# ఆదికాండము

## ప్రపంచ ప్రారంభం

### మొదటి రోజు—వెలుగు

1 మొట్టమొదట దేవుడు ఆకాశాన్ని భూమిని చేశాడు.
2భూమి మొత్తం శూన్యంగా ఉంది. భూమిమీద
ఏమీ లేదు. మహా సముద్రాన్ని చీకటి ఆవరించింది.
దేవుని ఆత్మ నీళ్లమీద సంచరిస్తూ ఉండెను. 3అప్పుడు
దేవుడు, "వెలుగు కలుగును గాక!" అన్నాడు. వెలుగు
ప్రకాశించటం మొదలయింది. 4దేవుడు ఆ వెలుగును
చూశాడు. ఆయనకు అది చక్కగా కనబడింది.
అప్పుడు దేవుడు ఆ వెలుగును చీకటినుండి వేరు
చేసాడు. 5వెలుగుకు "పగలు" అని, చీకటికి "రాత్రి"
అని దేవుడు పేరు పెట్టాడు.

అస్తమయము అయింది, ఆ తర్వాత ఉదయం అయింది. ఇది మొదటి రోజు.

### రెండవ రోజు—ఆకాశం

6అప్పుడు దేవుడు, "జలములను రెండు భాగము
లుగా చేయుటకు అంతరిక్షం* ఉండును గాక!"
అన్నాడు. 7కనుక దేవుడు అంతరిక్షాన్ని చేసి, నీళ్లను
వేరుపర్చాడు. కొంత నీరు గాలికి పైగాను, కొంత
నీరు గాలికి కిందను ఉంది. 8దేవుడు ఆ అంతరిక్షానికి
"ఆకాశం" అని పేరు పెట్టాడు.

అస్తమయం అయింది, ఆ తర్వాత ఉదయం అయింది. ఇది రెండవ రోజు.

### మూడవ రోజు—పొడి నేల, మొక్కలు

9అప్పుడు దేవుడు, "పొడి నేల కనబడునట్లు,
ఆకాశం కింద నీరు ఒక్క చోట చేరునుగాక!" అన్నాడు.
అలాగే జరిగింది. 10ఆ పొడి నేలకు "భూమి" అని
దేవుడు పేరు పెట్టాడు. మరియు ఒక్క చోట చేరిన
నీటికి " సముద్రాలు" అని దేవుడు పేరు పెట్టాడు.
ఆయనకు ఇది చక్కగా ఉన్నట్టు కనబడింది.
11అప్పుడు దేవుడు, "భూమి గడ్డిని, ఆహార ధాన్యపు
మొక్కలను, ఫలవృక్షాలను మొలిపించు గాక, ఫలవృ
క్షాలు విత్తనాలుగల పండ్లను పండిస్తాయి. మరియూ
ప్రతి మొక్క తన స్వంత రకం విత్తనాన్ని రూపొంది
స్తుంది. ఈ మొక్కలు భూమిమీద పెరుగును గాక"
అన్నాడు. అలాగే జరిగింది.
12గడ్డిని, ఆహార ధాన్యపు మొక్కలను భూమి
మొలిపించింది. మరియు అది విత్తనాలుగల పండ్ల
చెట్లను మొలిపించింది. ప్రతి మొక్క తన స్వంత
రకం విత్తనాలను రూపొందించింది. దేవునికి ఇది చక్కగా
ఉన్నట్లు కనబడింది.
13అస్తమయం అయింది, ఆ తర్వాత ఉదయం
అయింది. ఇది మూడవ రోజు.

### నాలుగవ రోజు—సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు

14అప్పుడు, "ఆకాశంలో జ్యోతులు ఉండును గాక.
ఈ జ్యోతులు రాత్రి నుండి పగలును వేరు చేస్తాయి.
జ్యోతులు ప్రత్యేక సంకేతాలను, ప్రత్యేక సమావేశాల*
ప్రారంభాన్ని సూచించేందుకు ఉపయోగించబడ
తాయి. మరియు రోజులను సంవత్సరాలను తెలుపు
టకు అవి ఉపయోగించబడతాయి. 15భూమి మీద
వెలుగును ప్రకాశింపజేయుటకు ఈ జ్యోతులు ఆకా
శంలో ఉంటాయి" అన్నాడు దేవుడు. అలాగే జరిగింది.
16కనుక ఆ రెండు పెద్ద జ్యోతులను దేవుడు
చేసాడు. పగటి వేళను ఏలుటకు దేవుడు పెద్ద జ్యోతిని
చేసాడు. రాత్రి వేళను ఏలుటకు ఆయన చిన్న జ్యోతిని
చేసాడు. దేవుడు నక్షత్రాలను కూడా చేసాడు. 17భూమి
మీద ప్రకాశించుటకు ఈ జ్యోతులను దేవుడు ఆకా
శంలో ఉంచాడు.
18పగటిని, రాత్రిని ఏలుటకు ఈ జ్యోతులను
ఆకాశంలో ఉంచాడు. ఈ జ్యోతులు చీకటి నుండి
వెలుగును వేరు చేసాయి. దేవునికి ఇది చక్కగా ఉన్నట్టు
కనబడింది.
19అస్తమయం అయింది, ఆ తర్వాత ఉదయం
అయింది. ఇది నాలుగవ రోజు.

---

**అంతరిక్షం** హెబ్రీ భాషలో 'అంతరిక్షం'కు బదులు 'గాలి' అని ఉన్నది.

**ప్రత్యేక సమావేశాలు** ఇశ్రాయేలీయులు సూర్యచంద్రులను ఆధారం చేసుకొని నెలలను, సంవత్సరాలను నిర్ణయించేవారు. అమావాస్య, పౌర్ణమి రోజుల్లో అనేక యూదుల శెలవులు, ప్రత్యేక సమావేశాలు ఆరంభమయ్యాయి.

### అయిదవ రోజు – చేపలు, పక్షులు

20అప్పుడు, “నీళ్లు అనేక ప్రాణులతో నిండి పోవును
గాక. మరియు భూమికి పైగా గాలిలో ఎగురుటకు
పక్షులు ఉండును గాక!” అన్నాడు దేవుడు. 21కనుక
దేవుడు సముద్రపు పెద్ద జంతువులను చేసాడు. సము
ద్రంలో సంచరించే ప్రతి ప్రాణిని దేవుడు చేసాడు.
సముద్ర జంతువులు ఎన్నో రకాలు ఉన్నాయి. వాట
న్నిటినీ దేవుడు చేసాడు. ఆకాశంలో ఎగిరే ప్రతి రకం
పక్షిని కూడ దేవుడు చేసాడు. మరియు ఇది చక్కగా
ఉన్నట్టు దేవునికి కనబడింది.
22ఈ జంతువులను దేవుడు ఆశీర్వదించాడు. అవి
అనేక పిల్లల్నిపెట్టి, సముద్రాలు నిండిపోవాలని దేవుడు
వాటితో చెప్పాడు.
23అస్తమయం అయింది, ఆ తర్వాత ఉదయం
అయింది. ఇది ఐదవ రోజు.

### ఆరవ రోజు – భూజంతువులు, మనుష్యులు

24అప్పుడు దేవుడు, “భూమి అనేక ప్రాణులను
చేయును గాక. అనేక రకాల జంతువులు ఉండును
గాక. పెద్ద జంతువులు, ప్రాకే అన్ని రకాల పురుగులు
చిన్న జంతువులు ఉండును గాక! మరియు ఈ జంతు
వులన్నీ యింకా వాటి రకపు జంతువుల్ని ఎక్కువగా
వృద్ధి చేయుగాక” అన్నాడు దేవుడు. ఈ సంగతులు
అన్నీ జరిగాయి.
25కనుక దేవుడు ప్రతి రకపు జంతువును చేసాడు.
క్రూర జంతువులను, సాధు జంతువులను, ప్రాకు
చుండు చిన్న వాటన్నింటినీ దేవుడు చేశాడు. మరియు
ఇది చక్కగా ఉన్నట్టు దేవునికి కనబడింది.
26అప్పుడు, “ఇప్పుడు మనం మనిషిని చేద్దాం.
మనం మన పోలికతో మనుష్యుల్ని చేద్దాం. మను
ష్యులు మనలా ఉంటారు. సముద్రంలోని చేపలన్నింటి
మీద, గాలిలో పక్షులన్నిటిమీద వారు ఏలుబడి చేస్తారు.
భూమిమీద పెద్ద జంతువులన్నింటి మీదను, ప్రాకు
చిన్న వాటన్నింటిమీదను వారు ఏలుబడి చేస్తారు”
అని చెప్పాడు.
27కనుక దేవుడు తన స్వంత రూపంలో మను
ష్యుల్ని చేశాడు. తన ప్రతిరూపంలో దేవుడు మను
ష్యుల్ని చేశాడు. దేవుడు వారిని మగ, ఆడ వారిగా
చేశాడు. 28దేవుడు వారిని, “ఇంకా అనేక మంది ప్రజలు
ఉండునట్లు పిల్లలను కనండి. భూమిమీద నిండిపోయి,
దానిని స్వాధీనం చేసుకోండి. సముద్రంలో చేపల
మీద, గాలిలో పక్షులమీద ఏలుబడి చేయండి. భూమి
మీద సంచరించే ప్రతి ప్రాణిమీద ఏలుబడి చేయండి”
అని ఆశీర్వదించాడు.
29“ఆహార ధాన్యపు మొక్కలన్నిటిని, ఫలవృక్షాలు
అన్నింటిని నేను మీకు ఇస్తున్నాను. ఆ చెట్లు విత్తనాలు
గల పండ్లను పండిస్తాయి. ఈ ఆహార ధాన్యం, పండ్లు
మీ ఆహారం అవుతుంది. 30మరియు పచ్చ మొక్కలు
అన్నింటిని జంతువులకు నేను ఇస్తున్నాను. ఆ పచ్చ
మొక్కలు వాటికి ఆహారం అవుతాయి. భూమిమీద
ప్రతి జంతువు, గాలిలో ఎగిరే ప్రతి పక్షి, భూమిమీద
ప్రాకుచుండు చిన్న ప్రాణులు అన్నీ ఆ ఆహారాన్ని
తింటాయి” అని దేవుడు చెప్పాడు. ఈ సంగతులు
అన్నీ జరిగాయి.
31దేవుడు తాను చేసినది అంతా చూశాడు. అది
అంతా చాలా చక్కగా ఉన్నట్టు దేవునికి కనబడింది.
అస్తమయం అయింది, ఆ తర్వాత ఉదయం
అయింది. ఇది ఆరవ రోజు.

### ఏడవ రోజు – విశ్రాంతి

2 కనుక భూమి, ఆకాశం, వాటిలోని ప్రతిదీ పూర్త
యింది. 2దేవుడు తాను చేస్తున్న పని ముగిం
చాడు. కనుక ఏడవ రోజున దేవుడు తన పని నుండి
విశ్రాంతి తీసుకొన్నాడు. 3ఏడవ రోజును దేవుడు ఆశీ
ర్వదించి, దానిని పవిత్ర దినంగా చేసాడు. దేవుడు
ప్రపంచాన్ని చేసేటప్పుడు జరిగించిన పని అంతటి
నుండి ఆ రోజున విశ్రాంతి తీసుకొన్నాడు గనుక, ఆ
రోజును ఆయన ప్రత్యేకమైనదిగా చేసాడు.

### మానవ జాతి ఆరంభం

4ఇదే భూమి, ఆకాశం చరిత్ర. భూమిని, ఆకాశాన్ని
దేవుడు చేసినప్పుడు జరిగిన సంగతుల విషయం ఇది.
5భూమి మీద మొక్కలు ఏమీ లేవు. పొలాల్లో ఏమీ
పెరగటం లేదు. అప్పటికి యింకా ఎక్కడా మొక్కలు
మొలవలేదు. అప్పటికి భూమిమీద యింకా వర్షం
యెహోవా కురిపించలేదు. మొక్కలను గూర్చి జాగ్రత్త
తీసుకొనే ఏ మనిషీ అప్పటికి లేడు. 6భూమి నుండి
ఆవిరి ఉబికి నేల అంతటిని తడిపింది.
7అప్పుడు యెహోవా దేవుడు నేలనుండి మట్టి
తీసుకొని మనిషిని చేశాడు. మనిషి నాసికా రంధ్రాలలో
జీవ వాయువును దేవుడు ఊదగా మనిషి సజీవుడు
అయ్యాడు. 8అప్పుడు తూర్పున ఏదెను అను చోట
ఒక తోటను యెహోవా నాటాడు. యెహోవా
దేవుడు తాను చేసిన మనిషిని ఆ తోటలో ఉంచాడు.
9అప్పుడు చూచుటకు అందంగా కనబడే చెట్లన్నిం
టినీ, మరియు ఆహారానికి మంచివైన చెట్లు అన్నింటినీ
భూమి పుట్టించునట్లు దేవుడు చేసాడు. జీవ వృక్ష
మును, మంచి చెడుల తెలివిని ఇచ్చే వృక్షమును ఆ
తోట మధ్యలో ఉన్నాయి.
10ఏదెను తోటలో నుండి ఒక నది ప్రవహిస్తూ ఆ
తోటకు నీటిని ఇస్తుంది. ఆ నది పాయలై నాలుగు
చిన్న నదులయింది. 11మొదటి నది పేరు పీషోను.
ఇది హవీలా దేశం అంతటా ప్రవహించే నది. 12(ఆ
దేశంలో బంగారం ఉంది, ఆ బంగారం చాలా మంచిది.

ఆ దేశంలో బోళం, గోమేధికము కూడా ఉన్నాయి).
13రెండవ నది పేరు గీహోను. ఆ నది కూషు దేశ
మంతటా ప్రవహిస్తుంది. 14మూడో నది పేరు హిద్దెకెలు.
ఆ నది అష్షూరు తూర్పు దిక్కున ప్రవహిస్తుంది.
నాలుగో నది యూఫ్రటీసు.
15మనిషిని ఏదేను తోటలో యెహోవా దేవుడు
ఉంచాడు. మొక్కలు నాటి తోటనుగూర్చి శ్రద్ధ తీసు
కోవడం మనిషి పని. 16యెహోవా దేవుడు మనిషికి
ఈ ఆజ్ఞ యిచ్చాడు:"ఈ తోటలోని ఏ చెట్టు ఫలము
నైనా నీవు తినవచ్చు. 17అయితే మంచి, చెడ్డల తెలివిని
ఇచ్చే చెట్టు ఫలమును నీవు తినకూడదు. ఆ చెట్టు
పండు నీవు తిన్న రోజున తప్పక చస్తావు."

## మొదటి స్త్రీ

18అప్పుడు యెహోవా దేవుడు, "పురుషుడు ఒంట
రిగా ఉండటం మంచిది కాదు. అతనికి సాటియైన
సహకారిణిని నేను చేస్తాను. మరియు ఆ సహకారిణి
అతనికి సహాయం చేస్తుంది" అనుకొన్నాడు.
19పొలాల్లోని ప్రతి జంతువును, గాలిలోని ప్రతి
పక్షిని నేలనుండి యెహోవా దేవుడు చేసాడు. ఈ
జంతువులన్నింటిని యెహోవా దేవుడు మనిషి దగ్గ
రకు రప్పించాడు, మనిషి ప్రతిదానికి పేరు పెట్టాడు.
20సాధు జంతువులన్నింటికి, ఆకాశ పక్షులన్నింటికి,
అడవి క్రూర జంతువులన్నింటికి మనిషి పేర్లు పెట్టాడు.
ఎన్నెన్నో జంతువుల్ని పక్షుల్ని మనిషి చూశాడు.
అయితే తనకు సరిపోయే సహాయంగా ఏదీ అతనికి
కనబడలేదు. 21అందుచేత ఆ పురుషుడు గాఢనిద్ర
పోయేటట్టు చేసాడు యెహోవా దేవుడు. అతడు
నిద్రపోతూ ఉండగా, అతని శరీరంలోని పక్క
ఎముకలలో ఒకదాన్ని తీసాడు. పక్క ఎముకను తీసిన
చోటును అతని మాంసముతో యెహోవా దేవుడు
పూడ్చి వేసాడు. 22స్త్రీని చేసేందుకు, అతని ప్రక్క
ఎముకను యెహోవా దేవుడు ఉపయోగించాడు.
అప్పుడు ఆ స్త్రీని ఆ పురుషుని దగ్గరకు యెహోవా
దేవుడు తీసుకొని వచ్చాడు. 23అప్పుడు ఆ పురుషుడు
ఇలా అన్నాడు:

"ఇప్పుడు, ఇది నావంటి మనిషే, ఆమె ఎముక
నా ఎముకల్లోనుంచి వచ్చింది. ఆమె శరీరం
నా శరీరంలోనుంచి వచ్చింది. ఆమె నరుని
లోనుండి తీయబడింది గనుక ఆమెను నారి
అంటాను."

24ఇందువల్ల పురుషుడు తన తండ్రిని, తల్లిని విడిచి,
తన భార్యను హత్తుకొంటాడు. వాళ్లిద్దరు ఏకమవుతారు.
25ఆ తోటలో ఆ పురుషుడు, అతని భార్యా నగ్నంగా
ఉన్నారు. కాని వారికి సిగ్గు తెలియదు.

## పాపం ప్రారంభం

3 ఆ సమయంలో ఆ స్త్రీతో సర్పం మాట్లాడింది.
యెహోవా దేవుడు సృష్టించిన అడవి జంతువు
లన్నిటిలో సర్పం చాలా తెలివైనది, కపటమైనది. ఆ
సర్పం స్త్రీని మోసగించాలనుకొని, "ఏమమ్మా ఈ
తోటలోని ఏ చెట్టు ఫలమైనా తినవద్దని దేవుడు నిజంగా
నీతో చెప్పాడా?" అంది.
2సర్పానికి ఆమె ఇలా జవాబిచ్చింది: "లేదు! దేవుడు
అలాగు చెప్పలేదు. తోటలోని చెట్ల ఫలాలు మేము
తినవచ్చు. 3అయితే ఒక చెట్టుంది, దాని ఫలము
మేము తినకూడదు. 'తోట మధ్యలో ఉన్న చెట్టు
ఫలం మీరు తినకూడదు. అసలు ఆ చెట్టును మీరు
ముట్టుకోకూడదు. అలాచేస్తే మీరు చస్తారు' అని
దేవుడు మాతో చెప్పాడు."
4అయితే సర్పం ఆ స్త్రీతో ఇలా అంది: "మీరు
చావరు. 5ఆ చెట్టు ఫలం మీరు తింటే, మంచి చెడ్డలను
గూర్చి మీరు తెలుసుకొంటారని దేవునికి తెలుసు.
అప్పుడు మీరు దేవునివలె ఉంటారు!'
6ఆ చెట్టు చాలా అందంగా ఉన్నట్టు ఆ స్త్రీ
చూసింది; ఆ ఫలం తినటానికి మంచిదిగా ఉన్నట్టు,
ఆ చెట్టు తెలివి నిస్తుందని ఆమె తెలుసుకొంది. కనుక
ఆ స్త్రీ ఆ చెట్టు ఫలం తీసుకొని దానిని తిన్నది. ఆ
పండులో కొంత ఆమె భర్తకు ఇచ్చింది, అతడు కూడా
దాన్ని తిన్నాడు.
7అప్పుడు ఆ పురుషుడు, స్త్రీ ఇద్దరూ మారిపో
యారు. వారి కళ్లు తెరవబడ్డట్టు, వారికి అన్నీ వేరుగా
కనబడ్డాయి. వారికి బట్టలు లేనట్లు నగ్నంగా ఉన్నట్లు
వాళ్లు చూశారు. కనుక వారు అంజూరపు ఆకులను
కుట్టి వాటినే బట్టలుగా ధరించారు.
8సాయంకాలపు చల్లని వేళలో యెహోవా దేవుడు
ఆ తోటలో నడుస్తుండగా ఆ పురుషుడు, స్త్రీ ఆ
చప్పుడు విని తోటలోని చెట్లమధ్య దాగుకొన్నారు.
యెహోవా దేవుని నుండి దాగుకొనేందుకు వారు
ప్రయత్నించారు. 9అయితే యెహోవా దేవుడు ఆ
పురుషుని పిలిచాడు. "నీవు ఎక్కడున్నావు?" అన్నాడు
యెహోవా.
10"నీవు తోటలో నడుస్తున్న చప్పుడు విన్నాను,
నాకు భయం వేసింది. నేను నగ్నంగా ఉన్నాను, అందుకే
దాగుకొన్నాను" అన్నాడు ఆ పురుషుడు.
11దేవుడు ఆ పురుషునితో ఇలా అన్నాడు. "నీవు
నగ్నంగా ఉన్నావని నీతో ఎవరు చెప్పారు? నిన్ను
సిగ్గుపడేటట్లు చేసింది ఏమిటి? నేను తినవద్దని చెప్పిన
పండు నీవు తిన్నావా ఏమిటి? ఆ చెట్టు ఫలం తినవద్దని
నేను నీకు ఆజ్ఞాపించానుగదా!"
12అందుకు ఆ పురుషుడు, "నా కోసం నీవు చేసిన
ఈమె ఆ చెట్టు ఫలాన్ని నాకిచ్చింది, అందుచేత నేను
తిన్నాను" అన్నాడు.

[13]అప్పుడు యెహోవా దేవుడు, "ఏమిటి నీవు చేసింది?" అన్నాడు ఆ స్త్రీతో.

ఆ స్త్రీ, "సర్పం నన్ను మోసం చేసింది. నన్ను వెర్రిదాన్ని చేస్తే నేను ఆ పండు తినేసాను" అని చెప్పింది.

[14]అందుచేత యెహోవా దేవుడు సర్పంతో ఇలా అన్నాడు:

"ఈ మహా చెడ్డ పని నీవే చేసావు కనుక నీవు శపించబడ్డావు. జంతువులన్నిటి కంటే నీ పరిస్థితి హీనంగా ఉంటుంది. నీవు నీ పొట్టతో పాకడం తప్పనిసరౌవుతుంది. నీవు జీవిత కాలమంతా మట్టి తింటావు.

15 ఈ స్త్రీని, నిన్ను ఒకరికొకర్ని విరోధుల్నిగా నేను చేస్తాను. నీ సంతానము, ఆమె సంతానము ఒకరి కొకరు విరోధులవుతారు. నీవు ఆమె శిశువు పాదం మీద కాటేస్తావు ఈ శిశువు నీ తలను చితుక కొడతాడు."

[16]అప్పుడు స్త్రీతో యెహోవా దేవుడు ఇలా అన్నాడు:

"నీవు గర్భవతిగా ఉన్నప్పుడు నేను నీకు బహు ప్రయాస కలుగజేస్తాను. నీవు పిల్లల్ని కనేట ప్పుడు మహా గొప్ప బాధ నీకు కలుగుతుంది. నీవు నీ భర్తను వాంఛిస్తావు కాని అతడే నిన్ను ఏలుతాడు."

[17]అప్పుడు పురుషునితో దేవుడు ఈలాగు అన్నాడు:

"ప్రత్యేకమైన చెట్టుఫలాన్ని తినవద్దని నేను నీకు ఆజ్ఞాపించాను. అయితే నీవు నీ భార్య చెప్పిన మాటలు విన్నావు ఆ చెట్టు ఫలాన్ని తిన్నావు కనుక నీ మూలంగా భూమిని నేను శపిస్తాను. భూమి ఇచ్చే ఆహారం కోసం నీవు నీ జీవితాంతం ఎంతో కష్టపడాల్సి ఉంటుంది.

18 పొలంలో పండే మొక్కల్ని నీవు తినాలని అను కొంటావు కాని ముళ్లను, పొదలను నేల నీకోసం పండిస్తుంది.

19 నీ భోజనం కోసం నీవు చాలా కష్టపడి పని చేస్తావు. నీ ముఖం అంతా చెమటతో నిండి పోయేంతగా నీవు పని చేస్తావు. నీవు చనిపోయే రోజు వరకు కష్టపడి పని చేస్తావు మరణించాక నీవు మరలా మట్టి అయిపోతావు. నేను నిన్ను చేసినప్పుడు మట్టిలో నుంచే నీవు తీయబడ్డావు మళ్లీ నీవు చనిపోయినప్పుడు తిరిగి మట్టిలోనే కలిసిపోతావు."

[20]ఆదాము* తన భార్యకు హవ్వ* అని పేరు
పెట్టాడు. ఎన్నడైనా సరే బతికిన ప్రతి మనిషికి ఈమె
తల్లి కనుక ఆయన ఆమెకు ఆ పేరు పెట్టాడు.
[21]యెహోవా దేవుడు జంతు చర్మాలతో ఆ పురు
షునికి, అతని భార్యకు చొక్కాలు చేసాడు. ఆ తరువాత
ఆ చొక్కాలను వారికి తొడిగించాడు.
[22]అప్పుడు యెహోవా దేవుడు అన్నాడు:
"చూడండి, మనిషి మనలా తయారయ్యాడు. మంచి,
చెడ్డలు మనిషికి తెలుసు. ఇప్పుడు ఆ మనిషి జీవ
వృక్షంనుండి ఫలములు తీసుకొని తింటే అతడు శాశ్వ
తంగా జీవిస్తాడు."
[23]కనుక ఏదెను తోటనుండి ఆ మనిషిని యెహోవా
దేవుడు వెళ్లగొట్టాడు. ఆదాము బలవంతంగా వెళ్ల
గొట్టబడి ఏ నేల నుండి అతడు తీయబడ్డాడో ఆ
నేలను సేద్యం చేయటం మొదలుపెట్టాడు. [24]తరువాత
ఆ తోటకు కాపలాగా దాని ద్వారం దగ్గర కెరూబులను*
దేవుడు ఉంచాడు. ఒక అగ్ని ఖడ్గాన్ని కూడా అక్కడ
ఉంచాడు. జీవ వృక్షమునకు పోయే మార్గాన్ని కాపలా
కాస్తూ ఆ ఖడ్గం చుట్టూరా తిరుగుతూవుంది.

## ప్రథమ కుటుంబం

4 ఆదాముకు అతని భార్య హవ్వకు లైంగిక సంబం
ధాలు కలిగాయి. హవ్వ ఒక శిశువుకు జన్మని
చ్చింది. ఆ శిశువుకు కయీను* అని నామకరణం
జరిగింది. హవ్వ "యెహోవా సహాయంతో నేను ఒక
మనిషిని పొందాను" అంది.
[2]ఆ తర్వాత హవ్వ మరో శిశువుకు జన్మనిచ్చింది.
ఈ శిశువు కయీనుకు తమ్ముడు అతనికి హేబెలు
అని నామకరణం చేశారు. హేబెలు గొర్రెల కాపరి
అయ్యాడు. కయీను వ్యవసాయదారుడయ్యాడు.

## ప్రథమ హత్య

[3-4]కోతకాలంలో కయీను యెహోవాకు ఒక అర్ప
ణను తెచ్చాడు. నేలనుండి తాను పండించిన ఆహార
పదార్థాన్ని కయీను తెచ్చాడు. హేబెలు తన మందలో
నుండి కొన్ని మంచి బలిసిన తొలిచూలు గొర్రెల్ని
తెచ్చాడు.
హేబెలును, అతని అర్పణను దేవుడు స్వీకరించాడు.

---

**ఆదాము** ఈ పేరుకు అర్థం 'మానవుడు' లేక 'మానవ జాతి'.

**హవ్వ** 'జీవం' అనే అర్థం వచ్చే హెబ్రీ పదం వంటిది ఈ పదం.

**కెరూబులు** దేవుని దగ్గర నుండి వచ్చిన ప్రత్యేక దేవ దూతలు.

**కయీను** 'తయారు చేయు' లేక 'పొందు' అనే అర్థం వచ్చే హీబ్రూ పదంవంటిది.

5అయితే కయీనును, అతని అర్పణను దేవుడు అంగీక
రించలేదు. అందువల్ల కయీను దుఃఖించాడు. అతనికి
చాలా కోపం వచ్చేసింది. 6యెహోవా కయీనును
అడిగాడు: "నీవెందుకు కోపంగా ఉన్నావు? నీ ముఖం
అలా విచారంగా ఉందేమిటి? 7నీవు మంచి పనులు
చేస్తే నాతో నీవు సరిగ్గా ఉంటావు. అప్పుడు నిన్ను
నేను అంగీకరిస్తాను. కాని నీవు చెడ్డ పనులు చేస్తే
అప్పుడు నీ జీవితంలో ఆ పాపం ఉంటుంది. నీ
పాపం నిన్ను అదుపులో ఉంచుకోవాలనుకుంటుంది.
కానీ నీవే ఆ పాపమును* అదుపులో పెట్టాలి."
8"మనం పొలంలోకి వెళ్దాం రా" అన్నాడు కయీను
తన తమ్ముడైన హేబెలుతో. కనుక కయీను, హేబెలు
పొలంలోకి వెళ్లారు. అప్పుడు కయీను తన తమ్ము
డైన హేబెలు మీద పడి అతన్ని చంపేసాడు.
9తర్వాత, "నీ తమ్ముడు ఎక్కడ ఉన్నాడు?"
అంటూ కయీనును యెహోవా అడిగాడు. "నాకు
తెలియదు. నా తమ్ముణ్ణి కాపలా కాయడం, వాణ్ణి
గూర్చి జాగ్రత్త తీసుకోవడమేనా నా పని" అని కయీను
జవాబిచ్చాడు.
10అప్పుడు యెహోవా యిలా అన్నాడు, "నీవు
చేసింది ఏమిటి? నీవే నీ తమ్ముణ్ణి చంపేసావు. నీ
తమ్ముని రక్తం నేల నుండి నాకు మొర్రపెట్టుతూ
వుంది. 11(నీవు నీ తమ్ముణ్ణి చంపావు) నీ చేతులనుండి
అతని రక్తాన్ని తీసుకోటానికి భూమి నోరు తెరచు
కుంది. భూమిమీద నుండి నీవు శపించబడ్డావు. 12ఇది
వరకు నీవు మొక్కలు నాటుకొన్నావు. అవి చక్కగా
పెరిగాయి. కాని ఇప్పుడు నీవు మొక్కలు నాటినా, నీ
మొక్కలు ఏపుగా ఎదగటానికి నేల తోడ్పడదు. భూమి
మీద నీకు ఇల్లు కూడా ఉండదు. ఒక చోటు నుండి
మరొక చోటుకు నీవు తిరుగుతూ ఉంటావు."
13అప్పుడు కయీను అన్నాడు: "ఇది నేను భరించ
లేని శిక్ష! 14చూడు! నన్ను ఈ భూమిని విడిచిపెట్టే
టట్లు నీవు బలవంతం చేశావు. నేను నీనుండి వెళ్లిపోయి
దాగుకొంటాను. (నీ రక్షణనుండి దూరంగా వెళ్తాను).
నేనిక్కడ, అక్కడ తిరుగుతుంటాను. నన్ను ఎవరు
చూస్తారో వాళ్లు నన్ను చంపేస్తారు."
15అప్పుడు కయీనుతో యెహోవా ఇలా
అన్నాడు: "నేను అలా జరుగనివ్వను! కయీనూ,
నిన్ను ఎవరైనా చంపితే, నేను వారిని మరింతగా శిక్షిస్తా"
తరువాత కయీనుకు యెహోవా ఒక గుర్తు వేసాడు.
ఎవ్వరూ అతణ్ణి చంపకూడదు అని ఈ గుర్తు సూచి
స్తుంది.

## కయీను కుటుంబం

16అప్పుడు కయీను యెహోవా సన్నిధి నుండి
వెళ్లిపోయాడు. ఏదెనుకు తూర్పునవున్న నోదు దేశ
ములో కయీను నివసించాడు.
17కయీను తన భార్యతో కలసినప్పుడు, ఆమె
గర్భవతియై హనోకు అనే కుమారుని కన్నది. కయీను
ఒక పట్టణం కట్టించి తన కుమారుడైన హనోకు
పేరు దానికి పెట్టాడు.
18హనోకుకు ఈరాదు అనే కుమారుడు పుట్టాడు.
ఈరాదుకు మహూయాయేలు అనే కుమారుడు
పుట్టాడు. మహూయాయేలుకు మతూషాయేలు అనే
కుమారుడు పుట్టాడు. మతూషాయేలుకు లెమెకు అనే
కుమారుడు పుట్టాడు.
19లెమెకు ఇద్దరు స్త్రీలను వివాహం చేసుకొన్నాడు.
ఒక భార్య పేరు ఆదా, మరొక భార్య పేరు సిల్లా.
20ఆదా యాబాలుకు జన్మనిచ్చింది. గుడారములలో
నివసిస్తూ, పశువులను పెంచుట ద్వారా జీవనోపాధి
సంపాదించుకొనే ప్రజలందరికి యాబాలు తండ్రి.
21ఆదాకు యూబాలు అనే మరో కుమారుడు
ఉన్నాడు. (యూబాలు యాబాలు సోదరుడు). సితా
రాను పిల్లన గ్రోవిని ఊదేవారందరికిని యూబాలు
తండ్రి.
22సిల్లా తూబల్కయీనుకు జన్మనిచ్చింది. ఇత్తడి,
యినుము పనులు చేసే వాళ్లందరికి తూబల్క యీను
తండ్రి. తూబల్కయీను సోదరికి నయమా అని పేరు
పెట్ట బడింది.
23లెమెకు తన భార్యలతో ఇలా అన్నాడు:

"ఆదా, సిల్లా, నా మాట వినండి! లెమెకు భార్య
లారా నేను చెప్పే సంగతులను వినండి: ఒకడు
నన్ను గాయపర్చాడు కనుక నేను వాడ్ని చంపే
సాను ఒక పిల్లవాడు నన్ను కొట్టగా నేనతనిని
చంపేసాను.
24 కయీనును చంపినందుకు శిక్ష చాలా అధికం!
కనుక నన్ను చంపినందుకు శిక్ష మరి ఎంతో
అధికంగా ఉంటుంది."

## ఆదాము హవ్వలకు మరో కుమారుడు

25ఆదాము హవ్వతో కలసినప్పుడు హవ్వ మరో
కుమారుణ్ణి కన్నది. ఈ కుమారునికి షేతు అని పేరు
పెట్టారు. నాకు ఇంకో కుమారుణ్ణి దేవుడు ఇచ్చాడు.
కయీను హేబెలును చంపాడు, అయితే ఇప్పుడు
నాకు షేతు ఉన్నాడు అంది హవ్వ. 26షేతుకు కూడ
ఒక కుమారుడు పుట్టాడు. అతనికి, ఎనోషు అని
అతడు పేరుపెట్టాడు. ఆ సమయంలో ప్రజలు
యెహోవాను ప్రార్థించటం మొదలుబెట్టారు.

---

**కానీ ... పాపమును** నీవు మంచి పని చేయకపోతే, 'పాపము' సింహంలా నీ ద్వారం దగ్గర పొంచి ఉంటుంది. అది నిన్ను కోరుకుంటుంది. గాని నీవే దాని మీద అధికారం కలిగి ఉండాలి.

### ఆదాము కుటుంబ చరిత్ర

5 ఆదాము* వంశాన్ని గూర్చిన గ్రంథం ఇది. దేవుడు తన పోలికలో మనిషిని (ఆదాము) చేసాడు. [2]ఒక పురుషుణ్ణి, మరో స్త్రీని దేవుడు చేసాడు. వాళ్లిద్దర్నీ చేసిన రోజున ఆయన వాళ్లను ఆశీర్వదించి, అప్పుడు వాళ్లకు మనుష్యులు అని పేరు పెట్టాడు.

[3]ఆదాముకు 130 సంవత్సరములు వయస్సు వచ్చాక ఇంకో కుమారునికి తండ్రి అయ్యాడు. ఈ కుమారుడు అచ్చం ఆదాములాగే వున్నాడు. ఆదాము తన కుమారునికి షేతు అని పేరు పెట్టాడు. [4]షేతు పుట్టిన తర్వాత ఆదాము 800 సంవత్సరములు బతికాడు. ఆ కాలంలో ఆదాముకు ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [5]కనుక ఆదాము మొత్తం 930 సంవత్సరములు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[6]షేతుకు 105 సంవత్సరముల వయస్సులో ఎనోషు అనే ఒక కుమారుడు పుట్టాడు. [7]ఎనోషు పుట్టిన తర్వాత షేతు 807 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో షేతుకు ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [8]కనుక మొత్తం 912 సంవత్సరాలు షేతు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[9]తొంబై సంవత్సరాల వయస్సు దాటిన తరువాత ఎనోషుకు కేయినాను అనే కుమారుడు పుట్టాడు. [10]కేయినాను పుట్టిన తర్వాత, ఎనోషు 815 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి యింకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [11]కనుక మొత్తం 905 సంవత్సరాలు ఎనోషు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[12]కేయినాను 70 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత, మహలలేలు అనే కుమారుడు అతనికి పుట్టాడు. [13]మహలలేలు పుట్టిన తర్వాత కేయినాను 840 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో కేయినానుకు ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [14]కనుక కేయినాను మొత్తం 910 సంవత్సరాలు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[15]మహలలేలు 65 సవంత్సరాల వయస్సులో ఉన్నప్పుడు యెరెదు అను కుమారుడు అతనికి పుట్టాడు. [16]యెరెదు పుట్టిన తర్వాత, మహలలేలు 830 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [17]కనుక మహలలేలు మొత్తం 895 సంవత్సరాలు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[18]యెరెదుకు 162 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత హనోకు అనే కుమారుడు పుట్టాడు. [19]హనోకు పుట్టిన తర్వాత, యెరెదు 800 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [20]కనుక యెరెదు మొత్తం 962 సంవత్సరాలు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[21]హనోకు 65 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత మెతూషెల అనే కుమారుడు అతనికి పుట్టాడు. [22]మెతూషెల పుట్టిన తర్వాత, హనోకు యింకా 300 సంవత్సరాలు దేవునితో సహవాసం చేసాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [23]కనుక హనోకు మొత్తం 365 సంవత్సరాలు జీవించాడు. [24]హనోకు దేవునికి సన్నిహితంగా ఉన్నాడు. ఒకనాడు దేవుడు హనోకును తనతో తీసుకుపోయాడు గనుక అతడు కనబడకుండా పోయాడు.

[25]మెతూషెలకు 187 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత లెమెకు అనే కుమారుడు పుట్టాడు. [26]లెమెకు పుట్టిన తర్వాత, మెతూషెల 782 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [27]కనుక మెతూషెల మొత్తం 969 సంవత్సరాలు జీవించాడు. అతడు అప్పుడు మరణించాడు.

[28]లెమెకు వయస్సు 182 సంవత్సరాలు ఉన్నప్పుడు అతనికి ఒక కుమారుడు పుట్టాడు. [29]లెమెకు తన కుమారునికి నోవహు* అని పేరు పెట్టాడు. "దేవుడు భూమిని శపించాడు గనుక వ్యవసాయ దారులమైన మనం చాలా కష్టపడి పని చేస్తున్నాం. అయితే నోవహు మనకు నెమ్మది కలుగజేస్తాడు " అన్నాడు లెమెకు.

[30]నోవహుకు పుట్టిన తర్వాత లెమెకు 595 సంవత్సరములు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. [31]కనుక లెమెకు మొత్తం 777 సంవత్సరాలు జీవించాడు. అప్పుడు అతడు మరణించాడు.

[32]నోవహు 500 సంవత్సరములు దాటిన తర్వాత షేము, హాము, యాఫెతు అనే కుమారులు పుట్టారు.

### ప్రజలు చెడ్డవాళ్లగుట

6 భూమిమీద మనుష్యుల సంఖ్య పెరుగుతూ పోయింది. వీరికి ఆడపిల్లలు పుట్టారు. [2-4]ఈ ఆడపిల్లలు చాలా అందంగా ఉన్నట్టు దేవుని కుమారులు చూశారు. కనుక దేవుని కుమారులు వారికి నచ్చిన ఆడపిల్లల్ని వాళ్లు పెళ్లి చేసుకొన్నారు.

ఆ స్త్రీలు పిల్లల్ని కన్నారు, ఆ కాలంలోను, ఆ తర్వాత కాలంలోను నెఫీలులనువారు* ఆ దేశంలో నివసించారు. వారు చాలా ప్రఖ్యాతి చెందిన ప్రజలు, ప్రాచీన కాలంనుండి వారు మహా వీరులు.

---

**ఆదాము** అక్షరాల "మానవత్వం లేక ప్రజలు" "భూమి లేక ఎర్రమన్ను" అన్న పదాలకున్న అర్థంలాంటిదే.

**నోవహు** అనగా "నెమ్మది."

**నెఫీలులు** అనగా "బలాత్కారులు." "పడిపోయిన ప్రజలు" అని అర్థమిచ్చు హెబ్రీ పదములాంటిది.

అప్పుడు యెహోవా అన్నాడు, “మనుష్యులు
మానవ మాత్రులు. వారి మూలంగా నా ఆత్మను ఎల్ల
ప్పుడు కలవరపడనియ్యను. 120 సంవత్సరాలు వారిని
బతకనిస్తాను.”

5భూమిమీద మనుష్యులు చాలా చెడ్డవాళ్లుగా
ఉన్నట్టు యెహోవా చూశాడు. ప్రజలు ఎల్లప్పుడునూ
చెడ్డ వాటిని గూర్చి మాత్రమే తలుస్తున్నట్టు
యెహోవా చూశాడు. 6ఈ భూమిమీద మనుష్యులను
చేసినందుకు యెహోవా విచార పడ్డాడు. దేవుని హృద
యంలో అది ఎంతో దుఃఖం కలిగించింది. 7కనుక
యెహోవా ఇలా అన్నాడు: “భూమిమీద నేను చేసిన
మనుష్యులందరినీ నేను నాశనం చేసేస్తాను. ప్రతి మను
ష్యుని, ప్రతి జంతువును, భూమిమీద ప్రాకు ప్రతి
జీవిని నేను నాశనం చేస్తాను. ఆకాశ పక్షుల్ని కూడా
నేను నాశనం చేస్తాను. ఎందుచేతనంటే, వీటన్నింటినీ
నేను చేసినందుకు విచారిస్తున్నాను గనుక.”

8అయితే భూమిమీద యెహోవాను సంతోష
పెట్టిన మనిషి ఒక్కడు ఉన్నాడు. అతడు నోవహు.

## నోవహు – జలప్రళయం

9ఇది నోవహు కుటుంబ కథ. నోవహు తన తరం
వారిలోనే నీతిమంతుడు. అతడు ఎల్లప్పుడు దేవునిని
అనుసరించాడు. 10నోవహుకు షేము, హాము,
యాఫెతు అని ముగ్గురు కుమారులు.

11-12దేవుడు భూమిని చూసి, మనుష్యులు దానిని
పాడుచేసినట్టు కనుగొన్నాడు. ఎక్కడ చూసినా చెడు
తనం ప్రజలు చెడ్డవారై పోయి, క్రూరులై, భూమిమీద
వారి జీవితాన్ని నాశనం చేసుకొన్నారు.

13కనుక నోవహుతో దేవుడు ఇలా చెప్పాడు: “మను
ష్యులంతా ఈ భూమిని కోపంతో హింసతో నింపే
సారు. కనుక జీవిస్తున్న వాటన్నింటిని నేను నాశనం
చేస్తాను. ఈ భూమిమీద నుండి వారిని నేను తీసివేస్తాను.
14చితిసారకపు చెక్కతో నీ కోసం ఒక ఓడను నిర్మించు,
ఓడల్లో గదులను చేసి ఓడకు తారు పైపూత పూయి.

15“నీవు చేయాల్సిన ఓడ కొలత ఇలా ఉండాలి.
300 అ. పొడవు, 50 అ. వెడల్పు, 30 అ. ఎత్తు.
16కప్పుకు సుమారు 18 అంగుళాల క్రింద ఓడకు ఒక
కిటికీ చేయి. ఓడకు ఒక ప్రక్క తలుపు పెట్టు. ఓడలో
మూడు అంతస్తులు చేయి. పై అంతస్తు, మధ్య
అంతస్తు, క్రింద అంతస్తు.

17“నేను నీతో చెబుతోంది గ్రహించు. ఈ భూమి
మీదకి ఒక మహాగొప్ప జలప్రళయాన్ని నేను తీసు
కొస్తున్నాను. ఆకాశం క్రింద జీవిస్తున్న సకల ప్రాణు
లను నేను నాశనం చేస్తాను. భూమిమీద ఉండే ప్రతీ
ప్రాణి చస్తుంది. భూమిమీద ఉన్న అన్నీ చస్తాయి.
18అయితే నిన్ను నేను రక్షిస్తాను. అప్పుడు నీతో
నేను ఒక ప్రత్యేక ఒడంబడిక చేస్తాను. నీవు, నీ కుమా
రులు, నీ భార్య, నీ కోడళ్లు అందరు ఓడలో ఎక్కాలి.
19భూమిమీద జీవిస్తోన్న ప్రాణులన్నింటిలో రెండేసి
చొప్పున నీవు సంపాదించాలి. ఆడ, మగ చొప్పున
వాటిని ఓడలోనికి తీసుకొని రావాలి. వాటిని నీతో
కూడ సజీవంగా ఉండనివ్వు. 20భూమిమీద ఉన్న ప్రతీ
జాతి పక్షుల్లోనుంచి రెండేసి తీసుకురా. భూమిమీద
ఉన్న అన్ని రకాల జంతువుల్లోనుంచి రెండేసి తీసు
కురా. నేలమీద ప్రాకు ప్రతి ప్రాణులలో రెండేసి
చొప్పున తీసుకురా, భూమిమీద ఉండే అన్ని రకాల
జంతువులు మగది, ఆడది నీతో ఉండాలి. ఓడలో
వాటిని సజీవంగా ఉంచు. 21అలాగే భూమి మీద ఉండే
ప్రతి విధమైన ఆహారాన్ని ఓడలోనికి తీసుకొనిరా. అది
నీకు, జంతువులకు భోజనం అవుతుంది.”

22వీటన్నింటినీ నోవహు చేసాడు. దేవుడు ఆజ్ఞాపిం
చినట్లే నోవహు వాటన్నిటినీ చేసాడు.

## జల ప్రళయం ప్రారంభం

7 అప్పుడు నోవహుతో యెహోవా ఇలా చెప్పాడు;
“ఈ కాలపు దుర్మార్గుల మధ్య నీవు మంచి
వాడివిగా నాకు కనబడ్డావు. కనుక నీ కుటుంబం అంత
టినీ కలుపుకొని మీరంతా ఓడలోపలికి వెళ్లండి.
2శుద్ధమయిన జంతువులన్నింటిలో నుండి ఏడేసి
జాతులు. (మగవి ఏడు, ఆడవి ఏడు) తీసుకో, భూమి
మీద ఉన్న ఇతర జంతువులన్నింటిలోనుండి ఒక్క
జత (మగది ఒకటి, ఆడది ఒకటి) తీసుకో. ఈ
జంతువులన్నింటిని నీతోబాటు ఓడలోనికి నడిపించు.
3ఆకాశంలో ఎగిరే పక్షులన్నింటిలో నుండి ఏడేసి
జతలు (మగవి ఏడు, ఆడవి ఏడు) తీసుకో. ఇలా
చేయటంవల్ల మిగతా జంతువులన్ని నాశనం చేయ
బడిన తర్వాత కూడా ఈ జంతువులన్ని భూమిమీద
జీవించడానికి వీలవుతుంది. 4ఇంక ఏడు రోజులకు
భూమిమీద విస్తారమైన వర్షం కురిపిస్తాను. 40 పగళ్లు,
40 రాత్రులు వర్షం కురుస్తుంది. భూమిమీద జీవించే
ప్రతిప్రాణి నాశనం చేయబడుతుంది. నేను చేసినవన్నీ
నశించిపోతాయి.” 5యెహోవా ఆజ్ఞాపించిన వీటన్నిటి
విషయంలో నోవహు విధేయుడయ్యాడు.

6ఈ జలప్రళయము వచ్చినప్పుడు నోవహు
వయస్సు 600 సంవత్సరాలు. 7వరద నీటినుండి తప్పిం
చుకొనేందుకు నోవహు, అతని కుటుంబం ఓడలో
ప్రవేశించారు. నోవహు భార్య, అతని కుమారులు,
వారి భార్యలు అతనితో కూడ ఓడలో ఉన్నారు.
8-9పవిత్ర జంతువులన్నీ, భూమిమీది ఇతర జంతువు
లన్నీ, పక్షులన్నీ, నేలమీద ప్రాకు ప్రాణులన్నీ నోవ
హుతో పాటు ఓడలోకి వెళ్లాయి. దేవుడు నోవహుకు
ఆజ్ఞాపించినట్లుగా ఆడ, మగ అనే జంటలుగ లోపలికి
వెళ్లాయి. 10ఏడు రోజుల తర్వాత వరద ప్రారంభమ
యింది. భూమిమీద వర్షం కురవటం మొదలయింది.

11-13రెండవ నెల 17వ రోజున భూమి క్రింద ఉన్న
జల ఊటలన్నీ బ్రద్దలై, నేలనుండి నీరు ప్రవహించటం
మొదలయింది. అదే రోజున భూమిమీద భారీ వర్షాలు
కురవటం ప్రారంభం అయింది. ఆకాశానికి కిటికీలు
తెర తీసినట్టుగా ఉంది. 40 పగళ్లు 40 రాత్రులు భూమి
మీద వర్షం కురిసింది. సరిగ్గా అదే రోజున నోవహు,
అతని భార్య, అతని కుమారులు షేము, హాము,
యాఫెతు వారి భార్యలు ఓడ ఎక్కారు. ఈ సమ
యంలో నోవహు 600 సంవత్సరాల వయస్సువాడు.
14ఆ మనుష్యులు, భూమిమీదనున్న అన్ని రకాల
జంతువులు ఆ ఓడలో ఉన్నారు. అన్ని రకాల పశువులు,
నేలమీద ప్రాకు అన్ని రకాల జంతువులు, అన్ని రకాల
పక్షులు ఆ ఓడలో ఉన్నాయి. 15ఈ జంతువులన్నీ
నోవహుతో కలిసి ఓడలోకి వెళ్లాయి. ప్రాణం ఉన్న
ప్రతి రకం జంతువు రెండేసి చొప్పున వచ్చాయి.
16సరిగ్గా దేవుడు ఆజ్ఞాపించినట్లే ఈ జంతువులన్నీ
ఓడలో జతలు జతలుగా ప్రవేశించాయి. తరువాత
యెహోవా ఓడ తలుపులు మూసివేసాడు.

1740 రోజుల పాటు నీళ్లు భూమిమీద వరదలై
పారాయి. నీటిమట్టం పెరుగుతూ ఓడను నేలమీద
నుండి పైకి లేపడం మొదలయింది. 18నీటిమట్టం
పెరగటం కొనసాగుతూనే ఉంది, ఓడ నేలకు చాలా
ఎత్తుగా నీటిమీద తేలుతోంది. 19నీటిమట్టం చాలా
పైకి లేచినందువల్ల గొప్ప ఎత్తయిన పర్వతాలు అన్నీ
నీళ్లలో మునిగిపోయాయి. 20పర్వత శిఖరాలకు పైగా
నీటిమట్టం లేస్తూనే ఉంది. అన్నింటికంటే ఎత్తయిన
పర్వత శిఖరానికి ఇంకా 20 అడుగులు ఎత్తుగానే
నీటిమట్టం ఉంది.

21-22భూమిమీద బ్రతికి ఉన్న ప్రతి ప్రాణీ చనిపో
యింది. ప్రతి పురుషుడు, స్త్రీ మరణించారు. పక్షులు,
పశువులు, జంతువులు ఎగిరే ప్రతి ప్రాణి చంపివేయ
బడ్డాయి. బ్రతికి శ్వాసించే ప్రతి జీవి చనిపోయింది.
23కనుక భూమిమీద ఉన్న సకల ప్రాణులను, ప్రతి
మనిషి, ప్రతి జంతువు, ప్రాకు ప్రతి ప్రాణి, ప్రతి పక్షి
అన్నింటినీ దేవుడు నాశనం చేసాడు. ఇవన్నీ భూమిమీద
నుండి నాశనం చేయబడ్డాయి. ఓడలోవున్న నోవహు
అతనితో ఉన్న మనుష్యులు, జంతువులు మాత్రమే
బ్రతికి ఉన్న ప్రాణులు. 24150 రోజుల పాటు నీళ్లు
భూమిని కప్పేసాయి.

### జల ప్రళయం ఆగి పోవుట

8 అయితే నోవహును దేవుడు మరచిపోలేదు. నోవ
హును, అతనితో కూడ ఓడలో ఉన్న జంతువుల
న్నింటిని, పశువులన్నింటిని దేవుడు జ్ఞాపకం చేసుకొ
న్నాడు. భూమిమీద గాలి వీచేటట్టు దేవుడు చేసాడు.
నీళ్లన్నీ కనపడకుండా పోయాయి.

2ఆకాశం నుండి వర్షం కురవటం ఆగిపోయింది.
భూమి క్రింద నుండి నీళ్లు ఉబుకుట కూడ నిలిచిపో
యింది. 3-4నేలమీద నిండిన నీళ్లు బాగా ఇంకిపోవడం
మొదలయింది. 150 రోజుల తర్వాత నీళ్లు బాగా తగ్గి
పోయాయి, గనుక ఓడ మరల నేలమీద నిలిచింది.
అరారాతు పర్వతాల్లో ఒకదాని మీద ఓడ నిలిచింది.
ఇది ఏడవ నెల పదిహేడవ రోజు. 5నీళ్లు ఇంకిపోతూనే
ఉన్నాయి, పదవ నెల మొదటి రోజుకు కొండ శిఖరాలు
నీళ్లకు పైగా కనబడ్డాయి.

6నలభై రోజుల తర్వాత నోవహు తాను చేసిన
ఓడ కిటికీ తెరిచాడు. 7ఒక కాకిని నోవహు బయటకు
పంపాడు. నీళ్లన్నీ ఇంకిపోయి, నేల ఆరిపోయేంత
వరకు ఒక చోటునుండి మరో చోటుకు ఆ కాకి
ఎగురుతూనే ఉంది. 8ఒక పావురాన్ని కూడా నోవహు
పంపించాడు. ఆరిన నేలను పావురం తెల్సుకోవాలను
కొన్నాడు నోవహు. అతడు నేల ఇంకా నీళ్లతో నిండి
ఉందేమో తెల్సుకోవాలనుకొన్నాడు.

9నేలమీద ఇంకా నీళ్లు నిండి ఉండటం చేత పావురం
తిరిగి ఓడలోకి వచ్చేసింది. నోవహు చేయి బయటకు
చాచి పావురాన్ని పట్టుకున్నాడు. ఆ పావురాన్ని
నోవహు మళ్లీ ఓడలోకి తెచ్చాడు.

10ఏడు రోజుల తర్వాత నోవహు పావురాన్ని మళ్లీ
బయటకి పంపించాడు. 11ఆ మధ్యాహ్నం ఆ పావురం
మళ్లీ నోవహు దగ్గరకు వచ్చేసింది. తాజా ఓలీవ ఆకు
ఆ పావురం నోటవుంది. భూమిమీద ఆరిన నేల ఉన్న
ట్టుగా నోవహుకు అది ఒక గుర్తు. 12ఏడు రోజుల
తర్వాత నోవహు పావురాన్ని మరల బయటకి పంపిం
చాడు. అయితే ఈసారి పావురం మరల ఎన్నడూ
తిరిగిరాలేదు.

13ఆ తర్వాత నోవహు ఓడ తలుపులు తెరిచాడు.
నేల ఆరిపోయినట్టుగా నోవహు చూశాడు. అది సంవత్స
రములో మొదటి నెల మొదటి రోజు. అప్పుడు
నోవహు వయస్సు 601 సంవత్సరాలు. 14రెండవ నెల
27వ రోజుకు నేల పూర్తిగా ఆరిపోయింది. 15అప్పుడు
యెహోవా నోవహుతో అన్నాడు: 16"ఓడ నేలకు
దిగింది. నీవు, నీ భార్య, నీ కుమారులు, నీ కోడళ్లు
ఇప్పుడు బయటకు వెళ్లాలి. 17జీవమున్న ప్రతి జంతు
వును, పక్షులన్నింటిని, భూమిమీద ప్రాకు ప్రాణులన్ని
టిని నీతోబాటు బయటకు తీసుకొనిరా. ఆ జంతు
వులు సంతానాభివృద్ధి చెంది, అవి మరల భూమిని
నింపుతాయి."

18తన కుమారులు, తన భార్య, తన కోడళ్లతో
నోవహు బయటకు వెళ్లాడు, 19జంతువులన్నీ ప్రాకు
ప్రాణులన్నీ, ప్రతి పక్షి ఓడను విడచి వెళ్లాయి. జంతువు
లన్నీ వాటి జాతి ప్రకారం గుంపులుగా బయటకు
వచ్చాయి.

20అప్పుడు యెహోవాకు ఒక బలిపీఠాన్ని నోవహు
కట్టాడు. పవిత్రమైన పక్షులన్నింటిలో నుండి, పవిత్ర
మైన జంతువులన్నింటిలో నుండి కొన్నింటిని నోవహు
తీసుకొని, దేవునికి కానుకగా బలిపీఠం మీద వాటిని
దహించాడు.
21యెహోవా ఈ బలుల సువాసనను ఆఘ్రూణించి
ఆనందించాడు. యెహోవా తనలో తాను అనుకొ
న్నాడు, "మనుష్యుల్ని శిక్షించేందుకోసం ఒక పద్ధతిగా
మరల ఎన్నడు నేను భూమిని శపించను. మనుష్యులు
చిన్నప్పటి నుండే దుర్మార్గులు కనుక భూమిమీద
జీవిస్తున్న వాటన్నింటిని మరల ఎన్నడును నాశనం
చేయను. లేదు మరల నేను ఇలా చేయను. 22భూమి
ఉన్నంత కాలమూ, నాటుటకు, పంట కోయుటకు
ఎల్లప్పుడూ ఒక సమయం ఉంటుంది. భూమిమీద
ఎప్పటికీ చల్లదనం, వేడి, వేసవికాలం, చలికాలం,
పగలు, రాత్రిళ్లు ఉంటాయి."

### నూతన ఆరంభం

9 నోవహును, అతని కుమారులను దేవుడు ఆశీర్వ
దించాడు. దేవుడు అతనితో చెప్పాడు: "అధిక
సంతానం కలిగి, నీ జనంతో భూమిని నింపు. 2భూమి
మీదనున్న ప్రతి జంతువు, గాలిలో ఎగిరే ప్రతి పక్షి,
నేలమీద ప్రాకు ప్రతి ప్రాణి, సముద్రంలోని ప్రతి
చేప నీకు భయపడతాయి. వాటన్నిటిపైన నీవు పాల
కునిగా ఉంటావు." 3"గతంలో నీవు తినేందుకు పచ్చ
మొక్కల్ని ఇచ్చాను. ఇప్పుడు ప్రతి జంతువు నీకు
ఆహారం అవుతుంది. భూమిపై నున్న సమస్తాన్ని నీకు
ఇస్తున్నాను - అదంతా నీదే. 4అయితే నీకు నేను ఒక
ఆజ్ఞ యిస్తున్నాను. దానిలో ఇంకా ప్రాణము (రక్తం)
ఉన్న మాంసాన్ని మీరు తినకూడదు. 5అనగా ఏ మనిషి
నైనా ఒక జంతువు చంపితే దాని రక్తాన్ని అడుగుతాను,
అలానే ఏ మనిషినైనా మరో మనిషి ప్రాణం తీస్తే, ఆ
మనిషి రక్తాన్ని అడుగుతాను.

6 "దేవుడు అచ్చం తనలాగే మనుష్యులను
చేసాడు. కనుక యింకొక మనిషిని చంపిన
వాడు మరో మనిషి చేత చంపబడాలి."

7నోవహూ, "నీవు, నీ కుమారులు అధిక సంతానం
కలిగి, నీ జనంతో భూమిని నింపుదురు గాక."
8తర్వాత నోవహుతో అతని కుమారులతో దేవుడు
ఇలా అన్నాడు: 9"నీతోను నీ తర్వాత నీ ప్రజలతోను
ఇప్పుడు నేను నా వాగ్దానం చేస్తున్నాను. 10నీతోబాటు
ఓడలో నుండి బయటకు వచ్చిన పక్షులన్నింటితోను,
పశువులన్నింటితోను, జంతువులన్నింటితోను, నేను
వాగ్దానం చేస్తున్నాను. భూమి మీదనున్న ప్రతి ప్రాణితో
నేను వాగ్దానం చేస్తున్నాను. 11ఇదే నీకు నా వాగ్దానం.
వరద నీటిచేత, భూమిమీద సకల ప్రాణులు నాశనం
చేయబడ్డాయి. అయితే ఇక ఎన్నటికీ మరల అలా
జరుగదు. భూమిమీద సకల ప్రాణులను ఒక వరద
మాత్రం ఇక ఎన్నటికీ తిరిగి నాశనం చేయదు."
12తర్వాత నోవహు, అతని కుమారులతో
యెహోవా యిలా అన్నాడు: "ఈ వాగ్దానం నేను
మీకు యిచ్చినట్టు రుజువుగా నేను మీకు ఒకటి ఇస్తాను.
మీతోను, భూమిమీద జీవించే ప్రతి ప్రాణితోను ఈ
వాగ్దానం నేను చేసానని చెప్పేందుకు ఇది రుజువు.
ఈ వాగ్దానం రాబోయే కాలములన్నిటిలో కొన సాగు
తుంది. ఇదే ఆ రుజువు.
13మేఘాల్లో నా రంగుల ధనస్సునుంచుచున్నాను.
నాకు, భూమికి జరిగిన ఒడం బడికకు రుజువు ఆ
రంగుల ధనస్సు. 14భూమికి పైగా మేఘాలను నేను
రప్పించినపుడు, మేఘాలలో రంగుల ధనుస్సును మీరు
చూస్తారు.
15రంగుల ధనస్సును నేను చూపినప్పుడు నీతోను,
భూమిమీదనున్న సకల ప్రాణులతోను జరిగిన ఒడంబ
డికను నేను జ్ఞాపకం చేసుకొంటాను. ఈ భూమిమీద
సకల ప్రాణులను ఒక జలప్రళయం మాత్రం ఇంకె
న్నడూ నాశనం చేయదు అని ఆ ఒప్పందం చెబు
తోంది. 16మేఘాల్లో ఆ రంగుల ధనస్సును నేను
చూచినప్పుడు శాశ్వతంగా కొనసాగే ఆ ఒడంబడికను
నేను జ్ఞాపకం చేసుకొంటాను. నాకు, భూమిమీద సకల
ప్రాణులకు మధ్య జరిగిన ఒడంబడికను నేను జ్ఞాపకం
చేసుకొంటాను."
17కనుక, "భూమిమీద సకల ప్రాణులతోను నేను
చేసిన ఒడంబడికకు ఆ మేఘ ధనుస్సు రుజువు" అని
నోవహుతో యెహోవా చెప్పాడు. కనుక నోవహుతో
ప్రభువు, "భూమిమీద సకల ప్రాణులతోను నేను చేసిన
ఒడంబడికకు మేఘములోని ధనుస్సు రుజువు" అని
చెప్పాడు.

### మళ్లీ సమస్యలు

18నోవహుతో కూడ అతని కుమారులు ఓడలో
నుండి బయటకు వచ్చారు. వారి పేర్లు షేము, హాము,
యాఫెతు. (హాము కనానుకు తండ్రి). 19ఆ ముగ్గురు
మగవాళ్లు నోవహు కుమారులు. మరియు భూమిమీద
ప్రజలంతా ఆ ముగ్గురి కుమారుల నుండి వచ్చినవాళ్లే.
20నోవహు వ్యవసాయదారుడయ్యాడు. అతడు ఒక
ద్రాక్షతోట నాటాడు.
21నోవహు ద్రాక్షారసం చేసి, దాన్ని తాగాడు. అతడు
మత్తెక్కి తన గుడారంలో పండుకొన్నాడు. నోవహు
బట్టలు ఏమీ వేసుకొనలేదు.
22కనాను తండ్రి హాము, దిగంబరంగా ఉన్న తన
తండ్రిని చూశాడు. గుడారం వెలుపలున్న తన సోదరు
లతో హాము ఈ విషయం చెప్పాడు. 23అప్పుడు

షేము, యాఫెతు కలసి ఒక అంగీని తెచ్చారు. వాళ్లు
ఆ అంగీని తమ భుజాలమీద మోసి గుడారంలోకి
తీసుకువెళ్లారు. వారు వెనక్కి గుడారంలోకి నడిచివెళ్లి
బట్టలు లేకుండా వున్న తమ తండ్రి ఒంటిమీద బట్ట
కప్పారు. 24ఆ తర్వాత నోవహు మేల్కొన్నాడు.
(ద్రాక్షారసంవల్ల అతడు నిద్రపోతూ ఉన్నాడు.)
అప్పుడు తన చిన్న కుమారుడు హాము తనకు చేసిన
దాన్ని అతడు తెలుసుకొన్నాడు. 25కనుక నోవహు
అన్నాడు:

“కనాను* శపించబడును గాక! కనాను తన
సోదరులకు బానిస అగును గాక!”

26నోవహు ఇంకా ఇలా అన్నాడు:

“షేము దేవుడగు యెహోవా స్తుతించబడును
గాక! కనాను షేముకు బానిస అవును గాక.”
27 యాఫెతుకు దేవుడు ఇంకా ఎక్కువ భూమిని
ఇచ్చును గాక! షేము గుడారాలలో దేవుడు
నివసించు గాక! కనాను వారికి బానిస అవును
గాక!”

28జలప్రళయం తర్వాత నోవహు 350 సంవత్సరాలు
బతికాడు. 29నోవహు మొత్తం 950 సంవత్సరాలు బతి
కాడు. తరువాత అతడు మరణించాడు.

## జనముల అభివృద్ధి విస్తరణ

10 నోవహు కుమారులు షేము, హాము,
యాఫెతు. ప్రళయం తర్వాత ఈ ముగ్గురు
మగవాళ్లు ఇంకా అనేకమంది కుమారులకు తండ్రుల
య్యారు. షేము, హాము, యాఫెతు ద్వారా వచ్చిన
కుమారుల జాబితా ఇది. యాఫెతు వంశస్థులు:

## యాఫెతు సంతానము

2యాఫెతు కుమారులు గోమెరు, మాగోగు,
మాదయి, యావాను, తుబాలు, మెషెకు, తీరసు.
3గోమెరు కుమారులు అష్కనజు, రీఫతు, తోగర్మా
4యావాను కుమారులు ఎలీషా, తర్షీషు, కిత్తీము,
దాదోనీము.
5మధ్యధరా సముద్రానికి చుట్టు ప్రక్కల దేశాల్లో
నివశించు ప్రజలంతా ఈ యాఫెతు కుమారుల సంతా
నమే. ఒక్కో కుమారునికి ఒక్కో స్వంత దేశం ఉంది.
కుటుంబాలన్ని పెరిగి వేరు వేరు జాతుల వారయ్యారు.
ప్రతి జాతివారికీ వారి స్వంత భాష ఉంది.

## హాము సంతానము

6హాము కుమారులు కూషు, మిస్రాయిము,*
పూతు, కనాను.
7కూషు కుమారులు సెబా, హవీలా, సబ్తా. రాయమా
కుమారులు షేబ, దదాను. 8కూషుకు నిమ్రోదు అనే
కుమారుడు కూడా ఉన్నాడు. భూమిమీద నిమ్రోదు
చాలా శక్తిమంతుడ య్యాడు. 9నిమ్రోదు యెహోవా
యెదుట గొప్ప వేటగాడు. అందుకే మనుష్యులు
కొందరిని నిమ్రోదుతో పోల్చి, “ఆ మనిషి నిమ్రోదు
వలె యెహోవా ఎదుట గొప్ప వేటగాడు” అంటారు.
10షీనారు దేశంలో బాబెలు, ఎరెకు, అక్కదు అనే
చోట్ల నిమ్రోదు రాజ్యం ఆరంభం అయింది.
11నిమ్రోదు అష్షూరు కూడా వెళ్లాడు. అక్కడే నీనెవె
రహెూబో, తీరు, కాలహు, 12రెసెను పట్టణాలను
అతడు నిర్మించాడు. (నీనెవెకు, కాలహు మహా పట్టణా
నికి మధ్య రెసెను ఉంది.)
13లూదీయులు, అనామీయులు, లెహాబీయులు,
నప్తుహీయులు. 14సత్రుసీయులు, కఫ్తోరీయుల జనాంగ
ములకు మిస్రాయిము తండ్రి. (ఫిలిష్తీయులు కస్లూహీ
యులలో నుండి వచ్చిన వారే.)
15సీదోను తండ్రి కనాను. కనాను జ్యేష్ఠ కుమారుడు
సీదోను, హేతుకు కనాను తండ్రి. 16యెబూసీయులు,
అమోరీయులు, గిర్గాషీయులు. 17హివ్వీయులు, అర్కీ
యులు, సినీయులు. 18అర్వాదీయులు, సెమారీ
యులు, హమాతీయులు అందరికి కనాను తండ్రి.
కనాను వంశాలు ప్రపంచంలోని వేర్వేరు భాగాలకు
వ్యాప్తి చెందాయి.
19ఉత్తరాన సీదోను నుండి దక్షిణాన గెరారు వరకు,
పశ్చిమాన గాజా నుండి తూర్పున సొదొమ, గొమొర్రా,
అద్మా, సెబోయీము నుండి లాషా వరకు కనాను
ప్రజల భూభాగమే. 20ఆ ప్రజలంతా హాము సంతానం.
ఆ ప్రజలందరికీ వారి స్వంత భాషలు, స్వంత దేశాలు
ఉన్నాయి. వారు వేరు వేరు జాతులయ్యారు.

## షేము సంతానము

21యాఫెతు అన్న షేము. షేము వంశస్థుల్లో ఒక
డైన ఏబెరు హెబ్రీ ప్రజలందరికీ తండ్రి.
22షేము కుమారులు, ఏలాము, అష్షూరు, అర్పక్షదు,
లూదు, అరాము,
23అరాము కుమారులు ఊజు, హూలు, గెతెరు
మాష.
24అర్పక్షదు షేలహుకు తండ్రి. షేలహు ఏబెరుకు
తండ్రి. 25ఏబెరు ఇద్దరు కుమారులకు తండ్రి, ఒక
కుమారునికి పెలెగు* అని పేరు పెట్టబడింది. అతని

---

**కనాను** హాము కుమారుడు. కనానీ ప్రజలు పాలస్తీనా తీర ప్రాంతం, లెబనాను, సిరియా ప్రాంతాలలో నివసించారు. తర్వాత, ఈ దేశాన్ని దేవుడు ఇశ్రాయేలీయులకు ఇచ్చాడు.

**మిస్రాయిము** ఇది ఈజిప్టు యొక్క మరో పేరు.

**పెలెగు** అనగా విభజన.

జీవిత కాలములోనే భూమి విభజింపబడింది. కనుక అతనికి ఈ పేరు పెట్టబడింది. మరో సోదరుడి పేరు యొక్తాను.

[26]యొక్తాను కుమారులు అల్మోదాదు, షెలపు, హసర్మావెతు, యెరహు, [27]హదోరము, ఊజాలు, దిక్లాను [28]ఓబాలు, అబీమాయెలు, షెబ, [29]ఓఫీరు, హవీలా, యోబాబు. ఈ మనుష్యులంతా యొక్తాను కుమారులు. [30]మేషాకు దేశానికీ, తూర్పునున్న కొండ దేశానికి మధ్య ఆ ప్రజలు జీవించారు. సెపారా దేశపు దిశలో మేషా ఉంది.

[31]వాళ్లు షేము వంశంనుండి వచ్చిన ప్రజలు. వంశాలు, భాషలు, దేశాలు, జాతులను బట్టి వారి క్రమం ఏర్పాటు చేయబడింది.

[32]నోవహు కుమారుల వంశాల జాబితా అది. అవి వారి జాతుల ప్రకారం ఏర్పాటు చేయబడ్డాయి. జలప్రళయం తర్వాత భూమి అంతటా వ్యాపించిన ప్రజలందరూ ఆ వంశాల నుండి వచ్చిన వారే.

### ప్రపంచ విభజన

11 జలప్రళయం తర్వాత మానవులంతా ఒకే భాష మాట్లాడారు. ప్రజలంతా ఒకే పదజాలం ఉపయోగించారు. [2]తూర్పు నుండి ప్రజలు కదిలిపోయారు. షీనారు దేశంలో మైదాన భూమిని వారు కనుగొన్నారు. బతుకుదెరువు కోసం ప్రజలంతా అక్కడే ఉండిపోయారు.

[3]"మనం ఇటుకలు చేసి, అవి గట్టిపడేందుకు వాటిని కాల్చాలి" అనుకొన్నారు ప్రజలు. ఇళ్లు కట్టుటకు ప్రజలు రాళ్లు గాక ఇటుకలనే ఉపయోగించారు. అలానే అడుసు గాక తారు ఉపయోగించారు.

[4]అప్పుడు ప్రజలు ఇలా అన్నారు: "మన కోసం మనం ఒక పట్టణం కట్టుకోవాలి. ఆకాశం అంత ఎత్తుగా మనం ఒక గోపుర శిఖరం కట్టుకోవాలి. ఇలా గనుక చేస్తే మనం ప్రఖ్యాతి చెందుతాం ప్రపంచమంతటా మనం చెల్లా చెదురవకుండా ఒకే చోట మనమంతా కలసి ఉంటాం."

[5]ఆ పట్టణాన్ని, ఆ గోపుర శిఖరాన్ని చూచుటకు యెహోవా దిగి వచ్చాడు. వాటిని ప్రజలు నిర్మిస్తూ ఉండటం యెహోవా చూశాడు. [6]యెహోవా ఇలా అన్నాడు: "ఈ ప్రజలంతా ఒకే భాష మాట్లాడుతున్నారు. వీళ్లంతా కలసి ఉమ్మడిగా ఈ పని చేస్తున్నట్టు నాకు కనబడుతోంది. వారు చేయగలగిన దానికి ఇది ప్రారంభం మాత్రమే. త్వరలో వాళ్లు యోచించినదేదైనా చేయ గలుగుతారు. [7]అందుచేత మనం కిందికి వెళ్లి వారి భాషను గలిబిలి చేద్దాం. అప్పుడు వాళ్లు ఒకరి నొకరు అర్థం చేసుకోలేరు."

[8]ఆ ప్రజలు భూలోకం అంతటా చెదిరిపోయేటట్టు యెహోవా చేసాడు. కనుక ఆ పట్టణాన్ని కట్టుకోవటం ఆ ప్రజలు ముగించలేకపోయారు. [9]మొత్తం ప్రపంచంలోని భాషను దేవుడు గలిబిలి చేసిన చోటు అదే. కనుక ఆ స్థలం బాబెలు* అని పిలువబడింది. కనుక ఆ స్థలం నుండి భూమిమీద ఇతర చోట్లన్నింటికీ ఆ ప్రజలను యెహోవా చెదరగొట్టాడు.

### షేము కుటుంబ చరిత్ర

[10]షేము కుటుంబ చరిత్ర ఇది. జలప్రళయం తర్వాత రెండు సంవత్సరాలకు, షేము 100 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు, అతని కుమారుడు అర్పక్షదు పుట్టాడు. [11]ఆ తర్వాత షేము 700 సంవత్సరాలు జీవించాడు. అతనికి ఇంకా కుమారులు కుమార్తెలు, ఉన్నారు.

[12]అర్పక్షదు 35 సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు, అతని కుమారుడు షెలహు పుట్టాడు. [13]షెలహు పుట్టిన తర్వాత అర్పక్షదు 403 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కొందరు కుమారులు కుమార్తెలు పుట్టారు.

[14]షెలహుకు 30 సంవత్సరాలు నిండిన తర్వాత అతని కుమారుడు ఏబెరు పుట్టాడు. [15]ఏబెరు పుట్టిన తర్వాత షెలహు 403 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కొందరు, కుమారులు కుమార్తెలు పుట్టారు.

[16]ఏబెరుకు 34 సంవత్సరాలు నిండిన తర్వాత అతని కుమారుడు పెలెగు పుట్టాడు. [17]పెలెగు పుట్టిన తర్వాత ఏబెరు 430 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు కుమార్తెలు పుట్టారు.

[18]పెలెగుకు 30 సంవత్సరాలు నిండినప్పుడు అతని కుమారుడు రయూ పుట్టాడు. [19]రయూ పుట్టిన తర్వాత, పెలెగు ఇంకా 209 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కొందరు కుమారులు, కుమార్తెలు పుట్టారు.

[20]రయూకు 32 సంనత్సరాలు నిండినప్పుడు, అతని కుమారుడు సెరూగు పుట్టాడు. [21]సెరూగు పుట్టిన తర్వాత రయూ 207 సంవత్సరాలు బతికాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమార్తెలు, కుమారులు పుట్టారు.

[22] సెరూగుకు 30 సంవత్సరాలు నిండినప్పుడు అతని కుమారుడు నాహోరు పుట్టాడు. [23]నాహోరు పుట్టిన తర్వాత, సెరూగు 200 సంవత్సరాలు జీవించాడు. ఆ కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు.

[24]నాహోరుకు 29 సంవత్సరాలు నిండినప్పుడు అతని కుమారుడు తెరహు పుట్టాడు. [25]తెరహు పుట్టిన తర్వాత నాహోరు 119 సంవత్సరాలు జీవించాడు. ఆ

---

**బాబెలు** లేక బబులోను. దీని అర్థమేమనగా 'తారుమారు.'

కాలంలో అతనికి ఇంకా కుమారులు, కుమార్తెలు పుట్టారు. 26తెరహుకు 70 సంవత్సరాలు నిండినప్పుడు, అతని కుమారులు అబ్రాము, నాహోరు, హారాను పుట్టారు.

### తెరహు కుటుంబ చరిత్ర

27తెరహు కుటుంబ చరిత్ర ఇది. అబ్రాము, నాహోరు, హారానులకు తండ్రి తెరహు. లోతుకు హారాను తండ్రి. 28కల్దీయుల ఊర్ అనే తన స్వగ్రామంలో హారాను మరణించాడు. తన తండ్రి తెరహు బ్రతికి ఉన్నప్పుడే హారాను చనిపోయాడు. 29అబ్రాము, నాహోరు పెళ్లి చేసుకొన్నారు. అబ్రాము భార్యకు శారయి అని పేరు పెట్టబడింది. నాహోరు భార్యకు మిల్కా అని పేరు పెట్టబడింది. మిల్కా హారాను కుమార్తె. మిల్కా ఇస్కాలకు హారాను తండ్రి. 30శారయి పిల్లలను కనే అవకాశం లేనందువల్ల ఆమెకు పిల్లలు లేరు.

31తెరహు తన కుటుంబముతోబాటు కల్దీయుల ఊర్ అను పట్టణమును విడచిపెట్టేసాడు. కనానుకు ప్రయాణం చేయాలని వారు ఏర్పాటు చేసుకొన్నారు. తన కుమారుడు అబ్రామును, మనమడు లోతును (హారాను కుమారుడు), కోడలు శారయిని తెరహు తన వెంట తీసుకు వెళ్లాడు. వారు హారాను పట్టణం వరకు ప్రయాణం చేసి, అక్కడ ఉండి పోవాలని నిర్ణయించు కొన్నారు. 32తెరహు 205 సంవత్సరాలు జీవించాడు. తర్వాత అతడు హారానులో మరణించాడు.

### దేవుడు అబ్రామును పిలచుట

12 అబ్రాముతో యెహోవా ఇలా అన్నాడు,
"నీ దేశాన్ని, నీ ప్రజలను విడిచిపెట్టు. నీ తండ్రి కుటుంబాన్ని విడిచిపెట్టి, నేను నీకు చూపించు దేశానికి వెళ్లు.
2 నిన్ను ఆశీర్వదిస్తాను. నిన్ను ఒక గొప్ప జాతిగా నేను చేస్తాను నీ పేరును నేను ప్రఖ్యాతి చేస్తాను. ఇతరులను ఆశీర్వదించటానికి ప్రజలు నీ పేరు ఉపయోగిస్తారు.
3 నిన్ను ఆశీర్వదించే వారిని నేను ఆశీర్వదిస్తాను. నిన్ను శపించే వాళ్లను నేను శపిస్తాను. భూమి మీద నున్న మనుష్యులందరిని ఆశీర్వదించడానికి నేను నిన్ను ఉపయోగిస్తాను."

### అబ్రాము కనాను వెళ్లాడు

4కనుక అబ్రాము యెహోవాకు విధేయుడై కనాను వెళ్లాడు. అతడు హారానును విడిచిపెట్టాడు, లోతు అతనితో కూడ వెళ్లాడు. ఈ సమయంలో అబ్రాము వయస్సు 75 సంవత్సరాలు. 5అబ్రాము హారానును విడిచిపెట్టినప్పుడు అతడు ఒంటరి వాడు కాడు. తన భార్య శారయిని, తమ్ముని కుమారుడు లోతును, హారానులో వారికి కలిగిన సమస్తాన్ని అబ్రాము తనతో తీసుకు వెళ్లాడు. హారానులో అబ్రాము సంపాదించిన బానిసలు అంతా వారితో వెళ్లారు. అబ్రాము అతని వర్గంవారు హారాను విడిచి, కనాను దేశానికి ప్రయాణం చేసారు. 6అబ్రాము కనాను దేశం గుండా సంచారం చేసాడు. అబ్రాము షెకెము పట్టణానికి పయనించి మోరేలో వున్న మహా వృక్షం దగ్గరకు వచ్చాడు. ఆ కాలంలో కనాని ప్రజలు ఈ దేశంలో నివసించారు.

7అబ్రాముకు యెహోవా ప్రత్యక్షమయ్యి, "ఈ దేశాన్ని నీ సంతానానికి ఇస్తాను" అన్నాడు.

ఆ స్థలంలో అబ్రాముకు యెహోవా ప్రత్యక్షమయ్యాడు. కనుక ఆ స్థలంలో యెహోవాను ఆరాధించటానికి అబ్రాము ఒక బలిపీఠం కట్టాడు. 8తర్వాత అబ్రాము ఆ స్థలం విడిచిపెట్టి బేతేలుకు తూర్పున ఉన్న పర్వత ప్రాంతాలకు వెళ్లాడు. అక్కడ అబ్రాము తన గుడారం వేసుకొన్నాడు. పడమటకి బేతేలు పట్టణం ఉంది. తూర్పున హాయి పట్టణం ఉంది. ఆ స్థలంలో యెహోవాకోసం మరో బలిపీఠాన్ని అబ్రాము నిర్మించాడు. అక్కడ అబ్రాము యెహోవాను ఆరాధించాడు. 9ఆ తర్వాత అబ్రాము మరల ప్రయాణం మొదలు పెట్టాడు. నెగెబు* దిశగా అతడు ప్రయాణం చేసాడు.

### ఈజిప్టులో అబ్రాము

10ఆ కాలంలో భూమి చాలా ఎండిపోయింది. వర్షం లేదు కనుక ఏ పంటా పెరగటం లేదు. కనుక అబ్రాము నివసించటానికి ఈజిప్టుకు వెళ్లాడు. 11తన భార్య శారయి చాలా అందంగా ఉండటం అబ్రాము గమనించాడు. కనుక వారు ఈజిప్టు చేరకముందే అబ్రాము శారయితో ఇలా చెప్పాడు: "నీవు చాలా అందమైన స్త్రీవని నాకు తెలుసు. 12ఈజిప్టీయులు నిన్ను చూస్తారు. ఈ స్త్రీ అతని భార్య అని వాళ్లు అంటారు. తర్వాత వాళ్లు నిన్ను ఆశించి నన్ను చంపేస్తారు. 13కనుక నీవు నా సోదరివి అని ప్రజలతో చెప్పు. అప్పుడు వాళ్లు నన్ను చంపరు. నేను నీ సోదరుణ్ణి అని అనుకొంటారు గనుక వాళ్లు నామీద దయ చూపిస్తారు. ఈ విధంగా నీవు నా ప్రాణం కాపాడుతావు."

14కనుక అబ్రాము తన భార్యతో ఈజిప్టు దేశంలో ప్రవేశించారు. శారయి చాలా అందగత్తె అని ఈజిప్టు ప్రజలు చూశారు. 15ఈజిప్టు నాయకులు కూడ కొందరు ఆమెను చూశారు. ఆమె చాలా అందగత్తె అని ఫరోతో వాళ్లు చెప్పారు. ఆ నాయకులు శారయిని ఫరో యింటికి తీసుకెళ్లారు. 16శారయికి అబ్రాము సోదరుడు అనుకొని ఫరో అబ్రాము మీద దయ

---

**నెగెబు** దక్షిణ పాలస్తీనాకు "నెగెవ్" అని పేరు.

చూపించాడు. గొర్రెలు, పశువులు, గాడిదలను ఫరో
అబ్రాముకు ఇచ్చాడు. సేవకులు, సేవకురాండ్రు,
ఒంటెలను కూడా అబ్రాముకు ఇచ్చాడు.
17అబ్రాము భార్యను ఫరో తీసుకొన్నాడు. కనుక
ఫరోకు అతని ఇంటిలోని మనుష్యులందరికి చాలా
తీవ్రమైన రోగాలు వచ్చేటట్టు యెహోవా చేసాడు.
18అందుచేత ఫరో అబ్రామును పిలిచాడు. ఫరో ఇలా
అన్నాడు, “నీవు నాకు చాలా అపకారం చేశావు. శారయి
నీ భార్య అని నాతో ఎందుకు నీవు చెప్పలేదు? 19ఈమె
నీ సోదరి అని చెప్పావు. నీవు ఎందుకలా చెప్పావు?
ఆమె నా భార్యగా ఉండాలని ఆమెను నేను తీసుకొ
న్నాను. అయితే ఇప్పుడు నీ భార్యను మరల నేను
నీకు ఇచ్చేస్తున్నాను. ఆమెను తీసుకొని వెళ్లిపో!”
20తర్వాత అబ్రామును ఈజిప్టు నుండి పంపించి వేయు
మని ఫరో తన మనుష్యులకు ఆజ్ఞాపించాడు. కనుక
అబ్రాము, అతని భార్య ఆ స్థలం విడిచి వెళ్లిపోయారు.
వాళ్లకు ఉన్న సమస్తాన్ని తీసుకొని వెళ్లిపోయారు.

## అబ్రాము తిరిగి కనాను రావటం

13 కనుక అబ్రాము ఈజిప్టు విడచిపెట్టాడు. తన
భార్యను, స్వంతంగా తనకు ఉన్నదంతా తీసు
కొని, నెగెబుగుండా అబ్రాము ప్రయాణం చేసాడు.
లోతు కూడా వాళ్లతో ఉన్నాడు. 2ఈ సమయానికి
అబ్రాము చాలా ఐశ్వర్యవంతుడు. అతనికి చాలా విస్తా
రంగా పశువులు ఉన్నాయి. చాలా వెండి, బంగారం
ఉన్నాయి.
3అబ్రాము చుట్టుప్రక్కల సంచరిస్తూనే ఉన్నాడు.
నెగెబు విడచిపెట్టి మళ్లీ బేతేలు వెనుకకు వెళ్లాడు.
బేతేలు పట్టణానికి, హాయి పట్టణానికి మధ్యనున్న
చోటుకు అతడు వెళ్లాడు. ఇంతకు ముందు అబ్రాము
నివసించిన స్థలమే ఇది. 4అబ్రాము ఒక బలిపీఠాన్ని
నిర్మించిన స్థలమిది. కనుక ఈ స్థలంలో అబ్రాము
యెహోవాను ఆరాధించాడు.

## అబ్రాము, లోతు వేరుపడటం

5ఈ సమయంలో అబ్రాముతో లోతు గూడా
ప్రయాణం చేస్తున్నాడు. లోతుకు గొర్రెలు, పశువులు,
గుడారాలు చాలా ఉన్నాయి. 6అబ్రాముకు, లోతుకు
పశువులు విస్తారంగా ఉన్నందువల్ల వాళ్లిద్దరికి ఆ భూమి
సరిపోలేదు. 7అబ్రాము గొర్రెల కాపరులు లోతు
గొర్రెల కాపరులు వాదించుకోవడం మొదలు పెట్టారు.
అదే సమయంలో కనానీయులు, పెరిజ్జీయులు కూడా
ఈ దేశంలో నివసిస్తున్నారు.
8కనుక లోతుతో అబ్రాము ఇలా అన్నాడు: “నీకు,
నాకు మధ్య వాదం ఏమీ ఉండకూడదు. నీ మనుష్యులు
నా మనుష్యులు వాదించుకోగూడదు. మనమంతా సోద
రులం. 9మనం వేరై పోవాలి. నీకు ఇష్టం వచ్చిన స్థలం
ఏదైనా నీవు కోరుకో నీవు ఎడమకు వెళ్తే నేను కుడికి
వెళ్తాను. నీవు కుడికి వెళ్తే, నేను ఎడమకు వెళ్తాను.”
10లోతు పరిశీలించి యొర్దాను లోయను చూశాడు.
అక్కడ నీళ్లు విస్తారంగా ఉన్నట్టు లోతు చూశాడు.
(ఇది సొదొమ గొమొర్రాలను యెహోవా నాశనము
చేయకముందు ఆ కాలంలో సోయరు వరకు యొర్దాను
లోయ యెహోవా తోటలా ఉంది, ఈజిప్టు భూమిలా
ఇది కూడ మంచి భూమి.) 11అందుచేత యొర్దాను
లోయలో జీవించాలని లోతు నిర్ణయించు కొన్నాడు.
ఆ ఇద్దరు మనుష్యులు వేరై పోయారు, లోతు తూర్పు
దిక్కుగా ప్రయాణం మొదలు పెట్టాడు. 12అబ్రాము
కనాను దేశంలోనే ఉండిపోయాడు, లోతు లోయలోని
పట్టణాల్లో నివసించాడు. బాగా దక్షిణాదిన ఉన్న సొదొ
మకు తరలిపోయి అక్కడ లోతు నివాసం ఏర్పరచు
కొన్నాడు. 13సొదొమ ప్రజలు చాలా దుర్మార్గులు.
వాళ్లు ఎప్పుడూ యెహోవాకు వ్యతిరేకంగా పాపం
చేస్తున్నారు.
14లోతు వెళ్లిపోయిన తర్వాత అబ్రాముతో
యెహోవా ఇలా అన్నాడు: “నీ చుట్టు చూడు ఉత్తరం,
దక్షిణం, తూర్పు, పడమర చూడు. 15నీవు చూస్తోన్న
ఈ దేశం అంతా నీకు, నీ వారసులకు నేను ఇస్తాను.
ఇది శాశ్వతంగా నీ దేశం అవుతుంది. 16భూమిమీద
ధూళి కణాలు ఎంత విస్తారమో, నీ వారసులను గూడ
అంత విస్తరింప జేస్తాను. నేలమీద ధూళి కణాలను
ఎవరైనా లెక్కించగలిగితే అది నీ ప్రజల సంఖ్య అవు
తుంది. 17కనుక వెళ్లు నీ దేశంలో సంచరించు. దానిని
ఇప్పుడు నేను నీకు ఇస్తున్నాను.”
18కనుక అబ్రాము తన గుడారాలను తరలించాడు,
మమ్రే సమీపంలోని మహా వృక్షాల దగ్గర నివసించాలని
అతడు వెళ్లాడు. ఇది హెబ్రోను పట్టణానికి దగ్గరగా
ఉంది. యెహోవాను ఆరాధించటానికి ఆ స్థలంలో
ఒక బలిపీఠాన్ని అబ్రాము కట్టించాడు.

## లోతు బంధించబడ్డాడు

14 షీనారు రాజైన అమ్రాపేలు, ఎల్లాసరు రాజైన
అర్యోకు, ఏలాం రాజైన కదొర్లాయోమెరు,
మరియు గోయీయుల రాజైన తిదాలు. 2ఈ రాజులం
తా కలసి సొదొమ రాజు బెరాతోను, గొమొర్రా రాజు
బిర్షా, అద్మా రాజు షినాబు, సెబోయీయుల రాజు
షెమేబెరు, బెల రాజు (సోయరు అని కూడ బెల
పిలవబడింది) లతో యుద్ధము చేసారు.
3ఈ రాజులంతా సిద్దీము లోయలో వారి సైన్యా
లతో కలుసుకున్నారు. (సిద్దీము లోయ యిప్పుడు
ఉప్పు సముద్రం) 4ఈ రాజులు పన్నెండు సంవత్సరాల
పాటు కదొర్లాయోమెరుకు సేవ చేసారు. అయితే
13వ సంవత్సరంలో వారంతా అతని మీద తిరుగుబాటు
చేసారు. 5కనుక 14 వ సంవత్సరంలో కదొర్లాయోమెరు

రాజు, అతనితో ఉన్న రాజులు వీరిమీద యుద్ధం
చేయటానికి వచ్చారు. కదొర్లాయోమెరు, అతనితో
ఉన్న రాజులు అష్తారోతు కర్నాయిములో రఫాయి
ప్రజలను ఓడించారు. హాములో జూజీయులను కూడా
వారు ఓడించారు. షావే కిర్యతాయిములో ఏమీయులను
వారు ఓడించారు. 6శేయీరు* కొండ ప్రదేశం నుండి
ఏల్పారాను వరకు హోరీయులను వారు ఓడించారు.
(ఏల్పారాను ఎడారి దగ్గరగా ఉంది.) 7తర్వాత కదొర్లా
యోమెరు రాజు ఉత్తర దిశగా తిరిగి ఏన్మిష్పతు (అంటే
కాదేషు) వెళ్లి, అమాలేకీ ప్రజలందర్నీ ఓడించాడు.
అమోరీ ప్రజలను కూడా అతడు ఓడించాడు. హససోన్
తామారులో ఈ ప్రజలు నివసిస్తారు.
8ఆ సమయంలో సొదొమ రాజు, గొమొర్రా రాజు,
అద్మా రాజు, సెబోయీము రాజు, బెల రాజు (బెల
అంటే సోయరు) కలసి వారి శత్రువుల మీద సిద్దీము
లోయలో యుద్ధం చేయటానికి వెళ్లారు. 9ఏలాము
రాజు కదొర్లాయోమెరు, గోయీయుల రాజు తిదాలు,
షీనారు రాజు అమ్రాపేలు, ఎల్లాసరు రాజు అర్యోకు
మీద వారు యుద్ధము చేసారు. అందుచేత ఈ నలుగురు
రాజులు ఆ అయిదుగురితో యుద్ధం చేసారు.
10సిద్దీం లోయలో తారుతో నింపబడ్డ గుంటలు
చాలా ఉన్నాయి. సొదొమ, గొమొర్రాల రాజులు వారి
సైన్యాలు పారిపోయారు. చాలా మంది సైనికులు ఆ
గుంటల్లో పడిపోయారు. అయితే మిగిలినవాళ్లు కొండ
ల్లోకి పారిపోయారు.
11కనుక సొదొమ, గొమొర్రా ప్రజల ఆస్తినంతా
వారి శత్రువులు తీసుకుపోయారు. వారి బట్టలు,
భోజనం అంతా తీసుకొని వారు వెళ్లిపోయారు.
12అబ్రాము సోదరుని కుమారుడు లోతు సొదొమలో
నివసిస్తుండగా శత్రువు అతణ్ణి బంధించాడు. అతని
ఆస్తి మొత్తం తీసుకొని శత్రువు వెళ్లిపోయాడు. 13పట్టు
బడని లోతుయొక్క మనుష్యులలో ఒకడు అబ్రాము
దగ్గరకు వెళ్లి జరిగినదాన్ని చెప్పాడు. అమ్మోరీవాడగు
మమ్రే చెట్లదగ్గర అబ్రాము నివాసం చేస్తున్నాడు.
మమ్రే, ఎష్కోలు, అనేరు ఒకరికి ఒకరు సహాయ ఒడం
బడిక చేసుకొన్నారు. అబ్రాముకు సహాయం చేసేం
దుకు గూడ వారు ఒక ఒడంబడిక చేసుకొన్నారు.

## అబ్రాము లోతును రక్షించుట

14లోతు బంధించబడ్డాడని అబ్రాముకు తెలిసింది.
కనుక అబ్రాము తన కుటుంబం అంతటిని సమావేశ
పర్చాడు. వారిలో 318 మంది శిక్షణ పొందిన సైనికులు
ఉన్నారు. అబ్రాము తన మనుష్యులకు నాయకత్వం
వహించి, దాను పట్టణం వరకు శత్రువును పూర్తిగా
తరిమివేసాడు. 15ఆ రాత్రి అతడు, అతని మనుష్యులు
శత్రువు మీద అకస్మాత్తుగా దాడి జరిపారు. వారు శత్రు
వును ఓడించి దమస్కుకు ఉత్తరాన హోబా వరకు
వారిని తరిమివేసారు. 16అప్పుడు అబ్రాము శత్రువు
దొంగిలించిన వస్తువులన్నింటిని మరల వెనుకకు
తీసుకొని వచ్చాడు. స్త్రీలను, సేవకులను, లోతును,
అతని ఆస్తి అంతటిని అబ్రాము వెనుకకు తీసుకొని
వచ్చాడు.
17కదొర్లాయోమెరును, అతనితో ఉన్న రాజులను
ఓడించిన తర్వాత అబ్రాము తన యింటికి తిరిగి
వెళ్లాడు. అతడు యింటికి వచ్చుచున్నప్పుడు షావే
లోయలో అతణ్ణి కలుసుకొనేందుకు సొదొమ రాజు
వెళ్లాడు. (ఇప్పుడు దీనిని రాజు లోయ అంటారు.)

## మెల్కీసెదెకు

18షాలేము రాజు మెల్కీసెదెకు కూడా అబ్రామును
కలుసుకొనేందుకు వెళ్లాడు. సర్వోన్నతుడైన దేవునికి
మెల్కీసెదెకు యాజకుడు. రొట్టెను ద్రాక్షారసాన్ని
మెల్కీసెదెకు తెచ్చాడు. 19మెల్కీసెదెకు అబ్రామును
ఆశీర్వదించి ఇలా అన్నాడు:

“అబ్రామా, మహోన్నతుడైన దేవుడు నీకు దీవె
నలు ప్రసాదించుగాక, దేవుడు భూమ్యాకాశాలను
చేసినవాడు.
20 సర్వోన్నతుడైన దేవుణ్ణి మనం స్తుతిస్తున్నాం
నీ శత్రువుల్ని ఓడించటానికి ఆయనే నీకు
సహాయం చేసాడు.”

యుద్ధ సమయంలో అబ్రాము తెచ్చుకొన్న దానం
తటిలో నుండి పదోవంతు మెల్కీసెదెకునకు అతడు
ఇచ్చాడు. 21అప్పుడు సొదొమ రాజు, “వీటన్నింటిని
నీ కోసమే ఉంచుకో. శత్రువుచేత బాధించబడి తీసు
కొనిపోబడ్డ నా మనుష్యులను మాత్రం నాకు ఇచ్చేయి”
అని అబ్రాముతో చెప్పాడు.
22అయితే సొదొమ రాజుతో అబ్రాము ఇలా
చెప్పాడు: “భూమిని, ఆకాశాన్ని చేసిన మహోన్నతు
డైన యెహోవా దేవుని పేర నేను వాగ్దానం చేస్తు
న్నాను.
23నీకు చెందినది ఏదీ నేను ఉంచుకోను. ఒక
నూలుపోగైనా లేక జోళ్ల దారాలయినా, ఏదీ ఉంచు
కోనని నేను వాగ్దానం చేస్తున్నాను. ‘అబ్రామును
నేనే ధనికునిగా చేసానని నీవు చెప్పడం నాకిష్టం లేదు.’
24నా యువకులు భుజించిన ఆహారం ఒక్కటి
మాత్రము నేను స్వీకరిస్తాను. అయితే మిగిలిన వారికి
వారి వంతు నీవు ఇవ్వాలి. యుద్ధములో మేము గెలుచు
కొన్న వాటిని తీసుకొని, ఆనేరు, ఎష్కోలు, మమ్రేలకు
రావలసిన భాగాలు వారికి ఇవ్వు. వీళ్లు నాకు యుద్ధంలో
సహాయపడ్డారు.”

---

**శేయీరు** లేక ‘ఎదోము.’

### అబ్రాముతో దేవుని ఒడంబడిక

15 ఈ సంగతులన్నీ జరిగాక, ఒక దర్శనంలో
అబ్రాముకు యెహోవా వాక్కు వచ్చి
"అబ్రామూ భయపడకు, నేను నిన్ను కాపాడుతాను.
నేను నీకు గొప్ప ప్రతిఫలం ఇస్తాను" అన్నాడు దేవుడు.
2అయితే అబ్రాము అన్నాడు; "యెహోవా దేవా,
నన్ను సంతోష పెట్టగలిగేందుకు నీవు ఇవ్వగలిగింది
ఏదీ లేదు. ఎందుచేతనంటే నాకు కుమారుడు లేడు.
కనుక నేను చనిపోయిన తర్వాత, నా సేవకుడును
దమస్కువాడైన ఎలీయెజెరు నా ఆస్తి అంతటికి కర్త
అవుతాడు." 3అబ్రాము: "చూడు దేవా, నాకు నీవు
కుమారుణ్ణి ఇవ్వలేదు. కనుక నా ఇంటిలో పుట్టిన
సేవకుడు నాకు గల ఆస్తి అంతా దక్కించుకొంటాడు."
4అప్పుడు అబ్రాముతో యెహోవా మాట్లాడాడు:
"నీకు ఉన్నవాటన్నింటిని పొందేవాడు నీ సేవకుడు
కాదు. నీకు ఒక కుమారుడు కలుగుతాడు. నీకుగల
వాటన్నింటిని నీ కుమారుడు పొందుతాడు."
5అంతట దేవుడు అబ్రామును గుడారము బయ
టకు తీసుకొనివెళ్లి, ఇలా చెప్పాడు: "ఆకాశం చూడు,
అక్కడ ఎన్ని నక్షత్రాలు ఉన్నాయో చూడు. అవి
చాలా ఉన్నాయి. నీవు లెక్కపెట్టలేవు. భవిష్యత్తులో
నీ కుటుంబం అలాగే ఉంటుంది."
6అబ్రాము దేవుణ్ణి నమ్మాడు, అబ్రాముయొక్క
విశ్వాసాన్ని దేవుడు నీతిగా అంగీకరించాడు 7అబ్రా
ముతో దేవుడు ఇలా అన్నాడు, "కల్దీయుల ఊరు
అను పట్టణము నుండి నిన్ను బయటకు నడిపించిన
యెహోవాను నేనే. ఈ దేశాన్ని నీకు ఇచ్చేందుకు
నేను అలా చేసాను. ఈ దేశం నీ స్వంతం అవుతుంది."
8అయితే అబ్రాము, "యెహోవా, నా ప్రభువా
ఈ దేశం నాదే అవుతుందని నాకు ఎలా తెలుస్తుంది?"
అన్నాడు.
9అబ్రాముతో దేవుడు అన్నాడు: "మనం ఒక ఒడం
బడిక చేసుకొందాం. మూడు సంవత్సరాల ఆవు ఒకటి,
మూడు సంవత్సరాల మేక ఒకటి, మూడు సంవత్సరాల
పొట్టేలు ఒకటి తీసుకురా. ఇంకా నా కోసం ఒక పావు
రాన్ని, ఒక చిన్న పావురాన్ని తీసుకురా."
10దేవుని కోసం వీటన్నిటిని అబ్రాము తెచ్చాడు.
ఆ జంతువులన్నింటిని చంపి ఒక్కోదాన్ని రెండేసి
ముక్కలు చేసాడు, తర్వాత అబ్రాము ఈ భాగాలను
ఒకదానికొకటి ఎదురెదురుగా వేసాడు. పక్షులను రెండు
భాగాలుగా అబ్రాము ఖండించలేదు. 11తర్వాత ఈ
జంతువులను తినటానికి పెద్ద పక్షులు వచ్చి వాలాయి.
కాని అబ్రాము వాటిని వెళ్లగొట్టేసాడు.
12తర్వాత ఆ రోజు సూర్యుడు అస్తమిస్తున్నాడు.
అబ్రాముకు బాగా నిద్ర వచ్చి నిద్రపోయాడు. అతడు
నిద్రపోతూ ఉండగా భయంకర గాఢ చీకటి కమ్మింది.
13అప్పుడు అబ్రాముతో యెహోవా ఇలా చెప్పాడు:
"ఈ సంగతులు నీవు తెలుసుకోవాలి, నీ సంతానము
విదేశీయులై వారి స్వంతం కాని దేశంలో అపరి చితు
లుగా ఉంటారు. వారు అక్కడ బానిసలుగా ఉంటారు.
ఇంకా, 400 సంవత్సరాలు కఠినంగా వాళ్లు శ్రమ పెట్టబడ
తారు. 14అయితే వాళ్లకు యజమానిగా ఉన్న దేశాన్ని,
400 సంవత్సరాల తరువాత నేను శిక్షిస్తాను. మరి నీ
ప్రజలేమో ఆ దేశాన్ని విడిచి పెట్టేస్తారు. నీ ప్రజలు
వెళ్లిపోయేటప్పుడు విస్తారమైన ఆస్తులను వారితో తీసు
కొనిపోతారు.
15"నీ మట్టుకు నీవు చాల వృద్ధాప్యం వరకు జీవి
స్తావు, మనశ్శాంతితో నీవు మరణిస్తావు. నీ వంశం
వారితో నీవు పాతి పెట్టబడతావు. 16నాలుగు తరాల
తర్వాత నీ ప్రజలు మరల ఈ దేశం వస్తారు. ఆ సమ
యంలో అమోరీ ప్రజలను నీ ప్రజలు ఓడిస్తారు.
అక్కడ నివసిస్తోన్న అమోరీ ప్రజలను శిక్షించటానికి నీ
ప్రజలను నేను వాడుకొంటాను. ఇది భవిష్యత్తులో
జరుగుతుంది. ఎందుచేతనంటే, శిక్షకు తగినంత చెడు
తనం ఇప్పుడు అమోరీ ప్రజల్లో లేదు."
17సూర్యుడు అస్తమించాక, చాలా చీకటి పడింది,
చచ్చిన జంతువులు రెండేసి ముక్కలుగా ఖండించబడి
ఇంకా అక్కడే నేలమీద పడి ఉన్నాయి. ఆ సమయంలో
పొగమంటల వరుస* చచ్చిన జంతువుల రెండేసి
ముక్కల మధ్యగా సాగిపోయింది. దేవుడు అబ్రాముతో
చేసుకొన్న ఒప్పందానికి ఇది ఒక 'ముద్ర' లేక
'సంతకం'. ఆ రోజుల్లో, కోయబడ్డ జంతువుల
ముక్కల మధ్య నడవడం అనే ఒడబండిక ఆ మనిషి
యొక్క నిజాయితీని తెలుపుతుంది. 'నేను ఈ ఒడం
బడికను అనుసరించకపోతే ఇదే నాకు జరుగనీ' అన్నది
దీని అర్థం.
18కనుక ఆనాడు, ఒక వాగ్దానాన్ని, ఒక ఒడంబడికను
అబ్రాముతో యెహోవా చేసాడు. యెహోవా
అన్నాడు: "ఈ దేశాన్ని నీ సంతానమునకు నేను
ఇస్తాను. ఈజిప్టు నదికి,* యూఫ్రటీసు నదికి మధ్య
ఉన్న దేశాన్ని నేను వారికి ఇస్తాను. 19కెనీయులు, కెని
జ్జీయులు, కద్మానీయులు, 20హిత్తీయులు, పెరిజ్జీ
యులు, రెఫాయీమీయులు, 21అమోరీయులు, కనానీ
యులు, గిర్గాషీయులు, యెబూషీయుల దేశమిది."

### పనిపిల్ల హాగరు

16 అబ్రాము భార్య శారయి. ఆమెకు, అబ్రాముకు
పిల్లలులేరు. శారయికి ఈజిప్టుకు చెందిన పని
పిల్ల ఉంది. ఆమె పేరు హాగరు. 2శారయి అబ్రాముతో
యిలా చెప్పింది: "చూడండి నాకు పిల్లలు పుట్టకుండా

---

**పొగమంటల వరుస** దేవుడు ప్రజలతో ఉంటాడన
డానికి ఇది గుర్తు.

**ఈజిప్టు నది** వాడి ఎల్ అరిష్.

చేసాడు యెహోవా. కనుక మీరు నా పని మనిషితో
పొండి. ఆమె ద్వారా పుట్టే శిశువును నా స్వంత శిశు
వుగా నేను స్వీకరిస్తాను."
తన భార్య శారయి మాట అబ్రాము విన్నాడు.
3కనాను దేశంలో అబ్రాము పది సంవత్సరాలు జీవించిన
తర్వాత ఇది జరిగింది. హాగరును తన భర్త అబ్రాముకు
శారయి యిచ్చింది. (హాగరు ఈజిప్టు నుండి వచ్చిన
దాసి)
4అబ్రాము వల్ల హాగరు గర్భవతి అయింది. హాగరు
ఇది గమనించినప్పుడు. ఆమె చాలా గర్వపడి, తన
యజమానురాలైన శారయికంటే తాను గొప్పదాన్ని
అని తలంచడం మొదలు పెట్టింది. 5అయితే శారయి
అబ్రాముతో, "నా పనిమనిషి ఇప్పుడు నన్నే అస్య
హించుకొంటుంది. దీనికి నేను నిన్నే నిందిస్తాను.
ఆమెను నేను నీకు ఇచ్చాను. ఆమె గర్భవతి అయింది.
అయితే ఆమె నాకంటే గొప్పదని భావిస్తుంది. మనలో
ఎవరు సరియైనవాళ్లో యెహోవాయే నిర్ణయించాలని
నేను కోరుతున్నాను" అని అనింది.
6కాని అబ్రాము, "హాగరుకు నీవు యజమానురా
లివి, నీ యిష్టం వచ్చినట్టు నీవు ఆమెకు చేయవచ్చు"
అన్నాడు శారయితో. అందుచేత శారయి తన పని
మనిషిని చాలా చులకనగా చూసింది. ఆ పనిమనిషి
పారిపోయింది.

### హాగరు కొడుకు ఇష్మాయేలు

7ఎడారిలో నీటి ఊట దగ్గర యెహోవా దూతకు
ఆ పనిమనిషికి కనబడింది. షూరు మార్గంలో ఆ
ఊట ఉంది. 8"హాగరూ, నీవు శారయి పని మనిషివి
గదూ! ఇక్కడెందుకు ఉన్నావు? నీవు ఎక్కడికి వెళ్తు
న్నావు?" అని ఆ దూత అడుగగా,
"నా యజమానురాలు శారయి నుండి పారి
పోతున్నాను" అని చెప్పింది హాగరు.
9"నీ యజమానురాలి దగ్గరకు నీవు తిరిగి వెళ్లు,
ఆమెకు లోబడి నడుచుకో" అని యెహోవా దూత
ఆమెతో చెప్పడం జరిగింది. 10"నీలో నుండి అనేక
జనములు వస్తారు. వారు చాలామంది ఉంటారు గనుక
వాళ్లను లెక్కపెట్టడం కూడ కుదరదు" అని కూడ
యెహోవా దూత చెప్పడం జరిగింది.
11ఇంకా యెహోవా దూత,

"ఇప్పుడు నీవు గర్భవతివి, మరి నీకు ఒక కుమా
రుడు పుడ్తాడు. అతనికి ఇష్మాయేలు* అని
పేరు పెడతావు. ఎందుచేతనంటే నీ కష్టాల్ని
గూర్చి యెహోవా విన్నాడు. ఆయన నీకు
సహాయం చేస్తాడు.
12"ఇష్మాయేలు అడవి గాడిదలా అదుపులేక,
స్వేచ్ఛగా ఉంటాడు అతడు అందరికి వ్యతిరేకమే
ప్రతి ఒక్కరూ అతనికి వ్యతిరేకమే తన సోదరు
లకు దగ్గరగా అతడు నివసిస్తాడు కాని అతడు
వారికి వ్యతిరేకంగా ఉంటాడు." అని చెప్పాడు.

13ఆ పనిమనిషితో యెహోవా మాట్లాడాడు. దేవు
నికి ఆమె ఒక కొత్త పేరు ప్రయోగించింది. "నన్ను
చూసే దేవుడవు నీవు" అని ఆయనతో చెప్పింది.
"ఈ స్థలంలో కూడా దేవుడు నన్ను చూస్తున్నాడు,
రక్షిస్తున్నాడు" అని అనుకొన్నందువల్ల ఆమె ఇలా
చెప్పింది. 14కనుక ఆ బావి బెయేర్ లహాయిరోయి*
అని పిలువబడింది. కాదేషుకు బెరెదుకు మధ్య ఉంది
ఆ బావి.
15హాగరు ఒక కుమారునికి జన్మనిచ్చింది. ఆ కుమా
రునికి ఇష్మాయేలు అని అబ్రాము పేరు పెట్టాడు.
16హాగరుకు ఇష్మాయేలు పుట్టినప్పుడు అబ్రాము
వయస్సు 86 సంవత్సరాలు.

### ఒడంబడికకు రుజువు – సున్నతి

17 అబ్రాముకు 99 సంవత్సరాల వయస్సు ఉన్న
ప్పుడు యెహోవా అతనికి కనపడి యిలా
చెప్పాడు: "నేను సర్వశక్తిమంతుడైన దేవుడిని నా
కోసం ఈ పనులు చేయి. నాకు విధేయుడవై, సరైన
జీవితం జీవించు. 2ఇలా గనుక నీవు చేస్తే మన ఇద్దరి
మధ్య ఒక ఒడంబడికను నేను తయారు చేస్తాను.
నిన్ను బాగా అభివృద్ధి చేస్తాను."
3అప్పుడు దేవునియెదుట అబ్రాము సాష్టాంగ
పడ్డాడు. అతనితో దేవుడు అన్నాడు. 4"మన ఒడంబడి
కలో నా భాగం ఇది. అనేక జనములకు నిన్ను తండ్రిగా
నేను చేస్తాను. 5నీ పేరు నేను మార్చేస్తాను. నీ పేరు
అబ్రాము కాదు – నీ పేరు అబ్రాహాము. అనేక జనాంగము
లకు నీవు తండ్రివి అవుతావు గనుక, నీకు నేను ఈ
పేరు పెడుతున్నాను. 6నీకు నేను పెద్ద సంతానాన్ని
ఇస్తాను. నీనుండి కొత్త జనాంగాలు ఉద్భవిస్తాయి.
నీనుండి కొత్త రాజులు వస్తారు. 7నీకు నాకు మధ్య
ఒక ఒడంబడికను నేను ఏర్పాటు చేస్తాను. నీ సంతానా
నికి ఈ ఒడంబడిక వర్తిస్తుంది. నేను నీకు దేవునిగా
ఉంటాను. నీ సంతానానికి దేవునిగా ఉంటాను. 8నీవు
పరాయివాడిగా నివసిస్తున్న ఈ దేశాన్ని అంటే కనాను
దేశాన్ని నీకును, నీ సంతానపు వారందరికిని శాశ్వతపు
హక్కుగా ఇస్తాను. నేను మీకు దేవునిగా ఉంటాను."
9అబ్రాహాముతో దేవుడు ఇంకా ఇలా చెప్పాడు:
"ఇక, ఒడంబడికలో నీ భాగం యిది. ఒడంబడికను

---

**ఇష్మాయేలు** 'దేవుడు వినును' అని దీని అర్థం.

**బెయేర్ లహాయిరోయి** 'నన్ను చూచుచున్న సజీవుని
బావి' అని దీని అర్థం.

నీవు నిలబెట్టాలి నీవూ, నీ సంతానమంతా నా ఒడంబడి
కకు విధేయులు కావాలి. 10మీరు విధేయులు కావాల్సిన
ఒడంబడిక ఇదే. ఇది మీకు, నాకు మధ్య ఒడంబడిక.
ఇది నీ సంతానమువారి కోసమూను; పుట్టిన ప్రతి
పిల్లవాడికి తప్పక సున్నతి చెయ్యాలి. 11నీకు నాకు
మధ్యగల ఒడంబడికను నీవు అనుసరిస్తావని తెలియ
చేసేందుకు నీవు నీ మర్మాంగపు ముందు చర్మాన్ని
కోయాలి. 12నీ జనములో పుట్టిన ప్రతి బాలుడు, నీ
జనము నుండికాక, ఇతర జనములనుండి డబ్బుతో
బానిసగా కొనబడిన వారిలో ప్రతి పురుషుడు సున్నతి
చేయించుకొనవలెను. 13కనుక నీ జాతి అంతటిలో
ప్రతి పిల్లవానికి సున్నతి జరుగుతున్నది. నీ వంశంలో
పుట్టిన ప్రతి పిల్లవాడికి, లేక బానిసగా కొనబడిన పిల్ల
వాడికి సున్నతి జరుగుతుంది. 14ఇది నా చట్టం, నీకు
నాకు మధ్య నున్న ఒడంబడిక. సున్నతి చేయని ఏ
మగవాడైనా సరే తన ప్రజల్లో నుండి తొలగించివేయ
బడతాడు. ఎందుచేతనంటే, ఆ వ్యక్తి నా ఒడంబడి
కను ఉల్లంఘించాడు కనుక."

## వాగ్దాన పుత్రుడు ఇస్సాకు

15అబ్రాహాముతో దేవుడు అన్నాడు: "నీ భార్య
శారయికి నేను ఒక కొత్త పేరు పెడ్తాను. ఆమె కొత్త
పేరు శారా*. 16ఆమెను నేను ఆశీర్వదిస్తాను. ఆమెకు
ఒక కుమారుణ్ణి నేను ఇస్తాను, మరి నీవు తండ్రివి
అవుతావు. అనేక కొత్త జనాంగములకు ఆమె తల్లి
అవుతుంది. జనముల రాజులు ఆమెలోనుండి వస్తారు."
17దేవుణ్ణి గౌరవించుటకు అబ్రాహాము ముఖం
క్రిందికి దించుకొన్నాడు. అయితే అతడు నవ్వి తనలో
తాను అనుకొన్నాడు: "నా వయస్సు 100 సంవత్సరాలు.
నాకు కొడుకు పుట్టజాలడు. మరి శారా వయస్సు 90
సంవత్సరాలు. ఆమెకు శిశువు జన్మించడం అసాధ్యం."
18అప్పుడు అబ్రాహాము దేవునితో ఇలా అన్నాడు:
"నా కుమారుడు ఇష్మాయేలు జీవించి నిన్ను సేవిస్తాడని
ఆశిస్తున్నాను."
19దేవుడు చెప్పాడు: "లేదు! నీ భార్య శారాకు
కుమారుడు పుడతాడని నేను చెప్పాను. అతనికి
ఇస్సాకు* అని నీవు పేరు పెడ్తావు. అతనితో నేను నా
ఒడంబడిక చేసుకొంటాను. ఆ ఒడంబడిక అతని సంతా
నాలన్నిటితోను శాశ్వతంగా కొనసాగే ఒడం బడికగా
ఉంటుంది.
20"ఇష్మాయేలును గూర్చి నీవు నన్ను అడిగావు,
నేను విన్నాను. అతణ్ణి నేను ఆశీర్వదిస్తాను. అతనికి
చాలా మంది పిల్లలు ఉంటారు. పన్నెండు మంది
మహా నాయకులకు అతడు తండ్రి అవుతాడు. అతని
కుటుంబం ఒక గొప్ప జాతి అవుతుంది. 21అయితే
ఇస్సాకుతో నేను నా ఒడంబడిక చేస్తాను. శారాకు
పుట్టబోయే కుమారుడు ఇస్సాకు. వచ్చే సంవత్సరం
సరిగ్గా ఇదే కాలంలో నీకు కుమారుడు పుడతాడు."
22అబ్రాహాముతో దేవుడు మాట్లాడటం ముగించిన
తర్వాత అబ్రాహాము ఒంటరిగా ఉన్నాడు. దేవుడు
లేచి అబ్రాహామును విడచి వెళ్లిపోయాడు. 23తన
కుటుంబంలోని మగవాళ్లకు, బాలురకు సున్నతి
చేయమని అబ్రాహాముతో దేవుడు చెప్పాడు. కనుక
ఇష్మాయేలును, తన ఇంట పుట్టిన సేవకులందరిని
అబ్రాహాము సమావేశపర్చాడు. డబ్బుతో కొనబడిన
సేవకులను గూడ అబ్రాహాము సమావేశపర్చాడు. అబ్రా
హాము ఇంటిలోని ప్రతి పురుషుడు, బాలుడు ఒక
చోట సమావేశ పర్చబడ్డారు. వారందరికి సున్నతి
చేయబడింది. అబ్రాహాము దేవుడు చెప్పినట్లు వారం
దరికి సున్నతి చేశాడు.
24అబ్రాహాము సున్నతి జరిగినప్పుడు అతని
వయస్సు 99 సంవత్సరాలు. 25అతని కుమారుడు ఇష్మా
యేలుకి సున్నతి జరిగినప్పుడు అతడు 13 ఏండ్ల
వాడు. 26అబ్రాహాము, అతని కుమారుడు ఇద్దరు ఒకే
రోజున సున్నతి చేయబడ్డారు. 27ఆ రోజునే అబ్రా
హాము ఇంటిలోని మగవాళ్లందరికి గూడ సున్నతి జరి
గింది. అతని ఇంట పుట్టిన సేవకులందరికి, అతడు
కొన్న సేవకులందరికి సున్నతి జరిగింది.

## ముగ్గురు అతిథులు

18 తర్వాత మళ్లీ అబ్రాహామునకు యెహోవా
ప్రత్యక్షమయ్యాడు. మమ్రేలోని సింధూర వన
మునకు దగ్గర్లో అబ్రాహాము నివసిస్తున్నాడు. ఒకనాడు
మిట్ట మధ్యాహ్నం అబ్రాహాము తన గుడార ద్వారం
దగ్గర కూర్చున్నాడు. 2అబ్రాహాము తలెత్తి చూడగా,
తన ముందర నిలచిన ముగ్గురు మనుష్యులు కనబ
డ్డారు. అబ్రాహాము వాళ్లను చూడగానే అతడు వారి
దగ్గరకు వెళ్లి: వారి ముందు వంగి, 3ఇలా అన్నాడు,
"అయ్యలారా, మీ దాసుడనైన నా దగ్గర దయచేసి
కొంత కాలం ఉండండి. 4మీ కాళ్లు కడుక్కొనేందుకు
నేను నీళ్లు తెస్తాను. చెట్ల కింద మీరు విశ్రాంతి తీసు
కోవచ్చు. 5మీ కోసం నేను భోజనం తెస్తాను, కడుపు
నిండా భోంచేయండి. తర్వాత మీ దారిన మీరు
వెళ్లొచ్చు."
"చాలా బాగుంది, అలాగే కానీయి" అన్నారు ఆ
ముగ్గురు మనుష్యులు. 6అబ్రాహాము తన గుడారము
దగ్గరకు త్వరత్వరగా వెళ్లాడు. "మూడు రొట్టెలకు
సరిపడే గోధుమలు త్వరగా తయారుచేయి" అన్నాడు
శారాతో అబ్రాహాము. 7తర్వాత అబ్రాహాము తన
పశువుల దగ్గరకు పరుగెత్తాడు. అబ్రాహాము చాలా మంచి
యవ్వనంలో ఉన్న దూడను తీసుకొని తన సేవకునికి

---

**శారా** రాజకుమారి అని దీని అర్థం.

**ఇస్సాకు** "అతడు నవ్వును"అని దీని అర్థం.

ఇచ్చాడు. త్వరగా ఆ దూడను వధించి, దానితో భోజనం సిద్ధం చేయుమని అబ్రాహాము చెప్పాడు. 8ఆ మాంసాన్ని ఆ ముగ్గురు మనుష్యులు భోంచేసేందుకు అబ్రాహాము ఇచ్చాడు. అతడు పాలు, వెన్న కూడ వాళ్లకు ఇచ్చాడు. ఆ ముగ్గురు చెట్టు కింద భోజనం చేస్తూ ఉండగా అబ్రాహాము వారి దగ్గర నిలబడ్డాడు.

9"నీ భార్య శారా ఎక్కడ?" అంటూ ఆ ముగ్గురు అబ్రాహామును అడిగారు.

"ఆమె అక్కడ గుడారంలో ఉంది" అన్నాడు అబ్రాహాము.

10అప్పుడు యెహోవా, "మళ్లీ వసంతకాలంలో నేను వస్తాను. అప్పటికి నీ భార్య శారాకు ఒక కుమారుడు కలిగి ఉంటాడు" అన్నాడు.

గుడారం లోపల శారా ఈ విషయాలు విన్నది. 11అబ్రాహాము శారాలు చాలా ముసలివాళ్లు. స్త్రీలు పిల్లలను కనగల వయస్సు శారాకు దాటిపోయింది. 12అందుచేత తాను విన్న మాటలను శారా నమ్మలేదు. "ఇప్పుడు నేనూ ముసలిదాన్ని, నా భర్త ముసలివాడు. నాకు కొడుకు పుట్టటానికి నేను మరీ ముసలిదాన్ని కదా" అనుకొంది తనలో తాను.

13అప్పుడు అబ్రాహాముతో యెహోవా ఇలా అన్నాడు: "నేను చెప్పింది శారా నమ్మటం లేదు. ఆమె నవ్వింది. నాకు కొడుకు పుట్టటానికి నేను మరీ ముసలిదాన్ని కదా!" అంది. 14యెహోవాకు అసాధ్యమైనది ఏదైనా ఉందా? నేను వస్తానని చెప్పిన వసంతకాలంలో మళ్లీ వస్తాను, అప్పుడు నీ భార్య శారాకు కుమారుడు ఉంటాడు.

15అయితే శారా, "నేను నవ్వలేదు" అంది. (భయపడి ఆమె అలా అంది.)

కాని యెహోవా, "కాదు, నీవు చెప్పేది నిజం కాదని నాకు తెలుసు. నీవు నవ్వావు" అన్నాడు.

16అప్పుడు ఆ మనుష్యులు వెళ్లటానికి లేచారు. వారు సొదొమ వైపు చూసి, ఆ దిశగా నడక ప్రారంభించారు. వారికి వీడ్కోలు చెప్పటానికి అబ్రాహాము వాళ్లతో కొంత దూరం నడిచాడు.

### దేవునితో అబ్రాహాము బేరం

17యెహోవా తనలో తాను ఇలా అనుకొన్నాడు: "ఇప్పుడు నేను చేయబోతున్నది అబ్రాహాముకు నేను చెప్పాలా? 18అబ్రాహాము గొప్ప శక్తిగల జనానికి మూల పురుషుడు అవుతాడు. అతని మూలంగా భూమి మీది ప్రజలంతా ఆశీర్వదించబడుతారు. 19అబ్రాహాముతో నేను ఒక ప్రత్యేక ఒడంబడిక చేసుకున్నాను. అతని పిల్లలు, సంతానము యెహోవా ఇష్ట ప్రకారం జీవించేటట్టు అబ్రాహాము వారికి ఆజ్ఞాపించాలని చెప్పి, నేను ఇలా చేసాను. సక్రమంగా న్యాయంగా వాళ్లు జీవించాలని చెప్పి నేను ఇలా చేసాను. అప్పుడు, యెహోవానైన నేను వాగ్దానం చేసిన వాటిని అతనికి ఇవ్వగలను."

20మరల యెహోవా ఇలా అన్నాడు: "సొదొమ గొమొర్రాల అరుపులు చాలా పెద్దవి. వారి పాపం చాలా భయంకరమైనది. అని నేను విన్నాను. 21కనుక నేను వెళ్లి, అక్కడి విషయాలు నేను విన్నంత చెడ్డగా ఉన్నాయేమో చూస్తాను. అప్పుడు నాకు నిశ్చయంగా తెలుస్తుంది."

22అంచేత ఆ మనుష్యులు మళ్లీ, సొదొమవైపు నడక ప్రారంభించారు. అయితే అబ్రాహాము యెహోవాతో అక్కడ ఉండిపోయాడు. 23అప్పుడు అబ్రాహాము యెహోవాను సమీపించి ఇలా అడిగాడు. "యెహోవా, నీవు దుష్టులను నాశనం చేసేటప్పుడు మంచి వారిని కూడ నాశనం చేస్తావా? 24ఆ పట్టణంలో ఒకవేళ 50 మంది మంచి వాళ్లు ఉంటే ఎలా? ఆ పట్టణాన్ని నాశనం చేసేస్తావా? అక్కడ నివసిస్తున్న 50 మంది మంచివాళ్ల కోసం తప్పక నీవు ఆ పట్టణాన్ని కాపాడు. 25ఆ పట్టణాన్ని నీవు అసలు నాశనం చేయనే చేయవు. చెడ్డవాళ్లను చంపడంకోసం 50 మంది మంచి వాళ్లను నీవు నాశనం చేయవు. అలా గనుక జరిగితే మంచివాళ్లు చెడ్డవాళ్లు సమానమై, ఇద్దరూ శిక్షించబడుతారు. భూలోక మంతటికి నీవు న్యాయమూర్తివి. నిజంగా నీవు సరైనదే చేస్తావని నాకు తెలుసు."

26అప్పుడు, "సొదొమ పట్టణంలో 50 మంది మంచి వాళ్లు నాకు కనబడితే, నేను ఆ పట్టణం అంతటిని కాపాడుతాను" అన్నాడు యెహోవా.

27దానికి అబ్రాహాము ఇలా అన్నాడు: "ప్రభూ, నీతో పోల్చుకొంటే, నేను ధూళిని, బూడిదను మాత్రమే. అయినా నేను మరోసారి తెగించి ఈ ప్రశ్న అడుగుతున్నాను.

28ఒకవేళ అయిదుగురు మంచివాళ్లు తప్పి పోయి, 45 మంది మాత్రమే మంచివాళ్లు ఆ పట్టణంలో ఉంటే ఎలా? కేవలం అయిదుగురు తక్కువ అయినందువల్ల మొత్తం పట్టణమంతటిని నాశనం చేస్తావా?"

"అక్కడ 45 మంది మంచివాళ్లు గనుక నాకు కనబడితే, ఆ పట్టణాన్ని నేను వదలివేస్తాను." అన్నాడు యెహోవా.

29మరల అబ్రాహాము, "అక్కడ 40 మంది మాత్రమే మంచివాళ్లు నీకు కనబడినా, నీవు ఆ పట్టణాన్ని నాశనం చేస్తావా?" అని యెహోవాను అడిగాడు.

"40 మంది మంచి వాళ్లు నాకు కనబడితే, నేను ఆ పట్టణాన్ని నాశనం చేయను" అన్నాడు యెహోవా.

30అందుకు అబ్రాహాము, "ప్రభూ, నా మీద కోపగించకు. మరొక్క మాట అడుగుతాను. ఆ పట్టణంలో 30 మంది మాత్రమే మంచివాళ్లు కనబడితే, నీవు ఆ పట్టణాన్ని నాశనం చేస్తావా?" అని అడిగాడు.

అందుకు యెహోవా, “అక్కడ 30 మంది మంచి
వాళ్లు నాకు కనబడితే, ఆ పట్టణాన్ని నేను నాశనం
చేయను” అని చెప్పాడు.
31అప్పుడు అబ్రాహాము, “నా ప్రభువుతో మరోసారి
మాటలాడ తెగించితిని ఒకవేళ అక్కడ 20 మంది
మంచివాళ్లే ఉంటే” అన్నాడు.
“20 మంది మంచివాళ్లు నాకు కనబడితే ఆ పట్ట
ణాన్ని నేను నాశనం చేయను” అని జవాబిచ్చాడు
యెహోవా.
32అప్పుడు అబ్రాహాము ఇలా అన్నాడు, “ప్రభూ
నాపై కోపగించకు, ఈ ఒక్కసారే చివరిగా నీతో మాట
లాడ తెగిస్తునాను. పదిమంది మంచివాళ్లే గనుక అక్కడ
నీకు కనబడితే, నీవేం చేస్తావు?”
“పదిమంది మంచివాళ్లు గనుక అక్కడ నాకు కన
బడితే, ఆ పట్టణాన్ని నేను నాశనం చేయను అన్నాడు”
యెహోవా.
33యెహోవా అబ్రాహాముతో మాట్లాడటం అయి
పోయింది, గనుక యెహోవా వెళ్లిపోయాడు. అబ్రా
హాము తన ఇంటికి వెళ్లిపోయాడు.

## లోతు అతిథులు

19 ఆ సాయంకాలం, ఆ ఇద్దరు దేవదూతలు
సొదొమ పట్టణం వచ్చారు. పట్టణ ద్వారం
దగ్గర కూర్చొని ఉన్న లోతు ఆ దేవదూతల్ని చూశాడు.
లోతు లేచి, దేవదూతల దగ్గరకు వెళ్లి, సాష్టాంగ పడ్డాడు.
2లోతు ఇలా అన్నాడు: “అయ్యలారా, దయతో నా
ఇంటికి రండి, నేను మీకు సేవ చేస్తాను. అక్కడ
మీరు మీ కాళ్లు కడుక్కొని, రాత్రి బస చేయవచ్చును.
ఆ తరువాత మీరు మీ ప్రయాణం కొనసాగించవచ్చు.”
“లేదు. ఈ రాత్రికి మేము ఈ ఖాళీ స్థలంలో బస
చేస్తాం” అన్నారు దేవదూతలు.
3కాని, వారిని తన ఇంటికి రమ్మని లోతు బల
వంతము చేసెను. అంచేత లోతు ఇంటికి వెళ్లడానికి
దేవదూతలు ఒప్పుకొన్నారు. వారు ఇంటికి వెళ్లగానే,
వారు తినేందుకు లోతు భోజనం తయారు చేసాడు,
వాళ్ల కోసం రొట్టెలు చేసాడు. లోతు వండిన భోజనం
దేవదూతలు తిన్నారు.
4ఆ రాత్రి పండుకొనక ముందు, పట్టణం నలు
మూలల నుండి పురుషులు చిన్నలూ, పెద్దలూ లోతు
ఇంటికి వచ్చారు. సొదొమ ప్రజలు లోతు ఇంటిని
చుట్టుముట్టి, లోతును పిల్చారు. 5“ఈ రాత్రి నీ ఇంటికి
వచ్చిన ఆ ఇద్దరు మనుష్యులు (దేవదూతలు) ఎక్కడ?
వాళ్లను బయటకు మా దగ్గరకు తీసుకురా. మేము
వాళ్లను సంభోగించాలి” అన్నారు.
6లోతు బయటకు వెళ్లి, తన వెనుకగా తలుపు
మూసాడు. 7“వద్దు, నా సోదరులారా, దయచేసి ఈ
చెడ్డపని మీరు చేయవద్దని బతిమలాడుతున్నాను” అని
ఆ మనుష్యలతో చెప్పాడు. 8“చూడండి, నాకు ఇద్దరు
కుమార్తెలు ఉన్నారు. వారు ఇదివరకు ఎన్నడూ ఏ
పురుషునివద్ద పడుకోలేదు. నా కూతుళ్లను మీకు
ఇస్తాను. మీ ఇష్టం వచ్చినట్టు వాళ్లను చేసుకోండి.
కాని దయచేసి ఈ మనుష్యులను మాత్రం ఏమీ చేయ
కండి. వీళ్లు నా ఇంటికి వచ్చారు, నేను వాళ్లను
కాపాడాలి” లోతు ఆ మనుష్యులతో అన్నాడు.
9“దారిలోనుంచి తప్పుకో” అంటూ ఇంటి చుట్టూ
ఉన్నవాళ్లంతా అరిచారు. “ఈలోతు ఒక యాత్రికుడుగా
మన పట్టణం వచ్చాడు. ఇప్పుడు మనకే నీతులు
చెబుతున్నాడు” – అని వాళ్లలో వాళ్లు చెప్పుకొన్నారు.
అప్పుడు వాళ్లు లోతుతో, “వాళ్లకు చేసే వాటికంటే
ఎక్కువ కీడు నీకు చేస్తాం” అని చెప్పారు కనుక ఆ
మనుష్యులు లోతు దగ్గరకు మరింత సమీపంగా వెళ్లి,
తలుపు బద్దలు కొట్టడానికి సిద్ధమయ్యారు.
10అయితే లోతు ఇంటిలో వున్న ఆ యిద్దరు
మనుష్యులు తలుపు తెరచి లోతును లోపలికి
లాగేసారు. తర్వాత వాళ్లు తలుపు మూసేసారు. 11ద్వార
మునకు వెలుపల ఉన్న మనుష్యులు గ్రుడ్డివాళ్లు అయ్యే
టట్టు ఆ దేవదూతలు చేసారు. కనుక ఇంటిలోనికి
ప్రవేశించాలని ప్రయత్నించిన ఆ మనుష్యులు, పెద్ద
వాళ్లు, చిన్నవాళ్లు అందరు గుడ్డివాళ్లయిపోయి ద్వారం
ఎక్కడుందో కనుక్కోలేక పోయారు.

## సొదొమ నుండి తప్పించుకోవటం

12“మీ కుటుంబాలకు చెందిన వాళ్లు ఇంకెవరైనా
ఈ పట్టణంలో ఉన్నారా? అల్లుళ్లు, కుమారులు, కుమా
ర్తెలు, లేక ఇంకెవరైనా మీ కుటుంబంలో ఉన్నారా?
మీ కుటుంబానికి చెందిన వాళ్లు ఇంకెవరైనా ఈ పట్ట
ణంలో ఉంటే, వాళ్లను ఇప్పుడే ఈ చోటు విడిచిపెట్ట
మని చెప్పాలి. 13మేము ఈ పట్టణాన్ని నాశనం
చేస్తున్నాం. ఈ పట్టణంలో ఉన్న దుష్టత్వాన్ని గూర్చి
యెహోవా అంతా చూశాడు. కనుక ఈ పట్టణాన్ని
నాశనం చేయటానికి యెహోవా మమ్మల్ని పంపిం
చాడు” అని ఆ ఇద్దరు మనుష్యులు లోతుకు చెప్పారు.
14కనుక లోతు బయటకు వెళ్లి, తన కుమార్తెలను
పెళ్లాడనైయున్న తన అల్లుళ్లతో మాట్లాడాడు.
“త్వరగా ఈ పట్టణం వదిలిపెట్టండి. యెహోవా దీన్ని
త్వరగా నాశనం చేస్తాడు” అన్నాడు లోతు. అయితే
లోతు పరిహాసం చేస్తున్నాడనుకొన్నారు వాళ్లు.
15మర్నాడు సూర్యోదయాన దేవదూతలు
లోతును తొందరపెట్టి ఈలాగన్నారు. “చూడు, ఈ
పట్టణం శిక్షించబడుతుంది. కనుక ఇంక నీతో ఉన్న
నీ భార్యను, నీ యిద్దరు కుమార్తెలను తోడుకొని ఈ
స్థలం విడిచిపెట్టు. అప్పుడు ఈ పట్టణంతోబాటు
నీవు నాశనంగాకుండా ఉంటావు.”

[16]కాని, లోతు కలవరపడి, వెళ్లిపోయేందుకు త్వర
పడలేదు. కనుక ఆ ఇద్దరు మనుష్యులు, (దేవదూతలు)
లోతు, అతని భార్య, అతని యిద్దరు కుమార్తెల చేతులు
పట్టుకొన్నారు. లోతును అతని కుటుంబాన్ని ఆ ఇద్దరు
మనుష్యులు ఆ పట్టణంలోనుంచి క్షేమంగా బయటకు
నడిపించారు. లోతు, అతని కుటుంబం యెడల
యెహోవా దయ చూపెట్టాడు. [17]అందుచేత లోతును
అతని కుటుంబాన్ని ఆ ఇద్దరు మనుష్యులు ఆ పట్ట
ణంలోనుండి బయటకు తీసుకొని వచ్చారు. వారు
బయటకు వచ్చాక, ఆ మనుష్యులలో ఒకరు ఇలా
అన్నారు: "ఇప్పుడు మీ ప్రాణం కాపాడుకోటానికి
పారిపొండి. మళ్లీ వెనుక్కు తిరిగి పట్టణం వైపు చూడ
కండి. లోయలో ఎక్కడా ఆగకండి. పర్వతాలు చేరేంత
వరకు పరుగెత్తండి. అలా చేయకపోతే, పట్టణంతో
పాటు మీరూ నాశనం అయిపోతారు."

[18]అయితే ఆ ఇద్దరు మనుష్యులతో లోతు ఇలా
చెప్పాడు: "అయ్యలారా, అంత దూరం పరుగెత్తమని
నన్ను బలవంతం చేయవద్దు. [19]మీ సేవకుడనైన నా
మీద మీరు చాలా దయ చూపించారు. నన్ను రక్షించటం
మీరు చూపించిన మహా గొప్ప దయ. కానీ, నేను
పర్వతాల వరకు పరుగెత్తలేను. నేను మరీ నిదానమైతే,
ఆ నగరానికి సంభవించవలసిన శిక్ష నాకు తగిలి నేను
మరణిస్తాను. [20]అయితే చూడండి, ఇక్కడికి సమీపంలో
ఒక చిన్న ఊరుంది. నన్ను ఆ ఊరికి పారిపోనివ్వండి,
అక్కడ నా ప్రాణం రక్షించబడుతుంది." [21]దేవదూత
లోతుతో, "సరే మంచిది, అలాగే కానివ్వు. నీవు వెళ్తున్న
ఆ ఊరిని నేను నాశనం చేయను. [22]అయితే అక్కడికి
వేగంగా పరుగెత్తు. నీవు క్షేమంగా ఆ ఊరు చేరేంతవరకు,
సొదొమను నేను నాశనం చేయను" అనెను. (ఆ
ఊరు చిన్నది గనుక అది సోయరు అని పిలువబడింది.)

## సొదొమ, గొమొర్రాల నాశనం

[23]సూర్యోదయం అయ్యేటప్పటికి లోతు సోయ
రులో ప్రవేశిస్తున్నాడు. [24]సొదొమ గొమొర్రాలను
యెహోవా నాశనం చేయటం మొదలు బెట్టాడు.
ఆకాశం నుండి అగ్ని గంధక వర్షాన్ని యెహోవా
పంపించాడు. [25]కనుక ఆ పట్టణాలను యెహోవా
నాశనం చేసాడు, మరియు ఆ లోయను, ఆ నగరాల్లో
నివసిస్తోన్న ప్రజలందరిని, చెట్లన్నింటిని ఆయన
నాశనం చేశాడు.

[26]వారు పారిపోతూ ఉండగా లోతు భార్య వెనుకకు
తిరిగి ఆ పట్టణం వైపుచూసింది. ఆమె వెనుకకు
తిరిగిచూడగానే ఉప్పుస్తంభం అయిపోయింది.

[27]ఆ ఉదయమే పెందలకడ అబ్రాహాము లేచి నిన్న
యెహోవా ఎదుట నిలిచిన స్థలానికి వెళ్లాడు. [28]అబ్రా
హాము సొదొమ గొమొర్రాలవైపు కిందుగా చూశాడు.
ఆ లోయ ప్రదేశమంతా అబ్రాహాము చూశాడు. ఆ
చోటనుండి విస్తారమైన పొగలు రావటం చూశాడు.
అది ఒక మహాగొప్ప మంటనుండి లేచిన పొగలా కన
బడింది. [29]ఆ లోయలోని పట్టణాలను దేవుడు నాశనం
చేసాడు. అయితే దేవుడు ఇది చేసినప్పుడు, అబ్రా
హాము అడిగిన దానిని ఆయన జ్ఞాపకం చేసుకొన్నాడు.
లోతు ప్రాణాన్ని దేవుడు రక్షించాడు, కాని లోతు నివ
సించిన పట్టణాన్ని యెహోవా నాశనం చేసాడు.

## లోతు, అతని కుమార్తెలు

[30]సోయరులో జీవితం గడిపేందుకు లోతు భయ
పడ్డాడు. కనుక అతడు, అతని ఇద్దరు కుమార్తెలు వెళ్లి
పర్వతాల్లో నివాసం చేశారు. అక్కడ ఒక గుహలో
వారు నివసించారు. [31]ఒక రోజున పెద్ద కుమార్తె చిన్న
కుమార్తెతో ఇలా చెప్పింది: "భూమిమీద అంతటా
స్త్రీలు పురుషులు పెళ్లి చేసుకొని కుటుంబం కలిగి
ఉంటారు. కానీ మనం పెళ్లి చేసుకొని పిల్లలు కలి
గేందుకు ఇక్కడ ఎవ్వరూ మగవాళ్లు లేరు. మన తండ్రి
ముసలివాడు. [32]కానీ మన కుటుంబం సాగాలి గనుక
మనకు పిల్లలు పుట్టడం కోసం మనం మన తండ్రిని
ఉపయోగించుకోవాలి. మనం మన తండ్రి దగ్గరకు
వెళ్లి, ఆయనతో పాటు మధుపానం చేసి, ఆయనకు
మత్తు కలిగిద్దాం. అప్పుడు మనం ఆయనతో పండు
కోవచ్చు."

[33]ఆ రాత్రి ఇద్దరు అమ్మాయిలూ తమ తండ్రి
దగ్గరకు వెళ్లి, అతనికి ద్రాక్షారసాన్ని తాగించి మత్తుగా
చేశారు. అప్పుడు పెద్దమ్మాయి తన తండ్రి పడక
మీదకు వెళ్లి, అతనితో లైంగికంగా కలసికొన్నది. లోతు
తాగినమత్తులో ఉన్నాడు గనుక, ఆమె ఎప్పుడు తనతో
పండుకొన్నది, లేచి వెళ్లినది, అతనికి తెలియలేదు.

[34]మర్నాడు పెద్దమ్మాయి చిన్నమ్మాయితో
చెప్పింది: "గత రాత్రి నా తండ్రితో నేను పండు
కొన్నాను. ఈ రాత్రి మళ్లీ మనం ఆయనకు ద్రాక్షారస
ముతో మత్తు కలిగిద్దాం. అప్పుడు నీవు ఆయన పడక
మీదకి వెళ్లి ఆయనతో లైంగికంగా కలసికొనవచ్చు.
ఈ విధంగా మన కుటుంబం అంతంకాకుండా పిల్లలు
పుట్టేందుకు మనం మన తండ్రిని ఉపయోగించు
కోవచ్చు." [35]కనుక ఆ రాత్రి తమ తండ్రికి మత్తు
ఎక్కేంతవరకు ఆ ఇద్దరు అమ్మాయిలూ తమ తండ్రికి
ద్రాక్షారసాన్ని తాగించారు. అప్పుడు చిన్నమ్మాయి
అతని పడక మీదకి వెళ్లి అతనితో పడుకొంది. అతని
కుమార్తె అతనితో పండుకొన్నట్టు లోతుకు మరల
తెలియలేదు. [36]అందుచేత లోతు కుమార్తెలు ఇద్దరూ
గర్భవతులయ్యారు. వారి తండ్రి వారి శిశువులకు
తండ్రి. [37]పెద్ద కుమార్తెకు ఒక కొడుకు పుట్టాడు.
ఆమె ఆ కుమారునికి మోయాబు* అని పేరు పెట్టింది.

---

**మోయాబు** "తండ్రి ద్వారా" అని దీని అర్థం.

నేటికి జీవిస్తోన్న మోయాబు ప్రజలందరికి అతడు తండ్రి. 38చిన్న కుమార్తెకు కూడ ఒక కొడుకు పుట్టాడు. ఆమె తన కుమారునికి బెన్నమ్మి* అని పేరు పెట్టింది. నేటికి జీవిస్తోన్న అమ్మోనీ ప్రజలందరికి బెన్నమ్మి తండ్రి.

### అబ్రాహాము గెరారుకు వెళ్లుట

20 అబ్రాహాము ఆ చోటు విడిచి నెగెబుకు ప్రయాణం కట్టాడు. కాదేషుకు, షూరుకు మధ్యనున్న గెరారుకు అబ్రాహాము వెళ్లాడు. గెరారులో ఉన్నప్పుడు 2శారా తన సోదరి అని అబ్రాహాము ప్రజలతో చెప్పాడు. గెరారు రాజు అబీమెలెకు ఇది విన్నాడు. అబీమెలెకు శారాను ఇష్టపడి, ఆమెను తీసుకుని వచ్చేందుకు కొందరు సేవకుల్ని పంపించాడు. 3అయితే ఆ రాత్రి దర్శనంలో అబీమెలెకుతో దేవుడు మాట్లాడి, "చూడు, నీవు చస్తావు. నీవు తెచ్చుకొన్న ఆ స్త్రీ వివాహితురాలు" అని చెప్పాడు.

4కానీ అప్పటికి అబీమెలెకు శారాతో శయనించ లేదు. కనుక అబీమెలెకు, "ప్రభూ, నేను దోషిని కాను. నిర్దోషిని నీవు చంపుతావా? 5'ఈ స్త్రీ నా సోదరి' అని అబ్రాహాము స్వయంగా నాతో చెప్పాడు. ఆ స్త్రీ కూడా 'ఈ పురుషుడు నా సోదరుడు' అని చెప్పింది. నేను నిర్దోషిని. నేను చేస్తున్నది ఏమిటో నాకు తెలియలేదు" అన్నాడు.

6ఆ దర్శనంలో అబీమెలెకుతో దేవుడు ఇలా చెప్పాడు: "అవును, నాకు తెలుసు, నీవు నిర్దోషివి. నీవు చేస్తున్నది ఏమిటో నీకు తెలియదు అని నాకు తెలుసు. నేను నిన్ను కాపాడాను. నాకు వ్యతిరేకంగా నిన్ను నేను పాపం చేయనీయలేదు. నీవు ఆమెతో శయనించకుండా చేసింది నేనే. 7కనుక అబ్రాహాము భార్యను తిరిగి అతనికి అప్పగించు. అబ్రాహాము ఒక ప్రవక్త.* అతడు నీ కోసం ప్రార్థిస్తాడు, అప్పుడు నీవు బతుకుతావు. కానీ శారాను నీవు తిరిగి అబ్రాహాముకు ఇవ్వకపోతే, నీవు మరణించడం తప్పదు. నీతోబాటు నీ కుటుంబం అంతా మరణిస్తుంది."

8కనుక మర్నాడు వేకువనే, అబీమెలెకు తన సేవకులందరినీ పిల్చాడు. దర్శనంలో సంభవించిన సంగతులన్నీ అబీమెలెకు వారితో చెప్పాడు. సేవకులు చాలా భయపడ్డారు. 9అప్పుడు అబీమెలెకు అబ్రాహా మును పిలిచి, అతనితో అన్నాడు: "నీవు మాకు ఎందుకు ఇలా చేసావు? నీకు నేను ఏమి అపకారం చేసాను? ఎందుకలా అబద్ధం చెప్పి, ఆమె నీ సోదరి అన్నావు? నా రాజ్యానికి నీవు చాలా చిక్కు తెచ్చిపెట్టావు. నాకు నీవు ఇలా చేయకుండా ఉండాల్సింది. 10నీవు దేనికి ఇలా చేసావు.?"

11అందుకు అబ్రాహాము చెప్పాడు: "నేను భయపడ్డాను. దేవుడంటే ఇక్కడ ఎవరికీ భయము లేదని అనుకొన్నాను. శారాను పొందటం కోసం ఎవరైనా నన్ను చంపేస్తారు అనుకొన్నాను. 12ఆమె నా భార్య, అయితే నా సోదరి కూడాను. ఆమె నా తండ్రి కుమార్తె గాని, నా తల్లి కుమార్తె కాదు. 13నా తండ్రి ఇంటి నుండి దేవుడు నన్ను బయటకు నడిపించాడు. అనేక చోట్ల సంచారం చేసేటట్టు దేవుడు నన్ను నడిపించాడు. అలా జరిగినప్పుడు, 'నీవు నా సోదరివని ప్రజలతో మనం వెళ్లిన చోటల్లా చెప్పు, నాకు ఈ మేలు చేయి' అని నేను శారాతో చెప్పాను."

14అప్పుడు జరిగిందేమిటో అబీమెలెకు అర్థం చేసుకొన్నాడు. కనుక శారాను అబీమెలెకు తిరిగి అబ్రాహాముకు అప్పగించేసాడు. కొన్ని గొర్రెలు, పశువులు, కొందరు ఆడ, మగ బానిసలను కూడ అబీమెలెకు అబ్రాహాముకు ఇచ్చాడు. 15మరియు "నీ చుట్టూ చూడు. ఇది నా దేశం. నీకు ఇష్టం వచ్చిన చోట నీవు ఉండవచ్చు" అన్నాడు అబీమెలెకు.

16"చూడు, నీ సోదరుడైన అబ్రాహాముకు 1000 వెండి నాణెములు ఇచ్చాను. జరిగిన వాటి విషయమై నా పశ్చాత్తాపం వ్యక్తం చేయడానికి యిది చేసాను. నేను సక్రమంగా జరిగించినట్టు అందరూ చూడాలని నేను కోరుతున్నాను" అని అబీమెలెకు శారాతో చెప్పాడు.

17-18అబీమెలెకు కుటుంబంలోని స్త్రీలను గొడ్రాళ్లుగా చేసాడు యెహోవా. అబ్రాహాము భార్య శారాను అబీమెలెకు తీసుకొన్నందుచేత దేవుడు ఇలా చేసాడు. అయితే అబ్రాహాము ప్రార్థించగా అబీమెలెకును, అతని భార్యను మరియు అతని దాసీలను దేవుడు స్వస్థపరచాడు.

### శారాకు ఒక శిశువు

21 యెహోవా శారాకు అనుగ్రహిస్తానని ఆమెకు వాగ్దానం చేసాడు. ఆయన వాగ్దానం చేసినట్టే ఆమెపై అనుగ్రహాన్ని చూపాడు. 2అబ్రాహాము వృద్ధాప్యంలో శారా గర్భవతి అయ్యింది, అతనికి ఒక కుమారుని కన్నది. ఈ సంగతులన్నీ సరిగ్గా దేవుడు వాగ్దానం చేసినట్టే జరిగాయి. 3శారా కుమారుని కన్నది, అబ్రాహాము వానికి ఇస్సాకు అని పేరు పెట్టాడు. 4దేవుడు ఆజ్ఞాపించినట్టు, ఇస్సాకుకు ఎనిమిది రోజులు నిండగానే అబ్రాహాము అతనికి సున్నతి చేశాడు.

5తన కుమారుడు ఇస్సాకు పుట్టినప్పుడు అబ్రాహాము వయస్సు 100 సంవత్సరాలు. 6"దేవుడు నన్ను సంతోషపెట్టాడు. ఇది విన్న ప్రతి ఒక్కరూ నాతో సంతోషిస్తారు. 7నేను శారాను, అబ్రాహాము కుమారుణ్ణి

---

**బెన్నమ్మి** "నా తండ్రి కుమారుడు" అని దీని అర్థం.

**ప్రవక్త** ప్రజలు ఏ విధంగా నడుచుకోవాలని దేవుడు కోరుతున్నాడో దాన్ని గూర్చి ప్రజలకు ప్రబోధించేవాడు.

పొందుతాడని ఏ ఒక్కరూ తలంచలేదు. కానీ ఆయన
వృద్ధుడుగా ఉన్నప్పుడు అబ్రాహాముకు నేను ఒక
కుమారుని కన్నాను” అంది శారా.

## ఇంట్లో చిక్కు

8ఇస్సాకు ఎదుగుతున్నాడు. త్వరలోనే గట్టి
పదార్థాలు భోజనం చేసేటంతటి పెద్దవాడయ్యాడు.
అప్పట్లో అబ్రాహాము ఒక మహా గొప్ప విందు చేసాడు.
9గతంలో ఈజిప్టు బానిసైన స్త్రీ హాగరు ఒక కుమారుని
కన్నది. ఆ కుమారునికి కూడ తండ్రి అబ్రాహామే.
అయితే ఆ కుమారుడు ఇప్పుడు ఇస్సాకును వేధించడం
శారా చూసింది. 10“కనుక ఆ బానిస స్త్రీని, ఆమె
కుమారుణ్ణి బలవంతంగా వెళ్లగొట్టు. మన మరణం
తరువాత మన కుమారుడు ఇస్సాకు మన ఆస్తి అంతటికి
వారసుడవుతాడు. దానిలో దాసీ కుమారుడు ఇస్సా
కుతో భాగం పంచుకోవటం నాకు ఇష్టం లేదు అంటూ”
శారా అబ్రాహాముతో చెప్పింది.

11ఇదంతా అబ్రాహాముకు బాధ కలిగించింది. తన
కుమారుడైన ఇష్మాయేలును గూర్చి అతడు చింతిం
చాడు. 12కానీ అబ్రాహాముతో దేవుడన్నాడు: “ఆ పిల్ల
వాణ్ణి గూర్చి నీవు చింతించకు. ఆ బానిస స్త్రీని గూర్చి
నీవు చింతపడకు. శారా కోరినట్టే చేయి. ఇస్సాకు
మాత్రమే నీకు వారసుడయిన కుమారుడు. 13అయితే
నీ బానిస స్త్రీ కుమారుణ్ణి కూడా నేను ఆశీర్వదిస్తాను.
అతడు నీ కుమారుడే, కనుక అతని వంశం నుండి
గూడ నేను ఒక గొప్ప జనాన్ని చేస్తాను.”

14మర్నాడు వేకువనే అబ్రాహాము కొంత భోజ
నాన్ని, తిత్తిలో నీళ్లు తెచ్చాడు. అబ్రాహాము వీటిని
హాగరుకు ఇచ్చాడు. హాగరు వీటిని తీసుకొని, తన
కుమారునితో కలసి వెళ్లిపోయింది. హాగరు ఆ చోటు
విడిచి బెయేర్షెబా అరణ్యంలో సంచరించింది.

15కొన్నాళ్లకు తిత్తిలోని నీళ్లన్నీ అయిపోయాయి.
తాగటానికి ఏమీ మిగలలేదు. కనుక హాగరు తన
కుమారుణ్ణి ఒక పొద పక్కన పెట్టింది. 16హాగరు
కొంచెం దూరం నడచి వెళ్లింది. అక్కడ ఆగిపోయి
కూర్చుంది. నీళ్లు లేవు గనుక తన కుమారుడు చని
పోతాడనుకొంది హాగరు. వాడు చస్తోంటే చూడటం
ఆమెకు ఇష్టం లేదు. ఆమె అక్కడ కూర్చొని ఏడ్వటం
మొదలు పెట్టింది.

17ఆ పిల్లవాడు ఏడ్వటం దేవుడు విన్నాడు. పరలో
కంనుండి దేవుని దూత హాగరును పిలిచాడు. అతడ
న్నాడు, “హాగరూ, ఏం జరిగింది? భయపడకు. అక్కడ
పిల్లవాడు ఏడ్వటం యెహోవా విన్నాడు. 18వెళ్లి పిల్ల
వాడికి సహాయం చేయి. వాడి చేయి పట్టి నడిపించు.
ఒక గొప్ప జనాంగానికి అతణ్ణి తండ్రిగా నేను చేస్తాను.”

19అంతలో హాగరుకు ఒక బావి కనబడేటట్టు
చేసాడు దేవుడు. కనుక హాగరు ఆ బావి దగ్గరకు వెళ్లి
తన తిత్తిని నీళ్లతో నింపుకొన్నది. తర్వాత పిల్లవాడు
తాగటానికి ఆమె నీళ్లు ఇచ్చింది. 20ఆ పిల్లవాడు
ఎదుగుతూ ఉండగా దేవుడు వానికి తోడుగానే ఉన్నాడు.
ఇష్మాయేలు అరణ్యంలో జీవిస్తూ, వేటగాడయ్యాడు.
బాణం కొట్టడంలో నిపుణత నేర్చుకొన్నాడు. 21అతని
తల్లి అతని కోసం ఈజిప్టులో భార్యను కనుగొన్నది.
వారు పారాను అరణ్యంలోనే జీవిస్తూ ఉన్నారు.

## అబీమెలెకుతో అబ్రాహాము బేరం

22అంతట అబీమెలెకు, ఫీకోలు అబ్రాహాముతో
మాట్లాడారు. అబీమెలెకు, అతని సైన్యాధిపతి ఫికోలు
అబ్రాహాముతో ఇలా చెప్పారు: “నీవు చేసే ప్రతి
దానిలోనూ దేవుడు నీతో ఉన్నాడు. 23కనుక ఇక్కడ
దేవుని యెదుట నాకు ఒక వాగ్దానం చేయాలి. నాతో,
నా పిల్లలతో నీవు న్యాయంగా వ్యవహరిస్తానని వాగ్దానం
చేయాలి. నీవు నివసించిన ఈ దేశం మీద, నామీద
నీవు దయగలిగి ఉంటానని వాగ్దానం చేయాలి. నీపైన
నేను ఎంత దయ చూపెట్టానో, నాపైన నీవు కూడా
అంత దయ చూపెడ్తానని వాగ్దానం చేయాలి.”

24“నన్ను నీవు ఎలా పరామర్శించావో నేను కూడా
నిన్ను అలాగే పరామర్శిస్తానని నేను వాగ్దానం చేస్తు
న్నాను” అన్నాడు అబ్రాహాము. 25అప్పుడు అబ్రాహాము
అబీమెలెకుతో ఒక ఫిర్యాదు చేసాడు. అబీమెలెకు సేవ
కులు ఒక మంచి నీటి బావిని స్వాధీనం చేసుకొన్నం
దుచేత అబ్రాహాము అబీమెలెకుతో ఫిర్యాదు చేసాడు.

26కానీ అబీమెలెకు, “ఇది ఎవరు చేసారో నాకు
తెలియదు. ఇంతకు ముందు ఈ విషయం నీవు నాతో
చెప్పలేదు” అన్నాడు.

27కనుక అబ్రాహాము, అబీమెలెకు ఒక ఒడంబడిక
చేసుకొన్నారు. ఆ ఒడంబడిక సూచనగా కొన్ని గొర్రె
లను, పశువులను అబీమెలెకుకు అబ్రాహాము ఇచ్చాడు.
28ఏడు* ఆడ గొర్రె పిల్లల్ని కూడా అబీమెలెకు ఎదుట
ఉంచాడు అబ్రాహాము.

29“ఈ ఏడు ఆడ గొర్రె పిల్లల్ని ఇలా ప్రత్యేకంగా
ఎందుకు పెట్టావు?” అని అబీమెలెకు అబ్రాహామును
అడిగాడు.

30“ఈ గొర్రెపిల్లల్ని నా దగ్గర నుండి నీవు స్వీక
రించినప్పుడు, ఈ బావిని నేను తవ్వించినట్టు రుజువు
అవుతుంది” అని అబ్రాహాము జవాబిచ్చాడు

31కనుక ఆ తర్వాత ఆ బావి బెయేర్షెబా* అని
పిలువబడింది. వారిద్దరు ఒకరికి ఒకరు ఆ స్థలంలో
వాగ్దానం చేసుకొన్న చోటు గనుక దానికి వారు ఆ

---

**ఏడు** ‘ఏడు’ అనే అర్థం ఇచ్చే హెబ్రూ పదం, ‘ప్రమాణం’ లేక ‘ఒప్పందం’ అనే అర్థం ఇచ్చే హెబ్రూ పదం ఒక్కటే. అందుకు ఏడు గొర్రెలు ఈ వాగ్దానానికి రుజువు.

**బెయేర్షెబా** “ప్రమాణపు బావి” అని దీని అర్థం.

పేరు పెట్టారు. 32కనుక అబ్రాహాము, అబీమెలెకు
బెయేర్షెబా* దగ్గర ఒక ఒడంబడిక చేసుకొన్నారు.
అప్పుడు అబీమెలెకు, అతని సైన్యాధిపతి తిరిగి ఫిలిష్తీ
ప్రజల దేశం వెళ్లిపోయారు.
33బెయేర్షెబాలో అబ్రాహాము ఒక అలంకారపు
చెట్టు* నాటాడు. అప్పుడు అబ్రాహాము ప్రభువు,
ఎల్లప్పుడు జీవిస్తున్న దేవుడైన యెహోవాకు అతడు
అక్కడ ప్రార్థన చేశాడు. 34ఫిలిష్తీయుల దేశంలో అబ్రా
హాము చాలకాలం నివసించాడు.

## అబ్రాహామూ నీ కొడుకును చంపు

22 ఆ సంగతులు జరిగిన తర్వాత అబ్రాహాము
యొక్క విశ్వాసాన్ని పరీక్షించాలని దేవుడు
అనుకొన్నాడు. "అబ్రాహామూ" అని దేవుడు అతణ్ణి
పిలిచాడు.
దానికి అబ్రాహాము "చిత్తం" అన్నాడు.
2అప్పుడు దేవుడు చెప్పాడు, "నీ కుమారుని
మోరీయా దేశం తీసుకొని వెళ్లు. మోరీయాలో నీ
కుమారుణ్ణి నాకు బలిగా చంపు. నీ ఒకే కుమారుడు,
నీవు ప్రేమిస్తున్న నీ కుమారుడైన ఇస్సాకును ఇలా
చేయాలి. అక్కడ కొండల్లో ఒక దానిమీద అతణ్ణి
దహనబలిగా ఉపయోగించు. ఏ కొండ అనేదీ నేను
నీతో చెబుతాను."
3ఉదయాన అబ్రాహాము లేచి తన గాడిదను సిద్ధం
చేసాడు. ఇస్సాకును తన ఇద్దరు సేవకులను అబ్రాహాము
తన వెంట తీసుకు వెళ్లాడు. బలి అర్పణ కోసం కట్టె
లను అబ్రాహాము నరికాడు. తర్వాత వారు వెళ్లాలని
దేవుడు అతనితో చెప్పిన చోటుకి వారు వెళ్లారు.
4వారు మూడు రోజులు ప్రయాణం చేసిన తర్వాత,
అబ్రాహాము కనులెత్తి దూరంలో వారు వెళ్లవలసిన
చోటును చూశాడు. 5అప్పుడు అబ్రాహాము, "మీరు
ఈ గాడిదతో ఇక్కడ ఉండండి. నేను నా కుమారుణ్ణి
తీసుకొని, అక్కడకి వెళ్లి ఆరాధన చేస్తాం. ఆ తర్వాత
మేము మీ దగ్గరకు తిరిగి వస్తాం" అని తన సేవకులతో
చెప్పాడు.
6అబ్రాహాము బలికోసం కట్టెలు తీసుకొని తన
కుమారుని భుజంమీద పెట్టాడు. ఒక ప్రత్యేక ఖడ్గం,
నిప్పు అబ్రాహాము పట్టుకొన్నాడు. అప్పుడు అబ్రా
హాము, అతని కుమారుడు యిద్దరు కలిసి ఆరాధనా
స్థలానికి వెళ్లారు.
7ఇస్సాకు "తండ్రీ!" అని తన తండ్రి అబ్రాహామును
పిలిచాడు. "ఏమిటి కొడుకా?" అని అడిగాడు
అబ్రాహాము.
"కట్టెలు, నిప్పు నాకు కనబడుతున్నాయి. కాని
మనం బలిగా దహించే గొర్రెపిల్ల ఏది?" అని ఇస్సాకు
అడిగాడు. 8"నా కుమారుడా, బలికోసం గొర్రెపిల్లను
సరైన సమయంలో దేవుడు మనకు ఇస్తాడు" అని
అబ్రాహాము జవాబిచ్చాడు.

## ఇస్సాకు రక్షించబడ్డాడు

కనుక అబ్రాహాము, అతని కుమారుడు ఇద్దరూ
కలిసి ఆ చోటుకి వెళ్లారు. 9దేవుడు వారికి వెళ్లమని
చెప్పిన చోటుకి వారు వెళ్లారు. అక్కడ అబ్రాహాము
ఒక బలిపీఠం కట్టాడు. కట్టెలను ఆ బలిపీఠం మీద
పెట్టాడు. తర్వాత తన కుమారుడు ఇస్సాకును అబ్రా
హాము కట్టివేసాడు. బలిపీఠం మీద కట్టెలపై ఇస్సాకును
పరుండబెట్టాడు.
10అప్పుడు అబ్రాహాము తన ఖడ్గం తీసుకొని తన
కుమారుని చంపడానికి సిద్ధమయ్యాడు.
11కాని అప్పుడు యెహోవా దూత అబ్రాహామును
ఆపు చేసాడు. దేవదూత ఆకాశం నుండి "అబ్రాహామా,
అబ్రాహామా" అని పిలిచాడు.
"చిత్తం" అని అబ్రాహాము జవాబిచ్చాడు.
12"నీ కుమారుని చంపవద్దు, అతనికి ఏ హానీ చేయ
వద్దు. నీకు దేవుని పట్ల భయం, ఆరాధనా భావం
ఉన్నాయని నాకిప్పుడు తెలుసు. నా కోసం, నీ కుమా
రుణ్ణి అదీ నీ ఒకే ఒక్క కుమారుణ్ణి చంపడానికి గూడా
నీవు సిద్ధమేనని నేను చూశాను" అన్నాడు దేవదూత.
13అబ్రాహాము అటు ప్రక్క చూడగా ఒక పొట్టేలు
కనబడింది. ఆ పొట్టేలు కొమ్ములు ఒక పొదలో చిక్కు
కొన్నాయి. కనుక అబ్రాహాము వెళ్లి, పొట్టేలును పట్టు
కొని దానిని చంపాడు. ఆ పొట్టేలును దేవునికి బలిగా
అబ్రాహాము ఉపయోగించాడు. అబ్రాహాము కుమా
రుడు రక్షించబడ్డాడు.
14అందుచేత ఆ స్థలానికి "యెహోవా ఈరె* "
అని బ్రహాము పేరు పెట్టాడు. "ఈ పర్వతం మీద
యెహోవా చూసుకుంటాడు" అని ఇప్పటికి ప్రజలు
చెబుతారు.
15ఆకాశంనుండి యెహోవా దూత అబ్రాహామును
రెండవసారి పిల్చాడు.
16యెహోవా దూత చెప్పాడు: "నా కోసం నీ
కుమారుణ్ణి చంపడానికి నీవు సిద్ధపడ్డావు. అతడు నీకు
ఒక్కడే కుమారుడు. నా కోసం నీవు ఇలా చేశావు
గనుక నేను నీకు ఈ వాగ్దానం చేస్తున్నాను. యెహోవా
నైన నేను వాగ్దానం చేసేది ఏమిటంటే 17నిజంగా
నిన్ను నేను ఆశీర్వదిస్తాను. ఆకాశంలో అసంఖ్యాక
నక్షత్రాలులాగా సముద్ర తీరంలో ఇసుకలాగా నీ

---

**అలంకారపు చెట్టు** పొడవుగా సన్నగా వెంట్రుకలవలె ఎల్లప్పుడు పచ్చగావుండే ఆకులుగల పొద.

**యెహోవా ఈరె** "దేవుడు చూస్తాడు" లేక "దేవుడు ఇస్తాడు" అని దీని అర్థం.

సంతానమును చేస్తాను. నీ ప్రజలు వారి శత్రువుల నందరినీ ఓడిస్తారు.

[18]నీ సంతానం ద్వారా భూమిమీద ప్రతి జనం ఆశీర్వదించబడతారు. నీవు నాకు విధేయుడవయ్యావు కనుక నేను దీన్ని చేస్తాను."

[19]అప్పుడు అబ్రాహాము మళ్లీ తన సేవకుల దగ్గరకు వెళ్లిపోయాడు. వాళ్లంతా బెయేర్షెబాకు ప్రయాణమై వెళ్లి పోయారు, అబ్రాహాము అక్కడ నివసించాడు.

[20]ఈ సంగతులన్నీ జరిగాక, అబ్రాహాముకు ఒక సందేశం పంపబడింది. ఆ సందేశం ఇది, నీ సోదరుడు నాహోరు, అతని భార్య మిల్కాకు ఇప్పుడు పిల్లలు ఉన్నారు. [21]మొదటి కుమారుడు ఊజు. రెండవ కుమారుడు బూజు, మూడవ కుమారుడు కెమూయేలు, అతడు అరాము తండ్రి. [22]ఆ తర్వాత కెసెదు, హజో, పిల్దాషు, యిద్లాపు, బెతూయేలు అనువారు ఉన్నారు." [23]బెతూయేలు రిబ్కాయొక్క తండ్రి. ఈ ఎనిమిది మంది కుమారులకు తల్లి మిల్కా, తండ్రి నాహోరు. నాహోరు అబ్రాహాము సోదరుడు. [24]మరియు నాహోరు దాసియైన రయూమా ద్వారా అతనికి ఇంకా నలుగురు కుమారులు తెబహు, గహము, తహషు, మయకా కలిగారు.

### శారా మరణించింది

**23** శారా 127 సంవత్సరాలు జీవించింది. [2]కనాను దేశంలోని కిర్యతర్బా పట్టణంలో (అనగా హెబ్రోను) ఆమె మరణించింది. అబ్రాహాము చాలా దుఃఖించి, ఆమె కోసం అక్కడ ఏడ్చాడు. [3]అప్పుడు మరణించిన తన భార్యను విడచిపెట్టి, హిత్తీ ప్రజలతో మాట్లాడేందుకు అబ్రాహాము వెళ్లాడు. [4]"నేను ఈ దేశవాసిని కాను. ఇక్కడ నేను యాత్రికుడను మాత్రమే. అందుచేత నా భార్యను పాతిపెట్టుటకు నాకు స్థలము లేదు. నేను నా భార్యను పాతిపెట్టడానికి దయచేసి నాకు కొంత స్థలం ఇవ్వండి" అన్నాడు.

[5]హిత్తీ ప్రజలు అబ్రాహాముకు ఇలా జవాబు చెప్పారు. [6]"అయ్యా, మా మధ్య మీరు దేవుని మహా నాయకులలో ఒకరు. చనిపోయిన మీ వాళ్లను పాతిపెట్టేందుకు మా శ్రేష్ఠమైన స్థలాన్ని మీరు తీసుకోవచ్చు. చనిపోయిన వాళ్లను పాతిపెట్టే మా స్థలాల్లో మీకు ఏది కావాలంటే అది తీసుకోవచ్చు. అక్కడ మీ భార్యను పాతిపెట్టడానికి మేము ఎవ్వరం అడ్డు చెప్పం."

[7]అబ్రాహాము లేచి ప్రజలకు నమస్కరించాడు. [8]అబ్రాహాము వాళ్లతో చెప్పాడు: "నేను నా భార్యను పాతిపెట్టడానికి మీరు నిజంగా నాకు సహాయం చేయగోరితే, సోహరు కుమారుడు ఎఫ్రోనుతో నా పక్షంగా మీరు మాట్లాడండి. [9]మక్పేలా గుహను నేను కొనాలని కోరుతున్నాను. ఇది ఎఫ్రోను స్వంతం. అది అతని పొలం చివరిలో ఉంది. దాని విలువ ఎంతో అంత మొత్తం నేను చెల్లిస్తాను. పాతిపెట్టే స్థలంగా దీనిని నేను కొంటున్నట్టు మీరంతా సాక్షులుగా ఉండాలని నేను కోరుతున్నాను."

[10]ఎఫ్రోను ఆ జనం మధ్యలో కూర్చొని ఉన్నాడు. ఎఫ్రోను అబ్రాహాముకు ఇలా జవాబిచ్చాడు: [11]"లేదయ్యా, నేను ఆ స్థలం ఇక్కడ మా అందరి ప్రజల సమక్షంలో నీకిచ్చేస్తాను. ఆ గుహను నేను నీకిస్తాను. నీవు నీ భార్యను పాతిపెట్టు కొనేందుకు ఆ స్థలం నేను నీకు ఇచ్చివేస్తాను."

[12]అప్పుడు అబ్రాహాము హిత్తీయుల ముందు వంగి నమస్కారం చేసాడు. [13]అబ్రాహాము, "ఆ పొలానికి పూర్తి ధర నేను చెల్లిస్తాను. నా డబ్బు స్వీకరించు, నా మృతులను నేను పాతిపెట్టుకొంటాను" అని ప్రజలందరి ముందు ఎఫ్రోనుతో చెప్పాడు.

[14]అబ్రాహాముకు ఎఫ్రోను జవాబు చెప్పాడు: [15]"అయ్యా నా మాట వినండి. 400 తులాల వెండి మీకు గాని నాకు గాని ఏపాటి? భూమిని తీసుకొని, చనిపోయిన నీ భార్యను పాతిపెట్టుకో."

[16]తనతో ఆ పొలం వెల ఎఫ్రోను చెబుతున్నాడని గ్రహించి ఆ వెల 400 తులాల వెండి తూచి అబ్రాహాము అతనికి ఇచ్చాడు.

[17-18]కనుక ఎఫ్రోను పొలానికి స్వంతదారులు మారిపోయారు. ఈ పొలం మమ్రేకు తూర్పున మక్పేలాలో ఉంది. ఆ పొలానికి, పొలంలో ఉన్న గుహకు, అందులోని చెట్లన్నిటికీ, అబ్రాహాము స్వంతదారుడయ్యాడు. ఎఫ్రోను అబ్రాహాముల మధ్య కుదిరిన ఒప్పందాన్ని ఆ పట్టణ ప్రజలంతా చూశారు. [19]ఇది జరిగిన తర్వాత మమ్రే దగ్గర ఉన్న మక్పేలా గుహలో అబ్రాహాము తన భార్యను పాతిపెట్టాడు (అది కనానులోని హెబ్రోను) [20]ఆ పొలాన్ని, దానిలోని గుహను హిత్తీ ప్రజల దగ్గర అబ్రాహాము కొన్నాడు. ఇది అతని ఆస్తి అయ్యింది, దాన్ని అతడు పాతిపెట్టే స్థలంగా ఉపయోగించాడు.

### ఇస్సాకు కోసం ఒక భార్య

**24** అబ్రాహాము కురువృద్ధుడయ్యేంత వరకు జీవించాడు. అబ్రాహామును, అతడు చేసిన దాన్నంతటిని దేవుడు ఆశీర్వదించాడు. [2]అబ్రాహాము యొక్క పాత సేవకుడు ఆస్తి వ్యవహారాలన్నింటి మీద నిర్వాహకునిగా ఉన్నాడు. ఆ సేవకుణ్ణి అబ్రాహాము తన దగ్గరకు పిలిచి ఇలా చెప్పాడు: "నీ చేయి నా తొడకింద పెట్టు.

[3]ఇప్పుడు నీవు నాకు ఒక వాగ్దానం చేయాలి. కనాను స్త్రీలలో ఎవరినీ నా కుమారుని పెళ్లి చేసుకోనివ్వవని భూమ్యాకాశాలకు దేవుడగు యెహోవా ఎదుట నాకు వాగ్దానం చేయి. మనం ఆ ప్రజల మధ్య నివసిస్తున్నాం గాని అతణ్ణి మాత్రం కనాను స్త్రీని వివాహం చేసుకోనివ్వవద్దు.

[4]నా దేశంలోని నా స్వంత ప్రజల దగ్గరకు వెళ్లు. అక్కడ నా కుమారుని కోసం భార్యను చూడు. అప్పుడు ఆమెను ఇక్కడికి (అతని దగ్గరకు) తీసుకురా."

[5]ఆ సేవకుడు, "ఒకవేళ ఆ స్త్రీ నాతో కలిసి ఈ దేశం రావడానికి ఇష్టపడకపోతే, నీ కుమారుడ్ని నేను నీ స్వంత దేశానికి తీసుకొని వెళ్లవచ్చునా ?" అని అడిగాడు.

[6]అబ్రాహాము అతనితో చెప్పాడు: "వద్దు, నా కుమారుని ఆ దేశం తీసుకు వెళ్లొద్దు. [7]పరలోక దేవుడైన యెహోవా నా స్వదేశము నుండి ఇక్కడికి నన్ను తీసుకొని వచ్చాడు. ఆ దేశం నా తండ్రికి, నా కుటుంబానికి మాతృదేశం కాని ఈ నూతన దేశం నీ కుటుంబానికి చెందుతుందని యెహోవా వాగ్దానం చేసాడు. ప్రభువు నీకంటే ముందర తన దేవదూతను పంపిస్తాడు. మరి నీవు నా కుమారునికి వధువును అక్కడనుంచి తెస్తావు. [8]అయితే అమ్మాయి నీతో రావటానికి నిరాకరిస్తే, ఈ వాగ్దాన విషయంలో నీ బాధ్యత తీరిపోతుంది. అంతేగాని నా కుమారుని మాత్రం నీవు ఆ దేశానికి తిరిగి తీసుకువెళ్లొద్దు."

[9]కనుక ఆ సేవకుడు తన యజమాని తొడకింద తన చేయి పెట్టి వాగ్దానం చేసాడు.

### అన్వేషణ ప్రారంభం

[10]అబ్రాహాము ఒంటెలలో పదింటిని తీసుకొని ఆ సేవకుడు ఆ చోటు విడిచి వెళ్లాడు. రకరకాల అందాల కానుకలు ఎన్నో తనతో కూడ ఆ సేవకుడు తీసుకెళ్లాడు. మెసపొతేమియాలోని* నాహోరు పట్టణం వెళ్లాడు ఆ సేవకుడు. [11]పట్టణం వెలుపల ఉన్న మంచి నీళ్ల బావి దగ్గరకు ఆ సేవకుడు సాయంకాలం వెళ్లాడు. నీళ్లు తీసుకొని పోయేందుకు స్త్రీలు సాయంకాలం వస్తారు. ఆ సేవకుడు తన ఒంటెలను అక్కడ మోకరింపజేసాడు.

[12]ఆ సేవకుడు చెప్పాడు: "ప్రభూ, నీవు నా యజమాని అబ్రాహాము దేవుడవు. ఈ వేళ నన్ను అతని కుమారుని కోసం భార్యను కనుగొనునట్లు చేయుము. నా యజమాని అబ్రాహాముకు దయచేసి ఈ మేలు అనుగ్రహించు. [13]ఇదిగో, మంచి నీళ్ల బావి దగ్గర నేను ఉన్నాను, పట్టణం నుండి అమ్మాయిలు నీళ్లు తోడటానికి ఇక్కడికి వస్తున్నారు.

[14]ఇస్సాకు కోసం ఏ అమ్మాయి సరైనదో తెలుసుకొనేందుకు ఒక ప్రత్యేక సూచన కోసం నేను కనిపెడుతున్నాను. ఆ ప్రత్యేక సూచన ఏమిటంటే: 'నేను నీళ్లు తాగాలి, నీ కడవ కింద పెట్టు' అని అమ్మాయితో నేను అంటాను. తాగు, 'నీ ఒంటెలకు కూడా నేను నీళ్లు పోస్తాను' అని అమ్మాయి గనుక చెబితే, అప్పుడు ఆమె సరైన అమ్మాయి అని నేను తెలుసుకొంటాను. అలా జరిగితే ఆమె ఇస్సాకుకు సరైన జోడు అని నీవు రుజువు చేసినట్టే. నా యజమానికి నీవు కరుణ చూపించావని నాకు తెలుస్తుంది."

### భార్య దొరికింది

[15]అంతలో, ఆ సేవకుడు ప్రార్థన ముగించక ముందే రిబ్కా అనే ఒక అమ్మాయి తన గ్రామం నుండి బావి దగ్గరకు వచ్చింది. రిబ్కా బెతూయేలు కుమార్తె. బెతూయేలు అబ్రాహాము సోదరుడు నాహోరు, మిల్కాల కుమారుడు. రిబ్కా తన నీళ్ల కడవ తన భుజంమీద పెట్టుకొని బావి దగ్గరకు వచ్చింది. [16]ఆ అమ్మాయి చాలా చక్కగా ఉంది. ఆమె కన్య. ఆమె ఎన్నడూ పురుషునితో శయనించలేదు. ఆమె తన కడవ నింపుకోటానికి బావిలోనికి దిగింది. [17]అప్పుడు ఆ సేవకుడు ఆమె దగ్గరకు పరుగెత్తి వెళ్లి, "నాకు తాగటానికి దయచేసి నీ కడవలో కొన్ని నీళ్లు ఇస్తావా" అన్నాడు.

[18]రిబ్కా త్వరగా తన భుజంమీద నుండి కడవ దించి, అతనికి నీళ్లు ఇచ్చింది. "అయ్యా, ఇదిగో తాగండి" అంది రిబ్కా. [19]అతను తాగటానికి పోయడం అయిన వెంటనే, "నీ ఒంటెలకు గూడా నేను నీళ్లు పోస్తాను" అంది రిబ్కా. [20]రిబ్కా వెంటనే తన కడవలోని నీళ్లన్నీ ఒంటెల కోసం అని చెప్పి నీళ్ల తొట్టిలో పోసింది. తర్వాత ఇంకా నీళ్లు తెచ్చేందుకు ఆమె బావి దగ్గరకు పరుగెత్తింది. ఆ ఒంటెలన్నింటికి ఆమె నీళ్లు పెట్టింది.

[21]ఆ సేవకుడు మౌనంగా ఆమెను గమనించాడు. యెహోవా తనకు జవాబిచ్చాడని, తన ప్రయాణాన్ని విజయవంతం చేశాడని అతను రూఢిగా తెలుసుకోవాలనుకొన్నాడు. [22]ఒంటెలు నీళ్లు తాగడం అయిపోగానే, అతడు అరతులం బంగారపు ఉంగరం రిబ్కాకు ఇచ్చాడు. 5 తులాల ఎత్తుగల బంగారపు గాజులు రెండు అతడు ఆమెకు ఇచ్చాడు. [23]"నీ తండ్రి ఎవరు? మా గుంపు పండుకొనేందుకు నీ తండ్రి ఇంటిలో చోటు ఉందా?" అని ఆ సేవకుడు ఆమెను అడిగాడు.

[24]"నా తండ్రి బెతూయేలు, నాహోరు మిల్కా యొక్క కుమారుడు" అని రిబ్కా జవాబిచ్చింది. [25]తర్వాత, "అవునండి, మీ ఒంటెలకు గడ్డి, మీరు పండు కొనేందుకు స్థలం మా దగ్గర ఉంది" అని ఆమె చెప్పింది.

[26]ఆ సేవకుడు వంగి యెహోవాను ఆరాధించి, [27]"నా యజమాని అబ్రాహాము దేవుడైన యెహోవా స్తుతించబడు గాక. యెహోవా నా యజమానుని పట్ల దయ చూపాడు. నా యజమాని బంధువు యింటికి యెహోవా నన్ను నడిపించాడు" అని చెప్పాడు.

---

**మెసపొతేమియా** లేక అరాము హరాయిము.

28అప్పుడు రిబ్కా పరుగెత్తి వెళ్లి తన ఇంటివారికి
ఈ సంగతులన్నీ చెప్పింది. 29-30రిబ్కాకు ఒక సోద
రుడు ఉన్నాడు. అతని పేరు లాబాను. ఆ మనిషి
తనతో చెప్పిన విషయాలు రిబ్కా చెప్పింది. లాబాను
ఆమె మాటలు వింటున్నాడు. ఎప్పుడైతే తన సోదరి
చేతులకు ఉంగరం, గాజులు లాబాను చూశాడో,
అప్పుడు బావి దగ్గరకు అతడు పరుగెత్తాడు. అక్కడ
ఆ మనిషి బావి దగ్గర ఒంటెల పక్కగా నిలబడి ఉన్నాడు.
31“అయ్యా, తమరికి లోనికి సుస్వాగతం. మీరలా
ఇక్కడే బయట నిలబడి ఉండనక్కర్లేదు. మీ ఒంటెలకు
స్థలం, మీరు పండుకొనేందుకు గది నేను సిద్ధం చేసాను”
అని లాబాను చెప్పాడు.

32కనుక అబ్రాహాము సేవకుడు ఆ ఇంటిలో ప్రవే
శించాడు. ఒంటెల పనిలో అతనికి లాబాను సహాయం
చేసి, అతని ఒంటెలకు గడ్డి వేసాడు. అతను, అతనితో
ఉన్న మనుష్యులకు కాళ్లు కడుక్కొనేందుకు నీళ్లు
ఇచ్చాడు. 33తర్వాత లాబాను అతనికి భోజనం
పెట్టాడు. అయితే ఆ సేవకుడు తినకుండా నిరాక
రించాడు. “నేను ఎందుకు వచ్చానో మీతో చెప్ప
కుండా నేను భోజనం చేయను” అన్నాడు అతను.
కనుక లాబాను, “అలాగైతే మాతో చెప్పు మరి”
అన్నాడు.

### రిబ్కా కోసం మంతనాలు

34ఆ సేవకుడు చెప్పింది ఇది: “నేను అబ్రాహాము
సేవకుడను. 35అన్ని విషయాల్లోను యెహోవా నా
యజమానిని ఎంతో గొప్పగా ఆశీర్వదించాడు. నా
యజమాని మహా ఘనుడయ్యాడు. గొర్రెల మందలు,
పశువుల మందలు విస్తారంగా యెహోవా అబ్రాహా
ముకు ఇచ్చాడు. అబ్రాహాముకు వెండి బంగారాలు
విస్తారంగా ఉన్నాయి. చాలా మంది ఆడ మగ సేవకులు
ఉన్నారు. ఒంటెలు, గాడిదలు చాలా ఉన్నాయి. 36నా
యజమాని భార్య శారా. ఆమె చాలా వృద్ధాప్యంలో
ఒక కుమారుని కన్నది. నా యజమాని తన ఆస్తి
సర్వం ఆ కుమారునికి ఇచ్చాడు. 37నేను ఒక వాగ్దానం
చేయాలని నా యజమాని నన్ను బలవంతం చేసాడు.
నా యజమాని ‘నా కుమారుణ్ణి కనాను అమ్మాయిల్లో
ఎవర్నీ చేసుకోనివ్వగూడదు. మనం ఆ ప్రజల మధ్య
నివసిస్తున్నాం కాని కనాను అమ్మాయిల్నెవరినీ అతడు
చేసుకోవటం నాకు ఇష్టం లేదు. 38కనుక నీవు నా
తండ్రి దేశానికి వెళ్తానని వాగ్దానం చేయాలి. నా వంశం
వారి దగ్గరకు వెళ్లి, నా కుమారుని కోసం భార్యను
కుదుర్చు’ అని నాతో చెప్పాడు. 39‘ఒక వేళ ఆ స్త్రీ
నాతో కలిసి ఈ దేశానికి రాదేమో’ అని నేను నా
యజమానితో అన్నాను. 40అయితే నా యజమాని
నాతో ఇలా చెప్పాడు, ‘నేను యెహోవాను సేవిస్తాను,
యెహోవా తన దూతను నీతో కూడ పంపి నీకు
సహాయం చేస్తాడు. అక్కడి ప్రజలలో నా కుమారుని
కోసం భార్యను నీవు కనుక్కొంటావు. 41కాని నీవు నా
తండ్రి దేశం వెళ్లాక, నా కుమారుని కోసం భార్యను
ఇచ్చేందుకు వారు నిరాకరిస్తే, అప్పుడు ఈ ప్రమాణ
బాధ్యత నీకు ఉండదు.”

42“ఈ వేళ నేను ఈ బావి దగ్గరకు వచ్చి అన్నాను:
‘నా యజమాని అబ్రాహాము దేవుడైన యెహోవా,
దయతో నా ప్రయాణం విజయవంతం చేయి. 43నేను
ఈ బావి దగ్గర నిలబడి, నీళ్లకోసం ఒక అమ్మాయి
ఇక్కడికి రావాలని నిరీక్షిస్తాను. అప్పుడు నేను, దయచేసి
తాగటానికి నీ కడవలోనుంచి నీళ్లు ఇమ్మని అడుగు
తాను. 44సరైన అమ్మాయి అయితే ఒక ప్రత్యేక
విధానంలో జవాబిస్తుంది. ఈ నీళ్లు తాగు, నీ ఒంటెలకు
గూడ నేను నీళ్లు తెస్తాను అని ఆమె అంటుంది. ఆ
విధంగా, నా యజమాని కుమారుని కోసం యెహోవా
ఏర్పరచిన స్త్రీ ఆమె అని నేను తెలుసుకొంటాను.’

45“నేను ప్రార్థించటం ముగించక ముందే, నీళ్ల
కోసం రిబ్కా బావి దగ్గరకు వచ్చింది. ఆమె తన నీళ్ల
కడవ తన భుజం మీద పెట్టుకొంది. ఆమె వెళ్లి బావి
నుండి నీళ్లు తోడింది. ‘దయచేసి కొంచెం నీళ్లు ఇమ్మని’
నేను ఆమెతో అన్నాను. 46వెంటనే ఆమె తన భుజం
మీద నుండి కడవదించి, నాకు నీళ్లుపోసి, ‘ఇవి త్రాగు,
నీ ఒంటెలకు గూడ నేను నీళ్లు తెస్తాను’ అంది. అందు
చేత నేను నీళ్లు తాగాను, నా ఒంటెలకు కూడా ఆమె
నీళ్లు పెట్టింది. 47అప్పుడు ‘నీ తండ్రి ఎవరు?’ అని
నేను ఆమెను అడిగాను. ‘మిల్కా నాహోరుల కుమారు
డైన బెతూయేలు నా తండ్రి’ అని ఆమె జవాబిచ్చింది.
అప్పుడు ఆమె చేతికి ఉంగరం, గాజులు నేను ఇచ్చాను.
48ఆ సమయంలో నేను నా తలవంచి యెహోవాకు
వందనాలు చేశాను. నా యజమాని దేవుడైన
యెహోవాను నేను స్తుతించాను. నా యజమాని సోద
రుని మనుమరాలి దగ్గరకే నన్ను ఆయన తిన్నగా నడి
పించినందుకు ఆయనకు వందనాలు చెప్పాను.
49ఇప్పుడు మీరేం చేస్తారో నాకు చెప్పండి. నా యజ
మాని యెడల మీరు దయ, నమ్మకత్వం చూపి, మీ
కుమార్తెను ఆయనకు ఇస్తారా? లేక మీ కుమార్తెను
ఇవ్వటానికి మీరు నిరాకరిస్తారా? నేను ఏమి చెయ్యాలో
నాకు తెలిసేటట్టు, మీరు చెప్పండి.”

50అప్పుడు లాబాను, బెతూయేలు జవాబిచ్చారు.
“ఇది యెహోవా నుండి వచ్చినట్లు మేము చూస్తు
న్నాము. కాబట్టి దీన్ని మార్చమని మేము చెప్పుటకు
ఏమీలేదు.

51రిబ్కా నీ ముందే వున్నది. ఆమెను తీసు కొని
వెళ్లు. నీ యజమాని కుమారుణ్ణి ఆమె పెళ్లి
చేసుకొంటుంది. ఇదే యెహోవా కోరేది.”

52అబ్రాహాము సేవకుడు ఈ మాటలు విని,
యెహోవా యెదుట నేలపై సాగిలపడ్డాడు.

53అప్పుడు ఆ సేవకుడు తాను తెచ్చిన కానుకలను
రిబ్కాకు ఇచ్చాడు బంగారు వెండి నగలు, ఎన్నో
అందమైన బట్టలు అతడు రిబ్కాకు యిచ్చాడు. ఆమె
సోదరునికి, తల్లికి గూడ చాలా ఖరీదైన కానుకలు
అతడు ఇచ్చాడు. 54ఆ సేవకుడు, అతనితోనున్న
సేవకులు తిని, తాగి అక్కడే ఉన్నారు. ఆ రాత్రి
వారు అక్కడే ఉన్నారు. మర్నాడు ఉదయం వారు
లేచి, "ఇప్పుడు మేం తిరిగి మా యజమాని దగ్గరకు
వెళ్తాం" అన్నారు. 55అప్పుడు రిబ్కా తల్లి,
సహోదరుడు ఈ విధంగా చెప్పారు, "రిబ్కాను
కొన్నాళ్లు మా దగ్గర ఉండనివ్వు. పది రోజులు
ఉండనివ్వు. ఆ తర్వాత ఆమె వెళ్లవచ్చు." 56కానీ ఆ
సేవకుడు, "నన్ను ఇంక ఆపవద్దు. నా ప్రయాణాన్ని
యెహోవా విజయవంతం చేసాడు. కనుక ఇప్పుడు
నా యజమాని దగ్గరకు నన్ను వెళ్లనివ్వండి" అని
వారితో చెప్పాడు.
57"రిబ్కాను పిలిచి, ఆమె ఇష్టం ఏమిటో మేము
అడుగుతాం" అన్నారు రిబ్కా అన్న, తల్లి. 58వారు
రిబ్కాను పిలిచి, "నీవు ఈ మనుష్యునితో కలిసి ఇప్పుడే
వెళ్తావా?" అని అడిగారు.
"అవును, నేను వెళ్తాను అంది రిబ్కా."
59కనుక అబ్రాహాము సేవకునితో, అతని మనుష్య
లతో కలిసి రిబ్కా వెళ్లటానికి వారు అనుమతించారు.
రిబ్కా దాది కూడ వారితో వెళ్లింది. 60వారు వెళ్తున్న
ప్పుడు రిబ్కాతో వారు ఇలా చెప్పారు:

"మా సోదరి, వేలమందికి, పది వేలమందికి
నీవు తల్లివి అవుదువు గాక. నీ సంతానము
వారి శత్రువులను ఓడించి వారి పట్టణాలను
స్వాధీనం చేసు కొందురు గాక!"

61అప్పుడు రిబ్కా, ఆమె దాది ఒంటెలను ఎక్కి
ఆ సేవకుని, అతని మనుష్యులను వెంబడించారు. ఆ
విధంగా ఆ సేవకుడు రిబ్కాను తోడుకొని తిరుగు
ప్రయాణమయ్యాడు.
62అప్పటికి ఇస్సాకు బెయేర్ లహాయిరోయి విడిచి,
నెగెవులో నివసిస్తున్నాడు.
63ఒక సాయంకాలం ఇస్సాకు ధ్యానించుట కోసం
అలా బయటకు పొలాల్లోకి వెళ్లాడు. ఇస్సాకు తలెత్తి
చూచేటప్పటికి అంత దూరంలో వస్తున్న ఒంటెలు
కనిపించాయి.
64రిబ్కా తలెత్తి ఇస్సాకుని చూసింది. అప్పుడామె
ఒంటె మీద నుండి క్రిందికి దిగెను.
65"మనలను కలుసు కొనేందుకు ఆ పొలాల్లో నడిచి
వస్తున్న యువకుడు ఎవరు?" అంటు ఆమె సేవకుని
అడిగింది. "ఆయనే నా యజమాని కుమారుడు"
అని చెప్పాడు ఆ సేవకుడు. కనుక రిబ్కా తన ముఖం
మీద ముసుగు కప్పుకొంది. 66జరిగిన సంగతులన్నీ
ఇస్సాకుతో ఆ సేవకుడు చెప్పాడు. 67అప్పుడు ఇస్సాకు
ఆ అమ్మాయిని తన తల్లి గుడారంలోకి తీసుకు
వచ్చాడు. ఆ రోజు రిబ్కా ఇస్సాకు భార్య అయ్యింది.
ఇస్సాకు ఆమెను చాలా ప్రేమించాడు. తన తల్లి మరణిం
చిన తర్వాత ఇస్సాకు దుఃఖనివారణ పొందాడు.

### అబ్రాహాము కుటుంబం

25 అబ్రాహాము మళ్లీ పెళ్లి చేసుకొన్నాడు.
ఆయన కొత్త భార్య పేరు కెతూరా. 2కెతూ
రాకు జిమ్రాను, యొక్షాను, మెదాను, మిద్యాను,
ఇష్బాకు, షూవహు పుట్టారు. 3యొక్షాను, షేబ, దెదాను
లకు తండ్రి. అష్షూరు, లెయుమీ మరియు లెతూషీ
ప్రజలు దెదాను సంతానము. 4మిద్యాను కుమారులు
ఏఫా, ఏఫెరు, హనోకు, అబీదా, ఎల్దాయా. అబ్రాహాము
కెతూరా, వివాహం మూలంగా ఈ కుమారులంతా
పుట్టారు.
5 - 6అబ్రాహాము చనిపోక ముందు తన దాసీల
కుమారులందరికి అతడు కొన్ని కానుకలు ఇచ్చాడు.
ఆ కుమారులను అబ్రాహాము తూర్పుకు పంపాడు.
అతడు వారిని ఇస్సాకుకు దూరంగా పంపించి వేసాడు.
అప్పుడు అబ్రాహాము తన ఆస్తి సర్వస్వం ఇస్సాకుకు
ఇచ్చాడు.
7అబ్రాహాము 175 సంవత్సరాలు వయస్సు వరకు
జీవించాడు.
8అప్పుడు అబ్రాహాము బలము తగ్గిపోయి
చనిపోయాడు. సుదీర్ఘ సంతృప్తికర జీవితం అతడు
జీవించాడు. అతడు మరణించి తనవారి దగ్గరకు చేర్చ
బడ్డాడు. 9అతని కుమారులు ఇస్సాకు, ఇష్మాయేలు
కలసి మక్పేలా గుహలో అతణ్ణి పాతిపెట్టారు. సోహరు
కుమారుడు ఎఫ్రోను పొలంలో ఈ గుహ ఉంది. అది
మమ్రేకు తూర్పున ఉంది.
10హిత్తీ ప్రజల దగ్గర్నుండి అబ్రాహాము కొన్న గుహ
ఇదే. అబ్రాహాము తన భార్య శారాతో అక్కడ పాతి
పెట్టబడ్డాడు. 11అబ్రాహాము చనిపోయిన తరువాత,
ఇస్సాకును దేవుడు ఆశీర్వదించాడు. మరియు ఇస్సాకు
బేయేర్ లహాయిరోయిలోనే నివాసం కొనసాగించాడు.
12ఇష్మాయేలు వంశంవారి జాబితా ఇది. అబ్రాహాము
హాగరుల కుమారుడు ఇష్మాయేలు. (శారాకు ఈజిప్టు
దాసి హాగరు)
13ఇష్మాయేలు కుమారుల పేర్లు ఇవి: మొదటి
కుమారుని పేరు సెబాయోతు, తర్వాత కేదారు
పుట్టాడు, తర్వాత అద్బయేలు, మిబాశిము, 14మిష్మా,
దుమారమశ్శా,
15హదరు, తేమా, యెతూరు, నాపీషు, కెదెమా
పుట్టారు. 16అవి ఇష్మాయేలు కుమారుల పేర్లు. ఒక్కో
కుమా రునికి ఒక్కో స్వంత శిబిరం ఉండేది, అదే

ఒక చిన్న పట్టణం అయింది. పన్నెండు మంది
కుమారులు, వారి స్వంత ప్రజలతో, పన్నెండు మంది
యువరాజుల్లా ఉన్నారు. [17]ఇష్మాయేలు 137
సంవత్సరాలు బతికాడు. తరువాత అతను చనిపోయి,
అతని పూర్వీకులతో చేర్చబడ్డాడు. [18]ఇష్మాయేలు
సంతానంవారు ఎడారి ప్రాంతమంతా బసచేసారు. ఈ
ప్రాంతం ఈజిప్టు దగ్గర హవీలా, షూరు నుండి ఉత్తరపు
చివరన అష్షూరు వరకు విస్తరించి ఉంది. ఇష్మాయేలు
సంతానము తరచూ అతని సోదరుని ప్రజలను
ఎదుర్కొన్నారు.

### ఇస్సాకు కుటుంబం

[19]ఇస్సాకు కుటుంబ చరిత్ర ఇది. అబ్రాహాముకు
ఇస్సాకు అనే ఒక కుమారుడు ఉన్నాడు. [20]ఇస్సాకు
వయస్సు 40 సంవత్సరాలు ఉన్నప్పుడు రిబ్కాను
అతడు వివాహం చేసుకొన్నాడు. రిబ్కా పద్దనరాముకు
చెందినది. ఆమె బెతూయేలు కుమార్తె, అరామీ
యుడగు లాబానుకు సోదరి. [21]ఇస్సాకు భార్యకు పిల్లలు
పుట్టలేదు. కనుక ఇస్సాకు తన భార్య కోసం ప్రార్థిం
చాడు. ఇస్సాకు ప్రార్థన యెహోవా విన్నాడు. రిబ్కాను
గర్భవతి కానిచ్చాడు.

[22]రిబ్కా గర్భవతిగా ఉన్నప్పుడు, ఆమె గర్భంలో
కవల పిల్లలు పెనుగులాడారు. రిబ్కా యెహోవాను
ప్రార్థించి, "ఎందుకు నాకు ఇలా జరిగింది?" అని
అడిగింది. [23]ఆమెతో యెహోవా చెప్పాడు: "నీ
గర్భంలో రెండు జనాంగాలు ఉన్నాయి. రెండు వంశాల
పాలకులు నీలోనుండి పుడతారు. కాని వారు విభ
జించబడతారు. ఒక కుమారుడు మరో కుమారుని
కంటే బలవంతుడుగా ఉంటాడు. పెద్ద కుమారుడు
చిన్న కుమారుని సేవిస్తాడు." [24]తగిన సమయం రాగానే
రిబ్కా కవల పిల్లల్ని కన్నది. [25]మొదట శిశువు ఎరుపు.
వాని చర్మం బొచ్చు అంగీలా ఉంది. కనుక వానికి
ఏశావు* అని పేరు పెట్టబడింది. [26]రెండవ శిశువు
పుట్టినప్పుడు వాడు ఏశావు మడిమను గట్టిగా పట్టుకొని
ఉన్నాడు. కనుక ఆ శిశువుకు యాకోబు అని పేరు
పెట్టబడింది. యాకోబు,* ఏశావు పుట్టినప్పుడు
ఇస్సాకు వయస్సు 60 సంవత్సరాలు.

[27]అబ్బాయిలు పెద్దవాళ్లయ్యారు. ఏశావు నిపుణ
తగల వేటగాడయ్యాడు. బయట పొలాల్లో ఉండటం
అంటే అతనికి చాలా ఇష్టం. అయితే యాకోబు నెమ్మది
పరుడు. అతను తన గుడారంలోనే ఉన్నాడు. [28]ఇస్సాకు
ఏశావును చాలా ప్రేమించాడు. ఏశావు వేటాడిన జంతు
వులను తినటం అతనికి ఇష్టం. కాని రిబ్కాకు యాకోబు
మీద ప్రేమ. [29]ఒకసారి ఏశావు వేటనుండి తిరిగి
వచ్చాడు. అతను అలసిపోయి, ఆకలితో బలహీనంగా
ఉన్నాడు. యాకోబు వంట పాత్రలో చిక్కుడు
కాయలు వండు తున్నాడు. [30]కనుక ఏశావు, "నేను
ఆకలితో నీరసం అయిపోయాను ఆ ఎర్రటి చిక్కుడు
కాయలు నాకు కొంచెం పెట్టు" అని యాకోబును
అడిగాడు. (అందుకే ప్రజలు అతణ్ణి ఏదోం* అని
పిలిచేవాళ్లు.) [31]అయితే యాకోబు, "నీ జ్యేష్ఠత్వపు
జన్మ హక్కుల్ని ఈ వేళ నాకు అమ్మివేయాలి"
అన్నాడు.

[32]ఏశావు "నేను ఆకలితో దాదాపు చచ్చాను. నేను
చనిపోతే, నా తండ్రి ఐశ్వర్యాలన్నీ నాకు సహాయపడవు.
కనుక నా వాటా నీకు ఇచ్చేస్తాను" అన్నాడు.

[33]కానీ యాకోబు దాన్ని, "నాకు ఇస్తావని ముందు
ప్రమాణం చేయాలి" అన్నాడు. కనుక ఏశావు యాకో
బుకు ప్రమాణం చేసాడు. తన తండ్రి ఐశ్వర్యంలో
తన వాటాను ఏశావు యాకోబుకు అమ్మివేసాడు.
[34]అప్పుడు యాకోబు రొట్టె, భోజనం ఏశావుకు
ఇచ్చాడు. ఏశావు తిని, తాగి వెళ్లిపోయాడు. కనుక
ఏశావు తన జ్యేష్ఠత్వపు హక్కులను లక్ష్యపెట్ట లేదని
వ్యక్తం చేసాడు.

### అబీమెలెకుతో ఇస్సాకు అబద్ధం చెప్పటం

26 ఒకసారి కరువుకాలం వచ్చింది. అబ్రాహాము
జీవిత కాలంలో వచ్చిన కరువులాంటిదే ఇది.
కనుక గెరారు పట్టణంలో ఉన్న ఫిలిష్తీ ప్రజల రాజు
అబీమెలెకు దగ్గరకు ఇస్సాకు వెళ్లాడు. [2]ఇస్సాకుతో
యెహోవా మాట్లాడాడు. యెహోవా చెప్పాడు:
"ఈజిప్టు వెళ్లవద్దు. నీవు ఉండాలని నేను నీకు ఆజ్ఞాపిం
చిన దేశంలోనే నీవు నివసించాలి. [3]ఆ దేశంలోనే నీవు
నివాసం ఉండు, నేను నీతో ఉంటాను. నిన్ను నేను
ఆశీర్వదిస్తాను. నీకు నీ వంశానికి ఈ భూభాగాలన్నీ
ఇస్తాను. నీ తండ్రి అబ్రాహాముకు నేను వాగ్దానం చేసిన
దంతా నీకు నేను ఇస్తాను.

[4]ఆకాశ నక్షత్రాలు ఎన్నో, నీ సంతానం అంతటిదిగా
నేను చేస్తాను. ఈ దేశాలన్నీ నీ కుటుంబానికి నేను
ఇస్తాను. నీ సంతానం మూలంగా భూమిమీద జనాంగా
లన్నీ ఆశీర్వదించబడతాయి. [5]నీ తండ్రియైన అబ్రా
హాము నా మాటలకు లోబడి, నేను చెప్పిన వాటిని
చేసాడు గనుక నేను ఇది చేస్తాను. అబ్రాహాము నా
ఆజ్ఞలకు చట్టాలకు, నియమాలకు విధేయుడ
య్యాడు." [6]కనుక ఇస్సాకు గెరారులో ఉండి పోయి
అక్కడ నివసించాడు. [7]ఇస్సాకు భార్య రిబ్కా చాలా
అందగత్తె. రిబ్కాను గూర్చి అక్కడి మనుష్యులు
ఇస్సాకును అడిగారు. "ఆమె నా సోదరి" అని చెప్పాడు

---

**ఏశావు** "రోమము" లేక "ఎఱ్ఱని" అని దీని అర్థం.

**యాకోబు** "మడిమెను పట్టుకొనినవాడు" లేక "మోస
గాడు" అని దీని అర్థం.

**ఏదోం** అనగా "ఎరుపు."

ఇస్సాకు. రిబ్కా తన భార్య అని వారితో చెప్పడానికి
ఇస్సాకు భయపడ్డాడు. ఆమెను పొందటం కోసం ఆ
మనుష్యులు తనను చంపివేస్తారని ఇస్సాకు భయ
పడ్డాడు.
8ఇస్సాకు అక్కడ చాలా కాలం ఉన్న తర్వాత,
ఇస్సాకు అతని భార్యతో సరసాలు ఆడుకోవటం అబీ
మలెకు తన కిటికీ గుండా చూశాడు. 9అబీమెలెకు
ఇస్సాకును పిలిచి "ఈ స్త్రీ నీ భార్య. ఈమె నీ సోదరి
అని మాతో ఎందుకు చెప్పావు?" అని అడిగాడు.
"నీవు ఈమెను పొందటం కోసం నన్ను చంపే
స్తావని నేను భయపడ్డాను" అని ఇస్సాకు అతనితో
చెప్పాడు.
10"నీవు మాకు కీడు చేసావు. మా మనుష్యుల్లో
ఎవడైనా ఒకడు నీ భార్యతో శయనించి ఉండేవాడు.
అప్పుడు అతడు మహా పాపము చేసిన నేరస్థుడ
య్యేవాడు" అన్నాడు అబీమెలెకు.
11అందుచేత అబీమెలెకు ప్రజలందరికి హెచ్చరిక
ఇచ్చాడు. "ఈ పురుషునిగాని, ఇతని భార్యనుగాని
ఎవరూ బాధించగూడదు. వారిని బాధించినవాడు ఎవరై
నాసరే చంపివేయబడతాడు" అని అతడు చెప్పాడు.

### ఇస్సాకు ధనికుడయ్యాడు

12ఆ దేశంలో ఇస్సాకు పొలాల్లో విత్తనాలు విత్తాడు.
ఆ సంవత్సరం అతడు విస్తారంగా పంట కూర్చుకు
న్నాడు. యెహోవా అతన్ని ఎంతో ఆశీర్వదించాడు.
13ఇస్సాకు ధనికుడయ్యాడు. అతడు మహా ఐశ్వర్య
వంతుడు అయ్యేవరకు మరింత విస్తారంగా ఐశ్వర్యం
కూర్చుకొన్నాడు.
14గొర్రెల మందలు, పశువుల మందలు అతనికి
విస్తారంగా ఉన్నాయి. అతనికి చాలా మంది బానిసలు
కూడా ఉన్నారు. ఫిలిష్తీప్రజలంతా అతనిమీద అసూయ
పడ్డారు. 15కనుక ఇస్సాకు తండ్రియైన అబ్రాహాము,
అతని సేవకులు తవ్విన చాలా బావుల్ని ఫిలిష్తీ ప్రజలు
పాడుచేశారు. ఆ బావుల్ని ఫిలిష్తీ ప్రజలు మట్టితో
నింపారు. 16అబీమెలెకు ఇస్సాకుతో, "మా దేశం వదలి
పెట్టు. నీవు మాకంటే చాలా అత్యధికంగా శక్తిమంతు
డవయ్యావు" అన్నాడు.
17కనుక ఇస్సాకు ఆ స్థలం విడిచిపెట్టి, గెరారు
చిన్న నదికి సమీపంలో నివాసం చేసాడు. ఇస్సాకు
అక్కడ ఉండి జీవించాడు.
18దీనికి ఎంతో ముందు అబ్రాహాము చాలా బావులు
తవ్వాడు. అబ్రాహాము చనిపోయిన తర్వాత ఫిలిష్తీ
ప్రజలు ఆ బావులను చెత్తతో నింపేసారు. కనుక
ఇస్సాకు తిరిగి వెళ్లి ఆ బావులను మళ్లీ తవ్వాడు.
వాటికి తన తండ్రి పెట్టిన పేర్లే ఇస్సాకు పెట్టాడు.
19చిన్న నది దగ్గర ఇస్సాకు సేవకులు ఒక బావి తవ్వారు.
ఆ బావిలో నీటి ఊట ఒకటి ఉబికింది. 20అయితే
గెరారు లోయలో గొర్రెల మందలను కాసేవాళ్లు
ఇస్సాకు పనివాళ్లతో జగడ మాడారు. "ఈ నీళ్లు మావి
అన్నారు వాళ్లు." కనుక ఆ బావికి 'ఏశెకు'* అని
ఇస్సాకు పేరు పెట్టాడు. అక్కడ ఆ మనుష్యులు
అతనితో జగడమాడారు గనుక దానికి ఆ పేరు పెట్టాడు.
21అప్పుడు ఇస్సాకు సేవకులు మరో బావి తవ్వారు.
ఆ బావి మూలంగా అక్కడి ప్రజలు కూడా జగడ
మాడారు. కనుక ఆ బావికి 'శిత్నా'* అని ఇస్సాకు
పేరు పెట్టాడు.
22ఇస్సాకు అక్కడ నుండి వెళ్లిపోయి మరో బావి
తవ్వాడు. ఆ బావి విషయం వాదించటానికి ఎవరూ
రాలేదు. కనుక ఆ బావికి 'రహెబోతు'* అని ఇస్సాకు
పేరు పెట్టాడు. "ఇప్పుడు మనకోసం యెహోవా
ఒక స్థలం ఇచ్చాడు. ఈ దేశంలో మనం అభివృద్ధిపొంది
సఫలము కావాలి." అన్నాడు ఇస్సాకు.
23ఆ చోటు నుండి ఇస్సాకు బెయేర్షెబాకు వెళ్లాడు.
24ఆ రాత్రి ఇస్సాకుతో యెహోవా మాట్లాడాడు. "నీ
తండ్రి అబ్రాహాము దేవుణ్ణి నేను. భయపడకు. నేను
నీకు తోడుగా ఉన్నాను, నేను నిన్ను ఆశీర్వదిస్తాను.
నీ వంశస్తులను అభివృద్ధి చేస్తాను. నా సేవకుడు అబ్రా
హాము కారణంగా నేను ఇది చేస్తాను" అని చెప్పాడు
యెహోవా. 25కనుక ఆ స్థలంలో దేవుణ్ణి ఆరాధిం
చేందుకు ఒక బలిపీఠాన్ని ఇస్సాకు కట్టించాడు. ఇస్సాకు
అక్కడ నివాసం చేయగా, అతని సేవకులు ఒక బావి
తవ్వారు.
26ఇస్సాకును చూసేందుకు గెరారు నుండి అబీమె
లెకు వచ్చాడు. సలహాదారుడు అహుజతును సైన్యాధి
పతియైన ఫీకోలును వెంటబెట్టుకొని అబీమెలెకు
వచ్చాడు. 27ఇస్సాకు వారితో, "ఇంతకుముందు నీవు
నాతో స్నేహంగా లేవు గదా. నీ దేశం వదిలిపెట్టేట్టు
నీవు నన్ను బలవంతం గూడా చేసావు గదా. ఇప్పుడు
నన్ను చూడటానికి ఎందుకు వచ్చావు?" అన్నాడు.
28వారు జవాబు చెప్పారు: "యెహోవా నీకు
తోడుగా ఉన్నాడని ఇప్పుడు మాకు తెలిసింది. మనం
ఒక ఒడంబడిక చేసుకోవాలని మా అభిప్రాయం. మాకు
నీవు ఒక ప్రమాణం చేయాలి. 29మేము నిన్ను బాధించ
లేదు. ఇప్పుడు నీవు కూడా మమ్మల్ని బాధించనని
ప్రమాణం చేయాలి. నిన్ను మేము పంపించివేసినా,
సమాధానంగా పంపించాం. యెహోవా నిన్ను ఆశీర్వ
దించాడని యిప్పుడు తేటగా తెలుస్తుంది."
30ఇస్సాకు వారికి విందు చేసాడు. వారు తిని తాగారు.
31మర్నాడు ఉదయం ఒక్కొక్కరు ఒక్కో ప్రమాణం
చేసారు. తర్వాత ఆ మనుష్యులు సమాధానంగా వెళ్లి

**ఏశెకు** అనగా 'జగడమాడు.'

**శిత్నా** అనగా "విరోధము."

**రహెబోతు** అనగా "ఎడము."

పోయారు. [32]ఆ రోజున ఇస్సాకు సేవకులు వచ్చి, వారు తవ్విన బావిని గూర్చి చెప్పారు. "ఆ బావిలో నీళ్లు చూశాం" అని చెప్పారు సేవకులు. [33]కనుక ఆ బావికి 'షెబ'* అని పేరు పెట్టాడు ఇస్సాకు. ఆ పట్టణం ఇప్పటికీ బెయేర్షెబా అని పిలువబడుతుంది.

### ఏశావు భార్యలు

[34]ఏశావు 40 సంవత్సరాల వయస్సులో హిత్తీ స్త్రీలను ఇద్దరిని వివాహం చేసుకొన్నాడు. ఒక స్త్రీ బేయేరి కుమార్తె యహూదీతు. ఇంకొక ఆమె ఏలోను కుమార్తె బాశెమతు. [35]ఈ వివాహాలు ఇస్సాకు రిబ్కాలను చాలా బాధపెట్టాయి.

### ఆస్తి సమస్యలు

27 ఇస్సాకు ముసలివాడైనప్పుడు అతని చూపు సన్నగిల్లింది. ఇస్సాకు తేటగా చూడలేక పోయాడు. ఒక నాడు తన పెద్ద కుమారుని అతడు తన దగ్గరకు పిల్చాడు, "కుమారుడా" అన్నాడు.

"ఇదిగో ఇక్కడే ఉన్నాను" అని జవాబిచ్చాడు ఏశావు.

[2]ఇస్సాకు చెప్పాడు: "చూడు, నేను ముసలివాడ నయ్యాను. ఒకవేళ త్వరలో నేను చనిపోతానేమో! [3]కనుక నీ విల్లు, అంబులు తీసుకొని వేటకు వెళ్లు. నేను తినటానికి ఒక జంతువును చంపు. [4]నాకు ఇష్టమైన భోజనం తయారు చేయి. అది నా దగ్గరకు తీసుకురా, నేను తింటాను. అప్పుడు నేను మరణించక ముందు నిన్ను ఆశీర్వదిస్తాను." [5]కనుక ఏశావు వేటకు వెళ్లాడు. ఇస్సాకు తన కుమారుడైన ఏశావుతో ఆ సంగతులు చెబుతున్నప్పుడు రిబ్కా విన్నది.

### యాకోబు ఇస్సాకును యుక్తితో మోసం చేయుట

[6]తన కుమారుడైన యాకోబుతో రిబ్కా చెప్పింది: "విను, నీ సోదరుడు ఏశావుతో నీ తండ్రి మాట్లాడటం నేను విన్నాను. [7]'నేను తినటానికి ఒక జంతువును చంపి నా కోసం భోజనం సిద్ధం చేయి, నేను భోంచే స్తాను. అప్పుడు నేను మరణించక ముందు నిన్ను ఆశీర్వదిస్తాను' అని నీ తండ్రి చెప్పాడు. [8]కనుక, కుమారుడా నేను చెప్పేది విని అలా చేయి. [9]మన మేకల మందలోనికి వెళ్లి, రెండు మేక పిల్లల్ని నా దగ్గరకు తీసుకురా. నీ తండ్రికి ఇష్టమైన పద్ధతిలో నేను వాటిని సిద్ధం చేస్తాను. [10]అప్పుడు ఆ భోజనాన్ని నీవే నీ తండ్రి దగ్గరకు తీసుకొని వెళ్లు. ఆయన మరణించక ముందు నిన్ను ఆశీర్వదిస్తాడు."

[11]అయితే యాకోబు తన తల్లి రిబ్కాతో ఇలా చెప్పాడు: "అయితే నా సోదరుడి శరీరమంతా వెంట్రుకలు ఉంటాయి, అతనిలా నాకు వెంట్రుకలు ఉండవు. [12]నా తండ్రి నన్ను తాకితే నేను ఏశావును కానని ఆయన తెలుసుకుంటాడు. అప్పుడు ఆయన నన్ను ఆశీర్వదించడు. నేను ఆయన్ను మోసం చేయటానికి ప్రయత్నించినందువల్ల ఆయన నన్ను శపిస్తాడు."

[13]కనుక రిబ్కా, "ఏదైనా కష్టం వస్తే ఆ నింద నేను భరిస్తాను. నేను చెప్పినది చేయి. వెళ్లి మేకల్ని తెచ్చి నాకు ఇవ్వు" అని అతనితో చెప్పింది.

[14]కనుక యాకోబు వెళ్లి రెండు మేకల్ని తీసుకొని, తెచ్చి వాటిని తల్లికి ఇచ్చాడు. ఇస్సాకుకు ఇష్టమైన ఒక ప్రత్యేక విధానంలో అతని తల్లి ఆ మేకలతో వంట చేసింది. [15]తర్వాత ఆమె, తన కుమారుడు ఏశావు ఎక్కువగా ఇష్టపడి ధరించే బట్టలు తెచ్చింది. ఆ బట్టలను చిన్న కుమారుడు యాకోబుకు ధరింప జేసింది.

[16]ఆ మేకల చర్మాలను రిబ్కా తీసుకొని, వాటిని యాకోబు చేతుల మీద వేసింది. [17]తర్వాత రిబ్కా తాను వండిన భోజనం తెచ్చి, దానిని యాకో బుకు యిచ్చింది.

[18]యాకోబు తన తండ్రి దగ్గరకు వెళ్లి, "తండ్రీ" అని పిల్చాడు.

"ఏమి కుమారుడా, ఎవరు నీవు" అన్నాడు తండ్రి.

[19]"నేను ఏశావును, నీ పెద్ద కుమారుడను. నీవు నాకు చెప్పిన పనులు చేసాను. నీ కోసం నేను వేటాడి తెచ్చిన జంతువులను సమకూర్చి వాటిచే నీకొరకైన భోజనమును సిద్ధపరచితిని. దానిని తిని, తృప్తిపొంది నన్ను ఆశీర్వదించవచ్చు" అని యాకోబు తన తండ్రితో చెప్పాడు.

[20]అయితే ఇస్సాకు, "నీవు ఇంత త్వరగా ఎలా వేటాడి జంతువుల్ని చంపగలిగావు?" అని తన కుమా రుణ్ణి అడిగాడు.

'త్వరగా నేను జంతువుల్ని సంపాదించటానికి నీ దేవుడైన యెహోవా నాకు సహాయం చేసాడు గనుక" అని యాకోబు జవాబిచ్చాడు.

[21]అప్పుడు ఇస్సాకు, "నా కుమారుడా నేను నిన్ను తడిమి చూడాలి. కనుక నీవిలా నా దగ్గరగా రా. నిన్ను నేను తడిమి చూస్తే, నిజంగా నీవు నా కుమారుడు ఏశావువో కాదో తెలుస్తుంది" అన్నాడు యాకోబుతో.

[22]కనుక తన తండ్రియైన ఇస్సాకు దగ్గరకు యాకోబు వెళ్లాడు. ఇస్సాకు అతణ్ణి తడిమి చూసి, "నీ స్వరం యాకోబు స్వరంలా ఉంది. కానీ, నీ చేతులు మాత్రం ఏశావు చేతుల్లా వెంట్రుకలతో ఉన్నాయి" అన్నాడు. [23]యాకోబు చేతులు ఏశావు చేతులవలె వెంట్రుకలతో ఉన్నందువల్ల అతడు యాకోబు అని ఇస్సాకుకు తెలియలేదు. కనుక ఇస్సాకు యాకోబును ఆశీర్వ దించాడు. [24]"నిజంగా నీవు నా కుమారుడు ఏశావువేనా?" అన్నాడు ఇస్సాకు. "అవును, నేనే" అని యాకోబు జవాబిచ్చాడు.

---

**షెబ** అనగా "ప్రమాణము."

### యాకోబుకు ఆశీర్వాదం

25అప్పుడు ఇస్సాకు, “ఆ భోజనం నా దగ్గరకు
తీసుకురా. నేను అది భోంచేసి, నిన్ను ఆశీర్వదిస్తాను”
అన్నాడు. కనుక యాకోబు అతనికి భోజనం ఇచ్చాడు,
అతడు భోంచేసాడు. యాకోబు అతనికి ద్రాక్షారసం
ఇచ్చాడు, అతడు త్రాగాడు.
26అప్పుడు ఇస్సాకు, “కుమారుడా, దగ్గరకు వచ్చి
నన్ను ముద్దు పెట్టుకో” అని అతనితో చెప్పాడు.
27కనుక యాకోబు తన తండ్రి దగ్గరకు వెళ్లి, అతణ్ణి
ముద్దు పెట్టుకొన్నాడు. అతని వస్త్రాలను ఇస్సాకు
వాసన చూచి, అతణ్ణి ఆశీర్వదించాడు. ఇస్సాకు ఇలా
అన్నాడు:

“నా కుమారుని వాసన యెహోవా ఆశీర్వ
దించిన చేని సువాసనలా ఉంది.
28 విస్తారమైన పంటలు, ద్రాక్షారసం నీకు ఉండే
టట్టు వర్షాలు యెహోవా నీకు సమృద్ధిగా ఇచ్చు
గాక.
29 మనుష్యులంతా నిన్నే సేవిస్తారు గాక, జనములు
నీకు సాగిలపడుదురు గాక, నీ సోదరుల మీద
నీవు పరిపాలన చేస్తావు నీ తల్లియొక్క కుమా
రులు నీకు సాగిలపడి నీకు లోబడుతారు, నిన్ను
శపించే ప్రతీ వ్యక్తి శపించబడుతాడు, నిన్ను ఆశీ
ర్వదించే ప్రతీ వ్యక్తి ఆశీర్వదించబడుతాడు.”

### ఏశావు ఆశీర్వాదం

30యాకోబును ఆశీర్వదించటం ముగించాడు
ఇస్సాకు. అప్పుడు, తన తండ్రి ఇస్సాకును విడిచి
యాకోబు వెళ్తుండగా, వేటనుండి ఏశావు తిరిగి
వచ్చాడు. 31తన తండ్రికి ఇష్టమైన ప్రత్యేక విధానంలో
భోజనం తయారు చేసాడు ఏశావు. దానిని ఏశావు
తన తండ్రి దగ్గరకు తెచ్చాడు. అతడు తన తండ్రితో,
“నాయనా, లేచి నీ కుమారుడు నీ కోసం వేటాడి
తెచ్చి వండిన మాంసాన్ని తిను, అప్పుడు నీవు నన్ను
దీవించగలవు”.
32అయితే ఇస్సాకు, “ఎవరు నీవు?” అన్నాడు
అతనితో.
“నేను నీ మొదటి కుమారుణ్ణి ఏశావును”
అన్నాడతను.
33అప్పుడు ఇస్సాకు చాలా బాధపడి, “అలాగైతే
నీవు రాకముందు భోజనం వండి నా దగ్గరకు తీసుకు
వచ్చినదెవరు? నేను అదంతా శుభ్రంగా భోంచేసి,
అతణ్ణి నేను ఆశీర్వదించానుగదా. ఇప్పుడు మళ్లీ నా
ఆశీర్వాదాన్ని నేను వెనుకకు తీసుకోవటానికి సమయం
మించిపోయిందే” అన్నాడు.
34ఏశావు తన తండ్రి మాటలు విన్నాడు. అతనిలో
కోపం, కక్ష రెచ్చిపోయాయి. అతను గట్టిగా ఏడ్చేసి
“అలాగైతే నన్ను కూడా ఆశీర్వదించు నాయనా’ అని
తన తండ్రితో చెప్పాడు. 35“నీ సోదరుడు నన్ను
మోసం చేసాడు. అతను వచ్చి, నీ ఆశీర్వాదాలు
తీసుకొన్నాడు” అన్నాడు ఇస్సాకు.
36“అతని పేరే యాకోబు (మోసగాడు). అది అత
నికి సరైన పేరు. రెండుసార్లు అతడు నన్ను మోసం
చేసాడు. జ్యేష్ఠత్వపు హక్కు తీసివేసుకొన్నాడు,
ఇప్పుడు నా ఆశీర్వాదాలు తీసివేసుకొన్నాడు. అని
చెప్పి ఏశావు, “మరి నా కోసం ఆశీర్వాదాలు ఏమైనా
మిగిల్చావా?” అని ప్రశ్నించాడు.
37“లేదు, ఇప్పుడు చాలా ఆలస్యమైపోయింది. నీ
మీద పరిపాలన చేసే అధికారం యాకోబుకు నేని
చ్చాను. అతని సోదరులంతా అతని సేవకులవుతారని
కూడా నేను చెప్పాను. ధాన్యం, ద్రాక్షారసం, సమృద్ధిగా
కలిగే ఆశీర్వాదం కూడా నేను అతనికి యిచ్చాను.
నీకు ఇచ్చేందుకు యింకేమీ మిగల్లేదు కుమారుడా”
అని జవాబిచ్చాడు ఇస్సాకు.
38తన తండ్రిని బ్రతిమలాడుతూనే ఉన్నాడు.
“నాయనా, నీ దగ్గర ఒక్క ఆశీర్వాదమే ఉందా? నన్ను
కూడా ఆశీర్వదించు నాయనా” అంటూ ఏశావు
ఏడ్వటం మొదలుబెట్టాడు.
39అప్పుడు అతనితో ఇస్సాకు ఇలా చెప్పాడు:

“నీవు సారం లేని దేశంలో నివసిస్తావు నీకు వర్ష
పాతం ఎక్కువగా ఉండదు.
40 నీ మనుగడ కోసం నీవు పోరాడాలి, నీవు నీ
సోదరునికి బానిసవు అవుతావు అయితే
స్వతంత్రం కోసం నీవు పోరాడతావు అతని
స్వాధీనం నుండి నీవు విడిపోతావు.”

41ఆ తరువాత తన తండ్రి అతణ్ణి ఆశీర్వదించ
డంవల్ల యాకోబును ఏశావు అసహ్యించుకొన్నాడు.
ఏశావు “త్వరలోనే నా తండ్రి చనిపోతాడు, నేను
అతని కోసం దుఃఖిస్తాను. కాని ఆ తర్వాత యాకోబును
నేను చంపేస్తాను” అని తనలో తాను అనుకొన్నాడు.
42ఏశావు యాకోబును చంపాలని చేస్తున్న ఆలోచ
నను గూర్చి రిబ్కా విన్నది. యాకోబును పిలిపించి,
అతనితో ఆమె ఇలా చెప్పింది. “ఇది విను, నీ అన్న
ఏశావు నిన్ను చంపాలని ప్రయత్నం చేస్తున్నాడు.
43అందుచేత, కుమారుడా, నేను చెప్పినట్టు చేయి.
హారానులో నా సోదరుడు లాబాను ఉన్నాడు. అతని
దగ్గరకు వెళ్లి దాగుకో. 44కొన్నాళ్లపాటు అతని దగ్గరే
ఉండు. నీ అన్న కోపం చల్లారే వరకు అతని దగ్గరే
ఉండు. 45కొన్ని రోజులు కాగానే నీవు నీ అన్నకు
చేసినది అతడు మరచిపోతాడు. అప్పుడు నిన్ను వెను
కకు తీసుకొని రావటానికి నేను ఒక సేవకుని పంపిస్తాను.
నా ఇద్దరు కుమారులను ఒకేనాడు పోగొట్టుకోవటం
నాకు ఇష్టం లేదు.”

46అప్పుడు రిబ్కా ఇస్సాకుతో, "నీ కుమారుడైన
ఏశావు హిత్తీ స్త్రీలను పెళ్లి చేసుకొన్నాడు. వాళ్లు మన
ప్రజలు కారు గనుక వారితో నేను చాలా విసిగి
పోయాను. యాకోబు కూడా వాళ్లలో ఒక స్త్రీని పెళ్లి
చేసుకొంటే, నేను చావటం మంచిది" అని చెప్పింది.

## భార్యకోసం యాకోబు అన్వేషణ

28 ఇస్సాకు యాకోబును పిలిచి ఆశీర్వదించాడు.
తర్వాత ఇస్సాకు అతనికి ఒక ఆజ్ఞ ఇచ్చాడు.
ఇస్సాకు ఇలా చెప్పాడు: "కనాను స్త్రీని మాత్రం నీవు
వివాహం చేసుకోగూడదు. 2కనుక ఈ చోటు విడిచి,
పద్దనరాము వెళ్లు. నీ తల్లి తండ్రియైన బెతూయేలు
ఇంటికి వెళ్లు. నీ తల్లి సోదరుడు లాబాను అక్కడే
నివసిస్తున్నాడు. అతని కుమార్తెల్లో ఒకదాన్ని పెళ్లాడు.
3సర్వశక్తిమంతుడైన దేవుడు నిన్ను ఆశీర్వదించి, అధిక
సంతానాన్ని నీకు ప్రసాదించాలని ప్రార్థిస్తున్నా. ఒక
గొప్ప జనాంగానికి నీవు పితరుడవు కావాలని నా ప్రార్థన.
4దేవుడు అబ్రాహామును ఆశీర్వదించినట్టే నిన్ను, నీ
పిల్లలను ఆశీర్వదించాలని నా ప్రార్థన. నీవు నివసించే
దేశం నీ స్వంతం కావాలని నా ప్రార్థన. ఇది దేవుడు
అబ్రాహాముకు ఇచ్చిన దేశం."
5ఇస్సాకు యాకోబును పద్దనరాముకు పంపించాడు.
రిబ్కా సోదరుడైన లాబాను దగ్గరకు యాకోబు వెళ్లాడు.
లాబాను రిబ్కాలకు తండ్రి బెతూయేలు. యాకోబు,
ఏశావులకు తల్లి రిబ్కా.
6తన తండ్రియైన ఇస్సాకు యాకోబును ఆశీర్వ
దించాడని ఏశావుకు తెలిసింది. యాకోబు భార్యను
సంపాదించు కొనేందుకు ఇస్సాకు అతణ్ణి పద్దనరాముకు
పంపినట్టు ఏశావుకు తెలిసింది. యాకోబు కనాను
స్త్రీని వివాహము చేసుకోగూడదని ఇస్సాకు ఆజ్ఞాపించి
నట్టు ఏశావుకు తెలిసింది. 7యాకోబు తన తల్లి
దండ్రుల మాటకు విధేయుడై పద్దనరాము వెళ్లినట్టు
ఏశావుకు తెలిసింది.
8తన కుమారులు కనానీ స్త్రీలను వివాహం
చేసుకోవటం తండ్రికి ఇష్టం లేదని దీనిద్వారా ఏశావుకు
తెలిసింది. 9అప్పటికే ఏశావుకు ఇద్దరు భార్యలు
ఉన్నారు. అయితే అతడు ఇష్మాయేలు దగ్గరకు వెళ్లి,
మరో స్త్రీని పెళ్లి చేసికొన్నాడు. ఇష్మాయేలు కుమార్తె
మాహలతును అతను పెళ్లి చేసుకొన్నాడు. ఇష్మా
యేలు అబ్రాహాము కుమారుడు. మాహలతు నెబా
యోతు సోదరి.

## దేవుని గృహం – బేతేలు

10యాకోబు బెయేర్షెబా విడిచి హారాను వెళ్లాడు.
11యాకోబు ప్రయాణం చేస్తూ ఉండగా సూర్యాస్త
మయం అయింది. అందుచేత ఆ రాత్రి ఉండేందుకు
యాకోబు ఒక చోటుకి వెళ్లాడు. అక్కడ ఒక బండ
కనబడింది. నిద్రపోయేందుకు యాకోబు దానిమీద
తలపెట్టి పండుకొన్నాడు. 12యాకోబుకు ఒక కల
వచ్చింది. నేలమీద ఒక నిచ్చెన ఉండి, అది ఆకాశాన్ని
అంటుకొన్నట్టు అతనికి కల వచ్చింది. దేవుని దూతలు
ఆ నిచ్చెన మీద ఎక్కుచు, దిగుచు ఉన్నట్టు యాకోబు
చూశాడు.
13అప్పుడు ఆ నిచ్చెన దగ్గర యెహోవా నిలిచినట్టు
యాకోబు చూశాడు. యెహోవా చెప్పాడు: "నీ తాత
అబ్రాహాము దేవుణ్ణి, యెహోవాను నేను. నేను ఇస్సాకు
దేవుణ్ణి ఇప్పుడు నీవు నిద్రపోతున్న ఈ దేశాన్ని నీకు
నేనిస్తాను. నీకు, నీ పిల్లలకు ఈ స్థలం నేనిస్తాను.
14నేలమీద ధూళి కణముల్లాగ నీకు గూడా ఎంతోమంది
వారసులు ఉంటారు. తూర్పు పడమరలకు, ఉత్తర
దక్షిణాలకు వారు విస్తరిస్తారు. నీ మూలంగా, నీ సంతానం
మూలంగా భూమిమీదనున్న కుటుంబాలన్నీ
ఆశీర్వదించబడతాయి.
15"నేను నీకు తోడుగా ఉన్నాను, నీవు వెళ్లే ప్రతి
చోట నేను నిన్ను కాపాడుతాను. మళ్లీ నిన్ను ఈ
దేశానికి నేను తీసుకొని వస్తాను. నేను వాగ్దానం చేసినది
నెరవేర్చేవరకు నిన్ను నేను విడువను."
16అప్పుడు యాకోబు నిద్రనుండి మేల్కొని
"యెహోవా ఈ స్థలములో ఉన్నాడని నాకు తెలుసు.
అయితే ఆయన ఇక్కడ ఉన్నట్టు, నేను నిద్ర పోయేంత
వరకు నాకు తెలియదు" అన్నాడు.
17యాకోబు భయపడ్డాడు. "ఇది మహా గొప్ప
స్థానం. ఇది దేవుని మందిరం. ఇది పరలోక ద్వారం"
అన్నాడు అతను.
18ఉదయం పెందలాడే లేచాడు యాకోబు. అతడు
పండుకొన్న రాయి తీసుకొని, దానిని అంచుమీద నిల
బెట్టాడు యాకోబు. తర్వాత ఆ రాయిమీద అతడు
నూనె పోసాడు. ఈ విధంగా అతడు ఆ రాయిని
దేవుని జ్ఞాపకార్థ చిహ్నంగా చేసాడు. 19ఆ స్థలం పేరు
లూజు. అయితే బేతేలు* అని దానికి యాకోబు
పేరు పెట్టాడు.
20అప్పుడు యాకోబు ఒక ప్రమాణం చేసాడు.
"దేవుడు నాకు తోడుగా ఉంటే, నేను ఎక్కడికి వెళ్లినా
దేవుడు నన్ను కాపాడుచు ఉంటే, తినుటకు భోజనం,
ధరించుటకు బట్టలు దేవుడు నాకు ఇస్తూ ఉంటే,
21నా తండ్రి ఇంటికి నేను సమాధానంగా తిరిగి రాగ
లిగితే, ఇవన్నీ దేవుడు చేస్తే , అప్పుడు యెహోవాయే
నా దేవుడు. 22నేను ఈ రాయిని యిక్కడ నిల
బెడతాను. దేవుని కోసం ఇది పరిశుద్ధ స్థలం అని అది
తెలియజేస్తుంది. దేవుడు నాకు ఇచ్చే వాటన్నింటిలో
పదవ భాగం నేను ఆయనకు ఇస్తాను" అని అతను
చెప్పాడు.

---

**బేతేలు** "దేవుని గృహం."

### యాకోబు రాహేలును కలసికొనుట

29 ఇంకా యాకోబు తన ప్రయాణం కొనసా
గించాడు. తూర్పు దేశానికి అతడు వెళ్లాడు.
2యాకోబు అలా చూడగానే, పొలాల్లో ఒక బావి కన
బడింది. గొర్రెల మందలు మూడు ఆ బావి దగ్గర
పండుకొని ఉన్నాయి. ఆ గొర్రెలు నీళ్లు తాగే స్థలం
ఆ బావి. ఆ బావిమీద ఒక పెద్ద బండ పెట్టి ఉంది.
3గొర్రెలన్నీ అక్కడికి రాగానే, ఆ గొర్రెల కాపరులు
ఆ బావిమీద బండను దొర్లిస్తారు. అప్పుడు గొర్రెలన్నీ
ఆ నీళ్లు తాగుతాయి. ఆ గొర్రెలు పూర్తిగా తాగిన
తర్వాత గొర్రెల కాపరులు ఆ బండను మళ్లీ దాని
స్థానంలో పెట్టేస్తారు.

4“సోదరులారా, ఎక్కడి వాళ్లు మీరు?” అని ఆ
గొర్రెల కాపరులను యాకోబు అడిగాడు.

“మేము హారాను వాళ్లం” అని వారు జవాబిచ్చారు.

5అందుకు యాకోబు, “నాహోరు కుమారుడు
లాబాను తెలుసా మీకు?” అని అడిగాడు.

“మాకు తెలుసు” అని గొర్రెల కాపరులు జవాబు
ఇచ్చారు.

6అప్పుడు యాకోబు “ఆయన ఎలా ఉన్నాడు?”
అని అడిగాడు.

“ఆయన బాగానే ఉన్నాడు, అంతా క్షేమమే. అదిగో
చూడు, ఆ వస్తున్నది ఆయన కుమార్తె. ఆమె పేరు
రాహేలు, ఆయన గొర్రెలు తోలుకొస్తున్నది” అన్నారు
వాళ్లు.

7“చూడండి, ఇప్పుడు ఇంకా పగలు ఉంది. సూర్యాస్త
మయానికి చాలా సమయం ఉంది. రాత్రి కోసం
గొర్రెల్ని మందగా చేర్చటానికి ఇంకా వేళ కాలేదు.
కనుక వాటికి నీళ్లు పెట్టి, మళ్లీ పొలాల్లోనికి వెళ్లనీ
య్యండి” అన్నాడు యాకోబు.

8కానీ గొర్రెల కాపరులు, “మందలన్నీ ఇక్కడ గుమి
గూడేవరకు మేము అలా చేయటానికి వీల్లేదు. అప్పుడు
మేము బావిమీద బండ దొర్లిస్తాము, గొర్రెలు నీళ్లు
తాగుతాయి” అన్నారు.

9కాపరులతో యాకోబు మాట్లాడుతుండగానే,
రాహేలు తన తండ్రి గొర్రెలతో అక్కడికి వచ్చింది.
(ఆ గొర్రెల బాధ్యత రాహేలుది.) 10లాబాను కుమార్తె
రాహేలు. యాకోబు తల్లి రిబ్కాకు సోదరుడు లాబాను.
రాహేలును చూడగానే యాకోబు వెళ్లి, బండను
దొర్లించి గొర్రెలకు నీళ్లు యిచ్చాడు. 11అప్పుడు
యాకోబు రాహేలును ముద్దుపెట్టుకొని ఏడ్చాడు.
12తను ఆమె తండ్రి బంధువు అని యాకోబు రాహే
లుతో చెప్పాడు. తను రిబ్కా కుమారుడనని రాహే
లుతో చెప్పాడు. కనుక రాహేలు యింటికి పరుగెత్తి,
తన తండ్రితో చెప్పింది.

13తన సోదరి కుమారుడు యాకోబును గూర్చిన
వార్త లాబాను విన్నాడు. అందుచేత అతణ్ణి కలుసు
కొనేందుకు లాబాను పరుగెత్తాడు. లాబాను అతడ్ని
కౌగిలించుకొని, ముద్దు పెట్టుకొని, తన యింటికి
తీసుకొని వచ్చాడు. జరిగినదంతా యాకోబు లాబా
నుతో చెప్పాడు. 14అప్పుడు లాబాను, “ఇదంతా భలే
బాగుందే, అయితే నీవు నా స్వంత కుటుంబపు వాడివే
సుమా” అన్నాడు. అందువల్ల యాకోబు లాబానుతో
ఒక నెల అక్కడే నివసించాడు.

### యాకోబు మోసపోయాడు

15ఒకనాడు లాబాను, “జీతం లేకుండా నా దగ్గర
నీవు ఇలా పనిచేస్తూ ఉండటం సరిగా లేదు. నీవు
బంధువుడివి. అంతేగాని బానిసవు కావు. నేను నీకు
ఏమి చెల్లించాలి?” అని యాకోబును అడిగాడు.

16లాబానుకు యిద్దరు కుమార్తెలుండిరి. పెద్దామె
లేయా, చిన్నామె రాహేలు.

17రాహేలు అందగత్తె. లేయా కళ్ల సమస్యగలది.*
18యాకోబు రాహేలును ప్రేమించాడు. యాకోబు
“నన్ను, నీ చిన్న కుమార్తె రాహేలును పెళ్లాడనిస్తే,
నేను నీకు ఏడు సంవత్సరాల పాటు పనిచేస్తాను” అని
లాబానుతో చెప్పాడు. 19“మరొకర్ని చేసుకోవడం
కంటే ఆమె నిన్ను పెళ్లి చేసుకోవడం మంచిది. కనుక
నా దగ్గరే ఉండు” అన్నాడు లాబాను.

20కనుక యాకోబు అక్కడే ఉండి, లాబాను కోసం
ఏడు సంవత్సరాలు పని చేసాడు. అయితే అతడు
రాహేలును ప్రేమించాడు గనుక అది చాల కొద్ది
కాలంలాగే కనబడింది అతనికి.

21ఏడు సంవత్సరాలు అయ్యాక, “రాహేలును నాకు
యివ్వండి, పెళ్లి చేసుకొంటాను. నీ దగ్గర నేను చేయా
ల్సిన కాలం తీరిపోయింది” అని యాకోబు లాబానుతో
చెప్పాడు.

22కనుక ఆ ప్రదేశంలోని ప్రజలందరికి లాబాను
విందు ఇచ్చాడు. 23ఆ రాత్రి లాబాను తన కుమార్తె
అయిన లేయాను యాకోబు దగ్గరకు తీసుకు
వచ్చాడు. యాకోబు లేయాలు లైంగికంగా కలుసు
కొన్నారు. 24తన దాసి జిల్పాను తన కుమార్తెకు
దాసీగా లాబాను ఇచ్చాడు. 25తాను సంభోగించినది
లేయా అని తెల్లవారినప్పుడు యాకోబు తెలుసు
కొన్నాడు. లాబానుతో యాకోబు, “నీవు నన్ను
మోసం చేసావు. నేను రాహేలును పెళ్లి చేసుకోవాలని
నీ దగ్గర కష్టపడి పని చేసాను. ఎందుకు నన్ను నీవు
మోసం చేసావు?” అన్నాడు.

26లాబాను చెప్పాడు: “పెద్ద కూతురుకి పెళ్లికాక
ముందు చిన్న కూతురికి పెళ్లి చేయటానికి మా దేశంలో
ఒప్పుకోరు. 27అయితే పెళ్లి ఆచారంగా వారం రోజులు

---

**లేయా కళ్ల సమస్యగలది** లేయా చాలా సౌందర్యవతి
కాదని పరోక్షంగా చెప్పవచ్చు.

ముగించు, రాహేలునుకూడ పెళ్లి చేసుకొనేందుకు
ఇస్తాను. కానీ నీవు మాత్రం మరో ఏడు సంవత్సరాలు
నా దగ్గర పని చేయాలి."
28కనుక యాకోబు అలాగే వారం ముగించాడు.
అప్పుడు లాబాను తన కుమార్తె రాహేలును అతనికి
భార్యగా ఇచ్చాడు. 29తన దాసీ బిల్హాను తన కుమార్తె
రాహేలుకు దాసీగా ఇచ్చాడు. 30కనుక యాకోబు రాహే
లుతో కూడా సంభోగించాడు. లేయాకంటే రాహేలును
యాకోబు ఎక్కువగా ప్రేమించాడు. లాబాను దగ్గర
మరో ఏడు సంవత్సరాలు యాకోబు పని చేసాడు.

### యాకోబు కుటుంబం పెరిగింది

31లేయాకంటె రాహేలును యాకోబు ఎక్కువగా
ప్రేమించడం యెహోవా చూశాడు. అందుచేత
లేయాకు పిల్లలు పుట్టేలాగు చేసాడు యెహోవా.
రాహేలుకు పిల్లలు లేరు.
32లేయాకు ఒక కొడుకు పుట్టాడు. ఆమె అతనికి
రూబేను*అని పేరు పెట్టింది. "నా కష్టాలను
యెహోవా చూశాడు. నా భర్త నన్ను ప్రేమించటం
లేదు. ఒకవేళ నా భర్త ఇప్పుడైనా నన్ను ప్రేమిస్తా
డేమో" అని లేయా అతనికి ఈ పేరు పెట్టింది.
33లేయా మళ్లీ గర్భవతి అయింది, మరో కొడుకు
పుట్టాడు. ఈ కుమారునికి షిమ్యోను* అని ఆమె
పేరు పెట్టింది. "నేను ప్రేమించబడటం లేదని తెలిసి
యెహోవా నాకు ఈ కుమారుణ్ణి ఇచ్చాడు" అని
చెప్పింది లేయా.
34లేయా మళ్లీ గర్భవతి అయింది, మరో కొడుకు
పుట్టాడు. ఆ కుమారునికి ఆమె లేవి* అని పేరు
పెట్టింది. "ఇప్పుడు నా భర్త నన్ను తప్పకుండా ప్రేమి
స్తాడు. అతనికి ముగ్గురు కుమారుల్ని నేను ఇచ్చాను"
అనుకొంది లేయా.
35అప్పుడు లేయాకు మరో కొడుకు పుట్టాడు.
ఈ కుమారునికి యూదా* అని ఆమె పేరు పెట్టింది.
"నేను ఇప్పుడు యెహోవాను స్తుతిస్తాను" అని చెప్పి
అతనికి ఆ పేరు పెట్టింది లేయా. అంతటితో ఆమెకు
సంతాన ప్రాప్తి ఆగిపోయింది.

30 తాను యాకోబుకు పిల్లల్ని కనటం లేదని
రాహేలు తెలుసుకొంది. రాహేలు, తన సోదరి
లేయాను గూర్చి అసూయపడింది. అందుచేత "నాకూ
పిల్లల్ని యివ్వు, లేకపోతే నేను చస్తాను" అంది యాకో
బుతో రాహేలు.
2యాకోబుకు రాహేలు మీద కోపం వచ్చింది.
"నేనేమి దేవుణ్ణి కాను. నీకు పిల్లలు పుట్టకుండా చేసింది
దేవుడు" అని చెప్పాడు యాకోబు.
3అప్పుడు రాహేలు "నా దాసిని బిల్హాను నీవు
తీసుకో. ఆమెతో శయనించు. నా కోసం ఆమె బిడ్డను
కంటుంది. అప్పుడు ఆమె మూలంగా నేను తల్లిన
వుతాను" అని చెప్పింది.
4కనుక రాహేలు తన దాసియైన బిల్హాను యాకో
బుకు ఇచ్చింది. యాకోబు బిల్హాతో సంభోగించాడు.
5బిల్హా గర్భవతి అయింది, యాకోబుకు ఒక కుమారుని
కన్నది.
6"దేవుడు నా ప్రార్థన విన్నాడు. నాకు ఒక కుమా
రుని ఇవ్వాలని ఆయన నిర్ణయం చేసాడు" అని చెప్పి,
రాహేలు ఆ కుమారునికి 'దాను'* అని పేరు పెట్టింది.
7బిల్హా మరల గర్భవతియై, యాకోబుకు మరో
కుమారుని కన్నది. 8రాహేలు "నా అక్కతో పోటిలో
చాలా కష్టపడి పోరాడాను. నేనే గెలిచాను" అని చెప్పి
ఆ కుమారునికి 'నఫ్తాలి'* అని పేరు పెట్టింది.
9లేయా తనకు ఇక పిల్లలు పుట్టడం లేదని గ్రహిం
చింది. అంచేత తన దాసి జిల్ఫాను ఆమె యాకోబుకు
ఇచ్చింది. 10అప్పుడు జిల్ఫాకు ఒక కొడుకు పుట్టాడు.
11లేయా "నేను అదృష్టవంతు రాలిని" అనుకొని, ఆ
కుమారునికి 'గాదు'* అని పేరు పెట్టింది. 12జిల్ఫాకు
మరో కుమారుడు పుట్టాడు. 13"నాకు చాలా సంతో
షంగా ఉంది. ఇప్పుడు స్త్రీలు నన్ను సంతోషం అని
పిలుస్తారు" అని చెప్పి లేయా ఆ కుమారునికి
'ఆషేరు'* అని పేరు పెట్టింది.
14గోధుమ కోతకాలంలో రూబేను పొలాల్లోకి
వెళ్లాడు. అక్కడ ప్రత్యేకమైన పూలు* అతనికి కన
బడ్డాయి. ఆ పూలు తెచ్చి రూబేను తన తల్లి లేయాకు
ఇచ్చాడు. అయితే రాహేలు, "నీ కొడుకు తెచ్చిన
పూలు దయచేసి నాకూ కొన్ని ఇవ్వవూ" అని
లేయాను అడిగింది.
15లేయా, "ఇప్పటికే నీవు నా భర్తను తీసివేసు
కొన్నావు. ఇప్పుడేమో నా కొడుకు తెచ్చిన పూలను
తీసుకోవటానికి ప్రయత్నిస్తున్నావా" అంది. కాని
రాహేలు "నీ కొడుకు తెచ్చిన పూలు గనుక నీవు
నాకు ఇస్తే, ఈ వేళ రాత్రికి నీవు యాకోబుతో శయ
నించవచ్చు" అని జవాబిచ్చింది. 16ఆ రాత్రి యాకోబు

---

**రూబేను** "చూడండి, ఒక కొడుకు"అని దీని అర్థం.

**షిమ్యోను** "ఆయన వింటాడు" అని దీని అర్థం.

**లేవి** "సన్నిహితం అవుట" అని దీని అర్థం.

**యూదా** "ఆయన స్తుతించబడునుగాక"అని దీని అర్థం.

**దాను** 'నిర్ణయం లేక తీర్పు" అని దీని అర్థం.

**నఫ్తాలి** "నా పోరాటం" అని దీని అర్థం.

**గాదు** "అదృష్టం" అని దీని అర్థం.

**ఆషేరు** "సంతోషం" అని దీని అర్థం.

**పూలు** హెబ్రీ భాషలో ప్రేమ యొక్క సంతాన మూలిక వంటిది.

పొలంనుంచి వచ్చాడు. అతన్ని చూచి, అతన్ని
కలుసుకోవటానికి లేయా బయటకు వెళ్లింది. "ఈ
వేళ రాత్రి నీవు నాతో పండుకోవాలి. నా కొడుకు
తెచ్చిన పూలతో నిన్ను నేను కొన్నాను" అని ఆమె
చెప్పింది. కనుక ఆ రాత్రి యాకోబు లేయాతో
పండుకొన్నాడు.

17అప్పుడు దేవుడు లేయాను మళ్లీ గర్భవతిని
కానిచ్చాడు. ఆమె అయిదవ కుమారుని కన్నది.
18లేయా అంది, "నా భర్తకు నా దాసిని ఇచ్చాను
గనుక దేవుడు నాకు ప్రతిఫలాన్ని యిచ్చాడు." అందు
కని చెప్పి లేయా అతనికి ఇశ్శాఖారు* అని పేరు
పెట్టింది.

19లేయా మళ్లీ గర్భవతి అయింది, ఆరో కుమారుణ్ణి
కన్నది. 20లేయా అంది "ఒక చక్కని బహుమానం
దేవుడు నాకు ఇచ్చాడు. ఇప్పుడు తప్పక యాకోబు
నన్ను స్వీకరిస్తాడు. ఎందుకంటే ఆయనకు నేను ఆరు
గురు కుమారుల్ని యిచ్చాను." కనుక జెబూలూను*
అని చెప్పి ఆ కుమారునికి పేరు పెట్టింది.

21తర్వాత లేయాకు కూతురు పుట్టింది. ఆ కూతు
రుకు దీనా అని పేరు పెట్టింది.

22అప్పుడు రాహేలు ప్రార్థన దేవుడు విన్నాడు.
రాహేలుకు పిల్లలు పుట్టేట్టుగా దేవుడు చేసాడు.

23 -24రాహేలు గర్భవతి అయింది, ఒక కుమారుణ్ణి
కన్నది. "దేవుడు నా అవమానం తొలగించి, నాకూ
ఒక కుమారుణ్ణి ఇచ్చాడు" అని చెప్పింది. "దేవుడు
నాకు మరో కుమారుణ్ణి అనుగ్రహించు గాక" అంటూ
రాహేలు ఆ కుమారునికి యోసేపు అని పేరు పెట్టింది.

## యాకోబు లాబానును మోసం చేయటం

25యోసేపు పుట్టిన తర్వాత లాబానుతో యాకోబు
అన్నాడు: "ఇక నా మాతృదేశంలోని నా స్వంత
యింటికి నన్ను వెళ్లనివ్వు. 26నా భార్యల్ని, పిల్లలను
నాకు అప్పగించు. నీ దగ్గర 14 సంవత్సరాలు పనిచేసి
నేను వాళ్లను సంపాదించుకొన్నాను. నీ దగ్గర నేను
మంచి పని చేసానని నీకు తెలుసు." 27అతనితో లాబాను
అన్నాడు: "నన్ను ఒక్క మాట చెప్పనివ్వు. నీ మూలం
గానే యెహోవా నన్ను ఆశీర్వదించాడని నాకు
తెలుసు. 28నీకు ఏం చెల్లించమంటావో చెప్పు, అది
నీకు నేను చెల్లిస్తాను."

29యాకోబు జవాబిచ్చాడు: "నీ కోసం నేను కష్టపడి
పని చేసానని నీకు తెలుసు. నీ గొర్రెల మందలను
నేను కాస్తూ ఉండగా అవి విస్తరించాయి, క్షేమంగా
ఉన్నాయి. 30నేను వచ్చిన మొదట్లో నీకు ఉన్నది
స్వల్పం. ఇప్పుడు నీకు చాలా విస్తారంగా ఉంది. నీ
కోసం నేను ఏదైనా చేసినప్పుడల్లా యెహోవా నిన్ను
ఆశీర్వదించాడు. ఇప్పుడు ఇక నా కోసం నేను పని
చేసుకోవాలి, నా ఇంటిని నేను కట్టుకోవాలి."

31"అలాగైతే నేను నీకు ఏమి ఇవ్వాలి?" అని
లాబాను అడిగాడు. యాకోబు ఇలా జవాబిచ్చాడు:
"నీవు నాకు ఏమీ యివ్వక్కర్లేదు. నేను చేసిన పనికి
తగినట్టుగా నీవు నాకు ఇస్తే చాలు. ఈ ఒక్క పని
చేయి. నేను మళ్లీ వెళ్లి నీ గొర్రెలను కాస్తాను. 32అయితే
ఈ వేళ నీ గొర్రెల మందల్లో నన్ను నడువనియ్యి,
వాటిలో మచ్చలుగాని చారలుగాని ఉన్న వాటన్నిటిని
నన్ను తీసుకోనివ్వు. అలాగే నల్ల మేకపిల్లలు అన్నిటిని
నన్ను తీసుకోనివ్వు. చారలు మచ్చలు ఉన్న ప్రతి
ఆడ మేకను నన్ను తీసుకోనివ్వు. అదే నాకు జీతం.
33నా నిజాయితీ ఏమిటో భవిష్యత్తులో నీవు తేలిగ్గా
తెలుసుకోవచ్చు. నీవు వచ్చి నా మందల్ని చూడ
వచ్చు. మచ్చలేని మేకగాని, నలుపు లేని గొర్రెగాని
నా దగ్గర ఉంటే, దాన్ని నేను దొంగిలించిన్నట్టు నీకు
తెలుస్తుంది."

34"అది నాకు సమ్మతమే. నీవు అడిగినట్టు మనం
చేద్దాం" అన్నాడు లాబాను. 35అయితే మచ్చలు ఉన్న
మేకపోతులన్నింటిని ఆ రోజే లాబాను దాచిపెట్టేసాడు.
మచ్చలు ఉన్న ఆడ మేకలన్నింటిని గూడ లాబాను
దాచిపెట్టేసాడు. ఈ గొర్రెలను కనిపెట్టి ఉండమని
లాబాను తన కుమారులతో చెప్పాడు. 36కనుక ఆ
కుమారులు మచ్చలుగల గొర్రెలన్నింటిని మరో
చోటుకు తోలుకొని వెళ్లారు. మూడు రోజుల పాటు
వారు ప్రయాణం చేసారు. యాకోబు అక్కడ ఉండి,
మిగిలిన జంతువులన్నింటి విషయం జాగ్రత్త పుచ్చు
కొన్నాడు. అయితే అక్కడ ఉన్నవాటిలో మచ్చలు
ఉన్నవి గాని చారలు ఉన్నవి గాని ఏ జంతువు లేదు.

37కనుక బూరగ, బాదాం అను చెట్ల పచ్చటి
కొమ్మలు యాకోబు నరికాడు. వాటిలో కొన్ని
చువ్వల పైబెరడు యాకోబు తీసివేసినందువల్ల వాటి
మీద తెల్ల చారలు కనబడుతున్నాయి. 38నీళ్లు తాగే
స్థలాల్లో మందల ముందు యాకోబు ఆ చువ్వలను
ఉంచాడు. ఆ జంతువులు నీళ్లు తాగటానికి వచ్చి
నప్పుడు, అక్కడే అవి కలిసేవి. 39ఆ చువ్వల ముందర
మేకలు చూలు కట్టినప్పుడు, మచ్చలు, చారలు,
నలుపుగల పిల్లలు వాటికి పుట్టాయి.

40మచ్చలు, నలుపు ఉన్న జంతువులను మిగతా
జంతువులనుండి యాకోబు వేరుచేసాడు. యాకోబు
తన జంతువులను లాబాను జంతువులనుండి వేరుగా
ఉంచాడు. 41మందలోని బలమైన జంతువులు ఎదైన
ప్పుడల్లా యాకోబు ఆ చువ్వలను వాటి కళ్లముందు
ఉంచాడు. ఆ కొమ్మల దగ్గర ఆ జంతువులు చూలు
కట్టేవి. 42అయితే ఒక్కటి, బలహీనమైన జంతువులు
ఎదైనప్పుడు యాకోబు ఆ కొమ్మలను అక్కడ పెట్ట

---

**ఇశ్శాఖారు** "ప్రతిఫలం" లేక "జీతము" అని దీని అర్థం.

**జెబూలూను** "స్తుతి" లేక "గౌరవం" అని దీని అర్థం.

లేదు. కనుక బలహీనమైన జంతువులకు పుట్టిన పిల్ల
లన్నీ లాబానువే. బలమైన జంతువులకు పుట్టిన పిల్ల
లన్నీ యాకోబువి. 43ఈ విధంగా యాకోబు చాలా
ధనికుడయ్యాడు. పెద్ద మందలు, చాలా మంది
సేవకులు, ఒంటెలు, గాడిదలు అతనికి ఉన్నాయి.

## వెళ్లాల్సిన సమయం – యాకోబు పారిపోవటం

31 ఒక రోజున లాబాను కొడుకులు మాట్లాడు
కోవడం యాకోబు విన్నాడు. “మన తండ్రికి
ఉన్నదంతా యాకోబు తీసివేసుకొన్నాడు. యాకోబు
ధనికుడై పోయాడు, ఈ ఐశ్వర్యం అంతా మన తండ్రి
దగ్గర నుండి యాకోబు తీసుకున్నాడు.” అని వాళ్లు
చెప్పుకొన్నారు. 2అప్పుడు లాబాను ఇదివరలో
ఉన్నంత స్నేహంగా తనతో యిప్పుడు లేనట్టు
యాకోబు గమనించాడు. 3అప్పుడు యెహోవా “నీ
పూర్వీకుల నివాస దేశానికి నీవు తిరిగి వెళ్లిపో. నేను
నీకు తోడుగా ఉంటాను” అని యాకోబుతో చెప్పాడు.
4కనుక యాకోబు తన గొర్రెలు, మేకలు మందలను
ఉంచిన పొలాల్లో తనను కలసికోమని రాహేలు, లేయా
లకు చెప్పాడు. 5రాహేలు, లేయాలతో యాకోబు
ఇలా చెప్పాడు: “మీ తండ్రి నామీద కోపంగా ఉన్నాడు.
ఇది వరకు ఎప్పుడూ అతడు నాతో స్నేహంగా ఉండే
వాడు, కాని ఇప్పుడు లేదు. అయితే, నా తండ్రి
దేవుడు నాతో వున్నాడు. 6నాకు చేతనైనంత మట్టుకు
నేను మీ తండ్రి కోసం కష్టపడ్డానని మీ ఇద్దరికీ తెలుసు.
7అయితే మీ తండ్రి నన్ను మోసం చేసాడు. నా
జీతం పదిసార్లు మీ తండ్రి మార్చాడు. అయినా ఈ
కాలమంతటిలో, లాబాను మోసాలన్నిటి నుండి దేవుడు
నన్ను కాపాడాడు.”
8“ఒకసారి లాబాను అన్నాడు: ‘మచ్చలు ఉన్న మేక
లన్నీ నీవు ఉంచుకోవచ్చు. ఇది నీ జీతం.’ అతడు
ఇలా చెప్పిన తర్వాత జంతువులన్నీ మచ్చలు ఉన్న
పిల్లలనే కన్నాయి. కనుక అవి అన్నీ నావే. కానీ అప్పుడు
లాబాను, ‘మచ్చలు గల మేకలను నేను తీసుకొంటాను,
చారలున్న మేకలన్నీ నీవే. అది నీకు జీతం’ అన్నాడు.
అతడు యిలా చెప్పిన తర్వాత జంతువులన్నీ చారలు
గల పిల్లల్ని పెట్టాయి. 9కనుక జంతువులను దేవుడు
మీ తండ్రి దగ్గర్నుండి తీసివేసి వాటిని నాకు ఇచ్చాడు.
10“జంతువులు కలిసే సమయంలో నాకు ఒక కల
వచ్చింది. ఎదవుతోన్న మగ మేకలన్నీ మచ్చలు,
చారలు గలవేనని నేను చూశాను. 11కలలో ఆ దేవదూత
నాతో మాట్లాడాడు. ఆ దేవదూత “యాకోబూ!”
అన్నాడు. ‘చిత్తం’ అన్నాను నేను.”
12“ఆ దేవదూత అన్నాడు: “చూడు, మచ్చలు,
చారలు ఉన్న మేకలు మాత్రమే ఎదవుతున్నాయి.
ఇలా జరిగేటట్టు నేను చేస్తున్నాను. లాబాను నీ యెడల
చేస్తోన్న అపకారం అంతా నేను చూశాను. కొత్తగా
పుట్టిన మేక పిల్లలన్నీ నీకే చెందాలని నేను ఇలా చేస్తు
న్నాను. 13బేతేలులో నీ దగ్గరకు వచ్చిన దేవుణ్ణి నేనే.
ఆ స్థలంలో నీవు ఒక బలిపీఠం కట్టావు. ఆ బలిపీఠం
మీద ఒలీవ నూనె నీవు పోసావు. అక్కడ నాకు నీవు
ఒక వాగ్దానం చేసావు. నీవు తిరిగి నీ పుట్టిన స్థలానికి
వెళ్లేందుకు ఇప్పుడు సిద్ధపడు.”
14-15రాహేలు, లేయాలు యాకోబుతో అన్నారు:
“మా తండ్రి చనిపోయినప్పుడు అతను మాకు ఇచ్చేది
ఏమీ లేదు. అతను మమ్మల్ని పరాయి వాళ్లుగా
చూశాడు. అతను మమ్మల్ని నీకు అమ్మేసాడు,
మరియు అప్పుడు మాకు రావలసిన సొమ్ము అంతా
వాడేసుకొన్నాడు. 16మా తండ్రి దగ్గర్నుండి ఈ ఆస్తి
అంతా దేవుడు తీసివేసాడు, ఇప్పుడు అది మనది
మన పిల్లలది. కనుక నీవు ఏం చేయాలని దేవుడు
నీతో చెప్పాడో అలాగే నీవు చేయాలి!”
17అందుచేత యాకోబు తన ప్రయాణానికి సిద్ధ
పడ్డాడు. తన కుమారులను, భార్యలను ఒంటెల మీద
ఎక్కించాడు. 18అప్పుడు వాళ్లు, అతని తండ్రి నివ
సించిన కనాను దేశానికి తిరిగి ప్రయాణం మొదలు
బెట్టారు. యాకోబు సంపాదించిన పశువుల మందలన్నీ
వారికి ముందుగా నడిచాయి. అతడు పద్దనరాములో
నివసించినప్పుడు సంపాదించుకొన్న సమస్తం అతడు
తీసుకొని వెళ్లాడు.
19ఈ సమయంలో లాబాను తన గొర్రెల బొచ్చు
కత్తిరించటానికి వెళ్లాడు. అతడు వెళ్లిపోయాక, రాహేలు
అతని ఇంటిలోకి వెళ్లి, తన తండ్రికి చెందిన విగ్రహాల్ని
దొంగిలించింది.
20సిరియావాడైన లాబానును యాకోబు మోసం
చేసాడు. అతడు వెళ్లిపోతున్నట్టు లాబానుతో చెప్ప
లేదు. 21యాకోబు తన కుటుంబాన్ని, తనకి ఉన్న
సమస్తాన్ని తీసుకొని వెంటనే వెళ్లిపోయాడు. వాళ్లు
యూఫ్రటీసు నది దాటి గిలాదు కొండవైపు
ప్రయాణం అయ్యారు. 22యాకోబు పారిపోయినట్టు
మూడు రోజుల తర్వాత లాబానుకు తెలిసింది. 23కనుక
లాబాను తన మనుష్యుల్ని సమావేశపరచి, యాకో
బును తరమటం మొదలు పెట్టాడు. ఏడు రోజుల
తర్వాత గిలాదు పర్వతం దగ్గర లాబాను యాకోబును
చూశాడు. 24ఆ రాత్రి ఒక దర్శనంలో లాబానుకు
దేవుడు ప్రత్యక్షమయ్యి, “నీవు యాకోబుతో చెప్పే
ప్రతీ మాట గూర్చి జాగ్రత్త సుమా!” అన్నాడు దేవుడు.

## దొంగిలించిన దేవుళ్ల కోసం వెదకటం

25మర్నాడు ఉదయాన్నే యాకోబును లాబాను
పట్టుకొన్నాడు. కొండమీద యాకోబు గుడారం వేసి
కొన్నాడు. కనుక లాబాను, అతని మనుష్యులంతా
గిలాదు కొండమీద గుడారాలు వేసుకొన్నారు.
26యాకోబుతో లాబాను అన్నాడు: “నీవెందుకు నన్ను

మోసం చేసావు? యుద్ధంలో చెరపట్టిన స్త్రీలవలె నా
కూతుళ్లను ఎందుకు తీసుకు పోతున్నావు? 27నాకు
చెప్పకుండా నీవెందుకు పారిపోతున్నావు? నీవు నాతో
చెప్పి ఉంటే నీకు నేను విందు చేసేవాణ్ణి. వాయి
ద్యాలతో సంగీతం, నాట్యం ఉండేవి. 28కనీసం నా
మనవళ్లను, మనవరాళ్లను ముద్దు పెట్టుకోనివ్వలేదు,
నా కూతుళ్లకు వీడ్కోలు చెప్పనివ్వలేదు. నీవు ఇలా
చేయటం చాలా బుద్ధి తక్కువ పని. 29నిజంగా నిన్ను
బాధించగల శక్తి నాకు ఉంది. అయితే గత రాత్రి నీ
తండ్రి దేవుడు నాకు దర్శనం యిచ్చాడు. ఏ విధంగా
కూడ నిన్ను బాధ పెట్టవద్దని ఆయన నన్ను హెచ్చ
రించాడు. 30నీవు తిరిగి నీ ఇంటికి వెళ్లిపోవాలన్న ఆశ
నీకు ఉన్నట్టు నాకు తెలుసు. అందుకే నీవు బయల్దే
రావు. కాని నా యింటి దేవతలను ఎందుకు దొంగి
లించావు?”

31యాకోబు ఇలా జవాబిచ్చాడు: “భయం చేత
నీకు చెప్పకుండా బయల్దేరాను. నీ కుమార్తెలను నా
దగ్గర్నుండి నీవు తీసుకొంటావేమో అనుకొన్నాను.
32అంతేగాని నీ విగ్రహాలను మాత్రం నేను దొంగి
లించలేదు. ఇక్కడ నాతో ఉన్నవాళ్లలో ఎవరి దగ్గర
యినా నీ విగ్రహాలు దొరికితే, అలాంటి వ్యక్తి చంపివేయ
బడుగాక. నీ మనుష్యులే నాకు సాక్షులు. నీకు చెందినది
ఏదైనా ఉందేమో నీవు వెదకవచ్చు. ఏదైనా సరే నీదైతే
దాన్ని తీసుకో” లాబాను దేవుళ్లను రాహేలు దొంగిలిం
చినట్లు యాకోబుకు తెలియదు.

33కనుక లాబాను వెళ్లి యాకోబు గుడారాల్లో వెది
కాడు. యాకోబు గుడారంలోను, తర్వాత లేయా
గుడారంలోను అతడు వెదికాడు. ఆ తర్వాత బానిస
స్త్రీలు ఇద్దరూ ఉంటున్న గుడారంలో అతడు వెదికాడు.
కాని అతని నివాసంలో దేవుళ్లు కనబడలేదు. అప్పుడు
లాబాను రాహేలు గుడారంలోకి వెళ్లాడు. 34రాహేలు
తన ఒంటె సామాగ్రిలో ఆ దేవుళ్లను దాచిపెట్టి, వాటి
మీద కూర్చొంది. లాబాను గుడారం అంతా వెదికాడు,
కాని ఆ విగ్రహాలు అతనికి దొరకలేదు.

35“నాయనా, నామీద కోపగించకు. నీ యెదుట
నేను నిలబడలేక పోతున్నాను. నేను రుతు క్రమంలో
ఉన్నాను” అని రాహేలు తన తండ్రితో చెప్పింది.
కనుక లాబాను ఆ బస అంతటా వెదికాడు, కాని తన
ఇంటి దేవుళ్లు అతనికి కనబడలేదు.

36అప్పుడు యాకోబుకు చాలా కోపం వచ్చింది.
యాకోబు అన్నాడు: “నేనేం తప్పు చేసాను? ఏ
ఆజ్ఞను నేను ఉల్లంఘించాను? నన్ను వెంటాడే హక్కు
నీకెక్కడిది? 37నా ఆస్తి అంతా నీవు వెదికావు. నీకు
చెందినది ఏమీ నీకు దొరకలేదు. నీకేమైనా దొరికి
ఉంటే దాన్ని నాకు చూపించు. మన మనుష్యులకు
కనబడేటట్టు దాన్ని ఇక్కడ పెట్టు. మనలో ఎవరిది
సరిగా ఉందో మనవాళ్లే నిర్ణయిస్తారు. 38ఇరవై సంవత్స
రాలు నీ కోసం నేను పని చేసాను. ఆ కాలమంతటిలో
గొర్రెపిల్లగాని, మేకపిల్లగాని ఒక్కటి గూడా పుట్టుకలో
చావలేదు. నీ మందలోని పొట్టేళ్లలో ఒక్కటి గూడా
నేను తినలేదు. 39ఎప్పుడైనా సరే అడవి మృగాలు
గొర్రెల్ని చంపితే, ఆ విలువ నేనే చెల్లించాను. చచ్చిన
జంతువును ఎప్పుడూ నీకు చూపెట్టి, ఇది నా తప్పు
కాదు అని నేను చెప్పలేదు. అయినా సరే రాత్రింబవళ్లు
నీ మందల్ని కాపలా కాచాను. 40పగలు ఎండకు నా
బలం క్షీణించింది. రాత్రి చలి మూలంగా నా కన్నులకు
నిద్ర దూరమయింది. 4120 సంవత్సరాలు ఒక బానిసలా
నేను నీకు పని చేసాను. నీ కుమార్తెలను సంపాదించు
కోవటానికి మొదట 14 సంవత్సరాలు నేను నీకు పని
చేసాను. తర్వాత ఆరు సంవత్సరాలు నీ జంతువుల్ని
సంపాదించటంకోసం పని చేసాను. ఆ కాలంలో నా
జీతాన్ని నీవు పదిసార్లు మార్చావు. 42అయితే నా
పూర్వీకుల దేవుడు, అబ్రాహాము దేవుడు, ఇస్సాకు
భయపడిన దేవుడు నాకు తోడుగా ఉన్నాడు. దేవుడే
గనుక నాకు తోడుగా లేకపోతే, నీవు నన్ను వట్టి
చేతులతో పంపి ఉండేవాడివి. కాని నా కష్టాలను దేవుడు
చూశాడు. నేను చేసిన పనిని దేవుడు చూశాడు. నాదే
సరి అని గతరాత్రి దేవుడు రుజువు చేసాడు.”

## యాకోబు, లాబాను సంధి

43యాకోబుతో లాబాను చెప్పాడు: “ఈ అమ్మా
యిలు నా కుమార్తెలు. వారి పిల్లలు నాకు చెందినవాళ్లు.
ఈ జంతువులన్నీ నావే. ఇక్కడ నీకు కనబడుతోన్న
సమస్తం నాదే. అయినప్పటికీ నా కుమార్తెలను, వారి
పిల్లలను నా దగ్గర ఉంచు కొనేందుకు నేను చేయ
గలిగింది ఏమీ లేదు. 44కనుక నీతో ఒడంబడిక చేసు
కొనేందుకు నేను సిద్ధంగా ఉన్నాను. మనకు ఒడంబడిక
ఒకటి కుదిరిందని సూచించేందుకు మనం ఇక్కడ
ఒక రాళ్ల కుప్ప వేద్దాం.”

45కనుక యాకోబు ఒక పెద్ద బండను తెచ్చాడు,
అతడు ఒక ఒడంబడిక చేసుకొన్నట్టు సూచనగా దాన్ని
నిలువబెట్టాడు. 46మరికొన్ని రాళ్లు తెచ్చి కుప్పగా
వేయుమని అతడు తన సేవకులతో చెప్పాడు.
అప్పుడు ఆ రాళ్ల కుప్ప ప్రక్కన వాళ్లు భోజనం
చేసారు. 47ఆ స్థలానికి యగర్ శాహదూత* అని లాబాను
పేరు పెట్టాడు. కానీ యాకోబు ఆ స్థలానికి గలేదు*
అని పేరు పెట్టాడు.

48“మనం ఇద్దరం మన ఒడంబడికను జ్ఞాపకం చేసు
కొనేందుకు ఈ రాళ్ల కుప్ప సహాయపడుతుంది”
అన్నాడు లాబాను యాకోబుతో. అందుకే ఆ స్థలానికి

---

**యగర్ శాహదూత** ఒప్పందపు రాళ్ల కుప్ప.

**గలేదు** ఇది గిలాదుకు మరో పేరు. దీని అర్థం ఒప్పందపు రాళ్ల కుప్ప.

గలేదు అని యాకోబు పేరు పెట్టాడు. 49అప్పుడు
లాబాను, “మనం ఒకరినుండి ఒకరం విడిపోయే
టప్పుడు యెహోవా మనల్ని కాపాడును గాక!”
అన్నాడు. కనుక ఆ స్థలానికి మిస్పా అని కూడ పేరు.
50అప్పుడు లాబాను అన్నాడు, “నా కుమార్తెలను
నీవు బాధిస్తే, దేవుడు నిన్ను శిక్షిస్తాడని జ్ఞాపకం
ఉంచుకో. నీవు ఇతర స్త్రీలను పెళ్లి చేసుకొంటే దేవుడు
నిన్ను చూస్తూనే ఉంటాడు. 51ఇదిగో, ఇవి మన యిద్దరి
మధ్య నేను ఉంచిన రాళ్లు. మనమిద్దరం ఒక ఒడంబడిక
చేసుకొన్నామని సూచించేందుకు, జ్ఞాపకం ఉంచుకొ
నేందుకు ఈ రాళ్ల కుప్ప. ఇది ప్రత్యేక బండ. 52మనం
మన ఒడంబడికను జ్ఞాపకం ఉంచుకొనేందుకు ఈ
రాళ్లకుప్ప ఈ ప్రత్యేక బండ మనకు తోడ్పడుతాయి.
నేనెన్నడూ ఈ రాళ్లు దాటి నీ మీదకు రాను. అలానే
నీవు కూడా ఎన్నడూ ఈ రాళ్లు దాటి నామీద పోరాడ
టానికి రాకూడదు. 53ఈ ఒప్పందాన్ని గనుక మనం
మీరితే, అబ్రాహాము దేవుడు, నాహోరు దేవుడు, వారి
పూర్వీకుల దేవుడు మనలను నేరస్థులుగా తీర్పు
చెప్పును గాక.”
యాకోబు తండ్రియైన ఇస్సాకు, దేవుణ్ణి “భయం
కరుడు” అని పిల్చాడు. కనుక యాకోబు ఆ పేరు
మీదనే వాగ్దానం చేసాడు. 54అప్పుడు యాకోబు ఒక
పశువును వధించి, ఆ కొండమీద దానిని బలిగా అర్పిం
చాడు. భోజనంలో పాలు పుచ్చుకోమని అతడు తన
వాళ్లను పిల్చాడు. భోజనం చేసి, ఆ రాత్రికి వారు ఆ
కొండమీదనే గడిపారు. 55మర్నాడు ఉదయాన్నే
లాబాను తన కుమార్తెలకు, వారి పిల్లలకు వీడ్కోలు
ముద్దు పెట్టాడు. అతడు వాళ్లను ఆశీర్వదించి తిరిగి
తన యింటికి వెళ్లిపోయాడు.

## ఏశావును మళ్లీ కలుసుకొనుట

32 యాకోబు కూడ అక్కడ నుండి వెళ్లి
పోయాడు. అతడు ప్రయాణం చేస్తుండగా
దేవుని దూతలను చూశాడు. 2యాకోబు వారిని చూసి
నప్పుడు, “ఇది దేవుని శిబిరం” అన్నాడు. కనుక ఆ
స్థలానికి “మహనయీము”* అని యాకోబు పేరు
పెట్టాడు.
3యాకోబు అన్న ఏశావు శేయెరు అనే ప్రాంతంలో
నివసిస్తున్నాడు. ఇది ఏదోం పర్వత ప్రాంతం.
యాకోబు ఏశావుకు వార్తాహరులను పంపాడు. 4“ఏశా
వుకు ఇలా చెప్పండి అని వార్తాహరులతో చెప్పాడు
యాకోబు: “మీ సేవకుడైన యాకోబు, నా యజ
మాని ఏశావుకు చెప్పేదేమిటంటే, ఇన్ని సంవత్సరాలు
నేను లాబానుతో నివసించాను. 5పశువులు, గాడిదలు,
మందలు, అనేక మంది సేవకులు, దాసీలు నాకు
ఉన్నారు. అవన్నీ నేను నీకు పంపిస్తున్నాను. నీవు
మమ్మల్ని చేర్చుకోవాలని మనవి.”
6వార్తాహరులు తిరిగి వచ్చి, “నీ అన్న ఏశావును
కలుసుకొనేందుకు మేము వెళ్లాం. నిన్ను కలుసు
కొనేందుకు అతడు వస్తున్నాడు. అతనితో 400 మంది
మనుష్యులు ఉన్నారు” అని యాకోబుతో చెప్పారు.
7ఆ వార్త యాకోబుకు భయం కలిగించింది. తనతో
ఉన్న మనుష్యులందరినీ అతడు రెండు గుంపులుగా
విభజించాడు. మందలను, పశువులను, ఒంటెలను
రెండు గుంపులుగా విభజించాడు. 8“ఏశావు వచ్చి ఒక
గుంపును హతమార్చినా, మరో గుంపు పారిపోయి
తప్పించుకోవచ్చు” అనుకున్నాడు యాకోబు.
9యాకోబు ఇలా అన్నాడు “నా తండ్రి అబ్రాహాము
దేవా! నా తండ్రి ఇస్సాకు దేవా! ఓ యెహోవా,
నన్ను మళ్లీ నా కుటుంబం దగ్గరకు, నా స్వదేశానికి
నీవే వచ్చేయమన్నావు. నీవు నాకు మేలు చేస్తాన
న్నావు. 10నా యెడల నీవు ఎంతో దయ చూపించావు.
నాకు ఎన్నో మేళ్లు చేసావు. మొదటిసారి నేను
యోర్దాను దాటినప్పుడు, నా చేతి కర్ర తప్ప యింకేమీ
నా స్వంతం లేదు. ఇప్పుడు రెండు గుంపులకు సరిప
డినంత నాకు ఉన్నది. 11దయచేసి నా అన్న ఏశావు
నుంచి నన్ను కాపాడు. నాకు అతడంటే భయంగా
ఉంది. అతడు వచ్చి మమ్మల్ని అందరిని, చివరికి
తల్లులను పిల్లలను కూడ చంపేస్తాడని భయంగా ఉంది.
12“నేను నీతో మంచిగా ఉంటాను. నేను నీ కుటుం
బాన్ని వర్ధిల్లచేసి, నీ పిల్లల్ని ఇసుక రేణువులంత విస్తా
రంగా చేస్తాను. లెక్కింప జాలనంత విస్తారంగా వారుం
టారు” అని నీవు నాతో అన్నావు గదా ప్రభూ.
13యాకోబు ఆ రాత్రి అక్కడే ఉండిపోయాడు.
ఏశావుకు కానుకలుగా ఇచ్చేందుకు కొన్ని వస్తువులను
యాకోబు సిద్ధం చేసాడు. 14యాకోబు200 ఆడ మేక
లను, 20 మేకపోతులను, 200 ఆడ గొర్రెలను, 20పొట్టే
ళ్లను తీసుకొన్నాడు. 15 30ఒంటెలను, వాటి పిల్లలను,
40 ఆవులను 10 ఎద్దులను, 20 ఆడ గాడిదలను, 10
మగ గాడిదలు యాకోబు తీసుకొన్నాడు. 16“ఒక్కొక్క
రకం జంతువుల మందను యాకోబు తన సేవకులకు
అప్పగించాడు. అప్పుడు యాకోబు తన సేవకులతో
ఒక్కో రకం జంతువుల మందను వేరు చేయండి
నాకు ముందుగా నడుస్తూ, ఒక్కో మందకు మధ్య
ఎడం ఉంచండి” అన్నాడు. 17యాకోబు వారికి ఇవ్వ
వలసిన ఆజ్ఞలన్నీ ఇచ్చాడు. మొదటి మంద వెంబడి
ఉన్న సేవకునితో యాకోబు “నా అన్న ఏశావు నీ
దగ్గరకు వచ్చి, ‘ఇవి ఎవరి జంతువులు? నీవు ఎక్కడికి
వెళ్తున్నావు? నీవు ఎవరి సేవకుడివి?’ అని అడిగితే,
18‘ఇవి నీ సేవకుడైన యాకోబు మందలు. నా యజ
మాని ఏశావుకు కానుకగా యాకోబు వీటిని పంపిం

**మహనయీము** అనగా “రెండు సేనలు” లేక “శిబిరాలు.”

చాడు. యాకోబు కూడా మా వెనుక వస్తున్నాడు'
అని నీవు చెప్పాలి" అన్నాడు.
19అందరూ అలాగే చేయాలి అని రెండవ సేవకునికి,
మూడవ సేవకునికి, మిగిలిన సేవకులందరికి
యాకోబు ఆజ్ఞాపించాడు. "ఏశావును మీరు కలుసు
కొన్నప్పుడు, ఏశావుకు మీరు ఇలానే చేయాలి." 20'ఇది
నీ కోసం కానుక, నీ సేవకుడైన యాకోబు వెనుక
ఉన్నాడు' అని మీరు చెప్పాలి అన్నాడు యాకోబు.
"ఈ కానుకలు ఇచ్చి వీళ్లను ముందు పంపిస్తే ఒకవేళ
ఏశావు నన్ను క్షమించి చేర్చుకొంటాడమో" అను
కొన్నాడు యాకోబు. 21కనుక యాకోబు ఏశావుకు
కానుకలు పంపించాడు. అయితే యాకోబు మాత్రం
ఆ రాత్రి శిబిరంలోనే వుండిపోయాడు.
22ఆ రాత్రి చాలా గడిచిన తర్వాత యాకోబు లేచి
బయల్దేరాడు. అతని భార్యలను, ఇద్దరు దాసీలను,
తన పదకొండుమంది పిల్లలను అతడు తనతో కూడ
వెంటబెట్టుకొని బయల్దేరాడు. యబ్బోకు నదిని దాట
వలసినచోట యాకోబు దాటాడు. 23తన కుటుం
బాన్ని నది దాటించాడు యాకోబు. తర్వాత
యాకోబు తనకి కలిగిన దాన్ని అంతటినీ నది
దాటించాడు.

### దేవునితో పోరాటం

24అందరికంటే చివర యాకోబు నదిని దాటాడు.
అయితే అతడు దాటక ముందు, అతడు ఇంకా
ఒంటరిగా ఉండగానే, ఒక మనిషి వచ్చి అతనితో
పోరాడాడు. సూర్యుడు ఉదయించే వరకు ఆ మనిషి
అతనితో పోరాడాడు. 25ఆ మనిషి యాకోబును ఓడిం
చలేనట్టు గ్రహించాడు. అందుచేత అతడు యాకోబు
కాలును తాకాడు. అప్పుడే యాకోబు కాలి కీలు జారి
పోయింది.
26అప్పుడు ఆ మనిషి, "నన్ను వెళ్లనివ్వు. సూర్యుడు
వచ్చేస్తున్నాడు" అని యాకోబుతో అన్నాడు.
కాని యాకోబు, "నేను నిన్ను వెళ్లనియ్యను. నీవు
నన్ను ఆశీర్వదించాల్సిందే" అన్నాడు.
27"నీ పేరేమిటి?" ఆ మనిషి అడిగాడు. "నా పేరు
యాకోబు" అన్నాడు యాకోబు.
28అప్పుడు, "నీ పేరు ఇకమీదట యాకోబు కాదు.
ఇప్పుడు నీ పేరు ఇశ్రాయేలు.* దేవునితోను, మను
ష్యులతోను నీవు పోరాడి, ఓడిపోలేదు గనుక నీకు
నేను ఈ పేరు పెడుతున్నాను" అన్నాడు ఆ మనిషి.
29అప్పుడు యాకోబు, "దయచేసి నీ పేరు ఏమిటో
చెప్పు" అని అడిగాడు. అయితే ఆ మనిషి, "నీవు నా
పేరెందుకు అడగాలి?" అన్నాడు. అప్పుడే యాకో
బును అతడు ఆశీర్వదించాడు. 30అందుచేత ఆ స్థలానికి
పెనూయేలు* అని యాకోబు పేరు పెట్టాడు. "ఇక్కడ
దేవుణ్ణి నేను ముఖాముఖిగా చూసాను. అయినప్పటికి
నా ప్రాణం దక్కింది" అన్నాడు యాకోబు.
31అతడు పెనూయేలు దాటుతుండగా సూర్యుడు
ఉదయించాడు. యాకోబు కాలికి అలా జరిగినందువల్ల
అతడు కుంటుతున్నాడు. 32అందుచేత తొడ గూటి
మీద ఉన్న కండరమును ఇశ్రాయేలీయులు ఈ
రోజువరకు తినరు, ఎందుకంటే అక్కడే యాకోబుకు
దెబ్బ తగిలింది.

### యాకోబు సాహసం చూపించుట

33 యాకోబు చూడగా ఏశావు రావడం కన
బడింది. ఏశావు, అతనితో 400 మంది మను
ష్యులు వస్తున్నారు. యాకోబు తన కుటుంబాన్ని
నాలుగు గుంపులుగా చేసాడు. లేయా, ఆమె పిల్లలు
ఒక గుంపులో ఉన్నారు, రాహేలు, యోసేపు ఒక
గుంపులో ఉన్నారు, ఇద్దరు దాసీలు, వారి పిల్లలు మరి
రెండు గుంపుల్లో ఉన్నారు. 2దాసీలను వారి పిల్లలను
యాకోబు ముందు ఉంచాడు. తర్వాత యాకోబు
లేయాను ఆమె పిల్లలను ఉంచాడు. ఆ తర్వాత, చివరగా
రాహేలును, యోసేపును ఉంచాడు యాకోబు.
3యాకోబును తానే ఏశావు వస్తున్న వైపు
ముందుగా వెళ్లాడు. కనుక ఏశావు దగ్గరకు వచ్చిన
మొదటి వాడు అతడే. యాకోబు తన అన్న దగ్గరకు
నడుస్తూ ఏడు సార్లు నేలమీద సాగిలపడ్డాడు.
4యాకోబు చూడగానే అతణ్ణి కలుసుకొనేందుకు
ఏశావు పరుగెత్తాడు. ఏశావు అతణ్ణి కౌగిలించుకొని హత్తు
కొన్నాడు. ఏశావు అతని మెడమీద ముద్దు పెట్టుకొని,
వారిద్దరు సంతోషముతో ఏడ్చేసారు. 5ఏశావు చూడగా
స్త్రీలు పిల్లలు అతనికి కనబడ్డారు. "నీతో ఉన్న వీళ్లంతా
ఎవరు?" అని అతడు అడిగాడు.
"దేవుడు నాకు ఇచ్చిన పిల్లలు వీళ్లంతాను. దేవుడు
నాకు మేలు చేసాడు" అంటూ జవాబు చెప్పాడు
యాకోబు.
6తర్వాత ఇద్దరు దాసీలు, వారితో ఉన్న పిల్లలు
ఏశావు దగ్గరకు వెళ్లారు. వాళ్లంతా అతని ముందు సాష్టాం
గపడ్డారు. 7తర్వాత లేయా, ఆమెతో ఉన్న పిల్లలు
ఏశావు దగ్గరకు వెళ్లి సాష్టాంగపడ్డారు. తరువాత,
రాహేలు, యోసేపు ఏశావు దగ్గరకు వెళ్లి సాష్టాంగ
పడ్డారు.
8"నేను ఇక్కడికి వస్తున్నప్పుడు నాకు కనబడిన
ప్రజలంతా ఎవరు? పైగా ఆ జంతువులన్నీ దేని
కోసం?" అని ఏశావు అడిగాడు.
దానికి యాకోబు "నీవు నన్ను స్వీకరించాలని చెప్పి
అవన్నీ నీకు నా కానుకలు" అని జవాబిచ్చాడు.

---

**ఇశ్రాయేలు** అనగా "దేవునితో పోరాడువాడు".

**పెనూయేలు** అనగా "దేవుని ముఖము".

9కాని ఏశావు, సోదరా, "నాకు నీవు కానుకలు ఇవ్వా
ల్సిన పని లేదు. నాకు కావల్సినంత ఉన్నది" అన్నాడు.
10యాకోబు అన్నాడు: "అలా కాదు, నేను నిన్ను
బతిమలాడుకొంటున్నాను. నీవు నిజంగా నన్ను అంగీ
కరిస్తుంటే, నీవు నా కానుకలు గూడా అంగీకరించాలి.
మరలా నేను నీ ముఖం చూడటం నాకెంతో సంతో
షంగా ఉంది. దేవుని ముఖము చూసినట్టు ఉంది.
నీవు నన్ను అంగీరించటం చూస్తే నాకు ఎంతో సంతో
షంగా ఉంది.
11అందుచేత నేను నీకు ఇస్తున్న కానుకలను గూడ
స్వీకరించుమని ప్రార్థిస్తున్నా. దేవుడు నాకు ఎంతో
మేలు చేసాడు. నాకు కావల్సిన దానికంటే ఎక్కువగా
ఉంది." ఈ విధంగా తన కానుకల్ని తీసుకోమని చెప్పి
యాకోబు ఏశావును బతిమలాడాడు. కనుక ఏశావు ఆ
కానుకలను స్వీకరించాడు. 12అప్పుడు ఏశావు, "ఇంక
నీవు ప్రయాణం కొనసాగించు. నేను కూడ నీతో
వస్తాను" అన్నాడు. 13కాని యాకోబు అతనితో ఇలా
చెప్పాడు: "నా పిల్లలు బలహీనులని నీకు తెలుసు.
పైగా నా మందలు, వాటి పిల్లలను గూర్చిన జాగ్రత్త
నేను తీసుకోవాలి. ఒక్క రోజునే నేను వాటిని చాలా
దూరం నడిపిస్తే అవి చస్తాయి. 14అంచేత నీవు ముందు
వెళ్లిపో. నేను మెల్లగా నీ వెనుక వస్తా. పశువులు, మిగిలిన
జంతువులు క్షేమంగా ఉండగలిగినంత నిదానంగా నేను
నడుస్తాను. మరియు నా పిల్లలు కూడ మరీ అలసి
పోకుండా నేను మెల్లగా వస్తాను. శేయీరులో నేను
నిన్ను కలుసుకొంటాను."
15ఏశావు, "అలాగైతే నీకు సహాయంగా నా మనుష్య
లను కొందర్ని నీతో ఉంచుతాను" అన్నాడు.
కానీ యాకోబు, "అదంతా నీ దయ. కాని అలా
చేయాల్సిన అవసరం ఏమీ లేదు" అన్నాడు. 16కనుక
ఆ రోజు ఏశావు శేయీరుకు తిరుగు ప్రయాణం
కట్టాడు. 17అయితే యాకోబు సుక్కోతు వెళ్లాడు.
అక్కడ తనకోసం ఒక యిల్లు, తన పశువుల కోసం
కొట్టములు కట్టాడు. అందుకే ఆ చోటుకు సుక్కోతు*
అని పేరు.
18ఆ తర్వాత, యాకోబు పద్దనరాము నుండి
కనానులో ఉన్న షెకెము పట్టణం వరకు తన ప్రయా
ణాన్ని క్షేమంగా ముగించాడు. ఆ పట్టణానికి సమీపంగా
ఒక పొలంలో యాకోబు తన నివాసం ఏర్పాటు
చేసుకొన్నాడు. 19షెకెము తండ్రియైన హమోరు
కుటుంబం దగ్గర యాకోబు ఆ పొలాన్ని కొన్నాడు.
యాకోబు నూరు వెండి నాణ్యాలు చెల్లించాడు.
20దేవుణ్ణి ఆరాధించటానికి యాకోబు అక్కడ ఒక
బలిపీఠం కట్టాడు. ఆ స్థలానికి "ఏల్, ఇశ్రాయేలీయుల
దేవుడు" అని పేరు పెట్టాడు.

### దీనాను చెరపటం

34 యాకోబు లేయాల కుమార్తె దీనా. ఒక
రోజు, ఆ ఊరి స్త్రీలను చూడాలని దీనా
బయటకు వెళ్లింది. 2ఆ దేశం రాజైన హమోరు కుమా
రుడు షెకెము దీనాను చూసాడు. అతడు ఆమెను
బంధించి, బలవంతంగా ఆమెతో సంభోగించాడు.
3షెకెము దీనాను ప్రేమించాడు. ఆమె తనను పెళ్లి
చేసుకునేలా ఒప్పించేందుకు ఆమెతో మాట్లాడాడు.
4"నేను పెళ్లి చేసుకోవటానికి దయచేసి ఈ అమ్మా
యినే తెచ్చి పెట్టమని" షెకెము తన తండ్రితో
చెప్పాడు.
5ఆ యువకుడు తన కూతురికి చేసిన దుష్కా
ర్యాన్ని గూర్చి యాకోబు విన్నాడు. అయితే
యాకోబు కుమారులంతా పశువులతోబాటు పొలాల్లో
ఉన్నారు. అందుచేత వాళ్లు ఇంటికి తిరిగి వచ్చేంత
వరకు యాకోబు ఏమీ చేయలేదు. 6అదే సమయంలో
షెకెము తండ్రి హమోరు యాకోబుతో మాట్లాడేం
దుకు వెళ్లాడు. 7జరిగిన దాన్ని గూర్చి యాకోబు
కుమారులకు పొలంలోనే తెలిసింది. ఇది విని వాళ్లకు
చాలా కోపం వచ్చింది. యాకోబు కూతురుతో శయ
నించి, షెకెము ఇశ్రాయేలీయుల వంశానికి అవమానం
తెచ్చాడు గనుక వారికి పిచ్చి కోపం రెచ్చిపోయింది.
షెకెము చాలా చెడ్డపని చేసాడు కనుక ఆ సోదరులంతా
పొలాలనుండి వచ్చేసారు.
8అయితే హమోరు ఆ సోదరులతో మాట్లాడాడు.
"నా కుమారుడు షెకెముకు దీనా కావాలని ఉంది.
దయచేసి వాడిని ఆమెను పెళ్లి చేసుకోనివ్వండి.
9మనకు ఒక ప్రత్యేక ఒడంబడిక ఉన్నట్టు ఈ వివాహం
వ్యక్తం చేస్తుంది. అప్పుడు మా మగవాళ్లు మీ అమ్మా
యిలను, మీ మగవాళ్లు మా అమ్మాయిలను పెళ్లి
చేసుకోవచ్చు. 10ఈ దేశంలోనే మీరు కూడ మాతో
కలసి ఉండవచ్చును. భూమిని స్వంతం చేసుకొనేం
దుకు, వ్యాపారం చేసేందుకు ఇక్కడ మీకు స్వేచ్ఛ
ఉంటుంది" అన్నాడు.
11షెకెము కూడ యాకోబుతో, అన్నదమ్ములతో
మాట్లాడాడు. షెకెము అన్నాడు: "దయచేసి నన్ను
స్వీకరించండి, నేను చేసిన దాని విషయంలో నన్ను
క్షమించండి. మీరు నన్నేమి చేయమంటే అది చేస్తా.
12మీరు నన్ను దీనాను పెళ్లి చేసుకోనిస్తే, మీరు కోరిన
కన్యాశుల్కం మీకు ఇస్తా. మీరు ఏమి అడిగితే అది
ఇస్తా కాని దీనాను నన్ను పెళ్లాడనివ్వండి."
13షెకెముతో, అతని తండ్రితో అబద్ధం చెప్పాలని
యాకోబు కుమారులు నిశ్చయించుకున్నారు. వారి
సోదరి దీనాకు షెకెము చేసిన నీచకార్యాన్ని బట్టి ఆ
సోదరులు ఇంకా కోపంగానే ఉన్నారు. 14కనుక ఆ
సోదరులు, "నీకు ఇంకా సున్నతి కాలేదు గనుక నిన్ను
మా సోదరిని పెళ్లి చేసుకోనివ్వం. మా సోదరి నిన్ను

---

**సుక్కోతు** అనగా తాత్కాలిక "పాకలు."

చేసుకోవడం తప్పు అవుతుంది. [15]అయితే నీవు ఈ
ఒక్క పని చేస్తే నిన్ను ఆమెను పెళ్లి చేసుకోనిస్తాం.
మీ పట్టణంలో ప్రతి పురుషుడూ మాలాగే సున్నతి
చేసుకోవాలి. [16]అప్పుడు మీ పురుషులు మా స్త్రీలను,
మా పురుషులు మీ స్త్రీలను పెళ్లి చేసుకోవచ్చు.
అప్పుడు మనమంతా ఒక్క ప్రజ అవుతాం [17]సున్నతికి
మీరు నిరాకరిస్తే, దీనాను మేము తీసివేసుకొంటాం"
అని అతనితో చెప్పారు.

[18]ఈ ఒడంబడిక హమోరుకు, షెకెముకు చాలా
సంతోషం కలిగించింది. [19]దీనా సోదరులు అడిగినట్టు
చేయాలంటే షెకెముకు చాలా సంతోషంగా ఉంది.

### పగసాధించుట

షెకెము, అతని కుటుంబంలోకెల్లా చాలా గౌరవం
గలవాడు. [20]హమోరు, షెకెము వారి పట్టణంలో సమా
వేశ స్థలానికి వెళ్లారు. ఆ పట్టణంలోని పురుషులుతో
వారు మాట్లాడి, అన్నారు: [21]"ఈ ఇశ్రాయేలీయులు
మనతో నిజంగా స్నేహంగా ఉండాలని కోరుతున్నారు.
వాళ్లను మన దేశంలోనే నివసించి వ్యాపారం చేసు
కోనిద్దాం. మనందరికి సరిపోయేంత భూమి మనకు
ఉంది. మనం వాళ్ల స్త్రీలను స్వేచ్ఛగా వివాహం చేసు
కోవచ్చు. అలానే వారి పురుషులు వివాహం చేసుకొ
నేందుకు మన స్త్రీలను సంతోషంగా మనం ఇవ్వవచ్చు.
[22]అయితే మన పురుషులంతా ఒక పని చేయడానికి
ఒప్పుకోవాలి. ఇశ్రాయేలు ప్రజల్లాగే మన మగవాళ్లంతా
సున్నతి చేసుకొనేందుకు సమ్మతించాలి. [23]మనం ఇలా
చేస్తే, వాళ్ల ఆల మందలు, జంతువులు, వస్తుజాలం
అన్నీ మనకి దక్కి, మనం ధనికులం అవుతాం. కనుక
మనం వాళ్లతో ఈ ఒడంబడిక చేయాల్సిందే, వాళ్లు
మనతోనే ఉంటారు." [24]సమావేశ స్థలంలో ఈ
మాటలు విన్న మగవాళ్లంతా షెకెము, హమోరులతో
ఏకీభవించారు. ఆ సమయంలో ప్రతి పురుషునికి
సున్నతి జరిగింది.

[25]మూడు రోజుల తర్వాత, సున్నతి పొందిన మగ
వాళ్లు ఇంకా బాధపడుతూనే ఉన్నారు. ఈ సమయంలో
ఆ మనుష్యులు బలహీనంగా ఉంటారని యాకోబు
ఇద్దరు కుమారులు షిమ్యోను, లేవీలకు తెలుసు. కనుక
వారు పట్టణంలోకి వెళ్లి, ఆ పురుషులందర్నీ అక్కడే
చంపేసారు. [26]దీనా సోదరులు షిమ్యోను, లేవీ కలిసి
హమోరును, అతని కుమారుని చంపేసారు. అంతట
వారు షెకెము యింటినుండి దీనాను తీసుకొని వెళ్లి
పోయారు. [27]యాకోబు మిగిలిన కుమారులు ఆ పట్ట
ణంలోకి వెళ్లి, అక్కడ ఉన్న సమస్తం దోచుకొన్నారు.
వారి సోదరికి షెకెము చేసిన దాని విషయంలో వారు
ఇంకా కోపంగా ఉన్నారు. [28]కనుక వారి జంతువు
లన్నింటినీ ఆ సోదరులు తీసుకుపోయారు. వారి గాడిద
లను, పట్టణంలో, పొలాల్లో మిగిలినదంతా వారు దోచు
కొన్నారు. [29]ప్రజలకు ఉన్నదంతా ఆ సోదరులు
దోచుకుపోయారు. చివరికి వారి భార్యలను, పిల్లలను
కూడా ఆ సోదరులు తీసుకొని వెళ్లిపోయారు.

[30]అయితే షిమ్యోనుతోనూ, లేవీతోనూ
యాకోబు అన్నాడు, "మీరు నాకు చాలా కష్టం తెచ్చి
పెట్టారు. ఈ దేశంలో ఉన్న ప్రజలంతా నన్ను అస
హ్యించుకొంటారు. కనానీ ప్రజలు, పెరిజ్జీ ప్రజలు
అంతానాకు వ్యతిరేకంగా లేస్తారు. మనమేమో చాలా
కొద్దిమందిమే ఉన్నాం. ఈ దేశంలో ఉన్నవాళ్లంతా
ఏకమై మనమీద యుద్ధానికి వస్తే, నన్ను నాశనం
చేస్తారు. నాతోబాటే మన ప్రజలందర్నీ నాశనం
చేస్తారు." [31]అయితే ఆ సోదరులు, "ఈ ప్రజలు మా
సోదరిని ఒక వేశ్యలా చేస్తే, చూస్తూ ఊరుకోమంటావా?
లేదు, మా సోదరికి అలా చేయటం వారిది తప్పు"
అని చెప్పారు.

### బేతేలులో యాకోబు

35 "బేతేలు పట్టణం వెళ్లు. అక్కడ నివసించి,
ఆరాధనకు బలిపీఠం నిర్మించు. నీవు నీ అన్న
ఏశావు దగ్గర్నుండి పారిపోతున్నప్పుడు నీకు అక్కడ
ప్రత్యక్షమైన ఏల్ దేవుణ్ణి జ్ఞాపకం చేసుకో. అక్కడ ఆ
దేవుణ్ణి ఆరాధించటానికి ఒక బలిపీఠం తయారు
చేసుకో" అని దేవుడు యాకోబుతో చెప్పాడు.

[2]కనుక యాకోబు తన కుటుంబం అంతటితో,
సేవకులందరితో ఇలా చెప్పాడు: "మీ దగ్గర ఉన్న
చెక్క, లోహములతో చేయబడిన ఆ తప్పుడు దేవతల
న్నిటిని నాశనం చేయండి. మిమ్మల్ని మీరు శుద్ధి
చేసుకోండి. శుభ్రమైన వస్త్రాలను ధరించండి. [3]మనం
యిక్కడ్నుండి బేతేలుకు వెళ్లిపోవాలి. ఆ స్థలంలో
నాకు కష్టం కలిగినప్పుడు సహాయం చేసినటువంటి
దేవునికి బలిపీఠం కట్టాను. ఆ దేవుడే నేను వెళ్లిన
ప్రతి చోటా నాతో ఉన్నాడు."

[4]కనుక ప్రజలు వారి దగ్గర ఉన్న అసత్య దేవత
లన్నిటిని యాకోబుకు ఇచ్చివేసారు. వారంతా వారి
చెవులకు ధరించిన నగలను యాకోబుకు ఇచ్చివేసారు.
షెకెము దగ్గర ఉన్న సింధూర వృక్షం కింద యాకోబు
వీటన్నిటిని పాతి పెట్టాడు.

[5]యాకోబు, అతని కుమారులు ఆ స్థలం విడిచి
వెళ్లిపోయారు. ఆ ఊరి ప్రజలు వీరిని వెంబడించి,
చంపాలనుకొన్నారు. అయినా వారు చాలా భయ
పడి*, యాకోబును వెంబడించలేదు. [6]కనుక
యాకోబు, అతని వాళ్లంతా లూజు వెళ్లారు. లూజు
ఇప్పుడు బేతేలు అని పిలువబడుతోంది. అది కనాను
దేశంలో ఉంది. [7]అక్కడ యాకోబు ఒక బలిపీఠం

---

**భయపడి** దేవుడు కల్పించిన భయం వాళ్లమీదే పడింది
అని దీని అర్థం.

కట్టాడు. ఆ స్థలానికి ఏల్ బేతేలు అని యాకోబు
పేరు పెట్టాడు. అతడు తన సోదరుని నుండి పారి
పోతున్నప్పుడు మొట్టమొదటి సారిగా అక్కడే దేవుడు
అతనికి ప్రత్యక్షమైన కారణంగా యాకోబు ఈ పేరును
నిర్ణయించాడు.
8రిబ్కా దాది దెబోరా అక్కడే చనిపోయింది. బేతే
లులో సింధూర వృక్షం కింద ఆమెను వారు పాతి
పెట్టారు. ఆ స్థలానికి అల్లోను బాకూతో అని వారు
పేరు పెట్టారు.

## యాకోబుకు కొత్త పేరు

9పద్దనరాము నుండి యాకోబు తిరిగి వస్తుండగా,
దేవుడు మరల అతనికి ప్రత్యక్షమయ్యి, యాకోబును
ఆశీర్వదించాడు. 10“నీ పేరు యాకోబు. కాని, ఆ
పేరును నేను మార్చేస్తాను. ఇప్పుడు నీవు యాకోబు
అని పిలువబడవు. ‘నీ కొత్త పేరు ఇశ్రాయేలు’ అని
ఉంటుంది” కాబట్టి దేవుడు అతనికి ఇశ్రాయేలు అని
పేరు పెట్టాడు.
11అతనితో దేవుడన్నాడు: నేను సర్వశక్తి మంతు
డనైన దేవుణ్ణి. కనుక నీకు ఈ ఆశీర్వాదం ఇస్తున్నాను:
నీకు చాలా సంతోషం కలిగి, ఒక గొప్ప జనాంగంగా
పెరుగుదువు! మరిన్ని జనాంగాలు, మరికొందరు
రాజులు నీలో నుండి ఉద్భవిస్తారు. 12అబ్రాహాము,
ఇస్సాకులకు ఒక ప్రత్యేక దేశం నేనిచ్చాను. ఇప్పుడు
ఆ దేశాన్ని నేను నీకు ఇస్తున్నాను. పైగా నీ తర్వాత
జీవించే నీ ప్రజలందరికీ ఆ దేశాన్ని నేను ఇస్తున్నాను.
13అంతలో దేవుడు అక్కడ్నుండి వెళ్లిపోయాడు. 14-
15ఈ స్థలంలో ఒక స్మారక శిల* యాకోబు నిల
బెట్టాడు. ద్రాక్షారసం, తైలం పోసి ఆ బండను పవిత్రం
చేసాడు యాకోబు. ఆ స్థలంలో దేవుడు యాకోబుతో
మాట్లాడాడు గనుక ఇది ఒక ప్రత్యేక స్థలం. యాకోబు
ఆ స్థలానికి బేతేలు అని పేరు పెట్టాడు.

## రాహేలు ప్రసవిస్తూ చనిపోయింది

16యాకోబు, అతని వాళ్లు బేతేలు నుండి ప్రయాణ
మయ్యారు. ఇంక వారు ఎఫ్రాతా (బెత్లెహేం) చేరుతార
నగా, రాహేలుకు ప్రసవ వేదన ప్రారంభమయింది.
17అయితే ఈ కాన్పులో రాహేలు చాలా కష్టపడు
తోంది. ఆమె విపరీతంగా బాధపడుతోంది. రాహేలు
పనిమనిషి ఇది చూసి, “రాహేలూ భయపడకు. నీవు
మరో కుమారుణ్ణి కంటున్నావు” అని చెప్పింది.
18కుమారుని కంటూనే రాహేలు చనిపోయింది.
చనిపోక ముందు ఆ పిల్లవాడికి బెనోని* అని ఆమె
పేరు పెట్టింది. అయితే యాకోబు అతనికి బెన్యా
మీను* అని పేరు పెట్టాడు.
19ఎఫ్రాతా మార్గంలో రాహేలు సమాధి చేయ
బడింది (ఎఫ్రాతా అంటే బెత్లెహేం). 20రాహేలు
గౌరవార్థం, ఆమె సమాధి మీద యాకోబు ఒక ప్రత్యేక
బండను ఉంచాడు. ఆ ప్రత్యేక బండ నేటికీ అక్కడ
ఉంది. 21అప్పుడు ఇశ్రాయేలు (యాకోబు) తన
ప్రయాణం కొనసాగించాడు. ఏదెరు శిఖరానికి కొద్దిగా
దక్షిణంగా అతడు శిబిరం వేసాడు.
22ఇశ్రాయేలు అక్కడ కొన్నాళ్లపాటు ఉండి
పోయాడు. అతడు అక్కడ ఉంటున్నప్పుడు ఇశ్రా
యేలు దాసి బిల్హాతో రూబేను శయనించాడు. ఇశ్రా
యేలు ఇది విని చాలా కోపగించుకొన్నాడు.

## ఇశ్రాయేలు కుటుంబం

యాకోబుకు (ఇశ్రాయేలుకు) 12 మంది
కుమారులు.
23అతని భార్య లేయా మూలంగా అతనికి ఆరుగురు
కుమారులు ఉన్నారు. రూబేను, షిమ్యోను, లేవి,
యూదా, ఇశ్శాఖారు, జెబూలును.
24అతని భార్య రాహేలు మూలంగా అతనికి ఇద్దరు
కుమారులున్నారు. యోసేపు, బెన్యామీను.
25రాహేలు పనిమనిషి బిల్హా మూలంగా అతనికి ఇద్దరు
కుమారులు ఉన్నారు. దాను, నఫ్తాలి.
26లేయా పనిమనిషి జిల్పా మూలంగా అతనికి ఇద్దరు
కుమారులు ఉన్నారు. గాదు, ఆషేరు.
వీరు పద్దనరాములో యాకోబుకు (ఇశ్రాయే
లుకు) పుట్టిన కుమారులు.
27కిర్యతర్బాలోని (హెబ్రోను) మమ్రేలోనున్న తన
తండ్రి ఇస్సాకు దగ్గరకు యాకోబు వెళ్లాడు. అబ్రా
హాము, ఇస్సాకులు నివసించిన చోటు ఇది. 28ఇస్సాకు
180 సంవత్సరాల వయస్సులో ఉన్నాడు. 29ఇస్సాకు
చాలకాలం నిండు జీవితాన్ని జీవించాడు. అతడు చని
పోయినప్పుడు వృద్ధుడు. అతని తండ్రి సమాధి చేయ
బడిన చోటనే, అతని కుమారులైన ఏశావు, యాకో
బులు అతణ్ణి కూడ సమాధి చేశారు.

## ఏశావు కుటుంబం

36 ఏశావు కుటుంబ జాబితా ఇది: (ఎదోము
అని కూడ అతనికి పేరు) ఏశావు కనాను
దేశపు స్త్రీలను పెళ్లి చేసుకొన్నాడు. ఏశావు కుటుంబ
జాబితా ఇది: (ఎదోము అని కూడ అతనికి పేరు)
2ఏశావు భార్యలు ఎవరంటే: ఆదా, హిత్తీవాడైన ఏలోను
కుమార్తె అహోలీబామా, హివ్వీవాడైన సిబ్యోను
కుమారుడు అనా కుమార్తె, 3బాశెమతు, ఇశ్మాయేలు

---

**స్మారక శిల** జ్ఞాపకము చేసుకొనేందుకు గుర్తుగా నిలువబెట్టు బండ.

**బెనోని** అనగా “నా శ్రమ పుత్రుడు.”

**బెన్యామీను** అనగా “నా కుడి చేతి పుత్రుడు.”

కుమార్తె, నెబాయోతు సోదరి. 4ఎలీఫజు అనే కుమా
రుని ఆదా ఏశావుకు కన్నది. రగూయేలు అనే కుమా
రుని బాశెమతు ఏశావుకు కన్నది. 5అహోలీబామా
ఏశావుకు ముగ్గురు కుమారులను కన్నది: యూషు,
యాలాము, కోరహు. వీరు ఏశావు కుమారులు. వీరు
కనాను దేశంలో పుట్టారు.

6-8ఏశావు కుటుంబం, యాకోబు కుటుంబం కలిసి
ఒకే చోట నివసించటం వల్ల ఆ ప్రాంతం వాళ్ల పోషణకు
చాలలేదు. కనుక ఏశావు కనాను విడిచిపెట్టి తన
సోదరుడు యాకోబుకు దూరంగా మరో దేశం వెళ్లి
పోయాడు. ఏశావు తనకు కలిగినదంతా తనతోబాటు
తీసుకొని పోయాడు. ఇవన్నీ అతడు కనానులో నివ
సించినప్పుడు సంపాదించుకొన్నాడు. కనుక తన భార్య
లను, కుమారులను, కుమార్తెలను, తన బానిసలంద
రిని, పశువులను, ఇతర జంతువులను ఏశావు తనతో
కూడ తెచ్చుకొన్నాడు. కనుక ఏశావు శేయీరు కొండ
ప్రాంతానికి తరలి పోయాడు. (ఏశావుకు ఎదోము
అని కూడ పేరు). (మరియు ఎదోము, శేయీరు
దేశానికి మరో పేరు)

9ఎదోమి ప్రజలకు ఏశావు తండ్రి. శేయీరు
(ఎదోము) కొండ ప్రాంతంలో నివసిస్తోన్న ఏశావు
కుటుంబంలోని వాళ్ల పేర్లు యివి:

10ఏశావు కుమారులు ఎలీఫజు, ఏశావు, ఆదాలకు
పుట్టిన కుమారుడు. రగూయేలు, ఏశావు, బాశెమ
తులకు పుట్టిన కుమారుడు.

11ఎలీఫజుకు అయిదుగురు కుమారులు: తేమాను,
ఓమారు, సెపో, గాతాము మరియు కనజు. 12ఎలీఫజుకు
తిమ్నా అనే ఒక దాసి కూడ ఉంది. తిమ్నా, ఎలీఫ
జులకు అమాలేకు పుట్టాడు.

13రగూయేలుకు ముగ్గురు కుమారులు: నహతు,
జెరహు, షమ్మా, మిజ్జ.

వీరు బాశెమతు మూలంగా ఏశావుకు మనుమళ్లు.

14అనా కుమార్తె అహోలీబామా ఏశావుకు మూడవ
భార్య. (అనా సిబ్యోను కుమారుడు.) ఏశావు, అహోలీ
బామాలకు పుట్టిన పిల్లలు: యూషు, యాలాము,
కోరహు.

15ఏశావు ద్వారా వచ్చిన వంశాలు యివి:

ఏశావు మొదటి కుమారుడు ఎలీఫజు. ఎలీఫజుకు
పుట్టిన వారు: తేమాను, ఓమారు, సెపో, కనజు.
16కోరహు, గాతాము, అమాలేకు.

ఈ వంశాలన్నీ ఏశావు భార్య ఆదానుండి ఉద్భ
వించాయి

17ఏశావు కుమారుడు రగూయేలు ఈ కింది కుటుం
బాలకు తండ్రి: నహతు, జెరహు, షమ్మా, మిజ్జ.

ఈ కుటుంబాలన్నీ ఏశావు భార్య బాశెమతు నుండి
ఉద్భవించాయి. 18అనా కుమార్తె, ఏశావు భార్య
అహోలీబామాకు యూషు, యగ్లాము, కోరహు
పుట్టారు. ఈ ముగ్గురు వారికి పుట్టిన కుటుంబాలకు
పెద్దలు. 19ఈ కుటుంబాలన్నీ ఏశావునుండి ఉద్భ
వించాయి.

20ఏశావుకంటె ముందు హోరీవాడైన శేయీరు
ఎదోములో నివసించాడు. శేయీరు కుమారులు వీరు:
లోతాను, శోబాలు, సిబ్యోను, అనా, 21దిషోను,
ఏసెరు, దీషాను. వీరు ఎశావు (ఎదోము) ప్రాంతం
నుండి వచ్చిన హోరీయ కుటుంబ నాయకులు.

22హోరీ, హేమీము. వీరికి లోతాను తండ్రి.
(తిమ్నా లోతాను సోదరి.)

23అల్వాన్, మానహదు, ఏబాలు, షపో, ఓనాము.
వీరి తండ్రి శోబాలు.

24సిబ్యోనుకు ఇద్దరు కుమారులు. అయ్యా, అనా.
(అనా తన తండ్రి గాడిదలను కాస్తూ ఉండగా ఎడారిలో
ఉష్ణధారలను కనుగొన్నవాడు.)

25దిషోను, అహోలీబామా అనే వారికి అనా తండ్రి.

26దిషోనుకు నలుగురు కుమారులు: హెమ్దాను,
ఎష్బాను, ఇత్రాను, కెరాను.

27ఏసెరుకు ముగ్గురు కుమారులు: బిల్హాను, జవాను,
అకాను.

28దీషానుకు ఇద్దరు కుమారులు: ఊజు, అరాను.

29హోరీ కుటుంబాల పెద్దల పేర్లు ఇవి: లోతాను,
శోబాలు, సిబ్యోను, అనా, 30దిషోను, ఏసెరు, దీషాను,
శేయీరు (ఎదోము) దేశంలో నివసించిన కుటుంబాల
పెద్దలు వీరంతాను.

31అప్పట్లో, ఎదోములో రాజులు ఉన్నారు.
ఇశ్రాయేలీయుల రాజులకంటె చాలా ముందే
ఎదోములో రాజులు ఉన్నారు.

32బెయోరు కుమారుడు బెల ఎదోమును పాలించిన
ఒక రాజు. అతడు దిన్హాబా పట్టణమును పాలించాడు.
33బెల చనిపోయినప్పుడు యోబాబు రాజయ్యాడు.
యోబాబు బొస్రావాడైన జెరహు కుమారుడు.
34యోబాబు చనిపోయినప్పుడు హుషాము
పాలించాడు. హుషాము తేమాని ప్రజల దేశవాసి.
35హుషాము చనిపోయాక హదదు ఆ ప్రాంతాన్ని పాలిం
చాడు. బదదు కుమారుడు హదదు. (మోయాబు
దేశంలో మిద్యానును జయించినవాడు హదదు.)
హదదు అవీతు పట్టణంవాడు. 36హదదు మరణించాక
శమ్లా ఆ దేశాన్ని పాలించాడు. శమ్లా మశ్రేకనుండి
వచ్చినవాడు.

37శమ్లా మరణించాక షావూలు ఆ ప్రాంతాన్ని
పాలించాడు. యూఫ్రటీసు నదీ ప్రాంతం లోని
రహెబోతువాడు షావూలు. 38షావూలు మరణా
నంతరం బయల్ హానాను ఆ దేశాన్ని పాలించాడు.
అక్బోరు కుమారుడు బయల్ హనాను. 39బయల్
హనాను మరణించాక హదదు (హదరు) ఆ దేశాన్ని
పాలించాడు. హదదు పాఫు నగరవాసి. అతని భార్య

పేరు మహేతబేలు. ఆమె మత్రేదు కుమార్తె. (మత్రేదు
తండ్రి మేజాహాబు.) 40-43తిమ్నా, అల్వా, యతేతు,
అహోలీబామా, ఏలా, పీనోను, కనజు, తేమాను,
మిబ్సారు, మగ్దీయేలు, ఈరాము: ఈ ఎదోమీ
కుటుంబాలకు పితరుడు ఏశావు. వీటిలో ఒక్కో
కుటుంబం, తన కుటుంబం పేరుతోనే పిలువబడే
ప్రాంతంలో నివసించింది.

### కలలుగనే యోసేపు

37 యాకోబు కనాను దేశంలో ఉంటూ, అక్కడే
నివసించాడు. ఇదీ, అతని తండ్రి నివసించినదీ
ఒకటే దేశం. 2ఇదీ యాకోబు కుటుంబ గాథ.
యోసేపు 17 సంవత్సరాల యువకుడు. గొర్రెల్ని,
మేకల్ని కాయటం అతని పని. తన సోదరులైన బిల్హా,
జిల్పా, కుమారులతో కలిసి యోసేపు ఈ పని చేసాడు.
(బిల్హా, జిల్పా అతని తండ్రి భార్యలు. అతని సోదరులు
చేసే చెడ్డ పనులను గూర్చి యోసేపు తన తండ్రితో
చెప్పేవాడు. 3అతని తండ్రి ఇశ్రాయేలు (యాకోబు)
చాలా వృద్ధుడుగా ఉన్నప్పుడు యోసేపు పుట్టాడు.
కనుక ఇశ్రాయేలు (యాకోబు) తన కుమారులందరి
కంటే యోసేపును ఎక్కువగా ప్రేమించాడు.
యాకోబు తన కుమారునికి ఒక ప్రత్యేకతగల అంగీ
ఇచ్చాడు. ఈ అంగీ చాలా పొడుగ్గా, అందంగా ఉంది.
4యోసేపు సోదరులు వారి తండ్రి వారందరికంటే
యోసేపును ఎక్కువగా ప్రేమించటం గమనించారు.
అందుచేత వారు వారి సోదరుణ్ణి ద్వేషించారు. వాళ్లు
యోసేపుతో స్నేహభావంతో మాట్లాడలేదు.
5ఒకసారి యోసేపుకు ఒక ప్రత్యేకమైన కల
వచ్చింది. తర్వాత ఈ కల విషయం యోసేపు తన
అన్నలతో చెప్పాడు. దీని తర్వాత అతని అన్నలు
అతణ్ణి మరింతగా ద్వేషించారు.
6"నాకో కల వచ్చింది, 7మనమంతా పొలంలో
పని చేస్తున్నాం. మనం గోధుమ పనలు కడ్తున్నాం.
నా పన నిలబడింది, దాని చుట్టూ మీ పనలు లేచి
నిలబడ్డాయి. అప్పుడు మీ పనలన్నీ నా పనకు సాష్టాంగ
పడ్డాయి" అని చెప్పాడు యోసేపు.
8అతని సోదరులు, "అంటే మా మీద నీవు రాజువై
అధికారం చేస్తావా?" అని అడిగారు. వారిని గూర్చి
యోసేపుకు వస్తోన్న కలల మూలంగా ఇప్పుడు వారు
అతణ్ణి ఇంకా ఎక్కువ ద్వేషిస్తున్నారు.
9అప్పుడు యోసేపుకు మళ్లీ ఒక కల వచ్చింది.
ఈ కలను గూర్చి యోసేపు తన సోదరులకు చెప్పాడు.
"నాకు ఇంకో కల వచ్చింది. సూర్యుడు, చంద్రుడు,
మరియు 11 నక్షత్రాలు నాకు సాష్టాంగపడటం నేను
చూసాను" అంటూ చెప్పాడు యోసేపు.
10ఈ కల విషయమై యోసేపు తన తండ్రితో
కూడ చెప్పాడు. కాని అతని తండ్రి అతణ్ణి విమ
ర్శించాడు. "ఇదేం కల? నేనూ, మీ అమ్మ, నీ సోదరులు
అందరం నీకు సాష్టాంగపడతామని నీవు నమ్ము
తున్నావా?" అన్నాడు అతని తండ్రి. 11యోసేపు
సోదరులు మాత్రం అతని మీద అసూయ పడుతూనే
ఉన్నారు. అయితే యోసేపు తండ్రి వీటన్నింటిని
గూర్చి చాలా ఆలోచన చేసి వీటి భావం ఏమై
ఉంటుందా అని ఆశ్చర్యపడుతూ వున్నాడు.
12ఒకరోజు, యోసేపు సోదరులు తమ తండ్రి
గొర్రెల్ని మేపుకొనేందుకు షెకెం వెళ్లారు.
13యాకోబు, "నీ సోదరులు షెకెంలో నా గొర్రెల్ని
కాస్తున్నారు. నీవు అక్కడికి వెళ్లాలి" అని యోసేపుతో
చెప్పాడు.
"అలాగే నేను వెళ్తా," అన్నాడు యోసేపు.
14యోసేపు తండ్రి, "నీవు వెళ్లి నీ సోదరులు క్షేమంగా
ఉన్నారో లేదో చూచి, మళ్లీ వచ్చి నా గొర్రెల క్షేమ
సమాచారం నాకు చెప్పాలి" అన్నాడు. అందుచేత
యోసేపు తండ్రి హెబ్రోను లోయనుండి షెకెముకు
అతడ్ని పంపించాడు.
15షెకెములో యోసేపు తప్పిపోయాడు. అతడు
పొలాల్లో తిరుగుతోంటే ఒక మనిషి చూశాడు. "ఏమిటి
వెదుకుతున్నావు" అన్నాడు ఆ మనిషి.
16"నేను నా అన్నల కోసం వెదుకుతున్నాను. వాళ్లు
గొర్రెల్ని మేపుకొంటూ ఎక్కడ ఉన్నారో నీవు చెప్ప
గలవా?" అన్నాడు యోసేపు.
17ఆ మనిషి "అప్పుడే వాళ్లు వెళ్లిపోయారు గదా.
వాళ్లు దోతాను వెళ్తాం అని చెప్పుకోవటం నేను
విన్నాను" అన్నాడు. కనుక యోసేపు తన సోదరులను
వెంబడించి, దోతానులో వారిని చూడగలిగాడు.

### బానిసగా యోసేపును అమ్మటం

18యోసేపు రావటం అతని అన్నలు అంత దూరం
నుంచే చూసారు. అతణ్ణి చంపేందుకు ఒక పథకం
వేయాలని వారు తీర్మానించుకొన్నారు. 19ఆ సోదరులు
వాళ్లలో వారు ఇలా చెప్పుకొన్నారు, "కలలుకనే
యోసేపు ఇక్కడికి వస్తున్నాడు. 20ఇప్పుడు మనకు
వీలైనప్పుడే మనం వాణ్ణి చంపివేయాలి. వాని శవాన్ని
ఇక్కడే ఏదో ఖాళీ బావిలో పడవేస్తే సరిపోతుంది.
అడవి మృగం ఏదో వాణ్ణి చంపేసిందని మన తండ్రితో
మనం చెప్పొచ్చు. అప్పుడు అతని కలలన్నీ అర్థము
లేనివని వానికి మనం చూపెట్టవచ్చు."
21కానీ రూబేను యోసేపును కాపాడాలి అను
కొన్నాడు, "వాణ్ణి మనం చంపొద్దు. 22వానికి హాని
చేయకుండానే ఒక బావిలో పడవేస్తే సరిపోతుంది"
అని చెప్పాడు రూబేను. యోసేపును రక్షించి, అతని
తండ్రి దగ్గరకు పంపించాలని రూబేను వేసిన పథకం
ఇది. 23యోసేపు తన సోదరుల దగ్గరకు వచ్చాడు.
వారు అతని మీద పడి, అందమైన అతని పొడవాటి

అంగీని చింపేసారు. 24తర్వాత, ఎండిపోయి ఖాళీగా
ఉన్న ఒక బావిలో అతణ్ణి పడవేసారు. 25యోసేపు
బావిలో పడి ఉంటే, అతని సోదరులు భోజనం
చేసేందుకు కూర్చున్నారు. అప్పుడు వారు చూడగా,
గిలాదునుండి ఈజిప్టుకు ప్రయాణం చేస్తోన్న
వ్యాపారస్తుల బృందం ఒకటి కనబడింది. వారి ఒంటెలు
గుగ్గిలం, మస్తకి, బోళం, ఐశ్వర్యాలు మోస్తున్నాయి.
26కనుక యూదా తన సోదరులతో "మనం మన
సోదరుని చంపి, వాని మరణాన్ని దాచిపెడితే మనకేం
లాభం? 27ఈ వ్యాపారస్తులకు గనుక మనం వాణ్ణి
అమ్మివేస్తే మనకు లాభం వస్తుంది. పైగా మన సొంత
సోదరుని చంపిన అపరాధం మనమీద ఉండదు"
అన్నాడు. మిగిలిన సోదరులు సమ్మతించారు.
28మిద్యానీ వ్యాపారవేత్తలు అటు రాగానే, ఆ సోదరులు
యోసేపును బావిలోనుండి బయటకు తీసారు. 20
వెండి నాణాలకు వారతణ్ణి ఆ వ్యాపారవేత్తలకు అమ్మి
వేసారు. వ్యాపారవేత్తలు అతణ్ణి ఈజిప్టుకు తీసుకు
వెళ్లారు.

29ఇంతసేపూ రూబేను అక్కడ తన సోదరులతో
లేడు. యోసేపును వారు అమ్మివేసినట్టు అతనికి తెలి
యదు. రూబేను బావి దగ్గరకు వచ్చినప్పుడు,
యోసేపు బావిలో లేడు. రూబేనుకు ఎక్కడాలేని
విచారం కలిగింది. తన విషాదాన్ని తెలియజేయడానికి
తన గుడ్డలను చింపివేసుకొన్నాడు. 30రూబేను తన
సోదరుల దగ్గరకు వెళ్లి, "పిల్లవాడు బావిలో లేడు,
నేనేం చేయాలి?" అని అడిగాడు. 31ఆ సోదరులు ఒక
మేకను చంపి, దాని రక్తాన్ని యోసేపుయొక్క అంద
మైన అంగీకి పూసారు. 32తర్వాత ఆ సోదరులు ఆ
అంగీని తమ తండ్రికి చూపించారు. "ఈ అంగీ మాకు
దొరికింది. ఇది యోసేపుదా?" అంటూ అడిగారు ఆ
సోదరులు.

33తండ్రి అంగీని చూచి, అది యోసేపుదేనని
తెలుసుకొన్నాడు. "అవును, అది అతనిదే. ఒకవేళ
అడవి మృగం ఏదైనా అతణ్ణి చంపివేసిందేమో. నా
కుమారుడు యోసేపును అడవి మృగం ఏదో భక్షించి
వేసింది!" అన్నాడు ఆ తండ్రి. 34యాకోబు తన
కుమారుని గూర్చిన దుఃఖంతో తన వస్త్రాలు చింపి
వేసుకొన్నాడు. అతడు దుఃఖంలో ఉన్నట్టు వ్యక్తం
చేసేందుకు ప్రత్యేక వస్త్రాలు యాకోబు ధరించాడు.
యాకోబు తన కుమారుని విషయం చాలా కాలం
దుఃఖంగానే ఉన్నాడు. 35యాకోబు కుమారులు,
కుమార్తెలు అందరూ అతణ్ణి ఓదార్చాలని ప్రయ
త్నించారు. అయినా యాకోబుకు ఎన్నడూ ఆదరణ
కలుగలేదు. యాకోబు "నా మరణ దినంవరకు నా
కుమారుని గూర్చి దుఃఖిస్తూనే ఉంటాను" అన్నాడు.
అందుచేత అతని కుమారుడైన యోసేపు కోసం
యాకోబు దుఃఖంలోనే కాలం గడుపుతూ ఉండి
పోయాడు.36యోసేపును కొన్న మిద్యాని
వ్యాపారవేత్తలు దరిమిలా అతణ్ణి ఈజిప్టులో ఫరో
సంరక్షక సేనాధిపతి పోతీఫరుకు అమ్మివేసారు.

### యూదా మరియు తామారు

38 సుమారు అదే సమయంలో యూదా తన
సోదరులను విడిచి, హీరా అనే ఒకతని దగ్గర
ఉండేందుకు వెళ్లాడు. హీరా అదుల్లాము నివాసి. 2అక్కడ
యూదా ఒక కనానీ అమ్మాయిని కలుసుకొని ఆమెను
పెళ్లి చేసుకొన్నాడు. ఆ అమ్మాయి తండ్రి పేరు
షూయ. 3ఆ కనానీ స్త్రీకి ఒక కుమారుడు పుట్టగా,
వారు అతనికి ఏరు అని పేరు పెట్టారు. 4తర్వాత
ఆమె మరో కుమారుని కన్నది. ఆ కుమారునికి వారు
ఓనాను అని పేరు పెట్టారు. 5తర్వాత షేలా అనే
పేరుగల ఇంకో కుమారుడు ఆమెకు పుట్టాడు.
యూదాకు మూడో కుమారుడు పుట్టినప్పుడు, అతడు
కజీబులో నివాసం ఉంటున్నాడు.

6యూదా తన మొదటి కుమారుడైన ఏరుకు
భార్యగా ఒక అమ్మాయిని ఏర్పాటు చేసాడు. ఆ
అమ్మాయి పేరు తామారు. 7కానీ ఏరు చాలా చెడ్డ
పనులు చేసాడు. అతని విషయంలో యెహోవాకు
సంతోషం లేదు. అందుచేత యెహోవా అతణ్ణి చంపే
సాడు. 8అప్పుడు యూదా అతని సోదరుడైన
ఓనానుతో "పోయి, చచ్చిన నీ సోదరుని భార్యతో
శయనించు. ఆమెకు భర్తలా ఉండు. పిల్లలు పుడితే
వారు నీ సోదరుడైన ఏరు పిల్లలుగా పరిగణించ బడ
తారు" అని చెప్పాడు.

9ఈ సంబంధంవలన కలిగే పిల్లలు తన పిల్లలుగా
పరిగణించబడరని ఓనానుకు తెలుసు. ఓనాను తామా
రుతో సంభోగించి, ఇంద్రియమును బయట పడ
వేసాడు.

10దీనితో యెహోవాకు కోపము వచ్చి ఆయన
ఓనానును చంపేసాడు. 11అప్పుడు యూదా "నీవు
తిరిగి నీ తండ్రి యింటికి వెళ్లిపో. నా చిన్న కుమారుడు
షేలా పెద్దవాడయ్యేంత వరకు నీవు మళ్లీ పెళ్లి
చేసుకోకు" అని తన కోడలైన తామారుతో చెప్పాడు.
షేలా కూడ తన అన్నల్లాగే చస్తాడేమోనని యూదాకు
భయం. అతని కోడలు తామారు తిరిగి తన తండ్రి
ఇంటికి వెళ్లిపోయింది.

12ఆ తర్వాత షూయ కుమార్తె, యూదా భార్య
చనిపోయింది. యూదాకు దుఃఖ కాలం తీరిపొయ్యాక,
అతడు తన స్నేహితుడు, అదుల్లాము నివాసి హీరాతో
కలిసి తిమ్నాతునకు వెళ్లాడు. తన గొర్రెల బొచ్చు
కత్తిరించాలని యూద తిమ్నాతునకు వెళ్లాడు.
13తామారు తన మామగారు యూదా తన గొర్రెల
బొచ్చు కత్తిరించేందుకు తిమ్నాతునకు వస్తున్నాడని
తెలుసుకొంది. 14తామారు ఎప్పుడు విధవరాలి గుడ్డలే

ధరించేది. కనుక ఇప్పుడు వేరే వస్త్రాలు ధరించి, నెత్తిమీద ముసుగు వేసుకొంది. అప్పుడు తిమ్నా తునకు దగ్గర్లో ఎనాయిం అనే పట్టణానికి పోయే మార్గంలో కూర్చొంది. యూదా చిన్న కుమారుడు షేల ఇప్పుడు పెద్దవాడయ్యాడని తామారుకు తెలుసు. అయినా గాని ఆమె అతణ్ణి పెళ్లి చేసుకొనే ఏర్పాట్లు యూదా చేయటం లేదు.

[15]యూదా ఆ మార్గాన ప్రయాణం చేసాడు. అతడు ఆమెను చూశాడు గాని ఆమె వేశ్య అనుకొన్నాడు. (వేశ్యలా ఆమె ముఖం మీద ముసుగు వేసుకొంది.) [16]కనుక యూదా ఆమె దగ్గరకు వెళ్లి, "నన్ను నీతో లైంగింకంగా కలవనీ" అని అడిగాడు. (ఆమె తన కోడలు తామారు అని యూదాకు తెలియదు.) "అసలు నీవు ఏ మాత్రం ఇస్తావేంటి?" అంది ఆమె.

[17]యూదా, "నా మందలోనుంచి ఒక మేక పిల్లను పంపిస్తా" అని జవాబిచ్చాడు.

"సరే, ఒప్పుకొంటాను. కాని నీవు ఆ మేక పిల్లను పంపించేంత వరకు నా దగ్గర ఉంచుకొనేందుకు నీవు యింకేమైనా నాకు ఇవ్వాలి సుమా" అని జవాబు చెప్పింది ఆమె.

[18]"నేను నీకు మేకపిల్లను పంపిస్తానని రుజువుగా ఉండేందుకు నన్నేమి ఇవ్వమంటావు?" అడిగాడు యూదా.

తామారు, "నీవు నీ ఉత్తరాల మీద ఉపయోగించే నీ ముద్ర, దాని దారం, నీ చేతి కర్ర ఇవ్వు" అని చెప్పింది. యూదా అవన్నీ ఆమెకు ఇచ్చాడు. అప్పుడు యూదా తామారుతో సంభోగించగా ఆమె గర్భవతి అయ్యింది. [19]తామారు ఇంటికి వెళ్లి, తన ముఖం మీద ముసుగు తీసివేసింది. మరల విధవ వస్త్రాలే ఆమె ధరించింది. [20]యూదా తామారుకు ఇచ్చిన మాట ప్రకారం ఒక మేకను ఇచ్చి తన స్నేహితుడు హీరాను ఆమె ఇంటికి పంపించాడు. మరియు ఆమె దగ్గర్నుండి ప్రత్యేక ముద్రను, చేతి కర్రను తీసుకొని రమ్మని యూదా అతనితో చెప్పాడు. కానీ హీరాకు ఆమె కన బడలేదు. [21]"ఇక్కడ దారి ప్రక్కగా ఉంటూండే ఆ వేశ్య ఏమయింది?" అని ఏనాయిము దగ్గర కొందరిని అడిగాడు హీరా.

"ఇక్కడ ఎన్నడూ వేశ్య నివసించలేదే" అని వాళ్లు అన్నారు.

[22]కనుక యూదా స్నేహితుడు యూదా దగ్గరకు తిరిగి వెళ్లి, "ఆ స్త్రీ నాకు కనబడలేదు. అక్కడ ఎన్నడూ వేశ్య లేదని అక్కడ ఉండేవాళ్లు చెప్పారు" అన్నాడు.

[23]అందుచేత యూదా, "ఆ వస్తువులు ఆమె దగ్గరే ఉండనివ్వు. మనుష్యులు నన్ను చూచి నవ్వటం నాకు ఇష్టం లేదు. ఆమెకు మేకను ఇవ్వాలని నేను ప్రయత్నం చేసాను, కానీ ఆమె మనకు కనబడలేదు. అది చాలు" అన్నాడు.

**తామారు గర్భవతి**

[24]మూడు నెలల తర్వాత, "నీ కోడలు తామారు ఒక వేశ్యలా పాపం చేసింది, ఇప్పుడు గర్భవతిగా ఉంది" అని యూదాతో చెప్పారు.

అప్పుడు యూదా, "ఆమెను బయటకు లాగి చంపేసి, ఆమె శరీరాన్ని కాల్చివేయండి" అన్నాడు.

[25]తామారును చంపటానికి మనుష్యులు వెళ్లారు. అయితే ఆమె తన మామగారికి ఒక సందేశం పంపింది. "నన్ను గర్భవతిగా చేసినవాడు ఈ వస్తువుల స్వంత దారుడే. (ప్రత్యేక ముద్ర, చేతి కర్ర ఆమె అతనికి చూపించింది.) ఈ వస్తువులు చూడు. ఇవి ఎవరివి? ఈ ముద్ర, దారం ఎవరివి? ఈ చేతి కర్ర ఎవరిది?"

[26]వాటిని యూదా గుర్తుపట్టి, "ఆమెదే సరి. నాదే తప్పు. నేను వాగ్దానం చేసిన ప్రకారం నా కుమారుడైన షేలాను నేను ఆమెకు ఇవ్వలేదు" అన్నాడు. యూదా మళ్లీ ఇక ఆమెతో శయనించలేదు.

[27]తామారు ప్రసవించే సమయం వచ్చినప్పుడు ఆమెకు కవలలు పుడతారని వారికి తెలిసింది. [28]ఆమె ప్రసవిస్తున్నప్పుడు ఒక శిశువు చేయి బయటకు వచ్చింది. మంత్రసాని ఆ చేతికి ఒక ఎర్ర దారం కట్టి, "ఈ శిశువు ముందు పుట్టాడు" అంది. [29]అయితే ఆ శిశువు తన చేయి లోపలకు లాగేసాడు. అప్పుడు మరో శిశువు ముందు పుట్టాడు. కనుక "మొత్తానికి నీవే ముందు భేదించుకొని పుట్టావన్న మాట" అంది మంత్రసాని. అంచేత వారు పెరెసు* అని వానికి పేరు పెట్టారు.

[30]తర్వాత రెండో శిశువు పుట్టాడు. చేతికి ఎర్రదారం కట్టబడిన శిశువు వీడు. వారు వాడికి జెరహు అనే పేరు పెట్టారు.

**యోసేపును ఈజిప్టులో పోతీఫరుకు అమ్మేసారు**

39 యోసేపును కొన్న వ్యాపార వేత్తలు అతణ్ణి ఈజిప్టుకు తీసుకు వెళ్లారు. ఫరో సంరక్షకుల అధిపతి పోతీఫరుకు వారు అతన్ని అమ్మేసారు. [2]అయితే యెహోవా యోసేపుకు సహాయం చేసాడు. యోసేపు విజయ సారథి అయ్యాడు. తన యజమాని, ఈజిప్టు వాడైన పోతీఫరు ఇంటిలో యోసేపు నివాసం ఉన్నాడు.

[3]యెహోవా యోసేపుకు తోడుగా ఉన్నట్టు పోతీ ఫరు తెలుసుకొన్నాడు. యోసేపు చేసిన ప్రతి పనిలో యెహోవా అతనికి తోడుగా ఉన్నట్టు పోతీఫరు గ్రహిం చాడు. [4]అందుచేత యోసేపు విషయంలో పోతీఫరు చాలా సంతోషించాడు. పోతీఫరు యోసేపును తనకు సహాయం చేయనిస్తూ, తన ఇంటి వ్యవహారాలన్నీ పర్యవేక్షింపనిచ్చాడు. పోతీఫరుకు ఉన్న సమస్తంమీద

**పెరెసు** అనగా భేదము.

యోసేపు అధికారి. 5ఆ ఇంటిమీద యోసేపు అధికారిగా
చేయబడిన తర్వాత, యెహోవా ఆ ఇంటినీ, పోతీ
ఫరుకు ఉన్న సమస్తాన్నీ ఆశీర్వదించాడు. ఇదంతా
యోసేపువల్లనే యెహోవా చేసాడు. పోతీఫరు
పొలాల్లో పెరిగే వాటన్నిటినీ యెహోవా ఆశీర్వ
దించాడు. 6కనుక పోతీఫరు తన ఇంటిలో అన్ని విష
యాల బాధ్యత యోసేపునే తీసుకోనిచ్చాడు. పోతీ
ఫరు తాను భుజించే భోజనం విషయం తప్ప మరి
దేనిగూర్చీ చింతించలేదు.

### పోతీఫరు భార్యను యోసేపు త్రుణీకరించటం

యోసేపు చాలా అందగాడు, చూడ చక్కని వాడు.
7కొన్నాళ్ల తర్వాత యోసేపు యజమాని భార్య
యోసేపు మీద మోజుపడసాగింది. ఒకనాడు ఆమె,
“నాతో శయనించు” అని అతనితో అంది.
8కానీ యోసేపు నిరాకరించాడు. అతడు చెప్పాడు:
“నా యజమాని తన ఇంటిలో అన్ని విషయాల్లోనూ
నన్ను నమ్మాడు. ఇక్కడ ఉన్న ప్రతిదాని గూర్చి
అతడు నాకు బాధ్యత పెట్టాడు. 9నా యజమాని తన
ఇంట నన్ను దాదాపుగా అతనికి సమానంగా ఉంచాడు.
నేను అతని భార్యతో శయనించకూడదు. అది తప్పు
అది దేవునికి వ్యతిరేకంగా పాపం.”
10ఆమె ప్రతిరోజూ యోసేపుతో మాట్లాడుతున్న
ప్పటికీ యోసేపు ఆమెతో శయనించేందుకు నిరాకరిం
చాడు. 11ఒక రోజు యోసేపు తన పని చేసుకొనేందు
కని ఇంటిలోనికి వెళ్లాడు. ఆ సమయంలో అతను
ఒక్కడే ఇంటిలో ఉన్నాడు. 12అతని యజమాని భార్య
అతని అంగీ పట్టి లాగి, “వచ్చి నాతో శయనించు”
అంది అతనితో. అయితే యోసేపు ఇంట్లోనుంచి
బయటకు పారిపోయాడు. పైగా అతడు తన అంగీని
ఆమె చేతిలోనే వదిలేసాడు.
13యోసేపు అతని అంగీని తన చేతిలోనే విడిచి
వెళ్లినట్టు ఆ స్త్రీ గమనించింది. జరిగిన దాని విషయమై
ఆమె అబద్ధం చెప్పాలని నిర్ణయించుకొంది. బయటకు
పరుగెత్తింది.
14ఆమె తన ఇంటిలో ఉన్న పురుషులను పిలిచింది.
ఆమె అంది, “చూడండి, మనలను ఆట పట్టించటానికే
ఈ హెబ్రీ బానిసను తెచ్చారు. ఇతడు లోనికి వచ్చి
నన్ను బలవంతం చేయటానికి ప్రయత్నించాడు. కానీ
నేను గట్టిగా కేక పెట్టేసరికి 15అతను భయపడి పారి
పోయాడు. అయితే అతని అంగీ నా దగ్గరే వదిలేసి
పోయాడు.” 16తన భర్త, అంటే యోసేపు యజమాని
ఇంటికి వచ్చేంత వరకు ఆమె ఆ అంగీని ఉంచింది.
17ఆమె తన భర్తతో అదే కథ చెప్పింది. ఆమె, “నీవు
ఇక్కడికి తీసుకొని వచ్చిన ఈ హెబ్రీ బానిస నామీద
పడటానికి ప్రయత్నం చేసాడు. 18అయితే అతడు
నా దగ్గరకు రాగానే నేను గట్టిగా కేక వేసాను. అతను
పారిపోయాడు గాని అతడు తన అంగీ విడిచిపెట్టేసాడు”
అని చెప్పింది.

### జైల్లో యోసేపు

19యోసేపు యజమాని అతని భార్య చెప్పిం దంతా
విన్నాడు. అతనికి చాలా కోపం వచ్చింది. 20రాజ
ద్రోహులను బంధించే ఒక చెరసాల ఉంది. కనుక
యోసేపును ఆ చెరసాలలో వేసాడు పోతీఫరు.
యోసేపు అందులోనే ఉన్నాడు.
21అయితే యోసేపుకు యెహోవా తోడుగా
ఉన్నాడు. యెహోవా యోసేపుకు తన దయను
చూపెడ్తూనే ఉన్నాడు. కొన్నాళ్లయ్యేటప్పటికి చెర
సాల కాపలాదారుల నాయకునికి యోసేపు అంటే
ఇష్టం కలిగింది. 22కాపలాదారుల అధిపతి ఖైదీలందరి
మీద యోసేపును నాయకునిగా ఉంచాడు. యోసేపు
వారికి నాయకుడు, అయినప్పటికీ వారు చేసిన పనులే
అతడు కూడా చేసాడు. 23చెరసాలలో ఉన్న ప్రతిదాని
విషయంలోను ఆ కాపలాదారుల నాయకుడు యోసే
పును నమ్మాడు. యెహోవా యోసేపుతో ఉన్నందు
చేత ఇలా జరిగింది. యోసేపు చేసే ప్రతి పనిలో
అతనికి కార్యసాధన కలిగేటట్టు యెహోవా యోసే
పుకు సహాయం చేసాడు.

### యోసేపు కలల భావం చెప్పటం

40 ఆ తరువాత ఫరో సేవకులు ఇద్దరు ఫరోకు
అపకారం చేసారు. ఆ సేవకుల్లో ఒకడు
రొట్టెలు కాల్చేవాడు. మరొకడు ద్రాక్షా పాత్రలు అందిం
చేవారి పెద్ద. 2వంటల పెద్ద, ద్రాక్షా పాత్రల, పెద్ద
మీద ఫరోకు కోపం వచ్చింది. 3కనుక వారిని కూడా
యోసేపు ఉన్న చెరసాలలోనే వేయించాడు ఫరో
రాజు సంరక్షకుల అధికారియైన పోతీఫరు ఈ చెరసాల
అధికారి. 4ఈ ఇద్దరు ఖైదీలను యోసేపు బాధ్యతకు
అప్పగించాడు అధికారి. ఆ ఇద్దరు మనుష్యులు కొన్నాళ్ల
వరకు అలా జైల్లోనే ఉన్నారు. 5ఒక రాత్రి ఆ ఇద్దరు
ఖైదీలకు కలలు వచ్చాయి. (ఆ ఇద్దరు ఖైదీలు ఈజిప్టు
రాజు సేవకులు - ఒకడు రొట్టెలు కాల్చేవాడు, మరొ
కడు ద్రాక్షా పాత్రల పెద్ద). ఒక్కో ఖైదీకి ఒక్కో కల
వచ్చింది. ఒక్కో కలకు ఒక్కో భావం ఉంది. 6మర్నాడు
ఉదయం యోసేపు వాళ్ల దగ్గరకు వెళ్లాడు. ఆ ఇద్దరు
మనుష్యులు ఏదో చింతిస్తున్నట్టు యోసేపు గమ
నించాడు. 7“ఏమిటి, ఈ వేళ మీరు చాలా చింతిస్తు
న్నట్టు కనబడు తున్నారు?” అని వారిని అడిగాడు
యోసేపు.
8“రాత్రి మాకు కలలు వచ్చాయి కాని మేము
కన్న కల మాకు అర్థం కాలేదు. ఆ కలలు ఏమిటో,
వాటి భావం ఏమిటో మాకు వివరించే వాళ్లెవరూ
లేరు” అని వాళ్లిద్దరు జవాబిచ్చారు.

యోసేపు, "కలలను తెలిసికొని, వాటి భావం చెప్ప
గలవాడు దేవుడు మాత్రమే కనుక దయచేసి మీ కలలు
నాకు చెప్పండి" అని వారితో అన్నాడు.

## ద్రాక్షా పాత్ర అందించే సేవకుని కల

9కనుక ద్రాక్షా పాత్రల సేవకుడు యోసేపుతో
తన కల చెప్పాడు. ఆ సేవకుడు ఇలా చెప్పాడు: "నా
కలలో ఒక ద్రాక్షావల్లి కనబడింది. 10ఆ ద్రాక్షావల్లికి
మూడు తీగెలున్నాయి. నేను చూస్తుండగా ఆ తీగెలకు
పూలు పూసి, ద్రాక్షాగెలలు అయ్యాయి. 11నేను ఫరో
పాత్ర పట్టుకొని ఉన్నాను. కనుక నేను ఆ ద్రాక్షాలను
తీసుకొని ఆ పాత్రలో వాటి రసం పిండాను. అప్పుడు
ఆ పాత్ర నేను ఫరోకు ఇచ్చాను."
12అప్పుడు యోసేపు అన్నాడు: "ఆ కలను నీకు
నేను వివరిస్తాను. మూడు కొమ్మలంటే మూడు
రోజులు. 13మూడు రోజులు గతించక ముందే ఫరో
నిన్ను క్షమించి, నిన్ను మళ్లీ నీ పని చేసుకోనిస్తాడు.
ఇది వరకు నీవు ఫరో దగ్గర చేసిన పని నీవు మళ్లీ
చేస్తావు. 14నీకు విడుదల అయింతర్వాత నన్ను జ్ఞాపకం
చేసుకో. నా మీద దయ ఉంచి, నాకు సహాయం
చేయి. నాకుగూడ ఈ చెరసాలలో నుంచి విముక్తి
కలిగేటట్టు నా గురించి ఫరోతో చెప్పు. 15నన్ను
అన్యాయంగా బలవంతంగా నాయింటినుండి నా ప్రజ
లైన హెబ్రూలనుండి తీసుకొనివచ్చారు. నేనేమి తప్పు
చేయలేదు. అందుచేత నేను ఈ చెరసాలలో
ఉండకూడదు."

## రొట్టెలు కాల్చేవాని కల

16మరో సేవకుని కల బాగున్నట్టు రొట్టెలు కాల్చే
వాడికి తోచింది. వాడు యోసేపుతో అన్నాడు,
"నాకూ ఒక కల వచ్చింది. నా తలమీద రొట్టెల
బుట్టలు మూడు ఉన్నట్టు నాకు కనబడింది. 17పైబు
ట్టలో అన్ని రకాల కాల్చిన ఆహారాలు ఉన్నాయి. ఈ
భోజనం రాజుగారి కోసం. కాని పక్షులు ఈ భోజనాన్ని
తినేస్తున్నాయి."
18యోసేపు జవాబిచ్చాడు: "ఈ కల అర్థం ఏమిటో
నీకు నేను చెబుతాను. మూడు బుట్టలు అంటే మూడు
రోజులు. 19మూడు రోజులు గడవక ముందే రాజుగారు
నిన్ను ఈ చెరసాలలోనుంచి విడుదల చేస్తారు. తర్వాత
రాజుగారు నీ తల నరికేస్తాడు, నీ శరీరాన్ని ఒక స్తంభానికి
వేలాడదీస్తాడు, పక్షులు నీ శరీరాన్ని తినివేస్తాయి."

## యోసేపును మర్చిపోవటం

20మూడు రోజుల తర్వాత రాజుగారి పుట్టిన రోజు
వచ్చింది. ఫరో తన సేవకులందరికీ ఒక విందు చేసాడు.
ఆ విందులో ఫరో తన రొట్టెలు కాల్చేవాడిని, ద్రాక్షా
పాత్రల సేవకుణ్ణి చెరసాలలోనుంచి బయటకు రప్పిం
చాడు. 21ద్రాక్షాపాత్రల సేవకుడ్ని ఫరో విడుదల
చేసాడు. అతని ఉద్యోగం మరల ఫరో అతనికి ఇచ్చాడు.
ద్రాక్షా పాత్రల సేవకుడు ద్రాక్షారసపు పాత్ర ఒకటి
ఫరో చేతికి అందించాడు.
22కానీ ఫరో రొట్టెలు కాల్చే వాడిని చంపేసాడు.
ఎలా జరుగుతుందని యోసేపు చెప్పాడో అంతా అలాగే
జరిగింది. 23అయితే ద్రాక్షా పాత్రల సేవకుడు
యోసేపుకు సహాయం చెయ్యటం మరిచిపోయాడు.
యోసేపు విషయం ఫరోతో అతడేమీ చెప్పలేదు.
ద్రాక్షాపాత్రల సేవకుడు యోసేపును గూర్చి మర్చి
పోయాడు.

## ఫరో కలలు

41 రెండు సంవత్సరాల తర్వాత ఫరోకు ఒక కల
వచ్చింది. ఫరో నైలునది ప్రక్కగా నిలబడి
నట్టు అతనికి కల వచ్చింది. 2అప్పుడు ఏడు ఆవులు
నదిలోనుంచి బయటకు రావటం ఫరో చూశాడు.
ఆవులు బలిసి అందంగా ఉన్నాయి. ఆవులు అక్కడ
నిలబడి గడ్డి తింటున్నాయి. 3అప్పుడు ఇంక ఏడు
ఆవులు నదిలోనుంచి బయటకు వచ్చాయి. కానీ
ఈ ఆవులు చిక్కిపోయి, బక్కగా ఉన్నాయి. అందంగా
ఉన్న ఏడు ఆవుల ప్రక్కగా ఈ ఏడు ఆవులు నిల
బడ్డాయి. 4అసహ్యంగా ఉన్న ఏడు ఆవులు అందంగా
బలిసి ఉన్న ఏడు ఆవులను తినివేసాయి. అంతలో
ఫరో మేల్కొన్నాడు.
5ఫరో మరల నిద్రపోగా రెండవసారి కల వచ్చింది.
ఒకే ధాన్యపు మొక్కకు ఏడు వెన్నులు పెరగటం అతడు
తన కలలో చూశాడు. ఆ ధాన్యపు గింజలు బలంగా,
బాగుండటం అతడు చూశాడు.
6తర్వాత అదే ధాన్యపు మొక్కకు మరో ఏడు
వెన్నులు పెరగటం అతడు చూశాడు. అయితే ఈ
వెన్నులు పీలగా ఉండి, వేడి గాడ్పులకు పాడై
పోయాయి.
7అప్పుడు పీలగా ఉన్న వెన్నులు, బలంగా బాగున్న
వెన్నులను తినివేసాయి. ఫరోకు మరల మెళుకువ
వచ్చింది. అదంతా కల మాత్రమేనని ఫరో గ్రహించాడు.
8మర్నాడు ఉదయం ఆ కలల విషయమై ఫరోకు కల
వరం కలిగింది. కనుక అతడు ఈజిప్టులోని మంత్ర
గాళ్లందరిని పిలిపించాడు. విద్వాంసులందరిని అతడు
పిలిపించాడు. ఆ కలను గూర్చి ఫరో వాళ్లతో చెప్పాడు.
అయితే వాళ్లలో ఒక్కడు కూడా ఆ కలను వివరించ
లేకపోయారు, దాని భావం చెప్పలేకపోయారు.

## సేవకుడు యోసేపును గూర్చి ఫరోతో చెప్పటం

9అప్పుడు ద్రాక్షాపాత్రల సేవకునికి యోసేపు
జ్ఞాపకం వచ్చాడు. ఆ సేవకుడు ఫరోతో ఇలా చెప్పాడు:
"నాకు జరిగిన ఒక విషయం జ్ఞాపకం వస్తుంది. 10నా
మీద, మరో సేవకుని మీద తమరికి కోపం వచ్చింది.

మీరు మమ్మల్ని చెరసాలలో వేసారు. 11చెరసాలలో
మా యిద్దరికీ ఒకే రాత్రి కల వచ్చింది. ఒక్కో కలకు
ఒక్కో అర్థం ఉంది. 12హెబ్రీ యువకుడు ఒకడు
మాతో బాటు ఆ చెరసాలలోనే ఉన్నాడు. రాజు సంరక్షక
ధళాధిపతికి అతడు సేవకుడు. మేము మా కలలు
అతనితో చెబితే, అతడు వాటిని మాకు వివరించాడు.
ఒక్కో కల అర్థం అతడు మాకు చెప్పాడు. 13అతడు
చెప్పిన అర్థాలు సత్యం. నాకు విడుదల అవుతుందని,
నా పాత ఉద్యోగం మళ్లీ నాకు లభిస్తుందని అతడు
నాకు చెప్పాడు. అది సత్యమే. వంటల పెద్ద మరణి
స్తాడని అతడు చెప్పాడు, అదీ సత్యమే."

## కలల భావం చెప్పేందుకు యోసేపును పిల్చారు

14కనుక ఫరో చెరసాలలోనుంచి యోసేపును పిలి
పించాడు. సంరక్షకులు వెంటనే యోసేపును చెరసాల
లోనుంచి తీసుకొని వచ్చారు. యోసేపు క్షవరం చేసు
కొని శుభ్రమైన బట్టలు వేసుకొన్నాడు. అప్పుడు
అతడు వెళ్లి ఫరో ముందర నిలవబడ్డాడు. 15అప్పుడు
ఫరో "నాకో కలవచ్చింది, అయితే ఆ కలను నాకు
వివరించగల వాళ్లు ఒక్కళ్లూ లేరు. ఎవరైనా వారి కల
నీతో చెబితే నీవు వాటిని వివరించి, భావంకూడ చెప్ప
గలవని నేను విన్నాను" అని యోసేపుతో అన్నాడు.
16యోసేపు, "కలలను గ్రహించటంలో నా
నైపుణ్యం ఏమీ లేదు. ఆ శక్తి దేవుడికే ఉంది. కనుక
దేవుడే ఫరోకుగూడ ఈ పని చేసి పెడ్తాడు" అని
జవాబిచ్చాడు. 17అప్పుడు ఫరో యోసేపుతో
చెప్పాడు: "నా కలలో నేను నైలునది పక్కగా
నిలబడ్డాను. 18ఆ నది లోనుంచి ఏడు ఆవులు
బయటకు వచ్చి గడ్డి మేయటం నేను చూశాను. ఈ
ఆవులు బలిసి, అందంగా ఉన్నాయి. 19అప్పుడు మరో
ఏడు ఆవులు నదిలో నుంచి రావటం నేను చూశాను.
ఈ ఆవులు బక్కచిక్కి రోగిష్టివిగా ఉన్నాయి. ఈజిప్టు
దేశం మొత్తంలో నేను చూసిన ఆవుల్లో అవి పరమ
అసహ్యంగా ఉన్నాయి. 20అసహ్యమైన ఈ ఏడు ఆవులు
ముందు వచ్చిన అందమైన ఏడు ఆవులను తినివేసాయి.
21అయితే ఆ ఏడు ఆవులను తినివేసిన తర్వాత కూడ
అవి ఇంకా బక్కచిక్కి ఉన్నాయి. వాటిని చూస్తే, అవి
ఏడు ఆవులను తిన్న వాటిల్లాగ అగుపించవు. ముందు
అవి ఎంత బక్కగా అసహ్యంగా ఉన్నాయో యిప్పుడూ
అలానే కనబడ్డాయి. అప్పుడు నేను మేల్కొన్నాను."
22"తర్వాత నాకు వచ్చిన మరో కలలో ఒకే ధాన్యపు
మొక్కకు ఏడు వెన్నులు పెరగటం నేను చూశాను.
ఆ వెన్నులు నిండుగా, చక్కగా, అందంగా ఉన్నాయి.
23తర్వాత వాటికి యింకా ఏడు వెన్నులు పెరిగాయి.
కానీ ఆ వెన్నులు పీలగా, అసహ్యంగా ఉండి, వేడి
గాడ్పులకు పాడైపోయాయి. 24అప్పుడు ఏడు మంచి
వెన్నులను పీల వెన్నులు తినివేసాయి.
మంత్రాలు తెలిసిన నా మనుష్యులకు, విద్వాం
సులకు నేను ఈ కల చెప్పాను. కానీ ఎవ్వరూ ఆ
కలను వివరించలేక పోతున్నారు. ఏమిటి దీని భావం?"

## కల భావం యోసేపు వివరిస్తాడు

25అప్పుడు ఫరోతో యోసేపు ఇలా చెప్పాడు:
"ఈ రెండు కలల భావం ఒక్కటే. ఏమి చేయనున్నాడో
అది దేవుడు మీతో చెబుతున్నాడు. 26ఏడు మంచి
ఆవులు ఏడు సంవత్సరాలు. ఏడు మంచి ధాన్యపు
వెన్నులు ఏడు సంవత్సరాలు. రెండు కలల్లోని సంగతి
ఒక్కటే. 27బక్కచిక్కి ఉన్న ఏడు ఆవులు, పీలగా
ఉన్న ఏడు ధాన్యపు వెన్నులు కూడ, ఏడు అంటే,
అవి ఈ దేశంలో ఏడు ఆకలి సంవత్సరాలు. ఏడు
మంచి సంవత్సరాల తర్వాత ఈ ఏడు సంవత్సరాలు
వస్తాయి. 28త్వరలో ఏమి జరుగుతుందో దాన్ని దేవుడు
మీకు చూపెట్టాడు. నేను చెప్పినట్టే ఇది జరుగుతుంది.
29ఈజిప్టు దేశమంతటా ఏడేళ్లపాటు మంచి పంటలు
పండి తినటానికి సమృద్ధిగా ఉంటుంది. 30అయితే ఆ
ఏడు సంవత్సరాల తర్వాత, దేశమంతటా కరువు సంవ
త్సరాలు ఏడు వస్తాయి. ఈజిప్టులో పండిన పంట
ఎంత ఉన్నదానిని మరచిపోతారు. ఈ ఆకలి దేశాన్ని
నాశనం చేస్తుంది. 31సమృద్ధిగా భోజనం చేయటం
అంటే ఏమిటో ప్రజలు మరచిపోతారు.
32"ఫరోగారూ, ఒకే విషయాన్ని గూర్చి మీకు రెండు
కలలు ఎందుకు వచ్చాయి? దేవుడు తప్పక జరిపి
స్తాడని చూపించేందుకు ఇలా జరిగింది. అదీ త్వరలోనే
దేవుడు జరిగిస్తాడని సూచిస్తోంది. 33కనుక ఓ ఫరో,
చాలా తెలివి, జ్ఞానం ఉన్న ఒక మనిషిని మీరు ఏర్పాటు
చేసుకోవాలి. ఆ మనిషిని ఈజిప్టు దేశం అంతటిమీద
అధికారిగా మీరు నియమించాలి. 34ఆ తర్వాత ప్రజల
దగ్గర్నుండి ధాన్యం సేకరించేందుకు మరికొందర్ని
మీరు నియమించాలి. ప్రతీ వ్యక్తి ఏడు మంచి సంవత్స
రాల్లో పండించే మంచి పంటలో అయిదవ భాగం
ఇవ్వాలి. 35రాబోయే మంచి సంవత్సరాల కాలంలో
ఈ ధాన్యం అంతా సేకరించమని ఈ మనుష్యులకు
ఆజ్ఞాపించండి. ఈ ధాన్యం పట్టణాల్లో భద్రం చేయటా
నికి వాళ్లకు అధికారం ఉందని ఈ మనుష్యులకు
చెప్పండి. తర్వాత ఆ ధాన్యం అవసరం వచ్చేంతవరకు
వారు దాన్ని కాపాడాలి. ఫరో! ఈ విధంగా ఆ ఆహారం
మీ అధీనంలో ఉంటుంది. 36ఈజిప్టు దేశంలో వచ్చే
ఏడు ఆకలి సంవత్సరాల్లో ఈ ధాన్యం సహాయపడు
తుంది. అప్పుడు ఈజిప్టు ప్రజలు ఆ ఏడు సంవత్సరాల్లో
కరువు కారణంగా మరణించరు."
37ఇది చాలా చక్కని తలంపులా కనబడింది ఫరోకు.
అతని సేవకులంతా ఒప్పుకొన్నారు. 38"ఈ పని చేసేం
దుకు యోసేపు కంటే మంచివాడ్ని ఇంకెవరినైనా
మీరు కనుగొనగలరా? దేవుని ఆత్మ మూలంగా ఇతడు

నిజంగా జ్ఞాని" అని ఫరో తన సేవకులతో చెప్పాడు.
39కనుక ఫరో, "వీటన్నింటిని దేవుడే నీకు చూపె
ట్టాడు కనుక నీవు అందరిలో మహా జ్ఞానివై ఉండాలి.
40అంచేత నిన్నే ఈ దేశం మీద అధిపతిగా నేను
చేస్తాను. ప్రజలు నీ ఆజ్ఞలన్నింటికి విధేయులవుతారు.
ఈ దేశంలో నేను ఒక్కడిన్ని మాత్రమే నీకంటె గొప్ప
అధికారిగా ఉంటాను" అని యోసేపుతో చెప్పాడు.
41(ఫరో యోసేపును రాజ్యపాలకునిగా నియమిం
చినప్పుడు ప్రత్యేక సమావేశం మరియు ఊరేగింపు
వుండినవి.) అప్పుడు ఫరో, "ఇప్పుడు ఈజిప్టు దేశం
అంతటి మీద నిన్ను నేను పాలకునిగా నియమిస్తు
న్నాను" అని యోసేపుతో చెప్పాడు. 42అప్పుడు
ఫరో రాజముద్రగల తన ఉంగరాన్ని యోసేపుకు
ఇచ్చాడు. యోసేపు ధరించటానికి నాణ్యతగల ఒక
అంగీని అతడు ఇచ్చాడు. యోసేపు మెడలో ఒక
బంగారు గొలుసు ఫరో వేసాడు. 43రెండో రాజరథం
మీద తిరుగమని ఫరో యోసేపుతో చెప్పాడు. ప్రత్యేక
సంరక్షకులు అతని రథానికి ముందర నడిచారు.
"ప్రజలారా, యోసేపుకు సాష్టాంగపడండి" అంటూ
వాళ్లు ప్రజలను హెచ్చరించారు.
కనుక ఈజిప్టు దేశం అంతటి మీద యోసేపు
పాలకునిగా నియమించబడ్డాడు. 44అతనితో ఫరో
అన్నాడు: "నేను ఫరోను అంటే రాజును. కనుక నేను
ఏమి అయినా చేయాలనుకొంటే అది చేస్తాను. కానీ,
ఈజిప్టులో మరి ఏ వ్యక్తి అయినా నీవు చెప్పకుండ
ఒక చేయి ఎత్తకూడదు, కాలు కదపగూడదు."
45యోసేపుకు జప్నత్పనేహు అనే మరో పేరు ఫరో
పెట్టాడు. ఓను యాజకుడు పోతీఫెర కుమార్తె ఆసెన
తును యోసేపుకు భార్యగా ఫరో ఇచ్చాడు. కనుక
ఈజిప్టు దేశం అంతటిమీద యోసేపు పాలకు
డయ్యాడు.
46యోసేపు ఈజిప్టు రాజు కొలువులో పని
చేయడం మొదలు బెట్టినప్పుడు అతని వయస్సు 30
సంవత్సరాలు. యోసేపు ఈజిప్టు దేశం అంతటా
సంచారం చేసాడు. 47ఏడు మంచి సంవత్సరాల కాలం
లోనూ దేశంలో పంటలు బాగుగా పండాయి. 48ఆ
ఏడు సంవత్సరాల్లో యోసేపు చాలా ధాన్యం ఈజిప్టులో
పొదుపు చేసాడు. ఆహారాన్ని యోసేపు పట్టణాల్లో
భద్రపరచాడు. ప్రతి పట్టణం చుట్టు ప్రక్కల పండిన
పంటను ఆ పట్టణంలోనే యోసేపు భద్రపరచాడు.
49యోసేపు విస్తారంగా ధాన్యం చేర్చి పెట్టాడు.
సముద్రపు ఇసుకలా ఉంది అదంతాను. కొలి చేందుకు
గూడ వీలులేనంత విస్తారంగా ఉంది అతడు చేర్చిపెట్టిన
ధాన్యం.
50ఓను యాజకుడైన పొతీఫెర కుమార్తె అయిన
ఆసెనతు యోసేపుకు భార్య. మొదటి ఆకలి సంవ
త్సరం రాకముందే యోసేపు ఆసెనెతులకు ఇద్దరు
కుమారులు పుట్టారు. 51మొదటి కుమారుని పేరు
మనష్షే. "నా కష్టాలు అన్నింటినీ, నా ఇంటిని గూర్చిన
విషయాలన్నింటినీ నేను మరచిపోయేటట్టు దేవుడు
చేసాడు" అని అనుకొన్నాడు గనుక యోసేపు అతనికి
ఈ పేరు పెట్టాడు.
52యోసేపు తన రెండవ కుమారు నికి ఎఫ్రాయిము
అని పేరు పెట్టాడు. "నాకు ఎన్నో గొప్ప కష్టాలు
వచ్చాయి, గాని అన్ని విషయాల్లో దేవుడు నాకు
సాఫల్యాన్ని కార్యసాధనను కల్గించాడు" అని యోసేపు
అనుకొన్నాడు గనుక యోసేపు అతనికి ఈ పేరు
పెట్టాడు.

### ఆకలి కాలం మొదలవుట.

53ఏడు సంవత్సరాలపాటు ప్రజలు తినేందుకు అవస
రమైన ఆహారం అంతా వారికి ఉంది. కానీ ఆ సంవత్స
రాలన్నీ ముగిశాయి. అవసరమైనది అంతా పండింది.
54అయితే ఏడు సంవత్సరాల ఆకలి కాలం మొదల
యింది. సరిగ్గా యోసేపు చెప్పినట్టే ఇది జరిగింది.
అన్ని దేశాలలో, అంతట ఏ ఆహారం పండలేదు.
తినుటకు ప్రజలకు ఏమీ లేదు. కానీ యోసేపు ధాన్యం
భద్రపరచినందువల్ల ఈజిప్టులో ప్రజలు తినుటకు
సరిపడినంత ఉంది. 55కరువు కాలం ప్రారంభం కాగానే
ఆహారంకోసం ప్రజలు ఫరోకు మొరపెట్టారు. ఫరో,
"యోసేపును అడగండి. అతడు ఏమి చేయమంటే
అలా చేయండి" అని చెప్పాడు ఈజిప్టు ప్రజలతో.
56కనుక ఆ దేశంలో ఎక్కడ చూసినా కరువు
ప్రబలుతున్నప్పుడు, ధాన్యము భద్రపరచిన గదులలో
నుండి యోసేపు ప్రజలకు ధాన్యం ఇచ్చాడు. చేర్చి
పెట్టిన ధాన్యం ఈజిప్టు ప్రజలకు యోసేపు విక్రయిం
చాడు. ఈజిప్టులో కరువు చాలా భయంకరంగా ఉంది.
57ఈజిప్టు చుట్టుపక్కల దేశాల ప్రజలంతా ధాన్యం
కొనేందుకు ఈజిప్టు వచ్చారు. కరువు ఈజిప్టులోను,
మరి యితర ప్రాంతాలలోను ఎక్కువగా ఉంది. ఈజిప్టు
చుట్టుపక్కల దేశాలవారు యోసేపు దగ్గరకు వచ్చారు.

### కలలు నిజం అయ్యాయి

42 ఈ సమయంలో కనాను దేశంలోను కరువు
ప్రబలుతోంది. అయితే ఈజిప్టులో ధాన్యం
ఉన్నట్టు యాకోబు తెలుసుకొన్నాడు: కనుక
యాకోబు తన కుమారులతో ఇలా చెప్పాడు. "ఏమీ
చేయకుండా ఇక్కడ ఎందుకు మనం కూర్చోవటం?
2ఈజిప్టులో అమ్మకానికి ధాన్యం ఉన్నట్టు నేను
విన్నాను. అందుచేత మనం అక్కడికి వెళ్లి మనం
తినేందుకు ధాన్యం కొనుక్కోవాలి. అప్పుడు మనం
చావకుండా బతుకుతాం."
3కనుక యోసేపు సోదరులు పదిమంది ధాన్యం
కొనేందుకు ఈజిప్టు వెళ్లారు. 4బెన్యామీనును యాకోబు
పంపలేదు. (బెన్యామీను ఒక్కడే యోసేపుకు స్వంత

తమ్ముడు). బెన్యామీనుకు ఏదైనా కీడు సంభవి
స్తుందేమోనని యాకోబు భయపడ్డాడు.
5కనానులో కరువు కాలం చాలా దారుణంగా ఉంది.
ధాన్యం కొనుగోలు చేసేందుకు ఎంతోమంది ప్రజలు
కనానునుండి ఈజిప్టు వెళ్లారు. వారిలో ఇశ్రాయేలు
కుమారులుకూడ ఉన్నారు.
6ఆ సమయంలో ఈజిప్టు అంతటిమీద యోసేపు
పాలకుడు. ఈజిప్టుకు వచ్చిన ప్రజలకు ధాన్యం
అమ్మకం చేసేందుకు గాను నియమింపబడిన అధికారి
యోసేపు. అయితే యోసేపు సోదరులు అతని దగ్గరకు
వచ్చి అతని ఎదుట సాష్టాంగపడ్డారు. 7యోసేపు తన
సోదరులను చూసాడు, వారెవరయిందీ అతనికి
తెలుసు, కానీ యోసేపు వారిని ఎరుగనట్టే వారితో
మాట్లాడాడు. అతడు వారితో కఠినంగా మాట్లాడాడు.
"ఎక్కడనుండి వచ్చారు మీరు?" అని అతడు అడిగాడు.
ఆ సోదరులు "మేము కనాను దేశంనుండి వచ్చాం.
ఆహారం కొనేందుకు మేము వచ్చాం" అని జవా
బిచ్చారు. 8ఈ మనుష్యులు తన సోదరులని
యోసేపుకు తెలుసును. కానీ అతను ఎవరయిందీ
వారికి తెలియదు. 9అతని అన్నల విషయంలో అతనికి
వచ్చిన కలలను యోసేపు జ్ఞాపకం చేసుకొన్నాడు.

**యోసేపు తన అన్నలను గూఢచారులు అన్నాడు**

యోసేపు తన అన్నలతో, "మీరు ఆహారం కొనేం
దుకు రాలేదు. మీరు గూఢచారులు. మా బలహీనతలు
తెలుసుకొనేందుకే మీరు వచ్చారు" అన్నాడు.
10అయితే ఆ సోదరులు, "లేదండి అయ్యా, మీ
సేవకులంగా మేము వచ్చాం. ఆహారం కొనేందుకు
మాత్రమే మేం వచ్చాం. 11మేమంతా అన్నదమ్ములం
మా అందరి తండ్రి ఒక్కడే. మేము నిజాయితీగల
మనుష్యులం, మేము గూఢచారులం కాము. ఆహారం
కొనేందుకు మాత్రమే మేం వచ్చాం" అని అతనితో
చెప్పారు. 12అప్పుడు యోసేపు, "లేదు, లేదు, ఏ
విషయంలో మేం బలహీనులమో తెలుసుకొనేందుకే
మీరు వచ్చారు" అన్నాడు వారితో.
13ఆ సోదరులు అన్నారు: "లేదు, మేమంతా అన్నద
మ్ములం. మా కుటుంబంలో మొత్తం పన్నెండుమంది
సోదరులం. మా అందరికీ తండ్రి ఒక్కడే. మా అంద
రిలో చిన్న తమ్ముడు ఇంకా ఇంటి దగ్గర మా తండ్రి
తోనే ఉన్నాడు. మరో తమ్ముడు చాలకాలం క్రిందటే
చనిపోయాడు. మీ ముందర మేం సేవకుల్లాంటి వాళ్లం.
మేము కనాను దేశం వాళ్లం."
14అయితే యోసేపు వారితో ఇలా అన్నాడు:
"లేదు, నేను అన్నదే సరియైనట్టు నాకు తెలుస్తోంది.
మీరు గూఢచారులు. 15అయితే మీరు సత్యమే చెబుతు
న్నట్టు మిమ్మల్ని రుజువు చేయనిస్తాను. మీ చిన్నత
మ్ముడు ఇక్కడికి వచ్చేంతవరకు మిమ్మల్ని వదలి
పెట్టనని ఫరో పేరు మీద ప్రమాణం చేసి, చెబుతు
న్నాను మిమ్మల్ని వదలిపెట్టనని. 16కనుక మీలో ఒకరు
తిరిగి వెళ్లి మీ చిన్న తమ్ముడ్ని ఇక్కడికి తీసుకొని
రావాలి. అంతవరకు మిగిలిన వారు ఇక్కడే జైల్లో
ఉండాలి. మీరు సత్యం చెబుతున్నారో లేదో మేం
చూస్తాం. అయితే మీరు గూఢచారులనే నా నమ్మకం."
17తర్వాత యోసేపు వాళ్లందర్నీ మూడు రోజుల
పాటు చెరసాలలో పెట్టాడు.

**షిమ్యోను బందీగా వుంచబడుట.**

18మూడు రోజుల తర్వాత వారితో యోసేపు
ఇలా అన్నాడు, "నేను దేవునికి భయపడేవాణ్ణి. అంచేత
మీరు సత్యమే చెబుతున్నారని రుజువు చేసేందుకు
మీకు ఒక అవకాశం ఇస్తాను. ఇలా మీరు చేస్తే నేను
మిమ్మల్ని బతకనిస్తాను. 19మీరు నమ్మకమైన మనుష్య
లైతే, మీ సోదరులలో ఒకరు ఇక్కడ జైల్లో ఉండాలి.
మిగిలినవారు మీ వాళ్లకోసం ధాన్యం తీసికొని
వెళ్లవచ్చు. 20అప్పుడు మీ చిన్న తమ్ముడ్ని ఇక్కడికి
తీసుకొని రండి. ఈ విధంగా, మీరు సత్యం చెబుతు
న్నారేమో నేను తెలుసుకొంటాను."
ఆ సోదరులు దీనికి ఒప్పుకొన్నారు. 21"మన చిన్న
తమ్ముడికి మనం చేసిన కీడు మూలంగా శిక్ష అనుభ
విస్తున్నాం. అతడు కష్టంతో ఉండటం మనం కళ్లారా
చూశాం. రక్షించమని అతడు మనల్ని బతిమలాడాడు.
కానీ వినటానికి గూడ మనం నిరాకరించాం. అందుకే
ఇప్పుడు మనం కష్ట పడుతున్నాం" అని వాళ్లలో వారు
చెప్పుకొన్నారు. 22అప్పుడు రూబేను, "ఆ పిల్లవానికి
మీరేమీ కీడు చేయకండి అని నేను మీతో చెప్పాను
కాని మీరు నా మాట వినకపోయారు. కనుక అతని
మరణం మూలంగానే ఇప్పుడు మనం శిక్ష పొందు
తున్నాం," అని వాళ్లతో చెప్పాడు.
23యోసేపు తన సోదరులతో మాట్లాడేందుకు ఒక
అనువాదకుడ్ని వాడుకొన్నాడు. అందుచేత వారి భాష
యోసేపు గ్రహించినట్లు ఆ సోదరులకు తెలియదు.
కానీ వారు చెప్పిన ప్రతి మాటా యోసేపు విని,
గ్రహించాడు. 24వారి మాటలు యోసేపుకు చాలా
దుఃఖం కలిగించాయి. అందుచేత యోసేపు వాళ్లను
విడిచి వెళ్లి ఏడ్చేసాడు. కొంచెం సేపయ్యాక యోసేపు
మళ్లీ వాళ్ల దగ్గరకు వెళ్లాడు. అతడు ఆ సోదరులలో
ఒకడైన షిమ్యోనును పట్టుకొని మిగిలిన సోదరులు
చూస్తుండగానే కట్టివేసాడు. 25వారి సంచులను
ధాన్యంతో నింపమని కొందరు సేవకులతో యోసేపు
చెప్పాడు. ఈ ధాన్యం కోసం ఆ సోదరులు యోసేపుకు
సొమ్ము చెల్లించారు. కానీ యోసేపు ఆ డబ్బు ఉంచు
కోలేదు. ఆ డబ్బును తిరిగి వారి సంచుల్లోనే పెట్టేసాడు
యోసేపు. అప్పుడు వారి ప్రయాణానికి అవసరమైన
వాటన్నింటిని యోసేపు వారికి ఇచ్చాడు.

26కనుక ఆ సోదరులు ఆ ధాన్యం గాడిదలమీద
వేసుకొని వెళ్లిపోయారు. 27ఆ సోదరులు ఆ రాత్రి
ఒకచోట బస చేసారు. ఆ సోదరులలో ఒకడు కొంచెం
ధాన్యం తన గాడిద కోసమని తన సంచి తెరిచాడు.
అతని డబ్బు అతని సంచిలోనే కనబడింది.
28అతడు, "చూడండి, ధాన్యంకోసం నేను చెల్లించిన
డబ్బు ఇదిగో. ఈ డబ్బును ఎవరో మళ్లీ నా సంచిలో
పెట్టే సారు" అని మిగతా సోదరులతో చెప్పాడు. ఆ
సోదరులకు చాలా భయం వేసింది. "దేవుడు మనకు
ఏం చేస్తున్నాడు?" అని ఒకరితో ఒకరు చెప్పు
కున్నారు.

## ఆ సోదరులు యాకోబుతో చెప్పటం

29ఈ సోదరులు కనాను దేశంలో ఉన్న తమ తండ్రి
యాకోబు దగ్గరకు వెళ్లారు. జరిగిన విషయాలన్నీ
యాకోబుతో చెప్పారు. 30వాళ్లు ఇలా చెప్పారు: "ఆ
దేశ పాలకుడు మాతో కఠినంగా మాట్లాడాడు. మేము
అక్కడి ప్రజల్ని నాశనం చేయాలనుకొనే గూఢచారు
లమని అనుకొన్నాడు అతడు. 31కానీ మేము నిజాయితీ
పరులం అని, గూఢచారులకు చెందినవాళ్లం కాదని
మేము చెప్పాం. 32మేము పన్నెండుమంది సోదరులం
అని చెప్పాం. కనానులో ఇంటి దగ్గర మా తండ్రితో
మా చిన్న తమ్ముడు ఒకడు ఉన్నాడని మరియు మా
మరియొక చిన్న తమ్ముడు ఒకడు చనిపోయాడని
మేము అతనితో చెప్పాం.
33"అప్పుడు, ఆ దేశపాలకుడు మాతో ఇలా
అన్నాడు: 'మీరు నమ్మకమైన వాళ్లని రుజువు చేయ
టానికి ఇదొక మార్గం. మీ సోదరులలో ఒకడ్ని నా
దగ్గర ఉంచండి. మీ ధాన్యం మీ కుటుంబాలకు తీసుకొని
వెళ్లండి. 34తర్వాత మీ కనిష్ఠ సోదరుడ్ని నా దగ్గరకు
తీసుకొని రండి. అప్పుడు నిజంగా మీరు నిజాయితీ
పరులో, లేక మమ్మల్ని నాశనం చేసేందుకు పంపబడిన
గూఢచారులో నాకు తెలుస్తుంది. మీరు చెప్పేది నిజ
మైతే మీ సోదరుడ్ని మళ్లీ మీకు అప్పగిస్తాను. అతణ్ణి
మీకు అప్పగిస్తాను, మా దేశంలో మీరు స్వేచ్ఛగా
ధాన్యం కొనుక్కోవచ్చు.'" 35అప్పుడు ఆ సోదరులు
వారి సంచుల్లో నుండి ధాన్యం తీయటానికి వెళ్లగా
వారిలో ప్రతి సోదరునికి తన ధాన్యపు సంచిలో తన
డబ్బు సంచి కనిపించింది. ఆ సోదరులు, వారి తండ్రి
కూడ ఆ డబ్బును చూచి చాలా భయపడిపోయారు.
36యాకోబు, "నేను నా పిల్లలందర్నీ పోగొట్టు
కోవాలని మీరు అనుకొంటున్నారా? యోసేపు
పోయాడు. షిమ్యోను పోయాడు. ఇప్పుడు బెన్యామీను
నుగూడ మీరు తీసుకొని పోవాలనుకొంటున్నారు" అని
వాళ్లతో అన్నాడు.
37అప్పుడు రూబేను, "నాయనా, బెన్యామీనును
గనుక నేను తిరిగి నీ దగ్గరకు తీసుకొని రాకపోతే, నా
ఇద్దరు కుమారులను నీవు చంపేసేయ్. నన్ను నమ్ము.
బెన్యామీనును నేను మళ్లీ నీ దగ్గరకు తీసుకొని వస్తాను"
అని తన తండ్రితో చెప్పాడు. 38అయితే యాకోబు
చెప్పాడు: "బెన్యామీనును మీతో నేను వెళ్లనివ్వను.
అతని సోదరుడు మరణించాడు, నా భార్య రాహేలు
కుమారులలో ఇతను ఒక్కడే మిగిలాడు. ఈజిప్టు
ప్రయాణంలో ఇతనికి ఏమైనా సంభవిస్తే నేను
చచ్చిపోతాను. నా వృద్ధాప్యంలో దుఃఖంతోనే మీరు
నన్ను సమాధికి పంపిస్తారు."

## బెన్యామీను వెళ్లటానికి యాకోబు ఒప్పుకోవటం

43 దేశంలో కరువు కాలం చాలా దారుణంగా
ఉంది. అక్కడ ఎలాంటి ఆహారం పండటం
లేదు. 2ప్రజలు ఈజిప్టునుండి తెచ్చుకొన్న ధాన్యం
అంతా తినేసారు. ధాన్యం అయిపోయినప్పుడు, "మళ్లీ
ఈజిప్టు వెళ్లి, మనం తినేందుకు మరింత ధాన్యం
కొనండి" అని యాకోబు తన కుమారులతో
చెప్పాడు.
3అయితే యాకోబుతో యూదా చెప్పాడు: "ఆ
దేశ పాలకుడు మమ్మల్ని హెచ్చరించాడు. మీ సోద
రుడ్ని మీరు నా దగ్గరకు తీసుకొని రాకపోతే నేను
మీతో మాట్లాడను. 4బెన్యామీనును నీవు మాతో
పంపిస్తేనే మేము వెళ్లి ధాన్యం కొంటాం. 5కానీ బెన్యా
మీనును పంపించేందుకు నీవు ఒప్పుకొనకపోతే మేం
వెళ్లం. అతడు లేకుండా తిరిగి రావద్దని ఆయన
మమ్మల్ని హెచ్చరించాడు."
6"మీకు ఇంకో సోదరుడు ఉన్నాడని అసలు మీరెం
దుకు చెప్పారు? ఇంత కీడు మీరెందుకు నాకు
చేసారు?" ఇశ్రాయేలు (యాకోబు) అడిగాడు.
7ఆ సోదరులు జవాబు చెప్పారు: "ఆ మనిషి
మమ్మల్ని అనేక ప్రశ్నలు వేశాడు. మా విషయం,
మా కుటుంబం విషయం అతడు తెలుసుకోవాలను
కున్నాడు, 'మీ తండ్రి ఇంకా బతికే ఉన్నాడా? ఇంటి
దగ్గర మీకు ఇంకో సోదరుడు ఉన్నాడా?' అని అతడు
మమ్మల్ని అడిగాడు. అతని ప్రశ్నలకు మాత్రమే మేము
జవాబిచ్చాం. మా మిగిలిన సోదరునికూడ తన దగ్గరకు
తీసుకొని రమ్మంటాడని మాకు తెలియదు!"
8అప్పుడు యూదా తన తండ్రి ఇశ్రాయేలుతో
ఇలా చెప్పాడు: "బెన్యామీనును నాతో పంపించు. అతని
విషయం నేను జాగ్రత్తగా చూసుకొంటాను. మేము
మాత్రం ఈజిప్టు వెళ్లాలి, ఆహారం తీసుకురావాలి. మేము
వెళ్లకపోతే మనమూ, మన పిల్లలు అందరం చస్తాం.
9అతని క్షేమం నేను చూసుకొంటాను. అతని బాధ్యత
నాది. అతణ్ణి నేను తిరిగి నీ దగ్గరకు తీసుకొని రాకపోతే
శాశ్వతంగా నీవు నన్ను నిందించవచ్చు. 10నీవు
మమ్మల్ని వెళ్లనిచ్చి ఉంటే ఇప్పటికి రెండు సార్లు
వెళ్లి వచ్చే వాళ్లం."

11అప్పుడు వారి తండ్రి ఇశ్రాయేలు అన్నాడు: "ఇదే
గనుక నిజంగా సత్యమైతే, అలాగే బెన్యామీనును నీతో
తీసుకొని వెళ్లు. అయితే ఆ పాలకునికి కానుకలు
తీసుకొని వెళ్లు. మన దేశంలో మనం సంపాదించ గలి
గినవి కొన్ని తీసుకొని వెళ్లు. కొంచెం మస్తకి, కొంచెం
తేనె, సుగంధద్రవ్యాలు, బోళం, పిస్తాచ కాయలు,
బాదం కాయలు, అతనికి తీసుకొని వెళ్లండి. 12ఈ
సారి రెండంతల డబ్బు మీతో తీసుకు వెళ్లండి. పోయిన
సారి మీరు చెల్లించగా తిరిగి మీకు ఇవ్వబడిన సొమ్ము
మళ్లీ తీసుకు వెళ్లండి. ఒకవేళ ఆ పాలకుడు పొరబడ్డా
డేమో. 13బెన్యామీనును తీసుకొని ఆ మనిషి దగ్గరకు
తిరిగి వెళ్లు. 14మీరు ఆ పాలకుని ముందర నిలిచి
నప్పుడు సర్వశక్తిమంతుడైన దేవుడు మీకు సహాయం
చేయాలని నేను ప్రార్థన చేస్తాను. బెన్యామీను, షిమ్యో
నులను అతడు క్షేమంగా తిరిగి వెళ్లనిచ్చేటట్టు నేను
ప్రార్థన చేస్తాను. లేనట్లయితే నా కుమారుని పోగొట్టు
కొని నేను మరల దుఃఖంలో మునిగిపోతాను."

15కనుక ఆ పాలకుని కోసం కానుకలన్నీ తీసు
కొన్నారు ఆ సోదరులు. వారు మొదటిసారి తీసుకొని
వెళ్లిన దానికి రెట్టింపు సొమ్ము వారితో కూడా తీసుకొని
వెళ్లారు. బెన్యామీను ఆ సోదరులతో కలసి ఈజిప్టు
వెళ్లాడు.

### సోదరులకు యోసేపు ఇంటికి ఆహ్వానం

16ఈజిప్టులో, వారితోబాటు బెన్యామీను ఉండటం
యోసేపు చూశాడు. యోసేపు "ఆ మనుష్యుల్ని నా
ఇంటికి తీసుకొని రండి. ఒక పశువును చంపి వంట
చేయండి. ఈ వేళ మధ్యాహ్నం వాళ్లు నాతోనే భోజనం
చేస్తారు" అని తన గృహనిర్వాహకునితో చెప్పాడు.
17అతను చెప్పినట్టే ఆ సేవకుడు చేసాడు. అతడు
వాళ్లను యోసేపు ఇంటికి తీసుకొని వచ్చాడు.

18వాళ్లు యోసేపు ఇంటికి తీసుకొని రాబడి
నప్పుడు ఆ సోదరులు భయపడ్డారు. "పోయినసారి
మన సంచుల్లో డబ్బు ఉంచబడ్డందువల్లనే మనల్ని
ఇక్కడకు తీసుకు వచ్చారు. మనల్ని నేరస్తులుగా
నిరూపించటానికి దాన్ని వారు వినియోగిస్తారు. తర్వాత
మన గాడిదల్ని దొంగిలించి, మనల్ని బానిసలుగా
చేస్తారు" అని వారనుకొన్నారు.

19కనుక యోసేపు ఇంటికి బాధ్యుడైన వాని దగ్గరకు
ఆ సోదరులు వెళ్లారు. 20వారు చెప్పారు: "అయ్యా,
ప్రమాణం చేసి సత్యం చెబుతున్నాం. పోయినసారి
మేము వచ్చినప్పుడు ఆహారం కొనుగోలు చేసేందుకే
మేం వచ్చాం. 21-22ఇంటికి వెళ్తూ మార్గంలో మేము
మా సంచులు విప్పితే మా ప్రతి ఒక్కరి సంచిలోనూ
డబ్బు కనబడింది. ఆ డబ్బు అక్కడికి ఎలా వచ్చిందో
మాకు తెలియదు. అయితే ఆ డబ్బు మళ్లీ మీకు
ఇచ్చేయాలని ఇప్పుడు మాతో తెచ్చాం. పైగా
ఇప్పుడు మేము కొనాలనుకొంటున్న ధాన్యంకోసం
ఇంకా ఎక్కువ మొత్తంకూడ మళ్లీ ఇప్పుడు తెచ్చాం."

23అయితే ఆ సేవకుడు, "భయపడకండి, నన్ను
నమ్మండి. మీ దేవుడు, మీ తండ్రి దేవుడు ఆ డబ్బును
మీ సంచుల్లో కానుకగా పెట్టి ఉంటాడు. పోయిన
సారి మీరు ధాన్యంకోసం డబ్బును మీరు నాకే చెల్లించి
నట్టు నాకు గుర్తు" అని వారితో చెప్పాడు.

ఆ సేవకుడు షిమ్యోనును చెరసాలలోనుంచి బయ
టకు తీసుకొని వచ్చాడు.

24ఆ సేవకుడు వాళ్లందరిని యోసేపు ఇంటికి
తీసుకొని వెళ్లాడు. అతడు వారికి నీళ్లు ఇస్తే, వాళ్లు
కాళ్లు కడుక్కొన్నారు. తర్వాత అతడు వారి గాడిదలకు
మేత పెట్టాడు.

25ఆ సోదరులు తాము యోసేపుతోబాటు భోంచే
యబోతున్నట్టు విన్నారు. కనుక వారు అతనికోసం
తెచ్చిన కానుకల్ని మధ్యాహ్నంవరకు సిద్ధం చేసు
కొన్నారు.

26యోసేపు ఇంటికి వచ్చాడు, ఆ సోదరులు వారితో
తెచ్చిన కానుకలు అతనికి ఇచ్చారు. తర్వాత వారు
నేలమీద సాష్టాంగపడ్డారు.

27వారెలా ఉన్నారని యోసేపు వాళ్లను అడిగాడు,
"మీరు నాతో చెప్పిన మీ ముసలి తండ్రి క్షేమంగా
ఉన్నాడా? ఆయన ఇంకా బతికే ఉన్నాడా?" అన్నాడు
యోసేపు.

28ఆ సోదరులు, "అయ్యా, మా తండ్రి బాగున్నాడు.
ఆయన ఇంకా బతికి ఉన్నాడు" అని జవాబిచ్చారు.
మళ్లీ వాళ్లంతా యోసేపు ముందర సాష్టాంగపడ్డారు.

### యోసేపు తమ్ముడు బెన్యామీనును చూచుట

29అప్పుడు యోసేపు తన సోదరుడు బెన్యా
మీనును చూశాడు, (బెన్యామీను, యోసేపులు ఒక్క
తల్లి పిల్లలు). "మీరు నాతో చెప్పిన మీ కనిష్ఠ సోదరుడు
ఇతడేనా?" అని యోసేపు అడిగాడు. అప్పుడు
యోసేపు, "కుమారుడా, దేవుడు నిన్ను ఆశీర్వదించు
గాక!" అన్నాడు బెన్యామీనుతో.

30అప్పుడు యోసేపు ఆ గదిలోనుంచి పరుగెత్తి
పోయాడు. బెన్యామీను మీద తనకు ఉన్న ప్రేమను
అతనికి చూపెట్టాలని యోసేపు ఎంతో ఆశించాడు.
అతనికి ఏడ్చెయ్యాల నిపించింది గాని అతడు ఏడ్వటం
అతని సోదరులు చూడకూడదు అనుకొన్నాడు. కనుక
యోసేపు తన గదిలోనికి పరుగెత్తి పోయి అక్కడ
ఏడ్చాడు. 31తర్వాత యోసేపు తన ముఖం కడుక్కొని
బయటకు వచ్చాడు. అతడు తనను తాను ఓదార్చు
కొని, "భోజనానికి వేళ అయ్యింది" అన్నాడు.

32ఆ సేవకులు యోసేపు ఒక్కడికి ఒక బల్ల దగ్గర
వేరుగాను, సోదరులను మరో బల్ల దగ్గర వేరుగాను
కూర్చుండబెట్టారు. వారితో భోంచేస్తున్న ఈజిప్టు

వారిని వారి మట్టుకే ఒక బల్లదగ్గర కూర్చుండ బెట్టారు.
ఈజిప్టువాళ్లు హెబ్రూవారితో కలిసి భోజనం చేయరు,
అది ఈజిప్టు మత విరోధం. 33యోసేపు సోదరులు
అతనికి ఎదురుగా ఇంకో బల్ల దగ్గర కూర్చున్నారు.
ఆ సోదరులు జ్యేష్ఠునితో మొదలుబెట్టి కనిష్ఠుని వరకు
వరుసక్రమంలో కూర్చున్నారు. జరుగుతున్నదంతా
ఏమిటా అన్నట్టు అన్నదమ్ములంతా ఒకరి ముఖాలు
ఒకరు చూసుకొంటున్నారు.* 34సేవకులు యోసేపు
బల్లమీద నుంచే వారికి భోజనం వడ్డిస్తున్నారు. అయితే
ఆ సేవకులు మిగిలిన వాళ్లకంటె అయిదు రెట్లు ఎక్కు
వగా బెన్యామీనుకు వడ్డించారు. ఆ సోదరులు దాదాపు
మత్తెక్కినంత వరకు యోసేపుతో కలిసి తిని తాగారు.

## యోసేపు పన్నాగం

44 అప్పుడు యోసేపు తన సేవకునికి ఒక ఆజ్ఞ
ఇచ్చాడు: "ఈ మనుష్యులు మోసుకొని పోగలి
గినంత ధాన్యం వారి సంచుల్లో నింపు. ప్రతి ఒక్కరి
సొమ్మును తిరిగి వారి వారి ధాన్యపు సంచుల్లో పెట్టు.
2అందరిలో చిన్న తమ్ముని సంచిలో డబ్బు పెట్టు.
అయితే నా ప్రత్యేకమైన వెండి పాత్రనుకూడ అతని
సంచిలో పెట్టు." ఆ సేవకుడు యోసేపు చెప్పినట్టు
చేసాడు.
3మర్నాటి ఉదయాన్నే ఆ సోదరులు వారి గాడి
దలతోబాటు వారి దేశం పంపించబడ్డారు. 4వారు
పట్టణం విడిచిన తర్వాత యోసేపు తన సేవకులతో
చెప్పాడు: "నీవు వెళ్లి ఆ మనుష్యుల్ని వెంబడించు.
వాళ్లను ఆపుజేసి 'మేము మీతో మంచిగా ఉన్నాం.
అయినా మీరెందుకు మాతో చెడ్డగా ప్రవర్తిస్తున్నారు?
మా యజమాని వెండి పాత్రను మీరెందుకు దొంగి
లించారు? 5ఇది నా యజమాని యోసేపు పానం
చేసే పాత్ర. రహస్య విషయాలను తెలుసుకొనేందుకు
ఆయన ఉపయోగించే పాత్ర ఇది. ఆయన పాత్రను
దొంగిలించి మీరు తప్పు చేసారు, అని వాళ్లతో చెప్పు."
6అందుచేత ఆ సేవకుడు విధేయుడయ్యాడు.
అతడు సవారి చేసి ఆ సోదరులను ఆపుజేసాడు. అతడు
చెప్పాల్సిందిగా యోసేపు అతనికి చెప్పిన విషయాలు
ఆ సేవకుడు వారితో చెప్పాడు.
7అయితే ఆ సోదరులు ఆ సేవకునితో ఇలా
అన్నారు: "ఆ పాలకుడు యిలా ఎందుకు అన్నాడు?
అలాంటిదేమీ మేము చేయము. 8ఇంతకు ముందు
మా సంచుల్లో మాకు దొరికిన డబ్బు మేం తెచ్చి
ఇచ్చాం. అందుచేత మీ యజమాని ఇంటినుండి వెండి
బంగారం ఏవీ మేము నిజంగా దొంగిలించం. 9మాలో
ఎవరి సంచిలోనైనా సరే ఆ వెండి పాత్ర నీకు కనబడితే,
వాడు చావాల్సిందే. అతణ్ణి నీవు చంపేయి, మేము
మీకు బానిసలమవుతాం."
10"మీరు చెప్పినట్టే చేద్దాం. కాని నేను మాత్రం
ఎవర్నీ చంపను. వెండి పాత్ర గనుక నాకు కనబడితే
ఆ మనిషి మాత్రం నాకు బానిస అవుతాడు. మిగిలిన
వాళ్లు స్వేచ్ఛగా వెళ్లొచ్చు" అన్నాడు ఆ సేవకుడు.

## బెన్యామీను పట్టుబడ్డాడు

11అప్పుడు ప్రతి ఒక్క సోదరుడూ తన సంచిని
నేలమీద పెట్టి తెరిచాడు. 12సేవకుడు సంచుల్లో
చూశాడు. అతడు జ్యేష్ఠునితో మొదలు బెట్టి కనిష్ఠునితో
ముగించాడు. బెన్యామీను సంచిలో ఆ పాత్ర అతనికి
కనబడింది. 13సోదరులకు దుఃఖం వచ్చేసింది.
దుఃఖంతో వాళ్లు వారి వస్త్రాలు చింపేసుకొన్నారు.
వారు వారి సంచుల్ని మళ్లీ గాడిదలమీద పెట్టి తిరిగి
ఆ పట్టణం వెళ్లారు.
14యూదా, అతని సోదరులు యోసేపు ఇంటికి
వెళ్లారు. యోసేపు ఇంకా అక్కడే ఉన్నాడు. ఆ సోదరు
లంతా నేలమీద సాష్టాంగపడ్డారు. 15యోసేపు "మీరెం
దుకు ఇలా చేసారు? రహస్యాలు తెలుసుకొనే ఒక
ప్రత్యేక పద్ధతి నా దగ్గర ఉందని మీకు తెలియదా?
ఈ పని నాకంటె బాగుగా ఇంకెవ్వరూ చేయలేరు"
అన్నాడు.
16యూదా, "అయ్యా, మేం ఇంకేమీ చెప్పలేం.
వివరించే దారి యింకొకటి లేదు. మేం నేరస్థులం
కాదని చూపించే విధం ఇంకొకటిలేదు. మేము చేసిన
మరో పని మూలంగా దేవుడు మమ్మల్ని నేరస్థులుగా
తీర్పు తీర్చాడు. కనుక మేము అందరం చివరకు
బెన్యామీనుతో కూడ బానిసలమవుతాం" అన్నాడు.
17కానీ యోసేపు, "నేను మిమ్మల్ని అందరినీ బాని
సలుగా చేయను. పాత్రను దొంగిలించిన మనిషి ఒక్కడే
నాకు బానిస అవుతాడు. మిగిలిన మీరు సమాధానంగా
మీ తండ్రి దగ్గరకు వెళ్లవచ్చు" అన్నాడు.

## బెన్యామీనుకోసం యూదా బ్రతిమలాడుట

18అప్పుడు యోసేపు దగ్గరకు యూదా వెళ్లి ఇలా
చెప్పాడు: "అయ్యా, దయచేసి తమరితో నన్ను
తేటగా చెప్పనివ్వండి. దయచేసి నాపై కోపగించకండి.
మీరు ఫరో అంతటి వారని నాకు తెలుసు. 19క్రితంసారి
మేము ఇక్కడ ఉన్నప్పుడు 'మీకు తండ్రిగాని సోదరుడు
గాని ఉన్నాడా?' అని తమరు అడిగారు. 20దానికి మేము
జవాబు చెప్పాం, మాకు ఒక తండ్రి ఉన్నాడు, ఆయన
ముసలివాడు. మాకు ఒక చిన్న తమ్ముడు ఉన్నాడు,
వాడు మా తండ్రికి ముసలితనంలో పుట్టాడు, అందు
చేత మా తండ్రికి వాడంటే చాలా ప్రేమ. పైగా ఆ

**అన్నదమ్ములంతా ... చూసుకొంటున్నారు.** అన్నదమ్ములు వరుసక్రమములో యోసేపుతో కూర్చు న్నారు గనుక వారికి ఆశ్చర్యమేసింది. అతనికి ఎలా తెలుసునో వారికి అర్థము కాలేదు.

చిన్న కుమారుని అన్న చనిపోయాడు. అందుచేత ఆ
తల్లికి పుట్టిన కుమారులలో మిగిలినవాడు ఇతడు
ఒక్కడే. మా తండ్రికి ఇతనంటే ఎంతో ప్రేమ.
21అప్పుడు 'ఆ సోదరుని నా దగ్గరకు తీసుకొని రండి,
నేను అతడ్ని చూడాలి' అన్నారు తమరు. 22దానికి
మేము 'ఆ చిన్నవాడు రావటానికి వీల్లేదు. అతడ్ని
తన తండ్రిని విడిచిపెట్టలేడు. అతని తండ్రి అతణ్ణి
గనక పోగొట్టుకొంటే, అతని తండ్రి దుఃఖంతో మరణి
స్తాడు' అని తమరితో చెప్పాం. 23కానీ తమరేమో
'మీరు మీ చిన్న తమ్ముడ్ని తప్పక తీసుకొని రావా
ల్సిందే, లేకపోతే మీకు ధాన్యం అమ్మేది లేదు' అన్నారు
మాతో. 24కనుక మేము తిరిగి మా తండ్రి దగ్గరకు
వెళ్లి, మీరు మాతో చెప్పినది ఆయనకు చెప్పాం.
25"తర్వాత మా తండ్రి 'మీరు మళ్లీ వెళ్లి మనకోసం
ధాన్యం కొనండి' అన్నాడు. 26మేము మా తండ్రితో
'మా చిన్న తమ్ముడు లేకుండా మేము వెళ్లలేం. మా
చిన్న తమ్ముడ్ని చూచేంత వరకు మళ్లీ మాకు ధాన్యం
అమ్మనని ఆ పాలకుడు అన్నాడు' అని చెప్పాం.
27అప్పుడు మా తండ్రి మాతో అన్నాడు 'నా భార్య
రాహేలు ఇద్దరు కుమారుల్ని నాకు కన్నది. 28ఒక
కుమారుడ్ని నేను బయటకు వెళ్లనిస్తే, అతణ్ణి
అడవిమృగం చంపేసింది. అప్పట్నుండి నేను అతణ్ణి
చూడలేదు. 29రెండో కుమారునిగూడా మీరు నా దగ్గ
ర్నుండి తీసుకొని పోతే, అతనికి ఏమైనా సంభవిస్తే ఆ
దుఃఖంతో నేను మరణించాల్సిందే!' 30కనుక ఇప్పుడు
మేము మా కనిష్ఠ సోదరుడు మాతో లేకుండా మేము
ఇంటికి వెళ్తే, ఏమి జరుగుతుందో ఊహించండి. మా
తండ్రి జీవితంలో ఈ కుర్రవాడు చాలా ముఖ్యం.
31ఈ కుర్రవాడు మాతో లేకపోవటం గమనిస్తే, మా
తండ్రి చనిపోతాడు. ఆ తప్పు మాదే అవుతుంది.
మహాగొప్ప దుఃఖంతో మా తండ్రి చనిపోయేటట్టు
చేసిన వాళ్లమవుతాం.
32"ఈ పిల్లవాని విషయం నేను బాధ్యత తీసు
కొన్నాను. 'ఇతణ్ణి మళ్లీ నీ దగ్గరకు తీసుకొని రాకపోతే
నా జీవితకాలమంతా నన్ను నీవు నిందించమని' నా
తండ్రితో నేను చెప్పాను. 33కనుక ఇప్పుడు నేను
మీకు మనవి చేసేది, మిమ్మల్ని బ్రతిమాలాడేది ఏమి
టంటే, దయచేసి ఈ పిల్లవాణ్ణి తన సోదరులతో
వెళ్లనివ్వండి. నేను ఇక్కడే ఉండి, మీకు బానిసను
అవుతాను. 34ఈ పిల్లవాడు నాతో లేకపోతే నేను
తిరిగి నా తండ్రి దగ్గరకు వెళ్లలేను. నా తండ్రికి ఏం
జరుగుతుందోనని నాకు చాలా భయంగా ఉంది."

## యోసేపు తానెవరని చెప్పుట

45 యోసేపు ఇంకెంతమాత్రం తనను తాను
ఓర్చుకోలేక పోయాడు. అక్కడున్న ప్రజలం
దరి ముందు అతడు గట్టిగా ఏడ్చేసాడు. "అందర్నీ
ఇక్కడనుండి వెళ్లిపొమ్మనండి" అన్నాడు యోసేపు.
అందుచేత అందరూ అక్కడనుండి వెళ్లిపోయారు. ఆ
సోదరులు మాత్రమే యోసేపు దగ్గర ఉన్నారు.
అప్పుడు యోసేపు తాను ఎవరయిందీ వారితో చెప్పే
సాడు. 2యోసేపు ఇంకా ఏడుస్తూనే ఉన్నందుచేత,
ఫరో ఇంటిలో ఉన్న ఈజిప్టు ప్రజలంతా అది విన్నారు.
3యోసేపు తన సోదరులతో "మీ సోదరుడు యోసే
పును నేనే, నా తండ్రి ఇంకా బ్రతికి ఉన్నాడా?"
అన్నాడు. కాని ఆ సోదరుల నోటమాట రాలేదు.
వారు భయంతో కలవరపడి పోయారు.
4కనుక యోసేపు మళ్లీ తన సోదరులతో, "నా
దగ్గరకు రండి. ఇలా నా దగ్గరకు రమ్మని బ్రతిమాలు
తున్నాను రండి" అన్నాడు. కనుక ఆ సోదరులంతా
యోసేపుకు దగ్గరగా వెళ్లారు. యోసేపు వాళ్లతో
చెప్పాడు, "నేనే మీ సోదరుణ్ణి, యోసేపును. ఈజిప్టుకు
బానిసగా మీరు అమ్మిన వాడిని నేనే. 5ఇప్పుడేమీ
బాధపడకండి. మీరు చేసినదాన్ని బట్టి మీ మీద మీరు
కోపం తెచ్చుకోవద్దు. నేను ఇక్కడికి రావటం దేవుని
ఏర్పాటు. మీ ప్రాణం కాపాడేందుకు నేను ఇక్కడికి
వచ్చాను.
6భయంకరమైన ఈ కరువు కాలం ఇప్పటికే రెండు
సంవత్సరాలనుండి ఉంది. నాట్లు వేయకుండా, కోతలు
కోయకుండా ఇంకా అయిదు సంవత్సరాలు
గడచిపోవాలి. 7కనుక మీ వాళ్లందరినీ ఈ దేశంలో
నేను రక్షించాలని చెప్పి దేవుడే నన్ను మీకంటె
ముందుగా ఇక్కడికి పంపించాడు. 8నేను యిక్కడికి
పంపబడటం మీ తప్పుకాదు. అదంతా దేవుని
సంకల్పం. దేవుడు నన్ను ఫరోకు తండ్రిలా చేసాడు.
ఆయన దివాణం అంతటిమీదను, మొత్తం ఈజిప్టు
అంతటికిని నేను పాలకుడ్ని."

## ఇశ్రాయేలుకు ఈజిప్టు వచ్చుటకు ఆహ్వానం

9"కనుక మీరు త్వరగా నా తండ్రి దగ్గరకు వెళ్లండి.
ఆయన కుమారుడు యోసేపు పంపిన సందేశం ఇది
అని నా తండ్రితో చెప్పండి" అన్నాడు యోసేపు.

> దేవుడు నన్ను ఈజిప్టు అంతటిమీద అధికారి
> నిగా చేసాడు. ఇక్కడికి నా దగ్గరకు వచ్చే
> యండి. ఇంకా వేచి ఉండవద్దు ఇప్పుడే వచ్చే
> యండి. 10గోషను దేశంలో నా దగ్గర మీరు
> నివసిస్తారు. మీరు, మీ పిల్లలు, మీ పిల్లల పిల్లలు,
> మీ జంతువులు, మీ మందలు ఇక్కడికి రావాలని
> ఆహ్వానిస్తున్నాను. 11వచ్చే అయిదు కరువు
> సంవత్సరాల కాలంలోనూ నేను మిమ్మల్ని
> చూచుకొంటాను. అందుచేత మీరూ, మీ
> కుటుంబాలు, మీ స్వంతది ఏదీ నష్టపోదు."

12యోసేపు తన సోదరులతో మాట్లాడటం కొన
సాగిస్తూనే ఉన్నాడు. “ఇప్పుడు మీరు నిజంగా, నేను
యోసేపు అని చూడగలుగుతున్నారు. అన్నాడు
అతడు. నేనే అని మీ సోదరుడు బెన్యామీనుకు తెలుసు.
మీతో మాట్లాడుతున్న నేను మీ సోదరుణ్ణి. 13కనుక
ఇక్కడ ఈజిప్టులో నాకు ఉన్న సమస్త ఘనతను గూర్చి
నా తండ్రికి చెప్పండి. మీరు ఇక్కడ చూచిన వాట
న్నింటిగూర్చి నా తండ్రికి చెప్పండి. ఇక మీరు త్వరపడి
నా తండ్రిని నా దగ్గరకు తీసుకురండి.” 14అప్పుడు
యోసేపు తన తమ్ముడు బెన్యామీనును కౌగలించుకొని
ఏడ్చాడు. బెన్యామీను కూడ ఏడ్చాడు. 15తర్వాత
యోసేపు తన సోదరులందరినీ ముద్దు పెట్టుకొని,
వారి మీదపడి ఏడ్చాడు. ఆ తర్వాత ఆ సోదరులు
అతనితో మాట్లాడటం మొదలు బెట్టారు.

16యోసేపు సోదరులు అతని దగ్గరకు వచ్చినట్లు
ఫరోకు తెలిసింది. ఫరో ఇల్లంతా ఈ వార్త పాకి
పోయింది. దీని విషయమె ఫరో, అతని సేవకులు
చాలా సంతోషించారు. 17కనుక యోసేపుతో ఫరో
అన్నాడు: “నీ సోదరులకు కావలసినంత ఆహారం తీసు
కొని తిరిగి కనాను దేశం వెళ్లమని చెప్పు. 18నీ తండ్రిని,
వారి కుటుంబాలను తిరిగి ఇక్కడికి నా దగ్గరకు తీసు
కొని రమ్మని వారితో చెప్పు. ఈజిప్టులో శ్రేష్ఠమైన
భూమిని నివాసానికి నేను నీకు ఇస్తాను. ఇక్కడ మనకు
ఉన్న శ్రేష్ఠ ఆహారం నీ కుటుంబం భోంచేస్తారు.”
19తర్వాత ఫరో అన్నాడు: “మన బండ్లలో మంచి
వాటిని కొన్నింటిని మీ సోదరులకు ఇయ్యి. కనాను
వెళ్లి, మీ తండ్రిని, స్త్రీలందరిని, పిల్లలను ఆ బండ్లమీద
తీసుకొని రమ్మని వారితో చెప్పు. 20వారి అన్ని
సామానులు తెచ్చుకొనే విషయంలో ఏమీ చింత
పడవద్దు. ఈజిప్టులో మనకు ఉన్న శ్రేష్ఠ వస్తువులు
మనం వారికి ఇద్దాం.”

21కనుక ఇశ్రాయేలు కుమారులు అలా చేసారు.
ఫరో వాగ్దానం చేసినట్టే యోసేపు వారికి మంచి బండ్లు
ఇచ్చాడు. వారి ప్రయాణానికి సరిపడినంత ఆహారం
యోసేపు వారికి ఇచ్చాడు. 22ఒక్కో సోదరునికి ఒక్కో
జత చక్కని వస్త్రాలు యిచ్చాడు యోసేపు. అయితే
బెన్యామీనుకు అయిదు జతల మంచి బట్టలు యోసేపు
ఇచ్చాడు. మరియు 300 వెండి నాణాలు కూడ
యోసేపు బెన్యామీనుకు ఇచ్చాడు.

23యోసేపు తన తండ్రికి కానుకలుకూడా
పంపించాడు. ఈజిప్టులోని మంచి వస్తువులు చాలా
సంచులనిండా నింపి పది గాడిదలమీద అతడు
పంపించాడు. అతని తండ్రి తిరిగి వచ్చేటప్పుడు
అవసరమైన ఆహారం, రొట్టె, ధాన్యం విస్తారంగా పది
ఆడగాడిదలమీద అతడు పంపించాడు. 24అప్పుడు
యోసేపు అతని సోదరులను వెళ్లమన్నాడు. వారు
వెళ్తూ ఉండగా యోసేపు “తిన్నగా ఇంటికి వెళ్లండి.
దారిలో పోట్లాడకండి” అని వారితో చెప్పాడు. 25కనుక
ఆ సోదరులు ఈజిప్టు దేశం విడిచి, కనాను దేశంలో
ఉన్న తమ తండ్రి దగ్గరకు వెళ్లారు. 26ఆ సోదరులు
“నాయనా, యోసేపు బతికే ఉన్నాడు, ఈజిప్టు దేశం
అంతటికి అతడే అధికారి” అని అతనితో చెప్పారు.

వారి తండ్రి ఆశ్చర్యచకితుడయ్యాడు. అతడు
వాళ్లను నమ్మలేదు. 27అయితే యోసేపు చెప్పిన
దంతా ఆ సోదరులు వారి తండ్రికి చెప్పారు. తర్వాత
అతనిని ఈజిప్టు తీసుకొని రమ్మని యోసేపు పంపిన
బండ్లను యాకోబు చూశాడు. అప్పుడు యాకోబు
సంతోషంతో ఉప్పొంగిపొయ్యాడు. 28“ఇప్పుడు నేను
మిమ్మల్ని నమ్ముతాను. నా కుమారుడు యోసేపు
ఇంకా బతికే ఉన్నాడు! నేను మరణించక ముందు
అతణ్ణి చూస్తాను” అన్నాడు ఇశ్రాయేలు.

### ఇశ్రాయేలుకు దేవుని అభయం

46 కనుక ఇశ్రాయేలు ఈజిప్టుకు తన ప్రయాణం
మొదలు పెట్టాడు. మొదట ఇశ్రాయేలు
బెయేర్షెబాకు వెళ్లాడు. అక్కడ తన తండ్రియైన ఇస్సాకు
దేవుణ్ణి ఇశ్రాయేలు ఆరాధించాడు. అతడు బలులు
అర్పించాడు.

2ఆ రాత్రి ఒక కలలో దేవుడు ఇశ్రాయే లుతో
మాట్లాడాడు. “యాకోబూ, యాకోబూ” అన్నాడు
దేవుడు.

“ఇదిగో ఇక్కడే ఉన్నాను” అని ఇశ్రాయేలు జవాబు
ఇచ్చాడు.

3అప్పుడు దేవుడు అన్నాడు: “నేను దేవుణ్ణి, నీ
తండ్రి దేవుణ్ణి. ఈజిప్టు వెళ్లేందుకు భయపడకు.
ఈజిప్టులో నిన్ను ఒక గొప్ప జనంగా నేను చేస్తాను.
4నీతో కూడ నేను ఈజిప్టుకు వస్తాను. మళ్లీ నేనే
నిన్ను ఈజిప్టునుండి బయటకు తీసుకొని వస్తాను.
నీవు ఈజిప్టులో మరణిస్తావు, కాని యోసేపు నీతో
ఉంటాడు. నీవు చనిపోయినప్పుడు అతని స్వంత
చేతులే నీ కళ్లను మూస్తాయి.”

### ఇశ్రాయేలు ఈజిప్టు వెళ్తాడు

5అప్పుడు యాకోబు బెయేర్షెబా విడిచి, ఈజిప్టుకు
ప్రయాణం చేసాడు. అతని కుమారులు, ఇశ్రాయేలు
కుమారులు తమ తండ్రిని, భార్యలను, తమ పిల్లలం
దరిని ఈజిప్టుకు తీసుకొని వచ్చారు. ఫరో పంపిన
బండ్లలో వారు ప్రయాణం చేసారు.

6తమ పశువులు, కనాను దేశంలో వారికి ఉన్నవి
అన్నీ వారితోబాటు ఉన్నవి. కనుక ఇశ్రాయేలు తన
పిల్లలందరితో, తన కుటుంబం అంతటితో కలిసి
ఈజిప్టు వెళ్లాడు. 7అతని కుమారులు అతని మనుమళ్లు,
అతని కుమార్తెలు, అతని మనమరాళ్లు అతనితో

ఉన్నారు. అతని కుటుంబం అంతా అతనితో కలిసి
ఈజిప్టుకు వెళ్లారు.

### యాకోబు కుటుంబం

8ఇశ్రాయేలుతో కలిసి ఈజిప్టు వెళ్లిన అతని కుమా
రులు, కుటుంబము వాళ్ల పేర్లు:
రూబేను యాకోబుయొక్క మొదటి కుమారుడు.
9రూబేను కుమారులు: హనోకు, పల్లు, హెజ్రోను,
కర్మీ.
10షిమ్యోను కుమారులు: యెమూయేలు,
యామీను, ఓహదు, యాకీను, సోహరు, కనానీ స్త్రీ
కుమారుడు షావూలు.
11లేవీ కుమారులు: గెర్షోను, కహాతు, మెరారీ.
12యూదా కుమారులు:
ఏరు, ఓనాను, షేలా, పెరెసు, జెరహు. (ఏరు,
ఓనాను కనానులో ఉన్నప్పుడే చనిపోయారు) పెరెసు
కుమారులు: హెజ్రోను, హామూలు,
13ఇశ్శాఖారు కుమారులు: తోలా, పువ్వా, యోబు,
షిమ్రోను.
14జెబూలూను కుమారులు: సెరెదు, ఏలోను,
యహలేలు
15రూబేను, షిమ్యోను, లేవి, యూదా, ఇశ్శాఖారు,
జెబూలూనులు, యాకోబు భార్య లేయా ద్వారా అతని
కుమారులు. లేయా ఆ కుమారులను పద్దనరాములో
కన్నది. ఆమె కుమార్తె దీనా కూడ ఉంది. ఈ
కుటుంబంలో 33 మంది ఉన్నారు.
16గాదు కుమారులు: సిప్యోను, హగ్గీ, షూనీ,
ఎస్బోను, ఏరీ, అరోదీ, అరేలీ,
17ఆషేరు కుమారులు: ఇమ్నా, ఇష్వా, ఇష్వి,
బెరీయా, వారి సోదరి శెరహు, హెబెరు, మల్కీయేలు,
18బెరీయా కుమారులు: వారంతా యాకోబుకు
అతని భార్య సేవకురాలు జిల్పాద్వారా పుట్టిన కుమా
రులు. ఈ కుటుంబంలో 16 మంది ఉన్నారు.
19మరియు అతని భార్య రాహేలు ద్వారా పుట్టిన
కుమారుడు బెన్యామీను కూడ యాకోబుతో ఉన్నాడు.
(యోసేపుకూడ రాహేలుకు పుట్టినవాడే కాని అతడు
అప్పటికే ఈజిప్టులో ఉన్నాడు.)
20ఈజిప్టులో యోసేపుకు ఇద్దరు కుమారులు:
మనష్షే, ఎఫ్రాయిము. (ఓను పట్టణ యాజకుడు
పోతీఫెర కుమార్తె ఆసెనతు యోసేపు భార్య).
21బెన్యామీను కుమారులు: బెల, బేకెరు, అష్బేలు,
గెరా, నయమాను, ఏహీ, రోషు, ముప్పీము, హుప్పీము,
అర్దు.
22వారంతా యాకోబుకు అతని భార్య రాహేలు
ద్వారా కలిగిన సంతానం. ఈ కుటుంబంలో 14 మంది
ఉన్నారు. 23దాను కుమారుడు: హుషీము
24నఫ్తాలి కుమారులు: యహసేలు, గూనీ, యేసెరు,
షిల్లేము 25వారు యాకోబు, బిల్హాలకు పుట్టిన
కుమారులు (రాహేలు సేవకురాలు బిల్హా). ఈ
కుటుంబంలో ఏడు గురు ఉన్నారు.
26ఇలా యాకోబు సంతానం ఈజిప్టు వెళ్లారు.
యాకోబు మూలంగా కలిగిన పిల్లలు మొత్తం 66
మంది. (యాకోబు భార్యలు ఈ లెక్కలో లేరు).
27మరియు యోసేపు ఇద్దరు కుమారులు కూడ
ఉన్నారు. వారు ఈజిప్టులో పుట్టారు. కనుక ఈజిప్టులో
యాకోబు కుటుంబంలో 70 మంది ఉన్నారు.

### ఇశ్రాయేలు ఈజిప్టు వచ్చుట

28యాకోబు మొదట యూదాను యోసేపు దగ్గ
రకు పంపించాడు. గోషెను దేశంలోని యోసేపు దగ్గ
రకు యూదా వెళ్లాడు. ఆ తర్వాత యాకోబు, అతని
వాళ్లు ఆ దేశంలో ప్రవేశించారు. 29యోసేపు తన
తండ్రి వచ్చేస్తున్నాడని విన్నాడు. గోషెనులో తన
తండ్రి ఇశ్రాయేలును ఎదుర్కొనుటకు యోసేపు తన
రథం సిద్ధం చేసుకొని బయల్దేరాడు. యోసేపు తన
తండ్రిని చూడగానే అతని మెడమీద పడి కౌగలించుకొని
చాలాసేపు ఏడ్చాడు. 30అప్పుడు ఇశ్రాయేలు, "ఇప్పుడు
నేను మన శ్శాంతిగా మరణించవచ్చు నీ ముఖం నేను
చూశాను, నీవు ఇంకా బ్రదికే ఉన్నావని నేను
చూడగలిగాను," అని యోసేపుతో చెప్పాడు.
31తన సోదరులతోను, తన తండ్రి కుటుంబం
తోను యోసేపు ఇలా చెప్పాడు: "నేను వెళ్లి మీరు
వచ్చినట్టు ఫరోతో చెబుతాను. ఫరోతో నేను ఏమని
చెబుతానంటే 'నా అన్నలు, నా తండ్రి కుటుంబం
కనాను దేశం విడిచి ఇక్కడ నా దగ్గరకు వచ్చారు.
32ఈ నా కుటుంబం గొర్రెల కాపరుల కుటుంబం.
నిత్యం వాళ్లు పశువుల్ని, మందల్ని కలిగి ఉండేవాళ్లు.
వారి పశువుల్ని, వారికి కలిగిన అంతటిని వాళ్లతోబాటు
వారు తెచ్చుకొన్నారు.' 33ఫరో మిమ్మల్ని పిలిచి
నప్పుడు మీరేం పని చేస్తారు? అని మిమ్మును అడుగు
తాడు.
34అప్పుడు మీరు 'మేము గొర్రెల కాపరులం, మా
జీవితకాలమంతా మా పశువుల్ని మేపుకొంటూ
జీవించాం. మాకు ముందు మా పూర్వీకులు ఇలాగే
జీవించారు' అని చెప్పండి. అప్పుడు ఫరో మిమ్మును
గోషెను దేశంలో జీవింపనిస్తాడు. గొర్రెల కాపరులంటే
ఈజిప్టు ప్రజలకు యిష్టం లేదు, కనుక మీరు గోషెను
దేశంలో ఉండవచ్చు."

### ఇశ్రాయేలు గోషెనులో స్థిరపడుట

47 యోసేపు ఫరో దగ్గరకు వెళ్లి, "నా తండ్రి,
నా సోదరులు, వారి కుటుంబాలు మొత్తం
ఇక్కడికి వచ్చారు. వారి పశువులు, కనాను దేశంలో

వారికి కలిగినది మొత్తం వారితో తెచ్చుకొన్నారు. వారిప్పుడు గోషెనులో ఉన్నారు" అని చెప్పాడు.
[2]యోసేపు తన సోదరులలో అయిదుగురిని తనతో కూడ ఫరో ఎదుటికి తీసుకొని వెళ్లాడు.

[3]"మీ వృత్తి ఏమిటి?" అని ఫరో ఆ సోదరులను అడిగాడు.

ఆ సోదరులు ఫరోతో, "అయ్యా, మేము గొర్రెల కాపరులం. మాకు ముందున్న మా పూర్వీకులు కూడా గొర్రెల కాపరులే" అని చెప్పారు. [4]"కనాను దేశంలో కరువు కాలం చాలా దారుణంగా ఉంది. మా పశువులకు అవసరమైన గడ్డి ఉన్న పొలాలు ఎక్కడా లేవు. అందు చేత ఈ దేశంలో బతుకుదామని మేము ఇక్కడికి వచ్చాం. మీరు దయచేసి మమ్మల్ని గోషెను దేశంలో ఉండనివ్వాల్సిందిగా మనవి చేస్తున్నాం" అని వారు ఫరోతో చెప్పారు.

[5]అప్పుడు యోసేపుతో ఫరో చెప్పాడు: "నీ తండ్రి, నీ సోదరులు నీ దగ్గరకు వచ్చారు. [6]వారు నివసించేందుకు ఈజిప్టులో ఏ స్థలమైనా సరే నీవు వారికోసం కోరుకోవచ్చు. నీ తండ్రికి, నీ సోదరులకు శ్రేష్ఠమైన భూమి ఇవ్వు. గోషెను దేశంలో వారిని ఉండనివ్వు. వారు నైపుణ్యంగల కాపరులైతే, వారు నా పశువులను కూడ చూసుకోవచ్చు."

[7]అప్పుడు యోసేపు తన తండ్రి యాకోబును ఫరో ఎదుటికి తీసుకొని వచ్చాడు. యాకోబు ఫరోను ఆశీర్వదించాడు. [8]అప్పుడు ఫరో "నీ వయస్సెంత?" అని యాకోబును అడిగాడు.

[9]"నేను తక్కువ కాలం ఎక్కువ కష్టాలతో బతికాను. 130 సంవత్సరాలే నేను బతికాను. నా తండ్రి, ఆయన పూర్వీకులు నాకంటె చాలా ఎక్కువ కాలం బతికారు" అని ఫరోతో యాకోబు చెప్పాడు.

[10]యాకోబు ఫరోను ఆశీర్వదించాడు. తర్వాత యాకోబు ఫరో ఎదుటి నుండి వెళ్లిపోయాడు.

[11]యోసేపు ఫరోకు విధేయుడయ్యాడు. అతడు తన తండ్రికి, తన సోదరులకు ఈజిప్టులో మంచి భూమిని సమీపంగా ఇచ్చాడు. ఈజిప్టులో రామసేసు నగరానికి దగ్గరలోవున్న ఈ భూమి అతి శ్రేష్ఠమైంది.
[12]మరియు తన తండ్రికి, సోదరులకు, వారి మనుష్యులందరికీ అవసరమైన ఆహారాన్ని యోసేపు వారికి ఇచ్చాడు.

### ఫరోకోసం యోసేపు భూమి కొన్నాడు

[13]కరువు కాలం మరీ తీవ్రం అయింది. దేశంలో ఎక్కడా ఆహారం లేదు. ఈ కష్టకాలం మూలంగా ఈజిప్టు, కనాను దరిద్రంగా తయారయ్యాయి.[14]ఆ దేశంలో ప్రజలు మరింత ధాన్యంకొన్నారు. యోసేపు ఆ ధనం ఆదాచేసి, దానిని ఫరో ఇంటికి తెచ్చాడు.
[15]కొన్నాళ్లకు ఈజిప్టులోను కనానులోను ప్రజల దగ్గర పైకం అయిపోయింది. ధాన్యం కొనేందుకే వారి డబ్బు అంతా ఖర్చు పెట్టారు. కనుక ప్రజలు యోసేపు దగ్గరకు వెళ్లి, "దయచేసి మాకు ధాన్యం ఇవ్వండి. మా డబ్బు అయిపోయింది. మేము భోజనం చేయకపోతే మీరు చూస్తూండగనే మేము మరణిస్తాం" అని చెప్పారు.

[16]"మీ పశువుల్ని ఇవ్వండి, నేను మీకు ఆహారం ఇస్తాను" అని యోసేపు జవాబిచ్చాడు. [17]కనుక ప్రజలు ఆహారం కొనేందుకు వారి పశువులను, గుర్రాలను, మిగిలిన జంతువులన్నిటిని ఉపయోగించారు. ఆ సంవత్సరం యోసేపు వారికి ఆహారం ఇచ్చి, వారి పశువులను తీసుకున్నాడు.

[18]అయితే ఆ తర్వాత సంవత్సరం ప్రజల దగ్గర జంతువులు లేవు, ఆహారం కొనేందుకు ఉపయోగించ టానికి ఏమీ లేవు. కనుక ప్రజలు యోసేపు దగ్గరకు వెళ్లి "మా దగ్గర ఇంకేమీ డబ్బు లేదని మీకు తెలుసు. మా పశువులన్నీ మీవే ఇప్పుడు. మా దగ్గర నీవు చూస్తున్న మా శరీరాలు, మా భూమి తప్ప ఇంకేమి లేవు. [19]మీరు చూస్తుండగానే నిశ్చయంగా మేము చని పోతాం. కానీ, మీరు మాకు ఆహారం ఇస్తే, మేము మా భూమిని ఫరోకు ఇస్తాం, మేము ఆయన బానిస లంగా ఉంటాము. మేము నాట్లు వేయటానికి మాకు విత్తనాలు ఇవ్వండి. అప్పుడు మేము చావక బతు కుతాం. భూమి మా కోసం మరోసారి పంటను ఇస్తుంది" అని చెప్పారు.

[20]కనుక యోసేపు ఈజిప్టులోని భూమి అంతటినీ ఫరోకోసం కొన్నాడు. ఈజిప్టులోని ప్రజలంతా వారి భూములను యోసేపుకు అమ్మివేసారు. వారు చాలా కరువుతో ఉన్నందుచేత ఇలా చేసారు. [21]మరియు ప్రజలందరు ఫరోకు బానిసలయ్యారు. ఈజిప్టు అంత టిలో ప్రజలు ఫరోకు బానిసలు. [22]యాజకుల స్వంత భూములను మాత్రమే యోసేపు కొనలేదు. యాజ కుల పనికి ఫరో జీతం ఇచ్చాడు గనుక వారు వారి భూములను అమ్ముకోవాల్సిన అవసరం లేదు. ఆ డబ్బును ఆహారం కొనేందుకు వారు ఉపయోగించు కొనేవారు.

[23]యోసేపు ప్రజలతో చెప్పాడు, "ఇప్పుడు మిమ్మల్ని, మీ భూముల్ని ఫరోకోసం నేను కొన్నాను. కనుక నేను విత్తనాలు ఇస్తాను, మీరు మీ భూముల్లో నాట్లు వేయవచ్చును. [24]కోతకాలంలో మీ పంటలో అయిదింట ఒక వంతు ఫరోకు ఇవ్వాలి. అయిదింట నాలుగు వంతులు మీకోసం మీరు ఉంచుకోవచ్చు. మీరు ఉంచుకొనే గింజలను మీ ఆహారం కోసమూ, వచ్చే సంవత్సరం విత్తనాల కోసం ఉపయోగించు కోవచ్చు. ఇప్పుడు మీరు మీ కుటుంబాలను, పిల్లలను పోషించుకోవచ్చు." [25]ప్రజలు, "మీరు మా ప్రాణాలు రక్షించారు. మేము సంతోషంగా మీకు, ఫరోకు బానిసలంగా ఉంటాం" అన్నారు.

26కనుక ఈ సమయంలో యోసేపు ఆ దేశంలో
చట్టం చేసాడు. ఆ చట్టం నేటికీ కొనసాగుతుంది.
భూమిలోనుండి వచ్చే దిగుబడి అంతటిలోనూ
అయిదింట ఒక వంతు ఫరోకు చెందుతుంది అనేది
ఆ చట్టం. భూములన్నీ ఫరో స్వంతం. యాజకుల
భూమి మాత్రమే ఫరో స్వంతం కాలేదు.

## నన్ను ఈజిప్టులో పాతిపెట్టవద్దు

27ఇశ్రాయేలు (యాకోబు) ఈజిప్టులో ఉన్నాడు.
గోషెను దేశంలో అతడు నివసించాడు. అతని
కుటుంబం పెరిగి చాలా పెద్దది అయింది. ఈజిప్టులో
వారు ఆ భూమిని సంపాదించి వర్ధిల్లారు.
28యాకోబు ఈజిప్టులో 17 సంవత్సరాలు జీవిం
చాడు. కనుక యాకోబు వయస్సు 147 సంవత్సరాలు.
29తాను త్వరలో చనిపోతానని తెలిసి, ఇశ్రాయేలు
(యాకోబు) తన కుమారుడు యోసేపును తన
దగ్గరకు పిల్చాడు. "నీవు నన్ను ప్రేమిస్తే, నీ చేయి
నా తొడకింద పెట్టి ప్రమాణం చేయి. నేను చెప్పినట్టు
నీవు చేస్తానని, నాకు నీవు నమ్మకంగా ఉంటావని
వాగ్దానం చేయి. నేను మరణించినప్పుడు నన్ను
ఈజిప్టులో పాతిపెట్టవద్దు.
30నా పూర్వీకులు పాతి పెట్టబడిన చోట నన్ను
పాతిపెట్టు. ఈజిప్టు నుండి నన్ను తీసుకొనిపోయి,
మన కుటుంబ సమాధుల స్థలంలో నన్ను పాతిపెట్టు"
అన్నాడు.
"నీవు చెప్పినట్టు చేస్తానని నేను వాగ్దానం చేస్తున్నా"
అని యోసేపు జవాబిచ్చాడు.
31అప్పుడు యాకోబు, "నాకు ప్రమాణం చేయి"
అన్నాడు. అందుకు యోసేపు అలా చేస్తానని
ప్రమాణం చేసాడు. అంతట ఇశ్రాయేలు పడక మీద
తన తల వెనుకకు వాల్చాడు.*

## మనష్షే. ఎఫ్రాయిములకు ఆశీర్వాదాలు.

48 కొంత కాలం తర్వాత, తన తండ్రి చాలా
అస్వస్థతగా ఉన్నాడని యోసేపుకు తెలి సింది.
కనుక మనష్షే. ఎఫ్రాయిము అనే తన యిద్దరు
కుమారులను తీసుకొని, యోసేపు తన తండ్రి దగ్గరకు
వెళ్లాడు.
2యోసేపు వచ్చినప్పుడు ఎవరో ఇశ్రాయేలుతో
చెప్పారు, "నీ కుమారుడు యోసేపు నిన్ను
చూడటానికి వచ్చాడు" అని. ఇశ్రాయేలు చాలా బల
హీనంగా ఉన్నాడు, అయినప్పటికీ కష్టంగా ప్రయ
త్నించి తన పడకమీద కూర్చున్నాడు.
3అప్పుడు యోసేపుతో ఇశ్రాయేలు అన్నాడు,
"కనాను దేశంలోని ఊజు వద్ద సర్వశక్తిమంతుడైన
దేవుడు నాకు ప్రత్యక్షమయ్యాడు. అక్కడే దేవుడు
నన్ను ఆశీర్వదించాడు". 4దేవుడు నాతో చెప్పాడు:
"నిన్ను ఒక గొప్ప వంశంగా నేను చేస్తాను. నీకు
అనేకమంది పిల్లలను నేను ఇస్తాను, మీరు గొప్ప జనం
అవుతారు. మీ వంశీకులు ఈ భూమిని శాశ్వతంగా
స్వంతం చేసుకుంటారు." 5ఇప్పుడు నీకు ఇద్దరు
కుమారులు ఉన్నారు. నేను రాకముందు యిక్కడ
ఈజిప్టు దేశంలో ఈ ఇద్దరు కుమారులు పుట్టారు.
ఎఫ్రాయిము, మనష్షే అనే నీ యిద్దరు కుమారులు
నా స్వంత కుమారుల్లాగే ఉంటారు. రూబేను, షిమ్యో
నులు నాకెలాగో వారూకూడ నాకు అంతే. 6కనుక
ఈ ఇద్దరు బాలురు నా కుమారులే. నాకు ఉన్న
దానంతటిలో వారికి గూడ భాగం ఉంది. అయితే
నీకు ఇంకా కుమారులు పుడితే వాళ్లు నీ స్వంత
కుమారులుగా ఉంటారు. అయితే వారు ఎఫ్రాయిము
మనష్షేలకు కుమారులుగా ఉంటారు. అంటే భవిష్య
త్తులో ఎఫ్రాయిము, మనష్షేలు కలిగి ఉండే దానంత
టిలో వాళ్లూ భాగస్థులవుతారు. 7పద్దనరాము నుండి
చేసిన ప్రయాణంలో రాహేలు చనిపోయింది. ఇది
నాకు చాలా దుఃఖం కలిగించింది. ఆమె కనాను దేశంలో
చనిపోయింది. అప్పటికి మేము ఇంకా ఎఫ్రాతా వైపు
ప్రయాణం చేస్తున్నాం. ఎఫ్రాతా పోయే మార్గంలో
నేను ఆమెను సమాధి చేసాను". (ఎఫ్రాతా బెత్లెహేము)
8అప్పుడు యోసేపు కుమారులను ఇశ్రాయేలు
చూశాడు. "ఈ పిల్లలు ఎవరు?" అని యోసేపును
అడిగాడు.
9యోసేపు తన తండ్రితో, "వీళ్లు నా కుమారులు.
దేవుడు నాకు ఇచ్చిన అబ్బాయిలు వీళ్లే" అని చెప్పాడు.
"నీ కుమారులను నా దగ్గరకు తీసుకొని రా! నేను
వారిని ఆశీర్వదిస్తాను" అన్నాడు ఇశ్రాయేలు.
10ఇశ్రాయేలు వృద్ధుడు గనుక అతని చూపు సరిగ్గా
లేదు అందుచేత యోసేపు ఆ బాలురను తన తండ్రికి
దగ్గరగా తీసుకొని వచ్చాడు. ఇశ్రాయేలు వారిని కౌగ
లించుకొని ముద్దు పెట్టుకొన్నాడు. 11అప్పుడు ఇశ్రా
యేలు ,"నీ ముఖం మళ్లీ చూస్తానని నేను ఎన్నడూ
అనుకోలేదు. అయితే చూడు! నిన్ను, నీ పిల్లలను
కూడ దేవుడు నన్ను చూడనిచ్చాడు" అన్నాడు యోసే
పుతో. 12అప్పుడు యోసేపు ఆ బాలురను ఇశ్రాయేలు
ఒడిలోనుండి దించగా, వారు అతని తండ్రి ఎదుట
సాగిలపడ్డారు.
13ఎఫ్రాయిమును అతని కుడి ప్రక్కను, మనష్షేను
అతని ఎడమ ప్రక్కను యోసేపు ఉంచాడు. (కనుక
ఇశ్రాయేలుకు ఎడమ ప్రక్క ఎఫ్రాయిము, కుడి ప్రక్క
మనష్షే ఉన్నారు). 14కానీ ఇశ్రాయేలు తన చేతులను
అటుయిటు మార్చి చిన్న పిల్లవాడు ఎఫ్రాయిము

**అంతట ... వాల్చాడు** భాషలో దుడ్డుకర్రమీదకు ముందుకు వంగి ఆరాధించెను అని కూడ అర్థం.

తలమీద తన కుడి చేతిని పెట్టాడు. తర్వాత ఇశ్రాయేలు పెద్దపిల్లవాడు మనష్షే తలమీద తన ఎడమ చేతిని పెట్టాడు. మనష్షే జ్యేష్ఠుడైనప్పటికి అతడు తన ఎడమ చేతిని మనష్షే మీద ఉంచాడు.

[15]మరియు ఇశ్రాయేలు యోసేపును ఆశీర్వదించి ఇలా చెప్పాడు:

"నా పూర్వీకులు అబ్రాహాము, ఇస్సాకు మన దేవుణ్ణి ఆరాధించారు. ఆ దేవుడే నా జీవితమంతా నన్ను నడిపించాడు.
16 ఆయనే నా కష్టాలన్నింటినుండి నన్ను రక్షించిన దూత. ఆయనే ఈ బాలురను దీవించాలని నేను ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు ఈ పిల్లలకు నా పేరు ఉంటుంది మన పూర్వీకులు అబ్రాహాము, ఇస్సాకుల పేర్లు వారికి ఉంటాయి. వారు ఈ భూమి మీద గొప్ప వంశాలుగా గొప్ప రాజ్యాలుగా ఎదగా లని నా ప్రార్థన."

[17]తన తండ్రి కుడిచేయి ఎఫ్రాయిము మీద ఉంచి
నట్లు యోసేపు చూశాడు. ఇది యోసేపుకు సంతోషం కలిగించలేదు. యోసేపు తన తండ్రి చేయి తీసుకొని, ఎఫ్రాయిం తలమీదనుండి తీసి, మనష్షే తలమీద ఉంచా
లనుకొన్నాడు. [18]యోసేపు తన తండ్రితో, "నీ కుడి
చేయి సరైన వాడిమీద పెట్టలేదు. మనష్షే జ్యేష్ఠుడు" అని చెప్పాడు.

[19]అయితే అతని తండ్రి వాదించి చెప్పాడు, "నాకు తెలుసు కొడుకా. మనష్షే జ్యేష్ఠుడు అతడు గొప్ప వాడవుతాడు. అతడు అనేకమంది ప్రజలకు తండ్రి కూడ అవుతాడు. కానీ చిన్నవాడు పెద్దవాడికంటె గొప్ప వాడవుతాడు. మరియు చిన్నవాడి వంశం ఇంకా చాలా పెద్దదిగా ఉంటుంది."

[20]అలా ఇశ్రాయేలు ఆనాడు వారిని ఆశీర్వదించాడు. "ఇశ్రాయేలువారు ఆశీర్వదించుటకు నీ నామాన్ని ఉపయోగిస్తారు." ఎవరినైనా ఆశీర్వదించినప్పుడు "దేవుడు ఎఫ్రాయిము మరియు మనష్షేవలె చేయునుగాక అని వాళ్లంటారు" అని అతడు చెప్పాడు.

ఈ విధంగా మనష్షేకంటె ఎఫ్రాయిమును గొప్ప చేశాడు ఇశ్రాయేలు.

[21]అప్పుడు యోసేపుతో ఇశ్రాయేలు అన్నాడు
"చూడు, నా మరణ ఘడియ దాదాపు సమీపించింది. అయితే దేవుడు మాత్రం ఇంకా మీతో ఉంటాడు. మీ
పూర్వీకుల దేశానికి ఆయన మిమ్మును నడిపిస్తాడు.
[22]నీ సోదరులకు ఇవ్వనిది నేను నీకు ఇచ్చాను. అమోరీ ప్రజలనుండి నేను గెలుచుకొన్న పర్వతాన్ని నేను నీకు ఇస్తున్నాను. ఆ పర్వతం కోసం నా కత్తితో, నా బాణంతో నేను ఆ మనుష్యులతో పోరాడి గెల్చాను."

### యాకోబు తన కుమారులను ఆశీర్వదించుట

49 అప్పుడు యాకోబు తన కుమారులందరినీ తన దగ్గరకు పిలిచాడు. అతడు చెప్పాడు: "నా కుమారులందరూ ఇక్కడ నా దగ్గరకు రండి. భవిష్యత్తులో ఏం జరుగుతుందో నేను మీకు చెబుతాను."

2 "యాకోబు కుమారులారా, మీరంతా కలిసి వచ్చి వినండి. మీ తండ్రి ఇశ్రాయేలు మాటలు వినండి."

### రూబేను

3 "రూబేనూ, నీవు మొట్టమొదటి కుమారుడవు. పురుషునిగా నా శక్తికి మొదటి ఋజువు నీవే. నా కుమారులందరిలోను గౌరవించదగిన మహా బలశాలివి నీవు. నీవు నా ప్రథమ సంతానం. నా కుమారులందరిలో నీవు మహా బలవంతుడవు, అతిశయాస్పదమైన వాడవు.

4 కానీ నీవు ఉద్రేకంతో అదుపుదప్పిన ప్రవాహం వలే ఉన్నావు. కాబట్టి నీవు ఎక్కువ గౌరవించ దగిన కుమారుడవు కావు నీ తండ్రికి చెందిన స్త్రీతో నీవు శయనించావు నీ తండ్రి పడకను నీవు ఎక్కావు. నీవు నా పడకకు అవమానం తెచ్చావు"

### షిమ్యోను, లేవీ

5 "షిమ్యోను, లేవీ సోదరులు. తమ ఖడ్గములతో పోరాడటం అంటే వారికి ప్రీతి.
6 రహస్యమందు వారు చెడు కార్యాలను తలస్తారు. వారి పథకాలలో నా ఆత్మ భాగాన్ని కోరటం లేదు, వారి రహస్య సమావేశాలను నేను అంగీకరించను, వారు వారి పగవారిని కోపంతో చంపారు వారు కేవలం సరదాలకు పశువులకు హాని చేసారు.
7 వారి కోపం శాపం అది చాల బలీయమయింది. వారికి కోపం వచ్చినప్పుడు వారు చాలా క్రూరులు యాకోబు దేశంలో వారి వంశాలకు వారి స్వంత భూమి వారికి ఉండదు ఇశ్రాయేలు అంతటిలో వారు చెదరి ఉంటారు."

### యూదా

8 "యూదా, నీ సోదరులు నిన్ను పొగడుదురు. నీవు నీ శత్రువులను ఓడిస్తావు. నీ సోదరులు నీకు సాగిలపడ్తారు.

9 యూదా సింహంలాంటివాడు. కుమారుడా,
తాను చంపిన జంతువు దగ్గర నిలిచిన సింహం
వంటి వాడవు నీవు. యూదా సింహంవంటి
వాడు. అతడు విశ్రాంతికోసం పండుకొంటాడు.
అతణ్ణి లేపుటకు ఎవరూ సాహసించరు
10 యూదా వంశపు పురుషులు రాజులుగా
ఉంటారు. అతని కుటుంబం పరిపాలిస్తుంది,
అనే సూచన అసలైన రాజు వచ్చేంతవరకు*
అతని కుటుం బాన్ని విడువదు. అప్పుడు అనేక
మంది అతనికి విధేయులై అతణ్ణి సేవిస్తారు.
11 అతడు ద్రాక్షావల్లికి తన గాడిదను కట్టివేస్తాడు*
శ్రేష్ఠమైన ద్రాక్షావల్లికి అతడు తన గాడిద పిల్లను
కట్టివేస్తాడు. అతడు తన బట్టలు ఉదుకుటకు
శ్రేష్ఠమైన ద్రాక్షారసాన్ని ఉపయోగిస్తాడు.
12 ద్రాక్షారసం తాగి అతని కళ్లు ఎరుపెక్కి
ఉంటాయి. పాలు తాగి అతని పళ్లు తెల్లగా
ఉంటాయి.'

### జెబూలూను

13 "జెబూలూను సముద్రానికి సమీపంగా జీవిస్తాడు.
అతని తీరం ఓడలకు క్షేమ స్థలంగా ఉంటుంది.
అతని భూమి సీదోను వరకు విస్తరిస్తుంది."

### ఇశ్శాఖారు

14 "ఇశ్శాఖారు చాలా ప్రయాసపడిన గాడిదల వలె
ఉంటాడు భారమైన బరువు మోసినందుచేత
అతడు పండుకొని ఉంటాడు.
15 అతడు తన విశ్రాంతి స్థలం మంచిదిగా ఉండే
టట్టు చూసుకొంటాడు తన భూమి రమ్యమైన
దిగా ఉండేటట్టు అతడు చూసుకొంటాడు.
తర్వాత అతడు బరువులు మోయుటకు ఒప్పు
కొంటాడు. బానిసగా పని చేసేందుకు అతడు
ఒప్పుకుంటాడు."

### దాను

"ఇతర ఇశ్రాయేలు వంశస్థుల్లాగే దాను తన ప్రజ
లకు తీర్పు తీరుస్తాడు.

17 దారి ప్రక్క ఉండే పామువలె దాను ఉండునుగాక
త్రోవ దగ్గర పొంచి ఉండే కట్లపామువలె అతడు
ఉండుగాక. ఆ పాము గుర్రపు మడిమెను కాటు
వేస్తుంది. ఆ గుర్రంమీద స్వారీ చేసే మనిషి
గుర్రం మీదనుండి పడిపోతాడు."
18 "యెహోవా, నీ రక్షణకోసం నేను కనిపెట్టుకొని
ఉన్నాను"

### గాదు

19 "దొంగల గుంపు గాదు మీద పడ్తారు. కానీ గాదు
వారిని తరిమివేస్తాడు.

### ఆషేరు

20 "ఆషేరు భూమి మంచి ఆహారాన్ని సమృద్ధిగా
పండిస్తుంది ఒక రాజుకు సరిపోయేలాంటి
భోజనం అతనికి ఉంటుంది."

### నఫ్తాలి

21 "స్వేచ్ఛగా పరుగులెత్తే లేడివంటివాడు. నఫ్తాలి
దాటి అందమైన పిల్లల్లా అతని మాటలు
ఉంటాయి."

### యోసేపు

22 "యోసేపు చాలా విజయశాలి నీళ్ల ఊట దగ్గర
ఎదిగే ద్రాక్షావల్లిలా కంచెమీద అల్లుకొనే ద్రాక్షా
తీగెలా అతడు ఫలిస్తాడు
23 చాలామంది అతనిమీద ఎదురు తిరిగి అతనితో
పోరాడారు బాణాలు పట్టుకొనేవారు అతనికి శత్రు
వులయ్యారు.
24 అయితే తన మహత్తర విల్లుతోను, నైపుణ్యంగల
తన చేతులతోను పోరాటం గెల్చాడు అతడు
తన శక్తిని యాకోబు యొక్క శక్తిమంతుని నుండి
గొర్రెల కాపరినుండి ఇశ్రాయేలు బండనుండి
25 నీ తండ్రి దేవునినుండి పొందుతాడు. దేవుడు
నిన్ను ఆశీర్వదిస్తాడు. సర్వశక్తిమంతుడగు
దేవుడు నిన్ను ఆశీర్వదించునుగాక! పైన ఆకా
శంనుండి ఆశీర్వాదములను, అగాధ స్థలముల
నుండి ఆశీర్వాదములను ఆయన నీకు అను
గ్రహించునుగాక స్తనముల దీవెనలు గర్భపు దీవె
నలు ఆయన నీకు ఇచ్చుగాక.

26 నా తల్లిదండ్రులకు ఎన్నెన్నో మేళ్లు జరిగాయి.
మరియు నీ తండ్రినైన నేను అంతకంటె ఎక్కు
వగ ఆశీర్వదించబడ్డాను నీ సోదరులు నీకు ఏమీ
లేకుండా నిన్ను విడిచిపెట్టి వేసేందుకు ప్రయ
త్నించారు అయితే ఇప్పుడు నా ఆశీర్వాదము
లన్నీ కొండంత ఎత్తుగా నీమీద క్రుమ్మరించ
బడతాయి."

---

**రాజు వచ్చేంతవరకు** "షిలోహు వచ్చునంతవరకు" లేక "దానికి చెందినవాడు వచ్చువరకు."

**అతడు ... గాడిదను కట్టివేస్తాడు** లేక అతని గాడిద ద్రాక్షావల్లికి కట్టబడుతుంది. అతని గాడిద పిల్ల శ్రేష్ఠమైన ద్రాక్షావల్లికి కట్టబడుతుంది. అతడు ద్రాక్షారసంలో తన బట్టలు ఉదుకుతాడు, ద్రాక్షారక్తంలో అతని శ్రేష్ఠవస్త్రాలు ఉదుకుతాడు. 12 అతని కళ్లు ద్రాక్షారసంకంటె ఎక్కువ ఎర్రగాను, అతని పళ్లు పాలకంటె ఎక్కువ తెల్లగాను ఉంటాయి.

### బెన్యామీను

27 "బెన్యామీను ఆకలిగొన్న తోడేలు వంటివాడు
ఉదయాన అతడు చంపుకొని తింటాడు మిగిలిన
దానిని అతడు సాయంకాలం పంచుకొంటాడు."
28అవి ఇశ్రాయేలు పంన్రెండు కుటుంబాలు.
మరియు వారి తండ్రి వారితో చెప్పిన విషయాలు
అవి. వారిలో ప్రతి కుమారునికి తగిన ఆశీర్వాదం
అతడు వారికి ఇచ్చాడు. 29తర్వాత ఇశ్రాయేలు వారికి
ఒక ఆజ్ఞ ఇచ్చాడు. అతడు ఇలా చెప్పాడు, "నేను
మరణించినప్పుడు నా ప్రజలతో ఉండాలని నేను కోరు
చున్నాను. హిత్తీయుడగు ఎఫ్రోను పొలంలోని గుహలో
నా పూర్వీకులతో బాటు పాతిపెట్టబడాలని కోరుతు
న్నాను. 30ఆ గుహ మమ్రే దగ్గర మక్పేలా పొలంలో
ఉంది. అది కనాను దేశంలో ఉంది. అబ్రాహాము తనను
పాతిపెట్టేందుకు స్థలం ఉండాలని ఎఫ్రోను దగ్గర ఆ
భూమి కొన్నాడు. 31అబ్రాహాము, అతని భార్య శారా
ఆ గుహలోనే పాతిపెట్టబడ్డారు. ఇస్సాకు, అతని భార్య
రిబ్కా ఆ గుహలోనే పాతిపెట్టబడ్డారు. నా భార్య
లేయాను నేను ఆ గుహలోనే పాతిపెట్టాను. 32హిత్తీ
మనుష్యుల దగ్గర కొన్న పొలంలో ఉంది ఆ గుహ."
33యాకోబు తన కుమారులతో మాట్లాడటం ముగిం
చిన తర్వాత అతడు పండుకొని, పడకమీద తన కాళ్లు
చాపుకొని మరణించాడు.

### యాకోబు సమాధి చేయబడుట

50 ఇశ్రాయేలు మరణించినప్పుడు యోసేపు
చాలా విచారించాడు. అతడు తన తండ్రిని
కౌగలించుకొని, అతని మీద పడి ఏడ్చి, అతనిని ముద్దు
పెట్టుకొన్నాడు. 2తన తండ్రి దేహమును సిద్ధం చేయు
మని అతడు తన సేవకులకు ఆజ్ఞాపించాడు (ఆ సేవ
కులు వైద్యులు). యాకోబు శరీరాన్ని సమాధి చేసేం
దుకు వైద్యులు సిద్ధం చేసారు. ఈజిప్టువారి ప్రత్యేక
పద్ధతిలో ఆ శరీరాన్ని వారు సిద్ధం చేసారు. 3ఈజిప్టు
వారు ఈ పద్ధతిలో శరీరాన్ని సిద్ధం చేయాలంటే, ఆ
శరీరాన్ని సమాధి చేసేందుకు ముందు 40 రోజులు
వారికి అవసరం. తర్వాత ఈజిప్టువాళ్లు యాకోబు
కోసం దుఃఖించటానికి ప్రత్యేక సమయం తీసు
కొన్నారు. ఆ సమయం 70 రోజులు.
4డెబ్భైరోజుల తర్వాత దుఃఖసమయం ముగిసింది.
కనుక ఫరో అధికారులతో యోసేపు మాట్లాడాడు.
"దయచేసి ఫరోతో ఇది చెప్పండి
5నా తండ్రి మరణ ఘడియల్లో నేను ఆయనకు
ఒక వాగ్దానం చేసాను. కనాను దేశంలోని ఒక గుహలో
నేను ఆయనను సమాధి చేస్తానని నేను వాగ్దానం
చేసాను. ఇది ఆయన తనకోసం సిద్ధం చేసుకొన్న
గుహ. కనుక దయచేసి నేను వెళ్లి, నా తండ్రిని సమాధి
చేసుకోనివ్వండి. అప్పుడు నేను తిరిగి మీ దగ్గరకు
వస్తాను" అన్నాడు యోసేపు. 6"నీ మాట నిలబెట్టుకో,
వెళ్లి నీ తండ్రిని సమాధి చేయి" అని ఫరో జవాబిచ్చాడు.
7కనుక యోసేపు తన తండ్రిని సమాధి చేసేందుకు
వెళ్లాడు. ఫరో అధికారులంతా ఫరో పెద్దలు (నాయ
కులు) యోసేపుతో కూడ వెళ్లారు. ఫరో నాయకులు,
ఈజిప్టులోని పెద్దలందరూ యోసేపుతో వెళ్లారు.
8యోసేపు కుటుంబంలోని వాళ్లందరూ, అతనితో
వెళ్లారు. మరియు తన తండ్రి కుటుంబం అంతా
యోసేపుతో వెళ్లారు. పిల్లలు, పశువులు మాత్రమే
గోషెను దేశంలో విడువబడటం జరిగింది 9యోసే
పుతో వెళ్లటానికి అందరూ రథాలమీద, గుర్రాలమీద
వెళ్లారు. అది చాలా పెద్ద గుంపు అయింది.
10యోర్దాను నదికి తూర్పున గోరెన్ ఆఠదు కళ్లం
దగ్గరకు వారు వెళ్లారు. ఆ స్థలంలో వారు ఇశ్రాయేలు
నిమిత్తం భూస్థాపన క్రమాలు దీర్ఘంగా జరిగించారు. ఆ
భూస్థాపన క్రమం ఏడు రోజులపాటు కొనసాగింది.
11గోరెన్ ఆఠదులో జరిగిన భూస్థాపన క్రమాన్ని
కనానులో నివసిస్తున్న ప్రజలు చూశారు. వారు "ఆ
ఈజిప్టు వాళ్లు ఎంతగా దుఃఖిస్తున్నారో అని చెప్పు
కొన్నారు" కనుక ఆ స్థలం ఇప్పుడు ఆబేల్ మిస్రా
యిము అని పిలువబడుతుంది.
12కనుక యాకోబు కుమారులు తమ తండ్రి ఆజ్ఞా
పించిన ప్రకారం చేసారు. 13వారు అతని శరీరాన్ని
కనానుకు తీసుకొని వెళ్లి, మక్పేలా గుహలో దానిని
పాతిపెట్టారు. హిత్తీయుడగు ఎఫ్రోను దగ్గర అబ్రాహాము
కొన్న పొలంలోని మమ్రే సమీపాన ఉన్న గుహ ఇది.
సమాధిస్థలంగా ఉపయోగించేందుకు అబ్రాహాము ఆ
గుహ కొన్నాడు. 14యోసేపు తన తండ్రిని పాతిపెట్టిన
తర్వాత, అతనూ, అతనితో ఆ గుంపులో ఉన్న ప్రతి
ఒక్కరూ తిరిగి ఈజిప్టు వెళ్లిపోయారు.

### సోదరులు యోసేపుకు భయపడుట

15యాకోబు మరణించిన తర్వాత యోసేపు సోద
రులు దిగులుపడిపోయారు. చాలాకాలం క్రిందట వారు
చేసినదాన్ని బట్టి యోసేపు ఇంకా వారిమీద కోపంగా
ఉంటాడని వారు భయపడ్డారు. మనము చేసినదాని
విషయంలో "బహుశః యోసేపు మనల్ని ఇంకా ద్వేషిం
చవచ్చు. మరియు మనం అతనికి చేసిన కీడంతటికి
తిరిగి పగ తీర్చుకోవచ్చు" అని తమలో తాము అను
కొన్నారు.
16కనుక ఆ సోదరులు యోసేపుకు ఈ సందేశం
పంపించారు.

నీ తండ్రి చనిపోక ముందు మాకు ఒక ఆజ్ఞ
ఇచ్చాడు. 17'యోసేపుకు వారు చేసిన కీడును
దయతో క్షమించమని నేను అతణ్ణి బ్రతిమాలు
తున్నానని యోసేపుతో చెప్పండి' అని అతడు

చెప్పాడు. కనుక యోసేపూ, మేము చేసిన
తప్పు పనిని దయచేసి ఇప్పుడు క్షమించు.
మేము నీ తండ్రి దేవుని దాసులం.

యోసేపు సోదరులు చెప్పిన విషయాలు యోసే
పుకు చాలా దుఃఖం కలిగించాయి, అతడు ఏడ్చేసాడు.
18యోసేపు సోదరులు అతని దగ్గరకు వెళ్లి అతని
ఎదుట సాగిలపడ్డారు. వారు "మేము నీకు దాసులం
"అని చెప్పారు.
19అప్పుడు యోసేపు, "భయపడకండి, నేనేం
దేవుణ్ణికాను. మిమ్మల్ని శిక్షించే హక్కు నాకు లేదు.
20మీరు నాకు ఏదో కీడు చేయాలని తలపెట్టారు.
కాని దేవుడు నిజంగా మంచి వాటిని తలపెట్టాడు.
అనేకమంది ప్రజల ప్రాణాలు కాపాడుటకు నన్ను
వాడుకోవటం దేవుని ఏర్పాటు. ఈ వేళ ఇంకా అదే
ఆయన ఏర్పాటు. 21కనుక భయపడవద్దు. నేను మీ
కోసం, మీ పిల్లలకోసం జాగ్రత్త పుచ్చుకుంటాను"
అని చెప్పాడు. యోసేపు తన సోదరులతో దయగా
మాట్లాడాడు. ఆ సోదరులకు యిది నెమ్మది కలిగిం
చింది. 22యోసేపు తన తండ్రి కుటుంబంతో సహా
ఈజిప్టులోనే జీవించటం కొనసాగించాడు. యోసేపు
110 సంవత్సరాల వయస్సులో చనిపోయాడు.
23యోసేపు జీవించి ఉన్నప్పుడు, ఎఫ్రాయిముకు
పిల్లలు, పిల్లల పిల్లలు పుట్టారు. మరియు అతని కుమా
రుడు మనష్షేకు మాకీరు అనే పేరుగల ఒక కొడుకు
ఉన్నాడు. మాకీరు పిల్లలను చూచేంతవరకు యోసేపు
జీవించాడు.

### యోసేపు మరణం

24యోసేపు మరణం దగ్గరపడినప్పుడు, అతడు,
"నేను చనిపోవాల్సిన సమయం దాదాపు వచ్చేసింది.
అయితే దేవుడు మిమ్మల్ని కాపాడుతాడని నాకు
తెలుసు. ఆయన మిమ్మల్ని ఈ దేశంనుండి బయటకు
తీసుకొని వెళ్తాడు. అబ్రాహాము, ఇస్సాకు, యాకోబు
లకు ఆయన ఇస్తానని వాగ్దానం చేసిన దేశానికి దేవుడు
మిమ్మల్ని నడిపిస్తాడు" అని తన సోదరులతో
చెప్పాడు.
25అప్పుడు యోసేపు తన వాళ్లందర్నీ ఒక వాగ్దానం
చెయ్యమని అడిగాడు. "దేవుడు మిమ్మల్ని ఆ నూతన
దేశానికి నడిపించినప్పుడు, నా యెముకలను మీతో
కూడ తీసుకొని వెళ్తామని నాకు వాగ్దానం చేయండి"
అన్నాడు యోసేపు.
26యోసేపు 110 సంవత్సరాల వయస్సు ఉన్న
ప్పుడు ఈజిప్టులో మరణించాడు. వైద్యులు అతని
శరీరాన్ని సమాధి చేసేందుకు సిద్ధంచేసి, ఈజిప్టులో
సమాధి పెట్టెలో ఆ శరీరాన్ని ఉంచారు.

# నిర్గమకాండము

### ఈజిప్టులో యాకోబు కుటుంబం

1 యాకోబు (ఇశ్రాయేలు) తన కుమారులతో పాటు ఈజిప్టు వెళ్లాడు. ఇశ్రాయేలు కుమారుల పేర్లు ఏవంటే: [2]రూబేను, షిమ్యోను, లేవి, యూదా, [3]ఇశ్శాఖారు, జెబూలూను, బెన్యామీను, [4]దాను, నఫ్తాలి, గాదు, ఆషేరు. ప్రతియొక్కరూ కుటుంబ సమేతంగా వచ్చారు. [5]యాకోబు సంతానం మొత్తం డెబ్బయి మంది. (12 మంది కుమారుల్లో మరొకడు యోసేపు. అతను అప్పటికే ఈజిప్టులో వున్నాడు.)

[6]తర్వాత యోసేపు, అతని సోదరులు, వారి తరం వారు అందరూ చనిపోయారు. [7]అయితే, ఇశ్రాయేలు ప్రజలకు పిల్లలు చాలామంది ఉన్నారు. వారి సంఖ్య చాలా పెరిగిపోయింది. ఆ ప్రజలు చాలా బలవంతులు కాగా ఈజిప్టు దేశం వాళ్లతోనే నిండిపోయింది.

### ఇశ్రాయేలు ప్రజలకు కష్టాలు

[8]అప్పుడు ఒక కొత్తరాజు ఈజిప్టును పాలించడం మొదలు పెట్టాడు. ఈ రాజుకు యోసేపు తెలియదు. [9]ఈ రాజు తన ప్రజలతో ఇలా అన్నాడు, "ఇశ్రాయేలు జనాన్ని చూడండి. వాళ్లు చాలామంది ఉన్నారు! పైగా వాళ్లు మనకంటె చాలా బలంగా ఉన్నారు! [10]వాళ్లపైన మనం ఏదైనా పథకం వేయాలి. లేకపోతే ఏదైనా యుద్ధం వచ్చినప్పుడు ఇశ్రాయేలు ప్రజలు మన శత్రువులతో ఏకం కావచ్చు. అల్లాంటప్పుడు వాళ్లు మనల్ని ఓడించి, మన దగ్గర్నుండి తప్పించుకొని పారిపోవచ్చు."

[11]ఈజిప్టు ప్రజలు ఇశ్రాయేలు ప్రజలకు జీవితాన్ని కష్టతరం చేయాలనుకొన్నారు. అందుచేత బానిసల పైన ఉండే అధికారులను ఇశ్రాయేలీయుల మీద నియమించారు. ఆ యజమానులు ఇశ్రాయేలు ప్రజలను బలవంతం చేసి ఫరోకోసం ధాన్యాదులను నిలువ చేయు పీతోము, రామసేను పట్టణాలను కట్టించారు. (ధాన్యం మొదలైన వాటిని వాళ్లు ఈ పట్టణాల్లో నిల్వ చేసేవాళ్లు*)

[12]ఇశ్రాయేలీయులు ప్రయాసపడి పనిచేయునట్లు ఈజిప్టు వాళ్లు వారిని బలవంతపెట్టారు. కాని పనిలో ఇశ్రాయేలు ప్రజలు ఎంతగా బలవంతం చేయబడితే, అంతగా వాళ్లు పెరిగి విస్తరించిపోయారు. కనుక ఇశ్రాయేలు ప్రజలను చూస్తోంటే, ఈజిప్టు వాళ్లు మరింత ఎక్కువగా భయపడిపోయారు. [13]అందుచేత ఈజిప్టు వారు ఇశ్రాయేలు ప్రజల శరీరశ్రమను మునుపటికన్నా ఎక్కువగా కష్టతరం చేసి బలవంత పెట్టారు.

[14]ఇశ్రాయేలీయుల జీవితాన్ని చాలా కష్టతరం చేశారు ఈజిప్టువారు. అడుసు* తొక్కి ఇటుకలు చేయడంలో వాళ్లు ఇశ్రాయేలు ప్రజల్ని బలవంతం చేశారు. అలాగే పొలాల్లో పనిచేయడానికి కూడా వాళ్లను చాల బలవంత పెట్టారు. వాళ్లు చేసిన ప్రతి పనిలోనూ వాళ్లను చాల బలవంత పెట్టి ఒత్తిడి చేసారు.

### దేవుణ్ని వెంబడించిన మంత్రసానులు

[15]షిఫ్రా, పూయా అను ఇద్దరు మంత్రసానులుండే వారు. వీరు ఇశ్రాయేలు స్త్రీల కాన్పు సమయాల్లో సహాయ పడేవారు. ఈజిప్టు రాజు ఈ మంత్రసానులను పిలిచి, [16]"ఈ హీబ్రూ స్త్రీలు పిల్లల్ని కనడంలో మీరు ఇలానే సహాయం చేస్తూ ఉండండి. ఒకవేళ ఆడపిల్ల పుడితే ఆ పిల్లను బ్రతకనివ్వండి, కాని శిశువు మగవాడైతే మాత్రం తప్పక చంపేయండి" అని చెప్పాడు.

[17]ఆ మంత్రసానులు దైవ భక్తిగలవాళ్లు గనుక వారు రాజుగారి ఆజ్ఞకు లోబడలేదు. మగపిల్లలందర్నీ వాళ్లు బ్రతకనిచ్చారు.

[18]ఈజిప్టురాజు ఆ మంత్రసానులను పిలిచి, "మీరు ఎందుకిలా చేసారు? ఆ మగపిల్లల్ని ఎందుకు బ్రతకనిచ్చారు?" అంటూ ప్రశ్నించాడు.

[19]"ఈజిప్టు స్త్రీలకంటె హీబ్రూ స్త్రీలకు చాల బలం ఉంది. సహాయం చేసేందుకు మేము వెళ్లేలోపుగానే వాళ్లు పిల్లల్ని కనేసారు." అంటూ మంత్రసానులు ఫరోతో చెప్పారు. [20-21](ఆ మంత్రసానుల విషయమై దేవుడు సంతోషించాడు కనుక వాళ్లకూ వారి స్వంత కుటుంబాలు ఉండేటట్టు దేవుడు వారికి మేలు చేశాడు. హీబ్రూ ప్రజలు* ఇంకా పిల్లల్ని కంటూనే ఉన్నారు. వాళ్లు చాల బలవంతులయ్యారు). [22]కనుక ఫరో,

---

**నిల్వ చేయుట** సమకూర్చుట.

**అడుసు** జిగటమట్టి, బంకమట్టి.

**హీబ్రూ ప్రజలు** అంటే ఇశ్రాయేలు వాళ్లు.

“మగశిశువు పుట్టినప్పుడల్లా, మీరు వాడ్ని నైలు నదిలో
పడవేయండి. కాని ఆడపిల్లల్ని అందరినీ బ్రతక
నియ్యండి” అని తన ప్రజలకు ఆజ్ఞాపించాడు.

## పసివాడైన మోషే

2 లేవీ వంశానికి చెందిన ఒకడు ఉన్నాడు. లేవీ
వంశానికి చెందినదాన్నే ఒకామెను అతడు పెళ్లి
చేసుకొన్నాడు. 2ఆమె గర్భవతియై ఒక కుమారుణ్ణి
కన్నది. శిశువు చాలా అందంగా ఉండడం చూసి ఆ
తల్లి మూడెన్నెల్లపాటు ఆ శిశువును దాచి ఉంచింది.
3అయితే మూడు నెలలు అయ్యాక ఆ శిశువు సంగతి
తెలిసిపోతుందేమోనని ఆ తల్లి భయపడింది. అలా
తెలిస్తే ఆ శిశువు మగపిల్లవాడు కనుక వాడ్ని చంపేస్తారు.
అందుకని ఆమె జమ్ముతో ఒక బుట్టను తయారు
చేసి, అది నీళ్లలో తేలడానికిగాను దానికి తారు
పూసింది. శిశువును ఆ బుట్టలో పెట్టింది. ఆమె తర్వాత
నది ఒడ్డున ఏపుగా పెరిగిన జమ్ములో ఆ బుట్టను
పెట్టింది. 4ఆ పసివాడి అక్క అక్కడే వుండి గమని
స్తూవుంది. ఆమె ఆ పసివాడికి ఏమి జరుగుతుందో
చూడాలని అనుకొంది.
5సరిగ్గా అదే సమయంలో ఫరో కూతురు స్నానం
చేయడానికి నది దగ్గరకు వెళ్లింది. ఆమె పని మనుషులు
నది గట్టు మీద తిరుగుతూ ఉన్నారు. జమ్ములో
ఉన్న బుట్టను ఆమె చూసింది. వెళ్లి ఆ బుట్టను తీసు
కురమ్మని ఆమె తన పనికత్తెల్లో ఒక దానితో చెప్పింది.
6రాజకుమారి ఆ బుట్ట తెరచి, అందులో ఉన్న మగ
పిల్లాడ్ని చూసింది. ఆ పసివాడు ఏడుస్తూ ఉండడం
చూసి, ఆమె జాలి పడింది. “వీడు హీబ్రూ పిల్లవాడని”
ఆమె చెప్పింది.
7ఇంకా అప్పటివరకు దాక్కొని ఉన్న ఆ పసివాని
అక్క లేచి, “ఈ పసివాడ్ని పెంచటానికి మీకు సహాయం
చేసేందుకు ఒక హీబ్రూ స్త్రీని వెదకి తీసుకొని
రమ్మంటారా?” అని రాజకుమారిని అడిగింది.
8“సరే అలాగే తీసుకురా” అంది రాజకుమారి. ఆ
పిల్ల వెళ్లి ఆ పసివాడి స్వంత తల్లినే తీసుకొచ్చింది.
9“ఈ పసివాడ్ని తీసుకొని వెళ్లి పాలిచ్చి నాకోసం
పెంచు. పసివాడ్ని జాగ్రత్తగా చూడు. నీకు నేను జీతం
ఇస్తాను” అంది ఆ రాజకుమారి. కనుక ఆ స్త్రీతన పసి
వాణ్ణి తీసుకొని జాగ్రత్తగా పెంచింది. 10ఆ పసివాడు
పెద్దవాడయ్యాడు. కొన్నాళ్లకు ఆ స్త్రీపిల్లవాడ్ని రాజ
కుమారి దగ్గరకు తీసుకొచ్చింది. రాజకుమారి ఆ పిల్ల
వాడ్ని తన సొంత కుమారుడుగా స్వీకరించింది. ఆ
పిల్లవాడ్ని నీళ్లలోంచి బయటికి తీసింది కనుక ఆమె
వానికి మోషే* అని పేరు పెట్టింది.

## మోషే తనవారికి సహాయంచేయుట

11మోషే పెరిగి పెద్దవాడయ్యాడు. తన ప్రజలు
అంటే, హీబ్రూవారు బలవంతంగా చాలా కష్టపడి పని
చేయాల్సి ఉన్నట్టు మోషే గ్రహించాడు. ఒకరోజు
ఈజిప్టు వాడొకడు హీబ్రూవాడ్ని కొట్టడం మోషే
చూసాడు. 12ఎవరైనా గమనిస్తున్నారేమోనని మోషే
అటు ఇటు చూసాడు. తర్వాత మోషే ఆ ఈజిప్టువాడ్ని
చంపేసి ఇసుకలో పాతిపెట్టాడు.
13మర్నాడు హీబ్రూవాళ్లే ఇద్దరు పోట్లాడుకోవడం
మోషే చూసాడు. వారిలో ఒకడిది తప్పని తెలుసుకొని
“అతనితో ఎందుకిలా మీవాడ్ని కొడుతున్నావు?” అని
అన్నాడు.
14దానికి అతను జవాబిస్తూ, “మామీద నీవు అధికారి
వనిగాని, న్యాయమూర్తివనిగాని ఎవరయినా నియమిం
చారా? నిన్న నీవు ఆ ఈజిప్టువాడ్ని చంపినట్టు నన్నూ
చంపుతావా?” అన్నాడు. అప్పుడు మోషే భయపడి
పోయాడు. “అలాగైతే నేను చేసిన ఆ పని ఇప్పుడు
అందరికీ తెలిసిపోయిందని ” మోషే తనలో తాను
అనుకొన్నాడు.
15మోషే చేసినదాన్నిగూర్చి విని ఫరో మోషేను
చంపెయ్యాలనే నిర్ణయానికొచ్చాడు! కానీ ఫరో దగ్గ
ర్నుండి మోషే పారిపోయాడు. మోషే మిద్యాను దేశా
నికి పారిపోయి అక్కడ ఒక బావివద్ద ఆగిపోయాడు.

## మిద్యానులో మోషే

16మిద్యానులో ఒక యాజకునికి ఏడుగురు కుమా
ర్తెలు. ఒకరోజు వారు తమ తండ్రిగారి గొర్రెలకు
నీళ్లు తీసుకొని రావడానికి ఆ బావి దగ్గరకు వెళ్లారు.
వారు ఆ నీళ్ల కుండలను నింపడానికి ప్రయత్నం
చేస్తూ ఉన్నారు. 17కాని అక్కడ ఉన్న కొందరు గొర్రెల
కాపరులు ఆ అమ్మాయిలను నీళ్లు చేదుకోనివ్వకుండా
వెళ్లగొట్టేస్తున్నారు. కనుక ఆ అమ్మాయిలకు మోషే
సహాయం చేసి, వారి గొర్రెల మందకు నీళ్లు పెట్టాడు.
18తర్వాత వాళ్లు వారి తండ్రి రగూయేలు దగ్గరకు
వెళ్లిపోయారు. “ఆయన వారితో ఈ రోజు మీరు
చాలా త్వరగా ఇంటికి వచ్చేశారు” అని అన్నాడు.
19“గొర్రెల కాపరులు కొందరు మమ్మల్ని వెళ్ల
గొట్టడానికి ప్రయత్నం చేసారు. అయితే ఈజిప్టు
మనిషి ఒకతను మాకు సహాయం చేసాడు.
అతడే మాకోసం నీళ్లు చేది, మా మందలకు
పెట్టాడు” అంటూ జవాబు చెప్పారు ఆ అమ్మాయిలు.
20అందుకు రగూయేలు “అలాగైతే అతనేడి? అతణ్ణి
ఎందుకలా విడిచిపెట్టారు? మీరు అతణ్ణి మనతో
భోజనం చేయమని పిలవండి” అన్నాడు తన
కూతుళ్లతో.
21అతనితో కలిసి ఉండటానికి మోషే అంగీక
రించాడు. అతను సిప్పోర అనే తన కూతుర్ని మోషేకు

---

**మోషే** అంటే “హీబ్రూ భాషలో నీళ్లలోనుండి బయటకు తీయబడింది” అని భావం.

భార్యగా ఇచ్చాడు. [22]సిప్పోరాకు కొడుకు పుట్టాడు.
అతనికి గెర్షోము* అని మోషే పేరుపెట్టాడు. మోషే
తనది కాని మరో పరాయి దేశంలో ఉండడం చేత
తన కొడుక్కు ఈ పేరు పెట్టాడు.

### ఇశ్రాయేలీయులకు సహాయం చేయుటకు దేవుడు నిశ్చయించుకొనుట

[23]చాలాకాలం గడచిపోయింది. ఈజిప్టురాజు చని
పోయాడు. అప్పటికి ఇశ్రాయేలు వాళ్లు ఇంకా కష్టతర
మైన పనులు చేసేందుకు బలవంత పెట్టబడుతూనే
ఉన్నారు. వాళ్లు సహాయం కోసం మొరపెడుతూ
ఉన్నారు. దేవుడు వారి మొర విన్నాడు. [24]దేవుడు
వారి ప్రార్థనలు విని, అబ్రాహాం, ఇస్సాకు, యాకోబు
లతో తాను చేసుకొన్న ఒడంబడికను జ్ఞాపకం చేసు
కొన్నాడు. [25]ఇశ్రాయేలీయుల కష్టాలను దేవుడు
చూచాడు. త్వరలోనే వారి కష్టాలను కడతేర్చాలని
ఆయనకు తెలుసు.

### మండుతున్న పొద

3 మోషే మామగారి పేరు యిత్రో (ఈయన
మిద్యాను వారికి యాజకుడు). యిత్రో గొర్రెలకు
మోషే కాపరి అయ్యాడు. ఒకనాడు మోషే అరణ్యా
నికి పశ్చిమంగా ఆ గొర్రెల్ని తోలుకుపోయాడు.
అక్కడ హోరేబు అనే ఒక కొండ ఉంది. అది దేవుని
కొండ. [2]ఆ కొండమీద మండుతున్న ఒక పొదలో
యెహోవా దూతను మోషే చూసాడు. ఆ పొద
మండిపోతూ కాలిపోకుండా ఉండటం మోషే చూశాడు.
[3]అందుచేత మోషే, “ఈ పొద మండుతూ ఉండి కాలి
పోకుండా ఎలా వుందో దగ్గరకు వెళ్లి చూడాలి” అను
కొన్నాడు.
[4]ఆ పొదను చూచేందుకు మోషే వస్తూ ఉండటం
యెహోవా చూశాడు. అందుచేత ఆ పొదలోంచే
దేవుడు, “మోషే, మోషే” అని మోషేను పిల్చాడు
“చిత్తం ప్రభూ” అన్నాడు మోషే.
[5]అప్పుడు దేవుడు ఇలా అన్నాడు, “ఇక దగ్గరకు
రాకు. నీ చెప్పులు విడువు. నీవు నిలబడింది పవిత్ర
స్థలం [6]నేను నీ పూర్వీకుల దేవుణ్ణి. నేను అబ్రాహాం,
ఇస్సాకు, యాకోబుల దేవుణ్ణి.” దేవుణ్ణి చూడాలంటే,
భయం వేసింది కనుక మోషే తన ముఖం కప్పు
కొన్నాడు.
[7]యెహోవా “ఈజిప్టులో నా ప్రజలు అను భవి
స్తున్న కష్టాలు నేను చూశాను. ఈజిప్టు వాళ్లు నా
ప్రజల్ని బాధపెట్టినప్పుడు వారు మొర పెట్టడం నేను
విన్నాను. వారి బాధ నాకు తెలుసు [8]ఈజిప్టు వాళ్ల
బారినుండి నా ప్రజల్ని రక్షించేందుకు ఇక నేను దిగి
వస్తాను. ఆ దేశం నుండి వాళ్లను బయటకు తెచ్చి,
మరో మంచి దేశానికి నడిపిస్తాను. అక్కడ వాళ్లు ఏ
కష్టాలూ లేకుండా స్వేచ్ఛగా ఉంటారు.* అది మంచి
మంచి వాటితో నిండిన చాలా మంచి దేశం.* కనానీ
యులు, హిత్తీయులు, అమోరీయులు, పెరిజ్జీయులు,
హివ్వీయులు, యెబూసీయులు, రకరకాల మను
ష్యులు అక్కడ నివసిస్తున్నారు. [9]ఇశ్రాయేలీయుల
మొరలు నేను విన్నాను. వాళ్ల జీవితాన్ని ఈజిప్టు వాళ్లు
ఎంత కష్టతరం చేసారో నేను చూశాను. [10]అందుచేత
నేను ఇప్పుడు ఫరో దగ్గరకు నిన్ను పంపిస్తున్నాను.
వెళ్లు, నా ప్రజలైన ఇశ్రాయేలీయులను ఈజిప్టు నుంచి
బయటకు తీసుకువెళ్లు” అని చెప్పాడు.
[11]అయితే మోషే, “నేనేమీ అంతగొప్ప వాణ్ణి కాదే.
ఫరో దగ్గరకు వెళ్లేందుకుగాని, ఈజిప్టు నుండి ఇశ్రాయే
లీయులను బయటకు నడిపించేందుకుగాని నేను ఎంత
టివాణ్ణి”? అంటూ దేవుణ్ణి అడిగాడు.
[12]“నేను నీకు తోడుగా ఉంటాను గనుక నీవు చేయ
గలవు. నేనే నిన్ను పంపిస్తున్నాను అనేందుకు రుజువు
ఏమిటంటే, నీవు ఈ ప్రజల్ని ఈజిప్టు నుండి బయటికి
నడిపించిన తర్వాత నీవు మళ్లీ వచ్చి ఈ కొండమీదనే
నన్ను ఆరాధిస్తావు!” అని దేవుడు చెప్పాడు.
[13]దానికి మోషే, “ నేను ఇశ్రాయేలీయుల దగ్గరకు
వెళ్లి మీ పూర్వీకుల దేవుడు నన్ను మీ దగ్గరకు పంపిం
చాడు’ అని చెబితే, ‘ఆ దేవుడి పేరేమిటి ’అని వాళ్లు
నన్ను అడుగుతారు గదా! మరి నేనేమని చెప్పాలి,”
అని దేవుణ్ణి అడిగాడు.
[14]“నేను ఉన్నవాడను”* (అని వారితో చెప్పు)
అన్నాడు దేవుడు మోషేతో. ఇశ్రాయేలీయుల దగ్గరకు
నీవు వెళ్లినప్పుడు, ‘ఉన్నవాడను,’ అనువాడు నన్ను
మీ దగ్గరకు పంపించాడు అని చెప్పు” అన్నాడు దేవుడు
మోషేతో.
[15]దేవుడు మోషేతో ఇలా చెప్పాడు: “మీ పూర్వీ
కులు, అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు
ఎల్లప్పుడూ నా పేరు యెహోవాగానే* ఉంటుంది.

---

**గెర్షోము** హీబ్రూ భాషలో ఈ పేరుకు ఇక్కడ నేను “పరదేశస్తుడ్ని” అని అర్థం.

**అక్కడ … ఉంటారు** అక్షరాలా సువిశాల దేశం.

**అది … దేశం** అక్షరాలా పాలు తేనెలు ప్రవహించే దేశం.

**నేను ఉన్నవాడను** యెహోవా అనే మాటలాగే ఉంటాయి హీబ్రూ మాటలు. దేవుడు అనే మాటకు యిక్కడ వాడిన మాట సాధారాణంగా దేవుడు అనే అనువాదం చేయబడింది. దేవుడు ఎల్లప్పుడూ ఉన్నాడు! తన ప్రజలతో ఎల్లప్పుడూ ఉన్నాడని భావం.

**యెహోవా** “యెహోవా” అనే ఈ మాట సాధారణంగా “దేవుడు” అని అనువాదం చేయబడింది. “ఆయన ఉన్నాడు” అనే భావము “ఆయన అన్నింటికీ ఉనికిని యిచ్చువాడు” అనే అర్థం వచ్చే హీబ్రూ మాటలాంటిదే ఈ మాట.

తరతరాల ప్రజలు ఆ పేరుతోనే నన్ను తెలుసు
కొంటారు. "యెహోవా నన్ను మీ దగ్గరకు పంపిం
చాడు' అని వాళ్లతో చెప్పు."
16"వెళ్లి ఇశ్రాయేలు సమాజంలోని పెద్దలందరిని
సమావేశపరిచి, 'మీ పూర్వీకుల దేవుడైన యెహోవా
నాకు ప్రత్యక్షం అయ్యాడు. అబ్రాహాము, ఇస్సాకు,
యాకోబుల దేవుడు నాతో మాట్లాడాడు. మిమ్మల్ని
గూర్చి ఈజిప్టులో మీకు సంభవించిన సంగతులను
గూర్చి నేను ఆలోచించాను. 17ఈజిప్టులో మీరు అనుభ
విస్తున్న శ్రమలనుండి మిమ్మల్ని తప్పించాలనే నిర్ణయా
నికొచ్చాను. ప్రస్తుతం కనానీయులు, హిత్తీయులు,
అమోరీయులు, పెరిజ్జీయులు, హివ్వీయులు,
యెబూసీయులు, అనే రకరకాల ప్రజలకు చెందిన
ఒక దేశానికి నేను మిమ్మల్ని నడిపిస్తాను. చాలా మంచి
మంచి వాటితో నిండిన ఒక మంచి దేశానికి నేను
మిమ్మల్ని నడిపిస్తాను' అని వాళ్లతోచెప్పు."

18"పెద్దలు (నాయకులు) నీ మాట వింటారు.
అప్పుడు నీవు, పెద్దలు (నాయకులు) కలిసి ఈజిప్టు
రాజు దగ్గరకు వెళ్లాలి. హెబ్రూ ప్రజల దేవుడైన
యెహోవా మాకు ప్రత్యక్షమయ్యాడు. మూడు
రోజుల దూరము అరణ్యంలోనికి ప్రయాణం చేసి
వెళ్లమని ఆయన చెప్పాడు. అక్కడ మా యెహోవా
దేవునికి మేము బలులు అర్పించాలి. అని నీవు అతనితో
చెప్పాలి.'

19"అయితే ఈజిప్టురాజు మిమ్మల్ని పోనియ్యడని
నాకు తెలుసు. అతడు మిమ్మల్ని పోనిచ్చేటట్టు ఒక
మహాశక్తి మాత్రమే అతణ్ణి బలవంతం చేస్తుంది. 20కనుక
ఈజిప్టు మీద నేను నా మహాశక్తిని ప్రయోగిస్తాను. ఆ
దేశంలో అద్భుతాలు జరిగేటట్టు చేస్తాను. నేను అలా
చేసిన తర్వాత అతడు మిమ్మల్ని వెళ్లనిస్తాడు. 21అంతే
కాదు ఈజిప్టు వాళ్లు ఇశ్రాయేలు ప్రజలమీద దయ
చూపించేటట్టుగా చేస్తాను. అందుచేత మీరు వెళ్లిపోయే
టప్పుడు నీ ప్రజలకు వాళ్లు కానుకలను ఇస్తారు."
22"హెబ్రూవాళ్లలో ప్రతి స్త్రీ తన పొరుగున ఉండే
ఈజిప్టు వాళ్లను, ఆ ఇళ్లలో వుండే వాళ్లందర్నీ అడగ్గానే
వాళ్లు ఆమెకు కానుకలు ఇస్తారు. వెండి, బంగారం,
మంచి బట్టలు, కానుకలుగా మీవారికి దొరుకుతాయి.
మీరు ఈజిప్టు విడిచి వెళ్లేటప్పుడు మీరు ఆ కానుకలను
మీ పిల్లలకు పెట్టాలి. ఈ విధంగా ఈజిప్టు ఐశ్వర్యాన్ని
మీరు తీసుకోవాలి."

4 అప్పుడు మోషే, "నీవు నన్ను పంపించావు అని
చెబితే ఇశ్రాయేలు ప్రజలు నమ్మరు గదా!
'యెహోవా నీకు కనబడనే లేదు అంటారు వాళ్లు'
అన్నాడు దేవునితో.
2అయితే దేవుడు, "నీ చేతిలోనిది ఏమిటి" అని
మోషేను అడిగాడు.

"ఇది నా చేతికర్ర" అని మోషే జవాబిచ్చాడు.
3అప్పుడు దేవుడు, "నీ కర్ర కింద పడవెయ్యి"
అన్నాడు. మోషే తన కర్రను నేల మీద పడేసాడు.
ఆ కర్ర ఒక పాముగా మారిపోయింది. మోషే భయపడి
దాని దగ్గర్నుండి పారిపోయాడు. 4అయితే యెహోవా
మోషేతో, "ముందుకు వెళ్లి ఆ పాము తోక అందుకో"
అన్నాడు.

మోషే ముందుకు వెళ్లి పాముతోక అందు
కొన్నాడు. మోషే అలా చేయగానే ఆ పాము మళ్లీ
కర్ర అయిపోయింది. 5"ఈ కర్రను ఇలా ప్రయోగించు,
అప్పుడు మీ పూర్వీకుల దేవుడు, అబ్రాహాము దేవుడు,
ఇస్సాకు దేవుడు, యాకోబు దేవుడు అయిన
యెహోవా నీకు ప్రత్యక్షమయ్యాడని నీ ప్రజలు నమ్ము
తారు" అన్నాడు దేవుడు.
6ఆ తర్వాత యెహోవా, "నీకు ఇంకో రుజువు
ఇస్తాను. నీ చెయ్యి నీ చొక్కాలోపల పెట్టు" అన్నాడు
మోషేతో.

కనుక మోషే తన చొక్కా తెరిచి తన చేతిని
లోపల పెట్టాడు. మళ్లీ మోషే తన చొక్కాలోనుంచి
తన చేతిని బయటికి తీయగానే అది మారిపోయింది.
అతని చేతినిండా మంచులాంటి తెల్లని కుష్ఠ మచ్చలు
కప్పేసాయి.
7"నీ చేతిని మళ్లీ నీ చొక్కాలో పెట్టు" అన్నాడు
దేవుడు. మోషే తన చేతిని మళ్లీ తన చొక్కాలోపల
పెట్టాడు. మోషే అలా పెట్టి మళ్లీ తన చేతిని బయటికి
తీయగానే అతని చెయ్యి మారిపోయింది. ఇప్పుడు
అతని చెయ్యి బాగైపోయి మళ్లీ మునుపటిలానే ఉంది.
8"నీకర్రను ఉపయోగించినప్పుడు ప్రజలు నిన్ను
నమ్మకపోతే, నీవు ఈ సూచన చూపెట్టినప్పుడు వాళ్లు
నిన్ను నమ్ముతారు. 9నీవు వాళ్లకు ఈ రెండు సూచనలు
చూపించాక కూడ వాళ్లు నమ్మటానికి నిరాకరిస్తే,
అప్పుడు నైలు నదిలోనుంచి కొన్ని నీళ్లు తీసుకో,
ఆ నీళ్లను నేలమీద పొయ్యి. అవి నేలను తాకగానే
రక్తం అవుతాయి" అన్నాడు దేవుడు.
10అయితే మోషే దేవునితో, "కానీ ప్రభూ నేను
నిజం చెప్పేస్తున్నాను. నేనేమీ నైపుణ్యంగల మాట
కారిని కాను. నాకు మనుష్యులతో చక్కగా మాట్లాడ్డం
ఎప్పుడూ చేతకాలేదు. కనీసం ఇప్పుడు నీతో మాట్లా
డిన తర్వాత కూడ నేను మంచి మాటకారిని కాలేదు.
నా మాట నిదానం అనీ, నాకు మంచి పద ప్రయోగం
రాదనీ* నీకు తెలుసు" అన్నాడు.
11"మనిషి నోటిని చేసిందెవరు? ఒకన్ని చెవిటి
వాడిగా లేక మూగవాడిగా చేయగలిగింది ఎవరు? ఒకన్ని
గుడ్డివానిగా చేయగలిగింది, చూడగలిగేటట్టు చేయగలి
గింది ఎవరు? వీటన్నింటిని చేయగలిగింది నేనే, నేను

**నా ... ప్రయోగం** నాకు సత్తి నేను తేటగా మాట్లాడలేను.

యెహోవాను, 12అందుచేత వెళ్లు. నీవు మాట్లాడే
టప్పుడు నేను నీతో ఉంటాను. చెప్పాల్సిన మాటలు
నేనే నీకు చెబుతాను" అని అతనితో యెహోవా
అన్నాడు.
13కానీ మోషే, "నా ప్రభువా, నన్ను విడిచిపెట్టి
మరెవర్నయినా పంపించుమని బతిమాలు కొంటు
న్నాను" అన్నాడు.
14యెహోవాకు మోషేమీద కోపం వచ్చింది, "లేవీ
వంశానికి చెందిన నీ సోదరుడు అహరోనును నేను
వాడుకొంటాను. అతనికి మాట్లాడుటలో నైపుణ్యం
ఉంది. అహరోను నీ దగ్గరకు వస్తాడు. నిన్ను చూచి
సంతోషిస్తాడు, 15అతడు నీతోకూడ ఫరో దగ్గరకు
వస్తాడు. నీవు చెప్పాల్సిందేమిటో నేను నీకు చెబుతాను,
అది నీవు అహరోనుకు చెప్పాలి. ఫరోతో చెప్పటానికి
అహరోను సరైన మాటల్ని సిద్ధం చేసుకొంటాడు.
16ప్రజలతోకూడ అహరోనే నీ పక్షంగా మాట్లాడుతాడు.
అతనికి నీవు ఒక మహారాజులా ఉంటావు. అతనే అధి
కారంతో నీ తరపున మాట్లాడతాడు.* 17కనుక వెళ్లు.
నీతోకూడ నీ కర్ర తీసుకొని వెళ్లు. నీకు నేను తోడుగా
ఉన్నానని ప్రజలకు తెలియడానికి నీ కర్రను, మిగతా
అద్భుతాలను ప్రయోగించు" అన్నాడు దేవుడు.

### మోషే ఈజిప్టుకు తిరిగి వెళ్లడం

18అప్పుడు మోషే తన మామ యిత్రో ఇంటికి
తిరిగి వెళ్లాడు. "ఈజిప్టులో నా ప్రజల దగ్గరకు నేను
మళ్లీ వెళతాను, నన్ను పోనివ్వండి. వాళ్లు ఇంకా బతికే
ఉన్నారేమో నేను వెళ్లి చూడాలి" అని యిత్రోతో
చెప్పాడు మోషే.
"నీవు సమాధానంగా వెళ్లొచ్చు" అన్నాడు యిత్రో
మోషేతో.
19తర్వాత మోషే ఇంకా మిద్యానులో ఉండగానే
దేవుడు మోషేతో, "ఇప్పుడు నీవు మళ్లీ ఈజిప్టు వెళ్లడం
నీకు క్షేమం. నిన్ను చంపాలని చూస్తున్న వాళ్లు ఇప్పుడు
చనిపోయారు" అని చెప్పాడు.
20కనుక మోషే తన భార్యను, తన కొడుకును
బయల్దేరదీసి గాడిదల మీద ఎక్కించాడు. తిరిగి ఈజిప్టు
దేశానికి ప్రయాణం కట్టాడు. దేవుని శక్తిగల తన కర్రను
మోషే తనతో తీసుకొనివెళ్లాడు.
21మోషే ఈజిప్టుకు ప్రయాణం చేస్తూండగా దేవుడు
అతనితో మాట్లాడాడు: "నీవు ఫరోతో మాట్లాడే
టప్పుడు నీవు ఏమేమి అద్భుతాలు చేసేందుకు నీకు
శక్తి ఇచ్చానో వాటన్నింటినీ చేయాలని జ్ఞాపకం
ఉంచుకో! అయితే నేను మాత్రం ఫరో ఇంకా మొండి
కెత్తేటట్లు చేస్తాను. అతడు ప్రజల్ని వెళ్లనియ్యడు.
22అప్పుడు నీవు ఫరోతో 23'ఇశ్రాయేలు నా ప్రథమ
సంతానంగా పుట్టిన కుమారుడు. నా కుమారుడు వెళ్లి
నన్ను ఆరాధించనివ్వు అని నేను నీతో చెబుతున్నాను.
నీవే గనుక ఇశ్రాయేలీయులను వెళ్లనివ్వకపోతే, నీ
పెద్దకుమారుణ్ణి నేను చంపేస్తాను.'" అని యెహోవా
అనుచున్నాడని అతనితో చెప్పెను.

### మోషే కొడుక్కి సున్నతి

24మోషే ఈజిప్టుకు తన ప్రయాణం కొనసాగిం
చాడు. నిద్రపోవాలని అతడు ఒక సత్రములో ఆగాడు.
అక్కడ దేవుడు మోషేను కలుసుకొని అతణ్ణి చంప
దలచాడు.* 25కాని సిప్పోర పదునైన ఒక కత్తి*
తీసుకొని తన కుమారునికి సున్నతి* చేసింది. ఆ
చర్మం పట్టుకొని ఆమె అతని పాదాలను తాకింది.
అప్పుడు ఆమె (మోషేతో) "నీవు రక్త సంబంధమైన*
భర్తవు అని అంది" 26సిప్పోర తన కుమారునికి సున్నతి
చేసినందువల్ల ఇలా చెప్పింది. అందుచేత దేవుడు
మోషేను క్షమించాడు (అతణ్ణి చంపలేదు).

### దేవుని యెదుట మోషే, అహరోనులు

27యెహోవా అహరోనుతో, "అరణ్యంలోకి వెళ్లి
మోషేను కలుసుకో" అని చెప్పాడు. కనుక అహరోను
వెళ్లి దేవుని పర్వతం* దగ్గర మోషేను కలుసు
కొన్నాడు. అహరోను మోషేను చూడగానే అతణ్ణి
ముద్దు పెట్టుకొన్నాడు. 28దేవుడు తనతో చెప్పిన
దంతా మోషే అహరోనుతో చెప్పాడు. దేవుడు తనను
ఎందుకు పంపిందీ, అహరోనుతో చెప్పాడు మోషే.
అలాగే అతను చేయాల్సిన అద్భుతాలు, చూపాల్సిన
రుజువులు అన్నింటిని మోషే అహరోనుకు వివ
రించాడు.
29అందుచేత మోషే, అహరోనూ వెళ్లి ఇశ్రాయేలు
పెద్దలందర్నీ సమావేశం చేసారు. 30అప్పుడు ఆ
ప్రజలతో వారు మాట్లాడారు. యెహోవా మోషేతో
చెప్పిన విషయాలన్నీ అతడు వాళ్లతో చెప్పాడు.
అప్పుడు వాళ్లందరూ చూచేటట్టు మోషే అద్భుతాలు

---

**నీవు ... మాట్లాడుతాడు** అక్షరాల అతను నీ తోడుగా ఉంటాడు. నీవు అతనికి దేవుడవుగా ఉంటావు.

**అతణ్ణి ... చంపదలచాడు** ఒకవేళ అతనికి సున్నతి చేయాలను కొన్నాడేమో.

**పదునైన ఒక కత్తి** సూదిగా ఉన్న రాయి నుండి చేయబడ్డ పదునుగల కత్తి.

**సున్నతి** అనగా పురుషాంగముపైన ఉన్న ముందు చర్మాన్ని కత్తిరించి వేయుట.

**రక్త సంబంధమైన** లేక అతడు స్వస్థత పొందాడు. సున్నతి మూలంగా నీవు రక్తసంబంధిత భర్తవు అని ఆమె చెప్పింది.

**దేవుని పర్వతం** హోరేబు పర్వతం సీనాయి పర్వతం అని కూడ ఇది పిలువబడింది.

చేసి రుజువు చేసాడు. 31దేవుడు మోషేను పంపించాడని
ఆ ప్రజలు నమ్మారు. ఇశ్రాయేలీయులకు సహాయం
చేసేందుకు దేవుడు వచ్చాడని తెలిసి ఆ ప్రజలు
దేవుని ముందర తలలు వంచుకొని ఆరాధించారు.
వారి కష్టాలను దేవుడు చూసాడని తెలిసి వాళ్లు దేవుడ్ని
ఆరాధించారు.

## ఫరో ముందు మోషే, అహరోనులు

5 మోషే, అహరోనూ ప్రజలతో మాట్లాడిన తరు
వాత ఫరో దగ్గరికి వెళ్లారు, " 'నా కోసం పండుగ
జరుపుకొనేందుకు నా ప్రజల్ని అరణ్యంలోకి వెళ్లనివ్వు'
అని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా చెబుతు
న్నాడు," అని చెప్పారు.
2అయితే ఫరో, "ఆ యెహోవా ఎవరు? అతనికి
నేనెందుకు లోబడాలి? ఇశ్రాయేలీయులను నేనెందుకు
వెళ్లనివ్వాలి? యెహోవా అని మీరు చెబుతున్న వాడు
నాకు తెలియదు. అందుచేత ఇశ్రాయేలీయులను నేను
వెళ్ల నీయను" అన్నాడు.
3దానికి మోషే, అహరోనులు, "హెబ్రూ ప్రజల
దేవుడు మాతో మాట్లాడాడు. కనుక మూడురోజుల
ప్రయాణమంత దూరం మమ్మల్ని అరణ్యంలోనికి
వెళ్లనివ్వాల్సిందిగా మనవి చేస్తున్నాము. అక్కడ మా
యెహోవా దేవునికి ఒక బలి అర్పిస్తాము. ఇది మేము
చేయకపోతే ఆయనకు కోపం వచ్చి మమ్మల్ని నాశనం
చేస్తాడేమో. ఒక రోగం ద్వారానో, కత్తి చేతనో
మమ్మల్ని చంపేస్తాడేమో" అని అన్నారు.
4కానీ ఫరో, "మోషే, అహరోనూ, ప్రజలను పని
చేయనీయకుండా మీరు చేస్తున్నారు. మళ్లీ పోయి
పనిచేసుకోమని ఆ బానిసలకు చెప్పండి. 5పనివాళ్లు
చాలా విస్తారంగా ఉన్నారు, మీరేమో వాళ్లను పని చెయ్య
నివ్వడంలేదు" అని వాళ్లతో చెప్పాడు.

## ప్రజలను ఫరో శిక్షించడం

6అదేరోజు ఇశ్రాయేలీయుల పని మరింత కష్టతరం
చేయమని ఫరో ఆజ్ఞాపించాడు. బానిసలపైనున్న
యజమానులతో 7"ఈ ప్రజలు ఇటుకలు చేసేందుకు
గడ్డి ఎప్పుడూ మీరే ఇచ్చారు. కాని ఇప్పుడు ఇటుకలు
చేసేందుకు అవసరమైన గడ్డిని వాళ్లే పోయి తెచ్చు
కోవాలని వారికి చెప్పండి. 8అయితే వాళ్లు మాత్రం
ఇంతకు ముందు ఎన్ని ఇటుకలు చేసేవాళ్లో ఇప్పుడు
కూడా అన్ని చేయాల్సిందే. వాళ్లు బద్ధకస్తులయి
పోయారు. అందుకే వాళ్లను పోనివ్వుమని నన్ను అడుగు
తున్నారు. వాళ్లు చేసేందుకు సరిపడినంత పనిలేదు.
అందుకే తమ దేవునికి బలి ఇవ్వడానికి వెళ్లనిమ్మని
నన్ను అడుగుతున్నారు.
9కనుక వీళ్ల పని మరింత కష్టం అయ్యేటట్టు
చేయండి. వాళ్లకు బాగా పని చెప్పండి. అప్పుడు
మోషే చెప్పే అబద్ధాలు వినేందుకు వాళ్లకు సమయం
ఉండదు" అని చెప్పాడు ఫరో.
10అందుచేత బానిసలపైనున్న ఈజిప్టు యజ
మానులు, హెబ్రూ ప్రజల నాయకుల దగ్గరకు వెళ్లి,
"మీ ఇటుకల కోసం గడ్డి ఇవ్వకూడదని ఫరో నిర్ణ
యించాడు. 11మీకు మీరే పోయి గడ్డి తెచ్చుకోవాలి.
కనుక వెళ్లి గడ్డి వెదుక్కోండి. అయితే మీరు మాత్రం
ఇంతకు ముందు ఎన్ని ఇటుకలు చేసేవారో ఇప్పుడు
కూడా అన్ని చేయాల్సిందే" అని వాళ్లతో చెప్పారు.
12కనుక గడ్డికోసం వెదుక్కొంటూ ఆ ప్రజలు
ఈజిప్టు దేశ వ్యాప్తంగా వెళ్లిపోయారు. 13ఆ ప్రజలు
మరింత కష్టపడి పనిచేసేటట్టు బానిస యజమానులు
వాళ్లని బలవంతం చేస్తూనే ఉన్నారు. ఆ ప్రజలు
అంతకు ముందు ఎన్ని ఇటుకలు చేసేవాళ్లో అన్ని
చేసేటట్టు వారు వాళ్లను బలవంతపెట్టారు. 14బానిస
లపై ఉండే ఈజిప్టు యజమానులు హెబ్రూ నాయకు
లను ఏర్పరచుకొని ప్రజలు చేసే పనికి వీళ్లను బాధ్యు
లుగా చేసారు, "మీరు ఇంతకు ముందు ఎన్ని ఇటుకలు
చేసారో ఇప్పుడు కూడ అన్ని ఎందుకు చెయ్యడం
లేదు? ఇది వరకు చేయగలిగారు అంటే, ఇప్పుడూ
చేయగల్గుతారు!" అంటూ బానిసలపై ఉండే ఈజిప్టు
యజమానులు హెబ్రూ నాయకులను కొట్టారు.
15అప్పుడు హెబ్రూ నాయకులు ఫరో దగ్గరకు
వెళ్లారు, "మేము నీ సేవకులము నీవు మమ్మల్ని
ఎందుకు ఇలా చూస్తున్నావు? 16నీవేమో మాకు గడ్డి
ఇవ్వవు. కాని మేము మాత్రం ఇదివరకు ఎన్ని ఇటుకలు
చేసామో అన్ని చేస్తూనే ఉండాలని ఆజ్ఞాపించావు.
పైగా ఇప్పుడు ఈ యజమానులు మమ్మల్ని కొడుతు
న్నారు. ఇలా చేయడం నీ మనుష్యులదే తప్పు" అంటూ
వారు ఫిర్యాదు చేసి చెప్పారు.
17ఫరో జవాబిస్తూ, "మీరు సోమరులు, మీకు పని
చేయడం ఇష్టంలేదు. అందుకే మిమ్మల్ని పోని వ్వమని
నన్ను అడుగుతున్నారు. అందుకే మీరు ఇక్కడ్నుండి
వెళ్లిపోయి యెహోవాకు బలులు అర్పించాలని అంటు
న్నారు.
18ఇక వెళ్లి పనిచెయ్యండి. మేము మీకు గడ్డి ఇవ్వము
కాని మీరు మాత్రం ఇదివరకు ఎన్ని ఇటుకలు చేసేవాళ్లో
ఇప్పుడు కూడ అన్ని చేయాలి" అన్నాడు.
19చిక్కుల్లో పడ్డట్టు ఇశ్రాయేలు పెద్దలకు అర్థమ
యింది. వారు ఇంతకు ముందు చేసినన్ని ఇటుకలు
ఇప్పుడు చేయలేరని ఆ నాయకులకు తెలుసు.
20వారు ఫరో సమావేశంనుండి వెళ్తూ మోషే, అహ
రోను ఉన్నచోట ఆగారు. వారి కోసం మోషే, అహ
రోనూ వేచియున్నారు. 21వారు మోషే అహరోను
లతో, "మమ్మల్ని వెళ్లనిమ్మని మీరు ఫరోతో చెప్పడం
చాల తప్పు. ఫరో, అతని అధికారులు మమ్మల్ని
ద్వేషించేటట్టు మీరు చేసారు కనుక యెహోవా

మిమ్మల్ని శిక్షించాలి. మమ్మల్ని చంపే అవకాశం మీరే
వారికి ఇచ్చారు" అని చెప్పారు.

### మోషే దేవునితో చెప్పటం

22అప్పుడు మోషే యెహోవాను ప్రార్థించి,
"ప్రభువా, ఎందుకు ఇలా నీ ప్రజలకు నీవు కీడు
చేసావు? నీవు ఇక్కడికి నన్నెందుకు పంపించావు?
23నన్ను చెప్పమని నీవు చెప్పిన సంగతులన్నీ నేను
ఫరో దగ్గరకు వెళ్లి చెప్పాను. కాని అప్పట్నుంచి నీ
ప్రజల విషయంలో అతడు చాల నీచంగా ప్రవర్తిస్తు
న్నాడు. నీవు వాళ్ల సహాయం కోసం ఏమీ చేయలేదు!"
అని చెప్పాడు.

6 అందుకు యెహోవా, "ఫరోకు నేను ఏమి
చేస్తానో నీవు ఇప్పుడు చూస్తావు. అతని మీద
నేను నా మహాశక్తిని ప్రయోగిస్తాను. దానితో అతడు
నా ప్రజలను వెళ్లనిస్తాడు. వారు వెళ్లిపోవడానికి అతడు
ఎంత ఇష్టపడతాడంటే, అతడే వారిని వెళ్లిపొమ్మని
బలవంతం చేస్తాడు" అని మోషేతో చెప్పాడు.
2మోషేతో దేవుడు ఇలా చెప్పాడు, 3"యెహో
వాను నేనే. అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు
నేను ప్రత్యక్షమయ్యాను." వాళ్లు, (ఎల్‌షద్దయి) సర్వ
శక్తిగల దేవుడు అని నన్ను పిలిచారు. నా పేరు
'యెహోవా' అని వారికి తెలియలేదు.
4వారితో నేను ఒక ఒడంబడిక చేసాను. కనాను
దేశం వారికి ఇస్తానని వాగ్దానం చేసాను. వారు ఆ
దేశంలో నివసించారు గాని అది వారి స్వంత దేశం
కాదు. 5ఇప్పుడు ఇశ్రాయేలు వాళ్లకు ఉన్న కష్టాలు
నాకు తెలుసు. వారు ఈజిప్టుకు బానిసలుగా ఉన్నారని
నాకు తెలుసు. నా ఒడంబడిక కూడా నాకు జ్ఞాపకం
ఉంది. 6కనుక నేను వాళ్లతో నీవు ఇలా చెప్పమన్నట్టు
ప్రజలతో చెప్పు. 'నేనే యెహోవాను, నేనే మిమ్మల్ని
రక్షిస్తాను. నేను మిమ్మల్ని స్వతంత్రుల్నిగా చేస్తాను.
ఈజిప్టు వాళ్లకు మీరు బానిసలుగా ఉండరు. నేను నా
మహాశక్తిని ప్రయో గించి మహా భయంకర శిక్షను ఈజిప్టు
వారి మీదికి రప్పిస్తాను. అప్పుడు మిమ్మల్ని నేను
రక్షిస్తాను. 7మీరు నా ప్రజలుగా ఉంటారు. నేనే మీ
దేవుడిగా ఉంటాను. నేనే యెహోవాను, మీ దేవుడనని,
ఈజిప్టునుండి నేనే మిమ్మల్ని విడిపించానని మీరు
తెలుసుకొంటారు. 8అబ్రాహాము, ఇస్సాకు, యాకోబు
లకు నేను ఒక గొప్ప వాగ్దానం చేసాను. అందుచేత
నేనే మిమ్మల్ని ఆ దేశానికి నడిపిస్తాను. ఆ దేశాన్ని
నేను మీకు ఇస్తాను. అది మీదే అవుతుంది. నేను
యెహోవాను." '
9"అందుచేత మోషే ఇదంతా ఇశ్రాయేలు వాళ్లతో
చెప్పాడు. అయితే, ప్రజలు పనిలో చాలా కష్టపడు
చున్నందుచేత మోషేను వారు సహించలేదు. అతని
మాట వారు వినలేదు.

10అప్పుడు యెహోవా మోషేతో ఇలా అన్నాడు:
11"ఇశ్రాయేలు ప్రజల్ని తన దేశంనుండి తప్పక
వెళ్లిపోనివ్వాలని ఫరో దగ్గరకు వెళ్లి చెప్పు."
12అయితే మోషే, "ఇశ్రాయేలు ప్రజలే నా మాట
వినరు. అలాంటప్పుడు ఫరో అంతకంటె వినడు. అసలే
నాకు మాట్లాడటం చేతకాదు."* అని అన్నాడు.
13కాని మోషే, అహరోనులతో యెహోవా మాట్లా
డాడు. వారు వెళ్లి ఇశ్రాయేలు ప్రజలతో మాట్లాడాలని
యెహోవా వారికి ఆజ్ఞాపించాడు. ఫరో దగ్గరికి వెళ్లి
అతనితో కూడ మాట్లాడాలని ఆయన వారికి ఆజ్ఞాపిం
చాడు. ఇశ్రాయేలు ప్రజల్ని ఈజిప్టు నుండి బయటకు
నడిపించుమని దేవుడు వారికి ఆజ్ఞాపించాడు.

### ఇశ్రాయేలీయుల కుటుంబాల్లో కొన్ని

14ఇశ్రాయేలు కుటుంబాల నాయకుల పేర్లు ఇవి–
ఇశ్రాయేలు జ్యేష్ఠపుత్రుడు రూబేనుకు హనోకు, పల్లు,
హెస్రోన్, కర్మి అనే నలుగురు కుమారులు గలరు.
15యెమూయేలు, యామీను, ఓహదు, యాకీను,
సోహరు, షావూలు అనువారు షిమ్యోను కుమారులు.
(షావూలు కనానీ స్త్రీ ద్వారా పుట్టిన కుమారుడు).
16లేవీ 137 సంవత్సరాలు బతికాడు. గెర్షోను, కహాతు,
మెరారీ అనువారు లేవీ కుమారులు.
17గెర్షోను కుమారులు లిబ్నీ, షిమీ. 18కహాతు 133
సంవత్సరాలు బ్రతికాడు. అమ్రాము, ఇస్హారు,
హెబ్రోను, ఉజ్జీయేలు అనువారు కహాతు కుమారులు.
19మహలి, ముషి అను వారు మెరారీ కుమారులు. ఈ
కుటుంబాలన్ని ఇశ్రాయేలు కుమారుడు లేవీ సంతానం.
20అమ్రాము 137 సంవత్సరాలు బతికాడు.
అమ్రాము తన తండ్రి సోదరి యోకెబెదును వివాహం
చేసుకొన్నాడు. ఈ అమ్రాము కుమారులే మోషే,
అహరోను. 21కోరహు, నెపెగు, జిఖ్రీ అనువారు ఇస్హారు
కుమారులు. 22మిషాయేలు, ఎల్జాఫను, సిత్రీ అనువారు
ఉజ్జీయేలు కుమారులు.
23అహరోను ఎలీషెబను వివాహం చేసుకొన్నాడు.
(ఎలీషెబ అమ్మినాదాబు కుమార్తె. నయసోను సోదరి)
అహరోను ఎలీషెబలకు నాదాబు, అబీహు, ఎలియా
జరు, ఈతామారులు పుట్టారు. 24కోరహు కుమారులు
అంటే, అస్సీరు, ఎల్కానా, అబియాసాపు. 25అహరోను
కుమారుడైన ఎలియాజరు పుతీయేలు కుమార్తెను
పెండ్లాడాడు, వాళ్లు ఫీనెహాసుకు జన్మనిచ్చారు. ఈ
మనుష్యులంతా ఇశ్రాయేలు కుమారుడైన లేవీ
సంతానం. 26అహరోను, మోషే ఈ వంశానికి చెందిన
వాళ్లు, "ఇశ్రాయేలు ప్రజల వంశాలను నడిపించండి"

---

**అసలే ... చేతకాదు** నా మాట అక్షరాలా విదేశీయుడి
మాటల్లాగా ఉంటాయి "నావి సున్నతిలేని పెదవులు" అని
భావం.

అని యెహోవా చెప్పింది వీళ్లకే. 27ఈజిప్టు రాజైన
ఫరోతో మాట్లాడిన వాళ్లు అహరోను, మోషే. ఇశ్రా
యేలు ప్రజల్ని ఈజిప్టు విడిచి పెట్టి వెళ్లనివ్వాల్సిందిగా
ఫరోతో చెప్పింది వీళ్లే.

### దేవుడు మళ్లీ మోషేను పిల్చాడు

28ఈజిప్టు దేశంలో దేవుడు మోషేతో మాట్లాడాడు.
29“నేను యెహోవాను నేను నీతో చెప్పిందంతా
ఈజిప్టు రాజుతో చెప్పు” అన్నాడు.
30“కానీ, నేను చక్కగా మాట్లాడలేనుగదా! రాజు
నా మాట వినడు” అని జవాబిచ్చాడు మోషే.

7 మోషేతో యెహోవా ఇలా అన్నాడు, “నేను
నీకు తోడుగా ఉంటాను. ఫరోకు నీవు ఒక మహా
రాజులా* ఉంటావు. అహరోను నీ పక్షంగా మాట్లాడే
మాటకారిగా* ఉంటాడు. 2నీకు నేను ఆజ్ఞాపించేదంతా
అహరోనుతో చెప్పు. నేను చెప్పే విషయాలన్నీ అతను
రాజుతో చెబుతాడు. ఇక ఫరో ఇశ్రాయేలు ప్రజలను
ఈ దేశాన్ని వదిలిపోనిస్తాడు. 3అయితే నేను ఫరోను
మొండిగా చేస్తాను. (మీరు అతనితో చెప్పే సంగతులను
అతడు లెక్క చేయడు) అప్పుడు నేను ఈజిప్టులో
అనేక అద్భుతాలు చేస్తాను. అయినా అతను వినేందుకు
నిరాకరిస్తాడు. 4అందుచేత ఈజిప్టును నేను ఘోరంగా
శిక్షిస్తాను. తర్వాత నా ప్రజలను ఆ దేశం నుండి నేను
బయటకు నడిపిస్తాను. 5అప్పుడు నేనే యెహోవాను
అని ఈజిప్టు ప్రజలు తెలుసుకుంటారు. నేను వాళ్లకు
వ్యతిరేకంగా ఉంటాను. నేనే యెహోవానని వారు
తెలుసుకొంటారు. అప్పుడు నేనే నా ప్రజలను ఆ
దేశంనుండి బయటకు నడిపిస్తాను.”

6మోషే, అహరోనులు యెహోవా తమతో చెప్పిన
ఈ మాటలకు విధేయులయ్యారు. 7అప్పటికి మోషే
వయస్సు 80 సంవత్సరాలు అహరోను వయస్సు 83
సంవత్సరాలు.

### మోషే కర్ర పాము అవుతుంది

8మోషే, అహరోనులతో యెహోవా ఇలా
అన్నాడు: 9“మీ శక్తి రుజువు చేయమని ఫరో మిమ్మల్ని
అడుగుతాడు. ఒక అద్భుతం చేయమని మిమ్మల్ని
అడుగుతాడు. అతని కర్ర నేలమీద పడవేయమని
అహరోనుతో చెప్పు. ఫరో చూస్తూ ఉండగానే ఆ
కర్ర పాము అవుతుంది.”
10కనుక మోషే, అహరోను ఫరో దగ్గరకు వెళ్లి
యెహోవా చెప్పినట్టు చేసారు. అహరోను తన చేతి
కర్రను కింద పడవేసాడు. ఫరో తన అధికారులతో
కలిసి చూస్తూ ఉండగానే ఆ కర్ర పాముగా అయింది.

11కనుక రాజు తన విద్వాంసులను, మంత్రగాళ్లను
పిలిపించాడు. వాళ్లు మంత్రాలు వేసి, అహరోను చేసి
నట్లే చేయగల్గారు. 12వాళ్లు కూడా వారి కర్రలను నేల
మీద పడవేసారు. ఆ కర్రలు పాములయ్యాయి, కాని
అహరోను కర్ర వాళ్ల కర్రలను మింగేసింది. 13అయినా
సరే ప్రజలను వెళ్లనిచ్చేందుకు ఫరో ఒప్పుకోలేదు.
ఎలా జరుగుతుందని యెహోవా చెప్పాడో అలాగే
ఇది జరిగింది. మోషే, అహరోనుల మాట వినేందుకు
రాజు ఒప్పుకోలేదు.

### నీళ్లు రక్తంగా మారటం

14అప్పుడు మోషే, అహరోనులతో యెహోవా
ఇలా చెప్పాడు: “ఫరో మొండికెత్తాడు. ప్రజల్ని పోని
చ్చేందుకు ఫరో నిరాకరిస్తున్నాడు. 15ఉదయాన్నే ఫరో
నైలు నదికి వెళ్తాడు. నది ఒడ్డున అతని దగ్గరకు
వెళ్లు. పాముగా మారిన ఆ కర్రను నీ వెంట తీసు
కొనివెళ్లు. 16అతనికి ఇలా చెప్పు: ‘హెబ్రీ ప్రజల
దేవుడైన యెహోవా నన్ను నీ దగ్గరకు పంపించాడు.
‘అరణ్యంలో నన్ను ఆరాధించటానికి నా ప్రజలను
వెళ్లనివ్వు’ అని నీతో చెప్పమని యెహోవా నాతో
చెప్పాడు. ఇప్పటివరకు నీవేమో యెహోవా మాట
వినలేదు.” ’
17“కనుక యెహోవా చెబుతున్నాడు, ‘నేనే
యెహోవానని చెప్పి నీవు ఇలా తెల్సుకొంటావు’ నా
చేతిలో ఉన్న ఈ కర్రతో నైలునది నీళ్లను నేను
కొడతాను. నైలునది రక్తంగా మారిపోతుంది. 18దానితో
నదిలో చేపలన్నీ చస్తాయి, నది కుళ్లు కంపు కొడు
తుంది. అంతటితో ఈజిప్టు వాళ్లు నదిలో నీళ్లు తాగలేక
పోతారు.”
19యెహోవా మోషేకు ఈ ఆజ్ఞ ఇచ్చాడు: “వారి
నదులు, కాలువలు, చెరువుల మీద, వారు నీరు
నిల్వచేసే ప్రతి స్థలం మీద తన చేతి కర్ర చాపాలని
అహరోనుకు చెప్పు. అతను ఇలా చెయ్యగానే నీళ్లన్నీ
రక్తంగా మారిపోతాయి. చెక్క పాత్రలు, రాతి పాత్రల్లో
ఉన్న నీళ్లతో సహా మొత్తం నీళ్లన్నీ రక్తంగా మారి
పోతాయి.
20యెహోవా ఆజ్ఞ ప్రకారం మోషే, అహరోనులు
చేసారు. అతను కర్ర పైకెత్తి నైలునది నీళ్లమీద
కొట్టాడు. ఫరో, అతని అధికారులు అందరి ముందు
అతడు ఇలా చేసాడు. నదిలో నీళ్లన్నీ రక్తంగా మారి
పోయాయి.
21నదిలో చేపలు చచ్చాయి. నది కుళ్లు కంపు
కొట్టడం మొదలయింది. అందుచేత ఈజిప్టు వాళ్లు
ఆ నదిలో నీళ్లు తాగలేక పోయారు. ఈజిప్టు అంతా
రక్తమయం అయిపోయింది.
22మాంత్రికులు కూడ మాయలు చేసి అలాగే
చేసారు. కనుక మోషే, అహరోనుల మాటను ఫరో

---

**మహారాజులా** లేక “దేవునిగా.”

**అహరోను ... మాటకారిగా** లేక “ప్రవక్తగా.”

లెక్కచేయలేదు. ఇది సరిగ్గా యెహోవా చెప్పినట్టే
జరిగింది. 23ఫరో ముఖం తిప్పుకొని తన ఇంట్లోకి
వెళ్లిపోయాడు. మోషే, అహరోనులు చేసిన దాన్ని
ఫరో అలక్ష్యం చేసాడు.
24ఈజిప్టు వాళ్లు నదిలో నీళ్లు త్రాగలేక పోయారు.
అందుచేత తాగే నీళ్ల కోసం వాళ్లు ఆ నది చుట్టూ
బావులు తవ్వారు.

## కప్పలు

8 నైలు నది నీళ్లను యెహోవా మార్చేసిన తర్వాత
ఏడు రోజులు గడిచాయి.
మోషేతో యెహోవా ఇలా అన్నాడు, “ఫరో
దగ్గరకు వెళ్లి–‘నన్ను ఆరాధించడానికి నా ప్రజలను
వెళ్లనివ్వు, అని యెహోవా చెబుతున్నాడని అతనితో
చెప్పు. 2వారు వెళ్లడానికి ఫరో నిరాకరిస్తే నేను
ఈజిప్టును కప్పలతో నింపేస్తాను 3నైలు నది కప్పలతో
నిండిపోతుంది. అవి నదిలోనుంచి వచ్చి మీ ఇళ్లలో
దూరుతాయి. అవి మీ పడక గదుల్లో పడకల మీద
వుంటాయి. మీ అధికారుల ఇళ్లలో, మీ వంట పాత్రల్లో,
నీళ్ల బానల్లో కప్పలే ఉంటాయి. 4నీవు, నీ ప్రజలు, నీ
అధికారులు అందరి మీదికీ కప్పలు వచ్చేస్తాయి.’”
5అప్పుడు మోషేతో యెహోవా, “కాలువలు,
నదులు, చెరువులు, అన్నింటి మీదికీ తన చేతి కర్రను
ఎత్తమని అహరోనుతో చెప్పు. కప్పలు బయటకు
వచ్చి ఈజిప్టు అంతటా నిండుతాయి ”అని చెప్పాడు.
6కనుక ఈజిప్టు జలాలపై అహరోను తన చేయి
ఎత్తగా నీళ్లలో నుండి కప్పలు బయటకు వచ్చి, ఈజిప్టు
దేశమంతా నిండిపోవటం మొదలయింది.
7మాయలు చేసే ఈజిప్టు మాంత్రికులు కూడా
అలాగే చేసారు, కనుక ఈజిప్టు మీదికి ఇంకా ఎక్కువ
కప్పలు వచ్చాయి.
8మోషే, అహరోనులను ఫరో పిలిపించాడు, “నా
దగ్గర్నుండి, నా ప్రజల దగ్గర్నుండి కప్పలను తీసి
వేయుమని యెహోవాను అడగండి. యెహోవాకు
బలులు అర్పించేందుకు ప్రజల్ని నేను వెళ్లనిస్తాను”
అన్నాడు ఫరో. 9ఫరోతో మోషే ఇలాగు చెప్పాడు,
“కప్పలు ఎప్పుడు పోవాలనుకుంటున్నావో నాతో
చెప్పు, నీ కోసం, నీ ప్రజల కోసం, నీ అధికారుల
కోసం నేను ప్రార్థన చేస్తాను. అప్పుడే కప్పలు
మిమ్మల్ని, మీ ఇళ్లను విడిచిపెట్టి నదిలోనే ఉండి
పోతాయి. (కప్పలు ఎప్పుడు నిన్ను వదిలి పోవాలను
కొంటున్నావు?)”10“రేపే” అన్నాడు ఫరో. మోషే
అన్నాడు: “నీవు చెప్పినట్టే జరుగుతుంది. మా దేవు
డైన, యెహోవాలాంటి దేవుడు ఇంకెవ్వరూ లేరని
నీవు తెలుసుకొంటావు.11నిన్ను, నీ ఇంటిని, నీ అధి
కారుల్ని, నీ ప్రజల్ని కప్పలు విడిచిపోతాయి. ఆ
కప్పలు నదిలోనే ఉండిపోతాయి.”
12మోషే, అహరోను ఫరో దగ్గర్నుండి వెళ్లి
పోయారు. ఫరో మీదికి ఆయన పంపిన కప్పల్నిగూర్చి
మోషే యెహోవాకు మొరపెట్టాడు. 13మోషే అడిగిన
ప్రకారం దేవుడు చేసాడు. ఇళ్లలో, వాకిళ్లలో, పొలాల్లో
కప్పలు చచ్చాయి. 14అవి కుళ్లి పోయి దేశమంతా
కంపు కొట్టడం మొదలయింది. 15కప్పల బాధ వదిలి
పోవడం చూచి ఫరో మళ్లీ మొండికెత్తాడు. అతను
ఏమి చెయ్యాలని మోషే అహరోనులు అడిగారో, అలా
చేయలేదు. ఇదంతా సరిగ్గా యెహోవా చెప్పినట్టే
జరిగింది.

## పేలు

16యెహోవా మోషేతో ఇలా అన్నాడు “నీ కర్ర
పైకెత్తి నేలమీద దుమ్మును కొట్టు ఈజిప్టుదేశ వ్యాప్తంగా
దుమ్ము పేలు అవుతాయి. అని అహరోనుతో చెప్పు”.
17వారు అలా చేసారు. అహరోను తన చేతి కర్ర
పైకెత్తి నేలమీద దుమ్మును కొట్టాడు. ఈజిప్టు అంతటా
దుమ్ము పేలు అయింది. మనుష్యుల మీద జంతువుల
మీద పేలు ఎక్కేసాయి.
18ఈజిప్టు మాంత్రికులు వారి మాయల్ని ప్రయో
గించి వారు కూడ అలా చేయాలని ప్రయత్నం చేసారు.
కానీ దుమ్ము నుండి పేలు వచ్చేటట్టు చేయలేక
పోయారు. జంతువుల మీద, మనుష్యుల మీద పేలు
అలాగే ఉండిపోయాయి.
19కనుక ఇది యెహోవా శక్తివల్లే జరిగిందని
మాంత్రికులు ఫరోతో చెప్పారు. కాని ఫరో వారు
చెప్పింది ఒప్పుకోలేదు. ఇదీ సరిగ్గా యెహోవా చెప్పి
నట్టే జరిగింది.

## ఈగలు

20యెహోవా మోషేతో ఇలా అన్నాడు, “ఉద
యాన్నే లేచి ఫరో దగ్గరకు వెళ్లు. ఫరో నదికి వెళ్తాడు.
‘నన్ను ఆరాధించడానికి నా ప్రజల్ని వెళ్లనివ్వు’ అని
యెహోవా అంటున్నాడని అతనితో చెప్పు. 21‘నీవు
నా ప్రజల్ని వెళ్లనివ్వక పోతే, నీ ఇండ్లలోకి ఈగలు
వచ్చేస్తాయి, నీ మీద, నీ అధికారుల మీద ఈగలు
పట్టేస్తాయి. ఈజిప్టు గృహాలన్నీ ఈగలతో నిండి
పోతాయి. ఈజిప్టు దేశమంతా ఈగలతో నిండి
పోతుంది.’ 22అయితే ఈజిప్టు ప్రజలను చూచినట్టు
మాత్రం ఇశ్రాయేలు ప్రజల్ని నేను చూడను. నా
ప్రజలు నివసిస్తున్న గోషెనులో మాత్రం ఈగలు
ఉండవు. ఈ విధంగా నేను అంటే యెహోవాను ఈ
భూమి మీద ఉన్నానని నీవు తెలుసుకొంటావు.
23కనుక రేపు నా ప్రజల్ని నీ ప్రజల కంటే వేరుగా
చూస్తాను. అదే నా రుజువు.”
24అందుచేత యెహోవా అలాగే చేసాడు. ఈజిప్టు
మీదికి విస్తారంగా ఈగలు వచ్చేసాయి. ఫరో ఇంట్లోను,

అతని అధికారుల ఇండ్లన్నింటిలోను ఈగలు
ఉన్నాయి. ఈజిప్టు అంతటా ఈగలు ముసురు
కొన్నాయి. ఈగలు దేశాన్ని నాశనం చేస్తున్నాయి.
25కనుక మోషే అహరోనుల్ని ఫరో పిలిపించాడు. "ఈ
దేశంలోనే ఇక్కడే మీ దేవునికి బలులు అర్పించండి"
అని ఫరో వాళ్లతో చెప్పాడు.
26కానీ మోషే అన్నాడు, "అలా చేయటం సరికాదు.
మా దేవుడైన యెహోవాకు బలులు అర్పించటం
చాలా భయంకర విషయం అని ఈజిప్టు వాళ్లు అను
కొంటారు. ఈజిప్టు వాళ్లకు కనబడేటట్టు మేము గనుక
ఇలా చేస్తే, ఈజిప్టు వాళ్లు మమ్మల్ని రాళ్లతో కొట్టి
చంపుతారు. 27మూడు రోజుల ప్రయాణమంత
దూరం మమ్మల్ని అరణ్యంలోకి వెళ్లనిచ్చి, అక్కడ
మా యెహోవా దేవునికి బలులు అర్పించనివ్వు.
యెహోవా మమ్మల్ని ఇలాగే చేయమన్నాడు."
28అందుకు ఫరో, "మీరు వెళ్లి అరణ్యంలో మీ
యెహోవా దేవునికి బలులు అర్పించనిస్తాను. కానీ
మీరు మాత్రం మూడు రోజుల ప్రయాణమంత దూరం
కంటే ఎక్కువ దూరం వెళ్లకూడదు. ఇక పోయి
నాకోసం ప్రార్థించు." అని మోషేతో అన్నాడు.
29"సరే రేపు నీ నుండి, నీ ప్రజలనుండి, నీ అధికారుల
దగ్గర్నుండి ఈగలను తొలిగించమని నేను పోయి
యెహోవాను వేడుకొంటాను. కాని, ప్రజలు బలులు
అర్పించకుండా నీవు మాత్రం ఆపు చేయకూడదు"
అన్నాడు మోషే. 30కనుక మోషే ఫరో దగ్గర్నుండి
వెళ్లిపోయి యెహోవాకు ప్రార్థన చేసాడు. 31మోషే
కోరినట్టు యెహోవా చేసాడు.
ఫరోనుండి, అతని ప్రజలనుండి అధికారుల నుండి
ఈగలను యెహోవా తొలగించాడు. ఈగలు ఒక్కటి
కూడా మిగుల లేదు. 32అయితే ఫరో మళ్లీ మొండికెత్తి
ప్రజలను వెళ్ల నివ్వలేదు.

## పశురోగం

9 అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
'నన్ను ఆరాధించేందుకు నా ప్రజలను వెళ్లనివ్వు'
అని హీబ్రూ ప్రజల 'దేవుడైన యెహోవా అంటు
న్నాడని ఫరో దగ్గరికి వెళ్లి అతనితో చెప్పు.' 2ఇంకా
నీవు వారిని పోనివ్వక ఆపి ఉంచితే 3పొలాల్లోని నీ
జంతువులు అన్నింటి మీద యెహోవా తన శక్తిని
ఉపయోగిస్తాడు. నీ గుర్రాలు, నీ గాడిదలు, ఒంటెలు,
పశువులు, గొర్రెలు అన్నింటికీ భయంకర రోగం వచ్చే
టట్టు యెహోవా చేస్తాడు. 4ఈజిప్టు జంతుజాలం
కంటె ఇశ్రాయేలీయుల జంతువుల్ని యెహోవా ప్రత్యే
కంగా చూస్తాడు. ఇశ్రాయేలీయులకు చెందిన జంతు
వుల్లో ఏదీ చావదు 5ఇదంతా జరగటానికి యెహోవా
సమయాన్ని నిర్ణయించాడు. రేపు ఈ దేశంలో ఇది
జరిగేటట్టు యెహోవా చేస్తాడు."
6మర్నాడు ఉదయాన్నే ఈజిప్టు పొలాల్లోని జంతు
వులన్నీ చచ్చాయి. కానీ ఇశ్రాయేలు ప్రజలకు చెందిన
జంతువుల్లో ఒక్కటికూడా చావలేదు. 7ఇశ్రాయేలీ
యుల జంతువులు ఏవైనా చచ్చాయేమో చూడమని
ఫరో మనుష్యుల్ని పంపాడు. ఇశ్రాయేలీ యుల జంతు
వుల్లో ఒక్కటి కూడ చావలేదు. ఫరో మాత్రం మొండి
గానే ఉండిపోయాడు. అతడు ప్రజల్ని వెళ్లనివ్వలేదు.

## దద్దుర్లు

8మోషే, అహరోనులకు యెహోవా ఇలా చెప్పాడు,
"మీ చేతుల నిండా కొలిమిలోని బూడిదను తీసుకోండి.
మోషే, ఫరో ముందర గాలిలో ఈ బూడిదను వెద
జల్లాలి. 9ఇది దుమ్ముగా మారి ఈజిప్టు దేశం అంతటా
వ్యాపిస్తుంది. ఈజిప్టులో ఎప్పుడెప్పుడు ఏ వ్యక్తిని లేక
జంతువును ఈ దుమ్ము తాకుతుందో ఆ చర్మంమీద
దద్దుర్లు పుడతాయి."
10మోషే, అహరోనులు కొలిమి నుండి బూడిద
తీసుకొన్నారు. తర్వాత వెళ్లి ఫరో ఎదుట నిలబడ్డారు.
ఆ బూడిదను వారు గాలిలో వెదజల్లారు, మనుష్యుల
మీద, జంతువుల మీద దద్దుర్లు పుట్టడం మొదల
యింది.' 11చివరికి మాంత్రికులకు కూడా ఆ దద్దుర్లు
వచ్చినందువల్ల మోషే ఇలా చేయకుండా మాంత్రికులు
కూడా ఆపలేక పోయారు. ఈజిప్టు అంతటా ఇది జరి
గింది. 12అయితే యెహోవా ఫరోను మొండి వాడిగా
చేసాడు. అందుచేత మోషే, అహరోనుల మాట వినేం
దుకు ఫరో ఒప్పుకోలేదు. ఇది సరిగ్గా యెహోవా
చెప్పినట్టే జరిగింది.

## వడగళ్లు

13అప్పుడు మోషేతో యెహోవా ఇలా అన్నాడు:
"ఉదయాన్నే లేచి, ఫరో దగ్గరికి వెళ్లు. 'నన్ను ఆరాధించ
డానికి, నా ప్రజలను వెళ్లనివ్వు' అని హీబ్రూ ప్రజల
దేవుడైన, యెహోవా అంటున్నాడని అతనితో చెప్పు.
14నీవు గనుక ఇలా చెయ్యకపోతే, అప్పుడు నీ మీద,
నీ ప్రజలమీద, నీ అధికారులమీద నా శక్తి అంతా
ప్రయోగిస్తాను. అప్పుడు నాలాంటి దేవుడు ప్రపంచం
లోనే లేడని నీకు తెలుస్తుంది. 15నేను నా శక్తిని ప్రయో
గించి, ఒక్క రోగం రప్పించానంటే, అది నిన్ను, నీ
ప్రజల్ని భూమి మీద లేకుండా తుడిచి పారేస్తుంది.
16అయితే ఒక కారణం వల్ల నేను నిన్ను ఇక్కడ
ఉంచాను. నా శక్తిని నీవు చూడాలని నిన్ను ఇక్కడ
ఉంచాను. అప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు నా
విషయం తెల్సుకొంటారు. 17నీవు ఇంకా నా ప్రజలకు
వ్యతిరేకంగా ఉన్నావు. నీవు వాళ్లను స్వతంత్రంగా
వెళ్లనివ్వడంలేదు. 18కనుక రేపు ఈ వేళకు మహా
బాధాకరమైన వడగళ్ల వానను నేను కురిపిస్తాను. ఇంతకు
ముందు ఎన్నడూ ఈజిప్టు ఒక దేశంగా ఏర్పడినప్పటి

నుండి ఇప్పటి వరకూ ఇలాంటి వడగళ్ల వాన పడలేదు.
19ఇక నీవు నీ జంతువుల్ని క్షేమంగా ఉండేచోట పెట్టు
కోవాలి. ప్రస్తుతం పొలాల్లో ఉన్న నీ స్వంతదైన ప్రతి
దాన్నీ భద్రమైన చోట నీవు ఉంచుకోవాలి. ఎందు
చేతనంటే పొలాల్లో నిలబడి ఉండే మనిషిగాని జంతువు
గాని చచ్చినట్లే. ఇంట్లో చేర్చబడకుండా ఉండే ప్రతి
దానిపైనా వడగళ్లు కురుస్తాయి.'"
20ఫరో అధికారులలో కొందరు యెహోవా
మాటను గమనించారు. వాళ్లు వెంటనే వారి పశువులన్ని
టినీ, బానిసలందరినీ ఇండ్లలో చేర్చారు. 21కాని మిగతా
వాళ్లు యెహోవా సందేశాన్ని లెక్క చేయలేదు.
అలాంటి వారు పొలాల్లో ఉన్న తమ బానిసలందరిని,
జంతువులన్నింటిని అక్కడే ఉండ నిచ్చారు.
22నీ చేతులు గాలిలో పైకి ఎత్తు, "ఈజిప్టు అంతటా
వడగళ్ల వాన ప్రారంభం అవుతుంది. ఈజిప్టు పొలాల్లో
ఉన్న మొక్కలన్నిటి మీద, జంతువులమీద, మనుష్యు
లందరి మీద వడగళ్లు పడతాయి" అని మోషేతో
యెహోవా చెప్పాడు.
23కనుక మోషే తన కర్రను పైకి ఎత్తాడు, ఉరు
ములు, మెరుపులు వచ్చేటట్టు, భూమి మీద వడగళ్లు
కురిసేటట్టు యెహోవా చేసాడు. ఈజిప్టు అంతటా
వడగళ్లు పడ్డాయి. 24వడగళ్లు పడుతోంటే, ఆ వడ
గళ్లతో పాటు మెరుపులు మెరిసాయి. ఈజిప్టు ఒక
రాజ్యంగా ఏర్పడినప్పటి నుండి, ఈజిప్టును ఇంత దారు
ణంగా దెబ్బతీసిన వడగళ్ల వాన ఇదే. 25ఈజిప్టు పొలాల్లో
ఉన్న సర్వాన్నీ ఈ వడగళ్లవాన నాశనం చేసింది.
మనుష్యుల్ని, జంతువుల్ని, మొక్కల్ని వడగళ్లు నాశనం
చేసాయి. వడగళ్ల మూలంగా పొలాల్లోని చెట్లన్నీ విరిగి
పోయాయి. 26ఇశ్రాయేలు ప్రజలు నివసించే గోషేను
ఒక్కటే వడగళ్లు పడని ఒకే ఒక చోటు.
27మోషే అహరోనులను ఫరో పిలిపించాడు. ఫరో
వారితో, "ఈ సారి నేను పాపం చేసాను. యెహోవా
న్యాయమంతుడు. తప్పు నాది, నా ప్రజలది. 28వడ
గళ్లు, ఉరుములు మరీ భయంకరంగా ఉన్నాయి! వాటిని
ఆపేయమని దేవుణ్ణి అడుగు. నేను మిమ్మల్ని వెళ్లి
పోనిస్తాను. మీరు ఇక్కడ ఉండనక్కర్లేదు." అని
చెప్పాడు.
29మోషే ఫరోతో చెప్పాడు: "నేను ఈ పట్టణం
నుండి యెహోవా ఎదుట నా చేతులు చాచి ప్రార్థి
స్తాను. ఉరుములు, వడగళ్లు ఆగిపోతాయి. ఈ భూమి
మీద యెహోవా ఉన్నాడని మీరు అప్పుడు తెలుసు
కొంటారు. 30అయినా నీవు నీ అధికారులు ఇంకా
యెహోవాకు భయపడడంలేదని నాకు తెలుసు."
31అప్పుడే జనుము గింజ పట్టింది. యవలు
అప్పుడే పూత పట్టాయి. అయిననూ ఈ మొక్కలు
నాశనం అయ్యాయి. 32అయితే గోధుమలు, మిరప
ఇతర ధాన్యాలకంటె ఆలస్యంగా పక్వానికి వస్తాయి.
అందుచేత ఈ మొక్కలు నాశనం కాలేదు. 33మోషే
ఫరోను విడిచి పట్టణం బయటికి వెళ్లాడు. యెహోవా
యెదుట అతడు తన చేతులు చాచాడు. ఉరుములు,
వడగళ్లు ఆగిపోయాయి. నేలమీద వర్షం కురవడం
కూడ ఆగిపోయింది. 34ఎప్పుడయితే వర్షం, వడగళ్లు,
ఉరుములు ఆగిపోవడం ఫరో చూశాడో, అప్పుడు
అతను మళ్లీ తప్పు చేసాడు. అతను అతని అధికారులు
మళ్లీ మొండికెత్తారు. 35ఇశ్రాయేలు ప్రజల్ని స్వేచ్ఛగా
వెళ్లనిచ్చేందుకు నిరాకరించాడు ఫరో. యెహోవా
మోషే ద్వారా చెప్పినట్లే ఇది జరిగింది.

### మిడతలు

10 యెహోవా మోషేతో, "ఫరో దగ్గరకు వెళ్లు.
నేనే అతణ్ణి అతని అధికారులని మొండిగా
చేస్తాను. నా మహత్తర అద్భుతాలను నేను వాళ్లకు
చూపించాలని నేనే ఇలా చేసాను. 2అలాగే ఈజిప్టులో
నేను చేసిన అద్భుతాలు, ఇతర మహత్యాల విషయం
మీరుకూడ మీ పిల్లలకు మీ పిల్లల పిల్లలకు చెప్పవచ్చని
వీటిని చేసాను. అప్పుడు నేనే యెహోవానని మీరంతా
తెల్సుకొంటారు" అని చెప్పాడు.
3మోషే, అహరోనులు ఫరో దగ్గరకు వెళ్లారు. "ఎంత
కాలం నీవు నాకు లోబడకుండా తిరస్కరిస్తావు? నన్ను
ఆరాధించడానికి నా ప్రజలను వెళ్లనివ్వు' అని హీబ్రూ
ప్రజల యెహోవా దేవుడు అంటున్నాడు" అని వారు
అతనితో చెప్పారు. 4నీవు నా ప్రజలను వెళ్లనివ్వకపోతే,
రేపు నీ దేశంలోకి మిడతలను తీసుకొస్తాను.
5నేల అంతా మిడతలతో నిండి పోతుంది. నీకు
నేల కనబడనంత విస్తారంగా మిడతలు ఉంటాయి.
వడగళ్ల వానలో మిగిలింది యింకేమైనా ఉంటే, దాన్ని
కాస్తా మిడతలు తినేస్తాయి. పొలాల్లో చెట్ల
ఆకులన్నిటినీ మిడతలు తినేస్తాయి. 6మీ ఇండ్లు మీ
అధికారుల, ఇండ్లు. ఈజిప్టులో ఉన్న మొత్తం ఇండ్లన్నీ
మిడతలతో నిండిపోతాయి. మీ తల్లిదండ్రులు, తాతలు
ఎన్నడైనా చూచిన వాటికంటే ఎక్కువ మిడతలు
ఉంటాయి. ఈజిప్టులో మనుష్యులు నివాసం మొదలు
పెట్టినప్పటినుండి ఎన్నడైనా ఉన్న మిడతల కంటె
ఎక్కువ మిడతలు ఉంటాయి". తరువాత మోషే
ఫరోను విడిచి, వెనుదిరిగాడు.
7"ఇంకెన్నాళ్లు ఈ మనుష్యులు మనల్ని చిక్కుల్లో
పెడతారు. మగవాళ్లందర్నీ వారి యెహోవా దేవుడ్ని
ఆరాధించుకొనేందుకు వెళ్లనివ్వు. నీవు వాళ్లను వెళ్లని
య్యకపోతే, నీవు గుర్తించక ముందే, ఈజిప్టు నాశనం
అయిపోతుంది" అని ఫరో అధికారులు అతనితో
చెప్పారు.
8కనుక మోషే అహరోనులను తన దగ్గరకు మళ్లీ
తీసుకురమ్మని ఫరో తన అధికారులతో చెప్పాడు.
"మీరు వెళ్లి మీ యెహోవా దేవుడ్ని ఆరాధించండి,

అయితే ఎవరెవరు వెళ్లుచున్నది నాకు సరిగ్గా
చెప్పండి?" అన్నాడు ఫరో.
9"మా ప్రజలలో పడుచువాళ్లు, వృద్ధులు వెళ్తారు!
మాతోబాటు మా కుమారులు మా కుమార్తెలను,
మా గొర్రెల్ని మా పశువుల్ని కూడ తీసుకపోతాం.
ఇది మా యెహోవా పండుగ గనుక మేమంతా వెళ్తాము"
అని జవాబిచ్చాడు మోషే.
10ఫరో వాళ్లతో, "నేను మిమ్మల్ని, మీ పిల్లల్ని
వెళ్లనిచ్చేముందు యెహోవా నిజంగా మీతో ఉండి
తీరాలి. చూస్తోంటే,
11మీరేదో దుర్మార్గం తలపెట్టి నట్లుంది. మగాళ్లు
వెళ్లి యెహోవాను ఆరాధించవచ్చు. అసలు
మీరడిగింది అదే. అంతేగాని మీరంతా మొత్తం వెళ్లి
పోయేందుకు వీల్లేదు" అని చెప్పి మోషే, అహరోను
లను ఫరో పంపించి వేసాడు. 12యెహోవా మోషేతో
"ఈజిప్టు మీద నీ చేయి ఎత్తు, మిడతలు వచ్చేస్తాయి.
ఈజిప్టు మొత్తం నేలమీద మిడతలు ఆవరించేస్తాయి.
వడగళ్లు నాశనం చేయకుండా మిగిలిన పంట అంతటినీ
ఆ మిడతలు తినేస్తాయి" అని చెప్పాడు.
13కనుక మోషే ఈజిప్టు దేశం మీద తన కర్ర
ఎత్తగా తూర్పు నుండి బలంగా గాలి వీచేటట్టు
యెహోవా చేసాడు. ఆ రోజంతా, రాత్రి అంతా గాలి
వీచింది. తెల్లవారేటప్పటికి ఈజిప్టు అంతటా మిడతల్ని
తెచ్చి పడేసింది ఆ గాలి.
14మిడతలు ఈజిప్టు దేశంలోకి ఎగిరివచ్చి
నేలమీదంతటా కమ్మాయి. ఈజిప్టులో ఇది వరకు
ఎన్నడూ లేనన్ని మిడతలు వచ్చేసాయి. పూర్వం
ఎన్నడూ అన్ని మిడతలు ఉండలేదు. 15నేల అంతా
మిడతలు కమ్మేశాయి. దేశం అంతా చీకటి
అయిపోయింది. వడగళ్లు నాశనం చేయకుండా
మిగిల్చిన చెట్లలో ప్రతి ఫలాన్ని, నేలమీద ఉన్న ప్రతి
మొక్కనూ మిడతలు తినేసాయి. మొత్తం ఈజిప్టులో
ఎక్కడేగాని ఏ చెట్లకూ మొక్కలకూ ఒక్క ఆకుగూడ
మిగల్లేదు.
16వెంటనే మోషే అహరోనులను పిలిపించాడు
ఫరో, "మీకు, మీ యెహోవా దేవునికి వ్యతిరేకంగా
నేను పాపం చేసాను. 17ఈ సారికి నా పాపాలు క్షమిం
చండి. నా దగ్గర్నుండి ఈ మృత్యువును (మిడతలను)
తీసివేయమని యెహోవాను అడగండి" అని చెప్పాడు
ఫరో.
18మోషే ఫరో దగ్గరనుండి వెళ్లిపోయి యెహో
వాను ప్రార్థించాడు. 19కనుక యెహోవా ఆ గాలిని
మార్చేసాడు. పడమటినుండి గాలి బలంగా వీచేటట్టు
చేసాడు. ఆ గాలి మిడతలన్నింటినీ ఎర్ర సముద్రంలోకి
కొట్టేసింది. ఈజిప్టులో ఒక్క మిడతకూడ మిగల్లేదు.
20అయితే యెహోవా ఫరోను మాత్రం ఇంకా
మొండిగా చేసాడు. ఇశ్రాయేలు ప్రజల్ని ఫరో వెళ్ల
నివ్వలేదు.

### అంధకారం

21అప్పుడు యెహోవా, "నీ చెయ్యి పైకెత్తు,
ఈజిప్టు చీకటిమయం అవుతుంది. చీకటిలో తడవులా
డేటంత కటిక చీకటి కమ్ముతుంది" అని మోషేతో
చెప్పాడు.
22కనుక మోషే తన చేతిని పైకి ఎత్తగానే ఒక
చీకటి మేఘం ఈజిప్టును ఆవరించేసింది. ఈజిప్టులో
మూడు రోజుల పాటు ఆ చీకటి ఉండిపోయింది.
23ఎవ్వరూ ఎవ్వర్నీ చూడలేక పోయారు. మూడు
రోజుల వరకు ఎవ్వరూ వాళ్ల స్థానాలు విడిచి పెట్టలేదు.
అయితే ఇశ్రాయేలు ప్రజలు నివసించే ప్రదేశాలన్నిం
టిలో వెలుగు ఉంది. 24ఫరో మళ్లీ మోషేను పిలిపించి,
"వెళ్లి యెహోవాను ఆరాధించండి. మీరు మీ పిల్లల్ని
మీతో కూడా తీసుకొని వెళ్లొచ్చు. కాని మీ గొర్రెల్ని,
పశువుల్ని మాత్రం ఇక్కడ విడిచి పెట్టండి" అన్నాడు.
25"మా గొర్రెల్ని, పశువుల్ని మాతో కూడ తీసు
కొని వెళ్లడమేకాదు, మేము వెళ్లేటప్పుడు మీరు కూడ
కానుకలు, బలి అర్పణలు మాకు యివ్వాలి. మా
యెహోవా దేవుడ్ని ఆరాధించడానికి ఈ బలులను
మేము వాడుకొంటాము. 26యెహోవాను ఆరాధిం
చేందుకు మా జంతువుల్ని కూడ మేము తీసుకొని
వెళ్తాము. ఒక్కడెక్క కూడ ఇక్కడ విడిచి పెట్టబడదు.
యెహోవాను ఆరాధించేందుకు ఏమేమి కావాలో
సరిగ్గా మాకూ ఇంకా తెలియదు. మేము వెళ్తున్న
చోటికి చేరిన తర్వాతే అది మాకు తెలుస్తుంది. అందు
చేత యివన్నీ మేము తీసుకెళ్లాల్సిందే" అని మోషే
అన్నాడు. 27యెహోవా ఫరోను ఇంకా మొండిగా
చేసాడు. అందుచేత ఫరో ప్రజలను వెళ్లనివ్వలేదు.
28అప్పుడు ఫరో మోషేతో, "పో, నా దగ్గర్నుండి
వెళ్లిపో! నీవు మళ్లీ ఇక్కడకు రాకూడదు. నన్ను కలుసు
కోవాలని మరోసారి వస్తే, నీవు చస్తావు" అన్నాడు.
29"మోషే ఫరోతో, నీవు చెప్పింది నిజమే. నిన్ను
చూడ్డానికి నేను మళ్లీ రాను" అని చెప్పాడు.

### జ్యేష్ఠుల మరణం

11 అప్పుడు యెహోవా మోషేతో ఇలా అన్నాడు:
"ఫరో మీదికి, ఈజిప్టు మీదికి నేను ఇంకా నాశనం
తీసుకు రావల్సి ఉంది. దాని తర్వాత అతడు మిమ్మల్ని
ఈజిప్టు నుండి పంపించి వేస్తాడు. వాస్తవానికి మీరు
ఈ దేశం వదలి వెళ్లిపోవాలని అతడు మిమ్మల్ని
బలవంతం చేస్తాడు. 2ఇశ్రాయేలు ప్రజలకు ఈ సందేశం
మీరు చెప్పాలి, 'మీరు స్త్రీలు పురుషులు అందరూ మీ
చుట్టు ప్రక్కల వాళ్ల దగ్గరకు వెళ్లి, వారి వెండి, బంగారు
వస్తువులన్నీ మీకు ఇమ్మని అడగాలి.

3ఈజిప్టు వాళ్లకు మీపై దయ కలిగేటట్టు
యెహోవా చేస్తాడు.” అప్పటికే ఈజిప్టు ప్రజలు
మరియు ఫరో అధికారులు కూడా మోషేను ఒక
మహాత్మునిగా ఎంచుతున్నారు.

4మోషే ప్రజలతో ఇలా చెప్పాడు: “ఈ వేళ మధ్య
రాత్రి నేను ఈజిప్టులో తిరుగుతాను. 5ఫరో పెద్ద
కుమారుడు మొదలు ధాన్యం తిరుగలి విసరుతున్న
బానిసయొక్క, పెద్ద కుమారుడు వరకు ఈజిప్టులో
ప్రతి పెద్ద కుమారుడు మరణిస్తాడు. అలాగే జంతువుల్లో
మొదట పుట్టినవన్నీ చస్తాయి. 6గతంలోకంటె, భవిష్య
త్తులోకంటె, ఇప్పుడు ఈజిప్టులోవినబడే ఏడ్పులు
మరీ దారుణంగా ఉంటాయి. 7కాని ఇశ్రాయేలు ప్రజల్లో
ఏ ఒక్కరికీ హాని కలుగదు. కనీసం వారిపై ఒక కుక్క
కూడ మొరగడం ఉండదు. ఇశ్రాయేలు ప్రజల్లో ఏ
ఒక్కరుగాని, వారి జంతువుల్లో ఏ ఒక్కటిగాని బాధ
పడవు. ఈవిధంగా ఇశ్రాయేలు ప్రజల్ని ఈజిప్టు వాళ్ల
కంటె, ప్రత్యేకంగా నేను చూశానని మీరు తెలుసు
కొంటారు. 8అప్పుడు మీ బానిసలు (ఈజిప్టు వాళ్లు)
సాష్టాంగపడి నన్ను ఆరాధిస్తారు.

“మీ ప్రజలందరినీ తీసుకొని మీరు వెళ్లిపోండి” అని
వాళ్లే అప్పుడు చెబుతారు. అప్పుడు నేను కోపంగా
ఫరోను విడిచి వెళ్తాను.” ’

9యెహోవా మోషేతో, “నీ మాట ఎందుచేత
ఫరో వినలేదు? ఈజిప్టులో నా మహత్తర శక్తిని నేను
చూపించ గలిగేందుకే” అని చెప్పాడు. 10ఆ కారణం
చేతనే ఫరో యెదుట మోషే, అహరోనులు ఈ మహా
అద్భుతాలన్నీ చేసారు. అందుకే ఫరో ఇశ్రాయేలు
ప్రజల్ని తన దేశం నుండి వెళ్లనియ్యకుండా అంత
మొండికెత్తేటట్టు యెహోవా చేసాడు.

## పస్కా పండుగ

12 మోషే, అహరోనులు ఇంకా ఈజిప్టులో ఉండ
గానే, యెహోవా వాళ్లతో మాట్లాడాడు.
యెహోవా ఇలా చెప్పాడు: 2“ఈనెల* మీకు సంవత్స
రంలో మొదటి నెలగా ఉంటుంది. 3ఈ ఆజ్ఞ ఇశ్రాయేలు
సమాజం అంతటికీ చెందుతుంది. ఈ నెల పదో
రోజున ఒక్కొక్కరు తన ఇంటివారి కోసం ఒక గొర్రె
పిల్లను తీసుకోవాలి. 4ఒక గొర్రెపిల్లను పూర్తిగా తినగలిగి
నంత మంది తన ఇంట్లో లేకపోతే, అలాంటి వారు
తమ భోజనం తినేందుకు ఇంటి పక్కవాళ్లను ఆహ్వా
నించాలి. ప్రతి ఒక్కరూ తినడానికి సరిపడినంతగా
గొర్రెపిల్ల ఉండాలి. 5గొర్రెపిల్ల ఒక సంవత్సరం వయసు
గల మగది కావాలి, అది మంచి ఆరోగ్యంగా ఉండాలి.
ఈ జంతువు చిన్న గొర్రె లేక చిన్న మేక కావచ్చును.
6నెలలో 14వ రోజువరకు మీరు ఆ జంతువును గమ
నించాలి. ఆ రోజు ఇశ్రాయేలు సమాజంలోని ప్రజ
లంతా సాయంకాల సమయంలో ఈ జంతువులను
చంపాలి. 7ఈ జంతువుల రక్తం అంతా భద్రం చేయాలి.
ఏ ఇండ్లలోనైతే ప్రజలు ఈ ఆహారం భోజనం చేస్తారో
ఆ ఇళ్ల ద్వార బంధాల నిలువు కమ్ములమీద, పైకమ్మి
మీద ఆ రక్తం చల్లాలి.

8“ఆ రాత్రే మీరు ఆ గొర్రెపిల్ల మాంసం కాల్చి
దాన్ని మొత్తం తినెయ్యాలి. చేదుగా ఉండే ఆకు
కూరలు, పొంగని రొట్టె కూడా మీరు తినాలి. 9గొర్రె
పిల్ల మాంసాన్ని మీరు నీళ్లతో వండకూడదు. మొత్తం
గొర్రెపిల్లను నిప్పుమీద పేల్చాలి. అప్పటికి ఇంకా ఈ
గొర్రెపిల్ల తల, కాళ్లు, ఆంత్రాలతోనే ఉండాలి. 10ఆ
మాంసం అంతా ఆ రాత్రికి రాత్రే మీరు భోంచేయాలి.
మాంసంలో ఏమైనా మర్నాటి ఉదయం వరకు మిగిలి
పోతే దాన్ని నిప్పులో వేసి కాల్చివేయాలి.

11“మీరు ఆ భోజనం చేసేటప్పుడు ప్రయాణం
చేస్తున్న వారిలా బట్టలు వేసుకోవాలి. మీ అంగీని మీ
నడుంకు బిగించాలి. మీరు మీ చెప్పులు తొడు
క్కోవాలి. మీ చేతి కర్రను చేతితో పట్టుకోవాలి. ఆతు
రంగా మీరు భోజనంచేయాలి. ఎందుచేతనంటే, ఇది
యెహోవాయొక్క పస్కా బలి* (యెహోవా తన
ప్రజలను కాపాడి, వారిని ఈజిప్టునుండి త్వరగా బయ
టకు నడిపించిన సమయం.)

12“ఈ రాత్రి నేను ఈజిప్టు అంతటా సంచారం
చేసి ఈజిప్టులోని ప్రతి పెద్ద కుమారుణ్ణి చంపేస్తాను.
మనుష్యుల్లోను, జంతువుల్లోను, మొదటి సంతానాన్ని
నేను చంపేస్తాను. ఈజిప్టు దేవతలందరికీ శిక్ష విధిస్తాను.
నేనే యెహోవానని వారికి తెలిసేటట్టు చేస్తాను.
13అయితే, మీ ఇళ్లమీదనున్న రక్తం ఒక ప్రత్యేక గుర్తుగా
ఉంటుంది. నేను ఆ రక్తాన్ని చూడగానే మీ ఇంటిని
దాటి వెళ్లిపోతాను.* ఈజిప్టు వాళ్లకు మాత్రం కీడు
జరిగేటట్టు చేస్తాను. అయితే, ఆ కీడు, రోగాలు
మిమ్మల్ని ఎవరినీ బాధించవు.

14“కనుక ఈ రాత్రిని మీరు ఎల్లప్పుడూ జ్ఞాపకం
ఉంచుకొంటారు. మీకు అది ఒక ప్రత్యేక పండుగ
రోజుగా ఉంటుంది. మీ తర్వాత మీ సంతానము శాశ్వ
తంగా ఈ పండుగను ఆచరించి యెహోవాను ఘన
పర్చాలి. 15ఈ పండుగనాడు ఏడు రోజుల పాటు
పొంగని రొట్టెలు మీరు తినాలి. ఈ పండుగ మొదటి
రోజున పులిసే పదార్థాన్ని మీ ఇండ్లలోనుంచి తీసి

---

**ఈనెల** అది “అబీబ్‌మాసం” లేక “నిసాను” అంటారు. ఇది మార్చి మధ్య నుండి ఏప్రిల్ మధ్య వరకు.

**యెహోవా … పస్కాబలి** దీని హీబ్రూ పదం అర్థం దాటిపోవడం. లేక కాపాడటం, యెహోవా తన ప్రజలను కాపాడి, ఈజిప్టులోనుండి వారిని వెంటనే బయటకు నడిపించిన సమయం.

**నేను … వెళ్లిపోతాను** “కాపాడుతాను.”

వేయాలి. ఈ పండుగ జరిగే మొత్తం ఏడు రోజుల్లోనూ
పులిసిన పదార్థాన్ని ఏ ఒక్కరూ తినకూడదు. ఎవరైనా
సరే పులిసే పదార్థం తింటే, ఆ వ్యక్తిని ఇశ్రాయేలు
వాళ్లనుండి మీరు వేరుచేయాలి. [16]పండుగలో మొదటి
రోజున, చివరి రోజున పరిశుద్ధ సమావేశాలు ఉంటాయి.
ఈ రోజుల్లో మీరు ఏ పనీ చేయకూడదు. ఇలాంటి
రోజుల్లో మీరు భోంచేయటానికి అవసరమైన భోజ
నాన్ని సిద్ధం చేసుకోవడం ఒక్కటే మీరు చెయ్యొచ్చు.
[17]పులియని పిండితో చేసే రొట్టెల పండుగను మీరు
జ్ఞాపకం ఉంచుకోవాలి. ఎందుచేతనంటే, సరిగ్గా ఈ
రోజే మీ వంశాలన్నిటినీ ఈజిప్టు నుండి నేను బయటకు
నడిపిన రోజు. అందుచేత మీ తర్వాత మీ సంతాన
మంతా ఈ రోజును జ్ఞాపకం చేసుకోవాలి. ఇది శాశ్వ
తంగా ఉండిపోయే చట్టం. [18]కనుక మొదటి నెల
(నిసాను) 14వ రోజు సాయంత్రం నుండి మీరు పులి
యని రొట్టెలు తినడం మొదలు పెట్టాలి. అదే నెల
21రోజు సాయంత్రం వరకు అలాంటి రొట్టెలే మీరు
తినాలి. [19]ఏడు రోజుల పాటు మీ ఇళ్లలో ఎక్కడా
పులిసిన పదార్థం ఉండకూడదు. ఇశ్రాయేలు పౌరు
డేకాని, విదేశీయుడేగాని ఏ వ్యక్తిగాని ఈసందర్భంలో
పులిసిన పదార్థం తింటే, మిగిలిన ఇశ్రాయేలీయులందరి
నుండి ఆ వ్యక్తి వేరు చేయబడాలి. [20]ఈ పండుగ
సమయంలో మీరు పులిసిన పదార్థం తినకూడదు.
మీరు ఎక్కడ ఉన్నాసరే, పులియని రొట్టెలు మాత్రమే
మీరు తినాలి.”

[21]కనుక పెద్దలందర్నీ మోషే పిలిచి, “మీ కుటుం
బాల కోసం గొర్రెపిల్లల్ని తెచ్చుకొని, పస్కా పండుగకు
ఆ గొర్రెపిల్లల్ని తీసుకోండి. [22]హిస్సోపు కొమ్మలు
తీసుకొని రక్తంతో నింపిన పాత్రల్లో వాటిని ముంచండి.
ద్వారబంధాల నిలువు కమ్ముల మీద, పైకమ్మి మీద
ఆ రక్తాన్ని పూయండి. తెల్లారేవరకు ఎవరూ తమ
ఇండ్లు విడిచి వెళ్ల కూడదు. [23]ఈజిప్టులో జ్యేష్ఠసం
తానాన్ని చంపడానికి యెహోవా సంచరించే సమ
యంలో, ద్వారబంధాల నిలువు కమ్ముల మీద పైకమ్మి
మీద రక్తాన్ని ఆయన చూస్తాడు. అప్పుడు యెహోవా
ఆ ఇంటిని కాపాడుతాడు* నాశనకారుడ్ని యెహోవా
మీ ఇంట్లోకి రానివ్వడు. మిమ్మల్ని బాధింపనియ్యడు.
[24]ఈ ఆజ్ఞ మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ చట్టం
మీకు, మీ సంతానానికి శాశ్వతంగా ఉంటుంది.
[25]యెహోవా మీకు ఇచ్చే దేశానికి వెళ్లిన తర్వాత
కూడ మీరు దీన్ని చేయటం జ్ఞాపకం ఉంచుకోవాలి.
[26]‘ఈ ఆచారం మనం ఎందుకు పాటిస్తున్నాము?’
అని మీ పిల్లలు మిమ్మల్ని అడిగినప్పుడు [27]‘యెహో
వాను ఘనపర్చడం కోసమే ఈ పస్కా పండుగ. ఎందు
చేతనంటే, మనం ఈజిప్టులో ఉన్నప్పుడు యెహోవా
ఇశ్రాయేలు గృహాలను దాటిపోయాడు* యెహోవా
ఈజిప్టు వాళ్లను చంపేసాడు. కానీ మన ఇళ్లల్లో వారిని
ఆయన రక్షించాడు. అందుచేత ఇప్పుడు ప్రజలు
సాష్టాంగపడి యెహోవాను ఆరాధిస్తున్నారు’ అని మీరు
చెప్పాలి.” అని అన్నాడు.

[28]మోషే అహరోనులకు యెహోవా ఈ ఆజ్ఞ
ఇచ్చాడు. అందుచేత యెహోవా ఆజ్ఞ ప్రకారం ఇశ్రా
యేలు ప్రజలు చేసారు.

[29]అర్ధరాత్రి వేళ ఫరో (ఈజిప్టు రాజ్యపాలకుడు)
ఇంట పెద్ద కుమారుడు మొదలుకొని చెరసాలలో
కూర్చొన్న ఖైదీ పెద్ద కుమారుని వరకు ఈజిప్టులో
పెద్ద కుమారులందర్నీ యెహోవా చంపేసాడు. అలాగే
జంతువుల్లో మొదటి సంతానం అన్నీ చచ్చాయి.
[30]ఆ రాత్రి ఈజిప్టులో ప్రతీ ఇంటా ఎవరో ఒకరు
చనిపోయారు. ఫరో, అతని అధికారులు, ఈజిప్టులోని
ప్రజలంతా ఘొల్లున ఏడ్వడం మొదలు పెట్టారు.

## ఇశ్రాయేలీయులు ఈజిప్టు విడిచి వెళ్లడం

[31]కనుక ఆ రాత్రి మోషే, అహరోనులను ఫరో
పిలిపించాడు. “మీరు వెంటనే నా ప్రజల్ని విడిచి
వెళ్లండి. మీరు చెప్పినట్టే మీరూ, మీ ప్రజలూ
చెయ్యండి. వెళ్లి యెహోవాను ఆరాధించండి. [32]మీరు
చెప్పినట్టే మీ గొర్రెలను, పశువులను, అన్నింటినీ
మీతోబాటు తీసుకొనిపోవచ్చు. వెళ్లండి. నన్నుకూడ
ఆశీర్వదించండి.” అని వారితో ఫరో అన్నాడు.
[33]వాళ్లను త్వరగా విడిచిపొమ్మని ఈజిప్టు ప్రజలు కూడ
వారిని అడిగారు. ఎందుకంటే, “మీరు వెళ్లకపోతే మేమం
దరం చస్తాము” అని వాళ్లు చెప్పారు.

[34]తమ రొట్టెల్లో పులిసిన పదార్థం వేసుకొనేంత
సమయం ఇశ్రాయేలు ప్రజలకు లేదు. పిండి ముద్ద
లున్న పాత్రలను బట్టలో కట్టుకొని వారు వారి భుజాన
వేసుకొని మోసుకుపోయారు. [35]అప్పుడు మోషే
వారిని ఏమి చేయమని చెప్పాడో అలాగే ఇశ్రాయేలు
ప్రజలు చేసారు. వారు వారి పక్క ఇండ్ల వారి దగ్గరకు
వెళ్లి బట్టలు, వెండి, బంగారు వస్తువులు ఇమ్మని
అడిగారు. [36]ఈజిప్టువారు ఇశ్రాయేలు ప్రజల మీద
దయ చూపించేటట్టు యెహోవా చేసాడు. అందుచేత
ఈజిప్టు వాళ్లు వారి ఐశ్వర్యాలను ఇశ్రాయేలు ప్రజలకు
యిచ్చారు.

[37]ఇశ్రాయేలు ప్రజలు ప్రయాణం కట్టి రామసేసు
నుండి సుక్కోతుకి వెళ్లారు. వారు పురుషులే సుమారు
6,00,000 మంది. ఇందులో పిల్లల సంఖ్యలేదు
[38]గొర్రెలు, పశువులు, ఇతర సామగ్రి చాల విస్తారంగా
ఉన్నాయి. వారితో బాటు చాల మంది రకరకాల
ప్రజలు ప్రయాణం చేస్తున్నారు. వీళ్లు

---

**కాపాడుతాడు** లేక “కాపాడుట.”

**దాటిపోయాడు** “దాటిపోతాడు.”

ఇశ్రాయేలీయులు కారు, గాని వారితో కలిసి వెళ్లారు.
39అయితే ప్రజలకు మాత్రం వారి రొట్టెల్లో పులిసిన
పదార్థం వేసుకొనే సమయం లేదు. వారు తమ
ప్రయాణం కోసం ప్రత్యేకమైన భోజనం ఏదీ సిద్ధం
చేసుకోలేదు. కనుక పులవని పిండితోనే వారు రొట్టెలు
చేసుకోవాల్సి వచ్చింది.
40ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టులో* 430 సంవత్స
రాలు జీవించారు. 41నాలుగువందల ముప్పై సంవత్స
రాల తర్వాత ఆరోజే మొత్తం యెహోవా సైన్యా
లన్నీ* ఈజిప్టు దేశాన్ని విడిచి వెళ్లిపోయాయి. 42కనుక
యెహోవా చేసిన దానిని ప్రజలు జ్ఞాపకం చేసు
కొంటారు. అది చాల ప్రత్యేకమైన రాత్రి కనుక తరతరా
లవరకు జ్ఞాపకం చేసుకొంటారు. ఇశ్రాయేలు ప్రజ
లంతా ఆ రాత్రిని శాశ్వతంగా జ్ఞాపకం ఉంచు కొంటారు.
43మోషే అహరోనులతో యెహోవా యిలా
చెప్పాడు: "పస్కా పండుగకు నియమాలు ఇవి. పస్కా
భోజనం విదేశీయుడెవరూ తినకూడదు. 44ఒకడు
బానిసను కొంటే, ఆ బానిసకు అతడు సున్నతి చేస్తే
అప్పుడు ఆ బానిస పస్కా పండుగ భోజనం చెయ్య
వచ్చు. 45అయితే, ఒక వ్యక్తి కేవలం మీ దేశంలో
ఉంటున్నా, లేక మీకోసం పని చేసేందుకు కూలికి
కుదుర్చుకొన్నా, అలాంటి వ్యక్తి పస్కా పండుగ
భోజనం చెయ్యకూడదు. (పస్కా పండుగ ఇశ్రాయేలీ
యులకు మాత్రమే) "
46"ప్రతి కుటుంబము ఒకే ఇంటిలో భోజనం
చేయాలి. భోజనాన్ని ఎవ్వరూ ఇంటి బయట తిన
కూడదు. మీరు గొర్రెమాంసము తిని దాని ఎముకను
విరువకూడదు. 47ఇశ్రాయేలు ప్రజలందరు ఈ పండు
గను ఆచరించాలి. 48ఇశ్రాయేలు సమాజంలో సభ్యుడు
కాని ఏ వ్యక్తి అయినా మీతోబాటు నివసిస్తూ ఉండి
యెహోవా పస్కా పండుగలో అతడు పాల్గొనాలను
కొంటే, అతనికి సున్నతి చేయాలి. అప్పుడు అతను
కూడ ఇశ్రాయేలు పౌరుడుగా ఆ భోజనంలో పాల్గొన
వచ్చు. కాని ఒకడు సున్నతి చేసుకోకపోతే అతను
పస్కా పండుగ భోజనంలో పాల్గొన కూడదు. 49అంద
రికీ ఇవే నియమాలు వర్తిస్తాయి. మీ దేశంలో నివసి
స్తున్న వ్యక్తి పౌరుడైనా సరే, విదేశీయుడైనా సరే యివే
నియమాలు వర్తిస్తాయి."
50 మోషే అహరోనులకు యెహోవా ఇచ్చిన
ఆజ్ఞలకు ప్రజలంతా విధేయులయ్యారు. 51కనుక అదే
రోజు ఇశ్రాయేలు ప్రజలందరినీ ఈజిప్టు దేశం నుండి
యెహోవా బయటకు నడిపించాడు. ప్రజలు గుంపు
లుగా బయల్దేరారు.

13 అప్పుడు యెహోవా మోషేతో యిలా
అన్నాడు. 2"ఇశ్రాయేలులో పెద్దకుమారుడు
ప్రతి ఒక్కడూ నాకు చెందుతాడు. ప్రతి స్త్రీకి పుట్టిన
పెద్దకుమారుడూ నావాడు. మీ జంతువుల్లో మొదటి
పుట్టే ప్రతి మగదాన్నీ మీరు నాకు అర్పించాలి."
3మోషే ప్రజలతో ఇలా చెప్పాడు: "ఈ రోజును
జ్ఞాపకం ఉంచుకోండి. మీరు ఈజిప్టులో బానిసలుగా
ఉండేవారు. అయితే ఈనాడు యెహోవా తన మహా
శక్తిని ప్రయోగించి మిమ్మల్ని విడుదల చేసాడు. మీరు
మాత్రం పులిసిన పదార్థంతో రొట్టెలు తినకూడదు.
4అబీబు* మాసంలో ఈనాడు మీరు ఈజిప్టును విడిచి
వెళ్తున్నారు. 5మీ పూర్వీకులకు యెహోవా వాగ్దానం
చేసాడు. కనానీ ప్రజలు, హిత్తీ ప్రజలు, అమోరీ ప్రజలు,
హివ్వీ ప్రజలు, యెబూసీ ప్రజలు నివసిస్తోన్న దేశాన్ని
మీకు ఇస్తానని యెహోవా వాగ్దానం చేసాడు.
యెహోవా మిమ్మల్ని పాలు తేనెలు ప్రవహిస్తోన్న ఆ
సుందర దేశానికి నడిపించిన తర్వాత అప్పుడు కూడా
మీరు ఈ రోజును జ్ఞాపకం చేసుకోవాలి. ప్రతి సంవ
త్సరం మొదటి నెలలో ఈరోజు ఒక ప్రత్యేకమైన
ఆరాధన రోజుగా మీకు ఉండాలి.
6"ఏడు రోజులపాటు పులియని రొట్టెలే మీరు
తినాలి. ఏడోనాడు ఒక గొప్ప విందు ఉంటుంది. ఈ
విందు యెహోవా ఘనతను సూచిస్తుంది. 7కనుక
ఏడు రోజులు పులిసిన పదార్థంతో చేయబడ్డ రొట్టెలు
ఏవీ మీరు తినకూడదు. మీ దేశం మొత్తంలో ఎక్కడా
పులిసిన పదార్థంతో తయారైన రొట్టెలు ఉండ
కూడదు. 8'యెహోవా ఈజిప్టునుండి మమ్మల్ని బయ
టకు రప్పించాడు. కనుక మనం ఈ పండుగ చేసు
కొంటున్నాము' అని ఈ రోజు నాడు మీరు మీ పిల్ల
లతో చెప్పాలి."
9"మీరు జ్ఞాపకం చేసుకొనేందుకు ఈ పండుగ మీకు
తోడ్పడుతుంది. అది మీ ముంజేతి మీద కట్టుకొన్న
దారం పోగులా ఉంటుంది. అది మీ కళ్లముందు కనబడే
ఒక జ్ఞాపికలా ఉంటుంది. యెహోవా ప్రబోధాలను
జ్ఞాపకం చేసుకొనేందుకు ఈ పండుగ మీకు సహాయ
పడుతుంది. మిమ్మల్ని ఈజిప్టు నుండి బయటకు
రప్పించేందుకు యెహోవా తన మహత్తర శక్తిని ప్రయో
గించాడని జ్ఞాపకం చేసుకొనేందుకు ఇది మీకు సహాయ
పడుతుంది. 10కనుక ప్రతి సంవత్సరం సరైన సమ
యంలో ఈ పండుగను జ్ఞాపకం చేసుకోండి."
11"మీకు ఇస్తానని వాగ్దానం చేసిన దేశానికి
యెహోవా మిమ్మల్ని నడిపిస్తాడు. కనానీయులు

**ఈజిప్టు** "ఈజిప్టు కనాను" అని ప్రాచీన గ్రీకు, సమరయ తర్జుమాల్లో ఉంది. అంటే వారు యోసేపు కాలం నుండి కాక అబ్రాహాం కాలంనుండి సంవత్సరాలు లెక్కించి ఉంటారు. ఆది కా. 15:12 16. గలతీ 3:17 చూడండి.

**ఇశ్రాయేలీ సైన్యాలన్నీ** ఇశ్రాయేలు ప్రజలు.

**అబీబు** లేక వసంతకాలం ప్రాచీన యూదా సంవత్సరంలో యిది మొదటి నెల నిసాన్ (మార్చి, ఏప్రిల్).

ఇప్పుడు అక్కడ నివసిస్తున్నారు. అయితే ఈ దేశాన్ని
మీకు ఇస్తానని మీ పూర్వీకులకు యెహోవా వాగ్దానం
చేసాడు. దేవుడు ఈ దేశాన్ని మీకు ఇచ్చిన తర్వాత
12ప్రతి పెద్ద కుమారుణ్ణి ఆయనకు ఇవ్వాలని మీరు
జ్ఞాపకం ఉంచుకోవాలి. అలాగే జంతువుల్లో ప్రథమంగా
పుట్టిన ప్రతి మగపిల్లనూ యెహోవాకు అర్పించాలి.
13తొలి పిల్లగా పుట్టిన ప్రతి గాడిదనూ యెహోవా
దగ్గర్నుండి మళ్లీ కొనుక్కోవచ్చు. మీరు ఆ గాడిదకు
బదులుగా ఒక గొర్రెపిల్లను ఇచ్చి, గాడిదను విడిపించు
కోవచ్చును. యెహోవా దగ్గర్నుండి ఆ గాడిదను
కొని విడిపించుకోనట్లయితే, దాన్ని చంపేయాలి.
మీరు దాని మెడ విరుగగొట్టాలి. అది బలి అర్పణ
అవుతుంది. ప్రతి పెద్ద సంతానాన్నీ యెహోవా దగ్గర
నుండి మళ్లీ కొనుక్కోవాలి.
14"మీరెందుకు ఇలా చేస్తున్నారని భవిష్యత్తులో మీ
పిల్లలు మిమ్మల్ని అడుగుతారు. "దీనంతటికీ భావం
ఏమిటి?" అని వారు అంటారు. దానికి మీరు యిలా
జవాబిస్తారు. 'ఈజిప్టు నుండి మనల్ని రక్షించేందుకు
యెహోవా తన మహత్తర శక్తిని ప్రయోగించాడు.
అక్కడ మనం బానిసలంగా ఉంటిమి. అయితే
యెహోవా మనల్ని అక్కడ నుండి బయటకు నడి
పించి ఇక్కడకు తీసుకొచ్చాడు. 15ఈజిప్టులో ఫరో
మొండికెత్తాడు. మనల్ని వెళ్లనిచ్చేందుకు అతడు నిరాక
రించాడు. కనుక ఆ దేశంలో ప్రతి జ్యేష్ఠ సంతానాన్నీ
యెహోవా చంపేసాడు. (పెద్ద కుమారుల్ని, తొలి
చూలు జంతువుల్ని యెహోవా చంపేసాడు) ఆ
కారణంచేత జంతువుల్లో మొదటి సంతానంగా పుట్టిన
ప్రతి మగపిల్లనూ* నేను యెహోవాకు అర్పిస్తు
న్నాను. ఆ కారణంచేతనే నా పెద్ద కుమారుల్లో ప్రతి
ఒక్కరినీ నేను యెహోవా దగ్గర్నుండి కొంటున్నాను.'
16ఇది నీ ముంజేతికి కట్టబడ్డ దారం పోగులాంటిది.
అది నీ కంటికి ఒక బాసికంలాంటిది.* యెహోవా
తన మహత్తర శక్తిచేత మనల్ని ఈజిప్టు నుండి బయ
టకు రప్పించాడని జ్ఞాపకం చేసుకొనేందుకు ఇది మీకు
సహాయకరంగా ఉంటుంది."

### ఈజిప్టు నుండి బయటకు ప్రయాణం

17ఫరో ఈజిప్టును విడిచి వెళ్లనిచ్చాడు. సముద్రం
వెంబడి పోయే మార్గంలో ఆ ప్రజలను యెహోవా
వెళ్ల నీయలేదు. ఈ మార్గం పాలస్తీనాకు దగ్గర దారి.
కాని "ప్రజలు ఆ దారిన వెళ్తే యుద్ధం చేయాల్సి
వస్తుంది. అలాంటప్పుడు వాళ్లు మనసు మార్చుకొని
మళ్లీ ఈజిప్టుకు వెళ్లిపోవచ్చు." 18కనుక వారిని ఇంకో
మార్గాన యెహోవా నడిపించాడు. ఎర్ర సముద్రం
పక్కగా ఉండే అరణ్యంలోనుంచి ఆయన వారిని నడి
పించాడు. అయితే, ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు విడిచి
పెట్టినప్పుడు యుద్ధ వస్త్రాలు ధరించి బయల్దేరారు.

### యోసేపు ఎముకలు ఇంటికి తీసుకొని వెళ్లడం

19మోషే తనతో బాటు యోసేపు ఎముకలను
తీసుకొని వెళ్లాడు. ఇలా చేయాలనిచెప్పి యోసేపు
తాను చనిపోక ముందే ఇశ్రాయేలు కుమారులతో
ప్రమాణం చేయించుకొన్నాడు. "దేవుడు మిమ్మల్ని
రక్షించినప్పుడు ఈజిప్టులోనుంచి నా ఎముకల్ని మీతో
తీసుకు వెళ్లాలని జ్ఞాపకం ఉంచుకోండి" అని తాను
చనిపోక ముందు యోసేపు చెప్పాడు).

### యెహోవా తన ప్రజలను నడిపించాడు

20ఇశ్రాయేలు ప్రజలు సుక్కోతు విడిచి ఏతాములో
బసచేసారు. ఏతాము ఎడారికి సమీపంగా ఉంది.
21యెహోవా ముందు దారితీశాడు. పగటి వేళ ప్రజ
లను నడిపించేందుకు ఒక ఎత్తయిన మేఘ స్తంభాన్ని
యెహోవా ఉపయోగించాడు, మరియు రాత్రివేళ
మార్గం చూపించడానికి ఒక ఎత్తయిన అగ్నిస్తంభాన్ని
యెహోవా ఉపయోగించాడు. వాళ్లు రాత్రి సమ
యంలో కూడ ప్రయాణం చేయగలిగేటట్టు ఆ అగ్ని
వారికి వెలుతురు నిచ్చింది. 22పగటి వేళంతా ఆ ఎత్త
యిన మేఘమూ, రాత్రి వేళంతా అగ్ని స్తంభమూ
వాళ్లతోటే ఉన్నాయి.

14 అప్పుడు మోషేతో యెహోవా ఇలా
అన్నాడు: 2"ప్రజలు వెనక్కు తిరిగి పీహ హీరో
తుకు ప్రయాణం కట్టమని చెప్పు. మిగ్దోలుకు, సము
ద్రానికి మధ్య ప్రదేశంలో రాత్రికి బసచేయాలని వారితో
చెప్పు. ఇది బయల్సెఫోను దగ్గర్లో ఉంది. 3ఇశ్రాయేలు
ప్రజలు ఎడారిలో తప్పిపోయి ఉంటారని ఫరో తలు
స్తాడు. పైగా ప్రజలు వెళ్ల గలిగినచోటు ఇంకేమీ ఉండదు
అనుకొంటాడు. 4ఫరోను నేను ధైర్యశాలిగా చేస్తాను.
అతడేమో మిమ్మల్ని తరుముతాడు. అయితే ఫరోను,
అతని సైన్యాన్ని నేను ఓడిస్తాను. ఇది నాకు కీర్తి
తెచ్చి పెడుతుంది. నేనే యెహోవానని ఈజిప్టు వాళ్లు
అప్పుడు తెల్సుకొంటారు." ఇశ్రాయేలు ప్రజలు దేవుని
మాటకు విధేయులై ఆయన చెప్పినట్టు చేసారు.

### ఇశ్రాయేలీయుల్ని ఫరో తరమటం

5ఇశ్రాయేలు ప్రజలు పారిపోయారని ఫరోకు ఒక
సమాచారం అందింది. ఎప్పుడైతే ఈ సంగతి విన్నారో
అప్పుడు వెంటనే ఫరో, అతని అధికారులు తాము
చేసిన దాన్ని గూర్చి తమ మనసు మార్చుకొన్నారు.
"ఇశ్రాయేలు ప్రజల్ని అసలు మనం ఎందుకు వెళ్ల

---

**మగపిల్లను** లేక "పిల్లలు."

**కట్టబడ్డ ... బాసికంలాంటిది** యూదులు వారి దేవుని ఆజ్ఞలను జ్ఞాపకం చేసుకొనేందుకు సూచనగా చేతులమీద, నొసటమీద ఇలాంటివి కట్టుకొంటారని సూచన కావచ్చును.

నిచ్చాం? వాళ్లను మనం ఎందుకు పారిపోనిచ్చాం?
ఇప్పుడు మనం మన బానిసల్ని పోగొట్టుకొన్నాం”
అన్నాడు ఫరో. 6కనుక ఫరో తన యుద్ధరథాన్ని
సిద్ధం చేసుకొని, తన మనుష్యుల్ని వెంట పెట్టుకొని
వెళ్లాడు. 7తన మనుష్యుల్లో బలవంతులయిన వాళ్లు
600 మందిని, రథాలు అన్నింటిని తనతో తీసుకొని
వెళ్లాడు. ఒక్కొరథానికి ఒక్కో అధికారి ఉన్నాడు.
8ఇశ్రాయేలీయులు విజయ సంకేతంగా చేతులు పైకెత్తి
వెళ్లి పోతున్నారు. కానీ ఈజిప్టురాజైన ఫరో ఇంకా
ధైర్యశాలి అయ్యేటట్టు యెహోవా చేసాడు. ఫరో
ఇశ్రాయేలు ప్రజల్ని ఇంకా తరిమాడు.
9ఈజిప్టు సైన్యంలో అశ్వదళాలు, రథాలు చాల
ఉన్నాయి. వారు ఇశ్రాయేలు ప్రజల్ని తరిమి, వారు
బయల్సెఫోనుకు తూర్పున పీహహీరోతువద్ద ఎర్ర సము
ద్రానికి దగ్గర్లో బస చేస్తూ ఉండగానే వారిని సమీ
పించారు.
10ఫరో, అతని సైన్యం తమవైపే రావడం ఇశ్రా
యేలు ప్రజలు చూసారు. ప్రజలు చాల భయపడ్డారు.
సహాయం చేయమని వారు యెహోవాకు మొర
పెట్టారు. 11మోషేతో వాళ్లు యిలా అన్నారు, “అసలు
ఈజిప్టు నుండి నీవు మమ్మల్నెందుకు బయటకు
తీసుకొచ్చావు? చావడానికి నీవు మమ్మల్ని ఈ ఎడారి
లోకి తీసుకురావడం ఎందుకు? మేము హాయిగా ఈజి
ప్టులోనే చచ్చేవాళ్లం అక్కడ ఈజిప్టులో కావాల్సి నన్ని
సమాధులున్నాయి. 12ఇలా జరుగుతుందని మేము
నీతో చెప్పాము. ‘దయచేసి మమ్మల్ని విసిగించకు.
మమ్మల్ని ఇక్కడే ఉండనిచ్చి, ఈజిప్టు వాళ్లకు సేవ
చేయనియ్యి అని ఈజిప్టులోనే మేము చెప్పాము.’
ఇలా బయటకు వచ్చి ఈ ఎడారిలో చావడంకంటె
ఈజిప్టులోనే ఉండిపోయి బానిసలంగా ఉంటేనే యింకా
బాగుండేది మాకు.”
13కానీ మోషే జవాబు ఇలా చెప్పాడు: “భయ
పడకండి! పారిపోకండి! యెహోవా ఈనాడు
మిమ్మల్ని రక్షించటం వేచి చూడండి. ఈ ఈజిప్టు
వారిని ఈరోజు తర్వాత మళ్లీ ఎన్నడూ మీరు చూడరు!
14మీరు ఊరకనే మౌనంగా ఉండటం తప్ప చేయా
ల్సిందేమీ లేదు. మీ పక్షంగా యెహోవా యుద్ధం
చేస్తాడు.”
15అప్పుడు మోషేతో యెహోవా ఇలా అన్నాడు,
“ఇంకా నీవెందుకు నాకు మొరపెడుతున్నావు? ఇశ్రా
యేలు ప్రజల్ని ముందడుగు వేయమని ఆజ్ఞాపించు
16నీ చేతిలో కర్రను ఎర్రసముద్రం మీదకు చాపు,
ఎర్రసముద్రం రెండుగా విడిపోతుంది. అప్పుడు ప్రజలు
ఆరిపోయిన నేలమీద సముద్రంలోనుంచి నడిచి వెళ్లి
పోవచ్చు. 17ఈజిప్టు వాళ్లను ధైర్యంగల వాళ్లుగా నేను
చేస్తాను. ఇలా చేసినందువల్ల వారు మిమ్మల్ని తరుము
తారు. అయితే ఫరోకంటె, అతని అశ్వదళాలు, రథాలు,
అన్నిటికంటె నేను ఎక్కువ శక్తిగలవాడ్ని అని మీకు
తెలియజేస్తాను. 18నేనే యెహోవానని ఈజిప్టు
అప్పుడు తెలుసు కొంటుంది. ఫరోను, అతని అశ్వ
దళాలను, రథాలను నేను ఓడించినప్పుడు వాళ్లు నన్ను
గౌరవిస్తారు.”

## ఈజిప్టు సైన్యాన్ని యెహోవా ఓడించటం

19ఆ సమయంలో యెహోవా దూత ప్రజల
వెనక్కు వెళ్లడం జరిగింది. (సాధారణంగా యెహోవా
దూత ప్రజలకు ముందర ఉండి వారిని నడిపించడం
జరుగుతుంది) కనుక ఎత్తైన మేఘం ప్రజల ముందర
నుండి కదలిపోయి, ప్రజల వెనక్కు వెళ్లింది 20ఈ
విధంగా ఈజిప్టు వాళ్లకు, ఇశ్రాయేలీయులకు మధ్య
ఆ మేఘం నిలిచింది. ఇశ్రాయేలు ప్రజలకు వెలుగు
ఉంది. కానీ ఈజిప్టు వారికి అంతా చీకటి. అందుచేత
ఆరాత్రి ఈజిప్టు వాళ్లు ఇశ్రాయేలు ప్రజల సమీపానికి
రాలేక పోయారు.
21మోషే ఎర్ర సముద్రం మీదికి తన చేయి ఎత్తగానే
తూర్పునుండి ఒక బలమైన గాలి వీచేటట్టు యెహోవా
చేసాడు. ఆ గాలి రాత్రి అంతా వీచింది. సముద్రం
రెండుగా విడిపోయింది. ఆ గాలి నేలను ఆరిపోయ్యే
టట్టు చేసింది. 22ఇశ్రాయేలు ప్రజలు సముద్రంలో
పొడినేల మీద వెళ్లారు. వాళ్లకు కుడిప్రక్క, ఎడమప్రక్క
నీళ్లు గోడలా నిలిచాయి. 23అప్పుడు ఫరో రథాలు,
అశ్వదళాలు అన్నీ వాళ్ల వెంట సముద్రంలో ప్రవే
శించాయి.
24ఆ ఉదయం ఎత్తయిన మేఘం నుండి అగ్ని
స్తంభం నుండి యెహోవా ఈజిప్టు సైన్యాన్ని
చూచాడు. యెహోవా వాళ్లను ఎదుర్కొని ఓడించాడు.
25రథచక్రాలు బిగిసిపోయి కదలడం లేదు. రథాలను
అదుపుచెయ్యడం చాలా కష్టతరంగా ఉంది. “మనం
ఇక్కడ్నుంచి పారిపోదాం రండి! యెహోవా మనకు
వ్యతిరేకంగా పోరాడుతున్నాడు. ఆయన ఇశ్రాయేలీ
యులకోసం యుద్ధం చేస్తున్నాడు.” అంటూ ఈజిప్టు
వాళ్లు కేకలు వేసారు. 26అప్పుడు యెహోవా
మోషేతో, “నీ చేయి సముద్రం మీదికి ఎత్తు, నీళ్లు
పడిపోయి ఈజిప్టు రథాలను, అశ్వదళాలను ముంచే
స్తాయి.” అని చెప్పాడు.
27కనుక తెల్లవారు ఝామున మోషే తన చేతిని
సముద్రం మీదికి ఎత్తాడు. నీళ్లు యథాస్థానానికి వచ్చి
పడ్డాయి. ఈజిప్టు వాళ్లు పారిపోయేందుకు ప్రయత్ని
స్తున్నారు. అయితే ఈజిప్టు వాళ్లు సముద్రంలో
కొట్టుకుపోయేటట్టు యెహోవా చేసాడు. 28నీళ్లు
యథాస్థానానికి మళ్లీ రావడం చేత రథాలను, అశ్వద
ళాలను కప్పేశాయి. ఇశ్రాయేలు ప్రజలను తరుము
కొచ్చిన ఫరో సైన్యాలన్నీ నాశనం చేయబడ్డాయి.
వాళ్లలో ఒక్కడూ బతకలేదు.

[29]అయితే ఇశ్రాయేలు ప్రజలు మాత్రం పొడినేల మీద సముద్రాన్ని దాటిపోయారు. వారి కుడి ఎడమ ప్రక్కల్లో నీళ్లు ఒక గోడలా నిలిచిపోయాయి.

[30]ఆ రోజు ఇశ్రాయేలు ప్రజలను ఈజిప్టువాళ్ల చేతినుండి యెహోవాయే రక్షించాడు. ఎర్రసముద్ర తీరాన ఈజిప్టువాళ్ల శవాలను ఇశ్రాయేలు ప్రజలు చూచారు.

[31]యెహోవా ఈజిప్టు వాళ్లను ఓడించినప్పుడు ఆయన మహత్తర శక్తిని ఇశ్రాయేలు ప్రజలు చూశారు. అందుచేత ప్రజలు యెహోవాకు భయపడి ఆయనను ఘనపర్చారు. యెహోవాను, ఆయన సేవకుడైన మోషేను నమ్మారు.

### మోషే పాట

15 అప్పుడు మోషే, అతనితోబాటు ఇశ్రాయేలు ప్రజలూ యెహోవాకు ఈ పాట పాడటం మొదలు పెట్టారు.

"యెహోవాను గూర్చి నేను గానం చేస్తాను.
ఆయన గొప్ప కార్యాలు చేసాడు గనుక గుర్రా
లను, రౌతులను ఆయనే సముద్రంలో పడ
వేసాడు.
2 యెహోవా నా బలం, నన్ను రక్షించేది ఆయనే
ఆయన్ను గూర్చి నేను స్తుతిగీతాలు పాడు
కొంటాను. యెహోవా నా దేవుడు, ఆయన్ను
నేను స్తుతిస్తాను. నా పూర్వీకుల దేవుడు*
యెహోవా ఆయన్ని నేను ఘనపరుస్తాను.
3 యెహోవా గొప్ప వీరుడు ఆయన పేరే
యెహోవా.
4 ఫరో రథాలను అశ్వదళాలను సముద్రంలో పడ
వేసాడు యెహోవా ఫరో ప్రధాన అధికారులు
ఎర్ర సముద్రంలో మునిగిపోయారు.
5 లోతైన జలాలు వారిని కప్పేసాయి లోతు
నీటిలో బండల్లా వాళ్లు మునిగిపొయ్యారు.
6 "నీ కుడిచేతిలో ఆశ్చర్యం కలిగించేటంత బలం
ఉంది. పభూ, నీ కుడిచేయి శత్రువును పటా
పంచలు చేసింది.
7 నీకు వ్యతిరేకంగా నిలిచిన వారిని నీ మహా ఘనత
చేత నాశనం చేసావు గడ్డిని తగుల బెట్టినట్టు నీ
కోపం వారిని నాశనం చేసింది.
8 నీవు విసరిన పెనుగాలి నీళ్లను ఉవ్వెత్తున నిలి
పేసింది వేగంగా ప్రవహించే నీళ్లు గట్టి గోడలా
అయ్యాయి సముద్రం, దాని లోపలి భాగాలవరకు
గడ్డ కట్టెను.
9 శత్రువు, "నేను వాళ్లను తరిమి పట్టుకొంటాను
వాళ్ల ఐశ్వర్యాలన్నీ దోచుకొంటాను నేను నా
కత్తి ప్రయోగించి, వాళ్ల సర్వస్వం దోచు
కొంటాను సర్వం నా కోసమే నా చేతుల్తో
దోచుకొంటాను" అని అన్నాడు.
10 కానీ నీవు వాళ్ల మీదకి గాలి రేపి సముద్రంతో
వాళ్లను కప్పేసావు సముద్ర అగాధంలో సీసం
మునిగిపోయినట్టు వాళ్లు మునిగిపొయ్యారు.
11 "యెహోవా, నీలాంటి పరాక్రమముగల దేవుడు
మరొకడు లేడు పరిశుద్ధతలో నీవు గొప్పవాడవు.
స్తుతి కీర్తనలతో ఆరాధించబడుటకు యోగ్యు
డవు ఆశ్చర్యకార్యములు చేయువాడవు నీకు
సాటి వేరెవ్వరూ లేరు.
12 నీ కుడి హస్తాన్ని పైకెత్తి ప్రపంచాన్నే నాశనం
చేయగలవు!
13 నీవు రక్షించిన ప్రజల్ని నీ దయతో నీవు నడిపి
స్తావు ఉల్లాసకరమైన నీ పవిత్ర దేశానికి నీ బలంతో
నీవు వీళ్లను నడిపిస్తావు.
14 "ఈ గాథను ఇతర జన సమూహాలు వింటారు
ఎంతైనా వాళ్లు భయపడ్తారు. ఫిలిష్తీ ప్రజలు
భయంతో వణకిపోతారు.
15 తరువాత ఎదోము నాయకులు భయంతో వణకి
పోతారు మోయాబు నాయకులు భయంతో
వణకిపోతారు. కనాను ప్రజలు తమ ధైర్యం
కోల్పోతారు.
16 ఆ ప్రజలు నీ బలాన్ని చూచి భయంతో నిండి
పోతారు యెహోవా ప్రజలు దాటి పొయ్యేంత
వరకు ఆ ప్రజల్ని నీవు దాటించేంత వరకు
వాళ్లు బండలా మౌనంగా ఉండిపోతారు.
17 యెహోవా నీవు నీ సింహాసనం కోసం సిద్ధం
చేసిన నీ పర్వతానికి నీ ప్రజల్ని నడిపిస్తావు ఓ
ప్రభో, నీ హస్తాలతో నీ ఆలయాన్ని నిర్మించు
18 యెహోవా శాశ్వతంగా సదా ఏలునుగాక!"

[19]ఫరో గుర్రాలు, రౌతులు, రథాలు సముద్రంలోకి వెళ్లిపొయ్యాయి. సముద్ర జలాలతో యెహోవా వాళ్లను కప్పేసాడు. అయితే ఇశ్రాయేలు ప్రజలు పొడి నేల మీద సముద్రంలో నడిచివెళ్లారు.

[20]అప్పుడు అహరోను సోదరి, మహిళా ప్రవక్తి మిర్యాము తంబుర పట్టుకొంది. మిర్యాము, మిగతా స్త్రీలు పాటలు పాడుతూ నాట్యం చేయడం మొదలు పెట్టారు. మిర్యాము ఈ మాటనే మరల మరల పల్లవిగా పలికింది,

21 "ఆయన గొప్ప కార్యాలు చేసాడు గనుక యెహో
వాకు గానం చేయండి గుర్రాలను, దాని రౌతు
లను ఆయన సముద్రంలో పడవేసాడు."

---

**నా పూర్వీకుల దేవుడు** అనగా అబ్రాహాము ఇస్సాకు యాకోబుల దేవుడు.

22 మోషే మాత్రం ఇశ్రాయేలు ప్రజల్ని ఎర్ర
సముద్రం నుండి దూరంగా నడిపిస్తూనే ఉన్నాడు.
ప్రజలు షూరు ఎడారిలోకి వెళ్లారు. ఎడారిలో మూడు
రోజులు వాళ్ల ప్రయాణం చేసారు. ప్రజలకు నీళ్లు
ఏవీ దొరకలేదు. 23 మూడురోజుల తర్వాత ప్రజలు
మారాకు ప్రయాణమై వెళ్లారు. మారాలో నీళ్లున్నాయి
గాని అవి త్రాగలేకపోయారు. ఆ నీళ్లు త్రాగలేనంత
చేదుగా ఉన్నాయి. అందుకే ఆ స్థలానికి మారా* అని
పేరు.

24 ప్రజలు మోషేకు ఫిర్యాదు చేయటం మొదలు
బెట్టారు, "ఇప్పుడు మేము ఏమి త్రాగాలి?"అన్నారు
ప్రజలు.

25 మోషే యెహోవాకు మొర పెట్టాడు.
యెహోవా అతనికి ఒక చెట్టును చూపించాడు. మోషే
ఆ చెట్టును నీళ్లలో వేసాడు. అతను యిలా చేయగానే
ఆ నీళ్లు తాగే మంచి నీళ్లయ్యాయి. ఆ స్థలంలో
ప్రజలకు యెహోవా తీర్పు తీర్చి వారికి ఒక ఆజ్ఞను
ఇచ్చాడు. ఆ ప్రజల విశ్వాసాన్ని కూడ యెహోవా
పరీక్షించాడు. 26 "మీ యెహోవా దేవునికి మీరు విధే
యులు కావాలి. ఆయన ఏవి సరైనవని చెబుతాడో
వాటిని మీరు చేయాలి. యెహోవా ఆజ్ఞలకు, చట్టానికి
మీరు విధేయులైతే, ఈజిప్టు వాళ్లలా మీరు రోగులు
అవ్వరు. నేను, యెహోవాను, ఈజిప్టు వాళ్ల మీదకు
పంపిన రోగాలు ఏవీ మీమీదకు పంపించను. నేనే
యెహోవాను. మిమ్మల్ని స్వస్థపరచేవాడ్ని నేనే."

27 అప్పుడు ప్రజలు ఏలీమునకు ప్రయాణ
మయ్యారు. ఏలీములో 12 నీటి ఊటలు ఉన్నాయి.
ఇంకా అక్కడ 70 ఈత చెట్లు ఉన్నాయి. అందుచేత
ఆ నీళ్ల దగ్గర వారు బసను ఏర్పాటు చేసుకొన్నారు.

16 తర్వాత ప్రజలు ఏలీము నుండి ప్రయాణం
చేసి సీనాయి ఎడారి చేరుకొన్నారు. ఈ స్థలం
ఏలీముకి, సీనాయికి మధ్య ఉంది. ఈజిప్టు వదలిన
తర్వాత రెండోనెల 15వ రోజున వారు ఈ స్థలానికి
వచ్చారు. 2 అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు మళ్లీ ఫిర్యాదు
చేయటం మొదలు పెట్టారు. ఆ ఎడారిలో వారు
మోషే అహరోనులకు ఫిర్యాదు చేసారు. 3 "ఈజిప్టు
దేశంలోనే యెహోవా మమ్మల్ని చంపేసి ఉంటే
మాకు బాగుండేది. ఈజిప్టులో తినేందుకు మాకు
సమృద్ధిగా ఉండేది. మాకు కావాల్సిన భోజనం అంతా
మాకు ఉండేది. కానీ ఇప్పుడు నీవు మమ్మల్ని ఈ
ఎడారిలోనికి తీసుకొచ్చావు. మేమంతా ఆకలితో
ఇక్కడే చస్తాము" అంటూ ప్రజలు మోషే అహరో
నులతో చెప్పారు.

4 అప్పుడు మోషేతో యెహోవా అన్నాడు,
"ఆకాశం నుండి ఆహారం కురిపిస్తాను. ఈ ఆహారం
మీరు తినేందుకే. ప్రతిరోజూ ప్రజలు బయటకు వెళ్లి
ఆరోజు తాము తినేందుకు ఎంత భోజనం అవసరమో
అంతే సమకూర్చు కోవాలి. నేను చెప్పినట్టు ప్రజలు
చేస్తారో లేదో చూద్దామని నేను యిలా చేసాను. 5 ఒక్క
రోజుకు ఎంత భోజనం సరిపోతుందో సరిగ్గా అంతే
ప్రజలు ప్రతిరోజూ తీసుకోవాలి. అయితే శుక్రవారం
నాడు ప్రజలు భోజనం సిద్ధం చేసుకొనేటప్పుడు
రెండు రోజులకు సరిపడే భోజనం ఉండేటట్టు వారు
చూసుకోవాలి.

6 కనుక మోషే అహరోనులు ఇశ్రాయేలు ప్రజలతో
ఇలా చెప్పారు, "ఈ రాత్రి యెహోవా శక్తి మీరు
చూస్తారు. ఈజిప్టు దేశం నుండి ఆయనే మిమ్మల్ని
రక్షించాడని మీరు తెలుసుకొంటారు. 7 యెహోవా
మహిమను రేపు ఉదయం మీరు చూస్తారు. యెహో
వాకు మీరు ఫిర్యాదు చేసారు. ఆయన మా మనవి
విన్నాడు. (ఆయన మీకు సహాయం చేస్తాడు) మీరు
మా దగ్గర ఫిర్యాదు మీద ఫిర్యాదు చేసారు. మేము ఏ
పాటి వారం?"

8 "మీరు ఫిర్యాదు చేస్తూ ఉన్నారు, యెహోవా మీ
ఫిర్యాదులు విన్నాడు. కనుక రాత్రివేళ ఆయన మీకు
మాంసం ఇస్తాడు. మీకు అవసరం ఉన్న భోజనం
అంతా ప్రతి ఉదయం మీకు ఉంటుంది. నాదగ్గర,
అహరోను దగ్గర మీరు ఫిర్యాదు చేస్తూ ఉండినారు.
కానీ ఇప్పుడు మేము కొంచెం విశ్రాంతి తీసుకొంటాం.
మీరు ఫిర్యాదు చేస్తోంది నా మీద, అహరోను మీద
కాదని జ్ఞాపకం ఉంచుకోండి. మీరు యెహోవాకు
విరోధంగా ఫిర్యాదు చేస్తున్నారు" అన్నాడు మోషే.

9 ఆ తర్వాత మోషే అహరోనుతో, "నీవు ఇశ్రాయేలు
ప్రజలతో మాట్లాడు: 'యెహోవా, మీ ఫిర్యాదులు
విన్నాడు గనుక ఆయన ఎదుట సమావేశం అవ్వండి'
అని వారితో చెప్పు అన్నాడు."

10 అహరోను ఇశ్రాయేలు ప్రజలందరితో మాట్లా
డాడు. వాళ్లంతా ఒక్కచోట చేరారు. అహరోను మాట్లా
డుతూ ఉండగా, ప్రజలంతా పక్కకు తిరిగి ఎడారిలోకి
చూచారు. యెహోవా మహిమ ఒక మేఘంలా ప్రత్యక్ష
మవడం వారు చూశారు.

11 యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 12 "ఇశ్రా
యేలు ప్రజల ఫిర్యాదులు నేను విన్నాను. కనుక
నేను చెబుతున్న నా మాటలు వారికి చెప్పు. 'రాత్రివేళ
మాంసం మీరు తింటారు. ప్రతి ఉదయం మీకు కావా
ల్సినంత భోజనం మీరు తింటారు. అప్పుడు మీ
యెహోవా దేవుణ్ణి నమ్ముకోవచ్చని మీరు తెలుసు
కొంటారు." '

13 ఆ రాత్రి వారి బస అంతటా పూరేళ్లు (పిట్టలు)
వచ్చాయి. (మాంసం కోసం ప్రజలు ఈ పిట్టల్ని
పట్టుకొన్నారు) ప్రతి ఉదయం బసకు దగ్గర్లో నేలమీద
మంచు కురిసింది. 14 సూర్యోదయం కాగానే ఆ మంచు

**మారా** అంటే హీబ్రూలో "చేదు" అని అర్థం.

కరిగిపోయింది. అయితే మంచు పోగానే నేలమీద
నూగుమంచు ఉండేది. 15ఇశ్రాయేలు ప్రజలు అది
చూసి “అది ఏమిటి?”అంటూ ఒకళ్లనొకళ్లు ప్రశ్నించు
కొన్నారు. ఈ పదార్థం ఏమిటో వారికి అర్థం కాలేదు
కనుక వాళ్లు ఈ ప్రశ్న అడిగారు. మోషే వాళ్లతో
చెప్పాడు: “మీరు భోజనంచేయడానికి యెహోవా
మీకు ఇచ్చిన భోజనం ఇది. 16ప్రతి వ్యక్తి తనకు అవ
సరమైనంత మాత్రమే తీసుకోవాలి. మీ కుటుంబంలో
ప్రతి వ్యక్తికీ 2 పావుల* కొలత ప్రకారం మీలో ఒక్కొ
క్కరు తీసుకోవాలి అని యెహోవా చెబుతున్నాడు.”

17కనుక ఇశ్రాయేలు ప్రజలు అలాగే చేసారు. ప్రతి
వ్యక్తి ఈ భోజనం కూర్చుకొన్నారు. కొంతమంది
మిగతా వాళ్ల కంటె ఎక్కువ కూర్చున్నారు. 18ఆ
ప్రజలు వారి కుటుంబంలో ప్రతివొక్కరికీ ఆ భోజనం
పెట్టారు. ఆ భోజన పదార్థం కొలుచుకొన్నప్పుడల్లా,
ప్రతి వ్యక్తికీ సరిపడ్డంత మాత్రమే ఉండేది. కాని
ఎన్నడూ ఎక్కువ మిగిలేది కాదు. ప్రతి వ్యక్తీ తాను,
తన కుటుంబం ఎంత తినగలరో సరిగ్గా అంతే తీసు
కొన్నారు.

19“రేపటికోసం ఆ భోజనం దాచుకోకండి” అని
మోషే వారితో చెప్పాడు. 20కానీ ప్రజలు మోషేకు
లోబడలేదు. కొంత మంది మర్నాడు తినవచ్చని తమ
భోజనంలో కొంత దాచుకొన్నారు. అలా దాచుకొన్న
భోజనం పురుగులు పట్టేసి, కంపు కొట్టేసింది. ఇలా
చేసినవాళ్ల మీద మోషేకు కోపం వచ్చింది.

21ప్రతి ఉదయం ప్రజలు భోజనం కూర్చు
కొన్నారు. ప్రతి వ్యక్తీ తాను తిన గలిగినంత కూర్చు
కొన్నాడు. అయితే, ఎండ ఎక్కువ కాగానే ఆహారం
కరిగిపోయి కనబడకుండా పోయింది.

22శుక్రవారంనాడు, రెండంతల ఆహారం ప్రజలు
కూర్చుకొన్నారు. ఒక్కొక్క మనిషికి 4 పావుల ప్రకారం
వారు కూర్చుకొన్నారు. కనుక ప్రజానాయకలు మోషే
దగ్గరకు వచ్చి ఈ విషయం తెలియజేసారు. 23“ఇలా
జరుగుతుందని యెహోవా చెప్పాడు. ఎందుచేత?
రేపు సబ్బాతు కనుక. అది యెహోవాకు ప్రత్యేకంగా
విశ్రాంతి రోజు. ఈరోజు వండుకోవాల్సిన భోజనం
అంతా వండుకోండి, అయితే మిగతా భోజనం రేపు
ఉదయానికి దాచుకోండి” అన్నాడు మోషే వాళ్లతో.

24కనుక ప్రజలు ఆ భోజనంలో మిగిలినదాన్ని
మర్నాటికోసం దాచుకొన్నారు. ఆ భోజనంలో ఏమీ
చెడిపోలేదు. అందులో కొంచెము కూడా పురుగుపట్ట
లేదు.

25శనివారం నాడు ప్రజలతో మోషే ఇలా చెప్పాడు:
“ఈవేళ సబ్బాతు, అంటే యెహోవా విశ్రాంతి రోజు.
అందుచేత మీలో ఏ ఒక్కరూ బయట పొలాల్లో ఉండ
కూడదు. నిన్న కూర్చుకొన్న భోజనాన్ని తినండి.
26ఆరు రోజుల కోసం మీరు ఆహారం కూర్చుకోవాలి.
అయితే ఏడోరోజు విశ్రాంతి రోజు కనుక నేల మీద
ప్రత్యేక ఆహారం ఏమీ దొరకదు.”

27శనివారంనాడు ప్రజల్లో కొంతమంది ఆహారం
కూర్చుకోవాలని బయటకు వెళ్లారు కాని వారికి ఆహారం
ఏమీ కనబడలేదు. 28అప్పుడు మోషేతో యెహోవా
అన్నాడు. “నా ఆజ్ఞలకు ఉపదేశాలకు లోబడకుండా
ఎన్నాళ్లు మీరు తిరస్కరిస్తారు?” 29చూడండి, శనివారం
మీకు విశ్రాంతి రోజుగా చేసాడు యెహోవా. అందుచేత
రెండు రోజులకు సరిపడేంత ఆహారం శుక్రవారమే
యెహోవా మీకు ఇస్తాడు. కనుక శనివారంనాడు మీలో
ప్రతిఒక్కరూ కూర్చొని విశ్రాంతి తీసుకోవాలి. ఎక్కడి
వాళ్లు అక్కడే ఉండండి.” 30కనుక శనివారంనాడు
ప్రజలు విశ్రాంతి తీసుకొన్నారు.

31ఆ ప్రత్యేక ఆహారాన్ని “మన్నా”* అని పిలవడం
మొదలుబెట్టారు ప్రజలు. మన్నా కొత్తిమెర గింజల్లా
చిన్నగా తెల్లగా ఉండి, తేనెపూసిన పూతరేకుల్లా ఉంది.
32అప్పుడు మోషే అన్నాడు , “నేను మిమ్మల్ని ఈజిప్టు
నుండి బయటికి రప్పించినప్పుడు ఎడారిలో నేను
మీకు ఇచ్చిన ఆహారాన్ని మీ సంతానం వాళ్లు చూడ
గలిగేటట్టు ఈ ఆహారం 2 పావులు దాచి ఉంచమని’
యెహోవా చెప్పాడు.”

33కనుక మోషే అహరోనుతో ఇలా అన్నాడు: “ఒక
పాత్ర తీసుకొని దానిలో 8 పావుల మన్నా నింపు.
ఈ మన్నాను మన సంతానం వారి కోసం దాచిపెట్టు”
34మోషే యెహోవా చెప్పినట్టు చేసాడు. మన్నా
పాత్రను ఒడంబడిక పెట్టె* ముందర పెట్టాడు
అహరోను.

35 40 సంవత్సరాలపాటు ప్రజలు మన్నా తిన్నారు.
కనాను దేశ సరిహద్దుల వచ్చేంతవరకు వారు దాన్ని
తిన్నారు. 36(మన్నా కొలిచేందుకు వారు ఉప యోగిం
చిన కొలత ఓమెరు. ఓమెరు అంటే ఏపాలో
పదోభాగం).

17 ఇశ్రాయేలు ప్రజలంతా కలసి సీను అరణ్యము
నుండి ప్రయాణమయ్యారు. యెహోవా
ఆజ్ఞాపించినట్లెల్లా ఒక తావు నుండి మరో తావుకు
వాళ్లు ప్రయాణం చేసారు. ప్రజలు రెఫిదీముకు
ప్రయాణం చేసి అక్కడ బసచేసారు. అక్కడ ప్రజలు
తాగేందుకు నీళ్లు లేవు. 2కనుక ప్రజలు మోషే మీదికి
లేచి, ఆయనతో వాదించటం మొదలు పెట్టారు.
“తాగేందుకు నీళ్లు ఇమ్మని” ప్రజలు మోషేను అడిగారు.

---

**పావుల** అక్షరాలా ఓమెరు కొలత.

**మన్నా** అది ఏమిటి?” అని అర్థం వచ్చే హీబ్రూ పదాల్లాంటిది.

**ఒడంబడిక పెట్టె** ప్రజలు ఎడారిలో ఉన్నప్పట్నుంచి ఎన్నో ముఖ్య వస్తువుల్ని ఆపెట్టెలో ఉంచారు. దేవుడు వారితో ఉన్నాడనేందుకు యివన్నీ సాక్ష్యం (రుజువు).

అయితే మోషే, "మీరెందుకు నామీదికి ఇలా
లేచారు? మీరు యెహోవాను ఎందుకు పరీక్షిస్తు
న్నారు?" (యెహోవా మనతో లేడని మీరను కొంటు
న్నారా?) అని వారితో అన్నాడు.
3కాని ప్రజలు మాత్రం నీళ్ల కోసం చాల దాహంగా
ఉన్నారు. అందుచేత వాళ్లు మోషేకు ఫిర్యాదు చేస్తూనే
ఉన్నారు, "అసలు నీవు మమ్మల్ని ఈజిప్టు నుండి
ఎందుకు తీసుకొచ్చావు? నీళ్లు లేక మేము, మా పిల్లలు,
మా పశువులు చావాలని నీవు మమ్మల్ని యిక్కడికి
తీసుకొచ్చావా?" అన్నారు ప్రజలు
4కనుక మోషే, "ఈ ప్రజల్ని నేనేమి చేయాలి?
నన్ను చంపెయ్యటానికి వాళ్లు సిద్ధంగా ఉన్నారు"
అంటూ యెహోవాకు మొరబెట్టాడు.
5మోషేతో యెహోవా అన్నాడు, "ఇశ్రాయేలు
ప్రజల ముందుకు వెళ్లు. ప్రజల పెద్దలలో (నాయ
కులు) కొందర్ని నీ వెంట తీసుకొని వెళ్లు. నీ చేతి
కర్రను తీసుకొని వెళ్లు. నీవు నైలునదిని కొట్టిన కర్ర
యిది. 6హోరేబులో (సీనాయి పర్వతం) నీ యెదుట
ఒక బండమీద నేను నిలబడతాను. కర్రతో ఆ బండను
కొట్టు, దానిలో నుండి నీళ్లు వస్తాయి. అప్పుడు ప్రజలు
తాగవచ్చు."
మోషే ఈ పనులు చేసాడు, ఇశ్రాయేలు పెద్దలు
(నాయకులు) అది చూచారు. 7మెరీబా* అని మస్సా*
అని ఆ స్థలానికి మోషే పేరు పెట్టాడు. ఎందుచేతనంటే,
ప్రజలు తనమీదికి లేచి యెహోవాను పరీక్షించిన స్థలం
ఇది. యెహోవా వారితో ఉన్నాడో లేదో తెల్సు
కోవాలని ప్రజలు కోరారు. 8రెఫీదీము వద్ద అమాలేకీ
ప్రజలు వచ్చి ఇశ్రాయేలు ప్రజలతో యుద్ధం చేసారు.
9కనుక, "కొందరు మనుష్యుల్ని ఏర్పాటు చేసుకొని
రేపు వెళ్లి అమాలేకీయులతో యుద్ధం చేయి. నేనేమో
కొండ శిఖరం మీద నిన్ను గమనిస్తూంటాను. దేవుడు
నాకు ఇచ్చిన కర్రను నేను పట్టుకొని ఉంటాను," అని
యెహోషువాతో మోషే చెప్పాడు.
10మోషే మాటకు విధేయుడై యెహోషువ
మర్నాడు అమాలేకీ ప్రజలతో యుద్ధం చేసేందుకు
వెళ్లాడు. అదే సమయంలో మోషే, అహరోను, హూరు
అనువారు కొండ శిఖరం మీదికి వెళ్లారు. 11మోషే
తన చేతి కర్రను ఎప్పుడు పైకి ఎత్తితే అప్పుడు ఇశ్రా
యేలు ప్రజలు యుద్ధం గెలుస్తున్నారు. అయితే మోషే
తన చేయి కిందికి దించగానే ఇశ్రాయేలు ప్రజలు
యుద్ధంలో ఓడిపోవడం మొదలవుతుంది.
12కొంచెం సేపయ్యాక, మోషే చేతులు అలసి
పోయి (మోషే చేతుల్ని అలానే పైకి ఎత్తి ఉంచే
మార్గం చూడాలను కొన్నారు మోషేతో ఉన్న
మనుష్యులు) అందుచేత వాళ్లు ఒక పెద్ద బండ తెచ్చి
మోషే కూర్చొనేందుకు వేసారు. అప్పుడు అహరోను
మోషే చేతుల్ని పైకి ఎత్తి పట్టి ఉంచాడు. మోషేకు
ఒకపక్క అహరోను, మరోపక్క హూరు ఉన్నారు.
సూర్యుడు అస్తమించే వరకు వారు ఆయన చేతులను
అలాగే పట్టి ఉంచారు. 13కనుక యెహోషువ (అతని
మనుష్యులు) అమాలేకీయులను ఆ యుద్ధంలో
ఓడించారు.
14అప్పుడు యెహోవా, "ఈ యుద్ధాన్ని గురించి
వ్రాసి ఉంచు. ఇక్కడ ఏమి జరిగిందో అది ప్రజలు
జ్ఞాపకం ఉంచుకొనేటట్టు ఈ సంగతులన్నీ ఒక
గ్రంథంలో వ్రాసి ఉంచు. అమాలేకీయులను ఈ భూమి
మీద నుండి పూర్తిగ నాశనం చేసేస్తానని యెహోషు
వతో తప్పక చెప్పు" అని మోషేతో అన్నాడు.
15తర్వాత మోషే ఒక బలిపీఠం నిర్మించాడు,
"యెహోవా నా ధ్వజం". అని మోషే దానికి పేరు
పెట్టాడు. 16"యెహోవా సింహాసనం వైపు నేను నా
చేతులు ఎత్తాను. కనుక తను ఎప్పుడూ చేసినట్టే,
యెహోవా అమాలేకీయులతో పోరాడాడు," అన్నాడు
మోషే.

### మోషే మామ నుండి సలహా

18 మోషే మామ యిత్రో, మిద్యానులో యాజ
కుడు. మోషేకు, ఇశ్రాయేలు ప్రజలకు దేవుడు
సహాయం చేసిన ఎన్నో విధానాల గూర్చి యిత్రో
విన్నాడు. ఇశ్రాయేలు ప్రజలను ఈజిప్టు నుండి
యెహోవా బయటకు నడిపించిన విషయం యిత్రో
విన్నాడు. 2దేవుని పర్వతం దగ్గర మోషే ఉన్నప్పుడు
మోషే భార్య సిప్పోరాను వెంటబెట్టుకొని, యిత్రో
మోషే దగ్గరకు వెళ్లాడు. (సిప్పోరాను మోషే ఇంటికి
పంపించినందుచేత ఆమె మోషేవద్ద లేదు) 3మోషే
ఇద్దరు కుమారులను కూడ యిత్రో తన వెంట తీసు
కొని వచ్చాడు. "ఒక దేశంలో నేను పరాయివాణ్ణి అని
మోషే చెప్పాడు గనుక. మొదటి కుమారునికి గెర్షోము
అని పేరు పెట్టాడు." "నా తండ్రి దేవుడు నాకు
సహాయం చేసాడు. ఈజిప్టు రాజు బారినుండి నన్ను
రక్షించాడు "అని మోషే అన్నాడు గనుక. 4మరో
కుమారునికి ఎలీయెజరు అని పేరు పెట్టాడు. 5దేవుని
పర్వతం దగ్గర ఎడారిలో మోషే బస చేస్తునప్పుడు
యిత్రో మోషే దగ్గరకు వెళ్లాడు. మోషే భార్య, అతని
ఇద్దరు కుమారులు యిత్రోతోనే ఉన్నారు.
6(మోషేకు యిత్రో ఒక సందేశం పంపించాడు),
"నేను నీ మామ యిత్రోను. నీ భార్యను, నీ ఇద్దరు
కుమారులను నేను నీ దగ్గరకు తీసుకొని వస్తున్నాను,"
అన్నాడు యిత్రో. 7కనుక మోషే తన మామగార్ని
కలుసు కొనేందుకు బయటకు వెళ్లాడు. మోషే అతని
ఎదుట వంగి, అతణ్ణి ముద్దు పెట్టుకొన్నాడు. వాళ్లిద్దరూ

---

**మెరీబా** ఈ పేరుకు "తిరుగుబాటు" అని అర్థం.

**అని మస్సా** "తీర్పు, శోధన, పరీక్ష" అని ఈ పేరుకు అర్థం.

వారి వారి క్షేమాన్ని గూర్చి అడిగి తెలుసుకొన్నారు.
తర్వాత ఇంకా మాట్లాడుకొనేందుకు వాళ్లిద్దరూ మోషే
గుడారంలోకి వెళ్లారు. 8ఇశ్రాయేలు ప్రజలకోసం
యెహోవా చేసినదంతా మోషే యిత్రోకు చెప్పాడు.
ఫరోకు, ఈజిప్టు ప్రజలకు యెహోవా చేసిన
విషయాల్ని గూర్చి మోషే అతనితో చెప్పాడు. దారిలో
వారికి కలిగిన సమస్యలన్నిటిని గూర్చీ మోషే చెప్పాడు.
కష్టం వచ్చినప్పుడల్లా ఆ ప్రజల్ని యెహోవా ఏవిధంగా
రక్షించిందీ, మోషే తన మామగారితో చెప్పాడు.
9ఇశ్రాయేలీయుల కోసం యెహోవా చేసిన మంచి
పనులన్నింటిని గూర్చి విన్నప్పుడు యిత్రో చాలా
సంతోషించాడు. ఈజిప్టు వాళ్ల నుండి, ఇశ్రాయేలు
ప్రజలను యెహోవా విడుదల చేసినందుకు యిత్రో
సంతోషించాడు. 10యిత్రో అన్నాడు:

“యెహోవాను స్తుతించండి. ఈజిప్టు మనుష్యుల
నుండి ఆయన మిమ్మల్ని విడిపించాడు. ఫరో
బారినుండి యెహోవా మిమ్మల్ని రక్షించాడు.
11 ఈజిప్టు వాళ్లకంటె నీ ప్రజలు గొప్ప వాళ్లుగా
చేయబడిన విధానాన్ని బట్టి దేవుళ్లందరికంటె
యెహోవా గొప్ప వాడని ఇప్పుడు నాకు
తెలిసింది.”

12అప్పుడు యిత్రో బలి అర్పణలు, కానుకలు
యెహోవాకు సమర్పించాడు. తర్వాత అహరోను,
ఇశ్రాయేలు పెద్దలు (నాయకులు) మోషే మామగారైన
యిత్రోతో కలిసి భోజనంచేసేందుకు వచ్చారు.
దేవుడ్ని ఆరాధించేందుకు ఒక ప్రత్యేక పద్ధతిగా వారు
ఇలా చేసారు.
13మర్నాడు ప్రజలకు న్యాయం తీర్చాల్సిన ప్రత్యేక
పని మోషేకు ఉంది. (అక్కడ చాలామంది ప్రజలు
న్నారు) అందుచేత ప్రజలు రోజంతా మోషే ఎదుట
నిలబడాల్సి వచ్చింది.
14ప్రజలకు మోషే న్యాయం తీర్చడం యిత్రో
చూసాడు, “నీవు ఎందుకు ఇలా చేస్తున్నావు? ఎందు
చేత నీవు ఒక్కడివే న్యాయమూర్తిగా ఉన్నావు? ప్రజలు
రోజంతా నీ దగ్గరకు రావడం ఏమిటి?” అన్నాడు
అతను.
15అప్పుడు మోషే తన మామగారితో చెప్పాడు:
“ప్రజలు వారి సమస్యల విషయంలో దేవుని నిర్ణయం
ఏమిటో నేను అడిగి తెలుసుకోవాలని నన్ను అడిగేం
దుకు నా దగ్గరకు వస్తారు. 16ఎవరిది సరిగ్గా ఉందో
నేను నిర్ణయిస్తాను. ఈ విధంగా దేవుడి చట్టాన్ని,
ఆయన ప్రబోధాల్ని నేను ప్రజలకు ప్రబోధిస్తాను.”
17అయితే మోషే మామ అతనితో ఇలా అన్నాడు:
“నీవు చేస్తోన్న ఈ పని బాగుండలేదు. 18నీవు ఒక్కడివీ
చెయ్యాలంటే, ఇది చాలా పెద్ద పని. దీనివల్ల నీవు
అలసిపోతావు. ఇది ప్రజలు కూడ అలసిపొయ్యేటట్టు
చేస్తుంది. ఈ పని నీవు ఒక్కడివీ చేయలేవు. 19నీకు
నేను సలహా ఇస్తాను, ఏమి చేయాలో నీకు చెబుతాను,
దేవుడు నీకు తోడుగా ఉండాలని ప్రార్థిస్తాను. (నీవు
చేయాల్సింది ఇది) ప్రజల సమస్యలను గూర్చి నీవు
వింటూ ఉండాల్సిందే. ఈ విషయాలను గూర్చి నీవు
దేవునితో చెబుతూ ఉండాల్సిందే. 20దేవుడి కట్టడలను,
విధులను నీవు ప్రజలకు బోధించాలి. కట్టడలను
ఉల్లంఘించొద్దని ప్రజలను హెచ్చరించు. సరైన జీవిత
విధానం ఏమిటో ప్రజలకు చెప్పు. వాళ్లేమి చేయాలో
వాళ్లకు చెప్పు.” 21అయితే, “ప్రజల్లోనుంచి మంచి
మనుష్యుల్ని నీవు ఏర్పాటు చేసుకోవాలి. డబ్బుకోసం
నిర్ణయాలు మార్చుకోనటువంటి మనుష్యుల్ని
ఏర్పాటు చేసుకో.”
“వీళ్లను ప్రజల మీద పరిపాలకులుగా చేయి. 1000
మంది 100 మందికి, 50 మందికి, చివరకి 10 మందికి
పైన పరిపాలకులు ఉండాలి. 22ఈ పరిపాలకుల్ని
ప్రజలకు న్యాయం తీర్చనివ్వు. ముఖ్యమైన వ్యాజ్యము
ఏదైనా వుంటే అప్పుడు నిర్ణయంకోసం వాళ్లు నీ
దగ్గరకు రావచ్చు. అయితే మిగతా వ్యాజ్యాలను వాళ్లే
నిర్ణయించవచ్చు. ఈ విధంగా నీకు తేలిక అవుతుంది.
పైగా ఈ మనుష్యులు నీ పనిని నీతోబాటు పంచు
కొంటారు. 23నీవు ఈ నీ పనులు చేస్తే, యెహోవాకు
ఇష్టమైతే, నీ పని నీవు కొనసాగించటానికి నీకు చేతన
వుతుంది. అదే సమయంలో ప్రజలంతా వారి సమ
స్యలు పరిష్కారమై ఇంటికి వెళ్లగల్గుతారు.” 24యిత్రో
తనకు చెప్పినట్టు మోషే చేసాడు. 25ఇశ్రాయేలు ప్రజ
ల్లోనుంచి మంచి మనుష్యుల్ని మోషే ఏర్పాటు
చేసాడు. మోషే వాళ్లను ప్రజలమీద నాయకులుగా
చేసాడు. 1000 మంది ప్రజల మీద 100 మంది
ప్రజలమీద 50 మంది ప్రజలమీద 10 మంది ప్రజలమీద
పరిపాలకులు ఉన్నారు.
26ఈ పరిపాలకులే ప్రజలకు న్యాయమూర్తులు.
ఎప్పుడైనా సరే ప్రజలు తమ వాదాలను ఈ పరి
పాలకుల దగ్గరకు తీసుకురావచ్చు. ప్రాముఖ్యమైన
వ్యాఖ్యాలను మాత్రమే మోషే పరిష్కారం చేయాల్సి
ఉంటుంది.
27కొద్దికాలం తర్వాత మోషే తన మామ యిత్రోకు
వీడ్కోలు చెప్పాడు. యిత్రో తన స్వగృహానికి వెళ్లి
పోయాడు.

### ఇశ్రాయేలీయులతో దేవుని ఒడంబడిక

19 ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు విడిచి ప్రయాణ
మైన మూడో నెలలో వారు సీనాయి అరణ్యము
చేరుకొన్నారు. 2ప్రజలు రెఫీదీము విడిచి, సీనాయి
అరణ్యమునకు వచ్చారు. పర్వత సమీపంలోని అరణ్య

ములో ఇశ్రాయేలు ప్రజలు బసచేసారు. 3అప్పుడు
మోషే పర్వతం* మీద దేవుడి దగ్గరకు వెళ్లాడు. మోషే
ఆ పర్వతం మీద ఉన్నప్పుడు, అతనితో దేవుడు
ఇలా చెప్పాడు. “యాకోబు మహా వంశమైన ఇశ్రాయేలు
ప్రజలకు ఈ విషయాలు చెప్పు: 4‘నా శత్రువులకు
నేను చేసిన పనులన్నీ మీరు చూసారు. ఈజిప్టు వాళ్లకు
నేను ఏమి చేసానో మీరు చూసారు. పక్షిరాజువలె*
నేను మిమ్మల్ని ఈజిప్టు నుండి మోసుకొని వచ్చి,
నా దగ్గరకు, ఇక్కడికి తీసుకొచ్చాను. 5కనుక ఇప్పుడు
మీరు నా మాటలకు లోబడాలి అంటున్నాను. నా
ఒడంబడికను నిలబెట్టండి. మీరు ఇలా చేస్తే, మీరు నా
ప్రత్యేకమైన స్వంత ప్రజలుగా ఉంటారు. 6మీరు ఒక
ప్రత్యేక జాతిగా యాజకుల సామ్రాజ్యంగా మీరు
ఉంటారు.’ మోషే, నేను నీతో చెప్పిన ఈ విషయాలు
ఇశ్రాయేలు ప్రజలతో నీవు తప్పక చెప్పాలి.”

7కనుక మోషే పర్వతం దిగివచ్చి ప్రజల పెద్దలను
(పరిపాలకులను) సమావేశపర్చాడు. వాళ్లతో చెప్పమని
యెహోవా తనకు ఆజ్ఞాపించిన విషయాలన్నింటినీ
మోషే ఆ పెద్దలకు చెప్పాడు. 8ప్రజలంతా కలిసి
మాట్లాడారు. “యెహోవా చెప్పిన దానికంతటికీ
మేము విధేయులం” అని వారు చెప్పారు.

తర్వాత పర్వతం మీద దేవుని దగ్గరకు మోషే
వెళ్లాడు. ప్రజలు ఆయనకు విధేయులవుతారు అని
మోషే దేవునితో చెప్పాడు. 9“దట్టమైన మేఘంలో
నేను మీ దగ్గరకు వస్తాను. నేను నీతో మాట్లాడుతాను.
నేను నీతో మాట్లాడటం ప్రజలంతా వింటారు. నీవు
చెప్పే విషయాలు ప్రజలు ఎల్లప్పుడూ నమ్మేటట్టుగా
నేను ఈ పని చేస్తాను.” అని యెహోవా మోషేతో
చెప్పాడు.

అప్పుడు ప్రజలు చెప్పిన సంగతులన్నీ యెహో
వాతో చెప్పాడు మోషే.

10యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: “ప్రత్యేక
మైన ఒక సమావేశంగా ప్రజల్ని ఇవ్వాళ రేపు నీవు
సిద్ధం చేయాలి. ప్రజలు తమ బట్టలు ఉదుక్కొని
11మూడో రోజున నా కోసం సిద్ధంగా ఉండాలి. మూడో
రోజున సీనాయి పర్వతం మీదికి యెహోవా దిగివ
స్తాడు. ప్రజలంతా నన్ను చూస్తారు.

12-13అయితే ప్రజలు పర్వతానికి దూరంగా ఉండా
లని నీవు తప్పక చెప్పాలి. ఒక గీతగీసి ప్రజలు ఆ
గీత దాటి రాకుండా చూడు. ఏమనిషిగాని, జంతు
వుగాని పర్వతాన్ని తాకినట్లయితే, చంపేయాలి. బాణా
లతో, లేక రాళ్లతో కొట్టి చంపేయాలి. కాని అలాంటి
వాణ్ణి ఎవరూ ముట్టుకోకూడదు. బూర ఊదేంత వరకు
ప్రజలు వేచి ఉండాలి. అప్పుడే వాళ్లు పర్వతం మీదికి
వెళ్లేందుకు అనుమతి ఇవ్వబడుతుంది,” అని మోషేతో
యెహోవా చెప్పాడు.

14కనుక మోషే పర్వతం దిగి కిందికి వెళ్లాడు.
ఆయన ప్రజల దగ్గరికి వెళ్లి, ప్రత్యేక సమావేశం కోసం
వాళ్లను సిద్ధం చేసాడు. ప్రజలు వాళ్ల బట్టలు ఉదు
క్కొన్నారు. 15అప్పుడు మోషే ప్రజలతో, “ఇంక
మూడు రోజుల్లో యెహోవాతో సమావేశం అయ్యేం
దుకు సిద్ధంగా ఉండండి. అంతవరకు పురుషులు
స్త్రీలను ముట్టుకోగూడదు” అని చెప్పాడు.

16మూడవ రోజు ఉదయాన పర్వతం మీద ఉరు
ములు, మెరుపులు వచ్చాయి. దట్టమైన ఒక మేఘం
ఆ పర్వతం మీదికి వచ్చింది. ఒక బూర శబ్దం చాల
పెద్దగా వినబడింది. ఆ బసలో ఉన్న ప్రజలంతా భయ
పడిపోయారు. 17అప్పుడు పర్వతం దగ్గర దేవుణ్ణి
కలుసుకొనేందుకు ప్రజలను వారి బసలోనుంచి మోషే
బయటకు నడిపించాడు. 18సీనాయి పర్వతం పొగతో
నిండిపోయింది. కొలిమిలోనుంచి లేచినట్టు పొగ ఆ
పర్వతం మీద నుండి పైకి లేచింది. యెహోవా అగ్నిలా
ఆ పర్వతం మీదికి వచ్చినందువల్ల యిలా జరిగింది.
పైగా పర్వతం అంతా వణకడం మొదలయ్యింది.
19బూర శబ్దం మరింత గట్టిగా మోగింది. దేవునితో
మోషే మాట్లాడినప్పుడల్లా ఉరుములాంటి స్వరంతో
యెహోవా జవాబిచ్చాడు.

20సీనాయి కొండ మీదికి యెహోవా దిగి వచ్చాడు.
పరలోకంనుంచి ఆ కొండ శిఖరం మీదికి యెహోవా
దిగి వచ్చాడు. అప్పుడు మోషేను తనతో కూడ
పర్వత శిఖరం మీదికి రమ్మని యెహోవా పిలిచాడు.
కనుక మోషే పర్వతం మీదికి వెళ్లాడు. 21అప్పుడు
యెహోవా మోషేతో, “నీవు కిందికి వెళ్లి, ప్రజలు
నాకు సమీపంగా రాకూడదని, నావైపు చూడకూడదని
వారితో చెప్పు. వారు కనుక అలా చేస్తే, వారిలో
చాల మంది చస్తారు.

22నాకు సమీపంగా వచ్చే యాజకులు ఈ ప్రత్యేక
సమావేశం కోసం వారిని సిద్ధం చేసుకోవాలని వారితో
చెప్పు. వారు ఇలా చేయకపోతే, నేను వాళ్లను శిక్షిస్తాను”
అని చెప్పాడు. 23కానీ మోషే యెహోవాతో “ప్రజలు
పర్వతం మీదికి రాలేరు. ఒక గీతగీయమని, ప్రజల్ని
ఆ గీత దాటి పవిత్ర స్థలం దగ్గరకు రానివ్వవద్దని నీవే
మాకు చెప్పావు” అని అన్నాడు.

24యెహోవా మోషేతో, “కింద ప్రజల దగ్గరకు
వెళ్లి, అహరోనును తీసుకొనిరా. అతణ్ణి నీతో పాటు
తీసుకొనిరా, కాని యాజకుల్ని, ప్రజల్ని, రానివ్వవద్దు.
వాళ్లు నాకు సమీపంగా వస్తే, నేను వాళ్లను శిక్షిస్తాను”
అన్నాడు, 25మోషే ప్రజల దగ్గరకు కిందికి వెళ్లి, ఈ
సంగతులు వారితో చెప్పాడు.

---

**పర్వతం** అది హోరేబు కొండ. దాన్ని సీనాయి పర్వతం అని కూడ అంటారు.

**పక్షిరాజు** ఈ పెద్ద పక్షులు తరచు తమ పిల్లలను ప్రమాద రహిత స్థలాలకు తీసుకుపోతూంటాయి.

### పది ఆజ్ఞలు

20 అప్పుడు మోషేతో దేవుడు ఈ మాటలు
చెప్పాడు: 2“నేను మీ దేవుణ్ణి. యెహోవాను.
ఈజిప్టు దేశం నుండి నేనే మిమ్మల్ని బయటికి రప్పిం
చాను. బానిసత్వం నుండి నేనే మిమ్మల్ని విడుదల
చేసాను. (కనుక ఈ ఆజ్ఞలకు మీరు విధేయులు కావాలి)
3“నేను గాక వేరే దేవుళ్లు ఎవ్వరినీ మీరు ఆరాధించ
కూడదు.
4“విగ్రహాలు ఏవీ మీరు చేయకూడదు పైన ఆకాశా
నికి సంబంధించింది గాని, క్రింద భూమికి సంబంధించిం
దిగాని, భూమి క్రింద నీళ్లకు సంబంధించిందిగాని, దేని
విగ్రహాన్ని లేక పటాన్ని చేయవద్దు. 5ఎలాంటి విగ్ర
హాల్నీ పూజించవద్దు, సేవించవద్దు. ఎందుకంటే,
యెహోవాను నేనే మీ దేవుణ్ణి. నేను నా ప్రజలు వేరే
దేవుళ్లను పూజించటాన్ని ద్వేషిస్తాను.* ఒక వ్యక్తి నాకు
వ్యతిరేకంగా పాపం చేస్తే ఆ వ్యక్తి నన్ను ద్వేషిస్తున్నాడు.
ఆ వ్యక్తి సంతానాన్ని మూడు, నాలుగు తరాల వరకు
నేను శిక్షిస్తాను. 6అయితే నా ఆజ్ఞలను ప్రేమించి, విధే
యులయ్యే ప్రజలకు వేల తరాలవరకు నేను ఎంతో
దయ చూపిస్తాను.
7“మీ దేవుడైన యెహోవా పేరును మీరు తప్పుగా
ప్రయోగించకూడదు. ఒక వ్యక్తి గనుక యెహోవా
పేరును తప్పుగా ప్రయోగిస్తే, ఆ వ్యక్తి దోషి.
యెహోవా అతణ్ణి నిర్దోషిగా చేయడు.”
8“సబ్బాతును ఒక ప్రత్యేక రోజుగా ఉంచుకోవడం
మరచిపోవద్దు. 9వారానికి ఆరు రోజులు మీరు మీ పని
చేసుకోవచ్చు. 10అయితే, యెహోవా గౌరవార్థం
ఏడవరోజు విశ్రాంతి రోజు కనుక ఆ రోజు ఏ వ్యక్తీ
పని చేయకూడదు. అంటే మీరు, మీ కొడుకులు,
కూతుళ్లు, మీ ఆడ, మగ బానిసలు, చివరికి మీ జంతు
వులు, మీ పట్టణాల్లో నివసించే విదేశీయులు కూడాను.
11 ఎందుకంటే, యెహోవా ఆరు రోజులు పనిచేసి
ఆకాశాన్ని, భూమిని, సముద్రాన్ని, వాటిలో ఉండే
సమస్తాన్ని చేసాడు. ఏడో రోజున దేవుడు విశ్రాంతి
తీసుకొన్నాడు. ఈ విధంగా ఏడవరోజును యెహోవా
ఆశీర్వదించాడు. దాన్ని చాలా ప్రత్యేకమైన రోజుగా
యెహోవా చేసాడు.”
12“నీ తండ్రిని, నీ తల్లిని సన్మానించు. నీ దేవుడైన
యెహోవా నీకిచ్చే దేశంలో నీకు పూర్తి ఆయుష్షు
ఉండేటట్టుగా నీవు ఇలా చేయాలి.”
13“నీవు ఎవ్వరినీ హత్య చేయకూడదు.”
14“వ్యభిచారపాపం నీవు చేయకూడదు.”
15“నీవు దొంగతనం చేయకూడదు.”
16“నీ పొరుగువాళ్ల విషయంలో నీవు అబద్ధాలు
చెప్పకూడదు.”
17“ఇతరుల వస్తువుల్ని నీవు తీసుకోవాలని ఆశ
పడకూడదు. నీ పొరుగు వాడి ఇంటిని, లేక వాని
భార్యను, లేక వాని ఆడ, మగ సేవకులను, లేక వాని
ఆవులను, లేక అతని గాడిదలను తీసుకోవాలని నీవు
ఆశపడకూడదు. నీ పొరుగువానికి చెందినది ఏదీ తీసు
కోవాలని నీవు ఆశపడకూడదు.”

### ప్రజలకు దేవుడంటే భయం

18ఇంతసేపూ లోయలో ప్రజలు కొండమీది
ఉరుము శబ్దం వింటూనే ఉన్నారు. మెరుపులు
చూస్తూనే ఉన్నారు. కొండమీద నుండి పొగ లేవడం
వారు చూసారు. ప్రజలు భయపడి వణికిపోయారు.
వాళ్లు కొండకు దూరంగా నిలబడి గమనించారు.
19అప్పుడు ప్రజలు మోషేతో “నీవు మాతో మాట్లాడా
లంటే మేము వింటాం. కాని దేవుణ్ణి మాత్రం మాతో
మాట్లాడనివ్వకు. అలా జరిగితే మేము చస్తాము,” అని
చెప్పారు.
20అప్పుడు మోషే, “తాను మిమ్మల్ని ప్రేమిస్తున్నా
డని రుజువు చేయడానికే, యెహోవా వచ్చాడు. మీరు
పాపం చేయకుండా ఉండేలా మీరు ఆయనను గౌరవిం
చాలని ఆయన కోరుతున్నాడు” అని ప్రజలకు
చెప్పాడు.
21దేవుడువున్న దట్టమైన మేఘం దగ్గరకు మోషే
వెళుతోంటే, ప్రజలు ఆ కొండకు దూరంగా నిల
బడ్డారు. 22అప్పుడు ఈ సంగతులు ఇశ్రాయేలు ప్రజ
లతో చెప్పమని యెహోవా మోషేతో చెప్పాడు.
“ఆకాశం నుండి నేను మీతో మాట్లాడటం మీరు
చూసారు. 23కనుక మీరు బంగారంతోగాని, వెండితోగాని
నాకు పోటీగా విగ్రహాలు చేసుకోకూడదు. ఈ అబద్ధపు
దేవుళ్లను మీరు చేసుకోకూడదు.
24“నా కోసం ఒక ప్రత్యేక బలిపీఠం చేయండి.
ఈ బలిపీఠం చేయడానికి మట్టి ఉపయోగించండి.
ఈ బలిపీఠం మీద దహనబలులు, సమాధాన బలులు,
బలిగా నాకు అర్పితం చేయండి. ఇలా చేయటానికి
మీ గొర్రెల్ని, పశువుల్ని వాడుకోండి. నన్ను జ్ఞాపకం
చేసుకోమని నేను మీకు చెప్పే ప్రతి చోటా మీరు
యిలా చేయాలి. అప్పుడు నేను వచ్చి మిమ్మల్ని
ఆశీర్వదిస్తాను. 25మీరు బండలతో* బలిపీఠం కడితే,
చెక్కబడిన బండలతో దానిని కట్టవద్దు. ఎందుకంటే,
పనిముట్లతో మీరు పని చేసినప్పుడు మీరు దానిని
అపవిత్రం చేస్తారు. బండల మీద మీరు ఏవైనా పని
ముట్లు ప్రయోగిస్తే, ఆ బలిపీఠాన్ని నేను అంగీక
రించను. 26బలిపీఠం మీదికి వెళ్లేందుకు మీరు మెట్లు

---

**ద్వేషిస్తాను** నేనే ఎల్కానా, రోషంగల దేవుణ్ణి.

**బండలతో** బహుశ ఇనుప పనిముట్టు కావచ్చు. యుద్ధంలో యినుప పనిముట్లు వాడేవారు గనుక బలిపీఠం కట్టుట్టకు అవి వాడకూడదు.

చేయకూడదు. అలా మెట్లు ఉంటే, ప్రజలు బలిపీఠం
వైపుకి చూసినప్పుడు మీ దిగంబరత్వం అంతా వారికి
కనబడుతుంది.”

### వేరే ఆజ్ఞలు

21 (అప్పుడు మోషేతో యెహోవా అన్నాడు),
“ఇవి నీవు ప్రజలకు ఇవ్వాల్సిన మిగతా ఆజ్ఞలు:
2“హెబ్రూ బానిసను కనుక నీవు కొంటే, ఆ బానిస
ఆరు సంవత్సరాలు మాత్రమే నీ సేవ చేయాలి. ఆరు
సంవత్సరాల తర్వాత వాడు స్వతంత్రుడవుతాడు. వాడు
చెల్లించాల్సింది ఏమీ ఉండదు. 3ఆ వ్యక్తి నీకు బానిస
అయినప్పుడు పెళ్లిగాకుండా ఉంటే అతడు
స్వతంత్రుడయినప్పుడు భార్యలేని వానిగానే నీ దగ్గ
ర్నుండి వెళ్తాడు. అయితే అతడు నీకు బానిస అయిన
ప్పుడు పెళ్లయిన వాడైతే, అతడు విడుదల చేయబడి
నప్పుడు తన భార్యను తనతో ఉంచుకొంటాడు.
4బానిస బ్రహ్మచారి అయితే యజమాని అతనికి ఒక
భార్యను ఇవ్వవచ్చు. ఆ భార్యకు కొడుకులు, కూతుళ్లు
పుడితే, ఆ స్త్రీ, ఆమె పిల్లలు యజమానికి చెందుతారు.
ఆ బానిస సేవాకాలం తీరిపోతే, అప్పుడు అతడు విడు
దల చేయబడతాడు.’’

5“అయితే ఒక వేళ ఆ యజమాని దగ్గరే ఉండి
పోవాలని బానిస తీర్మానించుకొంటే, ‘నా యజమాని
అంటే నాకు ప్రేమ. నా భార్య పిల్లలమీద నాకు ప్రేమ
కనుక నాకు స్వతంత్రం అక్కర్లేదు, నేను ఇలాగే ఉండి
పోతాను’ అని అతడు తప్పక చెప్పాలి. 6ఇలా కనుక
జరిగితే యజమాని ఆ బానిసను దేవుని దగ్గరకు తీసుక
రావాలి. తలుపు దగ్గరకు గాని, ద్వార బంధం దగ్గరకు
గాని యజమాని ఆ బానిసను తీసుకు రావాలి. యజ
మాని ఏదైనా పదునుగల పరికరాన్ని ప్రయోగించి, ఆ
బానిస చెవికి రంధ్రం చేయాలి. అప్పుడు బానిస
జీవితాంతం ఆ యజమానినే సేవిస్తాడు.”

7“ఒకడు తన కూతుర్ని బానిసగా అమ్మి వేయాలని
నిర్ణయించవచ్చు. ఇలా కనుక జరిగితే, ఆమెను విడుదల
చేసేందుకు సంబంధించిన నియమాలు మగ బాని
సలను విడుదల చేసే నియమాల్లాంటివి కావు. 8ఆ
స్త్రీ విషయం యజమానికి ఇష్టం లేకపోతే అతడు ఆ
స్త్రీని తిరిగి తన తండ్రికి అమ్మివేయవచ్చును. ఒకవేళ
ఆ స్త్రీని పెళ్లి చేసుకొంటానని ఆయజమాని వాగ్దానం
చేసి ఉంటే, ఇతరులకు ఆ స్త్రీని అమ్మివేసే అధికారం
అతను కోల్పోతాడు. 9ఆ యజమాని తన కుమారుణ్ణి
పెళ్లి చేసుకోవచ్చని వాగ్దానం చేసి ఉంటే, అప్పుడు
ఆమె బానిసగా ఎంచబడదు. ఒక కూతురిగా ఆమె
చూడబడుతుంది.”

10“ఒకవేళ యజమాని మరో స్త్రీని పెండ్లాడితే,
మొదటి స్త్రీకి భోజనం, బట్ట, అతడు తక్కువ చేయ
కూడదు. ఆమెకు ఏవేవి అనుభవించటానికి పెళ్లిద్వారా
హక్కు లభించిందో వాటన్నిటినీ అతడు ఆమెకు
ఇస్తూనే ఉండాలి. 11ఈ మూడింటినీ మగవాడు ఆమె
కోసం చేయాలి. అతడు చేయకపోతే, ఆమెకు ఏ
ఖర్చూ లేకుండానే ఆమె విడుదల చేయబడుతుంది.
ఆమె అతడకి డబ్బు ఏమీ రుణపడి ఉండదు.”

12“ఒకడు ఎవరినైనా కొట్టి చంపితే, వాడిని కూడ
చంపెయ్యాలి. 13అయితే ఏదైనా ప్రమాదం జరిగి, ఏ
పథకం వెయ్యకుండానే ఒకడు మరొకడ్ని చంపితే,
అది దేవుడు జరుగనిచ్చినదే అవుతుంది. భద్రతకోసం
ప్రజలు పారిపోయేందుకు ప్రత్యేక స్థలాలు కొన్నింటిని
నేను ఏర్పాటు చేస్తాను. కనుక ఆ వ్యక్తి వీటిలో ఒక
చోటికి పారిపోవచ్చు. 14ఒకడు మరొకని మీద
కోపంతో, లేకద్వేషంతోచంపడానికి పథకం వేస్తే,
అలాంటి హంతకుడు శిక్షించబడాలి. వానిని నా బలి
పీఠం నుండి దూరంగా తీసుక పోయి చంపేయాలి.”

15“ఎవడైనా తన తండ్రిని గాని, తల్లినిగాని కొడితే
వానిని చంపెయ్యాలి.”

16“బానిసగా అమ్మేందుకు, లేక తనకు బానిసగా
ఉండేందుకు ఎవరైనా మరొకడ్ని ఎత్తుకుపోతే, ఆ
వ్యక్తిని చంపెయ్యాలి.”

17“ఎవరైనా తన తండ్రిని లేక తల్లిని శపిస్తే ఆ
వ్యక్తిని చంపెయ్యాలి.”

18“ఇద్దరు వ్యక్తులు జగడమాడుకొని, వారిలో ఒకడు
రాతితోగాని, పిడికిలితోగాని మరొకనిని కొడితే, (అలాం
టివాడిని ఎలా శిక్షిస్తావు?) దెబ్బతగిలిన వాడు చావక
పోతే, అతడ్ని దెబ్బకొట్టి వాణ్ణి చంపకూడదు.
19అయితే దెబ్బ తిన్నవాడు కొన్నాళ్లపాటు పడక మీద
ఉండాల్సివస్తే, అతణ్ణి కొట్టినవాడే అతణ్ణి పోషించాలి.
అతణ్ణి కొట్టినవాడే అతనికి కలిగిన సమయం నష్టానికి
పరిహారం చెల్లించాలి. అతడు పూర్తిగా బాగయ్యేవరకు
ఆ వ్యక్తి అతణ్ణి పోషించాలి.

20“కొన్నిసార్లు ప్రజలు తమ ఆడ లేక మగ బానిస
లను కొడతారు. అలా కొట్టినతర్వాత బానిస చస్తే,
హంతకుడు శిక్షించబడాలి. 21అయితే బానిస చావ
కుండా, కొన్ని రోజుల తర్వాత బాగైతే, అప్పుడు ఆ
వ్యక్తి శిక్షించబడడు. ఎందుకంటే, బానిసకోసం యజ
మాని డబ్బు చెల్లించాడు గనుక బానిస అతనికే
చెందుతాడు.”

22“ఇద్దరు మగవాళ్లు పోట్లాడుకొంటునప్పుడు ఒక
గర్భవతికి దెబ్బ తగలవచ్చు. ఒకవేళ ఆమె ప్రసవించినా
ఆమెకు తీవ్రంగా దెబ్బ తగలకపోతే, ఆమెకు దెబ్బ
తగిలించినవాడు డబ్బు చెల్లించాలి. అతడు ఎంత డబ్బు
చెల్లించాలి అనే విషయం ఆమె భర్త నిర్ణయిస్తాడు. ఆ
నష్టం మొత్తం ఎంత అనేది నిర్ణయించడంలో న్యాయా
ధిపతులు అతనికి సహాయం చేస్తారు. 23అయితే, ఆ
స్త్రీకి తీవ్రంగా దెబ్బతగిలితే’ ఆమెను కొట్టినవాడు
శిక్షించబడాలి. ఒక వ్యక్తి చంపబడితే, ఆ వ్యక్తిని చంపిన

వాణ్ణి చంపెయ్యాలి. ఒకడి ప్రాణానికి బదులుగా
మరొకడి ప్రాణం తియ్యాలి. 24కంటికి కన్ను, పంటికి
పన్ను, చేతికి చేయి, పాదానికి పాదం, 25వాతకు
వాత, గాయానికి గాయం, కోతకు కోత ఉండాలి.”

26“ఒకడు ఒక బానిస కంటిమీద గుద్దితే, ఆ బానిసకు
ఆ కన్ను గుడ్డిదైతే అప్పుడు ఆ బానిస స్వతంత్రుడిగా
వెళ్లిపోవచ్చు. అతని కన్ను అతని విడుదలకు వెల
అవుతుంది. ఆడ బానిసకైనా మగ బానిసకైనా ఇంతే.
27ఒకవేళ యజమాని తన బానిస మూతి మీద కొడితే,
ఆ బానిసకు ఒక పన్ను ఊడితే ఆ బానిస స్వతంత్రుడుగా
వెళ్లిపోవచ్చు. ఆ బానిస విడుదలకు ఆ బానిస పన్ను
వెల అవుతుంది. ఆడ బానిసకైనా మగ బానిసకైనా
ఇంతే,

28“ఒక వేళ ఒకడి ఎద్దు ఏ పురుషుణ్ణి గాని, స్త్రీనిగాని
చంపితే, అప్పుడు ఆ ఎద్దును రాళ్లతో కొట్టి చంపాలి.
ఎద్దును మీరు తినకూడదు. కాని ఎద్దు యజమాని
మాత్రం నేరస్తుడు కాడు. 29అయితే అంతకు ముందు
ఆ ఎద్దు ఎవర్నయినా పొడిచి ఉంటే, దాని యజమానికి
హెచ్చరిక ఇవ్వబడి ఉంటే, అప్పుడు ఆ యజమాని
నేరస్తుడే, ఎందుకంటే, ఆ ఎద్దును అతడు కట్టి వెయ్య
లేదు. లేక దాని స్థానంలో దాన్ని బంధించలేదు. కనుక
ఎద్దును విచ్చలవిడిగా తిరుగనిస్తే, అది ఎవర్నయినా
చంపేస్తే, అప్పుడు ఆ యజమాని నేరస్తుడే, మీరు
ఎద్దును రాళ్లతో కొట్టి చంపాలి. తర్వాత యజమానిని
కూడ చంపెయ్యాలి. 30అయితే చనిపోయిన వాని
కుటుంబం డబ్బు తీసుకోవచ్చు. ఒకవేళ వారు అలా
డబ్బు తీసుకొంటే, ఎద్దు స్వంతదారుడ్ని చంప
కూడదు. కాని న్యాయాధిపతి నిర్ణయించిన డబ్బు
అతడు చెల్లించాలి.

31“ఒకరి కొడుకును లేక కూతుర్ని ఎద్దు చంపేస్తే
యిదే చట్టాన్ని పాటించాలి. 32ఒక ఎద్దు ఒక బానిసను
గనుక చంపేస్తే, మరొక కొత్త బానిస కోసం యజమా
నికి ముప్పయి వెండి నాణాలను ఎద్దు స్వంతదారుడు
చెల్లించాలి. ఎద్దును మాత్రం రాళ్లతో కొట్టి చంపాలి.
మగ బానిసలకు, ఆడ బానిసలకు ఈ చట్టం సమానంగా
వర్తిస్తుంది.”

33“ఒకడు గొయ్యిగాని, బావిగాని తవ్వి మూత పెట్టక
పోవచ్చును. మరొకడి జంతువు వచ్చి ఆ గుంటలో
పడితే ఆ గుంట స్వంతదారుడు నేరస్తుడు. 34ఆ గుంట
స్వంతదారుడు ఆ జంతువు కోసం డబ్బు చెల్లించాలి.
అయితే ఆ జంతువు కోసం అతడు డబ్బు చెల్లించాక
అతడు ఆ జంతువు శవాన్ని ఉంచు కొనేందుకు అను
మతి ఇవ్వాలి.

35“ఒకవేళ ఒకరి ఎద్దు మరొకరి ఎద్దును చంపేస్తే
అప్పుడు బతికి ఉన్న ఎద్దును అమ్మివేయాలి. ఆ
ఎద్దును అమ్మిన డబ్బు వాళ్లిద్దరూ సగం సగం తీసు
కోవాలి, చంపబడ్డ ఎద్దులో కూడ వాళ్లిద్దరికి సగం
సగం వస్తుంది. 36అయితే ఒకని ఎద్దు అంతకు ముందు
ఇతరుల జంతువులను పొడిచి ఉంటే, అతని ఎద్దు
విషయం ఆ యజమాని బాధ్యుడు. ఒకవేళ అతని
ఎద్దు మరొక ఎద్దును చంపేస్తే, ఆ ఎద్దును స్వేచ్ఛగా
తిరుగ నిచ్చినందుకు అతడు నేరస్థుడు, అతడు ఎద్దుకు
బదులు ఎద్దును ఇవ్వాలి. చంపబడిన ఎద్దుకు బదులుగా
అతడు తన ఎద్దును ఇవ్వాలి.”

22 “ఒక ఎద్దును లేక గొర్రెను దొంగతనం చేసిన
వాడిని నీవు ఎలా శిక్షిస్తావు? వాడు ఆ జంతు
వును చంపేసినా లేక అమ్మేసినా అతడు దాన్ని తిరిగి
ఇవ్వలేడు. కనుక వాడు దొంగిలించిన ఒక్క ఎద్దుకు
బదులు అయిదు ఎడ్ల నివ్వాలి. లేక వాడు దొంగతనం
చేసిన ఒక్క గొర్రెకు బదులు నాలుగు గొర్రెలు
ఇవ్వాలి. దొంగతనానికి అతడు శిక్ష చెల్లించాలి. 2-3వాడికి
స్వంతది అంటూ ఏమీ లేకపోతే, వాడ్ని బానిసగా
అమ్మాలి. అయితే ఆ జంతువు ఇంకా వానిదగ్గరే ఉంటే,
దాన్ని, నీవు చూస్తే అప్పుడు వాడు ఆ దొంగిలించిన
ప్రతి జంతువుకు బదులుగా రెండు జంతువుల్ని యజ
మానికి ఇవ్వాలి. ఆ జంతువు ఎద్దు, గాడిద, గొర్రె,
ఏదైనా ఫర్వాలేదు.”

4“దొంగ రాత్రివేళ ఒక ఇంటికి కన్నము వేయ
టానికి ప్రయత్నిస్తూండగా చంపబడితే, వాణ్ణి చంపిన
నేరం ఎవ్వరి మీదా ఉండదు. అయితే ఇది పగలు
జరిగితే వాణ్ణి చంపిన వాడు నేరస్థుడే (దోషి).” 5“ఒకడు
తన పొలంలో లేక ద్రాక్షాతోటలో మంట రాజబెడితే,
ఆ మంట పాకిపోయి, పక్కవాడి పొలాన్ని లేక ద్రాక్షా
తోటను కాల్చివేస్తే అతడు తన శ్రేష్ఠమైన పంటను
తన పొరుగువాడికి నష్టపరిహారంగా ఇవ్వాలి.”

6“ఒకడు తన పొలంలో ముళ్ల పొదలను తగుల
బెట్టడానికి మంట పెట్టవచ్చును. కానీ ఆ మంట
పెద్దదై పొరుగువాడి పొలాన్ని లేక పొరుగువాడి
పొలంలో పండుతున్న ధాన్యాన్ని కాల్చివేస్తే, అప్పుడు
ఆ మంటను రాజబెట్టిన వ్యక్తి తాను కాల్చివేసిన వాటికి
బదులుగా డబ్బు చెల్లించాలి.”

7“ఒకడు తన డబ్బును లేక ఇంకేదైనా వస్తువుల్ని
పొరుగువాని ఇంట్లో దాచి పెట్టమని తన పొరుగువాణ్ణి
అడగవచ్చు. ఆ పొరుగువాడి ఇంట్లోనుంచి ఆ డబ్బు
లేక వస్తువులు దొంగిలించబడితే, నీవేం చేయాలి?
దొంగను పట్టుకొనేందుకు నీవు ప్రయత్నం చేయాలి.
నీవు ఆ దొంగను పట్టుకొంటే, అప్పుడు వాడు ఆ
వస్తువుల విలువకు రెండంతలు చెల్లించాలి. 8కానీ ఆ
దొంగను నీవు పట్టుకోలేక పోతే, ఆ ఇంటి యజమాని
నేరస్థుడైతే, అప్పుడు దేవుడే న్యాయం తీరుస్తాడు. ఆ
ఇంటి యజమాని దేవుని ఎదుటకి వెళ్లాలి. అతడే
దొంగిలించి ఉంటే దేవుడు న్యాయం తీరుస్తాడు.”

9“పోయిన ఒక ఎద్దు, లేక గాడిద, గొర్రె, లేక
వస్త్రం లేక ఇంక దేన్నిగూర్చిగానీ ఇద్దరు వ్యక్తులకు

ఒడంబడిక కుదరకపోతే, అప్పుడు నీవేం చేయాలి?
‘ఇది నాది’ అని ఒకడంటే, లేదు, ‘ఇది నాది,’ అని
ఇంకొకడు అంటాడు. ఆ ఇద్దరు మనుష్యులు దేవుని
ఎదుటికి వెళ్లాలి. నేరుస్థుడు ఎవరో దేవుడే నిర్ణయి
స్తాడు. తప్పుచేసిన వాడు ఆ వస్తువు విలువకు రెండం
తలు అవతలి వానికి చెల్లించాలి.”
10“తన జంతువు విషయమై శ్రద్ధ పుచ్చుకోవడం
ద్వారా తనకు సహాయం చేయమని ఒకడు తన పొరుగు
వాణ్ణి అడగవచ్చు. ఈ జంతువు గాడిద కావచ్చు,
ఎద్దు కావచ్చు, గొర్రె కావచ్చు. అయితే ఆ జంతువు
చనిపోయినా, ఆ జంతువుకు దెబ్బ తగిలినా లేక
ఎవరూ చూడకుండా ఆ జంతువును ఇంకెవరైనా
తీసుకొనిపోయినా నీవేం చేయాలి? 11ఆ జంతువును
తాను దొంగిలించలేదని ఆ పొరుగువాడు వివరించి
చెప్పాలి. ఇదే కనుక సత్యం అయితే, తాను దొంగతనం
చేయలేదని ఆ పొరుగువాడు యెహోవాకు ప్రమాణం
చేయాలి. జంతువు యజమాని ఈ ప్రమాణాన్ని అంగీ
కరించాలి. ఆ పొరుగువాడు జంతువుకోసం దాని యజ
మానికి ఏమీ చెల్లించనక్కర్లేదు. 12అయితే, ఆ పొరుగు
వాడు జంతువును దొంగిలిస్తే, అప్పుడు ఆ జంతువు
కోసం దాని యజమానికి అతడు విలువ చెల్లించాలి.
13ఒకవేళ అడవి మృగాలు ఆ జంతువును చంపేస్తే,
ఆ పొరుగువాడు దాని శవాన్ని రుజువుగా తీసుకరావాలి.
చంపబడ్డ జంతువు కోసం దాని యజమానికి ఆ పొరుగు
వాడు ఏమీ చెల్లించనక్కరలేదు. 14ఒకడు తన పొరుగు
వాని దగ్గర దేన్నయినా బదులు తీసుకొంటే దానికి
అతడే బాధ్యుడు. ఒకవేళ ఒక జంతువుకు దెబ్బ తగిలినా
లేక ఆ జంతువు చచ్చినా, అప్పుడు ఆ పొరుగువాడు
దాని యజమానికి వెల చెల్లించాలి. యజమాని
స్వయంగా అక్కడ లేడు గనుక ఆ పొరుగువాడే దానికి
బాధ్యుడు. 15అయితే దాని యజమాని ఆ జంతువుతో
కూడా ఉంటే, పొరుగువాడు ఏమీ చెల్లించనక్కరలేదు.
లేక, ఆ పొరుగువాడు ఆ జంతువుతో పని చేయించు
కొనేందుకుగాను డబ్బు చెల్లిస్తోంటే, ఆ జంతువుకు
దెబ్బ తగిలినా, అది చచ్చినా, అతడు ఏమీ చెల్లించన
క్కర్లేదు. ఆ జంతువును వాడుకొనేందుకు అతడు
చెల్లించిన డబ్బే సరిపోతుంది.”
16“పెళ్లికాని పవిత్రమైన ఒక పడుచుదానితో ఒకవేళ
ఒకడికి లైంగిక సంబంధం ఉంటే, అతడు ఆమెను
పెళ్లి చేసుకోవాలి. ఆమె తండ్రికి అతడు నిండుగా
కట్నం యివ్వాలి. 17అతణ్ణి పెళ్లి చేసుకొనేందుకు
ఆమె తండ్రి అంగీకరించకపోయినా, అతడు ఆ డబ్బు
చెల్లించాల్సిందే. ఆమె కోసం పూర్తి మొత్తాన్ని అతడు
చెల్లించాలి.”
18“నీవు ఏ స్త్రీనీ కూడా మాయపనులు చెయ్య
నివ్వకూడదు. ఒకవేళ ఆమె చేస్తే, అలాంటి దాన్ని
నీవు బతకనివ్వకూడదు.”
19“నీవు ఎవ్వర్నీ జంతు సంయోగం చెయ్య నియ్య
కూడదు. ఇలా కనుక జరిగితే, ఆ వ్యక్తిని చంపేయాలి.
20“ఎవడైనా సరే దేవుడు కాని వాడికి బలి అర్పిస్తే,
అలాంటివాడ్ని నాశనం చేయాలి. యెహోవా దేవుడు
ఒక్కడికే నీవు బలులు అర్పించాలి.” 21“జ్ఞాపకం
ఉంచుకో ఇదివరకు మీరు ఈజిప్టు దేశంలో పరాయి
వాళ్లు. కనుక మీ దేశంలో ఉండే విదేశీయులలో ఎవర్నీ
మీరు మోసం చేయకూడదు. కొట్టగూడదు.”
22“విధవరాండ్రకు, అనాధలకు మీరు ఎన్నడూ
ఎట్లాంటి కీడు చేయకూడదు. 23ఆ విధవరాండ్రకు
లేక అనాధలకు మీరు ఏదైనా కీడు చేస్తే అది నాకు
తెలుస్తుంది. వారి శ్రమను గూర్చి నేను వింటాను.
24అంతేకాదు, నాకు చాల కోపం వస్తుంది. కత్తితో
నేను మిమ్మల్ని చంపేస్తాను. అప్పుడు మీ భార్యలు
విధవరాండ్రయి పోతారు. మీ పిల్లలు అనాధలు అయి
పోతారు.”
25“నా ప్రజల్లో ఒకరు పేదవారైతే, నీవు వానికి
డబ్బు అప్పిస్తే, ఆ డబ్బుకు నీవు అతని దగ్గర వడ్డీ
తీసుకోకూడదు. ఆ డబ్బు త్వరగా తిరిగి ఇచ్చి వేయ
మని నీవు అతణ్ణి తొందర చేయకూడదు: 26అతడు
నీకు బాకీ ఉన్న డబ్బు నీకు చెల్లిస్తాడని ప్రమాణంగా
ఎవరైనా ఒకరు తన అంగీని నీకు ఇవ్వవచ్చును. కాని
సూర్యాస్తమయం కాకముందే నీవు ఆ అంగీని తిరిగి
ఇచ్చివేయాలి. 27ఒకవేళ ఆ వ్యక్తికి ఆ అంగీ లేకపోతే,
తన శరీరాన్ని కప్పుకొనేందుకు అతనికి ఇంకేమీ లేక
పోవచ్చును. అతను నిద్రపోయినప్పుడు చల్లబడి
పోతాడు. మరి అతడు నాకు మొరబెడితే, అప్పుడు
నేను అతని మొర వింటాను. నేను దయగలవాణ్ణి
కనుక నేను వింటాను.”
28“నీ దేవుణ్ణిగాని, నీ ప్రజల నాయకులనుగాని నీవు
దూషించగూడదు.”
29“కోత కాలంలో నీ మొదటి గింజల్ని, నీ ఫలాల్లో
మొదటి రసాన్ని నీవు నాకు ఇవ్వాలి. సంవత్సరాంతం
వరకు వేచి ఉండొద్దు. “నీ పెద్దకుమారుల్ని నాకు
ఇవ్వు. 30అలాగే నీ ఆవుల్లో, గొర్రెల్లో, మొదట పుట్టిన
వాటిని నాకు ఇవ్వు. అవి ఏడు రోజులు వాటి తల్లితో
ఉండవచ్చు. ఎనిమిదవ రోజున వాటిని నాకు ఇవ్వాలి.
31మీరు నా ప్రత్యేక ప్రజలు. కనుక అడవి మృగాలు
చంపిన ఏదో ఒకదాని మాంసం మీరు తినవద్దు. చచ్చిన
ఆ జంతువులను కుక్కల్ని తిన నివ్వండి.”
23 “ప్రజలకు వ్యతిరేకంగా అబద్ధాలు చెప్పకండి.
న్యాయస్థానంలో మీరు సాక్షులుగా ఉంటే, ఒక
దుర్మార్గుడు అబద్ధాలు చెప్పేందుకు సహాయం చేయ
డానికి ఒప్పుకోవద్దు.
2“మిగిలిన వారంతా చేస్తున్నారనిచెప్పి నువ్వు ఏదీ
చేయవద్దు. ఒక గుంపు ప్రజలు తప్పు చేస్తోంటే,
నువ్వు వారితో కలువ వద్దు. నువ్వు చెడ్డ పనులు

చేసేటట్టు ఆ ప్రజలు నిన్ను ఒప్పించనియ్యవద్దు. సరియైనది, న్యాయమైనది నువ్వు చెయ్యాలి.
3"ఒక పేదవానికి తీర్పు జరుగుతోంటే, కొన్నిసార్లు అతని విషయంలో జాలిపడి, కొందరు అతణ్ణి బల పరుస్తారు. నువ్వు అలా చేయకూడదు. (అతనిది సరిగ్గా ఉంటేనే బలపర్చు.)
4"తప్పిపోయిన ఒక ఎద్దును లేక గాడిదను నీవు చూస్తే, దాన్ని దాని యజమానికి నీవు తిరిగి అప్ప గించాలి. ఆ యజమాని నీకు శత్రువైనా సరే, నీవు ఇలా చేయాల్సిందే.
5మోయలేనంత భారం ఉండడం చేత ఒక జంతువు నడవలేక పోతున్నట్టు నీవు చూస్తే, నీవు ఆగి ఆ జంతువుకు సహాయం చేయాలి. ఆ జంతువు నీ శత్రువులలో ఒకనికి చెందినా సరే నీవు దానికి సహాయం చేయాలి.
6"ఒక పేదవానికి ప్రజలు అన్యాయం చేయ నివ్వ కూడదు నీవు. ఇతరులు ఎవరికైనా తీర్చబడినట్టే తీర్పు తీర్చాలి.
7"ఏదైనా విషయంలో ఒకడు నేరస్థుడు అని నీవు చెబితే, నీవు చాల జాగ్రత్తగా ఉండాలి. ఒకడి మీద అబద్ధపు నిందలు వేయవద్దు. నిర్దోషియైన ఒకడ్ని తాను చేయని పనికి శిక్షగా ఎన్నడూ మరణించ నివ్వ వద్దు. ఒక నిర్దోషిని చంపేవాడు ఎవడైనా సరే చెడ్డవాడే, ఆ మనిషిని నేను క్షమించను.
8ఒకడు తప్పు చేస్తూ నీవు అతనితో ఏకీభవించాలని చెప్పి, నీకు డబ్బు ఇవ్వ జూస్తే, ఆ డబ్బు తీసుకోవద్దు. అలా చెల్లించిన డబ్బు న్యాయమూర్తులు సత్యాన్ని చూడకుండా చేస్తుంది. అలా చెల్లించిన డబ్బు మంచివాళ్లు అబద్ధాలు చెప్పేటట్టు చేస్తుంది.
9"విదేశీయుని యెడల నీవు ఎన్నడూ తప్పు చేయ కూడదు. మీరు ఈజిప్టు దేశంలో నివసించినప్పుడు మీరు పరాయి వాళ్లేనని జ్ఞాపకం ఉంచుకోవాలి." (ఒకడు తన స్వంతంకాని దేశంలో వుంటే వాడికి ఎలా వుంటుందో మీరు అర్థం చేసుకోవాలి.)

### ప్రత్యేకమైన శెలవు దినాలు

10"విత్తనాలు చల్లి పంటకోసి, ఆరు సంవత్సరాల పాటు భూమిని సాగుచేయండి.
11అయితే ఏడో సంవ త్సరం భూమిని ఉపయోగించకండి. (ఏడో సంవత్సరం భూమికి ఒక ప్రత్యేక విశ్రాంతి సమయంగా ఉండాలి) మీ పొలాల్లో ఏమీ నాటవద్దు. ఒకవేళ అక్కడ ఏవైనా పంటలు పెరిగితే, వాటిని పేద ప్రజలను తీసు కోనివ్వాలి. మిగిలిపోయిన ఆహారాన్ని అడవి మృగాల్ని తిననివ్వాలి. మీ ద్రాక్షాతోటలు, ఒలీవ మొక్కలు, తోటల విషయంలో కూడ మీరు అలాగే చేయాలి.
12"ఆరు రోజులు పని చేయండి. ఏడో రోజున విశ్రాంతి! మీ బానిసలు, ఇతర పని వాళ్లకు దీనివల్ల విశ్రాంతి, మరియు విరామం లభిస్తుంది. మీ ఎడ్లు, మీ గాడిదలకు కూడ విశ్రాంతి దొరుకుతుంది.
13"ఈ ఆజ్ఞలన్నింటికీ విధేయులు కావాలని మాత్రం ఖచ్చితంగా తెల్సుకోండి. వేరే దేవుళ్లను పూజిం చకండి. చివరకి వాళ్ల పేర్లు కూడా మీరు పలుకగూడదు.
14"ప్రతి సంవత్సరం మూడు ప్రత్యేక పండుగలు మీకు ఉంటాయి. ఈ పండుగల రోజుల్లో మీరు నన్ను ఆరాధించటానికి నా ప్రత్యేక స్థలానికి రావాలి.
15మొదటి పండుగ పులియని రొట్టెల విందు. ఇది నేను మీకు ఆజ్ఞాపించినట్టే ఉంటుంది. ఈ సమయంలో పులియ జేసే పదార్థం వినియోగించ కుండా చేయబడ్డ రొట్టెలు మీరు తింటారు. ఇలా ఏడురోజుల పాటు కొనసాగు తుంది. అబీబు* మాసంలో మీరు దీన్ని చేయాలి. ఎందుకంటే మీరు ఈజిప్టు నుండి బయటకు వచ్చిన సమయం యిదే. ఆ సమయంలో ప్రతి వ్యక్తి ఒక బలి అర్పణ నాకు తీసుకురావాలి.
16"రెండోది పెంతుకోస్తు పండగ. ఈ పండుగ వేసవి పూర్వార్ధంలో అంటే మీ పొలాల్లో మీరు నాట్లు వేసిన పంటల కోత మొదలుబెట్టే సమయంలో ఉంటుంది. మూడోది ఆశ్రయాల పండగ.
"ఇది ఆకురాలు కాలంలో ఉంటుంది. ఇది మీ పొలాల్లో పంటలన్నీ కూర్చుకొనే సమయంలో ఉంటుంది.
17"కనుక యెహోవా ప్రభువుతో ఉండేందుకు సంవత్సరానికి మూడుసార్లు పురుషులంతా ఒక ప్రత్యేక స్థలానికి వస్తారు.
18"నీవు ఒక జంతువును చంపి దాని రక్తం బలిగా అర్పించేటప్పుడు, పులియజేసే పదార్థంతో చేయబడ్డ రొట్టెలు నీవు అర్పించకూడదు. ఈ బలి అర్పణలోని మాంసం మీరు తినేటప్పుడు ఆ మాంసం అంతా ఒక్క రోజులోనే తినెయ్యాలి. మాంసంలో ఏమీ మర్నా టికి మిగల్చకూడదు.
19"మీరు మీ పంట కూర్చుకొనే కోత కాలంలో మీరు కోసే ప్రతి దానిలో మొదటి భాగం మీ యెహోవా దేవుని ఆలయానికి తీసుకురావాలి. "దాని తల్లి పాలతో ఉడకబెట్టబడిన మేకపిల్ల మాంసాన్ని మీరు తిన కూడదు."

### ఇశ్రాయేలీయులు భూమిని తీసుకొనుటలో దేవుడు సహాయం చేస్తాడు

20దేవుడు యిలా చెప్పాడు: "మీకు ముందర ఒక దేవదూతను నేను పంపుతున్నాను. మీ కోసం నేను సిద్ధం చేసిన చోటుకి ఈ దేవదూత మిమ్మల్ని నడిపిం చటం జరుగుతుంది.
21ఈ దేవదూతకు విధేయులుగా వెంబడించండి. ఆయన మీద తిరుగుబాటు చేయవద్దు. ఆయన విషయంలో మీరు చేసే తప్పిదాలను ఈ

---

**అబీబు** లేక "నిసాను" అనే వసంతకాలం సుమారు మార్చి, ఏప్రిల్.

దేవదూత క్షమించడు. ఆయనలో నా శక్తి ఉంది.
22ఆయన చెప్పే ప్రతి దానికీ మీరు లోబడాలి. నేను
మీతో చెప్పే ప్రతీదీ మీరు చేయాలి. మీ శత్రువు
లందరికీ నేను వ్యతిరేకంగా ఉంటాను. మీకు వ్యతిరేకంగా
ఉండే ప్రతి వ్యక్తికి నేను విరోధినే.”
23దేవుడు చెప్పాడు: “ఈ దేశంలోనుంచి నా దూత
మిమ్మల్ని నడిపిస్తాడు. అమోరీయులు, హిత్తీయులు,
పెరిజ్జీయులు, కనానీయులు, హివ్వీయులు, యెబూ
సీయులు అనే వేర్వేరు ప్రజల మీదికి ఆయన మిమ్మల్ని
నడిపిస్తాడు. అయితే వీళ్లందర్నీ నేను ఓడిస్తాను.”
24"వాళ్ల దేవుళ్లను పూజించవద్దు. ఆ దేవుళ్లకు
ఎన్నడూ సాష్టాంగపడవద్దు. వాళ్ల జీవిత విధానంలో
మీరు ఎన్నడూ జీవించకూడదు. వాళ్ల విగ్రహాల్ని మీరు
నాశనం చేయాలి. వాళ్ల దేవుళ్లను వాళ్లు జ్ఞాపకం చేసు
కొనేందుకు వాళ్లకు తోడ్పడే వాటన్నిటినీ మీరు విరుగ
గొట్టాలి. 25మీ యెహోవా దేవుణ్ణి మీరు సేవించాలి.
మీరు ఇలా చేస్తే, భోజన పానీయాలు సమృద్ధిగా
ఇచ్చి నేను మిమ్మల్ని ఆశీర్వదిస్తాను. సర్వరోగాల్నీ
మీలోనుండి తొలగించి వేస్తాను. 26మీ స్త్రీలంతా పిల్లల్ని
కనగల్గుతారు. వారి శిశువుల్లో ఏ ఒక్కరూ పుట్టుకలో
చావరు. మిమ్మల్ని అందరినీ సుదీర్ఘ ఆయుష్షుతో
బ్రతకనిస్తాను.”
27“మీరు మీ శత్రువుతో యుద్ధం చేసేటప్పుడు
నా మహత్తర శక్తిని మీ ముందర పంపిస్తాను. మీరు మీ
శత్రువులందర్నీ ఓడించటానికి నేను మీకు సహాయం
చేస్తాను. మీకు వ్యతిరేకంగా ఉండే మనుష్యులు
యుద్ధంలో కలవరపడిపోయి, పారిపోతారు. 28మీకు
ముందు కందిరీగలను* నేను పంపిస్తాను. ఆ కందిరీగలు
మీ శత్రువులు పారిపొయ్యేట్టు చేస్తాయి. హివ్వీ ప్రజలు,
కనానీ ప్రజలు, హిత్తీ ప్రజలు, మీ దేశాన్ని వదిలేస్తారు.
29అయితే త్వరగా మీ దేశాన్ని విడిచి పెట్టేటట్టు నేను
వాళ్లను బలవంతం చేయను. ఇదంతా నేను ఒక్క
సంవత్సరంలోనే చేయను. ఆ ప్రజల్ని నేను అంత
వేగంగా వెళ్లగొడితే, దేశం ఖాళీగా ఉంటుంది. అలాగైతే
అడవి మృగాలు అధికమై దేశాన్ని ఆక్రమించు
కొంటాయి. అవి మీకు చాల తొందర కలిగిస్తాయి.
30కనుక ఆ ప్రజల్ని చాలా నిదానంగా బయటకు వెళ్ల
గొడతాను. దేశంలోనికి మీరు చొచ్చుకు పోతూనే
ఉంటారు. మరి మీరు ఎక్కడికి వెళ్లినా, అక్కడ ఇతర
ప్రజలను నేను బలవంతంగా వెళ్లగొట్టేస్తాను.”
31“ఎర్ర సముద్రం నుండి యూఫ్రటీస్ నదివరకు
ఉన్న దేశం అంతా నేను మీకు యిస్తాను. ఫిలిష్తీ
సముద్రం (మధ్యధరా సముద్రం) పశ్చిమాన సరి
హద్దుగాను, అరేబియా ఎడారి తూర్పు సరిహద్దుగాను
ఉంటాయి. అక్కడ నివసిస్తున్న ప్రజల్ని మీరు ఓడించే
టట్టు చేస్తాను.
32“ఆ ప్రజల్లో ఎవరితోగాని లేక వారి దేవుళ్ల తోగాని
మీరు ఎలాంటి ఒడంబడికలూ చేసుకోకూడదు.
33వాళ్లను మీ దేశంలో ఉండనివ్వవద్దు. మీరు వాళ్లను
ఉండనిస్తే, మీరు పాపం చేయటానికి వాళ్లు కారకులు
అవుతారు. ఒకవేళ మీరు వాళ్లను ఉండనిస్తే వాళ్లు ఒక
ఉరిలా ఉంటారు. మీరేమో వాళ్ల దేవుళ్లను పూజించటం
మొదలు పెడతారు.”

### దేవుడు ఇశ్రాయేలీయులతో ఒడంబడిక చేయటం

24 మోషేతో దేవుడు ఇలా చెప్పాడు: “నీవు,
అహరోను, నాదాబు, అబీహు, ఇశ్రాయేలీ
యుల డెబ్బయి మంది పెద్దలు (నాయకులు) పర్వతం
మీదకు వచ్చి అంత దూరంలోనుంచే నన్ను ఆరాధిం
చాలి. 2అప్పుడు మోషే తాను మాత్రం యెహోవాకు
సమీపంగా రావాలి. మిగతా పురుషులు యెహోవాకు
సమీపంగా రాకూడదు. మిగతా ప్రజలు పర్వతం మీదకి
కూడా రాకూడదు.”
3కనుక యెహోవా ఇచ్చిన నియమాలు, ఆజ్ఞలు
అన్నింటిని గూర్చి మోషే ప్రజలతో చెప్పాడు.
అప్పుడు ప్రజలంతా, “యెహోవా చెప్పిన ఆజ్ఞలు
అన్నింటికీ మేము విధేయులమవుతాము” అన్నారు.
4కనుక యెహోవా ఆజ్ఞలు అన్నింటినీ మోషే
రాసాడు. (మర్నాటి ఉదయం పర్వతం దగ్గర మోషే
ఒక బలిపీఠం నిర్మించాడు. ఇశ్రాయేలీయుల పన్నెండు
వంశాల్లో ఒక్కోదానికి ఒకటి చొప్పున పన్నెండు రాళ్ల
నిలబెట్టాడు.
5అప్పుడు బలులు అర్పించటానికి యువకులను
మోషే పంపించాడు. దహన బలులుగా, సమాధాన
బలులుగా ఎడ్లను ఈ మనుష్యులు అర్పించారు.
6ఈ జంతువుల రక్తాన్ని మోషే భద్రం చేసాడు.
రక్తంలో సగాన్ని పాత్రల్లో ఉంచాడు మోషే. మిగతా
సగం రక్తాన్ని బలిపీఠం మీద ఆయన పోసాడు.*
7ప్రత్యేక ఒడంబడిక రాయబడ్డ పత్రాన్ని మోషే
చదివాడు. ఆయన చదువుతోంది ప్రజలంతా వినగలి
గేటట్టు మోషే ఆ ఒడంబడిక పత్రం చదివాడు.
అప్పుడు ప్రజలు, “యెహోవా మాకు ఇచ్చిన ఆజ్ఞ
లన్నీ మేము విన్నాము. వాటికి విధేయులం అయ్యేం
దుకు మేము ఒప్పుకొంటున్నాము” అన్నారు.
8తర్వాత బలి అర్పణ రక్తంతో నిండిన పాత్రలను
మోషే పట్టుకొన్నాడు. ఆ రక్తాన్ని ప్రజలమీద మోషే

---

**కందిరీగలను** ఇది నిజంగా కందిరీగ కావచ్చు, లేదా “దేవుని దూత,” లేక “ఆయన మహాశక్తి కావచ్చు.”

**ఈ ... పోసాడు** దేవునికీ, ప్రజలకీ మధ్య ఒడంబడికను ముద్రించేందుకు రక్తం ప్రయోగించబడింది. ఈ ఒడంబడికలో దేవుడు కూడ పాలుపుచ్చుకుంటున్నాడు అనేందుకు సూచనగా బలిపీఠం మీద పోయబడింది.

చిలకరించాడు* “మీతో యెహోవా ఒక ప్రత్యేక ఒడంబడిక చేసాడు అని ఈ రక్తం సూచిస్తుంది. మీకు దేవుడు ఇచ్చిన ఆజ్ఞలే ఈ ఒడంబడికను వివరిస్తాయి,” అని ఆయన చెప్పాడు.
9అప్పుడు మోషే, అహరోను, నాదాబు, అబీహు, ఇశ్రాయేలు పెద్దలు డెబ్బయి మంది పర్వతం మీదకు వెళ్లారు. 10పర్వతం మీద ఈ మనుష్యులు ఇశ్రాయేలీ యుల దేవుణ్ణి చూసారు. ఆకాశం అంత నిర్మలంగా కనబడుతున్న నీలంలాటి దేనిమీదనో దేవుడు నిలబ డ్డాడు. 11ఇశ్రాయేలు నాయకులంతా దేవుణ్ణి చూచారు, కాని దేవుడు వాళ్లను నాశనం చేయలేదు.* వాళ్లంతా కలిసి తిని తాగారు.

### మోషేకు రాతి పలకలు లభ్యం కావటం

12“పర్వతం మీద నా దగ్గరకు రా, నా ప్రబోధాలను, ఆజ్ఞలను పలకలుగా ఉన్న రెండు రాళ్ల మీద రాసాను. ఈ ప్రబోధాలు ప్రజలకోసం. ఆ రాతి పలకలను నేను నీకిస్తాను” అని యెహోవా మోషేతో చెప్పాడు.
13కనుక మోషే, ఆయన సహాయకుడైన యెహో షువ కలసి దేవుని పర్వతం మీదకు వెళ్లారు. 14మోషే, “మాకోసం ఇక్కడ వేచి ఉండండి. మేము తిరిగి మీదగ్గరకు వస్తాము. నేను లేనప్పడు అహరోను, హెూరు మీ దగ్గరే ఉన్నారు. ఎవరికైనా సమస్య ఉంటే వాళ్ల దగ్గరకు వెళ్లండి,” అని ఆ పెద్దలతో (నాయకు లతో) చెప్పాడు.

### మోషే దేవుడ్ని కలుసుకోవడం

15అప్పుడు మోషే పర్వతం మీదికి వెళ్లాడు. ఆ పర్వతాన్ని మేఘం కప్పేసింది. 16సీనాయి పర్వతం మీద యెహోవా మహిమ దిగివచ్చింది. ఆరు రోజుల పాటు పర్వతాన్ని మేఘం కప్పేసింది. ఏడోరోజున ఆ మేఘంలోనుంచి యెహోవా మోషేతో మాట్లా డాడు.
17ఇశ్రాయేలు ప్రజలు యెహోవా మహిమను చూడగలిగారు. అది ఆ పర్వతం మీద మండుతున్న అగ్నిలా వుంది. 18అప్పుడు మోషే ఆ పర్వతం మీద యింకా పైకి ఎక్కి మేఘంలోకి వెళ్లాడు. నలభై పగళ్లూ, నలభై రాత్రులు మోషే ఆ పర్వతం మీదే ఉన్నాడు.

### పవిత్రమైనవాటికి బహుమానాలు

25 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
2“నాకు కానుకలు తీసుకురమ్మని ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు. నాకు ఇవ్వాల్సింది ఏమిటి? ప్రతి మనిషి తన హృదయంలో తీర్మానించుకోవాలి. నా కోసం ఈ కానుకల్ని స్వీకరించు. 3ప్రజల దగ్గర్నుండి నీవు స్వీకరించాల్సిన వాటి జాబితా యిది: బంగారం, వెండి, కంచు. 4నీలం వస్త్రం, ఊదారంగు వస్త్రం, ఎరుపు వస్త్రం, మేలిమి వస్త్రం, మేక బొచ్చు, 5గొర్రె చర్మాలు, మేలురకం తోళ్లు, తుమ్మకర్ర 6దీపాలకు నూనె, ధూపం. ప్రత్యేక అభిషేక తైలానికి* సువాసన చేకూర్చే పరిమళ వస్తువులు, 7ఇంకా లేత పచ్చరాళ్లు, ఏఫోదు* మీద లేక న్యాయతీర్పుపై వస్త్రం మీద పొదిగించడానికి విలువైన రాళ్లు.”

### పవిత్ర గుడారం

8(ఇంకా దేవుడు ఇలా అన్నాడు): “నా కోసం ప్రజలు ఒక పవిత్ర స్థలాన్ని నిర్మిస్తారు. అప్పుడు నేను వారి మధ్య నివసిస్తాను. 9పవిత్ర గుడారం ఎలా ఉండాలో నేను మీకు చూపిస్తాను. దానిలో ఏమేమి వస్తువులు ఎలా ఉండాలో నేను మీకు చూపిస్తాను. సరిగ్గా నేను నీకు చూపించినట్టు ఒడంబడిక పెట్టె తయారు చెయ్యి.

### ఒడంబడిక పెట్టె

10“తుమ్మకర్ర ఉపయోగించి ఒక ప్రత్యేక పెట్టె తయారు చెయ్యి. ఈ పెట్టె పొడవు 45 అంగుళాల వెడల్పు 27 అంగుళాలు ఎత్తు 27 అంగుళాలు ఉండాలి. 11ఆ పెట్టెలోపల, బంగారు రేకుతో పెట్టెను కప్పాలి. ఆ పెట్టె చుట్టూ అంచుల మీద బంగారపు నగిషీబద్ధ పెట్టాలి. 12ఆ పెట్టె చుట్టూ మోసేందుకు నాలుగు బంగారు ఉంగరాలను తయారు చెయ్యాలి. ఆ పెట్టెకు ఒక్కోపక్క రెండేసి చొప్పున నాలుగు మూలలా ఆ ఉంగరాలను అమర్చాలి. 13తర్వాత పెట్టెను మోసేం దుకు కర్రలను తయారు చేయాలి. ఈ కర్రలను తుమ్మకర్రతో చేసి వాటికి బంగారం పొదిగించాలి. 14ఆ పెట్టె మూలల్లో ఉన్న ఉంగరాల గుండా ఆ కర్ర లను పెట్టాలి. ఆ పెట్టెను మోసేందుకు ఈ కర్రలను

---

**చిలకరించాడు** ఇలా చేయడం ఒడంబడికలో ప్రజలు పాలు పుచ్చుకొంటున్నారని, దేవునికి, ఇశ్రాయేలు ప్రజలకు మధ్య ఒప్పందానికి యిది ముద్ర వేస్తుంది.

**ఈ మనుష్యులు ... చేయలేదు** మనుష్యులు దేవుణ్ణి చూడలేరని పరిశుద్ధ గ్రంథం చెబుతోంది. అయితే, ఆయన ఎలా ఉంటాడో ఈ నాయకులు చూడాలని దేవుడు కోరాడు గనుక ఒక ప్రత్యేక విధానంలో ఆయన వాళ్లను చూడ నిచ్చాడు.

**అభిషేక తైలానికి** శుద్ధమైన ఒలీవ తైలం ప్రత్యేక కార్య క్రమాలకోసం ఒకవ్యక్తి రాజుగా, యాజకునిగా, ప్రవక్తగా ఏర్పాటు చేయబడినప్పుడు సాధారణంగా ఈ నూనె ఆ వ్యక్తితలమీద పోయబడుతుంది.

**ఏఫోదు** పూర్వం ఇశ్రాయేలీ యాజకులు ధరించే ఒక ప్రత్యేక అంగీ లేక కోటు, ఇశ్రాయేలు పన్నెండు గోత్రాలకు ప్రాతినిధ్యంవహిస్తూ పన్నెండు ప్రశస్తమైన రాళ్లు దానిమీద బంగారుతో పొదగబడుతాయి. ఊరీం, తుమ్మీమ్ దానిలో ఉంచబడతాయి.

ఉపయోగించాలి. 15ఈ కర్రలు ఎప్పుడూ వాటి ఉంగ
రాల్లోనే ఉండాలి. కర్రలను బయటికి తియ్యవద్దు."
16(దేవుడు అన్నాడు): "నేను ఒడంబడికను* నీకు
ఇస్తాను. ఆ ఒడంబడికను ఈ పెట్టెలో పెట్టు. 17ఆ
పెట్టెకు ఒక మూత* చెయ్యాలి. స్వచ్ఛమైన బంగా
రంతో దీన్ని చెయ్యాలి. 45అంగుళాల పొడవు 27
అంగళాల వెడల్పుతో దీన్ని చెయ్యాలి. 18"తర్వాత
రెండు బంగారు కెరూబు దూతలను చేసి ఆ మూతకు
రెండుకొనలమీద పెట్టాలి. కొట్టిన బంగారంతో ఈ
దూతల్ని చేయాలి. 19ఆ మూతకు ఒక కొనమీద
ఒక దూతను, మరో కొనమీద మరో దూతను ఉంచాలి.
మూత, దూతలు అంతా ఒకే వస్తువుగా చేయాలి.
20కెరూబులు ఒకదానికి ఎదురుగా ఇంకొకటి ఉండాలి.
ఆ దూతల ముఖాలు మూత వైపుకు చూస్తూ ఉండాలి.
ఆ కెరూబుల రెక్కలు మూతను ఆవరించి ఉండాలి.
ఆ కెరూబుల రెక్కలు ఆకాశం వైపు ఎత్తబడి ఉండాలి."
21"ఒడంబడిక రుజువు నేనే మీకిచ్చాను. ఆ ఒడం
బడికను పెట్టెలో పెట్టి, ప్రత్యేక మూతను పెట్టెమీద
పెట్టాలి. 22నేను నిన్ను కలుసుకొనేటప్పుడు ఆ ఒడం
బడిక పెట్టె ప్రత్యేక మూత మీద ఉన్న కెరూబు
దూతల మధ్యనుండి నేను మాట్లాడుతాను. అక్కడి
నుండే నేను నా ఆజ్ఞలన్నింటినీ ఇశ్రాయేలు ప్రజలకు
యిస్తాను.

### బల్ల

23"తుమ్మ కర్రతో ఒక బల్ల తయారు చెయ్యాలి.
ఈ బల్ల పొడవు 36 అంగుళాలు వెడల్పు 18 అంగుళాలు
ఎత్తు 27 అంగుళాలు ఉండాలి. 24బల్లను స్వచ్ఛమైన
బంగారంతో కప్పాలి. దాని చుట్టూ బంగారపు నగిషీబద్ద
పెట్టాలి. 25తర్వాత 4 అంగుళాల. బంగారు నగిషీ బద్దను
బల్ల చుట్టూ చేయాలి. ఇది కూడా స్వచ్ఛమైన బంగా
రంతో చేయాలి. 26అప్పుడు నాలుగు బంగారు ఉంగ
రాలు చేసి, బల్ల నాలుగు మూలలా వాటిని ఉంచాలి.
ఒక్కొక్క కాలు దగ్గర ఒక్కొక్క ఉంగరం పెట్టాలి. 27బల్ల
పై భాగానికి చుట్టూవున్న నగిషీ బద్దకు సమీపంగా
ఉంగరాలను ఉంచాలి. బల్లను మోసే మోతకర్రలను
ఈ ఉంగరాలు పట్టి ఉంచుతాయి. 28మోత కర్రలు
చేసేందుకు తుమ్మ కర్రను ఉపయోగించి వాటికి బంగా
రంతో తాపడం చేయాలి. వాటితో బల్లను మోయాలి.
29బల్లమీద ఉండే ప్రతి పళ్లెము, గిన్నె స్వచ్ఛమైన
బంగారంతో చేయబడాలి. అర్పితాలను పోసేందుకు
ఉపయోగించే పాత్రలు, గిన్నెలు స్వచ్ఛమైన బంగా
రంతో చెయ్యబడి ఉండాలి. 30ప్రత్యేకమైన రొట్టెను*
నా యెదుట బల్ల మీద పెట్టాలి. అవి నా యెదుట
ఎల్లప్పుడూ అక్కడ ఉండాలి.

### దీప స్తంభం

31"అప్పుడు నీవు ఒక దీపస్తంభం చేయాలి. దీప
స్తంభంలో ప్రతి భాగాన్నీ సాగకొట్టబడ్డ స్వచ్ఛమైన
బంగారంతో చేయాలి. అందంగా కనబడేటట్టు దీపానికి
పూలు చేయాలి. ఈ పూలలో మొగ్గలు, రేకులు
స్వచ్ఛమైన బంగారంతో చేయాలి. ఇవన్నీ దీప
స్తంభంతో పాటు ఒకే వస్తువుగా కలిసి ఉండాలి.
32"దీపస్తంభానికి ఒక పక్క మూడు కొమ్మలు మరో
పక్క మూడు కొమ్మలు మొత్తం ఆరు కొమ్మలు
ఉండాలి. 33ఒక్కొక్క కొమ్మకు మూడు పువ్వులు
ఉండాలి. ఈ పువ్వులను మొగ్గలు, రేకులుగల బాదం
పూలుగా చేయి. 34దీప స్తంభానికి మరో నాలుగు
పూలు చేయి. ఈ పూలు మొగ్గలు, రేకులుగల బాదం
పూవుల్లా చేయబడాలి. 35కాండమునకు ఇరు ప్రక్కల
మూడేసి కొమ్మల చొప్పున దీపస్తంభానికి ఆరు
కొమ్మలు ఉండాలి. కొమ్మలు కాండంలో కలిసే
మూడు చోట్లలో ఒక్కొక్క దాని కింద మొగ్గలు, రేకులు
గల ఒక పువ్వును చేయి. 36పువ్వులు కొమ్మలతో
సహా మొత్తం దీపస్తంభం స్వచ్ఛమైన బంగారంతో చేయ
బడాలి. ఈ బంగారం అంతా సాగకొట్టబడిన ఒకే
ముక్కగా ఉండాలి. 37అప్పుడు దీపస్తంభం మీదకు
ఏడు దీపాలు చేయి. ఈ దీపాలు దీపస్తంభం ఉన్న
చోట వెలుగు నిస్తాయి. 38ప్రమిదలు, దీపపు వత్తులను
తిప్పే పిడి చేసేందుకు స్వచ్ఛమైన బంగారం ఉపయో
గించు. 39దీపస్తంభం, దానితోబాటు ఉపయోగించే
వస్తువులను చేసేందుకు 75 పౌన్ల స్వచ్ఛమైన బంగారం
ఉపయోగించు. 40ప్రతీది సరిగ్గా నేను నీకు ఆ పర్వతం
మీద చూపించిన ప్రకారమే చేసేందుకు చాల జాగ్రత్త
పడు."

### పవిత్ర గుడారం

26 "పది తెరలతో పవిత్ర గుడారం చెయ్యాలి.
సున్నితమైన బట్ట, నీలం, ఎరుపు, ఊదా
రంగుల బట్టతో ఈ తెరలు చేయాలి. రెక్కలుగల
కెరూబుల చిత్ర పటాలను ఒక నిపుణుడు తెరలమీద
కుట్టాలి. 2తెరలన్నీ ఒకే కొలతలో తయారు చేయాలి.
ప్రతి తెరా 14 గజాల పొడవు 2 గజాల వెడల్పు

**ఒడంబడికను** సాక్ష్యం, రుజువు, పది ఆజ్ఞలు రాసిన రాతి పలకలు. దేవునికి, ఇశ్రాయేలీయులకు మధ్య ఒడంబడికకు యిది రుజువు.

**మూత** కరుణాపీఠం అని కూడ పిలువబడుతుంది. మూత అనీ పాపాలు క్షమించే స్థానం అని కూడ దీని హీబ్రూ పదానికి అర్థం.

**ప్రత్యేకమైన రొట్టె** సన్నిధి రొట్టె అని కూడ పిలువ బడింది. పవిత్ర స్థలంలో దేవుని యెదుట ప్రతిరోజూ ఈ రొట్టెను ఉంచాలి.

ఉండాలి. 3తెరలను రెండు భాగాలుగా కుట్టాలి. అయిదు
తెరలను ఒక విభాగానికి, అయిదు తెరలను మరో
విభాగానికి కలిపి కుట్టాలి. 4చివరి తెర అంచుకు
ఉంగరాలు కుట్టాలి. ఈ ఉంగరాలు చేసేందుకు నీలము
గుడ్డ ఉపయోగించాలి. తెరల రెండు విభాగాల కింది
అంచులకు ఉంగరాలు ఉండాలి. 5మొదటి విభాగంలోని
చివరి తెరకు 50 ఉంగరాలు, రెండో విభాగంలోని
చివరి తెరకు 50 ఉంగరాలు ఉండాలి. 6ఈ ఉంగరాలను
జత చేయటానికి 50 బంగారు ఉంగరాలు చెయ్యాలి.
పవిత్ర గుడారం అంతా ఒక్కటిగా ఉండటానికి ఇది
తెరలన్నింటినీ జత చేస్తుంది.
7“తర్వాత పవిత్ర గుడారాన్ని కప్పేందుకు ఇంకో
గుడారాన్ని నీవు చెయ్యాలి. ఈ గుడారం చేయటానికి
మేక వెంట్రుకలతో చేయబడ్డ 11 తెరలను ఉపయో
గించు. 8ఈ తెరలన్నీ ఒకే కొలతలో ఉండాలి. అవి
15 గజాలు పొడవు, 2 గజాలు వెడల్పు ఉండాలి.
9అయిదు తెరలను ఒక విభాగంగా కలిపి కుట్టాలి.
తర్వాత మిగిలిన ఆరు తెరలను మరో విభాగంగా కలిపి
కుట్టాలి. ఆరో తెరను గుడారం ముందటి భాగాన్ని
కప్పేందుకు ఉపయోగించాలి. తలుపులా తెరచు కొనేం
దుకు వీలుగా దీన్ని చుట్టిపెట్టాలి. 10ఒక భాగంలోని
చివరితెర అంచుకు 50 కొలుకులు తయారు
చెయ్యాలి. మరో విభాగంలోని చివరితెర కింది
అంచుకు కూడ అలానే చెయ్యాలి. మరో విభాగంలోని
చివరి తెర కింది అంచుకు కూడ అలానే చెయ్యాలి.
11అప్పుడు 50 ఇత్తడి ఉంగరాలు చెయ్యాలి. గుడ్డ
ఉంగరాలను జతచేయటానికి ఈ ఇత్తడి ఉంగరాలను
ఉపయోగించాలి. ఇలా చేయడంవల్ల తెరలన్నీ కలిసి
ఒకే గుడారంగా తయారువుతాయి. 12ఈ తెరలు పవిత్ర
గుడారం కంటె పొడవుగా ఉంటాయి. కనుక తెరల్లో
కొంత భాగం గుడారం వెనుకగా వేలాడుతుంటాయి.
13తెర గుడారం ప్రక్కల్లో వేలాడుతుంటుంది. ఇది
గుడారాన్ని భద్రంగా ఉంచుతుంది. 14పవిత్ర గుడారానికి
ఇంకా రెండు పైకప్పులు చేయాలి. ఒకటి ఎర్ర రంగు
పూసిన పొట్టేలు చర్మంతో చేయాలి. ఇంకొకటి మేలు
రకం తోలుతో చెయ్యాలి.
15“పవిత్ర గుడారం చట్రానికి ఉపయోగించే పలక
లను తుమ్మకర్రతో చెయ్యాలి. 16చట్రాలు 15 అంగు
ళాల పొడవు, 27అంగుళాల వెడల్పు ఉండాలి. 17ప్రతి
చట్రం ఒకేలా ఉండాలి. ప్రతి చట్రానికి పక్క పక్కగా
రెండేసి పక్కకర్రలు (దిమ్మలో అమర్చేవి) ఉండాలి.
18పవిత్ర గుడారం దక్షిణ పక్కకు 20 చట్రాలు చేయాలి.
19ప్రతి చట్రంకింద పెట్టడానికి రెండేసి వెండిదిమ్మలు
చేయాలి. కనుక చట్రాలన్నింటికీ 40 వెండిదిమ్మలు
నీవు చేయాలి. 20పవిత్ర గుడారం ఉత్తరదిక్కుకోసం
ఇంకా 20 చట్రాలు చెయ్యాలి. 21అంటే ఒక్కో చట్రా
నికి రెండేసి చొప్పున చట్రాలకోసం మొత్తం 40
వెండి దిమ్మలు చెయ్యాలి. 22గుడారం వెనుక పశ్చిమ
కొనకు ఇంకా ఆరు చట్రాలు నీవు చేయాలి. 23మూలల
కోసం రెండు చట్రాలు చెయ్యాలి 24మూలల్లో ఉండే
రెండు చట్రాలు జత చేయాలి. రెండుచట్రాలు అడుగు
భాగాన జతపర్చబడాలి. పైభాగంలో ఉన్న ఒక ఉంగరం
రెండు చట్రాలను జత పరుస్తుంది. 25కనుక (గుడారం
చివరన) మొత్తం ఎనిమిది చట్రాలు ఉంటాయి. ఒక్కో
చట్రం కింద రెండు దిమ్మల చొప్పున మొత్తం 16
వెండి దిమ్మలుంటాయి.
26“పవిత్ర గుడారం చట్రాలకు తుమ్మ కర్రతో
అడ్డకమ్ములు చేయాలి. పవిత్ర గుడారం మొదటి
ప్రక్కకు అయిదు అడ్డకమ్ములు ఉండాలి. 27పవిత్ర
గుడారం పశ్చిమాన వెనుకవైపు చట్రానికి అయిదు
అడ్డకమ్ములు ఉండాలి. పవిత్ర గుడారం పశ్చిమ
దిక్కున చట్రానికి అయిదు అడ్డకమ్ములు ఉండాలి.
(అంటే పవిత్ర గుడారం వెనుక) 28అయిదు చట్రాలకు
మధ్య ఉండే అడ్డకమ్మి పైనుండి కిందికి సగం సగంగా
ఉండాలి. ఈ కొననుండి ఆకొన వరకు చట్రాల గుండా
ఈ అడ్డకమ్మి దూర్చబడాలి. 29చట్రాలను బంగారంతో
తాపడం చేయాలి. అడ్డకమ్ములను పట్టి ఉంచడానికి
చట్రాలకు ఉంగరాలు చెయ్యాలి. 30నేను నీకు పర్వతం
మీద చూపించినట్టే, పవిత్ర గుడారం నిర్మించు.

## పవిత్ర గుడారం లోపల

31“సున్నితమైన వస్త్రంతో గుడారం లోపలి భాగం
కోసం ప్రత్యేకమైన ఒక తెరను తయారు చెయ్యాలి.
నీలం, ఊదా, ఎరుపు రంగు బట్టతో ఈ తెరను
తయారు చేయాలి. కెరూబుల చిత్రపటాలను ఈబట్ట
మీద కుట్టాలి. 32తుమ్మ కర్రతో నాలుగు స్తంభాలు
చెయ్యి. బంగారు కొక్కేల ఆ నాలుగు స్తంభాలకు
అమర్చు. స్తంభాలకు బంగారు తాపడం చెయ్యి.
స్తంభాల కింద నాలుగు వెండి దిమ్మలు పెట్టు. తర్వాత
తెరను బంగారు కొక్కేల మీద వ్రేలాడదీయి. 33కొక్కేల
మీద తెరను వేలాడ దీసిన తరువాత, ఒడంబడిక పెట్టెను
తెర వెనుక పెట్టు. పవిత్ర స్థానాన్ని, మహా పవిత్ర
స్థానాన్ని, ఈ తెర వేరుచేస్తుంది. 34మహా పవిత్ర
స్థానంలో ఒడంబడిక పెట్టె మీద మూత పెట్టు.”
35“పవిత్ర స్థానంలో నీవు చేసిన బల్లను తెర అవతలి
ప్రక్క పెట్టు. పవిత్ర గుడారంలో ఉత్తరంగా బల్ల
ఉండాలి. పవిత్ర గుడారంలో దక్షిణంగా దీపం ఉండాలి.
ఇది బల్లప్రక్క అడ్డంగా ఉండాలి.

## పవిత్ర గుడారపు ద్వారం

36“తర్వాత గుడారం ద్వారానికి ఒక తెర చెయ్యి.
తెరచేయటానికి నీలం, ఊదా, ఎరుపు బట్టను సున్నిత
మైన బట్టను ఉపయోగించు. ఆ బట్టలో చిత్రపటాలను
అల్లిక చేయాలి. 37తలుపుపై ఉండే తెరకు బంగారు

కొక్కేలు చేయాలి. బంగారు తాపడం చేయబడ్డ
అయిదు తుమ్మకర్ర స్తంభాలు చెయ్యాలి. అయిదు
స్తంభాలకూ అయిదు ఇత్తడిదిమ్మలు చేయాలి.

## అర్పణలు దహించడానికి బలిపీఠం

27 “తుమ్మకర్రతో ఒక బలిపీఠం నిర్మించు.
బలిపీఠం చతురస్రంగా ఉండాలి. అది 7 1/2
అంగుళాల పొడవు 7 1/2 అంగుళాల వెడల్పు 4 1/2
అంగుళాల ఎత్తు ఉండాలి. 2బలిపీఠం నలుమూలలా
ఒక్కోదానికి ఒక్కో కొమ్ము చేయాలి. అంతా ఒక్క
వస్తువుగా ఉండేటట్టు ఒక్కో కొమ్మును దాని మూలకు
జత చేయాలి. బలిపీఠాన్ని యిత్తడితో తాపడం
చేయాలి.
3“బలిపీఠం మీద ఉపయోగించబడే పరికరాలు,
పాత్రలు అన్నింటినీ ఇత్తడితో చేయాలి. బిందెలు,
పారలు, పాత్రలు, పళ్లపారలు, నిప్పునెత్తే పెంకులు
ఇత్తడితో చేయాలి. బలిపీఠం నుండి బూడిద ఎత్తి
శుభ్రం చేయడానికి యివి ఉపయోగించబడతాయి.
4ఒక పెద్ద యిత్తడి జల్లెడలాంటి దానిని చేయాలి.
తెర నాలుగు మూలలకు నాలుగు యిత్తడి ఉంగరాలు
చెయ్యాలి. 5బలిపీఠానికి అడుగున మెట్టు కింద తెరను
పెట్టాలి. కింద నుండి బలిపీఠంలో సగం పైవరకు,
తెర ఉంటుంది.
6“బలిపీఠపు కర్రలు చేయడానికి తుమ్మకర్ర ఉప
యోగించి వాటిని ఇత్తడితో తాపడం చేయాలి. 7బలి
పీఠం రెండు వైపులా ఉండే ఉంగరాల్లోనుంచి ఆ
కర్రలను దూర్చాలి. బలిపీఠం మోయడానికి ఈ కర్ర
లను ఉపయోగించాలి. 8బలిపీఠం గుల్లగా ఉంటుంది.
దాని ప్రక్కలు పలకలతో చేయబడతాయి. నేను నీకు
పర్వతం మీద చూపించినట్టే బలిపీఠాన్ని తయారు
చెయ్యి.

## గుడారానికి ఆవరణను ఏర్పరచటం

9“(పవిత్ర గుడారం చుట్టూ తెరలతో గోడకట్టు
ఇది గుడారానికి ఆవరణ అవుతుంది.) దక్షిణం వైపున
యాభై గజాల పొడవు తెరల గోడ ఉండాలి. సున్నిత
మైన బట్టతో ఈ తెరలు చేయబడాలి. 10ఇరవై
స్తంభాలు, ఆ స్తంభాల కింద 20 యిత్తడి దిమ్మలు
ఉపయోగించాలి. స్తంభాల కొక్కేల తెరల కడ్డీలు
వెండితో చేయాలి. 11దక్షిణ వైపున ఉన్నంత పొడవే
ఉత్తరం వైపున కూడా ఉండాలి. దానికి 100 తెరలు,
20 స్తంభాలు, 20 ఇత్తడి దిమ్మలు ఉండాలి. స్తంభాల
కొక్కేలు తెరల కడ్డీలు వెండితోనే చేయబడాలి.
12“ఆవరణం పడమటికొన వైపు 25 గజాల పొడవు
గల తెరలతో ఒక గోడ ఉండాలి. ఆ గోడ మీద 10
స్తంభాలు, 10 దిమ్మలు ఉండాలి. 13ఆవరణ తూర్పు
వైపు కూడా 25 గజాల పొడవు ఉండాలి. 14(ఈ
తూర్పు వైపే ఆవరణకు ప్రవేశం) ప్రవేశద్వారానికి
అన్ని వైపులా ఏడున్నర గజాల పొడవు గల తెరలు
ఉండాలి. ఆ పక్క మూడు స్తంభాలు మూడు దిమ్మలు
ఉండాలి. 15 అవతల వైపున కూడా ఏడున్నర గజాల
పొడవుగల తెరలు ఉండాలి. ఆ పక్కన మూడు స్తంభాలు
మూడు దిమ్మలు ఉండాలి.
16ఆవరణ ప్రవేశాన్ని కప్పడానికి 10 అంగుళాల
పొడవుగల తెర చెయ్యాలి. సున్నితమైన బట్ట నీలం,
ఎరుపు, ఊదారంగు బట్టలతో ఆ తెరను చేయాలి.
ఆ తెరమీద చిత్ర పటాల అల్లిక ఉండాలి. నాలుగు
స్తంభాలు, నాలుగు దిమ్మలు ఉండాలి. 17ఆవరణ
చుట్టూ ఉండే స్తంభాలన్నీ వెండి కడ్డీలతో జత కలపాలి.
స్తంభాల కొక్కేలు వెండితోను, స్తంభాల దిమ్మలు
యిత్తడితోను చేయాలి. 18ఆవరణం 50 గజాల పొడవు.
25 గజాల వెడల్పు ఉండాలి. ఆవరణ చుట్టు గోడ
ఏడున్నర అడుగుల ఎత్తు ఉండాలి. తెరలు సున్నితమైన
బట్టతో చేయాలి. స్తంభాలన్నింటి కింద ఉండే
దిమ్మల్ని ఇత్తడితోనే చేయాలి. 19అన్ని పరికరాలు,
పవిత్ర గుడారం మేకులు పవిత్ర గుడారంలో ఉపయో
గించే ఇతర వస్తువులు అన్నిటినీ ఇత్తడితోనే చేయాలి.
మేకులు (ఆవరణ చుట్టూ తెరలకు) అన్నీ ఇత్తడితో
చేయాలి.

## దీపాలకు నూనె

20“శ్రేష్ఠమైన ఒలీవ నూనె తీసుకొని రమ్మని ఇశ్రా
యేలు ప్రజలకు ఆజ్ఞాపించు. ప్రతి సాయంకాలం
వెలిగించాల్సిన దీపం కోసం ఈ నూనె ఉపయోగించు.
21దీపం విషయం అహరోను, అతని కుమారులు శ్రద్ధ
వహించాల్సి ఉంటుంది. సన్నిధి గుడారంలో మొదటి
గదిలోకి వారు వెళ్తారు. ఇది ఒడంబడిక పెట్టె ఉండే
గది బయట (రెండు గదులను వేరు పరచే) తెర
ముందర ఉంటుంది. ఇక్కడ సాయంత్రం నుండి తెల్ల
వారే వరకు యెహోవా ఎదుట దీపాలు తప్పక వెలు
గుతూ ఉండేటట్టు వారు బాధ్యత వహిస్తారు. ఇశ్రాయేలు
ప్రజలు, వారి వారసులు శాశ్వతంగా ఈ ఆజ్ఞకు
విధేయులు కావాలి.”

## యాజకుల వస్త్రాలు

28 “నీ సోదరుడైన అహరోను, అతని కుమా
రులు నాదాబు, అబీహు, ఎలియాజరు, ఈతా
మారు, ఇశ్రాయేలు ప్రజల్లోనుంచి, నీ దగ్గరకు రావాలని
చెప్పు. వీళ్లు యాజకులుగా నన్ను సేవిస్తారు.
2“నీ సోదరుడైన అహరోనుకు ప్రత్యేక వస్త్రాలు
చేయించు. ఈ వస్త్రాలు అతనికి గౌరవ మర్యాదలు
కల్గిస్తాయి. 3ఈ బట్టలు తయారు చేయగల నిపుణులు
ప్రజల్లో ఉన్నారు. ఈ మనుష్యులకు ప్రత్యేక జ్ఞానం
నేనిచ్చాను. అహరోనుకు బట్టలు తయారుచేయుమని

వారికి చెప్పు. అతను ఒక ప్రత్యేక విధానంలో నన్ను
సేవిస్తున్నాడని ఈ బట్టలు చూపెడ్తాయి. అప్పుడు
ఒక యాజకునిగా అతడు నన్ను సేవించవచ్చు. 4ఆ
మనుష్యులు చేయాల్సిన బట్టలు ఇవే: న్యాయతీర్పు
వస్త్రం ఏఫోదు, చేతుల్లేని ఒక ప్రత్యేక అంగీ, తల
కప్పుకొనే బట్ట, ఒక నడికట్టు పట్టి నీ సోదరుడైన
అహరోనుకు, అతని కుమారులకోసం ఆ మనుష్యులు
ఈ ప్రత్యేక దుస్తులను తయారుచేయాలి. అప్పుడు
అహరోను, అతని కుమారులు యాజకులుగా నన్ను
సేవించవచ్చు."
5 "బంగారురు దారాలు, సున్నితమైన బట్ట, నీలం,
ఎరుపు, ఊదా రంగుల బట్టలను ఉపయోగించాలని
ఆ మనుష్యులకు చెప్పు."

## ఏఫోదు – నడికట్టు పట్టి

6"ఏఫోదు తయారు చేయాటానికి బంగారు
దారాలు, సన్నని పేనిన నార బట్ట సున్నితమైన బట్ట,
నీలం, ఎరుపు, ఊదా రంగుల నూలు ఉపమోగించాలి
నైపుణ్యం గల పనివారు ఈ ఏఫోదు చేస్తారు. 7ఏఫోదు*
భుజాల దగ్గర ఒక్కో దాని దగ్గర ఒక్కో భుజం బట్ట
వేయబడుతుంది. ఏఫోదు రెండుకొనలు ఈ భుజం
బట్టలకు కట్టబడతాయి."
8"ఏఫోదు మీద వేసుకొనే కండువాను వారు చాల
జాగ్రత్తగా వేస్తారు. ఏఫోదులో ఉండేవాటితోనే బంగారు
దారాలు, సున్నితమైన బట్ట, నీలం, ఎరుపు, ఊదా
రంగు బట్టతోనే ఈ కండువా తయారు చేయబడు
తుంది."
9"నీవు రెండు లేతపచ్చ రాళ్లు తీసుకోవాలి. ఇశ్రా
యేలు పన్రెండు మంది కుమారుల పేర్లు ఈ రత్నాల
మీద చెక్కాలి 10ఒక రత్నం మీద ఆరు పేర్లు, మరో
రత్నంమీద ఆరు పేర్లు రాయాలి. పెద్ద కుమారుడు
మొదలుకొని చిన్న కుమారుని వరకు క్రమపద్ధతిలో
పేర్లు చెక్కు.
11ముద్రలు చేసేవాడు ఎలాగైతే చెక్కు తాడో,
అలా ఇశ్రాయేలు కుమారుల పేర్లను ఈ రాళ్ల మీద
చెక్కు. ఈ రత్నాలను బంగారంలో పొదుగు.
12అప్పుడు ఏఫోదు మీద ఉండే ఒక్కో భుజం బట్ట
మీద ఒక్కో రత్నాన్ని అమర్చు. అహరోను యెహోవా
ఎదుట నిలబడ్డప్పుడు ప్రత్యేకమైన ఈ అంగీ ధరిస్తాడు.
ఇశ్రాయేలు కుమారుల పేర్లు చెక్కబడ్డ రెండు రాళ్లు
ఏఫోదు మీద ఉంటాయి. ఇశ్రాయేలు ప్రజల్ని గూర్చి
తలంచేందుకు ఇది దేవునికి సహాయ పడుతుంది.
13ఏఫోదు మీద రాళ్లు నిలబడి ఉండేటట్టు మంచి
బంగారం ఉపయోగించు. 14స్వచ్ఛమైన బంగారు గొలు
సులను కలిపి తాడుపేనినట్టు మెలిపెట్టు. ఇలాంటివి
రెండు బంగారు గొలుసులు చేసి, వాటిని బంగారు
అల్లికలకు బిగించు.

## న్యాయతీర్పు పైవస్త్రం

15"ప్రధాన యాజకుని కోసం న్యాయపతకం
చేయి. ఏఫోదు చేసినట్టు నైపుణ్యంగల పనివారు ఈ
పైవస్త్రం చేయాలి. బంగారు దారాలు, సున్నితమైన
నారబట్ట, నీలం, ఎరుపు, ఊదారంగుబట్ట వాళ్లు ఉప
యోగించాలి. 16ఈ న్యాయతీర్పు పైవస్త్రం 9 అంగు
ళాల పొడవు, 9 అంగుళాల వెడల్పు ఉండాలి. అది
ఒక సంచి అయ్యేటట్టుగా మడత చేయబడాలి.
17న్యాయ పతకం మీద అందమైన రత్నాలు నాలుగు
వరుసలు పెట్టాలి. ఈ రత్నాల మొదటి వరసలో
పద్మరాగం, గోమేధికం, మరకతం ఉండాలి. 18రెండో
వరుసలో ఆకుపచ్చ నీలమణి, పచ్చమరకతం ఉండాలి.
19మూడో వరుసలో ఎరుపు వన్నె మణి, ఊదారంగు
మణి, వంగరంగు మణి ఉండాలి. 20నాలుగో వరుసలో
రక్తవర్ణం రాయి, లేతపచ్చ రాయి, సూర్యకాంతం
ఉండాలి. న్యాయతీర్పు పైవస్త్రంమీద ఈ రత్నాలన్నీ
నిలబడేట్టు బంగారం ఉపయోగించాలి. 21 ఇశ్రాయేలు
కుమారుల్లో ఒకొక్కరికి ఒకొక్కటి చొప్పున న్యాయ
తీర్పు పైవస్త్రంమీద పన్నెండు రత్నాలు ఉంటాయి.
ఈ రాళ్లలో ఒక్కోదానిమీద ఇశ్రాయేలు కుమారుల్లో
ఒక్కొక్కరిది ఒక దాని మీది రాయి. ఒక్కోరాయిలో
ఈ పేర్లను ముద్రించినట్టుగా చెక్కు.
22"న్యాయతీర్పు పైవస్త్రానికి స్వచ్ఛమైన బంగా
రంతో గొలుసులు చేయాలి. ఈ గొలుసులు తాడులా
ఉంటాయి. 23బంగారు ఉంగరాలు రెండు చేసి న్యాయప
తకం రెండు మూలల్లో పెట్టు. 24న్యాయతీర్పు
పైవస్త్రం మూలల్లో ఉన్న రెండు ఉంగరాల్లోనుంచి
ఈ బంగారు గొలుసులు రెంటిని దూర్చాలి. 25ఆ
గొలుసుల అవతలి కొనలను ఏఫోదు ముందర రెండు
భుజం బట్టలమీదపెట్టు. 26ఇంకో రెండు బంగారు
ఉంగరాలు చేసి, న్యాయతీర్పు పైవస్త్రం, అవతల ఉన్న
మరి రెండుమూలల్లో పెట్టాలి. ఏఫోదు దగ్గరగా ఉన్న
న్యాయతీర్పు పైవస్త్రం లోపలి వైపు ఇది. 27ఇంకా
రెండు బంగారు ఉంగరాలు చేసి, ఏఫోదు ముందర
భాగంలోని భుజభాగాల అడుగున పెట్టాలి. ఏఫోదు
దట్టీ పైభాగానికి దగ్గరగా బంగారు ఉంగరాలను ఉంచాలి.
28న్యాయతీర్పు పైవస్త్రం ఉంగరాలను ఏఫోదు ఉంగ
రాలకు జత చేయాలి. నడికట్లతో వీటిని జత చేసేం
దుకు నీలం పతకం ఉపయోగించాలి. ఇలా చేయడం
వల్ల న్యాయతీర్పు పైవస్త్రం నడికట్టును పట్టుకొని
ఉంటుంది.
29"అహరోను పరిశుద్ధ స్థలంలో ప్రవేశించినప్పుడు,
ఇశ్రాయేలు కుమారుల పేర్లు ఆయన గుండెమీద
ఉంటాయి. న్యాయం తీర్చడానికి ఆయన ధరించే

---

**ఏఫోదు** ప్రత్యేక అంగీ.

తీర్పు పతకం మీద ఈ పేర్లు ఉంటాయి. ఈ విధంగా
ఇశ్రాయేలు కుమారులు పన్నెండు మందిని యెహోవా
ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకొంటాడు. 30దేవుని నిర్ణ
యాలు తెలుసుకొనేందుకు ఊరీము, తుమ్మీములను
ప్రయోగిస్తాడు. అందుచేత ఊరీము, తుమ్మీములను
న్యాయతీర్పు పైవస్త్రములో ఉంచాలి. అహరోను
యెహోవా ముందర ఉన్నప్పుడు ఈ విషయాలు
అతని గుండెమీద ఉంటాయి. కనుక అహరోను
యెహోవా యెదుట ఉన్నప్పుడు, ఇశ్రాయేలీయు
లకు తీర్పు తీర్చే ఒక విధానాన్ని ఎల్లప్పుడూ తనతో
తీసుక వెళ్తాడు.

## యాజకుల యితర వస్త్రాలు

31"ఏఫోదు పైన ధరించేందుకు ఒక అంగీని
చెయ్యాలి. అంగీని నీలంరంగు బట్టతోనే చెయ్యాలి.
32దాని మధ్యలో తల పట్టేందుకు ఒక రంధ్రం ఉండాలి.
అది మెడచుట్టూ చిరిగిపోకుండా గోటు ఉండాలి.
33నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణం రంగుల బట్టతో దాని
మ్మపండు చేయాలి. అంగీ కింది భాగంలో దానిమ్మ
పండును వేలాడదీయాలి. దానిమ్మపండు మధ్య
బంగారు గంటలు వ్రేలాడదీయాలి. 34అంగీ అడుగున
చుట్టూరా ఒక బంగారు దానిమ్మపండు ఒక గంట,
మరో దానిమ్మపండు, మరో గంట ఇలా ఉండాలి.
35అహరోను యాజకునిగా పని చేసేటప్పుడు ఈ
అంగీని ధరించి, యెహోవా ఎదుట పరిశుద్ధ స్థలంలో
ప్రవేశిస్తాడు. అతడు పరిశుద్ధ స్థలంలో ప్రవేశించే
టప్పుడు గంటలు మోగుతాయి. ఈ విధంగా అహ
రోను మరణించడు.

36"స్వచ్ఛమైన బంగారంతో ఒక బద్ద చేయాలి,
"యెహోవా పరిశుద్ధుడు" అనే మాటలు ఒక ముద్రగా
తలపాగా చుట్టూ ముందరవైపు కట్టేందుకు నీలం
పతకం ఉపయోగించాలి. 38అహరోను దీన్ని తన
తలమీద ధరిస్తాడు. ఇశ్రాయేలీయుల కానుకల విష
యంలో దోషాలు ఏమైన ఉంటే ఆ దోషాన్ని అతడు
భరించినప్పుడు, ఇది అతన్ని పరిశుద్ధంగా ఉంచుతుంది.
ఈ కానుకలు ప్రజలు యెహోవాకు అర్పించేవి. ప్రజల
కానుకలను యెహోవా స్వీకరించేటట్టు అహరోను
దీనిని ఎప్పుడూ తన తలమీద ధరించాలి.

39"అంగీని తయారు చేసేందుకు సున్నితమైన నార
బట్టను ఉపయోగించాలి. తలపాగా చేసేందుకు సున్ని
తమైన నారబట్టను ఉపయోగించాలి. నడికట్టు మీద
బుట్టా కుట్టాలి. 40చొక్కాలు, పట్టాలు, తలపాగాలు
కూడా తయారు చేయాలి. ఇవి వారికి గౌరవమర్యాదలు
కలిగిస్తాయి. 41నీ సోదరుడైన అహరోనుకు, అతని
కుమారులకు ఈ బట్టలు ధరింపజేయాలి. తర్వాత
వారు యాజకులని చూపెట్టేందుకుగాను వారి తలమీద
ఒలీవనూనె పోయాలి. ఇది వాళ్లను యాజకులుగా
చేస్తుంది. ఒక ప్రత్యేక విధానంలో వారు నన్ను సేవిస్తు
న్నారని ఈ విధంగా నీవు తెలియజేస్తావు. అప్పుడు
వారు నన్ను యాజకులుగా సేవిస్తారు.

42"వారి ప్రత్యేక యాజక వస్త్రాల కింద ధరించేం
దుకు శ్రేష్ఠమైన బట్టను ఉపయోగించాలి. లోపల
ధరించే ఈ వస్త్రాలు నడుంనుండి కాళ్ల వరకు ధరించాలి.
43అహరోను, అతని కుమారులు సన్నిధి గుడారములో
ఎప్పుడు ప్రవేశించినా, ఈ వస్త్రాలు ధరించాలి. పరిశుద్ధ
స్థలంలో యాజకులుగా సేవ చేసేందుకు బలిపీఠం
దగ్గరకు ఎప్పుడు వచ్చినా వారు ఈ వస్త్రాలు ధరించాలి.
వారు ఈ వస్త్రాలు ధరించకపోతే, తప్పు చేసిన నేరస్థులై
చావాల్సి వస్తుంది. అహరోను, అతని తర్వాత అతని
కుటుంబం అంతటికీ ఇదంతా నిత్యం కొనసాగే ఒక
చట్టంగా ఉండాలి."

29 "అహరోను, అతని కుమారులు యాజకు
లుగా ఒక ప్రత్యేక విధానంలో నన్ను సేవిస్తు
న్నారని తెలియజేసేందుకు నీవు చేయాల్సిన దానిని
యిప్పుడు నీకు నేను చెబుతాను. ఒక గిత్తను, కళంకం
లేని రెండు పొట్టేళ్లను సంపాదించు. 2తర్వాత పులియ
జేసే పదార్థంలేని సన్నని గోధుమ పిండితో రొట్టె
చేయాలి. ఒలీవ నూనెతో కలిపి చేసే రొట్టెలకు
గూడ అవే వస్తువులు ఉపయోగించాలి. నూనెతో కలిపి
చిన్న చిన్న పల్చటి అప్పడాలు చేయాలి. 3ఈ
రొట్టెలు, అప్పడాలు ఒక బుట్టలో పెట్టాలి. ఆ బుట్టను
అహరోనుకు, అతని కుమారులకు ఇవ్వాలి. అదే సమ
యంలో గిత్తను రెండు పొట్టేళ్లను కూడ వారికి ఇవ్వాలి.

4"తర్వాత అహరోనును అతని కుమారులను
సన్నిధి గుడారం ముందటి ద్వారం దగ్గరకు తీసుకు
రావాలి. నీళ్లతో వాళ్లకు స్నానం చేయించాలి. 5అహ
రోనుకు అతని చొక్కా తొడిగించాలి. ప్రత్యేక ఏఫో
దుతో వుండే అంగీని అతనికి ధరింపజేయాలి. అప్పుడు
ఏఫోదును, న్యాయతీర్పు పైవస్త్రాన్ని అతనికి కట్టాలి.
అందమైన దట్టీని అతనికి కట్టాలి. 6తర్వాత అతని
తలమీద తలపాగ చుట్టాలి. ప్రత్యేక కిరీటాన్ని బంగారు
బద్ద తలపాగా చుట్టూరా ఉంచాలి. 7అభిషేక తైలము
తీసుకొని అతని తలమీద పోయాలి. అహరోను ఈ
పనికి ఏర్పరచబడ్డాడని ఇది సూచిస్తుంది.

8"తర్వాత అతని కుమారులను అక్కడికి తీసుక
రావాలి. వారికి తెల్ల అంగీలు ధరింపజేయాలి. 9అప్పుడు
వారి నడుములకు దట్టీలు చుట్టాలి. ధరించేందుకు
ప్రత్యేక టోపీలను వారికి ఇవ్వాలి. వారు యాజకులుగా
ఉండడం అప్పుడు ప్రారంభం అవుతుంది. శాశ్వతంగా
కొనసాగే ప్రత్యేక చట్టంవల్ల వారు యాజకులుగా
ఉంటారు. ఈ విధంగా అహరోనును, అతని కుమారు
లను నీవు యాజకులుగా చేయాలి.

10"తర్వాత సన్నిధి గుడారం ఎదుటకు గిత్తను తీసు
కురావాలి. అహరోను, అతని కుమారులు ఆ గిత్త తల

మీద వారి చేతులు పెట్టాలి, 11“అప్పుడు ఆ సన్నిధి
గుడారం ఎదుట ఆ గిత్తను చంపాలి. దీనిని యెహోవా
చూస్తాడు. 12అప్పుడు గిత్త రక్తంలో కొంత తీసుకొని
బలిపీఠం దగ్గరకు వెళ్లాలి. బలిపీఠం కొమ్ముల మీద నీ
వేళ్లతో కొంచెం రక్తం చిలకరించాలి. మిగిలిన రక్తం
అంతా బలిపీఠం అడుగున కుమ్మరించాలి. 13తర్వాత
గిత్త లోపలి కొవ్వు అంతా తీయాలి. కాలేయంలో
కొవ్విన భాగాన్ని రెండు మూత్రగ్రంథులను వాటి
చుట్టూ ఉండే కొవ్వును తీసి బలిపీఠం మీద దహించాలి.
14తర్వాత గిత్త మాంసం, చర్మం, ఇతర భాగాలు తీసు
కొని మీ పాళెము వెలుపటికి వెళ్లాలి. అక్కడ, పాళెము
వెలుపల వీటిని కాల్చివేయాలి. ఇది యాజకుల పాపా
లను తీసివేయు అర్పణ.

15“తర్వాత పొట్టేళ్లలో ఒకదాని తలమీద తమ
చేతులు పెట్టమని అహరోనుకు, అతని కుమారులకు
చెప్పు. 16అప్పుడు ఆ పొట్టేలును చంపి ఆ రక్తం
భద్రం చేయాలి. ఆ రక్తాన్ని బలిపీఠం నలువైపుల
వెదచల్లాలి. 17అప్పుడు పొట్టేలును ముక్కలు ముక్క
లుగా కోయాలి. పొట్టేలు లోపలి భాగాలను కాళ్లను
కడగాలి. వీటిని పొట్టేలు తల ఇతరభాగాలతో కలిపి
పెట్టాలి. 18అప్పుడు ఆ మొత్తాన్ని బలిపీఠం మీద
దహించి వేయాలి. ఇది దహించబడ్డ దహన బలి. ఇది
యెహోవాకు అర్పించబడింది. యెహోవా అర్పణను
వాసన చూస్తాడు. అది ఆయనకు ఎంతో ప్రీతికరంగా
ఉంటుంది. ఇది నిప్పు ఉపయోగించి యెహోవాకు
అర్పించే అర్పణ.

19“ఇంకో పొట్టేలు మీద వారి చేతులు వుంచమని
అహరోనుకు, అతని కుమారులకు చెప్పు. 20ఆ పొట్టే
లును చంపి, దాని రక్తం భద్రం చేయాలి. అహరోనుకు,
అతని కుమారులకు వారి కుడి చెవి కొనల మీద ఆ
రక్తం చల్లాలి. ఇంక వారి కుడి చేతుల బొటన వేళ్ల
మీద కొంత రక్తం ఉంచాలి. వారి కుడి పాదాల బొటన
వేళ్లపై మరికొంత రక్తం ఉంచాలి. అప్పుడు బలిపీఠం
మీద నాల్గువైపులా రక్తం చల్లాలి. 21తర్వాత బలిపీఠం
నుండి కొంత రక్తం తీసుకోవాలి. ప్రత్యేక తైలంతో
దాన్ని కలిపి, అహరోను మీద, అతని బట్టల మీద
దాన్ని చల్లాలి. ఆయన కుమారుల మీద, వారి బట్టల
మీద దాన్ని చల్లాలి. అహరోను, అతని కుమారులు
ఒక ప్రత్యేక విధానంలో నన్ను సేవిస్తున్నారని ఇది
సూచిస్తుంది. ప్రత్యేక సందర్భాల్లో మాత్రమే, వారి
బట్టలు ఉపయోగించబడుతాయని ఇది సూచిస్తుంది.

22“అప్పుడు పొట్టేలు నుండి కొవ్వును తీయాలి.
(అహరోనును ప్రధాన యాజకునిగా చేసే ఆచార
క్రమంలో ఉపయోగించబడే పొట్టేలు ఇది). తోక
చుట్టూ ఉండేక్రొవ్వును, శరీరం లోపలి భాగాలను
కప్పివుండే కొవ్వును తీయాలి. కాలేయంలో క్రొవ్విన
భాగాన్ని తీయాలి. మూత్రగ్రంథులు రెండింటిని, కుడి
కాలును తీయాలి. 23పులియని పదార్థం లేకుండా నీవు
చేసిన రొట్టెలు గల బుట్టను తీసుకొని యెహోవా
ముందు పెట్టాలి. బుట్టలోని రొట్టె ఒకటి, ఒలీవ
నూనెతో చేసిన రొట్టె ఒకటి, పలుచని చిన్న అప్పడం
ఒకటి బుట్టలో నుండి బయటికి తీయాలి. 24అప్పుడు
వీటిని అహరోనుకు, అతని కుమారులకు ఇవ్వు.
యెహోవా యెదుట వీటిని తమ చేతులతో పట్టుకొని
ఉండమని వారితో చెప్పు. ఇది యెహోవాకు ప్రత్యేక
మైన అర్పణ. 25అప్పుడు అహరోను, అతని కుమారుల
చేతుల్లోనుంచి వీటిని తీసుకొని, పొట్టేలుతోబాటు
బలిపీఠం మీద పెట్టు. యెహోవా ఈ దహనబలి
అర్పణ వాసన చూసి ఆనందిస్తాడు. ఇది నిప్పు ఉప
యోగించి యెహోవాకు ఇచ్చే అర్పణ.”

26“అప్పుడు పొట్టేలుయొక్క బోరను తీసుకోవాలి.
(ఇది అహరోను ప్రధాన యాజకునిగా చేసే ఆచార
క్రమంలో ఉపయోగించే పొట్టేలు). పొట్టేలు బోరను
యెహోవా సన్నిధిలో ఇచ్చి పుచ్చుకొనే ప్రత్యేక అర్ప
ణగా అర్పించాలి. జంతువుల్లోని ఈ భాగం నీది.
27అప్పుడు అహరోనును ప్రధాన యాజకునిగా చేయు
టకు ఉపయోగించి పొట్టేలు రొమ్ము, కాలు తీసుకో,
వాటిని అహరోనుకు, అతని కుమారులకు ఇయ్యి.
ఇది అర్పణలో ఒక ప్రత్యేక భాగం అవుతుంది. 28ఇశ్రా
యేలు ప్రజలు ఈ భాగాలను అహరోనుకు, అతని
కుమారులకు ఎల్లప్పుడూ ఇస్తూ ఉండాలి. ఇశ్రాయేలు
ప్రజలు యెహోవాకు అర్పణ అర్పించినప్పుడల్లా ఈ
భాగాలు ఎప్పుడూ యాజకులకే చెందుతాయి. ఈ
భాగాలను వారు యాజకులకు ఇచ్చినప్పుడు అవి
యెహోవాకు ఇచ్చినట్టే అవుతుంది.

29“అహరోను తయారు చేసిన ఆ ప్రత్యేక వస్త్రాలను
భద్రం చేయాలి. అతని తర్వాత జీవించే వారందరికీ
ఈ వస్త్రాలు చెందుతాయి. వారు యాజకులుగా
ఏర్పాటు చేయబడినప్పుడు ఈ వస్త్రాలు ధరిస్తారు.
30అహరోను తర్వాత అతని కుమారుడు ప్రధాన యాజ
కుడు అవుతాడు. ఈ కుమారుడు పరిశుద్ధ స్థలంలో
పరిచర్య చేసేందుకు సన్నిధి గుడారంలోనికి వచ్చి
నప్పుడు ఆ వస్త్రాలు ధరిస్తాడు. 31“అహరోనును
ప్రధాన యాజకునిగా చేసేందుకు ఉపయోగించిన
పొట్టేలు మాంసాన్ని ఒక పవిత్ర స్థలంలో వండాలి.
32అప్పుడు అహరోను, అతని కుమారులు సన్నిధి
గుడారం ఎదుటి ద్వారం ముందు ఆ మాంసం తినాలి.
మరియు బుట్టలోని రొట్టెను కూడ వారు తినాలి.
33వారు యాజకులుగా చేయబడ్డప్పుడు వారి పాపా
లను పరిహరించేందుకు ఈ అర్పణలు ఉపయోగించ
బడ్డాయి. ఇప్పుడు వారు ఈ అర్పణలను తినాలి.
34ఆ పొట్టేలు మాంసంలోగాని, ఆ రొట్టెలోగాని ఏమైనా
మర్నాటి ఉదయానికి మిగిలి ఉంటే దానిని కాల్చి
వేయాలి. ఆ రొట్టె, మాంసం. ఒక ప్రత్యేక సమ

యంలో, ఒక ప్రత్యేక విధానంలో మాత్రమే తినవలసి
నవి గనుక మీరు వాటిని తినకూడదు.
35 "అహరోను, అతని కుమారులకోసం నీవు చేయా
లని నేను నీకు ఆజ్ఞాపించిన వీటన్నింటినీ నీవు
చేయాలి. వీటిని ఏడురోజుల వ్యవధిలో నీవు చేయాలి.
36 రోజుకు ఒక ఎద్దు చొప్పున ఏడు రోజులు వధించాలి.
ఇది అహరోను, అతని కుమారుల పాపముకోసం
అర్పణగా ఉంటుంది. బలిపీఠాన్ని పవిత్రం చేసేందుకు
నీవు ఈ బలులను ఉపయోగించాలి. బలిపీఠాన్ని
పవిత్రం చేసేందుకు దాని మీద ఒలీవ నూనెపోయాలి.
37 ఏడురోజుల పాటు బలిపీఠాన్ని నీవు పవిత్రం
చేయాలి. ఆ సమయంలో బలిపీఠం అతిపవిత్రం అవు
తుంది. 38 "బలిపీఠం మీద ప్రతిరోజూ ఒక అర్పణ
అర్పించాలి. ఒక సంవత్సరం వయస్సుగల రెండు గొర్రె
పిల్లల్ని వధించాలి. 39 ఒక గొర్రెపిల్లను ఉదయం, మరో
గొర్రెపిల్లను సాయంత్రం అర్పించాలి. 40-41 మొదటి
గొర్రె పిల్లను నీవు వధించినప్పుడు పదవవంతు సన్నటి
గోధుమ పిండిని ఒక పావు ద్రాక్షారసంతో కలిపి అర్ప
ణగా చేయాలి. ఉదయం చేసినట్టే సాయంత్రం రెండో
గొర్రెపిల్లను వధించినప్పుడు కూడ పదవవంతు సన్నని
పిండిని అర్పించాలి. ఒక పావు ద్రాక్షారసం అర్పించాలి.
ఇది యెహోవాకు భోజన అర్పణం అవుతుంది. ఈ
అర్పణ నీవు దహించినప్పుడు, యెహోవా దీని సువాస
నను చూసి ఆనందిస్తాడు.
42 "ప్రతిరోజూ యెహోవాకు అర్పణగా వీటిని నీవు
దహించాలి. సమావేశ గుడారం ముందు ద్వారం దగ్గర,
యెహోవా ఎదుట వీటిని చేయాలి. ఇలానే ఎల్ల
ప్పుడూ చేస్తూ ఉండాలి. నీవు అర్పణ అర్పించు
నప్పుడు, యెహోవానైన నేను నిన్ను అక్కడ కలుసు
కొని నీతో మాట్లాడుతాను. 43 ఆ స్థలంలో నేను ఇశ్రా
యేలు ప్రజల్ని కలుసుకొంటాను. నా మహిమవల్ల ఆ
స్థలం పవిత్రపర్చబడుతుంది."
44 "కనుక సన్నిధి గుడారాన్ని నేను పవిత్రం చేస్తాను.
మరియు బలిపీఠాన్ని నేను పవిత్రం చేస్తాను. అహ
రోను, అతని కుమారులు నాకు యాజకులుగా సేవ
చేయగలిగేటట్టు నేను వారిని పవిత్రం చేస్తాను. 45 నేను
ఇశ్రాయేలు ప్రజలతో నివసిస్తాను. నేను వారికి దేవుడిగా
ఉంటాను. 46 'నేనే యెహోవాను, వారి దేవుడ్ని', అని
ప్రజలు తెలుసుకొంటారు. నేను వారితో నివసిం
చేందుకు వారిని 'ఈజిప్టునుండి బయటికి రప్పించింది
నేనే' అని వారు తెలుసుకొంటారు. నేనే వారి దేవుడైన
యెహోవాను."

## ధూప పీఠం

30 "తుమ్మ కర్రతో ఒక వేదిక చేయి. ధూపం
వేసేందుకు ఈ పీఠమును నీవు ఉపయోగిం
చాలి. 2 వేదికను 18 అంగుళాలు పొడవు, 18 అంగుళాలు
వెడల్పు గల చతురస్రముగా నీవు చేయాలి. దీని
ఎత్తు 36 అంగుళాలు ఉండాలి. నాలుగు మూలల
కొమ్ములు ఉండాలి. ఈ కొమ్ముల్ని వేదికతో కలిపి
ఒకటిగా చేయాలి. 3 బలిపీఠం పైభాగాన్ని, అన్ని ప్రక్క
లను స్వచ్ఛమైన బంగారం పొదిగించాలి. బలిపీఠం
చుట్టూ బంగారు నగిషిబద్ద పెట్టాలి. 4 నగిషీబద్ద అడుగు
భాగాన బంగారు ఉంగరాలు నాలుగు ఉండాలి. ఈ
బలిపీఠానికి ఎదురుగా రెండు బంగారు ఉంగరాలు
ఉండాలి. బలిపీఠం మోసే కర్రలకోసం ఈ బంగారు
ఉంగరాలు ఉపయోగించబడతాయి. 5 తుమ్మకర్రతోనే
ఆ కర్రలు చేయాలి. కర్రలకు బంగారు తాపడం
చేయాలి. 6 ప్రత్యేక తెరముందు ఈ బలిపీఠాన్ని
ఉంచాలి. ఒడంబడిక పెట్టెను తెర అవతల ఉంచాలి.
ఆ పెట్టె మూతకు ముందర బలిపీఠం ఉంచాలి. నేను
నిన్ను కలుసుకొనే చోటు ఇదే."
7 "ప్రతీ ఉదయం పరిమళ ద్రవ్యాల ధూపాన్ని
బలిపీఠం మీద అహరోను వేయాలి. దీపాలు సరిచేసేం
దుకు వచ్చినప్పుడు అతడు దీనిని చేయాలి. 8 మరల
సాయంత్రం అతడు ధూపం వేయాలి. ఇది అతడు
సాయంత్రం దీపాలను సరిచేసే వేళ. కనుక ప్రతిరోజూ
శాశ్వతంగా యెహోవా ఎదుట ధూపం వేయబడు
తుంది. 9 ఇంకేవిధమైన ధూపం వేసేందుకు గాని, దహన
బలి కోసంగాని ఈ బలిపీఠాన్ని ఉపయోగించవద్దు. ఏ
విధమైన ధాన్యార్పణగాని, పానార్పణంగాని అర్పించేం
దుకు ఈ బలిపీఠాన్ని ఉపయోగించవద్దు."
10 "సంవత్సరానికి ఒక సారి అహరోను యెహోవాకు
ఒక ప్రత్యేక బలి అర్పించాలి. ప్రజల పాపపరిహారం
నిమిత్తం చెల్లించేందుకు పాపపరిహారార్థ బలి రక్తాన్ని
అహరోను ఉపయోగించాలి. ఈ బలిపీఠపు కొమ్ముల
దగ్గర అహరోను దీనిని చేయాలి. ఇది, ప్రాయశ్చిత్తార్థ
దినం అని పిలువబడుతుంది. ఇది యెహోవాకు అతి
ప్రత్యేక దినం."

## ఆలయం పన్ను

11 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు, 12 "ఎంత
మంది ప్రజలు ఉన్నారో నీకు తెలిసేటట్టు, ఇశ్రాయేలు
ప్రజల్ని లెక్కబెట్టు. ఇలా చేసినప్పుడల్లా, ప్రతి వ్యక్తీ
తనకోసం యెహోవాకు పన్ను చెల్లించాలి. ప్రతి
వ్యక్తీ ఇలా చేస్తే ఏ విధమైన దారుణం ప్రజలకు సంభ
వించదు. 13 లెక్కించబడ్డ ప్రతి మనిషీ అరతులం చెల్లిం
చాలి. (ఇది అధికార పూర్వకమైన తులంలో సగం,
అధికార తులం అంటే 20 గొర్రెలు). ఈ అరతులం
యెహోవాకు అర్పణం 14 లెక్కించబడి, 20 సంవ
త్సరాలు లేక అంతకు ఎక్కువ వయసుగల ప్రతి వ్యక్తీ
యెహోవాకు ఈ అర్పణ చెల్లించాలి. 15 ధనికులు
అరతులం కంటె ఎక్కువ చెల్లించకూడదు. ప్రజలం
దరూ ఒకే అర్పణ యెహోవాకు చెల్లించాలి. ఇది మీ

ప్రాణం కోసం చెల్లించే అర్పణ. [16]ఇశ్రాయేలు ప్రజల దగ్గర్నుండి ఈ సొమ్ము పోగుచేయి. సన్నిధి గుడారంలో సేవకోసం ఈ సొమ్ము ఉపయోగించు. యెహోవా తన ప్రజలను జ్ఞాపకం ఉంచుకొనేందుకు ఈ చెల్లింపు ఒక విధానం. వారు తమ స్వంత ప్రాణాల నిమిత్తం చెల్లిస్తారు."

### కడుగుకొనేందుకు గంగాళం

[17]మోషేతో యెహోవా ఇలా చెప్పాడు, [18]"ఇత్తడి గంగాళం* ఒకటి చేసి ఇత్తడి పీటమీద దాన్ని పెట్టు. కడుగుకొనేందుకు నీవు దీనిని ఉపయోగించాలి. సన్నిధి గుడారానికి, బలిపీఠానికి మధ్య దీనిని ఉంచి, నీళ్లతో నింపు. [19]ఈ గంగాళంలోని నీళ్లతో అహరోను, అతని కుమారులు వారి కాళ్లు చేతులు కడుక్కోవాలి. [20]సన్నిధి గుడారం ప్రవేశించేటప్పుడు, లేక బలిపీఠం సమీపించేటప్పుడు ప్రతిసారీ వారు నీళ్లతో కడుక్కోవాలి. ఈ విధంగా వారు మరణించరు. [21]మరియు తమ చావకుండా ఉండేందుకు వారు తమ కాళ్లు చేతులు కడుక్కోవాలి. అహరోనుకీ, అతని ప్రజలకీ ఎప్పటికీ కొనసాగే చట్టం యిది. భవిష్యత్తులో జీవించే అహరోను సంతతి వాళ్లందరికీ యిది కొనసాగుతుంది."

### అభిషేక తైలం

[22]అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [23]"శ్రేష్ఠమైన సుగంధద్రవ్యాలు సంపాదించు. పరిమళ ధూపం చేయడానికి 500 తులాల స్వచ్ఛమైన గోప రసం, 250 తులాల సువాసనగల లవంగపట్ట, 500 తులాల సుగంధద్రవ్యాలు, [24]500 తులాల లవంగపట్ట తీసుకో. వీటన్నింటినీ కొలిచేందుకు అధికారిక కొలత ఉపయోగించు. మరియు మూడు పళ్ల ఒలీవ నూనె తీసుకో. [25]"ఒక పరిమళ అభిషేక తైలంగా చేయటానికి వీటన్నింటినీ కలపాలి. [26]సన్నిధి గుడారం మీద, ఒడంబడిక పెట్టె మీద ఈ తైలం పోయి, వీటికి ఒక ప్రత్యేక ఉద్దేశం వుంది అని ఇది తెలియజేస్తుంది. [27]బల్ల మీద, బల్లమీద ఉన్న పాత్రలన్నింటిమీద తైలం పోయి. దీపం మీద, దాని పరికరాలన్నింటి మీద ఈ తైలం పోయి. ధూపవేదిక మీద తైలం పోయి. [28]ఇంకా దేవునికి అర్పణలు దహనం చేసే బలిపీఠం మీద తైలం పోయి. ఆ బలిపీఠం పైన ఉండే సమస్తం మీద ఈ తైలం పోయి. గంగాళంమీద, దాని పీటమీద ఈ తైలం పోయి. [29]వీటన్నింటినీ నీవు పవిత్రం చేయాలి. అవి యెహోవాకు చాల ప్రత్యేకం. వీటిని ఏది తాకినా అది పవిత్రం అవుతుంది.

[30]"అహరోను, అతని కుమారుల మీద ఈ తైలం పోయి. వారు ఒక ప్రత్యేక విధానంలో నన్ను సేవిస్తున్నారని ఇది తెలియజేస్తుంది. అప్పుడు యాజకులుగా వారు నా సేవ చేయవచ్చు. [31]అభిషేక తైలం ఎల్లప్పుడు నాకు ప్రత్యేకమైనదిగా ఉంటుందని ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు. [32]సామాన్యమైన సుగంధ తైలంగా ఎవరూ దీనిని వాడకూడదు. ఈ ప్రత్యేక తైలం తయారు చేసిన విధానంలో సుగంధ తైలం తయారు చేయకూడదు. ఈ తైలం పవిత్రం, ఇది మీకు చాల ప్రత్యేకమైనదిగా ఉండాలి. [33]ఎవరైనా ఈ పవిత్ర తైలం వలె సుగంధ తైలం తయారు చేసి అన్యునికి యిస్తే, ఆ వ్యక్తి తన ప్రజల్లో నుండి వేరు చేయబడాలి.

### ధూపం

[34]అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు, "ఈ పరిమళ ద్రవ్యాలను తీసుకరా! జటామాంసి, గోపి చందనం, గంధపుచెక్క, స్వచ్ఛమైన సాంబ్రాణి. ఈ పరిమళ ద్రవ్యాలన్నీ సమపాళ్లలో ఉండేటట్టు తప్పక చూడాలి. [35]సుగంధ పరిమళ ధూపంగా ఉండేటట్టు ఈ పరిమళ ద్రవ్యాలన్నిటినీ కలపాలి. పరిమళ తైలం తయారుచేసే వాడు చేసినట్టే దీనిని చేయాలి. మరియు ఈ ధూపంలో ఉప్పు కలుపు. అది దీనిని స్వచ్ఛమైనదిగా, ప్రత్యేకమైనదిగా చేస్తుంది. [36]ధూప ద్రవ్యంలో కొంత మెత్తటి పొడుం అయ్యేంత వరకు నూరాలి. సన్నిధి గుడారంలో, ఒడంబడిక పెట్టె ఎదుట ఆ పొడుం ఉంచు. ఇది నేను నిన్ను కలుసుకొనే చోటు. ఈ ధూపపు పొడుంను దాని ప్రత్యేక పని కోసమే నీవు ఉపమోగించాలి. [37]యెహోవా కోసం ఈ ప్రత్యేక విధానంలో మాత్రమే నీవు ఈ ధూపాన్ని ఉపయోగించాలి. ఈ ధూపాన్ని ఒక ప్రత్యేక పద్ధతిలో నీవు తయారు చేయాలి. ఇంకే యితరమైన ధూపం చేయడానికి కూడ ఈ ప్రత్యేక పద్ధతిని వినియోగించవద్దు. [38]ఒక వ్యక్తి, తన కోసం ఈ ధూపం కొంత తయారు చేసి, దాని పరిమళాన్ని అనుభవించాలని కోరవచ్చు. అయితే, అతడు గనుక అలా చేస్తే, వాడు తన ప్రజల నుండి వేరు చేయబడాలి."

### బెసలేలు, అహోలాయాబు

31 అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [2]"యూదా గోత్రంలో ఊరు కుమారుడైన బెసలేలును నేను ఏర్పరచుకొన్నాను (హూరు కుమారుడు ఊరు). [3]బెసలేలును నేను దేవుని ఆత్మతో నింపాను. అన్ని రకాల వస్తువులు చేసేందుకు జ్ఞానం, నైపుణ్యం నేను అతనికి ఇచ్చాను. [4]నమూనాలు గీయటంలో బెసలేలు చాల ప్రజ్ఞ గలవాడు. బంగారు, వెండి, ఇత్తడితో అతడు వస్తువులు చేయగలడు. [5]బెసలేలు అందమైన నగలను చెక్కి, పొదుగగలడు. అతడు చెక్క పని చేయగలడు. బెసలేలు అన్ని రకాల పనులు చేయగలడు. [6]అతనితో పని చేయటానికి అహోలియాబును

---

**గంగాళం** లోహములో చేయబడిన పాత్ర.

కూడ నేను ఏర్పరచుకొన్నాను. అహాలీయాబు దాను
గోత్రపు అహీసామాకు కుమారుడు. నేను నీకు ఆజ్ఞా
పించిన వాటన్నింటినీ చేయగలిగేటట్టు మిగిలిన పని
వాళ్లందరికీ నేను నైపుణ్యం యిచ్చాను."

7 "సన్నిధి గుడారం ఒడంబడిక పెట్టె పెట్టెను
మూసే కరుణా పీఠము.
8 బల్ల, దానిమీద ఉండాల్సినవన్నీ ధూప వేదిక
9 దహన బలులు దహించే బలిపీఠం బలిపీఠం దగ్గర
ఉపయోగించే వస్తువులు గంగాళం, దాని క్రింద
పీట.
10 యాజకుడు అహరోనుకు ప్రత్యేక వస్త్రాలన్నీ,
అతని కుమారులు యాజకులుగా పరిచర్య చేసే
టప్పుడు ధరించాల్సిన ప్రత్యేక వస్త్రాలన్నీ,
11 అభిషేకానికి పరిమళ సువాసనగల తైలం, పవిత్ర
స్థలానికి అవసరమైన పరిమళ వాసనగల ధూపం.

ఈ పని వాళ్లు నేను నీకు ఆజ్ఞాపించిన ప్రకారం
అన్ని వస్తువులనూ తయారు చేస్తారు."

### సబ్బాతు

12అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
13"ఇశ్రాయేలు ప్రజలతో దీన్ని చెప్పు; 'నా ప్రత్యేక
విశ్రాంతి రోజులను గూర్చిన నియమాలను మీరు
పాటించాలి. రాబోయే తరాలన్నింటిలో మీకు, నాకు
మధ్య అవి ఒక గురుతుగా ఉంటాయి కనుక మీరు
ఇలా చేయాలి. యెహోవానైన నేనే మిమ్మల్ని నా
ప్రత్యేక ప్రజలుగా ఏర్పరచుకొన్నానని ఇది మీకు
తెలియజేస్తుంది."
14"'సబ్బాతు* రోజును ఒక ప్రత్యేక రోజుగా చేయి.
ఏ వ్యక్తి అయినా సరే సబ్బాతు రోజును మామూలు
రోజుగానే పరిగణిస్తే, ఆ వ్యక్తిని చంపేయాలి. సబ్బాతు
రోజున ఏవ్యక్తి అయినా సరే పనిచేస్తే ఆ వ్యక్తి తన
ప్రజల నుండి వేరు చేయబడాలి.
15పని చేయడానికి వారంలో ఇంకా ఆరు
రోజులున్నాయి. అయితే, ఏడో రోజు చాల
ప్రత్యేకమైన విశ్రాంతి రోజు. సబ్బాతు నాడు ఏ వ్యక్తి
అయినా సరే పనిచేస్తే వాణ్ణి చంపెయ్యాలి.
16ఇశ్రాయేలు ప్రజలు సబ్బాతు రోజును జ్ఞాపకం ఉంచు
కొని, దాన్ని ఒక ప్రత్యేక రోజుగా చేయాలి. ఇది
నాకూ, వారికీ మధ్య శాశ్వతంగా కొనసాగే ఒడంబడిక
17ఇశ్రాయేలీయులకూ, నాకూ మధ్య శాశ్వత సంకేతం
సబ్బాతు రోజే. యెహోవా ఆరు రోజులు పనిచేసి
ఆకాశాన్ని, భూమిని చేసాడు. ఏడోరోజున ఏ పని
చేయక విశ్రాంతి తీసుకొన్నాడు.'"

18అలా సీనాయి పర్వతం మీద యెహోవా
మోషేతో మాట్లాడ్డం ముగించాడు. అప్పుడు ఆజ్ఞలు
రాయబడ్డ రెండు రాతి పలకలను యెహోవా మోషేకు
ఇచ్చాడు. దేవుడు తన వ్రేలితో రాళ్లమీద ఈ ఆజ్ఞలు
రాసాడు.

### బంగారు దూడ

32 చాలాకాలం గడిచిపోయినా, మోషే పర్వతం
దిగి రాకపోవడం ప్రజలు గమనించారు. కనుక
ప్రజలు అహరోను చుట్టూ చేరారు, "చూడు, ఈజిప్టు
దేశం నుండి మోషే మమ్మల్ని బయటకు నడిపిం
చాడు. అయితే అతనికి ఏమయిందో మాకు తెలి
యదు. అందుచేత మాముందర నడవడానికి ఒక
దేవతను చేసి మమ్మల్ని నడిపించు" అని వారతనితో
చెప్పారు.
2"మీ భార్యలు, కుమారులు, కుమార్తెలకు చెందిన
బంగారు వస్తువులను తీసుకురండి" అని అహరోను
ప్రజలతో అన్నాడు. 3కాబట్టి ప్రజలంతా వారి బంగారు
వస్తువులను పోగుచేసి వాటిని అహరోను దగ్గరకు
తెచ్చారు. 4ప్రజల దగ్గర నుండి అహరోను బంగారం
తీసుకున్నాడు. అప్పుడు వాటితో ఒక దూడ విగ్రహం
చేసాడు. విగ్రహం చెక్కడానికి అహరోను ఉలి ఉపయో
గించాడు. (తర్వాత దానికి బంగారం పొదిగించాడు.)
అప్పుడు ప్రజలు, "ఓ ఇశ్రాయేలూ, ఈజిప్టు నుండి
మిమ్మల్ని బయటకు నడిపించింది ఈ దేవుడే"
అన్నారు.
5అహరోను వీటన్నింటినీ చూసాడు. కనుక ఆ
దూడ ఎదుట ఒక బలిపీఠం నిర్మించాడు. అప్పుడు
అహరోను ఒక ప్రకటన చేసాడు. "రేపు యెహోవాకు
ప్రత్యేక పండుగ" అని చెప్పాడు.
6మర్నాడు ఉదయం పెందలాడే ప్రజలు మేల్కొ
న్నారు. వాళ్లు జంతువులను చంపి దహన బలులుగాను,
సమాధాన బలులుగాను అర్పించారు. తిని, తాగేందుకు
ప్రజలు కూర్చున్నారు. అప్పుడు వాళ్లు విచ్చలవిడిగా
సంబరం చేసుకున్నారు.
7అదే సమయంలో మోషేతో యెహోవా ఇలా
అన్నాడు: "ఈ పర్వతం దిగి వెళ్లు. నీ ప్రజలు, ఈజిప్టు
దేశం నుండి నీవు బయటకు తీసుకు వచ్చిన ప్రజలు
భయంకర పాపం చేసారు. 8వాళ్లు చేయాలని నేను
ఆజ్ఞాపించిన సంగతుల నుండి వాళ్లు చాల త్వరగా
తప్పి పోయారు. కరగించిన బంగారంతో వాళ్లు ఒక
దూడను చేసుకొన్నారు. వాళ్లు ఆ దూడను పూజిస్తూ
దానికి బలులు చెల్లిస్తున్నారు. 'ఇశ్రాయేలూ, ఈజిప్టు
నుండి నిన్ను బయటకు రప్పించిన దేవుడు ఇదే,
అని ప్రజలు చెప్పుకొనుచున్నారు."
9"ఈ ప్రజలను నేను చూశాను. వీళ్లు ఎప్పుడూ
నన్ను వ్యతిరేకించే మొండి ప్రజలని నాకు తెలుసు.
10కనుక కోపంతో వాళ్లను నాశనం చేయనివ్వు,

---

**సబ్బాతు** అది యెహోవాను గౌరవించటానికి ప్రత్యేక
మైన రోజు.

అప్పుడు నీలోనుండి ఒక జనాన్ని నేను తయారు
చేస్తాను" అని మోషేతో యెహోవా అన్నాడు.
11అయితే, మోషే తన దేవుడైన యెహోవాను
బ్రతిమాలుకొని: "ప్రభూ! నీ కోపంచేత నీ ప్రజలను
నాశనం చేయకు. నీవే నీ మహాశక్తితో బలంతో ఈ
ప్రజలను ఈజిప్టు నుండి తీసుకువచ్చావు. 12అయితే,
నీవే నీ ప్రజలను నాశనం చేస్తే, 'యెహోవా తన
ప్రజలకు చెడ్డకార్యాలను చేయాలని తలపెట్టాడు.
అందుకే ఆయన వాళ్లను ఈజిప్టు నుండి బయటకు
రప్పించాడు. పర్వతాల్లోనే వాళ్లను చంపాలని ఆయన
అనుకున్నాడు. భూమి మీద తన ప్రజల్ని నాశనం
చేయాలని ఆయన అనుకొంటున్నాడు' అని ఈజిప్టు
ప్రజలు చెప్పవచ్చు. కనుక నీ ప్రజల మీద కోపగిం
చవద్దు. నీ కోపం విడిచిపెట్టేయి. నీ ప్రజల్ని నాశనం
చేయకు. 13నిన్ను సేవించిన మనుష్యులు అబ్రహాము,
ఇస్సాకు, ఇశ్రాయేలును (యాకోబు) జ్ఞాపకం చేసుకో.
నీవు నీ పేరు ప్రయోగించి ఆ మనుష్యులకు వాగ్దానం
చేసావు. 'నీ ప్రజలను ఆకాశంలో నక్షత్రాలు ఎన్ని
ఉన్నాయో అంతగా చేస్తాను. నేను వారికి వాగ్దానం
చేసిన ఈ దేశం అంతా నీ ప్రజలకు ఇస్తాను. ఈ
దేశం శాశ్వతంగా వారిదే అవుతుంది' అని నీవు
చెప్పావు"'. 14కనుక యెహోవా తన ప్రజలను గూర్చి
సంతాపపడ్డాడు. ఆయన చేస్తానన్న కీడును వారికి
చేయలేదు. అంటే, ఆ ప్రజలను ఆయన నాశనం
చేయలేదు. 15అప్పుడు మోషే పర్వతం దిగి వెళ్ళాడు.
ఆజ్ఞలు రాయబడ్డ రెండు రాతి పలకలు మోషే దగ్గర
ఉన్నాయి. రాతికి వెనుక, ముందు రెండు వైపుల
ఆజ్ఞలు రాయబడి ఉన్నాయి. 16దేవుడు తానే ఆ
రాళ్లను చేసాడు. మరియు దేవుడే ఆ రాళ్ల మీద
ఆజ్ఞలు రాసాడు.
17వారు పర్వతం దిగి వెళ్తున్నప్పుడు ప్రజలు బస
చేసిన చోటు నుండి వచ్చిన శబ్దం యెహోషువా
విన్నాడు, "కింద బసలో యుద్ధధ్వని వినిపిస్తున్న
ట్టుంది" అని మోషేతో యెహోషువా అన్నాడు.
18"అందుకు మోషే, అది జయధ్వనులు చేస్తున్న
సైన్యం శబ్దం కాదు. ఓటమివల్ల ఒక సైన్యం ఏడుస్తున్న
శబ్దమూ కాదు అది, నాకు వినబడుతోన్నది సంగీత
శబ్దం" అని జవాబిచ్చాడు.
19మోషే బసను సమీపించినప్పుడు, అతడు
బంగారు దూడను, ప్రజలు నాట్యమాడటమూ
చూసాడు. మోషేకు చాలా కోపం వచ్చి, ఆ ప్రత్యేక
రాతి పలకలను నేలకేసి కొట్టాడు. పర్వతం కింది
భాగంలో ఆ రాతి పలకలు ముక్కలు ముక్కల
య్యాయి.
20అప్పుడు ప్రజలు చేసిన దూడను మోషే నాశనం
చేసాడు. దాన్ని మంటల్లో వేసి కరిగిం చేసాడు.
అప్పుడు ఆ బంగారం దుమ్ము అయ్యేంత వరకు
నూరేసాడు. ఆ దుమ్మును నీళ్ళలో పడేసి ఇశ్రాయేలు
ప్రజల చేత బలవంతంగా ఆ నీళ్లు తాగించాడు.
21"ఈ ప్రజలు నీకేమి చేసారు? ఇలాంటి చెడ్డ
పాపం చేయడానికి నీవెందుకు వాళ్లను నడిపిం
చావు?"అని అహరోనును మోషే అడిగాడు.
22"అయ్యా, కోపగించకు. ఈ ప్రజలు తప్పు చేసేం
దుకు ఎప్పుడూ సిద్ధమేనని నీకు తెలుసు. 23'ఈజిప్టు
నుండి మోషే మమ్మల్ని నడిపించాడు. అయితే అతనికి
ఏమయిందో మాకు తెలియదు. కనుక మమ్మల్ని
నడిపించేందుకు మా కోసం ఒక దేవతను తయారు
చేయి' అని ప్రజలు నాతో అన్నారు. 24కనుక 'మీవద్ద
ఉన్న బంగారు నగలను నాకు ఇవ్వండి' అని ప్రజలతో
చెప్పాను. ప్రజలు వారి బంగారం నాకు ఇచ్చారు.
నేను ఆ బంగారాన్ని అగ్నిలో వేసాను. అగ్నిలో నుండి
ఆ దూడ బయటకు వచ్చింది" అని అహరోను జవా
బిచ్చాడు.
25అహరోను అక్కడ గలభాకు కారణమని మోషే
తెలుసుకున్నాడు. శత్రువులంతా చూడగలిగేటట్టు
ప్రజలు వెర్రివాళ్లలా విచ్చలవిడిగా తిరుగుతున్నారు.
26కనుక నివాసాల ప్రవేశం దగ్గర మోషే నిలబడ్డాడు.
"యెహోవాను వెంబడించాలని కోరేవారు ఎవరో వారు
నా దగ్గరకు రావాలి." అన్నాడు. లేవీ కుటుంబానికి
చెందిన ప్రజలంతా మోషే దగ్గరకు పరుగెత్తారు.
27అప్పుడు మోషే అన్నాడు, "ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవా ఏమి చెబుతున్నాడో నేను మీకు
చెబుతాను. 'ప్రతి మనిషీ తన కత్తి తీసుకొని మన
బసలో ఒక చివర నుండి మరో చివరకు వెళ్లాలి. ప్రతి
మనిషి తన సోదరుణ్ణి, స్నేహితుల్ని, ఇరుగు పొరుగువా
రిని చంపాల్సి వచ్చినా మీరు వారిని చంపాలి." 28లేవీ
కుటుంబానికి చెందిన ప్రజలు మోషే మాటకులో
బడ్డారు. ఆ రోజు ఇశ్రాయేలీయులతో సుమారు 3000
మంది చనిపోయారు. 29అప్పుడు, "మీ కుమారులను
మీ సోదరులను దీవించే వారినిగా యెహోవా నేడు
మిమ్మల్ని ఏర్పరచుకున్నాడు" అని మోషే చెప్పాడు.
30మర్నాటి ఉదయం ప్రజలందరికీ మోషే, "మీరు
భయంకర పాపం చేసారు. అయితే ఇప్పుడు నేను
యెహోవా దగ్గరకు పైకి వెళ్తాను. ఆయన మీ పాపం
విషయం మిమ్మల్ని క్షమించేందుకు నేనేమైనా చేయ
గలనేమో" అని చెప్పాడు. 31కనుక మోషే యెహోవా
దగ్గరకు తిరిగి వెళ్లి, "దయచేసి ఆలకించు! ఈ ప్రజలు
చాలా చెడ్డ పాపం చేసి, బంగారంతో దేవుణ్ణి చేసారు.
32ఇప్పుడు ఈ పాపం విషయం వారిని క్షమించు.
నీవు గనుక వారిని క్షమించకపోతే, నీవు వ్రాసిన
గ్రంథంలో* నా పేరు తుడిచేయి" అన్నాడు.

---

**గ్రంథం** ఇది బహుశా జీవ గ్రంథం కావచ్చు. దేవుడు
తన ప్రజలందరి పేర్లు వ్రాసిన పుస్తకం ఒకటి పెట్టు
కుంటాడన్నట్టు ఉంది.

33అయితే మోషేతో యెహోవా అన్నాడు, "నాకు
వ్యతిరేకంగా ఎవరు పాపం చేస్తారో ఆ ప్రజల పేర్లు
మాత్రమే నా గ్రంథంలో నుండి తుడిచి వేస్తాను.
34కనుక కిందకు వెళ్లి, నేను నీకు చెప్పిన చోటుకు
ప్రజలను నడిపించు. నీకు ముందు నా దేవదూత
నడుస్తూ నిన్ను నడిపిస్తాడు. పాపం చేసిన వాళ్లను
శిక్షించవలసిన సమయం వచ్చినప్పుడు వాళ్లు శిక్షిం
చబడుతారు:" 35కనుక ఆ ప్రజలకు భయంకర వ్యాధి
వచ్చేటట్టు యెహోవా చేసాడు. వారు బంగారు
దూడను చేయమని అహరోనుతో చెప్పినందువల్ల
ఆయన అలా చేసాడు.

## నేను మీతో రాను

33 అయితే మోషేతో యెహోవా యిలా
అన్నాడు: "ఈజిప్టు నుండి నీవు బయటకు
తీసుకు వచ్చిన నీ ప్రజలూ, నీవూ ఇక్కడనుండి వెళ్లి
పోవాలి. అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు ఇస్తానని
నేను వాగ్దానం చేసిన దేశానికి వెళ్లండి. నేను వాళ్లకు
వాగ్దానం చేసాను. మీ సంతానమునకు ఆ దేశాన్ని
ఇస్తానని నేను చెప్పాను. 2 మీకు ముందు వెళ్లడానికి
ఒక దూతను నేను పంపిస్తాను. కనానీయులను, అమోరీ
యులను, హిత్తీయులను, పెరిజ్జీయులను, హివ్వీయు
లను, యెబూసీయులను నేను ఓడిస్తాను. ఆ ప్రజలు
మీ దేశాన్ని విడిచి పెట్టేసేటట్టు బలవంతం చేస్తాను.
3కనుక అనేక మంచి వాటితో నిండిన దేశానికి వెళ్లండి.
కానీ నేను మీతో రాను. మీరు చాలా మొండివారు.
నేను మీతో వస్తే మార్గంలో కోపంవచ్చి మిమ్మల్ని
నేను నాశనం చేయవల్సి వస్తుందేమో."
4ఈ దుర్వార్తను ప్రజలు విని చాలా విచారించారు.
దీని తర్వాత ప్రజలు నగలు పెట్టుకోలేదు.
5""మీరు మొండివారు నేను మీతో కొంచెంసేపు
ప్రయాణం చేసినా సరే నేను మిమ్మల్ని నాశనం
చేయాల్సి వస్తుంది. కనుక మీ నగలన్నీ తీసి వేయండి.
అప్పుడు మీ విషయం ఏమి చేయాలో నేను ఆలోచి
స్తాను"" అని మోషేతో యెహోవా చెప్పినందువల్ల
వారు నగలు ధరించలేదు. 6కనుక హోరేబు కొండ
దగ్గర ఇశ్రాయేలు ప్రజలు వారి నగలన్నీ తీసి వేసారు.

## తాత్కాలిక సన్నిధి గుడారం

7గుడారాన్ని, నివాస డేరాలకు కొంత దూరం బయ
టకు జరిపాడు మోషే. "సన్నిధి గుడారం" అని మోషే
దానికి పేరు పెట్టాడు. ఏ వ్యక్తిగాని యెహోవాను
ఏదైనా అడగాలంటే, నివాస డేరాలకు వెలుపల ఉన్న
సన్నిధి గుడారానికి వెళ్లాల్సి వచ్చింది. 8ఎప్పుడేనా సరే,
బయటకు ఆ గుడారానికి మోషే వెళ్తే ప్రజలంతా
అతన్ని గమనిస్తూ ఉండేవారు. ప్రజలంతా వారి గుడా
రపు ద్వారం దగ్గర నిలబడి మోషే సన్నిధి గుడారంలో
ప్రవేశించేవరకు అతణ్ణి గమనించి చూస్తుండేవారు.
9మోషే సన్నిధి గుడారంలోకి వెళ్లినప్పుడల్లా స్తంభంలా
నిలువుగా ఉన్న మేఘం నిలిచి ఉండేది. ఈ విధంగా
మోషేతో యెహోవా మాట్లాడతాడు.
10సన్నిధి గుడారపు ద్వారం దగ్గర మేఘాన్ని
చూడగానే ప్రజలు యెహోవాను ఆరాధించుటకు
సాష్టాంగపడేవారు. 11మోషేతో ముఖాముఖిగా
యెహోవా మాట్లాడాడు. ఒక మనిషి తన స్నేహితు
నితో మాట్లాడినట్లు మోషేతో యెహోవా మాట్లా
డాడు. దేవునితో మాట్లాడిన తర్వాత, మోషే ఎప్పుడూ
బసకు వెళ్లిపోయేవాడు. నూను కుమారుడైన యెహో
షువ అనే ఒక యువకుడు మోషేకు సహాయకుడు.
మోషే సన్నిధి గుడారం వదిలినప్పుడల్లా యెహోషువ
సన్నిధి గుడారంలో నిలిచి ఉండేవాడు.

## యెహోవా మహిమను మోషే చూశాడు

12యెహోవాతో మోషే ఇలా అన్నాడు: "ఈ
ప్రజల్ని నడిపించమని నీవు చెప్పావు. నాతో ఎవర్ని
నీవు పంపిస్తావో నీవు చెప్పలేదు. 'నీవు నాకు బాగా
తెలుసు. నిన్ను గూర్చి నేను ఆనందిస్తున్నాను.' అని
నీవు నాతో చెప్పావు. 13నిజంగా నేను నీకు ఆనందం
కలిగించి ఉంటే, నీ మార్గాలు నాకు బోధించు. నేను
నిన్ను వాస్తవంగా తెలుసుకోవాలని కోరుతున్నాను.
అలాగైతే, నేను ఎల్లప్పుడూ నిన్ను సంతోషపెడ్తూ
ఉండగలుగతాను. వీళ్లంతా నీ ప్రజలని జ్ఞాపకం
ఉంచుకో." 14"నేను నీతో కూడా వస్తాను నేను
మిమ్మల్ని నడిపిస్తాను" అని యెహోవా జవాబిచ్చాడు.
15అప్పుడు మోషే ఆయనతో అన్నాడు: "నీవు
మాతో రాకపోతే మాత్రం, మమ్మల్ని యిక్కడ నుండి
పంపించి వేయకు. 16మరియు నా విషయంలో, ఈ
ప్రజల విషయంలో నీవు సంతోషిస్తున్నట్టు మాకెలా
తెలుస్తుంది? నీవు మాతో కూడా వస్తే, అప్పుడు
మాకు తెలుస్తుంది. నీవు మాతో రాకపోతే, ఈ భూమి
మీద ఉన్న ఏ ఇతర ప్రజలకంటే నేను, ఈ ప్రజలు
ప్రత్యేకం కాదు."
17అప్పుడు మోషేతో యెహోవా ఇలా అన్నాడు:
"నీవు అడిగినట్టు నేను చేస్తాను. నీ పట్ల నాకు ఆనందం
గనుక నేను ఇలా చేస్తాను. నీవు నాకు బాగా తెలుసు."
18అప్పుడు మోషే, "అలాగైతే నీ మహిమ నాకు
చూపించు" అన్నాడు.
19అప్పుడు యెహోవా జవాబిచ్చాడు: "నా
మంచితనం అంతా నీ ముందు నడిచేటట్లు చేస్తాను.
నేను యెహోవాను. నీకు వినబడేటట్టు నా పేరు
నేను ప్రకటిస్తాను. నేను ప్రకటించుకున్న వారికి ప్రేమ,
దయ నేను చూపెడతాను. 20కాని నా ముఖం నీవు
చూడలేవు. ఏ మనిషీ నన్ను చూచి కూడా బ్రతకలేడు."

21“అక్కడ నా దగ్గర ఒక చోట ఒక బండ వుంది.
నీవు ఆ బండమీద నిలబడవచ్చు. 22నా మహిమ ఆ
స్థలాన్ని దాటి వెళ్తుంది. ఆ బండలోని ఒక పెద్ద
సందులో నేను నిన్ను ఉంచి, నేను దాటి వెళ్లేటప్పుడు,
నా చేతితో నిన్ను కప్పుతాను. 23అప్పుడు నేను నా
చేయిని తీసివేస్తాను. నీవు నా వెనుకవైపు చూస్తావు.
కాని నా ముఖం మాత్రము నీవు చూడలేవు.”

### కొత్త రాతి పలకలు

34 అప్పుడు మోషేతో యెహోవా ఇలాగు
చెప్పాడు: “ముందు పగులగొట్టబడ్డ రెండు
రాతి పలకల్లాంటివే మరో రెండు రాతి పలకలు
తయారు చేయి. మొదటి రెండు రాళ్లమీద రాయబడ్డ
మాటలే ఈ రాళ్ల మీద నేను రాస్తాను. 2రేపు ఉదయం
సిద్ధంగా ఉండు. సీనాయి కొండమీదికి రమ్ము. అక్కడ
కొండ శిఖరం మీద నా ఎదుట నిలబడు. 3నీతో ఇంక
ఏవ్యక్తీ రావడానికి వీలులేదు. కొండమీద ఎక్కడా ఏ
వ్యక్తీ కనబడకూడదు. కనీసం ఆ కొండ కిందకూడ నీ
పశువుల మందలు కాని, గొర్రెల మందలు గాని మేత
కూడ మేయకూడదు.” 4కనుక మొదటి వాటిలాగే
మరో రెండు రాతి పలకలను మోషే చేసాడు. ఆ
మర్నాడు ఉదయాన్నే సీనాయి కొండ మీదికి అతడు
వెళ్లాడు. యెహోవా అతనికి ఆజ్ఞాపించిన ప్రకారమే
అంతా చేసాడు. ఆ రెండు రాతి పలకలను మోషే
తీసుకుని వెళ్ళాడు. 5మోషే కొండ మీద ఉన్నప్పుడు,
ఒక మేఘం మీద యెహోవా దిగి వచ్చాడు. అక్కడ
మోషే దగ్గర యెహోవా నిలబడ్డాడు. అతడు యెహో
వాను పేరుపెట్టి పిలిచాడు.
6మోషే ఎదుట యెహోవా దాటి వెళ్తూ ఇలా
అన్నాడు: “యెహోవా దయ, జాలిగల దేవుడు.
యెహోవా త్వరగా కోపపడడు. యెహోవా మహా
ప్రేమపూర్ణుడు. యెహోవా నమ్మకోదగినవాడు.
7వేలాది తరాలకు దయచూపించే వాడు యెహోవా.
ప్రజలు చేసే తప్పులను యెహోవా క్షమిస్తాడు.
అయితే నేరస్తులను శిక్షించడం యెహోవా
మరచిపోడు. నేరస్తులను యెహోవా శిక్షించడమే కాదు,
వారు చేసే తప్పులవల్ల వారి పిల్లలు, మనుమళ్లు,
మూడు నాలుగు తరాలవరకు శ్రమ అనుభవిస్తారు.”
8వెంటనే మోషే సాష్టాంగపడి యెహోవాను
ఆరాధించాడు. మోషే ఇలా అన్నాడు: 9“ప్రభూ, నా
విషయం నీకు ఇష్టమైతే దయచేసి మాతోకూడా
రమ్ము. వీళ్లు మొండి ప్రజలని నాకు తెలుసు. అయితే
మేము చేసిన తప్పుల విషయంలో మమ్మల్ని
క్షమించు. మమ్మల్ని నీ ప్రజలుగా స్వీకరించు.”
10అప్పుడు యెహోవా చెప్పాడు: “నీ ప్రజ
లందరితో నేను ఈ ఒడంబడికను చేస్తున్నాను. భూమి
మీద ఈ జనం కోసం ఇదివరకు ఎన్నడూ చేయని
అద్భుతకార్యాలు నేను చేస్తాను. యెహోవానైన నేను
మహాఘనుడనని నీతో ఉన్న ప్రజలు చూస్తారు. నేను
నీ కోసం చేసే అద్భుత కార్యాలను వారు చూస్తారు.
11ఈ వేళ నీకు నేను ఆజ్ఞాపిస్తున్న విషయాలకు
లోబడు, నీ శత్రువులు నీ దేశము వదలివెళ్ళి పోయే
టట్టు నేను వారిని బలవంతం చేస్తాను. అమోరీయు
లను, కనానీయులను, హిత్తీయుయులను, పెరిజీయు
లను, హివ్వీయులను, యెబుసీయులను నేను బయ
టకు వెళ్ళగొడతాను. 12జాగ్రత్తగా ఉండు! నీవు
వెళ్తోన్న దేశంలో నివసించే ప్రజలతో ఎలాంటి ఒడం
బడిక చేయకు. ఆ ప్రజలతో నీవు ఏదైనా ఒడంబడిక
చేస్తే, అది నీకు చిక్కు తెచ్చిపెడుతుంది.
13అయితే వారి బలిపీఠాలు నాశనం చేయి. వారు
పూజించే రాళ్లను విరుగగొట్టు. వారి విగ్రహాలను నరికి
వెయ్యి. 14మరో దేవుడ్ని ఎవర్నీ ఆరాధించవద్దు. నేను
ఎల్కానా, రోషముగల యెహోవాను. అది నా పేరు.
నేను ఎల్కానా, అంటే రోషముగల దేవుడ్ని.” 15“ఆ
దేశములో నివసించే ప్రజలతో ఎలాంటి ఒడంబడిక
చేయకుండా జాగ్రత్తగా ఉండు. నీవు గనుక అలా చేస్తే,
వారు వారి వారి దేవతలను ఆరాధించేటప్పుడు వాళ్లతో
కలవమని ఆ ప్రజలు నిన్ను పిలుస్తారు. వాళ్ల బలుల
మాంసం నీవు తినకుండ జాగ్రత్త పడుము. 16వారి
కూతుళ్లు కొందరిని మీ కుమారులకు భార్యలుగా మీరు
చేసుకుంటారేమో. ఆ కూతుళ్లు తప్పుడు దేవతలను
సేవిస్తారు. మీ కుమారులు కూడా అలాగే చేసేటట్టు
వారు నడిపించవచ్చు.”
17“విగ్రహాలు చేసుకోవద్దు.”
18“పులియని రొట్టెల పండుగ ఆచరించు. నేను
ఇదివరకు మీతో చెప్పిన ప్రకారము పులియచేసే
పదార్థం లేకుండా తయారు చేయబడిన రొట్టెలను
ఏడు రోజులపాటు తినాలి. నేను ఏర్పరచుకున్న
అబీబు నెలలో దీన్ని చేయాలి. ఎందుకంటే మీరు
ఈజిప్టు నుండి బయటకు వచ్చిన నెల అది.”
19“ఒక స్త్రీకి పుట్టిన ప్రథమ శిశువు ఎల్లప్పుడూ
నాకే చెందుతుంది. మీ పశువులకు, గొర్రెలకు మొద
టిదిగా పుట్టే పిల్లలు కూడా నాకే చెందుతాయి. 20మొద
టిదిగ పుట్టిన ఒక గాడిదను నీవు ఉంచు కోవాలంటే
ఒక గొర్రె పిల్లను యిచ్చి నీవు దాన్ని కొనుక్కోవచ్చు.
అయితే నీవు ఒక గొర్రెపిల్లను యిచ్చి ఆ గాడిదను
కొనకపోతే, ఆ గాడిదమెడ నీవు విరుగ గొట్టాలి. ప్రథమ
సంతానమైన నీ కుమారులందరినీ నా దగ్గర్నుంచి నీవు
కొనాలి. కానుక లేకుండా ఏ మనిషీ నా దగ్గరకు
రాకూడదు.”
21“ఆరు రోజులు నీవు పనిచేస్తావు. అయితే ఏడో
రోజున నీవు విశ్రాంతి తీసుకోవాలి. నాట్లు వేసేట
ప్పుడు; కోత కోసేటప్పుడు గూడ నీవు విశ్రాంతి
తీసుకోవాలి.”

[22]“నీవు వారాల పండుగ ఆచరించాలి. గోధుమ కోతలో నుండి మొదటి గింజల్ని ఈ పండుగకు విని యోగించాలి. సంవత్సరాంతములో కోతకాలపు పండుగ ఆచరించాలి.”

[23]“ప్రతి సంవత్సరమూ మూడుసార్లు మీ పురుషు లంతా మీ యజమానీ, ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాతో ఉండేందుకు వెళ్ళాలి.

[24]“మీరు మీ దేశంలోకి వెళ్లినప్పుడు, ఆ దేశంలో నుండి మీ శత్రువులను నేను వెళ్లగొట్టి వేస్తాను. మీ సరిహద్దులను నేను విశాలం చేస్తాను. మీకు ఇంకా భూమి లభిస్తుంది. ప్రతి సంవత్సరం మూడు సార్లు మీరు యెహోవా దేవుని ఎదుటకి వెళ్లాలి. ఆ సమ యంలో ఎవ్వరూ మీ భూమిని మీ దగ్గర నుండి తీసు కునేందుకు ప్రయత్నించరు.”

[25]“బలి రక్తం నీవు నాకు అర్పిస్తే పులిసిన పదార్థము ఏదీ దానితోపాటు అర్పించవద్దు.”

“పస్కా భోజనంలోని మాంసం ఏ మాత్రము మరు నాటి ఉదయానికి మిగులకూడదు.”

[26]“మీ కోతలో నుండి మొట్టమొదటి పంట యెహోవాకు ఇవ్వాలి. మీ యెహోవా దేవుని ఆలయ ములోనికి వాటిని తీసుకొని రావాలి.”

“మేక పిల్లను దాని తల్లి పాలతో ఎన్నడూ వండ కూడదు.” [27]అప్పుడు మోషేతో యెహోవా, “నేను నీకు చెప్పిన విషయాలన్నీ రాయి. నీతోను; ఇశ్రా యేలు ప్రజలతోను నేను చేసిన ఒడంబడిక విష యాలు అవి” అన్నాడు.

[28]నలభై పగళ్లు నలభై రాత్రుళ్లు మోషే అక్కడే యెహోవాతో ఉన్నాడు. అ సమయంలో అతను భోజనం చేయలేదు, నీళ్లు తాగలేదు. ఒడంబడిక మాటలు అంటే పది ఆజ్ఞలు రెండు రాతి పలకల మీద మోషే వ్రాసాడు.

### ప్రకాశిస్తున్న మోషే ముఖం

[29]అప్పుడు మోషే సీనాయి పర్వతం కిందికి వచ్చాడు. దేవుని ఆజ్ఞలు రాయబడ్డ ఆ రెండు రాతి పలకలనూ, అతను పట్టుకొచ్చాడు. మోషే యెహో వాతో మాట్లాడాడు. కనుక అతని ముఖం ప్రకాశిస్తూ ఉండినది. అయితే అది మోషేకు తెలియదు. [30]మోషే ముఖం మెరిసిపోతూ ప్రకాశిస్తూ ఉండటం అహరోను, ఇశ్రాయేలు ప్రజలందరూ చూశారు. అందుచేత అతని దగ్గరకు వెళ్లడానికి భయపడ్డారు.

[31]అయితే మోషే వాళ్లను పిలిచాడు. కనుక అహ రోను, ప్రజానాయకులు అందరూ మోషే దగ్గరకు వెళ్లారు. మోషే వాళ్లతో మాట్లాడాడు. [32]ఆ తర్వాత, ఇశ్రాయేలు ప్రజలంతా మోషే దగ్గరకు వచ్చారు. సీనాయి కొండ మీద యెహోవా తనకు ఇచ్చిన ఆజ్ఞలను మోషే వారికి ఇచ్చాడు. [33]మోషే ప్రజలతో మాట్లాడ్డం ముగించగానే తన ముఖం మీద ముసుగు కప్పుకున్నాడు. [34]యెహోవాతో మాట్లాడేందుకు ఆయన ఎదుటికి వెళ్లినప్పుడల్లా మోషే తన ముఖం మీద ముసుగు తీసివేసాడు. తరువాత మోషే బయటకు వచ్చి-యెహోవా ఆజ్ఞాపించిన విషయాలను ఇశ్రా యేలు ప్రజలకు చెప్పేవాడు. [35]మోషే ముఖం ప్రకా శంగా మెరిసిపోతున్నట్టు ప్రజలు చూసేవాళ్లు కనుక మోషే మరల తన ముఖం కప్పుకొనేవాడు. మరల యెహోవాతో మాట్లాడేందుకు వెళ్లేంతవరకు మోషే తన ముఖం పైనుండి ముసుకును తీసే వాడుకాదు.

### సబ్బాతు నియమాలు

35 ఇశ్రాయేలు ప్రజలందర్నీ మోషే సమావేశ పర్చాడు. మోషే వారితో చెప్పాడు: “మీరు చేయాలని యెహోవా ఆజ్ఞాపించిన విషయాలు నేను మీకు చెబుతాను.

[2]“పని చేయడానికి ఆరు రోజులున్నాయి. అయితే ఏడో రోజు మీకు చాల ప్రత్యేకమైన విశ్రాంతి రోజు. ఆ ప్రత్యేక దినాన విశ్రాంతి తీసుకోవడంవల్ల మీరు యెహోవాను ఘనపరుస్తారు. ఏడో రోజున పనిచేసే వ్యక్తిని చంపెయ్యాలి. [3]సబ్బాతు రోజున మీరు నివ సించే స్థలాల్లో నిప్పు కూడ రాజబెట్టకూడదు”

### పవిత్ర గుడారము మరియు వస్తువులు

[4]ఇశ్రాయేలు ప్రజలందరితో మోషే ఇలా చెప్పాడు: “యెహోవా ఆజ్ఞాపించినది ఇదే. [5]యెహోవా కోసం ప్రత్యేక కానుకలు సమకూర్చండి. మీరు ఏమి ఇస్తారో మీలో ప్రతి ఒక్కరూ మీ హృదయంలో తీర్మానం చేసుకోవాలి. అప్పుడు ఆ కానుక యెహోవా కోసం తీసుకుని రావాలి. బంగారం, వెండి, ఇత్తడి. [6]నీలం, ధూమ్ర వర్ణం, ఎరుపు బట్ట, శ్రేష్ఠమైన సన్నటి బట్ట, మేక బొచ్చు. [7]ఎరుపు రంగు వేసిన గొర్రె తోళ్లు, మంచి చర్మాలు, తుమ్మ కర్ర, [8]దీపాల కోసం ఒలీవ నూనె, అభిషేక తైలం కోసం పరిమళ ద్రవ్యాలు, సువాసన ధూపంకోసం పరిమళ ద్రవ్యాలు, [9]లేతపచ్చ రాళ్లు, యితర నగలు కానుకలుగా తీసుకు రావాలి. యాజ కులు ధరించే ఏఫోదు, న్యాయ తీర్పు పైవస్త్రం మీద ఈ రాళ్లు, నగలు అమర్చబడుతాయి.

[10]నైపుణ్యంగల వాళ్లందరూ యెహోవా ఆజ్ఞాపిం చిన వీటన్నింటినీ చేయాలి. (యెహోవా ఆజ్ఞాపించిన వస్తువులు ఇవి): [11]పవిత్ర గుడారం, దాని బయటి గుడారం, దాని కప్పు, కొక్కీలు, చట్రాలు, అడ్డ కర్రలు, స్తంభాలు, దిమ్మలు, [12]ఒడంబడిక పవిత్ర పెట్టె, దాని కర్రలు, పెట్టెను మూసే దాని మూత, పెట్టె ఉండే చోటును కప్పి ఉంచే తెర [13]బల్ల, దాని కర్రలు, బల్ల మీద వస్తువులన్నీ, బల్ల మీద ఉండే ప్రత్యేక రొట్టె, [14]వెలుగు కోసం ఉపయోగించే దీప స్తంభం, దీప

స్తంభానికి సంబంధించిన వస్తువులన్నీను, దీపాలు, దీపా
నికి నూనె, 15ధూపం వేసేందుకు బలిపీఠం, దాని
కర్రలు, అభిషేక తైలం, సువాసనగల ధూపద్రవ్యాలు,
పవిత్ర గుడారం, ప్రవేశం దగ్గర ద్వారాన్ని కప్పి ఉంచే
తెర, 16అర్పణలు దహించే బలిపీఠం, దాని ఇత్తడి
తెర, కర్రలు, బలిపీఠం దగ్గర ఉపయోగించే అన్ని
వస్తువులు, గంగాళం, దాని పీట, 17ఆవరణపు తెరలు,
వాటి కర్రలు, దిమ్మలు, ఆవరణ ద్వారపు తెర
18గుడారం, ఆవరణ గుడారం పట్టి ఉంచే మేకులు,
మేకులకు కట్టే తాళ్లు, 19పరిశుద్ధ స్థలంలో యాజకులు
ధరించే ప్రత్యేక నేత వస్త్రాలు. యాజకుడైన అహ
రోను, అతని కుమారులు ధరించాల్సిన ప్రత్యేక వస్త్రాలు
ఇవి. వాళ్లు యాజకులుగా సేవ చేసేటప్పుడు ఈ
వస్త్రాలు ధరిస్తారు."

## ప్రజల మహా గొప్ప అర్పణ

20అప్పుడు ప్రజలంతా మోషే దగ్గర్నుంచి వెళ్లి
పోయారు. 21ఇవ్వాలి అనుకొన్న ప్రజలంతా వచ్చి
యెహోవాకు కానుక తెచ్చారు. సన్నిధి గుడారం,
గుడారంలోని సమస్త సామగ్రి, ప్రత్యేక వస్త్రాలు చేసేం
దుకు ఈ కానుకలు ప్రయోగించబడ్డాయి. 22ఇవ్వాల
నుకున్న స్త్రీ పురుషులంతా అన్ని రకాల బంగారు
వస్త్రాలూ తెచ్చారు. పిన్నులు, చెవిపోగులు, ఉంగరాలు,
ఇతర బంగారు వస్తువులు వారు తీసుకు వచ్చారు.
వాళ్లంతా వారి బంగారాన్ని యెహోవాకు ఇచ్చారు.
ఇది యెహోవాకు ప్రత్యేక అర్పణ.

23నాణ్యమైన బట్ట, నీలం, ధూమ్రవర్ణం, ఎరుపు
బట్ట ఉన్న ప్రతి వ్యక్తీ వాటిని యెహోవాకోసం
తెచ్చాడు. మేక బొచ్చు, లేక ఎరుపు రంగు వేయబడ్డ
గొర్రె చర్మాలు లేక నాణ్యమైన తోలు ఉన్నవారు
ఎవరైనా సరే వాటిని యెహోవా కోసం తెచ్చారు.
24వెండిని లేక ఇత్తడి ఇవ్వాలనుకున్న ప్రతి వ్యక్తీ వచ్చి,
దానిని యెహోవాకు కానుకగా తెచ్చారు. తుమ్మకర్ర
ఉన్న ప్రతి వ్యక్తీ వచ్చి, దానిని యెహోవాకు కానుకగా
ఇచ్చాడు. 25నిపుణతగల ప్రతి స్త్రీ నాణ్యమైన బట్ట,
నీలం, ధూమ్ర వర్ణం, ఎరుపు బట్ట తయారు చేసింది.
26సహాయం చేయాలనుకొన్న నైపుణ్యంగల స్త్రీలంతా
మేక వెంట్రుకలతో వస్త్రాలు తయారు చేసారు.

27పెద్దలు లేతపచ్చలు, ప్రశస్తమైన ఇతర రాళ్లు
తెచ్చారు. యాజకుని ఏఫోదు, న్యాయతీర్పు పైవస్త్రం
మీద ఈ రాళ్లు రత్నాలు అమర్చబడ్డాయి. 28సుగంధ
ద్రవ్యాలు, ఒలీవ నూనె కూడ ప్రజలు తెచ్చారు.
సువాసనగల పరిమళ ద్రవ్యం, అభిషేక తైలం, దీపాల
నూనె కోసం ఉపయోగించబడ్డాయి.

29సహాయం చేయాలనుకొన్న ఇశ్రాయేలు ప్రజ
లంతా యెహోవాకు కానుకలు తెచ్చారు. ఈ కాను
కలు ఉచితం, మరియు ప్రజలు ఇవ్వాలను కొన్నారు
గనుక వాటిని ఇచ్చారు. మోషేకు, ప్రజలకు
యెహోవా ఇచ్చిన ఆజ్ఞ ప్రకారం చేసేందుకు ఈ
కానుకలు ఉపయోగించబడ్డాయి.

## బెసలేలు, అహోలీయాబు

30అప్పుడు ప్రజలతో మోషే ఇలా అన్నాడు:
"చూడండి, యూదా గోత్రానికి చెందిన ఊరి కుమా
రుడు బెసలేలును యెహోవా ఏర్పరచుకొన్నాడు.
(హూరు కుమారుడు ఊరి). 31బెసలేలును యెహోవా
తన ఆత్మతో నింపాడు. అన్ని రకాల పనులు చేయ
డానికి యెహోవా అతనికి నైపుణ్యం ఇచ్చాడు.
32అతడు నమూనాలు చేసి బంగారం, వెండి, ఇత్తడితో
వస్తువులు చేయగలడు. 33ప్రశస్తమైన రాళ్లను రత్నాలను
చెక్కిసానబెట్టగలడు. బెసలేలు చెక్కపనిచేసి అన్ని
రకాల వస్తువులు తయారు చేయగలడు. 34ఇతరులకు
నేర్పించగల నైపుణ్యాన్ని బెసలేలుకు, అహోలీ
యాబుకు దేవుడు యిచ్చాడు. (దాను గోత్రానికి
చెందిన అహీసామాకు కుమారుడు అహోలీయాబు).
35అన్ని రకాల పనులు చేయటానికి ప్రత్యేక నైపు
ణ్యాన్ని యెహోవా వారికి ఇచ్చాడు. వడ్లవాని పనులు,
లోహపు పనులు వారు చేయగలరు. నీలం, ధూమ్ర
వర్ణం, ఎరుపు, నాణ్యమైన బట్టల మీద బుటా పని
వారు చేయగలరు. ఉన్ని వస్త్రాలను వారు నేయగలరు."

36 "కనుక బెసలేలు, అహోలీయాబు, ఇంకా
నైపుణ్యంగల పురుషులందరూ యెహోవా
ఆజ్ఞాపించిన పనులన్నీ చేస్తారు. ఈ పరిశుద్ధ స్థలం
నిర్మించేందుకు అవసరమైన వాటిన్నింటినీ చేయ
టానికి అవసరమైన జ్ఞానం, అవగాహన దేవుడు ఈ
మనుష్యులకు ఇచ్చాడు."

2తర్వాత బెసలేలును, అహోలీయాబును,
యెహోవా నైపుణ్యాన్ని ఇచ్చిన ఇతర నిపుణులను
మోషే పిలిచాడు. పనిలో సహాయం చేయాలని వీళ్లంతా
వచ్చారు.

3ఇశ్రాయేలు ప్రజలు కానుకగా తెచ్చిన వస్తు
వులన్నింటినీ మోషే ఈ మనుష్యులకు ఇచ్చాడు.
పవిత్ర గుడారం నిర్మించడానికి వీటన్నింటినీ వారు
ఉపయోగించారు. ప్రతి ఉదయం ప్రజలు కానుకలు
తెస్తున్నారు.

4చివరకు నిపుణులైన పని వాళ్లు ఒక్కొక్కరు, ఆ
పవిత్ర స్థలంలో వారు చేస్తున్న పని విడిచి పెట్టి,
మోషేతో మాట్లాడటానికి వెళ్లారు. 5"ప్రజలు
కానుకలను విపరీతంగా తెచ్చేసారు. గుడారం పని
ముగించడానికి కావలసిన దానికంటే మా దగ్గర ఎక్కువే
ఉంది " అన్నారు వారు.

6అప్పుడు, "ఇంక ఏ స్త్రీగాని, పురుషుడుగాని
గుడారం కోసం ఏ విధమైన కానుకా తీసుకురాకూడదు"
అని బస అంతటకీ మోషే కబురు చేసాడు. 7పవిత్ర

స్థలానికి అవసరమైన దానికంటే ఎక్కువ వస్తువులను
ప్రజలు సిద్ధం చేసారు.

### పవిత్ర గుడారం

8అప్పుడు నిపుణులు పవిత్ర గుడారం తయారు
చేయటం మొదలు పెట్టారు. నీలం, ఎరుపు సన్నని
నారబట్టతో పది తెరలు వారు చేసారు. రెక్కలు గల
కెరూబుల చిత్రాలను ఆ బట్ట మీద వారు కుట్టి
పెట్టారు. 9ప్రతి తెరా ఒకే కొలత. అది 14 గజాలు
పొడువు, 2 గజాల వెడల్పు. 10అయిదు తెరలు కలిపి
ఒక భాగంగాను మిగిలిన అయిదు ముక్కలు కలిపి
మరో భాగంగాను కలపబడ్డాయి. 11తర్వాత మొదటి
అయిదు తెరల భాగానికి బట్ట అంచు వెంబడి నీలం
గుడ్డతో ఉంగరాలు చేస్తారు. మరో అయిదు ముక్కల
భాగానికి కూడ అలానేచేస్తారు. 12ఒక భాగంలో చివరి
తెర మీద 50 ఉంగరాలు మరో భాగంలో చివర తెర
మీద 50 ఉంగరాలు ఉన్నాయి. ఈ ఉంగరాలు ఒక
దానికి ఒకటి ఎదురెదురుగా ఉన్నాయి. 13అప్పుడు
వారు 50 బంగారు ఉంగరాలు చేసారు. రెండు తెరలను
ఒకటిగా కలిపేందుకు ఈ బంగారు ఉంగరాలను వారు
ఉపయోగించారు. అందుచేత గుడారం మొత్తం పవిత్ర
స్థలంగా కలపబడింది.
14అప్పుడు పవిత్ర గుడారం పైకప్పు కోసం మేక
వెంట్రుకలతో 11 తెరలను పనివారు తయారు చేసారు.
15మొత్తం 11 తెరలు ఒకే కొలత గలవి. వాటి పొడువు
15 గజాలు వెడల్పు 2 గజాలు. 16అయిదు తెరలను
ఒక భాగంగా కలిపి కుట్టారు. పనివాళ్లు తర్వాత ఆరు
తెరలను మరో భాగంగా కలిపి కుట్టారు.17మొదటి
భాగంలోని చివరి తెర అంచుకు 50 ఉంగరాలు
అమర్చారు. మరో భాగంలోని చివరి తెర అంచుకు
50 ఉంగరాలు అమర్చారు. 18ఈ రెండు భాగాలను
ఒక్కటిగా కలిపేందుకు 50 ఇత్తడి కొలుకులను పని
వారు తయారు చేసారు. 19తర్వాత గుడారానికి ఇంకా
రెండు పై కప్పులను వారు తయారు చేసారు. ఒక
పై కప్పు ఎరుపు రంగు వేసిన గొర్రె చర్మంతోను,
మరొ కటి నాణ్యమైన తోలుతోను చేయబడ్డాయి.
20తర్వాత తుమ్మ కర్రతో పనివారు పలకలు
చేసారు. 21 ఒక్కో పలక పొడువు 15 అడుగులు
వెడల్పు 27 అంగుళాలు. 22ఒక్కో పలక అడుగున
పక్క పక్కగా రెండు కొక్కీలు ఉన్నాయి. పవిత్ర
గుడారపు పలకల్లో ప్రతి ఒక్కటీ ఇలాగే చేయబడింది.
23గుడారం దక్షిణ భాగానికి 20 చట్రాలను వారు
తయారు చేసారు. 24ఆ తర్వాత ఈ 20 చట్రాల
కింద పెట్టడానికి 40 వెండి దిమ్మలను వారు చేసారు.
ప్రతి పలకకీ రెండేసి దిమ్మలు ఉన్నాయి. ఒక్కో బల్ల
కింద ప్రతి పక్కా కర్రలు, ఒక దిమ్మ. 25గుడారం
అవతలి వైపుకు (ఉత్తరం వైపు) కూడా వారు 20
పలకలు చేసారు. 26ఒక్కో చట్రం కిందా రెండేసి
చొప్పున 40 వెండి దిమ్మలు అతడు చేసాడు. 27పవిత్ర
గుడారం వెనుక భాగానికి (పడమటి వైపున) ఆరు
పలకలు అతడు చేసాడు. 28పవిత్ర గుడారం వెనుక
వైపు మూలలకు రెండు చట్రాలు అతడు చేసాడు.
29ఈ చట్రాలు అడుగు భాగాన కలిపి బిగించబడ్డాయి.
పై భాగాన అది జతచేయబడ్డ ఉంగరంలో అమర్చ
బడ్డాయి. ప్రతి మూలకూ అతడు ఇలాగే చేసాడు.
30కనుక పవిత్ర గుడారం పశ్చిమాన 8 చట్రాలు, 16
వెండి దిమ్మలు అంటే ఒక్కో చట్రం కింద రెండేసి
దిమ్మలు ఉన్నాయి.
31తర్వాత అతడు తుమ్మ కర్రతో అడ్డ కర్రలు
చేసాడు–పవిత్ర గుడారం మొదటి పక్కకు 5 అడ్డ
కర్రలు, 32 “పవిత్ర గుడారం రెండో పక్కకు 5 అడ్డ
కర్రలు, గుడారం వెనుక పక్కకు 5 అడ్డ కర్రలు.
33ఒక్కో చట్రంలోనుంచి దూరి అన్ని చట్రాల గుండా
అమర్చబడేటట్టు మధ్య అడ్డ కర్రను అతడు చేసాడు.
34ఈ చట్రాలను బంగారంతో అతడు తాపడం చేసాడు.
అడ్డ కర్రలను పట్టి ఉంచేందుకు బంగారు ఉంగరాలను
అతడు చేసాడు.
35తర్వాత అతి పవిత్ర స్థలంయొక్క ప్రవేశ ద్వారా
నికి తెరను వారు చేయటానికి నాణ్యమైన సన్నని
నారబట్ట, నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణపు బట్ట వారు
ఉపయోగించారు. నాణ్యమైన బట్టమీద కెరూబుల
చిత్రాలను అతడు కుట్టాడు. 36తుమ్మ కర్రతో నాలుగు
స్తంభాలు చేసి వాటికి బంగారం తాపడం చేసారు. ఆ
స్తంభాలకు బంగారు కొక్కీలు వారు చేసారు. ఆ స్తంభా
లకు నాలుగు వెండి దిమ్మలను వారు చేసారు.
37తర్వాత గుడారం ప్రవేశ ద్వారానికి ఒక తెరను వారు
తయారు చేసారు. నాణ్యమైన బట్ట, నీలం, ధూమ్ర
వర్ణం, ఎరుపు బట్టను వారు ఉపయోగించారు. ఆ
బట్ట మీద చిత్ర పటాల బుటాపని వారు చేసారు.
38తర్వాత ఈ తెరకోసం అయిదు స్తంభాలు, కొక్కీలు
వారు చేసారు. స్తంభాల శిఖరాలకు, తెరల కడ్డీలకు
అతడు బంగారు తాపడం చేసాడు. స్తంభాలకు అయిదు
ఇత్తడి దిమ్మలను వారు చేసారు.

### ఒడంబడిక పెట్టె

37 తుమ్మ కర్రతో పవిత్ర పెట్టెను బెసెలేలు
చేసాడు. ఆ పెట్టె పొడవు 45 అంగుళాలు,
వెడల్పు 27 అంగుళాలు. ఎత్తు 27 అంగుళాలు, 2పెట్టె
లోపల, బయట స్వచ్ఛమైన బంగారంతో అతడు
తాపడం చేసాడు. తర్వాత పెట్టె చుట్టూ బంగారు
నగిషీబద్ద కట్టాడు. 3బంగారు ఉంగరాలు నాలుగు చేసి
నాలుగు మూలలా వాటిని అమర్చాడు. పెట్టె మోయ
టానికి ఈ ఉంగరాలు ఉపయోగించబడ్డాయి. ఒక్కో
ప్రక్క రెండేసి ఉంగరాలు ఉన్నాయి. 4తర్వాత పెట్టెను

మోసేందుకు కర్రలను అతడు చేసాడు. తుమ్మ కర్రతో
చేసి ఆ కర్రలకు స్వచ్ఛమైన బంగారం తాపడం చేసాడు.
5పెట్టెకు ఒక్కో ప్రక్క ఉంగరాల గుండా కర్రలను
దూర్చిపెట్టాడు. 6తర్వాత స్వచ్ఛమైన బంగారంతో
అతడు మూత చేసాడు. దాని పొడవు 45 అంగుళాలు,
వెడల్పు 27 అంగుళాలు. 7తర్వాత బెసలేలు కొట్టబడ్డ
బంగారంతో రెండు కెరూబులను చేసాడు. ఆ కెరూబు
లను మూత కొనల మీద ఉంచాడు. 8ఒక కొనమీద
ఒక కెరూబును, మరో కొనమీద మరో కెరూబును
ఉంచాడు. అంతా ఒకే భాగంలో ఉండేటట్టు ఆ కెరూ
బులు మూతతో కలిపి చేయబడ్డాయి. 9కెరూబుల
రెక్కలు ఆకాశంవైపు విప్పబడ్డాయి. ఆ కెరూబుల
రెక్కలు పెట్టెను కప్పి ఉంచాయి. కెరూబులు ఎదురె
దురుగా మూతను చూస్తూ ఉన్నాయి.

### ప్రత్యేక బల్ల

10తర్వాత అతడు తుమ్మ కర్రతో బల్లను చేసాడు.
ఆ బల్ల పొడవు 36 అంగుళాలు, వెడల్పు 18 అంగుళాలు,
ఎత్తు 27 అంగుళాలు. 11అతడు ఆ బల్లను బంగారంతో
తాపడం చేసాడు. బల్ల నాలుగు ప్రక్కల బంగారు
నగిషీబద్ద చేసాడు. 12అప్పుడు అతడు ఆ బల్ల చుట్టూ
మూడు అంగుళాల చట్రం చేసాడు. ఆ చట్రం మీద
బంగారు నగిషీబద్దను అతడు ఉంచాడు. 13అప్పుడు
అతడు ఆ బల్లకు నాలుగు బంగారు ఉంగరాలు చేసాడు.
నాలుగు మూలలా నాలుగు బంగారు ఉంగరాలు అతడు
అమర్చాడు. అక్కడే నాలుగు కాళ్లు ఉన్నాయి. 14ఉంగ
రాలను బల్ల పైభాగంలో చట్రానికి దగ్గరగా అతడు
పెట్టాడు. బల్లను మోసేందుకు ఉపయోగించే కర్రలను
ఉంగరాలు పట్టి ఉంచుతాయి. 15తర్వాత బల్లలను
మోసేందుకు కర్రలను అతడు చేసాడు. తుమ్మ కర్ర
ఉపయోగించి చేసిన, ఆ కర్రలకు స్వచ్ఛమైన బంగారు
పూత పూసాడు. 16అప్పుడు బల్ల మీద ప్రయోగించే
వస్తువులన్నింటినీ తయారు చేసాడు. పానార్పణము
పోసేందుకు పళ్లెములు, గరిటెలు, గిన్నెలు, పాత్రలు
అతడు తయారు చేసాడు. ఇవన్నీ స్వచ్ఛమైన బంగా
రంతో తయారు చేయబడ్డాయి.

### దీప స్తంభం

17తర్వాత అతడు దీపస్తంభం చేసాడు. స్వచ్ఛమైన
బంగారం ఉపయోగించి, దాని దిమ్మను, స్తంభాన్ని
తీర్చిదిద్దాడు. తర్వాత పువ్వుల్లా కనపడే గిన్నెలు
చేసాడు. గిన్నెలకు మొగ్గలు, పువ్వులు ఉన్నాయి.
అన్నీ స్వచ్ఛమైన బంగారంతోనే చేయబడ్డాయి. ఈ
వస్తువులన్నీ ఒకే భాగంగా కలుపబడ్డాయి. 18దీపస్తంభం
ప్రక్కల్లో ఆరు కొమ్మలు ఉన్నాయి. ఒక పక్క మూడు
కొమ్మలు, మరో పక్క మూడు కొమ్మలు ఉన్నాయి.
19ఒక్కో కొమ్మకు మూడేసి బంగారు పూలున్నాయి.
ఈ పూలు బాదం పూలవలె చేయబడ్డాయి. వాటికి
మొగ్గలు, రేకులు ఉన్నాయి. 20బంగారంతో చేయబడ్డ
నాలుగు పూవులు దీపస్తంభపు కాండానికి ఉన్నాయి.
అవి కూడా మొగ్గలు, రేకులతో బాదం పూవుల్లానే
ఉన్నాయి. 21ఆరు కొమ్మలు రెండేసి చొప్పున మూడు
భాగాలుగా ఉన్నాయి. ఒక్కో కొమ్మ విభాగం కింద
ఒక్కో మొగ్గ ఉంది. 22మొగ్గలు, కొమ్మలు, దీపస్తంభం
అన్నీ స్వచ్ఛమైన బంగారంతో చేయబడ్డాయి. ఈ
బంగారం అంతా కొట్టబడి, ఒకే భాగంగా చేయబడింది.
23ఈ దీపస్తంభానికి అతడు ఏడు దీపాలు చేసాడు.
తర్వాత అతడు పళ్లెం, పట్టకారులు చేసాడు. సమస్తం
స్వచ్ఛమైన బంగారంతో చేయబడింది. 24దీపస్తంభం,
దాని పరికరాలు అన్నీ తయారు చేయడానికి అతడు
75 పౌన్ల స్వచ్ఛమైన బంగారం ఉపయోగించాడు.

### ధూప వేదిక

25ధూపం వేసేందుకు అతడు ధూప వేదిక చేసాడు.
తుమ్మ కర్రతో అతడు దీన్ని చేసాడు. వేదిక చతుర
స్రాకారం. దాని పొడవు 18 అంగుళాలు, వెడల్పు 18
అంగుళాలు, ఎత్తు 36 అంగుళాలు. వేదిక మీద నాలుగు
కొమ్మలు ఉన్నాయి. ఒక్కొక్క మూలను ఒక్కొక్క
కొమ్మ ఉంది. ఈ కొమ్మలు వేదికతో కలిపి ఒకే
భాగంగా చేయబడ్డాయి. 26పై భాగం, అన్ని ప్రక్కలు,
కొమ్మలకీ అతడు బంగారు తాపడం చేసాడు. తర్వాత
అతడు బలిపీఠం చుట్టూ బంగారు నగిషీబద్ద చేసాడు.
27బలిపీఠానికి అతడు రెండు బంగారు ఉంగరాలు
చేసాడు. బలిపీఠం నగిషీబద్దకు అడుగు భాగాన ఒక్కో
ప్రక్క ఒక్కోటిగా బంగారు ఉంగరాలను అమర్చాడు.
వేదికను మోసే కర్రలను ఈ బంగారు ఉంగరాలు
పట్టి వుంచేవి. 28స్తంభాలను తుమ్మ కర్రతో చేసి,
బంగారం తాపడం చేసాడు అతడు.

29తర్వాత అభిషేకించే పవిత్ర తైలం చేసాడు.
స్వచ్ఛమైన పరిమళ వాసనగల ధూపం కూడ అతడు
చేసాడు. అత్తరు చేసే నైపుణ్యంగల ఒకని చేత ఇవన్నీ
చేయబడ్డాయి.

### దహన బలులకు పీఠం

38 తర్వాత బెసలేలు బలిపీఠం కట్టాడు. ఇది దహన
బలులను దహించటానికి ఉపయోగించిన బలి
పీఠం. తుమ్మ కర్రతో అతడు బలిపీఠం చేసాడు. బలి
పీఠం చతురస్రం, దాని పొడవు ఏడున్నర అడుగులు,
వెడల్పు ఏడున్నర అడుగులు, ఎత్తు నాలుగున్నర
అడుగులు. 2ఒక్కొక్క మూలకు ఒక కొమ్మును అతడు
చేసాడు. కొమ్ములను బలిపీఠంతో ఏకభాగంగా అతడు
చేసాడు. తర్వాత అతడు దాన్నంతటినీ యిత్తడితో
తాపడం చేసాడు. 3తర్వాత బలిపీఠం మీద ఉప
యోగించే పరికరాలు అన్నింటినీ అతడు చేసాడు.

బిందెలు, గరిటెలు, గిన్నెలు, ముల్లు గరిటలు, నిప్పు
పాత్రలు అతడు చేసాడు. 4తర్వాత అతడు బలిపీఠం
కోసం ఒక వలలాంటి ఇత్తడి జల్లెడ తయారు చేసాడు.
ఈ ఇత్తడి జల్లెడ వలలా ఉంది. బలిపీఠం అడుగున
అంచు కింద ఉంచబడింది. అది అడుగు భాగాన కింద
నుండి బలిపీఠం లోనికి సగం వరకు వుంది. 5తర్వాత
ఇత్తడి ఉంగరాలు చేసాడు. బలిపీఠాన్ని మోసే కర్రలను
పట్టి వుంచేందుకు ఈ ఉంగరాలు ఉపయోగించ
బడ్డాయి. ఆ ఉంగరాలకు ఇత్తడి జల్లెడ నాలుగు మూల
లను అతడు అమర్చాడు. 6తర్వాత అతడు తుమ్మ
కర్రతో కర్రలు చేసి, వాటిని యిత్తడితో తాపడం
చేసాడు. 7ఆ కర్రలను ఉంగరాలలో అమర్చాడు అతడు.
బలిపీఠం పక్కలో ఉన్న కర్రలు బలిపీఠాన్ని మోసేం
దుకు ఉపయోగించబడ్డాయి. బలిపీఠం చేయడానికి
అతడు తుమ్మ కర్ర పలకలను ఉపయోగించాడు. బలి
పీఠం లోపల ఖాళీ 8గంగాళం వుంది. దాని దిమ్మను
అతడు ఇత్తడితో చేసాడు. స్త్రీలు ఇచ్చిన ఇత్తడి అద్దా
లను అతడు ఉపయోగించాడు. సమావేశ గుడార
ప్రవేశం దగ్గర పరిచర్య చేసే స్త్రీలు వీరు.

### పవిత్ర గుడారం చుట్టూ ఆవరణ

9తర్వాత ఆవరణ చుట్టూ తెరలను అతడు చేసాడు.
దక్షిణం వైపు తెరల పొడవు 50 గజాలు. 10దక్షిణం
వైపు 20 స్తంభాల ఆధారంతో తెరలు నిలబడ్డాయి.
ఈ తెరలు సన్నని నారతో చేయబడ్డాయి. ఆ స్తంభాలు
20 యిత్తడి దిమ్మల మీద ఉన్నాయి. స్తంభాలకు,
కర్రలకు కొక్కీలు వెండితో చేయబడ్డాయి. 11ఆవరణ
ఉత్తరం వైపుకూడ దక్షిణం వైపులాగే ఉంది. 20 ఇత్తడి
దిమ్మల మీద 20 స్తంభాలు ఉన్నాయి. స్తంభాలకు,
కర్రలకు కొక్కీలు వెండితో చేయబడ్డాయి. 12ఆవరణ
పడమటి వైపు తెరలు 25 గజాలు పొడవు. స్తంభాలు
10, దిమ్మలు 10 ఉన్నాయి. స్తంభాలకు కొక్కెములు
బిగించే తెరల కడ్డీలు వెండితో చేయబడ్డాయి.
13ఆవరణ ప్రవేశం తూర్పున ఉంది. తూర్పున 25
గజాలు వెడల్పు, 14ప్రవేశానికి ఒక ప్రక్క ఏడున్నర
గజాలు పొడవు గల ఒక తెర ఉంది. ఆ తెరకు మూడు
స్తంభాలు, మూడు దిమ్మలు ఉన్నాయి. 15ప్రవేశానికి
మరో పక్క ఇంకో తెర ఉంది. దాని పొడవు కూడ
ఏడున్నర గజాలు. ఆ తెరకు కూడా మూడు స్తంభాలు;
మూడు దిమ్మలు ఉన్నాయి. 16ఆవరణ చుట్టూ ఉన్న
తెరలన్నీ నాణ్యమైన బట్టతో చేయబడ్డాయి. 17స్తంభా
లకు దిమ్మలు ఇత్తడితో చేయబడ్డాయి. కొక్కెములు,
తెరల కడ్డీలు వెండితో చేయబడ్డాయి. స్తంభాల శిఖ
రాలు కూడ వెండితో తాపడం చేయబడ్డాయి. ఆవరణ
లోని స్తంభాలన్నీ తెరల వెండి కడ్డీలతో కలుపబడ్డాయి.
18నీలం, ఎరుపు ధూమ్రవర్ణం బట్ట, నాణ్యమైన
సన్నని నార బట్టతో ఆవరణ ప్రవేశానికి తెర చేయ
బడింది. నిపుణుడు వీటన్నింటినీ కలిపి కట్టాడు. ఆ
తెర 10 గజాలు పొడవు, రెండున్నర గజాలు ఎత్తు
ఉంది. ఆవరణలో తెరల వలే అవి కూడ అదే ఎత్తు
ఉన్నాయి. 19ఆ తెర నాలుగు స్తంభాలు, నాలుగు
ఇత్తడి దిమ్మల మీద ఆధారపడి ఉంది. 20స్తంభాల
మీద కొక్కెములు వెండితో చేయబడ్డాయి. స్తంభాల
శిఖరాలు, బిగించే కడ్డీలు వెండితో చేయబడ్డాయి.
21పవిత్ర గుడారం (ఒడంబడిక గుడారం) తయారు
చేసేందుకు ఉపయోగించిన వస్తువులన్నింటినీ రాసి
పెట్టమని లేవీ ప్రజలకు మోషే ఆజ్ఞాపించాడు. అహ
రోను కుమారుడు ఈతామారు ఈ జాబితా బాధ్యత
వహించాడు.
22దేవుడు మోషేకు ఆజ్ఞాపించిన సమస్తాన్నీ
యూదా వంశాపు హూరు కుమారుడైన ఊరి
కుమారుడు బెసలేలు తయారు చేసాడు. 23ఇంకా దాను
వంశాపు అహీసామాకు కుమారుడు అహోలీయాబు
అతనికి సహాయం చేసాడు. అహోలీయాబు నిపు
ణుడు, నమూనాలు గీయగలడు. శ్రేష్ఠమైన నారబట్ట
లతో నీలం, ఎరుపు ధూమ్ర వర్ణంగల బట్టతో బుటా
పని చేయగలవాడు అతడు.
24పవిత్ర గుడారం కోసం రెండు టన్నులకంటే
ఎక్కువ బంగారం యెహోవాకు అర్పణగా ఇవ్వ
బడింది. (ఆలయపు అధికారిక కొలత ప్రకారం ఇది
తూచబడింది.)
25ప్రజలు మూడుముప్పావు టన్నులకు మించి
వెండిని యిచ్చారు. (ఇది ఆలయపు అధికారిక కొలత
ప్రకారం తూచబడింది.) 26ఇరవై సంవత్సరాలు,
అంతకు పైబడ్డ మగవాళ్లందరినీ లెక్కించారు. మొత్తం
6,03,550 మంది మగవారున్నారు. వారిలో ప్రతి
ఒక్కడు ఒక వెండి బాకా (అరతులం వెండి) పన్ను
చెల్లించాలి. (ఒక వెండి బాకా అంటే అధికారిక కొలత
ప్రకారం ఒక అరతులం.) 27అందులో మూడు
ముప్పావు టన్నుల వెండి పవిత్ర గుడారపు 100
దిమ్మలు చేసేందుకు, తెరచేసేందుకు వినియోగించ
బడింది. ఒక్క దిమ్మకు 75 పౌన్ల వెండి వారు ఉప
యోగించారు. 28కొక్కెములు, తెరల కడ్డీలు చేయ
టానికి, స్తంభాలకు వెండి తాపడం చేయటానికి మరో
50 పౌన్ల వెండి ఉపయోగించబడింది.
29ఇత్తడి ఇరవైఆరున్నర టన్నులకు పైగా యెహో
వాకు ఇవ్వబడింది. 30సన్నిధి గుడార ప్రవేశం దగ్గర
దిమ్మలు చేయటానికి ఆ ఇత్తడి ఉపయోగించ బడింది.
బలిపీఠం, ఇత్తడి తెర చేసేందుకు కూడా వారు ఇత్తడి
ఉపయోగించారు. బలిపీఠం కోసం పరికరాలు, పాత్రలు
అన్నీ చేయటానికి కూడా ఇదే ఇత్తడి వాడబడింది.
31ఆవరణ చుట్టూ తెరల దిమ్మలు చేసేందుకు, ప్రవేశం
దగ్గర తెరల దిమ్మలు చేసేందుకు కూడా ఇదే ఇత్తడి
వాడబడింది. పవిత్ర గుడారానికి, ఆవరణ చుట్టూ ఉన్న

తెరలకూ కావల్సిన మేకులు చేసేందుకు కూడా ఇత్తడి ఉపయోగించబడింది.

### యాజకుల ప్రత్యేక వస్త్రాలు

39 పవిత్ర స్థలంలో యాజకులు పరిచర్య చేసేటప్పుడు ధరించే ప్రత్యేక వస్త్రాలు తయారు చేసేందుకు నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణంగల బట్టను పనివారు ఉపయోగించారు. మోషేకు యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారం వారు అహరోనుకు గూడ ప్రత్యేక వస్త్రాలు తయారు చేసారు.

### ఏఫోదు

2బంగారు తీగ, శ్రేష్ఠమైన బట్ట, నీలం, ఎరుపు, ధూమ్రవర్ణం గల బట్టతో అతడు ఏఫోదును చేసాడు. 3బంగారాన్ని సన్నని రేకులుగా వారు కొట్టారు. తర్వాత బంగారాన్ని పొడవైన తీగలుగా కోసారు. నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణంగల బట్ట, నాణ్యమైన బట్టతో బంగారాన్ని కలిపి కొట్టారు. ఇది చాల నైపుణ్యంగల వాని పని. 4ఏఫోదుకు భుజభాగాలను వారు చేసారు. ఈ భాగాలు బట్ట అంచులకు బిగించబడ్డాయి. అప్పుడు అన్ని భాగాలు కలిసి కట్టబడ్డాయి. 5దట్టి కూడ ఆలాగే చేయబడింది అది ఏఫోదులో ఒక భాగంగా ఉండేటట్టు కలుపబడింది. యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టే బంగారు తీగ, నాణ్యమైన బట్ట, నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణం బట్టలతో అది చేయబడింది.

6రత్నాలను బంగారపు జవలలో పనివాళ్లు పొదిగించారు. ఇశ్రాయేలు కుమారుల పేర్లను వారు రత్నాలపై చెక్కారు. 7తర్వాత ఏఫోదు భుజ భాగాల మీద రత్నాలను వారు అమర్చారు. ఇశ్రాయేలు కుమారులలో ఒక్కొక్కరికి ఒక్కో రత్నం సూచనగా ఉంది. యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారమే ఇది చేయబడింది.

### న్యాయతీర్పు పైవస్త్రం

8తర్వాత న్యాయతీర్పు పైవస్త్రం బెసలేలు చేసాడు. నిపుణుని పనిగా అది చేయబడింది. బంగారు దారాలు, నీలం, ఎరుపు, ధూమ్రవర్ణం బట్టలతో అది చేయబడింది. 9న్యాయతీర్పు పైవస్త్రం చతురస్రంగా ఉంది, రెండుగా మడత చేయబడింది. దాని పొడవు 9 అంగుళాలు, వెడల్పు 9 అంగుళాలు. 10తర్వాత పనివాళ్లు అందమైన రత్నాలను నాలుగు వరుసలుగా దాని మీద పెట్టారు. మొదటి వరుసలో మాణిక్యం, గోమేధికం, మరకతం ఉన్నాయి. 11రెండవ వరుసలో పద్మరాగం, నీలం, సూర్యకాంతమణి వున్నాయి. 12మూడవ వరుసలో గారుత్మతకం, యష్మురాయి. ఇంద్రనీలం వున్నాయి. 13నాలుగవ వరుసలో రక్తవర్ణపు రాయి, సులిమానిరాయి, సూర్యకాంతం ఉన్నాయి. ఈ రత్నాలన్నీ బంగారంలో పొదిగించబడ్డాయి. 14ఒక పనివాడు ఒక ముద్రను చేసినట్టు, ఇశ్రాయేలు కుమారుల పేర్లు ఈ పన్నెండు రాళ్లమీద చెక్కబడ్డాయి. ఇశ్రాయేలు కుమారులు ఒక్కొక్కరి పేరు ఒక్కో రాయి మీద ఉంది.

15న్యాయతీర్పు పైవస్త్రం కోసం స్వచ్ఛమైన బంగారంతో ఒక గొలుసు చేయబడింది. అది తాడుతో అల్లిక చేయబడింది. 16పనివాళ్లు రెండు బంగారు దిమ్మలు, రెండు బంగారు ఉంగరాలు చేసారు. న్యాయతీర్పు వస్త్రం పైభాగంలోని రెండు మూలల్లో బంగారు ఉంగరాలు రెండు పెట్టారు. 17తర్వాత బంగారు గొలుసులు రెంటిని న్యాయతీర్పు వస్త్రానికి మూలల్లో రెండు ఉంగరాలకు కట్టారు. 18బంగారు తాళ్ల అవతలి కొనలను రెండు జవలకు కట్టారు. తర్వాత ఏఫోదు ఎదుట భాగంలోని రెండు భుజాలకు వారు వాటిని బిగించారు. 19తర్వాత వారు మరి రెండు బంగారు ఉంగరాలు చేసి, ఏఫోదు అడుగు భాగపు రెండు మూలల్లో పెట్టారు. ఏఫోదు దగ్గర లోపలి భాగంలో వారు ఆ ఉంగరాలను పెట్టారు. 20భుజభాగాల ముందర అడుగు భాగంలో కూడా రెండు బంగారు ఉంగరాలను వారు పెట్టారు. ఏఫోదు దట్టీకి పైగా బిగింపు కూర్పునకు దగ్గరగా ఈ ఉంగరాలు ఉన్నాయి. 21తర్వాత నీలి (దారంతో అల్లిన బట్ట) దట్టీతో తీర్పు పతకపు ఉంగరాలను ఏఫోదు ఉంగరాలకు కట్టారు. ఈ విధంగా తీర్పు పతకం నడికట్టును హత్తుకొని ఉంది. అది పడిపోదు. యెహోవా ఆజ్ఞాపించినట్లే వాళ్లు ఇవన్నీ చేసారు.

### యాజకులకు ఇతర వస్త్రాలు

22తర్వాత ఏఫోదు అంగీని వారు తయారు చేసారు. నీలం గుడ్డతో దాన్ని తయారు చేసారు. అది ఒక నిపుణుని పనితనం. 23అంగీ మధ్యలో ఒక రంధ్రం ఉంది, ఆ రంధ్రం చుట్టూ ఒక గుడ్డ ముక్క కట్టబడింది. ఆ గుడ్డ ముక్క గోటు. ఆ రంధ్రం చినిగి పోకుండా ఉంచుతుంది.

24తర్వాత నాణ్యమైన బట్ట నీలం, ఎరుపు ధూమ్ర వర్ణపు నారబట్ట ఉపయోగించారు.అంగీ అడుగు భాగానికి చుట్టూరా దానిమ్మలను కట్టారు. 25తర్వాత స్వచ్ఛమైన బంగారంతో గంటలను వారు చేసారు. అంగీ అడుగు భాగాన దానిమ్మలకు మధ్య ఈ గంటలను వారు కట్టారు. 26అంగీ అడుగు భాగం చుట్టూరా గంటలు, దానిమ్మలు ఉన్నాయి. ప్రతి దానిమ్మకూ మధ్య ఒక గంట వుంది సరిగా యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టే యాజకుడు యెహోవాకు సేవ చేసేటప్పుడు ఈ అంగీని ధరించేవాడు.

27అహరోనుకు, అతని కుమారులకు చొక్కాలను పనివారు తయారు చేసారు. నాణ్యమైన బట్టతో ఈ చొక్కాలు చేయబడ్డాయి. 28ఇంకా పనివాళ్లు నాణ్యమైన

బట్టతో తలపాగాలను చేసారు. తలకు లోపలను, ఏఫోదు తీర్పు పతకాల కింద ధరించే బట్టలను వాళ్లు తయారు చేసారు. నాణ్యమైన బట్టతో వాళ్లు వీటిని తయారు చేసారు. 29నాణ్యమైన బట్ట నీలం, ఎరుపు, ధూమ్ర వర్ణంగల బట్టతో నడికట్టును వారు తయారు చేసారు. బట్టతో చిత్రపటాలు కుట్టబడ్డాయి. యెహోవా ఆజ్ఞాపించినట్టే ఇవన్నీ చేయబడ్డాయి.

30తర్వాత పవిత్ర కిరీటం కోసం ఒక బంగారు బద్ద తయారు చేసారు. దాన్ని స్వచ్ఛమైన బంగారంతో వాళ్లు చేసారు. బంగారం మీద వాళ్లు "యెహోవాకు పవిత్రం." అనే మాటలు వ్రాసారు. 31తర్వాత వాళ్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టే ఆ బంగారు బద్దకు ఒక నీలసూత్రం కట్టి దాని తలపాగాకు కట్టారు.

## పవిత్ర గుడారాన్ని మోషే తనిఖీ చేయటం

32కనుక సన్నిధి గుడారపు పని అంతా అయిపోయింది. సరిగ్గా యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టే ఇశ్రాయేలు ప్రజలు సమస్తం చేసారు. 33తర్వాత పవిత్ర సమావేశ గుడారాన్ని వారు మోషేకు చూపించారు. గుడారాన్ని, అందులో ఉన్న సమస్తాన్ని వాళ్లు అతనికి చూపించారు. ఉంగరాలు, చట్రాలు, కమ్మీలు, స్తంభాలు, దిమ్మలు, అన్నీ వాళ్లు అతనికి చూపించారు. 34ఎరుపు రంగు వేయబడ్డ గొర్రె చర్మాలతో తయారు చేయబడిన గుడారపు పైకప్పును వారు అతనికి చూపించారు. పొట్టేళ్ల తోలుతో చేయబడ్డ పైకప్పును వారు అతనికి చూపించారు. మరియు శ్రేష్ఠమైన తోలుతో చేయబడ్డ పవిత్రస్థల ప్రవేశానికి వేసే తెరను కూడా అతనికి చూపించారు.

35ఒడంబడిక పెట్టెను వారు మోషేకు చూపించారు. ఆ పెట్టెను మోసేందుకు ఉపయోగించే కర్రలను, పెట్టెను మూసివుంచే మూతను వారు అతనికి చూపించారు. 36బల్లను, గోనెమీద ఉంచే వాటన్నింటిని, దేవుని ప్రత్యేక రొట్టెను వారు మోషేకు చూపెట్టారు. 37స్వచ్ఛమైన బంగారంతో చేయబడ్డ దీపస్తంభాన్ని, దాని మీద దీపాలను వారు మోషేకు చూపించారు. దీపాలకు ఉపయోగించే నూనె, ఇతర వస్తువులన్నింటిని వారు మోషేకు చూపించారు. 38బంగారు బలిపీఠం, అభిషేక తైలం, పరిమళ వాసనగల ధూపం, గుడారపు ప్రవేశాన్ని మూసి వుంచే తెరను వారు అతనికి చూపించారు. 39ఇత్తడి బలిపీఠమును, ఇత్తడి తెరను వారు అతనికి చూపించారు. బలిపీఠాన్ని మోసేందుకు ఉపయోగించే కర్రలను వారు మోషేకు చూపించారు. బలిపీఠం మీద ఉపయోగించే వస్తువులన్నింటినీ వారు మోషేకు చూపించారు. గంగాళాన్ని గంగాళంకింద ఉండే దిమ్మను వారు అతనికి చూపించారు. 40ఆవరణలో స్తంభాలు, దిమ్మలతో ఉన్న తెరల గోడను మోషేకు వారు చూపించారు. ఆవరణ ద్వారాన్ని కప్పి ఉంచే తెరను వారు అతనికి చూపించారు. తాళ్లను, పవిత్ర గుడారపు మేకులను వారు అతనికి చూపించారు. పవిత్ర గుడారంలో, సన్నిధి గుడారంలో ఉన్నవాటన్నింటినీ వారు అతనికి చూపించారు. 41తర్వాత పవిత్ర గుడారంలో సేవలు చేసే యాజకుల కోసం తయారు చేయబడ్డ వస్త్రాలను వారు మోషేకు చూపించారు. యాజకుడైన అహరోను, అతని కుమారుల కోసం తయారు చేయబడ్డ ప్రత్యేక వస్త్రాలను వారు అతనికి చూపించారు. వారు యాజకులుగా సేవ చేసినప్పుడు ఆ వస్త్రాలు ధరించారు.

42సరిగ్గా యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టే ఇశ్రాయేలు ప్రజలు ఈ పని అంతా చేసారు. 43పని అంతటినీ మోషే చాలా సునిశితంగా పరిశీలించాడు. సరిగ్గా యెహోవా ఆజ్ఞాపించినట్టే పని జరిగినట్టు మోషే చూసాడు. కనుక వాళ్లను మోషే ఆశీర్వదించాడు.

## పవిత్ర గుడారాన్ని మోషే నిలబెట్టాడు

40 అప్పుడు మోషేతో యెహోవా యిలా చెప్పాడు: 2"మొదటి నెల మొదటి రోజున పవిత్ర గుడారాన్ని నిలబెట్టు. 3ఒడంబడిక పెట్టెను సమావేశ పవిత్ర గుడారంలో పెట్టు. తెరతో ఆ పెట్టెను కప్పివేయి. 4తర్వాత బల్లను లోపలికి తీసుకురా. బల్లమీద ఉండాల్సిన వస్తువులను దాని మీద ఉంచు. తర్వాత దీపస్తంభాన్ని గుడారంలో ఉంచు. 5ధూపార్పణ కోసం బంగారపు వేదికను గుడారంలో పెట్టు, ఒడంబడిక పెట్టెకు ముందర ఈ వేదికను పెట్టు. తర్వాత పవిత్ర గుడారపు ప్రవేశానికి తెరవేయి.

6"పవిత్ర గుడారపు (సన్నిధి గుడారం) ప్రవేశానికి ముందర దహనబలి అర్పణల పీఠాన్ని ఉంచు. 7ఈ బలిపీఠానికి, సన్నిధి గుడారానికి మధ్య గంగాళం ఉంచు. గంగాళంలో నీళ్లు పోయాలి. 8ఆవరణ చుట్టూ తెరలు తగిలించాలి. తర్వాత ఆవరణ ప్రవేశం దగ్గర తెర వేయాలి.

9"అభిషేకతైలం ఉపయోగించి పవిత్ర గుడారాన్ని, అందులో ఉండే సమస్తాన్ని అభిషేకించు. ఈ వస్తువుల మీద నీవు తైలం పోసినప్పుడు వాటిని నీవు పవిత్రం చేస్తావు. 10దహన బలులను దహించే బలిపీఠాన్ని, అభిషేకించు, బలిపీఠం మీద ఉండే సమస్తాన్నీ అభిషేకించు. ఆ బలిపీఠాన్ని నీవు పవిత్రం చేస్తావు. అది అతి పరిశుద్ధంగా ఉంటుంది. 11తర్వాత గంగాళాన్ని, దాని కింద దిమ్మను అభిషేకించు. ఆ వస్తువులను పవిత్రం చేసేందుకు ఇలా చేయి.

12"అహరోనును, అతని కుమారులను సన్నిధి గుడారం ప్రవేశం దగ్గరకు తీసుకురా. నీళ్లతో వాళ్లకు స్నానం చేయించాలి. 13తర్వాత అహరోనుకు ప్రత్యేక వస్త్రాలను తొడిగించాలి. తైలంతో అతన్ని అభిషేకించి అతన్ని పవిత్రంచెయ్యి. అప్పుడే అతడు యాజకుడుగా

సేవచేయగలడు. 14తర్వాత అతని కుమారులకు
వస్త్రాలు తొడిగించాలి. 15వాళ్ల తండ్రిని నీవు అభి
షేకించినట్టే కుమారులను కూడా అభిషేకించు.
అప్పుడు వాళ్లు కూడా యాజకులుగా నా సేవ చేయ
గలరు. వాళ్లను నీవు అభిషేకించినప్పుడు వాళ్లు యాజ
కుల వుతారు. రాబోయే కాలమంతా ఆ కుటుంబము
యాజకులుగా కొనసాగుతారు.” 16మోషే యెహోవా
వాకు విధేయుడయ్యాడు. యెహోవా తనకు ఆజ్ఞాపిం
చిన దానంతటి ప్రకారం అతడు చేసాడు.

17కనుక సరైన సమయంలో పవిత్రగుడారం నిల
బెట్టబడింది. వారు ఈజిప్టు విడిచిన తర్వాత అది
రెండవ సంవత్సరం మొదటి నెల మొదటి రోజు.
18యెహోవా చెప్పినట్టే పవిత్ర గుడారాన్ని మోషే
నిలబెట్టాడు. అతడు దిమ్మలను ముందుగా కింద
పెట్టాడు. తర్వాత ఆ దిమ్మల మీద చట్రాలను
పెట్టాడు. తర్వాత అతడు కమ్ములను అమర్చి, స్తంభా
లను నిలబెట్టాడు. 19ఆ తర్వాత పవిత్ర గుడారం
కప్పును మోషే నిలబెట్టాడు. తర్వాత గుడారపు కప్పు
మీద మరో కప్పును అతడు వేసాడు. యెహోవా
ఆజ్ఞాపించినట్టే అతడు వీటన్నింటినీ చేసాడు.

20దేవుని ఆజ్ఞలు రాయబడ్డ రాతి పలకలను ఒడం
బడిక పెట్టెలో మోషే పెట్టాడు. ఆ పెట్టెకు కర్రలను
మోషే పెట్టాడు. తర్వాత అతడు ఆ పెట్టెకు మూత
పెట్టాడు. 21తర్వాత ఆ పవిత్ర పెట్టెను గుడారంలోకి
మోషే తీసుకు వచ్చాడు. సరైన చోట అతడు తెర
వేసాడు. ఇది సన్నిధి గుడారంలో పవిత్ర పెట్టెను
మరుగు చేస్తుంది. యెహోవా తనకు ఆజ్ఞాపించిన
ప్రకారం మోషే వీటన్నింటినీ చేసాడు. 22తర్వాత
సన్నిధి గుడారపు బల్లను మోషే పెట్టాడు. గుడారం
ఉత్తరాన అతడు దీన్ని పెట్టాడు. (పవిత్ర స్థలంలో)
తెరముందర అతడు దీన్ని పెట్టాడు.23తర్వాత
యెహోవా సన్నిధిలో బల్ల మీద రొట్టెను అతడు
పెట్టాడు. యెహోవా తనకు ఆజ్ఞాపించినట్టు అతడు
దీన్ని చేసాడు. 24తర్వాత మోషే. దీపస్తంభాన్ని సన్నిధి
గుడారంలో పెట్టాడు. గుడారం దక్షిణాన, బల్లకు ఎదుట
అతడు దీపస్తంభం పెట్టాడు. 25తర్వాత యెహోవా
సన్నిధిలో దీపస్తంభం మీద దీపాలను అతడు పెట్టాడు.
యెహోవా తనకు ఆజ్ఞాపించినట్టే అతడు దీన్ని
చేసాడు.

26తర్వాత బంగారపు ధూపవేదికను సన్నిధి గుడా
రంలో మోషే పెట్టాడు. ఆ వేదికను తెరముందర
అతడు పెట్టాడు. 27తర్వాత ఆ బంగారు బలిపీఠం
మీద సువాసనగల పరిమళ ధూపం అతడు వేసాడు.
యెహోవా తనకు ఆజ్ఞాపించినట్టే అతడు దీన్ని
చేసాడు. 28తర్వాత పవిత్ర గుడారం ప్రవేశానికి మోషే
తెర వేసాడు.

29పవిత్ర గుడారం, సన్నిధి గుడారం ప్రవేశం దగ్గర
దహన బలులను దహించే బలిపీఠాన్ని మోషే పెట్టాడు.
అప్పుడు ఒక దహన బలి అర్పణను ఆ బలిపీఠం
మీద మోషే అర్పించాడు. యెహోవాకు ధాన్యార్పణ
కూడ అతడు అర్పించాడు. యెహోవా అతనికి ఆజ్ఞా
పించినట్టే అతడు వీటన్నింటినీ చేసాడు. 30తర్వాత
మోషే సన్నిధి గుడారానికి, బలిపీఠానికి మధ్య గంగాళం
ఉంచాడు కడుక్కోనేందుకు గంగాళంలో నీళ్లు పోసాడు.
31మోషే, అహరోను, అహరోను కుమారులు వారి
కాళ్లుచేతులు కడుక్కోనేందుకు ఈ గంగాళాన్ని ఉప
యోగించారు. 32వారు సన్నిధి గుడారంలో ప్రవేశించి
నప్పుడల్లా కాళ్లు కడుక్కొనేవారు. వాళ్లు బలిపీఠాన్ని
సమీపించిన ప్రతీసారీ వాళ్లను వాళ్లు కడుక్కొనేవారు.
యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన ప్రకారం వాళ్లు
ఇలా చేసారు.

33తర్వాత గుడారపు ఆవరణలో తెరలను మోషే
తగిలించాడు. మోషే గుడారపు ఆవరణలో బలిపీఠాన్ని
పెట్టాడు. తర్వాత అతడు ఆవరణ ప్రవేశం దగ్గర తెరను
వేసాడు. కనుక అతడు చేయాలని చెప్పి యెహోవా
తనకు అప్పగించిన పని అంతా మోషే ముగించాడు.

### యెహోవా మహిమ

34అంతా ముగించిన తర్వాత సన్నిధి గుడారాన్ని
ఒక మేఘం ఆవరించింది. యెహోవా మహిమ ఆ
పవిత్ర గుడారాన్ని నింపివేసింది. 35ఆ మేఘం పవిత్ర
గుడారం మీద నిలిచిపోగా యెహోవా మహిమ దాన్ని
నింపేసింది. కనుక మోషే ఆ సన్నిధి గుడారంలో
ప్రవేశించలేక పోయాడు. 36(ప్రజలు ఎప్పుడు సాగి
పోవాల్సిందీ చూపెట్టిన మేఘం) పవిత్ర గుడారంనుండి
మేఘం పైకి లేచినప్పుడు, ప్రజలు ప్రయాణం
మొదలు పెట్టేవారు. 37అయితే ఆ మేఘం పవిత్ర
గుడారం మీద నిలిచి ఉన్నప్పుడు ప్రజలు సాగిపోయే
ప్రయత్నం చేయలేదు. మేఘం లేచేంతవరకు వాళ్లు
ఆ స్థలంలోనే ఉండిపోయారు.

38కనుక యెహోవా మేఘం పగటివేళ పవిత్ర
గుడారం మీద నిలిచి ఉండేది. మరియు రాత్రివేళ ఆ
మేఘంలో అగ్ని ఉండేది. కనుక ఇశ్రాయేలు ప్రజలంతా
ప్రయాణం చేస్తునప్పుడు ఆ మేఘాన్ని చూడగలిగారు.

# లేవీయకాండము

### బలులు, అర్పణల నియమాలు

1 యెహోవా దేవుడు మోషేను పిలిచి, సన్నిధి గుడారంలో నుండి అతనితో మాట్లాడాడు. యెహోవా అన్నాడు: 2“ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు, మీలో ఎవరైనా యెహోవాకు అర్పణ తెచ్చినప్పుడు, ఆవుల మందలోనుండి గాని, గొర్రెల మందలోనుండి గాని దానిని తీసుకొని రావాలి.

3“ఒక వ్యక్తి తన ఆవుల మందలో ఒక దానిని దహనబలిగా అర్పిస్తుంటే, అది నిర్దోషమైన గిత్తయి* వుండాలి. ఆ వ్యక్తి ఆ గిత్తను సన్నిధి గుడారపు ద్వారం దగ్గరకు తీసుకొని వెళ్లాలి. అప్పుడు యెహోవా ఆ అర్పణను అంగీకరిస్తాడు. 4ఈ వ్యక్తి ఆ గిత్త తలమీద తన చేయి పెట్టాలి. ఆ వ్యక్తి పాపానికి ప్రాయశ్చిత్తంగా ఆ దహనబలి అర్పణను యెహోవా అంగీకరిస్తాడు.

5“ఆ వ్యక్తి యొక్క గిత్తను యెహోవా ఎదుట వధించాలి. అప్పుడు అహరోను కుమారులైన యాజకులు ఆ గిత్త రక్తాన్ని తీసుకొని రావాలి. సన్నిధి గుడారపు ద్వారం దగ్గర బలిపీఠం చుట్టూ ఆ రక్తాన్ని వారు చిలకరించాలి. 6అతడు ఆ పశువు చర్మాన్ని ఒలిచి, ఆ పశువును ముక్కలుగా నరకాలి. 7యాజకులైన అహరోను కుమారులు బలిపీఠం మీద కట్టెలు, నిప్పు ఉంచాలి. 8యాజకులైన అహరోను కుమారులు ఆ ముక్కలను (తల, కొవ్వు) కట్టెల మీద పెట్టాలి. ఆ కట్టెలు బలిపీఠం మీద నిప్పుల్లో ఉంటాయి. 9ఆ పశువు లోపలి భాగాలను, కాళ్లను నీళ్లతో యాజకుడు కడగాలి. తర్వాత ఆ పశువు అవయవాలు అన్నింటినీ బలిపీఠం మీద యాజకుడు దహించాలి. అది అగ్నిపై అర్పించబడే దహనబలి, ఇది యెహోవాకు ఇష్టమైన సువాసన.

### గొర్రెలు, మేకలు అర్పణల నియమాలు

10“ఒక వ్యక్తి గొర్రెనుగాని మేకనుగాని దహన బలిగా అర్పిస్తుంటే, ఏ దోషం లేని మగదానిని మాత్రమే అతడు అర్పించాలి. 11ఆ వ్యక్తి బలిపీఠానికి ఉత్తరాన, యెహోవా ఎదుట ఆ జంతువును వధించాలి. అప్పుడు యాజకులైన అహరోను కుమారులు, ఆ జంతువు రక్తాన్ని బలిపీఠం చుట్టూ చిలకరించాలి. 12అప్పుడు యాజకుడు ఆ జంతువును ముక్కలుగా నరకాలి. ఆ జంతువు తల, కొవ్వులను యాజకుడు ఉంచుకొంటాడు. ఆ ముక్కలను యాజకుడు కట్టెల మీద చక్కగా పేర్చాలి. బలిపీఠం మీద నిప్పుల్లో ఆ కట్టెలు ఉంటాయి. 13లోపలి భాగాలను, కాళ్లను నీళ్లతో యాజకుడు కడగాలి. అప్పుడు యాజకుడు ఆ జంతువు అవయవాలన్నింటినీ అర్పించి, బలిపీఠం మీద దహించాలి. అది అగ్నిపై అర్పించబడే దహనబలి, ఇది యెహోవాకు ఇష్టమైన సువాసన.

### పక్షుల బలి అర్పణకు నియమాలు

14“ఒక వ్యక్తి ఒక పక్షిని యెహోవాకు దహన బలిగా అర్పించాలనుకొంటే, తెల్ల గువ్వ, లేక పావురం పిల్ల మాత్రమే యివ్వాలి. 15అర్పణను యాజకుడు ఆ బలిపీఠం దగ్గరకు తీసుకొని రావాలి. యాజకుడు ఆ పక్షి తలను తుంచివేయాలి. అప్పుడు ఆ పక్షిని బలిపీఠం మీద యాజకుడు దహించాలి. ఆ పక్షి రక్తాన్ని బలిపీఠం పక్కగా కార్చివెయ్యాలి. 16యాజకుడు ఆ పక్షి మేత పొట్టను, దాని ఈకలను తీసివేసి, బలిపీఠానికి తూర్పుగా పారవేయాలి. ఇది వారు బలిపీఠపు బూడిదను పారవేసేచోటు. 17అప్పుడు యాజకుడు ఆ పక్షి రెక్కలను పట్టి చీల్చాలి గాని దానిని రెండు భాగాలుగా విడదీయకూడదు. బలిపీఠం మీద అగ్నిలోఉన్న కట్టెలపైన ఆ పక్షిని యాజకుడు దహించాలి. అది అగ్నిపైన అర్పించబడే దహనబలి, ఇది యెహోవాకు ఇష్టమైన సువాసన.

### ధాన్యార్పణల నియమాలు

2 “ఎవరైనా యెహోవాకు ధాన్యార్పణ పెట్టేటప్పుడు అది శ్రేష్ఠమైన పిండిగా ఉండాలి. ఆ వ్యక్తి ఆ పిండిమీద నూనెపోసి, సాంబ్రాణి వేయాలి. 2అప్పుడు దానిని యాజకులైన అహరోను కుమారుల దగ్గరకు అతడు తీసుకొని రావాలి. సాంబ్రాణిని, నూనె కలిపిన పిండిలో ఒక గుప్పెడు ఆ వ్యక్తి తీసుకోవాలి. అప్పుడు యాజకుడు బలిపీఠపు అగ్నితో ఆ పిండిని జ్ఞాపకార్థ అర్పణగా దహించాలి. అది యెహోవాకు

---

**గిత్త** అనగా విత్తులు కొట్టబడని యవ్వన ఎద్దు. దీన్ని కోడెదూడ అని కూడా అంటారు.

ఇష్టమైన సువాసనగా ఉంటుంది. 3మిగిలిపోయిన ధాన్యా
ర్పణ అహరోనుకు, అతని కుమారులకు చెందుతుంది.
యెహోవాకు అర్పించే హోమములు అన్నింటిలో
ఇది అతి పవిత్రం.

## పొయ్యిమీద కాల్చిన ధాన్యార్పణల నియమాలు

4"పొయ్యిమీద కాల్చబడిన ధాన్యార్పణ నీవు పెట్టే
టప్పుడు అది నూనె కలిపిన శ్రేష్ఠమైన పిండితో చేయ
బడ్డ పొంగని రొట్టెలు, లేక నూనె రాయబడ్డ పొంగని
అప్పడాలు కావాలి. 5పెనం మీద కాల్చబడిన ధాన్యా
ర్పణ నీవు తెస్తే అది నూనెతో కలిపిన పొంగని మంచి
పిండి కావాలి. 6దానిని నీవు ముక్కలు చేసి, దాని
మీద నూనెపోయాలి. అది ధాన్యార్పణ. 7నీవు వంట
గిన్నెలో వండిన ధాన్యార్పణ తెస్తే అది నూనెతో
కలుపబడిన మంచి పిండికావాలి.
8"ఈ పదార్థాలతో చేయబడిన ధాన్యార్పణను నీవు
యెహోవాకు తీసుకొని రావాలి. నీవు వాటిని
యాజకుని దగ్గరకు తీసుకొనివెళ్లాలి, అతడు వాటిని
బలిపీఠం మీద ఉంచుతాడు. 9ఇది జ్ఞాపకార్థమైన అర్పణ.
అది బలిపీఠం మీద దహించబడాలి. అగ్నిమీద అది
దహించబడుతుంది. ఇది యెహోవాకు ఇష్టమైన
సువాసన. 10మిగిలిపోయిన ధాన్యార్పణలు అహ
రోనుకు, అతని కుమారులకు చెందుతుంది. యెహో
వాకు అర్పించే హోమాలలో ఇది అతి పవిత్రం.
11"పులిసిన పదార్థం ఉన్న ధాన్యార్పణ ఏదీ మీరు
యెహోవాకు తీసుకొని రాకూడదు. పులిసిన పదార్థం
గాని, తేనెగాని యెహోవాకు అర్పణగా అగ్నిమీద
దహించకూడదు.
12మొదటి పంటలోనుండి పులిసిన పదార్థాన్ని,
తేనెను యెహోవాకు అర్పణగా మీరు తీసుకొని రావ
చ్చును. కానీ బలిపీఠం మీద ఇష్టమైన సువాసనగా
ఉండేందుకు పులిసిన పదార్థం, తేనె దహించబడ
కూడదు.
13నీవు తీసుకొని వచ్చే ప్రతి ధాన్యార్పణలో ఉప్పు
తప్పక వేయాలి. నీవు అర్పించు ధాన్యార్పణలో ఉప్పు
వేయవలెను.

## మొదటి పంటనుండి ధాన్యార్పణలు

14"మొదటి పంటలోనుండి నీవు యెహోవాకు
ధాన్యార్పణ అర్పిస్తే, వాటిని పేల్చి తీసుకురావాలి.
కొత్త ధాన్యం నుండి వాటిని ఒలిచి తీసుకొని రావాలి.
ఇది మొదటి పంటలోనుండి నీ కొరకైన ధాన్యా
ర్పణ అవుతుంది. 15దానిమీద నూనెను, సాంబ్రాణిని
నీవు వేయాలి. అది ధాన్యార్పణ అవుతుంది. 16ఒలిచిన
ధాన్యాన్ని, నూనెలోనుండి కొంతభాగాన్ని, సాంబ్రాణి
మొత్తాన్ని జ్ఞాపకార్థ అర్పణగా యాజకుడు దహించాలి.
ఇది యెహోవాకు హోమమైయుండును.

## సమాధాన బలుల నియమాలు

3 "ఒక వేళ ఒక వ్యక్తి ఇచ్చే అర్పణ సమాధాన బలి
అయితే, మగ లేక ఆడ జంతువును తన పశువుల
మందలోనుండి అతడు యెహోవాకు ఇస్తే ఆ
పశువులో ఎలాంటి దోషం ఉండకూడదు. 2ఆ వ్యక్తి
ఆ పశువు తలమీద తన చేతులు ఉంచాలి. సన్నిధి
గుడార ద్వారం దగ్గర ఆ పశువును అతడు వధించాలి.
అప్పుడు అహరోను కుమారులైన యాజకులు ఆ
రక్తాన్ని బలిపీఠం చుట్టూ చిలకరించాలి. 3ఈ వ్యక్తి
సమాధాన బలిలోనుంచి యెహోవాకు హోమం
చేయాలి. అంత్రములకు, లోపలి అవయవాలకు ఉండే
కొవ్వు అంతటినీ అతడు అర్పించాలి. 4మూత్రపిండా
లను ఆ రెండింటి మీది కొవ్వును, నడుం దగ్గర
కొవ్వును అతడు అర్పించాలి. మూత్రపిండాలతో
బాటు కార్జమును కప్పి ఉండే కొవ్వును అతడు
తీయాలి. 5అప్పుడు ఆ కొవ్వును అహరోను కుమా
రులు బలిపీఠం మీద దహించాలి. దీనిని వారు అగ్నిలో
కట్టెలమీద ఉన్న దహనబలి వేస్తారు. ఇది యెహోవాకు
ఇష్టమైన సువాసనను యిచ్చే హోమం.
6"ఒకవేళ ఆ వ్యక్తి, యెహోవాకు సమాధాన అర్ప
ణగా ఒక జంతువును మందలోనుండి తెస్తే, అది
ఆడదిగాని, మగదిగాని దోషం లేనిదిగా ఉండాలి. 7అతడు
ఒక గొర్రెపిల్లను తన అర్పణగా తెస్తే, అతడు దానిని
యెహోవా ఎదుటికి తేవాలి. 8సన్నిధి గుడారం ఎదుట
అతడు దాని తలమీద చేయి పెట్టి, దానిని వధించాలి.
దాని రక్తాన్ని అహరోను కుమారులు బలిపీఠం చుట్టూ
చిలకరిస్తారు. 9అప్పుడు అతడు సమాధాన బలిలో
నుంచి కొంత యెహోవాకు హోమం చేయాలి.
కొవ్వు, కొవ్విన తోకమొత్తం, దాని లోపలి అవయవాల
మీద చుట్టూ ఉండే కొవ్వు అతడు తీసుకొని రావాలి
(వెన్నుపూస నుండి ఉండే తోకను అతడు కోసి
వేయాలి). 10రెండు మూత్రపిండాలను, వాటిని కప్పి
ఉండే కొవ్వును, నడుం దగ్గరనున్న కొవ్వును అతడు
అర్పించాలి. కార్జానికి ఉండే కొవ్వుకూడా అతడు
అర్పించాలి. మూత్రపిండాలతో బాటు కార్జాన్ని కూడా
అతడు తీయాలి. 11అప్పుడు యాజకుడు ఆ జంతు
వును బలిపీఠం మీద దహిస్తాడు. అది యెహోవాకు
ప్రజలు అగ్నితో అర్పించిన ఆహారం అవుతుంది.

## సమాధాన బలిగా మేక – దాని నియమాలు

12"ఒక వ్యక్తి ఇచ్చే అర్పణ మేక అయితే, అతడు
దానిని యెహోవా ఎదుట అర్పించాలి. 13సన్నిధి
గుడార ద్వారం దగ్గర అతడు దాని తల మీద చేయి
పెట్టి దానిని వధించాలి. అప్పుడు అహరోను కుమా
రులు ఆ మేక రక్తాన్ని బలిపీఠం చుట్టూ చిలకరించాలి.
14తర్వాత ఆ మేకలోని కొంతభాగాన్ని అతడు యెహో
వాకు హోమం చేయాలి. లోపలి భాగాల్లోను, వాటి

మీదను ఉండే కొవ్వును అతడు అర్పించాలి. 15రెండు
మూత్రగ్రంథుల్ని, వాటి మీద ఉండే కొవ్వును, ఆ
మేక నడుం దగ్గరి కొవ్వును అతడు అర్పణ చేయాలి.
కార్జాన్ని కప్పి ఉండే కొవ్వును అతడు అర్పణ చేయాలి.
మూత్రపిండాలతోబాటు కార్జాన్ని కూడా అతడు
తీయాలి. 16మేక అవయవాలను యాజకుడు దహనం
చేయాలి. అది అగ్నితో అర్పించబడ్డ ఆహారం అవు
తుంది. అది ఇష్టమైన సువాసనగా ఉంటుంది. కొవ్వు
మొత్తం యెహోవాకు చెందుతుంది. 17మీ తరాల
న్నింటికీ శాశ్వతంగా ఈ నియమం కొనసాగుతుంది.
మీరు ఎక్కడ నివసించినా కొవ్వునుగాని రక్తాన్నిగాని
మీరు తినకూడదు.”

## అనుకోకుండా చేసిన పాపాలకు ప్రాయశ్చిత్త అర్పణలు – వాటి నియమాలు

4 మోషేతో యెహోవా మాట్లాడి ఇలా అన్నాడు:
2“ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు: ప్రమాదవశాత్తు
ఎవరైనా పాపం చేసి, చేయకూడదని యెహోవా
చెప్పిన వాటిని చేస్తే, అప్పుడు అతడు ఇలా చేయాలి:
3అభిషేకించబడిన యాజకుడు* పాపం చేసి,
ప్రజలమీదికి దోషం రప్పిస్తే, అప్పుడు అతడు తాను
చేసిన పాపం నిమిత్తం యెహోవాకు ఒక అర్పణను
అర్పించాలి. ఏ దోషమూ లేని ఒక కోడెదూడను
అతడు అర్పించాలి. పాపపరిహారార్థ బలిగా ఆ కోడె
దూడను అతడు అర్పించాలి. 4సన్నిధి గుడార ద్వారం
దగ్గర యెహోవా ఎదుటకు అభిషేకించబడిన యాజ
కుడు ఆ కోడెదూడను తీసుకొని రావాలి. అతడు
కోడెదూడ తల మీద తన చేతులు ఉంచి, యెహోవా
ఎదుట దానిని వధించాలి. 5అభిషిక్తుడైన యాజకుడు
అప్పుడు ఆ దూడ రక్తాన్ని కొంత తీసుకొని, దానిని
సన్నిధిగుడారం దగ్గరకు తీసుకొని రావాలి. 6యాజ
కుడు ఆ రక్తంలో తన వేలు ముంచి, పవిత్రగది తెర
ముందు యెహోవా ఎదుట ఏడు సార్లు ఆ రక్తాన్ని
చిలకరించాలి. 7యాజకుడు సుగంధద్రవ్యాల ధూప
వేదిక మీద ఆ రక్తంలో కొంత పూయాలి, (ఈ
ధూపవేదిక సన్నిధిగుడారంలో యెహోవా ఎదుట
ఉంటుంది). ఆ కోడెదూడ రక్తాన్ని అంతా దహన
బలిపీఠం అడుగున యాజకుడు పోయాలి. ఆ బలిపీఠం
సన్నిధి గుడారపు ద్వారం దగ్గర ఉంటుంది. 8మరియు
అతడు పాప పరిహారార్థపు కోడెదూడ కొవ్వునంతా
తీసివేయాలి. లోపలి భాగాలమీద, చుట్టూ ఉండే కొవ్వు
అంతా అతడు తీసివేయాలి. 9రెండుమూత్ర పిండా
లను,వాటిమీది కొవ్వును, నడుం దగ్గరనున్న కొవ్వును
అతడు తీసుకోవాలి. కార్జాన్ని కప్పి ఉన్న కొవ్వును
అతడు తీసుకోవాలి. మరియు అతడు మూత్రపిండా
లతో బాటు కార్జాన్ని కూడా తీసుకోవాలి.
10సమాధాన బలిలో బలియివ్వబడే కోడెదూడ
నుండి తీసినట్టే అతడు వీటన్నింటినీ తీయాలి*.
యాజకుడు దహన బలి పీఠంమీద దాని భాగాలన్నింటినీ
కాల్చాలి. 11కాని, ఆ కోడెదూడ చర్మాన్ని, దాని
మాంసం అంతటినీ, దాని తల, కాళ్లు, లోపలి భాగాలను,
దాని పేడను యాజకుడు బయటకు తీసుకొనిపోవాలి.
12బసకు వెలుపల బూడిద పారబోసే ప్రత్యేకమైన
చోటుకు ఆ కోడెదూడ కళేబరాన్ని యాజకుడు
తీసుకుపోవాలి. అక్కడ కట్టెల మీద నిప్పుతో ఆ
కోడెదూడను యాజకుడు కాల్చివేయాలి. బూడిద
పారబోసే చోట ఆ కోడెదూడ కాల్చివేయబడు
తుంది.
13“ఒక వేళ ఇశ్రాయేలు జనులంతా తెలియకుండా
పాపం చేయటం తటస్థించవచ్చు. చేయకూడదని
యెహోవా ఆజ్ఞాపించిన వాటిలో దేనినైనా వారు
చేసినట్లయితే వారు అపరాధులు అవుతారు. 14ఆ
పాపం విషయమై వారు తెలుసుకొంటే, అప్పుడు ఆ
జనాంగం అంతటి నిమిత్తం పాప పరిహారార్థబలిగా ఒక
కోడెదూడను అర్పించాలి. సన్నిధి గుడారం ఎదుటికి
వారు ఆ కోడెదూడను తీసుకొనిరావాలి. 15సమాజపు
పెద్దలందరూ, యెహోవా ఎదుట ఆ కోడెదూడ మీద
వారి చేతులు ఉంచాలి. యెహోవా ఎదుట ఆ కోడె
దూడ వధించబడాలి. 16అప్పుడు అభిషిక్తుడైన యాజ
కుడు ఆ కోడెదూడ రక్తంలో కొంత సన్నిధి గుడారం
దగ్గరకు తీసుకొనిరావాలి. 17యాజకుడు ఆ రక్తంలో
తన వేలు ముంచి, తెరముందు యెహోవా ఎదుట
ఏడు సార్లు దాన్ని చిలకరించాలి. 18అప్పుడు యాజ
కుడు బలిపీఠం కొమ్ములకు కొంత రక్తం పూయాలి.
ఆ బలిపీఠం సన్నిధి గుడారంలో యెహోవా ఎదుట
ఉంది. రక్తాన్నంతా దహన బలిపీఠం అడుగున యాజ
కుడు పోయాలి. ఆ బలిపీఠం సన్నిధి గుడార ద్వారం
దగ్గర ఉంది. 19అప్పుడు యాజకుడు దాని కొవ్వు
అంతా తీసి బలిపీఠంమీద దహించాలి. 20పాప పరిహారార్థ
బలిపశువుకు చేసినట్టే అతడు ఈ కోడెదూడకు కూడా
చేయాలి* ఈవిధంగా యాజకుడు ప్రజల పాపాలకు
ప్రాయశ్చిత్తం చేస్తాడు. మరియు ఇశ్రాయేలు ప్రజలను
దేవుడు క్షమిస్తాడు. 21యాజకుడు ఆ కోడెదూడను
బస బయటకు తీసుకొని వెళ్లి దానిని కాల్చివేయాలి.
ఇదీ మొదటి కోడెదూడకు చేసినట్టే. ఇది మొత్తం
సమాజానికి పాప పరిహారార్థ బలి. 22“చేయకూడదని

---

**అభిషేకించబడిన యాజకుడు** నియమింపబడిన సమయములో సేవ చేయుటకు ఏర్పరచబడ్డ యాజకుడు. ప్రత్యేకమైన నూనె చేత అభిషేకించబడి సేవ చేయుటకు దేవుని చేత ఏర్పరచబడిన వాడు.

**సమాధాన ... తీయాలి** లేవీ 3:1-5 చూడండి.

**పాప ... చేయాలి** లేవీ 4:3-12 చూడండి.

యెహోవా చెప్పిన ఆజ్ఞలలోదేనినైనా ఒక అధికారి
పొరబాటున అతిక్రమన చేసినట్లయితే, అప్పుడు ఆ
అధికారి అపరాధి అవుతాడు. 23అతడు తన పాపం
విషయమై తెలుసుకొంటే, అతడు ఏదోషమూ లేని
ఒక మగ మేకను తీసుకొని రావాలి. అది అతని అర్పణ.
24ఆ అధికారి ఆ మేక మీద తన చేయి ఉంచి,
యెహోవా ఎదుట వారు దహనబలి పశువును వధించు
చోట దానిని వధించాలి. ఆ మేక పాపపరిహారార్థ బలి.
25యాజకుడు పాప పరిహారార్థబలిలో కొంత రక్తాన్ని
తన వేలితో తీసుకోవాలి. యాజకుడు ఆ రక్తాన్ని
దహన బలిపీఠం కొమ్ములకు పూయాలి. మిగిలిన
రక్తాన్ని యాజకుడు దహన బలిపీఠం అడుగున
పోయాలి. 26ఆ మేక కొవ్వు అంతటినీ యాజకుడు
బలిపీఠం మీద దహించాలి. సమాధాన బలిలో కొవ్వును
దహించినట్లు అతడు దానిని దహించాలి. ఈ విధంగా
యాజకుడు అధికారి పాపమునకు ప్రాయశ్చిత్తం
చేస్తాడు. మరియు దేవుడు ఆ అధికారిని క్షమిస్తాడు.

27“చేయకూడదని యెహోవా ఆజ్ఞాపించిన
వాటిలో దేనినైనా ఒక సామాన్యుడు పొరబాటున
చేయటం తటస్థించవచ్చు. 28అతడు తన పాపాన్ని
గుర్తించినట్లయితే ఏదోషం లేని ఒక ఆడ మేకను
అతడు తీసుకొని రావాలి. అది ఆ వ్యక్తి అర్పణ.
అతడు చేసిన పాపం నిమిత్తం అతడు ఆ మేకను
తీసుకొని రావాలి. 29అతడు దాని తల మీద తన
చేతిని ఉంచి, దహనబలి స్థలంలో దానిని వధించాలి.
30అప్పుడు యాజకుడు ఆ మేక రక్తంలో కొంచెం
తన వేలితో తీసుకొని, దహనబలిపీఠం కొమ్ములకు
దానిని పూయాలి. ఆ మేక రక్తాన్నంతా బలిపీఠం
అడుగున యాజకుడు పోయాలి. 31తర్వాత సమాధాన
బలినుండి కొవ్వు అంతా తీసి వేసినట్టే ఆ మేక కొవ్వు
అంతటినీ యాజకుడు తీసివేయాలి. దానిని యెహో
వాకు ఇష్టమైన సువాసనగా బలిపీఠం మీద యాజకుడు
దహించాలి. ఈ విధంగా ఆ వ్యక్తి పాపాన్ని యాజకుడు
తుడిచి వేస్తాడు. మరియు ఆ వ్యక్తిని దేవుడు క్షమిస్తాడు.

32“ఈ వ్యక్తి తన పాపపరిహారార్థ బలిగా ఒక గొర్రె
పిల్లను తీసుకొని వస్తే, అది ఏదోషమూలేని ఆడ
గొర్రెయై ఉండాలి. 33అతడు దాని తలమీద తన
చేయి ఉంచి, దహనబలి పశువును వధించే స్థలంలో,
పాపపరిహారార్థ బలిగా దానిని కూడా వధించాలి. 34ఆ
పాప పరిహారార్థ బలి రక్తాన్ని యాజకుడు తనవేలితో
తీసుకొని, దహన బలిపీఠం కొమ్ములకు పూయాలి.
తర్వాత ఆ గొర్రె రక్తాన్నంతా బలిపీఠం అడుగున
అతడు పోయాలి.

35సమాధాన బలిలో గొర్రెపిల్ల కొవ్వునంతా తీసి
వేసినట్టే, ఆ గొర్రెపిల్ల యొక్క కొవ్వు అంతటినీ
యాజకుడు తీసివేయాలి. యాజకుడు యెహోవాకు
అర్పించే హోమంలా బలిపీఠం మీద ఆ ముక్కలను
దహించాలి. ఈ విధంగా, ఆ వ్యక్తి పాపాలను
యాజకుడు తుడిచి వేస్తాడు. మరియు దేవుడు ఆ
వ్యక్తిని క్షమిస్తాడు.

### తెలియక చేసే విభిన్న పాపాలు

5 ఒక వ్యక్తి ఒక హెచ్చరికను వినవచ్చు, లేక ఒక
వ్యక్తి తాను యితరులతో చెప్పాల్సిన ఒక విష
యాన్ని వినటమో, చూడటమో తటస్థిస్తుంది. ఆ
వ్యక్తి తాను చూసిన దాన్ని లేక విన్నదాన్ని చెప్పకపోతే
అతడు అపరాధి. 2లేక ఒకవేళ ఏదైనా అపవిత్రమైన
దాన్ని ఒక వ్యక్తి తాకవచ్చును. అది అపవిత్ర జంతువు
శవం గాని, లేక అపవిత్ర పశు శవంగాని, లేక అపవిత్రమైన
ఒక పాకెడు జంతువు శవమేగాని కావచ్చును. వాటిని
ముట్టుకొన్నట్టు అతనికి తెలియకపోయినా అతడు
మాత్రం అపరాధి అవుతాడు. 3ఒక మనిషి నుండి
అపవిత్రం అయినవి ఎన్నో వస్తాయి. ఒక వ్యక్తి అవతల
వ్యక్తిలోని యిలాంటి అపవిత్రమైన వాటిలో దేనినైనా
ముట్టుకోవచ్చు, అది అతనికి తెలియకపోవచ్చు. అపవి
త్రమైనది ఏదో తాను ముట్టుకొన్నానని అతనికి తెలిసి
నప్పుడు అతడు అపరాధి అవుతాడు. 4లేక ఒక వ్యక్తి
మంచిగాని చెడుగాని ఒకటి చేస్తానని తొందరపడి
వాగ్దానం చేయవచ్చు. మనుష్యులు తొందరపడి చాలా
వాగ్దానాలు చేస్తూంటారు. ఒకడు అలాంటి వాగ్దానం
చేసి, దానిని మరచిపోయి, మరల ఆ వాగ్దానాన్ని జ్ఞాపకం
చేసుకొన్నప్పుడు అతను దానిని చేయక పోతే అపరాధి
అవుతాడు. 5కనుక వీటిలో దేని విషయంలో అతడు
అపరాధియైనా, అతడు చేసిన తప్పు ఏమిటో అతడు
చెప్పాలి. 6అతడు చేసిన పాపానికి పరిహారంగా అపరాధ
పరిహారార్థబలిని యెహోవాకు అర్పించాలి. గొర్రెల
మందలోనుండి ఒక ఆడ జంతువును పాప పరిహారార్థ
బలిగా అతడు తీసుకొని రావాలి. అది గొర్రెపిల్ల కావ
చ్చును, లేక మేక కావచ్చును. అప్పుడు ఆవ్యక్తి
పాపాన్ని తుడిచివేసేందుకు చేయాల్సిన వాటిని యాజ
కుడు చేస్తాడు. 7“ఆ వ్యక్తి గొర్రెపిల్లను ఇవ్వలేకపోతే
అతడు రెండు గువ్వలనుగాని, రెండు పావురాలను
గాని తీసు కొని రావాలి. ఇవి అతని అపరాధ పరిహారార్థ
బలి. ఒకటి పాపపరిహారార్థ బలికోసం, మరొకటి దహన
బలికోసం. 8ఆ వ్యక్తి వాటిని యాజకుని దగ్గరకు
తీసుకొని రావాలి. పాపపరిహారార్థ బలిగా మొదట ఒక
దాన్ని యాజకుడు అర్పిస్తాడు. యాజకుడు దాని
తలను మెడనుండి వేరు చేస్తాడు. కానీ ఆ పక్షిని రెండు
భాగాలుగా మాత్రం యాజకుడు విడదీయడు. 9పాప
పరిహారార్థబలి రక్తాన్ని బలిపీఠం ప్రక్కలో యాజకుడు
చిలకరించాలి. తర్వాత మిగిలిన రక్తాన్ని బలిపీఠం అడు
గున యాజకుడు పోయాలి. అది పాపపరిహారార్థ బలి.
10తర్వాత యాజకుడు చట్టం ప్రకారం దహన బలిగా
రెండో పక్షిని అర్పించాలి. ఈ విధంగా యాజకుడు

ఆ వ్యక్తి పాపాన్ని తుడిచి వేస్తాడు. మరియు దేవుడు
ఆ వ్యక్తిని క్షమిస్తాడు. 11“ఆ వ్యక్తికి రెండు పావురాలను,
రెండు గువ్వలను యిచ్చే సామర్థ్యం లేకపోతే తూమెడు
మంచి పిండిలో పదోవంతును అతడు తీసుకొని
రావాలి. ఇది అతని పాపపరిహారార్థ బలి అర్పణ. ఆ
పిండిమీద అతడు నూనె పోయకూడదు. అది పాపపరి
హారార్థ బలి గనుక అతడు దానిమీద సాంబ్రాణి కూడా
వేయకూడదు. 12అతడు ఆ పిండిని యాజకుని దగ్గ
రకు తీసుకొని రావాలి. ఆ పిండిలోనుండి యాజకుడు
పిడికెడు పిండిని జ్ఞాపకార్థ అర్పణగా తీసుకోవాలి.
యెహోవాకు హోమం వేయు బలిపీఠం మీద యాజ
కుడు ఆ పిండిని దహించాలి. అది పాపపరిహారార్థ
బలి. 13ఈ విధంగా ఆ వ్యక్తి పాపాన్ని యాజకుడు
నిర్మూలిస్తాడు. మరియు దేవుడు ఆ వ్యక్తిని క్షమిస్తాడు.
ధాన్యార్పణలో వలెనే పాపపరిహారార్థ బలిలో మిగిలినది
కూడా యాజకునికి చెందుతుంది.”

14యెహోవా మోషేతో ఇలా చెప్పాడు:
15“యెహోవా పవిత్ర విషయాలకు వ్యతిరేకంగా ఒకడు
పొరబాటున ఏదైనా తప్పు చేయవచ్చును. అప్పుడు
అతడు ఏ దోషమూ లేని ఒక పొట్టేలును మందలో
నుండి తీసుకొని రావాలి. ఇది యెహోవాకు అతని
అపరాధ పరిహారార్థ బలి అర్పణ. పవిత్ర స్థానపు అధి
కారిక కొలత ప్రకారం ఆ పొట్టేలుకు నీవు ధర నిర్ణయిం
చాలి. 16పవిత్ర విషయానికి విరుద్ధంగా అతడు చేసిన
పాపానికి అతడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఆ ధరకు
అయిదో వంతు అతడు కలపాలి. ఈ మొత్తాన్ని అతడు
యాజకునికి ఇవ్వాలి. ఈవిధంగా అపరాధ పరిహారార్థ
బలి పొట్టేలుతో ఆ వ్యక్తి పాపాన్ని యాజకుడు నిర్మూ
లిస్తాడు. దేవుడు ఆ వ్యక్తిని క్షమిస్తాడు.

17“ఒకడు పాపం చేసి, చేయగూడదని యెహోవా
ఆజ్ఞాపించిన వాటిలో దేనినైనా చేసినప్పుడు అది అత
నికి తెలియకపోయినా ఆ వ్యక్తి అపరాధి అవుతాడు.
అతడు తన పాపానికి బాధ్యత వహించాలి. 18ఆ వ్యక్తి
ఏ దోషమూ లేని ఒక పొట్టేలును మందలోనుండి
యాజకుని దగ్గరకు తీసుకొని రావాలి. ఆ పొట్టేలు
అపరాధ పరిహారార్థబలి అర్పణ. ఆ వ్యక్తి తెలియక
చేసిన పాపాన్ని ఈవిధంగా యాజకుడు నిర్మూలిస్తాడు.
దేవుడు ఆ వ్యక్తిని క్షమిస్తాడు. 19ఆ వ్యక్తి చేస్తున్నది
పాపం అని అతనికి తెలియకపోయినా అతడు అపరాధి
అవుతాడు. కనుక అపరాధ పరిహారార్థ బలిని అతడు
యెహోవాకు అర్పించాలి.”

### అపనమ్మకస్థుల కోసం అపరాధ పరిహారార్థబలి

6 యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 2“ఒకడు
యిలాంటి పాపాలు చేసి, యెహోవాకు విరో
ధంగా అపరాధం చేయవచ్చు, ఒక వ్యక్తి మరొకరి
పక్షంగా దేనికైనా కాపలా కాస్తుండగా దానికి జరిగిన
దాన్నిగూర్చి అతడు అబద్ధం చెప్పవచ్చు, లేక ఒకడు
తాను చేసిన ప్రమాణం విషయంలో అబద్ధం చెప్ప
వచ్చు, లేక ఒకడు దేనినైనా దొంగిలించవచ్చు, లేక
ఎవర్నయినా మోసం చేయవచ్చు, 3లేక ఒకడు
పోయింది దొరికినప్పుడు దాన్నిగూర్చి అబద్ధం చెప్ప
వచ్చు, లేక ఒకడు ఏదో చేస్తానని వాగ్దానం చేసి
తర్వాత అతడు వాగ్దాన ప్రకారం చేయకపోవచ్చు,
లేక ఒకడు ఇంకేదైనా చెడుకార్యం చేయవచ్చు. 4ఒక
వ్యక్తి వీటిలో ఏదైనా చేస్తే, అప్పుడు ఆ వ్యక్తి అపరాధి
అవుతాడు. అతడు దొంగతనంగా తీసుకొన్నదిగాని,
మోసంచేసి తీసుకొన్నదిగాని, మరోవ్యక్తి భద్రంగా
ఉంచమని ఇవ్వగా అతడు తీసుకొన్నదిగాని, దొరికినా
అబద్ధం చెప్పి దాన్ని, లేక
5దేన్ని గూర్చి అతడు అబద్ధ ప్రమాణం చేసాడో
దాన్ని అతడు తిరిగి ఇచ్చివేయాలి. దాని పూర్తివిలువను
అతడు చెల్లించాలి. తర్వాత దాని విలువలో
అయిదోవంతు అదనంగా అతడు చెల్లించాలి. దాని
అసలైన సొంతదారునికి అతడు ఆ మొత్తాన్ని ఇవ్వాలి.
అతడు తన అపరాధ పరిహారార్థ బలి తెచ్చిననాడే
దీన్ని చెల్లించాలి.

6“ఆ వ్యక్తి అపరాధ పరిహారార్థ బలిని యాజకుని
దగ్గరకు తీసుకొని రావాలి. అది మందలోనుంచి తెచ్చిన
పొట్టేలు. ఆ పొట్టేలుకు ఏదోషమూ ఉండకూడదు.
అది యాజకుడు నిర్ణయించిన ధరకు తగినదిగా
ఉండాలి. అది యెహోవాకు అపరాధ పరిహారార్థ బలి.
7అప్పుడు యాజకుడు యెహోవా దగ్గరకు వెళ్లి, ఆ
వ్యక్తి చేసిన పాపాన్ని నిర్మూలిస్తాడు. అప్పుడు అతణ్ణి
దేవుడు క్షమిస్తాడు.”

### దహనబలులు

8యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 9“అహరో
నుకు అతని కుమారులకు ఈ ఆజ్ఞ ఇవ్వు. ఇది
దహనబలి అర్పణ నియమము. రాత్రి అంతా, తెల్ల
వారేవరకు దహనబలి అర్పణ బలిపీఠం మీద దహనం
అవుతూనే ఉండాలి. బలిపీఠం మీద బలిపీఠపు అగ్ని
మండుతూనే ఉండాలి.10యాజకుడు తన మేలురకపు
అంగీని ధరించాలి. అతడు తన మేలు రకపు చెడ్డీని
వేసుకోవాలి. తర్వాత బలిపీఠం మీద దహనబలిని అగ్ని
దహించగా మిగిలిన బూడిదను అతడు తీసుకోవాలి.
ఈ బూడిదను యాజకుడు బలిపీఠం పక్కగా
పోయాలి.

11అప్పుడు యాజకుడు తన బట్టలు తీసి వేసి
వేరే బట్టలు ధరించాలి. తర్వాత అతడు ఆ బూడిదను
బస వెలుపల ఒక ప్రత్యేక స్థలానికి తీసుకొని వెళ్లాలి.
12అయితే బలిపీఠపు అగ్నిని మాత్రం బలిపీఠం మీద
మండుతూ ఉండనివ్వాలి. దానిని ఆరిపోనివ్వ కూడదు.
ప్రతి ఉదయం బలిపీఠం మీద యాజకుడు కట్టెలను

కాల్చుతూఉండాలి. బలిపీఠం మీద అతడు కట్టెలు పేర్చాలి. సమాధాన బలుల కొవ్వును అతడు దహించాలి. 13ఎల్లప్పుడూ ఆగకుండా బలిపీఠం మీద అగ్ని మండుతూ ఉండాలి. అది ఆరిపోకూడదు.

### ధాన్యార్పణలు

14"ధాన్యార్పణలకు గల విధి ఇది. అహరోను కుమారులు యెహోవాకు బలిపీఠం ఎదుట దీనిని తీసుకొని రావాలి. 15ధాన్యార్పణలోనుంచి పిడికెడు మంచి పిండిని యాజకుడు తీసుకోవాలి. ధాన్యార్పణ మీద నూనె, సాంబ్రాణి ఉండాలి. ధాన్యార్పణాన్ని బలి పీఠం మీద యాజకుడు దహించాలి. అది ఇష్టమైన సువాసనగాను, యెహోవాకు జ్ఞాపకార్థ అర్పణగాను ఉంటుంది.

16"మిగిలిపోయిన ధాన్యార్పణాన్ని అహరోను, అతని కుమారులు తినాలి. ధాన్యార్పణ పొంగని రొట్టెలా ఉంటుంది. యాజకులు ఈరొట్టెను పవిత్ర స్థలంలో తినాలి. సన్నిధి గుడారపు ఆవరణలో వారు ఈ ధాన్యార్పణను తినాలి. 17ధాన్యార్పణను పులిసిన పదార్థం లేకుండా చేయాలి. అగ్నిద్వారా నాకు అర్పించ బడిన అర్పణల్లో అది వారి భాగంగా నేను దానిని ఇచ్చాను. పాపపరిహారార్థ బలిలా, అపరాధ పరిహారార్థ బలి అర్పణలా అది కూడ అతి పవిత్రం. 18యెహో వాకు అగ్నిద్వారా అర్పించబడిన అర్పణల్లోనుంచి అహరోను మగ సంతానం అందరూ తినవచ్చును. మీ తరాలన్నింటికీ ఇది శాశ్వత నియమము. ఈ అర్పణల స్పర్శ వారిని పవిత్రులను చేస్తుంది."

### యాజకుల ధాన్యార్పణం

19యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 20"అహ రోను, అతని కుమారులు యెహోవాకు తీసుకొని రావాల్సిన అర్పణలు ఇవి. అహరోను అభిషేకించబడిన రోజున వారు ఇలా చేయాలి. తూమెడు మంచి పిండిలో పదోవంతు వారు ఎల్లప్పుడూ ధాన్యార్పణగా తీసుకొని రావాలి. అందులోనుంచి సగం ఉదయం, సగం సాయంత్రం వారు తీసుకొని రావాలి.

21మంచి పిండిని నూనెతో కలిపి, పెనం మీద దాన్ని చేయాలి. అది ఉడికిన తర్వాత దానిని మీరు లోనికి తీసుకొని రావాలి. ధాన్యార్పణాన్ని మీరు భాగా లుగా చేయాలి. దానిని మీరు యెహోవాకు ఇష్టమైన సువాసనగా దహించాలి.

22"అహరోను, తర్వాత అతని సంతానంవారు ఎవరైతే అహరోను స్థానంలో అభిషేకించబడతారో వారు ఈ ధాన్యార్పణాన్ని యెహోవాకు పెట్టాలి. ఇది శాశ్వత నియమము, ధాన్యార్పణాన్ని యెహో వాకు పూర్తిగా దహించాలి. 23యాజకుల ప్రతీ ధాన్యా ర్పణను పూర్తిగాకాల్చాలి. దానిని తినకూడదు".

### పాప పరిహారార్థ బలి విధి

24యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 25"అహ రోను, అతని కుమారులతో ఇలా చెప్పు: పాప పరి హారార్థ అర్పణ విధి ఇది. యెహోవా ఎదుట దహనబలి పశువు వధించబడే చోటనే పాపపరిహారార్థ బలి పశువు కూడ అర్పించ బడాలి. అది అతి పరిశుద్ధం. 26పాప పరిహారార్థబలిని అర్పించే యాజకుడే దానిని తినాలి. సన్నిధి గుడారం యొక్క ఆవరణలో ఒక పరిశుద్ధ స్థలంలో అతడు దానిని తినాలి. 27పాప పరిహారార్థ బలి మాంసాన్ని తాకిన ప్రతి ఒక్కడూ పరిశుద్ధుడవు తాడు. మరియు తాకిన ప్రతి వస్తువూ పరిశుద్ధం అవు తుంది.

"చిలకరించబడిన రక్తం ఏ బట్టలమీద పడినా, మీరు ఆ బట్టలను ఉతకాలి. పరిశుద్ధ స్థలంలో మీరు ఆ బట్టలను ఉతకాలి. 28పాపపరిహారార్థ బలి గనుక మట్టి పాత్రలో ఉడకబెడితే ఆ పాత్రను పగుల గొట్టివేయాలి. పాపపరిహారార్థ బలిని ఇత్తడి పాత్రలో ఉడకబెడితే ఆ పాత్రను తోమి, నీళ్లతో కడగాలి.

29"యాజకులలో ప్రతి ఒక్కడూ పాపపరిహారార్థ బలిని తినవచ్చును. అది అతి పరిశుద్ధం. 30కానీ పాప పరిహారార్థ బలి రక్తాన్ని గనుక పరిశుద్ధస్థలాన్ని శుద్ధి చేసేందుకని సన్నిధి గుడారంలోనికి తీసుకొని వెళ్తే, అప్పుడు ఆ పాపపరిహారార్థ బలిని అగ్నిలో కాల్చి వేయాలి. ఆ పాపపరిహారార్థ బలిని యాజకులు తిన కూడదు.

### అపరాధ పరిహారార్థ బలులు

7 "అపరాధ పరిహారార్థ బలుల నియమాలు ఇవి. ఇది అతి పరిశుద్ధం. 2దహనబలి అర్పణలు వారు ఎక్కడ వధిస్తారో అక్కడే అపరాధ పరిహారార్థ బలులను కూడా యాజకుడు వధించాలి. అంతట యాజకుడు అపరాధ పరిహారార్థ బలి రక్తాన్ని బలిపీఠం చుట్టూ చిలకరించాలి.

3"అపరాధ పరిహారార్థ బలిలోని కొవ్వు అంతటినీ యాజకుడు అర్పించాలి. దాని కొవ్విన తోకను, దాని లోపలి భాగాలమీది కొవ్వును, 4రెండు మూత్ర గ్రంథు లను, వాటిమీది కొవ్వును, నడుందగ్గరి కొవ్వును, కార్జం యొక్క కొవ్విన భాగాన్ని అతడు అర్పించాలి. దానిని మూత్రగ్రంథులతోబాటు అతడు తీసివేయాలి. 5వీటన్నింటినీ బలిపీఠం మీద యాజకుడు దహించాలి. అవి యెహోవాకు హోమంగా అర్పించబడ్డ అర్పణలు అవుతాయి. అది అపరాధ పరిహారార్థ బలి .

6"యాజకుని కుటుంబంలో ఏ పురుషుడైనాసరే అపరాధపరిహారార్థ బలిని తినవచ్చును. అది అతి పరిశుద్ధం గనుక దాన్ని ఒక పరిశుద్ధ స్థలంలోనే తినాలి. 7అపరాధ పరిహారార్థ బలి కూడా పాపపరిహారార్థ బలి

లాంటిదే. రెండు అర్పణలకు నియమాలు ఒక్కటే.
బలులను చేసే యాజకుడు ఆహారంగా ఆ మాంసం
తీసుకొంటాడు. 8బలి అర్పణ చేసే యాజకుడు దహన
బలిపశువు చర్మాన్ని కూడా తీసుకోవచ్చును. 9ధాన్యా
ర్పణ పెట్టే యాజకునికే ప్రతి ధాన్యార్పణ చెందు
తుంది. పొయ్యిమీద వండిన ప్రతి ధాన్యార్పణ,
పాత్రలోగాని, పెనంమీదగాని వండిన ప్రతి ధాన్యార్పణ
ఆ యాజకునిదే అవుతుంది. 10ధాన్యార్పణలన్నీ అహ
రోను కుమారులకే చెందుతాయి. అవి పొడివైనా,
లేక నూనెతో కలుపబడినా భేదం ఏమీ లేదు. అహరోను
కుమారులు (యాజకులు) అందరూ ఈ ఆహారాన్ని
పంచుకోవాలి.

## సమాధాన బలులు

11“ఒక వ్యక్తి యెహోవాకు అర్పించాల్సిన సమా
ధాన బలులను గూర్చిన విధి ఇది. 12ఆ వ్యక్తి తన
కృతజ్ఞతలు తెలుపుకొనేందుకు సమాధాన బలులు
తేవచ్చును. కృతజ్ఞతలు చెల్లించేందుకు అతడు తన
బలిని తీసుకొని వచ్చినట్లయితే, నూనెతో కలుపబడిన
పులియని రొట్టెలను, నూనె పూసిన పొంగని అప్ప
డాలు, నూనెకలిపి కాల్చబడిన గోధుమ పిండివంటలు
అతడు అర్పించాలి. 13సమాధాన బలితో బాటు, పులి
యని రొట్టెలనుగూడ అతడు అర్పణగా తీసుకొని
రావాలి. ఇది ఒకడు తన కృతజ్ఞతను దేవునికి తెలియ
జేసేందుకు తీసుకొని రావాల్సిన అర్పణను గూర్చిన
విధి. 14సమాధాన బలుల రక్తాన్ని చిలకరించే యాజకు
నికి ఆ రొట్టెలలో ఒకటి చెందుతుంది. 15ఈ సమాధాన
బలి అర్పించిన రోజునే దాని మాంసం తినివేయాలి.
దేవునికి కృతజ్ఞతలు తెలియజేసేందుకు ఒక పద్ధతిగా
ఒకడు కానుక అర్పిస్తాడు. కాని దాని మాంసంలో
ఏమీ మర్నాటి ఉదయం వరకు మిగిలి ఉండకూడదు.
16“ఒక వ్యక్తి కేవలం దేవునికి ఒక కానుకగా
మాత్రమే సమాధాన బలిని తేవచ్చును. లేక ఒక వ్యక్తి
దేవునికి ఒక ప్రత్యేక వాగ్దానం చేసుకొని ఉండొచ్చు.
అదే నిజ మైతే ఆ బలిని అర్పించిన రోజునే దాన్ని
తినివేయాలి. ఒకవేళ ఏమైనా మిగిలితే, మర్నాడు దాన్ని
తినివేయాలి. 17అయితే ఈ బలి పశువు మాంసం
మూడో రోజుకు కూడా మిగిలి ఉంటే దానిని నిప్పుమీద
కాల్చివేయాలి. 18సమాధాన బలిలోని మాంసాన్ని
ఎవరైనా మూడో రోజున తింటే, ఆ వ్యక్తి విషయంలో
యెహోవా సంతోషించడు. ఆ బలిని అతని పక్షంగా
యెహోవా లెక్కించడు. ఆ బలి అపవిత్రం అవుతుంది.
ఆ మాంసంలో ఏదైనా తిన్నవాడు తన పాపానికి
తానే బాధ్యుడవుతాడు.
19“ఏదైనా అపవిత్రమైన దానికి తగిలిన మాంసాన్ని
కూడా ప్రజలు తినకూడదు. అలాంటి మాంసాన్ని
వారు అగ్నితో కాల్చివేయాలి. పరిశుద్ధమైన ప్రతివ్యక్తి
మాంసం తినవచ్చును. 20కానీ అపవిత్రమైనవాడు
ఒకడు, యెహోవాకు చెందిన సమాధాన బలి మాంసం
తిన్నట్లయితే, అతణ్ణి తన ప్రజల్లోనుండి వేరు
చేయాలి.
21“ఒకవేళ ఒక వ్యక్తి ఏదైనా అపవిత్రమైన దాన్ని
ముట్టవచ్చు. అది మనుష్యులచేత అపవిత్రం చేయ
బడిందే కావచ్చు లేక అపవిత్రమైన జంతువు కావచ్చు
లేక అసహ్యకరమైన అపవిత్రత కావచ్చును. అలాంటి
వాడు అపవిత్రుడు. యెహోవాకు చెందిన సమాధాన
బలి మాంసం అతడు తిన్నట్లయితే ఆ వ్యక్తిని అతని
ప్రజల్లోనుండి వేరు చేయాలి.”
22మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 23“ఇశ్రా
యేలు ప్రజలతో పశువుల, గొర్రెల, మేకల కొవ్వును
మీరు తినకూడదని చెప్పు. 24వాటంతట అవే చచ్చినా,
లేక యితర జంతువుల చేత చంపబడినా వాటి
కొవ్వును మీరు వాడుకోవచ్చును. కాని దాన్ని మాత్రం
ఎప్పుడూ తినకూడదు. 25యెహోవాకు హోమంగా
అర్పించబడిన జంతువు కొవ్వును ఒక వ్యక్తి తింటే ఆ
వ్యక్తిని అతని ప్రజల్లోనుంచి వేరు చేయాలి. 26మీరు
ఎక్కడ నివసించినాసరే జంతువు రక్తంగాని, పక్షిరక్తంగాని
ఎప్పుడూ మీరు తినకూడదు. 27ఎవరైనా సరే ఈ
రక్తాన్ని తింటే ఆ వ్యక్తిని అతని ప్రజల్లోనుంచి వేరు
చేయాలి.”

## నైవేద్యపు విధులు

28మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 29“ఇశ్రా
యేలు ప్రజలతో ఇలా చెప్పు, ఒక వ్యక్తి సమాధాన
బలిని యెహోవాకు తీసుకొని వస్తే ఆ కానుకలో
కొంత భాగాన్ని యెహోవాకు ఆ వ్యక్తి ఇవ్వాలి. 30కాను
కలోని ఆ భాగాన్ని హోమంగా కాల్చాలి. ఆ కానుకను
అతడు స్వయంగా తన చేతుల్తో తీసుకొని రావాలి.
ఆ జంతువు బోరమీదనున్న కొవ్వును, బోరను యాజ
కుని దగ్గరకు అతడు తీసుకొని రావాలి. ఆ బోర
యెహోవా ఎదుట పైకి ఎత్తబడుతుంది. ఇదే ఆ
నైవేద్యము. 31అప్పుడు యాజకుడు బలిపీఠం మీద
కొవ్వును దహించాలి. అయితే ఆ జంతువు బోర
అహరోనుకు, అతని కుమారులకు చెందుతుంది.
32సమాధాన బలి పశువు కుడితొడ కూడా మీరు
యాజకునికి ఇవ్వాలి. 33సమాధాన బలి పశువు రక్తాన్ని
మరియు కొవ్వును అర్పించే యాజకునికే సమాధాన
అర్పణలోని కుడి తొడ చెందుతుంది. 34నైవేద్యంలోని
బోరను, సమాధాన అర్పణలోని కుడి తొడను ఇశ్రా
యేలు ప్రజలనుండి నేను తీసుకొని, అహరోనుకు,
మరియు అతని కుమారులకు నేను వాటినిస్తున్నాను.
ఇది ఇశ్రాయేలు ప్రజలకు శాశ్వతమైన విధి.”
35యెహోవాకు అగ్నిచేత అర్పించబడు అర్పణల్లో,
ఆ భాగాలు అహరోనుకు, అతని కుమారులకు చెందు

తాయి. అహరోను, అతని కుమారులు యెహోవాకు
యాజకులుగా పని చేసినప్పుడు బలి అర్పణల్లో వారికి
కొంత భాగం లభిస్తుంది. 36యెహోవా, యాజకులను
అభిషేకించినప్పుడే ఈ విషయాన్ని చెప్పాడు, ఇశ్రా
యేలు ప్రజలు ఆ భాగాలను యాజకులకు ఇవ్వవ
లెను. వారి తరాలన్నింటిలో శాశ్వతంగా వారు ఆ
భాగాలను యాజకులకు ఇవ్వాలి.
37దహన బలి అర్పణ, నైవేద్యము, పాపపరిహారార్థ
బలి, అపరాధ పరిహారార్థ బలి, యాజకుల నియామకం,
సమాధాన బలి విధులు అవి. 38సీనాయి పర్వతంమీద
మోషేకు యెహోవా వాటిని ఇచ్చాడు. సీనాయి
ఎడారిలో ఇశ్రాయేలు ప్రజలు యెహోవాకు వారి
అర్పణలు తీసుకొని రావాలని ఆయన ఆజ్ఞాపించిన
రోజునే ఈ విధులను యెహోవా ఇచ్చాడు.

### అహరోను, కుమారులు సేవకు సిద్ధమగుట

8 యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 2"అహరో
నును, అతని కుమారులను, వారి వస్త్రాలు, అభిషే
కించే తైలాన్ని, పాపపరిహారార్థపు కోడెదూడ,రెండు
పొట్టేళ్ళను, ఒక గంపెడు పులియని రొట్టెలను నీతో
తీసుకొని, 3ప్రజలందరినీ సన్నిధి గుడారం యొక్క
ద్వారం దగ్గర సమావేశపర్చు."
4యెహోవా తనకు ఆజ్ఞాపించినట్లే మోషే చేసాడు.
ప్రజలు సన్నిధి గుడారం దగ్గర సమావేశం అయ్యారు.
5అప్పుడు మోషే, "చేయవలసినదానిని యెహోవా
సెలవిచ్చాడు"
6అప్పుడు అహరోనును, అతని కుమారులను
మోషే తీసుకొని వచ్చాడు. అతడు వారికి నీళ్లతో
స్నానం చేయించాడు. 7అప్పుడు అహరోనుకు మోషే
చొక్కా తొడిగించాడు. అహరోనుకు నడికట్టును
మోషే చుట్టాడు. అంతట ఒక నిలువుపాటి అంగీని
మోషే అహరోనుకు తొడిగించాడు. తర్వాత మోషే
ఏఫోదును అహరోనుకు ధరింపజేసాడు. నైపుణ్యంగా
అల్లిక చేయబడిన నడికట్టును మోషే అహరోను నడు
ముకు బిగించాడు. ఆ విధంగా ఏఫోదును అహరోనుకు
మోషే ధరింపజేసాడు. 8తర్వాత మోషే, న్యాయతీర్పు
పై వస్త్రంలో ఊరీము, తుమ్మీములను ఉంచాడు.
9అహరోను తలమీద తలపాగాను కూడా మోషే
పెట్టాడు. ఈ తలపాగా ముందర భాగంలో బంగారు
బద్దను మోషే పెట్టాడు. ఈ బంగారు బద్ద పరిశుద్ధ
కిరీటం. యెహోవా తనకు ఆజ్ఞాపించినట్లు మోషే
ఇలా చేసాడు.
10తర్వాత మోషే అభిషేక తైలాన్ని తీసుకొని
పవిత్ర గుడారాన్నీ, దానిలోని వస్తువులన్నిటినీ ప్రతి
ష్ఠించాడు. ఈ విధంగా వాటిని మోషే పరిశుద్ధం చేసాడు.
11ఆ అభిషేక తైలంలో కొంత బలిపీఠం మీద ఏడుసార్లు
మోషే చిలకరించాడు. బలిపీఠం, దాని పరికరాలు,
పాత్రలు అన్నింటినీ మోషే ప్రతిష్ఠించాడు. గంగాళాన్ని,
దాని పీటను కూడా మోషే ప్రతిష్ఠించాడు. ఈ విధంగా
మోషే వాటిని పరిశుద్ధం చేశాడు. 12అప్పుడు అభిషేక
తైలంలో కొంత అహరోను తలమీద మోషే పోసాడు.
ఈ విధంగా అహరోనును అతడు పరిశుద్ధం చేశాడు.
13అప్పుడు మోషే అహరోను కుమారులను తీసుకొని
వచ్చి, వారికి ప్రత్యేకమైన చొక్కాలను తొడిగించాడు.
అతడు వారికి దట్టీలు కట్టాడు. తర్వాత వారి తలలమీద
పాగాలను అతడు చుట్టాడు. యెహోవా తనకు ఆజ్ఞా
పించిన ప్రకారమే మోషే ఇవన్నీ చేసాడు.
14అప్పుడు పాపపరిహారార్థ బలిగా ఒక కోడె
దూడను మోషే తీసుకొనివచ్చాడు. పాపపరిహారార్థ
బలికొరకైన కోడె దూడ తలమీద అహరోను, అతని
కుమారులు వారి చేతులు ఉంచారు. 15అప్పుడు మోషే
ఆ కోడె దూడను వధించి, దాని రక్తాన్ని తీసాడు.
మోషే కొంచెం రక్తం తీసుకొని, తన వ్రేలితో దానిని
బలిపీఠపు కొమ్ములన్నింటి మీద చల్లాడు. ఈ విధంగా
బలిపీఠాన్ని బలులకోసం మోషే సిద్ధం చేసాడు,
తర్వాత ఆ రక్తాన్ని బలిపీఠపు అడుగున మోషే పోసాడు.
ఈ విధంగా ప్రజల పాపాలను పరిహారం చేసే బలుల
కోసం బలిపీఠాన్ని మోషే సిద్ధం చేసాడు. 16ఆ
కోడెదూడ లోపలి భాగాలనుండి కొవ్వు అంతటినీ
మోషే తీసాడు. కాలేయం యొక్క కొవ్విన భాగాన్ని,
రెండు మూత్ర పిండాలను, వాటిమీది కొవ్వును మోషే
తీసి బలిపీఠం మీద వాటిని దహించాడు. 17అయితే
ఆ కోడెదూడ చర్మాన్ని దాని మాంసాన్ని, దాని పేడను
వారి బస వెలుపలకు మోషే తీసుకుపోయాడు. నివాసా
నికి వెలుపల మంట వేసి అందులో వాటిని మోషే
కాల్చివేసాడు. యెహోవా తనకు ఆజ్ఞాపించినట్లే
మోషే అవన్నీ చేసాడు.
18తర్వాత మోషే దహనబలి పొట్టేలును తీసు
కొచ్చాడు. అహరోను, అతని కుమారులు ఆ పొట్టేలు
తలమీద వారి చేతులు ఉంచారు. 19అప్పుడు మోషే
ఆ పొట్టేలును వధించి, దాని రక్తాన్ని బలిపీఠం చుట్టూ
చల్లాడు. 20పొట్టేలును మోషే ముక్కలుగా కోసాడు.
లోపలి భాగాలను, కాళ్లను, నీళ్లతో మోషే కడిగాడు.
21తర్వాత మొత్తం పొట్టేలును బలిపీఠం మీద మోషే
దహించాడు. తలను, భాగాలను, కొవ్వును మోషే దహిం
చాడు. అది హోమంగా అర్పించబడిన దహనబలి.
అది యెహోవాకు ఇష్టమైన సువాసన. యెహోవా
ఆజ్ఞాపించినట్లే మోషే వాటిని చేసాడు.
22అప్పుడు మోషే మరొక పొట్టేలును తీసు
కొచ్చాడు. అహరోనును, అతని కుమారులను యాజ
కులుగా నియమించుటకు ఈ పొట్టేలు ఉపయోగించ
బడింది. అహరోను, అతని కుమారులు ఆ పొట్టేలు
తలమీద వారి చేతులు ఉంచారు. 23అప్పుడు మోషే
ఆ పొట్టేలును వధించాడు. దాని రక్తంలో కొంత అతడు

తీసుకొని, అహరోను చెవి కొనమీద, కుడిచేతి
బొటనవేలిమీద, అహరోను కుడికాలి బొటనవేలి మీద
వేసాడు. 24తర్వాత అహరోను కుమారులను బలిపీఠం
దగ్గరకు మోషే తీసుకొని వచ్చాడు. ఆ రక్తంలో కొంత
వారి కుడి చెవుల కొనలమీద, కుడి చేతుల బొటన
వేళ్లమీద, వారి కుడి కాళ్ల బొటనవ్రేళ్ల మీద మోషే
వేసాడు. తర్వాత బలిపీఠం చుట్టూ ఆ రక్తాన్ని మోషే
చిలకరించాడు. 25కొవ్వును, కొవ్విన తోకను, లోపలి
భాగాలమీది కొవ్వు అంతటినీ, కాలేయం యొక్క
కొవ్విన భాగాన్ని రెండు మూత్ర పిండాలను, వాటి
కొవ్వును, కుడి తొడను మోషే తీసాడు. 26ఒక గంపెడు
పులియని రొట్టెలు ప్రతిరోజూ యెహోవా ముందు
ఉంచబడ్డాయి. ఆ రొట్టెల్లో నూనె కలిపి చేయబడ్డ
రొట్టె ఒకటి, పులియని రొట్టెల్లోనుంచి ఒక రొట్టెను
మోషే తీసుకొని, పొట్టేలు కుడి తొడమీద, కొవ్వుమీద
ఆ రొట్టె ముక్కల్ని ఉంచాడు. 27తర్వాత మోషే
వాటన్నింటినీ అహరోను, అతని కుమారుల చేతుల్లో
పెట్టాడు. నైవేద్యంగా ఆ ముక్కలను యెహోవా
ఎదుట మోషే అల్లాడించాడు. 28అప్పుడు అహరోను
అతని కుమారుల చేతుల్లోనుండి మోషే వాటిని తీసు
కొన్నాడు. బలిపీఠం మీద దహనబలిగా వాటిని దహిం
చాడు. కాబట్టి అహరోనును, అతని కుమారులను
యాజకులుగా నియమించుటకు అర్పణ అది. అది
అగ్నితో అర్పించబడిన అర్పణ. అది యెహోవాకు
ఇష్టమైన సువాసన. 29దాని బోరను మోషే తీసుకొని,
యెహోవా ఎదుట అర్పణగా దానిని అల్లాడించాడు.
యాజకులను నియమించుటలో పొట్టేలు యొక్క
ఆ భాగం మోషేకు చెందుతుంది. ఇది యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్టు జరిగింది.

30బలిపీఠం మీద ఉన్న అభిషేకతైలం కొంత, రక్తం
కొంత మోషే తీసుకొన్నాడు. అందులో కొంచెం
అహరోను మీద, అతని వస్త్రాల మీద, మరియు అహరో
నుతో ఉన్న అతని కుమారుల మీద, వారి వస్త్రాల
మీద కొంచెం చల్లాడు. ఈ విధంగా అహరోనును
అతని వస్త్రాలను, అతని కుమారులను వారి వస్త్రాలను
మోషే పవిత్రం చేసాడు. 31అప్పుడు అహరోనుతో,
అతని కుమారులతో మోషే ఇలా చెప్పాడు: "మీకు
నా ఆజ్ఞ జ్ఞాపకం ఉందా? 'అహరోను, అతని కుమారులు
వీటిని తినాలి' అని నేను చెప్పాను. కనుక నియామక
కార్యక్రమంనుండి రొట్టెలు, మాంసం ఉన్న గంప
తీసుకోండి. సన్నిధి దగ్గర ఆ మాంసాన్ని ఉడకబెట్టండి.
ఆ రొట్టెను ఆ మాంసాన్ని అక్కడే మీరు తినాలి.
32రొట్టెగాని మాంసాన్నిగాని ఏమైనా మిగిలిపోతే, దాన్ని
కాల్చివేయాలి. 33నియామక క్రమం ఏడు రోజులపాటు
ఉంటుంది. మీ అభిషేకం పూర్తి అయ్యేంతవరకు మీరు
సన్నిధి గుడారంనుండి బయటకు వెళ్ల కూడదు. 34ఈ
వేళ మనం చేసిన వాటన్నింటినీ చేయుమని
యెహోవా ఆజ్ఞాపించాడు. మీ పాపాలను తుడిచివే
సేందుకు ఆయన వీటిని ఆజ్ఞాపించాడు. 35ఏడు
రోజుల పాటు రాత్రింబవళ్లు సన్నిధి గుడారం దగ్గరే
మీరు నిలిచి ఉండాలి. యెహోవా ఆజ్ఞలకు మీరు
విధేయులు కాకపోతే మీరు చనిపోతారు. ఈ ఆజ్ఞలు
నాకు యెహోవా ఇచ్చాడు."

36కనుక యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన వాట
న్నింటినీ అహరోను, అతని కుమారులు జరిగించారు.

### దేవుడు యాజకులను అంగీకరించుట

9 ఎనిమిదో రోజున అహరోనును, అతని కుమారు
లను మోషే పిలిచాడు. ఇశ్రాయేలు పెద్దలను
కూడా అతడు పిలిచాడు. 2అహరోనుతో మోషే
చెప్పాడు, "ఒక కోడెదూడను, పొట్టేలును తీసుకొని
రండి. వాటిలో ఏ దోషం ఉండకూడదు. కోడెదూడ
పాపపరిహారార్థ (బలి) విషయమై పొట్టేలు దహనబలి.
వాటిని యెహోవాకు అర్పించండి. 3ఇశ్రాయేలు ప్రజ
లతో ఇలా చెప్పండి, 'పాపపరిహారార్థ బలిగా ఒక మగ
మేకను తీసుకోండి. దహన బలికోసం ఒక కోడె
దూడను, ఒక గొర్రెపిల్లను తీసుకోండి. కోడెదూడ,
గొర్రెపిల్ల ఒక్క సంవత్సరం వయస్సుగలవి కావాలి. ఆ
జంతువుల్లో ఏ దోషమూ ఉండకూడదు. 4సమాధాన
బలుల కోసం ఒక కోడెదూడను, ఒక పొట్టేలును
తీసుకోండి. ఆ జంతువులను, నూనెతో కలుపబడ్డ
నైవేద్యాన్ని తీసుకొని, వాటిని యెహోవాకు అర్పిం
చండి. ఎందుకంటే ఈవేళ యెహోవా మీకు ప్రత్యక్ష
మవుతాడు.' "

5కనుక ప్రజలంతా సన్నిధి గుడారం దగ్గరకు
వచ్చారు. మోషే ఆజ్ఞాపించిన వాటన్నింటినీ వారంతా
తీసుకొచ్చారు. ప్రజలంతా యెహోవా ఎదుట నిల
బడ్డారు. 6"యెహోవా ఆజ్ఞప్రకారం మీరు చేసారు
కనుక యెహోవా మహిమను మీరు చూస్తారు"
అన్నాడు మోషే.

7అప్పుడు అహరోనుతో మోషే ఈ సంగతులు
చెప్పాడు: "వెళ్లి, యెహోవా ఆజ్ఞాపించిన వాటిని జరి
గించు. బలిపీఠం దగ్గరకు వెళ్లి, పాపపరిహారార్థ బలులు,
దహనబలి అర్పణలు అర్పించు. మీ పాపాలు, ప్రజల
పాపాలు తుడిచివేయబడేందుకు వాటిని జరిగించు.
ప్రజల బలులను నీవు తీసుకొని, వారి పాపాలను పరి
హరించే వాటిని జరిగించు."

8కనుక అహరోను బలిపీఠం దగ్గరకు వెళ్లాడు. పాప
పరిహారార్థ బలికోసం కోడె దూడను అతడు వధిం
చాడు. ఈ పాపపరిహారార్థ బలి అతని కోసమే.
9అప్పుడు అహరోను కుమారులు ఆ రక్తాన్ని అహరోను
దగ్గరకు తెచ్చారు. అహరోను తన వేలు ఆ రక్తంలో
ముంచి, బలిపీఠం కొమ్ములమీద దాన్ని చల్లాడు.
తర్వాత అహరోను ఆ రక్తాన్ని బలిపీఠం అడుగున

పోసాడు. 10పాపపరిహారార్థ బలిలోనుంచి కొవ్వును,
మూత్రగ్రంథులను, కాలేయం యొక్క కొవ్విన
భాగాన్ని అహరోను తీసుకొని, బలిపీఠం మీద అతడు
వాటిని దహించాడు. మోషేకు యెహోవా ఆజ్ఞా
పించినట్లే అతడు అలా చేసాడు. 11తర్వాత మాంసాన్ని,
చర్మాన్ని పాళెము వెలుపల అగ్నితో అహరోను కాల్చి
వేసాడు.

12తర్వాత, దహనబలి పశువును అహరోను వధిం
చాడు. అది ముక్కలుగా కోయబడింది. దాని రక్తాన్ని
అహరోను కుమారులు అహరోను దగ్గరకు తీసుకొని
వచ్చారు. అహరోను ఆ రక్తాన్ని బలిపీఠం చుట్టూ
చిలకరించాడు. 13దహనబలి పశువు యొక్క ముక్క
లను, దాని తలను అహరోను కుమారులు అహరోనుకు
అందించారు. అప్పుడు అహరోను వాటిని బలిపీఠం
మీద దహించాడు. 14దహన బలి పశువు లోపలి భాగా
లను, కాళ్లను కూడా అహరోను కడిగాడు. వాటిని బలి
పీఠం మీద అతడు కాల్చివేసాడు.

15తర్వాత ప్రజల అర్పణను అహరోను తీసు
కొచ్చాడు. ప్రజల పాప పరిహారార్థ బలిగా మేకను
వధించాడు. మొదటిదాని వలెనే అతడు పాప పరిహారా
ర్థంగా ఆ మేకను అర్పించాడు. 16అహరోను దహనబలి
తీసుకొనివచ్చి అర్పించాడు. యెహోవా ఆజ్ఞప్రకారం
అహరోను చేసాడు.

17అహరోను బలిపీఠం దగ్గరకు ధాన్యార్పణను తీసు
కువచ్చాడు. అతడు గుప్పెడు ధాన్యార్పణ తీసుకొని,
బలిపీఠం మీద ఆనాటి అనుదిన బలిని పక్కగా పెట్టాడు.

18ప్రజల సమాధాన బలి అర్పణలుగా కోడె
దూడను, పొట్టేలును కూడ అహరోను వధించాడు.
అహరోను కుమారులు రక్తాన్ని అహరోను దగ్గరకు
తెచ్చారు. ఈ రక్తాన్ని అహరోను బలిపీఠం చుట్టూ
చిలకరించాడు. 19కోడెదూడ, పొట్టేలు కొవ్వునుకూడ
అహరోను కుమారులు అహరోను దగ్గరకు తెచ్చారు.
కొవ్విన తోకను లోపలి భాగాలమీది కొవ్వును మూత్ర
గ్రంథులను, కాలేయము యొక్క కొవ్విన భాగాన్ని
వారు తీసుకొచ్చారు. 20కొవ్విన ఈ భాగాలను కోడె
దూడ, పొట్టేలు బోరలమీద అహరోను కుమారులు
ఉంచారు. కొవ్విన ఈ భాగాలను బలిపీఠం మీద అహ
రోను కాల్చివేసాడు. 21మోషే ఆజ్ఞాపించిన ప్రకారం
నైవేద్యంగా బోరలను, కుడితొడను యెహోవా
ఎదుట అహరోను అల్లాడించాడు.

22అప్పుడు అహరోను ప్రజల వైపుగా తన చేతులు
ఎత్తి వారిని ఆశీర్వదించాడు. అహరోను పాపపరిహారార్థ
బలి అర్పణను, దహనబలి అర్పణను, సమాధాన బలి
అర్పణ, అర్పించటం ముగించిన తర్వాత అతడు బలి
పీఠం నుండి దిగి వచ్చాడు.

23మోషే, అహరోనులు సన్నిధి గుడారం లోపలకు
వెళ్లారు. వారు బయటకు వచ్చి ప్రజలను ఆశీర్వ
దించారు. యెహోవా మహిమ ప్రజలందరికీ కనబడెను
24యెహోవా నుండి అగ్ని వచ్చి బలిపీఠం మీది దహన
బలిని, కొవ్వును దహించి వేసింది. ప్రజలంతా ఇది
చూచినప్పుడు ఉత్సాహధ్వనిచేసి సాష్టాంగపడ్డారు.

**దేవుని అగ్ని నాదాబు, అబీహులను నాశనం చేయటం**

10 అప్పుడు అహరోను కుమారులైన నాదాబు,
అబీహులు పాపం చేసారు. ధూపం వేసేందుకు
ఒక్కో కుమారుడు ఒక్కో ధూపార్తిని తీసుకొన్నాడు.
వారు వేరే నిప్పు తీసుకొని ధూపం అంటించారు.
వారు ఉపయోగించాలని దేవుడు ఆజ్ఞాపించిన నిప్పును
వారు ఉపయోగించలేదు. 2కనుక యెహోవా నుండి
అగ్ని వచ్చి నాదాబు, అబీహులను నాశనం చేసింది.
యెహోవా ఎదుట వారు మరణించారు.

3అప్పుడు అహరోనుతో మోషే ఇలా చెప్పాడు:
“యెహోవా ఈలాగు సెలవిస్తున్నాడు, ‘నా దగ్గరకు
వచ్చే యాజకులు నన్ను గౌరవించాలి. వారికీ, ప్రజ
లందరికీ నేను పరిశుద్ధుడుగా ఉండాలి.’ ” కనుక అహ
రోను తన కుమారుల చావునుగూర్చి ఏమీ అనలేదు.

4అహరోను పినతండ్రియైన ఉజ్జీయేలుకు ఇద్దరు
కుమారులుండిరి. వారు మిషాయేలు, ఎల్సాఫాను. “పరి
శుద్ధ స్థలం ముందునకు వెళ్లండి. మీ సోదరుల శవాలను
బస వెలుపలకు తీసుకొని పొండి” అని మోషే వారిద్ద
రితో చెప్పాడు.

5కనుక మిషాయేలు, ఎల్సాఫాను మోషేకు విధే
యులయ్యారు. నాదాబు, అబీహు శవాలను బస వెలుప
లకు వారు మోసుకొని పోయారు. నాదాబు, అబీహు
అప్పటికి ఇంకా వారి ప్రత్యేక చొక్కాలు ధరించే
ఉన్నారు. 6అప్పుడు అహరోనుతోను, అతని ఇతర
కుమారులు ఎలీయాజరు, ఈతామారులతో మోషే
ఇలా మాట్లాడాడు. “ఏమి విచారపడకండి. మీబట్టలు
చింపుకోవద్దు, జుట్టు చిందరవందర చేసుకోవద్దు. మీరు
అలాంటివి చేయకుండా ఉంటే మీరు చావకుండా
ఉంటారు. అలానే యెహోవా తన ప్రజలందరి మీద
కోపగించకుండా ఉంటాడు. ఇశ్రాయేలు జాతి మొత్తం
మీ బంధువులే. నాదాబు, అబీహులను యెహోవా
కాల్చివేసినందుకు వారంతా ఏడుస్తారు. 7కాని మీరు
మాత్రం సన్నిధి గుడారం వదిలి వెళ్లకూడదు. ఆ
ద్వారం నుండి కనుక మీరు బయటకు వెళ్తే మీరు
చనిపోతారు. ఎందుచేతనంటే యెహోవా ప్రత్యేక
తైలం మీమీద ఉంది.” గనుక అహరోను, ఎలీయాజరు,
ఈతామారు మోషేకు విధేయులయ్యారు.

8అప్పుడు అహరోనుతో యెహోవా అన్నాడు:
9“మీరు సన్నిధి గుడారంలోనికి వచ్చేటప్పుడు నీవుగాని
నీ కుమారులుగాని ద్రాక్షారసం, మద్యం తాగకూడదు.
మీరు అలాంటివి చేస్తే చనిపోతారు. మీతరాలన్నింటికీ
ఈ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది. 10పవిత్రం, అప

విత్రం అనే నిర్దిష్టమైన వ్యత్యాసాన్ని మీరు పాటించాలి.
11యెహోవా తన ఆజ్ఞలను మోషేకు ఇచ్చాడు, వాటిని
మోషే ప్రజలకు ఇచ్చాడు. అహరోనూ, నీవు ఆ ఆజ్ఞలు
అన్నింటి విషయమై ప్రజలకు ప్రబోధించాలి."
12అహరోనుకు ఎలీయాజరు, ఈ తామారు అనే
ఇద్దరు కుమారులు ఇంకా బతికి ఉన్నారు. అహరో
నుతో, అతని ఇద్దరు కుమారులతో మోషే ఇలా
అన్నాడు: "అగ్నిచే దహించబడిన బలులలో ధాన్యా
ర్పణ కొంత మిగిలిపోయింది. ధాన్యార్పణంలోని ఆ
భాగాన్ని మీరు తినాలి. అయితే అందులో పొంగే
పదార్థం కలుపకుండా మీరు తినాలి. బలిపీఠం దగ్గరే
దాన్ని తినాలి. ఎందుచేతనంటే ఆ అర్పణ అతి పరి
శుద్ధం. 13అది యెహోవా కోసం అగ్నిమీద దహించ
బడిన అర్పణలలో భాగమైయున్నది. ఆ భాగం నీకు
నీ కుమారులకు చెందుతుంది అని నీకు నేను ఇచ్చిన
ఆజ్ఞ ప్రబోధిస్తుంది. అయితే ఒక పరిశుద్ధ స్థలంలోనే
మీరు దాన్ని తినాలి.
14"మరియు నీవు, నీ కుమారులు, నీ కుమార్తెలు,
నైవేద్యంల్లోనుంచి బోరను తినవచ్చును. మీరు వాటిని
పవిత్ర స్థలంలో తినాల్సిన అవసరం లేదు గాని పరిశుభ్ర
మైన స్థలంలో తినాలి. ఎందుచేతనంటే అవి సమాధాన
బలిలోనివి. ఆ కానుకలను ఇశ్రాయేలు ప్రజలు దేవునికి
ఇస్తారు. ఆ జంతువుల్లో కొంత భాగాన్ని ప్రజలు
తింటారు కాని బోర మాత్రం మీ వంతు అవుతుంది.
15నిప్పుమీద దహించబడిన బలిలో భాగంగా ప్రజలు
వారు అర్పించే జంతువుల కొవ్వును తీసుకొని రావాలి.
సమాధాన బలిలోని తొడను, నైవేద్యంలోని
బోరనుకూడా వారు తీసుకుని రావాలి. అది యెహోవా
ఎదుట అల్లాడించబడుతుంది. ఆ తర్వాత అది ఆ
అర్పణలో మీ భాగం అవుతుంది. బలి అర్పణల్లోని
ఆ భాగం యెహోవా ఆజ్ఞాపించినట్టు శాశ్వతంగా మీ
వంతు అవుతుంది."
16పాప పరిహారార్థబలి మేక కోసం మోషే చూశాడు.
అయితే అప్పటికే అది దహించివేయబడింది. అహరోను
కుమారుల్లో మిగిలిన వారి మీద (ఎలీయాజరు,
ఈతామారు) మోషేకు చాలా కోపం వచ్చింది.
17మోషే, "ఆ మేకను మీరు పరిశుద్ధ స్థలంలోనే తినాల్సి
ఉంది. అది చాలా పరిశుద్ధం. దాన్ని యెహోవా ఎదుట
మీరెందుకు తినలేదు? ప్రజల దోషాన్ని తీసివేసేందుకు
దాన్ని యెహోవా మీకు ఇచ్చాడు. ఆ మేక బలి
ప్రజల పాపాలను తుడిచి వేసేందుకు ఉద్దేశించబడింది.
18చూడండి, ఆ మేక రక్తాన్ని పవిత్ర స్థలం లోపలకు
మీరు తీసుకొని రాలేదు. నేను ఆజ్ఞాపించిన ప్రకారం
మీరు దాన్ని పరిశుద్ధ స్థలంలోనే తినాల్సి ఉంది"! అని
అన్నాడు.
19కాని, మోషేతో అహరోను చెప్పాడు: "చూడు,
ఈవేళ వారు తమ పాపపరిహారార్థ బలిని, దహన బలి
అర్పణను యెహోవా ఎదుటికి తెచ్చారు. అయితే
ఈ వేళ నాకు ఏమి జరిగిందో నీకు తెలుసు. పాపపరిహా
రార్థ బలిని ఈ వేళ నేను తింటే యెహోవా ఆనంది
స్తాడని నీవు అనుకొంటావా? లేదు!"
20మోషే ఇది విన్నప్పుడు ఒప్పుకొన్నాడు.

## మాంసం తినేందుకు నియమాలు

11 మోషే, అహరోనులతో యెహోవా ఇలా
చెప్పాడు: 2"ఇశ్రాయేలు ప్రజలతో చెప్పండి:
మీరు తినదగిన జంతువులు ఏవంటే: 3ఏ జంతువు
డెక్కలు చీలి ఉండి, నెమరు వేస్తుందో దాని మాంసం
మీరు తినవచ్చును.
4-6"కొన్ని జంతువులు నెమరు వేస్తాయి గాని వాటి
డెక్కలు చీలి ఉండవు. అలాంటి జంతువుల్ని తినవద్దు.
ఒంటెలు, సిరాయారకపు పొట్టికుందేలు, కుందేలు
అలాంటివే కనుక అవి మీకు అపవిత్రం. 7మరికొన్ని
జంతువులకు డెక్కలు చీలి ఉంటాయి గాని అవి నెమరు
వేయవు. అలాంటి జంతువుల్ని తినవద్దు. పందులు
కూడా మీకు అపవిత్రం. 8ఆ జంతువుల (పందుల)
మాంసం తినవద్దు. వాటి శవాలను కనీసం తాకవద్దు
అవి మీకు అపవిత్రం.

## సముద్ర ఆహార నియమాలు

9"సముద్రంలోగాని, నదిలోగాని ఉండే జలచరా
లకు రెక్కలు, పొలుసు ఉంటే, మీరు వాటిని తిన
వచ్చును. 10-11అయితే సముద్రంలోగాని నదిలో గాని
ఉండే జలచరం దేనికైనా రెక్కలు, పొలుసు లేకపోతే,
వాటిని మీరు తినకూడదు. అలాంటిది అసహ్యమయి
నది. దాని మాంసం తినవద్దు. కనీసం దాని శవాన్ని
కూడా తాకవద్దు. 12సముద్రంలోనూ, నదిలోనూ ఉండే
ఏ జలచరానికైనా రెక్కలు, పొలుసులు లేకపోతే అది
అసహ్యమయిందిగానే మీరు ఎంచుకోవాలి.

## తినకూడని పక్షులు

13"అలానే మీరు తినకూడని పక్షులు ఇవి. ఈ
పక్షుల్లో దేనినీ తినవద్దు: పక్షిరాజులు, రాబందులు,
క్రౌంచ పక్షులు, 14గద్ద, అన్నిరకాల గద్దలు, 15అన్ని
రకాల నల్ల పక్షులు, 16నిప్పుకోళ్లు, కపిరిగాళ్లు, అన్ని
రకాల డేగలు, 17గుడ్లగూబలు, పగిడికంటెలు, పెద్దగుడ్ల
గూబలు, 18నీటి కాకులు, కొంగలు, నల్లబోరువలు,
19గూడ బాతులు, సంకుబుడి కొంగలు, అన్నిరకాల
కొంగలు, కుకుడుగువ్వలు, గబ్బిలాలు.
20"రెక్కలు ఉండి మొత్తం నాలుగు కాళ్లతో నడిచే
జీవులన్నీ అసహ్యమైనవే. రెక్కలు ఉండి, నాలుగు
కాళ్లతో నడిచే కీటకాలన్నీ అసహ్యమైనవే. ఆ కీట
కాలను తినవద్దు. 21అయితే కీటకాలకు రెక్కలు ఉండి
నాలుగు కాళ్లతో నడిస్తే, వాటికి కనుక పాదాలకు

పైగా కీళ్లు ఉండి అవి ఎగురగలిగినవైతే, అలాంటి
కీటకాలను మీరు తినవచ్చును. 22ఏ కీటకాలను మీరు
తినవచ్చునంటేః అన్ని రకాల మిడతలు,రెక్కలున్న
అన్నిరకాల మిడతలు, అన్ని రకాల పెద్ద మిడతలు,
అన్నిరకాల ఆకు మిడతలు.
23“అయితే రెక్కలు, నాలుగు పాదాలు ఉన్న
మిగిలిన కీటకాలు అన్నీ మీకు అసహ్యం. 24ఆ కీటకాలు
మిమ్మల్ని అపవిత్రపరుస్తాయి. ఈ కీటకాల శవాలను
తాకిన ఏ వ్యక్తి అయినా సరే సాయంత్రంవరకు
అపవిత్రం అవుతాడు. 25ఒక వ్యక్తి చచ్చిన కీటకాల్లో
ఒకదాన్ని గనుక పట్టుకొంటే ఆ వ్యక్తి తన బట్టలు
ఉతుక్కోవాలి. ఈ వ్యక్తి సాయంత్రం వరకు
అపవిత్రుడు.

### అపవిత్ర జంతువుల్ని గూర్చి మరికొన్ని నియమాలు

26-27“కొన్ని జంతువులకు డెక్కలు చీలి ఉంటాయి
గాని డెక్కలు సమానంగా చీలి ఉండవు. కొన్ని
జంతువులు నెమరు వేయవు. కొన్ని జంతువులకు
డెక్కలు ఉండవు, అవి వాటి పాదాలమీద నడుస్తాయి.
ఆ జంతువులన్నీ మీకు అపవిత్రం. వాటిని ఎవరైనా
తాకితే వారు అపవిత్రం అవుతారు. ఆ వ్యక్తి సాయంత్రం
వరకు అపవిత్రుడు 28వాటి శవాలను ఎవరైనా ఎత్తితే,
ఆ వ్యక్తి తన బట్టలు ఉతుక్కోవాలి. ఆ వ్యక్తి సాయం
త్రంవరకు అపవిత్రుడవుతాడు. ఆ జంతువులు మీకు
అపవిత్రము.

### పాకే జంతువులను గూర్చిన నియమాలు

29“ప్రాకే ఈ జంతువులు మీకు అపవిత్రంః ముంగి
సలు, పందికొక్కులు అన్ని రకాల పెద్ద బల్లులు.
30అడవి ఎలుకలు, మొసళ్లు, తొండలు, సరటాలు,
ఊసరవెల్లులు. 31“ప్రాకే ఈ జంతువులు మీకు
అపవిత్రం. వాటిలో చచ్చిన వాటిని ఎవరైనా తాకితే
అలాంటివారు సాయంత్రం వరకు అపవిత్రులవుతారు.

### అపవిత్ర జంతువులను గూర్చిన నియమాలు

32“అపవిత్రమైన ఆ జంతువుల్లో ఏదైనా చచ్చి
దేనిమీదైనా పడితే, అది అపవిత్రం అవుతుంది. అది
చెక్కతో, బట్టతో, తోలుతో చేయబడిన వస్తువులు
కానీ, లేక ఏదైనా పనిముట్టుగానీ కావచ్చును. అది
ఏదైనాసరే దాన్ని నీళ్లతో కడగాలి. సాయంత్రం వరకు
అది అపవిత్రం. తర్వాత అది మరల పవిత్రం అవు
తుంది. 33“అపవిత్రమైన ఆ జంతువుల శవం ఏదైనా
మట్టి పాత్రలో పడితే, ఆ పాత్రలో ఉన్నది ఏదైనా
సరే అది అపవిత్రం అవుతుంది. నీవు ఆ పాత్రను
పగులగొట్టి తీరాలి. 34అపవిత్రమైన మట్టి పాత్రలోని
నీళ్లు ఏ ఆహారపదార్థం మీద పడినా, అందులోని ఆహారం
అపవిత్రం అవుతుంది. అపవిత్రమైన పాత్రలోని
పానీయం ఏదైనా అపవిత్రం అవుతుంది. 35అపవిత్రమై
చచ్చిన జంతువుయొక్క అవయవం ఒకటి దేనిమీద
పడినా అది అపవిత్రం. అది మట్టి పొయ్యి కావచ్చును,
మట్టి కుంపటి కావచ్చును. దాన్ని ముక్కలుగా పగుల
గొట్టాలి. అవి ఇంకెంత మాత్రం పరిశుద్ధంగా ఉండవు.
అవి మీకు ఎప్పటికీ అపవిత్రంగానే ఉంటాయి.
36“నీళ్లు ఊరుతూండే ఊటగాని, బావిగాని పరి
శుద్ధంగా ఉంటుంది. అయితే అపవిత్రమైన ఏ జంతువు
శవాన్నీ, తాకిన ఏ వ్యక్తి అయినాసరే అపవిత్రుడు.
37అపవిత్ర జంతువుల్లోని ఏ శవమైనా, నాట్లువేసే ఏ
విత్తనంమీద పడినా, ఆ విత్తనం ఇంకా పరిశుద్ధంగానే
ఉంటుంది.
38అయితే ఆ విత్తనాలమీద నీళ్లు పోసిన తర్వాత
అపవిత్ర జంతువుయొక్క శవంలోని ఏ భాగమైనా ఆ
విత్తనాలమీద పడితే, అప్పుడు మీకు ఆ విత్తనాలు
అపవిత్రం.
39“మీరు ఆహారానికి ఉపయోగించే జంతువు ఏదైనా
చస్తే, దాని శవాన్ని తాకిన వ్యక్తి ఆ సాయంత్రం వరకు
అపవిత్రుడవుతాడు.
40మరియు ఈ జంతు మాంసం తిన్న వ్యక్తి తన
బట్టలు ఉతుక్కోవాలి. ఈ వ్యక్తి సాయంత్రం వరకు
అపవిత్రుడవుతాడు. ఆ జంతు శవాన్ని ఎత్తే మనిషి
తప్పక తన బట్టలు ఉతుక్కోవాలి. ఆ వ్యక్తి సాయంత్రం
వరకు అపవిత్రుడవుతాడు.
41“నేలమీద ప్రాకే ప్రతి జంతువు అసహ్యమ
యిందే. దాన్ని తినకూడదు.42పొట్టతో పాకే జంతు
వుల్లో దేనిని గాని లేక నాలుగు పాదాలతో నడిచే ఏ
జంతువునుగాని లేక చాలా పాదాలుగల జంతువును
గాని మీరు తినకూడదు. అవి మీకు అసహ్యమైనవి.
43అసహ్యమైన ఆ జంతువుల మూలంగా మిమ్మల్ని
మీరు హేయం చేసుకోవద్దు. వాటితో మిమ్మల్ని మీరు
అపవిత్రం చేసుకోవద్దు. 44ఎందుచేతనంటే నేను మీ
దేవుడైన యెహోవాను గనుక. నేను పరిశుద్ధుడ్ని
కనుక మీరు పరిశుద్ధంగా ఉండాలి. అసహ్యమైన ఆ
పాకే జంతువుల మూలంగా మిమ్మల్ని మీరు అపవిత్రం
చేసుకోవద్దు. 45మిమ్మల్ని ఈజిప్టునుండి నేను తీసు
కొచ్చాను. మీరు నాకు ప్రత్యేకమైన ప్రజలుగా
ఉండేందుకు నేను ఇలా చేసాను. మీకు నేను దేవుడిగా
ఉండాలని నేను ఇలా చేసాను. నేను పరిశుద్ధుడ్ని గనుక
మీరు కూడా పరిశుద్ధంగా ఉండాలి!”
46భూమిమీద ఉండే పశువులు, పక్షులు, ఇతర
జంతువులు అన్నింటిని గూర్చిన నియమాలు అవి.
సముద్రంలో ఉండే జలచరాలు, నేలమీద పాకే జంతు
వులు అన్నింటిని గూర్చిన నియమాలు అవి. 47పవిత్ర
జంతువులు ఏవో అపవిత్ర జంతువులు ఏవో ప్రజలు
తెలుసుకోగలిగేందుకే ఆ ప్రబోధాలు. అందుచేత ఏ
జంతువుల్ని తినవచ్చో, ఏ జంతువుల్ని తినకూడదో
ప్రజలకు తెలుస్తుంది.

12 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 2“ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: ఒక స్త్రీ మగ శిశువుకు
జన్మనిస్తే ఆ స్త్రీ ఏడు రోజుల వరకు అపవిత్రగా
వుంటుంది. ఇది ఆమె నెలసరి రక్తస్రావం విషయంలో
అపవిత్రంగా ఉన్నట్టే. 3ఎనిమిదో రోజున ఆ మగ
శిశువుకు సున్నతి చేయాలి. 4అప్పుడు ఆమె తన
రక్తస్రావంనుండి పవిత్రం అయ్యేందుకు ముప్పయి
మూడు రోజులు పడుతుంది. పరిశుద్ధమయింది దేన్నీ
ఆమె తాకగూడదు. ఆమె పవిత్రపరచబడటం పూర్తి
అయ్యేంతవరకు పరిశుద్ధ స్థలంలో ఆమె ప్రవేశించ
కూడదు. 5కానీ ఆ స్త్రీ ఒక ఆడ శిశువుకు జన్మయిస్తే
నెలసరి రక్తస్రావ సమయంలో ఉన్నట్టే రెండు వారాలు
ఆమె అపవిత్రంగా ఉంటుంది. ఆమె తన రక్తస్రావం
నుండి పవిత్రం అయ్యేందుకు అరవై ఆరు రోజులు
అవుతుంది.

6“ప్రసవించిన తల్లి పవిత్రం అయ్యేందుకు ఒక
ప్రత్యేక సమయం ఉంటుంది. పవిత్రపర్చబడే ఆ
ప్రత్యేక సమయం అయిపోగానే ఆడపిల్ల తల్లియైనా,
మగపిల్ల తల్లియైనా, ఆ తల్లి ప్రత్యేకమైన బలి అర్పణ
లను సన్నిధి గుడారానికి తీసుకొనిరావాలి. సన్నిధి
గుడార ద్వారం దగ్గర ఆ బలి అర్పణలను ఒక యాజకు
నికి ఇవ్వాలి. దహన బలికోసం ఒక సంవత్సరం వయస్సు
గల ఒక గొర్రెపిల్లను, పాపపరిహారార్థబలిగా ఒక పావురం
పిల్లను లేక ఒక గువ్వను ఆమె తీసుకొనిరావాలి.
7-8ఒకవేళ ఆ స్త్రీ గొర్రెపిల్లను ఇవ్వలేక పోతే, రెండు
పావురపు పిల్లల్నిగాని రెండుగువ్వలనుగాని ఆమె తీసు
కొని రావచ్చును. అందులో ఒకటి దహనబలి కోసం,
మరొకటి పాప పరిహారార్థ బలికోసం. వాటిని యాజ
కుడు యెహోవా ఎదుట అర్పిస్తాడు. ఈ విధంగా
ఆమెకోసం అతడు ఆమె పాపాలను తుడిచి వేస్తాడు.
అప్పుడు ఆమె తన రక్తస్రావంనుండి పవిత్రం అవు
తుంది. ఒక మగశిశువుకు లేదా ఆడశిశువుకు జన్మనిచ్చే
స్త్రీకి అవి నియమాలు.”

### చర్మరోగాలను గూర్చిన నియమాలు

13 మోషే, అహరోనులకు యెహోవా ఇలా
చెప్పాడు: 2“ఒక వ్యక్తి చర్మం మీద వాపు
ఉండవచ్చును, లేక అది పొక్కుగాని, నిగనిగలాడు మచ్చ
గాని కావచ్చును. ఆ మచ్చ కుష్ఠురోగంలా కనబడితే,
యాజకుడగు అహరోను దగ్గరకు గాని, యాజకులైన
అతని కుమారుల దగ్గరకుగాని ఆ వ్యక్తిని తీసుకొని
రావాలి. 3ఆ వ్యక్తి చర్మంమీది మచ్చను యాజకుడు
పరిశీలించాలి. ఆ మచ్చలోని వెంట్రుకలు తెల్లబడినా,
ఆ మచ్చ అతని చర్మంకంటె లోతుకు ఉన్నా అది
కుష్ఠురోగమే. యాజకుడు ఆ వ్యక్తిని పరిశీలించటం
ముగించగానే ఆ వ్యక్తి కుష్ఠురోగి అని యాజకుడు
ప్రకటించాలి.

4“కొన్నిసార్లు ఒక వ్యక్తి చర్మంమీద ఒక తెల్లమచ్చ
ఉంటుంది. కానీ ఆ మచ్చ చర్మంలోపలికి ఉండదు.
అదే నిజమైతే ఆ వ్యక్తిని ఏడు రోజులపాటు ఇతరుల
నుండి యాజకుడు వేరు చేయాలి. 5ఏడో రోజున
యాజకుడు ఆ వ్యక్తిని పరిశీలించాలి. ఆ మచ్చలో
మార్పు లేకుండా, అది చర్మంమీద విస్తరించకుండా
ఉన్నట్టు యాజకునికి కనబడితే, అప్పుడు ఆ వ్యక్తిని
మరో ఏడు రోజులపాటు యాజకుడు ప్రత్యేకించాలి.
6ఏడు రోజుల తర్వాత మరల ఆ వ్యక్తిని యాజకుడు
పరిశీలించాలి. ఆ మచ్చ మానిపోయి, చర్మంమీద
విస్తరించకుండా ఉంటే, ఆ వ్యక్తి పరిశుద్ధుడు అని యాజ
కుడు ప్రకటించాలి. ఆ మచ్చ కేవలం పొక్కే. ఆ వ్యక్తి
తన బట్టలు ఉతుక్కొని, మళ్లీ పవిత్రుడు కావాలి.

7“అయితే ఆ వ్యక్తి మరల శుద్ధి చేయబడేందుకు
తనను తాను యాజకునికి కనబరచుకొన్న తర్వాత,
ఆ పొక్కు చర్మంమీద మరలా విస్తరిస్తే, అప్పుడు ఆ
వ్యక్తి మరల యాజకుని దగ్గరకు రావాలి. 8యాజకుడు
తప్పక పరిశీలించాలి. ఒకవేళ ఆ పొక్కు చర్మం మీద
విస్తరిస్తే, ఆవ్యక్తి అపవిత్రుడని యాజకుడు తప్పక
ప్రకటించాలి. అది కుష్ఠురోగం.

9“ఒక వ్యక్తికి కుష్ఠురోగం ఉంటే అతణ్ణి యాజకుని
దగ్గరకు తీసుకొని రావాలి. 10యాజకుడు తప్పక ఆ
వ్యక్తిని పరిశీలించాలి. చర్మంలో తెల్లని వాపుఉండి,
వెంట్రుకలు తెల్లబడి ఉండి, వాపులో చర్మంతెల్లగా
కనబడితే 11అప్పుడు అది ఆ వ్యక్తి చర్మంమీద చాల
కాలంగా ఉన్న కుష్ఠురోగం. ఆ వ్యక్తి అపవిత్రుడు అని
యాజకుడు తప్పక ప్రకటించాలి. కొద్దికాలం ఆ వ్యక్తిని
మిగిలిన ప్రజలనుండి యాజకుడు ప్రత్యేకించాలి.
ఎందుచేతనంటే ఆ వ్యక్తి అపవిత్రుడు అని అతనికి
తెలుసు.

12“కొన్నిసార్లు చర్మరోగం ఒక వ్యక్తి శరీరమంతటా
వ్యాపిస్తుంది. ఆ వ్యక్తి తలనుండి పాదంవరకు చర్మం
మీద అంతటా చర్మరోగం ఆవరిస్తుంది. యాజకుడు
ఆ వ్యక్తి శరీరమంతా తప్పక చూడాలి. 13చర్మరోగం
శరీరమంతా వ్యాపించినట్టు, అది ఆ వ్యక్తి చర్మాన్ని
పూర్తిగా తెలుపు చేసినట్టు యాజకుడు చూస్తే,
అప్పుడు ఆ వ్యక్తి పవిత్రుడు అని యాజకుడు ప్రక
టించాలి. 14అయితే ఆ వ్యక్తి చర్మం పచ్చిగా ఉంటే
అతడు పవిత్రుడుకాడు. 15యాజకుడు చర్మం పచ్చిగా
ఉండటం చూసినప్పుడు, ఆ వ్యక్తి అపవిత్రుడని అతడు
ప్రకటించాలి. పచ్చి చర్మం పవిత్రం కాదు. అది కుష్ఠు
రోగం.

16“చర్మం మరల పచ్చిగా తయారై తెల్లగా మారితే,
అప్పుడు ఆ వ్యక్తి తప్పక యాజకుని దగ్గరకు రావాలి.
17యాజకుడు తప్పక ఆ వ్యక్తిని పరిశీలించాలి. ఆ
పొడ తెల్లబారితే ఆ పొడగల ఆ వ్యక్తి పవిత్రుడని
యాజకుడు ప్రకటించాలి. ఆ వ్యక్తి పవిత్రుడు.

18“ఒకవేళ దేహపు చర్మంమీద మానిపోయిన
పుండు ఉండవచ్చును. 19కాని ఆ పుండు స్థానంలో
తెల్లటి వాపుగాని, తెలుపు ఎరుపు కలిసి నిగనిగలాడే
మచ్చగానీ ఉండవచ్చును. అప్పుడు దేహం మీది ఈ
చోటును యాజకునికి చూపెట్టాలి. 20 యాజకుడు
పరిశీలించాలి. వాపు చర్మంకంటె లోతుగా ఉండి, దాని
మీది వెంట్రుకలు తెల్లబడి ఉంటే, అప్పుడు ఆ వ్యక్తి
అపవిత్రుడు అని యాజకుడు ప్రకటించాలి. ఆ మచ్చ
కుష్ఠరోగం పుండులోపలనుండి కుష్ఠరోగం బయట
పడింది. 21కానీ యాజకుడు ఆ మచ్చను చూడగా
దానిమీద వెంట్రుకలు తెల్లబడక, ఆ మచ్చ చర్మంకంటె
లోతుగా ఉండక మానుతున్నట్టు కనబడితే అప్పుడు
యాజకుడు, ఆ వ్యక్తిని ఏడు రోజులపాటు ప్రత్యేకంగా
ఉంచాలి. 22ఒకవేళ ఆ మచ్చయింకా ఎక్కువగా చర్మం
మీద విస్తరిస్తే, ఆ వ్యక్తి అపవిత్రుడని యాజకుడు
ప్రకటించాలి. అది కుష్ఠుపొడ. 23అయితే నిగనిగలాడే
ఆ మచ్చ విస్తరించక, ఉన్నచోటనే ఉంటే, అది పాత
పుండుకు సంబంధించిన దద్దురు మాత్రమే. ఆ వ్యక్తి
పవిత్రుడు అని యాజకుడు తప్పక ప్రకటించాలి.
24-25“ఒక వ్యక్తి చర్మంమీద కాలి వాత కావచ్చును.
ఒకవేళ ఆ పచ్చి చర్మం తెల్లగా గాని, తెలుపు ఎరుపు
రంగు మచ్చలా కానీ మారితే యాజకుడు తప్పక
దాన్ని పరిశీలించాలి. ఆ తెల్ల మచ్చ చర్మంకంటె
లోతుగా ఉన్నట్టుగానీ, ఆ మచ్చ మీది వెంట్రుకలు
తెల్లబడినా అది కుష్ఠరోగం. ఆ వాతలోనుంచి కుష్ఠు
రోగం బయటపడింది. అప్పుడు ఆ వ్యక్తి అపవిత్రుడు
అని యాజకుడు ప్రకటించాలి. అది కుష్ఠరోగం.
26కానీ యాజకుడు ఆ మచ్చను చూడగా నిగనిగలాడే
మచ్చమీద వెంట్రుకలు లేకుండా ఆ మచ్చ చర్మం
కంటె లోతుగా లేకుండ అది మానుతున్నట్టు ఉంటే
ఆ వ్యక్తిని ఏడు రోజులపాటు యాజకుడు వేరు
చేయాలి. 27ఏడవ రోజున యాజకుడు ఆ వ్యక్తిని
మరల పరిశీలించాలి. ఆ మచ్చ చర్మంమీద విస్తరిస్తే,
అప్పుడు ఆ వ్యక్తి అపవిత్రుడని యాజకుడు ప్రకటిం
చాలి. అది కుష్ఠరోగం. 28అయితే నిగనిగలాడే ఆ
మచ్చ చర్మంమీద విస్తరించక మానుతుంటే, అది వాత
మీది వాపు మాత్రమే. ఆ వ్యక్తి పవిత్రుడు అని యాజ
కుడు ప్రకటించాలి. అది కేవలం వాత మచ్చ మాత్రమే.
29“ఒక వ్యక్తి తలమీదగాని గెడ్డంమీద గాని పొడ
రావచ్చును. 30ఒక యాజకుడు ఆ పొడను పరిశీలిం
చాలి. ఆ పొడ చర్మంకంటె లోతుగా ఉన్నట్టు కన
బడినా, దానిచుట్టూ వెంట్రుకలు పలుచగాను, పసుపు
గాను ఉన్నా, ఆ వ్యక్తి అపవిత్రుడు అని యాజకుడు
ప్రకటించాలి. అది చెడ్డ చర్మరోగం. 31ఒక వేళ ఆ
పొడ చర్మంకంటె లోతుగా లేకపోయినా, దానిలో
నల్ల వెంట్రుకలు లేకపోతే ఆ వ్యక్తిని ఏడురోజులపాటు
యాజకుడు ప్రత్యేకించాలి. 32ఏడవ రోజున ఆ పొడను
యాజకుడు పరిశీలించాలి. ఆ పొడ విస్తరించక
పోయినా, దానిలో పసుపు వెంట్రుకలు పెరగక
పోయినా, ఆ పొడ చర్మంకంటె లోతుగా ఉన్నట్టు
కనబడకపోయినా, 33ఆ వ్యక్తి క్షౌరం చేసుకోవాలి. కానీ
అతడు ఆ పొడను కత్తిరించకూడదు. ఆ వ్యక్తిని యింకో
ఏడు రోజుల వరకు యాజకుడు ప్రత్యేకించాలి.
34ఏడవ రోజున యాజకుడు ఆ పొడను పరిశీలించాలి.
ఆ పొడ చర్మంలోనికి విస్తరించక, అది చర్మంకంటె
లోతుగా ఉన్నట్టు కనబడకపోయినా, ఆ వ్యక్తి పవిత్రుడు
అని యాజకుడు ప్రకటించాలి. ఆ వ్యక్తి తన బట్టలు
ఉతుకుకొని శుద్ధుడు కావాలి. 35కానీ ఆ వ్యక్తి పవిత్రు
డయిన తర్వాత ఆ పొడ చర్మంమీద వ్యాపిస్తే, 36యాజ
కుడు మరల ఆ వ్యక్తిని పరిశీలించాలి. ఆ పొడ చర్మం
మీద వ్యాపిస్తే, పసుపు వెంట్రుకల కోసం యాజకుడు
చూడక్కర్లేదు. ఆ వ్యక్తి అపవిత్రుడు. 37అయితే ఆ
వ్యాధి మానిపోయినట్టు యాజకుడు తలిస్తే, దానిలో
నల్ల వెంట్రుకలు పెరుగుతుంటే ఆ రోగం మాని
పోయింది. ఆ వ్యక్తి పవిత్రుడు. ఆ వ్యక్తి పవిత్రుడు
అని యాజకుడు ప్రకటించాలి. 38“ఒక వ్యక్తి చర్మం
మీద తెల్ల మచ్చలు ఉంటే, 39ఒక యాజకుడు ఆ
మచ్చలను పరిశీలించాలి. ఒకవేళ ఆ వ్యక్తి చర్మంమీది
మచ్చలు వాడిపోయి తెలుపుగా ఉంటే అది హానికరము
కాని పొక్కులు మాత్రమే. ఆ వ్యక్తి పవిత్రుడు.

40“ఒక వ్యక్తి తలమీద వెంట్రుకలు ఊడి పోవ
చ్చును. అతడు పవిత్రుడు. అది కేవలం బట్టతల.
41ఒకని తల ముందు భాగంలో వెంట్రుకలు రాలిపోవ
చ్చును. అతడు పవిత్రుడు. అది కేవలం మరో రకం
బట్టతల. 42కానీ అతని తలమీద ఎరుపు తెలుపు పొడ
ఉంటే అది చర్మవ్యాధి.

43ఒక యాజకుడు ఆ వ్యక్తిని పరిశీలించాలి. ఆ
పొడ వాపు ఎరుపు తెలుపుగా ఉండి, శరీరంలోని ఇతర
భాగాల్లో కుష్ఠు రోగంలా కనబడితే, 44ఆ వ్యక్తి తలమీద
కుష్ఠు రోగం ఉంది. ఆ వ్యక్తి అపవిత్రుడు అని యాజ
కుడు ప్రకటించాలి.

45“ఒక వ్యక్తికి కుష్ఠు రోగం ఉంటే అతడు ఇతరు
లను హెచ్చరించాలి. అపవిత్రుణ్ణి అపవిత్రుణ్ణి అని
కేకలు వేయాలి. అతడు తన బట్టలను చింపివేయాలి,
తన తల వెంట్రుకలు విరబోసుకోవాలి, తన నోరు
కప్పుకోవాలి. 46ఆ వ్యాధి ఉన్న కాలమంతా అతను
అపవిత్రుడే. ఆ వ్యక్తి అపవిత్రుడు. అతడు ఒంటరిగా
బతకాలి. అతని నివాసం బసకు వెలుపల ఉండాలి.

47“కొన్ని బట్టల మీద కుష్ఠుపొడ ఉండవచ్చును.
ఆ బట్ట నాణ్యమైనది లేక ఉన్నది కావచ్చు. 48బట్ట
అల్లినది కావచ్చు, కుట్టినది కావచ్చు, లేదా ఒక తోలు
మీద కాని, తోలుతో చేయబడిన మరి దేనిమీద కాని
ఆ కుష్ఠు పొడ ఉండవచ్చును. 49ఆ కుష్ఠుపొడ పచ్చగా
కానీ ఎర్రగా కానీ ఉంటే దాన్ని యాజకునికి

చూపించాలి. 50ఆ కుష్ఠుపొడను యాజకుడు పరిశీ
లించాలి. దానిని ఏడు రోజుల వరకు ఒక ప్రత్యేక
స్థలంలో అతడు ఉంచాలి. 51-52ఏడవ రోజున ఆ
కుష్ఠుపొడను యాజకుడు పరిశీలించాలి. ఆ కుష్ఠుపొడ
తోలు మీద ఉన్నా బట్టమీద ఉన్నా ఒకటే. ఆ బట్ట
కుట్టిందైనా అల్లినదైనా ఒకటే. ఆ తోలు ఉపయో
గించబడింది దేని కొరకైనా ఒకటే. కుష్ఠుపొడ వ్యాపిస్తే
అది నాశన కరమైనది. ఆ బట్ట లేక తోలు అపవిత్రం.
ఆ పొడ అపవిత్రం. ఆ బట్ట లేక తోలును యాజకుడు
కాల్చి వేయాలి.

53"ఆ కుష్ఠుపొడ వ్యాపించినట్టు యాజకునికి
కనబడకపోతే, ఆ తోలును లేక ఆ బట్టను ఉతకాలి.
అది తోలుగాని, బట్టగాని లేక బట్ట అల్లికగాని, కుట్టింది
గాని, దాన్ని ఉతకాల్సిందే. 54ఆ బట్టను లేక తోలును
ఉతకమని ఆ మనుష్యులకు యాజకుడు ఆజ్ఞాపించాలి.
అప్పుడు యాజకుడు ఆ బట్టలను ఇంకా ఏడు రోజుల
వరకు వేరుపరచాలి. 55ఆ సమయం తీరగానే యాజ
కుడు మళ్లీ పరిశీలించాలి. ఆ కుష్ఠుపొడ ఇంకా అలానే
కనబడితే అది అపవిత్రం. ఆ పొడ వ్యాపించకపోయినా
సరే ఆ బట్టను లేక ఆ తోలును మీరు కాల్చివేయాలి.

56"కానీ ఒకవేళ, ఆ తోలు ముక్కను లేక ఆ
బట్టను యాజకుడు చూచినప్పుడు, కుష్ఠుపొడ వాడి
పోయి ఉంటే, ఆ బట్టమీద లేక తోలు మీద ఉన్న ఆ
పొడను యాజకుడు చింపివేయాలి. ఆ బట్ట అల్లికది
గాని, పడుగుది కానీ ఫర్వాలేదు. 57లేదా ఆ బట్టమీద
లేక ఆ తోలుమీద కుష్ఠుపొడ తిరిగి రావచ్చును. అలా
జరిగితే ఆ కుష్ఠు పొడ వ్యాపిస్తుంది. ఆ చించిన బట్ట
ముక్కను లేక తోలు ముక్కను కాల్చివేయాలి.
58అయితే ఉతికిన తర్వాత కుష్ఠు పొడ మళ్లీ రాకపోతే
అప్పుడు ఆ బట్ట ముక్క లేక తోలు ముక్క పవిత్రం.
ఆ బట్ట కుట్టిందిగానీ అల్లిందిగానీ ఏదైనా ఫర్వాలేదు.
ఆ బట్ట పవిత్రం."

59తోలు ముక్కలు లేక బట్టముక్కల మీద కుష్ఠు
పొడకు సంబంధించిన నియమాలు అవి. బట్ట కుట్టింది
గాని అల్లిందిగాని ఫర్వాలేదు.

### బాగుపడిన కుష్ఠురోగికి నియమాలు

14 యెహోవా మోషేతో ఇలా చెప్పాడు, 2"చర్మ
రోగాలు కలిగి బాగుపడిన ప్రజలకు నియ
మాలు ఇవి.

"ఆ వ్యక్తిని పవిత్రం చేసేందుకే ఇవే నియమాలు.
చర్మవ్యాధి వచ్చిన వ్యక్తిని ఒక యాజకుడు చూడాలి.
3బస వెలుపల ఆ వ్యక్తి దగ్గరకు యాజకుడు వెళ్లాలి.
ఆ చర్మవ్యాధి బాగుపడినదేమో తెలుసుకొనేందుకు
యాజకుడు పరిశీలించాలి. 4ఆ వ్యక్తి ఆరోగ్యవంతంగా
ఉంటే అతణ్ణి ఈ పనులు చేయమని యాజకుడు
చెప్పాలి: ప్రాణంతో ఉన్న రెండు పవిత్ర పక్షుల్ని
అతడు తీసుకొని రావాలి, ఒక దేవదారు చెక్క ముక్కను,
ఎర్రటి గుడ్డ ముక్కను, ఒక హిస్సోపు ముక్కను కూడా
అతడు తీసుకొని రావాలి. ఇవన్నీ ఆవ్యక్తిని శుద్ధిచేసే
పనికోసమే. 5ఒక మట్టి పాత్రలో పారుతున్న నీళ్లమీద
ఒక పక్షిని చంపమని యాజకుడు చెప్పాలి. 6అప్పుడు
యింకా ప్రాణంతో ఉన్న రెండో పక్షిని, దేవదారు
చెక్కముక్క, ఎర్ర గుడ్డ ముక్క, హిస్సోపు ముక్కను
యాజకుడు తీసుకోవాలి. పారుతున్న నీళ్లమీద చంప
బడిన మొదటి పక్షి రక్తంలో, ప్రాణంతో ఉన్న రెండో
పక్షిని, మిగతా వస్తువులను యాజకుడు ముంచాలి.
7చర్మవ్యాధి ఉన్న వ్యక్తిమీద యాజకుడు ఏడుసార్లు
చిలకరించాలి. అప్పుడు ఆ వ్యక్తి పవిత్రుడు అని యాజ
కుడు ప్రకటించాలి. అప్పుడు యాజకుడు బహిరంగ
స్థలానికి వెళ్లి, ప్రాణంతో ఉన్న పక్షిని స్వేచ్ఛగా ఎగిరి
పోనివ్వాలి.

8"తర్వాత ఆ వ్యక్తి తన బట్టలు ఉతుక్కోవాలి.
అతడు తన వెంట్రుకలన్నింటినీ క్షౌరం చేసుకోవాలి.
అతడు నీళ్లతో స్నానం చేయాలి. అప్పుడు అతడు
పవిత్రం అవుతాడు. అప్పుడు ఆ వ్యక్తి బసలోనికి వెళ్ల
వచ్చును. కానీ అతడు ఏడు రోజులవరకు తన గుడారం
బయట ఉండాలి.

9ఏడవ రోజున అతడు తన వెంట్రు కలన్నీ క్షౌరం
చేసుకోవాలి. అతడు తన తల, గడ్డం, కనుబొమలు,
వెంట్రుకలు అన్నీ క్షౌరం చేసుకోవాలి. తర్వాత అతడు
తన బట్టలు ఉతుక్కొని, నీళ్లలో స్నానం చేయాలి.
అప్పుడు అతడు పవిత్రుడవుతాడు.

10"ఎనిమిదో రోజున, చర్మవ్యాధి కలిగి ఉండిన
వాడు ఏ దోషం లేని రెండు మగ గొర్రెపిల్లలను తీసు
కొని వెళ్లాలి. ఏ దోషం లేని ఒక్క సంవత్సరపు ఆడ
గొర్రె పిల్లను కూడా అతడు తీసుకొని వెళ్లాలి. ధాన్యా
ర్పణ కోసం నూనె కలిపిన మూడు పదోవంతుల
మంచి పిండిని అతడు తీసుకొని వెళ్లాలి. ఒక అర్ధసేరు
ఒలీవ నూనె ఆ వ్యక్తి తీసుకొని వెళ్లాలి. 11ఆ వ్యక్తి పవి
త్రుడు అని ప్రకటించే యాజకుడు, ఆ వ్యక్తిని, అతని
బలులను సన్నిధిగుడార ద్వారం దగ్గర యెహోవా
ఎదుటికి తీసుకొని రావాలి. 12గొర్రె పిల్లల్లో ఒకదాన్ని
అపరాధపరిహారార్థ బలిగా అర్పించాలి. ఆ గొర్రెపిల్లను,
కొంతనూనెను యెహోవా ఎదుట నైవేద్యంగా అర్పిం
చాలి. 13పాపపరిహారార్థ బలి, దహనబలి వధించే పవిత్ర
స్థలంలోనే యాజకుడు మగ గొర్రెపిల్లను వధించాలి.
అపరాధ పరిహారార్థ బలి పాపపరిహారార్థ బలిలాగే
ఉంటుంది. అది యాజకునికే చెందుతుంది. అది చాలా
పవిత్రం.

14"అపరాధ పరిహారార్థబలినుండి కొంత రక్తాన్ని
యాజకుడు తీసుకోవాలి. పవిత్ర పర్చబడాల్సిన వ్యక్తి
కుడి చెవి కొన మీద ఈ రక్తంలో కొంచెం యాజకుడు
వేయాలి. ఆ వ్యక్తి కుడి చేతి బొటన వేలిమీద, కుడి

పాదపు బొటనవేలిమీద ఈరక్తంలో కొంచెం యాజ
కుడు వేయాలి. 15యాజకుడు కొంచెం నూనె తీసు
కొని తన ఎడమ అర చేతిలో పోసుకోవాలి. 16అప్పుడు
యాజకుడు తన ఎడమ చేతిలో ఉన్న నూనెలో
తన కుడి చేతి వేలిని ముంచాలి. ఆ నూనెలో కొంచెం
యెహోవా ఎదుట ఏడుసార్లు చిలకరించేందుకు
ఆవేలిని అతడు ఉపయోగించాలి. 17పవిత్ర పర్చబడా
ల్సిన ఆ వ్యక్తి కుడి చెవి కొనమీద యాజకుడు తన
అరచేతిలోని నూనె కొంచెం పోయాలి. ఆ వ్యక్తి కుడి
చేతి బొటన వేలిమీద కుడి పాదం బొటనవేలి మీద
యాజకుడు ఆ నూనెలో కొంచెం పోయాలి. అపరాధ
పరిహారార్థ బలి అర్పణపు రక్తం మీద యాజకుడు ఆ
నూనెలో కొంచెం పోయాలి. 18యాజకుడు తన
అరచేతిలో మిగిలిన నూనెను పవిత్రపర్చబడాల్సిన వ్యక్తి
తలమీద పోయాలి. ఈ విధంగా యెహోవా ఎదుట
ఆ వ్యక్తి పాపాలను యాజకుడు తుడిచి వేస్తాడు.
19“తర్వాత ఆ వ్యక్తి పవిత్రుడయ్యేటట్టు యాజకుడు
పాపపరిహారార్థ బలిని అర్పించి, ఆ వ్యక్తి పాపాలను
తుడిచివేయాలి. ఆ తర్వాత దహనబలి పశువును
యాజకుడు వధించాలి. 20అప్పుడు యాజకుడు దహ
నబలి అర్పణను, ధాన్యార్పణను బలిపీఠం మీద అర్పిం
చాలి. ఈ విధంగా ఆ వ్యక్తి పాపాలను యాజకుడు
తుడిచివేయాలి. ఆ వ్యక్తి పవిత్రుడవుతాడు.

21“అయితే ఆ వ్యక్తి పేదవాడై అలాంటి అర్పణలు
ఇవ్వలేకపోతే, అపరాధ పరిహారార్థబలిగా ఒక మగ
గొర్రెపిల్లను అతడు తీసుకొని రావాలి. యాజకుడు
ఆ వ్యక్తి పాపాలను తుడిచివేసేందుకు అది నైవేద్యం.
ధాన్యార్పణగా తూములో పదోవంతు నూనెతో కలిసిన
గోధుమ పిండిని ఒక అర్థసేరు నూనెను 22రెండు
గువ్వలను, రెండు పావురపు పిల్లలను అతడు తీసుకొని
రావాలి. పేదవాళ్లుకూడ వాటిని తీసుకొని రాగలుగు
తారు. ఒక పక్షి పాపపరిహారార్థబలి కొరకు, మరొకటి
దహనబలి.

23“ఎనిమిదో రోజున సన్నిధి గుడారం దగ్గర
యాజకుని వద్దకు అతడు వాటిని తీసుకొని రావాలి.
ఆ వ్యక్తి పవిత్రుడయ్యేందుకు వాటిని యెహోవా
ఎదుట అర్పించాలి. 24అపరాధ పరిహారార్థ బలికోసం
గొర్రెపిల్లను, నూనెను, యాజకుడు తీసుకొని
యెహోవా ఎదుట నైవేద్యంగా వాటిని అల్లాడించాలి.
25అప్పుడు అపరాధ పరిహారార్థ బలికొరకైన గొర్రె
పిల్లను యాజకుడు వధించాలి. అపరాధ పరిహారార్థ
బలి రక్తంలో కొంచెం యాజకుడు తీసుకోవాలి.
పవిత్రం చేయబడాల్సిన వ్యక్తి కుడి చెవి కొనమీద ఈ
రక్తంలో కొంచెం యాజకుడు పోయాలి. ఈ వ్యక్తి
కుడి చేతి బొటనవేలిమీద, కుడిపాదం బొటనవేలిమీద
యాజకుడు ఈ రక్తం కొంచెం పోయాలి. 26ఈ
నూనెలో కూడ కొంచెం అతని ఎడమ చేతిలో యాజ
కుడు పోయాలి. 27యాజకుడు తన కుడిచేతి వేలిని
ప్రయోగించి తన ఎడమ చేతిలోని నూనె కొంచెం
తీసి యెహోవా ఎదుట ఏడుసార్లు చిలకరించాలి.
28తర్వాత యాజకుడు తన చేతిలోని నూనె కొంచెం
తీసి పవిత్రం కావాల్సిన వ్యక్తి కుడి చెవి కొనమీద
వేయాలి. ఆ వ్యక్తి కుడి చేతి బొటన వేలి మీద, కుడి
పాదం బొటన వేలిమీద యాజకుడు ఈ నూనెను
కొంచెం వేయాలి. అపరాధ పరిహారార్థబలి రక్త స్థానంలో
యాజకుడు ఈ నూనె కొంచెం వేయాలి. 29యాజ
కుడు తన చేతిలో మిగిలిపోయిన నూనెను, పవిత్రం
కావాల్సిన వాని తల మీద పోయాలి. ఈ విధంగా
యెహోవా ఎదుట ఆ వ్యక్తి పాపాలను యాజకుడు
తుడిచివేస్తాడు.

30“అప్పుడు ఆ వ్యక్తి ఒక గువ్వ లేక పావురపు
పిల్లలలో ఒకదానిని అర్పించాలి. (పేదవారు కూడా
ఆ పక్షులను ఇవ్వగలరు, ఆ వ్యక్తి ఇవ్వగలిగిందే
ఇవ్వాలి). 31ఒక పక్షిని పాప పరిహారార్థబలిగాను మరొక
దాన్ని దహనబలిగాను ఆ వ్యక్తి అర్పించాలి. అతడు
వాటిని ధాన్యార్పణతో బాటు అర్పించాలి. “ఈ విధంగా
యాజకుడు ఆ వ్యక్తి పాపాలను యెహోవా ఎదుట
తుడిచి వేస్తాడు. మరియు ఆ వ్యక్తి పవిత్రం అవుతాడు.”
32ఒక వ్యక్తి చర్మవ్యాధినుండి బాగు పడిన తర్వాత
అతణ్ణి పవిత్రం చేయటానికి అవీ నియమాలు.
“పవిత్రం అయ్యేందుకు నియమం ప్రకారం బలులు
అర్పించలేని ప్రజలకు అవీ నియమాలు.”

### ఇంటిలో కుష్ఠుపొడను గూర్చిన నియమాలు

33మోషే, అహరోనులతో యెహోవా ఇంకా ఇలా
అన్నాడు: 34“కనాను దేశాన్ని నేను నీ ప్రజలకు ఇస్తు
న్నాను. నీ ప్రజలు ఆ దేశం చేరుతారు. ఆ సమయంలో
ఎవరి యింట్లోనైనా నేను కుష్ఠుపొడను పెరగనీయ
వచ్చు. 35ఆ యింటి స్వంతదారుడు యాజకుని దగ్గ
రకు వచ్చి, ‘కుష్ఠుపొడలాంటిది ఏదో నాయింట్లో
కనిపిస్తుంది’, అనిచెప్పాలి.

36“అప్పుడు యాజకుడు ఆ ఇంటి వారిని ఇల్లు
ఖాళీచేయమని ఆజ్ఞాపించాలి.” యాజకుడు కుష్ఠు
పొడను చూడటానికి వెళ్లక ముందే వారు ఇల్లు ఖాళీ
చేయాలి. ఈ విధంగా ఆ ఇంట్లోని అపవిత్రమైన
వాటన్నింటినీ యాజకుడు కాపాడవలసిన పనిలేదు.
ఆ మనుష్యులు ఇల్లు ఖాళీచేసిన తర్వాత, ఆ ఇంటిని
చూడటానికి యాజకుడు లోనికి వెళ్లాలి. 37యాజ
కుడు కుష్ఠుపొడను పరిశీలించాలి. ఆ ఇంటి గోడలమీద
పొడకు పచ్చటి లేక ఎర్రటి రంధ్రాలు ఉండి, ఆ
పొడ గోడల ఉపరితలంలో చొచ్చుకు పోతున్నట్లు
కనబడితే, 38యాజకుడు ఆ ఇంటినుండి బయటకు
వెళ్లిపోయి ఏడు రోజులవరకు ఆ ఇంటికి తాళం
వేయాలి.

39“ఏడో రోజున యాజకుడు తిరిగి వచ్చి ఆ
ఇంటిని పరిశీలించాలి.” ఆ పొడ ఇంటి గోడలమీద
వ్యాపించి ఉంటే, 40పొడ ఉన్న రాళ్లను లాగి పార
వేయమని యాజకుడు ఆ ప్రజలకు ఆజ్ఞాపించాలి.
పట్టణం బయట ప్రత్యేకమైన ఒక అపవిత్ర స్థలంలో
వారు ఆ రాళ్లను వేయాలి. 41అప్పుడు యాజకుడు
ఆ ఇంటిలోపల అంతా గీకించాలి. అలా గీకిన పెచ్చు
లను వారు పారవేయాలి. పట్టణం బయట ప్రత్యేకమైన
ఒక అపవిత్ర స్థలంలో ఆ పెచ్చులను వారు వేయాలి.
42అప్పుడు ఆ వ్యక్తి ఆ ఇంటికి కొత్త రాళ్లు పెట్టాలి.
అతడు ఆ రాళ్లకు కొత్త అడుసు పూయించాలి.
43“ఒకవేళ ఒకడు పాతరాళ్లను, పాత పెచ్చులను
తీసివేసి, కొత్తరాళ్లు, కొత్త అడుసు పెట్టి ఉండొచ్చు.
ఒకవేళ ఆ ఇంటిలో మరల పొడ కనబడవచ్చును.
44అప్పుడు యాజకుడు లోనికి వచ్చి ఇంటిని పరిశీ
లించాలి. ఆ పొడ ఇంటిలో వ్యాపించి ఉంటే, అది
త్వరగా యితర స్థలాలకు గూడా వ్యాపించే వ్యాధి.
అందుచేత ఆ యిల్లు అపవిత్రము. 45ఆ వ్యక్తి ఆ
ఇంటిని కూలగొట్టాలి. ఆ రాళ్లను, పెచ్చులను, చెక్క
ముక్కలను పట్టణం వెలుపల అపవిత్రమైన ప్రత్యేక
స్థలానికి తీసుకొని పోవాలి. 46ఆ ఇంట్లోకి వెళ్లే ఏ వ్యక్తి
అయినాసరే సాయంత్రం వరకు అపవిత్రమవుతాడు.
47ఎవరైనా ఆ ఇంటిలో భోజనంచేసినా, పండుకొన్నా
ఆ వ్యక్తి తన బట్టలు ఉతుక్కోవాలి.”
48“ఆ ఇంట్లో కొత్త అడుసుతో కొత్త రాళ్లు వేసిన
తర్వాత యాజకుడు ఆ ఇంటిని పరిశీలించాలి. ఒకవేళ
ఆ పొడ ఇంటిలో వ్యాపించకపోతే ఆ ఇల్లు పవిత్రం
అని యాజకుడు ప్రకటించాలి. ఎందుచేతనంటే ఆ
పొడ పోయింది గనుక!
49“అప్పుడు ఆ ఇంటిని పవిత్రం చేయటానికి
యాజకుడు రెండు పక్షులను, దేవదారు చెక్క
ముక్కను, ఒక ఎర్ర గుడ్డముక్కను, ఒక హిస్సోపు
రెమ్మను తీసుకోవాలి. 50పారుతున్న నీళ్లలో ఒక మట్టి
పాత్రలో యాజకుడు ఒక పక్షిని వధించాలి. 51తరువాత
యాజకుడు దేవదారు చెక్క ముక్కను, హిస్సోపును,
ఎర్రగుడ్డ ముక్కను, ప్రాణంతో ఉన్న పక్షిని తీసు
కోవాలి. పారుతున్న నీళ్లలో వధించబడిన పక్షి రక్తంలో
యాజకుడు వీటన్నింటినీ ముంచాలి. అప్పుడు యాజ
కుడు ఆ రక్తాన్ని ఇంటిమీద ఏడు సార్లు చిలకరించాలి.
52ఈ విధంగా యాజకుడు ఆ యింటిని పవిత్రం
చేయటానికి వీటిని ఉపయోగించాలి. 53యాజకుడు
పట్టణం వెలుపలి బయలు ప్రదేశానికి వెళ్లి, బతికి
ఉన్న పక్షిని అక్కడ స్వేచ్ఛగా విడిచిపెట్టాలి. ఈ విధంగా
యాజకుడు ఆ యింటిని పవిత్రం చేయాలి. ఆ
ఇల్లు పవిత్రం అవుతుంది.”
54ఏ విధమైన కుష్ఠువ్యాధికి, 55బట్టమీద లేక ఇంటి
మీద కుష్ఠు పొడకు సంబంధించిన నియమాలు అవి.
56చర్మంమీద వాపులు, దద్దురులు, నిగనిగలాడే మచ్చ
లకు అవి నియమాలు. 57వస్తువులు పవిత్రంగా ఉన్నదీ
లేనిదీ ఆ నియమాలు నేర్పిస్తాయి. అలాంటి వ్యాధులకు
సంబంధించిన నియమాలు అవి.

## దేహస్రావ నియమాలు

15 మోషే, అహరోనులతో యెహోవా యింకా
యిలా చెప్పాడు: 2“ఇశ్రాయేలు ప్రజలకు
మీరిలా చెప్పండి: ఎవని దేహంలోనైనా స్రావం ఉంటే
వాడు అపవిత్రుడు. 3వాని శరీరంలోనుండి స్రావం కారు
తున్నా లేక నిలిచిపోయినా సరే ఫర్వాలేదు.
4“స్రావం ఉన్న వ్యక్తి పరుపుమీద పండుకొంటే,
ఆ పరుపు అపవిత్రం. ఆ వ్యక్తి కూర్చొనేవన్నీ అపవిత్రం
అవుతాయి. 5ఒకవేళ ఏ వ్యక్తి అయినా ఈ వ్యక్తి పరుపును
తాకితే అతడు తన బట్టలు ఉతుక్కొని, నీళ్లతో స్నానం
చేయాలి. సాయంత్రంవరకు అతడు అపవిత్రంగా
ఉంటాడు. 6ఇంకా స్రావంగల వాడు కూర్చున్న దేనిమీ
దనైనా సరే కూర్చున్న ఏ వ్యక్తిగాని తన బట్టలు ఉతు
క్కోవాలి, నీళ్లతో స్నానం చేయాలి. సాయంత్రం
వరకు అతడు అపవిత్రంగా ఉంటాడు. 7అలానే స్రావం
ఉన్న వ్యక్తిని తాకిన ఏ వ్యక్తిగాని తన బట్టలు ఉతుక్కొని,
నీళ్లతో స్నానం చేయాలి. సాయంత్రం వరకు అతడు
అపవిత్రంగా ఉంటాడు.”
8“స్రావంగల వాడు ఒక పవిత్రునిమీద ఉమ్మివేస్తే,
ఈ పవిత్రుడు తన బట్టలు ఉతుక్కొని, నీళ్లతో స్నానం
చేయాలి. ఈ వ్యక్తి సాయంత్రంవరకు అపవిత్రుడుగా
ఉంటాడు. 9స్రావంగల వ్యక్తి కూర్చొని స్వారీ చేసిన
ప్రతి ఆసనం అపవిత్రం అవుతుంది. 10కనుక స్రావంగల
వాని కింద ఉన్న దేనినైనా తాకిన ప్రతి ఒక్కరూ
సాయంత్రంవరకు అపవిత్రంగా వుంటారు. స్రావంగల
వాని కింద ఉండే వస్తువులను మోసిన వ్యక్తి తన
బట్టలు ఉదుకుకొని, నీళ్లతో స్నానం చేయాలి.
సాయంత్రంవరకు అతడు అపవిత్రంగా ఉంటాడు.”
11“ఒకవేళ స్రావంగల వ్యక్తి నీళ్లతో తన చేతులు
కడుగుకోకుండా మరొక వ్యక్తిని తాకవచ్చును. అప్పుడు
అవతల వ్యక్తి తన బట్టలు ఉతుక్కొని స్నానం చేయాలి.
సాయంత్రంవరకు అతడు అపవిత్రంగా ఉంటాడు.”
12“అయితే స్రావంగల వ్యక్తి ఒక మట్టి పాత్రను
తాకితే ఆ పాత్రను పగులగొట్టివేయాలి. స్రావంగల
ఈ వ్యక్తి గనుక ఒక చెక్క పాత్రను తాకితే, ఆ పాత్రను
నీళ్లతో కడగాలి.”

## స్రావశుద్ధి చేయబడిన వానికి నియమాలు.

13“స్రావంగల వాడు తన స్రావం నుండి పవిత్రునిగా
చేయబడితే అతడు తన శుద్ధికోసం తానే ఏడు రోజులు
లెక్కబెట్టుకోవాలి. అప్పుడు అతడు పారుతున్న
నీటిలో తన బట్టలు ఉతుక్కొని, స్నానం చేయాలి.

అతడు పవిత్రుడు అవుతాడు. 14ఎనిమిదో రోజున
రెండు గువ్వలను గాని రెండు పావురపు పిల్ల లనుగాని
ఆ వ్యక్తి తనకోసం తీసుకొని వెళ్లాలి. సన్నిధి గుడార
ద్వారం దగ్గర యెహోవా ఎదుటికి అతడు రావాలి.
ఆ వ్యక్తి రెండు పక్షులను యాజకునికి యివ్వాలి.
15ఒక పక్షిని పాప పరిహారార్థ బలిగాను, మరో పక్షిని
దహనబలిగాను యాజకుడు అర్పించాలి. కనుక
యాజకుడు ఆ వ్యక్తిని యెహోవాకు పవిత్రునిగా
చేస్తాడు.

## వీర్యస్ఖలనం గల వానికి నియమాలు

16“ఒకనికి వీర్యస్ఖలనం అవుతోంటే అతడు నీళ్లలో
పూర్తిగా స్నానం చేయాలి. సాయంత్రంవరకు అతడు
అపవిత్రంగా ఉంటాడు. 17ఒకవేళ ఏ బట్టమీద గాని
తోలుమీదగాని వీర్యం పడితే, ఆ బట్టను లేక తోలును
నీళ్లలో కడగాలి. సాయంత్రంవరకు అది అపవిత్రంగా
ఉంటుంది. 18ఒకవేళ ఒక పురుషుడు ఒక స్త్రీతో శయ
నించగా వీర్యస్ఖలనమైనప్పుడు ఆ స్త్రీ పురుషులు ఇద్దరూ
నీళ్లతో స్నానం చేయాలి. సాయంత్రం వరకు వారు
అపవిత్రంగా ఉంటారు.”

## రక్త స్రావం ఉన్న స్త్రీకి నియమాలు

19“ఒక స్త్రీకి తన నెలసరి రక్తస్రావంనుండి
స్రావంతో ఉంటే, ఆమె ఏడు రోజులు అపవిత్రంగా
ఉంటుంది. ఎవరైనా ఆమెను తాకితే వారు ఆ రోజు
సాయంత్రంవరకు అపవిత్రంగా ఉంటారు. 20మరియు
ఆ స్త్రీ తన నెలసరి రక్తస్రావ సమయంలో పండు
కొనేవన్నీ అపవిత్రం అవుతాయి. ఆ సమయంలో
ఆమె కూర్చొనేవన్నీ అపవిత్రం అవుతాయి. 21ఎవ
రైనా ఆ స్త్రీ పడకను తాకినట్టయితే ఆ వ్యక్తి తన
బట్టలు ఉతుక్కొని, నీళ్లలో స్నానం చేయాలి.
సాయంత్రం వరకు ఆ వ్యక్తి అపవిత్రుడు. 22ఒకవేళ
ఎవరైనా ఆమె కూర్చున్న దేనినైనా తాకితే, ఆ వ్యక్తి
తన బట్టలు ఉతుక్కొని, నీళ్లలో స్నానం చేయాలి.
సాయంత్రం వరకు ఆ వ్యక్తి అపవిత్రం. 23ఒకవ్యక్తి
ఆమె పడకను తాకినా, లేక ఆమె కూర్చున్న దేనినైనా
తాకినా, ఆ వ్యక్తి ఆ సాయంత్రం వరకు అపవిత్రుడవు
తాడు.

24“మరియు ఒక స్త్రీ నెలసరి రక్తస్రావ సమయంలో
ఒక పురుషుడు ఆమెతో లైంగిక పొందు అనుభవిస్తే,
ఆ పురుషుడు ఏడురోజులపాటు అపవిత్రంగా
ఉంటాడు. ఆ పురుషుడు పండుకొనే ప్రతి పడకా
అపవిత్రం అవుతుంది.”

25“ఒక స్త్రీకి నెలసరి రక్తస్రావ సమయంలో గాక,
ఆ తర్వాత ఆమెకు రక్తం చాల రోజుల వరకు స్రవిస్తే,
అలా రక్తం స్రవించినన్నాళ్లూ, నెలసరి రక్తస్రావంలో
వలెనే ఆమె అపవిత్రంగా ఉంటుంది. 26రక్త స్రావ
సమయమంతటిలో ఆ స్త్రీ ఏ పడకమీద పరుండినా
సరే, ఆమె నెలసరి రక్తస్రావ సమయంలో వలెనే
ఉంటుంది ఆ పడక. ఆమె కూర్చొనేది ఏదైనా సరే,
ఆమె నెలసరి రక్తస్రావ సమయంలో అపవిత్రమైనట్టే
అపవిత్రం అవుతుంది. 27ఆ వస్తువులను ఏ వ్యక్తి తాకితే
ఆ వ్యక్తి అపవిత్రం అవుతాడు. ఆ వ్యక్తి తన బట్టలు
ఉతుక్కొని, నీళ్లతో స్నానం చేయాలి. సాయంత్రం
వరకు అతడు అపవిత్రుడవుతాడు. 28ఆ తర్వాత ఆ
స్త్రీ తన స్రావంనుండి పవిత్రం అయిన తర్వాత, ఆమె
ఏడు రోజులు లెక్క పెట్టాలి. ఆ తర్వాత ఆమె పవిత్రం
అవుతుంది. 29అప్పుడు ఎనిమిదో రోజున ఆమె రెండు
గువ్వలను లేదా రెండు పావురపు పిల్లలను తీసుకొని
రావాలి. సన్నిధి గుడార ద్వారం వద్ద యాజకుని దగ్గరకు
ఆమె వాటిని తీసుకొని రావాలి. 30అప్పుడు ఒక పక్షిని
పాపపరిహారార్థబలిగాను మరో పక్షిని దహనబలిగాను
యాజకుడు అర్పించాలి. అలా యాజకుడు
యెహోవా ఎదుట ఆమెను పవిత్రం చేయాలి.

31“అందుచేత ఇశ్రాయేలు ప్రజలు తమ అపవి
త్రత విషయంలో వారి అపవిత్రతనుండి ప్రత్యేకించు
కోవాల్సిందిగా మీరు హెచ్చరించాలి. మీరు ప్రజలను
హెచ్చరించకపోతే, అప్పుడు వారు నా పవిత్ర గుడా
రాన్ని అపవిత్రం చేస్తారు. అప్పుడు వాళ్లు చావాల్సి
ఉంటుంది!”

32స్రావంగల వారి విషయంలో అవి నియమాలు.
వీర్యస్ఖలనం వలన అపవిత్రులైన పురుషులను గూర్చిన
నియమాలు అవి. 33మరియు నెలసరి రక్తస్రావం
మూలంగా అపవిత్రమైన స్త్రీలకు అవి నియమాలు.
అపవిత్రమైన స్త్రీతో శయనించి అపవిత్రమైన ఏ వ్యక్తి
కైనా అవి నియమాలు.

## ప్రాయశ్చిత్త దినం

16 యెహోవాకు ధూపం వేస్తూ అహరోను ఇద్దరు
కుమారులూ చనిపోయారు. అది జరిగిన
తర్వాత మోషేతో యెహోవా మాట్లాడాడు.
2మోషేతో యెహోవా ఇలా అన్నాడు: “నీ సోదరుడైన
అహరోనుతో మాట్లాడు.” పవిత్ర స్థలంలో తెర వెను
కకు అతడు వెళ్లజాలని కొన్ని ప్రత్యేక సమయాలు
ఉన్నాయని అతనితో చెప్పు. ఆ తెర వెనుక గదిలో
ఒడంబడిక పెట్టె ఉన్నది. ఆ పవిత్ర పెట్టెమీద కరుణా
పీఠం ఉంది. ఆ పెట్టెకు పైగా మేఘంలో నేను ప్రత్యక్ష
మవుతాను. అందుచేత యాజకుడు ఎల్లప్పుడూ ఆ
గదిలోనికి వెళ్లజాలడు. అతడు ఆ గదిలోనికి వెళ్తే,
అతడు మరణించవచ్చు!

3“ప్రాయశ్చిత్తపు రోజున అహరోను పరిశుద్ధ
స్థలంలో ప్రవేశించక ముందు, పాపపరిహారార్థ బలిగా
ఒక కోడెదూడను, దహన బలిగా ఒక పొట్టేలును అతడు
అర్పించాలి. 4అహరోను నీళ్లతో పూర్తిగా స్నానం

చేయాలి. అప్పుడు అహరోను ఈ బట్టలు ధరించాలి.
అహరోను పవిత్రమైన చొక్కా ధరించాలి. లోపల వేసు
కొనే బట్టలు శరీరాన్ని అంటిపెట్టుకొనేవిగా ఉండాలి.
మేలురకం దట్టిని నడుంకు కట్టుకోవాలి. మేలురకం
బట్టతో తలపాగా చుట్టుకోవాలి. ఇవి పవిత్ర వస్త్రాలు.
[5]"మరియు పాపపరిహారార్థ బలికోసం రెండు మగ
మేకలను, దహనబలికోసం ఒక పొట్టేలును ఇశ్రాయేలు
ప్రజల దగ్గర నుండి అహరోను తీసుకోవాలి. [6]అప్పుడు
అహరోను పాపపరిహారార్థ బలిగా ఒక కోడెదూడను
అర్పించాలి. ఈ పాపపరిహారార్థ బలి తనకోసమే.
అప్పుడు అతనిని, అతని కుటుంబాన్ని పవిత్రంచేసే
ఆచారాన్ని అహరోను జరిగించాలి.

[7]"తర్వాత, అహరోను ఆ రెండు మేకలను సన్నిధి
గుడార ద్వారం దగ్గరకు తీసుకొని రావాలి. [8]ఆ రెండు
మేకలకు అహరోను చీట్లు వేయాలి. ఒకచీటి యెహోవా
వాకు, ఇంకొకటి విడిచిపెట్టే అజాజేలుకు.*

[9]"అప్పుడు అహరోను చీటి ద్వారా నిర్ణయించ
బడిన మేకను యెహోవాకు అర్పించాలి. ఈ మేకను
అహరోను పాపపరిహారార్థ బలిగా చేయాలి. [10]అయితే
విడిచి పెట్టేందుకు చీటి ద్వారా నిర్ణయించబడిన మేకను
ప్రాణంతోనే యెహోవా ఎదుటికి తీసుకొని రావాలి.
దాన్ని పవిత్రం చేసే క్రమాన్ని యాజకుడు జరి
గించాలి. తర్వాత ఈ మేక అరణ్యంలో విడిచిపెట్ట
బడాలి.

[11]"తర్వాత అహరోను తన కోసం ఒక కోడె
దూడను పాపపరిహారార్థ బలిగా అర్పించాలి. తనను,
తన కుటుంబాన్ని అహరోను పవిత్రం చేసుకోవాలి.
అహరోను అతని కోసమే పాపపరిహారార్థ బలిగా ఆ
కోడెదూడను వధించాలి. [12]అప్పుడు యెహోవా సన్ని
ధిలోని ధూపపీఠంనుండి ధూపార్తి నిండా నిప్పులు
తీసుకోవాలి. చూర్ణం చేయబడిన పరిమళ ధూపాన్ని
రెండు గుప్పెళ్ల నిండా అహరోను తీసుకోవాలి. తెర
వెనుక నున్న గదిలోనికి అహరోను ఆ పరిమళ
ధూపాన్ని తీసుకొని రావాలి. [13]యెహోవా సన్నిధిలో
అహరోను ఆ ధూపాన్ని నిప్పుల మీద వేయాలి.
అప్పుడు ఒడంబడిక పెట్టె మీద ఉన్న కరుణా పీఠాన్ని
ఆ ధూపపొగ ఆవరిస్తుంది. ఈ విధంగా చేస్తే అహరోను
మరణించడు. [14]అహరోను ఆ కోడెదూడ రక్తంలో
కొంచెం తీసుకొని, తన వేలితో తూర్పుకు కరుణాపీఠం
మీదికి చిలకరించాలి. కరుణాపీఠం ముందర అతడు
తన వేలితో ఏడుసార్లు రక్తాన్ని చిలకరించాలి."

[15]"తర్వాత అహరోను ప్రజలకోసం పాప పరి
హారార్థ బలి మేకను వధించాలి. తెరవెనుక ఉన్న గది
లోనికి ఈ మేక రక్తాన్ని అహరోను తీసుకొని రావాలి.
కోడెదూడ రక్తంతో ఏమైతేచేసాడో అలాగే మేక
రక్తంతోకూడ అహరోను చేయాలి. కరుణాపీఠం మీద,
కరుణాపీఠం ఎదుట ఆ మేక రక్తాన్ని అహరోను చిలక
రించాలి. [16]ఇశ్రాయేలు ప్రజలు అపవిత్రమయిన
సందర్భాలెన్నో ఉన్నాయి కనుక ఇశ్రాయేలు ప్రజల
పాపాలు, నేరాలనుండి ఆ అతిపరిశుద్ధ స్థలాన్ని పవిత్రం
చేసేందుకు జరగాల్సిన ప్రాయశ్చిత్తాన్ని అహరోను
చేయాలి. అహరోను ఎందుకు ఇవన్నీ చేయాలి?
సన్నిధిగుడారం అపవిత్ర ప్రజల మధ్య ఉంటుంది
గనుక. [17]అతి పరిశుద్ధ స్థలాన్ని అహరోను పవిత్రం
చేసే సమయంలో సన్నిధిగుడారంలో ఎవ్వరూ ఉండ
కూడదు. అహరోను బయటకు వచ్చేంతవరకు ఏ
వ్యక్తీ లోనికి వెళ్లకూడదు. కనుక అహరోను తనను,
తన కుటుంబాన్ని పవిత్రం చేసుకోవాలి. తర్వాత ఇశ్రా
యేలు ప్రజలందరినీ అతడు పవిత్రం చేయాలి.
[18]తర్వాత యెహోవా సన్నిధిలో ఉన్న బలిపీఠం
దగ్గరకు అహరోను వెళ్లాలి. అహరోను బలిపీఠాన్ని
పవిత్రం చేస్తాడు. కోడెదూడ రక్తంలో కొంచెం, మేక
రక్తంలో కొంచెం తీసుకొని బలిపీఠం అన్ని వైపులా
ఉన్న దాని కొమ్ములకు అహరోను పూయాలి.
[19]తర్వాత అహరోను తన వేలితో కొంత రక్తాన్ని బలి
పీఠం మీద ఏడుసార్లు చిలకరించాలి. ఈ విధంగా ఇశ్రా
యేలు ప్రజల పాపాలన్నింటి నుండి బలిపీఠాన్ని
అహరోను పరిశుద్ధంగా, పవిత్రంగా చేయాలి."

[20]"అతి పరిశుద్ధ స్థలాన్ని, సన్నిధి గుడారాన్ని,
బలిపీఠాన్ని, అహరోను పవిత్రం చేస్తాడు. అలా జరిగిన
తర్వాత ఆ మేకను ప్రాణంతోనే యెహోవా సన్నిధికి
అహరోను తీసుకొని వస్తాడు. [21]బతికే ఉన్న ఆ మేక
తలమీద అహరోను తన రెండు చేతులు ఉంచుతాడు.
అప్పుడు ఇశ్రాయేలు ప్రజల పాపాలను, నేరాలను ఆ
మేకమీద అహరోను ఒప్పుకొంటాడు. ఈ విధంగా
అహరోను ప్రజల పాపాలను మేక నెత్తిమీద మోపు
తాడు. అప్పుడు ఆ మేకను అరణ్యంలోకి వదిలి పెట్టే
స్తాడు. ఈ మేకను అతను తోలివేయటానికి పక్కనే
ఒక మనిషి సిద్ధంగా నిలబడి ఉంటాడు. [22]కనుక ప్రజలం
దరి పాపాలను ఆ మేక తనమీద మోసుకొని ఖాళీ
అరణ్యంలోనికి తీసుకొనిపోతుంది. ఆ మేకను తోలు
కొనిపోయిన వాడు అరణ్యంలో దానిని విడిచి
పెట్టివేయాలి. [23]"అప్పుడు అహరోను సన్నిధి గుడా
రంలో ప్రవేశించాలి. పవిత్రస్థలంలోనికి వెళ్లి నప్పుడు
తాను ధరించిన వస్త్రాలను అతడు తీసివేయాలి. వాటిని
అక్కడే వదిలివేయాలి. [24]ఒక పవిత్ర స్థలంలో అతడు
నీళ్లతో స్నానం చేయాలి. అప్పుడు అతడు తన ఇతర
ప్రత్యేక వస్త్రాలు ధరించాలి. అతడు బయటకు వచ్చి
తనకోసం దహన బలిని, ప్రజలకోసం దహనబలిని
అర్పించాలి. అతని కోసం, ప్రజలకోసం అతడు తనను

**అజాజేలు** అనగా విడిచిపెట్టే మేక ఈ పదం లేక పేరుకు అర్థము తెలియదు. కాని, పాప పరిహారం చేసే మేక అనే అర్థాన్నిస్తుంది.

పవిత్రంచేసుకోవాలి. 25అప్పుడు పాపపరిహారార్థ బలి
పశువు యొక్క కొవ్వును అతడు బలిపీఠం మీద
దహించాలి.”
26“విడిచిపెట్టే మేకను అరణ్యంలో విడిచి పెట్టిన
వ్యక్తి తన బట్టలు ఉతుక్కొని, నీళ్లలో స్నానం చేయాలి.
ఆ తర్వాత ఆ వ్యక్తి బసలోనికి రావచ్చును.”
27“పాపపరిహారార్థ బలిపశువులైన కోడెదూడను,
మేకలను బస వెలుపలికి తీసుకొనిపోవాలి. ఈ జంతు
వుల రక్తం పవిత్ర వస్తువులను పవిత్రం చేసేందుకు
పవిత్ర స్థలానికి తీసుకొని రాబడింది. ఆ జంతువుల
చర్మాలను శవాలను, వాటి మలమును యాజకులు
అగ్నితో కాల్చివేయాలి. 28తర్వాత వాటిని కాల్చిన
వ్యక్తి తన వస్త్రాలను ఉతుక్కొని, నీళ్లలో స్నానం
చేయాలి. ఆ తర్వాత ఆ వ్యక్తి బసలోనికి రావచ్చును.
29ఆ ఆజ్ఞ మీకు శాశ్వతంగా ఉంటుంది. ఏడవ నెల
పదోరోజున మిమ్మల్ని మీరు తగ్గించుకోవాలి. మీరేమీ
పని చేయకూడదు. మీ మధ్య నివసిస్తున్న విదేశీ
యాత్రికులు ఎవరూ పని చేయకూడదు. 30ఎందు
చేతనంటే ఆ రోజు యాజకుడు మిమ్మల్ని పవి
త్రంచేసి, మీ పాపాలను కడిగివేస్తాడు. అప్పుడు మీరు
యెహోవాకు పవిత్రం చేయబడిన వారవుతారు. 31ఇది
మీకు చాల ముఖ్యమైన విశ్రాంతి రోజు. మీరు భోజనం
చేయకూడదు. ఈ ఆజ్ఞ ఎప్పటికీ కొన సాగుతుంది.
32“కనుక నియమించబడిన ప్రధాన యాజకుడు,
అంటే యాజకత్వం చేసేందుకు నియమించబడ్డ
మనిషి. అతడు అన్నింటినీ పవిత్రం చేసే కార్యక్రమాన్ని
జరిగిస్తాడు. ఆ యాజకుడు పవిత్ర నార వస్త్రాలు
ధరించాలి. 33అతి పరిశుద్ధ స్థలాన్ని, సన్నిధి గుడారాన్ని,
బలిపీఠాన్ని అతడు పవిత్రం చేయాలి. యాజకులను,
ఇశ్రాయేలు ప్రజలందరినీ అతడు పవిత్రం చేయాలి.
34ఇశ్రాయేలు ప్రజలను పవిత్రం చేసేందుకు ఇవ్వబడ్డ
ఆ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది. ప్రతి సంవత్స
రంలో ఒక సారి మీరు వాటిని జరిగించాలి. ఎందుకంటే
ఇశ్రాయేలు ప్రజల పాపాల మూలంగా వీటిని చేయ
వలెను.”

కనుక మోషేకు యెహోవా ఆజ్ఞాపించిన వీట
న్నింటినీ వారు జరిగించారు.

### జంతువులను చంపి తినటాన్ని గూర్చిన నియమాలు

17 మోషేతో యెహోవా చెప్పాడు: 2“అహరో
నుతో, అతని కుమారులతో, ప్రజలందరితో
ఇలా చెప్పు. 3ఇదే యెహోవా ఆజ్ఞ అని వారితో
చెప్పు: ఇశ్రాయేలు మనిషి ఒకడు ఒక కోడెదూడను
లేక గొర్రెపిల్లను, లేక ఒక మేకను బసలోగాని బస
వెలుపలగానీ చంపవచ్చును. 4ఆ వ్యక్తి ఆ జంతువును
సన్నిధి గుడార ద్వారం దగ్గరకు తీసుకొని రావాలి. ఆ
జంతువుయొక్క ఒక భాగాన్ని యెహోవాకు కానుకగా
అతడు అర్పించాలి. ఆ వ్యక్తి దాని రక్తాన్ని చిందించాడు.
కనుక అతడు తన కానుకను యెహోవా పవిత్ర గుడారా
నికి తీసుకొని వెళ్లాలి. ఆ జంతువులో ఒక భాగాన్ని
యెహోవాకు కానుకగా అతడు తీసుకొని వెళ్లకపోతే,
ఆ వ్యక్తి తన ప్రజల్లోనుండి వేరు చేయబడాలి. 5ప్రజలు
వారి సమాధాన బలిని యెహోవాకు అర్పించేందుకే
ఈ నియమం. ఇశ్రాయేలు ప్రజలు పొలాల్లో చంపే
జంతువులను కూడా తీసుకొని రావాలి. ఆ జంతు
వులను సన్నిధి గుడార ద్వారం దగ్గర వారు యెహో
వాకు అర్పించాలి. ఆ జంతువులను వారు యాజకుని
దగ్గరకు తీసుకొని రావాలి.
6అప్పుడు ఆ జంతువుల రక్తాన్ని సన్నిధి గుడారం
దగ్గర యెహోవా బలిపీఠం మీద యాజకుడు
చల్లుతాడు. మరియు ఆ జంతువుల కొవ్వును బలిపీఠం
మీద యాజకుడు దహించాలి. ఇది యెహోవాకు
ఇష్టమైన సువాసన. 7వారు వారి ‘మేక పోతు విగ్రహాలకు’
ఇంక ఎలాంటి బలులూ అర్పించకూడదు. ఆ ఇతర
దేవుళ్ళను వారు వెంబడిస్తూ వచ్చారు. అలా వారు
వ్యభిచారిణుల్లా ప్రవర్తించారు. ఈ నియమాలు
ఎప్పటికీ కొనసాగుతాయి.
8“ప్రజలతో చెప్పు: ఒక ఇశ్రాయేలు పౌరుడు లేక
ఒక యాత్రికుడు, లేక మీ మధ్య నివసిస్తున్న ఒక
విదేశీయుడు దహన బలిగాని ప్రాయశ్చిత్త బలిగాని
అర్పించవచ్చు. 9ఆ వ్యక్తి తన బలిని సన్నిధి గుడార
ద్వారం దగ్గరకు తీసుకొని వెళ్లి అక్కడ దానిని యెహో
వాకు అర్పించాలి. ఆ వ్యక్తి యిలా చేయకపోతే, అతడు
తన ప్రజల్లోనుండి వేరు చేయబడాలి.”
10“రక్తాన్ని తినే వాళ్లకు నేను విరోధిని. ఆ వ్యక్తి
ఇశ్రాయేలు పౌరుడు కావచ్చు లేక మీ మధ్య నివసించే
విదేశీయుడు కావచ్చు. ఆ వ్యక్తిని తన ప్రజల్లోనుంచి
నేను వేరు చేస్తాను.”
11ఎందుచేతనంటే దేహానికి ప్రాణం రక్తంలోనే
ఉంది. ఆ రక్తాన్ని బలిపీఠం మీద ప్రోక్షించే నియమాలు
నేను మీకు ఇచ్చాను. మిమ్మల్ని మీరు పవిత్రం చేసు
కొనేందుకు మీరిలా చేయాలి. మీరు తీసిన ప్రాణానికి
విలువ చెల్లింపుగా ఆ రక్తాన్ని మీరు నాకు యివ్వాలి.
12కనుక ఇశ్రాయేలు ప్రజలకు నేను చెప్పేది ఇదే:
మీలో ఎవ్వరూ రక్తం తినవద్దు. మీ మధ్య నివసించే
ఏ విదేశీయుడూ రక్తం తినకూడదు.
13“తినదగిన జంతువును లేక పక్షిని ఎవరైనా
పట్టుకొంటే, ఆ వ్యక్తి దాని రక్తాన్ని నేలమీద పోసి
మట్టితో కప్పివేయాలి. ఆ వ్యక్తి ఇశ్రాయేలు పౌరుడు
కావచ్చు లేక మీ మధ్య నివసించే విదేశీయుడు కావచ్చు.
14మీరెందుకు ఇలా చేయాలి? ఎందుచేతనంటే దాని
మాంసంలో ఇంకా రక్తం గనుక ఉంటే, ఆ జంతువు
ప్రాణం దాని మాంసంలో ఉంటుంది. కనుక ఇశ్రాయేలు
ప్రజలకు నేను ఈ ఆజ్ఞ ఇస్తున్నాను. ఇంకా రక్తంతో

ఉన్న మాంసం తినవద్దు. రక్తం తినే ఏవ్యక్తి అయినాసరే
తన ప్రజలనుండి వేరు చేయబడాల్సిందే.
15"మరియు దానంతట అదే చచ్చిన జంతువును
తిన్నవాడుగాని, లేక మరో జంతువుచే చంపబడ్డ
జంతువును తిన్నవాడుగాని ఆ సాయంత్రం వరకు
అపవిత్రుడుగా వుంటాడు. ఆవ్యక్తి తన బట్టలు ఉతు
క్కోవాలి. నీళ్ళతో పూర్తి స్నానం చేయాలి. ఆ వ్యక్తి
ఇశ్రాయేలు పౌరుడు కావచ్చును, లేక మీ మధ్య నివసి
స్తున్న విదేశీయుడు కావచ్చును. 16ఆ వ్యక్తి తన బట్టలు
ఉతుక్కోక పోయినా, స్నానం చేయకపోయినా అతడు
పాపం చేత దోషిగా ఉంటాడు."

### లైంగిక సంబంధాల నియమాలు

18 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు 2"ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: నేను యెహోవాను,
మీ దేవుణ్ణి. 3గతంలో మీరు ఈజిప్టులో జీవించారు.
ఆ దేశంలో జరిగించిన వాటిని మీరు ఇప్పుడు చేయ
కూడదు. నేను మిమ్మల్ని కనానుకు నడిపిస్తున్నాను.
ఆ ప్రజల ఆచారాలను పాటించవద్దు. 4మీరు నా నియ
మాలకు విధేయులై, నా ఆజ్ఞలను పాటించాలి. ఎందు
చేతనంటే నేను మీ దేవుడైన యెహోవాను గనుక.
5అందుచేతనే మీరు నా ఆజ్ఞలను నియమాలను పాటిం
చాలి. నా ఆజ్ఞలకు నియమాలకు విధేయుడయ్యే
వ్యక్తి జీవిస్తాడు! నేనే యెహోవాను.
6"నీ రక్తసంబంధులతో నీవు ఎన్నడూ లైంగిక
సంబంధం కలిగి ఉండకూడదు. నేను యెహోవాను.
7"నీ తండ్రితో, నీ తల్లితో నీవు ఎన్నడూ లైంగిక
సంబంధం కలిగి ఉండకూడదు. ఆమె నీ తల్లి, ఆమెతో
నీవు లైంగిక సంబంధము కలిగి ఉండకూడదు. 8నీ
తండ్రి యొక్క ఏ భార్యతో (ఆమె నీ తల్లి కానప్పటికీ)
నీవు లైంగిక సంబంధం కలిగి ఉండకూడదు. నీ తండ్రి
యొక్క ఏభార్యతోనైనా నీ తండ్రికి మాత్రమే లైంగిక
సంబంధాలు ఉండాలి. 9"నీ తండ్రి కుమార్తె, లేక నీ
తల్లి కుమార్తె నీకు సోదరి, ఆమెతో నీకు లైంగిక
సంబంధాలు ఉండ కూడదు. నీ సోదరి నీ యింట
పుట్టినా, లేక మరోచోట పుట్టినా సరే."
10"నీ మనుమరాలితో నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. ఆ పిల్లలు నీలో ఒక భాగం."
11"నీ తండ్రికి తల్లికి ఒక కుమార్తె ఉంటే, ఆమె
నీ సోదరి. ఆమెతో నీకు లైంగిక సంబంధాలు ఉండ
కూడదు."
12"నీ తండ్రి సోదరితో నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. ఆమె నీ తండ్రి రక్త సంబంధీకురాలు.
13నీ తల్లి సోదరితో నీకు లైంగిక సంబంధాలు ఉండ
కూడదు. ఆమె నీ తల్లి రక్తసంబంధీకురాలు. 14నీ
తండ్రి సోదరుని భార్యతో నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. అనగా నీ పినతండ్రి భార్యతో నీకు
లైంగిక సంబంధాలు ఉండకూడదు. ఆమె నీ పినతల్లి.
15"నీ కోడలితో నీకు లైంగిక సంబంధాలు ఉండ
కూడదు. ఆమె నీ కుమారుని భార్య. ఆమెతో నీకు
లైంగిక సంబంధాలు ఉండకూడదు."
16"నీ సోదరుని భార్యతో నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. నీ సోదరుడు మాత్రమే తన భార్యతో
లైంగిక సంబంధాలు కలిగి ఉండాలి."
17"తల్లి, కూతుళ్లతో నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. ఆ తల్లి మనుమరాలితో నీకు లైంగిక
సంబంధాలు ఉండకూడదు. ఈ మనుమరాలు ఆ తల్లి
కుమారుని బిడ్డ కావచ్చు, కుమార్తె బిడ్డ కావచ్చు.
ఆమె మనుమరాళ్లు ఆమె రక్తసంబంధీకులు. వారితో
లైంగిక సంబంధాలు కలిగి ఉండటం తప్పు."
18"నీ భార్య బతికి ఉండగా, ఆమె సోదరిని నీకు
మరో భార్యగా చేసుకోకూడదు. దీని మూలంగా అక్క
చెల్లెళ్లు విరోధులవుతారు. నీ భార్య సోదరితో నీకు
లైంగిక సంబంధాలు ఉండకూడదు."
19"మరియు ఒక స్త్రీకి నెలసరి రక్తస్రావం అవుతు
న్నప్పుడు, లైంగిక సంబంధాలకోసం నీవు ఆమె
చెంతకు పోకూడదు. ఈ సమయంలో ఆమె అపవి
త్రంగా ఉంటుంది."
20"నీ పొరుగువాని భార్యతో నీకు లైంగిక సంబం
ధాలు ఉండకూడదు. దీని మూలంగా నీవు అపవిత్రం
అవుతావు."
21"మోలెకు* కోసం నీ పిల్లల్లో ఎవరినీ అగ్ని
గుండం దాటనియ్యకూడదు. ఒకవేళ నీవు అలా చేస్తే,
నీ దేవుని నామం అంటే నీకు గౌరవం లేదని నీవు
చూపించినట్టే, నేనే యెహోవాను.
22"ఒక స్త్రీతో ఉన్నట్టు పురుషునితో నీకు లైంగిక
సంబంధాలు ఉండకూడదు. అది భయంకర పాపం!
23"ఏ జంతువుతోను నీకు లైంగిక సంబంధాలు
ఉండకూడదు. దీని మూలంగా నీవు అపవిత్రం అవు
తావు. అలాగే స్త్రీ జంతువుతో లైంగిక సంబంధాలు
కలిగి ఉండకూడదు. అది సృష్టి విరుద్ధం!
24"అలాంటి వాటిలో దేనిమూలంగాను మిమ్మల్ని
మీరు అపవిత్రం చేసుకోవద్దు. నేను జనాలను వారి
దేశాలనుండి వెళ్లగొట్టి, వారి దేశాలను నేను మీకు
యిస్తున్నాను. ఎందుచేతనంటే ఆ ప్రజలు ఆ చెడు
కార్యాలు చేసారు. 25కనుక దేశం మైలపడిపోయింది.
అలాంటి కార్యాలతో ఇప్పుడు దేశం రోగభూయిష్టమ
యింది. మరియు అక్కడ నివసించిన ప్రజలను ఆ
దేశం ఇప్పుడు వెళ్ళగొడుతుంది!
26"కనుక మీరు నా ఆజ్ఞలకు, నియమాలకు
విధేయులు కావాలి. ఆ భయంకర పాపాలు ఏవీ మీరు

---

**మోలెకు** ఇది అబద్ధపు దేవత తమ ఆరాధనా భాగంగా
ప్రజలు, కొన్నిసార్లు తమ పిల్లలను బలిగా అర్పించేవారు.

చేయకూడదు. ఇశ్రాయేలు పౌరులకు, మీ మధ్య
నివసించే ప్రజలకు నియమాలు యివి. [27]ఆ దేశంలో
మీకు ముందు నివసించిన ప్రజలు ఆ భయంకర
సంగతులన్నీ జరిగించారు. అందుచేత దేశం మైల
పడింది. [28]మీరూ ఈ పనులు చేస్తే, మీరూ ఆ దేశాన్ని
మైల చేస్తారు. మరియు మీకంటె ముందు అక్కడ
ఉన్న వాళ్ళను వెళ్ళగొట్టినట్లు అది మిమ్మల్ని కూడ
వెళ్ళగొడుతుంది. [29] ఏ వ్యక్తి గాని ఈ దారుణ పాపాలలో
దేనినైనా జరిగిస్తే, ఆ వ్యక్తి తన ప్రజల్లోనుండి వేరు
చేయబడాలి. [30]ఇతరులు ఆ భయంకర పాపాలు
చేశారు. కాని మీరు మాత్రం నా ఆజ్ఞలకు విధేయులు
కావాలి. ఆ భయంకర పాపాలేవీ మీరు చేయకూడదు.
ఆ భయంకర పాపాలతో మిమ్మల్ని మీరు మైల చేసు
కోవద్దు. నేను యెహోవాను, మీ దేవుణ్ణి."

### ఇశ్రాయేలు దేవునికి చెందినది

19 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [2]"ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: నేను మీ దేవుడైన
యెహోవాను నేను పవిత్రుణ్ణి కనుక మీరునూ
పవిత్రంగా ఉండాలి!

[3]"మీలో ప్రతి ఒక్కరూ తన తల్లిని, తండ్రిని
గౌరవించాలి, నా ప్రత్యేక విశ్రాంతి దినాలను పాటిం
చాలి. నేను మీ దేవుడైన యెహోవాను.

[4]"విగ్రహాలను పూజించకండి. మీకోసం అచ్చు
వేసిన విగ్రహ దేవతలను చేసుకోవద్దు. నేనే మీ దేవుడైన
యెహోవాను."

[5]"మీరు యెహోవాకు సమాధాన బలి అర్పించే
టప్పుడు, మీరు స్వీకరించబడేందుకు దానిని అర్పిం
చాలి. [6]మీరు దాన్ని అర్పించిన రోజున, ఆ మరునాడు
దాన్ని తినవచ్చును. కానీ ఆ బలిలో ఏమైనా మూడో
నాటికి మిగిలి ఉంటే దాన్ని మీరు అగ్నితో కాల్చి
వేయాలి. [7]బలిలోనిది ఏదైనా మూడో రోజున తింటే
అది దారుణ పాపం. అది స్వీకరించబడదు. [8]అలా
చేసే వ్యక్తి పాపం చేసిన అపరాధి అవుతాడు. ఎందు
చేతనంటే యెహోవాకు చెందిన పవిత్ర విషయాలను
అతడు గౌరవించలేదు కనుక ఆ వ్యక్తి తన ప్రజల్లోనుంచి
వేరు చేయబడాలి."

[9]"కోతకాలంలో మీరు మీ పంటకోసేప్పుడు,
మొత్తం మీ పొలాల మూలవరకు కోసెయ్యకండి.
ఒకవేళ గింజలు ఏమైనా నేలమీద పడితే ఆ గింజలు
మీరు ఏరుకోగూడదు. [10]మీ ద్రాక్షా తోటల్లో ద్రాక్షా
పండ్లన్నీ ఏరుకోవద్దు. నేలమీద పడిన ద్రాక్షపండ్లను
ఏరుకోవద్దు. ఎందుచేతనంటే, పేదవాళ్ళ కోసం, మీ
దేశంగుండా ప్రయాణం చేసే వాళ్ళకోసమూ మీరు
వాటిని విడిచిపెట్టాలి. నేను మీ దేవుడైన యెహో
వాను. [11]"మీరు దొంగతనం చేయకూడదు. మీరు
ప్రజల్ని మోసం చేయకూడదు. మీరు ఒకరితో ఒకరు
అబద్ధం చెప్పకూడదు. [12]నా నామాన్ని ప్రయోగించి
దొంగ వాగ్దానాలు చేయకూడదు. మీరు అలా చేస్తే,
మీ దేవుని పేరుమీద మీకు భక్తి లేదని మీరు వ్యక్తం
చేస్తారు. నేను యెహోవాను. [13]"మీ పొరుగువారికి
మీరు కీడు చేయకూడదు. మీరు అతని దగ్గర దోచు
కోగూడదు. కూలివాని కూలి మర్నాటి ఉదయం వరకు
మీరు బిగబట్టి ఉంచకూడదు."

[14]"మీరు చెవిటివారిని శపించకూడదు. గుడ్డి వారి
యెదుట ఏదీ అడ్డముంచి వారిని పడిపోయే విధంగా
చేయకూడదు. కాని నీవు దేవునికి భయపడాలి. నేను
యెహోవాను.

[15]"తీర్పు విషయంలో మీరు న్యాయంగా ఉండాలి.
పేదవాళ్ళని చెప్పి ప్రత్యేకంగా పక్షపాతం చూపెట్ట
కూడదు. ప్రముఖులనీ పక్షపాతం చూపెట్ట కూడదు.
మీ పొరుగు వారికి తీర్పు చెప్పేటప్పుడు మీరు
న్యాయంగా ఉండాలి. [16]మీరు ఇతరులను గూర్చి
తప్పుడు కథలు వ్యాపింపజేస్తూ తిరగకూడదు. నీ
పొరుగువాని ప్రాణానికి అపాయం కలిగించేది ఏదీ చేయ
వద్దు. నేను యెహోవాను."

[17]"నీ సోదరుణ్ణి నీ హృదయంలో కూడా నీవు
ద్వేషించకూడదు. ఒకవేళ నీ పొరుగువాడు ఏదైనా
తప్పు చేస్తే దాన్ని గూర్చి అతనితో మాట్లాడు. అయితే
అతణ్ణి క్షమించు. [18]మనుష్యులు నీకు చేసిన కీడును
మరచిపో. వారికి తిరిగి కీడు చేయాలని ప్రయ
త్నించకు. నిన్ను నీవు ప్రేమించుకొన్నట్టే నీ పొరుగు
వాణ్ణి ప్రేమించు. నేను యెహోవాను."

[19]"నా ఆజ్ఞలకు నీవు విధేయత చూపాలి. రెండు
రకాల పశువులను కలిపి సంతానోత్పత్తి చేయకూడదు.
రెండు రకాల విత్తనాలు నీ పొలంలో నీవు చల్లకూడదు.
రెండు రకాల మిశ్రమ దారాలతో నేయబడిన బట్టలు
నీవు తొడగకూడదు.

[20]"మరొకని బానిస స్త్రీతో ఒకడు లైంగిక సంబం
ధాలు పెట్టుకోవటం సంభవించవచ్చు. అయితే ఈ
బానిస స్త్రీ డబ్బుతో ఖరీదు చేయబడలేదు, లేక స్వతం
త్రమూ పొందలేదు. ఇలా గనుక జరిగితే వారికి శిక్ష
విధించాలి. కానీ వారికి మరణ శిక్ష లేదు. ఎందుచేతనంటే
ఆ స్త్రీ స్వతంత్రురాలు కాదు. [21]ఆ మగవాడు సన్నిధి
గుడార ద్వారం దగ్గరకు అపరాధ పరిహారార్థ బలి అర్ప
ణను తీసుకొని రావాలి. అపరాధ పరిహారార్థ బలిగా
ఒక గొర్రెపొట్టేలును అతడు తీసుకొని రావాలి. [22]అతణ్ణి
పవిత్రం చేసే కార్యాన్ని యాజకుడు జరిగిస్తాడు. ఆ
పొట్టేలును అతడు చేసిన పాపం కోసం అపరాధ పరి
హారార్థ బలిగా యెహోవా ఎదుట యాజకుడు అర్పిం
చాలి. అప్పుడు అతడు చేసిన పాపం విషయంలో
అతడు క్షమాపణ పొందుతాడు.

[23]"ముందుకు మీరు మీ దేశంలో ప్రవేశిస్తారు. ఆ
సమయంలో ఆహారంకోసం మీరు ఎన్నో రకాల చెట్లు

నాటుతారు. ఒక చెట్టును నాటిన తర్వాత మూడు
సంవత్సరాలవరకు ఆ చెట్టు ఫలం ఏదీ మీరు తిన
కూడదు. ఆ ఫలాన్ని మీరు ఉపయోగించకూడదు.
24నాలుగో సంవత్సరం ఆ చెట్టు ఫలం యెహోవాదే
అవుతుంది. అది యెహోవాకు పవిత్ర స్తుతి అర్పణ.
25అప్పుడు అయిదో సంవత్సరం ఆ చెట్టు ఫలం
మీరు తినవచ్చు. మరియు ఆ చెట్టు మీకు విస్తార
ఫలాన్ని యిస్తుంది. నేను మీ దేవుడైన యెహోవాను.
26“ఇంకా, రక్తం ఉన్నది ఏదీ మీరు తినకూడదు.
“భవిష్యత్తుగూర్చి ముందుగా చెప్పటానికి మంత్ర
తంత్రాలు ఏవీ మీరు ఉపయోగించకూడదు.

27“మీ తల చుట్టూ పెరిగే వెంట్రుకలను గుండ్రంగా
క్షౌరం చేయకూడదు. మీ గడ్డం కొనలు కత్తిరించి
వేయకూడదు. 28చనిపోయిన వాళ్ల జ్ఞాపకార్థం మీరు
మీ దేహాలను కోసుకోగూడదు. మీరు మీ ఒంటి మీద
పచ్చలు పొడిపించుకోగూడదు. నేను మీ దేవుడైన
యెహోవాను.”

29“మీ కుమార్తెను వేశ్యగా మార్చవద్దు. అలా
చేయటం ఆమెపై మీకు గౌరవం లేదని వ్యక్తం చేస్తుంది.
మీ దేశంలో ప్రజల్ని వేశ్యలు కానీయవద్దు. అలాంటి
పాపంతో మీ దేశాన్ని నిండనీయవద్దు.”

30“నా ప్రత్యేక విశ్రాంతి దినాల్లో మీరు పని చేయ
కూడదు. నా పవిత్రస్థలాన్ని మీరు ఘనంగా చూడాలి.
నేను యెహోవాను.”

31“సలహాకోసం కర్ణపిశాచులు, సోదెగాళ్ల దగ్గరకు
వెళ్లకూడదు. వాళ్ల దగ్గరకు వెళ్ళొద్దు, వారు మిమ్మల్ని
అపవిత్రం చేస్తారు. నేను యెహోవాను, మీ దేవుణ్ణి.”
32“వృద్ధులను గౌరవించండి. వారు గదిలోనికి
వచ్చినప్పుడు లేచి నిలబడండి. మీ దేవునికి గౌరవం
చూపెట్టండి. నేను యెహోవాను.

33“మీ దేశంలో నివసిస్తున్న విదేశీయులకు కీడు
చేయకండి. 34మీ స్వంత పౌరులను గౌరవించినట్టే,
విదేశీయుల్ని కూడా మీరు గౌరవించాలి. మిమ్మల్ని
మీరు ఎలా ప్రేమించుకొంటారో విదేశీయుల్ని కూడా
అలా ప్రేమించాలి. ఎందుచేతనంటే ఒకప్పుడు మీరూ
ఈజిప్టులో విదేశీయులే. నేను మీ దేవుడైన
యెహోవాను.”

35“ప్రజలు తీర్పు తీర్చేటప్పుడు మీరు న్యాయంగా
ఉండాలి. అలానే వస్తువుల్ని తూచేటప్పుడు, కొలిచే
టప్పుడు మీరు న్యాయంగా ఉండాలి. 36మీ తక్కెడలు
సమానంగా ఉండాలి. మీ మొగ్గులు ద్రావకాలను సరిగ్గా
నింపేవిగా ఉండాలి. మీ త్రాసులు, తూనికరాళ్లు వస్తు
వుల్ని సరిగ్గా తూచేవిగా ఉండాలి. నేను మీ దేవుడైన
యెహోవాను. నేనే మిమ్మల్ని ఈజిప్టు దేశంనుండి
బయటకు తీసుకొనివచ్చాను! 37“నా ఆజ్ఞలు,
నియమాలు అన్నీ మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. వాటికి
మీరు విధేయులు కావాలి. నేను యెహోవాను!”

20 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 2“ఇశ్రా
యేలు ప్రజలతో ఈ విషయాలు కూడా
నీవు చెప్పాలి: మీ దేశంలో ఒక వ్యక్తి తన పిల్లలలో
ఒకరిని దొంగదేవత మోలెకునకు అర్పించడం జరగ
వచ్చు, అప్పుడు ఆ వ్యక్తిని చంపెయ్యాలి. ఆ వ్యక్తి
ఇశ్రాయేలు పౌరుడైనా ఇశ్రాయేలులో నివసిస్తున్న విదేశీ
యుడైనా సరే, ఆ వ్యక్తిమీద మీరు రాళ్లు విసిరి చంపి
వేయాలి.

3నేను ఆ వ్యక్తికి విముఖుడ్ని. అతణ్ణి అతని
ప్రజల్లోనుంచి నేను వేరుచేస్తాను. ఎందుచేతనంటే
అతడు తన పిల్లల్ని మోలెకునకు ఇచ్చాడు. నా పవిత్ర
నామం అంటే అతనికి గౌరవం లేదని అతడు వ్యక్తం
చేసాడు. నా పవిత్ర స్థలాన్ని అతడు అపవిత్రం చేసాడు.
4ఒకవేళ సామాన్యులు అతణ్ణి పట్టించుకోక పోవచ్చు,
ఒకవేళ తన పిల్లల్ని మోలెకునకు అర్పించినవాణ్ణి వారు
పట్టించు కొనక పోవచ్చును, 5కానీ నేను మాత్రం
అతనికి, అతని కుటుంబానికి విరోధంగా ఉంటాను.
అతణ్ణి తన ప్రజల్లోనుంచి నేను వేరుచేసేస్తాను. నాకు
అపనమ్మకంగా ఉండి, మోలెకును వెంబడించే ఏ
వ్యక్తినైనా సరే నేను వేరు చేసేస్తాను.

6“సలహాకోసం కర్ణపిశాచుల దగ్గరకు, సోదె చెప్పే
వారి దగ్గరకు వెళ్ళే ఏ వ్యక్తికైనా సరే నేను విరోధంగా
ఉంటాను. అలాంటి వ్యక్తి నాకు అపనమ్మకంగా
ఉన్నాడు. కనుక అలాంటి వాణ్ణి తన ప్రజల్లోనుంచి
నేను వేరు చేసేస్తాను.”

7“ప్రత్యేకంగా ఉండండి. మిమ్మల్ని మీరు పవిత్రం
చేసుకోండి. ఎందుచేతనంటే నేను పవిత్రుడను గనుక.
నేను యెహోవాను మీ దేవుణ్ణి. 8నా ఆజ్ఞలు జ్ఞాపకం
చేసుకొని విధేయులుగా ఉండండి. నేను యెహోవాను
మరియు నా ప్రత్యేక ప్రజలుగా నేను మిమ్మల్ని
చేసాను.”

9“ఏ వ్యక్తిగాని తన తండ్రిని లేక తల్లిని శపించినట్ల
యితే ఆ వ్యక్తిని చంపేయాలి. అతడు తన తండ్రిని
లేక తల్లిని శపించాడు గనుక అతణ్ణి చంపేయాల్సిందే.”

## లైంగిక పాపాలకు శిక్ష

10“మగవాడు ఒకడు తన పొరుగువాని భార్యతో
లైంగిక సంబంధాలు పెట్టుకొంటే ఆ మగవాడు ఆడది
ఇద్దరూ వ్యభిచార అపరాధులే. అందుచేత మగవాడు,
ఆడది ఇద్దరూ చంపబడాల్సిందే. 11ఒక మగవాడు తన
తండ్రి భార్యతో లైంగిక సంబంధాలు పెట్టుకొంటే ఆ
మగవాడు చంపివేయాలి. ఆ మగవాడు, అతని తండ్రి
భార్యను, ఇద్దర్నీ చంపివేయాలి. వాడు తన తండ్రికి
విరుద్ధంగా పాపం చేసాడు. 12“ఒక మగవాడు తన
కోడలితో లైంగిక సంబంధాలు కలిగి ఉంటే, వాళ్ళిద్దర్నీ
చంపివేయాలి. వాళ్లు చాలా దారుణమైన లైంగిక పాపం
చేసారు. వాళ్లు శిక్షించబడాల్సిందే.

[13]“ఒక మగవాడు ఒక స్త్రీతో కలిగి ఉన్నట్టుగా మరో మగవాడితో లైంగిక సంబంధాలు కలిగి ఉంటే, వీళ్ళిద్దరు మగవాళ్లూ చాలా దారుణ పాపం చేసినట్టే. వాళ్ళను చంపివేయాల్సిందే. వాళ్ళ శిక్షకు వాళ్లే కారకులు.

[14]“ఒక మగవాడు ఒక స్త్రీతో, ఆమె తల్లితో కూడా లైంగిక సంబంధాలు కలిగి ఉంటే అది లైంగిక పాపం. ఆ మగవాడ్ని, ఆడవాళ్లు ఇద్దర్నీ ప్రజలు కాల్చి వేయాలి. మీ ప్రజల మధ్య ఇలాంటి లైంగిక పరమైన పాపం జరగనివ్వకండి.

[15]“ఒక మగావాడు ఒక జంతువుతో లైంగిక సంబంధాలు కలిగి ఉంటే అతణ్ణి చంపివేయాల్సిందే. మరియు మీరు ఆ జంతువును గూడ చంపివేయాలి. [16]ఒక స్త్రీ గనుక ఒక జంతువుతో లైంగిక సంబంధం పెట్టుకొంటే, ఆ స్త్రీని, జంతువును కూడ మీరు చంపివేయాలి. వారిని చంపేయాలి, వాళ్ళ శిక్షకు వాళ్లే కారకులు.”

[17]“ఒక సోదరుడు అతని సోదరి అనగా తండ్రి కుమార్తెగాని, తల్లి కుమార్తెగాని ఒకరితో ఒకరు లైంగిక సంబంధం పెట్టుకోవటం* చాలా సిగ్గుచేటు. వాళ్లను బహిరంగంగా శిక్షించాలి. వాళ్ల ప్రజల్లోనుంచి వాళ్లను వేరు చేయాలి. తన సోదరితో లైంగిక సంబంధం పెట్టుకొన్న మగవాడు అతని పాపం నిమిత్తం శిక్ష పొందాలి.”

[18]“ఒక స్త్రీ నెలసరి రక్తస్రావ సమయంలో ఒక మగవాడు ఆమెతో లైంగిక సంబంధం పెట్టుకొంటే ఆ స్త్రీ పురుషులు ఇద్దర్నీ వాళ్ల ప్రజల్లోనుంచి వేరు చేయాలి. ఆమె రక్తస్రావ స్థానాన్ని వారు బహిర్గతం చేసారు గనుక వాళ్లు పాపం చేసారు.

[19]“మీ తల్లి సోదరితో గాని, తండ్రి సోదరితోగాని లైంగిక సంబంధాలు పెట్టుకో గూడదు. అది రక్త సంబంధికుల పాపం. వాళ్ల పాపం మూలంగా వాళ్లు శిక్ష పొందాలి.

[20]“ఒకడు తన పినతల్లితో శయనించగూడదు. అతడు, అతని పినతల్లికూడ వారు చేసిన పాపం మూలంగా శిక్ష పొందుతారు. వాళ్లు పిల్లలు లేకుండా చస్తారు.

[21]ఎవడైనా తన సోదరుని భార్యను చేర్చుకోవడం తప్పు. వాడు తన సోదరునికి విరోధంగా పాపం చేసాడు. వాళ్లకూ పిల్లలు ఉండరు.

[22]“నా ఆజ్ఞలు, నియమాలు అన్నీ మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. వాటికి మీరు విధేయులు కావాలి. నేను మిమ్మల్ని మీ దేశానికి నడిపిస్తున్నాను. ఆ దేశంలో మీరు నివసిస్తారు. మీరు నా ఆజ్ఞలకు, నియమాలకు విధేయులైతే ఆ దేశం మిమ్మల్ని వెళ్లగొట్టదు. [23]ఇతర ప్రజల్ని ఆ దేశంలో నుండి నేను వెళ్ల గొట్టేస్తున్నాను. ఎందుచేతనంటే వాళ్లు అలాంటి పాపాలన్నీ చేసారు. ఆ పాపాలంటే నాకు అసహ్యం. కనుక వాళ్లు జీవించి నట్టు మీరు జీవించకండి.

[24]“వాళ్ల దేశం మీది అవుతుంది అని నేను మీతో చెప్పాను. వాళ్ల దేశాన్ని నేను మీకు యిస్తాను. అది మీ దేశం అవుతుంది. ఆ దేశం చాలా మంచి దేశం. పాలు, తేనెలు ప్రవహించే దేశం అది. నేను మీ దేవుడైన యెహోవాను.

“నేను మిమ్మల్ని నా ప్రత్యేక ప్రజలుగా చేసుకొన్నాను. ఇతరులకంటే మిమ్మల్ని నేను వేరుగా చూసుకొన్నాను. [25]కనుక పవిత్ర జంతువుల్ని అపవిత్ర జంతువులకంటె వేరుగా మీరు చూసుకోవాలి. పవిత్ర పక్షుల్ని అపవిత్ర పక్షుల కంటే వేరుగా మీరు చూసుకోవాలి. అపవిత్ర పక్షులు, జంతువులు, నేలమీద ప్రాకే వాటిలో దేన్నీ మీరు తినవద్దు. నేను వాటిని అపవిత్రంగా చేసాను. [26]నేను మిమ్మల్ని నా ప్రత్యేక ప్రజలుగా చేసాను. అందుచేత మీరు నా కోసం పవిత్రంగా ఉండాలి. ఎందుచేతనంటే నేను యెహోవాను, నేను పవిత్రుణ్ణి.

[27]“కర్ణపిశాచి, సోదెచెప్పేవారు, మగవాడు గాని, స్త్రీగాని చంపబడాల్సిందే. రాళ్లతో ప్రజలు వారిని చంపి వేయాలి. వాళ్లు శిక్షించబడాలి.”

## యాజకుల ప్రవర్తన

21 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [2]“యాజకులైన అహరోను కుమారులతో ఈ విషయాలు చెప్పు: అహరోను కుమారులు, యాజకులు: చనిపోయిన వారి శవాన్ని తాకి యాజకుడు అపవిత్రుడు కాకూడదు. [3]అయితే చనిపోయిన వ్యక్తి గనుక తన రక్త సంబంధీకుడైతే, అప్పుడు అతడు ఆ శవాన్ని తాకవచ్చు. చనిపోయిన వ్యక్తి యాజకుని తల్లి లేక తండ్రి, కుమారుడు లేక కుమార్తె ,సోదరుడు లేక అవివాహిత సోదరి అయితే యాజకుడు అపవిత్రం కావచ్చు. (ఈ సోదరికి భర్త లేడు గనుక ఆమె అతనికి చాలా దగ్గర అవుతుంది. కనుక ఆమె మరణిస్తే, ఆమెకోసం యాజకుడు మైల పడవచ్చు). [4]కానీ చనిపోయిన వ్యక్తి యాజకుని బానిసల్లో ఒక వ్యక్తి అయితే మాత్రం యాజకుడు మైలపడకూడదు.

[5]“యాజకులు వారి తలలు గుండు గీసికో గూడదు. యాజకులు వారి గెడ్డాల కొనలు కత్తిరించగూడదు. యాజకులు వారి దేహాల్లో ఎక్కడా కోసుకోగూడదు. [6]యాజకులు వారి దేవుని కోసం పవిత్రంగా ఉండాలి. దేవుని పేరంటే వారు భక్తి చూపించాలి. ఎందుచేతనంటే వారు నైవేద్యం, హోమం దేవునికి అర్పించువారు. కనుక వారు పవిత్రంగా ఉండాలి. [7]“యాజకుడు దేవుణ్ణి ప్రత్యేకంగా సేవించేవాడు. అందుచేత మరో మగ

---

**లైంగిక ... పెట్టుకోవటం** ‘తమ దిగంబరత్వాన్ని ఒకరి కొకరు చూసుకొన్న యెడల’ అని దీని భావం.

వాడితో లైంగిక సంబంధం ఉన్న స్త్రీని యాజకుడు
వివాహం చేసుకోగూడదు. వేశ్యనుగాని, విడువబడిన
స్త్రీనిగాని యాజకుడు వివాహం చేసుకోగూడదు.
8యాజకుడు ప్రత్యేక విధానంలో దేవుణ్ణి సేవించే
వాడు. కనుక మీరు అతణ్ణి ప్రత్యేక విధానంలో చూసు
కోవాలి. ఎందుచేతనంటే అతడు పవిత్ర వస్తువుల్ని
మోసేవాడు గనుక. పవిత్ర రొట్టెల్ని అతడు దేవునికి
తీసుకొనివస్తాడు, నేను పరిశుద్ధుడను. నేను యెహో
వాను, మరియు నేనే మిమ్మల్ని పరిశుద్ధులుగా చేస్తాను.
9“ఒక యాజకుని కుమార్తె వేశ్య అయితే ఆమె
తన పేరును నాశనం చేసికొంటుంది, తన తండ్రికి
అవమానం కలిగిస్తుంది. కనుక ఆమెను కాల్చివేయాలి.
10“ప్రధాన యాజకుడు తన సోదరుల్లోనుంచి
ఎంపిక చేయబడినవాడు. అతని తలమీద అభిషేక
తైలం పోయబడింది. ఈ విధంగా అతడు ప్రధాన
యాజకునిగా ప్రత్యేక పనికి నియమించబడ్డాడు.
ప్రత్యేక వస్త్రాలు ధరించేందుకు అతడు ఏర్పాటు చేయ
బడ్డాడు. కనుక అతడు తన విచారాన్ని బాహాటంగా
చూపించే పనులు చేయకూడదు. అతడు తన తల
వెంట్రుకలను చింపిరిజుట్టుగా పెరగ నివ్వకూడదు.
అతడు తన బట్టలు చింపుకోగూడదు. 11మృత దేహాన్ని
తాకి అతడు అపవిత్రుడు కాకూడదు. అతని స్వంత
తండ్రి, తల్లి చనిపోయినా సరే అతడు ఆ శవాన్ని
తాకగూడదు. 12ప్రధాన యాజకుడు పరిశుద్ధ స్థలం
నుండి బయటకు వెళ్లగూడదు. అతడు అలా గనుక
చేస్తే, అతడు అపవిత్రుడై, తర్వాత దేవుని పరిశుద్ధ
స్థలాన్ని అతడు అపవిత్రం చేయవచ్చు. ప్రధాన యాజ
కుని తలమీద ప్రత్యేక తైలం పోయబడింది. ఇదే
అతణ్ణి మిగిలిన ప్రజలకంటే ప్రత్యేకం చేసింది. నేను
పరిశుద్ధుడైన యెహోవాను.
13“ప్రధాన యాజకుడు కన్యగా ఉన్న స్త్రీని వివాహం
చేసుకోవాలి. 14ఇదివరకే మరొకనితో లైంగిక సంబం
ధాలు కలిగి ఉన్న స్త్రీని ప్రధాన యాజకుడు వివాహం
చేసుకోగూడదు. ఒక వేశ్యనుగాని, విడువబడిన స్త్రీని
గాని, లేక విధవరాలిని గాని ప్రధాన యాజకుడు వివాహం
చేసుకోగూడదు. ప్రధాన యాజకుడు తన స్వంత
ప్రజల్లోనే ఒక కన్యను వివాహం చేసుకోవాలి. 15ఈ
విధంగా ప్రజలు అతని పిల్లలకు మర్యాదనిస్తారు. ప్రధాన
యాజకుణ్ణి అతని ప్రత్యేక పని నిమిత్తం యెహోవా
నగు నేనే ప్రత్యేకించాను.” 16మోషేతో యెహోవా
చెప్పాడు: 17“అహరోనుతో చెప్పు: నీ సంతానంలోని
పిల్లలు ఎవరైనాసరే ఏదైనా శారీరక లోపం గలవారైతే
వారు దేవునికి ప్రత్యేక రొట్టెలు తీసుకొని వెళ్లకూడదు.
18అంగవిహీనం ఉన్న ఏ మనిషికూడ యాజకునిగా
నాకు సేవ చేయకూడదు, నాకు బలులు అర్పించ
కూడదు. ఎలాంటివారు యాజకులుగా నన్ను సేవించ
గూడదు అంటే:

గుడ్డి వాళ్లు, కుంటివాళ్లు, పాడైపోయిన
ముఖం ఉన్నవాళ్లు, చేతులుగాని కాళ్లుగాని
విపరీతంగా పొడవు ఉన్నవాళ్లు,
19 కాలైనా, చేయైనా విరిగినవాళ్లు,
20 గూనివాళ్లు, మరుగుజ్జువాళ్లు, కంటిలో
లోపాలు ఉన్నవాళ్లు, దురద లేక చర్మ వ్యాధి
ఉన్నవాళ్లు, అణగగొట్టబడిన వృషణాలు
ఉన్నవాళ్లు.

21అహరోను సంతానంలో ఎవరిలోనైనా ఏదోష
మైనా ఉంటే అలాంటి వ్యక్తి యెహోవాకు హోమ
అర్పణలు అర్పించకూడదు. ఆ వ్యక్తి ప్రత్యేక రొట్టెల్ని
కూడా దేవునికి తీసుకొని వెళ్ల కూడదు. 22ఆ వ్యక్తి
యాజక కుటుంబంలోని వాడు గనుక అతడు పవిత్ర
రొట్టెల్ని తినవచ్చును. అతి పవిత్రమైన రొట్టెల్ని
కూడా అతడు తినవచ్చును.
23కానీ అతడు మాత్రం తెరలోపలి అతి పరిశుద్ధ
స్థలంలోనికి వెళ్లకూడదు, బలిపీఠం దగ్గరకు గూడ
అతడు వెళ్లగూడదు. ఎందుచేతనంటే అతనిలో ఏదో
తప్పు ఉంది. అతడు నా పరిశుద్ధ స్థలాన్ని అపవిత్రం
చేయకూడదు. నేను యెహోవాను ఆ స్థలాల్ని
పరిశుద్ధం చేస్తాను!”
24కనుక అహరోనుతో, అతని కుమారులతో, ఇశ్రా
యేలు ప్రజలందరితో మోషే ఈ సంగతులు చెప్పాడు.

22 యెహోవా దేవుడు మోషేతో ఇలా చెప్పాడు:
2“అహరోనుతో, అతని కుమారులతో
చెప్పు: ఇశ్రాయేలు ప్రజలు నాకు వస్తువులను అర్పి
స్తారు. ఆ వస్తువులు పవిత్రం అవుతాయి. అవినావి.
అందుచేత యాజకులైన మీరు వాటిని తీసుకో
గూడదు. పవిత్రమైన ఆ వస్తువుల్ని మీరు ఉపయోగిస్తే,
నా పవిత్రనామం అంటే మీకు గౌరవం లేదని మీరు
వ్యక్తం చేస్తారు. నేను యెహోవాను. 3మీ సంతానమం
తటిలో ఎవరైనా వాటిని తాకితే ఆ వ్యక్తి అపవిత్రం
అవుతాడు. ఆ వ్యక్తి నానుండి వేరు చేయబడతాడు.
ఇశ్రాయేలు ప్రజలు ఆ వస్తువుల్ని నాకు ఇచ్చారు.
నేను యెహోవాను.
4“అహరోను సంతానంలో ఎవరికైనా దారుణమైన
చర్మవ్యాధి ఉంటే, లేక స్రావరోగం ఉంటే అతడు
పవిత్రం అయ్యేంతవరకు పవిత్ర భోజనం చేసేందుకు
వీల్లేదు. అపవిత్రుడైన ఏ యాజకునికైనా ఆ నియమం
వర్తిస్తుంది. అలాంటి యాజకుడు ఒక శవం మూలంగా
కానీ, లేక తన ఇంద్రియం మూలంగా కానీ అపవిత్రుడు
కావచ్చు. 5అపవిత్రమైన, పాకే జంతువుల్లో దేన్ని
తాకినా అతడు అపవిత్రుడు అవుతాడు. మరియు అపవి
త్రమైన మరో మనిషిని తాకుట వల్ల అతడు అపవిత్రుడు
అవుతాడు. దేని మూలంగా అతడు అపవిత్రమైనా సరే
6ఒక వ్యక్తి వాటిలో దేనిని తాకినా అతడు సాయంత్రం

వరకు అపవిత్రుడవుతాడు. ఆ వ్యక్తి పవిత్ర భోజనాన్ని తినకూడదు. అతడు నీళ్లతో స్నానము చేసినా సరే అతడు పవిత్ర భోజనం తినకూడదు. 7సూర్యాస్త మయం తర్వాతనే అతడు పవిత్రుడవుతాడు. అప్పుడు అతడు పవిత్ర భోజనం తినవచ్చును. ఎందుచేతనంటే ఆ భోజనం అతనికి చెందుతుంది గనుక.

8"ఒక జంతువు దానంతట అదేచచ్చినా, లేక మరో జంతువుచే చంపబడినా, చచ్చిన ఆ జంతువును యాజ కుడు తినకూడదు. ఆ వ్యక్తి ఆ జంతువును తింటే అతడు అపవిత్రుడవుతాడు. నేను యెహోవాను."

9"యాజకులు నన్ను సేవించేందుకు నిర్ణీత సమ యాలు ఉన్నాయి. ఆ సమయాల్లో వాళ్లు జాగ్రత్తగా ఉండాలి. పవిత్రమైన వాటిని అపవిత్రం చేయకుండా వారు జాగ్రత్తగా ఉండాలి. వాళ్లు గనుక జాగ్రత్తగా ఉంటే వాళ్లు చావరు. నేనే, యెహోవాను. వాళ్లను ఈ ప్రత్యేక పనికోసం ప్రత్యేకించాను. 10యాజక కుటుంబంలోని వాళ్లు మాత్రమే పవిత్ర భోజనం తినవచ్చు. యాజకు నితో ఉంటున్న అతిథి లేక యాజకుని కూలివాడు పవిత్ర భోజనం తినకూడదు.

11అయితే యాజకుడు తన స్వంత డబ్బుతో ఒక వ్యక్తిని బానిసగా గనుక కొనివుంటే ఆ వ్యక్తి పవిత్రమైన వాటిలో కొంత తినవచ్చును. యాజకుని ఇంట పుట్టిన బానిసలు కూడ యాజకుని భోజనంలో కొంత తినవచ్చును. 12యాజకుని కుమార్తె, యాజకుడు కాని వాణ్ణి వివాహం చేసుకోవచ్చు. ఆమె గనుక అలా చేస్తే, అప్పుడు ఆమె పవిత్ర అర్పణల్లోనివి ఏవీ తినకూడదు. 13ఒక యాజకుని కుమార్తె విధవ రాలు కావచ్చును, లేదా విడాకులు పొందవచ్చును. ఆమెను పోషించే పిల్లలు ఆమెకు లేని కారణంగా ఆమె బాల్యంలో నివసించిన తన తండ్రి ఇంటికి తిరిగి వెళ్తే, అప్పుడు ఆమె తన తండ్రి భోజనంలో కొంత తిన వచ్చును. అయితే యాజక కుటుంబంలోని వారు మాత్రమే ఈ భోజనాన్ని తినవచ్చును. 14ఒక వ్యక్తి పవిత్ర భోజనంలో కొంత పొరబాటున తిన్నట్లయితే ఆ వ్యక్తి అంత పవిత్ర భోజనాన్ని యాజకునికి ఇచ్చి వేయాలి. అయిదింట ఒకటి వంతున ఆ భోజనం ఖరీదు గూడ అతడు చెల్లించాలి.

15"ఇశ్రాయేలు ప్రజలు యెహోవాకు కానుకలు యిస్తారు. ఆ కానుకలు పవిత్రం అవుతాయి. కనుక ఆ పవిత్ర వస్తువుల్ని యాజకుడు అపవిత్రం చేయ కూడదు. 16ఒక వేళ యాజకులు గనుక ఆ వస్తువులు పవిత్రం కావు అన్నట్టు వాటిని చూస్తే, పవిత్ర భోజనం తిన్నప్పుడు వారు వారి పాపాన్ని అధికం చేసుకొన్న వాళ్లవుతారు. యెహోవాను. నేనే వాటిని పవిత్రం చేస్తాను!"

17యెహోవా దేవుడు మోషేతో ఇలా చెప్పాడు: 18"అహరోను, అతని కుమారులు, ఇశ్రాయేలు ప్రజలు అందరితో ఇలా చెప్పు: ఒకవేళ ఒక ఇశ్రాయేలు పౌరుడు, లేక ఒక విదేశీయుడు ఒక అర్పణ తీసుకొని రావాలను కొంటాడు. ఒకవేళ అది ఆ వ్యక్తి చేసుకొన్న ఏదో ఒక ప్రత్యేక వాగ్దానంగా కావచ్చు లేక ఒకవేళ ఆ వ్యక్తి ఇవ్వాలనుకొన్న ఒక ప్రత్యేక బలి కావచ్చు. 19-20ఆ ప్రజలు నిజంగా దేవునికి కానుకలు ఇవ్వాలని కోరుకొన్నందుచేత వారు తెచ్చే కానుకలు అవి. దోష భూయిష్టమైన ఏ అర్పణా నీవు అంగీకరించగూడదు. అలాంటి అర్పణవల్ల నాకు సంతోషం కలుగదు. కనుక ఒక కోడెదూడ, గొర్రె, మేక అయితే అది మగదై ఉండాలి. ఆపైన దానిలో ఏ దోషమూ ఉండకూడదు."

21"ఒక వ్యక్తి సమాధాన బలి యెహోవాకు తీసు కొని రావచ్చును. ఆ సమాధాన బలి ఆ వ్యక్తి చేసుకొన్న ఏదో ప్రత్యేక వాగ్దానానికి చెల్లింపు కావచ్చును. లేక అది ఆ వ్యక్తి యెహోవాకు అర్పించాలనుకొన్న ఒక ప్రత్యేక కానుక కావచ్చును. అది ఇక కోడెదూడ కావచ్చును లేక గొర్రె కావచ్చును. కానీ అది ఆరోగ్యంగా ఉండాలి. ఆ జంతువులో ఏ దోషమూ ఉండకూడదు. 22గుడ్డిది, ఎముకలు విరిగింది, కుంటిది లేక స్రావరోగం ఉన్నది, లేక దారుణమైన చర్మవ్యాధి ఉన్నది, ఏ జంతువును మీరు యెహోవాకు అర్పించ కూడదు. యెహోవా బలిపీఠపు అగ్నిమీద రోగగ్రస్థ మైన జంతువులను మీరు అర్పించకూడదు.

23"కొన్నిసార్లు ఒక కాలు మరీ పొడవుగానో లేక సరిగ్గా పెరగని ఒక పాదమో ఉన్న ఒక కోడెదూడ గాని గొర్రెగాని ఉండవచ్చు. ఒకవేళ ఒక వ్యక్తి అలాంటి జంతువును యెహోవాకు ప్రత్యేక కానుకగా అర్పించా లనుకొంటే, అది అంగీకారం అవుతుంది. అయితే ఆ వ్యక్తి చేసిన ప్రత్యేక వాగ్దానానికి చెల్లింపుగా మాత్రం అది అంగీకరించబడదు.

24"ఒక జంతువుకు గాయపడ్డ, లేక అణగగొట్ట బడిన లేక చినిగిన వృషణాలు ఉంటే అలాంటి జంతు వును మీరు యెహోవాకు అర్పించకూడదు.

25"విదేశీయుల దగ్గర్నుండి జంతువుల్ని యెహో వాకు బలిగా మీరు తీసుకోగూడదు. ఎందుచేతనంటే ఆ జంతువులు ఏ విధంగానైనా దెబ్బతిన్నాయేమో, లేదా వాటిలో ఏదైనా లోపం ఉండొచ్చు అందుచేత అవి అంగీకరించబడవు!"

26మోషేతో యెహోవా చెప్పాడు:

27"ఒక కోడెదూడ, లేక ఒక గొర్రె, లేక ఒక మేక పుట్టినప్పుడు ఏడు రోజులు అది తన తల్లితో ఉండాలి, అప్పుడు ఎనిమిదో రోజునగాని ఆ తర్వాతగాని యెహోవాకు హోమంగా అర్పించే బలిగా అది అంగీకరించ బడుతుంది. 28కానీ ఆ జంతువును, దాని తల్లిని ఒకే రోజున మీరు చంపకూడదు. పశువులకు, గొర్రెలకు యిదే నియమం వర్తిస్తుంది. 29ఏదైనా ప్రత్యేక కృతజ్ఞత అర్పణ మీరు యెహోవాకు

అర్పించాలని కోరితే, మీరు స్వేచ్ఛగా ఆ కానుకను అర్పించవచ్చును. అయితే అది దేవుణ్ణి సంతోషపెట్టే విధానంలో మీరు చేయాలి. 30మొత్తం జంతువును ఆ రోజే మీరు తినాలి. దాని మాంసంలో ఏమీ మర్నాటి ఉదయానికి మీరు మిగల్చకూడదు. నేను యెహోవాను.

31"నా ఆజ్ఞలను జ్ఞాపకం ఉంచుకోండి. వాటికి విధేయులవ్వండి. నేను యెహోవాను. 32నా పవిత్ర నామానికి గౌరవం చూపించండి. ఇశ్రాయేలు ప్రజలకు నేను ఎంతో ప్రత్యేకంగా ఉండాలి. నేను, యెహోవాను, మిమ్మల్ని నా ప్రత్యేక ప్రజలుగా చేసుకొన్నాను. 33నేనే మిమ్మల్ని ఈజిప్టునుండి తీసుకొని వచ్చాను. నేను మీకు దేవుణ్ణి అయ్యాను. నేను యెహోవాను!"

## ప్రత్యేక సెలవు రోజులు

23 మోషేతో యెహోవా చెప్పాడు: 2"ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు: యెహోవా ఏర్పాటు చేసిన పండుగలను పవిత్ర సమావేశాలుగా మీరు ప్రకటించాలి. నా ప్రత్యేక దినాలు ఏవంటే:

## సబ్బాతు

3"ఆరు రోజులు పని చేయండి. అయితే ఏడో రోజు సబ్బాతు, అది పవిత్ర సమావేశం జరిగే రోజు. మీరేమీ పని చేయకూడదు. మీ అందరి గృహాల్లోను అది యెహోవా నియమించిన సబ్బాతు.

## పస్కా

4"ఇవి యెహోవా ఏర్పాటు చేసిన పండుగ రోజులు. నిర్ణీత సమయాల్లో పవిత్ర సమావేశాల్ని గూర్చి మీరు ప్రకటించాలి. 5మొదటి నెల 14వ రోజు సాయంకాలం యెహోవా పస్కాపండుగ.

## పులియని రొట్టెల పండుగ

6"అదే నెల 15వ రోజు పులియని రొట్టెల పండుగ. పులియని రొట్టెలను ఏడు రోజులు మీరు తినాలి. 7ఈ సెలవల్లో మొదటి రోజున మీకు ఒక పవిత్ర సమావేశం ఉంటుంది. ఆ రోజున మీరు ఏ పనీ చేయకూడదు. 8ఏడు రోజులవరకు మీరు యెహోవాకు బలి అర్పించాలి. ఏడవ రోజున ఒక పవిత్ర సమావేశం జరుగుతుంది. ఆ రోజున మీరు ఏ పనీ చేయకూడదు."

## పంటకూర్చే పండుగ

9మోషేతో యెహోవా చెప్పాడు: 10"ఇశ్రాయేలు ప్రజలతో చెప్పు: నేను మీకు ఇచ్చే దేశంలో మీరు ప్రవేశిస్తారు. మీరు అక్కడ పంటలు కోస్తారు. ఆ సమయంలో మీ పంటలోని ప్రథమ పనను యాజకుని దగ్గరకు మీరు తీసుకొని రావాలి. 11ఆ పనను యాజకుడు యెహోవా ఎదుట అల్లాడిస్తాడు. అప్పుడు మీరు స్వీకరించబడతారు. యాజకుడు ఆదివారం ఉదయం ఆ పనను అల్లాడిస్తాడు.

12"మీరు పనను అల్లాడించే రోజున, ఒక సంవత్సరపు పోతు గొర్రె పిల్లను మీరు అర్పించాలి. ఆ గొర్రె పిల్లకు ఏ దోషం ఉండకూడదు. ఆ గొర్రెపిల్ల యెహోవాకు దహనబలి. 13ఒలీవ నూనెతో కలిపిన రెండు పదోవంతుల పిండిని ధాన్యార్పణగా మీరు అర్పించాలి. ముప్పావు ద్రాక్షారసమును కూడా మీరు అర్పించాలి. ఆ అర్పణలు యెహోవాకు ఇష్టమైన సువాసన. 14దేవునికి ఆ అర్పణలు చెల్లించేవరకు, కొత్త ధాన్యంగాని, ఫలాలుగాని, లేక కొత్త ధాన్యంతో చేయబడిన రొట్టెగాని మీరు తినకూడదు. మీరు ఎక్కడ నివసించినా సరే మీ తరాలన్నింటికీ ఈ ఆజ్ఞ కొనసాగుతుంది.

## పెంతెకొస్తు పండుగ

15"ఆ ఆదివారం మొదలు కొని (నైవేద్యం కోసం మీరు పన తీసుకొని వచ్చిన రోజునుండి) ఏడు వారాలు లెక్కించండి. 16ఏడవ వారం తర్వాత ఆదివారం నాడు (అంటే యాభై రోజుల తర్వాత) యెహోవాకు మీరు కొత్త ధాన్యార్పణను తీసుకొని రావాలి. 17ఆ రోజున మీ యిండ్ల నుండి రెండు రొట్టెలు తీసుకొని రండి. ఆ రొట్టె నైవేద్యంకోసం. 4 పావులు గోధుమ పిండిలో, పులిసిన పదార్థం ఉపయోగించి ఆ రొట్టెలు తయారు చేయాలి. అది మీ ప్రథమ పంటల్లోనుంచి మీరు యెహోవాకు అర్పించే కానుక.

18"ప్రజలు ధాన్యార్పణతో బాటు ఒక దూడను ఒక పొట్టేలును, ఏడాది పోతును, ఏడు గొర్రెపిల్లలను అర్పించాలి. వాటిలో ఏ దోషమూ ఉండకూడదు. అవి యెహోవాకు దహనబలి అర్పణ. అవి హోమంగా అర్పించబడి, యెహోవాకు కమ్మని సువాసనగా ఉంటాయి. 19పాప పరిహారార్థ బలిగా ఒక మేకపోతును, సమాధాన బలిగా రెండు ఏడాది మగ గొర్రెపిల్లలను మీరు అర్పించాలి.

20"నైవేద్యంగా ప్రథమ ఫలంలోని రొట్టెతోపాటు వాటిని, రెండు గొర్రెపిల్లలను యెహోవా ఎదుట యాజకుడు అల్లాడించాలి. అవి యెహోవాకు పవిత్రమైనది. అవి యాజకునికి చెందుతాయి. 21అదే రోజున మీరు ఒక పవిత్ర సమావేశాన్ని ఏర్పాటు చేయాలి. ఈ రోజులలో మీరేమి పని చేయకూడదు. మీ గృహాలన్నింటిలో ఈ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది. 22మరియు, మీరు మీ పొలంలో పంట కోసేటప్పుడు పొలం అంచులమట్టుకు కోసి వేయవద్దు. నేలమీద పడే కంకులు ఏరుకోవద్దు. పేదవారికోసమూ, మీ దేశం గుండా ప్రయాణించే విదేశీయుల కోసమూ వాటిని విడిచిపెట్టండి. నేను యెహోవాను, మీ దేవుణ్ణి!"

### బూరల పండుగ

23మరల మోషేతో యెహోవా చెప్పాడు: 24“ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు ఏడవ నెల మొదటి రోజున
మీకు ప్రత్యేకమైన విశ్రాంతి రోజు ఉండాలి. అప్పుడు
ఒక పవిత్ర సమావేశం ఉంటుంది. ప్రత్యేక జ్ఞాపకార్థ
సమయంగా మీరు బూర ఊదాలి. 25ఆ రోజున మీరు
ఏ పనీ చేయకూడదు. మీరు యెహోవాకు హోమ
అర్పణలు అర్పించాలి”

### ప్రాయశ్చిత్త దినం

26మోషేతో యెహోవా చెప్పాడు, 27“ఏడవ నెల
పదవరోజు ప్రాయశ్చిత్త దినంగా ఉంటుంది. ఒక పవిత్ర
సమావేశం ఉంటుంది. మీరు భోజనం చేయకూడదు,
యెహోవాకు మీరు హోమ అర్పణ తీసుకొని రావాలి.
28ఆ రోజున మీరు ఏ పనీ చేయకూడదు. ఎందు
చేతనంటే అది ప్రాయశ్చిత్త దినం. ఆ రోజు, యాజ
కులు యెహోవా ఎదుటికి వెళ్లి, మిమ్మల్ని పవిత్రం
చేసే ఆచారక్రమాన్ని జరిగిస్తారు.

29“ఆ రోజున భోజనం చేయకుండా ఉండేందుకు
ఎవరైనా తిరస్కరిస్తే, ఆ వ్యక్తిని తన ప్రజలనుండి
వేరు చేయాలి. 30ఆ రోజున ఎవరైనా పని చేస్తే ఆ
వ్యక్తిని తన ప్రజల్లోనుంచి నేను నాశనం చేస్తాను.
31మీరు అసలు ఏమీ పని చేయాకూడదు. మీరు ఎక్కడ
నివసించినా ఈ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది.
32అది మీకు ఒక ప్రత్యేక విశ్రాంతి దినం. మీరు
భోజనం చేయకూడదు. నెలలో తొమ్మిదవ రోజు
తర్వాత సాయంకాలంనుండి ఈ ప్రత్యేక విశ్రాంతి
దినం మీరు ప్రారంభించాలి. ఆ సాయంత్రంనుండి
మర్నాటి సాయంకాలం వరకు ఈ ప్రత్యేక విశ్రాంతి
దినం కొనసాగుతుంది.”

### పర్ణశాలల పండుగ

33మరల మోషేతో యెహోవా చెప్పాడు, 34“ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: ఏడవ నెల పదిహేనోవ
తేదీన పర్ణశాలల పండుగ. యెహోవాకు ఈ పండుగ
ఏడు రోజులపాటు కొనసాగుతుంది. 35మొదటి రోజున
పవిత్ర సమావేశం ఉంటుంది. మీరు ఏ పనీ చేయ
కూడదు. 36ఏడు రోజులు యెహోవాకు హోమార్ప
ణలు మీరు అర్పించాలి. ఎనిమిదో రోజు మీకు మరో
పవిత్ర సమావేశం జరుగుతుంది. మీరు యెహోవాకు
హోమార్పణలు అర్పించాలి. ఇది పవిత్ర సమావేశంగా
ఉంటుంది. మీరు ఏ పనీ చేయకూడదు.

37“అవి యెహోవా ప్రత్యేక పండుగలు. ఆ పండు
గల్లో పవిత్ర సమావేశాలు జరుగుతాయి. అర్పణలు,
బలి అర్పణలు, పానార్పణలు, దహనబలులు, ధాన్యా
ర్పణలు మీరు యెహోవాకు తీసుకొని రావాల్సిన
హోమార్పణలు. ఆ కానుకలు తగిన సమయంలో
మీరు తీసుకొని రావాలి. 38యెహోవా సబ్బాతు
రోజులు జ్ఞాపకం చేసుకోవటంతోబాటు ఈ పండు
గలన్నీ మీరు ఆచరించాలి. యెహోవాకు మీరు
అర్పించే మీ ఇతర అర్పణలుగాక ఈ కానుకలు అర్పిం
చాలి. మీ ప్రత్యేక వాగ్దానాల చెల్లింపుగా మీరు అర్పించే
అర్పణలు గాక వీటిని మీరు అర్పించాలి. మీరు యెహో
వాకు ఇవ్వాలనుకొన్న ప్రత్యేక అర్పణలుకాక ఇవి మీరు
ఇవ్వాలి.

39“ఏడవ నెల పదిహేనోవ రోజున, దేశంలో మీరు
పంటలు కూర్చుకొన్నప్పుడు, యెహోవా పండుగను
ఏడు రోజుల పాటు మీరు ఆచరించాలి. మొదటి
రోజున, ఏడో రోజున మీరు విశ్రాంతి తీసుకోవాలి.
40మొదటి రోజు పండ్ల చెట్లనుండి మంచి పండ్లు
మీరు కూర్చాలి. ఈత మట్టలు, గొంజి చెట్ల కొమ్మలు,
కాలువల దగ్గరి నిరవంజి చెట్లు మీరు తీసుకోవాలి. మీ
యెహోవా దేవుని ఎదుట ఏడు రోజులు మీరు పండుగ
ఆచరించాలి. 41ప్రతి సంవత్సరం ఏడు రోజులు
యెహోవాకు పండుగగా మీరు దీనిని ఆచరించాలి.
ఈ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది. ఏడవ నెలలో
మీరు ఈ పండుగను ఆచరించాలి. 42ఏడు రోజులు
తాత్కాలిక గుడారాల్లో మీరు నివసించాలి. ఇశ్రాయేలీ
యులలో పుట్టిన వాళ్ళంతా ఆ పర్ణశాలల్లోనే నివసిం
చాలి. 43ఇశ్రాయేలు ప్రజలను ఈజిప్టునుండి నేను
బయటకు తీసుకొని వచ్చినప్పుడు, తాత్కాలిక గుడా
రాల్లో నేను వారిని నివసింపజేసానని మీ సంతానం
అంతా తెలుసుకోవాలి. నేను మీ దేవుడనైన
యెహోవాను!”

44కనుక యెహోవా పండుగ రోజులు అన్నింటిని
గూర్చి ఇశ్రాయేలు ప్రజలందరితో మోషే చెప్పాడు.

### దీపస్తంభం, పవిత్ర రొట్టెలు

24 మోషేతో యెహోవా చెప్పాడు: 2“గానుగ
ఆడిన ఒలీవలనుండి పవిత్ర తైలం తీసుకొని
రమ్మని ఇశ్రాయేలు ప్రజలకు ఆజ్ఞాపించు. ఆ నూనె
దీపాల కోసం. ఆ దీపాలు ఆరిపోకుండా వెలగాలి.
3సన్నిధి గుడారంలో యెహోవా ఎదుట సాయంత్రం
నుండి ఉదయం వరకు దీపం వెలిగేటట్లు అహరోను
చూసుకొంటాడు. ఇది సాక్ష్యపు తెర ఎదుట ఉంటుంది.
అతి పవిత్రస్థలంలో ఈ తెర వెనుకనే ఒడంబడిక
పెట్టె ఉంటుంది. ఈ ఆజ్ఞ శాశ్వతంగా కొనసాగుతుంది.
4యెహోవా ఎదుట స్వచ్ఛమైన బంగారపు దీపస్తంభం
మీద దీపాలను అహరోను ఎల్లప్పుడూ వెలగనిస్తూ
ఉండాలి.” 5“మంచి రకం గోధుమ పిండి తీసుకొని,
దానితో పన్నెండు రొట్టెలు చేయాలి. ఒక్కో రొట్టెకు
నాలుగు పావుల గోధుమపిండి ఉపయోగించాలి.

[6]యెహోవా ఎదుట బంగారు బల్లమీద ఆ రొట్టెలను
రెండు వరుస లుగా పెట్టాలి. ఒక్కో వరుసలో ఆరు
రొట్టెలు ఉండాలి. [7]ఒక్కో వరుసమీద స్వచ్ఛమైన
సాంబ్రాణి వేయాలి. ఇది యెహోవాకు అర్పించబడిన
హోమాన్ని ఆయనను జ్ఞాపకం చేసుకొనేట్టు
చేస్తుంది. [8]ప్రతి సబ్బాతు నాడు అహరోను ఈ రొట్టె
లను యెహోవా ఎదుట క్రమంలో ఉంచాలి. శాశ్వ
తంగా ఇలా చేయాలి. ఇశ్రాయేలు ప్రజలతో ఈ
ఒడంబడిక ఎప్పటికీ కొనసాగుతుంది. [9]ఆ రొట్టె
అహరోనుకు, అతని కుమారులకు చెందుతుంది. వారు
ఈ రొట్టెను పరిశుద్ధ స్థలంలో తినాలి. ఎందుచేతనంటే
యెహోవాకు హోమంగా అర్పించబడిన అర్పణల్లో
అది ఒకటి. ఆ రొట్టె ఎప్పటికీ అహరోను భాగం
అవుతుంది."

### దేవుణ్ణి శపించిన మనిషి

[10]ఒక ఇశ్రాయేలు స్త్రీకి కుమారుడు ఒకడు
ఉన్నాడు. వాని తండ్రి ఈజిప్టువాడు. ఈ ఇశ్రాయేలు
స్త్రీ కుమారుడు ఇశ్రాయేలువాడే. అతడు ఇశ్రాయేలు
ప్రజల మధ్య తిరుగుతూ, బసలో పోరాడటం మొదలు
పెట్టాడు. [11]ఆ ఇశ్రాయేలు స్త్రీ కుమారుడు యెహోవా
నామాన్ని శపిస్తూ, దూషణ మాటలు మాట్లాడటం
మెదలు పెట్టాడు కనుక ప్రజలు అతణ్ణి మోషే దగ్గరకు
తీసుకొని వచ్చారు. (అతని తల్లి పేరు షెలోమీతు,
దాను కుటుంబ వంశానికి చెందిన దిబ్రీ కుమార్తె)
[12]ప్రజలు వాణ్ణి బందీగా పట్టి, యెహోవా ఆజ్ఞ వివరంగా
తెలియటం కోసం కనిపెట్టారు.

[13]అప్పుడు మోషేతో యెహోవా చెప్పాడు: [14]"ఆ
శపించినవాణ్ణి బసవెలుపలికి తీసుకొని రండి. తర్వాత
అతడు శపిస్తూండగా విన్న ప్రజలందర్నీ సమావేశ
పరచండి. వాళ్లు అతని తలమీద చేతులు వేయాలి.
తర్వాత ప్రజలంతా వాణ్ణి రాళ్లతో కొట్టి చంపాలి.
[15]ఇశ్రాయేలు ప్రజలతో నీవు చెప్పు: ఎవడైనా తన
దేవుణ్ణి శపిస్తే వాడు ఈ విధంగా శిక్షించబడాలి.
[16]యెహోవా నామానికి వ్యతిరేకంగా ఎవరైనా దూషణ
చేస్తే, వాణ్ణి చంపివేయాలి, ప్రజలంతా వాణ్ణి రాళ్ళతో
కొట్టాలి. ఇశ్రాయేలీయులలో పుట్టిన వాడిలా గానే,
విదేశీయులు కూడా శిక్షించబడాలి. ఏ వ్యక్తిగాని
యెహోవా నామాన్ని శపిస్తే ఆ వ్యక్తిని చంపివేయాలి."

[17]"ఇంకా ఒకడు మరొక వ్యక్తిని గనుక చంపేస్తే,
అలాంటివాణ్ణి చంపివేయాలి. [18]మరొకరికి చెందిన
జంతువును చంపినవాడు ఆ జంతువుకు బదులుగా
మరొక జంతువును ఇవ్వాలి."

[19]"ఒకడు తన పొరుగువానికి గాయం చేస్తే, వానికి
కూడా అలానే చేయాలి. [20]విరిగిన ఎముకకు విరిగిన
ఎముక, కంటికి కన్ను, పంటికి పన్ను. ఒకనికి ఎలాంటి
దెబ్బలు తగిలితే, వాటి కారకునికి గూడా అలాంటి
దెబ్బలే. [21]కనుక ఒకని జంతువును చంపినవాడు దాని
స్థానంలో మరో జంతువును ఇవ్వాలి. అయితే మరొ
కడ్ని చంపిన వాణ్ణి మాత్రం చంపివేయాలి."

[22]"మీకు ఒకే రకం న్యాయం ఉంటుంది. మీ స్వంత
దేశంలో ఉండే విదేశీయునికి కూడా అదే న్యాయం
ఉంటుంది. ఎందుచేతనంటే నేను మీ దేవుడైన
యెహోవాను గనుక."

[23]అప్పుడు మోషే ఇశ్రాయేలు ప్రజలతో మాట్లా
డగా, శపించిన వ్యక్తిని బసవెలుపలకు వారు తీసుకొని
వచ్చారు. అప్పుడు వాళ్లు రాళ్లతో కొట్టి అతణ్ణి చంపి
వేసారు. కనుక మోషేకు యెహోవా ఆజ్ఞాపించినట్టే
ఇశ్రాయేలు ప్రజలు చేసారు.

### భూమికి విశ్రాంతి సమయం

25 సీనాయి కొండ దగ్గర యెహోవా మోషేతో
మాట్లాడాడు. యెహోవా చెప్పాడు, [2]"ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: నేను మీకు ఇవ్వబోతున్న
దేశంలో మీరు ప్రవేశిస్తారు. ఆ సమయంలో మీరు
భూమికి ఒక ప్రత్యేక విశ్రాంతి సమయాన్ని కేటాయిం
చాలి. ఇది యెహోవాను ఘనపర్చేందుకు ఒక ప్రత్యేక
సమయంగా ఉంటుంది. [3]ఆరు సంవత్సరాలు మీరు
మీ భూమిలో విత్తనాలు చల్లుకోవాలి. మీ ద్రాక్షా తోట
ల్లోని తీగెలను ఆరు సంవత్సరాలు మీరు కత్తిరించు
కొంటూ, దాని ఫలాన్ని కూర్చుకోవాలి. [4]అయితే
ఏడో సంవత్సరం మీరు భూమిని విశ్రాంతి తీసుకోని
వ్వాలి. ఇది యెహోవాను ఘనపర్చేందుకు ప్రత్యేక
విశ్రాంతి సమయంగా ఉంటుంది. మీరు మీ పొలాల్లో
విత్తనాలు చల్లకూడదు లేక మీ ద్రాక్షాతోటల్లో తీగలను
కత్తిరించకూడదు. [5]మీ పంట కోత అయిపోయిన
తర్వాత వాటంతట అవే పెరిగే పంటను మీరు కోయ
కూడదు. కత్తిరించ బడని ద్రాక్షాతీగెలనుండి ద్రాక్షా
పండ్లను మీరు కూర్చగూడదు. భూమికి అది విశ్రాంతి
సంవత్సరంగా ఉంటుంది.

[6]"భూమికి ఒక సంవత్సరం విశ్రాంతి సంవత్సరంగా
ఉంటుంది గాని మీకు మాత్రం యింకా సరిపడినంత
ఆహారం ఉంటుంది. మీ ఆడ, మగ సేవకులందరికీ
సరిపడినంత ఆహారం ఉంటుంది. మీ కూలి వాళ్లకు,
మీ దేశంలో నివసించే విదేశీయులకు ఆహారం
ఉంటుంది. [7]మీ పశువులు, ఇతర జంతువులు తినేం
దుకు సరిపడినంత ఆహారం ఉంటుంది.

### బూరధ్వని చేసే మహోత్సవ కాలము

[8]"ఏడేసి సంవత్సరాల సముదాయంగల ఏడు సంవ
త్సరాలనుకూడ మీరు లెక్కించాలి. అది 49 సంవత్స
రాలు అవుతుంది. ఆ సమయంలో దేశంలో ఏడు
సంవత్సరాలు విశ్రాంతి ఉంటుంది. [9]ప్రాయశ్చిత్తం
రోజున పొట్టేలు కొమ్మును మీరు ఊదాలి. అది ఏడో

నెల పదోరోజు. పొట్టేలు కొమ్మును మీరు దేశ వ్యాప్తంగా
ఊదాలి. 10 50వ సంవత్సరాన్ని మీరు ఒక ప్రత్యేక
సంవత్సరంగా చేయాలి. మీ దేశంలో నివసించే మను
ష్యులందరికీ మీరు స్వతంత్రం ప్రకటించాలి. ఇది బూర
ధ్వని చేసే మహోత్సవ కాలం అని పిలువబడుతుంది.
మీలో ప్రతి ఒక్కరూ తన స్వంత ఆస్తిని తిరిగి పొందాలి.
మరియు మీలో ప్రతి ఒక్కరూ తన కుటుంబానికి
తిరిగి వెళ్లాలి. 11 50వ సంవత్సరం మీకు ప్రత్యేక సంబ
రంగా వుంటుంది. ఆ సంవత్సరములో విత్తనాలు చల్ల
వద్దు. వాటంతట అవే మొలిచే మొక్కల్ని కోయ
వద్దు. కత్తిరించబడని ద్రాక్షావల్లులనుండి ద్రాక్షపండ్లు
కూర్చవద్దు. 12 అది బూరధ్వని చేసే మహోత్సవ
కాలం. అది మీకు పవిత్ర సమయంగా ఉంటుంది.
పొలంనుండి వచ్చే పంటలను మీరు తినాలి. 13 బూర
ధ్వని చేసే మహోత్సవ కాలంలో ప్రతి వ్యక్తీ తన
స్వంత ఆస్తిని తిరిగి పొందాలి."
14 "నీ పొరుగువానికి నీ భూమిని అమ్మినప్పుడు
నీవు అతనికి మోసం చేయవద్దు. మరియు నీవు అతని
వద్ద భూమిని కొన్నప్పుడు అతడ్ని నిన్ను మోసం
చేయనీయకు. 15 నీ పొరుగువాని భూమిని నీవు కొనా
లనుకొన్నప్పుడు, గడచిన బూరధ్వని చేసే మహో
త్సవ కాలంనుండి ఎన్ని సంవత్సరాలు అయిందో లెక్క
చూచి, దాన్ని బట్టి ధర నిర్ణయం చేయాలి. ఒకవేళ
నీవు భూమి అమ్మితే, పంటలు కోసిన సంవత్సరాలు
లెక్కించి, ఆ లెక్క ప్రకారం ధర నిర్ణయించాలి. 16 చాలా
సంవత్సరాలు ఉంటే, ఖరీదు ఎక్కువ ఉంటుంది. సంవ
త్సరాలు తక్కువ ఉంటే ఖరీదు తగ్గించాలి. ఎందు
చేతనంటే నీ పొరుగువాడు నిజానికి కొన్ని పంటలు
మాత్రమే నీకు అమ్ముతున్నాడు. వచ్చే ఉత్సవంలో
ఆ భూమి తిరిగి అతని కుటుంబ పరం అవుతుంది.
17 మీరు ఒకరికి ఒకరు మోసం చేయకూడదు. మీ
దేవుణ్ణి మీరు ఘనపర్చాలి. నేను యెహోవాను మీ
దేవుణ్ణి."
18 "నా ఆజ్ఞలు, నియమాలు జ్ఞాపకం ఉంచుకోండి.
వాటికి విధేయులుగా ఉండండి. అప్పుడు మీరు మీ
దేశంలో క్షేమంగా ఉంటారు. 19 మరియు భూమి మీకు
మంచి పంటను ఇస్తుంది. అప్పుడు మీకు ఆహారం
సమృద్ధిగా ఉంటుంది. మీరు దేశంలో క్షేమంగా
ఉంటారు.
20 "కానీ ఒకవేళ మీరు, 'మేము విత్తనాలు చల్లి,
పంట కూర్చుకొనకపోతే ఏడో సంవత్సరం తినేందుకు
మాకు ఏమీ ఉండదు అనవచ్చు.' 21 చింతపడకండి.
ఆరవ సంవత్సరంలో నా ఆశీర్వాదాలు మీకు లభించేట
ట్టుగా నేను ఆజ్ఞాపిస్తాను. భూమి మూడు సంవత్సరాల
పాటు పంట ఇస్తూనే ఉంటుంది. 22 ఎనిమిదో సంవత్స
రంలో మీరు నాట్లు వేసినప్పుడు, మీరు యింకా
పాత పంటనే తింటూ ఉంటారు. ఎనిమిదో సంవత్స
రంలో మీరు నాటిన పంట చేతికి అందేవరకు, అంటే
తొమ్మిదో సంవత్సరం వరకు పాత పంటనే తింటూ
ఉంటారు.

### ఆస్తి నియమాలు

23 "వాస్తవానికి భూమి నాది. అందుచేత మీరు దాన్ని
శాశ్వతంగా అమ్మజాలరు. మీరు కేవలం నాతో, నా
భూమి మీద నివసిస్తున్న యాత్రికులు, విదేశీయులు.
24 మనుష్యులు వారి భూమిని అమ్మివేయ వచ్చును
కానీ ఎల్లప్పుడూ ఆ భూమి తిరిగి ఆ కుటుంబా నిదే
అవుతుంది. 25 మీ దేశంలో ఒక వ్యక్తి చాల నిరుపేద
కావచ్చును. అతడు తన ఆస్తి అమ్ముకోవాల్సినంత
పేదవాడై పోవచ్చును. కనుక అతని రక్తసంబంధీకులు
వచ్చి తమ బంధువుకోసం ఆ ఆస్తిని కొనాలి. 26 తన
భూమిని తిరిగి తనకోసం కొనేందుకు ఒకనికి రక్తసం
బంధి ఎవరూ లేక పోవచ్చును. అయితే తన భూమిని
తనకోసం కొనేందుకు కావలసినంత డబ్బు సంపాదిం
చవచ్చు. 27 అప్పుడు అతడు భూమి అమ్మివేసి ఎన్ని
సంవత్సరాలు అయిందో లెక్క పెట్టాలి. ఆ లెక్కను
ఉపయోగించి ఆ భూమి ధర నిర్ణయం చేయాలి.
అప్పుడు అతడు ఆ భూమిని తిరిగి కొనుక్కోవాలి.
ఆ భూమి మరల అతని ఆస్తి అవుతుంది. 28 అయితే
ఈ వ్యక్తి ఆ భూమిని తిరిగి తనకోసం కొనేందుకు
సరిపడినంత డబ్బు అతని వద్ద లేకపోతే, అతడు అమ్మి
వేసిన భూమి, వచ్చే బూరధ్వని చేసే మహోత్సవ
కాలం వరకు దానిని కొన్న వారి స్వాధీనంలోనే
ఉంటుంది. అప్పుడు బూరధ్వని చేసే మహోత్సవ
సమయంలో ఆ భూమి దాని మొదటి స్వంతదారుల
పరం అవుతుంది. కనుక ఆ ఆస్తి తిరిగి దాని అసలైన
కుటుంబానికి చెందుతుంది.
29 "ప్రాకారంగల పట్టణంలో ఒకడు తన ఇల్లు
అమ్మినట్టయితే, ఆ తర్వాత ఒక పూర్తి సంవత్సరం
పాటు ఆ ఇల్లును తిరిగి పొందే హక్కు ఆ వ్యక్తికి
ఉంటుంది. ఇంటిని తిరిగి పొందే హక్కు ఒక సంవత్స
రంవరకు కొనసాగుతుంది.
30 అయితే ఒక సంవత్సరం పూర్తయ్యేలోపల ఆ
ఇంటి స్వంతదారుడు కొనక పోయినట్టయితే,
అప్పుడు ప్రాకారంగల పట్టణంలోని ఆ ఇల్లు, దానిని
కొన్నవానికి, అతని సంతానానికి స్వంతం అవుతుంది.
బూరధ్వని చేసే మహోత్సవ సమయంలో ఆ యిల్లు
తిరిగి దాని ప్రథమ స్వంత దారుని వశం కాదు.
31 ప్రాకారాలు లేని పట్టణాలు బహిరంగ పొలాల్లో గుర్తించ
బడుతాయి. కనుక అలాంటి పట్టణాల్లో నిర్మించబడిన
ఇళ్లు బూరధ్వని చేసే మహోత్సవ సమయంలో తిరిగి
వాటి ప్రథమ స్వంత దారులపరం అవుతాయి.
32 "అయితే లేవీయుల పట్టణాల విషయం. లేవీ
యులు వారికి చెందిన పట్టణాల్లోని వారి ఇళ్లను

ఎప్పుడైనా సరే తిరిగి కొనవచ్చును. 33ఒక వ్యక్తి ఒక
లేవీయుని దగ్గర ఒక ఇల్లు కొంటే, లేవీయుల
పట్టణంలోని ఆ ఇల్లు బూరధ్వని చేసే మహోత్సవ
కాలంలో తిరిగి లేవీయులకే చెందుతుంది. ఎందుచేత
నంటే లేవీయుల పట్టణాలు లేవీ వంశపు ప్రజలకు
చెందినవి. ఆ పట్టణాలను ఇశ్రాయేలు ప్రజలే లేవీయు
లకు ఇచ్చారు. 34అలానే, లేవీయుల పట్టణాల చుట్టు
ప్రక్కల పొలాలు, పచ్చికబయళ్లు అమ్మేందుకు వీల్లేదు.
ఆ పొలాలు శాశ్వతంగా లేవీయులకే చెందుతాయి.

### బానిసల స్వంతదారులకు నియమాలు

35"ఒకవేళ మీ దేశ ప్రజల్లో ఒకడు పోషణ సాగనంత
పేదరికంలో పడవచ్చు. మీరు అతణ్ణి అతిథిలా మీతో
జీవింపనియ్యాలి. 36మీరు అతనికి అప్పుగా యిచ్చే
మొత్తంమీద వడ్డీ కట్టవద్దు. ఆ సోదరుణ్ణి నీతో నివసింప
నిచ్చి, నీ దేవుణ్ణి ఘనపరచు. 37అతనికి వడ్డీకి అప్పు
ఇవ్వవద్దు. అతడు భోజనం చేసే ఆహారం మీద లాభాలు
గడించేందుకు ప్రయత్నించవద్దు. 38నేను మీ దేవుడైన
యెహోవాను. కనాను దేశాన్ని మీకు ఇచ్చి, మీకు
దేవుణ్ణిగా ఉండేందుకు నేనే మిమ్మల్ని ఈజిప్టు దేశం
నుండి బయటకు తీసుకునివచ్చాను.

39"ఒకవేళ నీ సోదరుల్లో ఒకడు మరీ దరిద్రుడై,
నీకు బానిసగా అమ్ముడుపోవచ్చును. నీవు అతణ్ణి ఒక
బానిసలా పని చేయించకూడదు. 40అతడు ఒక కిరాయి
పనివానిలా, అతిథిలా బూరధ్వని చేసే మహోత్సవ
కాలం వరకు నీతో ఉంటాడు. 41తర్వాత అతడు
నిన్ను విడిచి పెట్టవచ్చును. అతడు తన పిల్లలను
తీసుకొని తిరిగి తన కుటుంబంలోనికి వెళ్ళిపోవ
చ్చును. అతడు తన పూర్వీకుల ఆస్తులను తిరిగి
పొందవచ్చును. 42ఎందుచేతనంటే, వాళ్లు నా సేవ
కులు, ఈజిప్టు బానిసత్వంలో నుండి నేను వాళ్లను
తీసుకొనివచ్చాను. వాళ్లు మరల బానిసలు కాకూడదు.
43ఇలాంటి వ్యక్తిని నీవు కఠినంగా పాలించగూడదు. నీ
దేవుణ్ణి నీవు ఘనపర్చాలి." 44"నీ స్త్రీ, పురుష బానిసల
విషయం: మీ చుట్టు పక్కల దేశాలనుండి ఆడ, మగ
బానిసలను మీరు తెచ్చుకోవచ్చును."

45మరియు, మీ దేశంలో నివసిస్తున్న విదేశీయుల
పిల్లలు వస్తానంటే వారిని కూడ మీరు బానిసలుగా
తీసుకోవచ్చును. ఆ పిల్ల బానిసలు మీకు చెందుతారు.
46ఈ విదేశీ బానిసలు మీ పిల్లల వశం అయ్యేటట్టు,
మీ మరణానంతరం మీరు వారిని మీ పిల్లలకు అప్పగించ
వచ్చును. వాళ్లు శాశ్వతంగా మీకు బానిసలు. ఈ విదేశీ
యుల్ని మీరు బానిసలుగా చేసుకోవచ్చును. కానీ మీ
స్వంత సోదరులైన ఇశ్రాయేలు ప్రజలను మాత్రం
కఠినంగా పాలించగూడదు.'

47"ఒకవేళ ఒక విదేశీయుడు లేక అతిథి మీ మధ్య
ధనికుడు కావచ్చు, ఒకవేళ మీ దేశంలో ఒకడు
దరిద్రుడై మీ మధ్య నివసిస్తున్న ఒక విదేశీయునికి
బానిసగా లేక అతని కుటుంబంలో సభ్యునిగా అమ్ముడు
పోయాడనుకోండి. 48ఆ వ్యక్తి తిరిగి కొనబడి, స్వంతం
త్రుడు అయ్యేందుకు అతనికి హక్కు ఉంటుంది. అతని
సోదరుల్లో ఒకరు అతణ్ణి తిరిగి కొనవచ్చును. 49అతని
పినతండ్రిగాని, పిన తండ్రి కుమారుడు గాని అతణ్ణి
కొనవచ్చును. లేక అతని వంశంలో అతని రక్తసంబంధి
ఎవరైనా అతణ్ణి కొనవచ్చును. లేక ఒకవేళ ఆ వ్యక్తి
తానే సరిపడినంత ధనం సంపాయించు కొంటే, తానే
డబ్బు చెల్లించి మరల స్వతంత్రుడు కావచ్చును.

50"వెల మీరెలా నిర్ణయిస్తారు? అతడు విదేశీయు
నికి తనను తాను అమ్ముకొన్న సమయంనుండి వచ్చే
బూరధ్వని చేసే మహోత్సవ కాలంవరకు ఎన్ని సంవ
త్సరాలో మీరు లెక్కగట్టాలి. వెల నిర్ణయం చేయటానికి
ఆ లెక్కను ఉపయోగించాలి. ఎందుచేతనంటే అవతలి
వ్యక్తి యితణ్ణి వాస్తవానికి కొన్ని సంవత్సరాలకోసమే
'కిరాయికి' పెట్టుకొన్నాడు. 51బూరధ్వని చేసే మహో
త్సవ కాలానికి ఇంకా చాల సంవత్సరాలు కావాల్సిఉంటే,
ఆ వ్యక్తి వెలలో అధిక భాగం తిరిగి చెల్లించాలి. అదంతా
సంవత్సరాల సంఖ్యమీద ఆధారపడి ఉంటుంది.
52ఉత్సవ సంవత్సరానికి మరికొన్ని యేండ్లు మాత్రమే
మిగిలి ఉంటే, అప్పుడు ఆ వ్యక్తి అసలు వెలలో కొద్ది
మాత్రమే చెల్లించాలి. 53అయితే ఆ వ్యక్తి కిరాయి పని
వాడిలాగానే ఆ విదేశీయుని దగ్గర ప్రతి సంవత్సరం
నివసిస్తాడు. ఆ విదేశీయుడు ఆ వ్యక్తి మీద కఠినంగా
ప్రవర్తించకుండును గాక.

54"ఆ వ్యక్తిని ఎవరూ కొనకపోయినప్పటికి, అతడు
స్వతంత్రుడు అవుతాడు. బూరధ్వని చేసే మహోత్సవ
కాలంలో అతడు, అతని పిల్లలు స్వతంత్రులవుతారు.
55ఎందుచేతనంటే, ఇశ్రాయేలు ప్రజలు నా సేవకులు.
వాళ్లు నా సేవకులు. ఈజిప్టు బానిసత్వం నుండి నేను
వాళ్లను తీసుకొని వచ్చాను. నేను మీ దేవుడైన
యెహోవాను!

### దేవుని పట్ల విధేయులగు వారికి బహుమానాలు

26 "మీకోసం మీరు విగ్రహాల్ని చేసుకోవద్దు.
విగ్రహాల్ని, జ్ఞాపక చిహ్నాల్ని నిలబెట్టవద్దు.
మీరు మొక్కేందుకు మీ దేశంలో రాతి విగ్రహాలను
నిలబెట్టవద్దు. ఎందుచేతనంటే, నేను మీ దేవుణ్ణి,
యెహోవాను.

2"నా ప్రత్యేక విశ్రాంతి రోజుల్ని జ్ఞాపకం ఉంచు
కొని, నా పవిత్ర స్థలాన్ని గౌరవించండి. నేను
యెహోవాను.

3"నా ఆజ్ఞలు, నియమాలు జ్ఞాపకం ఉంచుకోండి.
వాటికి విధేయులు అవ్వండి. 4వాటిని మీరు జరిగిస్తే,
నేను మీకు సకాలంలో వర్షాలు కురిపిస్తాను. భూమి
పంటను యిస్తుంది, పొలంలో చెట్లు వాటి ఫలాలను

ఇస్తాయి. 5ద్రాక్షాపండ్ల కోతకాలం వచ్చేంతవరకు మీరు
గానుగ పట్టడం కొనసాగుతుంది, మీరు మళ్ళీ మొక్కలు
నాటడం మొదలు పెట్టేంతవరకు మీరు ద్రాక్షాపండ్లు
కూర్చుకోవటం కొనసాగుతుంది. అప్పుడు మీరు
తినేందుకు సమృద్ధిగా ఉంటుంది. మరియు మీరు మీ
దేశంలో క్షేమంగా ఉంటారు. 6నేను మీ దేశానికి శాంతిని
ప్రసాదిస్తున్నాను. మీరు ప్రశాంతంగా పండుకొంటారు.
ఎవరూ మిమ్మల్ని భయపెట్టేందుకు రారు. హానికర
మైన జంతువులను నేను మీ దేశానికి దూరంగా ఉంచు
తాను. మరియు సైన్యాలు మీ దేశం గుండా వెళ్లజాలవు.
7“మీరు మీ శత్రువులను తరిమి, వారిని ఓడిస్తారు.
మీరు మీ ఖడ్గంతో వారిని చంపుతారు. 8మీలో
అయిదుగురు 100 మందిని తరుముతారు, మీలో 100
మంది 10,000 మందిని తరుముతారు. మీరు మీ శత్రువు
లను ఓడించి, మీ ఖడ్గంతో వారిని చంపేస్తారు.
9“అప్పుడు నేను మీ వైపు తిరుగుతాను. మీకు
అధికంగా సంతానం కలుగనిస్తాను. మీతో నా ఒడం
బడికను నేను నిలబెడతాను. 10ఒక సంవత్సరం కంటె
ఎక్కువ కాలానికి సరిపోయేంత పంట మీకు ఉంటుంది.
మీరు కొత్త పంట కోసుకొంటారు. అయితే కొత్త
పంట నిల్వ చేయటానికి స్థలం కావాలి గనుక పాత
పంటను పారవేయాల్సి ఉంటుంది. 11నేను నా పవిత్ర
గుడారాన్ని కూడ మీ మధ్య ఉంచుతాను. మీనుండి
నేను తిరిగిపోను. 12నేను మీతో నడుస్తాను, మీ దేవునిగా
ఉంటాను. మీరు నా ప్రజలుగా ఉంటారు. 13నేను
యెహోవాను, మీ దేవుణ్ణి. మీరు ఆ ఈజిప్టులో
బానిసలుగా ఉన్నారుగాని నేను మిమ్మల్ని ఈజిప్టు
నుండి బయటకు తీసుకొని వచ్చాను. బానిసలుగా
భారమైన బరువులు మోసి మీరు చాలా వంగిపోయారు.
అయితే మీ భుజాలమీద కాడిని నేను విరుగగొట్టేసాను.
నేను మిమ్మల్ని మరల తల ఎత్తుకొని తిరిగేటట్టు
చేస్తాను!

## అవిధేయతకు దేవుని శిక్ష

14“అయితే మీరు నాకు విధేయులు కాకుండా,
నా ఆజ్ఞలన్నింటినీ పాటించకుండా ఉంటే, అప్పుడు
మీకు ఈ కీడులన్నీ జరుగుతాయి. 15నా ఆజ్ఞలు,
నియమాలు పాటించడానికి మీరు నిరాకరిస్తే, మీరు
నా ఒడంబడికను ఉల్లంఘించినట్టే. 16మీరు గనుక అలా
చేస్తే అప్పుడు భయంకరమైన సంగతుల్ని మీకు సంభ
వింపజేస్తాను. నేను మీకు రోగం, జ్వరం వచ్చేటట్టు
చేస్తాను. అవి మీ కళ్లను పాడుచేసి, మీ ప్రాణాల్ని
తీస్తాయి. మీరు విత్తనాలు జల్లినప్పుడు ఫలితం
ఉండదు. మీ శత్రువులు మీ పంటను తినివేస్తారు.
17నేను మీకు విరోధంగా ఉంటాను గనుక మీ శత్రువులు
మిమ్మల్ని ఓడిస్తారు. ఆ శత్రువులు మిమ్మల్ని
ద్వేషించి, మీ మీద అధికారం చేస్తారు. ఎవరూ
మిమ్మల్ని తరమకుండానే మీరు పారిపోతారు.
18“ఇవన్నీ జరిగినా మీరు నాకు విధేయులు
కాకపోతే, మీ పాపాలకోసం నేను మిమ్మల్ని ఏడం
తలుగా శిక్షిస్తాను. 19మీకు అతిశయ కారణమైన మీ
గొప్ప పట్టణాలను నేను కూలగొట్టేస్తాను. ఆకాశం
వర్షాన్ని ఇవ్వదు, భూమి పంటనివ్వదు. 20మీరు కష్టపడి
పనిచేస్తారు, కాని దానివల్ల ప్రయోజనం ఉండదు. మీ
భూమి పంటలేమీ ఇవ్వదు, మీ చెట్లు వాటి ఫలాలను
ఇవ్వవు.
21“మీరు ఇంకా నాకు వ్యతిరేకంగా తిరిగి, నాకు
విధేయులయ్యేందుకు తిరస్కరిస్తే, అప్పుడు ఇంకా
ఏడు రెట్లు కఠినంగా నేను మిమ్మల్ని కొడతాను.
మీరు ఎక్కువ పాపం చేసినకొద్దీ, మరింత ఎక్కువగా
శిక్షించబడతారు. 22నేను మీ మీదికి అడవి మృగాలను
పంపిస్తాను. అవి మీ పిల్లలను మీ దగ్గరనుండి లాక్కొని
పోతాయి. అవి మీ పశువుల్ని నాశనం చేస్తాయి. అవి
మీ సంఖ్యను క్షీణింప చేస్తాయి. రహదారులు ఖాళీగా
ఉంటాయి గనుక ప్రయాణం చేయటానికి ప్రజలు
భయపడతారు.
23“అన్ని జరిగినా మీరు పాఠం నేర్చుకోకపోతే,
ఇంకా అప్పటికీ నాకు మీరు విరుద్ధంగా తిరిగితే,
24అప్పుడు నేను కూడా మీకు విరుద్ధంగా తిరుగుతాను.
నేను, అవును నేనే, మీ పాపాలకోసం ఏడుసార్లు
మిమ్మల్ని శిక్షిస్తాను. 25మీరు నా ఒడంబడికను ఉల్లం
ఘించారు కనుక నేను మిమ్మల్ని శిక్షిస్తాను. సైన్యాలను
నేను మీమీదికి రప్పిస్తాను. భద్రతకోసం మీరు మీ
పట్టణాల్లోకి పారిపోతారు. కాని నేను మీ మధ్య
వ్యాధుల్ని వ్యాపింప జేస్తాను. అప్పుడు మీ శత్రువు
మిమ్మల్ని ఓడించేస్తాడు. 26ఆ పట్టణంలో మిగిలి
పోయిన ధాన్యంలో కొంత భాగం నేను మీకు ఇస్తాను.
కానీ తినేందుకు బహుకొంచెం మాత్రమే ఆహారం
ఉంటుంది. వారి భోజనాన్ని అంతా ఒక్క పాత్రలో
పదిమంది ఆడవాళ్లు వండగలుగుతారు. ఆ భోజనం
ముద్దలు ఒక్కొక్కదాన్ని వారు లెక్కబెట్టగలుగుతారు.
మీరు తింటారు గాని మీ ఆకలి తీరదు.
27“మీరు ఇంకా నా మాట వినకపోతే, ఇంకా నాకు
విరోధంగా ఉంటే 28అప్పుడు నేను నిజంగా నా కోపం
చూపిస్తాను. నేను, అవును నేనే, మీ పాపాలకోసం
ఏడుసార్లు మిమ్మల్ని శిక్షిస్తాను. 29మీ కుమారులు,
కుమార్తెల శరీరాల్ని మీరు తింటారు. 30మీ ఉన్నత
స్థలాలను నేను నాశనం చేస్తాను. మీ ధూప వేదికలను
నేను పడగొట్టేస్తాను. మీ శవాలను మీ విగ్రహాల శవాల
మీద నేను పడవేస్తాను. మీరు నాకు చాలా అసహ్యంగా
ఉంటారు. 31మీ పట్టణాలను నేను నాశనం చేస్తాను.
మీ పరిశుద్ధ స్థలాన్ని నేను శూన్యం చేస్తాను. మీ అర్పణల
సువాసన నేను ఆఘ్రాణించను. 32మీ పట్టణాల్లో

నివసించేందుకు వచ్చే మీ శత్రువులు చూచి అదిరి
పోయేంతగా మీ దేశాన్ని నేను ఖాళీ చేస్తాను. 33ఇంకా
నేను మిమ్మల్ని రాజ్యాల్లో చెదరగొట్టేస్తాను. నేను నా
ఖడ్గం దూసి, మిమ్మల్ని నాశనం చేస్తాను. మీ దేశం
శూన్యంగాను, మీ పట్టణాలు చెత్తగాను ఉంటాయి.

34"మిమ్మల్ని మీ శత్రువులు తమ దేశానికి తీసు
కొని పోతారు. మీ దేశం ఖాళీ అయిపోతుంది. అందుచేత
మీ భూమికి చివరికి విశ్రాంతి లభిస్తుంది. భూమి దాని
విశ్రాంతిని అనుభవిస్తుంది. 35ఏడేండ్లకు ఒకసారి ఒక
సంవత్సరం పాటు భూమికి విశ్రాంతి ఉండాలని ఆజ్ఞ
ప్రబోధిస్తుంది. మీరు దానిలో నివసించినప్పుడు దానికి
మీరు ఇవ్వని విశ్రాంతిని, భూమి ఖాళీగా ఉన్న ఆ
సమయంలో అది పొందుతుంది. 36శేషించిన ప్రజలు
వారి శత్రు దేశంలో ధైర్యం కోల్పోతారు. ప్రతిదానికీ
వారు భయపడిపోతారు. గాలికి కొట్టుకొని పోయే
ఆకులా వారు అటుఇటు పరుగులెత్తుతారు. ఎవరో
వారిని కత్తితో తరుముతున్నట్టు వారు పరుగులెడతారు.
వారిని ఎవరూ తరమక ముందే వారు పడిపోతారు.
37ఎవరో వారిని కత్తితో తరుముతున్నట్టుగా వారు
పరుగులెడతారు. వారిని ఎవరూ తరమకుండానే వారు
ఒకరిమీద ఒకరు కూలిపోతారు.

"మీరు మీ శత్రువులను ఎదిరించి నిలిచే అంతటి
బలం మీకు ఉండదు. 38ఇతర దేశాల్లో తప్పిపోతారు.
మీ శత్రుదేశాల్లోనికి మీరు అదృశ్యమవుతారు. 39కనుక
మిగిలిన వాళ్లు వారి పాపంవలన వారి శత్రుదేశంలో
క్షీణించిపోయెదరు. వారు కూడా వారి పూర్వీకు
లవలెనే, వారి పాపంవలన క్షీణించిపోయెదరు."

## నిరీక్షణ ఎప్పుడూ ఉంటుంది

40"అయితే ఒకవేళ ప్రజలు వారి పాపాలు ఒప్పు
కొంటారేమో. వారు, వారి పూర్వీకుల పాపాలు ఒప్పు
కొంటారేమో. ఒకవేళ వారు నాకు విరోధంగా తిరిగినట్టు
ఒప్పుకోవచ్చు. ఒకవేళ వారు నాకు విరోధంగా పాపం
చేసినట్టు ఒప్పుకోవచ్చు. 41ఒకవేళ నేను వారికి
విరోధంగా తిరిగి వారి శత్రుదేశంలోనికి నేనే వాళ్లను
తీసుకొని పోయినట్టు వారు ఒప్పుకోవచ్చు. ఆ ప్రజలు
నన్ను ఎరుగని వాళ్లలా ప్రవర్తించారు. వాళ్లు తగ్గించు
కొని, వారి పాపపు శిక్షను స్వీకరిస్తే 42అప్పుడు యాకో
బుతో నా ఒడంబడికను నేను జ్ఞాపకం చేసుకొంటాను.
ఇస్సాకుతో నా ఒడంబడికను నేను జ్ఞాపకం చేసు
కొంటాను. అబ్రాహాముతో నా ఒడంబడికను నేను
జ్ఞాపకం చేసుకొంటాను. ఈ దేశాన్ని నేను జ్ఞాపకం
చేసుకొంటాను.

43"ఈ దేశం ఖాళీ అవుతుంది. భూమి దాని విశ్రాంతి
సమయాన్ని అనుభవిస్తుంది. అప్పుడు మిగిలిన వాళ్లు
వారి పాపపు శిక్షను అంగీకరిస్తారు. వారు నా ఆజ్ఞలను
ద్వేషించి, నా నియమాలకు విధేయులయ్యేందుకు
నిరాకరించినందువల్లే వారు శిక్ష పొందినట్టు వారు
గ్రహిస్తారు.

44వాస్తవంగా వారు పాపం చేసారు. అయితే సహా
యంకోసం వారు నా దగ్గరకు వస్తే, నేను వారినుండి
తిరిగిపోను. వారు వారి శత్రువుల దేశంలో ఉన్నప్పటికీ
నేను వారి మొర ఆలకిస్తాను. నేను వారిని పూర్తిగా
నాశనం చెయ్యను. వారితో నా ఒడంబడికను తెగ
తెంపులు చేయను. నేను యెహోవాను, వారి దేవుణ్ణి.
45వారి పూర్వీకులతో నాకుగల ఒడంబడికను నేను
జ్ఞాపకం చేసుకొంటాను. నేను వారికి దేవునిగా ఉండేం
దుకు నేను వారి పూర్వీకుల్ని ఈజిప్టు నుండి బయ
టకు రప్పించాను. ఇతర రాజ్యాలు వాటన్నింటినీ
చూసాయి. నేను యెహోవాను!"

46అవి యెహోవా ఇశ్రాయేలు ప్రజలకు యిచ్చిన
చట్టాలు, నియమాలు, ప్రబోధాలు. యెహోవాకు,
ఇశ్రాయేలు ప్రజలకు మధ్య ఆ ఆజ్ఞలే ఒక ఒడంబడిక.
సీనాయి పర్వతం దగ్గర ఆ ఆజ్ఞలను యెహోవా
ఇచ్చాడు. ఆయన వాటిని మోషేకు ఇవ్వగా, మోషే
వాటిని ప్రజలకు యిచ్చాడు.

## వాగ్దానాలు ముఖ్యం

27 యెహోవా మోషేతో చెప్పాడు: 2"ఇశ్రా
యేలు ప్రజలతో చెప్పు: ఒకవ్యక్తి యెహో
వాకు ఒక ప్రత్యేక వాగ్దానం చేయవచ్చు. ఆ వ్యక్తి ఒక
మనిషిని యెహోవాకు అర్పిస్తానని వాగ్దానం చేసి
ఉండొచ్చు. అలాగైతే ఆ మనిషి ఒక ప్రత్యేక విధానంలో
యెహోవాను సేవించాలి. ఆ మనిషికి యాజకుడు
కొంత విలువ నిర్ణయించాలి. ప్రజలు ఆ మనిషిని
యెహోవా దగ్గర తిరిగి కొనాలంటే వారు ఆ విలువ
చెల్లించాలి. 3ఇరవై నుండి అరవై సంవత్సరాల వయ
సుగల ఒక మగవాడి విలువ యాభై తులాల వెండి.
(వెండిని తూచేందుకు పవిత్ర స్థలంలోని అధికారిక
కొలతనే మీరు ఉపయోగించాలి).

4ఇరవై నుండి అరవై సంవత్సరాల వయస్సుగల
ఒక స్త్రీ విలువ ముప్పైతులాలు. 5ఐదు నుండి ఇరవై
సంవత్సరాల వయస్సుగల ఒక మగవాని విలువ ఇరవై
తులాలు. ఐదు నుండి ఇరవై సంవత్సరాల వయస్సుగల
ఒక స్త్రీ విలువ పది తులాలు. 6ఒక నెలనుండి ఐదు
సంవత్సరాల వయసుగల ఒక మగ శిశువు వెల ఐదు
తులాలు. ఆడ శిశువు వెల మూడు తులాలు. 7అరవై
సంవత్సరాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉన్న
ఒక మగవాని వెల పదిహేను తులాలు. ఒక స్త్రీవెల
పది తులాలు.

8"ఒక మనిషి ఆ వెల చెల్లించలేనంత పేదవాడైతే
ఆ వ్యక్తిని యాజకుని దగ్గరకు తీసుకొని రావాలి. ఆ
వ్యక్తి ఎంత మొత్తం చెల్లించగలడు అనే విషయం యాజ
కుడు తీర్మానిస్తాడు.

### యెహోవాకు కానుకలు

9“కొన్ని జంతువులు యెహోవాకు బలిగా ఉప
యోగపడతాయి. అలాంటి ఒక జంతువును ఒక వ్యక్తి
తీసుకొని వస్తే, ఆ జంతువు పవిత్రం అవుతుంది.
10ఆ వ్యక్తి ఆ జంతువునే యెహోవాకు ఇస్తానని
వాగ్దానం చేసాడు గనుక దానికి బదులు ఇంకోదాన్ని
యివ్వటానికి అతడు ప్రయత్నించకూడదు. ఇంకో
దానితో దీన్ని మార్చేందుకు అతడు ప్రయత్నించ
కూడదు. మంచి జంతువుకు బదులుగా పనికిరాని
జంతువును మార్చాలని అతడు ప్రయత్నించకూడదు.
పనికిరాని జంతువుకు బదులుగా మంచి జంతువును
మార్చాలనీ అతడు ప్రయత్నించకూడదు. ఆ మనిషి
అలా జంతువుల్ని మార్చటానికి ప్రయత్నిస్తే, అప్పుడు
ఆ జంతువులు రెండూ పవిత్రం అవుతాయి. అందుచేత
అవి రెండూ యెహోవాకే చెందుతాయి.

11“కొన్ని జంతువులు యెహోవాకు అర్పిం
చేందుకు పనికిరావు. అలాంటి అపవిత్ర జంతువును
ఒకదాన్ని ఒకడు యెహోవాకు యిచ్చేందుకు తీసు
కొనివస్తే, అప్పుడు ఆ జంతువును యాజకుని దగ్గరకు
తీసుకొనిరావాలి. 12యాజకుడు ఆ జంతువుకు విలువ
నిర్ణయం చేస్తాడు. యాజకుడు వెల నిర్ణయం చేసిన
తర్వాత ఆ జంతువు మంచిదేగాని పనికిరానిదేగాని,
దాని వెల అంతే. 13ఒకవేళ ఆ వ్యక్తి తిరిగి జంతువును
కొనుక్కోవాలనుకొంటే, అతడు దాని వెలకు అయిదో
వంతు అదనంగా చెల్లించాలి.

### యెహోవాకు అర్పించిన ఇంటి విలువ

14“ఇప్పుడు ఒక వ్యక్తి తన ఇంటిని యెహోవాకు
పవిత్రంగా ప్రతిష్ఠ చేస్తే, యాజకుడు దాని వెల నిర్ణయం
చేయాలి. యాజకుడు అలా వెల నిర్ణయిస్తే ఆ ఇల్లు
మంచిదేగాని, పనికి రానిదేగాని ఆ వెల అంతే. 15అయితే
ఆ ఇంటిని ఇచ్చిన వ్యక్తి తిరిగి దానిని తీసుకొనగోరితే,
దాని విలువకు అయిదోవంతు అదనంగా చెల్లించాలి.
అప్పుడు ఆ ఇల్లు ఆ వ్యక్తికి చెందుతుంది.

### ఆస్తి విలువ

16“ఒక వ్యక్తి తన పొలాల్లో కొంత భాగం యెహో
వాకు ప్రతిష్ఠ చేస్తే, దానిలో నాటేందుకు ఎంత విత్తనం
అవసరం ఉంటుందో అనేదానిమీద ఆ పొలాల వెల
ఆధారపడి ఉంటుంది. పది తూముల యవల విత్తనాల
వెల ఏభై తులాల వెండితో సమానము 17ఒకవేళ
బూరధ్వని చేసే మహోత్సవ కాలంలో ఆ వ్యక్తి తన
పొలాన్ని కానుకగా యిస్తే, యాజకుడు నిర్ణయించేదే
దాని వెల అవుతుంది. 18కానీ ఆ వ్యక్తి బూరధ్వని
మహోత్సవ కాలం దాటిపోయాక తన పొలాన్ని కాను
కగా యిస్తే, దాని ఖచ్చితమైన వెలను యాజకుడు
నిర్ణయించాలి. తర్వాత వచ్చే బూరధ్వని మహోత్సవ
కాలానికి ఎన్ని సంవత్సరాలు ఉన్నాయో అతడు
లెక్కించాలి. అప్పుడు ఆ లెక్క ఆధారంగా వెలకట్టాలి.
19ఒకవేళ తన పొలాన్ని కానుకగా యిచ్చిన వ్యక్తి తిరిగి
తన పొలాన్ని తీసుకోవాలనుకొంటే, దాని వెలకు
అయిదో వంతు అతడు అదనంగా చెల్లించాలి. అప్పుడు
ఆ పొలం తిరిగి అతనిదే అవుతుంది. 20“ఆ వ్యక్తి ఆ
పొలాన్ని తిరిగి కొనకపోతే, అప్పుడు ఆ పొలం ఎల్ల
ప్పుడూ యాజకులకే చెందుతుంది. ఒకవేళ ఆ
భూమిని మరొకరికి అమ్మివేస్తే, ఆ మొదటి వ్యక్తి
తిరిగి ఆ పొలం కొనేందుకు వీల్లేదు.

21ఒకవేళ ఆ వ్యక్తి గనుక ఆ పొలాన్ని మళ్లీ
కొనకపోతే, బూరధ్వని చేసే మహోత్సవ కాలంలో
ఆ భూమి యెహోవాకు పవిత్రంగా ఉండిపోతుంది.
అది శాశ్వతంగా యాజకునిదే అవుతుంది. అది
సంపూర్ణంగా యెహోవాకు ఇవ్వబడిన భూమిగా
ఉంటుంది.

22“ఒకవేళ ఒక వ్యక్తి అతడు కొన్న పొలాన్ని
యెహోవాకు ప్రతిష్ఠిస్తే, అది అతని స్వంత పొలంలో
ఒక భాగం కానప్పుడు. 23యాజకుడు బూరధ్వని
చేసే మహోత్సవ కాలంవరకుగల సంవత్సరాలను
లెక్కించి, దాని ప్రకారం ఆ పొలం వెల నిర్ణయించాలి.
అప్పుడు ఆ భూమి యెహోవాదే అవుతుంది. 24బూర
ధ్వని చేసే మహోత్సవ కాలంలో ఆ భూమి దాని
స్వంతదారునిది అవుతుంది. ఆ భూమి ఏ కుటుంబం
వారి స్వంతమో తిరిగి వారికే దక్కుతుంది. 25“ఆ
ధరలు చెల్లించేందుకు పవిత్రస్థలంలోని అధికారిక కొల
తనే మీరు ఉపయోగించాలి. పవిత్ర స్థలంలో అధికార
తులం బరువు 20 చిన్నాలు.

### జంతువుల విలువ

26“పశువుల్ని, గొర్రెల్ని, ప్రజలు యెహోవాకు
కానుకగా ఇవ్వవచ్చును. అయితే ఆ జంతువు తొలి
చూలు అయితే అది ముందే యెహోవాది. కనుక
తొలిచూలు వాటిని ప్రజలు కానుకగా యివ్వలేరు.
27తొలిచూలు జంతువులను ప్రజలు యెహోవాకు
ఇవ్వాలి. అయితే ఆ తొలిచూలు జంతువు అపవిత్ర
మైనదిగా ఉంటే అప్పుడు ఆ వ్యక్తి తిరిగి దానిని కొను
క్కోవాలి. ఆ జంతువు వెల యాజకుడు నిర్ణయించగా,
ఆ వ్యక్తి, దాని వెలకు అయిదోవంతు అదనంగా
చెల్లించాలి. ఒకవేళ ఆ వ్యక్తి గనుక ఆ జంతువును
తిరిగి కొనలేకపోతే, యాజకుడు తానే నిర్ణయించే
వెలకు ఆ జంతువును అమ్మివేయాలి.

### ప్రత్యేక బహుమతులు

28“ప్రజలు యెహోవాకు ఇచ్చే ఒక ప్రత్యేక
రకమైన కానుక ఉంది. ఆ కానుక సంపూర్ణంగా యెహో
వాదే అవుతుంది. ఆ కానుకను అమ్మటానికి, తిరిగి

కొనడానికి వీల్లేదు. ఆ కానుక యెహోవాకు చెందినది. ప్రజలు, జంతువులు, కుటుంబపు ఆస్తిలోని పొలాలు ఆ కానుక కావచ్చును.”

29 “ఒకవేళ ఆ ప్రత్యేకమైన కానుక ఒక వ్యక్తి అయి వుంటే ఆ వ్యక్తిని తిరిగి కొనేందుకు వీల్లేదు. ఆ వ్యక్తి చంపబడవలసినదే.”

30 “పంటలన్నింటిలో పదోవంతు యెహోవాకు చెందుతుంది. అంటే పొలాల్లోని పంటలు, చెట్ల ఫలాలు అని అర్థం. ఆ పదోవంతు యెహోవాదే అవుతుంది.
31 కనుక ఎవరైనా తన పదోవంతు తిరిగి తీసుకోవాలి అనుకొంటే, వారు దాని వెలకు అయిదో వంతు అదనంగా చెల్లించి, అప్పుడు దానిని తిరిగి కొనుక్కోవాలి.

32 “ఒక వ్యక్తికిగల పశువులు, గొర్రెలలో నుండి ప్రతి పదోజంతువును యాజకులు తీసుకోవాలి. పదోజంతువు ప్రతీదీ యెహోవాదే అవుతుంది.

33 కోరుకొన్న ఆ జంతువు మంచిదైనా చెడ్డదైనా, దాని స్వంతదారుడు చింతించవలసిన అవసరం లేదు. అతడు ఆ జంతువును మరో జంతువుతో మార్చకూడదు. అలా మరో జంతువుతో దాన్ని మార్చాలని అతడు నిర్ణయించుకొంటే అప్పుడు ఆ రెండు జంతువులూ యెహోవావే అవుతాయి. ఆ జంతువును తిరిగి కొనేందుకు వీల్లేదు.”
34 సీనాయి పర్వతం దగ్గర మోషేకు యెహోవా ఆజ్ఞాపించిన ఆజ్ఞలు అవి. అవి ఇశ్రాయేలు ప్రజలకోసమైన ఆజ్ఞలు.

# సంఖ్యాకాండము

### ఇశ్రాయేలు ప్రజల లెక్క

1 సన్నిధి గుడారంలో మోషేతో యెహోవా ఇలా
మాట్లాడాడు. ఇది సీనాయి అరణ్యంలో ఉంది.
ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు విడిచిన రెండవ సంవత్సరం
రెండవ నెల మొదటి రోజు అది, మోషేతో యెహోవా
ఇలా చెప్పాడు:

2"ఇశ్రాయేలు ప్రజలందరి సంఖ్యను లెక్కించు.
ప్రతి పురుషుని పేరు అతని వంశం, కుటుంబంతో
పాటు జాబితా చేయి 3ఇశ్రాయేలు పురుషులందరినీ,
నీవు, అహరోను లెక్కించాలి. 20 సంవత్సరాలు, అంతకు
ఎక్కువ వయస్సు ఉన్న వారిని మీరు లెక్కించాలి.
(వారు ఇశ్రాయేలు సైన్యంలో ఉండదగిన వాళ్లు.) వారి
వంశాల ప్రకారం వారి జాబితా చేయి. 4ప్రతి కుటుం
బము నుండి ఒక మనిషి మీకు సహాయం చేస్తాడు.
ఈ మనిషి తన వంశానికి నాయకుడుగా ఉంటాడు,
5మీతో ఉండి మీకు సహాయం చేసే పురుషుల పేర్లు
ఇవి;

రూబేను వంశంనుండి–షెదేయూరు కుమారుడు ఎలీసూరు;

6 షిమ్యోను వంశంనుండి–సూరీషద్దాయి కుమారుడు షెలుమీయేలు

7 యూదా వంశంనుండి – అమ్మీనాదాబు కుమారుడు నయస్సోను.

8 ఇశ్శాఖారు వంశంనుండి–సూయారు కుమారుడు నెతనేలు.

9 జెబూలూను వంశంనుండి–హెలోను కుమారుడు ఎలీయాబు.

10 యోసేపు సంతానమందు ఎఫ్రాయిము వంశం నుండి–అమిహూదు కుమారుడు ఎలీషామాయు–మనష్షే వంశంనుండి –పెదాసూరు కుమారుడు గమలీయేలు.

11 బెన్యామీను వంశంనుండి గిద్యోనీ కుమారుడు అబీదాను.

12 దాను వంశంనుండి–అమీషద్దాయి కుమారుడు అహీయెజెరు.

13 ఆషెరు వంశంనుండి–ఒక్రాను కుమారుడు పగీయేలు.

14 గాదు వంశంనుండి దెయూవేలు కుమారుడు ఎలాసాపు;

15 నఫ్తాలి వంశం నుండి–ఏనాను కుమారుడు అహీర."

16ఈ పురుషులు వారి కుటుంబాలకు నాయకులు,
వారి వంశాలకు నాయకులుగా కూడా, ప్రజలు ఈ
పురుషులను ఏర్పాటు చేసుకొన్నారు. 17-18పేరు
పేరునా ఈ పురుషులు ఏర్పరచుకోబడ్డారు. కనుక
రెండవ నెల మొదటి రోజున ఈ పురుషులను, ఇశ్రా
యేలు ప్రజలందరినీ మోషే అహరోనులు పిలిచారు.
అప్పుడు ప్రజలు వారి కుటుంబాల ప్రకారం, వారి
వంశాల ప్రకారం జాబితా చేయబడ్డారు. 20 సంవత్స
రాలు, అంతకు పైబడిన పురుషులు అంతా జాబితాలో
ఉన్నారు. 19సరిగ్గా యెహోవా ఆజ్ఞాపించినట్లే మోషే
చేసాడు. ప్రజలు సీనా అరణ్యంలో ఉన్నప్పుడే మోషే
వారిని లెక్కించాడు.

20ఇశ్రాయేలు జ్యేష్ఠకుమారుడు రూబేను యొక్క
సంతతి లెక్కించబడింది. 20 సంవత్సరాలు లేక అంతకు
ఎక్కువ వయస్సు ఉండి, యుద్ధంలో పని చేయగలిగిన
పురుషులందరి పేర్లు వ్రాయబడ్డాయి. వారు వారి
కుటుంబాలు, వంశాలతోకూడ జాబితాలో చేర్చ
బడ్డారు. 21రూబేను సంతతినుండి లెక్కించబడిన పురు
షుల సంఖ్య మొత్తం 46,500.

22షిమ్యోను సంతతి లెక్కించబడ్డారు. 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి,
యుద్ధంలో పని చేయగల పురుషులందరి పేర్లు జాబి
తాలో చేర్చబడ్డాయి. వారు, వారి కుటుంబాలు, వంశా
లతో బాటు జాబితాలో చేర్చబడ్డారు. 23షిమ్యోను
సంతతినుండి లెక్కించబడిన పురుషులు మొత్తం
59,900.

24గాదు సంతతి లెక్కించబడింది. 20 సంవత్సరాలు
అంతకంటె, ఎక్కువ వయస్సు ఉండి, యుద్ధంలో
పని చేయగల పురుషులందరి పేర్లు జాబితాలో చేర్చ
బడ్డాయి. వారి కుటుంబాలు, వంశాలతో బాటు వారు
జాబితాలో చేర్చబడ్డారు.

25గాదు సంతతి నుండి లెక్కించబడిన పురుషులు
మొత్తం 45,650.

26యూదా సంతతి లెక్కించబడింది. 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి,
యుద్ధంలో పని చేయగలిగిన పురుషులందరి పేర్లు
జాబితాలో చేర్చబడ్డాయి. వారు, వారి కుటుంబాలు,
వంశాలతో బాటు జాబితాలో చేర్చబడ్డారు. 27యూదా
సంతతి నుండి లెక్కించబడ్డ పురుషులు మొత్తం
74,600.

28ఇశ్శాఖారు సంతతి లెక్కించబడింది. 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయస్సు కలిగి ఉండి,
యుద్ధంలో పని చేయగల పురుషులందరి పేర్లు జాబి
తాలో చేర్చబడ్డాయి. వారు, వారి కుటుంబాలు, వంశా
లతో బాటు జాబితాలో చేర్చబడ్డారు. 29ఇశ్శాఖారు
సంతతిలో లెక్కించబడిన పురుషులు మొత్తం 54,400.

30జెబులూను సంతతి లెక్కించబడింది. 20 సంవ
త్సరాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి,
యుద్ధంలో పని చేయగల పురుషులందరి పేర్లు జాబి
తాలో చేర్చబడ్డాయి. వారు వారి కుటుంబాలు, వంశాల
తోబాటు జాబితాలో చేర్చబడ్డారు. 31జెబులూను
సంతతిలో లెక్కించబడిన పురుషులు మొత్తం 57,400.

32యోసేపు కుమారుడైన ఎఫ్రాయిము సంతతి
లెక్కించబడింది. 20 సంవత్సరాలు, అంతకంటె
ఎక్కువ వయస్సు ఉండి, యుద్ధంలో పని చేయగల
పురుషులందరి పేర్లు జాబితాలో చేర్చబడ్డాయి. వారు
వారి కుటుంబాలు, వంశాలతో బాటు జాబితాలో చేర్చ
బడ్డారు. 33ఎఫ్రాయిము సంతతిలో లెక్కించబడిన
పురుషులు మొత్తం 40,500.

34యోసేపు కుమారుడైన మనష్షే సంతతి లెక్కించ
బడింది. 20 సంవత్సరాలు అంతకంటె ఎక్కువ
వయస్సు ఉండి, యుద్ధంలో పని చేయగల పురుష
లందరి పేర్లు జాబితాలో చేర్చబడ్డాయి. వారి కుటుం
బాలు, వంశాలతోబాటు వారు జాబితాలో చేర్చబడ్డారు.
35మనష్షే సంతతినుండి లెక్కించబడిన పురుషులు
మొత్తం 32,200.

36బెన్యామీను సంతతి లెక్కించబడింది. 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి,
యుద్ధంలో పని చేయగల పురుషులందరి పేర్లు జాబి
తాలో చేర్చబడ్డాయి. వారి కుటుంబాలు, వంశాలతో
బాటు వారు జాబితాలో చేర్చబడ్డారు. 37బెన్యామీను
సంతతితో లెక్కించబడిన పురుషులు మొత్తం 35,400.

38దాను సంతతి లెక్కించబడింది. 20 సంవత్సరాలు
అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి, యుద్ధంలో
పని చేయగల పురుషులందరి పేర్లు జాబితాలో చేర్చ
బడ్డాయి. వారి కుటుంబాలు, వంశాలతోబాటు వారు
జాబితాలో చేర్చబడ్డారు. 39దాను సంతతిలో లెక్కించ
బడిన పురుషులు మొత్తం 62,700.

40ఆషేరు సంతతి లెక్కించబడింది. 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి,
యుద్ధంలో పని చేయగల పురుషులందరి పేర్లు జాబి
తాలో చేర్చబడ్డాయి. వారి కుటుంబాలు, వంశాలతో
బాటు వారు జాబితాలో చేర్చబడ్డారు. 41ఆషేరు సంత
తిలో లెక్కించబడిన పురుషులు మొత్తం 41,500.

42నఫ్తాలి సంతతి లెక్కించబడింది. 20 సంవత్స
రాలు అంతకంటె ఎక్కువ వయస్సు ఉండి, యుద్ధంలో
పని చేయగల పురుషులందరి పేర్లు జాబితాలో చేర్చ
బడ్డాయి. వారి కుటుంబాలు, వంశాలతోబాటు వారు
జాబితాలో చేర్చబడ్డారు. 43నఫ్తాలి సంతతిలో లెక్కించ
బడిన పురుషులు మొత్తం 53,400.

44ఈ పురుషులందర్నీ మోషే, అహరోను ఇశ్రా
యేలు పెద్దలు లెక్కించారు. (పన్నెండుమంది నాయ
కులు, ఒక్కో వంశంనుండి ఒక్కో నాయకుడు
ఉన్నారు.)

45ఇశ్రాయేలీయులలో 20 సంవత్సరాలు, అంత
కంటె ఎక్కువ వయస్సు ఉండి, సైన్యంలో పని
చేయగల ప్రతి పురుషుడు లెక్కించబడ్డాడు. ఆ పురు
షులు వారి వంశాలతో బాటు లెక్కించబడ్డారు. 46పురు
షుల సంఖ్య మొత్తం 6,03,550.

47లేవీ వంశపు కుటుంబాలు ఇశ్రాయేలీయులలో
ఇతరులతో బాటు జాబితాలో లెక్కించబడలేదు.
48యెహోవా మోషేతో ఇలా చెప్పాడు, 49"లేవీ వంశం
లోని పురుషులను నీవు లెక్కించకూడదు. ఇశ్రాయేలు
ప్రజలలో ఇతరులతో భాగంగా వీరిని చేర్చకు. 50ఒడం
బడిక పవిత్ర గుడారానికి వారు బాధ్యులని లేవీ మనుష్యు
లతో చెప్పు. దాని విషయం, దానితోబాటు ఉండే
వాటన్నింటి విషయం వారు జాగ్రత్త తీసుకోవాలి.
పవిత్ర గుడారాన్ని, దానిలో ఉండే వాటన్నింటినీ వారు
మోయాలి. వారి నివాసం దాని చుట్టు ఏర్పరచుకొని,
దానినిగూర్చి జాగ్రత్త తీసుకోవాలి. 51పవిత్ర గుడారం
ఎప్పుడైనా ముందుకు తీసుకుని పోదలిస్తే లేవీ మను
ష్యులే అది చేయాలి. ఎప్పుడైనా సరే ఒకచోట పవిత్ర
గుడారం వేయబడితే, అది లేవీ మనుష్యులే వేయాలి.
పవిత్ర గుడారం విషయం జాగ్రత్త తీసుకునేవారు వాళ్లే.
లేవీ కుటుంబానికి చెందనివారు ఇంకెవరయినా గుడా
రాన్ని గూర్చి శ్రద్ధ తీసుకునేందుకు ప్రయత్నిస్తే,
అతడు చంపివేయబడతాడు. 52ఇశ్రాయేలు ప్రజలు
వేరువేరు వంశాలుగా వారి నివాసాలు ఏర్పాటు చేసు
కోవాలి. ప్రతి మనిషీ తన కుటుంబ ధ్వజానికి దగ్గరగా
డేరాలు వేయాలి. 53అయితే లేవీ ప్రజలు పవిత్ర
గుడారం చుట్టూ డేరాలువేయాలి. ఒడంబడిక పవిత్ర
గుడారాన్ని లేవీ ప్రజలు కాపాడుతారు. ఇశ్రాయేలు
ప్రజలకు ఎలాంటి కీడూ జరుగకుండా వారు పవిత్ర
గుడారాన్ని కాపాడుతారు."

54కనుక మోషేకు యెహోవా ఆజ్ఞాపించిన విష
యాలన్నింటిలో ఇశ్రాయేలీయులు విధేయు
లయ్యారు.

## నివాసం ఏర్పాటు

2 మోషే, అహరోనులతో యెహోవా ఇలా
అన్నాడు: 2 "ఇశ్రాయేలు ప్రజలు వారి డేరాను
సన్నిధి గుడారం చుట్టూ వేసుకోవాలి. ఒక్కో వంశానికి
దాని స్వంత ధ్వజం ఉంటుంది, ఎవరి వంశ ధ్వజం
దగ్గర వారు నివాసం చేయాలి.
3"యూదా డేరా పతాకం తూర్పుపక్క అంటే
సూర్యోదయ దిశన ఉంటుంది. యూదా ప్రజలకు
అమ్మీనాదాబు కుమారుడైన నయస్సోను నాయకుడు.
4ఈ విభాగములో 74,600 మంది పురుషులు ఉన్నారు.
5"యూదావారి పక్కన ఇశ్శాఖారు వంశంవారి డేరా
ఉంటుంది. సూయారు కుమారుడైన నెతనేలు ఇశ్శా
ఖారు వంశానికి నాయకుడు. 6ఈ విభాగములో 54,400
మంది ఉన్నారు.
7"జెబూలూను వంశం కూడ యూదా వంశం పక్క
గానే ఉంటారు. హేలోను కుమారుడైన ఏలీయాబు
జెబూలూను వారికి నాయకుడు. 8ఈ విభాగములో
57,400 మంది ఉన్నారు.
9"యూదా సంతతిలో 1,86,400 మంది పురుషులు
ఉన్నారు. వీరంతా వారివారి వంశాల ప్రకారముగా విభ
జించబడ్డారు. ప్రజలు ఒక చోటనుండి మరో చోటకు
తరలి వెళ్లేటప్పుడు యూదా వంశం వారు ముందుగా
నడుస్తారు.
10"పవిత్ర గుడారానికి దక్షిణాన రూబేను డేరా
ధ్వజం ఉంటుంది. ఒక్కో వంశం దాని ధ్వజం దగ్గర
నివాసం చేస్తారు. షెదేయూరు కుమారుడు ఏలీసూరు
రూబేను వారికి నాయకుడు. 11ఈ విభాగములో 46,
500 మంది ఉన్నారు. 12"రూబేను వంశానికి పక్కగా
షిమ్యోను వంశంవారు నివాసం చేస్తారు. సూరీషద్దాయి
కుమారుడు షెలుమీయేలు, షిమ్యోను వారికి నాయ
కుడు. 13ఈ విభాగములో 59,300 మంది ఉన్నారు.
14"గాదు వంశంకూడ రూబేను వారి పక్కగా నివాసం
చేస్తారు. రగూయేలు కుమారుడైన ఎలీయాసాపు గాదు
వారికి నాయకుడు. 15ఈ విభాగములో 45,650 మంది
ఉన్నారు.
16"మొత్తం రూబేను నివాసంలో ఉన్న విభాగము
లన్నిటిలో కలిసి 1,51,450 మంది పురుషులు ఉన్నారు.
ప్రజలు ఒక చోటనుండి మరోచోటికి తరలి వెళ్లేట
ప్పుడు రూబేను వంశం రెండో విభాగముగా బయల్దేరు
తుంది.
17"ప్రజలు ప్రయాణం చేసేటప్పుడు లేవీ వంశం
వారు తర్వాత బయల్దేరతారు. సన్నిధి గుడారం వారితో
బాటు ఇతర వంశాలవారి మధ్య ఉంటుంది. వారు
బయల్దేరి వెళ్లే క్రమంలోనే వారి నివాసం ఏర్పాటు
చేసుకొంటారు. ప్రతి వ్యక్తీ తన వంశ ధ్వజం దగ్గర
ఉంటాడు. 18 "ఎఫ్రాయిము వారి గుడారపు ధ్వజం
పడమటి దిక్కున ఉంటుంది. ఎఫ్రాయిము విభాగ
ములు అక్కడ నివసిస్తాయి. అమీహూదు కుమారుడైన
ఎలీషామా ఎఫ్రాయిము ప్రజలకు నాయకుడు. 19ఈ
విభాగములో 40,500 మంది ప్రజలు ఉన్నారు.
20"ఎఫ్రాయిము కుటుంబానికి పక్కగా మనష్షే
వంశం నివసిస్తుంది. పెదాసూరు కుమారుడు గమలీ
యేలు మనష్షే మనుష్యులకు నాయకుడు.
21ఈ విభాగ ములో 32,200 మంది మనుష్యులు
ఉన్నారు.
22"బెన్యామీను వంశం కూడ ఎఫ్రాయిము కుటుం
బానికి పక్కగా నివాసం చేస్తారు. గిద్యోనీ కుమారుడు
అబీదాను బెన్యామీను ప్రజలకు నాయకుడు. 23ఈ
విభాగములో 35,400 మంది మనుష్యులు ఉన్నారు.
24"ఎఫ్రాయిము నివాసములో మొత్తం 1,08,100 పురు
షులు ఉన్నారు. ప్రజలు ఒక చోటునుండి మరో
చోటుకు తరలి వెళ్లినప్పుడు వారు మూడో కుటుం
బంగా బయల్దేరతారు.
25"దాను వారి గుడారపు ధ్వజం ఉత్తర దిశన
ఉంటుంది. దాను కుటుంబ విభాగాలు అక్కడ నివసి
స్తాయి. అమీషద్దాయి కుమారుడైన అహీయెజెరు దాను
వారికి నాయకుడు.
26ఈ విభాగములో 62,700 మంది ప్రజలు
ఉన్నారు.
27"ఆషేరు వంశాల వారు దాను కుటుంబ విభాగము
పక్కగా నివాసం చేస్తారు. ఒక్రాను కుమారుడు పగీ
యేలు, ఆషేరు ప్రజల నాయకుడు. 28ఈ వంశలో
41,500 మంది ప్రజలు ఉన్నారు.
29"నఫ్తాలి వంశంకూడ దాను వంశానికి పక్కగా
నివాసం చేస్తారు. ఏనాను కుమారుడైన అహీరా నఫ్తాలి
ప్రజల నాయకుడు. 30ఈ విభాగంలో 53,400 మంది
ఉన్నారు.
31"దాను నివాసంలో మొత్తం 1,57,600 మంది
పురుషులు ఉన్నారు. ప్రజలు ఒక చోట నుండి మరో
చోటుకు తరలినప్పుడు, వీరు చివరి కుటుంబముగా
బయల్దేరతారు. వారు తమ స్వంత ధ్వజం కిందనే
నివాసం చేస్తారు."
32అన్ని నివాసాలలోను ఉన్న మొత్తం వంశాలన్నిం
టిలో కలిపి 6,03,550 మంది పురుషులు ఉన్నారు.
33మోషే ఇశ్రాయేలు ప్రజలందరితో కలిపి లేవీయులను
లెక్కించలేదు. ఇది యెహోవా ఇచ్చిన ఆజ్ఞ.
34కనుక మోషేతో యెహోవా చెప్పిన వాటన్నిం
టికీ ఇశ్రాయేలు ప్రజలు విధేయులయ్యారు.
యెహోవా వారితో చెప్పినట్టే ఇశ్రాయేలు ప్రజలు
వారివారి పతాకాలదగ్గర నివాసం చేసారు. యెహోవా
వారితో చెప్పిన విధానంలోనే ఇశ్రాయేలు ప్రజలు
ప్రయాణం చేసారు. ప్రతి వ్యక్తీ తన కుటుంబంతో,
వంశంతోనే ఉన్నారు.

### అహరోను కుటుంబం, యాజకులు

3 సీనాయి పర్వతం మీద మోషేతో యెహోవా
మాట్లాడిన సమయంలో అహరోను, మోషేల
కుటుంబ చరిత్ర ఇది.
2అహరోనుకు కుమారులు నలుగురు. నాదాబు
మొదటి కుమారుడు. ఆ తర్వాత అబీహు, ఎలీయా
జరు, ఈతామారు. 3ఈ కుమారులు అభిషేకించబడిన
యాజకులు. యాజకులుగా యెహోవాను సేవించే
ప్రత్యేక పని ఈ కుమారులకు ఇవ్వబడింది. 4అయితే
నాదాబు, అబీహు యెహోవాను సేవిస్తూనే పాపం
చేసారు గనుక వారు చనిపోయారు. వారు యెహో
వాకు ఒక అర్పణ తయారు చేసారు కాని, యెహోవా
అనుమతించని అగ్నిని వారు ఉపయోగించారు. ఇది
సీనాయి అరణ్యంలో సంభవించింది. కనుక నాదాబు,
అబీహు అక్కడే చనిపోయారు. వారికి కుమారులు
లేనందుచేత ఎలీయాజరు, ఈతామారు యాజకులై
యెహోవాను సేవించారు. వారి తండ్రి అహరోను
జీవించి ఉండగానే వారు ఇలా చేసారు.

### లేవీయులు—యాజకుల సహాయకులు

5మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 6"లేవీ
కుటుంబంలోని వాళ్లందర్నీ తీసుకునిరా, అహరోను
యాజకుని దగ్గరకు వాళ్లను తీసుకునిరా. వారు అహరో
నుకు సహాయకులు. 7అహరోను సన్నిధి గుడారంలో
పరిచర్య చేసేటప్పుడు లేవీయులు అహరోనుకు
సహాయం చేస్తారు. ఇశ్రాయేలు ప్రజలు పవిత్ర గుడా
రంలో ఆరాధించటానికి వచ్చినప్పుడు వాళ్లందరికీ లేవీ
యులు సహాయం చేస్తారు. 8సన్నిధి గుడారంలో
సామగ్రి అంతటినీ ఇశ్రాయేలు ప్రజలు కాపాడాలి.
అది వారి బాధ్యత. కానీ లేవీయులు వీటి విషయం
జాగ్రత్త పుచ్చుకొని ఇశ్రాయేలు ప్రజలందరికీ సేవ
చేస్తారు. పవిత్ర గుడారంలో ఆరాధించటంలో ఇది
వారి విధానం. 9"లేవీయులు ఇశ్రాయేలు ప్రజలందరిలో
నుండి ఏర్పాటు చేసుకోబడ్డారు. ఈ లేవీయులు అహ
రోనుకు, అతని కుమారులకు సహాయం చేసేందుకు
ఏర్పాటు చేయబడ్డారు."
10"అహరోనును, అతని కుమారులను యాజకు
లుగా నీవు నియమించు. వారు, వారి బాధ్యతను
నిర్వహిస్తూ యాజకులుగా సేవ చేయాలి,
పవిత్ర వస్తువులను సమీపించేందుకు ప్రయత్నించే
ఏ వ్యక్తి అయినా చంపివేయబడాలి."
11ఇంకా మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
12"ఇశ్రాయేలీయులు ప్రతి కుటుంబంలోను పెద్ద
కుమారుణ్ణి నాకు ఇవ్వాలని, నేను నీతో చెప్పాను,
కానీ నన్ను సేవించేందుకు ఇప్పుడు లేవీయులను
నేను ఏర్పాటు చేసుకుంటున్నాను. వారు నా వారై
ఉంటారు. అందుచేత మిగిలిన ఇశ్రాయేలు ప్రజలంతా
వారి పెద్ద కుమారులను నాకు ఇవ్వాల్సిన అవసరం
లేదు.
13"మీరు ఈజిప్టులో ఉన్నప్పుడు, ఈజిప్టు ప్రజల
పెద్ద కుమారులందర్నీ నేను చంపాను. ఆ సమయంలో
ఇశ్రాయేలు పెద్ద కుమారులందరిని నా వాళ్లుగా నేను
అంగీకరించాను. పెద్ద కుమారులందరు నా వారు,
పశువులలో ప్రథమంగా పుట్టినవన్నీ నావే. కానీ మీ
పెద్దలందరినీ నేను మీకు తిరిగి ఇచ్చివేస్తున్నాను,
మరియు లేవీయులను నా వారిగా చేసుకుంటున్నాను.
నేను యెహోవాను."
14సీనాయి అరణ్యంలో మోషేతో మరోసారి
యెహోవా మాట్లాడాడు: యెహోవా ఇలా చెప్పాడు,
15"లేవీ వంశంలో ఉన్న లేవీలను, కుటుంబాలను
అన్నింటినీ లెక్కించు. ప్రతి పురుషుని, ఒక నెలగాని
అంతకంటె ఎక్కువగాని వయస్సు ఉన్న ప్రతి బాలుని
లెక్కించు."
16కనుక మోషే యెహోవాకు విధేయుడయ్యాడు.
అతడు వాళ్లందర్నీ లెక్కించాడు.
17లేవీకి ముగ్గురు కుమారులు. వారి పేర్లు: గెర్షోను,
కహాతు, మెరారి.
18ఒక్కో కుమారుడు ఎన్నో వంశాలకు నాయ
కుడు. గెర్షోను కుటుంబంలో, లిబ్నీ, షిమీ. 19కహాతు
కుటుంబంలో, అమ్రాము, ఇస్హారు, హెబ్రోను, ఉజ్జీ
యేలు, 20మెరారి కుటుంబంలో, మహలి, ముషి. ఇవి
లేవీ వంశానికి చెందిన కుటుంబాలు. 21లిబ్ని, షిమి
వంశాలు గెర్షోను కుటుంబానికి చెందినవి. అవి గెర్షోనీ
వంశాలు.
22ఈ రెండు కుటుంబాలలోను ఒక నెల వయసు
దాటిన బాలురు, పురుషులు 7,500 మంది ఉన్నారు.
23గెర్షోని కుటుంబాలు పశ్చిమాన నివాసం చేయాలని
చెప్పబడింది. పవిత్ర గుడారం వెనుకవైపు వారు
నివాసము చేసారు.
24లాయెలు కుమారుడు ఎలీయా సాపు గెర్షోనీ
ప్రజల కుటుంబాలకు నాయకుడు. 25పవిత్ర గుడారం,
దాని కప్పు, వెలుపలి గుడారం కాపాడుట పవిత్ర
గుడారంలో గెర్షోనీ ప్రజల బాధ్యత. సన్నిధి గుడారం
ప్రవేశంలో ఉన్న తెర బాధ్యత కూడా వారే
తీసుకున్నారు.
26ఆవరణలో తెర బాధ్యత కూడా వారే వహించారు.
ఆవరణానికి గల ప్రవేశం యొక్కతెర విషయం కూడా
వారే శ్రద్ధ పుచ్చుకున్నారు. పవిత్ర గుడారానికి, బలి
పీఠానికి చుట్టూ ఉంది ఈ ఆవరణ. తాళ్ల విషయం,
తెరలకు సంబంధించిన వాటన్నింటి విషయం వారే
జాగ్రత్త తీసుకున్నారు.
27అమ్రాము, ఇస్హారు, హెబ్రోను, ఉజ్జీయేలు
వంశాలు కహాతు కుటుంబానికి చెందినవి. వారు కహాతీ
వంశపువారు. 28పురుషులు ఒక నెల వయసు దాటిన

బాలురు, 8,600* మంది ఈ కుటుంబంలో ఉన్నారు.
పవిత్ర స్థలంలోని వాటిని కాపాడే బాధ్యత కహాతు
ప్రజలకు ఇవ్వబడింది. 29 పవిత్ర గుడారం దక్షిణ దిశ
కహాతీ వంశానికి ఇవ్వబడింది. ఇది వారు నివాసం చేసిన
ప్రదేశం. 30ఉజ్జీయేలు కుమారుడు ఎలీషాపాను కహాతీ
వంశాల నాయకుడు. 31పవిత్ర పెట్టె, బల్ల, దీపస్తంభం,
పవిత్ర స్థలంలోని పాత్రలను కాపాడటం వారి బాధ్యత.
తెర విషయం, దానితోబాటు ఉపయోగించిన వస్తువుల
న్నింటి విషయంకూడా వారు శ్రద్ధ తీసుకున్నారు.

32అహరోను కుమారుడును యాజకుడైన ఎలి
యాజరు లేవీ ప్రజానాయకులకు నాయకుడు. పవిత్ర
పరికరాలను కాపాడే వారందరిపై ఎలియాజరు పరీ
శీలకుడు.

33-34మాహలీ, మూషి కుటుంబాలు మెరారి వంశానికి
చెందినవి. ఒక నెల దాటిన బాలురు, పురుషులు మహలీ
కుటుంబంలో 6,200 మంది ఉన్నారు. 35అబీహాయిలు
కుమారుడైన సూరీయేలు మెరారి వంశానికి నాయ
కుడు. పవిత్ర గుడారం ఉత్తర ప్రదేశం ఈ వంశానికి
ఇవ్వబడింది. ఇది వారు నివాసం చేసిన ప్రదేశం. 36
పవిత్ర గుడారపు చట్రాలను కాపాడే బాధ్యత మెరారి
ప్రజలకు ఇవ్వబడింది. పవిత్ర గుడారపు చట్రాలతో
బాటు వాటి పలకలను, అడ్డకర్రలను, స్తంభాలను.
దిమ్మలను, పరికరాలను, దానికి సంబంధించిన
వాటన్నింటినీ వారు కాపాడారు. 37పవిత్ర గుడారం
చుట్టు ప్రక్కల స్తంభాలన్నింటినీ వారు కాపాడారు.
వాటి దిమ్మలు, మేకులు, తాళ్లు కూడ ఇందులో
ఉన్నాయి.

38సన్నిధి గుడారం ఎదుట పవిత్ర గుడారానికి
తూర్పున మోషే, అహరోను, అతని కుమారులు విడిది
చేసారు. పవిత్ర స్థలాన్ని కాపాడే బాధ్యత వారికి ఇవ్వ
బడింది. ఇది ఇశ్రాయేలీయులందరి పక్షంగా వారు
చేసారు. వేరే వారెవరైనా పవిత్ర స్థలం దగ్గరగా వస్తే
చంపేయాల్సిందే.

39లేవీ వంశంలో ఒక నెలగాని, అంతకు మించిగాని
వయస్సున్న బాలురను పురుషులను లెక్కించమని
మోషే, అహరోనులకు యెహోవా ఆజ్ఞాపించాడు.
మొత్తం సంఖ్య 22,000.

### లేవీయులు పెద్ద కుమారుల స్థానం వహించారు

40మోషేతో యెహోవా ఇలా అన్నాడు: "ఇశ్రాయే
లీయులలో ఒక నెలగాని అంతకంటె ఎక్కువగాని
వయసుగల మొదట పుట్టిన బాలురను, పురుషులను
అందరినీ లెక్కించు, వారి పేర్ల జాబితా ఒకటి తయారు
చేయి. 41ఇప్పుడు ఇశ్రాయేలీయుల పెద్ద కుమారులను
నేను తీసుకోను. ఇప్పుడు యెహోవానగు నేను లేవీ
యులను స్వీకరిస్తాను. ఇశ్రాయేలీయులలో ఇతరుల
పశువులలో మొదటి ఫలమంతటినీ తీసుకొనే బదులు
లేవీయుల పశువుల మొదటి ఫలాన్ని నేను తీసు
కుంటాను."

42కనుక యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారం మోషే
చేసాడు. ఇశ్రాయేలు ప్రజల పిల్లల్లో పెద్ద వారినందరినీ
మోషే లెక్కించాడు. 43ఒక నెల, అంతకంటె ఎక్కువ
వయసుగల మొదట పుట్టిన బాలురను, పురుషులను
మోషే జాబితా చేసాడు. ఆ జాబితాలో 22,273 మంది
ఉన్నారు.

44మోషేతో యెహోవా ఇంకా ఇలా అన్నాడు:
45"నేనే, యెహోవాను ఈ ఆజ్ఞ ఇస్తున్నాను; 'ఇశ్రా
యేలీయుల ఇతర కుటుంబాల్లోని మొదట పుట్టిన
వారందరి బదులు లేవీయులను తీసుకో. మిగిలిన
ప్రజల పశువులకు బదులు లేవీయుల పశువులను
నేను తీసుకుంటాను. లేవీయులు నా వారు. 46లేవీ
యులు 22,000 మంది ఉన్నారు కానీ, ఇతర కుటుం
బాల్లోని పెద్ద కుమారులు 22,273 మంది ఉన్నారు.
అనగా లేవీయులకంటె 273 మంది పెద్ద కుమారులు
ఎక్కువగా ఉన్నారు. 47కనుక ఆ 273 మందిలో ప్రతి
ఒక్కరి వద్దా అధికారిక కొలతనుపయోగించి అయిదు
తులాల వెండి తీసుకో. (ఇది20 చిన్నములు బరువుగల
అధికారిక కొలత.) ఇశ్రాయేలు ప్రజలవద్ద ఆ వెండి
వసూలు చేయి. 48ఆ వెండిని అహరోనుకు అతని
కుమారులకు ఇవ్వు. అది 273 మంది ఇశ్రాయేలీ
యులకు విమోచనా ధనం.' "

49కనుక 273 మంది కొరకు ఈ ధనాన్ని మోషే
వసూలు చేసాడు. ఈ 273 మంది స్థానాన్ని లేవీ
వంశం వహించలేకపోయింది. 50ఇశ్రాయేలు ప్రజలలో
మొదట పుట్టినవారినుండి వెండిని మోషే వసూలు
చేసాడు. అధికారిక కొలత ప్రకారం 1,365 వెండి
తులాలను అతడు వసూలు చేసాడు. 51యెహోవాకు
మోషే విధేయుడయ్యాడు. యెహోవా ఆజ్ఞాపించిన
ప్రకారం అహరోనుకు, అతని కుమారులకు ఆ వెండిని
మోషే ఇచ్చాడు.

### కహాతు కుటుంబ బాధ్యతలు

4 మోషే అహరోనులతో యెహోవా ఇలా
చెప్పాడు: 2"కహాతు వంశంలోని కుటుంబాలకు
చెందిన పురుషులను లెక్కించండి. (కహాతు వంశం
లేవీ వంశంలోని ఒక భాగం.) 3సైన్యంలో పని చేసిన
వారిలో 30 నుండి 50 సంవత్సరాల వరకు వయసుగల
పురుషులందరినీ లెక్కించండి. ఈ పురుషులు సన్నిధి
గుడారంలో పని చేస్తారు. 4సన్నిధి గుడారంలో అత్యంత
పవిత్ర స్థలాన్ని జాగ్రత్తగా చూసుకోవటం వారి పని.

---

**8,600** ప్రాచీన గ్రీకులో 8,300 అని ఉంది. హెబ్రీ
ప్రతుల్లో 8,600 అని ఉంది. సంఖ్యా. 3;22, 28, 34, 39
చూడుండి.

5 "ఇశ్రాయేలు ప్రజలు ఒక కొత్త స్థలానికి ప్రయాణం
చేసినప్పుడు, అహరోను, అతని కుమారులు సన్నిధి
గుడారంలోనికి వెళ్లి, తెరనుదించి, దానితో పవిత్ర
ఒడంబడిక పెట్టెను కప్పాలి. 6 తర్వాత దీనంతటినీ
శ్రేష్ఠమైన తోలుతో కప్పాలి. అప్పుడు దానంతటి మీద
నీలం రంగు బట్ట పరచి, దాని మోత కర్రలను పవిత్ర
పెట్టె ఉంగరాలలో దూర్చాలి.
7 "తర్వాత పవిత్ర బల్ల మీద ఒక నీలం బట్టను
వారు పర్చాలి. అప్పుడు గిన్నెలను, ధూపార్తులను,
పాత్రలను, పానము చేయు పాత్రలను వారు ఆ బల్ల
మీద పెట్టాలి. ప్రత్యేక రొట్టెలను కూడ ఆ బల్ల మీద
పెట్టాలి. 8 అప్పుడు వీటన్నింటిమీద ఒక ఎర్రబట్టను
మీరు వేయాలి. తర్వాత శ్రేష్ఠమైన తోలుతో అన్నింటినీ
కప్పాలి. అప్పుడు బల్ల ఉంగరాల్లో దండెలను పెట్టాలి.
9 "తర్వాత దీపస్తంభాన్ని, దాని దీపాలను నీలం
బట్టతో కప్పాలి. దీపాలను ప్రకాశింప చేసేందుకు
వినియోగించిన వస్తువులన్నింటినీ, దీపాలకు ఉప
యోగించిన నూనె పాత్రలను కప్పాలి. 10 అప్పుడు
ప్రతి దానిని శ్రేష్ఠమైన తోలుతో చుట్టి, వీటిని మోసేం
దుకు ఉపయోగించే దండెలమీద వీటిని ఉంచాలి.
11 "బంగారు బలిపీఠం మీద నీలం బట్టను పరచాలి.
దానిని శ్రేష్ఠమైన తోలుతో కప్పాలి. అప్పుడు బలిపీఠపు
ఉంగరాలలో దాని, మోత కర్రలను ఉంచాలి.
12 "తర్వాత పవిత్ర స్థలంలో ఆరాధనకు ఉపయో
గించే ప్రత్యేక వస్తువులన్నింటినీ సమకూర్చాలి. ఆ
వస్తువులను ఒక్క చోట సమకూర్చి, నీలం బట్టతో
వాటిని చుట్టి పెట్టాలి. అప్పుడు దాన్ని శ్రేష్ఠమైన
తోలుతో కప్పాలి. వీటిని మోసేందుకు ఒక చట్రంమీద
వాటిని ఉంచాలి.
13 "ఇత్తడి బలిపీఠపు బూడిదను తీసివేసి, ధూమ్ర
వర్ణంగల బట్టను దానిమీద పరచాలి. 14 తర్వాత బలిపీఠం
దగ్గర ఆరాధనకు ఉపయోగించే వస్తులన్నింటినీ సమ
కూర్చాలి. అవి ఏవనగా, ధూపార్తి, ముండ్ల గరిటెలు,
గిన్నెలు, ఇతర పరికరాలు. వీటన్నింటినీ యిత్తడి బలి
పీఠం మీద ఉంచాలి. తర్వాత బలిపీఠం మీద శ్రేష్ఠమైన
తోలు కప్పాలి. బలిపీఠపు ఉంగరాల్లో దానిమోత కర్రలు
ఉంచాలి.
15 "అహరోను, అతని కుమారులు పవిత్ర స్థలంలో
పవిత్ర వస్తువులన్నింటినీ కప్పటం అయిన తర్వాత,
కహాతు కుటుంబపు పురుషులు లోనికి వెళ్లి, ఆ వస్తు
వులను మోయటం మొదలు పెట్టవచ్చు. ఈ విధంగా
వారు చావకుండేలా పవిత్ర స్థలాన్ని తాకరు.
16 "యాజకుడైన అహరోను కుమారుడు ఎలియా
జరు పవిత్ర గుడారానికి బాధ్యుడు. పవిత్ర స్థలానికి,
దానిలోని సమస్తానికి అతడు బాధ్యుడు. దీపాల నూనె,
పరిమళ ధూపద్రవ్యాలు, నిత్యార్పణ, అభిషేక తైలం,
వీటన్నింటికీ అతడు బాధ్యుడు."

17 మోషే అహరోనులతో యెహోవా ఈలాగు
అన్నాడు: 18 "జాగ్రత్తగా ఉండండి, ఆ కహాతీ మను
ష్యుల్ని నాశనం కానివ్వకండి. 19 కహాతీ మనుష్యులు
అతి పవిత్ర స్థలాన్ని సమీపించికూడ మరణించకుండా
ఉండేటట్టుగా మీరు వీటిని చేయాలి. అహరోను, అతని
కుమారులు లోనికి వెళ్లి, కహాతీ మనుష్యులు ఒక్కొ
క్కరు ఏమేమి చేయాల్సిందీ చూపెట్టాలి. ఒక్కొక్కడు
మోయవలసిన వాటిని వారు ఒక్కొక్కనికి ఇవ్వాలి.
20 మీరు ఇలా చేయకపోతే, కహాతీ మనుష్యులు లోనికి
వెళ్లి, పవిత్ర వస్తువులను చూచి, అవి ముఖ్యమైనవి
కానట్టుగా ఎంచవచ్చును. వారు గనుక అలా ఒక
క్షణంపాటుచేస్తే, వారు మరణిస్తారు."

## గెర్షోను కుటుంబం పనులు

21 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 22 "గెర్షోను
సంతతిలో మనుష్యులందరినీ లెక్కించు. వంశాలుగా,
కుటుంబాలుగా వారి జాబితా తయారుచేయి. 23 30
నుండి 50 సంవత్సరాల వయస్సుగలిగి, యుద్ధంలో
పనిచేసిన పురుషులందరినీ లెక్కించు. వీరంతా సన్నిధి
గుడారాన్ని జాగ్రత్తగా చూసుకునే పని చేస్తారు.
24 "గెర్షోను కుటుంబమువారు చేయాల్సినవి,
మోయాల్సినవి ఇవి: 25 పవిత్ర గుడారపు తెరలు, సన్నిధి
గుడారం, దాని కప్పు, శ్రేష్ఠమైన తోలుతో చేయబడ్డ
కప్పు వారు మోయాలి. సన్నిధి గుడార ప్రవేశం దగ్గర
తెరను కూడా వారు మోయాలి. 26 పవిత్ర గుడారం
చుట్టూ బలిపీఠం చుట్టూ ఉండే ఆవరణ తెరలన్నీ
వారు మోయాలి. మరియు ఆవరణ ప్రవేశానికి ఉండే
తెరను కూడ వారు మోయాలి. తెరలకు ఉపయోగించే
వస్తువులన్నింటినీ, తాళ్లన్నింటినీ వారే మోయాలి. వీటి
విషయంలో ఏది చేయాల్సి వచ్చినా గెర్షోను
కుటుంబము వాళ్లే బాధ్యులు. 27 జరుగుతున్న పని
అంతటినీ అహరోను, అతని కుమారులు గమనిస్తూ
ఉంటారు. గెర్షోను ప్రజలు మోసేవాటిని, చేసేవాటినీ
అన్నింటినీ అహరోను, అతని కుమారులు గమనిస్తుం
టారు. వారు ఏ వస్తువులు మోయుటకు బాధ్యులో
వాటన్నింటిని గూర్చి నీవు వారితో చెప్పాలి. 28 గెర్షోను
కుటుంబమువారు సన్నిధి గుడారం కోసం చేయాల్సిన
పని ఇది. యాజకుడైన అహరోను కుమారుడు ఈతా
మారు వారి పనికి బాధ్యుడు."

## మెరారి కుటుంబం వారి పనులు

29 "మెరారియులలోని వంశాలు, కుటుంబాలలో
ఉన్న పురుషులందరినీ లెక్కించు. 30 30 నుండి 50
సంవత్సరాల వయసు కలిగి యుద్ధంలో పని చేసిన
పురుషులందరినీ లెక్కించు. వీరు సన్నిధి గుడారం
కోసం ఒక ప్రత్యేక పని చేస్తారు. 31 మీరు ప్రయాణం
చేసేటప్పుడు సన్నిధి గుడారపు పలకలు మోయటం

వారి పని. అడ్డకర్రలు, స్తంభాలు, దిమ్మెలను వారు
మోయాలి. [32]ఆవరణ చుట్టూ ఉండే స్తంభాలు కూడ
వారు మోయాలి. దిమ్మెలను, గుడారపు మేకులను,
తాళ్లను, ఆవరణ చుట్టూ ఉండే స్తంభాలకు ఉపయో
గించే సమస్తం వారు మోయాలి. పేర్ల జాబితా చేసి,
సరిగ్గా ఒక్కో మనిషి ఏమి మోయాలో వారికి చెప్పు.
[33]సన్నిధి గుడారపు పనిలో సేవ చేసేందుకు మెరారి
ప్రజలు చేయాల్సిన పనులు ఇవి. యాజకుడైన అహ
రోను కుమారుడు ఈతామారు వారి పనికి బాధ్యుడు."

### లేవీ కుటుంబాలు

[34]మోషే, అహరోను, ఇశ్రాయేలు ప్రజా నాయకులు
కహాతీ ప్రజలను లెక్కించారు. వంశాలుగా, కుటుంబా
లుగా వారు వారిని లెక్కించారు. [35]30నుండి 50 సంవత్స
రాల వయసు గలిగి యుద్ధంలో పని చేసిన పురుషులంద
రిని వారు లెక్కించారు. సన్నిధి గుడారంకోసం చేయా
ల్సిన ప్రత్యేక పని వీరికి అప్పగించబడింది.

[36]ఈ పని చేసేందుకు అర్హులు 2,750 మంది
పురుషులు కహాతు వంశంలో ఉన్నారు. [37]కనుక కహాతు
వంశంలోని ఈ పురుషులకు సన్నిధి గుడారం కోసం
చేయాల్సిన ప్రత్యేక పని అప్పగించబడింది. మోషేతో
యెహోవా చెప్పిన ప్రకారం మోషే, అహరోను యిలా
చేసారు.

[38]మరియు, గెర్షోను కుటుంబం కూడ లెక్కించ
బడింది. [39]30 నుండి 50 సంవత్సరాల వయసు ఉండి
సైన్యంలో పని చేసిన పురుషులంతా లెక్కించబడ్డారు.
సన్నిధి గుడారం కోసం వారు చేయాల్సిన ప్రత్యేక
పని ఈ మనుష్యులకు అప్పగించటం జరిగింది.
[40]గెర్షోను వంశాల్లో అర్హులైన పురుషులు 2,630 మంది
ఉన్నారు. [41]కనుక గెర్షోను వంశంలోని ఈ మనుష్యు
లకు సన్నిధి గుడారం కోసం చేయాల్సిన ప్రత్యేక పని
అప్పగించటం జరిగింది. మోషేకు యెహోవా చెప్పిన
ప్రకారం మోషే, అహరోను ఇలా చేసారు.

[42]మరియు మెరారి వంశంలోని పురుషులు లెక్కించ
బడ్డారు. [43].30 నుండి 50 సంవత్సరాల వయసు ఉండి
సైన్యంలో పని చేసిన పురుషులంతా లెక్కించబడ్డారు.
సన్నిధి గుడారం కోసం వీరు చేయాల్సిన ప్రత్యేక పని
వీరికి అప్పగించబడింది. [44]మెరారి వంశాల్లో అర్హులైన
పురుషులు 3,200 మంది ఉన్నారు. [45]కనుక మెరారి
వంశంలోని ఈ పురుషులకు వారి ప్రత్యేక పని అప్ప
గించబడింది. మోషేతో యెహోవా చెప్పిన ప్రకారం
మోషే అహరోనులు ఇలా చేసారు.

[46]కనుక మోషే, అహరోను, ఇశ్రాయేలు ప్రజా
నాయకులు లేవీయులలోని పురుషులందరినీ లెక్కిం
చారు. ప్రతి వంశాన్ని, ప్రతి కుటుంబాన్ని వారు లెక్కిం
చారు. [47]30నుండి 50 సంవత్సరాల వయసువుండి
సైన్యంలో పని చేసిన పురుషులందరూ లెక్కించ
బడ్డారు. సన్నిధి గుడారం కోసం చేయాల్సిన ప్రత్యేక
పని వీరికి అప్పగించబడింది. వారు ప్రయాణం చేసిన
ప్పుడు సన్నిధి గుడారాన్ని మోసే పనిని వారు చేసారు.
[48]వారి మొత్తం సంఖ్య 8,500.

[49]మోషేకు ఈ ఆజ్ఞను యెహోవా ఇచ్చాడు.
ఒక్కో మనిషికి ఒక్కో పని ఇవ్వబడింది. ఏ మనిషి
ఏమి మోయాలో ఆ మనిషికి చెప్పబడింది. కనుక
యెహోవా ఆజ్ఞ ప్రకారం చేయబడింది. పురుషులంతా
లెక్కించబడ్డారు.

### పరిశుభ్రత నియమాలు

5 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [2]"ఇశ్రా
యేలు ప్రజలు వ్యాధులు, రోగములు లేకుండ
వారి నివాసమును కాపాడుకోవాలని నేను ఆజ్ఞాపిస్తు
న్నాను. కుష్ఠురోగం ఉన్న ఏ మనిషైనా సరే వారి
నివాసములోనుండి పంపించి వేయాలని ప్రజలతో
చెప్పు. స్రావంగల ప్రతి మనిషినీ వారి నివాసంలోనుండి
పంపివేయాలని వారితో చెప్పు. శవాన్ని ముట్టిన ప్రతి
మనిషినీ వారి నివాసమునుండి పంపివేయాలని వారితో
చెప్పు. [3]అతడు స్త్రీగాని, పురుషుడుగాని గొప్పేమీ
కాలేదు. రోగాన్ని వ్యాధిని వారు మీ నివాసములో
వ్యాపింపజేయకుండునట్లు వారిని మీ నివాసమునుండి
బయటకు పంపించివేయండి. మీ నివాసములో మీ
మధ్య నేను నివసిస్తున్నాను."

[4]కనుక ఇశ్రాయేలు ప్రజలు దేవుని ఆజ్ఞకు విధేయు
లయ్యారు. అలాంటి వారిని నివాసము వెలుపలకు
వారు పంపించివేసారు. మోషేకు యెహోవా ఆజ్ఞా
పించిన ప్రకారం వారు ఇలా చేసారు.

### తప్పు చేస్తే శిక్ష

[5]మోషేతో యెహోవా ఈలాగు చెప్పాడు: [6]"ఇశ్రా
యేలు ప్రజలతో ఇలా చెప్పు: ఒకడు మరొక వ్యక్తికి
కీడు చేస్తాడు. (ఒకడు ఇతరులకు కీడు చేస్తే వాడు
నిజానికి దేవునికి వ్యతిరేకంగా పాపం చేస్తున్నాడు.)
అతడు దోషి. [7]కనుక అతడు తాను చేసిన పాపం
గూర్చి ప్రజలతో చెప్పాలి. తర్వాత అతడు చేసిన
తప్పుకు పూర్తిగా విలువ చెల్లించాలి. అతడు ఎవరికి
నష్టం కలిగించాడో ఆ మనిషికి చెల్లించాల్సినదానికి
ఇంకా ఐదో వంతు కలిపి చెల్లించాలి. [8]కానీ ఒక వేళ
ఎవరికైతే అతడు నష్టం కలిగించాడో అతడు చని
పోతాడు. ఒక వేళ నష్టపరిహారం పుచ్చుకొనేందుకు,
చనిపోయిన వ్యక్తికి నావాళ్లు అనుటకు ఎవరు ఉండరు.
అలాంటప్పుడు తప్పు చేసినవాడు ఆ విలువను
యెహోవాకు చెల్లించాలి. అతడు పూర్తి మొత్తాన్ని
యాజకునికి చెల్లించాలి. యాజకుడు ప్రాయశ్చిత్తా
ర్థపు పొట్టేలును బలిగా అర్పించాలి. తప్పు చేసిన ఆ
మనిషి పాపాలు క్షమింపబడుటకు బలిగా పొట్టేలు

అర్పించబడాలి. మిగిలిన విలువను యాజకుడు ఉంచు
కోవచ్చును.
9"ఇశ్రాయేలు ప్రజల్లో ఒకడు దేవునికి ఒక ప్రత్యేక
కానుక ఇస్తే, దానిని స్వీకరించే యాజకుడు దానిని
ఉంచుకోవచ్చును. అది అతనిదే. 10ఈ ప్రత్యేక కాను
కలు అర్పించాల్సిన అవసరం అంటూ ఏమీ లేదు.
కాని ఎవరైనా అలా ఇస్తే, అవి యాజకునికే చెందు
తాయి."

### అనుమానం భర్తలు

11అప్పుడు మోషేతో యెహోవా ఈలాగున
చెప్పాడు: 12"ఇశ్రాయేలు ప్రజలతో ఈ విషయాలు
చెప్పు: ఒకని భార్య అతనికి అపనమ్మకంగా ఉంటుంది.
13ఆమె మరొకనితో శయనించి, తన భర్తకు తెలియ
కుండా ఈ విషయం దాచిపెడుతుంది. ఆమె చేసిన
తప్పునుగూర్చి ఆమె భర్తకు ఎప్పటికి తెలియ
కపోవచ్చు. ఆమె ఈ పాపం చేసిందని అతనితో చెప్పే
వారు ఎవరూ ఉండక పోవచ్చు. మరియు ఆ స్త్రీ తన
పాపం విషయం తన భర్తకు చెప్పకపోవచ్చు. 14కానీ,
తన భార్య తనకు వ్యతిరేకంగా పాపం చేసిందని ఆ
భర్త అనుమానించటం ప్రారంభం కావచ్చు. అతనిలో
కోపం కలుగుతూ వుండవచ్చు. ఆమె పవిత్రంగా లేదని,
తనకు నమ్మకంగా లేదని అతనిలో అనుమానం ఏర్ప
డుతూ ఉండవచ్చు. 15అలా జరిగితే, అతడు తన
భార్యను యాజకుని దగ్గరకు తీసుకునిపోవాలి. ఆ
భర్త ఒక అర్పణకూడ తీసుకొని వెళ్లాలి. ఆ అర్పణ
తూమెడు యవలపిండిలో పదోవంతు. యవలపిం
డిలో నూనెగాని సాంబ్రాణిగాని వేయకూడదు. ఈ
యవల పిండి యెహోవాకు ధాన్యార్పణ. భర్త రోషం
మూలంగా అది అర్పించబడింది. అతని భార్య అతనికి
అపనమ్మకంగా ఉందని అతడు నమ్ముతున్నట్టు ఈ
అర్పణ సూచిస్తుంది.
16"యాజకుడు ఆ స్త్రీని యెహోవా ఎదుట నిలువ
బెడ్తాడు. 17అప్పుడు యాజకుడు మట్టి పాత్రలో
పవిత్ర జలం పోస్తాడు. పవిత్ర గుడారంలోని నేల
మీద మట్టి కొంత తీసుకుని, దానిని ఆ నీళ్లలో వేస్తాడు
యాజకుడు. 18ఆ స్త్రీని యెహోవా ఎదుట నిలచి
వుండమని యాజకుడు ఆమెను బలవంతం చేస్తాడు.
అప్పుడతడు ఆమె తల వెంట్రుకలను వదులుగా విడిచి,
ధాన్యార్పణను ఆమె చేతిలో పెడతాడు. ఇది తన భర్త
రోషం విషయం అర్పించే యవల పిండి. అదే సమ
యంలో పవిత్ర జలం ఉన్న మట్టి పాత్రను అతడు
పట్టుకొంటాడు. ఇది ఆ స్త్రీకి చిక్కుతెచ్చిపెట్టే పవిత్ర
జలం.
19"అప్పుడు అబద్ధం చెప్పకూడదని యాజకుడు
ఆ స్త్రీతో చెబుతాడు. సత్యం చెబుతానని ఆమె వాగ్దానం
చేయాలి. యాజకుడు ఆమెతో ఇలా అంటాడు, 'నీవు
ఇంకో మగవాడితో శయనించి ఉండకపోతే, నీ భర్తను
పెళ్లాడిన నీవు, అతనికి వ్యతిరేకంగా పాపం చేసి ఉండక
పోతే, కష్టం కలిగించే ఈ జలం నీకు హాని చేయదు.
20కానీ నీవు నీ భర్తకు వ్యతిరేకంగా పాపం చేసి ఉంటే,
నీవు మరో మగవాడితో శయనించి ఉంటే నీకు ఏదో
కీడు జరుగుతుంది. నీవు పవిత్రురాలివి కాదు. ఎందు
చేతనంటే నీ భర్తకాని వాడైన పర పురుషుడు నీతో
శయనించి నిన్ను అపవిత్రం చేసాడు. 21కనుక నీవు
ప్రత్యేక జలం తాగినప్పుడు నీకు గొప్ప కీడు సంభవి
స్తుంది. నీ కడుపు ఉబ్బిపోతుంది, ఇంక నీకు పిల్లలు
పుట్టరు. నీవు గర్భవతివి అయితే నీ శిశువు చని
పోతుంది. అప్పుడు నీ వాళ్లంతా నిన్ను విడిచిపెట్టేసి,
నిన్నుగూర్చి చెడుగా చెప్పుకొంటారు.' "ఆ స్త్రీ
యెహోవాకు ప్రత్యేక ప్రమాణం చేయాలని యాజ
కుడు ఆమెతో చెప్పాలి. ఆ స్త్రీ అబద్ధం గనుక చెబితే
ఈ కీడు తనకు జరుగుతుందని ఒప్పుకోవాలి. 22"నీ
శరీరంలో హాని కలిగించే ఈ నీళ్లు నీవు తాగాలి. నీవు
పాపం చేసి ఉంటే నీకు పిల్లలు పుట్టరు, నీకు కలిగే ఏ
శిశువైనా సరే పుట్టక ముందే చనిపోతుంది' అని
యాజకుడు చెప్పాలి. అప్పుడు ఆ స్త్రీ 'నీవు చెప్పినట్టు
చేయటానికి నేను ఒప్పుకుంటున్నాను' అని చెప్పాలి.
23"యాజకుడు ఈ హెచ్చరికలను ఒక పత్రంమీద
వ్రాయాలి. అప్పుడు అతడు ఆ మాటలను నీళ్లలోనికి
తుడిచివేయాలి. 24అప్పుడు హాని కలిగించే ఆ నీళ్లను
ఆ స్త్రీ తాగుతుంది. ఆ నీళ్లు ఆమెలో ప్రవేశించి,
ఆమె దోషి అయితే, ఆమెకు చాల శ్రమ కలిగిస్తాయి.
25"అప్పుడు యాజకుడు ఆమె దగ్గరనుండి ధాన్యా
ర్పణ తీసుకుని (రోషమునకు అర్పించు అర్పణ)
దానిని యెహోవా ఎదుట పైకి ఎత్తుతాడు. తర్వాత
బలిపీఠం దగ్గరకు దానిని తెస్తాడు. 26ఆ తర్వాత యాజ
కుడు తన చేతినిండా ధాన్యార్పణ పట్టుకొని బలిపీఠం
మీద ఉంచుతాడు. అప్పుడు అతడు దానిని దహిస్తాడు.
ఆ తర్వాత ఆ నీళ్లు త్రాగమని అతడు ఆ స్త్రీతో
చెబుతాడు. 27ఆ స్త్రీ తన భర్తకు వ్యతిరేకంగా పాపం
గనుక చేసి ఉంటే, ఆ నీళ్లు ఆమెకు హాని కలిగిస్తాయి.
ఆ నీళ్లు ఆమె శరీరంలోనికి పోయి, ఆమెకు చాలా
శ్రమ కలిగిస్తాయి. ఆమెలో ఏదైనా శిశువు ఉంటే అది
పుట్టక ముందే మరణిస్తుంది, ఆమె ఎన్నటికీ పిల్లలను
కనదు. ప్రజలంతా ఆమెకు వ్యతిరేకం అవుతారు. 28కానీ
ఆ స్త్రీ తన భర్తకు వ్యతిరేకంగా పాపం చేసి ఉండకపోతే,
ఆమె పవిత్రంగా ఉంటే అప్పుడు ఆమె నిర్దోషి అని
యాజకుడు చెబుతాడు. అప్పుడు ఆమె మామూలుగా
ఉండి పిల్లలను కనగల్గుతుంది.
29"అందుచేత రోషమునుగూర్చిన ఆజ్ఞ ఇది. తన
భర్తతో వివాహం జరిగిన ఒక స్త్రీ తన భర్తకు వ్యతిరేకంగా
పాపం చేసినప్పుడు నీవు చేయాల్సింది ఇది. 30లేక
ఒకడు తన భార్య తనకు వ్యతిరేకంగా పాపం చేసిందని

అనుమానించినప్పుడు అతడు చేయాల్సింది ఇది. ఆ
స్త్రీని యెహోవా యెదుట నిలువమని యాజకుడు
చెప్పాలి. అప్పుడు యాజకుడు ఇవన్నీ చేయాలి.
ఇది ఆజ్ఞ. 31ఇలా చేసినందువల్ల భర్త తప్పు చేసినట్టు
కాదు. కానీ ఆ స్త్రీ మాత్రం పాపం చేసి ఉంటే శ్రమ
అనుభవిస్తుంది."

### నాజీరులు

6 మోషేతో యెహోవా ఇలా అన్నాడు: 2"ఇశ్రాయే
లీయులతో ఈ విషయాలు చెప్పు: ఒక పురు
షుడు గాని స్త్రీగాని కొన్నాళ్ల పాటు ఒకరినుండి ఒకరు
ప్రత్యేకంగా ఉండాలని కోరవచ్చును. ఈ ప్రత్యేకించు
కోవటంలో ఉద్దేశం, అతడు ఆ వ్యవధిలో తనను
తాను సంపూర్ణంగా యెహోవాకు అర్పించుకోవటమే.
అతడు నాజీరు అని పిలువబడతాడు. 3ఆ కాలంలో
అతడు ద్రాక్షామద్యంగాని ఇంకే మత్తు పానీయంగాని
తాగకూడదు. ద్రాక్షారసంనుండి తీయబడిన చిరకను
గాని ఇంకే మత్తు పానీయంగాని అతడు తాగకూడదు.
ద్రాక్షాపండ్లుగాని, ఎండిన ద్రాక్షాలుగాని అతడు తిన
కూడదు, ద్రాక్షారసం తాగకూడదు. 4వేరుగా ఉండే ఆ
ప్రత్యేక సమయంలో ద్రాక్షానుండి వచ్చేది ఏదీ అతడు
తినకూడదు. ద్రాక్షాగింజలను, దాని తోలును కూడ
అతడు తినకూడదు.

5"అలా వేరుగా ఉండే కాలంలో అతడు తన తల
వెంట్రుకలు కత్తిరించుకోకూడదు. అతడు వేరుగా
ఉండాల్సిన రోజులు గడచిపోయేంతవరకు అతడు పవి
త్రంగా ఉండాలి. అతడు తన వెంట్రుకలను పొడవుగా
పెరగనివ్వాలి. అతడు దేవునికి చేసిన వాగ్దానంలో అతని
తల వెంట్రుకలు ఒక భాగం. ఆ వెంట్రుకలను ఒక
కానుకగా అతడు దేవునికి ఇస్తాడు. అందుచేత వేరుగా
ఉండే సమయం అయిపోయేంత వరకు అతడు తన
తల వెంట్రుకలను పొడవుగా పెంచాలి.

6"నాజీరు వేరుగా ఉన్న సమయంలో, అతడు
శవాన్ని సమీపించకూడదు. ఎందుచేతనంటే అతడు
తనను తాను పూర్తిగా యెహోవాకు అర్పించు
కొన్నాడు.

7అతని సొంత తండ్రి లేక తల్లి, సోదరుడు లేక
సోదరి చనిపోయినా సరే అతడు వారిని తాకగూడదు.
అలా తాకితే అతడు అపవిత్రుడవుతాడు. అతడు ప్రత్యే
కించుకొన్నట్టు, పూర్తిగా యెహోవాకు అర్పించు
కొన్నట్టు అతడు చూపెట్టుకోవాలి. 8అతడు వేరుగా
ఉన్న కాలమంతటిలో తనను తాను పూర్తిగా యెహో
వాకు అర్పించుకొన్నాడు.

9"నాజీరు మరొకనితో ఉన్నప్పుడు, ఆ మరొకడు
అకస్మాత్తుగా మరణించవచ్చును. చనిపోయినవానిని
నాజీరు ముట్టినట్టయితే నాజీరు అపవిత్రుడవుతాడు.
ఇలా జరిగినట్లయితే నాజీరు తన తల వెంట్రుకలను
తీసివేయాలి. (ఆ వెంట్రుకలు అతని ప్రమాణంలో
ఒక భాగం.) ఏడో రోజున అతడు తన వెంట్రుకలను
తీసివేయాలి. ఎందుచేతనంటే ఆ రోజునే ఆతడు
శుద్ధి చేయబడ్డాడు. 10ఎనిమిదో రోజున అతడు రెండు
గువ్వలను, రెండు పావురపు పిల్లలను యాజకుని
దగ్గరకు తీసుకుని రావాలి. పవిత్ర గుడార ద్వారం
దగ్గరే అతడు వాటిని యాజకునికి ఇవ్వాలి. 11అప్పుడు
యాజకుడు పాపపరిహారార్థబలిగా ఒకదాన్ని అర్పి
స్తాడు. రెండోదానిని దహన బలిగా అతడు అర్పిస్తాడు.
ఈ దహనబలి ఆ మనిషి చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం.
(అతడు శవం దగ్గర ఉండటమే అతని పాపం.) అతడు
తన తలవెంట్రుకలను దేవునికి ఇస్తానని ఆ సమ
యంలో మరల ప్రమాణం చేయాలి. 12అనగా అతడు
మరల ప్రత్యేకంగా ఉండేందుకు తనను యెహోవాకు
అర్పించుకోవాలని దీని అర్థం. ఒక సంవత్సరం వయసు
గల ఒక మగ గొర్రెపిల్లను అతడు తీసుకురావాలి.
అపరాధ పరిహారార్థ బలిగా అతడు దీనిని ఇవ్వాలి.
అతడు ప్రత్యేకంగా ఉన్న రోజులన్నీ మరచిపోవటం
జరిగింది. అతడు మరల ప్రత్యేకంగా ఉండటం ప్రారం
భించాలి. అతడు మొదటిసారి ప్రత్యేకంగా ఉన్నప్పుడు
శవాన్ని ముట్టినందువల్ల ఇలా చేయాలి.

13"ఆ మనిషి ప్రత్యేకంగా ఉండాల్సిన సమయం
అయిపోయిన తర్వాత అతడు ఇలా చేయాలి: సన్నిధి
గుడార ద్వారం దగ్గరకు అతడు వెళ్లాలి. 14అక్కడ
తన అర్పణను అతడు యెహోవాకు ఇవ్వాలి. అతని
అర్పణ ఏమిటంటే:

> దహనబలి కోసం ఒక్క సంవత్సరపు మగ గొర్రె
> పిల్ల. (ఈ గొర్రెపిల్లకు ఎలాంటి లోపం ఉండ
> కూడదు.) పాప పరిహారార్థబలి కోసం ఒక్క
> సంవత్సరపు ఆడ గొర్రెపిల్ల. (ఈ గొర్రెపిల్లకు
> ఎలాంటి లోపం ఉండ కూడదు.) సమాధాన
> బలికోసం ఒక్క మగ గొర్రె (ఈ గొర్రెకు
> ఎలాంటి లోపం ఉండ కూడదు.)
>
> 15 ఒక గంపనిండా పొంగనిపిండి రొట్టెలు
> (నూనెతోచేసిన మంచి గోధుమపిండి రొట్టెలు,
> ఈ రొట్టెల మీద నూనెపూయాలి). ధాన్యా
> ర్పణ, పానార్పణం ఈ కానుకలలో భాగంగా
> వుండాలి.

16"అప్పుడు యాజకుడు వీటిని యెహోవాకు
అర్పిస్తాడు. పాపపరిహారార్థబలిని, దహనబలిని యాజ
కుడు అర్పిస్తాడు. 17రొట్టెలబుట్టను యాజకుడు
యెహోవాకు అర్పిస్తాడు. తర్వాత యెహోవాకు
సమాధానబలిగా మగ గొర్రెను అతడు వధిస్తాడు. ధాన్యా
ర్పణ, పానార్పణాలతో అతడు దానిని యెహోవాకు
అర్పిస్తాడు.

[18]"సన్నిధి గుడారపు ప్రవేశం దగ్గరకు నాజీరు వెళ్లాలి. యెహోవాకోసం అతడు పెంచిన తలవెంట్రుకలను అక్కడ అతడు తీసివేయాలి. సమాధాన బలియాగం క్రింద మండుతున్న మంటల్లో ఆ వెంట్రుకలు వేయబడుతాయి.

[19]"నాజీరు తన తలవెంట్రుకలు తీసివేసిన తర్వాత, ఉడికిన మగ గొర్రె జబ్బను, గంపలోనుండి పెద్దది ఒకటి, చిన్నది ఒకటి, రెండు రొట్టెలను యాజకుడు అతనికి ఇస్తాడు. ఈ రెండు రొట్టెలు పులియని పిండితో చేయబడినవి. [20]అప్పుడు యాజకుడు వీటిని యెహోవా ముందర అల్లాడిస్తాడు. ఇది నైవేద్యము. ఇవి పవిత్రమైనవి, యాజకునికి చెందుతాయి. మరియు మగగొర్రె బోర, తొడ యెహోవా ముందర అల్లాడించ బడుతాయి. ఇవికూడ యాజకునికి చెందుతాయి. ఆ తర్వాత నాజీరు ద్రాక్షారసం తాగవచ్చును.

[21]"ఒక వ్యక్తి నాజీరుగా ప్రత్యేకించబడాలని నిర్ణయించుకొంటే, అప్పుడు అతడు ఈ కానుకలన్నీ యెహోవాకు అర్పించాలి. నాజీరు ప్రమాణానికి సంబంధించిన చట్టం అది. అయితే ఒక వ్యక్తి ఇంత కంటె చాల ఎక్కువే యెహోవాకి ఇవ్వగలిగి ఉండొచ్చు. అలాంటివాడు ఎక్కువ చేస్తానని వాగ్దానం చేస్తే, అతడు తన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలి. అది కూడ నాజీరు వాగ్దానపు చట్టమే."

### యాజకుని ఆశీస్సులు

[22]మోషేతో యెహోవా ఇలా అన్నాడు: [23]"అహరోను, అతని కుమారులతో ఇలా చెప్పు. ఇశ్రాయేలు ప్రజలను మీరు ఈ విధంగా ఆశీర్వదించాలి. వారు ఇలా అనాలి:

24 యెహోవా నిన్ను ఆశీర్వదించి కాపాడును
గాక.
25 యెహోవా తన ముఖకాంతిని నీపై ప్రకా
శింప చేయును గాక. ఆయన తన ప్రేమను
నీకు కనబర్చును గాక.
26 యెహోవా నిన్ను చూచి, నీకు సమాధానం
అనుగ్రహించును గాక."

[27]అప్పుడు యెహోవా, "ఈ విధంగా అహరోను, అతని కుమారులు ఇశ్రాయేలీయులను నా నామమును బట్టి ఆశీర్వదించినట్లు పలికినప్పుడు నేను వారిని ఆశీర్వదిస్తాను" అని చెప్పాడు.

### పవిత్ర గుడారపు ప్రతిష్ఠ

7 పవిత్ర గుడారాన్ని నిలబెట్టడం మోషే ముగించిన రోజే దానిని అతడు యెహోవాకు ప్రతిష్ఠించాడు. గుడారం మీద, దానిలో ప్రయోగించే పరికరాలన్నింటి మీద ప్రత్యేక తైలం పోసాడు. బలిపీఠం మీద, దానితో ఉపయోగించే వాటన్నింటి మీద మోషే ఆ తైలం పోసాడు. ఇది వీటన్నింటినీ పవిత్రం చేసింది.

[2]అప్పుడు ఇశ్రాయేలీయుల నాయకులు అర్పణలు అర్పించారు. వీరు ఒక్కో కుటుంబానికి నాయకులు, వారి వంశాల పెద్దలు. ఈ నాయకులు ప్రజలను లెక్క బెట్టారు. [3]ఈ నాయకులు యెహోవాకు అర్పణలు తెచ్చారు. ఆరు గూడు బండ్లను, వాటిని లాగటానికి పన్నెండు ఎద్దులను వీరు తెచ్చారు. (ఒక్కో ఎద్దును ఒక్కో నాయకుడు ఇచ్చాడు. ఒక్కో నాయకుడు మరో నాయకునితో కలిసి ఒక బండిని ఇచ్చాడు.) పవిత్ర గుడారం దగ్గర నాయకులు వీటిని యెహోవాకు ఇచ్చారు.

[4]మోషేతో యెహోవా ఇలా అన్నాడు: [5]"నాయకుల దగ్గర నుండి ఈ కానుకలు స్వీకరించు. సన్నిధి గుడారపు పనిలో ఈ కానుకలను ఉపయోగించవచ్చు. లేవీవాళ్లకు వీటిని ఇవ్వు. వాళ్లు వారి పని చేసుకొనేందుకు ఇవి సహాయపడ్తాయి."

[6]కనుక ఆ బండ్లను, ఎద్దులను మోషే స్వీకరించాడు. వీటిని లేవీ మనుష్యులకు అతడు ఇచ్చాడు. [7]గెర్షోను మనుష్యులకు రెండు బండ్లు, నాలుగు ఎడ్లు అతడు ఇచ్చాడు. వారి పనికోసం ఎడ్లు, బండ్లు వారికి అవసరం. [8]తర్వాత మెరారి మనుష్యులకు నాలుగు బండ్లు, ఎనిమిది ఎడ్లు మోషే ఇచ్చాడు. వారి పనికోసం ఎడ్లు, బండ్లు వారికి అవసరం. ఈ మనుష్యులందరి పనికి యాజకుడైన అహరోను కుమారుడు ఈతమారు బాధ్యుడు. [9]కహాతీ మనుష్యులకు బండ్లుగాని, ఎడ్లుగాని ఏమీ మోషే ఇవ్వలేదు. వీళ్లు పవిత్ర వస్తువులన్నింటినీ వారి భుజాలమీదే మోయాలి. ఇది వారు చేసేందుకు ఇవ్వబడిన పని.

[10]బలిపీఠం ప్రతిష్ఠించబడిన తర్వాత నాయకులు వారి అర్పణలు అక్కడకు తీసుకునివచ్చారు. ఆ బలిపీఠం ఎదుట వారు వారి అర్పణలను యెహోవాకు అర్పించారు. [11]"ఒక్కో నాయకుడు ఒక్కో రోజున బలిపీఠం ప్రతిష్ఠలో తన వంతుగా తన అర్పణలు తీసుకుని రావాలి" అని యెహోవా అంతకు ముందే మోషేతో చెప్పాడు.

[12-83]* పన్నెండుమంది నాయకుల్లో ప్రతి ఒక్కరూ పవిత్ర గుడారపు ప్రతిష్ఠకోసం తమ అర్పణలను తెచ్చారు. ఆ కానుకలు ఏవనగా: ఒక్కొక్క నాయకుడు 130 తులముల బరువుగల ఒక వెండి పళ్లెం తెచ్చాడు. ఒక్కొక్క నాయకుడు 70 తులాల బరువుగల వెండి

---

**12-83** హెబ్రీ మూల భాషలో ఒక్కొక్క నాయకుని అర్పణ వేర్వేరుగా రాయబడింది. అయితే ప్రతి అర్పణకు ఒకే వివరం ఉండటంవల్ల సులభంగా చదువుకొనేందుకు వీలుగా వీటన్నింటినీ మొదట రాసి తర్వాత ప్రతిదిన అర్పణను అర్పించిన వారి పేర్లు రాయబడ్డవి.

గిన్నె తెచ్చాడు. నూనెతో కలిపిన మంచి గోధుమ పిండితో ఆ పళ్లెం, గిన్నె నింపాడు. ఇది ధాన్యార్పణ కోసం ఉపయోగించేది. 10 తులాల బరువుగల బంగారు ధూపార్తిని ఒక్కొక్క నాయకుడు ఒక్కొక్కటి తెచ్చాడు. ధూపార్తి ధూపంతో నింపబడింది.

ఒక్కొక్క నాయకుడు ఒక కోడెదూడను, ఒక పొట్టేలును, ఒక సంవత్సరపు మగ గొర్రెపిల్లను తీసుకుని వచ్చాడు. ఈ జంతువులు దహనబలికోసం. పాపపరిహారార్థ బలిగా ఉపయోగించటంకోసం, ప్రతి నాయకుడూ ఒక మగ మేకను తెచ్చాడు. ప్రతి నాయకుడూ రెండు కోడెదూడలను, ఐదు పొట్టేళ్లను, ఐదు మగ మేకలను, ఒక సంవత్సరపు మగ గొర్రె పిల్లలు ఐదింటిని తీసుకొని వచ్చాడు. ఇవన్నీ సమాధాన బలిగా ఇవ్వబడ్డాయి.

మొదటి రోజున యూదా కుటుంబ నాయకుడును, అమ్మీనాదాబు కుమారుడునైన నయస్సోను తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

రెండో రోజున ఇశ్శాఖారు ప్రజల నాయకుడు, సూయారు కుమారుడైన నెతనేలు తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

మూడో రోజున జెబూలూను ప్రజల నాయకుడు, హెలోను కుమారుడైన ఎలియాబు తన అర్పణలు తీసుకొనివచ్చాడు. నాలుగో రోజున రూబేను ప్రజల నాయకుడునైన షెదేయూరు కుమారుడునైన ఏలీసూరు తన అర్పణలు తీసుకొని వచ్చాడు.

ఐదో రోజున షిమ్యోను ప్రజల నాయకుడును, సూరీషద్దాయి కుమారుడైన షెలుమీయేలు తన అర్పణలు తీసుకొని వచ్చాడు.

ఆరో రోజున గాదు ప్రజల నాయకుడు, దెయూవేలు కుమారుడునైన ఎలీయాసాపా తన అర్పణలు తీసుకుని వచ్చాడు. ఏడో రోజున ఎఫ్రాయిము ప్రజల నాయకుడును, అమీహూదు కుమారుడు ఎలీషామా తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

ఎనిమిదో రోజున మనష్షే ప్రజల నాయకుడును, పెదాసూరు కుమారుడునైన గమలీయేలు తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

తొమ్మిదో రోజున బెన్యామీను ప్రజల నాయకుడును, గిద్యోనీ కుమారుడునైన అబీదాను తన అర్పణలు తీసుకుని వచ్చాడు. పదో రోజున దాను ప్రజల నాయకుడును, అమీషదాయి కుమారుడైన అహీయెజెరు తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

పదకొండవ రోజున ఆషేరు ప్రజల నాయకుడు, ఒక్రాను కుమారుడైన పగీయేలు తన అర్పణలు తీసుకుని వచ్చాడు. పన్నెండో రోజున నఫ్తాలీ ప్రజల నాయకుడైన, ఏనాను కుమారుడైన అహీర తన అర్పణలు తీసుకుని వచ్చాడు.

84 కనుక ఇవన్నీ ఇశ్రాయేలు ప్రజల నాయకుల నుండి వచ్చిన కానుకలు. మోషే ప్రత్యేక తైలము పోసి బలిపీఠాన్ని ప్రతిష్ఠించిన సందర్భంలో వారు ఈ వస్తువులను తెచ్చారు. వెండి పళ్లెములు పన్నెండు, వెండిగిన్నెలు పన్నెండు, బంగారు ధూపార్తులు పన్నెండు వారు తీసుకుని వచ్చారు. 85 ఒక్కో వెండి పళ్లెం బరువు 130 తులాలు. ఒక్కో గిన్నె బరువు 70 తులాలు. వెండిపళ్లాలు, వెండిగిన్నెలు అన్నీ కలిసి 2,400 తులాల బరువు. 86 ధూపద్రవ్యంతో నిండిన పన్నెండు బంగారు ధూపార్తులలో ఒక్కొక్కటి పది తులాల బరువు. మొత్తం పన్నెండు బంగారు ధూపార్తులు కలిసి 120 తులాల బరువు కలవి. 87 దహనబలి అర్పణకు మొత్తం జంతువులు పన్నెండు కోడెదూడలు, పన్నెండు పొట్టేళ్లు, ఒక్కో సంవత్సరపు మగ గొర్రెపిల్లలు పన్నెండు. ధాన్యార్పణ కూడా ఉంది. పాపపరిహారార్థ బలిగా యెహోవాకు అర్పించేందుకు పన్నెండు మగ మేకలు కూడా ఉన్నాయి.

88 సమాధాన బలిగా వధించి ఉపయోగిం చేందుకు కూడ నాయకులు జంతువులను ఇచ్చారు. ఈ జంతువులు మొత్తం 24 కోడెదూడలు, 60 పొట్టేళ్లు, 60 మగ మేకలు, ఒక్క సంవత్సరపు మగ గొర్రెపిల్లలు 60 బలిపీఠం ప్రతిష్ఠ సమయంలో ఇవన్నీ అర్పణలుగా ఇవ్వబడ్డాయి. ఈ విధంగా బలిపీఠం మీద ప్రత్యేక తైలాన్ని మోషే పోసిన తర్వాత వారు ప్రతిష్ఠించారు.

89 యెహోవాతో మాట్లాడేందుకు మోషే సన్నిధి గుడారంలోకి వెళ్లాడు. ఆ సమయంలో అతనితో మాట్లాడుతున్న యెహోవా స్వరం అతడు విన్నాడు. ఒడంబడిక పెట్టెపైనున్న కరుణాపీఠంమీది రెండు కెరూబుదూతల మధ్య భాగంనుండి ఆ స్వరం వస్తోంది. ఇలా దేవుడు మోషేతో మాటలాడెను.

## దీప స్తంభం

8 మోషేతో యెహోవా ఇలా అన్నాడు: 2 "అహరోనుతో మాట్లాడి అతనితో ఇలా చెప్పు, నేను నీకు చూపించిన స్థలంలో ఏడు దీపాలను ఉంచు. దీపస్తంభం ముందు భాగాన్ని ఆ దీపాలు వెలిగించాలి."

3 అహరోను అలా చేసాడు. అహరోను ఆ దీపాలను సరైన చోట పెట్టి, దీపస్తంభం ముందు భాగాన్ని అవి వెలిగించేటట్టుగా అతడు వాటిని ఉంచాడు. మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞకు అతడు విధేయుడయ్యాడు. 4 దీపస్తంభం కొట్టబడిన బంగారంతో చేయబడింది. దిమ్మదగ్గర మొదలుకొని బంగారు పూలవరకు అంతా బంగారమే. మోషేకు యెహోవా చూపించిన ప్రకారమే అదంతా చేయబడింది.

## లేవీయులను ప్రతిష్ఠించటం

5 మోషేతో యెహోవా ఇలా అన్నాడు: 6 "ఇశ్రాయేలీయులలో ఇతరులనుండి లేవీ ప్రజలను వేరు చేయి. ఆ లేవీ మనుష్యులను శుద్ధి చేయి. 7 వారిని శుద్ధి

చేసేందుకు నీవు చేయాల్సింది ఇదే. పాప పరిహారార్థ అర్పణనుండి ప్రత్యేక జలాన్ని వారిమీద చల్లాలి. ఈ జలం వారిని శుద్ధి చేస్తుంది. అప్పుడు వారు శరీరం అంతటా క్షవరం చేసుకొని, వారి బట్టలు ఉదుకు కోవాలి. ఇది వారి శరీరాలను పవిత్రం చేస్తుంది.

8"అప్పుడు వారు ఒక కోడెదూడను, దానికి సంబం ధించిన ధాన్యార్పణను తీసుకోవాలి. ఈ ధాన్యార్పణ నూనెతో కలుపబడ్డ గోధుమపిండి. అప్పుడు పాప పరిహారార్థ బలిగా ఇంకో కోడెదూడను తీసుకోవాలి.
9లేవీ ప్రజలను సన్నిధి గుడారం ఎదుటి భాగంలోనికి తీసుకునిరావాలి. అప్పుడు ఇశ్రాయేలు ప్రజలందరినీ చుట్టూరా సమావేశపర్చాలి. 10అప్పుడు నీవు లేవీ ప్రజలను యెహోవా ఎదుటికి తీసుకునిరావాలి. ఇశ్రా యేలు ప్రజలు వారిమీద తమ చేతులు ఉంచుతారు.
11అప్పుడు అహరోను లేవీ మనుష్యులను యెహోవా ఎదుట కనపరుస్తాడు. వారు దేవునికి ఒక అర్పణవలె ఉంటారు. ఈ విధంగా యెహోవాకు ప్రత్యేక పని చేసేందుకు లేవీ ప్రజలు సిద్ధంగా ఉంటారు.

12"లేవీ మనుష్యులు కోడెదూడ తలలమీద చేతులు ఉంచాలని వారితో చెప్పు. ఒక కోడెదూడ పాపపరి హారార్థ బలిగాను మరొక కోడెదూడ దహన బలిగాను యెహోవాకు అర్పించాలి. ఈ అర్పణలు లేవీ ప్రజల పాపాలను కప్పిపుచ్చుతాయి. 13అహరోను, అతని కుమారుల ఎదుట నిలబడమని లేవీ మనుష్యులతో చెప్పు. అప్పుడు ఒక ప్రతిష్ఠ అర్పణగా లేవీ మనుష్య లను యెహోవాకు అర్పించు. 14ఈ విధంగా లేవీ మనుష్యులు ప్రత్యేకం అవుతారు. ఇశ్రాయేలీయులలో ఇతరులకు వీరు వేరుగా ఉంటారు. లేవీ ప్రజలు నావారై ఉంటారు.

15"కనుక లేవీ మనుష్యులను పవిత్రం చేయి. ప్రతి ష్ఠార్పణగా వారిని యెహోవాకు అర్పించు. ఇలా చేసిన తర్వాత వారు సన్నిధి గుడారంలోనికి వచ్చి వారి పని చేయవచ్చును. 16ఈ లేవీయులు నాకు ఇవ్వబడిన ఇశ్రాయేలు ప్రజలు. వారిని నా స్వంత ప్రజలుగా నేను స్వీకరించాను. గతంలో ఇశ్రాయేలీయుల ప్రతి కుటుంబంలో ప్రతి పెద్ద కుమారుడు నాకు ప్రతిష్ఠించ బడ్డాడు. అయితే ఇశ్రాయేలుల్లో ఇతరుల జ్యేష్ఠ కుమా రుల బదులు లేవీయులు మనుష్యులను నేను స్వీకరిం చాను. 17ఇశ్రాయేలీయుల ప్రతి కుటుంబములో మొదట పుట్టిన ప్రతి మగ శిశువు నావాడే. అది మనిషి గాని పశువుగాని నాకే. ఎందుకంటే ఈజిప్టులో మొదట పుట్టిన పిల్లలను, జంతువులనుగూడ నేను చంపేసాను, కనుక మొదట పుట్టినవారు నావారై ఉండాలని పెద్ద కుమారులను మీ నుండి వేరు చేసాను. 18ఇప్పుడు నేను లేవీ మనుష్యులను తీసుకున్నాను. ఇశ్రాయేలు కుటుంబాల్లో మొదటగా పుట్టిన కుమారులందరి స్థానంలో నేను వీరిని తీసుకున్నాను.

19ఇశ్రాయేలు ప్రజలందరిలోనుండి లేవీ మనుష్య లను నేను ఏర్పాటు చేసుకున్నాను. నేను వారిని అహరోనుకు అతని కుమారులకు కానుకలుగా ఇచ్చాను. సన్నిధి గుడారం దగ్గర వారు పని చేయాలని నేను కోరుతున్నాను. ఇశ్రాయేలు ప్రజలందరి పక్షంగా వారు సేవ చేస్తారు. ఇశ్రాయేలు ప్రజల పాపాలను కప్పిపుచ్చే బలులు అర్పించుటలో వారు సహాయం చేస్తారు. అప్పుడు ఇశ్రాయేలు ప్రజల పవిత్ర స్థలాన్ని సమీపించినా ఏ గొప్ప రోగంగాని, కష్టంగాని వారికి కలుగదు."

20కనుక మోషే, అహరోను, ఇశ్రాయేలు ప్రజలం దరు యెహోవాకు విధేయులయ్యారు. యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన దానిని లేవీ మనుష్యులకు వారు జరిగించారు. 21లేవీ ప్రజలు పవిత్రులయ్యారు. వారు వారిని శుద్ధి చేసుకున్నారు, వారి వస్త్రాలు ఉదుకు కొన్నారు. అప్పుడు అహరోను వారిని యెహోవా ఎదుట ప్రతిష్ఠార్పణగా అర్పించాడు. వారి పాపాలను క్షమించే అర్పణలను కూడా అర్పించి, అహరోను వారిని పవిత్రం చేసాడు. 22ఆ తర్వాత లేవీ మనుష్యులు వారి పని చేసుకొనేందుకు సన్నిధి గుడారానికి వచ్చారు. అహరోను, అతని కుమారులు వారిని పర్యవేక్షించారు. లేవీ ప్రజల పనికి వారు బాధ్యులు. యెహోవా మోషేకు ఇచ్చిన ఆజ్ఞకు అహరోను, అతని కుమారులు విధేయు లయ్యారు.

23మోషేతో యెహోవా చెప్పాడు: 24"ఇది లేవీ ప్రజలకు ఒక ప్రత్యేక ఆజ్ఞ. 25 సంవత్సరాలు, అంత కంటె ఎక్కువ వయసుగల ప్రతి లేవీ మనిషి సన్నిధి గుడారం దగ్గరకు వచ్చి అక్కడ పని చేయాలి. 25అయితే ఒకని వయసు 50 సంవత్సరాలు ఉన్నప్పుడు, అతడు తన దినచర్యనుండి విశ్రాంతి తీసుకోవాలి. అతడు తిరిగి పని చేయాల్సిన అవసరం లేదు. 2650 సంవత్స రాలు, అంతకంటె ఎక్కువ వయసుగల పురుషులు సన్నిధి గుడారం దగ్గర వారి సోదరులకు సహాయం చేయవచ్చును. కాని వారే స్వయంగా ఆ పని చేయ కూడదు. వారిని విరమించుకోనివ్వవచ్చు. లేవీ ప్రజ లకు వారి పనులను చెప్పేటప్పుడు ఇది చెప్పటం జ్ఞాపకం ఉంచుకో."

## పస్కా పండుగ ఆచరణ

9 సీనాయి అరణ్యంలో మోషేతో యెహోవా మాట్లాడాడు: ఇశ్రాయేలీయులు ఈజిప్టు నుండి బయటకు వచ్చిన తర్వాత ఒక సంవత్సరం, ఒక మాసం నాటి మాట ఇది. మోషేతో యెహోవా అన్నాడు: 2"నిర్ణీత సమయంలో పస్కా విందు భోజనం చేయటం జ్ఞాపకం ఉంచుకోవాలని ఇశ్రాయేలు ప్రజ లతో చెప్పు. 3ఈ నెల పద్నాల్గవ రోజు ఆ నిర్ణీత సమయం. మసక చీకటి వేళ వారు ఆ విందు భోజనం

చేయాలి. మరియు విందునుగూర్చి నేను ఇచ్చిన నియ
మాలన్నింటినీ వారు జ్ఞాపకం ఉంచుకోవాలి.” 4కనుక
పస్కా విందుభోజనం చేయటం జ్ఞాపకం ఉంచుకోమని
ఇశ్రాయేలు ప్రజలకు మోషే చెప్పాడు. 5పద్నాల్గవ
రోజున మసక చీకటివేళ సీనాయి అరణ్యంలో ప్రజలు
ఇది చేసారు. ఇది మొదటి నెలలో. మోషేకు
యెహోవా ఆజ్ఞాపించిన దానంతటి ప్రకారం ఇశ్రాయే
లీయులు జరిగించారు.

6అయితే ఆ రోజున కొందరు ప్రజలు పస్కా
విందు భోజనం చేయలేకపోయారు. ఒక శవం
మూలంగా వారు అపవిత్రులయ్యారు. కనుక ఆ రోజున
మోషే అహరోనుల దగ్గరకు వారు వెళ్లారు. 7“ఒక
శవం మూలంగా మేము ‘అపవిత్రులమయ్యాము’
అయితే ఇశ్రాయేలీయుల్లోని ఇతరులతో కలిసి మేము
కూడ యెహోవాకు ఈ నిర్ణీత సమయంలో కానుకలు
అర్పించటంలోను పస్కా ఆచరించుటలోను యాజ
కులు అడ్డుకొన్నారు ” అని ఆ ప్రజలు మోషేతో
చెప్పారు.

8“దీన్ని గూర్చి యెహోవా ఏమంటాడో నేను
అడుగుతాను” అన్నాడు మోషే వారితో.

9అప్పుడు మోషేతో యెహోవా: 10“ఇశ్రాయేలీ
యులతో ఈ విషయాలు చెప్పు, ఒకవేళ సరైన
సమయంలో మీరు పస్కాను ఆచరించలేకపోతున్నా
రేమో. మీరో లేక మీ సంతానంలో వారెవరైనా ఒక
శవాన్ని ముట్టినందువల్ల అపవిత్రంగా ఉన్నారేమో. లేదా
మీరు ప్రయాణంలో ఉన్నారేమో. 11అయితే మీరు
కూడ పస్కాను ఆచరించగలరు గాని నిర్ణీత సమ
యంలో కాదు. రెండవ నెల పద్నాలుగోరోజు సందె
వేళ మీరు పస్కాను ఆచరించాలి. ఆ సమయంలో
మీరు గొర్రెపిల్లను, పులియని రొట్టెలను, చేదు ఆకు
కూరలను తినాలి. 12ఆ భోజనంలో ఏమీ మర్నాటి
ఉదయానికి మీరు మిగల్చకూడదు. మరియు ఎము
కలు ఏవీ మీరు విరుగగొట్టకూడదు. మీరు పస్కా
విందు భోజనం చేసేటప్పుడు నియమాలన్నింటినీ
మీరు పాటించాలి. 13అయితే ఆచరించగల ప్రతి మనిషీ
పస్కావిందును నిర్ణీత సమయంలో తినాలి. అతడు
పవిత్రుడై, ప్రయాణంలో లేకుండా ఉండి పస్కాను
ఆచరించకపోతే, అతనికి క్షమాపణ లేదు. అతడు నిర్ణీత
సమయంలో పస్కా విందుభోజనం చేయకపోతే,
అప్పుడు అతడ్ని తన ప్రజల్లోనుంచి వెళ్లగొట్టి
వేయాలి. ఎందుచేతనంటే నిర్ణీత సమయంలో అతడు
తన అర్పణను యెహోవాకు అర్పించలేదు గనుక
అతడు దోషి.

14“ఇశ్రాయేలీయులకు చెందని ఒకడు మీతో నివ
సిస్తుంటే, అతడు మీతో కలిసి యెహోవా పస్కాలో
పాలు పుచ్చుకోవాలనుకోవచ్చు. ఇది అంగీకారమే గాని
మీకు ఇవ్వబడిన నియమాలన్నిటినీ అతడు పాటిం
చాలి. మీకోసం ఉన్న నియమాలే మీరు ఇతరులకోసం
కూడ పెట్టాలి.”

### మేఘం – అగ్ని

15పవిత్ర గుడారం (ఒడంబడిక గుడారం) నిలబెట్టిన
రోజున ఒక మేఘం దానిమీద నిలిచింది, రాత్రి పూట
ఆ మేఘం అగ్నిలా కనబడింది. 16ఆ మేఘం రాత్రి
అంతా పవిత్ర గుడారం మీదే నిలిచి ఉంది. 17ఆ
మేఘం పవిత్ర గుడారం మీద నుండి కదలినప్పుడు
ఇశ్రాయేలీయులు దానిని వెంబడించారు. ఆ మేఘం
ఆగిపోయినప్పుడు, అక్కడే ఇశ్రాయేలు ప్రజలు
గుడారాలు వేసుకొన్నారు. 18ఇశ్రాయేలు ప్రజలను ఈ
విధంగా సాగిపొమ్మని యెహోవా ఆజ్ఞాపించాడు అలాగే
వారు గుడారాలు వేసే స్థలం విషయంకూడా. ఆయన
ఇచ్చిన ఆజ్ఞ ఇదే. మేఘం పవిత్రగుడారం మీద నిలిచి
ఉండగా, ప్రజలు ఆ చోటనే నివాసం కొనసాగించారు.
19కొన్నిసార్లు చాలకాలంగా పవిత్ర గుడారంమీదనే ఆ
మేఘం నిలిచిపోయేది. ఇశ్రాయేలీయులు యెహో
వాకు విధేయులై ముందుకు కదల్లేదు. 20కొన్నిసార్లు
కొద్ది రోజులవరకు మాత్రమే మేఘం పవిత్ర గుడారం
మీద నిలిచేది. ప్రజలు యెహోవా ఆజ్ఞకు విధేయు
లయ్యారు. మేఘం కదిలినప్పుడు వారు ఆ మేఘాన్ని
వెంబడించారు. 21కొన్నిసార్లు ఆ మేఘము రాత్రి
మాత్రమే నిలిచి ఉండేది. ఆ మర్నాడు మేఘము
కదలగానే, ప్రజలుకూడ వారి సామగ్రి కూర్చుకొని
వెంబడించారు. పగలుకాని రాత్రికాని మేఘము కదిలితే
అప్పుడు ప్రజలుకూడ బయల్దేరారు. 22రెండు
రోజులుకానీ, ఒక నెలకానీ, ఒక సంవత్సరంకానీ ఆ
మేఘము పవిత్ర గుడారంమీద నిలిచిన కూడ ప్రజలు
యెహోవాకు విధేయులవుతూనే ఉన్నారు. తర్వాత
మేఘము తన స్థానంనుండి లేచి బయల్దేరితే, ప్రజలు
కూడ బయల్దేరారు. 23కనుక ప్రజలు యెహోవా
ఆజ్ఞకు విధేయులయ్యారు. యెహోవా వారికి చూపిం
చిన చోట వారు గుడారాలు వేసారు. మరల బయల్దేర
మని యెహోవా ఆజ్ఞాపించగానే వారు బయల్దేరారు,
మేఘాన్ని వెంబడించారు. యెహోవా ఆజ్ఞకు ప్రజలు
లోబడ్డారు. ఇది మోషే ద్వారా ఆయన వారికి ఇచ్చిన
ఆజ్ఞ.

### వెండి బూరలు

10 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
2“రెండు వెండి బూరలు చేయించు. వెండిని
ఉపయోగించి, బూరలు చేసేందుకు దానిని నలుగ
గొట్టాలి. ఆ బూరలు ప్రజలందర్నీ సమావేశపర్చి
సేనలను ఎప్పుడు బయలుదేరదీయాలో చెప్పటానికి
ఉండవలెను. ప్రజలు ఎక్కడ నివాసం చేయాలి అనేది
వారికి చెప్పటానికి ఇది నీకు సహాయకరంగా ఉంటుంది.

[3]ఆ రెండు బూరలు ఒక ప్రకటనగా ఉంటాయి. ప్రజ
లంతా అది విని, సన్నిధి గుడార ప్రవేశం దగ్గర నీ
ఎదుట కూడుకొంటారు. [4]నీవు ఒకే బూర ఊదితే
నాయకులు (ఇశ్రాయేలు పన్నెండు కుటుంబాల నాయ
కులు) నీ ఎదుట కూడుకొంటారు.

[5]"నీవు ఒక బూరను పదే పదే ఊదితే, తూర్పు
వైపున నివాసం చేస్తున్న వంశాలు బయల్దేరాలి. [6]ఒక
బూరను నీవు రెండోసారి కూడా అలాగే ఊదితే దక్షిణాన
నివాసం చేస్తున్నవారు బయల్దేరాలి. బూర శబ్దం ప్రజలు
బయల్దేరాలని చెప్పే ఒక ప్రకటన. [7]ప్రజలందరినీ
ఒక్కచోట నీవు సమకూర్చాలంటే, బూరలను మరో
విధంగా అంటే ఏకధాటిగా ఒకే శృతిలో ఊదాలి. [8]అహ
రోను కుమారులు, యాజకులు బూరలు ఊదాలి.
ఇది మీకు భవిష్యత్తులో కూడ కొనసాగే ఆజ్ఞ.

[9]"మీ స్వంత స్థలంలో మీరు శత్రువుతో యుద్ధం
చేయాల్సివస్తే, మీరు వారిమీదికి వెళ్లక ముందు
బూరలను గట్టిగా ఊదాలి. అప్పుడు మీ యెహోవా
దేవుడు వింటాడు, మీ శత్రువులనుండి ఆయన మిమ్మ
లను రక్షిస్తాడు. [10]అలాగే మీ ప్రత్యేక సంతోష సమయా
ల్లోకూడ మీరు బూరలు ఊదాలి. మీ ప్రత్యేక పండుగ
దినాల్లోను, నెలల ఆరంభ దినాల్లోను మీ బూరలు
ఊదండి. మీ దహన బలులు, మీ సమాధాన బలులు
అర్పించేటప్పుడు మీ బూరలు ఊదండి. అది మీరు
మీ దేవుని జ్ఞాపకం చేసుకునేందుకు సహాయకరమైన
ఒక ప్రత్యేక విషయం. మీరు ఇలా చేయాలని నేను
మీకు ఆజ్ఞాపిస్తున్నాను. నేను యెహోవాను, మీ
దేవుడ్ని."

## ఇశ్రాయేలు ప్రజల నివాసం మార్పు

[11]ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు విడిచిన తర్వాత
రెండో సంవత్సరం, రెండో నెలలో (20వ రోజు)
సన్నిధి గుడారం మీదనుండి మేఘం పైకి లేచింది.
[12]అందుచేత ఇశ్రాయేలు ప్రజలంతా సీనాయి అరణ్యాం
నుండి బయల్దేరి ప్రయాణం మొదలుబెట్టారు. పారాను
అరణ్యంలో ఆ మేఘం నిలిచిపోయేంత వరకు, వారు
ప్రయాణం చేసారు. [13]మోషేకు యెహోవా ఆజ్ఞాపిం
చిన ప్రకారంగా ఆ ప్రజలు వారి స్థలాన్ని మార్చటం
ఇది మొదటి సారి.

[14]యూదా గుడారంలో మూడు విభాగాలు
ముందుగా వెళ్లాయి. వారు వారి ధ్వజం కిందనే
ప్రయాణం చేసారు. మొదటి విభాగం యూదా వంశం.
అమ్మీనాదాబు కుమారుడైన నయస్సోను ఆ విభాగానికి
సైన్యాధిపతి. [15]తర్వాత ఇశ్శాఖారు విభాగం. సూయారు
కుమారుడైన నెతనేలు ఆ కుటుంబ విభాగానికి సైన్యా
ధిపతి. [16]ఆ తర్వాత జెబూలూను విభాగం. హెలోను
కుమారుడైన ఏలీయాబు ఆ విభాగానికి సైన్యాధిపతి.
[17]అప్పుడు సన్నిధి గుడారం దించబడింది. గెర్షోను,
మెరారి కుటుంబ పురుషులు పవిత్ర గుడారం మోసారు.
కనుక తర్వాత ఈ కుటుంబాల ప్రజలు వరుసలో
ఉన్నారు. [18]తర్వాత రూబేను నివాసము నుండి మూడు
భాగాలు వచ్చాయి. వారు వారి ధ్వజం కింద ప్రయాణం
చేసారు. మొదటిది రూబేను వంశం. షెదెయూరు
కుమారుడైన ఏలీసూరు ఆ విభాగానికి సైన్యాధిపతి.
[19]తర్వాత షిమ్యోను వంశం. సూరిషదాయి కుమారు
డైన షెలుమీయేలు ఆ విభాగానికి సైన్యాధిపతి.
[20]తర్వాత గాదు వంశం. దెయువేలు కుమారుడు
ఎలీయాసాపు ఆ విభాగానికి సైన్యాధిపతి. [21]తర్వాత
కహాతు కుటుంబ ప్రజలు. పవిత్ర గుడారం లోపల
ఉండే పవిత్ర పరికరాలను వారు మోసారు. ఈ ప్రజ
లంతా వచ్చేయకముందే పవిత్ర గుడారం నిలబెట్టేం
దుకు వీలుగా వీరు ఈ సమయంలో వచ్చారు. ప్రజలు
కూడా వచ్చారు.

[22]తర్వాత ఎఫ్రాయిము నివాసంనుండి మూడు
విభాగాలు వచ్చాయి. వారు వారి ధ్వజం కిందనే
ప్రయాణం చేసారు. మొట్టమొదటి విభాగం ఎఫ్రా
యిము వంశం. అమీహూదు కుమారుడైన ఎలీషామా
ఆ భాగానికి సైన్యాధిపతి. [23]తర్వాత మనష్షే వంశం.
పెదాసూరు కుమారుడైన గమలీయేలు ఆ విభాగానికి
సైన్యాధిపతి. [24]తర్వాత బెన్యామీను వంశం. గిద్యోనీ
కుమారుడైన అబీదాను ఆ విభాగానికి సైన్యాధిపతి.

[25]వరుసలో చివరి మూడు వంశాలు మిగిలిన
విభాగాలన్నిటికీ వెనుక కాపుగా ఉన్నాయి. ఇవి దాను
నివాసానికి చెందినవి. వారు వారి ధ్వజం కింద
ప్రయాణం చేసారు. మొదటి విభాగం దాను వంశం.
అమీషదాయి కుమారుడైన అహీయెజరు ఆ విభాగానికి
సైన్యాధిపతి. [26]తర్వాత ఆషేరు వంశం. ఒక్రాను
కుమారుడైన పగీయేలు ఆ విభాగానికి సైన్యాధిపతి.
[27]తర్వాత నఫ్తాలి వంశం. ఏనాను కుమారుడైన అహీరా
ఆ విభాగానికి సైన్యాధిపతి. [28]ఇశ్రాయేలు ప్రజలు ఒక
చోటు నుండి మరో చోటకు బయల్దేరినప్పుడు,
వారు వెళ్లిన విధానం అది.

[29]మిద్యానీ వాడగు రెవూయేలు కుమారుడు
హెూబాబు. (రెవూయేలు మోషేకు మామ.) "దేవుడు
మాకు ఇస్తానని వాగ్దానం చేసిన దేశానికి మేము
ప్రయాణం చేస్తున్నాము. కనుక మాతో రమ్ము. మేము
నీకు మేలు చేస్తాము. ఇశ్రాయేలు ప్రజలకు యెహోవా
మంచివాటిని వాగ్దానం చేసాడు" అని హెూబాబుతో
మోషే చెప్పాడు.

[30]"నేను మీతో రాను, నేను నా సొంతదేశానికి, నా
స్వంత ప్రజల దగ్గరకు వెళ్లిపోతాను" అని హెూబాబు
జవాబిచ్చాడు.

[31]అప్పుడు మోషే, "దయచేసి మమ్మల్ని విడు
వకు. అరణ్యంగూర్చి మాకంటె నీకే ఎక్కువ తెలుసు.
నీవు మాకు మార్గదర్శిగా ఉండొచ్చు. [32]నీవు మాతో

వస్తే, యెహోవా మాకు ఇచ్చే మంచివాటన్నింటిలో
మేము నీకు భాగం ఇస్తాము" అని చెప్పాడు.
33కనుక హోబాబు ఒప్పుకొన్నాడు యెహోవా
పర్వతం దగ్గరనుండి వారు ప్రయాణం మొదలు
బెట్టారు. పురుషులు యెహోవా ఒడంబడిక పవిత్ర
పెట్టెను పట్టుకొని ప్రజల ముందు నడిచారు. వారు
స్థలం కోసం వెదుకుతూ, మూడు రోజులపాటు పవిత్ర
పెట్టెను మోసారు. 34యెహోవా మేఘం ప్రతిరోజూ
వారిమీద ఉంది. ప్రతి ఉదయం వారు తమ స్థలం
విడిచిపెట్టినప్పుడు, వారిని నడిపించేందుకు మేఘం
అక్కడ ఉండేది:
35ప్రజలు ప్రయాణం మొదలు బెట్టి, పవిత్రపెట్టె
వారితోపాటు వెడలగానే, మోషే ఎప్పుడూ ఇలా చెప్పే
వాడు:

"యెహోవా, లెమ్ము నీ శత్రువులు అన్ని
దిక్కుల్లో పారిపోదురు గాక: నీకు వ్యతి
రేకంగా ఉన్న మనుష్యులు నీ ఎదుట నుండి
పారిపోదురుగాక."

36పవిత్ర పెట్టెను, దాని స్థలంలో దాన్ని ఉంచి
నప్పుడు, మోషే ఎప్పుడూ ఇలా చెప్పేవాడు,

"యెహోవా, లక్షలాదిమంది ఇశ్రాయేలు
ప్రజల దగ్గరకు తిరిగి రమ్ము."

### మళ్లీ ప్రజల ఫిర్యాదు.

11 ఈ సారి ప్రజలు వారి కష్టాలనుగూర్చి ఫిర్యాదు
చేసారు. వారి ఫిర్యాదులను యెహోవా
విన్నాడు. యెహోవా వీటిని విన్నప్పుడు ఆయనకు
కోపం వచ్చింది. యెహోవా దగ్గరనుండి అగ్ని వచ్చి
ప్రజల మధ్య రగులుకొంది. వారున్న స్థలంలో ఒక
చివర కొన్ని ప్రాంతాలను అగ్ని కాల్చివేసింది. 2కనుక
ప్రజలు మోషేకు మొరపెట్టుకొన్నారు. మోషే
యెహోవాను ప్రార్థించగా అగ్ని కాల్చివేయటం ఆగి
పోయింది. 3అందుచేత ఆ చోటు తబేరా* అని పిలువ
బడింది. ఆ ప్రజల మధ్య యెహోవా అగ్నిని దహింప
జేసాడు గనుక ఆ స్థలానికి వారు ఆ పేరు పెట్టారు.

### 70 మంది వృద్ధనాయకులు

4ఇశ్రాయేలీయులతో చేరిన విదేశీయులు తినేం
దుకు ఇంకా ఏవేవో కావాలనికోరటం మొదలు పెట్టారు.
త్వరలోనే మొత్తం ఇశ్రాయేలీయులంతా మళ్లీ ఫిర్యాదు
చేయటం మొదలు పెట్టారు. ప్రజలు ఇలా అన్నారు,
"తినటానికి మాకు మాంసం కావాలి! 5ఈజిప్టులో
మేము తిన్న చేపలు మాకు జ్ఞాపకం వస్తున్నాయి.
చేపలు మాకు ఉచితంగా దొరికేవి. మంచి కూర
గాయలు – దోసకాయలు, పుచ్చకాయలు, ఆకు
కూరలు, ఉల్లిపాయలు, వెల్లుల్లి పాయలు మాకు దొరి
కేవి. 6కానీ ఇప్పుడు మాకు బలంలేదు. మేము, ఈ
మన్నా తప్ప ఇంకేమి తినటంలేదు!"
7ఆ మన్నా కొత్తిమీమెర గింజల్లా ఉండి, చూపునకు
చెట్టుమీద జిగురు (బంక)లా ఉంది. 8ప్రజలు దీనిని
పోగుచేసి, నూరి పిండి చేస్తారు. లేక బండలను ఉప
యోగించి దాన్ని పొడుం చేస్తారు. తర్వాత ఒక
కుండలో దాన్ని వంట చేసేవారు, లేదా తియ్యటి
అప్పాలు చేసేవారు. అప్పాలు ఒలీవ నూనెతో చేసిన
రొట్టెల్లా రుచిగా ఉన్నాయి. 9ప్రతి రాత్రి నేల అంతా
మంచుతో తడిసినప్పుడు మన్నా నేలమీద కురిసింది.
10ప్రతి కుటుంబం వాళ్లు ఫిర్యాదు చేయటం మోషే
విన్నాడు. ప్రజలంతా వారివారి గుడారాల్లో గొణుగు
తున్నారు. యెహోవాకు చాలా కోపం వచ్చింది.
దానితో మోషేకు చాలా చికాకు కలిగింది. 11మోషే
యెహోవాను అడిగాడు, "యెహోవా, నీ సేవకుడ
నైన నాకు ఇంత కష్టం ఎందుకు కలిగించావు? నేనేమి
పొరబాటు చేసాను? నీకు సంతోషం లేకుండేటట్టు
నేను చేసింది ఏమిటి? ఈ ప్రజలందరి బాధ్యత నీవు
నాకెందుకు ఇచ్చావు? 12ఈ ప్రజలందరికీ నేను
తండ్రిని కానని నీకు తెలుసు. నేను వీరికి జన్మ
ఇవ్వలేదనీ నీకు తెలుసు. కానీ పాలిచ్చి పెంచే దాదిలా
నేనే వీరిని నా చేతుల్లో ఎత్తుకొని పోవాల్సినట్టు కన
బడుతుంది. నేను ఇలా చేసేటట్టుగా నీవెందుకు నన్ను
బలవంతం చేస్తున్నావు? నీవు మా పూర్వీకులకు
వాగ్దానం చేసిన దేశానికి నేను వారిని మోసుకొని వెళ్లాలని
నీవెందుకు నన్ను బలవంతం చేస్తున్నావు? 13ఈ ప్రజ
లందరికీ మాంసం నాదగ్గర లేదు. కానీ వారు నాకు
ఫిర్యాదు చేస్తూనే ఉన్నారు. 'తినటానికి మాంసం ఇవ్వు'
అంటున్నారు వారు. 14ఈ ప్రజలందరినీ గూర్చి నేను
ఒక్కడినే బాధ్యత వహించలేను. ఈ భారం నాకు
చాల బరువుగా ఉంది. 15వారి కష్టాలన్నీ నీవు నా మీదే
పెట్టాలనుకొంటే, ఇప్పుడే నన్ను చంపేయి. నన్ను
నీ సేవకునిగా నీవు అంగీకరిస్తే, నన్ను ఇప్పుడే చావ
నివ్వు. అప్పుడు నా కష్టాలన్నీ తీరిపోతాయి."
16మోషేతో యెహోవా ఇలా అన్నాడు: "ఇశ్రాయే
లీయుల పెద్దలను (నాయకులను) 70 మందిని నా
దగ్గరకు తీసుకునిరా. వీరు ప్రజలలో నాయకులు.
సన్నిధి గుడారం దగ్గరకు వారిని తీసుకునిరా. అక్కడ
నీతోబాటు వారిని నిలబెట్టు. 17అప్పుడు నేను దిగి
వచ్చి, అక్కడ నీతో మాట్లాడతాను. ఇప్పుడు నీ
మీదికి వచ్చిన ఆత్మను వారికికూడ నేను కొంత
ఇస్తాను. అప్పుడు నీవు ప్రజల బాధ్యత వహించటంలో
వారు కూడ నీకు సహాయం చేస్తారు. ఈ విధంగా ఈ

**తబేరా** దీని అర్థం "మంట."

ప్రజల బాధ్యత నీవు ఒంటరిగా భరించాల్సిన అవసరం ఉండదు.

[18]"ప్రజలతో ఇలా చెప్పు: రేపటికోసం మిమ్మల్ని మీరు సిద్ధం చేసుకోండి. రేపు మీరు మాంసం తింటారు. మీ ఏడ్పు యెహోవా విన్నాడు. 'తినటానికి మాకు మాంసం కావాలి. ఈజిప్టులోనే బాగుంది మాకు' అని మీరు చెప్పిన మాటలు యెహోవా విన్నాడు. కనుక యెహోవా ఇప్పుడు మీకు మాంసం ఇస్తాడు. మీరు అది తింటారు. [19]ఒకటి, రెండు, అయిదు, పది, ఇరవై రోజులకంటె ఎక్కువగానే మీరు అది తింటారు. [20]ఒక నెల అంతా మీరు ఆ మాంసం తింటారు. మొఖం మొత్తేటంతవరకు మీరు ఆ మాంసం తింటారు. యెహోవాకు వ్యతిరేకంగా మీరు ఫిర్యాదు చేసారు కనుక మీకు ఇలా జరుగుతుంది. యెహోవా మీ మధ్య సంచరిస్తూ, మీ అవసరాలను గ్రహిస్తాడు. కానీ మీరు ఆయన ఎదుట ఏడ్చి, ఫిర్యాదు చేసారు! అసలు 'మేము ఈజిప్టు ఎందుకు విడిచిపెట్టాము' అన్నారు మీరు."

[21]మోషే అన్నాడు: "యెహోవా, ఇక్కడ 6,00,000 మంది పురుషులు సంచరిస్తున్నారు. 'నీవేమో వారు ఒక నెలంతా తినటానికి సరిపోయే మాంసం ఇస్తాను అంటున్నావు!' [22]మొత్తం గొర్రెలు, పశువులు అన్నింటినీ వధించినా, ఇంత మంది ప్రజలకు ఒక నెల అంతా భోజనంగా పెట్టాలంటే అది చాలదు. అలానే సముద్రంలో ఉన్న మొత్తం చేపలన్నీ మేము పట్టినా, అవీ వారికి చాలవు."

[23]అయితే, "యెహోవా శక్తిని పరిమితం చేయకు. నేను చేస్తానని చెప్పినవాటిని చేస్తానో లేదో నీవు చూస్తావు" అని మోషేతో యెహోవా చెప్పాడు.

[24]కనుక మోషే ప్రజలతో మాట్లాడటానికి బయటకు వెళ్లాడు. యెహోవా చెప్పినది మోషే వారితో చెప్పాడు. అప్పుడు మోషే 70 మంది పెద్దలను సమావేశ పరచాడు. గుడారం చుట్టూ నిలబడమని మోషే వారితో చెప్పాడు. [25]అప్పుడు యెహోవా ఒక మేఘంలో దిగివచ్చి, మోషేతో మాట్లాడాడు. మోషే మీద ఉన్న దేవుని ఆత్మను ఆ 70 మంది పెద్దల మీద ఉంచాడు యెహోవా.* ఆత్మ వారిమీదికి దిగిరాగానే వారు ప్రవచించటం మొదలు పెట్టారు. అయితే ఈ ఒక్కసారి మాత్రమే ఈ మనుష్యులు ఇలా చేసారు.

[26]ఎల్దాదు, మేదాదు అనే ఇద్దరు పెద్దలు బయట గుడారం దగ్గరకు వెళ్లలేదు. వారి పేర్లు పెద్దల జాబితాలో ఉన్నాయి గాని వారు వారి గుడారంలోనే ఉండి పోయారు. కానీ దేవుని ఆత్మ వారిమీదికి కూడ వచ్చినందుచేత, వారుకూడ వారి గుడారంలోనే ప్రవచించటం మొదలుపెట్టారు.

[27]ఒక యువకుడు పరుగెత్తి వెళ్లి మోషేతో చెప్పాడు. "ఎల్దాదు, మేదాదు గుడారంలోనే ప్రవచిస్తున్నారు" అని అతడు చెప్పాడు.

[28]అయితే నూను కుమారుడైన యెహోషువ "అయ్యా మోషే, నీవు వారిని ఆపివేయాలి" అని మోషేతో చెప్పాడు. (యెహోషువ చిన్నతనం నుండి మోషేకు సహాయకుడుగా ఉన్నాడు.)

[29]కానీ మోషే, "ఇప్పుడు నేను నాయకుడ్ని కానని ప్రజలు తలుస్తారేమోనని నీవు భయపడుతున్నావా? యెహోవా ప్రజలు అందరూ ప్రవచిస్తే బాగుంటుందని నా ఆశ. వారందరి మీద యెహోవా తన ఆత్మను ఉంచితే బాగుండునని నా ఆశ" అని బదులు చెప్పాడు.
[30]అప్పుడు మోషే, ఇశ్రాయేలు నాయకులు అంతా తిరిగి గుడారాలకు వెళ్లిపోయారు.

## పూరేళ్లు వచ్చాయి

[31]అప్పుడు యెహోవా సముద్రం నుండి గొప్ప గాలి వీచేటట్టుగా చేసాడు. ఆ గాలి పూరేళ్లను ఆ ప్రాంతంలోకి విసిరాయి. వారి నివాసాల చుట్టూరా పూరేళ్లు ఎగిరాయి. నేల అంతా పూరేళ్లతో నిండిపోయేటన్ని ఉన్నాయి అవి. నేలమీద మూడు అడుగుల ఎత్తుగా పూరేళ్లు నిండిపోయాయి. ఒక మనిషి ఒక రోజున నడువగలిగినంత దూరం అన్ని దిశల్లో పూరేళ్లు ఉన్నాయి.

[32]ప్రజలు బయటకు వెళ్లి ఆ రాత్రి పగలు అంతా పూరేళ్లను ఏరుకొన్నారు. ఆ మర్నాడు అంతా వారు పూరేళ్లు పోగుచేసుకొన్నారు. తక్కువ కూర్చుకొన్నవాడు నూరు తూములుకన్నా ఎక్కువ పూరేళ్లను పోగు చేసుకున్నాడు. తర్వాత ప్రజలు ఆ పూరేళ్లను వారి గుడారాల చుట్టూ ఎండటానికి ఎండలో పరిచారు.

[33]ప్రజలు మాంసం తినటం మొదలుపెట్టారు కాని యెహోవాకు చాల కోపం వచ్చింది. ఆ మాంసం ఇంకా వారి నోటిలో ఉండగానే, ప్రజలు దానిని తినటం ముగించక ముందే ఆ ప్రజలకు భయంకరమైన రోగం వచ్చేటట్టు చేసాడు యెహోవా. అనేకులు అక్కడే మరణించినందువల్ల అక్కడే పాతిపెట్టబడ్డారు. [34]కనుక ప్రజలు ఆ చోటుకు కిబ్రోత్ హత్తావా* అని పేరు పెట్టారు. గొప్ప భోజనం కోసం బలీయమైన కోరికగల వారందరినీ అక్కడ పాతిపెట్టినందువల్ల వారు ఆ చోటుకు ఆ పేరు పెట్టారు.

[35]కిబ్రోత్ హత్తావా నుండి ప్రయాణం చేసి ప్రజలు హజేరోతు చేరి అక్కడ నివసించారు.

**మోషే ... యెహోవా** అనగా దేవుడు మోషేలో వున్నటువంటి తన ఆత్మను ప్రజలమీద కుమ్మరించాడని దీని భావం.

**కిబ్రోత్ హత్తావా** దీని అర్థం "దురాశ సమాధులు."

### మిర్యాము, అహరోనూ మోషే భార్యకు విరోధంగా మాట్లాడారు

12 మిర్యాము, అహరోనూ మోషేకు వ్యతిరేకంగా
మాట్లాడటం మొదలు పెట్టారు. అతని భార్య
ఇథియోపియా స్త్రీ గనుక వారు అతణ్ణి విమర్శించారు.
మోషే ఇథియోపియా ప్రజల్లోని స్త్రీని వివాహం చేసు
కోవటం మంచిది కాదని వారు తలంచారు. 2“ప్రజలతో
మాట్లాడటానికి యెహోవా మోషేను వాడుకొన్నాడు.
కానీ మోషే ఒక్కడే ఉన్నాడా? మన ద్వారా కూడ
యెహోవా మాట్లాడాడు కదా” అని వారు తమలో
తాము అనుకొన్నారు.

యెహోవా ఇది విన్నాడు. 3(మోషే చాలా దీనుడు.
అతడు గొప్పలు చెప్పుకోలేదు, సణగ లేదు. భూమి
మీద అందరికంటె అతడు దీనుడు.) 4కనుక
యెహోవా అకస్మాత్తుగా మోషే, అహరోను, మిర్యా
ములతో మాట్లాడాడు. “మీరు ముగ్గురూ ఇప్పుడే
సన్నిధి గుడారానికి రండి” అని చెప్పాడు. కనుక మోషే,
అహరోను, మిర్యాము గుడారానికి వెళ్లారు. 5అప్పుడు
యెహోవా ఒక మేఘంలో దిగివచ్చాడు. గుడార
ప్రవేశం దగ్గర యెహోవా నిలబడ్డాడు. “అహరోను,
మిర్యామును” తన దగ్గరకు రమ్మని పిల్చాడు
యెహోవా. వాళ్లిద్దరూ ఆయనకు దగ్గరగా రాగానే
6దేవుడు అన్నాడు: “నా మాటలు వినండి, మీ మధ్యకు
నేను ప్రవక్తలను పంపినప్పుడు, యెహోవా నగు నేను
వారికి దర్శనంలో కనబడతాను. కలలో నేనే వారితో
మాట్లాడతాను. 7కానీ నా సేవకుడైన మోషే అట్టివాడు
కాదు. అతడు నా ఇల్లంతటిలో నమ్మకస్థుడు. 8నేను
అతనితో మాట్లాడినప్పుడు ముఖాముఖిగా నేను అత
నితో మాట్లాడతాను. అతనితో నేను చెప్పాలనుకొనే
విషయాలు వివరంగా నేను చెబుతాను. గూఢార్థపు
పొడుపు కథలు నేను ప్రయోగించను. మోషే సాక్షాత్తు
యెహోవా రూపాన్ని చూడవచ్చు. కనుక నా సేవకు
డైన మోషేకు వ్యతిరేకంగా మీరెందుకు అంత ధైర్యంగా
మాట్లాడారు?”

9అంతట యెహోవా వారిని విడిచి వెళ్లి పోయాడు.
కానీ ఆయనకు వారిమీద చాలా కోపం వచ్చింది.
10యెహోవా మేఘం గుడారం మీదనుండి పైకి లేచి
పోయింది. అప్పుడు అహరోను అటు తిరిగి మిర్యా
మును చూడగా, ఆమెకు భయంకర కుష్ఠురోగం
రావటం అతనికి కనబడింది. ఆమె శరీరం మంచులా
తెల్లగా ఉంది.

11అప్పుడు మోషేతో అహరోను అన్నాడు:
“అయ్యో బుద్ధిహీనంగా మేము పాపం చేసాము,
మమ్మల్ని క్షమించు. 12చచ్చి పుట్టిన శిశువులా ఆమె
తన శరీరాన్ని పోగొట్టుకోనియ్యకు.” (కొన్నిసార్లు
అలాంటి శిశువు సగం శరీరం తినివేయబడిపుడు
తుంది.)

13కనుక మోషే, “ఓ దేవా ఈ రోగంనుండి ఆమెను
బాగుచేయి” అని యెహోవాకు మొరపెట్టాడు.

14“ఆమె తండ్రి ఆమె ముఖం మీద ఉమ్మి వేస్తే
ఆమెకు ఏడు రోజులు అవమానం కలుగుతుంది. కనుక
ఆమెను ఏడు రోజులు పాళెమునకు బయట ఉంచండి.
ఆ తర్వాత ఆమె తిరిగి లోనికి రావచ్చు” అని
యెహోవా జవాబిచ్చాడు. 15కనుక మిర్యాము ఏడు
రోజులపాటు పాళెమునకు వెలుపల ఉంచబడింది.
ఆమె మరల లోనికి తీసుకొని రాబడేంతవరకు ప్రజలు
అక్కడనుండి కదలలేదు.

16అది జరిగిన తర్వాత ప్రజలు హజేరోతు విడిచి
పారాను అరణ్యానికి ప్రయాణం చేసారు. ప్రజలు ఆ
అరణ్యంలో గుడారాలు వేసుకొనిరి.

### గూఢచారులు కనాను వెళ్లటం

13 మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
2“కనాను దేశాన్ని తరచి చూడ్డానికి కొందరు
మనుష్యుల్ని పంపించు. ఇదే నేను ఇశ్రాయేలీయులకు
ఇచ్చే దేశం. పన్నెండు వంశాల్లో ఒక్కొక్క దానినుండి
ఒక్కొక్కరిని పంపించు.”

3కనుక యెహోవా ఆజ్ఞకు మోషే విధేయు
డయ్యాడు. పారాను అరణ్యంలోనికి నాయకులను
అతడు పంపించాడు. 4వారి పేర్లు ఇవి:

రూబేను వంశంనుండి జక్కూరు కుమారుడైన షమ్మూయ.
5 షిమ్యోను వంశంనుడి హోరీ కుమారుడైన షాపాతు.
6 యూదా వంశంనుండి యెఫున్నె కుమారు డైన కాలేబు.
7 ఇఖారు వంశంనుండి యోసేపు కుమారుడైన ఇగాలు.
8 ఎఫ్రాయిము వంశంనుండి నూను కుమారు డైన హోషేయ.
9 బెన్యామీను వంశంనుండి రాఫు కుమారుడైన పల్తీ.
10 జెబూలూను వంశంనుండి సోరీ కుమారుడైన గదీయేలు.
11 మనష్షే (యోసేపు వంశాల్లో ఒకటి) వంశం నుండి సూసీ కుమారుడైన గదీ.
12 దాను వంశంనుండి గెమలి కుమారుడైన అమ్మీయేలు.
13 ఆషేరు వంశంనుండి మిఖాయేలు కుమారు డైన సెతూరు.
14 నఫ్తాలి వంశంనుండి వాపెసీ కుమారుడైన నహబీ.
15 గాదు వంశంనుండి మాకీ కుమారుడైన గెయువేలు.

16ఆ దేశాన్ని చూచి పరిశీలించేందుకు మోషే
పంపించిన వారి పేర్లు అవి. (నూను కుమారుడైన
హోషేయను మోషే యెహోషువ అని మరో పేరు
పెట్టి పిలిచేవాడు.)
17కనాను దేశాన్ని కనుక్కొనేందుకు మోషే వారిని
పంపించినప్పుడు అతడు ఇలా చెప్పాడు: "నెగెవు
ఎడారిలోనుండి వెళ్లండి, తర్వాత ఆ కొండల దేశంలోకి
వెళ్లండి. 18ఆ దేశం ఎలా ఉందో చూడండి. అక్కడ
నివసిస్తున్న ప్రజలనుగూర్చి తెలుసుకోండి. వారు బల
వంతులా? బలహీనులా? వారు కొద్ది మందేనా? చాల
మంది ఉన్నారా? 19వారు నివసిస్తున్న దేశాన్ని గూర్చి
తెలుసుకోండి. ఆ భూమి మంచిదా కాదా? వారు నివ
సించే పట్టణాలు ఎలాంటివి? ఆ పట్టణాలకు గోడలు
ఉన్నాయా? ఆ పట్టణాలకు బలీయమైన కాపుదల
ఉందా? 20ఆ దేశాన్ని గూర్చి ఇతర విషయాలు కూడ
తెలుసుకోండి. ఆ భూమి, సారమైనదా కాదా? ఆ
భూమిమీద చెట్లు ఉన్నాయా? అక్కడనుండి కొన్ని
పండ్లు తీసుకుని రావటానికి ప్రయత్నించండి." (ద్రాక్ష
ప్రథమ ఫలాల కాలం ఇది).
21అప్పుడు వారు ఆ దేశాన్ని పరిశీలించి చూసారు.
వారు సీను అరణ్యం నుండి రెహోబు, లెబోహమాతు
వరకు వెళ్లారు. 22నెగెవు ద్వారా ప్రయాణించి హెబ్రోను
పట్టణం చేరుకొన్నారు. (ఈజిప్టులోని సోయను
పట్టణం కంటె హెబ్రోను ఏడేండ్లు ముందు నిర్మించ
బడింది.) అక్కడ అహీమాను, షేషయి, తల్మయి
నివసించారు. వీరు అనాకీ ప్రజలు. 23వాళ్లు ఎష్కోలు
లోయలో ఒక ద్రాక్ష కొమ్మ కోసారు. ఆ కొమ్మకు
ఒక ద్రాక్ష గెల ఉంది. ఇద్దరు మనుష్యులు ఆ గెలను
ఒక కర్రకు కట్టి మోసుకొచ్చారు. కొన్ని దానిమ్మ,
అంజూరపు పండ్లు కూడ వారు తెచ్చారు. 24అక్కడ
ఇశ్రాయేలు మనుష్యులు ద్రాక్ష గుత్తిని కోసినందుచేత
ఆ చోటు ఎష్కోలు* అని పిలువబడింది.
25 40 రోజుల పాటు వారు ఆ దేశాన్ని పరిశీలించారు.
అప్పుడు వారు తిరిగి వారి నివాస మునకు వచ్చారు.
26ఆ మనుష్యులు కాదేషు దగ్గర మోషే, అహరోను,
ఇశ్రాయేలు ప్రజలందరి దగ్గరకు తిరిగి వచ్చారు. ఇది
పారాను అరణ్యంలో ఉంది. అప్పుడు వారు చూచిన
విషయాలన్నింటినీ మోషే, అహరోను, ఇశ్రాయేలు
ప్రజలు అందరితో చెప్పారు. వారు ఆ దేశపు పండ్లను
వారికి చూపించారు. 27ఆ మనుష్యులు మోషేతో ఇలా
చెప్పారు: "నీవు మమ్మల్ని పంపిన దేశంలోకి మేము
వెళ్లాము. ఆ దేశం చాలా బాగుంది. అక్కడ పాలు,
తేనెలు ప్రవహిస్తున్నాయి! అక్కడ మేము చూచిన
పండ్లు ఇవిగో. 28కానీ అక్కడ నివసిస్తున్న మనుష్యులు
చాలా బలము, శక్తి ఉన్నవాళ్లు. వారి పట్టణాలు బలంగా
కాపుదలలో ఉన్నాయి. ఆ పట్టణాలు చాల పెద్దవి.
అనాకు కుటుంబానికి చెందిన కొందరు మనుష్యుల్ని
కూడ మేము అక్కడ చూశాము. 29అమాలేకీ ప్రజలు
నెగెవు లోయలో నివసిస్తున్నారు. హిత్తీయులు, యెబూ
సీయులు, అమోరీయులు కొండల ప్రాంతంలో నివసి
స్తున్నారు. కనానీ ప్రజలు సముద్రతీర ప్రాంతంలోను,
యొర్దాను నదీతీరంలోను నివసిస్తున్నారు."
30అప్పుడు మోషే దగ్గర ఉన్న వాళ్లను నిశ్శబ్దంగా
ఉండమన్నాడు కాలేబు. అప్పుడు కాలేబు, "మనం
వెళ్లి ఆ దేశాన్ని మనకోసం స్వాధీనం చేసుకోవాలి.
తేలికగా మనం ఆ దేశాన్ని స్వాధీనం చేసుకోవచ్చు"
అని చెప్పాడు.
31కానీ అతనితో కూడ వెళ్లినవారు, "ఆ మనుష్యు
లతో మనం పోరాడలేం. వాళ్లు మనకంటె చాల బలం
గలవాళ్లు అన్నారు. 32మనం ఆ దేశ ప్రజలను జయిం
చేందుకు తగిన బలవంతులం కాదు" అని ఇశ్రాయేలు
ప్రజలందరితో వారు చెప్పారు. వారు ఇలా చెప్పారు:
"మేము చూచిన దేశంనిండా బలాఢ్యులు ఉన్నారు.
అక్కడికి వెళ్లిన ఎవరినైనాసరే తేలికగా జయించ
గలిగినంత బలంగలవాళ్లు వారు. 33అక్కడ మేము నెఫీలీ
ప్రజలను చూసాం (నెఫీలీ ప్రజలవాడగు అనాకు
సంతానం.) వాళ్ల ముందు నిలబడితే మేము మిడుతల్లా
ఉన్నట్టు అనిపించింది. మేమేదో మిడుతలంత చిన్న
వాళ్లంగా వాళ్లు మమ్మల్ని చూసారు."

## మళ్లీ ప్రజల ఫిర్యాదు

14 ఆ రాత్రి గుడారాలలో ఉన్న ప్రజలంతా గట్టిగా
ఏడ్వటం మొదలుపెట్టారు. 2ఇశ్రాయేలు
ప్రజలంతా మోషే, అహరోనులకు వ్యతిరేకంగా ఫిర్యాదు
చేసారు. ప్రజలంతా కూడి వచ్చి మోషే, అహరోను
లతో ఇలా చెప్పారు, "ఈజిప్టులోనో లేక అరణ్యం
లోనో మేము చావాల్సింది. మన కొత్త దేశంలో కత్తిచేత
చావటంకంటె అదే బాగుండేది. 3మమ్మల్ని ఈ కొత్త
దేశానికి చావటానికి తీసుకొచ్చాడా? మా భార్యల్ని,
మా పిల్లల్ని మా దగ్గరనుండి తీసుకుపోయి మమ్మల్ని
కత్తులతో చంపేస్తారు. మేము మళ్లీ ఈజిప్టు వెళ్లి
పోవటమే మాకు క్షేమం."
4అప్పుడు వాళ్లు, "మనం ఇంకో నాయకుడ్ని
ఏర్పాటు చేసుకొని, తిరిగి ఈజిప్టు వెళ్లిపోదాము" అని
ఒకళ్లతో ఒకరు చెప్పుకొన్నారు.
5అప్పుడు అక్కడ సమావేశమైన ఇశ్రాయేలు ప్రజ
లందరి ముందు మోషే, అహరోను సాష్టాంగపడ్డారు.
6ఆ దేశాన్ని కనుక్కొని వచ్చిన ఇద్దరు వ్యక్తులు నూను
కుమారుడైన యెహోషువ యెఫున్నె కుమారుడైన
కాలేబు బట్టలు చించుకున్నారు. 7ఈ ఇద్దరు మను
ష్యులూ అక్కడ సమావేశమైన ఇశ్రాయేలీయులంద
రితో ఇలా చెప్పారు: "మేము చూచిన దేశం చాల

---

**ఎష్కోలు** దీని అర్థం "ద్రాక్ష గుత్తి."

బాగుంది. 8మనమీద దేవునికి ఇష్టం ఉంటే, ఆయనే
మనల్ని ఆ దేశంలోనికి నడిపిస్తాడు. ఆ దేశం పాలు
తేనెలు ప్రవహిస్తున్నంత సౌభాగ్యమయినది. ఆ దేశాన్ని
మనకు ఇచ్చేందుకు యెహోవా తన శక్తి ప్రయోగి
స్తాడు. 9అంతేగాని మనం యెహోవాకు ఎదురు తిరుగ
కూడదు. ఆ దేశంలో ప్రజలకు కూడ మనం భయపడ
కూడదు. మనం వాళ్లను తేలికగా జయించేస్తాం. వాళ్లకు
ఎలాంటి భద్రతా లేదు, వాళ్లను క్షేమంగా ఉంచగలిగింది
ఏమీ లేదు. కానీ మనకు యెహోవా ఉన్నాడు. అందు
చేత ఆ మనుష్యుల్ని గూర్చి భయపడకండి!"
10అప్పుడు అక్కడ చేరిన ఇశ్రాయేలు ప్రజలంతా
వీళ్లిద్దర్నీ రాళ్లతో కొట్టి చంపేయాలని మాట్లాడు
కొన్నారు. అయితే యెహోవా మహిమ సన్నిధి
గుడారం మీదికి దిగివచ్చింది. ఇశ్రాయేలు ప్రజలంతా
అది చూడగలిగారు. 11అప్పుడు మోషేతో,
యెహోవా: "ఇంకా ఎన్నాళ్లు ఈ ప్రజలు ఇలా
చేస్తారు? వాళ్లు నన్ను నమ్మటంలేదనే వ్యక్తం చేస్తు
న్నారు. నా శక్తిమీద వాళ్లకు నమ్మకంలేనట్టే కనబడు
తోంది. శక్తివంతమైన ఎన్నో సూచనలు నేను వాళ్లకు
చూపించిన తర్వాతకూడ వాళ్లు నన్ను నమ్మటానికి
నిరాకరిస్తున్నారు. వాళ్లమధ్య నేను ఎన్నో మహాకార్యాలు
చేసాను. 12ఒక భయంకర రోగంతో వాళ్లందరినీ నేను
చంపేస్తాను. వాళ్లను నేను నాశనం చేస్తాను. మరో
జనాంగాన్ని తయారు చేసేందుకు నిన్ను నేను వాడు
కొంటాను. ఆ జనాంగం ఈ ప్రజలకంటె గొప్పదిగా,
బలమైనదిగా ఉంటుంది. అని అన్నాడు"
13అప్పుడు యెహోవాతో మోషే ఇలా అన్నాడు:
"నీవు అలాగనుక చేస్తే, నీ ప్రజలందరినీ నీవే చంపేసావని
ఈజిప్టు ప్రజలు వింటారు. ఈ ప్రజలను ఈజిప్టు
నుండి బయటకు తీసుకుని వచ్చేందుకు నీవు నీ
గొప్ప శక్తిని ప్రయోగించావు. 14ఈ గొప్ప శక్తినిగూర్చి
ఈ దేశ నివాసులందరికీ ఈజిప్టు ప్రజలు చెప్పారు.
ఒక యెహోవా, వాళ్లు ఇప్పటికే నిన్నుగూర్చి విన్నారు.
నీవు నీ ప్రజలకు తోడుగా ఉన్నావనీ ప్రతి ఒక్కరూ
నిన్ను చూసారనీ వారికి తెలుసు. నీ ప్రజలమీద నిలిచే
మేఘాన్ని గూర్చి కూడ ఈ దేశవాసులకు తెలుస్తుంది.
పగలు నీ ప్రజలను నడిపించేందుకు నీవు ఆ మేఘాన్ని
వాడుకొన్నావు. రాత్రిపూట నీ ప్రజలను నడిపించ
టానికి తిరిగి ఆ మేఘం అగ్నిగా మారుతుంది. 15అందు
చేత ఇప్పుడు నీవు ఈ ప్రజలను చంపకూడదు.
ఒకవేళ నీవు వారిని చంపితే, నీ శక్తిని గూర్చి విన్న
దేశాలన్నీ ఏమంటాయంటే 16'యెహోవా ఈ ప్రజ
లకు వాగ్దానం చేసిన దేశంలోకి వారిని తీసుకుని రాలేక
పోయాడు. అందుకని వాళ్లను అరణ్యంలోనే చంపే
సాడు అంటారు.'
17"కనుక యెహోవా, "ఇప్పుడు నీ బలం చూపె
ట్టాలి. నీవు చూపిస్తానని ప్రకటించిన విధానంలో నీవు
చూపించాలి. 18యెహోవా త్వరగా కోపపడడు.
ఆయన మహా ప్రేమమూర్తి. యెహోవా పాపాన్ని
ఆయనకు ఎదురు తిరిగేవారిని క్షమిస్తాడు. అయితే
నేరస్థులను మాత్రం యెహోవా ఎప్పుడూ శిక్షిస్తాడు."
తల్లిదండ్రులు చేసిన పాపాలకుకూడా యెహోవా
పిల్లల్ని శిక్షిస్తాడు. వారి తాత ముత్తాతల పాపాలకు
యెహోవా పిల్లల్నికూడ శిక్షిస్తాడు' అని నీవు చెప్పావు.
19కనుక నీ మహా ప్రేమను ఈ ప్రజలకు చూపించు.
వారి పాపం క్షమించు. వారు ఈజిప్టు విడిచినప్పటినుండి
నీవు వారిని క్షమించినట్టే ఇప్పుడు కూడా క్షమించు."
20యెహోవా జవాబిచ్చాడు: "నీవు అడిగినట్టే నేను
ఈ ప్రజలను క్షమించాను. 21అయితే సత్యం ఏమిటో
నీతో చెబుతాను. నేను జీవిస్తున్నంత నిశ్చయంగా,
నా శక్తి ఈ భూమి అంతటా ఆవరించినంత నిశ్చయంగా,
నేను నీకు ఆ వాగ్దానం చేస్తున్నాను. 22ఈజిప్టు నుండి
నేను బయటకు నడిపించిన ప్రజల్లో ఏ ఒక్కరూ ఆ
కనాను దేశాన్ని చూడరు. ఈజిప్టులో నేను చేసిన
మహా సూచనలను, నా మహిమను చూసారు ఆ ప్రజలు.
అరణ్యంలో నేను చేసిన మహా కార్యాలు వారు చూసారు.
అయినా వారు నాకు అవిధేయులై, పదిసార్లు నన్ను
శోధించారు. 23వారి పూర్వీకులకు ఆ గొప్ప దేశాన్ని
ఇస్తానని నేను వాగ్దానం చేసాను. అయితే నాకు ఇలాంటి
కీడు చేసిన ఏ వ్యక్తి ఎన్నటికీ ఆ దేశంలో ప్రవేశించడు.
24కానీ నా సేవకుడైన కాలేబు విషయం వేరు. అతడు
పూర్తిగా నన్ను వెంబడిస్తాడు. కనుక అతడు ఇప్పుడు
చూసిన ఆ దేశంలోకి అతడ్ని తీసుకొస్తాను. అతని
మనుష్యులకు ఆ దేశం దొరుకుతుంది. 25అమాలేకీ,
కనానీ ప్రజలు లోయలో నివసిస్తున్నారు. రేపు ఈ
చోటు విడిచి, తిరిగి ఎర్ర సముద్రం మార్గంగా అరణ్యా
నికి వెళ్లండి."

### ప్రజలను యెహోవా శిక్షించాడు

26మోషే, అహరోనులతో యెహోవా ఇలా
చెప్పాడు: 27"ఈ దుర్మార్గులు ఇంకెన్నాళ్లు ఇలా నా
మీద ఫిర్యాదు చేస్తుంటారు? వారి ఫిర్యాదులు, సణు
గుడు నేను విన్నాను. 28 కనుక వారితో ఇలా చెప్పు,
మీరు ఫిర్యాదు చేసిన విషయాలన్నింటినీ యెహోవా
తప్పక జరిగిస్తాడు. మీకు ఏమి సంభవిస్తుందంటే, 29ఈ
అరణ్యంలోనే మీ శరీరాలు చచ్చిపడతాయి. మీలో
20 సంవత్సరాలు, అంతకంటె ఎక్కువ వయసు ఉన్న
వాళ్లంతా మన ప్రజల్లో సభ్యులుగా లెక్కించబడ్డారు.
మీలో ప్రతి ఒక్కరూ, యెహోవానైన నా మీద ఫిర్యాదు
చేసారు. కనుక మీలో ప్రతి ఒక్కరూ అరణ్యంలోనే
చస్తారు. 30మీకు ఇస్తానని నేను వాగ్దానం చేసిన దేశంలో
మీరు ఒక్కరుకూడా ప్రవేశించరు. యెఫున్నె కుమారు
డైన కాలేబు, నూను కుమారుడైన యెహోషువ
మాత్రమే ఆ దేశంలోని ప్రవేశిస్తారు. 31మీరు భయపడి,

ఆ కొత్త దేశంలో మీ శత్రువులు మీ పిల్లలను మీ
దగ్గరనుండి తీసుకుని పోతారని ఫిర్యాదు చేసారు.
అయితే ఆ పిల్లల్నే ఆ దేశంలోకి నేను తీసుకుని
వస్తానని నేను మీతో చెబుతున్నాను. మీరు అంగీ
కరించకుండా నిరాకరించిన వాటిని వారు అనుభవిస్తారు.
32మీ విషయానికొస్తే, మీ శరీరాలు ఈ అరణ్యంలోనే
రాలిపోతాయి.

33"మీ పిల్లలు ఈ అరణ్యంలో 40 సంవత్సరాల
పాటు కాపరులుగా ఉంటారు. మీకు విశ్వాసం లేదు
గనుక వారు శ్రమపడుతారు. మీరంతా చచ్చేంతవరకు
వారు ఈ అరణ్యంలోనే ఉండాలి. అప్పుడు మీ అందరి
శరీరాలు ఈ అరణ్యంలోనే పడి ఉంటాయి. 34మీ
పాపాలకోసం 40 సంవత్సరాలు మీరు శ్రమ అనుభవి
స్తారు. (ఆ దేశాన్ని కనుగొన్న 40 రోజుల్లో ఒక్కో
రోజుకు ఒక్కో సంవత్సరం చొప్పున.) నేను మీకు
వ్యతిరేకంగా ఉండటం ఎంతో దారుణంగా ఉంటుందని
మీరు తెలుసుకుంటారు.

35"నేను యెహోవాను, నేనే మాట్లాడాను. ఈ
దుర్మార్గులందరికీ ఇవన్నీ నేను చేస్తానని ప్రమాణం
చేస్తున్నాను. వీరంతా కలిసి నామీదికి వచ్చారు.
అందుచేత వీళ్లంతా ఇక్కడే అరణ్యంలోనే చస్తారు."

36ఆ కొత్త దేశాన్ని కనుగొనేందుకు మోషే పంపిం
చిన మనుష్యులు తిరిగి వచ్చి ఇశ్రాయేలు ప్రజల్లో
ఫిర్యాదులు వ్యాపింప చేసారు. ఈ దేశంలో ప్రవేశించ
టానికి సరిపడినంత బలంగల వాళ్లం కాదు అని వారే
చెప్పారు. 37ఇశ్రాయేలు ప్రజల్లో కష్టాలు వ్యాపించ
టానికి వాళ్లే బాధ్యులు. అందుకని వాళ్లందర్నీ చంపేయ
టానికి ఒక రోగాన్ని రప్పించాడు యెహోవా.
38అయితే ఆ దేశాన్ని పరిశీలించటానికి పంపబడ్డ
వాళ్లలో నూను కుమారుడైన యెహోషువ, యెఫున్నె
కుమారుడైన కాలేబు కూడ ఉన్నారు. యెహోవా
వాళ్లిద్దర్నీ రక్షించాడు. మిగతా పదిమందిని చని పోవు
నట్లు చేసిన రోగం వారికి రాలేదు.

### కనానులో ప్రవేశించటానికి ప్రజలు ప్రయత్నించటం

39ఈ సంగతులన్నీ మోషే ఇశ్రాయేలు ప్రజలకు
చెప్పాడు. ప్రజలు చాలా, చాలా విచారించారు.
40మర్నాడు ఉదయాన్నే ప్రజలు కొండల దేశానికి
బయల్దేరారు. ఆ ప్రజలు, "మేము పాపము చేసాము.
మేము యెహోవా మీద నమ్మకం ఉంచనందుకు
మేము విచారిస్తున్నాము. యెహోవా వాగ్దానం చేసిన
దేశానికి మేము వెళ్తాము" అన్నారు.

41కానీ మోషే ఇలా అన్నాడు: "యెహోవా ఆజ్ఞకు
మీరెందుకు విధేయులవటం లేదు? మీకు జయం
కలుగదు. 42మీరు ఆ దేశం వెళ్లవద్దు. యెహోవా
మీకు తోడుగా లేడు. మీ శత్రువులు మిమ్మల్ని తేలికగా
ఓడించేస్తారు. 43అక్కడ అమాలేకీయులు, కనానీ
యులు మీతో పోరాడుతారు. మీరు యెహోవా నుండి
వేరై పోయారు. అందుచేత మీరు వాళ్లతో యుద్ధం
చేసేటప్పుడు ఆయన మీకు తోడుగా ఉండడు.
మీరంతా వారి ఖడ్గాలతో చంపబడతారు."

44కానీ ప్రజలు మోషేను నమ్మలేదు. వారు అలానే
ఆ కొండల దేశంవైపు వెళ్లారు. అయితే మోషేగాని,
యెహోవా ఒడంబడిక పెట్టెగాని వారితో వెళ్లలేదు.
45అప్పుడు ఆ కొండల దేశంలో నివసిస్తున్న అమాలేకీ
ప్రజలు, కనానీ ప్రజలు దిగివచ్చి ఇశ్రాయేలు ప్రజల
మీద దాడిచేసారు. అమాలేకీ ప్రజలు, కనానీ ప్రజలు
తేలికగా వీరిని ఓడించి, హోర్మా వరకు వారిని తరిమి
కొట్టారు.

### బలుల నియమాలు

15 మోషేతో యెహోవా ఇలా అన్నాడు: 2"ఇశ్రా
యేలు ప్రజలతో మాట్లాడి వారికి చెప్పు:
మీకు నివాసంగా నేను ఇస్తున్న ఒక దేశంలో మీరు
ప్రవేశిస్తారు. మీరు ఆ దేశంలో ప్రవేశించగానే మీరు
యెహోవాకు బలులు అర్పించాలి.

3ఈ అర్పణల్లో కొన్నింటిని మీరు అగ్నితో
దహించాలి. మీ పశువుల మందల్లోనుండి, గొర్రెల
మందల్లోనుండి మీరు అర్పణలు ఇవ్వాలి. ఇది
యెహోవాకు ప్రీతిని కలిగిస్తుంది. దహనబలులు, బలి
అర్పణలు, ప్రత్యేక ప్రమాణాలు, ప్రత్యేక కానుకలు,
సమాధాన బలులు, ప్రత్యేక సెలవు దినాలు ఇవన్నీ
యెహోవాకు చాల ఇష్టం.

4"ఆ సమయంలో తన అర్పణను తెచ్చేవాడు
యెహోవాకు ధాన్యార్పణ కూడ పెట్టాలి. ఆ ధాన్యా
ర్పణ ముప్పావు ఒలీవ నూనెతో కలపబడ్డ రెండు
పడుల పిండి. 5ఒక గొర్రెపిల్లను దహనబలిగా నీవు
అర్పించిన ప్రతిసారీ ముప్పావు ద్రాక్షారసం పానార్ప
ణంగా నీవు సిద్ధం చేయాలి.

6"మీరు ఒక పొట్టేలును అర్పిస్తుంటే కూడ ధాన్యా
ర్పణ సిద్ధం చేయాలి. ఆ ధాన్యార్పణ ఒక పడి ఒలీవ
నూనెతో కలుపబడ్డ నాలుగు పడుల పిండి. 7ఒక పడి
ద్రాక్షారసాన్ని పానార్పణంగా నీవు సిద్ధం చేయాలి.
దాన్ని యెహోవాకు అర్పించు. అది ఆయన్ను
సంతోషపెడుతుంది.

8"అర్పణగా, బలిగా, సమాధాన బలిగా, లేక
యెహోవాకు ఒక ప్రత్యేక వాగ్దానంగా నీవు ఒక కోడె
దూడను సిద్ధం చేయవచ్చు. 9కనుక ఆ కోడె
దూడతోబాటు ధాన్యార్పణ కూడ నీవు తీసుకొని
రావాలి. ఆ ధాన్యార్పణ పడిన్నర ఒలీవ నూనెతో
కలుపబడిన ఆరు పడుల గోధుమ పిండి. 10మరియు
పడిన్నర ద్రాక్షారసం పానార్పణంగా తేవాలి. ఈ అర్పణ
హోమంలో దహించబడటం యెహోవాకు ఎంతో
సంతోషం.

[11]నీవు యెహోవాకు అర్పించే ప్రతి కోడెదూడ, పొట్టేలు, గొర్రెపిల్ల, మేక పిల్ల ఈ విధంగా సిద్ధం చేయబడాలి. [12]నీవు అర్పించే ప్రతి జంతువుకూ నీవు ఇలా చేయాలి.

[13]“ ప్రజలు ఇలా దహన బలులు అర్పించినప్పుడు వారు యెహోవాను సంతోషపెడతారు. అయితే ఇశ్రాయేలీయుల్లో ప్రతి పౌరుడూ వీటన్నింటినీ నేను నీతో చెప్పినట్టే చేయాలి. [14]మరియు రాబోయే కాల మంతటిలో ఇశ్రాయేలు కుటుంబంలో జన్మించని వాడు మీ మధ్య నివసిస్తుంటే, అతడు కూడా వీటన్నింటికీ విధేయుడు కావాలి. నేను నీకు చెప్పిన విధంగానే అతడు ఇవన్నీ చేయాలి. [15]ఇశ్రాయేలు వంశంలో పుట్టిన మీకు, మీ మధ్య నివసించే ఇతరులకు ఒకే రకమైన నియమాలు ప్రజలకు ఉండాలి. ఈ ఆజ్ఞ ఇప్పటి నుండి భవిష్యత్తు వరకు కొనసాగుతుంది. మీరు, మీ మధ్య ఉండే ఇతరులు అంతా ఒకటే యెహోవా ఎదుట. [16]అంటే మీరు ఒకే ఆజ్ఞలు, నియమాలు పాటించాలని దీని భావం. ఇశ్రాయేలు వంశంలో పుట్టిన మీకు, మీ మధ్య నివసించే ఇతర ప్రజలందరకు ఇవే ఆజ్ఞలు, నియమాలు.”

[17]మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: [18]“ఇశ్రాయేలు ప్రజలతో ఈ విషయాలు చెప్పు: నేను మిమ్మల్ని మరో దేశానికి తీసుకుని వెళ్తున్నాను. [19]ఆ దేశంలో పండే ఆహారం మీరు తినేటప్పుడు దానిలో భాగం యెహోవాకు అర్పణగా మీరు ఇవ్వాలి. [20]మీరు ధాన్యం విసిరి, ముద్దగా చేయాలి. దాన్ని రొట్టెలుగా చేయాలి. ఆ రొట్టెల్లో మొదటిది యెహోవాకు ఇవ్వాలి. అది కళ్లం నుండి వచ్చే ధాన్యార్పణ. [21]ఇప్పుడు, రాబోయే కాలమంతా ఈ అర్పణను మీరు యెహోవాకు ఇవ్వాలి. అనగా మీరు ఆహారంగా విసరు కొనే ధాన్యంలో మొదటిది యెహోవాకు ఇవ్వాలని అర్థం.

[22]“మోషేకు యెహోవా ఇచ్చిన ఈ ఆజ్ఞలలో దేనికైనా విధేయులవటం మీరు మరచిపోతే మీరేమి చేయాలి? [23] ఇవి మోషే ద్వారా మీకివ్వబడిన ఆజ్ఞలు. వీటిని యెహోవా మీకు ఇచ్చిన రోజే ఈ ఆజ్ఞలు ప్రారంభం అయ్యాయి. ఈ ఆజ్ఞలు రాబోయే కాల మంతా కొనసాగుతాయి. [24]“అయితే వీటిలో ఏదైనా ఒక ఆజ్ఞకు మీరు విధేయులు కాకపోవటం జరుగవచ్చు. మీరు ఒక ఆజ్ఞకు విధేయులవటం మరచిపోయినా, ప్రజలంతా ఆ ఆజ్ఞ మరచిపోయి దోషులైనా, ప్రజలంతా ఒక కోడెదూడను యెహోవాకు అర్పణగా ఇవ్వాలి. ఇది దహనబలి, ఇది యెహోవాను సంతోషపెడుతుంది. కోడె దూడతో బాటు ధాన్యార్పణ, పానార్పణం కూడ ఇవ్వాలని జ్ఞాపకం ఉంచుకోండి. మరియు పాప పరిహర బలిగా ఒక మగ మేకనుకూడ మీరు ఇవ్వాలి.

[25]“కనుక ఆ పాపం నిమిత్తం ఆ చెల్లింపును యాజకుడు అర్పిస్తాడు. ఇశ్రాయేలు ప్రజలందరి కోసం అతడు ఇలా చేస్తాడు. వారు పాపం చేస్తున్నట్టు ప్రజలకు తెలియదు. అయితే దాన్నిగూర్చి వారు తెలుసుకొన్నప్పుడు, వారి తప్పిదం నిమిత్తం యెహోవాకు అర్పించేందుకు వారు ఒక అర్పణం తెచ్చారు. అది హోమంలో దహించబడిన పాప పరిహారార్థ అర్పణ. [26]ఇశ్రాయేలు ప్రజలందరు, వారి మధ్య నివసిస్తున్న ఇతర ప్రజలంతా క్షమించబడతారు. వారు చేస్తోంది తప్పు అని వారికి తెలియదు గనుక వారు క్షమించబడతారు.

[27]“అయితే ఒక వ్యక్తి మాత్రమే ఒక ఆజ్ఞను పాటించటం మరచిపోతే, అతడు ఒక సంవత్సరపు ఆడ మేకను పాపపరిహారార్థ బలిగా తీసుకుని రావాలి. [28]ఆ పాపం నిమిత్తం యెహోవా ఎదుట యాజకుడు ఆ చెల్లింపును అర్పిస్తాడు. అతని నిమిత్తం యాజకుడు చెల్లింపును అర్పించాడు గనుక అతడు క్షమించబడతాడు. [29]పాపం చేసినప్పటికి తాను తప్పు చేస్తున్నానని ఎరుగని ప్రతి వ్యక్తికి ఈ ఆజ్ఞ వర్తిస్తుంది. ఇశ్రాయేలు వంశంలో పుట్టిన వారికి, మీ మధ్యలో నివసిస్తున్న ఇతర ప్రజలకు కూడా ఇదే ఆజ్ఞ.

[30]“కానీ ఎవరైనా సరే తాను చేస్తోంది తప్పు అని తెలిసికూడ పాపం చేస్తే, అలాంటివాడు యెహోవాకు విరోధంగా జీవిస్తున్నాడు. అతడిని తన ప్రజలనుండి పంపించి వేయాలి. ఇశ్రాయేలు వంశంలో పుట్టిన వానికి, మీ మధ్య నివసించే వానికి ఇది సమానం. [31]అతడు యెహోవా మాటకు అడ్డం తిరిగాడు. అతడు యెహోవా ఆజ్ఞలకు విధేయుడు కాలేదు. అతడు తప్పకుండ మీ మధ్యనుండి వెళ్లగొట్టబడాలి. అతడు దోషిగానే ఉంటాడు.”

### విశ్రాంతి రోజున ఒకడు పని చేస్తే

[32]ఇప్పటికి ఇశ్రాయేలు ప్రజలు ఇంకా అరణ్యంలోనే ఉన్నారు. ఒకడు వంట కట్టెలు చూడటం తటస్థించింది. కనుక అతడు ఆ కట్టెలు ప్రోగుచేస్తున్నాడు కాని అది సబ్బాతు. అతడు ఇలా చేయటం మరి కొందరు చూసారు. [33]అతడు కట్టెలు ఏరటం చూచిన వాళ్లు అతన్ని, మోషే, అహరోను దగ్గరకు తీసుకుని వచ్చారు. ప్రజలంతా వాడ్ని చుట్టేసారు. [34]ఆ మనిషిని ఎలా శిక్షించాలో వారికి తెలియదు గనుక వారు అతణ్ణి అక్కడే ఉంచారు. [35]అప్పుడు యెహోవా, “ఆ మనిషి చావాలి. నివాస స్థలపు వెలుపల, ప్రజలంతా వానిమీద రాళ్లు విసరాలి” అని మోషేతో చెప్పాడు.

[36]కనుక ప్రజలు అతణ్ణి నివాస స్థలమునుండి వెలుపలకు తీసు కుని వెళ్లి రాళ్లతో కొట్టి చంపారు. మోషేకు యెహోవా ఆజ్ఞాపించిన విధంగానే వారు ఇలా చేసారు.

### నియమాలు జ్ఞాపకం ఉంచుకొనేందుకు దేవుని సహాయం

37మోషేతో యెహోవా అన్నాడు: 38“ఇశ్రాయేలు
ప్రజలతో మాట్లాడి ఇలా చెప్పు: మీరు నా ఆజ్ఞలు
జ్ఞాపకం ఉంచుకొనేందుకు నేను మీకు ఒకటి ఇస్తాను.
దారం ముక్కలు కొన్ని తీసుకొని వాటిని పేని, మీ
బట్టల అంచులకు వాటిని కట్టాలి. ఆ కుచ్చుల్లో
ఒక్కొక్క దాని మధ్య ఒక నీలం దారం ఉంచాలి.
ఇప్పుడూ, ఇక ముందుకూ ఎప్పటికీ మీరు వాటిని
ధరించాలి. 39మీరు ఈ కుచ్చులను చూచి, యెహోవా
మీకిచ్చిన ఆజ్ఞలన్నింటిని జ్ఞాపకం ఉంచుకో గలుగు
తారు. అప్పుడు మీరు ఆ ఆజ్ఞలకు విధేయులవుతారు.
ఆజ్ఞలను మరచిపోయి, మీ శరీరాలు, కండ్లు కోరిన
ప్రకారం చేయరు. 40మీరు నా ఆజ్ఞలు అన్నింటికి
విధేయులు కావాలని జ్ఞాపకం ఉంచుకొంటారు.
అప్పుడు మీరు దేవుని ప్రత్యేక ప్రజలుగా ఉంటారు.
41నేను యెహోవాను, మీ దేవుణ్ణి. మిమ్మల్ని ఈజిప్టు
నుండి బయటకు తీసుకుని వచ్చింది నేనే. నేను మీ
దేవునిగా ఉండటానికి ఇలా చేసాను. నేను యెహో
వాను, మీ దేవుణ్ణి.”

### మోషే మీద కొందరి నాయకుల తిరుగుబాటు

16 కోరహు, దాతాను, అబీరాము, ఓను అనువారు
మోషేకు ఎదురు తిరిగారు. (కోరహు ఇస్హారు
కుమారుడు. ఇస్హారు కహాతు కుమారుడు, కహాతు
లేవీ కుమారుడు. దాతాను, అబీరాము సోదరులు
ఎలీయాబు కుమారులు. ఓను పెలెతు కుమారుడు.)
దాతాను, అబీరాము, ఓను రూబేను వంశస్థులు. 2ఈ
నలుగురూ ఇశ్రాయేలీయులలో మరో 250 మందిని
పోగుజేసి మోషే మీదికి వచ్చారు. ఈ 250 మంది
ఇశ్రాయేలీయులలో పేరున్న పెద్ద మనుష్యులు. వారు
సభా సభ్యులుగా ఎన్నుకోబడినవారు.
3వారు మోషే, అహరోనులకు వ్యతిరేకంగా మాట్లాడ
టానికి గుంపుగా వచ్చి. “మీరు చేసింది మేము ఒప్పు
కోవటం లేదు. ఇశ్రాయేలీయుల నివాసంలో ఉన్న
వాళ్లంతా పవిత్రులు. వారిలో ప్రతి ఒక్కరూ మంచి
వారు. పైగా యెహోవా వారితో ఉన్నాడు. అలాంట
ప్పుడు మేము ఆ దేశంలో ప్రవేశించం అని చెబుతా
వేమి? నిన్ను నీవే అందరికంటె గొప్ప చేసుకొంటు
న్నావు” అని వాళ్లు మోషే, అహరోనులతో అన్నారు.
4మోషే ఈ సంగతులు వినగానే, వినయంతో
సాష్టాంగపడ్డాడు. (తాను గర్విష్ఠిని కానని చూపించ
టానికి 5అప్పుడు కోరహుతో, అతనితో ఉన్న వాళ్లం
దరితో మోషే ఇలా అన్నాడు: “వాస్తవానికి ఎవరు
యెహోవాకు చెందినవారో రేపు ఉదయం ఆయన
తెలియజేస్తాడు. అలాంటివాడిని అయన తన దగ్గరకు
రానిస్తాడు. ఆ మనిషిని యెహోవా ఎన్నిక చేసి,
యెహోవాయే అతడిని తన దగ్గరకు తీసుకొస్తాడు.
6అందుచేత కోరహు, నీవూ, నీ అనుచరులంతా ఇలా
చేయాలి. 7రేపు ధూపార్తుల్లో నిప్పు, సాంబ్రాణి
వెయ్యండి. అప్పుడు వాటిని యెహోవా సన్నిధికి
తీసుకొనిరండి. నిజంగా పవిత్రుడిని యెహోవా ఎంచు
కొంటాడు. కానీ, నీవూ, నీ లేవీ సోదరులు తప్పుచేసి
మితిమీరిపోయారు.”
8కోరహుతో మోషే ఇంకా ఇలా అన్నాడు: “లేవీయు
లారా, నా మాట వినండి. 9ఇశ్రాయేలు దేవుడు
మిమ్మల్ని వేరు చేసి, ప్రత్యేకంగా ఉంచినందుకు మీరు
సంతోషించాలి. మిగతా ఇశ్రాయేలు ప్రజలందరి కంటె
మీరు ప్రత్యేకం. ఇశ్రాయేలు ప్రజలు యెహోవాను
ఆరాధించేందుకు సహాయకరంగా యెహోవా పవిత్ర
గుడారంలో ప్రత్యేక పని చేయటానికి యెహోవా
మిమ్మల్ని తనకు దగ్గరగా తెచ్చుకొన్నాడు. అది
చాలదా? 10యెహోవా తానే నిన్ను, లేవీ ప్రజలందర్నీ
తన దగ్గరకు చేర్చుకొన్నాడు. కానీ ఇప్పుడు మీరే
యాజకులు అయ్యేందుకు కూడా ప్రయత్నిస్తు
న్నారు. 11నీవూ, నీ అనుచరులూ యెహోవా మీదికి
రావటానికి ఏకమయ్యారు. మీరు అహరోను మీదికి
వచ్చి, అతనికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేయటం తప్పు.”
12అప్పుడు ఎలీయాబు కుమారులైన దాతాను, అబీరా
ములను మోషే పిల్చాడు. కానీ వాళ్లిద్దరు చెప్పారు:
“మేము రాము. 13పాలు తేనెలు ప్రవహించే మంచి
ధనిక దేశంనుండి నీవు మమ్మల్ని బయటకు తీసుకు
చ్చావు. ఈ అరణ్యంలో మమ్మల్ని చంపటానికి నీవు
మమ్మల్ని ఇక్కడికి తీసుకుచ్చావు. పైగా నీకు మామీద
చాల అధికారం ఉన్నట్టు చూపించాలనుకొంటున్నావు.
14మేము నిన్నెందుకు వెంబండించాలి? పాలు తేనెలు
ప్రవహించే ఒక కొత్త ధనిక దేశానికి మమ్మల్ని నీవు
తీసుకుని రాలేదు. దేవుడు వాగ్దానం చేసిన దేశం నీవు
మాకు ఇవ్వలేదు. పొలాలు, ద్రాక్షాతోటలు నీవేమి
మాకు ఇవ్వలేదు. ఈ మనుష్యుల్ని నీ బానిసలుగా
చేస్తావా? లేదు, మేము రాము.”
15అందుచేత మోషేకు చాల కోపం వచ్చింది.
అతడు యెహోవాతో “వారి కానుకలు స్వీకరించకు.
వారి దగ్గరనుండి నేనేమి తీసుకోలేదు, కనీసం ఒక
గాడిదను కూడ తీసుకోలేదు. పైగా వారిలో ఎవ్వరికీ
నేనేమి కీడు చేయలేదు” అని చెప్పాడు.
16అప్పుడు మోషే కోరహుతో అన్నాడు: “నీవూ,
నీ అనుచరులంతా రేపు యెహోవా ఎదుట నిలబడాలి.
మీతోబాటు అహరోనుకూడ యెహోవా ఎదుట నిల
బడతాడు.
17మీలో ప్రతి ఒక్కరూ ఒక ధూపార్తి తీసుకుని,
అందులో సాంబ్రాణి వేసి దానిని యెహోవాకు
అర్పించాలి. నాయకులకు 250 ధూపార్తులు, నీకు
ఒక ధూపార్తి, అహరోనుకు ఒక ధూపార్తి ఉండాలి.”

18కనుక ప్రతి ఒక్కరూ ఒక్కో ధూపార్తిని సాంబ్రా
ణితో నింపారు. అప్పుడు వారు సన్నిధి గుడారపు
ప్రవేశం దగ్గర నిలబడ్డారు. మోషే, అహరోను కూడ
అక్కడ నిలబడ్డారు. 19కోరహు తన అనుచరులందరినీ
సమావేశపర్చాడు (వీళ్లే మోషే, అహరోనులను ఎదిరిం
చినవారు). సన్నిధి గుడార ప్రవేశం దగ్గర వీళ్లందర్నీ
కోరహు సమావేశ పర్చాడు. అప్పుడు అక్కడ ప్రతి
ఒక్కరికీ యెహోవా మహిమ ప్రత్యక్షం అయింది.

20మోషే, అహరోనులతో యెహోవా 21“ఈ మను
ష్యులకు దూరంగా వెళ్లిపోండి, నేను వాళ్లను ఇప్పుడే
నాశనం చేసేస్తాను” అన్నాడు.

22అయితే మోషే, అహరోనూ సాష్టాంగపడిపోయి
“ఓ దేవా, మనుష్యులందరి ఆత్మలను ఎరిగిన
యెహోవా నీవు. మొత్తం ఈ గుంపు అంతటి మీద
కోపగించకు. నిజానికి పాపం చేసింది ఒక్కడే” అంటూ
మొరపెట్టారు.

23అప్పుడు యెహోవా మోషేతో 24“కోరహు,
దాతాను, అబీరాము గుడారాల దగ్గరనుండి అందర్నీ
దూరంగా వెళ్లిపొమ్మని చెప్పు” అన్నాడు.

25మోషే లేచి దాతాను, అబీరాము దగ్గరకు వెళ్లాడు.
ఇశ్రాయేలు పెద్దలంతా అతన్ని వెంబడించారు. 26మోషే
ప్రజలను ఈ రీతిగా హెచ్చరించాడు: “ఈ దుర్మార్గుల
గుడారాల నుండి దూరంగా వెళ్లిపొండి. వారి వాటిని
ఏవీ తాకకండి. మీరు తాకితే వారి పాపాలవల్ల మీరుకూడ
నాశనం చేయబడతారు.”

27కనుక వాళ్లంతా కోరహు, దాతాను, అబీరాము
గుడారాలనుండి దూరంగా వెళ్లిపోయారు. దాతాను,
అబీరాము వారి భార్యలు, పిల్లలు, శిశువులతోబాటు
వారి గుడారాల బయట నిలబడి ఉన్నారు. 28అప్పుడు
మోషే చెప్పాడు: “నేను మీతో చెప్పిన విషయాలన్నీ
చేసేందుకు యెహోవా నన్ను పంపించాడని నేను
మీకు రుజువు చూపిస్తాను. అవన్నీ నా స్వంత తలం
పులు కావని నేను మీకు చూపిస్తాను. 29ఈ మనుష్యులు
ఇక్కడే చస్తారు. కానీ సాధారణంగా మనుష్యులు చని
పోయే సామాన్య విధానంలోనే గనుక వీరు మరణిస్తే,
నన్ను నిజంగా యెహోవా పంపించలేదని అర్థం. 30కానీ
ఈ మనుష్యులు వేరే విధంగా, మరో క్రొత్తరకంగా
మరణించేటట్టు యెహోవా గనుక చేస్తే అప్పుడు
వీళ్లు నిజంగా యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేసారని
మీకు తెలుస్తుంది. భూమి తెరచుకొని వీళ్లను మింగే
స్తుంది. వారు సజీవ సమాధి అయిపోతారు. వీరికి
చెందినది అంతా వీరితోబాటే లోపలికి వెళ్లిపోతుంది.”

31మోషే ఈ మాటలు చెబుతూ ఉండగానే ఆ
మనుష్యుల కాళ్ల కింద భూమి తెరచుకొంది. 32అది
భూమి తన నోరు తెరచి వారిని మింగివేసినట్టుగా
ఉంది. వారి కుటుంబాలన్నీ, కోరహు మనుష్యులంతా,
వారికి ఉన్నదంతా భూమిలోకి వెళ్లిపోయింది. 33వారు
సజీవంగానే సమాధిలోనికి వెళ్లిపోయారు. వారికి ఉన్న
దంతా వారితోబాటే లోపలికి వెళ్లిపోయింది. అప్పుడు
వారిమీద భూమి కప్పివేసింది. వారు నాశనమైపోయి,
పాళెములో లేకుండా పోయారు.

34నాశనం చేయబడు తోన్న మనుష్యుల అరుపులు
ఇశ్రాయేలు ప్రజలు విన్నారు. అందుచేత వాళ్లంతా
“భూమి మనల్నికూడ మ్రింగివేస్తుంది” అంటూ అటు
ఇటు పరుగులెత్తారు.

35తర్వాత యెహోవా దగ్గర్నుండి అగ్ని దిగి వచ్చి,
ధూపం వేస్తున్న ఆ 250 మందిని నాశనం చేసింది.

36యెహోవా మోషేతో ఇలా చెప్పాడు:

37-38“చచ్చిన ఆ మనుష్యుల మధ్య ఉన్న ధూపార్తు
లన్నింటినీ వెదకమని యాజకుడైన అహరోను కుమా
రుడైన ఎలీయాజరుతో చెప్పు. ఆ నిప్పుకణికలను
నివాసానికి దూరంగా చల్లండి. ధూపార్తులు ఇంకా పవిత్ర
మైనవే. ఇవి నాకు వ్యతిరేకంగా పాపం చేసిన మను
ష్యులు ఉపయోగించిన ధూపార్తులు. వారి పాపం వారి
ప్రాణాలు తీసింది. ధూపార్తులను రేకులుగా కొట్టండి.
బలిపీఠం కప్పటానికి ఈ రేకులు వాడండి. అవి
యెహోవా ఎదుట అర్పించబడినవి గనుక అవి
పవిత్రం. రేకులు చేయబడ్డ ఆ ధూపార్తులు ఇశ్రాయేలు
ప్రజలందరకు హెచ్చరికగా ఉండుగాక!”

39కనుక ఆ మనుష్యుల ఇత్తడి ధూపార్తులను అన్నిం
టినీ ఎలీయాజరు పోగుచేసాడు. వాళ్లంతా కాల్చివేయ
బడ్డారు గాని ధూపార్తులు మాత్రం అక్కడ ఉన్నాయి.
ఆ ధూపార్తులను వెడల్పు రేకులుగా కొట్టమని కొంద
రితో చెప్పాడు ఎలీయాజరు. అప్పుడు ఆ వెడల్పు
రేకులను అతడు బలిపీఠం చుట్టూ పెట్టాడు. 40మోషే
ద్వారా యెహోవా తనకు ఆజ్ఞాపించిన ప్రకారం అతడు
ఇలా చేసాడు. అహరోను కుటుంబానికి చెందిన వ్యక్తి
మాత్రమే యెహోవా ఎదుట ధూపం వేయాలని
ఇశ్రాయేలు ప్రజలు జ్ఞాపకం ఉంచుకొనేందుకు ఇది
సహాయకరమైన సూచన. ఇంకొక వ్యక్తి గనుక
యెహోవా ఎదుట ధూపం వేస్తే, అతడు కోరహు,
అతని అనుచరుల్లా అవుతాడు.

### అహరోను ప్రజల్ని రక్షించటం

41మరునాడు ఇశ్రాయేలు ప్రజలంతా మోషే, అహ
రోనుల మీద ఫిర్యాదు చేసారు. వారు, “యెహోవా
ప్రజలను మీరు చంపారు” అన్నారు.

42మోషే, అహరోనులు సన్నిధి గుడారం ప్రవేశం
దగ్గర నిలబడి ఉన్నారు. మోషే, అహరోనుల మీద
ఫిర్యాదు చేయటానికి ప్రజలు ఆచోట చేరారు. అయితే
వారు సన్నిధి గుడారం వైపు చూచినప్పుడు, మేఘం
దానిని ఆవరించి, యెహోవా మహిమ అక్కడ ప్రత్యక్ష
మయింది. 43అప్పుడు మోషే, అహరోనులు సన్నిధి
గుడారం ఎదుటికి వెళ్లారు.

44అప్పుడు యెహోవా మోషేతో 45“ఇప్పుడు
నేను వీళ్లను నాశనం చేస్తాను గనుక మీరు దూరంగా
తొలగిపొండి” అని చెప్పాడు. కనుక మోషే, అహరో
నులు సాష్టాంగపడ్డారు.
46అప్పుడు మోషే “నీ ధూపార్తిని బలిపీఠపు నిప్పు
లతో నింపు. దానిమీద సాంబ్రాణి వేయి. త్వరపడి
ప్రజల సమాజం దగ్గరకు వెళ్లి వారి పాపానికి ప్రాయ
శ్చిత్తం చేయి. యెహోవా వారి మీద కోపంగా
ఉన్నాడు. కష్టాలు అప్పుడే మొదలయ్యాయి” అని
అహరోనుతో చెప్పాడు.
47కనుక మోషే చెప్పినట్టు అహరోను చేసాడు.
అతడు నిప్పులు, సాంబ్రాణి తీసుకొని ప్రజలందరి
మధ్యకు పరుగెత్తాడు. అయితే అప్పటికే ప్రజల్లో రోగం
మొదలయింది. ప్రజలకోసం ప్రాయశ్చిత్తంగా అహ
రోను ధూపం వేసాడు. 48బ్రతికి ఉన్నవాళ్లకు, చచ్చిన
వాళ్లకు మధ్య నిలబడ్డాడు అహరోను. అంతటితో ఆ
రోగం ఆగిపోయింది. 49అయితే వారి పాపం నిమిత్తం
అహరోను ప్రాయశ్చిత్తం చేయకముందే ఆ రోగం
వల్ల కోరహు మూలంగా చచ్చినవాళ్లు కాక ఇంకా 14,700
మంది చనిపోయారు. 50అప్పుడు సన్నిధి గుడార
ప్రవేశం దగ్గర ఉన్న మోషే వద్దకు అహరోను తిరిగి
వెళ్లాడు. ప్రజల్లో ఆ భయంకర రోగం నిలిచిపోయింది.

## అహరోను ప్రధాన యాజకుడని దేవుడు రుజువు చేయటం

17 మోషేతో యెహోవా చెప్పాడు: 2“ఇశ్రా
యేలు ప్రజలతో మాట్లాడు. వారి దగ్గరనుండి
పన్నెండు చేతికర్రలు తీసుకునిరా. పన్నెండు వంశా
లలో ఒక్కొక్క నాయకుని దగ్గర్నుండి ఒకటి తీసుకో,
ఒక్కొక్కరి పేరు ఒక్కో కర్ర మీద వ్రాయి. 3లేవీ
వాళ్ల కర్రమీద అహరోను పేరు వ్రాయి. పన్నెండు
వంశాల్లో ప్రతి పెద్దకు ఒక కర్ర ఉండాలి. 4సన్నిధి
గుడారంలో ఒడంబడిక పెట్టె ఎదుట ఈ చేతి కర్రలను
పెట్టు. ఇది నేను నిన్ను కలుసుకొనే చోటు. 5ఒక్క
మనిషిని నేను ఏర్పాటు చేసుకొంటాను. ఏ మనిషిని
నేను ఎంచుకుంటానో నీకు తెలుస్తుంది. ఎందుచేత
నంటే అతని కర్రకు కొత్త ఆకులు మొలవటం ప్రారంభ
మవుతుంది. ఈ విధంగా, ప్రజలు నీకు, నాకు
ఎల్లప్పుడు వ్యతిరేకంగా ఫిర్యాదు చేయటం నేను ఆపు
చేస్తాను.”
6కనుక మోషే ఇశ్రాయేలు ప్రజలతో మాట్లా డాడు.
పెద్దలంతా ఒక్కొక్కరు ఒక కర్ర అతనికి ఇచ్చారు.
మొత్తం కర్రల సంఖ్య పన్నెండు. ఒక్కో వంశం
నాయకుని దగ్గరనుండి ఒక్కో కర్ర వచ్చింది. వాటి
మధ్య అహరోను కర్ర ఉంది. 7మోషే ఆ చేతి కర్రలను
సన్నిధి గుడారంలో ఒడంబడిక పెట్టె దగ్గర యెహోవా
ఎదుట ఉంచాడు.
8ఆ మరునాడు మోషే గుడారంలో ప్రవేశించాడు.
లేవీ వంశపు కర్ర, అంటే అహరోను చేతికర్ర కొత్త
ఆకులు తొడగటం మొదలు పెట్టినట్టు అతడు
చూసాడు. ఆ కర్రకు కొమ్మలుకూడ పెరిగి, బాదం
కాయలు కాసింది. 9కనుక యెహోవా స్థానం నుండి
మోషే ఆ కర్రలంటినీ బయటకు తెచ్చాడు. ఆ చేతి
కర్రలను ఇశ్రాయేలు ప్రజలకు మోషే చూపించాడు.
వాళ్లంతా ఆ కర్రలను చూచి, ఎవరి కర్ర వారు తిరిగి
తీసుకున్నారు.
10అప్పుడు యెహోవా మోషేతో ఇలా అన్నాడు:
“అహరోను చేతి కర్రను మళ్లీ గుడారంలో పెట్టు.
ఎల్లప్పుడూ నాకు వ్యతిరేకంగా ఎదురు తిరుగుచున్న
ఈ ప్రజలకు ఇది ఒక హెచ్చరికగా ఉంటుంది. నామీద
వారు ఫిర్యాదు చేయటం ఇది ఆపుచేస్తుంది. ఈ విధంగా
వారు చావకుండా ఉంటారు.” 11కనుక మోషే తనకు
యెహోవా చెప్పినట్టు చేసాడు.
12ఇశ్రాయేలు ప్రజలు మేము “చనిపోతామని మాకు
తెలుసు. మేము నశించిపోయాము. మేము అంతా
నశించిపోయాము. 13ఎవరైనా యెహోవా పవిత్ర
స్థలం సమీపంగా వచ్చినా సరే చస్తారు. మేము అంద
రము చనిపోతామా?” అని మోషేతో అన్నారు.

## యాజకులు, లేవీయుల పని

18 అహరోనుతో యెహోవా ఇలా చెప్పాడు:
“పవిత్ర స్థలానికి వ్యతిరేకంగా ఎలాంటి అపచా
రాలు జరిగినా ఇక మీదట నీవు, నీ కుమారులు, నీ
తండ్రి కుటుంబం బాధ్యులు. యాజకులకు వ్యతిరే
కంగా జరిగే అపచారాలకు నీవు, నీ కుమారులు
బాధ్యులు. 2నీ వంశంలో మిగిలిన లేవీ మనుష్యులను
కూడ నీతో చేర్చుకో. ఒడంబడిక, పవిత్ర గుడారంలో
నీవు, నీ కుమారులు చేయాల్సిన పనిలో వారు మీకు
సహాయం చేస్తారు. 3లేవీ వంశంలోని ఆ మనుష్యులు
నీ స్వాధీనంలో ఉంటారు. గుడారంలో జరగాల్సిన పని
అంతా వారు చేస్తారు. అయితే పవిత్ర స్థలంలోగాని,
బలిపీఠం దగ్గరగాని ఉన్న వస్తువులను వారు సమీపించ
కూడదు. ఒకవేళ వారు వెళ్తే, వారూ, నీవు కూడా చని
పోతావు. 4వారు నీతో కలిసి పనిచేస్తారు. సన్నిధి
గుడారం విషయమై జాగ్రత్త తీసుకోవటం వారి బాధ్యత.
గుడారంలో జరగాల్సిన పని అంతా వాళ్లు చేస్తారు.
నీవు ఉన్న చోటికి ఇంకెవ్వరూ రాకూడదు.
5“పవిత్ర స్థలాన్ని, బలిపీఠాన్ని జాగ్రత్తగా చూసు
కోవటం నీ బాధ్యత. ఇశ్రాయేలు ప్రజల మీద నేను
మళ్లీ కోపగించుకోవటం నాకు ఇష్టం లేదు. 6ఇశ్రాయేలు
ప్రజలందరిలోనుండి లేవీ ప్రజలను అంటే నీ ప్రజలను
నేనే ఏర్పాటు చేసుకొన్నాను. వారు నీకు ఒక కానుక
వంటివారు. యెహోవాను సేవించటం, సన్నిధి
గుడారం పని చేయటం ఒక్కటే వారి ఉద్దేశ్యం. 7అయితే

నీవు, నీ కుమారులు మాత్రమే యాజకులుగా పని
చేయవచ్చు. బలిపీఠం దగ్గరకు వెళ్లగలిగేది మీరు
మాత్రమే. మీరు మాత్రమే తెర లోపలకు వెళ్లగల
వారు. యాజకునిగా మీ సేవ అనేది నేను మీకు కాను
కగా ఇస్తున్నాను. అతి పవిత్ర స్థలాన్ని ఇంకెవరు
సమీపించినా వారిని చంపెయ్యాలి."

8అప్పుడు యెహోవా అహరోనుతో ఇలా
చెప్పాడు: "నాకు అర్పించబడిన అర్పణలన్నింటిమీద
నేనే నీకు బాధ్యత ఇచ్చాను. ఇశ్రాయేలు ప్రజలు
నాకు అర్పించే పవిత్ర అర్పణలన్నీ నేను నీకు ఇస్తాను.
ఈ కానుకలను నీవూ, నీ కుమారులూ పంచుకోవచ్చు.
ఎప్పుడూ అవి మీకే చెందుతాయి. 9దహించబడని పవిత్ర
అర్పణలన్నింటిలో మీకు వంతు ఉంటుంది. ప్రజలు
తమ కానుకలను అతి పవిత్ర అర్పణలుగా నా దగ్గరకు
తీసుకుస్తారు. ఇవి ధాన్యార్పణలు, పాప పరిహారార్థ
అర్పణలు, అపరాధ పరిహారార్థ అర్పణలు. అయితే
ఇవన్నీ నీవి, నీ కుమారులవి. 10అవి అత్యంత పవిత్ర
మైనవిగా వాటిని తినాలి. నీ కుటుంబంలో మగవారు
ప్రతి ఒక్కరూ దానిని తినాలి. అది పవిత్రం అని నీవు
చెప్పాలి. 11"ఇశ్రాయేలు ప్రజలు నైవేద్యంగా ఇచ్చు
అర్పణలు అన్నీ నీవే. ఇది నీకూ, నీ కుమారులకు,
కుమార్తెలకు నేను ఇస్తున్నాను. ఇది నీ వంతు. నీ
కుటుంబంలో పవిత్రంగా ఉన్న ప్రతి వ్యక్తీ దీనిని తిన
గలుగుతాడు.

12"శ్రేష్ఠమైన ఒలీవ నూనె అంతయు, శ్రేష్ఠమైన
కొత్త ద్రాక్షారసం అంతయు, ధాన్యం అంతయు నేను
నీకిస్తున్నాను. ఇవన్నీ యెహోవానైన నాకు ఇశ్రా
యేలు ప్రజలు ఇచ్చేవి. ఇవన్నీ వారి పంట కోతలో
ప్రథమ ఫలాలు. 13ప్రజలు పంటకోత కూర్చినప్పుడు,
మొదటివి అన్నీ వారు యెహోవాకు ఇస్తారు. కనుక
వీటిని నేను నీకు ఇస్తాను. నీ కుటుంబంలో పవిత్రంగా
ఉన్న ప్రతి వ్యక్తీ అది తినవచ్చును.

14"ఇశ్రాయేలులో యెహోవాకు అర్పించబడిన
ప్రతిదీ నీదే. 15"ఒక కుటుంబంలో, మనిషికి గాని
జంతువుకు గాని పుట్టిన మొట్టమొదటిది యెహోవాకు
అర్పించబడుతుంది. అది నీదే అవుతుంది. అయితే
అపవిత్రంగా పుట్టిన ప్రతి మొదటి శిశువుకు, ప్రతి
మొదటి మగ జంతువుకు నీవు వెల చెల్లించాలి.
అప్పుడు ఆ మొదటి శిశువు తిరిగి తన కుటుంబానికే
చెందుతుంది. 16వారు ఒక నెల వయసులో ఉన్న
ప్పుడు వారికోసం నీవు వెల చెల్లించాలి. ఆ వెల
అయిదు తులాల వెండి.

17"అయితే ఆవులలో, గొర్రెలలో మేకలలో
మొదట పుట్టిన దానికి నీవు వెల చెల్లింపకూడదు. ఆ
జంతువులు పవిత్రం–పరిశుభ్రం. వాటి రక్తం బలిపీఠం
మీద చిలకరించి వాటి కొవ్వును దహించాలి. ఇది
హోమంగా అర్పించబడిన అర్పణ. దీని వాసన
యెహోవానగు నాకు ఎంతో సంతోషం కలిగిస్తుంది.
18అయితే ఆ జంతువుల మాంసం నీదే అవుతుంది.
మరియు నైవేద్యంలోని బోర నీదే. మిగిలిన అర్పణల్లో
కుడి తొడ నీదే. 19పవిత్ర కానుకలుగా ప్రజలు అర్పిం
చేవి ఏవైనా సరే, యెహోవానగు నేను నీకు ఇస్తాను.
ఇది నీ వంతు. నీకు, నీ కుమారులకు, నీ కుమార్తెలకు
నేను ఇస్తాను. ఇది శాశ్వతంగా కొనసాగే వాగ్దానం.
నీకూ, నీ సంతతికీ నేను ఈ వాగ్దానం చేస్తున్నాను."

20అహరోనుతో యెహోవా ఇంకా ఇలా చెప్పాడు:
"దేశంలో నీకేమీ స్వాస్థ్యం ఉండదు. ఇతరులు
స్వంతంగా కలిగి ఉన్నవి ఏవీ నీకు స్వంతంగా ఉండవు.
నేను, యెహోవాను నీ స్వంతం. నేను వాగ్దానం
చేసిన దేశాన్ని ఇశ్రాయేలు ప్రజలు పొందుతారు.
అయితే నీకు మాత్రం నేనే నీ కానుకగా ఉంటాను.
21"ఇశ్రాయేలు ప్రజలు వారికి ఉన్న ప్రతి దానిలోను
పదోవంతు నాకు ఇస్తారు. కనుక ఆ పదోవంతును
నేను లేవీ ప్రజలకు ఇస్తాను. వారు సన్నిధి గుడారంలో
సేవించేటప్పుడు చేసే పనికి ఇది వారికి జీతం.
22అయితే ఇశ్రాయేలీయుల్లో ఇతరులు ఎన్నడూ
సన్నిధి గుడారం సమీపించకూడదు. వారు అలా వెళ్తే,
వారి పాపం నిమిత్తం ప్రాయశ్చిత్తం చెల్లించి మరీ
చస్తారు. 23సన్నిధి గుడారంలో పనిచేసే లేవీ ప్రజలే,
దానికి వ్యతిరేకంగా జరిగే పాపాలకు బాధ్యులు. ఈ
ఆజ్ఞ భవిష్యత్ కాలంలో కూడ కొనసాగుతుంది. ఇతర
ఇశ్రాయేలు ప్రజలకు నేను వాగ్దానం చేసిన దేశాన్ని
లేవీ ప్రజలు మాత్రం పొందరు. 24అయితే ఇశ్రాయేలు
ప్రజలు వారికి ఉన్న ప్రతి దానిలోనుండి పదోవంతు
నాకు ఇస్తారు. కనుక ఆ పదో వంతును నేను లేవీ
ప్రజలకు ఇస్తాను. అందుకే లేవీ వాళ్లను గూర్చి నేను
ఈ మాటలు చెప్పాను. ఇశ్రాయేలు ప్రజలకు నేను
వాగ్దానం చేసిన దేశాన్ని ఆ లేవీ ప్రజలు పొందరు."

25మోషేతో యెహోవా ఇలా చెప్పాడు: 26"లేవీ
ప్రజలతో మాట్లాడి వారికి ఇలా చెప్పు: ఇశ్రాయేలు
ప్రజలు వారికి ఉన్న ప్రతి దానిలోనుండి పదోవంతు
యెహోవాకు ఇవ్వాలి. ఆ పదోవంతు లేవీ ప్రజలకు
చెందుతుంది. అయితే అందులో పదోవంతు
యెహోవా అర్పణగా మీరు ఆయనకు ఇవ్వాలి.
27పంట కోసిన తర్వాత ధాన్యం, ద్రాక్ష గానుగ నుండి
రసం మీకు ఇవ్వబడుతాయి. అప్పుడు అవి కూడ
యెహోవాకు మీ అర్పణలు. 28ఈ విధంగా ఇతర
ఇశ్రాయేలు ప్రజలు చేసినట్టు, మీరు కూడ యెహో
వాకు అర్పణ ఇవ్వాలి. ఇశ్రాయేలు ప్రజలు యెహో
వాకు ఇచ్చే పదోవంతు మీకు ఇవ్వ బడుతుంది.
దానిలో పదోవంతును మీరు యాజకుడైన అహరో
నుకు ఇవ్వాలి. 29ఇశ్రాయేలు ప్రజలు వారికి ఉన్నదానం
తటిలో నుండి పదోవంతు మీకు ఇచ్చినప్పుడు,
వాటిలో శ్రేష్ఠమైనవి, అత్యంత పవిత్రమైనవి మీరు ప్రత్యే

కించాలి. అది మీరు యెహోవాకు ఇచ్చే పదోవంతు.
30"మోషే! లేవీ ప్రజలకు ఇది చెప్పు: ఇశ్రాయేలు
ప్రజలు వారి పంటలో నుండి, ద్రాక్షారసంలో నుండి
పదోవంతు మీకు ఇస్తారు. అప్పుడు అందులో శ్రేష్ఠమైన
భాగం మీరు యెహోవాకు ఇవ్వాలి. 31మిగిలి పోయిన
దంతా మీరు, మీ కుటుంబాలు తినవచ్చు. సన్నిధి
గుడారంలో మీరు చేసే పనికి ఇది మీకు జీతం.
32మరియు ఎల్లప్పుడూ దానిలోని శ్రేష్ఠ భాగాన్నే మీరు
యెహోవాకు ఇస్తే, మీరు ఎన్నటికీ అపరాధులు కారు.
ఇశ్రాయేలు ప్రజల నుండి అనేకుల పవిత్ర అర్పణలని
మీరు ఎన్నటికీ గుర్తుంచుకుంటారు. మీరు చావరు."

## ఎర్ర ఆవు బూడిద

19 మోషేతో, అహరోనుతో యెహోవా మాట్లా
డాడు. ఆయన ఇలా చెప్పాడు: 2"ఇశ్రాయేలు
ప్రజలకు ఇచ్చే ఆజ్ఞలు, ప్రబోధాలు ఇవే. వారు బలంగా
ఉన్న ఒక ఎర్ర ఆవును నీ దగ్గరకు తీసుకుని రావాలి.
ఆ ఆవుకు ఎలాంటి గాయాలు ఉండకూడదు. ఆ
ఆవు ఎన్నడూ కాడి మోసి ఉండకూడదు. 3ఆ ఆవును
యాజకుడైన ఎలీయాజరుకు ఇవ్వాలి. ఎలీయాజరు
ఆవును నివాసం యొక్క వెలుపలికి తీసుకునిపోయి,
అక్కడ దాన్ని వధించాలి. 4అప్పుడు యాజకుడైన
ఎలీయాజరు దాని రక్తంలో కొంత తన వేలిమీద
వేసుకోవాలి. తర్వాత అతడు ఆ రక్తంలో కొంత పవిత్ర
గుడారం వైపు చల్లాలి. అతడు ఇలా ఏడు సార్లు
చేయాలి. 5అప్పుడు మొత్తం ఆవు అతని ఎదుట
దహించబడాలి. దాని చర్మం, మాంసం, రక్తం, ప్రేగులు
అన్నీ దహించాలి. 6అప్పుడు యాజకుడు ఒక దేవదారు
కర్రను, హిస్సోపు కొమ్మను, ఎర్ర నూలును తీసుకుని,
ఆవు దహించబడుతున్న అగ్నిలో వేయాలి.
7అప్పుడు యాజకుడు స్నానం చేసి, నీళ్లతో
తన బట్టలు ఉదుకుకోవాలి. అతడు తిరిగి నివాసానికి
రావాలి. యాజకుడు సాయంత్రం వరకు అపవిత్రంగా
ఉంటాడు. 8ఆ ఆవును దహించే వ్యక్తి స్నానం చేసి,
నీళ్లతో తన బట్టలు ఉదుక్కోవాలి. సాయంత్రం వరకు
అతడు అపవిత్రంగానే ఉంటాడు. 9"అప్పుడు పవిత్రుడై
నవాడు ఒకడు ఆ ఆవు బూడిదను పోగు చేయాలి.
అతడు నివాసానికి బయట పరిశుభ్రమైన స్థలంలో ఆ
బూడిదను ఉంచుతాడు ప్రజలు పవిత్రులయ్యేందు
కోసం ఒక ప్రత్యేక ఆచారాన్ని పాటించేటప్పుడు ఈ
బూడిద ఉపయోగించబడుతుంది. ఒక వ్యక్తి పాపాలను
తొలగించేందుకు కూడా ఈ బూడిద ఉపయోగించ
బడుతుంది.
10"ఆవు బూడిదను పోగుచేసే వ్యక్తి తన బట్టలు
ఉదుక్కోవాలి. అతను సాయంత్రం వరకు అపవిత్రంగా
ఉంటాడు. "ఈ నియమం శాశ్వతంగా కొనసాగుతుంది.
ఇశ్రాయేలు పౌరులకు, మీతో కలిసి నివసిస్తున్న విదేశీ
యులకు ఈ నియమం వర్తిస్తుంది. 11ఎవరైనా ఒకరు
ఒక శవాన్ని తాకితే, అప్పుడు అతడు ఏడు రోజులు
అపవిత్రంగా ఉంటాడు. 12ప్రత్యేక జలంతో మూడో
రోజున, మళ్లీ ఏడో రోజున అతడు తనను తాను
కడుక్కోవాలి. అతడు ఇలా చేయకపోతే అపవిత్రంగానే
ఉంటాడు. 13ఒకడు ఒక శవాన్ని తాకితే అతడు అపవి
త్రుడు. అతడు అపవిత్రుడుగానే ఉండి, పవిత్ర గుడారా
నికి వెళ్తే, అప్పుడు ఆ పవిత్ర గుడారం అపవిత్రం
అవుతుంది. కనుక అతనిని ఇశ్రాయేలు ప్రజల్లోనుంచి
తొలగించి వేయాలి. ఒక అపవిత్రునిమీద ప్రత్యేకజలం
చల్లకపోతే అతడు అపవిత్రంగానే ఉండిపోతాడు.
14"తమ గుడారాల్లోనే మరణించే వారిని గూర్చిన
నియమం ఇది. ఒకడు తన గుడారంలో మరణిస్తే, ఆ
గుడారంలో ఉన్న ప్రతి ఒక్కరూ అపవిత్రులే. ఏడు
రోజులపాటు వారు అపవిత్రం అవుతారు. 15మూత
లేని ప్రతి పాత్ర అపవిత్రం అవుతుంది. 16ఏ మనిషిగాని
శవాన్నిగాని ముట్టుకొంటే, ఆ మనిషి అపవిత్రుడుగా
ఏడు రోజులు ఉంటాడు. శవం బయట పొలంలో
ఉన్నా, లేక యుద్ధంలో చచ్చిన వానిదైనా సరే ఇదే
వర్తిస్తుంది. మరియు చచ్చిన మనిషి ఎముకను ఒక
దాన్ని ఎవరైనా ముట్టుకుంటే అప్పుడు అతడు
అపవిత్రుడౌతాడు 17"కనుక అతనిని మరల పవిత్రం
చేయటానికి దహించబడ్డ ఆవు బూడిదను నీవు ప్రయో
గించాలి. పాత్రలో బూడిద మీద స్వచ్ఛమైన నీళ్లు
పోయాలి. 18పవిత్రుడు ఒకడు హిస్సోపు కొమ్మను
తీసుకుని, దానిని ఆ నీళ్లలో ముంచాలి. అప్పుడు
అతడు గుడారంమీదా, గిన్నెలమీదా, గుడారంలోని
మనుష్యులందరి మీదా దానిని చల్లాలి. శవాన్ని ముట్టు
కొన్న ఎవరికైనా నీవు ఇలాగే చేయాలి. యుద్ధంలో
చంపబడిన ఒకరి శవాన్ని ముట్టుకొనిన ఎవరికైనా
సరే, చచ్చిన మనిషి ఎముకను తాకిన ఎవరికైనా సరే
నీవు ఇలాగే చేయాలి.
19"అప్పుడు పవిత్రంగా ఉన్న ఒక మనిషి అపవి
త్రంగా ఉన్న వానిమీద మూడో రోజున, మరల ఏడో
రోజున ఈ నీళ్లు చల్లాలి. ఏడో రోజున అతడు పవిత్రం
అవుతాడు. అతడు తన వస్త్రాలను నీళ్లలో ఉతు
క్కోవాలి. ఆ సాయంకాలం అతడు పవిత్రుడవుతాడు.
20"ఒక వ్యక్తి అపవిత్రుడై, పవిత్రుడుగా చేయబడక
పోతే, అతడు ఇశ్రాయేలు ప్రజల్లోనుంచి వేరు చేయ
బడాలి. అతనిమీద ప్రత్యేక జలం చల్లబడలేదు. అతడు
పవిత్రుడు కాలేదు. కనుక అతడు పవిత్ర గుడారాన్ని
అపవిత్రం చేస్తాడేమో.
21ఇది మీకు శాశ్వత నియమం. ఒక వ్యక్తిమీద
ప్రత్యేక జలం చల్లబడితే అతడు తన బట్టలను కూడ
ఉదుక్కోవాలి. ఆ ప్రత్యేకజలాన్ని ముట్టినవాడు ఆ
సాయంకాలంవరకు మాత్రం అపవి త్రంగానే ఉంటాడు.
22అపవిత్రుడు ఒకడు ఇంకో వ్యక్తిని ముట్టుకుంటే

అతడుకూడ అపవిత్రుడవుతాడు. అతడు ఆ సాయంత్రం వరకు అపవిత్రంగా ఉంటాడు.”

## మిర్యాము మరణము

20 మొదటి నెల ఇశ్రాయేలు ప్రజలు సీను అరణ్యానికి వచ్చారు. ప్రజలు కాదేషులో నివాసం చేసారు. మిర్యాము చనిపోయి, అక్కడే పాతి పెట్టబడింది.

## మోషే పొరబాటు

2ఆ స్థలంలో ప్రజలకు చాలినంతగా నీళ్లు లేవు. కనుక ప్రజలు మోషే, అహరోనులతో ఫిర్యాదు చేయటానికి సమావేశమయ్యారు. 3ప్రజలు మోషేతో వాదించారు. వారు ఇలా అన్నారు: “ఒకవేళ మా సోదరుల్లా మేము కూడా యెహోవా ఎదుట మరణించి ఉంటే బాగుండేది. 4యెహోవా ప్రజలను నీవు ఈ అరణ్యంలోనికి ఎందుకు తీసుకొచ్చావు? మేమూ, మా పశువులూ ఇక్కడే చావాలని కోరుతున్నావా? 5ఈజిప్టు నుండి మమ్మల్ని ఎందుకు తీసుకొచ్చావు? ఈ పనికి మాలిన చోటుకు మమ్మల్ని నీవెందుకు తీసుకుచ్చావు? ఇక్కడ ధాన్యం లేదు. అంజూరపు పండ్లు, ద్రాక్షా పండ్లు, దానిమ్మ పండ్లు ఏమీ లేవు. కనీసం తాగటానికి నీళ్లు కూడ లేవు.” 6కనుక మోషే, అహరోను ఆ జనాన్ని విడిచి, సన్నిధి గుడార ద్వారం దగ్గరకు వెళ్లారు. వారు సాష్టాంగపడగా యెహోవా మహిమ ప్రత్యక్షమయి ంది.

7యెహోవా మోషేతో మాట్లాడాడు: 8“నీ సోదరుడు అహరోనును, ఈ జనాన్ని తీసుకుని ఆ బండ దగ్గరకు వెళ్లు నీ కర్ర కూడా తీసుకుని వెళ్లు. ఆ బండ ఎదుట ప్రజలతో మాట్లాడు. అప్పుడు ఆ బండనుండి నీళ్లు ప్రవహిస్తాయి. అప్పుడు ప్రజలకు, పశువులకు నీవు ఆ నీళ్లు ఇవ్వవచ్చును” అన్నాడు ఆయన.

9కనుక యెహోవా చెప్పిన ప్రకారం మోషే ఆయన ఎదుటనుండి కర్ర తీసుకున్నాడు. 10అప్పుడు ప్రజలంతా ఆ బండ ముందు సమావేశం కావాలని మోషే, అహరోను వారితో చెప్పారు. అప్పుడు మోషే, “మీరు ఎప్పుడూ సణుగుతున్నారు. ఇప్పుడు నా మాట వినండి. ఈ బండలోనుండి నీళ్లు వచ్చేటట్టు మేము చేస్తాము” అన్నాడు. 11మోషే తన చేయి పైకెత్తి రెండుసార్లు ఆ బండను కొట్టాడు. బండనుండి నీళ్లు ప్రవహించటం మొదలయ్యింది. ప్రజలు, పశువులు ఆ నీళ్లు త్రాగారు. 12అయితే మోషే, అహరోనులతో యెహోవా అన్నాడు: “ఇశ్రాయేలు ప్రజలంతా చుట్టూ చేరారు. కానీ మీరు నాకు ఘనత చూపలేదు. నీళ్లను ప్రవహింప జేసిన శక్తి నా దగ్గరనుండి వచ్చిందని ఇశ్రాయేలు ప్రజలకు మీరు చూపించలేదు. మీరు నన్ను నమ్ముకొన్నట్లుగా మీరు ప్రజలకు చూపించలేదు. ఆ ప్రజలకు నేను వాగ్దానం చేసిన దేశాన్ని వారికి ఇస్తాను. అయితే వాళ్లను ఆ దేశంలోనికి నడిపించేవాళ్లు మాత్రం మీరు కారు.”

13ఈ స్థలం మెరీబా* జలాలు అని పిలువబడింది. ఇక్కడనే ఇశ్రాయేలు ప్రజలు యెహోవాతో వాదించారు. ఆయన పవిత్రుడని యెహోవా ఇక్కడనే వారికి చూపించాడు.!

## ఇశ్రాయేలీయులకు ఎదోము ఆటంకము

14మోషే కాదేషులో ఉన్నప్పుడు, కొందరు మనుష్యులను ఎదోము రాజు దగ్గరికి పంపి ఈలాగు చెప్పమన్నాడు. ఆ సందేశం ఇది: “మీ సోదరులైన ఇశ్రాయేలీయులు మీతో చెప్పేది ఏమంటే: మాకు కలిగిన కష్టాలన్నీ నీకు తెలుసు. 15చాల సంవత్సరాల కిందట మా పూర్వీకులు ఈజిప్టు వెళ్లారు. చాల సంవత్సరాలు మేము అక్కడ జీవించాము. ఈజిప్టు ప్రజలు మా యెడల క్రూరంగా ఉన్నారు. 16అయితే మేము యెహోవాను సహాయం అడిగాము. యెహోవా మా మొర విని, మాకు సహాయం చేసేందుకు ఒక దేవదూతను పంపించాడు. యెహోవా మమ్మల్ని ఈజిప్టు నుండి బయటకు రప్పించాడు.

“ఇదిగో ఇప్పుడు మేము నీ దేశ సరిహద్దు అయిన కాదేషులో ఉన్నాము. 17దయచేసి నీ దేశంలోనుంచి మమ్మల్ని ప్రయాణం చేయనివ్వు. పొలాల్లోనుంచి, ద్రాక్షా తోటల్లోనుంచి మేము నడువము. మీ బావుల్లో దేనినుండీ మేము నీళ్లు తాగము. రాజమార్గంలో మాత్రమే మేము ప్రయాణం చేస్తాము. ఆ మార్గం నుండి కుడికి గాని ఎడమకు గాని మేము తొలగము. మీ దేశం దాటిపోయేంత వరకు మేము రాజ మార్గాననే ఉంటాము.”

18అయితే ఎదోము రాజు, “మీరు మా దేశంలో నుండి ప్రయాణం చేయగూడదు. మా దేశంలోనుండి ప్రయాణం చేయటానికి మీరు ప్రయత్నిస్తే, మేము వచ్చి కత్తులతో మీతో పోరాడుతాము” అని జవాబిచ్చాడు.

19ఇశ్రాయేలు ప్రజలు, “మేము రహదారి వెంబడే ప్రయాణం చేస్తాము. మా పశువులు మీ నీళ్లు ఏమైనా తాగితే, దానికి మేము వెల చెల్లిస్తాము. మేము మీ దేశంలోనుంచి నడుస్తాము, అంతే. అంతేగాని, దాన్ని మేము తీసుకోము” అని జవాబిచ్చారు.

20అయితే, “మేము మిమ్మల్ని మా దేశంలోంచి పోనియ్యము” అని ఎదోము జవాబిచ్చాడు.

అప్పుడు ఎదోము రాజు బలంగల విస్తార సైన్యాన్ని సమకూర్చుకొని, ఇశ్రాయేలు ప్రజలతో పోరాడటానికి

**మెరీబా** అనగా వివాదము.

వారి మీదికి వెళ్లాడు. [21]ఇశ్రాయేలు ప్రజలను తన దేశంగుండా వెళ్లనిచ్చేందుకు ఎదోము రాజు నిరాకరించాడు. ఇశ్రాయేలు ప్రజలు వెనక్కు తిరిగి మరో మార్గంగుండా వెళ్లిపోయారు.

### అహరోను మరణం

[22]ఇశ్రాయేలు ప్రజలంతా కాదేషు నుండి హోరు కొండకు ప్రయాణం చేసారు. [23]హోరు కొండ ఎదోము సరిహద్దుకు దగ్గర్లో ఉంది. మోషే, అహరోనులతో యెహోవా చెప్పాడు, [24]"అహరోను తన పూర్వీకుల దగ్గరకు వెళ్తాడు. ఇశ్రాయేలు ప్రజలకు నేను వాగ్దానం చేసిన దేశంలో అతడు ప్రవేశించడు. మోషే, అహరోనూ, మీరు మెరీబా జలాల దగ్గర నేను మీకు ఇచ్చిన ఆజ్ఞకు పూర్తిగా విధేయులు కాలేదు గనుక నేను మీతో ఇలా చెబుతున్నాను:

[25]"అహరోనును, అతని కుమారుడైన ఎలీయాజరును హోరు కొండమీదికి తీసుకుని రా. [26]అహరోను ప్రత్యేక దుస్తులు అతని దగ్గరనుండి తీసుకుని, అతని కుమారుడైన ఎలీయాజరుకు వాటిని తొడిగించు. అహరోను కొండమీద మరణిస్తాడు. అతడు తన పూర్వీకుల దగ్గరకు వెళ్తాడు."

[27]యెహోవా ఆజ్ఞకు మోషే విధేయుడయ్యాడు. మోషే, అహరోను, ఎలీయాజరు హోరు కొండ శిఖరం మీదకు వెళ్లారు. వారు వెళ్లటం ఇశ్రాయేలు ప్రజలంతా చూసారు.

[28]అహరోను వస్త్రాలన్నీ తీసి అతని కుమారుడైన ఎలీయాజరు మీద వేసాడు మోషే. అప్పుడు అహరోను ఆ కొండ శిఖరం మీద చనిపోయాడు. మోషే, ఎలీయాజరు కొండ దిగి కిందికి వచ్చారు. [29]అప్పుడు అహరోను చనిపోయినట్టు ప్రజలంతా తెలుసుకొన్నారు. కనుక ఇశ్రాయేలులో ప్రతి వ్యక్తీ 30 రోజుల పాటు సంతాపపడ్డారు.

### కనానీ వాళ్లతో యుద్ధం

21 కనానీ ప్రజల రాజు పేరు అరాదు. అతడు నెగెవు లోయలో నివసించాడు. ఇశ్రాయేలు ప్రజలు అతారీము దారిన వస్తున్నారని అరాదు రాజు విన్నాడు. కనుక రాజు బయలుదేరి వెళ్లి ఇశ్రాయేలు ప్రజల మీద దాడి చేసాడు. వారిలో కొందరిని అతడు బంధించి, బందీలుగా చేసాడు. [2]ఇశ్రాయేలు ప్రజలు యెహోవాతో, "యెహోవా, దయచేసి ఈ ప్రజలను రక్షించు. వారిని మరల మా దగ్గరకు తీసుకునిరా. ఇది నీవు చేస్తే, మేము వారి పట్టణాలను సర్వనాశనం చేస్తాము" అని ప్రమాణం చేసారు.

[3]ఇశ్రాయేలు ప్రజల మాట యెహోవా ఆలకించాడు. ఇశ్రాయేలు ప్రజలు కనానీ ప్రజలను ఓడించటానికి యెహోవా సమ్మతించాడు. కనానీ ప్రజలను, వారి పట్టణాలను ఇశ్రాయేలు ప్రజలు పూర్తిగా నాశనం చేసారు. అందుచేత ఆ స్థలానికి హోర్మ* అని పేరు పెట్టబడింది.

### ఇత్తడి సర్పం

[4]ఇశ్రాయేలు ప్రజలు హోరు కొండ విడిచి ఎర్ర సముద్రానికి వెళ్లే మార్గంలో ప్రయాణం చేసారు. ఎదోము అనే ప్రాంతాన్ని చుట్టి వచ్చేందుకు వారు ఇలా చేసారు. కానీ ప్రజల్లో సహనం లేదు. ప్రయాణం చేస్తూ దూరాన్ని గూర్చి వారు సణిగారు. [5]దేవునికి, మోషేకు ప్రజలు వ్యతిరేకంగా మాట్లాడారు. "మమ్మల్ని ఈజిప్టునుండి నీవెందుకు తీసుకుచ్చావు? మేము ఇక్కడ అరణ్యంలోనే చస్తాము! రొట్టెలేదు, నీళ్లు లేవు. ఈ దారుణమైన ఆహారం మాకు అసహ్యము" అన్నారు ప్రజలు.

[6]కనుక విష సర్పాలను ఆ ప్రజల మధ్యకు యెహోవా పంపించాడు. ఆ పాములు ప్రజలను కరిచాయి. ఇశ్రాయేలు ప్రజలు చాల మంది చనిపోయారు. [7]ప్రజలు మోషే దగ్గరకు వచ్చి, "యెహోవాకు, నీకు వ్యతిరేకంగా మాట్లాడి మేము పాపం చేసామని మాకు తెలుసు. యెహోవాకు ప్రార్థన చేసి ఈ పాములను తీసివేయమని అడుగు" అని చెప్పారు. కనుక ఆ ప్రజల కోసం మోషే ప్రార్థించాడు.

[8]"ఇత్తడి సర్పం ఒకటి చేసి దాన్ని ఒక స్తంభం మీద ఉంచు. పాము కరచిన వ్యక్తి ఆ స్తంభం మీది ఇత్తడి సర్పాన్ని చూడాలి. అప్పుడు అతడు చావడు" అని యెహోవా మోషేతో చెప్పాడు. [9]కనుక మోషే యెహోవా చెప్పినట్టు చేసాడు. అతడు ఒక ఇత్తడి సర్పాన్ని చేసి, ఒక స్తంభం మీద దాన్ని పెట్టాడు. అప్పుడు ఎవర్నయినా పాము కరిస్తే, ఆ మనిషి స్తంభం మీది ఇత్తడి సర్పాన్ని చూచి బతికాడు.

### మోయాబు లోయకు

[10]ఇశ్రాయేలు ప్రజలు ప్రయాణం కొన సాగించారు. ఓబోతు అనే చోట వారు నివాసం చేసుకొనిరి. [11]తర్వాత ఆ ప్రజలు ఓబోతునుండి ఈయ్యె అబారీము వెళ్లారు. ఇది తూర్పున మోయాబు సమీపంగా అరణ్యంలో ఉంది. [12]తర్వాత ప్రజలు ఆ స్థలం విడిచి, జెరెదు లోయకు ప్రయాణం చేసారు. అక్కడ నివాసాలు చేసుకొనిరి. [13]మళ్లీ ప్రజలు అర్నోను లోయకు వచ్చి, అక్కడికి సమీపంలో నివాసం చేసుకొనిరి. ఇవి అమోరీయ దేశానికి దగ్గర్లో ఉన్న అరణ్యంలో ఉంది. మోయాబు ప్రజలకు అమోరీ ప్రజలకు అర్నోను లోయ సరిహద్దు. [14]అందుకే యెహోవా యుద్ధాల గ్రంథంలో ఇలా కనబడుతుంది

---

**హోర్మ** అనగా నిర్మూలము లేక నాశనము.

"సుపాలోని వాహేబు, అర్నోను లోయలు,
15ఆరు అను పట్టణం వరకుగల లోయల పక్క
కొండలు. ఈ స్థలాలు మోయాబు సరిహద్దులో
ఉన్నాయి."
16ఇశ్రాయేలు ప్రజలు ఆ స్థలం విడిచి బెయేరు
చేరారు. ఈ స్థలంలో ఒక బావి ఉంది. యెహోవా
"ప్రజలను ఇక్కడికి తీసుకొనిరా. నేను వారికి నీళ్లిస్తాను"
అని మోషేతో చెప్పాడు. 17అప్పుడు ఇశ్రాయేలు
ప్రజలు ఈ పాట పాడారు,

"బావీ, ఉప్పొంగి ప్రవహించు, దానిగూర్చి
పాడండి!
18 మహాత్ములు ఈ బావి తవ్వారు. ప్రముఖ
నాయకులు ఈ బావి తవ్వారు. అధికార
దండములతో, కర్రలతో వారు ఈ బావి
తవ్వారు. అరణ్యంలో ఇది ఒక కానుక."

"మత్తాన"* అని పిలువబడే ఈ బావి దగ్గర ప్రజలు
ఉన్నారు. 19అప్పుడు ప్రజలు మత్తానానుండి నహలీయే
లుకు ప్రయాణం చేసారు. మళ్లీ వారు నహలీయేలు
నుండి బామోతుకు ప్రయాణం చేసారు. 20బామోతు
నుండి మోయాబు లోయకు ప్రజలు ప్రయాణం
చేసారు. ఇక్కడ ఎడారికి ఎదురుగా పిస్గా శిఖరం
కనబడుతుంది.

### సీహోను, ఓగు

21అమోరీ ప్రజల రాజు సీహోను దగ్గరకు ఇశ్రా
యేలు ప్రజలు కొందరు మనుష్యుల్ని పంపారు. వారు
ఆ రాజుతో 22"మమ్మల్ని నీ దేశంలోనుండి ప్రయాణం
చేయనివ్వు. మేము పొలాల్లోనుంచి గాని, ద్రాక్షా తోట
ల్లోనుంచిగాని నడువము. నీ బావుల్లోనుంచి నీళ్లు
తాగము. రాజ మార్గంలోనే మేము నడుస్తాము. నీ
దేశం దాటి వెళ్లేంతవరకు మేము ఆ మార్గంలోనే
ఉంటాము" అని చెప్పారు.
23అయితే సీహోను రాజు ఇశ్రాయేలు ప్రజలను
తన రాజ్యంలోనుండి ప్రయాణం చేయనియ్యలేదు.
రాజు తన సైన్యాన్ని సమకూర్చుకొని అరణ్యంలోకి
నడిపించాడు. ఇశ్రాయేలు ప్రజలమీదికి అతడు వెళ్తూ
ఉన్నాడు. యాహజు అనే చోట ఆ రాజు సైన్యం
ఇశ్రాయేలు ప్రజల మీద యుద్ధం చేసారు.
24కానీ ఇశ్రాయేలు ప్రజలు ఆ రాజును చంపారు.
అప్పుడు అర్నోను లోయ మొదలుకొని యబ్బోకు
ప్రాంతంవరకు అతని దేశాన్ని వారు స్వాధీనం చేసు
కొన్నారు. అమ్మోనీ ప్రజల సరిహద్దు వరకు ఇశ్రాయేలు
ప్రజలు స్వాధీనం చేసుకొన్నారు. అమ్మోనీ ప్రజలు
ఆ సరిహద్దును చాల గట్టిగా కాపాడు తున్నందుచేత
వారు అంతకంటె ఎక్కువ భూమిని స్వాధీనం చేసు
కోలేదు. 25అమోరీయుల ఈ పట్టణాలన్నింటినీ ఇశ్రా
యేలీయులు స్వాధీనం చేసికొని, అమోరీయుల పట్ట
ణాలన్నింటిలో హెష్బోను, దాని చుట్టు పక్కల ఉన్న
చిన్న చిన్న పట్టణాలన్నింటిలోను వారు నివసించటం
మొదలు పెట్టారు. 26సీహోను రాజు నివసించిన
పట్టణం హెష్బోను. గతంలో మోయాబు రాజును
సీహోను ఓడించాడు. అందువల్ల అర్నోను లోయ
వరకు మోయాబు దేశాన్ని సీహోను రాజు స్వాధీనం
చేసుకొన్నాడు.
27అందుకే గాయకులు ఇలా పాడతారు:

"హెష్బోనూ, నీ నిర్మాణం మళ్లీ జరగాలి.
సీహోను పట్టణం మళ్లీ కట్టబడును గాక!
28 హెష్బోనులో అగ్ని రగులుకొంది. ఆ అగ్ని
సీహోను పట్టణంలో రగులుకొంది. ఆర్,
మోయాబులను అగ్ని నాశనం చేసింది.
అర్నోను ఉన్నత స్థలాల కొండలను అది కాల్చే
సింది.
29 ఓ మోయాబూ, అది నీకు కీడు. కెమోషు
ప్రజలు నాశనం చేయబడ్డారు. అతని కుమా
రులు పారిపోయారు. అమోరీ ప్రజల రాజైన
సీహోను చేత అతని కుమార్తెలు బందీలు
చేయబడ్డారు.
30 అయితే మేము ఆ అమోరీలను ఓడించాము.
హెష్బోను నుండి దీబోను వరకు నషీమునుండి
మేదెబా దగ్గరి నోఫహువరకు వారి పట్టణాలను
మేము నాశనం చేసాం."

31కనుక ఇశ్రాయేలు ప్రజలు అమోరీ ప్రజల
దేశంలో నివాసం ఏర్పరచుకున్నారు.
32యాజెరు పట్టణాన్ని చూచి రమ్మని మోషే
కొందరు మనుష్యుల్ని పంపించాడు. మోషే ఇలా చేసిన
తర్వాత, ఇశ్రాయేలు ప్రజలు ఆ పట్టణాన్ని స్వాధీనం
చేసుకున్నారు. దాని చుట్టూ ఉన్న చిన్న చిన్న
పట్టణాలను కూడ వారు స్వాధీనం చేసుకున్నారు.
అక్కడ నివసిస్తున్న అమోరీ ప్రజలు పారిపొయ్యేట
ట్టుగా ఇశ్రాయేలు ప్రజలు వారిని తరిమివేసారు.
33అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు బాషాను దారిన
ప్రయాణం చేసారు. బాషాను రాజైన ఓగు తన
సైన్యాన్ని సిద్ధం చేసి ఇశ్రాయేలు ప్రజల మీదికి వెళ్లాడు.
ఎద్రేయి అనే చోట అతడు వారితో యుద్ధం చేసాడు.
34అయితే యెహోవా, "ఆ రాజును గూర్చి భయ
పడవద్దు. మీరు అతన్ని ఓడించునట్లు నేను చేస్తాను.
మొత్తం అతని సైన్యాన్ని, దేశాన్ని కూడ మీరు స్వాధీనం
చేసుకొంటారు. అమోరీ ప్రజల రాజైన హెష్బోనులో

---

**మత్తాన** అనగా అరణ్యంలో కానుక.

నివసించిన సీహోనుకు చేసినట్టే ఇతనికి కూడ
చేయండి" అని మోషేతో చెప్పాడు.

35కనుక ఓగును, అతని సైన్యాన్ని ఇశ్రాయేలు
ప్రజలు ఓడించేసారు. అతన్ని, అతని కుమారులను,
అతని సైన్యం అంతటినీ వారు చంపారు. అప్పుడు
అతని దేశం అంతా ఇశ్రాయేలు ప్రజలు స్వాధీనం
చేసుకున్నారు.

### బిలాము – మోయాబు రాజు

22 తర్వాత ఇశ్రాయేలు ప్రజలు మోయాబు
మైదానాలకు ప్రయాణం చేసారు. యెరికోకు
ఎదురుగా యొర్దాను నది దగ్గర వారు నివాసాలు
కట్టుకొనిరి.

2-3ఇశ్రాయేలు ప్రజలు అమోరీ ప్రజలకు చేసిన
వాటన్నిటినీ సిప్పోరు కుమారుడైన బాలాకు చూసాడు.
ఇశ్రాయేలు ప్రజలు చాలమంది ఉండటం చూచి,
మోయాబు రాజైన భయపడ్డాడు. ఇశ్రాయేలు ప్రజ
లంటే మోయాబువాళ్లు భయపడ్డారు.

4మోయాబు రాజు "ఆవు పొలంలో గడ్డి అంతా
తినివేసినట్టు ఈ గొప్ప ప్రజా సమూహం మన చుట్టూ
ఉన్న మొత్తం నాశనం చేసేస్తుంది" అని మిద్యాను
నాయకులతో చెప్పాడు.

అప్పట్లో సిప్పోరు కుమారుడైన బాలాకు
మోయాబు రాజు. 5బెయోరు కుమారుడు బిలామును
పిలువమని అతడు మనుష్యులను పంపించాడు.
బిలాము యూఫ్రటీసు నది దగ్గర పెతోరు అనే చోట
ఉన్నాడు. బాలాకు ఈ విధంగా సందేశం పంపాడు:
"ఈజిప్టునుండి ఒక కొత్త జాతి ప్రజలు వచ్చారు.
దేశం అంతా కమ్మేసేటంతమంది ఉన్నారు వారు. వాళ్లు
నా ప్రక్కనే గుడారాలు వేసుకొన్నారు. 6వీళ్లను ఎదు
ర్కోటానికి నీవు వచ్చి నాకు సహాయం చేయి.
అప్పుడు ఒకవేళ వారిని ఓడించగలనేమో వారి ముందు
నా బలం చాలదు. అప్పుడు వారిని నా దేశంనుండి
తరిమివేయగలను. నీకు గొప్పశక్తి ఉందని నాకు
తెలుసు. నీవు ఎవరినైనా ఆశీర్వదిస్తే, వారికి మేలు
జరుగుతుంది. నీవు ఎవరినైనా శపిస్తే వారికి కీడు
జరుగుతుంది. అందుచేత వచ్చి ఈ ప్రజలను శపించు.
అప్పుడు, నేను వారిని ఈ దేశం నుండి తోలి
వేయగలను."

7మోయాబు, మిద్యాను నాయకులు వెళ్లి
పోయారు. బిలాముతో మాట్లాడటానికి వారు వెళ్లారు.
అతని సేవకోసం అతనికి చెల్లించేందుకు వారు డబ్బు
తీసుకుని వెళ్లారు. బాలాకు చెప్పిన విషయం వారు
అతనికి చెప్పారు.

8బిలాము, "ఈ రాత్రికి మీరు ఇక్కడ ఉండండి.
నేను యెహోవాతో మాట్లాడి, ఆయన నాకు ఇచ్చే
జవాబు మీకు చెబుతాను" అని వారితో చెప్పాడు.
అందుచేత మోయాబు ప్రజా నాయకులు ఆ రాత్రి
వారితో ఉండిపోయారు.

9దేవుడు బిలాము దగ్గరకు వచ్చి, "నీతో ఉన్న
ఈ మనుష్యులు ఎవరు?" అని అడిగాడు. 10బిలాము
దేవునితో చెప్పాడు: "మోయాబు రాజును, సిప్పోరు
కుమారుడునైన బాలాకు నాకు ఒక కబురు చెప్పమని
వారిని పంపాడు. 11ఆ సందేశం ఇది: ఈజిప్టునుండి
ఒక కొత్త దేశపు జనాంగం వచ్చింది. వారు భూమి
అంతా నిండిపొయ్యేంత మంది ఉన్నారు. కనుక వచ్చి
వీళ్లను శపించు, అప్పుడు ఒకవేళ నేను వాళ్లతో యుద్ధం
చేసి నా దేశంనుండి వెళ్లగొట్ట గలుగుతానేమో."

12అయితే దేవుడు, "వాళ్లతో వెళ్లవద్దు. ఈ ప్రజ
లను నీవు శపించకూడదు. వీరు నా ప్రజలు" అని
బిలాముతో చెప్పాడు.

13మరునాటి ఉదయం బిలాము లేచి, "మీ స్వదేశా
నికి తిరిగి వెళ్లిపొండి. యెహోవా నన్ను మీతో వెళ్ల
నివ్వడు" అన్నాడు.

14కనుక మోయాబు నాయకులు తిరిగి బాలాకు
దగ్గరకు వెళ్లిపోయి అతనితో, "మాతో రావటానికి
బిలాము నిరాకరించాడు" అని చెప్పారు.

15కనుక బాలాకు మరికొందరు నాయకులను
బిలాము దగ్గరకు పంపించాడు. మొదటి సారికంటే
ఈ సారి చాల ఎక్కువ మందిని అతడు పంపించాడు.
మొదటిసారి అతడు పంపిన వారికంటె వీరు ప్రముఖ
నాయకులు. 16వారు బిలాము దగ్గరకు వెళ్లి చెప్పారు:
"సిప్పోరు కుమారుడైన బాలాకు నీతోఇలా చెప్ప
మన్నాడు. దయచేసి నీవు రాకుండా ఏదీ నిన్ను అడ్డ
పెట్టనియ్యకు. 17నేను అడిగిన దాన్ని నీవు చేస్తే,
నేను నీకు విస్తారంగా డబ్బు ఇస్తాను. నీవు వచ్చి, నా
పక్షంగా ఈ ప్రజలను శపించు."

18కానీ బిలాము ఆ మనుష్యులకు తన జవాబి
చ్చాడు. అతడు ఇలా చెప్పాడు: "నా దేవుడైన యెహో
వాకు నేను విధేయుడ్ని కావాలి. ఆయన ఆజ్ఞకు
వ్యతిరేకంగా నేనేమి చేయలేను. నేను చెయ్యొచ్చు
అని నా ప్రభువు చెబితేనే తప్ప లేకపోతే సామాన్యమైన
దైనా గొప్పదైనా నేనేమి చేయలేను. బాలాకు రాజు
అందమైన తన భవనమంతా వెండి బంగారాలతో నింపి
నాకు ఇచ్చినా సరే, నా ప్రభువు ఆజ్ఞకు వ్యతిరేకంగా
నేనేమి చేయను. 19అయితే ఇదివరకు వచ్చిన వారిలాగే
మీరు ఈ రాత్రి ఇక్కడ వుండవచ్చు. ఈ రాత్రి
యెహోవా నాతో ఏమి చెబుతాడో నేను తెలుసు
కొంటాను."

20ఆ రాత్రి యెహోవా బిలాము దగ్గరకు వచ్చి,
"ఈ మనుష్యులు వారితో కూడ నిన్ను రమ్మని
అడగటానికి మళ్లీ వచ్చారు. కనుక నీవు వారితో
వెళ్లవచ్చు. అయితే నేను నీతో ఏమి చెబుతానో అలా
మాత్రమే చేయాలి" అని చెప్పాడు.

### బిలాము, అతని గాడిద

21మరునాడు ఉదయాన్నే బిలాము లేచి తన
గాడిదకు గంత కట్టాడు. అప్పుడు అతడు మోయాబు
నాయకులతో వెళ్లాడు. 22బిలాము తన గాడిద మీద
వెళ్తున్నాడు. అతని ఇద్దరు సేవకులు అతనితో
ఉన్నారు. బిలాము ప్రయాణం చేస్తుండగా దేవునికి
కోపం వచ్చింది. కనుక యెహోవా దూత మార్గంలో
బిలాము ఎదుట నిలబడ్డాడు. ఆ దూత బిలామును
ఆపుజేయబోతున్నాడు.

23దారిలో యెహోవా దూత నిలబడటం బిలాము
గాడిద చూచింది. ఆ దూత చేతిలో ఖడ్గం ఉంది.
కనుక గాడిద దారి తొలగి పక్క పొలంలోకి వెళ్లింది.
బిలాము యెహోవా దూతను చూడలేదు. అందుచేత
అతనికి తన గాడిద మీద చాల కోపం వచ్చింది.
అతడు గాడిదను కొట్టి, మళ్లీ దారి మీదికి వెళ్లేందుకు
దాన్ని బలవంతం చేసాడు.

24తర్వాత ఆ దారిలో ఇరుకైన చోట యెహోవా
దూత నిలబడ్డాడు. ఇది రెండు ద్రాక్ష తోటల మధ్య
ఉంది. దారికి రెండు వైపులా గోడలు ఉన్నాయి 25మళ్లీ
ఆ గాడిద యెహోవా దూతను చూచింది. అందుచేత
ఆ గాడిద గోడకు రాసుకొనే అంత దగ్గరగా వెళ్లింది.
కనుక బిలాము పాదం గోడకేసి నొక్కేసింది. బిలాము
తన గాడిదను మళ్లీ కొట్టాడు.

26తర్వాత యెహోవా దూత మరో చోట నిలబ
డ్డాడు. ఇది కూడ ఇరుకు దారి. గాడిద వెనుకకు
తిరిగే అంత చోటుకూడ అక్కడలేదు. ఆ గాడిద
కుడికి ఎడమకు కూడ తిరుగలేక పోయింది.
27యెహోవాను ఆ గాడిద మళ్లీ చూచింది. కనుక
బిలాముతో సహా ఆ గాడిద కూలబడింది. బిలాముకు
ఆ గాడిద మీద చాలా కోపం వచ్చింది. అందుచేత
అతడు తన కర్రతో దాన్ని కొట్టాడు.

28అప్పుడు యెహోవా ఆ గాడిద మాట్లాడేటట్టు
చేసాడు. ఆ గాడిద, "నీవు నా మీద ఎందుకు కోపగించు
కొంటున్నావు? నీకు నేనేమి చేసాను? నీవు నన్ను
మూడుసార్లు కొట్టావు" అంది బిలాముతో.

29"నన్ను ఒక వెర్రివాడిలా చేసావు నీవు. నా చేతి
లోనే గనుక ఒక కత్తి ఉంటే, ఈ పాటికి నిన్ను
నరికేసి ఉండేవాడ్ని" అన్నాడు బిలాము తన గాడిదతో.

30అయితే ఆ గాడిద "ఎన్నెన్నో సంవత్సరాలుగా
నీవు స్వారీ చేస్తున్న నీ సొంత గాడిదను నేను. ఇంతకు
ముందు ఎన్నడూ నేను నీకు ఇలా చేయలేదని నీకు
తెలును" అంది బిలాముతో.

"అది నిజమే" బిలాము అన్నాడు.

31అప్పుడు దారి మీద నిలబడ్డ దేవదూతను
బిలాము చూడగలిగేటట్టు చేసెను యెహోవా. ఆ
దేవదూతను, అతని కత్తిని బిలాము చూసాడు. అప్పుడు
బిలాము నేలమీద సాష్టాంగపడ్డాడు.

32యెహోవా దూత బిలామును అడిగాడు:"నీవు
నీ గాడిదను ఎందుకు మూడుసార్లు కొట్టావు? నీకు
నామీద కోపం రావాలి. నిన్ను ఆపు చేయటానికే
సరిగ్గా సమయానికి నేను ఇక్కడికి వచ్చాను. 33గాడిద
నన్ను చూచి మూడు సార్లు నా నుండి పక్కకు తప్పు
కొంది. ఆ గాడిద కనుక తప్పుకొని ఉండకపోతే నిన్ను
చంపేసి ఉండేవాడ్ని. కానీ నీ గాడిదను నేను చంపేవాడ్ని
కాదు."

34అప్పుడు బిలాము: "నేను పాపం చేసాను. దారి
మీద నీవు నిలబడ్డావని నేనెరగను. నేను చేస్తోంది తప్పు
అయితే నేను తిరిగి ఇంటికి వెళ్లిపోతాను" అని
యెహోవా దూతతో చెప్పాడు.

35"లేదు! ఈ మనుష్యులతో, నీవు వెళ్లవచ్చు.
అయితే జాగ్రత్తగా ఉండు. నీవు చెప్పాలని నేను నీతో
చెప్పేమాటలే నీవు చెప్పాలి" అన్నాడు బిలాముతో
యెహోవా దూత. కనుక బాలాకు పంపిన మనుష్య
లతో బిలాము వెళ్లాడు.

36బిలాము వస్తున్నాడని బాలాకు విన్నాడు. కనుక
అర్నోను సరిహద్దులో ఉన్న మోయాబు పట్టణం
దగ్గర అతణ్ణి కలుసుకొనేందుకు బాలాకు వెళ్లాడు. ఇది
అతని దేశపు పొలిమేర. 37బాలాకు బిలామును చూడ
గానే "నీవు రావాలని ఇది చాలా చాలా ముఖ్యమయిందని
ఇంతకు ముందే నీతో చెప్పాను. నీవు నా దగ్గరకు
ఎందుకు రాలేదు? నేను నీకు ఇప్పుడు ఏమీ చెల్లించ
లేకపోవచ్చును" అన్నాడు బిలాముతో.

38అయితే బిలాము: "ఇప్పుడు నేను నీ దగ్గరకు
వచ్చాను. కానీ నీవు అడిగింది మాత్రం నేను చేయలేక
పోవచ్చు. చెప్పమని యెహోవా దేవుడు నాకు చెప్పిన
సంగతులు మాత్రమే నేను చెప్పగలను," అని జవా
బిచ్చాడు.

39అప్పుడు బిలాము బాలాకుతోకూడ కిర్యాత్
హుచ్చోతుకు వెళ్లాడు. 40బాలాకు తన బలి అర్పణగా
కొన్ని ఎడ్లను, గొర్రెలను వధించాడు. ఆ మాంసం
కొంత బిలాముకు, మరికొంత అతనితో ఉన్న నాయ
కులకు అతడు ఇచ్చాడు.

41ఆ మర్నాటి ఉదయం బాలాకు బామోతు
బయలు పట్టణానికి బిలామును తీసుకుని వెళ్లాడు. ఆ
పట్టణం నుండి వారు ఇశ్రాయేలు ప్రజలు వేసుకొన్న
గుడారాలను కొంత చూడగలరు.

### బిలాము మొదటి ప్రవచనం

23 బిలాము, "ఇక్కడ ఏడు బలిపీఠాలు కట్టండి.
నాకోసం ఏడు ఎద్దులు, ఏడు పొట్టేళ్లు సిద్ధం
చేయండి" అని చెప్పాడు. 2బిలాము అడిగినట్టే బాలాకు
దీన్ని చేసాడు. అప్పుడు బాలాకు, బిలాము ఒక్కో
బలిపీఠం మీద ఒక్కో పొట్టేలును, ఒక్కో ఎద్దును
వధించారు.

[3]అప్పుడు బిలాము, "ఈ బలిపీఠం దగ్గరగా ఉండు. నేను ఇంకో చోటికి వెళ్తాను. అప్పుడు యెహోవా నా దగ్గరకు వచ్చి నేను చెప్పాల్సింది ఏమిటో నాకు చెబుతాడు" అని బాలాకుతో చెప్పాడు. అప్పుడు బిలాము మరో ఉన్నత స్థలానికి వెళ్లిపోయాడు.

[4]అక్కడ దేవుడు బిలాము దగ్గరకు వచ్చాడు. "ఏడు బలిపీఠాలు నేను సిద్ధం చేసాను. ఒక్కో బలిపీఠంమీద ఒక్కో ఎద్దును ఒక్కోపొట్టేలును బలిగా నేను వధించాను" అన్నాడు బిలాము.

[5]అప్పుడు బిలాము ఏమి చెప్పాల్సిందీ యెహోవా అతనికి చెప్పాడు. అప్పుడు, "తిరిగి వెళ్లి, చెప్పమని నేను నీకు చెప్పిన విషయాలు బాలాకుతో చెప్పు" అన్నాడు యెహోవా.

[6]కనుక బిలాము తిరిగి బాలాకు దగ్గరకు వెళ్లాడు. బాలాకు ఇంకా బలిపీఠం దగ్గరే నిలిచి ఉన్నాడు. మోయాబు నాయకులంతా వారితో నిలిచి ఉన్నారు.
[7]అప్పుడు బిలాము ఈ విషయాలు చెప్పాడు:

తూర్పు కొండల్లో నుండి అరాము నుండి
మోయాబు రాజైన బాలాకు నన్ను ఇక్కడకు
తీసుకుచ్చాడు. వచ్చి ఇశ్రాయేలు ప్రజలను
శపించు! 'వచ్చి నా పక్షంగా యాకోబును
శపించు, వచ్చి ఇశ్రాయేలు ప్రజలను శపించు!"
అన్నాడు నాతో బాలాకు.

8 దేవుడు ఆ ప్రజలకు వ్యతిరేకంగా లేడు అందు
చేత నేనుకూడ వారిని శపించలేను. ఆ ప్రజల
విషయమై యెహోవా చెడ్డ విషయాలను చెప్ప
లేదు అందుచేత నేను అలా చేయలేను.

9 కొండమీద నుండి నేను ఆ ప్రజలను చూస్తు
న్నాను. ఎత్తయిన కొండల నుండి నేను చూస్తు
న్నాను. ఒంటరిగా బతుకుతున్న ప్రజలను నేను
చూస్తున్నాను, వాళ్లు మరో జనములో భాగం
కారు యాకోబు ప్రజలను ఎవరు లెక్కించ
గలరు.

10 ఇసుక రేణువులకంటె ఎక్కువ ఉన్నారు
యాకోబు ప్రజలు. ఇశ్రాయేలు ప్రజల్లో నాలు
గోవంతు మనుష్యుల్ని కూడ ఎవరూ లెక్కించ
లేరు. ఒక మంచి మనిషిగా నన్ను చావనివ్వండి
ఆ మనుష్యులు మరణించినంత సంతోషంగా
నన్ను మరణించనివ్వండి!

[11]బాలాకు బిలాముతో, "ఏమిటి నీవు నాకు చేసింది? నా శత్రువుల్ని శపించమని నేను నిన్ను ఇక్కడికి తీసుకుని వచ్చాను. కానీ నీవు మాత్రం వాళ్లను ఆశీర్వదించావు "అన్నాడు.

[12]కానీ బిలాము, "నేను చెప్పాల్సింది దేవుడు నాకు చెప్పిన విషయాలు మాత్రమే" అని జవాబిచ్చాడు.

[13]అప్పుడు, "అలాగైతే, నాతో మరో చోటికి రా. అక్కడకూడ నీవు మనుష్యుల్ని చూడగలవు. అయితే అందర్నీ కాదు గాని కొందర్ని మాత్రం చూడగలవు. అక్కడనుండి నీవు నా కోసం వాళ్లను శపించవచ్చు" అని అతనితో చెప్పాడు బాలాకు. [14]కనుక బాలాకు
యోఫీం పొలంలోకి బిలామును తీసుకుని వెళ్లాడు. ఇది పిస్గా కొండ శిఖరం మీద ఉంది. ఆ స్థలంలో బాలాకు ఏడు బలిపీఠాలు కట్టించాడు. అప్పుడు బాలాకు ఒక్కో బలిపీఠం మీద ఒక్కో ఎద్దును, ఒక్కో పొట్టేలును బలిగా వధించాడు.

[15]కనుక బిలాము, "ఈ బలిపీఠం దగ్గర ఉండు. నేను వెళ్లి అక్కడ దేవుడ్ని కలుసుకొంటాను" అని బాలాకుతో చెప్పాడు.

[16]కనుక యెహోవా బిలాము దగ్గరకు వచ్చి, అతడు ఏమి చెప్పాల్సిందీ అతనికి తెలియజేసాడు. అప్పుడు యెహోవా, బిలామును వెళ్లి ఆ సంగతులు బాలాకుతో చెప్పమన్నాడు. [17]కనుక బిలాము బాలాకు
దగ్గరకు వెళ్లాడు. బాలాకు ఇంకా బలిపీఠం దగ్గరే నిలిచి ఉన్నాడు. మోయాబు నాయకులు వారితోబాటు ఉన్నారు.

అతడు రావటం చూచి, "ఏమి చెప్పాడు యెహోవా?" అన్నాడు బాలాకు.

### బిలాము రెండో ప్రవచనం

[18]అప్పుడు బిలాము ఈ విషయాలు చెప్పాడు:

"బాలాకూ లేచి నా మాట విను. సిప్పోరు కుమా
రుడా, బాలాకూ, నా మాట విను.

19 దేవుడు మనిషికాడు, ఆయన అబద్ధం చెప్పడు.
దేవుడు మానవ కుమారుడు కాడు, అయన
నిర్ణయాలు మారవు. ఏదైనా చేస్తానని
యెహోవా చెబితే ఆయన అలా చేస్తాడు.
యెహోవా ఒక వాగ్దానం చేస్తే, ఆయన తన
వాగ్దానం ప్రకారం చేస్తాడు.

20 ఆ ప్రజలను ఆశీర్వదించమని యెహోవా నాకు
ఆజ్ఞాపించాడు. యెహోవా వారిని ఆశీర్వదిం
చాడు కనుక నేను దాన్ని మార్చలేను.

21 దేవునికి యాకోబు ప్రజల్లో తప్పేమీ కనబడ
లేదు. ఇశ్రాయేలు ప్రజల్లో ఏ పాపమూ దేవునికి
కనబడలేదు. యెహోవా వారి దేవుడు, ఆయన
వారితో ఉన్నాడు. మహారాజు వారితో ఉన్నాడు.

22 దేవుడు వారిని ఈజిప్టు నుండి బయటకు తీసు
కొచ్చాడు. అడవి ఎద్దుల్లా వారు బలంగా
ఉన్నారు.

23 యాకోబు ప్రజలను ఓడించగల శక్తి ఏదీ లేదు.
ఇశ్రాయేలు ప్రజలకు ఎదురు వెళ్లగల
మంత్రమూ ఏదీ లేదు.' దేవుడు చేసిన మహా

కార్యాలను చూడండి' అని యాకోబును గూర్చి,
ఇశ్రాయేలు ప్రజలను గూర్చి మనుష్యులు
అంటారు.
24 ఆ ప్రజలు బలమైన సింహంలా ఉంటారు.
సింహంలా వారు పోరాడతారు. ఆ సింహం తన
శత్రువును తినివేసేంత వరకు విశ్రాంతి తీసు
కోదు. తనకు వ్యతిరేకంగా ఉండేవారి రక్తం
తాగేంతవరకు ఆ సింహం ఊరుకోదు."

25అప్పుడు బాలాకు, "ఆ ప్రజలకు మేలు జరగాలని
నీవు అడుగలేదు గాని కీడు జరగాలని కూడ నీవు
అడుగలేదు" అన్నాడు బిలాముతో.
26బిలాము, "యెహోవా నాకు చెప్పిన విషయాలు
మాత్రమే చెబుతానని నేను నీకు ముందే చెప్పాను"
అని జవాబిచ్చాడు.
27అప్పుడు బాలాకు, "అలాగైతే నాతో మరో బలి
పీఠం దగ్గరకు రా. ఒకవేళ అక్కడ దేవుడు సంతోషించి,
అక్కడనుండి ఆ ప్రజలను శపించనిస్తాడేమో" అని
బిలాముతో చెప్పాడు.
28కనుక బాలాకు పీయోరు కొండకు బిలామును
తీసుకుని వెళ్లాడు. ఈ కొండ నుండి అరణ్యాన్ని
చూడవచ్చు.
29"ఇక్కడ ఏడు బలిపీఠాలు నిర్మించు. తర్వాత
బలికోసం ఏడు ఎద్దుల్ని, ఏడు పొట్టేళ్లను సిద్ధం చేయి"
అన్నాడు బిలాము. 30బిలాము అడిగినట్టు బాలాకు
చేసాడు. ప్రతి బలిపీఠం మీద ఒక్కో ఎద్దును, ఒక్కో
పొట్టేలును బాలాకు బలిగా వధించాడు.

### బిలాము మూడో ప్రవచనం

24 ఇశ్రాయేలును యెహోవా ఆశీర్వదించాలనే
కోరుతున్నట్టు బిలాము గమనించాడు. కనుక
ఎలాంటి మంత్రాలు ప్రయోగించినా గాని దానిని
బిలాము మార్చదలచుకోలేదు. కానీ బిలాము పక్కకు
తిరిగి అరణ్యం చూసాడు. 2బిలాము అరణ్యాన్ని చూచి,
అక్కడున్న ఇశ్రాయేలు ప్రజలందర్నీ చూసాడు. వారు,
వారి కుటుంబాలతో ఆ ప్రదేశాల్లో నివసిస్తున్నారు.
అప్పుడు దేవుని ఆత్మ బిలాము మీదికి రాగా 3బిలాము
ఈ విషయాలు చెప్పాడు:

"బెయోరు కుమారుడు ఈ విషయాలు చెబుతు
న్నాడు. నా కళ్లు తేటగా చూస్తున్నాయి కనుక
ఈ మాటలు పలుకుతున్నాను.
4 నేను దేవుని మాటలు వింటున్నాను కనుక ఈ
మాటలు చెబుతున్నాను. నేను చూడాలని ఆ
సర్వశక్తిమంతుడు కోరుతున్న వాటిని నేను చూడ
గలుగుతున్నాను. నేను సాగిలపడి తేటగా చూసి
నవాటిని చెబుతున్నాను.
5 "యాకోబు ప్రజలారా, మీ గుడారాలు చాలా
అందంగా ఉన్నాయి. ఇశ్రాయేలు ప్రజలారా, మీ
నివాసాలు అందంగా ఉన్నాయి.
6 భూమి మీద మీ గుడారాలు లోయల్లా పరచు
కొన్నాయి. అవి నదీ తీరంలో తోటలా
ఉన్నాయి. యెహోవా నాటిన అది చక్కటి
సువాసనగల మొక్కలా ఉంది. అది నీళ్ల దగ్గర
పెరిగే అందమైన చెట్లలా ఉంది.
7 మీకు ఎల్లప్పుడూ తాగటానికి కావాల్సినంత నీరు
ఉంటుంది. మీ ఆహారం పండించుకోవటానికి
కావాల్సినంత నీరు ఎల్లప్పుడూ ఉంటుంది మీకు.
ఆ ప్రజల రాజు అగాగుకంటె గొప్పవాడుగా
ఉంటాడు. వారి రాజ్యం చాలా గొప్పది అవు
తుంది.
8 "ఆ ప్రజలను ఈజిప్టునుండి దేవుడే బయటకు
తీసుకొచ్చాడు. వారు అడవి ఆవు అంతటి బలం
గలవారు. తమ శత్రువులందర్నీ వారు ఓడిస్తారు.
వారి శత్రువుల ఎముకల్ని వారు విరుగగొడ్తారు.
వారి బాణాలు వారి శత్రువుల్ని చంపేస్తాయి.
9 "తన ఆహారం మీదికి ఎగబడటానికి సిద్ధంగా వున్న
సింహంలా ఇశ్రాయేలీయులున్నారు. వారు నిద్ర
పోతున్న కొదమ సింహంలా ఉన్నారు. దానిని
మేల్కొలి పేందుకు ఎవడికి ధైర్యం చాలదు.
నిన్ను ఆశీర్వదించే వారు ఆశీర్వాదం పొందు
తారు. నిన్ను ఎవరైనా శపిస్తే వారికి గొప్ప
కష్టాలు వస్తాయి."

10అప్పుడు బాలాకు బిలాముమీద చాల కోప
పడ్డాడు. బిలాముతో బాలాకు అన్నాడు: "నిన్ను వచ్చి
నా శత్రువులను శపించమని పిలిచాను. కానీ నీవు వాళ్లను
ఆశీర్వదించావు. వాళ్లను మూడు సార్లు నీవు ఆశీర్వ
దించావు.
11ఇప్పుడు ఇంటికి వెళ్లిపో. నీకు చాలా ఇస్తానని
నేను నీతో చెప్పాను. అయితే నీవు నీ ప్రతిఫలం
పోగొట్టుకొనేటట్టు చేసాడు యెహోవా."
12బాలాకుతో బిలాము అన్నాడు: "నీవు నా దగ్గరకు
మనుష్యుల్ని పంపించావు. నన్ను రమ్మని వాళ్లు అడి
గారు. 13కానీ వారితో నేను, 'బాలాకు అతి సుందరమైన
తన భవనాన్ని వెండి, బంగారాలతో నింపి ఇవ్వవచ్చు
గాక. నేను మాత్రం నన్ను చెప్పమని యెహోవా
నాకు చెప్పిన మాటలే చెబుతాను మంచిగాని చెడుగాని,
నా అంతట నేనే ఏదీ చేయలేను. యెహోవా ఆజ్ఞా
పించినట్లు నేను చేసి తీరాల్సిందే' అన్నాను. ఈ సంగ
తులు నేను నీ మనుష్యులతో చెప్పటం నీకు జ్ఞాపకం
లేదా?
14ఇప్పుడు నేను నా స్వంత ప్రజల దగ్గరకు
వెళ్తున్నాను. అయితే నేను నీకు ఒక హెచ్చరిక

ఇస్తున్నాను. నీకూ, నీ ప్రజలకూ ఇశ్రాయేలు ప్రజలు ఇక ముందు ఏమి చేస్తారో నేను నీకు చెబుతాను.”

### బిలాము చివరి ప్రవచనాలు

15 అప్పుడు బిలాము ఈ విషయాలు చెప్పాడు:

“బెయెరు కుమారుడైన బిలాము మాటలు ఇవి. విషయాలను తేటగా చూడగలవాని మాటలు ఇవి.
16 మాటలను దేవుని దగ్గరనుండి వినగల వాని మాటలు ఇవి. మహోన్నతుడైన దేవుడు నాకు నేర్పినవాటిని నేను నేర్చుకున్నాను. నేను చూడాలని సర్వశక్తుడైన దేవుడు కోరినవాటిని నేను చూసాను. నేను ఆయనకు సాగిల పడుతున్నాను. దేవునికి కావలసినదానిని నేను తేటగా చూడగలను.
17 “యెహోవా రావటం నేను చూస్తున్నాను, కానీ ఇప్పుడే కాదు.ఆయన రాక నేను చూస్తున్నాను, కానీ అది త్వరలోనే జరగదు. యాకోబు వంశం నుండి ఒక నక్షత్రం వస్తుంది. ఇశ్రాయేలు నుండి ఒక కొత్త పాలకుడు వస్తాడు. ఆ పాలకుడు మోయాబు ప్రజల తలలు చితకగొడ్తాడు.షేతు కుమారులందరి తలలు ఆ పాలకుడు చితకగొడ్తాడు.
18 ఇశ్రాయేలీయులు బలము`గలవారవుతారు. అతనికి ఏదోము దేశము, అతని శత్రువైన శేయీరు* దొరుకుతాయి.
19 “యాకోబు వంశంనుండి ఒక కొత్త పాలకుడు వస్తాడు. పట్టణంలో ఇంకా బతికి ఉన్న వాళ్లను ఆ పాలకుడు నాశనం చేస్తాడు.”
20 తర్వాత బిలాము అమాలేకు ప్రజలను చూచి ఈ మాటలు చెప్పాడు: “దేశాలన్నింటిలో అమాలేకు అతి బలంగలది. కానీ అమాలేకు కూడ నాశనం చేయబడుతుంది”!
21 తర్వాత బిలాము కెనాతీ ప్రజలను చూచి ఈ మాటలు చెప్పాడు: “మీ దేశం క్షేమంగా ఉందని మీ నమ్మకం.ఎత్తయిన కొండమీది పక్షి గూడులా అది కాపాడ బడుతోందని మీ నమ్మకం.
22 అయితే మీరు కెనాతీ ప్రజలు నాశనం చేయబడతారు. అష్షూరు మిమ్మల్ని బందీలుగా చేస్తుంది.”
23 అప్పుడు బిలాము ఈ మాటలు చెప్పాడు: “దేవుడు ఇలా చేసినప్పుడు ఏ వ్యక్తీ బతకలేడు.
24 కిత్తీము తీరాలకు ఓడలు వస్తాయి. ఆ ఓడలు అష్షూరు, ఎబెరులను ఓడిస్తాయి. అయితే తర్వాత ఆ ఓడలు కూడ నాశనం చేయబడతాయి.”

25అప్పుడు బిలాము లేచి, తన స్వంత ఊరికి తిరిగి వెళ్లి పోయాడు.

### పెయోరు దగ్గర ఇశ్రాయేలు

25 ఇశ్రాయేలు ప్రజలు ఇంకా షిత్తీము దగ్గరే
నివాసం చేస్తున్నారు. ఆ సమయంలో పురుషులు మోయాబీ స్త్రీలతో లైంగిక పాపం చేయటం మొదలు పెట్టారు.
2-3మోయాబీ స్త్రీలు వారి నకిలీ దేవుళ్లకు బలులు అర్పించేటప్పుడు వచ్చి సహాయం చేయుమని ఆ పురుషులను ఆహ్వానించారు. యూదులు కొంతమంది ఆ దేవుళ్లను కొలిచి, అక్కడ భోజనం చేసారు. కనుక ఆ విధంగా ఇశ్రాయేలు ప్రజలు పెయోరులో బయలు దేవతను కొలవటం మొదలు పెట్టారు. యెహోవాకు ఈ ప్రజలమీద చాల కోపం వచ్చింది.
4“ఈ ప్రజల నాయకులందర్నీ పిలువు. ప్రజలంతా చూసేటట్టు వారిని చంపు. వారి శరీరాల్ని యెహోవా ఎదుట పడవేయి. అప్పుడు ఇశ్రాయేలు ప్రజలమీద యెహోవా కోపగించడు” అని మోషేతో యెహోవా చెప్పాడు.
5ఇశ్రాయేలీయుల న్యాయమూర్తులతో “పెయోరులో నకిలీ దేవుడైన బయలును కొలిచేందుకు ప్రజలను నడిపించిన మీ వంశపు నాయకులను ఒక్కొక్కరిని మీరు తెలుసుకోవాలి. తర్వాత మీరు వారిని చంపేయాలి” అని మోషే చెప్పాడు.
6ఆ సమయంలో మోషే, మరియు ఇశ్రాయేలు పెద్దలూ అంతా సన్నిధి గుడార ద్వారం దగ్గర చేరారు. ఇశ్రాయేలు మగవాడొకడు ఒక మిద్యానీ స్త్రీని తన ఇంటికి, తన కుటుంబం దగ్గరకు తీసుకొనివచ్చాడు. మోషే, మరియు పెద్దలూ అందరూ చూసేటట్టుగా వాడు ఇలా చేసాడు. మోషే, ఆ పెద్దలూ చాల విచారపడ్డారు.
7అహరోను కుమారుడైన ఎలీయాజరు కుమారుడు ఫీనెహాసు యాజకుడు ఇది చూసాడు. కనుక అతడు సమాజంనుండి వెళ్లి తన ఈటె తీసుకున్నాడు.
8ఇశ్రాయేలు పురుషునితోబాటు వాని గుడారంలోకి అతడు వెళ్లాడు. ఆ ఇశ్రాయేలు వానిని మిద్యానీ స్త్రీనీ ఈటెతో అతడు చంపేసాడు. ఆ ఈటెతో అతడు వారిద్దరి శరీరాలూ పొడిచినాడు. ఆ సందర్భంలో ఇశ్రాయేలు ప్రజల్లో గొప్ప రోగం పుట్టింది. అయితే వీళ్లద్దర్నీ ఫీనెహాసు చంపగానే ఆ రోగం ఆగిపోయింది.
9ఈ రోగం మూలంగా 24,000 మంది చనిపోయారు.
10మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
11“యాజకుడు అహరోను కుమారుడైన ఎలీయాజరు కుమారుడు ఫీనెహాసు ఇశ్రాయేలు ప్రజలను నా కోపం నుండి రక్షించాడు. నన్ను సంతోష పెట్టేందుకు అతడు ఎంతో

---

**శేయీరు** ఏదోముకి మరో పేరు.

కష్టపడి ప్రయత్నించాడు. అతడు నాలాగే ఉన్నాడు.
ప్రజల మధ్య నా మర్యాద కాపాడటానికి అతడు
ప్రయత్నం చేసాడు. అందుచేత నేను అనుకొన్న
ప్రకారం ప్రజలను చంపను. 12కనుక నేను ఫీనెహాసుతో
ఒక శాంతి ఒడంబడిక చేస్తున్నానని అతనితో చెప్పండి.
13అతడు, అతని తర్వాత జీవించే అతని కుటుంబీకులు
అందరికీ ఒక ఒడంబడిక ఉంటుంది. వారు ఎప్పటికీ
యాజకులే. ఎందుచేతనంటే అతడు తన దేవుడి
మర్యాద కాపాడటానికి ఎంతో కష్టపడి ప్రయత్నిం
చాడు. అతడు చేసినది ఇశ్రాయేలు ప్రజల తప్పులకు
ప్రాయశ్చిత్తం చేసింది."
14మిద్యానీ స్త్రీతో బాటు చంపబడ్డ ఇశ్రాయేలు
మగవాడు, సాలు కుమారుడైన జిమ్రీ. షిమ్యోను
వంశంలో ఒక కుటుంబానికి అతడు నాయకుడు.
15చంపబడిన మిద్యానీ స్త్రీ పేరు కొజ్బీ. ఆమె షూరు
కూమార్తె. షూరు మిద్యానీ ప్రజల్లో నాయకుడు.
అతడు తన వంశానికి పెద్ద.
16మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
17"మిద్యానీ ప్రజలు మీకు శత్రువులు. మీరు వాళ్లను
చంపేయాలి. 18ఇప్పటికే వాళ్లు మిమ్మల్ని శత్రువులుగా
చేసుకున్నారు. మీరు పెయోరు నకిలీ దేవుడిని కొలి
చేటట్టుగా వాళ్లు మిమ్మల్ని మోసం చేసారు. మిద్యానీ
నాయకుని కుమార్తె కొజ్బీని మీ వాడొకడు దాదాపు
వివాహం చేసుకున్నంత పని చేసారు వారు. అదే ఇశ్రా
యేలు ప్రజలకు రోగం వచ్చినప్పుడు చంపబడ్డ స్త్రీకి
పెయోరులో ప్రజలు బయలు నకిలీ దేవుణ్ణి కొలిచిన
కారణంగానే ఆ రోగం వచ్చినది."

26 ఆ మహా రోగం తర్వాత మోషేతో, అహరోను
కుమారుడు యాజకుడైన ఎలీయాజరుతో
యెహోవా మాట్లాడాడు: 2"ఇశ్రాయేలు ప్రజలందరినీ
లెక్కించండి. ప్రతి కుటుంబాన్నీ చూచి, 20 సంవత్స
రాలు, అంతకంటె ఎక్కువ వయసు ఉన్న పురుషులం
దరిని లెక్కించండి. వీరు ఇశ్రాయేలు సైన్యంలో పని
చేయటానికి సమర్థులు" అని ఆయన చెప్పాడు.
3ఇప్పటికి మోయాబు మైదానంలోనే ప్రజలు
నివాసం చేస్తున్నారు. ఇది యెరికోకు ఎదురుగా
యోర్దాను నది దగ్గర ఉంది. కనుక మోషే, యాజ
కుడైన ఎలీయాజరు ప్రజలతో మాట్లాడారు. వారు
4"20 గాని, అంతకంటె ఎక్కువ వయసు గాని ఉన్న
మగవాళ్ల సంఖ్య లెక్కించాలి. ఇది మోషేకు యెహోవా
ఇచ్చిన ఆజ్ఞ అన్నారు." ఈజిప్టు నుండి బయటకు
వచ్చిన ఇశ్రాయేలు ప్రజల జాబితా ఇది: 5రూబేను
సంతతి వాళ్లు వీరే. (యాకోబుకు) ఇశ్రాయేలు పెద్ద
కుమారుడు రూబేను. వంశాలు:

హనోకు – హనోకీల వంశం పల్లు పల్లువారి
వంశం

6 హెస్రోను హెస్రోనీల వంశం కర్మి కర్మీల
వంశం

7రూబేను సంతతిలోని వంశాలు అవి. మొత్తం 43,
730 మంది పురుషులు.
8పల్లు కుమారుడు ఏలీయాబు. 9నెమూయేలు,
దాతాను, అబీరాము ముగ్గురూ ఏలీయాబు కుమా
రులు. మోషే, అహరోనులకు ఎదురు తిరిగిన నాయ
కులు దాతాను, అబీరాము అని జ్ఞాపకం ఉంచుకోండి.
యెహోవాకు కోరహు ఎదురు తిరిగినప్పుడు వారు
కోరహును వెంబడించారు. 10అప్పుడే భూమి తెరచు
కొని, కోరహును, అతని అనుచరులు అందరినీ మింగివే
సింది. చనిపోయిన వారి సంఖ్య మొత్తం 250 మంది
పురుషులు. ఇశ్రాయేలు ప్రజలందరికీ ఇది ఒక హెచ్చ
రిక, గుర్తు. 11అయితే కోరహు కుటుంబంలోని ఇత
రులు మరణించలేదు.
12షిమ్యోను సంతతిలోని వంశాలు ఇవి:

నెమూయేలు–నెమూయేలీ వంశం యామీను–
యామీనీల వంశం యాకీను–యాకీనీల వంశం

13 జెరహు–జెరహీల వంశం షావూలు–వూలీ వంశం

14షిమ్యోను సంతతిలోని వంశాలు అవి. వారు
మొత్తం 22,200 మంది.

15 గాదు సంతతిలోని వంశాలు ఇవి:
సెపోను – సెపోనీల వంశం హగ్గి – హగ్గీల
వంశం షూనీ – షూనీల వంశం
16 ఓజని – ఓజనీల వంశం ఏరీ – ఏరీల వంశం
17 అరోది – అరోదీల వంశం అరేలి – అరేలీల
వంశం

18అవి గాదు సంతతిలోని వంశాలు. వారు మొత్తం
40,500 మంది పురుషులు.

19-20యూదా సంతతిలోని వంశాలు ఇవి:

షేలా – షేలావారి వంశం పెరెసు– పెరెసీల
వంశం జెరహు – జెరహీల వంశం (యూదా
కుమారులు ఏరు, ఓనాను అనే ఇద్దరు
కనానులో చనిపోయారు.)
21 పెరెసు వంశాలు ఇవి:
హెస్రోను – హెస్రోనీల వంశం హములు –
హములీల వంశం
22యూదా సంతతిలోని వంశాలు ఇవి. పురుషుల
సంఖ్య మొత్తం 76,500.

23ఇశ్శాఖారు సంతతిలోని వంశాలు ఇవి: తోల- తోలాలీ వారి వంశం

పువ్వా - పువ్వీల వంశం
24 యాషుబు - యాషుబీల వంశం షిమ్రోను షిమ్రోనీల వంశం

25ఇశ్శాఖారు సంతతిలోని వంశాలు అవి. పురుషుల సంఖ్య మొత్తం 64,300.
26 జెబూలూను సంతతిలోని వంశాలు:

సెరెదు - సెరెదీల వంశం ఏలోను- ఏలోనీల వంశం యహలేలు - యహలేల వంశం

27జెబూలూను సంతతిలోని వంశాలు అవి. పురుషుల సంఖ్య మొత్తం 60,500.
28యోసేపు ఇద్దరు కుమారులు మనష్షే, ఎఫ్రా యిము. ఒక్కో కుమారుడు కొన్ని స్వంత వంశాలతో
కూడిన ఒక్కో సంతతి అయ్యారు. 29మనష్షే సంతతి
ఏవనగా:

మాకీరు - మాకీరువారి వంశం (మాకీరు గిలా దుకు తండ్రి,) గిలాదు - గిలాదీల వంశం
30 గిలాదు వంశాలు: ఈజరు - ఈజరీల వంశం హెలెకు - హెలెకీవారి వంశం

31 అశ్రీయేలు- అశ్రీయేలీల వంశం షెకెము - షెకెమీల వంశం
32 షెమిద - షెమిదీల వంశం హెపెరు - హెపెరీల వంశం
33 హెపెరు కుమారుడు సెలోపెహదు. కానీ అతనికి కుమార్తెలు తప్ప కుమారులు లేరు. అతని కుమార్తెల పేర్లు మహల, నోయా, హొగ్ల, మిల్కా తిర్సా.

34అవన్నీ మనష్షే సంతతిలోని వంశాలు. పురుషుల సంఖ్య మొత్తం 52,700
35ఎఫ్రాయిము సంతతిలోని వంశాలు ఏవనగా:

షుతల - షుతలీల వంశం బేకరు - బేకరీల వంశం తహను - తహనీల వంశం
36 షుతలహు వంశం వాడు ఏరాను. అతని వంశ ఏరానీల వంశం

37ఎఫ్రాయిము సంతతిలోని వంశాలు అవి. పురుషుల సంఖ్య మొత్తం 32,500 యోసేపు సంతతికి చెందిన మొత్తం మనుష్యులు వారే.

38బెన్యామీను సంతతిలోని వంశాలు:

బెలా - బెలాలీ వంశం అష్బేలు - అష్బేలీ వంశం అహీరం - అహీరమీయీల వంశం
39 షుపం - షుపామీల వంశం హుపం - హుపామీల వంశం
40 బెలా వంశాలు ఏవనగా: ఆర్దు - ఆర్దీల వంశం నయమాను - నయమానీల వంశం

41బెన్యామీను సంతతిలోని వంశాలన్నీ అవి. పురుషుల సంఖ్య మొత్తం 45,600
42దాను సంతతిలోని వంశాలు:

షూషాము - షూషామీల వంశం. అది దాను సంతతిలోని కుటుంబం.

43షూషామీల వంశంలో ఎన్నో కుటుంబాలు ఉన్నాయి. పురుషుల సంఖ్య మొత్తం 64,400
44ఆషేరు సంతతిలోని వంశాలు:

ఇమ్నా - ఇమ్నా వారి వంశం ఇష్వీ - ఇష్వీల వంశం బెరీయ - బెరీయాల వంశం
45 బెరీయా వంశాలు: హెబెరు - హెబెరీల వంశం మల్కీయేలు - మల్కీయేలీల వంశం.

46 (ఆషేరుకు శెరహు అనే కూతురు కూడ ఉంది.)
47ఆషేరు సంతతిలోని వంశాలు అవి. పురుషుల సంఖ్య మొత్తం 53,400
48నఫ్తాలీ సంతతిలోని వంశాలు:

యహసియేలు - యహసియేలీల వంశం గూని - గూనీల వంశం
49 యెసెరు - యెసెరీల వంశం షిల్లేము - షిల్లేమీల వంశం.

50నఫ్తాలీ సంతతిలోని వంశాలు అవి. పురుషుల సంఖ్య మొత్తం 45,400
51కనుక ఇశ్రాయేలు పురుషుల సంఖ్య మొత్తం 6,01,730
52యెహోవా మోషేతో ఇలా చెప్పాడు: 53"ప్రతి
వంశానికీ దేశం లభిస్తుంది. ఇది నేను వారికి వాగ్దానం చేసిన దేశం. లెక్కించబడిన ప్రజలందరికీ సరిపడినంత
భూమి ప్రతి వంశానికీ లభిస్తుంది. 54పెద్ద వంశానికి
ఎక్కువ భూమి లభిస్తుంది. చిన్న వంశానికి తక్కువ భూమి లభిస్తుంది. అయితే నేను వాగ్దానం చేసిన దేశం ప్రతి వంశానికీ లభిస్తుంది. మరియు వారికి లభించే భూమి, లెక్కించబడిన వారందరికీ సరిపోయేటంత

ఉంటుంది. 55ప్రతి వంశానికీ ఆ భూమి ఇవ్వబడుతుంది.
ఏ వంశం వారి భూమికి ఆ పేరే పెట్టబడుతుంది.
56ప్రజలకు ఇస్తానని నేనే వాగ్దానం చేసినంతగా
ఉంటుంది ఆ భూమి. పెద్ద వంశాలకీ, చిన్నవాటికీ
అందివ్వబడుతుంది.”
57లేవీ సంతతి కూడ లెక్కించబడింది. లేవీ సంతతి
లోని వంశాలు ఇవి:

గెర్షోను – గెర్షోనీల వంశం కహాతు – కహాతీల
వంశం మెరారి – మెరారిల వంశం

58ఇవి కూడ లేవీ సంతతిలోని వంశాలే:

లిబ్నీల వంశం హెబ్రోనీల వంశం మహ్లీల వంశం
మూషీల వంశం కోరహీల వంశం

అమ్రాము కహాతు వంశం వాడు. 59అమ్రాము భార్య
పేరు యోకెబెదు. ఆమె కూడ లేవీ సంతతిలోనిదే.
ఆమె ఈజిప్టులో పుట్టింది. అమ్రాము, యోకెబెదులకు
అహరోను, మోషే ఇద్దరు కుమారులు. వారికి మిర్యాము
అని ఒక కుమార్తె కూడ ఉంది.
60నాదాబు, అబీహు, ఎలీయాజరు, ఈతామారు
లకు తండ్రి అహరోను. 61కానీ నాదాబు, అబీహు చని
పోయారు. అంగీకారం కాని అగ్నితో దేవునికి అర్పణ
చేసినందువల్ల వారు చనిపోయారు.
62లేవీ సంతతిలో పురుషుల సంఖ్య మొత్తం
23,000, అయితే ఇతర ఇశ్రాయేలు మనుష్యులతో
వీరు లెక్కించబడలేదు. మిగిలినవారికి యెహోవా
వాగ్దానం చేసిన భూమి మాత్రం లేదు.
63మోషే, యాజకుడైన ఎలీయాజరు ఈ ప్రజ
లందరినీ లెక్క చేసారు. మోయాబు మైదానాల్లో వారు
ఇశ్రాయేలు ప్రజలను లెక్క తీసారు. ఇది యెరికో
ఎదుట యోర్దాను నది అవతల జరిగింది. 64చాల
కాలం కిందట సీనాయి అరణ్యంలో ఇశ్రాయేలు ప్రజ
లందరినీ మోషే, యాజకుడైన అహరోనూ లెక్క
పెట్టారు. అయితే వాళ్లంతా చనిపోయారు. మోషే
మోయాబు మైదానాల్లో లెక్కపెట్టిన వారు వేరు, అంత
కుముందు లెక్కపెట్టిన వారు వేరు. 65వారు అందరూ
ఎడారిలోనే చస్తారు అని ఇశ్రాయేలు ప్రజలతో
యెహోవా చెప్పినందువల్ల ఇలా జరిగింది. సజీవంగా
ఉన్నవాళ్లు యెఫున్నె కుమారుడైన కాలేబు, నూను
కుమారుడైన యెహోషువ మాత్రమే.

## సెలోపెహాదు కుమార్తెలు

27 హెపెరు కుమారుడు సెలోపెహాదు. హెపెరు
గిలాదు కుమారుడు. గిలాదు మాకీరు కుమా
రుడు. మాకీరు మనష్షే కుమారుడు. మనష్షే యోసేపు
కుమారుడు. సెలోపెహాదుకు ఐదుగురు కుమార్తెలు
ఉన్నారు. వారి పేర్లు మహలా, నోయా, హొగ్లా,
మిల్కా, తిర్సా. 2సన్నిధి గుడారం దగ్గర సమావేశం
అవుతోన్న మోషే, యాజకుడైన ఎలీయాజరు,
పెద్దలు, ప్రజలు అందరి ముందరకు ఈ అయిదుగురు
స్త్రీలూ వెళ్లి సన్నిధి గుడారం ఎదుట నిలబడ్డారు. ఈ
ఐదుగురు కూతుళ్లు ఈ విధంగా చెప్పారు: 3“మనం
అరణ్య ప్రయాణంలో ఉన్నప్పుడే మా తండ్రి చని
పోయాడు. అతడు కోరహు గుంపులో చేరినవాడు
కాడు. (కోరహు యెహోవానుంచి తొలగి ఎదురు
తిరిగినవాడు.) మా తండ్రిది సహజ మరణం. కానీ
మా తండ్రికి కుమారులు లేరు. 4అంటే మా తండ్రి
పేరు కొనసాగదు. మా తండ్రి పేరు కొనసాగక పోవటం
సక్రమం కాదు. ఆయనకు కుమారులు లేరు గనుక
ఆయన పేరు అంతం అవుతుంది. అందుచేత మా
తండ్రి సోదరులకు వచ్చే భూమిలో మాకు కొంత
ఇవ్వవలసినదిగా మేము మీకు మనవి చేస్తున్నాము.”
5కనుక ఏమి చేయాలని యెహోవాను మోషే
అడిగాడు. 6అతనితో యెహోవా ఇలా అన్నాడు,
7“సెలోపెహాదు కుమార్తెలు చెప్పినది సరియైనదే.
వాళ్లు వారి తండ్రి సోదరులతో పాటు భూమిని
పంచుకోవలసినదే. కనుక నీవు వారి తండ్రికిచ్చిన
భూమిని వారికి ఇవ్వవలెను.
8“కనుక ఇశ్రాయేలు ప్రజలకు, ఇలా చట్టం
తయారు చేయి. ‘ఒకనికి కుమారులు లేకుండానే
అతడు చనిపోతే, అతని ఆస్తి అంతా అతని కుమార్తెకు
ఇవ్వవలెను. 9అతనికి కుమార్తె లేకపోతే, అతని ఆస్తి
అంతా అతని సోదరులకు ఇవ్వవలెను. 10అతనికి సోద
రులు లేకపోతే అతని ఆస్తి అంతా అతని తండ్రి సోద
రులకు ఇవ్వవలెను. 11అతని తండ్రికి సోదరులు లేక
పోతే, అతని ఆస్తి అంతా, అతని కుటుంబంలో దగ్గర
బంధువులకు ఇవ్వాలి. ఇశ్రాయేలు ప్రజల్లో ఇది ఒక
చట్టంగా ఉండాలి. యెహోవాయే ఈ ఆజ్ఞను
మోషేకు ఇస్తున్నాడు.’”

## కొత్త నాయకుడుగా యెహోషువ

12అప్పుడు మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
“ఆ కొండమీదికి ఎక్కుము. యొర్దాను నదికి తూర్పున
ఉన్న కొండల్లో అది ఒకటి. ఇశ్రాయేలు ప్రజలకు
నేను ఇస్తున్న దేశాన్ని నీవు అక్కడ నుండి చూస్తావు.
13నీవు ఈ దేశాన్ని చూశాక, నీ సోదరుడు అహరోను
మరణించినట్టే నీవు మరణిస్తావు. 14సీను అరణ్యంలో
నీళ్లకోసం ప్రజలు కోపగించుకోవటం జ్ఞాపకం చేసు
కొనుము. నీవూ, అహరోనూ కూడ నా ఆజ్ఞకు విధేయు
లయ్యేందుకు నిరాకరించారు. ప్రజల ముందు నీవు
నన్ను ఘనపర్చలేదు, పవిత్రంగా చూడలేదు.” (ఇది
సీను అరణ్యంలో కాదేషు దగ్గర మెరీబా నీళ్ల సంగతి.)

15యెహోవాతో మోషే ఇలా అన్నాడు: 16"ప్రజల
ఆలోచనలు తెలిసిన దేవుడు యెహోవా ప్రభువు,
నీవే ఈ ప్రజలకోసం మరో నాయకుడిని ఎంచుకోమని
మనవి చేస్తున్నాను.
17ఈ దేశంలోనుండి వీరిని బయటకు నడిపించి,
కొత్త దేశంలో చేర్చగల నాయకుడిని ఎంచవలసినదిగా
నేను యెహోవాకు మనవి చేస్తున్నాను. అప్పుడు
యెహోవా ప్రజలు కాపరి లేని గొర్రెల్లా ఉండరు."
18కనుక మోషేతో యెహోవా ఇలా అన్నాడు:
"నూను కుమారుడైన యెహోషువ నాయకుడుగా
ఉంటాడు. యెహోషువ ఆత్మను పొందినవాడు. అత
డిని కొత్త నాయకునిగా చేయి. 19యాజకుడైన ఎలీ
యాజరు ఎదుటా, ప్రజలందరి ఎదుటా నిలబడమని
అతనితో చెప్పు. అప్పుడు అతడిని కొత్త నాయకునిగా
నీవు చేయి.
20"అతడిని నీవు నాయకునిగా చేస్తున్నావని ప్రజ
లకు చూపెట్టు, అప్పుడు ప్రజలంతా అతనికి లోబ
డతారు.
21ఒకవేళ యెహోషువ ఒక కొత్త నిర్ణయం ఏదైనా
చేయాలంటే అతడు యాజకుడైన ఎలీయాజరు
దగ్గరకు వెళతాడు. యెహోవా జవాబు తెలుసుకొ
నేందుకు ఎలీయాజరు ఊరీమును ప్రయోగిస్తాడు.
అప్పుడు యెహోషువ, ప్రజలం దరూ దేవుడు చెప్పిన
వాటిని చేస్తారు. 'యుద్ధానికి వెళ్లండి' అని అతడు
చెబితే వారు యుద్ధానికి వెళ్తారు. ఒకవేళ 'ఇంటికి
వెళ్లండి' అని అతడు చెబితే వారు ఇంటికి వెళతారు."
22మోషే యెహోవాకు విధేయుడయ్యాడు.
యాజకుడైన ఎలీయాజరు ముందు, ప్రజలందరి
ఎదుట నిలబడమని యెహోషువాతో చెప్పాడు
మోషే. 23అప్పుడు అతడే కొత్త నాయకుడు అని
చూపెట్టేందుకు అతనిమీద మోషే చేతులు పెట్టాడు.
అతనితో యెహోవా చెప్పినట్టే అతడు చేసాడు.

## ప్రతిదిన అర్పణలు

28 అప్పుడు యెహోవా మోషేతో మాట్లా
డాడు. ఆయన ఇలా అన్నాడు: 2"ఇశ్రాయేలు
ప్రజలకు ఈ ఆజ్ఞ ఇవ్వవలెను. ప్రత్యేక కానుకలను
సరైన సమయంలోనే నాకు ఇవ్వవలెనని వారితో
చెప్పుము. ధాన్యార్పణలు, దహనబలులు నాకు ఇవ్వా
లని వారితో చెప్పుము. ఆ దహనబలుల వాసన
యెహోవాకు ఇష్టం. 3వారు యెహోవాకు ఇవ్వవల
సిన దహనబలులు ఇవే. ప్రతిరోజూ పుష్టిగల, ఒక
సంవత్సరం వయసున్న రెండు మగ గొర్రె పిల్లలు.
4ఒక గొర్రెపిల్ల ఉదయం, మరో గొర్రెపిల్లను సాయం
కాలమందు అర్పించాలి. 5మరియు ఒక పావు ఒలీవ
నూనెతో కలుపబడ్డ రెండుపావుల మంచి పిండి ధాన్యా
ర్పణగా పెట్టాలి." 6సీనాయి కొండ దగ్గర వారు ప్రతి
దినం అర్పణలు అర్పించటం మొదలుపెట్టారు. ఆ
దహనబలి అర్పణల వాసన యెహోవాకు ఇష్టమయి
నది. 7దహనబలి అర్పణతో బాటు ప్రజలు పానార్పణ
కూడ అర్పించాలి. ప్రతి గొర్రె పిల్లతోబాటు వారు
ముప్పావు ద్రాక్షారసం అర్పించాలి. పవిత్ర స్థలంలో
బలిపీఠం మీద పానార్పణం పోయాలి. ఇది యెహో
వాకు కానుక. 8రెండో గొర్రెపిల్లను సాయంకాలమందు
అర్పించాలి. సరిగ్గా ఉదయార్పణలాగే దీనిని అర్పిం
చాలి. అలాగే అదే రకం పానార్పణం ఇవ్వాలి. ఈ
దహనబలి యెహోవాకు సువాసనగా ఉంటుంది."

## సబ్బాతు అర్పణలు

9"విశ్రాంతి దినం శనివారం నాడు, ఒక సంవత్సరం
వయసుగల లోపంలేని రెండు గొర్రె పిల్లల్ని, తూమెడు
పిండిలో రెండు పదోవంతుల మంచి పిండి ఒలీవ
నూనెలో కలిపిన పానార్పణం మీరు అర్పించాలి.
10విశ్రాంతి దినం కోసం ఇది ప్రత్యేక అర్పణ. ప్రతి
రోజూ ఇచ్చే అర్పణ పానార్పణం గాక ఇది అదనం."

## నెలసరి సమావేశాలు

11"ప్రతి నెలా మొదటి రోజున ప్రత్యేకమైన దహన
బలి మీరు యెహోవాకు అర్పించాలి. ఈ అర్పణ
లోపంలేని రెండు కోడె దూడలు, ఒక పొట్టేలు, ఒక
సంవత్సరపు గొర్రెపిల్లలు ఏడు. 12మరియు ఒలీవ
నూనెతో కలుపబడిన తూమెడు మంచి పిండితో
మూడు పదోవంతులను ధాన్యార్పణగా ప్రతి కోడె
దూడతోబాటు అర్పించాలి. అలాగే, ఒలీవ నూనెతో
కలుపబడిన మంచి పిండిలో ఒక పదోవంతును పొట్టేలు
తోబాటు ధాన్యార్పణగా అర్పించాలి. 13ఒలీవ నూనెతో
కలుపబడిన మంచి పిండిలో ఒక పదోవంతును ఒక్కో
గొర్రెపిల్లతోబాటు ధాన్యార్పణగా అర్పించాలి. ఇది
యెహోవాకు సువాసన ఇచ్చే దహనబలి. 14ప్రతి కోడె
దూడతోబాటు పడిన్నర ద్రాక్షారసం, పొట్టేలుతోబాటు
ఒక్క పడి ద్రాక్షారసం, ప్రతి గొర్రెపిల్లతో బాటు
ముప్పావు ద్రాక్షారసం పానార్పణం. ఇది సంవత్సరంలో
నెలనెలా అర్పించాల్సిన దహనబలి. 15ప్రతి రోజూ
అర్పించే దహనబలి, పానార్పణంగాక ఒక మగ మేకను
యెహోవాకు మీరు అర్పించాలి. ఆ మేక పాప పరి
హారార్థ బలి.

## పస్కా పండుగ

16"మొదటి నెల (నిసాను) పదునాలుగవ రోజున
పస్కా. 17పులియని రొట్టెల పండుగ అదే నెల పది
హేనో రోజున ప్రారంభం అవుతుంది. ఆ పండుగ
ఏడు రోజులపాటు ఉంటుంది. పొంగని రొట్టెలు
మాత్రమే మీరు తినవచ్చును. 18ఈ పండుగ మొదటి
రోజున మీరు ఒక ప్రత్యేక సభజరపాలి. ఆ రోజు

మీరు ఏ పనీ చేయకూడదు. [19]మీరు యెహోవాకు
దహనబలులు అర్పించాలి. దహనబలులు రెండు కోడె
దూడలు, ఒక పొట్టేలు, అంగవిహీనం లేని ఒక సంవ
త్సరపు మగ గొర్రె పిల్లలు ఏడు. [20-21]ఒక్కొక్క కోడె
దూడతో తూములో మూడు పదివంతులును, పొట్టే
లుతో రెండు పది వంతులును, ఒక్కో గొర్రెపిల్లతో,
ఒక్కో పదోవంతు మంచి పిండి ఒలీవ నూనెతో కలిపి
ధాన్యార్పణంగా పెట్టాలి. [22]ఒక మగ మేకను కూడ
మీరు ఇవ్వాలి. ఆ మేక మీ కోసం పాప పరిహారార్థ
బలి అవుతుంది. అది మీ పాపాలను కప్పి పుచ్చుతుంది.
[23]ప్రతి ఉదయం మీరు అర్పించే దహన బలి అర్పణ
కాక ఈ అర్పణలు మీరు అర్పించాలి.

[24]"అదే విధంగా ఏడు రోజులపాటు మీరు ఆహార
అర్పణలు అర్పించాలి. ప్రతి రోజూ దానిని హోమంగా
మీరు అర్పించాలి. ఈ అర్పణ యెహోవాకు ఇష్టమైన
సువాసన. మీరు దహనబలిని, దాని పానార్పణను
క్రమంగా అర్పించాలి. ఇవిగాక ఆహారం (ప్రజలకు)మీరు
అర్పించాలి.

[25]"అప్పుడు పస్కా పండుగ ఏడవ రోజున మీకు
ఒక ప్రత్యేక సభ జరుగుతుంది. ఆ రోజున మీరు ఏ
పనీ చేయరు.

### వారాల పండుగ (పెంతెకొస్తు)

[26]"ప్రథమ ఫలాల పండుగలో (వారాల పండుగ)
కొత్త ధాన్యంలోనుంచి మీరు ధాన్యార్పణ యెహో
వాకు ఇవ్వవలెను. ఆ సమయంలో కూడ మీరు ఒక
ప్రత్యేక సభ ఏర్పాటు చేయాలి. ఆ రోజున మీరు ఏ
పనీ చేయకూడదు. [27]మీరుదహన బలులు అర్పించాలి.
ఆ బలి అర్పణలు యెహోవాకు ఇష్టమైన సువాసన.
రెండు కోడెదూడలు, ఒక పొట్టేలు, ఒక సంవత్సరపు
మగ గొర్రె పిల్లలు ఏడు మీరు అర్పించాలి. [28]ప్రతి
కోడెదూడతోను, నూనెతో కలుపబడిన తూమెడు
పిండిలో మూడు పదోవంతులు, ప్రతి పొట్టేలుతో
రెండు పదోవంతులు [29]ఒక్కో గొర్రె పిల్లతో ఒక్కో
పదోవంతును మీరు అర్పించాలి. [30]మీ పాపాలకు
ప్రాయశ్చిత్తంగా ఒక మగ మేకనుకూడా మీరు బలి
ఇవ్వవలెను. [31]రోజువారీ దహనబలులు, ధాన్యార్ప
ణాలు గాక వీటిని మీరు అర్పించాలి. జంతువులు
అంగహీనము కానివిగా ఉండేటట్టు తప్పక చూడాలి.
పానార్పణం పరిశుభ్రమయినదిగా ఉండాలి.

### బూరల పండుగ

29 "ఏడో నెల మొదటి రోజున ఒక ప్రత్యేక
సభ జరుగుతుంది. ఆ రోజు మీరు ఏ పనీ
చేయకూడదు. అది బూర ఊదే రోజు. [2]దహన బలు
లను మీరు అర్పించాలి. ఆ బలి అర్పణలు యెహో
వాకు ఇష్టమైన సువాసనగా ఉంటాయి. ఒక కోడె
దూడను, ఒక పొట్టేలును, పుష్టిగల ఒక సంవత్సరపు
ఏడు మగ గొర్రెపిల్లలను మీరు అర్పించాలి. [3]కోడె
దూడతో బాటు తూములో మూడు పదోవంతుల
మంచి పిండి నూనెతో కలిపినది, పొట్టేలుకు రెండు
పదోవంతులును, [4]ఏడు గొర్రెపిల్లల్లో ఒక్కోదానికి
ఒక్కో పదోవంతును మీరు అర్పించాలి. [5]మరియు
పాపపరిహారార్థ బలిగా ఒక మగ మేకను అర్పించండి.
[6]నెలపొడుపు* బలులు, దాని ధాన్యార్పణం గాక
బలులు అర్పించాలి. ప్రతిదిన బలులు, దాని ధాన్యా
ర్పణం, పానార్పణలకి అదనం. అవి వాటి నియమాల
ప్రకారం జరగాలి. అవి అగ్నిలో దహించబడాలి. అది
యెహోవాకు ఇష్టమైన సువాసన.

### ప్రాయశ్చిత్త దినం

[7]"ఏడో నెల పదో రోజున ఒక ప్రత్యేక సభ జరు
గుతుంది. ఆ రోజు మీరు ఏమీ భోజనం చేయకూడదు.
ఏ పనీ మీరు చేయకూడదు. [8]దహన బలులు మీరు
అర్పించాలి. అది యెహోవాకు ఇష్టమైన సువాసనగా
ఉంటుంది. ఒక కోడె దూడ, ఒక పొట్టేలు, అంగహీనము
కాని ఒక సంవత్సరపు ఏడు మగ గొర్రె పిల్లలను మీరు
అర్పించాలి. [9]ఒలీవ నూనెతో కలుపబడిన మంచి పిండి
తూములో మూడు పదోవంతులు ఒక కోడె దూడ
తోను, రెండు పదోవంతులు పొట్టేలుతోను, [10]ఏడు
గొర్రె పిల్లల్లో ఒక్కోదానిలో పదోవంతును మీరు
అర్పించాలి. [11]ఒక పోతు మేకను కూడ పాపపరి హారార్థ
బలిగా మీరు అర్పించాలి. ప్రాయశ్చిత్త దినపు పాప
పరిహారార్థ బలి అర్పణకు ఇది అదనం. ప్రతిదినం
బలి, దాని ధాన్యార్పణం, పానార్పణలకు ఇది అదనం.

### పర్ణశాలల పండుగ

[12]"ఏడోనెల పదిహేనవ రోజున ఒక ప్రత్యేక సభ
జరుగుతుంది. ఆ రోజు మీరు ఏ పనీ చేయకూడదు.
ఏడు రోజులు యెహోవాకు ప్రత్యేక పండుగ రోజు
లుగా మీరు జరుపుకోవాలి. [13]దహన బలులు మీరు
అర్పించాలి. అది యెహోవాకు ఇష్టమైన సువాసన.
కోడెదూడలు 13, పొట్టేళ్లు 2, పుష్టిగల ఒక సంవత్సరపు
గొర్రెపిల్లలు 14 మీరు అర్పించాలి.

[14]పద్నాలుగు కోడె దూడల్లో ఒక్కోదానితో
నూనెతో కలుపబడిన మంచి పిండి తూములో మూడు
పదోవంతులు, రెండు పొట్టేళ్లలో ఒక్కోదానితో రెండు
పదోవంతులు, [15]పదునాలుగు గొర్రెపిల్లల్లో ఒక్కో
దానితో ఒక్కో పదోవంతు మీరు అర్పించాలి. [16]ఒక
మగమేకనుకూడ మీరు అర్పించాలి. రోజువారీ బలి
అర్పణ, దాని ధాన్యార్పణ , పానార్పణలకు ఇది

---

**నెలపొడుపు** యూదుల నెలలో మొదటి దినం. ఇది
ప్రత్యేక ఆరాధనా దినం.

అదనం.17"ఈ పండుగ రెండోనాడు 12 కోడెదూడలు,
2 పొట్టేళ్లు, 14 పుష్టిగల యేడాది గొర్రెపిల్లలు మీరు
అర్పించాలి. 18కోడెదూడలకు, పొట్టేళ్లకు, గొర్రెపిల్ల
లకు సరైన లెక్క ప్రకారం ధాన్యార్పణ, పానార్పణ
కూడా మీరు అర్పించాలి. 19పాపపరిహారార్థ బలిగా ఒక
మగ మేకను కూడా మీరు అర్పించాలి. రోజువారీ బలి
అర్పణ, దాని ధాన్యార్పణ, పానార్పణలకు ఇది అదనం.
20"ఈ పండుగ మూడోనాడు 11 కోడెదూడలు,
2 పొట్టేళ్లు, 14 అంగహీనముకాని యేడాది గొర్రె
పిల్లలు మీరు అర్పించాలి. 21కోడెదూడలకు, పొట్టేళ్లకు,
గొర్రె పిల్లలకు సరైన లెక్క ప్రకారం ధాన్యార్పణ,
పానార్పణలు మీరు అర్పించాలి. 22పాపపరిహారార్థ
బలిగా ఒక మగమేకను మీరు అర్పించాలి. రోజువారీ
బలి అర్పణ, దాని ధాన్యార్పణ, పానార్పణకు ఇది
అదనం.
23"ఈ పండుగ నాలుగో రోజున 10 కోడెదూడలు,
2 పొట్టేళ్లు, 14 అంగహీనముకాని యేడాది గొర్రెపిల్లలు
మీరు అర్పించాలి. 24కోడెదూడలు, పొట్టేళ్లు, గొర్రెపిల్ల
లకు సరైన లెక్క ప్రకారం ధాన్యార్పణ, పానార్పణలు
మీరు అర్పించాలి. 25పాపపరిహారార్థ బలిగా ఒక మేకను
మీరు అర్పించాలి. ప్రతిదినము బలి అర్పణ, దాని
ధాన్యార్పణ, పానార్పణకు ఇది అదనం.
26"ఈ పండుగ ఐదో రోజున 9 కోడె దూడలు,
2 పొట్టేళ్లు, 14 అంగహీనముకాని యేడాది గొర్రెపిల్లలు
మీరు అర్పించాలి. 27కోడెదూడలు, పొట్టేళ్లు, గొర్రెపిల్ల
లకు సరైన లెక్క ప్రకారం ధాన్యార్పణ, పానార్పణ
మీరు అర్పించాలి. 28పాపపరిహారార్థ బలిగా ఒక మేకను
మీరు అర్పించాలి. ప్రతిదినము బలి అర్పణ, దాని
ధాన్యార్పణ, పానార్పణకు ఇది అదనం.
29"ఈ పండుగ ఆరోనాడు 8 కోడె దూడలు, 2
పొట్టేళ్లు, 14 పుష్టిగల యేడాది గొర్రెపిల్లలు మీరు
అర్పించాలి. 30కోడెదూడలు, పొట్టేళ్లు, గొర్రెపిల్లలకు
సరైన లెక్క ప్రకారం ధాన్యార్పణ, పానార్పణం మీరు
అర్పించాలి. 31పాపపరిహారార్థ బలిగా ఒక మేకను మీరు
అర్పించాలి. ప్రతిదినము బలి దాని ధాన్యార్పణ, పానా
ర్పణకు ఇది అదనం.
32"ఈ పండుగ ఏడోనాడు 7 కోడెదూడలు, 2
పొట్టేళ్లు, 14 పుష్టిగల గొర్రె పిల్లలు మీరు అర్పించాలి.
33కోడె దూడలు, పొట్టేళ్లు, గొర్రెపిల్లలకు సరైన లెక్క
ప్రకారం ధాన్యార్పణ, పానార్పణం మీరు అర్పించాలి.
34పాపపరిహారార్థ బలిగా ఒక మేకను మీరు అర్పించాలి.
ప్రతిదినం బలి అర్పణ, దాని ధాన్యార్పణ, పానార్పణకు
ఇది అదనం.
35"ఈ పండుగ ఎనిమిదో రోజు మీకు చాల ప్రత్యేక
సమావేశం ఉంటుంది. ఆ రోజు మీరు ఏ పనీ చేయ
కూడదు. 36మీరు ఒక దహనబలి అర్పించాలి. అది
హోమార్పణ. యెహోవాకు ఇష్టమైన సువాసన. ఒక
కోడెదూడ, ఒక పొట్టేలు, పుష్టిగల ఏడాది గొర్రె పిల్లలు
ఏడింటిని మీరు అర్పించాలి. 37కోడెదూడకు, పొట్టే
లుకు, గొర్రె పిల్లలకు సరైన లెక్క ప్రకారం ధాన్యా
ర్పణ, పానార్పణలు మీరు అర్పించాలి. 38పాపపరి
హారార్థ బలిగా మీరు ఒక మేకను అర్పించాలి. ప్రతి
దినము ధాన్యార్పణ, పానార్పణలకు ఇది అదనం.
39"ప్రత్యేక పండుగ రోజుల్లో మీ దహన బలులను
ధాన్యార్పణలను, పానార్పణలను, సమాధాన బలులను
మీరు తీసుకొని రావాలి. ఆ అర్పణలను మీరు యెహో
వాకు ఇవ్వవలెను. మీరు యెహోవాకు ఇవ్వాలను
కొన్న ప్రత్యేక కానుకలు, మీరు చేసిన ప్రత్యేక ప్రమా
ణాల్లో ఒక భాగము కాకుండా అదనంగా వీటిని అర్పిం
చాలి."
40యెహోవా తనకు ఆజ్ఞాపించిన విషయాలన్నిం
టిని గూర్చి ఇశ్రాయేలు ప్రజలతో మోషే చెప్పాడు.

## ప్రత్యేక ప్రమాణాలు

30 ఇశ్రాయేలు వంశాల నాయకులతో మోషే
మాట్లాడాడు. యెహోవానుండి వచ్చిన ఈ
ఆజ్ఞలనుగూర్చి మోషే వారితో చెప్పాడు.
2"ఒక వ్యక్తి దేవునితో ప్రత్యేక ప్రమాణం చేయాలని
కోరినా, లేక దేవునికి ఏదైనా ప్రత్యేకంగా ఇస్తానని
అతడు మ్రొక్కుకొనినా, అతడు ఆ ప్రకారం చేయాలి.
అయితే అతడు ప్రమాణం ప్రకారం ఖచ్చితంగా చేసి
తీరాలి.
3"ఒక యువతి ఇంకా తన తండ్రి ఇంట్లో నివసిస్తూ
ఉండొచ్చు. యెహోవాకు ప్రత్యేకంగా ఏదో ఇస్తానని
ఆ యువతి ప్రమాణం చేసి ఉండొచ్చు. 4ఆ ప్రమాణం
గూర్చి ఆమె తండ్రి విని, ఒప్పుకొంటే, ఆ యువతి
ప్రమాణం ప్రకారం చేసి తీరాలి. 5అయితే ఆమె తండ్రి
ఆ ప్రమాణం గూర్చి విని, ఒప్పుకొనకపోతే, అప్పుడు
ఆ యువతి తన ప్రమాణానికి బాధ్యురాలు కాదు.
ఆమె చేసిన ప్రమాణం ప్రకారం ఆమె నెరవేర్చాల్సిన
పనిలేదు. ఆమె తండ్రి ఆమెను వారించాడు గనుక
యెహోవా ఆమెను క్షమిస్తాడు.
6"మరియు ఒకని భార్య యెహోవాకు ఏదో ఇస్తా
నని ఒక ప్రత్యేక ప్రమాణం చేసి ఉండొచ్చు. 7భర్త ఆ
ప్రమాణంగూర్చి విని, ఒప్పుకొంటే, ఆమె చేసిన
ప్రమాణాన్ని ఆమె నెరవేర్చి తీరాలి. 8కానీ ఆ ప్రమాణం
గూర్చి భర్త విని, ఒప్పుకొనకపోతే, ఆ భార్య తన
ప్రమాణం ప్రకారం చేయనవసరం లేదు. ఆమె భర్త
ప్రమాణాన్ని భంగం చేసి ఆమె చెప్పినట్టు ఆమెను
చేయనివ్వలేదు. కనుక యెహోవా ఆమెను క్షమిస్తాడు.
9"ఒక విధవ లేక విడువబడ్డ ఒక స్త్రీ ఒక ప్రత్యేక
ప్రమాణం చేయవచ్చు. ఆమె అన్న ప్రకారం తన
ప్రమాణాన్ని నెరవేర్చవలసిందే. 10ఒక వివాహిత స్త్రీ
యెహోవాకు ఏదో ఇస్తానని వాగ్దానం చేసి ఉండొచ్చు.

11ఆ ప్రమాణం గూర్చి ఆమె భర్త విని, ఆమె
మ్రొక్కుబడిని చెల్లింపనిస్తే, ఆమె తన ప్రమాణం
ప్రకారం ఖచ్చితంగా చేసి తీరాలి. ఆమె ప్రమాణం
ప్రకారం సమస్తం చెల్లించాలి. 12కానీ ఆమె భర్త ఆ
ప్రమాణం గూర్చి విని, ఆమె ప్రమాణం నిలుపు కొనేం
దుకు నిరాకరిస్తే, ఆమె తన ప్రమాణం ప్రకారం చేయ
నక్కర్లేదు. ఆమె ఏమి ప్రమాణం చేసినా సరే ఫర్వాలేదు,
ఆమె భర్త ఆ ప్రమాణాన్ని భంగం చేయవచ్చు. ఒకవేళ
ఆమె భర్త ఆ ప్రమాణాన్ని భంగం చేస్తే యెహోవా
ఆమెను క్షమిస్తాడు. 13ఒక వివాహిత స్త్రీ యెహోవాకు
ఏదైనా ఇస్తానని ప్రమాణం చేయవచ్చు, లేక తనకు
ఏదైనా పరిత్యజించు కొంటానని ప్రమాణం చేయ
వచ్చు, లేక మరేదో ప్రత్యేక ప్రమాణాన్ని యెహో
వాకు ఆమె చేసి ఉండొచ్చు. ఆ ప్రమాణాల్లో దేనినైనా
భర్త భంగం చేయవచ్చును, లేదా ఆ ప్రమాణాలలో
దేనినైనా ఆ భర్త ఆమెను నెరవేర్చనీయవచ్చును. 14భర్త
ఏ విధంగా తన భార్యను ఆమె ప్రమాణాలను నెరవేర్చ
నిస్తాడు? అతడు ప్రమాణాలను గూర్చి విని, వాటిని
వారించకపోతే, అప్పుడు ఆ స్త్రీ, ఆమె చేసిన ప్రమాణా
లను నెరవేర్చాలి. 15కానీ భర్త ఆ ప్రమాణాలను గూర్చి
విని, వాటిని వారిస్తే, అప్పుడు ఆమె ప్రమాణాలను
ఉల్లంఘించినందుకు అతడు బాధ్యుడు."
16ఇవి మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞలు. ఒక
పురుషుడు అతని భార్యను గూర్చి, ఒక తండ్రి, ఇంకా
చిన్నదిగా ఉండి తన తండ్రి ఇంటనే ఉంటున్న
కూతురును గూర్చిన ఆజ్ఞలు ఇవి.

### మిద్యానీయులను ఇశ్రాయేలీయులు తిప్పికొట్టడం

31 యెహోవా మోషేతో మాట్లాడాడు. ఆయన
ఇలా చెప్పాడు: 2"మిద్యానీయుల విషయం
తేల్చేందుకు ఇశ్రాయేలీయులకు నేను సహాయం
చేస్తాను. ఆ తర్వాత నీవు మరణిస్తావు."
3కనుక మోషే ప్రజలతో మాట్లాడాడు. అతడు
వారితో ఇలా చెప్పాడు: "మీ మనుష్యుల్లో కొందరిని
సైనికులుగా ఏర్పరచుకోండి. మిద్యానీయుల విషయం
తేల్చేందుకు వారిని యెహోవా వాడుకొంటాడు.
4ఇశ్రాయేలీయుల్లో ఒక్కోదాని నుండి 1,000 మందిని
ఏర్పరచుకోండి. 5ఇశ్రాయేలు వంశాలన్నింటినుండి
మొత్తం 12,000 మంది సైనికులు ఉంటారు."
6ఆ 12,000 మందిని మోషే యుద్ధానికి పంపిం
చాడు. యాజకుడైన ఎలీయాజరు కుమారుడైన
ఫీనెహాసును వారితో అతడు పంపాడు. పవిత్ర వస్తు
వుల్ని, కొమ్ములను, బూరలను ఎలీయాజరు తనతో
తీసుకుని వెళ్లాడు. 7యెహోవా ఆజ్ఞాపించినట్టే ఇశ్రా
యేలు ప్రజలు మిద్యానీయులతో పోరాడారు. మిద్యానీ
మనుష్యులందరిని వారు చంపారు 8వారు చంపిన
వారిలో మిద్యాను రాజులు అయిదుగురు, ఎవీ, రేకెము,
సూరు, హూరు, రేబ ఉన్నారు. బెయోరు కొడుకైన
బిలామునుకూడ వారు ఖడ్గంతో చంపారు.
9ఇశ్రాయేలు ప్రజలు మిద్యానీ స్త్రీలను, పిల్లలను
బందీలుగా పట్టుకొన్నారు. వారి గొర్రెలను, పశువు
లను, ఇతరమైన వాటిని అన్నింటినీ వారు తీసు
కున్నారు. 10అప్పుడు వారి గ్రామాలు, పట్టణాలన్నిం
టినీ వారు కాల్చివేసారు. 11మనుష్యులందరినీ, జంతువు
లన్నింటినీ వారు తీసుకుని 12మోషే, యాజకుడైన
ఎలీయాజరు, ఇశ్రాయేలు ప్రజలందరి దగ్గరకు తీసు
కుని వచ్చారు. వారు తీసుకున్న వాటన్నింటిని ఇశ్రాయే
లీయుల నివాసం దగ్గరకు వారు తీసుకు వెళ్లారు.
మోయాబులోని అరాబోతు కొండల దగ్గర ఇశ్రాయేలీ
యులు నివాసంచేస్తున్నారు. ఇది యెరికో ఎదుట
యొర్దాను నదికి తూర్పున ఉంది. 13అప్పుడు ఆ
సైనికులను ఎదుర్కొనేందుకు మోషే, యాజకుడైన
ఎలీయాజరు, ఇశ్రాయేలు ప్రజలు వారి గుడారంనుండి
బయటకు వెళ్లారు.
14సైన్యాధిపతుల మీద మోషేకి చాల కోపం
వచ్చింది. యుద్ధంనుండి తిరిగి వచ్చిన శతాధిపతుల
మీద, సహస్రాధిపతులమీద అతనికి కోపం వచ్చింది.
15మోషే వారితో అన్నాడు, "ఆ స్త్రీలను మీరెందుకు
బ్రతకనిచ్చారు? 16ఈ స్త్రీలు ఇశ్రాయేలు పురుషులకు
తగరు. యెహోవానుండి ప్రజలు తిరిగి పోతారు.
అది బిలాము కాలంలాగే ఉంటుంది. బయలు పెయోరు
దగ్గర జరిగినట్టే జరుగుతుంది. ఆ రోగం యెహోవా
ప్రజలకు మళ్లీ వస్తుంది. 17ఇప్పుడు మిద్యానీ బాలురను
అందరినీ చంపివేయండి. పురుషునితో కాపురం చేసిన
ప్రతి మిద్యానీ స్త్రీని చంపివేయండి. పురుష సంయోగం
ఎరిగిన మిద్యానీ స్త్రీలలో ప్రతి ఒక్కరినీ చంపేయండి.
18ఏ పురుషునితోనూ ఎన్నడూ లైంగిక సంబంధం
లేని స్త్రీలను మీరు బ్రతకనివ్వవచ్చును. 19తర్వాత,
ఇతరులను చంపిన మీరందరూ ఏడు రోజులు నివాసా
నికి వెలుపల ఉండాలి. మీరు ఒక మృత దేహాన్ని
ముట్టినాసరే నివాసానికి వెలుపలే ఉండాలి. మూడో
రోజున మీరు, మీ బందీలు మిమ్మల్ని మీరు పవిత్రం
చేసుకోవాలి. 20ఏడో రోజున మళ్లీ మీరు అలాగే
చేయాలి. మీ బట్టలు అన్నీ మీరు ఉదుక్కోవాలి.
తోలు, ఉన్ని, కట్టెతో చేయబడిన వాటిని అన్నింటినీ
మీరు కడగాలి. మీరు తప్పక పవిత్రం కావాలి."
21అప్పుడు యాజకుడైన ఎలీయాజరు సైని
కులతో మాట్లాడాడు. అతడు ఇలా చెప్పాడు: "అవి
మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞలు. యుద్ధంనుండి
తిరిగి వచ్చే సైనికులకోసం ఈ ఆజ్ఞలు. 22-23అయితే
అగ్నిలో వేయాల్సిన వాటి విషయంలో ఆజ్ఞలు వేరుగా
ఉన్నాయి. బంగారం, వెండి, ఇత్తడి, ఇనుము, రేకు,
సీసం, మీరు అగ్నిలో వేయాలి. తర్వాత వాటిని నీళ్లతో
కడగండి, అవి పవిత్రం అవుతాయి. అగ్నిలో వేయ

జాలని వస్తువులైతే వాటిని కూడ నీళ్లతో మీరు కడగాలి.
[24]ఏడో రోజున తప్పక మీరు మీ వస్త్రాలను ఉదు
క్కోవాలి. అప్పుడు మీరు పవిత్రం అవుతారు. ఆ
తర్వాత మీరు నివాసంలోకి రావచ్చును.”

[25]అప్పుడు యెహోవా మోషేతో ఇలా చెప్పాడు:
[26]“సైనికులు యుద్ధంలో పట్టుకొన్న బందీలను,
జంతువులను, సామగ్రి అంతటినీ, నీవూ, యాజకు
డైన ఎలీయాజరూ, నాయకులందరూ లెక్కపెట్టాలి.
[27]తర్వాత వాటిని యుద్ధానికి వెళ్లిన సైనికులు, మిగిలిన
ఇశ్రాయేలు ప్రజల మధ్య పంచుకోవాలి. [28]యుద్ధానికి
వెళ్లిన సైనికుల దగ్గర ఆ సామగ్రిలో కొంత భాగం
తీసుకో. ఆ భాగం యెహోవాకు చెందుతుంది. ప్రతి
500 వస్తువుల్లో ఒక వస్తువు యెహోవా భాగం.
ప్రజలు, పశువులు, గాడిదలు, గొర్రెలు అన్నింటిలోను
ఇలాగే. [29]యుద్ధంలో సైనికులు తెచ్చిన వాటిలోని
వారి సగభాగంనుండి వాటిని తీసుకో. అప్పుడు వాటిని
యాజకుడైన ఎలీయాజరుకు ఇవ్వవలెను. ఆ భాగం
యెహోవాకు చెందుతుంది. [30]ఆ తర్వాత ప్రజల
సగభాగంలో ప్రతి 50 వస్తువుల్లోనుంచి ఒక వస్తువు
తీసుకో. ప్రజలు, పశువులు, గాడిదలు, గొర్రెలు, ఇంకా
ఏ జంతువు విషయంలో అయినా ఇలాగే. ఆ భాగం
లేవీయులకు ఇవ్వవలెను. (ఎందుచేతనంటే
యెహోవా పవిత్ర గుడారపు బాధ్యతను లేవీయులు
తీసుకొన్నారు గనుక.)” [31]కనుక మోషేకు యెహోవా
ఆజ్ఞాపించిన ప్రకారం మోషే, ఎలీయాజరు చేసారు.
[32]సైనికులు 6,75,000 గొర్రెలను, [33]72,000 పశు
వులను [34]61,000 గాడిదలను, [35]32,000 మంది స్త్రీలను
తీసుకున్నారు. (వారు ఏ పురుషునితోనూ లైంగిక
సంబంధం లేని వారు మాత్రమే.)

[36]యుద్ధానికి వెళ్లిన సైనికులకు 3,37,500 గొర్రెలు
వచ్చాయి. [37]675 గొర్రెలనువారు యెహోవాకు
ఇచ్చారు. [38]సైనికులకు 36,000 పశువులు వచ్చాయి.
72 పశువులను వారు యెహోవాకు ఇచ్చారు. [39]సైని
కులకు 30,500 గాడిదలు వచ్చాయి. 61 గాడిదలను
వారు యెహోవాకు ఇచ్చారు. [40]సైనికుల వంతు
16,000 మంది స్త్రీలు. 32 మంది స్త్రీలను వారు యెహో
వాకు ఇచ్చారు. [41]యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారం
ఆ కానుకలన్నింటిని యెహోవా కోసం యాజకుడైన
ఎలీయాజరుకు మోషే ఇచ్చాడు.

[42]అప్పుడు మోషే ప్రజల అర్థ భాగాన్ని లెక్కిం
చాడు. యుద్ధానికి వెళ్లిన సైనికుల దగ్గర మోషే తీసు
కున్న ప్రజల భాగం ఇది. [43]3,37, 500 గొర్రెలు
[44]36,000 పశువులు, [45]30,500 గాడిదలు [46]16,000
మంది స్త్రీలు ప్రజల వంతు. [47]ప్రతి 50 లోంచి ఒకటి
యెహోవాకోసం మోషే తీసుకున్నాడు. జంతువులు,
మనుష్యుల్లో కూడ ఇలాగే. అప్పుడు అతడు వాటిని
లేవీయులకు ఇచ్చాడు. ఎందుచేతనంటే వారు
యెహోవా పవిత్ర గుడారం విషయమై బాధ్యత వహిం
చారు గనుక. యెహోవా ఆజ్ఞ ప్రకారం మోషే ఇలా
చేసాడు.

[48]అప్పుడు సైన్యాధికారులు మోషే దగ్గరకు
వచ్చారు (1000 మంది మీద అధికారులు, 100 మంది
మీద అధికారులు.) [49]వారు మోషేతో చెప్పారు, “నీ
సేవకులమైన మేము మా సైనికులను లెక్కించాము.
వారిలో ఎవరినీ మేము విడిచిపెట్టలేదు. [50]కనుక ప్రతి
సైనికుని దగ్గర్నుండీ యెహోవా కానుకను మేము
తెస్తున్నాము. బంగారంతో చేయబడిన దండపతకాలు,
కడియాలు, ఉంగరాలు, చెవిపోగులు, గొలుసులు
మేము తెస్తున్నాము. మా పాపాలను కప్పేందుకు ఇది
యెహోవాకు కానుక.”

[51]కనుక బంగారంతో చేయబడిన ఆ వస్తువుల
న్నిటినీ మోషే తీసుకొని యాజకుడైన ఎలీయాజ
రుకు ఇచ్చాడు. [52]1000 మందిపైనున్న నాయకులు,
100 మందిపైనున్న నాయకులు యెహోవాకు
ఇచ్చిన మొత్తం బంగారం బరువు 420 పౌన్లు. [53]సైని
కులు యుద్ధంలో తీసుకొన్న మిగిలిన వస్తువులను
వారు ఉంచుకొన్నారు. [54]1000 మందిపైనున్న, 100
మందిపైనున్న అధికారుల దగ్గర బంగారాన్ని మోషే,
యాజకుడైన ఎలీయాజరూ తీసుకున్నారు. తర్వాత
ఆ బంగారాన్ని సన్నిధి గుడారంలో వారు ఉంచారు.
ఇశ్రాయేలు ప్రజలకు యెహోవా ఎదుట ఈ కానుక
ఒక జ్ఞాపక చిహ్నం.

### యొర్దాను నది తూర్పున ఇశ్రాయేలు వంశాలు

32 రూబేను, గాదు వంశాలకు చాల విస్తారంగా
పశువులు ఉన్నాయి. యాజెరు, గిలాదు ప్రదే
శాన్ని ఆ ప్రజలు చూశారు. ఈ ప్రదేశం వారి పశువులకు
బాగున్నట్టు వారికి కనబడింది. [2]కనుక రూబేను, గాదు
వంశాల వారు మోషే దగ్గరకు వచ్చారు. మోషేతో,
యాజకుడైన ఎలీయాజరుతో, ప్రజా నాయకులతో
వారు మాట్లాడారు. [3-4]వారు ఇలా చెప్పారు: “మీ సేవ
కులమైన మాకు చాల విస్తారంగా పశువులు ఉన్నాయి.
మేము ఏ దేశంతో పోరాడామో అది పశువులకు మంచి
ప్రదేశం. (అతారోతు, దీబోను, యాజెరు, నిమ్రా,
హెష్బోను, ఎలాలే, షెబాం, నెబో, బెయోను ఈ
ప్రాంతంలో ఉన్నాయి.) [5]మీకు ఇష్టమైతే ఈ
ప్రాంతాన్ని మాకు ఇవ్వవలెనని మేము కోరుతు
న్నాము. యొర్దాను నది ఆవలి వైపునకు మమ్మల్ని
తీసుకొని వెళ్లొద్దు.”

[6]రూబేను, గాదు వంశాల ప్రజలతో మోషే
అన్నాడు: “మీరు మీ సోదరులను యుద్ధానికి వెళ్లనిచ్చి,
మీరేమో ఇక్కడ స్థిరపడతారా? [7]ఇశ్రాయేలు ప్రజలను
మీరెందుకు అధైర్యపరుస్తున్నారు? నది దాటకుండా,
యెహోవా వారికి ఇచ్చిన దేశాన్ని స్వాధీనం చేసు

కోకుండా చేస్తారు మీరు. [8]మీ తండ్రులు నాకు అలాగే చేసారు. కాదేషు బర్నేయ దగ్గర దేశాన్ని పరిశీలించి రావటానికి గూఢచారులను నేను పంపించాను. 9వారు ఎష్కోలు లోయవరకు వెళ్లారు. వారు ఆ దేశాన్ని చూశారు. వారే ఇశ్రాయేలు ప్రజలను అధైర్యపర్చారు. యెహోవా ఇచ్చిన దేశంలోనికి ఇశ్రాయేలు ప్రజలను వెళ్ల నీయకుండా వారే అడ్డు చేసారు. [10]ప్రజల మీద యెహోవాకు చాలా కోపం వచ్చింది. యెహోవా ఇలా ప్రమాణం చేసాడు: [11]'ఈజిప్టు నుండి వచ్చిన వారిలో 20 సంవత్సరాలుగాని అంతకంటె ఎక్కువ వయసుగాని ఉన్నవారెవరూ ఈ దేశాన్ని చూడలేరు. అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు నేను ప్రమాణం చేసాను. ఈ దేశాన్ని ఈ మనుష్యులకు ఇస్తానని నేను వాగ్దానం చేసాను. కానీ వీరు నన్ను వాస్తవంగా అనుసరించలేదు. కనుక వీరికి ఈ దేశం దక్కదు. [12]కెనెజీ వాడగు యెఫున్నె కుమారుడైన కాలేబు, నూను కుమారుడైన యెహోషువ మాత్రమే వాస్తవంగా యెహోవాను వెంబడించారు!'

[13]"ఇశ్రాయేలు ప్రజల మీద యెహోవాకు చాల కోపం వచ్చింది. అందుచేతనే ప్రజలను 40 సంవత్సరాల పాటు అరణ్యంలోనే యెహోవా వుండనిచ్చాడు. యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేసిన ప్రజలందరూ చనిపోయేంతవరకు వారిని యెహోవా అక్కడనే ఉండనిచ్చాడు. [14]ఇప్పుడు మీరు మీ తండ్రులు చేసిన పాపమే మళ్లీ చేస్తున్నారు. పాపాత్ములైన ప్రజలారా, యెహోవా ఆయన ప్రజల మీద మరింత ఎక్కువగా కోపగించాలని మీరు కోరుతున్నారా? [15]మీరు యెహోవాను వెంబడించటం మానివేస్తే, ఇశ్రాయేలీయులు ఇంకా ఎక్కువ కాలం అరణ్యంలో ఉండేటట్టు యెహోవా చేస్తాడు. అప్పుడు మీరు ప్రజలందరినీ నాశనం చేస్తారు!"

[16]కానీ రూబేను, మరియు గాదు వంశాల ప్రజలు మోషే దగ్గరకు వెళ్లారు. వారు మోషేకు ఈ విధంగా చెప్పారు: "ఇక్కడ మేము మా పిల్లలకు పట్టణాలు కట్టుకుంటాము. మరియు మేము ఇక్కడ మందలకు కావలసిని దొడ్లు కట్టుకుంటాము. [17]ఇశ్రాయేలీయులను వారివారి స్థలాలకు చేర్చువరకు మేము వారి ముందర యుద్ధానికి సిద్ధపడి సాగిపోతాము. అయితే మా పిల్లలు ఈ దేశనివాసుల భయంచేత ప్రాకారంగల పట్టణాలలో సురక్షితంగా నివాసము వుండనియ్యండి. [18]ఇశ్రాయేలీయులలో ప్రతివాడును తన తన స్వాస్థ్యమును పొందువరకు మా ఇండ్లకు తిరిగిరాము. [19]యొర్దాను నదికి పశ్చిమ దిక్కునవున్న ఏ భూమినీ మేము తీసుకోము. యొర్దాను నదికి పూర్వ దిక్కున వున్న భూమే మాకు రావలసిన వారసత్వం."

[20]కనుక మోషే వారితో ఇలా చెప్పాడు: "మీరు వీటన్నింటినీ జరిగిస్తే, అప్పుడు ఈ దేశం మీది అవుతుంది. కానీ మీ సైనికులు మాత్రం యెహోవాకు ముందు యుద్ధానికి వెళ్లాలి. [21]మీ సైనికులు యొర్దాను నది దాటి, శత్రువు ఈ దేశాన్ని వదలి వెళ్లేటట్టు చేయాలి. [22]ఈ దేశాన్ని వశం చేసుకునేందుకు యెహోవా మనందరికీ సహాయం చేసిన తర్వాత, మీరు తిరిగి ఇంటికి వెళ్లవచ్చును. అప్పుడు యెహోవా గాని, ఇశ్రాయేలీయులు గాని మిమ్మల్ని దోషులుగా ఎంచరు. అప్పుడు యెహోవా మిమ్మల్ని ఈ దేశాన్ని తీసుకోనిస్తాడు. [23]కానీ మీరు ఇలా చేయకపోతే, మీరు యెహోవా దృష్టిలో పాపం చేసినట్టే. మరియు మీ పాపం కోసం మీరు శిక్ష పొందుతారని గట్టిగా తెలుసుకోండి. [24]మీ పిల్లల కోసం పట్టణాలు, మీ జంతువుల కోసం కొట్టాలు కట్టుకోండి. అయితే, మీరు మీ ప్రమాణం ప్రకారం తప్పక చేయాలి."

[25]అప్పుడు గాదు, రూబేను వంశాల నాయకులు మోషేతో ఇలా చెప్పారు: "మేము నీ సేవకులం, నీవు మా యజమానివి. కనుక నీవు ఏమి చెబితే అది మేము చేస్తాము. [26]మాభార్యలు, పిల్లలు, మా పశువులు గిలాదు పట్టణాల్లోనే ఉంటారు. [27]కానీ, నీ సేవకులమైన మేము మాత్రం యొర్దాను నది దాటతాము అయితే మా యజమాని చెప్పినట్టు మేము యెహోవా ముందర యుద్ధానికి ముందడుగువేస్తాం."

[28]కనుక ఇశ్రాయేలీయులు చేసిన ఈ ప్రమాణాన్ని మోషే, యాజకుడైన ఎలీయాజరు, నూను కుమారుడు యెహోషువ, ఇశ్రాయేలు వంశాల నాయకులు అందరూ విన్నారు. [29]మోషే వారితో చెప్పాడు: "గాదు, రూబేను ప్రజలు యొర్దాను నది దాటుతారు. వారు యెహోవాముందు యుద్ధానికి నడుస్తారు. మీరు దేశాన్ని వశం చేసుకునేందుకు వారు సహాయం చేస్తారు. దేశంలో వారి భాగంగా గిలాదు ప్రాంతాన్ని మీరు వారికి ఇవ్వవలెను. [30]కనాను దేశాన్ని స్వాధీనం చేసుకునేందుకు మీకు సహాయం చేస్తామని వారు ప్రమాణం చేస్తున్నారు."

[31]గాదు, రూబేను ప్రజలు జవాబిచ్చారు: "యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారం మేము చేస్తామని ప్రమాణం చేస్తున్నాము. [32]మేము యొర్దాను నది దాటి, యెహోవా ముందు కనాను దేశంలోకి నడుస్తాము. అయితే ఈ దేశంలో మా భాగం మాత్రం యొర్దాను నది తూర్పు ప్రదేశం."

[33]కనుక గాదు ప్రజలకు, రూబేను ప్రజలకు, మనష్షే వంశంలో సగంమంది ప్రజలకు ఆ ప్రదేశాన్ని మోషే ఇచ్చాడు. (మనష్షే యోసేపు కుమారుడు.) అమోరీ వాడగు సీహోను రాజ్యం, బాషాను రాజైన ఓగు రాజ్యం ఆ ప్రదేశంలో ఉన్నాయి. ఆ ప్రాంతం చుట్టూ ఉన్న పట్టణాలన్నీ ఆ ప్రదేశంలో ఉన్నాయి. [34]గాదు ప్రజలు దీబోను, అతారోతు, అరోయేరు, [35]అత్రోతు, షోపను, యాజెరు, యోగ్బహ, [36]బేత్నిమ్రా, బేత్హారాను

పట్టణాలు కట్టారు. బలమైన గోడలు గల పట్టణాలను,
వారి జంతువులకు కొట్టాలను వారు నిర్మించారు.
37రూబేను ప్రజలు హెష్బోను, ఏలాలే, కిర్యా
తాయిము 38నెబో, బయల్మెయోను, షిబ్మా పట్టణా
లను నిర్మించారు. వారు మరల కట్టిన పట్టణాలకు
పాత పేర్లనే ఉపయోగించారు. అయితే నెబో, బయల్మె
యోను పేర్లను వారు మార్చివేసారు.
39మాకీరు వంశం నుండి ప్రజలు గిలాదుకు వెళ్లారు.
(మాకీరు మనష్షే కుమారుడు.) వారు ఆ పట్టణాన్ని
ఓడించారు. అక్కడ నివసించిన అమోరీయులను వారు
ఓడించారు. 40కనుక మనష్షే వంశంలోని మాకీరుకు
గిలాదును మోషే ఇచ్చాడు, కనుక అతని కుటుంబం
అక్కడ స్థిరపడింది. 41మనష్షే వాడైన యాయీరు
అక్కడి చిన్న పట్టణాలను ఓడించాడు. అప్పుడు
వాటిని యాయీరు పల్లెలు అని అతడు పిల్చాడు.
42నాతును, దాని సమీపంలోని చిన్న పట్టణాలను
నోబహు ఓడించాడు. తర్వాత ఆ స్థలానికి అతడు
తన స్వంత పేరు పెట్టాడు.

### ఇశ్రాయేలీయులు ఈజిప్టునుండి వెళ్లిపోవుట

33 మోషే, అహరోనులు ఇశ్రాయేలు ప్రజలను
వంశాలవారీగా ఈజిప్టునుండి బయటకు నడి
పించారు. వారు ప్రయాణం చేసిన స్థలాలు ఇవి. 2ఆ
ప్రయాణాలను గూర్చి మోషే ఇలా వ్రాశాడు.
యెహోవా కోరిన విషయాలను మోషే వ్రాశాడు. ఆ
ప్రదేశాలు ఇవి:
3మొదటి నెల 15వ తేదీన వారు రామెసేసు నుండి
బయల్దేరారు. పస్కా మరునాటి ఉదయం ఇశ్రాయేలు
ప్రజలు జయనినాదాలు చేస్తూ ఈజిప్టునుండి బయ
టకు వచ్చారు. ఈజిప్టు ప్రజలంతా వారిని చూశారు.
4యెహోవా చంపిన తమ వారందరిని ఈజిప్టువారు
సమాధి చేస్తూ ఉన్నారు. తమ పెద్ద కుమారులందరినీ
వారు పాతిపెడ్తూ ఉన్నారు. ఈజిప్టు దేవతల మీద
యెహోవా తన తీర్పు తీర్చాడు.
5ఇశ్రాయేలు ప్రజలు రామెసేసును విడిచి సుక్కో
తుకు ప్రయాణం చేసారు. 6సుక్కోతు నుండి వారు
ఏతాముకు ప్రయాణం చేసారు. అక్కడ అరణ్య శివా
ర్లలో ప్రజలు నివాసం చేసారు. 7వారు ఏతాము విడిచి
పీహహీరోతు వెళ్లారు. ఇది బయల్సెఫోను దగ్గర ఉంది.
మిగ్దోలు దగ్గర ప్రజలు నివాసం చేసారు. 8ప్రజలు
పీహహీరోతు విడిచి, సముద్రం మధ్య నుంచి నడిచారు.
వారు అరణ్యంవైపు వెళ్లారు. అప్పుడు వారు ఏతాము
అరణ్యంలో మూడు రోజులు ప్రయాణం చేసారు.
మారా దగ్గర ప్రజలు నివాసం చేసారు.
9ప్రజలు మారాను విడిచి ఏలీము వెళ్లి అక్కడ
నివాసం చేసారు. అక్కడ 12 నీటి ఊటలు, 70 ఈత
చెట్లు ఉన్నాయి. 10ప్రజలు ఏలీము విడిచిపోయి ఎర్ర
సముద్రం దగ్గర నివాసం చేసారు. 11ప్రజలు ఎర్ర
సముద్రం విడిచిపోయి సీను అరణ్యంలో నివాసం
చేసారు.
12ప్రజలు సీను అరణ్యం విడిచి వెళ్లి దోపకాలో
నివాసం చేసారు.
13ప్రజలు దోపకా విడిచి వెళ్లి ఆలూషులో నివాసం
చేసారు.
14ప్రజలు ఆలూషు విడిచి వెళ్లి, రెఫీదీములో
నివాసం చేసారు. ఆ స్థలంలోనే ప్రజలు తాగేందుకు
నీరు దొరకలేదు.
15ప్రజలు రెఫీదీము విడిచివెళ్లి, సీనాయి అర
ణ్యంలో నివాసం చేసారు.
16ప్రజలు సీనాయి అరణ్యం విడిచివెళ్లి, కిబ్రోతు
హత్తావాలో నివాసం చేసారు.
17ప్రజలు కిబ్రోతుహత్తావా విడిచివెళ్లి హజేరో
తులో నివాసం చేసారు.
18ప్రజలు హేజేరోతు విడిచివెళ్లి, రిత్మాలో నివాసం
చేసారు.
19ప్రజలు రిత్మా విడిచివెళ్లి రిమ్మోను పారెసులో
నివాసం చేసారు.
20ప్రజలు రిమ్మోను పారెసు విడిచివెళ్లి, లిబ్నాలో
నివాసం చేసారు.
21ప్రజలు లిబ్నా విడిచివెళ్లి రీసాలో నివాసం చేసారు.
22ప్రజలు రీసా విడిచి వెళ్లి కెహెలాతాలో నివాసం
చేసారు.
23ప్రజలు కెహేలాతా విడిచివెళ్లి షాపెరు కొండ
దగ్గర నివాసం చేసారు.
24ప్రజలు షాపెరు కొండ విడిచివెళ్లి హరాదాలో
నివాసం చేసారు.
25ప్రజలు హరాదా విడిచివెళ్లి మకెలోతులో నివాసం
చేసారు.
26ప్రజలు మకెలోతు విడిచివెళ్లి తాహతులో నివాసం
చేసారు.
27ప్రజలు తాహతు విడిచివెళ్లి తారహులో నివాసం
చేసారు.
28ప్రజలు తారహు విడిచివెళ్లి మిత్కాలో నివాసం
చేసారు.
29ప్రజలు మిత్కా విడిచివెళ్లి హష్మోనాలో నివాసం
చేసారు.
30ప్రజలు హష్మోనా విడిచివెళ్లి మొసెరోతులో
నివాసం చేసారు.
31ప్రజలు మొసేరోతు విడిచివెళ్లి బెనే యాకానులో
నివాసం చేసారు.
32ప్రజలు బెనేయాకాను విడిచివెళ్లి హోరు హగ్గిద్గా
దులో నివాసం చేసారు.
33ప్రజలు హోరు హగ్గిద్గాదు విడిచివెళ్లి యొత్బా
తాలో నివాసం చేసారు.

34ప్రజలు యొత్బాతా విడిచివెళ్లి ఎబ్రొనాలో
నివాసం చేసారు.
35ప్రజలు ఎబ్రోనా విడిచివెళ్లి ఎసోన్గెబెరులో
నివాసం చేసారు.
36ప్రజలు ఎసోన్గెబెరులో విడిచివెళ్లి సీను అరణ్యం
లోని కాదేషులో నివాసం చేసారు.
37ప్రజలు కాదేషు విడిచి వెళ్లి హోరులో నివాసం
చేసారు. ఇది ఎదోము సరిహద్దు దగ్గర కొండ. 38యాజ
కుడు అహరోను యెహోవా మాటకు విధేయుడై
హోరు కొండ మీదికి వెళ్లాడు. ఆ స్థలంలోనే అహరోను
మరణించాడు. ఐదో నెల మొదటి రోజున అహరోను
చనిపోయాడు. అది ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు విడి
చిన 40 వ సంవత్సరం. 39అహరోను హోరు కొండ
మీద చనిపోయినప్పుడు అతని వయస్సు 123 సంవత్స
రాలు. కనాను దేశంలోని నెగెవు ప్రాంతంలో అరాదు
ఒక పట్టణం.
40ఇశ్రాయేలు ప్రజలు వస్తున్నారని అక్కడ వున్న
కనానీ రాజు విన్నాడు. 41ప్రజలు హోరు కొండ
విడిచి సల్మోనాలో నివాసం చేసారు.
42ప్రజలు సల్మోనా విడిచివెళ్లి పూనోనులో నివాసం
చేసారు.
43ప్రజలు పూనోను విడిచివెళ్లి ఓబోతులో నివాసం
చేసారు.
44ప్రజలు ఓబోతు విడిచివెళ్లి ఈయ్యె అబారీములో
నివాసం చేసారు. ఇది మోయాబు దేశ సరిహద్దులో
ఉంది.
45ప్రజలు ఈయ్యె అబారీము విడిచివెళ్లి దీబోను
గాదులో నివాసం చేసారు.
46ప్రజలు దీబోను గాదు విడిచివెళ్లి అల్మోను
దిబ్లాతాయిములో నివాసం చేసారు.
47ప్రజలు అల్మోను దిబ్లాతాయిములో విడిచివెళ్లి
నెబో దగ్గర అబారీము కొండల మీద నివాసం చేసారు.
48ప్రజలు అబారీము కొండలు విడిచి వెళ్లి యొర్దాను
నది దగ్గర అర్బత్ మోయాబులో నివాసం చేసారు.
ఇది యెరికో దగ్గర, యొర్దానుకు సమీపంలో వారు
నివాసం చేసారు. 49బెత్యేషిమోతు నుండి తుమ్మ పొలం
వరకు వారి నివాసం ఆక్రమించుకొంది. ఇది అర్బత్
మోయాబు అనే చోట ఉంది.
50అర్బత్ మోయాబు వద్ద మోషేతో యెహోవా
మాట్లడాడు. ఆయన అన్నాడు: 51"ఇశ్రాయేలు ప్రజ
లతో మాట్లాడు. వారితో ఈ విషయాలు చెప్పు:
మీరు యొర్దాను నది దాటుతారు. కనాను దేశంలోనికి
మీరు వెళతారు. 52అక్కడ మీరు చూసే మనుష్యుల
దగ్గరనుండి దేశాన్ని మీరు స్వాధీనం చేసుకొంటారు.
చెక్కబడిన వారి ప్రతిమలను విగ్రహాలను అన్నింటినీ
మీరు నాశనం చేయాలి. వారి ఉన్నత స్థలాలు అన్నిం
టినీ మీరు నాశనం చేయాలి. 53ఆ దేశాన్ని మీరు
స్వాధీనం చేసుకొని, మీరు అక్కడ స్థిరపడతారు. ఎందు
కనగా ఈ దేశాన్ని నేనే మీకు ఇస్తున్నాను. అది మీ
కుటుంబాలకు చెందుతుంది. 54మీ కుటుంబాలు ప్రతి
ఒక్కదానికి ఆ దేశంలో భాగం ఉంటుంది. దేశంలోని
ఒక్కోభాగం ఏ కుటుంబానికి వస్తుందో తెలుసు కొనేం
దుకు మీరు చీట్లు వేయాలి. పెద్ద కుటుంబాలకు ఆ
దేశంలో పెద్ద భాగం ఇవ్వవలెను. చిన్న కుటుంబాలకు
ఆ దేశంలో చిన్న భాగం ఇవ్వవలెను. చీట్లు చేసిన
నిర్ణయం ప్రకారమే ప్రజలకు భూమి ఇవ్వబడుతుంది.
ప్రతి వంశానికీ తన వంతు భూమి ఇవ్వబడుతుంది.
55"ఆ ఇతర మనుష్యులు దేశాన్ని వదలి పొయేట
ట్టుగా మీరు చేయాలి. ఆ ప్రజలను మీరు దేశంలో
ఉండనిస్తే, వారు మీకు ఎన్నో కష్టాలు కలిగిస్తారు.
వారు మీ కళ్లలో పొడుచుకొనే ముళ్లలా, పక్కలో
ముళ్లుగాను ఉంటారు. మీరు నివసించబోయే దేశానికి
వారు చాల కష్టాలు తెస్తారు. 56నేను ఏమి చేస్తానో
మీకు చూపించాను. ఆ ప్రజలను మీ దేశంలో గనుక
మీరు ఉండనిస్తే దానిని నేను మీకు చేస్తాను."

### కనాను – సరిహద్దులు

34 మోషేతో యెహోవా మాట్లాడాడు. ఆయన
ఇలా అన్నాడు: 2"ఇశ్రాయేలు ప్రజలకు ఈ
ఆజ్ఞ ఇవ్వుము. మీరు కనాను గదేశానికి వస్తున్నారు.
ఈ దేశాన్ని మీరు జయిస్తారు. కనాను దేశం అంతా
మీరు స్వాధీనం చేసుకొంటారు. 3దక్షిణాన ఎదోము
దగ్గర సీను అరణ్యంలో కొంత భాగం మీకు వస్తుంది.
మృత సముద్రపు దక్షిణ కొనలో మీ దక్షిణాది సరిహద్దు
మొదలవుతుంది. 4అక్రబ్బీము దక్షిణాన్ని అది దాటి
పోతుంది. సీను అరణ్యంనుండి కాదేషు, బర్నేయ,
అక్కడ్నుండి హసరద్దారు, మళ్లీ అక్కడ్నుండి అస్మోను
వరకు ఉంటుంది. 5అస్మోను నుండి ఈజిప్టు నది
వరకు పోయి, మధ్యధరా సముద్రం దగ్గర సరిహద్దు
ముగిస్తుంది. 6మీ పశ్చిమ సరిహద్దు మధ్యధరా
సముద్రం. 7మీ ఉత్తర సరిహద్దు మధ్యధరా సముద్రం
దగ్గర ప్రారంభమై, హోరు కొండవరకు ఉంటుంది.
(లెబానోనులో.) 8హోరు కొండనుండి లెబోహమత్
వరకు, అక్కడు నుండి సెదాదు వరకు ఉంటుంది.
9తర్వాత జిప్రోను వరకు వ్యాపించి, హసరేనాన్ దగ్గర
అయిపోతుంది. కనుక అది మీ ఉత్తర సరిహద్దు. 10మీ
తూర్పు సరిహద్దు ఎనాను దగ్గర ప్రారంభమై షెపాము
వరకు వ్యాపిస్తుంది. 11షెపామునుండి సరిహద్దు అయీ
నుకు తూర్పుగా వ్యాపించి రిబ్లావరకు ఉంటుంది.
కిన్నెరెతు సముద్రం (గలలీయ సముద్రం) పక్కగా
కొండల వెంబడి సరిహద్దు సాగిపోతుంది. 12తర్వాత
సరిహద్దు యొర్దాను నదీ తీరం వెంబడి కొనసాగుతుంది.
మృత సముద్రం దగ్గర అది అయిపోతుంది. అవి మీ
దేశం చుట్టూ సరిహద్దులు."

13కనుక ఇశ్రాయేలు ప్రజలకు మోషే ఈ ఆజ్ఞ ఇచ్చాడు: "అది మీకు లభించే దేశం. పది వంశాలు, మనష్షే వంశంలో సగం మంది కలిసి చీట్లు వేసుకొని ఆ దేశాన్ని పంచుకోవాలి. 14రూబేను, గాదు వంశాలు, మనష్షే వంశంలో సగంమంది ముందే వారి భూమిని తీసుకున్నారు. 15ఆ రెండున్నర వంశాల వారు యొర్దాను నదికి తూర్పువైపు యెరికో దగ్గర్లో భూమి తీసుకున్నారు."

16అప్పుడు యెహోవా మోషేతో మాట్లాడాడు. ఆయన ఇలా అన్నాడు: 17"దేశాన్ని భాగాలు చేసేందుకు యాజకుడైన ఎలీయాజరు, నూను కుమారుడు యెహోషువ నీకు సహాయపడతారు. వీరు 18అన్ని వంశాల నాయకులు. ఒక్కో వంశంనుండి ఒక్కో నాయకుడు ఉంటాడు. వారు దేశాన్ని భాగిస్తారు. 19ఆ నాయకుల పేర్లు ఇవి:

యూదా వంశంనుండి – యెఫున్నె కుమారుడు కాలేబు;
20 షిమ్యోను వంశంనుండి – అమ్మీహూదు కుమారుడు షెమూయేలు;
21 బెన్యామీను వంశంనుండి – కిస్లోను కుమారుడు ఎలీదాదు
22 దాను వంశంనుండి – యొగ్లి కుమారుడు బుక్కి
23 మనష్షే (యోసేపు కుమారుడు) వంశంనుండి– ఏఫోదు కుమారుడు హన్నీయేలు
24 ఎఫ్రాయిము (యోసేపు కుమారుడు) వంశంనుండి – షిఫ్తాను కుమారుడు కెమూయేలు
25 జెబూలూను వంశంనుండి – పర్నాకు కుమారుడు ఎలీషాపాను
26 ఇశ్శాఖారు వంశంనుండి – అజ్జాను కుమారుడు పల్తీయేలు
27 ఆషేరు వంశంనుండి – షెలోమి కుమారుడు అహీహూదు
28 నఫ్తాలి వంశంనుండి – అమ్మీహూదు కుమారుడు పెదహేలు."

29ఇశ్రాయేలు ప్రజలకు కనాను దేశాన్ని పంచేందుకు ఆ మనుష్యులను యెహోవా ఏర్పరచుకొన్నాడు.

### లేవీ వారి పట్టణాలు

35 యెహోవా మోషేతో ఇలా మాట్లాడాడు: ఇది మోయాబులో యొర్దాను లోయలో, యొర్దాను నది దగ్గర, యెరికో అవతల జరిగింది. యెహోవా ఇలా చెప్పాడు: 2"ఇశ్రాయేలు ప్రజలు వారి భాగంలోనుంచి కొన్ని పట్టణాలను లేవీ వారికి ఇవ్వవలెనని వారితో చెప్పుము. ఆ పట్టణాలను, వాటి చుట్టూ ఉండే పచ్చిక బయళ్లను ఇశ్రాయేలు ప్రజలు లేవీ వారికి ఇవ్వవలెను. 3లేవీయులు ఆ పట్టణాల్లో నివసించగలుగుతారు. వారి పశువులు, వారికి ఉన్న జంతువులు అన్నీ ఆ పట్టణాల చుట్టూ ఉండే పచ్చిక బయళ్లలో మేత మేయగలుగుతాయి. 4మీ భూమిలో ఎంతభాగం మీరు లేవీయులకు ఇవ్వవలెను. పట్టణాల ప్రాకారాలనుండి 1,500 అడుగుల వరకు భూమి లేవీయులకే చెందుతుంది. 5మరియు పట్టణానికి తూర్పున 3,000 అడుగులు, పట్టణానికి దక్షిణాన 3,000 అడుగులు, పట్టణానికి పశ్చిమాన 3,000 అడుగులు, పట్టణానికి ఉత్తరాన 3,000 అడుగులు మొత్తం లేవీయులకు చెందుతాయి. (ఆ భూమి అంతటికీ మధ్యలో పట్టణం ఉంటుంది, 6ఆ పట్టణాల్లో ఆరు ఆశ్రయపురాలుగా ఉంటాయి. ఒక వ్యక్తి ప్రమాద వశాత్తూ మరొకర్ని చంపేస్తే, అప్పుడు అతడు ఆశ్రయంకోసం ఆ పట్టణాలకు పారిపోవచ్చు. ఈ ఆరు పట్టణాలు గాక, ఇంకా 42 పట్టణాలను మీరు లేవీయులకు ఇవ్వాలి. 7కనుక మీరు మొత్తం 48 పట్టణాలను లేవీయులకు ఇవ్వవలెను. ఆ పట్టణాల చుట్టూ ఉండే భూమిని కూడా మీరు లేవీయులకు ఇవ్వవలెను. 8ఇశ్రాయేలీయులలో పెద్ద కుటుంబాలు ఉన్న వారు ఎక్కువ భూభాగాలు ఇవ్వవలెను. ఇశ్రాయేలు చిన్న కుటుంబాలవారు చిన్న భూభాగాలు ఇవ్వవలెను. అయితే అన్ని వంశాల వారూ దేశంలోని వారి భాగంలోనుంచి కొన్ని పట్టణాలను మాత్రం తప్పక లేవీవారికి ఇవ్వవలెను."

9తర్వాత యెహోవా మోషేతో మాట్లాడాడు. ఆయన ఇలా అన్నాడు: 10"ప్రజలతో ఈ సంగతులు చెప్పుము. మీరు యొర్దాను నది దాటి కనాను దేశంలో ప్రవేశిస్తారు. 11ఆశ్రయ పురాలుగా పట్టణాలను మీరు ఏర్పాటుచేయాలి. ఒక వ్యక్తి ప్రమాదవశాత్తూ మరో వ్యక్తిని చంపేస్తే, అప్పుడు అతడు భద్రత కోసం ఆ పట్టణాల్లో ఒకదానికి పారిపోవచ్చును. 12చనిపోయిన మనిషి కుటుంబంనుండి, దెబ్బకు దెబ్బతీయాలని చూచే వారి బారినుండి అతడు క్షేమంగా ఉంటాడు. అతనికి న్యాయస్థానంలో తీర్పు జరిగేంతవరకు అతడు క్షేమంగా ఉంటాడు. 13ఆశ్రయపురాలు ఆరు ఉంటాయి. 14ఆ పట్టణాల్లో మూడు యొర్దాను నదికి తూర్పు వైపున ఉంటాయి. ఆ పట్టణాల్లో మూడు యొర్దాను నదికి పశ్చిమాన కనాను దేశంలో ఉంటాయి. 15ఇశ్రాయేలు పౌరులకు, విదేశీయులకు, యాత్రికులకు ఆ పట్టణాలు క్షేమమైన స్థలాలుగా ఉంటాయి. వారిలో ఎవరైనా సరే మరొకర్ని ప్రమాదవశాత్తూ చంపేస్తే వారు ఆ పట్టణాల్లో ఒక దానికి పారిపోగలుగుతారు.

16"ఒక వ్యక్తి ఇంకో వ్యక్తిని ఇనుప ఆయుధంతో చంపితే, అప్పుడు చంపినవాడూ చావాల్సిందే. 17ఒక వ్యక్తి బండతో ఇంకో మనిషిని చంపితే, అతడు కూడ

చావాల్సిందే. (ఆ బండ సాధారణంగా మనుష్యులను
చంపేందుకు ప్రయోగించేది) 18ఒక వ్యక్తి కర్రను
ప్రయోగించి మరొకడ్ని చంపితే, అతడు కూడ చావా
ల్సిందే. (ఆ కర్ర సాధారణంగా మనుష్యులను చంపేం
దుకు ప్రయోగించే ఆయుధం) 19చనిపోయిన వాని
కుటుంబ సభ్యుల్లో ఒకరు హంతకుణ్ణి తరిమి చంప
వచ్చును.
20-21“ఒక వ్యక్తి మరో వ్యక్తిని చేతితో కొట్టి చంప
వచ్చు. లేదా ఒక వ్యక్తి మరొకరిని తోసేసి చంపవచ్చు.
లేక ఒక వ్యక్తి మరో వ్యక్తిమీద ఏదైనా విసరడం ద్వారా
వానిని చంపవచ్చును. ఆ హంతకుడు ద్వేషంతో అలా
చేస్తే అతడు హంతకుడు. ఆ మనిషిని చంపివేయాలి.
చనిపోయిన వాని కుటుంబ సభ్యుల్లో ఎవరైనా అతనిని
తరిమి చంపవచ్చును.
22“కానీ ఒక వ్యక్తి మరొకర్ని ప్రమాదవశాత్తూ చంప
వచ్చును. అతడు తాను చంపిన వాడిని ద్వేషించ
లేదు. అది కేవలం ప్రమాదవశాత్తూ జరిగింది. లేక ఒక
వ్యక్తి మరొకరి మీద ఏదో విసిరినప్పుడు అవతల
మనిషి చావవచ్చు- చంపాలని అతడు అలా చేయలేదు.
23లేక ఒక వ్యక్తి ఒక బండను విసిరివేయవచ్చును.
అతడు చూడని మరో వ్యక్తిమీద ఆ బండపడి, అతనిని
చంపవచ్చు. అతడు ఎవరినీ చంపాలని పథకం వేయ
లేదు. తాను చంపినవాడిని అతడు ద్వేషించలేదు-
అది కేవలం ప్రమాదవశాత్తూ జరిగింది. 24అలా జరిగితే
ఏమి చేయాలనేదీ సమాజం నిర్ణయం చేయాలి. 25చని
పోయిన వాని కుటుంబంలో వారు ఎవరైనా తిరిగి
అతడిని చంపవచ్చేమో సమాజపు న్యాయస్థానం నిర్ణ
యించాలి. న్యాయస్థానం హంతుకుడిని బతుకనివ్వా
లని ఒకవేళ నిర్ణయిస్తే, అప్పుడు ఈ వ్యక్తి తన ‘ఆశ్రయ
పురానికి’ వెళ్లాలి. పవిత్ర తైలంతో అభిషేకించబడిన
ప్రధాన యాజకుడు మరణించేంత వరకు అతడు
అక్కడే ఉండాలి.
26-27“ఆ మనిషి తన ‘ఆశ్రయ పురం’ హద్దులు
దాటి ఎన్నడూ బయటికి వెళ్లకూడదు. అతడు ఆ
హద్దులు దాటి బయటికి వెళ్తే, చనిపోయినవాని
కుటుంబ సభ్యుల్లో ఒకరు అతన్ని పట్టుకొని చంపివేస్తే,
అప్పుడు, ఆ సభ్యుని మీద హత్యా నేరం ఉండదు.
28ప్రమాదవశాత్తూ చంపిన వ్యక్తి, ప్రధాన యాజకుడు
మరణించేంతవరకు తన ‘ఆశ్రయ పురం’లోనే ఉండాలి.
ప్రధాన యాజకుడు మరణించాక, అతడు తిరిగి తన
చోటికి వెళ్లవచ్చును. 29మీ ప్రజల పట్టణాలన్నింటి
లోనూ ఆ నియమాలు శాశ్వత చట్టంగా ఉంటాయి.
30“సాక్ష్యాలు ఉన్నప్పుడు మాత్రమే హంతకుడు
హంతకునిగా చంపబడాలి. ఒకే ఒక్క సాక్షి ఉంటే ఏ
వ్యక్తినీ చంపకూడదు. 31“ఒక్క వ్యక్తి హంతకుడైతే,
అతడ్ని చంపి వేయాలి. డబ్బు తీసుకుని ఈ శిక్షను
మార్చవద్దు. ఆ హంతకుడు తప్పక చంపబడాలి.
32“ఒక వ్యక్తి మరొకర్ని చంపి, ఆశ్రయ పురాలలో
ఒక దానికి పారిపోతే, వాడిని ఇంటికి పోనిచ్చేందుకు
డబ్బు తీసుకోవద్దు. ప్రధాన యాజకుడు మరణించేంత
వరకు అతడు ఆ పట్టణంలోనే ఉండాలి.
33“నిరపరాధుల రక్తంతో మీ దేశాన్ని నాశనం కాని
వ్వవద్దు. ఒక వ్యక్తి మరో వ్యక్తిని హత్య చేస్తే, ఆ నేరా
నికి ఒకే శిక్ష. అది ఆ హంతకుడు చంపబడటమే. ఆ
నేరంనుండి దేశాన్ని మరే శిక్షకూడ విమోచించదు.
34నేనే యెహోవాను. నేను మీ దేశంలో ఇశ్రాయేలు
ప్రజలతో నివసిస్తాను. ఆ దేశంలో నేను నివసిస్తాను
గనుక నిర్దోషుల రక్తంతో దానిని పాడు చేయవద్దు.”

## సెలోపెహాదు కుమార్తెల భూమి

36 యోసేపు కుమారుడు మనష్షే. మనష్షే కుమా
రుడు మాకీరు. మాకీరు కుమారుడు గిలాదు.
గిలాదు వంశపు నాయకులు మోషేతో, ఇశ్రాయేలు
వంశాల నాయకులతో మాట్లాడటానికి వెళ్లారు. 2వారు
ఇలా అన్నారు: “అయ్యా, చీట్లు వేసి భూమిని తీసు
కోమని యెహోవా మనకు ఆజ్ఞాపించాడు. మరియు
అయ్యా, సెలోపెహదు భూమిని అతని కుమార్తెలకు
ఇవ్వవలెనని యెహోవా ఆజ్ఞాపించాడు. సెలోపెహదు
మా సోదరుడు. 3ఒకవేళ మరేదైనా ఇశ్రాయేలు వంశం
లోనుండి మరెవరైనా సెలోపెహదు కుమార్తెల్లో
ఒకరిని వివాహము చేసుకోవచ్చు. ఆ భూమి మా
కుటుంబం నుండి పోతుందా? ఆ మరో వంశంవారు
ఆ భూమిని తీసు కుంటారా? చీట్లు వేయడం ద్వారా
మాకు లభించిన ఆ భూమిని మేము పోగొట్టు
కుంటామా? 4ప్రజలు వారి భూమిని అమ్మివేయవచ్చు.
అయితే బూరధ్వని చేసే మహోత్సవ కాలంలో భూమి
అంతా దాని అసలైన సొంతదారులకు తిరిగి ఇవ్వబడు
తుంది. ఆ సమయంలో, సెలోపెహదు కుమార్తెలకు
చెందిన భూమి ఎవరికి లభిస్తుంది? అలా గనుక జరిగితే
మా కుటుంబం శాశ్వతంగా ఆ భూమిని పోగొట్టు
కుంటుంది కదా?”
5మోషే ఇశ్రాయేలీయులకు ఈ ఆజ్ఞ ఇచ్చాడు.
ఈ ఆజ్ఞ యెహోవానుండి వచ్చింది. “యోసేపు
వంశపు మనుష్యులు సరిగ్గా చెప్పారు. 6ఇది సెలో
పెహదు కుమార్తెలకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞ. మీరు
ఎవరినైనా వివాహమాడాలనుకుంటే మీ స్వంత
వంశంలో వారినే వివాహము చేసుకోవాలి.
7ఈ విధంగా ఇశ్రాయేలు ప్రజల్లో భూమి ఒక
వంశంనుండి మరో వంశానికి మారిపోదు.
ఇశ్రాయేలీయులు ప్రతి ఒక్కరూ వారి పూర్వీకు
లకు చెందిన భూమిని కాపాడాలి. 8ఒకవేళ ఎవరైనా
స్త్రీకి తన తండ్రి భూమి సంక్రమిస్తే, ఆమె తన స్వంత
వంశం వారినే ఎవరినైనా వివాహము చేసుకోవాలి. ఈ
విధంగా ప్రతి వ్యక్తీ తన పూర్వీకులకు చెందిన భూమిని

కాపాడాలి. 9కనుక ఇశ్రాయేలు ప్రజల్లో ఒక వంశంనుండి
మరో వంశానికి భూమి పోకూడదు. ఇశ్రాయేలీయులు
ప్రతి ఒక్కరూ వారి పూర్వీకులకు చెందిన భూమిని
కాపాడాలి."

10మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞకు సెలో
పెహదు కుమార్తెలు విధేయులయ్యారు.

11అందుచేత సెలోపెహదు కుమార్తెలు మహలా,
తిర్సా, హొగ్లా, మిల్కా, నోయా, వారి తండ్రి సోదరుని
కుమారులను వివాహము చేసుకున్నారు. 12వారి భర్తలు
మనష్షే వంశం వారు గనుక వారి భూమి తమ తండ్రి
కుటుంబం, వంశం వారికే చెందినది.

13కనుక అర్బోతు మోయాబు ప్రాంతంలో,
శ్రేష్ఠయొర్దాను నది ప్రక్కన, యెరికో దగ్గర మోషేకు
యెహోవా ఇచ్చిన చట్టాలు, ఆజ్ఞలు అవి. ఆ
చట్టములను, ఆజ్ఞలను మోషే ఇశ్రా యేలు ప్రజలకు
ఇచ్చాడు.

# ద్వితీయోపదేశకాండము

## ఇశ్రాయేలు ప్రజలతో మోషే మాట్లాడటం

1 ఇది ఇశ్రాయేలు ప్రజలకు మోషే యిచ్చిన సందేశం. వారు యొర్దాను నదికి తూర్పువైపుగల అరణ్యంలో ఉన్నప్పుడు అతడు ఈ విషయాలు వారితో చెప్పాడు. వారు అరాబా లోయలో ఉన్నారు. ఇది సూపుకు అవతల పారాను అరణ్యమునకు, తోపెలు, లాబాను, హజెరోతు, దీజాహాబు పట్టణాలకు మధ్యవుంది.
2హోరేబు కొండనుండి (సీనాయి) కాదేషు బర్నేయాకు శేయీరు కొండలద్వారా ప్రయాణం పదకొండు రోజులు మాత్రమే పడుతుంది. 3అయితే
ఇశ్రాయేలీయులు ఈజిప్టును విడిచినప్పటినుండి ఈ స్థలంలో మోషే వీరితో మాట్లడినప్పటికి 40 సంవత్సరాలు పట్టింది. అది 40వ సంవత్సరం, 11వ నెల ఒకటవ తేదీ. వారితో చెప్పమని యెహోవా మోషేకు ఆజ్ఞాపించిన సంగతులన్నింటినీ మోషే వారితో మాట్లాడినప్పుడు చెప్పాడు. 4ఇది సీహోనును, ఓగును
యెహోవా ఓడించిన తర్వాత జరిగిన సంగతి. సీహోను అమోరీయుల రాజు. సీహోను హెష్బోనులో నివసించాడు. ఓగు బాషాను రాజు. ఓగు అష్టారోతు, ఎద్రేయిలో నివసించాడు. 5ఇప్పుడు వారు
యోర్దాను నదికి తూర్పున మోయాబు దేశంలో ఉన్నారు, మరియు దేవుడు ఆజ్ఞాపించిన విషయాలను మోషే వివరించటం మొదలుబెట్టాడు. మోషే ఇలా చెప్పాడు:
6“మన దేవుడైన యెహోవా హోరేబు (సీనాయి) కొండమీద మనతో మాట్లాడాడు. ఆయన అన్నాడు, ‘ఈ కొండ దగ్గర మీరు యిప్పటికి చాలా కాలంనుండి నిలిచి ఉన్నారు. 7కదిలిపోయేందుకు సర్వ సిద్ధంగా
ఉండండి. అమోరీయుల కొండ దేశానికి, దాని చుట్టూవున్న యొర్దాను లోయ, కొండ దేశం, పశ్చిమ పల్లపు ప్రాంతాలు, నెగెవు, సముద్రతీర ప్రాంతం అన్ని చోట్లకూ వెళ్లండి, కనానీ ప్రజల దేశానికి వెళ్లండి, యూఫ్రటీసు మహానది వరకు లెబానోనుకు వెళ్లండి.
8చూడండి, ఈ దేశమంతా నేను మీకు ఇచ్చాను. మీరు అందులో ప్రవేశించి ఆ దేశాన్ని మీ స్వాధీనం చేసుకోండి. మీ పూర్వీకులు అబ్రాహాము, ఇస్సాకు, యాకోబుకు నేను వాగ్దానం చేసిన దేశం యిదే. వారికి, వారి సంతతివారికి ఈ దేశాన్ని యిస్తానని నేను వాగ్దానం చేశాను.’ ”

## మోషే నాయకులను ఎంపిక చేయుట

9అప్పుడు మోషే అన్నాడు: “ఆ సమయంలో నేను మీతో మాట్లాడినప్పుడు నేను ఒంటరిగా మీ విషయంలో శ్రద్ధ తీసుకోలేనని నేను చెప్పాను. 10మీ
దేవుడైన యెహోవా ఇంకా మరింతమంది ప్రజలను అధికం చేయటంతో నేడు మీరు ఆకాశ నక్షత్రాలు ఎన్ని ఉంటాయో అంతమంది ఉన్నారు. 11మీ పూర్వీ
కుల దేవుడైన యెహోవా మిమ్మల్ని ఇంకా 1000 రెట్లు పెంచునుగాక! ఆయన మీకు చేసిన వాగ్దానం ప్రకారమే ఆయన మిమ్మల్ని ఆశీర్వాదించుగాక! 12కానీ
నేను మీ విషయం శ్రద్ధ తీసుకోలేను, నేనొక్కడనే మీ వివాదాలు తీర్చలేను.
13కనుక ‘ప్రతి వంశంనుండి కొందరు ప్రతి నిధులను ఎన్నుకోండి, నేను వారిని మీమీద నాయకులుగా చేస్తాను. అవగాహన, అనుభవం ఉన్న జ్ఞానులను ఎన్నుకోండి’ అని మీతో చెప్పాను. 14“దానికి ‘అలా చేయటం
మంచిదే అనుకొంటున్నాము’ అని మీరు అన్నారు.’
15“కనుక మీరు మీ వంశాలనుండి ఎన్నుకొన్న అవగాహన, అనుభవమున్న జ్ఞానులను మీకు నాయకులుగా నేను చేసాను. వారిలో కొందరిని 1000 మందికి నాయకులుగాను, కొందరిని 100 మందికి నాయకులుగాను, కొందరిని 50 మందికి నాయకులుగాను, కొందరిని 10 మందికి నాయకులుగాను నేను చేసాను. నేను వారిని మీ వంశాలకు అధికారులుగా చేసాను.
16“ఈ నాయకులను మీకు న్యాయమూర్తులుగా ఉండమని అప్పట్లో నేను వారితో చెప్పాను. ‘మీ ప్రజల వాదాలు వినండి. ఒక్కో వ్యాజ్యెమును సరిగ్గా విచారణ చేయండి. సమస్య ఇశ్రాయేలీయుల ఇద్దరి మధ్యకావచ్చును, లేక ఒక ఇశ్రాయేలు వ్యక్తికీ, మరో పరాయి వ్యక్తికీ మధ్య అయినా సరే పర్వాలేదు. మీరు ప్రతి వ్యాజ్యమును సరిగ్గా విచారణ చేయాలి. 17మీరు
విచారణ జరిపేటప్పుడు ఒక వ్యక్తి మరో వ్యక్తికంటె ముఖ్యమైనవాడని మీరు తలచకూడదు. ప్రతివ్యక్తి పైనా ఒకే విధంగా విచారణ జరిగించాలి. మీ నిర్ణయం దేవుని నుండి వస్తుంది. కనుక, ఎవరిని గూర్చి భయపడ

వద్దు. అయితే మీరు విచారణ జరిపేందుకు ఒక
వ్యాజ్యము కష్టతరంగా ఉంటే, దానిని నా దగ్గరకు
తీసుకొని రండి. నేను దానిని విచారిస్తాను.' 18మీరు
చేయాల్సిన ఇతర విషయాలన్నింటినీ ఆ సమయం
లోనే నేను మీతో చెప్తాను.

## గూఢచారులు కనాను వెళ్లటం

19"అప్పుడు మన దేవుడైన యెహోవా మనకు
ఆజ్ఞాపించినట్లు మనం చేసాము. మనం హోరేబు
(సీనాయి) కొండను విడిచి, అమోరీయుల కొండ
దేశంవైపు ప్రయాణం చేసాము. మీరు చూసిన ఆ
మహా భయంకర అరణ్యం అంతటి గుండా మనం
వెళ్లాము. కాదేషు బర్నేయాకు మనం వచ్చాం.
20అప్పుడు నేను మీతో చెప్పాను: 'ఇప్పుడు మీరు
అమోరీయుల కొండ దేశానికి వచ్చారు. మన
యెహోవా దేవుడు ఈ దేశాన్ని మనకు ఇస్తాడు.
21చూడండి, అదిగో అదే ఆ దేశం. వెళ్లి ఆ దేశాన్ని
మీ స్వంతం చేసుకోండి. మీరు ఇలా చేయాలని మీ
పూర్వీకుల దేవుడైన యెహోవా మీతో చెప్పాడు.
అందుచేత భయపడకండి, దేనిని గూర్చి చింతపడ
కండి!' 22 "అప్పుడు మీరంతా నా దగ్గరకు వచ్చి 'ఆ
దేశాన్ని చూసేందుకు మనకంటే ముందుగా మను
ష్యుల్ని పంపిద్దాము, వారు తిరిగి వచ్చి మనం వెళ్లాల్సిన
మార్గం మనకు చెబుతారు. మనకు వచ్చే పట్టణాలను
గూర్చి కూడ వారు చెప్పగలుగుతారు అన్నారు.' 23'అది
మంచి తలంపు అని నేను అనుకొన్నాను. కనుక ఒక్కో
వంశం నుండి ఒకరి చొప్పున మీలోనుండి పన్నెండు
మందిని నేను ఎన్నుకొన్నాను. 24అప్పుడు ఆ మను
ష్యులు బయల్దేరి ఆ కొండ దేశానికి వెళ్లారు. వారు
ఎష్కోలు లోయకు వచ్చి దానిని పరిశోధించారు. 25ఆ
దేశంలోని ఫలాలు కొన్నింటిని తీసుకొని వారు మా
దగ్గరకు తిరిగి తెచ్చారు. వారు మాకు సమాచారం
అందిస్తూ 'అది మన యెహోవా దేవుడు మనకు
యిస్తున్న మంచి దేశం' అని చెప్పారు.
26"కాని ఆ దేశంలో ప్రవేశించటానికి మీరు నిరాక
రించారు. మీ దేవుడైన యెహోవా ఆజ్ఞకు లోబడేం
దుకు మీరు నిరాకరించారు.
27మీ గుడారాల్లో మీరు ఫిర్యాదులు చేసారు, మీరు
అన్నారు: 'యెహోవా మనలను ద్వేషిస్తున్నాడు.
అమోరీయులు మనలను నాశనం చేసేటట్టు, వారికి
మనలను అప్పగించటానికే ఆయన మనలను
ఈజిప్టునుండి బయటకు రప్పించాడు. 28ఇప్పుడు
మనము ఎక్కడికి వెళ్లగలము? మన సోదరులు
(పన్నెండుమంది) తెచ్చిన సమాచారం తోవారు
మనల్ని భయపెట్టారు. అక్కడి మనుష్యులు మనకంటే
పెద్దవాళ్లు, ఎత్తయినవాళ్లు. పట్టణాలు పెద్దవి, వాటి
గోడలు ఆకాశమంత ఎత్తు ఉన్నాయి. అక్కడ రాక్షసు
ల్లాంటి మనుష్యుల్ని* మేము చూశాము' అని వారు
చెప్పారు.
29"అప్పుడు నేను మీతో చెప్పాను: 'దిగులు పడ
కండి. ఆ మనుష్యుల విషయం భయపడవద్దు. 30మీ
దేవుడైన యెహోవా మీకు ముందు వెళ్లి, మీ పక్షంగా
పోరాడుతాడు. ఆయన ఈజిప్టులో చేసినట్టే దీన్నికూడ
చేస్తాడు. ఆయన మీకు ముందుగా వెళ్లటం 31అరణ్య
ములో మీరు చూశారు. ఒక మనిషి తన కుమారుని
మోసినట్టు, మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ఎలా
మోసిందీ మీరు చూశారు. ఇంత దూరం ఈ స్థలానికి
యెహోవా మిమ్మల్ని క్షేమంగా తీసుకొని వచ్చాడు.'
32"అయినప్పటికీ మీరు యింకా మీ దేవుడైన
యెహోవాను విశ్వసించలేదు. 33మీరు ప్రయాణం
చేస్తున్నప్పుడు మీ పాళెము కోసం స్థలం చూసేందుకు
ఆయన మీకు ముందుగా వెళ్లాడు. మీరు ఏ మార్గాన
వెళ్లాల్సిందీ మీకు చూపెట్టేందుకు రాత్రివేళ అగ్నిలోను,
పగటివేళ మేఘములోను ఆయన మీకు ముందు
వెళ్లాడు.

## కనానులో ప్రవేశించేందుకు ప్రజలు అనుమతింపబడలేదు

34"మీరు చెప్పింది యెహోవా విన్నాడు, ఆయ
నకు కోపం వచ్చింది. ఆయన ఒక గట్టి ప్రమాణం
చేసాడు. ఆయన చెప్పాడు: 35'ఇప్పుడు జీవిస్తున్న
దుష్టప్రజలైన మీలోఎవ్వరూ, నేను మీ పూర్వీకులకు
వాగ్దానం చేసిన ఆ మంచి దేశంలో ప్రవేశించరు.
36యెఫున్నె కుమారుడైన కాలేబు మాత్రమే ఆ దేశాన్ని
చూస్తాడు. కాలేబు నడిచిన భూమిని నేను అతనికి
యిస్తాను. ఆ భూమిని అతని సంతతివారికి నేను
యిస్తాను. ఎందుకంటే నేను ఆజ్ఞాపించినది అంతా
కాలేబు జరిగించాడు గనుక.'
37"మీ వల్ల యెహోవా నా మీదకూడా కోపగిం
చాడు. నాతో ఆయన చెప్పాడు: 'నీవు కూడా ఆ
దేశంలో ప్రవేశించజాలవు. 38అయితే నీ సహాయకు
డును నూను కుమారుడైన యెహోషువ ఆ దేశంలో
నికి వెళ్తాడు. ఇశ్రాయేలు ప్రజలు ఆ దేశాన్ని స్వాధీనం
చేసుకొనేందుకు అతడే వారిని నడిపిస్తాడు గనుక
యెహోషువాను ప్రోత్సహించు.' 39"మరియు
యెహోవా మనతో చెప్పాడు; 'మీ చిన్న పిల్లలను
మీ శత్రువులు ఎత్తికొనిపోతారని మీరు చెప్పారు గదా,
కానీ ఆ పిల్లలే ఆ దేశంలో ప్రవేశిస్తారు. ఒక విషయం
తప్పో? ఒప్పో? అని, తెలుసుకోలేనంత చిన్నవాళ్లు
గనుక మీరు చేసిన తప్పుకు మీ పిల్లల్ని నేను

---

**రాక్షసుల్లాంటి మనుష్యులు** హీబ్రూ ప్రతుల్లో "అనాకీయుల నెఫీలీయులు" అని వ్రాయబడివుంది. సంఖ్యాకాండము 13:33 చూడండి.

నిందించను. కనుక వారికే ఆ దేశాన్ని నేను యిస్తాను. ఆ దేశాన్ని మీ పిల్లలే వారి స్వంతంగా తీసుకొంటారు. [40]కానీ మీరు మాత్రం వెనుకకు తిరిగి ఎర్రసముద్ర మార్గంలో అరణ్యానికే వెళ్లాలి.'

[41]"అప్పుడు మీరు, 'మోషే, మేము యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేసాము. అయితే యిదివరకు యెహోవా దేవుడు మాకు ఆజ్ఞాపించిన ప్రకారం యిప్పుడు మేము వెళ్లి పోరాడుతాము' అని అన్నారు. అప్పుడు మీరు ఒక్కొక్కరు యుద్ధ ఆయుధాలు ధరించారు. ఆ కొండ దేశంలో ప్రవేశించటం సులభం అని మీరు అనుకొన్నారు.

[42]"అయితే, 'అక్కడికి వెళ్లి యుద్ధం చేయవద్దని ప్రజలతో చెప్పు, ఎందుకంటే నేను వారికి తోడుగా ఉండను, వారి శత్రువులు వారిని ఓడించేస్తారు' అని యెహోవా నాతోచెప్పాడు.'

[43]"కనుక నేను మీతో మాట్లాడాను, కాని మీరు వినలేదు. యెహోవా ఆజ్ఞకు లోబడేందుకు మీరు నిరాకరించారు. మీ స్వంత శక్తి ప్రయోగించవచ్చని మీరనుకొన్నారు. [44]అందుచేత మీరు ఆ కొండ దేశం మీదికి వెళ్లారు. అప్పుడు ఆ కొండ దేశంలో నివసిస్తున్న అమోరీయులు మీ మీద యుద్ధానికి వచ్చారు. తేనెటీగల దండు మనుష్యులను తరిమినట్టు వారు మిమ్ములను తరిమారు. శేయీరునుండి హోర్మా వరకు మిమ్మల్ని తరిమి, అక్కడ వారు మిమ్మల్ని ఓడించారు. [45]అప్పుడు మీరు తిరిగివచ్చి యెహోవాకు మొర్ర పెట్టారు. కానీ యెహోవా మీ మొర్ర వినలేదు. మీ మొర్ర వినటానికి ఆయన నిరాకరించాడు. [46]కనుక చాలా కాలం మీరు కాదేషులోనే ఉండిపోయారు."

## ఇశ్రాయేలీయులు అరణ్యంలో సంచారం చేయటం

2 "అప్పుడు మనం తిరిగి ఎర్రసముద్ర మార్గంలో అరణ్యంలోనికి ప్రయాణం చేసాము. మనం చేయవలెనని యెహోవా నాతో చెప్పింది అదే. చాలా రోజుల వరకు మనం శేయీరు* కొండ దేశం గుండా వెళ్లాము. [2]అప్పుడు నాతో యెహోవా అన్నాడు: [3]'మీరు ఈ కొండ దేశంగుండా చాలా తిరిగారు. ఉత్తర దిశగా తిరగండి. [4]మరియు మీకు ఇలా చెప్పమని ఆయన నాతో చెప్పాడు: మీరు శేయీరు దేశం గుండా దాటిపోతారు. ఈ దేశం మీ బంధువులైన ఏశావు సంతతివారికి చెందినది. వారు మీకు భయపడతారు. చాలా జాగ్రతగా ఉండండి. [5]వారితో యుద్ధం చేయ కండి. వారి దేశంలో ఏమాత్రం ఒక్క అడుగు కూడ నేను మీకు యివ్వను. ఎందుకంటే శేయీరు కొండ దేశాన్ని ఏశావుకు స్వంతంగా ఉండేందుకు నేను యిచ్చాను. [6]అక్కడ మీరు తినే భోజనానికిగాని తాగే నీటికిగాని మీరు ఏశావు ప్రజలకు వెల చెల్లించాలి. [7]మీరు చేసిన ప్రతిదానిలోనూ మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ఆశీర్వదించాడని జ్ఞాపకం ఉంచుకోండి. ఈ మహా ఎడారిలో మీరు నడవటం ఆయనకు తెలుసు. ఈ 40 సంవత్సరాలు మీ దేవుడైన యెహోవా మీతో ఉన్నాడు గనుక మీకు అవసరమైనవి అన్నీ ఎల్లప్పుడూ మీకు దొరికాయి'

[8]"కనుక శేయీరులో నివసించే మన బంధువులైన ఏశావు ప్రజలను మనం దాటిపోయాము. ఎలాతు, ఎసియోను-గెబరు పట్టణాల నుండి యోర్దాను వెళ్లే మార్గాన్ని మనం విడిచిపెట్టాం. మనం మళ్లుకొని మోయాబు అరణ్యానికి పోయే మార్గం మీద వెళ్లాము".

## ఆర్ వద్ద ఇశ్రాయేలీయులు

[9]"యెహోవా నాతో చెప్పాడు: 'మోయాబు ప్రజలను తొందర పెట్టవద్దు. వారితో యుద్ధం ప్రారంభించవద్దు, వారి దేశంలో ఏ మాత్రం భూమి నేను మీకు యివ్వను. వారు లోతు సంతతివారు,* ఆరు పట్టణాన్ని నేను వారికి యిచ్చాను.' " [10]ఇంతకు ముందు ఏమీము ప్రజలు ఆర్‌లో నివసించారు. వారు బలాఢ్యులు, వారు చాలామంది ఉన్నారు. అనాకీము* ప్రజల్లాగే వారు చాలా ఎత్తయినవాళ్లు. [11]అనాకీయుల్లాగే ఏమీము కూడ రెఫాయిము ప్రజల్లో ఒక భాగం అని చెప్పబడింది. కానీ మోయాబీ ప్రజలు వారిని ఏమీయులు అని పిల్చారు. [12]హోరీ ప్రజలు కూడ ఇంతకు ముందు శేయీరులో నివసించారు, కానీ ఏశావు ప్రజలు వారి దేశాన్ని స్వాధీనం చేసుకొన్నారు. హోరీయులను ఏశావు ప్రజలు నాశనం చేసారు. అప్పుడు హోరీయులు అంతకు ముందు నివసించిన చోట ఏశావు ప్రజలు నివసించారు. ఇశ్రాయేలు ప్రజలకు యెహోవా స్వంతంగా యిచ్చిన దేశంలోని ప్రజలకు ఇశ్రాయేలీయులు చేసినట్టు వారు అక్కడ ఉన్నవారికి చేసారు.

[13]"యెహోవా నాతో చెప్పాడు: 'ఇప్పుడు లేచి, జెరెదు వాగు దాటి వెళ్లండి.' కనుక మనం జెరెదు వాగు దాటివెళ్లాం. [14]మనం కాదేషు బర్నేయ విడిచి జెరెదు వాగు దాటునప్పటికి 38 సంవత్సరాలు పట్టింది. ఆ తరం యుద్ధ వీరులంతా చనిపోయారు. ఇలా జరుగుతుందని యెహోవా చెప్పాడు. [15]ఆ మనుష్యులు అందరూ గతించి పోయేవరకు యెహోవా వారికి విరోధంగానే ఉన్నాడు. [16]"యుద్ధ వీరులంతా చనిపోయి ప్రజల మధ్య లేకుండా గతించిపోయిన తర్వాత [17]యెహోవా నాతోఇలా చెప్పాడు:

---

**శేయీరు** ఏదోము యొక్క మరో పేరు.

**లోతు సంతతివారు** మోయాబు, అమ్మోను అను వారు లోతు కుమారులు. ఆది. 19:30-38 చూడండి.

**అనాకీము** అనాకీ సంతానం చాల పొడవైన వాళ్లు వీరులు అని ప్రసిద్ధి. సంఖ్యాకాండము 13:33 చూడండి.

18“ఈ వేళ మీరు సరిహద్దు ఆర్‌వద్ద దాటి మోయాబు
లోనికి వెళ్లాలి. 19మీరు అమ్మోనీయులను సమీపించి
నప్పుడు వారిని తొందర పెట్టవద్దు, వారితో యుద్ధం
చేయవద్దు, ఎందుకంటే వారి దేశం నేను మీకు
యివ్వను. ఎందుకంటే వారు లోతు సంతానం. వారు
స్వంతంగా ఉంచుకొనేందుకు ఆ దేశాన్ని నేను వారికి
యిచ్చాను.’”
20ఆ దేశం రెఫాయిము ప్రజల దేశం అనికూడ
చెప్పబడింది. అంతకు ముందు అక్కడ నివసించిన
ప్రజలు వారు, అమ్మోనీయులు వారిని ‘జంజుమ్మీలు’
అని పిలిచేవాళ్లు. 21జంజుమ్మీ ప్రజలు చాలా బలం
గలవారు, వాళ్లు చాలామంది ఉన్నారు. అనాకీము
ప్రజల్లా వారు చాలా ఎత్తయిన మనుషులు. కానీ జంజు
మ్మీలను నాశనం చేసేందుకు యెహోవా అమోరీయు
లకు సహాయంచేశాడు. అమ్మోనీయులు జంజుమ్మీల
దేశాన్ని స్వాధీనం చేసుకొని యిప్పుడు అక్కడ నివసి
స్తున్నారు. 22శేయీరులో నివసించే ఏశావు ప్రజలకు
(ఎదోమీలు) దేవుడు అలాగే చేశాడు. వారు అక్కడ
నివసించే హోరీయులను నాశనం చేశారు. ఇంతకు
ముందు హోరీయులు నివసించిన చోట యిప్పటికీ
ఏశావు ప్రజలు నివసిస్తున్నారు. 23క్రేతు ప్రజలలో
కొందరికి దేవుడు అలాగే చేశాడు. గాజా చుట్టు పక్కల
పట్టణాల్లో ఆవీయ ప్రజలు నివసించారు. అయితే
క్రేతునుండి కొందరు ప్రజలు వచ్చి ఆవీయ ప్రజలను
నాశనం చేశారు. క్రేతునుండి వచ్చిన ఆ ప్రజలు ఆ
దేశాన్ని స్వాధీనం చేసుకొని, ఇప్పుడు అక్కడ
నివసిస్తున్నారు.

### అమ్మోరీయులతో యుద్ధం

24“యెహోవా నాతో యిలా చెప్పాడు: ‘ప్రయా
ణానికి సిద్ధపడండి. అర్నోను నది లోయ దాటి వెళ్లండి.
హెష్బోను రాజు, అమ్మోరీవాడగు సీహోను మీద
నేను మీకు శక్తినిస్తాను. అతని దేశాన్ని స్వాధీనం చేసు
కొనేందుకు నేను మీకు శక్తిని యిస్తున్నాను. కనుక
అతనితో యుద్ధంచేసి, అతని దేశాన్ని స్వాధీనం చేసు
కోవటం మొదలుపెట్టండి. 25ప్రపంచంలోని ప్రజ
లంతా మీ విషయం భయపడేలా చేయటం నేను ఈ
వేళ ప్రారంభిస్తాను. మిమ్మల్ని గూర్చిన సమాచారం
వారు విని, భయంతో వణకిపోతారు. వారు మిమ్మల్ని
గూర్చి తలచినప్పుడు వాళ్లు భయంతో వణికిపోతారు.’
26“కెదెమోతు అరణ్యంనుండి హెష్బోను రాజైన
సీహోను దగ్గరకు నేను వార్తాహరులను పంపించాను.
వారు సీహోనుకు శాంతి ఒడంబడిక సమాచారం
తెలిపారు. వారు చెప్పారు: 27‘నీ దేశంగుండా మమ్మల్ని
వెళ్లనివ్వు. మేము మార్గంలోనే నిలిచి ఉంటాము.
మార్గంనుండి కుడికిగాని, ఎడమకుగాని మేము తొల
గము. 28మేము తినే భోజనానికి, తాగే నీళ్లకు వెండి
నీకు చెల్లిస్తాము. మేము నీ దేశంలోనుండి నడచి
వెళ్తాము, అంతే.
29మా దేవుడైన యెహోవా మాకు యిస్తున్న
దేశంలో ప్రవేశించేందుకే మేము యోర్దాను నది
దాటేంతవరకు మమ్మల్ని నీ దేశంలోనుంచి వెళ్ల నివ్వు.
ఇతరులు, అంటే శేయీరులో నివసించే ఏశావు ప్రజలు,
ఆర్‌లో నివసించే మోయాబు ప్రజలు వారి దేశంగుడా
మమ్మల్ని వెళ్లనిచ్చారు.’
30“కానీ హెష్బోను రాజైన సీహోను తన దేశం
లోంచి మమ్మల్ని పోనివ్వలేదు. మీ దేవుడైన
యెహోవా అతణ్ణి చాలా మొండికెత్తేటట్టు చేసాడు.
సీహోను రాజును మీ అధికారంకింద ఉంచటానికే
యెహోవా ఇలా చేసాడు. ఇప్పుడు ఆయన దీనిని
జరిగించాడు.
31“సీహోను రాజును, అతని దేశాన్ని నేను మీకు
యిస్తున్నాను. ఇప్పుడు దేశాన్ని స్వాధీనం చేసుకోండి’
అని యెహోవా నాకు చెప్పాడు.
32“అప్పుడు యాహసు దగ్గర మాతో యుద్ధం
చేయటానికి సీహోను రాజు, అతని ప్రజలందరు బయ
ల్దేరి వచ్చారు. 33అయితే మన యెహోవా దేవుడు
అతణ్ణి మనకు అప్పగించాడు. అతణ్ణి, అతని కుమారు
లను, అతని ప్రజలందరిని మనం ఓడించాము.
34అప్పట్లో సీహోను రాజుకు చెందిన పట్టణాలన్నిం
టినీ మనం పట్టుకొన్నాము. ప్రతి పట్టణంలో పురుషు
లను, స్త్రీలను, పిల్లలను ప్రజలందరినీ మనం పూర్తిగా
నాశనం చేసాము. ఎవ్వరినీ మనం బతకనియ్యలేదు.
35మనం పట్టుకొన్న పట్టణాల్లో పశువులను, విలువైన
వస్తువులను మాత్రమే మనం తీసుకొన్నాము.
36అర్నోను లోయ అంచులోని అరోయేరు పట్ట
ణాన్ని, ఆ లోయ మధ్యలో ఉన్న మరో పట్టణాన్ని
మనం ఓడించాము. అర్నోను లోయ, గిలాదుమధ్య
ఉన్న పట్టణాలన్నింటిని మనం ఓడించేటట్టు చేసాడు
యెహోవా. ఏ పట్టణం కూడా మన యెదుట నిలువ
లేకపోయింది. 37కానీ అమ్మోనీయుల దగ్గరకు కూడ
మీరు వెళ్లలేదు. యబ్బోకు నదీ తీరాలకుగాని, కొండ
దేశంలోని పట్టణాలకుగాని మీరు వెళ్లలేదు. మన దేవు
డైన యెహోవా మనకు ఇవ్వని ఏ స్థలం దగ్గరకూ
మీరు వెళ్లలేదు.”

### బాషాను ప్రజలతో యుద్ధం

3 “మనం మళ్లుకొని బాషాను మార్గంలో వెళ్లాము.
బాషాను రాజు ఓగు, అతని ప్రజలందరు ఎద్రేయి
దగ్గర మనతో యుద్ధం చేయటానికి వచ్చారు. 2‘ఓగును
నేను మీకు అప్పగించాలని నిర్ణయించాను గనుక అతని
గూర్చి భయపడవద్దు. అతని మనుష్యులందరిని, అతని
దేశాన్ని నేను మీకు యిస్తాను. హెష్బోనులో ఏలుబడి
చేసిన అమోరీ రాజు సీహోనుకు చేసినట్టే, అతన్ని

కూడ మీరు ఓడిస్తారు' అని యెహోవా నాతో
చెప్పాడు.
3"కనుక బాషాను రాజు ఓగును, అతని మనుష్యు
లందరిని మన యెహోవా దేవుడు మనకు అప్ప
గించాడు. అతని మనుష్యులు ఎవరూ మిగుల కుండా
మనం అతన్ని ఓడించాము. 4తర్వాత అప్పట్లో ఓగుకు
చెందిన పట్టణాలన్నింటినీ మనం స్వాధీనం చేసు
కొన్నాము. ఓగు ప్రజల పట్టణాలు అన్నింటినీ, బాషా
నులో ఓగు రాజ్యమైన అర్గోబు ప్రాంతం అంతటిలో
60 పట్టణాలను మనం స్వాధీనం చేసుకొన్నాము.
5ఎత్తయిన గోడలు, బలమైన కడ్డీలుగల గేట్లతో ఈ
పట్టణాలు చాలా బలమైనవి. మరియు గోడలులేని
పట్టణాలు కూడా చాలా ఉన్నాయి. 6హెష్బోను రాజైన
సీహోను పట్టణాలకు మనం చేసినట్టే వీటినికూడా
మనం నాశనం చేసాము. ప్రతి పట్టణాన్ని, వాటిలోని
ప్రజలందరిని స్త్రీలు, పిల్లలను సహా మనం సమూలంగా
నాశనం చేసాము. 7అయితే ఆ పట్టణాల్లోని పశువుల
న్నింటినీ, విలువైన వస్తువులను మనకోసం ఉంచు
కొన్నాము.
8"ఈ విధంగా, అమోరీ ప్రజల ఇద్దరు రాజుల
వద్దనుండి దేశాన్ని మన స్వాధీనం చేసుకొన్నాం. ఈ
దేశాలు యొర్దాను నదికి తూర్పు వైపున ఉన్నాయి.
అర్నోను లోయనుండి హెర్మోను పర్వతంవరకు
ఉంది ఈ దేశం. 9(హెర్మోను కొండను సీదోనీ ప్రజలు
షిర్యోను అనీ, అమోరీలు శెనీరు అని పిలుస్తారు)
10బాషాను అంతటిని సాలెకానుండి, ఎద్రేయివరకు,
గిలాదు పీఠభూమిలోని పట్టణాలన్నింటినీ మనం మన
స్వాధీనం చేసుకొన్నాం. సల్కా ఎద్రేయి బాషానులోని
ఓగు రాజ్యంలో పట్టణాలు."
11(ఇంకా జీవించి ఉన్న కొద్దిమంది రెఫాయిము
ప్రజల్లో బాషాను రాజు ఓగు ఒక్కడే. ఓగు మంచం
ఇనుప మంచం. దాని పొడవు 13 అడుగులు, వెడల్పు
6 అడుగులు. అమ్మోనీ ప్రజలు నివసించే రబ్బా పట్ట
ణంలో ఆ మంచం యింకా ఉంది.)

### యొర్దాను నదికి తూర్పున ఉన్న దేశం

12"ఆ సమయంలో ఈ దేశాన్ని మన స్వంతం
చేసుకొన్నాము. అర్నోను లోయ ప్రక్కగా అరోయేరు
దేశాన్ని, గిలాదు కొండ దేశంలో సగం, వాటి పట్టణా
లతో సహా రూబేను వంశంవారికి, గాదు వంశంవారికి
నేను ఇచ్చాను. 13గిలాదులో మిగతా సగం, బాషాను
అంతా మనష్షే వంశంవారిలో సగంమందికి నేను
ఇచ్చాను." (బాషాను ఓగు రాజ్యం. బాషానులో కొంత
భాగం అర్గోబు అని పిలువబడింది. బాషాను ప్రాంతం
రెఫాయిము దేశం అనికూడ పిలువబడింది).
14గెషూరు, మయకాతీతు ప్రజల సరిహద్దువరకు గల
మొత్తం అర్గోబు ప్రదేశం అంతా మనష్షే వంశీయుడైన
యాయీరు పట్టుకొన్నాడు. ఈ ప్రాంతానికి
యాయీరు తన స్వంత పేరు పెట్టుకొన్నాడు.
హవ్వీత్‌యాయీరు అని పేరు పెట్టాడు. (నేటికీ ఆ
ప్రాంతం బాషాను యాయీరు పట్టణాలు అని పిలువ
బడుతుంది).
15"గిలాదును నేను మాకీరుకు ఇచ్చాను.
16మరియు రూబేను వంశానికి, గాదు వంశానికి గిలాదు
వద్ద ప్రారంభం అవుతున్న దేశాన్ని నేను ఇచ్చాను.
ఈ దేశం అర్నోను లోయనుండి యబ్బోకు నదివరకు
ఉంది. (లోయ మధ్య భాగం ఒక సరిహద్దు. యబ్బోకు
నది అమ్మోనీ ప్రజలకు సరిహద్దు) 17పడమటి దిక్కున
అరాబాలోని యొర్దాను నది వారి ప్రాంతానికి సరిహద్దు.
ఈ ప్రాంతానికి ఉత్తరాన కిన్నెరెతు సరస్సు, దక్షిణాన
అరాబా సముద్రం (ఉప్పు సముద్రం) ఉన్నాయి.
తూర్పున అది పిస్గా కొండచరియల కింద ఉంది.
18"ఆ సమయంలో ఆ వంశాలకు నేను ఈ ఆజ్ఞ
యిచ్చానుః 'మీరు నివసించడానికి యొర్దాను నదికి
యివతలి ప్రక్క దేశాన్ని మీ దేవుడైన యెహోవా
మీకు యిచ్చాడు. అయితే యిప్పుడు మీ యుద్ధ
వీరులు వారి ఆయుధాలు చేతపట్టి మిగతా ఇశ్రాయేలు
వంశాలను నది దాటించాలి. 19మీ భార్యలు, మీ చిన్న
పిల్లలు, మీ పశువులు (మీకు పశువులు చాలా ఉన్నా
యని నాకు తెలుసు) నేను మీకు యిచ్చిన ఈ పట్ట
ణాల్లో యిక్కడ ఉండాలి. 20అయితే మీ బంధువులైన
ఇశ్రాయేలీయులకు యొర్దాను నదికి అవతల ప్రక్క
యెహోవా యిస్తున్న దేశాన్ని వారు స్వాధీనం చేసు
కొనేంతవరకు మీరు వారికి సహాయం చేయాలి. ఇక్కడ
మీకు శాంతి ఉన్నట్టుగానే అక్కడ వారికి యెహోవా
శాంతి నిచ్చేంతవరకు వారికి సహాయం చేయండి.
అప్పుడు నేను మీకు ఇచ్చిన ఈ దేశానికి మీరు తిరిగి
రావచ్చును.'
21"అప్పుడు యెహోషువతో నేను యిలా
చెప్పానుః 'మీ దేవుడైన యెహోవా ఈ ఇద్దరు రాజు
లకూ చేసిన వాటన్నింటినీ నీవు చూశావు. నీవు ప్రవే
శించే రాజ్యాలన్నింటికీ యెహోవా అలాగే చేస్తాడు.
22మీ దేవుడైన యెహోవా మీ పక్షంగా పోరాడుతాడు
గనుక ఈ దేశాల రాజులకు నీవు భయపడవద్దు.

### మోషే కనానులో ప్రవేశించలేకపోవటం

23"ఆ సమయంలో నేను యెహోవాను బతిమా
లాను. నేను చెప్పాను, 24'యెహోవా, నా ప్రభువా
నేను నీ సేవకుడిని. నీవు చేసే ఆశ్చర్యకరమైన, శక్తివంత
మైన విషయాలలో కొద్ది భాగం మాత్రమే నీవు నాకు
చూపించావు అని నాకు తెలుసు. నీవు చేసిన శక్తివంత
మైన మహత్కార్యాలను చేయగల దేవుడు ఆకాశంలో
గాని భూమి మీదగాని లేడు. 25యొర్దాను నదికి అవతల
ప్రక్క ఉన్న ఆ మంచి దేశాన్ని, సౌందర్యవంతమైన ఆ

కొండ దేశాన్ని, లెబానోనును చూడటానికి నన్ను
అవతలకు దాటి వెళ్లనియ్యి అని నేను నీకు మనవి
చేస్తున్నాను.’
26“కానీ మీ మూలంగా యెహోవా నామీద కోపగిం
చాడు. ఆయన నా మాట వినడానికి తిరస్కరించాడు.
యెహోవా నాతోచెప్పాడు, ‘నీకు ఇది చాలు. ఈ
విషయం నాతో యింకా చెప్పవద్దు. 27పిస్గా కొండ
శిఖరం మీదికి వెళ్లు. పడమర, ఉత్తరం, తూర్పు, దక్షిణం
చూడు. నీవు నీ కళ్లతో చూడవచ్చు గాని నీవు మాత్రం
ఎన్నటికీ యోర్దాను నది దాటి వెళ్లజాలవు. 28నీవు
తప్పక యెహోషువకు హెచ్చరికలు యివ్వాలి. అతణ్ణి
ప్రోత్సహించి, బలపర్చు. ఎందుకంటే ప్రజలను
యెహోషువ యోర్దాను నది దాటిస్తాడు. దేశాన్ని
స్వాధీనం చేసుకొని దానిలో నివసించేందుకు యెహో
షువ వారిని నడిపిస్తాడు. ఈ దేశాన్నే నీవు చూస్తావు.’
29“అందుచేత మేము బేత్పెయోరు అవతలివైపు
లోయలో నిలిచిపోయాము.”

## దేవుని ఆదేశాలు పాటించమని మోషే ప్రజలను హెచ్చరించటం

4 “ఇక, ఇశ్రాయేలీయులారా, నేను మీకు ప్రబోధించే
చట్టాలు, ఆజ్ఞలు వినండి. వాటికి విధేయుల
వ్వండి. అప్పుడు మీరు బతికి, మీ పూర్వీకుల దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో ప్రవేశించి దాన్ని
స్వాధీనం చేసుకోగలుగుతారు. 2నేను మీకు ఆజ్ఞాపిం
చిన వాటికి మీరేమీ అదనంగా చేర్చకూడదు. అందులో
నుంచి మీరేవీ తీసివేయకూడదు. నేను మీకు ఇచ్చిన
మీ యెహోవా దేవుని ఆజ్ఞలకు మీరు విధేయులు
కావాలి.
3“బయల్ పెయోరు వద్ద యెహోవా చేసింది
మీరు చూశారు. అక్కడ బయలును* వెంబడించిన
వాళ్లందరిని మీ దేవుడైన యెహోవా నాశనం చేసాడు.
4అయితే మీ దేవుడైన యెహోవా వైపు నిలిచి ఉన్న
మీరంతా ఈనాడు బతికి ఉన్నారు.
5“చూడండి, నా దేవుడైన యెహోవా నాకు
ఆజ్ఞాపించిన చట్టాలు, నియమాలు నేను మీకు
ప్రబోధించాను. మీరు ఏ దేశంలోనైతే ప్రవేశించి,
దానిని మీ స్వంతం చేసుకో బోతున్నారో ఆ దేశంలో
మీరు ఈ చట్టాలకు విధేయులు కావాలని వాటిని
నేను మీకు ప్రబోధించాను. 6ఈ ఆజ్ఞలకు జాగ్రత్తగా
లోబడండి. మీకు జ్ఞానం, తెలివి ఉన్నట్టు యితర
రాజ్యాల ప్రజలకు యిది తెలియజేస్తుంది. ఆ దేశాల
ప్రజలు ఈ ఆజ్ఞలను విన్నప్పుడు ‘నిజంగా ఈ గొప్ప
రాజ్య ప్రజలు (ఇశ్రాయేలీయులు) జ్ఞానులు, తెలివి
గలవారు’ అని చెబుతారు.

7“మనం దేవునికి మొర్రపెట్టినప్పుడు మన దేవు
డైన యెహోవా మనకు సమీపంగా ఉన్నట్టు, మరి
ఏ జాతికీ అంత సమీపంగా ఉండే ఏ దేవుడు లేడు.
8ఈనాడు నేను మీ ఎదుట ఉంచిన ప్రబోధాలంతటి
మంచి ఆజ్ఞలు, నియమాలు కలిగి ఉండేందుకు ఏ
జాతికూడ అంత గొప్పది కాదు.
9కానీ మీరు మాత్రం జాగ్రత్తగా ఉండాలి. మీరు
చూసిన సంగతులను మీరు బతికి ఉన్నంతకాలం మరచి
పోకుండా జాగ్రత్తగా ఉండాలి. మీ పిల్లలకు, మీ పిల్లల
పిల్లలకు మీరు ఈ సంగతులను ప్రబోధించాలి.
10హోరేబు కొండ దగ్గర మీరు మీ దేవుడైన
యెహోవా యెదుట నిలిచిన రోజును జ్ఞాపకం చేసు
కోండి. ‘నేను చెప్పే సంగతులు వినడానికి ప్రజలందరినీ
సమావేశపర్చు. అప్పుడు భూమి మీద వారు జీవించి
నంతకాలం వారు గౌరవించటం నేర్చుకొంటారు.
మరియు వారు ఈ సంగతులను వారి పిల్లలకు ప్రబోధి
స్తారు’ అని యెహోవా నాతో చెప్పాడు. 11మీరు దగ్గ
రకు వచ్చి కొండ దిగువ నిలబడ్డారు. ఆకాశంవరకు
ఎగసిన అగ్నితో ఆ కొండ మండింది. దట్టమైన కారుమ
బ్బులు, కటిక చీకటి. 12అప్పుడు అగ్నిలోనుండి
యెహోవా మీతో మాట్లాడాడు. ఎవరో మాట్లాడు
తున్న స్వరం మీరు విన్నారు కాని, ఏ ఆకారాన్నీ
మీరు చూడలేదు. స్వరం మాత్రమే వినబడింది.
13యెహోవా తన ఒడంబడికను మీతో చెప్పాడు.
పది ఆజ్ఞలను ఆయన మీతో చెప్పి, వాటిని పాటించ
మని మీకు ఆజ్ఞాపించాడు. ఆ ఒడంబడిక ఆజ్ఞలను
ఆయన రెండు రాతి పలకలమీద రాసాడు. 14ఆ సమ
యంలో నేను మీకు ఆజ్ఞలను, నియమాలను ప్రబోధిం
చాలనికూడ యెహోవా నాకు ఆజ్ఞాపించాడు. మీరు
స్వాధీనం చేసుకొని, నివసించబోతున్న దేశంలో మీరు
పాటించాల్సిన చట్టాలు ఇవి.
15“హోరేబు (సీనాయి) కొండమీద అగ్నిలో
నుండి యెహోవా మీతో మాట్లాడిన రోజున భౌతిక
మైన ఎలాంటి రూపంతోను మీరు ఆయనను చూడ
లేదు. దేవునికి ఆకారం లేదు. 16కనుక జాగ్రత్తగా
ఉండండి. ఏ ప్రాణి రూపంలోనైనా ఒక ప్రతిమను
లేక విగ్రహాన్ని చేసుకోవడం ద్వారా పాపంచేసి మీ
జీవితాలను నాశనం చేసుకోవద్దు. పురుషునివలె లేక
స్త్రీవలె కనబడే విగ్రహాన్ని చేయవద్దు.
17భూమిమీద జంతువులా కనబడే విగ్రహాన్నిగాని,
ఆకాశంలో ఎగిరే పక్షిలాంటి విగ్రహంగాని చేయవద్దు.
18నేలమీద ప్రాకే దేనివలెగాని, సముద్రపు చేపవలెగాని
కనబడే ఏ విగ్రహం చేయవద్దు, 19మరియు మీరు
పైన ఆకాశంలోనికి చూచినప్పుడు, సూర్యుడు,
చంద్రుడు, నక్షత్రాలు ఆకాశంలో మీకు కనిపించే వాట
న్నింటిని చూచినప్పుడు జాగ్రత్తగా ఉండండి. వాటిని
పూజించి, సేవించాలనే శోధన మీకు కలుగకుండా

**బయలు** కనానీ ప్రజలు ఆరాధించిన అబద్ధపు దేవత.

మీరు జాగ్రత్తగా ఉండండి. ఈ ప్రపంచంలో ఆ పనులు
ఇతరులు చేస్తే చేసుకోనిచ్చాడు మీ దేవుడైన
యెహోవా. 20అయితే మీరు ఆయన ప్రజలు,
యెహోవా మిమ్మును ఈజిప్టునుండి బయటకు తీసు
కొని వచ్చాడు. ఈజిప్టు ఇనుప కొలిమిలాంటిది.
ఇప్పుడు మీరు ఉన్నట్టుగా, మిమ్మును ఆయన తన
స్వంత ప్రజలుగా చేసేందుకు ఆయన మిమ్మును
బయటకు తీసుకొని వచ్చాడు.
21“మీ మూలంగా యెహోవా నా మీద కోప
గించాడు. ఆయన ఒక ప్రత్యేక ప్రమాణం చేసాడు.
నేను యొర్దాను నది దాటి అవతలికి వెళ్లకూడదు. మీ
దేవుడైన యెహోవా మీకు యిస్తున్న ఆ మంచి
దేశంలోనికి నేను వెళ్లజాలనని ఆయన నాతో చెప్పాడు.
22కనుక నేను యిక్కడ ఈ దేశంలోనే చావాలి. నేను
యొర్దాను నది దాటి వెళ్లలేను. కానీ మీరు మాత్రం
త్వరలోనే దాటి వెళ్లి, మీరు నివసించేందుకు ఆ మంచి
దేశాన్ని స్వాధీనం చేసుకొంటారు. 23మీ దేవుడైన
యెహోవా మీతో చేసిన ఒడంబడికను మీరు మరచి
పోకుండా ఆ కొత్త దేశంలో మీరు జాగ్రత్తగా ఉండాలి.
మీరు చేయకూడదని మీ యెహోవా దేవుడు మీతో
చెప్పిన ఏ రూపంలోనూ ఒక విగ్రహాన్ని చేయకూడదు.
24ఎందుకంటే మీ దేవుడైన యెహోవా తన ప్రజలు
ఇతర దేవుళ్లను పూజించడం అసహ్యించుకొంటాడు.
పైగా యెహోవా నాశనం చేసే అగ్నిలా ఉండగలడు.
25“మీరు ఆ దేశంలో చాలాకాలం జీవించిన తర్వాత,
మీకు పిల్లలు, పిల్లల పిల్లలు కలుగుతారు. మీరు ముసలి
వాళ్లవుతారు. అప్పుడు మారిపోయి మీ జీవితాన్ని పాడు
చేసుకొనవద్దు. దేని రూపంలోనూ ఒక విగ్రహాన్ని చేయ
వద్దు. అలాగు యెహోవాకు విరుద్ధంగా కీడు చేస్తే,
అది ఆయనకు కోపం పుట్టిస్తుంది. 26ఆ కీడు మీరు
జరిగిస్తే, ఇలా జరుగుతుందని నేడు ఆకాశం భూమి
మీమీద సాక్షులుగా ఉంటారు; త్వరలోనే మీరు ఆ
దేశంలో ఉండకుండాపోతారు. ఆ దేశాన్ని స్వాధీనం
చేసుకొనేందుకు ఇప్పుడు మీరు యొర్దాను నది దాటు
తున్నారు. కానీ అక్కడ మీరు ఎక్కువ కాలం జీవించరు.
మీరు సర్వనాశనం అవుతారు. 27దేశదేశాలకు
యెహోవా మిమ్మల్ని చెదరగొడతాడు. యెహోవా
మిమ్మల్ని పంపించే ఆ దేశాల్లో జీవించేందుకు మీరు
కొద్దిమంది మాత్రమే ఉంటారు. 28మనుష్యులు చేసిన
దేవుళ్లను చెక్కతో రాయితో చేయబడి, కానలేని,
వినలేని, తినలేని, వాసన చూడలేని దేవుళ్లను అక్కడ
మీరు సేవిస్తారు. 29అయితే అక్కడ, ఆ ఇతర దేశాల్లో
మీరు మీ దేవుడైన యెహోవా కోసం చూస్తారు. మీ
పూర్ణ హృదయంతో, పూర్ణ ఆత్మతో మీరు ఆయన
కోసం చూస్తే, మీరు ఆయనను కనుగొంటారు. 30మీరు
కష్టంలో ఉన్నప్పుడు – ఆ సంగతులన్నీ మీకు సంభవిం
చినప్పుడు – మీరు మీ దేవుడైన యెహోవా దగ్గరకు
తిరిగి వచ్చి, ఆయనకు విధేయులవుతారు. 31మీ దేవు
డైన యెహోవా కృపగల దేవుడు ఆయన మిమ్మల్ని
విడిచి పెట్టడు. ఆయన మిమ్మల్ని నాశనం చేయడు.
మీ పూర్వీకులకు ఆయన వాగ్దానం చేసిన ఒడంబడికను
ఆయన మరచిపోడు.

## దేవుడు చేసిన గొప్ప కార్యాలను గూర్చి ఆలోచించండి

32“ఇంతకు పూర్వం యింత గొప్పది ఏమైనా
జరిగిందా? ఎన్నడూ లేదు. గతాన్ని చూడండి, మీరు
పుట్టక ముందు జరిగిన వాటన్నింటినీ గూర్చి ఆలో
చించండి. భూమిమీద దేవుడు మనిషిని సృజించిన
అనాది కాలానికి వెళ్లండి. ప్రపంచంలో ఎక్కడేగాని,
ఎన్నడేగాని, జరిగిన వాటన్నింటినీ చూడండి. ఇంతటి
గొప్ప విషయాన్ని గూర్చి ఎన్నడైనా ఎవరైనా
విన్నారా? లేదు. 33దేవుడు అగ్నిలోనుండి మీతో
మాట్లాడగా మీరు వినికూడ యింకా బ్రతికే ఉన్నారు.
అలా యింకెవరికైనా ఎన్నడైనా జరిగిందా? లేదు.
34మరియు ఎప్పుడైనా, ఏ దేవుడైనా మరో దేశంలో
నుండి తనకోసం ఒక ప్రజను తీసుకొనేందుకు ప్రయ
త్నించాడా? లేదు. కానీ మీ యెహోవా దేవుడు
అద్భుత కార్యాలను చేయటం మీ మట్టుకు మీరే
చూశారు. ఆయన తన శక్తిని, బలాన్ని మీకు చూపిం
చాడు. ప్రజలను పరీక్షించిన కష్టాలను మీరు చూశారు.
అద్భుతాలు మహాత్మ్యాలు మీరు చూశారు. సంభవించిన
యుద్ధాలు, భయంకర విషయాలు మీరు చూశారు.
35ఆయనే దేవుడు అని మీరు తెలుసుకొనేందుకు ఈ
సంగతులను యెహోవా మీకు చూపించాడు. ఆయన
లాంటి దేవుడు ఇంకొకడు ఎవరూ లేరు. 36యెహోవా
మీకు ఒక పాఠం ప్రబోధించేందుకు పరలోకంనుండి
ఆయన తన స్వరాన్ని మిమ్మల్ని విననిచ్చాడు. భూమి
మీద ఆయన తన మహా అగ్నిని మిమ్మల్ని చూడనిచ్చి,
దానిలోనుండి ఆయన మీతో మాట్లాడాడు.
37“యెహోవా మీ పూర్వీకులను ప్రేమించాడు.
అందుకే వారి సంతతివారైన మిమ్మల్ని ఆయన ఏర్పర
చుకొన్నాడు. మరియు అందుకే ఆయన మిమ్మల్ని
ఈజిప్టునుండి బయటకు రప్పించాడు. ఆయన మీతో
ఉండి తన మహా శక్తితో మిమ్మల్ని బయటకు తీసుకొని
వచ్చాడు. 38మీరు ముందుకు సాగినప్పుడు, మీ
ముందు బలమైన గొప్ప రాజులను యెహోవా బల
వంతంగా వెళ్లగొట్టాడు. అయితే వారి దేశంలోనికి
యెహోవా మిమ్మల్ని తీసుకొని వచ్చాడు. మీరు
నివసించేందుకు వారి దేశాన్ని ఆయన మీకు
యిచ్చాడు. పైగా నేటికీ ఈ దేశం యింకా మీదే.
39“అందుచేత నేడు మీరు జ్ఞాపకం చేసుకొని,
యెహోవా దేవుడని అంగీకరించాలి. పైన ఆకాశం
లోను, కింద భూమి మీదను ఆయనే దేవుడు. ఇంక

వేరే ఏ దేవుడూ లేడు. 40మరియు ఈ వేళ నేను
మీకు యిచ్చే ఆయన చట్టాలు, ఆజ్ఞలకు మీరు విధే
యులు కావాలి. అప్పుడు మీకూ, మీ తర్వాత జీవించే
పిల్లలకు అంతా శుభం అవుతుంది. శాశ్వతంగా మీదిగా
ఉండేందుకు మీ దేవుడైన యెహోవా మీకు యిస్తున్న
దేశంలో మీరు దీర్ఘకాలం జీవిస్తారు."

### భద్రతా పట్టణాలను మోషే ఏర్పాటు చేయటం

41అప్పుడు యోర్దాను నదికి తూర్పున మూడు
పట్టణాలను మోషే ఏర్పాటు చేసాడు. 42ప్రమాదవ
శాత్తూ ఒక వ్యక్తి మరో వ్యక్తిని చంపేస్తే, ఆ వ్యక్తి ఈ
మూడు పట్టణాల్లో ఒకదానికి పారిపోయి క్షేమంగా
ఉండొచ్చు. అతడు చంపేసిన మనిషిని అతడు ద్వేషిం
చలేదు, అతణ్ణి చంపాలని అనుకొలేదు అంటే, అతడు
ఈ పట్టణాల్లో ఒకదానికి వెళ్లి, మరణ శిక్షలేకుండా
ఉండవచ్చు.

43మోషే ఏర్పాటు చేసిన ఈ మూడు పట్టణాలు
ఏవంటే: రూబేను ప్రజలకోసం అరణ్యపు పీఠభూమి
ల్లోని బేసెరు; గాదు ప్రజలకోసం గిలాదులోని
రామోతు, మనష్షే ప్రజలకోసం బాషానులోని గోలాను.

### మోషే ధర్మశాస్త్రానికి పీఠిక

44ఇశ్రాయేలు ప్రజలకు దేవుని ధర్మశాస్త్రాన్ని మోషే
యిచ్చాడు.

45ఆ ప్రజలు ఈజిప్టునుండి బయటకు వచ్చిన
తర్వాత ఈ ప్రబోధాలు, ఆజ్ఞలు, నియమాలు మోషే
వారికి యిచ్చాడు.

46యోర్దాను నదికి తూర్పు వైపున వారు
ఉన్నప్పుడు బేత్పయోరు అవతల లోయలో మోషే
వారికి ఈ ఆజ్ఞలు యిచ్చాడు. హెష్బోనులో నివసించిన
అమోరీయుల రాజైన సీహోను దేశంలో అప్పుడు
వారు ఉన్నారు. (వారు ఈజిప్టునుండి బయటకు
వచ్చినప్పుడు మోషే, ఇశ్రాయేలు ప్రజలూ సీహో
నును ఓడించారు. 47వారికోసం ఉంచు కొనేందుకు
వారు సీహోను దేశాన్ని స్వాధీనం చేసుకొన్నారు.
బాషాను రాజైన ఓగు దేశాన్ని కూడ వారు స్వాధీనం
చేసుకొన్నారు. ఈ యిద్దరు అమోరీ రాజులు
యోర్దాను నది తూర్పువైపున నివసించారు.
48అర్నోను లోయను ఆనుకొనివున్న అరోయేరు
పట్టణం నుండి, హెర్మోను కొండ అనబడిన సిరి
యోను* కొండవరకు ఉంది ఈ దేశం. 49యోర్దాను
నదికి తూర్పునవున్న యోర్దాను లోయ ప్రదేశం
అంతా ఈ దేశంలోనే ఉంది. దక్షిణాన మృత సము
ద్రాన్ని, తూర్పున పిస్గా కొండ చరియను తాకుతుంది
ఈ దేశం.)

---

**సిరియోను** లేక సీయోను.

### పది ఆజ్ఞలు

5 మోషే ఇశ్రాయేలు ప్రజలందరినీ సమావేశపరచి,
వారితో యిలా చెప్పాడు: "ఇశ్రాయేలు ప్రజలారా,
నేడు మీకు నేను చెప్పే ఆజ్ఞలను, నియమాలను
వినండి. ఈ ఆజ్ఞలను నేర్చుకొని, తప్పక వాటికి విధే
యులవ్వండి. 2హోరేబు (సీనాయి) కొండ దగ్గర
మన దేవుడైన యెహోవా మనతో ఒక ఒడంబడిక
చేసాడు. 3యెహోవా ఈ ఒడంబడికను మన పూర్వీకు
లతో చేయలేదుగాని మనతో, అవును నేడు సజీవులుగా
ఇక్కడ ఉన్న మన అందరితో చేసాడు. 4ఆ కొండ
దగ్గర యెహోవా మీతో ముఖాముఖిగా మాట్లాడాడు.
అగ్నిలో నుండి ఆయన మీతో మాట్లాడాడు. 5ఎందు
కంటే మీరు ఆ అగ్నికి భయపడి, కొండమీదికి
వెళ్లేందుకు నిరాకరించారు. కనుక ఆ సమయంలో
యెహోవా చెప్పిన దానిని మీతో చెప్పడానికి నేను
యెహోవాకు, మీకు మధ్య నిలబడ్డాను. యెహోవా
ఇలా చెప్పాడు: 6మీరు బానిసలుగా జీవించిన ఈజిప్టు
దేశంనుండి మిమ్మల్ని బయటకు రప్పించిన మీ దేవుణ్ణి
యెహోవాను నేనే. కనుక మీరు ఈ ఆజ్ఞలకు
విధేయులుగా ఉండండి.

7"నన్ను తప్ప మరి ఏ దేవుళ్లనూ ఆరాధించవద్దు.

8"పైన ఆకాశంలోగాని, కింద భూమిమీదగాని, ఆ
కింద సముద్రంలోగాని దేని విగ్రహమైనా, రూపం
అయినా చేసుకోవద్దు.

9ఎలాంటి విగ్రహాలను కూడా పూజించవద్దు,
సేవించవద్దు. ఎందుకంటే నేనే మీ దేవుడైన
యెహోవాను. మరియు వాళ్ల పిల్లలను, పిల్లల
పిల్లలను, ఆ పిల్లల పిల్లలను నేను శిక్షిస్తాను. 10అయితే
నన్ను ప్రేమించి, నా ఆజ్ఞలకు విధేయు లయ్యే
ప్రజలయెడల నేను చాలా దయ చూపిస్తాను.
అలాంటివారి వంశీయుల్లో వెయ్యితరాల వారివరకు
నేను దయ చూపిస్తాను.

11"మీ దేవుడైన యెహోవా పేరును వ్యర్థంగా
పలుకవద్దు. ఒక వ్యక్తి యెహోవా పేరును వ్యర్థంగా
పలికితే అతడు దోషి. యెహోవా అతణ్ణి నిర్దోషిగా
ఎంచడు.

12"సబ్బాతు రోజుకు ప్రత్యేక ప్రాముఖ్యతను
ఇచ్చేందుకు జ్ఞాపకం ఉంచుకోవాలి. వారం లోని ఇతర
దినాలకంటే విశ్రాంతి దినాన్ని వేరుగా ఉంచమని మీ
దేవుడైన యెహోవా మీకు ఆజ్ఞ యిచ్చాడు.
13మొదటి ఆరు రోజులు మీ పని చేసుకొనేందుకు.
14అయితే ఏడో రోజు మీ దేవుడైన యెహోవా
గౌరవార్థం విశ్రాంతి రోజు అవుతుంది. కనుక విశ్రాంతి
రోజున ఏ వ్యక్తీ పని చేయకూడదు. అంటే మీరు, మీ
కుమారులు, మీ కుమార్తెలు, మీ ఆడ, మగ బానిసలు,
మీ ఆవులు, మీ గాడిదలు, ఏ ఇతర జంతువులు, మీ
పట్టణాల్లో నివసిస్తున్న విదేశీయులు, మీ బానిసలు

కూడ మీవలెనే విశ్రాంతి తీసుకోగలగాలి. [15]ఈజిప్టులో
ఉన్నప్పుడు మీరూ బానిసలే అని మరచిపోవద్దు. మీ
దేవుడైన యెహోవా తన మహా శక్తితో ఈజిప్టునుండి
మిమ్మల్ని బయటకు తీసుకొని వచ్చాడు. ఆయన
మిమ్మల్ని స్వతంత్రులుగా చేసాడు. అందుచేతనే
ఎల్లప్పుడూ సబ్బాతు రోజును ఒక ప్రత్యేక రోజుగా
ఆచరించాలని మీ దేవుడైన యెహోవా మీకు ఆజ్ఞాపి
స్తున్నాడు. [16]"నీ తండ్రిని, నీ తల్లిని సన్మానించు.
నీవు యిలా చేయాలని నీ దేవుడైన యెహోవా నీకు
ఆజ్ఞ యిచ్చాడు. నీవు ఈ ఆజ్ఞను పాటిస్తే, నీవు
చాలాకాలం బ్రతుకుతావు. నీ దేవుడైన యెహోవా
నీకు ఇస్తున్న దేశంలో అంతా శుభం అవుతుంది.
[17]"ఎవరినీ హత్య చేయవద్దు."
[18]"వ్యభిచార పాపం చేయవద్దు."
[19]"ఏమీ దొంగిలించకు."

[20]"మరో వ్యక్తి చేసిన దాన్నిగూర్చి అబద్ధసాక్ష్యము
చెప్పకు.
[21]"మరొకరికి చెందినవి నీవైయుంటే బాగుండునని
ఆశించకు. ఇంకో వ్యక్తి భార్యను, అతని యింటిని,
అతని పొలాలను, అతని మగ లేక ఆడ పనివారిని,
అతని ఆవులను, అతని గాడిదలనుగాని ఇతరులకు
చెందిన దేనినిగాని నీవు ఆశించకూడదు."

### ప్రజలు దేవునికి భయపడటం

[22]"మీరంతా కలిసి ఆ కొండ దగ్గర ఉన్నప్పుడు
మీ అందరికీ ఈ ఆజ్ఞలను యెహోవా యిచ్చాడు.
అగ్ని, మేఘం, గాఢాంధకారంలోనుండి వచ్చిన పెద్ద
శబ్దంతో యెహోవా మాట్లాడాడు. ఆయన ఈ ఆజ్ఞలు
ఇచ్చిన తర్వాత యింకేమీ చెప్పలేదు. ఆయన తన
మాటలను రెండు రాతి పలకలమీద వ్రాసి వాటిని
నాకు ఇచ్చాడు.
[23]"పర్వతం అగ్నితో మండిపోతున్నప్పుడు అంధ
కారంలోనుంచి వచ్చిన ఆ స్వరం మీరు విన్నారు.
అప్పుడు, మీ వంశాల నాయకులు అందరూ, మీ
పెద్దలూ నా దగ్గరకు వచ్చారు. [24]వారు అన్నారు:
'మన దేవుడైన యెహోవా తన మహిమను, మహా
త్మ్యాన్ని మాకు చూపించాడు. ఆయన అగ్నిలోనుండి
మాట్లాడటం మేము విన్నాము. ఒక మనిషితో దేవుడు
మాట్లాడిన తర్వాత కూడ ఆ మనిషి బతకటం సాధ్య
మేనని ఈవేళ మేము చూశాము. [25]కానీ మన దేవుడైన
యెహోవా మాతో ఇంకొక్కసారి మాట్లాడటం గనుక
మేము వింటే మేము తప్పకుండా చస్తాము. ఆ భయం
కర అగ్ని మమ్మల్ని నాశనం చేసేస్తుంది. కానీ మేము
చావటం మాకు యిష్టంలేదు. [26]సజీవ దేవుడు మాట్లా
డటం మేము విన్నట్టుగా వినికూడ బతికిన మనిషి
ఎన్నడూ ఎవ్వడూ లేడు. [27]మోషే, నీవు దగ్గరగా
వెళ్లి, మన దేవుడైన యెహోవా చెబుతున్న సంగతు
లన్నీ విను. తర్వాత, యెహోవా నీకు చెప్పే విషయా
లన్నీ నీవు మాకు చెప్పు. మేము నీ మాట వింటాము,
నీవు చెప్పేది అంతా చేస్తాము.'

### మోషేతో యెహోవా మాట్లాడటం

[28]"మీరు నాతో చెప్పిన సంగతులను యెహోవా
విన్నాడు. అప్పుడు యెహోవా నాతో అన్నాడు,
'ఈ ప్రజలు చెప్పిన విషయాలు నేను విన్నాను.
వారు చెప్పింది అంతా మంచిదే. [29]వారు ఎల్లప్పుడూ
వారి హృదయాల్లో నన్ను గౌరవించి, నా ఆజ్ఞలన్నింటికీ
విధేయులైతే బాగుండును అని మాత్రమే నా కోరిక.
అప్పుడు వాళ్లకు, వాళ్ల సంతతివారికి సర్వం శుభం
అవుతుంది.'
[30]"'వెళ్లి, ప్రజలందరినీ వారి గుడారాలకు వెళ్లి
పొమ్మని చెప్పు. [31]అయితే మోషే, నీవు యిక్కడ
నాకు దగ్గరగా నిలబడు. నీవు వాళ్లకు నేర్పించాల్సిన
ఆజ్ఞలు, చట్టాలు, నియమాలు అన్నీ నీకు నేను చెబు
తాను. వారు జీవించేందుకు నేను వారికి ఇస్తున్న
దేశంలో వారు ఈ పనులు చేయాలి.' [32]"అందుచేత
యెహోవా మీకు ఆజ్ఞాపించిన వాటన్నింటినీ చేసేం
దుకు మీరు జాగ్రత్తగా వుండాలి. మీరు దేవుణ్ణి అనుస
రించటం మానకూడదు. [33]మీ దేవుడైన యెహోవా
మీకు ఆజ్ఞాపించిన విధంగా మీరు జీవించాలి. అప్పుడు
మీరు జీవించడం కొనసాగుతుంది, మీకు అంతా శుభ
ప్రదం అవుతుంది. మరియు మీది కాబోతున్న ఆ
దేశంలో మీ జీవితం పొడిగించబడుతుంది.

### ఎల్లప్పుడూ దేవుని ప్రేమించి, లోబడండి.

6 "నేను మీకు ప్రబోధించాలని మీ యెహోవా
దేవుడు నాకు చెప్పిన ఆజ్ఞలు, నియమాలు, ఇవి:
మీరు నివసించేందుకు ప్రవేశిస్తున్న దేశంలో ఈ ఆజ్ఞ
లకు లోబడండి. [2]మీరూ, మీ సంతతివారు బదికినంత
కాలం మీ దేవుడైన యెహోవాను గౌరవించాలి. నేను
మీకు యిచ్చే ఆయన నియమాలు, ఆజ్ఞలు అన్నింటికీ
మీరు విధేయులు కావాలి. మీరు ఇలా చేస్తే, ఆ కొత్త
దేశంలో మీరు దీర్ఘకాలం బతుకుతారు. [3]ఇశ్రాయేలు
ప్రజలారా, జాగ్రత్తగా వినండి. ఈ ఆజ్ఞలకు విధేయు
లుగా ఉండండి. అప్పుడు మీకు అంతా శుభం అవు
తుంది. మరియు మీరు ఒక గొప్ప రాజ్యం అవుతారు.
ఐశ్వర్యవంతమైన ఆ మంచి దేశంలో* వీటన్నింటినీ
మీ పూర్వీకుల దేవుడైన యెహోవా మీకు వాగ్దానం
చేసాడు. [4]"ఇశ్రాయేలు ప్రజలారా వినండి: యెహోవా
ఒక్కడు మాత్రమే మన దేవుడు. [5]మరియు మీరు మీ

---

**ఐశ్వర్య ... దేశంలో** "పాలు, తేనెలు ప్రవహించు చున్న దేశం" అని పాఠాంతరం.

నిండు హృదయంతోను, మీ నిండు ఆత్మతోను, మీ
నిండు బలంతోను మీ దేవుడైన యెహోవాను ప్రేమిం
చాలి. 6ఈవేళ నేను మీకు ఇస్తున్న ఈ ఆజ్ఞలను ఎల్ల
ప్పుడూ జ్ఞాపకం ఉంచుకోండి. 7వాటిని మీ పిల్లలకు
నేర్పించేందుకు జాగ్రత్త వహించండి. మీరు మీ
యింట్లో కూర్చున్నప్పుడు, మార్గంలో నడుస్తున్న
ప్పుడు ఈ ఆజ్ఞలను గూర్చి మాట్లాడుతూ ఉండండి.
మీరు పడుకొనేప్పుడు, లేచినప్పుడు వాటిని గూర్చి
మాట్లాడుతు ఉండండి. 8నా ప్రబోధాలను జ్ఞాపకం
ఉంచుకొనేందుకు సహాయకరంగా ఈ ఆజ్ఞలను మీ
చేతులకు కట్టుకోండి, మీ నొసట బాసికంలా ధరిం
చండి.

9మీ ఇండ్ల ద్వార బంధాలమీద, గవునుల మీద
వాటిని వ్రాయండి."

10"మీకు యిస్తానని చెప్పి మీ పూర్వీకులైన అబ్రా
హాము ఇస్సాకు, యాకోబులకు ఆయన వాగ్దానం చేసిన
ఆ దేశంలోనికి మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని
తీసుకొనివస్తాడు. అప్పుడు మీరు నిర్మించని గొప్ప,
ధనిక పట్టణాలను ఆయన మీకు ఇస్తాడు. 11మీరు
సమకూర్చని మంచి వస్తువులతో నిండిపోయిన గృహా
లను ఆయన మీకు ఇస్తాడు. మీరు త్రవ్వని బావులను
యెహోవా మీకు ఇస్తాడు. మీరు నాటని ద్రాక్షాతోట
లను, ఒలీవ చెట్లను యెహోవా మీకు ఇస్తాడు. భోజ
నానికి మీకు సమృద్ధిగా ఉంటుంది. 12"కానీ జాగ్రత్తగా
ఉండండి. మీరు బానిసలుగా జీవించిన ఈజిప్టు దేశం
నుండి మిమ్మల్ని బయటకు తీసుకొని వచ్చిన
యెహోవాను మరచిపోకండి. 13మీ దేవుడైన యెహో
వాను గౌరవించి ఆయనను మాత్రమే సేవించండి.
ఆయన పేరు మీద మాత్రమే ప్రమాణాలు చేయాలి.
(బూటకపు దేవుళ్ల పేర్లు ఉపయోగించవద్దు).

14మీరు యితర దేవుళ్లను అనుసరించకూడదు.
మీ చుట్టూ నివసించే ప్రజల దేవుళ్లను మీరు అనుస
రించకూడదు.

15మీ దేవుడైన యెహోవా ఎల్లప్పుడూ మీతో
ఉన్నాడు. మరియు మీరు ఆ ఇతర దేవుళ్లను వెంబడిస్తే,
యెహోవాకు మీ మీద చాలా కోపం వస్తుంది.
మిమ్మల్ని ఈ భూమి మీద ఉండకుండా ఆయన
నాశనం చేస్తాడు. ఆయన ప్రజలు ఇతర దేవుళ్లను
పూజించటం యెహోవా ద్వేషిస్తాడు. 16"మస్సాలో
మీరు ఆయనను పరీక్షించినట్టుగా మీ దేవుడైన
యెహోవాను మీరు పరీక్షించకూడదు.

17మీ దేవుడైన యెహోవా ఆజ్ఞలకు మీరు తప్ప
నిసరిగా విధేయులు కావాలి. ఆయన మీకు ఇచ్చిన
ప్రబోధాలు, ఆజ్ఞలు అన్నింటినీ మీరు పాటించాలి.
18సరైనవి, మంచివి, యెహోవాను సంతోషపెట్టేవి
మాత్రమే మీరు చేయాలి. అప్పుడు మీకు అంతా
మేలు జరిగి, యెహోవా మీ పూర్వీకులకు వాగ్దానం
చేసిన దేశంలో మీరు ప్రవేశించి, ఆ మంచి దేశాన్ని
స్వాధీనం చేసుకోగలుగుతారు. 19మరియు యెహోవా
చెప్పినట్టు మీరు మీ శత్రువులందరినీ బలవంతంగా
బయటకు వెళ్లగొడ్తారు.

### దేవుడు చేసిన వాటిని పిల్లలకు నేర్పించాలి

20"భవిష్యత్తులో 'మన దేవుడైన యెహోవా
మనకు ప్రబోధాలు, ఆజ్ఞలు, నియమాలు యిచ్చాడు
గదా, వాటి అర్థం ఏమిటి?' అని నీ కుమారుడు నిన్ను
అడగవచ్చును. 21అప్పుడు నీవు నీ కుమారునితో
ఇలా చెప్పాలి, 'మనం ఈజిప్టులో ఫరోకు బానిసలం,
అయితే యెహోవా మహా బలంతో ఈజిప్టునుండి
మనలను బయటకు తీసుకొని వచ్చాడు. 22మహా
గొప్ప, ఆశ్చర్యకరమైన నిదర్శనాలు, అద్భుతాలు
యెహోవా మనకు చూపించాడు. ఈజిప్టు ప్రజలకు,
ఫరోకు, ఫరో ఇంటివాళ్లకు ఆయన ఈ సంగతులు
జరిగించటం మనం చూశాము. 23 మరియు
యెహోవా మన పూర్వీకులకు వాగ్దానం చేసిన దేశాన్ని
మనకు ఇచ్చేందుకు ఆయన మనలను ఈజిప్టునుండి
బయటకు తీసుకొని వచ్చాడు. 24ఈ ప్రబోధాలన్నీ
పాటించాలని యెహోవా మనకు ఆజ్ఞాపించాడు.
అప్పుడు, మనం ఇప్పుడు ఉన్నట్టుగా ఎల్లప్పుడూ
క్షేమంగా సజీవులంగా ఉండేటట్లు మన దేవుడైన
యెహోవా మనలను కాపాడతాడు. 25మనం పాటించా
లని ఆయన మనకు ఆజ్ఞాపించిన ప్రకారం మనం
ఆజ్ఞలన్నింటికీ విధేయులం అవటం మనకు మంచిదిగా
దేవుడైన యెహోవా చూస్తాడు.'

### ఇశ్రాయేలీయులు దేవుని ప్రత్యేక ప్రజలు

7 "మీరు స్వాధీనం చేసుకొనేందుకు ప్రవేశించబో
తున్న దేశంలోనికి మీ దేవుడైన యెహోవా
మిమ్ములను తీసుకొని వస్తాడు. అనేక రాజ్యాలవాళ్లను–
హిత్తీయులు, గిర్గాషీయులు, అమోరీయులు, కనానీ
యులు, పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూసీ
యులు – మీకంటె బలంగల ఏడు గొప్ప రాజ్యాల
వాళ్లను మీకోసం యెహోవా బలవంతంగా బయటకు
వెళ్లగొడ్తాడు. 2ఈ రాజ్యాలను మీ దేవుడైన యెహోవా
మీ అధికారం కింద ఉంచుతాడు. మీరు వారిని ఓడిస్తారు.
మీరు వాళ్లను సర్వనాశనం చేయాలి. వాళ్లతో ఏ ఒడం
బడిక చేసుకోవద్దు. వాళ్లకు దయ చూపించవద్దు. 3ఆ
ప్రజల్లో ఎవరినీ పెళ్లి చేసుకోవద్దు, ఆ ఇతర రాజ్యాలకు
చెందిన ఎవరినీ మీ కుమారులనుగాని కుమార్తెలనుగాని
పెళ్లి చేసుకోనివ్వవద్దు. 4ఎందుకంటే మీ పిల్లలు నన్ను
వెంబడించకుండా ఆ ఇతరులు వారిని మళ్లిస్తారు.
అప్పుడు మీ పిల్లలు ఇతర దేవుళ్లను సేవిస్తారు. కనుక
యెహోవా మీ మీద కోపగిస్తాడు. వెంటనే ఆయన
మిమ్మల్ని నాశనం చేస్తాడు.

### బూటకపు దేవుళ్లను నాశనం చేయండి

[5]“ఈ రాజ్యాలకు మీరు చేయాల్సింది యిదే: మీరు
వారి బలిపీఠాలను విరుగగొట్టి, వాళ్ల స్మారక శిలలను
ముక్కలుగా చేయాలి. వారి ఆశేర స్తంభాలను* నరికి
వేసి, వారి విగ్రహాలను కాల్చివేయండి. [6]ఎందుకంటే
మీరు యెహోవాకు స్వంత ప్రజలు. భూమిమీద
మొత్తం ప్రజలందరిలో మీరు ఆయనకు ప్రత్యేక ప్రజగా
ఉండేందుకు – కేవలం ఆయనకు మాత్రమే చెందిన
వారుగా మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ఏర్పాటు
చేసుకొన్నాడు. [7]యెహోవా ఎందుకు ప్రేమించి,
ఏర్పాటు చేసుకొన్నాడు? ఇతర ప్రజలకంటే మీరు
ఎక్కువమంది ఉన్నారని కాదు. సమస్త జనులలో మీరే
అతి తక్కువ సంఖ్యవారు. [8]అయితే యెహోవా
మహాశక్తితో మిమ్మల్ని ఈజిప్టునుండి బయటకు తీసు
కొని వచ్చాడు. బానిసత్వంనుండి ఆయన మిమ్మల్ని
స్వతంత్రులను చేసాడు. ఈజిప్టు రాజు ఫరో అధికారం
నుండి ఆయన మిమ్మల్ని విడుదల చేసాడు. ఎందు
కంటే యెహోవా మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు గనుకను,
మీ పూర్వీకులకు ఆయన చేసిన వాగ్దానాన్ని నిలుపు
కోవాలనీ ఆయన అలా చేసాడు.

[9]“అందుచేత మీ దేవుడైన యెహోవా ఒక్కడే
దేవుడు, ఆయన నమ్మదగినవాడు అని జ్ఞాపకం ఉంచు
కోండి. ఆయన తన ఒడంబడికను నిలబెట్టుకొంటాడు.
ఆయనను ప్రేమించి, ఆయన ఆజ్ఞలకు విధేయు
లయ్యే వారందరికీ ఆయన తన ప్రేమ, దయ చూపు
తాడు. వేయి తరాలవరకు ఆయన తన ప్రేమ, దయ
చూపిస్తూనే ఉంటాడు.

[10]అయితే యెహోవాను ద్వేషించే ప్రజలను
ఆయన శిక్షిస్తాడు. వాళ్లను ఆయన నాశనం చేస్తాడు.
ఆయనను ద్వేషించే మనిషిని శిక్షించటంలో ఆయన
నిదానించడు.

[11]కనుక నేడు మీకు నేను ఇస్తున్న ఆజ్ఞలు, చట్టాలు,
నియమాలు విధేయత చూపే విషయంలో మీరు
జాగ్రత్తగా ఉండాలి.”

[12]“మీరు ఈ ఆజ్ఞలను ఆలకించి, వాటికి జాగ్రత్తగా
విధేయులైతే, మీ దేవుడైన యెహోవా మీతో చేసిన
ప్రేమ ఒడంబడికను నిలబెట్టుకొంటాడు. మీ పూర్వీకు
లకు ఆయన యిది వాగ్దానం చేసాడు. [13]ఆయన
మిమ్మల్ని ప్రేమిస్తాడు, ఆశీర్వదిస్తాడు. మీ ప్రజల
సంఖ్య యింకా యింకా పెరిగిపోతుంది. ఆయన మీ
పిల్లల్ని ఆశీర్వదిస్తాడు. మీ పొలాలను మంచి పంటలతో
ఆయన ఆశీర్వదిస్తాడు. ధాన్యం, కొత్త ద్రాక్షారసం,
నూనె ఆయన మీకు ఇస్తాడు. మీ ఆవులకు దూడలను,
గొర్రెలకు గొర్రె పిల్లలను ఇచ్చి ఆయన ఆశీర్వాది
స్తాడు. మీకు ఇస్తానని ఆయన మీ పూర్వీకులకు
వాగ్దానం చేసిన దేశంలో మీకు ఈ ఆశీర్వాదాలన్నీ
లభిస్తాయి. [14]“ప్రజలందరికంటే మీరు ఎక్కువగా ఆశీ
ర్వదించబడతారు. భార్యాభర్తల ప్రతి జంటకూ పిల్లలు
పుడతారు. మీ పశువులకు దూడలు పుడతాయి.
[15]సమస్త రోగాలనూ యెహోవా మీ నుండి తొల
గించివేస్తాడు. ఇంతకు ముందు ఈజిప్టులో మీకు కలిగిన
భయంకర వ్యాధులు ఏవీ ఆయన మీకు రానివ్వడు.
కానీ ఈ వ్యాధులన్నింటిని మిమ్మల్ని ద్వేషించేవారిమీద
ఆయన ఉంచుతాడు. [16]మీరు ఎవరిని ఓడించేందుకు
మీ దేవుడైన యెహోవా సహాయం చేస్తాడో, ఆ
ప్రజలందరినీ మీరు నాశనం చేయాలి. వారిమీద జాలి
పడవద్దు. మరియు వారి దేవుళ్లను సేవించవద్దు. ఎందు
కంటే వారు మీకు ఉరియవుతారు. మీరు వారి దేవుళ్లను
సేవిస్తే, మీరు శిక్ష అనుభవిస్తారు.

### యెహోవా తన ప్రజలకు సహాయం చేస్తానని వాగ్దానం చేయుట

[17]“‘ఈ రాజ్యాలు మనకంటే బలమైనవి. వారిని
మనం ఎలా వెళ్లగొట్టగలము?’ అని మీ హృదయంలో
అనుకోవద్దు. [18]వారిని గూర్చి మీరు భయపడకూడదు.
ఫరోకు, ఈజిప్టు ప్రజలందరకు మీ దేవుడైన
యెహోవా చేసిన దానిని మీరు బాగా జ్ఞాపకం ఉంచు
కోవాలి. [19]ఆయన వారికి కలిగించిన మహా కష్టాలను
మీరు చూశారు. ఆయన చేసిన అద్భుతాలు, మహత్కా
ర్యాలు మీరు చూశారు. మిమ్మల్ని ఈజిప్టునుండి
బయటకు రప్పించేందుకు యెహోవా ప్రయోగించిన
ఆయన మహాశక్తిని, బలాన్ని మీరు చూశారు. మీరు
భయపడే వారందరి మీదా అదే శక్తిని మీ దేవుడైన
యెహోవా ప్రయోగిస్తాడు.

[20]“మీ దగ్గర్నుండి పారిపోయి, దాక్కున్న వాళ్లం
దరినీ పట్టుకొనేందుకు మీ దేవుడైన యెహోవా
కందిరీగలను సహా పంపిస్తాడు. ఆ ప్రజలందరినీ దేవుడు
నాశనం చేస్తాడు.

[21]మీ దేవుడైన యెహోవా మీకు తోడుగా
ఉన్నాడు గనుక వారినిగూర్చి భయపడవద్దు. ఆయన
మహాగొప్పవాడు, భీకరుడునైన దేవుడు. [22]ఆ రాజ్యాల
ప్రజలు మీ దేశాన్ని కొంచెంకొంచెంగా విడిచి వెళ్లి
పోయేటట్టు మీ దేవుడైన యెహోవా వారిని బల
వంతపెడ్తాడు. వాళ్లందరినీ ఒకేసారిగా మీరు నాశనం
చేయరు. మీరు అలా చేస్తే మీకు అడవి మృగాల బాధ
విపరీతంగా పెరిగిపోతుంది. [23]అయితే మీ దేవుడైన
యెహోవా ఆ రాజ్యాలను మీకు ఇస్తాడు. వారు నాశనం
అయ్యేంతవరకు గొప్ప చిక్కుతో యెహోవా వారిని
యుద్ధంలో గందరగోళ పరుస్తాడు. [24]వారి రాజులను
ఓడించటానికి యెహోవా మీకు సహాయం చేస్తాడు.

---

**ఆశేర స్తంభాలు** ఆశేరు దేవతను గౌరవించటానికి ఉపయోగించబడ్డ స్తంభాలు. ఎక్కువ పిల్లలు కలగటానికి ఆమె సహాయపడుతుందని ప్రజలు నమ్మారు.

మీరు వారిని చంపేస్తారు, వారు ఎన్నడైనా జీవించిన
విషయం కూడా ప్రపంచం మరచిపోతుంది. మిమ్మల్ని
అడ్డగించటం ఏ మనిషి తరం కాదు. మీరు వాళ్లందరినీ
నాశనం చేస్తారు. 25"మీరు వారి దేవుళ్ల విగ్రహాలను
తప్పక కాల్చి వేయాలి. ఆ విగ్రహాల మీద ఉండే
బంగారంకానీ వెండి గానీ మీరు తీసుకొంటే
బాగుంటుందని మీరు ఆశించ కూడదు. ఆ వెండిగాని,
బంగారంగాని మీకోసం మీరు తీసుకోకూడదు. మీరు
అలా చేస్తే, మీరు చిక్కులో పెట్టబడతారు. (మీ
జీవితాలు నాశనం అవుతాయి) ఎందుకంటే మీ
యెహోవా దేవునికి ఆ విగ్రహాలు అసహ్యం.
26యెహోవా అసహ్యించుకొనే ఆ విగ్రహాల్లో
ఒక్కటికూడా మీరు మీ ఇంటిలోనికి తీసుకొని రాకూ
డదు. ఆ విగ్రహాలను మీరు మీ ఇంట్లోకి తీసుకొనివస్తే,
ఆ విగ్రహాలవలె మీరూ కూడా నాశనం చేయబడతారు.
మీరు వాటిని బాగా అసహ్యించుకోవాలి. ఆ విగ్రహాలను
నాశనం చేస్తానని దేవుడు ప్రమాణం చేసాడు.

### యెహోవాను జ్ఞాపకం చేసుకోండి

8 "ఈ వేళ నేను మీకు యిచ్చే ఆజ్ఞలు అన్నింటినీ
మీరు విని, విధేయులు కావాలి. అప్పుడు మీరు
జీవిస్తారు. మీరు యింకా యింకా అనేకమందిగా పెరిగి
పోతారు. మీ పూర్వీకులకు యెహోవా వాగ్దానం చేసిన
దేశంలో మీరు ప్రవేశించి, జీవిస్తారు. 2ఈ 40 సంవత్స
రాలు మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని అరణ్యంలో
నడిపించిన ఈ ప్రయాణం మొత్తం మీరు జ్ఞాపకం
ఉంచుకోవాలి. యెహోవా మిమ్మల్ని పరీక్షించాడు.
మిమ్మల్ని ఆయన దీనులుగా చేయాలి అనుకొన్నాడు.
మీరు ఆయన ఆజ్ఞలకు విధేయులవుతున్నారో లేదో,
మీ హృదయంలోని సంగతి ఆయన తెలుసుకోవాలి
అనుకొన్నాడు. 3యెహోవా మిమ్మల్ని అణచి వేసి,
ఆకలితో ఉండనిచ్చాడు. తర్వాత మీ పూర్వీకులు
ఎన్నడూ చూడని, మీకు యింతకు ముందు తెలియని
మన్నాతో* మిమ్మల్ని ఆయన పోషించాడు.
యెహోవా ఎందుకు ఈ సంగతులు జరిగించాడు?
ఎందుకంటే మనుష్యుల్ని ఆహారం మాత్రమే బ్రతి
కించదు అని మీరు తెలుసుకోవాలని ఆయన కోరాడు
గనుక. మనుష్యులు యెహోవా నోటనుండి వచ్చే
ప్రతి మాటవలన బ్రదుకుతారు. 4గడచిన ఈ 40
సంవత్సరాల్లో మీ బట్టలు చినిగిపోలేదు. మరియు మీ
పాదాలు వాచిపోకుండ యెహోవా మిమ్మల్ని కాపా
డాడు. 5ఒక తండ్రి తన కుమారునికి ప్రబోధం చేసినట్టే,
మీకు ప్రబోధంచేసి, మిమ్మును సరిదిద్దేందుకే మీ దేవు
డైన యెహోవా ఈ సంగతులన్నీ జరిగించాడని మీరు
తెలుసుకోవాలి.
6"మీ దేవుడైన యెహోవా ఆజ్ఞలన్నింటికీ మీరు
విధేయులు కావాలి. ఆయన మార్గాలలో నడుచుకొని,
ఆయనను గౌరవించాలి. 7నదులు, నీటి మడుగులు
ఉండి, కొండల్లో, లోయల్లో నీటి ఊటలు ప్రవహించే
మంచి దేశంలోనికి మీ దేవుడైన యెహోవా మిమ్మును
తీసుకొని వస్తున్నాడు. 8అది గోధుమ యవలు, ద్రాక్షా
తోటలు, అంజూరపు చెట్లు, దానిమ్మ చెట్లతో నిండిన
దేశం. ఒలీవ నూనె, తేనెగల దేశం అది. 9అక్కడ
మీకు ఆహారం సమృద్ధిగా ఉంటుంది. మీరు ఏమీ
లేకుండా ఉండరు. ఆ దేశంలో మీరు ఆ కొండలు
తవ్వి రాళ్లు, యినుము, రాగి తీయవచ్చును. 10మీరు
తినాలని ఆశించేవి అన్నీ మీకు దొరుకుతాయి.
అప్పుడు మీకు ఆయన యిచ్చిన మంచి దేశం కోసం
మీరు మీ దేవుడైన యెహోవాను స్తుతిస్తారు."

### యెహోవా చేసినదాన్ని మరచిపోకండి

11"జాగ్రత్తగా ఉండండి మీ దేవుడైన యెహోవాను
మరచిపోవద్దు. ఈ వేళ నేను మీకు ఇస్తున్న ఆజ్ఞలు,
చట్టాలు, నియమాలు జాగ్రత్తగా పాటించండి. 12మీరు
తినేందుకు ఆహారం సమృద్ధిగా మీకు ఉంటుంది, మీరు
మంచి యిళ్లు కట్టుకొని వాటిలో నివాసం చేస్తారు.
13మీ పశువులు, మందలు విస్తారంగా పెరుగుతాయి.
మీకు మరింత ఎక్కువ వెండి బంగారం ఉంటుంది.
మీకు విస్తారంగా వస్తుసామగ్రి ఉంటుంది. 14అలా జరిగి
నప్పుడు మీరు గర్వించకుండా జాగ్రత్తగా ఉండాలి.
మీ దేవుడైన యెహోవాను మీరు మరచిపోకూడదు.
మీరు బానిసలుగా ఉన్న ఈజిప్టు దేశంనుండి ఆయనే
మిమ్మల్ని బయటికి తీసుకొని వచ్చాడు. 15భయంకర
మైన మహాగొప్ప అరణ్యంలో మిమ్మల్ని యెహోవా
నడిపించాడు. ఆ అరణ్యంలో విషసర్పాలు, తేళ్లు
ఉండినవి. నేల ఎండిపోయి, ఎక్కడా నీళ్లు లేవు. కానీ
యెహోవా మీకు బండలో నుండి నీళ్లు ఇచ్చాడు.
16మీ పూర్వీకులు ఎన్నడూ ఎరుగని మన్నాతో
ఆయన మిమ్మల్ని అరణ్యంలో పోషించాడు.
యెహోవా మిమ్మల్ని పరీక్షించాడు. ఎందుకంటే
యెహోవా మిమ్మల్ని దీనులుగా చేయాలను
కొన్నాడు. అంతంలో మీకు అంతా మంచి జరగాలని
ఆయన కోరాడు. 17'ఈ ఐశ్వర్యం అంతా నా శక్తి
సామర్థ్యాలతో సంపాదించాను' అని ఎన్నడూ మీలో
మీరు అనుకోవద్దు. 18మీ దేవుడైన యెహోవాను
జ్ఞాపకం చేసుకోండి. ఐశ్వర్యం సంపాదించుకొనేందుకు
శక్తిని యిచ్చేవాడు ఆయనే అని జ్ఞాపకం ఉంచుకోండి.
యెహోవా ఎందుకు ఇలా చేస్తాడు? ఎందుకంటే మీ
పూర్వీకులతో ఆయన చేసిన ఒడంబడికను ఈ వేళ
ఆయన నిలబెట్టు కొంటున్నాడు గనుక.

---

**మన్నా** దేవుడు, ఇశ్రాయేలీయులు అరణ్యంలో 40 సంవత్సరాలు ప్రయాణం చేసినప్పుడు వారికి ఆకాశమునుండి పంపిన ప్రత్యేక ఆహారం.

19“ఎన్నటికీ మీ దేవుడైన యెహోవాను మరువ
కండి. ఇతర దేవుళ్లను పూజించి సేవించేందుకు
ఎన్నడూ వాటిని అనుసరించవద్దు. మీరు అలా గనుక
చేస్తే, ఈ వేళే నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను;
నిశ్చయంగా మీరు నాశనం చేయబడతారు. 20దేశాలను
మీరు నాశనం చేసేటట్టు యెహోవా చేసాడు. మీ
ఎదుట దేశాలను యెహోవా నాశనం చేస్తున్నట్టుగానే
మీరూ నాశనం చేయబడతారు. మీ దేవుడైన యెహో
వాకు మీరు విధేయులు కాలేదు గనుక ఇలా
జరుగుతుంది.

## యెహోవా ఇశ్రాయేలీయులకు తోడుగా ఉంటాడు

9 “ఇశ్రాయేలు ప్రజలారా, వినండి, ఈ వేళ మీరు
యొర్దాను నది దాటుతారు. మీకంటె బలంగల
ఆ గొప్ప రాజ్యాలను బయటకు వెళ్లగొట్టేందుకు మీరు
ఆ దేశంలో ప్రవేశిస్తారు. వారి పట్టణాలు చాలా పెద్దవి,
వాటి గోడలు ఆకాశమంత ఎత్తున్నాయి. 2అక్కడి
ప్రజలు ఎత్తయిన వాళ్లు, బలం ఉన్నవాళ్లు. వారు
అనాకీయ ప్రజలు. ఆ ప్రజలను గూర్చి మీకు తెలుసు.
‘అనాకీయ ప్రజల మీద ఎవడూ గెలవలేడు’ అని మన
గూఢచారులు చెప్పటం మీరు విన్నారు.
3“అయితే మీ దేవుడైన యెహోవా నాశనం చేసే
అగ్నిలా మీకు ముందర ఆ నదిని దాటుతాడని మీరు
ధైర్యంగా ఉండొచ్చు. ఆ దేశాలను యెహోవా నాశనం
చేస్తాడు. వాళ్లు మీ ముందు పతనమయ్యేలా ఆయన
చేస్తాడు. ఆ దేశస్తులను మీరు బయటకు వెళ్ల
గొట్టేస్తారు. త్వరగా మీరు వారిని నాశనం చేస్తారు.
ఇలా జరుగుతుందని యెహోవా మీకు వాగ్దానం
చేసాడు.
4“ఆ రాజ్యాల వాళ్లను మీనుండి మీ దేవుడైన
యెహోవా బయటకు వెళ్లగొట్టిన తర్వాత ‘మా
స్వంత నీతి జీవితాల మూలంగానే ఈ దేశంలో జీవించేం
దుకు యెహోవా మమ్మల్ని తీసుకొనివచ్చాడు’ అని
మీలో మీరు అనుకోవద్దు. ఆ రాజ్యాలవాళ్లను మీనుండి
యెహోవా వెళ్లగొట్టాడు, ఎందుకంటే వారు జీవించిన
చెడు మార్గంవల్లనే.
5“మీరు వాళ్ల దేశాన్ని స్వాధీనం చేసుకొనేందుకు
అందులో ప్రవేశిస్తున్నారంటే మీరేదో మంచివాళ్లు,
నీతిగా బతుకుతున్నారు అని కాదు. వాళ్లు చెడుమార్గా
లలో జీవించడంవల్లనే మీ దేవుడైన యెహోవా వాళ్లను
బయటకు వెళ్లగొడుతున్నాడు, మీరు లోనికి వెళ్తు
న్నారు. మరియు మీ పూర్వీకులు అబ్రాహాము,
ఇస్సాకు, యాకోబులకు యెహోవా చేసిన వాగ్దానం
నెరవేరాలని ఆయన కోరుచున్నాడు.
6“మీరు నివసిం చేందుకు ఆ మంచి దేశాన్ని మీ
దేవుడైన యెహోవా మీకు ఇస్తున్నాడు, అయితే
అది మీ నీతి బ్రతుకు మూలంగా కాదని మీరు
తెలుసుకోవాలి. సత్యం ఏమిటంటే మీరు మొండి
ప్రజలు.”

## యెహోవా కోపాన్ని జ్ఞాపకం చేసుకోండి

7“అరణ్యంలో మీరు మీ దేవుడైన యెహోవాకు
కోపం పుట్టించారని మరచిపోవద్దు. మీరు ఈజిప్టు దేశం
నుండి బయటకు వెళ్లిన రోజునుండి ఈ చోటికి
వచ్చిన ఈ రోజువరకు మీరు యెహోవాకు లోబడు
టకు నిరాకరించారు. 8ఇంకా హోరేబు కొండ దగ్గర
కూడ మీరు యెహోవాకు కోపం పుట్టించారు.
మిమ్మల్ని నాశనం చేయాల్సినంత కోపం వచ్చింది
యెహోవాకు. 9రాతి పలకలను స్వీకరించటానికి నేను
కొండమీదికి వెళ్లినప్పుడు (యెహోవా మీతో చేసిన
ఒడంబడిక పలకలు) 40 పగళ్లు 40 రాత్రుళ్లు నేను
కొండమీదనే ఉన్నాను. నేను భోజనంచేయలేదు, నీళ్లు
త్రాగలేదు.
10అప్పుడు ఆ రాతి పలకలను యెహోవా నాకు
యిచ్చాడు. ఆ పలకలమీద యెహోవా తన వ్రేలితో
రాసాడు. మీరు ఆ కొండ దగ్గర సమావేశమై నప్పుడు
అగ్నిలోనుండి ఆయన మీతో చెప్పినవి అన్నీ ఆయన
రాసాడు.
11“కనుక 40 పగళ్లు 40 రాత్రుళ్లు అయిపోగానే,
ఒడంబడిక రాతి పలకలు రెండింటిని యెహోవా నాకు
ఇచ్చాడు. 12అప్పుడు ‘లేచి త్వరగా ఇక్కడనుండి కిందికి
వెళ్లు. ఈజిప్టు నుండి నీవు బయటకు తీసుకొనివచ్చిన
ప్రజలు వారిని వారే నాశనం చేసుకొన్నారు. నేను
వారికి ఆజ్ఞాపించిన విషయాల నుండి త్వరగా వారు
తిరిగిపోయారు. వారు బంగారం కరిగించి వారికోసం
ఒక విగ్రహం చేసుకొన్నారు’ అని యెహోవా నాతో
ఇలా చెప్పాడు.
13“ఇంకా యెహోవా నాతో ఇలా చెప్పాడు: ‘ఈ
ప్రజలను నేను గమనించాను. వాళ్లు చాలా మొండివాళ్లు.
14వారి పేర్లనుకూడ ఎన్నటికీ ఎవ్వరూ జ్ఞాపకం చేసు
కోకుండా నేను వాళ్లను పూర్తిగా నాశనం చేసేస్తాను.
తరువాత ఇశ్రాయేలు ప్రజలకంటె ఎక్కువ బలం గల
యింకా గొప్ప ప్రజలను నీనుండి నేను కలుగ జేస్తాను.’

## బంగారు దూడ

15“అప్పుడు నేను వెనక్కు తిరిగి కొండదిగి కిందికి
వచ్చాను. ఆ కొండ అగ్నితో మండుతోంది. ఒడం
బడిక రాతి పలకలు రెండు నా చేతిలో ఉన్నాయి.
16నేను చూసినప్పుడు కరిగించిన బంగారంతో మీరు
మీకోసం ఒక దూడను చేసుకొని, మీ దేవుడైన
యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేయటం గుర్తిం
చాను. యెహోవా మీకు ఆజ్ఞాపించిన మార్గం నుండి
మీరు త్వరగా తిరిగిపోయారు.

17అందుచేత నేను ఆ రెండు రాతి పలకలు తీసుకొని
నేలకేసి కొట్టాను. అక్కడ మీ కళ్లముందు ఆ పలకలను
నేను ముక్కలుగా విరుగగొట్టేసాను.
18అప్పుడు నేను మొదట సారిలాగ 40 పగళ్లు, 40
రాత్రుళ్లు యెహోవా యెదుట నేలమీద సాష్టాంగ
పడ్డాను. నేను భోజనం చేయలేదు, నీళ్లు తాగలేదు.
మీరు అంత ఘోరంగా పాపం చేసారు గనుక నేను
యిలా చేసాను. యెహోవా దృష్టికి అపవిత్రమైనది
చేసి మీరు ఆయనకు కోపం పుట్టించారు.
19యెహోవా భయంకర కోపానికి నేను భయపడి
పోయాను. మిమ్మల్ని నాశనం చేసేటంత కోపం
మీమీద ఆయనకు కలిగింది. కానీ మరోసారి
యెహోవా నా మాట విన్నాడు. 20అహరోనును
నాశనం చేసివేయాలన్నంత కోపం వచ్చింది యెహో
వాకు. కనుక ఆ సమయంలో అహరోను కోసం కూడా
నేను ప్రార్థించాను. 21మీరు చేసిన ఆ బంగారు దూడను
నేను తీసుకొని దానిని అగ్నితో కాల్చివేసాను. నేను
దాన్ని చిన్న ముక్కలుగా చేసాను. ఆ దూడ ముక్కలను
ధూళిగా నేను చితకగొట్టాను. తర్వాత ఆ కొండనుండి
ప్రవ హించే నదిలో ఆ ధూళిని పారవేసాను.

### ఇశ్రాయేలీయులను క్షమించుమని దేవుణ్ణి మోషే అడగటం

22"మరియు మీరు తబేరావద్ద, మస్సావద్ద, కిబ్రోత్
హత్తావాలో యెహోవాకు కోపం పుట్టించారు. 23మీరు
కాదేషు బర్నేయానుండి వెళ్లిపోండి అని యెహోవా
చెప్పినప్పుడు మీరు విధేయులు కాలేదు. 'మీరు వెళ్లి
నేను మీకు యిచ్చిన దేశంలో నివసించండి' అని
ఆయన చెప్పాడు. కానీ మీరు మీ దేవుడైన యెహో
వాకు విధేయులు కాలేదు. మీరు ఆయనను నమ్మలేదు.
మీరు ఆయన ఆజ్ఞను వినలేదు. 24నేను మిమ్మల్ని
ఎరిగినప్పటినుండియు మీరు యెహోవాకు విధేయు
లయ్యేందుకు నిరాకరిస్తున్నారు.
25"కనుక నేను యెహోవా ఎదుట 40 పగళ్లు 40
రాత్రుళ్లు సాష్టాంగపడ్డాను. ఎందుకంటే మిమ్మల్ని
నాశనం చేస్తానని యెహోవా చెప్పాడు గనుక. 26నేను
యెహోవాకు ప్రార్థన చేసాను. నేను ఇలా చెప్పాను,
'యెహోవా దేవా, నీ ప్రజలను నాశనం చేయవద్దు.
వాళ్లు నీకు చెందినవాళ్లు. నీవే నీ మహాబలం, శక్తి
ప్రయోగించి వారిని విడుదల చేసి ఈజిప్టునుండి బయ
టకు తీసుకొని వచ్చావు. 27నీ సేవకులు అబ్రాహాము,
ఇస్సాకు, యాకోబులకు నీవు చేసిన నీ వాగ్దానం జ్ఞాపకం
చేసుకో. ఈ ప్రజలు ఎంత మొండివారో అది మరచిపో.
వారి చెడు మార్గాలను గాని వారి పాపంగాని చూడకు.
28నీ ప్రజలను నీవు శిక్షిస్తే 'యెహోవా తన ప్రజలకు
ఇస్తానని వాగ్దానం చేసిన దేశంలోనికి ఆయన వారిని
తీసుకొని వెళ్లలేకపోయాడు, ఆయన వాళ్లను
ద్వేషించాడు, కనుక వాళ్లను చంపివేయడానికి అరణ్యం
లోనికి తీసుకు వెళ్లాడు' అని ఈజిప్టువాళ్లు అంటారేమో.
29అయితే యెహోవా, వాళ్లు నీ ప్రజలు, వాళ్లు నీకు
చెందిన వాళ్లు. నీ మహాగొప్ప శక్తి, బలంతో నీవే
వాళ్లను ఈజిప్టునుండి బయటకు తీసుకొని వచ్చావు."

### కొత్త రాతి పలకలు

10 "ఆ సమయంలో యెహోవా నాతో యిలా
చెప్పాడు: 'మొదటి రాతి పలకల్లాంటివే రెండు
పలకలు రాతితో నీవు చెక్కాలి. అప్పుడు నీవు కొండ
ఎక్కి నా దగ్గరకు రావాలి. అలాగే నీ కోసం ఒక చెక్క
పెట్టెకూడా చేయాలి. 2నీవు పగులగొట్టిన మొదటి
పలకల మీద ఉన్న మాటలనే ఆ రాతి పలకలమీద
నేను రాస్తాను. అప్పుడు నీవు కొత్త పలకలను ఆ
పెట్టెలో పెట్టాలి.'
3"కనుక నేను తుమ్మ కర్రతో ఒక పెట్టె చేసాను.
మొదటి రెండు పలకల్లాంటివే మరి రెండు పలకలు
రాతినుండి నేను తొలిచాను. అప్పుడు నేను కొండ
మీదికి వెళ్లాను. ఆ రెండు రాతి పలకలు నా చేతిలో
ఉన్నాయి. 4అప్పుడు యెహోవా యింతకు ముందు
ఆ పలకల మీద వ్రాసిన ఆ మాటలనే, అంటే ఆ
కొండ దగ్గర మీరు సమావేశమైనప్పుడు అగ్నిలోనుండి
ఆయన మీతో చెప్పిన ఆ పది ఆజ్ఞలను ఆ పలకల
మీద వ్రాసాడు. అప్పుడు యెహోవా ఆ రాతి పలకలను
నాకు ఇచ్చాడు. 5నేను వెనక్కు తిరిగి, కొండ దిగి
వచ్చేసాను. ఆ పలకలను నేను చేసిన పెట్టెలో
ఉంచాను. వాటిని అందులో పెట్టుమని నాకు
యెహోవా ఆజ్ఞాపించాడు. ఇప్పటికీ ఆ పలకలు ఆ
పెట్టెలోనే ఉన్నాయి."
6(ఇశ్రాయేలు ప్రజలు యహకాను ప్రజల బావుల
దగ్గరనుండి ప్రయాణం చేసి మోసెరుకు వచ్చారు.
అక్కడ అహరోను చనిపోయి, పాతిపెట్టబడ్డాడు. అహ
రోను కుమారుడు ఎలీయాజరు అహరోను స్థానంలో
యాజకుడయ్యాడు. 7అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు
మోసెరునుండి గుద్గోదకు వెళ్లారు. మరియు వారు
గుద్గోదనుండి నదులుగల యొత్బాతా దేశం వెళ్లారు.
8ఆ సమయంలోనే యెహోవా తన ప్రత్యేక పని
నిమిత్తం, లేవీ వంశాన్ని యితర వంశాలనుండి వేరు
చేసాడు. యెహోవా ఒడంబడిక పెట్టెను* మోయా
ల్సిన పని వారిది. యెహోవా ఆలయంలో యాజకు
లుగా కూడా వారు సహాయం చేసారు. మరియు
యెహోవా నామమున ప్రజలను ఆశీర్వాదించాల్సిన
పనికూడా వారికి ఉంది. ఈ ప్రత్యేక పని వారు నేటికీ

---

**యెహోవా ఒడంబడిక పెట్టె** పది ఆజ్ఞలు వ్రాయబడ్డ రెండు రాతిపలకలు మొదలైనవి ఉంచబడిన పెట్టె. అనగా మందసము.

చేస్తున్నారు. 9అందువల్లనే యితర వంశాలవలె లేవీ
వంశం దేశంలో భాగం పొందలేదు. యెహోవాయే లేవీ
యులకు భాగం. మీ దేవుడైన యెహోవా వారికి
వాగ్దానం చేసింది అదే).
10“మొదటిసారిలాగే, 40 పగళ్లు 40 రాత్రుళ్లు నేను
ఆ కొండమీద ఉండిపోయాను. ఆ సమయంలో
యెహోవా నా మాట కూడ విన్నాడు. యెహోవా
మిమ్మల్ని నాశనం చేయకూడదని తీర్మానించాడు.
11యెహోవా ‘వెళ్లి ప్రజలను వారి ప్రయాణంలో
నడిపించు. వారు వెళ్లి, వారికి ఇస్తానని వారి పూర్వీకు
లకు నేను వాగ్దానం చేసిన దేశంలో నివసిస్తారు’ అని
నాతో చెప్పాడు.

### నిజంగా యెహోవా కోరేది

12“ఇశ్రాయేలు ప్రజలారా ఇప్పుడు వినండి. మీరు
చేయాలని మీ దేవుడైన యెహోవా కోరేది ఇదే: మీ
దేవుడైన యెహోవాను గౌరవించి, ఆయన మీతో
చెప్పినవన్నీ చేయండి. మీ నిండు హృదయంతో, మీ
నిండు ఆత్మతో మీ దేవుడైన యెహోవాను ప్రేమించి,
సేవించండి. 13ఈ వేళ నేను మీకు చెబుతున్న
యెహోవా చట్టాలను, ఆజ్ఞలను పాటించండి. ఈ
చట్టాలు, ఆజ్ఞలు మీ మంచికోసమే.
14“సర్వం మీ దేవుడైన యెహోవాకే చెందుతుంది.
ఆకాశం, మహా ఎత్తయిన ఆకాశం సహా యెహోవాదే.
భూమి, దానిమీద ఉన్న సమస్తం మీ దేవుడైన యెహో
వాదే. 15మీ పూర్వీకులను యెహోవా ఎంతో ప్రేమిం
చాడు. వారి సంతతివారైన మిమ్మల్ని ఆయన ప్రజలుగా
ఉండేందుకు ఏర్పరచుకొనే అంతగా ఆయన వారిని
ప్రేమించాడు. మరి ఏ ఇతర ప్రజ కాకుండ మిమ్మల్నే
ఆయన ఎన్నుకొన్నాడు. మీరు నేటికీ ఆయన ఏర్పర
చుకొన్న ప్రజలే.
16“మీరు మీ మొండి వైఖరి విడిచిపెట్టి, మీ
హృదయాలను యెహోవాకు ఇవ్వాలి. 17ఎందుకంటే
యెహోవా మీ దేవుడు గనుక. ఆయన దేవుళ్లకు
దేవుడు. ప్రభువులకు ప్రభువు . ఆయనే మహా దేవుడు.
ఆయన అద్భుతమైన శక్తిగల పరాక్రమశాలి. యెహో
వాకు ప్రతి మనిషీ సమానమే. ఆయన లంచం తీసు
కోడు. 18తల్లిదండ్రులు లేని పిల్లలకు ఆయన
సహాయం చేస్తాడు. విధవలకు ఆయన సహాయం
చేస్తాడు. మన దేశంలో ఉండే విదేశీయులను కూడా
ఆయన ప్రేమిస్తాడు. ఆయన వారికి భోజనం, బట్టలు
యిస్తాడు. 19అందుచేత ఆ విదేశీయులను మీరుకూడా
ప్రేమించాలి. ఎందుకంటే మీ మట్టుకు మీరే ఈజిప్టు
దేశంలో విదేశీయులు గనుక. 20“మీరు మీ దేవుడైన
యెహోవాను గౌరవించి, ఆయనను మాత్రమే
ఆరాధించాలి. ఎన్నడూ ఆయనను విడువవద్దు. మీరు
ప్రమాణాలు చేసేటప్పుడు మీరు ఆయన పేరు
మాత్రమే ఉపయోగించాలి. 21మీరు స్తుతించవలసినది
యెహోవాను మాత్రమే. ఆయన మీ దేవుడు. ఆయన
మీకోసం అద్భుతమైన గొప్ప కార్యాలు చేసాడు. మీరు
ఈ కార్యాలను మీ కళ్లారా చూసారు. 22మీ పూర్వీకులు
ఈజిప్టులోనికి వెళ్లినప్పుడు వారు 70 మంది మాత్రమే.
ఇప్పుడు మిమ్మల్ని ఎంతో మందిగా, ఆకాశ నక్షత్రాలు
ఎన్నో అంతమందిగా మీ దేవుడైన యెహోవా
చేసాడు.

### యెహోవాను జ్ఞాపకం చేసుకొనండి.

11 “అందుచేత మీ దేవుడైన యెహోవాను మీరు
ప్రేమించాలి. మీరు చేయాలని ఆయన మీతో
చెప్పే విషయాలను మీరు చేయాలి. ఆయన చట్టా
లకు, ఆజ్ఞలకు, నియమాలకు మీరు ఎల్లప్పుడూ విధే
యులు కావాలి. 2మీకు ప్రబోధం చేసేందుకు మీ
దేవుడైన యెహోవా చేసిన గొప్ప కార్యాలన్నింటినీ
నేడు జ్ఞాపకం చేసుకోండి. ఆ కార్యాలు జరగటం
చూచింది, వాటిని అనుభవించింది మీరేగాని మీ పిల్లలు
కాదు. యెహోవా ఎంత గొప్పవాడో మీరు చూసారు.
ఆయన ఎంత బలంగలవాడో మీరు చూశారు. ఆయన
చేసే శక్తివంతమైన కార్యాలు మీరు చూసారు. 3ఆయన
చేసిన అద్భుతాలను మీ పిల్లలు కాదు మీరు చూసారు.
ఈజిప్టులో, ఈజిప్టు రాజైన ఫరోకు, అతని దేశం
మొత్తానికి ఆయన చేసిన కార్యాలు మీరు చూశారు.
ఈజిప్టు సైన్యానికి, వారి గుర్రాలకు, రథాలకు
యెహోవా చేసిన వాటిని మీ పిల్లలు కాదు మీరే
చూసారు. 4వాళ్లు మిమ్మల్ని తరుముతూ ఉంటే,
వాళ్లను యెహోవా ఎర్ర సముద్ర నీళ్లతో కప్పివేస్తూ
ఉండటం మీరు చూసారు. యెహోవా వాళ్లను సర్వ
నాశనం చేయటం మీరు చూసారు. 5మీరు ఈ చోటికి
వచ్చేంత వరకు అరణ్యంలో మీ దేవుడైన యెహోవా
మీకోసం చేసిన వాటన్నింటిని చూసిన వారు మీరే,
మీ పిల్లలు కాదు. 6రూబేను వంశానికి చెందిన ఎలీ
యాబు కుమారులు దాతాను, అబీరాములకు
యెహోవా ఏమి చేసాడో మీరు చూసారు. భూమి
నోరు తెరచినట్టుగా తెరచుకొని ఆ మనుష్యులను
మ్రింగి వేయటం ఇశ్రాయేలు ప్రజలంతా చూసారు.
అది వారి కుటుంబాలను, వారి గుడారాలను, వారికి
ఉన్న ప్రతి పనిమనిషిని, ప్రతి జంతువును మింగి
వేసింది.
7యెహోవా చేసిన ఈ గొప్ప కార్యాలన్నిం టినీ
చూసినవాళ్లు మీరే, మీ పిల్లలు కాదు. 8“కనుక ఈ
వేళ నేను మీకు చెప్పే ప్రతి ఆజ్ఞకూ మీరు విధేయులు
కావాలి. అప్పుడు మీరు బలంగా ఉంటారు. మీరు
యోర్దాను నది దాటగలుగుతారు, మీరు ప్రవేశించ
బోతున్న దేశాన్ని స్వాధీనం చేసు కోగలుగుతారు.
9మరియు ఆ దేశంలో మీ జీవితం సుదీర్ఘం అవుతుంది.

మీ పూర్వీకులకు, వారి సంతతి వారికి ఇస్తానని
యెహోవా వాగ్దానం చేసింది ఈ దేశమే. ఇది
మంచివాటితో నిండిన దేశం.* 10మీకు లభిస్తున్న
ఈ దేశం మీరు వచ్చిన ఈజిప్టు దేశంలాంటిది కాదు.
ఈజిప్టు దేశంలో మీరు విత్తనాలు చల్లి, మీ మొక్కలకు
నీళ్లు పెట్టడానికి కాలువలనుండి నీళ్లుతోడేందుకు మీ
పాదాలు ప్రయోగించారు. కూరగాయల తోటకు నీళ్లు
పెట్టినట్టే మీ పొలాలకు మీరు నీళ్లు పెట్టారు. 11అయితే
త్వరలోనే మీకు లభిస్తున్న దేశం అలాంటిది కాదు.
ఆ దేశములో కొండలు, లోయలు ఉన్నాయి. ఆకాశం
నుండి కురిసే వర్షాల మూలంగా ఆ భూమికి నీరు
లభిస్తుంది. 12మీ దేవుడైన యెహోవా ఆ భూమి
విషయం శ్రద్ధ కలిగి ఉన్నాడు. సంవత్సర ఆరంభం
నుండి అంతంవరకు మీ దేవుడైన యెహోవా ఆ
భూమిని కనిపెట్టుకొని ఉంటాడు. 13“మీ దేవుడైన
యెహోవాను మీరు మీ నిండు హృదయంతో ప్రేమిం
చాలని, మీ నిండు ఆత్మతో సేవించాలని, నేడు మీకు
నేను ఇస్తున్న ఆజ్ఞలను మీరు జాగ్రత్తగా వినాలి. మీరు
అలా చేస్తే, అప్పుడు 14సకాలంలో నేను మీ భూమికి
వర్షం ఇస్తాను. తొలకరి వాన, కడవరి వాన నేను
పంపిస్తాను. అప్పుడు మీరు ధాన్యం, మీ కొత్త ద్రాక్షా
రసం, మీ నూనె సమకూర్చుకోవచ్చును. 15 మీ పశు
వుల కోసం నేను మీ పొలాల్లో గడ్డి మొలిపిస్తాను.
మీరు ఆహారం తినే సమృద్ధిగా ఉంటుంది.’ 16“అయితే
జాగ్రత్తగా ఉండండి. మోసపోవద్దు. ఇతర దేవుళ్లను
సేవించి, పూజించేందుకు తిరిగిపోవద్దు. 17ఆ విధంగా
మీరు చేస్తే యెహోవా మీమీద చాలా కోపగిస్తాడు.
ఆకాశాలను ఆయన మూసివేస్తాడు. అప్పుడు వర్షం
కురవదు. భూమి మీద పంట పండదు. యెహోవా
మీకు ఇస్తున్న మంచి దేశంలో మీరు త్వరగా నశిస్తారు.
18“నేను మీకు ఇస్తున్న ఈ ఆజ్ఞలు జ్ఞాపకం
ఉంచుకోండి. వాటిని మీ హృదయాల్లో భద్రంగా ఉంచు
కోండి. మీకు జ్ఞాపకంచేసే సూచనలుగా ఈ ఆజ్ఞలను
వ్రాసి మీ చేతులకు కట్టుకోండి, మీ నొసట బాసికంగా
కట్టుకోండి. 19ఈ ఆజ్ఞలను మీ పిల్లలకు నేర్పించండి.
మీరు మీ యిండ్లలో కూర్చున్నప్పుడు, మీరు
మార్గంలో నడిచేటప్పుడు, మీరు పండుకొన్నప్పుడు,
మీరు లేచినప్పుడు, ఈ విషయాలను గూర్చి మాట్లా
డండి. 20మీ గృహాల ద్వారబంధాల మీద, గవునుల
మీద ఈ ఆజ్ఞలు వ్రాయండి. 21అప్పుడు యెహోవా
మీ పూర్వీకులకు యిస్తానని వాగ్దానం చేసిన ఆ దేశంలో
మీరూ మీ పిల్లలూ దీర్ఘకాలం జీవిస్తారు. భూమికి పైగా
ఆకాశాలు ఉన్నంతవరకు మీరు అక్కడ నివసిస్తారు.
22“మీరు ఆచరించాలని నేను మీతో చెప్పిన ప్రతి
ఆజ్ఞకూ విధేయులుగా ఉండేందుకు జాగ్రత్త పడండి.
మీ దేవుడైన యెహోవాను ప్రేమించండి, ఆయన
మార్గాలన్నింటినీ వెంబడించండి, ఆయనకు నమ్మ
కంగా ఉండండి.
23“అప్పుడు ఆ దేశంలోనికి వెళ్తారు. ఆ యితర
రాజ్యాలన్నింటి జనాలనూ యెహోవా బయటకు
వెళ్లగొడ్తాడు. మీకంటే ఎక్కువ బలంగల పెద్ద రాజ్యాల
నుండి ఆ దేశాన్ని మీరు స్వాధీనం చేసుకొంటారు.
24మీరు నడిచే భూమి అంతా మీదే అవుతుంది.
మీ దేశం దక్షిణాన అరణ్యం మొదలుకొని ఉత్తరాన
లెబానోను వరకు మొత్తం వ్యాపించి ఉంటుంది.
తూర్పున యూఫ్రటీసు నదినుండి మొత్తం మధ్యధరా
సముద్రంవరకు వ్యాపించి ఉంటుంది. 25మీకు వ్యతి
రేకంగా నిలువగల వాడు ఎవడూ ఉండడు. ఆ దేశంలో
మీరు ఎక్కడికి వెళ్లినాసరే ప్రజలు మీకు భయపడే
టట్టుగా మీ దేవుడైన యెహోవా చేస్తాడు. ఇంతకు
ముందు యెహోవా మీకు వాగ్దానం చేసింది యిదే.”

## ఇశ్రాయేలుయొక్క కోరికలు ఆశీర్వాదములా లేక శాపములా

26“ఈ వేళ నేను మిమ్మల్ని ఒక ఆశీర్వాదమో
లేక ఒక శాపమో కోరుకోనిస్తున్నాను. 27ఈ వేళ నేను
మీతో చెప్పిన మీ దేవుడైన యెహోవా ఆజ్ఞలకు
మీరు లోబడితే మీకు ఆశీర్వాదం లభిస్తుంది. 28మీరు
మీ దేవుడైన యెహోవా మాట వినక, ఈ వేళ నేను
మీకు ఆజ్ఞాపించిన మార్గంనుండి మీరు తొలగిపోయి,
మీరు ఎరుగని ఇతర దేవుళ్లను అనుసరిస్తే మీ దేవుడైన
యెహోవా ఆజ్ఞలను పాటించేందుకు మీరు నిరాకరిస్తే
మీకు శాపం వస్తుంది.

29“మీరు నివసించబోతున్న దేశానికి మీ దేవుడైన
యెహోవా మిమ్మల్ని తీసుకొని వచ్చినప్పుడు మీరు
గెరిజీము కొండమీదికి వెళ్లి, అక్కడనుండి ఆ ఆశీర్వా
దాలు చదివి ప్రజలకు వినిపించాలి. అలాగే ఏబాలు
కొండమీదికి కూడా మీరు వెళ్లి అక్కడనుండి శాపాలు
చదివి ప్రజలకు వినిపించాలి. 30అరాబాలో నివసించే
కనానీ ప్రజల దేశంలో యోర్దాను నదికి ఆవలి ప్రక్క
ఈ కొండలు ఉన్నాయి. ఈ కొండలు పశ్చిమాన
గిల్గాలు పట్టణానికి దగ్గరగా మోరేలోని సింధూర వృక్షా
లకు సమీపంగా ఉన్నాయి.
31“మీరు యోర్దాను నది దాటివెళ్తారు. మీ దేవుడైన
యెహోవా మీకు యిస్తున్న దేశాన్ని మీరు స్వాధీనం
చేసుకొంటారు. ఈ దేశం మీది అవుతుంది. మీరు
ఈ దేశంలో నివసించేటప్పుడు, 32ఈ వేళ నేను
మీకు ఇస్తున్న ఆజ్ఞలు, నియమాలు అన్నింటికీ
జాగ్రత్తగా లోబడాలి.”

---

**మంచి … దేశం** “పాలు తేనెలు ప్రవహించుచున్న దేశం” అని మూలభాషలో వ్రాయబడివుంది.

### దేవుణ్ణి ఆరాధించేందుకు స్థలం

12 “కొత్త దేశంలో మీరు మీ జీవితకాలమంతా
పాటించేందుకు జాగ్రత్త పడాల్సిన ఆజ్ఞలు,
నియమాలు ఉన్నాయి. మీ పూర్వీకుల దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు జీవించినంత
కాలమూ ఈ ఆజ్ఞలకు మీరు విధేయులు కావాలి.
2ఇప్పుడు అక్కడ నివసిస్తున్న రాజ్యాలనుండి దేశాన్ని
మీరు స్వాధీనం చేసుకోండి. ఈ దేశాల ప్రజలు వారి
దేవుళ్లను పూజించిన స్థలాలన్నింటినీ మీరు పూర్తిగా
నాశనం చేయాలి. ఎత్తయిన పర్వతాలమీద, కొండల
మీద, పచ్చని చెట్ల కింద ఈ స్థలాలు ఉన్నాయి.
3వారి బలిపీఠాలను మీరు పడగొట్టాలి, వారి స్మారక
శిలలను ముక్కలు ముక్కలుగా విరుగగొట్టాలి. వారి
అషేరా స్తంభాలను మీరు కాల్చివేయాలి, వారి దేవుళ్ల
విగ్రహాలను కూలగొట్టండి.

4“కానీ ఆ ప్రజలు వారి దేవుళ్లను పూజించిన
పద్ధతిలో మీరు మీ దేవుడైన యెహోవాను ఆరాధించ
కూడదు. 5మీ దేవుడైన యెహోవా తన ఆలయం
కోసం ఒక ప్రత్యేక స్థలం మీ వంశాలవారి మధ్య నిర్ణ
యిస్తాడు. యెహోవా తన నామాన్ని అక్కడుంచు
తాడు. అది ఆయన ఆలయం ఆయనను ఆరాధించడా
నికి ఆ స్థలానికి వెళ్లాలి 6మీ దహనబలులు, మీ బలులు
మీ పంట, మరియు జంతువులో దశమ భాగం* మీ
ప్రత్యేక కానుకలు, యెహోవాకు మీరు వాగ్దానం చేసిన
కానుకలు, మీ స్వేచ్ఛార్పణలు, మరియు మీ పశువుల
మందలోను, గొర్రెల మందలోను మొట్టమొదటగా
పుట్టిన జంతువులను అక్కడికి మీరు తీసుకొని రావాలి.
7మీరూ, మీ కుటుంబాలూ ఆ చోట సమావేశమై
అక్కడ అందరూ కలిసి భోజనం చేయాలి, మీ దేవుడైన
యెహోవా అక్కడ మీతో ఉంటాడు. అక్కడ మీరు
కష్టపడిన వాటి ఫలాలను భుజిస్తారు. దేవుడైన
యెహోవా మిమ్మల్ని ఆశీర్వదించి ఆ మంచివాటిని
మీకు ఇచ్చాడని జ్ఞాపకం చేసుకొంటారు.

8“ఆ సమయంలో మనం ఇంతవరకు ఆరాధిస్తున్న
విధానాన్ని మీరు కొనసాగించకూడదు. ఇంతవరకు
మనకు యిష్టం వచ్చిన ఏ పద్ధతిలోనైనా దేవుణ్ణి
మనం ఆరాధించాం. 9ఎందుకంటే మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న శాంతియుతమైన దేశంలో
మనం యింకా ప్రవేశించలేదు గనుక. 10అయితే మీరు
యోర్దాను నది దాటి, మీ దేవుడైన యెహోవా మీకు
ఇస్తున్న ఆ దేశంలో నివసిస్తారు. అక్కడ మీ శత్రువులు
అందరినుండి యెహోవా మీకు విశ్రాంతి ఇస్తాడు.
మరియు మీరు క్షేమంగా జీవిస్తారు. 11అప్పుడు
యెహోవా తనకు ప్రత్యేక స్థలంగా ఉండేదుకు ఒక
స్థలం ఏర్పాటు చేసుకొంటాడు. మరియు నేను మీకు
ఆజ్ఞాపించిన వాటన్నింటినీ మీరు ఆ చోటికి తీసుకొని
రావాలి. మీ దహన బలులు, మీ బలులు, మీ దశమ
భాగాలు, మీ ప్రత్యేక కానుకలు, మీరు యెహోవాకు
వాగ్దానం చేసిన కానుకలు, మీ పశువుల మందల్లో,
గొర్రెల మందల్లో మొట్టమొదటగా పుట్టిన జంతువులు
అన్నింటినీ మీరు తీసుకొని రావాలి. 12మీ పిల్లలు, మీ
పనిమనుషులు, మీ పట్టణాల్లో నివసించే లేవీయులు–
మీ మనుష్యులందరినీ వెంట తీసుకొని ఆ స్థలానికి
రండి. (ఆ లేవీయులకు దేశంలో వారి స్వంత భాగం
ఉండదు.) అక్కడ మీ దేవుడైన యెహోవాతో కలిసి
సంతోషంగా సమయం గడపండి.

13మీకు కనబడిన ఏ స్థలంలో అంటే ఆ స్థలంలో
మీ దహనబలులు అర్పించకుండా మీరు జాగ్రత్తగా
ఉండండి. 14మీ వంశాలకు చెందిన ఒక ప్రాంతంలో
యెహోవా తన ప్రత్యేక స్థలాన్ని ఏర్పాటు చేసు
కొంటాడు. దహన బలులు అర్పించటం, నేను మీతో
చెప్పిన యితర పనులు అన్నీ అక్కడే చేయండి.
15“మీరు నివసించే ఏ స్థలంలోనైనా ఎర్ర జింక, చిన్న
దుప్పిలాంటి ఏ మంచి జంతువునైనా మీరు చంపి
తినవచ్చును. మీరు కోరినంత మాంసం, మీ దేవుడైన
యెహోవా మీకు యిచ్చినంత మీరు తినవచ్చును.
పవిత్రంగా ఉన్నవాళ్లు, అపవిత్రంగా ఉన్నవాళ్లు ఎవరైనా
సరే ఈ మాంసం తినవచ్చును. 16కాని రక్తంతో మాత్రం
మీరు తినకూడదు. రక్తాన్ని మీరు నీళ్లలా నేలమీద
పోయాలి.

17“మీరు నివసించే స్థలాల్లో మీరు తినకూడనివి
కొన్ని ఉన్నాయి. అని ఏవనగా: దేవునికి చెందిన
ధాన్యం, దేవునికి చెందిన మీ కొత్త ద్రాక్షారసం, నూనె
భాగాలు, మీ పశువుల మందల్లో, గొర్రెల మందల్లో
మొట్టమొదట పుట్టినవి, మీరు దేవునికి వాగ్దానం చేసిన
ఏ కానుకగాని, ఏ స్వేచ్ఛార్పణలుగాని, లేక దేవునికి
చెందిన ఏ కానుకలేగాని, 18మీ దేవుడైన యెహోవా
నిర్ణయించే ప్రత్యేక స్థలంలో, మీ దేవుడైన యెహోవా
మీతో ఉన్న ఆ స్థలంలో మాత్రమే అర్పణలను మీరు
తినాలి. మీరు అక్కడికి వెళ్లి, మీ కుమారులు, మీ
కుమార్తెలు, మీ పని మనుష్యులందరు, మీ పట్టణాల్లో
నివసించే లేవీయులతో కలిసి మీరు భోజనం చేయాలి.
అక్కడ మీ దేవుడైన యెహోవాతో కలిసి సంతోషంగా
సమయం గడపండి. మీరు కష్టపడి సంపాదించిన
వాటితో ఆనం దించండి. 19మీరు ఎల్లప్పుడూ ఈ
భోజనాలను లేవీయులతోకూడ పంచుకొనే విష
యంలో ఖచ్చి తంగా ఉండండి. మీరు మీ దేశంలో
బతికినంతకాలం ఇలా చేయండి.

20-21“మీ దేశాన్ని విస్తృతపరుస్తానని మీ దేవుడైన
యెహోవా వాగ్దానం చేసాడు. ఆయన అలా చేసిన
ప్పుడు, ఆయన తన ప్రత్యేక ఆలయంగా ఉండేందుకు

**దశమ భాగం** లేక పదింట ఒక భాగం. ద్వితీయోపదేశ కాండం 14:22-29 చూడండి.

ఏర్పరచుకొనే స్థలానికి మీ నివాసం చాలా దూరం
కావచ్చు. అది చాలా దూరమై, మాంసం కోసం మీరు
ఆకలిగా ఉంటే, అప్పుడు మీ దగ్గర ఉన్న ఏ మాంసమైనా
తినవచ్చును. యెహోవా మీకు ఇచ్చిన పశువుల
మందలోనుండిగాని, గొర్రెల మందలో నుండిగాని, ఏ
జంతువునైనా చంపుకోవచ్చును. నేను మీకు ఆజ్ఞా
పించిన ప్రకారం యిది చేయండి. మీరు నివసించే
చోట మీకు యిష్టం వచ్చినప్పుడు ఈ మాంసం
తినవచ్చును. 22జింక, దుప్పి మాంసం తిన్నట్టుగానే
మీరు ఈ మాంసం తినవచ్చును. పవిత్రంగా ఉన్నవాళ్లు,
అపవిత్రంగా ఉన్నవాళ్లు ఎవరైనా యిలా చేయ
వచ్చును. 23రక్తంతో మాత్రం తినకుండ జాగ్రత్తగా
ఉండండి. ఎందుకంటే ప్రాణం రక్తంలోనే ఉంటుంది.
ఇంకా ప్రాణం ఉన్న మాంసం మీరు తినకూడదు.
24రక్తంతో తినవద్దు, ఆ రక్తాన్ని మీరు నీళ్లలా నేలమీద
పారబోయాలి. 25సరైనది అని యెహోవా చెప్పిన
ప్రతిదీ మీరు చేయాలి. అందుచేత రక్తంతో తినవద్దు.
మీకు మీ సంతతివారికి మేలు కలుగుతుంది.”

26“మీరు ప్రతిష్ఠించిన వాటిని, మీ మొక్కు బడు
లను, మీ దేవుడైన యెహోవా నియమించే ప్రత్యేక
స్థలానికి మీరు తీసుకొని వెళ్లాలి. 27మీరు మీ దహన
బలులను ఆ స్థలంలో అర్పించాలి. మీ దహనబలుల
రక్తం, మాంసం మీ దేవుడైన యెహోవా బలిపీఠం
మీద అర్పించండి. మీ యితర బలుల విషయంలో
రక్తాన్ని మీ దేవుడైన యెహోవా బలిపీఠం మీద
అర్పించండి. అప్పుడు ఆ మాంసం మీరు తినవచ్చును.
28నేను మీకు ఇస్తున్న ఈ ఆజ్ఞలన్నింటికీ జాగ్రత్తగా
విధేయులు కావాలి. మంచివి, సరైనవి మీ దేవుడైన
యెహోవాను ఆనందపర్చే పనులు మీరు చేసినప్పుడు
మీకూ, మీ సంతతివారికి శాశ్వతంగా మేలు కలుగు
తుంది. 29“ఇతర రాజ్యాల ప్రాంతంలోనికి మీరు వెళ్లిన
ప్పుడు ఆ రాజ్యాలను మీ దేవుడైన యెహోవా
బయటకు వెళ్లగొట్టి నాశనం చేస్తాడు. మీరు లోనికి
వెళ్లి వారినుండి ఆ దేశం తీసుకొంటారు. వారి దేశంలో
మీరు నివసిస్తారు. 30అయితే అది జరిగిన తర్వాత
జాగ్రత్తగా ఉండండి. ఆ రాజ్యాలవారు పూజించిన దేవు
ళ్లను గూర్చి తెలుసుకోవటం ద్వారా మిమ్మల్ని మీరు
నాశనం చేసుకోవద్దు. వారు వారి దేవుళ్లను ఎలా
పూజిస్తారో అది మీరు నేర్చుకొనేందుకు ప్రయత్నించ
వద్దు. వాళ్లు పూజించినట్టు పూజించాలనే ఆలోచన
కూడా చేయవద్దు.

31ఆ ప్రజలు వారి దేవుళ్లను పూజించిన పద్ధతిలో
మీరు మీ దేవుడైన యెహోవాను ఆరాధించకూడదు.
ఎందుకంటే వారు వారి పూజలలో యెహోవాకు అసహ్య
మైన చెడ్డపనులు అన్నీ చేస్తారు. చివరికి వారు వారి
చిన్న బిడ్డలను కూడ వారి దేవుళ్లకు బలి అర్పణగా
కాల్చివేస్తారు.

32“నేను మీకు ఆజ్ఞాపించే సమస్తం జాగ్రత్తగా
చేయాలి. నేను మీకు చెప్పేవాటికి మరేమీ కలుపవద్దు,
ఏమీ తీసివేయవద్దు.

## అబద్ధపు ప్రవక్తలు

13 “ఒక ప్రవక్త లేక కలల భావం చెప్పే ఒక
వ్యక్తి మీ దగ్గరకు రావచ్చు. మీకు ఏదో ఒక
సూచన లేక అద్భుతం చూపిస్తానని అతడు మీతో
చెప్పవచ్చు. 2మరియు అతడు మీకు చెప్పిన సూచన
లేక అద్భుతం నెరవేరవచ్చు. అప్పుడు అతడు ఇతర
దేవుళ్లను (మీరు ఎరుగని దేవుళ్లను) పూజించమని
మీతో చెప్పవచ్చును. ‘మనం ఆ దేవుళ్లనే సేవిద్దాము’
అని అతడు మీతో అనవచ్చును. 3ఆ మనిషి మాట
వినవద్దు. ఎందుకంటె మీరు మీ దేవుణ్ణి మీ నిండు
హృదయంతోను, మీ నిండు ఆత్మతోను ప్రేమిస్తు
న్నారో లేదో తెలుసుకొనేందుకు మీ దేవుడైన
యెహోవా మిమ్మల్ని పరీక్షిస్తున్నాడు. 4మీరు మీ
దేవుడైన యెహోవాను వెంబడించాలి. మీరు తప్పక
ఆయనను గౌరవించాలి. యెహోవా ఆజ్ఞలకు విధే
యులై, ఆయన మీతో చెప్పినట్టు చేయండి.
యెహోవాను సేవించండి, ఎన్నటికీ ఆయనను విడువ
కండి.

5అంతేకాదు కలలను గూర్చి చెప్పే ఆ ప్రవక్తను
చంపివేయాలి. ఎందుకంటే మీ దేవుడైన యెహో
వాకు లోబడటం మానివేయండి అని మీతో చెబుతు
న్నాడు గనుక. మిమ్మల్ని ఈజిప్టునుండి బయటకు
తీసుకొని వచ్చినవాడు యెహోవా. అక్కడి బానిస
జీవితంనుండి ఆయనే మిమ్మల్ని రక్షించాడు. మీరు
జీవించాలని మీ దేవుడైన యెహోవా మీకు ఆజ్ఞా
పించిన జీవితం నుండి మిమ్మల్ని తప్పించి వేయాలని
ఆ వ్యక్తి ప్రయత్నిస్తున్నాడు. అందుచేత మీ ప్రజల
నుండి చెడుగును తీసివేసేందుకు మీరు ఆ వ్యక్తిని
చంపివేయాలి.

6“మీతో సన్నిహితంగా ఉండేవారు ఎవరైనా, మీరు
ఇతర దేవుళ్లను పూజించేందుకు రహస్యంగా మిమ్మల్ని
ఒప్పించవచ్చు. నీ స్వంత సోదరుడు, నీ కుమారుడు,
నీ కుమార్తె, నీవు ప్రేమించే నీ భార్య, లేక నీ అతి
సన్నిహిత మిత్రుడు కావచ్చు. ‘మనం పోయి యితర
దేవుళ్లను పూజిద్దాము’ అని ఆ వ్యక్తి చెప్పవచ్చు. (ఈ
దేవుళ్లను మీరు గాని, మీ పూర్వీకులు గాని ఎన్నడూ
ఎరుగరు. 7ఆ దేవుళ్లు మీకు దగ్గర్లో, దూరంలో, మీ
చుట్టు పక్కల రాజ్యాల్లో ఉండే ప్రజల దేవుళ్లు.) 8మీరు
ఆ వ్యక్తితో సమ్మతించకూడదు. అతని మాట వినవద్దు.
అతని మీద జాలిపడవద్దు. అతణ్ణి స్వేచ్ఛగా వెళ్లిపోనివ్వ
వద్దు. అతణ్ణి కాపాడవద్దు. 9-10కాని, మీరు అతణ్ణి
చంపాల్సిందే. మీరు అతణ్ణి రాళ్లతో కొట్టి చంపె
య్యాలి. నీవే మొట్ట మొదట రాళ్లు తీసుకొని అతని

మీద విసరాలి. తర్వాత ప్రజలందరూ రాళ్లు విసిరి
అతణ్ణి చంపాలి. ఎందుకంటే ఆ వ్యక్తి మిమ్మల్ని మీ
దేవుడైన యెహోవాకు దూరం చేయాలని ప్రయ
త్నించాడు. మీరు బానిసలుగా ఉన్న ఈజిప్టు దేశంనుండి
మిమ్మల్ని బయటకు రప్పించిన వాడు యెహో
వాయే.

11అప్పుడు ఇశ్రాయేలు ప్రజలందరు విని భయ
పడతారు. అంతేకాదు, వారు యిలాంటి చెడ్డపనులు
ఇంకేమీ మీ మధ్య జరిగించరు.

### నాశనం చేయబడాల్సిన పట్టణాలు

12"మీ దేవుడైన యెహోవా మీరు నివసించేందుకు
పట్టణాలు మీకు ఇచ్చాడు. కొన్నిసార్లు ఈ పట్టణాల్లో
ఒకదాన్ని గూర్చి మీరు ఏదైనా చెడువార్త వినవచ్చును.
మీరు 13మీ స్వంత దేశంలోనే దుర్మార్గులు కొందరు
వారి పట్టణస్థులను చెడ్డపనులు చేసేందుకు ప్రేరేపిస్తు
న్నారని వినవచ్చును. 'మనం వెళ్లి యితర దేవుళ్లను
సేవిద్దాము, అని వారు వారి పట్టణస్థులతో అన
వచ్చును. (ఈ దేవుళ్లు యింతకు ముందు మీరు
ఎన్నడూ ఎరుగని దేవుళ్లు.)

14మీరు ఇలాంటి వార్త వింటే, అది సత్యమా అని
తెలుసుకొనేందుకు మీరు చేయగలిగింది అంతా
చేయాలి. అది వాస్తవమేనని మీకు తెలిస్తే – అలాంటి
దారుణ విషయం నిజంగానే జరిగిందని మీకు
ఋజువైతే

15అప్పుడు మీరు ఆ పట్టణస్థులను శిక్షించాలి.
వాళ్లందరినీ చంపివేయాలి. మరియు వారి పశువుల
న్నింటినీ చంపివేయండి. మీరు ఆ పట్టణాన్ని పూర్తిగా
నాశనం చేయాలి.

16అప్పుడు మీరు విలువైన వస్తువులన్నింటినీ పోగు
చేసి పట్టణం మధ్యకు వాటిని తీసుకొని వెళ్లాలి. ఆ
పట్టణాన్ని, అందులో ఉన్న సమస్తాన్ని మీ దేవుడైన
యెహోవాకు దహనబలిగా మీరు కాల్చివేయాలి. ఆ
పట్టణం శాశ్వతంగా పాడు దిబ్బగా అవుతుంది. అది
ఎన్నటికీ తిరిగి కట్టబడకూడదు.

17ఆ పట్టణంలో ఉన్న సమస్తం నాశనం చేయ
బడేందుకు అది యెహోవాకు అప్పగించబడాలి. కనుక
ఆ వస్తువుల్లో ఏదీ మీకోసం మీరు ఉంచుకోకూడదు.
మీరు ఈ ఆజ్ఞను పాటిస్తే , అప్పుడు యెహోవా మీ
మీద కోపం చాలిస్తాడు. యెహోవా మీకు దయను
ప్రసాదిస్తాడు. ఆయనకు మీమీద జాలి ఉంటుంది.
ఆయన మీ పూర్వీకులకు వాగ్దానం చేసిన ప్రకారం
మీ రాజ్యాన్ని విస్తారంగా పెరుగనిస్తాడు. 18మీరు మీ
దేవుడైన యెహోవా మాట ఆలకించి, నేడు నేను
మీకు యిస్తున్న ఆజ్ఞలకు విధేయులైతే యిలా జరుగు
తుంది. మీ దేవుడైన యెహోవా సరైనవి అని చెప్పే
వాటిని మీరు చేయాలి.

### ఇశ్రాయేలీయులు దేవుని ప్రత్యేక ప్రజలు

14 "మీరు మీ దేవుడైన యెహోవా పిల్లలు.
ఎవరైనా చనిపోయినప్పుడు మీ విచారం వ్యక్తం
చేయటానికి మిమ్మల్ని మీరు కోసుకోకూడదు. మీ
తలలు గుండు గీసుకోకూడదు.

2ఎందుకంటే మీరు ఇతరులకు వ్యత్యాసంగా
ఉన్నారు. మీరు యెహోవాకు ప్రత్యేకమైన ప్రజలు.
ప్రపంచంలోని ప్రజలందరిలో నుండి మీ దేవుడైన
యెహోవా మిమ్మల్ని తన స్వంత ప్రజలుగా
ఉండేందుకు ఏర్పాటు చేసుకొన్నాడు."

### ఇశ్రాయేలీయులకు అనుమతించబడిన భోజనం

3"తినకూడని చెడ్డది అని యెహోవా చెప్పినది
ఏదీ తినవద్దు. 4మీరు ఈ జంతువులను తినవచ్చును:
ఆవులు, గొర్రెలు, మేకలు, 5జింక, దుప్పి, ఎర్ర చిన్న
జింక, అడవి గొర్రెలు, అడవి మేకలు, లేడి, కొండ
గొర్రెలు. 6గిట్టలు రెండుగా చీలి ఉండి, నెమరు వేసే
ఏజంతువునైనా మీరు తినచ్చును.

7కానీ ఒంటెలను, కుందేళ్లను, పొట్టి కుందేళ్లను
తినవద్దు. ఈ జంతువులు నెమరు వేస్తాయి గాని వాటి
డెక్కలు చీలి ఉండవు. కనుక ఈ జంతువులు మీకు
పవిత్ర ఆహారం కాదు. 8మరియు మీరు పందుల్ని
తినకూడదు. వాటి గిట్టలు చీలి ఉంటాయి గాని అవి
నెమరు వేయవు. అందుచేత పందులు మీకు పవిత్ర
ఆహారం కాదు. పందిమాంసం ఏమీ తినవద్దు, చచ్చిన
పందిని ముట్టుకోవద్దు.

9"రెక్కలు, పొలుసు ఉన్న ఎలాంటి చేపనైనా
తినవచ్చు. 10కానీ రెక్కలు, పొలుసు లేకుండా నీళ్లలో
జీవించే దేనినీ మీరు తినవద్దు. అది మీకు పవిత్ర
ఆహారం కాదు.

11"పవిత్రమైన ఏ పక్షినైనా మీరు తినవచ్చును.
12-18అయితే మీరు తినకూడని పక్షులు ఏవంటే:
పక్షిరాజు, ఏ రకమైన రాబందు, క్రౌంచు పక్షి, పిల్లిగద్ద,
కాకులు, నిప్పుకోళ్లు, కపిరిగాడు, కోకిల, ప్రతి విధమైన
డేగ పైడికంటె ఏ విధమైన గుడ్లగూబ, హంస, గూడ
బాతులు, తెల్లబందు, చెరువుకాకి, చీకు బాతు, సారస
పక్షి సంకుబుడి కొంగలు, ఏ విధమైన కొంగ, కుకుడు
గువ్వ, గబ్బిలము.

19"రెక్కలుగల అపవిత్ర పురుగులను దేనినీ తిన
వద్దు. 20అయితే పవిత్రమైన ఏ పక్షినైనా మీరు తిన
వచ్చును.

21"దానంతటఅదే చచ్చిన ఏ జంతువునూ తిన
వద్దు. చచ్చిన జంతువును మీ ఊళ్లో ఉన్న విదేశీయునికి
మీరు ఇవ్వవచ్చు, అతడు దాన్ని తినవచ్చు. లేక చచ్చిన
జంతువును విదేశీయునికి మీరు అమ్మవచ్చు. కానీ
మీ మట్టుకు మీరు చచ్చిన జంతువును తినకూడదు.
ఎందుకంటే మీరు మీ దేవుడైన యెహోవాకు చెందిన

వారు గనుక. మీరు ఆయనకు ప్రత్యేక ప్రజలు.
“గొర్రెపిల్లను దాని తల్లి పాలతో వండవద్దు.

## పదోవంతు ఇవ్వటం

22“ప్రతి సంవత్సరం మీ పొలాలలో పండే పంటల్లో
పదవ వంతు మీరు జాగ్రత్తగా దాచిపెట్టాలి. 23తర్వాత
యెహోవా తనకు ప్రత్యేక ఆలయంగా ఉండేందుకు
ఏర్పరచుకొన్న స్థలానికి మీరు వెళ్లాలి. అక్కడ మీ
పంటల్లో పదోవంతు, మీ ధాన్యంలో పదోవంతు, మీ
కొత్త ద్రాక్షారసం, మీ నూనె, మీ పశువుల మందలో,
గొర్రెల మందలో, మొట్ట మొదట పుట్టిన వాటిని మీ
దేవుడైన యెహోవాతో కలిసి మీరు తినాలి. అప్పుడు
మీ దేవుడైన యెహోవాను మీరు ఎల్లప్పుడూ గౌర
వించటం జ్ఞాపకం ఉంచుకొంటారు. 24అయితే మీరు
ప్రయాణం చేయటానికి ఆ స్థలం మీకు చాలా దూరం
కావచ్చును. ఒకవేళ మీకు యెహోవా అనుగ్రహించిన
పంటలన్నింటిలోని దశమ భాగాలు మీరు మోసుకొని
పోలేకపోవచ్చును. అలాగనుక జరిగితే యిలా చేయండి:
25మీ పంటలోని ఆ భాగం అమ్మివేయండి. ఆ ధనం
మీతోకూడ తీసుకొని, యెహోవా నిర్ణయించిన ఆ
ప్రత్యేక స్థలానికి వెళ్లండి. 26మీకు యిష్టం వచ్చింది
ఏదైనా – ఆవులు, గొర్రెలు, ద్రాక్షారసం, మద్యం లేక
మీరు కోరినది ఏ భోజనంగాని యింకేదైనాసరే కొనేం
దుకు ఆ ధనం వినియోగించండి. తర్వాత మీరు, మీ
కుటుంబం మీ దేవుడైన యెహోవాతో కలిసి ఆ
స్థలంలో భోజనంచేసి ఆనందించండి. 27అయితే మీ
పట్టణాల్లో నివసించే లేవీయులను నిర్లక్ష్యం చేయవద్దు,
ఎందుకంటే మీవలె వారికి భూమిలో భాగం లేదు.”

28“ప్రతి మూడేళ్ల చివరలో, మీ దశమ భాగాలన్నీ
ఆ సంవత్సరానికి మీరు తీసుకొని రావాలి. మీ పట్టణంలో
ఇతరులు దీనిని వినియోగించుకోగలిగిన ఒక స్థలంలో
ఈ ఆహారాన్ని ఉంచాలి. 29లేవీయులకు వారి స్వంత
భూమి లేదు గనుక ఈ ఆహారం వారికోసం ఉంటుంది.
మీ పట్టణంలో భోజనం లేని వారికి, విదేశీయులకు,
అనాథలకు, విధవలకు కూడా ఈ భోజనం ఉంటుంది.
ఇలా గనుక మీరు చేస్తే మీరు చేసే ప్రతి దానిలో మీ
దేవుడైన యెహోవా మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు.

## అప్పులు రద్దు చేసే ప్రత్యేక సంవత్సరం

15 “ప్రతి ఏడు సంవత్సరాల అంతంలో, మీరు
అప్పులన్నీ రద్దుచేయాలి. 2మీరు మీ అప్పు
లను రద్దు చేయాల్సిన పద్ధతి యిది; మరో ఇశ్రాయేలు
మనిషికి అప్పు యిచ్చిన ప్రతి ఇశ్రాయేలు వ్యక్తీ తన
అప్పును రద్దుచేయాలి. అతడు ఒక సోదరుణ్ణి (ఇశ్రాయే
లీయుని) అప్పు తిరిగి చెల్లించమని అడగ కూడదు.
ఎందుకంటే ఆ సంవత్సంరలో అప్పులన్నీ రద్దు అయి
పోయాయని యెహోవా ప్రకటించాడు గనుక. 3ఒక
విదేశీయుడ్ని మీరు తిరిగి చెల్లించమని అడగవచ్చు.
కానీ మరో ఇశ్రాయేలు మనిషి చెల్లించాల్సిన ఏ బాకీనైనా
మీరు రద్దుచేయాలి. 4అయితే మీ మధ్య బీద ప్రజలు
ఎవరూ ఉండరు. ఎందుకంటే మీరు నివసించుటకు
మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో
యెహోవా మిమ్మల్ని ఎంతో గొప్పగా ఆశీర్వదిస్తాడు.
5మీరు మీ దేవుడైన యెహోవాకు పూర్తిగా విధే
యులైతేనే ఇది జరుగుతుంది. ఈ వేళ నేను మీకు
చెప్పిన ప్రతి ఆజ్ఞకూ మీరు జాగ్రత్తగా విధేయులు
కావాలి. 6మీ దేవుడైన యెహోవా మీకు చేసిన వాగ్దానం
ప్రకారం ఆయన మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. మరియు
మీరు అనేక రాజ్యాలకు అప్పు ఇచ్చేంత ధనం మీకు
ఉంటుంది. కాని మీరు మాత్రం ఇతరుల దగ్గర అప్పు
తీసుకోవాల్సిన అవసరం ఉండదు. మీరు అనేక రాజ్యా
లను పాలిస్తారు. కానీ ఆ రాజ్యాల్లో ఏదీ మిమ్మల్ని
పాలించదు.

7“మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో
మీరు నివసించేటప్పుడు మీ ప్రజల మధ్య ఎవరైనా
పేదవారు ఒకరు ఉండవచ్చును. మీరు స్వార్థపరులుగా
ఉండకూడదు. ఆ పేద మనిషికి సహాయం చేసేందుకు
మీరు నిరాకరించకూడదు. 8మీరు అతనికి భాగం
పంచిపెట్టేందుకు యిష్టపడాలి. ఆ వ్యక్తికి అవసరమైనవి
అన్నీ అతనికి అప్పుగా ఇచ్చేందుకు మీరు ఇష్టపడాలి.
9“ఏడవ సంవత్సరం అంటే అప్పులు రద్దుచేసే సంవ
త్సరం దగ్గర్లో ఉందని చెప్పి ఎవరికైనా అప్పు
ఇచ్చేందుకు ఎన్నడూ తిరస్కరించవద్దు. అలాంటి
చెడుతలంపు మీ మనసులో కలుగనియ్యవద్దు.
సహాయం కావాల్సిన ఆ వ్యక్తిని గూర్చి నీవు ఎన్నడూ
చెడుగా తలంచవద్దు. నీవు అతనికి సహాయం చేసేం
దుకు నిరాకరించకూడదు. ఆ పేదవానికి నీవు ఏమీ
ఇవ్వకపోతే అతడు నీ మీద యెహోవాకు ఆరోపణ
చేస్తాడు. మరియు యెహోవా నిన్ను పాపం చేసిన
నేరస్థునిగా చూస్తాడు. 10“పేదవానికి నీవు ఇవ్వగలిగిన
దంతా ఇవ్వు. అతనికి యిచ్చే విషయంలో చెడుగా
భావించకు. ఎందుకంటే ఈ మంచి పని చేసినందుకు
మీ దేవుడైన యెహోవా మిమ్మును ఆశీర్వదిస్తాడు.
ఆయన నీ కార్యాలన్నిటిలోనూ, నీవు చేయు ప్రయ
త్నాలన్నిటిలోనూ, నిన్ను ఆశీర్వాదిస్తాడు. 11దేశంలో
పేద ప్రజలు ఎల్లప్పుడూ ఉంటారు. అందుకే మీ
ప్రజలకు మీ దేశంలో అక్కరలో ఉండే పేద ప్రజలకు
ఇచ్చేందుకు మీరు సిద్ధంగా ఉండాలని నేను మీకు
ఆజ్ఞ యిస్తున్నాను.

## బానిసలను స్వేచ్ఛగా పోనివ్వటం

12“మీ ప్రజల్లో ఒకరు – ఒక హెబ్రీ పురుషుడు
లేక స్త్రీ మీకు అమ్మబడితే అప్పుడు ఆ వ్యక్తి ఆరు
సంవత్సరాలు మీ సేవ చేయాలి. అప్పుడు ఏడవ

సంవత్సరం ఆ వ్యక్తిని నీ దగ్గర్నుండి నీవు స్వేచ్ఛగా
పోనివ్వాలి. 13అయితే నీవు నీ బానిసను స్వేచ్ఛగా
పోనిచ్చినప్పుడు, ఏమీ లేకుండానే ఆ వ్యక్తిని పోనివ్వ
కూడదు. 14మీ మందలోనుండి, మీ ధాన్యపు
కళ్లములోనుండి, మీ ద్రాక్ష గానుగలోనుండి ఆ వ్యక్తికి
మీరు పెద్ద వాటా ఇవ్వాలి. మీ దేవుడైన యెహోవా
మీకు మంచివాటిని సమృద్ధిగా యిచ్చి ఆశీర్వదించాడు.
అదే విధంగా మీరు కూడా మీ బానిసకు సమృద్ధిగా
ఇవ్వాలి. 15మీరు ఈజిప్టులో బానిసలు అని మీరు
జ్ఞాపకం ఉంచుకోవాలి. మీ దేవుడైన యెహోవా
మిమ్మల్ని రక్షించాడు. అందుచేత మీరు ఇలా చేయా
లని నేడు నేను మీతో చెబుతున్నాను. 16“అయితే
మీ బానిసల్లో ఒకరు, ‘నిన్ను నేను విడువను’ అంటారు.
మిమ్మల్ని, మీ కుటుంబాన్ని అతడు ప్రేమించటం
చేత, మీ దగ్గర అతడు బాగా బ్రతికినందుచేత అతడు
యిలా చెప్పవచ్చును. 17ఈ సేవకుడు మీ తలుపుకు
అతని చెవి ఆనించునట్లు ఉంచి, ఒక కదురును
ఉపయోగించి అతని చెవిలో రంధ్రం చేయాలి.
అప్పుడు అతడు శాశ్వతంగా మీకు బానిస అవుతాడు.
మీ దగ్గరే ఉండిపోవాలి అనుకొనే బానిస స్త్రీలకు కూడ
యిలాగే చేయాలి. 18“మీరు మీ బానిసలను స్వేచ్ఛగా
వెళ్లిపోనిచ్చినప్పుడు అది చెడ్డ పని అని మీరు
తలంచకూడదు. ఒక జీతగానికి నీవు చెల్లించేదానిలో
సగం డబ్బుకే అతడు ఆరు సంవత్సరాలు నీ దగ్గర
పనిచేసాడని జ్ఞాపకం ఉంచుకో. నీవు చేసే ప్రతిదానిలో
నీ దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదిస్తాడు.

## మొదట పుట్టిన జంతువుల్ని గురించి నియమాలు

19“నీ గోవులలోగాని, గొర్రెలలోగాని మొదట
పుట్టిన మగవాటన్నింటినీ నీవు యెహోవాకు ప్రతిష్ఠిం
చాలి. ఈ జంతువుల్లో దేనినీ నీ పనికి ఉపయోగించ
వద్దు. ఈ గొర్రెల్లో దేనినుండీ ఉన్ని కత్తిరించవద్దు.
20ప్రతి సంవత్సరం నీ గోవుల్లో, గొర్రెల్లో మొట్ట
మొదట పుట్టిన జంతువును తీసుకొని, మీ దేవుడైన
యెహోవా ఏర్పరచే స్థలంలోదానిని తినండి.
యెహోవా మీతో ఉండే ఆ స్థలంలో మీరూ మీ
కుటుంబం దానిని తినాలి. 21“అయితే ఆ జంతువు
కుంటిదిగాని, గుడ్డిదిగాని, లేక ఇంకేదైనా దోషంగాని
ఉన్నదైతే, ఆ జంతువును మీ దేవుడైన యెహోవాకు
మీరు బలిగా అర్పించకూడదు.
22అయితే మీరు నివసించే స్థలంలో మీరు దాని
మాంసం తినవచ్చును. పవిత్రమైన వాళ్లు, అపవిత్ర
మైన వాళ్లు ఎవరైనాసరే దానిని తినవచ్చును. దీనిని
గూర్చిన నియమాలు దుప్పి, జింక మాంసం గూర్చిన
లాంటివే. 23కానీ ఆ జంతువు రక్తం మాత్రం మీరు
తాగకూడదు. ఆ రక్తాన్ని మీరు నీళ్లలా నేలమీద
పోయాలి.”

## పస్కా పండుగ

16 “అబీబు* నెలలో మీరు మీ దేవుడైన
యెహోవాకు పస్కా పండుగ ఆచరించాలి.
ఎందుకంటే అబీబు నెలలోనే మీ దేవుడైన యెహోవా
మిమ్మల్ని రాత్రిపూట ఈజిప్టునుండి బయటకు
రప్పించాడు. 2యెహోవా తనకు ప్రత్యేక స్థలంగా
ఏర్పరచుకొనే చోటుకు మీరు వెళ్లాలి. అక్కడ మీ
దేవుడైన యెహోవాను గౌరవించేందుకు, పస్కా
పండుగ భోజనానికి ఒక ఆవును లేక మేకను మీరు
బలి యివ్వాలి. 3ఈ బలితోపాటు పొంగినది ఏదీ
తినవద్దు. ఏడు రోజులపాటు పొంగని రొట్టెలు మీరు
తినాలి. ఇది “బాధరొట్టె అని పిలువబడుతుంది.”
ఈజిప్టు దేశంలో మీ బాధలను జ్ఞాపకం చేసుకొనేందుకు
ఇది సహాయపడుతుంది. ఎంత త్వరగా మీరు ఆ దేశం
విడిచిపెట్టాల్సి వచ్చిందో జ్ఞాపకం ఉందా! మీరు
బ్రదికినంత కాలం ఆ రోజును జ్ఞాపకం ఉంచుకోవాలి.
4దేశవ్యాప్తంగా ఏడు రోజులపాటు ఎక్కడా ఎవరి
యింటిలో పులియని రొట్టెలు ఉండకూడదు.
మరియు మొదటి రోజు సాయంత్రం మీరు బలి
అర్పించే మాంసం అంతా తెల్లవారక ముందే తినటం
అయిపోవాలి.
5“మీ దేవుడైన యెహోవా మీకు ఇచ్చే పట్టణాలు
దేనిలోనైనా పస్కా పండుగ జంతువును మీరు బలి
అర్పించకూడదు. 6మీ దేవుడైన యెహోవా తనకోసం
ప్రత్యేక ఆలయంగా ఏర్పాటు చేసుకొన్న స్థలంలో
మాత్రమే పస్కా పండుగ జంతువును మీరు బలిగా
అర్పించాలి. అక్కడ సాయంకాలం సూర్యుడు అస్తమిం
చినప్పుడు పస్కా పండుగ జంతువును మీరు బలి
అర్పించాలి. యెహోవా మిమ్మల్ని ఈజిప్టునుండి
బయటకు తీసుకొనివచ్చిన సందర్భము ఇది.
7మరియు మీ దేవుడైన యెహోవా ఏర్పరచుకొనే
స్థలంలోనే పస్కా పండుగ మాంసం మీరు వండుకొని
తినాలి. అప్పుడు ఉదయాన్నే మీరు తిరిగి మీ గుడారా
లకు వెళ్లిపోవాలి. 8పులియని రొట్టెలను ఆరు రోజులు
మీరు తినాలి. ఏడో రోజున మీరు ఏ పనీ చేయకూడదు.
ఆ రోజు, మీ దేవుడైన యెహోవా కోసం ప్రత్యేక
సమావేశంగా ప్రజలంతా కూడు కొంటారు.

## వారాల పండుగ (పెంతెకొస్తు)

9“మీరు పంట కోయటం మొదలు పెట్టినప్పటి
నుండి ఏడు వారాలు లెక్క కట్టాలి. 10అప్పుడు మీ
దేవుడైన యెహోవాకు వారాల పండుగను మీరు

---

**అబీబు** “ధాన్యపు యవ్వన కంకులు” అని దీని అర్థం. ఇశ్రాయేలీయుల సంవత్సరపు మొదటి నెల, “సిసాన్” అని కూడా పిలుస్తారు. ఇది మార్చి మరియు ఏప్రిల్ నెలల సమయంలో వస్తుంది.

జరుపుకోవాలి. ఒక స్వేచ్ఛార్పణ తీసుకొని రావటంతో
దీనిని జరుపుకోండి. మీ దేవుడైన యెహోవా
మిమ్మల్ని ఎంతగా ఆశీర్వదించాడో ఆలోచించి, మీరు
ఎంత యివ్వాలి అనేది నిర్ణయించండి. [11]యెహోవా
తన ప్రత్యేక ఆలయంగా ఏర్పరచుకొనే చోటుకు
వెళ్లండి. అక్కడ మీరూ, మీ ప్రజలూ కలిసి అక్కడ
మీ దేవుడైన యెహోవాతో సంతోషంగా గడపండి.
మీ కుమారులు, మీ కుమార్తెలు, మీ సేవకులు, మీ
ప్రజలందరినీ మీతో బాటు తీసుకొని వెళ్లండి. అంతే
కాదు, మీ పట్టణాలలో నివసించే లేవీయులను, విదేశీ
యులను, తల్లిదండ్రులు లేని పిల్లలను, విధవలను
కూడ తీసుకొని వెళ్లండి. [12]మీరు ఈజిప్టులో బానిసలు
అని మరచిపోవద్దు. ఈ ఆజ్ఞలకు మీరు తప్పక విధే
యులు కావాలి.

### పర్ణశాలల పండుగ

[13]"మీ ధాన్యపు కళ్లమునుండి, మీ ద్రాక్ష గానుగ
నుండి మీరు మీ పంటను కూర్చుకొనే ఏడు రోజులకు
పర్ణశాలల పండుగ మీరు జరుపుకోవాలి.
[14]మీరూ, మీ కుమారులు, మీ కుమార్తెలు, మీ
సేవకులందరూ, మీ పట్టణాల్లో నివసించే లేవీయులు,
విదేశీయులు, తల్లిదండ్రులు లేని పిల్లలు, విధవలు
ఈ పండుగలో సంతోషంగా గడపండి. [15]యెహోవా
ఏర్పాటు చేసే ప్రత్యేక స్థలంలో ఏడు రోజులపాటు
ఈ పండుగను మీరు ఆచరించాలి. మీ దేవుడైన
యెహోవాను గౌరవించేందుకు దీనిని చేయండి. మీ
దేవుడైన యెహోవా మీ పంట అంతటినీ, మీరు
చేసిన పని అంతటినీ ఆశీర్వదించాడు గనుక బాగా
సంతోషించండి.
[16]"మీ దేవుడైన యెహోవా ఏర్పాటు చేసే ప్రత్యేక
స్థలంలో ఆయనను కలుసుకొనేందుకు సంవత్సరానికి
మూడుసార్లు మీ పురుషులంతా రావాలి. ఇది పులియని
రొట్టెల పండుగ, వారాల పండుగ, పర్ణశాలల పండుగల
ప్పుడు సంభవిస్తుంది. యెహోవాను కలుసుకొనేం
దుకు వచ్చే ప్రతి వ్యక్తీ ఒక కానుక తీసుకొని రావాలి.
[17]ప్రతి మనిషి ఇవ్వగలిగినంత ఇవ్వాలి. యెహోవా
తనకి ఎంత ఇచ్చాడో అనేది గ్రహించి, తాను ఎంత
ఇవ్వాలో నిర్ణయించాలి.

### ప్రజల కోసం అధికారులు, న్యాయమూర్తులు

[18]"మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న ప్రతి
పట్టణంలో మీ వంశాలలో న్యాయమూర్తులను, అధి
కారులను మీరు నియమించాలి. ఈ న్యాయమూర్తులు,
అధికారులు న్యాయంగా సక్రమంగా ప్రజలకు తీర్పు
తీర్చాలి.
[19]న్యాయ తీర్పును మీరు మార్చకూడదు. మీరు
కొందరియెడల పక్షపాతం చూపించకూడదు. ఒక
తీర్పులో మీ మనసు మార్చుకొనేందుకు మీరు డబ్బు
తీసుకోకూడదు. డబ్బు జ్ఞానుల కళ్లను గుడ్డివి చేస్తుంది,
ఒక మంచి వ్యక్తి చెప్పేదానిని మార్చేస్తుంది. [20]మీరు
బ్రతికి, మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశాన్ని
స్వాధీనపరచుకొనేందుకు న్యాయం, మంచి తనం
ఉండే తీర్పులనే మీరు ఇవ్వాలి.

### విగ్రహాలు దేవునికి అసహ్యం

[21]"మీ దేవుడైన యెహోవాకు మీరు ఒక బలిపీఠం
నిలబెట్టినప్పుడు, ఆషెరా* దేవతను ఘనపర్చే చెక్క
స్తంభాలు ఏవీ బలిపీఠం పక్కగా మీరు నిలబెట్టకూడదు.
[22]మరియు తప్పుడు దేవుళ్లను పూజించేందుకోసం
ప్రత్యేకమైన రాయిని మీరు నిలబెట్టకూడదు. మీ
దేవుడైన యెహోవా విగ్రహాలను విగ్రహారాధనను అస
హ్యించుకుంటాడు.

### బలులకు మంచి జంతువులనే ఉపయోగించాలి

17 "ఏదైనా దోషం ఉన్న ఆవునుగాని, గొర్రెను
గాని మీరు మీ దేవుడైన యెహోవాకు బలిగా
అర్పించకూడదు. ఎందుకంటే, మీ దేవుడైన యెహో
వాకు అది అసహ్యం.

### విగ్రహాలను ఆరాధించినందుకు శిక్ష

[2]"మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న పట్ట
ణాల్లో ఒకదానిలో జరిగిన ఒక చెడు విషయాన్ని
గూర్చి మీరు వినవచ్చును. మీలో ఒక పురుషుడు లేక
ఒక స్త్రీ యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేసినట్టు
మీరు వినవచ్చును. వారు యెహోవా ఒడంబడికను
తప్పిపోయినట్టు [3]వారు ఇతర దేవుళ్లను పూజించినట్టు
మీరు వినవచ్చును. లేదా వాళ్లు సూర్యుని, చంద్రుని,
నక్షత్రాలను పూజించినట్టు మీరు వినవచ్చును. అది
యెహోవానైన నేను మీకు ఇచ్చిన ఆజ్ఞకు విరుద్ధం.
[4]ఇలాంటి దుర్వార్త మీరు వింటే, మీరు దాన్ని జాగ్రత్తగా
పరిశీలించాలి. ఇశ్రాయేలీయులలో ఈ దారుణ సంఘ
టన నిజంగా జరిగింది వాస్తవమా అనేది మీరు తెలుసు
కోవాలి. అది వాస్తవమని మీకు ఋజువైతే [5]ఆ చెడు
కార్యం చేసిన మనిషిని మీరు శిక్షించాలి. ఆ పురుషుని
లేక స్త్రీని మీరు మీ పట్టణ ద్వారము దగ్గరకు తీసు
కొనివెళ్లి రాళ్ళతో కొట్టి వారిని చంపాలి. [6]అయితే ఆ
వ్యక్తి చెడుకార్యం చేసాడని ఒక్కరు మాత్రమే సాక్ష్యము
చెబితే ఆ వ్యక్తికి మరణ శిక్ష విధించకూడదు. అయితే
అది సత్యం అని ఇద్దరు ముగ్గురు సాక్ష్యం చెబితే,
అప్పుడు ఆ వ్యక్తిని చంపివేయాలి. [7]ఆ వ్యక్తిని చంప
టానికి మొదట ఆ సాక్షులు, తరువాత ప్రజలంతా ఆ

**ఆషెరా** ఇది అష్షూరీయుల, కనానీయుల దేవత. ఇది సంతానం కలిగిస్తుందని వారి నమ్మకము.

వ్యక్తి మీద చేతులు వేయాలి. ఈ విధంగా మీ మధ్య
నుండి ఆ చెడును నిర్మూలించాలి.

## కష్టతరమైన న్యాయస్థానాల నిర్ణయాలు

8“మీ న్యాయస్థానాలు తీర్పు చెప్పలేనంత కష్టతర
మైన సమస్యలు కొన్ని ఉండవచ్చును. అది ఒక హత్యా
నేరం కావచ్చు లేక ఇద్దరి మధ్య వివాదం కావచ్చును.
లేక యిద్దరి మధ్య ఘర్షణలో ఒకరికి హాని కలిగిన
విషయం కావచ్చు. మీ పట్టణాల్లో ఈ వ్యాజ్యాలు
విచారణకు వచ్చినప్పుడు, ఏది నిజం అనే విషయాన్ని
మీ న్యాయమూర్తులు నిర్ధారణ చేయలేక పోవచ్చును.
అప్పుడు మీ దేవుడైన యెహోవా ఏర్పాటు చేసే
ప్రత్యేక స్థలానికి మీరు వెళ్లాలి. 9లేవీ వంశానికి చెందిన
యాజకుల దగ్గరకు, అప్పటికి పదవిలో ఉన్న న్యాయ
మూర్తి దగ్గరకు మీరు వెళ్లాలి. ఆ సమస్యను గూర్చి
ఏమి చేయాలో వారు నిర్ణయిస్తారు. 10అక్కడ
యెహోవా ప్రత్యేక స్థలంలో వారు వారి తీర్మానాన్ని
మీకు తెలియజేస్తారు. మీరు చేయాలని వారు మీకు
చెప్పే విషయాలన్నీ మీరు జాగ్రత్తగా చేయాలి. 11మీరు
వారి తీర్మానాన్ని అంగీకరించి, వారి హెచ్చరికలను
ఖచ్చితంగా పాటించాలి. మీరు చేయాలని వారు చెప్పే
దానికి ఏదీ మీరు వ్యతిరేకంగా చేయకూడదు.
12“ఆ సమయంలో అక్కడ మీ దేవుడైన యెహో
వాను సేవిస్తున్న న్యాయమూర్తికి లేక యాజకునికి
విధేయులయ్యేందుకు నిరాకరించిన వ్యక్తిని మీరు శిక్షిం
చాలి. ఆ వ్యక్తి చావాల్సిందే. ఇశ్రాయేలులో ఈ చెడు
గును మీరు అరికట్టాలి. 13ఈ శిక్షనుగూర్చి ప్రజలంతా
విని భయం తెచ్చుకొంటారు. వారు ఇకమీదట
మొండిగా ఉండరు.

## రాజును ఎన్నుకోవడం ఎలా?

14“మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో
మీరు ప్రవేశిస్తారు. మీరు ఆ దేశాన్ని స్వాధీనం చేసుకొని
దానిలో మీరు నివసిస్తారు. అప్పుడు మీరు ‘మా చుట్టూ
ఉన్న రాజ్యాలలాగే మాకూ ఒక రాజును మేము నియ
మించుకొంటాము’ అంటారు. 15అలా జరిగినప్పుడు
యెహోవా ఏర్పాటు చేసిన రాజునే మీరూ ఏర్పరచు
కోవాలి. మీ మీద వుండే రాజు మీ ప్రజల్లో ఒకడై
ఉండాలి. ఒక విదేశీయుణ్ణి మీరు రాజుగా చేయ
కూడదు. 16రాజు తనకోసం మరీ ఎక్కువ గుర్రాలను
సంపాదించుకోకూడదు. ఇంకా గుర్రాలు తీసుకొనివ
చ్చేందుకు అతడు ఈజిప్టుకు మనుష్యులను పంప
కూడదు. ఎందుకంటే ‘మీరు ఎప్పుడూ తిరిగి ఆ
మార్గాన వెళ్లకూడదు’ అని యెహోవా మీతో చెప్పాడు
గనుక. 17మరియు రాజుకు ఎక్కువమంది భార్యలు
ఉండకూడదు. ఎందుకంటే అది అతణ్ణి యెహోవా
నుండి మళ్లింపచేస్తుంది గనుక. మరియు రాజు వెండి
బంగారాలతో తనను తాను ఐశ్వర్యవంతునిగా చేసు
కోకూడదు.
18“ఆ రాజు పరిపాలన ప్రారంభించినప్పుడు,
ధర్మశాస్త్రం నకలు ఒకటి తనకోసం ఒక గ్రంథంలో
అతడు రాసుకోవాలి. యాజకుల, లేవీయుల గ్రంథాల
నుండి అతడు ఆ ప్రతిని తయారు చేసుకోవాలి.
19రాజు ఆ గ్రంథాన్ని తన దగ్గర ఉంచుకోవాలి. అతడు
తన జీవితం అంతా ఆ గ్రంథం చదవాలి. ఎందుకంటే
అప్పుడే రాజు తన దేవుడైన యెహోవాను గౌరవిం
చటం నేర్చుకొంటాడు. ధర్మశాస్త్రం ఆజ్ఞాపించే ప్రతిదా
నికీ పూర్తి విధేయత చూపటం కూడ అతడు నేర్చు
కొంటాడు. 20అప్పుడు రాజు తన ప్రజలందరికంటే
తానే గొప్పవాడ్ని అని తలంచడు. అతడు ధర్మశాస్త్రనికి
దూరంగా తిరిగి పోకుండా, ఖచ్చితంగా దానిని పాటి
స్తాడు. అప్పుడు ఆ రాజు, అతని సంతతివారు ఇశ్రా
యేలు రాజ్యాన్ని చాలా కాలం పరిపాలిస్తారు.

## యాజకులను, లేవీయులను బలపరచటం

18 “ఇశ్రాయేలు దేశంలో లేవీ వంశపువారికి
భూమిలో ఎలాంటి వాటా దొరకదు. ఆ
ప్రజలు యాజకుల సేవచేస్తారు. నిప్పుమీద వంటచేసి,
యెహోవాకు అర్పించబడిన బలులు తింటూ వారు
బ్రదుకుతారు. లేవీ వంశపు ప్రజల వాటా అదే. 2ఇతర
వంశాల వారిలా ఆ లేవీ ప్రజలకు భూమిలో వాటా
ఏమీ ఉండదు. యెహోవాయే లేవీయుల వాటా,
యెహోవా ఇది వారికి వాగ్దానం చేసాడు.
3“మీరు ఒక ఆవును, ఎద్దును, లేక గొర్రెను బలిగా
చంపినప్పుడు, జబ్బ, రెండు దవడలు, పొట్ట మీరు
యాజకులకు ఇవ్వాలి.
4మీ మొదటి పంటలోనుండి మీ ధాన్యం, మీ
కొత్త ద్రాక్షారసం, నూనె మీరు యాజకులకు ఇవ్వాలి.
మీ గొర్రెలనుండి కత్తిరించిన మొదటి ఉన్ని మీరు
లేవీయులకు ఇవ్వాలి.
5ఎందుకంటే, మీ దేవుడైన యెహోవా మీ
వంశాలన్నింటినీ చూసి, శాశ్వతంగా తనకు యాజకు
లుగా ఉండేందుకు లేవీయుని, అతని సంతతివారిని
ఏర్పరచుకొన్నాడు.
6“ఇశ్రాయేలులోని ఏ పట్టణం నుండియైనా లేవీ
యుడు యెహోవా నియమించిన స్థలానికి తన ఇష్ట
మున్నప్పుడెల్ల రావచ్చు.
7అప్పుడు ఈ లేవీయుడు తన దేవుడైన
యెహోవా పేరుమీద పరిచర్య చేయ వచ్చు. అతడు
విధి నిర్వహిస్తున్న తన సోదర లేవీయు లందరిలాగే
యెహోవా ప్రత్యేక ఆలయంలో పరిచర్య చేయాలి.
8ఆ లేవీయుడికి సామాన్యంగా తన కుటుం బానికి
వచ్చే వాటా కాకుండా, మిగిలిన లేవీయులతోను
సమానంగా వాటా వస్తుంది.

### ఇశ్రాయేలీయులు ఇతర దేశాలను అనుసరించకూడదు

[9]"మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు ప్రవేశించినప్పుడు అక్కడ ఉండే ఇతర రాజ్యాల ప్రజలు చేసే దారుణమైన పనులు చేయటం నేర్చుకోవద్దు. [10]మీ బలిపీఠాల అగ్నిమీద మీ కుమారులను గాని మీ కుమార్తెలను గాని బలి ఇవ్వవద్దు. జ్యోతిష్యం చెప్పేవానితోగాని, మాంత్రికుని దగ్గర గాని, భూత వైద్యుని దగ్గర గాని, సోదెచెప్పేవారి దగ్గరగాని మాట్లాడి భవిష్యత్తులో ఏం జరుగుతుందో అని తెలిసి కొనేందుకు ప్రయత్నించవద్దు. [11]ఎవరినీ యితరుల మీద మంత్ర ప్రభావంతో బంధించనీయవద్దు. మీ మధ్య ఎవ్వరూ కర్ణపిశాచము అడిగేవారుగా గాని, సోదె చెప్పేవాడుగాగాని, ఉండకూడదు. ఎవ్వరూ చనిపోయినవారితో మాట్లాడేందుకు ప్రయత్నించకూడదు. [12]అలాంటివి చేసే వాళ్లంటే మీ దేవుడైన యెహోవాకు అసహ్యం. అందుకే ఆ ఇతర రాజ్యాల వాళ్లను మీ ఎదుట నుండి ఆయన వెళ్లగొట్టేస్తాడు. [13]మీ దేవుడైన యెహోవాకు మీరు నమ్మకంగా ఉండాలి.

### యెహోవాయొక్క ప్రత్యేక ప్రవక్త

[14]"మీరు ఆ ఇతర జనాంగాలను మీ దేశంలోనుండి వెళ్లగొట్టాలి. ఆ జనాంగాలు సోదెగాంఢ్ర మరియు శకునాలు చెప్పువారి మాంత్రికుల మాటలు వింటారు. అయితే మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని అలాంటి పనులు చేయనియ్యడు. [15]మీ దేవుడైన యెహోవా మీ దగ్గరకు ఒక ప్రవక్తను* పంపిస్తాడు. ఈ ప్రవక్త మీ స్వంత ప్రజల్లోనుండి వస్తాడు. అతడు నాలాగే ఉంటాడు. మీరు ఈ ప్రవక్త మాట వినాలి. [16]దేవుడే మీకు ఈ ప్రవక్తను పంపిస్తాడు, ఎందుకంటే మీరు ఆయనను అడిగింది అదే. మీరు హోరేబు (సీనాయి) కొండ దగ్గర సమావేశమైనప్పుడు దేవుని స్వరం విని, కొండ మీద మహా అగ్నిని చూచి మీరు భయపడ్డారు. అందుచేత 'మా దేవుడైన యెహోవా స్వరం మరోసారి మమ్మల్ని విననీయవద్దు. ఆ మహా గొప్ప అగ్నిని మాకు కనబడనీయవద్దు, మేము చస్తాము' అని మీరు అన్నారు.

[17]"యెహోవా నాతో ఇలా చెప్పాడు: 'వారు అడుగుతోంది మంచిదే. [18]నీవంటి ఒక ప్రవక్తను నేను వారికోసం పంపిస్తాను. ఈ ప్రవక్త వారి స్వంత ప్రజల్లో ఒకడే. అతడు చెప్పాల్సిన విషయాలను నేను అతనికి చెబుతాను. నేను ఆజ్ఞాపించేవి అన్నీ అతడు ప్రజలకు చెబుతాడు. [19]ఈ ప్రవక్త నా పక్షంగా మాట్లాడతాడు. అతడు నా పక్షంగా మాట్లాడినప్పుడు, ఏ వ్యక్తి అయినా సరే నా ఆజ్ఞలు వినటానికి నిరాకరిస్తే, ఆ వ్యక్తిని నేను శిక్షిస్తాను.'

### బూటకపు ప్రవక్తలను తెలుసుకోవటం ఎలా?

[20]"అయితే ఒక ప్రవక్త చెప్పాల్సిందిగా నేను చెప్పని దానిని చెప్పవచ్చు. అతడు నా పక్షంగా మాట్లాడుతున్నానని ప్రజలతో చెప్పవచ్చును. ఇలా జరిగితే ఆ ప్రవక్త చంపబడాల్సిందే. లేక ఇతర దేవుళ్ల పక్షంగా ఒక ప్రవక్త మాట్లాడవచ్చు. ఆ ప్రవక్త కూడా చంపబడాల్సిందే. [21]'ప్రవక్త చెబుతోన్న విషయం యెహోవా చెప్పింది కాదు అని మనం ఎలా తెలుసు కోగలము' అని మీరు తలుస్తూ ఉండవచ్చు. [22]ప్రవక్త యెహోవా పక్షంగా మాట్లాడుతున్నానని చెప్పినప్పుడు, ఆ విషయం జరగకపోతే, అది యెహోవా చెప్పింది కాదు అని అప్పుడు మీకు తెలిసిపోతుంది. ఈ ప్రవక్త తన స్వంత ఆలోచనలనే చెబుతున్నాడని మీకు తెలుస్తుంది. అతని గూర్చి మీరు భయపడాల్సిన పనిలేదు.

### భద్రతా పట్టణాలు

19 "ఇతర రాజ్యాలకు చెందిన దేశాన్ని మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్నాడు. ఆ రాజ్యాలను యెహోవా నాశనం చేస్తాడు. ఆ ప్రజలు నివసించిన చోట మీరు నివసిస్తారు. వారి పట్టణాలు, ఇండ్లు మీరు స్వాధీనం చేసుకొంటారు. అది జరిగినప్పుడు, [2-3]దేశాన్ని మీరు మూడు భాగాలు చేయాలి. తర్వాత ఒక్కో ప్రాంతంలో ఉండే ప్రజలందరికి దగ్గరగా ఉండేటట్టు ఆ భాగంలో ఒక పట్టణాన్ని మీరు ఏర్పరచుకోవాలి. ఆ పట్టణాలకు మీరు త్రోవలు వేయాలి. ఒక వ్యక్తిని చంపిన ఏ వ్యక్తిగాని అక్కడికి పారిపోవచ్చును.

[4]"ఎవరినైనా చంపేసి భద్రతకోసం ఈ మూడు పట్టణాల్లో ఒకదానికి పారిపోయే మనిషికి నియమాలు ఇవి: అతడు ప్రమాదవశాత్తు మరొకరిని చంపినవాడై ఉండాలి. అతడు తాను చంపిన వ్యక్తిని ద్వేషించినవాడు కాకూడదు. [5]ఒక ఉదాహరణ: ఒక మనిషి మరొక వ్యక్తితో కలిసి కట్టెలు కొట్టుకొనేందుకు అడవికి వెళ్లవచ్చును. ఒక చెట్టును నరకడానికి అతడు తన గొడ్డలిని విసురుతాడు కాని ఆ గొడ్డలి దాని పిడినుండి ఊడిపోతుంది. ఆ గొడ్డలి ఊడి వెళ్లి అవతల మనిషికి తగుల్తుంది, అతడు చనిపోతాడు. అప్పుడు ఆ గొడ్డలి విసరిన మనిషి ఆ మూడు పట్టణాల్లో ఒకదానికి పారిపోయి భద్రంగా ఉండవచ్చును.

[6]అయితే ఆ పట్టణం చాలా దూరంగా ఉంటే అతడు కావాల్సినంత వేగంగా పరుగెత్తలేక పోవచ్చును. అతను చంపిన మనిషి బంధువు ఎవరైనా అతణ్ణి తరిమి, అతడు ఆ పట్టణం చేరక ముందే పట్టుకోవచ్చును.

---

**ప్రవక్త** దేవునిచేత పిలవబడిన ప్రత్యేక సేవకుడు. దేవుడు కలల ద్వారా మరియు దర్శనాల ద్వారా ప్రవక్తలతో మాట్లాడేవాడు. తద్వారా ప్రజలకు సందేశాలను ప్రవక్తలు తెలిపేవారు.

ఆ దగ్గర బంధువు చాలా కోపంతో అతణ్ణి చంపివేయ
వచ్చును. కానీ ఆ మనిషి మరణ పాత్రుడుకాడు.
అతడు చంపినవాణ్ణి అతడు ద్వేషించలేదు. 7కనుక
ఈ పనికోసం మూడు పట్టణాలను నిర్ణయించు కోవా
ల్సిందిగా నేను మీకు ఆజ్ఞాపిస్తున్నాను.
8“మీ దేవుడైన యెహోవా మీ దేశాన్ని విస్తరింప
చేస్తానని మీ తండ్రులకు వాగ్దానం చేసాడు. మీ పూర్వీ
కులకు ఇస్తానని ఆయన వాగ్దానం చేసిన దేశం ఆయన
మీకు ఇస్తాడు. 9ఈ వేళ నేను మీకు ఇస్తున్న ఆయన
ఆజ్ఞలకు మీరు పూర్తిగా విధేయులై, మీ దేవుడైన
యెహోవాను మీరు ప్రేమించి, ఎల్లప్పుడూ ఆయన
మార్గాలలో జీవిస్తే, ఆయన దీనిని చేస్తాడు. తర్వాత
యెహోవా మీ దేశాన్ని విస్తృతపరచినప్పుడు భద్రత
కోసం యింకా మూడు పట్టణాలను మీరు ఏర్పాటు
చేసుకోవాలి. అవి మొదటి మూడు పట్టణాలకు చేర్చ
బడాలి. 10అప్పుడు మీ స్వంతంగా మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో అమాయక ప్రజలు
చంపబడరు. మరియు ఏ మరణం విషయంలోనూ
మీరు దోషులుగా ఉండరు.
11“అయితే ఒకడు మరొకడ్ని ద్వేషించాడను
కోండి. అతడు దాగుకొని, తాను ద్వేషించే మనిషిని
చంపేందుకు వేచి ఉంటాడు. అతడు ఆ వ్యక్తిని చంపేసి
భద్రతకోసం ఈ పట్టణాల్లో ఒకదానికి పారిపోతాడు.
12అలా జరిగితే అతని స్వగ్రామంలోని పెద్దలు
ఎవరినైనా పంపి అతణ్ణి పట్టుకొని ఆశ్రయపురంనుండి
తీసుకొని వెళ్లిపోవాలి. అతణ్ణి శిక్షించాల్సిన బాధ్యత
గల బంధువులకు ఆ పెద్దలు అప్పగించాలి. ఆ హంత
కుడు మరణించాలి. 13అతని కోసం మీరు విచారించ
కూడదు. నిర్దోషులను చంపిన పాపంనుండి ఇశ్రాయేలీ
యులను మీరు తప్పించాలి. అప్పుడు మీకు అంతా
మేలు అవుతుంది.

### ఆస్తుల సరిహద్దులు

14“నీవు నీ పొరుగువాని సరిహద్దు రాళ్లు తీసివేయ
కూడదు. మీరు నివసించేందుకు మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో పూర్వీకులు ఈ
సరిహద్దు రాళ్లను పెట్టారు.

### సాక్ష్యాలు

15“ఒక వ్యక్తి ధర్మశాస్త్రానికి విరుద్ధంగా ఏదైనా
చేస్తున్నట్టు నేరారోపణ ఉంటే, ఆ వ్యక్తి దోషి అని
నిర్ధారణ చేయటానికి ఒక్క సాక్ష్యం చాలదు. ఆ వ్యక్తి
నిజంగా తప్పు చేసాడని నిరూపించటానికి ఇద్దరు లేక
ముగ్గురు సాక్షులు అవసరం.
16“ఒక సాక్షి మరో వ్యక్తి తప్పు చేసాడని, అతని
మీద అబద్ధం చెప్పి, అతనికి హాని చేయాలని చూడ
వచ్చును.
17అప్పుడు ఒకరితో ఒకరు వాదించు కొంటున్న
ఆ ఇద్దరు వ్యకులూ యెహోవా ప్రత్యేక ఆలయానికి
వెళ్లి, అప్పట్లో నాయకులుగా ఉన్న యాజకులు,
న్యాయమూర్తులచే తీర్పు పొందాలి. 18న్యాయ
మూర్తులు జాగ్రత్తగా ప్రశ్నలు వేయాలి. సాక్షి అవతలి
వ్యక్తిమీద అబద్ధాలు చెప్పినట్టు వారు తెలుసు కోవచ్చు.
ఒకవేళ సాక్షి అబద్ధం చెప్పి ఉంటే 19మీరు అతణ్ణి
శిక్షించాలి. అవతలి వ్యక్తికి ఇతడు ఏమి చేయాలను
కొన్నాడో దానినే ఇతనికి మీరు చేయాలి. ఈ విధంగా
మీ మధ్యలో ఏలాంటి కీడులేకుండా మీరు చేయాలి.
20మిగిలిన ప్రజలంతా ఇది విని భయపడతారు. మళ్లీ
అలాంటి చెడు కార్యం ఇంకెవ్వరూ ఎన్నడూ చేయరు.
21“తప్పు చేసిన వాడ్ని మీరు శిక్షించినప్పుడు మీరు
విచారించకూడదు. ప్రాణానికి ప్రాణం, కంటికి కన్ను,
పంటికి పన్ను, చేతికి చేయి, కాలికి కాలు తీసివేయాలి.
(నేరస్థునికి శిక్ష విధించినట్టుగానే)

### యుద్ధ నియమాలు

20 “మీరు మీ శత్రువులతో యుద్ధం చేయటానికి
వెళ్లినప్పుడు, మీకంటె ఎక్కువ గుర్రాలు,
రథాలు, మనుష్యులు కనబడితే మీరు వారిని గూర్చి
భయపడకూడదు. ఎందుకంటే మీ దేవుడైన
యెహోవా మీతో ఉన్నాడు, ఆయనే మిమ్మల్ని
ఈజిప్టు దేశంనుండి బయటకు తీసుకొని వచ్చాడు.
2“యుద్ధానికి మీరు దగ్గరగా వెళ్లినప్పుడు యాజ
కుడు సైనికుల దగ్గరకు వెళ్లి, వారితో మాట్లాడాలి.
3యాజకుడు ఇలా చెప్పాలి, ‘ఇశ్రాయేలు మనుష్య
లారా నా మాట వినండి. ఈవేళ మీరు మీ శత్రువులతో
యుద్ధానికి వెళ్తున్నారు. మీ ధైర్యం విడువవద్దు.
కలవరపడవద్దు. శత్రువునుగూర్చి భయపడవద్దు.
4ఎందుకంటే మీ పక్షంగా మీ శత్రువులతో పోరాడేం
దుకు మీ దేవుడైన యెహోవా మీతోకూడ ఉన్నాడు.
మీ దేవుడైన యెహోవా మీరు విజయం పొందేటట్లు
సహాయం చేస్తాడు.’
5“లేవీ అధికారులు సైనికులతో ఇలా చెప్పాలి:
‘కొత్త ఇల్లు కట్టుకొని దానిని ఇంకా ప్రతిష్ఠించని వారు
ఇక్కడ ఎవరైనా ఉన్నారా? అలాంటివాడు తిరిగి తన
ఇంటికి వెళ్లిపోవాలి. అతడు యుద్ధంలో చంపబడతా
డేమో. అలాంటప్పుడు మరో మనిషి అతని ఇంటిని
ప్రతిష్ఠిస్తాడు.
6ద్రాక్షాతోటను నాటి, ఇంకా ద్రాక్షాపండ్లు కూర్చు
కొననివాడు ఇక్కడ ఎవరైనా ఉన్నారా? ఆ మనిషి
తిరిగి ఇంటికి వెళ్లిపోవాలి. ఆ మనిషి యుద్ధంలో
మరణిస్తే, అప్పుడు అతని పొలంలోని ఫలాలను మరొ
కడు అనుభవిస్తాడు. 7వివాహం కోసం ప్రధానం జరిగిన
వాడు ఇక్కడ ఎవరైనా ఉన్నారా? ఆ మనిషి తిరిగి
ఇంటికి వెళ్లిపోవాలి. యుద్ధంలో అతడు మరణిస్తే,

అతనికి ప్రధానం చేయబడిన స్త్రీని మరొకడు వివాహం చేసుకొంటాడు.’

8“ఆ లేవీ అధికారులు ప్రజలతో ఇంకా ఇలా చెప్పాలి. ‘ధైర్యం పోయి, భయపడ్తున్నవాడు ఇక్కడ ఎవరైనా ఉన్నారా? అతడు తిరిగి ఇంటికి వెళ్లాలి. అప్పుడు అతడు మిగిలిన సైనికులుకూడా ధైర్యం కోల్పోయేటట్టు చేయకుండా ఉంటాడు.’ 9తర్వాత అధికారులు సైన్యంతో మాట్లాడటం అయిపోయిన తర్వాత, సైన్యాన్ని నడిపించేందుకు సేనాధిపతులను వారు నియమించాలి. 10“మీరు ఒక పట్టణం మీద దాడి చేయక ముందు అక్కడి ప్రజలకు మీరు శాంతి రాయబారం పంపించాలి. 11మీ రాయబారాన్ని వారు అంగీకరించి, వారి గుమ్మాలు తెరచినట్లయితే ఆ పట్టణంలోని ప్రజలంతా మీకు కప్పం కట్టేవాళ్ళవుతారు. మీకు బానిసలై మీకు పని చేయవలసివస్తారు. 12అయితే ఆ పట్టణం మీతో సమాధానపడేందుకు నిరాకరించి మీతో పోరాడితే అప్పుడు మీరు ఆ పట్టణాన్ని చుట్టుముట్టాలి. 13మరియు మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ఆ పట్టణం స్వాధీనం చేసుకోనిచ్చినప్పుడు, మీరు దానిలోని పురుషులందరినీ చంపివేయాలి. 14అయితే ఆ పట్టణంలోని స్త్రీలను, పిల్లలను, పశువులను, మిగిలిన సమస్తం మీరు తీసుకో వచ్చును. మీ దేవుడైన యెహోవా వీటిని మీకు ఇచ్చాడు. 15మీరు నివసించబోయే దేశంలోగాక, మీకు దూరంగా ఉన్న పట్టణాలన్నింటికీ మీరు అలాగే చేయాలి.

16“అయితే మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలోని పట్టణాలను మీరు స్వాధీనం చేసుకొన్నప్పుడు ప్రతి ఒక్కరినీ మీరు చంపేయాలి. 17హిత్తీయులు, అమోరీయులు, కనానీయులు, పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూసీయులు, మొత్తం ప్రజలందరినీ పూర్తిగా మీరు నాశనం చేయాలి. మీరు ఇలా చేయాలని మీ దేవుడైన యెహోవా మీకు ఆజ్ఞాపించాడు. 18ఎందుకంటే అలా చేస్తే, మీరు మీ దేవుడైన యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేయుమని వారు మీకు నేర్పించజాలరు. వారు వారి దేవుళ్లను పూజించేటప్పుడు చేసే భయంకర పనులు ఏవీ వారు మీకు నేర్పించరు.

19“మీరు ఒక పట్టణం మీద యుద్ధం చేస్తుంటే, చాలా కాలంవరకు మీరు ఆ పట్టణం చుట్టూ ముట్టడి వేసి ఉండవచ్చు. ఆ పట్టణం చుట్టూ ఉండే ఫల వృక్షాలను మీరు నరికి వేయకూడదు. ఆ చెట్ల ఫలాలు మీరు తినవచ్చును గాని ఆ చెట్లను నరికి వేయకూడదు. ఈ చెట్లు మీ శత్రువులు కాదు, అందుచేత వాటితో యుద్ధం చేయవద్దు.

20అయితే ఫలాలు ఇవ్వని చెట్లు అని మీకు తెలిసిన వాటిని మీరు నరికివేయ వచ్చును. ఆ పట్టణం మీద యుద్ధం చేయటానికి అవసరమైన ఆయుధాలను తయారు చేసేందుకు ఈ చెట్లను మీరు ఉపయోగించవచ్చును. ఆ పట్టణం పతనం అయ్యేంత వరకు మీరు వాటిని ఉపయోగించవచ్చును.

### ఒకడు హత్య చేయబడి ఉంటే

21 “మీరు నివసించేందుకు, మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో ఒక పొలంలో హత్య చేయబడిన వాడు ఒకడు కనబడవచ్చును. కానీ అతణ్ణి చంపింది ఎవరో ఎవరికీ తెలియదు. 2అప్పుడు మీ నాయకులు, న్యాయమూర్తులు బయటకు వచ్చి, చంపబడిన మనిషి చుట్టూ ఉన్న పట్టణాల దూరాన్ని కొలత వేయాలి. 3చచ్చిన వానికి అతి దగ్గరగా ఉన్న పట్టణం ఏదో తెలిసినప్పుడు, ఆ పట్టణం పెద్దలు వారి మందలో నుండి ఒక ఆవును తీసుకొని రావాలి. అది పెయ్యగా ఉండాలి. అది ఎన్నడూ ఏ పనికీ వినియోగించబడనిది కావాలి. 4అప్పుడు ఆ పట్టణపు నాయకుడు, నీరు ప్రవహిస్తున్న ఒక లోయలోనికి ఆ ఆవును తీసుకొని రావాలి. ఆ లోయ ఇదివరకు ఎన్నడూ దున్ననిది, మొక్కలు నాటనిదిగా ఉండాలి. అప్పుడు నాయకులు ఆ లోయలో ఆవు మెడను విరుగగొట్టాలి. 5లేవీ సంతతి వారు యాజకులుకూడ అక్కడికి వెళ్లాలి. (యెహోవాను సేవించేందుకు, ఆయన పేరిట ప్రజలను దీవించేందుకు మీ దేవుడైన యెహోవా ఈ యాజకులను ఏర్పాటు చేసుకొన్నాడు. వివాదానికి సంబంధించిన ప్రతి విషయంలో న్యాయం ఎవరిదో యాజకులే నిర్ణయిస్తారు.) 6ఆ శవానికి అతి సమీపంగా ఉన్న పట్టణపు నాయకులంతా, లోయలో మెడ విరుగగొట్టబడిన ఆవుమీద వారి చేతులు కడుగుకోవాలి. 7ఈ నాయకులు ఇలా చెప్పాలి, ‘ఈ మనిషిని మేము చంపలేదు. అది జరగటం మేము చూడలేదు. 8యెహోవా, నీవు విమోచించిన నీ ఇశ్రాయేలు ప్రజలను క్షమించు. నీ ప్రజల్లో నిర్దోషిని ఎవరినీ నిందించబడనీయకు.’ అప్పుడు ఆ హత్య నిమిత్తం వారు నిందించబడరు. 9అలాంటి పరిస్థితుల్లో ఇలా చేయటమే మీకు సరి. అలా చేయటం ద్వారా నిర్దోషులు ఎవరి హత్యనుగూర్చి నిందించబడరు.

### యుద్ధంలో పట్టుబడ్డ స్త్రీలు

10“మీరు మీ శత్రువులతో యుద్ధం చేస్తారు, మీరు వారిని ఓడించేటట్టు మీ దేవుడైన యెహోవా చేస్తాడు. అప్పుడు మీరు మీ శత్రువులను బందీలుగా కొనిపోతారు. 11ఆ బందీలలో అందమైన ఒక స్త్రీని నీవు చూడవచ్చు. నీవు ఆమెను వాంఛించి, నీ భార్యగా చేసుకోవాలని తలంచవచ్చు. 12అప్పుడు నీవు ఆమెను నీ ఇంటికి తీసుకొని రావాలి. ఆమె తన తల గొరిగించుకొని, గోళ్లు కత్తిరించుకోవాలి. 13ఆమె ధరించి ఉన్న బట్టలు తీసివేయాలి. ఆమె నీ ఇంటనే ఉండి

తన తల్లిదండ్రుల కోసం నెల రోజులు విలపించాలి, ఆ తర్వాత నీవు ఆమె దగ్గరికి పోవచ్చును. ఆమెకు భర్తవు కావచ్చును. ఆమె నీకు భార్య అవుతుంది.
[14]కాని ఆమె వలన నీకు సంతృప్తి కలుగకపోతే, తనకు ఇష్టంవచ్చిన చోటికి నీవు ఆమెను పోనివ్వాలి. అయితే నీవు ఆమెను అమ్మకూడదు. నీవు ఆమెను బానిసగా చూడరాదు. ఎందుకంటే నీ వలన ఆమెకు అవమానము కలిగింది గనుక.

### జ్యేష్ఠ కుమారుడు

[15]"ఒక పురుషునికి ఇద్దరు భార్యలు ఉండి, వారిలో ఒకదానికంటె మరొక దానిని అతడు ఎక్కువగా ప్రేమిస్తూ ఉండవచ్చును. ఆ ఇద్దరు భార్యలూ అతనికి పిల్లలను కనవచ్చును. అతడు ప్రేమించని భార్యకు పుట్టిన బిడ్డ మొదటి బిడ్డ కావచ్చును.
[16]అతడు తన ఆస్తిని తన పిల్లలకు పంచి ఇచ్చేటప్పుడు జ్యేష్ఠునికి చెందిన ప్రత్యేకమైన వాటిని, తాను ప్రేమించే భార్య కుమారునికి అతడు ఇచ్చివేయకూడదు.
[17]తన ప్రేమకు పాత్రము కాని మొదటి భార్య బిడ్డను అతడు స్వీకరించాలి. అతడు అన్నింటిలో రెండంతల భాగం మొదటి కుమారునికి ఇవ్వాలి. ఎందుకంటే, ఆ బిడ్డ అతని మొదటి బిడ్డ గనుక. ప్రథమ సంతానం హక్కు ఆ బిడ్డకే చెందుతుంది.

### లోబడేందుకు తిరస్కరించే కుమారులు

[18]"ఒకని కుమారుడు మొండివాడు, లోబడడు. ఈ కుమారుడు తండ్రికి గాని తల్లికి గాని విధేయుడు కాడు. తల్లిదండ్రులు ఆ కుమారుని శిక్షిస్తారు. అయిన ప్పటికీ వారి మాట అతడు నిరాకరిస్తాడు.
[19]అప్పుడు పట్టణ సమావేశ స్థలం దగ్గర ఉండే ఆ పట్టణ నాయకుల దగ్గరకు ఆ తల్లిదండ్రులు వానిని తీసుకొని వెళ్లాలి.
[20]ఆ పట్టణ నాయకులతో వారు ఇలా చెప్పాలి: 'మా కుమారుడు మొండివాడు, లోబడటం లేదు. మేము చెప్పిన ఏ పనీ అతడు చేయడు. వాడు విపరీతంగా తిని తాగుతున్నాడు.'
[21]అప్పుడు ఆ పట్టణంలోని మనుష్యులు ఆ కుమారుని రాళ్లతో కొట్టి చంపాలి. ఇలా చేయటం ద్వారా ఈ చెడుతనాన్ని మీ నుండి తొలగిస్తారు. ఇశ్రాయేలు ప్రజలంతా దీనిగూర్చి విని భయపడతారు.

### నేరస్థులు చంపబడి చెట్టుకు వ్రేలాడదీయబడటం

[22]"ఒక వ్యక్తి మరణ శిక్షకు యోగ్యమైన పాపం చేసి నేరస్థుడు కావచ్చును. అతణ్ణి చంపేసిన తర్వాత అతని శవాన్ని ఒక చెట్టుకు వేలాడదీయాలి.
[23]అలా జరిగినప్పుడు అతని శవం రాత్రి అంతా చెట్టుకు ఉండ కూడదు. ఆ మనిషిని మీరు ఆ రోజే తప్పక సమాధి చేయాలి. ఎందుకంటే, చెట్టుమీద వేలాడే మనిషి దేవుని చేత శపించబడ్డాడు. మీరు నివసించేందుకు మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశాన్ని మీరు పాడు చేయకూడదు.

### ఇతర ఆజ్ఞలు

22 "నీ పొరుగు వాని ఆవు లేక గొర్రె తప్పిపోయి తిరగటం నీవు చూసినప్పుడు చూడ నట్టు విస్మరించకూడదు. నీవు దాన్ని తప్పక దాని యజమాని దగ్గరకు తీసుకొని వెళ్లాలి.
[2]ఆ యజమాని నివాసం నీకు దగ్గర్లో లేకపోతే, లేక అది ఎవరిదో నీకు తెలియకపోతే అప్పుడు ఆ ఆవును లేక గొర్రెను నీ ఇంటికి నీవు తీసుకొని వెళ్లాలి. దాని యజమాని దానికోసం వెదకుకొంటూ వచ్చేంతవరకు నీవు దానిని నీ దగ్గర ఉంచాలి. అప్పుడు నీవు అతనికి దానిని తిరిగి ఇచ్చివేయాలి.
[3]నీ పొరుగువాని గాడిద, నీ పొరుగువాని బట్టలు, లేక నీ పొరుగువాడు పోగొట్టుకొన్న దేని విషయంలో నైనా నీవు ఇలానే చేయాలి. నీ పొరుగువానికి నీవు సహాయం చేయాలి.
[4]"నీ పొరుగువాని గాడిద లేక ఆవు దారిలో పడిపోతే నీవు దానిని చూడనట్టు పోకూడదు. దాన్ని లేవనెత్త టానికి నీవు అతనికి సహాయం చేయాలి.
[5]"ఒక పురుషుని బట్టలను ఒక స్త్రీ ధరించకూడదు. మరియు పురుషుడు స్త్రీల బట్టలు ధరించకూడదు. ఇలా చేసేవారు ఎవరైనాసరే మీ దేవుడైన యెహోవాకు అసహ్యం.
[6]"నీవు దారిన నడుస్తుండగా ఒక పక్షిగూడును చెట్టుమీదగాని నేలమీదగాని నీవు చూడవచ్చును. తల్లి పక్షి పిల్ల పక్షులతోగాని గుడ్లమీదగాని కూర్చొని ఉంటే పిల్లలతోబాటు తల్లిపక్షిని నీవు తీసుకొనరాదు.
[7]పిల్ల పక్షుల్ని నీవు తీసుకొనవచ్చు. కాని నీవు తల్లిని పోనివ్వాలి. ఈ ఆజ్ఞలకు నీవు విధేయుడవైతే నీకు అన్నీ సక్రమంగా జరుగుతాయి, నీవు చాలా కాలం బ్రతుకుతావు.
[8]నీవు కొత్త యిల్లు కట్టినప్పుడు దాని కప్పు చుట్టూ పిట్టగోడ కట్టాలి. అప్పుడు ఆ యింటి మీదనుండి పడి చచ్చిన వారి మరణదోషం నీ మీద ఉండదు.

### జతపర్చబడకూడని విషయాలు

[9]"నీ ద్రాక్షపొలంలో రెండు రకాల విత్తనాలు నీవు విత్తకూడదు. ఎందుకంటే అప్పుడు నీవు విత్తిన విత్తనపు పంట, నీ పొలంలోని ద్రాక్ష రెండూ నిష్ప్రయోజనం.*

---

**నీ ద్రాక్ష ... నిష్ప్రయోజనం** "పవిత్రమౌతాయి" అని వాస్తవంగా వ్రాయబడివుంది. దీని అర్థం ఇవి కేవలం దేవునికి చెందినవి. అందుచేత ప్రజల చేత ఉపయోగించ బడవు."

10“గాడిదను, ఆవును కలిపి నీవు దున్నకూడదు.”
11“ఉన్ని, నార రెండూ కలిపి నేసిన బట్ట నీవు
ధరించకూడదు.
12“నీవు ధరించే అంగీకు నాలుగు మూలలా
కుచ్చులు ఉండాలి.”

### వివాహ చట్టాలు

13“ఒక పురుషుడు ఒక యువతిని వివాహం చేసు
కొని ఆమెతో లైంగిక సంబంధం కలిగి ఉండ వచ్చును.
ఆ తర్వాత ఆమె నచ్చలేదని అతడు చెప్పవచ్చు.
14‘నేను ఈమెను పెళ్లి చేసుకొన్నాను కానీ మేము
లైంగికంగా కలిసినప్పుడు ఈమె కన్య కాదని నాకు
తెలిసింది’ అని అతడు అబద్ధం చెప్పవచ్చు. ఆమెకు
విరోధంగా ఇలా చెప్పటంవల్ల ప్రజలు ఆమెను గూర్చి
చెడుగా భావిస్తారు. 15ఇలా జరిగితే ఆమె తల్లిదండ్రులు
ఆ పట్టణ సమావేశ స్థలం దగ్గర పెద్దల వద్దకు ఆమె
కన్య అనే రుజువు తీసుకొని రావాలి. 16ఆ యువతి
తండ్రి పెద్దలతో చెప్పాలి, ‘నా కూతుర్ని ఇతనికి
భార్యగా నేను ఇచ్చాను, కానీ ఇప్పుడు ఆమె అతనికి
ఇష్టం లేదు. 17ఇతడు నా కూతురి మీద అబద్ధాలు
చెప్పాడు. ‘నీ కూతురు కన్య అనే ఋజువు నాకు కన
బడలేదు’ అని అతడు అన్నాడు. అయితే నా కూతురు
కన్య, నా దగ్గర ఋజువుంది’ అప్పుడు వారు ఆమె
బట్టను* పట్టణ పెద్దలకు చూపించాలి.
18అప్పుడు ఆ పట్టణ పెద్దలు అతన్ని పట్టుకొని
శిక్షించాలి.
19నూరు వెండితులాలు వారు అతనికి జుల్మానా
విధించాలి. ఆమె భర్త ఒక ఇశ్రాయేలు యువతికి
అవమానం కలిగించాడు గనుక ఆమె తండ్రికి వారు
ఆ ధనం ఇవ్వాలి. ఆ యువతి ఆ పురుషునికి భార్యగా
కొనసాగాలి. అతడు తన జీవితాంతం ఆమెకు విడాకులు
ఇవ్వకూడదు.
20“అయితే ఒకవేళ ఆ భర్త తన భార్యను గూర్చి
చెప్పిన విషయాలు నిజం కావచ్చును. ఆమె కన్య
అని చెప్పేందుకు ఆ భార్య తల్లిదండ్రుల దగ్గర ఋజువు
లేక పోవచ్చును. ఇలా జరిగితే 21అప్పుడు ఆ పట్టణ
నాయకులు ఆ యువతిని ఆమె తల్లిదండ్రుల ఇంటి
గుమ్మం దగ్గరకు తీసుకొని రావాలి. తర్వాత ఆ పట్టణం
లోని మనుష్యులు ఆమెను రాళ్లతో కొట్టి చంపాలి.
ఎందుకంటే, ఇశ్రాయేలులో ఆమె అవమానకరమైన
పని చేసింది. ఆమె తన తండ్రి ఇంటిలో ఒక వేశ్యలా
ప్రవర్తించింది. చెడ్డది ఏదైనా సరే మీ ప్రజల్లోనుండి
మీరు తీసివేయాలి.

### లైంగిక పాపాలు

22“ఒక పురుషుడు మరొక పురుషుని భార్యతో
లైంగిక సంబంధం కలిగి ఉంటే ఆ స్త్రీ, ఆమెతో
లైంగిక సంబంధం గల ఆ పురుషుడూ ఇద్దరూ చావాలి.
చెడ్డది ఏదైనా సరే ఇశ్రాయేలు నుండి మీరు తొల
గించాలి.
23“మరొక పురుషునికి ప్రధానం చేయబడిన ఒక
యువతిని ఇంకో పురుషుడు కలియవచ్చును. అతడు
ఆమెతో లైంగిక సంబంధం కలిగి ఉండవచ్చు. ఇది
పట్టణంలో జరిగితే 24మీరు వాళ్లిద్దర్నీ పట్టణ ద్వారం
బయటకు తీసుకొని వచ్చి, మీరు వారిని రాళ్లతో
కొట్టి చంపాలి. ఆ పురుషుడు మరొకని భార్యను
లైంగిక పాపానికి వాడుకున్నాడు గనుక మీరు అతడ్ని
చంపాలి. ఆ యువతి పట్టణంలోనే ఉండి కూడా
సహాయం కోరలేదు’ గనుక మీరు ఆ యువతిని
చంపాలి. చెడ్డది ఏదైనాసరే మీ ప్రజల్లోనుండి మీరు
తొలగించాలి.
25“అయితే ప్రధానం చేయబడిన ఒక యువతిని
ఒక పురుషుడు పొలంలో చూచి అతనితో లైంగిక
సంబంధం అనుభవించమని ఆమెను బలవంతం చేస్తే,
అప్పుడు ఆ పురుషుడు మాత్రమే చావాలి. 26ఆ
యువతి మరణశిక్షకు పాత్రమైనది ఏమీ చేయలేదు,
గనుక మీరు ఆమెను ఏమీ చేయకూడదు. ఒకడు
మరొక అమాయకుని మీద దాడి చేసి హత్య చేసిన
వంటిదే ఈ వ్యాజ్యెముకూడాను. 27ఆ పురుషుడు
ప్రధానం చేయబడిన యువతిని బయట పొలంలో
చూసాడు. ఆ యువతి సహాయం కోసం కేకలు
పెట్టింది, కానీ ఆమెకు సహాయం చేసేవారు ఎవ్వరూ
లేరు.
28“ఒక పురుషుడు ప్రధానం చేయబడని ఒక కన్యను
చూచి, అతనితో లైంగిక సంబంధం అనుభవించమని
బలవంతం చేయవచ్చును. ఒకవేళ అతడు ఇలా
చేయటం ప్రజలు చూస్తే 29అప్పుడు అతడు
అమ్మాయి తల్లిదండ్రులకు యాభై తులాల వెండి
ఇవ్వాలి. ఆ యువతి అతని భార్య అవుతుంది. ఎందు
కంటే అతడు ఆమెను లైంగికంగా వాడుకొన్నాడు
గనుక. అతడు తన జీవితాంతం ఆమెకు విడాకులు
ఇవ్వకూడదు.
30“ఒక పురుషుడు తన తండ్రి భార్యతో లైంగిక
సంబంధం కలిగియుండి తన తండ్రికి అవమానం
కలిగించకూడదు.

### ఆరాధనలో పాల్గొనగలిగిన మనుష్యులు

23 “ఈ వ్యక్తులు యెహోవాను ఆరాధించు
టలో ఇశ్రాయేలు ప్రజల్లో భాగంగా ఉండ
కూడదు. వృషణాలు గాయపడినవాడు, పురుషాంగం
కోసివేయబడ్డవాడు 2లేక వివాహం కాని తల్లిదండ్రులకు

---

**బట్ట** రక్తపు మరకలున్న దుప్పటి. ఇది “వివాహ
రాత్రి దినాన తన కన్యత్వమును నిరూపించుటకై వధువు
ఉపయోగించిన బట్ట.

పుట్టినవాడు. ఇతని సంతతిలో ఏ వ్యక్తీ యెహోవా ప్రజల్లో భాగంగా ఉండకూడదు.

3"అమ్మోనీవాడు, మోయాబువాడు యెహోవా ప్రజలకు చెందడు. వారి సంతానంలో ఎవ్వరూ, చివరికి పదో తరం వారు కూడా యెహోవా ప్రజల్లో భాగం కాజాలరు.

4ఎందుకంటే, మీరు ఈజిప్టు నుండి వచ్చి నప్పుడు మీ ప్రయాణంలో అమ్మోనీయులు, మోయాబీయులు మీకు భోజనం, నీళ్లు ఇవ్వటానికి నిరాకరించారు. మరియు మిమ్మల్ని శపించేందుకు వారు బిలాముకు డబ్బు ఇచ్చారు గనుక వారు యెహోవా ప్రజల్లో భాగంగా ఉండజాలరు. (యరాము* లోని పెతోరు పట్టణపువాడైన బెయోరు కుమారుడు బిలాము.) 5అయితే యెహోవా దేవుడు బిలాము మాట వినకుండా నిరాకరించాడు. శాపాన్ని మీకు ఆశీర్వాదంగా యెహోవా మార్చాడు. ఎందుకంటే మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు గనుక. 6అమ్మోనీ ప్రజలతోగాని, మోయాబీ ప్రజలతోగాని సమాధాన పడేందుకు మీరు ఎన్నడూ ప్రయత్నించకూడదు. మీరు జీవించినంత కాలం వారితో స్నేహంగా ఉండవద్దు.

### ఇశ్రాయేలీయులు అంగీకరించాల్సిన ప్రజలు

7"ఎదోము వాణ్ణి మీరు ద్వేషించకూడదు. ఎందుకంటే అతడు మీకు బంధువు. ఈజిప్టు వాణ్ణి మీరు ద్వేషించకూడదు. ఎందుకంటే అతని దేశంలో మీరు పరాయివారుగా ఉన్నారు. 8ఎదోము, ఈజిప్టు వాళ్ల మూడో తరంవారి పిల్లలు యెహోవా ప్రజల్లో భాగంగా ఉండవచ్చును.

### సైన్యం పాళెమును పరిశుభ్రంగా ఉంచటం

9"మీ సైన్యం మీ శత్రువుల మీదికి వెళ్లినప్పుడు, మిమ్మల్ని అపవిత్రపరచే వాటన్నింటికీ దూరంగా ఉండండి. 10రాత్రిపూట కలలో తడిసి అపవిత్రమైన వాడు మీ మధ్య ఎవడైనా ఉంటే అతడు మీ పాళెము నుండి బయటకు వెళ్లిపోవాలి. అతడు పాళెమునుండి దూరంగా ఉండాలి. 11అయితే సాయంకాలం అతడు స్నానం చేయాలి. సూర్యుడు అస్తమించాక అతడు పాళెములోనికి రావచ్చును.

12"నీకు పాళెము వెలుపల బహిర్భూమిగా ఒక స్థలం ఉండాలి. 13మరియు నీ ఆయుధాలతో పాటు ఒక కట్టె నీకుఉండాలి; నీవు బహిర్భూమికి వెళ్లవల్సినప్పుడు ఆ కట్టెతో నీవు ఒక గుంట తవ్వుకొని తర్వాత దానిని పూడ్చివేయాలి. 14ఎందుకంటే మిమ్మల్ని రక్షించి, మీ శత్రువులను ఓడించటానికి మీ దేవుడైన యెహోవా మీ పాళెములో ఉన్నాడు. అందు చేత మీ పాళెము పవిత్రంగా ఉండాలి. అప్పుడు మీ మధ్యలో అపరిశుభ్రం లేదని చూసి, మీ దగ్గరనుండి వెళ్లిపోడు.

### ఇతర ఆజ్ఞలు

15"బానిస ఒకడు తన యజమాని దగ్గర్నుండి పారిపోయి నీ దగ్గరకు వస్తే, ఆ బానిసను నీవు తిరిగి అతని యజమానికి అప్పగించకూడదు. 16ఈ బానిస నీతో, తనకు ఇష్టం వచ్చిన చోట నివసించవచ్చును. అతడు కోరుకొన్న పట్టణంలో నివసించవచ్చు. నీవు అతన్ని తొందరపెట్టకూడదు.

17"ఇశ్రాయేలు పురుషుడేగాని, స్త్రీగాని ఎన్నటికీ ఆలయ వేశ్య కాకూడదు. 18ఒక వేశ్య లేక పురుషగామి సంపాదించిన డబ్బును నీ దేవుడైన యెహోవా ఆలయానికి తీసుకొని రాకూడదు. దేవునికి చేసిన మొక్కుబడి చెల్లించటానికి ఎవరూ ఆ డబ్బు ఉపయోగించకూడదు. మీ దేవుడైన యెహోవాకు వ్యభిచారులు అంటే అసహ్యం.

19"మరో ఇశ్రాయేలు వానికి నీవు డబ్బు అప్పు ఇస్తే నీవు వడ్డీ తీసుకోకూడదు. వడ్డీ ఆర్జించిపెట్టే దేనిమీదగానీ, డబ్బు మీద, ఆహారం మీదగాని వడ్డీ వసూలు చేయవద్దు. 20ఒక విదేశీయుని దగ్గర నీవు వడ్డీ తీసుకోవచ్చును. కానీ మరో ఇశ్రాయేలు వాని దగ్గర మాత్రం నీవు వడ్డీ తీసుకోకూడదు. ఈ నియమాలు నీవు పాటిస్తే, నీవు నివసించబోయే దేశంలో నీవు చేసే వాటన్నింటిలో నీ దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదిస్తాడు.

21"నీ దేవుడైన యెహోవాకు నీవు ఒక వాగ్దానం చేస్తే, నీ వాగ్దానం అంతటినీ చెల్లించేందుకు వెనుకాడవద్దు. ఎందుకంటే, నీవు దాన్ని చెల్లించాలని నీ దేవుడైన యెహోవా అడుగుతాడు. నీవు వాగ్దానం చేసినదానిని చెల్లించకపోతే అది నీకు పాపం అవుతుంది. 22నీవు ఆ వాగ్దానం చేయకపోతే నీయందు పాపం వుండదు 23కానీ నీవు చేస్తానని చెప్పిన వాటిని మాత్రం నీవు చేయాలి. నీవు నీ దేవుడైన యెహోవాకు స్వచ్ఛందంగా వాగ్దానం చేసినప్పుడు, నీ వాగ్దానం ప్రకారం నీవు చేయాలి. 24"మరొకరి ద్రాక్షా పొలంగుండా నీవు వెళ్లినప్పుడు, నీవు కోరినన్ని ద్రాక్షాపండ్లు నీవు తినవచ్చును. కానీ నీ బుట్టలో మాత్రం ద్రాక్షాపండ్లు ఏమీ వేసుకోకూడదు. 25నీవు మరొకరి పంట పొలంలోనుంచి వెళ్లినప్పుడు నీవు నీ చేతుల్తో వెన్నులు త్రుంచుకొని తినవచ్చును. కానీ అవతలివాడి పంట తీసుకొనేందుకు నీవు కొడవలితో కోయకూడదు.

24 "ఒకడు ఒక స్త్రీని వివాహం చేసుకొన్న తర్వాత ఆమెను గూర్చిన రహస్యం ఏదో తెలిసి ఆమెను ఇష్టపడడు. అతనికి ఆమె ఇష్టం లేకపోతే అతడు విడాకుల పత్రం వ్రాసి, దానిని ఆమెకు ఇవ్వాలి.

---

**యరాము** లేక మెసపొతేమియ.

అప్పుడు అతడు ఆమెను తన ఇంటినుండి పంపించి
వేయాలి. 2ఆమె అతని ఇల్లు విడిచి వెళ్లిపోయాక,
ఆమె మరొకనికి భార్య కావచ్చును. 3-4 అయితే ఒకవేళ
ఆ కొత్త భర్తకుకూడా ఆమె నచ్చకపోవటంతో అతడు
ఆమెను వెళ్లగొట్టవచ్చును. ఒకవేళ అతడు ఆమెకు
విడాకులు ఇచ్చినా, మొదటి భర్త ఆమెను మళ్లీ తన
భార్యగా చేర్చుకోకపోవచ్చును. లేక ఆమె కొత్త భర్త
చనిపోతే, మొదటి భర్త ఆమెను మరల తన భార్యగా
చేర్చుకొనక పోవచ్చును. అతనికి ఆమె అపవిత్రమ
యిందిగా ఉంటుంది. అతడు ఆమెను మళ్లీ పెళ్లి చేసు
కొంటే, యెహోవాకు అసహ్యమైనదానిని అతడు చేసి
నవాడవుతాడు. మీరు నివసించేందుకు మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు ఇలా పాపం
చేయకూడదు.

5"ఒక పురుషునికి పెళ్లయిన కొత్తలోనే అతణ్ణి
సైన్యంలోనికి పంపకూడదు. అతనికి ఎలాంటి ప్రత్యేక
పనినీ విధించకూడదు. ఒక్క సంవత్సరం అతడు ఇంటి
దగ్గరే ఉండి తన కొత్త భార్యను సంతోషపెట్టేందుకు
అతడు స్వేచ్ఛగా ఉండాలి.

6"ఒకనికి నీవు ఏదైనా బదులు ఇస్తే, దానికి భద్రతగా
అతని తిరుగటి రాయిని నీవు తీసు కోకూడదు. ఎందు
కంటే, అది అతని భోజనాన్ని తీసు కొన్నట్టే అవుతుంది
గనుక.

7"ఒకడు తన స్వంత ప్రజల్లోనుండి (ఇశ్రాయేలు
వాడ్ని) ఎత్తుకొనిపోయి, అతడ్ని బానిసగా వాడినా,
అమ్మినా, ఆ ఎత్తుకు పోయినవాడు చావాల్సిందే. ఈ
విధంగా మీ మధ్య ఎలాంటి చెడుగునైనా మీరు తొలగి
స్తారు.

8"కుష్ఠ రోగంవంటి వ్యాధి నీకు ఉంటే, లేవీ యాజ
కులు నీకు ప్రబోధించేవాటన్నింటినీ నీవు జాగ్రత్తగా
పాటించాలి. చేయాల్సిందిగా నేను యాజకులకు
చెప్పిన విషయాలను నీవు జాగ్రత్తగా పాటించాలి.
9మీరు ఈజిప్టునుండి బయటకు వచ్చిన ప్రయాణంలో
మిర్యాముకు* మీ దేవుడైన యెహోవా చేసినదాన్ని
జ్ఞాపకం ఉంచుకోవాలి.

10"నీవు ఎవరికైనా ఎలాంటి అప్పు ఇచ్చినా, దానికి
భద్రతగా దేనినైనా తీసుకొనేందుకు నీవు అతని
ఇంటిలోనికి వెళ్లకూడదు. 11నీవు బయటనే నిలిచి
ఉండాలి. అప్పుడు నీవు ఎవరికైతే అప్పు ఇచ్చావో
అతడే దానికి భద్రతగా దేనినైనా బయటకు తెచ్చి
నీకు ఇస్తాడు. 12 ఒకవేళ అతడు పేదవాడైతే అతని
వస్తువును తెల్లవారేవరకు నీ దగ్గర ఉంచుకోకూడదు.
13అతని వస్తువును ప్రతి సాయంత్రం నీవు అతనికి
ఇస్తూ ఉండాలి. అప్పుడు అతడు తన స్వంత బట్టలతో
నిద్రపోగల్గుతాడు. అతడు నీకు కృతజ్ఞతలు చెబుతాడు,
నీవు ఈ మంచి పని చేసినట్టు నీ దేవుడైన యెహోవా
చూస్తాడు.

14"పేదవాడు, అవసరంలో ఉన్నవాడునైన జీత
గాడ్ని నీవు మోసం చేయకూడదు. అతడు నీతోటి
ఇశ్రాయేలు వాడైనా, మీ పట్టణాలు ఒక దానిలో నివ
సిస్తున్న విదేశీయుడైనాసరే. 15ప్రతి రోజూ సూర్యుడు
అస్తమించక ముందే అతని జీతం అతనికి ఇచ్చి
వేయాలి. ఎందుకంటే, అతడు పేదవాడు, ఆ డబ్బే
అతనికి ఆధారం. నీవు అతనికి అలా చెల్లించకపోతే
అతడు నీ మీద యెహోవాకు ఫిర్యాదు చేస్తాడు. నీవు
పాప దోషివి అవుతావు.

16"పిల్లలు చేసిన దేనికోసమైనా తండ్రులను చంప
కూడదు. అలాగే తల్లిదండ్రులు చేసిన దేని కోసమూ
పిల్లలను చంపకూడదు. ఒక వ్యక్తి స్వయంగా తాను
చేసిన కీడు నిమిత్తము చంపబడాలి.

17"విదేశీయులకు, అనాథలకు న్యాయం జరిగేట్టు
నీవు చూడాలి. ఒక విధవ దగ్గర తాకట్టుగా బట్టలు
నీవెన్నటికీ తీసుకోకూడదు. 18మీరు ఒకప్పుడు ఈజి
ప్టులో బానిసలు అని ఎల్లప్పుడూ మీరు జ్ఞాపకం ఉంచు
కోవాలి. మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని అక్క
డ్నుండి బయటకు తీసుకొనివచ్చాడని మరచిపోవద్దు.
అందుకే మీరు పేదవారికి ఇలా చేయాలని నేను మీకు
ఆజ్ఞాపిస్తున్నాను.

19"నీవు నీ పొలంలో పంటకూర్చుకొంటూ, మరచి
పోయి ఒక పన అక్కడే విడిచిపెట్టావనుకో. నీవు మళ్లీ
దానికోసం వెళ్లకూడదు. విదేశీయుల కోసం, అనాథల
కోసం, విధవల కోసం అది ఉంటుంది. వారికోసం
నీవు కొంత ధాన్యం విడిచిపెడితే, నీ ప్రతి పనిలో నీ
దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదిస్తాడు. 20నీవు
నీ ఒలీవ చెట్లను రాల్చినప్పుడు కొమ్మలను పరిశీలిం
చేందుకు నీవు తిరిగి అక్కడకు వెళ్లకూడదు. నీవు
అలా విడిచిపెట్టే ఒలీవలు విదేశీయులకు, అనాథలకు,
విధవలకు ఉంటాయి. 21నీ ద్రాక్షతోటనుండి నీవు
ద్రాక్షా పండ్లు కూర్చుకొనేటప్పుడు, నీవు విడిచిపెట్టిన
పండ్లు తీసుకొనేందుకు నీవు తిరిగి అక్కడికి వెళ్ల
కూడదు. ఆ ద్రాక్షాపండ్లు విదేశీయుల కోసం, అనాథల
కోసం, విధవల కోసం ఉంటాయి. 22మీరు ఈజిప్టులో
బానిసలుగా ఉండేవారని జ్ఞాపకం ఉంచుకో. అందుకే
మీరు పేదవారికి ఇలా చేయాలని నేను నీకు
ఆజ్ఞాపిస్తున్నాను.

25 "ఇద్దరు మనుష్యులకు వివాదం ఉంటే వారు
న్యాయస్థానానికి వెళ్లాలి. న్యాయమూర్తులు
వారి వివాదాన్ని విచారించి, ఎవరిది తప్పు ఎవరిది
ఒప్పు అనే విషయం ప్రకటిస్తారు. 2నిందితుడు కొరడా
దెబ్బలు తినాల్సివస్తే, న్యాయమూర్తి అతణ్ణి బోర్లా
పండుకోబెట్టాలి. న్యాయమూర్తి చూస్తూ ఉండగా
ఎవరో ఒకరు ఆ దోషిని కొట్టాలి. అతని నేరానికి

---

**మిర్యాము** సంఖ్యాకాండము 12:1-15 చూడండి.

తగినన్ని దెబ్బలు ఆ దోషిని కొట్టాలి. 3ఒక మనిషిని
ఒకే సారి 40 కంటె ఎక్కువ దెబ్బలు కొట్టకూడదు.
అంతకంటె ఎక్కువగా అతడ్ని కొడితే, నీ సోదరుని
జీవితం అంటే నీకు లెక్కలేదని తెలుస్తుంది.
4“నూర్చే ఎద్దు తినకుండా దాని మూతికి చిక్కం
వేయకూడదు.
5“ఇద్దరు సోదరులు కలిసి జీవిస్తుండగా, వారిలో
ఒకరు చనిపోవటం, అతనికి కుమారుడు లేకపోవటం
జరిగితే, చనిపోయిన సోదరుని భార్య, ఆ కుటుంబానికి
దూరస్తుల్ని ఎవరినీ పెళ్లి చేసుకోకూడదు. ఆమె భర్త
సోదరుడు ఆమెను భార్యగా స్వీకరించి, ఆమెకు భార్యా
ధర్మం జరిగించాలి. ఒక భర్త సోదరుని విధులను ఆమె
భర్త సోదరుడు ఆమెకు జరిగించాలి. 6అప్పుడు ఆమెకు
పుట్టిన బిడ్డ, ఆ పురుషుని మృత సోదరునికి వారసుడుగా
ఉంటాడు. అప్పుడు చనిపోయిన సోదరుని పేరు ఇశ్రా
యేలు నుండి రూపు మాసిపోదు. 7ఒకవేళ ఆ మను
ష్యుడు తన సోదరుని భార్యను స్వీకరించడానికి ఇష్టపడక
పోతే, ఆమె పట్టణ సమావేశ స్థలం దగ్గర నాయకుల
వద్దకు వెళ్లాలి. అతని సోదరుని భార్య, ‘నా భర్త సోదరుడు
తన సోదరుని పేరు ఇశ్రాయేలులో సజీవంగా ఉంచేం
దుకు నిరాకరిస్తున్నాడు. భర్త సోదరుని విధులను అతడు
నాకు జరిగించటం లేదు’ అని నాయకులతో చెప్పాలి.
8అప్పుడు ఆ పట్టణపు నాయకులు అతణ్ణి పిలిపించి,
అతనితో మాట్లాడాలి. అతడు మొండివాడై, ‘ఆమెను
నేను స్వీకరించను’ అని చెబితే 9అతని సోదరుని భార్య
ఆ నాయకుల ముందుకు రావాలి. ఆమె అతని కాలి
నుండి అతని చెప్పు ఊడదీయాలి. అప్పుడు ఆమె
అతని ముఖం ముందు ఉమ్మివేయాలి. ‘తన సోదరుని
కుటుంబాన్ని ఉద్ధరించని సోదరునికి యిలా చేస్తు
న్నాను’ అని ఆమె చెప్పాలి. 10అప్పుడు ఆ సోదరుని
కుటుంబం ‘చెప్పు తీయబడ్డ మనిషి కుటుంబంగా’
ఇశ్రాయేలులో చెప్పుకోబడుతుంది.
11“ఇద్దరు మనుష్యులు ఒకరితో ఒకరు పోట్లాడుతూ
వుండవచ్చును. వారిలో ఒకని భార్య తన భర్తకు
సహాయం చేయటానికి రావచ్చును. కాని ఆమె అవతల
వాని పురుషాంగములను లాగకూడదు. 12ఆమె అలా
చేస్తే ఆమె చేతిని నరికి వేయాలి. ఆమెను గూర్చి
విచారించవద్దు.
13“మనుష్యుల్ని మోసం చేయటానికి తూనికెలో
దొంగ రాళ్లు ఉంచవద్దు. మరీ బరువుగా గాని, మరీ
తేలికగా గాని ఉండే రాళ్లు ఉపయోగించవద్దు. 14మరీ
పెద్దవి లేక మరీ చిన్నవిగా ఉండే కొలతలు నీ ఇంటిలో
ఉంచవద్దు. 15సరిగ్గాను, నిజాయితీగాను ఉండే రాళ్లు,
కొలతలు నీవు ఉపయోగించాలి. అప్పుడు మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో నీవు చాలా కాలం
జీవిస్తావు. 16తప్పుడు తూకాలు, కొలతలు ఉపయో
గించే వాళ్లను మీ దేవుడైన యెహోవా అసహ్యించు
కొంటాడు. అవును, తప్పు చేసే వాళ్లందర్నీ ఆయన
అసహ్యించుకొంటాడు.

## అమాలేకీయులు నాశనం చేయబడాలి

17“మీరు ఈజిప్టు నుండి వస్తున్నప్పుడు అమాలేకీ
యులు మీకు ఏమి చేసారో జ్ఞాపకం చేసుకోండి.
18అమాలేకీయులు దేవుణ్ణి గౌరవించలేదు. మీరు అలసి,
బలహీనంగా ఉన్నప్పుడు వాళ్లు మీమీద దాడి చేసారు.
వెనుక నడుస్తోన్న మీ ప్రజలందర్నీ వాళ్లు చంపేసారు.
19అందుకే అమాలేకీయుల జ్ఞాపకం కూడ ప్రపంచంలో
లేకుండా మీరు నాశనం చేయాలి. మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు ప్రవేశించి
నప్పుడు దీనిని చేయాలి. అక్కడ మీ చుట్టూరా ఉన్న
శత్రువులందరి నుండీ ఆయన మీకు విశ్రాంతిని ఇస్తాడు.
అయితే అమాలేకీయులను నాశనం చేయటం మాత్రం
మరచిపోవద్దు.

## ప్రథమ పంట

26 “మీరు నివసించేందుకు మీ దేవుడైన
యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు
త్వరలో ప్రవేశిస్తారు. మీరు అక్కడ మీ నివాసం ఏర్పర
చుకొన్నప్పుడు 2మీరు ప్రథమ ఫలాలు కొన్ని తీసు
కొని ఒక బుట్టలో పెట్టాలి. యెహోవా మీకు ఇస్తున్న
దేశంలో అది మీకు లభించిన ప్రథమ పంట అవుతుంది.
ఈ ప్రథమ పంట కొంత ఉన్న ఆ బుట్టను తీసుకొని,
మీ దేవుడైన యెహోవా నిర్ణయించే స్థలానికి వెళ్లండి.
అది యెహోవా తనకోసం ప్రత్యేక ఆలయంగా ఉండేం
దుకు ఏర్పాటు చేసుకొనే స్థలం. 3అప్పటికి అక్కడ
పరిచర్య చేస్తుండే యాజకుని దగ్గరకు మీరు వెళ్లాలి.
‘యెహోవా మనకు ఇస్తానని మన పూర్వీకులకు
వాగ్దానం చేసిన దేశంలోనికి నేను వచ్చేసానని నా
దేవుడైన యెహోవాకు నేడు నేను ప్రకటిస్తాను’ అని
నీవు అతనితో చెప్పాలి.
4“అప్పుడు నీ చేతిలోని బుట్టను యాజకుడు
తీసుకొంటాడు. నీ దేవుడైన యెహోవా బలిపీఠం
ఎదుట అతడు దానిని కింద ఉంచుతాడు. 5అప్పుడు
అక్కడ నీ దేవుడైన యెహోవా ఎదుట నీవు ఇలా
చెప్పాలి: ‘నా పూర్వీకుడు ఒక సంచార అరామీయుడు.
అతడు ఈజిప్టులోనికి వెళ్లి, అక్కడ నివసించాడు.
అతడు అక్కడికి వెళ్లినప్పుడు అతని కుటుంబంలో
కొద్ది మంది మాత్రమే ఉన్నారు. అయితే అక్కడ
ఈజిప్టులో అతడు అనేకమంది ప్రజలుగా, శక్తివంతమైన
ఒక గొప్ప జనంగా తయారయ్యాడు. 6ఈజిప్టువాళ్లు
మమ్మల్ని నీచంగా చూశారు. వాళ్లు మమ్మల్ని కష్టపెట్టి,
బానిస పని బలవంతంగా మాతో చేయించారు.
7అప్పుడు మేము మా పూర్వీకుల దేవుడైన యెహో
వాకు మొర్రపెట్టి, వారిని గూర్చి ఆరోపణ చేసాము.

యెహోవా మా మొర్ర విన్నాడు. మా కష్టం, మా
కఠినమైన పని, మా శ్రమ ఆయన చూశాడు. 8అప్పుడు
యెహోవా తన మహా శక్తి, ప్రభావాలతో ఈజిప్టు
నుండి మమ్మల్ని బయటకు తీసుకొని వచ్చాడు.
గొప్ప అద్భుతాలు, మహాత్మ్యాలు ఆయన చేసినాడు.
భయంకరమైన సంగతులు జరిగేటట్టు ఆయన
చేసాడు. 9కనుక ఆయనే మమ్మల్ని ఈ దేశానికి తీసు
కొనివచ్చాడు. పాలు, తేనెలు ప్రవహించుచున్న ఈ
మంచి దేశాన్ని ఆయన మాకు యిచ్చాడు. 10ఇప్పుడు
యెహోవా, నీవు మాకు యిచ్చిన దేశంలోని ప్రథమ
పంటను నీకు తెచ్చాను.’

“తర్వాత నీ పంటను నీ దేవుడైన యెహోవా
ఎదుట కింద పెట్టాలి. మరియు మీరు ఆయనను
ఆరాధించాలి. 11అప్పుడు మీ దేవుడైన యెహోవా
మీకూ, మీ కుటుంబానికీ ఇచ్చిన మంచి పదార్థాల
న్నింటినీ మీరు తిని ఆనందించవచ్చును. మీ మధ్య
నివసించే లేవీయులు, విదేశీయులతో మీరు వాటిని
పంచుకోవాలి.

12“ప్రతి మూడవ సంవత్సరం దశమభాగాల సంవ
త్సరం. ఆ సంవత్సరం మీ పంటలోని దశమ భాగాలన్నీ
అర్పించటం పూర్తి అయ్యాక దానిని మీరు లేవీయు
లకు, విదేశీయులకు, అనాథలకు, విధవలకు ఇవ్వాలి.
అప్పుడు వారు ప్రతి పట్టణంలో తిని తృప్తి పడవచ్చు.
13మీ దేవుడైన యెహోవాతో మీరు ఇలా చెప్పాలి:
‘నా పంటలోని పవిత్ర భాగాన్ని (దశమ భాగం) నేను
నా ఇంటినుండి తీసాను. దానిని లేవీయులకు, విదేశీ
యులకు, అనాథలకు, విధవలకు నేను ఇచ్చాను.
నీవు నాకు ఇచ్చిన ఆదేశాలన్నిటినీ నేను పాటించాను.
నేను వాటిని మరచిపోలేదు.

14నేను దుఃఖ సమయంలో ఈ ఆహారాన్ని తిన
లేదు. నేను అపవిత్రంగా ఉన్నప్పుడు ఈ ఆహారాన్ని
కూర్చలేదు. ఈ ఆహారంలో ఏదీ చనిపోయిన వారికి
నేను అర్పించలేదు. యెహోవా, నా దేవా, నేను
నీకు విధేయుడనయ్యాను. నీవు నాకు ఆదేశించిన
వాటన్నింటినీ నేను చేసాను. 15పరలోకంలోని నీ పవిత్ర
నివాసంనుండి క్రిందికి చూడు, నీ ప్రజలైన ఇశ్రాయేలీ
యులను ఆశీర్వదించు. నీవు మా పూర్వీకులకు
వాగ్దానం చేసినట్టు మాకు ఇచ్చిన, పాలు, తేనెలు
ప్రవహించుచున్న దేశాన్ని నీవు ఆశీర్వదించు.’

## యెహోవా ఆజ్ఞలకు విధేయులు కావాలి

16“ఈ ఆజ్ఞలు, నియమాలు అన్నింటికీ మీరు
విధేయులు కావాలని నేడు మీ దేవుడైన యెహోవా
మీకు ఆదేశిస్తున్నాడు. మీ నిండు హృదయంతో, మీ
నిండు ఆత్మతో వాటిని జాగ్రత్తగా పాటించండి.
17యెహోవా మీ దేవుడు అని ఈ వేళ మీరు చెప్పారు.
ఆయన మార్గాల్లో నడుస్తామనీ, ఆయన ప్రబోధాలను
పాటిస్తామనీ, ఆయన చట్టాలకు ఆజ్ఞలకు విధేయులం
అవుతామనీ మీరు ప్రమాణం చేసారు. మీరు చేయాల్సిం
దిగా ఆయన చెప్పే ప్రతిదీ చేస్తామని మీరు చెప్పారు.
18ఈ వేళ యెహోవా మిమ్మల్ని తన స్వంత ప్రజలుగా
స్వీకరించాడు. ఆయన దీన్ని మీకు వాగ్దానం చేసాడు.
మీరు ఆయన ఆదేశాలన్నింటికీ విధేయులు కావాలని
కూడా యెహోవా చెప్పాడు. 19యెహోవా తాను
చేసిన రాజ్యాలన్నింటికంటె మిమ్మల్ని గొప్పవాళ్లనుగా
చేస్తాడు. మెప్పు, కీర్తి, ఘనత ఆయన మీకు ఇస్తాడు.
మరియు ఆయన వాగ్దానం చేసినట్టు మీరు ఆయన
స్వంత ప్రత్యేక ప్రజలుగా ఉంటారు.”

## రాళ్ల జ్ఞాపికలు

27 మోషే, ఇశ్రాయేలు నాయకులతో కలసి,
ప్రజలకు ఆజ్ఞాపించాడు. ఆయన చెప్పాడు:
“నేడు నేను మీకు ఇచ్చే ఆజ్ఞలు అన్నింటికీ విధేయు
లుగా ఉండండి. 2మీరు యోర్దాను నది దాటి, మీ
దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీరు
ప్రవేశించిన రోజున, మీరు పెద్ద బండలను నిలబెట్టాలి.
ఈ రాళ్లకు సున్నము పూయండి. 3ఈ ధర్మశాస్త్రం
లోని మాటలు అన్నీ ఆ బండలమీద వ్రాయండి.
మీరు యోర్దాను నది దాటి వెళ్లిన తర్వాత ఇది మీరు
చేయాలి. తర్వాత మీ దేవుడైన యెహోవా మీకు
ఇస్తున్న – పాలు, తేనెలు ప్రవహించుచున్న దేశంలోనికి
మీరు వెళ్లాలి. మీ పూర్వీకుల దేవుడైన యెహోవా
దీనిని మీకు వాగ్దానం చేసాడు.

4“మీరు యోర్దాను నది దాటి వెళ్లిన తర్వాత, ఈ
వేళ నేను మీకు ఆదేశించినట్టు ఏబాలు కొండ మీద
మీరు ఈ బండలను నిలబెట్టాలి. ఈ బండలకు మీరు
సున్నము పూయాలి. 5మరియు అక్కడి రాళ్లు కొన్ని
ఉపయోగించి మీ దేవుడైన యెహోవాకు మీరు ఒక
బలిపీఠం కట్టాలి. రాళ్లను కోయటానికి యినుప పని
ముట్లు ఉపయోగించవద్దు. 6మీరు మీ దేవుడైన
యెహోవాకు బలిపీఠం కట్టేటప్పుడు, పగులగొట్టని
బండలనే మీరు ఉపయోగించాలి. అప్పుడు మీ
దేవుడైన యెహోవాకు ఆ బలిపీఠం మీద దహన
బలులు అర్పించండి. 7మరియు మీరు అక్కడ బలి
అర్పణలు అర్పించి, సమాధాన బలులను అర్పించాలి.
అక్కడ భోజనం చేసి, మీ దేవుడైన యెహోవాతో
సంతోషంగా సమయం గడపండి. 8మీరు నిలబెట్టే
బండల మీద ఈ ధర్మశాస్త్రం అంతా చాలా తేటగా
మీరు రాయాలి.”

## ధర్మశాస్త్ర శాపాలకు ప్రజల సమ్మతి

9లేవీ యాజకులతో కలసి మోషే ఇశ్రాయేలు
ప్రజలందరితో మాట్లాడాడు. ఆయన చెప్పాడు: “ఇశ్రా
యేలీయులారా, నిశ్శబ్దంగా ఉండి, వినండి. ఈ వేళ

మీరు మీ దేవుడైన యెహోవా ప్రజలు అయ్యారు.
10కనుక మీ దేవుడైన యెహోవా మీకు చెప్పేది
అంతా మీరు చేయాలి. ఈ వేళ నేను మీకు ఇస్తున్న
ఆయన ఆదేశాలు, చట్టాలకు మీరు విధేయులు
కావాలి."
11అదే రోజున ప్రజలతో మోషే ఇంకా ఇలా
చెప్పాడు: 12"మీరు యొర్దాను నది దాటి వెళ్లిన తర్వాత
గెరిజీము కొండమీద నిలబడి ప్రజలకు దీవెనలు ప్రక
టించాల్సిన వంశాలు ఏవనగా: షిమ్యోను, లేవీ, యూదా,
ఇశ్శాఖారు, యోసేపు, బెన్యామీను. 13శాపం ప్రకటించ
టానికి రూబేను, గాదు, ఆషేరు, జెబూలూను, దాను,
నఫ్తాలి వంశాలు ఏబాలు కొండమీద నిలబడాలి.
14"అప్పుడు లేవీయులు పెద్ద స్వరంతో ఇశ్రాయేలు
ప్రజలందరితో ఇలా చెప్పాలి.
15విగ్రహాలను తయారు చేసుకొని, రహస్య
స్థలంలో దాచిపెట్టుకొనేవాడు శాపగ్రస్థుడు. ఆ విగ్ర
హాలు కేవలం ఎవరో చేతిపనివాడు చేసిన చెక్క, రాయి,
లోహపు బొమ్మ మాత్రమే, వాటిని యెహోవా
అసహ్యించుకొంటాడు.'
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
16"అప్పుడు లేవీయులు 'తన తల్లినిగానీ తండ్రిని
గానీ గౌరవించటం లేదని సూచించే పనులు చేసేవాడు
శాపగ్రస్థుడు' అని చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
17"అప్పుడు లేవీయులు 'తన పొరుగువాని సరి
హద్దు రాయి తొలగించినవాడు శాపగ్రస్థుడు' అని
చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
18"అప్పుడు లేవీయులు 'గుడ్డివాడు, దారి తప్పి పోయే
టట్టు నడిపించేవాడు శాపగ్రస్థుడు' అని చెప్పాలి.
"అందుకు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
19"అప్పుడు లేవీయులు 'విదేశీయులకు, అనాథ
లకు, విధవలకు న్యాయంగా తీర్పు చెప్పనివాడు శాప
గ్రస్థుడు' అని చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
20"అప్పుడు లేవీయులు, 'ఒకడు తన తండ్రి
భార్యతో లైంగిక సంబంధాలు పెట్టుకోవటం, తన
తండ్రిని దిగంబరునిగా చేయటమే గనుక వాడు శాప
గ్రస్థుడు' అని చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
21"'ఏ జంతువుతోనైనా లైంగిక సంపర్కం గల వాడు
శాపగ్రస్థుడు' అని లేవీయులు చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
22"'తన సోదరితోగాని, తన తండ్రి కుమార్తెతోగాని,
తన తల్లి కుమార్తెతోగాని లైంగిక సంబంధం గలవాడు
శాపగ్రస్థుడు' అని లేవీయులు చెప్పాలి. "అప్పుడు
ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
23"'తన అత్తగారితో లైంగిక సంబంధం ఉన్నవాడు
శాపగ్రస్థుడు' అని లేవీయులు చెప్పాలి.
"అందుకు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
24"అతడు పట్టుబడనప్పటికీ 'రహస్యంగా మరొ
కడ్ని చంపినవాడు శాపగ్రస్థుడు' అని లేవీయులు
చెప్పాలి. "అందుకు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
25"నిర్దోషిని ఒకణ్ణి చంపటానికి డబ్బు తీసు
కొనేవాడు శాపగ్రస్థుడు' అని లేవీయులు చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.
26"ధర్మశాస్త్రాన్ని బలపర్చకుండా, దీనికి విధే
యుడు కానివాడు శాపగ్రస్థుడు' అని లేవీయులు
చెప్పాలి.
"అప్పుడు ప్రజలంతా 'ఆమెన్' అని చెప్పాలి.

### ధర్మశాస్త్రానికి లోబడినందుకు ఆశీర్వాదాలు

28 "మీరు మీ దేవుడైన యెహోవాకు విధే
యులై, ఈ రోజు నేను మీకు చెబుతోన్న
ఆయన ఆదేశాలన్నింటినీ పాటిస్తే, అప్పుడు మీ దేవు
డైన యెహోవా మిమ్మల్ని ఈ భూలోక రాజ్యాల
న్నింటికంటె ఉన్నత స్థానంలో ఉంచుతాడు. 2మీరు
గనుక మీ దేవుడైన యెహోవాకు విధేయులైతే ఈ
ఆశీర్వాదాలన్నీ మీకు లభించి, మీ స్వంతం
అవుతాయి.

3 "యెహోవా మీ పట్టణాలు మీ పొలాలను
ఆశీర్వాదిస్తాడు.
4 యెహోవా మీకు అధిక సంతానం యిచ్చి ఆశీ
ర్వాదిస్తాడు. మీపొలాలను మంచి పంటలతో
ఆయన ఆశీర్వదిస్తాడు, మీ పశువులకు సంతానా
భివృద్ధి కలిగిస్తాడు మీకు పశువులు, గొర్రెలు
విస్తారంగా ఉంటాయి.
5 మీకు ధాన్యపు పంటలు, ఆహారం సమృద్ధిగా
ఉండేటట్టు యెహోవా మిమ్మల్ని ఆశీర్వ
దిస్తాడు.
6 మీరు చేసే ప్రతి పనిలో యెహోవా మిమ్మల్ని
ఎల్లప్పుడూ ఆశీర్వదిస్తాడు.

7"మీ మీదికి వచ్చే మీ శత్రువులను మీరు ఓడిం
చేటట్టు యెహోవా చేస్తాడు. మీ శత్రువు మీ మీదికి
ఒకే మార్గంలో వచ్చి, ఏడు మార్గాల్లో పారిపోతాడు.
8"మీ కొట్టెలు నిండుగా ఉండేటట్టు యెహోవా
మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. మీరు చేసే ప్రతిదాన్నీ
ఆయన ఆశీర్వదిస్తాడు. మీ దేవుడైన యెహోవా
మీకు ఇస్తున్న దేశంలో ఆయన మిమ్మల్ని ఆశీర్వది
స్తాడు. 9యెహోవా మిమ్మల్ని తన స్వంత ప్రజలుగా
చేసుకొంటాడు. మీరు మీ దేవుడైన యెహోవా
ఆదేశాలకు విధేయులై, ఆయన మార్గాల్లో మీరు జీవిస్తే,

ఆయన దీనిని మీకు వాగ్దానం చేసాడు. [10]అప్పుడు
మీరు యెహోవా పేరు పెట్టబడిన ప్రజలు అని ఆ
దేశ ప్రజలంతా తెలుసుకొంటారు. వారు మీకు భయ
పడతారు.
[11]“మరియు యెహోవా దేవుడు మీకు ఎన్నో
మంచి వాటిని ఇస్తాడు. ఆయన మీకు ఎంతోమంది
పిల్లల్ని ఇస్తాడు. మీ పశువులకు ఆయన ఎన్నో దూడ
పిల్లలను ఇస్తాడు. మీకు ఇస్తానని యెహోవా మీ
పూర్వీకులకు వాగ్దానం చేసిన దేశంలో ఆయన మీకు
మంచి పంట ఇస్తాడు.
[12]యెహోవా తన గొప్ప ఆశీర్వాదాల్ని దాచి
ఉంచిన ఆకాశాన్ని తెరచి, సరైన సమయంలో మీ
భూమిమీద ఆయన వర్షం కురిపిస్తాడు. మీరు చేసే
పనులన్నింటినీ యెహోవా ఆశీర్వదిస్తాడు. అనేక
రాజ్యాలకు అప్పు ఇచ్చేంత ధనం మీ దగ్గర ఉంటుంది.
కానీ మీరు వారి దగ్గర అప్పు తీసుకోవాల్సిన అవసరం
ఉండదు. [13]యెహోవా మిమ్మల్ని తలగానే ఉంచు
తాడుగాని తోకగాకాదు. మీరు పైవారు గానే ఉంటారు
కాని కిందవారుగా ఉండరు. ఈ వేళ నేను మీకు
చెబుతున్న మీ దేవుడైన యెహోవా ఆదేశాలకు మీరు
విధేయులైతే ఇదంతా జరుగుతుంది. ఈ ఆజ్ఞలకు
మీరు జాగ్రత్తగా విధేయులు కావాలి.
[14]ఈ వేళ నేను మీకు ఇస్తున్న ప్రబోధాల్లో
దేనినుండీ మీరు తప్పి పోకూడదు. మీరు కుడి పక్కకు
గాని ఎడమ పక్కకు గాని తొలగిపోకూడదు. మీరు
ఇతర దేవుళ్లను సేవించడానికి వారిని వెంబడించ
కూడదు

### ధర్మశాస్త్రానికి లోబడనందుకు శాపాలు

[15]“అయితే మీ దేవుడైన యెహోవా మీకు చెప్పే
విషయాలను మీరు వినకపోతే, ఈ వేళ నేను మీకు
చెప్పే ఆయన ఆదేశాలకు, చట్టాలకు మీరు విధేయులు
కాకపోతే అప్పుడు మీకు ఇదిగో ఈ చెడ్డ సంగతులన్నీ
సంభవిస్తాయి;

16 “మీ పట్టణాల్ని, పొలాల్ని యెహోవా శపిస్తాడు
17 మీకు పంటలు ఉండకుండేలా యెహోవా
మిమ్మల్ని శపిస్తాడు. మీకు సరిపడేటంత
ఆహారం ఉండదు.
18 యెహోవా మిమ్మల్ని శపిస్తాడు, మీకు అనేక
మంది పిల్లలు కలగరు. ఆయన మీ భూమిని
శపిస్తాడు, గనుక మంచి పంటను మీరు పొందరు.
ఆయన మీ పశువులను శపిస్తాడు, గనుక అవి
ఎక్కువ పిల్లల్ని ఈనవు. ఆయన మీ దూడలను
గొర్రె పిల్లలను శపిస్తాడు.
19 మీరు చేసే వాటన్నింటిలో ఎల్లప్పుడూ
యెహోవా శపిస్తాడు.
20 “మీరు కీడు చేసి, యెహోవాకు దూరమైతే,
మీకు చెడు సంగతులు సంభవించేటట్టు ఆయన
చేస్తాడు. మీరు చేసే ప్రతిదానిలో మీకు విసుగు,
కష్టం కలుగుతుంది. మీరు త్వరగా, పూర్తిగా
నాశనం అయ్యేంతవరకు ఆయన అలా చేస్తూనే
ఉంటాడు. ఎందుకంటే మీరు ఆయననుంచి
దూరమై, ఆయనను విసర్జించారు.
21 మీరు యెహోవాకు విధేయులు కాకపోతే, మీరు
నివసించేందుకని ప్రవేశిస్తున్న దేశంలో,
మిమ్మల్ని పూర్తిగా నాశనం చేసేటంతవరకు
మీకు రోగాలు వచ్చేటట్టు ఆయన చేస్తాడు.
[22]యెహోవా రోగాలతో మిమ్మలను శిక్షిస్తాడు.
మీకు జ్వరం, వాపు వస్తాయి. యెహోవా మీకు
భయంకర వేడి కలిగిస్తాడు, భూమిపై వర్షాలు
ఉండవు. మీ పంటలు వ్యాధుల మూలంగా లేక
వేడి మూలంగా చస్తాయి. మీరు చచ్చేంతవరకు
ఈ కీడులన్నీ మీకు సంభవిస్తూనే ఉంటాయి.
[23]మీకు పైగా ఆకాశం ఇత్తడిలా తేటగా
ఉంటుంది. మీ కింద భూమి ఇనుములా గట్టిగా
ఉంటుంది. [24]ఆకాశంనుంచి వర్షానికి బదులు
ఇసుక, ధూళి యెహోవా పంపిస్తాడు. మీరు
నాశనం అయ్యేంతవరకు అది మీ మీదికి
వస్తుంది.
25 “మీ శత్రువులు మిమ్మల్ని ఓడించేటట్టు
యెహోవా చేస్తాడు. ఒక్క మార్గం గుండా మీరు
మీ శత్రువులమీదకు వెళ్లి, వారి దగ్గర్నుండి ఏడు
వేర్వేరు మార్గాలలో మీరు పారిపోతారు. మీకు
సంభవించే సంగతుల మూలంగా ప్రపంచంలోని
ప్రజలంతా భయపడతారు.
26 మీ శవాలు అడవి మృగాలకు, పక్షులకు ఆహారం
అవుతాయి. మీ శవాల మీదనుండి వాటిని వెళ్ల
గొట్టే వారు ఎవరూ ఉండరు.
27 “మీరు యెహోవాకు విధేయులు కాకపోతే,
ఆయన ఈజిప్టు వాళ్లమీదికి పంపిన గడ్డల్లాంటి
వాటితో ఆయన మిమ్మల్ని శిక్షిస్తాడు. పుండ్లు,
కుష్ఠు, గజ్జితో ఆయన మిమ్మల్ని శిక్షిస్తాడు.
[28]మీకు పిచ్చి ఎక్కేట్టుగా చేసి యెహోవా
మిమ్మల్ని శిక్షిస్తాడు. ఆయన మిమ్మల్ని
గుడ్డివాళ్లుగా చేసి, కలవరపరుస్తాడు. [29]అప్పుడు
గుడ్డివారు తడువులాడే రీతిగా నీవు
మధ్యాహ్నమందు తడువులాడుతావు. మీరు చేసే
ప్రతిదానిలో మీకు మీరు విఫలులవుతారు.
ప్రజలు మరల మరల మిమ్మల్ని బాధించి, మీ
దగ్గర్నుండి వస్తువులు దొంగిలిస్తారు. మిమ్మల్ని
రక్షించేవారు ఎవరూ ఉండరు.
30 “నీకు ప్రధానం చేయబడిన స్త్రీతో మరొకడు
లైంగిక సంబంధాలు అనుభవిస్తాడు. నీవు ఇల్లు

కడతావు గాని అందులో నీవు నివసించవు. ద్రాక్ష
తోట నీవు నాటుతావు గాని దానిలో నీవు ఏమీ
కూర్చుకోవు. 31నీ ఆవు నీ కళ్లముందే చంపబడు
తుంది గాని నీవు దాని మాంసం ఏమీ తినవు.
నీ గాడిద నీ దగ్గర్నుండి బలాత్కారంగా తీసుకొని
పోబడుతుంది. అది నీకు తిరిగి ఇవ్వబడదు. నీ
గొర్రెలు నీ శత్రువులకు ఇవ్వబడుతాయి. నిన్ను
రక్షించేవాడు ఎవడూ ఉండడు.
32 “మీ కొడుకులు, కూతుళ్లు వేరే జాతి ప్రజలకు
ఇవ్వబడేందుకు అనుమతించబడతారు. మీ
పిల్లలు మీకు కావాలి గనుక మీ కళ్లు బలహీనమై,
మీ చూపు మందగించేటంతవరకు మీరు
వాళ్లకోసం చూస్తారు. మరియు దేవుడు మీకు
సహాయం చేయడు.
33 “మీరు కష్టపడి పండించిన పంట అంతా మీకు
తెలియని మరోజాతి తినేస్తుంది. ప్రజలు
మిమ్మల్ని చెడుగా చూచి తిడతారు. విరుగగొట్ట
బడుతుంటారు. 34మీరు చూసే విషయాల
మూలంగా మీకుపిచ్చెక్కుతుంది. 35యెహోవా
మిమ్మల్ని రసిపుండ్లతో శిక్షి స్తాడు. ఈ పుండ్లు
మీ కాళ్ల మీద మోకాళ్లమీద ఉంటాయి. అవి మీ
అరికాలు మొదలుకొని మీ నడి నెత్తివరకు నిండి
ఉంటాయి. ఈ పుండ్లనుండి మీరు బాగుపడరు.
36 “మీరు ఎరుగని రాజ్యానికి మిమ్మల్ని, మీ రాజును
యెహోవా పంపించేస్తాడు. మీరు, మీ పూర్వీ
కులు కూడ ఆ రాజ్యాన్ని ఎన్నడూ చూడలేదు.
చెక్క,రాళ్లతో చేయబడిన ఇతర దేవుళ్లను
అక్కడ మీరు పూజిస్తారు. 37యెహోవా
మిమ్మల్ని పంపించే దేశాల్లో, మీకు సంభవించిన
సంగతులను చూసి ప్రజలు ఆశ్చర్యపోతారు.
వాళ్లు మిమ్మల్ని చూసి నవ్వుతారు. మిమ్మల్ని
గూర్చి చెడు సంగతులు చెబుతారు.

### ఓటమి శాపం

38“పొలాల్లో చల్లటానికి మీరు విస్తారంగా విత్తనాలు
తీసుకొని వెళ్తారు. కానీ మీ పంట కొద్దిగానే ఉంటుంది.
ఎందుకంటే మిడతలు మీ పంటను తినివేస్తాయి.
39మీరు ద్రాక్ష తోటలు నాటి, వాటిలో కష్టపడి పని
చేస్తారు. కానీ మీరు ద్రాక్ష పండ్లు కూర్చుకోరు, వాటి
రసం తాగలేరు. ఎందుకంటే పురుగులు వాటిని తిని
వేస్తాయి. 40మీ దేశమంతటా మీకు ఒలీవ చెట్లు
ఉంటాయి. కాని ఉపయోగించు కొనేందుకు మీకు
ఎలాంటి నూనె ఉండదు. ఎందుచేతనంటే మీ ఒలీవ
పండ్లు పాడై రాలిపోతాయి. 41మీకు కుమారులు,
కుమార్తెలు ఉంటారు. కాని వారిని మీరు ఉంచుకోలేరు.
ఎందుచేతనంటే వారు బంధించబడి తీసుకొని పోబడ
తారు. 42మీ చెట్లన్నింటినీ, మీ పొలాల్లోని పంటలన్నిం
టినీ మిడతలు నాశనం చేస్తాయి. 43మీ మధ్య నివసించే
విదేశీయులు మరింత ఎక్కువ అధికారం కూడ పొందు
తారు. మీరేమో మీకు ఉన్న అధికారం కూడ పోగొట్టు
కొంటారు. 44మీకు అప్పు ఇచ్చేందుకు విదేశీయుల
దగ్గర ధనం ఉంటుంది. కానీ వారికి అప్పు ఇవ్వటానికి
మీ దగ్గర ఏమీ ధనం ఉండదు. శిరస్సు దేహాన్ని స్వాధీ
నంలో ఉంచుకొన్నట్టు వారు మిమ్మల్ని స్వాధీనంలో
ఉంచుకొంటారు.మీరు తోకలా ఉంటారు.
45“ఈ శాపాలన్నీ మీ మీదికి వస్తాయి. మీరు నాశనం
అయ్యేంతవరకు అవి మిమ్మల్ని తరుముతూ, పట్టు
కొంటూనే ఉంటాయి. ఎందుకంటే మీ దేవుడైన
యెహోవా మీకు చెప్పిన వాటిని మీరు వినలేదు.
ఆయన మీకు ఇచ్చిన ఆదేశాలకు, ఆజ్ఞలకు మీరు
విధేయులు కాలేదు. 46మీకు, మీ సంతతివారికి దేవుడు
శాశ్వతంగా తీర్పుతీర్చాడని ఈ శాపాలు ప్రజలకు
తెలియజేస్తాయి. మీకు సంభవించే భయంకర విషయా
లను చూసి ప్రజలు ఆశ్చర్యపడిపోతారు.
47“మీ దేవుడైన యెహోవా మీకు చాలా ఆశీ
ర్వాదాలు ఇచ్చాడు. కానీ మీరు సంతోషంగా, ఆనంద
హృదయంతో ఆయనను సేవించలేదు. 48అందుచేత
శత్రువులకు మీరు సేవచేస్తారు. ఆకలి, దాహంతో మీరు
దిగంబరులుగా ఉంటారు. మీకు ఏమీ ఉండదు.
యెహోవా మిమ్మల్ని నాశనం చేసేంతవరకు ఆయన
మీ మెడమీద ఇనుప కాడిని పెడతాడు.

### శత్రు రాజ్య శాపం

49“దూరంనుండి మీ మీదికి ఒక రాజ్యాన్ని
యెహోవా తీసుకొని వస్తాడు. ఈ రాజ్యం భూమి
అవతలి పక్కనుండి వస్తుంది.ఈ రాజ్య భాష మీకు
అర్థం కాదు. ఆకాశంనుండి పక్షిరాజు వచ్చినట్టు ఈ
రాజ్యం వేగంగా మీ మీదికి వస్తుంది. 50ఈ రాజ్యం
వారి ముఖాలు కఠినంగా ఉంటాయి. వారు ముసలి
వాళ్లను లెక్కచేయరు. చిన్నపిల్లల మీద వాళ్లు దయ
చూపించరు. 51మీరు నాశనం అయ్యేంతవరకు మీ
పశువుల మందలోని దూడలను, మీ నేల పంటను
వారు తింటారు. ధాన్యం, కొత్త ద్రాక్షారసం, నూనె,
మీ పశువుల్లో దూడలు, మీ మందల్లో గొర్రెలు మీకోసం
వారు విడిచిపెట్టరు. మీరు నాశనం అయ్యేంత వరకు
ఇలా చేస్తూనే ఉంటారు.
52“ఈ రాజ్యం మీ పట్టణాలన్నింటినీ చుట్టు
ముట్టేస్తుంది. మీ పట్టణాల చుట్టూ ఉన్న మీ ఎత్తయిన,
బలమైన గోడల్ని మీరు నమ్ముకొంటారు. కానీ మీ
దేశం అంతటా ఈ గోడలన్నీ కూలిపోతాయి. అవును,
మీ దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశంలో మీ
పట్టణాలన్నింటిమీదా ఆ రాజ్యం దాడి చేస్తుంది.
53శత్రువు మీ పట్టణం చుట్టూ కనిపెట్టుకొని వుండగా,
మీరు ఎంతో శ్రమ అనుభవిస్తారు. మీరు ఆకలి భరించ

లేక మీ పిల్లల్నే తినివేస్తారు. మీ దేవుడైన యెహోవా
మీకు ఇచ్చిన కుమారులు, కుమార్తెల శరీరాలను మీరు
తింటారు.
54“మీలో దయగల అతి మర్యాదస్తుడు కూడా
క్రూరుడవుతాడు. ఇతరులతో కూడా క్రూరంగా
వుంటాడు. తాను ప్రేమించే భార్యతోగాని, ఇంకను
బతికున్న తన పిల్లలతోగాని క్రూరుడై భాగం
పంచుకొనేందుకు అతడు ఒప్పుకోడు. 55మీ పట్టణాల
మీద దాడి చేసేందుకు వచ్చే శత్రువు అంత తీవ్ర
నష్టం కలిగిస్తాడు గనుక అతనికి తినటానికి కూడా
ఏమీ మిగులదు. అందుచేత అతడు తన స్వంత పిల్లల్నే
కొందర్ని తినివేస్తాడు. కాని తన కుటుంబంలో ఇంకె
వ్వరికీ అతడు ఏమీ ఇవ్వడు.
56“ఎన్నడూ నేలమీద కాలు మోపనంత సున్నిత
మైన ధనికురాలు, మీలో ఎంతో గొప్ప దయ, మర్యాద
గల స్త్రీ కూడా కఠినంగా ఉండి అలానే చేస్తుంది.
ఆమె తన స్వంత ప్రియ భర్తతో లేక తన స్వంత
కుమారునితో, స్వంత కుమార్తెతో భాగం పంచు
కొనేందుకు నిరాకరిస్తుంది. 57ఆమె తన మావిని, తాను
కన్న తన స్వంత పిల్లలను రహస్యంగా తినేస్తుంది.
ఎందుకంటే బొత్తిగా ఆహారం లేదు గనుక. మీ శత్రువు
మీ పట్టణాల మీద దాడి చేసి, ఎంతో శ్రమ కలిగించి
నపుడు ఇలా జరుగుతుంది.
58“ఈ గ్రంథంలో వ్రాయబడిన చట్టంలోని ఆదేశా
లన్నింటికీ మీరు విధేయులు కావాలి. భయంకరమైన,
అద్భుతమైన మీ దేవుడైన యెహోవా నామాన్ని మీరు
గౌరవించాలి. మీరు విధేయులు కాకపోతే, అప్పుడు
59యెహోవా మీకు దారుణమైన కష్టాలు, కలిగిస్తాడు.
మరియు మీ సంతతివారు గొప్ప కష్టాలు చాలకాలం
కొనసాగే భయంకర రోగాలు అనుభవిస్తారు. 60మీరు
ఈజిప్టులో చాలా కష్టాలు, రోగాలు చూసారు. అవి
మిమ్మల్ని భయస్తుల్నిగా చేసాయి. ప్రభువు ఆ చెడ్డ
వాటన్నిటినీ మీ మీదకు రప్పిస్తాడు. 61ఈ గ్రంథంలో
వ్రాయబడని ప్రతి విధమైన ప్రతి రోగాన్ని, ప్రతి కష్టాన్ని
యెహోవా మీ మీదకు రప్పిస్తాడు. మీరు నాశనం
అయ్యేంతవరకు ఆయన ఇలా చేస్తూనే ఉంటాడు.
62మీరు ఆకాశ నక్షత్రాలు ఉన్నంత మంది ఉండవచ్చు.
కానీ మీలో కొంచెంమంది మాత్రమే మిగులుతారు.
ఎందుకు మీకు ఇలా జరుగుతుంది? మీరు మీ దేవుడైన
యెహోవా మాట వినలేదు గనుక.
63“ఇదివరకు మీకు మేలు చేసి, మీ రాజ్యాన్ని
విశాలపరచాలంటే యెహోవాకు సంతోషం. అదే
విధంగా మిమ్మల్ని పాడుచేసి, నాశనం చేయటానికి
యెహోవా సంతోషిస్తాడు. మీరు మీ స్వంతంగా తీసు
కొనేందుకు ప్రవేశిస్తున్న దేశంలోనుండి మీరు తొల
గించివేయబడతారు. 64భూమి ఈవైపునుండి ఆ వైపు
నకు గల ప్రపంచ ప్రజలందరి మధ్యకు యెహోవా
మిమ్మల్ని చెదరగొట్టివేస్తాడు. మీరు గాని మీ పూర్వీ
కులు గాని ఎన్నడూ ఆరాధించని దేవుళ్లను, చెక్క,
రాతితో చేసిన దేవుళ్లను మీరు సేవిస్తారు.
65“ఈ రాజ్యాలలో మీకు ఏ మాత్రం శాంతి
ఉండదు. మీరు విశ్రాంతి తీసుకొనే చోటు ఎక్కడా
ఉండదు. యెహోవా మీ మనస్సులను చింతతో నింపే
స్తాడు.మీ కళ్లు భారంగా ఉంటాయి. మీరు చాలా
అల్లకల్లోలంగా ఉంటారు. 66మీరు ప్రమాదంలో ఎల్ల
ప్పుడూ అనుమానంగా జీవిస్తారు. రాత్రింబవళ్లు మీకు
భయం కలుగుతూ ఉంటుంది. మీ జీవితాల విషయం
మీకు ఎన్నడూ గట్టి నమ్మకం ఉండదు. 67‘ఇది
సాయంత్రం అయితే బాగుండును’ అని ఉదయాన
మీరంటారు. ‘ఇది ఉదయం అయితే బాగుండును’
అని సాయంత్రం అంటారు. ఎందుకంటే మీ హృద
యంలో ఉండే భయంవల్ల, మీరు చూసే చెడు సంగ
తులవల్ల.
68యెహోవా మళ్లీ మిమ్మల్ని ఓడల్లో ఈజిప్టుకు
పంపిస్తాడు. మీరు మళ్లీ ఎన్నటికీ తిరిగి ఆ స్థలానికి
తిరిగి వెళ్లనవసరం లేదని నేను మీతో చెప్పాను, కానీ
యెహోవా మిమ్మల్ని అక్కడికి పంపిస్తాడు. అక్కడ
మీరు మీ శత్రువులకు బానిసలుగా అమ్ముడు
బోయేందుకు ప్రయత్నిస్తారు. కానీ మిమ్మల్ని ఎవరూ
కొనరు.”

## మోయాబులో ఒడంబడిక

29 మోయాబు దేశంలో మోషే ఇశ్రాయేలు ప్రజ
లతో చేయాల్సిందిగా యెహోవా చెప్పిన
ఒడంబడికలో భాగమే ఈ విషయాలు. హోరేబు
(సీనాయి) కొండమీద ఇశ్రాయేలు ప్రజలతో
యెహోవా చేసిన ఒడంబడిక గాక యిది ఆయన
చేసిన మరో ఒడంబడిక.
2మోషే ఇశ్రాయేలు ప్రజలందర్నీ సమావేశ
పర్చాడు. అతను వాళ్లతో ఇలా చెప్పాడు: “ఈజిప్టు
దేశంలో యెహోవా చేసిన వాటన్నింటినీ మీరు
చూసారు. ఫరోకు, ఫరో నాయకులకు, అతని దేశం
అంతటికీ యెహోవా చేసిన వాటిని మీరు చూసారు.
3ఆయన వాళ్లకు కలిగించిన గొప్ప కష్టాలు అన్నీ
మీరు చూసారు. ఆయన చేసిన అద్భుతాలు, మహా
త్కార్యాలు మీరు చూసారు. 4కానీ జరిగిందేమిటో ఈ
రోజుకూ మీకు అర్థంకాలేదు. మీరు చూసిన దానిని,
విన్నదానిని యెహోవా మీకు అర్థం కానివ్వలేదు.
5 40సంవత్సరాలు యెహోవా మిమ్మల్ని అరణ్యంలో
నడిపించాడు. ఆ కాలం అంతటిలో మీ బట్టలు పాతబడ
లేదు, మీ చెప్పులు అరిగిపోలేదు. 6మీ వద్ద భోజనం
ఏమీలేదు. ద్రాక్షారసంగాని తాగేందుకు మరేదీగాని మీ
దగ్గరలేదు. కానీ మీ విషయంలో యెహోవా శ్రద్ధ
తీసుకొన్నాడు. ఆయన మీ దేవుడైన యెహోవా

అని మీరు అర్థం చేసుకోవాలని ఆయన ఇలా చేసాడు.
[7]“మీరు ఈ స్థలానికి వచ్చినప్పుడు, హెష్బోను రాజు సీహోను, బాషాను రాజు ఓగు మన మీద యుద్ధానికి వచ్చారు. కానీ మనం వాళ్లను ఓడించాం. [8]అప్పుడు వారి దేశాన్ని మనం స్వాధీనం చేసుకొని, రూబేనీయులు, గాదీయులు, మనష్షే అర్థ గోత్రం వారికి స్వంతంగా ఇచ్చాము.
[9]కనుక ఈ ఒడంబడికలోని ఆదేశాలకు పూర్తిగా లోబడుతుంటే మీరు చేసే ప్రతి దానిలో మీరు విజయం పొందుతూ ఉంటారు. [10]“ఈ వేళ మీరంతా ఇక్కడ మీ దేవుడైన యెహోవా ఎదుట నిలబడ్డారు. మీ నాయకులు, మీ అధికారులు, మీ పెద్దలు, మిగిలిన మనుష్యులంతా ఇక్కడ ఉన్నారు. [11]మీ భార్యలు, పిల్లలు ఇక్కడ ఉన్నారు. మీ మధ్య నివసిస్తూ, మీ కట్టెలు కొట్టి, మీకు నీళ్లు మోసే విదేశీయులు కూడా ఇక్కడ ఉన్నారు. [12]మీరంతా మీ దేవుడైన యెహోవాతో ఒక ఒడంబడిక చేసు కొనేం దుకు ఇక్కడ ఉన్నారు. యెహోవా నేడు మీతో ఈ ఒడంబడిక చేస్తున్నాడు.
[13]ఈ ఒడంబడిక మూలంగా యెహోవా మిమ్మల్ని తన స్వంత ప్రజలుగా చేసుకొంటున్నాడు. మరియు సాక్షాత్తూ ఆయనే మీకు దేవుడుగా ఉంటాడు. ఇది ఆయన మీతో చెప్పాడు. మీ పూర్వీకులు అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు ఆయన దీనిని వాగ్దానం చేశాడు. [14]యెహోవా ఈ వాగ్దానాలన్నింటితో కూడిన ఈ ఒడంబడికను మీతో మాత్రమే చేయటం లేదు.
[15]ఈ వేళ ఇక్కడ మన దేవుడైన యెహోవా యెదుట నిలిచిన మనందరితో ఆయన ఈ ఒడంబడిక చేస్తున్నాడు. అయితే ఈనాడు ఇక్కడ మనతో లేని మన సంతానానికి కూడ ఈ ఒడంబడిక వర్తిస్తుంది. [16]మనం ఈజిప్టు దేశంలో ఎలా జీవించామో మీకు జ్ఞాపకమే. ఇక్కడికి వచ్చే మార్గంలో ఉన్న దేశాల్లోంచి మనం ఎలా ప్రయాణం చేసామో అదీ మీకు జ్ఞాపకమే. [17]చెక్క, రాయి, వెండి, బంగారంతో వారు చేసిన అసహ్యమైన విగ్రహాలను మీరు చూసారు. [18]ఈ వేళ ఇక్కడ ఉన్న పురుషుడుగాని, స్త్రీగాని, కుటుంబంగాని, వంశంగాని మీ దేవుడైన యెహోవా నుండి తిరిగిపోకుండా గట్టి జాగ్రత్తలో ఉండండి. ఏ వ్యక్తి కూడా పోయి ఆ రాజ్యాల దేవుళ్లను సేవించకూడదు. అలా చేసేవాళ్లు చేదైన విష ఫలాలు ఫలించే మొక్కల్లా ఉంటారు.
[19]“ఒక వ్యక్తి ఈ శాపాలన్నీ విని, ‘నా ఇష్టం వచ్చినట్టు నేను చేస్తూనే ఉంటాను. నాకేమీ కీడు సంభవించదు’ అంటూ తనను తాను ఆదరించుకో వచ్చును. ఆ వ్యక్తి తనకు మాత్రమేగాక ప్రతి ఒక్కరికీ చివరకు మంచి వాళ్లకుకూడ కీడు జరిగిస్తాడు.
[20-21]ఆ వ్యక్తిని యెహోవా క్షమించడు. మరియు, ఆ వ్యక్తిమీద యెహోవాకుకోపం వస్తుంది, యెహోవా ఆ వ్యక్తిని శిక్షిస్తాడు. ఇశ్రాయేలు వంశాలన్నింటి నుండీ యెహోవా అతణ్ణి వేరు చేసేస్తాడు. యెహోవా అతన్ని పూర్తిగా నాశనం చేస్తాడు. ఈ గ్రంథంలో వ్రాయబడిన కీడులన్నీ అతనికి సంభవిస్తాయి. ధర్మ శాస్త్ర గ్రంథంలో వ్రాయబడిన ఒడంబడికలో ఆ విషయాలన్నీ ఒక భాగం;
[22]“భవిష్యత్తులో మీ సంతానంవారు, దూరదేశాల్లోని విదేశీయులు మీ దేశం ఎలా పాడైపోయిందో చూస్తారు. యెహోవా దాని మీదికి రప్పించిన రోగాలను వారు చూస్తారు.
[23]దేశం అంతా మండే గంధకం, ఉప్పుతో నిష్ప్రయోజనంగా ఉంటుంది. దేశంలో ఏమీ నాట బడదు. ఏవీ, చివరకు గురుగులుకూడ పెరగవు. యెహోవా చాలా కోప గించినప్పుడు నాశనం చేసిన సొదొమ, గొమొర్రా, అద్మా, జెబోయిం పట్టణాల్లా ఈ దేశం ఉంటుంది.
[24]“యెహోవా ఈ దేశానికి ఎందుకు ఇలా చేసాడు? ఆయనకు ఎందుకు ఇంతకోపం వచ్చింది?’ అని ఇతర రాజ్యాలన్నీ అడుగుతాయి.
[25]జవాబు ఇదే: ‘ఇశ్రాయేలు ప్రజలు, వారి పూర్వీకుల దేవుడైన యెహోవా ఒడం బడికను విడిచిపెట్టేసారు గనుక యెహోవాకు కోపం వచ్చింది. యెహోవా వారిని ఈజిప్టు దేశనుండి బయటకు తీసు కొనివచ్చినప్పుడు ఆయన వారితోచేసిన ఒడంబడికను పాటించటం వాళ్లు మానివేసారు. [26]ఇశ్రాయేలు ప్రజలు ఇదివరకు ఎన్నడూ ఆరాధించని ఇతర దేవుళ్లను ఆరాధించటం మొదలు పెట్టారు. ఆ దేవుళ్లను పూజించ వద్దని యెహోవా ఆ ప్రజలతో చెప్పాడు. [27]అందు వల్లనే ఈ దేశ ప్రజల మీద యెహో వాకు అంతగా కోపం వచ్చింది. అందుచేత ఈ గ్రంథంలో వ్రాయ బడిన శాపాలన్నీ ఆయన వారి మీదికి రప్పించాడు. [28]యెహోవా వారి మీద చాలా కోపగించాడు. కనుక ఆయన వాళ్లను వారి దేశంనుండి బయటకు లాగేసాడు. ఈనాడు వారు ఉన్న మరో దేశంలో ఆయన వాళ్లను ఉంచాడు.’
[29]“మన దేవుడైన యెహోవా రహస్యంగా ఉంచిన మరికొన్ని విషయాలు ఉన్నాయి. ఆ సంగతులు ఆయనకు మాత్రమే తెలుసు. అయితే యెహోవా తన ధర్మశాస్త్రాన్ని మాత్రం మనల్ని తెలుసు కోనిచ్చాడు. ఆ ధర్మశాస్త్రం మనకోసం, మన సంతతివారి కోసం. మనం దానికి శాశ్వతంగా విధేయులం కావాలి.

### ఇశ్రాయేలీయులు వారి దేశానికి తిరిగి వెళ్తారు

30 “నేను చెప్పిన ఈ సంగతులన్నీ మీకు సంభవిస్తాయి. ఆశీర్వాదాల నుండి మంచి సంగతులు, శాపాలనుండి చెడు సంగతులు మీకు సంభవిస్తాయి. మీ దేవుడైన యెహోవా మిమ్మల్ని ఇతర

దేశాలకు పంపించివేస్తాడు. అప్పుడు మీరు ఈ విషయా
లను గూర్చి తలుస్తారు. [2]ఆ సమయంలో మీరూ,
మీ సంతానం మీ దేవుడైన యెహోవా దగ్గరకు తిరిగి
వస్తారు. నేడు నేను మీకు యిచ్చిన ఆయన ఆదేశాల
న్నింటికీ పూర్తిగా విధేయులై, మీ హృదయపూర్తిగా
మీరు ఆయనను వెంబడిస్తారు. [3]అప్పుడు మీ దేవుడైన
యెహోవా మీ మీద దయ చూపిస్తాడు. యెహోవా
మిమ్మల్ని మళ్లీ స్వతంత్రుల్ని చేస్తాడు. ఆయన
మిమ్మల్ని పంపించిన దేశాలనుండి తిరిగి వెనుకకు
తీసుకొనివస్తాడు. [4]ఆయన మిమ్మల్ని చివరి భూది
గంతాలవరకు పంపించినాసరే మీ దేవుడైన యెహోవా
మిమ్మల్ని సమావేశపర్చి, అక్కడనుండి తిరిగి వెనుకకు
తీసుకొని వస్తాడు.

[5]యెహోవా మిమ్మల్ని మీ పూర్వీ కుల దేశానికి
తీసుకొనివస్తాడు, ఆ దేశం మీదే అవుతుంది.
యెహోవా మీకు మేలు చేస్తాడు, మీ పూర్వీకులకు
ఉన్నదానికంటె మీకు ఎక్కువ ఉంటుంది. [6]మీ
దేవుడైన యెహోవా మీ యొక్కయు మీ సంతానం
యొక్కయు హృదయాలు సున్నతి చేస్తాడు. దాన్ని
బట్టే మీ దేవుడైన యెహోవాను మీరు మీ నిండు
హృదయంతోను, మీ నిండు మనస్సుతోను ప్రేమించి
బతుకుతారు.

[7]"మిమ్మల్ని ద్వేషించి, మీకు కష్టం కలిగించే మీ
శత్రువుల మీద ఆ శాపాలన్నింటినీ మీ దేవుడైన
యెహోవా రప్పిస్తాడు. [8]మరియు మీరు తిరిగి
యెహోవాకు విధేయులవుతారు. ఈ వేళ నేను మీకు
ఇస్తున్న ఆయన ఆదేశాలన్నింటికీ మీరు విధేయులవు
తారు. [9]మీ దేవుడైన యెహోవా మీరు చేసే ప్రతీదీ
విజయవంతం చేస్తాడు. ఆయన మీకు చాలా మంది
పిల్లల్ని ఇచ్చి ఆశీర్వదిస్తాడు. విస్తారమైన దూడలను
ఇచ్చి మీ మందలను, మంచి పంటలతో మీ పొలాలను
ఆయన ఆశీర్వదిస్తాడు. యెహోవా మీ యెడల మంచి
జరిగిస్తాడు. యెహోవా మీ పూర్వీకులకు మేలు చేసి
సంతోషించినట్టు, ఆయన మరల మీకు మేలు చేయ
టంలో ఆనందిస్తాడు.[10]అయితే మీరు చేయాలని మీ
దేవుడైన యెహోవా మీకు ఆజ్ఞాపించినవాటిని మీరు
చేయాలి. ఈ ధర్మశాస్త్రపు గ్రంథంలో వ్రాయబడిన
నియమాలు మీరు పాటించాలి, ఆదేశాలకు మీరు విధే
యులు కావాలి. మీ నిండు హృదయంతో, మీ ఆత్మతో
మీరు మీ దేవుడైన యెహోవా తట్టు తిరగాలి. అప్పుడు
ఈ మంచి విషయాలన్నీ మీకు సంభవిస్తాయి.

### జీవం లేక మరణం

[11]"ఈ వేళ నేను మీకు ఇస్తున్న ఈ ఆజ్ఞ చాలా
కష్టతరమయింది కాదు. అది చాలా దూరమైనదీ కాదు.
[12]మేము దానిని విని, దానిని జరిగించేందుకు 'ఎవరు
మా కోసం ఆకాశానికి వెళ్లి దాన్ని తీసుకొని వస్తారు
అని మీరు చెప్పేందుకు ఈ ఆదేశం ఆకాశంలో లేదు.'
[13]మేము దానిని విని, దానిని జరిగించడానికి 'మాకోసం
ఎవరు సముద్రం దాటి వెళ్లి, దానిని మాకోసం తీసుకొని
వస్తారు అని చెప్పటానికి ఈ ఆదేశం సముద్రానికి
అవతలపక్క లేదు.' [14]లేదు, ఆ మాట మీకు చాలా
సమీపంగా ఉంది. అది మీరు చేయగలిగేటట్టు మీ
నోటిలో, మీ హృదయంలో ఉంది.

[15]"జీవం, మరణం, మంచి చెడుల మధ్య కోరుకొనే
అవకాశం ఈ వేళ నేను మీకు యిచ్చాను. [16]మీరు మీ
దేవుడైన యెహోవాను ప్రేమించాలనీ, ఆయన
మార్గాల్లో నడచుకోవాలనీ, ఆయన ఆదేశాలకు, ఆజ్ఞ
లకు, నియమాలకు విధేయులు కావాలనీ ఈ వేళ
నేను మీకు ఆజ్ఞాపిస్తున్నాను. అప్పుడు మీరు బ్రతుకు
తారు, మీ దేశం విస్తరిస్తుంది. మరియు స్వంతంగా
మీరు తీసుకొనేందుకు ప్రవేశిస్తున్న దేశంలో మీ దేవు
డైన యెహోవా మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. [17]అయితే
మీరు యెహోవా నుండి మరలిపోయి, వినడానికి నిరాక
రిస్తే, ఇతర దేవుళ్లను పూజించి, సేవించేందుకు మీరు
తిప్పివేయబడితే [18]మీరు నాశనం చేయబడతారు. నేను
మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. మీరు మీ స్వంతంగా
తీసుకొనేందుకు ప్రవేశించాలని సిద్ధంగా ఉన్న
యొర్దాను నది అవతలి వైపు దేశంలో మీరు ఎక్కువ
కాలం బ్రతకరు.

[19]"ఈ వేళ మీరు కోరుకొనేందుకు రెండు విష
యాలు మీకు యిస్తున్నాను. మీరు కోరుకొనే దానికి
సాక్షులుగా ఉండమని భూమిని, ఆకాశాన్ని నేను అడుగు
తున్నాను. మీరు జీవం కోరుకోవచ్చు లేదా మరణం
కోరుకోవచ్చు. మొదటిది కోరుకుంటే అది ఆశీర్వాదం
తెచ్చిపెడ్తుంది. రెండోది కోరుకుంటే అది శాపం
తెస్తుంది. అందుచేత జీవం కోరుకోండి. అప్పుడు
మీరూ, మీ పిల్లలూ జీవిస్తారు. [20]మీరు మీ దేవుడైన
యెహోవాను ప్రేమించి, ఆయనకు విధేయులు
కావాలి. ఎన్నటికీ ఆయనను విడిచిపెట్టవద్దు. ఎందు
చేతనంటే యెహోవాయే మీకు జీవం. మీ పూర్వీకు
లైన అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులకు యిస్తానని
ఆయన వాగ్దానం చేసిన దేశంలో మీ దేవుడైన
యెహోవా మీకు దీర్ఘాయుష్షు ఇస్తాడు."

### కొత్త నాయకుడు యెహోషువ

31 అప్పుడు మోషే వెళ్లి, ఇశ్రాయేలీయు
లందరితో ఈ మాటలు చెప్పాడు. [2]మోషే
వాళ్లతో ఇలా చెప్పాడు, "ఇప్పుడు నాకు 120 సంవత్స
రాల వయస్సు. ఇంక మిమ్మల్ని నేను నడిపించలేను.
'నీవు యొర్దాను నది దాటి వెళ్లవు' అని యెహోవా
నాతో చెప్పాడు. [3]మీ దేవుడైన యెహోవా మీకు
ముందు వెళ్తాడు. మీకోసం ఈ రాజ్యాలను ఆయనే
నాశనం చేస్తాడు. వారి దగ్గరనుండి వారి రాజ్యాన్ని

మీరు తీసుకుంటారు. యెహోషువ మిమ్మల్ని
ముందుగా దాటిస్తాడు. ఇది యెహోవా చెప్పాడు:
4"అమోరీ రాజులైన సీహోను, ఓగులకు చేసినట్టే
యెహోవా ఈ రాజ్యాలకు చేస్తాడు. ఆ రాజుల దేశానికి
చేసిన విధముగానే ఆయన చేస్తాడు. వారి దేశాన్ని
యెహోవా నాశనం చేసాడు. 5మరియు మీరు ఈ
రాజ్యాలను నాశనం చేసేటట్టు యెహోవా సహాయం
చేస్తాడు. మీరు చేయాలని నేను చెప్పిన విషయాలన్నీ
మీరు వాళ్లకు చేయాలి. 6నిబ్బరంగా, ధైర్యంగా
ఉండండి. ఈ జనాలకు భయపడకండి. ఎందుకంటే
మీ దేవుడైన యెహోవా మీతో పాటు వెళ్తున్నాడు.
యెహోవా మిమ్మల్ని విడిచిపెట్టడు, మీకు సహాయం
చేయకుండా ఉండడు."
7అప్పుడు మోషే యెహోషువాను పిలిచాడు.
మోషే యెహోషువతో చెబుతుంటే ఇశ్రాయేలు ప్రజ
లంతా విన్నారు: "నిబ్బరంగా, ధైర్యంగా ఉండు, వారి
పూర్వీకులకు యిస్తానని యెహోవా వాగ్దానం చేసిన
దేశంలోనికి ఈప్రజలను నీవు నడిపించాలి. ఈ దేశాన్ని
తమ స్వంతంగా తీసుకునేందుకు ఇశ్రాయేలు ప్రజలకు
నీవు సహాయం చేయాలి.
8యెహోవా నీకు ముందు వెళ్తాడు. సాక్షాత్తూ
ఆయనే నీతో ఉంటాడు. ఆయన నీకు సహాయం
చేయకుండా ఉండడు, నిన్ను విడువడు, భయపడ
వద్దు, దిగులుపడవద్దు."

## ప్రబోధాలను మోషే వ్రాయటం

9అప్పుడు మోషే ఈ ధర్మశాస్త్రం వ్రాసి, లేవీ
సంతానపు యాజకులకు ఇచ్చాడు. యెహోవా ఒడం
బడిక పెట్టె మోసే పని వాళ్లదే. ఆ ధర్మశాస్త్రాన్ని
ఇశ్రాయేలు నాయకులందరికి కూడా మోషే
యిచ్చాడు. 10తర్వాత మోషే నాయకులకు ఆజ్ఞాపిం
చాడు. అతను ఇలా చెప్పాడు: "ప్రతి ఏడు సంవత్సరాల
ఆఖరిలో, స్వాతంత్ర్యపు సంవత్సరంలో, పర్ణశాలల
పండుగ సమయములో ఈ ధర్మశాస్త్రం చదవండి.
11ఆ సమయంలో మీ దేవుడైన యెహోవా ఏర్పరచు
కునే ప్రత్యేక స్థలంలో ఆయనను కలుసుకునేందుకు
ఇశ్రాయేలు ప్రజలంతా వస్తారు. అప్పుడు ప్రజలు
వినగలిగేటట్టు నీవు వారికి ఈ ధర్మశాస్త్రం చదివి విని
పించాలి. 12 పురుషులు, స్త్రీలు, చిన్నపిల్లలు, మీ పట్ట
ణాల్లో నివసించే విదేశీయులు అందరిని సమావేశ
పర్చాలి. వాళ్లు ధర్మశాస్త్రాన్ని విని, మీ దేవుడైన
యెహోవాను గౌరవించటం నేర్చుకుంటారు. ఈ
ధర్మశాస్త్రంలోని ఆదేశాలకు వారు జాగ్రత్తగా విధేయుల
వుతారు. 13ధర్మశాస్త్రం ఎరుగనివారి సంతానంవాళ్లంతా
దానిని వింటారు. వాళ్లు మీ దేవుడైన యెహోవాను
గౌరవించటం నేర్చుకుంటారు. యోర్దాను నది ఆవలి
ప్రక్క మీరు స్వాధీనం చేసుకునేందుకు సిద్ధంగా ఉన్న
దేశంలో మీరు జీవించినంత కాలం వారు ఆయనను
గౌరవిస్తారు."

## మోషేను, యెహోషువను యెహోవా పిలవటం

14"నీవు చనిపోయే సమయం దగ్గరపడింది.
యెహోషువను వెంటబెట్టుకుని, సన్నిధి గుడారం
దగ్గరకురా. యెహోషువ చేయాల్సిన పనులు నేను
అతనికి చెబుతాను" అని మోషేతో యెహోవా ఇలా
చెప్పాడు. కనుక మోషే, యెహోషువ సన్నిధి గుడారా
నికి వెళ్లారు.
15ఆ గుడారంలో ఒక మేఘస్తంభంలో యెహోవా
ప్రత్యక్షమయ్యాడు. మేఘస్తంభం గుడార ద్వారం దగ్గర
నిలిచింది. 16మోషేతో యెహోవా ఇలా చెప్పాడు:
"త్వరలో నీవు చనిపోతావు. నీవు నీ పూర్వీ కులతో
ఉండేందుకు వెళ్లిపోయిన తర్వాత, ఈ ప్రజలు నాకు
నమ్మకంగా ఉండరు. నేను వాళ్లతో చేసిన ఒడంబడికను
వాళ్లు ఉల్లంఘిస్తారు. వాళ్లు నన్ను విడిచిపెట్టేసి, వారు
వెళ్తున్న దేశంలోని ఇతర దేవుళ్లను, అబద్ధపు దేవుళ్లను
పూజించటం మొదలు పెడ్తారు.
17ఆ సమయంలో నేను వారిమీద చాలా కోపగించి,
వాళ్లను విడిచి పెడ్తాను. వాళ్లకు సహాయం చేయటానికి
నేను ఒప్పుకోను, వాళ్లు నాశనం చేయబడతారు.
వాళ్లకు భయంకరమైన సంగతులు జరుగుతాయి,
వాళ్లకు కష్టాలు వస్తాయి. అప్పుడు 'మన దేవుడు
మనతో లేడు గనుక ఈ కీడులు మనకు కలిగాయి'
అని వారు అంటారు. 18వాళ్లు కీడు చేసి, ఇతర దేవుళ్లను
పూజించారు గనుక నేను వారికి సహాయం చేయటానికి
ఒప్పుకోను.
19"కనుక ఈ పాట వ్రాసుకొని, ఇశ్రాయేలు ప్రజ
లకు నేర్పించు, అది పాడటం వారికి నేర్పించు.
అప్పుడు ఇశ్రాయేలీయుల మీద నాకు ఈ పాట
సాక్ష్యంగా ఉంటుంది.
20వారి పూర్వీకులకు నేను వాగ్దానం చేసిన, మంచి
వాటితో నిండిపోయిన దేశం లోనికి నేను వాళ్లను
తీసుకొని వెళ్తాను. వారు తినేందుకు కావాల్సినవి అన్నీ
వారికి ఉంటాయి. ఐశ్వర్యవంతమైన జీవితం వారికి
ఉంటుంది. కానీ అప్పుడు వాళ్లు యితర దేవుళ్ల వైపు
తిరిగి, వారిని సేవిస్తారు. నా నుండి వాళ్లు తిరిగిపోయి
నా ఒడంబడికను ఉల్లంఘిస్తారు. 21అప్పుడు వాళ్లకు
ఎన్నో భయంకర సంగతులు జరుగుతాయి, వారికి
ఎన్నో కష్టాలు వస్తాయి. అప్పటికి ఇంకా వారి ప్రజలకు
ఈ పాట జ్ఞాపకం ఉంటుంది, వారిది ఎంత తప్పు
అని యిది వారికి తెలియజేస్తుంది. నేను వారికి ఇస్తానని
వాగ్దానం చేసిన దేశంలోనికి నేను యింకా వారిని
తీసుకొని వెళ్లలేదు; కానీ వాళ్లు అక్కడ ఏం చేయాలని
పథకం వేస్తున్నారో నాకు అప్పుడే తెలుసు."

[22]కనుక ఆ రోజే మోషే ఆ పాట వ్రాసాడు. ఆ పాటను ఇశ్రాయేలు ప్రజలకు అతను నేర్పించాడు.

[23]తర్వాత నూను కుమారుడైన యెహోషువతో యెహోవా మాట్లాడాడు: అతనితో, "ధైర్యంగా, నిబ్బరంగా ఉండు. నేను ఇశ్రాయేలీయులకు వాగ్దానం చేసిన దేశంలోకి నీవు ఆ ప్రజలను నడిపిస్తావు. నేను నీతో ఉంటాను" అని యెహోవా చెప్పాడు.

### ఇశ్రాయేలు ప్రజలను మోషే హెచ్చరించటం

[24]ఈ ఉపదేశాలు అన్నింటినీ మోషే జాగ్రత్తగా ఒక గ్రంథంలో వ్రాసాడు. అతడు ముగించినప్పుడు [25]లేవీయులకు అతడు ఒక ఆజ్ఞ యిచ్చాడు. (వీళ్లు యెహోవా ఒడంబడిక పెట్టె విషయలో జాగ్రత్త తీసుకుంటారు.) అని మోషే చెప్పాడు, [26]"ఈ ధర్మ శాస్త్రపు గ్రంథం తీసుకొని, మీ దేవుడైన యెహోవా ఒడంబడిక పెట్టె పక్కగా పెట్టండి. అప్పుడు అది మీ మీద సాక్ష్యంగా అక్కడ ఉంటుంది. [27]మీరు చాలా మొండి వాళ్లని నాకు తెలుసు. మీ ఇష్టం వచ్చిన మార్గంలో వెళ్లాలని మీకు ఉంటుందని నాకు తెలుసు. చూడండి, నేను యింకా మీతో ఉన్న ఈనాడే మీరు యెహోవాకు విధేయులయ్యేందుకు నిరాకరించారు. నేను చనిపోయిన తర్వాత మీరు యెహోవాకు విధేయులయ్యేందుకు ఇంకా ఎక్కువ నిరాకరిస్తారు. [28]మీ వంశాల నాయకుల్ని, మీ అధికారుల్ని అందరిని సమావేశపర్చండి. వారికి నేను ఈ విషయాలు చెబుతాను. భూమిని, ఆకాశాన్ని నేను వారికి విరుద్ధంగా సాక్ష్యం పలికేందుకు పిలుస్తాను. [29]నా మరణం తర్వాత మీరు చెడ్డ వాళ్లవుతారని నాకు తెలుసు, మీరు వెంబడించాలని నేను మీకు ఆదేశించిన మార్గంనుండి మీరు తిరిగి పోతారు. అప్పుడు భవిష్యత్తులో చెడ్డ సంగతులు మీకు జరుగుతాయి. ఎందుకంటే, ఏవి చెడ్డవని యెహోవా చెబుతాడో అవే మీరు చేయాలను కుంటారు గనుక. మీరు చేసే పనుల మూలంగా మీరు ఆయనకు కోపం పుట్టిస్తారు."

### మోషే కీర్తన

[30]అప్పుడు మోషే ఇశ్రాయేలు ప్రజలందరికీ ఈ పాట చెప్పాడు. మొత్తం పాట అంతా ముగించేంత వరకు అతడు ఆపుజేయలేదు.

32 "ఆకాశములారా ఆలకించండి, నేను మాట్లాడుతాను. భూమి నానోటి మాటలు వినునుగాక!
2 నా ప్రబోధం వర్షంలా పడుతుంది, నా ఉపన్యాసం మంచులా ప్రవహిస్తుంది, మెత్తటి గడ్డిమీద పడే జల్లులా ఉంటుంది. కూరమొక్కల మీద వర్షంలా ఉంటుంది.
3 యెహోవా నామాన్ని నేను ప్రకటిస్తా! దేవుణ్ణి స్తుతించండి!
4 "ఆయన ఆశ్రయ దుర్గంలో ఉన్నాడు ఆయన పని పరిపూర్ణం! ఎందుకంటే ఆయన మార్గాలన్నీ సరైనవిగనుక. ఆయన సత్యవంతుడు నమ్మకోదగ్గ దేవుడు.
5 ఆయన చేసేది మంచిది, సరియైనది కూడా. మీరు నిజంగా ఆయన పిల్లలు కారు. మీతప్పుల మూలంగా మీరు ఆయనను సమీపించలేని అపవిత్రులయ్యారు. మీరు వంకర మనుష్యులు, అబద్ధీకులు.
6 యెహోవాకు మీరు చెల్లించవలసిన కృతజ్ఞత ఇదేనా? మీరు బుద్ధిహీనులు, అజ్ఞానులు, యెహోవా మీ తండ్రి, ఆయన మిమ్మల్ని చేసాడు. ఆయనే మీ సృష్టికర్త. ఆయన మిమ్మల్ని బల పరచేవాడు.
7 "పాత రోజులు జ్ఞాపకం చేసుకోండి, అనేక తరాల సంవత్సరాలను గూర్చి ఆలోచించండి. మీ తండ్రిని అడగండి, అతడు చెబుతాడు; మీ నాయకుల్ని అడగండి, వాళ్లు మీకు చెబుతారు.
8 రాజ్యాలకు వారి దేశాల్ని సర్వోన్నతుడైన దేవుడు యిచ్చాడు. ప్రజలు ఎక్కడ నివసించాల్సిందీ ఆయనే నిర్ణయించాడు. తర్వాత ఆయన ఇతరుల దేశాన్ని ఇశ్రాయేలు ప్రజలకు యిచ్చాడు.
9 ఆయన ప్రజలే యెహోవా వంతు; యాకోబు (ఇశ్రాయేలు) యెహోవాకు స్వంతం.
10 అరణ్య భూమిలో యాకోబును (ఇశ్రాయేలు) యెహోవా కనుగొన్నాడు, వేడి గాడ్పుల్లో కేకలు పెట్టే పనికిమాలిన అరణ్యంలో యెహోవా యాకోబు దగ్గరకు వచ్చి, అతణ్ణి గూర్చి జాగ్రత్త తీసుకున్నాడు. యెహోవా తన కంటి పాపలా అతడ్ని కాపాడాడు.
11 యెహోవా ఇశ్రాయేలీయులకు పక్షి రాజులా ఉన్నాడు. పక్షిరాజు తన పిల్లలకు ఎగరటం నేర్పించేందుకోసం అది వాటిని బయటకు తోస్తుంది. అది తన పిల్లలను కాపాడేందుకు వాటితో కలిసి ఎగురుతుంది. అవి పడిపోతున్నప్పుడు వాటిని పట్టుకొనేందుకు తన రెక్కలు చాపుతుంది. మరియు అది తన రెక్కల మీద వాటిని క్షేమ స్థలానికి మోసుకొని వెళ్తుంది. యెహోవా అలాగే ఉన్నాడు.
12 "యెహోవా మాత్రమే (ఇశ్రాయేలు) యాకోబును నడిపించాడు. యాకోబు దగ్గర ఇతర దేవతలు లేవు.
13 భూమియొక్క ఉన్నత స్థలాల్లో యాకోబును యెహోవా నడిపించాడు, పొలంలోని పంటను యాకోబు భుజించాడు యాకోబు బండలో నుండి తేనెను చెకుముకి రాతినుండి నూనెను తాగేటట్టు యెహోవా చేసాడు.

14 మందలోనుండి వెన్న, గొర్రెలనుండి పాలు
గొర్రెపిల్లలు, పొట్టేళ్లు, బాషాను జాతి మగ
మేకలు, అతి శ్రేష్ఠమైన గోధుమలు ఆయన
నీకు యిచ్చాడు. ద్రాక్షల ఎర్రటిరసం నుండి
ద్రాక్షారసం నీవు త్రాగావు.
15 "కానీ యెష్రూను కొవ్వు పట్టి బలిసిన ఎద్దులా
తన్నుతన్నాడు. వాడు బాగా తిని బలిసాడు.
వానికి మంచి పోషణ దొరికింది. వాడు తనను
చేసిన దేవుణ్ణి విడిచిపెట్టేసాడు. వాడు ఆ బండను
(యెహోవాను) తన రక్షకునిగా అంగీకరించ
లేదు.
16 యెహోవా ప్రజలు యితర దేవుళ్లను పూజించి
ఆయనకు రోషం పుట్టించారు. యెహోవాకు
అసహ్యమైన వారి విగ్రహాల మీద ఆయనకు
కోపం వచ్చేటట్లు వారు చేసారు.
17 నిజానికి దేవుళ్లు కాని దయ్యాలకు వారు బలులు
అర్పించారు. వాళ్లకు తెలియని దేవుళ్లకు వారు
బలులు అర్పించారు. ఈ దేవుళ్లు మీ పూర్వీ
కులు ఎన్నడూ పూజించని కొత్త దేవుళ్లు.
18 "మిమ్మల్ని సృష్టించిన ఆశ్రయ దుర్గమును
(దేవుణ్ణి) మీరు విడిచిపెట్టేసారు. మీకు జీవం
ప్రసాదించిన దేవుణ్ణి మీరు మరచిపోయారు.
19 యెహోవా కుమారులు, కుమార్తెలు ఆయ
నకు కోపం పుట్టించినందువల్ల ఆయన అది
చూచి తన ప్రజలను నిరా కరించాడు.
20 అప్పుడు యెహోవా ఇలా చెప్పాడు, 'వారినుండి
నేను నా ముఖం దాచుకొంటాను. వాళ్ల అంతం
ఏమిటో నేను చూడగలను. ఎందుకంటే వారు
చాలా చెడ్డ తరంవారు వారు అపనమ్మకమైన
పిల్లలు.
21 దేవుళ్లు కాని వాటితో వారు నాకు రోషం
కలిగించారు. పనికిమాలిన ఈ విగ్రహాలతో వారు
నాకు కోపం పుట్టించారు. నిజానికి రాజ్యం కాని
ఒక రాజ్యంతో నేను వారికి రోషం పుట్టిస్తాను.
ఒక బుద్ధిహీనమైన రాజ్యంతో నేను వారికి కోపం
పుట్టిస్తాను. నా కోపం అగ్నిని రాజబెట్టింది; నా
కోపం పాతాళ అగాధంవరకు మండుతుంది.
భూమిని, దాని పంటను నా కోపం నాశనం
చేస్తుంది. నా కోపం పర్వతాల పునాదులకు
నిప్పు అంటిస్తుంది.
23 "'ఇశ్రాయేలీయుల మీద నేను కష్టాలు ఉంచు
తాను. నేను వాళ్లమీద నా బాణాలు విసురుతాను.
24 ఆకలిచేత వాళ్లు బలహీనమై సన్నబడిపోతారు.
మండే వేడిచేత, భయంకర నాశనం చేతవారు
నాశనమైపోతారు. బురదలో పాకే పాముల విషం,
మృగాల కోరలు నేను వారిమీదికి పంపిస్తాను.
25 బయట ఖడ్గం దుఃఖాన్ని కలిగిస్తుంది. లోపల
ఖడ్గం భయాన్ని పుట్టిస్తుంది. యువకుడ్ని, కన్య
నుకూడ అది నాశనం చేస్తుంది. పసివారిని, తల
నెరిసిన వృద్ధులను కూడ అది నాశనం చేస్తుంది.
26 నేనంటాను: ఇశ్రాయేలు వాళ్లను నేను దూరంగా
ఊదేస్తాను. ప్రజలు ఇశ్రాయేలు వాళ్లను మరచి
పోయేటట్టు నేను చేస్తాను.
27 అయితే వారి శత్రువు చెప్పేది నాకు తెలుసు
అది నాకు చికాకు కలిగిస్తుంది. ఇశ్రాయేలీయుల
శత్రువు అపార్థం చేసు కొని "మా స్వంత శక్తితో
మేము గెలి చాము ఇది యెహోవా చేయలేదు"'
అనవచ్చును.
28 "వారు తెలివిలేని రాజ్యం, వారికి అవగాహన లేదు.
29 వారు తెలివిగల వాళ్లయితే వారు దీనిని గ్రహి
స్తారు. భవిష్యత్తులో వారి అంతం గూర్చి ఆలో
చిస్తారు.
30 ఒకడు 1000 మందిని తరిమితే ఇద్దరు 10000
మంది పారిపోయేటట్లు ఎలా చేయగలరు?
యెహోవా వారిని వారి శత్రువుకు అప్పగిస్తేనే
అలా జరుగుతుంది. ఆ ఆశ్రయ దుర్గం
(యెహోవా) ఈ శత్రువులను అమ్మివేస్తే,
యెహోవా ఈ శత్రువులను వారికి అప్పగిస్తే
మాత్రమే యిలా జరుగుతుంది.
31 ఈ శత్రువుల ఆశ్రయ దుర్గం మన బండ*
(యెహోవా) వంటి శక్తిమంతుడు కాడు. ఇది
సత్యమని మన శత్రువులుకూడ చూడగలరు.
32 ఈ శత్రువుల ద్రాక్ష సొదొమ ద్రాక్ష వంటిది.
గొమొర్రా* పొలాలలోని దాని వంటిది. వారి
ద్రాక్షా పండ్లు విషపు ద్రాక్షలు వారి ద్రాక్షా పండ్ల
గుత్తులు చేదు.
33 వారి ద్రాక్షారసం క్రూర సర్పాల విషం నాగు
పాముల కఠిన విషం.
34 "ఆ శిక్షను నేను భద్రం చేస్తున్నాను నా గిడ్డంగిలో
తాళం వేసి దీనిని నేను భద్రపరుస్తున్నాను. అని
యెహోవా చెబుతున్నాడు.
35 ప్రజల పాదం తప్పుడు పనుల్లోకి జారినప్పుడు
శిక్షించే వాణ్ణి వారి తప్పులకు ప్రజలకు ప్రతిఫలం
యిచ్చేవాడ్ని నేనే. ఎందుకంటె వారి కష్టకాలం
సమీపంగా ఉంది వారి శిక్ష త్వరగా వస్తుంది
గనుక.'
36 "యెహోవా తన ప్రజలకు శిక్ష విధిస్తాడు. వారు
ఆయన సేవకులు, ఆయన వారికి దయ చూపి

---

**బండ** దేవునియొక్క పేరు 'ఇది ఆయన ఒక బలమైన కోట లేక ఆశ్రయ దుర్గము' అనే అర్థాన్నిస్తుంది.

**సొదొమ ... గొమొర్రా** వారి పాపముద్వారా దేవునిచే నశింప బడిన రెండు పట్టణాలు. ఆదికాండము 19వ అధ్యాయం చూడండి.

స్తాడు. వారి శక్తి పోయే టట్టు ఆయన చేస్తాడు.
బానిసగాని స్వతంత్రుడు గాని వారంతా నిస్స
హాయు లయ్యేటట్టు ఆయన చేస్తాడు.
37 అప్పుడు ఆయన ఇలా అంటాడు, ‘అబద్ధపు
దేవుళ్లు ఎక్కడ? భద్రత కోసం వారు ఆశ్రయిం
చిన బండ ఎక్కడ? 38ఈ ప్రజల దేవుళ్లు ప్రజల
బలి అర్పణల కొవ్వు తిన్నారు. వారి పానార్ప
ణపు ద్రాక్షారసం వారు తాగారు. కనుక ఈ
దేవుళ్లనే లేచి మీకు సహాయం చేయ నివ్వండి.
వారినే మిమ్మల్ని కాపాడ నివ్వండి!
39 “‘ఇప్పుడు చూడండి, నేనే, నేను మాత్రమే దేవుణ్ణి
ఇంకే దేవుడూ లేడు. ప్రజలను బ్రతకనిచ్చేదీ,
చంపేదీ నిర్ణ యించే వాడ్ని నేనే . నేను ప్రజల్ని
బాధించగలను, బాగు చేయగలను. నా శక్తినుండి
ఒక మనిషిని ఏ మనిషి రక్షించ లేడు.
40 ఆకాశం వైపు నేను నాచేయి పైకెత్తి ఈ వాగ్దానం
చేస్తున్నాను. నేను శాశ్వతంగా జీవించటం సత్య
మయితే, ఈ సంగతులన్నీ జరుగుతాయి అనేది
కూడ సత్యమే.
41 నేను ప్రమాణం చేస్తున్నాను, తళతళలాడే నా
ఖడ్గానికి నేను పదునుపెడ్తాను. నా శత్రువుల్ని
శిక్షించటానికి దానిని నేను ఉపయోగిస్తాను. నేను
వారికి తగిన శిక్ష యిస్తాను.
42 నా శత్రువులు చంపబడతారు, ఖైదీలుగా తీసు
కొనిపోబడతారు. నా బాణాలు వారి రక్తంతో
కప్పబడి ఉంటాయి. నాఖడ్గం వారి సైనికుల
శిరస్సులను ఛేదిస్తుంది.’
43 “దేవుని ప్రజలకోసం సర్వప్రపంచం సంతోషిం
చాలి. ఎందుకంటే వారికి ఆయన సహాయం
చేస్తాడు గనుక. తన సేవకులను చంపే వాళ్లను
ఆయన శిక్షి స్తాడు గనుక. ఆయన తన శత్రువు
లకు తగిన శిక్షయిస్తాడు. ఆయన తన ప్రజల్ని,
తన దేశాన్ని పవిత్రం చేస్తాడు.”

### మోషే తన కీర్తనను ప్రజలకు నేర్పుట

44మోషే వచ్చి ఇశ్రాయేలు ప్రజలు వినగలిగేటట్లు
ఈ పాటలోని మాటలన్నీ చెప్పాడు. నూను కుమారు
డైన యెహోషువ మోషేతో ఉన్నాడు. 45మోషే
ప్రజలకు ఈ ప్రబోధాలు చేయటం ముగించినప్పుడు
46వాళ్లతో అతడు ఇలా చెప్పాడు,“ఈ వేళ నేను
మీకు ఇస్తున్న ఆదేశాలన్నింటిని మీరు గమనించి తీరాలి.
మరియు ఈ ధర్మశాస్త్రంలో ఉన్న ఆజ్ఞలన్నింటికీ మీ
పిల్లలు విధేయులు కావాలని మీరు వారికి చెప్పాలి.
47ఈ ప్రబోధాలు ముఖ్యమైనవి కావు అనుకోవద్దు.
అవి మీకు జీవం. యొర్దాను నదికి అవతల మీరు
స్వాధీనం చేసుకొనేందుకు సిద్ధంగా ఉన్న దేశంలో
ఈ ప్రబోధాల ద్వారా మీరు చాలా కాలం జీవిస్తారు.”

### నెబో కొండ మీద మోషే

48ఆ రోజే మోషేతో యెహోవా మాట్లాడాడు.
యెహోవా ఇలా చెప్పాడు,
49“అబారీము పర్వతాలకు వెళ్లుము. ఎరికో పట్టణం
అవతల మోయాబు దేశంలో నెబో కొండమీదికి
ఎక్కివెళ్లు. అప్పుడు నీవు ఇశ్రాయేలు ప్రజలు
నివసించటానికి నేను వారికి ఇస్తున్న కనాను దేశాన్ని
చూడవచ్చు.
50నీవు ఆ కొండమీద చనిపోతావు. హూరు
కొండమీద నీ సోదరుడు అహరోను చనిపోయి, తన
ప్రజలను చేరుకున్నట్టు నీవు కూడ చనిపోయిన నీ
ప్రజలను చేరుకుంటావు. 51ఎందుకంటె నీను
అరణ్యంలో కాదేషు సమీపంలో మెరీబా నీళ్ల దగ్గర
నీవు నాకు వ్యతిరేకంగా పాపం చేసావు. అది చూసేం
దుకు ఇశ్రాయేలు ప్రజలు అక్కడే ఉన్నారు. నీవు
నన్ను గౌరవించలేదు. ఆ సంగతి నీవు ప్రజలకు
చూపెట్టావు.
52కనుక ఇశ్రాయేలు ప్రజలకు నేను ఇస్తున్న దేశాన్ని
నీవు ఇప్పుడు నీముందర చూడ వచ్చు గాని నీవు
దానిలో ప్రవేశించలేవు.”

### మోషే ప్రజలను ఆశీర్వదించటం

33 దైవజనుడైన మోషే తాను చనిపోకముందు
ఇశ్రాయేలు ప్రజలకు యిచ్చిన ఆశీర్వాదం
ఇది. 2మోషే చెప్పినది;

“యెహోవా సీనాయినుండి వచ్చెను. యెహోవా
శేయీరులో ప్రభాత వెలుగులా ఉన్నాడు. ఆయన
పారాను కొండ నుండి ప్రకాశించే వెలుగులా
ఉన్నాడు. యెహోవా 10,000 మంది పరిశుద్ధు
లతో వచ్చాడు. ఆయన కుడిచేతి వైపున దేవుని
గొప్ప గొప్ప మహా సైనికులు ఉన్నారు.
3 అవును, యెహోవా తన ప్రజలను ప్రేమిస్తాడు.
ఆయన పరిశుద్ధ ప్రజలంతా ఆయన చేతిలో
ఉన్నారు. వారు ఆయన అడుగుజాడల్లో నడు
స్తారు. ప్రతి ఒక్కరూ ఆయన ప్రబోధాలు అంగీక
రిస్తారు.
4 మోషే మనకు ధర్మశాస్త్రం యిచ్చాడు. అది
యాకోబు ప్రజలందరికీ చెందుతుంది.
5 పజలు, వారి నాయకులు సమావేశమైనప్పుడు
యెషూరూనుకు* రాజు ఉన్నాడు. యెహో
వాయే వారి రాజు.

### రూబేనుకు ఆశీర్వాదాలు

6 “రూబేను మరణించక, జీవించునుగాక! అతని
వంశంలో అనేకమంది ప్రజలు ఉందురు గాక!”

---

**యెషూరూను** ఇది ఇశ్రాయేలుకు మరో పేరు మంచివాడు
లేక సత్యవంతుడు అని దీని అర్థం.

### యూదాకు ఆశీర్వాదాలు

7 యూదా వంశం గూర్చి మోషే ఈ విషయాలు
చెప్పాడు; "యెహోవా, యూదా నాయకుడు
సహాయం కోసం మొరపెట్టినప్పుడు ఆలకించు.
అతణ్ణి తన ప్రజల దగ్గరకు చేర్చు. అతణ్ణి బలం
వతుణ్ణి చేయి. అతడు తన శత్రువులను ఓడించ
టానికి సహాయం చేయి!"

### లేవీయులకు ఆశీర్వాదాలు

8 లేవీని గూర్చి మోషే ఇలా చెప్పాడు. "నీ నిజమైన
అనుచరుడు లేవీ ఊరీము తుమ్మీమునకు*
కాపలా ఉండేవాడు. నీ పత్యేక మనిషి వాటిని
కాపాడుతాడు. మస్సా దగ్గర నీవు లేవీ ప్రజలను
పరీక్షిం చావు వాళ్లు నీ వాళ్లని (నిన్ను ప్రేమించు
టకు) మెరీబా* నీళ్ల దగ్గర నీవు రుజువు చేసావు.
9 లేవీ తన తండ్రి, తల్లిని గూర్చి చెప్పాడు. 'వారి
విషయం నేను లెక్క చేయను' అతడు తన
సొంత సోదరులను స్వీకరించ లేదు. తన సొంత
పిల్లల్ని తెలుసుకో లేదు. లేవీయులు నీ మాటకు
విధేయులయ్యారు నీ ఒడంబడికను నిలబెట్టారు.
10 యాకోబుకు* నీ నియమాలను ఇశ్రా యేలుకు
నీ ధర్మశాస్త్రాన్ని వారు బోధిస్తారు. వాళ్లు నీ
యెదుట ధూపం వేస్తారు. నీ బలిపీఠం మీద
పరిపూర్ణ దహన బలులు అర్పిస్తారు.
11 యెహోవా లేవీకి చెందిన వాటిని ఆశీర్వదించు
అతడు జరిగించే వాటిని స్వీకరించు. అతని మీద
దాడి చేసే వాళ్లను నాశనం చేయి."

### బెన్యామీనుకు ఆశీర్వాదాలు

12 బెన్యామీను గూర్చి మోషే ఇలా చెప్పాడు.
"యెహోవా బెన్యామీనును ప్రేమిస్తున్నాడు.
బెన్యామీను ఆయన చెంత క్షేమంగా జీవిస్తాడు.
అతనిని యెహోవా ఎల్లప్పుడూ కాపాడతాడు.
మరియు యెహోవా అతని దేశంలో
నివసిస్తాడు."*

### యోసేపుకు ఆశీర్వాదాలు

13 యోసేపును గూర్చి మోషే ఇలా చెప్పాడు.
"యెహోవా అతని దేశాన్ని ఆశీర్వదించును
గాక. ఆకాశం నుండి శ్రేష్ఠమైన వాటితో భూమి
కింద దాగి ఉన్న లోతైన ధన సంపదతో
14 సూర్యుని శ్రేష్ఠఫలాలతో మాసాల శ్రేష్ఠపంటలతో
15 ప్రాచీన పర్వతాల నుండి శ్రేష్ఠఫలాలతో
కొండల్లో శాశ్వతంగా ఉంచబడే శ్రేష్ఠ పదార్థాలతో
16 భూమి నుండి శ్రేష్ఠమైన బహుమానాలు, దాని
పూర్ణ ఆశీర్వాదాలతో, మండుతూ ఉండే
పొదలో నివాసం చేసే యెహోవా కటాక్షంతో,
తన సోదరులనుంచి వేరుగా వించబడ్డ యోసేపు
తలమీద యోసేపు నడి నెత్తి మీద ఆశీర్వాదం
వచ్చునుగాక.
17 యోసేపు దొడ్డిలో మొట్టమొదట పుట్టిన
ఎద్దుకు ఎంతో శోభ, ఈ ఎద్దు కొమ్ములు
అడవి దున్నపోతు కొమ్ములంత పెద్దవిగా
ఉంటాయి. యోసేపు మందలు మనుష్యుల్ని
తోసివేస్తాయి, అందర్నీ, భూదిగాంతాల వరకు
తోసివేస్తాయి. అవును, మనష్షేకు వేలాది మంది
ప్రజలు ఉన్నారు, అవును, ఎఫ్రాయిముకు పది
వేలమంది ప్రజలు ఉన్నారు."

### జెబూలూనుకు ఆశీర్వాదాలు

18 జెబూలూను గూర్చి మోషే చెప్పినది;
"జెబూలూనూ, నీవు బయటకు వెళ్లినప్పుడు,
ఇశ్శాఖారూ, నీ యింటివద్ద నీ గుడారాలలో
సంతోషంగా ఉండు.
19 వారు తమ ప్రజలను కొండకు (కర్మెలు) పిలు
స్తారు. అక్కడ వారు సరైన బలులు అర్పిస్తారు.
ఎందుకంటే, సముద్రాల్లోని సమృద్ధిని వారు తీసు
కొంటారు. ఇసుకలో దాగి ఉన్న ఐశ్వర్యాలను
మీరు తీసుకుంటారు గనుక."

### గాదుకు ఆశీర్వాదాలు

20 గాదును గూర్చి మోషే ఇలా చెప్పాడు; "గాదును
విశాలపర్చే దేవునికి స్తోత్రాలు! గాదు సింహంలా
పడుకుంటాడు, చేతిని, నడినెత్తిని చీల్చేస్తాడు.
21 శ్రేష్ఠభాగం అతడు తనకోసం ఎంచుకుంటాడు
అక్కడ రాజభాగం అతనికి ఉంచబడుతుంది.
ప్రజానాయకులు అతని దగ్గరకు వస్తారు ఇశ్రాయే
లీయుల యెడల అతడు దయ చూపుతాడు.
యెహోవా దృష్టికి మంచివాటిని అతడు
చేస్తాడు. యెహోవా అతని పక్షంగా తీర్పు
తీరుస్తాడు."

### దానుకు ఆశీర్వాదాలు

22 దాను గూర్చి మోషే ఇలా చెప్పాడు; "దాను
బాషాను నుండి దూకే సింహపు పిల్ల."

---

**ఊరీము, తుమ్మీము** దేవుని నుండి తమ ప్రశ్నలకు జవాబులు పొందేందుకు యాజకులు వీటిని ఉపయోగించేవారు.

**మస్సా ... మెరీబా** సంఖ్యాకాండము 20:1-13 చూడండి.

**యాకోబు** ఇశ్రాయేలు యొక్క మరో పేరు.

**మరియు ... నివసిస్తాడు** అక్షరాల అతడు ఆయన భుజాల మధ్య జీవిస్తాడని అర్థం. యెహోవా ఆలయం బెన్యామీను, యూదా వారి సరిహద్దుల మధ్య ఉంటుందని కావచ్చు.

### నఫ్తాలీకి ఆశీర్వాదాలు

23 నఫ్తాలీ గూర్చి మోషే ఇలా చెప్పాడు. "నఫ్తాలీ,
నీవు దయపొంది తృప్తిగా ఉన్నావు, యెహోవా
ఆశీర్వాదాలతో నిండిపోయావు, (గలలీ)
పశ్చిమ, దక్షిణాల భూమిని నీవు తీసుకో."

### ఆషేరుకు ఆశీర్వాదాలు

24 ఆషేరును* గూర్చి మోషే ఇలా చెప్పాడు;
"కుమారులలో ఆషేరు అత్యధికంగా ఆశీర్వ
దించబడినవాడు; అతణ్ణి తన సోదరులకు ప్రియ
మైన వాడ్నిగా ఉండనియ్యండి. అతణ్ణి తన
పాదాలు తైలముతో కడుగ కోనివ్వండి.
25 నీ తాళాలు యినుపవి, యిత్తడివి. నీ బలం
జీవితం అంత ఉంటుంది."

### మోషే దేవుణ్ణి స్తుతించుట

26 "ఓ యెషూరూనూ, దేవునివంటి వాడు ఎవ్వరూ
లేరు. దేవుడు తన మహిమతో నీకు సహాయం
చేసేందుకు. మేఘాల మీద ఆకాశంలో విహ
రిస్తాడు
27 నిత్యుడైన దేవుడు నీకు భద్రతా స్థలం శాశ్వతంగా
ఆదుకునే హస్తాలు నీకింద ఉన్నాయి. దేవుడు
శత్రువును నీదగ్గర నుండి వెళ్లగొట్టేస్తాడు. 'శత్రు
వును నాశనం చేయి' అంటాడు.
28 కనుక ఇశ్రాయేలు క్షేమంగా జీవిస్తాడు, ధాన్యం,
ద్రాక్షారసం ఉండే దేశంలో యాకోబు ఊట
క్షేమంగా ఉంటుంది. అవును, అతని ఆకాశం
మంచును కురిపిస్తుంది.
29 ఇశ్రాయేలూ, నీవు సంతోషంగా ఉన్నావు.
యెహోవా చేత రక్షించబడిన దేశంగా నీవలె ఏ
దేశమూ లేదు. యెహోవాయే నీకు సహాయం
చేసేవాడు. నీ విజయానికి యెహోవాయే
ఖడ్గం. నీ శత్రువులు నీకు విధేయులై వస్తారు.
వారి అబద్ధపు దేవతల పూజా స్థలాల మీద
మీరు నడుస్తారు."

### మోషే మరణించటం

34 మోషే మోయాబు పల్లపు ప్రాంతాల నుండి
యెరికో దాటి నెబో కొండ మీద పిస్గా
శిఖరం మీదికి వెళ్లాడు. గిలాదునుండి దానువరకు దేశం
మొత్తం యెహోవా మోషేకు చూపించాడు. 2 ఎఫ్రా
యిము, మనష్షేల దేశం అంతా, నఫ్తాలీ అంతా
యెహోవా అతనికి చూపించాడు. యూదా దేశం
మధ్యదరా సముద్రం వరకు ఆయన అతనికి
చూపించాడు. 3 నెగెవు ప్రాంతాన్ని, సోయెరు నుండి
ఈతచెట్ల పట్టణం యెరికోకు పోయే లోయ అంతా
మోషేకు యెహోవా చూపించాడు. 4 "అబ్రహాము,
ఇస్సాకు, యాకోబులకు నేను వాగ్దానంచేసిన దేశం
యిదే. 'మీ సంతతివారికి ఈ దేశం నేను యిస్తాను'
అని వారితో నేను చెప్పాను. నిన్ను ఆ దేశం చూడ
నిచ్చాను, నీవు అక్కడికి వెళ్లలేవు" అని మోషేతో
యెహోవా చెప్పాడు. 5 అప్పుడు యెహోవా
సేవకుడు మోషే అక్కడ మోయాబు దేశములో చని
పోయాడు. ఇలా జరుగుతుందని యెహోవా మోషేతో
ముందే చెప్పాడు. 6 బెత్పెయోరు అవతల మోయాబు
దేశంలోని లోయలో యెహోవా మోషేను పాతి
పెట్టాడు. అయితే మోషే సమాధి ఎక్కడ ఉందో ఈ
రోజువరకు ఎవరికీ తెలియదు. 7 మోషే చనిపోయి
నప్పుడు అతని వయస్సు 120 సంవత్సరాలు. అతని
కళ్లు మసక కాలేదు. అతడు ఇంకా బలంగానే ఉన్నాడు.
8 ఇశ్రాయేలు ప్రజలు మోయాబు పల్లపు ప్రాంతాల్లో
30 రోజుల పాటు మోషే కోసం ఏడ్చారు. ఇది
పూర్తి సంతాప దినాల సమయము.

### యెహోషువ కొత్త నాయకుడవటం

9 అప్పుడు నూను కుమారుడైన యెహోషువ మీద
మోషే చేతులు పెట్టిన కారణంగా యెహోషువ జ్ఞానా
త్మతో పూర్తిగా నిండిపోయాడు. ఇశ్రాయేలు ప్రజలు
యెహోషువ మాట విన్నారు. మోషేకు యెహోవా
ఆజ్ఞాపించినట్టు వారు చేసారు. 10 కాని ఆ సమ యము
నుండి మళ్లీ మోషేవంటి ప్రవక్త జన్మించలేదు.
యెహోవా దేవునికి మోషే ముఖాముఖిగా తెలుసు.
11 ఈజిప్టు దేశంలో యెహోవా చేత పంపబడి
మోషే చేసిన అద్భుతాలు, మహాత్కార్యాలు ఏ ప్రవక్తా
ఎన్నడూ చేయలేదు. ఆ అద్భుతాలు, మహాత్కార్యాలు
ఈజిప్టులో ఫరోకు, అతని సేవకులందరికీ, ప్రజలంద
రికి చూపించబడ్డాయి.
12 మోషే చేయగా ఇశ్రాయేలు ప్రజలంతా చూసిన
ఆ శక్తివంతమైన ఆశ్చర్యకార్యాలు ఏ ప్రవక్తా ఎన్నడూ
చేయలేదు.

---

**ఆషేరు** దీని అర్థం ధన్యుడు లేక సంతోషం.

# యెహోషువ

### దేవుడు ఇశ్రాయేలీయులను నడిపించేందుకు యెహోషువను ఎన్నుకొనటం

1 యెహోవా సేవకుడు మోషే. నూను కుమారు
డైన యెహోషువ, మోషేకు సహాయకుడు.
మోషే చనిపోయాక యెహోషువతో యెహోవా
మాట్లాడాడు. యెహోషువతో యెహోవా అన్నాడు:
2“నా సేవకుడు మోషే మరణించాడు. ఇప్పుడు నీవు,
ఈ ప్రజలు వెళ్లి యోర్దాను నది దాటండి. ఇశ్రాయేలు
ప్రజలైన మీకు నేను ఇస్తున్న దేశంలోకి మీరు వెళ్లాలి.
3ఈ దేశాన్ని నేను మీకు ఇస్తానని మోషేకు వాగ్దానం
చేసాను. కనుక మీరు వెళ్లే ప్రతి చోటునూ నేను
మీకు ఇస్తాను. 4హిత్తీ ప్రజల దేశం అంతా, అంటే
ఎడారి, లెబానోను మొదలుకొని మహానది వరకునున్న
(యూఫ్రటీసు) దేశమంతా మీదే. మరియు ఇక్కడ
నుండి పశ్చిమాన మధ్యధరా సముద్రం వరకు (అది
సూర్యాస్తమయ దిశ) మీ సరిహద్దు.
5నేను మోషేకు తోడుగా ఉన్నట్టు నీకు తోడుగా
వుంటాను. నీ జీవితాంతం నిన్నెవ్వరూ అడ్డగించలేరు.
నేను నిన్ను విడిచి పెట్టను. ఎన్నటికీ నిన్ను నేను
ఎడబాయను.
6“యెహోషువా, నీవు బలంగా, ధైర్యంగా ఉండాలి!
ఈ ప్రజలు వారి దేశాన్ని స్వాధీనం చేసుకోగలిగేటట్టు
నీవు ఈ ప్రజలను నడిపించాల్సి ఉంటుంది. వారి పిత
రులకు ఇస్తానని నేను వాగ్దానం చేసిన దేశం ఇది.
7అయితే నీవు మరో విషయంలో కూడ బలంగా,
ధైర్యంగా ఉండాలి. నా సేవకుడు మోషే నీకు ఇచ్చిన
ఆజ్ఞలను పాటించే విషయంలో నీవు జాగ్రత్తగా
ఉండాలి. అతని ప్రబోధాలను నీవు సరిగ్గా పాటిస్తే,
నీవు చేసే ప్రతి పనిలోనూ నీకు విజయం కలుగుతుంది.
8ధర్మశాస్త్రంలో రాయబడిన విషయాలను ఎల్లప్పుడూ
జ్ఞాపకం ఉంచుకో. ఆ గ్రంథాన్ని రాత్రి, పగలు
ధ్యానించు. అప్పుడు అందులో వ్రాయబడిన విషయా
లను పాటించగలుగుతావు. నీవు ఇలా చేస్తే, నీవు
చేసే ప్రతీదీ తెలివిగా, విజయవంతంగా చేయగలుగు
తావు. 9నీవు బలంగా ధైర్యంగా ఉండాలని నేను ఆజ్ఞాపిం
చినట్టు జ్ఞాపకం ఉంచుకో. అందుచేత భయపడవద్దు.
ఎందుచేతనంటే? నీవు వెళ్లే ప్రతిచోటా నీ యెహోవా
దేవుడు నీకు తోడుగా ఉంటాడు గనుక.”

### యెహోషువ తన కార్యాన్ని నిర్వహించటం

10కనుక యెహోషువ ప్రజానాయకులకు ఆదే
శాలు ఇచ్చాడు. అతడు చెప్పాడు: 11“గుడారాల్లోనికి
వెళ్లి ప్రజలను సిద్ధంగా ఉండమని చెప్పండి. ప్రజలతో
ఇలా చెప్పండి, ‘భోజనం తయారు చేసుకోండి.
మూడు రోజుల్లో మనం యోర్దాను నది దాటాలి. మీ
దేవుడైన యెహోవా మీకు ఇస్తున్న దేశాన్ని మనం
వెళ్లి తీసుకొందాము.’”
12తర్వాత రూబేను, గాదు, మనష్షే వంశంలో సగ
భాగం వారితో యెహోషువ మాట్లాడాడు. యెహో
షువ చెప్పాడు: 13“యెహోవా సేవకుడు మోషే మీతో
ఏమి చెప్పాడో జ్ఞాపకం చేసుకోండి. మీకు విశ్రాం
తికోసం మీ దేవుడైన యెహోవా మీకు ఒక స్థలం
ఇస్తాడు అని అతడు చెప్పాడు. ఆ దేశాన్ని యెహోవా
మీకు యిస్తాడు. 14ఇప్పుడు యోర్దాను నదికి తూర్పున
ఉన్న ఈ దేశాన్ని యెహోవా మీకు ఇచ్చాడు. మీ
భార్యలు, మీ పిల్లలు, మీ పశువులు ఈ దేశంలో నివ
సించవచ్చు. అయితే యుద్ధం చేసే మీ పురుషులంతా
మీ సోదరులతో కలిసి యోర్దాను నది దాటాలి. మీరు
యుద్ధానికి సిద్ధపడి మీ సోదరులు వారి దేశాన్ని స్వాధీనం
చేసుకొనేందుకు సహాయపడాలి. 15విశ్రాంతి కోసం
యెహోవా మీకు ఒక స్థలం ఇచ్చాడు. మీ సోదరుల
కోసం కూడా యెహోవా అలాగే చేస్తాడు. అయితే
యెహోవా దేవుడు వారికి ఇస్తున్న దేశాన్ని మీ
సోదరులు స్వాధీనం చేసుకొనేంతవరకు మీ సోదరులకు
మీరు సహాయం చేయాలి. అప్పుడు యోర్దానుకు
తూర్పున ఉన్న మీ దేశానికి మీరు వెళ్లిపోవచ్చు.
యెహోవా సేవకుడు మోషే మీకు ఇచ్చిన దేశం
అది.”

16అప్పుడు ప్రజలు యెహోషువాకు బదులు
చెప్పారు: “మమ్మల్ని ఏమి చేయమని నీవు ఆజ్ఞాపిస్తే,
మేము అలా చేస్తాము. నీవు మమ్మల్ని ఎక్కడికి పంపిస్తే
మేము అక్కడికి వెళ్తాము. 17మేము మోషేకు పూర్తిగా
విధేయులం అయ్యాము. అలాగే, నీవు చెప్పే ప్రతిదానికీ
మేము విధేయులవుతాము. ఒక్క విషయం మాత్రమే
మేము యెహోవాను అడుగుతాము. నీ దేవుడైన
యెహోవా మోషేకు తోడుగా ఉన్నట్టే నీకునూ
తోడుగా ఉండాలని అడుగుతాము. 18తర్వాత, ఎవరై

నా నీ ఆజ్ఞలను తిరస్కరించినా, లేక ఎవరైనా నీమీద
తిరుగుబాటు చేసినా అలాంటివాడు చావాల్సిందే.
బలంగా, ధైర్యంగా ఉండు!"

### యెరికో పట్టణంలో గూఢచారులు

2 నూను కుమారుడైన యెహోషువ, ప్రజలు
అంతా ఆకాషియా* దగ్గర గుడారాలు వేసుకొనిరి.
యెహోషువ ఇద్దరు గూఢచారుల్ని పంపించాడు.
వీళ్లను యెహోషువ పంపినట్టు మరెవ్వరికీ తెలియదు.
"మీరు వెళ్లి ఆ దేశాన్ని చూడండి. ముఖ్యంగా యెరికో
పట్టణాన్ని దగ్గరగా చూడండి" అని యెహోషువ ఆ
మనుష్యులతో చెప్పాడు.
కనుక ఆ మనుష్యులు యెరికో పట్టణం వెళ్లారు.
వాళ్లు ఒక వేశ్య ఇంటికి వెళ్లి, అక్కడ వుండిరి. ఆ స్త్రీ
పేరు రాహాబు.
2"మన ప్రజల బలహీనత తెలుసుకొనేందుకు
కొందరు ఇశ్రాయేలు మనుష్యులు వచ్చారు" అని
యెరికో రాజుతో ఎవరో చెప్పారు. 3కనుక యెరికో
రాజు రాహాబుకు ఇలా కబురంపాడు: "నీ ఇంటికి వచ్చి
దాక్కొన్న ఆ మనుష్యుల్ని దాచిపెట్టకు. వాళ్లను
బయటకు తీసుకొనిరా. వాళ్లు మన దేశాన్ని వేగు
చూడటానికి వచ్చారు."
4ఆ స్త్రీ వాళ్లిద్దర్నీ దాచిపెట్టేసింది. అయితే ఆమె
అంది: "ఆ ఇద్దరూ ఇక్కడికి వచ్చిన మాట నిజమే.
అయితే వాళ్లు ఎక్కడ్నుండి వచ్చిందీ నాకు తెలియదు.
5సాయంకాలం, పట్టణ ద్వారాలు మూసివేసే వేళ వాళ్లు
వెళ్లిపోయారు. వాళ్లు ఎక్కడికి వెళ్లిందీ నాకు తెలి
యదు. కానీ ఒకవేళ మీరు త్వరగా వెళ్తే మీరు వాళ్లను
పట్టుకోవచ్చేమో." 6అయితే నిజానికి వాళ్లను అటక*
మీద జనుపకట్టెలో దాచిపెట్టింది.
7కనుక రాజుగారి మనుష్యులు ఇశ్రాయేలు వాళ్లిద్దరి
కోసం వెదక్కుంటూ వెళ్లిపోయారు. యోర్దాను నది
రేవుల దగ్గరకు వారు వెళ్లారు. రాజుగారి మనుష్యులు
పట్టణం నుండి బయటకు వెళ్లిన ఆ సమయంలోనే
పట్టణ ద్వారాలు మూసివేయబడ్డాయి.
8ఆ ఇద్దరు మనుష్యులూ అప్పుడే నిద్రకు ఉప
క్రమించబోతున్నారు. అయితే ఆమె అటక పైకి వెళ్లి
వాళ్లతో మాట్లాడింది. 9రాహాబు అంది, "ఈ దేశాన్ని
యెహోవా మీ ప్రజలకు ఇచ్చాడని నాకు తెలుసు.
మీరంటే మాకు భయం. ఈ దేశంలో ఉన్న ప్రజలంద
రికీ మీరంటే భయమే. 10యెహోవా మీకు సహాయం
చేసిన విధానాల్ని గూర్చి విన్నాము గనుక మాకు
భయం. మీరు ఈజిప్టునుండి వచ్చినప్పుడు ఎర్ర
సముద్రం ఆరిపోయేటట్టు ఆయన చేసాడని మేము
విన్నాము. అమోరీ రాజులైన సీహోను, ఓగులకు
మీరు చేసినదాన్ని గూర్చి కూడ మేము విన్నాము.
యోర్దాను నదికి తూర్పున ఉన్న ఆ రాజులను మీరు
నాశనం చేసిన సంగతి మేము విన్నాము. 11ఆ సంగ
తులు మేము విని చాల భయపడిపోయాము ఇప్పుడు
మా వాళ్లెవరికీ మీతో పోరాడే ధైర్యంలేదు. ఎందు
చేతనంటే పైన ఆకాశాన్ని కింద భూమిని మీ
యెహోవా దేవుడే పాలిస్తున్నాడు గనుక. 12ఇప్పుడు
మీరు నాతో ఒడంబడిక చేస్తామని మాట ఇవ్వండి.
నేను మీకు సహాయం చేసాను, దయ చూపించాను.
కనుక మీరు నా కుటుంబానికి దయ చూపిస్తామని
యెహోవా ఎదుట ప్రమాణం చేయండి. ఇలా మీరు
చేస్తామని దయచేసి నాకు చెప్పండి. 13నా తండ్రి,
తల్లి, సోదరులు, సోదరీలు, వాళ్లందరి కుటుంబాల్ని,
నా కుటుంబాన్ని మీరు బ్రతుకనిస్తామని నాకు మాట
ఇవ్వండి. చావునుండి మీరు మమ్మల్ని రక్షిస్తామని
ప్రమాణం చేయండి."
14ఆ మనుష్యులు ఒప్పుకున్నారు. "మీ ప్రాణాల
కోసం మా ప్రాణాలు ఇస్తాము. మేము చేస్తోన్న పని
గూర్చి ఎవ్వరితో చెప్పకు. తర్వాత మీ దేశాన్ని
యెహోవా మాకు ఇచ్చినప్పుడు మేము నీకు దయ
చూపిస్తాము. నీవు మా మాట నమ్ము" అని వాళ్లు
చెప్పారు.
15ఆ స్త్రీ ఇల్లు పట్టణం ప్రహరీ గోడమీద కట్టబడింది.
అది గోడలో ఒక భాగంగా ఉంది. కనుక ఆమె ఒక
తాడు ప్రయోగించి కిటికీలోనుంచి వాళ్లిద్దర్నీ కిందికి
దించింది. 16అప్పుడు ఆమె వాళ్లతో అంది: "పార
బాటున కూడా మీరు రాజుగారి మనుష్యులకు కనపడ
కుండా పడమటి కొండల్లోకి వెళ్లిపొండి. మూడు
రోజులు అక్కడ దాక్కోండి. రాజుగారి మనుష్యులు
తిరిగి వచ్చాక, మీ దారిన మీరు వెళ్లవచ్చు."
17ఆ మనుష్యులు ఇద్దరూ ఆమెతో అన్నారు:
"మేము నీకు వాగ్దానం చేసాము. అయితే నీవు ఒక
పని చేయాలి. లేకపోతే మా వాగ్దానానికి మేము బాధ్యు
లంకాదు. 18మేము తప్పించుకొనేందుకు నీవు ఈ
ఎర్రటి తాడు ప్రయోగిస్తున్నావు. మేము ఈ దేశానికి
తిరిగి వస్తాము. ఆ సమయంలో ఈ ఎర్రటి తాడును
నీవు నీ కిటికీలో కట్టాలి. నీ తండ్రిని, తల్లిని, నీ
సోదరులను, నీ కుటుంబం అంతటిని నీవు నీ ఇంట్లో
చేర్చాలి. 19ఈ ఇంట్లో ఉండే ప్రతీ ఒక్కరినీ మేము
క్షేమంగా కాపాడుతాము. నీ ఇంట్లో ఉన్న వాళ్లెవరైనా
దెబ్బతింటే దానికి మేము బాధ్యులము. నీ ఇంట్లోనుంచి
ఎవరైనా బయటకు వెళ్లి, చంపబడితే దానికి మేము
బాధ్యులము కాము. అది ఆ వ్యక్తి తప్పు అవుతుంది.

---

**ఆకాషియా** లేక "షిత్తీం." యోర్దాను నదికి తూర్పు దిశగావున్న ఒక ఊరు.

**అటక** లేక మిద్దె. ఇశ్రాయేలులో మిద్దెలు సమానముగా ఉండేవి. ప్రజలు వస్తువులను ఉంచడానికి ఈ అటకలను ఉపయోగించేవారు.

[20]ఈ ఒడంబడిక మేము నీతో చేస్తున్నాము. మేము
చేస్తోన్న పనిగూర్చి నీవు గనుక ఎవరితోనైనా చెప్పావు
అంటే మేము ఈ ఒడంబడికకు కట్టుబడి
ఉండనక్కర్లేదు."
[21]"ఇది నాకు సమ్మతమే" అని ఆ స్త్రీ జవాబి
చ్చింది. ఆమె వాళ్లకు వీడ్కోలు చెప్పింది, వాళ్లు
ఆమె ఇల్లు విడిచి బయల్దేరారు. అప్పుడు ఆమె ఆ
ఎర్రటి తాడును కిటికీకి కట్టింది.
[22]ఆ మనుష్యులు ఆమె ఇల్లు విడిచి, కొండల్లోకి
వెళ్లిపోయారు. మూడు రోజులు వాళ్లు అక్కడే
ఉన్నారు. రాజు మనుష్యులు మార్గం అంతా వెదికారు.
మూడు రోజుల తర్వాత రాజు మనుష్యులు వెదకటం
మానివేసి పట్టణానికి తిరిగి వెళ్లిపోయారు. [23]అప్పుడు
ఆ మనుష్యులు ఇద్దరూ యెహోషువ దగ్గరకు
ప్రయాణం మొదలుబెట్టారు. వాళ్లు కొండలు విడిచి,
నది దాటారు. నూను కుమారుడైన యెహోషువ
దగ్గరకు వారు వెళ్లారు. వారు తెలుసుకొన్న సమాచారం
అంతా వాళ్లు యెహోషువకు చెప్పారు. [24]వారు
యెహోషువతో, "నిజంగా ఆ దేశం అంతా యెహోవా
మనకు ఇచ్చాడు. ఆ దేశ ప్రజలందరికీ మనమంటే
భయంగా ఉంది" అని చెప్పారు.

### యోర్దాను నదిలో అద్భుత కార్యం

3 మరునాడు ఉదయం పెందలాడే యెహోషువ,
ఇశ్రాయేలు ప్రజలు అందరూ లేచి షిత్తీము విడిచి
పెట్టారు. యోర్దాను నదికి వారు ప్రయాణం చేసారు.
నది దాటి అవతలికి వెళ్లకముందు వారు యోర్దాను
నది దగ్గర గుడారాలు వేసారు. [2]మూడు రోజుల తర్వాత
నాయకులు పాళెమునంతా తిరిగి చూసారు. [3]నాయ
కులు ప్రజలకు ఆదేశాలు ఇచ్చారు, "మీ యెహోవా
దేవుని ఒడంబడిక పెట్టెను* యాజకులు, లేవీ
యులు* మోయటం మీరు చూస్తారు. ఆ సమ
యంలో మీరు ఉన్న చోటు విడిచి, వాళ్లను వెంబడిం
చాలి. [4]కానీ మరీ సమీపంగా వెంబడి పోకూడదు. ఒక
1000 గజాలు* వారికి వెనుకగా ఉండండి. ఈ
మార్గంలో మీరు ఇదివరకు ఎన్నడూ ప్రయాణం చేయ
లేదు. అందుచేత వారిని వెంబడిస్తే, ఎక్కడికి వెళ్లాల్సిందీ
మీకు తెలుస్తుంది" అని వారు చెప్పారు.

[5]అప్పుడు యెహోషువ, "మిమ్మల్ని మీరు
పవిత్రం చేసుకోండి. రేపు యెహోవా అద్భుత
కార్యాలు చేయటానికి మిమ్మల్ని వాడుకొంటాడు" అని
ప్రజలతో చెప్పాడు.
[6]తర్వాత యెహోషువ, "ఒడంబడిక పెట్టెను తీసు
కొని ప్రజలకు ముందుగా నదిని దాటండి" అని యాజ
కులతో చెప్పాడు. కనుక యాజకులు ఆ పెట్టెను
ఎత్తుకొని, ప్రజలకు ముందు మోసు కొనిపోయారు.
[7]అప్పుడు యెహోషువతో యెహోవా చెప్పాడు:
"ఈ వేళ ఇశ్రాయేలీయులందరి దృష్టిలో నిన్ను ఒక
గొప్పవానిగా చేస్తాను. నేను మోషేకు తోడుగా ఉన్నట్టే,
నీకూ తోడుగా ఉన్నానని అప్పుడు వాళ్లు తెలుసు
కొంటారు. [8]యాజకులు ఒడంబడిక పెట్టె మోస్తారు.
యాజకులతో ఇలా చెప్పు, 'యోర్దాను నదీ తీరానికి
నడవండి, సరిగ్గా మీరు నీళ్లలో కాలుపెట్టే ముందు
ఆగండి.'"
[9]అంతట ఇశ్రాయేలు ప్రజలతో యెహోషువ
చెప్పాడు: "రండి, మీ యెహోవా దేవుని మాటలు
వినండి. [10]జీవంగల దేవుడు మీతో నిజంగా ఉన్నాడు
అనేందుకు ఇదే ఋజువు. నిజంగా ఆయన మీ
శత్రువుల్ని ఓడించేస్తాడు అనేందుకు ఇదే ఋజువు.
కనానీ ప్రజలు, హిత్తీ ప్రజలు, హివ్వీ ప్రజలు, పెరిజ్జీ
ప్రజలు, గెర్గేషీ ప్రజలు, అమోరీ ప్రజలు, యెబూసీ
ప్రజలు అందరినీ ఆయన ఈ దేశంనుండి వెళ్ల
గొట్టేస్తాడు. [11]ఇదే ఋజువు. మీరు యోర్దాను దాటేట
ప్పుడు, సర్వలోకాధిపతి ఒడంబడిక పెట్టె మీకు
ముందుగా వెళ్తుంది. [12]ఇప్పుడు మీలో 12 మందిని
ఏర్పాటు చేయండి. ఇశ్రాయేలీయుల 12 వంశాల్లో
ఒక్కోదాని నుండి ఒక్కో వ్యక్తిని ఏర్పాటు చేసు
కొనండి. [13]సర్వలోకాధికారి అయిన యెహోవా ఒడం
బడిక పెట్టెను యాజకులు మోస్తారు. వారు ఆ పెట్టెను
మీకు ముందు యోర్దాను నదిలోనికి మోసుకొని
వెళ్తారు. వారు నీళ్లలో ప్రవేశించగానే యోర్దాను నదీ
ప్రవాహం నిలిచిపోతుంది. నీరు నిలిచిపోయి, ఆ స్థలానికి
వెనుక ఆనకట్ట వేసినట్టు నిలిచిపోతాయి."
[14]యాజకులు ఒడంబడిక పెట్టె మోయగా, ప్రజలు
తాము గుడారాలు వేసిన చోటునుండి బయల్దేరారు.
ప్రజలు యోర్దాను నది దాటడం ప్రారంభించారు.
[15](కోతకాలంలో యోర్దాను నది దాని గట్లు మీద
పొర్లి పారుతుంది. అందుచేత నది పొంగుతూ ఉంది.)
పెట్టెను మోస్తున్న యాజకులు నది ఒడ్డుకు వచ్చారు.
నీళ్లలో వారు నిలిచిపోయారు. [16]సరిగ్గా అప్పుడే నీరు
ప్రవహించటం ఆగిపోయింది. (ఆ స్థలం వెనుక నీళ్లు
ఆనకట్ట కట్టినట్టు నిలిచిపోయాయి.) నది పొడవునా
ఆదాం వరకు (సారెతాను దగ్గర ఒక ఊరు.) నీరు
ఎత్తుగా నిలబడ్డాయి. ప్రజలు యెరికో దగ్గర నది
దాటారు. [17]ఆ చోట నేల ఆరిపోయింది. యాజకులు

---

**ఒడంబడిక పెట్టె** ఇశ్రాయేలీయులు సీనాయి ఎడారి ప్రాంతంలో వున్నప్పుడు దేవుడు వారితో ఉన్నాడని చూపించే పెట్టె. ఈ పెట్టెలో పది ఆజ్ఞలున్న రాతి పలకలు, మరియు ఇతర పవిత్ర వస్తువులు ఉన్నాయి.

**లేవీయులు** లేవీవంశీయులు ఈ లేవీయులు దేవాలయంలో యాజకులకు సహాయం చేసేవారు. మరియు వీరు ప్రభుత్వంలో పనిచేసేవారు.

1000 **గజాలు** 2,000 మూరలు.

యెహోవా ఒడంబడిక పెట్టెను ఆ నది మధ్యవరకు
మోసుకొని వెళ్లి, అక్కడ నిలిచిపోయారు. ఇశ్రాయేలు
ప్రజలు అందరూ యోర్దాను నదిలో ఆరిన నేలమీద
నడచి, ఆవలికి దాటేవరకు యాజకులు అక్కడ వేచి
ఉన్నారు.

## ప్రజలకు జ్ఞాపకాన్నిచ్చే రాళ్లు

4 ప్రజలంతా యోర్దాను నది దాటడం అయి
పోయిన తర్వాత యెహోషువతో యెహోవా
చెప్పాడు: 2"ప్రజల్లోనుండి 12 మందిని ఏర్పాటు
చేయి. ఒక్కొక్క వంశంనుండి ఒక్కొక్క మనిషిని
ఏర్పాటు చేయి. 3నదిలో యాజకులు నిలిచిన చోటు
చూడమని వారితో చెప్పు. అక్కడ పన్నెండు రాళ్లను
వెదికి వాటిని మీతోబాటు తీసుకొని వెళ్లాలి. ఈ రాత్రి
మీరు నివాసంచేసే స్థలంలో ఆ రాళ్లను ఉంచండి."
4కనుక యెహోషువ ఒక్కొక్క వంశంనుండి
ఒక్కొక్క మనిషిని ఏర్పాటు చేసాడు. తర్వాత ఆ
పన్నెండుమందినీ అతడు సమావేశపర్చాడు. 5యెహో
షువ వాళ్లతో చెప్పాడు: "మీ యెహోవా దేవుని
పవిత్ర పెట్టె నీళ్లలో ఉన్న చోటుకు వెళ్లండి. ఇశ్రాయే
లీయుల పన్నెండు వంశాల్లో ఒక్కోదానికి ఒక్కొక్క
రాయి అక్కడ ఉంటాయి. ఆ రాతిని మీ భుజంమీద
మోయండి. 6ఈ రాళ్లు మీ మధ్య గుర్తుగా ఉంటాయి.
భవిష్యత్తులో మీ పిల్లలు 'ఈ రాళ్ల భావం ఏమిటి?'
అని మిమ్మల్ని అడుగుతారు. 7యోర్దాను నదిలో నీరు
ప్రవహించకుండా యెహోవా చేసాడు అని మీ పిల్ల
లతో చెప్పండి. యెహోవా ఒడంబడిక పెట్టె నీళ్లలో
దిగగానే నీరు నిలిచిపోయాయి. ఈ విషయాన్ని శాశ్వ
తంగా జ్ఞాపకం ఉంచుకొనేందుకు ఆ రాళ్లు ఇశ్రాయేలు
ప్రజలకు తోడ్పడుతాయి."
8కనుక ఇశ్రాయేలు ప్రజలు యెహోషువకు విధే
యులయ్యారు. యోర్దాను నది మధ్యలోనుండి
పన్నెండు రాళ్లు వాళ్లు మోసుకొని వెళ్లారు. ఇశ్రాయేలీ
యుల పన్నెండు వంశాల్లో ఒక్కోదానికి ఒక్కోరాయి
ఉంది. యెహోషువకు యెహోవా ఆజ్ఞాపించిన ప్రకా
రమే వారు ఇలా చేసారు. ఆ మనుష్యులు ఆ రాళ్లు
మోసుకొనిపోయి వారు నివాసము చేసిన చోట వాటిని
ఉంచారు. 9(యెహోవా యొక్క పవిత్ర పెట్టెను
మోస్తున్నప్పుడు యోర్దాను నది మధ్యలో యాజకులు
నిలిచిన చోటకూడా యెహోషువ పన్నెండు రాళ్లు
ఉంచాడు. నేటికీ ఆ రాళ్లు అక్కడ ఉన్నాయి.)
10ప్రజలు చేయాల్సింది ఏమిటో చెప్పమని
యెహోవా యెహోషువకు ఆజ్ఞాపించాడు. యెహో
షువ చేయాలని మోషే చెప్పిన సంగతులే అవి. కనుక
ఆ విషయాలన్నీ జరిగించేంతవరకు పవిత్ర పెట్టెను
మోస్తున్న యాజకులు నది మధ్యలోనే నిలబడి
ఉన్నారు. ప్రజలు త్వరపడి నది దాటారు. 11ప్రజలు
నదిని దాటిపోవడం అయిపోగానే యాజకులు
యెహోవా పెట్టెను ప్రజల ఎదుటికి మోసుకొని
వెళ్లారు.
12రూబేను, గాదు వంశాలు, మనష్షే వంశంలోని
సగంమంది మగవాళ్లు మోషే వారికి చెప్పిన వాటికి
విధేయులయ్యారు. మిగతా మనుష్యుల ముందు వీరు
నదిని దాటారు. వీళ్లు యుద్ధానికి సిద్ధపడ్డారు. దేవుడు
వారికి వాగ్దానం చేసిన దేశాన్ని స్వాధీనం చేసు కొనేం
దుకు, మిగిలిన ప్రజలకు సహాయం చేయటానికి వీరు
వెళ్తున్నారు.
13యుద్ధానికి సిద్ధపడిన వారు సుమారు నలభై
వేలమంది సైనికులు యెహోవా ఎదుట సాగి
పోయారు. యెరికో మైదానాల దిశగా వారు సాగి
పోయారు.
14ఆ రోజున ఇశ్రాయేలు ప్రజలందరికీ యెహో
షువను ఒక మహామనిషిగా యెహోవా చేసాడు.
అప్పట్నుంచి ప్రజలు యెహోషువను గౌరవించారు.
మోషేను వారు గౌరవించినట్టే యెహోషువను కూడ
వారు జీవితకాలమంతా గౌరవించారు.
15ఆ పెట్టెను మోస్తున్న యాజకులు ఇంకా నదిలో
నిలబడి ఉండగానే,
16"యాజకులను నదిలోనుండి బయటకు
రమ్మని ఆజ్ఞాపించు" అంటూ యెహోవా, యెహోషు
వతో చెప్పాడు.
17కనుక యెహోషువ యాజకులకు, "యోర్దాను
నదిలోనుండి బయటకు రండి" అని ఆజ్ఞాపించాడు.
18యాజకులు యెహోషువకు విధేయుల
య్యారు. వారు ఆ పెట్టెను మోసుకొని, నదిలో నుండి
బయటకు వచ్చారు. యాజకుల పాదాలు, నది ఆవలి
ఒడ్డున నేలను తాకగానే, నదిలో నీరు మరల ప్రవహిం
చటం మొదలయింది. ప్రజలు నదిని దాటి వెళ్లక
ముందులాగే నీరు గట్ల మీద పొర్లి పారుతున్నాయి.
19మొదటి నెల పదో రోజున ప్రజలు యోర్దాను
నది దాటారు. యెరికోకు తూర్పున గిల్గాలులో ప్రజలు
గుడారాలు వేసారు 20యోర్దాను నదిలోనుంచి తీసు
కొన్న పన్నెండు రాళ్లను ప్రజలు వారితో మోసుకొని
వెళ్లారు. ఆ రాళ్లను గిల్గాలులో యెహోషువ నిలువ
బెట్టాడు.
21అప్పుడు యెహోషువ ప్రజలతో చెప్పాడు:
"'ఈ రాళ్లు ఏమిటి?' అని భవిష్యత్తులో మీ పిల్లలు
తల్లిదండ్రుల్ని అడుగుతారు. 22'ఏ విధంగానైతే ఇశ్రా
యేలు ప్రజలు యోర్దాను నదిని ఆరిన నేలమీద
దాటి వెళ్లారో ఆ విషయాన్ని జ్ఞాపకం చేసుకొనేందుకు
ఈ రాళ్లు తోడ్పడుతాయి' అని పిల్లలతో మీరు
చెప్పాలి. 23మీ యెహోవా దేవుడు ఆ నదిలో నీటి
ప్రవాహాన్ని నిలిపివేసాడు. ప్రజలు దానిని దాటిపోయేం
తవరకు నది ఎండిపోయింది. ఎర్ర సముద్రం దగ్గర

ప్రజలకు యెహోవా ఏమి చేసాడో, యోర్దాను నది
దగ్గరకూడ ఆయన అలానే చేసాడు. ప్రజలు దాటి
వెళ్లగలిగేందుకు ఎర్ర సముద్రంలో నీళ్లను యెహోవా
నిలిపివేశాడని జ్ఞాపకం ఉంచుకోండి.
[24]యెహోవాకు మహాశక్తి ఉందని ఈ దేశ
ప్రజలంతా తెలుసుకోవాలని ఆయన దీనిని చేసాడు.
అప్పుడు ఆ ప్రజలు మీ యెహోవా దేవునికి
ఎల్లప్పుడూ భయపడి ఉంటారు."

5 కనుక ఇశ్రాయేలు ప్రజలు యోర్దాను నది దాటి
వెళ్లేంతవరకు యెహోవా దానిని ఎండి పోయే
టట్టు చేసాడు. యోర్దాను నదికి పశ్చిమాన ఉన్న
రాజులు, మధ్యధరా సముద్ర ప్రాంతంలో ఉన్న కనానీ
ప్రజలు ఇది విని చాల భయపడిపోయారు. అంతటితో
ఇశ్రాయేలు ప్రజలను ఎదిరించే ధైర్యం వారికి లేక
పోయింది.

### ఇశ్రాయేలీయులు సున్నతి చేయబడ్డారు

[2]ఆ సమయంలో యెహోవా, "మొనగల రాళ్లతో
కత్తులు చేసి, ఇశ్రాయేలు ప్రజలకు మరల సున్నతి*
చేయు" అని యెహోషువతో చెప్పాడు.
[3]కనుక యెహోషువ మొనగల రాళ్లతో కత్తులు
చేసాడు. తర్వాత గిబియత్ హార్లత్* దగ్గర అతడు
వారికి సున్నతి చేసాడు.
[4-7]ఆ మగవాళ్లకు యెహోషువ ఎందుకు సున్నతి
చేసాడంటే; ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు వదలిపెట్టిన
తర్వాత, సైన్యానికి తగిన వాళ్లందరికీ సున్నతి చేయ
బడింది. అరణ్యంలో ఉన్నప్పుడు ఆ వీరులు చాల
మంది యెహోవా మాట వినలేదు. అందుచేత "పాలు,
తేనెలు ప్రవహించే ఆ దేశాన్ని" ఆ మనుష్యులు చూడ
రని యెహోవా ప్రమాణం చేసాడు. ఆ దేశాన్ని మనకు
ఇస్తానని యెహోవా మన పూర్వీకులకు వాగ్దానం
చేసాడు కానీ ఆ మనుష్యుల మూలంగా ప్రజలంతా
40 సంవత్సరాలపాటు అరణ్యంలోనే సంచరించాల్సి
వచ్చింది. అలా ఆ సైన్యం వాళ్లంతా చావాల్సి ఉంది.
పోరాడే ఆ మనుష్యులంతా చనిపోయారు. వారి కుమా
రులు వారి స్థానాలు వహించారు. అయితే ఈజిప్టునుండి
వచ్చేటప్పుడు అరణ్యంలో పుట్టిన బాలురకు ఎవ్వరికి
సున్నతి జరగలేదు. అందుచేత యెహోషువ వారికి
సున్నతి చేసాడు.
[8]ప్రజలందరికీ యెహోషువ సున్నతి చేయటం
ముగించాడు. తర్వాత వాళ్లంతా స్వస్థత పడేంతవరకు
ఆ గుడారాలలోనే ఉండిపోయారు.

### కనానులో మొదటి పస్కా పండుగ

[9]ఆ సమయంలో యెహోవా, "మీరు ఈజిప్టులో
బానిసలుగా ఉన్నప్పుడు అవమానం పొందారు కానీ
నేడు ఆ అవమానాన్ని నేను తొలగించివేసాను" అని
యెహోషువతో చెప్పాడు. అందుచేత ఆ స్థలానికి
గిల్గాలు* అని యెహోషువ పేరు పెట్టాడు. నేటికీ
ఆ చోటు గిల్గాలు అనే పిలువబడుతోంది.
[10]ఇశ్రాయేలు ప్రజలు యెరికో మైదానాల్లో గిల్గా
లులో దిగియున్నప్పుడే వారు పస్కా విందు చేసారు.
అది ఆ నెల 14వ తేదీ సాయంత్రం. [11]మరునాడు
పస్కా తర్వాత ప్రజలు ఆ దేశంలో పండిన ఆహారం
కొంత భోజనం చేసారు. పులుపు పదార్థం లేని
రొట్టెను, వేయించిన గింజలను వారు తిన్నారు. [12]ఆ
రోజు ప్రజలు ఈ ఆహారం భోజనంచేసిన తర్వాత
ఆకాశంనుండి వచ్చే ప్రత్యేక ఆహారం ఆగిపోయింది.
ఆ తర్వాత ఆకాశంనుండి వచ్చే ప్రత్యేక ఆహారం
ఇశ్రాయేలు ప్రజలకు లభించలేదు. అప్పట్నుంచి
కనాను దేశంలో పండిన పంటనే వారు తిన్నారు.
[13]యెహోషువ యెరికోకు సమీపంగా ఉన్నప్పుడు
అతడు పైకి చూడగా అతని యెదుట ఒక మనిషి
నిలిచి ఉండటం కనబడింది. ఆ మనిషి చేతిలో ఒక
ఖడ్గం ఉంది. యెహోషువ అతని దగ్గరకు వెళ్లి, "నీవు
మా ప్రజల పక్షమా, లేక నీవు మా శత్రువర్గం వాడివా?"
అని అడిగాడు.
[14]ఆ మనిషి, "నేను శత్రువును కాను. నేను
యెహోవా సైన్యములకు సేనాధిపతిని. ఇప్పుడే నేను
మీ దగ్గరకు వచ్చాను"అని జవాబిచ్చాడు.
అప్పుడు యెహోషువ, ఆయనను గౌరవిస్తు
సాష్టాంగపడి. "నా యజమాని, తన సేవకుడైన నాకు
ఏమి సెలవిస్తున్నారు?" అని అడిగెను.
[15]అందుకు యెహోవా సైన్యాధిపతి, "నీ చెప్పులు
తీసివేయి. ఇప్పుడు నీవు నిలిచిన స్థలం పవిత్ర స్థలము"
అని చెప్పాడు. కనుక యెహోషువ ఆయనకు విధే
యుడయ్యాడు.

### యెరికోను స్వాధీనపర్చుకొనటం

6 యెరికో పట్టణం మూసివేయబడింది. ఇశ్రా
యేలు ప్రజలు దగ్గర్లోనే ఉన్నందువల్ల ఆ పట్టణం
లోని ప్రజలు భయపడ్డారు. ఎవరూ పట్టణంలోనికి
గాని, బయటకు గాని వెళ్లలేదు.

---

**సున్నతి** గోప్యాంగముకు వున్న ముందు చర్మము కోయబడటం దీనినే సున్నతి అంటారు. ఇది చేయటం ద్వారా యూదులలో ప్రతి ఒక్కడూ దేవుని ఒడంబడికలో పాలిభాగస్తుడు అని ఇది తెలుపుతుంది. ఆ.కా.17:9–14 చూడండి.

**గిబియత్ హార్లత్** "సున్నతి పర్వతం" అని దీని భావం.

**గిల్గాలు** హెబ్రీ భాషలో ఈ పదానికి "పొర్లిపోవుట" అని అర్థం.

2అప్పుడు యెహోషువతో యెహోవా చెప్పాడు:
“చూడు, యెరికో పట్టణాన్ని నేను నీ స్వాధీనంలో
ఉంచాను. దాని రాజు, పట్టణంలోని యుద్ధ వీరులు
నీ స్వాధీనంలో ఉన్నారు. 3నీ సైన్యంతో పట్టణం
చుట్టూ రోజుకు ఒక్కసారి ప్రదక్షిణం చేయి. ఇలా
ఆరు రోజులు చేయి. 4పొట్టేలు కొమ్ములతో చేసిన
బూరలు ఊదేందుకు ఏడుగురు యాజకులను నియ
మించుము. పవిత్ర పెట్టెకు ముందుగా నడువుమని
యాజకులతో చెప్పు. ఏడో రోజున ఏడుసార్లు
పట్టణం చుట్టూ ప్రదక్షిణం చేయండి. ఏడోరోజున
వారు ముందడుగు వేయగానే బూరలు ఊదాలని
యాజకులతో చెప్పు.

5యాజకులు బూరలతో పెద్ద శబ్దం చేయాలి. ఆ
శబ్దం నీవు వినగానే ప్రజలందర్నీ కేకలు వేయమని
చెప్పు. మీరు ఇలా చేయగానే పట్టణం యొక్క గోడలు
కూలిపోతాయి. అప్పుడు మీ ప్రజలు సరాసరి పట్టణం
లోనికి వెళ్లిపోవాలి.”

6కనుక నూను కుమారుడైన యెహోషువ యాజ
కులందర్నీ సమావేశపర్చాడు. “యెహోవా పవిత్ర
పెట్టెను మోయండి. ఏడుగురు యాజకులు బూరలు
మోయాలని చెప్పండి. ఆ యాజకులు పవిత్ర పెట్టెకు
ముందుగా నడవాలి” అని యెహోషువ వారితో
చెప్పాడు.

7“ఇప్పుడు బయల్దేరండి. పట్టణం చుట్టూ నడ
వండి. ఆయుధాలు ధరించిన సైనికులు యెహోవా
పవిత్ర పెట్టె ఎదుట నడవాలి” అని యెహోషువ
ప్రజలకు ఆజ్ఞాపించాడు.

8యెహోషువ ప్రజలతో మాట్లాడటం ముగించ
గానే, ఏడుగురు యాజకులు యెహోవా సన్నిధిని
నడవటం మొదలుబెట్టారు. ఏడు బూరలను వారు
మోసుకొని వెళ్లారు. వారు నడుస్తూ ఉన్నప్పుడు
బూరలు ఊదారు. యెహోవా పవిత్ర పెట్టెను మోసే
వారు వారి వెనుక నడిచారు. 9ఆయుధాలు ధరించిన
సైనికులు యాజకులకు ముందుగా నడిచారు. పవిత్ర
పెట్టె వెనుక నడుస్తోన్న వాళ్లు బూరలు ఊదారు.
10అయితే యుద్ధనాదం చేయవద్దని యెహోషువ
ప్రజలతో చెప్పాడు. “కేకలు వేయకండి. నేను మీతో
చెప్పే రోజు వరకు ఒక్క మాటకూడ పలుకకండి.
తరువాత మీరు కేకలు వేయవచ్చు” అన్నాడు
యెహోషువ.

11కనుక యెహోవా పవిత్ర పెట్టెను పట్టణం
చుట్టూ ఒక్కసారి యాజకులచేత యెహోషువ
మోయించాడు. తర్వాత వారు వారి బసకు వెళ్లి ఆ
రాత్రి అక్కడే గడిపారు.

12మర్నాటి ఉదయాన్నే యెహోషువ లేచాడు.
యాజకులు యెహోవా పవిత్ర పెట్టెను మరలా
మోసారు. 13మరియు యాజకులు ఏడుగురు ఏడు
బూరలు మోసారు. యెహోవా పవిత్ర పెట్టె ఎదుట
వారు నడుస్తూ బూరలు ఊదారు. ఆయుధాలు
ధరించిన సైనికులు వారికి ముందుగా నడిచారు.
యెహోవా పవిత్ర పెట్టె వెనుక నడిచే యాజకులు
నడుస్తూ, బూరలు ఊదారు.

14కనుక రెండో రోజున వాళ్లంతా పట్టణం చుట్టూ
ఒక మారు ప్రదక్షిణం చేసారు. ఆ తర్వాత వాళ్లు
తిరిగి వారి బసకు వెళ్లిపోయారు. ఆరు రోజులపాటు
వారు ఇలానే ప్రతిరోజూ చేసారు.

15ఏడో రోజు సూర్యోదయాన్నే వారు మేల్కొ
న్నారు. వారు పట్టణం చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణాలు
చేసారు. అంతకు ముందు రోజులలో నడచినట్టే
నడిచారు, కాని ఆ రోజు పట్టణం చుట్టూ ఏడుసార్లు
తిరిగారు. 16పట్టణం చుట్టూ వారు ఏడోసారి తిరుగగానే,
యాజకులు వారి బూరలు ఊదారు. సరిగ్గా అప్పుడే
యెహోషువ ఆజ్ఞ యిచ్చాడు: “ఇప్పుడు కేకలు
వేయండి! యెహోవా ఈ పట్టణాన్ని మీకు ఇచ్చేస్తు
న్నాడు! 17ఈ పట్టణం, ఇందులో ఉన్న సమస్తం
యెహోవాదే.* వేశ్య రాహాబు, ఆమె ఇంటిలో ఉన్న
వారు మాత్రమే బ్రతకాలి. మనం పంపిన ఇద్దరికీ
రాహాబు సహాయం చేసింది గనుక వారిని చంపకూడదు.
18మరియు మిగిలిన వాటన్నింటినీ మనం నాశనం
చేసివేయాలని జ్ఞాపకం ఉంచుకోండి. వాటిని తీసు
కోవద్దు. మీరు వాటిని తీసుకొని, మన పాళెములోనికి
గనుక తీసుకొని వస్తే మిమ్మల్ని మీరే నాశనం చేసు
కొంటారు. పైగా మీరు మొత్తం ఇశ్రాయేలు ప్రజలంద
రికీ కష్టం తెచ్చి పెడ్తారు. 19వెండి, బంగారం మరియు
ఇత్తడి, ఇనుముతో చేసిన వస్తువులన్నీ మొత్తం
యెహోవాకే చెందుతాయి. వాటన్నింటినీ ఆయన
కోసం దాచిపెట్టాలి.”

20యాజకులు బూరలు ఊదారు. ప్రజలు బూరలు
విని కేకలు వేయటం మొదలుబెట్టారు. గోడలు కూలి
పోయాయి. ప్రజలు ఏకంగా పట్టణంలో జొరబడి
పోయారు. అందుచేత ఇశ్రాయేలు ప్రజలు ఆ పట్ట
ణాన్ని ఓడించేసారు. 21ఆ పట్టణంలో ఉన్న సమస్తాన్ని
ప్రజలు నాశనం చేసారు. అక్కడ ప్రాణంతో ఉన్న
సమస్తాన్ని వాళ్లు నాశనం చేసారు. పడుచు కుర్రాళ్లను,
పెద్ద మగవాళ్లను, పడుచుపిల్లల్ని, స్త్రీలను పశువుల్ని,
గొర్రెల్ని, గాడిదల్ని వారు చంపేశారు.

22ఆ దేశాన్ని చూసేందుకు తాను పంపించిన ఇద్దరు
మనుష్యులతో యెహోషువ మాట్లాడాడు: “ఆ వేశ్య
ఇంటికి వెళ్లండి. ఆమెను బయటకు తీసుకొని రండి.
మరియు ఆమెతో ఉన్న వాళ్లందరినీ బయటకు

---

**సమస్తం యెహోవాదే** సామాన్యంగా శత్రువులనుండి తెచ్చిన విలువైన వస్తువులను దేవాలయపు ఖజానాలో ఉంచుతారు. లేక వాటిని నాశనం చేస్తారు.

తీసుకొని రండి. మీరు ఆమెతో చేసిన వాగ్దానం ప్రకారంగా మీరు ఇలా చేయండి."

[23]కనుక ఆ ఇద్దరు మనుష్యులూ ఆ ఇంట్లోకి వెళ్లి, రాహాబును బయటకు తీసుకొని వచ్చారు. ఆమె తండ్రి, తల్లి, సోదరులు, ఆమె కుటుంబం మొత్తం, ఆమెతో ఉన్న వాళ్లందర్నీ వారు బయటకు తీసు కొనివచ్చారు. ఆ మనుష్యులందరినీ ఇశ్రాయేలీయుల పాళెము వెలుపల క్షేమకరమైన చోట వారు ఉంచారు.

[24]అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు ఆ పట్టణం మొత్తాన్ని తగులబెట్టేసారు. వెండి, బంగారం, ఇత్తడి, ఇనుముతో చేయబడినవి తప్ప ఆ పట్టణంలో ఉన్న వాటన్నింటినీ వారు కాల్చేసారు. ఇవన్నీ యెహోవా కోసం భద్రం చేయబడ్డాయి. [25]వేశ్య రాహాబును, ఆమె కుటుంబాన్ని, ఆమెతో ఉన్నవారందరినీ యెహోషువ రక్షించాడు. యెరికోను వేగు చూచేందుకు యెహో షువ పంపిన మనుష్యులకు రాహాబు సహాయం చేసింది కనుక యెహోషువ వారిని బ్రదుకనిచ్చాడు. నేటికీ రాహాబు ఇశ్రాయేలు ప్రజల్లో సజీవంగా ఉండిపోయింది.

[26]ఆ సమయంలోనే ముఖ్యమైన ఈ వాగ్దానం యెహోషువ చేసాడు:

"ఈ యెరికో పట్టణాన్ని మరల ఎవరైనా
కట్టడానికి ప్రయత్నిస్తే వారు యెహోవా
వలన ప్రమాదానికి గురి అవుతారు. ఈ
పట్టణానికి పునాది వేసే మనిషి తన పెద్ద
కుమారుణ్ణి పోగొట్టుకుంటాడు. ద్వారాలు
నిలబెట్టేవాడు తన చిన్న కుమారుణ్ణి
పోగొట్టుకొంటాడు."

[27]కనుక యెహోవా, యెహోషువకు తోడుగా ఉన్నాడు. మరియు యెహోషువ ఆ దేశం అంతటా ప్రసిద్ధి చెందాడు.

### ఆకాను పాపం

7 అయితే ఇశ్రాయేలు ప్రజలు దేవునికి విధేయులు కాలేదు. యూదా వంశానికి చెందిన జబ్ది మను మడు, కర్మి కుమారుడు ఆకాను అనే పేరుగలవాడు ఒకడు ఉన్నాడు. నాశనం చేయాల్సిన వస్తువుల్లో కొన్నింటిని ఆకాను దాచిపెట్టుకున్నాడు. అందుచేత ఇశ్రాయేలు ప్రజల మీద యెహోవాకు చాల కోపం వచ్చింది.

[2]వారు యెరికోను ఓడించిన తర్వాత యెహోషువ హాయి* పట్టణానికి కొందరు మనుష్యుల్ని పంపిం చాడు. బేతేలుకు తూర్పున బేతావెను దగ్గర ఉంది హాయి. "హాయికి వెళ్లి, ఆ ప్రాంతంలో బలహీనతలు ఏమిటో చూడండి" అని యెహోషువ వారితో చెప్పాడు. కనుక ఆ దేశాన్ని వేగు చూడటానికి ఆ మనుష్యులు వెళ్లారు.

[3]తర్వాత ఆ మనుష్యులు యెహోషువ దగ్గరకు తిరిగి వచ్చారు. "హాయి బలహీన ప్రాంతం. ఆ దేశాన్ని జయించేందుకు మనకు మన మనుష్యులంతా అవసరం లేదు. అక్కడ యుద్ధానికి రెండువేల మంది లేక మూడువేల మందిని పంపించు. మన ప్రజలందర్నీ ఉపయోగించాల్సిన అవసరం లేదు. మనమీద పోరా డేందుకు అక్కడ కొద్దిమంది మనుష్యులే ఉన్నారు" అన్నారు వారు.

[4-5]కనుక సుమారు మూడువేల మంది మనుష్యులు హాయికి వెళ్లారు. కాని హాయివారు ఇశ్రాయేలు మను ష్యులను 36 మందిని చంపివేసారు. పైగా ఇశ్రాయేలు ప్రజలు పారిపోయారు. హాయివాళ్లు తమ పట్టణ ద్వారాల దగ్గరనుండి షేబారీమువరకు వాళ్లను తరిమివే సారు. హాయివాళ్లు వారిని బాగా కొట్టివేసారు.

ఇశ్రాయేలు ప్రజలు అది చూసి, చాలా భయపడి పోయారు, ధైర్యం కోల్పోయారు. [6]యెహోషువ ఇది విని, తన బట్టలు చింపుకొని, పవిత్ర పెట్టె ముందర నేలమీద సాగిలపడ్డాడు. సాయంత్రం వరకు యెహో షువ అక్కడే ఉండిపోయాడు. ఇశ్రాయేలు నాయకు లంతా అలానే చేసారు. వారు వారి తలలమీద ధూళి పోసుకొన్నారు.

[7]అప్పుడు యెహోషువ చెప్పాడు: "అయ్యో యెహోవా ప్రభువా! మా ప్రజలను నీవే యొర్దాను నది దాటించావు. కానీ నీవెందుకు మమ్మల్ని ఇంత దూరం తీసుకొని వచ్చి, అమోరీవాళ్లు మమ్మల్ని నాశనం చేయునట్లు చేశావు. యొర్దాను నది ఆవల మేము తృప్తిపడి, అక్కడే ఉండిపోవాల్సింది. [8]నా ప్రాణం మీద ప్రమాణం చేసి చెబుతున్నాను, ప్రభూ! ఇప్పుడు నేను చెప్పగలిగింది ఏమీ లేదు. ఇశ్రాయేలీయులు శత్రువులకు లోబడిపోయారు. [9]కనానీ ప్రజలు, ఈ దేశంలోని ప్రజలు అందరూ జరిగిన దానిగూర్చి వింటారు. తరువాత వాళ్లు మా మీదికి వచ్చి, మమ్మల్ని అందర్నీ చంపేస్తారు. అప్పుడు నీ గొప్ప పేరు కాపాడేందుకు నీవు ఏమి చేస్తావు?" [10]యెహోషువతో యెహోవా ఇలా చెప్పాడు: "లేచి నిలబడు! ఎందుకు నీవు సాష్టాంగ పడతావు? [11]ఇశ్రాయేలు ప్రజలు నాకు విరోధంగా పాపం చేసారు. వాళ్లు విధేయులు కావాలని నేను చేసిన ఒడంబడికను వారు ఉల్లంఘించారు. నాశనం చేయాలని నేను ఆజ్ఞాపించిన వాటిలో వారు కొన్ని తీసుకొన్నారు. వారు నా దగ్గర దొంగతనం చేసారు. వాళ్లు అబద్ధం చెప్పారు. ఆ వస్తువుల్ని వాళ్లు వారికోసం దాచుకొన్నారు. [12]అందుచేతనే ఇశ్రాయేలు సైన్యం యుద్ధంలో ఓడిపోయి పారిపోయింది. వారు తప్పు చేసినందువల్లనే ఇలా జరిగింది. వాళ్లు నాశనం

**హాయి** అనగా "పాడుబడిన" ఊరు అని అర్థం.

కావాలి. నేను ఇంక మీకు సహాయం చేయను. మీరు
నాశనం చేయాలని నేను మీకు ఆజ్ఞాపించిన వాటన్నిం
టినీ మీరు నాశనం చేయాలి. మీరు ఇలా చేస్తేనే
తప్ప నేను ఇక మీదట మీకు తోడుగా ఉండను.
13"ఇప్పుడు వెళ్లి, ప్రజలను పవిత్రం చేసి, ప్రజలతో
ఇలా చెప్పు, 'మిమ్మల్ని మీరు పవిత్రం చేసుకోండి.
రేపటికోసం సిద్ధపడండి. ఇశ్రాయేలీయులు యెహోవా
దేవుడు నాశనం చేయుమని ఆజ్ఞాపించిన వాటిని కొంత
మంది దాచిపెట్టుకొన్నారని ఆయన చెబుతున్నాడు.
వాటిని మీరు పారవేసేటంతవరకు మీరెన్నటికీ మీ
శత్రువుల్ని ఓడించలేరు.
14"'రేపు ఉదయం మీరంతా యెహోవా ఎదుట
నిలవాలి. అన్ని గోత్రాలూ యెహోవా యెదుట నిల
బడాలి. ఒక గోత్రాన్ని యెహోవా నిర్ణయం చేస్తాడు.
అప్పుడు ఆ గోత్రం మాత్రమే యెహోవా యెదుట
నిలబడాలి. అప్పుడు ఆ గోత్రం నుండి ఒక వంశాన్ని
యెహోవా నిర్ణయిస్తాడు. అప్పుడు ఆ వంశం వాళ్లు
మాత్రమే యెహోవా ఎదుట నిలబడాలి. ఆ వంశంలో
నుండి ఒక్క కుటుంబాన్ని మాత్రమే యెహోవా
నిర్ణయిస్తాడు. అప్పుడు ఆ ఒక్క కుటుంబం మాత్రమే
యెహోవా ఎదుట నిలబడాలి. అప్పుడు ఆ కుటుం
బంలో ఒక్కొక్క పురుషుని యెహోవా చూస్తాడు.
15మనం నాశనం చేయాల్సిన వాటిని దాచిపెట్టుకొన్న
మనిషి పట్టుబడతాడు. అప్పుడు ఆ మనిషిని అగ్నితో
కాల్చి నాశనం చేయాలి. మరియు అతనికి కలిగిన
సమస్తం అతనితో బాటు నాశనం చేయబడుతుంది.
యెహోవా ఆజ్ఞాపించిన ఒడంబడికను ఆ మనిషి ఉల్లం
ఘించాడు. ఇశ్రాయేలు ప్రజల మధ్య అతడు మహా
అపరాధం చేసాడు.'"
16మర్నాడు ఉదయం పెందలాడే ఇశ్రాయేలు ప్రజ
లందరినీ యెహోవా ఎదుటకు యెహోషువ నడిపిం
చాడు. ఇశ్రాయేలు గోత్రాలన్నీ యెహోవా ఎదుట
నిలిచాయి. యూదా గోత్రాన్ని యెహోవా నిర్ణయిం
చాడు. 17కనుక యూదా గోత్రములోని వంశాలన్నీ
యెహోవా ఎదుట నిలిచాయి. జెరహు వంశాన్ని
యెహోవా నిర్ణయం చేసాడు. అప్పుడు జెరహు వంశం
లోని కుటుంబాలు అన్నీ యెహోవా ఎదుట నిలి
చాయి. జబ్ది కుటుంబం నిర్ణయించబడింది. 18అప్పుడు
ఆ కుటుంబంలోని పురుషులంతా యెహోవా ఎదు
టికి రావాలని యెహోషువ చెప్పాడు. కర్మీ కుమారు
డైన ఆకానును యెహోవా నిర్ణయం చేసాడు. (జిమ్రి
కుమారుడు కర్మి, జెరహు కుమారుడు జబ్ది).
19అప్పుడు ఆకానుతో యెహోషువ అన్నాడు:
"నా కుమారుడా, (నీ ప్రార్థన చేసుకో) ఇశ్రాయేలు
దేవుడైన యెహోవాను స్తుతించి, నీవు ఒప్పుకో.
నీవేం చేసావో నాతో చెప్పు. నా దగ్గర ఏమీ దాచేందుకు
ప్రయత్నించకు!"
20ఆకాను ఇలా జవాబిచ్చాడు: "ఇశ్రాయేలు దేవు
డైన యెహోవాకు వ్యతిరేకంగా నేను పాపం చేసిన
మాట నిజమే. నేను చేసింది ఏమిటంటే, 21యెరికో
పట్టణాన్ని అందులో ఉన్న వాటన్నిటినీ మనం
పట్టుకొన్నాము గదా! వాటిలో అందమైన ఒక బబు
లోను అంగీ, రెండు వందల తులాల వెండి, యాభై
తులాలకంటె ఎక్కువ బంగారం నేను చూసాను. ఇవన్నీ
తప్పక నాకు కావాలనిపించింది. అందుచేత నేను వాటిని
తీసుకొన్నాను. నా గుడారంలో నేల తవ్వితే అవి
మీకు కనబడుతాయి. వెండి కూడ అంగీ కిందనే ఉంది."
22కనుక యెహోషువ కొందరు మనుష్యుల్ని ఆ
గుడారానికి పంపించాడు. వారు ఆ గుడారానికి పరుగెత్తి
వెళ్లి, ఆ వస్తువులు గుడారంలో దాచిపెట్టబడి ఉండటం
చూసారు. వెండి కూడా అంగీ కిందనే ఉంది. 23ఆ
మనుష్యులు ఆ వస్తువుల్ని గుడారంలోనుంచి వెలుప
టికి తీసుకొనివచ్చారు. వారు ఆ వస్తువుల్ని యెహో
షువ దగ్గరకు, ప్రజలందరి దగ్గరకు తీసుకొని వెళ్లారు.
వారు యెహోవా ఎదుట వాటిని నేలమీద పెట్టారు.
24అప్పుడు యెహోషువ, ప్రజలు అందరూ కలిసి
జెరహు కుమారుడు ఆకానును ఆకోరు* లోయకు
తీసుకొని వెళ్లారు. వెండి, అంగీ, బంగారం, ఆకాను
కుమారులు, కూతుళ్లు, అతని పశువులు, అతని గాడి
దలు, అతని గొర్రెలు, అతని గుడారం, అతనికి ఉన్న
సర్వమును వారు తీసుకొని వెళ్లారు. వారు వీటన్నింటినీ
ఆకానుతోబాటు ఆకోరు లోయకు తీసుకొని వెళ్లారు.
25అప్పుడు యెహోషువ, "నీవు మాకు ఇంత కష్టం
ఎందుకు తెచ్చిపెట్టావో నాకు తెలియదు! కానీ
ఇప్పుడు యెహోవా నిన్ను బాధిస్తాడు!" అన్నాడు.
అప్పుడు ప్రజలు ఆకాను చచ్చేంతవరకు అతణ్ణి
రాళ్లతో కొట్టారు. అతని కుటుంబాన్నికూడ వారు
చంపేసారు. అప్పుడు వాళ్లందర్నీ, అతనికి ఉన్నదా
న్నంతటినీ ప్రజలు కాల్చివేసారు. 26వారు ఆకానును
కాల్చేసిన తర్వాత, అతని శరీరం మీద చాల రాళ్లు
కుప్పగా వేసారు. ఆ రాళ్లు నేటికీ అక్కడ ఉన్నాయి.
(కనుక యెహోవా ఆకానును బాధించాడు.) అందుకే
ఆ స్థలం ఆకోరు లోయ అని పిలువబడుతుంది. ఆ
తర్వాత యెహోవా ప్రజల మీద కోపగించలేదు.

### హాయి నాశనమగుట

8 అప్పుడు యెహోవా యెహోషువతో చెప్పాడు:
"భయపడకు. జడియకు. నీ యుద్ధ వీరులందరినీ
హాయి మీదికి నడిపించు. హాయి రాజును ఓడిం
చేందుకు నేను నీకు సహాయం చేస్తాను. అతని ప్రజల్ని,
అతని పట్టణాన్ని, అతని దేశాన్ని నేను నీకు ఇస్తున్నాను.

---

**ఆకోరు** అనగా "కష్టాలు" లేక "సమస్యలు" అని అర్థం.

2నీవు యెరికోకు, దాని రాజుకు చేసినట్టే హాయికి,
దాని రాజుకుగూడ చేస్తావు. ఈసారి మాత్రమే మీరు
ఐశ్వర్యాలన్నీ తీసుకొని మీకోసం దాచుకోవచ్చు. ఆ
ఐశ్వర్యాలను మీరు, మీ ప్రజలు పంచుకోండి. ఇప్పుడు
మీ సైనికులు కొందర్ని పట్టణం వెనుక మాటు
వేయమని చెప్పు."

3కనుక యెహోషువ తన సైన్యం అంతటినీ
హాయివైపు నడిపించాడు. తర్వాత మంచి పరాక్రమం
గల ముప్పయివేలమంది శూరులను యెహోషువ
ఏర్పాటు చేసుకొన్నాడు. అతడు వీళ్లందరినీ రాత్రి
పూట బయటకు పంపించాడు. 4యెహోషువ వారికి
ఇలా ఆజ్ఞాపించాడు: "నేను మీతో చెప్పేది జాగ్రత్తగా
వినండి. పట్టణం వెనుక ప్రాంతంలో మీరు దాక్కోవాలి.
దాడి చేయాల్సిన సమయంకోసం కనిపెట్టి ఉండాలి.
పట్టణానికి మరీ దూరంగా వెళ్లకండి. కనిపెడ్తూ, సిద్ధంగా
ఉండండి. 5నేను నాతో ఉన్న మనుష్యులను పట్టణం
మీదికి నడిపిస్తాను. పట్టణంలోపలి మనుష్యులు మాతో
యుద్ధం చేయటానికి బయటకు వస్తారు. మేము ఇదివ
రకువలెనే, వెనుదిరిగి వారి దగ్గర్నుండి పారిపోతాం.
6ఆ మనుష్యులు పట్టణం నుండి మమ్మల్ని తరుము
తారు. ఇదివరకువలెనే మేము వాళ్ల ఎదుట నుండి
పారిపోతున్నామని వారు అనుకొంటారు. కనుక మేము
పారిపోతాము. 7అప్పుడు మీరు దాగుకొన్న చోటు
నుండి బయటకు వచ్చి పట్టణాన్ని స్వాధీనం చేసు
కోవాలి. మీ యెహోవా దేవుడు మీరు గెలిచేందుకు
మీకు శక్తి ఇస్తాడు.

8"యెహోవా చెప్పినట్టే మీరు చేయాలి. నన్ను
గమనించండి. దాడి చేసేందుకు నేను మీకు ఆజ్ఞ
ఇస్తాను. మీరు పట్టణాన్ని స్వాధీనం చేసుకొన్న తర్వాత
మీరు దాన్ని కాల్చివేయాలి."

9అప్పుడు యెహోషువ, వారు దాగుకొనే
చోటుకు వారిని పంపించగా, బేతేలు, హాయికి మధ్యగల
ఒకచోటికి వారు వెళ్లారు. ఇది హాయికి పశ్చిమాన
ఉంది. ఆ రాత్రి యెహోషువ తన మనుష్యుల దగ్గరే
ఉండిపోయాడు.

10మరునాడు ఉదయాన్నే యెహోషువ పురుషు
లందరినీ సమావేశం చేసాడు. అప్పుడు యెహోషువ,
ఇశ్రాయేలు నాయకులు అందరినీ హాయి మీదికి నడి
పించారు. 11యెహోషువతో ఉన్న సైనికులందరూ
హాయి మీద దాడి చేశారు. ఆ పట్టణం ఎదుట వాళ్లు
ఆగిపోయారు. పట్టణానికి ఉత్తరాన సైన్యం బస
చేసింది. సైన్యానికినీ హాయికినీ మధ్య ఒక లోయ
ఉంది.

12అప్పుడు యెహోషువ ఐదువేల మంది పురు
షులను ఏర్పరచుకొన్నాడు. పట్టణానికి పశ్చిమంగా,
బేతేలుకు, హాయికి మధ్య ప్రాంతంలో దాగి ఉండమని
యెహోషువ వారిని పంపించాడు. 13కనుక యెహో
షువ తన మనుష్యుల్ని యుద్ధానికి సిద్ధం చేసాడు.
పట్టణానికి ఉత్తరాన ముఖ్యమైన బస ఉంది. మిగిలిన
వాళ్లు పడమటివైపు దాగుకొన్నారు. ఆ రాత్రి
యెహోషువ లోయలోనికి దిగి వెళ్లాడు.

14తర్వాత హాయి రాజు ఇశ్రాయేలు సైన్యాన్ని
చూసాడు. రాజు, అతని ప్రజలు లేచి, ఇశ్రాయేలు
సైన్యంతో యుద్ధం చేసేందుకు త్వరపడ్డారు. హాయి
రాజు పట్టణానికి తూర్పు దిశన బయటికి వెళ్లాడు.
కనుక పట్టణం వెనుకవైపు సైనికులు దాగి ఉన్న
విషయం అతనికి తెలియదు.

15యెహోషువ, అతనితో ఉన్న ఇశ్రాయేలీయులు
అందరూ హాయివారి చేత వెనుకకు నెట్టబడ్డారు.
యెహోషువ, అతని మనుష్యులు ఎడారివైపు తూర్పు
దిశగా పారిపోవటం మొదలుబెట్టారు. 16పట్టణంలో
ఉన్న ప్రజలు కేకలు వేస్తూ, యెహోషువను, అతని
మనుష్యులను తరమటం మొదలుబెట్టారు. ప్రజలంతా
పట్టణం వదలిపెట్టేసారు. 17హాయి, బేతేలు ప్రజలు
అంతా ఇశ్రాయేలు సైన్యాన్ని తరిమారు. పట్టణం
బాహాటంగా తెరచి ఉంది పట్టణాన్ని కాపాడేందుకు
ఎవరూ అక్కడ ఉండి పోలేదు.

18యెహోవా "నీ ఈటెను హాయి పట్టణం మీదికి
ఎత్తి పట్టుకో. ఆ పట్టణాన్ని నేను నీకు ఇస్తాను" అని
యెహోషువతో చెప్పాడు. కనుక యెహోషువ తన
ఈటెను హాయి పట్టణం మీదికి ఎత్తి పట్టుకొన్నాడు.
19దాగుకొన్న ఇశ్రాయేలు మనుష్యులు ఇది చూసారు.
వారు దాగుకొన్న చోటునుండి త్వరగా బయటకు
వచ్చి, పట్టణంవైపు త్వరగా బయల్దేరారు. వారు పట్ట
ణంలో ప్రవేశించి, దాన్ని స్వాధీనం చేసుకొన్నారు.
అప్పుడు సైనికులు ఆ పట్టణాన్ని కాల్చి వేసేందుకు
మంటలు పెట్టడం మొదలుపెట్టారు. 20హాయినుండి
వచ్చిన మనుష్యులు వెనుకకు తిరిగి చూడగా వారి
పట్టణం కాలిపోవటం కనుపించింది. పొగ ఆకాశానికి
ఎక్కటం వారు చూసారు. కనుక వారి బలం, ధైర్యం
క్షీణించిపోయాయి. వారు ఇశ్రాయేలీయులను తర
మటం మానివేసారు. ఇశ్రాయేలు మనుష్యులు పారిపో
వటం మానివేసారు. వారు వెనుకకు తిరిగి హాయి
మనుష్యులతో పోరాటానికి దిగారు. హాయి మనుష్యులు
పారిపోయేందుకు క్షేమకరమైన స్థలం ఏమీ లేకపో
యింది. 21యెహోషువ, అతని మనుష్యులు
అందరూ, వారి సైన్యం ఆ పట్టణాన్ని స్వాధీనం చేసు
కోవటం చూసారు. ఆ పట్టణంనుండి పొగ లేవటం
వారు చూసారు. అప్పటికే వారు పరుగెత్తటం మాని
వేసారు. వారు వెనుకకు తిరిగి హాయి మనుష్యుల
మీద పోరాటానికి పరుగెత్తారు. 22అప్పుడు దాగు కొని
యున్న మనుష్యులు పోరాటంలో సహాయం చేసేం
దుకు పట్టణంలోనుండి బయటకు వచ్చారు. హాయి
మనుష్యులకు రెండువైపులా ఇశ్రాయేలు సైన్యం

ఉంది. హాయి మనుష్యులు చిక్కులోపడ్డారు. ఇశ్రాయే
లీయులు వారిని ఓడించారు. హాయి మనుష్యుల్లో ఒక్క
రినిగూడ బ్రతకనీయకుండా, శత్రువు ఒక్కడూ
తప్పించుకోకుండా వారు పోరాడారు. 23అయితే హాయి
రాజును ప్రాణంతో ఉండనిచ్చారు. యెహోషువ మను
ష్యులు అతణ్ణి యెహోషువ దగ్గరకు తీసుకొచ్చారు.

### యుద్ధాన్ని గూర్చి ఆలోచించటం

24యుద్ధ సమయంలో హాయి మనుష్యుల్ని ఇశ్రా
యేలు సైన్యం పొలాల్లోనికి, ఎడారిలోనికి తరిమింది.
కనుక హాయి మనుష్యులందరినీ ఇశ్రాయేలు సైన్యం
చంపటం పూర్తి చేసింది. పొలాల్లో, ఎడారిలో ఉన్న
మనుష్యులను చంపటం వారు పూర్తి చేసారు. అప్పుడు
ఇశ్రాయేలు మనుష్యులంతా తిరిగి హాయి వెళ్లారు.
అప్పుడు ఆ పట్టణంలో ప్రాణంతో ఇంకా బతికి ఉన్న
వాళ్లందరినీ వారు చంపేసారు. 25హాయి పట్టణ ప్రజ
లంతా ఆ రోజునే చనిపోయారు. పన్నెండువేల మంది
పురుషులు, స్త్రీలు 26ఆ పట్టణాన్ని నాశనం చేసేందుకు
తన ప్రజలకు ఒక సంకేతంగా యెహోషువ తన
ఈటెను హాయి పట్టణం వైపు ఎత్తి పట్టుకొన్నాడు.
ఆ పట్టణంలోని ప్రజలు అందరూ నాశనం చేయ
బడేంతవరకు యెహోషువ ఆపు చేయలేదు.
27ఆ పట్టణ ప్రజలు కలిగియున్న వస్తువులను,
జంతువులను ఇశ్రాయేలు ప్రజలు తమ కోసం దాచు
కొన్నారు. యెహోషువకు యెహోవా ఆజ్ఞ ఇచ్చిన
ప్పుడు వారు ఇలా చేసేందుకు అనుమతి ఇచ్చాడు.
28అప్పుడు యెహోషువ హాయి పట్టణాన్ని కాల్చి
వేసాడు. ఆ పట్టణం ఒక పనికిమాలిన రాళ్ల కుప్ప
అయింది. నేటికీ అది అలానే ఉంది. 29హాయి రాజును
యెహోషువ ఒక చెట్టుకు ఉరితీసాడు. ఆ సాయంత్రం
వరకు అతణ్ణి అలానే ఆ చెట్టుకు వేలాడనిచ్చాడు.
సూర్యాస్తమయం అయినప్పుడు ఆ రాజు దేహాన్ని
చెట్టు మీదనుండి దించమని యెహోషువ తన మను
ష్యులకు ఆజ్ఞాపించాడు. పట్టణద్వారం దగ్గర వారు
అతని దేహాన్ని కింద పడవేసారు. తర్వాత వారు అతని
దేహాన్ని రాళ్ల గుట్టతో కప్పివేసారు. ఆ రాళ్ల కుప్ప
నేటికీ అక్కడ ఉంది.

### ఆశీర్వాదాలు మరియు శాపాలను చదవటం

30అప్పుడు యెహోషువ ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాకు ఒక బలిపీఠమును కట్టాడు. ఏబాలు
కొండమీద ఆ బలిపీఠాన్ని అతడు కట్టాడు. 31బలి
పీఠాలు కట్టడం ఎలా అనేది యెహోవా సేవకుడు
మోషే ఇశ్రాయేలు ప్రజలకు తెలియ జేసాడు. కనుక
మోషే ధర్మశాస్త్ర గ్రంథంలో వివరించబడిన ప్రకారం
యెహోషువ బలిపీఠాన్ని నిర్మించాడు. చెక్కబడని
రాళ్లతో బలిపీఠం కట్టబడింది. ఆ రాళ్లమీద ఎన్నడూ
ఏ పనిముట్టూ ప్రయోగించబడలేదు. ఆ బలిపీఠం
మీద వారు యెహోవాకు దహనబలి అర్పణలు అర్పిం
చారు. సమాధాన బలులు కూడ వారు అర్పించారు.
32ఆ స్థలంలోనే మోషే ధర్మశాస్త్రాన్ని యెహో
షువ రాళ్లమీద చెక్కాడు. ఇశ్రాయేలు ప్రజలంతా
చూసేందుకు వీలుగా అతడు ఇలా చేసాడు.
33పెద్దలు, అధికారులు, న్యాయమూర్తులు, ఇశ్రా
యేలు ప్రజలు అందరూ పవిత్ర పెట్టె చుట్టూ నిల
బడ్డారు. యెహోవా ఒడంబడిక పవిత్ర పెట్టెను
మోస్తున్న లేవీ యాజకుల ఎదుట వారు నిలబడ్డారు.
యూదా ప్రజలు, యూదులు కానివాళ్లు అందరూ
అక్కడ ఉన్నారు. సగం మంది ప్రజలు ఏబాలు కొండ
ఎదుటను, మిగిలిన సగం మంది ప్రజలు గెరిజీము
కొండ ఎదుటను నిలబడ్డారు. యెహోవా సేవకుడు
మోషే ప్రజలను ఆశీర్వదించినప్పటిలానే ఉంది
ఇప్పుడు కూడ. మోషే మొదటిసారి ఆశీర్వదించి
నప్పుడు ప్రజలు ఇలాగే నిలబడాలని అతడు చెప్పాడు.
34అప్పుడు యెహోషువ ధర్మశాస్త్రంలోని
మాటలు అన్నీ చదివాడు. ఆశీర్వాదాలను, శాపాలను
కూడ యెహోషువ చదివాడు. ధర్మశాస్త్రంలో రాయ
బడిన ప్రతిదీ ఉన్నది ఉన్నట్టుగా అతడు చదివాడు.
35ఇశ్రాయేలు ప్రజలంతా అక్కడ సమావేశం
అయ్యారు. స్త్రీలు, పిల్లలు, ఇశ్రాయేలు ప్రజల మధ్య
నివసించిన విదేశీయులు అందరూ అక్కడ ఉన్నారు.
మరియు మోషే ఇచ్చిన ప్రతి ఆజ్ఞనూ యెహోషువ
చదివాడు.

### గిబియోనులు యెహోషువకు చేసిన యుక్తి

9 యోర్దాను నదికి పశ్చిమాన ఉన్న రాజులు
అందరూ ఈ సంగతులు విన్నారు. హిత్తీ, అమోరీ,
కనానీ, పెరిజ్జీ, హివ్వీ, యెబూసీ ప్రజల రాజులు వీరు.
వారు కొండ దేశాల్లోనూ, మైదాన దేశాల్లోనూ నివ
సించారు. మధ్యధరా సముద్ర తీరంలో లెబానోను
వరకూ కూడ వారు నివసించారు. 2ఈ రాజులంతా
ఏకమయ్యారు. యెహోషువ మీద, ఇశ్రాయేలు ప్రజ
లతో యుద్ధం చేయటానికి వారు పథకాలు వేసారు.
3యెరికో, హాయి పట్టణాలను యెహోషువ
జయించిన విధానాన్ని గూర్చి గిబియోను పట్టణ
ప్రజలు విన్నారు. 4కనుక వారు ఇశ్రాయేలు ప్రజలను
మోసం చేయాలని నిర్ణయించారు. వారి పథకం ఇలా
ఉంది: పగిలిపోయి, చినిగిపోయిన పాత ద్రాక్షారసం
తిత్తులను వారు పోగుచేసారు. వారి జంతువుల వీపుల
మీద ఈ పాత ద్రాక్షారసపు తిత్తులను* వారు వేసారు.
వారు చాల దూరంనుండి ప్రయాణం చేసివచ్చినట్టు

---

**ద్రాక్షారసపు తిత్తులు** జంతువుల చర్మంతో చేసిన బుడ్డి.
ఈ బుడ్డిలో ద్రాక్షారసమును నింపి వుంచుతారు.

కనబడాలని ఆ పాత తిత్తులను అలా జంతువుల మీద
వేసారు. 5ఆ మనుష్యులు పాదాలకు పాత చెప్పులు
తొడుక్కొన్నారు. వాళ్లు పాత బట్టలు వేసుకొన్నారు.
ఎండిపోయి విరిగిపోతున్న పాత రొట్టె కొంత వారు
సంపాదించారు. అందుచేత ఆ మనుష్యులు చాలా
దూరంనుండి ప్రయాణం చేసివచ్చినట్టు కనబడ్డారు.
6అప్పుడు వాళ్లు ఇశ్రాయేలీయుల బసకు వెళ్లారు. ఈ
బస గిల్గాలు దగ్గర ఉంది.

ఆ మనుష్యులు యెహోషువ దగ్గరకు వెళ్లి, “మేము
చాల దూరదేశం నుండి ప్రయాణం చేసి వచ్చాము.
మేము మీతో శాంతి ఒడంబడిక చేసుకోవాలని కోరు
తున్నాం” అని అతనితో చెప్పారు.

7ఇశ్రాయేలు మనుష్యులు “ఒకవేళ మీరు మమ్మల్ని
మోసం చేయాలని చూస్తున్నారేమో. ఒకవేళ మీరు
మాకు దగ్గర్లోనే నివసిస్తున్నారేమో. మీరు ఎక్కడ్నుంచి
వచ్చిందీ మేము తెలుసుకొనేంతవరకు మేము మీతో
శాంతి ఒడంబడిక కుదుర్చుకోలేం” అని ఈ హివ్వీ
యుల వారితో చెప్పారు.

8హివ్వీ మనుష్యులు యెహోషువతో “మేము నీ
దాసులం” అన్నారు.

అయితే యెహోషువ, “మీరెవరు? మీరు ఎక్క
డ్నుంచి వచ్చారు?” అని అడిగాడు. 9అప్పుడు ఆ
మనుష్యులు ఇలా జవాబిచ్చారు, “మేము నీ దాసులము.
మేము చాల దూరదేశం నుండి వచ్చాం. మీ యెహోవా
దేవుని మహాశక్తిని గూర్చి మేము విన్నందుచేత మేము
వచ్చాము. ఆయన చేసిన కార్యాలను గూర్చి మేము
విన్నాము. ఈజిప్టులో ఆయన చేసిన వాటన్నింటిని
గూర్చి మేము విన్నాం. 10యోర్దాను నది తూర్పు
దిశనున్న అమోరీ రాజులు ఇద్దర్ని ఆయన ఓడించినట్టు
మేము విన్నాము. వాళ్లు అష్తారోతు దేశంలో హెష్బోను
రాజైన సీహోను, బాషాను రాజైన ఓగు.

11“కనుక మా నాయకులు, ప్రజలు మాతో
ఏమన్నారంటే, ‘మీ ప్రయాణానికి కావలసినంత
భోజనం మీతో తీసుకొని వెళ్లండి; వెళ్లి ఇశ్రాయేలు
ప్రజల్ని కలువండి. మేము మీ సేవకులం, మాతో
శాంతి ఒడంబడిక చేయండి అని వాళ్లతో చెప్పండి’
అన్నారు.”

12“మా రొట్టెలు చూడండి. మేము ఇల్లు విడిచి
నప్పుడు ఇది తాజాగా వేడిగా ఉండెను. అయితే ఇప్పుడు
ఇది ఎండిపోయి, పాసిపోవటం మీరు చూడగలరు.
13మా ద్రాక్షారసం తిత్తులను చూడండి. మేము ఇల్లు
విడిచినప్పుడు, అవి కొత్తవి, ద్రాక్షారసంతో నిండి
ఉండినాయి. ఇప్పుడు అవి పాతబడిపోయి, పిగిలిపోతూ
ఉండటం మీకు కనబడుతూనే ఉంది. మా బట్టలు,
చెప్పులు చూడండి. మా దూర ప్రయాణం వల్ల
మేము ధరించినవన్నీ దాదాపు పాడైపోవటం మీరు
చూస్తూనే ఉన్నారు.”

14ఈ మనుష్యులు చెప్పేది సత్యమో కాదో తెలు
సుకోవాలి అనుకొన్నారు ఇశ్రాయేలు మనుష్యులు.
కనుక వాళ్లు ఆ రొట్టెను రుచి చూసారు–కాని ఏమి
చేయాలనే విషయం వారు యెహోవాను అడుగలేదు.
15వాళ్లతో శాంతి ఒడంబడిక చేసుకొనేందుకు యెహో
షువ ఒప్పుకున్నాడు. వాళ్లను బతక నిచ్చేందుకు
అతడు అంగీకరించాడు. ఈ ఒడంబడికకు ఇశ్రాయేలు
నాయకులు ఒప్పుకున్నారు.

16మూడు రోజుల తర్వాత, ఆ మనుష్యులు వారి
గుడారాలకు చాల దగ్గర్లో నివసిస్తున్నవారేనని ఇశ్రా
యేలు ప్రజలు తెలుసుకొన్నారు. 17కనుక వాళ్లు నివసి
స్తున్న చోటుకు ఇశ్రాయేలు ప్రజలు వెళ్లారు. మూడవ
నాడు ఆ ప్రజలు నివసిస్తున్న గిబియోను, కెఫీరా,
బెయెరోతు, కిర్యత్యారీము పట్టణాలకు ఇశ్రాయేలు
ప్రజలు వెళ్లారు. 18కానీ ఇశ్రాయేలు సైన్యం ఆ పట్టణా
లమీద యుద్ధం చేయాలని ప్రయత్నించలేదు. వారు
ఆ ప్రజలతో శాంతి ఒడంబడిక కుదుర్చుకొన్నారు.
వారు ఇశ్రాయేలీయుల యెహోవా దేవుని ఎదుట ఆ
ప్రజలకు ప్రమాణం చేసారు.

ఆ ప్రమాణం చేసిన నాయకులను ప్రజలంతా
నిందించారు.

19అయితే నాయకులు జవాబు చెప్పారు: “మేము
మా వాగ్దానం చేసాము. ఇశ్రాయేలీయుల యెహోవా
దేవుని ఎదుట మేము ప్రమాణం చేసాము. ఇప్పుడు
మేము వాళ్లతో యుద్ధం చేయలేము. 20మనము ఇలా
చేయాలి. మనం వాళ్లను బతకనివ్వాలి. మనము వాళ్లకు
హాని చేయకూడదు, లేదా మనం వారితో చేసిన
ప్రమాణం ఉల్లంఘించిన కారణంగా యెహోవా కోపం
మనమీద ఉంటుంది. 21అందుచేత వాళ్లను బ్రతక
నిద్దాం. అయితే వాళ్లు మనకు బానిసలుగా ఉంటారు.
వాళ్లు మనకోసం కట్టెలు కొట్టి, మన ప్రజలందరి
కోసం నీరు మోస్తారు.” అందుచేత ఆ ప్రజలకు ఇచ్చిన
వాగ్దానాన్ని ఆ నాయకులు ఉల్లంఘించలేదు.

22గిబియోను ప్రజలను పిలిచాడు యెహోషువ.
“మీరు ఎందుకు మాతో అబద్ధం చెప్పారు? మీ దేశం
మా పాళెము పక్కనే ఉంది. కానీ మీరు చాలా దూర
దేశంనుండి వచ్చినట్టు మాతో చెప్పారు. 23ఇప్పుడు
మీ ప్రజలకు చాల కష్టాలు ఎదురవుతాయి. మీ ప్రజ
లంతా బానిసలుగా ఉంటారు. దేవుని ఆలయం కోసం
వాళ్లు కట్టెలు కొట్టాలి, నీరు మోయాలి” అని అతడు
చెప్పాడు.

24గిబియోనీ ప్రజలు జవాబు చెప్పారు: “మీరు
మమ్మల్ని చంపేస్తారని భయంతో మేము మీకు అబద్ధం
చెప్పాము. ఈ దేశం అంతా మీకు ఇచ్చేస్తానని దేవుడు
తన సేవకుడు మోషేతో చెప్పినట్టు మేము విన్నాము.
ఈ దేశంలో నివసిస్తున్న మనుష్యులందరినీ చంపి
వేయమనికూడా దేవుడు మీకు ఆజ్ఞాపించాడు. అందుకే

మేము మీతో అబద్ధం చెప్పాము. 25ఇప్పుడు మేము
మీకు దాసులం. మీకు సరియైనదిగా అనిపించిన
ప్రకారం మీరు మాకు ఏమైనా చేయవచ్చు." 26కనుక
గిబియోను ప్రజలు బానిసలు అయ్యారు. అయితే
యెహోషువ వారి ప్రాణాలు రక్షించాడు. ఇశ్రాయేలు
ప్రజలు వాళ్లను చంపకుండా చేసాడు యెహోషువ.
27యెహోషువ గిబియోను ప్రజలను ఇశ్రాయేలు
ప్రజలకు బానిసలుగా చేసాడు. ఇశ్రాయేలు ప్రజల
కోసం, యెహోవా బలిపీఠం ఎక్కడ ఉండాలని
యెహోవా కోరితే అక్కడ దానికోసం వారు కట్టెలు
నరికి, నీరు మోసారు. ఆ ప్రజలు నేటికీ బానిసలే.

### సూర్యుడు కదలక నిలచిన రోజు

10 అప్పట్లో అదోనీసెదెకు యెరూషలేము రాజు.
యెహోషువ హాయిని ఓడించి, దానిని సర్వ
నాశనం చేసాడని ఈ రాజు విన్నాడు. యెరికోకు,
దాని రాజుకుకూడా యెహోషువ అలానే చేసాడని
ఆ రాజు తెలుసుకొన్నాడు. గిబియోను ప్రజలు ఇశ్రా
యేలీయులతో శాంతి ఒడంబడిక చేసుకొన్నారని, ఆ
ప్రజలు యెరూషలేంకు సమీపంగానే నివసిస్తున్నారని
కూడా ఆ రాజు తెలుసుకొన్నాడు.

2అందుచేత ఈ విషయాల మూలంగా అదోనీ
సెదెక్, అతని ప్రజలు చాలా భయపడ్డారు. హాయివలె
గిబియోను చిన్న పట్టణం కాదు. ఏ రాజధాని పట్టణ
మైనా ఎంత పెద్దగా ఉంటుందో, గిబియోను అంత
పెద్ద పట్టణం. మరియు ఆ పట్టణంలోని పురుషులంతా
మంచి శూరులు. కనుక వారు భయపడ్డారు. 3యెరూష
లేము రాజు అదోనీసెదెక్, హెబ్రోను రాజైన
హోహాంతో మాట్లాడాడు. యార్మూత్ రాజైన పీరా
ముతో, లాకీషు రాజు యాఫీయతో, ఎగ్లోను రాజైన
దెబీరుతోకూడా అతడు మాట్లాడాడు. 4"మీరు నాతో
కూడా గిబియోను మీద దాడి చేసేందుకు వచ్చి
సహాయం చేయండి. యెహోషువతో, ఇశ్రాయేలు
ప్రజలతో గిబియోను శాంతి ఒడంబడిక కుదుర్చు
కొంది" అని యెరూషలేము రాజు వీళ్లను బతి
మిలాడాడు.

5అందుచేత ఈ అయిదుగురు అమోరీ రాజులూ
వారి సైన్యాలను ఏకం చేసారు. (అయిదుగురు రాజులు
ఎవరనగా, యెరూషలేము రాజు, హెబ్రోను రాజు,
యార్మూత్ రాజు, లాకీషు రాజు, ఎగ్లోను రాజు)
మరియు వారి సైన్యాలు గిబియోను మీదికి వెళ్లాయి.
ఆ సైన్యాలు పట్టణాన్ని చుట్టు ముట్టడించి, దానిమీద
పోరాటం మొదలుపెట్టాయి.

6గిల్గాలులో తన పాళెములో ఉన్న యెహోషువ
దగ్గరకు గిబియోను పట్టణంలోని ప్రజలు సందేశం
పంపించారు. "మేము నీ సేవకులము. మమ్మల్ని
ఒంటరిగా విడిచిపెట్టకు. వచ్చి మాకు సహాయం
చేయి. త్వరపడు. మమ్మల్ని రక్షించు. కొండ దేశం
లోని అమోరీ రాజులంతా వారి సైన్యాలను ఏకం
చేసారు. మామీద వాళ్లు యుద్ధం చేస్తున్నారు" ఇదీ
ఆ సందేశం.

7కనుక యెహోషువ తన సైన్యం అంతటితో
గిల్గాలునుండి బయల్దేరాడు. యెహోషువ యొక్క
మంచి శూరులంతా అతనితో ఉన్నారు. 8యెహోవా,
"ఆ సైన్యాల విషయమై భయపడకు. నీవు వాళ్లను
జయించేటట్టు నేను చేస్తాను. ఆ సైన్యాల్లో ఏదీ
నిన్ను జయించజాలదు" అని యెహోషువతో
చెప్పాడు.

9యెహోషువ, అతని సైన్యం రాత్రంతా గిబి
యోనుకు ప్రయాణం చేసారు. (యెహోషువ వస్తు
న్నట్టు శత్రువుకు తెలియదు.) అందుచేత యెహో
షువ వారిమీద దాడి చేసి వాళ్లకు ఆశ్చర్యం కలిగించాడు.

10ఇశ్రాయేలీయులు దాడి చేసినప్పుడు అవతలి
సైన్యాలను యెహోవా చాల గలిబిలి చేసాడు. కనుక
ఇశ్రాయేలీయులు గొప్ప విజయంతో వారిని ఓడిం
చారు. ఇశ్రాయేలీయులు గిబియోనునుండి వారిని
తరిమివేసారు. బేత్‌హోరోను మార్గంవరకు ఇశ్రాయేలీ
యులు వారిని తరిమివేసారు. అజెకా, మక్కేదా వరకు
ఇశ్రాయేలు సైన్యం ఆ మనుష్యుల్ని చంపారు. 11ఇశ్రా
యేలు సైన్యం వారి శత్రువుల్ని బెత్‌హోరాన్ నుండి
అజెకావరకు దారి పొడవునా తరిమారు. వారు శత్రు
వును తరుముతూ ఉండగా, యెహోవా ఆకాశంనుండి
పెద్ద వడగండ్లు కురిపించాడు. ఈ పెద్ద వడగండ్ల
మూలంగా శత్రువులు అనేకమంది చనిపోయారు. ఇశ్రా
యేలు ప్రజలు ఖడ్గంతో చంపిన వారికంటె ఈ వడ
గండ్ల మూలంగానే చాల ఎక్కువమంది మరణించారు.

12ఆ రోజు ఇశ్రాయేలు ప్రజలు అమోరీ ప్రజలను
ఓడించేటట్టుగా యెహోవా చేసాడు. మరియు ఆ
రోజు యెహోషువ ఇశ్రాయేలు ప్రజలందరి ఎదుట
నిలిచి యెహోవాతో ఇలా చెప్పాడు:

"ఓ సూర్యుడా, గిబియోనుకు పైగా ఆకా
శంలో నిలిచి ఉండు, ఓ చంద్రుడా, అయ్యా
లోను లోయలో నిలిచి ఉండు."

13కనుక సూర్యుడు కదలలేదు. ప్రజలు తమ శత్రు
వులను ఓడించేంతవరకు చంద్రుడు కూడ నిలిచి
పోయాడు. ఇది యాషారు గ్రంథంలో వ్రాయబడి
ఉంది. ఆకాశం మధ్యలో సూర్యుడు స్తంభించి
పోయాడు. ఒక రోజంతా అది కదల్లేదు. 14ఆ రోజుకు
ముందు ఎన్నడూ అలా జరుగలేదు. ఆ తర్వాత కూడ
ఎన్నడూ మళ్లీ అలా జరుగలేదు. ఆ రోజు మనిషి
మాట యెహోవా విన్నరోజు. నిజంగా ఇశ్రాయేలీ
యుల పక్షంగా యెహోవా యుద్ధం చేసాడు!

[15]ఇది జరిగిన తర్వాత యెహోషువా, అతని సైన్యం తిరిగి గిల్గాలు దగ్గర గుడారాలకు వెళ్లిపోయారు. [16]యుద్ధ సమయంలో ఆ అయిదుగురు రాజులూ పారిపోయారు. మక్కేదా సమీపంలో ఒక గుహలో వారు దాగుకొన్నారు. [17]అయితే ఆ అయిదుగురు రాజులు ఆ గుహలో దాగుకోవటం ఎవరో కనుక్కొన్నారు. యెహోషువకు ఈ విషయం తెలిసింది. [18]యెహోషువ చెప్పాడు, "ఆ గుహ ద్వారాన్ని పెద్ద బండలతో మూసివేయండి. ఆ గుహకు కాపలాగా కొందరు మనుష్యుల్ని అక్కడ ఉంచండి. [19]కానీ మీరు అక్కడ ఉండొద్దు. శత్రువును తరుముతూనే ఉండండి. వెనుకనుండి వారిమీద మీ దాడి కొనసాగించండి. శత్రువుల్ని తిరిగి వారి పట్టణాలకు క్షేమంగా వెళ్లనీయకండి. మీ యెహోవా దేవుడు వారిమీద మీకు విజయం ఇచ్చాడు."

[20]కనుక యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలూ శత్రువులను చంపేసారు. అయితే శత్రువులు కొందరు తప్పించుకొని, వారి పట్టణాలకు వెళ్లి దాగుకోగలిగారు. వీళ్లు చంపబడలేదు. [21]పోరాటం అయిపోయిన తర్వాత యెహోషువ మనుష్యులు మక్కేదా దగ్గర అతని దగ్గరకు తిరిగి వచ్చారు. ఇశ్రాయేలు ప్రజలకు వ్యతిరేకంగా ఒక్కమాట పలికే ధైర్యంగలవాళ్లు ఆ దేశంలో ఒక్కరూ లేకపోయారు.

[22]యెహోషువ చెప్పాడు, "గుహను మూసిన బండలను తీసివేసి, ఆ అయిదుగురు రాజులనూ నా దగ్గరకు తీసుకొని రండి" అని. [23]కనుక యెహోషువ మనుష్యులు ఆ అయిదుగురు రాజులనూ గుహలోనుండి బయటకు తీసుకొని వచ్చారు. ఈ అయిదుగురు రాజులూ యెరూషలేము రాజు, హెబ్రోను రాజు, యర్మూతు రాజు, లాకీషు రాజు, ఎగ్లోను రాజు. [24]కనుక ఆ ఐదుగురు రాజులనూ వారు యెహోషువ దగ్గరకు తీసుకొని వచ్చారు. యెహోషువ తన మనుష్యులందరినీ ఆ చోటుకి పిలిచాడు. "ఇక్కడికి వచ్చి, ఈ రాజుల మెడలమీద మీ పాదాలు పెట్టండి" అని తన సైన్యాధికారులతో యెహోషువ చెప్పాడు. అందుచేత యెహోషువ సైన్యాధికారులు దగ్గరగా వచ్చారు. వారు ఆ రాజుల మెడలమీద తమ పాదాలు పెట్టారు.

[25]అప్పుడు యెహోషువ: "బలంగా, ధైర్యంగా ఉండండి. భవిష్యత్తులో మీరు యుద్ధం చేసే శత్రువులందరికీ యెహోవా ఏమి చేస్తాడో నేను మీకు చూపిస్తాను" అన్నాడు తన మనుష్యులతో.

[26]అప్పుడు యెహోషువ ఆ అయిదుగురు రాజులనూ చంపేసాడు. అతడు వారి శరీరాలను ఐదు చెట్లకు వేలాడదీసాడు. యెహోషువ వాళ్లను అలానే సాయంత్రంవరకు చెట్లకు వేలాడనిచ్చాడు. [27]సూర్యాస్తమయమప్పుడు ఆ శవాలను చెట్లనుండి దించమని యెహోషువ తన మనుష్యులతో చెప్పాడు. అప్పుడు వారు ఆ శవాలను, అంతకు ముందు వారు దాగుకొన్న గుహలోనే పడవేసారు. ఆ గుహ ద్వారాన్ని పెద్ద బండలతో వారు మూసివేసారు. నేటికీ ఆ శవాలు ఆ గుహలోనే ఉన్నాయి.

[28]ఆ రోజు యెహోషువ మక్కేదాను జయించాడు. ఆ పట్టణంలోని రాజును, ప్రజలను యెహోషువ చంపేసాడు. మనుష్యులు ఎవ్వరూ ప్రాణాలతో విడిచి పెట్టబడలేదు. యెరికో రాజుకు చేసినట్టే మక్కేదా రాజుకు యెహోషువ చేసాడు.

### దక్షిణ ప్రాంతాలను ఓడించటం

[29]అప్పుడు యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలు అందరూ మక్కేదానుండి ప్రయాణం చేసారు. వారు లిబ్నా వెళ్లి ఆ పట్టణంపై దాడి చేసారు. [30]ఆ పట్టణాన్ని, దాని రాజును ఇశ్రాయేలు ప్రజలు ఓడించేటట్టుగా యెహోవా చేసాడు. ఆ పట్టణంలో ఉన్న ప్రతి వ్యక్తినీ ఇశ్రాయేలు ప్రజలు చంపివేసారు. మనుష్యులెవ్వరూ ప్రాణాలతో విడువబడలేదు. మరియు ప్రజలు యెరికో రాజుకు చేసినట్టే ఆ రాజుకుకూడ చేసారు.

[31]అప్పుడు యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలు అందరూ లిబ్నా విడిచి, లాకీషుకు ప్రయాణమయ్యారు. యెహోషువ, అతని సైన్యం లిబ్నా దగ్గర్లోనే ఉండి, ఆ పట్టణం మీద దాడి చేసారు. [32]ఇశ్రాయేలు ప్రజలు లాకీషు పట్టణాన్ని ఓడించేటట్టుగా యెహోవా చేసాడు. వారు ఆ పట్టణాన్ని రెండో రోజున ఓడించారు. ఆ పట్టణంలో ప్రతి వ్యక్తినీ ఇశ్రాయేలు ప్రజలు చంపేసారు. లిబ్నాకు అతడు చేసిందికూడ ఇదే. [33]ఇదే సమయంలో గెజెరు రాజైన హోరాము, లాకీషుకు సహాయం చేసేందుకు వచ్చాడు. కానీ అతణ్ణి, అతని సైన్యాన్ని కూడ యెహోషువ ఓడించాడు. అక్కడ మనుష్యులు ఎవరూ బతికి బయటపడలేదు.

[34]అప్పుడు యెహోషువ, అతని ప్రజలు అందరూ లాకీషునుండి ఎగ్లోనుకు ప్రయాణ మయ్యారు. వారు ఎగ్లోను చుట్టు పక్కల బసచేసి దానిమీద దాడిచేసారు. [35]ఆ రోజు వారు ఆ పట్టణాన్ని పట్టుకొని, ఆ పట్టణంలో ప్రజలందరినీ చంపేసారు. వారు లాకీషుకు చేసిందికూడ ఇదే.

[36]అప్పుడు యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలు అందరూ ఎగ్లోను నుండి హెబ్రోనుకు ప్రయాణ మయ్యారు. అప్పుడు వారు హెబ్రోను మీద దాడి చేసారు.

[37]ఆ పట్టణాన్ని, హెబ్రోను చుట్టుపట్ల ఉన్న చిన్న చిన్న ఊళ్లను వారు పట్టుకొన్నారు. ఆ పట్టణంలో ప్రతి ఒక్కరినీ ఇశ్రాయేలు ప్రజలు చంపేసారు. అక్కడ ఏ ఒక్కరినీ వారు బ్రతకనియ్యలేదు. వారు ఎగ్లోనుకు చేసింది కూడ ఇదే. వారు ఆ పట్టణాన్ని నాశనంచేసి, అందులోని ప్రజలందరినీ చంపివేసారు.

38అప్పుడు యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలు అందరూ తిరిగి దెబీరుకు వెళ్లి, ఆ పట్టణం మీద దాడి చేసారు. 39వారు ఆ పట్టణాన్ని, దాని రాజును, దెబీరు సమీపంలోవున్న చిన్నచిన్న పట్టణాలన్నింటినీ స్వాధీనం చేసుకొన్నారు. ఆ పట్టణంలో ప్రతి ఒక్కరినీ వారు చంపేసారు. అక్కడ ఎవరినీ బ్రతకనియ్యలేదు. హెబ్రోనుకు, దాని రాజుకు చేసినట్టే, దెబీరుకు, దాని రాజుకు ఇశ్రాయేలు ప్రజలు చేసారు. లిబ్నాకు, దాని రాజుకు కూడ వారు ఇలానే చేసారు.

40కనుక నెగెవు, కొండ ప్రాంతపు పట్టణాల రాజులందరినీ, పడమటి కొండ చరియలనూ, తూర్పు కొండ చరియలనూ, యెహోషువ ఓడించేసాడు. ఆ ప్రజలందరినీ చంపివేయుమని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా యెహోషువతో చెప్పాడు. అందుచేత ఆ స్థలాల్లో ఎవ్వరినీ యెహోషువ ప్రాణాలతో విడిచిపెట్టలేదు. 41కాదేషు బర్నేయనుండి గాజా వరకుగల పట్టణాలన్నింటినీ యెహోషువ స్వాధీనం చేసుకొన్నాడు. గోషేను (ఈజిప్టు) దేశం నుండి గిబియోను వరకుగల పట్టణాలన్నింటినీ అతడు స్వాధీనం చేసుకొన్నాడు. 42ఆ ప్రయాణంలో ఆ పట్టణాలన్నింటినీ, వాటి రాజులందరినీ యెహోషువ పట్టుకొన్నాడు. ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా ఇశ్రాయేలీయుల పక్షంగా యుద్ధం చేసినందువల్ల యెహోషువ ఇలా చేయగలిగాడు. 43అప్పుడు యెహోషువ, ఇశ్రాయేలు ప్రజలు అందరు గిల్గాలు లోని వారి గుడారాలకు తిరిగి వెళ్లారు.

### ఉత్తర ప్రాంతాలను వశపర్చుకొనటం

11 జరిగిన ఈ సంగతులు అన్నింటిని గూర్చి హాసోరు రాజు యాబీను విన్నాడు. అందుచేత అతడు అనేకమంది రాజుల సైన్యాలను సమకూర్చాలని నిర్ణయించాడు. మదోను రాజైన యోబాబు, షిమ్రోను రాజు, అక్షపు రాజు, 2ఉత్తరాన కొండదేశం, ఎడారి రాజులు ఇద్దరికి యాబీను సందేశం పంపించాడు. కిన్నెరెత్, నెగెవ్, పడమటి దిగువ కొండల రాజులకు యాబీను సందేశం పంపించాడు. పడమట నఫోత్‌దార్ రాజుకుగూడ యాబీను సందేశం పంపించాడు. 3యాబీను ఆ సందేశాన్ని తూర్పు, పడమరలలో ఉన్న కనానీ ప్రజల రాజులకు పంపించాడు. కొండ ప్రదేశాల్లో నివసిస్తున్న అమోరీ ప్రజలకు, హిత్తీ ప్రజలకు, పెరిజ్జీ ప్రజలకు, యెబూసీ ప్రజలకు పంపించాడు. మిస్పా ప్రాంతంలో హెర్మోను కొండ దిగువలో నివసిస్తున్న హివ్వీ ప్రజలకుగూడ అతడు ఆ సందేశం పంపించాడు. 4కనుక ఈ రాజులందరి సైన్యాలు కూడి వచ్చాయి. అక్కడ ఎంతోమంది శూరులు ఉన్నారు, ఎన్నో రథాలు, ఎన్నో గుర్రాలు ఉన్నాయి. అది అతి విస్తారమైన సైన్యం. సముద్ర తీరంలో ఇసుక రేణువులు ఎన్ని ఉంటాయో అంతమంది ఉన్నట్టున్నారు. 5ఈ రాజులంతా మెరోము అనే చిన్న నది దగ్గర సమావేశమయ్యారు. వారు తమ సైన్యాలను ఒకే చోట చేర్చారు. ఇశ్రాయేలీయుల మీద పోరాడేందుకు వారు ఏర్పాట్లు చేసారు.

6అప్పుడు యెహోవా, "ఆ సైన్యాన్ని చూచి భయపడకు. రేపు ఈ వేళకు మీరు ఆ సైన్యాన్ని ఓడించేటట్టు నేను చేస్తాను. వాళ్లందరినీ మీరు చంపేస్తారు. మీరు వారి గుర్రాల కుడికాళ్ల నరాలను నరికివేసి, వారి రథాలను తగులబెట్టేస్తారు" అని యెహోషువతో చెప్పాడు.

7యెహోషువ, అతని సర్వసైన్యం శత్రువును ఆశ్చర్యచకితులుగా చేసారు. మెరోము నది వద్ద వారు శత్రువుమీద దాడి చేసారు. 8ఇశ్రాయేలీయులు వారిని ఓడించేటట్టు చేసాడు యెహోవా. ఇశ్రాయేలీయులు వారిని ఓడించి, మహా సీదోను, మిస్రెపోత్మాయిము, తూర్పున మిస్పాలోయ వరకు వారిని తరిమివేసారు. శత్రువులలో ఒక్కరుకూడ బతకకుండా చచ్చేవరకు ఇశ్రాయేలు సైన్యం పోరాడింది. 9యెహోషువ ఏమి చేయాలని యెహోవ చెప్పాడో అతడు అలాగే చేసాడు-యెహోషువ వారి గుర్రాల కుడికాళ్ల నరాలను తెగగొట్టి, వారి రథాలను కాల్చివేసాడు.

10అప్పుడు యెహోషువ వెనుకకు వెళ్లి హాసోరు పట్టణాన్ని పట్టుకొన్నాడు. హాసోరు రాజును యెహోషువ చంపివేసాడు. (ఇశ్రాయేలీయుల మీద యుద్ధం చేసిన రాజ్యాలన్నింటికీ హాసోరు నాయకుడు) 11ఆ పట్టణంలో ప్రతి ఒక్కరినీ ఇశ్రాయేలు సైన్యం చంపేసింది. వారు ఆ ప్రజలందరినీ పూర్తిగా నాశనం చేసారు. ప్రాణంతో ఏదీ విడువబడలేదు. అప్పుడు వారు ఆ పట్టణాన్ని కాల్చివేసారు.

12ఈ పట్టణాలన్నింటినీ యెహోషువ పట్టుకొన్నాడు. వాటి రాజులందరినీ అతడు చంపివేసాడు. ఆ పట్టణాల్లో ఉన్న సమస్తాన్నీ పూర్తిగా యెహోషువ నాశనం చేసాడు. యెహోవా సేవకుడు మోషే ఆజ్ఞాపించినట్టే అతడు ఇలా చేసాడు. 13కానీ వారి కొండల మీద కట్టబడిన పట్టణాలలోని ఒక్కటికూడ ఇశ్రాయేలు సైన్యం కాల్చివేయలేదు. వారు కాల్చివేసిన కొండ మీది పట్టణం హాజోరు మాత్రమే. ఇది యెహోషువ కాల్చిన పట్టణం. 14ఈ పట్టణాల్లో దొరికిన వాటన్నింటినీ ఇశ్రాయేలు ప్రజలు వారికోసమే ఉంచుకొన్నారు. ఆ పట్టణంలోని జంతువులన్నింటినీ వారే ఉంచుకొన్నారు. కానీ అక్కడ ప్రజలను అందరినీ చంపివేసారు. మనుష్యులు ఎవరినీ వారు బ్రతకనివ్వలేదు. 15ఇలా చేయుమని చాలకాలం క్రితమే యెహోవా మోషేకు ఆజ్ఞాపించాడు. ఇలా చేయుమని మోషే యెహోషువకు ఆజ్ఞాపించియున్నాడు. కనుక యెహోషువ దేవునికి విధేయుడయ్యాడు. యెహోవ

మోషేకు ఆజ్ఞాపించిన సమస్తాన్ని యెహోషువ
జరిగించాడు.
16కనుక ఈ దేశం అంతటిలో ఉన్న ప్రజలందరినీ
యెహోషువ ఓడించాడు. కొండదేశం, నెగెవు
ప్రాంతం, గోషెను ప్రాంతం అంతాను, పడమటి
కొండల దిగువ ప్రాంతం, అరాబా ప్రాంతం, ఇశ్రాయేలు
పర్వతాలు, వాటి దగ్గర్లో ఉన్న కొండలు అన్నింటిమీదా
అతడు ఆధిపత్యం కలిగి ఉన్నాడు. 17శేయీరు దగ్గర
హాలాకు కొండ నుండి హెర్మోను కొండ దిగువన
లెబానోను లోయలో బయల్గాదు వరకు ఉన్న దేశం
అంతా యెహోషువ స్వాధీనంలో ఉంది. ఆ దేశంలోని
రాజులందరినీ యెహోషువ పట్టుకొని చంపివేసాడు.
18యెహోషువ ఆ రాజులతో చాల సంవత్సరాలు
యుద్ధం చేసాడు. 19ఆ దేశం మొత్తంలో ఒక్క పట్టణం
మాత్రమే ఇశ్రాయేలీయులతో శాంతి ఒడంబడిక చేసు
కొంది. గిబియోనులో నివసిస్తున్న హివ్వీ ప్రజలే వారు.
మిగతా పట్టణాలన్నీ యుద్ధంలో ఓడించబడ్డాయి. 20ఆ
ప్రజలు తాము చాలా బలంగల వాళ్లమని అనుకోవాలనే
యెహోవా కోరాడు. అప్పుడే వారు ఇశ్రాయేలీయుల
మీద యుద్ధం చేస్తారు. ఈ విధంగా ఆయన వారిని
నిర్దాక్షిణ్యంగా నాశనం చేయనిచ్చాడు. మోషే ఏమి
చేయాలని యెహోవా ఆజ్ఞాపించాడో అలాగే ఆయన
వారిని నాశనం చేయబడనిచ్చాడు.
21హెబ్రోను, దెబీరు, అనాబు, యూదా ప్రాంతా
ల్లోను, కొండదేశంలోను అనాకీ ప్రజలు* నివ
సించారు. ఈ అనాకీ ప్రజలతో యెహోషువ యుద్ధం
చేసాడు. ఆ ప్రజలందరినీ, వారి పట్టణాలను యెహో
షువ పూర్తిగా నాశనం చేసాడు. 22ఇశ్రాయేలు దేశంలో
అనాకీ ప్రజలు ఎవ్వరూ ప్రాణంతో మిగుల లేదు.
మిగిలిన అనాకీ ప్రజలు గాజా, గాతు, అష్డోదులలో
నివసించారు. 23ఇశ్రాయేలు దేశం అంతటినీ యెహో
షువ స్వాధీనం చేసుకొన్నాడు. చాలా కాలం క్రిందట
యెహోవ మోషేకు చెప్పింది ఇదే. యెహోవా
వాగ్దానం చేసినందువల్ల ఆయన ఆ దేశాన్ని ఇశ్రాయేలీ
యులకు ఇచ్చాడు. యెహోషువ ఆ దేశాన్ని ఇశ్రా
యేలు వంశాలకు పంచిపెట్టాడు. అప్పుడు యుద్ధం
ముగిసింది. చివరికి దేశంలో శాంతి నెలకొంది.

### ఇశ్రాయేలీయులచే ఓడింపబడిన రాజులు

12 యోర్దాను నదికి తూర్పున ఉన్న దేశాన్ని
ఇశ్రాయేలు ప్రజలు స్వాధీనం చేసుకొన్నారు.
అర్నోను లోయనుండి హెర్మోను కొండవరకు, అరా
బాకు తూర్పు ప్రాంతాన గల భూమి అంతా ఇప్పుడు
వారిదే. ఈ భూమిని స్వాధీనం చేసుకొనేందుకు ఇశ్రా
యేలు ప్రజలు ఓడించిన రాజుల జాబితా ఇది:
2హెష్బోను పట్టణంలో నివసిస్తున్న అమోరీ ప్రజల
రాజు సీహోను, అర్నోను లోయవద్ద అరోయేరు
నుండి యబ్బోకు నదివరకుగల దేశం అంతా అతడు
పాలించాడు. ఆ లోయ మధ్యనుండి అతడి దేశం
మొదలవుతుంది. అమ్మోనీ ప్రజలకు, వారికి ఇది
సరిహద్దు. గిలాదులోని సగం భూమిని సీహోను పాలిం
చాడు. 3అరాబా తూర్పు ప్రాంతంలో కిన్నెరెతు సము
ద్రంనుండి అరాబా సముద్రం (ఉప్పు సముద్రం) వరకు
అతడు పాలించాడు. బెత్ ఎషిమోతు నుండి దక్షిణాన
పిస్గా కొండల వరకు అతడు పాలించాడు.
4బాషాను రాజు ఓగు రెఫాయిము సంతతివాడు.
అష్టారోతు, ఎద్రేయిలో ఓగు దేశాన్ని పాలించాడు.
5హెర్మోను కొండ, సలెకా, బాషాను ప్రాంతం అంతా
ఓగు పాలించాడు. గెషూరు, మాక ప్రజలు నివసించిన
చోట అతని దేశం సరిహద్దు. గిలాదులో సగం భూభా
గాన్ని కూడ ఓగు పాలించాడు. హెష్బోను రాజు
సీహోను భూమికి ఈ భూమి సరిహద్దు.
6యెహోవా సేవకుడు మోషే, ఇశ్రాయేలు ప్రజలు
ఈ రాజులందరినీ ఓడించారు. మరియు ఆ భూమిని
రూబేను వంశం, గాదు వంశం మనష్షే వంశంలో సగం
భాగానికి మోషే ఇచ్చాడు. ఈ భూమిని వారికి
స్వంతంగా ఇచ్చేసాడు మోషే.
7యోర్దాను నదికి పశ్చిమాన ఉన్న దేశంలోని
రాజులందరినీ కూడ ఇశ్రాయేలు ప్రజలు ఓడించారు.
ఈ దేశంలో ప్రజలను యెహోషువ నడిపించాడు.
ఈ దేశాన్ని యెహోషువ ప్రజలకు ఇచ్చి, పన్నెండు
వంశాల వారికి దీనిని పంచిపెట్టాడు. ఇది వారికి ఇస్తానని
దేవునిచే వాగ్దానం చేయబడిన దేశం లెబానోను
లోయలోని బయెల్‌గాదుకు శేయీరు దగ్గర హాలాకు
కొండకు మధ్య ఉంది ఈ భూమి. 8కొండ దేశం,
పశ్చిమాన పడమటి కొండ దిగువ, అరాబా, పర్వతాలు,
ఎడారి, నెగెవు దీనిలో ఉన్నాయి. హిత్తీ ప్రజలు, అమోరీ
ప్రజలు, కనానీ ప్రజలు, పెరిజ్జీ ప్రజలు, హివ్వీ ప్రజలు,
యెబూసీ ప్రజలు నివసించిన దేశం ఇది. ఇశ్రాయేలు
ప్రజలు ఓడించిన రాజుల జాబితా ఇది:

| | | |
|---|---|---|
| 9 | యెరికో రాజు | 1 |
| | బేతేలు దగ్గర నున్న హాయి రాజు. | 1 |
| 10 | యెరూషలేము రాజు. | 1 |
| | హెబ్రోను రాజు. | 1 |
| 11 | యార్మూతు రాజు. | 1 |
| | లాకీషు రాజు. | 1 |
| 12 | ఎగ్లోను రాజు. | 1 |
| | గెజెరు రాజు. | 1 |
| 13 | దెబీరు రాజు. | 1 |
| | గెదెరు రాజు. | 1 |

---

**అనాకీ ప్రజలు** అనాకీయుని వంశీయులు. వారు భారీకా
యులు, పొడుగాటి వారు. మరియు వారు గొప్ప యోధు
లుగా ప్రసిద్ధి చెందినవారు. సంఖ్యా.13:33 చూడండి.

| | | |
|---|---|---|
| 14 | హోర్మా రాజు. | 1 |
| | అరాదు రాజు. | 1 |
| 15 | లిబ్నా రాజు. | 1 |
| | అదుల్లాం రాజు. | 1 |
| 16 | మక్కేద రాజు. | 1 |
| | బేతేలు రాజు. | 1 |
| 17 | తపువ రాజు. | 1 |
| | హెపెరు రాజు. | 1 |
| 18 | అఫెకు రాజు. | 1 |
| | లాషారోను రాజు. | 1 |
| 19 | మదోను రాజు. | 1 |
| | హాజోరు రాజు. | 1 |
| 20 | షిమ్రోన్ మెరోన్. | 1 |
| | అక్షపు రాజు. | 1 |
| 21 | తానాకు రాజు. | 1 |
| | మెగిద్దో రాజు. | 1 |
| 22 | కెదెషు రాజు. | 1 |
| | కర్మెలులోని యొకెనం రాజు. | 1 |
| 23 | దోరు పర్వతంలో దోరు రాజు. | 1 |
| | గిల్గాలులోని గోయిం రాజు. | 1 |
| 24 | తిర్సా రాజు. | 1 |
| | మొత్తం రాజులు (ముప్పై ఒకటి) | 31 |

### ఇంకా స్వాధీన పరచుకొనని భూమి

13 యెహోషువ చాల ముసలివాడైనప్పుడు
యెహోవా అతనితో చెప్పాడు: “యెహో
షువా, నీవు ముసలివాడవైపోయావు. కానీ నీవు
స్వాధీనం చేసుకోవాల్సిన భూమి ఇంకా చాలా ఉంది.
2ఫిలిష్తీయుల దేశాన్ని, గెషూరు దేశాన్ని నీవు ఇంకా
స్వాధీనం చేసుకోలేదు. 3ఈజిప్టు దగ్గర షీహోరు నది*
నుండి ఉత్తరాన ఎక్రోను సరిహద్దు వరకు గల
ప్రాంతాన్ని నీవు ఇంకా స్వాధీనం చేసుకోలేదు. అది
కనానీ ప్రజలకు చెందినది. గాజా, అష్డోదు, అష్కెలోను,
గాతు, ఎక్రోనుల ఐదుగురు ఫిలిష్తీ నాయకులను ఇంకా
నీవు జయించాలి. నీవు అవ్వీతీ ప్రజలను, 4కనాను
దేశానికి దక్షిణాన ఉన్న వారిని కూడ నీవు ఓడించాలి.
5గెబాలీ ప్రజల ప్రాంతాన్ని నీవు ఇంకా ఓడించలేదు.
హెర్మోను కొండ దిగువన బయెల్గాదుకు తూర్పున
లిబోహ- మాత్ వరకు గల లెబానోను ప్రాంతం కూడ
ఉంది.
6“లెబానోనునుండి మిశ్రేఫోత్మాయిము వరకూ గల
కొండ దేశంలో సీదోను ప్రజలు నివసిస్తున్నారు.
అయితే ఇశ్రాయేలు ప్రజల కోసం ఈ ప్రజలందరినీ
నేను బయటకు వెళ్లగొట్టేస్తాను. ఇశ్రాయేలు ప్రజలకు
నీవు భూమిని పంచిపెట్టేటప్పుడు ఈ భూమిని తప్పక
జ్ఞాపకం ఉంచుకో. నేను నీకు చెప్పినట్టు ఇలానే చేయి.
7ఇప్పుడు తొమ్మిది వంశాలు, మనష్షే సగం వంశం
వారికి ఈ భూమిని విభజించు.”

### భూమిని పంచటం

8మనష్షే వంశంలో మిగిలిన సగం మందికి ఇదివరకే
నేను భూమి ఇచ్చాను. రూబేను వంశం వారికి, గాదు
వంశం వారికి నేను ఇదివరకే భూమిని ఇచ్చాను.
యొర్దాను నది తూర్పున యెహోవా సేవకుడు మోషే
వారికి భూమిని ఇచ్చాడు. 9యొర్దాను నది తూర్పున
మోషే వారికి ఇచ్చిన భూమి ఇదే: దీబోను వరకు
గల మేదెబా మైదాన ప్రాంతం అంతా ఇందులో ఉంది.
అర్నోను లోయదగ్గర అరోయేరు వద్ద ఈ భూమి
మొదలవుతుంది, ఆ లోయ మధ్యలోగల పట్టణం
వరకు ఆ భూమి విస్తరించి ఉంది. 10అమోరీ ప్రజల
రాజు సీహోను పాలించిన పట్టణాలన్నీ ఆ దేశంలో
ఉన్నాయి. రాజు హెష్బోను పట్టణంలో ఉండి పాలిం
చాడు. అమోరీ ప్రజలు నివసించిన ప్రాంతం వరకు
ఈ దేశం విస్తరించింది. 11గిలాదు పట్టణం కూడ ఆ
దేశంలో ఉంది. గెషూరు, మాయకా ప్రజలు నివసించిన
ప్రాంతంకూడ ఆ దేశంలో ఉంది. హెర్మోను పర్వతం
అంతా, సల్కావరకు బాషాను అంతా ఆ దేశంలో
ఉంది. 12ఓగు రాజు రాజ్యమంతా ఆ దేశంలో ఉంది.
ఓగు రాజు బాషానులో పాలించాడు. గతంలో అతడు
అష్టారోతు, ఎద్రేయీలో పాలించాడు. ఓగు రెఫా
యిము ప్రజలనుండి వచ్చినవాడు. గతంలో మోషే
ఆ ప్రజలను ఓడించి, వారి దేశాన్ని స్వాధీనం చేసు
కున్నాడు. 13గెషూరు, మయకా ప్రజలను ఇశ్రాయేలు
ప్రజలు బలవంతంగా బయటకు వెళ్లగొట్టలేదు. నేటికీ
ఆ ప్రజలు ఇశ్రాయేలు ప్రజల మధ్య నివసిస్తున్నారు.
14లేవీ వంశం ఒక్కటే భూమి ఏమీ లభించని
కుటుంబం. దానికి బదులుగా, ఇశ్రాయేలీయుల
యెహోవా దేవునికి దహన బలులుగా అర్పించబడిన
జంతువులన్నీ లేవీ కుటుంబంవారు తీసుకుంటారు.
అదే యెహోవా వారికి వాగ్దానం చేసింది.
15రూబేను వంశంలో ప్రతి వంశంవారికీ మోషే
కొంత భూమి ఇచ్చాడు. వారికి దొరికిన భూమి ఇది:
16అర్నోను లోయదగ్గర అరోయేరునుండి మేదెబా
పట్టణంవరకు గల భూమి. ఆ లోయ మధ్యలో ఉన్న
పట్టణం, మైదానం మొత్తం ఇందులో ఉంది.
17హెష్బోను వరకు ఉంది ఈ భూమి. మైదానంలోని
పట్టణాలన్నీ ఈ భూమిలో ఉన్నాయి. ఆ పట్టణాలు
దీబోను, బామోత్ బయలు, బేత్బయల్మెయోను,
18యహజ్, కెదెమోతు, మేఫాతు, 19కిర్యతాయిము,
సిబ్మా లోయలోని కొండమీది యెరెత్ షహరు,

**షీహోరు నది** బహుశా నైల్ నది తూర్పు ప్రాంత విభాగాలలో ఒకటి కావచ్చు.

20బెత్పెయోరు, పిస్గాకొండలు, బెత్ యెషిమోత్.
21కనుక మైదానంలోని అన్ని పట్టణాలు, అమోరీ ప్రజల
రాజు సీహోను పాలించిన ప్రాంతం అంతా ఈ
భూమిలో ఉంది. ఆ రాజు హెష్బోను పట్టణం దగ్గర
పాలించాడు. అయితే అతణ్ణి, మిద్యాను ప్రజానాయకు
లను మోషే ఓడించాడు. ఆ నాయకులు ఎవి, రెకెము,
సూర్, హూరు, రెబా. (ఈ నాయకులంతా సీహో
నుతో చేయి కలిపి పోరాడారు) ఈ నాయకులంతా
ఆ దేశంలోనే నివసించారు. 22బెయోరువాడైన బిలా
మును ఇశ్రాయేలు ప్రజలు చంపారు. (బిలాము భవి
ష్యత్తును గూర్చి చెప్పేందుకు మంత్రాలు వేసేవాడు)
ఆ పోరాటంలో ఇశ్రాయేలు ప్రజలు చాలమందిని చంపే
సారు. 23రూబేనుకు ఇచ్చిన భూమికి యోర్దాను నదీ
తీరం సరిహద్దు. కనుక రూబేను వంశం వారికి ఇవ్వబడిన
భూమిలో ఈ పట్టణాలు, పొలాలు అన్నీ చేర్చ
బడ్డాయి. 24గాదు వంశం వారికి మోషే ఇచ్చిన భూమి
ఇది. ప్రతి ఒక్క వంశానికీ ఈ భూమిని మోషే ఇచ్చాడు.
25యాజెరు భూమి, గిలాదు పట్టణాలు అన్నీ,
రబ్బాతు దగ్గర అరోయేరు వరకూ గల అమ్మోనీ
ప్రజల భూమిలో సగం మోషే వారికి ఇచ్చాడు.
26హెష్బోను నుండి రామత్ మిస్పా, బెటోనీము వరకూ
గల భూమి ఇందులో ఉంది. మహనయిము నుండి
దెబీరువరకు గల ప్రాంతం అంతా ఈ భూమిలో
ఉంది. 27బేతారాము, బెత్నిమ్రా, సుక్కోతు, సఫోను
లోయ ఈ భూమిలో ఉన్నవే. హెష్బోను రాజు
సీహోను పాలించిన మిగిలిన భూమి అంతా ఇందులో
ఉంది. ఇది యోర్దాను నదికి తూర్పున ఉన్న భూమి.
కిన్నెరెతు సముద్రం చివరివరకు ఈ భూమి విస్తరించి
ఉంది. 28ఈ భూమి అంతా గాదు వంశానికి మోషే
ఇచ్చినది. ఈ జాబితాలో చేర్చబడిన పట్టణాలు అన్నీ
ఈ భూమిలో ఉన్నాయి. ఒక్కో వంశానికి ఆ భూమిని
మోషే ఇచ్చాడు.

29మనష్షే వంశంలో సగం మందికి మోషే ఇచ్చిన
భూమి ఇదే. మనష్షే వంశంలోని సగం వంశాలు ఈ
భూమిని తీసుకున్నాయి.

30ఆ భూమి మహనయిము దగ్గర మొదలవుతుంది.
బాషాను అంతా, బాషాను రాజు ఓగు పాలించిన దేశం
అంతా, బాషానులోని యాయీరు పట్టణాలన్నీ ఆ
భూమిలో ఉన్నాయి. (అవి మొత్తం 60 పట్టణాలు)
31గిలాదులో సగం, అష్తారోతు, ఎద్రేయి కూడ ఆ
భూమిలో ఉన్నాయి. (గిలాదు, అష్తారోతు, ఎద్రేయి
ఓగు రాజు నివసించిన పట్టణాలు) ఈ భూమి అంతా
మనష్షే కుమారుడు మాకీరు కుటుంబానికి ఇవ్వ
బడింది. ఆ కుమారులు అందరిలో సగం మందికి ఈ
భూమి దొరికింది.

32మోయాబు మైదానాల్లో ఈ వంశాలకు ఈ
భూమి అంతటినీ మోషే ఇచ్చాడు. ఇది యెరికోకు
తూర్పున యోర్దాను నది అవతల ఉంది. 33అయితే
లేవీ వంశం వారికి మోషే భూమి ఏమీ ఇవ్వలేదు.
ఇశ్రాయేలీయుల యెహోవా దేవుడు స్వాక్షాత్తు ఆయనే
లేవీ వంశం వారి పరంగా ఉంటానని వాగ్దానం చేసాడు.

14 యాజకుడైన ఎలీయాజరు, నూను కుమారు
డైన యెహోషువ, ఇశ్రాయేలు వంశాలు
అన్నింటి నాయకులు కలిసి ప్రజలకు ఏ భూమి ఇవ్వాలి
అనే విషయం నిర్ణయం చేసారు. 2ప్రజలు ఏ విధంగా
వారి భూమిని నిర్ణయించు కోవాల్సిందీ చాలకాలం
క్రితమే మోషేకు యెహోవా ఆజ్ఞాపించాడు. తొమ్మిది
న్నర వంశాల వారు ఎవరికి ఏ భూమి అనే విషయం
నిర్ణయించేందుకు చీట్లు వేసారు. 3రెండున్నర వంశాల
వారికి యోర్దాను నదికి తూర్పున వారి భూమి వారికి
మోషే ఇదివరకే ఇచ్చాడు. అయితే మిగతా ప్రజల్లా
లేవీ వంశానికి మాత్రం భూమి ఏమీ ఇవ్వబడలేదు.
4(పన్నెండు వంశాలకు వారి స్వంత భూమి ఇవ్వ
బడింది) యోసేపు కుమారులు మనష్షే, ఎఫ్రాయిము
రెండు వంశాలుగా విభజించబడ్డారు. (మరియు ఒక్కో
వంశానికి కొంత భూమి దొరికింది) కానీ లేవీ వంశపు
ప్రజలకు భూమి ఏమీ ఇవ్వబడలేదు. వారు నివసిం
చేందుకు కొన్ని పట్టణాలు మాత్రం ఇవ్వబడ్డాయి.
(ఈ పట్టణాలు ప్రతి వంశంవారి భూమిలోనూ
ఉన్నాయి.) వారి జంతువులకోసం వారికి పొలాలు
కూడ ఇవ్వబడ్డాయి. 5ఇశ్రాయేలు వంశాలకు భూమిని
ఇచ్చే విధానం మోషేకు యెహోవా చెప్పాడు. ఇశ్రా
యేలు ప్రజలు యెహోవా ఆజ్ఞాపించినట్టే భూమిని
పంచుకొన్నారు.

### కాలేబుకు భూమి ఇవ్వబడటం

6ఒకరోజు యూదా వంశపు మనుష్యులు కొందరు
గిల్గాలులో యెహోషువ దగ్గరకు వెళ్లారు. కెనెజీ
వాడైన యెఫున్నె కుమారుడు కాలేబు వారిలో ఒకడు.
కాలేబు యెహోషువతో చెప్పాడు, “కాదేషు బర్నే
యలో యెహోవా చెప్పిన సంగతులు నీకు జ్ఞాపకమే.
యెహోవా తన సేవకుడు* మోషేతో మాట్లాడుతూ
నిన్ను, నన్ను గూర్చి చెప్పాడు. 7మనం వెళ్లబోతున్న
దేశాన్ని చూచి రమ్మని యెహోవా సేవకుడు మోషే
నన్ను పంపాడు. అప్పుడు నా వయస్సు 40 సంవత్స
రాలు. నేను తిరిగి వచ్చినప్పుడు ఆ దేశాన్ని గూర్చిన
నా అభిప్రాయం నేను మోషేతో చెప్పాను. 8అయితే
నాతోబాటు వెళ్లిన ఇతర ప్రజలు భయపెట్టే విషయా
లను వారితో చెప్పారు. కానీ నేను మాత్రం ఆ దేశాన్ని
యెహోవా మన స్వాధీనం చేస్తాడని నిజంగా
నమ్మాను. 9కనుక ఆ రోజున మోషే నాకు వాగ్దానం

---

**తన సేవకుడు** అక్షరార్థముగా “దేవుని మనుష్యుడు” అని అర్థం.

చేసాడు: 'నీవు వెళ్లిన ఆ భూమి నీదే అవుతుంది.
శాశ్వతంగా ఆ భూమి నీ పిల్లలకు స్వంతం అవుతుంది.
నా దేవుడైన యెహోవాను నీవు నిజంగా విశ్వసించావు
గనుక ఆ భూమిని నేను నీకు ఇస్తాను.'
10"ఇదిగో చూడు, యెహోవా చేస్తానని చెప్పినట్టే,
అప్పటినుండి 45 సంవత్సరాలు ఆయన నన్ను బతి
కించి ఉంచాడు. ఆ సమయంలో మనం అంతా అర
ణ్యంలో సంచారం చేసాము. ఇదిగో, ఇప్పుడు నా
వయస్సు 85 సంవత్సరాలు. 11మోషే నన్ను బయటకు
పంపించిన నాడు నేను ఎంత బలంగా ఉన్నానో
ఇప్పుడూ అంతే బలంగా ఉన్నాను. అప్పటిలాగే పోరా
డేందుకు ఇప్పుడూ నేను సిద్ధంగా ఉన్నాను. 12కనుక
చాలకాలం క్రిందట యెహోవా నాకు వాగ్దానం చేసిన
ఆ కొండ చరియను ఇప్పుడు నాకు ఇయ్యి. బలాఢ్యు
లైన అనాకీ ప్రజలు అక్కడ నివసించినట్టు అప్పట్లో
నీవు విన్నావు. మరియు ఆ పట్టణాలు చాల పెద్దవి,
మంచి కాపుదలలో ఉన్నవి. కానీ ఇప్పుడు, ఒకవేళ
యెహోవా నాతో ఉన్నాడేమో, యెహోవా చెప్పి
నట్టు నేను ఆ భూమిని తీసుకుంటాను."
13యెఫున్నె కుమారుడైన కాలేబును యెహో
షువ ఆశీర్వదించాడు. యెహోషువ అతనికి హెబ్రోను
పట్టణాన్ని స్వంతంగా ఇచ్చాడు. 14ఇప్పటికీ ఆ
హెబ్రోను పట్టణం కెనెజీవాడగు యెఫున్నె కుమారుడు
కాలేబుకు చెంది ఉంది. ఇశ్రాయేలీయుల యెహోవా
దేవుణ్ణి అతడు నమ్ముకొని విధేయుడైనందువల్ల ఇప్ప
టికీ ఆ భూమి అతని ప్రజలకే చెంది ఉంది. 15గతంలో
ఆ పట్టణం కిర్యత్ అర్బ అని పిలువబడింది. అనాకీ
ప్రజల్లోకెల్లా మహా గొప్పవాడైన అర్బ పేరు ఆ
పట్టణానికి పెట్టబడింది.
ఆ తర్వాత దేశంలో శాంతి నెలకొంది.

## యూదా వంశీయులకు భూమి

15 యూదాకు ఇవ్వబడిన భూమి ఒక్కో కుటుం
బాలకు పంచబడింది. ఆ భూమి ఎదోము
సరిహద్దు వరకు, దక్షిణాన తేమాను చివర సీను అరణ్యం
వరకు ఉంది. 2యూదా భూమికి దక్షిణ సరిహద్దు,
మృత సముద్రం దక్షిణ కొనలో మొదలవుతుంది.
3దాని సరిహద్దు దక్షిణాన తేలు కనుమ వరకు పోయి
సీనువరకు కొనసాగింది. దక్షిణాన కాదేషు బర్నేయ
వరకు సరిహద్దు విస్తరించింది. హెస్రోను దాటి అద్దారు
వరకు సరిహద్దు విస్తరించింది. అద్దారునుండి సరిహద్దు
మలుపు తిరిగి కర్కా వరకు విస్తరించింది. 4అస్మోను,
ఈజిప్టు ఏరు, మధ్యధరా సముద్రం వరకు సరిహద్దు
విస్తరించింది. ఆ భూమి అంతా వారి దక్షిణ సరిహద్దు.
5ఉప్పు సముద్రం నుండి, యొర్దాను నది సము
ద్రంలో పడే ప్రాంతం వరకు తూర్పు సరిహద్దు.
యొర్దాను నది ఉప్పు సముద్రంలో పడే ప్రాంతంలో
ఉత్తర సరిహద్దు మొదలవుతుంది. 6ఉత్తర సరిహద్దు
బేత్‌హొగ్లా వరకు విస్తరించి, ఉత్తరాన బేత్ అరాబావరకు
కొనసాగింది. ఆ సరిహద్దు బోహను బండవరకు వ్యాపిం
చింది. (రూబేను కుమారుడు బోహను) 7ఆ తర్వాత
ఉత్తర సరిహద్దు ఆకోరు లోయలోనుండి దెబీరు వరకు
కొనసాగింది. అక్కడ ఆ సరిహద్దు ఉత్తరానికి, తిరిగి
గిల్గాలు వరకు వ్యాపించింది. అదుమ్మీము పర్వతాల
మధ్యగా పోయే మార్గం మీద ఉంది గిల్గాలు. అది
ఏటికి దక్షిణాన ఉంది. ఏన్‌షెమెషు నీళ్ల వరకు సరిహద్దు
వ్యాపించింది. ఎన్‌రొగేలు దగ్గర సరిహద్దు నిలిచి
పోయింది. 8తర్వాత యెబూసు పట్టణానికి దక్షిణాన
ఉన్న బెన్‌హిన్నోము లోయగుండా ఆ సరిహద్దు కొన
సాగింది. (ఆ యెబూసు పట్టణం పేరు యెరూషలేము)
అక్కడ సరిహద్దు కొండ శిఖరం మీదుగా హిన్నోము
లోయకు పశ్చిమంగా వెళ్లింది. ఇది రెఫాయిము
లోయకు ఉత్తరపు అంచున ఉంది. 9అక్కడ నుండి
ఆ సరిహద్దు నెఫ్తోయ నీళ్ల ఊటవరకు కొనసాగింది.
తర్వాత ఆ సరిహద్దు ఎఫ్రోను కొండ సమీపంలో గల
పట్టణాలకు పోయింది. ఆ స్థలంలో ఆ సరిహద్దు
మళ్లుకొని బాలాకు పోయింది. (బాలా కిర్యత్ యారీం
అనికూడ పిలువబడింది) 10బాలావద్ద సరిహద్దు పశ్చి
మంగా మళ్లుకొని శేయీరు కొండ దేశానికి పోయింది.
ఆ సరిహద్దు యారీం కొండకు (కెసలోను అని కూడ
పిలువబడింది) ఉత్తర దిశగా కొనసాగి బెత్‌షెమెషు
వరకు కొనసాగింది. అక్కడ్నుండి ఆ సరిహద్దు తిమ్నా
దాటిపోయింది. 11అప్పుడు ఆ సరిహద్దు ఎక్రోనుకు
ఉత్తరాన ఉన్న కొండకు చేరింది. ఆ చోటనుండి ఆ
సరిహద్దు షికెరానుకు మరలి బాలా కొండను దాటి
పోయింది. ఆ సరిహద్దు యబ్నేలువరకు కొనసాగి
మధ్యధరా సముద్రం దగ్గర ముగిసింది. 12యూదా
దేశానికి పశ్చిమ సరిహద్దు మధ్యధరా సముద్రం. కనుక
యూదా దేశం ఈ నాలుగు సరిహద్దుల లోపల ఉంది.
యూదా కుటుంబాలు ఈ దేశంలో నివసించాయి.
13యెఫున్నె కుమారుడైన కాలేబుకు యూదా
దేశంలో భాగం ఇవ్వాల్సిందిగా యెహోషువను
యెహోవా ఆజ్ఞాపించాడు. కనుక దేవుడు ఆజ్ఞాపించిన
భూమిని కాలేబుకు యెహోషువ ఇచ్చాడు. హెబ్రోను
అనికూడ పిలువబడిన కిర్యత్ అర్బ పట్టణాన్ని
యెహోషువ అతనికి ఇచ్చాడు (అనాకు తండ్రి అర్బ)
14హెబ్రోనులో నివాసం ఉన్న అనాకీ వంశాలు
మూడింటిని కాలేబు వెళ్లగొట్టేసాడు. అవి శాషాయి,
అహీమాను, తల్మయి వంశాలు. వారు అనాకు కుటుం
బంవారు. 15తర్వాత దెబీరులో నివసిస్తున్న ప్రజల
మీద కాలేబు యుద్ధం చేసాడు. (గతంలో దెబీరును
కిర్యత్ సెఫెర్ అనికూడ పిలిచేవాళ్లు) 16"కిర్యత్ సెఫెర్
మీద దాడి చేసి, ఆ పట్టణాన్ని ఓడించే మగవాడెవడో
అతడు నా కుమార్తె అక్సాను పెళ్లాడవచ్చు. అతనికి

నా కూతుర్ని బహుమానంగా ఇస్తాను” అన్నాడు
కాలేబు.
17 కాలేబు సహోదరుడైన కనజు కుమారుడు
ఒత్నియేలు ఆ పట్టణాన్ని ఓడించాడు. కనుక కాలేబు
తన కుమార్తె అక్సాను ఒత్నియేలుకు భార్యగా ఇచ్చాడు.
18తన తండ్రి కాలేబు దగ్గర మరికొంత భూమి అడగాలని
ఒత్నియేలు అక్సాను* కోరాడు. (అక్సా తన తండ్రి
దగ్గరకు వెళ్లింది.) ఆమె తన గాడిద మీద నుండి
దిగగానే “నీకేం కావాలి?” అని కాలేబు ఆమెను అడిగాడు.
19“నాకు ఒక ఆశీర్వాదం కావాలి.* (నీరుగల భూమి
నాకు కావాలి) నీవు నాకు నెగెవులో* ఇచ్చిన భూమి
ఎడారి భూమి. కనుక నీటి ఊటలు గల భూమి నాకు
ఇవ్వాలి” అని అక్సా జవాబిచ్చింది. కనుక మెరకలోను
పల్లంలోని నీటి ఊటలు గల భూమిని కాలేబు ఆమెకు
ఇచ్చాడు.
20యూదా వంశానికి దేవుడు వాగ్దానం చేసిన భూమి
దొరికింది. ఒక్కో కుటుంబానికి ఆ భూమిలో భాగం
దొరికింది. 21నెగెవు దక్షిణాన గల పట్టణాలన్నీ యూదా
వంశానికి వచ్చాయి. ఈ పట్టణాలు ఎదోము సరిహద్దు
సమీపంగా ఉన్నాయి. ఆ పట్టణాల జాబితా ఇది;
కబ్జీలు, ఎదెరు, యగురు, 22కీనా, దిమోనా, అదాదా:
23కెదెషు, హసోరు, ఇత్నాను 24జీఫు, తెలెం, బెయలోత్
25హసోర్, హదత్తా, కెరియోతు, హెస్రోను (హసోరు
అని కూడ పిలువబడుతుంది) 26అమాము, షెమ,
మొలాదా 27హసర్‌గద్దా, హెష్మోను, బెత్‌పెలెతు, 28హసర్
షువలు, బెయెర్‌షెబ, బిజ్యోత్యా 29బాలా, ఇయం,
ఎజెము, 30ఎల్తోలద్, కెసిల్, హొర్మా, 31సిక్లగు,
మద్మన్నా, సన్సన్నా ,32లెబయొతు, షిల్హిం, అయిన్
మరియు రిమ్మోన్. మొత్తం మీద 29 పట్టణాలు, వాటి
పొలాలు ఉన్నాయి. పడమటి కొండ దిగువల్లోకూడ
యూదా వంశం వారికి పట్టణాలు వచ్చాయి. ఆ
పట్టణాల జాబితా ఇది:
33ఎష్తాయోలు, జొర్యా, అష్నా 34జానోహ, ఎన్‌గ
న్నీము, తప్పుయ, ఎనాం 35యార్మూత్, అదుల్లాము
శోకో, అజెకా 36షరాయిం, అదితాయిము, మరియు
గెదెరా (గెదెరోతాయిము అనికూడ పిలువబడింది)
మొత్తం మీద 14 పట్టణాలు, వాటి పొలాలు.
37యూదా వంశంవారికి ఇవ్వబడిన పట్టణాలు
సెనాను, హదష, మిగ్దల్‌గాదు, 38దిలాన్, మిస్పే, యొక్త
యెలు 39లాకీషు, బొస్కతు, ఎగ్లోను 40కబ్బోన్,
లహ్మాను, కిత్లిషు 41గెదెరొతు, బెత్‌దాగోను నయమా,
మరియు మక్కేదా. మొత్తంమీద 16 పట్టణాలు
మరియు వాటి పొలాలు.
42యూదా ప్రజలకు లభించిన ఇతర పట్టణాలు:
లిబ్నా, ఎతెరు, అషను, 43ఇప్తా, అష్న, నెజిబు
44కెయిలా, అక్జీబు, మారేషా. మొత్తంమీద 9 పట్టణాలు
మరియు వాటి పొలాలు.
45ఎక్రోను పట్టణం, దాని సమీపంలో గల అన్ని
చిన్న పట్టణాలు, పొలాలు యూదా ప్రజలకే దొరి
కాయి. 46ఎక్రోనుకు పశ్చిమాన గల ప్రాంతం,
అష్డోదుకు సమీపంలో ఉన్న పట్టణాలు, పొలాలు
అన్నీ కూడా వారికి లభించాయి. 47అష్డోదు చుట్టూ
ఉన్న ప్రాంతం అంతాను, అక్కడి చిన్న పట్టణాలు
యూదా దేశంలో భాగమే. గాజా చుట్టూ ఉన్న
ప్రాంతం, పొలాలు, పట్టణాలు కూడా యూదా ప్రజలకే
వచ్చాయి. ఈజిప్టు నదివరకు వారి దేశం విస్తరించింది.
మరియు వారిదేశం మధ్యధరా సముద్ర తీరం వెంబడి
విస్తరించింది.
48కొండ దేశంలోకూడా యూదా ప్రజలకు పట్ట
ణాలు ఇవ్వబడ్డాయి. ఆ పట్టణాల జాబితా ఇది:
షామిరు, యత్తీరు, శాకొహె
49దన్నా, కిర్యత్ సన్నా, (దెబిర్ అనికూడ పిలువ
బడింది) 50అనబు, ఎష్తెమో, అనీం 51గోషెను,
హలోను, మరియు గిలో. మొత్తం మీద 11పట్టణాలు
మరియు వాటి పొలాలు.
52యూదా ప్రజలకు ఈ పట్టణాలు కూడ ఇవ్వ
బడ్డాయి: అరబు, దూమా, ఎషాను, 53యనీము, బెత్
తప్పుయా, అఫెకా,
54హుమతా, కిర్యత్ అర్బ (హెబ్రోను అని కూడ
పిలువబడింది) మరియు సీయోరు. 9పట్టణాలు, వాటి
పొలాలు ఉన్నాయి.
55ప్రజలకు ఈ పట్టణాలు కూడా ఇవ్వబడ్డాయి:
మయోను, కర్మెలు, జీఫు, యుట్ట, 56యెజ్రెయేలు,
యొకెదియము, జనోవా 57కయిను, గిబియ మరియు
తిమ్నా మొత్తం మీద 10 పట్టణాలు మరియు వాటి
పొలాలు.
58యూదా ప్రజలకు ఈ పట్టణాలు కూడా ఇవ్వ
బడ్డాయి: హల్‌హులు, బెత్‌జూరు, గెదొరు, 59మారాతు,
బెత్‌అనొతు మరియు ఎల్‌తెకొను. మొత్తం మీద అవి
6 పట్టణాలు మరియు వాటి పొలాలు.
60రబ్బ, కిర్యత్‌బెతు (కిర్యత్యారీం అనికూడా పిలువ
బడుతుంది) రెండు పట్టణాలు కూడ యూదా ప్రజ
లకు ఇవ్వబడ్డాయి.
61యూదా ప్రజలకు ఎడారి పట్టణాలు యివ్వ
బడ్డాయి. ఆ పట్టణాల జాబితా ఇది: బెత్ అరాబా,
మిద్దీను, సెకాకా 62నిబ్షాను, ఉప్పు పట్టణం, మరియు
ఎన్‌గెది. మొత్తం మీద 6 పట్టణాలు మరియు వాటి
పొలాలు.

**ఒత్నియేలు అక్సాను** అడగటం లేక “అక్సా ఒత్నియే
లును అడగటం.”

**ఆశీర్వాదం కావాలి** లేక “దయచేసి నాకు స్వాగతము
పలుకు.” లేక “నాకు నీళ్లున్న ఒక గుంట ఇవ్వు.”

**నెగెవు** యూదాలోని దక్షిణదిశగావున్న ఎడారి ప్రాంతం.

63యెరుషలేములో నివసిస్తున్న యెబూసీ ప్రజ
లను యూదా సైన్యం బయటకు వెళ్లగొట్ట లేక
పోయింది. కనుక యెరుషలేములోని యూదా ప్రజల
మధ్య యెబూసీ ప్రజలు నేటికీ ఇంకా నివసిస్తూనే
ఉన్నారు.

### ఎఫ్రాయిము, మనష్షే వంశీయులకు భూములు

16 యోసేపు కుటుంబానికి లభించిన దేశం ఇది.
ఈ దేశం యెరికో సమీపాన యోర్దాను నది
దగ్గర ప్రారంభమై యెరికో జలాల వరకు కొనసాగింది.
(ఇది యెరికోకు సరిగ్గా తూర్పున ఉంది) ఆ సరిహద్దు
యెరికోనుండి పైకి, బేతేలు కొండ ప్రాంతంవరకు
వ్యాపించింది. 2తర్వాత ఆ సరిహద్దు బేతేలు (లూజు)
నుండి అతరోత్ వద్ద అర్కీయ సరిహద్దువరకు కొన
సాగింది. 3తర్వాత ఆ సరిహద్దు పశ్చిమాన యాఫ్లేతీయ
ప్రజల సరిహద్దువైపు పోయింది. దిగువ బెత్హొరను
వరకూ ఆ సరిహద్దు కొనసాగింది. తర్వాత ఆ సరిహద్దు
గెజెరుకు పోయి, సముద్రం వరకు వ్యాపించింది.
4కనుక మనష్షే, ఎఫ్రాయిం ప్రజలకు వారి భూమి
లభించింది. (మనష్షే, ఎఫ్రాయిము యోసేపు
కుమారులు)
5ఎఫ్రాయిము ప్రజలకు ఇవ్వబడిన భూమి ఇది:
తూర్పున ఎగువ బేత్హోరోను సమీపంలో అతా
రోతు అద్దారు వద్ద వారి సరిహద్దు మొదలయింది.
6మరియు పశ్చిమ సరిహద్దు మిక్మెతతు వద్ద మొదల
యింది. ఆ సరిహద్దు తూర్పున తానతు షిలోహుకు
మళ్లి, యానోయకు విస్తరించింది. 7అప్పుడు ఆ సరి
హద్దు యానోయనుండి క్రిందికి అతారోతు మరియు
నారాకు వెళ్ళింది. ఆ సరిహద్దు యెరికోను తాకి,
యోర్దాను నది దగ్గర నిలిచిపోయేంతవరకు కొన
సాగింది. 8ఆ సరిహద్దు తప్పూయ మొదలుకొని కానా
ఏటివరకు పశ్చిమంగా వ్యాపించి, సముద్రం దగ్గర
అంతమయింది. అది మొత్తం ఎఫ్రాయిము ప్రజలకు
ఇవ్వబడిన దేశం. ఆ వంశంలోని ఒక్కో కుటుంబానికి
ఈ దేశంలో కొంత భాగం దొరికింది. 9ఎఫ్రాయిము
వారి సరిహద్దు పట్టణాలు అనేకం నిజానికి మనష్షే వారి
సరిహద్దుల్లోనే ఉన్నాయి. కానీ ఆ పట్టణాలు, ఆ
పొలాలు ఎఫ్రాయిము వారికే వచ్చాయి. 10అయితే
గెజరు పట్టణంనుండి కనానీ ప్రజలను ఎఫ్రాయిము
ప్రజలు వెళ్లగొట్టలేకపోయారు. కనుక నేటికీ
ఎఫ్రాయిము ప్రజల మధ్య కనానీ ప్రజలు నివసి
స్తున్నారు. కానీ కనానీ ప్రజలు ఎఫ్రాయిము ప్రజలకు
బానిసలుగా అయ్యారు.

17 తర్వాత మనష్షే వంశానికి భూమి ఇవ్వబడింది.
యోసేపు మొదటి కుమారుడు మనష్షే.
మనష్షే మొదటి కుమారుడు మాకీరు, ఇతడు గిలాదు
తండ్రి.* మాకీరు గొప్ప వీరుడు, కనుక గిలాదు,
బాషాను ప్రాంతాలు మాకీరు వంశానికి ఇవ్వబడ్డాయి.
2మనష్షే వంశంలోని ఇతర కుటుంబాలకు కూడా
భూమి యివ్వబడింది. ఆ కుటుంబాలు అబియెజెరు,
హెలెకు, అశ్రీయెలు, షెకెము, హెఫెరు, షెమిద.
యోసేపు కుమారుడగు మనష్షే మిగిలిన కుమారులు
వీరంతాను. ఈ మనుష్యుల కుటుంబాలకు కూడ
కొంత భూమి లభించింది.
3హెపెరు కుమారుడు సెలోపెహాదు. గిలాదు
కుమారుడు హెపెరు. గిలాదు మాకీరు కుమారుడు,
మాకీరు మనష్షే కుమారుడు. కానీ సెలోపెహాదుకు
కుమారులు లేరు. అతనికి ఐదుగురు కుమార్తెలు
ఉన్నారు. ఆ కుమార్తెల పేర్లు మహల, నోయ, హొగ్ల,
మిల్కా, తిర్సా. 4యాజకుడైన ఎలీయాజరు, నూను
కుమారుడైన యెహోషువ ఇశ్రాయేలు నాయకు
లందరి దగ్గరకు ఆ కుమార్తెలు వెళ్లారు. "మగవారికి
ఇచ్చినట్టే మాకూ భూమి ఇవ్వాలని మోషేతో
యెహోవా చెప్పాడు" అన్నారు ఆ కుమార్తెలు. కనుక
ఎలీయాజరు యెహోవాకు విధేయుడై, ఆ
కుమార్తెలకు కొంత భూమి యిచ్చాడు. కనుక
కుమారులవలెనే ఈ కుమార్తెలకుగూడ కొంత భూమి
లభించింది.
5కనుక మనష్షే వంశానికి యోర్దాను నదికి పశ్చిమాన
పది ప్రాంతాలు, యోర్దాను నది ఆవలి ప్రక్క గిలాదు,
బాషాను అనే మరి రెండు ప్రాంతాలు ఉన్నాయి.
6మనష్షే కుమార్తెలకు గూడ కుమారులవలెనే భూమి
లభించింది. మనష్షే మిగిలిన కుటుంబాలకు గిలాదు
దేశం ఇవ్వబడింది.
7మనష్షే భూములు ఆషేరు, మిక్మెతాతు మధ్య
ప్రాంతంలో ఉన్నాయి. ఇది షెకెము దగ్గర సరిహద్దు
దక్షిణాన ఎన్తపూయా వరకు వెళ్లింది. 8తపూయ
దేశం మనష్షేకు చెందినదే కాని తపూయ పట్టణం
మాత్రం కాదు. తపూయా పట్టణం మనష్షే దేశ
సరిహద్దు పక్కగా ఉంది, అది ఎఫ్రాయిము కుమారు
లకు చెందినది. 9మనష్షే సరిహద్దు దక్షిణాన కానా
ఏటివరకు వ్యాపించింది. ఈ మనష్షే ప్రాంతంలోని
పట్టణాలు ఎఫ్రాయిముకు చెందినవి. నదికి ఉత్తరాన
ఉంది మనష్షే సరిహద్దు మరియు అది పశ్చిమాన
సముద్రం వరకు విస్తరించింది. 10దక్షిణ దేశం ఎఫ్రాయి
ముకు చెందినది. ఉత్తర దేశం మనష్షేది. మధ్యధరా
సముద్రం పడమటి సరిహద్దు. ఆ సరిహద్దు ఉత్తరాన
ఆషేరు దేశాన్ని, తూర్పున ఇశ్శాఖారు దేశాన్ని తాకు
తుంది.

---

**గిలాదు తండ్రి** లేక "గిలాదు ప్రాంతముల నాయకుడు."

11ఇశ్శాఖారు, ఆషేరు ప్రాంతంలో బెత్షెయాను,
దాని తాలూకు చిన్న పట్టణాలు, ఇబ్లెయాము, దాని
తాలూకు చిన్న పట్టణాలు మనష్షే స్వంతం. దోరు
పట్టణంలో, దాని తాలూకు చిన్న పట్టణాల్లో,
ఎన్దోరు పట్టణంలో దాని తాలూకు చిన్న పట్టణాల్లో
నివసించే ప్రజలంతా మనష్షే స్వంతం. తానాకు, దాని
చిన్న పట్టణాల్లో, మెగిద్దో, దాని చిన్న పట్టణాల్లో,
నాఫోతు మూడు పట్టణాల్లో నివసించే ప్రజలంతా
మనష్షే స్వంతం.
12మనష్షే ప్రజలు ఆ పట్టణాలను ఓడించలేక
పోయారు. కనుక కనానీ ప్రజలు అక్కడనే నివసించటం
కొనసాగించారు.
13అయితే ఇశ్రాయేలు ప్రజలు బలవంతులుగా
ఎదిగారు. ఇది జరిగినప్పుడు కనానీ ప్రజలను తమకు
బానిసలుగా చేసుకొన్నారు. కానీ ఆ దేశం విడిచి
పొమ్మని మాత్రం కనానీ ప్రజలను వారు ఒత్తిడి
చేయలేదు.
14యోసేపు వంశంవారు యెహోషువతో
మాట్లాడి "నీవు మాకు ఒక్క ప్రాంతం మాత్రమే
ఇచ్చావు. కానీ మేము చాలమందిమి ఉన్నాము.
యెహోవా తన ప్రజలకు ఇచ్చిన భూమి అంతటిలో
ఒక్క భాగం మాత్రమే మాకు ఎందుకు యిచ్చావు?"
అన్నారు.
15అప్పుడు యెహోషువ, "మీరు గనుక చాలినంత
మంది ఉంటే, మీరు కొండ ప్రదేశానికి వెళ్లి, మీకు
నివాస స్థలాన్ని చేసుకోండి. ఇది పెరిజ్జీ ప్రజలకు,
రెఫాయిము ప్రజలకు చెందిన దేశం. ఇది ఎఫ్రాయిము
వారి కొండ ప్రదేశం కాదు. ఎఫ్రాయిము కొండ ప్రదేశం
మీకు మరీ చిన్నది అవుతుంది" అని బదులు చెప్పాడు.
16యోసేపు ప్రజలు, "నిజమే, ఎఫ్రాయిము కొండ
దేశం మాకు చాలదు. కానీ కనానీ ప్రజలు నివసిస్తున్న
ప్రదేశం ప్రమాదకరమయింది. వారు నైపుణ్యంగల
యుద్ధ వీరులు. మరియు బెత్షెయనులోను, ఆ
ప్రాంతంలోని చిన్న పట్టణాలన్నింటిలోను వారికి బల
మైన ఆయుధాలు, ఇనుప రథాలు ఉన్నాయి. పైగా
యెజ్రెయేలు లోయలోకూడ వాళ్ళున్నారు" అని
చెప్పారు.
17అప్పుడు యోసేపు, ఎఫ్రాయిము, మనష్షే ప్రజ
లతో యెహోషువ ఇలా చెప్పాడు: "అయితే మీరు
చాల విస్తారంగా ఉన్నారు. మీకూ మహాగొప్ప శక్తి
ఉంది. మీకు చాల ఎక్కువ భూమిని ఇవ్వాలి. 18కొండ
ప్రదేశం మీదే. అది అడవి అయినా మీరు చెట్లు నరికి
మంచి నివాస ప్రదేశంగా దాన్ని మార్చుకోవచ్చు. అది
మొత్తం మీ స్వంతం అవుతుంది. కనానీ ప్రజలను
మీరు ఆ దేశం నుండి వెళ్లగొట్టివేయాలి. వారికి
బలమూ, బలమైన ఆయుధాలూ ఉన్నప్పటికీ మీరు
వారిని ఓడించేస్తారు."

### మిగిలిన భూమిని పంచటం

18 ఇశ్రాయేలు ప్రజలంతా షిలోహు అనే
ప్రాంతంలో సమావేశం అయ్యారు. అక్కడ
సన్నిధి గుడారాన్ని* వారు నిలబెట్టారు. ఇశ్రాయేలు
ప్రజలు ఆ దేశాన్ని వారి ఆధీనంలో ఉంచుకొన్నారు.
ఆ దేశంలోని శత్రువులందరినీ వారు ఓడించారు.
2అయితే దేవుడు వాగ్దానం చేసిన ప్రదేశంలో భాగం
పొందని ఇశ్రాయేలు వంశాలు అప్పటికి యింకా ఏడు
ఉన్నాయి.
3కనుక ఇశ్రాయేలు ప్రజలతో యెహోషువ
చెప్పాడు, "మీ దేశాన్ని తీసుకొనేందుకు మీరెందుకు
ఇంత కాలం చూస్తూ ఊరకున్నారు. మీ తండ్రుల
దేవుడు యెహోవా ఈ దేశాన్ని మీకు ఇచ్చాడు.
4కనుక మీ వంశాల్లో ఒక్కోదాని నుండి ముగ్గురు
మనుష్యుల్ని ఏర్పాటు చేసుకోవాలి. దేశాన్ని పరిశీలించి
చూచేందుకు నేను ఆ మనుష్యుల్ని బయటకు పంపి
స్తాను. ఆ దేశ పటాన్ని వారు తయారు చేస్తారు.
తర్వాత వారు తిరిగి నా దగ్గరకు వస్తారు. 5దేశాన్ని
వారు ఏడు భాగాలుగా విభజిస్తారు. యూదా ప్రజలు
వారి దేశాన్ని దక్షిణాన ఉంచుకొంటారు. యోసేపు
ప్రజలు వారి దేశాన్ని ఉత్తరాన ఉంచుకొంటారు.
6అయితే మీరు పటం గీసి, దేశాన్ని ఏడు భాగాలుగా
విభజించాలి. ఆ పటాన్ని నా దగ్గరకు తీసుకొని రండి,
ఏ వంశానికి ఏ భూమి రావాలో అది మనం యెహోవా
దేవుడినే నిర్ణయం చేయనిద్దాం. 7కానీ లేవీ ప్రజలకు
మాత్రం ఈ భూముల్లో ఎలాంటి భాగమూ ఉండదు.
వారు యాజకులు, వారి పని యెహోవాను సేవిం
చటమే. గాదు, రూబేను, మనష్షే వంశాలలో సగం
మంది వారికి వాగ్దానం చేయబడిన దేశాన్ని ఇదివరకే
తీసుకొన్నారు. వారు యోర్దాను నదికి తూర్పు వైపున
ఉన్నారు. యెహోవా సేవకుడు మోషే ఇదివరకే వారికి
ఆ దేశాన్ని ఇచ్చాడు."
8కనుక ఏర్పాటు చేయబడిన మనుష్యులు ఆ
దేశంలో ప్రవేశించటం మొదలు పెట్టారు. ఆ దేశం
యొక్క వివరాలను తయారు చేసి, వాటిని యెహో
షువ దగ్గరకు తీసుకొని రావాలి అనేది వారి పథకం.
కనుక యెహోషువ, "వెళ్లి దేశాన్ని పరిశీలించి, దాని
వివరాలు తయారు చేయండి. అప్పుడు తిరిగి నా
దగ్గరకు రండి. అప్పుడు మీకు ఏ భూమి రావాలి
అనేది నేను నిర్ణయించేందుకు సహాయం చేయాల్సిం
దిగా యెహోవాను అడుగుతాను. ఇది మనం ఇక్కడ
షిలోహులో చేద్దాం" అని వారితో చెప్పాడు.
9కనుక ఆ మనుష్యులు ఆ చోటు విడిచి ఆ
దేశంలో ప్రవేశించారు. ఆ మనుష్యులు ఆ దేశాన్ని

---

**సన్నిధి గుడారం** దేవుని దర్శించేందుకు ఇశ్రాయేలీయులు అక్కడికి వెళ్తుండేవారు.

పరిశీలించి, యెహోషువ కొరకు పటాలు తయారు
చేసారు. ప్రతి పట్టణాన్నీ వారు పరిశీలించి, దేశం
ఏడు భాగాలు అయ్యేటట్టు చేసారు. వారు ఆ పటాలు
తయారుచేసి యెహోషువ దగ్గరకు తిరిగి వచ్చారు.
యెహోషువ ఇంకా షిలోహులోని పాళెములోనే
ఉన్నాడు. 10ఆ సమయంలో యెహోషువ యెహో
వాను సహాయం కొరకు వేడుకున్నాడు. ఒక్కో వంశా
నికి ఇవ్వాల్సిన దేశాలను యెహోషువ నిర్ణయించాడు.

### బెన్యామీనీయులకు భూభాగం

11యూదాకు యోసేపుకు మధ్యగల ప్రాంతం
లోని దేశం బెన్యామీను వంశానికి ఇవ్వబడింది.
బెన్యామీను వంశంలోని ప్రతి కుటుంబానికీ కొంత
భూమి లభించింది. బెన్యామీనుకు నిర్ణయించబడిన
భూమి ఇది: 12ఉత్తర సరిహద్దు యోర్దాను నది దగ్గర
మొదలయింది. యెరికో ఉత్తరపు అంచున కొనసాగింది
ఆ సరిహద్దు. తర్వాత ఆ సరిహద్దు పశ్చిమాన కొండ
దేశంలోనుండి వెళ్లింది. బెత్ అవెనుకు సరిగ్గా తూర్పున
చేరేంతవరకు ఆ సరిహద్దు కొనసాగింది. 13తర్వాత ఆ
సరిహద్దు లూజుకు (బేతేలు) దక్షిణంగా విస్తరించింది.
తర్వాత ఆ సరిహద్దు అతారోతు అద్దారుకు వెళ్లింది.
దిగువ బెత్ హరానుకు దక్షిణాన కొండమీద ఉంది
అతారోత్ అద్దార్. 14బెత్హరానుకు దక్షిణంగా ఒక
కొండ ఉంది. ఈ కొండ దగ్గర ఆ సరిహద్దు మళ్లుకొని
కొండ పడమటి పక్కకు దగ్గర్లో దక్షిణంగా వెళ్లింది.
ఆ సరిహద్దు కిర్యత్ బాలాకు (కిర్యత్యారం) పోయింది.
ఇది యూదా ప్రజలు నివసించిన ఒక పట్టణం. ఇది
పడమటి సరిహద్దు.

15దక్షిణ సరిహద్దు కిర్యత్యారీము దగ్గర మొదలై
నెఫ్తోయ నదివరకు విస్తరించింది. 16తర్వాత బెన్హి
న్నోము లోయ దగ్గర కొండ మట్టానికి ఆ సరిహద్దు
విస్తరించింది. ఇది రెఫాయిము లోయకు ఉత్తర దిశ.
ఆ సరిహద్దు యెబూసు పట్టణానికి దక్షిణంగా హిన్నోము
లోయగుండా సాగిపోయింది. తర్వాత ఆ సరిహద్దు
ఎన్రోగెలుకు విస్తరించింది. 17అక్కడ ఆ సరిహద్దు
ఉత్తరంగా మళ్లి ఎన్షెమెషుకు పోయింది. ఆ సరిహద్దు
గెలిలోతుకు (పర్వతాల్లోని అదుమీము కనుమ దగ్గర
ఉంది గెలిలోతు) కొనసాగింది. ఆ సరిహద్దు రూబేను
కుమారుడు బోహను కోసం పేరుపెట్టబడిన మహా
శిలవరకు కిందికి విస్తరించింది. 18బెత్అరబా ఉత్తర
ప్రాంతంవరకు ఆ సరిహద్దు కొనసాగింది. తర్వాత ఆ
సరిహద్దు అరబాలోనికి విస్తరించింది. 19తర్వాత ఆ
సరిహద్దు బెత్హొగ్లా ఉత్తర ప్రాంతంవరకు వెళ్లి, ఉప్పు
సముద్రపు ఉత్తర తీరాన ముగిసింది. ఇక్కడే యోర్దాను
నది ఆ సముద్రంలో పడుతుంది. అది దక్షిణ సరిహద్దు.

20తూర్పు వైపున యోర్దాను నది సరిహద్దు. కనుక
బెన్యామీను వంశానికి ఇవ్వబడిన దేశం ఇది. అవే అన్ని
వైపులా సరిహద్దులు. 21కనుక బెన్యామీను కుటుంబాలు
ప్రతీ ఒక్కటీ ఈ దేశాన్ని పొందాయి. మరియు వారి
స్వంత పట్టణాలు ఇవి: యెరికో, బెత్హొగ్లా, ఎమెక్
కెజీబ్ 22బెత్ అరాబా, సెమరాయిము, బేతేలు
23అవ్వీము, పారా, ఒఫ్రా 24కెఫెరు అమ్మోని, ఒఫ్ని,
గెబ. ఇవి పన్నెండు పట్టణాలు, ఈ పట్టణాల దగ్గర
ప్రజలు నివసిస్తున్న చిన్న ప్రాంతాలు కూడా
ఉన్నాయి.

25బెన్యామీను వంశం స్వంత పట్టణాల్లో గిబి
యోను, రామా, బెయెరోతు 26మిస్పే, కెఫిరా, మోసా,
27రెకెము, ఇర్పెయెలు, తరలా 28సేలా, ఎలెపు,
యెబూసీ పట్టణం (యెరుషలేము), గిబియా, కిర్యత్
ఉన్నాయి. ఇవి పద్నాలుగు పట్టణాలు, వీటి దగ్గర్లో
ప్రజలు నివసిస్తున్న చిన్న ప్రాంతాలు కూడ ఉన్నాయి.
ఈ ప్రాంతాలన్నీ బెన్యామీను వంశానికి లభించిన
భూములు.

### షిమ్యోను వంశం వారికి భూమి

19 అప్పుడు షిమ్యోను వంశంవారికి, ఆ వంశంలో
ప్రతి కుటుంబానికీ వారి భూములను యెహో
షువ వంచిపెట్టాడు. వారికి లభించిన భూమి
యూదాకు చెందిన ప్రాంతం లోపల ఉంది. 2వారికి
లభించిన భూమి యిది; బెయెర్ షెబ (షెబ)
మోలాదా, 3హజర్షువలు, బాలా, ఎజెము, 4ఎల్తోలదు,
బెతులు, హోర్మా 5సిక్లగు, బెత్ మార్కాబోదు,
హజర్సుస 6బెత్ లబాయోతు మరియు షారుహను.
ఇవి పదమూడు పట్టణాలు, వాటి పొలాలు మొత్తము.
7అయిను, రిమ్మోను, ఎతెరు, ఆషాను పట్టణాలు
కూడా వారికి లభించాయి. ఇవి నాలుగు పట్టణాలు,
వాటి పొలాలు మొత్తము.

8బాలాత్ బెయెరు వరకు ప్రజలు నివసిస్తున్న అతి
చిన్న ప్రాంతాలు కూడ అన్నీ వారికి లభించాయి.
(ఇది నెగెవు ప్రాంతంలో ఉన్న రామా వంటిదే.)
కనుక షిమ్యోనీ ప్రజల కుటుంబాలకు ఇవ్వబడిన
భూములు అవి. ఒక్కో కుటుంబానికి ఈ భూములు
లభించాయి. 9షిమ్యోనీ ప్రజల భూమి యూదా
భూభాగంలోనుండి తీసికోబడింది. యూదా వారికి
అవసరమైన దానికంటె చాలా ఎక్కువ భూమి ఉంది.
కనుక వారి భూమిలో షిమ్యోనీ ప్రజలకు కొంత
భాగం లభించింది.

### జెబూలూను వంశం వారికి లభించిన భూమి

10తర్వాత భూమి లభించిన వంశం జెబులూను.
జెబూలూను వంశంలోని ప్రతి కుటుంబానికీ, వారికి
వాగ్దానం చేయబడిన భూమి లభించింది. జెబూలూను
సరిహద్దు శారీదు వరకు విస్తరించింది. 11తర్వాత అది
పశ్చిమాన మరాలా వరకు పోయి, దబ్బాషెతు

ప్రాంతానికి సమీపంగా సాగిపోయింది. తర్వాత ఆ
సరిహద్దు యొక్నెయాము దగ్గర ప్రాంతానికి విస్తరిం
చింది. 12తర్వాత ఆ సరిహద్దు తూర్పుకు మళ్లింది.
శారీదు నుండి అది కిస్లోత్ తాబోరు ప్రాంతానికి విస్తరిం
చింది. తర్వాత ఆ సరిహద్దు దబెరాతు, యాఫియకు
విస్తరించింది. 13తర్వాత ఆ సరిహద్దు తూర్పున గాత్
హెఫెరు, ఎత్‌కాసీను వరకు విస్తరించింది. ఆ సరిహద్దు
రిమ్మోను వద్ద అంతమయింది. తర్వాత ఆ సరిహద్దు
మళ్లుకొని నేయావరకు కొనసాగింది. 14నేయావద్ద
ఆ సరిహద్దు మరల మళ్లుకొని ఉత్తరానికి విస్తరించింది.
ఆ సరిహద్దు హన్నాతోన్ వరకు విస్తరించి, ఇఫ్తాయెల్
లోయవరకు కొనసాగింది. 15ఈ సరిహద్దు లోపల
కట్టాత్, నహలాలు, షిమ్రోను, ఇదలా, బేత్లెహేము పట్ట
ణాలు ఉన్నాయి. మొత్తం మీద పన్నెండు పట్టణాలు,
వాటి పొలాలు అన్నీ ఉన్నాయి. 16కనుక జెబులూనుకు
లభించిన పట్టణాలు, ప్రాంతాలు ఇవి. జెబులూను
ప్రతి వంశానికీ ఈ భూమి లభించింది.

### ఇశ్శాఖారు వంశం వారికి భూమి

17నాలుగవ భాగం ఇశ్శాఖారు వంశంవారికి ఇవ్వ
బడింది. ఆ వంశంలో ప్రతి కుటుంబానికీ కొంత
భూమి లభించింది. 18ఆ కుటుంబాలకు వారికి ఇవ్వ
బడిన భూమి యిది; యెజ్రెయేలు, కెసుల్లోతు,
షూనేము, 19హపరాయిము, షియోను, అనాహరతు
20రబ్బీతు, కిష్యోను, ఎబెజు 21రెమెతు, ఎన్‌గన్నీము,
ఎన్‌హద్దా, బెత్‌పెసెసు.
22వారి దేశ సరిహద్దు తాబోరు, షహజును, బెత్
షెమెషు అనే ప్రాంతాలను తాకుతుంది. ఆ సరిహద్దు
యొర్దాను నది దగ్గర నిలిచిపోయింది. మొత్తం మీద
16 పట్టణాలు, వాటి పొలాలు అన్నీ ఉన్నాయి. 23ఈ
పట్టణాలు, పురాలు ఇశ్శాఖారు వంశానికి యివ్వబడిన
దేశంలోని భాగం. ప్రతీ కుటుంబానికీ ఈ దేశంలో
భాగం లభించింది.

### ఆషేరు వంశంవారికి లభించిన భూమి

24దేశంలోని ఐదవ భాగం ఆషేరు వంశం వారికి
ఇవ్వబడింది. ఆ వంశంలోని ప్రతీ కుటుంబానికీ ఆ
భూమిలో కొంత లభించింది. 25ఆ వంశానికి ఇవ్వబడిన
దేశం ఇది; హెల్కతు, హాలి, బెతెను, అక్షాపు, 26అలమ్మె
లెకు, అమద్, మిషల్.
పడమటి సరిహద్దు కర్మెలు పర్వతం, షీహోరు
లిబ్నాతు వరకు కొనసాగింది. 27తర్వాత ఆ సరిహద్దు
తూర్పుకు మళ్లింది. ఆ సరిహద్దు బెత్ దాగోనుకు
విస్తరించింది. ఆ సరిహద్దు జెబులూను, ఇఫెలు లోయ
లను తాకింది. తర్వాత ఆ సరిహద్దు బెత్‌ఎమెక్,
నెయీఎల్‌కు ఉత్తరంగా కొనసాగింది. ఆ సరిహద్దు
కాబూలుకు ఉత్తరంగా దాటిపోయింది. 28తర్వాత
అబ్దోను,* రెహోబు, హమ్మోను, కానా వరకు ఆ
సరిహద్దు కొనసాగింది. మహాసీదోను ప్రాంతంవరకు
ఆ సరిహద్దు కొనసాగింది. 29తర్వాత ఆ సరిహద్దు
తిరిగి దక్షిణంగా రామాకు విస్తరించింది. ఆ సరిహద్దు
బలమైన తుయర పట్టణంవరకు కొనసాగింది. తర్వాత
సరిహద్దు మళ్లుకొని హొసాకు పోయింది. సముద్రం
దగ్గర అక్జీబు ప్రాంతంలో 30ఉమ్మా, అఫెకు, రెహోబు
దగ్గర సరిహద్దు అయిపోయింది.
మొత్తం మీద ఇరవై రెండు పట్టణాలు, వాటి పొలాలు
మొత్తము. 31ఆషేరు వంశానికి ఇవ్వబడిన దేశంలో
ఈ పట్టణాలు, వాటి పొలాలు అన్నీ ఒక భాగం. ఆ
వంశంలోని ప్రతీ కుటుంబానికీ ఈ దేశంలో ఒక భాగం
లభించింది.

### నఫ్తాలి వంశం వారికి లభించిన భూమి

32నఫ్తాలి వంశం వారికి ఆరో భాగం భూమి యివ్వ
బడింది. ఆ వంశంలోని ప్రతీ కుటుంబానికీ ఆ దేశంలో
కొంత భాగం లభించింది. 33వారి దేశ సరిహద్దు జయ
నన్నీములోని సింధూరవనము దగ్గర ప్రారంభమ
యింది. ఇది హెలెపు సమీపంలో ఉంది. తర్వాత
ఆదామి, నెకెబు, యబ్నెయెలు గుండా ఆ సరిహద్దు
కొనసాగింది. ఆ సరిహద్దు లక్కుం ప్రాంతం వరకు
విస్తరించి, యొర్దాను నది దగ్గర ముగిసింది. 34తర్వాత
ఆ సరిహద్దు అస్నోతు తాబోరుగుండా పడమటికి
వెళ్లింది. హుక్కోకు దగ్గర సరిహద్దు నిలిచిపోయింది.
దక్షిణాన సరిహద్దు జెబులూను ప్రాంతం వరకు వెళ్లింది.
పశ్చిమాన ఆ సరిహద్దు ఆషేరు ప్రాంతం వరకు వెళ్లింది.
తూర్పున యొర్దాను నది దగ్గర ఆ సరిహద్దు యూదా
వరకు వెళ్లింది. 35ఈ సరిహద్దుల లోపల కొన్ని బలమైన
పట్టణాలు ఉన్నాయి. ఆ పట్టణాలు జిద్దీము, జేరు,
హమ్మాతు, రక్కాతు, కిన్నెరతు 36అదామా, రామా,
హషారు 37కెదెషు, ఎద్రేయి, ఎన్‌హసోరు 38ఇరోను,
మిగ్దల్ ఎల్, హొరేం, బెత్‌అనాతు, బెత్‌షెమెషు.
మొత్తం మీద పంతొమ్మిది, పట్టణాలు వాటి పొలాలు
మొత్తము.
39ఆ పట్టణాలు, వాటి చుట్టూ ఉన్న పురాలు
నఫ్తాలి వంశం వారికి యివ్వబడిన దేశంలో ఉన్నాయి.
ఆ వంశంలో ప్రతి కుటుంబానికీ ఆ దేశంలో కొంత
భాగం లభించింది.

### దాను వంశం వారికి లభించిన భూమి

40తర్వాత దాను వంశానికి భూమి యివ్వబడింది.
ఆ వంశంలోని ప్రతి కుటుంబానికీ ఆ దేశంలో కొంత
భూమి లభించింది. 41వారికి ఇవ్వబడిన భూమి ఇది:
జొర్యా, ఎష్తాయోలు, ఇర్‌షెమెషు 42షయల్బీను,

---

**అబ్దోను** లేక “హెబ్రోన్.”

అయ్యాలోను, ఇత్లా, 43ఎలోను, తిమ్నా, ఎక్రోను
44ఎల్తెకే, గిబ్బెతోను, బాలాతా 45యెహుదు బెనెబెరక్,
గాత్ రిమ్మోను 46మేయర్కోను రక్కోను, యొప్ప
దగ్గర ప్రాంతం.
47అయితే దాను ప్రజలు వారి దేశాన్ని స్వాధీనం
చేసుకోవటంలో కష్టం వచ్చింది. అక్కడ బలమైన
శత్రువులు ఉన్నారు, వారిని దాను ప్రజలు తేలికగా
ఓడించలేకపోయారు. కనుక దాను ప్రజలు వెళ్లి లెషెము
మీద యుద్ధం చేసారు. లెషెమును వారు ఓడించి,
అక్కడ నివసించిన మనుష్యులను చంపివేసారు. కనుక
దాను ప్రజలు లెషెము పట్టణంలో నివసించారు. దాని
పేరును వారు దానుగా మార్చివేసారు, ఎందుకంటే
అది ఆ వంశం పితరుని పేరు.
48దాను వంశానికి యివ్వబడిన దేశం ఈ పట్టణాలు,
పురాలు మొత్తము. ప్రతీ కుటుంబానికీ ఈ దేశంలో
భాగం లభించింది.

### యెహోషువకు లభించిన భూమి

49కనుక దేశాన్ని విభజించటం, వేర్వేరు వంశాలకు
దానిని పంచి ఇవ్వటం నాయకులు ముగించారు. వారు
ముగించిన తర్వాత, నూను కుమారుడైన యెహోషు
వకు గూడ కొంత భూమి ఇవ్వాలని ఇశ్రాయేలు ప్రజ
అంతా నిర్ణయించారు. ఇది అతనికి వాగ్దానం చేయబడిన
భూమి. 50అతనికి ఈ భూమి రావాలని యెహోవా
ఆజ్ఞాపించాడు. కనుక ఎఫ్రాయిము కొండ దేశంలోని
తిమ్నాత్ సెరహు పురమును వారు యెహోషువకు
ఇచ్చారు. ఈ పట్టణమే తనకు కావాలని యెహోషువ
వారితో చెప్పాడు. కనుక యెహోషువ ఆ పట్టణాన్ని
మరింత గట్టిగా కట్టి, అక్కడ నివసించాడు.
51కనుక ఇశ్రాయేలీయుల వేర్వేరు వంశాలకు ఈ
భూములన్నీ ఇవ్వబడ్డాయి. ఈ దేశాన్ని విభాగిం
చేందుకు యాజకుడైన ఎలీయేజరు, నూను కుమారు
డైన యెహోషువ, ఒక్కో వంశాల నాయకులు
షిలోహు అనే స్థలంలో సమావేశం అయ్యారు. సన్నిధి
గుడార ప్రవేశం దగ్గర యెహోవా సన్నిధిలో వారు
సమావేశమయ్యారు. ఇప్పుడు దేశాన్ని విభాగించటం
వారు ముగించారు.

### ఆశ్రయ పురాలు

20 అప్పుడు యెహోషువతో యెహోవా ఇలా
చెప్పాడు: 2"నీకు ఒక ఆజ్ఞ ఇచ్చేందుకు నేను
మోషేను వాడుకొన్నాను. ప్రత్యేకమైన ఆశ్రయ పురా
లను నిర్మించుమని మోషే నీతో చెప్పాడు. 3ఎవరైనా
ఒక వ్యక్తి మరొక వ్యక్తిని చంపితే, అది ప్రమాదవశాత్తు
జరిగిందే తప్ప, ఆ వ్యక్తిని చంపాలనే ఉద్దేశం లేకపోతే,
అప్పుడు అతడు దాగుకొనేందుకు ఒక ఆశ్రయ
పురానికి వెళ్ల వచ్చును.
4"ఆ వ్యక్తి ఇలా చేయాలి. అతడు పారిపోయి, ఆ
పట్టణాల్లో ఒకదానికి వెళ్లినప్పుడు, ఆ పట్టణ ప్రవేశం
దగ్గర అతడు ఆగిపోవాలి. అతడు ద్వారం దగ్గర
ఆగిపోయి, జరిగిన విషయాన్ని గూర్చి ప్రజానాయ
కులకు చెప్పాలి. అప్పుడు ఆ ప్రజానాయకులు అతణ్ణి
ఆ పట్టణంలో ప్రవేశింప నియ్యవచ్చును. అతడు వాళ్ల
మధ్య నివసించేందుకు వారు అతనికి ఒక స్థలం ఇస్తారు.
5అయితే వానిని తరుముతున్న వాడు అతణ్ణి వెంబడించి
ఆ పట్టణానికి రావచ్చును. ఇలా గనుక జరిగితే ఆ
పట్టణ నాయకులు వదలిపెట్టకూడదు. ఆశ్రయం
కోసం వారి దగ్గరకు వచ్చిన వ్యక్తిని వారు కాపాడాలి.
ఆ వ్యక్తి చంపినవానిని ఉద్దేశ పూర్వకంగా చంపలేదు
గనుక వారు అతణ్ణి కాపాడాలి. అది ప్రమాదవశాత్తు
జరిగింది. అతడు కోపంతో, ఆ వ్యక్తిని చంపాలని
చేసిన నిర్ణయం కాదు. అది ఏదో అలా జరిగిపోయింది.
6ఆ పట్టణంలోని న్యాయస్థానం అతనికి తీర్పు తీర్చేం
తవరకు అతడు ఆ పట్టణంలో ఉండాలి. మరియు
ప్రధాన యాజకుడు మరణించేంతవరకు అతడు ఆ
పట్టణంలోనే ఉండి పోవాలి. తర్వాత అతడు ఏ పట్టణం
నుండి పారిపోయాడో అక్కడి తన స్వంత ఇంటికి
తిరిగి వెళ్లవచ్చును."
7కనుక, "ఆశ్రయ పురాలుగా" పిలువబడేందుకు
కొన్ని పట్టణాలను ఇశ్రాయేలు ప్రజలు నిర్ణయించారు.

ఆ పట్టణాలు: నఫ్తాలి కొండ దేశంలోని గలిల
యలో కెదెషు, ఎఫ్రాయిము కొండ దేశంలో
షెకెము, యూదా కొండ దేశంలో కిర్యత్
అర్బ (హెబ్రోను.)
8 యొర్దాను నది తూర్పు దిక్కున, యెరికో
దగ్గర రూబేను దేశంలోని అరణ్యంలో
బేసెరు, గాదు దేశంలోని గిలాదులో రామోతు,
మనష్షే దేశంలోని బాషానులో గోలాను.

9ఏ ఇశ్రాయేలీయులు అయినా, వారి మధ్య నివసి
స్తున్న ఏవ్యక్తి అయినా ప్రమాదవశాత్తు ఒకరిని చంపి
నట్లయితే, ఆ వ్యక్తి భద్రతకోసం ఈ ఆశ్రయ పురా
లలో ఒక దానికి పారిపోవచ్చును. అప్పుడు ఆ వ్యక్తి
అక్కడ క్షేమంగా ఉంటాడు, అతణ్ణి తరుముతున్న
ఎవరిచేతగాని అతడు చంపబడడు. ఆ పట్టణ న్యాయ
స్థానం, ఆ పట్టణంలో అతనికి న్యాయం తీరుస్తుంది.

### యాజకులకు, లేవీయులకు లభించిన పట్టణాలు

21 లేవీ వంశంపు ప్రధానులు యాజకుడైన
ఎలీయాజరుతో, నూను కుమారుడు
యెహోషువతో, ఇశ్రాయేలీయుల ఇతర వంశాల
ప్రధానులతో మాట్లాడేందుకు వెళ్లారు. 2ఇది కనాను
దేశంలోని షిలోహు పట్టణంలో సంభవించింది.

"మోషేకు యెహోవా ఒక ఆజ్ఞ ఇచ్చాడు. మేము నివసించేందుకు మీరు మాకు పట్టణాలు ఇవ్వాలని ఆయన ఆజ్ఞాపించాడు. మా పశువులు మేత మేసేందుకు పొలాలుకూడ మీరు మాకు ఇవ్వాలని ఆయన ఆజ్ఞాపించాడు" అని లేవీ ప్రధానులు వారితో చెప్పారు.
[3]కనుక యెహోవా ఆజ్ఞకు ఇశ్రాయేలు ప్రజలు విధేయులయ్యారు. లేవీ ప్రజలకు వారు ఈ పట్టణాలు, ప్రాంతాలు ఇచ్చారు:

[4]కహతు వంశంలో ఒక భాగం వారికి పదమూడు పట్టణాలు ఇవ్వబడ్డాయి. యూదా, షిమ్యోను, బెన్యామీను వారికి చెందిన ప్రాంతాల్లో ఈ పట్టణాలు ఉన్నాయి. (కహతు వంశం, లేవీ వంశంలో ఒక భాగం. లేవీ యాజకుడైన అహరోను సంతానము).

[5]కహతు వంశంలోని మరో భాగం వారికి పది పట్టణాలు ఇవ్వబడ్డాయి. ఈ పది పట్టణాలు ఎఫ్రాయిము, దాను, మనష్షే అర్ధగోత్రం వారి ప్రాంతాల్లో ఉన్నాయి.

[6]గెర్షోము వంశపు ప్రజలకు పదమూడు పట్టణాలు ఇవ్వబడ్డాయి. ఇశ్శాఖారు, ఆషేరు, నఫ్తాలి, బాషానులోని మనష్షే అర్ధ గోత్రం వారి ప్రాంతాల్లో ఈ పట్టణాలు ఉన్నాయి.

[7]మెరారీ కుటుంబం వారికి పన్నెండు పట్టణాలు ఇవ్వబడ్డాయి. రూబేను, గాదు, జెబులూనుకు చెందిన ప్రాంతాల్లో ఈ పట్టణాలు ఉన్నాయి.

[8]కనుక ఈ పట్టణాలు, వీటి పరిసరాల్లోని పొలాలు లేవీ ప్రజలకు ఇశ్రాయేలు ప్రజలు ఇచ్చారు. మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞకు విధేయులుగా వారు ఇలా చేసారు.

[9]యూదా, షిమ్యోనుకు చెందిన దేశంనుండి తీసు
కొనబడిన పట్టణాల పేర్లు ఇవి. [10]మొదట నిర్ణయించ
బడిన పట్టణాలు కహత్ కుటుంబానికి ఇవ్వబడ్డాయి
(లేవీ ప్రజలు). [11]కిర్యత్ అర్బ (హెబ్రోను), దాని
పొలాలు అన్నీ వారు వారికి ఇచ్చారు. ఇది యూదా కొండ దేశంలో ఉంది. (అనాకు తండ్రి అర్బ). ఆ పట్టణం దగ్గర్లో వారి పశువులు మేసేందుకు పొలాలు
కూడ వారికి లభించాయి. [12]అయితే కిర్యత్ అర్బ
చుట్టు ఉన్న చిన్న పట్టణాలు, పొలాలు యెఫున్నె
కుమారుడైన కాలేబుకు చెందినవి. [13]కనుక హెబ్రోను
పట్టణాన్ని వారు అహరోను సంతతివారికి ఇచ్చారు. హెబ్రోను ఆశ్రయ పట్టణం. అహరోను సంతతివారికి
లిబ్నా [14]యత్తీరు, యష్టెమోయ [15]హోలోను,
దెబీరు, [16]అయ్యిను, యుట్ట, బెత్షెమెషు పట్టణాలను
కూడ వారు ఇచ్చారు. ఈ పట్టణాల చుట్టుపక్కల ఉన్న పొలాలు అన్నింటిని కూడ వారు వీరికి ఇచ్చారు. ఈ రెండు వంశాలకు ఇవ్వబడినవి తొమ్మిది పట్టణాలు.
[17]బెన్యామీను సంతతివారికి చెందిన పట్టణాలను
కూడా అహరోను సంతతివారికి ఇచ్చారు. ఆ పట్టణాలు
గిబియోను, గెబ, [18]అనాతోతు, అల్మోను. ఈ నాలుగు
పట్టణాలను, వాటి చుట్టూ ఉన్న పొలాలు అన్నింటినీ
వారు వీరికి ఇచ్చారు. [19]కనుక యాజకులకు ఇవ్వబడిన
పట్టణాలు ఇవి. ఈ యాజకులు అహరోను సంతానం వారు. మొత్తం మీద అవి పదమూడు పట్టణాలు మరియు వాటి పొలాలు.

[20]కొహతీ కుటుంబంలో ఇతర ప్రజలకు ఈ
పట్టణాలు ఇవ్వబడ్డాయి. ఈ పట్టణాలు ఎఫ్రాయిము
వంశంనుండి తీసుకోబడ్డాయి. [21]ఎఫ్రాయిము కొండ
ప్రదేశంనుండి షెకెము పట్టణం (షెకెము ఒక ఆశ్రయ
పట్టణం) వారువారికి గెజెర్ [22]కిబ్సాయిము, బెత్హోరాను
కూడ ఇచ్చారు. మొత్తం మీద అవి నాలుగు పట్టణాలు మరియు వాటి పొలాలు.

[23]దాను వంశం వారు వారికి ఎత్తెకె, గిబ్బెతాను
[24]అయ్యలోను, గాత్ రిమ్మోను ఇచ్చారు. మొత్తం
మీద నాలుగు పట్టణాలు మరియు వాటి పొలాలు.

[25]మనష్షే వంశంలోని సగంమంది తానాను, గాత్
రిమ్మోను వారికి ఇచ్చారు. ఈ రెండు పట్టణాల చుట్టూ ఉన్న పొలాలు అన్నీ వారికి ఇవ్వబడ్డాయి.

[26]కనుక దీనితో ఇంకా పది పట్టణాలు, వాటి చుట్టూ
ఉన్న భూమి మొత్తం కొహత్ కుటుంబం వారికి ఇవ్వబడ్డాయి.

[27]లేవీ వంశంలోని గెర్షోను కుటుంబం వారికి ఈ
పట్టణాలు ఇవ్వబడ్డాయి.

మనష్షే వంశంలోని సగంమంది బాషానులోని గొలానును వారికి ఇచ్చారు. (గొలాను ఆశ్రయ పట్టణం) మనష్షేకూడ బెఎష్తెరాను వారికి ఇచ్చారు. ఈ రెండు పట్టణాల చుట్టూ ఉన్న మొత్తం భూమి కూడ గెర్షోను కుటుంబం వారికి ఇవ్వబడింది.

[28]ఇశ్శాఖారు వంశంవారు వారికి కిషియోను,
దబెరాతు [29]యార్మూతు, ఎన్గన్నీము ఇచ్చారు. ఈ
నాలుగు పట్టణాలు, వాటిచుట్టూ ఉన్న మొత్తం భూమిని కూడ వారి పశువులకోసం ఇశ్శాఖారు వంశానికి ఇచ్చారు.

[30]ఆశేరు వంశం వారు వారికి మిషాలు, అబ్దోను
[31]హెల్కాతు, రెహబు ఇచ్చారు. ఈ నాలుగు పట్టణాలు
వాటి చుట్టూ ఉన్న మొత్తం భూమిని కూడ వారు వారి పశువుల కోసం ఇచ్చారు.

[32]నఫ్తాలి వంశంవారు గలలీయలోని కెదెషును వారికి
ఇచ్చారు. (కెదెషు ఆశ్రయ పట్టణం). హమ్మోత్ దోరు,
కర్తానుకూడ నఫ్తాలి వారికి ఇచ్చారు. ఈ రెండు పట్టణాల చుట్టూ ఉన్న మొత్తం భూమి కూడ గెర్షోను
కుటుంబం వారికి ఇవ్వబడింది. [33]మొత్తం మీద గెర్షోను
కుటుంబం వారికి పద మూడు పట్టణాలు, ఈ పట్టణాల చుట్టూ ఉన్న మొత్తం పొలాలు లభించాయి.

[34]మరో లేవీ కుటుంబం మెరారీ కుటుంబం.
మెరారీ కుటుంబం వారికి ఇవ్వబడిన పట్టణాలు ఇవి:

జెబులూను వంశంవారు ఇచ్చినవి: యొకెనియము,
కర్తా 35దిమ్నా, నహలాలు. ఈ నాలుగు పట్టణాల
చుట్టూ ఉన్న మొత్తం భూమి కూడ మెరారీ ప్రజలకే
ఇవ్వబడింది.
36రూబేను వంశంవారు వారికి ఇచ్చినవి బెసెరు,
యహసు 37కెదెమోతు, మోఫాతు. ఈ నాలుగు
పట్టణాల చుట్టూ ఉన్న మొత్తం భూమి కూడ మెరారీ
కుటుంబానికే ఇవ్వబడింది.
38గాదు వంశం వారు వారికి ఇచ్చినవి గిలాదులోని
రామోత్. (గిలాదు ఒక ఆశ్రయ పట్టణం). వారు ఇంకా
మహనయీము, 39హెష్బోను, యాజెరు కూడ
ఇచ్చారు. ఈ నాలుగు పట్టణాల చుట్టూ ఉన్న మొత్తం
భూమిని కూడ గాదువారు వారికి ఇచ్చారు.
40మొత్తం మీద మెరారీ వారికి ఇవ్వబడినవి
పన్నెండు పట్టణాలు.
41మొత్తం మీద లేవీ వంశానికి నలభై ఎనిమిది పట్ట
ణాలు లభించాయి. ఈ పట్టణాలన్నీ ఇశ్రాయేలు ప్రజల
స్వాధీనంలో ఉన్న దేశంలోనే ఉన్నాయి. 42ఈ పట్ట
ణాలు ప్రతిదాని చుట్టూ పశువులు బతికేందుకు గాను
భూమి, పొలాలు ఉన్నాయి.
43కనుక ఇశ్రాయేలు ప్రజలకు యెహోవా చేసిన
వాగ్దానాన్ని ఆయన నెరవేర్చాడు. ఆయన వాగ్దానం
చేసిన దేశం అంతటినీ ఆ ప్రజలకు ఆయన ఇచ్చాడు.
ఆ ప్రజలు ఆ దేశాన్ని స్వతంత్రించుకొని అక్కడ నివ
సించారు. 44మరియు వారి దేశానికి అన్నివైపులా ఆ
ప్రజలు శాంతి కలిగి ఉండేటట్లు యెహోవా చేసాడు.
చాలా కాలం కిందట వారి పూర్వీకులకు ఆయన
వాగ్దానం చేసింది ఇదే. వారి శత్రువులు ఎవరూ వారిని
ఓడించలేదు. ఇశ్రాయేలు ప్రజలు వారి ప్రతి శత్రువును
ఓడించేటట్టు యెహోవా చేసాడు. 45ఇశ్రాయేలు
ప్రజలకు యెహోవా చేసిన ప్రతి వాగ్దానాన్నీ ఆయన
నెరవేర్చాడు. నెరవేరని వాగ్దానాలంటూ ఏమీ లేవు.
ప్రతి వాగ్దానం నిజమయింది.

### మూడు వంశాలు ఇండ్లకు వెళ్లటం

22 అప్పుడు రూబేను, గాదు వంశాలు, మనష్షే
వంశంలో సగం మంది, అందరినీ ఒక
సమావేశానికి పిలిచాడు యెహోషువ. 2యెహోషువ
వారితో అన్నాడు: "మీరు చేయాలని మోషే చెప్పిన
వాటన్నింటికీ మీరు విధేయులయ్యారు. మోషే
యెహోవా సేవకుడు. మరియు, మీరు నా ఆజ్ఞల
న్నింటికి కూడా విధేయులయ్యారు. 3ఇంకను
ఇన్నాళ్లూ ఇశ్రాయేలు ఇతర ప్రజలందరినీ మీరు బల
పర్చారు. మీ యెహోవా దేవుడు మీకు ఇచ్చిన ఆజ్ఞల
న్నింటికీ మీరు జాగ్రత్తగా విధేయులయ్యారు. 4ఇశ్రా
యేలు ప్రజలకు శాంతి ఇస్తానని మీ యెహోవా దేవుడు
వాగ్దానం చేసాడు. కనుక ఇప్పుడు యెహోవా తన
వాగ్దానం నిలబెట్టుకొన్నాడు. ఇప్పటికి మీరు తిరిగి మీ
ఇండ్లకు వెళ్లవచ్చును. మీకు ఇవ్వబడ్డ దేశానికి మీరు
తిరిగి వెళ్లవచ్చును. ఇది యోర్దాను నదికి తూర్పున
ఉన్న దేశం. యెహోవా సేవకుడు మోషే మీకు
ఇచ్చిన దేశం ఇది. 5అయితే మోషే మీకు ఇచ్చిన
చట్టానికి లోబడుతూనే ఉండాలని జ్ఞాపకం ఉంచు
కోండి. మీ యెహోవా దేవుడ్ని ప్రేమిస్తూ, ఆయన
ఆజ్ఞలకు లోబడటమే ఆ చట్టం. మీరు ఆయనను
వెంబడిస్తూనే ఉండాలి, మీకు చేతనైనంత బాగుగా
ఆయనను సేవిస్తూనే ఉండాలి."
6తర్వాత యెహోషువ వారికి వీడ్కోలు చెప్పగా,
వారు వెళ్లిపోయారు. వారు వారి ఇండ్లకు వెళ్లిపోయారు.
7బాషాను దేశాన్ని మనష్షే అర్ధ వంశం వారికి మోషే
ఇచ్చాడు. మిగిలిన అర్ధ వంశంవారికి యోర్దాను నది
పడమటి వైపు దేశాన్ని యెహోషువ ఇచ్చాడు. అక్కడి
కివారి ఇండ్లకు యెహోషువ వారిని పంపివేసాడు.
యెహోషువ వారిని ఆశీర్వదించాడు. 8"మీ ఇండ్లకు
మీ ఐశ్వర్యాలకు తిరిగి వెళ్లండి. మీకు చాల పశువులు,
చాల విలువైన నగలు, వెండి, బంగారం ఉన్నాయి.
మీకు చాల అందమైన బట్టలు ఉన్నాయి. మరియు
మీ శత్రువుల దగ్గర చాల వస్తువులు మీరు తీసు
కొన్నారు. వీటన్నింటినీ మీలో మీరు పంచు కోవాలి."
అని అతడు చెప్పాడు.
9కనుక రూబేను, గాదు, మనష్షే వంశాలవారు మిగి
లిన ఇశ్రాయేలు ప్రజలను విడిచి వెళ్లారు. వారు కనాను
లోని షిలోహులో ఉన్నారు. ఆ స్థలం విడిచి వారు
తిరిగి గిలాదు వెళ్లారు. ఇది వారి స్వంత దేశం. ఈ
దేశాన్ని మోషే వారికి ఇవ్వాలని యెహోవా ఆజ్ఞాపించి
నందువల్ల అతడు దానిని వారికి ఇచ్చాడు.
10రూబేను, గాదు, మనష్షే ప్రజలు గెలిలోతు అనే
స్థలానికి ప్రయాణం చేసారు. ఇది కనాను దేశంలో
యోర్దాను నది దగ్గర ఉంది. ఆ స్థలంలో ప్రజలు ఒక
చక్కని బలిపీఠం నిర్మించారు. 11కానీ ఈ మూడు
వంశాలవారు నిర్మించిన బలిపీఠం గూర్చి, ఇంకా
షిలోహులోనే ఉన్న ఇతర ఇశ్రాయేలు ప్రజలు
విన్నారు. కనాను సరిహద్దులో గెలిల్‌తో అనే చోట
బలిపీఠం ఉన్నదని వారు విన్నారు. అది యోర్దాను
నది దగ్గర ఇశ్రాయేలీయుల వైపుగా ఉంది. 12ఈ
మూడు వంశాల మీద ఇశ్రాయేలు ప్రజలందరికీ చాల
కోపం వచ్చింది. వారు కలుసుకొని, వాళ్లతో యుద్ధం
చేయాలని నిర్ణయం చేసారు.
13కనుక రూబేను, గాదు, మనష్షే ప్రజలతో మాట్లా
డేందుకు ఇశ్రాయేలు ప్రజలు కొందరు మనుష్యుల్ని
పంపించారు. యాజకుడు ఎలీయాజరు కుమారుడైన
ఫీనెహాసు ఈ మనుష్యులకు నాయకుడు.
14వంశాల నాయకులలో పదిమందిని కూడ వారు
అక్కడికి పంపించారు. షిలోహులో ఉన్న ఇశ్రాయేలు

వంశాల్లో ఒక్కో దాని నుండి ఒక్కో మనిషి అందులో
ఉన్నాడు.
15కనుక ఈ పదకొండు మంది గిలాదు వెళ్లారు.
రూబేను, గాదు, మనష్షే ప్రజలతో మాట్లాడటానికి
వారు వెళ్లారు. ఆ పదకొండు మంది వారితో అన్నారు:
16“ఇశ్రాయేలు ప్రజలంతా మిమ్మల్ని అడిగేది ఏమి
టంటే, ‘ఇశ్రాయేలీయుల దేవునికి వ్యతిరేకంగా మీరు
ఈ పని ఎందుకు చేసారు? మీరెందుకు యెహోవాకు
అడ్డం తిరిగారు? మీకోసం మీరెందుకు బలిపీఠం కట్టు
కొన్నారు? ఇది దేవుని చట్టానికి విరుద్ధం అని మీకు
తెలుసు. 17పెయొరు అనే మనిషి జ్ఞాపకం ఉన్నాడా?
అతడు ఇలాగే చేసాడు. అతడి పాపం మూలంగా నేటికీ
మనం శ్రమ అనుభవిస్తున్నాం. అతడి మహా అపరాధం
మూలంగా ఇశ్రాయేలు ప్రజలు అనేకమంది రోగులు
అయ్యేటట్టు దేవుడు చేసాడు. ఆ రోగం మూలంగా
మనం నేడు కూడ శ్రమపడుతున్నాం. 18ఇప్పుడు
మీరు మళ్లీ అలాగే చేస్తున్నారు. మీరు యెహోవాకు
విరోధంగా తిరుగుతున్నారు. యెహోవాను వెంబడిం
చటానికి మీరు నిరాకరిస్తారా? మీరు చేస్తున్న దానిని
మానివేయకపోతే ఇశ్రాయేలీయుల్లో ప్రతి ఒక్కరి మీదా
యెహోవా కోపగిస్తాడు.
19“ఆరాధించుకొనేందుకు మీ దేశం తగినట్టుగా
లేకపోతే, మా దేశంలోనికి రండి. యెహోవా గుడారం
మా దేశంలో ఉంది. మీరు కూడ మా దేశంలో కొంత
తీసుకొని, అక్కడే నివసించవచ్చు. అంతేకాని యెహో
వాకు విరోధంగా తిరుగకండి. మరో బలిపీఠం నిర్మించ
వద్దు. మన యెహోవా దేవుని బలిపీఠం సన్నిధి
గుడారంలో ఇదివరకే ఉంది.
20“జెరహు కుమారుడు ఆకాను ఆనేవాడ్ని జ్ఞాపకం
చేసుకోండి. నాశనం చేయాల్సిన వస్తువుల విషయంలో
అతడు ఆజ్ఞకు లోబడేందుకు ఇష్టపడలేదు. ఆ ఒక్కడు
యెహోవా ఆజ్ఞను ఉల్లంఘించాడు, కానీ ఇశ్రాయేలు
ప్రజలంతా శిక్షపొందారు. ఆకాను అతని అపరాధం
మూలంగా చనిపోయాడు. కానీ అతని వలన ఇంకా
చాలమంది ప్రజలు కూడ చనిపోయారు.”
21రూబేను, గాదు, మనష్షే వంశాల ప్రజలు ఆ పద
కొండు మందికీ జవాబు చెప్పారు. వారు చెప్పింది
ఇదే: 22“యెహోవాయే మా దేవుడు. మళ్లీ చెబుతు
న్నాము. యెహోవాయే మా దేవుడు. మేము ఎందుకు
ఇలా చేసామో దేవునికి తెలుసు. మీరు కూడ తెలుసు
కోవాలని మేము కోరుతున్నాము. మేము చేసిన దానికి
మీరు విచారణ జరుపవచ్చు. మేము చేసింది తప్పు
అనే నమ్మకం మీకు కలిగితే, మీరు మమ్మల్ని చంప
వచ్చు. 23మేము గనుక దేవుని చట్టాన్ని ఉల్లంఘించి
ఉంటే, మమ్మల్ని శిక్షించుమని చెప్పి ఆ దేవుడినే
మేము అడుగుతాము. ధాన్యార్పణలు, సమాధాన
బలులు అర్పించేందుకు, దహనబలుల కోసమూ
మేము ఈ బలిపీఠం నిర్మించామని మీరు తలుస్తు
న్నారా? లేదు. ఆ కారణంతో మేము దీన్ని నిర్మించ
లేదు. మేము ఈ బలిపీఠాన్ని ఎందుకు నిర్మించాము?
24మేము కూడ మీ దేశంలో భాగస్థులమేనని మీ ప్రజలు
భవిష్యత్తులో ఒప్పుకోరేమోనని మేము భయపడ్డాం.
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాను మేము ఆరా
ధించకూడదని అప్పుడు మీ ప్రజలు అంటారు.
25యొర్దాను నది అవతలి వైపు దేవుడు మాకు భూమి
ఇచ్చాడు. అంటే యొర్దాను నది మనల్ని వేరు
చేస్తుందని దీని అర్థం. మీ పిల్లలు పెద్దవారై, మీ దేశాన్ని
పాలించినప్పుడు, మేమూ మీ వాళ్లమేనని వారికి జ్ఞాపకం
ఉండదు. ‘రూబేను, గాదు ప్రజలారా, మీరు ఇశ్రాయేలు
ప్రజల మధ్యను చెందినవారు కారు’ అని మాతో వారు
అంటారు. అందుచేత మా పిల్లలు యెహోవాను
ఆరాధించకుండా మీ పిల్లలు ఆటంకపరుస్తారు.
26“అందుచేత మేము ఈ బలిపీఠం నిర్మించాలని
నిర్ణయించాం. అంతేగాని దీనిని దహనబలులకు, బలు
లకు ఉపయోగించాలని మేము తలచలేదు. 27మీరు
ఆరాధిస్తున్న, మీరు ఆరాధించే దేవుడినే మేమూ
ఆరాధిస్తున్నామనే విషయం మా బలిపీఠం మా ప్రజ
లకు తెలియజేయాలనేదే అసలైన కారణం. మేము
యెహోవాను ఆరాధిస్తామని మీకు, మాకు, మన
భవిష్యత్ పిల్లలందరికీ ఈ బలిపీఠం ఋజువుగా
ఉంటుంది. మా బలులు, ధాన్యార్పణలు, సమాధాన
బలులు యెహోవాకు అర్పిస్తాము. మీ పిల్లలు పెరిగి
పెద్దవారైనప్పుడు, మీవలెనే మేము కూడ ఇశ్రాయేలీ
యులం అని తెలుసుకోవాలని మా కోరిక. 28ముందు
నాటికి మేము ఇశ్రాయేలీయులకు చెందిన వాళ్లము
కాదు అని మీ పిల్లలు చెప్పినట్లయితే ‘చూడండి!
మాకు ముందు జీవించిన మా పితరులు ఒక బలిపీఠం
నిర్మించారు. ఆ బలిపీఠం సరిగ్గా పవిత్ర గుడారం
ముందర ఉన్న బలిపీఠంలాగానే ఉంది. ఈ బలిపీఠాన్ని
బలులు అర్పించేందుకు మేము ఉపయోగించము.
మేమూ ఇశ్రాయేలు ప్రజల్లో ఒక భాగమే అని ఈ
బలిపీఠం తెలియజేస్తుంది’ అని మా పిల్లలు చెప్పగలుగు
తారు. 29“వాస్తవంగా మేము యెహోవాకు వ్యతిరేకంగా
ఉండాలనుకోవటం లేదు. ఆయనను వెంబడించటం
ఇప్పుడు మానివేయాలని కోరటం లేదు. పవిత్ర
గుడారం ఎదుట ఉన్నదే సత్యమైన ఒకే బలిపీఠం అని
మాకు తెలుసు. ఆ బలిపీఠం మన యెహోవా
దేవునిది.”
30రూబేను, గాదు, మనష్షే ప్రజలు చెప్పిన ఈ
విషయాలను యాజకుడు ఫీనెహాసు, పదిమంది నాయ
కులు విన్నారు. ఈ మనుష్యులు సత్యమే చెబుతు
న్నారని వారు తృప్తిపడ్డారు. 31కనుక యాజకుడు
ఫీనెహాసు, “యెహోవా మనతో ఉన్నాడని ఇప్పుడు
మాకు తెలుసు. మరియు మీరు ఆయనకు విరోధంగా

తిరుగలేదని కూడ ఇప్పుడు తెలుస్తుంది. ఇశ్రాయేలు
ప్రజలు యెహోవా చేత శిక్షించబడరు గనుక మేము
సంతోషిస్తున్నాము” అన్నాడు.
32అప్పుడు ఫీనెహాసు, తదితర నాయకులు ఆ
చోటు విడిచి, ఇంటికి వెళ్లారు. రూబేను, గాదు ప్రజలను
గిలాదు దేశంలో విడిచిపెట్టి, వారు కనానుకు తిరిగి
వెళ్లారు. ఇశ్రాయేలు ప్రజల దగ్గరకు వారు తిరిగి వెళ్లి
జరిగినది వారికి తెలియజేసారు. 33ఇశ్రాయేలు ప్రజలు
కూడ తృప్తి చెందారు. వారు సంతోషించి, దేవునికి
కృతజ్ఞతలు చెల్లించారు. రూబేను, గాదు, మనష్షే ప్రజల
మీదికి యుద్ధానికి వెళ్లకూడదని వారు తీర్మానించారు.
ఆ దేశాలను నాశనం చేయకూడదని వారు నిర్ణ
యించారు.
34మరియు, “యెహోవాయే దేవుడని మేము
నమ్ముతున్నట్టు ఈ బలిపీఠం ప్రజలందరికీ తెలియ
జేస్తుంది” అని రూబేను, గాదు, మనష్షే ప్రజలు
చెప్పారు. అందుచేత వారు ఆ బలిపీఠానికి “ఋజువు”
అని పేరు పెట్టారు.

### యెహోషువ ప్రజలను ప్రోత్సాహించటం

23 ఇశ్రాయేలీయులకు వారి చుట్టూ ఉండే
శత్రువులనుండి యెహోవా శాంతిని
ఇచ్చాడు. ఇశ్రాయేలీయులను యెహోవా క్షేమంగా
ఉంచాడు. చాల సంవత్సరాలు గడిచాయి, యెహో
షువ వృద్ధుడయ్యాడు. 2ఈ సమయంలో ఇశ్రాయేలు
నాయకులు, కుటుంబ పెద్దలు న్యాయమూర్తులు అంద
రినీ యెహోషువ సమావేశపర్చాడు. యెహో షువ
ఇలా చెప్పాడు: “నేను చాల ముసలివాడినయ్యాను.
3మన శత్రువులకు యెహోవా చేసిన వాటిని మీరు
చూసారు. మనకు సహాయం చేసేందుకు అయన
అలా చేసాడు. మీ దేవుడైన యెహోవా మీ పక్షంగా
పోరాడాడు. 4పశ్చిమాన మహా సముద్రానికి, యొర్దా
నుకు మధ్యగల దేశమంతా మీ ప్రజలు తీసుకోవచ్చని
నేను మీతో చెప్పినది జ్ఞాపకం ఉంచుకోండి. నేను
మీకు ఇస్తానని చెప్పిన దేశం అది. కానీ మీరు ఇంకా
దానిని స్వాధీనం చేసుకోలేదు. 5అక్కడ నివసిస్తున్న
ప్రజలను మీ యెహోవా దేవుడు బలవంతంగా వెళ్ల
గొట్టేస్తాడు. మీరు ఆ దేశంలో ప్రవేశిస్తారు, అక్కడ
నివసిస్తున్న ప్రజలను యెహోవా వెళ్లగొట్టేస్తాడు. మీ
దేవుడైన యెహోవా చేసిన వాగ్దానం ఇది.
6“యెహోవా మనకు ఆజ్ఞాపించిన వాటన్నింటికీ
విధేయులుగా ఉండేందుకు మీరు జాగ్రత్తపడాలి. మోషే
ధర్మశాస్త్రంలో రాయబడిన వాటన్నింటికీ విధేయు
లుగా ఉండండి. ఆ ధర్మశాస్త్రానికి విముఖులు కావద్దు.
7ఇశ్రాయేలు ప్రజలు కానివాళ్లు ఇంకా కొంతమంది
మన మధ్య నివసిస్తున్నారు. ఆ ప్రజలు వారి స్వంత
దేవుళ్లను ఆరాధిస్తున్నారు. ఆ ప్రజలతో స్నేహం చేయ
వద్దు. వారి దేవుళ్లను సేవించవద్దు, ఆరాధించవద్దు.
8మీ దేవుడైన యెహోవాను వెంబడించటం మీరు
కొనసాగించాలి. గతంలో మీరు ఇలా చేసారు, ఇలాగే
మీరు చేస్తూ ఉండాలి.
9“మహా బలం గల అనేక రాజ్యాలను ఓడించేందుకు
యెహోవా మీకు సహాయం చేసాడు. ఆ ప్రజలను
యెహోవా బలవంతంగా వెళ్లగొట్టాడు. ఏ రాజ్యం
కూడా మిమ్మల్ని ఓడించలేకపోయింది.
10యెహోవా సహాయంతో ఇశ్రాయేలీయులలో
ఒక్కడు వేయిమంది శత్రువులను ఓడించగలిగాడు.
ఎందుకంటే మీ దేవుడైన యెహోవా మీ పక్షంగా
పోరాడటంవల్లనే ఇది జరిగింది. ఇలా చేస్తానని
యెహోవా వాగ్దానం చేసాడు. 11అందుచేత మీరు మీ
దేవుడైన యెహోవాను ప్రేమిస్తూనే ఉండాలి. మీరు
సంపూర్ణులుగా అయనను ప్రేమించాలి.
12“యెహోవా మార్గంనుండి తొలగిపోవద్దు. ఇశ్రా
యేలీయులకు చెందని ఏ ఇతరులతో స్నేహం చేయ
వద్దు. వారి మనుష్యులను ఎవరినీ పెళ్లాడకండి. అయితే
మీరే గనుక ఈ మనుష్యులతో స్నేహం చేస్తే 13మీ
శత్రువులను జయించేందుకు మీ దేవుడైన యెహోవా
మీకు సహాయం చేయడు. కనుక ఈ ప్రజలు మీకు
ఒక ఉచ్చుగా ఉంటారు. వారు మీ కళ్లలో పొగలా,
ధూళిలా మీకు బాధ కలిగిస్తారు. మరియు ఈ
మంచిదేశం నుండి మీరు వెళ్లగొట్టబడతారు. ఇది మీ
దేవుడైన యెహోవా మీకు ఇచ్చిన దేశం, కానీ మీరు
ఈ ఆజ్ఞకు విధేయులు కాకపోతే, దీనిని పోగొట్టు
కొంటారు.
14“ఇది దాదాపు నేను చనిపోవాల్సిన సమయం.
యెహోవా మీకోసం ఎన్నో గొప్ప కార్యాలు చేసాడని
మీకు తెలుసు, మీరు వాస్తవంగా నమ్ముతున్నారు.
ఆయన చేసిన వాగ్దానాలు ఏవీ ఆయన తప్పలేదని
మీకు తెలుసు. మనకు ఇచ్చిన ప్రతి వాగ్దానమూ
యెహోవా నెరవేర్చాడు. 15మీ దేవుడైన యెహోవా
ఇచ్చిన ప్రతి మంచి వాగ్దానం నిజంగా నెరవేరింది.
అయితే అదే విధంగా యెహోవా తన ఇతర వాగ్దా
నాలను కూడ నెరవేరుస్తాడు. మీరు తప్పు చేస్తే మీకు
కీడు కలుగుతుందని ఆయన వాగ్దానం చేసాడు. ఆయన
మీకు ఇచ్చిన ఈ మంచి దేశంనుండి బలవంతంగా
మిమ్మల్ని వెళ్లగొట్టేస్తానని ఆయన వాగ్దానం చేసాడు.
16మీ దేవుడైన యెహోవాతో మీరు చేసిన ఒడం
బడికను నిలబెట్టుకొనేందుకు మీరు నిరాకరిస్తే ఇలా
జరుగుతుంది. మీరు వెళ్లి ఇతర దేవుళ్లను పూజిస్తే
మీరు ఈ దేశాన్ని పోగొట్టుకొంటారు. ఆ ఇతర
దేవుళ్లను మీరు పూజించకూడదు. మీరు గనుక అలా
చేస్తే మీ మీద యెహోవాకు చాలా కోపం వస్తుంది.
అప్పుడు ఆయన మీకు ఇచ్చిన ఈ మంచి దేశంనుండి
మీరు వెంటనే వెళ్లగొట్టబడతారు.”

### యెహోషువ వీడ్కోలు చెప్పటం

24 అప్పుడు ఇశ్రాయేలీయుల వంశాలన్నీ షెకె
ములో సమావేశం అయ్యాయి. వారందరినీ
యెహోషువ అక్కడికి పిలిచాడు. అప్పుడు ఇశ్రాయేలు
నాయకులను, కుటుంబ పెద్దలను, న్యాయమూర్తు
లను యెహోషువ పిలిచాడు. వీళ్లంతా దేవుని ఎదుట
నిలబడ్డారు.
2అప్పుడు యెహోషువ ప్రజలందరితో మాట్లా
డాడు. అతడు ఇలా చెప్పాడు: “ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవా మీతో చెబుతున్నదే నేను మీతో
చెబుతున్నాను.
చాలాకాలం కిందట మీ పూర్వీకులు యూఫ్రటీసు
నదికి ఆవలిపక్క నివసించారు. అబ్రాహాము, నాహో
రుల తండ్రి తెరహు వంటి మనుష్యులను గూర్చి
నేను చెప్పుచున్నాను. అప్పట్లో వాళ్లు ఇతర దేవుళ్లను
పూజించారు. 3అయితే యెహోవానైన నేను మీ
తండ్రి అబ్రాహామును నది ఆవలివైపు దేశంనుండి
బయటకు రప్పించాను. నేను అతనిని కనాను
దేశంగుండా నడిపించి, అతనికి అనేకమంది పిల్లల్ని
ఇచ్చాను. అబ్రాహాముకు ఇస్సాకు అనే కొడుకును
నేను ఇచ్చాను. 4మరియు ఇస్సాకునకు యాకోబు,
ఏశావు అనే ఇద్దరు కొడుకులను నేను ఇచ్చాను.
శేయీరు చుట్టూరా ఉన్న పర్వతాలను నేను ఏశావుకు
ఇచ్చాను. కానీ యాకోబు, అతని కొడుకులు అక్కడ
నివసించలేదు. బ్రతికేందుకు వారు ఈజిప్టు వెళ్లారు.
5అప్పుడు మోషే, అహరోనులను నేను ఈజిప్టుకు
పంపించాను. నా ప్రజలను వారు ఈజిప్టునుండి
బయటకు తీసుకొని రావాలని నేను కోరాను. ఈజిప్టు
ప్రజలకు అనేకమైన భయంకర సంగతులు జరిగేటట్టు
నేను చేసాను. అప్పుడు నేను మీ వాళ్లను ఈజిప్టునుండి
బయటకు రప్పించాను. 6కనుక నేనే మీ పూర్వీకులను
ఈజిప్టునుండి బయటకు రప్పించాను. వారు ఎర్ర
సముద్రం వరకు వచ్చేటప్పటికి, ఈజిప్టు మనుష్యులు
వారిని తరుముతున్నారు. రథాలు ఉన్నాయి, రౌతులు
ఉన్నారు అక్కడ. 7కనుక యెహోవానైన నన్ను
ప్రజలు సహాయం కోరారు. నేను ఈజిప్టు ప్రజల
మీదికి మహాగొప్ప కష్టం వచ్చేటట్టు చేసాను. సముద్రం
వాళ్లను కప్పివేసేటట్టుగా యెహోవానైన నేను
చేసాను. ఈజిప్టు సైన్యానికి నేను చేసిన దీనిని మీ
మట్టుకు మీరే చూసారు.
ఆ తర్వాత చాలా కాలం మీరు అరణ్యంలో నివ
సించారు. 8అప్పుడు నేను అమోరీయుల దేశానికి
మిమ్మల్ని తీసుకొని వచ్చాను. ఇది యోర్దాను నదికి
తూర్పున ఉంది. ఆ ప్రజలు మీతో యుద్ధం చేసారు
కాని మీరు వారిని ఓడించేటట్టు నేను చేసాను. ఆ
ప్రజలను నాశనం చేసే శక్తి నేను మీకు ఇచ్చాను.
అప్పుడు మీరు ఆ దేశాన్ని స్వాధీనం చేసుకొన్నారు.
9అప్పుడు మోయాబు రాజు, సిప్పోరు కుమారు
డైన బాలాకు ఇశ్రాయేలు ప్రజలతో యుద్ధానికి సిద్ధ
మయ్యాడు. రాజు బెయోరు కుమారుడైన బిలామును
పిలిపించాడు. మిమ్మల్ని శపించమని అతడు బిలామును
అడిగాడు. 10కానీ యెహోవానైన నేను బిలాము మాట
వినటానికి నిరాకరించాను. కనుక మీకు మంచి సంగ
తులు సంభవించాలని అర్థించాడు. అతడు మిమ్మల్ని
చాలాసార్లు ఆశీర్వదించాడు. నేను మిమ్మల్ని రక్షించి,
కష్టంనుండి బయటకు రప్పించాను.
11అప్పుడు మీరు యోర్దాను నది దాటి ప్రయాణం
చేసారు. మీరు యెరికో చేరుకొన్నారు. యెరికో
పట్టణం ప్రజలు మీతో పోరాడారు. మరియు అమోరీ
ప్రజలు, పెరిజ్జీ ప్రజలు, హివ్వీ ప్రజలు, యెబూసీ
ప్రజలు మీతో పోరాడారు. కాని వాళ్లందరినీ మీరు
ఓడించేటట్టు నేను చేసాను. 12మీ సైన్యం ముందుకు
వెళ్తున్నప్పుడు వారికి ముందుగా కందిరీగలను నేను
పంపించాను. ఆ కందిరీగలు మీ శత్రువులను పారిపోయే
టట్టు చేసాయి. కనుక మీరు ఖడ్గాలు, బాణాలు
ప్రయోగించకుండా దేశాన్ని స్వాధీనం చేసుకున్నారు.
13యెహోవానైన నేను మీకు ఆ దేశాన్ని ఇచ్చాను.
మీరు పని చేయాల్సిన అవసరం లేకుండానే ఆ దేశాన్ని
నేను మీకు ఇచ్చాను. మీరు నిర్మించని పట్టణాలను
నేను మీకు ఇచ్చాను. ఇప్పుడు మీరు ఆ దేశంలో, ఆ
పట్టణాల్లో నివసిస్తున్నారు. మీరు నాటకుండానే ద్రాక్షా
తోటలు, ఒలీవ మొక్కలు మీకు ఉన్నాయి.”
14అప్పుడు యెహోషువ ప్రజలతో ఇలా
చెప్పాడు: “ఇప్పుడు మీరు యెహోవా మాటలు
విన్నారు. కనుక మీరు యెహోవాను గౌరవించి,
నిజంగా ఆయనను సేవించాలి. మీ పూర్వీకులు పూజిం
చిన అసత్య దేవుళ్లను పారవేయండి. అది ఎప్పుడో
చాలకాలం కిందట నదికి అవతల, ఈజిప్టులో జరిగిన
విషయం. ఇప్పుడు మీరు యెహోవాను సేవించాలి.
15“అయితే ఒకవేళ యెహోవాను సేవించటం మీకు
ఇష్టం లేదేమో. అది ఈ వేళే మీరు తేల్చుకోవాలి.
మీరు ఎవరిని సేవిస్తారో నేడే నిర్ణయించుకోవాలి. మీ
పూర్వీకులు నదికి ఆవల నివసించినప్పుడు సేవించిన
దేవుళ్లను మీరు సేవిస్తారో? లేదా ఈ దేశంలో
నివసించిన అమోరీయుల దేవుళ్లను సేవిస్తారో? మీకు
మీరే కోరుకోండి. అయితే, నేను, నా కుటుంబం
మాత్రం యెహోవాను సేవిస్తాము!”
16అప్పుడు ప్రజలు ఇలా జవాబిచ్చారు, “లేదు,
యెహోవాను అనుసరించటం మేము ఎన్నటికీ
మానము. ఇక ఇతర దేవుళ్లను ఎన్నటికీ మేము
సేవించము.
17మన ప్రజలను ఈజిప్టునుండి బయటకు రప్పిం
చినవాడు యెహోవాయే అని మాకు తెలుసు. ఆ
దేశంలో మనం బానిసలం. అయితే అక్కడ యెహోవా

మనకోసం మహాగొప్ప కార్యాలు చేసాడు. ఆయనే ఆ
దేశంనుండి మనల్ని బయటకు రప్పించాడు, ఇతర
దేశాలగుండా మనము ప్రయాణం చినప్పుడు ఆయనే
మనలను కాపాడాడు. [18]తర్వాత ఈ దేశాల్లో నివసించే
ప్రజలను ఓడించటానికి యెహోవాయే మనకు
సహాయం చేసాడు. ఇప్పుడు మనం ఉన్న ఈ దేశంలో
నివసించిన అమోరీ ప్రజలను ఓడించేందుకు
యెహోవా మనకు సహాయం చేసాడు. కనుక మేము
ఆయననే సేవిస్తాం. ఎందుచేతనంటే ఆయనే మన
దేవుడు గనుక."

[19]అప్పుడు యెహోషువ అన్నాడు, "(అది నిజం
కాదు) మీరు యెహోవాను సరిగ్గా సేవించలేరు.
యెహోవా దేవుడు పరిశుద్ధుడు. తన ప్రజలు ఇతర
దేవుళ్లను పూజిస్తే దేవునికి అసహ్యం. అలా మీరు
ఆయనకు వ్యతిరేకంగా తిరిగితే దేవుడు మిమ్మల్ని
క్షమించడు. [20]మీరు యెహోవాను విడిచిపెట్టి, ఇతర
దేవుళ్లను సేవిస్తారు మరియు భయంకర సంగతులను
దేవుడు మీకు సంభవింపజేస్తాడు. యెహోవా
మిమ్మల్ని నాశనం చేస్తాడు. యెహోవా దేవుడు మీ
ఎడల దయగా ఉన్నాడు కానీ మీరు ఆయనకు విరో
ధంగా తిరిగితే ఆయన మిమ్మల్ని నాశనం చేస్తాడు."

[21]అయితే ప్రజలు, "లేదు, మేము యెహోవానే
సేవిస్తాము" అని యెహోషువతో చెప్పారు.

[22]అప్పుడు యెహోషువ, "మీ చుట్టూ, ఇక్కడ
మీతో ఉన్న ప్రజల చుట్టూ చూడండి. మీరు యెహో
వానే సేవించేందుకు నిర్ణయం చేసారని మీకు తెలుసా,
మీరు ఒప్పుకొన్నారా? దీనికి మీరంతా సాక్షులేనా?"
అన్నాడు.

ప్రజలు "అవును, ఇది సత్యం. మేము యెహోవానే
సేవిస్తామని మేము నిర్ణయించు కొన్నట్టు మా అందరికీ
తెలుసు" అని జవాబిచ్చారు.

[23]అప్పుడు యెహోషువ, "అలాగైతే మీ మధ్య
ఉన్న అసత్య దేవుళ్లను పారవేయండి. ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవాను మీ పూర్ణ హృదయంతో
ప్రేమించండి" అని చెప్పాడు.

[24]అప్పుడు ప్రజలు "మేము మా దేవుడైన యెహో
వానే సేవిస్తాము. మేము ఆయనకే విధేయులమ
వుతాము" అని యెహోషువతో చెప్పారు.

[25]కనుక ఆ రోజున యెహోషువ ప్రజలతో ఒక
ఒడంబడిక చేసాడు. ఈ ఒడంబడికను వారు పాటిం
చాల్సిన ఒక చట్టముగా చేసాడు యెహోషువ.

షెకెము అనబడిన పట్టణంలో ఇదంతా జరిగింది.
[26]దేవుని ధర్మశాస్త్రపు గ్రంథంలో యెహోషువ ఈ
సంగతులన్నీ వ్రాసాడు. అప్పుడు యెహోషువ ఒక
పెద్ద బండను చూసాడు. (ఈ బండ ఈ ఒడంబడికకు
ఋజువు) యెహోవా పవిత్ర గుడారం దగ్గర సింధూర
వృక్షం కింద ఆ బండను అతడు పెట్టాడు.

[27]అప్పుడు యెహోషువ ప్రజలందరితో
చెప్పాడు: "ఈనాడు మనం చేసిన సంగతులను జ్ఞాపకం
చేసుకునేందుకు ఈ బండ మీకు సహాయకరంగా
ఉంటుంది. ఈనాడు యెహోవా మనతో మాట్లాడుతు
న్నప్పుడు ఈ బండ ఇక్కడే ఉంది. కనుక ఈ వేళ
జరిగిన దానిని మనం జ్ఞాపకం చేసుకునేందుకు సహాయ
కరంగా ఉంటుంది ఈ బండ. మీమీద ఈ బండ సాక్షి.
మీ దేవుడైన యెహోవాకు మీరు విరోధంగా తిరుగ
కుండా ఈ బండ మిమ్మల్ని వారిస్తుంది."

[28]అప్పుడు యెహోషువ ప్రజలందరినీ వారి
ఇండ్లకు వెళ్లిపొమ్మని చెప్పాడు. ప్రతి వ్యక్తీ తన స్వంత
స్థలానికి వెళ్లిపోయాడు.

### యెహోషువ మరణం

[29]ఆ తర్వాత నూను కుమారుడైన యెహోషువ
చనిపోయాడు. ఆయన వయస్సు నూటపది సంవత్స
రాలు. [30]తిమ్నాత్ సెరహులోని తన స్వంత స్థలంలో
యెహోషువ పాతిపెట్టబడ్డాడు. ఇది గాయషు
కొండకు ఉత్తరాన ఎఫ్రాయిం దేశంలో ఉంది.

[31]యెహోషువ జీవించిన కాలంలో ఇశ్రాయేలు
ప్రజలు యెహోవాను సేవించారు. యెహోషువ
మరణం తర్వాత కూడా ప్రజలు యెహోవాను సేవిం
చారు. తమ నాయకులు బ్రతికి ఉన్నంతవరకు ప్రజలు
యెహోవాను సేవించటం కొనసాగించారు ఇశ్రాయేలీ
యులకు యెహోవా చేసినవాటిని చూసినవారు ఈ
నాయకులు.

### యోసేపు ఎముకలను ఇంటికి తేవటం

[32]ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టును విడిచినప్పుడు,
యోసేపు ఎముకలను వారితోకూడ మోసుకుని
వచ్చారు. కనుక యోసేపు ఎముకలను షెకెములో
ప్రజలు పాతిపెట్టారు. షెకెము తండ్రి, హమోరు కుమా
రుల దగ్గర యాకోబు కొన్న భూమిలో వారు ఆ
ఎముకలను పాతిపెట్టారు. ఆ భూమిని యాకోబు
వందవెండి నాణాలకు కొన్నాడు. ఈ భూమి యోసేపు
పిల్లలకు చెందినది.

[33]అహరోను కుమారుడైన ఎలీయాజరు చని
పోయాడు. అతడు గిబియాలో పాతిపెట్టబడ్డాడు.
ఎఫ్రాయిము కొండ దేశంలో గిబియా ఒక పురం. ఆ
పురం ఎలీయాజరు కుమారుడైన ఫీనెహాసుకు ఇవ్వ
బడింది.

# న్యాయాధిపతులు

## కనానీయులతో యూదా యుద్ధం చేయటం

1 యెహోషువ చనిపోయాడు. అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు యెహోవాకు ప్రార్థన చేసారు: యెహోవాతో, "మా వంశాలలో ఏది ముందుగా వెళ్లి, మా పక్షంగా కనానీయులకు విరోధంగా యుద్ధం చేయాలి?" అని వారు అడిగినారు.

[2]యెహోవా, "యూదా వంశస్థులు వెళతారు. నేను వారిని ఈ దేశం తీసుకోనిస్తాను" అని ఇశ్రాయేలీయులతో చెప్పాడు.

[3]యూదా పురుషులు, వారి సోదరులైన షిమ్యోను వంశంవారిని సహాయం అడిగారు. "సోదరులారా, మనలో ప్రతి ఒక్కరికీ కొంత భూమి ఇస్తానని యెహోవా వాగ్దానం చేశాడు. మీరు వచ్చి, మా భూమి కోసం పోరాడటంలో సహాయం చేస్తే, అప్పుడు మేము మీ భూమి కోసం పోరాడేందుకు మీకు సహాయం చేస్తాం" అన్నారు యూదా మనుష్యులు. యూదా సోదరులతో కలిసి పోరాడేందుకు షిమ్యోను మనుష్యులు అంగీకరించారు.

[4]కనానీయులను, పెరిజ్జీయులను ఓడించుటకు యూదా మనుష్యులకు యెహోవా సహాయం చేశాడు. బెజెకు పట్టణం దగ్గర యూదావారు 10,000 మందిని చంపేసారు. [5]బెజెకు పట్టణంలో బెజెకు పాలకుని యూదా మనుష్యులు చూసి అతనితో పోరాడారు. యూదా వారు కనానీయులను, పెరిజ్జీయులను ఓడించారు.

[6]బెజెకు పాలకుడు* పారిపోయేందుకు ప్రయత్నించాడు. కానీ యూదా వారు అతనిని తరిమి పట్టుకొన్నారు. వారు అతనిని పట్టుకున్నప్పుడు అతని కాళ్లు చేతుల బొటన వేళ్లను వారు కోసివేసారు. [7]అప్పుడు బెజెకు పాలకుడు, "డెభై మంది రాజుల కాళ్లు, చేతుల బొటన వేళ్లను నేను కోసివేసాను. ఆ రాజులు నా బల్ల మీదనుండి కింద రాలిన ఆహారం ముక్కలు తినవలసి వచ్చేది. ఆ రాజులకు నేను చేసిన దానిని దేవుడు ఇప్పుడు తిరిగి నాకు చెల్లించాడు" అని చెప్పాడు. బెజెకు పరిపాలకుని యూదా మనుష్యులు యెరూషలేము తీసుకుని వెళ్లారు. అతడు అక్కడ మరణించాడు. [8]యూదావారు యెరూషలేము మీద యుద్ధం చేసి దానిని పట్టుకొన్నారు. యెరూషలేము ప్రజలను చంపేందుకు యూదావారు వారి ఖడ్గాలు ఉపయోగించారు. తర్వాత వారు పట్టణాన్ని కాల్చేశారు. [9]ఆ తర్వాత యూదావారు మరికొంత మంది కనానీయులతో యుద్ధం చేయటానికి వెళ్లారు. నెగెవులోని కొండ దేశంలోను, పశ్చిమ కొండ చరియల్లోను ఆ కనానీయులు నివసించారు.

[10]తర్వాత హెబ్రోను పట్టణంలో నివసించిన కనానీయులతో యుద్ధం చేసేందుకు యూదావారు వెళ్లారు. (హెబ్రోను కిర్యతర్బా అని పిలువబడేది.) షేషయి, అహీమాను, తల్మయి* అనే వారిని యూదావారు ఓడించారు.

## కాలేబు, అతని కుమార్తె

[11]యూదా వారు ఆ చోటు విడిచిపెట్టేశారు. దెబీరులో ఉన్న ప్రజలతో యుద్ధం చేయటానికి వారు దెబీరు పట్టణం వెళ్లారు. (గతంలో దెబీరు కిర్యత్సేఫెరు అని పిలువబడింది). [12]యూదావారు యుద్ధం ప్రారంభించక ముందు, ఆ మనుష్యులకు కాలేబు ఒక వాగ్దానం చేసాడు, "కిర్యత్సేఫెరు మీద దాడిచేయాలని నేను కోరుతున్నాను. ఆ పట్టణాన్ని ముట్టడించి, దానిని పట్టుకొనేవాడికి నేను నా కుమార్తె అక్సాను ఇస్తాను. అతనిని నా కుమార్తెను వివాహం చేసుకోనిస్తాను" అని చెప్పాడు కాలేబు.

[13]కాలేబుకు కనజు అనే పేరుగల చిన్న తమ్ముడు ఉన్నాడు. కనజుకు ఒత్నీయేలు అను పేరుగల ఒక కుమారుడు ఉన్నాడు. కిర్యత్సేఫెరు పట్టణాన్ని ఒత్నీయేలు పట్టుకున్నాడు. అందుచేత ఒత్నీయేలుకు భార్యగా ఉండేందుకు కాలేబు తన కుమార్తె అక్సాను అతనికి ఇచ్చాడు.

[14]అక్సా ఒత్నీయేలుతో కాపురానికి వెళ్లింది. తన తండ్రిని కొంత భూమి అడగమని అక్సాతో చెప్పాడు ఒత్నీయేలు. అక్సా తన తండ్రి దగ్గరకు వెళ్లింది. ఆమె

---

**బెజెకు పాలకుడు** (రాజు) లేక 'ఆదోనీ బెజెకు.'

**షేషయి, అహీమాను, తల్మయి** అనాకు అను మనుష్యనికి ముగ్గురు కుమారులు. వారు రాక్షసుల్లాంటి వారు. సంఖ్యాకాండం 13:22 చూడండి.

తన గాడిద మీదనుండి దిగగానే, "నీకేం కావాలి?" అని కాలేబు ఆమెను అడిగాడు.

[15]అక్సా జవాబిచ్చింది: "నాకు ఒక ఆశీర్వాదం ఇవ్వుము. నీవు నాకు నెగెవులో ఎండిపోయిన ఎడారి భూమి ఇచ్చావు. దయచేసి నీళ్లుగల భూమి నాకు కొంత ఇవ్వుము." కనుక ఆమె కోరినట్టు కాలేబు ఆమెకు ఇచ్చాడు. అప్పుడు ఎగువ, దిగువ నీటి మడుగులను కాలేబు ఆమెకు ఇచ్చాడు.

[16]కెనెతీ ప్రజలు అంజూరపు చెట్ల పట్టణం (యెరికో) విడిచి, యూదా ప్రజలతో వెళ్ళారు. వారు యూదా అరణ్యంలోని ప్రజలతో కలిసి జీవించటానికి అక్కడికే వెళ్లారు. అది అరాదు పట్టణానికి సమీపంగానే నెగెవులో ఉంది. (కెనెతీ ప్రజలు మోషే మామగారి కుటుంబానికి చెందినవారు.)

[17]కనానీ ప్రజలు కొందరు జెఫతు పట్టణంలో నివసించారు. కనుక యూదావారు, షిమ్యోను వంశం వారు ఆ కనానీయుల మీద దాడిచేశారు. ఆ పట్టణాన్ని వారు పూర్తిగా ధ్వంసం చేశారు. అందుచేత వారు ఆ పట్టణానికి హోర్మా * అని పేరు పెట్టారు.

[18]యూదావారు గాజా పట్టణాన్ని, దాని చుట్టూరా ఉన్న చిన్న పట్టణాలను పట్టుకొన్నారు. అష్కెలోను, ఎక్రోను పట్టణాలను, వాటి చుట్టూరా ఉన్న చిన్న పట్టణాలను కూడా యూదావారు పట్టుకొన్నారు.

[19]యూదావారు యుద్ధం చేసినప్పుడు యెహోవా వారి పక్షంగా ఉన్నాడు. కొండ దేశంలోని భూమిని వారు స్వాధీనం చేసుకున్నారు. కానీ లోయల్లో ఉన్న ప్రజల వద్ద ఇనుప రథాలు ఉండటం చేత ఆ భూమిని యూదావారు తీసుకోలేక పోయారు.

[20]హెబ్రోను దగ్గర ఉన్న భూమిని కాలేబుకు ఇస్తానని మోషే వాగ్దానం చేసాడు. కనుక ఆ భూమి కాలేబు కుటుంబానికి ఇవ్వబడినది. కాలేబు మనుష్యులు అనాకు యొక్క ముగ్గురు కుమారులను ఆ చోటు నుండి బలవంతంగా వెళ్లగొట్టారు.

### బెన్యామీను మనుష్యులు యెరూషలేములో స్థిరపడటం

[21]బెన్యామీను వంశపు వారు యెరూషలేము నుండి యెబూసీ ప్రజలను వెళ్లగొట్టలేకపోయారు. కనుక నేటికీ బెన్యామీను ప్రజలతో బాటు యెబూసీ ప్రజలు కూడా యెరూషలేములో నివసిస్తున్నారు.

### యోసేపు మనుష్యులు బేతేలును పట్టుకోవటం

[22-23]యోసేపు వంశం వారు బేతేలు పట్టణం మీద యుద్ధానికి వెళ్లారు. (పూర్వం బేతేలు లూజు అని పిలువబడింది.) యోసేపు వంశం వారి పక్షంగా యెహోవా ఉన్నాడు. యోసేపు వంశం వారు బేతేలు పట్టణానికి కొందరు గూఢాచారులను పంపించారు. (వీళ్లు బేతేలు పట్టణాన్ని ఓడించే మార్గాల కోసం వెదికారు.) [24]గూఢచారులు బేతేలు పట్టణాన్ని గమనించి చూస్తూండగా ఆ పట్టణంలో నుండి ఒక మనిషి బయటకు రావటం వారు చూశారు. ఆ గూఢచారులు, "పట్టణంలోనికి ఒక రహస్య మార్గం మాకు చూపించు. మేము పట్టణం మీద దాడి చేస్తాము. కానీ నీవు మాకు సహాయం చేస్తే, మేము నీకు హాని చేయము" అని అతనితో చెప్పారు.

[25]ఆ మనిషి పట్టణంలోనికిగల రహస్య మార్గాన్ని గూఢాచారులకు చూపించాడు. యోసేపు వంశస్థులు బేతేలు ప్రజలను చంపటానికి వారి ఖడ్గాలు ప్రయోగించారు. కానీ వారికి సహాయం చేసిన మనిషికి వారు హాని చేయలేదు. అతని కుటుంబం వారికి కూడ వారు హాని చేయలేదు. అతడు, అతని కుటుంబం స్వేచ్ఛగా వెళ్లనివ్వబడ్డారు. [26]అతడు హిత్తీ ప్రజలు నివసించే దేశానికి వెళ్లి, ఒక పట్టణం నిర్మించాడు. ఆ పట్టణానికి లూజు అని అతడు పేరు పెట్టాడు. ఆ పట్టణం నేటికీ లూజు అని పిలువ బడుతూవుంది.

### మిగిలిన కుటుంబ వంశాలు కనానీయులతో పోరాడటం

[27]బేత్షెయానును, తయినాకు, దోరు, ఇబ్లెయామును, మెగిద్దో పట్టణాల్లో, ఆ పట్టణాల చుట్టుపక్కల ఉన్న చిన్న పట్టణాల్లో కనానీ ప్రజలు నివసిస్తున్నారు. మనష్షే వంశం వారు ఆ ప్రజలను ఆ పట్టణాల నుండి వెళ్లగొట్టలేకపోయారు. అందుచేత కనానీయులు ఉండిపోయారు. వారు తమ గృహాలు విడిచిపెట్టేందుకు నిరాకరించారు.

[28]తర్వాత ఇశ్రాయేలు ప్రజలు బలవంతులై కనానీ ప్రజలను తమకు బానిసలుగా చేసుకున్నారు. కానీ ఇశ్రాయేలు ప్రజలు కనాను ప్రజలందరినీ వారి దేశం నుండి వెళ్లగొట్టలేకపోయారు.

[29](ఎఫ్రాయిము వంశం వారి విషయం కూడ అలాగే జరిగింది.) గెజెరులో కనానీ ప్రజలు నివసిస్తున్నారు. ఎఫ్రాయిము వంశస్తులు ఆ కనాను ప్రజలందరినీ వారి దేశం నుండి వెళ్ల గొట్టలేదు. కనుక ఎఫ్రాయిము ప్రజలతోబాటు కనాను ప్రజలు కూడ గెజెరులో నివసించటం కొనసాగించారు. [30]జెబూలూను వంశం వారి విషయంలో కూడ అలాగే జరిగింది. కిత్రోను, నహలోలు పట్టణాల్లో కొందరు కనానీయులు నివసించారు. జెబూలూను ప్రజలు ఆ మనుష్యులను వారి దేశం నుండి వెళ్లగొట్టలేదు. ఆ కనానీయులు ఉండిపోయి, జెబూలూను వారితో నివసించారు. కానీ జెబూలూను వారు ఆ ప్రజలను తమకు బానిసలుగా పని చేయించుకొన్నారు.

---

**హోర్మా** "సంపూర్తిగా నాశనం గావించబడటం" అని దీని అర్థం.

31(ఆషేరు వంశం వారి విషయంలో కూడా అలాగే
జరిగింది.) అక్కో, సీదోను, అహ్లాబు, అక్జీబు, హెల్బా,
అఫెకు, రెహోబు పట్టణాలనుండి ఇతర మనుష్యు
లను ఆషేరువారు వెళ్లగొట్టలేదు 32ఆషేరువారు కనాను
ప్రజలను వారి దేశం నుండి వెళ్లగొట్టలేదు. కనుక ఆ
కనానీయులు ఆషేరు ప్రజలతో కలిసి జీవించటం
కొనసాగించారు.

33(నఫ్తాలి వంశం వారి విషయంలో కూడా ఇలాగే
జరిగింది.) బేత్షెమెషు, బేతనాతు పట్టణాలలోని ప్రజ
లను నఫ్తాలీ ప్రజలు వెళ్ళగొట్టలేదు. కనుక నఫ్తాలి
ప్రజలు ఇతరులతో కలసి ఆ పట్టణాలలోనే నివసిం
చటం కొనసాగించారు. ఆ కనానీ ప్రజలు నఫ్తాలీ
వారికి బానిసలుగా పని చేసారు.

34అమోరీయులు, దాను వంశం వారిని కొండ
దేశంలో నివసించేట్టుగా బలవంతం చేసారు. దాను
ప్రజలు లోయలలో నివసించేందుకు అమోరీ ప్రజలు
రానివ్వ లేదు. కనుక దాను వారు కొండలలోనే ఉండి
పోవాల్సి వచ్చింది. 35అమోరీయులు అయ్యాలోను,
హెరెసు కొండలోను, షయల్బీములోను నివసిం
చేందుకు అమోరీయులు తీర్మానించుకున్నారు. తరు
వాత యోసేపువంశం బలమైనదిగా పెరిగింది. అప్పుడు
వారు అమోరీయులను తమకు బానిసలుగా పని
చేయించుకున్నారు.

36అమోరీయుల దేశం తేలు కనుమనుండి హస్సెలా
వరకు, ఆ పైన హస్సెలాకు అవతల కొండ దేశంలోనికీ
విస్తరించింది.

## బోకీము దగ్గర యెహోవా దూత

2 యెహోవా దూత గిల్గాలు పట్టణం నుండి
బోకీము పట్టణానికి వెళ్లాడు. యెహోవా నుండి
వచ్చిన ఒక సందేశాన్ని ఆ దూత ఇశ్రాయేలు ప్రజలకు
అందించాడు. ఇదే ఆ సందేశం: “నేను మిమ్మల్ని
ఈజిప్టు నుండి బయటకు తీసుకుని వచ్చాను. నేను
మీ పూర్వీకులకు ఇస్తానని వాగ్దానం చేసిన దేశానికి
నేను మిమ్మల్ని నడిపించాను. మీతో నేను చేసిన నా
ఒడంబడికను నేను ఎన్నడూ ఉల్లంఘించను. 2ఈ
దేశంలో నివసించే వారితో మీరు ఏ ఒడంబడిక చేసు
కోకూడదు. వారి బలిపీఠాలను మీరు నాశనం చేయాలి
అని నేను చెప్పాను. కాని మీరు నాకు విధేయులు
కాలేదు.

3“నేను మీకు చెబుతాను: ‘ఇతరులను ఇక మీదట
ఈ దేశం నుండి బలవంతంగా నేను వెళ్లగొట్టను. ఈ
ప్రజలు మీకు ఒక సమస్య అవుతారు. వారు మీకు
ఉరిగా ఉంటారు. వారి దేవతలు మీకు ఉరిలాగా
ఉంటారు.’ ”

4యెహోవా నుండి వచ్చిన ఈ సందేశాన్ని ఇశ్రా
యేలు ప్రజలకు దేవదూత చెప్పగానే ప్రజలు గట్టిగా
ఏడ్చారు. 5కనుక ఇశ్రాయేలీయులు ఏడ్చిన ఆ స్థలానికి
బోకీము* అని పేరు పెట్టారు. బోకీములో ఇశ్రాయే
లీయులు యెహోవాకు బలులు అర్పించారు.

## అవిధేయతవలన అపజయం

6అప్పుడు యెహోషువ ప్రజలను ఇంటికి
పొమ్మని చెప్పాడు. అందుచేత ప్రతి వంశంవారు నివ
సించుటకు వారికి యివ్వబడిన భూమిని తీసుకొను
టకు వెళ్లారు. 7యెహోషువ బ్రతికి ఉన్నంతవరకు
ఇశ్రాయేలీయులు యెహోవాను సేవించారు.
యెహోషువ మరణించిన తరువాత జీవించిన నాయ
కుల (పెద్దలు) జీవిత కాలంలో వారు యెహోవాను
సేవించారు. ఇశ్రాయేలు ప్రజలకోసం యెహోవా
చేసిన గొప్ప కార్యాలన్నింటినీ ఈ వృద్ధులు చూశారు.
8నూను కుమారుడు, యెహోవా సేవకుడునగు
యెహోషువ 110 సంవత్సరాల వయస్సులో మరణిం
చాడు. 9ఇశ్రాయేలు ప్రజలు, యెహోషువకు ఇవ్వ
బడిన స్థలంలో వారు అతనిని సమాధి చేసారు. అది
ఎఫ్రాయిము కొండ దేశంలో గాయషు పర్వతానికి
ఉత్తరాన తిమ్నాతు హెరెసు దగ్గర ఉంది.

10ఆ తరం వారంతా చనిపోయాక తరువాత తరం
పెరిగింది. యెహోవాను గూర్చిగాని, ఇశ్రాయేలీయు
లకు యెహోవా చేసిన వాటిని గూర్చిగాని ఈ కొత్త
తరం వారికి తెలియదు. 11అందుచేత ఇశ్రాయేలు
ప్రజలు కీడు చేస్తూ తప్పుడు దేవత బయలును సేవిం
చారు. ప్రజలు ఈ కీడు చేయటం యెహోవా
చూశాడు. 12ఇశ్రాయేలు ప్రజలను ఈజిప్టు నుండి
యెహోవా బయటకు తీసుకుని వచ్చాడు. ఈ ప్రజల
పూర్వీకులు యెహోవాను ఆరాధించారు. కాని ఇశ్రా
యేలు ప్రజలు యెహోవాను అనుసరించటం మాను
కొన్నారు. ఇశ్రాయేలీయులు వారి చుట్టూరా నివసిం
చిన ప్రజలయొక్క తప్పుడు దేవుళ్లను* పూజించటం
మొదలు పెట్టారు. అది యెహోవాకు కోపం కలిగిం
చింది. 13ఇశ్రాయేలీయులు యెహోవాను అనుసరిం
చటం మానివేసి బయలు, అష్తారోతులను పూజిం
చటం మొదలు పెట్టారు.

14ఇశ్రాయేలు ప్రజలమీద యెహోవాకు కోపం
వచ్చింది. కనుక శత్రువులు ఇశ్రాయేలీయుల మీద
దాడిచేసి వారి ఆస్తులను తీసుకునేట్టుగా యెహోవా
చేశాడు. యెహోవా వారి చుట్టూరా ఉన్న వారి శత్రు
వుల ద్వారా వారు ఓడిపోయేట్టు చేశాడు. ఇశ్రాయేలు

---

**బోకీము** అనగా “ప్రజల ఏడ్పు” అని అర్థం.

**తప్పుడు దేవత** వర్షాన్ని, గాలుల్ని ఈ బూటకపు దేవత తెస్తుందని కనానీయులు నమ్మారు. భూమి మంచి పంటలు ఇచ్చేందుకు కూడా ఇది సహాయ పడుతుందని వారు నమ్మారు.

ప్రజలు వారి శత్రువులనుండి వారిని వారు కాపాడు
కోలేక పోయారు. 15ఇశ్రాయేలు ప్రజలు యుద్ధానికి
బయటకు వెళ్లినప్పుడల్లా ఓడిపోయారు. యెహోవా
వారి పక్షంగా లేని కారణంచేత వారు ఓడిపోయారు.
ఇశ్రాయేలీయులు వారి చుట్టూరా నివసిస్తున్న ప్రజల
దేవతలను సేవిస్తే, వారు ఓడిపోతారని యెహోవా
ముందుగానే వారిని హెచ్చరించాడు. ఇశ్రాయేలు
ప్రజలు చాలా శ్రమ అనుభవించారు.

16అప్పుడు యెహోవా న్యాయమూర్తులు అనే
నాయకులను ఏర్పాటు చేశాడు. ఇశ్రాయేలు ప్రజల
ఆస్తులను తీసుకున్న శత్రువులనుండి వారిని ఈ నాయ
కులు రక్షించారు. 17కాని ఇశ్రాయేలు ప్రజలు వారి
న్యాయాధిపతుల మాట వినలేదు. ఇశ్రాయేలు ప్రజలు
దేవునికి నమ్మకంగా ఉండక ఇతర దేవుళ్లను అనుస
రించారు.* పూర్వం ఇశ్రాయేలీయుల పూర్వీకులు
యెహోవా ఆజ్ఞలకు విధేయులయ్యారు. కానీ ఇశ్రా
యేలీయులు ఇప్పుడు మారిపోయి, యెహోవాకు
విధేయులు కావటం లేదు.

18ఇశ్రాయేలీయుల శత్రువులు ఇశ్రాయేలు ప్రజ
లకు అనేకసార్లు చెడు సంగతులు జరిగించారు. అందు
చేత ఇశ్రాయేలీయులు సహాయం కోసం ఏడ్చేవారు.
ప్రతీసారీ, ప్రజల విషయమై యెహోవా సంతాప
పడ్డాడు. ప్రతీసారీ ప్రజలను వారి శత్రువుల నుండి
రక్షించేందుకు ఆయన ఒక న్యాయమూర్తిని పంపిం
చాడు. యెహోవా ఎల్లప్పుడూ ఆ న్యాయమూర్తు
లతో ఉండేవాడు. కనుక ప్రతిసారీ ఇశ్రాయేలు ప్రజలు
వారి శత్రువుల నుండి రక్షించబడ్డారు. 19అయితే ప్రతీ
న్యాయమూర్తి చనిపోయినప్పుడూ, ఇశ్రాయేలీయులు
మరల పాపం చేసి, బూటకపు దేవుళ్లను పూజించటం
మొదలుపెట్టారు. ఇశ్రాయేలీయులు చాలా మొండి
వాళ్లు వారు తమ చెడు మార్గాలు విడిచి పెట్టేందుకు
నిరాకరించారు.

20అందుచేత ఇశ్రాయేలీయుల మీద యెహోవా
కోపగించి, ఆయన చెప్పాడు: “ఈ ప్రజలు నేను
వారి పూర్వీకులతో చేసిన ఒడంబడికనే ఉల్లంఘిం
చారు. వారు నా మాట వినలేదు. 21కనుక నేను
ఇంకెంత మాత్రం ఇతర రాజ్యాలను జయించి, ఇశ్రాయే
లీయుల కోసం దారి సులభం చేయను. యెహోషువ
చని పోయినప్పుడు ఆ రాజ్యాలు ఇంకా ఈ దేశంలోనే
ఉన్నాయి. మరియు ఆ రాజ్యాలను నేను ఈ దేశంలోనే
ఉండనిస్తాను. 22ఇశ్రాయేలు ప్రజలను పరీక్షించేందుకు
నేను ఆ రాజ్యాలను ప్రయోగిస్తాను. ఇశ్రాయేలు
ప్రజలు, వారి పూర్వీకులు యెహోవా ఆజ్ఞలను
పాటించినట్టుగా, పాటించగలరేమో నేను చూస్తాను.”
23యెహోవా ఆ రాజ్యాలను దేశంలో ఉండనిచ్చాడు.
ఆ రాజ్యాలు వెంటనే దేశం విడిచిపోయేట్టు యెహోవా
బలవంతం చేయలేదు. వారిని ఓడించేందుకు ఆయన
యెహోషువ సైన్యానికి సహాయం చేయలేదు.

3 1-2ఇతర రాజ్యాల ప్రజలంతా ఇశ్రాయేలీయుల
దేశం విడిచిపెట్టేటట్టు యెహోవా బలవంతం
చేయలేదు. ఇశ్రాయేలీయులను యెహోవా పరీక్షించా
లనుకున్నాడు. ఈ సమయంలో జీవిస్తూ ఉన్న ఇశ్రా
యేలు ప్రజలు ఒక్కరు కూడ కనాను దేశాన్ని స్వాధీనం
చేసుకునేందుకు జరిగిన యుద్ధాల్లో పాల్గొనలేదు.
అందుచేత ఆ ఇతర రాజ్యాలను యెహోవా వారి
దేశంలో ఉండనిచ్చాడు. (ఆ యుద్ధాలలో పాల్గొనని
ఇశ్రాయేలు ప్రజలకు నేర్పించాలని యెహోవా ఇలా
చేసాడు.) ఆ దేశంలో యెహోవా ఉండనిచ్చిన
రాజ్యాల పేర్లు ఇవి: 3ఫిలిష్తీయుల అయిదుగురు పరిపాల
కులు, కనానీయులు అందరూను, సీదోను ప్రజలు,
గయెలు హెర్మోను నుండి లెబోహమాతు వరకు గల
లెబానోను కొండల్లో జీవించిన హివ్వీ ప్రజలు. 4ఇశ్రా
యేలు ప్రజలను పరీక్షించటానికి యెహోవా ఆ రాజ్యా
లను దేశంలో ఉండనిచ్చాడు. వారి పూర్వీకులకు
మోషే ద్వారా యెహోవా ఇచ్చిన ఆదేశాలకు ఇశ్రా
యేలు ప్రజలు విధేయులవుతారేమోనని ఆయన
చూడాలను కున్నాడు.

5కనానీయులతో, హిత్తీ ప్రజలతో, అమోరీ ప్రజ
లతో, పెరిజ్జీ ప్రజలతో, హివ్వీ ప్రజలతో, యెబూసీ
ప్రజ లతో కలిసి ఇశ్రాయేలు ప్రజలు జీవించారు.
6ఇశ్రాయేలు ప్రజలు, ఆ ప్రజల కుమార్తెలను వివా
హము చేసుకోవటం మొదలు పెట్టారు. ఇశ్రాయేలు
ప్రజలు తమ కుమార్తెలను ఆ మనుష్యుల కుమారులు
వివాహము చేసుకోనిచ్చారు. మరియు ఇశ్రాయేలు
ప్రజలు ఆ మనుష్యుల దేవుళ్లను పూజించటం మొదలు
పెట్టారు.

### మొదటి న్యాయమూర్తి, ఒత్నీయేలు

7ఇశ్రాయేలు ప్రజలు చెడు పనులు చేసినట్టు
యెహోవా చూశాడు. ఇశ్రాయేలు ప్రజలు వారి దేవుడు
యెహోవాను మరచిపోయి, బయలు మరియు
అషేరా* అను బూటకపు దేవుళ్లను సేవించారు.
8ఇశ్రాయేలీయుల మీద యెహోవాకు కోపం వచ్చింది.
యెహోవా అరామునహరాయిము* రాజు కూషన్రిషా
తాయిము ఇశ్రాయేలుప్రజలను ఓడించి, వారిని పాలించ

**ఇశ్రాయేలు ... అనుసరించారు** ఇతర దేవతలకు వ్యభిచారి ణిలా వ్యవహరించారు అని వాస్తవంగా రాయబడి ఉంది.

**అషేరా** ఒక ముఖ్యమైన కనానీ దేవత. ఈమె ‘ఎల్’ యొక్క భార్య లేక ‘బయలు’ యొక్క ప్రియురాలు అని వారనుకొన్నారు.

**అరామునహరాయిము** ఉత్తర సిరియాలోని ఒక స్థలం, యూఫ్రటీసు మరియు టైగ్రీస్ నదుల నడుమ వున్నది.

నిచ్చాడు. ఇశ్రాయేలీయులు ఎనిమిది సంవత్సరాల
పాటు ఆ రాజు పాలనలో ఉన్నారు. 9కానీ ఇశ్రాయేలీ
యులు సహాయం కోసం యెహోవాకు మొరపెట్టారు.
వారిని రక్షించేందుకు యెహోవా ఒక మనిషిని
పంపించాడు. ఆ మనిషి పేరు ఒత్నీయేలు. అతడు
కనజు అనే వ్యక్తి కుమారుడు. కనజు కాలేబుకు చిన్న
తమ్ముడు. ఒత్నీయేలు ఇశ్రాయేలీయులను రక్షిం
చాడు. 10యెహోవా ఆత్మ ఒత్నీయేలు మీదికి వచ్చి
నప్పుడు అతడు ఇశ్రాయేలీయులకు న్యాయమూర్తి
అయ్యాడు. ఇశ్రాయేలీయులను ఒత్నీయేలు యుద్ధా
నికి నడిపించాడు. అరాము రాజు కూషన్రిషాతాయి
మును ఓడించేందుకు యెహోవా ఒత్నీయేలుకు
సహాయం చేసాడు. 11అందుచేత కనజు కుమారుడు
ఒత్నీయేలు చనిపోయేంతవరకు నలభై సంవత్సరాలు
దేశం శాంతితో ఉండెను.

### న్యాయమూర్తి ఏహూదు

12ఇశ్రాయేలు ప్రజలు మరల చెడుకార్యాలు
చేయటం యెహోవా చూశాడు. కనుక ఇశ్రాయేలు
ప్రజలను ఓడించేందుకు మోయాబు రాజు ఎగ్లోనుకు
యెహోవా శక్తి ఇచ్చాడు. 13అమ్మోనీ ప్రజలు,
అమాలేకు ప్రజల దగ్గర నుండి ఎగ్లోను సహాయం
పొందాడు. వారు అతనితో కలిసి, ఇశ్రాయేలు ప్రజల
మీద దాడిచేశారు. ఎగ్లోను, అతని సైన్యం ఇశ్రాయేలు
ప్రజలను ఓడించి, ఖర్జూరపు చెట్ల పట్టణం నుండి
(యెరికో) వారిని బలవంతంగా వెళ్లగొట్టారు. 14ఎగ్లోను
ఇశ్రాయేలు ప్రజలను పద్దెనిమిది సంవత్సరాలు పాలిం
చాడు. 15ప్రజలు యెహోవాకు మొరపెట్టారు. ఇశ్రా
యేలు ప్రజలను రక్షించేందుకు యెహోవా ఒక మని
షిని పంపించాడు. ఆ మనిషి పేరు ఏహూదు. ఏహూదు
ఎడమచేతి వాటంగలవాడు. ఏహూదు బెన్యామీను వంశా
నికి చెందిన గెరా అనే పేరుగల వాని కుమారుడు.
మోయాబు రాజు ఎగ్లోనుకు కొంత పన్ను డబ్బు
చెల్లించేందుకు ఇశ్రాయేలు ప్రజలు ఏహూదును
పంపించారు. 16ఏహూదు అతనికోసం ఒక ఖడ్గం చేసు
కున్నాడు. ఆ ఖడ్గానికి రెండంచులున్నాయి, దాని
పొడవు పద్దెనిమిది అంగుళాలు. ఏహూదు ఆ ఖడ్గాన్ని
తన కుడి తొడకు కట్టుకొని తన బట్టల కింద దానిని
కప్పిపెట్టాడు.

17ఏహూదు మోయాబు రాజైన ఎగ్లోను దగ్గరకు
వచ్చి పన్ను డబ్బు చెల్లించాడు. (ఎగ్లోను చాలా లావు
పాటి మనిషి) 18ఏహూదు ఆ డబ్బును ఎగ్లోనుకు
చెల్లించిన తర్వాత, ఆ డబ్బును మోసుకుని వచ్చిన
ఆ మనుష్యులను తిరిగి ఇంటికి పంపించివేసాడు.
19ఏహూదు వెళ్లేందుకు బయలుదేరాడు. గిల్గాలు పట్ట
ణంలో విగ్రహాలను అతడు సమీపించినప్పుడు అతడు
వెనుకకు తిరిగాడు. అప్పుడు ఏహూదు, “ఓ రాజా,
నీకు చెప్పాల్సిన ఒక రహస్య సందేశం నా దగ్గర ఉంది”
అని ఎగ్లోనుతో చెప్పాడు. ఊరకవుండు అన్నాడు
రాజు. తర్వాత అతడు సేవకులందరినీ ఆ గదిలోనుండి
బయటకు పంపివేసాడు. 20ఏహూదు ఎగ్లోను రాజు
దగ్గరకు వెళ్లాడు. ఎగ్లోను తన వేసవి కాలపు రాజ
భవనంలో ఒంటరిగా కూర్చునియున్నాడు.

అప్పుడు ఏహూదు, “దేవుని దగ్గరనుండి నీ కోసము
ఒక సందేశం నా వద్ద వుంది” అని చెప్పాడు. రాజు
తన సింహాసనం నుండి లేచి ఏహూదుకు చాలా దగ్గరగా
వచ్చాడు. 21రాజు తన సింహాసనం నుండి లేచి నిల
బడగా, ఏహూదు తన కుడి తొడకు కట్టబడిన ఖడ్గాన్ని
తన ఎడమ చేతితో అందుకొని బయటకు తీసాడు.
అప్పుడు ఏహూదు ఆ ఖడ్గాన్ని రాజు పొట్టలో పొడిచి
వేసాడు. 22ఆ ఖడ్గం పిడికూడ లోపలకు దిగిపోవు
నంతగా రాజు కడుపులోనికి దిగిపోయింది. రాజు కొవ్వు
ఖడ్గము నిండా అతుక్కుపోయింది. కనుక ఏహూదు
ఆ ఖడ్గాన్ని ఎగ్లోను పొట్టలోనే విడిచి పెట్టేసాడు.
23ఏహూదు గదిలో నుండి బయటకు వెళ్లి దాని
తలుపులు మూసి తాళం వేసాడు.

24ఏహూదు వెళ్లిపోగానే సేవకులు తిరిగి వచ్చారు.
ఆ గది తలుపులు తాళము వేసి ఉండటం ఆ సేవకులు
చూశారు. కనుక ఆ సేవకులు, “రాజు తన విశ్రాంతి
గదిలో మూత్ర విసర్జనకు వెళ్లి ఉంటాడు” అని చెప్పు
కున్నారు. 25అందుచేత ఆ సేవకులు చాలాసేపు వేచి
ఉన్నారు. చివరికి వారు దిగులు చెందారు. వారు తాళం
చెవి తెచ్చి తలుపులు తెరిచారు. ఆ సేవకులు ప్రవేశించి
నప్పుడు, వారి రాజు నేల మీద చచ్చిపడి ఉండటం
చూశారు.

26ఆ సేవకులు రాజు కొరకు వేచి ఉండగా,
ఏహూదు పారిపోయేందుకు సమయం దొరికింది.
ఏహూదు విగ్రహాలను దాటి శెయీరా అను స్థలంవైపు
వెళ్లాడు. 27ఏహూదు శెయీరా అను స్థలం చేరాడు.
అప్పుడు అతడు అక్కడ ఎఫ్రాయిమీయుల కొండ
దేశంలో బూర ఊదాడు. ఇశ్రాయేలు ప్రజలు బూర
శబ్దం విని, ఏహూదు వారిని నడిపిస్తుండగా వారు
కొండలు దిగివెళ్లారు. 28ఏహూదు, “నన్ను వెంబడిం
చండి! మన శత్రువులైన మోయాబు ప్రజలను ఓడిం
చేందుకు యెహోవా మనకు సహాయం చేస్తాడు”
అని ఇశ్రా యేలు ప్రజలతో చెప్పాడు. కనుక ఇశ్రాయేలు
ప్రజలు ఏహూదును వెంబడించారు. ఎక్కడైతే
యోర్దాను నదిని తేలికగా దాటి, మోయాబు దేశం
లోనికి వెళ్లవచ్చునో ఆ స్థలాలను స్వాధీనం చేసుకు
నేందుకు వారు ఏహూదు వెంట వెళ్లారు. ఇశ్రాయేలు
ప్రజలు ఏ ఒక్కరినీ కూడా యోర్దాను నదిని దాట
నివ్వలేదు. 29మోయాబు ప్రజలలో ధైర్యం, బలంగల
పదివేల మందిని ఇశ్రాయేలు ప్రజలు చంపివేసారు.
మోయాబు వాడు ఒక్కడు కూడా తప్పించుకోలేదు.

30కనుక ఆ రోజు నుండి ఇశ్రాయేలు ప్రజలు
మోయాబు ప్రజలను పాలించటం మొదలు పెట్టారు.
మరియు ఆ దేశంలో ఎనభై సంవత్సరాల వరకు
శాంతి ప్రబలింది.

### న్యాయమూర్తి షమ్గరు

31ఏహూదు ఇశ్రాయేలు ప్రజలను రక్షించిన తర్వాత
మరో మనిషి ఇశ్రాయేలీయులను రక్షించాడు. ఆ మనిషి
పేరు షమ్గరు. అతడు అనాతు కుమారుడు. ఫిలిష్తీ
మనుష్యులు అరువందల మందిని చంపేందుకు షమ్గరు
ఒక ములుకోల (ఎద్దులను తోలే ముల్లుగల కర్ర)ను
ప్రయోగించాడు.

### స్త్రీ న్యాయమూర్తి దెబోరా

4 చెడ్డవి అని యెహోవా చెప్పిన వాటినే ప్రజలు
ఏహూదు చనిపోయిన తర్వాత మరల చేశారు.
2కనుక కనాను రాజు యాబీను ఇశ్రాయేలీయులను
ఓడించేలాగ యెహోవా చేశాడు. యాబీను హాసోరు
పట్టణంలో పరిపాలించాడు. సీసెరా అను పేరుగలవాడు
యాబీను రాజు సైన్యానికి సేనాధిపతి. హరోషెతు
హగ్గోయిం అనే పట్టణంలో సీసెరా నివసించాడు.
3సీసెరాకు తొమ్మిదివందల ఇనుప రథాలున్నాయి.
అతడు ఇరవై సంవత్సరాలు ఇశ్రాయేలు ప్రజల ఎడల
చాలా క్రూరంగా ఉన్నాడు. కనుక సహాయం కోసం
వారు యెహోవాకు మొరపెట్టారు.
4దెబోరా అనే పేరుగల ఒక ప్రవక్తి ఉంది. ఆమె
లప్పీదోతు అను పేరుగల వాని భార్య. ఆ కాలంలో
ఆమె ఇశ్రాయేలీయులకు న్యాయమూర్తి. 5ఒక రోజు
దెబోరా ఖర్జూర చెట్టు కింద కూర్చుని ఉంది. సీసెరా
విషయం ఏమి చెయ్యాలి అని ఆమెను అడిగేందుకు
ఇశ్రాయేలు ప్రజలు ఆమె దగ్గరకు వచ్చారు. ఎఫ్రా
యిము కొండ దేశంలో రామా, బేతేలుకు మధ్య
దెబోరా యొక్క ఖర్జూర చెట్టు ఉంది. 6బారాకు అను
పేరుగల మనిషికి దెబోరా ఒక వర్తమానం పంపింది.
ఆమెను కలుసుకునేందుకు రమ్మని ఆమె అతనిని
అడిగింది. బారాకు అబీనోయము అనే పేరుగల వాని
కుమారుడు. బారాకు నఫ్తాలి ప్రాంతంలోని కెదెషు
పట్టణంలో నివసించేవాడు. దెబోరా బారాకుతో ఇలా
చెప్పింది: "ఇశ్రాయేలు దేవుడు యెహోవా నీకు ఆజ్ఞ
ఇస్తున్నాడు. 'వెళ్లి నఫ్తాలి జెబూలూను వంశాల నుండి
పదివేల మంది పురుషులను సమావేశపరచి, ఆ మను
ష్యులను తాబోరు కొండకు నడిపించు. 7యాబీను
రాజు సైన్యాధిపతి సీసెరాను నేను నీ దగ్గరకు రప్పిస్తాను.
సీసెరాను, అతని రథాలను, మరియు అతని సైన్యాన్ని
కీషోను నది దగ్గరకు నేను రప్పిస్తాను. అక్కడ నీవు
సీసెరాను ఓడించేందుకు నేను నీకు సహాయం
చేస్తాను.' "
8అప్పుడు బారాకు, "నీవు నాతో కూడా వస్తే
నేను వెళ్లి ఈ పని చేస్తాను. కాని నీవు నాతో రాకపోతే,
నేనూ వెళ్లను" అని దెబోరాతో చెప్పాడు.
9"ఓ, నేను తప్పకుండా నీతో వస్తాను" అని దెబోరా
జవాబిచ్చింది. "కానీ నీ వైఖరి మూలంగా, సీసెరా
ఓడించబడినప్పుడు నీవు ఘనత పొందవు. ఒక స్త్రీ
సీసెరాను ఓడించేటట్టు యెహోవా చేస్తాడు" అని
చెప్పింది.
కనుక బారాకుతో కూడ కెదెషు పట్టణానికి దెబోరా
వెళ్లింది. 10కెదెషు పట్టణం దగ్గర జెబూలూను, నఫ్తాలి
వంశాలను బారాకు సమావేశ పరిచాడు. ఆ వంశాల
నుండి అతనిని వెంబడించేందుకు పదివేల మంది పురు
షులను సమావేశపర్చాడు. దెబోరా కూడా బారాకుతో
వెళ్లింది.
11కెనితీ ప్రజలకు చెందిన, హెబెరు అను పేరుగల
ఒకడు ఉన్నాడు. (కెనితీ ప్రజలు హోబాబు వంశస్థులు.
హోబాబు మోషేకు మామ) జయనన్నీము అను
చోట మస్తకి చెట్టు దగ్గర హెబెరు తన నివాసం ఏర్పాటు
చేసుకున్నాడు. జయనన్నీము కెదెషు పట్టణానికి
దగ్గరగా ఉంది.
12అబీనోయము కుమారుడు బారాకు తాబోరు
కొండ దగ్గర ఉన్నాడని సీసెరాతో ఎవరో చెప్పారు.
13కనుక సీసెరా తన తొమ్మిదివందల ఇనుప రథాలను
సిద్ధం చేసాడు. సీసెరా తన మనుష్యులందరినీ ఒక్క
చోట చేర్చాడు. వారు హరోషెతు హగ్గోయిము
పట్టణం నుండి కీషోను నది దగ్గరకు సాగిపోయారు.
14అప్పుడు దెబోరా, "ఈ వేళ నీవు సీసెరాను
ఓడించేందుకు యెహోవా సహాయం చేస్తాడు. నీ
కోసం యెహోవా ఇప్పటికే మార్గాన్ని చక్కగా
తయారు చేశాడని నీకు గట్టిగా తెలుసు" అని బారాకుతో
చెప్పింది. కనుక పదివేల మంది మనుష్యులను తాబోరు
కొండ నుండి బారాకు నడిపించాడు. 15బారాకు, అతని
మనుష్యులు సీసెరా మీద దాడిచేసారు. యుద్ధ సమ
యంలో సీసెరాను, అతని సైన్యాన్ని, రథాలను
యెహోవా కలవరపర్చాడు. ఏమి చేయాలో వారికి
తెలియలేదు. అందుచేత బారాకు, అతని మనుష్యులు
సీసెరా సైన్యాన్ని ఓడించారు. కానీ, సీసెరా తన రథాన్ని
విడిచిపెట్టి కాలినడకన పారిపోయాడు. 16బారాకు
సీసెరా సైన్యంతో పోరాటం కొనసాగించాడు. హరో
షెతు, హగ్గోయిము వరకూ కూడా సీసెరా రథాలను,
సైన్యాన్ని బారాకు, అతని మనుష్యులు తరిమి వేసారు.
బారాకు, అతని మనుష్యులు వారి ఖడ్గాలను ఉప
యోగించి సీసెరా మనుష్యులను చంపివేసారు. సీసెరా
మనుష్యులలో ఒక్కడు కూడా ప్రాణంతో విడువబడ
లేదు.
17కానీ సీసెరా పారిపోయాడు. యాయేలు అను
స్త్రీ నివసిస్తున్న గుడారం దగ్గరకు అతడు వచ్చాడు.

యాయేలు హెబెరు అనువాని భార్య. అతడు కెనితీ
ప్రజల్లో ఒకడు. హెబెరు కుటుంబం హసోరు రాజగు
యాబీనుతో సమాధానంగా ఉంది. కనుక సీసెరా
యాయేలు గుడారానికి పరుగెత్తాడు. [18]సీసెరా రావటం
యాయేలు చూసింది గనుక అతనిని కలుసుకొ
నేందుకు ఆమె బయటకు వెళ్లింది. యాయేలు,
“అయ్యా, నా గుడారంలోనికి రండి. రండి, భయ
పడవద్దు” అని సీసెరాతో చెప్పింది. కనుక సీసెరా,
యాయేలు గుడారంలోనికి వెళ్లాడు. ఆమె అతనిని
గొంగళితో కప్పింది.

[19]“నాకు దాహంగా వుంది. దయచేసి తాగేందుకు
నాకు కొంచెం నీళ్లు ఇవ్వు” అన్నాడు సీసెరా యాయే
లుతో. జంతు చర్మంతో చేయబడిన ఒక బుడ్డి
యాయేలు దగ్గర ఉంది. అందులో ఆమె పాలు పోసి
ఉంచింది. సీసెరా తాగటానికి యాయేలు ఆ పాలు
ఇచ్చింది. అప్పుడు ఆమె సీసెరాను కప్పివేసింది.

[20]అప్పుడు సీసెరా యాయేలుతో, “వెళ్లి, గుడార
ద్వారం దగ్గర నిలువబడు. ఎవరైనా అటువైపు వచ్చి,
‘లోపల ఎవరైనా ఉన్నారా?’ అని అడిగితే ‘లేరు’ అని
చెప్పు” అన్నాడు.

[21]కానీ యాయేలు ఒక గుడారపు మేకును, ఒక
సుత్తెను చూసింది. యాయేలు త్వరగా సీసెరా దగ్గరకు
వెళ్లింది. సీసెరా చాలా అలసిపోయినందువల్ల, నిద్ర
పోతున్నాడు. యాయేలు గుడారపు మేకును సీసెరా
కణతల మీద పెట్టి, సుత్తెతో దిగ గొట్టేసింది. ఆ
గుడారపు మేకు సీసెరా కణతల్లో నుండి నేల మీదికి
దిగిపోయింది. సీసెరా మరణించాడు. [22]సరిగ్గా అప్పుడే
సీసెరా కోసం వెదుక్కొంటూ బారాకు యాయేలు
గుడారంవైపు వచ్చాడు. యాయేలు బారాకును
కలుసుకొనేందుకు బయటకు వెళ్లి, “ఇక్కడ లోపలికి
రా, నీవు వెదకుతున్న మనిషిని నేను నీకు చూపిస్తాను”
అంది. కనుక బారాకు యాయేలుతో కలిసి గుడారంలో
ప్రవేశించాడు. అక్కడ కణతల్లో నుండి నేలమీదికి
గుడారపు మేకు దిగిపోయి, చచ్చిపడి ఉన్న సీసెరా
బారాకుకు కనిపించాడు.

[23]ఆ రోజు కనాను రాజు యాబీనును ఇశ్రాయేలు
ప్రజలకోసం దేవుడు ఓడించాడు. [24]కనుక ఇశ్రాయేలు
ప్రజలు కనాను రాజు యాబీనును ఓడించటంతో
మరింత బలవంతులయ్యారు. కనాను రాజు యాబీ
నును ఇశ్రాయేలు ప్రజలు చివరికి నాశనం చేసారు.

### దెబోరా గీతం

5 ఇశ్రాయేలు ప్రజలు సీసెరాను ఓడించిన రోజున
దెబోరా, అబీనోయము కుమారుడు బారాకు ఈ
గీతం పాడారు:

2 ఇశ్రాయేలు మనుష్యులు యుద్ధానికి సిద్ధమ
య్యారు. యుద్ధానికి వెళ్లేందుకు పజలు స్వచ్ఛం
ధంగా ముందుకు వచ్చారు. యెహోవాను
స్తుతించండి.

3 రాజులారా, వినండి. అధికారులారా గమనించండి!
నేను పాడుతాను. నా మట్టుకు నేనే యెహో
వాకు గానం చేస్తాను. యెహోవాకు, ఇశ్రాయేలు
ప్రజల దేవు నికి నేను సంగీతం గానం చేస్తాను.

4 యెహోవా, గతంలో నీవు శేయీరు* దేశం
నుండి వచ్చావు. ఎదోము దేశం నుండి నీవు
సాగిపోయావు. నీవు నడువగా భూమి కంపిం
చింది. ఆకాశాలు వర్షించాయి. మేఘాలు నీళ్లు
కురిపించాయి.

5 సీనాయి పర్వత దేవుడగు యెహోవా ఎదుట
ఇశ్రాయేలీయుల దేవుడగు యెహోవా ఎదుట
పర్వతాలు కంపించాయి.

6 అనాతు కుమారుడు షమ్గరు* రోజుల్లో
యాయేలు రోజుల్లో, రహదారులు ఖాళీ
అయ్యాయి. ప్రయాణికుల ఒంటెలు వెనుక
దారుల్లో వెళ్లాయి.

7 దెబోరా, నీవు వచ్చేవరకు, ఇశ్రాయేలుకు నీవు
ఒక తల్లిగా వచ్చేవరకు సైనికులు లేరు ఇశ్రాయే
లులో సైనికులు లేరు.

8 వారు కొత్త దేవతలను అనుసరించాలని కోరు
కొన్నారు. అందుచేత వారి పట్టణ ద్వారాలవద్ద
వారు పోరాడవలసి వచ్చింది. నలభై వేల మంది
ఇశ్రాయేలు సైనికుల్లో ఎవరివద్దా ఒక డాలుగాని,
బల్లెంగాని లేదు.

9 నా హృదయం ఇశ్రాయేలు సైన్యాధికారుల తోనే
ఉంది. ఈ సైన్యాధికారులు ఇశ్రాయేలీయుల
కోసం పోరాడేందుకు స్వచ్ఛంధంగా ముందుకు
వచ్చారు. యెహోవాను స్తుతించండి!

10 తెల్లగాడిదల మీద ప్రయాణం చేసే ప్రజలారా,
వాటి వీపు మీద తివాచీ*లపై కూర్చొనే ప్రజ
లారా, దారిలో ప్రయాణం చేసే ప్రజలారా గమ
నించండి!

11 యెహోవా విజయాలను గూర్చి. ఇశ్రాయేలీ
యుల మధ్య యెహోవా సైనికుల విజయాలను
గూర్చి యెహోవా ప్రజలు పట్టణ ద్వారాల్లో
పోరాడేందుకు వెళ్లినప్పటి విషయాలను గూర్చి
పశువులు నీళ్లు త్రాగే చోట్ల తాళాల శబ్దాలతో
వారు చెప్పుకొంటున్నారు.

12 దెబోరా మేలుకో, మేలుకో! మేలుకో, మేలుకో,
ఒక పాట పాడు! బారాకూ లెమ్ము!

---

**శేయీరు** ఎదోము యొక్క మరో పేరు.

**షమ్గరు** ఇశ్రాయేలీయుల న్యాయాధిపతి. న్యాయాధి పతులు 3:31 చూడండి.

**తివాచీ** ఒక విధమైన రత్న కంబళి.

అబీనోయము కుమారుడా, వెళ్లి, నీ శత్రువులను
పట్టుకో!
13 ఆ సమయంలో బతికి ఉన్నవారు నాయకుల
దగ్గరకు వచ్చారు. యెహోవా ప్రజలు సైనికు
లతో కలిసి నా దగ్గరకు వచ్చారు.
14 అమాలేకు కొండ దేశంలో ఎఫ్రాయిము మను
ష్యులు స్థిరపడ్డారు. బెన్యామీనూ,ఆ మనుష్యులు
నిన్నూ, నీప్రజలను వెంబడించారు. మాకీరు
కుటుంబ వంశంనుండి సైన్యాధికారులు దిగి
వచ్చారు. జెబూలూను వంశం నుండి ఇత్తడి
దండం పట్టి నడిపించు వారు వచ్చారు.
15 ఇశ్శాఖారు నాయకులు దెబోరాతో ఉన్నారు.
ఇశ్శాఖారు వంశం వారు బారాకు నకు నమ్మకంగా
ఉన్నారు. ఆ మనుష్యులు లోయలోనికి కాలి
నడకన సాగిపోయారు. రూబేనీయులలో బహు
గొప్పగా హృదయ పరిశోధన జరిగింది.
16 అలాగైతే, మీరంతా గొర్రెల దొడ్ల గోడల వద్ద
ఎందుకు కూర్చొన్నారు?రూబేను, వారి సాహస
సైనికులు యుద్ధం గూర్చి గట్టిగా తలచారు.
కానీ వారు గొర్రెల కోసం వాయించిన సంగీతం
వింటూ, ఇంటి వద్దనే కూర్చుండిపోయారు.
17 గిలాదువారు యోర్దానుకు ఆవలివైపున వారి
గుడారాల్లోనే ఉండిపోయారు. దాను ప్రజలారా,
మీరు మీ ఓడల దగ్గరే ఎందుకు ఉండి పోయారు?
ఆషేరు వంశం వారు సముద్ర తీరంలోనే ఉండి
పోయారు. క్షేమ కరమైన ఓడ రేవుల్లోనే వారు
ఉండి పోయారు.
18 కానీ జెబూలూను మనుష్యులు నఫ్తాలి మను
ష్యులు ఆ కొండల మీద పోరాడేందుకు వారి
ప్రాణాలకు తెగించారు.
19 రాజులు వచ్చారు, వారు యుద్ధం చేసారు. కనాను
రాజులు మెగిద్దో జలాల వద్ద తానాకు పట్టణం
దగ్గర (కనాను రాజులు) యుద్ధం చేసారు. కానీ
వారు ఐశ్వర్యం ఏమీ ఇంటికి తీసుకుని పోలేదు.
20 నక్షత్రాలు ఆకాశంలోనుంచి పోరాడాయి. నక్ష
త్రాలు, వాటి మార్గం నుండి అవి సీసె రాతో
పోరాడాయి.
21 కీషోను నది ప్రాచీన నది. ఆ కీషోను నది సీసెరా
మనుష్యులను తుడిచిపెట్టింది. నా ప్రాణమా,
బలము కలిగి ముందుకు సాగిపో.
22 గుర్రాల డెక్కలు నేలను అదరగొట్టాయి. సీసెరా
బలమైన గుర్రాలు పరుగులు తీసాయి.
23 "మేరోజు పట్టణాన్ని శపించండి" అని యెహోవా
దూత చెప్పాడు, "వారు యెహోవాకు సహాయం
చేసేందుకు, యెహోవాకు సైనికులను ఇచ్చేం
దుకు రాలేదు గనుక వారిని శపించండి"
24 కనానీయుడైన హెబెరు భార్య యాయేలు. ఆమె
స్త్రీలలో దీవెన నొందును.
25 సీసెరా నీళ్లను అడిగెను. యాయేలు అతనికి
పాలను ఇచ్చెను. తరువాత సర్దారులకు తగిన
పాత్రతో మీగడ తెచ్చియిచ్చెను.
26 మరియు యాయేలు డేరా మేకు చేత పట్టు
కొనెను. పనివారు ఉపయోగించు సుత్తెను కుడి
చేత పట్టుకొనెను. తరువాత మేకుతో అతని
తలను పగులగొట్టెను. అప్పుడు సీసెరా కణత
పగిలి అక్కడే పడి పోయెను.
27 యాయేలు పాదాల మధ్య కుప్ప కూలి
పోయాడు అతను పడిపోయాడు. అతను అక్కడే
పడి ఉన్నాడు! ఆమె పాదాల మధ్య అతడు
కుప్పకూలిపోయాడు. అతడు పడిపోయాడు!
సీసెరా ఎక్కడ పడ్డాడో అక్కడ కూలిపోయాడు.
చనిపోయాడు!
28 సీసెరా తల్లి కిటికీలోంచి చూసి ఏడుస్తు వున్నది.
సీసెరా తల్లి తెరలలో నుండి చూస్తు వున్నది,
'సీసెరా రథం ఎందుకు ఆలస్యమైంది? అతని
రథం, గుర్రాల ధ్వనులు ఎందుకు ఆలస్యం
అయ్యాయి.'
29 ఆమె పరిచారికలలో అతి తెలివిగల ఒకతె ఆమెకు
జవాబిస్తుంది. అవును, సేవకురాలు ఆమెకు
జవాబిస్తుంది.
30 "నిశ్చయంగా వారు గెలిచారు! వారు ఓడించిన
ప్రజలనుండి వస్తువులను వారు తీసుకుంటు
న్నారు! వారిలో వారు ఆ వస్తువులను పంచు
కొంటున్నారు! ఒక్కో సైనికుడు ఒకరు లేక
ఇద్దరు అమ్మాయిలను తీసుకుంటున్నారు. ఒక
వేళ సీసెరా రంగు వేయబడిన ఒక గుడ్డ ముక్క
తీసు కుంటున్నాడేమో. అదీ సంగతి! విజయ
శాలి సీసెరా ధరించేందుకు ఒకటి రెండు విచిత్ర
బుట్టా నేత బట్టలు తెచ్చుకుంటున్నాడు
కాబోలు."
31 యెహోవా, నీ శత్రువులంతా ఇలానే మరణిం
చెదరు గాక! కానీ నిన్ను ప్రేమించే మనుష్య
లందరూ తేటగా ప్రకాశించే సూర్యునిలా ఉందురు
గాక!

ఆ దేశంలో 40 సంవత్సరాల వరకు శాంతి
నెలకొన్నది.

### మిద్యానీయులు ఇశ్రాయేలీయులతో యుద్ధం చేయుట

6 యెహోవా చెడ్డవి అని చెప్పిన సంగతులనే ఇశ్రా
యేలు ప్రజలు మరల చేసారు. అందుచేత
యెహోవా మిద్యాను ప్రజలు ఇశ్రాయేలు ప్రజలను
ఏడు సంవత్సరాల వరకు ఓడింపనిచ్చాడు. 2మిద్యాను
ప్రజలు చాలా శక్తిగలవారు మరియు ఇశ్రాయేలు ప్రజల

పట్ల చాలా క్రూరులు. కనుక ఇశ్రాయేలు ప్రజలు ఆ కొండలలో దాగుకొనే స్థలాలు అనేకంచేసుకున్నారు. వారి భోజనాన్ని గుహలలోను, కనుక్కొనేందుకు కష్ట తరమైన స్థలాలలోను దాచుకున్నారు.
[3]తూర్పు ప్రాంతంనుండి మిద్యానీయులు, అమాలేకీయులు ఎల్లప్పుడు వచ్చి వారి పంటలను పాడుచేసేవారు గనుక వారు అలా చేశారు.
[4]ఆ మనుష్యులు దేశంలో బసచేసి, ఇశ్రాయేలు ప్రజల పంటలను నాశనం చేశారు. గాజా పట్టణం వరకుగల దేశమంతటా ఇశ్రాయేలీయుల పంటలను వారు నాశనం చేశారు. ఇశ్రాయేలీయులు తినేందుకు ఆ ప్రజలు ఏమీ విడిచి పెట్టలేదు. వారికోసం గొర్రెలుగాని, పశువులుగాని లేక గాడిదలు గాని ఏమీ వారు విడిచిపెట్టలేదు.
[5]మిద్యానీయులు వచ్చి ఆ దేశంలో నివాసం చేశారు. వారు వారి కుటుంబాలను వారి పశువులను వారి వెంట తెచ్చుకున్నారు. వారు మిడతల దండులంత మంది ఉన్నారు! వారి మనుష్యులు, వారి ఒంటెలు విస్తారంగా ఉన్నందుచేత లెక్కించుటకు అసాధ్యం అయింది. ఈ మనుష్యులంతా దేశంలోకి వచ్చి దానిని పాడుచేశారు.
[6]మిద్యాను ప్రజల మూలంగా ఇశ్రాయేలు ప్రజలు చాలా దరిద్రులయ్యారు కనుక ఇశ్రాయేలీయులు సహాయం కోసం యెహోవాకు మొరపెట్టారు.

[7]మిద్యానీయులు* ఆ చెడ్డ పనులన్నీ చేశారు. కనుక ఇశ్రాయేలీయులు సహాయం కోసం యెహోవాకు మొరపెట్టారు.
[8]కనుక యెహోవా వారికి ఒక ప్రవక్తను పంపించాడు. ఇశ్రాయేలీయులతో ఆ ప్రవక్త ఇలా చెప్పాడు: "ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా చెప్పేది ఇదే: 'మీరు ఈజిప్టు దేశంలో బానిసలుగా ఉంటిరి. నేను మిమ్మల్ని స్వతంత్రులనుగా చేసి ఆ దేశం నుండి బయటకు రప్పించాను.
[9]ఈజిప్టు యొక్క బలమైన ప్రజలనుండి నేను మిమ్మల్ని రక్షించాను. తర్వాత కనాను దేశ ప్రజలు మిమ్మల్ని బాధ పెట్టారు. కనుక నేను మరల మిమ్మల్ని రక్షించాను. ఆ ప్రజలు వారి దేశం వదలి పోయేటట్టు నేను చేశాను. మరియు వారి దేశాన్ని, నేను మీకు ఇచ్చాను.'
[10]'నేనే మీ యెహోవాను, మీ దేవుడనని' అప్పుడు మీకు చెప్పాను. 'మీరు అమోరీయుల దేశంలో నివసిస్తారు. కాని వారి బూటకపు దేవుళ్లను మీరు పూజించకూడదు, అని నేను మీతో చెప్పాను. కాని మీరు నాకు విధేయులు కాలేదు."

### యెహోవా దూత గిద్యోనును దర్శించటం

[11]ఆ కాలంలో, గిద్యోను అను పేరుగల మనిషి దగ్గరకు యెహోవా దూత వచ్చాడు. దేవుని దూత వచ్చి ఒఫ్రాలోని మస్తకి చెట్టు కింద కూర్చున్నాడు. ఈ మస్తకి చెట్టు యోవాషు అనే పేరుగలవానిది. యోవాషు అబీయెజ్రీ వంశస్థుడు. యోవాషు గిద్యోనుకు తండ్రి. గిద్యోను ఒక ద్రాక్షా గానుగలో గోధుమలు నలుగకొడుతున్నాడు. యెహోవా దూత గిద్యోను దగ్గర కూర్చున్నాడు. మిద్యానీయులు, తనని (గిద్యోను) చూడకుండునట్లు ద్రాక్షా గానుగ చాటున గోధుమలను నలుగగొట్టుచుండగా,
[12]యెహోవా దూత గిద్యోనుకు ప్రత్యక్షమయి, "మహా సైనికుడా, యెహోవా నీకు తోడుగా ఉంటాడు" అని చెప్పాడు.

[13]అప్పుడు గిద్యోను అన్నాడు: "అయ్యా, నేను ప్రమాణం చేస్తున్నాను, యెహోవా మనకు తోడుగా ఉంటే మనకు ఇన్ని కష్టాలెందుకు? మన పూర్వీకులకు ఆయన అద్భుతమైన విషయాలు జరిగించాడు అని మనం విన్నాం. మన పూర్వీకులను ఈజిప్టు నుండి యెహోవా బయటకు రప్పించాడని వారు మనతో చెప్పారు. కాని యెహోవా మనలను విడిచిపెట్టేశాడు. యెహోవా మిద్యానీయులు మనలను ఓడింపనిచ్చాడు."

[14]యెహోవా గిద్యోనువైపు తిరిగి, "నీ శక్తిని ప్రయోగించు. నీవు వెళ్లి మిద్యాను ప్రజల నుండి ఇశ్రాయేలీయులను రక్షించు. వారిని రక్షించేందుకు నేను నిన్ను పంపుతున్నాను!" అని చెప్పాడు.

[15]అయితే గిద్యోను, "అయ్యా, నన్ను క్షమించండి, ఇశ్రాయేలీయులను నేను ఎలా రక్షించగలను? మనష్షే వంశంలో నా కుటుంబం అతి బలహీనమైనది. నా కుటుంబంలో అందరికంటే నేను చిన్నవాడను" అని జవాబిచ్చాడు.

[16]యెహోవా గిద్యోనుకు జవాబిస్తూ, "నేను నీతో కూడా ఉన్నాను! కనుక మిద్యానీయులను నీవు ఓడించగలవు. అది నీవు ఒకే ఒక్క మనిషితో పోరాడుతున్నట్టుగా కనబడుతుంది." అని చెప్పాడు.

[17]అప్పుడు గిద్యోను యెహోవాతో చెప్పాడు: "నా మీద నీకు దయ ఉంటే, నీవే నిజంగా యెహోవా అనేందుకు నాకు ఒక ఋజువు చూపు.
[18]దయచేసి ఇక్కడే వేచియుండు. నేను తిరిగి నీ దగ్గరకు వచ్చేంతవరకు వెళ్లిపోవద్దు. నా కానుకను తెచ్చి నీ ఎదుట పెట్టనియ్యి." యెహోవా, "నీవు తిరిగి వచ్చేవరకూ నేను వేచి ఉంటాను," అని చెప్పాడు.

[19]కనుక గిద్యోను వెళ్లి కాగుతున్న నీళ్లలో ఒక మేక పిల్లను వంటకం చేసాడు. గిద్యోను తూమెడు పిండిని తీసుకుని పొంగని రొట్టె చేసాడు. అప్పుడు గిద్యోను ఆ మాంసాన్ని ఒక బుట్టలో ఉంచి ఉడకపెట్టిన మాంసము యొక్క రసాన్ని ఒక పాత్రలో ఉంచాడు. గిద్యోను ఆ మాంసాన్ని, వండిన మాంసపు రసాన్ని, పొంగని రొట్టెను బయటకు తీశాడు. గిద్యోను ఆ భోజనాన్ని మస్తకి చెట్టు కింద యెహోవాకు ఇచ్చాడు.

---

**మిద్యానీయులు** 7-10 వచనాలు పురాతన హీబ్రూ ప్రతులైన 'మృత సముద్రపు ప్రతుల్లో' రాయబడలేదు.

[20]దేవుని దూత, "ఆ మాంసాన్ని, పొంగని ఆ రొట్టెను అదిగో అక్కడ ఉన్న బండ మీద ఉంచు. తర్వాత నీళ్లు పారబోయి" అని గిద్యోనుతో చెప్పాడు. గిద్యోను తనకు చెప్పబడినట్టు చేశాడు.

[21]యెహోవా దూత ఒక చేతికర్ర పట్టుకొని ఉన్నాడు. యెహోవా దూత ఆ కర్ర కొనతో మాంసాన్ని, రొట్టెను తాకాడు. అప్పుడు బండనుండి అగ్ని బయలు వెళ్లింది! ఆ మాంసం, రొట్టె పూర్తిగా కాల్చివేయబడ్డాయి! అప్పుడు యెహోవా దూత అదృశ్యమయ్యాడు.

[22]గిద్యోను తాను యెహోవా దూతతో మాట్లాడుతున్నట్లు అప్పుడు గ్రహించాడు. కనుక గిద్యోను, "సర్వశక్తిమంతుడైన యెహోవా! యెహోవా దూతను నేను ముఖాముఖిగా చూశాను!" అని అరిచాడు.

[23]కానీ యెహోవా, "నిశ్శబ్దంగా ఉండు! భయపడవద్దు! నీవు చనిపోవు!" అని గిద్యోనుతో చెప్పాడు.

[24]కనుక యెహోవాను ఆరాధించేందుకు ఆ స్థలంలో గిద్యోను ఒక బలిపీఠం నిర్మించాడు. ఆ బలిపీఠానికి, "యెహోవాయే శాంతి" అని గిద్యోను పేరు పెట్టాడు. ఒఫ్రా పట్టణంలో ఆ బలిపీఠం ఇంకా నిలిచి ఉంది. అబీయెజ్రీ కుటుంబం నివసించే చోట ఒఫ్రా ఉంది.

### గిద్యోను బయలు బలిపీఠాన్ని పడగొట్టటం

[25]అదే రాత్రి గిద్యోనుతో యెహోవా మాట్లాడాడు. యెహోవా ఇలా చెప్పాడు: "నీ తండ్రికి చెందిన బాగా ఎదిగిన ఎద్దును, అనగా ఏడు సంవత్సరాల ఎద్దును తీసుకో. నీ తండ్రికి బూటకపు బయలు దేవతా బలిపీఠము ఒకటి ఉంది. ఆ బలిపీఠము పక్కగా ఒక కొయ్యస్తంభం ఉంది. బూటకపు దేవత అషేరా ఘనత కోసం ఆ స్తంభం చేయబడింది. బయలు బలిపీఠాన్ని పడదోసేందుకు, అషేరా స్తంభాన్ని విరగగొట్టేందుకు ఆ ఎద్దును ఉపయోగించు. [26]అప్పుడు నీ యెహోవా దేవునికి సరయిన బలిపీఠం నిర్మించు. ఎత్తైన ఈ స్థలంలో బలిపీఠాన్ని నిర్మించు. అప్పుడు బాగా ఎదిగిన ఆ ఎద్దును ఈ బలిపీఠం మీద చంపిదహించు. నీ అర్పణను దహించేందుకు అషేరా స్తంభపు కొట్టెను ఉపయోగించు."

[27]కనుక గిద్యోను తన సేవకులు పది మందిని తీసుకొని యెహోవా చేయమని చెప్పినట్టు చేశాడు. కాని తన కుటుంబము వారు, పట్టణము వారు తాను చేస్తున్న దానిని చూస్తారేమోనని గిద్యోను భయపడ్డాడు. తాను ఏమి చేయాలని తనతో యెహోవా చెప్పాడో దానినే గిద్యోను చేశాడు. కానీ అతడు ఆ పనిని పగలు కాక రాత్రివేళ చేశాడు.

[28]మరునాడు ఉదయాన్నే ఆ పట్టణ ప్రజలు మేల్కొన్నారు. బయలు బలిపీఠం పాడుచేయబడి ఉండటం వారు చూశారు. అషేరా స్తంభం నరకబడి ఉండటం కూడా వారు చూశారు. అషేరా స్తంభం బయలు బలిపీఠానికి పక్కగా వుంది. గిద్యోను కట్టిన బలిపీఠాన్ని కూడా ఆ మనుష్యులు చూశారు. ఆ బలిపీఠం మీద అర్పించబడిన ఎద్దును వారు చూశారు.

[29]ఆ పట్టణస్తులు ఒకర్నొకరు చూసి, "మన బలిపీఠాన్ని ఎవరు పడగొట్టారు? మన అషేర స్తంభాన్ని ఎవరు నరికి వేసారు?" అని చెప్పుకొన్నారు. వారు ఎన్నో ప్రశ్నలు వేసుకొని, ఆ పనులు చేసినదెవరో తెలిసికొనేందుకు ప్రయత్నించారు.

"యోవాషు కుమారుడైన గిద్యోను ఈ పని చేసాడు" అని వారితో ఎవరో చెప్పారు. [30]కనుక ఆ పట్టణస్తులు యోవాషు దగ్గరకు వచ్చారు, "నీవు నీ కుమారుని బయటకు తీసుకురా! అతడు బయలు బలిపీఠాన్ని పడగొట్టాడు. ఆ బలిపీఠం పక్కనే ఉన్న అషేరా స్తంభాన్ని అతడు నరికి వేసాడు. కనుక నీ కుమారుడు చావాల్సిందే" అని వారు యోవాషుతో చెప్పారు. [31]అప్పుడు యోవాషు తన చుట్టూరా ఉన్న జనంతో మాట్లాడాడు: "మీరు బయలు పక్షాన ఉంటారా? మీరు బయలును కాపాడుతారా? ఎవడైనా బయలు పక్షం వహిస్తే ఉదయానికల్లా వాడు చంపబడునుగాక. ఒకవేళ బయలు నిజంగా దేవుడైతే, వాని బలిపీఠాన్ని ఎవరైనా పడగొట్టుతున్నప్పుడు తనను తానే కాపాడుకోవాలి" అని యోవాషు చెప్పాడు. [32]"ఒకవేళ బయలు బలిపీఠాన్ని గిద్యోను పడగొట్టియుంటే అతనితోనే బయలును వాదించమనండి." అని యోవాషు చెప్పాడు. కనుక ఆ రోజున యోవాషు గిద్యోనుకు యెరుబ్బయెలు* అని ఒక కొత్త పేరు పెట్టాడు.

### గిద్యోను మిద్యాను ప్రజలను ఓడించటం

[33]మిద్యాను, అమాలేకు తూర్పు ప్రాంతపు ఇతర ప్రజలు ఇశ్రాయేలీయుల మీద యుద్ధం చేసేందుకు సమావేశమయ్యారు. ఆ ప్రజలు యోర్దాను నది దాటి వెళ్లి యెజ్రెయేలు లోయలో నివాసం చేశారు. [34]యెహోవా ఆత్మ గిద్యోను మీదికి వచ్చి అతనికి గొప్ప శక్తిని ఇచ్చింది. అబీయెజెరు కుటుంబం తనను వెంబడించేందుకు గిద్యోను ఒక బూర ఊదాడు. [35]మనష్షే వంశం మనుష్యులందరి దగ్గరకు గిద్యోను వార్తాహరులను పంపించాడు. ఆయుధాలు తీసుకుని యుద్ధానికి సిద్ధంకావాలని ఆ వార్తాహరులు మనష్షే మనుష్యులతో చెప్పారు. ఆషేరు, జెబులూను, నఫ్తాలి వంశాలకుకూడా గిద్యోను వార్తాహరులను పంపించాడు.

---

**యెరుబ్బయెలు** అనగా వాదించువాడు అని అర్థం.

వార్తాహరులు అదే సందేశం తీసుకుని వెళ్లారు. కనుక
ఆ వంశాల వారు కూడా గిద్యోనును, అతని మనుష్య
లను కలుసుకొనటానికి వెళ్లారు.
36అప్పుడు గిద్యోను దేవునితో చెప్పాడు: "ఇశ్రా
యేలు ప్రజలను రక్షించేందుకు నీవు నాకు సహాయం
చేస్తానని చెప్పావు. నాకు ఋజువు చూపు! 37నేను
కళ్లంలో గొర్రెచర్మం ఉంచుతాను. చుట్టూరా ఉన్న
నేల అంతా పొడిగా ఉండి, ఆ చర్మం మీద మాత్రమే
మంచుపడివుంటే, అప్పుడు నీవు చెప్పినట్టే ఇశ్రాయే
లును రక్షించేందుకు నీవు నన్ను వాడుకొంటావని
నేను తెలుసుకొంటాను."
38సరిగ్గా అలాగే జరిగింది. మరునాడు ఉదయాన్నే
గిద్యోను లేచి ఆ గొర్రెచర్మాన్ని పిండాడు. ఆ గొర్రె
చర్మం నుండి ఒక పాత్ర నిండుగా అతడు నీళ్లు పిండాడు.
39అప్పుడు గిద్యోను దేవునితో, "నా మీద కోప
గించకు. మరొక్క విషయం నిన్ను అడుగనియ్యి.
గొర్రెచర్మంతో నిన్ను మరొక్కసారి పరీక్షించనియ్యి.
ఈసారి దాని చుట్టూరా ఉన్న నేల మంచుతో తడిసి
గొర్రెచర్మం మాత్రం పొడిగా ఉండనియ్యి" అని
చెప్పాడు.
40ఆ రాత్రి దేవుడు సరిగ్గా అలాగే చేసాడు. గొర్రె
చర్మం మాత్రం పొడిగా ఉంది, కానీ దాని చుట్టూరా
నేల మంచుతో తడిసి ఉంది.

7 మరునాడు ఉదయాన్నే యెరుబ్బయలు,
(గిద్యోను) మరియు అతని మనుష్యులందరూ
హరోదు బావి దగ్గర దిగారు. మోరె కొండ దిగువన
ఉన్న లోయలో మిద్యాను ప్రజలు బసచేసారు. ఇది
గిద్యోనుకు, అతని మనుష్యులకు ఉత్తరాన ఉంది.
2అప్పుడు యెహోవా, "మిద్యాను ప్రజలను ఓడిం
చేందుకు నేను నీ మనుష్యులకు సహాయం చేయ
బోతున్నాను. కాని ఆ పని కోసం నీ దగ్గర ఉన్న
మనుష్యులు చాలా ఎక్కువ మంది. ఇశ్రాయేలు ప్రజలు
వారిని వారే రక్షించుకొన్నారని అతిశయించి నన్ను
మరచిపోవటం నాకు ఇష్టం లేదు.
3కనుక ఇప్పుడు నీ మనుష్యులకు ఒక ప్రకటన
చెయ్యి. 'భయపడేవారు ఎవరైనా సరే గిలాదు కొండ
విడిచి పోవచ్చును. అలాంటి వారు తిరిగి ఇంటికి వెళ్లి
పోవచ్చును' అని వారితో చెప్పుము" అని గిద్యోనుతో
అన్నాడు. ఆ సమయంలో ఇరవై రెండు వేల మంది
గిద్యోనును విడిచిపెట్టి తిరిగి ఇంటికి వెళ్లిపోయారు.
కానీ ఇంకా పదివేల మంది మనుష్యులు మిగిలి
పోయారు.
4"ఇంకా చాలా మంది మనుష్యులున్నారు. ఆ
మనుష్యులను నీళ్ల దగ్గరకు కిందికి తీసుకుని వెళ్లు,
అక్కడ నేను నీ కోసం వారిని పరీక్షిస్తాను. 'ఇతడు
నీతో వెళ్తాడు' అని నేను చెబితే అతడు వెళతాడు.
కాని నేను, 'అతడు నీతో వెళ్లడు' అని అంటే ఆ
మనుష్యుడు వెళ్లకూడదు" అని గిద్యోనుతో
యెహోవా చెప్పాడు.
5కనుక గిద్యోను ఆ మనుష్యులను నీళ్ల దగ్గరకు
కిందికి నడిపించాడు. ఆ నీళ్ల దగ్గర గిద్యోనుతో
యెహోవా ఇలా చెప్పాడు, "ఈ మనుష్యులను ఈ
విధంగా వేరు చెయ్యి. కుక్క గతికినట్లు గతుకుచూ
నీళ్లు తాగే వారంతా ఒక గుంపు. మరియు మోకాళ్ల
మీద వంగి నీళ్లు తాగే మనుష్యులంతా మరో గుంపుగా
చేయ బడాలి."
6నోటి దగ్గరకు నీళ్లు తెచ్చేందుకు తమ చేతులను
పయోగించి కుక్క గతికినట్లు గతికిన వారు మూడు
వందల మంది. మిగిలిన వాళ్లంతా మోకాళ్ల మీద వంగి
నీళ్లు తాగారు.
7యెహోవా గిద్యోనుతో, "కుక్కలా గతికి నీళ్లు
తాగిన మూడువందల మందిని నేను వాడుకొంటాను.
మిమ్మల్ని రక్షించేందుకు ఆ మనుష్యులను నేను వాడు
కొంటాను. మరియు మిద్యాను ప్రజలను ఓడించేట్లుగా
నేను చేస్తాను. మిగిలిన మనుష్యులను వారి ఇళ్లకు
వెళ్లిపోనియ్యి" అని చెప్పాడు. 8కనుక మిగిలిన ఇశ్రా
యేలు మనుష్యులను గిద్యోను వారి ఇళ్లకు పంపి
వేసాడు. గిద్యోను ఆ మూడు వందల మంది మనుష్య
లను తన వెంట ఉంచుకొన్నాడు. ఇళ్లకు వెళ్లిపోయిన
వారి బూరలను, ఆహార పదార్థాలను ఆ మూడు వందల
మంది ఉంచుకొన్నారు.
గిద్యోను పాళెమునకు కింద లోయలో మిద్యానీ
యుల పాళెము ఉండెను. 9రాత్రివేళ గిద్యోనుతో
యెహోవా మాట్లాడాడు. అతనితో యెహోవా ఇలా
చెప్పాడు: "లెమ్ము, మిద్యాను సైన్యాన్ని నీవు ఓడించే
టట్టు నేను చేస్తాను. వారి పాళెము వద్దకు దిగి వెళ్లు.
10ఒంటరిగా వెళ్లేందుకు నీవు భయపడితే, నీ సేవకుడు
పూరాను నీ వెంట తీసుకుని వెళ్లు. 11మిద్యాను ప్రజల
పాళెము లోపలికి వెళ్లు. ఆ మనుష్యులు చెప్పు
కుంటున్న విషయాలు విను. ఆ తర్వాత వారి మీద
దాడి చేసేందుకు నీకు భయం ఉండదు."
కనుక గిద్యోను, అతని సేవకుడు పూరా శత్రువుల
పాళెము చివరి భాగానికి వెళ్లారు. 12మిద్యాను ప్రజలు,
అమాలేకు ప్రజలు, తూర్పు ప్రాంత ప్రజలందరూ
ఆ లోయలో విడిదిచేశారు. వారు చాలామంది మను
ష్యులు ఉన్నందుచేత వారు ఒక మిడతల దండులా
కనిపించారు. సముద్రతీరంలో ఇసుక రేణువులవలె ఆ
ప్రజలకు ఒంటెలు ఉన్నట్టు కనిపించింది.
13గిద్యోను శత్రువుల విడిది దగ్గరకు వచ్చి, అక్కడ
ఒక మనిషి మాట్లాడటం విన్నాడు. అతడు తాను
చూచిన ఒక కలను గూర్చి తన స్నేహితునితో చెప్పు
తున్నాడు, "ఒక గుండ్రని రొట్టె దొర్లుకుంటూ
మిద్యాను ప్రజల విడిదిలోకి వచ్చింది. ఆ రొట్టె గుడా
రాన్ని బలంగా గుద్దుకోవటం చేత ఆ గుడారం తల

కిందులై నేల మట్టంగా పడిపోయింది” అని ఆ మనిషి
చెబుతూ ఉన్నాడు.
14ఆ మనిషి స్నేహితునికి అతని కల భావం తెలుసు.
“నీ కలకు ఒకే ఒక అర్థం ఉంటుంది. ఇశ్రాయేలు
వాడగు ఆ మనిషిని గూర్చినదే నీ కల. అది యోవాషు
కుమారుడు గిద్యోను గూర్చినది. మిద్యాను సైన్యం
అంతటినీ ఓడించేందుకు గిద్యోనుకు దేవుడు
సహాయం చేస్తాడని దాని భావం” అని ఆ మనిషి
స్నేహితుడు చెప్పాడు.
15ఆ మనుష్యులు ఆ కలను గూర్చి, దాని భావం
గూర్చి చెప్పుకోవటం విన్న తర్వాత గిద్యోను దేవునికి
సాష్టాంగ పడ్డాడు. తర్వాత గిద్యోను ఇశ్రాయేలీయుల
విడిదికి తిరిగి వెళ్లిపోయాడు. గిద్యోను ప్రజలందరినీ
పిలిచి, “లేవండి! మిద్యాను ప్రజలను ఓడించేందుకు
యెహోవా మనకు సహాయం చేస్తాడు” అని చెప్పాడు.
16అప్పుడు గిద్యోను మూడు వందల మందిని మూడు
గుంపులుగా చేసాడు. ఒక్కో మనిషికీ ఒక్కో బూరను,
ఒక్కో ఖాళీ కుండనూ గిద్యోను ఇచ్చాడు. ప్రతి ఖాళీ
కుండలోను మండుతున్న ఒక దివిటీ ఉంది.
17అప్పుడు గిద్యోను వారితో ఇలా చెప్పాడు: “నన్ను
గమనించి నేను చేసినట్టు చేయండి. శత్రువు విడిది
చివరి భాగం వరకు నన్ను అనుసరించండి. నా వెంబడి
రండి. ఆ విడిది చివరి భాగానికి నేను వెళ్లగానే, సరిగ్గా
నేను చేసినట్టే చేయండి. 18మీరు శత్రువు విడిదిని
చుట్టుముట్టండి. నేనూ, నాతో ఉన్న వాళ్లందరూ
బూరలు ఊదుతాము. మేము బూరలు ఊదినప్పుడు
మీరు కూడా మీ బూరలు ఊదండి. అప్పుడు ‘యెహో
వాకు, గిద్యోనుకు విజయం అని కేకలు వేయండి!’ ”
19కనుక గిద్యోను, అతనితో ఉన్న వంద మంది
శత్రువులు విడిది చివరి భాగానికి వెళ్లారు. కావలి వారు
మారిన వెంటనే వారు అక్కడికి వచ్చారు. అది
నడిజాము వేళ. గిద్యోను, అతనితో ఉన్న మనుష్యులు
వారి బూరలు ఊది, వారి కుండలు పగులగొట్టారు.
20అప్పుడు గిద్యోను మనుష్యులు మొత్తం మూడు
గుంపులవారు వారి బూరలు ఊది వారి కుండలు
పగులగొట్టారు. ఆ మనుష్యులు దివిటీలను వారి ఎడమ
చేతులలోను, బూరలు వారి కుడిచేతులలోను పట్టు
కొన్నారు. ఆ మనుష్యులు వారి బూరలు ఊదుతూ,
“యెహోవాకు ఒక ఖడ్గం, గిద్యోనుకు ఒక ఖడ్గం”
అని కేకలు వేసారు.
21గిద్యోను మనుష్యులు వారు ఉన్న చోటనే నిల
బడ్డారు. కాని ఆ విడిదిలో మిద్యాను వారు కేకలు
వేస్తూ పారిపోవటం మొదలుపెట్టారు.
22గిద్యోను మూడు వందల మంది మనుష్యులు
వారి బూరలు ఊదటం మొదలు పెట్టగానే మిద్యాను
మనుష్యులు వారి కత్తులతో వారే ఒకర్నొకరు
చంపుకొనేట్టు యెహోవా చేశాడు. సెరేరాతు పట్టణం
వైపు ఉన్న బేత్షిత్తా పట్టణానికి శత్రుసైన్యం వాళ్లు
పారిపోయారు. తబ్బాతు పట్టణం దగ్గర ఉన్న
ఆబేల్మెహోలా పట్టణ సరిహద్దు వరకు ఆ మనుష్యులు
పారిపోయారు.
23అప్పుడు నఫ్తాలి, ఆషేరు, మొత్తం మనష్షే
వంశాల నుండి వచ్చిన సైనికులు మిద్యాను ప్రజలను
తరమవల సిందిగా ఆజ్ఞాపించబడ్డారు. 24ఎఫ్రాయిము
కొండ దేశమంతటికీ గిద్యోను వార్తాహరులను పంపిం
చాడు. “దిగి వచ్చి మిద్యాను ప్రజలను ఎదుర్కొనండి.
వీరిని బేత్బారా వరకూ తరిమి, నదిని అదుపు చేసి,
యోర్దాను నదిని స్వాధీనం చేసుకోండి. మిద్యాను
ప్రజలు అక్కడికి చేరక ముందే ఈ పని చేయండి”
అని వార్తాహరులు చెప్పారు.
కనుక ఎఫ్రాయిము వంశంలోని మనుష్యులందరినీ
వారు పిలచారు. బేత్బారా వరకు వారు నదిని స్వాధీనం
చేసుకున్నారు.
25మిద్యాను నాయకులు ఇద్దరిని ఎఫ్రా యిము
మనుష్యులు పట్టుకున్నారు. ఈ ఇద్దరు నాయ కుల
పేర్లు ఓరేబు, జెయేబు. ఓరేబు బండ అనుచోట
ఎఫ్రాయిము మనుష్యులు ఓరేబును చంపివేసారు.
జెయేబు ద్రాక్షగానుగ అనుచోట వారు జెయేబును
చంపివేసారు. ఎఫ్రాయిము మనుష్యులు మిద్యాను
వారిని ఇంకా తరుముతూనే ఉన్నారు. కానీ మొదట
ఓరేబు, జెయేబు తలలను వారు నరికివేసి
ఆ తలలను గిద్యోను వద్దకు తీసుకుని వెళ్లారు.
ప్రజలు యోర్దాను నదిని దాటేచోట గిద్యోను
ఉన్నాడు.

8 ఎఫ్రాయిము వారికి గిద్యోను మీద కోపం
వచ్చింది. ఎఫ్రాయిము వారికి గిద్యోను కనబడి
నప్పుడు, “ఎందుకు నీవు మాపట్ల ఇలా వ్యవహరిం
చావు. నీవు మిద్యాను ప్రజలమీద యుద్ధానికి వెళ్లి
నప్పుడు నీవు మమ్మల్ని ఎందుకు పిలవలేదు?” అని
వారు గిద్యోనును అడిగారు.
2ఎఫ్రాయిము మనుష్యులకు గిద్యోను ఇలా
జవాబు ఇచ్చాడు: “మీరు చేసినట్టు నేనేమీ చేయలేదు.
మా అబీయెజెరు వంశస్థులకంటె, మీ ఎఫ్రాయిము
వారికి ఎక్కువ పంట వచ్చింది. కోతకాలంలో మా
వారు కూర్చే ద్రాక్షపళ్లకంటె, మీరు పొలంలో పరిగె
విడిచిపెట్టే ద్రాక్షపళ్లు ఎక్కువ ఉంటాయి. అది నిజం
కాదా?
3(అలాగే, ఇప్పుడు కూడా మీకు ఎక్కువ పంట
వచ్చింది.) మిద్యాను నాయకులు ఓరేబు, జెయేబులను
పట్టుకొనేందుకు దేవుడు మీకు అనుమతి ఇచ్చాడు.
మీరు చేసినదానితో నా విజయాన్ని నేను ఎలా
పోల్చుకోగలను?” గిద్యోను మాటలు ఎఫ్రాయిము
వారు విన్నప్పుడు, వారు ముందు కోపపడినంత
కోపపడలేదు.

### మిద్యాను రాజులు ఇద్దరిని గిద్యోను పట్టుకున్నాడు

4అప్పుడు గిద్యోను, అతని మూడు వందల మంది
మనుష్యులు యొర్దాను నది దగ్గరకు వచ్చి దానిని
దాటి అవతలికి వెళ్లారు. కానీ వారు అలసిపోయి ఆక
లితో* ఉన్నారు, 5“నా సైనికులు భోజనం చేసేందుకు
ఏమైనా పెట్టండి. నా సైనికులు చాలా అలసిపోయారు.
మిద్యాను రాజులు జెబహు, సల్మున్నాలను మేము
ఇంకా తరుముతున్నాము” అని గిద్యోను సుక్కోతు
పట్టణం వారితో చెప్పాడు.
6కానీ సుక్కోతు పట్టణ నాయకులు, “నీ సైనికులు
భోజనం చేసేందుకు ఏదైనా మేము ఎందుకు పెట్టాలి?
జెబహు, సల్మున్నాలను మీరు ఇంకా పట్టుకోలేదు
గదా?” అని గిద్యోనుతో చెప్పారు.
7అప్పుడు గిద్యోను, “మీరు మాకు భోజనం
పెట్టరు. జెబహు, సల్మున్నాలను పట్టుకొనేందుకు
యెహోవా నాకు సహాయం చేస్తాడు. ఆ తర్వాత
నేను తిరిగి ఇక్కడికి వస్తాను. అడవి ముళ్లకంపతోను,
నూర్చుకొయ్యతోను మిమ్మల్ని కొడతాను” అని
చెప్పాడు.
8గిద్యోను సుక్కోతు పట్టణం విడిచి, పెనూయేలు
పట్టణం వెళ్లాడు. సుక్కోతు వారిని అడిగినట్టే, గిద్యోను
భోజనం కోసం పెనూయేలు వారిని అడిగాడు. కాని
సుక్కోతు వారు ఇచ్చిన జవాబే పెనూయేలు వారు
గిద్యోనుకు ఇచ్చారు. 9కనుక గిద్యోను, “నేను విజయం
సాధించిన తర్వాత, నేను ఇక్కడకు తిరిగి వచ్చి ఈ
గోపురాన్ని కూలగొట్టేస్తాను” అని పెనూయేలు
వారితో చెప్పాడు.
10జెబహు, సల్మున్నా, వారి సైన్యం కర్కోరు పట్ట
ణంలో ఉన్నారు. వారి సైన్యంలో పదిహేను వేల
మంది సైనికులు ఉన్నారు. తూర్పు ప్రాంతపు ప్రజ
లందరి సైన్యంలో మిగిలిన సైనికులు వీరు. ఆ
సైన్యంలో లక్షా ఇరవై వేల మంది బలమైన సైనికులు
అప్పటికే చంపివేయబడ్డారు.
11గిద్యోను, అతని మనుష్యులు గుడారవాసుల
మార్గం ఉపయోగించారు. ఆ మార్గం నోబహు,
యొగ్బెహ పట్టణాలకు తూర్పున ఉంది. గిద్యోను
కర్కోరు పట్టణం వచ్చి శత్రువుమీద దాడిచేశాడు. ఈ
దాడిని శత్రుసైన్యం ఊహించలేదు. 12మిద్యాను ప్రజల
రాజులు జెబహు, సల్మున్నాలు పారిపోయారు. కానీ
గిద్యోను ఆ రాజులను తరిమి పట్టుకొన్నాడు.
గిద్యోను, అతని మనుష్యులు శత్రు సైన్యాన్ని
ఓడించారు.
13అప్పుడు యోవాషు కుమారుడైన గిద్యోను
యుద్ధం నుండి తిరిగి వచ్చాడు. గిద్యోను, అతని
మనుష్యులు హెరెసు కనుమ అనబడిన పర్వత మార్గం
గుండా ప్రయాణం చేసి తిరిగి వచ్చారు. 14గిద్యోను
సుక్కోతు పట్టణం నుండి ఒక యువకుని పట్టు
కొన్నాడు. గిద్యోను ఆ యువకుని కొన్ని ప్రశ్నలు
అడిగాడు. ఆ యువకుడు గిద్యోనుకు కొన్ని పేర్లు
రాసి ఇచ్చాడు. సుక్కోతు పట్టణపు నాయకులు, పెద్ద
మనుష్యుల పేర్లు ఆ యువకుడు రాసిపెట్టాడు. డెబ్బై
ఏడు మంది పేర్లు అతడు ఇచ్చాడు.
15అప్పుడు గిద్యోను సుక్కోతు పట్టణానికి
వచ్చాడు. ఆ పట్టణంవారితో “ఇదిగో, జెబహు, సల్ము
న్నాలు. ‘అలసిపోయిన నీ సైనికులకు మేము భోజనం
ఎందుకు పెట్టాలి? మీరు జెబహు, సల్మున్నాలను పట్టు
కోలేదుగా?’ అంటూ మీరు నన్ను హేళన చేసారు”
అని అతడు చెప్పాడు.
16గిద్యోను సుక్కోతు పట్టణపు పెద్ద మనుష్యులను
పట్టుకొని, వారిని శిక్షించేందుకు అడవినుండి తెచ్చిన
ముళ్లకంపతో, నూర్చేడి కొయ్యతో వారిని కొట్టాడు.
17పెనూయేలు పట్టణంలో ఉన్న గోపురాన్ని కూడా
గిద్యోను కూలగొట్టివేశాడు. తరువాత అతడు ఆ పట్ట
ణంలో నివసించేవారిని చంపివేశాడు.
18అప్పుడు గిద్యోను, “తాబోరు కొండ మీద మీరు
కొందరిని చంపేశారు. ఆ మనుష్యులు ఎలా ఉంటారు?”
అని జెబహు, సల్మున్నాలను అడిగాడు.
“ఆ మనుష్యులు నీలాంటి వారే, వారిలో ప్రతి
ఒక్కడూ యువరాజులా కనిపించాడు” అని జెబహు,
సల్మున్నాలు జవాబు ఇచ్చారు.
19“ఆ మనుష్యులు నా సోదరులు! నా తల్లి కుమా
రులు! యెహోవా తోడు, మీరు గనుక వారిని చంపి
ఉండకపోతే ఇప్పుడు నేను మిమ్మల్ని చంపను”
అన్నాడు.
20అప్పుడు గిద్యోను యెతెరువైపు తిరిగాడు.
గిద్యోను పెద్ద కుమారుడు యెతెరు. “ఈ రాజులను
చంపు” అని గిద్యోను అతనితో చెప్పాడు. కాని యెతెరు
చిన్న పిల్లవాడు గనుక అతడు భయపడ్డాడు. కనుక
అతడు తన ఖడ్గం బయటకు తీయలేదు.
21అప్పుడు జెబహు సల్మున్నాలు, “రా, నీవే
మమ్మల్ని చంపు. నీవు మగవాడివి, ఈ పని చేయటానికి
తగిన బలం ఉన్నవాడివి” అని గిద్యోనుతో చెప్పారు.
కావున గిద్యోను లేచి జెబహు, సల్మున్నాలను చంపి
వేశాడు. అప్పుడు గిద్యోను వారి ఒంటెల మెడల
మీద చంద్రాకారంలో ఉన్న నగలను తీసుకున్నాడు.

### గిద్యోను ఏఫోదును తయారు చేయుట

22ఇశ్రాయేలు ప్రజలు, “మిద్యాను ప్రజల నుండి
నీవు మమ్మల్ని రక్షించావు. కనుక ఇప్పుడు నీవే
మమ్మల్ని పాలించు. నీవూ, నీ కుమారుడు, నీ మను
మళ్లు మా మీద అధికారులుగా ఉండాలని మేము కోరు

---

**ఆకలి** ఇది పురాతన గ్రీకు అనువాదం నుంచి హీబ్రూ ప్రతుల్లో ‘తరుముచు’ అని రాయబడివుంది.

తున్నాము" అని గిద్యోనుతో చెప్పారు. 23అయితే
గిద్యోను, "యెహోవాయే మిమ్మల్ని పాలించేవాడు.
నేను మీ మీద అధికారిగా ఉండను. నా కుమారుడు
మీ మీద ఏలుబడి చేయడు" అని ఇశ్రాయేలీయులతో
చెప్పాడు.
24ఇశ్రాయేలు వారు ఓడించిన మనుష్యులలో
కొందరు ఇష్మాయేలీయులుండిరి. ఇష్మాయేలు మను
ష్యులు బంగారు పోగులు ధరించారు. కనుక గిద్యోను:
"మీరు నా కోసం ఈ ఒక్క పనిచేయండి. యుద్ధంలో
మీరు తీసుకున్న బంగారు పోగులు ఒక్కొక్కరు
ఒక్కొక్కటి నాకు ఇవ్వండి" అని ఇష్మాయేలు
ప్రజలతో చెప్పాడు.
25కనుక ఇష్మాయేలు ప్రజలు, "నీకు కావలసినది
మేము సంతోషంగా ఇస్తాము" అని గిద్యోనుతో
చెప్పారు. కనుక వారు ఒక అంగీ నేలమీద పరిచారు.
26ఆ బంగారు పోగులు ప్రోగు చేయబడినప్పుడు వాటి
బరువు నలభై మూడు పౌనులు (1,700 తులములు)
అయినది. ఇష్మాయేలు ప్రజలు గిద్యోనుకు ఇచ్చిన
ఇతర కానుకలు ఈ బరువులో లేవు. చంద్రాకారములో
ఉన్న నగలు, వంకాయరంగు వస్త్రాలు వారు అతనికి
ఇచ్చారు. ఈ వస్తువులు మిద్యాను ప్రజల రాజులు
ధరించినవి. మిద్యాను రాజుల ఒంటెల మీది గొలుసు
లను కూడ వారు అతనికి ఇచ్చారు. 27ఒక ఏఫోదు
చేసేందుకు గిద్యోను ఆ బంగారాన్ని ఉపయోగించాడు.
అతడు తన స్వంత ఊరు ఒఫ్రాలో ఆ ఏఫోదును
ఉంచాడు. ఇశ్రాయేలు ప్రజలందరూ ఆ ఏఫోదును
పూజించారు. ఈ విధంగా ఇశ్రాయేలు ప్రజలు దేవునికి
నమ్మకంగా ఉండక, ఏఫోదును పూజించారు. గిద్యోను
మరియు అతని కుటుంబము పాపం చేసేందుకు ఆ
ఏఫోదు ఒక ఉచ్చులా తయారైంది.

### గిద్యోను మరణం

28మిద్యాను ప్రజలు ఇశ్రాయేలు ప్రజల పాలన
కింద ఉండేందుకు బలవంతం చేయబడ్డారు. మిద్యాను
ప్రజలు ఇంకెంత మాత్రం చిక్కు కలిగించలేదు.
గిద్యోను జీవించినంత కాలం, నలభై సంవత్సరాలు
దేశంలో శాంతి ఉంది.
29యోవాషు కుమారుడైన యెరుబ్బయలు
(గిద్యోను) ఇంటికి వెళ్లాడు. 30గిద్యోనుకు డెబ్బై మంది
సొంత కుమారులు ఉన్నారు. అతనికి చాలా మంది
భార్యలు ఉన్నారు గనుక అంతమంది కుమారులు
ఉన్నారు. 31గిద్యోను దాసి ఒకతె షెకెము పట్టణంలో
నివసించినది. ఆ దాసి ద్వారా అతనికి ఒక కుమారుడు
పుట్టాడు. ఆ కుమారునికి అబీమెలెకు అని అతడు
పేరు పెట్టాడు.
32యోవాషు కుమారుడైన గిద్యోను మంచి వృద్ధా
ప్యంలో చనిపోయాడు. గిద్యోను అతని తండ్రి యోవా
షుకు స్వంతంగా ఉన్న సమాధిలో పాతిపెట్టబడ్డాడు.
ఆ సమాధి అబీయెజ్రీ వంశం వారు నివసించే ఒఫ్రా
పట్టణంలో ఉంది. 33గిద్యోను చనిపోగానే ఇశ్రాయేలు
ప్రజలు దేవునికి మరలా నమ్మకంగా ఉండక, వారు
బయలును వెంబడించారు. బయలు బెరీతును వారు
వారి దేవతగా చేసుకున్నారు. 34ఇశ్రాయేలు ప్రజల
చుట్టూరా నివసిస్తున్న వారి శత్రువులందరి బారి నుండి
యెహోవా వారిని రక్షించినప్పటికీ, ఇశ్రాయేలు ప్రజలు
వారి దేవుడైన యెహోవాను జ్ఞాపకం చేసుకోలేదు.
35యెరుబ్బయలు (గిద్యోను), ఇశ్రాయేలు ప్రజల
కోసం ఎన్నో మంచిపనులు చేసినప్పటికీ వారు అతని
కుటుంబానికి నమ్మకంగా ఉండలేదు.

### అబీమెలెకు రాజు అవటం

9 అబీమెలెకు యెరుబ్బయలు (గిద్యోను) కుమా
రుడు. అబీమెలెకు షెకెము పట్టణంలో నివసి
స్తున్న తన మామల దగ్గరకు వెళ్లాడు. అతడు తన
మామలతోను, తన తల్లి వంశస్థులందరితోను ఇలా
చెప్పాడు: 2"షెకెము పట్టణపు నాయకులను ఈ ప్రశ్న
అడగండి: యెరుబ్బయలు యొక్క డెబ్బయి మంది
కుమారులచేత పాలించబడటం మీకు మంచిదా లేక
ఒకే మనిషిచేత పాలింపబడుట మంచిదా? నేను మీ
బంధువునని జ్ఞాపకం ఉంచుకోండి.' "
3అబీమెలెకు మామలు షెకెము నాయకులతో
మాట్లాడి, వారిని ఆ ప్రశ్న అడిగారు. షెకెము నాయ
కులు అబీమెలెకు అనుచరులుగా ఉండాలని నిర్ణయం
చేసారు. "అతడు మా సోదరుడు గదా" అని ఆ నాయ
కులు చెప్పారు. 4కనుక షెకెము నాయకులు డెబ్భై
వెండి నాణెములు అబీమెలెకుకు ఇచ్చారు. ఆ వెండి
బయలు బెరీతు* దేవతా మందిరానికి చెందినది.
అబీమెలెకు కొంతమంది కిరాయి మనుష్యులను
తెచ్చేందుకు ఆ వెండిని ఉపయోగించాడు. ఈ మను
ష్యులు పనికిమాలిన వాళ్లు, నిర్లక్ష్యపు మనుష్యులు.
అబీమెలెకు ఎక్కడికి వెళ్లినా వారు అతనిని వెంబ
డించారు.
5అబీమెలెకు ఒఫ్రాలోని తన తండ్రి ఇంటికి
వెళ్లాడు. అబీమెలెకు తన సోదరులను చంపివేసాడు.
అబీమెలెకు తన తండ్రియైన యెరుబ్బయలు
(గిద్యోను) కుమా రులు డెబ్భై మందిని చంపివేశాడు.
అతడు వారందరినీ ఒకే సమయంలో* చంపివేశాడు.
అయితే యెరుబ్బయలు చిన్న కుమారుడు అబీమెలె
కునకు కనబడ కుండా దాగుకొని తప్పించుకొన్నాడు.

---

**బయలు బెరీతు** ఒడంబడిక ప్రభువు అనే అర్థాన్ని ఈ
దేవత పేరు ఇస్తుంది.

**ఒకే సమయంలో** ఒకే బండమీద అని మూల భాషలో
రాయబడింది.

ఆ చిన్న కుమారుని పేరు యోతాము. [6]అప్పుడు
షెకెము నాయకులందరూ, మిల్లో ఇంటి వారూ సమా
వేశం అయ్యారు. షెకెములో స్తంభపు మహావృక్షము
(మస్తకి) పక్క ఆ ప్రజలంతా సమావేశమై అబీమె
లెకును వారి రాజుగా చేసుకున్నారు.

### యోతాము కథ

[7]షెకెము పట్టణ నాయకులు అబీమెలెకును
రాజుగా చేసారని యోతాము విన్నాడు. అతడు ఇది
విన్నప్పుడు వెళ్లి గెరిజీము కొండ శిఖరం మీద నిల
బడ్డాడు. యోతాము ఈ కథను గట్టిగా అరచి, ప్రజలకు
ఇలా చెప్పాడు.

షెకెము పట్టణ నాయకులారా, నా మాట
వినండి. తర్వాత దేవుడు మీ మాట వినును.
[8]ఒకనాడు వృక్షాలన్నీ వాటిని ఏలేందుకు
ఒక రాజును ఏర్పాటు చేసుకోవాలని అను
కొన్నాయి. ఆ చెట్లు, "నీవే మా రాజుగా
ఉండు" అని ఒలీవ చెట్టుతో అన్నాయి.
[9]కాని ఒలీవ చెట్టు అంది: "నా తైలం కోసం
మనుష్యులు, దేవుళ్లు నన్ను పొగడుతారు.
కేవలం నేను వెళ్లి ఇతర చెట్ల మీద అటూ
ఇటూ ఊగేందుకోసం నా తైలాన్ని తయారు
చేయడం నేను మానివేయాలా?"
[10]అప్పుడు ఆ చెట్లు అంజూరపు చెట్టుతో,
"వచ్చి మా మీద రాజుగా ఉండు" అని
అడిగాయి.
[11]కాని, "కేవలం ఇతర చెట్ల మీద అటూ
ఇటూ ఊగటం కోసం మధురమైన నా మంచి
ఫలం ఫలించటం మానివేయాలా?" అన్నది
ఆ అంజూరపు చెట్టు.
[12]అప్పుడు ఆ చెట్లు, "వచ్చి మా మీద
రాజుగా ఉండు" అని ద్రాక్షావల్లితో, అన్నాయి.
[13]కాని ద్రాక్షావల్లి, "నా ద్రాక్షారసం మనుష్య
లను, రాజులను సంతోష పెడుతుంది. కేవలం
నేను వెళ్లి ఆ చెట్ల మీద అటూ ఇటూ ఊగటం
కోసం నా ద్రాక్షరసం తయారు చేయటం
నేను మానివేయాలా?" అన్నది.
[14]చివరికి చెట్లన్నీ కలసి, "వచ్చి మా మీద
రాజుగా ఉండు" అని ముళ్లకంపతో అన్నాయి.
[15]కాని ఆ ముళ్లకంప, "మీరు నన్ను నిజంగా
మీ మీద రాజుగా చేయాలని కోరితే మీరు
వచ్చి నా నీడలో ఆశ్రయం తీసుకోండి. కాని
అలా చేయటం ఇష్టం లేకపోతే అప్పుడు ముళ్ల
కంపలో నుండి అగ్ని వచ్చునుగాక. ఆ అగ్ని
లెబానోను దేవదారు వృక్షాలను కూడా కాల్చి
వేయును గాక" అని ఆ చెట్లతో చెప్పినది.

[16]అబీమెలెకును మీరు రాజుగా చేసినప్పుడు మీరు
పూర్తి నిజాయితీగా ఉన్నట్లయితే, మీరు అతనితో
సంతోషించి ఉండేవారు. మరియు మీరు గనుక యెరు
బ్బయలు, అతని కుటుంబముతో న్యాయంగా ఉండి
ఉంటే మంచిదే. మరియు యెరుబ్బయలును పరామ
ర్శించాల్సినట్లు, పరామర్శించియుంటే మంచిదే. [17]కానీ
నా తండ్రి మీ కోసం ఏమి చేశాడో ఆలోచించండి.
నా తండ్రి మీ కోసం పోరాడాడు. మిద్యాను ప్రజల
నుండి అతడు మిమ్మల్ని రక్షించినప్పుడు తన
ప్రాణాన్ని అపాయానికి గురిచేసుకున్నాడు.
[18]కానీ ఇప్పుడు మీరు నా తండ్రి వంశానికి
విరోధంగా తిరిగారు. నా తండ్రి కుమారులు డెబ్బై
మందిని ఒకేసారి మీరు చంపివేసారు. అబీమెలెకును
షెకెము పట్టణము మీద రాజుగా మీరు చేశారు. అతడు
మీకు బంధువు గనుక మీరు అతనిని రాజుగా చేశారు.
కానీ అతడు కేవలం నా తండ్రి యొక్క దాసీ కుమారుడు
మాత్రమే!
[19]కనుక ఈనాడు యెరుబ్బయలుకు, అతని
కుటుంబానికి మీరు సంపూర్ణంగా న్యాయంగా ఉంటే,
అబీమెలెకు మీకు రాజుగా ఉన్నందుకు మీరు సంతో
షంగా ఉండవచ్చు. మరియు అతడు మీతో సంతో
షంగా ఉండవచ్చు. [20]కాని మీరు సరిగ్గా ప్రవర్తించి
ఉండకపోతే, షెకెము నాయకులైన మిమ్మల్ని మిల్లో
ఇంటివారిని అబీమెలెకు నాశనం చేయును గాక.
మరియు అబీమెలెకు కూడా నాశనం చేయబడును
గాక." [21]యోతాము ఇదంతా చెప్పగానే అతడు పారి
పోయాడు. అతడు బెయేరు అనే పట్టణానికి తప్పించు
కొని పోయాడు. యోతాము అతని సోదరుడైన అబీమె
లెకు విషయంలో భయపడినందున ఆ పట్టణంలోనే
ఉండిపోయాడు.

### షెకెముతో అబీమెలెకు యుద్ధం

[22]అబీమెలెకు ఇశ్రాయేలు ప్రజలను మూడు సంవ
త్సరాలు పాలించాడు. [23-24]అబీమెలెకు చంపిన డెబ్బై
మంది యెరుబ్బయలు కుమారులు అబీమెలెకునకు
స్వంత సోదరులే. ఈ చెడుకార్యాలు చేయటంలో
షెకెము నాయకులు అతనిని బలపర్చారు. కనుక అబీ
మెలెకునకు షెకెము నాయకులకు మధ్య దేవుడు
చిక్కు కలిగించాడు. మరియు అబీమెలెకును బాధించు
టకు షెకెము నాయకులు అన్వేషించుట మొదలు
పెట్టారు. [25]షెకెము పట్టణ నాయకులకు అబీమెలెకు
అంటే ఇంకెంత మాత్రం ఇష్టం లేదు. మార్గంలో వెళ్లే
ప్రతి ఒక్కరినీ దాడి చేసి దోచుకొనేందుకు వారు
కొండల శిఖరాలన్నిటి మీద మనుష్యులను ఉంచారు.
ఆ దాడుల విషయం అబీమెలెకునకు తెలిసిపోయింది.
[26]ఎబెదు కుమారుడు గాలు అను పేరుగల మనిషి.
అతని సోదరులు షెకెము పట్టణానికి తరలి వచ్చారు.

షెకెము పట్టణానికి నాయకులు గాలును నమ్మేందుకు,
వెంబడించేందుకు తీర్మానించారు. [27]ఒకరోజు ద్రాక్ష
పండ్లు ఏరుకొనేందుకు షెకెము ప్రజలు పొలాలకు
వెళ్లారు. ప్రజలు ద్రాక్షరసం చేసేందుకు ద్రాక్షాపండ్లను
పిండారు. తరువాత వాళ్లు తమ దేవుని ఆలయంలో
ఉత్సవాన్ని జరుపుకున్నారు. ప్రజలు తిని, తాగి అబీమె
లెకుపై చెడుగా మాటలాడుకున్నారు.

[28]అప్పుడు ఎబెదు కొడుకైన గాలు, "మనము
షెకెము ప్రజలమా? మనమెందుకు అతనికి విధేయు
లవ్వాలి? అబీమెలెకు తనను ఏమను కొంటున్నాడు?
అబీమెలెకు యెరుబ్బయలు కుమారులలో ఒకడు
కాడా? అబీమెలెకు జెబులూను తన అధికారిగా నియ
మించలేదా? మనము అబీమెలెకునకు విధేయులం
కాకూడదు. మనము మన స్వంత ప్రజలనే అంటే
హామోరు ప్రజలనే* అనుసరించాలి." అని వారితో
అన్నాడు. (హామోరు షెకెముకు తండ్రి) [29]నీవు నన్ను
ఈ ప్రజలకు ముఖ్యాధికారిగా చేస్తే, నేను అబీమెలెకును
నాశనం చేస్తాను. నేను అతనికి 'నీ సైన్యాన్ని సిద్ధం
చేసుకుని యుద్ధానికి రా' అని చెప్తాను.

[30]జెబులు షెకెము పట్టణానికి అధిపతియై
ఉండెను. ఎబెదు కుమారుడైన గాలు ఈ మాటలను
మాట్లాడి నప్పుడు జెబులుకు చాలా కోపం వచ్చింది.

[31]అప్పుడతడు అరుమ పట్టణంలో ఉన్న అబీ
మెలెకు దగ్గరకు జెబులు వార్తాహరులను పంపించాడు.
ఆ సందేశం యిది:

ఎబెదు కుమారుడు గాలు, మరియు గాలు
సోదరులు షెకెము పట్టణం వచ్చారు. వారు మీకు
చిక్కులు కలిగిస్తున్నారు. మొత్తం పట్టణాన్ని గాలు
మీకు విరోధంగా తిప్పుతున్నాడు. [32]కనుక మీరు, మీ
మనుష్యులు ఈ రాత్రికి వచ్చి పట్టణం బయట
పొలాల్లో దాగుకోవాలి. [33]తరువాత సూర్యోదయం
కాగానే పట్టణం మీద దాడి చేయండి. మీతో యుద్ధం
చేయటానికి గాలు, అతని మనుష్యులు బయటకు
వస్తారు. ఆ మనుష్యులు పోరాడేందుకు బయటకు
రాగానే వారికి మీరు చేయగలిగింది చేయండి.

[34]కనుక ఆ రాత్రివేళ అబీమెలెకు, అతని సైనికులు
లేచి పట్టణానికి వెళ్లారు, ఆ సైనికులు నాలుగు గుంపు
లుగా విడిపోయారు. వారు షెకెము పట్టణానికి దగ్గరలో
దాగుకొన్నారు. [35]ఎబెదు కుమారుడు గాలు బయటకు
వెళ్లి షెకెము పట్టణ ద్వార ప్రవేశం దగ్గర నిలబడ్డాడు.
గాలు అక్కడ నిలబడి ఉండగా అబీమెలెకు, అతని
సైనికులు వారి రహస్య స్థలాల నుండి బయటకు
వచ్చారు. [36]గాలు ఆ సైనికులను చూశాడు. గాలు,
"అదిగో చూడు. ఆ కొండల మీద నుండి మనుష్యులు
దిగి వస్తున్నారు" అని అన్నాడు.

కాని జెబులు, "నీకు కనబడుతోంది కొండల
నీడలు మాత్రమే. ఆ నీడలు సరిగ్గా మనుష్యుల్లాగే
కనబడ తాయి" అన్నాడు.

[37]కాని, "అదిగో చూడు అక్కడ. ఆ చోట నుండి
కొందరు మనుష్యుల దండు దిగివస్తోంది. ఆ శకున
గాండ్ర వృక్షం పక్కగా ఎవరిదో తల నాకు కనబడు
తోంది అని గాలు మరల చెప్పాడు. [38]నీవు ఇప్పుడు
ఎందుకు అతిశయించుటలేదు? 'అబీమెలెకు ఎవడు?
మేము ఎందుకు అతనికి విధేయులము కావాలి?' అని
నీవు అడిగావు. ఈ మనుష్యులను గూర్చి నీవు హేళన
చేశావు. ఇప్పుడు వెళ్లి వారితో యుద్ధం చేయి" అని
జెబులు గాలుతో చెప్పాడు.

[39]కనుక షెకెము నాయకులను అబీమెలెకుతో
పోరాడుటకు గాలు తీసుకొని వెళ్లాడు. [40]అబీమెలెకు,
అతని మనుష్యులు, గాలును, అతని మనుష్యులను
వెంటాడారు. గాలు మనుష్యులు షెకెము పట్టణ ద్వారం
వైపు వెనుకకు పరుగెత్తారు. ఆ ద్వారం చేరక ముందే
గాలు మనుష్యులు చాలామంది చంపి వేయబడ్డారు.

[41]అప్పుడు అబీమెలెకు అరుమ పట్టణానికి తిరిగి
వచ్చాడు. గాలును, అతని సోదరులను షెకెము పట్టణం
నుండి జెబులు బలవంతంగా వెళ్లగొట్టాడు.

[42]మరునాడు షెకెము ప్రజలు పొలాల్లో పని చేయ
టానికి వెళ్లారు. అది అబీమెలెకు తెలుసుకున్నాడు.
[43]కనుక అబీమెలెకు తన మనుష్యులను మూడు గుంపు
లుగా విభజించాడు. షెకెము ప్రజలపై ఆశ్చర్య రీతిగా
దాడి చేయాలని అతడు అనుకొన్నాడు. కనుక అతడు
తన మనుష్యులను పొలాల్లో దాచి ఉంచాడు. ప్రజలు
పట్టణంలో నుండి బయటకు రావటం అతడు చూడ
గానే అతడు దూకి వారిపై దాడిచేశాడు. [44]అబీమెలెకు,
అతని గుంపువారు షెకెము ద్వారం దగ్గర ఒక చోటుకి
పరుగెత్తారు. మిగిలిన రెండు గుంపుల వారు పొలాల్లో
ఉన్న ప్రజల దగ్గరకు పరుగెత్తి వారిని చంపివేశారు.
[45]ఆ రోజంతా అబీమెలెకు, అతని మనుష్యులు షెకెము
పట్టణం మీద యుద్ధంచేశారు. అబీమెలెకు, అతని మను
ష్యులు షెకెము పట్టణాన్ని పట్టుకొని ఆ పట్టణ ప్రజ
లను చంపివేశారు. అప్పుడు అబీమెలెకు ఆ పట్టణాన్ని
కూలగొట్టి దాని శిథిలాల మీద ఉప్పు చల్లాడు.

[46]షెకెము గోపురం దగ్గర కొంతమంది ప్రజలు
నివసించేవారు. షెకెమునకు సంభవించిన దాన్ని గూర్చి
అక్కడి ప్రజలు విన్నప్పుడు వారు ఏల్‌బెరీతు* దేవతా
మందిరంలో ఎంతో క్షేమంగా ఉండే గదిలో సమావేశ
మయ్యారు.

---

**హామోరు ప్రజలు** షెకెములో పుట్టినటువంటి వారు. ఆదికాండం 34వ అధ్యాయములో ఉన్నట్లుగా హామోరు షెకెము తండ్రి. షెకెము పట్టణానికి హామోరు కుమారుని పేరు పెట్టబడిందని చెప్పబడింది.

**ఏల్‌బెరీతు** దీని అర్థం 'ఒడంబడిక దేవుడు.'

47షెకెము గోపురపు నాయకులందరూ సమావేశ
మయ్యారని అబీమెలెకు విన్నాడు. 48కనుక అబీమె
లెకు, అతని మనుష్యులందరు సల్మోను కొండ మీదికి
వెళ్లారు. అబీమెలెకు ఒక గొడ్డలి తీసుకుని కొన్ని
కొమ్మలు నరికాడు. ఆ కొమ్మలను అతడు తన భుజాల
మీద మోసుకుని వెళ్లాడు. అప్పుడు అబీమెలెకు తనతో
ఉన్న మనుష్యులతో, “త్వరపడండి, నేను చేసిన పని
చేయండి” అని చెప్పాడు. 49కనుక వారందరు
కొమ్మలు నరికి అబీమెలెకును వెంబడించారు. ఏల్‌బె
రీతు దేవతా మందిరపు భద్రతాగదికి అడ్డంగా కుప్ప
వేసారు. అప్పుడు వారు ఆ కొమ్మలకు నిప్పు అంటించి
ఆ గదిలో ఉన్న మనుష్యులను కాల్చివేసారు. కనుక
షెకెము గోపురం దగ్గర నివసించే స్త్రీపురుషులు వెయ్యి
మంది చనిపోయారు.

## అబీమెలెకు మరణం

50అప్పుడు అబీమెలెకు, అతని మనుష్యులు తేబేసు
పట్టణం వెళ్లారు. అబీమెలెకు, అతని మనుష్యులు ఆ
పట్టణాన్ని పట్టుకున్నారు. 51కాని ఆ పట్టణం లోపల
ఒక బలమైన గోపురం ఉంది. నాయకులు ఇతర స్త్రీ
పురుషులు ఆ గోపురమునకు పారిపోయారు. ప్రజలు
ఆ గోపురం లోపల ఉండగా వారు లోపల నుండి
తాళం వేసారు. తరువాత వారు ఆ గోపురపు కప్పు
మీదికి ఎక్కారు. 52ఆ గోపురంమీద దాడి చేయుటకు
అబీమెలెకు, అతని మనుష్యులు దాని దగ్గరకు వచ్చారు.
అబీమెలెకు ఆ గోపుర ద్వారం దగ్గరకు వెళ్లాడు. అతడు
ఆ గోపురాన్ని తగులబెట్టాలి అనుకున్నాడు. 53కాని
అబీమెలెకు ఆ గోపుర ద్వారం దగ్గర నిలబడి ఉండగా
పై కప్పు మీద ఉన్న ఒక స్త్రీ తిరుగటి రాయి ఒకటి
అతని తల మీద వేసింది. ఆ తిరుగటి రాయి అబీమెలెకు
తలను చితకగొట్టింది. 54వెంటనే అబీమెలెకు తన
ఆయుధాలు మోసే సేవకునితో, “నీ ఖడ్గం తీసుకుని
నన్ను చంపివేయి. ‘అబీమెలెకును ఒక స్త్రీ చంపేసింది’
అని ప్రజలు చెప్పకుండా ఉండేందుకు నీవే నన్ను
చంపివేయాలి” అని చెప్పాడు. కనుక ఆ సేవకుడు
తన కత్తితో అబీమెలెకును పొడిచివేయగా అబీమెలెకు
చనిపోయాడు. 55అబీమెలెకు చనిపోయినట్టు ఇశ్రా
యేలు ప్రజలు చూశారు. కనుక వారంతా తిరిగి ఇంటికి
వెళ్లారు. 56ఆ విధంగా అబీమెలెకు చేసిన చెడు
విషయాలు అన్నింటికోసం దేవుడు అతణ్ణి శిక్షించాడు.
అబీమెలెకు తన డెబ్భై మంది సోదరులను చంపి తన
స్వంత తండ్రికి విరోధంగా పాపం చేసాడు. 57షెకెము
పట్టణ ప్రజలు చేసిన చెడుపనుల కోసం దేవుడు
వారిని కూడా శిక్షించాడు. కనుక యోతాము చెప్పిన
విష యాలు నిజం అయ్యాయి. (యెరుబ్బయలు
చిన్న కుమారుడు యోతాము. యెరుబ్బయలు అనగా
గిద్యోను).

## న్యాయమూర్తి తోలా

10 అబీమెలెకు చనిపోయిన తరువాత ఇశ్రాయేలు
ప్రజలను రక్షించుటకు దేవుడు మరో న్యాయ
మూర్తిని పంపించాడు. ఆ మనిషి పేరు తోలా. తోలా,
పువ్వా అనే పేరుగల మనిషి కుమారుడు. పువ్వా,
దోదో అనే పేరుగల వాని కుమారుడు. తోలా ఇశ్శాఖారు
వంశానికి చెందినవాడు. తోలా షామీరు పట్టణంలో
నివసించేవాడు. షామీరు పట్టణం ఎఫ్రాయిము కొండ
దేశంలో ఉంది. 2తోలా ఇరవై మూడు సంవత్సరాలు
ఇశ్రాయేలు ప్రజలకు న్యాయమూర్తిగా ఉన్నాడు.
తర్వాత తోలా చనిపోయి, షామీరు పట్టణంలో పాతి
పెట్టబడ్డాడు.

## న్యాయమూర్తి యాయీరు

3తోలా మరణించిన తరువాత మరో న్యాయమూర్తి
దేవుని చేత పంపబడ్డాడు. ఆ మనిషి పేరు యాయీరు.
యాయీరు గిలాదు ప్రాంతంలో నివసించేవాడు.
యాయీరు ఇరవై రెండు సంవత్సరాలు ఇశ్రాయేలు
ప్రజలకు న్యాయమూర్తిగా ఉన్నాడు. 4యాయీరుకు
ముప్పయి మంది కుమారులు. ఆ ముప్పయి మంది
కుమారులు ముప్పయి గాడిదల మీద తిరిగేవారు. వారు
గిలాదు ప్రాంతంలోని ముప్పయి పట్టణాల మీద అధి
కారం చేసేవారు. ఈ రోజు వరకు ఆ పట్టణాలు
యాయీరు పట్టణాలు అని పిలువబడుతున్నాయి.
5యాయీరు మరణించి కామోను పట్టణంలో పాతి
పెట్టబడ్డాడు.

## అమ్మోనీయులు ఇశ్రాయేలు మీద యుద్ధం చేయుట

6మరల ఇశ్రాయేలు ప్రజలు, యెహోవా చెడ్డవి
అని చెప్పిన వాటినే చేసారు. బూటకపు దేవతలు
బయలు, అష్తారోతులను వారు పూజించటం మొదలు
పెట్టారు. వారు అరాము ప్రజల దేవుళ్లను, సీదోను
ప్రజల దేవుళ్లను, మోయాబు ప్రజల దేవుళ్లను,
అమ్మోను ప్రజల దేవుళ్లను, ఫిలిష్తీయ ప్రజల దేవుళ్లను
కూడా పూజించారు. ఇశ్రాయేలు ప్రజలు యెహో
వాను విడిచిపెట్టి ఆయనను సేవించటం మాను
కున్నారు.

7కనుక ఇశ్రాయేలు ప్రజల మీద యెహోవాకు
కోపం వచ్చింది. ఫిలిష్తీ ప్రజలు, అమ్మోను ప్రజలు
వారిని ఓడించేటట్టుగా యెహోవా చేసాడు. 8అదే
సంవత్సరం యొర్దాను నదికి తూర్పువైపునగల గిలాదు
ప్రాంతంలో నివసించే ఇశ్రాయేలు ప్రజలను ఆ మను
ష్యులు నాశనం చేసారు. అది అమ్మోరీ ప్రజలు నివ
సించిన దేశం. ఆ ఇశ్రాయేలు ప్రజలు పద్దెనిమిది
సంవత్సరాలు శ్రమ అనుభవించారు. 9అప్పుడు అమ్మో
నీయులు యొర్దాను నది దాటి వెళ్లారు. యూదా,
బెన్యామీను, ఎఫ్రాయిము ప్రజల మీద యుద్ధం

చేసేందుకు వారు వెళ్లారు. అమ్మోనీయులు ఇశ్రాయేలు
ప్రజలకు అనేక కష్టాలు కలిగించారు.
[10]కనుక ఇశ్రాయేలు ప్రజలు సహాయం కోసం
యెహోవాకు మొరపెట్టారు. "దేవా, మేము నీకు విరో
ధంగా పాపం చేశాము. మేము మా దేవుని విడిచిపెట్టి
బూటకపు బయలు దేవతను పూజించాము" అని వారు
చెప్పారు. [11]ఇశ్రాయేలు ప్రజలకు యెహోవా జవాబు
చెప్పాడు: "ఈజిప్టు ప్రజలు అమ్మోరీయులు, అమ్మోనీ
యులు, ఫిలిష్తీయులు మిమ్మల్ని బాధించినప్పుడు
మీరు నాకు మొరపెట్టారు. వారి బారినుండి నేను
మిమ్మల్ని రక్షించాను. [12]సీదోను ప్రజలు, అమాలేకీ
యులు, మిద్యానీయులు* మిమ్మల్ని బాధించి
నప్పుడు మీరు నాకు మొరపెట్టారు. ఆ ప్రజల నుండి
కూడా నేను మిమ్మల్ని రక్షించాను. [13]కానీ మీరు నన్ను
విడిచిపెట్టేశారు. మీరు ఇతర దేవుళ్లను పూజించారు.
కనుక మిమ్మల్ని మరల రక్షించటానికి నేను నిరాకరి
స్తున్నాను. [14]ఆ దేవుళ్లను పూజించటం మీకు ఇష్టం
కనుక వెళ్లి, సహాయం కోసం వాటికి మొరపెట్టండి.
మీరు కష్టంలో ఉన్నప్పుడు ఆ దేవుళ్లనే మీకు సహాయం
చేయనీయండి." [15]కానీ ఇశ్రాయేలు ప్రజలు, "మేము
పాపం చేశాము. మమ్మల్ని నీవు ఏమి చేయాలను
కొంటే అలాగే చేయి. కానీ ఈ వేళ నీవు మమ్మల్ని
రక్షించు" అని యెహొ వాను అడిగారు. [16]అప్పుడు
ఇశ్రాయేలు ప్రజలు ఆ అన్యదేవతలను పారవేశారు.
వారు మరల యెహోవాను ఆరాధించటం మొదలు
పెట్టారు. కనుక వారు శ్రమపడుతున్నప్పుడు
యెహోవా వారిని చూచి సంతాపపడ్డాడు.

### నాయకునిగా యెఫ్తా ఎన్నుకోబడుట

[17]అమ్మోనీయులు యుద్ధానికి సమావేశమ
య్యారు. గిలాదు ప్రాంతంలో వారు విడిది చేసారు.
ఇశ్రాయేలు ప్రజలు ఒక్కచోట సమావేశమయ్యారు.
మిస్పా పట్టణం వద్ద ఉంది వారి విడిది. [18]గిలాదు
ప్రాంతంలో నివసించే ప్రజల నాయకులు, "అమ్మోను
ప్రజలమీద దాడి చేసేందుకు మనల్ని ఎవరు నడిపి
స్తారు? ఆ మనిషి, గిలాదు ప్రాంతంలో నివసించే
ప్రజలందరికీ ప్రధాని అవుతాడు" అన్నారు.

11 యెఫ్తా గిలాదు వంశంవాడు. అతడు బలమైన
సైనికుడు. అయితే యెఫ్తా ఒక వేశ్య
కుమారుడు. అతని తండ్రి పేరు గిలాదు. [2]గిలాదు
భార్యకు చాలామంది కుమారులు ఉన్నారు. ఆ కుమా
రులు పెద్దవారైనప్పుడు, యెఫ్తా అంటే వారికి ఇష్టంలేక
పోయింది. ఆ కుమారులు యెఫ్తాను అతని స్వగ్రామం
నుండి బలవంతంగా వెళ్లగొట్టారు. "మా తండ్రి ఆస్తిలో
నీకు ఎలాంటి భాగం లేదు. నీవు మరో స్త్రీ కుమారుడివి"
అని వారు అతనితో చెప్పారు. [3]కనుక యెఫ్తా తన
సోదరుల మూలంగా వెళ్లిపోయాడు. అతడు టోబు
దేశంలో నివసించాడు. టోబు దేశంలో కొందరు అల్లరి
జనం యెఫ్తాను వెంబడించటం మొదలు పెట్టారు.
[4]కొంతకాలం తర్వాత అమ్మోనీ ప్రజలు, ఇశ్రా
యేలు ప్రజలతో యుద్ధం చేశారు. [5]అమ్మోనీయులు
ఇశ్రాయేలు ప్రజలతో యుద్ధం చేస్తున్నారు గనుక
గిలాదులోని పెద్దలు (నాయకులు) యెఫ్తా దగ్గరకు
వెళ్లారు. యెఫ్తాటోబు దేశం విడిచిపెట్టి, గిలాదుకు
తిరిగి రావాలని వారు కోరారు. [6]ఆ పెద్దలు, "మనం
అమ్మోనీయులతో యుద్ధం చేయ గలిగేటట్టు, నీవు
వచ్చి మాకు నాయకునిగా ఉండు" అని యెఫ్తాతో
చెప్పారు. [7]కానీ యెఫ్తా, "మీరే నన్ను నా తండ్రి
ఇంటి నుండి బలవంతంగా వెళ్లగొట్టారు. నేనంటే మీకు
అసహ్యం. కనుక మీకు కష్టం వచ్చిందని మీరు ఇప్పుడు
నా దగ్గరకు రావటం ఎందుకు?" అని గిలాదు దేశపు
పెద్దలను (నాయకులను) అడిగాడు.
[8]"ఆ కారణం వల్లనే ఇప్పుడు మేము నీ దగ్గరకు
వచ్చాము. దయచేసి మాతో వచ్చి అమ్మోనీయుల
మీద యుద్ధం చేయి. గిలాదులో నివసిస్తున్న ప్రజ
లందరి మీద నీవు సైన్యాధికారిగా ఉంటావు" అని గిలాదు
పెద్దలు యెఫ్తాతో చెప్పారు.
[9]అప్పుడు యెఫ్తా, "నేను గిలాదుకు తిరిగి వచ్చి,
అమ్మోనీయులతో యుద్ధం చేయాలని మీరు కోరితే,
మంచిదే. కానీ గెలిచేందుకు యెహోవా నాకు
సహాయం చేస్తే, అప్పుడు మీకు నేను కొత్త నాయకు
నిగా ఉంటాను" అని గిలాదు పెద్దలతో చెప్పాడు.
[10]గిలాదు పెద్దలు (నాయకులు), "మనం చెప్పు
కొంటున్నది అంతా యెహోవా వింటున్నాడు. మేము
చేయాలని నీవు చెప్పేది అంతా మేము చేస్తామని
వాగ్దానం చేస్తున్నాము" అని యెఫ్తాతో చెప్పారు.
[11]కనుక గిలాదు పెద్దలతో యెఫ్తా వెళ్లాడు. ఆ
ప్రజలు యెఫ్తాను తమ నాయకునిగా, సైన్యాధికారిగా
చేసుకున్నారు. మిస్పా పట్టణంలో యెహోవా ఎదుట
యెఫ్తా తన మాటలన్నింటినీ మళ్లీ చెప్పాడు.

### అమ్మోను రాజు వద్దకు యెఫ్తా సందేశకులను పంపుట

[12]అమ్మోను ప్రజల రాజు దగ్గరకు యెఫ్తా సందేశ
కులను పంపించాడు. ఆ సందేశకులు రాజుకు ఈ
సందేశం అందించారు: "అమ్మోను ప్రజలకు, ఇశ్రా
యేలు ప్రజలకు మధ్యగల సమస్య ఏమిటి? మాపై
యుద్ధానికి నీవెందుకు వచ్చావు?"
[13]అమ్మోను ప్రజల రాజు, "ఇశ్రాయేలు ప్రజలు
ఈజిప్టు నుండి వచ్చినప్పుడు, వారు మా భూమిని
ఆక్రమించుకున్నారు గనుక ఇశ్రాయేలీయులతో మేము
యుద్ధం చేస్తున్నాము. అమ్మోను నది నుండి

---

**మిద్యానీయులు** ఇది పురాతన గ్రీకు అనువాదం.
హీబ్రూలో మోవీయులు అని రాయబడివుంది.

యబ్బోకు నది వరకు, యోర్దాను నది వరకు వారు
మా భూమిని ఆక్రమించారు. ఇప్పుడు మా భూమిని
శాంతియుతంగా తిరిగి మాకు ఇచ్చివేయమని ఇశ్రా
యేలీయులతో చెప్పండి” అని యెఫ్తా సందేశకులతో
చెప్పాడు.
14యెఫ్తా సందేశకులు ఈ సందేశాన్ని తిరిగి
యెఫ్తాకు అందించారు. అప్పుడు యెఫ్తా ఆ సందేశ
కులను తిరిగి అమ్మోనీయుల రాజు దగ్గరకు పంపిం
చాడు. 15వారు తిరిగి తీసుకుని వెళ్లిన సందేశం ఇది :

యెఫ్తా చెప్పేది ఇది: మోయాబు ప్రజల
భూమిగాని, అమ్మోను ప్రజల భూమిగాని ఇశ్రా
యేలీయులు తీసుకోలేదు. 16ఇశ్రాయేలీ
యులు ఈజిప్టు నుండి బయటకు వచ్చి
నప్పుడు, ఇశ్రాయేలు ప్రజలు అరణ్యంలోనికి
వెళ్లారు. తర్వాత ఇశ్రాయేలు ప్రజలు ఎర్ర
సముద్రానికి వెళ్లారు. తర్వాత వారు కాదేషు
వెళ్లారు. 17ఇశ్రాయేలీయులు ఎదోము రాజు
దగ్గరకు సందేశకులను పంపించారు. ఒక
సహాయం కోసం ఆ సందేశకులు అడిగారు.
“ఇశ్రాయేలు ప్రజలను నీ దేశంలో నుండి
పోనియ్యి” అని వారు అడిగారు. కానీ ఎదోము
రాజు మమ్మల్ని వారి దేశంలో నుండి వెళ్లనివ్వ
లేదు. అదే సందేశాన్ని మేము మోయాబు
రాజుకు కూడ పంపించాము. కానీ మోయాబు
రాజుగూడ మమ్మల్ని తన దేశంలోనుండి వెళ్లని
వ్వలేదు. కనుక ఇశ్రాయేలు ప్రజలు కాదేషులో
నిలిచిపోయారు.
18తర్వాత ఇశ్రాయేలు ప్రజలు అరణ్యంలో
నుండి, ఎదోము, మోయాబు దేశాల సరిహ
ద్దుల నుండి తిరిగి వెళ్లారు. ఇశ్రాయేలు ప్రజలు
మోయాబు దేశానికి తూర్పుదిశగా ప్రయాణం
చేశారు. అర్నోను నదికి అవతలవైపు వారు
విడిది చేసారు. మోయాబు దేశ సరిహద్దును
వారు దాటలేదు. (అర్నోను నది మోయాబు
దేశానికి సరిహద్దు.)
19తర్వాత ఇశ్రాయేలీయులు అమ్మోరీ
యుల రాజు సీహోను దగ్గరకు సందేశకులను
పంపించారు. సీహోను హెష్బోను పట్టణపు
రాజు, “ఇశ్రాయేలు ప్రజలను నీ దేశంలో
నుండి వెళ్లనియ్యి. మేము మా దేశానికి వెళ్ల
గోరుతున్నాము.” అని ఆ సందేశకులు సీహో
నుతో చెప్పారు. 20కానీ అమ్మోరీయుల రాజు
సీహోను ఇశ్రాయేలు ప్రజలను తన సరిహ
ద్దులు దాటనివ్వలేదు. సీహోను తన ప్రజలం
దరినీ సమావేశపరచి, యాహసు దగ్గర విడిది
చేసాడు. అప్పుడు అమ్మోరీయులు ఇశ్రాయేలీ
యులతో యుద్ధం చేసారు. 21అయితే సీహో
నును, అతని సైన్యాన్ని ఓడించేందుకు ఇశ్రా
యేలు దేవుడు యెహోవా, ఇశ్రాయేలు ప్రజ
లకు సహాయం చేసాడు. కనుక అమ్మోరీ
యుల దేశం ఇశ్రాయేలీయుల ఆస్తి అయింది.
22కనుక అమ్మోరీయుల దేశం అంతా ఇశ్రాయే
లీయుల వశం అయింది. ఆ దేశం అర్నోను
నదినుండి యబ్బోకు నదివరకు ఉంది. ఆ
దేశం అరణ్యంనుండి యోర్దాను నదివరకు
ఉంది.
23అమ్మోరీ ప్రజలను వారి దేశంనుండి వెళ్ల
గొట్టినవాడు యెహోవా, ఇశ్రాయేలు దేవుడు.
మరియు ఆ దేశాన్ని ఇశ్రాయేలు ప్రజలకు
యెహోవా ఇచ్చాడు. ఇశ్రాయేలు ప్రజలు
ఈ దేశాన్ని విడిచి వెళ్లిపోయేట్టు నీవు చేయ
గలవని అనుకొంటున్నావా? 24నీ కెమోషు
దేవత నీకు ఇచ్చిన దేశంలో నిశ్చయంగా నీవు
ఉండవచ్చును. కనుక మా యెహోవా దేవుడు
మాకు ఇచ్చిన దేశంలో మేము ఉంటాము.
25సిప్పోరు కుమారుడు బాలాకు*కంటె నీవు
మంచివాడవా? అతను మోయాబు దేశానికి
రాజు. అతడు ఇశ్రాయేలు ప్రజలతో ఏమైనా
వాదించాడా? అతడు ఇశ్రాయేలు ప్రజలతో
నిజంగా యుద్ధం చేశాడా? 26హెష్బోను పట్ట
ణంలో, దాని చుట్టూరా ఉన్న ఊళ్లలోను
మూడువందల సంవత్సరాలు ఇశ్రాయేలు
ప్రజలు నివసించారు. ఇశ్రాయేలు ప్రజలు అరో
యేరు పట్టణంలోను, దాని చుట్టూరా ఉన్న
ఊళ్లలోను మూడువందల సంవత్సరాలు నివ
సించారు. అర్నోను నది పొడవునా ఉన్న పట్ట
ణాలు అన్నింటిలోనూ ఇశ్రాయేలు ప్రజలు
మూడువందల సంవత్సరాలు నివసించారు. ఆ
కాలమంతటిలోనూ ఈ పట్టణాలను తీసుకు
నేందుకు నీవు ఎందుకు ప్రయత్నం చేయ
లేదు?
27ఇశ్రాయేలు ప్రజలు నీకు విరోధంగా
పాపం చేయలేదు. కానీ నీవు ఇశ్రాయేలు ప్రజ
లకు విరోధంగా చాలా చెడ్డ పని చేస్తున్నావు.
ఇశ్రాయేలు ప్రజలు సరియైనది చేస్తున్నారో,
అమ్మోనీయులు సరియైనది చేస్తున్నారో
అనేది నిజమైన న్యాయమూర్తి యెహోవా
నిర్ణయించునుగాక!” 28యెఫ్తా దగ్గర్నుండి
వచ్చిన ఈ సందేశాన్ని అమ్మోనీయుల రాజు
నిరాకరించాడు.

---

**సిప్పోరు కుమారుడు బాలాకు** సంఖ్యా. 22-24వ అధ్యాయం చూడండి.

### యెఫ్తా వాగ్దానం

[29]అప్పుడు యెహోవా ఆత్మ యెఫ్తా మీదికి
వచ్చింది. గిలాదు, మనష్షే ప్రాంతాలలో యెఫ్తా
సంచారం చేశాడు. అతడు గిలాదులోని మిస్పా పట్టణా
నికి వెళ్లాడు. గిలాదులోని మిస్పా పట్టణంనుండి యెఫ్తా
అమ్మోనీయుల దేశంలోనికి వెళ్లాడు.
[30]యెహోవాకు యెఫ్తా ఒక ప్రమాణం చేసాడు,
"అమ్మోనీయులను నేను ఓడించేటట్టుగా నీవు చేస్తే,
[31]ఆ విజయంతో నేను తిరిగి వచ్చేటప్పుడు నా
ఇంటిలోనుండి మొట్టమొదట బయటకు వచ్చేదానిని
నేను నీకు అర్పిస్తాను. దానిని నేను దహన బలిగా
యెహోవాకు అర్పిస్తాను" అని అతడు చెప్పాడు.
[32]అప్పుడు యెఫ్తా అమ్మోనీ ప్రజల దేశం
వెళ్ళాడు. అమ్మోనీయులతో యెఫ్తా యుద్ధం చేశాడు.
వారిని ఓడించటానికి యెహోవా అతనికి సహాయం
చేశాడు. [33]అరోయేరు పట్టణంనుండి మిన్నీతు పట్టణం
వరకు అతడు వారిని ఓడించాడు. యెఫ్తా ఇరవై పట్టణా
లను పట్టుకొన్నాడు. ఆబేల్కెరామీము పట్టణంవరకు
అమ్మోనీయులతో అతడు పోరాడాడు. ఇశ్రాయేలీ
యులు అమ్మోనీ ప్రజలను ఓడించారు. అది అమ్మోనీ
ప్రజలకు ఒక గొప్ప పరాజయం.
[34]యెఫ్తా తిరిగి మిస్పా వెళ్లాడు. యెఫ్తా తన ఇంటికి
వెళ్లగా, అతని కుమార్తె అతన్ని ఎదుర్కొనేందుకు
ఇంటిలో నుండి బయటకు వచ్చింది. ఆమె తంబుర
వాయిస్తూ, నాట్యం చేస్తూ వచ్చెను. ఆమె అతనికి
ఒక్కతే కుమార్తె. యెఫ్తా ఆమెను ఎంతో ప్రేమించాడు.
యెఫ్తాకు ఇంకా కుమారులు, కుమార్తెలు ఎవరూ
లేరు. [35]యెఫ్తా ఇంటి నుండి మొట్టమొదట బయటకు
వచ్చింది తన కుమార్తె అని అతడు చూడగానే, అతడు
తన దుఃఖాన్ని వ్యక్తం చేయటానికి తన బట్టలు చింపి
వేసికున్నాడు. అప్పుడు అతడు, "అయ్యో, నా
కుమారీ, నీవు నన్ను దుఃఖంతో నింపివేశావు. నీవు
నన్ను ఎంతో ఎంతో భాధపెట్టేశావు. యెహోవాకు
నేను వాగ్దానం చేశాను, దానిని నేను మార్చలేను" అని
చెప్పాడు.
[36]అప్పుడు అతని కుమార్తె, "నా తండ్రీ, నీవు
యెహోవాకు ఒక వాగ్దానం చేశావు. కనుక నీ వాగ్దానం
నిలబెట్టుకో. నీవు చెప్పినట్టే చేయి. నీ శత్రువులైన
అమ్మోనీయులను ఓడించటానికి యెహోవాయేగదా
నీకు సహాయం చేసాడు" అని యెఫ్తాతో చెప్పింది.
[37]అప్పుడు యెఫ్తా కుమార్తె, "అయితే నా కోసం
ముందుగా ఈ ఒక్కటి చేయి. రెండు నెలలు నన్ను
ఏకాంతంగా ఉండనివ్వు. నన్ను కొండలకు వెళ్లనివ్వు.
నేను పెళ్లి చేసుకోను, పిల్లలు ఉండరు, కనుక నన్ను
నా స్నేహితురాండ్రను కలిసి ఏడ్వనివ్వు" అని తన
తండ్రితో చెప్పింది. [38]"వెళ్లి అలాగే చేయి" అని
చెప్పాడు యెఫ్తా. రెండు నెలల కోసం యెఫ్తా ఆమెను
పంపించివేశాడు. యెఫ్తా కుమార్తె, ఆమె స్నేహితు
రాండ్రు కొండలలో నివసించారు. ఆమెకు పెళ్లి, పిల్లలు
ఉండరు కనుక వారు ఆమె కోసం ఏడ్చారు.
[39]రెండు నెలల అనంతరం, యెఫ్తా కుమార్తె తన
తండ్రి దగ్గరకు తిరిగి వచ్చింది. యెఫ్తా యెహోవాకు
వాగ్దానం చేసిన ప్రకారమే జరిగించాడు. యెఫ్తా కుమా
ర్తెకు ఎవరితోనూ ఎన్నడూ లైంగిక సంబంధాలు లేవు.
కనుక ఇశ్రాయేలులో ఇది ఒక ఆచారం అయ్యింది.
[40]గిలాదు వాడైన యెఫ్తా కుమార్తెను ఇశ్రాయేలు స్త్రీలు
ప్రతి సంవత్సరం జ్ఞాపకం చేసుకుంటారు. యెఫ్తా
కుమార్తె కోసం ఇశ్రాయేలు స్త్రీలు ప్రతి సంవత్సరం
నాలుగు రోజుల పాటు ఏడుస్తారు.

### యెఫ్తా మరియు ఎఫ్రాయిము

12 ఎఫ్రాయిము వంశంలోని మనుష్యులు వారి
సైనికులందరినీ సమావేశ పరిచారు. తరువాత
వారు నది దాటి సఫోను పట్టణం వెళ్లారు. వారు,
"అమ్మోనీయులతో పోరాడేందుకు సహాయంగా నీవు
మమ్మల్ని ఎందుకు పిలువలేదు? నీతో పాటే నీ ఇంటిని
కాల్చివేస్తాము" అని యెఫ్తాతో అన్నారు.
[2]వారికి యెఫ్తా జవాబు చెప్పాడు: "అమ్మోనీ
యులు మాకు చాలా కష్టాలు కలిగించారు. కనుక
నేను, నా ప్రజలు వారి మీద యుద్ధం చేశాము." నేను
మిమ్మల్ని పిలిచాను, కాని మాకు సహాయం చేయ
టానికి మీరు రాలేదు. [3]మీరు మాకు సహాయం చేయరని
నాకు తెలిసింది. కనుక నేను నా ప్రాణాన్ని లెక్కచేయ
లేదు. అమ్మోనీయులతో యుద్ధం చేయటానికి నేను
నది దాటివెళ్లాను. వారిని ఓడించేందుకు యెహోవా
నాకు సహాయం చేశాడు. ఇప్పుడు నాతో పోరాడటానికి
మీరెందుకు ఈ వేళ వచ్చారు?"
[4]అప్పుడు యెఫ్తా గిలాదు మనుష్యులను సమావేశ
పరిచాడు. వారు ఎఫ్రాయిము మనుష్యులతో యుద్ధం
చేసారు. ఎఫ్రాయిము మనుష్యులు గిలాదు వారిని అవ
మానించారు గనుక ఆ మనుష్యులతో వారు పోరాడారు.
"గిలాదు వారైన మీరు ఎఫ్రాయిము మనుష్యులలో
మిగిలిన వారే తప్ప మరేమీ కాదు. మీకు కనీసం
సొంత దేశం కూడా లేదు. మీలో కొందరు ఎఫ్రాయి
ముకు మరికొందరు మనష్షేకు చెందినవారు" అని
వారు అన్నారు. గిలాదు మనుష్యులు ఎఫ్రాయిము
మనుష్యులను ఓడించారు.
[5]ప్రజలు యొర్దాను నదిని దాటే రేవులను గిలాదు
మనుష్యులు పట్టుకొన్నారు. ఆ రేవులు ఎఫ్రాయిము
దేశానికి పోయేదారులు. ఎఫ్రాయిము వారిలో తప్పించు
కున్న వాడు ఎప్పుడైనా నది దగ్గరకు వచ్చి, "నన్ను
దాటనివ్వండి" అని చెబితే గిలాదువారు, "నీవు ఎఫ్రా
యిము వాడవా?" అని అడుగుతారు. "లేదు" అని
వాడు చెబితే [6]"షిబ్బోలెతు అనే మాట పలుకు" అని

వారు అంటారు. ఎఫ్రాయిము మనుష్యులు ఆ మాటను సరిగ్గా పలుకలేరు. వారు ఆ మాటను “సిబ్బోలెతు ” అని పలుకుతారు. కనుక అటువంటి వారిని ఒకడు “సిబ్బోలెతు” అని చెబితే అతడు ఎఫ్రాయిము వాడని గిలాదు వారికి తెలిసిపోతుంది. కనుక ఆ రేవు దగ్గరే వారు చంపేస్తారు. అలాగున వారు నలభై రెండువేల మంది ఎఫ్రాయిము మనుష్యులను చంపివేశారు.

7ఆరు సంవత్సరాలు ఇశ్రాయేలీయులకు యెఫ్తా న్యాయమూర్తిగా ఉన్నాడు. అప్పుడు గిలాదు వాడైన యెఫ్తా చనిపోయాడు. వారు అతని పట్టణమైన గిలాదులో అతనిని పాతి పెట్టారు.

## న్యాయాధిపతి ఇబ్సాను

8యెఫ్తా తర్వాత ఇబ్సాను ఇశ్రాయేలు ప్రజలకు న్యాయాధిపతి అయ్యాడు. ఇబ్సాను బేత్లెహేము నగరానికి చెందినవాడు. 9ఇబ్సానుకి ముప్పై మంది కొడుకులు, ముప్పై మంది కుమార్తెలు ఉన్నారు. తమ బంధువులు కాని వారిని వివాహం చేసుకోవలసిందిగా అతను ముప్పై మంది కుమార్తెలను కోరాడు. తమ బంధువులు కాని ముప్పై మంది స్త్రీలను అతను కనుగొన్నాడు. వారిని అతని కుమారులు వివాహం చేసుకున్నారు. ఇశ్రాయేలు ప్రజలకు ఇబ్సాను ఏడు సంవత్సరాల పాటు న్యాయాధిపతిగా ఉన్నాడు. 10తర్వాత ఇబ్సాను మరణించాడు. అతనిని బేత్లెహేం నగరంలో సమాధి చేశారు.

## న్యాయాధిపతి ఏలోను

11ఇబ్సాను అనంతరం, ఇశ్రాయేలు ప్రజలకు ఏలోను న్యాయాధిపతి అయ్యాడు. ఏలోను జెబూలూను వంశమునుండి వచ్చినవాడు. అతను ఇశ్రాయేలు ప్రజలకు పది సంవత్సరాల పాటు న్యాయాధి పతిగా ఉన్నాడు. 12అప్పుడు జెబులూను వంశంనుండి వచ్చిన ఏలోను చనిపోయాడు. ఆయన ఆయ్యాలోను లోని జెబూలూను పట్టణంలో సమాధి చేయబడ్డాడు.

## న్యాయాధిపతి అబ్దోను

13ఏలోను మరణానంతరం, హిల్లేలు కుమారుడైన అబ్దోను అనే అతను ఇశ్రాయేలు ప్రజలకు న్యాయాధిపతి అయ్యాడు. 14అబ్దోను పిరాతోను అనే నగరానికి చెందినవాడు. అబ్దోనుకు 40 మంది కుమారులు, 30 మంది మనుమలు ఉన్నారు. వారు డెబ్భయి గాడిదలెక్కి తిరిగారు. ఇశ్రాయేలు ప్రజలకు అబ్దోను ఎనిమిదేళ్ల పాటు న్యాయాధిపతిగా ఉన్నాడు. 15ఆ తర్వాత హిల్లేలు కుమారుడైన అబ్దోను మరణించాడు. అతనిని పిరాతోను నగరంలో సమాధి చేశారు. పిరాతోను ఎఫ్రాయిము అనే ప్రదేశంలో ఉంది. ఇది కొండదేశం లోనిది, అక్కడ అమాలేకీయుల ప్రజలు నివసించేవారు.

## సమ్సోను జననం

13 ఇశ్రాయేలు ప్రజలు చెడ్డ పనులు చేయడం మళ్లీ యెహోవా చూశాడు. అందువల్ల ఫిలిష్తీయులు వారిని 40 సంవత్సరాల పాటు పరిపాలించేందుకు యెహోవా అనుమతించాడు.

2జొర్యాకి చెందిన ఒకతను ఉండేవాడు. అతని పేరు మానోహ. అతను దాను వంశానికి చెందినవాడు. మానోహకు ఒక భార్య ఉంది. ఆమె పిల్లలెవరినీ కనలేక పోయింది. 3యెహోవా దూత మానోహ భార్యకి ప్రత్యక్షమయ్యాడు. అతను ఇలా అన్నాడు: “నీవు పిల్లల్ని కనలేకపోయావు. కాని నీవు గర్భవతివవుతావు. ఒక కొడుకుని కంటావు. 4ఏ మద్యంగాని, ఘాటైన పానీయంగాని నీవు తాగవద్దు. అపరిశుభ్రమైన ఆహారం కూడా నీవు తినవద్దు. 5ఎందుకంటే నీవు గర్భవతివై, ఒక కొడుకుని కంటావు. ఒక ప్రత్యేకమైన విధంగా అతను దేవునికి సమర్పించబడతాడు. అతను నాజీరవుతాడు.* అందువల్ల ఎప్పుడూ అతని జుట్టు కత్తిరించకు. అతను జన్మించడానికి పూర్వమే అతను దేవుని ప్రత్యేకమైన వ్యక్తిగా వుంటాడు. అతను ఇశ్రాయేలు ప్రజల్ని ఫిలిష్తీయుల అధికారం నుంచి కాపాడతాడు.”

6తర్వాత ఆమె తన భర్త వద్దకు వెళ్లి అతనితో జరిగిన విషయం చెప్పింది. ఆమె ఇలా చెప్పింది: “దేవుని వద్దనుండి ఒక మనిషి నా వద్దకు వచ్చాడు. అతను దేవదూతగా కనిపించాడు. అతను నన్ను భయపెట్టాడు. ఎక్కడినుంచి అతను వచ్చాడో, ఆ సంగతి నేను కనుక్కోలేదు. అతను తన పేరు చెప్పలేదు. 7కాని నాతో ఇలా అన్నాడు: ‘నీవు గర్భవతివి. నీకొక కుమారుడు కలుగుతాడు. మద్యంగాని, ఏ ఇతర ఘాటైన పానీయంగాని తాగవద్దు. అపరిశుభ్రంగా ఉండే ఆహారమూ తినవద్దు. ఎందుకంటే, ప్రత్యేకమైన విధంగా అతను దేవునికి సమర్పించబడతాడు. ఆ బాలుడు దేవుని ప్రత్యేక వ్యక్తి. పుట్టుకకు మునుపటినుంచి మరణించేంత వరకు అతను విలక్షణమైన* మనిషి.’ ”

8ఆ తర్వాత మానోహ యెహోవాను ప్రార్థించాడు. అతను ఇలా అన్నాడు: “యెహోవా, దేవదూతను మళ్లీ మా వద్దకు పంపవలసిందిగా నిన్ను ప్రార్థిస్తున్నాను. త్వరలోనే బాలుడుగా జన్మించనున్న అతనికి మేము ఏమి చేయాలో అది ఆ దేవదూత మాకు నేర్పాలి”

9దేవుడు మానోహ ప్రార్థన ఆలకించాడు. దేవదూత మళ్లీ ఆ స్త్రీకి ప్రత్యక్షమయ్యాడు. ఆమె ఒక పొలంలో కూర్చునివుంది. ఆమె భర్త మానోహ ఆమె

---

**నాజీరు** దేవునికి ప్రత్యేక వాగ్దానాన్ని చేసినవాడు. నాజీరు వాగ్దాన నియమాలను గురించి సంఖ్యా. 6:21 చూడండి.

**విలక్షణమైన** విశిష్టమైన, ప్రత్యేకమైన.

వద్ద లేడు. [10]అందువల్ల అది చెప్పాలని భర్త వద్దకు
పరుగెత్తి, "ఆ మనిషి తిరిగి వచ్చాడు! మొన్న వచ్చిన
అతను ఇక్కడే వున్నాడు." అని తన భర్తతో చెప్పింది.
[11]మానోహ లేచి తన భార్యను అనుసరించాడు.
అతను ఆ మనిషి వద్దకు రాగానే, "ఇంతకు మునుపు
నా భార్యతో మాటలాడిన వ్యక్తివి నీవేనా" అని అడిగాడు.
"నేనే" అన్నాడు దేవదూత.
[12]అందువల్ల మానోహ, "నీవు చెప్పినట్లు జరుగు
తుందని భావిస్తున్నాను. బాలుడు ఎలాంటి జీవితం
గడుపుతాడో, అతడేమి చేస్తాడో చెప్పు" అని అడిగాడు.
[13]యెహోవా దూత మానోహతో ఇలా చెప్పాడు:
"నేను చెప్పినదంతా నీ భార్య చేయాలి. [14]ద్రాక్షాతీగ
మీద పెరిగే దానిని ఆమె తినకూడదు. ఆమె మద్యము
తాగకూడదు. అపరిశుభ్రమైన ఆహారం తినకూడదు.
ఏమి చేయుమని ఆమెను ఆజ్ఞాపించానో, ఆమె అదంతా
చేయాలి."
[15]అప్పుడు ఆ యెహోవా దూతతో మానోహ
ఇలా చెప్పాడు: "దయచేసి నీవు మాతోపాటు కొంత
సేపు ఉండు. నీవు తినేందుకుగాను ఒక పడుచు మేకను
వండిపెట్టాలని అనుకుంటున్నాము."
[16]యెహోవా దూత మానోహతో ఇలా అన్నాడు:
"నేను వెళ్లకుండా మీరు చేసినా, నేను మీరు పెట్టే
ఆహారం తినను. కాని మీరేదైనా చెయ్యదలుచుకుంటే,
అప్పుడు యెహోవాకు దహనబలిని సమర్పించండి."
(ఆ వ్యక్తి నిజంగా యెహోవా దూత అని మానోహ
అర్థం చేసుకోలేక పోయాడు).
[17]అప్పుడు యెహోవా దూతను, "నీ పేరేమిటి?
నీవు చెప్పినదంతా నిజంగా జరిగినప్పుడు, నిన్ను
గౌరవించాలని మేమనుకుంటున్నాము. అందువల్లనే
నీ పేరు తెలుసుకోదలచాను."
[18]యెహోవా దూత ఇలా చెప్పాడు: "నా పేరు
మీరెందుకు అడుగుతున్నారు? ఇది మీరు నమ్మడానికి
చాలా ఆశ్చర్యకరము"
[19]అప్పుడు మానోహ ఒక బండ మీద ఒక పడుచు
మేకను బలి ఇచ్చాడు. మేకను, ధాన్యమును యెహో
వాకు, మరియు అద్భుతాలు కావించే వ్యక్తికీ సమ
ర్పించాడు.
[20]మానోహ, అతని భార్య జరిగిన వాటిని గమనిస్తూ
వచ్చారు. మధ్యస్థానము నుండి ఆకాశానికి పొగలు లేచి
నప్పుడు, యెహోవా దూత ఆ మంటలలో పరము
నకు వెళ్లిపోయాడు!
ఎప్పుడైతే అది మానోహ, అతని భార్య చూసారో,
నేలకు తాకేలా తమ ముఖాలు వంచి నమస్కరించారు.
[21]ఆ వ్యక్తి నిజంగానే యెహోవా దూత అని చివరికి
మానోహ గ్రహించాడు. ఆ తర్వాత యెహోవాదూత
మళ్లీ మానోహ, మరియు ఆయన భార్య ముందు
ప్రత్యక్షం కాలేదు. [22]మానోహ తన భార్యతో ఇలా
అన్నాడు: "మనం దేవుణ్ణి చూశాము. ఇందువల్ల తప్ప
కుండా మనం మరణిస్తాము!"
[23]కాని అతని భార్య అతనితో, "మనల్ని చంపాలని
దేవుడు భావించడం లేదు. యెహోవా కనక మనల్ని
చంపదలచుకుంటే, మనం సమర్పించిన వండిన వస్తు
వుని, ధాన్యాన్ని ఆయన స్వీకరించి ఉండడు. మనకీ
విషయాలను ఆయన చూపివుండడు. పైగా వీటిని
మనకు చెప్పి ఉండడు." అని చెప్పింది.
[24]తరువాత ఆ స్త్రీకి బాలుడు జన్మించాడు. అతనికి
సమ్సోను అని పేరు పెట్టింది. సమ్సోను పెరిగాడు.
యెహోవా అతనిని ఆశీర్వదించాడు. [25]యెహోవా
ఆత్మ సమ్సోనులో పనిచేయనారంభించింది. అతన
ప్పుడు మహెనుదాను నగరంలో ఉన్నాడు. ఆ నగరం
జోర్యా, ఎష్తాయోలుకు మధ్య ఉంది.

### సమ్సోను వివాహం

14 సమ్సోను తిమ్నాతు నగరానికి వెళ్లాడు. అక్కడ
ఒక ఫిలిష్తీయుల యువతిని అతను చూశాడు.
[2]అతను ఇంటికి వెళ్లిన తర్వాత తల్లిదండ్రులతో ఇలా
అన్నాడు: "తిమ్నాతులో నేనొక ఫిలిష్తీయుల స్త్రీని
చూశాను. మీరామెను తీసుకురావాలి అని నా కోరిక.
నేనామెను పెళ్లి చేసుకుంటాను."
[3]అతని తల్లిదండ్రులు ఇలా సమాధానం చెప్పారు:
"నీవు పెళ్లి చేసుకోవటానికి! ఇశ్రాయేలు ప్రజల మధ్య
తప్పకుండా ఒక స్త్రీ ఉంటుంది. కాని ఫిలిష్తీయుల
మధ్యగల ఒక స్త్రీని నీవు పెళ్లి చేసుకుంటావా? ఆ
ప్రజలు సున్నతి కూడా చేసుకోలేదు." కాని సమ్సోను
ఇలా అన్నాడు: "ఆ స్త్రీని నా కోసం తీసుకురండి
ఆమె నాకు కావాలి." [4](యెహోవా ఇది జరగాలని
ఆశించినట్లు సమ్సోను తల్లిదండ్రులకు తెలియదు.
ఫిలిష్తీయులకు విరుద్ధంగా ఏదో ఒకటి చేయటానికి
యెహోవా ఒక అవకాశం కోసం చూడసాగాడు. ఫిలిష్తీ
యులు అప్పట్లో ఇశ్రాయేలు ప్రజల మీద ఆధిపత్యం
చలాయించే వారు.)
[5]సమ్సోను తన తల్లిదండ్రుల్ని వెంట బెట్టుకుని
తిమ్నాతు నగరానికి వెళ్లాడు. నగరానికి దగ్గరగా ఉన్న
ద్రాక్షతోటలదాకా వారు వెళ్లారు. అప్పుడు ఒక పడుచు
సింహం ఉన్నట్టుండి గర్జించింది. అది సమ్సోను మీదికి
దుమికింది. [6]అప్పుడు యెహోవా ఆత్మ సమ్సోనుని
బలపరచగా, గొప్ప శక్తితో, వట్టి చేతులతోనే అతను
సింహాన్ని చీల్చివేశాడు. అది అతనికి సులభంగా
తోచింది. ఒక పడుచు మేకను చీల్చునంత సులభంగా
తోచిందాపని. కాని అతనేమి చేశాడో, ఆ సంగతి తల్లికి
గాని తండ్రికి గాని తెలుపలేదు. [7]అందువల్ల సమ్సోను
నగరానికి వెళ్లి, ఆ ఫిలిష్తీయుల స్త్రీతో మాట్లా డాడు.
ఆమె అతనిని సంతోషపెట్టింది. [8]చాలారోజుల
తర్వాత, సమ్సోను ఫిలిష్తీయుల స్త్రీని వివాహమా

డేందుకు తిరిగి వచ్చాడు. త్రోవలో చచ్చిపోయిన ఆ
సింహాన్ని చూడటానికి వెళ్లాడు. మృత సింహం శరీరం
మీద తేనెటీగల గుంపు చూశాడు. అవి కొంచెం తేనె
తయారు చేశాయి. 9తన చేతులతో సమ్సోను ఆ
తేనెను తీసుకున్నాడు. ఆ తేనె తింటూ అతను నడి
చాడు. తల్లిదండ్రుల వద్దకు వచ్చాడు. ఆ తేనెకొంచెం
వారికి ఇచ్చాడు. వారు కూడా తిన్నారు. కాని మృత
సింహం శరీరంనుంచి తాను తేనెను తెచ్చినట్లు
సమ్సోను తల్లిదండ్రులకు చెప్పలేదు.
10సమ్సోను తండ్రి ఆ ఫిలిష్తీయుల స్త్రీని చూసేం
దుకు వెళ్లాడు. పెళ్లికొడుకు విందు ఇవ్వడం ఆ రోజు
లలో ఆచారంగా ఉండేది. అందువల్ల సమ్సోను ఒక
విందు ఇచ్చాడు. 11ఫిలిష్తీయుల ప్రజలు అతను విందు
యివ్వడం చూసి అతనికి తోడుగా ముప్పై మంది
మనుషుల్ని పంపారు.
12అప్పుడు సమ్సోను ముప్పై మంది మనుష్యు
లతో ఇలా అన్నాడు: "నేను మీకో చిక్కు ప్రశ్న
చెపుతాను. ఈ విందు ఏడు రోజులపాటు సాగుతుంది.
ఈలోగా మీరు సమాధానం వెతకాలి. ఈలోగా కనుక
మీరు చిక్కు ప్రశ్నకు సమాధానం చెప్పగలిగితే, నేను
మీకు ముప్పై నార వస్త్రాలు, ముప్పై మార్పు గుడ్డలు
ఇస్తాను. 13కానీ మీకు సమాధానం దొరక్కపోతే
అప్పుడు మీరు ముప్పై నార వస్త్రాలు, ముప్పై మార్పు
గుడ్డలను ఇవ్వాలి. అప్పుడు ఆ ముప్పై మంది
మనుష్యులు ఇలా అన్నారు. "నీ చిక్కు ప్రశ్న ఏమిటో
మాకు చెప్పు. అది మేము వినదలచాము."
14సమ్సోను ఈ చిక్కు ప్రశ్న వాళ్లకి చెప్పాడు:
బలమైన దానిలోనుండి తీపి వచ్చింది. తినుదానిలో
నుండి తిండి వచ్చింది.

మూడు రోజుల పాటు ఆ ముప్పైమంది మను
ష్యులు సమాధానం కోసం ప్రయత్నించారు. కాని
కనుగొన లేకపోయారు.
15నాలుగవ రోజున,* ఆ మనుష్యులు సమ్సోను
భార్య వద్దకు వచ్చారు. వారన్నారు: "మమ్మల్ని పేద
వారుగా చేసేందుకు ఇక్కడికి ఆహ్వానించావా? ఆ
చిక్కు ప్రశ్నకు సమాధానం చెప్పవలసిందిగా నీవు నీ
భర్తను ప్రేరేపించాలి. మా కోసం కనుక నీవు సమాధానం
రప్పించకపోతే మేము నిన్ను కాల్చివేస్తాము. అలాగే
మీ తండ్రిగారి వద్ద ఉన్న మనుష్యులందరినీ చంపి
వేస్తాము."
16అందువల్ల సమ్సోను భార్య అతనిని సమీపించి
విలపించింది. ఆమె అన్నది: "నీవు నన్ను ద్వేషిస్తు
న్నావు. నీవు నిజంగా నన్ను ప్రేమించడంలేదు. నీవు
మా మనుష్యులకో చిక్కు ప్రశ్న ఇచ్చావు. నీవు నాకైనా
సమాధానం చెప్పవు." అప్పుడు సమ్సోను ఇలా
అన్నాడు; "నేను నా తల్లిదండ్రులకైనా చెప్పలేదు.
నేను నీకు ఎందుకు చెప్పాలి?"
17విందులోని కడమ యేడు రోజులూ సమ్సోను
భార్య ఏడుస్తూ కూర్చుంది. చివరికతను సమాధానం
చెప్పాడు. ఏడవ రోజున ఆ చిక్కు ప్రశ్నకు సమాధానం
తెలియజేశాడు. ఆమె తనను వేధించుకు తినడంవల్ల
ఆమెకు సమాధానం చెప్పాడు. తర్వాత ఆమె తన
మనుష్యుల వద్దకు వెళ్లి, చిక్కు ప్రశ్నకు సమాధానం
చెప్పింది. 18ఏడవ రోజున సూర్యుడు అస్తమించేలోగా
ఫిలిష్తీయుల మనుష్యులకు సమాధానం లభించింది.
వారు సమ్సోను వద్దకు వచ్చి, ఇలా అన్నారు:

"తేనె కంటె మధురమైనదేది? సింహంకంటె
బలంకలది ఏది?" తర్వాత సమ్సోను వాళ్లతో
ఇలా అన్నాడు: "మీరు కనుక నా ఆవుతోనే
దున్నక పోతే మీరు నా చిక్కు ప్రశ్నను
పరిష్కరించి ఉండలేరు."

19సమ్సోను ఉగ్రుడయ్యాడు. యెహోవా ఆత్మ
గొప్ప శక్తితో సమ్సోనుని నింపింది. అతను అష్కెలోను
నగరానికి వెళ్లాడు. ఆ నగరంలో అతను ముప్పైమంది
ఫిలిష్తీయులను చంపివేశాడు. తర్వాత వారి మృత
శరీరాల మీది నుంచి అన్ని వస్త్రాలు, సొమ్ములు తీసు
కున్నాడు. అతను ఆ వస్త్రాలను తిరిగి తీసుకు వచ్చి,
తన చిక్కు ప్రశ్నకు సమాధానం చెప్పిన ఆ ముప్పై
మంది మనుష్యులకు ఇచ్చివేశాడు. తర్వాత అతను
తన తండ్రి ఇంటికి వెళ్లాడు.
20సమ్సోను తన భార్యను తీసుకుపోలేదు. ఆమె
తండ్రి ఇష్టము చొప్పున అటు తరువాత ఆమెను
సమ్సోను ప్రాణ స్నేహితుడు ఒకడు భార్యగా
అంగీకరించెను.

### సమ్సోను ఫిలిష్తీయులకు కష్టాలు కలిగించుట

15 గోధుమ పంట కోతల సమయంలో, సమ్సోను
తన భార్యను చూడడానికి వెళ్లాడు. ఆమెకు
కానుకగా ఒక పడుచు మేకను తీసుకు వెళ్లాడు. అతను
ఇలా అన్నాడు; "నేను నా భార్య గదికి వెడుతున్నాను."
2కాని ఆమె తండ్రి సమ్సోనుని లోపలికి వెళ్ల
నీయలేదు. ఆమె తండ్రి సమ్సోనుతో ఇలా అన్నాడు:
"ఆమెను నీవు ద్వేషించినట్లు భావించాను. అందువల్లనే
వివాహ మునకు వచ్చిన తోడి పెండ్లికుమారుడ్ని వివా
హము చేసుకోమన్నాను. ఆమె చిన్న చెల్లెలు చాలా
సౌందర్యవతి. ఆ చిన్న చెల్లెలిని తీసుకువెళ్లు"
3కాని సమ్సోను అతనితో ఇలా అన్నాడు; "మీ
ఫిలిష్తీయులను బాధించేందుకు తగిన కారణం ఇప్పుడు
నాకు కనిపించింది. ఇప్పుడు నన్నెవ్వరూ నిందించరు."

---

**నాలుగవ రోజు** ఇది గ్రీకు అనువాదం నుంచి, హీబ్రూ
ప్రతుల్లో 'ఏడవ రోజు' అని రాయబడింది.

[4]అందువల్ల సమ్సోను బయటికి వెళ్లి మూడు వందల నక్కల్ని పట్టుకున్నాడు. ఒకేసారి రెండేసి నక్కల్ని తీసుకుని వాటి తోకల్ని జతలు జతలుగా కట్టివేశాడు. ప్రతి రెండు నక్కల తోకలకు మధ్య ఒక దివిటీ కట్టి వేశాడు. [5]తరువాత నక్కల తోకల మధ్య ఉన్న దివిటీలు వెలిగించాడు. ఆ తర్వాత ఫిలిష్తీయుల ధాన్యపు రాసుల గుండా నక్కల్ని పరుగెత్త నిచ్చాడు. ఆ విధంగా, అతను వారి పొలాలలో పెరిగిన మొక్కల్నీ, కోసిపెట్టిన ధాన్యపు రాసుల్నీ కాల్చివేశాడు. అతను వాళ్ల ద్రాక్ష తోటల్ని, వాళ్ల ఒలీవ చెట్లని కూడా కాల్చివేశాడు.

[6]"ఈ పని ఎవరు చేశారు? అని ఫిలిష్తీయులు అడిగారు. ఎవరో ఇలా చెప్పారు: "తిమ్నాతుకు చెందిన ఆ మనిషియొక్క అల్లుడైన సమ్సోను ఈ పనిచేశాడు. అతను ఈ విధంగా ఎందుకు చేశాడంటే, అతని మామ గారు సమ్సోను భార్యని పెళ్లిలోని అతని స్నేహితునికి ఇచ్చివేశాడు." అందువల్ల సమ్సోను భార్యనీ, ఆమె తండ్రినీ ఫిలిష్తీయులు కాల్చి వేశారు.

[7]అప్పుడు ఫిలిష్తీయులను ఉద్దేశించి సమ్సోను ఇలా అన్నాడు; "మీరు నాకు ఈ విధంగా కీడు చేశారు. అందువల్ల మీకు ఇప్పుడు నేను కీడు చేస్తాను. అప్పుడు నేను మీమీద పగతీర్చుకోవడం మానేస్తాను." [8]తర్వాత సమ్సోను ఫిలిష్తీయుల మీద దాడిచేశాడు. చాలా మందిని చంపివేశాడు. తర్వాత అతను వెళ్లి ఒక గుహలో నివ సించెను. ఏతాము బండ అనే ప్రదేశంలో ఆ గుహ ఉన్నది. [9]అప్పుడు ఫిలిష్తీయులు యూదా ప్రాంతానికి తరలిపోయారు. లేహీ అనే చోట వారు నిలిచారు. వారి సైనికులు అక్కడ విడిదిచేసి యుద్ధానికి సద్ధ పడ్డారు.

[10]యూదా వంశానికి చెందిన మనుష్యులు వారిని ఇలా ప్రశ్నించారు: "ఫిలిష్తీయులైన మీరు మాతో యుద్ధం చేసేందుకు ఎందుకు ఇక్కడికి వచ్చారు?"

అందుకు వారు ఇలా అన్నారు: "మేము సమ్సో నును పట్టుకోడానికి వచ్చాము. అతనిని మేము మా బందీగా చేసుకోవడానికి వచ్చాము. అతను మా ప్రజలకి చేసిన పనులకు బదులుగా అతనిని శిక్షిస్తాము."

[11]అప్పుడు యూదా వంశస్థులైన మూడువేల మంది మనుష్యులు సమ్సోనును పట్టుకొనుటకు ఏతాము బండకి దగ్గరగా వున్న ఆ గుహ వద్దకు వెళ్లి. అతనితో ఇలా అన్నారు: "నీవు మాకేమి చేశావు? ఫిలిష్తీయులు మమ్మల్ని పరిపాలిస్తున్నారని నీకు తెలియదా?"

"వారు నాకు చేసిన కీడుకు బదులుగా వారిని నేను శిక్షించాను." అని సమ్సోను సమాధానం చెప్పాడు.

[12]అప్పుడు వారు సమ్సోనుతో ఇలా అన్నారు: "మేము నిన్ను బంధించడానికి వచ్చాము. మేము నిన్ను ఫిలిష్తీయులకు అప్పజెప్పుతాము."యూదా నుండి వచ్చిన మనుష్యులతో సమ్సోను ఇలా అన్నాడు: "మీరు నాకు ఏమీ అపకారం చేయమని నాకు మాట ఇవ్వాలి."

[13]యూదా నుండి వచ్చిన మనుష్యులు ఇలా అన్నారు: "అందుకు మేము సమ్మతిస్తున్నాము. మేము నిన్ను బంధించి, ఫిలిష్తీయులకు అప్పజెప్పుతాము. మేము నిన్ను చంపమని మాట ఇస్తున్నాము." అప్పుడు వారు రెండు కొత్త తాళ్లతో సమ్సోనును బంధించారు. ఆ ప్రాంతంలోని గుహనుంచి అతనిని తీసుకువెళ్లారు.

[14]లేహీ అనే చోటికి సమ్సోను రాగానే, ఫిలిష్తీయులు అతనిని కలుసుకోడానికి అక్కడికి వచ్చారు. సంతో షంతో వారు కేకలు వేశారు. అప్పుడు యెహోవా ఆత్మ గొప్ప శక్తితో సమ్సోనును నింపగా, సమ్సోను తాళ్లు తెంపుకున్నాడు. కాలిపోయిన దారంవలె ఆ తాళ్లు బలహీనముగా కనిపించాయి. కరిగిపోయినట్లుగా ఆ తాళ్లు సడలిపోయాయి.

[15]సమ్సోను చచ్చిపోయిన ఒక గాడిద దవడ ఎముకను చూశాడు. అతను ఆ దవడ ఎముకను తీసుకున్నాడు. దానితో వేయి మంది ఫిలిష్తీయుల్ని చంపివేశాడు.

16 తర్వాత సమ్సోను అన్నాడు; గాడిద దవడ
ఎముకతో వెయ్యి మందిని చంపాను! గాడిద
దవడ ఎముకతో వారిని ఎత్తైన కుప్పగా
పేర్చాను!

[17]సమ్సోను ఈలాగు చెప్పిన తర్వాత, ఆ దవడ ఎముకను అతడు కిందికి విసరివేశాడు. అందువల్ల ఆ ప్రదేశానికి రామత్లేహీ* అనే పేరు వచ్చింది.

[18]సమ్సోనుకు బాగా దాహం వేసింది. అందువల్ల అతను యెహోవాను ఉద్దేశించి కేకపెట్టాడు. అతను అన్నాడు; "నేను నీ భక్తుడను. నీవు నాకు మహా విజయం సమకూర్చావు. ఇప్పుడు దప్పిక బాధతో నన్ను మరణం పాలుచేయవద్దు. సున్నతి కూడా చేసుకోని మనుష్యులకు నన్ను పట్టుబడకుండా చెయ్యి"

[19]లేహీలోని నేలలో ఒక రంధ్రం ఉంది. ఆ రంధ్రం బద్దలయ్యేలా దేవుడు చేసెను. నీళ్లు వెలికి వచ్చాయి. ఆ నీటిని సమ్సోను తాగి, హాయిపొందాడు. అతను మళ్లీ బలవంతుడయ్యాడు. అందువల్ల అతను ఆ నీటి బుగ్గకి ఎన్ హక్కోరె* అని పేరు పెట్టాడు. నేటికీ లేహీ నగరంలో అది ఉంది.

[20]ఈ రీతిగా ఇశ్రాయేలు ప్రజలకు సమ్సోను న్యాయాధిపతిగా ఇరవై సంవత్సరాలపాటు వ్యవహరించాడు. ఇది ఫిలిష్తీయులు నివసించిన కాలంలో జరిగింది.

---

**రామత్లేహీ** దవడ కొండ అని దీని అర్థం.

**ఎన్ హక్కోరె** అనగా పిలిచిన వాని ఊట అని అర్థం.

### సమ్సోను గాజా నగరానికి వెళ్లటం

16 ఒకనాడు సమ్సోను గాజా నగరానికి వెళ్లాడు.
అక్కడ అతనొక వ్యభిచారిణిని చూశాడు. ఆ
రాత్రి ఆమెతో గడిపేందుకు అతను అక్కడికి వెళ్లాడు.
2ఎవరో ఒకతను గాజా పౌరులతో ఇలా చెప్పాడు:
“సమ్సోను ఇక్కడికి వచ్చాడు.” సమ్సోనును చంపాలని
వారనుకున్నారు. అందువల్ల వారు నగరాన్ని చుట్టు
ముట్టారు. వారు నగర ద్వారం వద్ద దాగివున్నారు. ఆ
రాత్రి అంతా సమ్సోను కోసం చాలా వేచివున్నారు.
నిశ్శబ్దంగా వారు ఒకరితో ఒకరు, “ప్రొద్దున పొడవగానే,
మనం సమ్సోనును చంపుదాము” అని చెప్పుకున్నారు.
3కాని సమ్సోను ఆ వ్యభిచారిణితో అర్ధరాత్రి వరకే
ఉన్నాడు. అర్ధరాత్రి వేళ సమ్సోను లేచాడు. నగర
ద్వారం తలుపుల్ని అతను లాగివేశాడు. గోడనుండి
వాటిని సడలింపజేశాడు. సమ్సోను తలుపులను కిందికి
లాగివేశాడు. రెండు స్తంభాలను, తలుపుల్ని మూసివేసి
ఉంచిన అడ్డగడియలను లాగివేశాడు. సమ్సోను వాటిని
తన భుజాల మీద వేసుకుని, హెబ్రోను నగరానికి
సమీపాన ఉన్న కొండ మీదికి మోసుకుని పోయాడు.

### సమ్సోను మరియు దెలీలా

4తర్వాత సమ్సోను దెలీలా అనే స్త్రీని ప్రేమించాడు.
ఆమె శోరేకు అనే లోయకు చెందింది. 5ఫిలిష్తీయుల
పరిపాలకులు దెలీలా వద్దకు వెళ్లారు. వారు అన్నారు;
“సమ్సోను అంత బలవంతుడు కావడానికి గల కారణ
మేమిటో తెలుసుకోదలచాము. ఏదో ఒక ఉపాయం
పన్ని ఆ రహస్యాన్ని అతని నుంచి రప్పించు. అప్పుడు
అతనిని ఎలా పట్టుకొని బంధించాలో తెలుసు
కుంటాము. ఆ తర్వాత అతన్ని అదుపులో ఉంచ
గలము. నీవు కనుక ఇది చేయగలిగితే, నీకు మాలో
ఒక్కొక్కరు ఇరవై ఎనిమిది పౌండ్లు వెండి యిస్తాము.”
6అప్పుడు దెలీలా సమ్సోనుతో, “నీవెందుకు అంత
బలవంతుడవై యున్నావో చెప్పు. ఎవరైనా నిన్ను
బంధించి నిస్సహాయుణ్ణి చేయగలుగుతారా, చెప్పు?”
అని అడిగింది. 7సమ్సోను బదులు చెప్పాడు, “ఎవరైనా
నన్ను ఇంకా తడి ఆరని కొత్త వింటినారులు ఏడింటితో
బంధించాలి. అలా ఎవరైనా చేయగలిగితే, అప్పుడు
ఇతర మనిషిలాగ బలహీనుణ్ణి అవుతాను.”
8అప్పుడు ఫిలిష్తీయుల పాలకులు కొత్త వింటి
నారులు ఏడు దెలీలా వద్దకు తీసుకువచ్చారు. అవి
ఇంకా తడియారలేదు. ఆ వింటి నారులతో దెలీలా
సమ్సోనును బంధించింది.
9కొంతమంది మగవాళ్లు పక్క గదిలో దాగి
ఉన్నారు. దెలీలా సమ్సోనుతో ఇలా చెప్పింది;
“సమ్సోనూ! ఫిలిష్తీయులు నిన్ను ఇప్పుడు పట్టుకోను
న్నారు” అంది. కాని సమ్సోను సులభంగా ఆ వింటి
నారులు తెంచుకున్నాడు. అగ్నిలోనుండి పోయిన
దారంలా, బూడిదలా అవి తెగిపోయాయి. అందువల్ల
ఫిలిష్తీయులు సమ్సోను బలానికిగల రహస్యాన్ని
కనుగొనలేక పోయారు.
10అప్పుడు దెలీలా సమ్సోనుతో అన్నది: “నీవు
నాతో అబద్ధం చెప్పావు. దయచేసి నాకు నిజం
చెప్పండి. నిన్ను ఎవరైనా ఎలా బంధించగలరు?”
11సమ్సోను ఇలా అన్నాడు; “ఎవరైనా నన్ను
కొత్త తాళ్లతో కట్టివేయాలి. అంతకు పూర్వం
వాడనటు వంటి కొత్త తాళ్లతో నన్ను కట్టివేయాలి.
ఎవరైనా అలా చేయగలిగితే, నేను ఇతరులవలె
బలహీనుణ్ణి అవుతాను.”
12అందువల్ల దెలీలా కొత్త తాళ్లు తీసుకుంది.
వాటితో సమ్సోనును కట్టివేసింది. పక్క గదిలో
కొందరు మనుష్యులు దాగి ఉన్నారు. తర్వాత దెలీలా
“సమ్సోనూ, ఫిలిష్తీయులు ఇప్పుడు నిన్ను పట్టు
కుంటారు.” అన్నది. కాని అతను ఆ తాళ్లు సునాయా
సంగా తెంచుకున్నాడు. దారాలను తెంపినంత సుల
భంగా వాటిని తెంచివేశాడు.
13తర్వాత దెలీలా, “మళ్లీ నువ్వు అబద్ధం చెప్పావు.
నన్ను అవివేకిగా చేశావు. ఇప్పుడైనా చెప్పు, ఎవరైనా
నిన్ను ఎలా బంధించగలరో.” అని సమ్సోనుతో
చెప్పింది.
“నా తలమీది వెంట్రుకలతో ఏడుజడలను అల్లి
గలిగి, వాటిని ఒక మేకుతో బిగించినట్లయితే అప్పుడు
ఇతర మనుష్యుల్లా నేను బలహీనుణ్ని అవుతాను” అని
సమ్సోను చెప్పాడు.తర్వాత సమ్సోను నిద్రపోయాడు.
అప్పుడు అతని తలమీది వెంట్రుకలను అల్లింది.
14తర్వాత దెలీలా గుడారం మేకుతో మగ్గాన్ని నేలకు
బిగించింది, అతనిని చూసి ఇలా అన్నది. “సమ్సోనూ,
ఫిలిష్తీయులిప్పుడు నిన్ను పట్టుకుంటారు.” సమ్సోను
ఆ గుడారం మేకుని, మగ్గాన్ని లాగివేశాడు.
15అప్పుడు దెలీలా సమ్సోనుతో అన్నది; ‘నేను
నిన్ను ప్రేమిస్తున్నాను.’ అని నీవు ఎలా చెప్పగలవు?
నా మీద నీకు నమ్మకం కూడా లేదు. నీవు మూడవ
సారిగా నన్ను అవివేకిని చేశావు. నీ మహా బలానికిగల
రహస్యాన్ని చెప్పనే లేదు.” 16ఇలా ప్రతిరోజూ ఆమె
సమ్సోనును వేధించుకు తినసాగింది. ఆమె అలా
వేధించుకు తినడం చూసి అతను విసిగిపోయాడు.
మరణం సంభవించేలా అనిపించింది.
17చివరికి సమ్సోను దెలీలాతో అన్నీ చెప్పాడు. అతను
ఇలా అన్నాడు; “నేను నా జుట్టుని గొరిగించుకొనలేదు.
నేను పుట్టుటకు మునుపే, నన్ను దేవునికి అర్పించారు.
ఎవరైనా నా తలను గొరిగినట్లయితే, అప్పుడు నా
బలాన్ని కోల్పోతాను. ఇతర మనుష్యుల్లా నేనప్పుడు
బలహీనుణ్ని అవుతాను.” 18సమ్సోను తన రహస్యాన్ని
చెప్పినట్లుగా దెలీలా గ్రహించింది. ఫిలిష్తీయుల పరి
పాలకులకు ఒక సందేశం పంపింది. ఆమె ఇలా

చెప్పింది; "మళ్లీ రండి. సమ్సోను నాతో అన్నీ
చెప్పాడు." అందువల్ల ఫిలిష్తీయుల పరిపాలకులు
దెలీలా వద్దకు మళ్లీ వచ్చారు. తమతో పాటు వాళ్లు
మాటయిచ్చిన ప్రకారం డబ్బు కూడా తీసుకు
వచ్చారు.
[19]సమ్సోను తన తొడమీద పడుకుని వున్నప్పుడు
దెలీలా అతనిని నిద్ర పుచ్చింది. అప్పుడొక వ్యక్తిని
లోనికి పిలిచి, సమ్సోను తలవెంట్రుకలను గొరిగి వేయ
మనింది. ఈ విధంగా సమ్సోనుని ఆమె బలహీనపరి
చింది. సమ్సోను బలహీనుడయ్యాడు. [20]అప్పుడు
అతణ్ణి లేవమని చెప్పి, "సమ్సోనూ, ఫిలిష్తీయులిప్పుడు
నిన్ను పట్టుకోనున్నారు" అని ఆమె చెప్పింది. అతను
మేల్కొన్నాడు. ఆలోచన చేశాడు, "నేను పూర్వం
చేసినట్లుగా చేసి తప్పించుకుంటాను. స్వతంత్రుణ్ణి
అవుతాను." కాని యెహోవా అతనిని విడనాడి వెళ్లి
నట్లు సమ్సోను గ్రహించలేదు.
[21]ఫిలిష్తీయులు సమ్సోనును పట్టుకున్నారు.
వారతని కళ్లు పెరికి వేశారు. గాజా నగరానికి తీసుకుని
వెళ్లారు. అతను పారిపోకుండా ఉండేందుకుగాను, సంకె
ళ్లతో బంధించారు. వారు సమ్సోనును చెరసాలలో
ఉంచారు. అతని చేత ధాన్యం విసిరించారు. [29]కాని
సమ్సోను వెంట్రుకలు మళ్లీ మొలవసాగాయి. [23]ఫిలిష్తీ
యుల పాలకులు ఒకటిగా చేరి పండగ చేసుకోవా
లనుకున్నారు. తమ దేవుడైన దాగోనుకు* పెద్ద బలి
కూడా ఇవ్వాలనుకున్నారు. "మన శత్రువైన సమ్సో
నును ఓడించేందుకు మన దేవుడు మనకు సహాయం
చేశాడు." అని అనుకున్నారు.
[24]సమ్సోనుని చూడగానే వారు తమ దేవుణ్ణి ప్రశం
సించారు. వారు ఇలా అన్నారు:

"ఈ మనిషి మనవారిని నాశనం చేశాడు ఈ
మనిషి మనవారిలో పలువురిని చంపాడు,
కాని మన దేవుడు మన శత్రువుని వశం చేసు
కునేందుకు సహాయం చేశాడు!"

[25]ఉత్సవ సమయంలో ప్రజలు చాలా సంతోషంగా
ఉన్నారు. అప్పుడు వారిలా అన్నారు: "సమ్సోనును
వెలికి తీసుకురండి. అతనిని చూసి మేము పరిహాసం
చెయ్యాలి." కనుక చెరసాల నుంచి సమ్సోనును బయ
టికి తీసుకువచ్చారు. అతనిని పరిహసించారు. దేవుడైన
దాగోను గుడిలో స్తంభాల మధ్య సమ్సోనును నిల
బెట్టారు. [26]ఒక సేవకుడు సమ్సోను చెయ్యి పట్టు
కున్నాడు. అతనితో సమ్సోను, "ఈ ఆలయానికి
ఆధారంగా వున్న స్తంభాల మధ్య నన్ను ఉంచు వాటిని
ఆనుకుని వుంటాను" అన్నాడు.
[27]ఆ ఆలయం స్త్రీ పురుషులతో కిటకిటలాడు
తున్నది. ఫిలిష్తీయుల పాలకులందరూ అక్కడికి
చేరారు. ఆలయ కప్పుమీద సుమారు మూడువేల
మంది స్త్రీ పురుషులు ఉన్నారు. వారందరూ సమ్సో
నును చూసి ఎగతాళి చేస్తున్నారు. [28]అప్పుడు
యెహోవాను సమ్సోను స్తుతించాడు. "సర్వశక్తిమంతు
డవైన యెహోవా, నన్ను మరచిపోవద్దు. దేవుడా,
మరొకసారి నాకు బలం ప్రసాదించు. నా రెండు కళ్లనీ
చీల్చివేసిన ఈ ఫిలిష్తీయులను శిక్షించేందుకు నాకు
శక్తి ఇయ్యి." అని ప్రార్థించాడు. [29]అప్పుడు ఆలయం
మధ్య వున్న రెండు స్తంభాలను సమ్సోను పట్టు
కున్నాడు. ఆ రెండు స్తంభాలు ఆలయాన్ని భరిస్తు
న్నవి. ఆ రెండు స్తంభాలను అతను కౌగిలించు
కున్నాడు. ఒక స్తంభం అతని కుడిచేయి వైపున
వున్నది. మరొకటి ఎడమ చేతివైపున వున్నది.
[30]సమ్సోను ఇలాఅన్నాడు: "ఈ ఫిలిష్తీయులతో
పాటు నేను మరణిస్తాను" అని, తర్వాత తన శక్తి
కొద్దీ వాటిని తోశాడు. ఆలయంలోపల వున్న పరిపాల
కులు మరియు మనుష్యుల మీద ఆలయం పడి
పోయింది. ఈ విధంగా సమ్సోను ఇంకా మరికొందరు
ఫిలిష్తీయులను చంపివేశాడు. అతను జీవించిన నాటి
కంటె మరణ సమయంలోనే, చాలా మందిని చంపి
వేశాడు.

[31]సమ్సోను యొక్క సోదరులు, అతని కుటుంబం
లోని వారందరూ అతని దేహం తీసుకురావడానికి
వెళ్లారు. అతనిని తీసుకు వచ్చి, తండ్రి సమాధిలో
పాతి పెట్టారు. ఆ సమాధి జొర్యా, ఏష్తాయోలు నగరాల
మధ్య ఉన్నది. ఇశ్రాయేలు ప్రజలకు సమ్సోను ఇరవై
సంవత్సరాలపాటు న్యాయాధిపతిగా వ్యవహరించాడు.

## మీకా విగ్రహాలు

17 పర్వత దేశమైన ఎఫ్రాయిములో మీకా అనే
ఒక వ్యక్తి వుండేవాడు. [2]మీకా తన తల్లితో,
"నీ వద్దనున్న ఇరవై ఎనిమిది పౌండ్ల వెండి దొంగి
లించిన వ్యక్తి ఎవరో నీకు తెలియునా! ఆ విషయమై
ఒక శాపం ఉన్నట్లు నీవు చెప్పగా విన్నాను. సరే,
వెండి నా వద్ద ఉన్నది. అది నేను తీసుకున్నాను"
అన్నాడు.
"కుమారుడా, నిన్ను యెహోవా ఆశీర్వదించు
గాక" అన్నది. [3]మీకా తన తల్లికి ఇరవై ఎనిమిది పౌండ్ల
వెండిని తిరిగి ఇచ్చి వేశాడు. అప్పుడామె అంది, "నేనీ
వెండిని యెహోవాకు విశేష కానుకగా సమర్పిస్తాను.
నేను దీనిని నా కుమారునికి ఇస్తాను. అతను ఒక
విగ్రహం తయారు చేసిదానిని వెండితో కప్పాలి. అందు
వల్ల, నా కుమారుడా, ఈ వెండిని తిరిగి నీకే ఇస్తాను."

**దాగోను** మంచి ధాన్యపు పంటనిస్తుందని కనానీ ప్రజలు
ఈ బూటకపు దేవతను ఆరాధించారు. ఇది వారికి అతి
ముఖ్యమైన దేవత అయ్యుండవచ్చు.

4కాని మీకా ఆ వెండిని తిరిగి తల్లికే ఇచ్చివేశాడు.
ఆమె దాదాపు అయిదు పౌండ్ల వెండిని మాత్రమే
తీసుకుని, ఆ వెండిని కంసాలివానికి ఇచ్చింది. వెండి
పనిముట్లు తయారు చేసే వ్యక్తి ఒక విగ్రహం తయారు
చేసి దానిని వెండితో కప్పాడు. ఆ విగ్రహం మీకా
ఇంట్లో ఉంచబడింది. 5మీకాకు విగ్రహాలు ఆరాధించే
ఒక ఆలయం వుండేది. అతను ఒక ఏఫోదు, కొన్ని
విగ్రహాలు తయారు చేశాడు. తర్వాత తన కుమారు
లలో ఒకనిని యాజకునిగా ఎంపిక చేశాడు. 6(ఆ
రోజులలో ఇశ్రాయేలు ప్రజలకు రాజు లేడు. అందువల్ల
ప్రతి వ్యక్తీ తనకేది సరి అని అనిపిస్తే, దానినే చేస్తూండే
వాడు). 7లేవీ వంశానికి చెందిన ఒక యువకుడు
ఉన్నాడు. అతను యూదాలోని బేత్లెహేముకి చెందిన
వాడు. యూదా వంశస్తులతో అతను నివసిస్తూండే
వాడు. 8మరొక నివాసం కోసం అతను అన్వేషిస్తూ,
ప్రయాణం చేస్తూవుండగా, అతను మీకా ఇంటికి
వచ్చాడు. ఎఫ్రాయిము పర్వత దేశంలో మీకా ఇల్లు
ఉంది.

9"నీవు ఎక్కడినుంచి వచ్చావు?" అని మీకా అతనిని
అడిగాడు. ఆ యువకుడు ఇలా సమాధానం ఇచ్చాడు:
"నేను లేవీ వంశానికి చెందినవాణ్ణి. యూదా లోని
బేత్లెహేమునుంచి వస్తున్నాను. నివసించేందుకు గాను
నేనొక చోటు చూస్తున్నాను."

10అప్పుడు మీకా అతనితో అన్నాడు: "నీవు నాతో
పాటు వుండు. నీవు నాకు తండ్రిగా, నా యాజకునిగా
ఉండు. ప్రతి సంవత్సరం నీకు 4 ఔన్సుల వెండి
ఇస్తాను. నీకు అన్నవస్త్రాలు కూడా ఇస్తాను." మీకా
చెప్పినట్లుగా లేవీ వంశపు వాడు చేసాడు. 11మీకాతో
పాటు ఉండేందుకు యువకుడైన లేవీ వంశపువాడు
సమ్మతించాడు. ఆ యువకుడు మీకా యొక్క సొంత
కొడుకులలో ఒకనిలాగ అయ్యాడు. 12మీకా అతనిని
తన యాజకునిగా ఎంపికచేశాడు. అందువల్ల ఆ యువ
కుడు యాజకుడయ్యాడు. మీకా ఇంట్లో నివసించ
సాగాడు. 13మీకా ఇలా అన్నాడు, "లేవీ వంశపువాడొ
కడు నా యాజకునిగా వున్నాడు కనుక యెహోవా
ఇప్పుడు నాకు మంచిగా ఉండునని నేను
భావిస్తున్నాను."

### దాను లాయిషు నగరాన్ని పట్టుకొనుట

18 ఆ సమయంలో, ఇశ్రాయేలు ప్రజలకు రాజు
లేడు. పైగా ఆ సమయంలో దాను వంశీయులు
ఉండడానికిగాను ఒక చోటుకోసం అన్వేషిస్తున్నారు.
తమకు సొంతమనదగిన ప్రదేశం వారికి లేదు. ఇశ్రాయే
లుకి చెందిన ఇతర వంశాలవారికి స్వస్థలం ఉంది.
కాని దాను వంశీయులకు సొంత ప్రదేశం లేదు.

2అందువల్ల దాను వంశంవారు ఐదుగురు సైనికు
లను ఏదైనా ఒక ప్రదేశం అన్వేషించమని చెప్పి
పంపించారు. వారు ఒక మంచి ప్రదేశం వెదికేందుకు
గాను వెళ్లారు. ఆ ఐదుగురు జోర్యా, ఎష్తాయేలు నగరాల
నుండి వచ్చారు. దాను వంశమునకు చెందిన అన్ని
కుటుంబాల నుండి వచ్చినవారు. అందువల్లనే వారిని
ఎంపిక చేయడం జరిగింది. "వెళ్లి ఏదైనా ఒక చోటు
చూడండి" అని వారికి చెప్పబడింది.

ఆ ఐదుగురూ కొండ దేశమైన ఎఫ్రాయిముకి
వచ్చారు. వారు మీకా ఇంటికి వచ్చారు. ఆ రాత్రి
ఇక్కడే గడిపారు. 3వారు మీకా ఇంటికి అతి సమీపంగా
వచ్చేసరికి, ఆ లేవీ యువకుడి కంఠస్వరం విన్నారు.
ఆ గొంతుని వారు గుర్తుపట్టారు. అందువల్ల వారు
మీకా ఇంటి దగ్గర ఆగిపోయారు. ఆ యువకుణ్ణి "ఎవరు
నిన్నీ స్థలానికి తీసుకువచ్చారు? ఇక్కడ నీవేమి చేస్తు
న్నావు? ఇక్కడ నీ పనేమిటి?" అని వారు అడిగిరి.

4ఆ యువకుడు మీకా తనకోసం చేసిన పనులను
తెలియజేశాడు. "మీకా నన్ను జీతానికి ఉంచుకున్నాడు.
నేనతని యాజకుడిని" అని అతను చెప్పాడు.

5అప్పుడు వారతనితో ఇలా అన్నారు; "దయచేసి
మాకోసంగాను దేవుణ్ణి ఏదో ఒకటి అడగండి. ఏదైనా
మేము తెలుసుకోదలచాము. ఉండడానికి చోటుకోసం
వెతుకుతున్న మా అన్వేషణ విజయవంత మవు
తుందా?"

6యాజకుడు ఆ ఐదుగురితో ఇలా అన్నాడు,
"అవుతుంది. నిశ్చితంగా వెళ్లండి. మీ త్రోవలో,
యెహోవా మిమ్మల్ని నడుపుతాడు."

7అందువల్ల ఐదుగురు వెళ్లిపోయారు. లాయిషు
నగరానికి వారు వచ్చారు. ఆ నగరంలోని ప్రజలు
భద్రత కలిగి ఉండడం వారు చూశారు. వారిని సీదోను
ప్రజలు పరిపాలించారు. ప్రతిదీ ప్రశాంతంగా శాంతి
యుతంగా ఉండి, ప్రజలకు అంతా సమృద్ధిగా ఉండి
నది. తమకు హాని కలిగించే విరోధులు దగ్గరలో వారికి
లేరు. పైగా సీదోను నగరానికి దూరంగా వారు నివసి
స్తున్నారు. ప్రజలతో ఎలాంటి ఒడంబడికలూ చేసుకో
లేదు.

8ఆ ఐదుగురూ జోర్యా, ఎష్తాయేలు నగరాలకు
తిరిగి వెళ్లారు. "సంప్రదింపులు చేశారా?" అని వారి
బంధువులు అడిగారు. 9ఆ ఐదుగురూ ఇలా బదులు
చెప్పారు, "మేము ఒక ప్రదేశం చూశాము. అది చాలా
బాగున్నది. వారిని మనం ప్రతిఘటించాలి. వేచి ఉండ
వద్దు! మనం వెళదాము, ఆ ప్రదేశాన్ని తీసుకుందాము.
10మీరు ఆ ప్రదేశానికి వచ్చినప్పుడు, అక్కడ చాలా
ప్రదేశం ఉన్నదని మీరే తెలుసుకుంటారు. అక్కడ అన్నీ
సమృద్ధిగా ఉన్నాయి. ప్రజలు ఏ ప్రతిఘటనను ఎదు
ర్కొంటారని అనుకోవడం లేదని మీరు తెలుసు
కుంటారు. దేవుడే మనకు ఆ ప్రదేశం ఇచ్చాడు."

11అందువల్ల దాను వంశానికి చెందిన ఆరువందల
మంది మనుష్యులు జోర్యా, ఎష్తాయేలు నగరాలకు

బయలుదేరారు. యుద్ధానికి వారు సిద్ధంగా ఉన్నారు.
[12]లాయిషు నగరానికి వెళ్లే దారిలో, యూదాలోని కిర్య
త్యారీము అనే నగరం వద్ద వారు ఆగారు. అక్కడ ఒక
గుడారం వేసుకున్నారు. అందువల్లనే కిర్యత్యారీముకి
పడమరగావున్న ప్రదేశానికి మహనెదాను అని పేరు
వచ్చింది. నేటికీ అదే పేరు. [13]ఆ ప్రదేశంనుండి, ఆ
ఆరువందల మంది మనుష్యులూ కొండదేశమైన ఎఫ్రా
యిముకి ప్రయాణమయ్యారు. ఆ తర్వాత వారు మీకా
ఇంటికి వచ్చారు. [14]లాయిషు చుట్టు ప్రక్కల
ప్రాంతంలో సంచరించటానికి వెళ్లిన ఆ ఐదు గురూ
వాళ్ల బంధువులతో అన్నారు; "ఒక ఇంట్లో ఏఫోదు
ఉన్నది. పైగా గృహదేవతలు, చెక్కిన విగ్రహం మరియు
వెండి విగ్రహం ఉన్నాయి. మీకేమి చేయాలో తెలుసు
వాటిని తీసుకురావాలి." [15]అందువల్ల వారు మీకా ఇంటి
వద్ద నిలిచారు. అక్కడే యువకుడైన లేవీ మనిషి
ఉన్నాడు. నీవెలా వున్నావని ఆ యువకుని వారడిగారు.
[16]దాను వంశీయులైన ఆ ఆరువందల మంది మను
ష్యులు వెలుపల ద్వారం వద్ద నిలిచారు. వారి వద్ద
ఆయుధాలు ఉన్నాయి. యుద్ధానికి వారు సిద్ధంగా
ఉన్నారు. [17-18]ఐదుగురు గూఢచారులు ఇంట్లోకి
వెళ్లారు. వెలుపల ద్వారం పక్కగా యుద్ధ సన్నద్ధులైన
ఆ ఆరువందల మంది మనుష్యులతో యాజకుడు
నిలబడివున్నాడు. ఆ మనుష్యులు మలిచిన విగ్రహం,
ఏఫోదు, గృహదేవతలు మరియు వెండి విగ్రహం తీసు
కున్నారు. యువకుడైన లేవీ యాజకుడు, "మీరేమి
చేస్తున్నారు?"అని అడిగాడు. [19]ఆ ఐదుగురు బదులు
చెప్పారు: "ఊరక వుండు! ఒక్కమాట కూడా మాట్లాడ
వద్దు. మాతో పాటు రా. మా తండ్రిగా, యాజకుడుగా
ఉండు. నీవు ఎన్నుకుని తీరాలి. కేవలం ఒక్క వ్యక్తికి
తండ్రిగా, యాజకుడుగా ఉండటం మంచిదా? లేక
ఇశ్రాయేలు ప్రజలలో ఒక వంశం వారికి యాజకుడుగా
ఉండడం మంచిదా?"

[20]లేవీ వ్యక్తికిది సంతోషదాయకమయింది. అందు
వల్ల అతను ఏఫోదు, గృహదేవతలు మరియు విగ్రహం
తీసుకొని, దాను వంశం వారివద్ద నుంచి వచ్చిన
మనుష్యులతో వెళ్లిపోయాడు.

[21]తర్వాత దాను వంశానికి చెందిన ఆ ఆరువందల
మంది మనుష్యులు లేవీ యాజకునితో కలిసి వెనుదిరిగి
మీకా ఇల్లు విడిచి వెళ్లారు. వారు తమ చిన్న పిల్లలను,
తమ జంతువులను తమ అన్ని వస్తువులను వారి
ముందు విడిచిపెట్టి వెళ్లారు.

[22]దాను వంశమునకు చెందిన ఆ మనుష్యులు ఆ
చోటునుండి చాలా దూరం వెళ్లారు. మీకాదగ్గర నివ
సించే వారు ఒకటిగా కలుసుకున్నారు. తర్వాత దాను
మనుష్యుల్ని వెంబడించారు. వారిని పట్టుకున్నారు.
[23]దాను మనుష్యుల్ని మీకా మనుష్యులు కేకలు వేయ
సాగారు. దాను మనుష్యులు నిలబడ్డారు. "సమస్య
ఏమిటి? ఎందుకు కేకలు వేస్తున్నారు?" అని మీకాని
అడిగారు.

[24]మీకా బదులు చెప్పెను: "దాను మనుష్యులైన
మీరు నా విగ్రహాలు తీసుకుపోతున్నారు. వాటిని నా
కోసం తయారు చేసుకున్నాను. మీరు నా యాజకుని
కూడా తీసుకువెళ్తున్నారు. ఇక నాకు ఏమి మిగిలింది?
'సమస్య ఏమిటి?' అని మీరెలా అడుగుతారు?"

[25]దాను వంశీయులు అందుకు ఇలా అన్నారు:
"మాతో నీవు వివాదానికి పాల్పడడం మంచిది కాదు.
మాలో కొందరు కోపిష్ఠులు. మమ్మల్ని నీవు కేకలు
వేస్తే, వారు నిన్ను ప్రతిఘటించవచ్చు. నీవు, మీ
కుటుంబాలవారూ చంపబడవచ్చు."

[26]తర్వాత దాను వంశానికి చెందిన మనుష్యులు
వెనుదిరిగి తమ తోవను వెళ్లారు. ఆ మనుష్యులు తన
కంటె బలాఢ్యులని మీకా గ్రహించాడు. అందువల్ల
అతను ఇంటికి వెళ్లిపోయాడు.

[27]కాగా మీకా చేసిన విగ్రహాలను దాను వంశీయులు
తీసుకునిపోయారు. మీకాతో ఉండిన యాజకుని
కూడా తమతో పాటు తీసుకునిపోయారు. తర్వాత
వారు లాయిషుకి వచ్చారు. లాయిషులో నివసిస్తున్న
వారి మీద దాడిచేశారు. ఆ మనుష్యులు శాంతముగా
ఉన్నారు. వారు దాడిని ఎదురుచూడలేదు. దానుకు
చెందిన మనుష్యులు వారిని తమ కత్తులతో చంపి
వేశారు. తర్వాత నగరాన్ని కాల్చివేశారు. [28]లాయిషులో
నివసించేవారికి తమను కాపాడేవారు లేరు. వారు
సీదోను నగరానికి చాలా దూరాన నివసించుటచే, ఆ
నగర ప్రజలు సహాయం చేయలేకపోయారు. మరియు
లాయిషు ప్రజలు అరాము ప్రజలతో ఒడంబడికయేమీ
చేసుకొని ఉండలేదు. అందువల్ల వారు సహాయం
చెయ్యలేదు. లాయిషు నగరం ఒక లోయలో ఉంది.
అది బెతెహెూబు పట్టణానికి చెందింది. దాను ప్రజలు
ఆ ప్రదేశంలో ఒక కొత్త నగరం నిర్మించుకున్నారు.
ఆ నగరం వారి నివాసమయింది. [29]దాను ప్రజలు ఆ
నగరానికి కొత్త పేరు పెట్టారు. దానిని లాయిషు
అన్నారు. కాని దానిని దాను అని మార్చివేశారు. ఆ
నగరానికి ఇశ్రాయేలు కుమారులలో ఒకడైన దాను
అను పూర్వీకుని పేరు పెట్టారు.

[30]దాను వంశానికి చెందిన ప్రజలు దాను నగరంలో
విగ్రహాలు ప్రతిష్ఠించారు. వారు గెర్షోము కుమారుడైన
యోనాతానును తమ యాజకునిగా నియమించు
కున్నారు. గెర్షోము మోషే* కుమారుడు. యోనా
తాను మరియు అతని కుమారులు ఇశ్రాయేలు ప్రజల్ని
బందీలుగా చేసి బబులోనుకు తీసుకు వెళ్లేంతవరకు
దాను వంశం వారికి యాజకులుగా ఉన్నారు. [31]దాను
ప్రజలు మీకా చేసిన విగ్రహాలను పూజిస్తూండేవారు.

---

**మోషే** లేక మనష్షే.

దేవాలయము షిలోహులో ఉన్నంత కాలము వారు
ఆ విగ్రహాలను పూజించుచుండిరి.

### లేవీ వంశపు వ్యక్తి మరియు అతని దాసి*

19 ఆ సమయమున, ఇశ్రాయేలు ప్రజలకు రాజు
లేడు. చాలా దూరానవున్న కొండదేశమైన
ఎఫ్రాయిముల్లో లేవీ వంశమునకు చెందిన వ్యక్తి
ఉండెను. అతనికి ఒక దాసివుండెను. ఆమె అతనికి
భార్యవలె ఉండెను. యూదాలోని బేత్లెహేముకు ఆ
దాసి చెందింది. [2]కాని ఆ దాసి లేవీ వంశపు వ్యక్తితో
ఒక ఒడంబడిక చేసుకొంది. ఆమె అతనిని విడిచి
పెట్టి, యూదాలోని బేత్లెహేములో ఉన్న తన తండ్రి
వద్దకు వెళ్లింది. అక్కడ ఆమె నాలుగు నెలలపాటు
ఉంది. [3]తర్వాత ఆమె భర్త ఆమెకోసం వచ్చాడు.
ఆమెతో అతను ప్రీతిపూర్వకంగా మాటలాడాడు. ఆమె
మరల తన వద్దకు రావాలని అలా మాటలాడాడు.
అతను తన సేవకుని, రెండు గాడిదలను తీసుకొని
వెళ్లాడు. లేవీ వంశపు వ్యక్తి ఆమె తండ్రి ఇంటికి వచ్చాడు.
లేవీ వంశపు వ్యక్తిని చూసి ఆమె తండ్రి బయటికి
వచ్చి అతనిని అభినందించాడు. ఆమె తండ్రికి చాలా
సంతోషం కలిగింది. [4]ఆ స్త్రీ తండ్రి లేవీ వ్యక్తిని ఇంటి
లోనికి తీసుకుని వెళ్లాడు. లేవీ వ్యక్తి మామగారు అతనిని
ఇంట ఉండుమని కోరాడు. అందువల్ల ఆ లేవీ వ్యక్తి
మూడురోజులున్నాడు. అతను తిని, తాగి, మామగారి
ఇంట నిదురించాడు.

[5]నాలుగవ రోజున, తెల్లవారుజామున వారు మేల్కొ
న్నారు. లేవీ వంశపు వ్యక్తి బయలుదేరే సన్నాహంలో
వున్నాడు. కాని ఆ యువతి తండ్రి తన అల్లుడితో
ఇలా అన్నాడు: "మొట్టమొదట ఏమైనా తిను. నీవు
తిన్న తర్వాత వెళ్లవచ్చును." [6]అందువల్ల లేవీ వంశపు
వాడు అతని మామగారు తినుటకు, తాగుటకు కలిసి
కుర్చొనిరి. ఆ తర్వాత మామగారు అతనితో, "ఈ
సాయంకాలందాకా ఇక్కడే వుండి, విశ్రాంతి తీసుకుని,
ఆనందించి వెళ్లవచ్చు" అన్నాడు. అందువల్ల ఆ ఇద్దరూ
కలసి తిన్నారు. [7]లేవీ వంశపువాడు వెళ్లాలని లేచాడు.
కాని అతని మామగారు ఆ రాత్రికి ఉండిపొమ్మని అతనిని
వేడుకొన్నాడు. [8]తర్వాత, ఐదవరోజున తెల్లవారు
జామునే లేవీ వంశపువాడు మేల్కొన్నాడు. అతడు
బయలుదేరే సన్నాహంలో ఉన్నాడు. కాని ఆ స్త్రీ తండ్రి
అల్లుడితో ఇలా చెప్పాడు: "మొదట ఏదైనా తిను.
నిశ్చింతగా ఈ సాయంకాలందాకా ఉండు." కనుక
వాళ్లిద్దరూ మళ్లీ కలసి తిన్నారు.

[9]తర్వాత లేవీ వంశపువాడు, అతని దాసి అతని
సేవకుడు బయలుదేరడానికి లేచారు. కాని ఆ యువతి
తండ్రి, "చాలా చీకటిపడింది. రోజు చాలావరకు అయి
పోయింది. కనుక రాత్రికి ఇక్కడేవుండి సంతోషమును
భవించు. రేపు ఉదయం నీవు తెల్లవారుజామునే
మేల్కొని నీ తోవను వెళ్లు" అన్నాడు.

[10]కాని లేవీ వంశపువాడు మరోరాత్రికి అక్కడ
వుండదలచుకోలేదు. అతను తన రెండు గాడిదలను,
తన దాసిని వెంటబెట్టుకున్నాడు. యెబూసు నగర
మునకు సమీపించాడు. (యెరూషలేముకు మరోపేరు
యెబూసు). [11]ఆ రోజు చాలావరకు అయిపోయింది.
యెబూసు నగరము దగ్గరికి వచ్చారు. అప్పుడు
సేవకుడు తన యజమానిని చూసి, "యెబూసు నగరం
వద్ద మనము ఆగిపోదాము. ఈ రాత్రికి ఇక్కడే
ఉందాము" అన్నాడు.

[12]కాని అతని యజమాని అయిన లేవీ వంశపు
వాడు, "కాదు, మనము తెలియని నగరం లోపలికి
వెళ్లకూడదు. అక్కడి ప్రజలు ఇశ్రాయేలు ప్రజలు కాదు.
గిబియా నగరమునకు మనము వెళదాము" అన్నాడు.
[13]లేవీ వంశపు వ్యక్తి, "పదండి, గిబియా లేక రామా
నగరమునకు వెడదాము. ఈ రెండు నగరాలలో ఒక
దానిలో మనము ఈ రాత్రి గడుపుదాము" అన్నాడు.
[14]అందువల్ల లేవీ వంశపువాడు, అతనితో ఉన్న
మనుష్యులు పైకి ప్రయాణం చేశారు. గిబియా నగర
మును వారు ప్రవేశించే సమయానికి సూర్యుడు అస్తమి
స్తున్నాడు. బెన్యామీను వంశీయుల ప్రదేశంలో గిబియా
ఉంది. [15]అందువల్ల వారు గిబియాలో ఆగిపోయారు.
ఆ నగరములో ఆ రాత్రికి ఉండాలని వారనుకున్నారు.
వారు నగరం మధ్యకు వచ్చి అక్కడ కూర్చున్నారు.
కాని ఎవ్వరూ వారిని తమ ఇంటికి రమ్మని పిలవలేదు.

[16]ఆ సాయంకాలం పొలంనుంచి ఒక వృద్ధుడు
నగరములోనికి వచ్చాడు. అతని ఇల్లు కొండ దేశమ
యిన ఎఫ్రాయిములో ఉన్నది. కాని ఇప్పుడతను
గిబియా నగరములో నివసిస్తున్నాడు. (గిబియా
మనుష్యులు బెన్యామీను వంశమునకు చెందిన వారు).
[17]ఆ వృద్ధుడు లేవీ వంశపువాడయిన ఆ ప్రయాణికుని
చూశాడు. ఆ వృద్ధుడు, "మీరెక్కడికి వెడుతున్నారు?
ఎక్కడినుంచి వచ్చారు?" అని ప్రశ్నించాడు.

[18]లేవీ వంశపువాడు సమాధానం చెప్పాడు: "మేము
యూదాలోని బేత్లెహేమునుంచి ప్రయాణం చేస్తు
న్నాము. మేము స్వగృహానికి వెడుతున్నాము. అయితే
ఈ రాత్రి ఎవరూ మమ్ములను ఉండమని ఆహ్వానించ
లేదు. ఎఫ్రాయిము కొండదేశానికి వెనకవున్న వాళ్లము
మేము. నేను స్వగృహమునకు వెళుతున్నాను.

[19]"మా గాడిదలకు తగినంత గడ్డి ఆహారం
వున్నాయి. మాకు రొట్టె, మద్యము ఉన్నది. అనగా,
నాకు, యువతికి మరియు నా సేవకుడికి. మాకేమియు
అవసరము లేదు." [20]వృద్ధుడిట్లు చెప్పాడు: "నీవు
మా ఇంట్లో ఉండవచ్చును. నీకు కావలసినదంతా

---

**దాసి** ఉపపత్ని లేక స్త్రీ సేవకురాలు భార్యగా వ్యవహరించే
సేవకురాలు.

నేనిస్తాను. నగర మధ్యమున మాత్రం రాత్రివేళ ఉండకూడదు.”

21తర్వాత లేవీ వంశపువానిని, అతని మనుష్యుల్ని అతను తన ఇంటికి తీసుకుని వెళ్లాడు. అతని గాడిదలకు ఆయన ఆహారం పెట్టాడు. వారు కాళ్లు కడుగుకున్నారు. ఆ తర్వాత తినుటకు తాగుటకు ఆయన వారికిచ్చాడు.

22ఆ లేవీ వంశపు వ్యక్తియు, అతనితో వున్న మనుష్యులును సంతోషంగా వుండగా, ఆ నగరమునకు చెందినవారు కొందరు ఇంటిని చుట్టుముట్టారు. వారు దుర్జనులు.వారు తలుపు కొట్టసాగారు. ఆ ఇంటి స్వంతదారైన వృద్ధుని వుద్దేశించి కేకలు వేయసాగారు. వారు ఇలా అన్నారు; “మీ ఇంటికి వచ్చిన ఆ వ్యక్తిని వెలుపలికి తీసుకుని రమ్ము. మేమతనితో సంభోగింప దలచినాము.”

23వృద్ధుడు వెలుపలికి పోయి ఆ దుర్జనులతో మాట లాడెను: “వద్దు, నా స్నేహితులారా! అటువంటి చెడ్డ పనులు చేయవద్దు. అతను మా ఇంటి అతిథి. ఈ మహా పాపకృత్యం మీరు చేయవద్దు” అన్నాడు. 24ఇదుగో చూడండి. ఇక్కడ నా కుమార్తె ఉంది. ఆమెకి ఇంతకు మునుపెన్నడూ సంభోగమననేమో తెలియదు. ఆమెను నేను వెలుపలికి తీసుకు వస్తాను. మరియు ఆయన దాసిని కూడ బయటికి తీసుకు వస్తాను . మీ ఇష్టమొచ్చినట్లు వారిని చేయవచ్చును. మీరు వారిని హింసించవచ్చు. కాని మా యింటికి వచ్చిన వ్యక్తితో పాపకృత్యం చేయవద్దు” అన్నాడు. 25కాని ఆ చెడ్డ మనుష్యులు వృద్ధుని మాటలు వినదలచుకోలేదు. అందువల్ల లేవీ వంశపువాడు తన దాసిని వెలుపలికి తీసుకువెళ్లి, ఆమెను చెడ్డవారి చెంత ఉంచాడు. ఆ చెడ్డవారు ఆమెను గాయపరిచారు. ఆ రాత్రియంతయు ఆమెను బలాత్కరించారు. తర్వాత తెల్లవారుజామున ఆమెను విడిచిపెట్టారు. 26తెల్లవారుజామున తన యజమాని నివసిస్తున్న ఇంటికి ఆమె వచ్చింది. ఆమె ముందుతలుపు వద్ద పడిపోయింది. ఆమె అచ్చటనే వెలుతురు వచ్చేవరకు పడివుంది.

27ఉదయాన లేవీ వంశపువాడు మేల్కొన్నాడు. అతను ఇంటికి వెళ్లవలెనని అనుకొన్నాడు. వెలుపలికి వెళ్లుటకుగాను తలుపు తెరిచాడు. గడపవద్ద ఒక చేయి ఉంది. అక్కడ అతని దాసి ఉంది. 28లేవీ వంశపువాడు, “లెమ్ము మనము వెళ్లిపోదాం” అనెను. కాని ఆమె సమాధానం చెప్పలేదు ఆమె చనిపోయింది.

లేవీ వంశపు వాడు తన దాసిని గాడిదమీద వేసుకుని ఇంటికి వెళ్లాడు. 29అతను ఇల్లు చేరుకోగానే ఒక కత్తి తీసుకొని దాసిని పన్నెండు భాగాలుగా ఖండించాడు. తర్వాత అతను ఆ పన్నెండు భాగాలను ఇశ్రాయేలు ప్రజలు నివసించిన అన్ని ప్రదేశాలకు పంపించాడు. 30ఇది చూసిన వారు, “ఇశ్రాయేలులో ఇంతకు మునుపు ఎన్నడూ ఇలా జరగలేదు, ఈజిప్టునుంచి మనం వచ్చిన నాటినుండి మనం ఇప్పటివరకు ఇలాంటిది చూచి వుండలేదు. దీన్ని గురించి చర్చించి మనమేమి చేయవలెనో చెప్పు” అన్నారు.

## ఇశ్రాయేలుకీ బెన్యామీనుకీ మధ్య యుద్ధం

20 అందువల్ల ఇశ్రాయేలు ప్రజలందరూ ఏకమైనారు. వారందరూ మిస్పా నగరంలోని యెహోవా సమక్షమున నిలబడుటకు కలిసివచ్చారు. ఇశ్రాయేలులోని ప్రతిచోటునుండి వచ్చారు. గిలాదులోని ఇశ్రాయేలు మనుష్యులు కూడా వచ్చారు. 2ఇశ్రాయేలులోని వివిధ వంశాల నాయకులూ వచ్చారు. దేవుని ప్రజలు బహిరంగ సభలో వారు తమతమ స్థానములు అలంకరించారు. నాలుగు లక్షల సైనికులు కత్తులతో ఆ చోట వున్నారు. 3బెన్యామీను వంశమునకు చెందిన మనుష్యులు ఇశ్రాయేలు ప్రజలు మిస్పాలో సమావేశమైన విషయం తెలుసుకొనిరి. “ఈ భయంకర విషయం ఎలా జరిగిందో మాకు చెప్పండి” అని ఇశ్రాయేలు ప్రజలన్నారు.

4అప్పుడు చంపబడిన ఆ స్త్రీ భర్త వారితో జరిగిన కథ చెప్పాడు. అతను ఇలా అన్నాడు, “నా దాసి, నేనూ బెన్యామీను ప్రదేశంలోని గిబియా నగరమునకు వచ్చాము. మేమారాత్రి అక్కడ గడిపాము. 5కాని రాత్రి సమయాన గిబియా నగరపు నాయకులు నేను నివసించే ఇంటికి వచ్చారు. వారు ఇల్లు చుట్టుముట్టారు. నన్ను చంపాలని అనుకున్నారు. వారు నా దాసిని బలాత్కరించారు. ఆమె చనిపోయింది. 6అందువల్ల నా దాసిని తీసుకుని వచ్చి, ఈమెను పన్నెండు భాగాలుగా ఖండించితిని. తర్వాత ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క వంశంవారికి పంపించాను. నేను మనము స్వీకరించిన పన్నెండు ప్రదేశాలకు పన్నెండు భాగాలను పంపించాను. ఎందుకు చేశాననగా బెన్యామీను ప్రజలు ఈ భయంకర విషయాన్ని ఇశ్రాయేలులో జరిగించారు. 7కనుక ఇప్పుడు ఇశ్రాయేలు ప్రజలారా, మాట్లాడండి. మనమేమి చేయవలెనో మీరు నిర్ణయం తీసుకోండి.”

8ఒకేసారి, అందరు మనుష్యులూ లేచి నిలబడ్డారు. ముక్తకంఠంతో అన్నారు: “మేమెవ్వరమూ ఇళ్లకి వెళ్లము. అవును. మాలో ఏ ఒక్కరూ తన ఇంటికి తిరిగి వెళ్లడు. 9ఇప్పుడు గిబియా నగరానికి ఇలా చేద్దాము. ఆ ప్రజల్ని ఏం చేయాలో దేవుడు తోవ చూపడానికి చీట్లు వేద్దాము. 10ఇశ్రాయేలు విభిన్న వంశాల నుండి ప్రతి వంద మందిలోనుండి పదిమందిని ఎన్నుకుందాము. ప్రతి వేయి మంది నుండి వంద మందిని ఎన్నుకుందాము. ప్రతి పదివేల మంది నుండి వేయి మందిని ఎన్నుకుందాము. మనము ఎంపిక చేసిన ఆ మనుష్యులు సైన్యం కోసం పనులు చేస్తారు. తర్వాత బెన్యామీను ప్రదేశంలోని గిబియా నగరానికి సైన్యం తరలి వెళుతుంది. ఇశ్రాయేలు ప్రజల వారైన ఆ

మనుష్యుల్ని భయంకరమైన ఆ విషయం జరిపిన వారిని
సైన్యం శిక్షిస్తుంది.” 11అందువల్ల ఇశ్రాయేలుకి చెందిన
వారందరూ గిబియా నగరానికి చేరారు. వారేమి చేస్తు
న్నారో, దానికి వారందరూ సమ్మతించారు. 12ఇశ్రా
యేలు ప్రజలు ఒక సందేశమిచ్చి బెన్యామీను వారి
వద్దకు పంపించారు. ఆ సందేశమేమనగా, “మీకు
చెందిన కొందరు మనుష్యులు చేసిన ఈ ఘోర కృత్య
మేమిటి? 13గిబియా నగరం నుంచి ఆ దుర్జనుల్ని
మా వద్దకు పంపండి. వారిని మాకు అప్పజెప్పండి.
మేము వారిని చంపుతాము. ఇశ్రాయేలు ప్రజలనుండి
ఆ పాపాన్ని తొలగించదలచాము.”

కాని బెన్యామీను వంశానికి చెందిన వారు తమ
బంధువులు పంపిన ఆ సందేశాన్ని వినదలచుకోలేదు.
ఆ బంధువులు ఇశ్రాయేలులోని ఇతర ప్రజలు. 14బెన్యా
మీను వంశంవారు తమ నగరములు విడిచి గిబియా
నగరమునకు వెళ్లారు. ఇశ్రాయేలులోని ఇతర వంశాలకు
చెందినవారితో పోరాడాలని వారు గిబియా వెళ్లారు.
15బెన్యామీను వంశం వారు ఇరవై ఆరువేలమంది సైని
కుల్ని సమకూర్చుకున్నారు. ఆ సైనికులందరూ
యుద్ధానికి తర్ఫీదు పొందినవారు. వారు గిబియా
నగరం నుండి ఏడువందల మంది తర్ఫీదు పొందిన
సైనికులను సమకూర్చుకున్నారు. 16పైగా ఎడమ చేతి
వాటం గల ఏడువందల మంది తర్ఫీదు పొందిన సైని
కులు కూడా ఉన్నారు. వారిలో ప్రతి ఒక్కరూ చాలా
సామర్థ్యంతో వడిసెలను ఉపయోగించగలరు. వారం
దరూ వడిసెలతో తలవెంట్రుక మీదికి గురి తప్ప
కుండా రాయి విసరగలిగేవారు.

17బెన్యామీను తప్ప మిగిలిన ఇశ్రాయేలు వంశాల
వారు మొత్తం మీద నాలుగు లక్షల మంది వీరయోధుల్ని
సమకూర్చుకున్నారు. ఆ నాలుగు లక్షల మంది వద్ద
ఖడ్గాలున్నాయి. ప్రతి ఒక్కరూ సుశిక్షితుడైన సైని
కుడు. 18ఇశ్రాయేలు ప్రజలు బేతేలు నగరం దాకా
వెళ్లారు. బేతేలు వద్ద వారు దేవుని ఇలా అడిగారు:
“బెన్యామీను వంశం వారిని ఏ వంశం వారు మొదట
ఎదుర్కొంటారు?”

“యూదా వంశం వారు మొదట ఎదుర్కొంటారు”
అని యెహోవా బదులు చెప్పాడు.

19ఆ మరునాటి ఉదయం ఇశ్రాయేలు ప్రజలు
మేల్కొన్నారు. గిబియా నగరం వద్ద ఒక గుడారం
వేశారు. 20తర్వాత ఇశ్రాయేలు సైన్యం బెన్యామీను
సైన్యాన్ని ఎదుర్కోడానికి గిబియా నగరం వద్దకి తరలి
వెళ్లింది. 21ఆ తర్వాత బెన్యామీను సైన్యం గిబియా
నగరం నుండి బయటికి వచ్చింది. బెన్యామీను సైన్యం
ఆ రోజు జరిగిన యుద్ధంలో ఇరవైరెండు వేలమంది
ఇశ్రాయేలు సైనికుల్ని హతమార్చింది.

22-23ఇశ్రాయేలీయులు యెహోవావద్దకు వెళ్లారు.
సాయంకాలందాకా విలపించారు. వారు యెహోవాను
అడిగారు: “బెన్యామీను ప్రజలతో మళ్లీ మేము యుద్ధం
చేయాలా? ఆ మనుష్యులు మా బంధువులు.” “వెళ్లి,
వాళ్లతో యుద్ధం చేయండి” అని యెహోవా సమా
ధానమిచ్చాడు. ఇశ్రాయేలు మనుష్యులు ఒకరి నొకరిని
ప్రోత్సాహ పరుచుకున్నారు. మొదటి రోజున చేసి
నట్లుగా, వారు మళ్లీ యుద్ధానికి తరలి వెళ్లారు.

24అప్పుడు బెన్యామీను సైన్యం దగ్గరికి ఇశ్రాయేలు
సైన్యం వచ్చింది. ఇది యుద్ధం రెండవరోజు. 25రెండ
వరోజున సైన్యాన్ని ఎదుర్కొనాలని గిబియా నగరం
వెలుపలికి బెన్యామీను సైన్యం వచ్చింది, బెన్యామీను
సైన్యం ఇశ్రాయేలు సైన్యంలోని పద్దెనిమిది వేల
మందిని చంపివేసింది. ఇశ్రాయేలు సైన్యంలోని
మనుష్యులు సుశిక్షితులైన సైనికులు.

26తర్వాత ఇశ్రాయేలు మనుష్యులందరు బేతేలు
నగరం దాకా వెళ్లారు. ఆ చోట వారు కూర్చుని
యెహోవాను పిలిచారు. సాయంకాలంవరకు ఆ రోజు
వారేమీ తిన లేదు. వారు దహన బలులు సమాధాన
బలులను అర్పించారు. 27ఇశ్రాయేలు మనుష్యులు
యెహోవాను ఒక ప్రశ్న అడిగారు. (ఆ రోజుల్లో
దేవుని ఒడంబడిక పెట్టె బేతేలులో ఉంది. 28ఫినెహాసు
యాజకునిగా వుండి దేవుణ్ణి సేవిస్తూవున్నాడు.
ఫినెహాసు ఎలీయాజరు కుమారుడు ఎలీయాజరు ఆహ
రోను కుమారుడు) ఇశ్రాయేలు ప్రజలు ఇలా అడిగారు:
“బెన్యామీను ప్రజలు మా బంధువులు. మళ్లీ మేము
వారిని ప్రతి ఘటించడానికి వెళ్లవలెనా? లేకపోతే మేము
యుద్ధం ఆపివేయవలెనా?”

యెహోవా, “వెళ్లండి, రేపు వారిని ఓడించేందుకు
నేను సహాయం చేస్తాను” అన్నాడు.

29తర్వాత ఇశ్రాయేలు సైన్యం గిబియా నగరం
పరిసరాలలో కొందరు మనుష్యులను దాచి ఉంచింది.
30మూడో రోజున ఇశ్రాయేలు సైన్యం గిబియా నగ
రంతో యుద్ధానికి తలపడింది. అంతకు మునుపు
చేసినట్లుగా, వారు యుద్ధ సన్నద్ధులయ్యారు. 31బెన్యా
మీను సైన్యం గిబియా నగరం వెలుపలికి వచ్చింది,
ఇశ్రాయేలు సైనికుల్ని ఎదుర్కొనడానికి. ఇశ్రాయేలు
సైన్యం వెనుకకు మరలింది. బెన్యామీను సైన్యం
తమను తరుముకు రావాలని అలా చేసింది. ఈ విధంగా
బెన్యామీను సైన్యం నగరానికి చాలా దూరంలో ఉండా
లని మాయోపాయం పన్నబడింది.

బెన్యామీను సైన్యం, తాము పూర్వం చేసినట్లుగా,
ఇశ్రాయేలు సైనికుల్ని చంపడం మొదలు పెట్టింది.
ఇశ్రాయేలుకి చెందిన సుమారు ముప్పై మందిని చంపి
వేయడం జరిగింది. పొలాలలో ఉండేవారిని కొందరిని
చంపివేశారు. రాజమార్గం మీద ఉన్న వారిని కొందరిని
చంపివేశారు. ఒక రాజమార్గం బేతేలు నగరానికి వెళు
తుంది. మరొక రాజమార్గం గిబియా నగరానికి వెళు
తుంది.

[32]"పూర్వంలా మనం జయిస్తున్నాము" అని
బెన్యామీను మనుష్యులు అనుకున్నారు.
ఇశ్రాయేలు మనుష్యులు పరుగు పెట్టుచున్నారు.
కాని అదొక యుక్తి బెన్యామీను మనుష్యులు తమ
నగరమునుండి రాజమార్గం మీదికి రావాలని వారు అభి
లాషించారు. [33]అందువల్ల అందరు మగవాళ్లూ పరు
గెత్తారు. వారు బయల్తామారు అనే చోట ఆగారు.
ఇశ్రాయేలుకి చెందిన కొందరు మనుష్యులు గిబియాకి
పడమరగా దాగుకొని ఉన్నారు. వారు తాము దాగిన
స్థలములనుండి పరుగెత్తి గిబియాను ఎదుర్కొన్నారు.
[34]ఇశ్రాయేలుకి చెందిన సుశిక్షితులైన పదివేల మంది
సైనికులు గిబియా నగరాన్ని ఎదుర్కొన్నారు.
యుద్ధం చాలా ఘోరంగా ఉంది. కాని బెన్యామీను
సైన్యానికి ఏమి భయంకరమైన సంఘటన జరుగు
తుందో తెలియదు.
[35]ఇశ్రాయేలు సైన్యాన్ని ఉపయోగించి
యెహోవా బెన్యామీను సైన్యాన్ని ఓడించాడు. ఆనాడు
ఇశ్రాయేలు సైన్యం ఇరవై అయిదువేల వంద మంది
బెన్యామీను సైనికులను చంపివేసింది. ఆ సైనికు
లందరూ యుద్ధానికి తర్ఫీదు పొందినవారే. [36]అందు
వల్ల బెన్యామీను ప్రజలు తాము ఓడిపోయినట్లుగా
గ్రహించారు.
ఇశ్రాయేలు సైన్యం వెనుదిరిగింది. వారు ఎందుకు
వెనుదిరిగారనగా, ఆశ్చర్యకరమైన దాడిమీద వారు ఆధార
పడి ఉన్నారు. గిబియా వద్ద వారి మనుష్యులు కొందరు
దాగి ఉన్నారు. [37]దాగివున్న మనుష్యులు గిబియా
నగరం వైపు హడావిడిగా పోయారు. వారు అటూ
ఇటూ వెళ్లి నగరంలో వున్న ప్రతివాడినీ కత్తులతో
చంపివేశారు. ఇప్పుడు [38]ఇశ్రాయేలు మనుష్యులు
దాగివున్న మనుష్యుల ద్వారా ఒక యుక్తిపన్నారు.
దాగివున్న మనుష్యులు ఒక ప్రత్యేక సూచన పంపాలి.
ఒక పెద్ద పొగమేఘం వారు కల్పించాలి.
[39-41]బెన్యామీను సైన్యం ఇశ్రాయేలు సైనికుల్ని
సుమారు ముప్పై మందిని చంపారు. అందువల్ల, బెన్యా
మీను మనుష్యులు ఇలా అన్నారు; "మునుపటివలె
మేము జయిస్తున్నాము" కాని అప్పుడు ఒక పెద్ద పొగ
మేఘం నగరంనుండి వెలువడింది. బెన్యామీను మను
ష్యులు చుట్టూ తిరిగి పొగచూశారు. నగరమంతా దగ్ధ
మవుతోంది. అప్పుడు ఇశ్రాయేలు సైన్యం పరుగిడి
పోవడం ఆపివేశారు. వారు చుట్టు తిరిగి యుద్ధం చేయ
సాగారు. బెన్యామీను ప్రజలు భయపడ్డారు. అప్పుడు
తమకు భయంకరమైన విషయం జరిగినట్లుగా వారు
తెలుసుకున్నారు.
[42]అందువల్ల బెన్యామీను సైన్యం ఇశ్రాయేలు
సైన్యంనుంచి పారిపోయింది. వారు ఎడారివైపు పారి
పోయారు. కాని వారు యుద్ధం నుంచి తప్పించు
కొనలేకపోయారు. ఇశ్రాయేలు మనుష్యులు తమ
నగరాలనుండి వెలుపలికి వచ్చి వారిని చంపారు. [43]ఇశ్రా
యేలు మనుష్యులు బెన్యామీను మనుష్యుల్ని చుట్టు
ముట్టారు. వారిని వెంటాడసాగారు. వారిని ఆగనీయ
కుండా తరిమి, గిబియా తూర్పు ప్రదేశాన వారిని
వారు ఓడించారు. [44]అందువల్ల బెన్యామీను సైన్యానికి
చెందిన పద్దెనిమిది వేలమంది బలవంతులైన వీర
యోధులు చంపబడ్డారు. [45]బెన్యామీను సైన్యం ఎడారి
వైపుకి పరుగెత్త సాగింది. రిమ్మోనుబండ వద్దకు వారు
పరుగెత్తారు. కాని ఇశ్రాయేలు సైన్యం బెన్యామీను
తాలూకు ఐదువేల మంది వీరుల్ని, రాజమార్గం పక్క
నున్న వారిని చంపింది. బెన్యామీను మనుష్యుల్ని వారు
వెంటాడసాగారు. గిదోము అనే పేరుగల ప్రదేశం దాకా
వారిని వెంటాడారు. అక్కడ ఇశ్రాయేలు సైన్యం బెన్యా
మీనుకు చెందిన రెండువేల మందిని చంపివేసింది.
[46]ఆనాడు, బెన్యామీను సైన్యంలోని ఇరవై ఐదు
వేల మంది మనుష్యులు చంపబడ్డారు. వారందరూ
తమ ఖడ్గాలతో వీరోచితంగా పోరాడారు.
[47]కాని బెన్యామీను తాలూకు ఆరువందల మంది
ఎడారికి పారిపోయారు. వారు రిమ్మోను బండ అనే
ప్రదేశంవరకు వెళ్లి, అక్కడ నాలుగు నెలల పాటు
ఉన్నారు. [48]ఇశ్రాయేలు మనుష్యులు బెన్యామీను
దేశానికి తిరిగి వెళ్లారు. ఎదురైన భూమిలోని ప్రతి
మనిషిని వారు చంపారు. వారు జంతువులనన్నిటినీ
చంపారు. తమకు కనిపించిన వాటిని అన్నిటినీ వారు
నాశనం చేశారు. వారు వచ్చిన ప్రతి నగరాన్నీ దగ్ధం
చేశారు.

## బెన్యామీను మనుష్యులు భార్యలను పొందటం

**21** మిస్పా వద్ద ఇశ్రాయేలు మనుష్యులు ఒక ప్రతిజ్ఞ
చేశారు. అది ఏదనగా, "బెన్యామీను కుటుంబ
వంశంవారికి చెందిన ఏ ఒక్కడూ కూడా ఇశ్రాయేలు
వాళ్ల కుమార్తెలను వివాహము చేసుకో నియ్యము."
[2]ఇశ్రాయేలు మనుష్యులు బేతేలు నగరానికి వెళ్లారు.
అక్కడ సాయంకాలంవరకు వారు దేవుని ముందు
కూర్చొని పెద్దగా ఏడ్చారు. [3]వారు దేవునితో,
"యెహోవా, నీవు ఇశ్రాయేలు ప్రజలకు దేవుడవు.
ఈ భయంకరమైన విషయం మాకెందుకు సంభవిం
చింది? ఎందుకుగాను ఇశ్రాయేలుకి చెందిన ఒక వంశపు
వారు తీసుకు వెళ్లబడ్డారు" అని అడిగారు.
[4]ఆ మరుసటి రోజు ఉదయం ఇశ్రాయేలు ప్రజలు
ఒక బలిపీఠం నిర్మించారు. ఆ బలిపీఠం మీద వారు
దహన బలులు, సమాధాన బలులు దేవునికి సమర్పిం
చారు. [5]"యెహోవా సమక్షంలో మమ్మల్ని కలుసు
కోవడానికి రాని ఇశ్రాయేలు వంశాలవారెవరైనా
ఉన్నారా?" అని ఇశ్రాయేలు ప్రజలు అడిగారు. ఒక
తీవ్రమైన ప్రతిజ్ఞ చేశారు కనుక, వారీ ప్రశ్న అడిగారు.
ఇతర ఇశ్రాయేలీయుల వంశముల నుండి మిస్పా నగరం

రాకుంటే వారిని హతమార్చుతామని వారు ప్రతిజ్ఞ
చేశారు. 6అప్పుడు బెన్యామీను ప్రజలైన తమ బంధు
వుల నిమిత్తం ఇశ్రాయేలు ప్రజలు విచారించారు. వారు
ఇలా అన్నారు; “నేడు ఇశ్రాయేలు నుండి ఒక వంశం
వేరు చేయబడింది. 7మేము యెహోవా సమక్షాన
ఒక ప్రతిజ్ఞ చేశాము. బెన్యామీను మనుష్యులలో ఎవ్వ
రినీ మా కుమార్తెలలో ఎవ్వరూ వివాహము చేసు
కోరాదని ప్రతిజ్ఞ చేశాము. అందువల్ల బెన్యామీను మను
ష్యులకు భార్యలు ఎలా కలుగుతారో మేము నిస్సందే
హంగా ఎలా చెప్పగలము? అని అన్నారు.

8అప్పుడు ఇశ్రాయేలు మనుష్యులు, “ఇశ్రాయేలుకి
చెందిన ఏ వంశం వారు మిస్పాకి రాలేదు? మేము
దేవుని సమక్షమున ఏకమైనాము. ఒక వంశం ఇక్కడికి
రాలేదని మేము అనుకొంటున్నాము” అని అడిగారు.
ఆ తర్వాత యాబేష్గిలాదు నగరం నుండి ఎవ్వరూ
వచ్చి ఇశ్రాయేలుకి చెందిన ఇతరుల్ని కలుసుకోలేదని
వారు కనుగొన్నారు. 9ఎవరున్నారో, ఎవరు లేరో అని
తెలుసుకునేందుకు ఇశ్రాయేలు మనుష్యులు అందరినీ
లెక్క పెట్టారు. యాబేష్గిలాదు నుండి ఎవ్వరూ అక్కడ
లేరని వారు కనుగొన్నారు. 10అందువల్ల ఇశ్రాయేలు
ప్రజలు పన్నెండువేల మంది సైనికులను యాబే
ష్గిలాదు నగరానికి పంపించారు. ఆ సైనికులతో వారు,
“యాబేష్గిలాదుకు వెళ్లండి. అక్కడున్న ప్రతి వ్యక్తినీ
స్త్రీలను పిల్లలను మీ ఖడ్గాలతో సంహరించండి. 11మీరు
ఇది చెయ్యాలి. యాబేష్గి లాదులో ఉన్న ప్రతి వ్యక్తినీ
మీరు చంపాలి. పైగా పురుషునితో సంభోగించిన ప్రతి
స్త్రీని కూడా మీరు చంపాలి. కాని పురుషునితో
సంభోగము ఎరగని ఏ స్త్రీనీ మీరు చంపకూడదు.”
అని చెప్పారు. 12ఆ పన్నెండువేల మంది సైనికులు
యాబేష్గిలాదులో నాలుగువందల మంది యువతులు
ఏ పురుషునితోను సంభోగించలేదని తెలుసుకున్నారు.
ఆ సైనికులు ఆ యువతులను షిలోహు ప్రాంతానికి
తీసుకు వచ్చారు. షిలోహు కనాను ప్రదేశంలో ఉన్నది.

13తర్వాత ఇశ్రాయేలు ప్రజలు బెన్యామీనువారికి
ఒక సందేశం పంపించారు. బెన్యామీను మనుష్యులతో
సంధి చేసుకుంటామన్నారు. బెన్యామీను మనుష్యులు
రిమ్మోను బండ అనేచోట ఉన్నారు. 14అందువల్ల
బెన్యామీను మనుష్యులు ఇశ్రాయేలుకి తిరిగి వచ్చారు.
ఇశ్రాయేలు ప్రజలు యాబేష్గిలాదులో తాము చంపని
స్త్రీలను వారికి ఇచ్చారు. కాని బెన్యామీను పురుషుల
కందరికీ సరిపడ్డ స్త్రీలు లేరు.

15బెన్యామీను పురుషుల్ని తలచుకుని ఇశ్రాయేలు
ప్రజలు విచారించారు. ఇశ్రాయేలుకి చెందిన ఇతర
వంశాల నుండి వాళ్లను యెహోవా వేరు చేసినందుకు
వారు విచారించారు. 16ఇశ్రాయేలు ప్రజల నాయకులు
ఇలా అన్నారు; “బెన్యామీను వంశానికి చెందిన స్త్రీలు
చంపబడ్డారు. ఇంకా సజీవులైఉన్న బెన్యామీను
పురుషులకు మేము భార్యల్ని ఎలా తేగలము? 17ఇంకా
సజీవులై ఉన్న బెన్యామీను పురుషులకు వారి వంశాలు
కొనసాగేందుకుగాను పిల్లలు ఉండాలి. ఇశ్రాయేలుకి
చెందిన ఒక వంశం మరణించకుండా ఉండడానికి ఇది
చేయబడాలి. 18కాని మేము మా కుమార్తెలు బెన్యా
మీను పురుషుల్ని వివాహము చేసుకోనియ్యము. మేము
ఈ ప్రతిజ్ఞ చేశాము, ‘ఎవరైనా సరే బెన్యామీను పురుష
నికి భార్యనిస్తే, అతనికి చెరుపు కలుగుతుంది.’ 19మాకో
ఆలోచన ఉంది. షిలోహు నగరంలో ఇప్పుడు యెహో
వాకు ఉత్సవం జరిగేకాలం. అక్కడ ప్రతి సంవత్సరం
ఉత్సవం జరుగుతుంది.” (షిలోహు నగరం బేతేలు
నగరానికి ఉత్తరాన ఉంది, బేతేలునుంచి షెకెముకు
పోయే బాటకి తూర్పున వుంది. అది లెబోనా నగరానికి
దక్షిణాన ఉంది.)

20అందువల్ల బెన్యామీను మనుష్యులకి పెద్దలు
(నాయకులు) తమ ఆలోచన తెలియజేశారు.

“వెళ్లండి ద్రాక్షతోటల్లో దాగుకొనండి. 21ఉత్స
వంలో షిలోహునుండి యువతులు వచ్చి నాట్యంలో
పాల్గొంటారు. వేచివుండండి. మీరే ద్రాక్షతోటల్లో దాగి
ఉన్నారో, అక్కడినుండి మీరు పారిపోండి. మీలో,
ప్రతి ఒక్కడూ షిలోహు నగరానికి చెందిన ఒక యువ
తిని తీసుకునివెళ్లాలి. ఆ యువతుల్ని బెన్యామీను నగరా
నికి తీసుకుని వెళ్లండి, వివాహము చేసుకోండి. 22ఆ
యువతుల తండ్రులుగాని సోదరులుగాని వెలుపలికి
వచ్చి, మాకు ఇది ఫిర్యాదు చేస్తారు. అప్పుడు,
‘బెన్యామీను పురుషుల ఎడల దయకలిగి ఉండండి.
వారు ఆ యువతుల్ని వివాహము చేసుకోనివ్వండి.
వారు ఈ స్త్రీలను తీసుకున్నారు. కాని మీతో యుద్ధం
చెయ్యలేదు. వారు స్త్రీలను తీసుకువెళ్లారు. అందువల్ల
దేవునివద్ద చేసిన ప్రతిజ్ఞ మీరు ఉల్లంఘించలేదు. వారికి
ఆ యువతులను ఇచ్చి వివాహము చెయ్యమని మీరు
ప్రతిజ్ఞ పట్టారు. బెన్యామీను పురుషులకు మీరా
యువతులను యివ్వలేదు. వారు మీ వద్దనుంచే ఆ
యువతుల్ని తీసుకువెళ్లారు. అందువల్ల మీరు మీ
ప్రతిజ్ఞ తప్ప లేదు.’” అన్నారు.

23అందువల్ల బెన్యామీను వంశపు మనుష్యులు
చేసినది అదే. ఆ యువతులు నాట్యం చేసేటప్పుడు,
ప్రతి పురుషుడూ వారిలో ఒక్కరిని పట్టుకున్నాడు.
ఆ యువతులను వారు తీసుకుపోయి, వివాహము
చేసుకున్నారు. వారు తమ దేశానికి తిరిగి వెళ్లిపోయారు.
ఆ దేశంలో బెన్యామీను మనుష్యులు మళ్లీ నగర
నిర్మాణం చేసుకున్నారు, వారా భూమిలోనే నివ
సించారు. 24తర్వాత ఇశ్రాయేలు మనుష్యులు ఇళ్లకు
వెళ్లిపోయారు. వారు తమ దేశానికి, తమ వంశం వద్దకు
వెళ్లారు. 25ఆ రోజుల్లో ఇశ్రాయేలు మనుష్యులకు రాజు
లేడు. అందువల్ల ప్రతి ఒక్కడూ తనకు ఏది సరి అని
తోచిందో, అదే చేశాడు.

# రూతు

### యూదాలో

1 పూర్వం న్యాయమూర్తులు ఏలిన కాలంలో, తినటా
నికి చాలినంత ఆహారం దొరకని కరువు రోజులు
వచ్చాయి. ఎలీమెలెకు అనే ఒకతను యూదాలోని
బేత్లెహేము వదలిపెట్టి, అతను, అతని భార్య, అతని
యిద్దరు కుమారులు మోయాబు కొండ ప్రదేశంలో
బతకడానికి వెళ్లారు. 2అతని భార్య పేరు నయోమి,
అతని యిద్దరు కుమారుల పేర్లు మహ్లోను, కిలి
యోను. వాళ్లు యూదాలోని బేత్లెహేములో ఎఫ్రాతా
వంశానికి చెందినవాళ్లు. ఈ కుటుంబం మోయాబు
లోని కొండ ప్రదేశానికి ప్రయాణము కట్టి అక్కడే
ఉండిపోయారు.
3ఆ తరువాత నయోమి భర్త ఎలీమెలెకు చని
పోయాడు. అందుచేత నయోమి, ఆమె యిద్దరు
కుమారులు మాత్రమే మిగిలారు. 4మోయాబు దేశపు
స్త్రీలను ఆమె కుమారులు పెళ్లాడారు. ఒకని భార్య
పేరు ఓర్పా, ఇంకొకని భార్య పేరు రూతు. మోయా
బులో సుమారు పది సంవత్సరాలు వాళ్లు నివసించారు.
5అంతలో మహ్లోను, కిలియోను కూడా చని
పోయారు. అందుచేత నయోమి ఇటు భర్తగాని, అటు
కుమారులుగాని లేని ఒంటరిదయిపోయింది

### నయోమి ఇంటికి వెళ్లిపోతుంది

6దేవుడు తన ప్రజలకు సహాయం చేసినట్టు,
ఆయన తన ప్రజలకు (యూదాలో) ఆహారం దయ
చేసినట్టు మోయాబు కొండదేశంలో నయోమి
విన్నది. అందుచేత నయోమి మోయాబు కొండ
దేశము విడిచిపెట్టి తిరిగి తన ఇంటికి వెళ్లి పోవాలని
తీర్మానించుకుంది. ఆమె కోడళ్లు కూడా ఆమెతోనే
వెళ్లిపోయేందుకు తీర్మానించుకున్నారు. 7అంతవరకు
బతుకుతున్న చోటు విడిచిపెట్టేసి మళ్లీ యూదా
దేశము పోయేదారి పట్టి ప్రయాణము మొదలు
పెట్టారు.
8అప్పుడు నయోమి తన కోడళ్లు యిద్దరితో ఇలా
అన్నది: “మీరు ఎవరి పుట్టింటికి వారు వెళ్లండి. మీరు
చనిపోయిన నా ఇద్దరు కుమారులపైన, నాపైన ఎంతో
దయ చూపెట్టారు. అలాగే యెహోవా మీపైన దయ
చూపెట్టాలని కోరుకుంటున్నాను. 9మీరు ఇద్దరూ మళ్లీ
పెళ్లాడి మీ భర్తలతో సుఖంగా ఉండేందుకు ఆ దేవుడే
మీకు సహాయం చేయాలనేదే నా ప్రార్థన.” నయోమి
తన యిద్దరు కోడళ్లను ముద్దు పెట్టుకుంది. దానితో
అందరూ ఏడ్వటం మొదలుపెట్టారు.
10ఆ కోడళ్లు, “మేమూ నీతోనే వచ్చేస్తాము. నీ
కుటుంబంలోనే ఉంటాము” అన్నారు.
11కాని నయోమి ఇలా అన్నది: “నా కుమార్తెలారా!
మీ పుట్టిళ్లకు వెళ్లిపొండి. మీరు నాతో రావడం దేనికి?
మిమ్మల్ని పెళ్లిచేసుకునేందుకు నా దగ్గర ఇంకెవరూ
కుమారులు లేరు. 12ఇంటికి వెళ్లిపొండి. ఇంకో భర్తను
కట్టుకునేందుకు నేను మరీ ముసలిదానను, ఒకవేళ
నాకు మళ్లీ పెళ్లవుతుందని నేను అనుకున్నా లాభం
లేదు. ఎందుచేతనంటే ఒకవేళ నేను ఈ రాత్రికి రాత్రే
గర్భవతినై నాకు ఇద్దరు కుమారులు పుట్టినా 13మీరు
వారిని పెండ్లాడాలంటే, వాళ్లు పెద్ద వాళ్లయ్యేంతవరకు
మీరు వాళ్లకోసం వేచి ఉండాలి. అన్నాళ్లూ మీరు పెళ్లి
చేసుకోకుండా ఆపుజేయడం నాకు మరీ విచారం.
ఎందుకంటే, యెహోవా హస్తము నాకు విరోధముగా
ఎన్నో పనులు చేసింది.”
14అప్పుడు ఆ స్త్రీలు మరింతగా ఏడ్చేశారు. ఓర్పా
నయోమిని ముద్దు పెట్టుకుని వెళ్లిపోయింది. కాని
రూతు ఆమెను హత్తుకుని ఉండిపోయింది.
15నయోమి అన్నది: “చూడమ్మా! నీ తోడికోడలు
తన సొంతవారి దగ్గరకు, వారి దేవుళ్ల దగ్గరకు తిరిగి
వెళ్లిపోయినది. నీవు కూడా అలానే చేయి.” 16కానీ
రూతు, “నిన్ను విడిచి నా స్వంతవాళ్ల దగ్గరకు వెళ్లి
పొమ్మని నన్ను బలవంతం చేయవద్దు. నేను నీతోనే
వస్తాను. నీవు ఎక్కడికి వెళ్తే, నేనూ అక్కడికి వెళ్తాను.
నీవు ఎక్కడవుంటే, నేనూ అక్కడే ఉంటాను. నీవారే
నావారు, నీ దేవుడే నా దేవుడు. 17నీవు ఎక్కడ చస్తే
నేనూ అక్కడే చస్తాను. అక్కడే సమాధి చేయబడ
తాను. నేను ఈ మాట నిలబెట్టు కోలేకపోతే, దేవుడే
నన్ను శిక్షిస్తాడు. చావుతప్ప ఇంకేదీ మనలను విడదీయ
లేదు.”

### స్వంత ఇంటికి

18రూతు తనతోనే రావాలనే పట్టుదలతో ఉన్నట్టు
గ్రహించి, నయోమి ఆమెతో వాదించడం మానివేసింది.

[19]నయోమి, రూతు కలసి బేత్లెహేము పురము వరకు
ప్రయాణము చేశారు. వారిద్దరూ బేత్లెహేము చేరగానే
ఆ ఊరివారంతా సంబరపడిపోయి, "ఈమె నయోమి
కదూ?" అని చెప్పుకున్నారు.
[20]"నన్ను (మధురము) నయోమి* అని పిలవ
కండి. నన్ను మారా* అని పిలవండి. ఎందుచేతనంటే,
సర్వశక్తిమంతుడైన దేవుడు నా బతుకును చాలా దుఃఖ
మయం చేశాడు" అన్నది నయోమి వారితో. [21]"నేను
వెళ్లినప్పుడు నాకు కావాల్సింది అంతా ఉంది, కాని
ఇప్పుడు ఏమీ లేనిదానిగా ఇంటికి తీసుకొచ్చాడు
దేవుడు. ఆయన నన్ను దుఃఖమయినిగా చేస్తే, మీరు
నన్ను సంతోషం* అని పిలవడం దేనికి? సర్వశక్తి
మంతుడైన దేవుడు నన్ను చాలా బాధపెట్టాడు."
[22]అలా నయోమి, ఆమె కోడలు రూతు
(మోయాబు స్త్రీ) మోయాబు దేశమునుండి తిరిగి
వచ్చేశారు. యవల పంటకోత మొదలవుతున్న
రోజుల్లో వీరిద్దరూ యూదాలోని బేత్లెహేము పురము
చేరుకున్నారు.

### రూతు బోయజును కలుసుకొనుట

2 బేత్లెహేములో నయోమి భర్త ఎలీమెలెకు వంశపు
వాడైన బోయజు అనే దగ్గర బంధువు ఒకతను
ఉండేవాడు. అతడు గొప్ప శక్తిసంపన్నుడు.
[2]ఒకరోజు రూతు నయోమితో, "నేను పొలాల్లోకి
వెళితే బాగుంటుంది. ఒకవేళ ఎవరైనా నామీద జాలిపడి
తన పొలంలో తన వెనుక పరిగె ఏరుకోనిస్తారేమో."
అన్నది.
[3]"సరే మంచిది బిడ్డా, అలాగే వెళ్లిరా" అన్నది
నయోమి. రూతు పొలం వెళ్లి, పంట కోస్తున్న పనివాళ్ల
వెనకాల తిరుగుతూ, వాళ్లు విడిచిపెట్టే పరిగె ఏరు
కుంటుంది. ఆ పొలము ఎలీమెలెకు వంశపువాడైన
బోయజుకు చెందినది.
[4]బోయజు బేత్లెహేమునుండి అప్పుడే పొలముకు
వచ్చాడు. "దేవుడే మీకు తోడుగా వుండును గాక!"
అంటూ తన పనివాళ్లను అభినందించాడు. పనివాళ్లు
"యెహోవా నిన్ను ఆశీర్వదించును గాక!" అంటూ
జవాబిచ్చారు. [5]అప్పుడు ఆయన రూతును చూసి
పనివాళ్లపైన నియమించబడ్డ పెద్ద సేవకునితో, "ఎవరి
అమ్మాయి ఈమె?" అని అడిగాడు బోయజు.
[6]"ఆమె మోయాబు కొండదేశము నుండి నయో
మితో పాటు వచ్చిన మోయాబు స్త్రీ. [7]పనివాళ్ల వెనక
తిరుగుతూ అక్కడక్కడ మిగిలిపోయిన కంకులను
(పరిగె) ఏరుకోనిమ్మని ప్రొద్దున్నే వచ్చి నన్ను అడి
గింది. అప్పట్నుండి ఆమె ఎడతెరిపి లేకుండా పని
చేస్తూనే వుంది. అదిగో ఆ కనబడేదే ఆమె ఇల్లు.
కాసేపు మాత్రము అక్కడ విశ్రాంతి తీసుకుంది"
అన్నాడు ఆ పెద్ద సేవకుడు.
[8]అప్పుడు బోయజు రూతుతో ఇలా అన్నాడు:
"నా కుమారీ వినుము. నీవు ఇక్కడే నా పొలంలోనే
వుండి పరిగె ఏరుకో. ఇంకెవ్వరి పొలానికీ వెళ్లాల్సిన
పనిలేదు. నా ఆడ కూలీలవెనకే పోతూవుండు. [9]మగ
వాళ్లు ఏ పొలములో కోత కోస్తుంటారో గమనిస్తూ
అక్కడ ఆడకూలీల వెనకే ఉండు. నిన్నేమి గొడవ
పెట్టొద్దని కుర్రాళ్లతో చెబుతాలే. దాహమైతే నా
మనుషులు తాగే పాత్రలోని నీళ్లే తాగు."
[10]రూతు నేల చూపులు చూస్తూ, నేలవరకు వంగి
బోయజుతో ఇలా అన్నది. "పరాయిదాననయిన నేను
నీ దృష్టిలో పడటం, నీ దయకు పాత్రురాలను కావడం
ఆశ్చర్యంగావుంది." [11]బోయజు జవాబిచ్చాడు: "నీ
అత్తగారు నయోమికి నీవు చేసిన సహాయాన్ని గూర్చి
నాకంతా తెలుసు. నీ భర్త చనిపోయిన తర్వాత కూడ
నీవు ఆమెకు సహాయము చేశావని నాకు తెలుసు.
అంతేకాదు, నీవు నీ తల్లిదండ్రులను నీ స్వదేశాన్ని
కూడా విడిచిపెట్టేసి, ఈ దేశము వచ్చేశావు. ఇక్కడి
వారెవ్వరూ నీకు తెలియదు. అయినా నయోమితో
వచ్చేశావు.
[12]నీవు చేసిన ఈ మంచి పనులన్నిటికీ యెహోవా
నీకు ప్రతిఫలము ఇస్తాడు. ఏ ఇశ్రాయేలు వారి దేవుని
దగ్గర ఆశ్రయము కోరి వచ్చావో ఆ యెహోవా
దేవుడు నీకు సకల ఐశ్వర్యాలు ప్రసాదించునుగాక!
మరియు ఆయన నిన్ను కాపాడునుగాక."
[13]"అయ్యా! నేను కేవలం ఒక పనిమనిషిని, మీ
పని మనుషుల్లో కనీసం ఒకదానితో సమానము కాను
నేను. అయినా నన్ను గూర్చి ఎంతో దయగా మాట్లాడి,
నన్ను ఆదరించారు. మీ దయ నాకు ఉంటే చాలు"
అన్నది రూతు.
[14]మధ్యాహ్న భోజనము వేళ బోయజు, "ఇక్కడికి
రా! మా భోజనము తిను. రొట్టెను ద్రాక్షారసములో
ముంచుకో" అన్నాడు రూతుతో.
కనుక రూతు పనివాళ్లతో కలిసి కూర్చుంది.
బోయజు ఆమెకు కొన్ని పేలాలు పెట్టాడు. రూతు
తృప్తిగా భోజనము చేసిన తర్వాత ఇంకా కొంచెము
మిగిలాయి.
[15]తరువాత రూతు లేచి మళ్లీ పనికి వెళ్లింది.
బోయజు తన పనివారితో, "పనల మధ్యకూడ ఆమెను
ఏరుకోనివ్వండి. ఆమెను అభ్యంతర పెట్టకండి.
[16]ఆమె కోసం కొన్ని కంకులు పనల్లోనుంచి జార
విడుస్తూ, ఆమె ఏరుకొనేందుకు వాటిని విడిచిపెట్టండి,
అలా ఆమె పనిని సులభం చేయండి." అని చెప్పాడు.

---

**నయోమి** అనే మాటకు అర్థం 'సంతోషం' (మధురము).

**మారా** అంటే 'చేదు' లేక 'దుఃఖం' అని అర్థం.

**సంతోషం** అంటే అది ఆమె పేరు. నయోమికి అర్థం.

### నయోమి బోయజును గురించి వినుట

[17]సాయంత్రంవరకు రూతు పొలాల్లో పని చేసింది.
తర్వాత ఆమె ఆ కంకులను దుళ్లగొట్టింది. అవి
సుమారు ఒక తూమెడు యవల గింజలయ్యాయి.
[18]రూతు తాను ఏరుకొన్న గింజలను తన అత్తకు
చూపెట్టేందుకని ఊరిలోనికి మోసుకొనిపోయింది. ఆ
మధ్యాహ్న భోజనములో మిగిలినదానిని కూడ ఆమెకు
ఇచ్చింది.
[19]ఆమె అత్త ఇలా అన్నది: "ఈ గింజలన్నీ ఎక్కడ
ఏరుకున్నావు? నీవు ఎక్కడ పని చేశావు? నిన్ను
గమనించినవాడిని దేవుడు దీవించునుగాక."

రూతు తన అత్తతో, "ఈ వేళ బోయజు అనే ఆయన దగ్గర నేను పని చేశాను" అని చెప్పింది.

"యెహోవా అతనిని ఆశీర్వదించునుగాక! బ్రతికిన
వాళ్లకు, చచ్చినవాళ్లకు అందరికీ దేవుడు దయ చూపె
డుతూనే వుంటాడు." అని తన కోడలితో చెప్పింది
నయోమి. [20]"బోయజు మన బంధువే, మనలను
కాపాడేవాళ్లలో బోయజు ఒకడు" అని తన కోడలితో
చెప్పింది నయోమి.
[21]అప్పుడు, "మళ్లీ వచ్చి పని చేసుకోమని, కోత
పూర్తి అయ్యేవరకు తన పనివాళ్లతో కలిసే పని చేసు
కోమన్నాడు బోయజు" అని చెప్పింది రూతు.
[22]దానికి నయోమి తన కోడలు రూతుతో ఇలా
చెప్పింది: "అతని ఆడ కూలీలతోనే కలిసి పని చేసు
కోవటం మంచిది నీకు. ఇంకేదైనా పొలంలో పనిచేస్తే
మరే మగాడైనా నిన్ను బాధించవచ్చు." [23]అందుచేత
రూతు బోయజుగారి ఆడ కూలీలనే సన్నిహితంగా
వెంబడిస్తూ, పనిచేసుకొంటూ పోయింది. యవలకోత
పూర్తయ్యేవరకు ఆమె గింజలు ఏరుకొంది. గోధుమ
కోత అయ్యేంతవరకు కూడ ఆమె అక్కడే పనిచేసింది.
రూతు తన అత్తగారు నయోమితోబాటే కలిసి
వుంటోంది.

### కళ్లము దగ్గర రూతు, బోయజు

3 రూతు అత్త నయోమి, "చూడు బిడ్డా, ఒకవేళ నీ
కోసం నేనొక మంచి భర్తను చూస్తే బాగుం
టుందేమో, అది నీకు క్షేమం. [2](ఒక వేళ బోయజే
తగినవాడేమో) బోయజు మనకు చాలా దగ్గర
బంధువు. అతని దగ్గర పనిచేసే స్త్రీలతో నీవూ పని
చేసావు. ఈ రోజు రాత్రి అతడు కళ్లము దగ్గర పని
చేస్తాడు. [3]నీవు పోయి స్నానం చేసి బట్టలు కట్టుకో,
మంచి బట్టలు కట్టుకొని కళ్లము దగ్గరకు వెళ్లు, అయితే,
బోయజు భోజనము చెయ్యటము అయ్యేంత వరకు
అతనికి కనబడకు. [4]అతడు భోజనము చేసిన తర్వాత
పండుకొని విశ్రాంతి తీసుకుంటాడు. అతను ఎక్కడ
పండుకుంటాడో గమనిస్తూ ఉండు. అక్కడికి వెళ్లి,
అతని కాళ్లమీదున్న దుప్పటి తొలగించి, అక్కడే అతని
దగ్గరే పండుకో. అప్పుడు నీవేమి చేయాలో (పెళ్లి
గూర్చి) అతనే నీకు చెప్తాడు."
[5]"నీవు చెప్పినట్టే చేస్తా" అని జవాబిచ్చింది రూతు.
[6]రూతు కళ్లము దగ్గరకు వెళ్లింది. ఏమి చేయుమని
అత్త చెప్పిందో అదంతా చేసింది రూతు. [7]తిని తాగడం
అయినతర్వాత బోయజు బాగా తృప్తిగా ఉన్నాడు.
ధాన్యంకుప్ప దగ్గర పండుకునేందుకు వెళ్లాడు
బోయజు. అప్పుడు రూతు మెల్లమెల్లగా వెళ్లి అతని
కాళ్లమీద దుప్పటి తొలగించింది. అతని పాదాల దగ్గరే
ఆమె పండుకొంది.
[8]సుమారు మధ్యరాత్రి బోయజు పక్కకు దొర్లాడు
(నిద్రలోనుంచి మేల్కొన్నాడు) అతను చాలా ఆశ్చర్య
పోయాడు. తన పాదాల దగ్గర ఒక స్త్రీ పండుకొని
వుంది. [9]"ఎవరు నీవు" అన్నాడు బోయజు.

"నీ సేవకురాలనైన రూతును. నన్ను కాపాడాల్సింది నీవే. నీ దుప్పటి నా మీద కప్పు" అన్నది రూతు.

[10]అందుకు బోయజు, "నా కుమారీ! యెహోవా
నిన్ను దీవించునుగాక! నాపై నీవు చాలా దయ చూపె
ట్టావు. మొదట్లో నీవు నయోమి మీద చూపెట్టిన
దయకంటె, ఇప్పుడు నామీద చూపెట్టిన దయ చాలా
ఎక్కువ. నీవు పెళ్లి చేసుకొనేందుకు ధనవంతుడో,
పేదవాడో మరో యువకుడిని చూసుకుని ఉండా
ల్సింది, కాని నీవు అలా చేయలేదు. [11]కనుక చూడు
బిడ్డా! నీవేమి భయపడకు. నీవు అడిగింది నేను చేస్తా.
నీవు చాలా మంచిదానివని మన ఊళ్లో అందరికీ తెలుసు.
[12]నేను నీకు చాలా దగ్గర బంధువును అనడం కూడ
సత్యమే. అయితే, నాకంటే నీకు మరింత దగ్గర బంధువు
ఒకాయన ఉన్నాడు.
[13]ఈ రాత్రికి నీవు ఇక్కడ ఉండు. ఆయన నీకేమైనా
సహాయము చేస్తాడేమో ఉదయాన్నే తెలుసు
కుందాము. నీకు సహాయము చేయటానికి ఆయన
నిర్ణయం తీసుకొంటే మంచిదే. సహాయం చేయటానికి
ఆయన నిరాకరిస్తే మాత్రం దేవుడు సజీవుడు గనుక
నేనే నిన్ను పెళ్లాడి ఎలీమెలెకు భూమిని నీ కోసము
మళ్లీ కొనియిస్తాను. ఇది నా వాగ్దానం. కనుక తెల్లారే
వరకు ఇక్కడే పడుకో."
[14]అందుచేత తెల్లారేవరకు అతని కాళ్ల దగ్గరే పడు
కొనింది రూతు. తెల్లవారుఝామునే ఒకరినొకరు
గుర్తించే పాటి వెలుగు రాకముందే ఆమె లేచివెళ్లి
పోయింది.

"రాత్రి నీవు నా దగ్గరకు ఇక్కడికి వచ్చిన సంగతి రహస్యముగానే ఉంచుదాము" అన్నాడు బోయజు ఆమెతో.

[15]"నీ దుప్పటి నా దగ్గరకు తీసుకురా, దాన్ని తెరచి
పట్టుకో" అన్నాడు బోయజు. అందుచేత రూతు తన
దుప్పటి తెరచి పట్టుకుంది. ఆమె అత్తగారైన నయో
మికి కానుకగా ఒక తూమెడు యవలు కొలిచి ఇచ్చాడు

బోయజు. ఆ దుప్పటిని మూట కట్టి ఆమె భుజంమీద
పెట్టి, బోయజు ఊళ్లోకి వెళ్లిపోయాడు. 16రూతు
తన అత్త నయోమి ఇంటికి వెళ్లిపోయింది. నయోమి
(గుమ్మం దగ్గరకు వెళ్లి) "ఎవరది" అని అడిగింది.
(రూతు ఇంట్లోకి వెళ్లి) తనకోసము బోయజు చేసిం
దంతా చెప్పింది. 17"నీకు కానుకగా ఇమ్మని బోయజు
ఈ యవలు నాకు ఇచ్చాడు. నీ కోసము కానుక
తీసుకుపోకుండా నేను ఇంటికి వెళ్లకూడదన్నాడు
బోయజు" అని చెప్పింది రూతు.

18"నా కుమారీ, ఏమి జరుగుతుందో తెలిసేంత
వరకు నెమ్మదిగా ఉండు. బోయజు మాత్రం ఏమి
చేయాలో అది చేసేంతవరకు ఊరుకోడు. ఏమి జరిగేదీ
ఈరోజు గడవక ముందే మనము వింటాము." అన్నది
నయోమి.

### బోయజు మరియు మరో బంధువు

4 పట్టణ ద్వారము దగ్గర ప్రజలు సమావేశమయ్యే
చోటికి బోయజు వెళ్లాడు. బోయజు చెప్పిన
దగ్గర బంధువు అటువైపు వచ్చేంతవరకు బోయజు
అక్కడే కూర్చున్నాడు. "మిత్రమా, ఇలా రా! ఇక్కడ
కూర్చో" అని బోయజు అతడిని పిల్చాడు.

2తర్వాత బోయజు కొందరు సాక్షులను పదిమంది
పెద్దలను సమావేశ పర్చాడు. వాళ్లను, "అక్కడ
కూర్చో"మని చెప్పినప్పుడు వాళ్లు కూర్చున్నారు.

3అప్పుడు నయోమి దగ్గరి బంధువుతో బోయజు
మాట్లాడాడు. "నయోమి మోయాబు దేశమునుండి
తిరిగి వచ్చేసింది. మన బంధువు ఎలీమెలెకు భూమిని
ఆమె అమ్మేస్తుంది. 4ఈ ఊరి ప్రజలయెదుట, నా
వాళ్ల పెద్దలయెదుట ఈ విషయం నీతో చెప్పాలని
నిర్ణయించుకున్నాను. ఈ భూమిని నీవు విడిపించా
లనుకుంటే నీవు కొనుక్కో. ఆ భూమిని విడిపించడం
నీకు ఇష్టము లేకపోతే నాకు చెప్పు, ఆ భూమిని విడి
పించాల్సిన బాధ్యత నీ తర్వాత నాదే అని నాకు తెలుసు.
ఆ భూమిని నీవు తిరిగి కొనకపోతే, నేను కొంటాను"
అంటూ బోయజు ఆ దగ్గరి బంధువుతో చెప్పాడు.

5"నయోమి దగ్గరనుండి నీవు ఆ భూమిని కొంటే,
చనిపోయిన వాని భార్య మోయాబు స్త్రీ నీదే అవుతుంది
(రూతుకు సంతానం కలిగినప్పుడు ఆ సంతానానికి
ఆ భూమి చెందుతుంది) ఆ విధంగా ఆ భూమి చని
పోయినవాని కుటుంబానికే చెంది ఉంటుంది"
అన్నాడు.

6ఆ దగ్గరి బంధువు జవాబుగా అన్నాడు: "నేను ఆ
భూమిని కొనలేను. ఆ భూమి నాకు చెందాల్సిందే,
కాని నేను దాన్ని కొనలేను. ఒకవేళ నేను దాన్ని
కొనాల్సివస్తే, నా సొంత భూమిని పోగొట్టుకోవాల్సి
వస్తుందేమో. అందుచేత నీవు ఆ భూమిని కొనవచ్చు."
7(పూర్వము ఇశ్రాయేలులో ప్రజలు ఆస్తి కొన్నా విడి
పించినా ఒకడు తన చెప్పు తీసి అవతల వ్యక్తికి ఇచ్చే
వాడు. క్రయ విక్రయాలకు అది వారి రుజువు). 8"కనుక
ఆ భూమిని నీవే కొనుక్కో" అన్నాడు ఆ దగ్గరి
బంధువు. తర్వాత ఆ దగ్గరి బంధువు తన చెప్పుతీసి
దానిని బోయజుకు ఇచ్చాడు.

9అప్పుడు బోయజు పెద్దలతోను, ప్రజలందరి
తోను చెప్పాడు. "ఎలీమెలెకు, కిలియోను, మహ్లోను
లకు చెందిన దానినంతటినీ నయోమి దగ్గరనుండి
నేను కొంటున్నాను. దానికి నేడు మీరే సాక్షులు.
10నా భార్యగా ఉండేందుకు రూతును కూడా నేను
తీసుకొంటున్నాను. చనిపోయినవాని ఆస్తి అతని
కుటుంబానికే ఉండాలని నేను ఇలా చేస్తున్నాను. ఈ
విధంగా చేయటంవల్ల చనిపోయిన వాని పేరు అతని
దేశానికి, కుటుంబానికి దూరముకాకుండా ఉంటుంది.
ఈ వేళ మీరంతా దీనికి సాక్షులు."

11 పట్టణద్వారము దగ్గర ఉన్న పెద్దలు, ప్రజలు
దీనికి సాక్షులు.

"ఈ స్త్రీ నీ ఇంటికి వచ్చేస్తుంది యెహోవా
ఈమెను రాహేలు, లేయా వలె చేయును
గాక! రాహేలు, లేయాలు ఇశ్రాయేలు వంశ
పుత్రదాతలు ఎఫ్రాతాలో నీవు శక్తిమంతు
డవు అవుదువు గాక. బెత్లెహేములో నీవు
ప్రఖ్యాత పురుషుడవవుదువు గాక !
12 "తామారు యూదా కుమారుడు పెరెసును
కన్నది అతని కుటుంబం చాలా గొప్పది
అలాగే రూతు ద్వారా అనేక మంది పిల్లలను
యెహోవా నీకు ప్రసాదించును గాక! నీ
కుటుంబము కూడ అతని కుటుంబంలాగే
గౌరవప్రదమవును గాక!"

13బోయజు రూతును పెళ్లి చేసుకున్నాడు.
యెహోవా ఆమెను గర్భవతిని కానిచ్చినప్పుడు ఆమె
ఒక కుమా రుని కన్నది. 14ఆ ఊరిలో స్త్రీలు నయో
మితో నిన్ను ఆదుకొనేందుకు (బోయజు) ఇతడిని
ఇచ్చిన యెహో వాని స్తుతించు. అతడు ఇశ్రాయేలులో
ప్రఖ్యాతి నొందును గాక! అనిరి. మరియు వారు,

15 "అతడే నీకు బలాన్ని యిచ్చి, నీ వృద్ధా
ప్యంలో నిన్ను కాపాడును గాక! నీ కోడలు
వల్ల ఇదంతా జరిగింది. ఆమె నీ కోసం ఈ
పిల్లవానిని కన్నది. ఆమెకు నీవంటే చాలా
ప్రేమ. ఈమె ఏడుగురు కుమారులను కంటే
నీకు మేలు." అని అనిరి.

16నయోమి పిల్లవాడ్ని తీసుకొని, చేతుల్లో ఎత్తు
కొని ఆడించింది.

[17]ఆ స్త్రీలు, "ఈ పిల్లవాడు నయోమి కోసమే
పుట్టాడు" అన్నారు. ఇరుగు పొరుగువారు ఆతనికి
ఓబేదు అని పేరు పెట్టారు. ఓబేదు యెష్షయికి తండ్రి.
యెష్షయి రాజైన దావీదుకు తండ్రి.

### రూతు బోయజు కుటుంబము

18 పెరెసు కుటుంబ చరిత్ర ఇది. పెరెసు
హెస్రోనుకు తండ్రి.
19 హెస్రోను రాముకు తండ్రి. రాము అమ్మి
నాదాబుకు తండ్రి.
20 అమ్మినాదాబు నయసోనుకు తండ్రి.
నయసోను శల్మానుకు తండ్రి.
21 శల్మాను బోయజుకు తండ్రి. బోయజు
ఓబేదుకు తండ్రి.
22 ఓబేదు యెష్షయికి తండ్రి యెష్షయి
దావీదుకు తండ్రి.

# 1 సమూయేలు

### ఎల్కానా—అతని భార్యలు

1 ఎల్కానా అనబడే ఒక వ్యక్తి ఉండెను. అతను కొండల
దేశమైన ఎఫ్రాయిములోని రామతయి మ్సోఫీము
పట్టణవాసి. ఎల్కానా సూపు వంశస్థుడు. అతని తండ్రి
యెరోహాము. యెరోహాము ఎలీహు యొక్క కుమా
రుడు. ఎలీహు తండ్రి తోహు. తోహు ఎఫ్రాయిము
వంశపువాడైన సూపు కుమారుడు.
2ఎల్కానాకు ఇద్దరు భార్యలు. మొదటి భార్య పేరు
హన్నా. రెండవ భార్యపేరు పెనిన్నా. పెనిన్నా సంతాన
వతి. కాని హన్నాకు పిల్లలు కలుగలేదు.

### షిలోహులో ఆరాధన

3ప్రతి సంవత్సరము ఎల్కానా రామతయి మ్సోఫీము
నుండి షిలోహుకు వెళ్లి సర్వశక్తిమంతుడైన యెహో
వాను ఆరాధించేవాడు. అక్కడ ఆయన బలులు కూడ
అర్పించేవాడు. షిలోహులో హొఫ్నీ, మరియు ఫీనె
హాసు అనే వారిరువురు యెహోవా యాజకులుగా
ఉండిరి. వారిరువురూ ఏలీ అనే ప్రధాన యాజకుని
కుమారులు. 4ప్రతిసారీ బలిఅర్పణలో ఒక భాగం
ఎల్కానా తన భార్య పెనిన్నాకు ఇచ్చేవాడు. ఆమె
కుమారులకు కూడా భాగాలు ఇచ్చేవాడు. 5యెహోవా
హన్నాను గొడ్రాలుగా చేసినప్పటికీ, ఎల్కానా మాత్రం
ఆమెను బాగా ప్రేమించేవాడు గనుక ఆమెకు కూడ
ఎల్లప్పుడు అర్పణలో సమానభాగం ఇచ్చేవాడు.

### పెనిన్నా హన్నాను కలవర పెట్టుట

6పెనిన్నా అదేపనిగా హన్నాను పీడిస్తూ ఆమె మన
స్సుకు ఎంతో బాధ కలిగించేది. అందుకు కారణం
దేవుడు ఆమెను గొడ్రాలుగా చేయటమే. 7ప్రతి ఏటా
ఇదిలా జరుగుతూ వచ్చింది. షిలోహులోని యెహోవా
ఆలయానికి వెళ్లిన ప్రతిసారీ హన్నాను పెనిన్నా
కించపరిచేది. ఒకరోజు ఎల్కానా బలి అర్పించు
చుండగా హన్నా ఏడ్వసాగింది. భోజనం కూడా చేయ
లేదు. 8ఆమె భర్త ఎల్కానా, "ఎందుకు విచారిస్తున్నా
వనీ, ఎందుకు తినటం లేదనీ, ఎందుకు దుఃఖంతో
ఉన్నావనీ ఆమెను అడిగాడు. నీకు నేను ఉన్నాను,
నేను నీ భర్తను. పదిమంది కొడుకులకంటె నేను
నీకు ఎక్కువ" అని కూడ ఓదార్చాడు.

### హన్నా ప్రార్థన

9హన్నా అన్నపానాలు పుచ్చుకొన్న తర్వాత,
యెహోవాను ప్రార్థించటానికి వెళ్లింది. యెహోవా
పవిత్ర ఆలయ ద్వారం పక్కనే యాజకుడు ఏలీ
ఆసీనుడై వున్నాడు. 10హన్నా మిక్కిలి విచారంతో
ఉంది. చాలా దుఃఖించి దేవుణ్ణి ప్రార్థించింది. 11ఒక
పెద్ద మొక్కుబడి మొక్కింది. "సర్వశక్తిమంతుడవైన
యెహోవా దేవా, నేను ఎంత దుఃఖంలో వున్నానో
చూడు. నన్ను జ్ఞాపకముంచుకో! నన్ను మర్చిపోవద్దు.
నాకొక కుమారుని కలుగజేస్తే వానిని నేను తిరిగి నీ
సేవకై జీవితాంతం విడిచి పెడ్తాను. పైగా అతడు
మద్యపానాది* వ్యస నాలకు లోనుగాడు. అతడు నాజీర
వుతాడు. మరియు అతని తలవెంట్రుకలు ఎవ్వరూ
కత్తిపట్టి తీయరు"* అని కోరుకున్నది.
12ఆ విధంగా హన్నా ప్రార్థనలో ఉన్నంతసేపూ
ఏలీ ఆమె నోటిని గమనిస్తూ ఉన్నాడు. 13హన్నా
అంత రంగంలోనే ప్రార్థిస్తూవుంది. ఆమె పెదవులు
కదిలాయి గాని ఆమె గొంతు విప్పలేదు. అందుచేత
హన్నా మద్యం సేవించి వుంటుందని ఏలీ భావించాడు.
14"మద్యం తాగటం మానివేయి. నీ ద్రాక్షా రసాన్ని
పారబోయి" అని హన్నాతో ఏలీ చెప్పాడు.
15"లేదయ్యా, నేను ద్రాక్షారసం గాని, మరేదిగాని
సేవించలేదు. నేను నా సమస్యలన్నీ యెహోవాతో
చెప్పుకుంటున్నాను. 16నేనొక చెడ్డ స్త్రీనని తలంచ
వద్దు. ఇంత ఎక్కువ సేపు నేను ప్రార్థన చేస్తూ ఉన్నా
నంటే నాకు ఎన్నో బాధలు, అంతులేని దుఃఖం
ఉన్నాయి" అని హన్నా సమాధాన మిచ్చింది.
17అంతట ఏలీ, "నీవు సమాధానంతో వెళ్లు. ఇశ్రా
యేలు దేవుడు నీ కోర్కెలను నెరవేర్చునుగాక" అని
హన్నాను పంపివేశాడు.
18"నామీద దయ ఉంచండి" అని చెప్పి హన్నా

---

**మద్యపానాది** ప్రాచీన గ్రీకు అనువాదంలో ఈ మాటలు చేర్చబడ్డాయి.

**తలవెంట్రుకలు ... తీయరు** జుట్టు తీయననీ, మత్తు పానీయాలు ముట్టననీ శపథం చేసేవారిని నాజీరులని అంటారు. చూడు: సంఖ్యాకాండం 6:5. వీరు తమ జీవితాలను దేవుని సేవకు అంకితం చేసినవారు.

వెళ్లి, కొంచెం ఆహారం తీసుకున్నది. ఆ తరువాత
ఆమె మరెప్పుడూ అంత మనోవేదన చెందలేదు.
[19]మరునాటి తెల్లవారు ఝామునే ఎల్కానా కుటుంబ
సభ్యులంతా లేచి దేవుని ఆరాధించి రామాలో ఉన్న
తమ ఇంటికి వెళ్లిపోయారు.

### సమూయేలు జననం

ఎల్కానా తన భార్య హన్నాతో శయనించాడు.
హన్నాను యెహోవా జ్ఞాపకము చేసుకున్నాడు.
[20]మరు సంవత్సరం సమయానికి హన్నా గర్భవతియై,
ఒక కుమారుని కని తన కుమారునికి సమూయేలు*
అని పేరు పెట్టింది. “వీనిపేరు సమూయేలు. ఎందు
కంటే వీని కొరకు నేను యెహోవాని ప్రార్థించాను.
ఆయన నా ప్రార్థన ఆలకించాడు” అని అన్నది హన్నా.
[21]ఆ సంవత్సరం ఎల్కానా సకుటుంబంగా షిలో
హుకు వెళ్లి యెహోవాకు బలులు సమర్పించి మొక్కిన
మొక్కులు తీర్చేందుకు వెళ్లారు. [22]కాని ఈ సారి
ఎల్కానాతో హన్నా వెళ్లలేదు. “బిడ్డకు ఆహారం తినే
వయస్సు వచ్చినపుడు షిలోహుకు తీసుకుని వెళతాను.
అప్పుడతనిని దేవునికి అంకితం చేస్తాను. అతడు నాజీరు
అవుతాడు. అది మొదలు శాశ్వతంగా షిలోహులో ఉండి
పోతాడు,” అని హన్నా ఎల్కానాకు చెప్పింది.
[23]“నీకు ఎలా మంచిదనిపిస్తే అలా చేయి. కుమా
రుడు స్వయంగా ఆహారం తినగలిగే వయస్సు వచ్చే
వరకు ఇంటివద్దనే ఉండు. యెహోవా తన వాగ్దానం
నెరవేర్చునుగాక” అని ఆమె భర్త ఎల్కానా అన్నాడు.
తన కుమారుని పెంచుతూ హన్నా ఇంటి వద్దనే ఉండి
పోయింది.

### హన్నా సమూయేలును షిలోహులోని ఏలీ వద్దకు కొనిపోవటం

[24]బాలునికి స్వయంగా అన్నం తినే వయస్సు వచ్చి
నప్పుడు హన్నా అతనిని షిలోహులోని యెహోవా
ఆలయానికి తీసుకుని వెళ్లింది. తనతోపాటు మూడు
సంవత్సరాల గిత్తదూడను, అరబస్తా పిండిని, ఒక ద్రాక్షా
రసం సీసాను తీసుకుని వెళ్లినది.
[25]యెహోవా ముందరకు వెళ్లి ఎల్కానా యథా
విధిగా కోడెదూడను యెహోవాకు బలిగా వధించాడు.
అప్పుడు హన్నా బాలుని ఏలీ వద్దకు తీసుకుని వెళ్లింది.
[26]అప్పుడామె ఏలీతో, “అయ్యా, నీ జీవము తోడుగా
చెప్పుచున్నాను; నేను గతంలో నీ చెంత నిలబడి
యెహోవాకి ప్రార్థించిన స్త్రీనే, [27]ఈ బిడ్డ కోసమే
నేను ప్రార్థించాను. యెహోవా నా ప్రార్థన ఆలకించి
ఈ బిడ్డను నాకు ప్రసాదించాడు. [28]ఇప్పుడు ఈ
బిడ్డను తిరిగి యెహోవాకు ఇస్తున్నాను. వీడు జీవి
తాంతం యెహోవా సేవలో నిమగ్నమై ఉంటాడు”
అని అన్నది.
హన్నా తన కుమారుని అక్కడ వదిలి* యెహో
వాను ఆరాధించింది.

### హన్నా కృతజ్ఞతలు

2 హన్నా దేవుని ఇలా కీర్తించెను:

“నా హృదయం దేవునిలో పరవశించి పోతూ
వుంది. నా దేవుని ద్వారా నాకు బలము కలిగెను
నా శత్రువులను నేను పరిహసించగలను. నా
విజయానికి మురి సిపోతున్నాను.
2 “యెహోవా వంటి మరో పరిశుద్ధ దేవుడు లేడు.
నీవు తప్ప మరో దేవుడు లేడు! మన దేవుని
వంటి బండ* మరొకడు లేడు.
3 ఇక డంబాలు పలుకవద్దు! గర్వపు మాటలు కట్టి
పెట్టండి! ఎందువల్లనంటే యెహోవా దేవునికి
అంతా తెలుసు దేవుడు మనుష్యులను నడిపి
స్తాడు, వారికి తీర్పు తీరుస్తాడు.
4 మహా బలశాలుల విల్లులు విరిగిపోతాయి! బల
హీనులు బలవంతులవుతారు!
5 ఇది వరకు సమృద్ధిగా భోజనం ఉన్నవారు
భోజనం కోసం పని చేయాలి ఇప్పుడు. కాని
ఇదివరకు ఆకలితో కుమిలేవారికి ఇప్పుడు సమృ
ద్ధిగా భోజనం! గొడ్రాలుకు ఏడుగురు పిల్లలు!
సంతానవతికి పుత్రనాశనంతో దుఃఖపాటు.
6 యెహోవా జనన మరణ కారకుడు! దేవుడు
నరులను చావుగోతికి తోసివేయ గలడు. ఆయన
వారిని మరల బతికించగలడు. యెహోవా
కొందరిని పేద వారిగా చేస్తాడు,
7 మరికొందరిని ధనవంతులుగా చేస్తాడు. పతనా
నికీ, ఉన్నతికీ కారకుడు యెహోవాయే.
8 మట్టిలో ఉండే వారిని యెహోవా ఉన్నతికి
తీసుకొని వస్తాడు. ఆయన వారి దుఃఖాన్ని నిర్మూ
లిస్తాడు. యెహోవా పేదవారిని ప్రముఖులుగా
చేస్తాడు. యువ రాజుల సరసన కూర్చుండ
బెడ్తాడు. యెహోవా వారిని ఘనులతోబాటు
ఉన్నతాసీనులను చేస్తాడు. పునాదుల వరకూ
ఈ సర్వజగత్తూ యెహోవాదే! యెహోవా
ఈ జగత్తును ఆ పునాదులపై నిలిపాడు.

---

**సమూయేలు** అతని పేరు “దేవుడు” అని లేక “అతడు దేవునినుండి” వచ్చాడు అని అర్థం. కానీ హెబ్రీ భాషలో “అడుగుట” అని అర్థంవచ్చే పదాల గారడి ఉంది.

**తన ... వదిలి** ప్రాచీన గ్రీకు ప్రతులలో ఈ వాక్యం పొందుపర్చబడింది.

**బండ** ఇది దేవునికి ఒక పేరు.“దుర్గం” అని “భద్రతా స్థలం” అని ఇది సూచిస్తుంది.

9 యెహోవా తన పరిశుద్ధ ప్రజలను కాపాడు
తాడు. వారు పడిపోకుండా ఆయన వారిని కాపా
డుతాడు. కాని దుష్టులు నాశనం చేయబడతారు.
వారు అంధకారంలో పడిపోతారు. వారి శక్తి, వారు
జయించేందుకు తోడ్పడదు.
10 యెహోవా తన శత్రువులన నాశనం చేస్తాడు.
సర్వోన్నతుడైన దేవుడు ప్రజల గుండెలదిరేలా
పరలోకంలో గర్జిస్తాడు. సర్వలోకానికీ
యెహోవా తీర్పు ఇస్తాడు! యెహోవా తన
రాజుకు శక్తి ఇస్తాడు. ఆయన నియమించిన
రాజును బలవంతునిగా చేస్తాడు."

11తరువాత ఎల్కానా తన కుటుంబంతో కలిసి
రామాలో తన ఇంటికి వెళ్లిపోయాడు. బాలుడు
మాత్రం యాజకుడైన ఏలీ పర్యవేక్షణలో షిలోహులో
యెహోవా సేవలో వుండిపోయాడు.

## ఏలీ దుష్ట సంతానం—హొఫ్నీ, ఫీనెహాసు

12ఏలీ కుమారులు చెడ్డవారు. వారు యెహోవాను
లక్ష్యపెట్టలేదు. 13యాజకులు ప్రజల పట్ల ఎలా ప్రవ
ర్తించాలో వారు చింత చేయలేదు. ప్రజలు వచ్చిన
ప్పుడు యాజకులు ఇలా చేయాలి. ఒక వ్యక్తి బలి
ఇచ్చిన ప్రతిసారీ ఆ మాంసాన్ని యాజకుడు ఒక
కుండలో ఉడకబెట్టాలి. అప్పుడు యాజకుని సేవకుడు
మూడు మొనలు గల ఒక కొంకి గరిటెతో రావాలి.
14యాజకుని సేవకుడు గరిటెను ఉడుకుతోన్న బాణ
లిలో గుచ్చి తీయాలి. అప్పుడా గరిటె కొనలకు
పట్టుకొని ఎంత మాంసం వస్తుందో అది మాత్రం
యాజకునికి చెందుతుంది. బలులు ఇవ్వటానికి షిలో
హుకు వచ్చిన ఇశ్రాయేలు ప్రజలకు యాజకులు చేయ
వలసిన విధి ఇదే.
15కాని ఏలీ కుమారులు ఆ పద్ధతిని పాటించలేదు.
కొవ్వును బలిపీఠం మీద దహించక మునుపే వారి
సేవకులు బలులు ఇచ్చేవారి వద్దకు వెళ్లి "యాజకుని
వంటకానికై కొంత మాంసం ఇవ్వమనీ, ఉడుకబెట్టిన
మాంసం మీనుండి ఆయన తీసుకోడని అనేవారు."
16అయితే బలి ఇచ్చే వ్యక్తి గనుక కొవ్వును
యథావిధిగా, "ముందు దహించిన తరువాత మీ ఇష్టం
వచ్చినంత తీసుకోమని" అంటే యాజకుని సేవకుడు
ఒప్పుకొనేవాడు కాదు. "అలా కాదు, ముందుగా
మాంసం ఇవ్వండి. మీరు నాకు ఇవ్వకపోతే, బల
వంతాన తీసుకోవలసి వస్తుంది!" అని బదులు చెప్పే
వాడు.
17ఈ విధంగా, యెహోవాకు అర్పించబడిన అర్ప
ణలను వారు లక్ష్యపెట్టలేదని హొఫ్నీ, ఫీనెహాసులు
వ్యక్తం చేసారు. ఇది చాలా చెడ్డపాపం. 18కానీ సమూ
యేలు యెహోవాను సేవించాడు. సమూయేలు
ఏఫోదు* ధరించిన ఒక బాల సహాయకుడు. 19ప్రతి
సంవత్సరం సమూయేలు తల్లి అతనికై ఒక చిన్న
అంగీ తయారుచేసి, తన భర్తతో షిలోహుకు బలి
అర్పించేందుకు వెళ్లినపుడు ఆ అంగీని సమూయేలు
కొరకు తీసుకొని వెళ్లేది.
20ఎల్కానాను, అతని భార్యను ఏలీ ఆశీర్వదించే
వాడు: "హన్నా ప్రార్థన ఫలితంగా పుట్టిన వానిని మరల
యెహోవా సేవకై ఇచ్చారు గనుక అతని స్థానాన్ని
భర్తీ చేసే విధంగా హన్నాద్వారా యెహోవా మీకు
పిల్లలను కలుగజేయుగాక."
తర్వాత ఎల్కానా, హన్నా ఇంటికి వెళ్లిపోయారు.
21దేవుని అనుగ్రహం వల్ల హన్నాకు క్రమేపీ ముగ్గురు
కుమారులు, ఇద్దరు కుమార్తెలు కలిగారు. బాలకుడైన
సమూయేలు యెహోవా ఆలయములో దినదినము
మంచి స్థితికి ఎదుగు చుండెను.

## కుమారుల విషయంలో ఏలీ అసమర్థత

22ఏలీ చాలా వృద్ధుడై పోయాడు. షిలోహుకు వచ్చే
ఇశ్రాయేలీయులందరి యెడల తన కుమారులు
చేస్తున్న పనులను గూర్చి అతడు నిరంతరం వింటూనే
వున్నాడు. పైగా సన్నిధి గుడారపు ద్వారం వద్ద పరి
చర్యలు చేసే స్త్రీలతో తన కుమారులు శయ
నిస్తున్నారని కూడా ఏలీ విన్నాడు.
23ఏలీ తన కుమారులతో, "మీరు చేసిన చెడ్డ కార్యా
లను గూర్చి ఇక్కడ ప్రజలు నాతో చెప్పారు. మీరెం
దుకు ఈ చెడ్డపనులు చేస్తున్నారు? 24నా కుమారు
లారా, ఈ చెడ్డపనులు చేయకండి. యెహోవా ప్రజలు
మీ గురించి చెడుగా చెప్పుకుంటున్నారు. 25ఒక వ్యక్తి
మరో వ్యక్తి పట్ల అపచారం చేస్తే, దేవుడు ఒక వేళ
అతనికి సహాయం చేయవచ్చు. అయితే ఒక వ్యక్తి
యెహోవా పట్ల అపచారం చేస్తే ఇక వానికి దిక్కెవరు?"
అని అడిగాడు.
అయినా ఏలీ కుమారులు తండ్రి సలహాను లెక్క
చేయలేదు; కాబట్టి యెహోవా ఏలీ కుమారులను
చంపటానికి నిర్ణయించాడు. 26బాలుడైన సమూయేలు
మాత్రం దేవుని దయయందును, మనుష్యుల దయ
యందును పెరుగుతూ వచ్చాడు.

## ఏలీ కుటుంబ విషయంలో భయంకర ప్రవచనం

27దేవుని మనిషి* ఒకడు ఏలీ వద్దకు వచ్చాడు. ఆ
దేవుని మనిషి ఇలా చెప్పాడు "ఈజిప్టు దేశంలో నీ
పూర్వీకులు ఫరో ఇంటిలో బానిసలుగా ఉన్నప్పుడు

---

**ఏఫోదు** యాజకుడని లేక యాజకుని సహాయకుడని తెలి
పేందుకు వారు ధరించే ఒక ప్రత్యేక అంగీ.

**దేవుని మనిషి** ప్రజలతో మాట్లాడేందుకు దేవుడు పంపిన
మనిషి – ఒక ప్రవక్త.

వారికి నేను ప్రత్యక్షమయ్యాను. [28]ఇశ్రాయేలులో వున్న నీ పూర్వీకుని కుటుంబాన్ని నేను ఎన్నుకున్నాను. వారిని యాజకులుగా నియమించాను. నా బలిపీఠం వద్దకు వెళ్లి ధూపం వేయటానికి వారు ప్రత్యేక ఏఫోదు ధరించేలా కోరుకున్నాను. నీ తండ్రి కుటుంబీకులు ఇశ్రాయేలు ప్రజలు అర్పించిన బలి మాంసాన్ని తీసు కునేలాగున చేశాను.

[29]అయితే నీవు బలులను, కాను కలను ఎందువలన గౌరవించుట లేదు? నీవు నాకంటే నీ కుమారులనే ఎక్కువ గౌరవిస్తున్నావు. నా కొరకు ఇశ్రాయేలు ప్రజలు తెచ్చిన మాంసాది అర్పణలలో మంచి వాటిని సంగ్రహించి క్రొవ్వెక్కి వున్నావు."

[30]ఆ దేవుని మనిషి ఇంకా ఇలా అన్నాడు: "ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా నీ కుటుంబీకులు, నీ తండ్రి కుటుంబీకులు ఆయనను శాశ్వతంగా సేవించే విధంగా అనుగ్రహించాడు. కాని యెహోవా ఇప్పుడిలా సెలవిస్తున్నాడు: 'అది ఇంక ఎన్నటికీ జరుగదు! నన్ను సేవించే వారినే నేను గౌరవిస్తాను. నన్ను సేవించుటకు నిరాకరించే వారికి అనేక కష్ట నష్టాలు సంభవిస్తాయి. [31]మీ సంతానమంతటినీ నేను నాశనం చేసే సమయ మాసన్నమవుతూ ఉంది. అప్పుడు నీ కుటుంబంలో పెరిగి పెద్దవారై ముసలితనాన్ని చూచువాడు ఒక్కడూ ఉండడు. [32]ఇశ్రాయేలు ప్రజలకు మంచి జరుగుతూ ఉండగా, నీ ఇంటి వద్ద మాత్రం కీడు జరుగుతూ ఉంటుంది.* నీ కుటుంబంలో మాత్రం ముసలి వాడొకడును ఉండడు.

[33]ఒక్కడిని మాత్రం నా బలి పీఠం వద్ద యాజకునిగా సేవచేయటానికి రక్షిస్తాను. కాని, అతడు మాత్రం యాజకునిగా తన కళ్లు మందగించి, బలం ఉడిగి పోయేంత వరకు జీవిస్తాడు. నీ సంతానం వారంతా కత్తివేటుకు బలై పోతారు.

[34]నేను చెప్పినవన్నీ నిజమవబోతున్నట్లుగా నీకు ఒక నిదర్శనం ఇస్తున్నాను. నీ ఇరువురు కుమారులైన హొఫ్నీ మరియు ఫీనెహాసు ఒకే రోజు మరణిస్తారు. [35]నాకై నేనే ఒక నమ్మకమైన యాజకుని ఎంచు కుంటాను. ఈ యాజకుడు నేను చెప్పినట్లు విని, నా మాట ప్రకారం చేస్తాడు. ఈ యాజకుని వంశాన్ని నేను స్థిరపరుస్తాను. నేను అభిషిక్తునిగా చేసిన రాజు ఎదుట ఇతడు నా సేవ చేస్తాడు.

[36]నీ వంశంలో మిగిలిన వాళ్లంతా ఈ యాజకుని ఎదుట వంగి కొంచెం రొట్టె కోసం లేక కొద్దిగా డబ్బుకోసం దీనంగా ఆశిస్తారు. "మాకు భోజనానికి ఆహారం ఉండేలా మాకు యాజకులుగా ఉద్యోగం ఇప్పించమని అడుగుతారు."

**యింటి ... ఉంటుంది** ఈ వాక్య భాగం ప్రాచీన గ్రీకు అనువాదంలో లేదు.

## సమూయేలుకు దేవుని పిలుపు

3 ఆ రోజుల్లో యెహోవా ఎవరితోనూ ప్రత్యక్షంగా తరచు మాట్లాడేవాడు కాడు. స్వప్న దర్శనాలూ చాలా తక్కువే. ఏలీ పర్యవేక్షణలో బాలకుడైన సమూయేలు యెహోవా సేవలో ఉన్నాడు.

[2]ఏలీ కళ్లు బలహీనమై ఇంచుమించు గుడ్డివాడై పోయాడు. ఒకరోజు అతడు పడుకుని వున్నాడు. [3]సమూయేలు యెహోవా పవిత్ర గుడారంలో పడుకు న్నాడు. దేవుని పవిత్ర పెట్టె* కూడా గుడారంలోనే వుంది. గుడారంలో యెహోవా దీపం ఇంకా వెలుగు తూనే వుంది. [4]యెహోవా సమూయేలును పిలి చాడు."ఇక్కడే వున్నాను" అంటూ [5](ఏలీ తనను పిలి చాడని అనుకొని) సమూయేలు ఏలీ వద్దకు పరుగున పోయాడు. "మీరు పిలిచారుగా అందుకే, వచ్చాను" అన్నాడు. "నేను నిన్ను పిలవలేదు. పోయి పడుకో" అన్నాడు ఏలీ. సమూయేలు పోయి పడుకున్నాడు. [6]దేవుడు మళ్లీ, "సమూయేలూ!" అని పిలిచాడు. సమూయేలు ఏలీ వద్దకు వెళ్లి, "నేనిక్కడే ఉన్నాను. నన్ను పిలిచారా?" అని అడిగాడు.

"నేను నిన్ను పిలవలేదు. పోయి పడుకో" అన్నాడు ఏలీ.

[7]సమూయేలుకు ఇంకా యెహోవాతో అనుభవం లేదు. అతనితో యెహోవా ఇంతవరకూ ప్రత్యక్షంగా మాట్లాడి వుండలేదు.*

[8]మూడవసారి యెహోవా సమూయేలును పిలి చాడు. సమూయేలు లేచి ఏలీ వద్దకు వెళ్లి, "నేను ఇక్కడే వున్నాను; నన్ను పిలిచారా?" అని అన్నాడు.

యెహోవా ఆ బాలుని పిలుస్తున్నాడని అప్పుడు ఏలీకి అర్థమయింది. [9]ఏలీ సమూయేలుతో, "నీవు పోయి పడుకో. మళ్లీ ఎవరైనా నిన్ను పిలిస్తే 'యెహోవా, సెలవియ్యండి! నేను తమ దాసుణ్ణి. నేను వింటు న్నాను' " అని చెప్పమన్నాడు. తరువాత సమూయేలు వెళ్లి పక్కమీద పడుకున్నాడు. [10]యెహోవా వచ్చి అక్కడ నిలిచాడు. "సమూయేలూ!, సమూయేలూ" అంటూ మునుపటిలా పిలిచాడు.

"చెప్పండి, నేను మీ దాసుడను. నేను వింటున్నాను" అన్నాడు సమూయేలు.

[11]యెహోవా సమూయేలుతో ఇలా అన్నాడు: "చూడు, నేను ఇశ్రాయేలులో ఒక కార్యం నిర్వహించ

**దేవుని ... పెట్టె** దీనిని "ఒడంబడిక పెట్టె" అని కూడ అంటారు. ఇశ్రాయేలీయులు సీనాయి ఎడారిలో ఉన్న రోజులనుంచి జరిగిన అనేక విషయాలు దీనిలో భద్ర పర్చబడ్డాయి.

**మాట్లాడివుండలేదు** అంటే దేవుని వాణి సమూయే లుకు ఇంకా తెలియపర్చబడలేదు.

దలిచాను. దీనిని గురించి విన్న ప్రతి ఒక్కడూ ఆశ్చర్య
పోతాడు.* 12నేను ఏలీకి, అతని కుటుంబానికి ఏది
చేస్తానని చెప్పివున్నానో అదంతా అప్పుడు చేస్తాను.
మొదటినుంచి చివరి వరకు అంతా చేసి తీరుతాను.
13తన వంశాన్ని శాశ్వతంగా శిక్షిస్తానని ఏలీతో చెప్పాను.
అలా ఎందుకు చేయదలిచానంటే తన కుమారులు
దైవదూషణ చేసినట్లు, అకృత్యాలకు పాల్పడినట్లు
ఏలీకి తెలుసు. అయినా వారిని అదుపులో పెట్టలేక
పోయాడు. 14అందువల్ల ఏలీ వంశం ఎన్ని బలులు,
ధాన్యార్పణలు సమర్పించినా వారి పాపాన్ని మాపుకో
లేరని నిశ్చితంగా చెప్పి ఉన్నాను.” 15తెల్లవారేవరకూ
సమూయేలు పక్కమీదే ఉన్నాడు. ఆ తరువాత లేచి
దేవాలయ ద్వారం తెరిచాడు. దర్శనం గూర్చి ఏలీతో
చెప్పటానికి సమూయేలు భయపడ్డాడు 16కాని ఏలీ,
“కుమారుడా సమూయేలూ” అని పిలిచాడు. “ఇక్కడే
ఉన్నానయ్యా” అన్నాడు సమూయేలు.
17“యెహోవా నీతో ఏమన్నాడు? నాతో ఏమీ
దాచవద్దు. ఆయన నీకు చెప్పిన సమాచారంలో నీవు
ఏమి దాచినా దేవుడు నిన్ను బాగా శిక్షిస్తాడు” అని
అన్నాడు.
18దానితో సమూయేలు ఉన్నది వున్నట్లు ఏలీకి
ఏమీ దాచకుండా చెప్పాడు.
అది విన్న ఏలీ, “ఆయన యెహోవా. ఆయనకు
ఏది మంచిదనిపిస్తే అది చేయనీ” అన్నాడు.
19సమూయేలు పెరుగుతూ వుండగా యెహోవా
అతనికి తోడై ఉండెను. యెహోవా సమూయేలుతో
చెప్పిన వర్తమానాలను ఎన్నడూ అబద్ధం కానీయలేదు.
20అందువల్ల దానునుండి, బెయేర్షెబా వరకు ఇశ్రాయేలు
దేశమంతా సమూయేలును యెహోవా యొక్క నిజ
మైన ప్రవక్తగా గుర్తించింది. 21షిలోహులో యెహోవా
సమూయేలుకు దర్శనమిస్తూ వచ్చాడు. మాటలోనే
సమూయేలుకు యెహోవా ప్రత్యక్షమయ్యేవాడు.
4 సమూయేలును గురించిన వార్త ఇశ్రాయేలు దేశ
మంతా వ్యాపించింది. ఏలీ పండుముసలి వాడ
య్యాడు. ఏలీ కుమారులు యెహోవా ఎదుట దుష్ట
కార్యాలు చేస్తూనే ఉన్నారు.

### ఫిలిష్తీయులు ఇశ్రాయేలు ప్రజలను ఓడించుట

అదే సమయంలో ఫిలిష్తీయులంతా ఏకమై ఇశ్రా
యేలు మీదికి యుద్ధానికి దిగారు. ఇశ్రాయేలు ప్రజలు
కూడా ఈ దాడిని ఎదుర్కోవటానికి కదలి వెళ్లి ఎబె
నెజరు అనే చోట కాచుకొని యుండిరి. ఆఫెకు అనే
చోట ఫిలిష్తీయులు బసచేశారు. 2ఫిలిష్తీయులు దాడికి
బారులుతీరి నిలువగా యుద్ధం మొదలయింది.
యుద్ధంలో ఫిలిష్తీయులు ఇశ్రాయేలు ప్రజలను
ఓడించి ఇశ్రాయేలు సైన్యంలో సుమారు నాలుగు
వేలమంది సైనికులను చంపివేశారు. 3ఇశ్రాయేలు
సైన్యం తమ స్థలాలకు వచ్చారు. వారి నాయకులు,
“యెహోవా ఎందువల్ల తమకు ఫిలిష్తీయుల చేతుల్లో
ఓటమి కలిగించాడని ఆలోచించారు. వారు తమ
యెహోవా ఒడంబడిక పెట్టెను షిలోహునుండి తీసు
కుని రావాలని నిర్ణయించారు. ఈ విధంగా యెహోవా
మనతో యుద్ధ భూమికి వస్తాడు. ఆయన మన శత్రువు
లబారినుండి మనల్ని రక్షిస్తాడు” అని అనుకొన్నారు.
4ఆ విధంగా అనుకొని షిలోహుకు మనుష్యులను
పంపారు. వారు సర్వశక్తిమంతుడైన యెహోవా ఒడం
బడిక పెట్టెను తీసుకుని వచ్చారు. పెట్టెపైన కెరూ
బులు ఉన్నారు. మరియు యెహోవా కూర్చొనే
సింహాసనంలా వారు ఉన్నారు. ఏలీ కుమారులు హొఫ్నీ
మరియు ఫీనెహాసు ఆ పెట్టెతో వున్నారు.
5యెహోవా ఒడంబడిక పెట్టె యుద్ధస్థలంలోనికి
రాగానే ఇశ్రాయేలు సేనలు పొంగివచ్చే సంతోషంతో
భూమి అదిరేలా కేరింతలు పెట్టారు. 6ఫిలిష్తీయులు
ఈ కేకలు విని, “హెబ్రీయుల స్థలములో ఎందుకీ
కలకలం?” అని అనుకోసాగారు.
అప్పుడు వారు యెహోవా పవిత్రపెట్టె హెబ్రీ
యుల శిబిరములోకి వచ్చినదని కనుగొన్నారు. 7ఫిలిష్తీ
యులు భీతి చెందారు. “హెబ్రీ శిబిరములోకి దేవుడు
వచ్చాడు. మనకు సంకట కాలం వచ్చింది. ఇలా
ఇదివరకెన్నడూ జరుగలేదు! 8మనం వ్యాకులపాటు
చెందియున్నాము. ఆ మహా దేవుని నుండి మనలను
రక్షించేవారెవరు? ఈజిప్టువాళ్లను గతంలో అనేక రోగా
లకు, దారుణ శిక్షలకు గురిచేసి వారిని అష్టకష్టాల
పాలు చేసినవాడు ఈ దేవుడే. 9అయినను ఫిలిష్తీయు
సోదరులారా, ధైర్యంగా ఉండండి. లెండి. వీరకిశోరాలై
పోరాడండి! గతంలో హెబ్రీయులు మన బానిసలు.
కాబట్టి వీరాధివీరులై పోరాడండి. లేదా మీరు హెబ్రీయు
లకు బానిసలై పోయే ప్రమాదం వుంది!” అంటూ
ఫిలిష్తీయుల నాయకులు సైనికులను ఉత్తేజపరిచారు.
10ఫిలిష్తీయులు వీరోచితంగా పోరాడి ఇశ్రాయేలు
సైన్యాన్ని ఓడించారు. ఇశ్రాయేలీయులలో ప్రతి
ఒక్కడూ తన గుడారానికి పారిపోయాడు. ఇది వారికి
ఘోర పరాజయం. ముప్పది వేలమంది ఇశ్రాయేలు
సైనికులు చనిపోయారు.11దేవుని పవిత్ర పెట్టెను
ఫిలిష్తీయులు పట్టుకుపోయారు. ఏలీ యొక్క ఇద్దరు
కుమారులు హొఫ్నీ మరియు ఫీనెహాసు చని
పోయారు.
12అదేరోజు బెన్యామీను వాడొకడు యుద్ధ భూమి
నుండి పారిపోయాడు. సంభవించిన ఈ గొప్ప విషాదా
నికి సూచనగా తన బట్టలు చించుకొని, నెత్తిన దుమ్ము
చల్లుకొని షిలోహుకు వెళ్లాడు. 13ఈ బెన్యామీనీయుడు

---

**దీనిని ... ఆశ్చర్యపోతాడు** ఇది విన్న ప్రతివాని చెవులూ గింగురుమంటాయి అని శబ్దార్థం.

షిలోహు వెళ్లేసరికి ఏలీ నగర ద్వారం దగ్గర ఒక ఆసనం
మీద కూర్చుని ఉన్నాడు. దేవుని పవిత్ర పెట్టె విష
యంలో అతను కొంత గాభరాగా వున్నాడు. అందువల్ల
అతనక్కడ కూర్చుని ఎదురు చూస్తూ ఉన్నాడు. బెన్యా
మీనీయుడు పట్టణంలోనికి వెళ్లి ఈ దుర్వార్తను వెల్లడి
చేశాడు. షిలోహు పట్టణమంతా ఒక్కతీరున గగ్గోలు
పడి ఏడ్చింది. 14-15ఏలీ 98 ఏండ్ల వయస్సుగల గుడ్డి
వానిగా ఉన్నాడు. కనుక అతడు ఏమీ చూడలేక
పోయాడు. కాని, ఏడ్పుల ధ్వని ఏలీ విన్నాడు. "ఏమిటీ
గొప్ప ఏడ్పుల ధ్వని?" అని ఏలీ అడిగాడు.

బెన్యామీనీయుడు ఏలీ దగ్గరకు పరుగెత్తుకు వెళ్లి,
జరిగినది అతనితో చెప్పాడు. 16బెన్యామీనీయుడు
తాను ఆ రోజు యుద్ధంనుండి పారిపోయి వచ్చినట్లు
చెప్పాడు.

"ఏమి జరిగిందో చెప్పు" అన్నాడు ఏలీ.

17ఈ వార్త తెచ్చిన బెన్యామీనీయుడు ఏలీతో ఇలా
చెప్పాడు: "ఫిలిష్తీయుల చేతిలో ఇశ్రాయేలీయులు
చిత్తుగా ఓడిపోయారు. వారిలో అనేకమంది సైనికులు
చనిపోయారు. నీ ఇరువురు కుమారులూ చని
పోయారు. దేవుని పవిత్ర పెట్టెను ఫిలిష్తీయులు తీసు
కునిపోయారు."

18ఏలీ వృద్ధుడు, స్థూలకాయుడు. బెన్యామీనీ యుడు
దేవుని పవిత్ర పెట్టెనుగూర్చి చెప్పగానే ఏలీ, ద్వారం
దగ్గర ఉన్న తన ఆసనంనుండి వెనుకకుపడి, మెడవిరిగి,
చనిపోయాడు. ఇశ్రాయేలీయులను 20 సంవత్సరాల*
పాటు ఏలీ నడిపించాడు.

### మహిమ తొలగిపోయింది

19ఏలీ కోడలు (ఫీనెహాసు భార్య) గర్భవతి. నెలలు
బాగా నిండాయి. దేవుని పవిత్ర పెట్టె శత్రువుల చేత
పడటం, తన మామ ఏలీ మరణం, తన భర్త ఫీనెహాసు
మరణవార్తలు వినగానే ఆమెకు తీవ్రంగా పురుటి
నొప్పులు వచ్చాయి. ఆమె వంగిపోయి ప్రసవిం
చేసింది. 20ఆమె చావు ఘడియల్లో ఉండగా, "చింత
పడకు, నీకు కొడుకు పుట్టాడు" అంటూ అక్కడ
ఉన్న స్త్రీలు ఆమెను ఓదార్చారు.

కానీ ఆమె ఏమీ పట్టించుకోకుండానే, "ఇశ్రాయేలు
నుండి మహిమ తొలగిపోయింది!" అంటూ తన కుమా
రునికి ఈకాబోదు* అని పేరు పెట్టింది. 21తన
కుమారునికి ఈకాబోదు అని పేరు పెట్టటానికి కారణం
ఏమంటే, దేవుని పవిత్ర పెట్టె పరుల హస్తగతమ
య్యింది; దానికి తోడు తన మామ, భర్త ఇద్దరూ
చనిపోయారు. 22ఫిలిష్తీయులు దేవుని పవిత్ర పెట్టెను
తీసుకుని పోయారు గనుకనే "ఇశ్రాయేలు నుండి
మహిమ తొలగిపోయింది" అని ఆమె వాపోయింది.

### పవిత్ర పెట్టె మూలంగా ఫిలిష్తీయులకు కష్టకాలం

5 ఫిలిష్తీయులు దేవుని పవిత్ర పెట్టెను ఎబెనెజరు
నుంచి అష్డోదుకి తీసుకుని వెళ్లారు. 2దేవుని పవిత్ర
పెట్టెను వారు దాగోను* దేవాలయంలోనికి తీసుకుని
పోయి దాగోను విగ్రహం పక్కన వుంచారు. 3అష్డోదు
ప్రజలు ఆ మరునాడు తెల్లవారుఝామునే లేచి దాగోను
విగ్రహం బోర్లపడి వుండటం చూశారు. యెహోవా
దేవుని పవిత్ర పెట్టె ముందు దాగోను విగ్రహం
పడిపోయి ఉంది. అష్డోదు ప్రజలు దాగోను విగ్రహాన్ని
తిరిగి యథాస్థానంలో వుంచారు. 4కాని మరునాటి
ఉదయం అష్డోదు ప్రజలు వచ్చి చూడగా దాగోను
విగ్రహం మళ్లీ పడిపోయివుంది. దాగోను దేవుని పవిత్ర
పెట్టెముందు పడిపోయివున్నాడు. ఈసారి దాగోను
తల, చేతులు విరిగిపోయి ఆలయ గుమ్మం మీద పడి
ఉన్నాయి. దాగోను మొండెం మాత్రం ఒక్క ముక్కగా
మిగిలింది. 5అందువల్ల ఈనాటికీ దాగోను యాజకులు
గాని, ఇతరులుగాని అష్డోదులో దాగోను ఆలయం గడప
తొక్కేందుకు నిరాకరిస్తారు.

6అష్డోదు ప్రజలకు, వారి ఇరుగు పొరుగు గ్రామాల
వారికి యెహోవా తీవ్రంగా శిక్ష విధించాడు. బహు
కష్టాలపాలు చేశాడు. వారంతా శరీరం నిండా గడ్డలు
కలిగి బాధపడ్డారు. వారి మీదికి ఎలుకల దండును
పంపించాడు. వాళ్ల ఓడలలోను, పంట పొలాల్లోను
ఎలుకలు విపరీతంగా తిరగటం ప్రారంభించాయి. నగర
వాసులంతా భయభ్రాంతులయ్యారు. 7అష్డోదు ప్రజలు
అక్కడ జరుగుతున్నదంతా బాగా గమనించారు.
"మనల్ని, మన దైవం దాగోనును బాగా శిక్షిస్తూవుంది
గనుక, ఇశ్రాయేలు దేవుని పవిత్ర పెట్టె ఇక ఏమాత్రం
మనతో వుండరాదు." అని అనుకున్నారు.

8అష్డోదు ప్రజలు ఫిలిష్తీయుల పాలకులు ఐదుగురినీ
ఒక్కచోటికి పిలువనంపారు. "ఇశ్రాయేలీయుల దేవుని
పవిత్ర పెట్టె విషయంలో తాము ఏమి చేయాలని
వారిని అడిగారు."

అది విన్న పాలకులు, "ఇశ్రాయేలు దేవుని పవిత్ర
పెట్టెను గాతునకు తరలించమనగా" వారలా చేశారు.

9అలా ఫిలిష్తీయులు దేవుని పవిత్ర పెట్టెను గాతు
నకు తరలించిన పిమ్మట, యెహోవా ఆ నగరాన్ని
కూడా శిక్షించాడు. ప్రజలు భయభ్రాంతులయ్యారు.
గాతులో చిన్న, పెద్ద అందరినీ కలవరపెట్టాడు. వారికి
కూడ శరీరం నిండా కంతులు, గడ్డలు లేచేలా చేశాడు.
10కనుక ఫిలిష్తీయులు దేవుని పవిత్ర పెట్టెను ఎక్రో
నుకు పంపించారు.

---

**20 సంవత్సరాలు** అని గ్రీకు భాషలో రాయబడింది. మరియు యోసేఫను చరిత్రలో రాయబడింది. హెబ్రీ ప్రామాణిక గ్రంథంలో 40 సంవత్సరాలు అని రాయబడింది.

**ఈకాబోదు** మహిమలేదు అని అర్థం.

**దాగోను** దాగోను ఫిలిష్తీయుల ఒక అబద్ధపు దేవత.

కానీ దేవుని పవిత్ర పెట్టె ఎక్రోనుకు చేరగానే అక్కడి
ప్రజలు, “ఇశ్రాయేలు ప్రజల దేవుని పవిత్ర పెట్టెను
మా ఎక్రోను నగరానికి ఎందుకు తీసుకుని వస్తున్నారు?
మమ్ములనందరినీ మీరు చంపదలిచారా?” అంటూ
అరవటం మొదలుపెట్టారు. 11వారు ఫిలిష్తీయుల పాల
కులనందరినీ ఒక్క చోటికి పిలిపించి “ఇశ్రాయేలు
దేవుని పవిత్ర పెట్టె మమ్మల్నీ, ప్రజలందరినీ చంప
కముందే దానిని యధాస్థానానికి పంపించి వేయ
మన్నారు.”

ఎక్రోనీయులు మిక్కిలి భీతి చెందియున్నారు.
అక్కడ దేవుని దండన చాలా భయంకరంగా ఉంది.
12చావగా మిగిలిన వారు శరీరంపై గడ్డలతో బాధ
పడ్డారు. ఎక్రోను ప్రజల అరుపులు ఆకాశాన్ని తాకు
నట్లుగా ఉండెను.

### దేవుని పవిత్ర పెట్టె యధా స్థానానికి పంపబడుట

6 దేవుని పవిత్ర పెట్టెను ఏడునెలలు ఫిలిష్తీయులు
తమ దేశమందు ఉంచుకున్నారు. 2ఫిలిష్తీయులు
వారి పూజారులను, మాంత్రికులను పిలిచి,
‘యెహోవా పవిత్ర పెట్టెను మేము ఏమి చేయాలి?
ఈ పెట్టెను తిరిగి దాని స్థానానికి పంపాలంటే ఏమి
చేయాలో మాకు చెప్పండి” అని అడిగారు.

3“మీరు ఇశ్రాయేలు దేవుని పవిత్ర పెట్టెను తిరిగి
పంపదలచుకుంటే ఊరక పంపవద్దు. ఆ దేవుడు మీ
పాపాలను క్షమించే విధంగా తగిన కానుకలతో పంపాలి.
అప్పుడు మీరు స్వస్థపరచబడి పవిత్రపరచబడతారు.
దేవుడు మిమ్మల్ని క్షమించి, మిమ్మల్ని శిక్షించటం
మానివేయాలంటే మీరు ఇలా చేయాలి” అని ఆ
పూజారులు, మాంత్రికులు చెప్పారు.

4"తమను క్షమించాలంటే ఇశ్రాయేలు దేవునికి ఏమి
కానుకలు పంపాలని” ఫిలిష్తీయులు అడిగారు.

“ఫిలిష్తీ నాయకులు అయిదుగురు ఉన్నారు. (ఒక్కో
పట్టణానికి ఒక్కో నాయకుడు.) మీ ప్రజలం దరికీ,
నాయకులకు ఒకటే సమస్య ఉంది. కనుక గడ్డ ల్లాంటి
బంగారు ప్రతిరూపాలను మీరు చేయండి. మరియు
ఎలుకల్లా కనబడే బంగారు ప్రతిరూపాలను మీరు
చేయండి. 5మరియు దేశాన్ని పాడుచేస్తోన్న ఎలుకల
ప్రతిరూపాలు చేయండి. ఈ బంగారు ప్రతి రూపాలను
ఇశ్రాయేలు దేవునికి వెలగా ఇవ్వండి. ఒకవేళ అప్పుడు
ఇశ్రాయేలీయుల దేవుడు మిమ్మల్ని, మీ దేవుళ్లను,
మీ దేశాన్ని శిక్షించటం మానివేస్తాడేమో. 6ఈజిప్టు
వాళ్లలా, ఫరోలా మొండిగా ఉండవద్దు. దేవుడు ఈజిప్టు
వాళ్లను శిక్షించాడు. అందుకే ఈజిప్టువాళ్లు ఇశ్రా
యేలువాళ్లను ఈజిప్టు విడిచి వెళ్లనిచ్చారు. 7“మీరు
ఒక కొత్త బండిని నిర్మించి, అప్పుడే ఈనిన రెండు
ఆవులను తేవాలి. ఆ రెండు ఆవులకు ఇదివరలో
కాడికట్టి ఉండకూడదు. వాటిని ఆ బండికి కట్టండి.
దూడలను ఇంటికి తీసుకుని వెళ్లి వాటిని గాటిలో
ఉంచండి. వాటిని తల్లి ఆవుల వెనుక పోనీయవద్దు.*
8యెహోవా పవిత్ర పెట్టెను ఆ బండి మీద ఉంచండి.
బంగారు ప్రతిరూపాలను ఒక సంచిలో వేసి పెట్టె
పక్కన పెట్టండి. అవి దేవుడు మీ పాపాలను క్షమించ
గలందులకు మీరిచ్చే కానుకలు. పిమ్మట బండిని
మార్గాన వెళ్లనివ్వండి. 9బండిని కనిపెట్టి వుండండి.
బండి గనుక ఇశ్రాయేలులో బేత్షెమెషు దిశగా వెళితే
యెహోవా నిజంగా మనకీ భయంకర రోగం కలుగ
జేసినట్లు అవుతుంది. ఒకవేళ ఆవులు బేత్షెమెషువైపు
పోకపోతే, మనల్ని శిక్షించింది ఇశ్రాయేలు దేవుడు కాదని
మనం గ్రహించవచ్చు. మన జబ్బు మనకు ఏదో
అలా వచ్చేసింది అని మనం భావించాలి” అని అన్నారు
యాజకులు, మాంత్రికులు.

10యాజకులు, మాంత్రికులు చెప్పిన రీతిగా ఫిలిష్తీ
యులు అంతా చేశారు. దూడలున్న రెండు ఆవుల్ని
తెచ్చి బండికి కట్టి, లేగదూడల్ని ఇంటివద్దనే వుంచారు.
11ఫిలిష్తీయులు యెహోవా పవిత్ర పెట్టెను, మరియు
బంగారు గడ్డలను ఎలుకల బంగారు ప్రతిరూపాలను
ఆ బండిమీద పెట్టారు. 12ఆవులు తిన్నగా బేత్షెమెషు
వైపు వెళ్లాయి, ఆవులు అదేపనిగా అరుస్తూ బాటమీదే
సాగి పోయాయి. అవి కుడికిగాని, ఎడమకిగాని తిరగ
లేదు. బేత్షెమెషు పొలిమేరవరకు ఫిలిష్తీయుల పాలకులు
ఆవులను అనుసరించి వెళ్లారు.

13లోయలో బేత్షెమెషు ప్రజలు ఆ సమయంలో
తమ గోధుమ పంట కోస్తున్నారు. వారు తలలు పైకెత్తి
చూసినప్పుడు పవిత్ర పెట్టె కనబడింది. మరల పెట్టెను
చూడగలిగినందుకు వారు ఎంతో ఆనంద పడిరి.

14బేత్షెమెషు వాడైన యెహోషువ పొలంలోకి వచ్చి
ఒక పెద్ద బండ వద్ద బండి ఆగింది. బేత్షెమెషు ప్రజలు
బండిని నరికివేశారు. ఆవులను చంపి యెహోవాకు
బలి అర్పించారు.

15లేవీయులు యెహోవా పవిత్ర పెట్టెను కిందికి
దించారు. బంగారు ప్రతిరూపాలున్న సంచిని కూడ
వారు దించారు. ఆ రెండింటినీ లేవీయులు ఆ పెద్ద
బండమీద వుంచారు. ఆ రోజు బేత్షెమెషు ప్రజలు
దహన బలులను సమర్పించారు.

16బేత్షెమెషు ప్రజలు చేసిన ఈ సంగతులంతా
ఫిలిష్తీయుల పాలకులు ఐదుగురు జాగ్రత్తగా తిలకించి
ఎక్రోనునకు ఆ రోజే వెళ్లిపోయారు.

17ఈ విధంగా వారికి లేచిన గడ్డల ప్రతిరూపాలను
బంగారంతో చేయించి ఫిలిష్తీయులు తమ పాప పరిహా

---

**వాటిని ... వెనుక పోనీయవద్దు** ఆవులు వాటి దూడల కోసం వెనక్కు రాకుండ తిన్నగా బేత్షెమెషు వెళ్లిపోతే, అప్పుడు దేవుడే వాటిని నడిపిస్తున్నట్టు రుజువు అవుతుంది. దేవుడు వారి కానుకలను స్వీకరించినట్లు తెలుస్తుంది.

రంగా యెహోవాకు కానుకలు పంపారు. అదేమాదిరి
బంగారు బొమ్మలను ఒక్కొక్కటి చొప్పున ఫిలిష్తీ
యుల పట్టణాలయిన అష్డోదు, గాజా, అష్కెలోను,
గాతు, ఎక్రోనులనుండి పంపారు. [18]ఫిలిష్తీయులు
ఎలుకల బంగారు ప్రతిరూపాలను కూడ పంపారు.
ఐదుగురు ఫిలిష్తీయుల పాలకుల అధీనంలో ఎన్ని
పట్టణాలున్నాయో అన్ని బంగారు బొమ్మలను
పంపారు. ఈ ఫిలిష్తీయుల పట్టణాలలో చుట్టు ప్రాకారా
లతో కట్టుదిట్టము చేయబడిన పట్టణాలు, వాటికింద
ఉన్న గ్రామాలు చేర్చబడ్డాయి.

ఏ బండ మీదయితే బేత్షెమెషు ప్రజలు యెహోవా
పవిత్ర పెట్టెను ఉంచారో ఆ పెద్ద బండ బేత్షెమెషువాసి
యెహోషువ పొలంలో ఈనాటికీ సాక్షిగావుంది. [19]కాని
బేత్షెమెషు ప్రజలు యెహోవా పవిత్ర పెట్టెను చూసి
నప్పుడు అక్కడ యాజకులు లేరు. అందువల్ల దేవుడు
బేత్షెమెషు వారిలో డెబ్బదిమందిని చంపాడు. అంత
కఠినంగా తమను దేవుడు శిక్షించినందుకు బేత్షెమెషు
వారు దుఃఖించారు.

[20]"ఈ యెహోవా పవిత్ర దేవుని ముందర నిల
బడగల యాజకుడు ఎక్కడ? ఇక్కడ నుంచి ఈ
పెట్టెను ఎక్కడికి తరలించాలి?" అని వారు యోచన
చేశారు. [21]బేత్షెమెషు జనం కిర్యత్యారీము ప్రజలకు
వర్తమానం పంపారు. "ఫిలిష్తీయులు యెహోవా పవిత్ర
పెట్టెను తిరిగి తెచ్చారని, వచ్చి దానిని తమ నగరానికి
తీసుకుని పోవలసినదని సందేశం పంపారు."

7 కిర్యత్యారీము ప్రజలు వచ్చి యెహోవా పవిత్ర
పెట్టెను తీసుకొని వెళ్లారు. కొండమీద ఉన్న అబీ
నాదాబు ఇంటికి వారు యెహోవా పెట్టెను తీసుకొని
వెళ్లారు. పెట్టె విషయంలో జాగ్రత్త పుచ్చు కొనేందుకు
అబీనాదాబు కుమారుడగు ఎలియాజరును వారు
ప్రత్యేక క్రమం ప్రకారం ఏర్పరిచారు. [2]కిర్యత్యారీములో
ఆ పెట్టె ఇరువది సుధీర్ఘ సంవత్స రాలుండెను.

### ఇశ్రాయేలీయులను యెహోవా రక్షించుట

ఇశ్రాయేలు ప్రజలు మళ్లీ భక్తిశ్రద్ధలతో యెహోవా
ఎదుట దుఃఖపడి ఆయనను వెదకటం మొదలు
పెట్టారు. [3]ఇశ్రాయేలీయులనుద్దేశించి సమూయేలు
ఇలా అన్నాడు: "మీ హృదయ పూర్వకంగా మీరంతా
యెహోవా దగ్గరకు తిరిగి వస్తున్నట్లయితే, మీరు మీ
అన్య దేవుళ్లను విడిచిపెట్టాలి. మీ అష్తారోతు* దేవతా
విగ్రహాలను విడిచి పెట్టాలి. మిమ్ములను మీరు
యెహోవాకు పూర్తిగా సమర్పించుకోండి. ఆయననే
ఆరాధించండి. అప్పుడాయన మిమ్మల్ని ఫిలిష్తీయుల
బారినుండి తప్పిస్తాడు."

[4]అది విన్న ఇశ్రాయేలీయులు బయలు,* అష్తా
రోతు విగ్రహాలన్నిటినీ పారవేసారు.

అప్పుడు ఇశ్రాయేలీయులంతా యెహోవాను
మాత్రమే సేవించారు.

[5]"ఇశ్రాయేలు వారంతా మిస్పావద్ద తప్పక సమా
వేశం కావాలి. అక్కడ వారి కోసం నేను యెహోవాను
ప్రార్థిస్తాను" అని సమూయేలు వారితో చెప్పాడు.

[6]ఇశ్రాయేలీయులు మిస్పావద్ద సమావేశం
అయ్యారు. వారు నీళ్లు తెచ్చి యెహోవా ముందర
పారపోసారు. (ఈ విధంగా వారు ఉపవాసం ప్రారం
భించారు.) ఆ రోజు వారు ఏమీ తినకుండా ఉండి,
వారి పాపాలు ఒప్పుకోవటం మొదలుపెట్టారు. "మేము
యెహోవాకు వ్యతిరేకంగా పాపం చేసాము" అని వారు
చెప్పారు. కనుక సమూయేలు ఇశ్రాయేలీయులకు
ఒక న్యాయమూర్తిగా సేవ చేయటం మిస్పాలో
ప్రారంభించాడు.

[7]ఇశ్రాయేలు ప్రజలు మిస్పావద్ద సమావేశమవుతు
న్నట్లు ఫిలిష్తీయులు విన్నారు. ఫిలిష్తీయుల పాలకులు
ఇశ్రాయేలీయులపై యుద్ధానికి తరలి వచ్చారు. వారు
వస్తున్నారని ఇశ్రాయేలీయులు విని, భయపడ్డారు.
[8]వారు సమూయేలుతో "మా కొరకు ప్రభువైన దేవుని
ప్రార్థించుట ఆపవద్దు. ఫిలిష్తీయుల బారినుండి
మమ్మును రక్షించమని యెహోవాను వేడుము!" అని
విన్నవించారు.

[9]అప్పుడు సమూయేలు పాలుతాగుతున్న గొర్రె
పిల్లను తీసుకుని దానిని పూర్తిగా యెహోవాకు దహన
బలిగా దహించాడు. సమూయేలు ఇశ్రాయేలీయుల
కోసం యెహోవాను ప్రార్థించాడు. యెహోవా అత
నికి జవాబిచ్చాడు.

[10]సమూయేలు బలి పశువును దహించుచున్న
ప్పుడు ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులపై యుద్ధానికి
సమీపిస్తూ ఉన్నారు. కానీ యెహోవా అకస్మాత్తుగా
ఒక భయంకర ఉరుమును ఫిలిష్తీయుల వద్ద కలి
గించాడు. ఆ ఉరుము ఫిలిష్తీయులను భయపెట్టగా
వారు కలవరపడి చిందర వందర అయ్యారు. అప్పుడు
సంభవించిన యుద్ధంలో ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయు
లను ఓడించారు.

[11]ఇశ్రాయేలు జనం మిస్పా నుండి బయటకు వచ్చి
ఫిలిష్తీయులను అందిన వారిని అందినట్లు చంపుతూ
బేత్కారు వరకూ తరుముకుంటూ పోయారు.

---

**అష్తారోతు** ఈ బూటకపు దేవత మనుష్యులకు సంతానం కలిగిస్తుందని కనానీ ప్రజలు భావించారు. అది వారి కామ దేవత.

**బయలు** ఈ బూటకపు దేవుడు వర్షాలను, తుఫానులను రప్పించేవాడని కనానీ ప్రజల నమ్మకం. భూమి నుంచి పంటను పండేటట్టు చేసేది కూడ ఈ దేవుడే అని వారి నమ్మకం.

### ఇశ్రాయేలులో ప్రశాంతత

12ఇదంతా జరిగిన తర్వాత సమూయేలు జ్ఞాపకా
ర్థంగా మిస్పాకు, షేనుకు మధ్య ఒక ప్రత్యేక రాతిని
నిల బెట్టాడు. దానికి సమూయేలు “సహాయ శిల”*
అని పేరు పెట్టి, “ఇంతవరకు యెహోవా మనకు
సహా యము చేసాడు అని చెప్పాడు.”
13ఫిలిష్తీయులు ఓడించబడ్డారు. మరల వారు ఇశ్రా
యేలు దేశంలోనికి అడుగు పెట్టలేదు. సమూయేలు
బతికినంత కాలం యెహోవా ఫిలిష్తీయులకు వ్యతిరే
కంగానే వున్నాడు. 14ఫిలిష్తీయులు ఇశ్రాయేలునుండి
పట్టణాలను తీసుకున్నారు. ఎక్రోను నుండి గాతు
వరకుగల ప్రాంతాల్లోని పట్టణాలను ఫిలిష్తీయులు తీసు
కున్నారు. అయితే ఇశ్రాయేలీయులు ఆ పట్టణా లను
తిరిగి గెలుచుకున్నారు. మరియు ఈ పట్టణాల చుట్టు
పక్కల ఉన్న స్థలాన్ని కూడా ఇశ్రాయేలీయులు
స్వాధీనం చేసుకున్నారు. అంతేకాకుండా ఇశ్రాయేలీ
యులకు, అమోరీయులకు మధ్య శాంతి నెలకొన్నది.
15సమూయేలు తన జీవిత కాలమంతా న్యాయ
మూర్తిగా ఇశ్రాయేలీయులను నడిపించాడు. 16ప్రతి
సంవత్సరం సమూయేలు దేశవ్యాప్తంగా సంచారం చేసే
వాడు. ఇశ్రాయేలు ప్రజలకు తీర్పు చెబుతూ ఒక
స్థలంనుండి మరో స్థలానికి వెళ్లేవాడు. బేతేలు, గిల్గాలు,
మిస్పాకు అతడు వెళ్లాడు. కనుక ఈ స్థలాలన్నింటిలో
అతడు ఇశ్రాయేలీయులకు తీర్పు చెబుతూ, వారిని
పాలించాడు. 17కానీ సమూయేలు తన ఇల్లు ఉన్న
రామాకు తిరిగి వెళ్లేవాడు. రామాలో వున్న ప్రజలను
కూడ సమూయేలు పాలిస్తూ, తీర్పు చెప్పేవాడు.
రామాలో యెహోవాకు ఒక బలిపీఠాన్ని సమూయేలు
నిర్మించాడు.

### రాజుకొరకు ఇశ్రాయేలు ప్రజల అభ్యర్థన

8 సమూయేలు వృద్ధుడయిన పిమ్మట తన కుమా
రులను ఇశ్రాయేలీయులకు న్యాయాధి పతులుగా
నియమించాడు. 2సమూయేలు మొదటి కుమారుని
పేరు యోవేలు. రెండవవాని పేరు అబీయా. వారిద్దరూ
బెయేర్షెబాలో న్యాయాధిపతులు. 3కాని సమూయేలు
కుమారులకు తండ్రి నడవడి రాలేదు. యోవేలు,
అబీయా, ఇద్దరూ లంచం ద్వారా ధన సంపాదనకు
పాల్పడినారు. తమ తీర్పులను తారుమారు చేయటా
నికి ప్రజలను మోసంచేసి రహస్యంగా లంచాలు తీసుకు
నేవారు.

4కావున ఇశ్రాయేలు పెద్దలంతా (నాయకులు)
సమూయేలును కలుసుకొనుటకు రామా వెళ్లారు.
5వారు సమూయేలుతో, “నీవు వృద్ధుడవు. పైగా నీ
కుమారులు నీ మాదిరిని వెంబడించుట లేదు. కాబట్టి
అన్ని రాజ్యాల మాదిరిగా మమ్ములను పాలించటానికి
కూడ ఒక రాజును ఇయ్యి” అని అన్నారు.
6ఇది తప్పు అని సమూయేలు తలచాడు. కనుక
సమూయేలు యెహోవాకు ప్రార్థించాడు.
7యెహోవా సమూయేలుతో ఇలా అన్నాడు: “ప్రజలు
ఏమి చెపితే దానిని నీవు పాటించు. వారి రాజుగా
ఉండేందుకు వారు నన్ను తిరస్కరించారు గాని నిన్ను
కాదు. 8వారు ఎప్పటిలాగే ప్రవర్తిస్తున్నారు. నేను వారిని
ఈజిప్టునుంచి రక్షించినప్పుడు, వారు నన్ను వదిలి
ఇతర దేవుళ్లను పూజించారు. నీ పట్ల కూడా వారిప్పుడు
అలాగే ప్రవర్తిస్తున్నారు. 9అయినా నీవు ప్రజలు చెప్పిన
దానిని పాటించు. కాని వారికి ఒక హెచ్చరిక చెయ్యి.
రాజు వారికి ఏమి చేస్తాడో ఒకసారి వివరించి చెప్పాలి.”
10రాజుకొరకు అడుగుతున్న ప్రజలకు సమూయేలు
సమాధాన మిచ్చాడు. యెహోవా సెలవిచ్చిన విషయ
మంతా సమూయేలు ప్రజలకు ఇలా వివరంగా
చెప్పాడు: 11“మిమ్మల్ని పాలించేందుకు మీకు గనుక
ఒక రాజు ఉంటే అతడు ఇలా చేస్తాడు: అతడు మీ
కుమారులను తనకు సేవ చేసేటట్లు బలవంతం
చేస్తాడు. అతడు వారిని బలవంతంగా సైనికులుగా
చేస్తాడు. వారిని తన రథాలలో, అశ్వదళాలలో పని
చేయిస్తాడు. మీ కుమారులు రాజు రథానికి ముందు
పరుగెత్తే సంరక్షకులు అవుతారు. 12రాజు మీ కుమా
రులలో కొంతమందిని వేయిమంది మీద అధికారులు
గాను, ఏబదిమంది మీద అధికారులుగాను చేస్తాడు. మీ
సంతతిలో మరికొంత మందిని రాజు తన భూమిని
సాగు చేయుటకు, మరికొంత మందిని పంట కోయు
టకు నియమిస్తాడు. ఇంకా కొంతమందిని యుద్ధ పరిక
రాలను, ఆయుధాలను తయారు చేసేందుకు, ఆయన
రథాలకు కావలసిన వస్తు సామగ్రిని సమకూర్చటానికి
రాజు వినియోగిస్తాడు.

13“ఈ రాజు మీ కుమార్తెలను కూడా తీసుకుని,
వారిలో కొంతమందిని అత్తరులు చేసేందుకు, మరి
కొంత మందిని ఆయన ఆహార పదార్థాలు తయారు
చేయ టానికి వినియోగిస్తాడు.

14“ఈ రాజు మీ భూములలో శ్రేష్ఠమైన వాటిని,
ద్రాక్షా తోటలను, ఒలీవ తోటలను తీసుకుంటాడు.
వాటిని తన అధికారులకు, సేవకులకు ఇస్తాడు. 15మీ
పంట లోను, ద్రాక్ష దిగుబడిలోను పదవవంతు ఆయన
తీసు కుంటాడు. ఈ పదవ భాగాన్ని రాజు తన అధికారు
లకు, సేవకులకు ఇస్తాడు.

16ఈ రాజు మీ సేవకులను, పనిపిల్లలను కూడ
తీసుకుంటాడు. మీకున్న మంచి మంచి పాడి పశువు
లను, గాడిదలను కూడా తీసుకుంటాడు. వారందరినీ
తన స్వంత పనులకు వినియోగించుకుంటాడు.
17ఆయన మీ గొర్రెల మందలలో పదవవంతు తీసు
కుంటాడు. “అసలు మీరు కూడా ఈ రాజుకు బానిసలై

---

**సహాయ శిల** లేక “ఎబెనెజరు.”

పోతారు. [18]ఆ సమయం వచ్చినపుడు మీరెన్నుకున్న
రాజు మూలంగా మీరు చాలా ఏడుస్తారు. కానీ
యెహోవా మాత్రం ఆ ప్రార్థనకు జవాబు ఇవ్వడు."
[19]సమూయేలు ఇంత చెప్పినా వారు పట్టించు
కోలేదు. పైగా ఇలా అన్నారు: "కాదు! మమ్మేలను
ఏలటానికి మాకో రాజు కావాలి. [20]అప్పుడు మేము
ఇతర రాజ్యాలతో సమాన ప్రతిపత్తిగల వారమవుతాము.
మా రాజే మా నాయకుడు. యుద్ధంలో ఆయన
మమ్మల్ని నడిపించి, మాకోసం ఆయన యుద్ధం
చేస్తాడు."
[21]ప్రజలు చెప్పినదంతా విన్న సమూయేలు వారు
చెప్పిన మాటలను యెహోవాకు తెలియజేసాడు.
[22]"వారి మాట శిరసావహించుమనీ, వారికో రాజును
ఇవ్వమనీ" యెహోవా చెప్పాడు. అప్పుడు సమూ
యేలు అక్కడ సమావేశమైన ప్రజలకు "తమ పట్టణా
నికి వెళ్లిపొమ్మని చెప్పాడు."

### సౌలు తన తండ్రి గాడిదలను వెదకబోవటం

9 బెన్యామీను గోత్రమునకు చెందిన వారిలో కీషు
చాలా ముఖ్యుడు. అతను అబీయేలు కుమారుడు.
అబీయేలు సెరోరు కుమారుడు. సెరోరు బెకోరతు
పుత్రుడు. బెకోరతు బెన్యామీనీయుడైన అఫీయ కుమా
రుడు. [2]కీషుకు సౌలు అనే ఒక కుమారుడు ఉన్నాడు.
సౌలు చాలా అందగాడు. సౌలుకంటె ఎక్కువ అందగాడు
మరొకడు లేడు. ఇశ్రాయేలీయులందరి లోనూ అతడు
ఆజానుబాహుడు.
[3]ఒకనాడు కీషు గాడిదలు తప్పిపోయాయి. కనుక
"సేవకులలో ఒకరిని తీసుకుని గాడిదలను వెదకవ
లసిందిగా" కీషు తన కుమారుడైన సౌలుతో చెప్పాడు.
[4]ఎఫ్రాయిము కొండలు, షాలిషా దేశమంతా వెది
కారు. కాని సౌలు, అతని సేవకుడు గాడిదలను కనుక్కో
లేకపోయారు. వారు షయలీము ప్రాంతానికి వెళ్లారు.
అక్కడ కూడా గాడిదలు లేవు. సౌలు బెన్యామీనీయుల
దేశ ప్రాంతంలో కూడ తిరిగి వెదికాడు. అయినా అవి
దొరకలేదు. [5]చివరికి సౌలు, అతని సేవకుడు కలిసి
సూపు పట్టణానికి వచ్చారు. సౌలు, "ఇంటికి వెళ్లి
పోదామని తన సేవకునితో అన్నాడు. తన తండ్రి
గాడిదల విషయం మర్చిపోయి తమను గురించి కంగారు
(చింత) పడతాడని" అన్నాడు సౌలు.
[6]"మనము ఈ పట్టణంలోనికి వెళ్దాము. ఈ పట్ట
ణంలో ఒక దైవజనుడు ఉన్నాడు. ప్రజలు అతనిని
చాలా గౌరవిస్తారు, ఆయన చెప్పేది నెరవేరుతుంది.
ఒకవేళ మనం యిప్పుడు ఎక్కడికి వెళ్లాల్సిందీ ఆయన
చెప్పగలడేమో" అని సేవకుడు సౌలుతో అన్నాడు.
[7]"సరే మంచిది. మనం పట్టణంలోనికి వెళ్దాము.
కానీ ఆ దైవజనుడికి మనము ఏమి ఇవ్వగలం? మన
సంచుల్లో ఆహారం అయిపోయింది. ఆయనకు ఇచ్చేం
దుకు మన దగ్గర మరి ఏ కానుకలూ లేవు. అందుచేత
మనము ఏమి ఇవ్వగలము?" అని సౌలు అన్నాడు.
[8]"చూడండి, నా దగ్గర కొంత డబ్బు ఉంది. దానిని
ఆ దైవజనుడికి ఇద్దాము. అప్పుడాయన మన
ప్రయాణ విషయమై చెపుతాడు" అన్నాడు సేవకుడు.
[9-11]"ఇది మంచి ఆలోచన! వెళదాం పద" అన్నాడు
సౌలు. కనుక వారిద్దరూ కలసి దైవ జనుడుండే పట్టణం
వైపు బయలుదేరి వెళ్లారు. సౌలు, సేవకుడు ఆ పట్టణా
నికి కొండ ఎక్కి వెళ్తున్నారు. మార్గంలో వారు కొందరు
యువతులను కలుసుకొన్నారు. వారు నీళ్లకోసం బయ
టికి వస్తున్నారు. "దీర్ఘదర్శి ఇక్కడ ఉన్నాడా?" అని
వారు ఆ యువతులను అడిగారు. (గతంలో ఇశ్రాయేలీ
యులు ప్రవక్తను, "దీర్ఘదర్శి" అని పిలిచేవారు. అందు
చేత దేవుని నుండి వారు ఏదైనా అడిగి తెలుసుకోవా
లనుకొంటే, "దీర్ఘదర్శి దగ్గరకు పోదాం పదండి" అనే
వాళ్లు). [12]అది విన్న యువతులు, "అవును ఆ దీర్ఘదర్శి
ఇక్కడే ఉన్నాడు. ఆయన ఈ వేళే పట్టణంలోకి
వచ్చాడు. వీధిలో ఉన్నాడు. ఆరాధనా స్థలంలో సమా
ధాన బలిలో పాలుపుచ్చుకొనేందుకు కొందరు ప్రజలు
ఈ వేళ సమావేశం అవుతున్నారు. [13]"మీరు పట్టణం
లోకి ప్రవేశించగానే ఆయనను చూడగలరు. మీరు
త్వరపడి వెళ్తే, ఆరాధన స్థలంలో ఆయన భోజనానికి
వెళ్లక ముందే మీరు ఆయనను చూడగలుగుతారు.
దీర్ఘదర్శి వచ్చి బలి పదార్థాలను ఆశీర్వదించే వరకూ
ప్రజలు భోజనాలు మొదలు పెట్టరు. వెంటనే వెళ్తే
మీరు ఆయనను చూడగలరు" అని ఆ కన్యకలు
చెప్పారు. [14]సౌలు, అతని సేవకుడు పట్టణానికి వెళ్లారు.
పట్టణంలోకి వెళ్లగానే వారు సమూయేలును చూసారు.
ఆరాధనకు వెళ్లే నిమిత్తం సమూయేలు పట్టణంలో
నుండి బయటకు వస్తూ వారికి ఎదురయ్యాడు.
[15]ఒకరోజు ముందు యెహోవా సమూయేలుతో
ఇలా అన్నాడు: [16]"రేపు ఇంచుమించు ఇదే సమయానికి
నేను నీ వద్దకు ఒక వ్యక్తిని పంపుతాను. అతడు బెన్యా
మీనువాడు. నా ప్రజలైన ఇశ్రాయేలీయుల మీద
నాయకునిగా ఉండేందుకు నీవు అతనిని అభిషే
కించాలి.* నా ప్రజల బాధ నేను గమనించాను. నా
ప్రజల రోదన నేను విన్నాను గనుక ఫిలిష్తీయుల
బారినుండి నా ప్రజలను అతడు రక్షిస్తాడు."
[17]సమూయేలు ప్రథమంగా సౌలును చూసినప్పుడు
యెహోవా అతనితో, "నేను నీకు చెప్పిన వ్యక్తి ఇతడే;
నా ప్రజలను పాలించువాడితడే" అన్నాడు. [18]సౌలు
పట్టణ ద్వారం దగ్గర సమూయేలుకు కనబడెను. "దీర్ఘ
దర్శి ఇల్లెక్కడ?" అని సౌలు సమూ యేలును అడిగాడు.

---

**అభిషేకించుట** ఒకడు రాజుగ, యాజకుడుగ లేక ప్రవక్తగా
నియమింపబడాలంటే ముందుగ దేవునిచేత అభిషేకించ
బడాలి. ఒలీవ నూనెతో అతని తలను అభిషేకిస్తారు.

19"నేనే దీర్ఘదర్శిని. నాకు ముందుగా నడుస్తూ
ఆరాధనా స్థలానికి వెళ్ళు. ఈ రోజు నీవు, నీ సేవకుడు
నాతో కలిసి భోజనం చేయాలి. రేపటి ఉదయం నీ
ప్రశ్నలన్నింటికీ జవాబు చెప్పి నిన్ను ఇంటికి పంపు
తాను.
20మూడు రోజులనుండి మీరు పోగొట్టుకున్న
గాడిదలను గురించి బాధ పడవద్దు. అవి దొరికాయి.
ఇప్పుడు ఇశ్రాయేలు కోరుకుంటున్నది ఎవరిని? నీ
తండ్రి కుటుంబాన్ని కదా?" అన్నాడు సమూయేలు.
21అది విన్న సౌలు, "నేను బెన్యామీను వంశానికి
చెందిన వాడిని! ఇశ్రాయేలు అంతటిలో నా వంశం
చిన్నదిగదా! అందులో నా ఇంటివారు అతి తక్కువ
సంఖ్యలో వున్నారే! అలాంటి నన్ను ఇశ్రాయేలు
కోరుతూ వుందని ఎందుకు చెబుతున్నావు?" అని
అడిగాడు.
22అప్పుడు సమూయేలు సౌలును, అతని సేవకుని
భోజనాలు పెట్టే చోటికి తీసుకుని వెళ్లాడు. భోజనాల
బల్లవద్ద సౌలుకి, అతని సేవకునికి ప్రముఖ స్థానాలను
సమూయేలు ఇచ్చాడు. భోజనాల స్థలంలో సమాధాన
అర్పణలో పాలుపుచ్చుకొనేందుకు సుమారు ముప్పది
మంది ఆహ్వానించబడ్డారు. 23వంటవానితో సమూ
యేలు, "నేను నీకిచ్చిన మాంసాన్ని తీసుకునిరా. ప్రత్యే
కంగా భద్రపర్చమని నీతో చెప్పిన మాంస భాగం
అది" అన్నాడు.
24వంటవాడు తొడ మాంసాన్ని* తెచ్చి సౌలు
ముందు బల్లమీద పెట్టాడు. అప్పుడు సమూయేలు,
ఆ మాంసం అతని కోసం ప్రత్యేకించబడిందని సౌలుతో
చెప్పాడు. ఈ ప్రత్యేకమైన సందర్భానికోసం అతని
కొరకే ఈ మాంసం భద్రపర్చబడింది. కనుక సౌలును
దాన్ని స్వీకరించుమని సమూయేలు చెప్పాడు. కావున
సౌలు ఆ రోజు సమూయేలుతో కలిసి భోజనం చేశాడు.
25భోజనాలు అయిన తరువాత వారు ఆరాధనా
స్థలంనుండి కిందికి దిగి పట్టణంలోకి వెళ్లారు. ఒక
మిద్దెమీద సౌలుకు పడక ఏర్పాటు చేసారు. అక్కడ
సౌలు నిద్రపోయాడు.
26మరునాడు తెల్లవారుఝామున సమూయేలు లేచి
మిద్దెమీద ఉన్న సౌలును మేల్కొలిపాడు. "బయల్దేరు,
నిన్ను నీ దారిని నేను పంపిస్తాను" అన్నాడు సమూ
యేలు. సౌలు లేచి సమూయేలుతో కలిసి బయటికి
వెళ్లాడు. 27సౌలు, అతని సేవకుడు సమూయేలుతో
కలిసి ఊరి బయటకు రాగానే సమూయేలు సౌలును
పిలిచి, "నీ సేవకుణ్ణి మనకు ముందు నడుస్తూ వుండ
మని చెప్పు. నేను నీకు చెప్పాల్సిన దేవుని సందేశం
ఒకటి ఉంది" అని చెప్పాడు.

### సమూయేలు సౌలును అభిషిక్తునిగా చేయుట

10 సమూయేలు ఒక పాత్రలో ప్రత్యేక నూనె
తీసుకుని సౌలు తలమీద పోసాడు. సమూ
యేలు సౌలును ముద్దు పెట్టుకొని, "యెహోవా తన
ప్రజలైన ఇశ్రాయేలీయులకు నిన్ను నాయకునిగా
ఉండేందుకు అభిషేకించాడు. నీవు దేవుని ప్రజలకు
ఆధిపత్యం వహించాలి. చుట్టూరా వున్న శత్రువుల
బారినుండి వారిని నీవు కాపాడతావు. యెహోవా తన
ప్రజల మీద పాలకునిగా ఉండేందుకు నిన్ను అభిషేకిం
చాడు. ఇది సత్యమని ఋజువు చేసే గుర్తు ఇది. 2ఈ
రోజు నీవు నా వద్దనుండి వెళ్లగానే బెన్యామీను సరిహ
ద్దుల్లో సెల్సహు వద్దనున్న రాహేలు సమాధి దగ్గర
నీవు ఇద్దరు వ్యక్తులను కలుస్తావు. 'నీవు వెదకబోయిన
గాడిదలు దొరుకుతాయి. నీ తండ్రి గాడిదలను గూర్చి
చింత పడటం మానేసాడు. ఇప్పుడు ఆయన నీ విష
యంలో చింతిస్తున్నాడు. నా కుమారుని సంగతి నేనేమి
చేయాలి? అని ఆయన అంటున్నాడు" ' అని ఆ
ఇద్దరు మనుష్యులు నీతో అంటారు.
3"ఆ తరువాత తాబోరు వద్ద సింధూర మహా వృక్షం
వరకూ నీవు ఆగకుండా ప్రయాణం చేస్తావు. అక్కడ
మళ్లీ ముగ్గురు మనుష్యులు నిన్ను కలుస్తారు. వారు
బేతేలు పట్టణంలో దేవుని ఆరాధించటానికి వెళుతూ
ఉంటారు. వారిలో ఒకడు మూడు మేక పిల్లలను మోసు
కొని వస్తాడు. రెండవ వానివద్ద మూడు రొట్టెలు
ఉంటాయి. మూడవ వానివద్ద ఒక తిత్తినిండా ద్రాక్షారసం
ఉంటుంది. 4ఆ ముగ్గురు వ్యక్తులూ నిన్ను పలకరించి
రెండు రొట్టెలు నీకు ఇస్తారు. ఆ రెండిటినీ వారినుండి
నీవు తీసుకుంటావు.5తరువాత నీవు ఫిలిష్తీయుల కోట
వున్న గిబియ–ఎలోహీముకు* వెళతావు. నీవు ఆ
పట్టణం దరిచేరగానే ఒక ప్రవక్తల గుంపు బయటకు
రావటం నీవు చూస్తావు. వీరు ఆరాధనా స్థలంనుండి
వస్తూ ఉంటారు. వీణలు, తంబూరా, వేణువు, తంతి
వాయిద్యాలను ముందు వాయిస్తూ దేవుని గూర్చిన
విషయాలు చెబుతూ వస్తారు. 6యెహోవా ఆత్మ నీ
మీదకు బలంగా వస్తుంది. నీలో గొప్ప పరివర్తన
వస్తుంది. ఆ ప్రవక్తలతో పాటు నీవు కూడా దేవుని
విషయాలు చెబుతావు. 7ఈ సూచనలన్నీ ఋజు
వయ్యాక, నీ ఇష్టం వచ్చినట్లు చేయ వచ్చును. దేవుడు
నీకు తోడై ఉంటాడు.
8"నాకంటె ముందుగా నీవు గిల్గాలుకు వెళ్లు. నేను
తరువాత వచ్చి నిన్ను కలుస్తాను. అప్పుడు నేను

**తొడ మాంసం** బహుశ యిది ప్రముఖ అతిథులకోసం ఉంచబడే ఎడమ తొడ కావచ్చు. కుడి తొడ బలి అర్పించే యాజకునికి చెందుతుంది. బలి జంతువును చంపి దాని కొవ్వును దేవునికి కానుకగా బలిపీఠం మీద పెట్టేందుకు యాజకుడు తోడ్పడతాడు.

**గిబియ ఎలోహీము** దేవుని కొండ.

దహన బలులు, సమాధాన బలులు అర్పిస్తాను. కానీ, నీవు ఏడు రోజులు ఆగవలసి వుంటుంది. అప్పుడు నిన్ను కలసి నీవు ఏమి చేయాలో చెబుతాను" అన్నాడు.

### సౌలు ప్రవక్తలా మారుట

[9]సమూయేలును వదిలి సౌలు వెళ్లిపోవటానికి మరల గానే దేవుడు సౌలుకు హృదయ పరివర్తన కలుగచేసాడు. అతనికి చెప్పబడిన గుర్తులన్నీ ఆరోజు నిజమ య్యాయి.
[10]సౌలు, అతని సేవకుడు గిబియా-ఎలోహిం చేరగానే సౌలు కొంతమంది ప్రవక్తలను కలిసాడు. దేవుని ఆత్మ సౌలు మీదికి అతి శక్తివంతంగా దిగెను. మిగిలిన ప్రవక్త లతో కలసి సౌలుకూడ దేవుని విషయాలు చెప్ప సాగాడు.
[11]ఇదివరకు సౌలును ఎరిగిన ప్రజలు అతడు ఇతర ప్రవక్తలతో కలసి ప్రవక్తలా మాట్లాడటం చూసారు. వారంతా "కీషు కొడుకు సౌలుకు ఏమయ్యిందో ఏమో! సౌలుకూడా ప్రవక్తలలో ఒకడయ్యాడా?" అంటూ ఆశ్చర్యపోయారు.
[12]గిబియ-ఎలోహిములో నివసిస్తున్న ఒకడు, "అవును, అతడు వారి నాయకుడిలా* కనబడు తున్నాడు" అన్నాడు. అందుకే, "సౌలుకూడా ప్రవక్తల్లో ఒకడా?" అనే నానుడి ప్రసిద్ధికెక్కింది.

### సౌలు ఇల్లు చేరుట

[13]దేవుని విషయాలు ప్రవచించటం అయిన తర్వాత సౌలు తన ఇంటివద్ద ఉన్న ఆరాధనా స్థలం దగ్గరకు వచ్చాడు. [14]సౌలు తన సేవకుని కలసి ఇంటికి వెళ్లగానే అతని పినతండ్రి, "ఎక్కడికి పోయారు" అని వారిని అడిగాడు.
"గాడిదలను వెదకటానికి వెళ్లాము. అవి దొరకక పోయేసరికి సమూయేలును చూడటానికి వెళ్లాము." అని సౌలు చెప్పాడు.
[15]"సమూయేలు నీకు ఏమి చెప్పాడో దయచేసి నాకు చెప్పు" అన్నాడు సౌలు పినతండ్రి.
[16]"గాడిదలు దొరికినట్లు వెల్లడి చేశాడని సౌలు అన్నాడు." అంతేగాని రాజ్యాన్ని గురించి సమూయేలు చెప్పినదేదీ సౌలు తన పినతండ్రికి చెప్పలేదు.

### సౌలును రాజుగా సమూయేలు ప్రకటించుట

[17]మిస్పావద్ద యెహోవాను కలుసుకొనేందుకు ఇశ్రా యేలీయులంతా సమావేశం కావాలని సమూయేలు పిలుపునిచ్చాడు. [18]సమూయేలు ఇలా అన్నాడు: "నేను ఇశ్రాయేలును ఈజిప్టునుంచి బయటకు తీసుకుని వచ్చాను. 'నేను మిమ్మల్ని ఈజిప్టు బంధంనుండి విడుదల చేశాను. మిమ్మల్ని బాధించటానికి ప్రయత్నిం చిన ఇతర రాజ్యాలనుండి కూడా మిమ్మల్ని రక్షించాను'. అని ఇశ్రాయేలీయుల యెహోవా దేవుడు చెప్పాడు:
[19]మళ్లీ ఇశ్రాయేలీయులతో సమూయేలు ఇలా అన్నాడు: "మీ అందరి కష్టనష్టాల నుండి మీ దేవుడు మిమ్మల్ని కాపాడుతూ వస్తూనే వున్నాడు. కానీ నేడు మీరు మీ దేవుని తిరస్కరించారు. మిమ్మల్ని పాలించ టానికి మీకో రాజు కావాలని అడుగుతున్నారు. సరే. రండి! మీమీ వంశాల వారీగా, కుటుంబాల వారీగా దేవుని ముందర నిల బడండి."
[20]ఇశ్రాయేలు వంశాల వారినందరినీ సమూయేలు ఒక చోట చేర్చాడు. వారిలో బెన్యామీను వంశం ఎన్ను కోబడింది.
[21]బెన్యామీను వంశంలో వున్న కుటుంబాల వారంద రినీ గుంపు గుంపుగా వరుసగా నడిపించాడు. వాటిలో మత్రీ కుటుంబం ఎన్నుకోబడింది. మరల మత్రీ కుటుంబంలోని వారందరినీ వరుసగా నడిపించాడు. వారిలో కీషు కుమారుడు సౌలు ఎంపిక చేయబడ్డాడు. సౌలును చూడాలని వచ్చిన ప్రజలు అతనికోసం వెదు కగా అతడు కనిపించలేదు. [22]"ఆ మనిషి ఇక్కడ ఉన్నాడా?" అని ప్రజలు అడిగారు.
"సౌలు సామానుల వెనుక దాగి ఉన్నాడని" యెహోవా చెప్పాడు.
[23]జనం పరుగెత్తుకుంటూ పోయి సామాన్ల వెనుక దాగుకొని ఉన్న సౌలును తీసుకుని వచ్చారు. సౌలు వారందరిలో నిలబడి ఉన్నపుడు అతను అందరికంటె ఎత్తుగా, ఆజానుబాహుడుగా కనబడ్డాడు.
[24]"ఇదిగో చూడండి, యెహోవా ఎంపిక చేసిన మనిషి. ప్రజలలో సౌలువంటివాడు ఒక్కడూ లేడు." అని సమూయేలు ప్రజలందరితో అన్నాడు. అప్పుడు ప్రజలు, "రాజు దీర్ఘకాలం జీవించునుగాక!" అని అరి చారు.
[25]నూతన రాజ్యంలో నిబంధనావళిని సమూయేలు ప్రజలకు వివరించాడు. రాజ్యపరిపాలన నియమాలను, నిబంధనలను ఒక పుస్తకంలో రాసి సమూయేలు యెహోవా ముందర ఉంచాడు. అలా చేసి సమూ యేలు ప్రజలను తమ తమ ఇండ్లకు వెళ్లమన్నాడు.
[26]సౌలు గిబియాలో వున్న తన ఇంటికి వెళ్లిపోయాడు. దేవుడు అక్కడ వున్న ధైర్యవంతుల హృదయాలను ప్రేరేపించాడు. ఈ ధీరులంతా సౌలు వెంట వెళ్లారు.
[27]కాని పనికిమాలినవారు కొందరు "ఈ వ్యక్తి మనలను ఎలా రక్షించగలడు" అని అంటూ సౌలును చులకనగా చేసి ఆయనకు కానుకలను పట్టుకు వెళ్లటానికి నిరాక రించారు. సౌలు ఏమీ పలకలేదు.

---

**అవును ... నాయకుడిలా** అక్షరాలా "వారి తండ్రి ఎవరు" అని. ప్రవక్తల నాయకుడు సాధారణంగా వారి తండ్రి అని పిలువబడేవాడు.

### అమ్మోనీయుల రాజు నాహాషు

అమ్మోనీయుల రాజైన నాహాషు గాదీయులను, రూబేనీయులను క్రూరంగా బాధిస్తూండేవాడు. వారిలో ప్రతి ఒక్కడి కుడి కంటినీ రాజు తీసివేస్తూండేవాడు. వారిని ఎవరైనా రక్షించటం కూడా అతడు సహించ లేదు. అమ్మోనీయుల రాజైన నాహాషు యొర్దాను నదికి కుడి వైపున ఉన్న ఇశ్రాయేలీయులలో ప్రతి ఒక్కరి కుడి కన్నూ తోడివేసాడు. కాని ఏడువేలమంది అమ్మో నీయుల నుండి పారిపోయి యాబేష్గిలాదుకు చేరారు.

11 ఒకనెల గడిచింది. తరువాత అమ్మోనీయుడైన
నాహాషు తన సైన్యంతో వచ్చి యాబేష్గిలాదు
నగరాన్ని ముట్టడించాడు. "నీవు మాతో ఒడంబడిక
చేసుకొంటే మేము నీ సేవ చేస్తాము" అని యాబేషు
ప్రజలు నాహాషుతో చెప్పారు.
2"మీలోని ప్రతి ఒక్కని కుడి కంటినీ తోడివేయ
నిస్తే మీతో సంధికి ఒప్పుకుంటానన్నాడు నాహాషు."
అలా చేస్తే నేను ఇశ్రాయేలునంతటినీ అవమాన పర్చి
నట్లవుతుందన్నాడు.
3అది విన్న యాబేషు ప్రజల నాయకులు "ఏడు
రోజులు గడువు ఇవ్వమని అడిగారు. ఇశ్రాయేలు నలు
మూలలకు దూతలను పంపుతామనీ, ఎవ్వరూ
సహాయం చేయటానికి ముందుకు రాకపోతే లొంగి
పోతామనీ" వారు నాహాషుతో అన్నారు.

### సౌలు యాబేషు గిలాదును రక్షించుట

4వార్తాహరులు సౌలు నివసిస్తున్న గిబియాకు వెళ్లారు.
అక్కడి ప్రజలకు ఆ వార్త అందజేశారు. ప్రజలు
ఘోరంగా విలపించారు.
5సౌలు అప్పుడే తన పొలములోని తన పశువుల
దగ్గరనుండి ఇంటికి వస్తూనే ప్రజల రోదన విన్నాడు.
"ప్రజలకేమయ్యింది? వారెందుకు విలపిస్తున్నారు?"
అని అడిగాడు.
అప్పుడు ప్రజలు యాబేషునుండి వచ్చిన దూతలు
చెప్పినదంతా వినిపించారు. 6అది వినగానే సౌలు మీదకు
దేవుని ఆత్మ శక్తివంతంగా వచ్చి ఆవరించింది. అతనికి
పట్టరాని కోపం వచ్చింది.
7సౌలు ఒక జత కాడి ఎద్దు లను తీసుకుని వాటిని
నరికి ముక్కలు చేసి, వాటిని ఆ వచ్చిన దూతలకు
ఇచ్చి వాటిని ఇశ్రాయేలునలు మూలలకూ తీసుకొని
వెళ్లమన్నాడు.
"వార్తాహరులు ఆ ఎడ్ల మాంస ఖండాలను వాడ
వాడలా తిప్పుతూ సౌలును, సమూయేలును వెంబ
డించని వారి ఎడ్లన్నిటికీ ఇదే గతి పడుతుందని చాటి
చెప్పారు." యెహోవా భయం ప్రజలందరికీ ముంచు
కొచ్చింది. వారంతా ఒక్కటై బయటికి వచ్చారు.
8సౌలు బెజెకు వద్ద వారిని సమావేశపరచినప్పుడు
అక్కడ మూడులక్షల మంది ఇశ్రాయేలీయులు, ముప్ప
దివేలమంది యూదా వారు ఉన్నారు. 9"గిలాదులో
ఉన్న యాబేషుకు వెళ్లండి. ఆ ప్రజలు రేపు మధ్యాహ్నం
లోగా రక్షించబడుతారని ఆ ప్రజలతో చెప్పండి" అని
సౌలు, అతని సైనికులు యాబేషునుండి వచ్చిన మను
ష్యులకు చెప్పారు. సౌలు సమాచారాన్ని యాబేషు
ప్రజలకు ఆ దూతలు తెలియజేసినప్పుడు వారు చాలా
ఆనందపడ్డారు.
10యాబేషు ప్రజలు, "రేపు లొంగిపోతామనీ,
అప్పుడు వారిని తనకు ఇష్టం వచ్చినట్లు చేయవచ్చనీ"
అమ్మోనీయుడైన నాహాషుకు తెలియజేశారు. 11ఆ
మరునాటి ఉదయం సౌలు తన సైన్యాన్ని మూడు
గుంపులుగా విభజించాడు. సూర్యోదయానికి సౌలు
సైన్యం అమ్మోనీయుల శిబిరాన్ని చేరింది. అమ్మోనీ
యుల గస్తీ తిరిగే జట్టు మారుతున్నప్పుడు సౌలు
వారిమీద దాడి చేసాడు. సౌలు, అతని సైనికులు
అమ్మోనీయులను ఓడించారు. చావగా మిగిలిన అమ్మో
నీయులు చెల్లాచెదురై పోయారు. ఏ ఇద్దరూ కూడ
కలసి ఉండే అవకాశం వారికి లేకుండా పోయింది.
12"సౌలు రాజుగా ఉండటానికి అంగీకరించని వాళ్లె
వరు? వారిని ఇక్కడికి తీసుకొని రండి. వారిని చంపే
స్తాము" అని ప్రజలు సమూయేలుతో అన్నారు.
13"వద్దు. ఈ వేళ ఇశ్రాయేలీయులను రక్షించినవాడు
యెహోవా. అందుచేత ఈ వేళ ఏ ఒక్కరూ చంప
బడకూడదు" అని సౌలు చెప్పాడు.
14"గిల్గాలుకు వెళదాం రండి. అక్కడ సౌలు రాజ
రికాన్ని తిరిగి కొనసాగేలా చేద్దాము" అన్నాడు సమూ
యేలు ప్రజలతో.
15జనమంతా గిల్గాలుకు వెళ్లారు. అక్కడ యెహోవా
ఎదుట వారు సౌలును మళ్లీ రాజుగా ఎన్నుకున్నారు.
వారు యెహోవాకు సమాధాన బలులు కూడ
అర్పించారు. సౌలు, ఇశ్రాయేలు ప్రజలు గొప్ప సంబరం
జరుపుకొన్నారు.

### రాజు విషయం సమూయేలు ఇశ్రాయేలీయులతో మాట్లాడటం

12 సమూయేలు ఇశ్రాయేలు ప్రజలనుద్దేశించి
ఇలా అన్నాడు: "మీరు నన్ను కోరినదంతా
చేశాను. మీకు ఒక రాజు కావాలంటే ఇచ్చాను. 2ఇప్పుడు
మీకు నాయకత్వం వహించటానికి ఒక రాజు ఉన్నాడు.
నేను తల నెరసి ముసలివాడనై పోయాను. నా కుమా
రులు మీతోనే ఉన్నారు. నా చిన్ననాటి నుంచీ మీకు
నేను ఆధిపత్యం వహించాను. 3ఇప్పుడు నేను మీ
సమక్షంలోనే ఉన్నాను. నేనేదైనా తప్పు చేసివుంటే
మీరు నాకు వ్యతిరేకంగా వాటిని దేవునికి, ఆయన
ఏర్పరచిన రాజుకు చెప్పండి. నేను ఎవరి ఎద్దునే
గాని, గాడిదనే గాని దొంగిలించానా? నేనెవరినైనా

బాధించటంగాని, మోసగించటంగాని జరిగిందా? నేనె
ప్పుడైనా డబ్బుగాని, ఒక జత చెప్పులుగాని తప్పుపని
చేయటానికి తీసుకున్నానా? ఇటువంటి పనులేవైనా
చేసి ఉంటే నేను వాటిని తిరిగి ఇచ్చి తప్పు
సరిదిద్దుకుంటాను.”
4“నీవు మమ్ములను మోసం చేయలేదు; బాధ
పెట్టనూ లేదు. నీవు ఎవరి వద్దా లంచాలు కూడ
తీసుకోలేదు” అని ఇశ్రాయేలు జనం అన్నారు.
5“యెహోవా, ఆయన ఎంపిక చేసిన రాజు కూడ
ఈ రోజు మీరు చెప్పిన దానిని విన్నారు. మీరు నాలో
ఏ తప్పూ కనుగొనలేదనే దానికి వారిద్దరూ సాక్షులు”
అన్నాడు సమూయేలు. అంతట ప్రజలు, “అవును!
ఇది సత్యం” అని చెప్పారు.
6అప్పుడు ప్రజలనుద్దేశించి సమూయేలు, “ఆ
దేవుడే సాక్షి. ఆయనే మోషేను, అహరోనును ఎంపిక
చేసాడు. మీ పూర్వీకులను ఈజిప్టు నుండి ఆయనే
విముక్తులను చేసాడు.” 7మీరంతా ఇప్పుడు ఇక్కడ
నిలబడండి. ఆ యెహోవా మీ కోసం, మీ పూర్వీకుల
సంక్షేమం కోసం చేసిన పనులను వివరిస్తాను.
8యాకోబు వెళ్లిన తర్వాత ఈజిప్టు ప్రజలు ఆయన
వంశీకుల జీవితాన్ని కష్టతరం చేశారు. కావున వారు
యెహోవా సహాయం అర్థించారు. వారి మొర ఆల
కించిన యెహోవా మోషేను, అహరోనును అక్కడికి
పంపించాడు. వారిద్దరూ మీ పూర్వీకులను ఈజిప్టు
నుండి బయటకు తీసుకుని వచ్చి ఈ ప్రాంతానికి
నడిపించారు.
9“కానీ మీ పూర్వీకులు వారి దేవుడైన యెహో
వాను మర్చిపోయారు.” అప్పుడు యెహోవా వారిని
హాసోరు పట్టణ సైన్యాధిపతి సీసెరాకు బానిసలయ్యేలా
చేశాడు. తరువాత ఫిలిష్తీయులకు, మోయాబు రాజుకు
కూడ యెహోవా వారిని బానిసలు కానిచ్చాడు.
వారంతా మీ పూర్వీకులకు వ్యతిరేకంగా పోరాడారు.
10అయితే మీ పూర్వీకులు సహాయంకోసం
యెహోవాకు మొరపెట్టారు. ‘మేము పాపం చేసాము.
మేము యెహోవాను విడిచిపెట్టి బయలు, అష్తారోతు
అనే బూటకపు దేవతలను సేవించాము. అయితే
ఇప్పుడు మమ్మల్ని మా శత్రువుల బారినుండి రక్షించు.
మేము నిన్ను సేవిస్తాము’ అని చెప్పారు.
11"యెరుబ్బయలు (గిద్యోను) బెదానను (బారాకు)
యెఫ్తా, సమూయేలును పంపి, మీ చుట్టూ ఉన్న
శత్రువులనుండి యెహోవా మిమ్మల్ని రక్షించాడు.
మీరు క్షేమంగా జీవిస్తున్నారు. 12కానీ అమ్మోనీయుల
రాజైన నాహాషు మీమీద యుద్ధానికి రావటం మీరు
చూసినప్పుడు, మీకు మీ దేవుడైన యెహోవా రాజుగా
ఉన్నప్పటికీ “మమ్మ పాలించటానికి మాకు ఒక రాజు
కావాలని” మీరు కోరుకున్నారు! 13మీరు ఎంపిక
చేసుకొన్న రాజు మీరు కోరుకున్న రాజు ఇదిగో
ఇక్కడ ఉన్నాడు. మీమీద ఒక రాజును యెహోవా
నియమించాడు. 14మీరు యెహోవాను ఘనపరచి,
ఆయనను సేవించాలి. ఆయన ఆజ్ఞలకు వ్యతిరేకంగా
మీరు పోరాడకూడదు. మరియు మీరు, మిమ్మల్ని
పాలిస్తున్న రాజు, మీ దేవుడైన యెహోవాను వెంబ
డించాలి. మీరు ఆ పనులు చేస్తే, అప్పుడు దేవుడు
మిమ్మల్ని రక్షిస్తాడు.
15కానీ మీరు యెహోవాకు విధేయులు కాకపోతే,
ఆయన ఆజ్ఞలను తిరస్కరిస్తే, ఆయన మీకు వ్యతిరేకి
అవుతాడు. ప్రభువు మిమ్మల్ని, మీ రాజును సర్వ
నాశనం చేస్తాడు.
16“ఇప్పుడు మీరు నిశ్శబ్దంగా, నిశ్చలంగా నిల
బడండి. మీ కళ్లముందే యెహోవా చేసే ఒక మహిమా
న్విత కార్యం చూడండి. 17ఇప్పుడు గోధుమ పంట*
కోతకు వచ్చింది. ఫెళఫెళమనే ఉరుములు, మెరుపు
లతో వర్షం కురిపించుమని నేను దేవుని ప్రార్థిస్తాను.
అప్పుడు మీరు రాజు కావాలని అడిగి, యెహోవాపట్ల
ఎంత పాపం చేశారో మీరే తెలుసుకుంటారు,” అని
వివరంగా చెప్పాడు.
18అలా చెప్పి, సమూయేలు యెహోవాను ప్రార్థిం
చాడు. అదే రోజున యెహోవా ఉరుములతో కూడిన
వర్షం పంపించాడు. దానితో యెహోవా అనిన, సమూ
యేలు అనిన ప్రజలకు విపరీతమైన భయం ఏర్పడింది.
19ప్రజలు సమూయేలుతో, “నీ సేవకులమైన మా
కోసం దేవుడైన యెహోవాను ప్రార్థించు. మమ్మల్ని
చనిపోనీయవద్దు. మా పాపాల మూటకుతోడు రాజు
కావాలని అడిగే దురాచారాన్ని కూడ సంతరించు
కున్నాం” అని వాపోయారు.
20భయపడవద్దని సమూయేలు వారికి ధైర్యం
చెప్పాడు. “మీరు తప్పు చేసిన మాట నిజమే. అయినా
యెహోవాకు దూరం కావద్దు. మీ హృదయ పూర్వ
కంగా యెహోవాకు సేవ చేయండి. 21విగ్రహాలు వట్టి
బొమ్మలే. అవి మీకు సహాయం చేయలేవు. కావున
వాటిని పూజించవద్దు. విగ్రహాలు మీకు సహాయమూ
చెయ్యలేవు, కాపాడనూలేవు. విగ్రహాలు కేవలం
వ్యర్థము!!
22“అయితే యెహోవా తన ప్రజలను విడిచి
పెట్టడు. యెహోవా మిమ్మల్ని తన స్వంత ప్రజలుగా
చేసుకోనేందుకు ఆనందించాడు. అందుచేత తన
మంచి పేరుకోసం ఆయన మిమ్మల్ని విడిచిపెట్టడు.
23కావున మీ కోసం ప్రార్థన చేయకుండా నేను మాని
వేస్తే అది నా తప్పు అవుతుంది. ఒకవేళ నేను అలా
మానివేస్తే యెహోవాకు విరుద్ధంగా పాపం చేసినవాణ్ణి
అవుతాను. సరైన మంచి జీవన మార్గాన్ని నేను మీకు
ప్రబోధిస్తాను. 24అయితే మీరు యెహోవా ఎడల

---

**గోధుమ పంట** ఇది వర్షాలు లేని కాలం.

భయభక్తులతో ఉండాలి. మీ పూర్ణ హృదయంతో మీరు వాస్తవంగా ఆయనను సేవించాలి. ఆయన మీ కోసం చేసిన ఆశ్చర్యకరమైన పనులన్నీ జ్ఞాపకం చేసుకోండి! [25]మీరు మొండి వైఖరితో చెడుచేస్తూనే ఉంటే ఆయన మిమ్మల్నీ, మీ రాజునూ చీపురుతో పాచిని ఊడ్చి పారవేసినట్లు విసిరేస్తాడు" అని సమూయేలు వారికి వివరించి చెప్పాడు.

## సౌలు చేసిన మొదటి తప్పు

13 అప్పటికి సౌలు పరిపాలించటం మొదలు పెట్టి ఒక సంవత్సరం అయింది. అతడు రెండు సంవత్సరాలు పాలించేసరికి [2]ఇశ్రాయేలునుండి మూడు వేల మందిని సైన్యానికి ఎంపిక చేశాడు. కొండల ప్రాంతమైన బేతేలు పట్టణం దగ్గర మిక్మషులో అతనితోకూడ రెండు వేలమంది ఉన్నారు. బెన్యామీనులోని గిబియాలో యోనాతానుతో ఒక వెయ్యిమంది ఉన్నారు. సైన్యంలో మిగిలిన వారిని సౌలు ఇంటికి పంపేశాడు.

[3]యోనాతాను ఫిలిష్తీయులను గెబాలో ఉన్న వారి శిబిరం వద్దనే ఓడించాడు. ఇది విన్న ఫిలిష్తీయులు "హెబ్రీ జనం తిరుగుబాటు చేశారని" అరిచారు. "హెబ్రీ ప్రజలు జరిగినదంతా వినాలని" సౌలు అన్నాడు. ఇదంతా ఇశ్రాయేలు దేశమంతా చాటింపు వేసి చెప్పమని మనుష్యులను పురమాయించాడు సౌలు. [4]ఇశ్రాయేలీయులంతా ఈ వార్త విని, "సౌలు ఫిలిష్తీయులను ఓడించాడు గనుక వాళ్లు మనల్ని ఇప్పుడు మరింత అసహ్యించుకుంటారని" అన్నారు.

సౌలును గిల్గాలు వద్ద కలుసుకోవాలని ఇశ్రాయేలు ప్రజలకు పిలుపు వచ్చింది. [5]ఫిలిష్తీయులు ఇశ్రాయేలుపై దెబ్బ తీయటానికి సమాయత్తమయ్యారు. వారికి మూడు వేల రథాలు ఉన్నాయి. ఆరువేల మంది అశ్వదళ సైనికులు ఉన్నారు. సముద్ర తీరాన ఇసుక ఉన్నట్లుగా ఫిలిష్తీయుల సైన్యంకూడ లెక్కకు మించి ఉంది. వారంతా పోయి మిక్మషు వద్ద గుడారాలు వేసుకున్నారు. బేతావెనుకు తూర్పుగా మిక్మషు ఉంది.

[6]ఇశ్రాయేలు ప్రజలు తాము చాలా విషమ స్థితిలో వున్నట్లు గమనించారు. వారు చిక్కులో పడ్డామని గుర్తించి వారంతా పారిపోయి కొండగుహల్లోను, బండ సందుల్లోను, పొదల్లోను దాక్కున్నారు. మరికొందరు రాతిబండల వెనుక, గోతులలోను, నూతులలోను దాక్కున్నారు. [7]కొందరు హెబ్రీయులు యొర్దాను నది దాటి గాదు, గిలాదు ప్రాంతాలకు వెళ్లారు. కాని సౌలు గిల్గాలులోనే ఉన్నాడు. తన సైన్యంలోని వారంతా భయంతో వణకిపోయారు. [8]సమూయేలు గిల్గాలులో సౌలును కలుస్తానని చెప్పాడు. అందువల్ల సౌలు గిల్గాలులో ఏడు రోజులు ఉన్నాడు. కాని సమూయేలు రాలేదు. సైనికులు ఒక్కొక్కరే సౌలును వదిలి పోవటం మొదలుపెట్టారు. [9]"దహన బలులను, సమాధాన బలులను తన దగ్గరకు తీసుకుని రమ్మని" చెప్పాడు. అవి వచ్చిన పిమ్మట సౌలు దహన బలులు అర్పించాడు. [10]సౌలు దహనబలి అర్పించి ముగించే సరికి సమూయేలు వచ్చాడు. సౌలు ఆయనను కలుసుకొనేందుకు వెళ్లాడు.

[11]సమూయేలు, "నీవు చేసిన పని ఏమిటి?" అని సౌలును అడిగాడు. అందుకు సౌలు, "మిక్మషు వద్ద ఫిలిష్తీయులు కూడుకొంటున్నారు. సైనికులేమో నన్ను విడిచిపెట్టేసి, ఒక్కొక్కరే వెళ్లిపోవటం నేను గమనించాను. నీవేమో సమయానికి ఇక్కడికి రాలేదు. [12]గిల్గాలు వద్ద ఫిలిష్తీయులు నా మీదకు వస్తారని నేననుకున్నాను. అప్పటికి నేను ఇంకా దేవుని సహాయం అర్థించియుండలేదు. అందువల్ల నేను బలవంతంగా దహనబలి అర్పించాను" అని చెప్పాడు.

[13]అది విన్న సమూయేలు, "నీవు చాలా అవివేకంగా ప్రవర్తించావు! నీ దేవుడైన యెహోవా ఆజ్ఞ నీవు పాటించలేదు. నీవు ఆయన ఆజ్ఞను పాటించివుంటే, ఆయన ఇశ్రాయేలు మీద నీ కుటుంబ పాలన ఎప్పటికీ కొనసాగేలా చేసేవాడు. [14]ఇప్పుడు నీ పాలన అంతం అవుతుంది. యెహోవాకు విధేయుడు కావాలని కోరేవాని కోసం యెహోవా చూశాడు. యెహోవా అతనిని కనుగొన్నాడు. యెహోవా అతనిని తన ప్రజలకు కొత్త నాయకునిగా ఎంపిక చేసాడు. నీవు యెహోవా ఆజ్ఞకు విధేయుడవు కాలేదు. కనుక యెహోవా కొత్త నాయకుని ఎంపిక చేసాడు!" అని చెప్పాడు.

## మిక్మషువద్ద యుద్ధం

[15]అప్పుడు సమూయేలు బయల్దేరి గిల్గాలు విడిచి వెళ్లిపోయాడు. సౌలు, అతనితో మిగిలిన సైన్యం గిల్గాలు విడిచి బెన్యామీను ప్రాంతంలోని గిబియాకు వెళ్లారు. తన వద్ద మిగిలిన సైన్యాన్ని సమీకరించుకొని చూస్తే సౌలు వద్ద ఆరువందల మంది మాత్రమే మిగిలారు.[16]సౌలు, అతని కుమారుడు యోనాతాను, మరియు సైనికులు బెన్యామీను ప్రాంతంలోని గిబియాకు వెళ్లారు. ఫిలిష్తీయులు మిక్మషులో గుడారాలు వేసుకొనియుండిరి. [17]మెరుపు దాడులు చేసే మూడు దళాలు ఫిలిష్తీయుల శిబిరంనుంచి బయలుదేరాయి. ఒక దళం ఉత్తరంగా షూయాలు ప్రాంతంలో ఒఫ్రా మార్గంలో వెళ్లింది. [18]రెండవది వాయవ్య దిశగా బేత్ హోరోనుకు పోయే మార్గంలో వెళ్లింది. మూడవ దళం తూర్పున సరిహద్దు మార్గంలో వెళ్లింది. ఆ దారి అరణ్య దిశగా జెబోయిము లోయకు సమీపంగా ఉంది.

[19]ఇశ్రాయేలు ప్రజలు ఎవ్వరూ ఇనుముతో ఏ వస్తువూ చేయలేరు. ఇశ్రాయేలులో కమ్మరి ఒక్కడూ లేడు. "(కమ్మరివాళ్లు ఉంటే) ఇశ్రాయేలీయులు కత్తులను ఈటెలను చేయించుకొనెదరు" అని

ఫిలిష్తీయులు చెప్పుకొని కమ్మరి వాళ్ల లేకుండా చేసిరి.
20ఇనుప వస్తువులను ఫిలిష్తీయులు మాత్రమే పదును
పెట్ట గలరు. అందుచేత ఇశ్రాయేలీయులు వారి నాగళ్లు,
పారలు, గొడ్డళ్లు, లేక కొడవళ్ల గనుక పదును చేయా
ల్సివస్తే, వారు ఫిలిష్తీయుల దగ్గరకు వెళ్లాల్సి వచ్చేది.
21నాగళ్లు, పారలు సాన బెట్టడానికి ఫిలిష్తీ కమ్మరులు
1/3 వంతు ఔన్సు వెండి పుచ్చుకొనేవారు. మరియు
గునపాలు, గొడ్డళ్లు, మునికోల ఇనుప కొనలు సాన
బెట్టటానికి వారు 1/6 వంతు ఔన్సు (వెండి) (అక్షరాల
షెకెలులో మూడోవంతు) పుచ్చుకొనేవారు.
22కనుక యుద్ధం రోజున సౌలు వెంట ఉన్న ఇశ్రాయేలు
సైనికులు ఎవ్వరి వద్దా (ఇనుప) ఖడ్గాలు, ఈటెలు
లేవు. సౌలుకు, అతని కుమారుడు యోనాతానుకు
మాత్రమే ఇనుప ఆయుధాలు ఉన్నాయి. 23మిక్మషు
వద్ద కనుమను ఫిలిష్తీ సైనికదళం ఒకటి కాపలా కాస్తూ
ఉంది.

## యోనాతాను ఫిలిష్తీయులపై పడటం

14 సౌలు కుమారుడైన యోనాతాను తన ఆయు
ధాలు మోసే యువకుని పిలిచి "లోయ ఆవలి
పక్కన వున్న ఫిలిష్తీయుల గుడారాల వద్దకు వెళదాము"
అన్నాడు. కాని ఈ విషయం మాత్రం తన తండ్రికి
చెప్పలేదు.
2మిగ్రోనులో ఒక కొండ కొనలో ఒక దానిమ్మ
చెట్టు కింద సౌలు కూర్చుని ఉన్నాడు. ఇది అక్కడ
ఉన్న కళ్లానికి దగ్గర్లో ఉంది. సౌలుతోకూడ ఆరువందల
మంది మనుష్యులు ఉన్నారు. 3వారిలో ఒకడు
అహీయా. ఈకాబోదు సోదరుడగు అహీటూబు కుమా
రుడు అహీయా. ఈకాబోదు ఫీనెహాసు కుమారుడు.
ఫీనెహాసు ఏలీ కుమారుడు. షిలోహు పట్టణంలో
యెహోవా యాజకునిగా అహీయా పని చేస్తున్నాడు.
అతడు ఏఫోదు అనబడే పవిత్ర వస్త్రం ధరించాడు.
4కనుమకు ఇరుప్రక్కలా నిటారైన బండలు న్నాయి.
యోనాతాను ఆ కనుమగుండా ఫిలిష్తీయుల శిబిర
మునకు వెళ్లాలని నిర్ణయించాడు. ఒక పక్కనున్న కొండ
పేరు బొస్సేసు. రెండవ పక్కనున్న నిడువు కొండ
కనుమ పేరు సెనే. 5ఒక బండ మిక్మషు వైపు ఉత్తరానికి
ఉంది. మరొక బండ గిబియా వైపు దక్షిణంగా ఉంది.
6యోనాతాను తన ఆయుధాలు మోసే యువకు
నితో వారి మీదికి వెళదాము రమ్మన్నాడు. "బహుశః
యెహోవా మనకు సహాయం చేయవచ్చు. మనతో
ఎక్కువ మంది వున్నారా, తక్కువమంది ఉన్నారా,
అన్నది సమస్య కాదు. దేవుడు సంకల్పిస్తే ఇవేమీ
అడ్డురావు విజయానికి" అన్నాడు యోనాతాను.
7"మీ చిత్తమొచ్చినట్లు చేయండి. నేను ఎంతసేపూ
నిన్ను కనిపెట్టుకొనే ఉంటాను" అన్నాడు ఆ యువ
సైనికుడు.
8"అయితే, రా! ఫిలిష్తీయుల దగ్గరకు పోదాము.
వారు మనలను చూసేలా వెళదాము. 9వాళ్లు గనుక
మనల్ని చూసి 'తాము వచ్చే వరకూ ఆగండని' అంటే,
మనము అప్పుడు ఎక్కడ వుంటే అక్కడే ఆగిపోదాము.
వారి వద్దకు పోవద్దు. 10కానీ 'మా దగ్గరకు పైకి రండి'
అని ఫిలిష్తీయులు చెబితే, మనం వాళ్ల దగ్గరకు ఎక్కి
పోదాము. ఎందుకంటే అది దేవుని నుండి వచ్చే గుర్తు
గనుక. మనం వారిని ఓడించేలా యెహోవా చేస్తాడని
దాని అర్థం." అని యోనాతాను తన యువ సైనికునితో
చెప్పాడు.
11ఫిలిష్తీయులు వారిని చూసేలా యోనాతాను,
అతని సహాయకుడు ఇద్దరూ కలసి వెళ్లారు. వీరిని
చూసిన ఫిలిష్తీయులు వారిలో వారు, "చూడండి!
హెబ్రీ సైనికులు వారు దాగిన బొరియలనుండి బయ
టికి వస్తున్నారు!" అని అనుకున్నారు. 12శిబిరంలో
వున్న ఫిలిష్తీయులు వారిద్దరినీ చూసి, "మావద్దకు
పైకి రండి. మీకు మంచి గుణపాఠం చెబుతాము"
అన్నారు. అది విన్న యోనాతాను తన సహాయకు
నితో, "నా వెనుకనే కొండ ఎక్కు. యెహోవా ఫిలిష్తీ
యులను ఇశ్రాయేలుకు అప్పగించాడు!" అని
చెప్పాడు.
13-14అప్పుడు యోనాతాను తన కాళ్లు, చేతులతో
మీదికి ఎగబాకినాడు. భటుడు అతని వెనుకనే అను
సరించాడు. యోనాతాను మరియు అతని సహాయ
కుడు ఫిలిష్తీయులను ఎదుర్కొన్నారు. మొదటి
వధయందు వారు ఇరవై మంది ఫిలిష్తీయులను అర
ఎకరము నేల పొడవున చంపారు. యోనాతాను ఎదు
రుగా వచ్చిన వారితో పోరాడాడు. ఆయుధాలు మోసే
వాడు అతని వెనుకనే వస్తూ చావకుండా గాయపడ్డవారిని
చంపేసాడు.
15ఫిలిష్తీయులంతా చాలా భయపడిపోయారు.
మెరుపు దాడులను చేయగల దళంవారితో సహా శిబి
రంలో ఉన్న వారంతా మిక్కిలిగా భయపడ్డారు. భూమి
కూడ కంపించింది! వారు చాలా భయంతో వణకి
పోయారు.
16బెన్యామీను దేశంలోని గిబియా వద్ద ఉన్న సౌలు
సైనికులు, ఫిలిష్తీ సైనికులు చెల్లాచెదురై పారిపోవటం
చూశారు. 17సౌలు తనతోకూడ ఉన్న సైన్యంతో
"మనుష్యుల్ని లెక్కబెట్టండి. శిబిరాన్ని విడిచిపోయింది
ఎవరో నేను తెలుసుకోవాలి" అన్నాడు. వారు లెక్క
పెట్టి చూస్తే, అక్కడ లేని వారు యోనాతాను, అతని
ఆయుధము మోసేవాడు.
18"దేవుని పవిత్ర పెట్టెను తెమ్మని" యాజకుడైన
అహీయతో సౌలు చెప్పాడు. (ఆ సమయంలో పవిత్ర
పెట్టె ఇశ్రాయేలీయుల వద్ద ఉంది. 19సౌలు యాజకు
నితో మాట్లాడుతూ వుండగానే ఫిలిష్తీయులలో అలజడి
ఎక్కువయ్యింది. అప్పుడు సౌలు అసహనంతో, "నీ

ప్రార్థన యిక చాలు, నీ చేతులు కిందికి దించు" అని
యాజకునితో చెప్పాడు.
20సౌలు, మరియు అతనితోవున్న సైన్యం సమకూడి
యుద్ధానికి దిగారు. ఫిలిష్తీయులు గందరగోళంగా ఉన్నా
రని వారు గమనించారు. కొంతమంది ఫిలిష్తీయులు
తమలో తామే కత్తులతో పొడుచు కొంటున్నట్టు
వారు చూశారు. 21గతంలో వారి కింద పని చేసిన
హెబ్రీయులు కొందరు ఫిలిష్తీయుల శిబిరంలో
ఉన్నారు. ఈ హెబ్రీయులు సౌలు, యోనాతానుతో
వున్న ఇశ్రాయేలీయులకు మద్దతు ఇచ్చారు. 22ఎఫ్రా
యిము కొండల దేశంలో దాగివున్న ఇశ్రాయేలీయు
లంతా పారిపోతున్న ఫిలిష్తీయుల గూర్చి విన్నారు.
వీరంతా యుద్ధంలో చేరి ఫిలిష్తీయులను తరిమి
కొట్టారు. 23ఆ విధంగా ఆ రోజున ఇశ్రాయేలు ప్రజలకు
యెహోవా గొప్ప విజయాన్ని ఇచ్చాడు. యుద్ధం
బేతావెను దాటిపోయింది. సైన్యమంతా సౌలు దగ్గర
ఉంది. సుమారు పదివేల మంది అతని వద్ద ఉన్నారు.
తరువాత ఎఫ్రాయిము రాజ్యంలోని ప్రతి నగరానికీ
యుద్ధం వ్యాపించింది.

### సౌలు చేసిన మరో తప్పు

24ఆరోజు సౌలు ఒక పెద్ద తప్పు చేశాడు. ఇశ్రాయేలు
సైనికులు ఆకలితో నకనకలాడి పోయారు. దీనికంత
టికీ కారణం వారిని సౌలు ఒక ప్రమాణం కింద వుంచ
టమే! "సాయంత్రమయ్యేలోగా గాని, లేక నా శత్రువు
లను నేను ఓడించక ముందుగాని ఎవ్వరైనా భోజనం
చేస్తే వారు శపించబడతారు!" అని వారికి సౌలు ముందు
గానే చెప్పాడు. దానితో ఇశ్రాయేలు సైనికులు
ఎవ్వరూ ఆహారం ముట్టలేదు.
25ఆ ప్రాంతంలో ఒక తేనెతుట్ట వుంది. 26సైని
కులు దానివద్దకు వచ్చేసరికి వాళ్ల ప్రమాణం జ్ఞాపకం
రావటంతో తేనె ముట్టటానికి భయపడిపోయారు.
27అయితే సౌలు చేయించిన ఈ ప్రమాణం గురించి
యోనాతానుకు తెలియదు. అతను తన చేతికర్రను
తేనెతుట్టలోనికి గుచ్చి లాగగానే తేనెవచ్చింది. అతడు
దానిని తాగగా అతనికి ఎంతో హాయినిచ్చింది. 28సైని
కులలో ఒకడు యోనాతానుకు "నీ తండ్రి సైనికు
లతో ప్రమాణము చేయించి, ఆహారము పుచ్చుకొను
వాడు శపించబడును అని చెప్పాడు. అందువల్లనే ఏ
ఒక్క సైనికుడు కూడా ఆరోజు ఏమీ తినలేదని
అన్నాడు. అందువల్లనే సైనికులంతా విపరీతంగా అలసి
పోయారని" చెప్పాడు.
29"మా తండ్రి దేశానికి లేనిపోని తిప్పలు తెచ్చి
పెట్టాడు. చూడండి! ఈ తేనెను నేను కొంచెం రుచి
చూస్తేనే నాకు చాలా హాయిగా వుంది! 30ఈ రోజు
శత్రువుల వద్ద తీసుకున్న ఆహారమంతా మన సైనికులు
గనుక తినివుంటే, వారు ఎంత హాయిగా ఉండేవారు!
ఇంకా చాలా మంది ఫిలిష్తీయులను కూడ చంపి ఉండే
వాళ్లు!" అన్నాడు యోనాతాను.
31ఆ రోజు మిక్మషునుండి అయ్యాలోను వరకూ
గల ఫిలిష్తీయులనందరినీ ఇశ్రాయేలు సైనికులు ఓడిం
చారు. ఆ తరువాత వారు బాగా నీరసించి పోయారు.
32వారు ఫిలిష్తీయుల గొర్రెలను, పశువులను, దూడ
లను పట్టుకొన్నారు. ఆకలికి తట్టుకోలేక వారు ఆ
పశువులను నేలమీదే చంపి రక్తంతో నిండిన మాంసాన్నే
తినివేశారు
33ఒక వ్యక్తి వెళ్లి సౌలుతో, "చూశావా! సైనికులంతా
యెహోవా పట్ల పాపం చేస్తున్నారు. రక్తం కలసివున్న
మాంసాన్నే వారు తింటున్నారు" అని చెప్పాడు. అది
విని సౌలు, "మీరు పాపం చేశారు! ఒక పెద్ద బండను
ఇక్కడికి దొర్లించండి" అన్నాడు.
34"నీవు వెళ్లి ప్రతి ఒక్కడ్నీ తన ఎద్దును, గొర్రెను
ఇక్కడికి తీసుకుని రమ్మను. వారు వచ్చి తమ పశువు
లను ఇక్కడ బండ మీద వధించాలి. దేవుని పట్ల
పాపం చేయవద్దు. రక్తం కలిసివున్న మాంసాన్ని తిన
కండి" అన్నాడు సౌలు.
ఆ రాత్రి ప్రతి ఒక్కడూ తన పశువులను తెచ్చి
అక్కడ వధించాడు.
35తరువాత సౌలు యెహోవాకు ఒక బలిపీఠాన్ని
నిర్మించాడు. అది సౌలు తానే యెహోవాకి నిర్మించిన
మొదటి బలిపీఠం.
36"పదండి! ఈ రాత్రి ఫిలిష్తీయులను తరుము
దాము. వాళ్లనందరినీ చంపివేసి వాళ్ల వస్తువులన్నీ తీసు
కుందాము!" అన్నాడు సౌలు.
"నీకు ఎలా మంచిదనిపిస్తే అలా చేయి" అని సైని
కులు జవాబిచ్చారు. కానీ "మనము దేవుని అడుగు
దాము" అని యాజకుడు చెప్పాడు.
37అందువల్ల సౌలు లేచి, "దేవా! నేను వెళ్లి ఫిలిష్తీ
యులను తరిమికొట్టనా? మేము వాళ్లను ఓడించేలా
సహాయం చేస్తావా?" అని అడిగాడు. కాని ఆరోజు
సౌలుకు యెహోవా సమాధానం ఇవ్వలేదు.
38"నాయకులందరినీ నా దగ్గరకు తీసుకుని రండి.
ఈ వేళ ఎవరు పాపం చేసారో మనము తెలుసు
కొందాము. 39ఇశ్రాయేలును రక్షించే యెహోవా
తోడుగా నేను ఈ ప్రమాణం చేస్తున్నాను. ఈ పాపం
నా స్వంత కుమారుడు యోనాతాను చేసినా, అతడు
చావాల్సిందే" అని చెప్పాడు సౌలు. సైన్యంలో ఎవ్వరూ
ఏమీ మాట్లాడలేదు. 40సౌలు ఇశ్రాయేలీయులందరినీ
పిలిచి వారందరినీ ఒక పక్కన నిలబెట్టి, తన కుమారు
నితో కలిసి తానొక పక్కన నిలబడ్డాడు. "మీకు ఎలా
మంచిదనిపిస్తే అలా చేయండి" అని సైనికులంతా
చెప్పారు. 41"ఓ ఇశ్రాయేలీయుల దేవుడవైన
యెహోవా, నీ సేవకుడనైన నా ప్రార్థన ఈ రోజున
ఎందుకు ఆలకించలేదు! నేను గాని, నా కుమారుడు

యోనాతాను గాని పాపం చేస్తే మాకు ఊరీము పడేలా చేయుము. నీ ప్రజలయిన ఇశ్రాయేలీయులు పాపం చేస్తే, వారికి తుమ్మీము* పడేలా చేయుము" అని సౌలు ప్రార్థన చేశాడు. సౌలు యోనాతాను పాపం చేసినట్టు ఊరీము పడింది. అందుచేత ప్రజలు నిర్దోషులని తేలటంతో వారు వెళ్లిపోయారు.
42సౌలు, యోనాతానుల మధ్య మళ్లీ వేస్తే యోనాతాను దోషి అని తేలింది.
43"ఏమి చేసావో చెప్పు" అని సౌలు యోనాతానును అడిగాడు.

"నేను కేవలం నా చేతికర్ర చివరన అంటిన తేనెను రుచి చూసాను. దానికే నేను మరణశిక్ష అనుభవించాలా?" అన్నాడు యోనాతాను.
44సౌలు "దేవునికి నేను తీవ్రమైన ప్రమాణం చేసాను. నా ప్రమాణాన్ని గనుక నేను నిలబెట్టుకోక పోతే నాకు ఎన్నో దారుణాలు చేయుమని నేను దేవుని అడిగాను. కనుక యోనాతానూ, నీవు మరణించాల్సిందే" అన్నాడు.

45అయితే సైనికులు, "ఈవేళ ఇశ్రాయేలీయులను మహా విజయానికి నడిపించిన వాడు యోనాతానే. అలాంటప్పుడు యోనాతాను మరణించాలా? వీల్లేదు. సజీవ దేవుని తోడు, యోనాతాను తలమీదనుండి ఒక్క వెంట్రుక నేలరాలదుగాక! ఈ వేళ ఫిలిష్తీయులతో యుద్ధం చేయటానికి దేవుడే యోనాతానుకు సహాయం చేసాడు!" అని సౌలుతో చెప్పారు. అందుచేత సైనికులు యోనాతానును కాపాడారు. అతడు చంపబడలేదు.

46కనుక ఫిలిష్తీయులను తరమటం సౌలుమానుకున్నాడు. ఫిలిష్తీయులు వారి స్థలానికి వెళ్లి పోయారు.

### ఇశ్రాయేలు శత్రువులతో సౌలు పోరాటం

47సౌలు పరిపాలన సాగించిన కాలంలో, ఇశ్రాయేలు చుట్టూవున్న దాని శత్రువులందరితో అతడు యుద్ధం చేశాడు. మోయాబీయులతోను అమ్మోనీయులతోను, ఎదోమీయులతోను, సోబాదేశపు రాజులతోను, ఫిలిష్తీయులతోను సౌలు యుద్ధంచేశాడు. సౌలు ఎక్కడికి వెళితే అక్కడ శత్రువులను ఓడించి విజయం సాధించాడు.
48సౌలు చాలా ధైర్యవంతుడు. అతడు అమాలేకీయులను సహా జయించాడు. ఇశ్రాయేలును కొల్లగొట్టాలని ప్రయత్నించిన దాని శత్రువులందరినీ సౌలు చీల్చి చెండాడి ఇశ్రాయేలును రక్షించాడు.

49యోనాతాను, ఇష్వీ, మెల్కీషూవ, ఈ ముగ్గురూ సౌలు కుమారులు. సౌలు పెద్దకుమార్తె పేరు మేరబు. ఆయన చిన్న కుమర్తె పేరు మీకాలు.
50సౌలు భార్య పేరు అహీనోయము. ఆమె అహిమయస్సు అనే వాని కుమార్తె సౌలు సైన్యాధికారి పేరు అబ్నేరు. అతడు నేరు అనేవాని కుమారుడు. నేరు సౌలు పినతండ్రి.
51సౌలు తండ్రి కీషు; అబ్నేరు తండ్రి నేరు-ఇద్దరూ అబీయేలు అనే వాని కుమారులు.

52సౌలు జీవితాంతం ధైర్యశాలిగా ఉన్నాడు. ఫిలిష్తీయులతో తీవ్రంగా పోరాడాడు. సౌలు తన రాజ్యంలో ఎప్పుడయినా, ఎక్కడయినా ఒక ధైర్యవంతుని గాని బలశాలిని గాని చూస్తే వానిని తన కోటలోని ప్రత్యేక సైనిక దళంలో చేర్చుకొనేవాడు.

### అమాలేకీయులను సౌలు నాశనం చేయుట

15 సమూయేలు ఒక రోజు సౌలు వద్దకు వచ్చాడు. గతంలో అతనిని ఇశ్రాయేలు రాజుగా అభిషిక్తుని చేయటానికి యెహోవా తనను పంపిన విషయం జ్ఞాపకం చేస్తూ, మరో వర్తమానం యెహోవా దగ్గర నుండి తెచ్చినట్లు సమూయేలు చెప్పాడు.
2సర్వశక్తిమంతుడైన యెహోవా వర్తమానం ఇది: "ఈజిప్టు నుండి విముక్తి పొంది ఇశ్రాయేలీయులు బయటికి వచ్చినపుడు వారిని కనానుకు పోకుండా ఆపాలని అమాలేకీయులు ప్రయత్నించారు. అమాలేకీయులు ఏమి చేశారో నేను స్వయంగా చూశాను.
3నీవు ఇప్పుడు వెళ్లు. అమాలేకీయులపై యుద్ధం ప్రకటించు. నీవు అమాలేకీయులను సర్వనాశనం చేయాలి. అంతేగాదు. వారికి చెందిన ప్రతి వస్తువూ నాశనం కావాలి. దేనినీ బతకనివ్వకు. పురుషులను, స్త్రీలను, పిల్లలను, పసివాళ్లను, పశువులను, గొర్రెలను, ఒంటెలను, గాడిదలను-అన్నింటినీ హతమార్చి వేయాలి."

4సౌలు సైన్యాన్ని పిలిచి తెలాయీము వద్ద సమీకరించాడు. సైనికులు రెండు లక్షలమంది ఉన్నారు. అందులో పదివేలమంది యూదాకు చెందినవారు.
5సౌలు అమాలేకీయుల ఒక నగర సమీపానికి వెళ్లి లోయలో పొంచివున్నాడు.
6ఆ ప్రాంతంలో కేనీయులు కూడా వున్నారు. సౌలు వారితో అమాలేకీయులను వదిలి వెళ్లిపొమ్మన్నాడు. అలా వెళ్తే అమాలేకీయులతో పాటు వారిని చంపనని చెప్పాడు. "ఇశ్రాయేలీయులు ఈజిప్టునుండి వచ్చినప్పుడు మీరు వారికి కనికరము చూపారు గనుక మిమ్మల్ని చంపను" అని సౌలు అన్నాడు. అది విని అమాలేకీయులనుండి విడిపోయి కేనీయులు వెళ్లిపోయారు.

7అమాలేకీయులను సౌలు ఓడించాడు. హవీలా నుండి ఈజిప్టు సరిహద్దుల్లోని షూరు పట్టణం వరకూ సౌలు వారితో పోరాడాడు.
8అమాలేకీయుల రాజైన అగగును మాత్రం సజీవంగా పట్టుకుని అతని సైన్యం అంతటినీ సౌలు చంపేసాడు.
9సౌలు, మరియు ఇశ్రా యేలు సైనికులు అగగును బతకనిచ్చారు. బలంగా, ఆరోగ్యంగావున్న గొర్రెలను, పశువులను, గొర్రెపిల్లలను కూడా వారు వదిలివేశారు. ప్రయోజన కరమైన వాట

---

**ఊరీము ... తుమ్మీము** దేవుని నుండి తమ ప్రశ్నలకు జవాబులు పొందేందుకు యాజకులు వీటిని ఉపయోగించేవారు.

న్నింటినీ చంపకుండా విడిచిపెట్టి వారికి అవసరం లేని
వాటన్నింటినీ వారు చంపేసారు.

**సమూయేలు సౌలుకు తన పాపం విషయం చెప్పుట**

10యెహోవా వాక్కు సమూయేలు దగ్గరకు
వచ్చింది. 11"సౌలు నన్ను అనుసరించటం మానేశాడు.
కావున సౌలును రాజుగా చేసినందుకు బాధపడుతు
న్నాను. అతడు నా ఆజ్ఞలను శిరసావహించలేదు."
అని యెహోవా చెప్పాడు. ఇది విన్న సమూయేలు
గాభరా పడిపోయాడు. రాత్రంతా దుఃఖంతో యెహో
వాని ప్రార్థించాడు.
12మరునాటి తెల్లవారుఝామున సమూయేలు లేచి
సౌలును కలుసుకొనేందుకు వెళ్లాడు. కానీ అక్కడి
ప్రజలు, "సౌలు కర్మెలుకు వెళ్లాడు. తన గౌరవార్థం
అక్కడ ఒక జ్ఞాపక స్తంభం నిలబెట్టడానికి సౌలు వెళ్లాడు.
తర్వాత సౌలు అనేక చోట్లకు ప్రయాణం చేసి, చివరికి
గిల్గాలు వెళ్లాలని ఏర్పాటు చేసుకున్నాడు" అని
చెప్పారు. కనుక సౌలు ఉన్న చోటికే సమూయేలు
వెళ్లాడు. సౌలు అమాలేకీయుల దగ్గర తీసుకున్న
వాటిలో మొదటి భాగాన్ని అప్పుడే అర్పించాడు. సౌలు
వాటిని దహనబలిగా యెహోవాకు అర్పిస్తున్నాడు.
13సమూయేలు సౌలు దగ్గరకు వెళ్లాడు: "యెహోవా
నిన్ను ఆశీర్వదించునుగాక! యెహోవా ఆజ్ఞలకు నేను
విధేయుడనయ్యాను" అని సౌలు చెప్పాడు.
14"ఆజ్ఞ నెరవేర్చితే మరి నేను వింటున్న గొర్రెల,
పశువుల అరుపులు ఏమిటి" అని సమూయేలు ప్రశ్నిం
చాడు. 15సౌలు ఇలా జవాబు చెప్పాడు: "సైనికులు
వాటిని అమాలేకీయులనుండి తీసుకున్నారు. నీ దేవు
డైన యెహోవాకు దహనబలి చేయటానికి సైనికులు
మంచి గొర్రెలను పశువులను కాపాడారు. కాని మిగిలిన
వాటన్నిటినీ మేము చంపేశాము."
16సమూయేలు, "ఇంక మాట్లాడకు. రాత్రి
యెహోవా నాకు ఏమి చెప్పాడో నీవు విను" అన్నాడు
సౌలుతో.

సౌలు, "సరే నాకు చెప్పు" అన్నాడు.

17సమూయేలు ఇలా చెప్పాడు: "గతంలో నీవు
ప్రముఖుడవు కాదని తలచావు. కాని ఇశ్రాయేలు వంశాల
న్నింటికీ నీవు నాయకుడవైనావు. ఇశ్రాయేలుకు
రాజుగా యెహోవా నిన్ను ఎంపిక చేశాడు.
18యెహోవా నిన్ను ఒక ప్రత్యేక పనిమీద పంపించాడు.
"వెళ్లి ఆ దుర్మార్గపు అమాలేకీయులనందరినీ చంపి
వేయి. వాళ్లను పూర్తిగా నాశనం చేయి" అని యెహోవా
చెప్పాడు. 19కానీ నీవు యెహోవా మాట వినలేదు.
వాటిని నీకోసం అట్టే పెట్టుకోవాలను కున్నావు. కనుక
ఏది చెడ్డదని యెహోవా చెప్పాడో అదే నీవు చేసావు."
20సౌలు, "నేనైతే యెహోవాకు విధేయుడ
నయ్యాను. యెహోవా పంపిన చోటికి నేను వెళ్లాను.
అమాలేకీయులనందరినీ నేను నాశనం చేశాను. వారి
రాజు అగగును మాత్రమే నేను తిరిగి తీసుకుని వచ్చాను.
21సైనికులు మాత్రమే నీ దేవుడైన యెహోవాకు
గిల్గాలువద్ద బలి అర్పించేందుకు శ్రేష్ఠమైన గొర్రెలను,
పశువులను తీసుకుని వచ్చారు" అన్నాడు.
22కానీ సమూయేలు, "యెహోవాకు ఎక్కువ ప్రీతి
పాత్రమైనది ఏమిటి? దహనబలులు, బలులా? లేక
యెహోవా ఆజ్ఞాపాలనయా? దేవునికి బలులు అర్పిం
చటంకంటే, ఆయనకు విధేయుడై ఉండటం శ్రేష్ఠము.
పొట్టేళ్ల కొవ్వును అర్పించేకంటే, దేవుని వాక్కు వినటం
శ్రేష్ఠము. 23అవిధేయుడవై ఉండట మంటే మంత్రం
వేసే పాపం లాంటిదే. మొండి వైఖరితో నీకు తోచినదే
చేయటం విగ్రహారాధనవంటి పాపమే. నీవు యెహోవా
ఆజ్ఞను ధిక్కరించావు. ఈ కారణంగా ఇప్పుడు
యెహోవా నిన్ను రాజుగా తిరస్కరిస్తున్నాడు."
24అప్పుడు సౌలు, "నేను పాపం చేశాను. నేను
యెహోవా ఆజ్ఞలకు లోబడలేదు. నీవు చెప్పినట్లుగా
నేను చేయలేదు. నేను ప్రజలకు భయపడ్డాను. వారు
ఎలా చెప్పితే అలా చేశాను. 25నా పాపం క్షమించుమని
ఇప్పుడు నేను నిన్ను వేడుకుంటున్నాను. నేను
యెహోవాని ఆరాధిస్తాను, నాతోకూడ రా" అని సమూ
యేలుతో చెప్పాడు.
26కానీ సమూయేలు, "నేను నీతో మళ్లీ వెనుకకు
రాను. నీవు యెహోవా ఆజ్ఞ తిరస్కరించావు. ఇప్పుడు
యెహోవా నిన్ను ఇశ్రాయేలు రాజుగా తిరస్కరిస్తు
న్నాడు" అని చెప్పాడు.
27సమూయేలు వెళ్లిపోవటానికి తిరగగానే, సౌలు
ఆయన అంగీ పట్టుకున్నాడు. అంగీ చిరిగిపోయింది.
28సమూయేలు, "నీవు నా అంగీ చింపేసావు. అదే
విధంగా ఈ వేళ యెహోవా ఇశ్రాయేలు రాజ్యాన్ని
నీనుంచి తీసేస్తాడు. నీ స్నేహితుల్లో ఒకరికి ఈ
రాజ్యాన్ని యెహోవా ఇచ్చాడు. ఇతడు నీకంటే మంచి
వాడు. 29యెహోవా ఇశ్రాయేలీయుల దేవుడు.
యెహోవా శాశ్వతంగా జీవిస్తాడు. యెహోవా అబద్ధం
చెప్పడు. తన మనస్సు మార్చుకోడు. అనుక్షణం
మనస్సు మార్చుకునే మనిషిలాంటివాడు కాదు
యెహోవా" అని సౌలుతో చెప్పాడు.
30సౌలు సమాధానమిస్తూ, "సరే నేను పాపం చేశాను.
కాని దయచేసి నాతోకూడ రా. కనీసం నాయకుల
ఎదుట, ఇశ్రాయేలు ప్రజల ఎదుట నాకు కొంచెం
మర్యాద చూపించు. దేవుడైన యెహోవాను నేను
ఆరాధించటానికి నాతోకూడ తిరిగి రా" అన్నాడు.
31కనుక సమూయేలు సౌలుతో కలసి వెనుకకు వెళ్లాడు.
సౌలు యెహోవాను ఆరాధించాడు.
32"అమాలేకీయుల రాజైన అగగును తన వద్దకు
తీసుకుని రమ్మని" సమూయేలు చెప్పాడు. అగగు
సంకెళ్లతో బంధించబడి సమూయేలు ముందుకు

వచ్చాడు. “నిశ్చయంగా ఇతడు నన్ను చంపడు” అని
అగగు అనుకున్నాడు.
33కాని సమూయేలు అగగుతో, “నీ కత్తివేటుకు
గురిచేసి అనేకమంది పిల్లలను తమ తల్లులకు లేకుండా
చేసావు. కనుక ఇప్పుడు నీ తల్లికి పిల్లలు ఉండరు,”
అంటూ గిల్గాలులో యెహోవా ఎదుట సమూయేలు
అగగును ముక్కలుగా నరికి వేశాడు. 34అప్పుడు సమూ
యేలు రామాకు వెళ్లిపోయాడు. సౌలు గిబియాలోని
తన ఇంటికి వెళ్లిపోయాడు. 35ఆ తరువాత సమూ
యేలు తన జీవితాంతం సౌలును మళ్లీ ఎన్నడూ
చూడలేదు. కాని సౌలు విషయంలో సమూయేలు
చాలా దుఃఖించాడు. సౌలును ఇశ్రాయేలుకు రాజుగా
చేసినందుకు యెహోవా చాలా చింతించాడు.

## సమూయేలు బేత్లెహేముకు వెళ్లుట

16 యెహోవా, “ఎంతకాలం ఇలా సౌలుకోసం
చింతిస్తావు? ఇశ్రాయేలు రాజుగా సౌలును నేను
నిరాకరించాను. నీ కొమ్ములను నూనెతో నింపుకొని
వెళ్లు. యెష్షయి అనే మనిషి దగ్గరకు నేను నిన్ను
పంపిస్తున్నాను. యెష్షయి బేత్లెహేములో నివసిస్తు
న్నాడు. అతని కుమారులలో ఒకనిని నేను రాజుగా
ఎంపిక చేసాను” అని సమూయేలుతో చెప్పాడు.
2కానీ, “నేను వెళితే ఈ వార్త సౌలు విని నన్ను
చంపటానికి ప్రయత్నం చేస్తాడు” అని సమూయేలు
అన్నాడు.
“నీవు ఒక కోడెదూడను తీసుకుని బెత్లెహేముకు
వెళ్లు. ‘యెహోవాకు నేను ఒక బలి అర్పించటానికి
వచ్చాను’ అని చెప్పు. 3బలి కార్యక్రమానికి యెష్షయిని
రమ్మని ఆహ్వానించు. అప్పుడు ఏమి చేయాలో నేను
నీకు తెలియచేస్తాను. నేను నీకు చూపిన మనిషిని
నీవు తప్పక అభిషేకించాలి” అని యెహోవా చెప్పాడు.
4యెహోవా చెప్పినట్లు సమూయేలు చేసాడు.
సమూయేలు బెత్లెహేముకు వెళ్లాడు. బెత్లెహేము పెద్దలు
భయంతో వణకిపోయారు. వారు సమూయేలును
కలుసుకొని, “నీవు సమాధానంగానే వచ్చావా?” అని
అడిగారు.
5“అవును నేను సమాధానంగానే వచ్చాను. యెహో
వాకు ఒక బలి అర్పించటానికి నేను వచ్చాను. మీరంతా
తయారై బలి కార్యక్రమానికి నాతోకూడ రావటానికి
సిద్ధపడండి” అని సమూయేలు జవాబు చెప్పాడు.
సమూయేలు యెష్షయిని, అతని కుమారులను సిద్ధం
చేశాడు. బలి అర్పణలో పాలుపుచ్చుకోమని సమూ
యేలు వారిని ఆహ్వానించాడు.
6యెష్షయి, అతని కుమారులు వచ్చినపుడు సమూ
యేలు ఏలీయాబును చూసాడు. “నిజంగా యెహోవా
ఎంపిక చేసిన మనిషి ఇతడే” అని సమూయేలు
తలచాడు.
7అయితే యెహోవా, “ఏలీయాబు ఎంతో
అందంగా ఎత్తుగా ఉన్నాడు. కానీ ఆ విషయాలు
లక్ష్యపెట్టకు. మనుష్యులు చూసే విషయాలను కాదు
దేవుడు చూసేది. ప్రజలు బాహ్య సౌందర్యం చూస్తారు
కానీ యెహోవా హృదయం చూస్తాడు. ఏలీయాబు
తగిన వాడు కాడు” అని తెలియజేసాడు.
8అప్పుడు యెష్షయి తన కుమారుడైన అబీనా
దాబును పిలిచాడు. అబీనాదాబు సమూయేలు ఎదుట
నడి చాడు. కానీ సమూయేలు, “లేదు యెహోవా
ఎంపిక చేసినవాడు ఇతడు కాదు” అన్నాడు.
9తరువాత షమ్మాను సమూయేలు ఎదుట నడువు
మని యెష్షయి చెప్పాడు. కానీ సమూయేలు, “లేదు,
ఇతనినికూడ యెహోవా ఎంపిక చేయలేదు”
అన్నాడు.
10తన కుమారులు ఏడుగురిని యెష్షయి సమూయే
లుకు చూపించాడు. కానీ, “వీరిలో ఎవ్వరినీ
యెహోవా ఎంపిక చేయలేదని” సమూయేలు యెష్ష
యితో చెప్పాడు.11అప్పుడు, “నీ కుమారులంతా
వీరేనా?” అని సమూయేలు యెష్షయిని అడిగాడు.
“అందరికంటె చిన్నవాడు ఇంకొకడు ఉన్నాడు. కానీ
వాడు గొర్రెలను మేపుతున్నాడు” అని యెష్షయి
జవాబిచ్చాడు.
సమూయేలు, “అతనికి కబురు చేయి. అతన్ని
ఇక్కడకు తీసుకునిరా. అతడొచ్చేవరకూ మనం భోజ
నానికి కూర్చోము” అని చెప్పాడు.
12యెష్షయి తన చిన్న కుమారుని తీసుకుని వచ్చేం
దుకు ఒకరిని పంపించాడు. ఈ కుమారుడు ఎర్రని
తల వెంట్రుకలతో చక్కగా కనబడేవాడు. అతడు
ఎర్రటివాడు మరియు చాలా అందగాడు.
“లేచి అతనిని అభిషేకించు. అతడే సుమా!” అని
యెహోవా సమూయేలుతో చెప్పాడు.
13ప్రత్యేక నూనెతో ఉన్న కొమ్మును సమూయేలు
తీసుకుని యెష్షయి చిన్న కుమారుని సోదరులందరి
ఎదుటనే అతని మీద పోసాడు. ఆ రోజునుండి
యెహోవా ఆత్మ దావీదు మీదికి మహా శక్తివంతంగా
వచ్చింది. తరువాత సమూయేలు రామాకు వెళ్లి
పోయాడు.

## ఒక దుష్ట శక్తి సౌలును వ్యాకుల పెట్టుట

14యెహోవా ఆత్మ సౌలును విడిచి పెట్టేసాడు.
యెహోవా సౌలు మీదికి ఒక దుష్టాత్మను పంపించాడు.
అది అతనికి చాలా ఇబ్బంది కలిగించింది. 15సౌలు
సేవకులు అతనితో ఇలా అన్నారు: “దేవుని వద్దనుండి
వచ్చిన ఒక దుష్ట ఆత్మ వచ్చి నిన్ను బాధ పెడుతోంది.
16మాకు ఆజ్ఞ ఇవ్వుము. సితారాను వాయించగలవాని
కోసం వెదుకుతాము. యెహోవా దగ్గరనుండి ఆ
దుష్ట శక్తి నీ మీదికి వస్తే ఇతడు సితారా వాయిస్తాడు.

అప్పుడు ఆ దుష్ట ఆత్మ నిన్ను విడిచిపెట్టేస్తుంది.
నీకు ఊరట కలుగుతుంది.”
17“ఒక మంచి సితార వాయించువానిని చూసి నా
దగ్గరకు తీసుకుని రండి” అని సౌలు తన సేవకులతో
చెప్పాడు.
18అప్పుడు నౌకర్లలో ఒకడు, “బేత్లెహేములో
యెష్షయి అని ఒక మనిషి ఉన్నాడు. యెష్షయి కొడు
కును నేను చూసాను. సితార వాయించటం అతనికి
వచ్చు. అతడు ధైర్యవంతుడు. బాగా పోరాడగలవాడు
కూడా. అతడు చాతుర్యంగలవాడు. అతడు అందగాడు.
యెహోవా అతనికి తోడుగా ఉన్నాడు” అని చెప్పాడు.
19కనుక సౌలు కొందరు మనుష్యులను యెష్షయి
దగ్గరకు పంపించాడు. “నీకు దావీదు అనే కొడుకు
ఉన్నాడు. అతడు గొర్రెలను కాస్తున్నాడు. అతనిని
నా దగ్గరకు పంపించు” అని సౌలు చెప్పినదానిని వారు
యెష్షయికి చెప్పారు.

20కనుక యెష్షయి సౌలుకు కానుకలుగా కొన్ని
వస్తువులు సిద్ధం చేసాడు. ఒక గాడిదను, కొంత రొట్టె,
ఒక ద్రాక్షారసపు తిత్తి, ఒక మేక పిల్లను యెష్షయి
సిద్ధం చేసాడు. యెష్షయి వాటిని దావీదుకు ఇచ్చి
అతనిని సౌలు వద్దకు పంపించాడు.

21కనుక దావీదు సౌలు దగ్గరకు వెళ్లి అతని ఎదుట
నిలిచాడు. సౌలు దావీదును చాలా ప్రేమించాడు.
దావీదు సౌలుకు ఆయుధాలు మోసే సహాయకు
డయ్యాడు. 22“దావీదును నాతో ఉండనియ్యి. నా
సేవ చేయనియ్యి. అతడంటే నాకు చాలా ఇష్టం”
అని యెష్షయికి ఒక సందేశం పంపాడు సౌలు.

23దేవుడు పంపిన దురాత్మ సౌలు మీదికి వచ్చినపుడు
దావీదు తన సితార తీసుకుని వాయించేవాడు. ఆ
దుష్ట ఆత్మ సౌలును వదిలిపోయేది, అతనికి హాయిగా
ఉండేది.

### గొల్యాతు ఇశ్రాయేలీయులను యుద్ధానికి పిలుచుట

17 ఫిలిష్తీయులు వారి సైన్యాన్ని యుద్ధానికి సమీ
కరించారు. వారు యూదాలో శోకో అనేచోట
సమావేశమయ్యారు. వారి శిబిరం ఏఫెస్దమ్మీము అనే
పట్టణం వద్ద పెట్టారు. ఏఫెస్దమ్మీము అనే పట్టణం
శోకోకు, అజేకాకు మధ్యగా వుంది.

2సౌలు, మరియు ఇశ్రాయేలు సైన్యాలుకూడా సమా
వేశం అయ్యారు. ఏలా లోయలో వారి శిబిరం ఉంది.
ఫిలిష్తీయులతో యుద్ధానికి సౌలు సైన్యం తయార
య్యింది.
3ఫిలిష్తీయులు ఒక కొండమీద ఉన్నారు, ఇశ్రాయేలీ
యులు మరో కొండమీద ఉన్నారు. ఈ రెండు కొండల
మధ్య లోయ ఉంది. 4ఫిలిష్తీయులకు ఒక ప్రఖ్యాత
వీరుడు ఉన్నాడు. వానిపేరు గొల్యాతు. వాడు గాతుకు
చెందినవాడు. అతని ఎత్తు తొమ్మిది అడుగుల* కంటె
ఎక్కువ. గొల్యాతు ఫిలిష్తీయుల శిబిరంలో నుంచి
బయటికి వచ్చాడు.
5అతని తలమీద ఒక కంచుటోపీ ఉంది. కంచుతో
చేసిన చేప పొలుసులవంటి కవచం అతడు ధరించాడు.
ఈ కవచం కంచుతో చేయబడి నూట ఇరవై అయిదు
పౌన్ల బరువు ఉంది. 6గొల్యాతు కాళ్లకు రాగి కవచాలు
ఉన్నాయి. కంచు ఈటె* ఒకటి అతని మెడమీద
కట్టబడి వుంది. 7గొల్యాతు ఈటెకువున్న కర్రపిడి
సాలెవాని మగ్గం వద్దవుండే దోనెలాగా వుంది. ఈటె
కత్తి బరువు పదిహేను “పౌన్లు.”* గొల్యాతు డాలు
మోసే భటుడు అతనికి ముందుగా నడిచాడు.
8గొల్యాతు బయటకు వచ్చి ఇశ్రాయేలు సైనికులకు
కేకవేసాడు: “మీ సైనికులు అందరూ యుద్ధానికి
బారులు తీసారు ఎందుకు? మీరు సౌలు సేవకులు.
నేను ఫిలిష్తీవాడిని. కనుక మీరు ఒకనిని ఎంపిక చేసుకొని
నాతో పోరాడేందుకు వానిని పంపించండి.
9వాడు గనుక నన్ను చంపితే ఫిలిష్తీయులందరు
మీ సేవకులవుతారు. కానీ నేను గెలిచి మీవాడిని చంపితే,
మీరంతా మాకు సేవకులు అవుతారు. అప్పుడు మీరు
మాకు సేవ చేస్తారు!” అన్నాడు అతను.
10“ఈ రోజు నేనిలా నిలబడి ఇశ్రాయేలు సైన్యాన్ని
ఎగతాళి చేస్తున్నాను! నాతో పోరాడటానికి మీలో
ఒకనిని పంపండి” అనికూడ ఆ ఫిలిష్తీయుడు అన్నాడు.
11గొల్యాతు చెప్పిన వాటిని సౌలు, ఇశ్రాయేలు సైని
కులు విన్నారు. వారు చాలా భయపడ్డారు.

### దావీదు యుద్ధ భూమికి వచ్చుట

12ఎఫ్రాతీయుడైన యెష్షయి కుమారుడు దావీదు.
యూదాలో ఉన్న బేత్లెహేముకు చెందినవాడు
యెష్షయి. అతనికి ఎనమండుగురు కుమారులు. సౌలు
కాలంలో యెష్షయి వృద్ధుడు. 13యెష్షయి యొక్క
ముగ్గురు పెద్ద కుమారులు సౌలుతోపాటు యుద్ధానికి
వెళ్లారు. పెద్ద కుమారుడు ఏలీయాబు. రెండవ కుమా
రుడు అబీనాదాబు. మూడవ కుమారుడు షమ్మా.

---

**తొమ్మిది అడుగులు** అంటే సామాన్య పరిభాషలో నాలుగు మూరల జానెడు అని అర్థం. ప్రాచీన గ్రీకు అనువాదం ప్రకారం ఒక హెబ్రీ చేతివ్రాత ప్రతి ప్రకారం ఈ లెక్క అనుసరించబడింది. చాలా హెబ్రీ పుస్తకాలలో ఆరుమూరల జానెడు అని, తొమ్మిది అడుగుల నాలుగు అంగుళాలని వుంది.

**కంచు ఈటె** తేలికపాటి చిన్న రకపు కత్తి అనికూడా కొన్ని ప్రతులలో వుంది.

15 **పౌన్లు** హెబ్రీ భాషలో 600 షెకెలులని అర్థం.

14దావీదు అందరికంటె చిన్న కుమారుడు. పెద్ద కుమా
రులు ముగ్గురూ సౌలు సైన్యంలో ఉన్నారు. 15కానీ
దావీదు బేత్లెహేములోని తన తండ్రి గొర్రెలను కాసేం
దుకు అప్పుడప్పుడూ సౌలును వదిలి వెళ్లేవాడు.
16ఫిలిష్తీయుడైన గొల్యాతు ప్రతిరోజూ ఉదయం,
సాయంత్రం బయటికి వచ్చి ఇశ్రాయేలు సైన్యం
ఎదుట నిలబడేవాడు. ఇలా నలుబది రోజులు ఇశ్రా
యేలీయులను గొల్యాతు ఎగతాళి చేసాడు.
17ఒక రోజు యెష్షయి తన కుమారుడైన దావీదుతో
ఇలా చెప్పాడు: "యుద్ధాల శిబిరంలో ఉన్న నీ
అన్నలకు తూమెడు వేయించిన గోధుమలు, ఈ పది
రొట్టెలు తీసుకుని వెళ్లు. 18ఈ పది జున్ను ముక్కలు
కూడ తీసుకుని వెళ్లి నీ సోదరులున్న వేయి మంది
గల పటాలం అధికారికి ఇయ్యి. నీ సోదరులు ఎలా
వున్నారో తెలుసుకొని, వారి యోగక్షేమాలకు గుర్తుగా
ఏదైనా తిరిగి తీసుకునిరా. 19నీ సోదరులంతా ఇప్పుడు
సౌలుతోనూ, ఇశ్రాయేలు సైన్యంతోనూ కలిసి ఏలా
లోయలో ఉన్నారు. వారు ఫిలిష్తీయులతో యుద్ధం
చేస్తున్నారు."
20దావీదు తెల్లవారు ఝామునే లేచి మరో కాపరికి
మందను అప్పగించాడు. ఆహారపు మూటను తీసుకుని
యెష్షయి చెప్పిన విధంగా బయలుదేరి వెళ్లాడు. దావీదు
తన బండిని శిబిరం యొద్దకు తోలుకెళ్లాడు. దావీదు
అక్కడికి వచ్చేటప్పటికి, సైనికులు వారి వారి యుద్ధ
స్థావరాలకు వెళ్లుచూ ఉన్నారు. సైనికులు యుద్ధ
నినాదాలు చేయటం మొదలుబెట్టారు. 21ఇశ్రాయేలీ
యులు, ఫిలిష్తీయులు వారి వారి మనుష్యులను
యుద్ధంలో సంధించటానికి సమీకరిస్తున్నారు.
22ఆహార పదార్థాల అజమాయిషీ వహించే వ్యక్తివద్ద
దావీదు తను తెచ్చిన ఆహార పదార్థాలను వుంచి,
ఇశ్రాయేలు సైనికులు ఉన్న చోటికి పరుగెత్తాడు.
తన సోదరులను గూర్చి దావీదు అడిగాడు. 23దావీదు
తన సోదరులతో సంభాషించటం మొదలుబెట్టాడు.

**గొల్యాతుతో పోరాటానికి దావీదు ముందుకు వచ్చుట**

అదే సమయానికి ఫిలిష్తీయుల పోరాట వీరుడు
గాతీయుడైన గొల్యాతు ఫిలిష్తీ సైన్యంనుండి బయ
టకు వచ్చాడు. గొల్యాతు ఇశ్రాయేలీయులను
మామూలు గానే కవ్వించే కేకలు వేసాడు. ఇది దావీదు
విన్నాడు. 24గొల్యాతును చూడగానే ఇశ్రాయేలు సైని
కులు పారిపోయారు. అతడంటే వారందరికీ భయము.
25ఇశ్రాయేలు మనుష్యుల్లో ఒకడు ఇలా అన్నాడు:
"వాడిని మీరు చూసారా? చూడండి వానిని. గొల్యాతు
మాటిమాటికీ బయటికి వచ్చి ఇశ్రాయేలీయులను ఎగ
తాళి చేస్తున్నాడు. వానిని చంపినవానికి రాజు పుష్క
లంగా డబ్బుఇస్తాడు. కనుక గొల్యాతును చంపినవాడు
ధనవంతుడైపోతాడు; గొల్యాతును చంపినవానికి సౌలు
తన కుమార్తెను కూడ ఇచ్చి వివాహము చేస్తాడు.
ఇశ్రాయేలులో వాని కుటుంబాన్ని సౌలు స్వేచ్ఛగా
ఉండనిస్తాడు."
26తన దగ్గర నిలబడిన మనుష్యులను దావీదు
అడిగాడు, "ఈ ఫిలిష్తీవానిని చంపి ఇశ్రాయేలులో ఈ
పరాభవాన్ని తొలగించిన వానికి బహుమానం ఏమిటి?
ఇంతకూ ఈ గొల్యాతు ఎవడు? వాడు సున్నతి
సంస్కారం కూడా లేనివాడు! వాడు కేవలం ఒక ఫిలి
ష్తీయుడే. జీవిస్తున్న దేవునికి వ్యతిరేకంగా మాట్లాడే
అధికారం వానికి ఉందని వాడు ఎలా అనుకుంటు
న్నాడు?" 27కనుక ఆ ఇశ్రాయేలువాడు, గొల్యాతును
చంపినందుకు లభించే బహుమానం గూర్చి దావీదుకు
చెప్పాడు. 28దావీదు సైనికులతో మాట్లాడుతుండగా
అతని పెద్ద అన్న ఏలీయాబు విన్నాడు. దావీదు మీద
ఏలీయాబుకు కోపం వచ్చింది. "అసలు నీవు ఇక్కడికి
ఎందుకు వచ్చావు? ఉన్న కొన్ని గొర్రెలను అర
ణ్యంలో ఎవరి దగ్గర వదిలిపెట్టావు? నాకు తెలుసు
నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావో! చేయుమని చెప్పింది
చేయటం నీకు ఇష్టం లేదు. యుద్ధం చూడటానికే
ఇక్కడికి రావాలనుకున్నావు" అంటూ ఏలీయాబు
దావీదును నిలదీసాడు.
29"ఇంతకూ నేనేం చేసాను? నేనేమి తప్పు చేయ
లేదే! నేను ఊరికే మాట్లాడుతున్నాను" అన్నాడు
దావీదు. 30దావీదు ఇంకొందరి వైపు తిరిగి మళ్లీ అవే
ప్రశ్నలు వేశాడు. వారుకూడ ఇంతకు ముందు చెప్పిన
సమాధానాలే దావీదుకు చెప్పారు.
31దావీదు పలికినది అంతా కొందరు సౌలుతో
చెప్పారు. దావీదును తన దగ్గరకు తీసుకుని రమ్మని
సౌలు వాళ్లకు ఆజ్ఞాపించాడు. 32దావీదు, "ఎవ్వరినీ
నిరుత్సాహ పడనియ్యవద్దు. నేను మీ సేవకుడిని. నేను
వెళ్లి ఈ ఫిలిష్తీ వానితో పోరాడుతాను" అని సౌలుతో
చెప్పాడు.
33సౌలు, "నీవు ఈ ఫిలిష్తీ గొల్యాతును ఎదిరించి
పోరాడలేవు. నీవు కనీసం ఒక సైనికుడివి కూడ కాదు.
గొల్యాతు చిన్నప్పటి నుండీ యుద్ధంలో ఆరితేరిన
వాడు" అని జవాబిచ్చాడు.
34అయితే, "నీ సేవకుడనగు నేను నా తండ్రి గొర్రె
లను కాపలా కాస్తూ ఉండేవాడిని. ఎప్పుడైనా ఒక
సింహంగాని, ఎలుగు బంటిగాని నా మంద మీది కొచ్చి
ఒక గొర్రెను పట్టుకుంటే, 35దానిని నేను తరిమి
కొట్టేవాడిని. ఆ అడవి మృగాన్ని నేను ఎదిరించి,
దాని నోటినుండి గొర్రెను రక్షించేవాడిని. ఒకవేళ అదే
నా మీదికి వస్తే, దాని జూలు పట్టి దానితో పోరాడి,
దాన్ని చంపేసేవాడిని. 36నేను ఒక సింహాన్నీ, ఒక
ఎలుగుబంటినీ చంపేసాను. అదే విధంగా సున్నతి
సంస్కారం లేని ఆ పరాయి ఫిలిష్తీయుడిని నేను చంపే
స్తాను. జీవిస్తున్న దేవుని సైన్యాన్ని గొల్యాతు ఎగతాళి

చేసాడు గనుక వాడు చస్తాడు. 37యెహోవా నన్ను
సింహంనుండి, ఎలుగుబంటినుండి కాపాడాడు.
ఇప్పుడు ఈ ఫిలిష్తీయుడైన గొల్యాతునుండి కూడ
ఆ యెహోవాయే నన్ను రక్షిస్తాడు" అని దావీదు
సౌలుతో చెప్పాడు.

"అయితే వెళ్లు. యెహోవా నీకు తోడై యుం
డునుగాక!" అని దావీదుతో చెప్పాడు సౌలు. 38సౌలు
తన స్వంత వస్త్రాలను దావీదుకు ధరింపజేసాడు.
దావీదు తలమీద ఒక కంచు శిరస్త్రాణం (టోపి),
అతని వంటిమీద ఒక కవచం సౌలు పెట్టించాడు.

39దావీదు ఒక కత్తి ధరించి అటు ఇటు నడవటానికి
ప్రయత్నించాడు. సౌలు యుద్ధ వస్త్రాలను దావీదు
ధరించటానికి ప్రయత్నించాడు. కానీ ఈ బరువులన్నీ
ధరించటం దావీదుకు అలవాటు లేదు. అప్పుడు
దావీదు, "ఇవన్నీ వేసుకుని నేను పోరాడలేను. వీటన్ని
టికీ నేను అలవాటు పడలేదు," అని సౌలుతో చెప్పి
వాటన్నింటినీ విడిచి వేశాడు. 40దావీదు తన చేతికర్ర
తీసుకున్నాడు. లోయలో ఉన్న మంచి నునుపైన
రాళ్లను ఐదింటిని దావీదు ఏరుకొన్నాడు. ఆ అయిదు
రాళ్లను తన సంచిలో వేసుకున్నాడు. తన చేతిలో
వడిసెలు పుచ్చుకొన్నాడు. అప్పుడు ఫిలిష్తీయుడైన
గొల్యాతును ఎదురించేందుకు అతడు వెళ్లాడు.

## దావీదు గొల్యాతును చంపుట

41ఫిలిష్తీయుడైన గొల్యాతు నెమ్మదిగా నడుస్తూ
దావీదుకు సమీపంగా వస్తున్నాడు. గొల్యాతు కవచం
మోసే సహాయకుడు వానికి ముందుగా నడుస్తున్నాడు.
42గొల్యాతు దావీదును చూచి నవ్వసాగాడు. దావీదు
ఒక సైనికుడు కూడ కానట్టు గొల్యాతు చూసాడు.
దావీదు కేవలం ఎర్రని ముఖంగల ఒక అందగాడు
మాత్రమే. 43గొల్యాతు దావీదు వైపు చూసి, "నేనేమైనా
కుక్కని అనుకున్నావా కర్ర పట్టుకొని వచ్చావు!" అని
ఎగతాళి చేశాడు. గొల్యాతు తన దేవుళ్ల పేర్లన్నీ ఉచ్చ
రిస్తూ దావీదును శపించాడు.

44"ఇటు రారా! నీ శవాన్ని పక్షులకు, జంతువులకు
ఆహారంగా వేస్తాను" అంటూ దావీదు మీద కేకలు
వేసాడు గొల్యాతు.

45"నీవు కత్తి, కవచం, ఈటెలు ధరించి నా దగ్గరకు
వస్తున్నావు. కానీ నేను ఇశ్రాయేలు సైన్యాలకు దేవుడు,
సర్వశక్తిమంతుడైన యెహోవా పేరిట నీ దగ్గరకు
వస్తున్నాను. ఆయనపై నీవు నిందా వాక్యాలు పలికావు.
46ఈ రోజు ఆ యెహోవా, నాచేత నిన్ను ఓడిస్తాడు.
నిన్ను నేను చంపేస్తాను. ఈ వేళ నేను నీ తల నరికి
నీ శవాన్ని పక్షులకు, అడవి జంతువులకు ఆహారంగా
వేస్తాను. మిగిలిన ఫిలిష్తీయులందరికీ అలానే చేస్తాము.
అప్పుడు ఇశ్రాయేలులో దేవుడు ఉన్నాడని ప్రపంచం
అంతా తెలుసుకొంటుంది. 47ప్రజలను రక్షించాలంటే
యెహోవాకు కత్తులు, కటారులు అక్కరలేదని ఇక్క
డున్నవారంతా తెలుసుకొంటారు. ఈ యుద్ధం
యెహోవాదే! మీ ఫిలిష్తీయులందరినీ ఓడించేలా
యెహోవా మాకు సహాయం చేస్తాడు" అని దావీదు
ఫిలిష్తీయుడైన గొల్యాతుతో చెప్పాడు.

48ఫిలిష్తీయుడైన గొల్యాతు దావీదు మీద పడటానికి
మెల్లగా దగ్గరగా వెళ్లాడు. దావీదు గొల్యాతును ఎదుర్కో
టానికి వేగంగా పరుగెత్తాడు. 49దావీదు తన సంచిలో
నుంచి ఒక రాయి తీసి వడిసెలలో పెట్టి దానిని విసరి
కొట్టాడు. ఆ రాయి వడిసెల నుండి వెళ్లి గొల్యాతు
నుదుటి మీద గట్టిగా తగిలింది. ఆ రాయి అతని తల
లోనికి లోతుగా దూసుకుపోయింది. గొల్యాతు ఒక్క
సారిగా నేలమీద బోర్ల పడిపోయాడు.

50అలా దావీదు ఫిలిష్తీయుల యోధుణ్ణి కేవలం ఒక
రాయి, వడిసెలతోనే ఓడించేసాడు. ఒక్క దెబ్బతో
వానిని చంపేసాడు. దావీదు చేతిలో కనీసం కత్తికూడ
లేదు. 51కనుక దావీదు పరుగున పోయి పడివున్న
గొల్యాతు పక్కన నిలబడ్డాడు. తరువాత దావీదు
గొల్యాతు ఒరలోవున్న కత్తిని లాగి దానితోనే గొల్యాతు
తలను నరికివేశాడు. అలా దావీదు ఫిలిష్తీయుల వీరుని
హతమార్చాడు.

ఎప్పుడయితే తమ వీరుడు చావటం మిగతా ఫిలిష్తీ
యులు చూసారో అప్పుడు వెనుదిరిగి పారిపోయారు.
52ఇశ్రాయేలు, యూదా సైనికులు జయజయ
ధ్వనులు చేస్తూ ఫిలిష్తీయుల సైనికులను గాతు నగర
సరిహద్దుల వరకు, ఎక్రోను నగర ద్వారం వరకు
తరిమి తరిమి కొట్టారు. చాలామంది ఫిలిష్తీయులను
వారు చంపేసారు. వారి శవాలు షరాయిము బాటపై
గాతు, ఎక్రోనుల వరకు అంత దూరమూ పడి
వున్నాయి. 53ఫిలిష్తీయుల సైన్యాన్ని వెళ్లగొట్టి వచ్చి,
ఇశ్రాయేలు సైనికులు ఫిలిష్తీయుల గుడారాల నుంచి
చాలా వస్తు సంపదను తీసుకున్నారు.

54గొల్యాతు తలను దావీదు యెరూషలేముకు తీసు
కుని వెళ్లాడు. ఆ ఫిలిష్తీయుల యోధుని ఆయుధాలను
కూడా దావీదు తన గుడారములో పెట్టాడు.

## దావీదును గూర్చి సౌలుకు భయం ప్రారంభం

55దావీదు ధైర్యంగా గొల్యాతును ఎదుర్కొన్న
తీరును సౌలు గమనించాడు. తన సేనాని అబ్నేరును
పిలిచి, "ఆ కుర్రవాని తండ్రి ఎవరని" అడిగాడు.

"మీ తోడు అతనెవరో నాకు తెలియదు రాజా"
అన్నాడు అబ్నేరు. 56సౌలు, "ఆ కుర్రవాని తండ్రి
ఎవరో తెలుసుకో" అన్నాడు.

57గొల్యాతును చంపి దావీదు తిరిగి రాగానే అబ్నేరు
అతనిని సౌలువద్దకు తీసుకుని వచ్చాడు. దావీదు ఇంకా
ఆ ఫిలిష్తీయుని తలను తన చేతిలో పట్టుకొని ఉన్నాడు.
58"చిన్నవాడా! నీ తండ్రి ఎవరు?" అని సౌలు అతన్ని

అడిగాడు.
“బేత్లెహేములో ఉన్న మీ సేవకుడు యెష్షయి
కుమారుడను నేను” అని దావీదు జవాబు చెప్పాడు.

### దావీదు–యోనాతానుల స్నేహం

18 దావీదు సౌలుతో మాట్లాడటం ముగించాక,
యోనాతాను దావీదుకు చాలా సన్నిహితు
డయ్యాడు. తనను తాను ప్రేమించుకున్నంతగా
యోనాతాను దావీదును ప్రేమించాడు. 2సౌలు ఆ రోజు
నుంచీ దావీదును తన వద్దనే ఉంచుకొన్నాడు.
దావీదును ఊరిలోవున్న తన తండ్రి వద్దకు సౌలు
పోనీయలేదు.
3యోనాతాను దావీదుతో ఒక ఒడంబడిక చేసుకు
న్నాడు.ఎందువల్లనంటే, దావీదు అంటే యోనా
తానుకు ఎనలేని ప్రేమ. 4యోనాతాను తన అంగీ
తీసి దావీదుకు తొడిగాడు. యోనాతాను తన సైనిక
దుస్తులు కూడా దావీదుకు ఇచ్చాడు. అంతేగాదు;
యోనాతాను తన ఖడ్గం, విల్లంబులు, పటకా అన్నీ
దావీదుకు ఇచ్చాడు.

### దావీదు విజయాన్ని సౌలు గుర్తించుట

5సౌలు దావీదును అనేక యుద్ధాలకు పంపాడు.
అన్నింటిలో అతడు విజయం సాధిస్తూ వచ్చాడు.
కాబట్టి అతనిని సైన్యాధికారిగా సౌలు నియమించాడు.
దీనికి ప్రజలంతా చాలా సంతోషించారు. సౌలు అధి
కారులు కూడ సంతోషించారు.
6దావీదు ఫిలిష్తీయులతో యుద్ధానికి వెళ్లి తిరిగి వచ్చి
నప్పుడు ఇశ్రాయేలు రాజ్యంలోని వివిధ పట్టణాల
స్త్రీలు అందరూ దావీదును కలుసుకొనేందుకు బయ
టకు వచ్చారు. వారు వీణారాగాలతోను, మృదంగ
తాళ ధ్వనులతోను దావీదు ఎదుట చిరునవ్వులతో
నాట్యం చేసారు. ఇదంతా వారు సౌలు యెదుటనే
చేసారు.
7“సౌలు వేల కొలదిగాను హతము చేసెననియు

దావీదు పదివేల కొలదిగా హతము చేసె
ననియు” స్త్రీలంతా జయగీతిక పాడారు.

8స్త్రీల పాట సౌలును కలవర పెట్టింది. అతనికి
చాలా కోపం వచ్చింది. “తాను వేలమందిని మాత్రమే
చంపానని దావీదు పదివేల మందిని చంపాడని స్త్రీలు
చెబుతున్నారే” అని సౌలు పరి పరి విధాల ఆలోచన
చేశాడు. 9అప్పటినుండి సౌలు దావీదును ఒక కంట
కనిపెడుతూ వచ్చాడు.

### సౌలు దావీదును గూర్చి భయపడుట

10ఆ మరుసటి రోజు దేవుని యొద్ద నుండి ఒక
దుష్ట ఆత్మ సౌలును బలీయంగా ఆవరించింది. తన
ఇంటిలో సౌలు చాలా కిరాతకంగా ప్రవర్తించాడు. ఎప్ప
టిలాగే దావీదు తన వీణ వాయించాడు. కానీ సౌలు
చేతిలో ఒక బల్లెం ఉంది. 11“దావీదును గోడకు గుచ్చి
వేయాలని సౌలు” తలచాడు. రెండుసార్లు సౌలు బల్లెం
విసరినాడు. కానీ దావీదు తప్పించుకున్నాడు.
12యెహోవా దావీదుకు తోడుగా ఉన్నాడు.
యెహోవా సౌలును వదిలి వేశాడు. అందువల్ల దావీదు
అంటే సౌలుకు భయంవేసింది. 13సౌలు తన దగ్గర
నుండి దావీదును పంపివేసాడు. సౌలు దావీదును వెయ్యి
మంది సైనికులకు అధిపతిగా చేసాడు. ఆ సైనికులను
దావీదు యుద్ధానికి నడిపించాడు.
14యెహోవా దావీదుతో ఉన్నాడు గనుక, దావీదు
ఏది చేసినా విజయాన్నే సాధిస్తూ వచ్చాడు. 15దావీదు
చాలా విజయం సాధిస్తున్నట్టు సౌలు గమనించాడు.
దానితో సౌలుకు దావీదు అంటే భయం ఇంకా ఎక్కువ
య్యింది.
16కానీ ఇశ్రాయేలు, యూదా ప్రజలు అందరూ
దావీదును ఎక్కువగా ప్రేమించారు. కారణం వారిని
యుద్ధంలో దావీదు అతిచాకచక్యంగా నడిపించుటచేత.

### దావీదు తన కుమార్తెను వివాహం చేసుకోవాలని సౌలు కోరిక

17(కానీ సౌలు దావీదును చంపాలని కోరాడు. దావీ
దును మోసం చేయటానికి ఒక పథకం వేసాడు).
సౌలు, “ఇదిగో నా పెద్ద కుమార్తె మేరబు. నీవు ఆమెను
పెళ్లి చేసుకోవచ్చు. తర్వాత నీవు మంచి శక్తిగల సైని
కుడివి కావచ్చు. నీవు నాకు ఒక కొడుకులా ఉంటావు.
అప్పుడు నీవు వెళ్లి, యెహోవా పక్షంగా యుద్ధాలు
చేయి” అని దావీదుతో చెప్పాడు. (ఇది ఒక పన్నా
గము). వాస్తవానికి సౌలు, “ఇప్పుడు దావీదును నేనేమీ
చంపక్కర్లేదు. నా కోసం ఫిలిష్తీయులే అతనిని చంపు
తారులే” అని తలచాడు.
18అందుకు దావీదు, “మాది గొప్ప కుటుంబం
కాదు, నేను గొప్ప వ్యక్తినీ కాను. కనుక నేను రాజుగారి
అమ్మాయిని పెళ్లాడలేను” అని అన్నాడు.
19అందుచేత మేరబు దావీదును పెళ్లి చేసుకొనే
సమయం వచ్చేసరికి, సౌలు ఆమెను మెహోలాతీ
వాడైన అద్రియేలు అనేవానికిచ్చి వివాహము చేసాడు.
20సౌలు యొక్క మరో కుమార్తె మీకాలు దావీదును
ప్రేమించింది. మీకాలు దావీదును ప్రేమించినట్టు
ప్రజలు సౌలుకు చెప్పారు. అది విని సౌలు సంతో
షించాడు. 21“మీకాలు దావీదును వివాహ మాడ టానికి
నేను అంగీకరిస్తాను. దావీదును ఉచ్చులో పెట్టేందుకు
నేను మీకాలును వినియోగించుకుంటాను. అప్పుడు
దావీదును ఫిలిష్తీయుల చేతనే చంపిస్తాను” అనుకొ
న్నాడు సౌలు. కనుక సౌలు రెండవ సారిగా దావీదుతో,

"ఈ వేళ నీవు నా కూతుర్ని పెళ్లి చేసుకోవచ్చు"
అని చెప్పాడు. 22సౌలు తన అధికారులకు ఇలా ఆజ్ఞా
పించాడు. "దావీదుతో ఆంతరంగికంగా, 'రాజుకు
నీవంటే చాలా ఇష్టం ఆయన అధికారులకు కూడా
నీవంటే ఇష్టం నీవు అతని కుమార్తెను పెళ్లి చేసుకో'
అని చాటుగా దావీదుకు చెప్పండి" అని సౌలు వారితో
అన్నాడు.
23సౌలు అధికారులు అలాగే దావీదుతో చెప్పారు.
అది విన్న దావీదు, "రాజుగారి అల్లుడు కావటమంటే
అంత తేలికైన పని అనుకుంటున్నారా? (రాజుగారి
కుమార్తెకు కట్నం ఇచ్చేందుకు నా దగ్గర డబ్బులేదు.)
నేను సామాన్య నిరుపేదను" అని దావీదు జవాబిచ్చాడు.
24తిరిగి సౌలు అధికారులు దావీదు చెప్పినదంతా
సౌలుకు వివరించారు. 25మళ్లీ సౌలు వారితో, "దావీదు
కట్నం చెల్లించనక్కరలేదనీ, కేవలం ఒక వందమంది
ఫిలిష్తీయుల సున్నతి చర్మాలను తెస్తే చాలనీ చెప్పండి.
దానితో సౌలు తన శత్రువుల మీద పగ తీర్చుకున్న
ట్లవుతుందని చెప్పండి" అన్నాడు. ఈ పని చేస్తే ఫిలి
ష్తీయులు దావీదును చంపుతారని సౌలు రహస్య పథకం.
26సౌలు అధికార్లు మళ్లీ దావీదుకు ఈ విషయం
చెప్పారు. దావీదు సౌలు అల్లుడు కావటానికి ఇష్టపడ్డాడు.
కనుక అతడు వెంటనే పనికి పూనుకున్నాడు. 27దావీదు
తన సైనికులతో బయలుదేరి వెళ్లి రెండువందల
మంది ఫిలిష్తీయులను చంపి, వారి సున్నతి చర్మాలను
తీసుకుని వచ్చి సౌలుకు ఇచ్చాడు. రాజుగారి అల్లుడు
కావాలని కోరి దావీదు ఇలా చేసాడు.

అప్పుడు సౌలు దావీదును తన కుమార్తె మీకాలును
పెండ్లి చేసుకోనిచ్చాడు. 28అప్పుడు కూడా యెహోవా
దావీదుతో ఉన్నాడని సౌలు అవగాహన చేసుకున్నాడు.
పైగా తన కుమార్తె మీకాలు దావీదును ప్రేమిస్తూ
ఉందని తెలుసుకున్నాడు. 29దానితో సౌలుకు దావీదు
అంటే భయం ఎక్కువయ్యింది. ఆ విధంగా సౌలు
దావీదుకు ఎల్లప్పుడూ విరోధంగా ఉండిపోయాడు.
30ఫిలిష్తీయుల సేనాధిపతులు మాత్రం ఇశ్రాయేలీ
యులపై తమ దండయాత్రలు సాగిస్తూనే ఉన్నారు.
అయితే ప్రతిసారీ దావీదు వారిని ఓడిస్తూనే ఉన్నాడు.
సౌలు కిందవున్న అధికారులందరిలో దావీదు చాలా
ఉత్తమ అధికారి. అందువల్ల దావీదు చాలా ప్రసిద్ధిలోకి
వచ్చాడు.

### యోనాతాను దావీదుకు సహాయం చేసాడు

19 దావీదును చంపి వేయుమని సౌలు తన
కుమారుడైన యోనాతానుకు, మిగిలిన అధి
కారులకు చెప్పాడు. కానీ యోనాతాను దావీదును
చాలా ప్రేమించాడు. 2యోనాతాను దావీదును హెచ్చ
రించాడు. "జాగ్రత్తగా ఉండు. సౌలు నిన్ను చంపాలని
అవకాశం కోసం చూస్తున్నాడు. ఉదయం పొలానికి
వెళ్లి అక్కడ దాగి వుండు. 3నేను నా తండ్రితో ఆ
పొలానికి వస్తాను. నీవు దాగియున్న పొలాల వద్ద మేము
నిలబడతాము. నీ విషయంలో నా తండ్రితో నేను
మాట్లాడతాను. తరువాత నేను తెలుసు కున్నదంతా
నీకు చెబుతాను" అని యోనాతాను దావీదుతో
చెప్పాడు.
4యోనాతాను తన తండ్రి సౌలుతో మాట్లాడుతూ
దావీదు గుణగణాలను కొనియాడాడు. "నీవు రాజువు.
దావీదు నీ సేవకుడు. దావీదు నీకు ఏమీ కీడు చేయ
లేదు. కనుక అతనికి ఏమీ కీడు చేయకు. దావీదు
ఎల్లప్పుడూ నీ ఎడల మేలునే చేసాడు. 5దావీదు తన
ప్రాణాలను కూడా లెక్క చేయకుండా ఫిలిష్తీయుడైన
గొల్యాతును చంపాడు. దానిద్వారా యెహోవా ఇశ్రా
యేలు అంతటికీ ఘనవిజయం సమకూర్చి పెట్టాడు.
అదంతా నీవు చూశావు, ఆనందించావు. పైగా అటు
వంటి దావీదుకు నీవు ఎందుకు కీడు తలస్తున్నావు?
అతడు అమాయకుడు. అతనిని చంపటానికి తగిన
కారణమే లేదు" అని అన్నాడు.
6యోనాతాను చెప్పినదంతా విని సౌలు ఒక
ప్రమాణం చేసాడు. "యెహోవా సజీవంగా ఉన్నాడు
అన్నంత నిజంగా, దావీదు చంపబడడు" అని చెప్పాడు
సౌలు.
7కనుక యోనాతాను దావీదును పిలిచి జరిగినదంతా
అతనితో చెప్పాడు. అప్పుడు యోనాతాను దావీదును
తన తండ్రి వద్దకు తీసుకుని వెళ్లాడు. అప్పటి నుండి
దావీదు మొదట్లోలాగే సౌలు దగ్గర ఉన్నాడు.

### సౌలు మరల దావీదును చంపాలని చూచుట

8మళ్లీ యుద్ధం వచ్చినప్పుడు దావీదు ఫిలిష్తీయులను
ఎదుర్కోవటానికి వెళ్లాడు. దావీదు వారిని తరిమి
కొట్టాడు, వారు అతని దగ్గరనుండి పారిపోయారు.
9కానీ ఒక దుష్ట ఆత్మ యెహోవా వద్దనుండి వచ్చి
సౌలును ఆవరించింది. సౌలు తన ఇంట్లోనే కూర్చుని
వున్నాడు. సౌలు చేతిలో అతని ఈటెవుంది. దావీదు
సితార వాయిస్తూ ఉన్నాడు. 10సౌలు తన ఈటెను
దావీదు మీదికి విసరి అతనిని వెనుక ఉన్న గోడకు
గుచ్చివేయాలని ప్రయత్నించాడు. కాని ఈటెను
దావీదు తప్పుకోవటంతో ఈటె గురి తప్పి గోడలోకి
దిగిపోయింది. ఆ రాత్రి దావీదు పారిపోయాడు.
11సౌలు తన మనుష్యులను దావీదు ఇంటికి
పంపాడు. వారు దావీదు ఇంటిపై నిఘా వేసి రాత్రి
అంతా అక్కడే ఉండి, ఉదయమే అతనిని చంపే ప్రయ
త్నంలో కనిపెట్టుకొని ఉన్నారు. కానీ దావీదు భార్య
మీకాలు అతనిని హెచ్చరించింది. "ఈ రాత్రి నీవు
పారిపోయి నీ ప్రాణాలను రక్షించుకో. లేనిచో ఉద
యమే నీవు చంపబడతావు" అని ఆమె చెప్పింది.
12అలా చెప్పి, దావీదును ఒక కిటికీగుండా బయటకు

దింపింది. దావీదు తప్పించుకొని పారి పోయాడు.
13మీకాలు గృహ దేవత విగ్రహాన్ని తెచ్చి పక్కమీద
ఉంచి దుప్పట్లు కప్పింది. ఆ విగ్రహం తల మీద
కొన్ని మేక వెంట్రుకలు కూడ ఆమె అమర్చింది.
14దావీదును బంధించమని సౌలు తన సైనికులను
పంపాడు. కానీ "దావీదుకు అనారోగ్యంగా వుందని"
మీకాలు చెప్పింది. 15ఈ విషయం తన మనుష్యులు
చెప్పేసరికి, "అవసరమైతే దావీదును మంచంతో సహా
ఎత్తుకు రండి. నేను అతనిని అవసరమైతే చంపేస్తాను"
అని ఆ మనుష్యులతో సౌలు చెప్పాడు.
16సౌలు మనుష్యులు దావీదు కోసం మళ్లీ దావీదు
ఇంటికి వెళ్లి చూడగా పక్కమీద ఉన్నది ఒక దేవతా
విగ్రహం మాత్రమేనని, దాని తలమీద ఉన్నవి కేవలం
మేక వెంట్రుకలు మాత్రమేననీ వారు తెలుసుకున్నారు.
17"ఇలా నన్నెందుకు మోసగించావు, నా శత్రువును
వదిలిపెట్టావు, వాడు పారిపోయాడు" అని సౌలు
మీకాలును అడిగాడు.

"తనకు సహాయం చేయకపోతే నన్ను చంపుతానని
అతడు బెదిరించాడు. అందుకే నేను అలా చేశానని"
మీకాలు జవాబు ఇచ్చింది.

### దావీదు రామాలోని గుడారాలకు వెళ్లుట

18దావీదు సౌలు బారి నుండి తప్పించుకుని రామాలో
వున్న సమూయేలు వద్దకు వెళ్లాడు. సౌలు తన పట్ల
చేసినదంతటినీ దావీదు సమూయేలుకు చెప్పాడు.
తరువాత దావీదు, సమూయేలు కలిసి ప్రవక్తల గుడారా
లకు వెళ్లారు. దావీదు అక్కడే ఉండి పోయాడు.
19రామాలో వున్న గుడారాలలో దావీదు ఉంటు
న్నట్లు సౌలు విన్నాడు. 20దావీదును బంధించి తీసుకుని
రావలసిందిగా సౌలు మనుష్యులను పంపాడు. కానీ
వారు ఆ గుడారాలకు వచ్చేసరికి అక్కడ ప్రవక్తల
గుంపు ఒకటి ప్రవచిస్తూ ఉండటం కనబడింది. సమూ
యేలు ఆ ప్రవక్తలకు నాయకత్వం వహించి ఉన్నాడు.
దేవుని ఆత్మ సౌలు పంపిన మనుష్యుల మీదికి రాగా
వారు కూడ దేవుని విషయాలు చెప్పనారంభించారు.
21ఈ వార్త సౌలు వరకూ పోయింది. అతను మరి
కొంతమంది మనుష్యులను పంపాడు. వారుకూడ
దేవుని విషయాలు చెప్పటం మొదలుపెట్టారు. కనుక
మూడవసారి మళ్లీ సౌలు మనుష్యులను పంపాడు. వారు
కూడ దేవుని విషయాలు చెప్పటం మొదలు పెట్టారు.
22చివరికి సౌలు స్వయంగా బయలుదేరి రామా చేరు
కున్నాడు. సేఖూలో ఒక నూర్పిడి కళ్లము దగ్గర
వున్న పెద్ద బావి వద్దకు సౌలు వచ్చాడు. "సమూయేలు,
దావీదు ఎక్కడ ఉన్నారని" సౌలు అక్కడున్న వారిని
అడిగాడు. "రామాదగ్గర ఉన్న నాయోతులో ఉన్నారని"
వాళ్లు జవాబు చెప్పారు. 23అప్పుడు సౌలు రామా
దగ్గర్లో వున్న నాయోతుకు వెళ్లాడు. దేవుని ఆత్మ
సౌలు మీదికి కూడ రావటంతో అతను దేవుని విష
యాలు చెబుతూ ముందుకు నడిచాడు. రామాలో
వున్న నాయోతుకు వెళ్లేవరకు సౌలు మరింత ఎక్కువగా
దేవుని విషయాలు చెబుతూనే ఉన్నాడు. 24అప్పుడు
సౌలు తన బట్టలు విడిచి, సమూయేలు ఎదుట అతడు
దేవుని విషయాలు పలికాడు. ఆ పగలూ, ఆ రాత్రి
శరీరంమీద బట్టలు లేకుండానే సౌలు గడిపాడు. ఆ
కారణం చేతనే, "సౌలుకూడ ప్రవక్తల్లో ఒకడు
అయ్యాడా?" అని ప్రజలు అనుకోవటం మొదల
య్యింది.

### దావీదు, యోనాతానుల ఒడంబడిక

20 దావీదు రామాలో వున్న నాయోతునుంచి
పారిపోయాడు. తిన్నగా యోనాతాను వద్దకు
వెళ్లి, "నేనేమి తప్పు చేశాను? నా నేరం ఏమిటి? నీ
తండ్రి ఎందుకు నన్ను చంపాలని ప్రయత్నిస్తు
న్నాడు?" అని అడిగాడు.
2అది విన్న యోనాతాను ఇలా అన్నాడు, "నా
తండ్రి నిన్ను చంపటానికి ప్రయత్నం చేయటం లేదు.
నా తండ్రి ముందుగా నాకు చెప్పకుండా ఏ పనీ
చేయడు. అది అతి ముఖ్యమైన పనిగాని, లేక అతి
స్వల్పమైన విషయంగాని మా తండ్రి ఎప్పుడూ నాకు
చెబుతాడు. ఆయన నిన్ను చంపాలనే తన ఆలోచనను
నాకెందుకు చెప్పకుండా ఉంటాడు? లేదు. అది నిజం
కాదు!"
3కానీ దావీదు, "నేను నీ స్నేహితుడనని నీ తండ్రికి
బాగా తెలుసు. యోనాతానుకు ఈ విషయం తెలియ
కూడదు అతనికి తెలిస్తే దావీదుకు చెప్పేస్తాడు అని
నీ తండ్రి అనుకుని ఉంటాడు. దేవుడు జీవిస్తున్నాడు
అన్నంత నిజంగా, నీవు జీవిస్తున్నా వన్నంత నిజంగా
నేను మృత్యువుకు చాలా చేరువలో ఉన్నాను." అని
జవాబిచ్చాడు.
4యోనాతాను, "సరే, ఇప్పుడు నీవు ఏమి చేయ
మంటే అది నేను చేస్తాను" అని దావీదుతో అన్నాడు.
5అప్పుడు దావీదు, "అయితే చూడు. రేపు అమా
వాస్య విందు. నేను రాజుతో కలిసి విందారగించవలసి
వుంది. కాని రేపు సాయంత్రం వరకు నన్ను పొలాల్లో
దాగివుండనీ. 6నేను రాలేదని నీ తండ్రి గమనించినపుడు
'దావీదు తన స్వగ్రామమైన బేత్లెహేముకు వెళ్లాలని
కోరాడు. ఈ నెలసరి బలి అర్పణకు అతని కుటుంబం
వారు స్వంతంగా విందు చేసుకోవాలని కోరారు. కనుక
దావీదు తన కుటుంబంతో కలసి ఉండేందుకు తనను
వెళ్లనివ్వా ల్సిందిగా నన్ను అడిగాడు' అని నీ తండ్రికి
చెప్పు అన్నాడు. 7'సరే మంచిది' అని మీ తండ్రి
అంటే నేను హాయిగా ఉన్నట్లే. కానీ ఆయనకు కోపం
వస్తే మాత్రం నాకు కీడు చేస్తాడని నీవు నమ్మవచ్చు.
8యోనాతానూ! నేను నీ సేవకుడను. నన్ను కనిక

రించు. యెహోవా ఎదుట నీవు నాతో ఒక ఒడంబడిక
చేసావు. నేను దోషినయితే నీకై నీవే నన్ను చంప
వచ్చు! కానీ నన్ను మాత్రం నీ తండ్రి వద్దకు తీసుకుని
వెళ్లకు” అన్నాడు. 9యోనాతాను, “లేదు ఎప్పటికీ
అలా జరగదు! నా తండ్రి నీకు కీడు తలపెడితే నేను
నీకు తెలియ జేస్తాను” అని చెప్పాడు.
10దావీదు, “ నీ తండ్రి నిన్ను తిడితే అది నాకెవరు
తెలియజేస్తారు?” అన్నాడు.
11అప్పుడు యోనాతాను, “అయితే, రా! మనం
పొలంలోకి వెళదాము” అని అనగా యోనాతాను,
దావీదు కలిసి పొలంలోకి వెళ్లారు.
12యోనాతాను దావీదుతో ఇలా అన్నాడు: “ఇశ్రా
యేలు దేవుడైన యెహోవా సమక్షంలో నేను నీకు
వాగ్దానం చేస్తున్నాను. నా తండ్రి నీ విషయంలో ఏ
తలంపుతో ఉన్నాడో తెలుసుకుంటానని నీకు
ప్రమాణం చేస్తున్నాను. నీ పట్ల ఆయన వైఖరి
బాగుందో లేదో తెలుసుకుంటాను. ఆ విషయం
మూడురోజుల్లో నీకు పొలానికి కబురు చేస్తాను. 13నా
తండ్రి గనుక నీకు కీడు తలపెడితే, అది నీకు తెలియ
పర్చి, నిన్ను క్షేమంగా వెళ్లిపోనిస్తాను. ఇది నేను చేయక
పోతే యెహోవా నన్ను శిక్షించునుగాక! యెహోవా
నా తండ్రికి తోడైయున్నట్లు, నీకు కూడ తోడై
వుండునుగాక! 14నేను జీవించినంత కాలం, నా మీద
దయ చూపించు. నేను మరణించాక 15నా కుటుంబం
పట్ల నీ దయాదాక్షిణ్యాలు చూపించటం ఎన్నడూ
మానవద్దు. ఈ భూమి మీద నీ శత్రువుల నందరినీ
యెహోవా నాశనం చేయునుగాక! 16ఆ సమయంలో
యోనాతాను కుటుంబం దావీదునుండి వేరు చేయ
బడాల్సి వస్తే, అలాగే జరుగనివ్వు. దావీదు శత్రువులను
యెహోవా శిక్షించునుగాక!”
17అప్పుడు యోనాతాను తన మీద దావీదుకు ఉన్న
ప్రేమ వాగ్దానాన్ని మరల చూపించమన్నాడు. ఎందువల్ల
నంటే యోనాతాను తనను తాను ప్రేమించు కున్నం
తగా దావీదును ప్రేమించాడు గనుక అలా చేశాడు.
18“రేపు అమావాస్య విందుగదా! అక్కడ నీ స్థానం
ఖాళీగా వుంటుంది. కనుక నా తండ్రి నీవు రాలేదని
గమనిస్తాడు. 19ఈ కష్టాలన్నీ ప్రారంభమైనప్పుడు నీవు
ముందుగా ఎక్కడ దాగివున్నావో అక్కడికే మూడవ
రోజున కూడ నీవు వెళ్లు. అక్కడ కొండ పక్కన వేచి
వుండు. 20మూడవ రోజున కొండ పక్కగా నేనొక
గురిని బాణంతో కొడుతున్నట్టు నేను నటిస్తాను. నేను
కొన్ని బాణాలు వదులుతాను. 21అప్పుడు ఆ వదిలిన
బాణాన్ని వెదికేందుకుగాను ఒక కుర్రవానిని పంపుతాను.
వానితో నేను ‘మరీ దూరం వెళ్లిపోయావు. బాణాలు
అక్కడ నాకు దగ్గర్లోనే ఉన్నాయి గదా, వెనక్కు వచ్చేసి
వాటిని తీసుకొనిరా’ అని చెబుతాను. నేను గనుక
అలా చెబితే అప్పుడు నీవు బయటికి రావచ్చు.
యెహోవా జీవిస్తున్నంత వాస్తవంగా నీకు క్షేమం కలుగు
తుందని వాగ్దానం చేస్తున్నాను. ప్రమాదం ఏమీ లేదు.
22కానీ ఒకవేళ ఏదైనా తొందర ఉంటే, ‘బాణాలు
చాలా దూరంగా ఉన్నాయి. వెళ్లి వాటిని తీసుకురా’
అని ఆ కుర్రవానితో నేను అంటాను. నేను గనుక
అలా చెబితే నీవు తప్పక పారిపోవాల్సిందే. అంటే
యెహోవా నిన్ను దూరంగా పంపుతున్నాడన్న మాట.
23మనిద్దరి మధ్యవున్న ఈ ఒడంబడిక జ్ఞాపకం
ఉంచుకో. యెహోవా మనకు శాశ్వతంగా సాక్షి” అని
యోనాతాను దావీదుకు చెప్పాడు. 24అప్పుడు దావీదు
పొలంలో దాక్కున్నాడు.

## విందులో సౌలు వైఖరి

అమావాస్య విందు సమయం వచ్చింది. రాజు
భోజనం చేయటానికి కూర్చున్నాడు. 25మామూలుగా
కూర్చునే చోటులో గోడ దగ్గరగా రాజు కూర్చు
న్నాడు. సౌలుకు ఎదురుగా యోనాతాను కూర్చు
న్నాడు. సౌలుకు పక్కగా అబ్నేరు కూర్చున్నాడు.
కానీ దావీదు స్థానం ఖాళీగా ఉంది.
26ఆరోజు సౌలు ఏమీ అనలేదు. “దావీదుకు ఏమైనా
జరిగివుండవచ్చు; లేదా మైలపడి* ఉండవచ్చు” అను
కున్నాడు. 27కానీ మరునాడు, అంటే ఆ నెల రెండో
రోజున కూడా దావీదు స్థానం ఖాళీగావుంది. “యెష్షయి
కుమారుడు నిన్న, ఈ రోజు కూడా అమావాస్య
విందుకు ఎందుకు రాలేదని సౌలు యోనాతానును”
అడిగాడు.
28“బేత్లెహేము వెళ్లనిమ్మని దావీదు నన్ను అడిగాడు.
29అతని కుటుంబం వాళ్లున్న బేత్లెహేములో ఒక బలి
అర్పణ ఇస్తున్నారని, అతడు చెప్పాడు. అతని సోద
రుడు అతనిని రమ్మని పిలిచాడనీ, కాబట్టి తన సోదరు
లను చూడటానికి అనుమతి ఇమ్మని స్నేహితునిగా
అడుగుతున్నాననీ దావీదు చెప్పాడు. అందుచేత
దావీదు రాజు విందుకు రాలేక పోయాడు,” అని యోనా
తాను చెప్పాడు. 30సౌలుకు యోనాతాను మీద చాలా
కోపం వచ్చింది, “మాట తిరస్కరించే బానిస స్త్రీకి
పుట్టినవాడివి నీవు! నీవు ఆ స్త్రీలాగే ప్రవర్తిస్తున్నావు.
నాకు తెలుసు నీవు దావీదు పక్షాన ఉన్నావని. నీకూ,
నిన్ను కన్నతల్లికి తలవంపులు తెస్తున్నావు. 31యెష్షయి
కుమారుడు బతికి ఉన్నంత వరకూ నీవు రాజు
కావటంగాని, రాజ్యాన్ని చేపట్టటం గాని జరుగదు.
ఇప్పుడే దావీదును నా దగ్గరకు తీసుకునిరా! వాడు
చచ్చిన వారితో సమానము!” అన్నాడు సౌలు.

---

**మైలపడి** మతపరమైన కార్యాలకు పాత నిబంధనలో కొన్ని నియమాలు నిర్దేశించబడినాయి. శవాన్ని తాకినా, స్త్రీ సంగమం చేసినా స్నానాదులు చేసి, శుచియై కొద్ది రోజులు ఆగి దేవుని కార్యాలలో పాల్గొనాలి.

32“దావీదును ఎందుకు చంపాలి? దావీదు చేసిన
నేరం ఏమిటి?” అని యోనాతాను తన తండ్రిని
అడిగాడు. 33సౌలు తన ఈటెను యోనాతాను మీదికి
విసరి, అతనిని చంపటానికి ప్రయత్నం చేసాడు.
దానితో తన తండ్రి నిజంగానే దావీదును చంపాలని
తల పెట్టాడని యోనాతానుకు అర్థమయ్యింది.
34యోనాతానుకు విపరీతంగా కోపం వచ్చింది. భోజ
నాల బల్ల వదిలి వెళ్లిపోయాడు. యోనాతాను తన
తండ్రి మీద చాల కోపంతో ఆ విందు రెండో రోజు
కూడ ఏమీ భోజనంచేయటానికి ఒప్పుకోలేదు. సౌలు
తనను పరాభవించినందుకు, దావీదును చంపాలని
చూస్తున్నందుకు యోనాతాను కోపగించాడు.

### యోనాతాను, దావీదు ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకోవడం

35ఆ మరునాటి ఉదయం యోనాతాను పొలానికి
వెళ్లాడు. వాళ్లనుకున్నట్లుగా దావీదును కలవటానికి
అతడు వెళ్లాడు. యోనాతాను తన వెంట ఒక చిన్న
పిల్లవానిని కూడ తీసుకుని వెళ్లాడు.
36“నేను వేసే బాణాన్ని పరుగున పోయి వెదకి
తీసుకు నిరా” అని యోనాతాను పిల్లవానితో చెప్పాడు.
ఆ పిల్లవాడు పరుగెత్తుచుండగా యోనాతాను వాని
తల మీదగా అవతలికి బాణాలు వేశాడు.
37బాణాలు పడిన చోటుకి బాలుడు పరుగెత్తాడు.
కానీ యోనాతాను “బాణాలు ఇంకా చాలా దూరంలో
ఉన్నాయి” అని అరిచాడు. 38“వెళ్లు! త్వరగా వెళ్లు!
ఆ బాణాలు తీసుకురా, ఆగకు!” అంటూ యోనాతాను
కేకలు వేశాడు. ఆ బాలుడు బాణాలు తీసుకుని తన
యజమాని వద్దకు తెచ్చాడు. 39ఈ సందర్భంలో
ఇక్కడ అతి రహస్యంగా ఏమి జరిగిందో ఆ బాలునికి
ఏమీ తెలియదు. యోనాతానుకు, దావీదుకు మాత్రమే
అది తెలుసు. 40యోనాతాను తన విల్లు, అంబులను
ఆ బాలునికి ఇచ్చి, “పట్టణానికి వెళ్లి పొమ్మ”ని చెప్పాడు.
41ఆ కుర్రవాడు వెళ్లిపోయాక, కొండ ఆవలి ప్రక్క
తాను దాగివున్న చోటనుండి దావీదు బయటికి
వచ్చాడు. దావీదు యోనాతాను ముందు ప్రణమిల్లాడు.
అలా మూడుసార్లు దావీదు చేశాడు. తరువాత దావీదు,
యోనాతాను ఒకరినొకరు ముద్దు పెట్టుకున్నారు.
వారు ఇద్దరూ బాగా ఏడ్చారు. దావీదు యోనాతాను
కంటె ఎక్కువగా ఏడ్చాడు.
42“శాంతితో వెళ్లు. మనము స్నేహితులుగా కొన
సాగుతామని యెహోవా నామంతో వాగ్దానం చేసు
కున్నాము. మనమధ్య, మన తరువాత మన తరాల
వారి మధ్య యెహోవా శాశ్వతంగా సాక్షిగా ఉంటాడని
మనము చెప్పుకున్నాము” అని యోనాతాను
దావీదుతో అన్నాడు.

### యాజకుడైన అహీమెలెకును చూచుటకు దావీదు వెళ్ళుట

21 తరువాత దావీదు వెళ్లిపోయాడు. యోనా
తాను తిరిగి పట్టణానికి వెళ్లాడు. 2అహీమెలెకు
అనే యాజకుని చూడటానికి దావీదు నోబు పట్టణానికి
వెళ్లాడు. దావీదును చూడగానే అహీమెలెకు భయంతో
వణకిపోయాడు. “నీవు ఒంటరిగా ఎందుకున్నావు?
నీకు తోడుగా ఎవ్వరూ ఎందుకు లేరు?” అని అహీమె
లెకు దావీదును అడిగాడు.
3దావీదు అహీమెలెకుతో, “రాజు నాకు ఒక ప్రత్యేక
మైన ఆజ్ఞ ఇచ్చాడు. తాను ఏ పనిమీద నన్ను పంపి
స్తున్నాడో అది వేరెవ్వరికీ తెలియ కూడదన్నాడు.
నన్ను ఏమి చేయమని ఆయన చెప్పాడో అది ఎవ్వరికీ
తెలియకూడదని ఆయన ఆజ్ఞ. నన్ను ఎక్కడ కల
వాలో నా మనుష్యులకు నేను చెప్పాను. 4ఇప్పుడు
నీవద్ద ఏమైనా ఆహారం ఉన్నదా? నాకు ఐదు రొట్టెలు
లేదా ఏది ఉంటే అది ఇవ్వు” అని చెప్పాడు.
5“తనవద్ద మామూలు రొట్టెలేవీ లేవనీ, కేవలం
ప్రతిష్ఠితంగా దేవుని సన్నిధిలో ఉంచిన రొట్టెలు*
కొంత వున్నాయనీ, తన పరివారమంతా స్త్రీలకు
దూరంగా వున్న వారైతే వారు ఈ రొట్టె తినవచ్చునీ”
యాజకుడు దావీదుతో అన్నాడు.
6అది విన్న దావీదు, “మేము ఏ స్త్రీలతోను ఉండ
లేదు. మేము యుద్ధానికి వెళ్లినప్పుడల్లా, అలాగే
మామూలు పనులు చేసేటప్పుడు కూడ నా మను
ష్యులు తమ శరీరాలను పవిత్రంగా ఉంచు కుంటారు.
ఇప్పుడు మేము బయలుదేరిన మా పని ఎంతో
పవిత్రమైనది కనుక ఈ వేళ ఇది మరింత సత్యం”
అన్నాడు.
7పవిత్ర రొట్టె తప్ప మరొకటి లేక పోవటంతో
యాజకుడు దావీదుకు దానినే ఇచ్చాడు. యాజకులు
యెహోవా ఎదుట పీఠంపై ఆరగింపుగా ఉంచే రొట్టె
ఇది. ప్రతి రోజూ వారు ఈ రొట్టెను తీసివేసి మళ్లీ
కొత్త రొట్టెను దాని స్థానంలో ఉంచుతారు.
8సౌలు అధికారులలో ఒకడు ఆ రోజున ఇక్కడ
ఉన్నాడు. వాని పేరు దోయేగు. అతడు ఎదోమీ
యుడు. వాడు అక్కడ యెహోవా ఎదుట ఉంచ
బడ్డాడు. దోయేగు సౌలు యొక్క గొర్రెల కాపరులకు
నాయకుడు. 9యాజకుడైన అహీమెలెకును, “ఒక
ఈటెగాని, కత్తిగాని అక్కడ ఉన్నదా అని దావీదు అడి
గాడు. రాజుపని అతి ముఖ్యమైనదని, తను త్వరగా
వెళ్లవలసి ఉందనీ, తాను కత్తిగాని మరి ఏ ఇతర
ఆయుధంగాని తేలేదనీ చెప్పాడు.”

---

**ప్రతిష్ఠితంగా ... ఉంచిన రొట్టె** పవిత్ర గుడారంలో దేవుని సన్నిధిలో ఆహారాన్ని ప్రతిష్ఠితంగా ఉంచుతారు. మామూలుగా దానిని శుచియైన యాజకుడు తినటం ఆనవాయితీ.

10ఫిలిష్తీయుడైన గొల్యాతు ఆయుధం ఒక్కటే
ఇక్కడ ఉందని యాజకుడు చెప్పాడు. "ఏలా
లోయలో నీవు వానిని చంపినప్పుడు వాని దగ్గర నీవు
తీసుకున్న ఖడ్గం అది. ఆ ఖడ్గం ఒక బట్టలో చుట్టబడి
ఏఫోదు అంగీ వెనుక ఉంచబడింది. కావాలంటే అది
నీవు తీసుకోవచ్చు" అని అహీమెలెకు అన్నాడు.
"గొల్యాతు కత్తికి మించిన కత్తిలేదు. దానిని నాకు
ఇవ్వుము" అన్నాడు దావీదు.

### దావీదు గాతుకు పారి పోవుట

11ఆ రోజు సౌలు నుంచి దావీదు అలా పారి
పోయాడు. గాతు రాజైన ఆకీషు వద్దకు దావీదు వెళ్లాడు.
12కానీ ఆకీషు అధికారులకు అది నచ్చలేదు. వారు
ఆయనతో ఇలా అన్నారు: "ఇతని పేరు దావీదు.
ఇశ్రాయేలు రాజ్యానికి రాజు. ఇశ్రాయేలీయులు పాటలు
పాడేది ఇతనిని గూర్చే. అతనికోసం వారు పాటలు
పాడి నాట్యం చేస్తారు. ఇశ్రాయేలీయులు ఇదిగో ఈ
పాట పాడతారు:

"సౌలు వేల కొలదిగా హతము చేసాడు!
దావీదు పది వేల కొలదిగా హతము
చేసాడు!!"

13ఈ మాటలను దావీదు జ్ఞాపకం చేసుకున్నాడు.
గాతు రాజైన ఆకీషును గూర్చి దావీదు చాలా భయ
పడ్డాడు. 14అందువల్ల ఆకీషు ముందు, అతని సిబ్బంది
ముందు దావీదు పిచ్చి పట్టిన వానిలా నటించుట
మొదలు పెట్టాడు. అక్కడున్నంత సేపూ దావీదు పిచ్చి
వానిలా ప్రవర్తించాడు. మార్గపు తలుపుల మీద అతడు
ఉమ్మి వేశాడు. తన ఉమ్ము తన గడ్డం మీద పడేటట్టు
ఉమ్మేసాడు.
15ఆకీషు, "వీని వైపు చూడండి! వీడు పిచ్చివాడు!
వీడిని నా వద్దకు ఎందుకు తీసుకుని వచ్చారు? 16ఇప్ప
టికే నా వద్ద పిచ్చి వాళ్లు చాలామంది ఉన్నారు. నా
ముందు పిచ్చి పిచ్చిగా ప్రవర్తించటానికి వీనిని మీరు
నా ఇంటికి తీసుకుని రానక్కర్లేదు! ఈ మనిషిని మళ్లీ
నా ఇంటికి రానివ్వకండి" అని తన అధికారులతో
చెప్పాడు.

### దావీదు పలుచోట్లకు వెళ్లుట

22 దావీదు గాతును వదిలి అదుల్లాము గుహలోకి
పారిపోయాడు. అదుల్లాము గుహలో దావీదు
ఉన్నట్లు అతని సోదరులు, బంధువులు విన్నారు.
దావీదును చూడటానికి వారక్కడికి వెళ్లారు. 2చాలా
మంది ప్రజలు దావీదుతో కలిసారు. కష్టాల్లో ఉన్నవారు,
అప్పుల్లో ఉన్నవారు, అసంతృప్తి చెందిన వారు దావీదు
చుట్టూ చేరారు. వారికి దావీదు నాయకుడయ్యాడు.
అతనితో కలిపి వారు మొత్తం నాలుగు వందలమంది.
3దావీదు అదుల్లాము గుహ వదిలి మోయాబులో
ఉన్న మిస్పాకు వెళ్లాడు. "దేవుడు నాకు ఏమి చేయను
న్నాడో నేను తెలుసుకునే వరకు దయచేసి నా తల్లి
దండ్రులను వచ్చి నీతో ఉండనియ్యి" అని దావీదు
మోయాబు రాజును అడిగాడు. 4దావీదు తన తల్లి
దండ్రులను మోయాబు రాజువద్ద వదిలి పెట్టాడు.
దావీదు కొండలలో* దాగి ఉన్నంత కాలం అతని
తల్లిదండ్రులు మోయాబు రాజుతోనే ఉన్నారు.
5గాదు ప్రవక్త దావీదును, "కోటలో వుండవద్దనీ,
యూదాకు వెళ్లమని చెప్పాడు." కనుక దావీదు బయ
ల్దేరి హారేతు అరణ్యానికి వెళ్లాడు.

### అహీమెలెకు కుటుంబాన్ని సౌలు నాశనము చేయుట

6దావీదు, అతని మనుష్యులను గూర్చి తన మనుష్యు
లకు తెలిసినట్లు సౌలు విన్నాడు. గిబియా వద్ద కొండ
మీద ఉన్న ఒక వృక్షం క్రింద సౌలు కూర్చున్నాడు.
సౌలు కింది అధికారులంతా అతని చుట్టూ నిలబడ్డారు.
సౌలు చేతిలో ఒక ఈటె వుంది. 7సౌలు తన చుట్టూ
వున్న అధికారులనుద్దేశించి, "బెన్యామీను మనుష్యు
లారా వినండి! యెష్షయి కుమారుడు దావీదు మీ
అందరికీ భూములు, ద్రాక్షతోటలు ఇస్తాడని మీరను
కుంటున్నారా? మీ అందరినీ దావీదు సహస్ర సైన్యా
ధిపతులుగా, శత దళాధిపతులుగా చేస్తాడని మీరు అను
కుంటున్నారా? అని అడిగాడు.
8"మీరంతా నాకు వ్యతిరేకంగా కుట్ర పన్నారు!
మీరు రహస్య పథకాలు వేసారు. నా కుమారుడు యోనా
తాను యెష్షయి కుమారునితో ఒడంబడిక చేసుకు
న్నట్లు మీలో ఎవ్వడూ నాకు చెప్పలేదు! నా గురించి
మీలో ఒక్కనికీ శ్రద్ధ లేదు! దావీదును నా కుమారుడు
యోనాతాను ప్రోత్సహించినట్లు మీలో ఒక్కడూ నాకు
చెప్పలేదు. నా సేవకుడు దావీదును దాగుకొనుమని,
నన్ను ఎదురుదెబ్బ తీయుమని యోనాతాను
చెప్పాడు. దావీదు ఇప్పుడు అదే పని చేస్తున్నాడు"
అని అన్నాడు. 9ఎదోమీయుడగు దోయేగు అక్కడ
సౌలు అధికారులతో పాటు నిలబడి వున్నాడు.
"యెష్షయి కుమారుడైన దావీదు అహీటూబు కుమారు
డైన అహీమెలెకును నోబులో చూడటానికి వచ్చి
నపుడు, అతనిని నేను చూసాను. 10దావీదు కొరకు
అహీమెలెకు ప్రార్థన చేయటం, అహీమెలెకు అతనికి
ఆహారం ఇవ్వటం, పైగా ఫిలిష్తీయుడైన గొల్యాతు
ఖడ్గాన్ని అహీమెలెకు దావీదుకు ఇవ్వటం నేను
చూసాను" అని దోయేగు వివరంగా చెప్పాడు.

---

**కొండలు** శత్రు దాడులు జరిగినప్పుడు తమను తాము
రక్షించుకునేందుకు ప్రజలు దాగివుండే చోటు. వీటిని
దుర్గాలని కూడ అంటారు.

[11]అది విన్న సౌలు అహీటూబు కుమారుడు,
యాజకుడైన అహీమెలెకును, అతని బంధువుల నంద
రినీ తన దగ్గరకు తీసుకుని రమ్మన్నాడు. అహీమెలెకు
బంధువు లంతా నోబులో యాజకులు. వారంతా
రాజువద్దకు వచ్చారు. [12]“అహీటూబు కుమారుడా,
విను” అని సౌలు అహీమెలెకుతో అన్నాడు.
“చెప్పండి ప్రభూ,” అన్నాడు అహీమెలెకు.
[13]“నీవూ, యెష్షయి కుమారుడైన దావీదూ కలసి
నామీద ఎందుకు రహస్య పథకాలు వేసారు? నీవు
దావీదుకు రొట్టె, ఖడ్గం ఇచ్చావు. వాని కోసం నీవు
దేవునికి ప్రార్థన చేసావు. ఇప్పుడు దావీదు నన్ను
ఎదుర్కొటానికి వేచియున్నాడు.” అన్నాడు అహీమెలె
కుతో సౌలు.
[14]అహీమెలెకు, “దావీదు నీ పట్ల చాలా విశ్వాసంగా
ఉన్నాడు. దావీదు అంతటి నమ్మకస్థుడు నీ అధికారు
లలో మరెవ్వరూ లేరు. దావీదు నీ సొంత అల్లుడు.
పైగా నీ అంగరక్షకులందరికీ అతడు అధిపతి. నీ సొంత
కుటుంబమంతా దావీదును గౌరవిస్తూ ఉంది. [15]నేను
దావీదు కొరకు ప్రార్థన చేయటం అది మొదటిసారి
కాదు. ఎన్నటికీ కాదు. నన్నుగాని, నా బంధువులనుగాని
నిందించవద్దు. మేము నీ సేవకులము. ఇప్పుడు ఏమి
జరుగుతూ ఉందనేది నాకేమీ తెలియదు” అని జవా
బిచ్చాడు.
[16]కానీ రాజు, “అహీమెలెకూ! నీవూ, నీ బంధువులు
అంతా చావాల్సిందే!” అన్నాడు. [17]అప్పుడు రాజు
తన పక్కనవున్న భటులతో, “వెళ్లి, యెహోవా
యాజకులందరినీ చంపండి. వారు దావీదు పక్షంగా
ఉన్నారు. దావీదు పారిపోతున్నాడని వారికి తెలుసు.
అయినా వారు నాకు ఆ విషయం చెప్పలేదు” అని
చెప్పాడు. రాజభటులు యెహోవా యాజకులకు
హాని చేసేందుకు నిరాకరించారు.
[18]అప్పుడు రాజు దోయేగును పిలచి, “నీవు వెళ్లి
ఆ యాజకులను చంపు” అని ఆజ్ఞాపించాడు. దానితో
ఎదోమీయుడైన దోయేగు వెళ్లి యాజకులందరినీ
చంపేసాడు. ఆ రోజు ఎనభై అయిదు మంది యాజ
కులను దోయేగు చంపేసాడు. [19]నోబు యాజకుల
యొక్క పట్టణం. నోబు పట్టణంలోని వారందరినీ
దోయేగు చంపేసాడు. పురుషులు, స్త్రీలు, పిల్లలు,
పసివాళ్లు అందరినీ దోయేగు చంపేసాడు. వారి పశు
వులు, గాడిదలు, గొర్రెలు అన్నిటినీ దోయేగు
చంపేసాడు.
[20]అయితే అబ్యాతారు తప్పించుకున్నాడు. ఇతడు
అహీటూబు మనుమడు. అంటే అహీమెలెకు కుమా
రుడు. అబ్యాతారు పారిపోయి దావీదును కలుసు
కొన్నాడు. [21]సౌలు, యెహోవా యాజకులనందరినీ
చంపిన విధమంతా అబ్యాతారు దావీదుకు చెప్పాడు.
[22]“ఎదోమీయుడగు దోయేగును ఆ రోజు నోబులో
నేను చూసాను, వాడు సౌలుకు తప్పనిసరిగా చెబుతా
డని నాకు తెలుసును, కాని నీ తండ్రి కుటుంబం
అంతా చనిపోవటానికి నేనే కారకుడను. [23]నిన్ను
చంపాలనుకొనే సౌలు నన్నూ చంపాలనుకుంటు
న్నాడు. నీవు నాతోనే ఉండు. భయపడవద్దు. నాతో
ఉంటే నీవు క్షేమంగా ఉంటావు” అని దావీదు
అబ్యాతారుతో అన్నాడు.

## దావీదు కెయీలాకు వెళ్లటం

23 అక్కడి ప్రజలు దావీదుతో, “ఫిలిష్తీయులు
కెయీలా రాజ్యంపై యుద్ధం చేస్తున్నారనీ,
నూర్చేడి కళ్లాలనుండి ధాన్యాన్ని కొల్ల గొడుతు
న్నార”నీ చెప్పారు.
[2]“నేను వెళ్లి ఈ ఫిలిష్తీయులతో యుద్ధం చేయనా?”
అని దావీదు యెహోవాని అడిగాడు. “వెళ్లుము ఫిలిష్తీ
యులను ఎదుర్కొని కెయీలాను కాపాడు,” అని
యెహోవా దావీదుకు సమాధాన మిచ్చాడు. [3]కాని
దావీదు మనుష్యులు, “మనము యూదాలోనే ఉండి
భయపడి పోతున్నాము. ఇక ఫిలిష్తీయుల సైన్యంవున్న
చోటికి వెళితే మా భయానికి అంతువుండదు”
అన్నారు.
[4]దావీదు మళ్లీ యెహోవాను అడిగాడు. యెహోవా,
“కెయీలాకు వెళ్లుము ఫిలిష్తీయులను జయించటానికి
నేను నీకు సహాయం చేస్తాను” అని దావీదుకు జవాబి
చ్చాడు. [5]అప్పుడు దావీదు తన మనుష్యులతో కెయీ
లాకు వెళ్లాడు. దావీదు మనుష్యులు ఫిలిష్తీయులతో
యుద్ధం చేసి వారిని ఓడించి వారి పశువులను
పట్టుకున్నారు. దావీదు ఫిలిష్తీయులను చిత్తుగా ఓడించి
వారి బారినుండి కెయీలా ప్రజలను రక్షించాడు.
[6](అహీమెలెకు కుమారుడు అబ్యాతారు దావీదు వద్దకు
పారిపోయినప్పుడు తనతో ఏఫోదు అనబడే యాజ
కుల అంగీనొక దానిని తీసుకుని వెళ్లాడు).
[7]దావీదు కెయీలాలో ఉన్నట్లు ప్రజలు సౌలుకు
చెప్పారు. అది విని, “దేవుడు దావీదును నాకిచ్చినట్టే!
దావీదు తనకు తాను బోనులో పడ్డాడు. ఎందువల్ల
నంటే అతను చుట్టూ ద్వారాలు, కటకటాలు ఉన్న
పట్టణంలో ప్రవేశించాడు” అన్నాడు సౌలు.
[8]సౌలు తన సైన్యాన్ని సమీకరించుకొని యుద్ధానికి
సిద్ధమయ్యాడు. దావీదును, అతని అనుచరులను ఎది
రించటానికి సౌలు సైన్యం కెయీలాకు వెళ్లేందుకు
తయారయింది.
[9]తన మీద సౌలు పన్నాగం పన్నుతున్నాడని దావీదు
తెలుసుకున్నాడు. “ఏఫోదు తీసుకురా” అని దావీదు
అబ్యాతారుకు చెప్పాడు.
[10]దావీదు ఇలా ప్రార్థన చేశాడు: “ఇశ్రాయేలీయుల
యెహోవా దేవా! నా మూలంగా సౌలు కెయీలా
పట్టణానికి వచ్చి దానిని నాశనం చేయ సంకల్పించాడని

విన్నాను. 11సౌలు కెయీలాకు వస్తాడా? కెయీలా ప్రజలు నన్ను సౌలుకు అప్పగిస్తారా? ఇశ్రాయేలీయుల యెహోవా దేవా, నేను నీ సేవకుడను! దయచేసి నాకు చెప్పు”

12దావీదు, “కెయీలా ప్రజలు నన్ను, నా మనుష్యులను సౌలుకు అప్పగిస్తారా?” అని మళ్లీ అడిగాడు. “అవును!” అని యెహోవా జవాబిచ్చాడు.

13అది విన్న దావీదు తన మనుష్యులతో కెయీలా వదిలి వెళ్లిపోయాడు. దావీదుతో ఆరువందల మంది వెళ్లారు. ఒక చోటనుండి మరొక చోటకి వారు తరలి పోయారు. దావీదు కెయీలానుండి తప్పించుకున్నాడని విన్న సౌలు కెయీలా నగరానికి వెళ్లలేదు.

### సౌలు దావీదును వెంటాడుట

14దావీదు అరణ్యములో ఉన్న దుర్గాలలోను, జీఫు అరణ్యంలోని కొండలలోను తలదాచుకున్నాడు. ప్రతి రోజూ సౌలు దావీదు కోసం వెదుకుతూ ఉండేవాడు. కానీ యెహోవా దావీదును సౌలు పట్టుకొనేలా చేయలేదు.

15జీఫు అరణ్యంలో హోరేషు వద్ద ఉన్నాడు దావీదు. సౌలు తనను చంపటానికి వస్తున్నాడని భయపడ్డాడు.
16కానీ సౌలు కుమారుడు యోనాతాను హోరేషులో ఉన్న దావీదును చూడటానికి వెళ్లాడు. యోనాతాను దావీదుకు యెహోవా మీద దృఢవిశ్వాసం కలిగేందుకు సహాయం చేసాడు. 17యోనాతాను, “భయపడకు, నా తండ్రి సౌలు నిన్ను తాకలేడు. నీవు ఇశ్రాయేలుకు రాజువవుతావు. నేను నీ తరువాత స్థానంలో ఉంటాను. ఇది నా తండ్రికి కూడా తెలుసు” అన్నాడు దావీదుతో.
18యోనాతాను, దావీదు ఇద్దరూ యెహోవా ఎదుట ఒక ఒడంబడిక చేసుకున్నారు. తరువాత యోనాతాను ఇంటికి వెళ్లిపోయాడు. దావీదు హోరేషులో ఉండిపోయాడు.

### జీఫు ప్రజలు దావీదు గురించి సౌలుకు చెప్పుట

19గిబియాలో ఉన్న సౌలు వద్దకు జీఫు ప్రజలు వచ్చి, “తమ రాజ్యంలో దావీదు దాగియున్నట్లు చెప్పారు. యెషిమోనుకు దక్షిణంగా ఉన్న హకీలా కొండ మీద వున్న హోరేషు కోటలో దావీదు ఉన్నట్లు చెప్పారు. 20ఓ రాజా! ఇప్పుడు మీరు ఏ సమయంలో వచ్చినా దావీదును మీకు పట్టి ఇచ్చే బాధ్యత మాది” అని అన్నారు.

21అందుకు సౌలు, “నాకు సహాయం చేస్తున్నందుకు యెహోవా మిమ్మల్ని ఆశీర్వదించునుగాక! 22వెళ్లండి. అతని గురించి ఇంకా ఎక్కువ విషయాలు తెలుసుకొనండి. దావీదు ఎక్కడ ఉంటున్నాడో కనుగొనండి. అతనిని అక్కడ ఎవరు చూశారో కూడా తెలుసుకోండి. సౌలు కంటె దావీదు తెలివైనవాడు, కనుక తనను మోసగిస్తాడు అని అనుకున్నాడు. 23దావీదు దాక్కొనే స్థలాలన్నీ కూడ తెలుసుకోండి. మళ్లీ నా వద్దకు వచ్చి నాకు పూర్తి సమాచారం తెలియ జేయండి. అప్పుడు నేను మీతో వస్తాను. దావీదు ఆ ప్రాంతంలోనే ఉంటే నేను వానిని కనుగొంటాను. అవసరమైతే యూదాలో ప్రతి ఇంటిని శోధించైనా సరే వానిని కనుక్కుంటాను” అన్నాడు.

24అప్పుడు జీఫువాళ్లు జీఫుకు తిరిగి వెళ్లిపోయారు. సౌలు తరువాత అక్కడికి వెళ్లాడు. దావీదు, అతని అనుచరులు మాయోను అరణ్యంలో ఉన్నారు. అది యెషీమోనుకు దక్షిణంగా ఉన్న ఎడారి ప్రాంతం.
25సౌలు, అతని సైనికులు దావీదును వెతుక్కుంటూ వెళ్లారు. కాని సౌలు అతనికొరకు వస్తున్నాడని ప్రజలు దావీదును హెచ్చరించారు. దావీదు మాయోను అరణ్యంలోని “కొండ”కు వెళ్లాడు. ఇది సౌలు తెలుసుకున్నాడు. సౌలు దావీదును వెతుక్కుంటూ మాయోను అరణ్యానికి వెళ్లాడు.

26పర్వతానికి ఒక పక్కన సౌలు ఉన్నాడు. దావీదు, అతని మనుష్యులు అదే పర్వతానికి మరో వైపున ఉన్నారు. సౌలునుండి దూరంగా పోవటానికి దావీదు తొందర పడుతూ ఉన్నాడు. కానీ దావీదును సపరివారంగా పట్టుకోవాలని సౌలు, అతని సైనికులు ఆ పర్వతం చుట్టూ తిరుగుట ప్రారంభించారు.

27ఒక సందేశకుడు సౌలు వద్దకు వచ్చి, “ఫిలిష్తీయులు తమ రాజ్యం మీదికి దండెత్తి వస్తున్నారనీ” త్వరగా రమ్మనీ చెప్పాడు.

28అంతటితో సౌలు దావీదును వెంటాడటం మాని ఫిలిష్తీయులను ఎదుర్కోటానికి వెళ్లాడు. అందువల్ల ప్రజలు ఈ ప్రదేశానికి, “జారుడు బండ”* అని పేరు పెట్టారు. 29దావీదు మోయోను ఎడారి వదిలి ఏన్గెదీ దగ్గర ఉన్న కొండస్థలాలకు వెళ్లాడు.

### దావీదు సౌలును అవమానపరచుట

24 సౌలు ఫిలిష్తీయులను తరిమివేసిన పిమ్మట, “దావీదు ఏన్గెదీ ఎడారిలో ఉంటున్నట్లు” ప్రజలు అతనికి చెప్పారు.

2కనుక సౌలు ఇశ్రాయేలు అంతటినుండీ మూడువేల మందిని ప్రత్యేకంగా ఎంపిక చేసి, వారిని తీసుకొని వెళ్లి దావీదు కొరకు, అతని అనుచరుల కొరకు వెతకటం మొదలు పెట్టాడు. అడవి మేక బండలు అనే చోట వారు వెదికారు. 3సౌలు బాట పక్కగావున్న గొర్రెల మంద వద్దకు వచ్చి అక్కడ ఉన్న ఒక గుహలోకి కాలకృత్యాలు తీర్చుకోవటానికి వెళ్లాడు. ఆ గుహలోనే చాలా లోపల దావీదు, అతని మనుష్యులు దాగి వున్నారు. 4సౌలును చూసి దావీదు అనుచరులు

---

**జారుడు బండ** లేక “సెలహమ్మలెకోతు.”

అతనితో “యెహోవా చెప్పిన రోజు ఇదే. ‘నీ శత్రు
వును నీకు అప్పగిస్తాను కనుక ఇప్పుడు నీ శత్రువును
నీ ఇష్టం వచ్చినట్లు చేయవచ్చు అని యెహోవా
నీతో చెప్పాడు గదా!’ ” అన్నారు.
అప్పుడు దావీదు మెల్లగా సౌలు వద్దకు పాకుతూ
వెళ్లి. సౌలు అంగీని ఒక కొన కోసివేశాడు. సౌలు దావీ
దును గమనించలేదు. 5కానీ తర్వాత సౌలు అంగీని
కోసివేసినందుకు దావీదు బాధపడ్డాడు. 6“నా యజ
మానికి నేను ఇలాంటి పని చేయకుండా యెహోవా
నన్ను నివారించునుగాక! సౌలు యెహోవా నియ
మించిన రాజు. సౌలు యెహోవాచే అభిషేకింపబడిన
రాజు గనుక సౌలుకు వ్యతిరేకంగా నేను ఏమీ చేయ
కూడదు” అని దావీదు తన మనుష్యులతో అన్నాడు.
7కోపోద్రేకులైన తన మనుష్యులను అదుపు చేయ
టానికి దావీదు ఈ మాటలు చెప్పాడు. దావీదు వారిని
సౌలు మీదికి పోనియ్యలేదు.
సౌలు గుహ వదిలి తన దారిన వెళ్లిపోయాడు. 8అతని
వెనుకనే దావీదు బయటికి వచ్చి, “రాజా నా ప్రభూ”
అని కేక వేసాడు. సౌలు వెనుదిరిగి చూశాడు. దావీదు
వంగి నమస్కరించాడు. 9“దావీదు నీకు హాని చేయ
చూస్తున్నాడని ప్రజలు చెబితే నీవెందుకు ఆ మాటలు
వింటున్నావు? 10యెహోవా ఈ రోజున గుహలో
నిన్ను నాకు ఎలా అప్పగించాడో నీ కళ్లతో నీవే
చూశావు. కానీ నిన్ను చంపటానికి నేను నిరాకరించాను.
నేను నీపట్ల కనికరము చూపాను. ‘సౌలు యెహోవా
చేత అభిషేకించబడిన రాజు. నా యజమానికి నేను
కీడు చేయను’ అని నేననుకున్నాను. 11ఇదిగో నీ
రాజవస్త్రం ముక్క నా చేతిలో ఉంది చూడు! దీనిని
నీ అంగీ నుండి ఒక మూల కోశాను. నిన్ను నేను
చంపగలిగి ఉండేవాడిని కానీ చంపలేదు. ఇప్పుడైనా
నీవు అర్థం చేసుకో. నేను నీకు ఏ కీడూ తలపెట్ట
లేదు. నేను నీ ఎడల ఏ తప్పూ చేయలేదు. కాని
నీవు మాత్రం నన్ను చంపే ప్రయత్నంలో వెంటా
డుతున్నావు. 12యెహోవాయే న్యాయం తీర్చును
గాక! నీవు నాపట్ల తలపెట్టిన కీడుకు యెహోవా
నిన్ను శిక్షించవచ్చును. కాని నాకై నేను నీతో
పోరాడను. 13దుష్టులనుండి దుష్టకార్యాలే వస్తాయనే
ఒక పాత సామెత ఉంది. కానీ నేను దుర్మార్గం ఏమీ
చేయలేదు. నేను దుర్మార్గుడిని కాదు. నేను నీకు
హాని చేయను.
14ఇంతకూ నీవు తరుముచున్నది ఎవరిని? ఇశ్రా
యేలు రాజు పోరాడేందుకు వస్తున్నది ఎవరిమీదికి?
నిన్ను గాయపర్చే వారినెవరినో నీవు వెంటాడటం
లేదు! ఏదో ఒక చచ్చిన కుక్కనో, లేక ఈగనో నీవు
తరుము తున్నట్టుగా ఉంది. 15యెహోవాయే న్యాయ
మూర్తిగా ఉండి నీకూ నాకూ మధ్య న్యాయం తీర్చును
గాక! యెహోవా నన్ను బలపర్చి నేను నిర్దోషినని
నిరూపిస్తాడు. ఆయన నన్ను నీ బారినుండి రక్షిస్తాడు”
అని రాజైన సౌలుతో దావీదు చెప్పాడు.
16దావీదు తన మాట ముగించగానే, సౌలు
“దావీదూ! నా కుమారుడా, అది నీ స్వరమేనా?”
అంటూ ఏడ్వటం మొదలుపెట్టాడు. సౌలు చాలా
ఏడ్చాడు. 17“అవును నీవు చెప్పింది వాస్తవమే. నేనే
తప్పు చేశాను. నీవు నాపట్ల చాలా మంచితనం చూపిం
చావు. కాని నేనే నీపట్ల చెడుగా ప్రవర్తించాను. 18నీవు
చేసిన మంచి పనులన్నీ నాకు నీవు చెప్పావు.
యెహోవా నన్ను నీ వద్దకు తీసుకుని వచ్చాడు.
అయినా నీవు నన్ను చంపలేదు.
19ఇది నీవు నా శత్రువు కాదని నిరూపిస్తుంది. శత్రువు
చేజిక్కినపుడు మంచితనంతో ఎవరూ విడిచి పెట్టరు.
శత్రువుకు ఎవరూ మేలు చేయరు. ఈ రోజు నీవు
నాపట్ల ఇంత మంచిగా ప్రవర్తించినందుకు యెహోవా
నీకు ప్రతిఫలం దయచేయును గాక! 20నీవు ఖచ్చితంగా
రాజువు అవుతావని నాకు తెలుసు. ఇశ్రాయేలు
రాజ్యాన్ని నీవు పరిపాలిస్తావు. 21ఇప్పుడు నాకొక మాట
ఇవ్వు. యెహోవా నామం పేరిట నీవు నా సంతతి
వారిని హతమార్చనని మాటయివ్వు. నా తండ్రి వంశం
నుంచి నా పేరు తుడిచివేయనని నీవు నాకు ప్రమాణం
చేసి చెప్పు.” అన్నాడు సౌలు.
22కనుక సౌలుకు దావీదు వాగ్దానం చేసాడు. సౌలు
కుటుంబాన్ని నాశనం చేయనని దావీదు వాగ్దానం
చేశాడు. అప్పుడు సౌలు ఇంటికి తిరిగి వెళ్లాడు. దావీదు
తన అనుచరులతో కొండ స్థలాలకు వెళ్లిపోయాడు.

## దావీదు మరియు మూర్ఖుడైన నాబాలు

25 సమూయేలు చనిపోయాడు. సభచేరిన ఇశ్రా
యేలీయులు సమూయేలు మృతికి తమ
సంతాపాన్ని వెలిబుచ్చారు. రామాలో వున్న అతని
ఇంటివద్దనే సమూయేలు భౌతిక కాయాన్ని వారు
సమాధి చేశారు. అప్పుడు దావీదు పారాను అరణ్యానికి
తరలిపోయాడు.
2మాయోనులో ఒక ధనవంతుడు నివసిస్తుండేవాడు.
అతనికి మూడువేల గొర్రెలు, వెయ్యి మేకలు
ఉన్నాయి. ఏదో వ్యాపార రీత్యా అతడు కర్మెలులో
ఉన్నాడు. కర్మెలులో అతడు తన గొర్రెల బొచ్చు
కత్తిరిస్తున్నాడు. 3అతని పేరు నాబాలు.* అతని భార్య
పేరు అబీగయీలు. ఆమె చాలా తెలివైనది, మంచి
అందగత్తె. కానీ నాబాలు క్రూరుడు, నీచుడు, కాలేబు
సంతతివాడు.
4దావీదు అరణ్యంలో ఉన్నప్పుడు, నాబాలు తన
గొర్రెలనుండి ఉన్ని తీస్తున్నట్లు విన్నాడు. 5దావీదు
పదిమంది యువకులను పిలిచి, “కర్మెలులో వున్న

---

**నాబాలు** బుద్ధిహీనుడు అని దీని అర్థం.

నాబాలు వద్దకు వెళ్లి అతనిని తన పక్షంగా పలుక
రించమని” చెప్పాడు. 6“నీవూ, నీ కుటుంబం బాగు
న్నారని ఆశిస్తున్నాను! నీకు ఉన్నదంతా క్షేమం అని
కూడ నేను భావిస్తున్నాను, 7నీవు నీ గొర్రెల నుండి
ఉన్ని తీస్తున్నట్లు నేను విన్నాను. నీ గొర్రెల కాపరులు
కొద్ది రోజులు మా వద్ద ఉన్నారు. అప్పుడు వారికి
మేము ఏ హానీ చేయలేదు. వారు కర్మెలులో ఉన్నంత
కాలం మేము వారినుండి ఏమీ తీసుకోలేదు. 8నీవు
వారి నడిగితే ఇది నిజం అని వారే చెబుతారు. మేము
ఈ సంతోష సమయంలో నీ దగ్గరకు వస్తున్నాము.
అందుచేత ఈ యువకుల పట్ల నీవు కనికరం
చూపించు. దయచేసి నీవు ఇవ్వగలిగింది వారికి ఇవ్వు.
నీ స్నేహితుడవైన* దావీదు కోసం ఇది చేయి” అని
చెప్పమన్నాడు దావీదు.
9దావీదు మనుష్యులు నాబాలు దగ్గరకు వెళ్లారు.
దావీదు సందేశాన్ని వారు నాబాలుకు అందజేశారు.
10కాని నాబాలు చాలా అసభ్యకరంగా వ్యవహరించాడు.
తన వద్దకు వచ్చిన దావీదు సేవకులతో, “ఎవడీ
దావీదు? ఎవడీ యెష్షయి కొడుకు? ఇటీవల చాలా
మంది బానిసలు తమ యజమానులనుండి పారిపోతు
న్నారు! 11నావద్ద రొట్టె, నీళ్లూ ఉన్నాయి. అవి, నావద్ద
ఉన్న మాంసం, ఉన్ని తీసే నా సేవకులకు కావాలి.
నాకు తెలియని వాళ్లెవరికీ నేను దాన్ని ఇవ్వను,” అని
కసురు కున్నాడు నాబాలు. 12నాబాలు అన్నదంతా
దావీదు మనుష్యులు తిరిగి వెళ్లి దావీదుకు చెప్పారు.
13ఇది విన్న దావీదు తన మనుష్యులను, “తమ కత్తులు
తీసుకోమన్నాడు.” కనుక దావీదు అతని మనుష్యులు
తమ తమ కత్తులు చేపట్టారు. సుమారు నాలుగు
వందల మంది దావీదుతో వెళ్లారు. రెండు వందల
మంది సామాన్ల వద్ద కాపలా ఉన్నారు.

### అబీగయీలు ఆపదను తప్పించుట

14నాబాలు నౌకర్లలో ఒకడు తన యజమాని భార్య
అబీగయీలు వద్దకు వెళ్లి, “దావీదు అరణ్యం నుండి
కొందరు దూతలను మా యజమాని నాబాలును
పలకరించేందుకు పంపాడు. అయితే నాబాలు వారితో
నీచంగా ప్రవర్తించాడు అని చెప్పాడు. 15దావీదు మను
ష్యులు మనపట్ల చాలా మర్యాదగా ఉన్నారు. మనకు
ఏ అపకారమూ చేయలేదు. మేము గొర్రెలను పొలా
లకు తోలుకు వెళ్లినప్పుడు వారు మాతోనే ఉన్నారు.
వారు ఎప్పుడూ ఏమీ దొంగిలించలేదు. 16రాత్రింబగళ్లు
దావీదు మనుష్యులు మమ్మల్ని కాపాడారు. మేము
గొర్రెలను మేపుతున్న రోజుల్లో వారు మాకు పెట్టని
కోటలా ఉండి మమ్మల్ని కాపాడారు.
17ఇప్పుడు నీవు ఏమి చేయగలవో నీవే ఆలోచించి
నిశ్చయించు. మా యజమాని నాబాలుకూ, అతని
కుటుంబానికీ భయంకర ఆపద రాబోతోంది. నాబాలు
చెప్పిన మాటలు బుద్ధి తక్కువ మాటలు” అని
చెప్పాడు. 18అబీగయీలు వెంటనే రెండువందల
రొట్టెలు, రెండు నిండు ద్రాక్షారసపు తిత్తులు, వండిన
ఐదు గొర్రెల మాంసం, సుమారు ఐదు మానికల
వండిన ఆహారం, ఒక మూట ఎండు ద్రాక్ష, ఎండిన
అంజూరపు పండ్ల అడలు రెండు వందలు, కొన్ని
గాడిదల మీద ఎత్తించింది. 19తరువాత అబీగయీలు
తన నౌకర్లతో, “వాటిని తీసుకుని వెళ్లమని, వారి వెనుక
తను బయలు దేరి వస్తానని చెప్పింది.” కానీ ఆమె
ఇదంతా తన భర్తకు చెప్పలేదు.
20అబీగయీలు తన గాడిద మీద ఎక్కి పర్వతం
అవతలి వైపుకు వచ్చింది. ఎదురుగా వస్తున్న దావీ
దును, అతని మనుష్యులను ఆమె కలుసుకున్నది.
21అబీగయీలు దావీదును కలుసుకోక ముందు
దావీదు తన అనుచరులతో, “నాబాలు ఆస్తిని అర
ణ్యంలో నేను అనవసరంగా కాపాడాను. వాని గొర్రె
లలో ఒక్కటికూడ తప్పిపోకుండా అదుపు చేయిం
చాను. నేనతనికి అన్నీ మంచి పనులు చేశాను. కానీ
అతను నాపట్ల చాలా చెడుగా ప్రవర్తించాడు. 22రేపటి
ఉదయంలోగా నేను నాబాలు కుటుంబంలో ఒక్క
మగవాడు కూడా లేకుండా చంపకపోతే యెహోవా
నన్ను శిక్షించును గాక!” అన్నాడు.
23అయితే అబీగయీలు దావీదును చూడగానే
వెంటనే గాడిద మీదనుంచి దిగి దావీదుకు సాగిలపడి
అభి వందనం చేసింది. 24అబీగయీలు దావీదు పాదాల
మీద పడి, “అయ్యా, నన్ను నీతో మాట్లాడనియ్యి.
నేను చెప్పేది విను. జరిగిన దానికి నన్నేనిందించు.
25నీవు పంపిన మనుష్యుల్ని నేను చూడలేదు. ఈ
పనికిమాలిన మనిషి నాబాలును నీవు లక్ష్యపెట్టకు.
అతను తన పేరుకు తగినట్టే ఉన్నాడు. అతని పేరుకు
‘బుద్ధిహీనుడని’ అర్థం. అతడు నిజంగానే బుద్ధిహీనుడు.
26నిర్దోషులను చంపకుండా, యెహోవాయే నిన్ను
దూరంగా ఉంచాడు. యెహోవా జీవిస్తున్నాడు
నిజంగా, నీవు జీవిస్తున్నావు నిజంగా నీ శత్రువులంతా,
మరియు నీకు కీడు తలపెట్టిన వారంతా నాబాలువలె
అవుదురు గాక! 27నీ కోసం నేను ఈ కానుకలు
తెచ్చాను. నిన్ను అనుసరిస్తున్న నీ మనుష్యులకు ఈ
కానుకలనివ్వు 28తప్పు చేసినందుకు నన్ను క్షమించు.
యెహోవా నీ కుటుంబాన్ని బలపరచి నీ కుటుం
బంలో అనేక మంది రాజులు పుట్టేలా చేస్తాడని నాకు
తెలుసు. నీవు ఆయన తరఫున యుద్ధాలు చేస్తున్నావు
గనుక యెహోవా అలా చేస్తాడు. నీవు జీవించియు
న్నంత కాలం ప్రజలకు నీలో ఏ తప్పూ కనబడదు.
29ఒక మనిషి నిన్ను చంపాలని వెంటాడినా, నీ దేవుడైన

---

**స్నేహితుడు** కుమారుడు అని మూలభాషలో రాయ
బడింది.

యెహోవా నీ ప్రాణాన్ని రక్షిస్తాడు. ఒడిసెలలో పెట్టి విసరిన రాయిలా యెహోవా నీ శత్రువుల ప్రాణాలను విసిరేస్తాడు. [30]నీకు అనేక మంచి వాటిని చేస్తానని యెహోవా వాగ్దానం చేసాడు. కనుక యెహోవా వాట న్నింటినీ నెరవేరుస్తాడు. ఆయన నిన్ను ఇశ్రాయేలుకు నాయకునిగా చేస్తాడు. [31]అప్పుడు నీవు ఈ బోనులో పడవు. దుర్మార్గాలు చేసిన దోషం నీకు ఉండదు. నిర్దోషులను చంపావనే దోషం నీ మీద ఉండదు. ఆ మహా గొప్ప విజయం నీకు యెహోవా చేకూర్చి నప్పుడు దయచేసి నన్ను జ్ఞాపకం చేసుకోమని ప్రార్థి స్తున్నాను" అని వేడుకున్నది.

[32]దావీదు అబీగయీలుకు సమాధానమిస్తూ, "ఇశ్రా యేలు దేవుడైన యెహోవాకు స్తోత్రం. నన్ను కలుసు కునేందుకు దేవుడే నిన్ను పంపించాడు. [33]నీవు సరియైన న్యాయ విచారణ చేసినందుకు దేవుడు నిన్ను ఆశీర్వదించునుగాక! ఈ రోజు నేను నిర్దోషులను చంపకుండా నీవే నన్ను వారించావు. [34]ఇశ్రాయేలీ యుల దేవుడైన యెహోవా జీవిస్తున్నంత నిజంగా నీవు గనుక ఇంత త్వరగా ఈరోజు నన్ను కలుసు కొనేందుకు రాకపోతే రేపటి ఉదయం లోపల నాబాలు వంశంలో ఒక్క మగవాడు కూడా మిగిలే వాడు కాదు" అని చెప్పాడు దావీదు.

[35]అప్పుడు దావీదు అబీగ యీలు తెచ్చిన కానుకలు స్వీకరించి, "శాంతితో ఇంటికి వెళ్లు నీ మాటలు నేను విన్నాను, నీవు కోరినట్టు నేను చేస్తాను" అని దావీదు ఆమెతో చెప్పాడు.

### నాబాలు మరణము

[36]అబీగయీలు తిరిగి వచ్చేసరికి నాబాలు ఇంటి వద్దనే ఉన్నాడు. నాబాలు ఒక రాజులా తింటూ ఉన్నాడు. బాగా తాగి, ఉల్లాసంగా ఉన్నాడు. అందుచేత అబీగయీలు మరుసటి రోజు ఉదయం వరకు నాబా లుతో ఏమీ చెప్పలేదు. [37]మరుసటి ఉదయం నాబాలు మామూలుగా ఉన్నాడు. కనుక అతని భార్య జరిగిన దంతా అతనితో చెప్పింది. అది వినగానే అతనికి గుండె పోటు వచ్చి రాయిలా బిగుసుకుపోయాడు. [38]ఆ తరు వాత పదిరోజులకు నాబాలు చచ్చేటట్టుగా చేసాడు యెహోవా. [39]నాబాలు మరణ వార్త విన్న దావీదు, "యెహో వాకు స్తోత్రం! నాబాలు నన్ను గూర్చి చెడుగా మాట్లాడాడు. కానీ యెహోవా నన్ను బల పర్చాడు. నాబాలు తప్పు చేసాడు గనుక యెహోవా వానిని చచ్చేటట్టు చేసాడు" అని చెప్పాడు.

అప్పుడు దావీదు అబీగయీలుకు ఒక వర్తమానం పంపాడు. ఆమె తనకు భార్య కావాలని దావీదు అడి గాడు. [40]దావీదు సేవకులు కర్మెలుకు వెళ్లి అబీగయీ లును కలిసి, "దావీదు నిన్ను తీసుకుని రమ్మని మమ్మి లను పంపించాడు. నీవు అతని భార్యవు కావాలని దావీదు కోరిక" అని చెప్పారు. [41]అబీగయీలు సాగిల పడి నమస్కరించి, "నేను మీ దాసిని మీ సేవకు సిద్ధంగా ఉన్నాను. నేను నా యజమానియైన దావీదు సేవకుల పాదప్రక్షాళనం* చేయటానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పింది.

[42]అబీగయీలు వెంటనే ఒక గాడిద మీద ఎక్కి దావీదు పంపిన సేవకులతో కలసి వెళ్లింది. ఆమెతో అయిదుగురు పనిగత్తెలను కూడ తీసుకుని వెళ్లింది. అబీగయీలు దావీదు భార్య అయింది.

[43]యెజ్రెయేలీ వాసి అహీనోయమును కూడ దావీదు వివాహము చేసుకున్నాడు. అహీనోయము, అబీగ యీలు ఇద్దరూ దావీదుకు భార్యలయ్యారు. [44]సౌలు కుమార్తె మీకాలు కూడ దావీదుకు భార్యయే గాని, సౌలు ఆమెను గల్లీముకు చెందిన లాయీషు అనే వాని కుమారుడు పల్తీయేలుకు ఇచ్చి మళ్లీ పెళ్లి చేశాడు.

### దావీదు, అబీషై సౌలు గుడారంలోకి ప్రవేశించుట

26 జీఫు ప్రజలు సౌలును చూడటానికి గిబి యాకు వెళ్లారు. "హకీలా కొండల్లో దావీదు దాగి ఉంటున్నాడు. ఈ కొండ యెషీమోనుకు ఎదు రుగా ఉంది" అని వారు సౌలుతో చెప్పారు. [2]జీఫు అరణ్యంలోకి సౌలు వెళ్లాడు. ఇశ్రాయేలు అంతటిలో తాను ఎంపిక చేసుకొన్న మూడువేల మంది సైనికు లను సౌలు తన వెంట తీసుకుని వెళ్లాడు. సౌలు, అతని మనుష్యులు దావీదును వెదుక్కుంటూ జీఫు అరణ్యంలోకి వెళ్లారు. [3]సౌలు హకీలా కొండపై గుడా రాలు సిద్ధపరచుకొనెను. యెషీమోనుకు ఎదురుగా బాటపక్కలో ఈ స్థలం వుంది. దావీదు అరణ్యం లోనే వుండి, సౌలు తనను వెతుక్కుంటూ వచ్చినట్లు విన్నాడు. [4]దావీదు తన వేగుల వారిని పంపి సౌలు హకీలా కొండకు వచ్చినట్లు తెలుసుకున్నాడు. [5]సౌలు గుడారాలు వేసుకున్న ప్రదేశానికి దావీదు వెళ్లాడు. సౌలు, అబ్నేరు ఇద్దరూ నిద్రిస్తున్న చోటును దావీదు చూశాడు. (నేరు కుమారుడు అబ్నేరు సౌలు సైన్యా లకు సేనాని.) గుడారం మధ్యలో సౌలు నిద్రిస్తూ వున్నాడు. సైన్యమంతా అతని చుట్టూ వుంది.

[6]హిత్తీయుడైన అహీమెలెకుతోను, సెరూయా కుమారుడయిన అబీషైతోను దావీదు మాట్లాడి, "సౌలు పాళెములోనికి తనతో ఎవరు రాగలరని" అడిగాడు. (అబీషై అనేవాడు యోవాబు తమ్ముడు). "నీతో నేను వస్తా" అని అబీషై చెప్పాడు.

[7]చీకటి పడ్డాక దావీదు, అబీషై కలిసి సౌలు మజిలీలోకి వెళ్లారు. సౌలు మధ్యలో నిద్రపోతూ

---

**సేవకుల పాదప్రక్షాళనం** దావీదు కాలంలో ఒక వ్యక్తి ప్రజల కాళ్లు కడిగితే ఆ వ్యక్తియొక్క అణకువకు, నమ్రతకు గుర్తు.

ఉన్నాడు. సౌలు తల వద్ద అతని ఈటె భూమిలోకి
దిగవేసి ఉంది. అతని చుట్టూ సైనికులు, పక్కగా
అబ్నేరు నిద్రపోతూ ఉన్నారు. 8"నీ శత్రువును ఓడించ
టానికి దేవుడు నీకు ఈ రోజు అవకాశం ఇచ్చాడు.
ఒక్క వేటుతో, అతని ఈటెతోనే సౌలును భూమి
లోనికి పొడిచి వేస్తాను" అన్నాడు అబీషై దావీదుతో.
9కానీ దావీదు అబీషైతో ఇలా అన్నాడు, "సౌలును
చంపవద్దు! యెహోవాచే ఎంపిక చేయబడిన రాజుకు
హాని చేసినవాడు శిక్షించబడాలి. 10యెహోవా జీవిస్తు
న్నంత నిజంగా యెహోవా తానే సౌలును శిక్షిస్తాడు.
ఒకవేళ సౌలు సహజంగానే చనిపోవచ్చు. లేదా
యుద్ధంలో అతడు చంపబడవచ్చు. 11కానీ యెహోవా
చేత అభిషేకించబడిన రాజును నేను మాత్రం చంప
కుండా ఉండేటట్టు చేయుమని యెహోవాకు నేను
ప్రార్థన చేస్తాను. కనుక సౌలు తలవద్ద ఉన్న ఈటెను,
మంచినీటి కూజాను తీసుకోండి. మనము వెళ్లి
పోదాము."
12కనుక సౌలు తల దగ్గర వున్న ఈటెను, నీటి
కూజాను తీసుకుని దావీదు, అబీషై సౌలు గుడారం
నుండి బయటకు వెళ్లిపోయారు. ఇదంతా జరగటం
ఏ ఒక్కరూ చూడలేదు. ఇది ఎవ్వరికీ తెలియదు.
ఒక్క మనిషి కూడ కనీసం మేల్కోలేదు! యెహోవా
సౌలును, తన సైన్యాన్ని గాఢనిద్రలో పడవేయటంతో
వారంతా అలా నిద్రపోయారు.

### దావీదు మరల సౌలును అవమానించుట

13దావీదు ఆవలివైపుకు వెళ్లిపోయాడు. సౌలు
గుడారాలకు దూరంగా లోయ అవతల ఉన్న పర్వతం
మీద దావీదు నిలబడ్డాడు. అంటే వీరిద్దరి గుడారాలు
ఒకదాని కొకటి చాలా దూరంగా ఉన్నాయి.
14నేరు కుమారుడైన అబ్నేరును, సైన్యాన్ని ఉద్దే
శించి దావీదు కేకవేసి "అబ్నేరూ నాకు జవాబు చెప్పు"
అన్నాడు.
"రాజును పిలుస్తోన్న నీవు ఎవరివి?" అని అబ్నేరు
అడిగాడు.
15అందుకు దావీదు, "నీవు మగాడివి కదూ! నీవు
ఇశ్రాయేలు అంతటిలో చాలా గొప్పవాడివి కదూ!
నిజమేనంటావా? అయితే నీవు నీ యజమానుడైన
రాజును ఎందుకు కాపాడుకోలేదు? నీ యజమానియైన
రాజును చంపటానికి ఒక సామాన్యుడు నీ గుడారం
లోనికి వచ్చాడు!
16నీవు గొప్ప పొరపాటు చేసావు. యెహోవా జీవిస్తు
న్నంత నిజంగా నీవూ నీ సైనికులూ చావాలి. ఎందు
కంటే యెహోవా చేత అభిషేకించబడ్డ నా యజమాని
యైన రాజును కాపాడలేదు. నీవు సౌలు తలవద్ద
వుంచబడిన ఈటె, నీళ్లకూజా ఏమయ్యాయో చూడు.
అవి ఏవి?" అని ఎదురు ప్రశ్నవేసాడు. 17సౌలుకు
దావీదు స్వరం తెలుసు. "నా కుమారుడా దావీదూ,
అది నీ స్వరమే కదూ?" అన్నాడు సౌలు దావీదుతో.
"అవును నా యజమానీ, నా రాజా, ఇది నా స్వరమే"
అన్నాడు దావీదు.
18దావీదు ఇంకా ఇలా అన్నాడు, "రాజా, నీవు నన్నెం
దుకు ఇలా తరుముతున్నావు? నేను చేసిన నేరం
ఏమిటి? దేని విషయంలో నేను దోషిని? 19రాజా, నా
యజమానీ, నా మాట విను! యెహోవా గనుక
నీకు నాపై కోపం వచ్చినట్లు చేసి ఉంటె ఆయనకు
బలి సమర్పణ చేద్దాము. కానీ మనుష్యుల ప్రేరణవల్ల
నామీద నీకు కోపం వచ్చివుంటే యెహోవా వారిని
కష్టనష్టాలకు గురిచేస్తాడు. యెహోవా నాకిచ్చిన
భూమిని నేను వదిలిపోయేలా మనుష్యులు చేశారు.
వెళ్లి ఇతర దేవుళ్లను కొలువమని
20పరదేశీయులతో ఉండుమని మనుష్యులు నాకు
చెప్పారు. ఇప్పుడు నన్ను యెహోవా సన్నిధికి
దూరంగా చావనీయకు. ఇశ్రాయేలు రాజు ఒక పురు
గును చంపటానికి వెతుక్కుంటూ బయటికి వచ్చాడు!
కొండల్లో కౌజు పిట్టను* వేటాడటానికి వచ్చినవానిలా
ఉన్నావు నీవు!"
21అప్పుడు సౌలు, "నేను పాపం చేసాను. నా
కుమారుడా దావీదూ, నా దగ్గరకు తిరిగి వచ్చేయి.
నా ప్రాణం నీకు ముఖ్యం అని ఈ రోజు నీవు నాకు
చూపించావు. అందుచేత నేను నీకు హాని చేసేందుకు
ప్రయత్నించను. నేను తెలివి తక్కువగా ప్రవర్తించాను.
నేను ఒక పెద్ద తప్పుచేశాను" అన్నాడు.
22"ఇదిగో రాజు ఈటె. మీలో ఒక యువకుడు
వచ్చి దీనిని తీసుకోవచ్చు. 23మంచిచేసిన ప్రతి వానికీ
యెహోవా ప్రతిఫలం ఇప్పిస్తాడు. కీడు చేసిన వానిని
ఆయన శిక్షిస్తాడు. ఈ వేళ యెహోవా నేను నిన్ను
ఓడించేటట్టు చేసాడు. అయినా యెహోవా చేత
అభిషేకించబడిన రాజుకు నేను హాని చేయను. 24నీ
ప్రాణం నాకు ముఖ్యం అని ఈ వేళ నేను నీకు
చూపించాను. యెహోవాకు నా ప్రాణం ముఖ్యం
అని యెహోవా నీకు చూపిస్తాడు. ప్రతి కష్టంనుంచీ
యెహోవా నన్ను రక్షిస్తాడు" అని చెప్పాడు దావీదు.
25సౌలు, "నా కుమారుడా దావీదూ, దేవుడు నిన్నాశీ
ర్వదించును గాక! నీవు చాలా ఉన్నతమైన కార్యాలు
చేస్తావు. నీవు విజయం సాధిస్తావు" అని దావీదుతో
చెప్పాడు.

---

**కొండల్లో కౌజు పిట్టను** కొండల్లో కౌజు పిట్టలను వేటాడేవారు వాటిని సొమ్మసిల్లే వరకు తరుముతారు. అప్పుడు వాటిని చంపుతారు. అదే మాదిరిగా సౌలుకూడ దావీదును వెంటాడాడు. ఇది కూడ రెండర్థాలు గల పద ప్రయోగమే. హెబ్రీలో "కౌజు పిట్ట" అనే పదానికీ, 14వ వచనంలో "పిలచు-కేకవేయు" అనే పదాలకు సామ్యం కన్పిస్తుంది.

దావీదు తన దారిన తాను వెళ్లిపోయాడు. సౌలు
తన ఇంటికి తిరిగి వెళ్లాడు.

### దావీదు తన మనుష్యులతో ఫిలిష్తీయుల రాజ్యానికి వెళ్లుట

27 తరువాత దావీదు, "ఏదో ఒకరోజు సౌలు
నన్ను పట్టుకుంటాడు. ఈ పరిస్థితిలో నేను
ఫిలిష్తీయుల రాజ్యానికి తప్పించుకోవటం ఒక్కటే
ఉత్తమ మార్గం. అప్పుడు సౌలు నా కోసం ఇశ్రాయేలు
రాజ్యంలో వెదకటం మానేస్తాడు. ఆ విధంగా నేను
సౌలునుండి తప్పించుకుంటాను" అనుకున్నాడు.
2అందుచేత దావీదు, తన ఆరు వందలమంది అను
చరులతో ఇశ్రాయేలును వదిలి వెళ్లాడు. వారు మాయో
కుమారుడైన ఆకీషు వద్దకు వెళ్లారు. ఆకీషు గాతుకు
రాజు. 3దావీదు, అతని మనుష్యులు వారి కుటుంబా
లతో సహా ఆకీషు రాజుతో పాటు గాతులో నివాసము
ఏర్పాటు చేసుకున్నారు. దావీదు ఇద్దరు భార్యలు
యెజ్రెయేలీ వాసి అహీనోయము, మరియు, కర్మెలు
నివాసి, నాబాలు భార్య విధవరాలునైన అబీగయీలు
అతనితో ఉన్నారు. 4దావీదు గాతుకు పారిపోయాడని
ప్రజలు సౌలుతో చెప్పగానే సౌలు అతని కొరకు వెద
కటం మానేశాడు.
5ఆకీషును దావీదు కలసి, "నా విషయమై నీవు
సంతోషిస్తే బయట పట్టణంలో ఒక ఊరిలో స్థానమిస్తే
అక్కడ ఉంటాను. నేను కేవలం నీ సేవకుడిని మాత్రమే.
రాజధానిలో నీతో నేను ఉండుటకంటె నేను అక్కడే
ఉండటం మంచిది" అని చెప్పాడు. 6సిక్లగు అనే ఊరిని
అదే రోజున ఆకీషు దావీదుకు ఇచ్చాడు. కావున
అప్పటి నుండి సిక్లగు యూదా రాజులకు చెందినదిగా
ఉండిపోయింది. 7ఫిలిష్తీయుల రాజ్యంలో దావీదు ఒక
సంవత్సరం నాలుగు నెలలు ఉన్నాడు.

### దావీదు ఆకీషు రాజును మోసగించుట

8దావీదు, అతని మనుష్యులు కలసి అమాలేకీయుల
తోనూ, గెషూరులో నివసిస్తున్న ప్రజలతోనూ యుద్ధా
నికి వెళ్లారు. దావీదు మనుష్యులు వారిని ఓడించి వారి
ఆస్తులను దోచుకున్నారు. ఆ ప్రజలంతా షూరు
పట్టణం దగ్గర తెలెమునుండి మొత్తం ఈజిప్టువరకు
నివసిస్తూ ఉన్నారు. 9ఆ ప్రాంతంలో దావీదు వారితో
పోరాడి వారిని ఓడించాడు. వారి గొర్రెలను, పశువులను,
గాడిదలను, ఒంటెలను, దుస్తులను అన్నిటినీ స్వాధీనం
చేసుకొని వాటిని ఆకీషుకు ఇచ్చాడు.
10దావీదు ఇలా చాలాసార్లు చేసాడు. ప్రతిసారీ దావీదు
ఎక్కడ యుద్ధం చేసి, సంపద అంతా తెస్తున్నాడు
అనే విషయం ఆకీషు అడిగేవాడు. "యూదాకు దక్షిణ
ప్రాంతంలో యుద్ధం చేసాననీ యెరహ్మెయేలుకు
దక్షిణ భాగాన పోరాడాననీ, కేనీయుల దేశానికి దక్షిణాన
పోరాడాను" అనీ ప్రతిసారీ ఒక పేరు చెపుతూ
ఉండేవాడు దావీదు. 11బతికి వున్న ఒక స్త్రీని గాని,
పురుషుని గాని దావీదు ఒక్కసారి కూడా గాతుకు
తీసుకుని రాలేదు. "అలా చేస్తే వాళ్లు నిజానికి తాను
చేస్తున్న పనులన్నీ ఆకీషుకు చెబుతారని దావీదు అను
కున్నాడు." ఫిలిష్తీయుల దేశంలో ఉన్న అన్ని
రోజులూ దావీదు ఇలాగే చేసాడు. 12ఆకీషు మాత్రం
దావీదును నమ్మటం మొదలుపెట్టాడు. "ఇప్పుడు
దావీదు యొక్క స్వంత వాళ్లే అతనిని ద్వేషిస్తున్నారు.
ఇశ్రాయేలీయులు దావీదును బాగా అసహ్యించుకుంటు
న్నారు. అందువల్ల దావీదు శాశ్వతంగా నాకు సేవ
చేస్తాడు" అని ఆకీషు తనలో తాను అనుకున్నాడు.

### ఫిలిష్తీయుల యుద్ధ సన్నాహం

28 తరువాత ఫిలిష్తీయులు ఇశ్రాయేలుపై
యుద్ధానికి తమ సైన్యాన్ని సిద్ధం చేశారు.
ఆకీషు దావీదుతో, "నీవూ, నీ మనుష్యులూ నాతో
కలిసి ఇశ్రాయేలీయుల మీద పోరాటానికి వెళ్లాలని గ్రహిం
చావా?" అని అన్నాడు.
2"ఓ, తప్పకుండా. అప్పుడు నీవే చూస్తావుగా నేను
ఏమి చేయగలిగిందీ" అని దావీదు జవాబిచ్చాడు.
"చాలా బాగుంది. నిన్ను నా అంగరక్షకునిగా శాశ్వత
నియామకం చేస్తాను" అని అన్నాడు ఆకీషు.

### సౌలు మరియు ఏన్దోరు స్త్రీ

3సమూయేలు చనిపోయాడు. ఇశ్రాయేలీయులంతా
అతని మరణానికి దుఃఖించారు. అతని స్వంత పట్టణ
మైన రామాలోనే సమూయేలు శరీరాన్ని ప్రజలు
సమాధి చేశారు.
అంతకు ముందే సౌలు కర్ణపిశాచముగలవారిని*,
చిల్లంగివారిని ఇశ్రాయేలు నుండి వెడల గొట్టాడు.
4ఫిలిష్తీయులంతా యుద్ధానికి సిద్ధమై షూనేము అనే
చోట గుడారాలు వేసుకున్నారు. సౌలు ఇశ్రాయేలీ
యులందరినీ సమీకరించి, గిల్బోవలో గుడారాలు వేసు
కున్నాడు.
5ఫిలిష్తీయుల సైన్యాన్ని చూడగానే సౌలు అదిరి
పోయాడు. అతని గుండె భయంతో కొట్టుకుంది.
6సౌలు యెహోవాను ప్రార్థించాడు. కానీ
యెహోవా అతనికి జవాబు ఇవ్వలేదు. కలలోకూడ
దేవుడు సౌలుతో మాట్లాడలేదు. అతనికి జవాబు
ఇచ్చేందుకు దేవుడు ఊరీము* ప్రయోగించ లేదు.

---

**కర్ణపిశాచముగలవారు** చనిపోయిన వారితో మాట్లాడేందుకు ప్రయత్నిస్తారు.

**ఊరీము** ఆ కాలంలో దేవుని జవాబులు తుమ్మీము ద్వారా ప్రధాన యాజకులు తెలుసుకొనేవారు. అది ఏమిటో తేటగా తెలియదు.

[7]చివరికి సౌలు తన మనుష్యులతో, "ఒక కర్ణపిశాచంగల
స్త్రీని వెదకండి. నేను వెళ్లి ఏమి జరుగబోతోందో
ఆమెను అడుగుతాను" అని చెప్పాడు.
"ఏన్దోరులో కర్ణ పిశాచం గల ఒక స్త్రీ వుందని"
అతని అధికారులు అతనితో చెప్పారు.
[8]అప్పుడు సౌలు గుర్తు తెలియకుండా మారు వేషం
వేసుకొని, ఆ రాత్రి ఇద్దరు మనుష్యులను వెంటబెట్టు
కొని ఆ స్త్రీని చూడటానికి వెళ్లాడు. "ఆ స్త్రీని దైవావే
శంతో తన భవిష్యత్తును చెప్పమన్నాడు. నేను చెప్పిన
వ్యక్తిని నీవు పిలువు" అని అన్నాడు.
[9]కానీ ఆ స్త్రీ, "సౌలు ఏమి చేసాడో నీకు ఖచ్చితంగా
తెలుసు. కర్ణపిశాచముగలవారిని, చిల్లంగివారిని ఇశ్రా
యేలు నుండి వెళ్లగొట్టాడు. నీవు నన్ను ఉరి వేసి
చంపాలని చూస్తున్నావు" అని సౌలుతో అంది.
[10]సౌలు యెహోవా పేరును ప్రయోగించి ఆ స్త్రీకి
ప్రమాణం చేసాడు. "యెహోవా జీవిస్తున్నంత నిజంగా
చెబుతున్నాను. నీవు ఈ పని చేసినందుకు శిక్ష
పొందవు" అన్నాడు.
[11]"అయితే మాట్లాడేందుకు ఎవరిని రప్పించ
మంటావు?" అని ఆ స్త్రీ సౌలును అడిగింది.
"సమూయేలును" అన్నాడు సౌలు.
[12]ఆ స్త్రీ సమూయేలును చూచి చావుకేక వేసింది.
"నీవు నన్ను మాయ చేసావు, నీవు సౌలువే" అంది
ఆ స్త్రీ సౌలుతో.
[13]"అయినా ఏమీ భయపడకు! నీవు ఏమి చూస్తు
న్నావు?" అన్నాడు సౌలు ఆమెతో. "భూమిలోనుండి*
ఒక ఆత్మ రావటం నేను చూస్తున్నాను" అంది ఆ
స్త్రీ.
[14]"అయితే, వాని ఆకారం ఎలా ఉంది?" అని సౌలు
అడిగాడు.
"అతడు అంగీ ధరించిన ముసలివానిలా కనబడుతు
న్నాడు" అని ఆ స్త్రీ జవాబిచ్చింది.
అది సమూయేలు అని అప్పుడు సౌలుకు తెలిసింది.
సౌలు సాష్టాంగపడి నమస్కరించాడు. [15]"నన్నెందుకు
ఇబ్బంది పెట్టావు? నన్నెందుకు పైకి రప్పించావు?"
అన్నాడు సమూయేలు సౌలుతో.
సౌలు, "నేను కష్టంలో వున్నాను. ఫిలిష్తీయులు నా
మీదికి యుద్ధానికి వచ్చారు. దేవుడేమో నన్ను విడిచి
పెట్టేసాడు. ఆయన నాకు ఇంకెంత మాత్రం జవాబు
ఇవ్వటంలేదు. నాకు ఆయన స్వప్నంలోగాని, ప్రవక్తల
ద్వారాగాని జవాబు ఇవ్వటం లేదు. అందుకే నేను
నిన్ను పిలిపించాను. నా కర్తవ్యమేమిటో నీవు నాకు
చెప్పాలి" అన్నాడు.
[16]సమూయేలు, "యెహోవా నిన్ను విసర్జించి
ఇప్పుడు ఆయన నీ పొరుగువానితో ఉన్నాడు. అందు
చేత నీవు నన్నెందుకు పిలిచావు? [17]యెహోవా ఏమి
చేస్తానని చెప్పాడో అదే చేసాడు. ఈ విషయాలు
నాద్వారా నీకు చెప్పాడు. యెహోవా ఇశ్రాయేలు
రాజ్యాన్ని నీ చేతులనుండి తీసివేసాడు. దానిని నీ
పొరుగు వారిలో ఒకనికి ఆయన ఇచ్చాడు. ఆ పొరుగు
వాడే దావీదు! [18]నీవు యెహోవా ఆజ్ఞ పాటించలేదు.
నీవు అమాలేకీయులను నాశనం చేయలేదు, వారిమీద
యెహోవా ఎంత కోపగించాడో వారికి చూపించలేదు.
అందుకే దేవుడు ఈ వేళ నీకు దీనిని చేసాడు.
[19]యెహోవా ఇశ్రాయేలును, నిన్ను కూడ ఫిలిష్తీయు
లకు ఇచ్చివేసాడు. ఫిలిష్తీయులు ఇశ్రాయేలు సైన్యాన్ని
ఓడించేటట్టు యెహోవా చేస్తాడు. రేపు నీవూ, నీ
కుమారులు కూడా నాతోపాటు ఇక్కడ ఉంటారు"
అని చెప్పాడు.
[20]సౌలు వెంటనే నేల మీదికి ఒరిగిపోయి, అక్కడే
పడి ఉన్నాడు. సమూయేలు చెప్పిన వాటి మూలంగా
సౌలు భయపడిపోయాడు. ఆ రాత్రి, పగలు సౌలు
ఏమీ తినకపోవటంతో చాలా నీరసించి పోయాడు.
[21]ఆ స్త్రీ సౌలు వద్దకు వచ్చి, అతను నిజంగానే
చాలా భయపడి పోయినట్టు గమనించింది. "చూడు,
నేను నీ సేవకురాలిని. నేను నీకు విధేయురాలిన
య్యాను. నేను నా ప్రాణానికి తెగించి నీవు చెప్పినట్లు
చేసాను.
[22]దయచేసి ఇప్పుడు నేను చెప్పేది విను. నీకు
కొంత ఆహారం ఇస్తాను. నీవు అది తినాలి. అప్పుడు
నీ దారిన నీవు వెళ్లటానికి సరిపడే శక్తి నీకు ఉంటుంది"
అని ఆమె చెప్పింది.
[23]కానీ సౌలు తిరస్కరించాడు. "నేనేమి తినను"
అన్నాడు. సౌలు అధికార్లు ఆమెతో కలసి సౌలును
తినమని బతిమలాడారు. చివరకు సౌలు ఒప్పుకుని
నేల మీదనుండి లేచి పక్కమీద కూర్చున్నాడు. [24]ఆ
స్త్రీ ఇంటివద్ద ఒక బలిసిన ఆవుదూడ వుంది. వెంటనే
ఆమె ఆ దూడను చంపింది; కొంత పిండి తీసి
స్వయంగా కలిపి దానిని పులియ గొట్టకుండా రొట్టె
కాల్చింది. [25]ఆ ఆహారాన్ని సౌలు ముందు, అతని అధి
కార్ల ముందు ఆమె పెట్టింది. సౌలు, అతని అధికార్లు
భోజనంచేసారు. అదే రోజు రాత్రి వారు బయలుదేరి
వెళ్లిపోయారు.

## ఫిలిష్తీయుల పాలకులు దావీదు సహాయం తిరస్కరించుట

29 ఆఫెకు వద్ద ఫిలిష్తీయులు తమ సైన్యాన్ని
సమకూర్చారు. యెజ్రెయేలులో ఊట బావి
వద్ద ఇశ్రాయేలు సైనికులు గుడారాలు వేసుకున్నారు.
[2]ఫిలిష్తీయుల పాలకులు నూరుమంది దళాలతో,
వేయి మంది దళాలతో ముందడుగు వేస్తున్నారు.
దావీదు, అతని మనుష్యులు ఆకీషు వెనుక నడుస్తూ

---

**భూమిలోనుండి** చావు స్థలంనుండి లేక షియోలునుండి.

ఉన్నారు. 3ఫిలిష్తీయుల దళాధిపతులు, “ఈ హెబ్రీవాళ్లు
ఇక్కడ ఏమి చేస్తున్నారు” అని అడిగారు.
అప్పుడు ఆకీషు ఫిలిష్తీయుల దళాధిపతులతో,
“ఇతడు దావీదు. ఇతడు సౌలు అధికారుల్లో ఒకడు.
దావీదు చాలా కాలంగా నాతో ఉంటున్నాడు. దావీదు
సౌలును విడిచిపెట్టి వచ్చి నా దగ్గర ఉంటున్నప్పటి
నుండి ఇతనిలో నాకు ఏ తప్పూ కనబడలేదు,” అని
చెప్పాడు.
4కానీ ఆకీషు మీద ఫిలిష్తీ దళాధిపతులకు చాలా
కోపం వచ్చింది. “దావీదును వెనుకకు పంపించు!
నీవు ఇతనికిచ్చిన ఊరికి ఇతను తిరిగి వెళ్లిపోవాలి.
యుద్ధంలోకి ఇతడు మనతో రావటానికి వీల్లేదు. ఇతను
ఇక్కడ ఉన్నాడంటే మన మధ్యలో శత్రువును పెట్టుకు
న్నట్టే అవుతుంది. ఇతను మన మనుష్యులను చంపి
తన రాజు సౌలును సంతోష పెడతాడు. 5ఈ దావీదును
గూర్చే ఇశ్రాయేలీయులు నాట్యం చేస్తూ ‘సౌలు వేల
కొలదిగా హతము చేసెననియు, దావీదు పదివేల కొల
దిగా హతము చేసెననియు.’ అని పాట పాడారు” అని
చెప్పారు ఆ దళాధిపతులు.
6అందుచేత ఆకీషు దావీదును పిలిచాడు.
“యెహోవా జీవిస్తున్నంత నిజంగా, నీవు నాకు నమ్మ
కంగా ఉన్నావు. నీవు నా సైన్యంలో పని చేయటం
నాకు చాలా సంతోషంగా ఉంటుంది. నీవు వచ్చిన
రోజునుండి నీలో ఏ తప్పూ నాకు కనబడలేదు. ఫిలిష్తీ
యుల పాలకులు* కూడ నీవు మంచివాడివని
తలస్తున్నారు.
7శాంతితో వెనుకకు వెళ్లిపో. ఫిలిష్తీయుల పాల
కులకు విరోధంగా ఏమీ చెయ్యకు,” అని ఆకీషు
చెప్పాడు. 8దావీదు, “నేను ఏమి తప్పుచేసాను? నేను
నీ దగ్గరకు వచ్చిన రోజునుండి ఈ రోజు వరకు నీవు
నాలో ఏమి తప్పు కనుగొన్నావు? నా యజమానివైన
రాజు యొక్క శత్రువులతో నన్నెందుకు పోరాడ
నివ్వవు?” అని దావీదు అడిగాడు.
9అందుకు ఆకీషు, “నీవు మంచివాడవని నాకు
తెలుసు. నీవు దేవుని దగ్గరనుండి వచ్చిన దేవదూతలా
ఉన్నావు. కానీ ఫిలిష్తీయుల దళాధిపతి మాత్రం,
‘దావీదు మాతో కలిసి యుద్ధానికి రాకూడదు’
అంటూనే ఉన్నాడు.
10తెల్లవారు ఝామునే లేచి నీవూ, నీ మనుష్యులూ
వెనక్కు వెళ్లిపోవాలి. నేను మీకిచ్చిన నగరానికి తిరిగి
వెళ్లండి. నిన్ను గురించి దళాధిపతి చెప్పిన చెడ్డ మాట
లను లెక్క చేయకు. నీవు మంచివాడివి. కనుక సూర్యో
దయం కాగానే వెళ్లిపోవాలి” అన్నాడు. 11అందుచేత
దావీదు, అతని మనుష్యులు తెల్లవారుఝామునే లేచి
ఫిలిష్తీయుల దేశానికి వెళ్లిపోయారు. ఫిలిష్తీయులు
యెజ్రెయేలుకు సాగిపోయారు.

### అమాలేకీయులు సిక్లగు ప్రజలను పట్టుకొనుట

30 దావీదు, అతని మనుష్యులు మూడవ రోజుకు
సిక్లగు నగరానికి చేరుకున్నారు. అమాలేకీ
యులు సిక్లగును ముట్టడివేయుట వారు చూశారు.
అమాలేకీయులు నెగెవ్ ప్రాంతం మీద దాడి చేసారు.
వారు సిక్లగు మీద దాడి చేసి, పట్టణాన్ని తగులబెట్టారు.
2సిక్లగులో ఉన్న స్త్రీలను బందీలుగా పట్టుకున్నారు.
పడుచువాళ్లను, వృద్ధులను అందరినీ వారు పట్టు
కొన్నారు. వారు ఎవ్వరినీ చంపలేదు. కేవలం వారిని
బందీలుగా పట్టుకొన్నారు.
3దావీదు, అతని మనుష్యులు సిక్లగు వచ్చేసరికి
పట్టణమంతా తగులబడి పోవటం వారికి కనబడింది.
వారి భార్యలు, కొడుకులు, కూతుళ్లు, అంతా బందీలుగా
కొనిపోబడ్డారు. అమాలేకీయులు వారిని పట్టుకొ
న్నారు. 4దావీదు, అతని సైనికులు సొమ్మసిల్లి
పోయేలా గట్టిగా విలపించారు. 5దావీదు యొక్క ఇద్దరు
భార్యలు (యెజ్రెయేలీ అహీనోయము, కర్మెలు వాడైన
నాబాలు భార్య, విధవరాలు అబీగయీలు) కూడ బందీ
లుగా కొనిపోబడ్డారు.
6సైన్యంలోని మగవాళ్లంతా వారి కుమారులు, కుమా
ర్తెలు బందీలుగా తీసుకుని పోబడినందుకు విచారంగా,
కోపంగా ఉన్నారు. దావీదును రాళ్లతో కొట్టి చంపాలని
వారు మాట్లాడుకుంటున్నారు. ఇది దావీదును చాలా
తల్లడిల్ల చేసింది. కానీ దావీదు తనదేవుడైన యెహోవా
నుంచి బలంపొందాడు. 7యాజకుడైన అబ్యాతారుతో,
“ఏఫోదును తెమ్మని” చెప్పాడు దావీదు.
8అప్పుడు దావీదు యెహోవాకు ప్రార్థన చేసాడు.
“మా కుటుంబాలను బందీలుగా తీసుకునిపోయిన
వారిని నేను వెంటాడనా? వారిని పట్టుకుంటానా?”
అని అడిగాడు. “వారిని వెంటాడు. నీవు వారిని పట్టు
కుంటావు. మీ కుటుంబాలను రక్షించుకొంటావు” అని
యెహోవా ప్రత్యుత్తర మిచ్చాడు.

### దావీదు, అతని మనుష్యులు ఈజిప్టు బానిసను చూచుట

9-10దావీదు తన ఆరువందల మంది మనుష్యులను
తనతో బెసోరు సెలయేటి వద్దకు తీసుకుని వెళ్లాడు.
కొంతమంది ఆ సెలయేటి వద్ద ఉండిపోయారు.
అక్కడ నిలబడిపోయిన చాలా మంది అలసిపోయి
ముందుకు వెళ్లలేనంత బలహీనంగా ఉన్నందువల్ల
అక్కడే ఉండిపోయారు. కనుక దావీదు, మరో 400
మంది కలసి, అమాలేకీయులను తరుముట కొన
సాగించారు.

---

**ఫిలిష్తీయుల పాలకులు** ఫిలిష్తీల పాలకులు దావీదుపట్ల సద్భావంతో ఉంటారు. కాని దళాధిపతులే బాగా వ్యతిరేకించారు.

11ఈజిప్టు మనిషి ఒకడు పొలాల్లో దావీదు మనుష్యు
లకు కనబడ్డాడు. వారు ఆ ఈజిప్టు వానిని దావీదు
దగ్గరకు తీసుకుని వెళ్లారు. ఆ ఈజిప్టు వానికి వారు
మంచినీళ్లు, కొంచెం ఆహారం ఇచ్చారు. 12అంజూరపు
పళ్లను, రొట్టెను, రెండు గుత్తుల ఎండు ద్రాక్షలను
కూడ వారు అతనికి ఇచ్చారు. అవి తిని వాడు కొంత
సేదతీరాడు. మూడు పగళ్లు, మూడు రాత్రులు అతడు
ఏమీ తినిగాని, తాగిగాని ఎరుగడు.
13“నీ యజమాని ఎవరు? నీవు ఎక్కడనుండి వస్తు
న్నావు?” అని దావీదు అడిగాడు.
అందుకు, “నేను ఈజిప్టు వాడిని. ఒక అమాలేకీ
యుని బానిసను. మూడు రోజుల క్రితం నాకు జబ్బు
చేసింది. అందుచేత నా యజమాని నన్ను వదిలివేశాడు.
14కెరేతీయులు నివసించే దక్షిణ ప్రాంతాన్ని, యూదా
దేశాన్ని, కాలేబు ప్రజలు నివసించే నెగెవ్ ప్రాంతాన్ని
మేము ముట్టడించాము. మేము సిక్లగును కూడ తగుల
బెట్టాము” అని ఆ ఈజిప్టువాడు దావీదుకు చెప్పాడు.
15“అయితే మా భార్య పిల్లల్ని తీసుకుని పోయిన
ఆ మనుష్యుల దగ్గరకు నీవు నన్ను తీసుకుని
వెళతావా?” అని దావీదు ఆ ఈజిప్టు వాడిని అడిగాడు.
“నన్ను చంపననీ, నా యజమానికి తిరిగి నన్ను
అప్పగించననీ దేవుని ముందర నీవు మాట ఇస్తే వారిని
కనుక్కొనేందుకు నేను సహాయం చేస్తాను” అన్నాడు
ఆ ఈజిప్టువాడు.

### అమాలేకీయులను దావీదు ఓడించుట

16ఈజిప్టువాడు దావీదును అమాలేకీయుల దగ్గరకు
నడిపించాడు. ఆ సమయంలో వారు తాగుతూ,
తింటూ నేలమీద ఇక్కడా అక్కడా పండుకొనివున్నారు.
ఫిలిష్తీయుల దేశం నుండి, యూదా దేశం నుండి వారు
కొల్లగొట్టిన ఆస్తిపాస్తులను చూసు కుంటూ సంబరం
జరుపు కుంటున్నారు.
17దావీదు వారిని ఓడించి, చంపేసాడు. సూర్యో
దయం నుంచి మరునాటి సాయంత్రం వరకు వారు
యుద్ధం చేశారు. సుమారు నాలుగు వందల మంది
అమాలేకీ యువకులు మాత్రం ఒంటెలపై దూకి పారి
పోయారు వారిలో మిగిలిన వారెవ్వరూ బ్రతికి బయట
పడలేదు.
18దావీదుకు తన ఇద్దరు భార్యలు తిరిగి దొరికారు.
అమాలేకీయులు కొల్లగొట్టినదంతా దావీదు తిరిగి తీసు
కున్నాడు.
19ఏమీ ఒదిలిపెట్టబడలేదు. చిన్నాపెద్దా, వారి
కూతుళ్లు, కొడుకులు, అందర్నీ వారు తిరిగి తెచ్చు
కున్నారు. వారి విలువైన వస్తువులన్నీ వారు తిరిగి
తెచ్చుకున్నారు. అమాలేకీయులు దోచుకున్న దంతా
వారు తిరిగి తెచ్చుకున్నారు. దావీదు సమస్తం మళ్లీ
తెచ్చుకున్నాడు.
20గొర్రెలన్నిటినీ, పశువుల న్నింటినీ దావీదు మరల
తెచ్చుకున్నాడు. దావీదు మనుష్యులు వాటిని ముందు
నడుపుకుంటూ వచ్చారు. వారు “ఇది దావీదు యొక్క
బహుమానం” అన్నారు.

### కొల్ల సొమ్మును దావీదు అందరికీ సమంగా పంచుట

21అలసి నీరసించి దావీదును వెంబడించలేక బెసోరు
సెలయేటి దగ్గర దిగబడిపోయిన రెండు వందలమంది
సైనికుల వద్దకు దావీదు తిరిగి వచ్చాడు. వారంతా
దావీదును, సైన్యాన్ని చూచి ఎదురేగి ఆహ్వానించారు.
22అయితే దావీదు వెంట వెళ్లిన గుంపులో కొందరు
చెడ్డవాళ్లు, అల్లరి మూక ఉన్నారు. వారు, “ఈ రెండు
వందల మంది మనతో రాలేదు. కనుక మనము తీసు
కున్న వాటిలో వారికి ఎవరికీ ఏమీ ఇవ్వం. కాకపోతే
వారివారి భార్యా పిల్లలను మాత్రం వారు తీసుకుని
వెళ్లిపోవచ్చు” అన్నారు.
23అది విన్న దావీదు, “కాదు, సోదరులారా! అలా
చేయకండి. యెహోవా మనకు ఇచ్చిన వాటి విషయం
ఆలోచించండి. మనపై దాడి చేసిన శత్రువులను
యెహోవా మనచేత ఓడించాడు. 24మీరు చెప్పే దానిని
ఎవరూ వినరు. సామానుల వద్ద కాపలా వున్న వారికి,
యుద్ధం చేసిన వారికి సమంగానే వాటా వస్తుంది.
అందరూ సమంగానే పంచుకోవాలి” అన్నాడు.
25దావీదు దీనిని ఇశ్రాయేలుకు ఒక నియమంగా,
ఒక ఆదేశంగా చేశాడు. ఆ నియమం ఈ నాటికీ
అమలులో వుంది.
26దావీదు సిక్లగుకు వచ్చాడు. అతడు అమాలే
కీయుల నుండి తెచ్చిన సంపదలో కొంత భాగాన్ని
తన స్నేహితులైన యూదా నాయకులకు పంపాడు.
“యెహోవా శత్రువులనుండి మేము తెచ్చిన సంపద
లోనుంచి మీకో చిరుకానుక” అని చెప్పి పంపాడు
దావీదు. 27అమాలేకీయులనుంచి తాను తెచ్చిన వస్తువు
లలో మరికొన్నింటిని బేతేలు నాయకులకు, నెగెవు
లోని రామోతు, యత్తీరు, 28అరోయేరు, షిప్మోతు,
ఎష్టెమో, 29రాకాలు మొదలగు యెరహ్మెయేలీ
నగరాలకు 30కేనీయుల, హోర్మా, కోరాషాను, అతాకు
31మరియు హెబ్రోను నగరాల నాయకులకు దావీదు
పంపించాడు. అంతేగాక, దావీదు తన మనుష్యులతో
ఎక్కడెక్కడికి వెళ్లాడో ఆ ప్రాంతాల నాయకులకు
కూడ వాటిలో కొన్నింటిని దావీదు పంపించాడు.

### సౌలు మరణం

31 ఫిలిష్తీయులు ఇశ్రాయేలుతో యుద్ధం చేశారు.
ఇశ్రాయేలు సైన్యం చెల్లాచెదురై ఫిలిష్తీయుల
నుండి పారిపోయారు. గిల్బోవ పర్వతంవద్ద చాలా
మంది ఇశ్రాయేలీయులు చంపబడ్డారు. 2ఫిలిష్తీయులు
సౌలుతోను, అతని కుమారులతోను భీకరంగా
పోరాడారు. సౌలు కుమారులైన యోనాతాను,

అబీనాదాబు మరియు మెల్కీషూవలను ఫిలిష్తీయులు
చంపివేశారు.
3సౌలు మీద యుద్ధం దారుణంగా జరిగింది. విలు
కాండ్రు సౌలు మీద బాణాలు వేయగా సౌలు శరీరం
తూట్లు పడిపోయింది. 4సౌలు తన ఆయుధాలు మోసే
వానిని పిలిచి, "నీ కత్తి దూసి దానితో నన్ను సంహ
రించు. సున్నతి సంస్కారం లేని ఈ పరాయి వాళ్లు
నన్ను గేలి చేయకుండా నన్ను సంహరించు" అని
చెప్పాడు. కాని సౌలు సహాయకుడు నిరాకరించాడు.
అతడు చాలా భయపడిపోయాడు. అందుచేత సౌలు
తన కత్తినే దూసి దానితో తనను తానే చంపుకున్నాడు.
5అలా సౌలు చనిపోవటం ఆయుధాలు మోసేవాడు
చూశాడు. కనుక వాడు కూడ తన కత్తితో తాను
పొడుచుకొని సౌలుతో పాటు చనిపోయాడు. 6కనుక
ఆ ఒక్కరోజున సౌలు, అతని ముగ్గురు కుమారులు,
అతని సహాయకుడు అందరూ చనిపోయారు.

### సౌలు మరణం గూర్చి ఫిలిష్తీయుల ఆనందం

7లోయకు అవతల నివసిస్తున్న ఇశ్రాయేలీయులు,
ఇశ్రాయేలు సైన్యం పారిపోవటం చూశారు. సౌలు,
అతని కుమారులు చనిపోవటం కూడ వారు చూశారు.
కనుక ఆ ఇశ్రాయేలీయులు తమ నగరాలను వదిలి
పారిపోయారు. అప్పుడు ఫిలిష్తీయులు వచ్చి ఆ
నగరాలను ఆక్రమించుకొని వాటిలో నివసించసాగారు.
8ఆ మరునాడు చనిపోయిన వారివద్దనున్న విలువైన
వస్తువులను తీసుకోవటానికి ఫిలిష్తీయులు వచ్చారు.
సౌలు, అతని ముగ్గురు కుమారులు గిల్బోవ పర్వతం
మీద చనిపోయి ఉన్నట్లు వారు చూశారు.
9 ఫిలిష్తీయులు సౌలు తల నరికి, అతని కవచం తీసు
కున్నారు. ఈ వార్తను వారు ఫిలిష్తీయులందరికీ తెలియ
జేసి, వారి బూటకపు దేవతల విగ్రహాల దేవాలయానికి
కూడ ఆ వార్తను చేరవేశారు.
10వారు సౌలు కవచాన్ని అష్తారోతు దేవత గుడిలో
ఉంచారు. ఫిలిష్తీయులు సౌలు శవాన్ని బెత్షాను నగర
గోడకు వేలాడదీసారు.
11ఫిలిష్తీయులు సౌలుకు చేసిన వాటన్నింటిని గూర్చి
యాబేష్గిలాదు నివాసులు విన్నారు. 12కనుక యాబేషు
నగరంలో వున్న సైనికులంతా, ఒక రాత్రంతా నడిచి
బేత్షాను నగరానికి వెళ్లారు. సౌలు శవాన్ని బేత్షాను
నగర గోడ మీదనుంచి వారు దించారు.
అలాగే సౌలు కుమారుల శవాలను కూడ ఆ గోడ
మీద నుంచి వారు దించారు. అప్పుడు ఆ శవాలన్నిటినీ
వారు యాబేషుకు తీసుకుని వెళ్లారు. అక్కడ యాబేషు
ప్రజలు సౌలు, అతని ముగ్గురు కుమారుల శవాలకు
దహన సంస్కారం చేశారు.
13తరువాత వారు సౌలు, అతని ముగ్గురు కుమారుల
శవాలను తీసుకుని యాబేషులో సింధూర వృక్షం క్రింద
సమాధి చేశారు. అప్పుడు యాబేషు ప్రజలు వారి
దుఃఖాన్ని వెలిబుచ్చారు. యాబేషు ప్రజలు ఏడు
రోజుల పాటు భోజన పానాదులు మానివేశారు.*

---

**ఏడురోజులు ... మానివేశారు** సౌలు మరణంపట్ల వారి ప్రగాఢ సంతాపాన్ని వారు ఆ విధంగా ప్రకటితం చేశారు. సౌలు వారి నగరాన్ని కాపాడిన విషయం వారు ఎన్నడూ మరువలేదు.

# 2 సమూయేలు

## సౌలు మరణం గురించి దావీదు వినటం

1 దావీదు అమాలేకీయులను ఓడించిన తర్వాత అతను సిక్లగుకు వచ్చి రెండు రోజులపాటు ఉన్నాడు. ఇది సౌలు మరణించిన తరువాత జరిగింది.
2మూడవ రోజున సిక్లగుకు ఒక యువసైనికుడు వచ్చాడు. ఇతడు సౌలు శిబిరము నుండి వచ్చాడు. వాని బట్టలు చిరిగిపోయి వున్నాయి. తలనిండా మట్టి పడివుంది.* అతను దావీదు వద్దకు వచ్చి ప్రణమిల్లాడు.
3"నీవు ఎక్కడ నుండి వచ్చావు?" అని దావీదు వానిని అడిగాడు.

"నేను ఇశ్రాయేలీయుల శిబిరము నుండి తప్పించుకొని వచ్చాను" అని దావీదుకు సమాధాన మిచ్చాడు.
4"దయచేసి యుద్ధంలో ఎవరు గెల్చారో చెప్పు" అని దావీదు అడిగాడు.

"జనం యుద్ధభూమి నుండి పారిపోయారు. అనేక మంది హతులయ్యారు. సౌలు, ఆయన కుమారుడు యోనాతాను ఇద్దరూ చనిపోయారు" అని చెప్పాడా వ్యక్తి.
5దావీదు, "సౌలు, ఆయన కుమారుడు యోనాతాను ఇద్దరూ చనిపోయినట్లు నీకు ఎలా తెలుసు?" అని అడిగాడు.

6అందుకు యువసైనికుడు, ఇలా చెప్పెను: "నేను ఆ సమయంలో గిల్బోవ పర్వతం మీదకు రావటం జరిగింది. సౌలు తన ఈటెపై ఆనుకొని వుండటం నేను చూశాను. ఫిలిష్తీయులు తమ రథాల మీద, గుర్రాల మీద సౌలుకు చేరువగా వస్తూవున్నారు.
7సౌలు వెను దిరిగి నన్ను చూశాడు. ఆయన నన్ను పిలవగా నన్నేమి చేయమంటారు? అంటూ వెళ్లాను.
8'నీవెవడవు' అని సౌలు నన్నడిగాడు. నేనొక అమాలేకీయుడనని చెప్పాను.
9సౌలు నాతో, 'దయచేసి కొంచెం ఆగి నన్ను చంపివేయుము. నేను తీవ్రంగా గాయపడ్డాను. నేను ఇంచుమించు చనిపోయినట్లే' అని చెప్పాడు."
10అందువల్ల నేను ఆగి, ఆయనను చంపాను. ఆయన ఇక బ్రతకనంత తీవ్రంగా గాయపడ్డాడని నాకు తెలుసు. అప్పుడు నేనాయన కిరీటాన్ని, కంకణాన్ని తీసుకొని, వాటిని నా యజమానివైన నీ యొద్దకు తెచ్చాను."

11తన దుఃఖాన్ని వెలిబుచ్చటానికి దావీదు తన బట్టలను చించుకున్నాడు. దావీదుతో వున్న మనుష్యు లందరూ అలానే చేశారు.
12వారు మిక్కిలి దుఃఖించారు. సాయంత్రం వరకు వారేమీ తినలేదు. సౌలు, అతని కుమారుడు యోనాతాను ఇరువురూ మరణించి నందుకు వారు విలపించారు. మరణించిన యెహోవా ప్రజలకొరకు, ఇశ్రాయేలు కొరకు దావీదు, అతని మనుష్యులు దుఃఖించారు. సౌలు, అతని కుమారుడు యోనాతాను, తదితర ఇశ్రాయేలీయులు కత్తులతో నరకబడి చంపబడినందుకు వారు విలపించారు.

## అమాలేకీయుని చంపమని దావీదు ఆజ్ఞ

13సౌలు మరణవార్త తెచ్చిన ఆ యువసైనికుని, "నీవెక్కడ నుంచి వచ్చావు?" అని దావీదు అడిగాడు.

"నేనొక పరదేశీయుని కుమారుడను. అమాలేకీయుడను," అని ఆ యువసైనికుడు అన్నాడు.
14"యెహోవాచే ప్రతిష్ఠింపబడిన రాజును చంపటానికి నీవెందుకు భయపడలేదు?" అని దావీదు వానిని అడిగాడు.
15-16తరువాత దావీదు తన యువభటులలో ఒకనిని పిలిచి ఆ అమాలేకీయుని చంపుమని చెప్పాడు. యువకుడైన ఇశ్రాయేలు సైనికుడు అమాలేకీయుని చంపివేశాడు. "నీ చావుకు నీవే కారకుడవు. నీకు వ్యతిరేకంగా నీవే మాట్లాడావు!* 'దేవునిచే ఎంపిక చేయబడిన రాజును నేనే చంపానని' నీవే అన్నావు," అని దావీదు ఆ అమాలేకీయునుద్దేశించి అన్నాడు.

## సౌలు, యోనాతానులను గూర్చిన దావీదు ప్రలాప గీతిక

17సౌలు, అతని కుమారుడు యోనాతానులను గూర్చి దావీదు ఒక ప్రలాప గీతం పాడాడు.
18యూదా ప్రజలకు ఈ పాట నేర్పుమని దావీదు తన మనుష్యులకు చెప్పాడు. ఈ పాట "ధనుర్గీతిక" అని పిలవబడింది. ఈ పాట యాషారు గ్రంథంలో ఇలా వ్రాయబడింది:

---

**బట్టలు ... వుంది** చిరిగిన దుస్తులు, నెత్తినిండా దుమ్ము వున్న వ్యక్తి మిక్కిలి విషాదంలో వున్నట్లు గుర్తు.

**నీ చావుకు ... మాట్లాడావు** నీ రక్తం నీ తలమీదే పడుగాక అని శబ్దార్థం.

19 ఓహో! "ఇశ్రాయేలూ నీ సౌందర్యం ఉన్నత
స్థలాలపై ధ్వంసం చేయబడింది! బలాఢ్యులు
పడిపోయారు!
20 ఈ విషయం గాతులో చెప్పవద్దు, అష్కెలోను*
వీధులలో ప్రకటించ వద్దు! ఏలయనగా ఫిలిష్తీ
యుల ఆడపడుచులు సంతసించ వచ్చు,
సున్నతి కాని వారి కుమార్తెలు ఉల్లసించవచ్చు!
21 గిల్బోవ పర్వతాలపై హిమబిందువులు గాని వాన
చినుకులు గాని పడకుండుగాక! ఆ పొలాలు
బీడులై పోవుగాక! యోధులైన వారి డాళ్లు అక్కడ
మలినమైనాయి అభిషిక్తుడైన సౌలు డాలు
నూనెతో మెరుగు పెట్టబడలేదు.
22 యోనాతాను విల్లు దానివంతు శత్రు సంహారం
చేసింది. సౌలు కత్తి దానివంతు శత్రువులను
తుత్తునియలు చేసింది. అవి శత్రురక్తాన్ని చిందిం
చాయి యోధుల కొవ్వును స్పృశించాయి.
23 సౌలును, యోనాతానును మేము ప్రేమించాము;
వారు బ్రతికి వుండగా వారి సహాయ సంపత్తును
అనుభవించాము! మరణంలో సైతం సౌలు,
యోనాతాను ఎడబాటు ఎరుగరు! వారు పక్షి
రాజుల కంటె వేగం గలవారు, వారు సింహాల
కంటె బలంగలవారు!
24 ఇశ్రాయేలు కుమార్తెలారా, సౌలు కొరకు
ఏడ్వండి! సౌలు మిమ్మల్ని ఎర్రని ఛాయగల
దుస్తులతో అలంకరించియున్నాడు; మీ దుస్తు
లపై బంగారు నగలు పెట్టాడు.
25 యుద్ధంలో బలవంతులు నేలకొరిగారు!
యోనాతాను గిల్బోవ కొండల్లో కన్ను
మూశాడు.
26 యోనాతానూ, సహోదరుడా! నీ కొరకై విలపి
స్తున్నాను. నీ స్నేహపు మాధుర్యాన్ని చవి
చూశాను; నా పట్ల నీ ప్రేమ అద్భుతం, అది
స్త్రీల ప్రేమకంటే మహోన్నతమైనది!
27 శక్తిమంతులు యుద్ధ రంగంలో నేలకొరిగారు!
వారి ఆయుధాలు నాశనమయ్యాయి."

### దావీదు తన మనుష్యులతో హెబ్రోనుకు వెళ్లటం

2 దావీదు యెహోవాకు ప్రార్థన చేసి, "నేను
యూదా రాజ్యంలో ఏ నగరానికైనా వెళ్లనా?"
అని అడిగాడు.

"వెళ్లు" అన్నాడు యెహోవా.

"ఎక్కడికి వెళ్లను?" అని దావీదు అడిగితే,

"హెబ్రోనుకు" అని యెహోవా సమాధాన
మిచ్చాడు.

2కావున దావీదు అక్కడికి వెళ్లాడు. ఆయన భార్య
లైన యెజ్రెయేలీయురాలగు అహీనోయము, కర్మెలీ
యుడగు నాబాలు భార్యయు విధవరాలునగు అబీగ
యీలు ఆయనతో వెళ్లిరి. 3దావీదు తన మనుష్య
లందరినీ వారి వారి కుటుంబాలతో సహా తనవెంట
తీసుకొనివెళ్లాడు. వారంతా హెబ్రోను నగర ప్రాంతా
లలో తన నివాసాలను ఏర్పరచుకున్నారు.

### యాబేషు ప్రజలకు దావీదు కృతజ్ఞతలు తెలపటం

4యూదా ప్రజలు వచ్చి దావీదును యూదా రాజ్యా
నికి రాజుగా అభిషేకం చేశారు. ఆ పని చేసి, "సౌలుకు
అంత్యక్రియలు జరిపినది యాబేష్గిలాదు" వారని దావీ
దుకు చెప్పారు.

5యాబేష్గిలాదు ప్రజల వద్దకు దావీదు దూతలను
పంపాడు. దావీదు మాటగా వారు యాబేషు ప్రజలకు
ఈ విధంగా చెప్పారు: "మీ రాజైన సౌలు అస్థికలను*
మీరు దయతో పాతిపెట్టినందుకు దేవుడు మిమ్మునా
శీర్వదించు గాక! 6దేవుడు ఇప్పుడు మీపట్ల దయగల
వాడై, సత్య దృష్టితో వుంటాడు. మీరు సౌలు అస్థికలను
పాతిపెట్టినందుకు నేను కూడా మీపట్ల దయగలిగి
వుంటాను. 7మీ రాజైన సౌలు చని పోయాడు. కనుక
ఇప్పుడు యూదావారు నన్ను పట్టాభిషిక్తునిగా చేశారు.
అందువల్ల మీరు బలపరాక్రమ సంపన్నులుగా మెల
గండి."

### ఇష్బోషెతు రాజవటం

8నేరు కుమారుడైన అబ్నేరు సౌలు యొక్క సైన్యా
ధిపతిగా ఉన్నాడు. అబ్నేరు సౌలు కుమారుడైన ఇష్బో
షెతును మహనయీమునకు తీసుకొని వెళ్లాడు.
9అక్కడ అబ్నేరు అతనిని గిలాదు, ఆషేరి, యెజ్రె
యేలు, ఎఫ్రాయిము, బెన్యామీను వారిమీద రాజుగా
నియమించాడు. అనగా ఇష్బోషెతు ఇశ్రాయేలుకు
రాజయ్యాడు.

10ఇష్బోషెతు సౌలు కుమారుడు. అతడు ఇశ్రాయే
లుకు రాజై పాలించేనాటికి నలుబది ఏండ్ల వయస్సు
వాడు. అతడు రెండు సంవత్సరాలు పరిపాలన చేశాడు.
కాని యూదా వంశంవారు దావీదును అనుసరించారు.
11హెబ్రోనులో యూదా వంశవారికి దావీదు ఏడు
సంవత్సరాల ఆరునెలలు రాజుగా ఉన్నాడు.

### ఇష్బోషెతు మనుష్యులకు, దావీదు మనుష్యులకు పోటీ

12నేరు కుమారుడైన అబ్నేరు, సౌలు కుమారుడైన
ఇష్బోషెతు నౌకరులు మహనయీము వదిలి పయనమై

---

**అష్కెలోను** ఇది ఫిలిష్తీయుల ఐదు నగరాలలో ఒకటి.

**అస్థికలను** సౌలు, యోనాతానుల శవాలు దహనం చేయబడినాయి. మొదటి సమూయేలు 31:12 చూడండి.

పోయారు. వారు గిబియోను చేరారు. 13సెరూయా
కుమారుడగు యోవాబు, దావీదు సేవకులు కూడ
గిబియోనుకు వెళ్లారు. గిబియోను మడుగువద్ద వారు
అబ్నేరును, ఇష్బోషెతు సేవకులను కలిసారు. అబ్నేరు
తరపువారంతా కొలనుకు ఒక పక్క కూర్చున్నారు.
యోవాబు పక్షం వారు మరొక పక్క కూర్చున్నారు.
14యోవాబుతో అబ్నేరు, "మన ఇరుపక్షాల యువ
కులనూ ప్రోత్సహించి వారి మధ్య బలప్రదర్శన ఇక్కడ
జరుపుదాము" అన్నాడు.
పోటీ నిర్వహించటానికి యోవాబు ఒప్పు కున్నాడు.
15అప్పుడు యువసైనికులు లేచారు. ఇరుపక్షాల
వారూ వారి వారి యువసైనికులను పోటీకి లెక్క
పెట్టారు. ఇష్బోషెతు పక్షాన బెన్యామీను వంశీయులు,
దావీదు పక్షాన అతని అనుచరులు పన్నెండు మంది
చొప్పున ఎంపిక చేయబడ్డారు. 16ప్రతి ఒక్కడూ తన
ప్రత్యర్థి తలను పట్టుకొని తమ కత్తులతో వారి డొక్క
లలో పొడుచుకున్నారు. దానితో వారంతా ఒక్కపెట్టున
నేలకొరిగారు. అందువల్ల ఆ ప్రదేశం "చురకత్తుల
క్షేత్రం"* అని పిలవబడింది. ఆ ప్రదేశం గిబియోనులో
ఉంది.

## అబ్నేరు అశాహేలును చంపటం

17ఆ రోజు పోటీ ఒక భయంకర పోరాటంగా
మారింది. దావీదు సైనికులు అబ్నేరును, ఇశ్రాయేలీ
యులను ఓడించారు. 18యోవాబు, అబీషై, అశాహేలు
అనువారు ముగ్గురూ సెరూయా కుమారులు. అశా
హేలు పరుగులో మిక్కిలి వడి గలవాడు. అడవిలేడిలా
వేగంగా పరుగు తీయ గలవాడు. 19అశాహేలు అబ్నేరును
తరుముకుంటూ పోయాడు. అశాహేలు తిన్నగా అబ్నే
రును అనుసరించి తరిమాడు. 20అబ్నేరు వెనుదిరిగి
చూసి, "నీవు అశాహేలువా?" అని అడిగాడు.
"అవును నేనే" అన్నాడు అశాహేలు.
21" (అబ్నేరు అశాహేలును గాయ పరచేందుకు
ఇష్టపడలేదు) అయితే నీవు కుడి పక్కకు గాని, ఎడమ
పక్కకు తిరిగి అక్కడ వున్న యువకులలో ఒకడిని
పట్టుకుని వాని కవచం నీ కొరకు తీసుకో" అన్నాడు
అబ్నేరు. కాని అశాహేలు అబ్నేరును వెంటాడటం
మానటానికి ఒప్పుకోలేదు.
22అబ్నేరు మళ్లీ అశాహేలుతో ఇలా అన్నాడు:
"నన్ను తరమటం ఆపివేయుము. నీవు ఆపకపోతే
నేను నిన్ను చంపుతాను. నేను నిన్ను చంపిన పక్షంలో
నీ సోదరుడైన యోవాబు ముఖం మళ్లీ నేను చూడ
లేను!" 23కాని అశాహేలు అబ్నేరును తరమటం మాన
లేదు. దానితో అబ్నేరు తన ఈటె వెనుక భాగంతో
అశాహేలు పొట్టలో పొడిచాడు. ఈటె మడం ఎంత
తీవ్రంగా దిగబడిందనగా అది పొట్టలో నుండి వీపు
ద్వారా బయటికి వచ్చింది. అశాహేలు అక్కడి కక్కడే
మరణించాడు.

## యోవాబు, అబీషైలు అబ్నేరును వెంటాడటం

అశాహేలు శవం నేలమీద పడివుంది. అతని మనుష్యు
లందరూ అక్కడికి వచ్చి ఆగారు. (అశాహేలును
చూసేందుకు) 24కాని యోవాబు, అబీషై* లిరువురూ
అబ్నేరును వెంటాడసాగారు. వారు అమ్మా కొండ
చేరేసరికి సూర్యుడు అస్తమిస్తూ ఉన్నాడు. గిబియోను
ఎడారిమార్గంలో గీహ ఎదురుగా అమ్మా కొండవుంది.
25బెన్యామీనీయులంతా అబ్నేరు వద్దకు వచ్చి కొండ
మీద కూడారు.
26అబ్నేరు యోవాబును పిలిచి, "కత్తివుంటే అది
ఎల్లప్పుడూ చంపటానికేనా? నీకు తెలుసు; నిజానికి
ఇది విషాదాంతమవుతుంది! తమ సోదరులనే వెంటా
డటం మానివేయమని ఆ మనుష్యులకు చెప్పు" అని
అన్నాడు.
27"నీవామాట అన్నావు, మంచిదే. దేవుని జీవం
తోడుగా చెపుతున్నాను. నీవు ఇప్పుడు మాట్లాడకుండా
వుండివుంటే ఈ జనం వారి సోదరులను తెల్లవారే
వరకు తరుముకుంటూ పోయేవారు" అని యోవాబు
అన్నాడు. 28అప్పుడు యోవాబు ఒక బూర వూదాడు.
దానితో అతని మనుష్యులు ఇశ్రాయేలీయులను తర
మటం మానివేశారు. ఆ తరువాత ఇశ్రాయేలీయులతో
యుద్ధం చేయాలని వారు ఎంతమాత్రం ప్రయత్నం
చేయలేదు.
29అబ్నేరు, అతని మనుష్యులు ఆ రాత్రంతా అరా
బహు మైదానం గుండా ప్రయాణం చేసి యొర్దాను
నదిని దాటారు. మరునాటి పగలంతా వారు ప్రయాణం
చేసి మహనయీముకు చేరారు.
30యోవాబు అబ్నేరును తరుముట మాని, తిరిగి
వచ్చాడు. యోవాబు తన జనాన్ని సమావేశ పర్చి
నప్పుడు, దావీదు అనుచరులలో పందొమ్మిది మంది
తప్పియున్నారు. అశాహేలు కూడా లేడు. 31అబ్నేరు
అనుచరులలో మూడువందల అరువది మంది బెన్యామీ
నీయులను దావీదు సేవకులు వధించారు. 32దావీదు
మనుష్యులు అశాహేలు శవాన్ని బేత్లెహేముకు తీసుకొని
వెళ్లి, అక్కడ ఉన్న అతని తండ్రి సమాధిలోనే పాతి
పెట్టారు. యోవాబు, అతని మనుష్యులు రాత్రంతా
పయనించారు. వారు హెబ్రోను చేరేసరికి సూర్యో
దయమయ్యింది.

**చురకత్తుల క్షేత్రం** హెబ్రీలో ఈ క్షేత్రం పేరు "హెల్కా త్జూస్సూరీము" అంటారు.

**యోవాబు, అబీషై** యోవాబు అబీషైలిరువురూ అబ్నేరు చంపిన అశాహేలు సోదరులు. చూడండి 2:18వ వచనం.

### ఇశ్రాయేలు, యూదా రాజ్యాల మధ్య యుద్ధం

3 సౌలు కుటుంబానికి, దావీదు కుటుంబానికి* మధ్య దీర్ఘకాలిక యుద్ధం కొనసాగింది. దావీదు రాను రాను బాగా బలపడ్డాడు. సౌలు కుటుంబం నానాటికీ బలహీనమయింది.

### హెబ్రోనులో దావీదుకు ఆరుగురు కుమారులు కలగటం

2హెబ్రోనులో దావీదుకు పుత్ర సంతానం కలిగింది. మొదటి కుమారుడు అమ్నోను. అమ్నోను తల్లి యెజ్రెయేలీయురాలగు అహీనోయము. 3రెండవ కుమారుడు కిల్యాబు. కిల్యాబు తల్లి అబీగయీలు. ఈమె కర్మెలీయుడగు నాబాలు భార్యయైన విధవరాలు. మూడవ కుమారుడు అబ్షాలోము. అబ్షాలోము తల్లి గెషూరు రాజైన తల్మయి కుమార్తె మయకా. 4నాల్గవ కుమారుడు అదోనీయా. అదోనీయా తల్లి హగ్గీతు. ఐదవ కుమారుడు షెఫట్య. షెఫట్య తల్లి అబీటలు. 5ఆరవ కుమారుడు ఇత్రెయాము. ఇత్రెయాము తల్లి దావీదు భార్యయగు ఎగ్లా. ఈ ఆరుగురు కుమారులు హెబ్రోనులో దావీదుకు కలిగారు.

### అబ్నేరు దావీదు పక్షంలో చేరేందుకు నిశ్చయించటం

6సౌలు కుటుంబానికి, దావీదు కుటుంబానికి యుద్ధం జరిగిన కాలంలో అబ్నేరు సౌలు సైన్యంలో బలాన్ని పుంజుకున్నాడు. 7సౌలుకు రిస్పా అనే ఒక దాసి వుండేది. ఆమె సౌలుకు ఇంచుమించు భార్యవలె వుండేది. రిస్పా అయ్యా అనువాని కుమార్తె. ఇష్బోషెతు ఒకనాడు అబ్నేరును పిలచి, “నా తండ్రి పనిగత్తెతో నీవు ఎందుకు అక్రమ సంబంధం పెట్టుకున్నావు?” అని అడిగిగాడు.

8ఇష్బోషెతు అన్న మాటకు అబ్నేరుకు ఎక్కడా లేని కోపం వచ్చింది. అబ్నేరు ఇలా అన్నాడు, “నేను సౌలుకు, అతని కుటుంబానికి చాలా విధేయుడనై వున్నాను! నేను నిన్ను దావీదుకు అప్పగించలేదు; (పైగా అతడు నిన్ను ఓడించేలా చేయనూ లేదు.) యూదావారి తరపున పనిచేస్తూ ఒక రాజద్రోహిగా* నేను ఎన్నడూ మెలగలేదు. కాని నీవిప్పుడు నేనొక నీచకార్యం చేసినట్లు మాట్లాడుతున్నావు! 9-10నేనిప్పుడు నిశ్చయంగా చెప్తున్నాను. దేవుడు చెప్పిన విషయాలు ఇప్పుడు జరిగేలా నేను తప్పక ప్రయత్నం చేస్తాను! సౌలు వంశంనుండి రాజ్యాన్ని తీసుకొని దావీదుకు ఇస్తానని యెహోవా చెప్పాడు. దావీదును యూదా రాజ్యానికి, ఇశ్రాయేలుకు రాజుగా యెహోవా చేస్తాడు. దాను నుండి బెయేర్షెబా వరకు దావీదు పరిపాలిస్తాడు! ఈ పనులన్నీ నెరవేరేలా నేను సహాయ పడక పోతే దేవుడు నన్ను శిక్షించుగాక!”

11ఇష్బోషెతు అబ్నేరుతో ఇంకేమీ చెప్పలేక పోయాడు. ఇష్బోషెతు అతనంటే విపరీతంగా భయపడిపోయాడు. 12అబ్నేరు దావీదు వద్దకు దూతలను పంపాడు. అబ్నేరు తన మాటగా ఇలా చెప్పమన్నాడు: “నీవు ఈ రాజ్యాన్ని ఏలు. నాతో ఒక ఒడంబడిక చేసుకో. నీవు ఇశ్రాయేలంతటికీ రాజయ్యేలా నేను నీకు సహాయపడతాను.”

13అందుకు దావీదు, “మంచిది! నేను నీతో ఒక ఒడం బడిక చేసుకుంటాను. కాని నిన్నొకటి అడుగుతాను; నీవు సౌలు కుమార్తె మీకాలును తీసుకొని వచ్చేవరకు నేను నిన్ను కలవను” అని చెప్పమన్నాడు.

### దావీదు తన భార్య మీకాలును తిరిగి పొందటం

14సౌలు కుమారుడు ఇష్బోషెతు వద్దకు దావీదు దూతలను పంపాడు. “నా భార్య మీకాలును తిరిగి నాకు తెచ్చి ఇవ్వు. ఆమె నాకు ప్రధానం చేయబడింది. ఆమెను వివాహమాడటానికి నేను వందమంది ఫిలిష్తీయులను చంపియున్నాను”* అని చెప్పి పంపాడు. 15లాయీషు కుమారుడైన పల్తీయేలు అనే వాని నుండి మీకాలును తీసుకొని రమ్మని సౌలు కుమారుడు ఇష్బోషెతు తన మనుష్యులను పంపాడు. 16మీకాలు భర్త పల్తీయేలు మీకాలుతో కూడా వచ్చాడు. మీకాలును అనుసరించి పల్తీయేలు బహూరీము వరకు ఏడుస్తూ వచ్చాడు. కాని అబ్నేరు పల్తీయేలుతో, “ఇంటికి తిరిగి పొమ్మని” చెప్పాడు. అప్పుడు పల్తీయేలు ఇంటికి వెళ్లి పోయాడు.

### అబ్నేరు దావీదుకు సహాయం చేస్తానని మాట ఇవ్వటం

17అబ్నేరు ఇశ్రాయేలు నాయకులకు యిలా వర్తమానం పంపించాడు: “మీరు దావీదును మీ రాజుగా చేసుకోవాలని చాలా కాలంగా కోరుకుంటూ వున్నారు. 18ఆ పని ఇప్పుడు చేయండి! ‘ఇశ్రాయేలీయులైన నా ప్రజలందరినీ ఫిలిష్తీయుల నుండి, వారి తదితర శత్రువుల నుండి రక్షిస్తాననీ; ఈ పని నా సేవకుడైన దావీదు ద్వారా నెరవేరుస్తాననీ’ యెహోవా పలికినప్పుడు ఆయన ఈ దావీదును గురించే చెప్పాడు.”

---

**సౌలు ... కుటుంబానికి** సౌలు ఇంటికీ, దావీదు ఇంటికీ మధ్య అని శబ్దార్థం. అంటే యూదా వంశానికి తదితర వంశాలకు అని భావం

**యూదావారి ... రాజద్రోహిగా** నేను యూదావారి కుక్కతలనా? అని అక్షరార్థంగా వ్రాయబడింది.

**ఆమెను ... చంపియున్నాను** ఆమె కొరకు నేను 100 మంది ఫిలిష్తీయుల సున్నతి చర్మాలను చెల్లించాను అని శబ్దార్థం. 1 సమూయేలు 18:20-30, మరియు 25:44 చూడండి.

19అబ్నేరు ఈ విషయాలన్నీ దావీదుతో హెబ్రో
నులో చెప్పాడు. ఈ విషయాలు బెన్యామీనీయు
లందరికీ కూడ చెప్పాడు. అబ్నేరు చెప్పిన విషయాలు
బెన్యామీను వంశంవారికీ, ఇశ్రాయేలీయులందరికీ
మంచివిగా తోచాయి.

20అప్పుడు అబ్నేరు హెబ్రోనులో దావీదు వద్దకు
వచ్చాడు. అబ్నేరు అతనితో ఇరువది మంది మనుష్యు
లను తీసుకొని వచ్చాడు. అబ్నేరుకు, అతనితో వచ్చిన
మనుష్యులకు దావీదు విందు ఇచ్చాడు.

21అబ్నేరు దావీదుతో ఇలా అన్నాడు, "ప్రభువైన
నా రాజా! నేను ఇశ్రాయేలీయులందరినీ నీ వద్దకు
తీసుకొని వస్తాను. అప్పుడు వారంతా నీతో ఒక
ఒడంబడిక చేసుకొంటారు. తరువాత నీకు నచ్చిన
విధంగా ఇశ్రా యేలును పరిపాలించవచ్చు!"తరువాత
దావీదు అబ్నేరును వెళ్లమని చెప్పగా, అబ్నేరు
ప్రశాంతంగా వెళ్లిపోయాడు.

### అబ్నేరు మరణం

22యోవాబు, దావీదు అధికారులు యుద్ధం నుండి
తిరిగి వచ్చారు. వారు శత్రువుల నుండి ఎన్నో విలువైన
వస్తువులను కొల్లగొట్టు కొచ్చారు. దావీదు అబ్నేరును
శాంతంగా వెళ్లమని పంపివేశాడు. అందువల్ల హెబ్రో
నులో దావీదు వద్ద అబ్నేరు లేడు.

23యోవాబు, అతని సైనికులంతా హెబ్రోనుకు
చేరారు. సైన్యం యోవాబుతో, "నేరు కుమారుడైన
అబ్నేరు దావీదు రాజు వద్దకు రాగా, ఆయన అబ్నేరును
శాంతంగా వెళ్లమని పంపివేశాడు" అని అన్నది.

24యోవాబు రాజు వద్దకు వచ్చి, "ఏమిటి నీవు
చేసిన పని? అబ్నేరు నీ వద్దకు వస్తే, అతనికి ఏ హానీ
చేయకుండా ఎందుకు పంపించివేశావు!

25నేరు కుమారుడైన అబ్నేరును నీవెరుగుదువు!
అతడు నిన్ను మోసగించటానికి వచ్చాడు! నీవు చేస్తు
న్నదంతా సమగ్రంగా తెలుసుకోవాలనే తలంపుతో
వచ్చాడు!" అని అన్నాడు.

26యోవాబు దావీదు వద్ద నుండి వెళ్లి, సిరా అను
బావి వద్దకు అబ్నేరు కొరకు తన దూతలను పంపాడు.
దూతలు అబ్నేరును వెనుకకు తీసుకొని వచ్చారు.
కాని ఇదంతా దావీదుకు తెలియదు. 27అబ్నేరు హెబ్రో
నుకు రాగానే, యోవాబు అతనిని సింహద్వారం
మధ్యలో ఏదో రహస్యంగా మాట్లాడాలని ఒక పక్కకు
తీసుకొని వెళ్లాడు. కాని యోవాబు తన కత్తితో అబ్నేరు
పొట్టలో పొడిచాడు. అబ్నేరు చనిపోయాడు. గతంలో
యోవాబు సోదరుడైన అశాహేలును అబ్నేరు చంపాడు.
కావున యోవాబు అబ్నేరును చంపివేశాడు.

### దావీదు అబ్నేరు కొరకు దుఃఖించటం

28తరువాత ఈ వార్త దావీదు విన్నాడు. దావీదు
ఇలా అన్నాడు: "నేను, నా రాజ్యం నేరు కుమారుడైన
అబ్నేరు హత్య విషయంలో నిర్దోషులం. యెహోవాకి
ఇది తెలుసు. 29యోవాబు, అతని కుటుంబం దీనం
తటికి బాధ్యులు. అతని కుటుంబమంతా నిందితులే.
యోవాబు కుటుంబానికి అనేక కష్టాలు ఎదుర వుతా
యని నేను నమ్ముతున్నాను. అతని కుటుంబంలో
ఎప్పుడూ ఎవరో ఒకరు కుష్టువ్యాధి పీడితుడో, అంగవై
కల్యంతో కర్ర పట్టుకు నడిచే వాడో, యుద్ధంలో
హతుడయ్యేవాడో, లేదా ఆహారము లేనివాడో వుంటా
డని కూడ నేను నమ్ముతున్నాను."

30యోవాబు, అతని సోదరుడు అబీషైలిరువురూ
అబ్నేరును చంపిన కారణమేమనగా అబ్నేరు వారి
సహోదరుడైన అశాహేలును గిబియోను వద్ద
యుద్ధంలో చంపాడు.

31-32యోవాబుతోను, అతనితో ఉన్న మనుష్యుల
తోను దావీదు "తమ బట్టలను చింపుకొని,* విషాద
సూచకంగా వేరే వస్త్రాలు వేసు కోమనీ, అబ్నేరు కొరకు
విలపించుమనీ" చెప్పాడు. వారు అబ్నేరును హెబ్రో
నులో సమాధి చేశారు. అంత్యక్రియలకు దావీదు హాజర
య్యాడు. దావీదు రాజు, ప్రజలు అబ్నేరు సమాధి
వద్ద దుఃఖించారు.

33దావీదు రాజు అబ్నేరుపై ఈ విషాద గీతిక
పాడాడు:

"అబ్నేరు ఒక అవివేకిలా హతుడాయెనా?
34 అతని చేతులకు బంధాలులేవు, పాదాలకు గొలు
సులు వేయలేదు! అయినా క్రూరుల ముందు
నీవు నేలకొరిగావు. ఒరిగి మరణించావు."

అప్పుడు ప్రజలంతా మళ్లీ అబ్నేరు కొరకు విల
పించారు. 35ఆ రోజు ఇంకా పొద్దువుండగానే దావీదును
ఆహారం తీసుకోమని కోరటానికి ప్రజలు వచ్చారు.
కాని దావీదు ఒక ప్రత్యేకమైన ప్రమాణం చేశాడు.
"నేను రొట్టెగాని, తదితరమైన ఆహారంగాని సూర్యాస్త
మయం గాకుండా తింటే దేవుడు నన్ను శిక్షించుగాక!
నాకు మరిన్ని కష్టాలు తెచ్చి పెట్టుగాక!" అని అన్నాడు.

36అసలు అక్కడ ఏమి జరిగిందో ప్రజలంతా
చూశారు, కనుక దావీదు రాజు చేసేవాటన్నిటినీ ప్రజలు
ఒప్పుకున్నారు. 37నేరు కుమారుడైన అబ్నేరును చంపి
నది దావీదు రాజు కాదని యూదా ప్రజలకీ, ఇశ్రాయే
లీయులందరికీ ఆరోజు అర్థమయ్యింది. 38దావీదు రాజు
తన సేవకులతో ఇలా అన్నాడు: "మీకు తెలుసు;

---

**బట్టలను చింపుకొనుట** బట్టలను చింపుకొనుట
గొప్ప విషాదానికి గుర్తు.

ఇశ్రాయేలులో ఈ రోజు ఒక ప్రముఖ నాయకుడు చనిపోయాడు. [39]పైగా ఇదే రోజున నేను రాజుగా అభిషేకించబడ్డాను. ఈ సెరూయా కుమారులు నాకు మిక్కిలి దుఃఖాన్ని కలుగజేశారు. యెహోవా వారికి అర్హమైన శిక్ష విధించుగాక!"

### సౌలు కుటుంబానికి కష్టాలు రావటం

4 హెబ్రోనులో అబ్నేరు చనిపోయాడని సౌలు కుమారుడు ఇష్బోషెతు విన్నాడు. ఇష్బోషెతు, అతని ప్రజలు చాలా గాభరా చెందారు. [2]సౌలు సైన్యంలో దళాధిపతులైన ఇరువురు సౌలు కుమారుడైన ఇష్బోషెతు వద్దకు వచ్చారు. ఆ ఇరువురిలో ఒకని పేరు బయనా, మరియొకని పేరు రేకాబు. బయనా, రేకాబులిద్దరూ బెయేరోతీయుడగు రిమ్మోను కుమారులు. వారు బెన్యామీను వంశానికి* చెందిన వారు. బెయేరోతు పట్టణం బెన్యామీను వంశానికి చెందినది. [3]కాని బెయేరోతు ప్రజలు గిత్తయీముకు పారిపోయి, ఈనాటికీ వారక్కడ నివసిస్తున్నారు.

### యోనాతాను కుమారుడు మెఫీబోషెతు

[4]సౌలు కుమారుడైన యోనాతానుకు కుంటివాడైన ఒక కుమారుడున్నాడు. యెజ్రెయేలు వద్ద సౌలు, అతని కుమారుడు యోనాతాను చనిపోయారన్న వార్త వచ్చే సమయానికి యోనాతాను కుమారుడు ఐదేండ్లవాడు. అప్పుడా పిల్లవాని దాది వాని నెత్తుకొని పారిపోయినది. ఖంగారుగా పారిపోయేటప్పుడు, దాది చేతులలో నుండి యోనాతాను కుమారుడు జారి కిందపడ్డాడు. అందువల్ల యోనాతాను కుమారుడు కుంటివాడయ్యాడు. వీని పేరు మెఫీబోషెతు.

[5]రేకాబు, బయనాలిరువురూ బెయేరోతీయుడగు రిమ్మోను కుమారులు. వారు ఇష్బోషెతు ఇంటికి మిట్ట మధ్యాహ్న సమయంలో వెళ్లారు. ఎండ తీవ్రంగా ఉన్నందున ఇష్బోషెతు విశ్రాంతి తీసుకొంటున్నాడు. [6-7]రేకాబు, బయనా గోధుమలు తీసుకొని వెళ్లాలనే నెపంతో నట్టింట్లోకి వచ్చారు. ఇష్బోషెతు తన పడక గదిలో పక్కమీద పడుకున్నాడు. రేకాబు, బయనాలిద్దరూ ఇష్బోషెతును పొడిచి చంపారు. వారు అతని తల నరికి దానిని వారితో తీసుకొనిపోయారు. రాత్రంతా ప్రయాణం చేసి, [8]హెబ్రోనుకు వచ్చారు. ఇష్బోషెతు తలను దావీదుకు ఇచ్చారు. రేకాబు, బయనాలు దావీదు రాజుతో ఇలా అన్నారు: "నీ శత్రువైన సౌలు కుమారుడు ఇష్బోషెతు తల ఇదిగో. అతడు నిన్ను చంప ప్రయత్నం చేశాడు! యెహోవా ఈ రోజు సౌలును, అతని కుటుంబాన్ని శిక్షించాడు!"

[9]రేకాబు, బయనాలకు సమాధానంగా దావీదు ఇలా అన్నాడు: "యెహోవా జీవము తోడుగా, నిజానికి అతను నన్ను అనేక కష్టాల నుంచి రక్షించాడు. [10]ఒకానొకడు నాకేదో మంచివార్త చెప్పాలన్నట్లు వచ్చాడు. వాడు వచ్చి, 'సౌలు చచ్చిపోయాడు!' అని చెప్పాడు. ఆ వార్త నాకు అందచేసినందుకు వానికి నేను పారితోషికము ఇస్తాననుకున్నాడు. కాని నేను వానిని పట్టుకొని సిక్లగు వద్ద చంపివేశాను.

[11]కావున మీ చావును కూడ నేను కోరుతున్నాను. ఎందుకనగా దుష్టులు ఒక మంచి వ్యక్తిని అతని పక్క మీదే, అతని ఇంటిలోనే హత్య చేశారు!"

[12]దావీదు కొందరు యువకులను పిలచి రేకాబు, బయనాలను చంపమన్నాడు. అప్పుడా యువకులు రేకాబు, బయనాల కాళ్లు, చేతులు నరికి, హెబ్రోను మడుగు వద్ద వేలాడ దీశారు. తరువాత ఇష్బోషెతుతలను తీసు కొని హెబ్రోనులో అబ్నేరు సమాధి వద్ద పాతి పెట్టారు.

### ఇశ్రాయేలీయులు దావీదును రాజు చేయటం

5 అప్పుడు ఇశ్రాయేలు వంశాల వారందరూ హెబ్రోనులో దావీదు వద్దకు వచ్చి ఇలా అన్నారు: "చూడండి; మనమంతా ఒకే కుటుంబం!* [2]గతంలో సౌలు రాజుగా ఉన్నప్పుడు ఇశ్రాయేలీయుల యుద్ధాలలో నీవు మమ్ములను నడిపించావు. మరియు ఇశ్రాయేలును యుద్ధము నుంచి ఇంటికి తిరిగి రప్పించావు. 'ఇశ్రాయేలీయులైన నా ప్రజలకు నీవు కాపరివవుతావు. ఇశ్రాయేలుకు పాలకుడవవుతావు' అని యెహోవా నీకు చెప్పాడు."

[3]ఇశ్రాయేలు నాయకులంతా హెబ్రోనులో ఉన్న దావీదు రాజు వద్దకు వచ్చారు. దావీదు రాజు హెబ్రోనులో ఆ వచ్చిన నాయకులతో యెహోవా సమక్షంలో ఒక ఒడంబడిక చేసుకున్నాడు. అప్పుడా నాయకులంతా దావీదును ఇశ్రాయేలు రాజుగా అభిషేకించారు.

[4]పరిపాలన చేపట్టే నాటికి దావీదు ముప్పది సంవత్సరాల వాడు. అతడు నలుబది సంవత్సరాలు పాలించాడు. [5]హెబ్రోనులో వుండి యూదా రాజ్యాన్ని ఏడు సంవత్సరాల, ఆరు నెలలు పాలించాడు. పిమ్మట యెరూషలేము నుంచి ఇశ్రాయేలు, యూదా రాజ్యాలను ముప్పదిమూడు సంవత్సరాలు పాలించాడు.

### దావీదు యెరూషలేము పట్టణాన్ని జయించుట

[6]రాజు తన మనుష్యులతో యెబూసీయుల మీదికి దండెత్తి యెరూషలేముకు పోయెను. (యెబూసీయులు దేశంలో నివాసం ఏర్పరచుకొని స్థిరపడి

---

**బెన్యామీను వంశం** వారు బెన్యామీను కుమారులని శబ్దార్థం.

**ఒకే కుటుంబం** నీ రక్త మాంసములే అని శబ్దార్థం.

పోయారు). యెబూసీయులు దావీదుతో, "నీవు మా
నగరంలోకి రాలేవు.* ఒకవేళ వస్తే, కుంటి, గుడ్డివారు
సహితం నిన్ను విరోధిస్తారు"* అని అన్నారు. 7కాని
దావీదు సీయోను కోటను* వశపర్చుకున్నాడు. తరు
వాత దానినే దావీదు నగరం అని పిలవటం మొదలు
పెట్టారు. 8ఆ రోజు దావీదు తన మనుష్యులతో,
"మీరు యెబూసీయులను ఓడించాలంటే నీటి
సొరంగం* ద్వారా ఆ 'కుంటి మరియు గ్రుడ్డి' శత్రువుల
వద్దకు వెళ్లండి" అని అన్నాడు.

అందువల్లనే, "కుంటి, గుడ్డివారు ఇంట్లోకి*
రాలేరని" అంటారు.

9దావీదు కోటలో నివసించి, దానిని "దావీదు
నగరం" అని పిలిచాడు. మిల్లో* నుండి చుట్టు పక్కల
అనేక భవనాలను దావీదు కట్టించాడు. సీయోను
నగరంలో కూడా అనేక కట్టడాలను చేపట్టి లోపల
బాగా అభివృద్ధి చేశాడు. 10సర్వశక్తిమంతుడైన దేవుడు
అతనికి తోడైయున్నందున, దావీదు క్రమంగా బలపడి
వర్ధిల్లాడు.

11తూరు రాజైన హీరాము కొందరు దూతలను
దావీదు వద్దకు పంపాడు. వారితో పాటు దేవదారు
కలపను, వడ్రంగులను, శిల్పులను పంపాడు. వారంతా
దావీదుకు ఒక భవనం నిర్మించారు. 12నిజంగా
యెహోవా తనను ఇశ్రాయేలుకు రాజును చేసినట్లు
దావీదుకు ఆ సమయంలో అర్థమయ్యింది.
యెహోవా ప్రజలైన ఇశ్రాయేలీయులకు తన
రాజ్యాన్ని చాలా ముఖ్యమైనదిగా దేవుడు చేసినాడని
దావీదు తెలుసుకొన్నాడు.

### యెరూషలేములో దావీదుకు కలిగిన సంతానం

13దావీదు యెరూషలేము నుండి పెక్కు మంది
దాసీలను, భార్యలను స్వీకరించాడు. హెబ్రోను నుండి
యెరూషలేముకు వెళ్లిన పిమ్మట దావీదు ఆ పని
చేసాడు. దావీదుకు చాలా మంది కుమారులు, కుమా
ర్తెలు కలిగారు.

14యెరూషలేములో దావీదుకు కలిగిన కుమారుల
పేర్లు: షమ్మూ, యషోబాబు, నాతాను, సొలొమోను,
15ఇభారు, ఏలీషూవ, నెపెగు, యాఫీయ, 16ఎలీషామా,
ఎల్యాదా మరియు ఎలీపేలెటు.

### ఫిలిష్తీయుల పైకి దావీదు యుద్ధానికి పోవటం

17ఇశ్రాయేలీయులు దావీదును ఇశ్రాయేలుకు
రాజుగా అభిషేకించారని ఫిలిష్తీయులు వినగానే, ఫిలి
ష్తీయు లంతా దావీదును చంపాలని వెదకటం మొదలు
పెట్టారు. కాని ఈ వార్త దావీదు విన్నాడు. అతను ఒక
కోటలోకి వెళ్లాడు.

18ఫిలిష్తీయులు వచ్చి రెఫాయీము లోయలో
దిగారు.

19దావీదు ప్రార్థన చేసి, "ఫిలిష్తీయుల మీదికి యుద్ధా
నికి వెళ్లేదా? ఫిలిష్తీయులను ఓడించటంలో నాకు
సహాయపడతావా?" అని యెహోవాను అడిగాడు.

"వెళ్లు. ఫిలిష్తీయులను ఓడించటంలో నీకు నేను
తప్పక సహాయం చేస్తాను" అని యెహోవా చెప్పాడు.

20అప్పుడు దావీదు బయల్పెరాజీముకు వచ్చి,
ఫిలిష్తీ యులను ఓడించాడు. "ఆనకట్ట తెగి నీళ్లు పరవళ్లు
తొక్కుతూ ప్రవహించినట్లు, యెహోవా నా శత్రువు
లను నాముందు చెల్లాచెదురై పారిపోయేలా చేసాడు,"
అని అనుకున్నాడు దావీదు. ఆ కారణం చేత దావీదు
ఆ ప్రదేశానికి బయల్పెరాజీము* అని పేరుపెట్టాడు.
21ఫిలిష్తీయులు పారిపోతూ తమ దేవుళ్ల విగ్రహాలను
బయల్పెరాజీము వద్ద వదిలిపోయారు. దావీదు, అతని
మనుష్యులు ఆ విగ్రహాలన్నిటినీ తీసు కొని వెళ్లారు.

22ఫిలిష్తీయులు మళ్లీ రెఫాయీము లోయలోకి
వచ్చి దిగారు.

23దావీదు యెహోవాని ప్రార్థించాడు. ఈ సారి
యెహోవా దావీదుతో ఇలా అన్నాడు, "తిన్నగా అక్క
డికి వెళ్లవద్దు. వాళ్లను చుట్టుముట్టి సైన్యానికి వెనుకగా
వెళ్లు. గులిమిడి చెట్లవద్ద వారిని ఎదుర్కో.

24చెట్ల మీదకు ఎక్కి కూర్చుని, ఫిలిష్తీయులు
యుద్ధానికి నడచివచ్చే శబ్దం వింటావు. అప్పుడు నీవు
త్వరపడాలి. ఎందుకంటే యెహోవా అక్కడ ఫిలిష్తీ
యులను ఓడించటానికి నీ కొరకు ఉన్నట్లు అది
సంకేతం."

25యెహోవా తనను ఏమి చేయుమని ఆజ్ఞ
ఇచ్చాడో దావీదు అదంతా చేశాడు. అతను ఫిలిష్తీయు
లను ఓడించాడు. అతడు వారిని గెబనుండి గెజెరువరకు
తరుము కుంటూ పోయి చంపాడు.

---

**నీవు ... రాలేవు** యెరూషలేము నగరం కొండమీద నిర్మించ
బడింది. నగరం చుట్టూ ఎత్తైన గోడలున్నాయి. అందువల్ల
దానిని పట్టుకోవటం చాలా కష్టం.

**కుంటి ... విరోధిస్తారు** దావీదు నగరంలో ప్రవేశించ
లేడని వారు తలచి ఆ విధంగా అన్నారు.

**సీయోను కోట** సీయోను కోట యెరూషలేము
నగరంలో ఒక భాగం.

**నీటి సొరంగం** ప్రాచీన పట్టణమైన యెరూషలేము
లోనికి వెళ్లే భూగర్భ నీటి సొరంగం ఒకటి వున్నది. దావీదు,
అతని మనుష్యులు నగరంలో ప్రవేశించటానికి ఈ సొరం
గాన్ని వినియోగించుకున్నారు.

**ఇంట్లోకి** రాజగృహం లేక ఆలయం అని అర్థం.

**మిల్లో** బహుశః ఇది ప్రాచీన కాలపు సీయోను
కోటలో మిక్కిలి బలమైన ప్రదేశాలలో ఒకటి కావచ్చు.

**బయల్పెరాజీము** హెబ్రీలో ఈ పేరుకు 'దేవుడు
ఛేదిస్తాడు' అని అర్థం.

### దేవుని పవిత్ర పెట్టెను యెరూషలేముకు తరలించుట

6 దావీదు మరల ప్రత్యేకంగా ఉత్తములైన ముప్పది
వేల మంది ఇశ్రాయేలు యోధులను సమకూర్చు
కొన్నాడు. 2దావీదు వారిని తీసుకొని యూదాలో
ఉన్న బాలాకు* ప్రయాణమై వెళ్లాడు. యూదాలోని
బాలాలో ఉన్న దేవుని పవిత్ర పెట్టె తీసుకొని, దానిని
యెరూషలేముకు బయలు దేర దీసినారు. ఈ పవిత్ర
పెట్టె సైన్యములకు అధిపతియైన యెహోవా పరమ
పవిత్ర నామంతో పిలవబడుతూ ఉంది. పవిత్ర పెట్టె
పైనున్న కెరూబుల మధ్య ఆయన ఆసీనుడైయు
న్నాడు. 3దావీదు మనుష్యులు యెహోవా పవిత్ర
పెట్టెను ఒక కొత్త బండిపై ఉంచారు. కొండమీద
ఉన్న అబీనాదాబు ఇంటినుండి వారా పెట్టెను తెచ్చారు.
అబీనాదాబు కుమారులైన ఉజ్జా మరియు అహ్యో
అనువారు ఆ బండిని తోలారు.
4కొండమీద ఉన్న అబీనాదాబు ఇంటినుండి ఉజ్జా,
అహ్యోలిరువురూ ఆ బండిని బయలుదేరదీశారు.
బండిపై దేవుని పవిత్ర పెట్టెవున్నది. అహ్యో బండి
ముందు నడుస్తూ ఉన్నాడు. 5దావీదు, మరియు ఇశ్రా
యేలీలందరూ యెహోవా ముందు రకరకాల వాద్య
విశేషాలు వాయిస్తూ ఉన్నారు. ఈ వాద్య పరికరాలు
తమాల వృక్షపు కర్రతో చేయబడ్డాయి. ఆ వాద్య విశే
షములలో వీణలు, విచిత్ర వీణలు, మృదంగములు,
ఢమరుకములు, తాళములు మొదలగునవి ఉన్నాయి.
6దావీదు మనుష్యులు నాకోను నూర్పిడి కళ్లం దగ్గరకు
రాగానే ఎద్దులు తూలి పడబోయాయి. దానితో బండి
మీదవున్న దేవుని ఒడంబడిక పెట్టె ఒరిగి కింద పడ
బోయింది. వెంటనే ఉజ్జా పవిత్ర పెట్టెను పట్టు
కున్నాడు. 7యెహోవాకు ఉజ్జాపై కోపం వచ్చి చంపి
వేశాడు.* దేవుని పవిత్ర పెట్టెను తాకినప్పుడు ఉజ్జా
దేవుని గౌరవించినట్లు గాదు. దేవుని పవిత్ర పెట్టెవలన
ఉజ్జా చంపబడ్డాడు. 8ఉజ్జాను యెహోవా చంపి
నందుకు దావీదు కలత చెందాడు. దావీదు ఆ స్థలానికి
"పెరెజ్–ఉజ్జా"* అని పేరు పెట్టాడు. ఆ ప్రదేశం
ఈనాటికీ పెరెజ్–ఉజ్జా అనే పిలవబడుతూ వుంది.
9ఆ రోజు దావీదు యెహోవా అంటే భయపడి
పోయాడు. "ఇప్పుడు దేవుని పవిత్ర పెట్టె నా వద్దకు
ఎలా వస్తుంది?" అని అడిగాడు.10దావీదు పురములోనికి
తనకై తాను దేవుని పవిత్ర పెట్టెను దావీదు తీసుకొని
పోవుటకు సుముఖత చూపలేదు. గాతువాడైన ఓబేదె
దోము* ఇంటిలో పవిత్ర పెట్టెను దావీదు వుంచాడు.
బాటమీద నుంచి గిత్తీయుడైన ఓబేదెదోము ఇంటి
వరకు పవిత్ర పెట్టెను దావీదు మోసాడు. 11ఓబేదె
దోము ఇంటి వద్ద యెహోవా పవిత్ర పెట్టె మూడు
నెలలపాటు వుండెను. కాబట్టి ఓబేదెదోమును, అతని
కుటుంబాన్ని దేవుడు ఆశీర్వదించాడు.
12ప్రజలు దావీదు వద్దకు వచ్చి, "దేవుని పవిత్ర
పెట్టె అక్కడున్న కారణాన యెహోవా ఓబేదెదోము
కుటుంబాన్ని, అతని వస్తువాహనాలను ఆశీర్వ
దించాడు" అని చెప్పారు. దానితో దావీదు ఓబేదెదోము
ఇంటి నుండి దేవుని ఒడంబడిక పెట్టెను ఆనందో
త్సాహాలతో తేవటానికి వెళ్లాడు. 13యెహోవా పవిత్ర
పెట్టెను మోసేవారు ఆరడుగులు నడిచి ఆగగా, దావీదు
ఒక ఎద్దును, ఒక బలిసిన దూడను బలియిచ్చాడు.
14పిమ్మట యెహోవా ముందు దావీదు నృత్యం
చేశాడు. ఏఫోదు అనబడే యాజకుల పవిత్ర వస్త్రాన్ని
ధరించాడు.
15యెహోవా పవిత్ర పెట్టెను నగరంలోకి తెస్తూ
వుండగా దావీదు, ఇశ్రాయేలీయులంతా సంతోషంతో
కేకలు వేశారు. బూరలు ఊదారు. 16సౌలు కుమార్తె
మీకాలు ఒక కిటికీ గుండా చూస్తూ వుంది. యెహోవా
పవిత్ర పెట్టె నగరంలోనికి వచ్చినప్పుడు, యెహోవా
ముందు దావీదు చిందులేస్తూ, నాట్యం చేస్తూవున్నాడు.
ఇదంతా మీకాలు చూసి, దావీదును తన మనసులో
అవమానించింది.
17పవిత్ర పెట్టె కొరకు దావీదు ఒక గుడారం నిర్మింప
జేశాడు. ఇశ్రాయేలీయులు యెహోవా పవిత్ర పెట్టెను
గుడారంలో దాని స్థానంలో నిలిపారు. దావీదు అప్పుడు
దహన బలులు, సమాధాన బలులు యెహోవాకు
సమర్పించాడు.
18దహన బలులు, సమాధాన బలులు సమర్పించాక,
సర్వ శక్తిమంతుడైన యెహోవా పేరిట దావీదు ప్రజ
లను ఆశీర్వదించాడు. 19నైవేద్యంగా ఉంచిన రొట్టె,
ఎండిన ద్రాక్ష భక్ష్యములు, ఖర్జూరపు పండువేసి చేసిన
రొట్టెలను స్త్రీ పురుషులందరికీ, ఇశ్రాయేలీయు
లందరికీ ప్రసాదంగా పంచి పెట్టాడు. తరువాత వారంతా
తమ తమ ఇండ్లకు వెళ్లిపోయారు.

### మీకాలు దావీదును అవమానించటం

20దావీదు తన ఇంటి వారిని ఆశీర్వదించటానికి
వెళ్లాడు. కాని సౌలు కుమార్తె మీకాలు దావీదును

---

**యూదాలో వున్న బాలా** బాలా అనేది కిర్యత్యారీమునకు మరో పేరు. చూడండి దినవృత్తాంతములు మొదటి గ్రంథము 13:6.

**దేవునికి ... చంపివేశాడు** లేవీయులు మాత్రమే దేవుని పెట్టెను మోయుటకు గాని, సమావేశపు గుడారమునుండి తదితర సామగ్రి మోయుటకు గాని అర్హులు. ఉజ్జా లేవీయుడు కాదు. చూడండి సంఖ్యాకాండం 1:50.

**పెరెజ్ ... ఉజ్జా** హెబ్రీలో పెరెజ్ ఉజ్జా అంటే ఉజ్జాకు శిక్ష అని అర్థం.

**ఓబేదెదోము** ఇతడు లేవీ వంశానికి చెందినవాడు. యెరూషలేముకు దగ్గరగా నివాసం ఏర్పరచుకున్నాడు.

కలవటానికి బయటికి వచ్చింది. “ఇశ్రాయేలు రాజు
ఈనాడు తనను తాను ఏమాత్రం గౌరవించుకోలేదు.
నీ సేవకుల పని గత్తెల ముందు నీవు నీ బట్టలు
విప్పివేశావు.* సిగ్గు విడిచి బట్టలు విప్పుకునే ఒక
మూర్ఖునిలా ప్రవర్తించావు!” అని బాగా అవమానించింది.
21 అందుకు దావీదు మీకాలుతో ఇలా అన్నాడు:
“యెహోవా నన్ను ఎంపిక చేశాడు. అంతేగాని నీ
తండ్రినీ కాదు, లేక అతని కుటుంబంలో మరెవ్వరినీ
కాదు. తన ప్రజలైన ఇశ్రాయేలీయులందరికీ నాయ
కునిగా యెహోవా నన్ను ఎంపిక చేశాడు. అందువల్ల
యెహోవా ఎదుట నేను ఉత్సవం చేశాను. 22 బహుశః
నీ దృష్టిలో నాకు గౌరవం లేకుండా పోవచ్చు. నాకు
నేను ఇంకా కించ పర్చుకోవచ్చు. కాని నీవు చెప్పిన
ఆ పనిగత్తెలు మాత్రం నన్ను గౌరవిస్తారు!”
23 ఈ రీతిగా దావీదును అవమానించినందున సౌలు
కుమార్తె మీకాలుకు పిల్లలు కలుగలేదు. ఆమె గొడ్రాలు
గానే చనిపోయింది.

### దేవాలయ నిర్మాణానికి దావీదు ఆలోచన

7 దావీదు తన కొత్త ఇంటిలో నివసించుచున్న
కాలంలో యెహోవా ఆయనకు చుట్టూ వున్న
శత్రువుల నుండి ఏ బాధలూ లేకుండా శాంతిని సమ
కూర్చాడు. 2 రాజు (దావీదు) నాతాను అనే ఒక ప్రవక్త
వద్దకు వెళ్లి, “చూడండి, నేను దేవదారు కలపతో
నిర్మించబడిన ఒక భవంతిలో ఉంటున్నాను. కాని
దేవుని పవిత్ర పెట్టె ఇంకా గుడారంలోనే ఉంచ
బడింది!” అన్నాడు.
3 రాజుతో (దావీదు) నాతాను, “వెళ్లు. నీవు వాస్త
వంగా ఏమి చేయాలని అనుకుంటున్నావో అది
చేయుము. యెహోవా నీతో ఉన్నాడు” అని
చెప్పాడు.
4 కాని ఆ రాత్రి యెహోవా వాక్యం నాతానుకు
చేరింది. 5 యెహోవా నాతానును పిలచి ఆయన
మాటగా, ఆయన సేవకుడైన దావీదుతో ఇలా చెప్ప
మన్నాడు: “నా కొరకు ఆలయ నిర్మాణం చేయ
వలసిన వ్యక్తివి నీవు కాదు. 6 ఇశ్రాయేలీయులను ఈజిప్టు
నుండి తీసుకొని వచ్చినప్పుడు నేను ఆలయంలో
నివసించ లేదు. ఒక గుడారంలో వుంటూనే అటూ
ఇటూ పయనించాను. గుడారాన్నే నివాసంగా
వినియోగించుకున్నాను. 7 ఇశ్రాయేలు వంశము వారిలో
ఏ ఒక్కరికీ దేవదారు కలపతో నాకు ఆలయం నిర్మించే
విషయంపై ఒక్క మాటకూడా చెప్పియుండలేదు.”
8 సర్వశక్తిమంతుడైన యెహోవా నాతానును దావీ
దుతో ఇంకా ఇలా చెప్పమన్నాడు, “నిన్ను నేను పచ్చిక
బయళ్ల నుండి పట్టుకొచ్చాను. నీవు గొర్రెలను కాస్తూ
వుండగా నిన్ను పట్టుకొచ్చాను. నా ప్రజలైన ఇశ్రా
యేలీయులకు నాయకునిగా వుండేందుకు నిన్ను
తెచ్చాను. 9 నీవు ఎక్కడికి వెళితే అక్కడికల్లా నేను
నీతో వచ్చాను. నీ కొరకు నీ శత్రువులందరినీ ఓడిం
చాను. ఇప్పుడు ఈ భూమి మీద అతి ప్రముఖ వ్యక్తు
లలో ఒకరిగా నిన్ను నేను చేస్తాను. 10-11 ఇశ్రాయేలీ
యులైన నా ప్రజలకు నేనొక స్థలాన్ని ఎంపిక చేస్తాను.
ఇశ్రాయేలీయులందరినీ అక్కడ స్థిరపడేలా చేసి వారి
స్వంత స్థలంలో వారుండేలా చేస్తాను. ఆ తరువాత
వారెన్నడూ కదిలే పనివుండదు. గతంలో నా ఇశ్రా
యేలు ప్రజలకు మార్గ దర్శకులుగా నేను న్యాయాధి
పతులను పంపియున్నాను. కాని దుష్ట జనులు వారిని
బాధించారు. అదిప్పుడు జరగదు. నీ శత్రువులందరి
నుండి నీకు శాంతి లభించేలా చేస్తాను. నీ వంశంలో
రాజులు వర్ధిల్లేలా చేస్తానని కూడా చెప్తున్నాను.*
12 “నీకు అంత్య కాలం సమీపించినప్పుడు నీ పూర్వీ
కుల వద్దనే సమాధి చేయబడతావు. అప్పుడు నేను
నీ స్వంత పిల్లలలో ఒకనిని రాజుగా చేస్తాను. 13 అతడు
నా నామాన్ని ఘనపర్చే విధంగా ఒక దేవాలయం
నిర్మిస్తాడు. అతని రాజ్యాన్ని శాశ్వత ప్రాతి పదికపై
చాలా బలమైనదిగా చేస్తాను. 14 అతనికి తండ్రిగా నేను
వ్యవహరిస్తాను. అతడు నాకు కుమారుడు. అతడు
పాపం చేస్తే, అతనిని శిక్షించటానికి వేరే ప్రజలను విని
యోగిస్తాను. వారు దండములు ధరించి నా తరపున
పనిచేస్తారు. 15 కాని నేనతనిని ప్రేమతో చూడక
మానను. నేనతనిపట్ల దాక్షిణ్యాలు కలిగి ఉంటాను.
నేను నా ప్రేమను, దయను సౌలునుండి తొలగించాను.
నేను నీ వైపునకు తిరిగినప్పుడు, సౌలును పక్కకు
నెట్టినాను. నీ వంశానికి నేనది చేయను. 16 నీ వంశం,
నీ రాజ్యం శాశ్వతంగా నా ముందు కొనసాగుతాయి.”
17 నాతాను దావీదుకు అంతా చెప్పాడు. అతను
తన దర్శనంలో విన్నదంతా దావీదుకు చెప్పాడు.

### దావీదు దేవుని ప్రార్థించటం

18 పిమ్మట దావీదు రాజు లోనికి వెళ్లి యెహోవా
ముందు కూర్చున్నాడు. దావీదు ప్రార్థనా పూర్వకంగా
యెహోవాతో ఇలా విన్నవించుకున్నాడు,
“యెహోవా, నా దేవా, నీకు నేనెందుకంత ముఖ్యుడ
నయ్యాను? నా కుటుంబం ఎందుకంత ప్రాముఖ్యం
గలదయ్యింది? నన్నెందుకు అంత ముఖ్యమైన వాణ్ణి
చేశావు? 19 నేనొక సేవకుణ్ణి తప్ప మరేమీ కాను. కాని

---

**నీ సేవకుల ... విప్పివేశావు** ఏఫోదు అనబడే ఒక్క పవిత్ర వస్త్రం మినహా అతని శరీరం మీద మరేమీ లేదు. అతని శరీరం ఎంత వరకు బట్టతో కప్పబడిందో మనకు తెలియదు.

**నీ వంశంలో ... చెప్తున్నాను** నీ కొరకై ఒక ఇల్లు యిస్తానని భావార్థం.

నీవు నా పట్ల చాలా కరుణతో వున్నావు. భవిష్యత్తులో
నా కుటుంబానికి జరిగే కొన్ని మంచి విషయాలు
కూడ చెప్పావు. యెహోవా, నా దేవా, నీవిలా ప్రజ
లతో ఎప్పుడూ మాట్లాడవు. మాట్లాడతావా? [20]నేను
నీతో ఎలా ఎల్లప్పుడూ మాట్లాడగలను? యెహోవా,
నా దేవా, నేను కేవలం ఒక సేవకుడినని నీకు తెలుసు;
[21]ఈ అద్భుత కార్యాలన్నీ నీవు చేస్తానని అన్నావు
గనుక జరిపి నిరూపించావు. పైగా నీవు చేయాలను
కున్న దానిలో ఇదొక పని! ఈ గొప్ప విషయాలన్నీ
నాకు తెలపాలని నీవు నిశ్చయించావు.

[22]ఈ కారణంవలన నీవు గొప్పవాడవు, ఓ నా
ప్రభువైన దేవా! యెహోవా నీకు నీవే సాటి. నీవంటి
దేవుడు వేరొకరు లేరు. మాకై మేము ఇదంతా
విన్నాము.

[23]ఇశ్రాయేలీయులైన నీ ప్రజలవలె మరో జనం
ఈ భూమిమీద లేదు. ఆ ప్రజలు అసాధారణమైన
వారు. వారు ఈజిప్టులో బానిసలయ్యారు. కాని నీవు
వారిని విముక్తి చేసి తీసుకొని వచ్చావు. వారిని నీ
ప్రజలుగా చేశావు. ఇశ్రాయేలీయుల కొరకు నీవు
గొప్పవైన, అద్భుతమైన క్రియలు నెరవేర్చావు. నీ
దేశంకొరకు ఆశ్చర్యకరమైన పనులు చేశావు. [24]ఇశ్రా
యేలు ప్రజలను శాశ్వతంగా నీకు అతి సన్నిహితులైన
స్వంత ప్రజలుగా చేసుకున్నావు. యెహోవా, నీవు
వారి పవిత్ర దేవుడవు.

[25]“ప్రభువైన దేవా! ఇప్పుడు నీవు నీ సేవకుడినైన
నా నిమిత్తం, మరియు నా కుటుంబం నిమిత్తం ఈ
సంగతులు చేసెదనని వాగ్దానము చేసియున్నావు. నీవి
చ్చిన వాగ్దానాలు శాశ్వతంగా నిజమయ్యేలా చేయుము!
నా కుటుంబాన్ని శాశ్వతంగా ఒక రాజ కుటుంబంగా
చేయుము.

[26]అప్పుడు నీ నామము మహిమాన్వితం చేయ
బడుతుంది. “ప్రజలంతా, “సర్వశక్తిగల యెహోవా,
ఇశ్రాయేలును పరిపాలించు దేవుడు. తన సేవకుడైన
దావీదు కుటుంబం ఆయన సేవలో బలముతో
కొనసాగుతుంది” అని అందురు.

[27]“సర్వశక్తిమంతుడవైన యెహోవా! ఇశ్రాయేలీ
యుల దేవా నాకు చాలా విషయాలు విశదం చేశావు.
‘నా వంశాభివృద్ధికి నీ ఆశీస్సులిచ్చావు.’ నీ సేవకుడనైన
నేను అందుకు కృతజ్ఞతాస్తుతులు చెల్లిస్తున్నాను.
[28]యెహోవా, నా దేవా,! నీవే దేవునివి. నీవి సత్య
వాక్కులు. నీ సేవకుడనైన నాకు ఈ మంచి విషయా
లన్నీ వాగ్దానం చేశావు.

[29]దయచేసి నా కుటుంబాన్ని దీవించు. నీ ముందు
దానిని ఎల్లప్పుడూ వర్ధిల్లేలా చేయుము. యెహోవా,
నా దేవా,! నీవే అద్భుత విషయాలు చెప్పావు. నీ
దీవెనతో నా కుటుంబం ఎల్లప్పుడూ ఆశీర్వదింప
బడియుండు గాక!”

### దావీదు అనేక యుద్ధాలను గెలవటం

8 తరువాత దావీదు ఫిలిష్తీయులను ఓడించాడు. వారి
రాజధాని నగరాన్ని స్వాధీన పర్చుకున్నాడు.
[2]దావీదు మోయాబీయులను కూడ ఓడించాడు. పట్టు
బడిన వారందరినీ నేల మీద పరుండేలా చేసి, వారి
పొడుగు కొలవటానికి ఒక తాడు తీసుకున్నాడు. రెండు
కొలతల పొడవున్న వారందరినీ చంపించాడు. ఒక
కొలత పొడవున్న వారందరినీ వదిలిపెట్టాడు. దానితో
మోయాబీయులంతా దావీదుకు సేవకులయ్యారు.
వారంతా ఆయనకు కప్పము* చెల్లించారు.

[3]సోబారాజు రెహోబు కుమారుడైన హదదెజరును
దావీదు ఓడించాడు. యూఫ్రటీసు నదీ తీరానగల
తన ఆధిపత్యాన్ని దావీదు తిరిగి చేజిక్కించుకున్నాడు.
[4]హదదెజరు నుండి పదిహేడు వందల మంది గుర్రపు
దళము వారిని, ఇరవై వేలమంది కాల్బలము వారిని
దావీదు పట్టుకున్నాడు. ఒక వంద మంచి గుర్రాలు
మినహా మిగిలిన గుర్రాలన్నిటినీ దావీదు కుంటివానివిగా
చేసాడు. ఆ వంద గుర్రాలను రథాలను లాగేందుకు
రక్షించాడు.

[5]సోబా రాజగు హదదెజరుకు సహాయం చేయటానికి
దమస్కునుండి సిరియనులు వచ్చిరి. కాని దావీదు
ఇరువది రెండువేల మంది సిరియనులను ఓడించాడు.
[6]తరువాత దమస్కు అధీనంలోనున్న సిరియా దేశ
మందు దావీదు రక్షక దళాలను నియమించాడు. సిరి
యనులు వచ్చి దావీదుకు కప్పము చెల్లించారు. దావీదు
ఎక్కడికి వెళితే అక్కడ యెహోవా అతనికి విజయ
పరంపర సమకూర్చి పెట్టాడు.

[7]హదదెజరు సైనికుల బంగారు డాళ్లను (రక్షక
ఫలకాలు) దావీదు తీసుకొని యెరూషలేముకు
తెచ్చాడు. [8]బెతహు, బేరోతైలనుండి దావీదు లెక్కకు
మించి ఇత్తడి సామగ్రి పట్టుకొనిపోయాడు. (బెతహు,
బేరోతై అను రెండు నగరాలూ హదదెజరుకు
చెందినవి).

[9]హదదెజరు సైన్యాన్ని దావీదు ఓడించినట్లు
హమాతు రాజైన తోయి విన్నాడు. [10]తోయి తన
కుమారుడైన యోరామును దావీదు రాజువద్దకు
పంపాడు. యోరాము వచ్చి దావీదును పలకరించి,
హదదెజరుతో పోరాడి ఓడించినందుకు ఆయనను అభి
నందించాడు. (తోయిపై హదదెజరు గతంలో దండెత్తి
యుద్ధాలు చేశాడు). యోరాము దావీదు వద్దకు వెండి,
బంగారు, ఇత్తడి వస్తువులను కానుకలుగా తెచ్చాడు.
[11]దావీదు వాటిని తీసుకొని యెహోవాకి సమర్పిం
చాడు. తాను ఇతర దేశములను ఓడించి తెచ్చి యెహో
వాకి సమర్పించిన వెండి బంగారు వస్తువులతో పాటు

**కప్పము** యుద్ధంలో ఓడిపోయిన సామంతులు గెలిచిన రాజుకు చెల్లించే పైకం.

ఈ సామగ్రిని కూడ ఉంచాడు. 12తాను జయించిన
దేశా లలో సిరియ, మోయాబు, అమ్మోను, ఫిలిష్తీయ,
అమాలేకు ఉన్నాయి. సోబా రాజైన రెహోబు
కుమారుడు హదదెజరును కూడ దావీదు ఓడించాడు.
13దావీదు పద్దెనిమిది వేల సిరియనులను ఉప్పు
లోయలో ఓడించాడు. అతను ఇంటికి తిరిగి వచ్చే
సరికి మిక్కిలి కీర్తి గడించాడు. 14ఎదోములో దావీదు
సైన్యాన్ని రక్షణకై నిలిపాడు. ఎదోము రాజ్యమంతటా
కాపలా దళాలను నియమించాడు. ఎదోమీయులంతా
దావీదుకు సేవకులయ్యారు. దావీదు వెళ్లిన ప్రతిచోటా
యెహోవా అతనికి విజయాన్ని సమకూర్చి పెట్టాడు.

### దావీదు పరిపాలన

15ఇశ్రాయేలంతటినీ దావీదు పరిపాలించాడు.
దావీదు తీసుకున్న నిర్ణయాలు తన ప్రజలందరికీ
నిష్పక్ష పాతంగా వుండి ఆమోదయోగ్యంగా వుండేవి.
16సెరూయా కుమారుడైన యోవాబు సర్వసైన్యా
ధ్యక్షుడయ్యాడు. అహీలూదు కుమారుడగు యెహో
షాపాతు చరిత్రకారుడు పత్ర లేఖకుడుగా నియమితు
డయ్యాడు. 17అహీటూబు కుమారుడైన సాదోకు,
అబ్యాతారు కుమారుడైన అహీమెలెకు యాజకులుగా
ఉన్నారు. శెరాయా అనునతను ప్రధాన కార్యదర్శిగా
వ్యవహరించాడు. 18యెహోయాదా కుమారుడు
బెనాయా కెరేతీయులకు, పెలేతీయులకు* అధిపతి
అయ్యాడు. దావీదు కుమారులు రాజకీయ సలహాదారు
లైన ప్రముఖ వ్యక్తులుగా* నియమితులయ్యారు.

### సౌలు కుటుంబానికి దావీదు కనికరము చూపగోరటం

9 "సౌలు కుటుంబంలో ఇంకా ఎవరైనా మిగిలియు
న్నారా? యోనాతాను కోసం ఆ వ్యక్తికి నేను
కనికరం చూపదల్చుకున్నాను" అని దావీదు చెప్పాడు.
2సౌలు కుటుంబానికి చెందిన సీబా అనే ఒక సేవ
కుడు ఉన్నాడు. దావీదు మనుష్యులు సీబాను దావీదు
వద్దకు తీసుకొని వచ్చారు. దావీదు రాజు సీబాతో,
"నీవు సీబావేనా?" అని అడిగాడు.
"అవును, నీ సేవకుడనైన సీబానే" అని అన్నాడు
సీబా.
3"అయితే సౌలు కుటుంబంలో ఎవరైనా జీవించి
వున్నారా? వుంటే ఆ వ్యక్తికి దేవుని కృపను చూపాలని
అనుకుంటున్నాను" అని దావీదు చెప్పాడు. దావీదు
రాజుతో సీబా యిలా అన్నాడు: "యోనాతాను
కుమారుడొకడు ఇంకా జీవించియున్నాడు. అతని
రెండు కాళ్లూ అవిటివి."
4"ఈ కుమారుడెక్కడున్నాడని" రాజు సీబాను
అడిగాడు.
"లోదెబారులో ఉన్న అమ్మీయేలు కుమారుడైన
మాకీరు ఇంటిలో వున్నాడని" సీబా రాజుకు చెప్పాడు.
5అప్పుడు దావీదు రాజు తన సేవకులను లోదెబా
రుకు పంపాడు. అమ్మీయేలు కుమారుడైన మాకీరు
ఇంటిలో వున్న యోనాతాను కుమారుని తీసుకొని
రమ్మని చెప్పాడు. 6యోనాతాను కుమారుడైన మెఫీ
బోషెతు దావీదు వద్దకు వచ్చి వంగి నమస్కరించాడు.
"మెఫీబోషెతూ" అని పిలిచాడు దావీదు.
"అవునయ్యా! నేను నీ సేవకుడను మీ ముందు
వున్నాను" అని అన్నాడు మెఫీబోషెతు.
7మెఫీబోషెతుతో దావీదు ఇలా అన్నాడు, "భయ
పడకు. నేను నీపట్ల దయగలిగి ఉంటాను. నీ తండ్రి
యెన యోనాతాను కారణంగా నేను నీకు సహాయం
చేస్తాను. నీ తాతయైన సౌలు భూమినంతా నీకు తిరిగి
ఇచ్చివేస్తాను. నీవు ఎల్లప్పుడూ నాతో నా బల్ల వద్ద
భోజనం చేస్తావు."
8మెఫీబోషెతు మరల దావీదుకు వంగి నమస్క
రించాడు. మెఫీబోషెతు ఇలా అన్నాడు: "మీరు మీ
సేవకుడనైన నా పట్ల చాలా దయగలిగియున్నారు!
పైగా నేను చచ్చిన కుక్కకంటె హీనమైన వాడిని!"
9పిమ్మట దావీదు రాజు సౌలు సేవకుడైన సీబాను
పిలిచి, "సౌలుకు, సౌలు కుటుంబానికి చెందిన ఆస్తి
పాస్తులన్నీ నీ యజమాని మనుమడైన మెఫీబోషెతుకు
ఇచ్చాను.
10మెఫీబోషెతు కొరకు ఆ భూమిని నీవు సాగు
చేయి. మెఫీబోషెతు కొరకు నీ కుమారులు, సేవకులు
కలిసి చేయండి. పంట పండించండి. దానితో నీ
యజమాని మనుమడు మెఫీబోషెతుకు పుష్కలంగా
ఆహారం దొరుకుతుంది. కాని నీ యజమాని మనుమడు
నా బల్లవద్ద తినగలిగి వుంటాడు."
సీబాకు పదునైదుగురు కుమారులు, ఇరువైమంది
సేవకులు వున్నారు.
11దావీదు రాజుతో సీబా ఇలా అన్నాడు: "నేను నీ
సేవకుడను. రాజైన నా ప్రభువు ఆజ్ఞాపించిన విధంగా
నేను అంతా చేస్తాను."
ఆ ప్రకారంగానే మెఫీబోషెతు దావీదు బల్లవద్ద రాజ
కుమారులలో ఒకనిగా భోజనం చేశాడు. 12మెఫీబోషె
తుకు మీకా అనబడే ఒక చిన్న కుమారుడున్నాడు.
సీబా కుటుంబంలోని వారంతా మెఫీబోషెతుకు సేవకు
లయ్యారు.
13మెఫీబోషెతు రెండుకాళ్లూ కుంటివే. మెఫీబో
షెతు యెరూషలేములోనే నివసించాడు. ప్రతి రోజూ
మెఫీబోషెతు రాజు భోజనాల బల్ల వద్దనే తినేవాడు.

---

**కెరేతీయులు, పెలేతీయులు** వీరు బహుశః దావీదుకు ప్రత్యేక అంగరక్షకులు కావచ్చు. ఒక ప్రాచీన అరమెయికు (సిరియను) అనువాదంలో "విలుకాండ్రు, ఒడిసెల వీరులు" అని వున్నది.

**ప్రముఖ వ్యక్తులు** యాజకులని శబ్దార్థం.

### హానూను దావీదు మనుష్యులను అవమానపరచటం

10 తరువాత అమ్మోనీయుల రాజైన నాహాషు చని
పోయాడు. అతని తరువాత అతని కుమారుడు
హానూను రాజయ్యాడు. 2మరణవార్త విన్న దావీదు
“నాహాషు నాపట్ల చాలా దయగలిగియుండెను. కాబట్టి
అతని కుమారుడు హానూను పట్లకూడ నేను దయ
గలిగి ఉంటాను,” అని అన్నాడు. ఆ ప్రకారం దావీదు
తన అధికారులను తండ్రి మరణంతో విచారంలో ఉన్న
హానూనును పలకరించి ఓదార్చే నిమిత్తం పంపాడు.
దావీదు అధికారులు అమ్మోనీయుల దేశానికి
వెళ్లారు. 3కాని అమ్మోనీయుల నాయకులు వారి రాజైన
హానూనును కలిసి, “నీ తండ్రి మరణ సందర్భంగా
నిన్ను ఓదార్చటానికి తన మనుష్యులను పంపి నీ
తండ్రిని గౌరవించటానికి ప్రయత్నిస్తున్నాడని నీవు
అనుకుంటున్నావా? కాదు! దావీదు తన మనుష్యులను
నీ నగరాన్ని పరిశీలించి రహస్యాలను తెలిసికొనే నిమిత్తం
గూఢచారులుగా పంపాడు. వారు నీ మీదకు యుద్ధ
సన్నాహాలు చేస్తున్నారు!” అని చెప్పారు.
4కాబట్టి హానూను దావీదు పంపిన అధికారులను
పట్టుకొని, వారి గడ్డాలలో సగభాగం గొరిగించాడు.
వారి దుస్తులను కూడ సగంనుంచి తొడలవరకు కత్తి
రించి వేశాడు. తరువాత వారిని పంపివేశాడు.
5ఆ అధికారులు చాలా అవమానం పొందారని విన్న
దావీదు కొందరు దూతలను తన అధికారులను కల
వటానికి పంపాడు. దూతల ద్వారా, “మీ గడ్డాలు
బాగా పెరిగేవరకు మీరు యెరికో పట్టణంలో వుండండి.
తరువాత యెరూషలేమునకు తిరిగిరండి,” అని కబురు
పంపాడు దావీదు రాజు.

### అమ్మోనీయులపై యుద్ధం

6అమ్మోనీయులు దావీదు రాజుతో శతృత్వం తెచ్చి
పెట్టుకున్నామని తెలుసుకున్నారు. దానితో వారు
సైన్యాన్ని సమకూర్చుకొనే ప్రయత్నంలో బేత్రె
హోబు, సోబాలలోవున్న సిరియనులను జీతానికి పిలి
పించుకొన్నారు. సిరియను కాల్బలము ఇరువది వేల
వరకు వుంది. ఒక వెయ్యిమంది సైనికులతో సహా
మయకా రాజును, టోబునుండి పన్నెండు వేలమందిని
జీతానికి పిలిపించుకొన్నారు.
7ఈ విషయం దావీదు విన్నాడు. అతడు యోవా
బును, అతని సైన్యంలో వీరులందరిని పంపాడు.
8అమ్మోనీయులు బయటికి వచ్చి యుద్ధానికి సిద్ధమ
య్యారు. వారు నగర ద్వారం దగ్గర మోహరించారు.
సోబానుండి, రెహోబునుండి వచ్చిన సిరియనులు,
టోబునుండి, మయకానుండి వచ్చిన మనుష్యు
లందరూ అమ్మోనీయులతో కలిసి రంగంలో నిలబడ
లేదు. 9అమ్మోనీయులు తనకు ముందు, వెనుక కూడ
నిల బడి వున్నారని యోవాబు గమనించాడు. అందు
వల్ల తనతో వచ్చిన ఇశ్రాయేలీయులలో కొందరు
నేర్పరులైన వారిని ఎన్నుకుని వారిని సిరియనులతో
యుద్ధానికి సిద్ధం చేశాడు. 10మిగిలిన సైన్యాన్ని అమ్మో
నీయుల మీదికి పోవటానికి యోవాబు తన సోదరుడైన
అబీషైకి ఇచ్చాడు. 11యోవాబు అబీషైకి ఇలా
చెప్పాడు: “సిరియనులు గనుక బలం పుంజుకొని
నన్ను ఓడించేలా వుంటే నీవు వచ్చి నాకు సహాయం
చేయుము. అమ్మోనీయులు గనుక నీకంటె ఆధి
క్యతలో వుంటే నేను వచ్చి నీకు సహాయం చేస్తాను.
12ధైర్యంగా ఉండు. మన ప్రజలకోసం, మన దేవుని
నగరాలకోసం మనమంతా వీరోచితంగా పోరాడదాం!
యెహోవా దృష్టికి ఏది మంచిదనిపించుతుందో అది
ఆయన చేస్తాడు.”
13తరువాత యోవాబు, అతని మనుష్యులు సిరియ
నులను ఎదుర్కొన్నారు. యోవాబు యొక్క, అతని
సైన్యంయొక్క ధాటికి తట్టుకోలేక సిరియనులు పారి
పోయారు.
14సిరియనులు పారిపోతున్నట్లు అమ్మోనీయులు
చూశారు. దానితో వారుకూడ అబీషైకి భయపడి పారి
పోయారు. వారు వారి నగరానికి పోయారు. యోవాబు
అమ్మోనీయులతో యుద్ధానంతరం తిరిగి వచ్చి
యెరూషలేముకు వెళ్లాడు.

### సిరియనులు మళ్లీ యుద్ధానికి సిద్ధమవటం

15ఇశ్రాయేలీయులు తమను ఓడించారని సిరియ
నులు గుర్తించారు. వారంతా మళ్లీ సమకూడి ఒక పెద్ద
సైన్యాన్ని సమకూర్చారు.
16హదదెజరు తన దూతలను యూఫ్రటీసు నది
అవతల నివసిస్తూ ఉన్న సిరియనులనందరినీ తీసుకొని
రావలసినదిగా పంపాడు. ఈ సిరియనులంతా హేలా
ముకు వచ్చారు. వారి నాయకుడు షోబకు. ఇతడు
హదదెజరు సైన్యాధిపతి.
17దావీదు ఇదంతా విని ఇశ్రాయేలీయులనందరినీ
కూడ దీశాడు. వారు యోర్దాను నదిని దాటి హేలాముకు
వెళ్లారు. అక్కడ సిరియనులు యుద్ధానికి సిద్ధమై వారిని
ఎదిరించారు.
18కాని దావీదు సిరియనులను ఓడించాడు. సిరియ
నులు ఇశ్రాయేలీయులకు భయపడి పారిపోయారు.
దావీదు సిరియను సైన్యంలో ఏడు వందల మంది
రథసారధులను, నలుబది వేల మంది గుర్రపు దళం
వారిని చంపివేశాడు. అంతేగాదు సిరియను సైన్యా
ధిపతియైన షోబకును కూడ దావీదు చంపి వేశాడు.
19హదదెజరు సామంత రాజులంతా వారి సైన్యాలను
ఇశ్రాయేలీయులు ఓడించినట్లు చూశారు. కావున వారు
ఇశ్రాయేలీయులతో సంధి చేసికొని వారిని సేవిస్తూ
వచ్చారు. మళ్లీ అమ్మోనీయులకు సహాయం చేయ
టానికి సిరియనులు భయపడి పోయారు.

### దావీదు బత్షెబను కలవటం

11 వసంతకాలం వచ్చింది. రాజులు యుద్ధాలకు
దిగే తరుణం. దావీదు యోవాబును, ఇతర
సేవకులను, ఇశ్రాయేలీయులను సిద్ధంచేసి అమ్మోనీ
యులను నాశనం చేయటానికి పంపాడు. యోవాబు
సైన్యం (అమ్మోనీయుల రాజధాని నగరమైన) రబ్బా
నగరంపై కూడ దాడి చేసింది.

ఈసారి దావీదు యెరూషలేములోనే వుండి
పోయాడు. 2ఆ రోజు సాయంత్రం పడకనుంచి లేచి,
రాజు మేడ మీద అటు యిటు తిరుగ సాగాడు. అప్పు
డతడు స్నానం చేస్తూ ఉన్న స్త్రీనొక దానిని చూశాడు.
ఆమె చాలా అందంగా ఉంది. 3దావీదు తన సేవకులను
పిలువనంపాడు. ఆ స్త్రీ ఎవరని అడుగగా, ఒక సేవకుడు,
"ఆమె పేరు బత్షెబ అనీ, ఆమె ఏలీయాము కుమార్తె
అనీ చెప్పాడు. ఆమె హిత్తీయుడగు ఊరియాకు భార్య
అనికూడ చెప్పాడు."

4దావీదు దూతలను పంపి బత్షెబను తన వద్దకు
తీసుకొని రమ్మని చెప్పాడు. ఆమె దావీదు వద్దకు
వచ్చినప్పుడు, ఆమెతో అతడు సంగమించాడు. ఆమె
స్నానాదులు చేసి, శుచియై తన ఇంటికి వెళ్లిపోయింది.
5కాని "బత్షెబ గర్భవతి" అయింది. ఈ విషయమై
దావీదుకు వర్తమానం పంపింది.

### దావీదు తన పాపాన్ని దాయజూడటం

6దావీదు ఒక వర్తమానం యోవాబుకు పంపాడు.
"హిత్తీ యుడగు ఊరియాను నా వద్దకు పంపు"మని
కబురు చేశాడు. అందువల్ల యోవాబు ఊరియాను
దావీదు వద్దకు పంపాడు. 7ఊరియా దావీదు వద్దకు
వచ్చాడు. దావీదు అతనిని యోవాబు ఎలా ఉన్నాడనీ,
సైనికు లెలా వున్నారనీ, యుద్ధం ఎలా కొనసాగుతు
న్నదనీ అడిగాడు. 8తరువాత "ఇంటికి పోయి విశ్రాంతి*
తీసు కోమని" దావీదు ఊరియాకు చెప్పాడు.

ఊరియా రాజు ఇంటిని వదిలి బయటికి వచ్చాడు.
రాజు ఊరియాకు ఒక బహుమానం కూడ పంపాడు.
9కాని ఊరియా ఇంటికి పోలేదు. రాజు ఇంటి ఆవరణ
ద్వారం వద్ద ఊరియా నిద్రపోయాడు. మిగిలిన రాజ
సేవకుల మాదిరిగా అతను కూడా అక్కడే నిద్ర
పోయాడు. 10"ఊరియా ఇంటికి పోలేదని" సేవకులు
దావీదుకు చెప్పారు.

అప్పుడు దావీదు ఊరియాను పిలిచి, "నీవు చాలా
దూరంనుండి వచ్చావు గదా! నీవు ఇంటికి ఎందుకు
వెళ్లలేదు?" అని అడిగాడు.

11దావీదుతో ఊరియా ఇలా అన్నాడు: "పవిత్ర
పెట్టె, ఇశ్రాయేలు, యూదా సైనికులు అందరూ
గుడారాలలో ఉంటున్నారు. నా యజమాని యోవాబు,
నా ప్రభువు (దావీదు రాజు) యొక్క సేవకులందరూ
బయట పొలాల్లో గుడారాలు వేసుకొనివున్నారు.
కావున నేను ఇంటికి వెళ్లి తాగి, భార్యతో విలాసంగా
కాలం గడపటం మంచిది కాదు!"

12"అయితే ఈ రోజు ఇక్కడే ఉండు. రేపు నిన్ను
మళ్లీ యుద్ధానికి పంపివేస్తాను" అని దావీదు ఊరి
యాతో అన్నాడు. ఊరియా ఆ రోజు యెరూషలే
ములో ఉన్నాడు. అతడు మరుసటి రోజు తెల్లవారే
వరకు వున్నాడు. 13ఊరియాను తన వద్దకు వచ్చి
కన్పించమని దావీదు కబురు పంపాడు. దావీదుతో
కలిసి ఊరియా బాగా తాగి, తిన్నాడు. దావీదు ఊరి
యాకు బాగా తాగ బోశాడు. అయినా ఊరియా ఇంటికి
పోలేదు. ఆ రోజు సాయంత్రం ఊరియా రాజుగారి
సేవకులతో కలిసి రాజభవన ద్వారం వద్ద నిద్ర
పోవటానికి వెళ్లాడు.

### ఊరియాను చంపించేందుకు దావీదు పథకం

14మరునాటి ఉదయం దావీదు యోవాబుకు ఒక
ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరం ఊరియా ద్వారా పంపాడు.
15 ఆ ఉత్తరంలో దావీదు ఇలా రాశాడు, "యుద్ధం
ఎక్కడ ముమ్మరంగా సాగుతూ వుంటుందో అక్కడ
ఊరియాను ముందు వరుసలో పెట్టు. అక్కడ వానిని
ఒంటరిగా వదిలి వేయి. అలా నిస్సహాయుడై చని
పోయేలా చేయి."

16యోవాబు నగరాన్ని పరిశీలించి ఎక్కడ అమ్మోనీ
యులు ధైర్యంగా ఉన్నారో చూశాడు. అతడా ప్రదేశానికి
ఊరియాను పంప నిర్ణయించాడు. 17ఆ నగర (అమ్మో
నీయుల రాజధానియగు రబ్బా) ప్రజలు యోవాబును
ఎదిరించటానికి బయటికి వచ్చారు. దావీదు మను
ష్యులు కొందరు చంపబడ్డారు. చంపబడిన వారిలో
హిత్తీయుడైన ఊరియా ఒకడు.

18యుద్ధ పరిణామాలపై యోవాబు దావీదుకు ఒక
నివేదిక పంపాడు. 19ఆ దూతతో యుద్ధంలో ఏమి
జరిగిందో దావీదు రాజుకు వివరంగా చెప్పమన్నాడు.
20"బహుశః రాజు కలత చెందుతాడు. 'యోవాబు
సైన్యం నగర సమీపానికి ఎందుకు వెళ్లింది? వారు
గోడల మీదుగా బాణాలు వేశేవారని తెలియదా? 21ఎరు
బ్బెషెతు కుమారుడైన అబీమెలెకును ఎవరు
చంపారో మీకు గుర్తుందా? ఆ నగర గోడపై నుండి
ఒక స్త్రీ తిరుగలి పై రాయిని విసరివేయగా అబీమెలెకు
చనిపోయాడు. ఆ స్త్రీ అతనిని తేబేసువద్ద చంపింది.
మీరు ఆ గోడ చెంతకు ఎందుకు వెళ్లారు? అని అన
వచ్చు. దావీదు రాజు గనుక అలా అంటే నీవు తప్ప
కుండా 'నీ సేవకుడు హిత్తీయుడైన ఊరియా కూడా
చనిపోయాడు' అని చెప్పాలి" అంటూ యోవాబు
దూతను పంపాడు.

---

**విశ్రాంతి** కాళ్లు, "చేతులు కడుగుకొనుట" అని
శబ్దార్థం.

[22]ఆ వచ్చిన దూత లోనికి వెళ్లి యోవాబు చెప్ప
మన్నట్లు దావీదుకు వివరించి చెప్పాడు. [23] దూత
ఇలా చెప్పాడు: "అమ్మోనీయులు మమ్మల్ని పొలాల్లో
ఎదుర్కొన్నారు. కాని మేము వారితో నగర ద్వారం
వద్ద పోరాడాము. [24]మీ సేవకులపై నగర గోడల
మీద ఉన్న వారు బాణాలు వేశారు. మీ సేవకులలో
కొంత మంది చనిపోయారు. మీ సేవకుడు, హిత్తీయు
డైన ఊరియా కూడ చనిపోయాడు."
[25]సరే ఈ విషయంపై కలతపడవద్దని* యోవా
బుతో చెప్పమని దూతతో దావీదు అన్నాడు. "కత్తికి
వారూ, వీరూ అని తేడా వుండదు. అది అందరినీ
చంపుతుంది. రబ్బా నగరంపై దాడి తీవ్రం చేయండి.
ఆ నగరం అప్పుడు వశమవుతుంది" అని చెప్పి
యోవాబును ప్రోత్సహించుమని దావీదు దూతకు
చెప్పాడు.

### దావీదు బత్షెబను వివాహమాడటం

[26]తన భర్త ఊరియా చనిపోయినట్లు బత్షెబ విన్నది.
తన భర్తకై విలపించింది. [27]సంతాప దినాలు గడిచాక,
దావీదు తన మనుష్యులను పంపి ఆమెను తన ఇంటికి
తీసుకొని రమ్మన్నాడు. తరువాత ఆమె దావీదుకు
భార్య అయింది. దావీదు వల్ల ఆమెకు కుమారుడు
జన్మించాడు. దావీదు చేసిన ఈ చెడ్డ పనిని యెహోవా
ఆమోదించలేదు.

### నాతాను దావీదుతో మాట్లాడటం

12 యెహోవా నాతాను ప్రవక్తను దావీదు వద్దకు
పంపాడు. నాతాను దావీదు వద్దకు వచ్చి ఇలా
చెప్పాడు: "ఒక నగరంలో ఇద్దరు వ్యక్తులున్నారు.
ఒకడు ధనవంతుడు. రెండవవాడు దరిద్రుడు. [2]ధన
వంతుని వద్ద చాలా గొర్రెలు, పశువులు వున్నాయి.
[3]కాని పేదవానివద్ద తాను కొనుక్కున్న ఒక ఆడ గొర్రె
పిల్ల తప్ప మరేమీ లేదు. ఆ గొర్రెపిల్లను పేదవాడు
సాకాడు. ఆ పేదవానితో పాటు, అతని పిల్లతో పాటు
ఆ గొర్రెపిల్ల కూడ పెరిగింది. ఆ గొర్రెపిల్ల పేదవాని
కంచంలో తిని, వాని గిన్నెలో నీళ్లు తాగింది. ఆ పేద
వాని రొమ్ము మీద గొర్రెపిల్ల పడుకొని నిద్రపోయేది.
పేద వానికి ఆ గొర్రెపిల్ల ఒక కూతురిలా వుండేది.
[4]"ఇదిలా వుండగా ఒక యాత్రికుడు ధనవంతుని
చూడటానికి ఆ నగరంలో ఆగాడు. ధనికుడు ఆ
యాత్రికునికి ఆహారం ఇవ్వబోయాడు. కాని ఆ
యాత్రికునికి ఆహారంగా తనకున్న గొర్రెలలో గాని,
పశువులలో గాని దేనినీ చంపటానికి ధనికుడు ఇష్ట
పడలేదు. దానికి బదులు, ధనికుడు ఆ నగరంలో
ఉన్న పేదవాని గొర్రెపిల్లను తీసుకొని, చంపి ఆ యాత్రి
కునికి ఆహారంగా వండించాడు."
[5]ఇది వింటున్న దావీదుకు ధనికునిపై విపరీతంగా
కోపం వచ్చింది. "యెహోవా జీవము తోడుగా ఈ
పని చేసిన ఆ వ్యక్తి నిశ్చయంగా చావవలసిందే! [6]ఆ
గొర్రె పిల్ల విలువకు నాలుగింతలు ధనికుడు చెల్లించాలి.
ఎందుకంటే వాడు ఈ భయంకరమైన పని చేశాడు.
పైగా వాడు దయలేనివాడు!" అని దావీదు నాతానుతో
అన్నాడు.

### నాతాను దావీదుతో అతని పాపాన్ని తెలియజెప్పటం

[7]"ఆ వ్యక్తివి నీవే అన్నాడు నాతాను దావీదుతో.
ఇశ్రాయేలు దేవుడైన యెహోవా నీ విషయంలో ఇలా
అంటున్నాడని నాతాను దావీదుతో చెప్పాడు: నిన్ను
ఇశ్రాయేలుకు రాజుగా నేను అభిషిక్తం చేశాను. సౌలు
నుండి నిన్ను కాపాడాను. [8]అతని కుటుంబాన్ని, భార్య
లను నీవు తీసుకొనేలా చేశాను. పైగా ఇశ్రాయేలు
పైన, యూదా పైన రాజుగా నియమించాను. ఇవన్నీ
చాల వన్నట్లు, నీకు ఇంకా చాలా ఇచ్చాను.
[9]కావున ఎందువల్ల యెహోవా ఆజ్ఞను తిరస్క
రించావు? దేవుడు చెడ్డదని చెప్పిన దానిని ఎందుకు
చేశావు? హిత్తీయుడైన ఊరియాను నీవు కత్తితో
చంపించావు. అతని భార్యను నీ భార్యగా చేసుకున్నావు.
అవును; నీవు ఊరియాను అమ్మోనీయుల కత్తితో
చంపావు! [10]కావున, కత్తి నీ కుటుంబాన్ని వదిలిపెట్టదు.
హిత్తీయుడు ఊరియా భార్యను నీవు చేపట్టావు. ఈ
రకంగా నీవు నన్ను లక్ష్య పెట్టలేదని నిరూపించు
కున్నావు."
[11]"నేను నీకు ఆపద తీసుకు వస్తున్నాను. నీ కుటుం
బంలో నుండే ఈ ఆపద వస్తుంది. నీ భార్యలందరినీ
నీ నుండి నేను తీసివేసి, నీకు అతి సన్నిహితుడైన
వానికొకనికి ఇస్తాను. ఆ వ్యక్తి నీ భార్యలందరితో కలి
యగా, అది అందరికీ తెలుస్తుంది.* [12]నీవు బత్షెబతో
రహస్యంగా కూడినావు. కాని నేను చేసే పని ఇశ్రాయేలు
ప్రజలందరికీ తెలుస్తుంది."*
[13]నాతానుతో, "యెహోవా పట్ల నేను పాపం
చేశాను" అని దావీదు చెప్పాడు.
అప్పుడు నాతాను దావీదుతో ఇలా అన్నాడు,
"యెహోవా నీకు పాపవిమోచనం చేశాడు. నీవు చంప
బడవు. [14]కాని నీవు చేసిన ఈ పాపకార్యంవల్ల శత్రువులు
నీ యెహోవాని అసహ్యించుకునేలా చేశావు. అందువల్ల
నీకు పుట్టిన కుమారుడు చనిపోతాడు."

---

**కలతపడవద్దు** నీ దృష్టిలో ఈ పని ఒక దుష్టకార్యంగా భావించవద్దు అని శబ్దార్థం.

**అది అందరికీ తెలుస్తుంది** అంటే "పట్టపగలే, బహిర్గతం గానే జరుగుతుందని" శబ్దార్థం.

**కాని. .. తెలుస్తుంది** ఇశ్రాయేలు ప్రజల ముందు, సూర్యుని ముందు అని శబ్దార్థం.

### దావీదువలన బత్షెబకు పుట్టిన శిశువు మరణించటం

15ఆమ్మట నాతాను ఇంటికి వెళ్లిపోయాడు.
ఊరియా భార్య ద్వారా దావీదుకు పుట్టిన బిడ్డ తీవ్రంగా
జబ్బు పడేలా యెహోవా చేశాడు. 16దావీదు బిడ్డ
కొరకు దేవుని ప్రార్థించాడు. దావీదు తినటానికి, తాగ
టానికి నిరాకరించాడు. అతను తన ఇంట్లోకివెళ్లి లోపలే
వుండి పోయాడు. రాత్రంతా నేలమీదే పడుకొని వుండి
పోయాడు. 17దావీదు కుటుంబంలో ముఖ్యులైన వారు
వచ్చి దావీదును నేలమీద నుండి లేపటానికి ప్రయ
త్నించారు. కాని దావీదు లేవ నిరాకరించాడు. వారితో
కలిసి భోజనం చేయటానికి కూడ దావీదు నిరాక
రించాడు. 18ఏడవ రోజున శిశువు మరణించింది. శిశువు
మరణించిందని దావీదుతో చెప్పటానికి సేవకులు
భయపడ్డారు. ఒకరితో ఒకరు వారిలా అనుకోసాగారు,
“చూడండి, బిడ్డ బతికివుండగా మనం ఆయనతో
మాట్లాడాలని ప్రయత్నం చేశాము. కాని ఆయన మన
మాట వినలేదు. ఇప్పుడు బిడ్డ మరణం గురించి మనం
తెలియ జేస్తే, అతడు తన ప్రాణానికి ముప్పు వాటిల్లే
ఏ పనికైనా పాల్పడవచ్చు!” 19కాని దావీదు తన సేవ
కులు గుసగుసలాడు కోవటం గమనించి బిడ్డ మరణించి
వుండ వచ్చని ఊహించాడు. “బిడ్డ చనిపోయాడా?”
అని దావీదు సేవకులను అడిగాడు.

“అవును, చనిపోయాడు” అని సేవకులు అన్నారు.
20దావీదు నేలమీద నుంచి లేచాడు. కాళ్లు చేతులు
కడుక్కొని, బట్టలు మార్చుకొని, యెహోవాని ప్రార్థిం
చటానికి ఆలయానికి వెళ్లాడు. తరువాత ఇంటికి వెళ్లి,
తినటానికి ఆహారాన్ని అడిగాడు. సేవకులు కొంత
ఆహారాన్ని ఇవ్వగా, అతడు తిన్నాడు.
21దావీదు సేవకులు ఆయనతో ఇలా చెప్పారు,
“నీవిలా ఎందుకు ప్రవర్తిస్తున్నావు? బిడ్డ బ్రతికి వుండగా
నీవు తినటానికి నిరాకరించావు. నీవు ఏడ్చావు. కాని
బిడ్డ చనిపోగానే, నీవు లేచి భోజనం చేశావు.”
22అందుకు దావీదు ఇలా చెప్పాడు: “బిడ్డ బతికి
వుండగా నేను తినలేదు. ఏడ్చాను. ఎందువల్లనంటే
యెహోవా నన్ను కనికరించి బిడ్డను బతికించవచ్చు!
ఎవరికి తెలుసు! అనుకున్నాను. 23కాని ఇప్పుడు బిడ్డ
చని పోయాడు. కావున ఇప్పుడు నేనెందుకు తినటానికి
నిరాకరించాలి? నేను బిడ్డను తిరిగి బతికించుకొన
గలనా? లేదు! ఏదో ఒక రోజున నేనే వాని దగ్గరకు
వెళతాను. అంతేగాని వాడు నా వద్దకు తిరిగి రాలేడు.”

### సొలొమోను జన్మించటం

24దావీదు తన భార్యయైన బత్షెబను ఓదార్చాడు.
అతడా మెతో కలిసి వుండి సంగమించగా, ఆమె గర్భవతి
అయింది. ఆమెకు మరొక కుమారుడు జన్మించాడు.
దావీదు వానికి సొలొమోను అని పేరు పెట్టాడు.
యెహోవా సొలొమోనును ప్రేమించాడు. 25 ప్రవక్త
నాతాను ద్వారా యెహోవా తన సందేశం పంపాడు.
నాతాను వచ్చి సొలొమోనుకు యదీద్యా* అని నామ
కరణం చేశాడు. దేవుని ఆజ్ఞానుసారం నాతాను అలా
చేశాడు.

### దావీదు రబ్బాను పట్టుకొనటం

26యోవాబు అమ్మోనీయుల నగరంపై యుద్ధం
చేశాడు. అతడు రాజధానీ నగరాన్ని పట్టుకున్నాడు.
27యోవాబు దావీదు వద్దకు దూతలను పంపి ఇలా
చెప్పమన్నాడు: “నేను రబ్బాపై యుద్ధం నిర్వహిం
చాను. నేను జలనగరాన్ని పట్టుకున్నాను. 28ఇప్పుడు
నీవు మిగిలిన సైన్యాన్ని కూడగట్టుకొని వచ్చి రబ్బా
నగరాన్ని ముట్టడించు. దానిని నాకై నేను వశపర్చుకు
నేలోగా నీవు వచ్చి పట్టుకో. నేను గనుక వశపర్చు
కుంటే, ఆ నగరం నా పేరు మీదుగా పిలువబడుతుంది!”
29దావీదు తన సైన్యాన్ని కూడదీసికొని రబ్బా
నగరానికి వెళ్లాడు. యుద్ధం చేసి ఆ నగరాన్ని వశపర్చు
కున్నాడు. 30దావీదు ఆ రాజు తలనుండి* కిరీటాన్ని
తీసు కున్నాడు. అది బంగారు కిరీటం. దాని బరువు
సుమారు డెబ్బది అయిదు కాసులు. ఈ కిరీటంలో
విలువైన వజ్రాలు పొదగబడ్డాయి. ఆ కిరీటాన్ని సైని
కులు దావీదు తలపై వుంచారు. ఆ నగరం నుండి
దావీదు అనేక విలువైన వస్తువులను కొల్లగొట్టుకు
పోయాడు. 31అంతేగాదు, దావీదు రబ్బా నగర వాసు
లను బయటకు తీసుకొని వచ్చాడు. వారందరినీ రంప
ములతోను, పలుగులతోను, గొడ్డళ్లతోను పని చేయిం
చాడు. వారందరినీ ఇటుకలతో కట్టడాలను నిర్మించేలా
చేశాడు. అమ్మోనీయుల నగరాలన్నిటిలో దావీదు
ఇలాగే చేయించాడు. తరువాత దావీదు తన సైన్యంతో
యెరూషలేముకు వెళ్లిపోయాడు.

### అమ్నోను తామారును మోహించుట

13 దావీదుకు అబ్షాలోము అను కుమారుడొక
డున్నాడు. అబ్షాలోముకు ఒక సోదరివుంది.
ఆమె పేరు తామారు. ఆమె బహుసౌందర్యవతి. దావీదు
యొక్క మరో కుమారుడైన అమ్నోను* తామారును
మోహించాడు. 2తామారు కన్యక. అందువల్ల ఆమెను
తన కామవాంఛ తీర్చుకోవటానికి అమ్నోను ఆమెను

---

**యదీద్యా** యదీద్యా అనగా దేవునికి ప్రియమైనవాడు అని అర్థం.

**రాజు తలనుండి** మల్కాము తలనుండి అని కూడ అంటారు. మల్కాము అమ్మోనీయులు ఆరాధించే ఒక బూటకపు దైవం.

**అమ్నోను** అబ్షాలోముకు, తామారుకు అమ్నోను సవతి తల్లి కుమారుడవుతాడు. వారందరికీ దావీదు తండ్రి. అబ్షాలోముకు ఒక తల్లి, అమ్నోనుకు వేరొక తల్లి ఉన్నారు. చూడండి సమూయేలు రెండవ గ్రంథం 3:2,3.

ఏమీ చేయలేకపోయాడు. కాని అమ్నోను ఆమెను
మిక్కిలిగా మోహించాడు. ఆమెను పొందలేక ఆమె
ధ్యాసతో అమ్నోను విరహంతో నీరసించిపోయాడు.
[3]అమ్నోనుకు యెహోనాదాబు అనే స్నేహితు
డొకడు న్నాడు. అతడు షిమ్యా కుమారుడు. షిమ్యా
దావీదు సోదరుడు. యెహోనాదాబు యుక్తిగల వాడు.
[4]యెహోనాదాబు అమ్నోనుతో, "రోజు రోజుకీ నీవు
చిక్కిపోతున్నావు! నీవు రాజ కుమారుడవు! తినటానికి
కావలసినంత ఉంది. కాని ఎందుకిలా చిక్కి శల్యమై
పోతున్నావు ? నాతో చెప్పు" అన్నాడు.

"నేను తామారును ప్రేమిస్తున్నాను. కాని ఆమె నా
తమ్ముడైన అబ్షాలోము సహోదరి" అన్నాడు
అమ్నోను.

[5]యెహోనాదాబు అమ్నోనుకు ఇలా సలహా
యిచ్చాడు: "నీవు పోయి పండుకో, జబ్బు పడిన
వానిలా నటించు. అప్పుడు నీ తండ్రి నిన్ను చూసేం
దుకు వస్తాడు. నీవాయనతో నీ చెల్లెలైన తామారును
నీకు ఆహారాన్నిచ్చి సేవ చేయటానికి పంపమను.
ఆమె నీ ఎదుట ఆహారం నీవు చూస్తూవుండగా
తయారు చేసి ఆమె నీకు పెడుతుందని కూడా చెప్పు."
[6]ఆ సలహా మేరకు అమ్నోను పక్క మీద పడుకుని
జబ్బు పడిన వానిలా నటించాడు. అమ్నోనును చూడ
టానికి దావీదు రాజు వచ్చాడు. "దయచేసి చెల్లెలు
తామారును పంపించు. నేను చూస్తూవుండగా ఆమె
రెండు ప్రత్యేకమైన రొట్టెలు చేసి పెడుతుంది. ఆమె
చేతిమీదుగా తింటాను" అని దావీదుతో అమ్నోను
చెప్పాడు.
[7]దావీదు తామారు ఇంటికి దూతలను పంపాడు.
వారు తామారుతో ఆమె సోదరుడు, "అమ్నోను ఇంటికి
వెళ్లి అతనికి కొంత ఆహారం చేసిపెట్టమని చెప్పారు."

**అమ్నోనుకు తామారు ఆహారం తయారు చేయటం**

[8]తన సోదరుడైన అమ్నోను ఇంటికి తామారు
వెళ్లింది. అమ్నోను మంచంపై ఉన్నాడు. తామారు
కొంత పిండి తీసుకొని, దానిని ఆమె స్వయంగా కలి
పింది. అమ్నోను చూస్తూవుండగా ఆమె కొన్ని
రొట్టెలు చేసింది. తరువాత ఆమె రొట్టెలను కాల్చింది.
[9]తామారు రొట్టెలను కాల్చిన పిమ్మట పెనంలో
వాటిని తీసుకొని వెళ్లి అమ్నోను ముందు పళ్లెంలో
వేసింది. కాని అమ్నోను తినటానికి అంగీకరించలేదు.
అమ్నోను తన సేవకులందరినీ, "అతనిని ఒంటరిగా
వదిలి వెళ్లి పొమ్మన్నాడు" అమ్నోను గదినుండి సేవకు
లంతా బయటికి పోయారు.

**అమ్నోను తామారును చెరచుట**

[10]అమ్నోను తామారుతో, "రొట్టెలను లోపలి గది
లోనికి తీసుకొనిరా. అప్పుడు నీ చేతిమీదుగా వాటిని
తింటాను" అని అన్నాడు. తామారు లోపలి గదిలో
వున్న తన సోదరుడైన అమ్నోను వద్దకు వెళ్లింది.
ఆమె చేసిన రొట్టెలను తీసుకొని వెళ్లింది. [11]తన
చేతుల మీదుగా తింటాడని ఆమె అమ్నోను వద్దకు
వెళ్లింది. కాని అమ్నోను తామారును పట్టుకున్నాడు.
"చెల్లీ, రా! నాతో కలిసి పడుకో!" అని అన్నాడు.
[12]అందుకు తామారు అమ్నోనుతో ఇలా ప్రాధేయ
పడింది: "వద్దు, సోదరా! నన్ను బలవంతం చేయకు!
ఇశ్రాయేలులో ఇలా ఎన్నటికీ జరుగకూడదు! ఈ
అవమానకరమైన పని చేయకు! [13]నా కళంకాన్ని
నేనెన్నడూ మాపుకోలేను. ఇశ్రాయేలీయులలో నీచ
కార్యాలు చేసే మూర్ఖులలో నీవొకడివై పోతావు. దయ
చేసి రాజుతో మాట్లాడు. నన్ను వివాహం చేసికోటానికి
ఆయన నీకు అనుమతిస్తాడు."
[14]కాని అమ్నోను తామారు చెప్పే దానిని వినటానికి
నిరాకరించాడు. అతడు తామారుకంటె బలవంతుడు.
అతడామెను బలాత్కరించి సంగమించాడు. [15]దాని తరు
వాత అమ్నోను తామారును అసహ్యించుకున్నాడు.
ముందు అతనామెనెంతగా ప్రేమించాడో, అంతకు
మించి ఇప్పుడు అమ్నోను తామారును అసహ్యించు
కున్నాడు. అమ్నోను తామారుతో, "మంచం మీది
నుంచి లేచి బయటికి పొమ్మన్నాడు."
[16]అందుకు తామారు అమ్నోనుతో, "కాదు! నీవి
ప్పుడు మునుపటికంటె ఇంకా ఘోరమైన తప్పు
చేస్తున్నావు. నీవు నన్ను పంపివేయటానికి ప్రయత్ని
స్తున్నావు!" అని అన్నది.

కాని అమ్నోను తామారు చెప్పేది వినలేదు.
[17]అమ్నోను తన సేవకుణ్ణి లోనికి పిలిచి, "ఇప్పుడే
ఈ పిల్లను గదినుండి బయటికి పంపించు! బయటకు
నెట్టి తలుపుకు తాళం వేయి" అని చెప్పాడు.
[18]అమ్నోను సేవకుడు తామారును బయటికి గెంటి
గదికి తాళం పెట్టాడు. తామారు ఒక రంగురంగుల
పొడవైన చేతులు, చాలా వదులుగా వుండే అంగీని
వేసుకున్నది. ఈ రకమైన అంగీలను పెండ్లి కాని రాజ
కుమార్తెలు మాత్రమే వేసుకునేవారు. [19]తామారు
కొద్దిగా బూడిద తీసికొని తన నెత్తి మీద పోసుకున్నది.
తన రంగు రంగుల అంగీని చింపుకొన్నది. తన చేయి
నెత్తిమీద పెట్టుకుని బిగ్గరగా ఏడ్చుకుంటూ
పోయింది.* [20]తామారు సోదరుడు అబ్షాలోము తామా
రుతో, "నీ సోదరుడు అమ్నోను నిన్ను చెరచి
నాడుగా*?" అన్నాడు. "అమ్నోను నీ సోదరుడు.
కావున చెల్లీ, ప్రస్తుతానికి నీవు మాట్లాడక వుండు. ఇది

---

**తామారు ... పోయింది** ఇదంతా ఆమె బహు
దుఃఖంతో వున్నట్లు, సంక్షోభం చెందియున్నట్లు తెలియ
జేసే సంకేతం.

**చెరచినాడు** నీతో కలిసినాడు అని శబ్దార్థం.

నిన్ను విపరీతంగా సంక్షోభపెట్టకుండా* చూసుకో!" అది విన్న తామారు ఇక ఏమీ మాట్లాడ లేదు. నాశనమైన స్త్రీలా, ఆమె అబ్షాలోము ఇంటి వద్దనే ఉండసాగింది.
21ఈ వార్త దావీదు రాజు విన్నాడు. ఆయనకు పట్టరాని కోపం వచ్చింది. 22అబ్షాలోము అమ్నోనును అస హ్యించుకున్నాడు. అబ్షాలోము అమ్నోను నుద్దేశించి మంచిగా గాని, చెడ్డగా గాని ఏమీ అనలేదు. తన సోదరి తామారును చెరచినందుకు అమ్నోనును అసహ్యించుకున్నాడు.

### అబ్షాలోము పగ తీర్చుకొనటం

23రెండు సంవత్సరాల తరువాత అబ్షాలోము కొందరు మనుష్యులను తన గొర్రెల నుండి ఉన్ని తీయటానికి బయల్హాసోరుకు రావించాడు. ఈ కార్యక్రమం చూడటానికి రాజకుమారులందరినీ అబ్షాలోము ఆహ్వానించాడు. 24అబ్షాలోము రాజు వద్దకు వెళ్లి, "నా గొర్రెల నుండి ఉన్ని తీయటానికి మనుష్యులను పిలిచాను. దయచేసి నీ సేవకులతో వచ్చి ఆ కార్యక్రమం తిలకించు" మని అడిగాడు.
25"వద్దు, కుమారుడా! మేము రాము. మేమంతా వస్తే అది నీకు చాలా శ్రమ అవుతుంది" అని దావీదు రాజు అబ్షాలోముతో అన్నాడు. దావీదును రమ్మని అబ్షా లోము ప్రాధేయపడ్డాడు. దావీదు వెళ్లలేదు గాని, అతని పనిని ఆశీర్వదించాడు.
26"నీవు రాకుంటే, దయచేసి నా సోదరుడు అమ్నోనును నాతో పంపించు" మని అబ్షాలోము అడిగాడు.
"అతడు నీతో ఎందుకు రావాలి?" అని దావీదు రాజు అడిగాడు. 27అయినా అబ్షాలోము వినిపించుకోకుండా అదే పనిగా ప్రాధేయపడి అడిగాడు. చివరికి అమ్నోను, మిగిలిన రాజకుమారులు అబ్షాలోముతో వెళ్లటానికి ఒప్పుకున్నారు.

### అమ్నోను హత్య చేయబడటం

28అబ్షాలోము తన సేవకులకు ఒక ఆజ్ఞ ఇచ్చాడు. "అమ్నోనును ఒక కంట కనిపెట్టి వుండండి. వాడు బాగా తాగిన పిమ్మట 'అమ్నోనును చంపండి' అంటాను. ఆ సమయంలో వానిని చంపండి! భయ పడకండి నేను మీకు ఆజ్ఞ ఇస్తున్నాను! నిబ్బరంగా, ధైర్యంగా వుండండి" అని అబ్షాలోము సేవకులతో అన్నాడు. 29అబ్షాలోము ఆజ్ఞ మేరకు అతని యువ సేవకులు అమ్నోనును చంపివేశారు. కాని దావీదు మిగిలిన కుమారులంతా తప్పించుకున్నారు. వారిలో ప్రతి ఒక్కడూ తన కంచర గాడిదపై ఎక్కి తప్పించుకు పోయాడు.

### అమ్నోను మరణవార్తను దావీదు వినటం

30రాజకుమారులంతా మార్గమధ్యంలో వుండగానే, ఈ వార్త దావీదుకు చేరింది. "అబ్షాలోము రాజ కుమారులందరినీ చంపివేశాడనీ; ఒక్కడు కూడా మిగల లేదనీ" ఆయనకు వర్తమానం వచ్చింది.
31దావీదు రాజు తన బట్టలు చింపుకొని నేలమీద పడ్డాడు. దావీదు చెంతనున్న తన సేవకులు కూడా విషాదసూచకంగా తమ బట్టలు కూడా చింపుకున్నారు.
32దావీదు సోదరుడగు షిమ్యా కుమారుడు యెహోనాదాబు దావీదు వద్దకు వచ్చి ఇలా అన్నాడు: "రాజ కుమారులంతా చనిపోయారని అనుకోవద్దు. చని పోయినది అమ్నోను ఒక్కడు మాత్రమే! అబ్షాలోము ఇదంతా జరిపించాడు. 33కారణమేమనగా అమ్నోను అబ్షాలోము చెల్లెలు తామారును చెరిచాడు. కాబట్టి అమ్నోను మాత్రము చంపబడ్డాడు.
34అబ్షాలోము పరారైనాడు. నగర ప్రహరీ గోడమీద ఒక కావలివాడు నిలబడి వున్నాడు. కొండకు అవతలి పక్కనుండి చాలా మంది రావటం చూశాడు. 35అది చూసి యెహోనాదాబు దావీదు రాజుతో, "చూడండి, నేను చెప్పింది నిజమైనది. రాజ కుమారులంతా వస్తున్నారు!" అన్నాడు.
36యెహోనాదాబు ఈ మాటలు అంటూ వుండగానే రాజకుమారులు వచ్చారు. వారు గగ్గోలు పడి ఏడుస్తూవున్నారు. దావీదు, అతని సేవకులందరూ కూడ విలపించసాగారు. వారంతా విపరీతంగా దుఃఖించారు. 37దావీదు తన కుమారుడైన అమ్నోను కొరకు ప్రతి రోజూ దుఃఖించాడు.

### అబ్షాలోము గెషూరుకు తప్పించుకు పోవటం

అబ్షాలోము తల్మయి రాజు* వద్దకు పారి పోయాడు. తల్మయి గెషూరుకు రాజు. అతని తండ్రి పేరు అమీహూదు.
38అబ్షాలోము గెషూరుకు పారిపోయి అక్కడ మూడు సంవత్సరాలు ఉన్నాడు. 39అమ్నోను మరణం గూర్చి దావీదురాజు క్రమేపీ ఓదార్చబడ్డాడు. కాని అతడు అబ్షాలోమును గూర్చి మిక్కిలి ఆరాట పడ సాగాడు.

### యోవాబు ఒక నేర్పరియైన స్త్రీని దావీదు వద్దకు పంపటం

14 అబ్షాలోమును గూర్చి దావీదు రాజు మిక్కిలి బెంగపెట్టు కున్నాడని సెరూయా కుమారుడైన యోవాబు గ్రహించాడు. 2యోవాబు తన దూతలను తెకోవకు పంపి, అక్కడి నుండి ఒక నేర్పరియైన

---

**సంక్షోభపెట్టకుండా** దీనిని తీవ్రంగా నీ హృదయాన్ని గాయపర్చనీయవద్దని శబ్దార్థం.

**తల్మయి రాజు** తల్మయి రాజు అబ్షాలోముకు తాత. సమూయేలు గ్రంథం 3:3 చూడండి.

స్త్రీని తీసుకొని రమ్మని చెప్పాడు. ఆ స్త్రీతో యోవాబు
ఇలా అన్నాడు: "దయచేసి నీవు చాలా దుఃఖంలో
ఉన్నట్లు నటించు. విషాదసూచకమైన బట్టలు వేసుకో,
అలంకరణ చేసుకోవద్దు. చనిపోయిన, నీకు ప్రియమైన
ఒక వ్యక్తి కోసం చాలా కాలంగా విలపిస్తున్నట్లు ప్రవ
ర్తించు. 3నేను ఇప్పుడు నీకు చెప్పే మాటలను నీవు
రాజు వద్దకు వెళ్లి చెప్పు." ఈ విధంగా ఆ యుక్తిగల
స్త్రీతో మాట్లాడి, ఆమె రాజుతో ఏమి చెప్పాలో
యోవాబు ఆమెకు వివరించాడు.

4తరువాత తెకోవ నుండి వచ్చిన స్త్రీ రాజు వద్దకు
వెళ్లి మాట్లాడింది. ఆమె రాజు ముందు ప్రణమిల్లింది.
ఆమె ముఖం నేలకు తాకింది. వంగి నమస్కరించి,
"రాజా, నాకు సహాయం చేయండి!" అని ప్రాధేయ
పడింది.

5"ఏమిటి నీ సమస్య?" అని దావీదు రాజు ప్రశ్నిం
చాడు. ఆ స్త్రీ యిలా చెప్పింది: "నేనొక విధవ స్త్రీని!
నా భర్త చనిపోయాడు. 6నాకు ఇద్దరు కుమారు
లున్నారు. వారిద్దరూ పొలాల్లోకి పోయి దెబ్బలాటకు
దిగారు. వాళ్లను నివారించటానికి ఒక్కడు కూడా లేక
పోయాడు. ఒక కొడుకు, ఇంకొక కొడుకును చంపి
వేశాడు.

7ఇప్పుడు కుటుంబమంతా నామీద కత్తిగట్టారు.
హత్యకు పాల్పడిన కొడుకును తెమ్మని ఒత్తిడి తెస్తు
న్నారు. తన సోదరుని చంపిన కారణంగా వారంతా
అతనిని చంపుతామంటున్నారు. నా కొడుకును చంప
నిస్తే, తన తండ్రికి ఏకైక వారసుడైన వాడు లేకుండా
పోతాడు! నా కుమారుడు అగ్నిలో చివరి నిప్పుక
ణంలాంటివాడు. ఇప్పుడు ఆ చివరి నిప్పుకణం ఆరిపో
బోతూవుంది! దానితో మరణించిన నా భర్త పేరు,
ఆస్తి నేలపాలవుతాయి."

8ఇది విన్న రాజు, "ఇక నీవు ఇంటికి వెళ్లు. నీ
విషయాల పట్ల నేను శ్రద్ధ తీసుకుంటాను" అని
ఆమెతో అన్నాడు.

9తెకోవ స్త్రీ రాజుతో, "ఈ విషయంలో వచ్చే
పరిణా మాలకు, పర్యవసానానికి నిందంతా నామీదే
పడుగాక! నా ప్రభువైన రాజా! నీవు, నీ సింహాసనం
ఈ విషయంలో ఏ దోషమూ ఎరుగరు!" అని చెప్పింది.

10"నిన్ను గురించి ఎవరైనా దీనిగూర్చి నిన్నేమైన
అనినయెడల నా వద్దకు తీసుకొనిరా. వాడు మరల
నిన్ను ఏమీ అనడు" అని దావీదు రాజు అన్నాడు.

11అది విన్న ఆ స్త్రీ రాజును ఇలా వేడుకున్నది:
"దయ చేసి నీ దేవుడైన యెహోవాను ప్రార్థించు.
హంతకులను శిక్షించాలని చూసే ఆ ప్రజలు నా
కుమారునికి కీడు చేయకుండా దేవుడు నివారించగ
లందులకు ఆయనను ప్రార్థించు."

దావీదు ఆమెకు ఇలా అభయమిచ్చాడు:
"యెహోవా జీవము తోడుగా ఎవ్వడూ నీ కుమారునికి
హాని చేయలేడు. నీ కుమారుని తలలోని ఒక్క వెంట్రుక
కూడా కింద రాలదు."

12ఆ స్త్రీ, "నా ప్రభువైన రాజా! నన్నింకా కొన్ని
విషయాలు చెప్పనీయండి" అని అన్నది. చెప్ప
మన్నాడు రాజు.

13ఆ స్త్రీ ఇలా అన్నది: "దేవుని ప్రజలకు వ్యతిరేకంగా
ఇవన్నీ నీవెందుకు చేస్తున్నావు? అవును. ఇవన్నీ చేస్తూ
నీవు దోషివని బహిర్గతం చేసుకుంటున్నావు!* ఎందు
వల్లననగా నీవు నీయింటి నుండి పంపివేసిన నీ కుమా
రుని తిరిగి తీసుకొని రాలేదు. 14మనమంతా ఏదో
ఒక రోజు చనిపోవటమనేది సత్యం. మనమంతా నేల
మీద ఒలికిన నీరులాంటివారం. ఈ ఒలికిన నీటిని
మట్టిలో నుండి తిరిగి తీయటం ఎవ్వరికీ సాధ్యం
కాని పని. కాని దేవుడు ప్రాణాన్ని తీసుకొనడు. ఇండ్ల
నుండి తరిమి వేయబడిన వారికి దేవుడు ఒక పథకం
తయారుచేసి ఉంచుతాడు. అంటే వారు ఆయన నుండి
బలవంతంగా దూరం చేయబడలేదు! 15నా ప్రభువైన
రాజా! ఈ మాటలు నీకు చెప్పటానికి నేను వచ్చాను.
కారణమేమంటే, ప్రజలు నన్ను భయపెట్టారు! నేను
వాళ్లతో నన్ను పోయి రాజుతో మాట్లాడనీయమ
న్నాను. బహుశః రాజు నా విన్నపం ఆలకింపవచ్చునని
అన్నాను. 16రాజు వింటాడు. విని నన్ను, నా కుమారుణ్ణి
చంపజూస్తున్న వారి నుండి రక్షణ కల్పిస్తాడనీ; దేవుడు
ప్రసాదించిన ఆస్తిని అనుభవించకుండ చేయజూస్తున్న
వారి నుంచి మమ్మల్ని రక్షిస్తాడనీ అనుకున్నాను. 17నా
ప్రభువైన నా రాజు మాటలు మనశ్శాంతినిస్తాయని
నాకు తెలుసు. ఎందువల్లనంటే నీవు దేవుని నుండి
వచ్చిన దూతలాంటివాడవు. ఏది మంచిదో, ఏది
చెడ్డదో నీకు తెలుసు. దేవుడు సదా నీతో వుండు
గాక!"

18అది విని ఆశ్చర్యపడిన రాజైన దావీదు, "నేనొక
ప్రశ్న అడుగుతాను. నీవు సమాధానం చెప్పాలి"
అన్నాడు.

ఆ స్త్రీ, "నా ప్రభువైన రాజా దయచేసి మీ ప్రశ్న
అడగండి!" అన్నది.

19"విషయాలన్నీ మాట్లాడమని యోవాబు నీతో
చెప్పాడా ?" అని రాజు అడిగాడు.

ఆ స్త్రీ ఇలా అన్నది: "నీ ప్రమాణంగా, నా ప్రభువైన
రాజా, నీవు నిజం చెప్పావు. నీ సేవకుడైన యోవాబు
ఇవన్నీ చెప్పమని నాతో అన్నాడు. 20యోవాబు ఇలా

---

**ఇవన్నీ ... చేసుకుంటున్నావు** తెకోవ స్త్రీ తన కుమారునికి, తనకు అనుకూలంగా రాజువద్దనుండి హామీ తీసుకున్నది. దావీదు రాజు కుమారుడైన అబ్షాలోము స్థితికూడ ఇంచుమించు అదే రకం. రాజుమాట రాజుకే అప్పజెప్పి, అబ్షాలోము విషయంలో కూడ రాజు మనస్సు మార్చి తగిన హామీ తీసుకొని ఆ స్త్రీ బయటపడి, బాహాటంగా మాట్లాడటం మొదలు పెట్టింది.

ఎందుకు చేశాడంటే నీవు పరిస్థితులు నిష్పక్షపాతంగా,
రాగ ద్వేషాలు లేకుండా అవగాహన చేసుకొని యుక్త
మైన నిర్ణయం తీసుకుంటావని. నా ప్రభువా, నీవు
దేవ దూతలా తెలివిగలవాడవు. ఈ భూమిమీద జరిగే
దంతా నీకు తెలుసు."

**అబ్షాలోము యెరూషలేముకు తిరిగి రావటం**

21రాజు యోవాబుతో ఇలా అన్నాడు: "చూడండి.
నేను మాట ఇచ్చిన విధంగా చేస్తాను. యువకుడైన
అబ్షాలోమును దయచేసి తీసుకొని రండి."
22యోవాబు తన ముఖం నేలనుతాకి సాష్టాంగపడి
నమస్కరించాడు. రాజైన దావీదుకు ఆశీర్వచనం పలికి,
"ఈ రోజు నాపట్ల మీరు ప్రసన్నులైయున్నారని నాకు
తెలుసు! ఎందువల్లనంటే నేను అడిగినదంతా నీవు
చేశావు!" అని అన్నాడు.
23యోవాబు లేచి గెషూరుకు వెళ్లి అబ్షాలోమును
యెరూషలేముకు తీసుకొని వచ్చాడు. 24అయితే
దావీదు రాజు మాత్రం, "అబ్షాలోము తప్పక తన
స్వంత ఇంటికి వెళ్లిపోవాలి. అతడు నన్ను చూడటానికి
రాకూడదు" అని అన్నాడు. కావున అబ్షాలోము తన
స్వంత ఇంటికి వెళ్లిపోయాడు. అబ్షాలోము రాజును
చూడటానికి వెళ్లలేక పోయాడు.
25అబ్షాలోము అందంలో అందరి ప్రశంసలూ
పొందిన వాడు. అబ్షాలోమంత అందగాడు ఇశ్రాయేలం
తటిలో మరొకడు లేడు. అరికాలు నుండి నడినెత్తివరకు
అతనిలో రవ్వంత కూడా లోపం లేదు. 26ప్రతి సంవత్స
రాంతానా అబ్షాలోము తన తల వెండ్రుకలు కత్తిరించి
తూచేవాడు. తూకం ప్రకారం రెండు వందల తుల
ముల* బరువు ఉండేవి. 27అబ్షాలోముకు ముగ్గురు
కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు. కుమార్తె పేరు
తామారు. తామారు సౌందర్యవతి.

**తనను వచ్చి చూడమని అబ్షాలోము యోవాబును బలవంత పెట్టుట**

28అబ్షాలోము యెరూషలేములో రెండు సంవత్స
రాలున్నాడు. అయినా అతనికి రాజదర్శనం నిరాకరింప
బడింది. 29యోవాబు వద్దకు అబ్షాలోము దూతలను
పంపాడు. ఈ దూతలు అబ్షాలోమును రాజు వద్దకు
పంపమని అడిగారు. కాని యోవాబు అబ్షాలోము వద్దకు
రాకపోయెను. రెండవసారి మరొక దూతను అబ్షా
లోము పంపాడు. అయినా యోవాబు రావటానికి
నిరాకరించాడు. 30దానితో అబ్షాలోము తన సేవకులను
పిలిచి ఇలా అన్నాడు: "చూడండి; యోవాబు పొలం
నా పొలానికి పక్కనే వున్నది. తన పొలంలో యవల
ధాన్యం పండివుంది. వెళ్లి ఆ యవలధాన్యాన్ని తగుల
బెట్టండి."
ఆ మాట మీద అబ్షాలోము సేవకులు వెళ్లి
యోవాబు పొలంలో పంటకు నిప్పుపెట్టారు.
31యోవాబు లేచి అబ్షాలోము ఇంటికి వెళ్లి, "నీ సేవ
కులు నా పంటను ఎందుకు తగులబెట్టారు" అని
అడిగాడు.
32యోవాబుతో అబ్షాలోము ఇలా అన్నాడు: "నీకు
నేను వర్తమానం పంపాను. ఇక్కడికి నిన్ను రమ్మ
న్నాను. నేను నిన్ను రాజు వద్దకు పంపాలని అను
కున్నాను. గెషూరు నుండి నన్ను ఆయన ఎందుకు
రప్పించాడో నిన్ను పంపి అడిగించాలనుకున్నాను.
నేను ఆయనను చూడలేను. కావున ఈ పరిస్థితుల్లో
నేను గెషూరుకు పోయి అక్కడవుండటం మంచిది!
ఇప్పుడు నాకు రాజదర్శనం ఏర్పాటు చేయుము.
నేను పాపం చేస్తే ఆయన నన్ను చంపవచ్చు!"

**అబ్షాలోము దావీదు రాజును దర్శించటం**

33అప్పుడు యోవాబు రాజు వద్దకు వచ్చి అబ్షా
లోము అన్న మాటలన్నీ చెప్పాడు. రాజు అబ్షాలో
మును పిలిపించగా, అబ్షాలోము వచ్చాడు. అబ్షాలోము
రాజు ముందు సాష్టాంగపడి నమస్కరించాడు. అప్పుడు
రాజు అబ్షాలోమును ముద్దు పెట్టుకున్నాడు.

**అబ్షాలోము అనేకులను స్నేహితులుగా చేసుకోవటం**

15 ఇదంతా అయిన పిమ్మట అబ్షాలోము తనకై
ప్రత్యేకంగా ఒక రథాన్ని మరియు గుర్రములను
సమకూర్చుకున్నాడు. తన రథం సాగుతూ వుండగా
ముందు వెళ్లటానికి ఏబది మంది సైనికులను ఏర్పాటు
చేసుకున్నాడు. 2అబ్షాలోము ఉదయం పెందలకడ
లేచి నగర ద్వారం* వద్ద నిలబడేవాడు. అక్కడికి ఎవ
రైనా ఏదైనా సమస్యపై న్యాయం కోరుతూ దావీదు
రాజు కొరకు వస్తే, అబ్షాలోము వారిని పిలిచేవాడు.
వారిని "ఏ నగరం నుండి వచ్చినారని" అడిగేవాడు.
"ఇశ్రాయేలు వంశాలలో ఒకడినని" ఆ వచ్చినవాడు
చెప్పేవాడు. 3అందుకు అబ్షాలోము "చూడు, నీవు
నిజమే చెప్తున్నావు. కాని దావీదు రాజు నీవు చెప్పేది
వినడు" అని అనేవాడు.
4అబ్షాలోము ఇంకా ఇలా అనేవాడు, "ఓహో, ఈ
రాజ్యంలో నన్నెవరైనా న్యాయాధిపతిగా చేయాలని
నేను ఆశిస్తున్నాను. న్యాయం కోరుతూ ఎవరు ఏ
సమస్యతో వచ్చినా వారికి తగిన న్యాయం నేనప్పుడు

---

**రెండు వందల తులములు** ఆంగ్లేయ తూనిక ప్రకారం ఐదు పౌనులు. లేక ఆనాటి రాజకొలమానం ప్రకారం రెండు వందల షెకెములు.

**నగర ద్వారం** ఈ నగర ద్వారం వద్దనే ప్రజలంతా తమ తమ వ్యాపారం నిర్వహించేవారు. ఇక్కడే న్యాయస్థానం కూడా ఏర్పాటు చేయబడి ప్రజల లావాదేవీలు తీర్చబడేవి.

చేయగలుగుతాను. వచ్చిన వాని సమస్యకు తగిన
పరిష్కారం కనుగొని సహాయం చేయగలుగుతాను.
5ఎవరైనా అబ్షాలోము వద్దకు వచ్చి ప్రణమిల్లి నమ
స్కరించబోతే, అతను వాని కొరకు ముందుకు వెళ్లి,
అతనిని ఆదరంగా తన వద్దకు తీసుకొనేవాడు. తరువాత
ఆ వచ్చిన వానిని అతను స్నేహపూర్వకంగా ముద్దు
పెట్టుకొనేవాడు. 6దావీదు రాజు వద్దకు న్యాయం కోసం
ఇశ్రాయేలు నుండి ఎవరు వచ్చినా అబ్షాలోము అలా
చేసేవాడు. ఈ రకంగా ఇశ్రాయేలు ప్రజలందరి
హృదయాలనూ అబ్షాలోము గెలిచాడు.

## దావీదు రాజ్యాన్ని కైవశం చేసుకోటానికి అబ్షాలోము పథకం

7నాలుగేండ్ల* తరువాత దావీదు రాజుతో అబ్షా
లోము ఇలా అన్నాడు: "హెబ్రోనులో నేను వుండగా
యెహోవా వాకి నేను మొక్కుకున్నాను. దయచేసి ఆ
మొక్కు చెల్లించటానికి నన్ను వెళ్లనీయండి. 8గతంలో
నేను సిరియ దేశమందలి గెషూరులో వుండగా
మొక్కాను. నన్ను యెహోవా మరల యెరూషలే
ముకు తీసుకొని వస్తే యెహోవాను ఆరాధించెదనని
మొక్కు కున్నాను."
9"ప్రశాంతంగా వెళ్లిరా!" అని దావీదు రాజు
అన్నాడు.
అబ్షాలోము హెబ్రోనుకు వెళ్లాడు. 10కాని అబ్షా
లోము వేగుల వారిని ఇశ్రాయేలు వంశాల వారందరి
వద్దకు పంపాడు. వారు వెళ్లి ప్రజలలో, "మీరు బాకా
నాదం విన్నప్పుడు అబ్షాలోము హెబ్రోనులో
రాజయ్యాడు!" అని కేకలు పెట్టమన్నాడు.
11అబ్షాలోము తనతో వెళ్లటానికి రెండువందల
మందిని ఆహ్వానించాడు. యెరూషలేము నుండి
వారంతా అత నితో వెళ్లారు. కాని అతడు ఏమి యుక్తి
పన్నుతున్నాడో వారికి తెలియదు.
12అహీతోపెలు దావీదు సలహాదారులలో ఒకడు.
అహీతోపెలు గీలో పట్టణవాసి. అబ్షాలోము బలులు
సమర్పించేటప్పుడు అతడు అహీతో పెలునుగీలో
పట్టణం నుంచి రమ్మని కబురు పంపాడు. అబ్షాలోము
పన్నినయుక్తులన్నీ సక్రమంగా సాగుతున్నాయి.
ప్రజలు అబ్షాలోమును అధిక సంఖ్యలో బలపర్చ
నారంభించారు.

## అబ్షాలోము పథకం గురించి దావీదు వినటం

13ఈ వార్త దావీదుకు చెప్పటానికి ఒక వ్యక్తి
వచ్చాడు. "ఇశ్రాయేలు ప్రజలు అబ్షాలోమును అనుస
రించటం మొదలు పెట్టారు" అని అతడు చెప్పాడు.
14అది విని దావీదు యెరూషలేములో తనతో ఉన్న
సేవకులను పిలిచి ఇలా చెప్పాడు: "మనం ఇప్పుడు
అవశ్యంగా తప్పించుకోవాలి! మనం అలా చేయకపోతే
అబ్షాలోము మనల్ని వదిలిపెట్టడు. అబ్షాలోము మనల్ని
పట్టుకొనే లోపు మనం త్వరపడాలి. అతడు మనంద
రినీ నాశనం చేస్తాడు. అతడు ఇశ్రాయేలు ప్రజలను
కత్తితో నరికి చంపుతాడు."
15"మీరు ఏమి చేయాలని మాకు చెపుతారో మేమది
చేస్తాము" అని రాజు యొక్క సేవకులు అన్నారు.

## దావీదు, అతని మనుష్యులు తప్పించుకోటం

16రాజు (దావీదు) తన ఇంటి వారందరితో కలిసి
బయటికి పోయాడు. రాజు తన ఉంపుడుగత్తెలలో
పది మందిని ఇంటిని చూస్తూ వుండేటందుకు వదిలి
పెట్టాడు.
17తన ప్రజలందరూ వెంటరాగా రాజు బయలుదేరి
వెళ్లాడు. వారు చివరి ఇంటివద్ద ఆగారు. 18సేవకులంతా
రాజు ముందునుంచి వెళ్లారు. కెరేతీయులు, పెలేతీ
యులు మరియు గిత్తీయులు (ఆరు వందల మంది
గాతువారు) అందరూ రాజు ముందు నుంచి నడిచి
వెళ్లారు.
19గిత్తీయుడైన ఇత్తయిని చూచి రాజు, "నీవెందుకు
మాతో వస్తున్నావు ? తిరిగిపోయి, కొత్త రాజుతో
(అబ్షాలోము) వుండిపో. నీవు పరదేశీయుడవు. ఇది
నీ స్వదేశం కాదు. 20నిన్న మాత్రమే నీవు నన్ను
కలియటానికి వచ్చావు. ఇప్పుడు నీవు నాతో కలిసి
వివిధ ప్రాంతాలు తిరిగే అవసరం వుందా ? లేదు.
తిరిగి వెళ్లిపో. నీ సోదరులను కూడ నీతో తీసుకొని
వెళ్లు. దయ, విశ్వాసం నీకు అండగా వుండుగాక!"
అని అన్నాడు.
21కాని ఇత్తయి రాజుకు సమాధానమిస్తూ,
"యెహోవా జీవము తోడుగా, నీ జీవము తోడుగా
నేను నీతోనే వుంటాను! చావుబతుకుల్లో కూడ నేను
నీతోనే వుంటాను!" అని అన్నాడు.
22"అయితే మనం కిద్రోను వాగు దాటుదాము,"
అన్నాడు రాజు ఇత్తయితో.
అప్పుడు గిత్తీయుడైన ఇత్తయి తన వారితోను,
వారి పిల్లలతోను కిద్రోను వాగు దాటాడు. 23ప్రజ
లంతా* బిగ్గరగా ఏడ్వసాగారు. రాజు (దావీదు) కిద్రోను
వాగు దాటాడు. అప్పుడు వారంతా ఎడారివైపు
ప్రయాణం సాగించారు.
24సాదోకు, తనతో వున్న తదితర లేవీయు
లందరూ దేవుని ఒడంబడిక పెట్టెను మోసుకొని వస్తూ
వున్నారు. వారు దేవుని పెట్టెనుదించారు. ప్రజలంతా
యెరూషలేము నగరం నుండి వెళ్లిపోయే వరకు

---

**నాలుగేండ్లు** కొన్ని ప్రాచీన రచనలలో నలభై ఏండ్లని వున్నది.

**ప్రజలంతా** "దేశమంతా" అని పాఠాంతరము.

అబ్యాతారు ప్రార్థన* చేస్తూవున్నాడు. 25సాదోకుతో
రాజు (దావీదు) ఈ విధంగా చెప్పాడు: “దేవుని పవిత్ర
పెట్టెను యెరూషలేముకు తిరిగి తీసుకొని వెళ్లు. ఒక
వేళ యెహోవా నన్నను గ్రహించితే, ఆయన నన్ను
యెరూషలేముకు తిరిగి తీసుకొని వస్తాడు. యెహోవా
మరల నన్ను యెరూషలేమును, ఆయన దేవాల
యమును చూసేలా చేస్తాడు. 26కాని దేవుడు నేనంటే
ఇష్టంలేదని చెప్పితే ఆయన నాకు వ్యతిరేకంగా తన
ఇష్టం వచ్చినట్లు చేయగలడు.”
27యాజకుడు సాదోకుతో రాజు ఇంకా ఇలా
అన్నాడు: “నీవు దీర్ఘదర్శివి.* నగరానికి ప్రశాంతంగా
వెళ్లు. నీ కుమారుడైన అహిమయస్సును, అబ్యాతారు
కుమారుడైన యోనాతానును నీతో తీసుకొని వెళ్లు.
28ప్రజలు ఎడారిలోకి ప్రవేశించే స్థలంలో నేను మీ
నుండి మళ్లీ సమాచారం వచ్చేవరకు వేచి వుంటాను.”
29కావున సాదోకు, అబ్యాతారు దేవుని పవిత్ర
పెట్టెను తీసుకొని యెరూషలేముకు తిరిగి వెళ్లి అక్కడ
వుండి పోయారు.

### అహీతోపెలుకు వ్యతిరేకంగా దావీదు ప్రార్థించుట

30దావీదు ఒలీవల పర్వతం మీదికి వెళ్లాడు. అతడు
ఏడుస్తూవున్నాడు. తలమీద ముసుగు వేసికొని,
చెప్పులు కూడ లేకుండ వెళ్లాడు. దావీదుతో వున్న
మనుష్యులంతా కూడ తలపై ముసుగు వేసుకున్నారు.
వారు ఏడుస్తూ దావీదు వెంట వెళ్లారు.
31ఒక వ్యక్తి దావీదు వద్దకు వచ్చి, “అబ్షాలోముతో
కలిసి పథకం వేసిన వారిలో అహీతోపెలు ఒకడు”
అని చెప్పాడు. అది విని దావీదు యెహోవాకు “అహీ
తోపెలు సలహా నిరుపయోగమయ్యేలా చేయమని
నిన్ను వేడుకుంటున్నాను” అని ప్రార్థన చేశాడు.
32దావీదు పర్వతం పైకి వెళ్లాడు. తరుచూ అతను
అక్కడ దేవుని ఆరాధించేవాడు. ఆ సమయంలో అర్కీ
యుడైన హూషై అనువాడు దావీదు వద్దకు వచ్చాడు.
హూషై చొక్కా చిరిగివుంది. వాని తలపై దుమ్ము*
వుంది.
33దావీదు హూషైతో ఇలా అన్నాడు: “నీవు నాతో
వస్తే నేను శ్రద్ధ తీసుకోవలసిన వారిలో నీవొకడివవు
తావు.
34కాని నీవు యెరూషలేము నగరానికి వెళితే, అహీ
తోపెలు సలహాను ఎందుకూ కొరగానిదిగా నీవు
చేయగలవు. అబ్షాలోముతో: ఓ రాజా, నేను నీ సేవకు
డను. నేను నీ తండ్రిని సేవించాను. కాని ఇప్పుడు
నిన్ను సేవింపవచ్చాను, అని చెప్పు. 35యాజకులైన
సాదోకు, అబ్యాతారు నీకు తోడుగా వుంటారు. రాజ
గృహంలో నీవు విన్నదంతా వారికి తప్పక చెప్పాలి.
36సాదోకు కుమారుడు అహిమయస్సు, అబ్యాతారు
కుమారుడు యోనాతాను వారికి తోడుగా వుంటారు.
నీవు విన్నదంతా వారికి చెప్పి పంపితే, వారు వచ్చి
నాకు తెలియజేస్తారు.”
37అప్పుడు దావీదు స్నేహితుడు హూషై నగరానికి
వెళ్లాడు. అబ్షాలోము కూడ నగరానికి చేరియున్నాడు.

### సీబా దావీదును కలవటం

16 ఒలీవల పర్వతం మీద దావీదు కొంతవరకు
వెళ్లాడు. అక్కడ మెఫీబోషెతు సేవకుడైన
సీబా దావీదును కలిశాడు. సీబా వెంట గంతలు కట్టిన
రెండు గాడిదలున్నాయి. గాడిదల మీద రెండు వందల
రొట్టెలు, ఒక వంద ఎండు ద్రాక్షాగుత్తులు, ఒక వంద
అంజూరపు పండ్లు, ఒక ద్రాక్షారసపు తిత్తివున్నాయి.
2రాజు (దావీదు) సీబాతో, “ఇవన్నీ ఎందుకు?” అని
అన్నాడు.
“ఈ గాడిదలు రాజకుటుంబంవారు ఎక్కటానికి.
ఈ రొట్టెలు, పండ్లు సేవకులు తినటానికి. ఎడారిలో
ఎవరైనా అలసిపోతే ఈ ద్రాక్షారసం తాగి సేద తీర్చు
కోవచ్చు” అని సీబా అన్నాడు. 3“మెఫీబోషెతు*
ఎక్కడ? అని రాజు అడిగాడు.
“మెఫీబోషెతు యెరూషలేములోనే వుంటున్నాడు.
ఎందువల్లనంటే ఈ రోజు ఇశ్రాయేలీయులు తన
తాత* రాజ్యాన్ని అతనికి తిరిగి ఇచ్చి వేస్తారని ఆశి
స్తూవున్నాడు!” అని రాజుకు సీబా సమాధానం
చెప్పాడు.
4“సరే, మంచిది. మెఫీబోషెతుకు చెందినదంతా
ఇప్పుడు నేను నీకు ఇస్తాను” అని రాజు సీబాతో
చెప్పాడు.
అది విని సీబా, “మీకు నేను నమస్కరిస్తున్నాను.
మీకు నేనిలా సదా సంతృప్తిని చేకూర్చగలనని ఆశిస్తు
న్నాను” అని అన్నాడు.

### దావీదును షిమీ శపించటం

5దావీదు బహూరీముకు వచ్చాడు. బహూరీము
నుండి సౌలు కుటుంబానికి చెందిన వాడొకడు బయ
టికి వచ్చాడు. వాని పేరు షిమీ. అతను గెరా అనువాని
కుమారుడు. దావీదును గురించి చెడు మాటలు

---

**ప్రార్థన** పైకి వెళ్లాడని ఒక అర్థం. అంటే “ధూపం వేయుట,” “బలులు యిచ్చుట” అని కూడ చెప్పవచ్చును. లేక సమానార్థంలో అబ్యాతారు ప్రజలంతా వెళ్లేవరకు పేటికకు ఒకపక్క నిలబడినాడని చెప్పవచ్చు.

**దీర్ఘదర్శి** ప్రవక్తకు మరో పేరు.

**చొక్కా ... దుమ్ము** విషాద సూచకం.

**మెఫీబోషెతు** “నీ యజమాని మనుమడు” అని పాఠాంతరం.

**తాత** “తండ్రి” అని పాఠాంతరం.

మాట్లాడుతూ వాడు బయటికి వచ్చాడు. అతడలా
పదే పదే నిందిస్తూ వచ్చాడు.
6దావీదు మీదికి, అతని సేవకుల మీదికి రాళ్లు
విసరటం మొదలు పెట్టాడు. కాని దావీదుతో వున్న
మనుష్యులు, సైనికులు దావీదు చుట్టూ చేరారు.
చూట్టూ చేరి రక్షణ కల్పించారు. 7షిమీ దావీదును
తిట్టాడు. "బయ టికి పో! బయటికి పో! నీవు మంచి
వాడవు కావు. హంతకుడవు!"* అంటూ తిట్టాడు.
8"యెహోవా నిన్ను శిక్షిస్తాడు! ఎందువల్లననగా నీవు
సౌలు కుటుంబంలోని మనుష్యులను చంపావు! రాజైన
సౌలు స్థానాన్ని నీవు సంగ్రహించావు!* కాని
యెహోవా ఇప్పుడు రాజ్యాన్ని నీ కుమారుడైన
అబ్షాలోముకు ఇచ్చాడు! నీవు చేసిన చెడు కార్యాలన్నీ
ఇప్పుడు నీకే జరుగుతున్నాయి! ఎందువల్లననగా
నీవొక హంత కుడవు!"
9సెరూయా కుమారుడైన అబీషై రాజుతో, "నా
ప్రభువైన రాజును ఈ చచ్చిన కుక్క ఎందుకు తిట్టాలి?
నన్ను వెళ్లి షిమీ తల నరికివేయనీయండి!" అని
అన్నాడు.
10అందుకు రాజు ఇలా అన్నాడు: "సెరూయా
కుమారులారా నేనేమి చేయగలను! నిజానికి షిమీ
నన్ను దూషిస్తున్నాడు! కాని యెహోవా వానిచేత
నన్ను శపిస్తున్నాడు!"
11దావీదు తన సేవకులతోను, అబీషైతోను ఇంకా
ఈ విధంగా అన్నాడు, "చూడండి, నా స్వంత కుమా
రుడే నన్ను చంపజూస్తున్నాడు! బెన్యామీనీయుడైన
ఈ మనుష్యుడు (షిమీ) నన్ను చంపటానికి ఇంకా
ఎక్కువ హక్కు కలిగి వున్నాడు! అతనిని అలా వదిలి
వేయండి. నన్ను గురించి చెడ్డ మాటలు వానిని చెప్ప
నీయండి. యెహోవాయే ఇవన్నీ వానిచేత పలికి
స్తున్నాడు. 12బహుశః యెహోవా నాకు జరుగుతున్న
అన్యాయాన్ని కూడా గమనిస్తూ వుండవచ్చు. బహుశః
యెహోవాయే నాకు మేలు చేయవచ్చు. ఈ రోజు
షిమీ చెప్పే చెడ్డ మాటలన్నిటికీ భిన్నంగా ఏదో ఒక
మంచి నాకు జరుగవచ్చు!"
13కావున దావీదు తన మనుష్యులతో కలిసి తన
దారిన వెళ్లిపోయాడు. కాని షిమీ దావీదును అనుసరి
స్తూనే ఉన్నాడు. కొండ పక్కగా దారికి ఆవలివైపున
నడుస్తూ ఉన్నాడు. దారి పొడవునా షిమీ దావీదును
దూషిస్తూనే ఉన్నాడు. అంతేగాకుండా దావీదు మీదకు
రాళ్లు రువ్వటం, దుమ్ము జల్లటం కూడ చేస్తూనే
వున్నాడు.
14రాజైన దావీదు, అతని అనుచరులు బహూరీము
అను చోటికి చేరారు. వారంతా బాగా అలసిపోయారు.
వారు బహూరీము వద్ద విశ్రమించారు. 15అబ్షాలోము,
అహీతోపెలు, తదితర ఇశ్రాయేలీయులు యెరూషలే
ముకు వచ్చారు. 16అర్కీయుడు, దావీదు స్నేహితుడు
అయిన హూషై అబ్షాలోము వద్దకు వచ్చి "రాజు
వర్ధిల్లు గాక! రాజు వర్ధిల్లు గాక!" అని అన్నాడు.
17"నీ స్నేహితుడు దావీదుపట్ల నీవు ఎందుకు
రాజభక్తి కలిగియుండలేదు? నీ స్నేహితునితో కలిసి
యెరూషలేమును విడిచి ఎందుకు పోలేదు?" అని
అబ్షాలోము అడిగాడు.
18హూషై ఇలా అన్నాడు: "యెహోవా ఎవరిని
ఎన్నుకుంటాడో నేను ఆయన మనిషిని. ఈ మను
ష్యులు, ఇశ్రాయేలు ప్రజలు నిన్ను ఎంపికచేశారు.
నేను నీతోనే వుంటాను. 19గతంలో నేను నీ తండ్రికి
సేవచేశాను. సరే, ఇప్పుడు నేను ఎవరికి సేవ చేయాలి?
దావీదు కుమారునికి! అందువల్ల నేను నీకు సేవ
చేస్తాను."

### అబ్షాలోము అహీతోపెలును సలహా అడగటం

20"దయచేసి ఇప్పుడు మనం ఏమి చేయాలో
చెప్పు" అని అబ్షాలోము అహీతోపెలును అడిగాడు.
21అబ్షాలోముతో అహీతోపెలు ఇలా అన్నాడు: "నీ
తండ్రి తన యొక్క దాసీలను కొంత మందిని ఇల్లు
చూస్తూ ఉండమని వదిలి వెళ్లాడు. నీవు వెళ్లి వారితో
సాంగత్యము చేయుము. దానితో ఇశ్రాయేలీయు
లందరూ నీ తండ్రి నిన్నసహ్యించు కుంటున్నాడని
వింటారు. అప్పుడు నీకు మద్దతు యివ్వటానికి నీ
ప్రజలందరికీ తగిన ప్రోత్సాహం దొరుకుతుంది."
22తరువాత అబ్షాలోము కొరకు మిద్దె మీద ఒక
డేరా వేశారు. అక్కడ తన తండ్రి దాసీలతో అబ్షాలోము
సంగమించాడు. ఇశ్రాయేలీయులంతా ఇది చూశారు.
23ఆ కాలంలో అహీతోపెలు సలహా దావీదు, అబ్షా
లోము లిరువురూ చాలా ముఖ్యమైనదిగా భావించే
వారు. ఒక వ్యక్తికి దేవుని మాట ఎంత ముఖ్యమో,
అహీతోపెలు సలహా కూడా అంత విలువగలదిగా
ఉండేది.

### దావీదు విషయంలో అహీతోపెలు సలహా

17 అహీతోపెలు అబ్షాలోముతో ఇంకా యిలా
అన్నాడు: "ఇప్పుడు నన్ను పన్నెండు వేల
మంది సైనికులను ఎంపిక చేసుకోనీయ్యి. ఈ రాత్రికి
నేను దావీదును వెంటాడతాను. 2అతడు బాగా అలసి
పోయి బలహీన పడ్డాక నేనతనిని పట్టుకుంటాను.
అతనిని బెదరగొడతాను. దానితో అతనితో ఉన్న
వారంతా పారిపోతారు. నేను రాజైన దావీదును
మాత్రమే చంపుతాను. 3తరువాత ప్రజలందరినీ నేను
నీ వద్దకు తీసుకొని వస్తాను. నీవు వెదకుతున్న వ్యక్తి
(దావీదు) గనుక చనిపోతే, మిగిలిన ప్రజలంతా

---

**హంతకుడవు** రక్తదాహంగలవాడవని పాఠాంతరం.

**సంగ్రహించావు** "తీసుకున్నావని" శబ్దార్థం.

శాంతంగా తిరిగి వస్తారు.” 4ఈ పథకం అబ్షాలోముకు,
మిగిలిన ఇశ్రాయేలు నాయకులకు మంచిదనిపించింది.
5అయినా అబ్షాలోము, “అర్కీయుడైన హూషైని పిల
వండి. అతడేమి చెపుతాడో కూడా నేను వినదలిచాను”
అని అన్నాడు.

## అహీతోపెలు సలహాను హూషై వమ్ము చేయటం

6అబ్షాలోము వద్దకు హూషై వచ్చాడు. అహీతో
పెలు సలహాను హూషైకు అబ్షాలోము వివరించాడు.
దానిని అనుసరించవచ్చా? లేదా? తెలియజెప్ప
మన్నాడు.
7హూషై ఈ విధంగా చెప్పాడు, “అహీతోపెలు
ఇచ్చిన సలహా ఈ సమయంలో మంచిది కాదు.” 8నీ
తండ్రి, అతని మనుష్యులు చాలా గట్టివారని నీకు
తెలుసు. పొలాల్లో తన పిల్లల్ని పోగొట్టుకున్న ఎలుగు
బంటివలె వారు మహా కోపంతో వున్నారు. నీ తండ్రి
బహు నేర్పరియైన యోధుడు. అతను రాత్రంతా తన
మనుష్యులతో కలిసి వుండడు. 9బహుశః ఈ పాటికి
ఆయన ఏ గుహలోనో, మరొక చోటనో దాగి వుండ
వచ్చు. నీ తండ్రి గనుక నా మనుష్యులను ముందుగా
ఎదుర్కొంటే, ప్రజలందరికీ ఆ వార్త తెలిసిపోతుంది.
అబ్షాలోము అనుచరులు ఓడి పోతున్నారని వారంతా
అనుకుంటారు! 10సింహాల్లా ధైర్యంగా వుండే నీ మను
ష్యులు కూడ చెదరిపోయే అవకాశం వుంది. ఎందువల్ల
ననగా ఇశ్రాయేలీయులంతా నీ తండ్రి బలవంతుడైన
యోధుడనీ, ఆయన మనుష్యులు మంచి ధైర్యవంతు
లనీ ఎరుగుదురు!
11“నేను చెప్పేదేమంటే ఇప్పుడు నీవు దానునుండి
బెయేర్షెబా* వరకు వున్న ఇశ్రాయేలీయులనందరినీ
చేరదియ్యి. సముద్ర తీరాన ఇసుక రేణువుల్లా నీ వద్ద
అనేక మంది ప్రజలు వుంటారు. అప్పుడు నీకై నీవే
యుద్ధానికి వెళ్ల వచ్చు. 12అతను దాగివున్న చోటు
లోనే మనం దావీదును పట్టుకోవచ్చు. భూమి మీదకు
మంచు పడినట్లు మనం దావీదు మీద పడవచ్చు.
దావీదును, అతని మనుష్యులందరినీ మనం చంప
వచ్చు. వారిలో ఏ ఒక్కడూ వదిలిపెట్టబడడు. 13ఒకవేళ
దావీదు నగరంలోకి తప్పించుకుంటే, ఇశ్రాయేలీయు
లంతా తాళ్లు పట్టుకు వస్తారు. ఆ నగరాన్నంతా మనం
లోయలోకి లాగి వేద్దాం ఇక ఆ నగరంలో ఒక్క
చిన్న రాయి కూడ మిగలదు!”
14“అర్కీయుడైన హూషై ఇచ్చిన సలహా అహీతో
పెలు సలహాకంటె చాలా బాగుందని,” అబ్షాలోము,
ఇతర ఇశ్రాయేలీయులంతా అన్నారు. ఇదంతా
యెహోవా ఏర్పాటు గావున, వారంతా అలా చెప్పారు.
యెహోవా అహీతోపెలు ఇచ్చిన మంచి సలహాను
వ్యర్థంచేయ సంకల్పించాడు. ఆ విధంగా అబ్షాలోమును
శిక్షింప జూశాడు.

## హూషై దావీదుకు ఒక హెచ్చరిక పంపటం

15హూషై ఈ విషయాలన్నీ యాజకులైన
సాదోకు మరియు అబ్యాతారుకు చెప్పాడు. అబ్షాలో
ముకు, ఇశ్రాయేలు నాయకులకు అహీతోపెలు
యిచ్చిన సలహాను కూడ హూషై వారికి చెప్పాడు.
అంతే గాకుండా తను ఏ సలహా ఇచ్చినది కూడా
సాదోకు, అబ్యాతా రులకు హూషై వివరించాడు.
హూషై ఇలా అన్నాడు: 16“త్వరగా దావీదుకు ఒక
వర్తమానం పంపండి. ప్రజలు ఎక్కడెక్కడైతే ఎడారి
లోకి ప్రవేశిస్తారో ఆయా ప్రాంతాలలో దావీదును
ఈ రాత్రికి వుండవద్దని చెప్పండి. కాని యొర్దాను
నదిని తక్షణమే దాటి వెళ్లమనండి. వారు నదిని గనుక
దాటినట్లయితే రాజు, ఆయన అనుచరులు పట్టు
బడరు.” 17యాజకుల కుమారులైన యోనాతాను
మరియు అహిమయస్సు కలిసి ఏన్ రోగేలు దగ్గర
వేచివున్నారు. వాళ్లు నగరంలోకి వెళ్తున్నట్లు ఎవరూ
చూడ కూడదనుకున్నారు. కావున ఒక పనిపిల్ల వారి
వద్దకు వచ్చింది. ఆమె వారికి ఒక సమాచారం అంద
జేసింది. తరువాత యోనాతాను, అహిమయస్సులు
ఇరువురూ రాజైన దావీదు వద్దకు వెళ్లి అన్ని
విషయాలూ చెప్పారు.
18అయినా ఒక బాలుడు యోనాతానును, అహిమ
యస్సును చూశాడు. వాడు అబ్షాలోముకు చెప్పటానికి
పరుగున పోయాడు. ఇది గమనించిన యోనాతాను,
అహిమయస్సు వెంటనే పారిపోయారు. వారు బహూరీ
ములో ఒకని ఇంటికి వెళ్లారు. ఆ ఇంటివాని ఆవర
ణలో* ఒక బావి వున్నది. యోనాతాను, అహిమ
యస్సు ఆ బావిలోకి దిగారు. 19ఇంటివాని భార్య బావి
మీద ఒక దుప్పటి కప్పి వేసింది. ఆమె మళ్లీ దాని
మీద ధాన్యం పోసింది. అప్పుడా బావి ఒక ధాన్యపు
రాశిలా కన్పించింది. అందువల్ల యోనాతాను, అహి
మయస్సు అందులో దాగి వున్నారని ఎవరూ అను
కోరు. 20అబ్షాలోము సైనికులు ఆ ఇంటి యజమాను
రాలి వద్దకు వచ్చి “అహిమయస్సు, యోనాతాను
ఎక్కడ వున్నారు?” అని అడిగారు.
“వాళ్లు అప్పుడే వాగు దాటి పోయారని” ఆ స్త్రీ
అబ్షాలోము మనుష్యులకు చెప్పింది. అబ్షాలోము మను
ష్యులు యోనాతాను, అహిమయస్సులను వెదు

---

**దానునుండి బెయేర్షెబా** అనగా ఇశ్రాయేలు జనులందరనీ అర్థం. దాను ఇశ్రాయేలుకు ఉత్తర సరిహద్దుల్లోను, బెయేర్షెబా దక్షిణానగల పట్టణాలు.

**ఇంటివాని ఆవరణ** ఆ చుట్టు పక్కల చాలా మంది ఇండ్లు నిర్మించుకొని, వంటలు వండుకోవటానికి, పని చేసుకోవటానికి మరియు తినటానికి ఉపయోగించుకొంటారు.

క్కుంటూ పోయారు. కాని వారిద్దరినీ వారు కనుగొన
లేదు. అందుచే అబ్షాలోము సైనికులు యెరూషలే
ముకు తిరిగి వెళ్లిపోయారు.
21అబ్షాలోము మనుష్యులు వెళ్లిపోయిన తరువాత
యోనాతాను, అహిమయస్సు బావిలో నుండి బయటికి
వచ్చారు. జరిగినదంతా రాజైన దావీదుకు వారు
చెప్పారు. వారు దావీదుతో, "త్వరపడండి. నదిని దాటి
వెళ్లండి! మీకు వ్యతిరేకంగా అహీతోపెలు ఇవన్నీ
చేస్తున్నాడు" అని అన్నారు.
22దావీదు, అతని మనుష్యులు యొర్దాను నదిని
దాటి వెళ్లారు. సూర్యోదయానికి ముందే దావీదు,
అతని అనుచరులు యొర్దాను నదిని దాటారు.

### అహీతోపెలు ఆత్మహత్య చేసుకోవటం

23ఇశ్రాయేలీయులు తన సలహా పాటించలేదని అహీ
తోపెలు గమనించాడు. అహీతోపెలు తన గాడిదపై
గంతవేసి దానిపై తన నగరానికి వెళ్లాడు. తన కుటుంబ
పోషణకు తగిన ఏర్పాట్లు చేసి అహీతోపెలు ఉరిపోసు
కొని చనిపోయాడు. అహీతోపెలు చనిపోయినాక అతని
శవాన్ని అతని తండ్రి సమాధిలో పాతిపెట్టారు.

### అబ్షాలోము యొర్దాను నదిని దాటటం

24దావీదు మహనయీముకు చేరాడు. అబ్షాలోము,
అతనితో ఉన్న ఇశ్రాయేలీయులు యొర్దాను నదిని
దాటారు. 25అబ్షాలోము తన సైన్యాధి కారిగా అమాశాను
నియమించాడు. అంటే యోవాబు స్థానాన్ని అమాశా
ఆక్రమించాడు.* ఇత్రా అనేవాని కుమారుడు అమాశా.
ఇత్రా ఇష్మాయేలీయుడు* అమాశా తల్లి పేరు అబీగ
యీలు. ఈమె సెరూయా* సోదరియగు నాహాషు
కుమార్తె. (సెరూయా యోవాబు తల్లి)
26అబ్షాలోము, ఇశ్రాయేలీయులు గిలాదు రాజ్యంలో
గుడారాలు వేసుకున్నారు.

### షోబీ, మాకీరు, బర్జిల్లయి

27దావీదు మహనయీముకు చేరాడు. షోబీ, మాకీరు
మరియు బర్జిల్లయి అక్కడ వున్నారు. (నాహాషు
కుమారుడైన షోబీ అమ్మోనీయుల రాజధానియగు
రబ్బాకు చెందినవాడు. అమ్మీయేలు కుమారుడైన
మాకీరు లోదెబారుకు చెందినవాడు. బర్జిల్లయి అను
వాడు గిలాదులోని రోగెలీము పట్టణవాసి) 28-29"ఎడా
రిలోవున్న ప్రజలు అలసిపోయి ఆకలిదప్పులు గొని
యున్నారు" అని వారు చెప్పినారు. అందువల్ల దావీదు,
అతని మనుష్యులు తినటానికి వారు అనేక పదార్థాలు
పట్టుకువచ్చారు. వారు పరుపులు, పాత్రలు, కుండలు
తెచ్చారు. వారింకా గోధుమలు, యవలు, పిండి, వేపిన
ధాన్యం, కాయగూరలు, ఎండబెట్టిన గింజలు, తేనె,
వెన్న, గొర్రెలు, ఆవుపాల మీగడ మొదలైనవన్నీ
తెచ్చారు.

### దావీదు యుద్ధ సన్నాహం

18 దావీదు తన మనుష్యులను లెక్కబెట్టాడు.
సహస్రదళాధిపతులను, శత దళాధిపతులను
తన సైన్యాన్ని నడిపేందుకు ఎంపిక చేశాడు. 2దావీదు
తన సైన్యాన్ని మూడు గుంపులుగా విభజించాడు.
తరువాత దావీదు వారిని బయలుదేరదీశాడు. మూడో
వంతు సైన్యాన్ని యోవాబు నడిపించాడు. యోవాబు
సోదరుడైన సెరూయా కుమారుడగు అబీషై రెండవ
గుంపును, గాతువాడైన ఇత్తయి మూడవ దళాన్ని
నడిపించారు.
"నేను కూడ మీతో వస్తాను" అని రాజైన దావీదు
ఆ జనంతో అన్నాడు.
3కాని ప్రజలు వద్దన్నారు. "వద్దు! నీవు మాతో
రాకూడదు! మేము గనుక యుద్ధరంగం నుండి పారి
పోతే, అబ్షాలోము మనుష్యులు ఏమీ లెక్కచేయరు.
మాలో సగం మంది చనిపోయినా వారు పట్టించుకోరు.
కాని నీవు మాలాంటి పదివేల మందికి సమానం. కావున
నీవు నగరంలోనే వుండటం మంచిది. మాకు సహాయం
కావలసి వచ్చినప్పుడు నీవు మాకు సహాయపడవచ్చు"
అని అన్నారు.
4"సరే, మీరు ఏది మంచిదని తలిస్తే నేనది చేస్తాను"
అని రాజు ప్రజలతో అన్నాడు.
తరువాత రాజు నగర ద్వారం పక్కన నిలబడ్డాడు.
సైన్యం బయటికి వెళ్లింది. వారంతా వందేసి, వెయ్యేసి
మంది జట్లుగా బయటికి వెళ్లారు.

### "యువకుడైన అబ్షాలోము పట్ల ఉదారంగా వుండండి!"

5యోవాబు, అబీషై మరియు ఇత్తయికి రాజు,
"నా కొరకు ఈ పని చేయండి. యువకుడైన అబ్షా
లోము పట్ల ఉదారంగా ప్రవర్తించండి!" అని ఒక ఆజ్ఞ
ఇచ్చాడు.
సైన్యాధిపతులకు రాజు యిచ్చిన ఆజ్ఞలను ఆ
ప్రజలంతా విన్నారు.

---

**యోవాబు ... ఆక్రమించాడు** యోవాబు ఇంకా దావీదునే బలపరుస్తూ ఉన్నాడు. అబ్షాలోమునుండి దావీదు పారిపోయేనాటికి దావీదు ముగ్గురు సైన్యాధికారులలో యోవాబు ఒకడు. చూడండి సమూయేలు రెండవ గ్రంథం 18:2.

**ఇష్మాయేలీయుడు** ఒక ప్రాచీన అనువాదంలో ఇష్మాయేలీయుడని వుంది. (మొదటి దినవృత్తాంతములు 2:17) హెబ్రీ గ్రంథంలో ఇశ్రాయేలీయుడని వుంది.

**సెరూయా** "సెరూయా సోదరియగు నాహాషుకు కుమార్తెయైన అబీగయీలుతో ఇత్రా సంగమించెను" అని పాఠాంతరము.

## దావీదు సైన్యం అబ్షాలోము సైన్యాన్ని ఓడించటం

6అబ్షాలోము తరపున వచ్చిన ఇశ్రాయేలీయుల పైకి
దావీదు సైన్యం రణరంగంలోకి ప్రవేశించింది. ఎఫ్రా
యిము అరణ్యంలో వారు పోరాడారు. 7దావీదు సైన్యం
ఇశ్రాయేలీయులను ఓడించింది. ఆ రోజు ఇరవై వేల
మంది చనిపోయారు. 8యుద్ధం దేశవ్యాప్తంగా జరిగింది.
ఆ రోజు కత్తివేటుకు చచ్చిన వారికంటే అడవిలో
చిక్కుకొని చనిపోయిన వారి సంఖ్య ఎక్కువగా ఉంది.
9అబ్షాలోము దావీదు సేవకులను కలవటం జరి
గింది. అబ్షాలోము తప్పించుకు పోవటానికి ఒక కంచర
గాడిదను ఎక్కాడు. ఆ కంచర గాడిద పెద్ద సింధూర
వృక్షం కొమ్మల కిందుగా వెళ్లింది. కొమ్మలు చిక్కగా
అల్లుకొని ఉన్నాయి. అబ్షాలోము తల ఆ కొమ్మల్లో
చిక్కుకు పోయింది. తన కంచర గాడిద తన కింద
నుంచి పారిపోయింది. ఆ విధంగా అబ్షాలోము భూమికి
పైగా* వేలాడుచున్నాడు.
10ఇది జరగటం ఒక వ్యక్తి చూశాడు. అతడు పోయి
యోవాబుతో, "అబ్షాలోము సింధూర వృక్షం
కొమ్మల్లో చిక్కుకొని వేలాడటం నేను చూశాను!"
అని చెప్పాడు. 11"మరి నీవతనిని ఎందుకు చంపి
కిందపడేలా చేయలేదు ? నీకు నేను ఒక నడికట్టును
మరియు పది తులముల వెండి ఇచ్చివుండేవాడిని!"
అని యోవాబు అన్నాడు.
12యోవాబుతో అతడిలా అన్నాడు: "నీవు వెయ్యి
తులముల వెండి ఇచ్చినా నేను రాజకుమారుడిని గాయ
పర్చేవాడినికాను. ఎందుకనగా, రాజు నీకు, అబీషైకి,
ఇత్తయికి యిచ్చిన ఆజ్ఞ మేమంతా విన్నాము. 'చిన్న
వాడైన అబ్షాలోమును గాయపర్చకుండా ఉదారంగా
ప్రవర్తించండి' అని రాజు అన్నాడు.
13నేను గనుక అబ్షాలోమును చంపితే రాజు ఎలాగో
తెలుసుకుంటాడు. మళ్లీ నీవే నన్ను శిక్షిస్తావు!"
14"ఈ విధంగా నేను ఇక్కడ నీతో కాలం వృధా
చేయను" అని యోవాబు అన్నాడు.
అబ్షాలోము ఇంకా చెట్టుకు వేలాడుచూ బతికే
వున్నాడు. యోవాబు మూడు ఈటెలను తీసు
కున్నాడు. ఆ ఈటెలను అబ్షాలోము మీదికి విసిరాడు.
ఆ ఈటెలు అబ్షాలోము గుండెను చీల్చుకుంటూ
దూసుకు పోయాయి. 15యోవాబుకు యుద్ధంలో
సహాయపడుతూ అతని వెంట పది మంది యువ
సైనికులున్నారు. ఆ పదిమంది అబ్షాలోము చుట్టూ
చేరి అతనిని చంపివేశారు.
16యోవాబు బూర ఊది, ప్రజలను పిలిచి అబ్షాలో
ముతో వున్న ఇశ్రాయేలీయులను వెంటాడటం ఆపమ
న్నాడు. 17యోవాబు మనుష్యులు అబ్షాలోము శవాన్ని
తీసి అరణ్యంలో ఒక పెద్ద గోతిలో పడవేశారు. ఆ
పెద్ద గోతిని రాళ్లు వేసి పూడ్చి వేశారు. అబ్షాలోము
అనుచరులైన ఇశ్రాయేలీయులంతా భయపడి ఇండ్లకు
పారిపోయారు.
18అబ్షాలోము బ్రతికివున్న రోజుల్లో 'రాజు
లోయలో' ఒక స్తంభం నిర్మించాడు. అప్పుడు అబ్షా
లోము ఇలా అన్నాడు: "నా పేరు చిరస్థాయిగా నిలవ
టానికి నాకు కుమారుడు లేడు" అందువల్ల ఆ స్తంభానికి
తన పేరే పెట్టుకున్నాడు. ఆ స్తంభం ఈనాటికీ "అబ్షా
లోము జ్ఞాపక చిహ్నం" అని పిలవబడుతూ వుంది.

## యోవాబు ఈ వార్తను దావీదుకు పంపటం

19సాదోకు కుమారుడైన అహిమయస్సు యోవా
బుతో, "నన్ను పరుగున పోయి ఈ వార్తను రాజైన
దావీదుకు చెప్పనీయండి. నీ కొరకు శత్రువును
యెహోవా నాశనం చేశాడు" అని చెపుతానన్నాడు.
20అహిమయస్సుతో యోవాబు ఇలా అన్నాడు:
"వద్దు, దావీదుకు ఈ రోజు ఈ వార్తను తీసుకొని
పోవటానికి వీలులేదు. ఇంకొక రోజు ఈ వార్తను చేర
వేయవచ్చు. అంతేగాని ఈ రోజు మాత్రం వద్దు.
ఎందుకంటావా? రాజు యొక్క కుమారుడు చని
పోయాడు గనుక."
21తరువాత కూషీయుడైన ఒకనిని యోవాబు
పిలిచి, "అతను చూసిన విషయాలన్నీ రాజు వద్దకు
వెళ్లి చెప్పమన్నాడు." కూషీయుడు యోవాబుకు
నమస్కరించాడు. తరువాత కూషీయుడు దావీదుకు
వార్త చెప్పటానికి పరుగెత్తాడు. 22కాని సాదోకు కుమారు
డైన అహిమయస్సు యోవాబుతో, "ఏమి జరిగినా
పరవాలేదు. నన్ను కూడా కూషీయుని వెనుక పరు
గెత్తుకు వెళ్లనీయండి!" అని ప్రాధేయపడ్డాడు.
"కుమారుడా! నీవెందుకు వార్త మోసుకొని పోవా
లనుకుంటున్నావు? నీవు తీసుకొని వెళ్లిన ఈ వార్తకు
నీకు ఏ బహుమానమూ లభించదు!" అని యోవాబు
అన్నాడు. 23"ఏమి జరిగినా పరవాలేదు; నేను వేగంగా
వెళతాను," అన్నాడు అహిమయస్సు.
"అయితే పరుగెత్తు!" అన్నాడు యోవాబు అహిమ
యస్సుతో. అప్పుడు యొర్దాను లోయగుండా అహిమ
యస్సు పరుగెత్తాడు. అతడు కూషీయుని దాటి వెళ్లాడు.

## దావీదు వార్త వినటం

24నగర రెండు ద్వారాల మధ్య దావీదు కూర్చుని
వున్నాడు. కావలివాడు ద్వారం మీద వున్న గోడపైకి
వెళ్లి పరిశీలించాడు. దూరాన ఒకడు ఒంటరిగా పరు
గెత్తుకు రావటం చూశాడు. 25ఈ విషయం చెప్పటానికి
కావలివాడు రాజును పిలిచాడు.
"ఒక్కడే గనుక వస్తూవుంటే, వాడు ఏదో వార్త
తెస్తూవున్నాడన్నమాట!" అని దావీదు రాజు అన్నాడు.

---

**భూమికి పైగా** "భూమికి ఆకాశానికి మధ్యగా" అని శబ్దార్థం.

ఆ వ్యక్తి క్రమేపీ నగరాన్ని సమీపించాడు. [26]కావలివాడు ఇంకొక వ్యక్తి రావటం కూడా చూశాడు. పైనున్న కావలివాడు ద్వారపాలకుని పిలిచి, "చూడు! ఇంకొకడు ఒంటరిగా పరుగెత్తుకు వస్తున్నాడు!" అని చెప్పాడు. "అయితే వాడు కూడా వార్త తెస్తున్నాడు!" అని అన్నాడు రాజు.

[27]"మొదటి వ్యక్తి సాదోకు కుమారుడైన అహిమయస్సులా పరుగెత్తుతున్నాడని నేను అనుకుంటున్నాను" అని కావలివాడన్నాడు.

"అహిమయస్సు మంచి వ్యక్తి. అతడేదో మంచి వార్త తెస్తూ వుండవచ్చు!" అని రాజు అన్నాడు.

[28]అహిమయస్సు రాజును పిలిచి, "అంతా బాగున్నది!" అన్నాడు. అహిమయస్సు సాష్టాంగ నమస్కారం చేసి నిలబడ్డాడు. "నీ ప్రభువైన దేవునికి స్తోత్రము. నా ఏలినవాడవైన రాజుకు వ్యతిరేకంగా వున్న వారిని యెహోవా ఓడించాడు," అని అహిమయస్సు చెప్పాడు.

[29]"యువకుడైన అబ్షాలోము క్షేమంగా ఉన్నాడా?" అని రాజు అడిగాడు.

"యోవాబు నన్ను పంపినపుడు అక్కడ పెద్ద కోలాహలం నేను చూశాను. కాని అది ఎందుకో నాకు తెలియదు" అని అహిమయస్సు సమాధానమిచ్చాడు.

[30]"ఇటు పైకి వచ్చి, ఇక్కడ వుండు" అన్నాడు రాజు. అహిమయస్సు పైకి వెళ్లి పక్కన నిలబడి వేచి వున్నాడు.

[31]తరువాత కూషీయుడు వచ్చాడు. "నా ఏలినవాడవైన రాజుకు ఒక వార్త! నీకు వ్యతిరేకులైన ప్రజలను యెహోవా ఈ రోజు శిక్షించాడు" అని చెప్పాడు.

[32]"యువకుడైన అబ్షాలోము క్షేమంగా వున్నాడా?" అని రాజు కూషీయుని అడిగాడు.

"నీ శత్రువులు, నిన్ను గాయపర్చాలని నీకు వ్యతిరేకంగా వచ్చే ఇతర మనుష్యులు ఆ యువకునిలా (అబ్షాలోము) అయిపోతారని నేను అనుకుంటున్నాను" అని కూషీయుడు చెప్పాడు.

[33]దానితో అబ్షాలోము చనిపోయాడని రాజుకు అర్థమయింది. రాజు మిక్కిలి కలతపడిపోయాడు. నగర ద్వారం మీద వున్న గది వద్దకు వెళ్లాడు. అక్కడ బాగా విలపించాడు. గదిలోకి వెళ్లాడు. గదిలోకి పోతూ, "నా కుమారుడా, అబ్షాలోమా! నా కుమారుడా, అబ్షాలోమా! నీ బదులు నేను చనిపోయి వుండవలసింది. ఓ అబ్షాలోమా! నా కుమారుడా, నా కుమారుడా!" అని దుఃఖించాడు.

### దావీదును యోవాబు మందలించటం

19 ప్రజలు ఈ వార్తను యోవాబుకు అందజేశారు. "చూడు, రాజు దుఃఖిస్తున్నాడు. అబ్షాలోము కొరకు చాలా విచారిస్తున్నాడు" అని వారు యోవాబుకు చెప్పారు. [2]ఆ రోజు దావీదు సైన్యం యుద్ధంలో గెలిచింది. కాని అది వారందరికీ మిక్కిలి సంతాప దినంగా మారింది. విషాదమయ దినమయిన కారణమేమనగా "రాజు తన కుమారుని కొరకు మిక్కిలిగా విచారిస్తున్నాడని" ప్రజలంతా విన్నారు.

[3]ప్రజలంతా నిశ్శబ్దంగా నగరంలోకి వచ్చారు. వారంతా యుద్ధంనుండి, పారిపోయి వచ్చిన వారిలా అగుపించారు. [4] రాజు తన ముఖాన్ని కప్పుకున్నాడు. "నా కుమారుడా, అబ్షాలోమా; ఓ అబ్షాలోమా, నా కుమారుడా, నా కుమారుడా!" అని బిగ్గరగా ఏడ్వసాగాడు.

[5]యోవాబు రాజు ఇంటికి వచ్చాడు. యోవాబు రాజుతో ఇలా అన్నాడు: "ఈ రోజు నీవు నీ ముఖాన్ని కప్పుకున్నావు. అంతేగాదు, నీవు నీ సేవకుల ముఖాలన్నీ సిగ్గుతో కప్పివేశావు! ఈ రోజు నీ సేవకులు నీ ప్రాణాన్ని కాపాడారు! వారు నీ కుమారుల ప్రాణాలను, కుమార్తెలను, భార్యలను, నీ దాసీలను – అందరినీ కాపాడారు. [6]నీ సేవకులంతా సిగ్గుతో తలవంచుకున్నారు. కారణమేమంటే నిన్ను అసహ్యించుకునే వారిని నీవు ప్రేమిస్తున్నావు. నిన్ను ప్రేమించేవారిని నీవు అసహ్యించుకుంటున్నావు! నీ క్రింది అధికారులన్నా, నీ మనుష్యులన్నా నీకు లెక్కలేదని ఈ రోజు నీవు స్పష్టంచేశావు. నిజానికి అబ్షాలోము బతికి, మేమంతా చచ్చిపోయి వుంటే నీవు చాలా సంతోషపడి వుండేవాడివని ఈ రోజు నాకు విశదమయింది! [7]లెమ్ము. ఇప్పుడు నీ సేవకులందరితో మాట్లాడి, వారిని ప్రోత్సహించు! నేను యెహోవా మీద ఒట్టుపెట్టి చెప్తున్నాను. నీవు గనుక బయటికి వెళ్లి ఈ పని చేయకపోతే, రాత్రయ్యేసరికి నీతో ఒక్కడు కూడా వుండడు! నీ యవ్వనం నుండి ఇప్పటి వరకు నీవను భవించిన కష్టాలన్నిటికంటె, ఇప్పటి నీ పరిస్థితి చాలా అధ్వాన్నమవుతుంది."

[8]అప్పుడు రాజు నగరద్వారం* వద్దకు వెళ్లాడు. రాజు నగర ద్వారం వద్ద వున్నాడన్న వార్త వ్యాపించింది. అందుచే ప్రజలంతా ఆయనను చూసేందుకు వచ్చారు.

### దావీదు మరల రాజవటం

అబ్షాలోమును అనుసరించిన ఇశ్రాయేలీయు లంతా ఇండ్లకు పారిపోయారు. [9]ఇశ్రాయేలు వంశాల ప్రజలందరూ ఒకరితో ఒకరు చర్చించటం మొదలు పెట్టారు. వారిలా అనుకున్నారు: "రాజైన దావీదు మనల్ని ఫిలిష్తీయులనుండి, తదితర శత్రువుల నుండి కాపాడాడు. దావీదు అబ్షాలోముకు దూరంగా పారిపోయాడు.

---

**నగర ద్వారం** ఇక్కడే బహిరంగ సభలు కూడ జరుగుతాయి.

10మనల్ని పాలించటానికి అబ్షాలోమును ఎన్నుకు
న్నాము. కాని అతనిప్పుడు యుద్ధంలో చనిపోయాడు.
కావున మనం మళ్లీ దావీదును రాజుగా చేసుకోవాలి.”
11దావీదు రాజు యాజకులైన సాదోకుకు, అబ్యా
తారుకు వర్తమానం పంపించాడు. దావీదు వారికిలా
చెప్పాడు: “యూదా నాయకులతో మాట్లాడండి.
వారితో, ‘రాజును (దావీదును) తిరిగి ఇంటికి తీసుకొని
రావటంలో మీరెందుకు వెనుకబడి వున్నారు?
చూడండి. ఇశ్రాయేలీయులంతా రాజును తిరిగి ఇంటికి
తీసుకొని వచ్చే విషయం మాట్లాడుతున్నారు.
12మీరంతా నా సోదరులు. మీరు నా కుటుంబం వారు
అయినప్పుడు రాజును తిరిగి ఇంటికి తీసుకొని
రావటంలో మీరెందుకు చివరివంశం వారవుతున్నారు?’
అని చెప్పండి. 13అమాశాతో, “నీవు నా కుటుంబంలో
భాగస్వామివి. నేను నిన్ను యోవాబు స్థానంలో సైన్యా
ధికారిగా చేయకపోతే దేవుడు నన్ను శిక్షించు గాక!’
అని కూడ చెప్పండి.”
14దావీదు యూదా ప్రజలందరి హృదయాలను
చూరగొన్నాడు. వారంతా ఒకటయ్యేలా చేశాడు.
యూదా ప్రజలు దావీదుకు వర్తమానం పంపారు. “నీ
సేవకు లందరితో కలిసి తిరిగి రమ్ము” అని వారన్నారు.
15అప్పుడు రాజు (దావీదు) యొర్దాను నది వద్దకు
వచ్చాడు. యూదా ప్రజలు రాజును కలవటానికి గిల్గా
లుకు వచ్చారు. వారు రాజును యొర్దాను నదిని
దాటించి తీసుకొని రావటానికి వచ్చారు.

### దావీదును షిమీ క్షమాభిక్ష కోరటం

16గెరా కుమారుడైన షిమీ బెన్యామీను వంశానికి
చెందినవాడు. అతడు బహూరీములో నివసిస్తూండే
వాడు. దావీదు రాజును కలవటానికి షిమీ వేగంగా
ముందుకు వచ్చాడు. యూదా ప్రజలతో కలిసి షిమీ
వచ్చాడు. 17వేయిమంది బెన్యామీనీయులు కూడ
షిమీతో వచ్చారు. సౌలు కుటుంబమువారి సేవకుడు
సీబా కూడా వచ్చాడు. సీబా తన పదునైదుగురు కుమా
రులను ఇరవై మంది సేవకులను తనతో తీసుకొని
వచ్చాడు. వీరంతా దావీదు రాజును కలవటానికి హుటా
హుటిని యొర్దాను నది వద్దకు వెళ్లారు.
18రాజ కుటుంబాన్ని యూదాకు తిరిగి తీసుకొని
రావటంలో సహాయపడటానికి ప్రజలు యొర్దాను
నదిని దాటి వెళ్లారు. రాజు ఏది కోరితే వారది చేయ
సాగారు. రాజు నదిని దాటుతూ వుండగా, గెరా
కుమారుడైన షిమీ ఆయన వద్దకు వచ్చాడు. అతడు
రాజు ముందు సాష్టాంగపడ్డాడు. 19రాజుతో షిమీ ఇలా
అన్నాడు, “నా ప్రభువా, నేను చేసిన పొరపాట్లను
పట్టించుకోవద్దు! నా ప్రభువైన రాజా, నీవు యెరూష
లేము వదిలి వెళ్లే టప్పుడు నేను నీపట్ల చేసిన అపచారా
లను మనసులో పెట్టుకోవద్దు. 20పాపం చేసినట్లు
నేను తెలుసుకున్నాను. అందువల్ల యోసేపు కుటుం
బంలో* నుండి నేను ముందుగా నిన్ను నా ప్రభువైన
రాజును, కలుసుకోవాలని వచ్చాను.”
21కాని సెరూయా కుమారుడైన అబీషై ఇలా
అన్నాడు: “యెహోవాచే అభిషిక్తము చేయబడిన
రాజునకు కీడు జరగాలని కోరుకున్నందుకు షిమీని
మనం తప్పక చంపివేయాలి.”
22దావీదు వారిని వారించి, వారితో, “సెరూయా
కుమారులారా, మీకును - నాకును ఏమి పొందిక!
ఈ రోజు మీరు నాకు వ్యతిరేకులయ్యారు! ఇశ్రాయే
లులో ఏ ఒక్కడూ చంపబడడు. నాకు తెలుసు. ఈ
రోజు నేను ఇశ్రాయేలుకు రాజును!” అని అన్నాడు.
23ఆ తరువాత రాజు షిమీతో, “నీవు చంపబడవు”
అని అన్నాడు. పైగా తనకై తాను షిమీని చంపనని
రాజు అతనికి ప్రమాణం చేసి చెప్పాడు.*

### దావీదు దర్శనానికి మెఫీబోషెతు వెళ్లటం

24సౌలు మనుమడైన మెఫీబోషెతు దావీదు రాజును
కలియటానికి వచ్చాడు. రాజు యెరూషలేము వదిలి
వెళ్లిన నాటినుండి ప్రశాంతంగా తిరిగి వచ్చేవరకు
మెఫీబోషెతు కాళ్లు కడగలేదు; గడ్డం తీసుకోలేదు;
తన బట్టలు కూడ ఉతుకుకొనలేదు. 25మెఫీబోషెతు
రాజును కలవటానికి యెరూషలేము నుండి వచ్చాడు.
రాజు అతనిని చూచి, “మెఫీబోషెతూ, నేను యెరూష
లేము నుండి పారిపోయినప్పుడు నీవెందుకు నాతో
రాలేదు ?” అని అడిగాడు.
26అందుకు మెఫీబోషెతు ఇలా అన్నాడు: “నా
ప్రభువైన రాజా, నా సేవకుడు (సీబా) నన్ను మోసం
చేశాడు! నేను అవిటివాడిని గనుక నా సేవకుడైన
సీబాను పిలిచి, ‘ఒక గాడిదపై గంత కట్టి సిద్ధం చేయ
మన్నాను. దానిపై రాజుతో వెళతానన్నాను.’ 27కాని
నా సేవకుడు నన్ను మోసగించాడు. నా గురించి
నీకు చెడుగా చెప్పాడు. కాని నా ప్రభువైన రాజు దేవ
దూతలాంటివాడు. నీకు ఏది మంచిదనిపించితే అది
చేయుము.
28నా తాత యొక్క కుటుంబాన్నంతటినీ నీవు
చంపగలిగియుండే వాడివి. కాని నీవు అలా చేయ
లేదు. నీ బల్ల వద్ద భోజనం చేసే వారితో కలిసి తినే

**యోసేపు కుటుంబము** బహుశా: వీరు అబ్షాలోమును అను
సరించిన ఇశ్రాయేలీయులు కావచ్చు. ఉత్తర దేశపు వంశాల
న్నిటికీ యోసేపు కుమారుల్లో ఒకడైన ఎఫ్రాయిము పేరు
అనేక పర్యాయాలు వాడబడింది.

**షిమీని ... చెప్పినాడు** షిమీని దావీదు చంపలేదు.
కాని దావీదు కుమారుడు సొలోమోను కొన్ని సంవత్సరాల
తరువాత షిమీని చంపటానికి ఆజ్ఞ యిచ్చాడు. చూడండి
1 రాజులు 2:44-46.

అర్హత నాకు కలిగించావు. కావున దేనిని గురించీ రాజుకు
ఫిర్యాదు చేసే హక్కు నాకు లేదు!"
29"ఇక నీ సమస్యల గురించి ఏమీ చెప్పకు! ఉన్న
భూమిని నీకు, సీబాకు పంచాలని నిర్ణయించాను,"
అని రాజు మెఫీబోషెతుకు చెప్పాడు. 30"సీబానే భూమి
నంతా తీసుకోనిమ్ము! ఎందు వల్లనంటే నా ప్రభువైన
రాజు శాంతంగా ఇంటికి తిరిగి వచ్చాడు గనుక" అని
మెఫీబోషెతు రాజుతో అన్నాడు.

## బర్జిల్లయిని తనతో యెరూషలేముకు రమ్మని దావీదు అడగటం

31గిలాదీయుడగు బర్జిల్లయి రోగెలీ నుండి వచ్చాడు.
అతడు రాజుతో యొర్దాను నదివద్దకు వచ్చాడు.
రాజును నది దాటించటానికి ఆయనతో కూడ వెళ్లాడు.
32బర్జిల్లయి పండు ముదుసలి. అతనికి ఎనభై సంవ
త్సరాలు. మహనయీములో దావీదువుండగా, బర్జిల్లయి
ఆయనకు ఆహారాన్ని, తదితర వస్తువులను సమ
కూర్చాడు. బర్జిల్లయి గొప్ప ధనవంతుడు గనుక ఇవన్నీ
చేయగలిగాడు.
33దావీదు బర్జిల్లయితో ఇలా అన్నాడు, "నాతో
నది దాటిరా, నాతో నీవు యెరూషలేములో నివసిస్తే
నీ పోషణ బాధ్యత నేను తీసుకుంటాను."
34కాని బర్జిల్లయి రాజుతో ఇలా అన్నాడు: "నేను
ఎంత వయో వృద్ధుడనో నీకు తెలుసా? నేను నీతో
యెరూషలేముకు రాగలనని నీవనుకుంటున్నావా?
35నాకు ఎనుబది ఏండ్లు! మంచి చెడుల విచక్షణా
జ్ఞానం కూడా తెలియనంత ముసలి వాడినయ్యాను.
తినటానికి, తాగటానికి రుచులు కూడ తెలియనంత
వయసు మళ్లిన వాడను. గాయనీ గాయకుల స్వరము
వినలేనివాడిని. అటువంటి నన్ను గురించి నీవెందుకు
చింత చేస్తు న్నావు? 36నీ నుండి నేను బహుమతులు
కోరను! నీతో పాటు యొర్దాను నదిని దాటుతాను.
37తరువాత దయచేసి నన్ను తిరిగి వెళ్లి పోనిమ్ము.
అలా నేను నా స్వంత నగరంలో చనిపోయి, నాతల్లి
దండ్రుల సమాధిలో వుంచబడతాను. నీ సేవకుడు
కింహాము ఇక్కడే వున్నాడు. అతనిని నా ప్రభువైన
నీతో తీసుకొని వెళ్లు. అతనితో నీకు ఏ పని కావాలంటే
అది చేయించుకో."
38"కింహాము నాతోనే వస్తాడు. నీ కొరకు అతని
పట్ల నేను దయగలిగి వుంటాను. నీ కొరకు నేనేమైనా
చేస్తాను." అని రాజు సమాధానమిచ్చాడు.

## దావీదు ఇంటికి తిరిగి వెళ్లటం

39రాజు బర్జిల్లయిని ముద్దు పెట్టుకుని ఆశీర్వ
దించాడు. బర్జిల్లయి తిరిగి ఇంటికి వెళ్లిపోయాడు.
రాజు, అతని పరివారం నదిని దాటారు. 40గిల్గాలుకు
వెళ్లటానికి రాజు యొర్దాను నదిని దాటినప్పుడు,
కింహాము కూడ అతనితో వెళ్లాడు. యూదా ప్రజ
లంతా, ఇశ్రాయేలు ప్రజలలో సగంమంది, దావీదును
నది దాటించారు.

## ఇశ్రాయేలీయులు యూదా వారితో వాదించటం

41ఇశ్రాయేలీయులంతా రాజు వద్దకు వచ్చి,
"యూదావారైన మా సోదరులు నిన్ను ఎత్తుకు
పోయారు. మళ్లీ నిన్ను, నీ కుటుంబాన్ని, నీ పరివారాన్నీ
తిరిగి తీసుకొని వచ్చారు! ఎందువలన?" అని
ప్రశ్నించారు.
42యూదా ప్రజలంతా ఇశ్రాయేలీయులకు ఇలా
సమాధానం చెప్పారు: "మేము ఆ విధంగా ఎందుకు
చేశామంటే రాజు మాకు దగ్గర బంధువు కాబట్టి ఈ
విషయంలో మీరు మాపట్ల ఎందుకు కోపంగావున్నారో
తెలియటం లేదు. అయినా రాజు చేత ఖర్చు పెట్టించి
మేము ఏమీ తినలేదు! పైగా రాజు మాకు ఏమీ
బహుమానాలు ఇవ్వనూలేదు!"
43అప్పుడు ఇశ్రాయేలీయులు ఇలా అన్నారు
"రాజును ఎంపిక చేసుకోవటంలో మేము అత్యధిక
సంఖ్యలో పాల్గొన్నాము. దావీదులో మాకు పది భాగా
లున్నాయి.* కావున దావీదుతో వ్యవహారానికి మీకంటె
మాకే ఎక్కువ హక్కు వుంది! కాని మీరు మమ్మల్ని
లక్ష్యపెట్టలేదు! ఎందువల్ల? నిజానికి రాజును తిరిగి
తీసుకొని రావాలని మేమే ముందుగా అనుకున్నాము!"
కాని యూదా ప్రజలు ఇశ్రాయేలీయులతో బాగా
నిందారోపణ చేస్తూ చెడుగా మాట్లాడారు. యూదా
వారి మాటలు ఇశ్రాయేలీయులు అన్నవాటికంటె
చాలా తీవ్రంగా వున్నాయి.

## షెబ ఇశ్రాయేలీయులను దావీదుకు వ్యతిరేకంగా చేయటం

20 బిక్రి కుమారుడైన షెబ అనే పనికిమాలిన
వాడొకడు అక్కడ వుండటం జరిగింది. షెబ
అనేవాడు బెన్యామీను వంశానికి చెందినవాడు. అతడు
బూర వూది,

> "దావీదులో మనకు భాగం లేదు. యెష్షయి
> కుమారునితో మనకేమీ సంబంధం లేదు!
> కావున ఇశ్రాయేలీయులారా, మనమంతా
> మన గుడారాలకు పోదాం పదండి" అని

చెప్పాడు.

---

**దావీదులో ... భాగాలున్నాయి** రాజ్య విభజన జరిగినప్పుడు యూదావారు, బెన్యామీనీయులు కలిసి యూదా రాజ్యంగా ఏర్పడ్డారు. మిగిలిన పది వంశాలవారు ఇశ్రాయేలు రాజ్యంలో ఉండిపోయారు.

2దానితో ఇశ్రాయేలీయులు దావీదును వదిలి, బిక్రి
కుమారుడైన షెబను అనుసరించారు. కాని యూదా
ప్రజలు మాత్రం యొర్దాను నది వద్ద నుండి యెరూష
లేముకు వచ్చేవరకు దారి పొడవునా వారి రాజైన
దావీదుతోనే వున్నారు.
3దావీదు యెరూషలేములోని తన ఇంటికి వచ్చాడు.
గతంలో దావీదు తన ఉపపత్నులను* పది మందిని
ఇల్లు చక్కదిద్దేందుకై వదిలి వెళ్లాడు. ఇప్పుడు దావీదు
ఈ స్త్రీలను ఒక ప్రత్యేకమైన ఇంటిలో వుంచాడు. ఆ
ఇంటికి సైనిక కాపలా ఏర్పాటు చేశాడు. ఆ స్త్రీలు
తమ జీవితాంతం ఆ ఇంటిలోనే వుండిపోయారు.
దావీదు వారికి ఆహారాదులిచ్చాడు గాని, వారితో
సాంగత్యం చేయలేదు. వారి మరణ పర్యంతం ఆ
స్త్రీలు విధవరాండ్రవలె జీవించారు.
4రాజు అమాశాను పిలిచి, "యూదా ప్రజలను
మూడు రోజులలో నన్ను కలవమని చెప్పు. నీవు
కూడా ఇక్కడ వుండాలి" అని అన్నాడు.
5యూదా ప్రజలందరినీ పిలిచి కూడగట్టుకు రావ
టానికి అమాశా వెళ్లాడు. కాని రాజు పెట్టిన గడువుకంటె
అమాశా ఎక్కువ కాలాన్ని తీసుకున్నాడు.

### అబీషైతో షెబను చంపమని దావీదు చెప్పటం

6దావీదు అబీషైని పిలిచి, "బిక్రి కుమారుడైన షెబ
మనకు అబ్షాలోముకంటె ఎక్కువ ప్రమాద కరమైన
మనిషి. కావున నా సైనికులను తీసుకొని షెబను
వెంటాడు. షెబ ప్రాకారాలున్న నగరాలలోనికి తప్పిం
చుకునే ముందుగానే నీవు త్వరపడాలి. షెబ గనుక
ప్రాకారాలున్న నగరాలలోకి వెళ్లినాడంటే ఇక వాడు
మననుండి తప్పించుకున్నట్లే," అని అన్నాడు.
7కనుక యోవాబు మనుష్యులు, కెరేతీయులు,
పెలేతీయులు, తదితర సైనికులు యెరూషలేము
నుండి బయలుదేరి వెళ్లారు. బిక్రి కుమారుడైన షెబను
వారు వెంటాడారు.

### యోవాబు అమాశాను చంపటం

8గిబియోను గుట్ట వద్దకు యోవాబు తన సైని
కులతో వచ్చినప్పుడు అమాశా వారిని కలవటానికి
ఎదురేగాడు. యోవాబు తన సైనిక దుస్తుల్లో వున్నాడు.
నడికట్టు కట్టుకున్నాడు. అతని ఒరలో కత్తి వున్నది.
అమాశాను కలవటానికి యోవాబు ముందుకు వెళ్లాడు.
ఆ సమ యంలో తన ఒరలోని కత్తి జారి కిందపడింది.
యోవాబు ఆ కత్తిని తీసి చేతితో పట్టుకున్నాడు.
9"సోదరా, నీవు క్షేమమేనా?" అని యోవాబు అమాశాను
అడిగినాడు. యోవాబు తన కుడిచేతితో అమాశాను
ముద్దు పెట్టుకునేందుకా అన్నట్టు గడ్డం పట్టు
కున్నాడు. 10యోవాబు చేతిలో వున్న కత్తిని అమాశా
గమనించలేదు. యోవాబు తన కత్తితో అమాశా
పొట్టలో పొడిచాడు. అమాశా పేగులన్నీ బైటకు
వచ్చాయి. యోవాబు మళ్లీ పొడిచే అవసరం లేకుండా
పోయింది–అమాశా అప్పుడే చనిపోయాడు.

### దావీదు మనుష్యులు అదే పనిగా షెబను వెదకుట

యోవాబు, అతని సోదరుడు అబీషై కలిసి బిక్రి
కుమారుడు షెబను తరమటం కొనసాగించారు.
11యోవాబు సైనికులలో యువకుడైన వాడొకడు
అమాశా శవం వద్ద నిలబడ్డాడు. ఆ యువకుడు మిగిలిన
వారి నుద్దేశించి, "మీలో యోవాబును, దావీదును బల
పర్చే ప్రతి ఒక్కడూ యోవాబును అనుసరించి వెళ్లాలి.
షెబను వెంటాడటంలో అతనికి సహాయం చేయండి!"
అని అన్నాడు.
12మార్గ మధ్యంలో అమాశా శవం రక్తపు మడుగులో
పడివుంది. జనమంతా శవాన్ని చూసే నిమిత్తం అక్కడ
ఆగుతూ ఉన్నారు కావున ఆ యువకుడు అమాశా
శవాన్ని ప్రక్కనే వున్న పొలంలోనికి లాగి, దాని మీద
ఒక బట్ట కప్పాడు. 13అమాశా శవం బాట మీద నుంచి
తీసివేయబడిన పిమ్మట జనమంతా యోవాబును అను
సరించారు. బిక్రి కుమారుడు షెబను తరిమేందుకు
వారు యోవాబుతో కలిసి వెళ్లారు.

### ఆబేలు బేత్మయకాకు షెబ తప్పించుకు పోవటం

14బిక్రి కుమారుడు షెబ ఇశ్రాయేలు వంశపు వారు
నివసించే ప్రాంతాల గుండా పోయి ఆబేలు బేత్మయకా
నగరాన్ని చేరాడు. బెరీయులందరూ కూడి షెబను
అనుసరించారు.
15యోవాబు, అతని మనుష్యులు ఆబేలు
బేత్మయకా వద్దకు వచ్చారు. యోవాబు సైన్యం
నగరాన్ని ముట్టడించింది. నగరం చుట్టూవున్న గోడకు
వారు ఒక చోట కందకం పూడ్చి బాగా మట్టి పోశారు.
అలా మట్టి పోయటంతో వారు గోడ దగ్గరకు వెళ్ల
గలిగారు. ఆ గోడను పడగొట్టే ఉద్దేశంతో వారప్పుడు
దానిని పగులగొట్టటం మొదలుపెట్టారు.
16ఇంతలో ఒక వివేకం గల స్త్రీ నగరంలో నుండి
కేకలు పెట్టింది. "నే చెప్పేది వినండి. యోవాబును
ఇక్కడికి రమ్మని చెప్పండి. అతనితో నేను మాట్లాడ
దలిచాను!" అని అరచింది.
17ఆ స్త్రీతో మాట్లాడటానికి యోవాబు దగ్గరగా
వచ్చాడు. "యోవాబువు నీవేనా ?" అని ఆమె అడిగింది.
"అవును. నేనే" అని యోవాబు సమాధానం
చెప్పాడు. "అయితే నేను చెప్పేది విను!" అని ఆ స్త్రీ

---

**ఉపపత్నులు** దావీదు కుమారుడు అబ్షాలోము
దావీదు ఉంపుడుగత్తెలతో సంపర్కం చేశాడు. చూడండి
సమూయేలు రెండవ గ్రంథం 16:21-22.

యోవాబుతో అన్నది. "వింటున్నాను" అని యోవాబు
అన్నాడు.
18ఆ స్త్రీ ఇలా అన్నది, "పూర్వం ప్రజలు 'సలహా
కొరకు ఆబేలులో అడగమని అనే వారు. అప్పుడు
వారి సమస్య తీరిపోయేది. 19శాంతిని కోరే వారిలో,
ఇశ్రాయేలు పట్ల విశ్వాసముగల వారిలో నేనొక దానిని.
ఇశ్రాయేలులో ఒక ముఖ్యనగరాన్ని నీవు నాశనం చేయ
టానికి ప్రయత్నిస్తున్నావు. యెహోవాకి చెందిన
దానిని నీవెందుకు నాశనం చేయ సంకల్పించావు?"
20"లేదు! లేదు! నేను దేనినీ నాశనం చేయదల్చ
లేదు* మీ పట్టణాన్ని నిర్మూలించను. 21కాని ఎఫ్రా
యిము కొండ ప్రాంతము వాడొకడున్నాడు. వాని
పేరు షెబ. అతడు బిక్రి యొక్క కుమారుడు. వాడు
దావీదు రాజుపై తిరుగుబాటు చేశాడు. నీవు గనుక
వానిని నా కప్పగించితే, నేను నగరాన్ని వదిలి పెడ
తాను," అని యోవాబు అన్నాడు.

"అయితే సరే! అతని తల గోడ మీది నుంచి
మీకు విసరివేయబడుతుంది" అని ఆ స్త్రీ యోవాబుతో
అన్నది.
22తరువాత ఆ స్త్రీ నగర ప్రజలందరితో చాలా
యుక్తిగా మాట్లాడింది. అది విని ఆ నగరవాసులు
బిక్రి కుమారుడు షెబ తల నరికి దానిని గోడ మీదుగా
యోవాబుకు విసరివేశారు. అప్పుడు యోవాబు బూర
వూదగా సైన్యం నగరం వదిలి వెళ్లిపోయింది. ప్రతి
వాడూ తన గుడారానికి వెళ్లిపోయాడు. యెరూష
లేములో వున్న రాజు వద్దకు యోవాబు వెళ్లాడు.

### దావీదు కొలువులో ముఖ్యమైన ఉద్యోగులు

23ఇశ్రాయేలు రాజ్యంలో యోవాబు సర్వ సైన్యా
ధ్యక్షుడయ్యాడు. కాని కెరేతీయులకును, పెలేతీయుల
కును యెహోయాదా కుమారుడైన బెనాయా అధి
పతి. 24వెట్టి చాకిరీ వంటి శరీర కష్టం చేసేదండుకు
అదోరాము నాయకత్వం వహించాడు. అహీలూదు
కుమారుడగు యెహోషాపాతు చరిత్రకారుడుగా నియ
మితుడయ్యాడు. 25షెవా ప్రధాన కార్యదర్శిగాను;
సాదోకు, అబ్యాతారు యాజకులుగాను; 26మరియు
యాయీరీయుడగు ఈరా రాజుకు ప్రధానా చార్యుడు
గను వున్నారు.

### గిబియోనీయులు సౌలు కుటుంబాన్ని శిక్షించమని కోరటం

21 దావీదు కాలంలో ఒకసారి కరువు సంభవిం
చింది. ఆ కరువు మూడు సంవత్సరాలు కొన
సాగింది. దావీదు యెహోవాను ప్రార్థించాడు. దావీదు
ప్రార్థన ఆలకించి యెహోవా ఇలా అన్నాడు: "సౌలు,
మరియు అతని హంతకుల కుటుంబం* ఈ కరువుకు
కారణం. ఇప్పుడీ కాటకం (కష్టం) సౌలు గిబియోనీ
యులను చంపివేసినందుకు వచ్చింది."
2(గిబియోనీ యులు ఇశ్రాయేలు వారు కాదు.
చావగా మిగిలిన అమ్మోరీయులకు చెందిన ఒక గుంపు
వారు. ఇశ్రాయేలీయులు వారికి కీడు చేయబోమని
గిబియోనీయులకు* ప్రమాణ పూర్వకంగా చెప్పియు
న్నారు. కాని సౌలు ఇశ్రాయేలీయుల పట్ల, యూదా
వారి పట్ల ప్రేమకలవాడై గిబియోనీయులను చంప
బూనాడు)

దావీదు రాజు గిబియోనీయులను పిలిచాడు.
అతడు వారితో మాట్లాడాడు.
3"నేను మీకు ఏమి సహాయం చేయగలను?
మీరు యెహోవా ప్రజలను* దీవించేలాగున
నేను ఇశ్రాయేలు వారి పాపాన్ని పోగొట్టటానికి
ఏమి చేయాలి?" అని దావీదు గిబియోనీయులను
అడిగాడు.
4"సౌలు, అతని కుటుంబం వారు చేసిన పాపాలకు
పరిహారంగా వెండి బంగారాలు ఇవ్వాలని అడిగే హక్కు
గాని, ఇశ్రాయేలులో ఎవ్వరినైనా చంపే హక్కుగాని
మాకు లేదు" అని గిబియోనీయులు దావీదుతో
అన్నారు.

"అయితే మీకు నేనేమి చేయగలను?" అని దావీదు
అడిగాడు.
5అప్పుడు గిబియోనీయులు దావీదుతో ఇలా
అన్నారు, "సౌలు మాకు వ్యతిరేకంగా కుట్రపన్నాడు.
ఇశ్రాయేలులో మిగిలివున్న మా ప్రజలందరినీ సర్వ
నాశనం చేయాలని ప్రయత్నించాడు.
6సౌలు యెహోవాచే ఎంపిక చేయబడిన
రాజు. కావున అతని ఏడుగురు కుమారులను మా
వద్దకు తీసుకొని రా. వారిని మేము సౌలు యొక్క
గిబియా పర్వతం మీద యెహోవా ఎదుట
ఉరితీస్తాము."

రాజైన దావీదు, "వారిని మీకు నేను అప్ప
గించెద"నని అన్నాడు. 7కాని రాజు యోనాతాను
కుమారుడైన మెఫీబోషెతుకు రక్షణ కల్పించాడు.
(యోనాతాను సౌలు కుమారుడు) ఆ మేరకు
దావీదు యెహోవా పేరు మీద యోనాతానుకు

---

**లేదు ... చేయదల్చలేదు** "అదికాదు, అదికాదు! నేను కబళించాలనిగాని, నాశనం చేయాలనిగాని అనుకోవటం లేదు" అని పాఠాంతరం.

**హంతకుల కుటుంబం** 'రక్త పిశాసుల నిలయం' అని పాఠాంతరం.

**ఇశ్రాయేలీయులు .. గిబియోనీయులకు** యెహోషువ కాలంలో గిబియోనీయులు ఇశ్రాయేలీయులను మోసగించి నపుడు ఇది జరిగింది. చూడండి యెహోషువ 9:3-15.

**యెహోవా ప్రజలను** యెహోవా వారసత్వం అని పాఠాంతరం.

ప్రమాణం* చేసియున్నాడు. అందువల్ల రాజు వారిని
మెఫీబోషెతుకు హాని చేయించలేదు. [8]అయ్యా కుమా
ర్తెయగు రిస్పాకు సౌలువలన పుట్టిన ఇద్దరు కుమారు
లను రాజు తీసుకున్నాడు. వారిద్దరి పేర్లు అర్మోని
మరియు మెఫీబోషెతు* రిస్పా కుమారులైన ఈ
ఇద్దరినీ, మరియు సౌలు కుమార్తెయగు మెరాబునకు
పుట్టిన ఐదుగురు కుమారులను రాజు తీసుకున్నాడు.
(మెహోలాతీయుడగు బర్జిల్లయి కుమారుడైన అద్రీయే
లువలన మెరాబునకు పుట్టిన వారీ ఐదుగురు పుత్రులు)
[9]దావీదు ఈ ఏడుగురు కుమారులను గిబియోనీయు
లకు అప్పగించాడు. అప్పుడు గిబియోనీయులు ఈ
ఏడుగురిని గిబియా పర్వతంమీద యెహోవా సాన్ని
ధ్యంలో ఉరితీశారు. ఈ ఏడుగురు కుమారులు కలిసి
చనిపోయారు. యవల ధాన్యంపంట కోత ప్రారంభ
కాలంలో వారు చంపబడ్డారు.

**రిస్పా తన కుమారుల శవాలకు కాపలా వుండటం**

[10]అయ్యా కుమార్తె రిస్పా విషాద సూచకమైన ఒక
వస్త్రం తీసుకొని కొండ* మీద పరచింది. ఆ వస్త్రం
పంట కోతలు మొదలు పెట్టినప్పటి నుండి దానిమీద
వర్షం పడే వరకు ఆ కొండ మీద పర్చబడివుంది.
పగటి వేళ పక్షులు వచ్చి తన కుమారుల శవాలను
ముట్టకుండా రిస్పా చూచేది. రాత్రిళ్లు పొలాల్లో నుంచి
జంతువులు వచ్చి కుమారుల శవాలను ముట్ట
కుండగనూ కాపాడేది.

[11]అయ్యా కుమార్తెయు, సౌలు దాసి అగు రిస్పా
చేస్తున్నదంతా ప్రజలు దావీదుకు చెప్పారు. [12]అప్పుడు
దావీదు యాబేష్గిలాదు వారి నుండి సౌలు యొక్కయు,
యోనాతాను యొక్కయు ఎముకలను తీసుకున్నాడు.
(యాబేషు వారు ఈ ఎముకలను బేత్షానులోని ప్రధాన
వీధి నుండి దొంగిలించారు. బేత్షానులోని ఈ వీధిలోనే
గతంలో ఫిలిష్తీయులు సౌలు, యోనాతానుల శవాలను
వేలాడదీశారు. గిల్బోవ వద్ద సౌలును చంపిన తరువాత
ఫిలిష్తీయులు ఆ శవాలను వేలాడ దీశారు) [13]దావీదు
గిలాదు నుంచి సౌలు యొక్కయు, అతని కుమారుడైన
యోనాతాను యొక్కయు ఎముకలను తెచ్చినాడు.
తరువాత ప్రజలు ఉరి తీయబడిన సౌలు యొక్క
ఏడుగురి కుమారుల శవాలను సేకరించారు. [14]బెన్యామీ
నులోని సేలా అనేచోట సౌలు యొక్క, అతని కుమా
రుడు యోనాతాను యొక్క ఎముకలను వారు పాతి
పెట్టారు. శవాలను మాత్రం సౌలు తండ్రి కీషు సమాధి
యందు వారు పాతిపెట్టారు. రాజు యొక్క ఆజ్ఞాను
సారం ప్రజలు ఇవన్నీ చేశారు. రాజ్యంలోని ప్రజల
ప్రార్థన దేవుడు ఆలకించాడు.

**ఫిలిష్తీయులతో యుద్ధం**

[15]దావీదుతో ఫిలిష్తీయులు మరల యుద్ధానికి
దిగారు. దావీదు తన సైన్యంతో ఫిలిష్తీయులతో
యుద్ధం చేయటానికి తరలివెళ్లాడు. కాని దావీదు బాగా
అలసిపోయి బలహీనపడిపోయాడు. [16]ఇష్బిబె నోబ
అనే రెఫాయీముల సంతతి వాడొకడున్నాడు. ఇష్బిబే
నోబ ఈటె మూడు వందల షెకెలుల* ఇత్తడి ప్రమా
ణంలోవుంది. వానికొక కొత్త కత్తి కూడావున్నది. వాడు
దావీదును చంపయత్నించాడు. [17]కాని సెరూయా
కుమారుడైన అబీషై ఆ ఫిలిష్తీయుని చంపి, దావీదు
ప్రాణం కాపాడాడు. అప్పుడు దావీదు మనుష్యులు
అతనికి ఒక ప్రమాణం చేశారు. "ఇకమీదట నీవు
యుద్ధాలు చేయటానికి బయటికి వెళ్లరాదు. ఒక వేళ
వెళితేమాత్రం నీవు చంపబడతావు. దానితో ఇశ్రాయేలు
ఒక మహానాయకుని* కోల్పోతుంది," అని చెప్పారు.

[18]తరువాత గోబు వద్ద ఫిలిష్తీయులతో మరో
యుద్ధం జరిగింది. అందులో హుషాతీయుడైన సిబ్బెకై
రెఫాయీముల సంతతివాడగు సపునుచంపాడు. సపు
భయంకరాకారుడు. [19]ఫిలిష్తీయులతో గోబువద్ద మరో
యుద్ధం జరిగింది. అక్కడ ఎల్హానాను అనువాడు గిత్తీ
యుడైన గొల్యాతును* సంహరించాడు. ఎల్హానాను
బేత్లెహేము వాడైన యహరేయోరెగీము అనువాని
కుమారుడు. గొల్యాతు ఈటె సాలి వాని దోనెవలె
మందంగా, పొడవుగావుంది. [20]గాతువద్ద మళ్లీ యుద్ధం
జరిగింది. అక్కడ మహా కాయుడొకడున్నాడు. వాని
కాళ్లకు, చేతులకు ఒక్కొక్కదానికి ఆరేసివ్రేళ్ల చొప్పున
మొత్తము ఇరవై నాలుగువున్నాయి. అతడు రాక్షసాకారు
లగు రెఫాయీముల సంతతివాడు. [21]ఈ మనుష్యుడు
ఇశ్రాయేలీయులపై యుద్ధానికి కాలుదువ్వాడు.

---

**దావీదు ... ప్రమాణం** దావీదు, యోనాతాను ఒకరి కుటుం బాలను మరియొకరు నాశనం చేయకూడదని ప్రమాణాలు చేసుకొనియున్నారు. చూడండి సమూయేలు మొదటి గ్రంథం 20:12-23,42.

**మెఫీబోషెతు** ఈ మెఫీబోషెతు సౌలు కుమారుడైన యోనాతాను పుత్రుడు కాదు.

**అయ్యా కుమార్తె ... కొండ** ఇది గిబియోనులో ఉండే పెద్ద కొండ అయివుండవచ్చు ఇక్కడ కొండ అంటే అర్థం కొండమీద శవాలు పడివున్న చోటు అనిగాని; ఆమె కుమా బీరులు పాతిపెట్టబడిన చోటు అనిగాని అర్థం చెప్ప వచ్చు.

**మూడు వందల షెకెలు** ఆంగ్లేయ తూకం ప్రకారం పదిహేడున్నర పౌనులు.

**ఒక మహానాయకుని** ఇశ్రాయేలుకు వెలుగునిచ్చే జ్యోతిని నీవు ఆర్పివేసిన వాడవవుతావు అని శబ్దార్థం.

**గిత్తీయుడైన గొల్యాతు** ఈ ఫిలిష్తీయుడు గొల్యాతు సోదరుడు. ఇతని పేరు లహ్మీ. చూడండి దినవృత్తాంతం మొదటి గ్రంథం 20:5.

దావీదు సోదరుడైన షిమ్యా కుమారుడు యోనాతాను
వానిని చంపివేశాడు. 22ఈ నలుగురూ గాతుకు చెందిన
భీకరుడైన రెఫా సంతతివారు. వీరంతా దావీదువలన,
అతని సైనికుల వలన చంపబడ్డారు.

### దావీదు యెహోవాను స్తుతించడం

22 యెహోవా దావీదును సౌలు నుండి, తదితర
శత్రువుల బారి నుండి తప్పించాడు. ఆ సంద
ర్భాన్ని పురస్కరించుకుని దావీదు ఈ స్తుతిగీతం
ఆలపించాడు:

యెహోవా నా కొండ, నా కోట, నా రక్షకుడు!
3 సహాయంకొరకు నేనాయనను ఆశ్రయిస్తాను!
ఆయన నా రక్షణ దుర్గం! దేవుడు నా రక్షణ
స్థలం! ఆయన శక్తి నన్ను రక్షిస్తుంది*!
యెహోవా నా ఉన్నత దుర్గము ఆయన నా
భద్రమైన తావు. నాకు కీడు రాకుండా కాపాడే
రక్షకుడు!
4 యెహోవా స్తుతింపబడుగాక! ఆదుకొమ్మని
యెహోవాను వేడుకున్నాను దేవుడు నా శత్రు
వుల బారి నుండి నన్ను రక్షించును!
5 మృత్యు తరంగాలు నన్ను చుట్టుముట్టాయి,
కష్టాలు ముంచుకొచ్చాయి. అవి నన్ను బెదర
గొట్టాయి!
6 సమాధి ఉచ్చులు నాచుట్టూ బిగిశాయి, మృత్యు
మాయలో చిక్కుకున్నాను!
7 నేను కష్టాల ఊబిలో వున్నాను. అయినా నేను
యెహోవాని అర్థించాను. అవును, నేను నా
దేవుని పిలిచాను! ఆయన తన ఆలయంలో
వున్నాడు, ఆయన నా మొరాలకించాడు; నా
ఆక్రందన ఆయన చెవులను చేరింది.
8 భూమి విస్మయం చెంది, కంపించింది, పర
లోకపు పునాదులు కదిలి పోయాయి,
యెహోవా కోపావేశుడైన కారణాన!
9 ఆయన ముక్కు రంధ్రాల నుండి పొగబారింది,
ఆయన నోటి నుండి అగ్ని శిఖలు వెలువడ్డాయి.
10 ఆకాశమును ఛేదించుకొని ఆయన భువికి దిగి
వచ్చాడు! ఆయన ఒక కారు మేఘముపై నిల
బడ్డాడు!
11 యెహోవా కెరూబు దూతల మీద వేగంగా
వచ్చాడు; అవును, ఆయన గాలి రెక్కలపై పయ
నించటం ప్రజలు చూసారు!
12 యెహోవా కారుచీకటిని తన చుట్టూ డేరావలె
కప్పుకున్నాడు. ఆయన వానమబ్బులను
ఆకాశంలో పోగు చేస్తాడు.
13 ఆయన తేజస్సు బొగ్గులను మండింప చేసింది!
14 యెహోవా ఆకాశంలో గర్జించాడు ఆ సర్వోన్న
తుడు మాట్లాడాడు!
15 యెహోవా బాణములు వేసి శత్రువులను చెల్లా
చెదరు చేశాడు. యెహోవా మెరుపులను ప్రస
రింప చేశాడు, వారు భయకంపితులై పారి
పోయారు
16 అప్పుడు ప్రజలు సముద్రపు అడుగును చూడ
గలిగారు, భూమి పునాదులు బహిర్గతమ
య్యాయి.! యెహోవా గర్జించగా అవన్నియూ
జరిగాయి, ఆయన నాసికారంధ్రముల నుండి
వెలువడిన వేడిగాల్పులకు అలా జరిగాయి!
17 యెహోవా ఆకాశం నుండి చేయిచాచి నన్ను
పట్టుకున్నాడు! అనంత జలరాసుల నుండి
నన్ను వెలికి తీశాడు;
18 నాబద్ధ శత్రువు నుండి, నన్ను ద్వేషించు వారి
నుండి ఆయన నన్ను కాపాడాడు. నా శత్రువులు
నిజానికి నా శక్తికి మించిన వారు, కావున వారి
నుండి ఆయన నన్ను కాపాడాడు!
19 నా కష్టకాలంలో శత్రువులు నన్నెదిరించగా
యెహోవా నన్నాదుకున్నాడు!
20 నాకు నిర్భయత్వమును కలుగ జేశాడు. ఆయ
నకు నేను ప్రీతిపాత్రుడను గనుక ఆయన నన్ను
కాపాడాడు. నేను న్యాయ బద్ధమైన పనులు
చేయుటచే యెహోవా నన్ను సత్కరించాడు;
21 యెహోవా నన్ను సత్కరించాడంటే నా చేతులు
పాపం చేయక పరిశుద్ధంగా వున్నాయి!
22 అంటే, యెహోవా యొక్క న్యాయ మార్గాన్ని
నేననుసరించాను!
23 యెహోవాయొక్క తీర్పులు నిత్యం నా మదిలో
మెదలుతూనే ఉంటాయి. ఆయన ఆజ్ఞలను
నేనెన్నడూ విడనాడను.
24 దేవుని ముందు నేను దోషిని కాను; నేను పాపానికి
దూరంగా ఉంటాను!
25 అందువల్లనే యెహోవా నాకు ప్రతిఫల
మిచ్చును. ఎందుకంటే, నేను న్యాయబద్ధంగా
నివసిస్తాను! దేవుడు గమనించేలా నేను నిష్కళంక
జీవితాన్ని గడుపుతాను.
26 నిన్నొక వ్యక్తి ప్రేమిస్తున్నాడంటే, నీవు నీ ప్రేమా
నురాగాలను వానికి పంచి ఇస్తావు! ఒక వ్యక్తి నీ
పట్ల నిజాయితీగా వుంటే నీవు కూడా అతని
పట్ల సత్యసంధుడవై వుంటావు!
27 ఎవరైనా నీ పట్ల సత్ప్రవర్తనతో మెలగితే, నీవు
కూడ అతని పట్ల సద్భావం చూపిస్తావు! కాని
ఎవరైనా నీకు ప్రతికూలంగా వుంటే, నీవు కూడ
ప్రతికూలుడవై వుంటావు!
28 ఆపదలోవున్న వారిని నీవు ఆదుకుంటావు, కాని

---

**ఆయన శక్తి నన్ను రక్షిస్తుంది** ఆయనే నాకు మోక్ష
మార్గం అని పాఠాంతరం.

గర్వాంధులను తిరస్కరిస్తావు. గర్వముగల వానిని
అవమానిస్తావు పొగరు బోతులను నేలరాస్తావు!
29 యెహోవా, నీవు నాకు వెలుగైయున్నావు.
యెహోవా నా చుట్టూ అలుముకొన్న చీకటిని
పారదోలి వెలుగు నిస్తావు.
30 మూకుమ్మడిగా మీద పడే సైనికులను చెండా
డేలా నాకు సహాయపడ్డావు. దేవుడిచ్చిన శక్తితో,
నేను ప్రాకారాలను దూక గలను!
31 దేవుని మార్గము దోషరహితమైనది; యెహోవా
మాట పొల్లుపోనిది. తనను శరణుజొచ్చిన ప్రతి
వానినీ యెహోవా రక్షిస్తాడు.
32 యెహోవాను మించిన దేవుడు లేడు; మన
దేవునిలా కొండ వంటి మరో అండలేదు.
33 దేవుడు నా రక్షణ దుర్గం; సన్మార్గుల జీవన
మార్గంలో దేవుడు నడచి మార్గదర్శకుడ
వుతాడు!
34 జింక కాళ్ల వేగాన్ని దేవుడు నాకు ప్రసాదిస్తాడు!
ఉన్నత స్థలాల మీద నన్ను నిలకడగా నిలు
పుతాడు.
35 దేవుడు నాకు యుద్ధానికి శిక్షణ యిస్తాడు. నా
చేతులు ఇత్తడి విల్లంబును వంచి వేయగలవు.
36 డాలువలె నీవు నన్ను రక్షిస్తావు! నీ సహాయం
నన్ను ఉన్నతుని చేసింది!
37 నా పాదాలు తడబడకుండా నీవు నా మార్గాన్ని
విశాలం చేశావు.
38 నేను నా శత్రువులను తరిమి, వారిని నాశనం
చేశాను! వారిని సర్వనాశనం చేసేదాకా నేను
వెనుకకు తిరుగను;
39 నేను నా శత్రువులను నాశనం చేశాను, నేను
వారిని పూర్తిగా సంహరించాను! వారు మరల
తలయెత్తే అవకాశం లేదు! అవును, నేను నా
శత్రువులను నా కాలరాశాను!
40 ఎందువల్లననగా నీవు నన్ను యుద్ధంలో బల
వంతునిగా చేశావు. నీవే నా శత్రువులను
ఓడించినావు.
41 నా శత్రువులు పరుగెత్తి పోయేలా నీవు చేశావు!
నన్ను అసహ్యించుకునే వారిని నేను ఓడిస్తాను!
42 నా శత్రువులు సహాయం కోసం తల్లడిల్లగా వారిని
ఆదుకొనే వారొక్కరూ లేకుండిరి!
43 నా శత్రుమూకను తుత్తునియలు చేశాను! వారు
నేలమీది ధూళిలా చితికిపోయారు; నా శత్రువులు
వీధిలోని బురదగా మారేలాగు వారిని నా
పాదములతో అణగ ద్రొక్కాను.
44 నా ప్రజలు నన్ను వ్యతిరేకించినప్పుడు కూడా
నీవు నన్ను కాపాడావు! నన్ను రాజ్యాలకు అధి
పతిగా చేశావు; నాకు తెలియని ప్రజలు నన్ను
సేవిస్తారు!
45 ఇతర రాజ్యాల ప్రజలు నాకు విధేయులవుతారు!
నా పేరు వినినంతనే వారు విధేయులవుతారు.
46 అన్య రాజ్యాల వారు నేనంటే భయపడతారు;
భయకంపితులై వారి రహస్య స్థావరాల నుండి
బయటికి వస్తారు!
47 యెహోవా నిత్యుడు! కొండంత అండ అయిన
నా దేవుని నామమును కీర్తించండి! ఆయనను
సర్వోన్నతునిగా స్వీకరించండి! ఆయన నన్ను
కాపాడే కొండ;
48 నా కొరకు నా శత్రువులను దండించే దేవుడు,
ప్రజలను నా పాలనలోకి తెచ్చు వాడాయన;
49 నా శత్రువుల నుండి నన్ను విముక్తి చేయు
వాడు ఆయనే! అవును, నా శత్రువులకు మిన్నగా
నన్ను ఉన్నతుని చేశావు! నన్ను గాయపర్చను
ద్దేశించిన వాని నుండి నన్ను రక్షించావు.
50 యెహోవా! అన్ని రాజ్యాల సమక్షంలో నీకు
స్తోత్రములు అర్పిస్తున్నాను!
51 ఆయన నియమించిన రాజుకు దిగ్వి జయం
కలిగేలా యెహోవా సహాయపడతాడు; ఆయన
అభిషిక్తము చేసిన రాజైన దావీదుకు, అతని సంత
తికి అనంతంగా దేవుడు తన ప్రేమానురాగాలను
పంచి ఇస్తాడు!

## దావీదు తుది పలుకులు

23 ఇవి దేవునిచే ఉన్నతుడుగా చేయబడిన వ్యక్తి,
యాకోబు దేవునిచే అభిషిక్తము చేయబడిన
రాజు, ఇశ్రాయేలు మధుర గాయకుడు, యెష్షయి
కుమారుడు అయిన దావీదు పలికినతుది పలు
కులు. దావీదు ఇలా అన్నాడు:
2 యెహోవా ఆత్మ నా ద్వారా మాట్లాడినది.
ఆయన పలుకే నా నోటిలో వున్నది.
3 ఇశ్రాయేలు దేవుడు మాట్లాడాడు, ఇశ్రాయే లుకు
ఆశ్రయదుర్గమైన దేవుడు నాతో యిలా
అన్నాడు: "ఏ వ్యక్తి ప్రజలను న్యాయమార్గాన
పరి పాలిస్తాడో," "ఏ వ్యక్తి దైవ భీతితో పరిపాలన
సాగిస్తాడో"
4 "ఆ వ్యక్తి అరుణోదయ కాంతిలా ప్రకాశిస్తాడు, ఆ
వ్యక్తి మబ్బులేని ప్రాతఃకాలంలా ప్రశాంత గంభీ
రంగా వుంటాడు, లేతగడ్డిని చిగురింపజేయు వర్షా
నంతర సూర్యకాంతిలా ఆ వ్యక్తి ప్రకాశిస్తాడు."
5 గతంలో దేవుడు నా కుటుంబాన్ని బలపర్చ
లేదు.తరువాత దేవుడు నాతో ఒక శాశ్వత ఒడం
బడిక చేశాడు. అది సమగ్రమైన నిబంధనగా
దేవుడు రూపొందించాడు. ఈ ఒడంబడికను
దేవుడు బలపర్చాడు. దానిని ఆయన ఉల్లంఘిం
చడు! ఈ ఒడంబడిక నాకు మోక్ష సాధనం;

నేను కోరినదల్లా ఈ ఒడంబడికనే; ఖచ్చితంగా
యెహోవా దానిని వర్ధిల్లేలాగు చేస్తాడు!
6 కాని దుష్టులు ముండ్లవంటి వారు. జనులు
ముండ్లనుచేతబట్టరు. వాటిని తక్షణం విసర్జిస్తారు!
7 వాటిని ఎవరు తాకినా కర్ర, ఇనుము బల్లెము
లతో గుచ్చివేసినట్లవుతుంది. దుష్టులు కూడ
ముండ్ల వంటి వారు వారు అగ్నిలో తోయబడి
పూర్తిగా దహింపబడతారు.

## ముగ్గురు వీరులు

8దావీదు సైన్యంలో ప్రముఖుల పేర్లు ఇలా
వున్నాయి:
తక్మోనీయుడగు యోషేబెష్షెబెతు ముగ్గురు
యోధుల అధిపతి. ఎస్నీయుడైన అదీనా అని కూడ
ఇతడు పిలవబడేవాడు. యోషేబెష్షెబెతు ఒక్క యుద్ధం
లోనే ఎనిమిది వందల మందిని చంపివేశాడు.
9అహోహీయుడైన దోదో కుమారుడు ఎలియా
జరు తరువాత ప్రముఖుడు. దావీదు ఫిలిష్తీయులను
ఎదిరించిన కాలంలో అతనితో వున్న ముగ్గురు యోధు
లలో ఎలియాజరు ఒకడు. ఒక పర్యాయము ఫిలిష్తీ
యులు గుమిగూడి ఇశ్రాయేలీయుల మీదికి యుద్ధానికి
రాగా, ఇశ్రాయేలీయులు పారిపోయారు. 10అప్పుడు
ఎలియాజరు మాత్రము అలసిపోయేవరకు ఫిలిష్తీయు
లతో ఒంటరిగా పోరాడాడు. తన చెయ్యి కత్తి పిడికి
అంటుకుపోయేలా గట్టిగా పట్టుకుని విడవకుండా శత్రు
సంహారం చేశాడు. ఆ రోజు యెహోవా ఇశ్రాయేలీ
యులకు గొప్ప విజయాన్ని సమకూర్చిపెట్టాడు.
ఎలియాజరు యుద్ధంలో గెలిచిన తరువాత, జనం
తిరిగి వచ్చారు. కాని నిజానికి వారు ఓడిపోయిన శత్రువు
లను దోచుకోడానికి మాత్రమే వచ్చారు.
11హరారీయుడగు ఆగే కుమారుడైన షమ్మా
తరువాత ప్రముఖ సేనాని. ఒక పర్యాయం ఫిలిష్తీయులు
వచ్చి నిండుగా పండిన అలసందల చేనువద్ద గుమి
గూడారు. ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులను చూసి
పారి పోయారు. 12కాని షమ్మా మాత్రం చేను మధ్యలో
నిలబడ్డాడు. అతడు చేనును కాపాడుతూ పోరాడాడు.
అతడు ఫిలిష్తీయులను హత మార్చాడు. అప్పుడు
కూడ యెహోవా వారికి ఘన విజయం చేకూర్చాడు.

## ముగ్గురు ప్రముఖ సైనికులు

13పంట కోతకాలంలో ముప్పై మంది సైనికులలో
ఘటికులైన ముగ్గురు ఒక సారి దావీదు వద్దకు వచ్చారు.
ఈ ముగ్గురూ అదుల్లాము గుహవద్దకు వచ్చారు. రెఫా
యీము లోయలో ఫిలిష్తీయుల సైన్యం గుడారాలు
వేసింది.
14ఆ సమయంలో దావీదు కోటలో వున్నాడు.
బేత్లెహేములో కొంత మంది ఫిలిష్తీయుల సైనికు
లున్నారు. 15తన స్వగ్రామంలోని నీరు తాగాలనే ప్రగాఢ
వాంఛ దావీదుకు కలిగింది. "ఓహో, బేత్లెహేము నగర
ద్వారం వద్దగల బావి నీరు ఎవరైనా తెచ్చియిస్తే బాగుం
టుందని అనుకుంటున్నాను," అని దావీదు అన్నాడు.
వాస్తవంగా దావీదు దీనిని కోరలేదు; కాని తానలా
మాట్లాడాడు.
16కాని ముగ్గురు బలాఢ్యులు మాత్రం ఫిలిష్తీయుల
సైనికులను ఛేధించుకుంటూ వెళ్లారు. బేత్లెహేము నగర
ద్వారంవద్దగల బావి నుండి నీరు తీసుకున్నారు. దానిని
వారు దావీదు వద్దకు తెచ్చారు. కాని దావీదు ఆ
నీటిని తాగ నిరాకరించాడు. అతడా నీటిని యెహోవా
ముందు పారబోశాడు. 17దావీదు యెహోవాతో,
"యెహోవా, నేను దీనిని తాగలేను! నా కొరకు తమ
ప్రాణాలను లెక్కచేయకుండా వెళ్లిన వారి రక్తం తాగి
నట్లుగా వుంటుంది," అని అన్నాడు. అందువల్ల దావీదు
ఆ నీటిని తాగ నిరాకరించాడు. ఈ ముగ్గురు సైనికులు
అలా అనేక సాహసకృత్యాలు చేశారు.

## ఇతర జ్ఞానముగల సైనికులు

18సెరూయా కుమారుడైన యోవాబు సోదరుడగు
అబీషై ఈ ముగ్గురు సైనికులకు నాయకుడు. అబీషై
తన ఈటెనుపయోగించి మూడు వందల శత్రుసైని
కులను హతమార్చాడు. అతను కూడ ఆ ముగ్గురు
సైనికులంత ప్రఖ్యాతి వహించాడు. 19వారి ముగ్గురు
కంటె అబీషై మిక్కిలి ప్రశంసలు పొందాడు. అతడు
వారికి నాయకుడయ్యాడు. అంతేగాని వారితో పాటు
ఆ కూటమిలో ఒక సభ్యుడు కాదు.
20యెహోయాదా కుమారుడైన బెనాయా
వున్నాడు. అతడు ఒక పరాక్రమశాలి కుమారుడు.
అతడు కబ్సెయేలను ఊరివాడు. బెనాయా చాలా
సాహసకృత్యాలు చేశాడు. అతడు మోయాబీయుడగు
అరీయేలు ఇద్దరు కుమారులను చంపివేశాడు. అంతే
గాదు. మంచుపడే కాలంలో బెనాయా ఒక గోతిలోదిగి
అక్కడ దాగిన ఒక సింహాన్ని చంపాడు.
21ఈజిప్టుకు చెందిన ఒక బలమైన యోధుణ్ణి
చంపాడు. ఆ ఈజిప్టీయుని చేతిలో ఒక ఈటెవుంది.
కాని బెనాయా చేతిలో ఒక కర్ర మాత్రమేవుంది.
కాని బెనాయా వెళ్లి ఆ ఈజిప్టీయుని చేతిలోని ఈటె
లాక్కున్నాడు. తరువాత బెనాయా ఆ ఈటెతోనే
ఈజిప్టీయుని పొడిచి చంపాడు. 22యెహోయాదా
కుమారుడైన బెనాయా అటువంటి కార్యాలు చాలా
చేశాడు. బెనాయా కూడ ఆ ముగ్గురు యోధులవలె
ప్రసిద్ధి గాంచాడు. 23ముప్పై మంది సైనికులలోను
బెనాయాకు ఎక్కువ గౌరవం లభించింది; కాని ఆ
ముగ్గురు యోధుల కూటమిలో సభ్యుడు కాలేదు.
బెనాయాను దావీదు తన అంగరక్షకులకు నాయకునిగా
చేశాడు.

### ముప్పై మంది వీరులు

24 యోవాబు సోదరుడగు అశాహేలు ఆ ముప్పై
మందిలో ఒకడు. ఆ ముప్పై మందిలో మిగిలిన వారి
పేర్లు: బేత్లెహేమీయుడగు దోదో కుమారుడైన ఎల్హా
నాను, 25హరోదీయుడైన షమ్మా, హరోదీయుడైన
ఎలీకా, 26పల్తీయుడైన హేలెస్సు, తెకోవీయుడగు
ఇక్కేషు కుమారుడగు ఈరా, 27అనాతోతీయుడైన
అబీయెజరు, హుషాతీయుడైన మెబున్నయి,
28అహోహీయుడైన సల్మోను, నెటోపాతీయుడైన
మహరై, 29నెటోపాతీయుడగు బయానా కుమారు
డైన హేలెబు, బెన్యామీనీయుల గిబియాలో పుట్టిన
రీబై కుమారుడు ఇత్తయి, 30పిరాతోనీయుడైన
బెనాయా, గాయషు సెలయేళ్ల ప్రాంతం వాడైన
హిద్దయి, 31అర్బాతీయుడైన అబీయల్బోను, బర్హుమీ
యుడైన అజ్మావెతు, 32షయల్బోనీయుడైన
ఎల్యహ్బా, యాషేను కుమారులలో 33హరారీయుడైన
షమ్మా కుమారుడు యోనాతాను, హరారీయుడైన
షారారు కుమారుడగు అహీయాము,
34మాయకాతీయునికి పుట్టిన అహస్బయి కుమారు
డగు ఎలీపేలెటు, గిలోనీయుడైన అహీతోపెలు కుమా
రుడగు ఏలీయాము, 35కర్మెతీయుడైన హెస్రై, అర్బీ
యుడైన పయరై, 36సోబావాడగు నాతాను కుమారు
డైన ఇగాలు, గాదీయుడైన బానీ,
37అమ్మోనీయుడైన జెలెకు, బెయేరోతీయుడైన
నహరై, (సెరూయా కుమారుడైన యోవాబునకు
ఆయుధాలు మోసే సహాయకులు,) 38ఇత్రీయుడగు
ఈరా, ఇత్రీయుడగు గారేబు, 39మరియు హిత్తీయుడైన
ఊరియా. వీరంతా మొత్తం ముప్పది ఏడుగురు.

### దావీదు తన సైన్యాన్ని లెక్కింప గోరటం

24 యెహోవా మరోసారి ఇశ్రాయేలీయుల పట్ల
కోపం చెందాడు. యెహోవా దావీదును ఇశ్రా
యేలీయులకు వ్యతిరేకమయ్యేలా చేశాడు. యెహోవా
దావీదుతో, “వెళ్లు, ఇశ్రాయేలు వారిని, యూదా వారిని
లెక్కించు” అని అన్నాడు.
2దావీదు రాజు సైన్యాధ్యక్షుడైన యోవాబును
పిలిచి, “దాను నుండి బెయేర్షెబా వరకు తిరిగి ఇశ్రా
యేలీయుల వంశాల వారందరినీ లెక్కించు. దానివల్ల
వారెంత మంది వున్నారో నాకు తెలుస్తుంది,” అని
అన్నాడు.
3కాని యోవాబు రాజైన దావీదుతో ఇలా అన్నాడు,
“ఇప్పటి జనాభా ఎంతైనా వుండనీ; నీ ప్రభువైన
దేవుడు అంతకు వంద రెట్లు ప్రజలను నీకు యిచ్చు
గాక! ఇది జరుగగా నీవు చూడాలని కాంక్షిస్తున్నాను.
అయినా ఈ పని నీవెందుకు తల పెట్టావు?”
4రాజు అది విని యోవాబును, సైన్యాధికారులను
జనాభా లెక్కలు తీయమని తీవ్రంగా ఆజ్ఞాపించాడు.
దానితో యోవాబు, సైన్యాధికారులు ఇశ్రాయేలులో
జనాభా లెక్కలు తీయటానికి రాజును విడిచి వెళ్లారు.
5వారు యొర్దాను నదిదాటారు. అరోయేరు వద్ద గుడా
రాలు వేశారు. వారి గుడారాలు లోయలోని నగరానికి
కుడిప్రక్కగా వున్నవి. (నగరం గాదులోయ మధ్యలో
వుంది. యాజేరుకు వెళ్లే మార్గంలోనే నగరంవుంది)
6వారు గిలాదుకు, తహ్తీంహొద్షీ దేశానికి వెళ్లారు.
వారింకా దానాయానుకు, సీదోను ప్రాంతానికి వెళ్లారు.
7వారు తూరు కోటను, మరియు హివ్వీయుల, కనానీ
యుల యొక్క నగరాలను దర్శించారు. వారు యూదా
దేశపు దక్షిణ ప్రాంతాన గల బెయేర్షెబా చేరారు. 8ఇలా
దేశమంతా వారు తొమ్మిది నెలల, ఇరువది రోజుల
పాటు తిరిగి చివరికి యెరూషలేముకు వచ్చారు.
9జనాభా పట్టికను యోవాబు రాజుకు సమ
ర్పించాడు. ఇశ్రాయేలులో కత్తి పట్టగల జనం ఎనిమిది
లక్షలవరకు వున్నారు. యూదాలో ఐదులక్షల మంది
వున్నారు.

### దావీదును యెహోవా శిక్షించటం

10జనాభా లెక్కలు చూసినందుకు దావీదు సిగ్గు
పడ్డాడు. దావీదు యెహోవాకి ఇలా విన్నవించు
కున్నాడు, “నేను చేసిన ఈ పనివల్ల నేను చాలా
పాపం మూటగట్టుకున్నాను. ప్రభువా, నా పాపాన్ని
క్షమించమని వేడుకుంటున్నాను. నేను చాలా మూర్ఖంగా
ప్రవర్తించాను.”
11దావీదు ఉదయం నిద్రలేచే సరికి యెహోవా
వాక్యం గాదుకు చేరింది. గాదు ప్రవక్త దావీదుకు సన్నిహి
తుడు. 12గాదుకు యెహోవా ఇలా చెప్పాడు: “దావీదు
వద్దకు వెళ్లి నా మాటగా ఈ విషయం చెప్పు:
యెహోవా మూడు విషయాలు నీ ముందు వుంచు
తున్నాడు. ఆయన నీకు చేయవలసిన దాని నొకటి
నీవు ఎన్నుకో.”
13దావీదుతో గాదు ఇలా చెప్పాడు: “నేను చెప్పే
వాటిలో ఒక దానిని కోరుకో:

ఏడేండ్ల కరువు నీకూ, నీ రాజ్యానికీ రావాలా, లేక
నీ శత్రువులు నిన్ను మూడు నెలల పాటు వెన్నంటి
తరమాలా,

లేక మూడు రోజుల పాటు నీ దేశంలో వ్యాధులు
ప్రబలాలా బాగా ఆలోచన చేసి ఈ మూడింటిలో
నీవు దేనిని కోరుకుంటున్నావో చెప్పు. నేను నీ నిర్ణ
యాన్ని నన్ను పంపిన యెహోవాకి అందజేయాలి.”
14గాదుతో దావీదు, “నిజంగా నేను చాలా క్లిష్ట పరి
స్థితిలోపడ్డాను! యెహోవా దయామయుడు కావున
ఆయన్నే మమ్మల్ని శిక్షించనీ, నాకు శిక్ష ప్రజలనుండి
మాత్రం రానీయకు!” అని అన్నాడు.
15అందువల్ల యెహోవా ఇశ్రాయేలులో వ్యాధులు ప్రబ
లేలా చేశాడు. ఉదయం మొదలైన వ్యాధులు

నిర్ణయించిన గడువు వరకు ప్రబలినాయి. ఉత్తర
దేశంలో దానునుండి దక్షిణ ఇశ్రాయేలులోని బెయేర్షెబా
వరకు డెబ్బై వేల మంది చనిపోయారు. [16]దేవదూత
యెరూషలేమును నాశనం చేసేందుకు చేయి పైకి
లేపాడు. కాని జరిగినవిషాద సంఘటనలకు యెహోవా
విచారించాడు. ప్రజలను నాశనం చేసిన దేవదూతతో
యెహోవా, "ఇది చాలు! నీ చేయిదించు!" అని
అన్నాడు. యెహోవాదూత యెబూసీయుడైన
అరౌనా యొక్క కళ్లం* వద్దవున్నాడు.

### దావీదు అరౌనా కళ్లము కొనటం

[17]ప్రజలను నశింపజేసిన దేవదూతను దావీదు
చూశాడు. దావీదు యెహోవాకి యిలా విన్నవించు
కున్నాడు, "నేను పాపం చేశాను! నేను తప్పు చేశాను!
కాని నా ప్రజలంతా నన్ను గొర్రెలవలె అనుసరించారు!
వారు చేసిన తప్పేమీ లేదు! కావున దయచేసి నీ
కోపం నామీద, నా తండ్రి కుటుంబం మీద మాత్రమే
చూపించు!"
[18]ఆ రోజు మరల గాదు దావీదు వద్దకు వచ్చి,
"యెబూసీయుడైన అరౌనా యొక్క కళ్లం మీద
యెహోవాకి ఒక బలిపీఠం నిర్మించు" మని చెప్పాడు.
[19]గాదు చెప్పిన రీతి దావీదు అంతా చేశాడు.
యెహోవా ఆజ్ఞలను దావీదు శిరసావహించాడు.
దావీదు అరౌనాను చూడటానికి వెళ్లాడు. [20]అరౌనా
తలెత్తి చూడగా అక్కడ రాజు (దావీదు) వున్నాడు.
ఆయన మనుష్యులు తన వైపు రావటం చూశాడు.
అరౌనా ఎదురేగి తన శిరస్సు నేలను ఆనే వరకు వంగి
రాజుకు నమస్కరించాడు.
[21]"నా ప్రభువైన రాజు నా వద్దకు ఎందుకు వచ్చి
నట్లు?" అని అడిగాడు అరౌనా. అందుకు దావీదు,
"నీనుండి నూర్పిడి కళ్లం కొనడానికి.
అది కొని దానిపై యెహోవాకు ఒక బలిపీఠం నిర్మి
స్తాను. అప్పుడు ఈ వ్యాధులన్నీ అరికట్ట బడతాయి,"
అని అన్నాడు. [22]"నా ప్రభువైన రాజు బలికి ఏది
కావాలంటే అది తీసుకోవచ్చు. దహనబలికి కొన్ని
ఎద్దులున్నాయి. అగ్నిని ప్రజ్వలింప చేయటానికి
గింజలు రాలగొట్టే బల్లలు, మరియు ఎద్దులపై వేసే
కాడికర్రలు వున్నాయి! [23]ఓ రాజా! ఇవన్నీ నీకు నేను
ఇస్తాను." అని అరౌనా దావీదుతో అన్నాడు. "నీ ప్రభు
వైన దేవుడు నీపట్ల ప్రీతి చెందుగాక!" అని కూడ
అన్నాడు.
[24]అప్పుడు అరౌనాతో రాజు ఇలా అన్నాడు: "కాదు!
నేను నిజం చెప్తున్నాను. నీకు వెలయిచ్చి నీ నుండి
ఈ భూమినికొంటాను. నాకు వెల లేకుండా వచ్చిన
వాటితో నా ప్రభువైన దేవునికి దహనబలులు
ఇవ్వను!" కావున నూర్పిడి కళ్లాన్ని, ఎద్దులను, ఏభై
తులాల వెండి వెల ఇచ్చి దావీదు కొన్నాడు.
[25]తరువాత యెహోవాకి అక్కడ ఒక బలిపీఠాన్ని
దావీదు నిర్మింప జేశాడు. దహనబలులు, సమాధాన
బలులు దావీదు అర్పించాడు. దేశంకొరకు దావీదు
చేసిన ప్రార్థనను యెహోవా ఆలకించి, ఇశ్రాయేలులో
ప్రబలిన వ్యాధులను ఇంకా వ్యాపించకుండా ఆపాడు.

---

**అరౌనా యొక్క కళ్లం** దినవృత్తాంతము మొదటి గ్రంథం 21:15లో "ఒర్నాను" కళ్లంవద్ద అని ఉన్నది.

# 1 రాజులు

### అదోనీయా తనకు తాను రాజుగా ప్రకటించు కొనుట

1 దావీదు రాజు బాగా ముసలివాడయ్యాడు. అందువల్ల
అతను చలికి తట్టుకోలేకపోయాడు. తన సేవకులు
ఎన్ని దుప్పట్లు కప్పినాగాని, అతను చలికి వణికి
పోతూనే వున్నాడు. 2కావున ఆయన సేవకులు ఆయ
నతో, “నీ ఆలనాపాలనా చూడటానికి వయస్సులో
ఉన్న ఒక అమ్మాయిని మేము చూస్తాము. ఆమె నీ
పక్కలో పండుకొని నీకు తగిన వెచ్చదనం సమ
కూర్చుతుంది.” అని అన్నారు. 3అలా చెప్పి రాజు
సేవకులు ఇశ్రాయేలు రాజ్యమంతా ఒక చిన్నదాని
కొరకు వెదక నారంభించారు. రాజుకు వెచ్చదనాన్ని
ఇవ్వగలిగే రూపం, యవ్వనం ఉన్న స్త్రీ కొరకు వారు
వెదకసాగారు. చివరకు అబీషగు అనబడే షూనేమీయు
రాలిని చూచి, ఆమెను రాజు వద్దకు తీసుకొని వచ్చారు.
4ఆమె చాలా అందగత్తె, ఆమె రాజుపట్ల శ్రద్ధ తీసుకొని,
అతనికి సేవలు చేయనారంభించింది. కాని రాజైన
దావీదు ఆమెను కూడలేదు.

5-6దావీదు కుమారుడు అదోనీయా ‘నేనే రాజు
నౌతా’నని అనుకొన్నాడు. (అదోనీయా తల్లి పేరు
హగ్గీతు) అదోనీయా చాలా అందమైనవాడు. అతడు
రాజు కావాలని మిక్కిలి ఉబలాటపడ్డాడు. అందువల్ల
తనకు తానే ఒక రథాన్ని, గుర్రాలను సమకూర్చు
కున్నాడు. తన ముందు పరుగెత్తుటకు ఏభై మంది
మనుష్యులను కూడా నియమించాడు. అతడు అబ్షా
లోము తర్వాత పుట్టాడు. దావీదు రాజు ఎప్పుడూ
అదోనీయాను మందలించలేదు, విమర్శించలేదు.
“ఏమి చేస్తున్నావు?” అని కాని, “అది ఎందుకు
చేశావు?” అని కాని అతడు ఎప్పుడూ అడగలేదు.

7సెరూయా కుమారుడైన యోవాబుతోను,
యాజకుడైన అబ్యాతారుతోను అదోనీయా మాట్లా
డాడు. అతడు రాజు అయ్యేలాగ వారు సహాయం
చేయడానికి అంగీకరించారు.

8కాని అదోనీయా రాజు కావడానికి ఒప్పుకోని
వారిలో యాజకుడైన సాదోకు, యెహోయాదా
కుమారుడైన బెనాయా, ప్రవక్తయైన నాతాను, షిమీ,
మరియు దావీదు రాజుయొక్క ప్రత్యేక అంగరక్షకుడైన
రేయీా వుండిరి. అందువల్ల వీరు అదోనీయాతో
కలియలేదు.

9అదోనీయా కొన్ని జంతు బలులను అర్పించాడు.
అతడు కొన్ని గొర్రెలను, ఆవులను, మరియు కొన్ని
బలిసిన కోడెదూడలను సమాధాన బలిగా ఇచ్చాడు.
అదోనీయా ఈ బలులన్నీ ఏన్రోగేలు దగ్గర వున్న
జోహెలేతు అను శిలవద్ద సమర్పించాడు. ఈ ప్రత్యే
కమైన పూజా కార్యక్రమానికి అదోనీయా చాలామందిని
ఆహ్వానించాడు. రాజైన దావీదుయొక్క ఇతర కుమారు
లను, యూదా పాలకులు, నాయకులందరినీ అదో
నీయా ఆహ్వానించాడు. 10కాని అదోనీయా ప్రవక్త
యగు నాతానును గాని, బెనాయాను గాని, తన
తండ్రియొక్క ప్రత్యేక అంగరక్షకుని గాని, లేక తన
సోదరుడు సొలొమోనును గాని ఆహ్వానించలేదు.

11ఇదంతా విన్న నాతాను, సొలొమోను తల్లియైన
బత్షెబ వద్దకు వెళ్లి ఇలా అన్నాడు, “హగ్గీతు కుమారుడైన
అదోనీయా ఏమి చేస్తున్నాడో నీవు విన్నావా? తనకై
తాను రాజుగా ప్రకటించుకొన్నాడు. మన యజమాని
యైన దావీదు కూడ ఈ విషయం ఎరుగడు. 12నీ
జీవితం, నీ కుమారుడైన సొలొమోను జీవితం ప్రమా
దంలో పడవచ్చు. మీ ప్రాణాలను కాపాడుకోవాలంటే
నీవు ఏమి చేయాలో నేను చెపుతాను. 13దావీదు
రాజు వద్దకు వెళ్లి, ‘నా ప్రభువైన రాజా, నీ తరువాత
రాజ్యానికి వారసుడు నా కుమారుడైన సొలొమోను
అవుతాడని నీవు ప్రమాణం చేశావు. కాని ఇప్పుడు
అదోనీయా ఎందుకు రాజయ్యాడు?’ అని అడుగు.
14నీవు అలా మాట్లాడుతూ వుండగా నేను లోపలికి
వస్తాను. వచ్చి, నీవు అదోనీయా గురించి చెప్పినదంతా
నిజమని రాజుతో నేను చెపుతాను.”

15తరువాత బత్షెబ రాజును చూడటానికి ఆయన
పడకగదిలోనికి వెళ్లింది. రాజు ముసలివాడయ్యాడు.
షూనేమీయురాలగు అబీషగు అక్కడ ఆయనకు సేవ
చేస్తూ వున్నది. 16బత్షెబ రాజుకు సాష్టాంగ నమస్కారం
చేసింది. “నీకు ఏమి కావాలి?” అని రాజు ప్రశ్నించాడు.

17బత్షెబ ఇలా చెప్పసాగింది, “మహారాజా! ప్రభువైన
నీ దేవుని పేరు మీద నీవు నాకు ఒక ప్రమాణం
చేశావు. ‘నా తరువాత నీ కుమారుడైన సొలొమోను
రాజవుతాడు. నా సింహాసనం మీద సొలొమోను రాజ్య
పాలన చేస్తాడు’ అని అన్నావు. 18కాని ఇప్పుడు అదో
నీయా రాజయ్యాడు. అయినా ఆ విషయం నీకు

తెలియదు. 19సమాధానబలి ఇచ్చే నిమిత్తం అదోనీయా
చాలా జంతువులను చంపాడు. అతడు ఆవులను, బలి
సిన కోడెదూడలను, గొర్రెలను చంపాడు. మరియు
నీ కుమారులనందరినీ ఆహ్వానించాడు. యాజకుడైన
అబ్యాతారును, సైన్యాధ్యక్షుడు యోవాబును కూడ
అతడు ఆహ్వానించాడు. కాని అతడు నిన్ను సేవించే
నా కుమారుడైన సొలొమోనును మాత్రం ఆహ్వానించ
లేదు. 20మహారాజా! ఇశ్రాయేలు ప్రజలంతా నిన్ను
గమనిస్తూ వున్నారు. నీ తరువాత నీవు ఎవరిని రాజుగా
నియమిస్తావో? అని వారు ఎదురు చూస్తూ వున్నారు.
21నీ మరణానంతరం, నీ పితరులతో నీవు సమాధి
చేయబడతావు. ప్రజలు మాత్రం నేను, సొలొమోను
నేరస్థులమని భావిస్తారు."
22బత్షెబ ఇలా రాజుతో మాట్లాడుతూ వుండగా,
ప్రవక్తయగు నాతాను రాజును చూడటానికి వచ్చాడు.
23 "ప్రవక్తయగు నాతాను ఇక్కడికి వచ్చాడు" అని
సేవకులు రాజుతో చెప్పారు. నాతాను రాజువద్దకు
వెళ్లి సాష్టాంగ నమస్కారం చేశాడు. 24నాతాను రాజుతో
ఇలా అన్నాడు, "నా ప్రభువా, నీ తరువాత రాజ్య
పాలనకు కొత్త రాజుగా అదోనీయాను ప్రకటించావా?,
నీ తరువాత ప్రజాపాలన చేయటానికి అదోనీయాను
నియమించాలని నిర్ణయించావా? 25ఈ రోజు అతను
సమాధాన బలులు అర్పించాడు. అతడు చాలా ఆవు
లను, బలిసిన కోడెదూడలను, గొర్రెలను చంపాడు.
నీ యొక్క ఇతర కుమారులందరిని, సైన్యాధ్యక్షుడిని,
యాజకుడైన అబ్యాతారును అతడు పిలిచాడు. ఈ
సమయంలో వారంతా అతనితో కలిసి తాగుతూ,
తింటూ వేడుక చేసుకొంటున్నారు. పైగా, 'రాజైన
అదోనీయా వర్ధిల్లు గాక!' అని వారంతా అంటున్నారు.
26కాని అతను నన్నుగాని, యాజకుడైన సాదోకును
గాని, యెహోయాదా కుమారుడైన బెనాయాను గాని,
నీ కుమారుడైన సొలొమోనును గాని పిలువలేదు.
27ఇదంతా చేసింది నీవేనా? మేము నిన్ను సేవిస్తూ
నీకు విధేయులమైయున్నాము కదా, అయినను నీ
తరువాత నీ వారసుడుగా ఎవరిని ఎన్నుకున్నదీ మాకు
ఎందుకు చెప్పలేదు?"
28ఇది విన్న రాజు బత్షెబను పిలువనంపాడు. రాజు
ముందుకు బత్షెబ వచ్చింది.
29అప్పుడు రాజు ఒక ప్రమాణం చేశాడు, "నా
ప్రభువైన దేవుడు నాకు సంభవించిన ప్రతి ఆపద
నుండి నన్ను కాపాడాడు. నా ప్రభువైన దేవుడు
నిత్యుడు. ఆ దైవశక్తితో నేను ప్రమాణం చేస్తున్నాను:
30గతంలో నీకు నేనిచ్చిన మాటను ఈ రోజు నెర
వేర్చుతాను. ఇశ్రాయేలు దేవుడైన నా యెహోవా
యొక్క శక్తితో నేనీ ప్రమాణం చేసియున్నాను. నా
తరువాత నీ కుమారుడైన సొలొమోను రాజవుతాడని
నీకు ప్రమాణం చేశాను. నా తరువాత నా సింహాసనం
మీద నా స్థానాన్ని అతడు పొందుతాడని కూడా మాట
ఇచ్చాను. నేను నా మాట నిలబెట్టుకుంటాను."
31తరువాత బత్షెబ రాజుముందు సాగిలపడి, "రాజైన
దావీదు వర్ధిల్లు గాక !" అని అన్నది.

### దావీదు సొలొమోనును రాజుగా చేయటం

32రాజైన దావీదు అప్పుడు "యాజకుడగు సాదో
కును, ప్రవక్తయగు నాతానును, యెహోయాదా
కుమారుడైన బెనాయాను పిలువనంపాడు." వారు
ముగ్గురూ రాజు వద్దకు వచ్చారు. 33"మీరు రాజాధికా
రులను మీతో తీసుకొని, నా కుమారుడైన సొలొమో
నును నా కంచర గాడిదపై ఎక్కించి దిగువనున్న
గిహోను చలమ* దగ్గరకు తీసుకొని వెళ్లండి.
34అక్కడ యాజకుడైన సాదోకు, ప్రవక్తయగు
నాతాను అతనిని ఇశ్రాయేలు రాజుగా అభిషిక్తుని
చేయాలి. బూర ఊది 'ఇదిగో కొత్తరాజు సొలొమోను!'
అని చాటాలి. 35తరువాత అతనితో కలిసి ఇక్కడకి
తిరిగిరండి. అతడు నా సింహాసనం మీద కూర్చుండి,
నా స్థానంలో రాజుగా వ్యవహరిస్తాడు. ఇశ్రాయేలు మీద,
యూదా మీద రాజుగా వుండటానికి నేనతనిని ఎన్ను
కున్నాను," అని రాజైన దావీదు వారితో అన్నాడు.
36యెహోయాదా కుమారుడైన బెనాయా
రాజుతో, "అది చాలా మంచి పని! నీ దేవుడైన
యెహోవా అది జరిగేలా చేయునుగాక! 37యెహోవా
ఎల్లప్పుడు మా యజమాని రాజువైన నీకు సహాయ
పడుతూ వచ్చాడు. యెహోవా ఇప్పుడు సొలొమో
నుకు సహాయపడును గాక! దేవుడు సొలొమోనును
కూడా నీకంటె ఘనమైన రాజుగా చేయునుగాక!" అని
అన్నాడు. 38కావున సాదోకు, నాతాను, బెనాయా,
రాజు యొక్క సేవకులు రాజాజ్ఞ శిరసావహించారు.
సొలొమోనును రాజు యొక్క కంచర గాడిదపై
ఎక్కించి వారతనితో గిహోనుకు వెళ్లారు. 39యాజకు
డైన సాదోకు పవిత్ర గుడారము నుండి తనతో నూనె
పట్టుకెళ్లాడు. సాదోకు ఆ నూనెను సొలొమోను తలపై
పోసి రాజుగా అభిషిక్తుని చేశాడు. వారప్పుడు బాకా
వూదగా అక్కడున్న ప్రజలంతా, "సొలొమోను రాజు
వర్ధిల్లుగాక !" అని అన్నారు. 40ఆ ప్రజలంతా సొలొమో
నుతో కలిసి నగరానికి వచ్చారు. వారు పిల్లనగ్రోవులను
ఊదుతూ, జయజయ ధ్వనులు చేయసాగారు. వారు
సంతోషంతో భూమి అదిరేలా కేకలేశారు.
41ఆ సమయంలో అదోనీయా, మరియు అతనితో
ఉన్న అతిథులు భోజనాలు పూర్తి చేస్తున్నారు, వారు

---

**గిహోను చలమ** ఇది యెరూషలేము నగరానికి ప్రధానమైన నీటి వసతి. ఈ చలమ సరిగ్గా నగరానికి బయట లోయలో ఉంది. ఇది అదోనీయా, అతని మనుష్యులు ఉన్న ఏన్‌రోగే లుకు చాలా దగ్గరలో ఉంది.

బూరనాదం విన్నారు. "నగరంలో ఏమి జరుగుతూ
వుంది, మనం వినే శబ్దం ఏమిటి?" అని యోవాబు
అడిగాడు.
42యోవాబు అలా మాట్లాడుతూ వుండగానే
యాజకుడైన అబ్యాతారు కుమారుడు యోనాతాను
అక్కడికి వచ్చాడు. అదోనీయా అతనిని చూసి "రా,
లోనికి రా! నీవు చాలా మంచివాడవు.* నీవు ఏదైనా
మంచివార్తే నాకు తెస్తూ వుండవచ్చు" అని అన్నాడు.
43కాని యోనాతాను ఇలా సమాధాన మిచ్చాడు,
"కాదు! ఇది నీకు శుభవార్త కాదు. మన రాజైన దావీదు
సొలొమోనును రాజుగా ప్రకటించాడు. 44రాజైన
దావీదు యాజకుడైన సాదోకును, ప్రవక్తయగు
నాతానును, యెహోయాదా కుమారుడైన బెనా
యాను, మరియు తన సేవకులను అతనితో పంపాడు.
వారు సొలొమోనును రాజు యొక్క స్వంత కంచర
గాడిదపై కూర్చుండబెట్టారు. 45తరువాత యాజకు
డైన సాదోకు, ప్రవక్తయైన నాతాను ఇరువురూ సొలొ
మోనుకు గిహోను వద్ద పట్టాభిషేకం చేశారు. వార
ప్పుడు నగరానికి తిరిగి వెళ్లారు. ప్రజలు వారిననుసరించి
వెళ్లారు. కావున ఇప్పుడు నగరంలో జనమంతా చాలా
సంతోషంగా వున్నారు. ఆ శబ్ధమే మీరిప్పుడు వింటు
న్నారు. 46సొలొమోను ఇప్పుడు రాజు సింహాసనం
మీద కూర్చున్నాడు.
47రాజు యొక్క సేవకులంతా రాజైన దావీదు
వద్దకు అతను మంచిపని చేసినట్లు చెప్పటానికి
వచ్చారు. వారంతా, 'దావీదు రాజా, నీవు చాలా గొప్ప
రాజువి! కాని నీ దేవుడు సొలొమోనును కూడ ఒక
గొప్ప రాజుగా చేయాలని ప్రార్థిస్తున్నాము. నీ దేవుడు
సొలొమోనును నీకంటె ఖ్యాతిగల రాజుగా చేయును
గాక. నీ రాజ్యముకంటె అతని రాజ్యము ఘనముగా
ఉండునట్లు చేయునుగాక!' అని అంటున్నారు. యోనా
తాను నగరంలో జరుగుతున్న విషయాలు అదోనీ
యాతో ఇంకా ఇలా చెప్పసాగాడు: "తరువాత రాజైన
దావీదు దేవుని ప్రార్థించటానికి తన పక్కమీదే సాష్టాంగ
పడ్డాడు.
48'ఇశ్రాయేలు దేవుడైన నా యెహోవాకు జయము
గును గాక! యెహోవా నా కుమారులలో ఒకనిని నా
సింహాసనం మీద కూర్చుండ జేశాడు. దేవుడు అది
నేను చూడగలిగేలా చేశాడు' అని దావీదు రాజు
అన్నాడు."
49ఇది విన్న అదోనీయా, అతిథులందరూ భయ
పడి అక్కడి నుండి త్వరగా వెళ్లిపోయారు.
50అదోనీయా కూడ సొలొమోనుకు భయపడ్డాడు.
కావున అతడు బలిపీఠం వద్దకు వెళ్లి, ఆ పీఠపు
కొమ్ములను* పట్టుకున్నాడు. 51ఈ లోపు ఒకడు
సొలొమోను వద్దకు వెళ్లి, "అదోనీయా నీవంటే చాలా
భయపడిపోతున్నాడు. అతడు బలిపీఠం వద్ద ఉన్నాడు.
అతడు బలిపీఠపు కొమ్ములను పట్టుకొని, అక్కడి
నుండి పోవటం లేదు. సొలొమోను వద్దకు ఎవరైనా
వెళ్లి తనను చంపకుండా వుండేలా ప్రమాణం చేయించ
మని వేడుకుంటున్నాడు" అని చెప్పాడు.
52అది విన్న సొలొమోను, "అదోనీయా గనుక
బుద్ధిమంతునిలా మెలిగితే, అతని తలమీది ఒక్క
వెంట్రుక కూడ రాలదని నేను ప్రమాణం చేస్తున్నాను.
కాని అతడేమైనా పొరపాటు చేస్తే, వాడు చావటం
ఖాయం" అని అన్నాడు. 53అప్పుడు సొలొమోను
కొంతమందిని పంపి అదోనీయాను తీసుకొని రమ్మ
న్నాడు. వారు అదోనీయాను రాజైన సొలొమోను
వద్దకు తీసుకొచ్చారు. అదోనీయా రాజైన సొలొ
మోను ముందుకు వచ్చి సాష్టాంగపడ్డాడు. "నీవు ఇంటికి
వెళ్లు" అని సొలొమోను అతనితో అన్నాడు.

### సొలొమోనుకు దావీదు హితోపదేశం

2 దావీదుకు మరణకాలం సమీపించింది. కావున
దావీదు సొలొమోనును పిలిచి ఇలా అన్నాడు:
2"నాకు మరణకాలం సమీపించింది. నీవు మంచివానిగా,
సమర్థవంతమైన నాయకునిగా పేరు తెచ్చుకో. 3దేవుని
ఆజ్ఞలన్నీ శిరసావహించు. నీ దేవుడైన యెహోవా
మనకిచ్చిన ఆదేశాలన్నిటినీ పాటించు. ఆయన ధర్మ
శాస్త్రాలను పాటిస్తూ, ఆయన మనకు చెప్పిన వన్నీ
చేయి. మోషే ధర్మశాస్త్రంలో నిర్దేశించిన సూత్రాలన్ని
టినీ పాటించు. ఇవన్నీ నీవు పాటిస్తే, నీవు ఏది చేసినా,
నీవు వెళ్లిన ప్రతి చోటా నీకు విజయం చేకూరుతుంది.
4నీవు యెహోవాకు విధేయుడవయివుంటే, ఆయన
నాగురించి చేసిన ప్రమాణం నెరవేర్చుతాడు.
యెహోవా నాకు చేసిన వాగ్దానమిది: "నీవారు నా
ఆదేశ సూత్రాలను అనుసరించి తీరాలి. నేను నిర్దేశించిన
రీతిగా జీవితం గడపాలి. నీ కుమారులు సంపూర్ణ
హృదయంతో, ఆత్మసాక్షిగా నాలో విశ్వాసం కలిగి
వుండాలి. నీ కుమారులు ఇవన్నీ చేస్తే, నీ కుటుంబంలో
ఒక వ్యక్తి ఎల్లప్పుడూ ఇశ్రాయేలు ప్రజలపై పాలకు
డుగా వుంటాడు."
5"సెరూయా కుమారుడైన యోవాబు నాకు ఏమి
చేసినదీ నీవు గుర్తు పెట్టుకోవాలి కూడ. ఇశ్రాయేలు
సైన్యాల ఇద్దరు అధిపతులను అతడు చంపాడు. నేరు

**మంచివాడు** "ముఖ్యమైన వ్యక్తివి" అని పాఠాంతరం. ఈ హెబ్రీ మాటకు, "ముఖ్యమైన కుటుంబం నుండి వచ్చిన వ్యక్తి" అని అర్థం.

**పీఠపు కొమ్ములు** అంటే అతను క్షమాభిక్ష కోరుతున్నాడని అర్థం. ఏ వ్యక్తి అయినా తాను తప్పు చేయకపోతే, అతడు పవిత్రస్థలంలోనికి వెళ్లి బలిపీఠపు కొమ్ములను పట్టుకుంటే అప్పుడా వ్యక్తి శిక్షింపబడకూడదు.

కుమారుడైన అబ్నేరును, యెతెరు కుమారుడైన
అమాశాను అతడు చంపాడు. అతడు వారిని శాంతి
నెలకొన్న రోజులలో చంపిన విషయం నీవు గుర్తుంచు
కోవాలి. వారు యుద్ధ సమయంలో ప్రజలను చంపా
రనే కోపంతో అతడా పని చేశాడు. కాని చంపబడిన
ఆ ఇద్దరు సేనాధిపతులు అమాయకులు. కావున
నేనతనిని శిక్షించాలి. 6కాని ఇప్పుడు నీవు రాజువు.
నీవు ఏది మిక్కిలి తెలివైన పద్ధతి అనుకుంటే దానిద్వారా
అతనిని శిక్షించాలి. అంటే అతడు ఖచ్చితంగా చంప
బడాలి."

7"గిలాదీయుడైన బర్జిల్లయి కుమారుల పట్ల నీవు
దయగలిగి వుండాలి. వారిని నీ స్నేహితులుగా స్వీక
రించి, వారు నీ బల్లవద్ద విందారగించేలా చూడు. నీ
సోదరుడగు అబ్షాలోము నుండి నేను పారిపోయిన
ప్పుడు వారు నాకు సహాయం చేశారు.

8"గెరా కుమారుడగు షిమీ నీవద్దనే వున్నట్లు నీవు
గమనించాలి. ఇతడు బెన్యామీనీయుడు. బహూరీము
పురవాసి. నేను మహనయీముకు వెళ్లిన రోజున ఇతడు
నాకు వ్యతిరేకంగా చాలా చెడు మాటలు మాట్లాడాడు.
ఇతడు మరల యోర్దాను నది వద్ద నన్ను కలవటానికి
వచ్చాడు. నేను యెహోవా ముందు ప్రమాణం చేసి
షిమీని నేను చంపనని చెప్పాను. 9కావున నీవు వానిని
శిక్షింపకుండా వదలవద్దు. నీవు తెలివిగలవాడవు. వానికి
ఏమి చేయాలో నీకు తెలుసు. వాడు వృద్ధాప్యంలో
ప్రశాంతంగా చనిపోయేలా విడువవద్దు."

10ఇవన్నీ చెప్పి దావీదు చనిపోయాడు. దావీదు
నగరంలో అతడు సమాధి చేయబడ్డాడు. 11దావీదు
నలభై సంవత్సరాల పాటు ఇశ్రాయేలును పరిపాలిం
చాడు. అతడు హెబ్రోనులో ఏడు సంవత్సరాలు,
యెరూషలేములో ముప్పై మూడు సంవత్సరాలు
పాలించాడు. 12ఇప్పుడు సొలొమోను తన తండ్రియగు
దావీదు సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు రాజు
అని చెప్పటానికి ఏరకమైన అనుమానం లేదు.*

13ఈ సమయంలో హగ్గీతు కుమారుడైన అదో
నీయా సొలొమోను తల్లియగు బత్షెబ వద్దకు వెళ్లాడు.
"నీవు సమాధానంతో వచ్చావా?" అని బత్షెబ అతనిని
అడిగింది.

"అవును. ఐక్యత కోసమే ఈ సందర్శనం. 14నీకు
ఒక విషయం నేను చెప్పాలి" అని అదోనీయా సమా
ధానం చెప్పాడు.

"అయితే మాట్లాడు" అన్నది బత్షెబ.

15అదోనీయా ఇలా చెప్పాడు: "నీకు గుర్తుండే
వుంటుంది, ఈ రాజ్యం ఒకప్పుడు నాది. ఇశ్రాయేలు
ప్రజలంతా నేనే వారి రాజుననుకున్నారు. కాని పరి
స్థితులు తారుమారైనాయి. ఇప్పుడు నా సోదరుడు
రాజైనాడు. దేవుడు అతనిని రాజుగా ఎంపిక చేశాడు.
16కావున నిన్ను నేనొక విషయం అడగాలనుకుంటు
న్నాను. దయచేసి దానిని తిరస్కరించవద్దు."

"నీకేం కావాలి?" అని బత్షెబ అడిగింది.

17"నాకు తెలుసు, రాజైన సొలొమోను నీవు ఏది
చేయమంటే అది చేస్తాడని. అందువల్ల దయచేసి
షూనేమీయురాలైన అబీషగును నాకు భార్యగా యివ్వ
మని అతనిని అడుగు" అని అదోనీయా అన్నాడు.

18"మంచిది, నీ తరఫున నేను రాజుతో మాట్లాడ
తాను" అని బత్షెబ అన్నది.

19కావున రాజైన సొలొమోనుతో మాట్లాడ్డానికి
బత్షెబ అతని వద్దకు వెళ్లింది. సొలొమోను ఆమెను
చూచి కలుసుకొనేందుకు నిలబడ్డాడు. ఆమెకు
వందనం చేసి, సింహాసనం మీద కూర్చున్నాడు. తన
తల్లి కొరకు సేవకులతో మరో ఉన్నతాసనం తెప్పిం
చాడు. అప్పుడామె అతనికి కుడి పక్కగా కూర్చున్నది.

20"నిన్నొక చిన్న విషయం అడగాలని వచ్చాను.
దయచేసి తిరస్కరించవద్దు" అని బత్షెబ అతనితో
అన్నది.

"నీవు ఏది కావాలంటే అది అడగవచ్చునమ్మా!
నేనెప్పుడూ తిరస్కరించను" అని రాజు అన్నాడు.

21"అయితే షూనేమీయురాలగు అబీషగును నీ సోద
రుడైన అదోనీయా వివాహమాడుటకు అనుమతి
ఇవ్వు" అని బత్షెబ అన్నది.

22అది విన్న సొలొమోను రాజు, "అబీషగును అతని
కిమ్మనే ఎందుకు అడుగుతున్నావు? అతడు నా అన్న
గనుక అతను రాజు కావటానికి కూడా అనుమతి ఇమ్మని
నన్నెందుకు అడగటం లేదు? యాజకుడైన అబ్యా
తారు, యోవాబు కూడా అతనికి మద్దతు ఇస్తారేమో!"
అని తన తల్లితో అన్నాడు.

23అప్పుడు సొలొమోను యెహోవాకు ఒక
ప్రమాణం చేశాడు. అతనిలా అన్నాడు: "అదోనీయా
నన్నిది అడిగినందుకు తగిన శాస్తి జరిగేలా చేస్తానని
ప్రమాణం చేస్తున్నాను! ఇది వాని ప్రాణానికే ముప్పు
తెస్తుందని ప్రమాణ పూర్వకంగా చెపుతున్నాను!
24ఇశ్రాయేలు రాజు కావటానికి యెహోవా నాకు
అనుమతి ఇచ్చాడు. నా తండ్రియైన దావీదు సింహాస
నాన్ని దేవుడు నాకు ఇచ్చాడు. రాజ్యాన్ని నాకు, నా
ప్రజలకు ఇచ్చి యెహోవా ఆయన మాట నిలబెట్టు
కున్నాడు. అదోనీయా ఈ రోజు ఖచ్చితంగా చని
పోతాడని, ఇవన్నీ నెరవేర్చిన నిత్యుడైన యెహోవా
ముందు ప్రమాణం చేసి చెపుతున్నాను!"

25రాజైన సొలొమోను బెనాయాను పిలిచి ఒక
ఆజ్ఞ ఇచ్చాడు. బెనాయా బయటికి వెళ్లి అదోనీ యాను
చంపేశాడు. 26రాజైన సొలొమోను యాజకుడగు
అబ్యా తారును పిలిచి, "నేను నిన్ను చంపివుండే వాడిని.

---

**అతడు ... అనుమానం లేదు** అతని రాజ్యం స్థిరంగా
నెల కొల్పబడింది అని పాఠాంతరం.

కాని అనాతోతులో వున్న నీ ఇంటికి తిరిగి వెళ్లటానికి
అనుమతి ఇస్తున్నాను. నిన్ను ఇప్పుడు చంపను. ఎందు
వల్లనంటే నా తండ్రి దావీదుతో కలిసి వెళ్లేటప్పుడు
నీవు యెహోవా పవిత్ర పెట్టె మోయుటలో సహాయ
పడ్డావు. పైగా నీవు నా తండ్రి కష్ట సమయాలలో
నీవాయనకు తోడుగా వున్నావని కూడా నాకు
తెలుసు.” 27అయితే ఇక నుంచి యెహోవా యాజకు
నిగా కొనసాగటానికి వీల్లేదని అబ్యాతారుతో సొలొ
మోను చెప్పాడు. యెహోవా ఎలా జరుగుతుందని
చెప్పాడో ఇప్పుడిది ఆ రకంగా జరిగింది. యెహోవా
ఏలీని గురించి, అతని కుటుంబం గురించి షిలోహులో
చెప్పిన దానికి అనుగుణంగా ఇప్పుడిది జరిగింది.

28యోవాబు జరిగినదంతా విని భయపడి
పోయాడు. అతడు అదోనీయాకు మద్దతు యిచ్చాడు
గాని, అబ్షాలోముకు వ్యతిరేకి అయ్యాడు. యోవాబు
దేవుని గుడారంలోకి పారిపోయి బలిపీఠపు కొమ్ములను
పట్టుకొన్నాడు. 29యోవాబు దేవుని గుడారంలో బలి
పీఠం వద్ద వున్నాడని ఎవరో పోయి రాజైన సొలొమో
నుకు చెప్పారు. సొలొమోను బెనాయాను పిలచి
యోవాబును చంపమన్నాడు.

30బెనాయా యెహోవా గుడారంలోనికెళ్లి యోవా
బుతో, “రాజు అతనిని బయటికి రమ్మంటున్నాడని”
చెప్పాడు.

“వద్దు, నేనిక్కడే చనిపోతాను” అని యోవాబు
అన్నాడు.

కావున బెనాయా తిరిగి వెళ్లి యోవాబు అన్న
మాటలు రాజుకు చెప్పాడు. 31“అయితే అతను చెప్పి
నట్లే చేయుము! వానిని అక్కడే చంపివేయుము.
పిమ్మట వానిని పాతిపెట్టుము. అప్పుడు యోవాబు
చేసిన పనుల యొక్క దోషం నా కుటుంబానికి, నాకు
తగలకుండ పోతుంది. ఈ దోషమెందుకు వచ్చిందనగా
యోవాబు అమాయకులను చంపాడు. 32తనకంటె
చాలా మంచివారిద్దరిని యోవాబు హత్య చేశాడు.
వారిద్దరు నేరు కుమారుడైన అబ్నేరు, మరియు
యెతెరు కుమారుడైన అమాశా. అబ్నేరు ఇశ్రాయేలు
సైన్యాధిపతి. అమాశా యూదావారి సైన్యాధిపతి.
అతడు వారిని చంపినట్లు నా తండ్రి దావీదుకు
తెలియదు. కావున యెహోవా అతనికి తగిన శాస్తి
చేస్తాడు.

33“వాళ్ల చావుకు కారణమయిన అపరాధి అతనే.
తన కుటుంబం కూడా శాశ్వతంగా ఈ నేరానికి
బాధ్యులు. కాని దావీదుకు, అతని సంతతి వారికి,
అతని కుటుంబానికి, అతని సింహాసనానికి దేవుడు
శాశ్వతంగా శాంతిని చేకూర్చుతాడు.”

34కావున యెహోయాదా కుమారుడైన బెనాయా
వచ్చి యోవాబును చంపాడు. యోవాబు శవాన్ని
ఎడారిలో అతని ఇంటి సమీపాన పాతిపెట్టారు. 35తరు
వాత యోవాబు స్థానంలో యెహోయాదా కుమారు
డైన బెనాయాను సైన్యాధ్యక్షునిగా సొలొమోను
నియమించాడు. సొలొమోను అబ్యాతారు స్థానంలో
సాదోకును కొత్త ప్రధాన యాజకునిగా కూడా
నియమించాడు. 36తరువాత, షిమీని రాజు పిలిచాడు.
రాజు షిమీతో, “ఇక్కడ యెరూషలేములో నీ కొరకై
ఒక ఇల్లు నిర్మించుకో. నీవు అందులో నివసిస్తూ,
నగరం వదిలి వెళ్ల వద్దు.

37నీవు నగరం వదిలి కిద్రోను వాగు దాటి వెళ్లితే
గనుక, ఎవరో ఒకరు నిన్ను చంపుతారు. ఆ తప్పుకు
నీవే బాధ్యుడవు” అని అన్నాడు.

38అది విని షిమీ, “నా రాజా, నీవు చెప్పినది చాలా
బాగున్నది. నేను నీకు విధేయుడనై వుంటాను” అని
అన్నాడు. షిమీ యెరూషలేములో చాలాకాలం నివ
సించాడు.

39కాని మూడు సంవత్సరాల తరువాత షిమీ యొక్క
ఇద్దరు బానిసలు పారిపోయారు. వారు గాతు రాజు
వద్దకు వెళ్లారు. ఆ రాజు పేరు ఆకీషు. అతడు మయకా
కుమారుడు. తన బానిసలు గాతులో వున్నట్లు షిమీ
విన్నాడు.

40తన గాడిదపై గంతవేసి, దానిమీద గాతు రాజైన
ఆకీషు వద్దకు వెళ్లాడు. అతడు తన బానిసలను వెదు
క్కుంటూ వెళ్లాడు. వాళ్లను అక్కడ పట్టుకుని తన
ఇంటికి తిరిగి తీసుకొచ్చాడు.

41కాని ఎవ్వరో సొలొమోను వద్దకు వెళ్లి షిమీ
యెరూషలేము నుండి గాతుకు వెళ్లి వచ్చాడని
చెప్పారు.

42అందువల్ల సొలొమోను షిమీని పిలిపించాడు.
సొలొమోను అతనితో ఇలా అన్నాడు, “యెరూషలేము
విడిచి వెళ్లితే నీవు చంపబడతావని నీకు తెలిసేలా
నేను నీ చేత యెహోవా పేరు మీద ప్రమాణం
చేయించాను. నీవు ఇక్కడినుండి ఎక్కడికైనా వెళ్లితే
తత్ఫలితంగా సంభవించే నీ మరణానికి నీవే కారకుడ
వవుతావని కూడా నిన్ను నేను హెచ్చరించాను. నేను
చెప్పినదానికి నీవు ఒప్పుకున్నావు. నాకు విధేయుడవై
వుంటానని నీవు అన్నావు.

43మరి నీ మాటను నీవు ఎందుకు నిలబెట్టుకో
లేదు? నా ఆజ్ఞను నీవెందుకు శిరసావహించలేదు?
44నీవు నా తండ్రి దావీదు పట్ల చేసిన అనేక తప్పులు
నీకు గుర్తుండే వుంటాయి. ఆ తప్పులన్నిటికీ
యెహోవా నిన్నిప్పుడు శిక్షిస్తాడు. 45కాని యెహోవా
నన్ను ఆశీర్వదిస్తాడు. దావీదు సింహాసనాన్ని ఆయన
ఎప్పుడూ సురక్షితంగా ఉంచుతాడు.”

46పిమ్మట రాజు షిమీని చంపమని బెనాయాకు
ఆజ్ఞ యివ్వగా అతను ఆ పని పూర్తి చేశాడు. అప్పుడు
సొలొమోను తన రాజ్యాన్ని పూర్తిగా తన అదుపులోకి
తెచ్చుకున్నాడు.

## రాజుగా సొలొమోను

3 సొలొమోను ఈజిప్టు రాజైన ఫరో కుమార్తెను
వివాహం చేసుకున్నాడు. అతనితో ఒక ఒడంబడిక
చేసుకున్నాడు. సొలొమోను ఆమెను దావీదు నగరానికి
తీసుకొనివచ్చాడు. ఆ సమయంలో సొలొమోను తన
భవనాన్ని, దేవాలయాన్ని నిర్మింప చేస్తూనేవున్నాడు.
సొలొమోను యెరూషలేము నగరం చుట్టూ ఒక గోడ
కూడా నిర్మిస్తున్నాడు. 2దేవాలయం ఇంకా పూర్తి
కాలేదు. అందువల్ల అప్పటి వరకు ప్రజలు తమ బలు
లను గుట్టలపై * వున్న బలిపీఠాల వద్దనే అర్పిస్తూండే
వారు. 3యెహోవాను ప్రేమించినట్లుగా సొలొమోను
నిరూపించుకున్నాడు. తన తండ్రియగు దావీదు
చెప్పిన విషయాలన్నీ నియమంగా పాటించాడు. కాని
సొలొమోను ఒక్క విషయంలో మాత్రం తన తండ్రి
చెప్పింది చేశాడు. అదేమనగా సొలొమోను గుట్టలపై
బలులు అర్పించటం, ధూపం వేయటం, కొన
సాగించటం.

4సొలొమోను రాజు బలులు అర్పించుటకు గిబి
యోనుకు వెళ్లాడు. అది బలి అర్పణచేసే ప్రదేశాలన్ని
టిలో చాలా పేరు గాంచిన గుట్ట. సొలొమోను ఆ
బలిపీఠం మీద ఒక వెయ్యి బలులు అర్పించాడు.
5సొలొమోను గిబియోను వద్ద వున్నప్పుడు
యెహోవా ఆయనకు స్వప్నంలో దర్శన మిచ్చాడు.
"నీవేదైనా కోరుకో. నీ కోరిక నెరవేర్చుతాను" అని
యెహోవా అన్నాడు.

6సొలొమోను ఇలా అన్నాడు: "నీ సేవకుడగు నా
తండ్రి దావీదుకు నీవు మిక్కిలి దయ చూపావు.
ఆయన నిన్ననుసరించాడు. ఆయన కూడా మంచి
వాడై, ధర్మంగా జీవించాడు. నీవాయన కుమారుని
రాజ్య సింహాసనానికి అర్హుణ్ణి చేసినప్పుడు, నీవు
ఆయనకు అపూర్వమైన కరుణ చూపావు. 7నా ప్రభు
వైన దేవా! నా తండ్రి స్థానంలో రాజ్యపాలన చేసేలా
నాకు అనుమతి ఇచ్చావు. కాని నేనింకా పసివానిలా
వున్నాను. నేను నిర్వర్తించవలసిన పనులు నెరవేర్చ
టానికి తగిన వివేకం నాకు కొరతగా ఉంది. 8నీ సేవ
కుడనైన నేను నీచేత ప్రత్యేకంగా ఎంపిక చేయబడిన
ప్రజల మధ్య వున్నాను. వారి జనాభా పెద్దది. వారు
లెక్కపెట్టలేనంత ఎక్కువగా వున్నారు. కావున పాలకు
డైన వాడు వారి విషయంలో అనేకానేక నిర్ణయాలు
తీసుకోవలసి వుంటుంది. 9అందువల్ల ఈ ప్రజానీకంపై
ధర్మపరిపాలన చేయగల న్యాయ నిర్ణయం చేయగల
దక్షత, పరిజ్ఞానము నాకు దయచేయుమని నిన్ను వేడు
కుంటున్నాను. ఈ జ్ఞానమువల్ల నేను మంచి చెడుల
నిర్ణయం చేయగలుగుతాను. ఈ మహా పరిజ్ఞానము
లేకుండ, ఈ గొప్ప ప్రజానీకాన్ని పరిపాలించటం
అసాధ్యమైన పని."

10సొలొమోను ఇది అడిగినందుకు యెహోవా
చాలా సంతోషించాడు. 11అతనితో దేవుడిలా అన్నాడు:
"నీవు నీకు దీర్ఘాయుష్షు యిమ్మని అడుగలేదు. నీవు
నీ కొరకై ధనధాన్యాదులిమ్మని అడుగలేదు. నీ శత్రు
నాశనం కూడ నీవు కోరుకోలేదు. మంచిచెడుల విచ
క్షణా జ్ఞానం, న్యాయనిర్ణయం చేయగల దక్షత నీవు
అడిగావు. 12కావున నీవడిగిన దానిని నీకు దయచేస్తాను.
నీకు విజ్ఞానాన్ని, వివేకాన్ని ఇస్తాను. గతంలో నీవంటి
వాడెవ్వడూ లేనట్లుగా నీకు జ్ఞానాన్ని కలుగజేస్తాను.
భవిష్యత్తులో కూడ నీకు సాటి మరి ఎవ్వడూ వుండడు"
13పైగా, నీకు పారితోషికంగా నీవు అడుగనివి కూడ
నీకు ఇస్తున్నాను. నీ జీవితాంతం నీకు ధనధాన్యాలు,
గౌరవ మర్యాదలు లభిస్తాయి. నీయంతటి గొప్పవాడు
ఈ ప్రపంచంలో మరో రాజు వుండడు. 14నాకు విధే
యుడవై వుండుమనీ, నా న్యాయమార్గాన్ని, నా ఆజ్ఞ
లను పాటించుమని నిన్ను నేనడుగుతున్నాను. నీ
తండ్రి దావీదువలె నీవు కూడ నడుచుకో. నీవు ఆ
విధంగా చేస్తే నీకు దీర్ఘాయుష్షు కూడ నేనిస్తాను."

15సొలొమోను మేల్కొన్నాడు. దేవుడు అతనితో
కలలో మాట్లాడినట్లు తెలుసుకొన్నాడు. సొలొమోను
తరువాత యెరూషలేముకు వెళ్లి యెహోవా ఒడం
బడిక పెట్టె ముందు నిల్చున్నాడు. సొలొమోను
యెహోవాకు ఒక దహనబలి ఇచ్చాడు. అతనింకా
సమాధాన బలులు కూడా దేవునికి చెల్లించాడు. తరు
వాత అతని పరిపాలనలో అతనికి చేదోడు వాదోడుగా
వున్న నాయకులకు, అధికారులందరికీ విందు
ఇచ్చాడు. 16ఒక రోజు ఇద్దరు వేశ్యా స్త్రీలు సొలొమోను
వద్దకు వచ్చారు. వారు రాజు ముందు నిలబడ్డారు.
17ఆ ఇద్దరిలో ఒక స్త్రీ ఇలా అన్నది, "అయ్యా, ఈమె,
నేను ఒకే ఇంట్లో నివసిస్తూ వుంటాము. మేమిద్దరం
గర్భవతుల మైనాము. కాన్పు నెలలు వచ్చాయి. నేనొక
బిడ్డను ప్రసవించాను. అప్పుడు ఈమె నా పక్కనే
వుంది. 18మూడు రోజుల తరువాత ఈమె కూడ ఒక
బిడ్డను కన్నది. మా ఇద్దరితో పాటు ఇంటిలో
మరెవ్వరూ లేరు. కేవలం మేమిద్దరమే వుంటున్నాము.
19ఒక రోజు రాత్రి ఈ స్త్రీ తన బిడ్డతో నిద్రిస్తూండగా,
ఆ బిడ్డ చనిపోయింది. 20అప్పుడు ఆమె ఆ రాత్రి
సమయంలో నేను నిద్రిస్తూండగా నా పక్కలో నుండి
నా బిడ్డను తీసుకొన్నది. నా బిడ్డను ఆమె తన పక్కలో
వేసుకొన్నది. చనిపోయిన బిడ్డను నా పక్కమీద
వుంచింది. 21మరునాటి ఉదయం నేను లేచి నా బిడ్డకు
పాలివ్వబోయాను. కాని బిడ్డ చనిపోయినట్లు గమనిం
చాను. నేను బిడ్డకేసి తేరిపార చూడగా ఆ బిడ్డ నా
బిడ్డ కాదని కనుగొన్నాను."

---

**గుట్టలపై** కనానీయుల మతానుసారం బలులు సమర్పించే కొండలు, ఇశ్రాయేలులో దేవాలయం నిర్మింపబడక ముందు బలులు అర్పించే ఉన్నత ప్రదేశాలు.

[22]కాని ఆ రెండవ స్త్రీ, "కాదు! బతికి వున్న బిడ్డే
నా బిడ్డ, చనిపోయిన బిడ్డే నీ బిడ్డ" అని అన్నది.
అందుకు మొదటి స్త్రీ ఇలా అన్నది, "కాదు! నీవు
పొరపాటు పడుతున్నావు! చనిపోయిన బిడ్డే నీది.
బతికివున్న బిడ్డ నాది!" ఇలా ఆ యిద్దరు స్త్రీలు రాజు
ముందు వాదోపవాదాలు చేసుకొన్నారు.
[23]ఇదంతా విన్న సొలొమోను, "మీ ఇద్దరిలో ప్రతి
ఒక్కరూ బతికివున్న బిడ్డ 'నాదే' అంటున్నారు. మీలో
ప్రతి ఒక్కరు చనిపోయిన బిడ్డ ఎదుటి వ్యక్తిదని
అంటున్నారు" అని అన్నాడు.
[24]అప్పుడు సొలొమోను రాజు తన సేవకుడిని
పంపి ఒక కత్తి తెప్పించాడు. [25]సొలొమోను రాజు
ఇలా అన్నాడు, "ఇప్పుడు మనం ఈ రకంగా చేద్దాం.
బతికి వున్న బిడ్డను రెండు ముక్కలుగా నరికేద్దాం. ఆ
ఇద్దరు స్త్రీలకు చెరియొక ముక్క ఇద్దాం!"
[26]ఇది విన్న ఆ రెండవ స్త్రీ, "ఈ పని చాలా
బాగుంటుంది. బిడ్డను రెండు ముక్కలు చేయండి,
అప్పుడు మా ఇద్దరిలో ఎవ్వరికీ ఆ బిడ్డ రాకుండా
పోతుంది" అని అన్నది.
కాని బిడ్డయొక్క నిజమైన తల్లియగు మొదటి స్త్రీ
తన బిడ్డపట్ల నిండైన ప్రేమతో రాజుతో, "అయ్యా,
దయచేసి బిడ్డను చంపవద్దు! బిడ్డను ఆమెకే ఇవ్వండి,"
అని అన్నది.
[27]సొలొమోను రాజు అప్పుడిలా అన్నాడు, "బిడ్డను
చంపకండి! బిడ్డను మొదటి స్త్రీకి ఇవ్వండి, అసలైన
తల్లి ఆమెయే!"
[28]ఇశ్రాయేలు ప్రజలు సొలొమోను రాజు తీర్పును
విన్నారు. ఆయన చాలా తెలివైనవాడు కావున అతనిని
ప్రజలు చాలా గౌరవించారు. న్యాయ నిర్ణయం చేయు
టలో ఆయనకు దేవుడిచ్చిన వివేకం * ఉన్నట్లు వారు
గమనించారు.

### సొలొమోను కింది అధికారులు, పాలకులు

4 ఇశ్రాయేలు ప్రజలందరి పైన సొలొమోను రాజు
పరిపాలన సాగించాడు. [2]తన పరిపాలనలో అత
నికి సహాయ పడిన ప్రముఖమైన అధికారుల పేర్లు
ఇవి:

సాదోకు కుమారుడైన అజర్యా ప్రధాన
యాజకుడు.
[3]షీషా కుమారులైన ఎలీహోరెపు మరియు
అహీయా న్యాయస్థానాలలో జరిగే వాగ్వాద
ములు, తీర్పులు మొదలగు వాటిని గ్రంథస్థం
చేసే లేఖకులు. అహీలూదు కుమారుడైన
యెహోషాపాతు చరిత్రకారుడు. [4]యెహో
యాదా కుమారుడైన బెనాయా సైన్యాధ్య
క్షుడు. సాదోకు, అబ్యాతారు యాజకులు.
[5]నాతాను కుమారుడు అజర్యా మండలా
ధిపతుల మీద అధికారి. నాతాను కుమారుడైన
జాబూదు అంతఃపుర యాజకుడే గాక రాజైన
సొలొమోనుకు సలహాదారుడు.
[6]అహీషారు రాజు యొక్క ఇంటి నిర్వహణలో
అన్ని జాగ్రత్తలు తీసుకొనేవాడు. అబ్దా కుమారు
డైన అదోనిరాము బానిసలకు అధిపతి.

[7]ఇశ్రాయేలును పరిపాలనా సౌలభ్యం కొరకు మండ
లాల పేరుతో పన్నెండు ప్రాంతాలుగా విభజించారు.
ప్రతి మండల పాలనకు రాజైన సొలొమోను ఒక
పాలకుని ఎంపిక చేశాడు. ఈ పన్నెండుగురు మండలా
ధిపతులు రాజుకు, రాజ కుటుంబానికి ఆహార
ధాన్యాలు, తదితర తిను బండారాలు సేకరించి పంపేలా
ఆజ్ఞలు ఇవ్వబడ్డాయి. ఈ పన్నెండుగురు పాలకులలో
ఒక్కొక్కడు సంవత్సరంలో ఒక్కొక్క నెల చొప్పున
ఆహార పదార్థాలు సేకరించి రాజుకు పంపే బాధ్యత
వహిస్తాడు.
[8]ఆ పన్నెండుగురు మండలాధిపతుల పేర్లు ఇవి:
బెన్-హూరు కొండల ప్రాంతమైన ఎఫ్రాయిమునందు
పాలకుడు;
[9]బెన్-దెకెరు అనునతను మాకస్సు, షయల్బీము,
బేత్షెమెషులోను మరియు ఏలోన్బేథానానులోను;
[10]బెన్-హెసెదు అనువాడు అరుబ్బోతు, శోకో
మరియు హెపెరులోను;
[11]బెన్-అబీనాదాబు నఫోతు దోరులోను (ఇతడు
సొలొమోను కుమార్తెయగు టాపాతును వివాహ
మాడాడు);
[12]అహీలూదు కుమారుడైన బయనా అనువాడు
తానాకు, మెగిద్దో మరియు సారెతాను పక్కనున్న
బేత్షెయాను ప్రాంతమంతటికీ; (ఈ ప్రాంతం యెజ్రె
యేలు దిగువ బేత్షెయాను మొదలుకొని ఆబేల్మె
హోలా వరకు యొక్నెయాముకు అడ్డముగా వ్యాపించి
ఉన్నది)
[13]బెన్-గెబెరు అనునతను రామోత్గిలాదులోను;
(ఇతడు గిలాదులోని మనష్షే కుమారుడైన యాయీరు
పట్టణాలు, గ్రామాలపైన పాలకుడు. ఇతనింకా బాషా
నులో ఉన్న అర్గోబు మండల ప్రాంతమునకు కూడా
పాలకుడుగా నియమింపబడ్డాడు. ఈ ప్రాంతంలో
చుట్టూ ప్రాకారాలున్న అరువది నగరాలున్నాయి. ఈ
నగరాలన్నిటికీ ద్వారాల మీద కంచు కడ్డీలు ఏర్పాటు
చేయబడ్డాయి).
[14]ఇద్దో కుమారుడైన అహీనాదాబు మహనయీ
ములోను; [15]అహిమయస్సు అనునతడు నఫ్తాలీము
లోను, ఇతడు సొలొమోను కుమార్తెయగు

**దేవుడిచ్చిన వివేకం** గొప్ప ప్రజ్ఞా ప్రభావములని
పాఠాంతరం.

బాశెమతును వివాహమాడాడు; 16హూషై కుమారుడగు
బయనా ఆషేరులోను, ఆలోతులోను;
17పరూయయహు కుమారుడగు యెహోషాపాతు
ఇశ్శాఖారు ప్రాంతంలోను;
18ఏలా కుమారుడగు షిమీ బెన్యామీనులోను;
19ఊరి కుమారుడైన గెబెరు అనునతడు గిలాదు
లోను అధిపతులుగా నియమింపబడ్డారు. (గిలాదు
ప్రాంతంలో అమోరీయులకు రాజైన సీహోను,
బాషాను రాజైన ఓగు నివసించేవారు). కాని ఆ ప్రాంత
మంతటికీ గెబెరు ఒక్కడు మాత్రమే పాలకుడుగా
నియమితుడయ్యాడు.

### రాజు కుటుంబానికి దినసరి ఆహార పదార్థాలు

20యూదాలోను, ఇశ్రాయేలులోను జనాభా విప
రీతంగా పెరిగింది. సముద్రతీరాన ఇసుక రేణువులా
ప్రజానీకం విస్తరించింది. ప్రజలంతా సుఖసంతోషా
లతో తింటూ, తాగుతూ, విలాసంగా జీవిస్తూ వున్నారు.
21యూఫ్రటీసు నది మొదలుకొని ఫిలిష్తీయుల
రాజ్యం వరకుగల రాజ్యాలన్నిటిపైన సొలొమోను పరి
పాలన సాగించాడు. అతని రాజ్యం ఈజిప్టు సరిహద్దుల
వరకు వ్యాపించింది. ఈ సామ్రాజ్యాధి పతులంతా
సొలొమోను ఆధిపత్యాన్ని అతని జీవితాంతంవరకు
అంగీకరించి అతనికి పన్ను చెల్లిస్తూ వచ్చారు.*
22-23 సొలొమోను రాజుకు, ఆయన బల్ల వద్ద
భోజనం చేసే వారికి సరిపడు దినసరి ఆహార పదార్థాలు
ఈ విధంగా వున్నాయి:

ఆరువందల తూముల* మెత్తని గోధుమ పిండి;
పన్నెండు వందల తూముల ముతక పిండి;
మంచి మేపులో ఉన్న పది ఆవులు; పొలాల్లో
మేసే ఇరువది ఆవులు; వంద గొర్రెలు; మూడు
రకాల దుప్పులు; ప్రత్యేకంగా ఎంపిక చేసిన
బాతులు మొదలగు పక్షి జాతులు.

24యూఫ్రటీసు నదికి పశ్చిమ ప్రాంతాన గల రాజ్యా
లన్నిటినీ సొలొమోను పరిపాలించాడు. ఈ ప్రాంతం
తిప్సహు మొదలు గాజా వరకు వ్యాపించి వున్నది.
సొలొమోను సామ్రాజ్యంలో నలుమూలలా శాంతి నెల
కొన్నది. 25సొలొమోను జీవించినంత కాలం యూదా
లోను, ఇశ్రాయేలులోని దాను నుండి బెయేర్షెబా వరకు
ప్రజలంతా శాంతి భద్రతలతో నివసించారు. ప్రజలు
తమ తమ అంజూరపు చెట్ల కింద, ద్రాక్షాలతల కిందను
కూర్చొని సుఖశాంతులతో జీవితం గడిపారు.
26సొలొమోను తన రథాలనులాగే నాలుగు వేల
గుర్రాలను ఉంచుటకు తగిన శాలలు ఏర్పాటు చేశాడు.
ఆయనకు పండ్రెండు వేల గుర్రాలు వున్నాయి. తన
రథాశ్వములకై సొలొమోను నాలుగు వేల* గుర్రపు
శాలలు కలిగియున్నాడు. సొలొమోనుకు పండ్రెండు
వేల మందిగల గుర్రపు దళం కూడా వున్నది. 27ప్రతి
నెల పన్నెండు మంది మండలాధిపతులలో ఒక్కొక్కడు
చొప్పున సొలొమోను రాజుకు కావలసిన సరుకు
లన్నిటినీ సమకూర్చి పెట్టేవాడు. రాజు బల్ల వద్ద తినే
వారందరికీ ఇవన్నీ సరిపోయేవి. 28రాజు యొక్క రథా
శ్వములకు, స్వారి గుర్రాలకు తగినంత పచ్చగడ్డిని,
యవధాన్యమును మండలాధిపతులు సేకరించి సరఫరా
చేసేవారు. ప్రతి ఒక్కడూ ఈ ధాన్యాన్ని నియమిత
స్థానాలకు చేరవేసేవాడు.
29సొలొమోనుకు దేవుడు మిక్కిలి జ్ఞానాన్ని ప్రసా
దించాడు. సొలొమోను అనేక విషయాలను సూక్ష్మంగా
గమనించేవాడు. అతని జ్ఞానం ఊహ కందనిది.*
30తూర్పుదేశపు మానవులందరి వివేక జ్ఞానా
లకంటె, సొలొమోను జ్ఞాన సంపద మిక్కిలి అతిశయిం
చినది. ఈజిప్టులోనున్న వారి తెలివితేటల కంటె అతని
శక్తి యుక్తులు మించినవి. 31ఈ భూమి మీద ప్రజలంద
రికంటె అతను తెలివైనవాడు. అతడు ఎజ్రాహీయుడైన
ఏతాను కంటె, మహోలు కుమారులైన హేమాను,
కల్కోలు, దర్ద అనువారి కంటె మిక్కిలి తెలివైనవాడు.
రాజైన సొలొమోను కీర్తి ఇశ్రాయేలు, యూదాల చుట్టు
పక్కలనున్న దేశాలకు కూడ వ్యాపించింది. 32తన
జీవిత కాలంలో రాజైన సొలొమోను మూడు వేల
సామెతలను రాశాడు.* అతనింకా వెయ్యిన్ని ఐదు
కీర్తనలు కూడా రచించాడు.
33సొలొమోను ప్రకృతిని క్షుణ్ణంగా అర్థం చేసు
కున్నాడు. సొలొమోను అనేక వృక్షజాతులను గూర్చి
చెప్పాడు. లెబానోనులోని గొప్ప దేవదారు వృక్షముల
నుండి, గోడలలో పుట్టి పాకే లతజాతుల మొక్కల
వరకు అతనికి తెలుసు. రాజైన సొలొమోను జంతువు
లను గూర్చి, పక్షులను గూర్చి, పాములు తదితర
పాకే క్రిమికీటకాదులు, బల్లులు, చేపలు మొదలగు
వాటిని గూర్చి కూడా చెప్పాడు. 34రాజైన సొలొమోను
జ్ఞానమును వినటానికి అన్ని దేశాల నుంచి ప్రజలు

**అంగీకరించి ... చెల్లిస్తూ వచ్చారు** అంటే ఈ దేశాల వారు సొలొమోను గొప్పతనాన్ని, ఆధిపత్యాన్ని అంగీకరించి అతనితో శాంతి సంధి చేసుకున్నట్లు నిరూపణ అవుతుంది.

**ఆరువందల తూములు** ఆంగ్ల కొలమానం ప్రకారం నూట ఏబై బుషెల్సు లేక ముప్పై కార్లు.

**నాలుగు వేలు** హెబ్రీ, లాటిను ప్రతులలో నలబై వేలని వున్నది. కాని దినవృత్తాంతాలు రెండవ గ్రంథము 9:25 చూడండి.

**అతని జ్ఞానం ఊహకందనిది** అతని జ్ఞానము సముద్ర తీరానగల ఇసుకలా అనంతం అని పాఠాంతరం.

**సామెతలను రాశాడు** లేక చెప్పెను అని పాఠాంతరం.

వచ్చేవారు. ఇతర దేశాల రాజులు తమ తమ పండితు
లను, శాస్త్రజ్ఞులను రాజైన సొలొమోను చెప్పే విష
యాలను వినటానికి పంపేవారు.

## సొలొమోను దేవాలయాన్ని కట్టుట

5 హీరాము అనునతను తూరు దేశానికి రాజు.
అతను దావీదుకు చిరకాల స్నేహితుడు. దావీదు
స్థానంలో సొలొమోను రాజ్యానికి వచ్చాడని విన్న
హీరాము తన సేవకులను సొలొమోను వద్దకు
పంపాడు. 2సొలొమోను వారిద్వారా రాజైన హీరాముకు
ఇలా చెప్పి పంపాడు: 3"నా తండ్రియగు రాజైన దావీదు
చుట్టుపక్కల రాజ్యాల వారితో అనేక యుద్ధాలు
చేసినట్లు నీకు తెలుసు. అందువల్ల యెహోవాయగు
తన దేవుని ఘనపరిచేలా ఒక దేవాలయం నిర్మించ
లేకపోయాడు. తన శత్రువులందరినీ యెహోవా తాను
ఓడించేలా చేసే వరకు రాజైన దావీదు వేచివున్నాడు.
4కాని ఇప్పుడు యెహోవా దేవుడు నా రాజ్యం నలు
మూలలా శాంతి నెలకొనేలా చేశాడు. ప్రస్తుతం నాకు
శత్రువులు లేరు. నా ప్రజలు నిర్భయంగావున్నారు.
5"యెహోవా నా తండ్రియగు దావీదుకు ఒక
మాట ఇచ్చాడు. యెహోవా ఇలా అన్నాడు, 'నీ
తరువాత నీ కుమారుని రాజును చేస్తాను. నీ కుమారుడు
నా పట్ల గౌరవ సూచకంగా ఒక దేవాలయం నిర్మిస్తాడు.'
కావున ఇప్పుడు నా యెహోవా దేవునికి ఘనంగా
ఒక దేవాలయం నిర్మింపజూస్తున్నాను. 6అందువల్ల
ఈ విషయంలో నీ సహాయం కోరుతున్నాను. నీ
మనుష్యులను లెబానోనుకు పంపించు. వారక్కడ నా
కొరకు దేవదారు వృక్షాలను పడగొట్టాలి. నా పనివాళ్లు
నీ పనివారితో కలిసి పని చేస్తారు. నీ పనివాళ్లకు వేతనంగా
నీవు ఎంత నిర్ణయిస్తే అది నేను చెల్లిస్తాను. కాని నీ
సహాయం మాత్రం నాకు కావాలి. మా వడ్రంగులు*
సీదోను వడ్రంగులకు సాటిరారు."
7సొలొమోను అడిగినదంతా విన్న హీరాము చాలా
సంతోషపడ్డాడు. "ఆ మహా సామ్రాజ్యానికి రాజుగా
వ్యవహరించటానికి దావీదుకు ప్రజ్ఞాశాలియైన కుమా
రుని ప్రసాదించినందుకు దేవునికి ఈ రోజు నమస్కరి
స్తున్నాను!" అని రాజైన హీరాము అన్నాడు. 8అప్పుడు
హీరాము ఒక సమాచారాన్ని సొలొమోనుకు యిలా
పంపాడు: "నీవు అడిగిన విషయాలన్నీ నేను విన్నాను.
నీవు కోరినన్ని దేవదారు వృక్షాలను, సరళపు చెట్లను
నీకు యిస్తాను. 9నా పనివాళ్లు ఆ దూలాలన్నిటినీ
లెబానోను నుండి సముద్రతీరానికి చేరవేస్తారు. వాటిని
నేను తెప్పలుగా కట్టించి సముద్రంలో వేయించి నీవు
కోరిన స్థలానికి చేరేలా చేస్తాను. అక్కడ ఆ దూలాలను
విడివిడిగా తీస్తాను. వాటిని నీవు తీసుకోవచ్చు. ఈ
సందర్భంగా నీవు నా మాట మన్నించి నా రాజకుటుంబ
పోషణకు తగిన ఆహార పదార్థాలను సమకూర్చుతావని
ఆశిస్తున్నాను."
10ఆ విధంగా హీరాము దేవదారు, సరళపు చెట్ల
కలపను సొలొమోనుకు సరఫరా చేయసాగాడు.
11సొలొమోను కూడ హీరాముకు అతని ఇంటి వారి
పోషణకు రెండు లక్షల తూముల గోధుమలు, మూడు
వేల ఎనిమిది వందల* పడుల స్వచ్ఛమైన ఒలీవ
గింజల నూనెను ప్రతియేటా పంపాడు.
12యెహోవా చేసిన వాగ్దానం ప్రకారం ఆయన
సొలొమోనుకు గొప్ప జ్ఞానాన్ని కలుగజేశాడు. హీరాము,
సొలొమోనుల మధ్య శాంతి, సామరస్యాలు నెల
కొన్నాయి. ఆ ఇద్దరు రాజులు ఒక ఒడంబడిక చేసు
కున్నారు.
13రాజైన సొలొమోను ముప్పదివేల మంది ఇశ్రాయే
లీయులను ఈ పనిలో సహాయపడటానికి బలవంతంగా
కూలిపనికి చేర్చుకున్నాడు. 14వీరిపై అధికారిగా అదోనీ
రాము అను వానిని రాజైన సొలొమోను నియమిం
చాడు. సొలొమోను వారిని మూడు జట్లుగా విభజిం
చాడు. ప్రతి జట్టులోను పదివేల మంది వున్నారు.
ప్రతి జట్టు లెబానోనులో ఒక నెలపాటు పనిచేసి,
రెండు నెలలు ఇంటివద్ద ఉండేవారు. 15సొలొమోను
ఎనుబది వేల మందిని కొండ ప్రాంతంలో పని చేయ
టానికి బలవంతపర్చాడు. వీరు రాళ్లు కొట్టి చెక్కాలి.
కొట్టిన రాళ్లను చేరవేయటానికి డెబ్బది వేల మంది
వున్నారు. 16ఈ పని చేసే వారిపై పర్యవేక్షణకై మూడు
వేల మూడు వందల మంది నియమితులయ్యారు.
17రాజైన సొలొమోను దేవాలయ పునాదులకు పనికి
వచ్చే విలువైన పెద్ద బండలు చెక్కమని పనివారికి
ఆజ్ఞ ఇచ్చాడు. ఈ రాళ్లు అతి నేర్పుగా కొట్టబడేవి.
18సొలొమోను యొక్క, హీరాము యొక్క శిల్పులు,
మరియు బిబ్లోసు* నుండి వచ్చిన వారును రాళ్లను
చెక్కారు. ఈ కట్టడపు పనివారంతా రాళ్లను, దూలా
లను, దేవాలయ నిర్మాణానికి తయారు చేశారు.

## దేవాలయ నిర్మాణం

6 ఆ విధంగా సొలొమోను దేవాలయ నిర్మాణం
మొదలుపెట్టాడు. ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టులో
నుండి వచ్చిన నాలుగు వందల ఎనభై సంవత్సరాల
తరువాత ఇది జరిగింది. అంతేగాకుండా ఇది రాజైన
సొలొమోను ఇశ్రాయేలుపై రాజ్యాధిపత్యం వహించిన

---

**వడ్రంగులు** వడ్రంగులనగా కొట్టెతో పనులు చేయు వారు. పూర్వకాలంలో వీరినే చెట్లు కొట్టే వారిగా భావించే వారు.

**మూడు వేల ఎనిమిది వందలు** ఇరవై వేల బాతులని శబ్దార్థం. ఆరు గాలన్లు ఒక బాతు అని లెక్క.

**బిబ్లోసు** లేక గెబాలు.

నాలుగవ సంవత్సరం. ఆ సంవత్సరంలో అది జీప్
అను రెండవ నెల. 2దేవాలయం పొడవు తొమ్మిది
అడుగులు,* వెడల్పు ముప్పై అడుగులు.* దాని
ఎత్తు నలుబది ఐదు అడుగులు.* 3దేవాలయపు ముఖ
మండపం పొడవు ముప్పై అడుగులు; వెడల్పు
పదిహేను అడుగులు. ఈ మండపం ప్రధాన దేవాలయా
నికి ముంగిటనే వున్నది. దీని పొడవు దేవాలయం
యొక్క వెడల్పుకు సమానంగా వుంది. 4దేవాల
యంలో ఇరుకైన కిటికీలు వున్నాయి. ఈ కిటికీలు
చూడటానికి బయటి నుండి ఇరుకుగాను, లోపలి
వైపు విశాలంగాను* వున్నాయి. 5పిమ్మట ప్రధాన
దేవాలయం గోడల నానుకొని కొన్ని గదులను సొలొ
మోను కట్టించాడు. ఈ గదులు ఒకదాని మీద ఒకటిగా
నిర్మింపబడ్డాయి. 6కింది అంతస్తులో ఉన్న గదుల
వెడల్పు ఏడున్నర అడుగులు.* మధ్య అంతస్తులో
గదుల వెడల్పు తొమ్మిది అడుగులు.* దాని పై
గదుల వెడల్పు పదిన్నర అడుగులు.* గదులకు ఒక
పక్క గోడగా వున్న దేవాలయం గోడ, కింద గదుల
గోడకన్న మందము తక్కువ. గదులన్నీ ఆ గోడకు
ఆనుకొని కట్టబడినా, వాటి ముఖ్య దూలాలు గోడలోకి
చొచ్చుకొని పోకుండా ఆధార శిలలపై పెట్టబడ్డాయి.
7ఈ దేవాలయ నిర్మాణానికి ఉపయోగించిన రాళ్లన్నీ
అవి తీయబడిన గనుల వద్దనే కావలసిన రీతిలో శిల్పు
లచే చెక్కబడి, మలచబడినందున నిర్మాణ స్థలంలో
సుత్తులు, గొడ్డళ్లు, తదితర పనిముట్లు వాడిన శబ్దం
వినరాలేదు.

8దేవాలయం పక్కగా కట్టిన కింది గదులకు ప్రవేశ
మార్గం దక్షిణ భాగాన వున్నది. రెండవ అంతస్తుకు
వెళ్లటానికి, అక్కడి నుండి మూడవ అంతస్తు గదులకు
వెళ్లటానికి మెట్ల మార్గాలు ఏర్పాటు చేయబడ్డాయి.
9దేవాలయపు పైకప్పును దూలాలతోను, దేవదారు
చెక్కలతోను సొలొమోను నిర్మింపజేశాడు. ఆ విధంగా
సొలొమోను దేవాలయ నిర్మాణం పూర్తి చేశాడు.
10దేవాలయం పక్కనున్న కింది అంతస్తు పని కూడా
పూర్తి చేశాడు. అది ఏడున్నర అడుగుల ఎత్తు వుంది.
అది దేవదారు దూలాలతో దేవాలయానికి జత చేర్చ
బడివుంది.

11సొలొమోనుతో యెహోవా ఇలా అన్నాడు:
12"నీవు నా న్యాయ సూత్రాలను, ఆజ్ఞలను పాటించి
నట్లయితే నీ తండ్రియగు దావీదుకు నీ గురించి
నేను చేసిన వాగ్దానం నెరవేర్చుతాను. 13నా ప్రజలైన
ఇశ్రాయేలీయుల మధ్య నీవు నిర్మించే ఈ దేవాల
యంలో నేను నివసిస్తాను. నేను ఇశ్రాయేలు ప్రజలను
ఎన్నటికీ విడనాడను."

### దేవాలయపు వివరాలు

14సొలొమోను దేవాలయ నిర్మాణం పూర్తి చేశాడు.
15దేవాలయపు లోపలి పక్క గోడలకు దేవదారు
బల్లలు అమర్చబడ్డాయి. కింది నేల భాగం సరళపు
మ్రాను చెక్కలతో కప్పబడింది. 16ముప్పై అడుగుల
పొడవు గల ఒక గది దేవాలయానికి వెనుకగా కట్ట
బడింది. కింది నుంచి కప్పు వరకు అమర్చబడిన
దేవదారు చెక్కల పనితనంతో ఈ గది దేవాలయం
నుండి వేరు చేయబడింది. ఈ గదికి అతి పవిత్ర
స్థలమని పేరు. 17ఈ మిక్కిలి పరిశుద్ధ స్థలం ముందున్న
గది అరువది అడుగుల పొడవు గలిగివున్నది. 18ఆ
దేవదారు చెక్కలపై వికసించిన పువ్వులు, సొర తీగలు*
మనోహరంగా చెక్కబడ్డాయి. ఆ గది లోపలి భాగమంతా
దేవదారు పలకలతో కప్పబడింది. అందువల్ల ఎవ్వరూ
గోడ రాళ్లను చూడలేరు.

19ఆలయ ప్రాంగణానికి వెనుక వున్న ఈ అతి
పరిశుద్ధ స్థలము దేవుని ఒడంబడిక పెట్టె వుంచటానికి
నిర్మింపబడింది. 20ఈ అతి పరిశుద్ధ స్థలము ముప్పై
అడుగుల పొడవు, ముప్పై అడుగుల వెడల్పు ముప్పై
అడుగుల ఎత్తు కలిగివుంది. 21సొలొమోను ఈ అతి
పరిశుద్ధ స్థలము లోపలి భాగమంతా శుద్ధ బంగారంతో
పొదిగించాడు. ఈ గదికి ముందు బంగారంతో పొద
గబడిన ఒక బలిపీఠం నిర్మించబడింది. దాని చుట్టూ
బంగారు గొలుసులు చుట్టబడ్డాయి. కెరూబులు
రెండూ బంగారు రేకులతో కప్పబడ్డాయి. 22దేవా
లయం మొత్తం బంగారంతో పొదగబడింది. అతి
పరిశుద్ధ స్థలము వద్దగల పీఠం కూడా బంగారంతో
పొదగబడింది.

23పనివారు కెరూబులను రెక్కలతో తయారు
చేశారు. అవి ఒలీవ కర్రతో చేయబడ్డాయి. ఈ కెరూబు
లను అతి పరిశుద్ధ స్థలములో వుంచారు. ప్రతి ఒక్క
దేవదూత పదిహేను అడుగుల పొడవు వున్నది.
24-26రెండు కెరూబులు ఒకే పరిమాణంలో, ఒకే రకంగా

---

**తొమ్మిది అడుగులు** అరవై మూరలని శబ్దార్థం. మూర అనగా పదునెనిమిది మొదలు ఇరవై రెండు అంగుళాలు.

**ముప్పది అడుగులు** ఇరవై మూరలు.

**నలుబది ఐదు అడుగులు** ముప్పై మూరలు. ప్రాచీన గ్రీకు అనువాదంలో ఇరవై ఐదు మూరలని వున్నది.

**లోపలి వైపు విశాలంగాను** బహుశః దీని అర్థం పనిత నంగా అల్లిక వేయబడిన కిటికీలని కావచ్చు.

**ఏడున్నర అడుగులు** ఐదు మూరలు.

**తొమ్మిది అడుగులు** ఆరు మూరలు.

**పదిన్నర అడుగులు** ఏడు మూరలు.

**సొర తీగలు** బాగా పాకే తీగజాతి మొక్క. దీని కాయలు జాడీల వలె బారుగా వుంటాయి. ఎండిన కాయలు గట్టిపడి, పైపెచ్చు చెక్కలా వుంటుంది.

నిర్మించబడ్డాయి. ప్రతి కెరూబునికీ రెండు రెక్కలు
న్నాయి. ప్రతి రెక్క ఏడున్నర అడుగుల పొడవుంది.
ఒక రెక్క చివరి నుండి మరో రెక్క చివరి వరకు గల
మధ్య దూరం పదిహేను అడుగులు. ప్రతి కెరూబు
పదిహేను అడుగుల పొడవులో మలచబడింది. 27ఈ
కెరూబులు అతి పరిశుద్ధ స్థలములో పక్కపక్కన నిల
బెట్టబడ్డారు. గది మధ్యలో వారి రెక్కలు ఒక దానితో
ఒకటి కలిశాయి. మిగిలిన రెండు రెక్కలు ఆ పక్కగోడ
నొకటి ఈ పక్క గోడ నొకటి ఆనుకొని వున్నాయి.
28రెండు కెరూబులు బంగారంతో పొదగబడ్డాయి.

29అతి పరిశుద్ధ స్థలము చుట్టూవున్న గోడల·మీద,
లోపల గదుల గోడల మీద కెరూబులు, తమాల
వృక్షాలు, పువ్వులు చిత్రీకరింపబడ్డాయి. 30అతి పరిశుద్ధ
స్థలము, దేవాలయ ప్రాంగణ గది నేలలు బంగారు
రేకులతో కప్పబడ్డాయి.

31అతి పరిశుద్ధ స్థలానికి తలుపులు ఏర్పరచ
బడ్డాయి. ఆ తలుపులు ఒలీవ కర్రతో చేయబడ్డాయి.
తలుపు ఐదు రకాలుగా* తిరిగే విధంగా ఐదు ముఖముల
నిలువు కమ్మికి అమర్చబడింది.

32రెండు తలుపులూ ఒలీవ కర్రతో చేయబడినవే.
తలుపుల మీద కెరూబుల, తమల వృక్షాల, పువ్వుల
చిత్రాలు మలచబడ్డాయి. తలుపులు బంగారంతో
పొదగబడ్డాయి.

33ప్రధాన గది ద్వారానికి ఒలీవ కర్రతో చేయబడిన
చదరపు తలుపు అమర్చబడింది. 34దాని రెండు
తలుపులు సరళపు చెక్కలతో చేయబడ్డాయి. 35ప్రతి
తలుపూ రెండు భాగాలుగా చేయబడింది. దానివల్ల
రెండేసి భాగాలు మూయటానికి వీలవుతుంది. తలుపుల
మీద కెరూబులు, తమాల వృక్షాలు, పూవులు చెక్క
బడ్డాయి. ఈ చెక్కడాలన్నిటి పైన బంగారు పూత
వేయబడింది.

36తరువాత లోపలి ఆవరణం సిద్ధం చేయబడింది.
పెరడు చుట్టూ గోడ నిర్మాణం జరిగింది. ఈ గోడలు
చెక్కిన మూడు రాళ్ల వరుసతో నిర్మింపబడి, వాటికి
ఒక వరుసలో దేవదారు చెక్క అమర్చబడింది.

37ఆ సంవత్సరంలో దేవాలయ నిర్మాణం పని
రెండవ నెలలో ప్రారంభించబడింది. ఆ నెల పేరు
జీప్. అది సొలొమోను ఇశ్రాయేలును పాలించటం
మొదలు పెట్టిన పిమ్మట నాలుగవ సంవత్సరం. 38సొలొ
మోను పాలన పదకొండు సంవత్సరాలు సాగేనాటికి
దేవాలయ నిర్మాణం పూర్తయింది. పూర్తి అయ్యేనాటికి
ఆ సంవత్సరంలో ఎనిమిదవ నెల జరుగుతూ వుంది.
దాని పేరు బూలు. దేవాలయ నిర్మాణం పథకం ప్రకారం
పూర్తయింది. దేవాలయ నిర్మాణ పరిసమాప్తికి సొలొ
మోను ఏడు సంవత్సరాలు కృషి చేశాడు.

**ఐదు రకాలు** ఇక్కడ భావం విశదంగా లేదు.

### సొలొమోను భవనం

7 రాజైన సొలొమోను తనకై ఒక రాజభవనం
కట్టించాడు. సొలొమోను రాజభవన నిర్మాణానికి
పదమూడు సంవత్సరాలు పట్టింది. 2అతడింకా "లెబా
నోను అరణ్యపు విశ్రాంతి గృహాన్ని" కూడ ఒకటి
కట్టించాడు. అది నూట ఏభై అడుగుల* పొడవు,
డెబ్బది ఐదు అడుగుల* వెడల్పు, మరియు నలభై
ఐదు అడుగుల* ఎత్తు కలిగివుంది. దానికి నాలుగు
వరుసల దేవదారు స్తంభాలు వున్నాయి. వాటి పైన
నగిషీ పని చేసిన దేవదారు స్తంభ శీర్షాలు నిలుపబడ్డాయి.
3స్తంభముల మీద పైకప్పుగా దేవదారు పలకలు పర్చ
బడ్డాయి. కప్పు భాగానికి నలభైయైదు దూలాలను
పరిచారు. నాలుగు స్తంభాల వరుసల మధ్య నున్న
మూడు భాగాలకు ఒక్కొక్క దానికి పదిహేను కొయ్య
కడ్డీలు చొప్పున అమర్చబడ్డాయి. 4ఈ వరుసల మధ్య
కిటికీలున్నాయి. అవి ఒకదానికొకటి ఎదురెదురుగా
నిర్మింపబడ్డాయి. 5తలుపులన్నీ చదరంగా వున్నాయి.
ప్రతి వరుస చివరనున్న తలుపులు ఒకదానికొకటి
ఎదురెదురుగా వున్నాయి.

6సొలొమోను "స్తంభాలతో ఒక మండపం" నిర్మిం
చాడు. దాని పొడవు డెభ్భై అడుగులు; వెడల్పు నలభై
అడుగులు, స్తంభాల నాధారంగా చేసుకొని మండపానికి
ముందు ఒక వసారా వుంది.

7సొలొమోను తమ న్యాయ విచారణ జరుపుటకు
సింహాసనమున్న ఒక గదిని కట్టించాడు. దానికి "న్యాయ
సభాస్థలి" అని పేరు పెట్టాడు. ఆ గదంతా కింది నేల
నుండి పైకప్పు దూలాల వరకు దేవదారు చెక్కలతో
కప్పబడింది.

8సొలొమోను నివసించే ఇల్లు ఈ న్యాయ సభా
స్థలానికి బాగా వెనుక భాగంలో వుంది. అదే రకమైన
మరియొక ఇంటిని తన భార్యకై నిర్మింపజేశాడు. తన
భార్య ఈజిప్టు రాజు కుమార్తె. 9ఈ భవనాలన్నీ చాలా
ఖరీదైన రాళ్లతో కట్టబడ్డాయి. ఈ రాళ్లన్నీ కావలసిన
పరిమాణంలో చెక్కబడి, ప్రత్యేక రంపాలతో కోయ
బడ్డాయి. ఈ రాళ్లు ముందు వెనుక కోయబడ్డాయి.
ఈ ఖరీదైన రాళ్లు పునాదుల నుండి పై వరుస వరకు
వేయబడ్డాయి. ఆవరణ గోడలకు, ఆవరణలోను రాళ్లు
వాడబడ్డాయి. 10పునాదులకు ఖరీదైన పెద్ద బండలు
వేయబడ్డాయి. కొన్ని బండలు పదిహేను అడుగుల
పొడవు గలవి; మరికొన్ని పన్నెండు అడుగుల
పొడవుగలవై వున్నాయి. 11ఈ బండల మీద ఇతర
ఖరీదైన రాళ్లు, దేవదారు కట్టెలు వేశారు. 12భవనపు
ఆవరణ, దేవాలయపు ఆవరణ, దేవాలయ సింహ

**నూట ఏభై అడుగులు** వంద మూరలు.

**డెబ్బది ఐదు అడుగులు** ఏభై మూరలు.

**నలభై ఐదు అడుగులు** ముప్పై మూరలు.

ద్వారపు గోడలు మూడు వరుసల చెక్కిన రాళ్లతో
నిర్మింపబడి వాటి మీద దేవదారు దూలాలు వేయ
బడ్డాయి.
13రాజైన సొలొమోను తూరు పట్టణం నుండి
హీరాము అను వానిని తన వద్దకు పిలిపించాడు.
14హీరాము తల్లి నఫ్తాలి వంశానికి చెందిన స్త్రీ. మర
ణించిన తన తండ్రి తూరు పట్టణపువాడు. హీరాము
కంచు పనిలో బహు నేర్పరి. మంచి అనుభవజ్ఞుడు.
రాజైన సొలొమోను అతనిని పిలవగా హీరాము అంగీ
కరించి వచ్చాడు. రాజైన సొలొమోను కంచు పనుల
న్నిటికీ అతనిని అధిపతిగా చేశాడు. కంచుతో చేసే
పనులన్నీ హీరాము నిర్వహించాడు.
15హీరాము రెండు కంచు స్తంభాలు పోత పోశాడు.
ఒక్కొక్కటి ఇరువై ఏడు అడుగుల పొడవు, పద్దెనిమిది
అడుగుల చుట్టు కొలత (ఉరవు) కలిగి వున్నాయి.
అయితే ఈ స్తంభాల లోపలి భాగం బోలుగా వుంది.
స్తంభపు అంచు మందం నాలుగు అంగుళాలు.*
16అతడు రెండు స్తంభ శీర్షాలు* కూడా తయారు
చేశాడు. అవి ఒక్కొక్కటి ఏడున్నర అడుగుల పొడవున
వున్నాయి. ఈ స్తంభశీర్షాలను హీరాము తాను పోత
పోసిన స్తంభాలపై నిలిపాడు. 17పిమ్మట గొలుసులతో
వలలవంటి అల్లిక తయారు చేసి స్తంభాల మీద నున్న
శీర్షాలను కప్పేలా పైనవేశాడు. 18దానిమ్మకాయల ఆకా
రంలో వేలాడే బంతులు గల రెండు కంచు గొలుసులను
అతడు తయారు చేశాడు. ఈ కంచు దానిమ్మ కాయల
వరుసలను స్తంభశీర్షాల మీదనున్న లోహపు వలల
మీద చుట్టాడు. 19ఈ స్తంభశీర్షాలు ఏడున్నర అడుగుల
పొడవున వికసించిన పద్మాకారంలో మలచబడ్డాయి.
20ఈ స్తంభశీర్షాలు కంచు స్తంభాలమీద పెట్టబడ్డాయి.
పాత్ర ఆకారంలో ఉన్న వలలపైన అవి పెట్టబడ్డాయి.
ఆ ప్రదేశంలో స్తంభశీర్షం చుట్టూ ఇరవై దానిమ్మ
కాయలు గల గొలుసు చుట్టబడింది. 21ఈ రెండు
కంచు స్తంభాలను హీరాము దేవాలయపు మండపం
వద్ద నిలబెట్టాడు. ఒక స్తంభం దక్షిణ వైపున, మరొక
స్తంభం ఉత్తరవైపున నిలుపబడ్డాయి. దక్షిణ స్తంభానికి
యాకీను అని, ఉత్తర స్తంభానికి బోయజు అని పేర్లు
పెట్టారు. 22పుష్పాకారంలో వున్న పీటలు కంచు
స్తంభాలపై ఉంచబడ్డాయి. ఆ విధంగా స్తంభ నిర్మాణం
పని పూర్తయింది.
23పిమ్మట హీరాము కంచుతో ఒక గుండ్రని కోనేరు
తయారు చేశాడు. (దానిని వారు "సముద్రం" అని
పిలిచారు) ఆ సముద్రం సుమారు నలభై ఐదు
అడుగుల* చుట్టు కొలత కలిగివుంది. ఒక అంచు
నుండి మరొక అంచు వరకు సముద్రం అడ్డుగా
పదిహేను అడుగులు వుంది. దాని లోతు ఏడున్నర
అడుగులు. 24దాని చుట్టు బయటి అంచున ఒక కమ్మి
ఉన్నది. ఈ కమ్మి కింద రెండు వరుసల కంచు సొర
తీగె పొందుపర్చబడింది. అనగా ఈ కంచు సొరతీగ
ఒక్క ముక్కగానే చెరువుతో పాటు ఒకే సారి మలచ
బడింది. 25ఈ కోనేటిని పన్నెండు కంచు గిత్తల
వీపులపై నిలిపారు. ఈ పన్నెండు గిత్తలు చెరువు
నుండి బయటికి చూస్తున్నాయి. మూడు ఉత్తరానికి,
మూడు తూర్పుకు, మూడు దక్షిణానికి, మరి మూడు
పడమరకు చూస్తున్నాయి. 26కంచు చెరువు అంచు
మందం నాలుగు అంగుళాలు. చెరువు అంచు గిన్నె
అంచులా, విచ్చిన పూరేకులా వున్నది. ఆ చెరువులో
సుమారు తొమ్మిది గరిసెల* నీరు పట్టుతుంది.
27హీరాము తరువాత పది కంచు తోపుడు బండ్ల వంటివి
తయారుచేశాడు. ఒక్కొక్క దాని పొడవు ఆరు అడు
గులు (నాలుగు మూరలు), వెడల్పు ఆరు అడుగులు,
మరియు ఎత్తు నాలుగున్నర అడుగులు (మూడు
మూరలు), 28వీటి పక్కలు నాలుగు మూలలుగా వున్న
కంచు పలకలతో మూయబడ్డాయి. ఆ నాలుగు మూల
లుగా వున్న పలకలు చట్రాలతో బిగించబడ్డాయి.
29ఆ పలకల మీద సింహాలు, గిత్త దూడలు, కెరూ
బులు చిత్రీకరించబడ్డాయి. ఆ సింహాల, గిత్తల బొమ్మ
లపై వరుస, కింది వరుసలలో పువ్వుల అలంకరణ
కంచులోకి దట్టించి ముద్రించబడింది. 30ప్రతి బండికి
నాలుగు కంచు చక్రాలున్నాయి. చక్రాలకు ఇరుసు
లున్నాయి. మూలల మీద పెద్ద గిన్నెలు నిలపటానికి
కంచు ముక్కల ఆధారం వుంది. ఆ కంచు ఆధారాల
మీద పూలు చెక్కబడ్డాయి. 31ఆ గిన్నెలకు పైన
అంచు చుట్టూ చట్రముంది. గిన్నెకు పదునెనిమిది
అంగుళాల ఎత్తున అదివుంది. గిన్నె మూతి గుండ్రంగా
వున్నది. గిన్నెలోతు ఇరువది ఏడు అంగుళాలు. చట్రం
మీద కూడ అలంకరణ చెక్కబడి వున్నది. ఈ చట్రం
గుండ్రంగా గాక నాలుగు పలకలుగా వుంది. 32అడుగు
చట్రం కింద నాలుగు చక్రాలున్నాయి. చక్రాలు ఇరవై
ఏడు అంగుళాల ఎత్తు వున్నాయి. చక్రాల ఇరుసులు
బండితో ఒకే రీతిగా చేయబడ్డాయి. 33వీటి చక్రాలు
రథ చక్రాలను పోలి వున్నాయి. చక్రాలలో ప్రతిదీ
వాటి మధ్య కడ్డీలు, అంచులు, చువ్వలు, చక్రపు
నడిమి భాగం కంచుతో చేయబడింది.
34ప్రతి బండికీ నాలుగు మూలలా నాలుగు ఆధారా
లున్నాయి. అవన్నీ బండితో పాటు ఒకే రీతిగా చేయ
బడినవే. 35ప్రతి బండి చుట్టూ పైభాగాన ఒక బొద్దు
వంటి చట్రముంది. అది బండితో కలిసి ఏకంగా

**నాలుగు అంగుళాలు** బెత్తెడు అని పాఠాంతరం.

**స్తంభ శీర్షాలు** పీటలు అని పాఠాంతరం.

**నలభై ఐదు అడుగులు** ముప్పది మూరలు.

**తొమ్మిది గరిసెలు** పదకొండు వేల గాలనులు లేక రెండు
వేల మందికి సరిపోయే స్నానోదకం అని పాఠాంతరం.

చేయబడింది. 36బండి పక్కన గల కంచు పలకలపై
కెరూబుల, సింహాల, తమాల వృక్షాల చిత్రాలు మలచ
బడ్డాయి. ఎక్కడెక్కడ అవకాశం వున్నదో అక్కడ
చిత్రాలు, అలంకరణలు చెక్కబడ్డాయి. చుట్టూ అనేక
పుష్పాలు చెక్కబడ్డాయి. 37ఆ రకంగా హీరాము పది
బండ్లను తయారు చేశాడు. ప్రతీదీ కరిగించిన కంచును
మూసలో పోతపోశారు. కావున అన్ని బండ్లు ఒకే పరిమా
ణంలో, ఒకే ఆకారంలో ఉన్నాయి.

38హీరాము పిమ్మట పది పెద్ద తొట్లను తయారు
చేశాడు. ముందు నిర్మించిన పది బండ్ల మీదికి పది
తొట్లను నిర్మించాడు. ప్రతి తొట్టి ఈ అంచు నుండి
ఆ అంచు వరకు అడ్డంగా ఆరడుగులు వుంది. ప్రతి
తొట్టిలోను ఏడువందల ఇరువది తూముల* నీరు
పట్టేది. 39హీరాము ఐదు బండ్లను దేవాలయానికి
దక్షిణాన, మిగిలిన ఐదింటిని ఉత్తర భాగాన ఉంచాడు.
పెద్ద కోనేటిని దేవాలయానికి ఆగ్నేయ భాగాన నెల
కొల్పాడు. 40హీరాము ఇంకా కొన్ని కుండలను,
చిన్నపాటి గరిటెలను, గిన్నెలను తయారు చేశాడు.
రాజైన సొలొమోను హీరామును చేయుమని చెప్పిన
వన్నీ అతడు పూర్తిచేశాడు. యెహోవా దేవాలయానికై
హీరాము చేసిన వస్తువులు ఇవి:

41రెండు స్తంభాలు;

ఆ రెండు స్తంభాల మీద నున్న స్తంభశీర్షాలకు
ఏర్పాటు చేసిన గిన్నెలాంటి పాత్రలు; స్తంభాల మీది
రెండు శీర్షాల కొరకు ఉంచబడిన రెండు గిన్నెలను
కప్పటానికి రెండు అల్లికలు;

42ఆ అల్లికలకు నాలుగు వందల దానిమ్మకాయల
బొమ్మలు; రెండు స్తంభాల మీది శీర్షాలకు అమర్చిన
గిన్నెలపై గల అల్లికల మీద దానిమ్మకాయల గొలు
సును రెండు వరుసల చొప్పున చుట్టారు.

43పది బండ్లు; వాటిపైన తొట్టెలు;

44పన్నెండు గిత్తలపై నిల్పిన ఒక పెద్ద కోనేరు;

45కుండలు, చిన్న పాటి గరిటెలు, గిన్నెలు,
యెహోవా దేవాలయానికి కావలసిన తదితర
పాత్రలు; మరియు రాజు ఇంటికి నలభై ఎనిమిది
స్తంభాలు;

రాజైన సొలొమోను కోరినవన్నీ హీరాము తయారు
చేసి పెట్టాడు. అవన్నీ మెరుగు దిద్దిన కంచుతో చేయ
బడ్డాయి. 46సొలొమోను ఈ వస్తు సామగ్రిని చేయటా
నికి పట్టిన కంచును తూకం వేయలేదు. అది తూచటా
నికి అలివికానంత ఉంది. అందువల్ల వారు ఎంత కంచు
వాడినది తెలియదు. 47ఈ కంచు సామగ్రి అంతా
రాజు ఆజ్ఞ ప్రకారం యొర్దాను నది దగ్గర సుక్కోతుకు,
సారెతానుకు మధ్య చేయబడ్డాయి. ఈ వస్తు సామగ్రి
నంతా కంచు కరగించి బంక మట్టితో చేసిన మూసలలో
పోసి వారు తయారుచేశారు.

48దేవాలయం కొరకు అనేక వస్తువులు బంగారంతో
చేయటానికి కూడ సొలొమోను ఆజ్ఞ ఇచ్చాడు. బంగా
రంతో దేవాలయానికి సొలొమోను చేయించిన వస్తు
వులు ఈ విధంగా వున్నాయి:

బంగారు బలిపీఠం; బంగారపు బల్ల (దేవునికి
అర్పించు సముఖపు రొట్టెలు ఉంచడానికి).

49పది దీప స్తంభాలు: (అతి పరిశుద్ధ స్థలము ముందు
కుడిపక్కన ఐదు, ఎడమపక్కన ఐదు ఇవి ఉంచ
బడ్డాయి)

బంగారు పుష్పాలు, ప్రమిదెలు, పటకారులు;
50గిన్నెలు; దీపాలను కాంతి కొరకై ఎగ దోసే
పనిముట్లు; పాత్రలు; పెనాలు; ధూపం వేయ
టానికి బొగ్గులు వేసే బంగారు ధూపకలశం;
దేవాలయం సింహద్వారపు తలుపులు.

51ఆ రకంగా రాజైన సొలొమోను కోరుకున్న
ప్రకారం యెహోవా దేవాలయంయొక్క పని పూర్తి
అయింది. అప్పుడు రాజైన సొలొమోను తన తండ్రి
దావీదు దేవునికి అంకితం చేసిన వస్తువులన్నీ దేవాల
యానికి తెచ్చాడు. దేవాలయపు ధనాగారంలో ఆ
వెండి బంగారాలు భద్రపరిచాడు.

### నిబంధన మందసం దేవాలయానికి తేబడుట

8 రాజైన సొలొమోను తరువాత ఇశ్రాయేలు పెద్దలం
దరినీ, ఆయా వంశాల ప్రధాన పురుషులను, ఇశ్రా
యేలులో కుటుంబ పెద్దలను ఒక చోటికి పిలిపిం
చాడు. వారందరినీ యెరూషలేములో తన వద్దకు
రమ్మని చెప్పాడు. సీయోను అనబడే దావీదుపురం
నుండి దేవుని ఒడంబడిక పెట్టెను దేవాలయానికి తర
లించే కార్యక్రమంలో పాల్గొనమని సొలొమోను వారిని
కోరాడు. 2కావున ఇశ్రాయేలీయులందరూ రాజైన
సొలొమోను వద్దకు వచ్చారు. ఏతనీము అనబడే
మాసంలో పండుగ సందర్భంగా ప్రత్యేక సెలవు రోజున
(పర్ణశాలల పండుగ) సమావేశం జరిగింది. అది సంవత్స
రంలో ఏడవనెల.

3ఇశ్రాయేలు పెద్దలందరూ ఆ స్థలానికి వచ్చారు.
అప్పుడు యాజకులు పవిత్ర ఒడంబడిక పెట్టె తీసు
కున్నారు. 4యెహోవా ఒడంబడిక పెట్టె సన్నిధి గుడా
రము, దానిలోని పవిత్ర వస్తువులతో పాటు వారు
మోసుకొని వెళ్లారు. లేవీయులు కొందరు ఈ వస్తు
వులను మోయుటలో సహాయం చేశారు. 5రాజైన
సొలొమోను, ఇశ్రాయేలు ప్రజలందరూ ఒడంబడిక
పెట్టె ముందు సమావేశమయ్యారు. వారప్పుడు

---

**ఏడువందల ఇరవది తూములు** రెండు వందల ముప్పై గాలన్లు అని; నలభై మందికి సరిపోయే స్నానోదకం అని పాఠాంతరం.

ఎవ్వరూ లెక్కపెట్టలేనన్ని గొర్రెలను, పశువులను బలి
యిచ్చారు. [6] అప్పుడు యాజకులు యెహోవా ఒడం
బడిక పెట్టె దాని అసలైన స్థానంలో ఉంచారు. అది
అతి పరిశుద్ధ స్థలము. ఒడంబడిక పెట్టె కెరూబుల
రెక్కల కిందుగా ఉంచబడింది. [7]ఒడంబడిక పెట్టె ఉంచ
బడిన స్థానం మీదుగా కెరూబులరెక్కలు వ్యాపించి
వున్నాయి. ఆ రెక్కలు ఒడంబడిక పెట్టె, దానిని
మోయుటకు ఉపయోగించే కోలలను కప్పివేశాయి.
[8]ఒడంబడిక పెట్టె మోసే కోలలు (కర్రలు) చాలా
పొడవైనవి. అతి పరిశుద్ధ స్థలం ముందు పవిత్ర స్థలంలో
ఎవరు నిలబడి చూసినా ఆ కోలలను చివరి వరకు
చూడగలరు. కాని వాటినెవరూ బయటి నుండి చూడ
లేరు. ఈ నాటికీ ఆ కోలలు అదే స్థానంలో వున్నాయి.
[9]ఆ ఒడంబడిక పెట్టెలో వున్నవి కేవలం రెండు రాతి
ఫలకాలు. ఈ రెండు ఫలకాలను హోరేబు అనే చోట
మోషే ఈ ఒడంబడిక పెట్టెలో భద్రపరచాడు. ఇశ్రాయే
లీయులు ఈజిప్టు నుండి బయటికి వచ్చిన తరువాత
హోరేబు అనే చోటనే యెహోవా వారితో తన
ఒడంబడిక చేశాడు.

[10]యాజకులు అతి పరిశుద్ధ స్థలాన్ని వదిలి బయ
టికి వచ్చిన పిమ్మట, ఒక మేఘం యెహోవా దేవాల
యాన్ని కమ్మివేసింది. [11]యెహోవా మహిమతో దేవా
లయం నిండిపోగా యాజకులు తమ విధులను నిర్వ
ర్తించలేక పోయారు.

[12] అప్పుడు సొలొమోను ఇలా అన్నాడు: "ఆకా
శంలో ప్రకాశించటానికి యెహోవా సూర్యుడ్ని
కలుగజేశాడు, కాని ఆయన మాత్రం ఒక నల్లని
మేఘంలో నివసిస్తానన్నాడు.
[13] నిజానికి నేనొక అద్భుతమైన దేవాలయాన్ని నీ
కొరకు నిర్మించాను, అది నీవు శాశ్వతంగా నివ
సించే స్థలం."
[14] ఇశ్రాయేలీయులందరూ అక్కడ నిలబడియు
న్నారు. రాజైన సొలొమోను వారి వైపు తిరిగి
వారిని దీవించుమని దేవునిని అడిగాడు.
[15] తరువాత రాజైన సొలొమోను దేవునికి సుదీర్ఘ
మైన ప్రార్థన చేశాడు. ఆయనిలా అన్నాడు:
"ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా ఉన్న
తుడు. నా తండ్రి దావీదుకు ఇచ్చిన మాట
ప్రకారం ఆయన అన్నీ నెరవేర్చాడు.
[16] యెహోవా నా తండ్రితో, 'నా ప్రజలైన ఇశ్రా
యేలీయులను నేను ఈజిప్టు నుండి విముక్తు
లను చేసి తీసుకొని వచ్చాను. కాని నా గౌరవార్థం
నాకో దేవాలయం కట్టించటానికి ఇశ్రాయేలు
వంశాలు నివసించే ఏ పట్టణాన్నీ నేనింకా
ఎన్నుకో లేదు. నా ప్రజలైన ఇశ్రాయేలును
ఏలటానికి నేనొక యువరాజును ఎంపిక చేయ
లేదు. కాని నేను గౌరవింపబడే చోటుగా ఇప్పుడు
యెరూషలేమును ఎన్నుకున్నాను. మరియు నా
ప్రజలైన ఇశ్రాయేలును పరిపాలించటానికి
దావీదును ఎంపిక చేశాను' అని చెప్పాడు.

[17]"ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు ఘనంగా
ఒక దేవాలయం కట్టించాలని నా తండ్రి దావీదు మిక్కి
లిగా కోరుకున్నాడు. [18]కాని యెహోవా నా తండ్రి
దావీదుతో 'నాకు తెలుసు, నీవు నాకు దేవాలయం
కట్టించి గౌరవించాలని మిక్కిలి ఆసక్తితో ఉన్నావు.
నాకు దేవాలయ నిర్మాణం చేయాలను కోవటం
సంతోషించ తగ్గ విషయం. [19]కాని నాకు దేవాలయం
కట్టించేది నీవు కాదు. నేను ఆ పనికి నిన్ను ఎంపిక
చేయలేదు. నీ రక్తం పంచుకు పుట్టిన నీ కుమారుడు
నాకు దేవాలయ నిర్మాణం చేయిస్తాడు,' అని అన్నాడు.
[20]"కావున యెహోవా ఆయన ఇచ్చిన మాటను
నిలబెట్టుకున్నాడు. నా తండ్రి దావీదు స్థానంలో
ఇప్పుడు నేను రాజును. యెహోవా కనికరించిన
విధంగా ఇప్పుడు నేను ఇశ్రాయేలు ప్రజలను పాలిస్తు
న్నాను. ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు నేను
దేవాలయం కట్టించాను. [21]దేవాలయంలో దేవుని
ఒడంబడిక పెట్టెకు ప్రత్యేక స్థానం ఏర్పాటు చేశాను.
మన పూర్వీకులతో యెహోవా చేసిన ఒక ఒడంబడిక
ఆ మందసంలో వుంది. యెహోవా మన పూర్వీకు
లను ఈజిప్టు నుండి తీసుకొని వచ్చినప్పుడు ఆయన
ఆ ఒడంబడిక చేశాడు."

[22]పిమ్మట సొలొమోను యెహోవా బలిపీఠం
ముందు నిలబడ్డాడు. ప్రజలంతా అతనికి ఎదురుగా
నిలబడ్డారు. రాజైన సొలొమోను చేతులు చాపి, ఆకాశం
వైపు చూశాడు. [23]అతనిలా అన్నాడు:

"ఓ ప్రభూ, ఇశ్రాయేలీయుల దేవా! నీవంటి
యెహోవా ఆకాశంలో గాని, భూమి మీద గాని మరొ
క్కడు లేడు. నీ ప్రజలను నీవు మిక్కిలిగా ప్రేమిస్తు
న్నావు. కావున నీవు వారితో ఒక ఒడంబడిక చేసుకు
న్నావు. నిన్ననుసరించే ప్రజల పట్ల నీ ఒడంబడిక
తప్పక అమలు పర్చుతావు. [24]నీ సేవకుడు, నా తండ్రి
అయిన దావీదుకు నీవు ఆ వాగ్దానం చేశావు. నీవు ఆ
వాగ్దానం నెరవేర్చావు. నీ నోటితో నీవే ఆ వాగ్దానం
చేశావు. నీ అమోఘమైన శక్తి సంపదతో ఆ వాగ్దానం
ఈ రోజు నిజమయ్యేలా చేశావు. [25]ఇశ్రాయేలీయుల
దేవుడవైన నా ప్రభువా, నా తండ్రియు నీ సేవకుడు
అయిన దావీదుకు నీవు చేసిన ఇతర వాగ్దానాలను
కూడ ఇప్పుడు నెరవేర్చు. నీవిలా అన్నావు: 'నీవు నా
ఆజ్ఞలను పాటించినట్లు నీ కుమారులు కూడా
నన్ననుసరించే విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలి.
వారు అలా చేస్తే నీవు నీ కుటుంబంలో ఎల్లప్పుడూ
ఇశ్రాయేలును పాలించ టానికి ఒకనిని కలిగి వుంటావు.'

26ఇశ్రాయేలు దైవమగు ఓ నా ప్రభువా, నీవు నా
తండ్రికిచ్చిన ఆ వాగ్దానం కొనసాగించుమని కూడా
నేను వేడు కుంటున్నాను.
27"కాని దేవుడు నిజంగా ఈ భూమి మీద నివసించ
గలడా? ఈ ఆకాశము, ఉన్నత ఆకాశాలు నిన్ను భరించ
జాలవు. నేను నిర్మించిన ఈ నివాసం కూడ ఖచ్చితంగా
నిన్ను ఇముడ్చుకోలేదు.
28దయచేసి నా ప్రార్థనను, నా మనవిని ఆలకించు.
నేను నీ సేవకుడను. నీవు నా ప్రభువైన దేవుడవు.
నేను చేసే ఈ ప్రార్థన ఆలకించు. 29గతంలో నీవు,
'నేనక్కడ గౌరవింపబడుదు'నని చెప్పావు. దయచేసి
ఈ ఆలయాన్ని రాత్రింబవళ్లు కనిపెట్టుకుని ఉండు.
ఈ దేవాలయంలో నేను చేసే ఈ ప్రార్థన ఆలకించు.
30దయచేసి నీ సేవకుడనైన నేను, ఇశ్రాయేలు ప్రజలు
ఈ స్థలంలో చేసే ప్రార్థనలన్నీ ఆలకించు. మాకు
తెలుసు నీవు పరలోకంలో నివసిస్తావని, అక్కడ నుండి
మా ప్రార్థన ఆలకించి, మమ్మల్ని మన్నించుమని
మేము నిన్ను వేడుకుంటున్నాము.
31"ఎవరైనా ఒక వ్యక్తి మరో వ్యక్తి పట్ల అపచారం
చేస్తే, వాడు ఈ బలిపీఠం వద్దకు తేబడతాడు. ఆ
వ్యక్తి గనుక నేరం చేయకపోతే, తన నిర్దోషత్వాన్ని
నిరూపించుకుంటూ ఒక ప్రమాణం చేస్తాడు. 32పర
లోకంలో నుండి నీవు అది విని, ఆ వ్యక్తి పట్ల న్యాయ
నిర్ణయం చెయ్యి. దోషిని శిక్షించి, అమాయకుడైన
వానిని క్షమించు.
33"కొన్నిసార్లు నీ ప్రజలైన ఇశ్రాయేలీయులు నీ
పట్ల పాపం చేయవచ్చు; మరియు వారి శత్రువులు
వారిని ఓడించవచ్చు. వారు మరల నీ వద్దకు తిరిగి
వచ్చి నీకు స్తోత్రం చేస్తారు. ఈ దేవాలయంలో వారు
నిన్ను వేడుకొంటూ ప్రార్థనలు చేస్తారు. 34పరలో
కంలో నీవు వారి ప్రార్థన దయచేసి విను. నీ ప్రజలైన
ఇశ్రాయేలీయుల పాపాలను క్షమించు. మళ్లీ వారి
రాజ్యం వారికి వచ్చేలా చేయి. ఈ రాజ్యం వారి
పూర్వీకులకు నీవు ఇచ్చినదే!
35"మరి కొన్ని సార్లు వారు నీకు వ్యతిరేకంగా పాపం
చేస్తే, వారి భూముల్లో వర్షం కురియకుండా నీవు
చేస్తావు. వారు మరల ఈ ప్రదేశానికి వచ్చి నిన్ను
ప్రార్థించి, స్తుతిస్తారు. నీవు వారిని బాధించినప్పుడు,
వారు చేసిన పాపాలకు వారు పశ్చాత్తాపం పొందుతారు.
36ఇది జరిగినప్పుడు, పరలోకంలో నీవు వారి ప్రార్థన
ఆలకించుము. నీ సేవకుడనగు నా తప్పులు, ఇశ్రా
యేలు ప్రజల తప్పులను మన్నించు. పరలోకాన్ని
గురించి వారికి బోధించు. యెహోవా, అప్పుడు దయ
చేసి రాజ్యంలో వర్షం కురిపించు. ఈ రాజ్యం వారికి
నీవిచ్చినదే !
37"ఈ నేల బాగా ఎండిపోయి, పంటలు పండక
పోవచ్చు. లేక భయంకర వ్యాధి ప్రజలలో వ్యాపించ
వచ్చు. బహుశా పండిన పంటనంతా క్రిమికీటకాదులు
నాశనం చేయవచ్చు. లేక నీ ప్రజలు వారి నగరాలలో
శత్రువాత పడవచ్చు లేక నీ ప్రజలలో చాలామంది
వ్యాధిగ్రస్థులు కావచ్చు. 38వీటిలో ఏదైనా జరిగిన
ప్పుడు, ఏ ఒక్కడైనా జరిగిన దానికి పశ్చాత్తాపపడి,
చేతులు చాచి ఈ దేవాలయంలో నిలబడి నీకు ప్రార్థన
చేస్తే, 39దయచేసి అతని ప్రార్థన ఆలకించు. పరలో
కంలో నీవు నీ నివాసంలో వుండగా దానిని ఆలకించు.
ఆలకించి ఈ ప్రజలను మన్నించి, వారికి సహాయం
చేయి. ప్రజలు నిజంగా ఏమి ఆలోచిస్తున్నారో తెలుసు
కోగల శక్తి నీకు తప్ప మరి ఎవ్వరికీ లేదు. కావున
ప్రతి వ్యక్తికీ తీర్పు తీర్చి ఏది ఉచితమో వానికి అది
చేయి. 40నీవు అలాగున చేయి. దానివల్ల వారు నీ
పట్ల భయభ్రాంతులతో, భక్తి భావంతో మా పూర్వీ
కులకు నీవిచ్చిన ఈ రాజ్యంలో సదా జీవిస్తారు.
41-42"ఇతర ప్రాంతాల ప్రజలు కూడా నీ ప్రతిభా
విశేషాలను గురించి వింటారు. వారు దూర ప్రాంతాల
నుండి దేవాలయానికి ప్రార్థనలు చేయటానికి వస్తారు.
43నీ పరలోక నివాసంనుండి దయచేసి వారి మనవి
ఆలకించు. ఇతర ప్రాంతాలవారు నిన్నడిగినదంతా
దయచేసి నెరవేర్చు. ఇశ్రాయేలులో నీ ప్రజలు నీపట్ల
ఎలాంటి భయభక్తులతో మెలుగుతారో, వారు కూడ
అలా నీపట్ల విధేయులైయుంటారు. అప్పుడు సర్వ
ప్రాంతాల ప్రజలంతా నీ గౌరవార్థం నేను కట్టించిన
ఈ దేవాలయం గురించి తెలుసుకుంటారు. 44"కొన్ని
సార్లు వారి శత్రువులతో పోరాడటానికి నీవు నీ ప్రజలకు
ఆజ్ఞ ఇవ్వవచ్చు. అలాంటప్పుడు వారు నీవు ఎన్ను
కున్న ఈ నగరానికి వచ్చిగాని, నీ గౌరవార్థం నేను
కట్టించిన ఈ దేవాలయానికి వచ్చిగాని ప్రార్థన చేస్తారు.
45ఆ సమయంలో పరలోకంలో వున్న నీవు విని
వారికి సహాయం చేయి.
46"నీ ప్రజలు నీ పట్ల పాపం చేస్తారు. ఇది నాకు
తెలుసు. ఎందువల్లననగా పాపం చేయని వ్యక్తి లేడు.
నీ ప్రజల పట్ల నీకు కోపం వస్తుంది. వారి శత్రువులు
వారిని ఓడించేలా చేస్తావు. వారి శత్రువులు వారిని
బందీలు చేసి దూర ప్రాంతాలకు తీసుకొని పోతారు.
47ఆ దూర పరాయి రాజ్యంలో నీ ప్రజలు జరిగిన
దానిని జ్ఞాపకం చేసుకుంటారు. వారు చేసిన పాపానికి
వారు పశ్చాత్తాప పడతారు. ఆ పరాయి రాజ్యంలో
బందీలుగా వుండి వారు నిన్ను ప్రార్థిస్తారు. వారు 'మేము
పాపం చేశాం; మేము తప్పుచేశాం' అని అంటారు.
48వారు నిజంగా ఆ పరాయి రాజ్యాలలో నిన్ను ఆశ్ర
యిస్తే, నీవు వారి పూర్వీకులకు ఇచ్చిన ఈ రాజ్యం
వైపుగాని, నీవు ఎన్నుకున్న ఈ నగరంవైపు గాని,
నేను నీ గౌరవార్థం కట్టించిన ఈ దేవాలయమువైపు
గాని తిరిగి ప్రార్థిస్తే, 49దయచేసి పరలోకంలో వున్న
నీవు వారి ప్రార్థన ఆలకించు. 50నీ ప్రజల పాపాలన్నిటినీ

క్షమించు. నీకు వ్యతిరేకంగా తిరిగినందుకు కూడా వారిని
క్షమించు. వారి శత్రువులు వారిపట్ల ఉదారంగా వుండేలా
చేయి. 51వారు నీ ప్రజలే అని ఎల్లప్పుడూ గుర్తు
పెట్టుకో. నీవు వారిని ఈజిప్టు నుండి బయటకు
తెచ్చినట్లు జ్ఞాపక ముంచుకో. మండుతున్న కొలిమిలో
నుండి బయటికి తీసినట్లు వారిని రక్షించావు!

52"ప్రభువైన దేవా, నా ప్రార్థనలను, నీ ప్రజలైన
ఇశ్రాయేలీయుల ప్రార్థనలను దయచేసి ఆలకించు.
వారు ఏ సమయములో నిన్ను నీ సహాయము కోరి
ప్రార్థించినా వారి ప్రార్థన విను. 53ఈ భూలోకంలో
వున్న ప్రజానీకమంతటిలో వారిని నీవు నీ ప్రజలుగా
ఎంపిక చేశావు. యెహోవా మా పూర్వీకులను ఈజిప్టు
నుండి తీసుకొని వచ్చినప్పుడు, నీ సేవకుడైన మోషే
ద్వారా ఈ వాగ్దానం నీవు చేశావు."

54ఈ విధంగా సొలొమోను దేవునికి ప్రార్థన చేశాడు.
దేవుని బలిపీఠం ముందు అతను మోకాళ్ల మీద
ఉన్నాడు. తన చేతులను ఆకాశం వైపు చాచి అతడు
ప్రార్థించాడు. సొలొమోను ప్రార్థన ముగించిన పిమ్మట
లేచి నిలబడ్డాడు.

55 పిమ్మట, పెద్ద గొంతుతో ఇశ్రాయేలు ప్రజ
లందరినీ దీవించమని దేవుని అర్థించాడు. సొలొమోను
ఇలా అన్నాడు:

56"యెహోవాకు స్తోత్రము కలుగునుగాక! తన
ప్రజలైన ఇశ్రాయేలీయులకు విశ్రాంతి ఇస్తానని ఆయన
వాగ్దానం చేశాడు. అలాగే ఆయన మనకు విశ్రాంతి
ఇచ్చాడు! తన సేవకుడైన మోషే ద్వారా ఇశ్రాయేలు
ప్రజలకు అనేక శుభప్రదమైన వాగ్దానాలను చేశాడు.
యెహోవా ఈ వాగ్థానాలన్నిటినీ నెరవేర్చాడు. 57మన
దేవుడైన యెహోవాను మనతో ఉండమని అడుగు
తున్నాను. ఆయన మన పూర్వీకులతో ఎలా
వున్నాడో అలాగే మనతో కూడ ఉండమని అడుగు
తున్నాను. మనలను ఎన్నడూ వదిలి వుండవద్దని వేడు
కుంటున్నాను. 58ఈ రకంగా మనం ఆయనను ఆశ్ర
యించి, ఆయనను అనుసరించుదాం. ఆయన మన
పూర్వీకులకు ఇచ్చిన న్యాయసూత్రాలను, ఆజ్ఞలను
మనము ఆచరిద్దాము. 59నా ఈ ప్రార్థన, నేనడిగిన
అన్ని విషయాలు సదా గుర్తుంచుకోమని మన దేవుడైన
యెహోవాను అడుగుతున్నాను. తన సేవకుడైన రాజు
కొరకు, ఇశ్రాయేలు ప్రజలకొరకు ఇవన్నీ జరిపించ
మని వేడుకుంటున్నాను. ఇలా ప్రతి రోజూ జరిపించ
మని కూడా వేడుకుంటున్నాను. 60యెహోవా ఇవన్నీ
జరిగేలా చేస్తే ప్రపంచ ప్రజలంతా మన దేవుడైన
యెహోవాయే నిజమైన దేవుడని తెలుసుకుంటారు.
61మన దేవుడైన యెహోవాకు మీరంతా చెంది
యున్నారు. కావున మన దేవుడైన యెహోవాకు
విధేయులై యుండాలి. ఆయన న్యాయ సూత్రాలను,
ఆజ్ఞలను మీరంతా తప్పక అనుసరించాలి. మీరిప్పుడు
చేస్తున్నట్లు భవిష్యత్తులో కూడ ఆయన మార్గాన్ని
మీరనుసరించాలి."

62తరువాత రాజైన సొలొమోను, ఇశ్రాయేలీయు
లందరు యెహోవాకు బలులు అర్పించారు. 63సొలొ
మోను ఇరువది రెండు వేల పశువులను, ఒక లక్షా
ఇరువది వేల గొర్రెలను బలి ఇచ్చాడు. ఇవి సమాధాన
బలులుగా అర్పించారు. ఈ విధంగా రాజు, ఇశ్రాయేలీ
యులు దేవాలయాన్ని దేవునికి అంకితము చేశారు.
64రాజైన సొలొమోను ఇంకా ఆ రోజు దేవుని ఆల
యము ముందున్న ఆవరణను దేవుని కార్యము కొరకు
పవిత్రం చేశాడు. అతనక్కడ దహన బలులు, ధాన్యార్ప
ణలు, జంతువుల కొవ్వును సమాధాన సూచకంగా
అర్పించాడు. అతి పరిశుద్ధ స్థలము ముందున్న కంచు
బలిపీఠం ఇవన్నీ అర్పించటానికి బహు చిన్నది అగు
టచే, రాజైన సొలొమోను ఆవరణలో అర్పించాడు.

65రాజైన సొలొమోను, ఇశ్రాయేలీయులు దేవాల
యంలో ఆ విధంగా పండుగ జరుపుకున్నారు. ఉత్తర
భాగాన బహుదూరంలో ఉన్న హమాతు కనుమ నుండి
దక్షిణాన ఈజిప్టు సరిహద్దు వరకుగల ఇశ్రాయేలీయు
లంతా పండుగలో పాల్గొన్నారు. లెక్కకు మించిన
జనాభా అక్కడ చేరింది. ఏడు రోజులపాటు వారంతా
అక్కడ ఆహారపానీయాలు స్వీకరిస్తూ వేడుక చేసు
కున్నారు. 66ఎనిమిదవ రోజు సొలొమోను వారందరినీ
తమ ఇండ్లకు వెళ్లమన్నాడు. ప్రజలంతా రాజుకు కృత
జ్ఞతా వందనాలు చెప్పి తమ ఇండ్లకు వెళ్లారు. తన
సేవకుడైన దావీదుకు, తన ప్రజలైన ఇశ్రాయేలీయు
లకు యెహోవా ఇచ్చిన సహాయ సంపత్తికి ప్రజలంతా
చాలా సంతోషపడ్డారు.

### దేవుడు మరల సొలొమోను వద్దకు వచ్చుట

9 సొలొమోను యెహోవా దేవాలయాన్ని, తన
రాజ భవనాన్ని నిర్మించటం పూర్తి చేశాడు. తాను
నిర్మించదలచుకొన్నవన్నీ పూర్తి చేశాడు. 2తరువాత
యెహోవా సొలొమోనుకు పూర్వం గిబియోను పట్ట
ణంలో ప్రత్యక్షమైనట్లు మళ్లీ కన్పించాడు. 3యెహోవా
అతనితో ఇలా అన్నాడు: "నీ ప్రార్థన విన్నాను. నీవు
నన్ను చేయమని అడిగిన విషయాలను కూడా
విన్నాను. నీవు ఈ దేవాలయము కట్టించావు. నేను
దానిని పవిత్రస్థలంగా చేశాను. కావున నేనక్కడ శాశ్వ
తంగా ఆరాధించబడతాను. నేను దానిని కనిపెట్టుకుని
ఉండి ఎల్లప్పుడూ దానిని గూర్చి ఆలోచన చేస్తాను.
4నీ తండ్రివలె నీవు సదా నన్ను ఆరాధిస్తూ వుండాలి.
అతడు న్యాయవర్తనుడు; నిజాయితీపరుడు. నా
న్యాయసూత్రాలను, నేను నిర్దేశించిన కట్టుబాట్లను నీవు
పాటించాలి.

5"నీవు ఇవన్నీ పాటిస్తే, ఇశ్రాయేలు రాజు ఎల్ల
ప్పుడూ నీ వంశంలో నుండి వచ్చేలా చేస్తాను. ఈ

వాగ్దానం నేను నీ తండ్రి దావీదుకు చేశాను. ఇశ్రాయేలు
ఎల్లప్పుడూ అతని సంతానంలోని వాడొకనిచే పరి
పాలింపబడుతుందని నేనతనితో చెప్పాను.
6-7 "అయితే నీవు గాని, నీ సంతతి గాని నన్ను
అనుసరించక పోయినా, నా న్యాయసూత్రాలను, నేను
నిర్దేశించిన కట్టుబాట్లను పాటించకపోయినా, లేక మీరు
ఇతర దేవుళ్లను సేవించి, ఆరాధించినా, నేను ఇచ్చిన
రాజ్యంలో నుంచి ఇశ్రాయేలీయులు బయటికి
పోయేలా ఒత్తిడి తెస్తాను. ఇశ్రాయేలీయులు నలుగు
రిలో నవ్వులపాలై, క్రమశిక్షణారాహిత్యంలో ఒక
ఉదాహరణగా మిగిలి పోతారు. నేను ఈ దేవాలయాన్ని
పవిత్రపరిచాను. ఇది ప్రజలు నన్ను గౌరవించే స్థలం.
కాని మీరు నా ఆజ్ఞలను మన్నించకపోతే ఈ దేవాల
యాన్ని నేలమట్టం చేస్తాను. 8ఈ దేవాలయం సర్వ
నాశనం చేయబడుతుంది. ఇది చూచిన ప్రతివాడూ
విస్మయము చెందుతాడు. వారంతా, 'యెహోవా ఈ
రాజ్యానికి, ఈ దేవాలయానికి ఈ భయంకర పరిస్థితిని
ఎందుకు కల్పించాడు?' అని అడుగుతారు. 9మరి
కొందరు, 'ఈ పరిణామం ఎందుకు వచ్చిందంటే ఆ
ప్రజలు వారి యెహోవా దేవుని మర్చిపోయారు.
వారి దేవుడు వారి పూర్వీకులను ఈజిప్టు నుండి తీసు
కుని వచ్చాడు. కాని వారు ఇతర దైవాలను సేవించటం
మొదలు పెట్టారు' అని సమాధానం చెపుతారు.'"
10ఇరవై సంవత్సరాల కాలవ్యవధిలో రాజైన సొలొ
మోను యెహోవా యొక్క దేవాలయాన్ని, తన రాజ
గృహాన్ని కట్టించాడు. 11ఇరవై సంవత్సరాల తరువాత
రాజైన సొలొమోను గలిలీయ దేశమందున్న ఇరవై
పట్టణాలను తూరు రాజైన హీరాముకు ఇచ్చాడు.
హీరాము రాజు ఆలయ నిర్మాణంలోను, రాజ ప్రాసాద
నిర్మాణంలోను సహాయపడి నందుకు, సొలొమోను
ఈ పట్టణాలను ఇచ్చాడు. సొలొమోను కోరినంత
దేవదారు కలపను, సరళ వృక్షాలను, బంగారాన్ని
హీరాము ఇచ్చాడు. 12కావున సొలొమోను ఇచ్చిన ఆ
పట్టణాలను చూడటానికి తూరు నుండి హీరాము
బయలుదేరి వెళ్లాడు. హీరాము ఆ పట్టణాలను చూచి
తృప్తిపడలేదు. 13"ఈ పనికిరాని పట్టణాలను నాకు
ఎందుకిచ్చినట్లు సోదరా?" అని హీరాము రాజు
అన్నాడు. హీరాము రాజు ఆ పట్టణ ప్రాంతాలకు
కాబూల్* ప్రాంతమని పేరు పెట్టాడు. ఈ నాటికీ ఆ
ప్రాంతం కాబూల్ అని పిలవబడుతోంది. 14హీరాము
సుమారు రెండు వందల నలభై * మణుగుల బంగా
రాన్ని రాజైన సొలొమోనుకు పంపాడు.
15రాజైన సొలొమోను దేవాలయ నిర్మాణానికి,
రాజభవన నిర్మాణానికి బానిసలను బలవంతంగా పని
చేయించాడు. ఈ బానిసలను చాలా ఇతర కట్టడాల
విషయంలో కూడ రాజైన సొలొమోను వినియో
గించుకున్నాడు. అతడు మిల్లోను* నిర్మించాడు.
అతడింకా నగరానికి చుట్టూ ప్రాకారం కట్టించాడు.
అతను హాసోరు, మెగిద్దో, మరియు గెజెరు నగరాలను
కూడ పునర్నిర్మించాడు.
16గతంలో ఈజిప్టు రాజు గెజెరు నగరంపై దండెత్తి
దానిని తగులబెట్టాడు. అక్కడ నివసించే కనానీయు
లను చంపేశాడు. ఫరో కుమార్తెను సొలొమోను
వివాహం చేసుకొన్నాడు. పెండ్లి కానుకగా ఫరో ఆ
నగరాన్ని సొలొమోనుకు ఇచ్చాడు. 17సొలొమోను
ఆ నగరాన్ని తిరిగి నిర్మించాడు. సొలొమోను దిగువ
బేత్ హోరోనును కూడ నిర్మించాడు. 18రాజైన సొలొ
మోను బయతాతును, యూదయ అరణ్యములో
నున్న తద్మోరు నగరాలను కూడా నిర్మించాడు.
19రాజైన సొలొమోను ధాన్యాగారములు, తదితర
వస్తువులు నిల్వచేయు గోదాములుండు నగరాలను
కూడ కట్టించాడు. తన రథాలకు, గుర్రాలకు తగిన
శాలలు కూడ నిర్మింపజేశాడు. యెరూషలేములోను,
లెబానోను లోను, ఇంకా తాను రాజ్యం చేసిన ప్రాంతా
లలోను సొలొమోను రాజు కావాలనుకున్న కట్టడాలను
చాలా నిర్మించాడు.
20ఇశ్రాయేలీయులు కానివారు రాజ్యంలో చాలా
మంది వున్నారు. వారు అమోరీయులు, హిత్తీయులు,
పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూసీయులు. 21ఇశ్రా
యేలీయులు ఈ ప్రజలను నాశనం చేయలేక
పోయారు. సొలొమోను వారిని బానిసలుగా పనిచేసే
టందుకు బలవంతం చేశాడు. వారంతా ఈ నాటికీ
బానిసలే. 22కాని సొలొమోను ఇశ్రాయేలీయుల నెవ్వ
రినీ తన బానిసలు కమ్మని బలవంతం చేయలేదు.
ఇశ్రాయేలు ప్రజలు సైనికులుగాను, ప్రభుత్వ అధికారు
లుగాను, ఉద్యోగులుగాను, సైన్యాధిపతులు గాను,
రథాధిపతులుగాను, రథసారథులుగాను పని చేశారు.
23సొలొమోను చేపట్టిన కార్యక్రమాలను పరిశీలించ
డానికి ఐదువందల ఏభై మంది అధికారులున్నారు.
వారు పనివారి మీద అధికారులు. 24ఫరో కుమార్తె
దావీదు నగరం నుండి సొలొమోను ఆమెకు కట్టించిన
భవనానికి వెళ్లింది. అప్పుడు సొలొమోను మిల్లోను
నిర్మించాడు. 25సంవత్సరానికి మూడుసార్లు సొలొ
మోను బలిపీఠం మీద దహన బలులు మరియు

**కాబూల్** అంటే వ్యర్థమైనది; లేక నిష్ప్రయోజన
మైనది అని భావం.

**రెండు వందల నలభై** 9,000 పౌనులు, లేక 120
తలాంతులకు సమానం.

**మిల్లో** అనగా బహుశః దేవాలయ ప్రాంగణానికి
ఆగ్నేయ భాగాన ఎత్తయిన తిన్నె లేక దిబ్బవంటి ప్రదేశం.
ఈ బలిపీఠాన్ని సొలొమోను యెహోవాకొరకు
నిర్మించాడు.

సమాధాన బలులు అర్పించాడు. ఈ బలిపీఠం సొలొమోను యెహోవా కొరకు నిర్మించింది. రాజైన సొలొమోను యెహోవా ముందు ధూపం వేసేవాడు. కావున దేవాలయ నిర్వహణకు కావలసిన వస్తువులన్నీ అతడు సరఫరా చేసేవాడు.

26ఎసోన్గెబెరు వద్ద రాజైన సొలొమోను ఓడలను
కూడ నిర్మించాడు. ఈ పట్టణం ఏలతు దగ్గర వుంది.
ఇది ఎదోము రాజ్యంలో ఎర్ర సముద్రపు తీరాన
వుంది. 27రాజైన హీరాము వద్ద సముద్ర విషయాలలో
ఆరితేరిన మనుష్యులు కొందరున్నారు. వీరు తరుచు ఓడలలో ప్రయాణం చేసేవారు. సొలొమోను మనుష్యులతో కలిసి సొలొమోను ఓడలలో పని చేయటానికి హీరాము రాజు ఆ మనుష్యులను పంపాడు. 28సొలొ
మోను ఓడలు ఓఫీరను స్థలానికి వెళ్లాయి. ఆ ఓడలు ఓఫీరు నుండి ఎనిమిది వందల నలభై మణగుల* బంగారాన్ని రాజైన సొలొమోనుకు తీసుకొని వచ్చాయి.

### షేబ దేశపు రాణి సొలొమోనును దర్శించుట

10 షేబ దేశపు రాణి సొలొమోను ప్రజ్ఞా విశేషాలను గూర్చి విన్నది. జటిలమైన ప్రశ్నలు వేసి అతనిని పరీక్షించాలని ఆమె వచ్చింది.

2అనేక మంది సేవకులు వెంటరాగా, ఆమె యెరూష
లేముకు ప్రయాణమై వచ్చింది. సుగంధ ద్రవ్యాలు, వజ్రాలు, బంగారం మొదలైన వాటిని అనేక ఒంటెల మీద ఎక్కించి తనతో తీసుకొని వచ్చింది. ఆమె సొలొమోనును కలిసి, ఆమె ఆలోచించ గలిగినన్ని
చిక్కు ప్రశ్నలను వేసింది. 3సొలొమోను అన్ని ప్రశ్న
లకూ సమాధానం చెప్పాడు. సమాధానం చెప్పటానికి ఆమె వేసిన ప్రశ్నలలో ఏ ఒక్కటీ అతనికి కష్టమైనదిగా
కన్పించలేదు. 4షేబ దేశపు రాణి సొలొమోను చాలా
తెలివైనవాడని తెలుసుకున్నది. అతను నిర్మించిన అతి సుందరమైన రాజభవనాన్ని కూడ ఆమె తిలకించింది.

5రాజు బల్లవద్ద విలువైన భోజన పదార్థాలను ఆమె
చూసింది. రాజు కింది అధికారులు సమావేశమయ్యే తీరు తెన్నులు ఆమె గమనించింది. రాజభవనంలో సేవచేయుటకు, వారు ధరించే మంచి దుస్తులను ఆమె చూసింది. రాజు ఇచ్చే విందులు, ఆయన దేవాలయంలో అర్పించే బలులు కూడా చూసింది. ఇవన్నీ ఆమెకు ఆనందము ఆశ్చర్యము కలుగజేశాయి.

6కావున రాజుతో రాణి ఇలా అన్నది, "నీవు చేసే
పనుల గురించి, నీ ప్రజ్ఞా ప్రభావాల గురించి నేను నా దేశంలో చాలా విన్నాను. నేను విన్నవన్నీ నిజమని
తేలింది! 7నేనిక్కడికి వచ్చి స్వయంగా నా కళ్లతో
నేను చూచే వరకు నేను విన్నవన్నీ నిజమని నమ్మలేదు. ఇప్పుడు నేను విన్న దానికంటె ఎక్కువ ఉన్నట్లు చూశాను. నీ తెలివి తేటలు, నీ సిరిసంపదలను గురించి ప్రజలు నాకు చెప్పినదాని కంటె అవి అతిశయించి వున్నాయి.

8నీ భార్యలు, నీ సేవకులు చాలా అదృష్టవంతులు!
వారికి ఎల్లప్పుడూ నిన్ను సేవించే భాగ్యము, నీ
తెలివితేటలను వినే అదృష్టము లభించింది! 9నీ దేవు
డైన యెహోవాకు స్తోత్రము కలుగునుగాక! నిన్ను ఇశ్రాయేలుకు రాజుగా చేయటానికి ఆయన ఇష్టపడ్డాడు. దేవుడైన యెహోవా ఇశ్రాయేలు పట్ల నిరంతర ప్రేమగలిగి వున్నాడు. కావుననే ఆయన నిన్ను రాజుగా చేశాడు; నీవు న్యాయమార్గంలో రాజ్యపాలన చేస్తున్నావు."

10పిమ్మట షేబ దేశపు రాణి రెండు వందల నలభై
మణుగుల* బంగారాన్ని, చాలా సుగంధ ద్రవ్యాలను, రత్నాలను రాజుకు కానుకగా సమర్పించింది. ముందెన్నడూ ఎవ్వరూ ఇశ్రాయేలు రాజ్యాలలోకి తేనన్ని సుగంధ ద్రవ్యాలను షేబ దేశపు రాణి సొలొమోనుకు సమర్పించింది.

11హీరాము యొక్క ఓడలు కూడ ఓఫీరు నుండి
బంగారం తీసుకుని వచ్చాయి. ఆ ఓడలు చాలా కలప,* వజ్రాలు కూడ తీసుకుని వచ్చాయి. 12ఆ కలపను
దేవాలయంలోను, రాజభవనంలోను స్తంభాలు చేయటానికి సొలొమోను ఉపయోగించాడు. గాయకులకు సితారను, స్వరమండలమును చేయటానికి కూడ ఆ కలపను అతడు ఉపయోగించాడు. ఇశ్రాయేలు లోనికి ఆ రకమైన కలపను ఎవ్వరూ తేలేదు. అప్పటి నుండి మళ్లీ ఎవ్వరూ ఆ విధమైన కట్టెను చూడలేదు.

13సాటి రాజ్యాధినేతకు ఒక రాజు ఎలాంటి కానుకలు
ఇస్తాడో, ఆలాగున రాజైన సొలొమోను షేబ దేశపు రాణికి కానుకలు ఇచ్చాడు. పైగా ఆమె అడిగిన ఇతర వస్తువులను కూడా ఆమెకు సమర్పించాడు. ఆ తరువాత రాణి, ఆమె పరివారము తమ దేశానికి వెళ్లి పోయారు.

14ప్రతి సంవత్సరం సొలొమోనుకు సుమారు ఒక
వెయ్యి మూడు వందల ముప్పది రెండు మణుగుల* బంగారం వచ్చేది. 15ఇదిగాక తర్షీషునుండి వచ్చే ఓడలు
బంగారం తెచ్చేవి. వ్యాపారస్తుల నుండి, అరబీ రాజుల

---

**ఎనిమిది వందల నలభై మణుగులు** 31,500 పౌనులు; లేక తలాంతులకు సమానం.

**రెండు వందల నలభై మణుగులు** 9,000 పౌనులు.

**కలప** ఇది ఒక ప్రత్యేకమైన చెక్క. దీనిని చందనపు కర్ర అని కూడ అంటారు గాని, ఇది ఏమి కర్ర అయినదీ సరిగా ఎవ్వరికీ తెలియదు.

**ముప్పది రెండు మణుగులు** 79,920 పౌనులు, లేక 666 తలాంతులు.

నుండి, మరియు రాజ్యంలో ఇతర ప్రాంతీయ పాల
కుల నుండి కూడా రాజుకు బంగారం వచ్చేది.
16రాజైన సొలొమోను పలకలుగా కొట్టబడిన
బంగారంతో రెండు వందల పెద్ద తరహా డాళ్లను చేయిం
చాడు. ప్రతి డాలు ఆరు వందల తులాల* బంగారం
కలిగి వుండేది. 17అతడింకా మూడు వందల చిన్న
తరహా డాళ్లను కూడా రేకులు గొట్టిన బంగారంతో
చేయించాడు. ప్రతి డాలు నూట అరువది తులాల
బంగారం కలిగివుంది. రాజు వాటిని “లెబానోను అర
ణ్యంలోని” విశ్రాంతి గృహములో ఉంచినాడు.
18రాజైన సొలొమోను ఒక పెద్ద దంతపు
సింహాసనాన్ని చేయించాడు. దానికి మేలిమి బంగారు
పూత పూయించాడు. 19సింహాసనం ముందు ఆరు
మెట్లు వున్నాయి. ఈ సింహాసనపు వెనుక భాగం
పైన గుండ్రంగా వుంది. సింహాసనానికి ఇరువైపులా
చేతులు వుంచటానికి ఆధారపు కమ్ములు వున్నాయి.
సింహాసనపు చేతులు గాక సింహాల విగ్రహాలు కూడ
సింహాసనానికి ఇరుపక్కల వున్నాయి. 20ఆరు మెట్లలో
ప్రతి మెట్టుకు రెండు పక్కలా రెండు సింహాల బొమ్మ
లను పెట్టారు. ఏ ఇతర రాజ్యంలోను ఈ రకంగా
సింహాలంకరణ చేసి ఉండలేదు. 21లెబానోను అరణ్యపు
భవనంలో గిన్నెలు, పాన పాత్రలు, పనిముట్లు, ఆయు
ధాలు, అన్నీ శుద్ధ బంగారంతో చేయబడ్డాయి. భవ
నంలో ఏదీ వెండితో చేయబడలేదు. సొలొమోను
కాలంలో బంగారం ఎంత విరివిగా లభించేదనగా ప్రజలు
వెండిని విలువైన లోహంగా అసలు పరిగణించనేలేదు!
22వ్యాపార నిమిత్తం ఇతర దేశాలకు పంపటానికి
సొలొమోనుకు చాలా ఓడలున్నాయి. ప్రతి మూడు
నెలలకూ ఓడలు తిరిగి వస్తూవుండేవి. ఆ ఓడల నిండా
బంగారం, వెండి, దంతం, పశువులు రాజుకొరకు
తేబడేవి.
23ఈ భూమి మీద సొలొమోను మిక్కిలి ప్రఖ్యాతి
గాంచిన రాజు. రాజులందరి కంటె అతనికి ధనం,
తెలివి తేటలు విశేషంగా ఉన్నాయి. 24ప్రతి చోట
ప్రజలు రాజైన సొలొమోనును చూడాలని ఆరాట
పడేవారు. యెహోవా అతనికిచ్చిన మహా జ్ఞానాన్ని
వారంతా విని తెలుసుకుని ఆనందించాలని కుతూహ
లపడేవారు. 25ప్రతి సంవత్సరం రాజును చూడ్డానికి
ప్రజలు వచ్చేవారు. వచ్చిన ప్రతివాడూ ఏదో ఒక
కానుక పట్టుకు వచ్చేవాడు. వారు వెండి, బంగారు
వస్తువులు, దుస్తులు, ఆయుధాలు, సుగంధ ద్రవ్యాలు,
గుర్రాలు, కంచర గాడిదలు మొదలగు వాటిని తెచ్చే
వారు.
26కావున సొలొమోను అనేక రథములను, గుర్రము
లను కలిగియున్నాడు. అతనికి ఒక వెయ్యి నాలుగు
వందల రథములు, పన్నెండు వేల గుర్రములు
వున్నాయి. సొలొమోను ప్రత్యేక నగరాలను నిర్మించి
ఈ రథాలన్నిటినీ వాటిలో వుంచాడు. కాని రాజైన
సొలొమోను కొన్ని రథాలను తనతో యెరూష
లేములో వుంచుకున్నాడు. 27రాజు ఇశ్రాయేలును
మిక్కిలి సంపన్న దేశంగా చేశాడు. యెరూషలేము నగ
రంలో వెండి రాతి గుట్టల్లా, దేవదారు చెక్కల్లా,
కొండల్లో, కోనల్లో కాచే మేడి పండ్లలా అతి సామా
న్యమై పోయింది. 28ఈజిప్టు నుంచి, కూషు నుంచి
సొలొమోను గుర్రములను తెప్పించే వాడు. అతని
వర్తకులు వాటిని కూయిలో కొని ఇశ్రాయేలుకు తెచ్చే
వారు. 29ఈజిప్టు నుండి తెచ్చిన రథం ఒక్కటికి ఆరు
వందల తులాల వెండి, గుర్రం ఒక్కటికి నూట ఏబది
తులాల వెండి చొప్పున చెల్లించేవారు. సొలొమోను
గుర్రాలను, రథాలను హిత్తీయుల రాజులకు మరియు
అరాము రాజులకు అమ్మేడివాడు.

### సొలొమోను మరియు అతని భార్యలు

11 రాజైన సొలొమోను ఇశ్రాయేలీయులు కాని
వారైన అనేక మంది స్త్రీలను ప్రేమించాడు.
అలాంటి స్త్రీలలో ఫరో కుమార్తె, మోయాబీయులు,
అమ్మోనీయులు, ఎదోమీయులు, సీదోనీయులు,
హిత్తీయులు వున్నారు. 2గతంలో ఇశ్రాయేలు ప్రజలతో
యెహోవా దేవుడు ఇలా అన్నాడు: “ఇతర దేశాల
వారిని మీరు వివాహం చేసుకోరాదు. ఒక వేళ మీరు
అలా చేస్తే ఆ ప్రజలు వాళ్ల దేవుళ్లను మీరు కొలిచేలా
చేస్తారు.” కాని సొలొమోను ఈ స్త్రీల వ్యామోహంలో
పడ్డాడు. 3సొలొమోనుకు ఏడు వందల మంది భార్యలు
న్నారు. (వీరంతా ఇతర దేశాల రాజుల కుమార్తెలే)
అతనికి ఇంకను మూడు వందల మంది బానిస స్త్రీలు
ఉపపత్నులుగ ఉన్నారు. అతని భార్యలు అతనిని తప్పు
దారి పట్టించి దేవునికి దూరం చేశారు. 4సొలొమోను
వృద్ధుడయ్యే సరికి అతని భార్యలు అతడు ఇతర
దేవుళ్లను మొక్కేలా చేశారు. తన తండ్రియగు దావీదు
యెహోవా పట్ల చూపిన వినయ విధేయతలు, భక్తి
శ్రద్ధలు సొలొమోను చూపలేకపోయాడు. 5సొలొ
మోను అష్తారోతును ఆరాధించాడు. ఇది ఒక సీదోనీ
యుల దేవత. మరియు సొలొమోను మిల్కోమును
ఆరాధించాడు. ఇది అమ్మోనీయుల ఒక భయంకర
విగ్రహం. 6ఈలాగున సొలొమోను యెహోవా పట్ల
అపచారం చేశాడు. తన తండ్రి దావీదువలె సొలొమోను
సంపూర్ణంగా యెహోవాని అనుసరించలేదు.
7కెమోషుకు ఒక ఆరాధనా స్థలాన్ని సొలొమోను
నిర్మించాడు. కెమోషు మోయాబీయుల ఒక ఘోర
మైన విగ్రహం. యెరూషలేముకు తూర్పుదిశలో ఒక
కొండపై ఆ ఆరాధనా స్థలాన్ని సొలొమోను నిర్మిం
చాడు. అదే కొండ మీద మొలెకునకు కూడా ఒక

---

**ఆరు వందల తులాలు** 15 పౌనులు.

ఆరాధనా స్థలాన్ని సొలొమోను నిర్మించాడు. మొలెకు
అమ్మోనీయులకు చెందిన ఒక భయానక విగ్రహం.
[8]ఇతర దేశాలకు చెందిన తన భార్యలందరి నిమిత్తం
సొలొమోను ఈ మాదిరి ఆరాధనా స్థలాలను నిర్మిం
చాడు. అతని భార్యలు వారి వారి దేవుళ్లకు ధూపం
వేసి, బలులు సమర్పించేవారు.
[9]ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా నుండి
సొలొమోను దూరమైనాడు. కావున యెహోవా సొలొ
మోను పట్ల కోపం వహించాడు. సొలొమోనుకు
యెహోవా రెండు సార్లు ప్రత్యక్షమైనాడు. [10]చిల్లర
దేవుళ్లను ఆరాధించరాదని యెహోవా సొలొమోనుకు
చెప్పాడు: యెహోవా ఆజ్ఞను సొలొమోను పాటించ
లేదు. [11]కావున యెహోవా సొలొమోనుతో ఇలా
అన్నాడు, "నాతో నీవు చేసుకొన్న ఒడంబడికను అను
సరించుటకు నీవిష్టపడలేదు. నీవు నా ఆజ్ఞలను శిర
సావహించలేదు. కావున నీ రాజ్యాన్ని నీ నుండి వేరు
చేస్తానని నిశ్చయంగా చెప్తున్నాను. దానిని నీ సేవకునికి
ఇస్తాను. [12]కాని నీ తండ్రి దావీదును నేను మిక్కిలి
ప్రేమించి యున్నాను. అందువల్ల నీవు బతికియుండగా
నీ రాజ్యం నీ నుండి తీసుకొనను. నీ కుమారుడు
రాజు అయ్యే వరకు నేను వేచి వుంటాను. అప్పుడు
వాని నుండి దానిని నేను తీసుకుంటాను. [13]అప్పుడు
కూడ, రాజ్యాన్నంతా నీ కుమారుని వద్ద నుండి తీసు
కోను. అతను పరిపాలించటానికి ఒక తెగను అతనికి
వదిలి వేస్తాను. ఉన్నతుడైన నా సేవకుడగు దావీదు
కొరకు నేనది చేయదలిచాను. నేను ఎంపిక చేసుకున్న
యెరూషలేము నగరం కొరకు నేనలా చేస్తాను."

### సొలొమోను శత్రువులు

ఆ సమయంలో ఎదోమీయుడగు హదదు అను
వానిని యెహోవా సొలొమోనుకు శత్రువయ్యేలా
చేశాడు. అతడు ఎదోము వంశానికి చెందిన వారిలో
ఒకడు. [15]అది ఇలా జరిగింది. ఇదివరలో దావీదు
ఎదోము రాజ్యాన్ని ఓడించాడు. అప్పుడు దావీదు
సైన్యాధిపతిగా యోవాబు వున్నాడు. చనిపోయిన
వారిని పాతి పెట్టించేందుకు యోవాబు ఎదోములోకి
వెళ్లాడు. కాని అతడు అక్కడవున్న మగవారినందరినీ
చంపేశాడు. [16]యోవాబు, ఇశ్రాయేలీయులందరూ
ఎదోములో ఆరు నెలలు వున్నారు. ఆ సమయంలోనే
వారు ఎదోములో వున్న పురుషులనందరినీ చంపేశారు.
[17]కాని అప్పటికి హదదు చాలా చిన్నవాడు. కావున
హదదు ఈజిప్టుకు పారిపోయాడు. హదదు తండ్రి
యొక్క సేవకులు కొందరు అతనితో కలిసి వెళ్లారు.
[18]వారు మిద్యాను దేశము నుండి పారానుకు వెళ్లారు.
పారాను దేశంలో వారితో మరి కొందరు కలిశారు.
వారంతా కలిసి ఈజిప్టుకు వెళ్లారు. ఈజిప్టు రాజగు
ఫరో వద్దకు వెళ్లి సహాయం అర్థించారు. హదదుకు
ఒక ఇంటిని, కొంత భూమిని ఫరో ఇచ్చాడు. ఫరో
అతనికి అన్ని అండ దండలు ఇచ్చి, ఆహారం కూడా
ఏర్పాటు చేశాడు.
[19]హదదును ఫరో మిక్కిలి అభిమానించాడు. హద
దుకు ఫరో ఒక భార్యను కూడా ఇచ్చాడు. ఆమె
ఫరో మరదలే! (ఫరో భార్య పేరు రాణి తహ్పెనేసు)
[20]అనగా తహ్పెనేసు యొక్క సోదరి హదదును వివాహ
మాడింది. వారికి ఒక కుమారుడు పుట్టాడు. వాని
పేరు గెనుబతు. రాణి తెహ్పెనేసు గెనుబతును తన
పిల్లలతో పాటు ఫరో ఇంటిలోనే పెరగనిచ్చింది.
[21]దావీదు చనిపోయినట్లు ఈజిప్టులో వున్న హదదు
విన్నాడు. సైన్యాధిపతి యోవాబు కూడ చనిపోయి
నట్లు అతడు విన్నాడు. అందువల్ల హదదు ఫరో వద్దకు
వెళ్లి, "నన్ను నా స్వదేశానికి వెళ్ల నియ్యండి" అని
అడిగాడు. [22]"నీకు ఇక్కడ కావలసినవన్నీ సమకూ
ర్చాను! మరి నీవెందుకు నీ స్వదేశానికి వెళ్లిపోవాలను
కుంటున్నావు?" అని ఫరో అన్నాడు. అయితే హదదు
మాత్రం, "దయచేసి నన్ను మాత్రం ఇంటికి వెళ్ల
నీయండి" అని ప్రాధేయపడ్డాడు.
[23]సొలొమోనుకు మరొక వ్యక్తి శత్రువయ్యేలా
యెహోవా చేశాడు. అతడు ఎల్యాదా కుమారుడైన
రెజోను. రెజోను తన యజమాని వద్ద నుండి పారి
పోయాడు. సోబా రాజైన హదదెజరు ఇతని యజమాని.
[24]దావీదు సోబా సైన్యాన్ని ఓడించిన పిమ్మట రెజోను
కొంత మందిని చేరదీసి ఒక చిన్న సైన్యాన్ని తయారు
చేశాడు. రెజోను దమస్కుకు వెళ్లి అక్కడ స్థిరపడ్డాడు.
తరువాత అతను దమస్కుకు రాజు అయ్యాడు.
[25]రెజోను అరాము దేశమును పాలించాడు. రెజోను
ఇశ్రాయేలును అసహ్యించు కొనేవాడు. కావున సొలొ
మోను బతికినంత కాలం రెజోను ఇశ్రాయేలుకు శత్రు
వుగానే వున్నాడు. రెజోను, హదదు ఇశ్రాయేలులో
చాలా అలజడిని సృష్టించారు.
[26]నెబాతు కుమారుడైన యరొబాము సొలొ మోను
సేవకులలో ఒకడు. యరొబాము ఎఫ్రాయీము ప్రజ
లవాడు. అతడు జెరేదా పట్టణానికి చెందినవాడు.
యరొబాము తల్లి పేరు జెరూహా. అతని తండ్రి మర
ణించాడు. అతడు రాజుకు వ్యతిరేకి అయ్యాడు.
[27]యరొబాము రాజుకు వ్యతిరేకం కావటానికి ఒక
కారణం వుంది. సొలొమోను మిల్లో కట్టించి, తన
తండ్రి దావీదు నగర గోడను సరిచేస్తూ వున్నాడు.
[28]యరొబాము చాలా బలశాలి. అతడు మంచి పనివాడని
సొలొమోను గమనించాడు. అందుచే అతనిని యోసేపు
వంశంవారు* చేసే అతి కష్టమైన పనుల మీద అధికారిగా

---

**యోసేపు వంశంవారు** యోసేపు వంశంలో ఎఫ్రాయీము,
మనష్షే వంశాల వారు చేరియున్నారు. యోసేపు కుమారుల
పేరుతో ఆ వంశాలు వ్యవహరింపబడుతూ వుండేవి.

నియమించాడు. [29]ఒక రోజు యరొబాము యెరూష
లేము నుండి ప్రయాణం చేస్తూ వున్నాడు. షిలోనీయు
డైన ప్రవక్త అహీయా దారిలో యరొబామును కలి
శాడు. అహీయా నూతన వస్త్రం ధరించియున్నాడు.
పొలాల్లో వారిద్దరు తప్ప మరెవ్వరూ లేరు. [30]అహీయా
తాను ధరించిన నూతన వస్త్రం తీసి దానిని పన్నెండు
ముక్కలుగా చించాడు.

[31]అప్పుడు అహీయా యరొబాముతో ఈ విధంగా
చెప్పాడు: "ఈ వస్త్రంలో పది ముక్కలు నీవు తీసుకో,
ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఏమి చెప్పినాడనగా:
'ఈ రాజ్యాన్ని సొలొమోను నుండి దూరం చేస్తాను.
అప్పుడు నీకు పది గోత్రాలను ఇస్తాను. [32]కాని దావీదు
కుటుంబం ఒక గోత్రపువారిని ఏలటానికి అనుమతి
ఇస్తాను. ఇది నా సేవకుడైన దావీదు జ్ఞాపకార్థం, యెరూ
షలేము నగరం కొరకు నేను దీనిని చేస్తాను. ఇశ్రాయేలు
వంశాలవారుండే నగరాలన్నింటిలో యెరూషలేమును
నేను ఎన్నుకున్నాను. [33]సొలొమోను నన్ననుస
రించటం మానివేసినందుకు నేను ఇదంతా చేయదలి
చాను. నన్ను విడిచి అతను సీదోనీయుల దేవత
అష్తారోతును, మోయాబీయుల దేవత కెమోషును,
అమ్మోనీయుల దేవత మిల్కోమును మొక్కు
తున్నాడు. ఉత్తమ కార్యాలను, ధర్మ మార్గాన్ని అనుస
రించటం సొలొమోను మానివేశాడు. నా న్యాయ
సూత్రాలను, ఆజ్ఞలను శిరసావహించటం లేదు. తన
తండ్రి దావీదు నడచిన మార్గాన అతడు నడుచుట
లేదు. [34]కావున అతని నుండి రాజ్యాన్నంతా తీసు
కుంటాను. అయినా అతను బతికినంత కాలం తాను
రాజుగా వుండేలా చూస్తాను. నా సేవకుడైన దావీదు
గౌరవార్థం నేనలా చేస్తాను. నేను దావీదును ఎందుకు
ఎన్నుకున్నాననగా అతడు నా ఆజ్ఞలను, నా ధర్మ
సూత్రాలను అన్నిటినీ పాటించాడు. [35]ఈ రాజ్యాన్ని
నేనతని కుమారుని వద్ద నుండి తీసుకుంటాను.
మరియు యరొబామా, పది వంశాల వారిని పరిపాలించ
టానికి నీకు అనుమతి ఇస్తాను. [36]సొలొమోను కుమా
రుడు ఒక వంశం వారిపై పాలనాధికారం కలిగి వుండేలా
చేస్తాను. నా సేవకుడైన దావీదు నా ముందు యెరూష
లేములో ఎల్లప్పుడూ రాజ్యం కలిగి వుండేటందుకు
ఆ విధంగా చేస్తాను. యెరూషలేమును నా స్వంత
నగరంగా నేను ఎన్నుకున్నాను. [37]కాని నీవు కోరినంత
మట్టుకు నీవు రాజ్యం చేయగలిగేలా చేస్తాను. ఇశ్రా
యేలు సంతతినీ నీవు ఏలుబడి చేస్తావు. [38]నీవు గనుక
నా న్యాయ సూత్రాలను, నా ఆజ్ఞలను పాటిస్తూ
సన్మార్గంలో నడిస్తే ఇవన్నీ జరిగేలా నేను చేస్తాను.
దావీదు నా ధర్మ సూత్రాలను, ఆజ్ఞలను పాటించినట్లు
నీవు కూడ పాటిస్తే నేను నీకు తోడై వుంటాను. దావీ
దుకు చేసినట్లు, నీ వంశం కూడ రాజ వంశమయ్యేలా
చేస్తాను. ఇశ్రాయేలును నీకిస్తాను. [39]ఆజ్ఞాపాలన చేయక
పోయిన కారణంగా దావీదు సంతానాన్ని నేను శిక్షిస్తాను.
కాని వారిని నేను శాశ్వతంగా శిక్షకు గురి చేయను.'"

### సొలొమోను మరణం

[40]సొలొమోను యరొబామును చంప ప్రయత్నిం
చాడు. కాని యరొబాము ఈజిప్టుకు పారిపోయాడు.
ఈజిప్టు రాజగు షీషకు వద్దకు అతను వెళ్లాడు.
సొలొమోను చనిపోయేవరకు యరొబాము అక్కడే
వున్నాడు.

[41]తన పరిపాలనా కాలంలో సొలొమోను అనేకమైన
ప్రజ్ఞాప్రాభవాలతో కూడిన పనులను చేశాడు. ఈ
విషయాలన్నీ సొలొమోను చరిత్ర గ్రంథంలో పొందు
పర్చబడ్డాయి.

[42]యెరూషలేము నుండి ఇశ్రాయేలంతటిపైన
సొలొమోను నలుబది సంవత్సరాలు పరిపాలన చేశాడు.
[43]తరువాత సొలొమోను చనిపోయాడు. అతడు తన
పూర్వీకులతో సమాధి చేయబడ్డాడు.* అతడు తన
తండ్రియగు దావీదు పురములో సమాధి చేయ
బడ్డాడు.

### అంతః కలహం

12 [1-2]నెబాతు కుమారుడైన యరొబాము సొలొ
మోను నుండి తప్పించుకొని ఈజిప్టుకు పారి
పోయాడు. అక్కడే వుండి పోయాడు. అతడు సొలొ
మోను మరణం గురించి విన్నప్పుడు, ఎఫ్రాయీము
కొండలలో వున్న జెరేదా అను తన నగరానికి తిరిగి
వచ్చాడు.

రాజైన సొలొమోను చనిపోయి, తన పూర్వీకు
లతో పాటు సమాధి చేయబడిన పిమ్మట అతని
కుమారుడు రెహబాము అతని స్థానంలో రాజయ్యాడు.
[3]ఇశ్రాయేలు ప్రజలంతా షెకెమునకు వెళ్లారు. వారంతా
రెహబామును రాజుగా చేయటానికి వెళ్లారు. రెహబాము
కూడా రాజు కావటానికి షెకెమునకు వెళ్లాడు. [4]ప్రజలు
రెహబాముతో, "నీ తండ్రి మమ్మల్ని బలవంతంగా
భరింపరాని శరీర కష్టం చేయించాడు. కాని ఇప్పుడు
నీవు మాకు శ్రమ తగ్గించాలి. నీ తండ్రి మాకు విధించిన
శరీరకష్టం నీవు మాన్పించాలి. అప్పుడు మేము నీకు
సేవ చేస్తాము" అని అన్నారు.

[5]దానికి సమాధానంగా రెహబాము, "మూడు రోజుల
తరువాత నా వద్దకు రండి. అప్పుడు మీకు నేను
సమాధానం చెపుతాను" అని అన్నాడు. కావున ప్రజ
లంతా వెళ్లిపోయారు.

[6]సొలొమోను జీవించివున్నప్పుడు అతనికి పరి
పాలనలో సహాయపడిన కొందరు పెద్దలైన

---

**అతడు ... చేయబడ్డాడు** తన పితరులతో కలిసి నిద్రించెనని శబ్దార్థం.

సలహాదారులున్నారు. కావున రాజైన రెహబాము ఈ
సందర్భంలో, "ఆ ప్రజలకు ఏమి చెప్పాలని మీరను
కొంటున్నారు?" అని సలహా అడిగాడు.
7పెద్దలు ఇలా అన్నారు, "ఈ రోజు నీవు వారి
సేవకునిలా మెలగితే, రేపు వారంతా నిన్ను సేవిస్తారు.
నీవు వారితో ప్రేమగా కనికరంతో మాట్లాడితే వారంతా
నీ కొరకు ఎల్లప్పుడూ పనిచేస్తారు."
8కాని రెహబాము వారి సలహాను పెడచెవిని పెట్టాడు.
తన స్నేహితులైన యువకులను మళ్లీ సలహా అడిగాడు.
9"నీ తండ్రి ఇచ్చిన కఠినమైన పనికంటె తక్కువ పని
ఇమ్మని ప్రజలు నన్నడుగుతున్నారు. నేనేమి సమా
ధానం చెపితే మంచిదని మీరనుకుంటున్నారు?
నన్నేమి చెప్పమంటారు?" అని రెహబాము తన
స్నేహితులను అడిగాడు.
10రాజు యొక్క యువ స్నేహితులు, "ఆ ప్రజలు
నీ వద్దకు వచ్చి, 'నీ తండ్రి మమ్మల్ని బండ చాకిరి
చేయటానికి బలవంతం చేశాడు. కనుక మా పనిని
ఇప్పుడు సులభం చేయుము' అని అడిగారు కదా!
అయితే నీవిప్పుడు కొన్ని డంబాలు పలికి, 'నా చిటికెన
వేలు నా తండ్రి శరీరం కంటె పెద్దదిగా వుంది. 11నా
తండ్రి మిమ్మల్ని బండ చాకిరికి గురిచేశాడు. కాని
నేను మిమ్మల్ని ఇంకా కష్టపడేలా చేస్తాను! నా తండ్రి
మీచే పని చేయించటానికి కొరడాలు ఉపయోగిం
చాడు. కాని నేను పదునైన లోహపు ముక్కలతో
కూర్చబడిన కొరడాలతో, మిమ్మల్ని చీల్చునట్లుగా
కొడతాను" అని సమాధానం చెప్పమన్నారు.
12రెహబాము ప్రజలను, "మూడు రోజుల తరువాత
తన వద్దకు రమ్మని" చెప్పాడు. కావున మూడు రోజుల
తరువాత ఇశ్రాయేలీయులంతా రెహబాము వద్దకు
వచ్చారు. 13అప్పుడు రాజైన రెహబాము వారితో చాలా
పౌరుషంగా మాట్లాడాడు. పెద్దలిచ్చిన సలహా రాజు
పెడచెవిని పెట్టాడు. 14తన యువ స్నేహితులు చెప్పి
నదే చేశాడు. రెహబాము వారితో, "నా తండ్రి మిమ్మల్ని
హింసించి శరీర కష్టం చేయించాడు. కాని నేను మీకు
ఇంకా కఠినమైన పని ఇస్తాను. నా తండ్రి మిమ్మల్ని
కొరడాలతో కొట్టి పని చేయించాడు. కాని నేను
మిమ్మల్ని ఎలా కొడతానంటే మీరు తేళ్లు కుట్టినట్లు
బాధపడతారు!" అని చెప్పాడు. 15కావున రాజు తన
ప్రజలు కోరిన దానిని చేయలేదు. ఇదంతా యెహో
వాయే తన చిత్తప్రకారం జరిపించాడు. తాను నెబాతు
కుమారుడైన యరొబాముకు ఇచ్చిన వాగ్దానం నెరవేరే
లాగున యెహోవా ఇది ఈ విధంగా జరిగేలా చేశాడు.
షిలోహుకు చెందిన ప్రవక్త అహియా ద్వారా ఈ
వాగ్దానం చేశాడు.
16ఇశ్రాయేలీయులంతా కొత్త రాజు తమ అభ్యర్థన
వినలేదని గమనించారు. అందువల్ల ప్రజలు ఇలా
అన్నారు: "మనం దావీదు వంశానికి చెందినవారమా?
కాదు, యెష్షయి రాజ్యంలో మనకేమైనా వస్తుందా?
రాదు! కావున ఇశ్రాయేలు సోదరులారా, మనమంతా
మన ఇండ్లకు పోదాం పదండి, దావీదు కుమారుణ్ణి
తన ప్రజలను ఏలుకోనీయండి!" తరువాత ఇశ్రాయేలీ
యులందరూ తమ తమ ఇండ్లకు వెళ్లిపోయారు.
17అయినా రెహబాము యూదా నగరాలలో ఉన్న
ఇశ్రాయేలీయులందరినీ ఏలాడు.
18కూలిపని చేసే వారిపై అదోరాము అనునతడు
అధికారిగా వుండేవాడు. రాజైన రెహబాము అదో
రామును ప్రజలతో మాట్లాడేటందుకు పంపాడు. కాని
ఇశ్రాయేలీయులు వానిని రాళ్లతో కొట్టి చంపేశారు.
అది విని రాజైన రెహబాము తన రథమెక్కి యెరూష
లేముకు తప్పించుకుపోయాడు. 19అలా ఇశ్రాయేలీ
యులు దావీదు వంశంపై తిరుగుబాటు చేశారు. వారు
ఈనాటికీ దావీదు వంశానికి వ్యతిరేకులుగానే వున్నారు.
20యరొబాము తిరిగి వచ్చినట్లు ఇశ్రాయేలీయులు
విన్నారు. కావున వారతనిని ఒక సభకు ఆహ్వానించి,
ఇశ్రాయేలంతటికీ రాజుగా చేశారు. యూదాగోత్రం
వారొక్కరు మాత్రమే దావీదు కుటుంబాన్ని అను
సరించారు.
21రెహబాము యెరూషలేముకు తిరిగి వెళ్లాడు.
అతడు యూదా గోత్రపువారిని, బెన్యామీను గోత్రపు
వారిని సమావేశపరిచాడు. వారిని ఒక లక్షా ఎనుబదివేల
మందిగల ఒక సైన్యంగా తయారు చేశాడు. రెహబాము
ఇశ్రాయేలీయులతో యుద్ధం చేయ సంకల్పించాడు.
తన రాజ్యాన్ని తిరిగి సంపాదించాలని అతని కోరిక.
22కాని యెహోవా ఒక దైవజ్ఞుని (ప్రవక్త)తో
మాట్లాడాడు. అతని పేరు షెమయా. యెహోవా ఆ
ప్రవక్తతో ఇలా అన్నాడు: 23"నీవు వెళ్లి సొలొమోను
కుమారుడు, యూదా రాజు అయిన రెహబాముతోను,
మరియు యూదా, బెన్యామీను ప్రజలతోను
మాట్లాడు. 24మీ సోదరుల మీదికి మీరు యుద్ధానికి
వెళ్లవద్దని నా మాటగా వారికి చెప్పు 'మీలో ప్రతి
ఒక్కడూ ఇంటికి వెళ్లాలి. ఇవన్నీ జరిగేలా నేనే చేశాను.'
ఈ విషయం యెహోవా మీకు తెలియ చేయమ
న్నాడని చెప్పు." ప్రవక్త వెళ్లి చెప్పగా రెహబాము సైన్యం
లోని వారంతా విని యెహోవా ఆజ్ఞ శిరసావహించారు.
వారు ఇండ్లకు వెళ్లారు.
25యరొబాము తరువాత షెకెమును చాలా బలమైన
నగరంగా తీర్చిదిద్దాడు. ఆ నగరం ఎఫ్రాయీము కొండ
లలో వుంది. యరొబాము అక్కడ నివసించాడు.
అతడు పెనూయేలు అను నగరానికి వెళ్లి దానిని కూడ
మంచి పటిష్ఠమైన నగరంగా చేశాడు.
26-27యరొబాము ఇలా అనుకున్నాడు: "ఇప్పుడు
ప్రజలంతా యెరూషలేములో యెహోవా దేవాల
యానికి యథా ప్రకారంగా వెళుతూ వుంటే, వారు
దావీదు వంశం వారిచే పాలింపబడాలని అనుకుంటారు.

యూదా రాజైన రెహబామునే వారు మళ్లీ అనుసరించ
వచ్చు. ఆ తరువాత వారు నన్ను చంపనూవచ్చు.
28అందువల్ల తాను ఏమి చేయాలో తెలియజేయమని
రాజు తన సలహాదారులను అడిగాడు. వారి సలహా
మేరకు అతడు రెండు బంగారు కోడెదూడలను చేయిం
చాడు. రాజైన యరొబాము ప్రజలనుద్దేశించి, "మీరు
దేవుని ఆరాధించేందుకు యెరూషలేముకు వెళ్లవద్దు.
ఇశ్రాయేలీయులారా, ఇవిగో మిమ్మల్ని ఈజిప్టు నుండి
తీసుకుని వచ్చిన దేవతలు ఇవే" అని అన్నాడు. 29అలా
అని రాజైన యరొబాము ఒక బంగారు కోడెదూడ
బొమ్మను బేతేలునందును, రెండవ దానిని దాను నగర
మందును ప్రతిష్ఠించాడు. 30కాని ఇది ఘోరమైన పాపం.
ప్రజలు బేతేలు, దాను నగరాలకు ప్రయాణమై కోడె
దూడల విగ్రహాలను ఆరాధించటం మొదలు పెట్టారు.
31గుట్టల మీద, కొండల మీద యరొబాము
ఆరాధనా స్థలాలను కట్టించాడు. వివిధ వంశాల నుండి
యాజకులను ఎంపిక చేశాడు. (కేవలం లేవీయుల
నుండి మాత్రమే అతడు యాజకులను ఎంపిక
చేయలేదు).
32రాజైన యరొబాము ఒక కొత్త పండుగరోజు
ప్రకటించాడు. ఇది పస్కా పండుగ వంటిది. అది ఎని
మిదవ నెలలో పదునైదవ రోజు. (ఒకటవ నెల పది
హేనవ రోజున కాదు). యూదాలో బేతేలు నగరంలో
వున్న పీఠం వద్ద ఆ రోజున రాజు బలులు సమర్పిం
చాడు. తాను తయారు చేయించిన దూడల బొమ్మ
లకు రాజు బలులు అర్పించేవాడు. తను ఏర్పాటు
చేసిన దేవాలయాలలో సేవ చేయటానికి రాజైన
యరొబాము యాజకులను బేతేలు నుండి కూడ
తీసుకున్నాడు. 33కావున రాజైన యరొబాము ఇశ్రా
యేలీయులకు పండుగ నిమిత్తం తనకు అనుకూలమైన
రోజును మాత్రమే నిర్ణయించాడు. అది ఎనిమిదవ
నెలలో పదునైదవ రోజు. ఆ సమయంలో అతను
నిర్మించిన బలిపీఠాల వద్ద అతడు బలులు సమర్పించి,
ధూపం వేసేవాడు. (ఈ కార్యాలు) అతను బేతేలు
నగరంలో నిర్వహించేవాడు.

### దేవుడు బేతేలుకు వ్యతిరేకంగా పలుకుట

13 ఒక రోజు యూదా దేశపు వాడైన ఒక దైవ
జనుడ్ని బేతేలు నగరానికి వెళ్లమని యెహోవా
ఆజ్ఞ ఇచ్చాడు. ఆ దైవజనుడు అక్కడికి వెళ్లే సరికి
రాజైన యరొబాము బలిపీఠం వద్ద నిలబడి ధూపం
వేస్తూ వున్నాడు. 2ఆ బలిపీఠానికి వ్యతిరేకంగా మాట్లాడ
మని యెహోవా దైవజనునికి ఆజ్ఞ ఇచ్చాడు. ఆయన
ఇలా చెప్పాడు:
"బలిపీఠమా, నీకు యెహోవా ఇలా చెప్పు
చున్నాడు: 'దావీదు వంశంలో యోషీయా అనువాడొ
కడు జన్మిస్తాడు. ఈ యాజకులు ఇప్పుడు కొండలపై,
గుట్టలపై ఆరాధిస్తున్నారు కాని ఓ బలిపీఠమా,
యోషీయా ఈ యాజకులను నీ మీద పెట్టి, వారిని
చంపుతాడు. ఇప్పుడా యాజకులు నీ మీద ధూపం
వేస్తున్నారు. కాని యోషీయా నీమీద మానవుల
అస్థికలను తగులబెడతాడు.అప్పుడు నీవు దేనికీ ఉప
యోగపడవు.' "
3ఇవి జరిగి తీరుతాయనటానికి దైవజనుడు ఒక
సూచనఇచ్చాడు. "యెహోవా ఈ సూచన నాకు
తెలియజెప్పాడు. ఈ బలిపీఠం నిలువునా పగిలి
పోతుంది. దాని మీది బూడిద కిందికి పడి పోతుంది"
అని ప్రవక్త అన్నాడు.
4బేతేలులో వున్న బలిపీఠాన్ని గురించి దైవజనుడు
చెప్పిన సమాచారాన్ని రాజైన యరొబాము విన్నాడు.
అతడు తన చేతిని బలిపీఠం మీదినుంచి తీసి ప్రవక్త
వైపు చూస్తూ, "అతనిని నిర్బంధించండి!" అని
అన్నాడు. రాజు అలా అన్నదే తడవుగా అతని చేయి
చచ్చుపడిపోయింది. దానిని అతడు కదల్చలేక
పోయాడు. 5అంతే గాకుండా, బలిపీఠం ముక్కలై
పోయింది. దాని మీది బూడిద కిందికి పడిపోయింది.
దేవుని సమాచారంగా ఆ దైవజనుడు దీనినే చెప్పాడు.
6అప్పుడు యరొబాము దైవజనునితో, "దయచేసి
నా కొరకు నీ దేవుడైన యెహోవాను ప్రార్థించు. నా
చేతిని బాగు చేయమని యెహోవాను అడుగు"
అంటూ ప్రాధేయపడ్డాడు.
అందుకొరకు దైవజనుడు యెహోవాను ప్రార్థిం
చాడు. తక్షణమే రాజు చేయి స్వస్థపడింది. అది
పూర్వపు చేయిలా ఆరోగ్యవంతంగా వుంది. 7అప్పుడు
రాజు ఆ దైవజ్ఞుడితో, "దయచేసి నాతో నా ఇంటికి
వచ్చి, నాతో భోజనం చేయి. నేను నీకు ఒక కానుక
సమర్పించదలిచాను" అని అన్నాడు.
8అది విన్న ప్రవక్త రాజుతో, "నేను నీతో నీ ఇంటికి
రాను! నీవు నీ రాజ్యంలో సగంభాగం నాకిచ్చినా
నేను నీతో రాను! ఈ స్థలంలో నేనేదీ తినను,
తాగను. 9ఏదీ తినకూడదని తాగరాదని యెహోవా
ఆజ్ఞ. నేనిక్కడికి వచ్చిన బాట వెంట మళ్లీ ప్రయాణం
చేయవద్దని కూడా యెహోవా ఆజ్ఞ ఇచ్చాడు" అని
అన్నాడు.
10అందువల్ల అతడు మరో మార్గాన తిరుగు
ప్రయాణం సాగించాడు. బేతేలుకు వచ్చిన బాట వెంట
తను తిరిగి వెళ్లలేదు.
11ఆ రోజులలో బేతేలు నగరంలో వృద్ధుడైన ఒక
ప్రవక్త నివసిస్తూ వుండేవాడు. ఆ వృద్ధ ప్రవక్త యొక్క
కుమారులు దైవజనుడు వచ్చి బేతేలు నగరంలో చేసి
నదంతా తమ తండ్రితో చెప్పారు. రాజైన యరొబా
ముతో ఆ దైవజనుడు చెప్పినదంతా కూడా వారు
తమ తండ్రికి వివరించారు. 12అయితే "అతడు ఏ
మార్గాన వెళ్లాడని" వృద్ధ ప్రవక్త అడిగాడు. యూదా

నుండి వచ్చిన దైవజనుడు వెళ్లిన దారిని తమ తండ్రికి
అతని కుమారులు చూపించారు. 13వృద్ధ ప్రవక్త తన
కుమారులతో అతని గాడిదపై గంత వేయమని
చెప్పాడు. వారతని గాడిదపై గంత వేయగా, దానిపై
ఎక్కి ప్రవక్త ప్రయాణమై వెళ్లాడు.
14ఆ వృద్ధ ప్రవక్త దైవజనుడిని వెతుక్కుంటూ
పోయాడు. దైవజనుడు ఒక సింధూర వృక్షం కింద
కూర్చుని వుండటం వృద్ధ ప్రవక్త చూశాడు. "యూదా
నుండి వచ్చిన దైవజనుడవు నీవేనా?" అని వృద్ధ
ప్రవక్త అడిగాడు. "అవును నేనే" అన్నాడు దైవజనుడు.
15"అయితే దయచేసి నా ఇంటికి వచ్చి, నాతో
భోజనం చేయండి" అంటూ వృద్ధ ప్రవక్త అడిగాడు.
16కాని దైవజనుడిలా అన్నాడు: "నేను నీతో
రాలేను. నీతో ఈ ప్రదేశంలో అన్నపానాదులు తీసు
కోలేను. 17 'అక్కడ నీవేదీ తినరాదు; తాగరాదు. నీవు
వెళ్లిన దారిన తిరిగి రాకూడదు; అని కూడ యెహోవా
నాకు ఆజ్ఞ ఇచ్చాడు."
18"కాని నేను కూడా నీలాగే ఒక ప్రవక్తను" అన్నాడు
ఆ వృద్ధ ప్రవక్త. అతడు ఒక అబద్ధం కూడా చెప్పాడు.
"యెహోవా యొక్క దేవదూత నావద్దకు వచ్చాడు.
ఆ యెహోవా యొక్క దేవదూత నిన్ను నా ఇంటికి
తీసుకుని వెళ్లమని, నాతో నీవు భోజనాదులు చేసేలా
అనుమతివ్వమనీ అన్నాడు" అని చెప్పాడు.
19ఈ మాటలు నమ్మి ఆ దైవజనుడు వృద్ధ ప్రవక్త
ఇంటికి వెళ్లాడు. అతనితో కలిసి భోజనాదికములు
చేశాడు. 20వారు బల్లవద్ద కూర్చునివుండగా, యెహోవా
వృద్ధ ప్రవక్తతో మాట్లాడాడు. 21ఆ వృద్ధ ప్రవక్త యూదా
దేశపు దైవజనునితో ఇలా అన్నాడు: "ప్రభువాజ్ఞ నీవు
పాటించలేదని ఆయన అన్నాడు! యెహోవా ఆదేశిం
చిన దానిని నీవు చేయలేదు. 22ఈ ప్రదేశంలో నీవు
ఏమీ తినరాదనీ, తాగరాదనీ యెహోవా ఆజ్ఞాపించాడు.
కాని నీవు తిరిగి వచ్చి భోజనాదికాలు నిర్వర్తించావు.
అందువల్ల నీ శవం నీ పితరుల సమాధిలో ఉంచబడదు."
23దైవజనుడు భోజనం ముగించాడు. వృద్ధ ప్రవక్త
గాడిదపై గంత వేయగా, దైవజనుడు దానిపై వెళ్లాడు.
24 తను ఇంటికి తిరిగి వెళ్లే మార్గంలో ఒక సింహం
దైవజనుని మీదపడి చంపేసింది. దైవజనుని శరీరం
బాటపై పడివుంది. గాడిద, సింహం శవం పక్కన నిలబడి
వున్నాయి. 25కొందరు ఆ దారిన పోతూ, శవం పక్కన
సింహం నిలబడివుండటం చూశారు. వృద్ధ ప్రవక్త వున్న
నగరానికి వచ్చి, వారు దారిలో చూసినదంతా చెప్పారు.
26ఆ వృద్ధ ప్రవక్తే యూదా దేశపు దైవజనుని
వెనుకకు తీసుకొని వచ్చాడు. వృద్ధ ప్రవక్త జరిగినదంతా
విని, "ఆ దైవజనుడు యెహోవా ఆజ్ఞ పాటించలేదు.
అందువలన యెహోవా ఒక సింహాన్ని అతనిని చంప
టానికి పంపాడు. ఇది చేస్తానని యెహోవా చెప్పియు
న్నాడు" అని అన్నాడు. 27"తన గాడిదపై గంత
వేయమని" తన కుమారులతో ప్రవక్త చెప్పాడు. తన
కుమారులు గాడిదపై గంతవేశారు. 28వృద్ధ ప్రవక్త
దానిపై వెళ్లి శవం బాటపై పడివుండటం చూశాడు.
గాడిద, సింహం ఇంకా శవం పక్కన నిలబడి వున్నాయి.
పైగా ఆ సింహం శవాన్ని తినటం గాని, గాడిదను
గాయపర్చటం గాని చేయలేదు.
29వృద్ధ ప్రవక్త శవాన్ని తన గాడిదపై వేశాడు. దైవ
జనుని మృతికి సంతాపం తెలియజేయటానికి శవాన్ని
ప్రవక్త వెనుకకు తీసుకుని వచ్చాడు. 30శవాన్ని ప్రవక్త
తన కుటుంబానికి సంబంధించిన సమాధిలో పెట్టాడు.
వృద్ధ ప్రవక్త అతని మృతికి సంతాపం తెలియజేశాడు.
ఆ ప్రవక్త, "ఓ నా సహోదరుడా, నీ మరణానికి
మిక్కిలి విలపిస్తున్నాను" అని అన్నాడు. 31వృద్ధ ప్రవక్త
దైవజనుని శవాన్ని పాతిపెట్టాడు. తరువాత తన కుమా
రులతో ఇలా అన్నాడు: "నేను చనిపోయినప్పుడు
నా శవాన్ని ఇదే సమాధిలో ఉంచండి. నా ఎముకలను
అతని అస్థికల పక్కనే ఉంచండి.
32యెహోవా అతని ద్వారా చెప్పిన మాటలు
నిజమయి తీరుతాయి. యెహోవా బేతేలులోని బలి
పీఠానికి, సమరియ పట్టణాలలోని ఉన్నత స్థలాలకు
వ్యతిరేకంగా మాట్లాడటానికి అతనిని ఉపయోగించు
కున్నాడు."
33రాజైన యరొబాములో ఏమీ మార్పు రాలేదు.
అతడు చెడ్డ పనులు చేస్తూనే వున్నాడు. వేర్వేరు
వంశాల నుండి మనుష్యులను అతడు యాజకులుగా*
ఎంపిక చేస్తూనే వున్నాడు. ఈ యాజకులు ఉన్నత
ప్రదేశాలలో పూజా కార్యక్రమాలు నిర్వర్తించారు. ఎవరు
యాజకుడు కావాలనుకుంటే వారికా అవకాశం ఇవ్వ
బడింది.
34ఇది ఒక మహా పాపమై తన రాజ్యం సర్వ నాశనం
కావటానికి ప్రధాన కారణమయ్యింది.

### యరొబాము కుమారుని మరణం

14 ఆ సమయంలో యరొబాము కుమారుడు
అబీయా తీవ్రంగా జబ్బు పడ్డాడు. 2యరొ
బాము తన భార్యతో ఇలా అన్నాడు: "నీవు షిలోహుకు
వెళ్లు. అక్కడ ప్రవక్త అహీయాను దర్శించు. నేను
ఇశ్రాయేలుకు రాజునవుతానని చెప్పిన వాడే ఈ
అహీయా. నీవు నా భార్యవని ప్రజలకు తెలియకుండా
మారువేషం వేసుకొని వెళ్లు. 3 ప్రవక్త కొరకు పది
రొట్టెలను, తీపి పదార్థాలను, ఒక జాడీ తేనెను కానుకగా
పట్టుకు వెళ్లు. తరువాత మన కుమారునికి ఏమి
జరుగుతుందో చెప్పమని ఆయనను అడుగు. ప్రవక్త
యైన అహీయా అంతా చెపుతాడు."

---

**వేర్వేరు … యాజకులుగా** ధర్మశాస్త్ర ప్రకారం లేవీ వంశం వారినే యాజకులుగా నియమించాలి.

[4]అందువల్ల రాజు భార్య షిలోహుకు వెళ్లింది. ప్రవక్త అహీయా ఇంటికి వెళ్లింది. అహీయా పండు ముసలి వాడయ్యాడు. చూపుపోయింది. [5]కాని ఈ లోపు యెహోవా అహీయాతో, "యరొబాము భార్య నీ వద్దకు వస్తూవుంది. ఆమె కుమారునికి జబ్బు చేయగా, అతనికి ఏమి జరుగుతుందో తెలుసుకోవాలని వస్తూ వుంది" అని తెలియజేశాడు. తరువాత అహీయా ఆమెకు ఏమి చెప్పాలో కూడ యెహోవా వివరించాడు.యరొబాము భార్య అహీయా ఇంటికి వచ్చింది. ఆమె ఎవరో ప్రజలకు తెలియకుండా వుండాలని ఆమె ప్రయత్నిస్తూ వుంది. [6]ఆమె ద్వారం వద్దకు వచ్చినట్లు అహీయా శబ్దం విన్నాడు. వెంటనే అహీయా ఇలా అన్నాడు: "యరొబాము భార్యా, లోపలికి రా, ప్రజలు నిన్ను ఎవరో అనుకోవాలని నీవు ఎందుకు ప్రయత్నిస్తున్నావు? నీకు ఒక దుర్వార్త చెప్పదలిచాను. [7]నీవు ఇంటికి తిరిగి వెళ్లి ఇశ్రాయేలు దేవుడైన యెహోవా యరొబాముకు చెప్పమన్న వర్తమానం తెలియజేయి. యెహోవా ఇలా అంటున్నాడు: 'యరొబామా, ఇశ్రాయేలీయు లందరిలోను నేను నిన్ను ఎంపిక చేశాను. నా ప్రజలకు నిన్ను పాలకునిగా చేశాను. [8]దావీదు వంశం ఇశ్రాయేలును ఏలుతూ వుంది. కాని వారినుండి రాజ్యాన్ని తీసుకుని, దానిని నేను నీకిచ్చాను. నా సేవకుడగు దావీదువలె నీవు ప్రవర్తించలేదు. అతడు నా ఆజ్ఞలను ఎల్లప్పుడు పాటించాడు. పూర్ణ హృదయంతో అతడు నన్ను అనుసరించాడు. నేను అంగీకరించిన వాటినే అతడు చేసేవాడు. [9]కాని నీవు ఘోరమైన పాపాలను చాలా చేశావు. నీ ముందు పాలించిన వారు చేసిన పాపాలకంటె నీవు అతి భయంకరమైన పాపాలు చేశావు. నన్ను వదిలిపెట్టి పెడ మార్గాన పడ్డావు. నీవు విగ్రహాలను, చిల్లర దేవుళ్లను తయారు చేశావు. ఇది నాకు చాలా కోప కారణమయ్యింది. [10]కావున నేను యరొబాము కుటుంబానికి కష్టాలు కలుగజేస్తాను. నీ కుటుంబంలో పురుషులందరినీ చంపివేస్తాను. ఎండిన పేడను అగ్ని దహించి వేయునట్లు నేను నీ కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాను. [11]నగరంలో చనిపోయిన నీ కుటుంబం వారిని కుక్కలు పీక్కుతింటాయి. పొలాల్లో చనిపోయే నీ కుటుంబంవారిని పక్షులు పొడుచుకు తింటాయి.' ఇదే యెహోవా వాక్కు."

[12]యరొబాము భార్యతో ప్రవక్త అహీయా ఇంకా ఇలా అన్నాడు: "ఇప్పుడు ఇంటికి వెళ్లు. నీవు నగర ద్వారం ప్రవేశించగానే నీ కుమారుడు చనిపోతాడు. [13]ఇశ్రాయేలంతా వాని కొరకు విలపించి, అతనిని సమాధి చేస్తారు. యరొబాము కుటుంబంలో నీ కుమారుడు ఒక్కడే సమాధి చేయబడతాడు. ఎందువల్లననగా యరొబాము కుటుంబంలో అతడొక్కడే ప్రభువైన ఇశ్రాయేలు దేవుని సంతోషపరిచాడు. [14]యెహోవా ఇశ్రాయేలుపై మరో కొత్త రాజును నియమిస్తాడు. ఆ కొత్త రాజు యరొబాము కుటుంబాన్ని నాశనం చేస్తాడు. ఇది శీఘ్రంగా జరుగుతుంది. [15]అప్పుడు యెహోవా ఇశ్రాయేలును శిక్షిస్తాడు. ఇశ్రాయేలు ప్రజలు నీటిలోని ఎత్తైన గడ్డి అల్లాడినట్లు తల్లడిల్లిపోతారు. ఇశ్రాయేలు ప్రజల్ని ఈ మంచి దేశం నుండి యెహోవా లాగివేస్తాడు. ఈ రాజ్యాన్ని వారి పూర్వీకులకు ఆయన ఇచ్చాడు. యూఫ్రటీసు నదికావల వీరు చెల్లాచెదరైపోయేలా చేస్తాడు. ఇది జరుగుతుంది. కారణమేమంటే యెహోవా ఆ ప్రజల పట్ల కోపంగా వున్నాడు. ప్రత్యేకమైన స్తంభాలు నిర్మించి అషేరాను ఆరాధించటం మొదలుపెట్టి ప్రజలాయనకు చాలా కోపం కలుగ జేశారు. [16]యరొబాము పాపం చేశాడు. అతడు పాపం చేసి ఇశ్రాయేలు ప్రజలు కూడ పాపం చేయటానికి కారకుడయ్యాడు. కావున ఇశ్రాయేలు ప్రజలు ఓడింపబడేలా యెహోవా చేస్తాడు."

[17]యరొబాము భార్య తిర్సాకు తిరిగి వెళ్లింది. ఆమె ఇంటికి వెళ్లగానే బాలుడు చనిపోయాడు. [18]ఇశ్రాయేలీయులంతా అతని కొరకై విలపించి, అతనిని సమాధి చేశారు. యెహోవా ఎలా జరుగుతుందని చెప్పాడో, అదే విధంగా ఇది జరిగింది. తన సేవకుడైన ప్రవక్త అహీయా ద్వారా ఈ విషయాలన్నీ చెప్పాడు.

[19]రాజైన యరొబాము అనేకమైన ఇతర పనులు చేశాడు. అతడు యుద్ధాలు చేశాడు. ప్రజాపాలన కొనసాగించాడు. అతడు చేసిన పనులన్నీ ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథంలో వివరించబడ్డాయి.

[20]యరొ బాము రాజుగా ఇరువది రెండు సంవత్సరాలు పరి పాలించాడు. తరువాత అతడు చనిపోగా, వానిని అతని పూర్వీకులతో సమాధి చేశారు. అతని కుమారుడు నాదాబు అతని స్థానంలో రాజైనాడు.

[21]యూదాకు రాజయ్యేనాటికి సొలొమోను కుమారుడు రెహబాము 41 సంవత్సరాలవాడు. యెరూషలేము నగరంలో రెహబాము పదిహేడు సంత్సరాలు పాలించాడు. ఈ నగరంలోనే యెహోవా తాను గౌరవింపబడాలని నిశ్చయించాడు. ఇశ్రాయేలు రాజ్యమంతటిలో ఈ నగరాన్నే ఆయన ఎన్నుకున్నాడు. రెహబాము తల్లి అమ్మోనీయురాలగు నయమా.

[22]యూదా ప్రజలు యెహోవా దృష్టిలో పాప కార్యాలు చేయటం కొనసాగించారు. వారంటే కోపగించుకొనేలా ప్రజలు యెహోవా పట్ల అనేక పాప కార్యాలు చేశారు. వారికి ముందు నివసించిన వారి పితరులకంటె ఘోరమైన పాపాలను వారు చేశారు.

[23]ఆ ప్రజలు ఉన్నత స్థలాలను,* స్మారకశిలను, పవిత్ర కొయ్యగుంజలను నిర్మించారు. వీటన్నిటినీ వారు కొండల మీద, పచ్చని చెట్ల కింద ఏర్పాటు

**ఉన్నత స్థలాలు** బూటకపు దేవుళ్లను పూజించటానికి ప్రజలు యివన్నీ నిర్మించేవారు.

చేశారు. 24దేవుని ఆరాధన పేరుతో నీచమైన లైంగిక
కార్యాలకు* అమ్ముడు పోయే పురుషులు కూడా
అక్కడ వున్నారు. యూదా వారు కూడా చాలా
చెడుకార్యలకు పాల్పడ్డారు. వారికి ముందు ఈ
రాజ్యంలో నివసించిన జనులు కూడా అదే రకపు
చెడుకార్యాలు చేశారు. అందుచే యెహోవా రాజ్యాన్ని
వారి నుండి తీసుకుని ఇశ్రాయేలు ప్రజలకు అప్ప
గించాడు. 25రెహబాము రాజ్యానికి వచ్చిన ఐదవ సంవ
త్సరంలో, ఈజిప్టు రాజైన షీషకు యెరూషలేము పైకి
దండెత్తి వచ్చాడు. 26షీషకు దేవాలయ ఖజానాను,
రాజభవనాన్ని కొల్లగొట్టాడు. అరాము రాజైన హదదె
జరు సైనికుల నుండి దావీదు తీసుకున్న బంగారు
డాళ్లను కూడా అతడు ఎత్తుకొనిపోయాడు. దావీదు
ఈ డాళ్లను యెరూషలేముకు తీసుకుని వచ్చాడు.
షీషకు బంగారు డాళ్లన్నీ పట్టుకు పోయాడు. 27అందు
వల్ల రాజైన రెహబాము వీటికి మారుగా చాలా డాళ్లను
చేయించాడు. అయితే ఈ డాళ్లన్నీ బంగారానికి బదులు
కంచుతో చేయబడ్డాయి. రాజభవన ద్వార పాలకులకు
అతనియొక్క డాళ్లను ఇచ్చాడు. 28రాజు యెహోవా
దేవాలయానికి వెళ్లినప్పుడల్లా తన అంగ రక్షకులు వెంట
వెళ్లేవారు. వారు డాళ్లను చేతబట్టుకొని వెళ్లేవారు. వారు
పని ముగించిన పిమ్మట వాటిని రక్షక భటుల గదిలో
గోడకు తగిలించేవారు.

29రాజైన రెహబాము చేసిన కార్యాలన్నీ యూదా
రాజుల చరిత్ర గ్రంధంలో పొందుపర్చబడ్డాయి. 30రెహ
బాము, యరొబాము ఇద్దరూ ఎప్పుడూ ఒకరితో ఒకరు
యుద్ధం చేస్తూ వుండేవారు.

31రెహబాము చనిపోగా అతను తన పూర్వీకులతో
దావీదు నగరంలో సమాధి చేయబడినాడు. (అతని
తల్లి అమ్మోనీయురాలగు నయమా) రెహబాము కుమా
రుడు అబీయాము అతని స్థానంలో రాజయ్యాడు.

### యూదాకు అబీయాము రాజగుట

15 నెబాతు కుమారుడు యరొబాము ఇశ్రాయే
లును పాలిస్తూ వుండెను. అతని పాలనలో
పదునెనిమిదో సంవత్సరం గడుస్తూ వుండగా, అబీ
యాము యూదాకు రాజు అయ్యాడు. 2అబీయాము
మూడు సంవత్సరాలు పాలించాడు. అతని తల్లి పేరు
మయకా. ఆమె అబీషాలోము కుమార్తె.

3పూర్వం తన తండ్రి చేసిన తప్పులన్నీ అతను
కూడా చేశాడు. తన తాత దావీదు తన ప్రభువైన
యెహోవాకు యథార్థుడై వున్నట్లు, అబీయాము
యెహోవాకు విశ్వాసపాత్రుడై వుండలేదు.
4యెహోవా దావీదును ప్రేమించాడు. అందువల్ల అబీ
యాముకు యెరూషలేములో ఒక రాజ్యాన్ని ఇచ్చాడు.
అతనికి ఒక కుమారుని కూడ కలుగజేశాడు.
యెహోవా ఇంకా యెరూషలేమును సురక్షితంగా
వుండేలా చేశాడు. ఇదంతా యెహోవా దావీదు కొరకు
చేశాడు. 5యెహోవా కోరిన ప్రకారం దావీదు అన్నీ
సవ్యమైన పనులు చేశాడు. యెహోవా ఆజ్ఞలను సదా
పాటించాడు. హిత్తీయుడైన ఊరియా పట్ల తను చేసిన
పాపం ఒక్కటి తప్ప, దావీదు యెహోవాకు సదా
విధేయుడైయున్నాడు. 6రెహబాము, యరొబాము
ఇద్దరూ ఒకరితో ఒకరు ఎల్లప్పుడు యుద్ధం చేస్తూనే
వున్నారు.* 7అబీయాము చేసిన ఇతరమైన పనులన్నీ
యూదా రాజుల చరిత్రలో రాయబడ్డాయి.

అబీయాము పరిపాలించే సమయంలో అబీ
యాముకు, యరొబాముకు యుద్ధం జరిగింది.

8అబీయాము చనిపోయినప్పుడు అతడు దావీదు
నగరంలో సమాధి చేయబడ్డాడు. అబీయాము కుమా
రుని పేరు ఆసా. అబీయాము స్థానంలో ఆసా
రాజయ్యాడు.

### యూదా రాజుగా ఆసా

9యరొబాము పాలన మొదలై ఇరువదియవ సంవ
త్సరం జరుగుతూండగా, ఆసా రాజ్యానికి వచ్చాడు.
10ఆసా యెరూషలేములో నలుబది యొక్క సంవత్స
రాలు పాలించాడు. అతని తల్లి పేరు మయకా. మయకా
అబ్షాలోము కుమార్తె.

11ఆసా తన పూర్వీకుడైన దావీదువలె యెహోవా
దృష్టిలో యథార్థమైన వాటిని చేసాడు. 12ఆ రోజులలో
కూడా లైంగిక వాంఛలకై తమ శరీరాలను ఆరాధనా
స్థలాలలో అమ్ముకుని చిల్లర దేవుళ్లను పూజించే పురు
షులున్నారు. అటువంటి పురుషగాములను ఆసా దేశం
నుండి వెడలగొట్టాడు. మరియు ఆసా తన పూర్వీకులు
తయారు చేసిన విగ్రహాలన్నిటినీ తీసి వేశాడు. 13తన
తల్లి మయకాను రాణి పదవి నుంచి ఆసా తొలగించాడు.
కారణ మేమంటే మయకా ఒక హేయమైన అషేరా
దేవతా విగ్రహాన్ని తయారు చేయించింది. ఈ భయం
కర విగ్రహాన్ని ముక్కలు చేసి ఆసా వాటిని కిద్రోను
లోయలో తగులబెట్టాడు. 14కాని ఆసా ఉన్నత
స్థలాలను నాశనం చేయలేదు. తన జీవిత కాలమంతా
ఆసా యెహోవాకు విశ్వాస పాత్రుడుగా ఉన్నాడు.
15ఆసా తండ్రి కొన్ని వస్తువులను యెహోవాకు
సమర్పించాడు. ఆసా కూడ కొన్ని కానుకలను
యెహోవాకు సమర్పించాడు. వారు బంగారం, వెండి,
తదితర వస్తు సామగ్రిని కానుకలుగా సమర్పించారు.
అవన్నీ ఆసా దేవాలయంలో వుంచాడు.

---

**దేవుని ... కార్యాలకు** ఈ రకమైన పురుష వ్యభిచారం కనానీయుల దేవతారాధనలలో భాగంగా వుండేది.

**రెహబాము ... వున్నారు** ఈ వచనం ప్రాచీన గ్రీకు అనువాదంలో లేదు.

16యూదా రాజుగా ఆసా కొనసాగినంత కాలం,
ఇశ్రాయేలు రాజైన బయెషాతో యుద్ధాలు కొనసాగిం
చాడు. 17బయెషా యూదా వారితో యుద్ధం చేశాడు.
ఆసా రాజ్యమైన యూదాకు ప్రజల రాకపోకలను నిలిపి
వేయమని బయెషా సంకల్పించాడు. అందువల్ల రామా
నగరాన్ని అతడు చాలా పటిష్ఠపర్చినాడు. 18దేవాలయం
ఖజానా నుండి, రాజభవనం నుండి ఆసా వెండి,
బంగారాలను తీశాడు. అతని సేవకులకు వాటినిచ్చి
అరాము రాజైన బెన్హదదుకు పంపాడు. (బెన్హదదు
తండ్రి పేరు టబ్రిమ్మోను, టబ్రిమ్మోను తండ్రి పేరు
హెజ్యోను) అతడు దమస్కు నగరంలో వుంటున్నాడు.
19అతనికి ఆసా ఇలా వర్తమానం పంపాడు, "నా తండ్రికి,
నీ తండ్రికి మధ్య ఒక శాంతి ఒడంబడిక జరిగింది.
ఇప్పుడు నీతో నేను కూడ శాంతి ఒడంబడిక నొకదానిని
చేసుకోదలిచాను. నీకు వెండి బంగారాలు కానుకలుగా
పంపుతున్నాను. ఇశ్రాయేలు రాజైన బయెషాతో
నీకున్న ఒప్పందాన్ని రద్దు చేసుకోవలసిందిగా కోరు
తున్నాను. అప్పుడు బయెషా నా రాజ్యం వదిలి
పోతాడు."
20రాజైన బెన్హదదు ఆసా రాజు కోరిన దానికి ఒప్పు
కున్నాడు. కావున ఇశ్రాయేలు పట్టణాలమీదికి తన
సైన్యాలను పంపాడు. ఈయోను, దాను, ఆబేల్బేత్మ
యకా, కిన్నెరెతు పట్టణాలను ఓడించాడు. కిన్నెరెతు,
నఫ్తాలీలను అతడు పూర్తిగా ఓడించాడు. 21ఈ
దండయాత్రలను గురించి బయెషా విన్నాడు. దానితో
అతడు రామా నగరాన్ని కట్టు దిట్టం చేయటం
మానివేశాడు. అతడు రామా నగరాన్ని వదిలి తిర్సాకు
తిరిగి వెళ్లాడు. 22అప్పుడు రాజైన ఆసా యూదా
ప్రజలందరి సహకారాన్ని కోరుతూ ఒక అభ్యర్థన
చేశాడు. వారంతా బయెషా రామా నగరాన్ని పటిష్ఠం
చేయటానికి వినియోగిస్తున్న రాళ్లను, కలపను తీసుకొ
నిపోయారు. వాటిని బెన్యామీనీయుల నగరమైన
గెబకు, మరియు మిస్పాకు చేరవేశారు. రాజైన ఆసా
ఆ రెండు నగరాలను పటిష్టంగా పునర్నిర్మించాడు.
23ఆసా చేసిన ఇతరమైన అన్ని పనులు, అతని
బలం, అతను నిర్మించిన నగరాల విషయం యూదా
రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి. ఆసా ముస
లివాడైనప్పుడు, అతని పాదాలలో జబ్బు ఏర్పడింది.
24ఆసా చనిపోయినప్పుడు, అతని పూర్వీకుడైన
దావీదు నగరంలో సమాధి చేయబడ్డాడు. తరువాత
ఆసా కుమారుడు యెహోషాపాతు అతని స్థానంలో
రాజు అయ్యాడు.

## ఇశ్రాయేలు రాజుగా నాదాబు

25యూదాకు రాజైన ఆసా పాలన రెండవ సంవ
త్సరం గడుస్తూ వుండగా యరొబాము కుమారుడు
నాదాబు ఇశ్రాయేలుకు రాజయ్యాడు. నాదాబు ఇశ్రా
యేలును రెండు సంవత్సరాలు పాలించాడు.
26యెహోవా దృష్టిలో అతను చాలా తప్పులు చేశాడు.
తన తండ్రి యరొబాము చేసిన తప్పులన్నీ ఇతడూ
చేశాడు. యరొబాము ఇశ్రాయేలు ప్రజలు కూడ పాపం
చేయటానికి కారకుడయ్యాడు.
27బయెషా అహీయా కుమారుడు. వారు ఇశ్శాఖారు
వంశస్థులు. రాజైన నాదాబును చంపి వేయటానికి
బయెషా పథకం వేశాడు. అది నాదాబు, ఇశ్రాయేలు
వారంతా కలిసి గిబ్బెతోను నగరంపై దాడి జరుపుతున్న
సమయం. గిబ్బెతోను ఫిలిష్తీయుల నగరం. అక్కడ
నాదాబును బయెషా హత్య చేశాడు. 28యూదాపై
ఆసా పాలన మూడవ సంవత్సరం జరుగుతుండగా
ఇది జరిగింది. ఇశ్రాయేలుకు తరువాత బయెషా రాజు
అయ్యాడు.

## ఇశ్రాయేలు రాజుగా బయెషా

29బయెషా రాజైన పిమ్మట అతడు యరొబాము
కుటుంబాన్ని హతమార్చాడు. యరొబాము కుటుం
బంలో ఒక్కడిని కూడా బయెషా ప్రాణంతో వదల
లేదు. యెహోవా ఎలా జరుగుతుందని సెలవిచ్చాడో,
అదే రీతిలో ఇదంతా జరిగింది. షిలోహులో తన సేవకు
డైన అహీయా ద్వారా యెహోవా ఇది పలికాడు.
30ఇదంతా ఎందుకు జరిగినదనగా రాజైన యరొబాము
చాలా పాపకార్యాలు చేశాడు. అంతే కాకుండా, ఇశ్రా
యేలు ప్రజలు కూడా పాపకార్యాలు చేయటానికి
యరొబాము కారకుడయ్యాడు. హేయమైన తన పను
లతో యరొబాము ఇశ్రాయేలు దేవుడైన యెహో
వాకు మిక్కిలి కోపం కల్గించాడు.
31నాదాబు చేసిన ఇతర కార్యాలన్నీ ఇశ్రాయేలు
రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి. 32బయెషా
ఇశ్రాయేలును యేలినంత కాలం యూదా రాజైన
ఆసాతో యుద్ధాలు చేస్తూనేవున్నాడు.
33ఆసా యూదా రాజ్యాన్ని మూడవ సంవత్సరం
పాలిస్తూండగా, అహీయా కుమారుడైన బయెషా ఇశ్రా
యేలుకు రాజయ్యాడు. బయెషా ఇరువది నాలుగు
సంవత్సరాలు తిర్సాలో పరిపాలించాడు. 34కాని బయెషా
యెహోవాకు వ్యతిరేకంగా అనేక దుష్టకార్యాలు చేశాడు.
యరొబాము చేసిన పాపాలే ఇతడు కూడ చేశాడు.
ఇశ్రాయేలు ప్రజలు కూడా పాపం చేయటానికి
యరొబాము కారకుడయ్యాడు.

## బయెషా మరణం

16 తరువాత యెహోవా హనానీ కుమారుడైన
యెహూతో మాట్లాడాడు. యెహోవా రాజైన
బయెషాకు వ్యతిరేకంగా మాట్లాడాడు.
2"నిన్నొక ముఖ్యమైన వ్యక్తిగా నేను చేశాను. ఇశ్రా
యేలీయులైన నా ప్రజలపై నిన్ను యువరాజుగా

చేశాను. నీవు కూడా యరొబాము మార్గాన్నే అను
సరించావు. నా ప్రజలైన ఇశ్రాయేలీయులు తప్పు
దారి పట్టేలా చేశావు. వారి పాపకార్యాలతో వారు నాకు
కోపం కలుగజేశారు. 3కావున ఓ బయెషా, నిన్ను నీ
కుటుంబాన్ని నేను నాశనం చేస్తాను. నెబాతు కుమారు
డైన యరొబాము కుటుంబానికి చేసినదంతా నీ
కుటుంబానికి కూడా చేస్తాను. 4నీ కుటుంబం వారు
నగర వీధుల్లో పడి చనిపోతారు. వారి శవాలను కుక్కలు
తింటాయి. నీ సంతతిలో కొందరు పొలాల్లో చని
పోతారు. వారి శవాలను పక్షులు తిని పోతాయి."
5బయెషా చేసిన ఇతర విషయాలన్నిటిని గురించి,
అతని సైనిక బలం గురించి ఇశ్రాయేలు రాజుల చరిత్ర
గ్రంథంలో వ్రాయబడింది. 6బయెషా చనిపోయి
నప్పుడు అతనిని తిర్సాలో సమాధి చేశారు. అతని
కుమారుడు ఏలా అతని స్థానంలో రాజు అయ్యాడు.
7కావున ప్రవక్తయగు యెహూకు యెహోవా ఒక
వర్తమానం అందించాడు. ఆ వర్తమానం బయెషాకు,
అతని కుటుంబానికి వ్యతిరేకంగా వుంది. యెహోవా
దృష్టిలో నీచమైన కార్యాలనేకం బయెషా చేశాడు. ఇది
యెహోవాకు కోపకారణమయ్యింది. అతనికి ముందు
యరొబాము సంతతి వారు చేసిన పనులే బయెషా
కూడ చేశాడు. బయెషా యరొబాము కుటుంబం
వారినందరినీ చంపివేసినందుకు కూడా యెహోవా
కోపంగా వున్నాడు.

## ఇశ్రాయేలు రాజుగా ఏలా

8యూదా రాజుగా ఆసా పాలన ఇరువది ఆరవ
సంవత్సరం గడుస్తూ వుండగా ఏలా ఇశ్రాయేలుకు రాజు
అయ్యాడు. ఏలా అనువాడు బయెషా కుమారుడు.
అతడు తిర్సాలో రెండేండ్లు పరిపాలించాడు.
9రాజైన ఏలా కింది అధికారులలో జిమ్రీ ఒకడు.
ఏలా యొక్క రథబలంలో సగానికి జిమ్రీ అధిపతి.
కాని ఏలాకు వ్యతిరేకంగా జిమ్రీ కుట్ర పన్నాడు.
రాజైన ఏలా తిర్సాలో ఉన్నాడు. అతడు అర్సా
ఇంటిలో బాగా మద్యపానం చేసి మత్తుగా ఉన్నాడు.
తిర్సాలో వున్న రాజభవన నిర్వాహకుడు అర్సా. 10జిమ్రీ
ఆ ఇంటిలో ప్రవేశించి రాజైన ఏలాను చంపేశాడు.
ఆసా పాలన యూదాలో ఇరువది ఏడవ సంవత్సరం
జరుగుతూ వుండగా ఇది జరిగింది. తరువాత ఏలా
స్థానంలో జిమ్రీ ఇశ్రాయేలుకు రాజు అయ్యాడు.

## ఇశ్రాయేలు రాజుగా జిమ్రీ

11జిమ్రీ రాజుగా సింహాసనాన్ని అధిష్ఠించగానే,
అతడు బయెషా కుటుంబం వారినందరినీ సంహరిం
చాడు. బయెషా వంశంలోని మగవారినెవ్వరినీ అతడు
ప్రాణాలతో వదలలేదు. బయెషా స్నేహితులను కూడ
జిమ్రీ చంపేశాడు. 12జిమ్రీ ఆ విధంగా బయెషాయొక్క
వంశనాశనం గావించాడు. ప్రవక్తయైన యెహూ ద్వారా
బయెషాకు వ్యతిరేకంగా ఏమి జరుగుతుందని
యెహోవా పలికాడో ఆ రీతిగా ఇది జరిగింది.
13బయెషా, అతని కుమారుడు ఏలా చేసిన పాపాల
ఫలితంగా ఇది జరిగింది. వారు పాపం చేయటమే
కాకుండా, ఇశ్రాయేలీయులు పాపం చేయటానికి
కూడా వారు కారకులయ్యారు. వారు విగ్రహాలను
చేయటానికి పాల్పడినందుకు కూడా యెహోవా కోప
గించాడు.
14ఏలా చేసిన ఇతర కార్యాలన్నీ ఇశ్రాయేలు రాజుల
చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి.
15ఆసా పాలన యూదాలో ఇరువది ఏడవ సంవ
త్సరం జరుగుతూ వుండగా, జిమ్రీ ఇశ్రాయేలుకు రాజ
య్యాడు. జిమ్రి తిర్సాలో ఏడు రోజులు పాలించాడు.
అసలు జరిగిన విషయమేమనగా:
ఫిలిష్తీయుల నగరమైన గిబ్బెతోను వద్ద ఇశ్రాయేలు
సైన్యం దిగియుండెను. 16రాజుకు వ్యతిరేకంగా జిమ్రి
కుట్ర పన్నుతున్నాడని సైనికులు విన్నారు. అతడు
రాజును చంపివేశాడని కూడ విన్నారు. అదే రోజున
ఇశ్రాయేలీయులు ఒమ్రీని రాజుగా అదే శిబిరంలోనే
ప్రకటించారు. ఒమ్రీ సైన్యాధ్యక్షుడు. 17తరువాత
ఒమ్రీ, ఇశ్రాయేలు సైన్యం గిబ్బెతోనును వదిలి తిర్సా
పైకి దండెత్తి వెళ్లారు. 18నగరాన్ని ముట్టడించి పట్టుకు
న్నారని జిమ్రీ తెలుసుకున్నాడు. అతడు రాజభవనం
లోకి వెళ్లి దానికి నిప్పుపెట్టాడు. అతడు భవనంతో
పాటు కాలిపోయాడు. 19జిమ్రీ పాపం చేయబట్టి
అతడు నాశనమయ్యాడు. అతడు పాపం చేశాడు.
యెహోవా దృష్టిలో అనేక చెడు కార్యాలు చేశాడు.
యరొబాము మాదిరిగానే అతను కూడా పాపం చేశాడు.
యరొబాము ఇశ్రాయేలు ప్రజలు కూడా పాపం చేయ
టానికి కారకుడయ్యాడు.
20జిమ్రీ పన్నిన కుట్ర విషయం, అతను చేసిన
తదితర కార్యాలు ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథంలో
వ్రాయబడ్డాయి. జిమ్రీ రాజైన ఏలీకి వ్యతిరేకంగా తిరిగి
నప్పుడు జరిగిన సంఘటనలు కూడ ఆ గ్రంథంలో
పొందు పర్చబడ్డాయి.

## ఇశ్రాయేలు రాజుగా ఒమ్రీ

21ఇశ్రాయేలు ప్రజలు రెండు వర్గాలుగా విడి
పోయారు. ఒక వర్గం గీనతు కుమారుడైన తిబ్నీని
బలపర్చి, అతనిని రాజుగా చేయ సంకల్పించింది.
రెండవ వర్గం ఒమ్రీని అనుసరించింది. 22ఒమ్రీ అనుచ
రులు గీనతు కుమారుడైన తిబ్నీ వర్గం వారికంటె
బలంగా వున్నారు. అందువల్ల తిబ్నీ చంపబడ్డాడు.
ఒమ్రీ రాజయ్యాడు.
23ఆసా పాలన యూదాలో ముప్పదియొకటో
సంవత్సరం జరుగుతూ వుండగా, ఒమ్రీ ఇశ్రాయేలుకు

రాజయ్యాడు. ఒమ్రీ ఇశ్రాయేలును పన్నెండు సంవత్స
రాలు పాలించాడు. అందులో ఆరు సంవత్సరాలు
తిర్సాలో వుండి ఏలాడు. 24కాని ఒమ్రీ షోమ్రోను
కొండను కొన్నాడు. దానిని షెమెరు అను వానియొద్ద
నాలుగు మణుగుల* వెండి నిచ్చి కొన్నాడు. ఆ కొండ
మీద ఒమ్రీ ఒక నగరాన్ని కట్టాడు. ఆ కొండ యజమాని
యైన షెమెరు జ్ఞాపకార్థం ఆ నగరానికి షోమ్రోను*
అని పేరు పెట్టాడు.

25కాని ఒమ్రీ యెహోవా దృష్టిలో అనేక దుష్ట
కార్యాలు చేశాడు. తనకు ముందు యేలిన రాజులందరి
కంటె అతడు ఎక్కువ పాపం చేశాడు. 26అతడు నెబాతు
కుమారుడైన యరొబాము చేసిన తప్పులన్నీ చేశాడు.
ఇశ్రాయేలీయులు పాపకార్యాలు చేయటానికి యరొ
బాము కారకుడయ్యాడు. కావున వారంతా ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవాకు మిక్కిలి కోపం
కలుగజేశారు. యెహోవాకు కోపం రావటానికి కారణ
మేమనగా వారు పనికిమాలిన విగ్రహారాధన చేశారు.

27ఒమ్రీ చేసిన ఇతర కార్యాలు, తన సైనికబలం
మొదలగు విషయాలన్నీ ఇశ్రాయేలు రాజుల చరిత్ర
గ్రంథంలో వ్రాయబడ్డాయి. 28ఒమ్రీ చనిపోయాడు.
అతనిని షోమ్రోనులో సమాధి చేశారు. అతని కుమా
రుడు అహాబు అతని స్థానంలో రాజు అయ్యాడు.

### ఇశ్రాయేలు రాజుగా అహాబు

29యూదాలో ఆసా పాలన ముప్పై ఎనిమిదవ
సంవత్సరం జరుగుతూండగా ఒమ్రీ కుమారుడైన
అహాబు ఇశ్రాయేలుకు రాజైనాడు. షోమ్రోను నుండి
ఇరువది రెండు సంవత్సరాల పాటు ఇశ్రాయేలును
పాలించాడు. 30ఆహాబు యెహోవా చేయవద్దన్న
కార్యాలను చేశాడు. తనకు ముందు పాలించిన వారంద
రికంటె అహాబు ఎక్కువ చెడుకార్యాలు చేశాడు.
31నెబాతు కుమారుడైన యరొబాము చేసిన పాప
క్రియలు అహాబుకు చాలా సామాన్యమైనవిగా కన్పిం
చాయి. ఆ తప్పులు చాలవన్నట్లు అతడు ఎత్బయలు
కుమార్తెయగు యెజెబెలును వివాహం చేసుకున్నాడు.
ఎత్బయలు సీదోనుకు రాజు. దానితో అహాబు
బయలు దేవతను* కొలవటం మొదలు పెట్టాడు.
అహాబు అతనిని ఆరాధించాడు. 32షోమ్రోనులో
బయలు ఆరాధనకు ఒక ఆలయాన్ని కట్టించాడు. ఆ
ఆలయంలో ఒక బలిపీఠం ఏర్పాటు చేశాడు. 33అషేరా
దేవతను ఆరాధించటానికి అహాబు ఒక ప్రత్యేక
స్తంభాన్ని నిర్మించాడు. తనకు ముందు యేలిన రాజు
లందరి కంటె అహాబు ఎక్కువ పాపం చేసి ఇశ్రాయేలు
దేవుడైన యెహోవాకు మిక్కిలి కోపాన్ని కలుగ
జేశాడు.

34అహాబు రాజ్యం చేసే కాలంలో బేతేలు వాడైన
హీయేలు యెరికో పట్టణాన్ని పునర్నిర్మించాడు.
హీయేలు నగర నిర్మాణపు పనిని మొదలు పెట్టగానే,
అతని పెద్ద కుమారుడగు అబీరాము చనిపోయాడు.
హీయేలు నగర ద్వారాలు నిర్మించేటప్పుడు అతని
చిన్న కుమారుడగు సెగూబు చనిపోయాడు. నూను
కుమారుడైన యెహోషువ ద్వారా ఏది ఎలా జరుగు
తుందని యెహోవా చెప్పాడో ఇదంతా ఆ విధంగా
జరిగింది.*

### ఏలీయా మరియు వర్షాభావ పరిస్థితి

17 ప్రవక్తయైన ఏలీయా గిలాదులోని తిష్బీ
నగరానికి చెందినవాడు. ఏలీయా వచ్చి రాజైన
అహాబుతో ఇలా అన్నాడు: "ఇశ్రాయేలు దేవుడైన
యెహోవాను నేను సేవిస్తాను. ఆయన శక్తితో నేను
నిశ్చయంగా చెప్పేదేమనగా రాబోవు కొద్ది సంవత్స
రాలలో మంచుగాని, వర్షంగాని కురియదు. నేను ఆజ్ఞ
ఇస్తేగాని వర్షం పడదు."

2తరువాత యెహోవా ఏలీయాతో, 3"నీవు ఈ
ప్రదేశాన్ని వదిలి తూర్పుదిశగా వెళ్లి, కెరీతు వాగువద్ద
దాగి వుండు. ఆ వాగు యోర్దాను నదికి తూర్పున
ఉన్నది. 4నీవు ఆ వాగు నీటిని తాగవచ్చు. నీకు ఆహా
రాన్ని అక్కడికి చేరవేయమని నేను కాకోలములకు*
ఆజ్ఞ ఇచ్చాను" అని అన్నాడు. 5కావున యెహోవా
చెప్పిన విధంగా ఏలీయా చేశాడు. యోర్దాను నదికి
తూర్పున వున్న కెరీతువాగు దగ్గర నివసించటానికి
అతడు వెళ్లాడు. 6బొంత కాకులు ప్రతి ఉదయం
రొట్టెను, ప్రతి సాయంత్రం మాంసాన్ని తెచ్చి ఇచ్చేవి.
ఏలీయా వాగు నీటిని తాగేవాడు.

7వర్షాలు పడక పోవటంతో, కొంత కాలానికి వాగు
ఎండిపోయింది. 8అప్పుడు యెహోవా ఏలీయాతో
ఇలా అన్నాడు:

9"సీదోనులోని సారెపతు అను పట్టణానికి వెళ్లి,
అక్కడ నివసించు. ఆ ప్రదేశంలో ఒక విధవరాలు

---

**నాలుగు మణుగులు** ఆంగ్ల తులామానం ప్రకారం నూట ఏబది పౌనులు. రెండు తలాంతులని పాఠాంతరం.

**షోమ్రోను** సమరియ అని పాఠాంతరం.

**బయలు దేవత** బయలు సీదోనీయుల ప్రధాన దేవత అతను భక్తులకు బహు సంతానాన్ని ప్రసాదిస్తాడని, పంటలు బాగా పండేలా చేస్తాడని ప్రజల విశ్వాసం.

**నూను ... జరిగింది** యెహోషువ యెరికో పట్టణాన్ని నాశనం చేసినప్పుడు, ఈ పట్టణాన్ని ఎవరైతే తిరిగి నిర్మించ పూనుకుంటారో అతని పెద్ద కుమారుడు, చిన్న కుమారుడు చనిపోతారని చెప్పాడు. (చూడండి యెహోషువా గ్రంథం 6:26).

**కాకోలములు** పెద్ద జాతికాకులు. వీటినే బొంత కాకులు అని కూడ అంటారు.

నివసిస్తూవుంది. నీకు ఆహారం ఇవ్వమని ఆమెను ఆదే
శించాను."
10కావున ఏలీయా సారెపతు అను పట్టణానికి
వెళ్లాడు. అతడు నగర ద్వారం వద్దకు వెళ్లే సరికి
అతనక్కడ ఒక విధవ స్త్రీని చూశాడు. ఆమె వంటకై
పుల్లలు ఏరుకొంటూ వుంది. ఏలీయా ఆమెను, "నాకు
తాగటానికి ఒక చెంబుతో నీరు తెచ్చి పెడతావా?"
అని అడిగాడు. 11అతనికి నీరు తేవటానికి ఆమె వెళ్తూం
డగా, "నాకో రొట్టె ముక్క కూడా దయచేసి తీసుకుని
రా" అని ఏలీయా అన్నాడు.
12"నీ దేవుడైన యెహోవా సాక్షిగా నేను చెప్తు
న్నాను. నా వద్ద రొట్టె లేదు. ఒక జాడీలో కొద్ది
పిండి మాత్రం వుంది. కూజాలో కొంచెం ఒలీవ నూనె
వుంది. నిప్పు రాజేయటానికి రెండు పుల్లలు ఏరు
కోడానికి నేనిక్కడికి వచ్చాను. నేనవి తీసుకొని వెళ్లి
మా ఆఖరి వంట చేసుకోవాలి. నేను, నా కుమారుడు
అది తిని, తరువాత ఆకలితో మాడి చనిపోతాము"
అని ఆ స్త్రీ అన్నది.
13ఏలీయా ఆమెతో ఇలా అన్నాడు: "ఏమీ బాధ
పడకు. నీవు చెప్పిన రీతిలో నీవు ఇంటికి వెళ్లి వంట
చేసుకో. కాని నీ వద్దవున్న పిండిలో నుంచి ఒక
చిన్న రొట్టె ముందుగా చేసి, దానిని నాకు తెచ్చి
పెట్టు. తర్వాత నీ కొరకు, నీ బిడ్డ కొరకు వంట
చేసుకో. 14ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
ఇలా అన్నాడు: 'ఆ పిండి జాడీ ఎప్పుడూ ఖాళీ కాదు.
ఆ కూజాలో నూనె ఎప్పుడూ తరిగిపోదు. ఈ రాజ్యం
మీద యెహోవా వర్షం కురిపించే వరకు ఇది కొన
సాగుతుంది.' "
15అందువల్ల ఆ స్త్రీ ఇంటికి వెళ్లింది. ఏలీయా
ఆమెకు ఏమి చేయమని చెప్పాడో అదంతా చేసింది.
ఏలీయా, ఆ స్త్రీ, ఆ కుమారుడు చాలా దినముల
వరకు సరిపడు ఆహారం కలిగియున్నారు. 16పిండి
జాడీ, నూనె కూజా ఎన్నడూ ఖాళీ కాలేదు. యెహోవా
ఎలా జరుగుతుందని చెప్పాడో, అంతా అలానే జరి
గింది. ఈ విషయాలన్నీ యెహోవా ఏలీయా ద్వారా
చెప్పాడు.
17కొంత కాలం తరువాత ఆ విధవ స్త్రీ కుమారునికి
జబ్బు చేసింది. జబ్బు రోజురోజుకు తీవ్రమయ్యింది.
చివరిగా అతని శ్వాస ఆగిపోయింది. 18ఆమె ఏలీయా
వద్దకు వచ్చి, "నీవు దైవజనుడవు కదా! నీవు నా
బిడ్డకు సహాయం చేయగలవా? లేక కేవలం నేను
చేసిన తప్పులన్నిటినీ నాకు జ్ఞాపకం చేయటానికే
నీవు ఇక్కడికి వచ్చావా? నా కుమారుడు చనిపోయేలా
చేయటానికే నీవు వచ్చావా?" అని అడిగింది.
19"నీవు నీ కుమారుని నాకు ఇవ్వు" అని ఏలీయా
ఆమెతో అన్నాడు. ఏలీయా ఆమె వద్ద నుండి బిడ్డను
తీసుకుని పై అంతస్తుకు వెళ్లాడు. తను ఉంటున్న
గదిలో పక్కమీద బాలుని పడుకోబెట్టాడు. 20తరువాత
ఏలీయా ఇలా ప్రార్థన చేశాడు: "ఓ నా ప్రభువైన
దేవా! ఈ విధవరాలు తన ఇంటిలో నాకు ఆశ్రయ
మిచ్చింది. అటువంటి స్త్రీకి ఇటువంటి ఆపద నీవు
కలుగజేస్తావా? ఆమె కుమారుడు చనిపోయేలా
చేస్తావా?" 21పిమ్మట ఏలీయా ఆ బాలుని మీద మూడు
సార్లు పడి, "ఓ నా ప్రభువైన దేవా! ఈ బాలుడు
మరల జీవించేలా చేయు" మని ప్రార్థించాడు.
22యెహోవా ఏలీయా ప్రార్థన ఆలకించాడు.
బాలుడు శ్వాసపీల్చటం ప్రారంభించాడు. వాడు బతి
కాడు. 23ఏలీయా బాలుని కిందికి తీసుకుని వచ్చాడు.
బాలుని అతని తల్లికి ఇస్తూ, "చూడు! నీ కుమారుడు
బతికాడు" అని ఏలీయా అన్నాడు.
24"నీవు నిజంగా దైవజనుడవేనని నేను ఇప్పుడు
విశ్వసిస్తున్నాను. నిజంగా యెహోవా నీద్వారా మాట్లా
డుతున్నాడని నేను తెలుసుకున్నాను" అని ఆ స్త్రీ
అన్నది.

### ఏలీయా మరియు బయలు ప్రవక్తలు

18 వర్షాలు లేకుండా పోయి మూడు సంవత్సరాల
య్యింది. అప్పుడు యెహోవా ఏలీయాతో,
"నీవు వెళ్లి రాజైన అహాబును కలుసుకో. నేను త్వరలో
వర్షం కురిసేలా చేస్తాను" అని చెప్పాడు. 2కావున
ఏలీయా అహాబును కలిసేటందుకు వెళ్లాడు.
అప్పుడు షోమ్రోనులో క్షామం నెలకొన్నది.
3రాజైన అహాబు ఓబద్యాను పిలిపించాడు. ఓబద్యా
రాజభవన నిర్వాహకుడుగా పని చేస్తున్నాడు. (ఓబద్యా
యెహోవాకు నిజమైన అనుచరుడు) 4ఒకసారి యెజె
బెలు యెహోవా ప్రవక్తలందరినీ చంపటం మొదలు
పెట్టింది. అప్పుడు ఓబద్యా నూరుమంది ప్రవక్తలను
చేరదీసి, వారిని రెండు గుహలలో దాచాడు. ఓబద్యా
ఏబది మందిని ఒక గుహలోను, మరో ఏబది మందిని
ఒక గుహలోను దాచాడు. ఓబద్యా వారికి ఆహార పానీ
యాలు ఇచ్చి కాపాడాడు.) 5రాజైన అహాబు ఓబ
ద్యాతో ఇలా అన్నాడు: "నాతో కలిసిరా. మనిద్దరం
దేశంలో వున్న నీటి వనరులన్నీ పరిశీలిద్దాము. మన
గుర్రాలు, కంచర గాడిదలు బతకటానికి తగిన పచ్చగడ్డి
దొరుకుతుందేమో చూద్దాం. అప్పుడు మన పశువు
లను చంపే అవసరము వుండదు." 6నీటి వనరులు
వెదకటానికి ఎవరేదిశకు వెళ్లాలో వారు నిర్ణయించు
కున్నారు. వారిద్దరూ దేశమంతా తిరగనారంభించారు.
అహాబు ఒక దిశలో వెళ్లాడు. ఓబద్యా మరోదిశలో
వెళ్లాడు. 7ఓబద్యా ప్రయాణం చేస్తూండగా అతడు
ఏలీయాను కలిశాడు. ఏలీయాను చూడగానే, అతనె
వరో ఓబద్యా తెలుసుకున్నాడు. ఓబద్యా ఏలీయాకు
సాష్టాంగ నమస్కారం చేసి, "నీవు నా యజమానివైన
ఏలీయావే గదా?" అని అడిగాడు.

8“అవును నేనే. నీవు వెళ్లి నేనిక్కడ వున్నానని నీ
యజమాని రాజుకు తెలియజేయి” అని ఏలీయా
సమాధానం చెప్పాడు.
9అందుకు ఓబద్యా ఇలా అన్నాడు: “నేను అహా
బుతో నీవెక్కడ వున్నదీ నాకు తెలుసునని చెప్పితే
అతడు నన్ను చంపుతాడు! నీ పట్ల నేనేమీ అపచారం
చేయలేదు! నేను చనిపోవాలని నీవెందుకు కోరు
కుంటున్నావు? 10నీ దేవుడైన యెహోవా సాక్షిగా
చెప్తున్నాను. రాజు నీ కొరకై ప్రతి చోటా చూస్తున్నా
డు! నిన్ను వెదకమని తన మనుష్యులను అన్ని దేశాలకు
పంపాడు. ఏ పాలకుడైనా తన దేశంలో నీవు లేవని
చెపితే అహాబు అంతటితో ఆగక నీవతని రాజ్యంలో
లేవని ప్రమాణం చేయమని బలవంతపెట్టు తున్నాడు.
11ఈ పరిస్థితుల్లో నేను వెళ్లి నీవిక్కడ వున్నావని
చెప్పమంటున్నావా? 12ఒకవేళ నేను పోయి రాజైన
అహాబుతో నీవిక్కడ వున్నావని చెపితే, ఈ లోపు
యెహోవా నిన్ను ఇక్కడ నుంచి మరో చోటికి
తీసుకుని పోవచ్చు. రాజైన అహాబు వచ్చి నీవిక్కడ
లేకపోవటం చూచి, నన్ను చంపేస్తాడు! నేను నా
బాల్యం నుండి యెహోవాను ఆశ్రయించియున్నాను.
13నేను ఏమి చేశానో నీవు వినే వుంటావు! యెజెబెలు
యెహోవా యొక్క ప్రవక్తలందరినీ చంపుతూండగా,
నేను వంద మంది ప్రవక్తలను గుహలలో దాచాను.
ఏభై మంది ప్రవక్తలను ఒక గుహలోను, మరో ఏభై
మందిని వేరొక గుహలోను దాచాను. వారికి అన్న
పానాదులిచ్చి ఆదుకున్నాను. 14ఇప్పుడు నన్ను వెళ్లి
నీవిక్కడ వున్నట్లు రాజుతో చెప్పమంటున్నావు. రాజు
నన్ను చంపేస్తాడు!”
15అది విన్న ఏలీయా, “సర్వశక్తిమంతుడైన
యెహోవా సాక్షిగా ఈ రోజు నేను రాజు ముందు
నిలుస్తానని ప్రమాణం చేస్తున్నాను” అని అన్నాడు.
16అందువల్ల ఓబద్యా రాజైన అహాబు వద్దకు
వెళ్లాడు. ఏలీయా ఎక్కడ వున్నదీ అతనికి చెప్పాడు.
రాజైన అహాబు ఏలీయాను చూడటానికి వెళ్లాడు.
17ఏలీయాను అహాబు చూచి, “నీవేనా? ఇశ్రాయే
లులో కల్లోలం సృష్టించే వాడివి నీవే కదా!” అని
అన్నాడు.
18ఏలీయా ఇలా అన్నాడు, “నేను ఇశ్రాయేలులో
కల్లోలం సృష్టించటం లేదు. కష్టాలన్నీ నీ మూలంగా,
నీ తండ్రి కుటుంబం వారివల్ల వచ్చినవే. యెహోవా
ఆజ్ఞలను తిరస్కరిస్తూ, బూటకపు దేవుళ్లను పూజిస్తూ,
నీవే ఈ కష్టాలన్నిటికీ కారకుడవయ్యావు. 19ఇశ్రాయేలీ
యులందరినీ ఇప్పుడు కర్మెలు పర్వతం వద్ద నన్ను
కలవమని సమాచారం పంపు. పైగా నాలుగు వందల
ఏభై మంది బయలు దేవత ప్రవక్తలను, నాలుగు
వందల మంది బూటకపు దేవత అషేరా ప్రవక్తలను
అక్కడికి తీసుకొనిరా. రాణీ యెజెబెలు ఈ ప్రవక్త
లందరినీ పోషిస్తూ* వున్నది.” 20పిమ్మట అహాబు
ఇశ్రాయేలు వారందరినీ, ఆ ప్రవక్తలను కర్మెలు పర్వతం
వద్దకు పిలువనంపాడు. 21ఆ ప్రజలందరి వద్దకు
ఏలీయా వచ్చాడు. అతడు వారినుద్దేశించి, “మీరంతా
ఎవరిని అనుసరించాలనేది ఎప్పుడు నిర్ణయిస్తారు?
యెహోవా నిజమైన దేవుడైతే మీరాయనను అనుస
రించండి. బయలు నిజమైన దేవత అయితే మీరా
దేవతను అనుసరించండి” అని అన్నాడు.
ప్రజలు ఏమీ మాట్లాడలేదు. 22అందువల్ల ఏలీయా
ఇలా అన్నాడు: “ఇక్కడ నేనొక్కడినే యెహోవా
యొక్క ప్రవక్తను. నేను ఒంటరిగా వున్నాను. కాని
నాలుగు వందల ఏభై మంది బయలు ప్రవక్తలున్నారు.
23కావున మీరు రెండు ఆబోతులను తీసుకునిరండి.
వాటిలో ఒక దానిని బయలు ప్రవక్తలను తీసుకోని
వ్వండి. వారు దానిని చంపి ముక్కలు చేయనీయండి.
ఆ మాంసాన్ని ఒక చితిపై వుంచండి. కాని ఆ చితికి
నిప్పు పెట్టవద్దు. నేను కూడ ఆ రెండవ ఆబోతును
అలాగే చేస్తాను. నేనూ ఆ చితికి నిప్పు అంటించను.
24బయలు దేవత ప్రవక్తలారా ! మీరు మీ దేవునికి
ప్రార్థించండి. నేను నా యెహోవాను ప్రార్థిస్తాను. ఏ
దేవుడైతే ప్రార్థనలను ఆలకించి, చితిని రగిలింప
చేస్తాడో అతడే నిజమైన దేవుడు.”
ప్రజలంతా ఇది మంచి ఆలోచన అని ఒప్పు
కున్నారు.
25బయలు ప్రవక్తలతో మళ్లీ ఏలీయా ఇలా
అన్నాడు: “మీరు చాలా మంది వున్నారు. కనుక పని
మీరు ముందు మొదలు పెట్టండి. ఒక ఆబోతును
ఎన్నుకుని తయారు చెయ్యండి. కాని నిప్పు మాత్రం
రగల్చకండి.”
26కావున ఆ ప్రవక్తలు తమకివ్వబడిన ఆబోతును
తీసుకున్నారు. దానిని తయారు చేశారు. వారు బయలు
దేవతకు మధ్యాహ్నం వరకు ప్రార్థనలు చేశారు. “ఓ
బయలు దేవతా! మా ప్రార్థనలు ఆలకించు!” అని
వేడుకున్నారు. కాని ఎటువంటి చప్పుడూ లేదు.
ఎవ్వరూ సమాధాన మియ్యలేదు. వారు నిర్మించిన
బలిపీఠం చుట్టూ ప్రవక్తలు నాట్యం చేశారు. కానీ
నిప్పు రాజలేదు.
27మధ్యాహ్నమైనప్పుడు ఏలీయా వారిని హేళన
చేయనారంభించాడు: “బయలు నిజంగా దైవమైతే
మీరు బిగ్గరగా ప్రార్థన చేయాల్సివుంటుందేమో! బహుశః
అతడు ఆలోచిస్తూ ఉండవచ్చు! లేక అతడు చాలా
పని ఒత్తిడిలో ఉండవచ్చు. లేక అతను ప్రయాణం
చేస్తూ ఉండవచ్చు! అతడు నిద్రపోతూ ఉండవచ్చు!
బహుశః మీరతనిని లేపవలసి ఉంటుంది!” అంటూ

---

**రాణీ ... పోషిస్తూ** ఈ ప్రవక్తలందరూ యెజెబెలు బల్లవద్ద భోజనం చేస్తారని శబ్దార్థం.

అపహాస్యం చేశాడు ఏలీయా. [28]అందువల్ల ఆ ప్రవక్తలు
బిగ్గరగా ప్రార్థనలు చేయనారంభించారు. వారు కత్తుల
తోను, ఈటెలతోను శరీరమంతా చీరుకున్నారు. (అది
వారి ఆరాధనా తీరు) వారు రక్తం కారేలాగు ఒళ్లు
చీరుకున్నారు. [29]మధ్యాహ్న సమయం దాటి
పోయింది. అయినా నిప్పు అంటుకోలేదు. సాయం
త్రపు బలుల సమయం అయ్యేవరకు ఆ ప్రవక్తలు
తమ భయానక చేష్టలు* సాగించారు. బయలు వద్ద
నుండి సమాధానం లేదు. చితికి ఏమీ జరగలేదు.*

[30]అప్పుడు ఏలీయా ప్రజలతో, "నా వద్దకు రండి"
అని అన్నాడు. వారంతా ఏలీయా చుట్టూ చేరారు.
బేతేలులో ఉన్న యెహోవా యొక్క బలిపీఠం నాశనం
చేయబడింది. ఏలీయా దానిని మళ్లీ నిర్మించాడు.
[31]ఏలీయా పన్నెండు రాళ్లను తీసుకున్నాడు. ఒక్కొక్క
గోత్రానికి ఒక్కొక్క రాయి చొప్పున ఇశ్రాయేలు
పన్నెండు గోత్రాలకు పన్నెండు రాళ్లను తీశాడు.
యాకోబు పన్నెండు మంది కుమారుల పేర్లతో ఈ
గోత్రాలు పిలవబడుతూ వున్నాయి. యాకోబునే
యెహోవా ఇశ్రాయేలని పిలిచాడు. [32]ఏలీయా ఈ
రాళ్లను యెహోవా గౌరవార్థం బలిపీఠాన్ని నిర్మించ
టానికి ఉపయోగించాడు. పీఠం చుట్టూ ఏలీయా చిన్న
కందకం తవ్వించాడు. అది రెండు షియాల* విత్తనాలు
నీటితో సహా పట్టేటంత వెడల్పు, లోతు కలిగివుంది.
[33]అప్పుడు ఏలీయా కట్టెనంతా బలిపీఠంపై వుంచాడు.
అతడు ఆబోతును ముక్కలుగా నరికి, వాటిని పేర్చిన
కట్టెలపై వుంచాడు.

[34]తరువాత ఏలీయా ప్రజలను నాలుగు జాడీలతో
నీరు తీసుకుని మాంసం మీద, కట్టెల మీద చల్ల
మన్నాడు. వారిని అదే విధంగా మళ్లీ చేయమన్నాడు.
ఆయన వారితో మూడవ సారి కూడా అలానే చేయ
మన్నాడు. [35]ఆ నీరు బలిపీఠం నుండి జారి చుట్టూ
వున్న కందకాన్ని నింపేసింది.

[36]సాయంకాలపు బలులు ఇచ్చే వేళ అయ్యింది.
ప్రవక్తయగు ఏలీయా పీఠం వద్దకు వెళ్లి ఇలా ప్రార్థిం
చాడు: "ఓ ప్రభువా! అబ్రాహాము, ఇస్సాకు, యాకో
బుల దేవా! ఇశ్రాయేలీయుల దైవం నీవేనని నిరూ
పించమని నేనిప్పుడు నిన్నడుగుతున్నాను. నేను నీ
సేవకుడనని నిరూపించు. ఈ పనులన్నీ చేయమని
నన్ను నీవే ఆదేశించినట్లు కూడ ఈ ప్రజలకు
తెలియజేయి. [37]ఓ ప్రభువా, నా ప్రార్థన ఆలకించు.
ప్రభూ! నీవే దేవుడవని ఈ ప్రజలకు నిరూపించు.
అప్పుడు ఈ ప్రజలందరినీ మరల నీవు నీ దగ్గరకు
చేర్చుకుంటున్నావని వీరు తెలుసుకుంటారు."

[38]అప్పుడు యెహోవా అగ్ని పంపించాడు. బలి
మాంసాన్ని, కట్టెలను, రాళ్లను, బలిపీఠం చుట్టూవున్న
ప్రదేశాన్ని అగ్ని దహించి వేసింది. కందకంలో వున్న
నీరు కూడ అగ్నివల్ల ఇగిరి పోయింది. [39]ప్రజలంతా
ఇది చూశారు. వారు భూమి మీద సాగిలపడి, "యెహో
వాయే దేవుడు! యెహోవాయే దేవుడు! అని
స్తుతించసాగారు"

[40]అప్పుడు ఏలీయా, "బయలు దేవత ప్రవక్త
లందరినీ పట్టుకొనండి. ఒక్కడినీ పారి పోనీయవద్దు!"
అని అన్నాడు. ప్రవక్తలందరినీ ప్రజలు పట్టుకున్నారు.
ఏలీయా వారందరినీ కీషోను వాగు దగ్గరకు తీసుకుని
వెళ్లాడు. అక్కడ ఆ ప్రవక్తలందరినీ చంపేశాడు.

## తిరిగి వర్షాలు పడటం

[41]ఏలీయా రాజైన అహాబుతో, "నీవు ఇప్పుడు
వెళ్లి అన్నపానాదులు స్వీకరించు. ఒక భారీ వర్షం పడ
బోతూ వుంది" అని అన్నాడు. [42]రాజైన అహాబు
భోజనానికి వెళ్లాడు. అదే సమయంలో ఏలీయా
కర్మెలు పర్వతం మీద అతడు వంగి తన మోకాళ్లమధ్య
తలను పెట్టాడు. [43]అప్పుడు ఏలీయా తన సేవకునితో
సముద్రం చూడమన్నాడు.

సముద్రం కనపడే చోటుకు సేవకుడు వెళ్లాడు.
"నేనేమీ చూడలేదు" అని సేవకుడు తిరిగి వచ్చి
చెప్పాడు. మళ్లీ వెళ్లి చూడమని ఏలీయా అన్నాడు.
ఈ విధంగా ఏడుసార్లు జరిగింది. [44]ఏడవసారి నౌకరు
తిరిగి వచ్చి ఒక పిడికెడంత మబ్బును చూసినట్లు
చెప్పాడు. అది సముద్రం మీది నుంచి వస్తున్నదని
అన్నాడు. ఏలీయా తన సేవకునితో, "రాజైన అహాబు
వద్దకు వెళ్లి తన రథం సిద్ధం చేసుకొని వెంటనే ఇంటికి
వెళ్లమని చెప్పు. అతనిప్పుడు వెళ్లకపోతే వర్షం అతనిని
ఆపేస్తుంది" అని అన్నాడు.

[45]ఆ తరువాత కొద్ది సేపటికే ఆకాశంలో కారు
మేఘాలు కమ్ముకొచ్చాయి. భయంకరంగా గాలి, వాన
ప్రారంభమైనాయి. అహాబు తన రథమెక్కి యెజ్రెయే
లుకు తిరుగు ప్రయాణం సాగించాడు. [46]యెహోవా
శక్తి ఏలీయా మీదికి వచ్చింది. ఏలీయా తన బట్టలను
నడుముకు బిగించి కట్టి రాజైన అహాబుకంటె
ముందుగా యెజ్రెయేలుకు పరుగెత్తికొని వెళ్లాడు.

## సీనాయి పర్వతంపై ఏలీయా

19 ఏలీయా చేసిన పనులన్నీ రాజైన అహాబు
తన భార్యయగు రాణీ యెజెబెలుకు చెప్పాడు.
కత్తి పట్టి ఎలా ప్రవక్తలందరినీ ఏలీయా చంపాడో

---

**భయానక చేష్టలు** హెబ్రీలో ఈ మాటకు "ఒళ్లు మరచుట" అని అర్థం కూడ వుంది.

**బయలు ... జరగలేదు** ఎవరూ వినలేదనీ, ఏమీ పట్టించు కోలేదనీ పాఠాంతరం.

**రెండు షియాలు** ఆంగ్ల కొలమానం ప్రకారం ఏడు గాలన్ల నీరు పట్టేటంత కందకం. లేక రెండు మానికల ధాన్యం పట్టేటంత కందకం.

అహాబు ఆమెకు వివరించాడు. 2అది విన్న యెజెబెలు
ఒక దూతను ఏలీయా వద్దకు పంపింది. ఆమె వర్త
మానం ఇలా వుంది: “రేపు ఈ పాటికి నీవు ప్రవక్తలను
చంపిన విధంగా నిన్ను నేను చంపుతానని ప్రమాణం
చేస్తున్నాను. నేనా పనిలో విజయం సాధించలేని
పక్షంలో దేవతలు నన్ను చంపుగాక!”

3ఇది విన్న ఏలీయా భయపడ్డాడు. తన ప్రాణం
కాపాడుకొనేందుకు పారిపోయాడు. అతనితో తన
నౌకరును తీసుకుని వెళ్లాడు. వారు యూదాలోని బెయే
ర్షెబాకు వెళ్లారు. బెయేర్షెబాలో తన నౌకరును ఏలీయా
వదిలాడు. 4తరువాత ఒక రోజంతా ప్రయాణం చేసి
ఏలీయా ఎడారిలోకి వెళ్లాడు. ఏలీయా ఒక పొదకింద
కూర్చున్నాడు. అతడు చని పోవాలని కోరుకున్నాడు.
ఏలీయా యెహోవానిలా ప్రార్థించాడు: “ప్రభువా,
నాకిది చాలు. ఇక నన్ను చనిపోనియ్యండి. నా పూర్వి
కుల కంటె నేను ఉన్నతమైనవాడిని కాను.”

5ఏలీయా తరువాత చెట్టు కింద పడుకొని నిద్ర
పోయాడు. యెహోవా దూత వచ్చి ఏలీయాను
తట్టాడు. “నిద్ర లేచి, ఆహారం తీసుకో!” అన్నాడు
దేవదూత. 6ఏలీయా తన వద్ద నిప్పుల మీద కాల్చిన
రొట్టె, ఒక కూజాలో నీరు వున్నట్లు చూశాడు. ఏలీయా
ఆ రొట్టెను తిని, నీరు తాగాడు. అతను మరల
నిద్రపోయాడు.

7యెహోవా దేవదూత మళ్లీ అతని వద్దకు వచ్చి,
“లేచి ఆహారం తీసుకో, నీవు భోజనం చేయకపోతే
నీవు చేయవలసిన ప్రయాణం నీవు నడవలేనంతగా
వుంటుంది” అని అన్నాడు. 8అందుచేత ఏలీయా లేచి
అన్న పానాదులు స్వీకరించాడు. ఏలీయా తిన్న
ఆహారం అతనికి నలభై రోజులు రాత్రింబగళ్లు నడవ
గలిగే శక్తి నిచ్చింది. అతడు దేవుని పర్వతం అనబడే
హోరేబు పర్వతం వద్దకు వచ్చాడు.
9 అక్కడ ఏలీయా ఒక గుహలోకి వెళ్లి ఆ రాత్రి
తలదాచుకున్నాడు.

అక్కడ యెహోవా ఏలీయాతో మాట్లాడి,
“ఏలీయా! నీవిక్కడెందుకున్నావు!” అని అడిగాడు.

10ఏలీయా ఇలా సమాధానం చెప్పాడు: “సర్వశక్తి
మంతుడవైన యెహోవా, నేను నిన్ను సదా సేవిస్తూ
వచ్చాను. నా శక్తికొలదీ నేను నిన్ను ఆరాధించాను.
కాని ఇశ్రాయేలు ప్రజలు నీతో చేసుకున్న ఒడం
బడికను భంగపర్చారు. నీ బలిపీఠాలను వారు నాశనం
చేశారు. వారు నీ ప్రవక్తలను చంపేశారు. నేనొక్కడినే
ప్రవక్తగా ఇంకా జీవించి వున్నాను. ఇప్పుడు వారు
నన్నూ చంప జూస్తున్నారు!”

11అందుకు యెహోవా ఏలీయాతో: “నీవు వెళ్లి
పర్వతం మీద నా ముందు నిలబడు. నేను నీ పక్కగా
వెళతాను” అని అన్నాడు. యెహోవా అలా చేయగా,
ఒక పెనుగాలి వీచింది. ఆ గాలి కొండలను రెండుగా
చీల్చివేసింది. యెహోవా ముందు ఆ గాలి పెద్ద
గుట్టలను పిండి చేసింది. కాని ఆ పెనుగాలి యెహోవా
మాత్రం కాదు! గాలి తగ్గిన పిమ్మట ఒక భూకంపం
వచ్చింది. ఆ భూకంపం కూడా యెహోవా కాదు.
12ఆ భూకంపం పోయిన పిమ్మట అగ్ని పుట్టింది. ఆ
అగ్నికూడా యెహోవా కాదు. అగ్ని తరువాత ప్రశాం
తత నెలకొనగా, ఒక మృదువైన శబ్దం వినవచ్చింది.

13ఏలీయా ఆ శబ్దాన్ని విన్నప్పుడు తన అంగీతో
తన ముఖం కప్పుకున్నాడు. అతను గుహ ద్వారం
వద్దకు వెళ్లి నిలబడ్డాడు. ఇంతలో “ఏలీయా, ఇక్కడెం
దుకున్నావు?” అంటున్న ఒక కంఠ స్వరం విన్నాడు.

14ఏలీయా ఇలా అన్నాడు: “సర్వశక్తిమంతుడవైన
యెహోవా దేవా, శక్తి వంచన లేకుండా నేను నిన్ను
సదా సేవిస్తూవచ్చాను. కాని ఇశ్రాయేలు ప్రజలు వారు
నీతో చేసుకున్న ఒప్పందానికి విఘాతం కలుగజేశారు.
నీకై నిర్మించిన బలిపీఠాలను నాశనం చేశారు. నీ ప్రవ
క్తలను చంపేశారు. జీవించియున్న ప్రవక్తలు మరె
వ్వరూ లేరు నేను మినహా. వారిప్పుడు నన్ను చంప
జూస్తున్నారు.”

15యెహోవా ఇలా అన్నాడు: “నీవు వచ్చిన దారి
లోనే తిరిగి దమస్కు ఎడారికి వెళ్లు. నగరంలో ప్రవే
శించి హజాయేలును అరాము దేశానికి (సిరియా)
రాజుగా అభిషేకించు.”

16పిమ్మట నింషీ కుమారుడైన యెహూను ఇశ్రా
యేలుపై రాజుగా అభిషిక్తుని చేయి. తరువాత, ఆబేల్మె
హోలావాడైన షాపాతు కుమారుడైన ఎలీషాకు నీ
తర్వాత ప్రవక్తగా అభిషేకంచేయి. 17హజాయేలు
ఖడ్గము నుండి తప్పించుకున్న ప్రతివాడినీ యెహూ
సంహరిస్తాడు. యెహూ కత్తి పోటునుంచి తప్పించు
కున్న ప్రతివాడినీ హజాయేలు చంపేస్తాడు. 18ఇశ్రాయే
లులో ఏడువేల మందిని నేను వదిలి పెడతాను. ఈ
ఏడువేల మంది బయలు ముందు ఎన్నడూ వంగి
నమస్కరించ లేదు. బయలు విగ్రహాల నెన్నడూ వారు
ముద్దు పెట్టు కోలేదు.”

## ఎలీషా ప్రవక్త అవటం

19కావున ఏలీయా ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్లాడు
షాపాతు కుమారుడైన ఎలీషాను చూశాడు. ఎలీషా
ఎద్దులను కట్టి 12 ఎకరాల పొలం దున్నుతున్నాడు.
ఏలియా వచ్చినప్పుడు ఎలీషా చివరి ఎకరాన్ని దున్ను
చుండెను. ఏలీయా సరాసరి ఎలీషా వద్దకు వచ్చాడు.
ఏలీయా తన అంగీని తీసి ఎలీషా మీద కప్పాడు.

20అప్పుడు ఎలీషా పొలంలోవున్న తన ఎద్దులను
వదిలి పెట్టాడు. అతడు పరుగెత్తి ఏలీయా వద్దకు
వెళ్లి, “నన్ను వెళ్లి నా తల్లిదండ్రులను ముద్దు పెట్టుకొని
వారి వద్ద వీడ్కోలు తీసుకోనీయండి. తరువాత నేను
మీతో వస్తాను” అని అన్నాడు.

“అది చాలా మంచిది. వెళ్లు. నిన్ను నేనాపను”*
అని ఏలీయా అన్నాడు.
21ఎలీషా వెళ్లి తన ఇంటి వారితో ఒక ప్రత్యేకమైన
విందారగించాడు. ఎలీషా వెళ్లి తన ఎద్దులను చంపాడు.
ఎడ్లకు కట్టిన కాడి కర్రతో నిప్పుచేసి, ఎడ్ల మాంసాన్ని
ఉడకబెట్టాడు. ఆ మాంసాన్ని అందరికీ ఇచ్చాడు.
వారంతా ఆ మాంసాన్ని తిన్నారు. ఎలీషా తరువాత
ఏలీయాను అనుసరించి వెళ్లాడు. ఎలీషా ఏలీయాకు
సహాయకుడయ్యాడు.

### బెన్హదదు, అహాబు యుద్ధానికి తలపడుట

20 బెన్హదదు సిరియా రాజు, అతడు తన సైన్యాల
న్నిటినీ సమీకరించాడు. తనతో ముప్పై
ఇద్దరు రాజులున్నారు. వారికి రథాలు, గుర్రాలు
వున్నాయి. వారు సమరియను (షోమ్రోను) ముట్ట
డించి యుద్ధం చేశారు. 2ఇశ్రాయేలు రాజైన అహాబు
వద్దకు సిరియా రాజు దూతలను పంపాడు. 3వారు
బెన్హదదు మాటగా అహాబుతో ఇలా అన్నారు: “నీవు
నీ యొక్క వెండి బంగారాలను నాకు ఇచ్చేయాలి.
అంతేగాక నీ భార్యలను, పిల్లలను కూడ తప్పక నాకు
ఇచ్చేయాలి.”
4ఇశ్రాయేలు రాజు ఇలా అన్నాడు: “నా యజమాని
యైన ఓ రాజా, నేను నీ వాడనని ఒప్పుకుంటున్నాను.
నాకున్న ప్రతిదీ నీకు చెందినదే.”
5దూతలు మరల అహాబు వద్దకు వచ్చారు. వారు
బెన్హదదు తరుపున ఇలా అన్నారు, “నీవు నీ వెండి
బంగారాలను, నీ భార్యలను, పిల్లలను నాకు ఇవ్వాలని
నేనింతకు ముందే చెప్పాను. 6నేనిప్పుడు నా మనుష్యు
లను పంపి నీ భవనాన్ని, నీ కింది పాలకుల ఇండ్లను
వెదికించాలనుకుంటున్నాను. నా మనుష్యులకు ఏది
నచ్చితే అది తీసుకుని వస్తారు.”
7ఇది విని, రాజైన అహాబు తన దేశంలో వున్న
పెద్దల (నాయకుల)తో ఒక సమావేశం ఏర్పాటు
చేశాడు. వారితో ఇలా అన్నాడు: “చూడండి! బెన్హదదు
కయ్యానికి సిద్ధమవుతున్నాడు. నా భార్యలను, పిల్ల
లను, నా వెండి బంగారాలను నేనతనికి ఇవ్వాలని
ముందుగా చెప్పాడు. అవన్నీ ఇవ్వటానికి నేను ఒప్పు
కున్నాను. కాని ఇప్పుడతను సర్వం తీసుకోవాలని
చూస్తున్నాడు.”
8ఇది విన్న పెద్దలు (నాయకులు), ఇతర ప్రజలు
“బెన్హదదును లెక్క చేయవద్దనీ, అతను చెప్పినట్లు
చేయవద్దనీ” అన్నారు.
9బెన్హదదుకు తిరుగు సమాధానంలో అహాబు ఇలా
అన్నాడు: “నేను నీవు ముందు చెప్పిన విధంగా చేస్తాను.
కాని నీవు రెండవసారి ఆజ్ఞ ఇచ్చినట్లుగా నేను చేయ
జాలను.”
రాజైన బెన్హదదు మనుష్యులు ఈ సమాచారాన్ని
అతనికి అందజేశారు.
10బెన్హదదు నుంచి మరో వర్తమానం తీసుకుని
దూతలు మళ్లీ వచ్చారు. ఆ సమాచారం ఇలా వుంది,
“నేను షోమ్రోనును పూర్తిగా నాశనం చేస్తాను. ఆ నగ
రంలో ఏదీ మిగిలి వుండదని నేను ప్రమాణం చేసి
చెప్తున్నాను! నా మనుష్యులు గుర్తుగా* ఇంటికి తెచ్చు
కోవటానికి కూడ అక్కడ ఏమీ మిగలదు. నేనిది చేయక
పోతే దేవుడు నన్ను సర్వనాశనం చేయుగాక!”
11రాజైన అహాబు ప్రత్యుత్తరమిస్తూ “బెన్హదదుకు
ఇలా చెప్పండి. కవచాన్ని ధరించువాడు దానిని ధరించి
విప్పిన వానివలె గొప్పలు చెప్పరాదు”* అని చెప్ప
మన్నాడు.
12రాజైన బెన్హదదు ఇతర పాలకులతో కలిసి తన
డేరాలో వున్నాడు. ఆ సమయంలో అతని దూతలు
తిరిగి వచ్చి రాజైన అహాబు ఇచ్చిన సమాధానాన్ని
అతనికి అందజేశారు. రాజైన బెన్హదదు నగరాన్ని ముట్ట
డించటానికి సన్నద్ధులు కండని తన మనుష్యులకు
ఆజ్ఞ ఇచ్చాడు. కావున వారంతా తమ తమ స్థానాలకు
వెళ్లారు.
13అదే సమయంలో ఒక ప్రవక్త రాజైన అహాబు
వద్దకు వెళ్లి యెహోవా ఇలా అంటున్నాడని చెప్పాడు:
“ఆ పెద్ద సైన్యాన్ని నీవు చూస్తున్నావు గదా! దేవుడనైన
నేను నీవు ఆ మహా సైన్యాన్ని ఈ రోజు ఓడించేలా
చేస్తాను. అప్పుడు నేనే నిత్యుడనైన యెహోవానని
నీవు గుర్తిస్తావు.”
14“వారిని ఓడించటానికి నీవు ఎవరిని ఉపయో
గిస్తావు?” అని అహాబు అడిగాడు.
“యువకులైన ప్రభుత్వాధికారులను” అని
యెహోవా సెలవిస్తున్నాడని ప్రవక్త అన్నాడు.
“ప్రధాన సైన్యాన్ని ఎవరు నడుపుతారు?” అని
రాజు అడిగాడు. నీవే” అని ప్రవక్త అన్నాడు.
15కావున అహాబు యువ ప్రభుత్వాధికారులను
సమాయత్తపరచాడు. వారు రెండు వందల ముప్పై
రెండుమంది ఉన్నారు. ఇశ్రాయేలు సైన్యాన్నంతటినీ
రాజు సమీకరించాడు. వారంతా ఏడు వేల మంది
వున్నారు.
16మధ్యాహ్నమయ్యింది. రాజైన బెన్హదదు, అతనికి
తోడుగా ఉన్న ముప్పైరెండు మంది పాలకులు వారి

---

**నిన్ను నేనాపను** “నీకు నేను ఏమి చేశానని?” లేక “నిన్ను ఏమి చేస్తాను?” అని శబ్దార్థం.

**మనుష్యులు గుర్తుగా** హెబ్రీలో గుప్పెడు మట్టి కూడ అని శబ్దార్థం.

**కవచాన్ని ... చెప్పరాదు** ‘నిజమైన సైనికుడు యుద్ధం ముగిసినాక గొప్పతనం చెప్పుకుంటాడు గాని, యుద్ధానికి ముందు కాదు’ అని పాఠాంతరం.

గుడారాలలో బాగా మద్యపానం చేసి మైకంలో
వున్నారు. ఈ సమయంలో రాజైన అహాబు దండ
యాత్ర మొదలయ్యింది. 17యువ ప్రభుత్వాధి
కారులు ముందుగా ఎదుర్కొన్నారు. రాజైన బెన్హదదు
మనుష్యులు ఆయనతో షోమ్రోను నుండి కొందరు
సైనికులు బయటికి వచ్చినట్లు చెప్పారు. 18"అయితే
వారు యుద్ధానికి వస్తూ వుండవచ్చు. లేదా వారు
సంధి నిమిత్తమై వస్తూ వుండవచ్చు. ఏది ఏమైనా
వారిని సజీవంగా పట్టుకోండి" అని బెన్హదదు అన్నాడు.
19రాజైన అహాబు యొక్క యువసైనికులు దండ
యాత్రను నడుపుతున్నారు. ఇశ్రాయేలు సైన్యం
వారిని అనుసరిస్తూ వుంది. 20ఇశ్రాయేలు అధికారులలో
ప్రతియొక్కడూ తనని ఎదుర్కొన్న శత్రువును చంపి
వేశాడు. కావున అరాము నుండి వచ్చినవారు పారి
పోయారు. ఇశ్రాయేలు సైన్యం వారిని తరిమికొట్టింది.
రాజైన బెన్హదదు ఒక రథాశ్వము నెక్కి తప్పించు
కున్నాడు. 21రాజైన అహాబు తన సైన్యాన్ని నడిపించి
అరాము సైనికుల గుర్రాలను, రథాలను స్వాధీన
పర్చుకున్నాడు. ఆ విధంగా రాజైన అహాబు చేతిలో
సిరియను సైన్యం ఘోర పరాజయం పొందింది.
22అప్పుడు ప్రవక్త రాజైన అహాబు వద్దకు వెళ్లి
ఇలా అన్నాడు, "ఆరాము రాజైన బెన్హదదు రాబోయే
వసంతకాలం నాటికి మళ్లీ నీమీదికి యుద్ధానికి వస్తాడు.
ఇప్పుడు నీవు నీ నివాసానికి వెళ్లి నీ సైన్యాన్ని బాగా
బలపర్చుకో. అతని దండయాత్ర నుంచి నిన్ను నీవు
రక్షించుకోవటానికి తగిన వ్యూహాలు సిద్ధం చేయి."

### బెన్హదదు తిరిగి యుద్ధానికి వచ్చుట

23రాజైన బెన్హదదు సేవకులు కొందరు వచ్చి
ఆయనకు ఇలా సలహా ఇచ్చారు, "ఇశ్రాయేలు దేవతలు
కొండ దేవతలు. మనం యుద్ధం పర్వత ప్రాంతంలో
నిర్వహించాం. అందువల్ల ఇశ్రాయేలు ప్రజలు గెలిచారు.
కావున ఈ సారి మనం మైదాన ప్రాంతంలో యుద్ధం
నిర్వహించాలి. అప్పుడు మనం గెలుస్తాం. 24ఇప్పుడు
నీవొకటి చేయాలి. ఈ ముప్పది యిద్దరు పాలకులను
సైన్యాలను నడిపించేందుకు అనుమతించవద్దు. వారి
స్థానంలో దళాధిపతులను నియమించు.
25"తర్వాత నీవు పోగొట్టుకున్నటువంటి
సైన్యాన్ని మళ్లీ నీవు భర్తీ చేయాలి. పూర్వపు
సైన్యంలో వున్నట్లుగా గుర్రాలను, రథాలను మళ్లీ
సేకరించు. అప్పుడు ఇశ్రాయేలు సైన్యాన్ని మైదాన
ప్రాంతంలో మనం ఎదుర్కొందాం. అప్పుడు విజయం
మనదే!" బెన్హదదు వారి సలహా పాటించాడు. వారు
చెప్పిందంతా చేశాడు.
26వసంత కాలం వచ్చే సరికి బెన్హదదు అరాము
ప్రజలను సమీకరించాడు. ఇశ్రాయేలుతో యుద్ధం
చేయటానికి అతడు ఆఫెకు నగరానికి వెళ్లాడు.
27ఇశ్రాయేలీయులు కూడా యుద్ధానికి తయారై
నారు. ఇశ్రాయేలు ప్రజలు అరాము సైన్యంతో పోరాడ
టానికి వెళ్లారు. అరాము సైనికులు దిగిన చోటికి
ఎదురుగానే ఇశ్రాయేలు సైనికులు మకాంవేశారు. అరా
మీయులు ఆ ప్రదేశాన్నంతా ఆక్రమించియుండగా,
ఇశ్రాయేలీయులు కేవలం రెండు మేకల మందలవలె
వున్నారు.
28ఇశ్రాయేలు రాజు వద్దకు దైవజనుడొకడు వర్త
మానాన్ని తెచ్చాడు. యెహోవా ఇలా చెప్పాడు:
"అరాము ప్రజలు ప్రభువునైన నన్ను ఒక కొండ
దేవతగా చిత్రీకరించారు. నేను లోయలకు కూడ
దేవుడనేనని వారు భావించలేదు. కావున నీవు ఈ
పెద్ద సైన్యాన్ని ఓడించేలా చేస్తాను. అప్పుడు సర్వత్రా
నేనే ప్రభువునని నీవు తెలుసుకుంటావు."
29ఇరు సైన్యాలు ఎదురెదురుగా ఏడు రోజుల
పాటు మోకరించి వున్నాయి. ఏడవరోజు యుద్ధం
మొదలయ్యింది. ఇశ్రాయేలీయులు ఒక్క రోజులో
ఒక లక్ష మంది అరాము సైనికులను చంపేశారు.
30మిగిలిన వారు ఆఫెకు నగరానికి పారిపోయారు.
నగర ప్రాకారపు గోడ విరిగి పడగా ఇరవై ఏడువేల
మంది సైనికులు చనిపోయారు. బెన్హదదు కూడ నగ
రానికి పారిపోయాడు. అతడొక గదిలో దాక్కున్నాడు.
31ఈ లోపు కొందరు సేవకులు అతనితో ఇలా
అన్నారు: "ఇశ్రాయేలు రాజులు కనికరం చూపను
న్నట్లు మేము విన్నాం. మనం గోనెబట్టలు ధరించి,
తాళ్లు తలకు చుట్టుకుని* ఇశ్రాయేలు రాజు వద్దకు
వెళ్దాం. బహుశః అతడు మనల్ని బతకనివ్వొచ్చు."
32వారు గోనెపట్టలు చుట్టుకుని, తలపై తాళ్లు
వేసుకున్నారు. వారు ఇశ్రాయేలు రాజు వద్దకు వచ్చి,
"మీ సేవకుడు బెన్హదదు దయచేసి తనను బతకనివ్వ
మని అడుగుతున్నాడు" అని చెప్పారు.
"అయితే అతడింకా బతికే వున్నాడా? అతడు నా
సహోదరుడే!" అన్నాడు అహాబు.
33బెన్హదదు మనుష్యులు రాజైన అహాబు నిజంగా
దయచూపి బెన్హదదును చంపనని నిరూపించే విధంగా
ఏదైనా చెప్పాలని కోరుకున్నారు. ఎప్పుడయితే బెన్హ
దదును నా సహోదరుడని అహాబు అన్నాడో, వచ్చిన
మనుష్యులు వెంటనే, "అవును ! బెన్హదదు నీ సోద
రుడే!" అని అన్నారు.
"అతనిని నా వద్దకు తీసుకుని రండి" అని అహాబు
అన్నాడు. తరువాత బెన్హదదు రాజైన అహాబు
ముందుకు వచ్చాడు. అహాబు అతనిని తనతో తన
రథం ఎక్కమన్నాడు.

---

**గోనె బట్టలు ... చుట్టుకుని** ఇలా చేసిన వారు అల్ప
స్థితిలోను, అణకువతోను వున్నట్లు; వారు లొంగి పోవ
డానికి సిద్ధంగా వున్నట్లు గుర్తు.

34బెన్హదదు అతనితో ఇలా అన్నాడు: “అహాబూ,
నా తండ్రి నీ తండ్రి వద్ద నుండి తీసుకున్న పట్టణా
లన్నిటినీ నేను నీకు తిరిగి ఇస్తాను. నా తండ్రి
షోమ్రోనులో చేసిన విధంగా, దమస్కులో నీవు కొన్ని
వీధులను నిర్మించి, వ్యాపార కేంద్రాలను ఏర్పాటు
చేయవచ్చు.”
అది విన్న అహాబు, “నీవు ఇందుకు ఒప్పుకుంటే
నేను నిన్ను వదిలి పెడతాను” అని అన్నాడు. తరువాత
ఆ రాజులిద్దరూ ఒక శాంతి ఒడంబడిక కుదుర్చుకు
న్నారు. రాజైన అహాబు రాజైన బెన్హదదును స్వేచ్ఛగా
వదిలాడు.

**ఒక ప్రవక్త అహాబుకు వ్యతిరేకంగా మాట్లాడుట**

35ప్రవక్తలలో ఒకడు మరో ప్రవక్తతో, “నన్ను
కొట్టు!” అని అన్నాడు. యెహోవా వలన ప్రేరేపించ
బడి అతనలా అన్నాడు. కాని ఆ రెండవ ప్రవక్త అతనిని
కొట్ట నిరాకరించాడు. 36అందుచే మొదటి ప్రవక్త ఇలా
అన్నాడు: “నీవు యెహోవా ఆజ్ఞను పాటించలేదు.
నీవు ఈ ప్రదేశాన్ని వదిలి వెళ్లగానే ఒక సింహం నిన్ను
చంపేస్తుంది.” ఆ రెండవ ప్రవక్త ఆ ప్రదేశం వదిలి
వెళ్లగానే ఒక సింహం వచ్చి అతనిని చంపేసింది.
37మొదటి ప్రవక్త మరో వ్యక్తి వద్దకు వెళ్లి, “నన్ను
కొట్టు!” అన్నాడు.
ఈ వ్యక్తి వానిని కొట్టాడు. ప్రవక్తకు బాగా దెబ్బ
తగిలింది. 38 అందుచే ఆ ప్రవక్త ఒక బట్టతో తన
ముఖం కప్పుకున్నాడు. దానివల్ల అతనెవరైనదీ
ఎవ్వరూ గుర్తు పట్టలేదు. ప్రవక్త వెళ్లి రాజు కొరకు
బాటపై నిలబడ్డాడు. 39రాజు వచ్చినప్పుడు ప్రవక్త
ఆయనతో ఇలా అన్నాడు: “నేను యుద్ధం చేయ
టానికి వెళ్లాను. మనలో ఒకడు శత్రుసైనికునొకణ్ణి
నా వద్దకు తీసుకుని వచ్చాడు. ఆ శత్రుసైనికునికి
కాపలా వుండమనీ, వాడు గనుక పారిపోతే అతని
స్థానంలో నేను నా ప్రాణాలను ఇవ్వవలసి వుంటుందనీ
మన సైనికుడు నాతో చెప్పాడు. లేదా రెండు మణు
గుల* వెండి చెల్లించవలసి వుంటుందని అన్నాడు.
40కాని నేను వేరే పనిలో నిమగ్నమై వుండగా ఆ శత్రు
సైనికుడు పారిపోయాడు.” ఇశ్రాయేలు రాజు ఇలా
అన్నాడు: “నీవా సైనికుని ఒదిలిపెట్టిన నేరం చేసినట్లు
ఒప్పుకున్నావు. దానికి సమాధానం కూడా నీకు
తెలుసు. ఆ వ్యక్తి చెప్పినట్లే నీవు చేయాలి.

41అప్పుడా ప్రవక్త తన ముఖము మీది బట్టను
తీసేశాడు. ఇశ్రాయేలు రాజు వానిని చూచి, అతడు
ప్రవక్తలలో ఒకడని తెలుసుకున్నాడు. 42 ప్రవక్త
యెహోవా వర్తమానాన్ని రాజుకిలా చెప్పాడు: “చంప
బడాలని నేను నిర్దేశించిన వ్యక్తిని నీవు వదిలి పెట్టావు.
కావున వాని స్థానంలో నీ ప్రాణం తీసుకోబడుతుంది.
అతని ప్రజల స్థానంలో నీ ప్రజలు చనిపోవలసి
వుంటుంది.”
43రాజు షోమ్రోనులో వున్న తన ఇంటికి వెళ్లి
పోయాడు. అతని మనస్సు బాగా కలత పడింది. అతడు
చింతాక్రాంతుడయ్యాడు.

**నాబోతు ద్రాక్ష తోట**

21 రాజైన అహాబు భవనం షోమ్రోను నగరంలో
వుంది. రాజభవనం దగ్గర ఒక ద్రాక్ష తోట
వుంది. 2ఒక రోజు నాబోతును పిలిచి అహాబు ఇలా
అన్నాడు: “నీ పొలం నాకు ఇచ్చివేయి. నేను దానిని
కూరగాయల తోటగా మార్చాలను కుంటున్నాను.
నీ చేను నా భవనానికి దగ్గరగా వుంది. దానికి బదులు
దానికంటె మంచి ద్రాక్షతోట నీకు మరొకటి ఇస్తాను.
లేదా, నీకు కావాలంటే దాని విలువ డబ్బు రూపంలో
చెల్లిస్తాను.”
3నాబోతు అది విని, “నా భూమిని నీ కెన్నడూ
ఇవ్వను. ఇది నా పిత్రార్జితం” అని అన్నాడు.
4అహాబు ఇంటికి వెళ్లాడు. నాబోతు పట్ల కోపంగా
వున్నాడు. అతని మనస్సు కలతపడింది. యెజ్రెయేలు
వాడైన నాబోతు చెప్పినది అతనికి గిట్టలేదు. (“నా
పిత్రార్జితమైన భూమిని నీకివ్వను” అని నాబోతు
అన్నాడు.) అహాబు పక్కపై పడుకున్నాడు. ముఖం
తిప్పుకుని భోజనం చేయ నిరాకరించాడు.
5అహాబు భార్య యెజెబెలు అతని వద్దకు వెళ్లింది.
“ఎందుకు నీవు కలత చెంది వున్నావు? నీవెందుకు
తినటం లేదు?” అని యెజెబెలు అడిగింది.
6అహాబు ఇలా సమాధానం చెప్పాడు: “యెజ్రె
యేలువాడైన నాబోతును అతని పొలం నాకిమ్మని
అడిగాను. దాని పూర్తి ఖరీదు చెల్లిస్తానన్నాను. లేదా,
అతను కావాలంటే వేరే పొలం ఇస్తానన్నాను. కాని
నాబోతు అతని పొలం ఇవ్వటానికి నిరాకరించాడు.”
7అది విని యెజెబెలు, “అది సరే! ఇశ్రాయేలుకు
రాజువు నీవే కదా! పక్క మీది నుండి లేచి ఆహారం
తీసుకో. నీకు హాయిగా వుంటుంది. నాబోతు పొలాన్ని
నీకు నేనిప్పిస్తాను” అని అన్నది. 8తరువాత యెజెబెలు
కొన్ని ఉత్తరాలను అహాబు పేరు మీద రాసింది. వాటి
మీద అహాబు సంతకం ఆమె చేసింది. అహాబు రాజ
ముద్రను వాటిపై వేసి అంటించింది. ఆమె వాటిని
నాబోతు నివసించే నగరంలో వున్న పెద్దలు, నాయకు
లకు ఇతర ముఖ్యమైన వ్యక్తులకు పంపించింది. 9ఆమె
పంపిన లేఖలో ఇలా వుంది:
ప్రజలందరికి ఉపవాస దినాన్ని ఒకటి ప్రకటిం
చండి. తరువాత పట్టణంలోని ప్రజలందరినీ ఆ రోజు

---

**రెండు మణుగులు** ఆంగ్ల కొలమానం ప్రకారం డెబ్బై ఐదు పౌనులని అర్థం.

సమావేశ పర్చండి. ఆ సమావేశంలో మనం నాబోతును
గురించి మాట్లాడాలి. 10నాబోతును గురించి ప్రజలకు
అబద్ధాలు చెప్పగల కొందరిని సమావేశంలో వుండేలా
చూడండి. నాబోతు రాజుకు, దేవునికి వ్యతిరేకంగా
దూషణ భాషణ చేయగా తాము విన్నట్లు ప్రజలకు
వారు అబద్ధం చెప్పాలి. అప్పుడు నాబోతును నగరం
నుండి బయటికి తీసుకొని పోయి రాళ్లతో కొట్టి
చంపాలి.

11అది చదివిన యెజ్రెయేలు నాయకులు
(పెద్దలు), ఇతర ప్రముఖులు ఆజ్ఞను శిరసావహించారు.
12ప్రజలంతా ఉపవాసం చేయాలని ఒక రోజును నిర్ణ
యించి ప్రకటించారు. ఆ రోజున నియమిత స్థలంలో
సమావేశం కావాలని ప్రజలందరికీ పిలుపు ఇచ్చారు.
వారు నాబోతును ప్రజల ముందు ఒక ప్రత్యేక స్థానంలో
కూర్చుండబెట్టారు. 13అప్పుడు ఇద్దరు మనుష్యులు
లేచి నాబోతు దేవునిని, రాజును గూర్చి దుర్భాషలాడు
తూండగా తాము విన్నట్లు ప్రజలకు చెప్పారు. అందు
వల్ల ప్రజలు నాబోతును నగరం నుండి బయటికి
లాక్కొని వెళ్లి, అతనిని రాళ్లతో కొట్టి చంపారు. 14తరు
వాత నాబోతు చంపబడ్డాడన్న వర్తమానం నాయకులు
యెజెబెలుకు పంపారు.

15ఈ వార్త విన్న యెజెబెలు వెంటనే అహాబు
వద్దకు వెళ్లి, “నాబోతు చనిపోయాడు. ఇప్పుడు నీవు
వెళ్లి నీకు కావలసిన పొలాన్ని తీసికో” అని చెప్పింది.
16కావున అహాబు ద్రాక్షతోటకు వెళ్లి దానిని తన వశం
చేసుకున్నాడు.

17ఇదే సమయంలో యెహోవా ఏలీయాతో
మాట్లాడాడు. (ఏలీయా తిష్బీయుడైన ప్రవక్త)
యెహోవా ఇలా అన్నాడు: 18“షోమ్రోనులో వున్న
రాజైన అహాబు వద్దకు వెళ్లు. అతడు నాబోతుకు
చెందిన ద్రాక్షతోటలో వుంటాడు. ఆ పొలాన్ని తన
స్వాధీనం చేసుకొనటానికి అహాబు అక్కడికి వెళ్లాడు.
19యెహోవా అంటున్నాడని నా మాటగా అతనికి
ఈ విధంగా చెప్పు: “అహాబూ! నీవు నాబోతు అనే
వానిని చంపావు. ఇప్పుడు నీవతని పొలం స్వాధీనం
చేసుకుంటున్నావు. అందువల్ల నేను చెప్పేదేమనగా
నాబోతు చనిపోయిన స్థలంలోనే నీవు కూడ చని
పోతావు. నాబోతు రక్తాన్ని నాకిన కుక్కలు అదే
స్థలంలో నీ రక్తాన్ని కూడ నాకుతాయి!”

20తరువాత ఏలీయా అహాబు వద్దకు వెళ్లాడు. ఏలీ
యాను అహాబు చూసి, “నీవు మళ్లీ నావద్దకు వచ్చావు.
నీ వెప్పుడూ నాకు వ్యతిరేకివై శత్రువులా ప్రవర్తిస్తు
న్నావు” అని అన్నాడు.

ఏలీయా ఇలా సమాధానమిచ్చాడు: “అవును, నేను
మళ్లీ నిన్ను కలుసుకున్నాను. జీవితమంతా యెహో
వాకు విరుద్ధగా పాపం చేస్తూనే వచ్చావు. 21అందువల్ల
యెహోవా నీతో ఇలా అంటున్నాడు, నేను నిన్ను
నాశనం చేస్తాను. నేను నిన్ను, నీ ఇంటిలోని ప్రతి
బాలుణ్ణి, మరియు మగవారినందరినీ చంపేస్తాను.
22నెబాతు కుమారుడైన యరొబాము కుటుంబానికి
పట్టిన గతే నీ కుటుంబానికి కూడ పడుతుంది. రాజైన
బయెషా కుటుంబంవలె నీ కుటుంబం కూడ అయి
పోతుంది. ఆ రెండు కుటుంబాలూ సర్వనాశనం చేయ
బడ్డాయి. అదే విధంగా నీ కుటుంబానికి కూడ చేస్తాను.
కారణమేమంటే నీవు నాకు కోపం కల్గించావు. ఇశ్రా
యేలు ప్రజలు చెడుకార్యాలు చేసేటందుకు కూడా
నీవు కారకుడవయ్యావు. 23ఇంకా యెహోవా చెప్పిన
దేమనగా నీ భార్యయగు యెజెబెలు శవాన్ని యెజ్రె
యేలు నగరంలో కుక్కలు పీక్కు తింటాయి. 24నీ
కుటుంబంలోని వాడెవడు నగరంలో చనిపోయినా వాని
శవాన్ని కుక్కలు తింటాయి. వారిలో ఎవడు పొలాల్లో
చనిపోయినా వానిని పక్షులు తింటాయి.”

25అహాబువలె అన్ని తప్పుడు పనులు చేసినవాడు,
అంత పాపం మూటగట్టు కున్నవాడు మరొక వ్యక్తి
లేడు. అతని భార్య యెజెబెలు అతడా తప్పులు చేయ
టానికి కారకురాలయింది. 26కొయ్య బొమ్మలను
పూజిస్తూ, అహాబు ఘోరమైన పాపానికి ఒడిగట్టాడు.
ఈ రకమైన పనినే అమోరీయులు కూడా చేశారు.
అందువల్లనే యెహోవా ఆ రాజ్యాన్ని వారి నుండి
తీసుకుని ఇశ్రాయేలీయులకు ఇచ్చాడు.

27ఏలీయా మాట్లాడటం పూర్తి చేసిన తరువాత
అహాబు చాలా ఖిన్నుడయాడు. తన విచారానికి సూచ
నగా తన బట్టలు చింపుకున్నాడు. తరువాత విచార
సూచకంగా ప్రత్యేకమైన బట్టలు ధరించాడు. అహాబు
భోజనం మానేశాడు. ఆ ప్రత్యేకమైన బట్టలతోనే నిద్ర
పోయాడు. అహాబు బహు దుఃఖంతో మిక్కిలి కలత
చెందాడు.

28ప్రవక్తయగు ఏలీయాతో యెహోవా ఇలా
అన్నాడు: 29“అహాబు నాముందు తనను తాను తక్కువ
చేసుకుని వినమ్రుడైనట్లు నేను చూస్తున్నాను. అందు
వల్ల అతను బతికియున్నంత కాలం నేనతనికి ఆపదలు
కలుగజేయను. అతని కుమారుడు రాజు అయ్యేవరకు
ఆగుతాను. అప్పుడు అహాబు కుటుంబానికి కష్టనష్టాలు
కలుగజేస్తాను.”

## మీకాయా అహాబును హెచ్చరించుట

22 తరువాత రెండు సంవత్సరాల కాలంలో ఇశ్రా
యేలు, అరాము దేశాల మధ్య శాంతి సామర
స్యాలు నెలకొన్నాయి. 2మూడవ సంవత్సరంలో
యూదా రాజైన యెహోషాపాతు ఇశ్రాయేలు రాజైన
అహాబును చూడటానికి వెళ్లాడు.

3అదే సమయంలో అహాబు తన అధికారులతో,
“రామోత్గిలాదు పట్టణాన్ని అరాము రాజు మనవద్ద
నుండి తీసుకున్న సంగతి మీకు జ్ఞాపకమున్నదా?

మనం రామోత్గిలాదును తిరిగి తీసుకొని రావటానికి ఏ
రకమైన చర్యనూ ఎందుకు తీసుకోలేదు? అది మన
పట్టణమై తీరాలి" అని అన్నాడు. [4]అప్పుడు అహాబు
తన వద్దకు వచ్చిన రాజైన యెహోషాపాతును,
"రామోత్గిలాదు వద్ద అరాము సైన్యంతో పోరాడటానికి
నీవు మాతో కలుస్తావా?" అని అడిగాడు.

"అవును, నేను మీతో కలుస్తాను. నీ సైన్యంతో
సహకరించటానికి నా సైనికులు, గుర్రాలు సిద్ధంగా
వున్నాయి. [5] కాని ముందుగా మనం యెహోవాను
మనకు సహాయం చేయమని అడగాలి" అని యెహో
షాపాతు అన్నాడు.

[6]అందుచేత అహాబు ప్రవక్తలందరినీ సమావేశ
పర్చాడు. ఆ సమయంలో అక్కడ సుమారు నాలుగు
వందల మంది ప్రవక్తలున్నారు. "నేను వెళ్లి అరాము
సైన్యంతో రామోత్గిలాదు వద్ద యుద్ధం చేయ
వచ్చునా? లేక నేనింకా మరో సమయం కొరకు వేచి
వుండాలా?" అని అహాబు వారినడిగాడు.

"నీవు వెళ్లి ఇప్పుడు యుద్ధం చేయవచ్చు.
యెహోవా నీకు విజయం చేకూర్చుతాడు" అని ప్రవక్త
లన్నారు.

[7]కాని యెహోషాపాతు, "యెహోవా యొక్క
ప్రవక్త మరెవరైనా ఇక్కడ వున్నారా? వుంటే అతడు
అహాబు ఏమి చేయాలో దేవుని అడిగి తెలుసుకోవాలి"
అని అన్నాడు.

[8]"మరో ప్రవక్త వున్నాడు. అతని పేరు మీకాయా,
అతడు ఇమ్లా కుమారుడు. కాని నేనతనిని అసహ్యించు
కుంటాను. అతడు యెహోవా తరపున మాట్లాడి
నప్పుడు, అతడెప్పుడూ నాకు మంచి చెప్పడు. నాకు
ఇష్టం లేని విషయాలే అతడెప్పుడూ చెపుతాడు" అని
అహాబు అన్నాడు.

"అహాబు రాజా, నీవు అలా అనకూడదు" అని
యెహోషాపాతు అన్నాడు.

[9]కావున రాజైన అహాబు తన అధికారులలో ఒకనిని
పిలిచి మీకాయా కొరకు వెళ్లి ఎక్కడున్నాడో చూడ
మన్నాడు.

[10]ఆ సమయంలో ఆ రాజులిద్దరూ తమ తమ
రాజ దుస్తుల్లో వున్నారు. వారు సింహాసనాల మీద
కూర్చుని వున్నారు. అది షోమ్రోను నగర ద్వారం
వద్దగల న్యాయస్థానం. ప్రవక్తలందరూ వారి ముందు
నిలబడ్డారు. ప్రవక్తలు ప్రత్యేకమైన విషయాలనేకం
యెహోవా నుండి తెలుసుకుని ప్రకటిస్తున్నారు.
[11]వారిలో కెనయనా కుమారుడు సిద్కియా అను
వాడొకడున్నాడు. సిద్కియా కొన్ని ఇనుప
కొమ్ములు* చేయించి తెచ్చాడు. అతడు అహాబుతో
యెహోవా ఇలా అంటున్నాడని చెప్పాడు: "అరాము
సైన్యంతో పోరాడటానికి నీవు ఈ ఇనుప కొమ్ములు
ఉపయోగిస్తావు. నీవు వారిని ఓడించి, సర్వనాశనం
చేస్తావు." [12]మిగిలిన ప్రవక్తలు కూడ సిద్కియా చెప్పిన
దానితో ఏకీభవించారు. ఆ ప్రవక్త ఇంకా ఇలా అన్నాడు:
"నీ సైన్యం ఇప్పుడే కదిలి వెళ్లాలి. అరాము సైన్యంతో
వారు రామోత్గిలాదు వద్ద పోరు సల్పాలి. నీవా
పోరాటంలో గెలుస్తావు. యెహోవా నీవు గెలిచేలా
చేస్తాడు."

[13]ఈ కార్యక్రమం ఇలా కొనసాగుతూ వుండగా
ప్రభుత్వాధికారి మీకాయాకొరకు వెళ్లాడు. అతడు మీకా
యాను చూసి, "ప్రవక్తలంతా రాజు గెలుస్తాడని చెపుతు
న్నారు. నేననేదేమంటే నీవు కూడా అదే మాదిరిగా
చెపితే నీకు చాలా క్షేమకరం" అని అన్నాడు.

[14]"కాదు! యెహోవా ప్రసాదించిన శక్తిచేత
యెహోవా నన్ను ఏది చెప్పమని ఆజ్ఞయిస్తే అదే
చెపుతానని ప్రమాణం చేసియున్నాను" అని మీకాయా
సమాధానం చెప్పాడు.

[15]తరువాత మీకాయా వచ్చి రాజైన అహాబు
ముందు నిలబడ్డాడు. రాజు అతనిని ఇలా అడిగాడు:
"మీకాయా, రాజైన యెహోషాపాతు, నేను మా
సైన్యాలను కలుపవచ్చా? ఇప్పుడు మేము వెళ్లి రామోత్గి
లాదు వద్ద అరాము సైన్యంతో పోరాడ వచ్చునా?"

"అవును. మీరు వెళ్లి వారితో ఇప్పుడు యుద్ధం
చేయవచ్చు. యెహోవా నిన్ను గెలిపిస్తాడు" అని
మీకాయా సమాధానం చెప్పాడు.

[16]కాని ఇలా అన్నాడు: "నీవు ఈ మాటలు
యెహోవా శక్తితో చెప్పటం లేదు. ఇది నీ ఊహాగానం.
అందువల్ల నాకు నిజం చెప్పు! నేనేం చేయాలో
యెహోవా శక్తి ఆధారంగా నాకు తెలియజెప్పు!
ఎన్నిసార్లు నేను నీకు చెప్పాను!"

[17]అందుకు మీకాయా ఇలా అన్నాడు: "ఏమి జరుగు
తుందో నేను చూడగలను. ఇశ్రాయేలు సైన్యం
కొండల్లో చిందరవందరై పోతుంది. కాపరిలేని గొర్రెల్లా
వారు వికలమైపోతారు. 'ఈ మనుష్యులకు నాయకుడు
లేడు. పోరుమాని వారు ఇండ్లకు పోతే మంచిది' అని
యెహోవా అంటున్నాడు."

[18]యెహోషాపాతుతో అప్పుడు అహాబు ఇలా
అన్నాడు: "చూడు! నేను చెప్పాను గదా! ఈ ప్రవక్త
నన్ను గురించి ఎన్నడూ మంచి చెప్పడు. ప్రతిసారీ
నేను వినవొల్లని మాటలే అతడు చెపుతాడు."

[19]కాని మీకాయా యెహోవా తరపున మాట్లాడటం
కొనసాగించాడు. మీకాయా ఇలా అన్నాడు: "వినండి!
ఇవి యెహోవా చెప్పిన మాటలు. యెహోవా పర
లోకంలో సింహాసనాసీనుడై వున్నట్లు చూశాను. దేవ
దూతలు ఆయనకు చేరువలో నిలబడియున్నారు.
[20]యెహోవా వారితో ఇలా చెప్పినాడు: 'మీలో

---

**ఇనుప కొమ్ములు** ఇనుప కొమ్ములు గొప్ప బలానికి
నిదర్శనాలు.

ఎవరైనా రాజైన అహాబును మోసగించగలరా? అతడు
రామోత్గిలాదు వద్ద అరాము సైన్యంతో పోరాడేలా
చేయాలని నా వాంఛ. అప్పుడతడు చంపబడతాడు.'
దేవదూతలు తాము చేయవలసిన పనిపై ఒక ఖచ్చిత
మైన నిర్ణయానికి రాలేకపోయారు. 21అప్పుడు ఒక
దేవదూత యెహోవా ముందుకు వచ్చి, 'నేనతనిని
మాయ జేయగలను!' అని చెప్పాడు. 22'ఎలామా
యలో పడవేయగలవు? అని యెహోవా అడిగాడు.
'అహాబు ప్రవక్తలందరినీ కలవరపెడతాను. రాజైన అహా
బుతో అన్నీ అబద్ధాలు చెప్పమని ప్రవక్తలను ప్రోత్సహి
స్తాను. ప్రవక్తల సమాచారాలన్నీ అబద్ధాలే' అని దేవ
దూత అన్నాడు. అందుకు యెహోవా, 'మంచిది!
వెళ్లి అహాబు రాజును మాయలో పడవేయి; నీకు
విజయం చేకూరుతుంది'" అని అన్నాడు.

23మీకాయా తన కథనం ముగించాడు. అతనిలా
అన్నాడు: "ఇదీ ఇక్కడ జరిగిన విషయం. యెహోవా
నీ ప్రవక్తలను నీతో అబద్దమాడేలా చేశాడు. యెహోవా
తనకు తానే నీకు కష్టనష్టాలు రావాలని కోరి నిశ్చయిం
చాడు."

24తరువాత ప్రవక్తయగు సిద్కియా, మీకాయా
వద్దకు వెళ్లాడు. సిద్కియా మీకాయాను చెంప మీద
కొట్టి, "యెహోవా శక్తి నన్ను వదిలి నీద్వారా మాట్లాడు
తున్నదని నీవు నిజంగా నమ్ముతున్నావా?" అని
అడిగాడు.

25"నీవు వెంటనే వెళ్లి ఒక చిన్న గదిలో దాగి
వుండు. అప్పుడు నేను నిజం చెప్తున్నట్లు నీకు తెలు
స్తుంది" అన్నాడు మీకాయా.

26మీకాయాను బంధించమని అహాబు తన అధికారు
లకు ఆజ్ఞ ఇచ్చాడు. "ఇతనిని బంధించి నగర పాలకు
డగు ఆమోను వద్దకు తీసుకుని వెళ్లండి. రాజకుమారు
డైన యెవాషును ఇతనిపై తీర్పు చెప్పనీయండి.
27మీకాయాను కారాగారంలో వుంచమని అతనికి
చెప్పండి. వీనికి కేవలం రొట్టె, నీరు మాత్రం ఇవ్వండి.
నేను యుద్ధం నుండి ఇంటికి తిరిగి వచ్చే వరకు ఇత
నిని అక్కడే వుంచండి" అని రాజైన అహాబు అన్నాడు.
28అది విన్న మీకాయా ఇలా ప్రకటించాడు: "సర్వ
ప్రజలారా, నే చెప్పేది సావధానంగా వినండి! అహాబు
రాజా, యుద్ధం నుండి నీవు క్షేమంగా ఇంటికి తిరిగి
వస్తే, యెహోవా నా ద్వారా మాట్లాడి యుండనట్లే."
29తరువాత రాజైన అహాబు, మరియు రాజైన
యెహోషాపాతు కలిసి రామోత్గిలాదు వద్ద అరాము
సైన్యంతో యుద్ధం చేయటానికి వెళ్లారు. గిలాదు అనే
ప్రాంతంలో ఇది వుంది. 30అహాబు యెహోషా
పాతుతో ఇలా అన్నాడు: "మనం యుద్ధానికి సిద్ధమ
వుదాం. నేను రాజునని తెలియకుండా వుండేలాగున
తగిన దుస్తులు వేసుకుంటాను. కాని నీవు మాత్రం
రాజఠీవి ఉట్టిపడే నీ యొక్క ప్రత్యేక దుస్తులు ధరించు."
ఇశ్రాయేలు రాజు మారువేషం వేసుకున్నాడు. యుద్ధం
మొదలయింది. 31అరాము రాజుకు ముప్పది యిద్దరు
రథాధిపతులున్నారు. ఈ ముప్పది యిద్దరు రథాధిపతు
లకూ ఇశ్రాయేలు రాజు ఎక్కడ వున్నాడో చూడమని
చెప్పాడు. ఇశ్రాయేలు రాజును చంపేయమని అరాము
రాజు అధిపతులకు ఆజ్ఞ ఇచ్చాడు. 32యుద్ధం సాగుతూ
వుండగా ఈ అధిపతులు రాజైన యెహోషాపాతును
చూశారు. వారు అతనినే ఇశ్రాయేలు రాజుగా భావిం
చారు. అందుచే వారతనిని చంపటానికి వెళ్లారు.
యెహోషాపాతు తను రాజు కాదన్నట్లు అరవటం
ప్రారంభించాడు. 33దానితో అతడు రాజైన అహాబు
కాదని తెలుసుకున్నారు. అందుచేత వారతనిని చంప
లేదు.

34కాని ఒక సైనికుడు తన బాణాన్ని గాలిలోకి
వదిలాడు. అతడు కావాలని దానిని ఎవరిపైకీ గురి
చూసి వదలలేదు. కాని ఆ బాణం ఇశ్రాయేలు రాజైన
అహాబుకు తగిలింది. రాజు కవచం అతని శరీరాన్ని
కప్పని చోట బాణం తగిలింది. రాజైన అహాబు తన
సారధితో, "నాకు ఒక బాణం తగిలింది. త్వరగా రథాన్ని
ఈ ప్రదేశం నుండి బయటికి నడిపించు. యుద్ధం
నుండి మనం వెళ్లిపోవాలి" అని అన్నాడు.

35సైన్యాలు మాత్రం యుద్ధాన్ని కొనసాగించాయి.
రాజైన అహాబు తన రథం మీదే వుండిపోయాడు.
రథంలో ఒక పక్కగా ఆనుకొని వున్నాడు. అతడు
అరాము సైన్యంవైపు చూస్తూ వుండిపోయాడు. అతని
గాయం నుండి కారిన రక్తం రథంలో పేరుకుపోయింది.
బాగా సాయంత్రమయ్యేసరికి రాజు చనిపోయాడు.
36సూర్యాస్తమయ సమయంలో ఇశ్రాయేలు సైన్యం
తమ స్వదేశానికి, నగరానికి తిరిగి వెళ్లటానికి ఆజ్ఞ ఇవ్వ
బడింది.

37రాజైన అహాబు ఆ విధంగా చనిపోయాడు. అతని
భౌతిక కాయాన్ని కొందరు షోమ్రోనుకు తీసుకొని
వెళ్లారు. వారు దానిని అక్కడ సమాధి చేశారు. 38అహాబు
రథాన్ని సైనికులు షోమ్రోనులో ఒక చెరువు వద్ద
కడిగారు. అక్కడ కొన్ని కుక్కలు రథం చుట్టూ చేరి
రథంలో పేరుకు పోయిన రాజైన అహాబు రక్తాన్ని
నాకాయి. పైగా ఆ నీటిలో వేశ్యలు స్నానం చేశారు.
ఇవన్నీ ఎలా జరుగుతాయని యెహోవా చెప్పియు
న్నాడో అలానే జరిగాయి.

39రాజైన అహాబు తన పరిపాలనాకాలంలో చేసిన
పనులన్నీ ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథంలో
పొందు పర్చబడ్డాయి. రాజు తన భవనాన్ని అందంగా
తీర్చిదిద్దటానికి ఉపయోగించిన దంతాన్ని గూర్చి కూడ
ఆ గ్రంథం వివరిస్తుంది. అందులో రాజు నిర్మించిన
నగరాన్ని గూర్చి కూడా వుంది. 40అహాబు చనిపోయిన
పిమ్మట అతని కుమారుడైన అహజ్యా అతని స్థానంలో
రాజు అయ్యాడు.

### యూదా రాజుగా యెహోషాపాతు

41ఆసా కుమారుడైన యెహోషాపాతు ఇశ్రాయేలు
రాజైన అహాబు ఏలుబడి నాలుగవ సంవత్సరంలో
యూదాకు రాజయ్యాడు. 42యెహోషాపాతు రాజు
అయ్యే నాటికి అతని వయస్సు ముప్పై అయిదు
సంవత్సరాలు. యెహోషాపాతు యెరూషలేములో
ఇరవై అయిదు సంవత్సరాలు పరిపాలించాడు. యెహో
షాపాతు తల్లి షిల్హీ కుమార్తె. అతని తల్లి పేరు అజూబా.
43యెహోషాపాతు మంచి వ్యక్తి. గతంలో తన తండ్రి
నడచిన రీతినే ఇతడు కూడ నడిచాడు. యెహోవా
ఆజ్ఞలను శిరసావహించాడు. కాని యెహోషాపాతు
ఉన్నత స్థలాలను తీసివేయలేదు. ఆ స్థలాలలో ప్రజలు
బలులు సమర్పించటం, ధూపం వేయటం వంటి
ఆరాధనా కార్యక్రమాలు కొనసాగించారు.
44యెహోషాపాతు ఇశ్రాయేలు రాజుతో ఒక శాంతి
ఒడంబడికను కుదుర్చుకున్నాడు. 45యెహోషాపాతు
మిక్కిలి ధైర్యవంతుడు. అతడు చాలా యుద్ధాలు
చేశాడు. అతడు చేసిన పనులన్నీ యూదా రాజుల
చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి. 46వ్యభిచార విష
యంగా తమ శరీరాలను అమ్ముకొనే స్త్రీ పురుషులను
ఆరాధనా స్థలాలనుండి యెహోషాపాతు వెళ్లగొట్టాడు.
తన తండ్రియగు ఆసా రాజ్యం చేసిన కాలంలో ఆ
రకమైన స్త్రీ పురుషులు ఆరాధనా స్థలాలలో సేవ
చేస్తూ వుండేవారు. 47ఆ కాలంలో ఎదోము దేశానికి
రాజు లేడు. అది ఒక పాలనాధికారి అధీనంలో వుండేది.
ఆ అధికారి యూదా రాజుచేత ఎంపిక చేయబడేవాడు.

### యెహోషాపాతు ఓడలు

48రాజైన యెహోషాపాతు సముద్రయానానికి
అనువైన ఓడలను నిర్మించాడు. యెహోషాపాతు ఆ
ఓడలను ఓఫీరు దేశానికి పంపాడు. ఓడలు బంగారాన్ని
తేవాలని అతని ఆశయం. కాని ఓడలు ఎసోన్గెబెరు
వద్ద మునిగిపోయాయి. ఓడలు బంగారాన్ని అసలు
తేలేక పోయాయి.
49ఇశ్రాయేలు రాజైన అహజ్యా యెహోషాపాతుకు
సహాయం చేయటానికి వెళ్లాడు. యెహోషాపాతుతో
నౌకా నిర్మాణ యానాలలో సమర్థులైన వారిని తీసు
కొని వస్తానని అహజ్యా అన్నాడు. కాని యెహోషాపాతు
అహజ్యా మనుష్యులను వినియోగించుకోడానికి నిరా
కరించాడు. 50యెహోషాపాతు చనిపోయాడు. అత
నిని తన పూర్వికులతో దావీదు నగరంలో సమాధి
చేశారు. తరువాత అతని కుమారుడు యెహోరాము
రాజయ్యాడు.

### ఇశ్రాయేలు రాజుగా అహజ్యా

51అహాబు కుమారుడు అహజ్యా, యెహోషాపాతు
పాలన యూదాలో పదునేడవ సంవత్సరం జరుగు
తుండగా అహజ్యా ఇశ్రాయేలుకు రాజైనాడు. అహజ్యా
షోమ్రోనులో రెండు సంవత్సరాలు పాలించాడు.
52అహజ్యా యెహోవా దృష్టిలో పాపం చేశాడు. తన
తండ్రి అహాబు, తన తల్లి యెజెబెలు,
మరియు నెబాతు కుమారుడైన యరొబాము నడ
చిన చెడునడతనే అహజ్యా కూడ అనుసరించాడు.
ఈ పాలకులంతా ఇశ్రాయేలు ప్రజలు పాపం చేయ
టానికి కారకులయ్యారు.
53అహజ్యా బూటకపు దేవత బయలును ఆరాధిం
చాడు. తనకు ముందున్న తన తండ్రి వలెనే ఆ
అసత్య దేవతను కొలిచాడు. తన ఈ చెడు నడవడితో
ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు చాలా కోపం
కలిగించాడు. తనకు ముందున్న తన తండ్రిపట్ల కోప
గించినట్లు యెహోవా అహజ్యా పట్ల కూడా కోపంతో
వున్నాడు.

# 2 రాజులు

### అహజ్యాకు సందేశం

1 అహాబు మరణానంతరం, ఇశ్రాయేలు మీద మోయాబు తిరుగుబాటు చేసింది.

2 ఒకరోజు షోమ్రోనులోని తన ఇంటి పై భాగాన అహజ్యా ఉన్నాడు. ఆ ఇంటి కప్పునుండి కొయ్యకడ్డీల గుండా అహజ్యా కిందపడి, బాగా గాయపడ్డాడు. అహజ్యా తన దూతల్ని పిలిచి వాళ్లతో, "ఎక్రోను దేవుని బయల్జెబూబుల యాజకుల దగ్గరికి వెళ్లండి. నా గాయాలనుండి నేను బయట పడగలుగుతానో లేదో వారిని అడగండి" అని చెప్పాడు.

3 కాని తిష్బీయుడైన ఏలీయాతో యెహోవా దూత ఇలా చెప్పాడు: "షోమ్రోను నుంచి అహజ్యా రాజు కొందరు దూతలను పంపాడు. ఆ మనుష్యుల్ని కలుసుకో. 'ఇశ్రాయేలులో ఒక దేవుడున్నాడు. కనుక ఎక్రోను దేవుని బయల్జెబూబుల యాజకులను అడగటానికి ఎందుకు మీరు అక్కడికి వెళుతున్నారు? అని వారిని అడుగుము. 4 మరియు అహజ్యా రాజుతో ఈ విషయాలు చెప్పమని ఆ దూతలకు ఆజ్ఞాపించుము. బలయల్జెబూబును అడగటానికి నీవు దూతలను పంపించావు. నీవీ విధంగా చేయడంవలన నీవు పడక నుంచి లేవవు, నీవు మరణిస్తావు అని యెహోవా చెప్పాడు."' తర్వాత అక్కడినుంచి వెళ్లి ఆ మాటలు అహజ్యా సేవకులకు ఏలీయా చెప్పాడు.

5 దూతలు అహజ్యా దగ్గరకు వచ్చారు. "మీరింత త్వరగా ఎందుకు వచ్చారు?" అని అహజ్యా వారిని అడిగాడు. 6 దూతలు అహజ్యాతో ఇట్లన్నారు: "మమ్మల్ని కలుసుకునేందుకు ఒక వ్యక్తి వచ్చాడు. మమ్మల్ని పంపించిన రాజుకి యెహోవా చెప్పిన మాటలు చెప్పమని అతను చెప్పాడు. 'ఇశ్రాయేలులో ఒక దేవుడున్నాడు, అందువల్ల ఎక్రోను దేవుడైన బయల్జెబూబుని ప్రశ్నలడగటం దేనికి? ఇట్లు చేయడంవల్ల నీవు పడకనుండి లేవవనియు, నీవు మరణిస్తావనియు యెహోవా చెప్పాడు!' "

7 "మిమ్మల్ని కలుసుకుని మీకు ఈ మాటలు చెప్పిన ఆ వ్యక్తి ఎలా వున్నాడు?" అని అహజ్యా దూతలను అడిగాడు.

8 "ఆ వ్యక్తి వెంట్రుకలతోచేసిన వస్త్రము ధరించాడు. నడుముకి ఒక తోలు నడికట్టు ధరించాడు" అని అహజ్యాకు దూతలు సమాధానమిచ్చారు. తర్వాత అహజ్యా, "తిష్బీయుడయిన ఏలీయానే అది" అని అన్నాడు.

### అహజ్యా పంపిన నాయకులను అగ్ని నాశనము చేయుట

9 అహజ్యా ఏలీయా వద్దకు ఒక నాయకుని మరియు ఏభై మంది మనుష్యుల్ని పంపాడు. ఆ నాయకుడు ఏలీయావద్దకు వెళ్లాడు. అప్పుడు ఏలీయా ఒక కొండ పై భాగాన కూర్చొని వున్నాడు. నాయకుడు, "దేవుని మనిషీ, 'క్రిందికి దిగమని రాజు చెప్పాడు" అని పలికాడు.

10 ఏలీయా ఏభై మంది మనుష్యులను, ఆ నాయకుని చూచి, "నేనే కనుక దేవుని మనిషినైతే, పరలోకం నుంచి అగ్ని వచ్చి నిన్నూ, నీ ఏభై మందిని నాశనం చేయునుగాక" అన్నాడు.

అందువల్ల పరలోకం నుండి అగ్ని వచ్చి ఆ నాయకుని, ఏభై మందిని నాశనం చేసింది.

11 అహజ్యా మరల ఏభై మందితో మరొక నాయకుని ఏలీయా వద్దకు పంపాడు. ఆ నాయకుడు ఏలీయాతో, "దేవుని మనిషీ, క్రిందికి త్వరగా రమ్ము అని రాజు చెప్పాడు" అని పలికాడు.

12 ఏలీయా ఆ నాయకుని అతని ఏభై మంది మనుష్యులతో, "నేనే కనుక దేవుని మనిషినైతే, పరలోకం నుంచి అగ్ని వచ్చి నిన్నూ నీ ఏభై మంది మనుష్యులను నాశనము చేయుగాక!" అన్నాడు. అప్పుడు దేవుని అగ్ని పరలోకం నుండి వచ్చి వారిని నాశనము చేసింది.

13 అహజ్యా మూడవ నాయకుని ఏభై మంది మనుష్యులతో పంపాడు. ఆ మూడవ నాయకుడు ఏలీయా వద్దకు వచ్చాడు. ఆ నాయకుడు మోకరిల్లి ఏలీయాను అర్థించాడు: "దేవుని మనిషీ, నా జీవితమూ నా ఏభై మంది సేవకుల జీవితములు నీకు విలువగలవై వుండునుగాక! 14 పరలోకం నుండి అగ్ని వచ్చి మొదటి ఇద్దరు నాయకులను వారి ఏభై మంది మనుష్యులను నాశనం చేసింది. మా మీద కరుణ చూపి మమ్ము బ్రతకనిమ్ము."

15 యెహోవా దూత ఏలీయాతో, "ఆ నాయకునితో పొమ్ము, అతనికి భయపడకుము" అన్నాడు. అందువల్ల ఏలీయా ఆ నాయకునితో కూడి అహజ్యా రాజుని చూడటానికి వెళ్లాడు. 16 అహజ్యాతో ఏలీయా,

"యెహోవా నీ విషయమై ఈలాగున చెప్పెను, ఇశ్రా
యేలులో ఒక దేవుడున్నాడు. అందువల్ల ఎక్రోను
దేవుడైన బయల్జెబూబు వద్దకు ప్రశ్నలడగమని దూత
లను ఎందుకు పంపావు? నీవు ఇట్లు చేయడంవలన,
నీవు నీ పడకనుండి లేవవు. నీవు మరణిస్తావు" అన్నాడు.

### యెహోరాము అహజ్యా అంతఃపురాన్ని స్వాధీనం చేసుకొనుట

17ఏలీయా ద్వారా యెహోవా చెప్పినట్లుగా,
అహజ్యా మరణించాడు. అహజ్యాకి కుమారుడు లేడు.
అందువల్ల అహజ్యా తర్వాత యెహోరాము రాజ
య్యాడు. యెహోషాపాతు కుమారుడైన యెహో
రాము పరిపాలించసాగాడు. అతని రెండవ సంవత్సర
పాలనా కాలంలో యెహోషాపాతు యూదా రాజుగా
వున్నాడు.
18అహజ్యా చేసిన ఇతర పనులు 'ఇశ్రాయేలు రాజుల
వృత్తాంతము' అనే గ్రంథంలో వ్రాయబడినవి.

### ఏలీయాని స్వీకరించటానికి యెహోవా పథకాలు వేయుట

2 సుడిగాలి ద్వారా ఏలీయాని యెహోవా పర
లోకానికి తీసుకు వెళ్లేందుకు సమయం దగ్గర
పడింది. ఏలీయా ఎలీషాతో గిల్గాలుకు వెళ్లాడు.
2ఎలీషాతో, "దయచేసి ఇక్కడ వుండుము, ఎందు
కనగా యెహోవా నన్ను బేతేలునకు వెళ్లుమని ఆదే
శించాడు" అని చెప్పాడు.
కాని ఎలీషా, "యెహోవా జీవంతోడు, నా జీవం
తోడు నేను నిన్ను విడిచి వెళ్లను" అని ఏలీయాతో
చెప్పాడు. అందువల్ల ఆ ఇద్దరు మనుష్యులు బేతేలుకు
వెళ్లారు.
3బేతేలులో వున్న ప్రవక్తలు ఎలీషా వద్దకు వచ్చి
యిట్లన్నారు: "నేడు నీ యజమానిని నీ వద్దనుండి
యెహోవా తీసుకొని పోవునన్న విషయం నీకు
తెలుసా?"
"అవును. నాకు తెలుసు. ఆ విషయం మాటలా
డకు." అని ఎలీషా చెప్పాడు.
4ఎలీషాతో ఏలీయా, "దయచేసి ఇక్కడ
వుండుము. ఎందుకనగా నన్ను యెరికోకు వెళ్లమని
యెహోవా ఆదేశించాడు" అని చెప్పాడు.
కాని ఎలీషా, "యెహోవా జీవంతోడు, నా జీవం
తోడు నేను నిన్ను విడిచి వెళ్లను" అని చెప్పాడు.
అందువల్ల వారిరువురు మనుష్యులు యెరికోకు వెళ్లారు.
5యెరికోలోనున్న ప్రవక్తల బృందం ఎలీషా వద్దకు
వచ్చి యిట్లన్నారు. "నేడు నీ యజమానిని నీ వద్దనుండి
యెహోవా తీసుకొని పోవునన్న విషయం నీకు
తెలుసా?" ఎలీషా, "అవును, నాకు తెలుసు. ఆ విష
యమై మాటలాడకు" అని చెప్పాడు.
6ఏలీయా ఎలీషాతో, "దయచేసి ఇక్కడ
వుండుము. ఎందుకంటే నన్ను యోర్దాను నది వద్దకు
వెళ్లమని యెహోవా ఆదేశించాడు" అని చెప్పాడు.
ఏలీయా ఇలా అన్నాడు, "యెహోవా జీవంతోడు,
నా జీవంతోడు నేను నిన్ను విడిచి వెళ్లను." అందువల్ల
ఆ ఇరువురు వెళ్లారు.
7ప్రవక్తల బృందం నుండి ఏభై మంది మనుష్యులు
వారిని అనుసరించారు. ఏలీయా ఎలీషాలు యోర్దాను
నదివద్ద నిలిచారు. ఆ ఏభై మంది మనుష్యులు ఏలీయా
ఎలీషాలకు దూరంగా నిలబడ్డారు.
8ఏలీయా తన అంగీని తీసి మడత పెట్టి నీటిమీద
దానితో కొట్టాడు. నీళ్లు కుడికీ ఎడమకీ వేరు వేర
య్యాయి. అప్పుడు ఏలీయా ఎలీషాలు పొడినేల మీద
నదిని దాటారు.
9వారు నదిని దాటిన తర్వాత, ఏలీయా ఎలీషాతో,
"నీనుండి యెహోవా నన్ను తీసుకొని పోవడానికి
ముందు నీ కోసం నన్నేమి చేయమంటావు?" అని
ఏలీయా అడిగాడు.
"నీ ఆత్మ రెండింతల భాగముగా నామీదికి వచ్చు
నట్లు చేయి" అని ఎలీషా అడిగాడు.
10ఏలీయా, "కష్టమైన విషయం నీవు అడిగావు.
నన్ను నీనుండి తీసుకొని పోయేటప్పుడు నన్ను
చూస్తూ వుంటే అది జరుగుతుంది. కాని నన్ను నీనుండి
తీసుకొని పోయేటప్పుడు చూడకుంటే, అప్పుడు అది
జరగదు" అని చెప్పాడు.

### దేవుడు ఏలీయాను పరలోకానికి తీసుకొని పోవుట

11ఏలీయా ఎలీషాలు ఒకటిగా నడుస్తూ మాటలా
డుతూ వున్నారు. ఉన్నట్టుండి కొన్ని గుర్రాలు, ఒక
అగ్నిరథం వచ్చి ఏలీయా ఎలీషాలను వేరు చేసాయి.
ఆ గుర్రాలు మరియు రథం ఉన్నాయి. తర్వాత ఒక
సుడిగాలి ద్వారా ఏలీయా పరలోకానికి తీసుకొని
పోబడ్డాడు.
12అది ఎలీషా చూచి, "నా తండ్రీ! నా తండ్రీ!
ఇశ్రాయేలు రథం, దాని గుర్రపు సైనికులు"* అని
అరిచాడు. ఎలీషా ఏలీయాని ఆ తర్వాత ఎన్నడూ
చూడలేదు. ఎలీషా తన విచారాన్ని వ్యక్తం చేయడానికి
తన వస్త్రాలను రెండుగా చింపివేశాడు.
13ఏలీయా ధరించు వస్త్రం భూమిమీదికి పడింది.
అందువల్ల ఎలీషా దానిని తీసుకున్నాడు. ఎలీషా
నీటినికొట్టి, "ఏలీయా దేవుడైన యెహోవా ఎక్కడ?"
అన్నాడు.
14ఎలీషా నీటిని కొట్టగా నీళ్లు కుడికీ ఎడమకీ వేరు
వేరయ్యాయి. అప్పుడు ఎలీషా నదిని దాటాడు.

---

**ఇశ్రాయేలు ... సైనికులు** దేవుడు మరియు ఆయన పరలోక సైన్యం అని అర్థం.

### ఏలీయా కోసం ప్రవక్తలు అడుగుట

[15]యెరికోలోని ప్రవక్తల బృందం ఎలీషాని చూడ
గానే, "ఏలీయా ఆత్మ ఇప్పుడు ఎలీషా మీద వున్నది"
అన్నారు. ఎలీషాని కలుసుకునేందుకు వారు వచ్చారు.
ఎలీషా ముందు వారు నేలకు తాకునట్లుగా నమస్క
రించారు. [16]అతనితో వారు ఇట్లన్నారు: "ఇదుగో,
మా వద్ద ఏభై మంది సజ్జనులున్నారు. వారు వెళ్లి నీ
యజమానికోసం వెతకనిమ్ము. యెహోవా ఆత్మ
ఒకవేళ ఏలీయాని పైకి తీసుకొని పోయి ఏ కొండ
మీదనో లేక ఏ లోయలోనో పడవేసి వుండవచ్చు."
కాని ఎలీషా, "వద్దు ఏలీయాని వెతకడం కోసం
మనుష్యుల్ని పంపవద్దు" అని చెప్పాడు.
[17]ప్రవక్తల బృందం అతను ఇబ్బందిలో పడనంత
వరకు ప్రార్థించారు. అప్పుడు ఎలీషా, "బాగున్నది.
ఏలీయాని వెతకడం కోసం మనుష్యుల్ని పంపించండి"
అని చెప్పాడు. ప్రవక్తల బృందం ఆ ఏభై మంది
మనుష్యులను ఏలీయాకోసం పంపారు. మూడు
రోజులపాటు వారు వెతికారు. కాని ఏలీయాను వారు
కనుగొనలేక పోయారు. [18]కనుక ఎలీషా నివసించు
చున్న యెరికోకి వారు వెళ్లారు. ఏలీయాని తాము
కనుగొనలేక పోయామని వాళ్లు అతనితో చెప్పారు.
ఎలీషా, "మీరు వెళ్లవద్దని నేను చెప్పాను" అన్నాడు.

### ఎలీషా నీటిని మంచి నీళ్లుగా చేయుట

[19]ఆ నగర పౌరులు ఎలీషాతో, "అయ్యా, ఈ
నగరం చక్కని ప్రదేశంలో వున్నట్టు మీరు చూస్తు
న్నారు. కాని నీళ్లు మంచివి కావు. అందువల్లనే ఈ
ప్రదేశంలో పంటలు పండవు" అని చెప్పారు.
[20]"ఒక కొత్త పాత్ర తీసుకురండి. అందులో ఉప్పు
వేయండి" అని ఎలీషా చెప్పాడు.
పౌరులు పాత్రను ఎలీషా వద్దకు తీసుకు వచ్చారు.
[21]తర్వాత భూమినుండి నీరు ప్రవహించే ఆ స్థలం
వద్దకు ఎలీషా వెళ్లాడు. ఎలీషా ఆ ఉప్పును నీటిలోకి
విసిరాడు. "నేను ఈ నీటిని బాగు చేయుచున్నానని,
ఇప్పటినుండి ఈ నీరు మరణము కలిగించదు. పంటలు
పండనట్లుగా చేయదు" అని యెహోవా చెప్పాడు.
[22]ఆ నీరు పరిశుద్ధ మయ్యింది. ఆ జలము నేటికీ
మంచి నీరుగా ఉంది ఎలీషా చెప్పినట్లుగానే అది జరిగెను.

### ఎలీషాని కొందరు పిల్లలు ఎగతాళి చేయుట

[23]ఎలీషా ఆ నగరం నుండి బేతేలుకు వెళ్లాడు.
ఎలీషా నగరం చేరడానికి కొండ ఎక్కుతూ ఉన్నాడు.
నగరం నుండి కొందరు పిల్లలు బయటికి వస్తున్నారు.
ఎలీషాని చూచి వారు ఎగతాళి చేశారు. అతనితో వారు
ఇట్లు అన్నారు: "ఓ బట్టతల మనిషీ, పైకి వెళ్లుము."
[24]ఎలీషా వెనుదిరిగి ఆ బాలురను చూశాడు. వారి
పట్ల చెడు విషయాలు జరగాలని అతను యెహో
వాని అర్థించాడు. తర్వాత అడవినుండి రెండు ఎలుగు
బంట్లు వెలుపలికి వచ్చి ఆ బాలురను ఎదిరించాయి.
ఆ ఎలుగుబంట్లు ఆ నలభైరెండు మంది పిల్లలను
చీల్చివేశాయి.
[25]ఎలీషా బేతేలు వీడి కర్మెలు పర్వతం వద్దకు
వెళ్లాడు. మరియు అక్కడ నుండి, ఎలీషా షోమ్రోనుకు
మరలి వెళ్లాడు.

### ఇశ్రాయేలుకి యెహోరాము రాజవుట

3 అహాబు కుమారుడైన యెహోరాము షోమ్రో
నులో ఇశ్రాయేలుకు రాజయ్యాడు. యూదా
రాజుగా యెహోషాపాతు 18 వ పరిపాలనా సంవత్స
రమున అతను పాలించడానికి మొదలు పెట్టాడు.
యెహోరాము 12 సంవత్సరములు పరిపాలించాడు.
[2]యెహోవా తప్పని చెప్పిన పనులు యెహోరాము
చేశాడు. కాని యెహోరాము తన తల్లిదండ్రులవంటి
వాడు కాడు. బయలు దేవతను పూజించేందుకు తన
తండ్రి నిర్మించిన స్తంభాన్ని అతడు తొలగించాడు.
కాని నెబాతు కుమారుడైన యరొబాము చేసిన పాపా
లను అతడు చేశాడు. [3]యరొబాము ఇశ్రాయేలు వారిని
పాపములు చేసేటట్లు చేశాడు. యెహోరాము యరొ
బాము చేసిన పాపాలను ఆపలేకపోయాడు.

### ఇశ్రాయేలు నుండి మోయాబు వేరు పడుట

[4]మోయాబు రాజు మేషా. మేషావద్ద చాలా మేక
లుండెను. మేషా 1,00,000 గొర్రెల ఉన్నిని 1,00,000
గొర్రె పొట్టేలుల ఉన్నిని ఇశ్రాయేలు రాజుకి ఇచ్చాడు.
[5]కాని అహాబు మరణించిన తర్వాత, మోయాబు రాజు
ఇశ్రాయేలు రాజ్యపరిపాలనలో నుండి తిరుగుబాటు
చేశాడు.
[6]తర్వాత యెహోరాము రాజు షోమ్రోను నుండి
వెలుపలికి పోయి ఇశ్రాయేలు మనుష్యులందరిని సమీక
రించాడు. [7]యెహోరాము యూదారాజైన యెహో
షాపాతు వద్దకు దూతలను పంపాడు. యెహోరాము
ఇట్లన్నాడు: "మోయాబు రాజు,నా పరిపాలనపై తిరుగ
బడ్డాడు. మోయాబుతో యుద్ధము చేయడానికి నీవు
నాతో కలసెదవా?"
యెహోషాపాతు, "అలాగే నేను నీతో కలుస్తాను.
మనమిద్దరము ఒక సైన్యమవుదాము. నా ప్రజలు నీ
ప్రజలవలె వుంటారు. నా గుర్రములు నీ గుర్రములవలె
వుంటాయి." అని చెప్పాడు.

### ఆ ముగ్గురు రాజులు ఎలీషా సలహా కోరుట

[8]యెహోషాపాతు యెహోరాముతో, "మనము
ఏ త్రోవను వెళ్లాలి?" అని అడిగాడు. "మనము ఎదోము
ఎడారిద్వారా వెళ్లాలి" అని యెహోరాము సమాధాన
మిచ్చాడు.

9అందువల్ల ఇశ్రాయేలు రాజు, యూదా, ఎదోము
రాజులతో కలిసి వెళ్లాడు. ఏడు రోజులపాటు వాళ్లు
ప్రయాణం చేశారు. తమ సైన్యానికి గానీ, జంతువు
లకు గానీ తగినంత నీరు దొరకలేదు. 10చివరికి ఇశ్రా
యేలు రాజు (యెహోరాము) ఇలా చెప్పాడు,
"యెహోవా నిజంగానే మన ముగ్గురిని మోయాబు
రాజులను ఓడించటానికే ఒకటిగా చేశాడు."

11కాని యెహోషాపాతు, "తప్పక యెహోవా
యొక్క ఒక ప్రవక్త ఇక్కడే వున్నాడు. మనమేమి
చేయవలెనో యెహోవాని అడగమని మనము ఆ
ప్రవక్తను అడుగుదాము" అని చెప్పాడు.

ఇశ్రాయేలు రాజు సేవకుడొకడు, "షాపాతు కుమా
రుడైన ఎలీషా ఇక్కడే వున్నాడు. ఎలీషా ఏలీయా
యొక్క సేవకుడు" అని చెప్పాడు.

12"యెహోవా మాట ఎలీషాతో ఉన్నది" అని
యెహోషాపాతు పలికాడు.

అందువల్ల ఇశ్రాయేలు రాజు (యెహోరాము),
ఎదోము రాజు మరియు యెహోషాపాతు ఎలీషాని
దర్శించటానికి వెళ్లారు.

13ఇశ్రాయేలురాజు (యెహోరాము)తో ఎలీషా,
"నా నుండి నీకేమి కావలెను! నీ తల్లిదండ్రులయొక్క
ప్రవక్తల వద్దకు పొమ్ము" అన్నాడు.

ఇశ్రాయేలు రాజు ఎలీషాతో, "అలా కాదు. మేము
నిన్ను దర్శించుటకే వచ్చాము. మమ్మల్ని మోయా
బీయులను ఓడించటానికి మా ముగ్గురి రాజులను
దేవుడు ఒకటిగా పిలిచాడు" అని చెప్పాడు.

14"నేను యూదా రాజయిన యెహోషాపాతును
గౌరవిస్తున్నాను. యెహోవా పేరు మీద ప్రమాణం
చేసి చెప్తున్నాను. సర్వశక్తిమంతుడైన యెహోవాను
నేను సేవిస్తాను. యెహోవా జీవముతోడు యెహోషా
పాతు కనుక లేకపోయినచో నేను నిన్ను శ్రద్ధ చేయక
నిన్ను పూర్తిగా నిర్లక్ష్యము చేసేవాడిని. 15కాని ఇప్పుడు
వీణ వాయించే వానిని తీసుకొని రమ్ము." అని ఎలీషా
చెప్పాడు. ఆ వ్యక్తి వీణ వాయించగానే, యెహోవా
యొక్క శక్తి ఎలీషా మీదికి వచ్చింది. 16అప్పుడు ఎలీషా,
"యెహోవా చెప్పుచున్నది ఇదే. లోయలో రంధ్రాలు
చేయండి. 17యెహోవా చెప్పుచున్నది ఇదే. నీవు
పెనుగాలిని చూడవు. నీవు వానను చూడవు. కాని
లోయ నీటితో నిండి ఉంటుంది. అప్పుడు నీవు, నీ
ఆవులు, జంతువులు తాగటానికి నీరు లభిస్తుంది. 18ఇది
చేయడం యెహోవాకు సులభం మోయాబీ యులను
ఓడించేలా యెహోవా చేయగలడు. 19నీవు ప్రతి దృఢ
మైన నగరముపై మరియు ప్రతి మంచి నగరముపై
దాడి చేస్తావు. నీవు ప్రతి మంచి వృక్షాన్ని నరికి వేస్తావు.
అన్ని ఊటలను నీవు నిలిపివేయగలవు. నీవు విసిరివేసే
రాళ్లతో ప్రతి మంచి స్థలమును నీవు పాడుచేస్తావు"
అని పలికాడు. 20ఉదయాన దేవునికి బలి జరిగే
సమయంలో ఎదోము మార్గము నుండి నీరు ప్రవ
హించడం ప్రారంభమయ్యింది. లోయనిండింది.

21మోయాబు లోని ప్రజలు తమతో యుద్ధం
చేయడానికి గాను రాజులు వచ్చిన విషయము
విన్నారు. కవచములు ధరించడానికి మనుష్యులందరు
ఒక్కటిగా వయసు మళ్లిన వారైయున్నారు. వారు
సరిహద్దు వద్ద వేచి ఉన్నారు. వారు యుద్ధానికి సిద్ధ
మయ్యారు. 22ఆ రోజు ఉదయం వారు పెందలకడనే
మేల్కొన్నారు. లోయలోని నీళ్లలో ప్రభాత సూర్యుడు
ప్రకాశిస్తూ ఉన్నాడు. అది మోయాబు ప్రజలకు నెత్తు
రువలె కనిపించింది. 23"నెత్తురు చూడుడి! రాజులు
తమలో తాము పోరాడుకొని వుండవచ్చును. ఒకరి
నొకరు నాశనము చేసికొని వుండవచ్చు. మృత శరీర
ముల నుండి విలువగల వస్తువులు తీసుకొనుటకు
గాను మనము వెళ్దాము" అని మోయాబు ప్రజలు
చెప్పుకున్నారు.

24మోయాబు ప్రజలు ఇశ్రాయేలు గుడారము
వద్దకు వచ్చారు. కాని ఇశ్రాయేలు వారు వెలుపలికి
వచ్చి మోయాబు సైన్యాన్ని ఎదుర్కొన్నారు. ఇశ్రా
యేలు ప్రజల నుండి మోయాబు ప్రజలు పారి
పోయారు. ఇశ్రాయేలు వారు మోయాబు దాకా పరుగె
త్తుకు పోయి మోయాబు ప్రజలతో యుద్ధం చేశారు.
25ఇశ్రాయేలు వారు నగరములను ధ్వంసం చేశారు.
వారు మోయాబులోని ప్రతి మంచి పట్టణము మీదికి
రాళ్లు విసిరివేశారు. నీటి బావులన్నిటినీ పూడ్చి
వేసినారు. అన్ని ఊటలను ఆపి వేశారు. అన్ని మంచి
చెట్లను నరికివేశారు. కీర్హరెశెతు వరకు వారు యుద్ధం
చేస్తు వెళ్లారు. ఇశ్రాయేలు సైనికులు కీర్హరెశెతు చుట్టు
ముట్టి, దాని మీద దాడిచేశారు.

26మోయాబు రాజు ఆ యుద్ధము తనకు కష్టమై
నదిగా చూశాడు. అందువల్ల ఖడ్గములు ధరించిన ఏడు
వందల మంది మనుష్యుల్ని తీసుకొని సైన్యాన్ని ఛేదిం
చడానికి, ఎదోము రాజుని హతమార్చడానికిగాను
వెళ్లాడు. కాని వారు ఎదోము రాజుని ఎదుర్కొనలేక
పోయారు. 27తర్వాత మోయాబు రాజు తన పెద్ద
కొడుకుని వెంట తీసుకొనిపోయాడు. తన అనంత
రము రాజు కావలసిన కుమారుడు అతడే. తన కుమా
రుని ప్రాకారము మీద దహన బలిగా అర్పించాడు. ఇది
చూచిన ఇశ్రాయేలీయులు తల కిందులయ్యారు.
అందువల్ల ఇశ్రాయేలు ప్రజలు మోయాబు రాజుని
విడిచి తమ దేశానికి తిరిగి వెళ్లిపోయారు.

### ఒక ప్రవక్తయొక్క భార్య విధవరాలై, సహాయం కోసం ఎలీషాని అడగటం

4 ప్రవక్తల బృందానికి చెందిన ఒకనికి భార్య ఉన్నది.
అతడు మరణించాడు. అతని భార్య ఎలీషాతో,
"నా భర్తకూడా నీకు ఒక సేవకుడు. ఇప్పుడు నా భర్త

మరణించాడు. అతను యెహోవాని గౌరవించెనని నీకు
తెలుసు. కాని అతను ఒక మనిషికి అప్పువుండెను.
ఇప్పుడా వ్యక్తి నా ఇద్దరు కొడుకులను తీసుకు వెళ్లి
వారిని తన బానిసలుగా చేసుకోవలెనని అనుకున్నాడు"
అని విన్నవించింది.
2"నేను నీకెలా సహాయం చేయగలను? మీ ఇంట్లో
ఏమున్నదో చెప్పుము" అని ఎలీషా అడిగినాడు. ఆమె,
"మా ఇంట్లో ఏమీ లేదు. ఒలీవ నూనెగల ఒక జాడీ
వున్నది" అని బదులు చెప్పింది.
3అప్పుడు ఎలీషా, "వెళ్లి మీ ఇరుగు పొరుగు వారి
వద్ద నుంచి పాత్రలు అడిగి తీసుకొనిరా. అవి ఖాళీగా
ఉండాలి. చాలా పాత్రలు అడిగి తీసుకో. 4తర్వాత మీ
ఇంటికి పోయి తలుపులు మూసుకో. నీవు నీ కుమా
రులు మాత్రం ఇంటిలో వుండాలి. అటు తర్వాత
నూనెను ఆ పాత్రలో పోయుము. వాటిని వేరే ఒక
చోట ఉంచుము" అని చెప్పాడు.
5అందువల్ల ఆ స్త్రీ ఎలీషాని విడిచి తన ఇంటిలోకి
వెళ్లి తలుపులు మూసుకొనినది. ఆమెయు తన కొడు
కులు మాత్రమే ఇంట్లో వున్నారు. ఆమె కుమారులు
పాత్రలు తెచ్చారు. ఆమె వాటిలో నూనె పోసింది.
6ఆమె చాలా పాత్రలు నింపింది. చివరికి, "మరొక
పాత్ర తీసుకొని రమ్ము" అని తన కొడుకుతో
చెప్పింది. కాని అన్ని పాత్రలు నిండిపోయివున్నాయి.
ఒక కుమారుడు ఆమెతో, "ఇక పాత్రలులేవు" అని
చెప్పాడు. ఆ సమయంలో జాడీలోని నూనె కూడ
పూర్తి అయింది.
7ఏమి జరిగిందో, అప్పుడు ఆ స్త్రీ ఎలీషాతో
చెప్పింది. ఎలీషా ఆమెతో అన్నాడు, "వెళ్లు, నూనెను
అమ్మి నీ అప్పు తీర్చి వేయి. నీవు నూనెను అమ్మిన
తర్వాత, నీ అప్పును తీర్చిన తర్వాత నీవు నీ కుమా
రులు మిగిలిన పైకంతో జీవించగలుగుతారు."

### షూనేములోని ఒక స్త్రీ ఎలీషాకి గది ఇచ్చుట

8ఒకరోజు ఎలీషా షూనేము వెళ్లాడు. ఒక ముఖ్యమైన
స్త్రీ షూనేములో నివసిస్తున్నది. ఈ స్త్రీ తన ఇంట
విశ్రమించి భోజనం చేయమని ఎలీషాను కోరింది.
కనుక ఆ ప్రదేశం మీదుగా ఎలీషా వెళ్లిన ప్రతిసారి
అక్కడ ఆగి భోజనం చేసేవాడు.
9ఆ స్త్రీ తన భర్తతో, "ఇదుగో, నాకు ఎలీషా
దేవుని పవిత్ర వ్యక్తిగా గోచరిస్తున్నాడు. ఎప్పుడూ
అతను మన ఇంటి మీదుగా వెళ్తాడు. 10ఎలీషా కోసం
మనము ఇంటి పై భాగాన ఒక గదిని కట్టిద్దాము. ఆ
గదిలో ఒక మంచము కూడా అమర్చుదాము. అక్కడ
ఒక మేజాబల్ల, ఒక కుర్చీ, ఒక దీపం ఉంచుదాము.
ఎప్పుడైతే అతను మన ఇంటికి వస్తాడో అప్పుడు
దీనిని అతను తన గదిగా వాడుకోవచ్చు" అని చెప్పింది.
11ఒకరోజు ఎలీషా ఆమె ఇంటికి వచ్చాడు. అతను ఆ
గదికి వెళ్లి, అక్కడ విశ్రమించాడు. 12ఎలీషా తన
సేవకుడైన గేహజీతో, "ఆ షూనేము స్త్రీని పిలువుము"
అని చెప్పాడు. సేవకుడు షూనేము స్త్రీని పిలిచాడు.
ఆమె ఎలీషా ఎదుట నిలిచింది. 13ఎలీషా తన సేవకు
నితో ఇట్లనెను: "ఇప్పుడీమెకు చెప్పుము. మాకోసం
నీవు చేయదగినదంతా చేశావు. నీ కోసం మేమేమి
చేయుదుము? మేము నీ పక్షమున రాజుతో గాని,
సైన్యం యొక్క నాయకునితో గాని ఏమైనా చెప్ప
మంటావా?"
ఆ స్త్రీ, "నేను నా ప్రజల మధ్య హాయిగా ఇక్కడ
నివసిస్తున్నాను" అని బదులు చెప్పింది.
14"మనమామెకు ఏమి చేద్దాం?" అని ఎలీషా
గేహజీని అడిగాడు.
"ఆమెకు కొడుకు లేడని నాకు తెలియును. ఆమె
భర్త ముసలివాడు" అని ప్రత్యుత్తర మిచ్చాడు.
15అప్పుడు ఎలీషా, "ఆమెను పిలువుము" అన్నాడు.
అందువల్ల గేహజీ ఆమెను పిలుచుకొని వచ్చాడు. ఆమె
వచ్చి అతని ఎదుట నిలబడింది. 16ఎలీషా ఆమెతో,
"వచ్చే వసంత కాలంలో, ఈ పాటికి నీవు నీ సొంత
మగ బిడ్డను కౌగిలించుకుని ఉందువు" అన్నాడు. ఆ
స్త్రీ, "కాదు దైవజనుడా! నాతో అబద్ధం చెప్పకు"
అని చెప్పింది.

### షూనేము స్త్రీకి కొడుకు పుట్టుట

17ఆమె గర్భవతి అయింది. ఎలీషా చెప్పినట్లుగా,
తరువాత వసంత ఋతువులో ఆమె ఒక కుమారుని
ప్రసవించింది.
18ఆ పిల్లవాడు పెరిగాడు. ఒకరోజు అతను కంకుల్ని
కోస్తున్న తన తండ్రిని పనివారిని చూసేందుకు పొలం
లోకి వెళ్లాడు. ఆ పిల్లవాడు 19తండ్రిని చూచి, "అయ్యో,
నా తల, నా తల పగిలిపోతున్నది" అన్నాడు.
"అతనిని ఆ తల్లి వద్దకు ఎత్తుకొని వెళ్లండి" అని
తండ్రి తన సేవకునికి చెప్పెను.
20సేవకుడు ఆ పిల్లవానిని అతని తల్లి వద్దకు తీసుకు
వెళ్లాడు. మధ్యాహ్నం దాకా పిల్లవాడు తల్లి తొడమీద
కూర్చొని వున్నాడు. తర్వాత ఆ పిల్లవాడు మర
ణించాడు.

### ఎలీషాని చూడటానికి ఆ స్త్రీ వెళ్లటం

21దైవజనుడైన (ఎలీషా) పడకమీద ఆమె తన
పిల్లవానిని ఉంచి ఆమె ఆ గది తలుపు మూసివేసి
వెలుపలికి వెళ్లింది. 22ఆమె తన భర్తను పిలచి, "ఒక
సేవకుని ఒక గాడిదను పంపుము. అప్పుడు నేను
దైవజనుని (ఎలీషా) కలుసుకునేందుకు త్వరగా వెళ్లె
దను" అని చెప్పింది.
23ఆమె భర్త, "దైవజనుని (ఎలీషా) వద్దకు నేడెం
దుకు నీవు వెళ్లుచున్నావు. నేడు అమావాస్య గాని

సబ్బాతు రోజుగాని కాదు" అన్నాడు. "ఫరవాలేదు
అంతా సక్రమంగానే వుంటుంది" అని ఆమె చెప్పింది.
24తర్వాత ఆమె గాడిదకు ఒక గంత పరిచింది. ఆ
సేవకునితో, మనము త్వరగా వెళదాము, వేగముగా
తోలుము, నేను చెప్పేంత వరకూ నెమ్మదిగా తోల
వద్దని చెప్పింది.
25ఆ స్త్రీ దైవజనుడను (ఎలీషా) చూసేందుకు
కర్మెలు పర్వతానికి వెళ్లింది.
దైవజనుడు (ఎలీషా) షూనేము స్త్రీ చాలాదూరం
నుండి వస్తుండగా చూశాడు. ఎలీషా తన సేవకుడైన
గేహజీతో చెప్పాడు "చూడు ఆమె షూనేము స్త్రీ,
26ఇప్పుడే పరుగెత్తుకుని వెళ్లు, ఆమెను కలుసుకు
నేందుకు, 'ఏమి కష్టం? నీవు సరిగా వున్నావా? నీ భర్త
సరిగా వున్నాడా?' నీ బిడ్డ సరిగావున్నాడా? అని ఆమెను
కలుసుకొని అడుగుము." గేహజీ ఆ విధంగా ఆ
షూనేము స్త్రీని అడిగాడు. ఆమె, " అంతా క్షేమము"
అని చెప్పింది.
27కాని ఆ షూనేము స్త్రీ దైవజనుని కోసం కొండ
మీదికి వెళ్లి క్రిందికి వంగి ఎలీషా పాదాలు తాకింది.
గేహజీ ఆమెను పక్కకు తొలగించాలని ఆమె దగ్గరికి
వచ్చాడు. కాని దైవజనుడు (ఎలీషా) గేహజీని చూచి,
"ఆమెను ఉండనీ. ఆమె చాలా బాధగా ఉన్నది. ఆ
సంగతి నాకు యెహోవా చెప్పలేదు. యెహోవా
ఈ విషయం నాకు చెప్పక దాచాడు." అని పలికాడు.
28అప్పుడు షూనేము స్త్రీ, "అయ్యా నాకు కొడుకు
కావలయునని నేను చెప్పలేదు గదా. నన్ను మోసం
చెయ్యవద్దు" అన్నాను, అని అనగా
29వెంటనే గేహజీతో, ఎలీషా, "నీవు ఆమెతో వెళ్ల
డానికి సిద్ధంగా వుండుము. నా చేతికర్ర తీసుకుని
వెళ్లుము. ఎవరితోను మాటలాడుటకు ఆగవద్దు. ఎవ
రినైనా నీవు కలుసుకుంటే, అతనితో నమస్కారము
అని కూడా చెప్పకుము. ఒకవేళ ఎవరైనా నీకు, 'నమ
స్కారము' అన్నట్లయితే, అతనికి బదులు చెప్పకుము.
నా చేతి కర్రను బిడ్డ ముఖమున ఉంచుము" అని
చెప్పాడు.
30కాని ఆ బిడ్డ తల్లి, "నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను.
యెహోవా జీవంతోడు, నీ జీవం తోడు నీవు రాకుండా
నేను వెళ్లను" అంది. అందువల్ల ఎలీషా లేచి, షూనేము
స్త్రీని అనుసరించాడు.
31ఎలీషా మరియు షూనేము స్త్రీ చేరుకునేందుకు
ముందుగా, గేహజీ షూనేము స్త్రీ ఇల్లు చేరుకున్నాడు.
ఆ బిడ్డ ముఖము మీద ఆ కర్రను ఉంచాడు. కాని
బిడ్డ మాటలాడలేదు. ఏమియు వినిపించిన జాడ కూడా
తెలియరాలేదు. అప్పుడు గేహజీ ఎలీషాని కలుసు కోవ
డానికి వెలుపలికి వచ్చాడు. "బిడ్డ లేవడు" అని గేహజీ
ఎలీషాకి చెప్పాడు.

### షూనేము స్త్రీ కుమారుడు మరల బ్రతుకుట

32ఎలీషా ఇంట్లోకి వెళ్లాడు. తన మంచం మీద ఆ
బిడ్డ చనిపోయివున్నాడు. 33ఎలీషా గదిలోకి వెళ్లి తలుపు
మూసుకున్నాడు. ఇప్పుడు ఎలీషా మరియు ఆ బిడ్డ
మాత్రమే గదిలో వున్నారు. అప్పుడు ఎలీషా యెహో
వాని ప్రార్థించాడు. 34ఎలీషా పడక వద్దకు వెళ్లాడు.
బిడ్డ మీద పడుకున్నాడు. ఎలీషా తన నోటిని బిడ్డ
నోటిమీద వుంచాడు. ఎలీషా తన కండ్లను బిడ్డ కండ్ల
మీద వుంచాడు. తరువాత బిడ్డ దేహం వేడి ఎక్కేంత
వరకు బిడ్డమీద ఎలీషా పండుకొన్నాడు.
35తర్వాత ఎలీషా లేచి ఆ గది చుట్టూ తిరిగాడు.
వెనుకకు వెళ్లి, బిడ్డ ఏడు సార్లు తుమ్మేంత వరకూ
కళ్లు తెరిచేంతవరకూ బిడ్డ మీద పండుకొన్నాడు.
36ఎలీషా గేహజీని పిలచి, "ఆ షూనేము స్త్రీని
పిలువుము" అని చెప్పాడు.
గేహజీ షూనేము స్త్రీని పిలచాడు. ఆమె ఎలీషా
వద్దకు వచ్చింది. "నీ కొడుకుని ఎత్తుకో" అని ఎలీషా
చెప్పాడు. 37తర్వాత షూనేము స్త్రీ గదిలోకి వెళ్లి,
ఎలీషా పాదాలకు మోకరిల్లింది. ఆ తర్వాత తన పిల్ల
వాడిని ఎత్తుకుని ఆమె వెలుపలికి వెళ్లింది.

### ఎలీషా మరియు విషం కలిపిన కూర

38ఎలీషా మరల గిల్గాలుకు వెళ్లాడు. అప్పుడా
ప్రదేశంలో ఆకలి ఎక్కువగా వుంది. ప్రవక్తల బృందం
ఎలీషా ముందు కూర్చున్నారు. ఎలీషా తన సేవకు
నితో, "పెద్ద కుండను నిప్పు మీద ఉంచుము. ప్రవక్తల
బృందానికి కూర తయారు చేయి" అని చెప్పాడు.
39ఒక వ్యక్తి మూలికలు తీసుకు వచ్చేందుకు పొలం
వెళ్లాడు. అతను పిచ్చి ద్రాక్ష చూసి దాని కాయలు
తీసుకు వచ్చాడు. ఆ కాయలు తన ఒడిలో కట్టుకుని
తీసుకుని వచ్చాడు. అతను ఆ కాయలను ముక్కలు
చేసి కుండలో వేశాడు. కాని అది ఏ రకపు ఫలమో
ప్రవక్తల బృందానికి తెలియదు.
40తర్వాత వారు మనుష్యులకు కొంచెం కూర
తినడానికి వడ్డించారు. కాని వారు కూర తినడానికి
ప్రారంభించగా, ఎలీషాని పిలచి, "దైవజనుడా!
కుండలో విషం ఉన్నది" అని అన్నారు. ఆ కూర
విషంలా వుంది. అందువల్ల అది వారు తినలేకపోయారు.
41అప్పుడు ఎలీషా, "కొంచెం పిండి తీసుకురండి"
అన్నాడు. వారు పిండిని ఎలీషా వద్దకు తీసుకు వచ్చారు.
దాన్ని అతను కుండలో వేసి. "మనుష్యులకు ఆ
కూర వడ్డించండి. వారు భుజిస్తారు" అని ఎలీషా
చెప్పాడు. ఆ కూరలో ఎలాంటి దోషం లేదు.

### ప్రవక్తల బృందానికి ఎలీషా ఆహారమిచ్చుట

42బయల్షాలిషా నుంచి ఒక వ్యక్తి వచ్చాడు. అతడు
మొదటి పంటవల్ల లభించిన (ఎలీషా) ఇరవై యవల

రొట్టెలు, క్రొత్త ధాన్యపు కంకులను, కొన్ని పండ్లను దైవజనునికి ఇచ్చాడు. ఎలీషా అప్పుడు, "వీటిని వారికి ఆహారంగా ఇవ్వండి" అన్నాడు.

43 ఎలీషా సేవకుడు, "ఏమిటి? ఇక్కడ వంద మంది ఉన్నారు. నేను వారందరికీ ఈ ఆహారం ఎలా ఇవ్వ గలను?" అని అన్నాడు.

కాని ఎలీషా, "వారు తినడానికిగాను అది ఇమ్ము. వారది భుజిస్తారు. ఇంకా కొంచెం ఆహారం మిగులు తుంది అని యెహోవా చెప్పాడు" అన్నాడు.

44 అప్పుడు ఎలీషా సేవకుడు ఆ ఆహారమును ప్రవక్తల ముందుంచాడు. ప్రవక్తల బృందం తినడానికి తగినంత ఆహారం ఉండి, పైగా ఇంకా ఆహారం మిగిలి పోయింది. యెహోవా చెప్పినట్లుగానే ఇది జరిగింది.

### నయమాను సమస్య

5 సిరియా రాజు యొక్క సైన్యాధిపతి నయమాను. రాజుకి అతడు అతి ముఖ్యుడు. ఎందుకనగా, యెహోవా అతనిని ఉపయోగించుకొని సిరియా విజయం సాధించేలా చేశాడు. నయమాను మహాశక్తి మంతుడు, గొప్పవాడు. కాని కుష్ఠవ్యాధి వలన అతను బాధ పడుతూ ఉన్నాడు.

2 ఇశ్రాయేలులో యుద్ధం చేయడానికై సిరియను సైన్యం అనేక బృందాల సైనికులను పంపింది. ఇశ్రాయేలీయులను వారి బానిసలుగా గ్రహించారు. ఒకసారి వారు ఇశ్రాయేలునుంచి ఒక అమ్మాయిని తీసుకు వచ్చారు. ఆ అమ్మాయి నయమాను భార్యకు సేవకురాలుగా, ఉంది. 3 ఆ అమ్మాయి నయమాను భార్యతో ఇలా చెప్పింది: "నా యజమాని (నయమాను) ప్రవక్తయైన ఎలీషాను కలుసుకోవాలని నా కోరిక. ఎలీషా షోమ్రోను నివాసి. ఆ ప్రవక్త నయమాను కుష్ఠవ్యాధిని బాగు చేయగలడు."

4 నయమాను తన యజమాని (సిరాయారాజు) వద్దకు వెళ్లాడు. సిరియా రాజుకి ఆ అమ్మాయి చెప్పిన విషయాలు నయమాను తెలిపాడు. 5 అప్పుడు సిరియా రాజు, "అయితే ఇప్పుడే వెళ్లు. నేను ఇశ్రాయేలు రాజుకి ఒక లేఖ పంపుతాను" అన్నాడు.

అందువల్ల నయమాను ఇశ్రాయేలుకి వెళ్లాడు. నయమాను కొన్ని కానుకలు తీసుకు వెళ్లాడు. ఏడువందల పౌనుల వెండి, అరు వేల బంగారం ముక్కలు మరియు పది దుస్తులు నయమాను తీసుకు వెళ్లాడు. 6 సిరియా రాజు ఇశ్రాయేలు రాజుకి ఇచ్చిన లేఖ కూడా తీసుకు వెళ్లాడు. ఆ లేఖలో ఇలా వుంది:"... నేను ఇప్పుడు నా సేవకుడైన నయమానుని నీ వద్దకు పంపుతున్నాను. అతని కుష్ఠవ్యాధిని నివారించుము."

7 ఇశ్రాయేలు రాజు ఆ ఉత్తరం చదవగానే, తాను తలక్రిందులైనానని విచారంగా ఉన్నానని తెలిపేందుకు తన దుస్తులు చింపివేశాడు. ఇశ్రాయేలు రాజు, "నేను దేవుడినా? కాదు. జీవ మరణాల మీద నాకు శక్తిలేదు. అందువల్ల సిరియా రాజు కుష్ఠవ్యాధితో బాధపడే ఒకనిని స్వస్థపరచుటకు నా వద్దకు ఎందుకు పంపినట్లు? దానిని గురించి ఆలోచించుము. అది ఒక మాయోపాయమని తెలియుచున్నది. సిరియా రాజు యుద్ధానికి సన్నద్ధుడవుతున్నాడు" అని చెప్పాడు.

8 ఇశ్రాయేలు రాజు తన వస్త్రమును చింపుకొనిన సంగతి దైవజనుడైన ఎలీషాకు తెలిసినపుడు ఈ క్రింది సందేశాన్ని రాజుకి పంపాడు: "మీరు మీ దుస్తులు ఎందుకు చింపివేసుకొన్నారు? నయమానుని నా వద్దకు పంపండి. అప్పుడతను ఇశ్రాయేలులో ఒక ప్రవక్త ఉన్నట్లు తెలుసు కుంటాడు."

9 ఈ కారణంగా నయమాను తన గుర్రాలతోను రథాలతోను ఎలీషా ఇంటికి వచ్చాడు. తలుపుకి వెలుపల నుంచున్నాడు. 10 ఎలీషా ఒక దూతను నయమాను వద్దకు పంపాడు. ఆ దూత, "వెళ్ళి. ఏడు మారులు యోర్దాను నదిలో స్నానం చేయుము. అప్పుడు నీ చర్మం నయమవుతుంది. నీవు పరిశుద్ధుడవు అవుతావు, శుభ్రపడతావు" అన్నాడు.

11 నయమాను కోపపడి, వెళ్లిపోయాడు. అతను, "ఎలీషా కనీసం వెలుపలికి వచ్చి నా యెదుట నిలబడి తన దేవుడైన యెహోవాని పిలుస్తాడనుకున్నాను. నా ముందర చేయి ఆడించి మరి నా కుష్ఠవ్యాధి బాగుచేస్తాడని ఆశించాను. 12 దమస్కు నదులైన అబానా, ఫర్పరులు ఇశ్రాయేలులోని అన్ని జలాల కంటె మంచివి. నేనెందుకు దమస్కులోని ఆ నదులలో స్నానం చేసి శుద్ధుణ్ని కాకూడదు!" అని అనుకొని నయమాను మహాగ్రుడయి కోపంతో వెళ్లి పోయాడు.

13 కాని నయమాను సేవకులు అతనిని సమీపించి అతనితో మాట్లాడారు. వారు ఈ విధంగా అన్నారు: "తండ్రీ ప్రవక్త మిమ్మల్ని ఒక కష్టమైన విషయం చెయ్యమని చెప్పగా, ఆ విధంగా చేయాలి అంతేనా? మీతో సులభమైన పని చెప్పినా, అది కూడా పాటించాలి. ఆయన చెప్పిందేమనగా, కడుగుకొనుము నీవు పరిశుద్ధుడవయ్యెదవు."

14 అందువల్ల దైవజనుడు ఎలీషా చెప్పినట్లుగా నయమాను ఆచరించాడు. నయమాను యోర్దాను నది లోపలికి వెళ్లి ఏడు సార్లు మునిగాడు. వెంటనే నయమాను పరిశుద్ధుడయ్యాడు. నయమాను చర్మం పసిపిల్లవాని చర్మంవలె మృదువుగా వుంది.

15 నయమాను మరియు అతని బృందంవారు దైవజనుడు (ఎలీషా) వద్దకు వచ్చారు. ఎలీషా ఎదుట అతను నిలబడి, "ఇదుగో, ఇశ్రాయేలులో తప్ప యీ ప్రపంచంలో మరెచ్చట కూడ దేవుడు లేడని ఇప్పుడు తెలుసుకున్నాను. ఇప్పుడు నా కానుకను స్వీకరింపుము" అని పలికాడు.

16కాని ఎలీషా, “నేను యెహోవాను సేవిస్తున్నాను.
యెహోవా జీవముతోడు, నేను ఎట్టి కానుకను స్వీక
రింపనని వాగ్దానం చేస్తున్నాను” అన్నాడు.
నయమాను కష్టతరంగా అతనిని సముదా యించు
టకు ప్రయత్నించాడు. కాని ఎలీషా తిరస్కరించాడు.
17అప్పుడు నయమాను, “ఈ కానుకను కనుక నీవు
స్వీకరించకపోతే, కనీసం ఇదైనా నా కోసం చేయుము.
నా రెండు కంచర గాడిదలు మీది గంపలను ఇశ్రాయేలు
దేశపు మన్నులో నింపుటకు అనుమతింపుము. ఎందు
కనగా, ఇతర దేవతలకు నేను ఎన్నటికీ ఎటువంటి
బలులు సమర్పించను, యెహోవాకి మాత్రమే సమర్పి
స్తాను. 18ఇది చేయడం వల్ల నన్ను యెహోవా క్షమిం
చునట్లు యెహోవాని ప్రార్థిస్తున్నాను. భవిష్యత్తులో,
నా యజమాని (సిరియా రాజు) రిమ్మోను ఆలయం
లోకి వెళ్లి అసత్య దేవతలను పూజిస్తాడు. రిమ్మోను
ఆరాధన జరుగునప్పుడు నా సహాయము కొరకు రాజు
నామీద ఆధారపడి వుంటాడు. అందువల్ల నేను
రిమ్మోను ఆలయంలో మోకరిల్లుతాను. అలా జరిగి
నప్పుడు నన్ను క్షమింపుమని యెహోవాని వేడుకొను
చున్నాను” అని పలికాడు. 19“నెమ్మదికలిగి వెళ్లుము”
అని ఎలీషా నయమానుకి చెప్పాడు. అందువల్ల నయ
మాను ఎలీషాని విడిచి కొంతదూరం వెళ్లాడు.
20కాని దైవజనుడు అయిన ఎలీషా సేవకుడు
గేహజీ, “నా యజమాని (ఎలీషా) సిరియనుడయిన
నయమానుని వెళ్లనిచ్చాడు. కాని అతడు తెచ్చిన కాను
కను స్వీకరించలేదు. యెహోవా జీవము తోడుగా
వెనుకనే నేను పరిగెత్తుకుపోయి, అతని వద్దనుంచి
ఏదైనా తీసుకువస్తాను” అని అనుకున్నాడు. 21అందు
వల్ల గేహజీ నయమాను వద్దకు పరుగెత్తుకు వెళ్లాడు.
తన వెనుక ఎవరో పరిగెత్తుకుని వస్తున్నట్లు నయ
మాను గ్రహించి. అతను తన రథం దిగి గేహజీని కలు
సుకుని, “అంతా సవ్యంగా వుందిగదా” అని నయమాను
అడిగెను.
22“అవును. అంతా సవ్యంగానే వుంది. నా యజ
మాని (ఎలీషా) నన్ను పంపాడు. ఇద్దరు యువకులు
నా వద్దకు వచ్చారనీ, కొండ దేశమైన ఎఫ్రాయిము
నుంచి ప్రవక్తల బృందానికి వారు చెందిన వారనీ, వారికి
డెబ్భైయిదు పౌన్ల వెండి మరియు రెండురకాల దుస్తులు
ఇమ్మని ఆయన చెప్పాడు” అని గేహజీ చెప్పాడు.
23“అయ్యా, నూట ఏభై పౌన్లు తీసుకోండి” అని
నయమాను చెప్పాడు. గేహజీ ఆ వెండిని తీసుకు
నేందుకు నయమాను అతనిని ఒప్పించాడు. నయ
మాను నూట ఏభై పౌన్లు వెండిని రెండు సంచులలో
వేసి, రెండు రకాల దుస్తులు కూడా తీసుకున్నాడు.
తర్వాత ఆ వస్తువుల్ని నయమాను తన సేవకులిద్దరికి
ఇచ్చాడు. గేహజీ కొరకు వారు ఆ వస్తువులను మోసుకు
వెళ్లారు. 24గేహజీ కొండ వద్దకు రాగానే, ఈ వస్తువులను
అతని సేవకుల వద్దనుంచి తీసుకుని, గేహజీ ఆ సేవ
కులను పంపివేశాడు. వారు వెళ్లిపోయారు. తర్వాత
గేహజీ ఆ వస్తువులను ఇంట్లో దాచాడు.
25గేహజీ తన యజమాని అయిన ఎలీషా యెదుట
నిలబడ్డాడు. గేహజీతో ఎలీషా, “గేహజీ, నీవు ఎక్కడికి
వెళ్లావు?” అని అడిగాడు.
“నేనెక్కడికీ వెళ్లలేదు” అని గేహజీ చెప్పాడు.
26“ఇది నిజం కాదు నిన్ను కలుసుకునేందుకు నయ
మాను తన రథంనుంచి క్రిందికి దిగినప్పుడు నా
హృదయం నీతో వున్నది. పైకం, వస్త్రాలు, ఒలీవలు,
ద్రాక్షలు, గొర్రెలు, ఆవులు లేక స్త్రీ పురుష సేవకులు
మొదలైనవి తీసుకునేందుకు ఇది సమయం కాదు.
27ఇప్పుడు నీకు, నీ వంశానికి నయమాను వ్యాధి సంక్ర
మిస్తుంది. ఎల్లప్పుడూ నీకు కుష్ఠవ్యాధి వుంటుంది”
అని ఎలీషా గేహజీతో చెప్పాడు.ఎలీషాని విడిచి గేహజీ
వెళ్లగానే, గేహజీ శరీరం మంచువలె తెల్లగా కనిపించింది.
గేహజీకి కుష్ఠవ్యాధి కగిలింది.

## ఎలీషా మరియు గొడ్డలి

6 ప్రవక్తల బృందం ఎలీషాతో ఇలా చెప్పింది:
“మేమా ప్రదేశంలో నివసిస్తున్నాము. కాని మాకది
చాలా చిన్నదిగా వుంది. 2యోర్దాను నదివద్దకు వెళ్లి,
అడవిలో చెట్లు నరుకుదాము. మనలో ప్రతి ఒక్కరికి
ఒక దూలము లభిస్తుంది. అక్కడ నివాసయోగ్యమైన
ఇల్లు నిర్మించుకుందాము.”
“బాగుంది అలాగే కానివ్వండి” అని ఎలీషా బదులు
చెప్పాడు.
3“మాతో మీరు రండి” అని ఒకడనెను. ఎలీషా
“బాగుంది, నేను కూడా మీతో వస్తాను” అని చెప్పాడు.
4అందువల్ల ఎలీషా ప్రవక్తల బృందంతో పాటు
వెళ్లాడు. వారు యోర్దాను నది వద్దకు చేరుకుని కొన్ని
చెట్లు నరకసాగారు. 5కాని ఒక వ్యక్తి ఒక చెట్టు నరికే
టప్పుడు, చేతినుండి గొడ్డలి జారిపోయి నీళ్లలో
పడింది. అప్పుడతను, “యజమానీ, నేను ఆ గొడ్డలి
చేబదులుగా తెచ్చాను” అని అరిచాడు.
6దైవజనుడైన ఎలీషా, “అది ఎక్కడ పడింది” అని
అడిగాడు.
గొడ్డలి పడిన చోటును అతను ఎలీషాకు చూపాడు.
అప్పుడు ఎలీషా ఒక కొమ్మ నరికి, కర్రను నదిలోకి
విసిరివేసెను. ఆ కొమ్మ ఇనుప గొడ్డలి నీళ్లలో తేలు
నట్లు చేసింది. 7“గొడ్డలి పైకి తీసుకో” అని ఎలీషా
చెప్పాడు. అప్పుడా వ్యక్తి గొడ్డలిని తీసుకున్నాడు.

## సిరియా ఇశ్రాయేలును పట్టుకొనుటకు ప్రయత్నించుట

8సిరియా రాజు ఇశ్రాయేలుతో యుద్ధం చేయాలని
తన సైనికోద్యోగులతో ఆయన సమాలోచన

చేస్తున్నాడు. "ఈ చోట దాక్కొని ఇశ్రాయేలు వారు వచ్చినప్పుడు వారిని ఎదుర్కొనండి" అని అతను చెప్పాడు.

[9]కాని దైవజనుడు అయిన ఎలీషా ఇశ్రాయేలు రాజుకి ఒక సందేశం పంపాడు. ఎలీషా ఇట్లన్నాడు: "జాగ్రత్తగా వుండండి. ఆ స్థలంగుండా పోవద్దు! సిరియా సైనికులు అక్కడ దాగుకొని వున్నారు"

[10]ఇశ్రాయేలు రాజు తన మనుష్యులకు సందేశం పంపుతూ దైవజనుడు (ఎలీషా) తనకు హెచ్చరిక చేశాడని తెలియపరిచాడు. ఇశ్రాయేలు రాజు పలువురిని
కాపాడగలిగాడు. [11]ఇందువల్ల సిరియా రాజు తలక్రిందు
లయ్యాడు. తన సైనికోద్యోగుల్ని సమావేశ పరచి వారితో, "ఇశ్రాయేలు రాజుకోసం గూఢచారి పని
చేస్తున్నదెవరో చెప్పండి" అని అడిగాడు. [12]సిరియా
రాజు అధికారులలో ఒకడు, "ప్రభూ, రాజా, మాలో ఎవ్వరమూ గూఢాచారులము కాము. ఇశ్రాయేలు ప్రవక్త అయిన ఎలీషా ఇశ్రాయేలు రాజుకు అనేక రహస్య విషయాలు చెప్పగలడు. మీరు నిద్రించే గృహంలో మీరు మాట్లాడే మాటలు కూడా చెప్పగలడు"
అన్నాడు. [13]అప్పుడు సిరియా రాజు, "ఎలీషాని కను
గొనండి. అతనిని పట్టుకునేందుకు నేను మనుష్యులను పంపుతాను" అన్నాడు. "ఎలీషా దోతానులో ఉన్నాడు" అని రాజ సేవకులు చెప్పారు.

[14]అప్పుడు సిరియా రాజు గుర్రాలు, రథాలు, ఒక పెద్ద సైన్యం దోతానుకు పంపాడు. వారు రాత్రి వేళ
చేరి నగరాన్ని చుట్టుముట్టారు. [15]ఆ ఉదయం ఎలీషా
సేవకుడు త్వరగా మేల్కొన్నాడు. అతను వెలుపలికి పోయి నగరం చుట్టూ ఒక పెద్ద సైన్యం రథాలు, గుర్రాలు ఉండటం చూశాడు.

ఎలీషా సేవకుడు, "నా యజమానీ! మనమేమి చేయగలము" అని ఎలీషాని చూసి అడిగాడు.

[16]"భయపడకు, సిరియా కోసం యుద్ధం చేసే సైన్యం కంటె మనకోసం యుద్ధం చేసే సైన్యం చాలా పెద్దది" అని ఎలీషా చెప్పాడు.

[17]అప్పుడు ఎలీషా ప్రార్థించి ఇలా చెప్పాడు: "యెహోవా, నా సేవకుని కళ్లు తెరిపింపుము. అప్పుడతను చూడగలడు." యెహోవా ఆ యువకుని కళ్లు తెరిపించాడు. మరియు సేవకుడు కొండ చుట్టూ అగ్నిరథాలు గుర్రాలు వుండటం చూశాడు. అవి ఎలీషా చుట్టూ ఉన్నాయి.

[18]ఈ అగ్నిరథాలు గుర్రాలు ఎలీషాకోసం క్రిందికి దిగి వచ్చాయి. ఎలీషా యెహోవాను ప్రార్థించాడు. "ఈ మనుష్యులను అంధులను చేయవలసిందిగా నిన్ను ప్రార్థించుచున్నాను" అన్నాడు.

ఎలీషా ప్రార్థించిన ప్రకారం యెహోవా చేశాడు. సిరియా సైనికులు అంధులగునట్లు యెహోవా
చేశాడు. [19]సిరియా సైనికులను వుద్దేశించి ఎలీషా,
"ఇది సరి అయిన మార్గం కాదు. ఇది సరి అయిన నగరం కాదు. నన్ను అనుసరించండి. మీరు ఎవరికోసం వెతుకుతున్నారో నేను అతని వద్దకు మిమ్మలను తీసుకుని వెళతాను" అన్నాడు. తర్వాత ఎలీషా సిరియా సైన్యాన్ని షోమ్రోనుకు నడిపించాడు.

[20]వారు షోమ్రోనుకు చేరుకోగానే,"యెహోవా, వీరి కళ్లు తెరిపించుము. అప్పుడు వారు చూడగలుగుతారు" అని ఎలీషా ప్రార్థించాడు. అప్పుడు యెహోవా
వారి కళ్లు తెరిపించాడు. [21]తామప్పుడు షోమ్రోను
నగరంలో వున్నట్లుగా సైనికులు చూశారు. ఇశ్రాయేలు రాజు సిరియా సైన్యాన్ని చూశాడు. ఎలీషాతో ఇశ్రాయేలు రాజు, "తండ్రీ వారిని నేను చంపనా," అని
అడిగాడు. [22]"నీ ఖడ్గముతో, విల్లమ్ములతో నీవు
యుద్ధంలో పట్టుకున్న ఈ మనుష్యలను నీవు చంపగోరుచున్నావా? సిరియా సైనికులకు రొట్టెలు మంచినీళ్లు ఇమ్ము. వారిని తిని త్రాగనిమ్ము. తర్వాత వారు వారి దేశానికి యజమాని వద్దకు వెళ్తారు" అని ఎలీషా చెప్పాడు.

[23]ఇశ్రాయేలు రాజు సిరియా సైన్యానికై చాలా ఆహారం తయారు చేయించాడు. ఆ సైనికులు తిన్నారు, త్రాగారు. తర్వాత ఇశ్రాయేలు రాజు సిరియా సైనికులను వారి దేశానికి పంపించాడు. సిరియా సైనికులు వారి యజమాని వద్దకు వెళ్లారు. సిరియా వారు దాడి చేయడానికై సైనికులెవరినీ ఇశ్రాయేలుకి పంపలేదు.

## భయంకరమైన కరువు కాలం షోమ్రోనులో ఏర్పడుట

[24]ఇది జరిగిన తర్వాత, సిరియా రాజయిన బెన్హదదు తన సర్వసైన్యాన్ని సమీకరించి షోమ్రోను నగ
రాన్ని చుట్టుముట్టి దాడి చేయడానికి వెళ్లాడు. [25]నగరం
లోకి ప్రజలు ఆహారం తీసుకురాకుండా సైనికులు చేశారు. అందువల్ల షోమ్రోనులో భయంకరమైన కరువు ఏర్పడింది. అది యెంత కష్టకాలమంటే, ఒక గాడిద తల ఎనభై వెండి రూపాయిలకు మరియు పావురపు పావు రెట్ట ఐదు వెండి రూపాయిలకు అమ్మబడింది.

[26]ఇశ్రాయేలు రాజు నగరాన్ని ఆవరించిన ప్రాకారము మీద నడుస్తున్నాడు. ఒక స్త్రీ అతనిని ఉద్దేశించి కేక పెట్టింది. "నా ప్రభువా, యజమాని! దయచేసి నాకు సహాయం చెయ్యండి" అని.

[27]ఇశ్రాయేలు రాజు, "యెహోవా కనుక సహాయం చేయకపోతే, నేను ఎలా సహాయం చేయగలను? నీకు ఇవ్వదగింది నావద్ద ఏమియులేదు, కళ్లంలో ధాన్యం
లేదు. ద్రాక్షారసపు శాలలో ద్రాక్షారసం లేదు."[28]తర్వాత,
"నీకు వచ్చిన కష్టమేమి?" అని ఇశ్రాయేలు రాజు అడిగాడు.

ఆ స్త్రీ ఇలా బదులు చెప్పింది. "నీవు నీ కుమారుని మాకిచ్చివేయండి. అతనిని చంపి నేడు ఆహారం

భుజిస్తాము. ఆ తర్వాత మేము మా కుమారుని రేపు
భుజిస్తాము" అని ఈమె చెప్పింది. 29కాబట్టి మా
కుమారుణ్ణి ఉడికించి తినేశారు. తర్వాత ఆ మరుసటి
రోజు నేను ఆ స్త్రీని ఇలా అడిగాను: "నీవు నీ కుమారుని
ఇమ్ము. మేము అతనిని చంపి నేడు భుజిస్తాము. కాని
ఆమె తన కుమారుని దాచివేసింది."
30ఆ స్త్రీ పలుకులు వినగానే, రాజు తాను తలక్రిందు
లైనానని దుఃఖాన్ని తెలపడానికి తన వస్త్రాలు చింపు
కున్నాడు. ఆ గోడమీదుగా రాజు వెళ్తున్నప్పుడు రాజు
గోనె పట్ట ధరించాడనీ, అది అతడు తల క్రిందులయిన,
వ్యసనమయిన స్థితిని తెలుపుతున్నదని ప్రజలు
గ్రహించారు.
31రాజు, "ఈ రోజు ఆఖరికి షాపాతు కుమారుడైన
ఎలీషా తల కనుక అతని దేహం మీద ఉంటే, నన్ను
దేవుడు శిక్షించునుగాక!" అని చెప్పాడు.
32ఎలీషా వద్దకు రాజు ఒక దూతను పంపించాడు.
ఎలీషా తన ఇంట్లో కూర్చుని ఉన్నాడు. మరియు
పెద్దలు (నాయకులు) అతనితోపాటు ఉన్నారు. ఆ
దూత అక్కడికి చేరుకోవడానికి ముందుగా, పెద్దల్ని
ఉద్దేశించి అతను ఇలా అన్నాడు: "చూడండి, ఆ హంత
కుని కుమారుడు (ఇశ్రాయేలు రాజు) నా తల నరికి
వేసేందుకు మనుష్యులను పంపిస్తున్నాడు. ఆ దూత
చేరగానే, తలుపు మూసివేయండి తలుపు పట్టుకుని,
అతనిని లోపలికి రానివ్వకండి. నేనతని యజమాని
అడుగులు అతని వెనుక వస్తున్నట్టు ఆ సవ్వడి మనకు
వినిపించునుగదా."
33ఎలీషా ఆ పెద్దలతో (నాయకులతో) మాట్లాడు
తూండగా, దూత అక్కడికి వచ్చాడు. ఆ సందేశమిది:
"యెహోవా నుండి ఈ కష్టం వచ్చింది. ఇంకా
యెహోవా కోసం నేనెందుకు వేచివుండాలి."

7 "దేవుని సందేశం వినండి. యెహోవా చెప్పు
చున్నాడు. "రేపు ఈపాటికి ఆహారం సమృద్ధిగా
ఉంటుంది. అది మరల చౌకగా దొరుకుతుంది. సమా
రియా నగర ద్వారం వద్ద ఒక రూపాయికి ఒక సన్నని
మేలు రకం పిండి, ఇంకొక రూపాయికి రెండు బుట్టల
(సేరుల) యవలు అమ్మబడును."
2తర్వాత రాజుకి దగ్గరగా వున్న అధికారి దేవుని
వ్యక్తి ఎలీషాకి సమాధానమిచ్చాడు. "పరలోకపు కిటి
కీలు యెహోవా తెరిచినా, ఇది జరగదు"* అని ఆ
అధికారి చెప్పాడు.
"నీవు నీ కళ్ళతో అది చూడగలవు. కాని ఆ ఆహారం
కొంచమైనా నీవు తినలేవు" అని ఎలీషా చెప్పాడు.

### సిరియనుల గుడారము ఖాళీగా వుండటాన్ని కుష్ఠరోగులు చూచుట

3నగర ద్వారం వద్ద నలుగురు కుష్ఠరోగులుండిరి.
వారు ఒకరితో ఒకరు ఇట్లు చెప్పుకున్నారు: "కూర్చుని
మరణించడానికి నిరీక్షిస్తున్నామా? 4షోమ్రోనులో ఆహా
రంలేదు. మనము నగరంలోకి వెళితే, మనమక్కడ
చనిపోతాము. ఇక్కడ ఉంటే, చనిపోతాము. కనుక
మనము సిరియనుల గుడారానికి వెళదాము. వాళ్లు
కనుక మనలను అక్కడ ఉండనిస్తే, అప్పుడు మనం
బతుకుదాము. వాళ్లు మనలను చంపితే మనము
మరణిద్దాము."
5అందువల్ల ఆ సాయంకాలం ఆ నలుగురు కుష్ఠ
రోగులు సిరియనుల గుడారానికి వెళ్లారు. వారు గుడారం
అంచుదాకా వెళ్లారు. అక్కడ మనుష్యులెవ్వరూ లేరు.
6సిరియనుల గుడారం వారు రథాలు, గుర్రాలు, సైన్యం
వస్తున్న సవ్వడిని సిరియనుల సైన్యం వినేలా
యెహోవా ఏర్పాటు చేశాడు. అందువల్ల సిరియనుల
సైనికులు ఒకరితో ఒకరు ఇలా చెప్పుకొన్నారు: "ఇశ్రా
యేలు రాజు హిత్తీయుల, ఈజిప్టీయుల రాజులను
మనకు ప్రతికూలంగా జీతమిచ్చి వాడుకున్నాడు."
7ఆ సాయంకాలమే సిరియావారు అన్నీ అక్కడే
విడిచిపెట్టి పారిపోయారు. వారు తమ గుడారాలు విడిచి
పెట్టారు. గుర్రాలు, గాడిదలు మొదలైనవి కూడా విడిచి
పెట్టి ప్రాణాలకోసం పారిపోయారు.

### విరోధి శిబిరములో కుష్ఠరోగులు

8శిబిరం ప్రారంభమైన చోటికి ఈ కుష్ఠరోగులు
వచ్చారు. వారు ఒక గుడారంలోకి వెళ్లారు. వారు
తిన్నారు; తాగారు. తర్వాత ఆ కుష్ఠరోగులు వెండి
బంగారు వస్త్రాలు మొదలైన వాటిని తీసుకున్నారు.
వెండి బంగారాలు వస్త్రాలను వారు దాచివేశారు. తర్వాత
వెనక్కి వచ్చి మరొక గుడారంలో ప్రవేశించారు. ఈ
గుడారం నుంచి వస్తువులను బయటికి చేరవేశారు.
ఈ వస్తువులను కూడా వారు దాచివేశారు. 9తర్వాత
ఈ కుష్ఠరోగులు ఒకరితో ఒకరు ఇలా చెప్పుకున్నారు:
"మనము తప్పు చేస్తున్నాము. నేడు మనకు మంచి
వార్త కలదు. కాని మనము మౌనంగా ఉన్నాము. మళ్లీ
సూర్యుడు వచ్చేంతవరకు మనము వేచివుంటే, మనము
శిక్షింపబడతాము. ఇప్పుడే మనము వెళ్లిపోదాము. రాజు
గారి భవనంలో వున్న మనుష్యులకు చెపుదాము."

### మంచి వార్తను కుష్ఠరోగులు చెప్పుట

10ఆ తరువాత కుష్ఠరోగులు వచ్చి, నగర ద్వారపాల
కులతో చెప్పారు: "మేము సిరియావారి శిబిరాలకు
వెళ్లాము. కాని మేము ఎవ్వరి గొంతు వినలేదు. అక్కడ
ఎవ్వరూ లేరు. గుర్రాలు గాడిదలు ఇంకా కట్టివేయ
బడివున్నాయి. గుడారాలు అలాగేవున్నాయి. కాని

---

**పరలోకపు ... ఇది జరగదు** ఈ వచనం యొక్క అర్థం బహుశః ఈ విధంగా ఉండవచ్చు. యెహోవా పరలోకపు కిటికీలను తెరిచినా అవి గోధుమ మరియు యవలగింజలను, కురిపించడానికే అని వుండవచ్చు.

మనుష్యులందరూ వెళ్లిపోయారు.” 11తర్వాత నగర
ద్వారపాలకులు కేకలు వేసి రాజ భవనంలోని వారికి
చెప్పారు. 12అది రాత్రిగడియ. అప్పుడు రాజు పడక
నుండి లేచాడు. తన అధికారులతో రాజు, “సిరియా
సైనికులు మనకేమి చేస్తున్నారో మీకు చెప్తాను.
మనము ఆకలిగా వున్నామని వారికి తెలుసు. పొలాలలో
దాగుకొనడానికి వారు విడిదిని విడిచిపెట్టి వెళ్లారు.
నగరం వెలుపలికి ఇశ్రాయేలువారు రాగానే, వారిని సజీ
వంగా మనము పట్టుకోవచ్చు, తర్వాత మనం నగరం
ప్రవేశిద్దాము అని వారనుకొంటున్నారు” అని చెప్పాడు.
13రాజ ఉద్యోగులలో ఒకడు, “నగరంలో ఇంకా
మిగిలిన ఐదు గుర్రాలను కొంతమంది పురుషులు తీసు
కొని పోనివ్వండి. ఆ గుర్రాలు ఎలాగైనా మరణించేవే.
నగరంలో ఇంకా మిగిలిన ఇశ్రాయేలువారివలె మర
ణించేవే, ఈ వ్యక్తులను ఏమి జరిగిందో తెలుసుకోడా
నికి మనము పంపిద్దాము” అని చెప్పాడు.
14అందువల్ల గుర్రాలు కట్టిన రెండు రథాలను ఆ
మనుష్యులు తీసుకున్నారు. ఆ మనుష్యులను
సిరియను సైన్యము వెనుక పంపాడు. “వెళ్లి ఏమి
జరిగిందో చూడండి” అని రాజు చెప్పాడు.
15యొర్దాను నదిదాకా ఆ మనుష్యులు సిరియను
సైన్యము వెనుకగా వెళ్లారు. ఆ మార్గమంతటా వస్త్రాలు
ఆయుధాలు వున్నాయి. సిరియావారు ఆ వస్తువులను
పారిపోయినప్పుడు వదలి వేశారు. ఆ దూతలు వెనుకకు
వెళ్లి షోమ్రోను చేరుకొని రాజుకు చెప్పారు.
16తర్వాత ఆ ఇశ్రాయేలీయులు సిరియను శిబి
రానికి పరిగెత్తుకుని వెళ్లి అక్కడినుండి విలువగల వస్తు
వులు తీసుకున్నారు. ప్రతి ఒక్కనికి వస్తువులు సమృ
ద్ధిగా వున్నాయి. అందువల్ల యెహోవా చెప్పినట్లుగానే
అది జరిగింది. ఒక్క రూపాయికి మేలిరకం పిండి ఒక
బుట్ట మరియు ఒక్క రూపాయికి రెండు బుట్టల
యవలు అమ్మబడెను.
17రాజు తన ఉద్యోగిని సన్నిహితుడయిన వానిని
ద్వార సంరక్షణకు ఎంపిక చేసెను. కాని ప్రజలు విరోధి
శిబిరము నుండి వస్తువులను పొందడానికి పరుగెత్తి,
వారు ఆ ఉద్యోగిని కిందికి తోసి అతని మీదుగా నడి
చారు. రాజు దేవుని వ్యక్తి అయిన ఎలీషా ఇంటికి
వచ్చినప్పుడు, అతను చెప్పినట్లుగానే ఆ ఉద్యోగి
మరణించాడు.
18ఎలీషా కూడ ఇలా సూచించాడు: “ఒక్క రూపా
యికి మేలిరకం పిండి ఒక బుట్ట మరియు ఒక్క
రూపాయికి రెండు బుట్టల యవలు అమ్మబడెను.
సమారియా నగర ద్వారములవద్దగల అంగడి వీధివద్ద
ప్రతివారు కొనగలరు.”
19కాని ఆ ఉద్యోగి దేవుని వ్యక్తికి చెప్పిన సమాధాన
మేమిటంటే: “యెహోవా పరలోకపు కిటికీలు తెర
చినా, ఇలా జరగదు”అని. ఎలీషా ఆ ఉద్యోగితో ఇలా
చెప్పివుండెను. “నీవు నీ కళ్లతోనే చూడగలవు, కాని
నీవు ఆ ఆహారమేమీ భుజింపవు.” 20ఆ విధంగానే, ఆ
ఉద్యోగికి జరిగింది. ప్రజలు ద్వారం దగ్గర అతనిని
కిందికి తోసి, అతని మీదగా నడిచారు. అతను
మరణించాడు.

### రాజు మరియు షూనేము స్త్రీ

8 ఎవరి కొడుకునైతే సజీవునిగా ఎలీషా చేసెనో,
ఆ స్త్రీతో ఎలీషా మాటలాడెను. ఎలీషా చెప్పాడు.
“నీవు నీ కుటుంబము మరొక దేశానికి వెళ్లాలి. ఎందు
కనగా, ఇక్కడ కరువుకాలం ఏర్పడుతుందని యెహోవా
నిశ్చయించినాడు. ఈ విధమైన కరువు ఈ దేశంలో
ఏడు సంవత్సరముల పాటు ఉంటుంది.”
2అందువల్ల ఆ స్త్రీ దేవుని మనిషి చెప్పినట్లుగా
చేసింది. తన కుటుంబంతో ఆమె ఫిలిష్తీయుల దేశంలో
ఏడేండ్లు ఉండటానికి వెళ్లింది. 3ఆ ఏడు సంవత్సరములు
పూర్తి అయిన తర్వాత ఆ స్త్రీ ఫిలిష్తీయుల దేశం
నుంచి తిరిగి వచ్చింది.
ఆ స్త్రీ రాజుతో మాట్లాడడానికి వెళ్లింది. తన ఇల్లు
తన పొలము తనకు చేరునట్లుగా కోరుటకే ఆమె
వెళ్లింది.
4దేవుని వ్యక్తికి (ఎలీషా) సేవకుడైన గేహజీతో రాజు
మాట్లాడుతూ ఉన్నాడు. రాజు ఈ విధంగా అడిగాడు:
“దయచేసి ఎలీషా చేసిన గొప్ప కార్యాలను తెలుపండి.”
5మృతజీవి ఒకనిని సజీవునిగా ఎలీషా చేసెనన్న
విషయాన్ని గేహజీ రాజుకి చెప్పుచున్నాడు. ఆ సమ
యాన తన కొడుకుని ఎలీషా బ్రతికింపజేసిన ఆ స్త్రీ
రాజువద్దకు పోయింది. తన పొలమూ తన యిల్లూ
తాను పొందుటకు సహాయం చేయుమని రాజుని అడగ
టానికి ఆమె వెళ్లింది. గేహజీ, “నా ప్రభువా, రాజా,
ఈమెయే ఆ స్త్రీ. ఇతడే ఎలీషా బ్రతికించిన ఆ
కుమారుడు” అని చెప్పాడు. 6ఏమి కావలెనో చెప్పుమని
రాజు ఆమెని అడిగాడు. ఆ స్త్రీ రాజుతో చెప్పింది.
తర్వాత ఆ స్త్రీకి సహాయము చేయడానికై రాజు
ఒక అధికారిని ఎన్నుకున్నాడు. “ఆమెకున్నదంతా
ఆమెకు వచ్చేలా చేయండి. ఆమె దేశం విడిచిపెట్టిన
నాటినుంచీ నేటిదాకా కోతలవల్ల ఆమెకు రావలసి
నదంతా ఇప్పించడి” అని చెప్పాడు.

### బెన్హదదు హజాయేలును ఎలీషా వద్దకు పంపుట

7ఎలీషా దమస్కుకు వెళ్లాడు. సిరియా రాజయిన
బెన్హదదు జబ్బుతో వున్నాడు. “దేవుని వ్యక్తి ఇచ్చటికి
వచ్చాడు:” అని ఒకడు బెన్హదదుకు చెప్పాడు.
8అప్పుడు బెన్హదదు హజాయేలుతో ఇట్లన్నాడు:
“ఒక కానుక తీసుకొని దేవుని వ్యక్తిని కలుసుకొనుము.
నేను నా జబ్బునుండి కోలుకొందునో లేదో అతడు
యెహోవాని అడగమని అతనితో చెప్పుము.”

9 అందువల్ల హజాయేలు ఎలీషాని కలుసు కొనడానికి
వెళ్లాడు. తనతో పాటు హజాయేలు కానుకలు
తెచ్చాడు. దమస్కు నుండి అతడు అన్ని రకాల మంచి
వస్తువులు తెచ్చాడు. వాటిని మోయడానికి 40
ఒంటెలు కావలసి వచ్చింది. హజాయేలు ఎలీషా వద్దకు
పోయాడు. “నీ అనుచరుడైన* సిరియా రాజు నన్ను
నీ వద్దకు పంపించాడు. ఆయన జబ్బునుండి కోలు
కొనునో లేదో అడగమని, నన్ను పంపెను,” అని
హజాయేలు చెప్పాడు.
10 అప్పుడు ఎలీషా, “నీవు బాగుపడెదవని బెన్హద
దుతో చెప్పు. కాని నీవు చనిపోదువని నిజముగా
యెహోవా నాతో చెప్పాడు.” అన్నాడు.

### హజాయేలుకి సంబంధించి ఎలీషా ఒక ప్రవచనము చెప్పుట

11 ఎలీషా పైకి క్రిందికి చూడసాగాడు. హజాయేలు
ఇబ్బందిలో పడేంతవరకూ అతను చూసెను. దైవ
జనుడు ఏడవసాగెను.
12 “అయ్యా, మీరెందుకు ఏడుస్తున్నారు?” అని
హజాయేలు అడిగాడు. “ఇశ్రాయేలు వారికి మీరేమి
చెడుపనులు చేయగలరో తెలిసి నేను ఏడుస్తున్నాను.
మీరు వారి బలమైన నగరాలను దగ్ధం చేస్తారు. ఖడ్గాలతో
మీరు ఆ యువకులను చంపుతారు. వారి పసిపిల్లలను
కూడా మీరు హతమారుస్తారు. మీరు వారి గర్భవతులను
చీల్చి వేస్తారు” అని ఎలీషా సమాధానం చెప్పాడు.
13 హజాయేలు “నేను శక్తిమంతుడను కానని
చెప్పాడు. ఈ గొప్ప విషయాలు నేను చేయలేను.”
“నీవు సిరియా రాజువి కాగలవని యెహోవా
చూపాడు.” అని ఎలీషా సమధాన మిచ్చాడు.
14 ఆ తర్వాత హజాయేలు ఎలీషాని విడిచి తన
రాజు వద్దకు వెళ్లాడు. “ఎలీషా నీతో ఏమి చెప్పాడు?”
అని బెన్హదదు హజాయేలును అడిగాడు.
“నీవు జీవించెదవు అని ఎలీషా చెప్పాడు” అని
హజాయేలు చెప్పాడు.

### హజాయేలు బెన్హదదును హత్య చేయుట

15 కాని ఆ మరునాడే హజాయేలు ఒక ముతక
వస్త్రం తీసుకుని దాన్ని నీటిలో తడిపాడు. తర్వాత
బెన్హదదు ముఖాన్ని కప్పివేసి, వుక్కిరి బిక్కిరి చేయ
డంతో అతడు మరణించాడు. హజాయేలు కొత్తగా
రాజు అయ్యాడు.

### యెహోరాము తన పాలన ప్రారంభించుట

16 ఇశ్రాయేలుకు రాజైన అహాబు కొడుకు యెహో
రాము పరిపాలనలోని, అయిదవ సంవత్సరమున,
యూదా రాజైన యెహోషాపాతు కొడుకు యెహో
రాము యూదాకు రాజయ్యాడు. 17 యెహోరాము
పరిపాలించు నాటికి అతను ముప్పై రెండు యేండ్ల
వాడు. యెరూషలేములో అతను ఎనిమిదేళ్లు పరిపాలిం
చాడు. 18 కాని పూర్వపు ఇశ్రాయేలు రాజుల చెడు
మార్గాలను ఇతడు అనుసరించాడు. అహాబు కుటుంబీ
కులు చేసినట్లుగా యెహోవా దృష్టికి తప్పు అని
ఎంచబడిన చెడుకార్యాలు చేశాడు. 19 కాని తన సేవకు
డైన దావీదుకు వాగ్దానం చేయడంవల్ల యెహోవా
యూదాను నాశనం చేయలేదు.
అతని వంశానికి చెందిన వారు ఎవరో ఒకరు
ఎప్పుడూ రాజుగా వుంటారని దావీదుకు యెహోవా
వాగ్దానం చేశాడు.
20 యెహోరాము కాలంలో యూదా పరిపాలన
నుండి ఎదోమీయులు విడిపోయి తమకు ఒక రాజుని
ఎన్నుకున్నారు.
21 అప్పుడు యెహోరాము అతని రథము లన్నిటినీ
తీసుకుని జాయీరుకు వెళ్లెను. రాత్రివేళ ఎదోము
సైన్యము వారిని చుట్టుముట్టింది. యెహోరాము
అతని అధికారులు వారిని ఎదుర్కొని, తప్పించు
కున్నారు. యెహోరాము సైనికులందరు పారిపోయి
తమ దేశం చేరుకున్నారు. 22 ఈ కారణంచేత ఎదోము
వారు యూదా పరిపాలనకు ఎదురు తిరిగారు.
అదే సమయమున లిబ్నా కూడా యూదా పరి
పాలనకు ఎదురు తిరిగింది.
23 యెహోరాము చేసిన ఇతర పనులన్నియు
“యూదా రాజుల వృత్తాంతము” అనే గ్రంథంలో
వ్రాయబడి ఉన్నవి.
24 తరువాత యెహోరాము మరణించాడు. దావీదు
నగరంలో తన పూర్వీకులతో పాటు అతను సమాధి
చేయబడ్డాడు. యెహోరాము కుమారుడైన అహజ్యా
కొత్తగా రాజయ్యాడు.

### అహజ్యా తన పరిపాలన ప్రారంభించుట

25 అహాబు కుమారుడైన యెహోరాము ఇశ్రాయే
లుకు రాజయిన పన్నెండవ సంవత్సరమున, యెహో
రాము కుమారుడైన అహజ్యా యూదా రాజ్యానికి రాజ
య్యాడు.
26 అహజ్యా పరిపాలన ప్రారంభించినప్పుడు అతని
వయస్సు ఇరవై రెండు సంవత్సరములు. అతను యెరూ
షలేములో ఒక సంవత్సరం పరిపాలించాడు. అతని
తల్లి పేరు అతల్యా. ఆమె ఇశ్రాయేలు రాజయిన ఒమ్రీ
కుమార్తె. 27 యెహోవా తప్పని చెప్పిన పనులనే
అహజ్యా చేశాడు. అహాబు వంశీయులవలె అహజ్యా
అనేక చెడుకార్యాలు చేశాడు. అతని భార్య అహాబు
వంశానికి చెందినదగుటచే, అహజ్యా ఈ విధంగా
నివసించాడు.

---

**అనుచరుడు** అక్షరాల “కొడుకు”.

### హజాయేలుకు ప్రతిగా జరిగిన యుద్ధంలో యెహోరాము గాయపడుట

28యెహోరాము అహాబు వంశానికి చెందినవాడు. సిరియా రాజయిన హజాయేలుతో రామోత్గిలాదు అనేచోట యుద్ధం చేసేందుకు అహజ్యా యెహోరాముతో కలిసి వెళ్లాడు. సిరియన్లు యెహోరామును గాయపరచిరి. ఆ గాయముల నుండి బాగు పడుటకు గాను యెహోరాము రాజు ఇశ్రాయేలుకి తిరిగి వెళ్లి పోయాడు. యెహోరాము యెజ్రెయేలు అనే ప్రదేశానికి పోయాడు. యెహోరాము కుమారుడైన అహజ్యా యూదా యొక్క రాజు. అహజ్యా యెహోరామును చూడటానికి యెజ్రెయేలు వెళ్లాడు.

### ఒక యువ ప్రవక్తతో యెహూని అభిషేకించమని ఎలీషా చెప్పుట

9 ప్రవక్త అయిన ఎలీషా ప్రవక్తల బృందంలో ఒకనిని పిలచి, అతనితో ఎలీషా, "ఈ చిన్న నూనె సీసాని నీ చేతితో తీసుకుని వెళ్లడానికి నీవు సిద్ధంగా ఉండు. రామోత్గిలాదుకు వెళ్లు. 2నీవక్కడికి చేరుకోగానే, నింషీ కుమారుడైన యెహోషాపాతు కుమారుడగు యెహూ నీకు కనిపిస్తాడు. అతని సోదరులలోనుండి అతనిని చాటుగా పిలచి, తర్వాత ఒక గదిలోకి తీసుకు వెళ్లు. 3చిన్న నూనె సీసా తీసుకుపోయి, యెహూ తలమీద నూనె పోసి ఈరీతిగా చెప్పు. ఇది యెహోవా చెప్పింది. ఇశ్రాయేలీయుల కొత్తరాజుగా నిన్ను అభిషేకించాను. తర్వాత నీవు తలుపు తెరచి పారిపో. అక్కడ నిలచి వుండవద్దు" అన్నాడు.

4అందువల్ల ఈ యువ ప్రవక్త రామోత్గిలాదుకు వెళ్లాడు. 5ఆ యువకుడు అక్కడకు చేరగానే, అతను సైన్యాధిపతులు అక్కడ కూర్చుని వుండటం చూశాడు. "అధిపతీ! నీకు నేనొక సందేశం తెచ్చాను" అని ఆ యువకుడు చెప్పాడు.

"మేమందరము ఇక్కడున్నాము ఎవరికి సందేశం?" అని యెహూ అడిగాడు.

"అధిపతీ! నీకే సందేశం" అని యువకుడు చెప్పాడు.

6యెహూ లేచి ఇంట్లోకి వెళ్లాడు. అప్పుడు యువ ప్రవక్త యెహూను అభిషేకించాడు. ఆ యువ ప్రవక్త యెహూతో ఈ విధంగా చెప్పాడు: "యెహోవా యొక్క ఇశ్రాయేలు ప్రజలను పరిపాలించే కొత్తరాజుగా నిన్ను అభిషేకించానని ఇశ్రాయేలు దేవుడైన యెహోవా చెప్పుచున్నాడు. 7నీ రాజైన అహాబు వంశాన్ని నీవు నాశనం చెయ్యాలి. కాబట్టి నా సేవకులు, ప్రవక్తలు, యెహోవా యొక్క మనుష్యుల, మరణానికి కారణమైన యెజెబెలును శిక్షిస్తున్నాను. 8అందువల్ల అహాబు వంశీయులందరూ మరణిస్తారు. అహాబు వంశంలో మగపిల్లవాడెవ్వడూ బతకనీయకుండా చేస్తాను. ఆ మగ బిడ్డ సేవకుడైనా సరే స్వతంత్రుడైనా సరే భేదము లేదు. 9నెబాతు కుమారుడైన యరొబాము వంశంవలె, అహీయా కుమారుడైన బయెషా వంశం వలె అహాబు వంశాన్ని చేస్తాను. 10యెజ్రెయేలు ప్రదేశంలో యెజెబెలుని కుక్కలు తింటాయి, యెజెబెలు సమాధి చేయబడదు." ఆ తర్వాత యువ ప్రవక్త తలుపు తెరిచి పరు గెత్తుకొని పోయాడు.

### యెహూని రాజుగా సేవకులు ప్రకటించుట

11యెహూ తన రాజ ఉద్యోగుల వద్దకు వెళ్లాడు. ఒక అధికారి యెహూతో, "అంతా మంచిగా వున్నదా? ఈ పిచ్చివాడు నీ వద్దకు ఎందుకు వచ్చాడు?" అని అడిగాడు. ఆ సేవకులకు యెహూ ఇలా సమాధాన మిచ్చాడు. "ఆ వ్యక్తిని గురించి నీకు తెలుసు. అతను చెప్పే పిచ్చి విషయాలు నీకు తెలుసు."

12అధికారులు, "కాదు నిజం చెప్పు. అతడు ఏమి చెప్పాడు?" అని అడిగారు. ఆ యువ ప్రవక్త చెప్పిన విషయాలు యెహూ అధికారులకు, "అతడు చెప్పిన దేమనగా, "ఇశ్రాయేలుకు కొత్తరాజుగా నేను నిన్ను అభిషేకించానని యెహోవా చెప్పాడు" అని అతను నాకు చెప్పాడు."

13తర్వాత ప్రతి అధికారి వెంటనే తమ దుస్తులు తీసివేసి, యెహూ ఎదుట మెట్లమీద పరిచారు. ఆ తర్వాత, "యెహూరాజు" అని బూరఊది ప్రకటించారు.

### యెహూ యెజ్రెయేలుకు వెళ్లుట

14అందువల్ల యెహోషాపాతు కుమారుడైన యెహూ, యెహోరాముకు విరుద్ధంగా పథక రచన చేసెను. యెహోషాపాతు నింషీ కుమారుడు.

ఆ సమయమున యెహోరాము మరియు ఇశ్రాయేలు వాళ్లు సిరియాకు రాజయిన హజాయేలుకు వ్యతిరేకంగా రామోత్గిలాదును కాపాడటానికి ప్రయత్నించారు. 15సిరియా రాజయిన హజాయేలుకు ప్రతికూలంగా యెహోరాము రాజు యుద్ధం చేశాడు. కాని సిరియనులు యెహోరాము రాజును గాయపరిచారు. అతను ఆ గాయాలనుంచి బయటపడడానికి యెజ్రెయేలుకు వెళ్లాడు. అందువల్ల యెహూ అధికారులను ఉద్దేశించి, "నేను కొత్త రాజని మీరు సమ్మతించినట్లయితే, ఇప్పుడు ఎవరినీ నగరం నుంచి తప్పించు కొనకుండా చేయండి. ఎందుకనగా, ఈ విషయం యెజ్రెయేలీయులతో చెప్పకూడదు" అని పలికాడు.

16యెజ్రెయేలులో యెహోరాము మంచము పట్టి విశ్రాంతి పొందుచున్నాడు. అందువల్ల యెహూ తన రథమెక్కి, యెజ్రెయేలుకు వెళ్లాడు. యూదా రాజయిన అహజ్యా యెహోరామును చూడడానికి యెజ్రెయేలుకు వచ్చాడు. 17యెజ్రెయేలులోని ఒక గోపురం మీద ఒక కాపలావాడు నిలబడివున్నాడు. యెహూ

యొక్క పెద్ద సైన్యం రావడం అతను చూశాడు. "చాలా మంది మనుష్యులు వచ్చుట చూస్తున్నాను." అని అతను చెప్పాడు.

"వారిని కలుసుకునేందుకు ఎవరినైనా గుర్రం మీద పంపుము. ఆ మనుష్యులు శాంతికోసం వస్తున్నారో లేదో కనుక్కోమని ఈ దూతతో చెప్పుము" అని యెహోరాము చెప్పాడు.

18అందువల్ల ఆ దూత యెహూని కలుసుకోవడానికి గుర్రమెక్కి వెళ్లాడు. వార్తాహరుడు, "మీరు శాంతికోసం వచ్చారా? లేదా అని యెహోరాము అడుగుతున్నాడు" అని పలికాడు.

"శాంతితో నీకేమీ పని లేదు. రమ్ము, నన్ను అనుసరింపుము" అని యెహూ చెప్పాడు.

"దూత ఆ బృందం వద్దకు వెళ్లాడు. కాని ఇంత వరకూ తిరిగి రాలేదు" అని కాపలాదారుడు యెహోరాముతో చెప్పాడు.

19తర్వాత యెహోరాము రెండవ దూతను గుర్రంమీద పంపాడు. ఈ వ్యక్తి యెహూ బృందం వారి వద్దకు వచ్చి, "యెహోరాము రాజు శాంతి అని చెప్పుచున్నాడు" అన్నాడు.

"నీకు శాంతితో ఏమీ పనిలేదు. రమ్ము, నన్ను అనుసరింపుము" అని సమాధానమిచ్చాడు.

20"రెండవ దూత బృందం వద్దకు వెళ్లాడు. కాని అతను కూడా ఇంకా తిరిగి రాలేదు. పిచ్చివానివలె, ఒకడు అతని రథం నడుపుతున్నాడు. నింషీ కుమారుడైన యెహూవలె నడుపుతున్నాడు" అని కాపలాదారు యెహోరాముతో అన్నాడు.

21"నా రథం తీసుకుని రా" అని యెహోరాము చెప్పాడు.

అందువల్ల సేవకుడు యెహోరాము యొక్క రథమును తీసుకువచ్చాడు. ఇశ్రాయేలు రాజయిన యెహోరాము, యూదా రాజయిన అహజ్యా, ఇద్దరూ రథాలలో యెహూని కలుసుకోడానికి వెళ్లారు. వారు యెజ్రెయేలీయుడైన నాబోతు పొలం వద్ద యెహూని కలుసుకున్నారు. 22యెహోరాము యెహూని చూసి, "యెహూ, నీవు శాంతికోసం వచ్చావా?" అని అడిగాడు.

"నీ తల్లి యెజెబెలు వ్యభిచారము, చేతబడితనము ఘోరముగా చేయుచుండగా సమాధానం ఎక్కడనుండి వచ్చును. అని చెప్పి పారిపోవుచు ఉండెను.

23యెహోరాము గుర్రాలను వెనక్కి పరుగు తీయించాడు. యెహోరాము అహజ్యాను చూసి "అహజ్యా, ఇది ఒక మాయోపాయం" అన్నాడు.

24అప్పుడు యెహూ తన బలంకొద్దీ బాణం లాగి యెహోరామును వీపుమీద కొట్టాగా, ఆ బాణం యెహోరాము గుండెలోనుండి దూసుకొని వెళ్లగా, యెహోరాము తన రథం మీదనే మరణించాడు.
25యెహూ తన అధిపతియైన బిద్కరుతో, "యెహోరాము దేహాన్ని పైకి ఎత్తి, యెజ్రెయేలులో నాబోతు పొలంలోకి విసిరివేయుము. ఒకసారి జ్ఞాపకం చేసుకో నీవు, నేను యెహోరాము తండ్రి అయిన అహాబుతో కలిసి పయనం చేసినప్పుడు, ఇది అతనికి జరుగునని యెహోవా చెప్పాడు. 26'నిన్న నాబోతు అతని కుమారుల రక్తం నేను చూశాననీ, అందువల్ల ఈ పొలంలో అహాబును శిక్షించెదననీ' యెహోవా చెప్పెను. కావున, యెహోవా చెప్పినట్లు ఈ కళేబరాన్ని తీసుకొని పొలంలోకి విసరుము అనెను."

27యూదా రాజయిన అహజ్యా దీనిని చూసి పారిపోయాడు. అతను ఉద్యానవన గృహంద్వారా తప్పించుకొనడానికి ప్రయత్నించాడు. యెహూ అతనిని అనుసరించాడు. "అహజ్యా తన రథంలోనికి వెళ్లినా, అతనిని చంపి వేయుము" అని యెహూ చెప్పాడు.

అందువల్ల యెహూ మనుష్యులు అహజ్యాను ఇబ్లెయాము దగ్గర గూరునకు వెళ్లే బాటమీద కొట్టగా అహజ్యా మెగిద్దోకు పారిపోయి అతను అక్కడ మరణించాడు. 28అహజ్యా సేవకులు అహజ్యా శరీరాన్ని రథంలో తీసుకొని యెరూషలేముకి వెళ్లారు. వారు అహజ్యాను దావీదు నగరంలో అతని పూర్వీకుల సమాధిలో సమాధి చేశారు.

29ఇశ్రాయేలు రాజుగా యెహోరాము పదకొండవ పరిపాలనా సంవత్సరమున అహజ్యా యూదాకు రాజయ్యాడు.

### యెజెబెలు భయంకర మరణం

30యెహూ యెజ్రెయేలుకు వెళ్లాడు. యెజెబెలు ఆ వార్త విన్నది. కనుక ఆమె తనను సింగారించుకుంది జుట్టు సరిదిద్దుకుంది, రంగుపూసుకుంది, శిరోభూషనములు ధరించుకున్న తర్వాత ఆమె కిటికీకి ప్రక్కగా నిలిచి వెలుపలికి చూచింది. 31యెహూ గుమ్మం ద్వారా నగరం ప్రవేశించాడు. "ఆమె అతనిని చూసి జిమ్రీ వంటివాడా, అతనివలె నీవు నీ యజమానిని చంపి వేశావు" సమాధానంగా వచ్చుచున్నావా అని యెజెబెలు అడిగెను.

32యెహూ కిటికీ పైకి చూశాడు. "నా ప్రక్క ఎవరున్నారు? ఎవరు?" అన్నాడు. ఇద్దరో ముగ్గురో నపుంసకులు యెహూని కిటికీ నుండి చూశారు. 33వారితో యెహూ, "యెజెబెలుని కిందికి తోసి వేయండి" అన్నాడు.తర్వాత నపుంసకులు యెజెబెలుని కిందికి తోసివేశారు. యెజెబెలు రక్తం కొంచెం గోడమీద చిమ్మింది. గుర్రాలమీద కూడా చిమ్మింది. గుర్రాలు యెజెబెలు శరీరం మీదుగా నడిచాయి. 34యెహూ ఇంట్లోకి వెళ్లి అన్నపానాదులు చేసిన తరువాత, "ఇప్పుడు ఈ శాపగ్రస్తురాలిని చూడండి, ఈమె ఒక రాజు కుమార్తె. అందువల్ల ఆమెను సమాధి చేయండి" అన్నాడు.

[35]ఆ మనుష్యులు యెజెబెలుని సమాధి చేయ
డానికి వెళ్లారు. కాని ఆమె శరీరం వారికి కనబడలేదు.
ఆమె కపాలము, ఆమె పాదాలు, ఆమె అరచేతులు
మాత్రమే కనిపించాయి. [36]అందువల్ల ఆ మనుష్యులు
వెనుదిరిగి వచ్చి యెహూతో చెప్పారు. అప్పుడు
యెహూ, "యెహోవా తన సేవకుడు తిష్బీవాడయిన
ఏలీయాతో చెప్పాడు. యెజ్రెయేలు ప్రదేశంలో యెజె
బెలు శవాన్ని కుక్కలు తింటాయని. [37]యెజ్రెయేలు
ప్రదేశపు పొలంలో యెజెబెలు శవం పెంటవలె ఉంటుం
దనీ, ఇది యెజెబెలని ఎవరూ గుర్తు పట్టలేరనీ ఏలీయా
చెప్పాడు."

### షోమ్రోను నాయకులకు యెహూ ఉత్తరాలు వ్రాయుట

10 షోమ్రోనులో అహాబుకి డెబ్బైమంది కుమారు
లుండిరి. యెహూ ఉత్తరాలు రాసి యెజ్రె
యేలు రాజులకు నాయకులకు వాటిని షోమ్రోనుకు
పంపాడు. అహాబు కుమారులను పెంచిన ప్రజలకు
కూడా ఆ ఉత్తరాలు అతడు పంపాడు. ఆ ఉత్తరాలలో
యెహూ ఇట్లు చెప్పాడు: [2-3]"మీకీ ఉత్తరం చేరగానే,
మీ తండ్రి కుమారులలో సర్వశ్రేష్టుడైన వానిని ఎన్ను
కోండి. మీకు రథాలు గుర్రాలు వున్నాయి. మీరు
బలిష్టమైన నగరంలో ఉంటున్నారు. మీకు ఆయుధాలు
కూడా వున్నాయి. మీరెన్నుకున్న అతని కుమారుని
తండ్రి సింహాసనం మీద కూర్చోబెట్టండి. తర్వాత
మీ తండ్రి వంశం కోసం పోరాడండి."

[4]కాని యెజ్రెయేలు పరిపాలకులు, నాయకులు
చాలా భయపడిపోయారు. "ఆ రాజులిద్దరు (యెహో
రాము మరియు అహజ్యా) యెహూని ఆపలేక
పోయారు. కనుక మనము కూడా అతనిని ఆపలేము"
అని వారు అనుకున్నారు.

[5]అహాబు గృహ సంరక్షకుడు, నగరాన్ని అదుపులో
ఉంచిన వాడు, అహాబు పిల్లలను పెంచిన పెద్దలు,
ప్రజలు యెహూకి ఒక సందేశం పంపారు. "మేము
మీ సేవకులం. మీరేమి చెపితే మేమది చేస్తాము. మేమె
వరిని రాజుగా చేసుకోవాలి. మీకు ఏది మంచిదిగా
తోస్తే అది మాకు చెయ్యండి" అని తెలియజేసారు.

### షోమ్రోను నాయకులు అహాబు పిల్లలను చంపుట

[6]తర్వాత యెహూ రెండవ ఉత్తరం ఆ నాయకులకు
రాశాడు. "మీరు కనుక నన్ను సమర్థిస్తే నా మాట
పాటిస్తే, ఇప్పుడు అహాబు కుమారుల తలలు నరికి
వేయండి. రేపు ఈపాటికి వాటిని యెజ్రెయేలులో
నా వద్దకు తీసుకురండి" అని యెహూ చెప్పాడు.

అహాబుకి డెబ్బైమంది కుమారులు. వారు తమను
పెంచిన నగర నాయకులతో ఉన్నారు. [7]ఈ లేఖను
నగర నాయకులు అందుకోగానే, వారు రాజ కుమా
రులు డెబ్బైమందిని తీసుకొని వెళ్లి చంపివేశారు.
తర్వాత నాయకులు రాజ కుమారుల తలలను బుట్ట
లలో వేసి యెజ్రెయేలులోని యెహూకి ఆ బుట్టలు
పంపారు. [8]దూత యెహూని సమీపించి అతనికిది
చెప్పాడు: "వాళ్లు రాజకుమారుల తలలు తెచ్చారు!"

తర్వాత యెహూ, "నగర ద్వారం వద్ద ఉదయం
వరకు రెండు వరసలలో ఆ తలలు ఉంచండి" అని
చెప్పాడు.

[9]ఉదయాన, యెహూ వెలుపలికి వెళ్లి, ప్రజల
యెదుట నిలచి వారితో ఇలా అన్నాడు: "మీరు అమా
యకులు. చూడండి. నేను నా యజమానికి విరుద్ధంగా
పథకాలు వేశాను. నేనతనిని చంపాను. కాని అహాబు
పిల్లలందరినీ ఎవరు చంపారు? మీరే చంపారు.
[10]యెహోవా చెప్పినదంతా జరుగుతుందని మీరు
గ్రహించాలి. మరియు యెహోవా అహాబు వంశానికి
సంబంధించిన యీ విషయాలు చెప్పేందుకు ఏలీ
యాని ఉపయోగించాడు. యెహోవా తాను చేస్తానన్న
పనులు చేశాడు."

[11]అందువల్ల యెహూ యెజ్రెయేలులో నివసించే
అహాబు వంశీయుల నందరినీ చంపివేశాడు. యెహూ
ముఖ్యులందరినీ, సన్నిహిత మిత్రుల్ని, యాజకులను
చంపివేశాడు. అహాబు వంశంలోని వారు ఎవ్వరూ మిగల
లేదు.

### యెహూ అహజ్యా బంధువులను చంపుట

[12]యెహూ యెజ్రెయేలు విడచి షోమ్రోనుకు
వెళ్లాడు. తోవలో యెహూ గొర్రెల కాపరుల శిబిరం
అనేచోట ఆగాడు. ఆ చోట గొర్రెల కాపరులు గొర్రెల
మీద ఉన్నిని కత్తిరిస్తున్నారు.

[13]యూదా రాజయిన అహజ్యా యొక్క బంధువు
లను యెహూ కలుసుకున్నాడు. "ఎవరు మీరు?" అని
యెహూ ప్రశ్నించాడు.

వారు, "మేము యూదా రాజయిన అహజ్యా బంధు
వులము. రాజకుమారులను రాణిగారి పిల్లలను చూసి
వెళదామని వచ్చాము" అని సమాధానం చెప్పారు.

[14]తర్వాత యెహూ, "వారిని సజీవులుగా తీసుకు
వెళ్లండి" అని తన మనుష్యులకు చెప్పాడు.యెహూ
మనుష్యులు అహజ్యా బంధువులను సజీవులుగా పట్టు
కున్నారు. వారు నలభై రెండు మంది. బేతెకెదు బావి
వద్ద యెహూ వారిని చంపివేశాడు. యెహూ ఒక్కరిని
కూడా ప్రాణాలతో వుండనివ్వలేదు.

### యెహూ యెహోనాదాబును కలుసుకొనుట

[15]అక్కడినుంచి యెహూ వెళ్లిన తర్వాత, అతను
రేకాబు కుమారుడైన యెహోనాదాబును కలుసు
కున్నాడు. యెహూని కలుసుకోవాలని యెహోనా
దాబు వెళ్లుచున్నాడు. యెహూ యెహోనా దాబును
అభినందించి, "నేను నీకు నమ్మకస్థుడనైన

స్నేహితునివలె, నీవు నాకు నమ్మకస్థుడనైన స్నేహితు
డవేనా?" అని అడిగాడు.
"నేను నీకు నమ్మకస్థుడైన స్నేహితుడినే" అని
యెహోనాదాబు బదులు చెప్పాడు.
"అలా అయితే, నీ చేయి నాకిమ్ము" అని యెహూ
చెప్పాడు.
తర్వాత యెహూ యెహోనాదాబును లాగి తన
రథంలోకి ఎక్కించుకున్నాడు.
[16]"నాతోపాటు రా. యెహోవాపట్ల నా భావాలు
ఎంత దృఢంగా ఉన్నాయో చూడవచ్చు" అని యెహూ
చెప్పాడు.
అందువల్ల యెహోనాదాబు యెహూ రథంలో
వెళ్లాడు. [17]యెహూ షోమ్రోనుకి వచ్చి, అక్కడ ఇంకా
సజీవులైవున్న అహాబు వంశీయులందరిని హత
మార్చాడు. యెహోవా ఏలీయాతో చెప్పినట్లుగా,
యెహూ అన్ని పనులు చేసాడు.

### యెహూ బయలుదేవుని పూజించే వారిని పిలచుట

[18]తర్వాత యెహూ ప్రజలందరినీ సమీకరించాడు.
వారితో యెహూ, "అహాబు కొద్దిగా బయలు దేవుని
సేవించాడు. కాని యెహూ అనే నేను బయలు దేవునికి
ఎక్కువ సేవ చేస్తాను. [19]ఇప్పుడు బయలు దేవుని
ప్రవక్తలను యాజకులను అందరినీ పిలవండి. బయలు
దేవుని పూజించేవారినందరినీ పిలవండి. ఈ సమా
వేశానికి అందరూ హాజరు అయ్యేలా చూడండి.
బయలు దేవునికి నేనొక గొప్పబలి సమర్పించాలి.
ఈ సమావేశానికి రానివారిని నేను చంపుతాను" అని
చెప్పాడు.
కాని యెహూ వారిపట్ల కుయుక్తి పన్నాడు. బయలు
ఆరాధకులను యెహూ నాశనం చేయదలచాడు.
[20]"బయలుకు ఒక పవిత్ర సమావేశం ఏర్పాటు
చేయండి" అని యెహూ చెప్పాడు. మరియు యాజ
కులు సమావేశం ప్రకటించారు. [21]తర్వాత యెహూ
ఇశ్రాయేలు దేశమంతటా ఒక సందేశం పంపాడు.
బయలు ఆరాధకులందరూ వచ్చారు. ఎవ్వరూ ఇంట్లో
వుండలేదు. బయలు దేవుని మందిరంలో బయలు
ఆరాధకులందరూ వచ్చారు. మందిరం ప్రజలతో నిండి
పోయింది. [22]దుస్తులు దగ్గర ఉంచబడిన వ్యక్తితో
యెహూ ఇట్లనెను. " బయలు ఆరాధకులందరికి
దుస్తులు తీసుకురండి" అని చెప్పగా ఆ వ్యక్తి బయలు
ఆరాధకులందరికి దుస్తులు తీసుకు వచ్చాడు.
[23]తర్వాత యెహూ, రేకాబు కుమారుడైన యెహో
నాదాబు బయలు మందిరంలోనికి పోయారు. బయలు
ఆరాధకులను ఉద్దేశించి, "మీ చుట్టు పక్కల చూడండి.
మీతో యెహోవా యొక్క సేవకులెవరూ లేరని
చూసుకోండి. బయలు ఆరాధకులు మాత్రమే ఇక్కడు
న్నారని నిర్ధారణ చేసుకోండి" అని యెహూ చెప్పాడు.
[24]బయలు ఆరాధకులు గుడిలోకి వెళ్లారు; బలులు
మరియు దహన బలులు అర్పించాలనుకున్నారు.
కాని వెలుపల, యెహూ ఎనభై మందితో వేచి
యున్నాడు. "ఎవ్వరూ తప్పించుకోకుండా చూడండి.
ఎవరైనా ఒక్కనినైనా తప్పించినట్లయితే, ఆ వ్యక్తి
తన ప్రాణమునే ఫలితంగా పెట్టవలసి వస్తుంది" అని
యెహూ చెప్పాడు.
[25]త్వరగా యెహూ తన దహన బలుల అర్పణ
పూర్తి చేయగా, అతను కాపలాదారులకు, అధిపతులకు
ఇట్లు చెప్పాడు. "లోపలికి వెళ్లి, బయలు ఆరాధకులను
చంపండి. ఆలయంలోనుండి ఎవ్వరూ సజీవంగా బయ
టికి రాకుండా చూడండి" అని చెప్పాడు.
అందువల్ల అధిపతులు ఖడ్గాలు ప్రయోగించి
బయలు ఆరాధకులను చంపివేశారు. ఆ తర్వాత కాపలా
దార్లు, అధిపతులు బయలు ఆరాధకుల శరీరాలను
బయటికి విసిరివేశారు. తర్వాత వారు బయలు దేవత
ఆలయంలోని లోపలిగదిలోనికి వెళ్లారు.
[26]బయలు ఆలయంలో వున్న జ్ఞాపక శిలలను*
వారు వెలుపలికి తీసుకువచ్చి, దేవాలయాన్ని దగ్ధం
చేశారు.
[27]తర్వాత దేవాలయంలోని జ్ఞాపకశిలలను నుగ్గు
నుగ్గు చేశారు. బయలు దేవాలయాన్ని కూడా నుగ్గు
నుగ్గు చేశారు. వారు బయలు దేవాలయాన్ని ఒక
మరుగుదొడ్డిగా మార్చారు. ప్రజలు ఇప్పటికీ ఆ ప్రదేశ
మును ముస్తాబు గదిగా (పాయిఖానాగా) వాడతారు.
[28]ఈ విధంగా యెహూ ఇశ్రాయేలులో బయలు
ఆరాధనను నాశనం చేశాడు. [29]కాని నెబాతు కుమారు
డైన యరొబాము చేసిన పాపాలు పూర్తిగా తొలగలేదు;
అందువల్ల ఇశ్రాయేలు పాపం చేయవలసి వచ్చింది.
బేతేలు, దానులలో బంగారు దూడలను యెహూ
నాశనం చెయ్యలేదు.

### ఇశ్రాయేలుమీద యెహూ పరిపాలన

[30]యెహోవా యెహూని ఉద్దేశించి, "నీవు బాగుగా
చేశావు. నేను చెప్పిన సంగతులను నీవు చేశావు. నేను
ఆశించిన విధంగా నీవు అహాబు వంశాన్ని నాశనం
చేశావు. అందువల్ల నీ సంతతి వారు ఇశ్రాయేలును
నాలుగు తరాలవరకూ పరిపాలిస్తారు" అని చెప్పాడు.
[31]కాని హృదయపూర్వకంగా యెహూ జాగ్రత్తగా
యెహోవా ధర్మశాస్త్రాన్ని పాటిస్తూ నివసించలేదు.
ఇశ్రాయేలును పాపానికి గురిచేసిన యరొబాము పాపా
లను యెహూ ఆపలేకపోయాడు.

---

**జ్ఞాపక శిలలను** ప్రజలు ఒక ప్రత్యేక విషయాన్ని జ్ఞాపకముంచుకోవటానికి రాళ్లను ప్రతిష్ఠించేవాళ్లు. ఇశ్రాయేలీయులు కూడా అలాగే చేసేవాళ్లు.

### హజాయేలు ఇశ్రాయేలును ఓడించుట

32ఆ సమయమున, యెహోవా ఇశ్రాయేలును
భాగాలుగా ఛేదింపసాగాడు. సిరియా రాజయిన హజా
యేలు ఇశ్రాయేలు ప్రతి సరిహద్దుననున్న ఇశ్రాయేలు
వారిని ఓడించాడు. 33యోర్దాను నదికి తూర్పునవున్న
ప్రదేశాన్ని హజాయేలు జయించాడు. గాదీయులకును,
రూబేనీయులకును మరియు మనష్షేవంశాలకు చెందిన
ప్రాంతాలను, గిలాదుప్రాంతములన్నీ, అర్నోను
లోయ ప్రక్కనున్న అరోయేరు ప్రదేశంలోని గిలాదు,
బాషాను ప్రాంతాల వరకూ హజాయేలు జయించాడు.

### యెహూ మరణం

34యెహూ కావించిన ఇతర గొప్ప పనులు 'ఇశ్రా
యేలు రాజుల వృత్తాంతము' అనే గ్రంథంలో వ్రాయ
బడినవి. 35యెహూ మరణించగా, అతని పూర్వీకులతో
పాటుగా సమాధి చేయబడ్డాడు. షోమ్రోనులో ప్రజలు
యెహూని సమాధి చేశారు. అతని తర్వాత, యెహూ
కుమారుడైన యెహోయాహాజు ఇశ్రాయేలుకి కొత్తగా
రాజయ్యాడు. 36షోమ్రోనులో ఇశ్రాయేలు మీద
యెహూ ఇరవైఎనిమిది సంవత్సరాల పాటు పరి
పాలించాడు.

### అతల్యా యూదాలోని రాజకుమారులందరిని చంపుట

11 అతల్యా అహజ్యా యొక్క తల్లి. తన కుమా
రుడు చనిపోయినట్లు ఆమె చూసింది. అందు
వల్ల ఆమె లేచి రాజవంశం అంతటినీ చంపివేసింది.
2యెహోషెబ రాజైన యెహోరాముయొక్క
కుమార్తె. అహజ్యా సోదరి. యోవాషు రాజ కుమారు
లలో ఒకడు. మిగిలిన పిల్లలు చంపబడినప్పుడు
యెహోషెబ యోవాషును తీసుకుని దాచింది. ఆమె
యోవాషును అతని దాదిని ఆమె పడక గదిలో
ఉంచింది. అందువల్ల యెహోషెబ మరియు దాది
అతల్యాకి తెలియకుండా యోవాషును కాపాడారు. ఆ
విధంగా యోవాషు మరణించలేదు.
3తర్వాత యోవాషు మరియు యెహోషెబా
యెహోవా యొక్క ఆలయంలో దాగివున్నారు.
అక్కడ యోవాషు ఆరు సంవత్సరములు దాగివున్నాడు.
మరియు అతల్యా యూదా దేశాన్ని పరిపాలించింది.
4ఏడవ సంవత్సరమున ప్రధాన యాజకుడయిన
యెహోయాదా సైనికుల అధిపతులను కాపలాదారు
లను రప్పించాడు. యెహోయాదా వారిని యెహోవా
ఆలయములో ఒక చోట సమకూర్చాడు. తర్వాత
యెహోయాదా వారితో ఒక ఒడంబడిక కుదుర్చు
కున్నాడు. ఆలయంలో యెహోయాదా వారిని ఒక
వాగ్దానం చేయమని నిర్బంధించాడు. అప్పుడు వారికి
రాజుగారి కుమారుడైన యోవాషును చూపించాడు.
5తర్వాత యెహోయాదా వారికొక ఆజ్ఞ విధించాడు.
"ఈ పని మీరు చెయ్యాలి. ప్రతి విశ్రాంతి రోజున
మీలో మూడోవంతు రావాలి. మీరు రాజభవనాన్ని
కాపలా కాయాలి. 6మూడోవంతు సూరు ద్వారం వద్ద
వుండాలి. మరియు మూడోవంతు కాపలాదారులకు
వెనకాల ద్వారంవద్ద వుండాలి. ఈ విధంగా మీరు ఒక
గోడవలె యోవాషును రక్షించాలి. 7ప్రతి విశ్రాంతి రోజు
మీలో రెండువంతుల యెహోవా ఆలయాన్ని కాపలా
కాయాలి. యోవాషు రాజుని రక్షించాలి. యోవాషు
రాజు ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్లినా మీరు అతని
వెంట వుండాలి. 8మొత్తం రాజుని ఆవరించి వుండాలి.
ప్రతి కాపలాదారుడు తన ఆయుధాన్ని చేత ధరించి
వుండాలి. మీకు మరీ దగ్గరగా వచ్చే ఎవనినైనా మీరు
హతమార్చాలి" అని అన్నాడు.
9యెహోయాదా యాజకుడు ఆజ్ఞాపించిన అన్ని
టినీ అధిపతులు పాటించారు. ప్రతి అధిపతి తన
మనుష్యులను తీసుకున్నాడు. ఒక బృందమేమో శని
వారంనాడు రాజుకి కాపలాగా ఉండాలి. వారం మిగిలిన
రోజుల్లో ఇతర బృందాలు కాపలాగా వుండాలి రాజుకి.
యెహోయాదా యాజకుని వద్దకు ఆ మనుష్య
లందరు వెళ్లారు.
10మరియు యాజకుడు బల్లెములు, కవచములు
అధిపతులకు ఇచ్చాడు. ఆ బల్లెములు కవచములు
యెహోవా ఆలయంలో దావీదు ఉంచినవి. 11ఈ
కాపలాదార్లు ఆయుధములు ధరించి ఆలయం కుడి
మూలనుంచి మరియు ఆలయం ఎడమ మూలవరకు
నిలబడ్డారు. వారు బలిపీఠం, ఆలయం చుట్టూ నిల
బడ్డారు. వారు దేవాలయంలో రాజును కాపాడడానికి
ఆయన చుట్టూ నిలబడ్డారు. 12ఈ మనుష్యులు
యోవాషును బయటకు తీసుకొని వచ్చి అతని తల
మీద వారు కిరీటం ఉంచారు. దేవునికీ రాజుకీ మధ్య
జరిగిన ఒడంబడికను రాజుకి ఇచ్చారు. తర్వాత వారు
అతనిని అభిషేకించి కొత్త రాజుగా చేశారు. "రాజు
వర్ధిల్లుగాక!" అని వారు కరతాళ ధ్వనులు చేశారు;
నినాదాలు చేశారు.
13రాణి అతల్యా కాపలాదారులు మరియు ప్రజల
నుండి శబ్దం విన్నది. అందువల్ల ఆమె యెహోవా
ఆలయం వద్దనున్న ప్రజల దగ్గరకు వెళ్లింది. 14అతల్యా
మామూలుగా రాజు నిలబడే స్తంభం వద్ద రాజుని
చూసింది. రాజుకోసం బాకాలూదే నాయకులను ప్రజ
లను కూడా ఆమె చూసింది. అందరు మనుష్యులు
చాలా సంతోషంగా వున్నట్లు ఆమె చూసింది. బూరలు
మ్రోగాయి. ఆమె తలక్రిందులయినట్లుగా తెలుపడానికి
తన వస్త్రములు చింపుకొన్నది. తర్వాత అతల్యా, "రాజ
ద్రోహం, రాజద్రోహం" అని అరిచింది.
15సైనికులు అధికారులుగా నున్న అధిపతులకు
యాజకుడు అయిన యెహోయాదా ఒక ఆజ్ఞ
విధించాడు. "ఆలయం వెలుపలికి అతల్యాను తీసుకొని

వెళ్లండి. ఆమె అనుచరులను చంపండి. కాని యెహోవా ఆలయంలో వారిని చంపకండి" అని యెహోయాదా వారికి చెప్పాడు.

[16]అందువల్ల సైనికులు అతల్యాను లాగివేశారు. అంతఃపురానికి గుర్రాలు వెళ్లే ప్రవేశంగుండా ఆమె వెళ్లేటప్పుడు ఆమెను చంపివేశారు.

[17]తర్వాత యెహోయాదా రాజుకు ప్రజలకు మధ్య ఒక ఒడంబడిక చేశాడు. ఈ ఒడంబడిక రాజు ప్రజలు యెహోవాకి చెందిన వారని తెలుపుతుంది. యెహోయాదా రాజుకు ప్రజలకు మధ్య కూడా ఒక ఒడంబడిక చేశాడు. ప్రజలకు రాజు ఏమి చేయాలో ఈ ఒడంబడిక తెలుపుతుంది. ప్రజలు విధేయులై రాజుని అనుసరిస్తారని ఈ ఒడంబడిక తెలుపుతుంది.

[18]తర్వాత మనుష్యులు అందరు అసత్య దేవత బయలు ఆలయానికి వెళ్లారు. ఆ మనుష్యులు బయలు విగ్రహాన్ని, అతని బలిపీఠాలను ధ్వంసం చేశారు. వాటిని వారు ముక్కలు ముక్కలుగా చేశారు. ఆ మనుష్యులు బయలు యొక్క యాజకుడు మత్తానును బలిపీఠముల వద్ద చంపివేశారు.

అందువల్ల యాజకుడు అయిన యెహోయాదా యెహోవా ఆలయాన్ని ఆ మనుష్యుల అధికారమున నిర్వహణార్థం ఉంచాడు. [19]యాజకుడు మనుష్యు లందరిని నడిపించాడు. వారు యెహోవా ఆలయం నుండి రాజు ఇంటివరకు వెళ్లారు. రాజుగారి ప్రత్యేక కాపలాదార్లు, అధిపతులు రాజుతోపాటు వెళ్లారు. మరియు మనుష్యులందరూ వారిని అనుసరించారు. వారు రాజభవన ప్రవేశ ద్వారం వద్దకు వెళ్లారు. యోవాషు రాజు సింహాసనం మీద ఉన్నాడు.

[20]మనుష్యులు అందరు చాలా సంతోషంగా వున్నారు. నగరం శాంతంగా ఉంది. మరియు రాణి అతల్యాను రాజభవనం వద్ద కత్తితో చంపివేసిన తరు వాత [21]యోవాషు రాజయినప్పుడు, అతను ఏడేండ్ల వాడు.

### యోవాషు పరిపాలన ప్రారంభించుట

12 ఇశ్రాయేలు రాజుగా యెహూ పాలన సాగించిన ఏడవ సంవత్సరంనుండి యోవాషు తన పరి పాలన ప్రారంభించాడు. యెరూషలేములో యోవాషు 40 సంవత్సరములు పాలించాడు. యోవాషు తల్లి బెయే ర్షెబాకు చెందిన జిబ్యా. [2]యెహోవా సరి అయినవని చెప్పిన పనులు యోవాషు జరిగించాడు. జీవితాం తమూ యోవాషు యెహోవా పట్ల విధేయుడై వుండెను. యాజకుడైన యెహోయాదా తనకు నేర్పించిన పనులు అతను చేశాడు. [3]కాని అతను ఉన్నత స్థానాలను నాశనం చెయ్యలేదు. ఆ ఆరాధనా స్థలాలలో నేటికీ ప్రజలు బలులు అర్పిస్తున్నారు, ధూపం వేస్తున్నారు.

### యోవాషు ఆలయ పునరుద్ధారణకు ఆజ్ఞాపించుట

[4-5]"యెహోవా ఆలయంలో చాలా ధనం వున్నది. ప్రజలు ఆలయానికి కొన్ని వస్తువులు సమర్పించారు. వారిని లెక్కించినప్పుడు ప్రజలు ఆలయం పన్ను చెల్లించారు. డబ్బు ఇవ్వాలనే వుద్దేశ్యంతో వారు ఇచ్చారు. యాజకులైన మీరు ఆ ధనం తీసుకొని యెహోవా ఆలయాన్ని బాగు చేయండి. తాను సేవ చేసే ప్రజలనుండి లభించే డబ్బును ప్రతి యాజకుడు వినియోగించాలి. యెహోవా ఆలయానికి ఆ డబ్బుతో మంచిపనులు చేయాలి" అని యాజకులకు యోవాషు చెప్పాడు.

[6]కాని యాజకులు మరమ్మతులు చేయలేదు. యోవాషు రాజుగావున్న 23వ సంవత్సరమున, యాజ కులు అప్పటికీ మరమ్మతులు చేయలేదు. [7]అందువల్ల యోవాషు రాజు యెహోయాదా యాజకుని, ఇతర యాజకులను పిలిపించుకున్నాడు. యోవాషు, యెహోయాదా, ఇతర యాజకులతో, "మీరెందుకు ఆలయాన్ని మరమ్మతు చేయలేదు? మీరు సేవించే మనుష్యుల వద్దనుండి మీరు డబ్బును తీసుకోవడం నిలిపివేయండి. ఆ డబ్బును వాడకండి. ఆలయాన్ని మరమ్మతు చేయుటకే అది వినియోగించ బడాలి" అని చెప్పాడు.

[8]ప్రజలవద్ద నుండి డబ్బు వసూలు చేయడాన్ని ఆపివేయడానికి యాజకులు సమ్మతించారు. అయితే ఆలయాన్ని బాగు చేయకూడదని నిర్ణయించు కున్నారు. [9]అందువల్ల యాజకుడైన యెహోయాదా ఒక పెట్టె తీసుకుని దానిమీద ఒక రంధ్రం చేశాడు. తర్వాత యెహోయాదా బలిపీఠపు దక్షిణ దిశగా పెట్టెను ఉంచాడు. ఈ పెట్టె యెహోవా ఆలయానికి ప్రజలు వచ్చే ద్వారానికి పక్కగా వున్నది. కొందరు యాజకులు ఆలయంలోని ఆ ద్వారాన్ని కాపలా కాసారు. యెహోవాకి ప్రజలు సమర్పించిన డబ్బును ఆ యాజకులు తీసుకుని, ఆ పెట్టెలో వేశారు.

[10]తర్వాత ఆలయానికి వెళ్లినప్పుడల్లా ప్రజలు ఆ పెట్టెలో డబ్బు వేయడం మొదలుపెట్టారు. రాజుగారి కార్యదర్శి, ప్రధాన యాజకుడు ఆ పెట్టెలో డబ్బు చాలా ఉండడం చూసినప్పుడు, వారు ఆ పెట్టె నుండి డబ్బు తీసుకోసాగారు. వారు ఆ డబ్బుని సంచులలో వేసి లెక్కించారు. [11]యెహోవా ఆలయాన పనిచేసే వారికి వారు ఆ డబ్బు ఇచ్చి వేశారు. వడ్రంగులు మరి ఇతర ఆలయ కాపరులకు డబ్బు ఇచ్చారు. [12]రాళ్లు చెక్కే వారికి రాళ్లు మోసేవారికీ ఇవ్వడానికి ఆ డబ్బు వినియోగించారు. మరియు కలపకొనడానికి, రాళ్లు ముక్కలు చేయడానికి, ఆలయ మరమ్మతు పనులకు వారు ఆ డబ్బు వినియోగించారు.

[13-14]యెహోవా ఆలయానికి ప్రజలు డబ్బు ఇచ్చారు. కాని యాజకులు ఆ డబ్బుతో వెండి

కప్పులు, దీపాలు తీసివేసేందుకు వుపయోగించే
కప్పులు, గిన్నెలు, బూరలు, బంగారం, వెండి పాత్రలు
చేసేందుకు యాజకులు ఆ డబ్బు వినియోగించలేక
పోయారు. ఆ డబ్బు పనివారికి ఇవ్వబడింది. ఆ పని
వారు యెహోవా ఆలయాన్ని బాగుగా చేశారు.
15ఆ డబ్బునంతా ఎవ్వరూ లెక్కించలేదు. ఆ
డబ్బు ఏమి చేయబడినదో చెప్పమని ఏ పనివానిని
నిర్భంధించ లేదు. ఎందుకనగా పనివారు నమ్మకస్థులుగా
ఉన్నారు.
16అపరాధ పరిహారార్థ బలులు, పాపపరిహారార్థ
బలులు సమర్పించు సమయములో ప్రజలు ఆ డబ్బు
ఇచ్చారు. ఆ డబ్బు పనివారికి ఇవ్వబడడం జరిగేదికాదు.
ఆ డబ్బు యాజకులకు చెందినది.

### హజాయేలు నుండి యోవాషు యెరూషలేమును రక్షించుట

17సిరియారాజు హజాయేలు. గాతు నగరానికి ప్రతి
కూలంగా యుద్ధం చేయడానికి హజాయేలు వెళ్లాడు.
హజాయేలు గాతుని ఓడించాడు. తర్వాత అతను
యెరూషలేముకు ప్రతికూలంగా యుద్ధం చేయడానికి
నిశ్చయించాడు.
18యెహోషాపాతు, యెహోరాము అహజ్యాలు
యూదా రాజులుగా వున్నారు. వారు యోవాషు పూర్వీ
కులు. వారు యెహోవాకు చాలా వస్తువులు సమర్పిం
చారు. ఆ వస్తువులు ఆలయంలో ఉంచబడ్డాయి.
యోవాషు కూడా చాలా వస్తువులు యెహోవాకు
సమర్పించాడు. యోవాషు ఆలయంలోవున్న అన్ని
వస్తువులు, బంగారం తీసుకున్నాడు. తన యింట్లో
ఉన్న వాటిని కూడా తీసుకున్నాడు. తర్వాత
యోవాషు ఆ విలువగల వస్తువులను సిరియా రాజైన
హజాయేలుకి పంపాడు. అప్పుడు హజాయేలు యెరూ
షలేమునుండి వెళ్లిపోయాడు.

### యోవాషు మరణం

19యోవాషు చేసిన అన్ని ఘనకార్యాలు 'యూదా
రాజుల చరిత్ర ' అనే గ్రంథంలో వ్రాయబడినవి.
20యోవాషు అధికారులు అతనికి విరుద్ధంగా పథకం
వేశారు. వారు సిల్లాకి వెళ్లే మార్గమున ఉన్న 'మిల్లో'
అనే ఇంట్లో యోవాషును చంపివేశారు. 21షిమాతు
కుమారుడైన యోజాకారు,* షోమేరు కుమారుడైన
యెహోజాబాదు యోవాషు అధికారులు. వారు
యోవాషుని చంపివేశారు.
దావీదు నగరంలో అతని పూర్వీకులతో పాటుగా
యోవాషుని సమాధి చేశారు. యోవాషు కుమారుడైన
అహజ్యా అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### యెహోయాహాజు తన పరిపాలన ప్రారంభించుట

13 యెహూ కుమారుడైన యెహోయాహాజు
షోమ్రోనులోని ఇశ్రాయేలుకు రాజయ్యాడు.
అహజ్యా కుమారుడైన యోవాషు యూదా రాజుగా
ఉన్న 23వ సంవత్సరమున ఇది జరిగింది. యెహోయా
హాజు 17 ఏళ్లపాటు పరిపాలించాడు.
2యెహోయాహాజు యెహోవా తప్పు అని
చెప్పిన పనులను చేశాడు. ఇశ్రాయేలును పాపానికి
గురిచేసిన, నెబాతు కుమారుడు యరొబాము పాపా
లను యెహోయాహాజు అనుసరించాడు. యెహో
యాహాజు వీటిని చేయడం మానలేదు. 3అప్పుడు
యెహోవా ఇశ్రాయేలుకు వ్యతిరేకంగా కోపగించెను.
సిరియా రాజయిన హజాయేలు, హజాయేలు కుమారు
డైన బెన్హదదులకు యెహోవా ఇశ్రాయేలు దేశపు
అధికారాన్ని ఇచ్చెను.

### ఇశ్రాయేలు ప్రజల మీద యెహోవా దయ

4తర్వాత యెహోయాహాజు తనకు సహాయం
చేయమని యెహోవాను ప్రార్థించాడు. యెహోవా
అతని మొర ఆలకించాడు. ఇశ్రాయేలు కష్టాలను
యెహోవా చూశాడు. సిరియా రాజు ఇశ్రాయేలు
వారిని ఎలా కష్టపెట్టెనో కూడా చూశాడు.
5అందువల్ల ఇశ్రాయేలుని కాపాడేందుకు ఒక వ్యక్తిని
యెహోవా పంపాడు. ఇశ్రాయేలువారు సిరియావారి
నుండి విడిపింపబడ్డారు. అందువల్ల ఇశ్రాయేలువారు
పూర్వం చేసినట్లుగా, తమ ఇళ్లకు పోయారు.
6కాని ఇశ్రాయేలువారు ఇశ్రాయేలుని పాపానికి గురి
చేసిన యరొబాము వంశీయుల పాపాలను ఆపలేదు.
యరొబాము చేసిన పాపాలను వారు కొనసాగించారు.
వారు షోమ్రోనులో అషెరా స్తంభాలు ఉంచారు.
7సిరియా రాజు యెహోయాహాజు యొక్క సైన్యాన్ని
ఓడించి సైన్యంలోని చాలామందిని సిరియా రాజు
నాశనం చేశాడు. అతను ఏభై మంది గుర్రాల సైనికు
లను, పదిరథాలను, పదివేలమంది సైనికులను
మాత్రమే విడిచిపెట్టాడు. యెహోయాహాజు యొక్క
సైనికులు నూర్పిడి సమయాన గాలికి చెదర కొట్టబడే
ఊక వంటివారైనారు. 8యెహోయాహాజు చేసిన ఘన
కార్యాలన్నీ 'ఇశ్రాయేలు రాజుల చరిత్ర' అనే గ్రంథంలో
రాయబడ్డాయి. 9యెహోయాహాజు మరణించగా,
అతని పూర్వీకులతో పాటు అతను సమాధి చేయ
బడ్డాడు. షోమ్రోనులో ప్రజలతనిని సమాధి చేశారు.
యెహో యాహాజు కుమారుడు యెహోయాషు
అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### యెహోయాషు ఇశ్రాయేలుని పాలించుట

10యెహోయాహాజు కుమారుడైన యెహో
యాషు షోమ్రోనులోని ఇశ్రాయేలుకు రాజయ్యాడు.

---

**యోజాకారు** లేక యోజహారు.

యూదా రాజుగా యెహోయాషు పరిపాలించిన 37
వ సంవత్సరంలో ఇది జరిగింది. యెహోయాషు
ఇశ్రాయేలీయులను 16 సంవత్సరాలు పరిపాలించాడు.
11యెహోవా తప్పు అని చెప్పిన కార్యాలను యెహో
యాషు జరిగించాడు. నెబాతు కుమారుడైన యరో
బాము ఇశ్రాయేలు పాపకార్యాలకు గురిచేసిన ఆ చెడు
కార్యాలను అతను నివారించలేక పోయాడు. యెహో
యాషు ఆ పాపాలు కొనసాగించాడు. 12యెహో
యాషు చేసిన ఆ ఘనకార్యాలు అతను యూదా
రాజయిన అమాజ్యాకు ప్రతికూలంగా చేసిన యుద్ధాలు
'ఇశ్రాయేలు రాజుల చరిత్ర' అనే గ్రంథంలో వ్రాయ
బడ్డాయి. 13యెహోయాషు మరణించగా, అతని
పూర్వీకులతో పాటుగా అతడు సమాధి చేయబడ్డాడు.
యరొబాము క్రొత్తగా రాజయ్యాడు. యెహోయాషు
సింహాసనం మీద యెరొబాము ఆసీనుడయ్యాడు.
యెహోయాషు ఇశ్రాయేలు రాజులతో పాటు షోమ్రో
నులో సమాధి చేయబడ్డాడు.

### యెహోయాషు ఎలీషాని సందర్శించుట

14ఎలీషా జబ్బు పడ్డాడు. తర్వాత ఎలీషా ఆ
జబ్బుతో మరణించాడు. ఇశ్రాయేలు రాజయిన
యెహోయాషు ఎలీషాని సందర్శించడానికి వెళ్లి,
యెహోయాషు ఎలీషా కోసం విలపించాడు. "నా
తండ్రీ, నా తండ్రీ! ఇశ్రాయేలు రథాలకు గుర్రాలకు
ఇది సమయమేనా?"* అని అడిగాడు.

15యెహోయాషుతో, "విల్లు, కొన్ని బాణాలు
తీసుకొనుము" అని ఎలీషా చెప్పాడు.

యెహోయాషు ఒక విల్లు, కొన్ని బాణాలు తీసు
కున్నాడు. 16అప్పుడు ఎలీషా ఇశ్రాయేలు రాజుతో
ఇలా చెప్పాడు: "వింటిమీద నీ చేయి వేయుము."
యెహోయాషు వింటిమీద తన చేయి వేసాడు.
తర్వాత ఎలీషా రాజు చేతులమీద తన చేతులు
ఉంచాడు.

17"తూర్పు కిటికీ తెరువుము" అని ఎలీషా
చెప్పాడు. యెహోయాషు కిటికీ తెరిచాడు. తర్వాత,
"గురిచూసి బాణం వదులుము" అని ఎలీషా చెప్పాడు.
యెహోయాషు బాణం వదిలాడు. అప్పుడు ఎలీషా,
"అది యెహోవా యొక్క విజయాస్త్రం! సిరియా
మీద విజయాస్త్రం. నీవు సిరియన్లను అఫెకు అనే
చోట ఓడిస్తావు. మరియు వారిని నాశనం చేస్తావు"
అని చెప్పాడు.

18"బాణాలు తీసుకో" అని ఎలీషా చెప్పాడు.
యెహోయాషు బాణాలు తీసుకున్నాడు. అప్పుడు
ఇశ్రాయేలు రాజుతో, "నేల మీద కొట్టుము" అని
ఎలీషా చెప్పాడు.

మూడుసార్లు యెహోయాషు నేలను కొట్టాడు.
తర్వాత ఆపివేశాడు. 19దైవజనుడు అయిన ఎలీషా
యెహోయాషుపై కోపగించాడు. "నీవు ఐదు లేక
ఆరుసార్లు కొట్టి వుండవలసింది. అప్పుడు నీవు సిరి
యాను నాశనమయ్యేంత వరకు ఓడించేవాడివి. కాని
ఇప్పుడు నీవు సిరియాని మూడు సార్లు మాత్రమే
ఓడించగలవు" అని ఎలీషా చెప్పాడు.

### ఎలీషా సమాధివద్ద ఆశ్చర్యకరమైన విషయం

20ఎలీషా మరణించగా, ప్రజలతనిని సమాధి చేశారు.
వసంత ఋతువులో ఒకసారి, మోయాబు సైనిక
బృందం ఇశ్రాయేలుకు వచ్చింది. యుద్ధంలోని వస్తు
వులను తీసుకోడానికి వారు వచ్చారు. 21కొందరు ఇశ్రా
యేలువారు చనిపోయిన ఒక వ్యక్తిని సమాధి చేస్తూ
ఉన్నారు. వారు సైనిక బృందాన్ని చూశారు. ఇశ్రాయేలు
వారు ఆ చనిపోయిన వ్యక్తిని ఎలీషా సమాధిలోకి విస
రివేసి పారిపోయారు. ఎలీషా ఎముకలను ఆ చని
పోయిన వ్యక్తి తాకగానే, సజీవుడయ్యాడు; తన కాళ్ల
మీద నిలబడగలిగాడు!

### యెహోయాషు ఇశ్రాయేలు నగరాలను జయించుట

22యెహోయాషు పరిపాలించిన ఆ రోజులలో,
సిరియా రాజయిన హజాయేలు ఇశ్రాయేలుకు ఇబ్బంది
కలిగించాడు. 23కాని యెహోవా ఇశ్రాయేలు వారిపట్ల
దయ వహించాడు. యెహోవా దయాళుడు. ఇశ్రా
యేలు వారివైపు తిరిగినాడు మరియు వారిని నాశనం
చేయలేదు. ఎందుకంటే అబ్రాహాము, ఇస్సాకు, యాకో
బులతో తాను చేసిన ఒడంబడిక వల్ల, యెహోవా
ఇశ్రాయేలు వారిని నాశనం చేయడు; ఇకను వారిని
విసర్జించడు.

24సిరియా రాజయిన హజాయేలు మరణించాడు.
అతని తర్వాత అతని కుమారుడు బెన్హదదు క్రొత్త
రాజయ్యాడు. 25అతను మరణించడానికి పూర్వం,
యుద్ధంలో హజాయేలు కొన్ని నగరాలను యెహో
యాషు తండ్రి అయిన యెహోయాహాజు నుండి
తీసుకొనెను. కాని ఇప్పుడు యెహోయాషు హజా
యేలు కుమారుడైన బెన్హదదు నుండి యీ నగరాలు
మరల పొందెను. యెహోయాషు, బెన్హదదును
మూడుసార్లు ఓడించి, ఇశ్రాయేలు నగరాలను మరల
తీసుకున్నాడు.

### అమాజ్యా యూదాలో తన పరిపాలన ప్రారంభించుట

14 యూదా రాజయిన యోవాషు కుమారుడైన
అమాజ్యా యెహోయాహాజు కొడుకైన
యోవాషు ఇశ్రాయేలు రాజుగా వున్న రెండవ సంవత్స
రమున యూదాకు రాజయ్యాడు. 2అమాజ్యా పరి
పాలన ప్రారంభించేనాటికి 25 యేళ్లవాడు. యెరూ

---

**ఇశ్రాయేలు … సమయమేనా?** 2 రాజు 2:12 చూడుము.

షలేములో అమాజ్యా 29 సంవత్సరాలు పరిపాలించాడు.
అతని తల్లి పేరు యెహోయద్దాను. [3]యెహోవా
మెచ్చుకున్న పనులు అమాజ్యా జరిగించాడు. తన
పూర్వీకుడైన దావీదువలె అతను పూర్తిగా దేవుని
అనుసరించలేదు. తన తండ్రి అయిన యోవాషు చేసిన
పనులన్నీ అతను చేశాడు. [4]అతను ఉన్నత స్థానాలను
నాశనం చేయలేదు. ఆ ఆరాధనా స్థలాలలో నేటికీ
ప్రజలు బలులు అర్పించుచూ; ధూపం వేస్తున్నారు.
[5]అమాజ్యాకు తన రాజ్యం మీద మంచి అదుపు
వున్న ఆ సమయమున, తన తండ్రిని చంపిన అధికారు
లను అతను చంపాడు. [6]కాని హంతకుల పిల్లలను
అతను చంపలేదు. యెహోవా మోషే ధర్మశాస్త్రంలో
ఈ ఆజ్ఞను ఇచ్చాడు: "తమ పిల్లలు చేసినదానికి వారి
తల్లిదండ్రులను చంపకూడదు. తమ తల్లిదండ్రులు
చేసిన దానికి వారి పిల్లలను చంపకూడదు. అతనే
స్వయంగా చేసిన చెడు పనికి అతనినే చంపవలెను."*
[7]అమాజ్యా ఉప్పు లోయలో పదివేల మంది
ఎదోము వాళ్లను చంపాడు. యుద్ధంలో అమాజ్యా
సెలా అనే స్థలాన్ని "యొక్తయేలు" అని వ్యవహ
రించాడు. ఆ స్థలం నేటికీ "యొక్తయేలు" అని పిలువ
బడుచున్నది.

### అమాజ్యా యెహోయాషుకి ప్రతికూలంగా యుద్ధం కోరుకొనుట

[8]అమాజ్యా యెహోయాహాజు కుమారుడైన
యెహోయాషు వద్దకు దూతల్ని పంపాడు. యెహో
యాహాజు ఇశ్రాయేలు రాజయిన యెహూ కుమారుడు.
"మనము ముఖాముఖిగా కలుసుకుని యుద్ధం చేద్దాము"
అని అమాజ్యా సందేశం పంపించాడు.
[9]ఇశ్రాయేలు రాజయిన యెహోయాషు యూదా
రాజయిన అమాజ్యాకు బదులు రాశాడు. యెహో
యాషు ఇలా చెప్పాడు. "లెబానోను దేవదారు చెట్టుకి
లెబానోనులోని ముళ్లపొద ఒక సందేశం పంపింది.
అది ఏమనగా, నీవు నీ కుమార్తెను నా కుమారుడికి
పెళ్లి చేసుకునేందుకు యిమ్ము. కాని లెబానోనులోని
ఒక దుష్ట మృగం ఆ త్రోవను వెళుతూ ముళ్లపొద
మీద నడిచింది. నీవు ఎదోముని ఓడించిన మాట
నిజమే. [10]కాని నీవు ఎదోము మీద పొందిన విజయానికి
నీవు గర్వపడుతున్నావు. నీవు ఎదోములో వుండి మిడి
సిపడుతున్నావు. ఇంతకు నీవు ఎందుకు ఆపద తెచ్చు
కుంటావు. నీవు ఇలా చేస్తే, నీవు పతనంకాగలవు.
మరియు యూదా నీతోపాటు నాశనం కాగలదు."
[11]కాని అమాజ్యా యెహోయాషు ఇచ్చిన హెచ్చరి
కను లెక్కచేయలేదు. అందువల్ల ఇశ్రాయేలు రాజైన
యెహోయాషు యూదా రాజైన అమాజ్యాకు ప్రతి
కూలంగా బేత్షెమెషు అనే చోట యుద్ధం చేయడానికి
వెళ్లాడు. [12]ఇశ్రాయేలు యూదాను ఓడించాడు.
యూదాకు చెందిన ప్రతి వ్యక్తి పారిపోయాడు. [13]బేత్షె
మెషు వద్ద ఇశ్రాయేలు రాజైన యెహోయాషు
యూదా రాజైన అమాజ్యాను బంధించాడు. అమాజ్యా
యోవాషు కుమారుడు. అతను అహజ్యా కుమారుడు.
యెహోయాషు అమాజ్యాను యెరూషలేముకు తీసు
కువెళ్లాడు. యెహోయాషు ఎఫ్రాయిము ద్వారం
నుంచి కోట ద్వారం, 600 అడుగుల యెరూషలేము
ప్రాకారమును పగలగొట్టాడు.
[14]తర్వాత యెహోయాషు యెహోవా ఆలయం
లోని బంగారం, వెండి, వస్తువులను రాజభవనంలోని
నిధులను తీసుకుపోయాడు. యెహోయాషు ప్రజ
లను కూడా తన బందీలుగా తీసుకుపోయాడు.
తర్వాత అతను షోమ్రోనుకు తిరిగి వెళ్లాడు.
[15]యెహోయాషు చేసిన ఘనకార్యములు
యూదా రాజయిన అమాజ్యాతో అతను పోరాడిన
విధంతో సహా 'ఇశ్రాయేలు రాజ్య చరిత్ర' అనే
గ్రంథంలో వ్రాయబడి వున్నవి. [16]యెహోయాషు
మరణించగా, అతనిని అతని పూర్వీకులతో పాటు
సమాధి చేశారు. ఇశ్రాయేలు రాజులతో పాటుగా
షోమ్రోనులో యెహోయాషు సమాధి చేయబడ్డాడు.
యెహోయాషు కుమారుడు యరొబాము, అతని
తర్వాత క్రొత్తగా రాజయ్యాడు.

### అమాజ్యా మరణం

[17]ఇశ్రాయేలు రాజైన యెహోయాహాజు కుమా
రుడు యెహోయాషు మరణించిన 15సంవత్సరాల
వరకు యూదా రాజయిన యోవాషు కుమారుడు
అమాజ్యా బ్రదికాడు. [18]అమాజ్యా జరిగించిన
ఘనకార్యాలన్నీ 'యూదా రాజుల చరిత్ర' అనే
గ్రంథంలో వ్రాయబడివున్నాయి. [19]యెరూషలేములో
ప్రజలు అమాజ్యాకు ప్రతి కూలంగా ఒక పథకం వేశారు.
అమాజ్యా లాకీషుకు పారిపోయాడు. కాని ప్రజలు
లాకీషుకు అమాజ్యా వెనకాల కొందరు వ్యక్తులను
పంపారు. ఆ వ్యక్తులు లాకీషులో అమాజ్యాను చంపి
వేశారు. [20]ప్రజలు అమాజ్యా దేహాన్ని గుర్రాల మీద
వెనక్కి తీసుకువచ్చి, దావీదు నగరంలో అతని పూర్వీ
కులతో పాటు అమాజ్యాను సమాధి చేశారు.

### అజర్యా యూదా మీద తన పరిపాలన ప్రారంభించుట

[21]తర్వాతయూదాలోని మనుష్యులందరు అమజ్యా
కుమారుడైన అజర్యాను కొత్త రాజుగా చేశారు. అజర్యా
16 యేండ్లవాడు.
[22]అమాజ్యా రాజు మరణించగా, అతని పూర్వీకు
లతో పాటు అతనిని సమాధి చేశారు. తర్వాత అజర్యా

---

**తల్లిదండ్రులు ... చంపవలెను** ద్వితీ. 24:16 చూడండి.

ఏలతు పట్టణం మరల నిర్మించి, దానిని యూదాకు
స్వాధీన పరిచాడు.

### రెండవ యరొబాము ఇశ్రాయేలు మీద తన పరిపాలన ప్రారంభించుట

[23]యూదా రాజుగా యోవాషు కుమారుడైన
అమాజ్యా పరిపాలనలో 15వ సంవత్సరమున ఇశ్రా
యేలు రాజైన యెహోయాషు కుమారుడు యరొ
బాము సమరియాలో పరిపాలన ప్రారంభించెను.
యరొబాము 41 సంవత్సరాలు పరిపాలించాడు.
[24]యెహోవా తప్పు అని చెప్పిన కార్యములు ఈ
యరొబాము చేశాడు. నెబాతు కుమారుడు యరొ
బాము ఇశ్రాయేలు పాపాలకు కారణమైన ఆ పాపకార్య
ములను యరొబాము ఆపలేదు. [25]హమాతు నుండి
అరబా సముద్రం దాకా వ్యాపించిన ఇశ్రాయేలు దేశ
మును యరొబాము మరల తీసుకున్నాడు. ఇశ్రాయేలు
దేవుడగు యెహోవా తన భక్తుడైన అమిత్తయి కుమా
రుడు యోనాకు చెప్పినట్లు ఇది జరిగింది. అమిత్తయి
గత్హేపెరు నుండి వచ్చిన ఒక ప్రవక్త. [26]ఇశ్రాయేలు
వారందరికీ చాలా ఇబ్బందులున్నాయని యెహోవా
చూశాడు. సేవకులు స్వతంత్రులూ వున్నారని
చూశాడు. ఇశ్రాయేలుకు సహాయం చేయదగిన వ్యక్తి
ఎవరూ లేరు. [27]ప్రపంచంలో ఇశ్రాయేలు అన్న పేరుని
తీసివేస్తానని యెహోవా చెప్పలేదు. అందువల్ల
యెహోవా యెహోయాషు కుమారుడైన యరొబా
ముని ఇశ్రాయేలు ప్రజలను రక్షించేందుకు ఏర్పాటు
చేసాడు.

[28]యరొబాము చేసిన ఘనకార్యాలన్ని 'ఇశ్రా యేలు
రాజుల చరిత్ర' అనే గ్రంథంలో రాయబడినవి. ఇశ్రా
యేలుకు గాను దమస్కు మరియు హమాతులను
యరొబాము తిరిగి పొందిన కథకూడా ఇందులో
పొందుపరచబడింది. (ఈ నగరాలు యూదాకి చెంది
నవి). [29]యరొబాము మరణించగా, ఇశ్రాయేలీయుల
రాజులైన అతని పూర్వీకులతో పాటుగా అతను
సమాధి చేయబడ్డాడు. యరొబాము కుమారుడైన
జెకర్యా, అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### యూదా మీద అజర్యా పరిపాలన

15 ఇశ్రాయేలు రాజుగా యరొబాము పరిపాలన
చేసే 27వ సంవత్సరమున యూదాకు రాజైన
అమాజ్యా కుమారుడు అజర్యా రాజయ్యాడు. [2]అతను
పరిపాలన ప్రారంభించేనాటికి, అజర్యా 16 సంవత్సర
ముల వయస్సు గలవాడు. యెరూషలేములో 52 సంవ
త్సరాలు పరిపాలించాడు. అజర్యా తల్లి పేరు యెరూష
లేముకు చెందిన యెకొల్యా. [3]తన తండ్రి అమాజ్యా
వలె, అజర్యా యెహోవా మంచివని చెప్పిన పనులు
చేశాడు. అతని తండ్రి అమాజ్యా చేసిన వాటినే అజర్యా
అనుసరించాడు. [4]కాని అతను ఉన్నత స్థానాలను పాడు
చేయలేదు. ఈ ఉన్నత స్థలాల్లో* ప్రజలింకా బలులు
అర్పించుచూ; ధూపం వేయు చున్నారు.
[5]యెహోవా అజర్యా రాజును కుష్ఠరోగగ్రస్తునిగా
చేశాడు. అతను మరణించేంత వరకు కుష్ఠరోగియే.
అజర్యా విడిగా ఒక ఇంట్లో ఉన్నాడు. రాజ కుమారుడైన
యోతాము రాజభవన సంరక్షణలో శ్రద్ధ వహించాడు.
ప్రజలను న్యాయ విచారణ చేశాడు.
[6]అజర్యా చేసిన ఘనకార్యాలన్నీ 'యూదా రాజుల
చరిత్ర' అనే గ్రంథంలో రాయబడినవి. [7]అజర్యా మర
ణించగా, దావీదు నగరంలో అతని పూర్వీకులతో
పాటు సమాధి చేయబడ్డాడు. అజర్యా కుమారుడు
యోతాము, అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### ఇశ్రాయేలు మీద జెకర్యా కొద్ది కాలపు పరిపాలన

[8]యరొబాము కుమారుడైన జెకర్యా ఇశ్రాయేలు
లోని షోమ్రోనుపై ఆరు నెలలు పరిపాలించాడు. ఇది
యూదా రాజుగా అజర్యా పరిపాలనకు వచ్చిన 38వ
సంవత్సరమున జరిగింది. [9]యెహోవా తప్పు అని
చెప్పిన పనులు జెకర్యా చేశాడు. అతని పూర్వీకులు
చేసిన వాటినే అతను చేసెను. నెబాతు కుమారుడైన
యరొబాము చేసిన పాపాలవల్ల ఇశ్రాయేలును పాప
మునకు పాల్పడజేసిన ఆ పాపకార్యాలను అతను ఆప
లేదు.

[10]యాబేషు కుమారుడైన షల్లూము జెకర్యాకు
విరోధంగా కుట్రపన్నాడు. షల్లూము జెకర్యాను ప్రజల
ముందర చంపివేశాడు. అతని తర్వాత షల్లూము కొత్తగా
రాజయ్యాడు. [11]జెకర్యా చేసిన ఇతర పనులన్నీ
'ఇశ్రాయేలు రాజుల చరిత్ర' అనే గ్రంథంలో రాయబడి
వున్నవి.

[12]ఈ విధంగా యెహోవా చెప్పినవన్నీ నిజమ
య్యాయి. యెహూ యొక్క సంతతిలోని నాలుగు
తరాల వారు ఇశ్రాయేలు రాజులుగా ఉందురని
యెహోవా చెప్పాడు.

### ఇశ్రాయేలు మీద షల్లూము కొద్దికాలము అధికారం చేయుట

[13]యాబేషు కుమారుడైన షల్లూము ఇశ్రాయేలుకు
రాజయ్యాడు. ఇది యూదా రాజుగా ఉజ్జియా పరి
పాలన చేసే 39వ సంవత్సరంలో జరిగింది. షోమ్రో
నులో షల్లూము ఒక నెల పరిపాలించాడు.
[14]గాదీ కుమారుడైన మెనహేము తిర్సానుండి
షోమ్రోనుకు వచ్చాడు. మెనహేము యాబేషు

---

**ఉన్నత స్థలాలు** దేవుణ్ణి, అబద్ధపు దేవుళ్ళను పూజించే స్థలాలు తరచుగా ఈ స్థలాలు కొండలపైన, పర్వతాలపైన ఉంటాయి.

కుమారుడైన షల్లూమును చంపివేశాడు. తర్వాత
మెనహేము, అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.
15షల్లూము చేసిన అన్ని పనులు జెకర్యాకు విరు
ద్ధంగా అతని పథకములతో సహా 'ఇశ్రాయేలు రాజుల
చరిత్ర' అనే గ్రంథంలో రాయబడ్డాయి.

## ఇశ్రాయేలులో మెనహేము పరిపాలన

16షల్లూము మరణానంతరం, మెనహేము తిప్సహు
ఆ పరిసర ప్రాంతాన్ని ఓడించాడు. అతనికై ప్రజలు
నగరద్వారాన్ని తెరవడానికి అంగీకరించలేదు. అందు
వల్ల మెనహేము వారిని ఓడించాడు. నగరంలోని గర్భిణీ
స్త్రీల కడుపులు చీల్చాడు.
17అజర్యా యూదా రాజుగా వున్న 39వ సంవత్సర
మున, గాదీ కుమారుడైన మెనహేము ఇశ్రాయేలుకు
రాజయ్యాడు. షోమ్రోనులో మెనహేము పది సంవత్స
రాల పాటు పరిపాలించాడు. 18యెహోవా చెడ్డవని
చెప్పిన పనులు మెనహేము చేశాడు. నెబాతు కుమారు
డైన యరొబాము ఇశ్రాయేలీయులను పాపాలకు
గురిచేసిన ఆ పాపాలను మెనహేము ఆపలేదు.
19అష్షూరు రాజయిన 'పూలు' ఇశ్రాయేలుకు ప్రతి
కూలంగా యుద్ధం చేయడానికి వచ్చాడు. మెనహేము
పూలుకు 75,000 పౌన్ల వెండి ఇచ్చాడు. పూలు
మెనహేముకి సహాయపడుననీ, మెనహేము రాజ్యాన్ని
బలిష్ఠం చేయుననీ అనుకుని అతను అలా చేశాడు.
20ధనవంతులూ, అధికారం గలవారూ పన్నులు చెల్లిం
చునట్లుగా చేసి మెనహేము డబ్బును వసూలు చేశాడు.
మెనహేము ప్రతి వ్యక్తికీ 20 తులాల వెండి పన్నుగా
విధించాడు. తర్వాత మెనహేము అష్షూరు రాజుకి ఆ
డబ్బు ఇచ్చాడు. అందువల్ల అష్షూరు రాజు ఇశ్రాయే
లును విడిచి వెళ్లాడు.
21మెనహేము చేసిన అన్ని గొప్పకార్యాలు 'ఇశ్రా
యేలు రాజుల చరిత్రగ్రంథంలో' రాయబడినవి. 22మెన
హేము మరణించగా, అతని పూర్వీకులతో పాటు,
అతడు సమాధి చేయబడ్డాడు. మెనహేము కుమారుడు
పెకహ్యా అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

## ఇశ్రాయేలులో పెకహ్యా పరిపాలన

23అజర్యా యూదా రాజుగా వున్న 50వ సంవత్స
రమున, మెనహేము కుమారుడైన పెకహ్యా షోమ్రోను
లోని ఇశ్రాయేలుకు రాజయ్యాడు. పెకహ్యా రెండేండ్లు
పాలించాడు. 24యెహోవా తప్పని చెప్పిన కార్యాలను
పెకహ్యా చేశాడు. నెబాతు కుమారుడైన యరొబాము
ఇశ్రాయేలును పాపకార్యాలకు గురిచేసిన ఆ పాపాలను
పెకహ్యా ఆపలేదు.
25పెకహ్యా సైన్యానికి అధిపతి అయిన పెకహు
రెమల్యా కుమారుడు. పెకహు రాజైన పెకహ్యాకు విరోధ
ముగా పన్నాగము చేశాడు. అతనిని షోమ్రోనులోని
రాజభవనములో అతను చంపాడు. గిలాదునుంచి
వచ్చిన 50 మంది మనుష్యులు పెకహ్యాని చంపేట
ప్పుడు పెకహుతో పాటువున్నారు. అతని తర్వాత
పెకహు కొత్తగా రాజయ్యాడు.
26పెకహ్యా చేసిన అన్ని గొప్పకార్యాలు 'ఇశ్రాయేలు
రాజుల చరిత్ర' అనే గ్రంథంలో రాయబడినవి.

## ఇశ్రాయేలులో పెకహు పరిపాలన

27యూదా రాజుగా అజర్యా వున్న 52వ సంవత్స
రమున షోమ్రోనులోని ఇశ్రాయేలుని రెమల్యా కొడు
కైన పెకహు పరిపాలించసాగాడు. పెకహు 20 సంవత్స
రాలు పరిపాలించాడు.
28యెహోవా చెడ్డవని చెప్పిన పనులు పెకహు
చేశాడు. నెబాతు కుమారుడైన యరొబాము ఇశ్రాయే
లుని పాపానికి గురిచేసిన ఆ పాపాలను పెకహు
ఆపలేదు.
29అష్షూరు పాలకుడైన తిగ్లత్పిలేసెరు ఇశ్రా
యేలుకు ప్రతికూలంగా యుద్ధం చేయడానికి
వచ్చాడు. ఇశ్రాయేలు రాజుగా పెకహు వున్న కాలంలో
ఇది జరిగింది. తిగ్లత్పిలేసెరు, ఈయోను, ఆబేల్బేత్మ
యకా, హాసోరు, గిలాదు, యానోయహు కెదెషు
గలిలయ మరియు నఫ్తాలీ ప్రాంతమంతటినీ స్వాధీనం
చేసుకున్నాడు. ఈ అన్ని స్థలాలనుండి తిగ్లత్పిలేసెరు
ప్రజలను బందీలుగా అష్షూరుకు తీసుకువెళ్లాడు.
30హోషేయా కొడుకు ఏలా, రెమల్యా కొడుకు
పెకహు మీద పన్నాగం పన్నాడు. హోషేయా పెక
హును చంపివేశాడు. అప్పుడు హోషేయా పెకహుకు
పిదప క్రొత్తగా రాజు అయ్యాడు. ఇది ఉజ్జియా కొడుకు
యోతాము యొక్క 20వ సంవత్సర యూదా పరి
పాలనలో జరిగింది.
31పెకహు చేసిన అన్ని ఘనకార్యములు 'ఇశ్రాయేలు
రాజుల చరిత్ర' అనే గ్రంథంలో రాయబడినవి.

## యూదాపై యోతాము పరిపాలన

32ఉజ్జియా కుమారుడైన యోతాము యూదాకు
రాజయ్యాడు. రెమల్యా కొడుకైన పెకహు ఇశ్రాయే
లుకు రాజుగా వున్న రెండవ సంవత్సరంలో ఇది జరి
గింది. 33యోతాము రాజయినప్పుడు, అతను 25
యేండ్లవాడు. యోతాము యెరూషలేములో 16 సంవ
త్సరాలు పాలించాడు. యోతాము తల్లి పేరు యెరూషా.
ఆమె సాదోకు కుమార్తె. 34తన తండ్రి ఉజ్జియా
వలె, యెహోవా మంచివని చెప్పిన పనులు యోతాము
చేశాడు. 35కాని అతను ఉన్నత స్థలాలను పాడు చేయ
లేదు. ఈ ఉన్నత స్థలాలలో ప్రజలు నేటికీ బలులు
అర్పించుచూ ధూపం వేయుచున్నారు. యెహోవా
ఆలయానికి గల పైద్వారమును యోతాము నిర్మిం
చాడు. 36యోతాము చేసిన అన్ని ఘనకార్యాలు

'యూదా రాజుల చరిత్ర' అనే గ్రంథంలో రాయ
బడినవి.
37ఆ సమయమున, సిరియా రాజయిన రెజీనును,
రెమల్యా కొడుకైన పెకహును యూదాకు ప్రతి
కూలంగా యుద్ధం చేయడానికి యెహోవా పంపాడు.
38యోతాము మరణించగా, అతని పూర్వీకులతో
పాటు అతను అతని పూర్వీకుడైన దావీదు పేరు
మీదగల నగరంలో సమాధి చేయబడ్డాడు. యోతాము
కుమారుడు అహాజు అతని తర్వాత కొత్తగా
రాజయ్యాడు.

## యూదాలో అహాజు రాజు అగుట

16 యోతాము కుమారుడైన అహాజు యూదాకు
రాజయ్యాడు. రెమల్యా కుమారుడైన పెకహు
ఇశ్రాయేలుకు రాజుగా వున్న 17వ సంవత్సరమున
అది జరిగింది. 2అహాజు రాజయ్యేనాటికి, అతను 20
యేండ్లవాడు. యెరూషలేములో అహాజు 16 సంవత్స
రాలు పరిపాలించాడు. యెహోవా చేయుమని చెప్పిన
పనులు అహాజు చేయలేదు. తన పూర్వీకుడైన దావీదు
దేవునికి విధేయుడు. కానీ తన పూర్వీకులవలె అహాజు
యెహోవాకి విధేయత చూపలేదు. 3అహాజు ఇశ్రా
యేలు రాజులవలె నివసించాడు. అతను తన కుమా
రుని కూడా అగ్నిలో బలిగా అర్పించాడు. ఇశ్రాయేలు
వారు వచ్చినప్పుడు యెహోవా విడిచి వెళ్లుటకు
కారణమైన ఆ జనాంగములు చేసిన భయంకర పాపా
లను అతను అనుసరించాడు. 4అహాజు బలులు
అర్పిస్తూ ఉన్నత స్థలాలలో ధూపం వేసాడు; కొండల
మీద ప్రతి పచ్చని చెట్టు కిందను వెలిగించాడు.
5సిరియా రాజయిన రెజీను రెమల్యా కుమారుడు
మరియు ఇశ్రాయేలు రాజయిన పెకహు యెరూషలే
ముకు ప్రతికూలంగా యుద్ధం చేయడానికి వచ్చారు.
రెజీను పెకహు కలిసి అహాజుని చుట్టుముట్టారు; కాని
ఓడించలేకపోయారు. 6ఆ సమయంలో సిరియా రాజ
యిన రెజీను సిరియా కోసం ఏలతును తిరిగి
పొందాడు. ఏలతులో నివసించే యూదా వారినందరిని
రెజీను తీసుకుపోయాడు. ఏలతులో స్థిరపడిన సిరియ
నులు నేటికీ అక్కడే నివసిస్తున్నారు.
7అష్షూరు రాజయిన తిగ్లత్పిలేసెరు వద్దకు అహాజు
దూతలను పంపాడు. సందేశం ఏమనగా: "నేను మీ
సేవకుడను. నేను మీకు కుమారునివంటి వాడను.
సిరియా రాజు, ఇశ్రాయేలు రాజుల నుండి నన్ను
మీరు కాపాడవలెను. వారు నాతో యుద్ధం చేయడానికి
వచ్చారు."
8యెహోవా ఆలయంలోను, రాజభవన నిధుల
లోను వున్న వెండి బంగారాలను అహాజు తీసుకొని
పోయాడు. తర్వాత అహాజు అష్షూరు రాజుకి కానుక
పంపాడు. 9అష్షూరు రాజు అహాజు మాట ఆలకించాడు.
అష్షూరు రాజు దమస్కుకు ప్రతికూలంగా యుద్ధానికి
పోయాడు. రాజు ఆ నగరాన్ని వశం చేసుకున్నాడు;
ప్రజలను బందీలుగా చేసి దమస్కు నుండి కీరుకి
తీసుకునిపోయాడు. అతను రెజీనును కూడా చంపి
వేశాడు.
10అహాజు రాజు అష్షూరు రాజైన తిగ్లత్పిలేసెరును
కలుసుకునేందుకు దమస్కు వెళ్లాడు. దమస్కులో
అహాజు బలిపీఠం చూశాడు. అహాజు రాజు దీని నమూ
నాని పద్ధతిని ఊరియా యాజకునికి పంపాడు.
11తర్వాత యాజకుడయిన ఊరియా దమస్కు నుండి
అహాజు రాజు పంపిన నమూనాననుసరించి ఒక బలిపీఠం
నిర్మించాడు. దమస్కు నుండి అహాజు రాజు రాకకు
పూర్వమే ఊరియా యాజకుడు అదే రకమైన బలిపీఠం
నిర్మించాడు.
12దమస్కు నుండి రాజు రాగానే, అతను బలిపీఠం
చూశాడు. ఆ బలిపీఠం వద్ద రాజు బలులు అర్పించాడు.
13బలిపీఠం మీద అహాజు దహన బలులు ధాన్యార్పణలు
అర్పించాడు. అతను పానీయ అర్పణలు, సమాధాన
బలులు ఈ బలిపీఠం మీద అర్పించాడు.
14అహాజు ఆలయం ముందు భాగం నుండి
యెహోవా సమక్షంలోవున్న కంచు బలిపీఠం తీసు
కున్నాడు. ఈ కంచు బలిపీఠం అహాజు బలిపీఠానికి
యెహోవా ఆలయానికి మధ్య వున్నది. తన సొంత
బలిపీఠానికి ఉత్తర దిశగా కంచు బలిపీఠం ఉంచాడు.
15అహాజు ఊరియా యాజకునికి ఆజ్ఞ విధించాడు:
"ఉదయపు దహనబలులను, సాయంకాలపు ధాన్యా
ర్పణలను, ఈ దేశంలోని ప్రజల పానీయ అర్పణలకు
ఈ పెద్ద బలిపీఠం ఉపయోగించాలి. వండబడిన
బలులు, దహన బలులు మరి ఇతర బలుల నుండి
తీసిన రక్తాన్ని పెద్ద బలిపీఠం మీద చల్లాలి. కాని అవస
రము వచ్చినప్పుడల్లా నేను కంచు బలిపీఠం ఉపయోగి
స్తాను."
16అహాజు రాజు తనకు ఆజ్ఞాపించిన ప్రకారం
ఉరియా యాజకుడు జరిగించాడు.
17యాజకులు తమ చేతులు కడుగుకొనేందుకు
బళ్ల నిండుగా ఇత్తడి గంగాళాలు, లోతు పళ్లాలు వున్నవి.
అహాజు రాజు ఆ గంగాళాలు, లోతు పళ్లెములు తొల
గించి బండ్లని ముక్కలు చేశాడు. కంచు స్తంభాల మీద
నున్న పెద్ద తొట్టిని తీసివేశాడు. ఆ పెద్ద తొట్టిని
చదును చేయబడిన రాయిపై వుంచాడు. 18ఆలయం
లోని ప్రతి భాగంలో సబ్బాతు సమావేశాల కోసం
పనివారు మూయబడిన ఒక ప్రదేశం తయారు చేశారు.
అహజు రాజు తన కోసం కప్పియున్న మండపము
మరియు వెలుపలి ప్రవేశాన్ని తీసివేశాడు. వాటన్నిటినీ
యెహోవా ఆలయంనుంచి అహజు తీసివేశాడు.
అష్షూరు రాజుకోసం అహాజు అవి చేశాడు.
19అహాజు చేసిన ఆ కార్యాలన్నీ 'యూదా రాజుల

చరిత్ర అనే గ్రంథంలో రాయబడి ఉన్నాయి. 20అహాజు
మరణించగా, అతను దావీదు నగరంలో అతని పూర్వి
కులతో పాటు సమాధి చేయబడ్డాడు. అహాజు కుమా
రుడు హిజ్కియా, అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

## హోషేయా ఇశ్రాయేలు మీద తన పాలన ప్రారంభించుట

17 ఏలా కుమారుడైన హోషేయా ఇశ్రాయే
లులో షోమ్రోను నుంచి పరిపాలించసాగాడు.
అహాజు యూదా రాజుగా ఉన్న 12వ సంవత్సరమున
ఇది జరిగింది. హోషేయా తొమ్మిదేళ్ల పరిపాలిం
చాడు. 2యెహోవా తప్పనిచెప్పిన పనులు
హోషేయా చేశాడు. కాని హోషేయా తనకు పూర్వి
కులైన ఇశ్రాయేలు రాజులవలె చెడ్డవాడు కాదు.
3షల్మనేసెరు అష్షూరుకు రాజు. అతను హోషే
యాకి ప్రతికూలంగా యుద్ధానికి వెళ్లాడు. షల్మనేసెరు
హోషేయాని ఓడించాడు. మరియు హోషేయా
అతని సేవకుడయ్యాడు. అందువల్ల హోషేయా షల్మ
నేసెరుకు పన్ను చెల్లించాడు.
4తర్వాత, హోషేయా ఈజిప్టు రాజు సహాయం
కోరుతూ దూతలను పంపాడు. ఆ రాజు పేరు సో.
ఆ సంవత్సరం హోషేయా తాను ప్రతియేడు చేసే
విధంగా అష్షూరు రాజుకి కప్పం కట్టలేదు. అష్షూరు
రాజు తనకు విరుద్ధంగా హోషేయా పథక రచన
చేసినట్లు తెలుసుకున్నాడు. అందువల్ల అష్షూరు రాజు
హోషేయాని ఖైదుచేసి చెరసాలలో వేశాడు.
5అష్షూరు రాజు ఇశ్రాయేలులో చాలా స్థలాలపై
దాడి చేశాడు. తర్వాత షోమ్రోనుకు అతను వచ్చాడు.
అతను షోమ్రోనుకి ప్రతికూలంగా మూడు సంవత్స
రాలు యుద్ధం చేశాడు. 6అష్షూరు రాజు ఇశ్రాయేలు
రాజుగా హోషేయా వున్న తొమ్మిదో సంవత్సరమున
షోమ్రోనును తీసుకున్నాడు. అష్షూరు రాజు చాలా
మంది ఇశ్రాయేలు వారిని బంధించి, వారిని బందీలుగా
అష్షూరుకు తీసుకుని వెళ్లాడు. వారినతడు గోజాను
వద్ద హాబోరు నదికి ప్రక్కగా హలాహు అనే చోటను,
మాదీయుల ఇతర నగరాలలోను నివసింపజేశాడు.
7ఇశ్రాయేలు వారు తమ యెహోవా దేవునికి విరు
ద్ధంగా పాపం చేశారు కనుక, ఈ విషయాలు జరిగాయి.
ఆ యెహోవాయే ఈజిప్టు నుండి ఇశ్రాయేలు వారిని
బయటకు తీసుకువచ్చాడు. మరియు ఈజిప్టు రాజైన
ఫరో శక్తి నుండి యెహో వాయే రక్షించాడు. కాని
ఇశ్రాయేలు వారు ఇతర దేవుళ్లను పూజించసాగారు.
ఈజిప్టు రాజైన ఫరో అధికారం నుండి యెహోవా
వారిని సంరక్షించాడు. 8ఇతర జనాంగములు చేసినట్లు
గానే, వారు చేయసాగారు. ఇశ్రాయేలీయులు వచ్చి
నప్పుడు ఆ జనాంగములను వారిని తమ ప్రదేశము
వదిలి వెళ్లాలని యెహోవా చేత నిర్భందించబడ్డారు.
ఇశ్రాయేలు వారు కూడా దేవుని వల్లగాక రాజులచే
పరిపాలించబడాలని ఎంచుకున్నారు. 9ఇశ్రాయేలు
వారు తమ యెహోవా దేవునికి విరుద్ధమైన సంగతు
లను రహస్యంగా చేశారు. వారు చేసినవి సరి అయినవి
కావు! తమ నగరాలన్నిటిలోను ఇశ్రాయేలువారు
ఉన్నత స్థలాలు నిర్మించారు. చిన్న పట్టణం నుంచి
పెద్ద నగరం దాకా. 10ఇశ్రాయేలువారు స్మారక శిలలు
వేశారు. ప్రతి కొండమీదను పచ్చని చెట్ల క్రిందను
అషెరా స్తంభాలు ఏర్పాటు చేశారు. 11అన్ని ఆరాధనా
స్థలాలలోను ఇశ్రాయేలువారు ధూపం వేసేవారు.
యెహోవా జనాంగములను తమ కళ్ల ఎదుటే బల
వంతంగా విడిచిపెట్టి వెళ్లమని చెప్పిన విధంగా, వారీ
పనులు చేసేవారు. ఇశ్రాయేలువారు చేసినచెడుపనులు
యెహోవాకి ఆగ్రహం కలిగించాయి. 12వారు విగ్రహ
లను కొలిచారు. “మీరీ పని చేయకూడదు” అని
యెహోవా ఇశ్రాయేలువారికి చెప్పాడు.
13ఇశ్రాయేలుని యూదాని హెచ్చరిక చేసేందుకు
యెహోవా ప్రతి ప్రవక్తను, దీర్ఘదర్శిని ఉపయోగిం
చాడు. “మీరు చేసే చెడు పనులకు అయిష్టత
చూపండి. నా ఆజ్ఞలను చట్టాలను పాటించండి. మీ
పూర్వికులకు నేనిచ్చిన ధర్మశాస్త్రమును మీరు అను
సరించండి. ఈ ధర్మశాస్త్రాన్ని నా సేవకులైన ప్రవక్తల
ద్వారా మీకు అందించాను” అని యెహోవా చెప్పాడు.
14కాని ప్రజలు ఆ మాటలు వినలేదు. తమ పూర్వి
కులవలె వారు మొండిగా వుండిరి. వారి పూర్వీకులు
తమ యెహోవా దేవుని విశ్వసించలేదు. 15ప్రజలు
యెహోవా చట్టాలను అంగీకరించలేదు. తమ పూర్వి
కులతో యెహోవా చేసిన ఒడంబడికను అంగీకరించ
లేదు. వారు యెహోవా చేసిన హెచ్చరికలను పాటించ
లేదు. ఎందుకు విలువలేని విగ్రహములను వారు కొలి
చారు, మరియు వారు ఎందుకు విలువలేనివార
య్యారు. తమ చుట్టూ వున్న జనాంగములవలె వారు
ఆ ప్రజల చెడు జీవిత పద్ధతిని అనుసరించారు. మరియు
యెహోవా ఇశ్రాయేలు ప్రజలను, హెచ్చరించి, ఆ
చెడు పనులు చేయవద్దని చెప్పాడు.
16తమ యెహోవా దేవుని ఆజ్ఞలను ప్రజలు పాటిం
చడం మానివేశారు. వారు రెండు బంగారు దూడల
విగ్రహాలు చేశారు. అషెరా స్తంభాలు వారు ఏర్పాటు
చేశారు. వారు ఆకాశంలోని అన్ని నక్షత్రాలను పూజిం
చారు; బయలు దేవతలను కొలిచారు.
17వారు తమ కొడుకుల్ని, కూతుళ్లని అగ్నిలో
వేసి బలి ఇచ్చారు. భవిష్యత్తుని తెలుసుకునేందుకు
వారు చేతబడి తనమును ఇంద్రజాలమును ఉపయో
గించారు. దుష్కార్యమని యెహోవా చెప్పినదానిని
ప్రజలు చేశారు. యెహోవాని ఆగ్రహ పరిచేందుకు
వారు అలా చేశారు. 18అందువల్ల యెహోవా ఇశ్రా
యేలుపట్ల చాలా కోపపడ్డాడు; తన దృష్టినుంచివారిని

తప్పించాడు. యూదా గోత్రం తప్ప మరి ఇతర
ఇశ్రాయేలువారు లేరు.

### యూదా ప్రజలు కూడా దోషం చేసినవారే

19యూదా ప్రజలు కూడా తమ దేవుడైన
యెహోవా ఆజ్ఞలను పాటించలేదు. యూదా ప్రజలు
ఇశ్రాయేలు ప్రజలవలె నివసించారు.
20యెహోవా ఇశ్రాయేలు ప్రజలందరిని త్రోసి
పుచ్చాడు. అతడు వారికి ఎన్నో ఇబ్బందులు కలుగ
జేశాడు. ఇతరులు తమను నాశనం చేసేటట్లు చేసు
కున్నారు. చిట్టచివరికి, ఆయన తన దృష్టినుండి వారిని
త్రోసిపుచ్చాడు. 21యెహోవా దావీదు వంశం నుంచి
ఇశ్రాయేలుని విడగొట్టాడు. మరియు ఇశ్రాయేలువారు
నెబాతు కుమారుడైన యరొబామును తమ రాజుగా
చేసుకున్నారు. యరొబాము యెహోవాని అనుసరిం
చని వారుగా వారిని గురించాడు. ఇశ్రాయేలువారు మహా
పాపం చేసేలా యరొబాము చేశాడు. అందువల్ల 22ఇశ్రా
యేలువారు యరొబాము చేసిన పాపాలన్నీ చేశారు.
23యెహోవా తన దృష్టినుండి ఇశ్రాయేలుని దూర
ముగా తీసుకుపోయే వరకు, వారు ఆ పాపాలు
చేయడం మానలేదు. మరియు ఇలా జరుగునని
యెహోవా చెప్పాడు! ఆయన ప్రజలకు ఇలా జరుగు
తుందని చెప్పమని ప్రవక్తలను పంపించాడు. అందువల్ల
ఇశ్రాయేలువారిని తమ దేశంనుండి అష్షూరుకు తీసుకు
వెళ్లడం జరిగింది. అక్కడ వారు నేటిదాకా వున్నారు.

### షోమ్రోను ప్రజల ప్రారంభం

24అష్షూరు రాజు ఇశ్రాయేలు వారిని షోమ్రోను
నుండి వెలుపలికి తీసుకు వచ్చాడు. తర్వాత అష్షూరు
రాజు బబులోను, కూతా, అవ్వా, హమాతు, సెపర్వ
యీముల నుండి మనుష్యులను తీసుకువచ్చాడు.
అతను వారినందరిని షోమ్రోనులో ఉంచాడు. ఆ
ప్రజలు షోమ్రోనును గ్రహించి ఆ చుట్టు ప్రక్కల నగ
రాలలో నివసింపసాగారు. 25ఈ ప్రజలు షోమ్రో నులో
ఉండసాగిన తర్వాత, యెహోవాని వారు గౌరవించ
లేదు. అందువల్ల ప్రభువు వారిమీదికి సింహాలను పంపిం
చాడు. ఈ సింహాలు కొందరిని చంపివేశాయి.
26కొందరు అష్షూరు రాజుతో, "నీవు తీసుకువచ్చి
షోమ్రోను నగరాలలో నిలిపిన ప్రజలకు ఆ దేశపు
దేవుని న్యాయసూత్రాలు తెలియవు. అందువల్ల దేవుడు
సింహాలను పంపి వారిని ఎదుర్కొన్నాడు. ఆ ప్రజలకు
ఆ ప్రదేశపు దేవుని చట్టాలు తెలియవు కనుక వారిని
సింహాలు చంపివేశాయి" అని చెప్పారు.
27అందువల్ల అష్షూరు రాజు ఇలా ఆజ్ఞాపించాడు:
"మీరు షోమ్రోను నుండి కొందరు యాజకులను తీసు
కున్నారు. నేను బంధించిన యాజకులలో ఒకరిని
తిరిగి షోమ్రోనుకు పంపించండి. ఆ యాజకుడ్ని
వెళ్లి అక్కడే వుండనివ్వండి. తర్వాత ఆ యాజకుడు
ఆ దేశపు దేవుని న్యాయసూత్రాలను వారికి బోధించ
గలడు."
28అందువల్ల అష్షూరులు తీసుకుపోయిన ఒక
యాజకుడు బేతేలులో నివసించడానికి వచ్చాడు. ఈ
యాజకుడు యెహోవాని ఎలా గౌరవించాలో వాళ్లకి
బోధించాడు. 29కాని ఆ మనుష్యులందరు తమతమ
దేవుళ్ల విగ్రహాలను చేసి షోమ్రోనుల ఉన్నత స్థానాలలో
ఆలయాలలో ఆ విగ్రహాలను ఉంచారు. 30బబులోను
మనుష్యులు అబద్ధపు దేవుడైన సుక్కోతెబ్బోతును
కల్పించుకున్నారు. కూతా మనుష్యులు అబద్ధపు
దేవుడైన నెర్గలుని కల్పించుకున్నారు. 31అవ్వాకు
చెందినవారు అసత్య దేవుడైన నిబ్హజు తర్తాకులను
కల్పించుకున్నారు. హమాతు ప్రజలు అబద్ధపు దేవు
డైన అషీమాని కల్పించుకున్నారు. మరియు సెపర్వీ
యుల నుండి వచ్చిన ప్రజలు తమ అసత్యపు దేవుళ్ల
యిన అద్రమ్మెలెకు, అనెమ్మెలెకుల గౌరవార్థం తమ
సంతానాన్ని అగ్నికి ఆహుతి చేశారు.
32కాని ఆ ప్రజలు యెహోవాని కూడా పూజిం
చారు. ప్రజలనుండి ఉన్నత స్థానాలకు వారు యాజకు
లను ఎంపిక చేశారు. ఆ ఆరాధనా స్థలాలలో ఈ
యాజకులు ఆలయాలలో ప్రజలకోసం బలులు
అర్పించారు: 33వారు యెహోవాని గౌరవించారు; కాని
వారు తమ సొంత దేవుళ్లను కూడా సేవించారు. ఆ
ప్రజలు తాము తీసుకొని రాబడిన దేశాలలో జరిగించి
నట్లుగానే తమ దేవుళ్లను పూజించారు.
34నేటికీ ఆ ప్రజలు పూర్వం వున్నట్లుగానే నివసి
స్తున్నారు. వారు యెహోవాని గౌరవించరు. వారు
ఇశ్రాయేలువారి నిబంధనలను, ఆజ్ఞలను పాటించరు.
వారు యాకోబు పిల్లలకు (ఇశ్రాయేలు) విధించిన
ఆజ్ఞలనుగాని నిబంధనలను గాని పాటించ లేదు.
35యెహోవా ఇశ్రాయేలువారితో ఒక ఒడంబడిక చేసు
కున్నాడు. యెహోవా, "మీరు ఇతర దేవతలను అను
సరిచకూడదు. మీరు వారిని పూజించకూడదు; ఆరా
ధించకూడదు; వారికి బలులు కూడా సమర్పించ
కూడదు.
36"కాని యెహోవాని అను సరించాలి. ఈజిప్టు
నుంచి మిమ్ము తీసుకువచ్చిన యెహోవాయే దేవుడు.
యెహోవా తన గొప్ప శక్తిని మిమ్ము రక్షించడానికి
వినియోగించాడు. మీరు యెహోవాని ఆరాధిస్తూ
మరియు గౌరవించి ఆయనకి బలులు సమర్పించాలి:
37ఆయన మీ కోసం రాసిన నిబంధనలు, న్యాయ
సూత్రాలు, బోధనలు, ఆజ్ఞలు మొదలైన వాటిని మీరు
పాటించాలి. ఎప్పుడూ మీరీ విషయాలు పాటించాలి.
మీరు ఇతర దేవతలను గౌరవించరాదు. 38మీతో నేను
చేసిన ఒడంబడిక మీరు మరచిపోకూడదు. 39మీరు
మీ దేవుడైన యెహోవానే గౌరవించాలి. తర్వాత

ఆయన మిమ్మును మీ విరోధులనుండి సంరక్షిస్తాడు" అని ఆజ్ఞాపించాడు.

40కాని ఇశ్రాయేలువారు వినలేదు. పూర్వం చేసిన ట్లుగానే వారు అవే పనులు చేయసాగారు. 41అందువల్ల ఇప్పుడు ఇతర జనాంగంవారు యెహోవాను గౌరవి స్తారు. అలాగే తమ సొంత విగ్రహాలను కూడా పూజి స్తారు. తమ పూర్వీకులు చేసినట్లుగానే, వారి పిల్లలు మనుమలు, మనుమ రాండ్రు అవే పనులు చేస్తున్నారు. ఈ నాటికీ వారు అవే పనులు చేస్తున్నారు.

### హిజ్కియా యూదాలో తన పరిపాలన ప్రారంభించుట

18 అహాజు కుమారుడైన హిజ్కియా యూదా రాజుగా వుండెను. ఏలా కుమారుడైన హోషేయ ఇశ్రాయేలు రాజుగా ఉన్న మూడవ సంవత్సరమున, హిజ్కియా తన పరిపాలన ప్రారంభించాడు. 2పరిపాలన ప్రారంభించునాటికి అతను 25 యేండ్ల వాడు. యెరూషలేములో హిజ్కియా 29యేండ్లు పాలించాడు. అతని తల్లి పేరు అబీ; ఆమె జెకర్యా కుమార్తె. 3హిజ్కియా తన పూర్వీకుడైన దావీదువలె, యెహోవా దృష్టికి మంచి పనులు చేసెను.

4హిజ్కియా ఉన్నత స్థలాలను ధ్వంసం చేశాడు. అతను స్మారకశిలలను బద్ధలు చేశాడు; అషెరా స్తంభా లను పడగొట్టాడు. ఆ సమయంలో, ఇశ్రాయేలు ప్రజలు మోషే చేసిన ఇత్తడి సర్పానికి ధూపం వెలిగించే వారు. ఈ ఇత్తడి సర్పం 'నెహుష్టాను' అని పిలవబడేది. హిజ్కియా ఈ ఇత్తడి సర్పాన్ని ముక్కలు చేశాడు. ఎందుకనగా ప్రజలు ఆ కంచు సర్పాన్ని పూజిస్తున్నారు కనుక.

5హిజ్కియా ఇశ్రాయేలు దేవుడైన యెహోవాను విశ్వసించాడు. యూదాలోని రాజులందరిలో అతనికి పూర్వంగాని, తర్వాతగాని హిజ్కియా వంటి వ్యక్తి లేడు. 6యెహోవా పట్ల హిజ్కియా అతి విధేయుడు. యెహోవాను అనుసరించడం అతను మానలేదు. మోషేకు యెహోవా ఇచ్చిన ఆజ్ఞలను అతను పాటించాడు. 7యెహోవా హిజ్కియా పక్షంగా వున్నాడు. అతను చేసిన ప్రతి విషయంలోను హిజ్కియా కృతార్థుడయ్యాడు.

హిజ్కియా అష్షూరు రాజు పరిపాలన నుండి తప్పు కున్నాడు. అష్షూరు రాజుని కలవడం హిజ్కియా మాని వేశాడు. 8హిజ్కియా గాజాకి వెళ్లేదారి అంతటను ఆ చుట్టుప్రక్కల ప్రదేశంలోగల ఫిలిష్తీయులందరినీ ఓడించాడు. చిన్న పట్టణం మొదలుకొని పెద్ద నగరందాకా గల అన్ని ఫిలిష్తీయుల నగరాలను అతను ఓడించాడు.

### అష్షూరువారు షోమ్రోనుని పట్టుకొనుట

9అష్షూరు రాజైన షల్మనేసెరు షోమ్రోనుకి విరుద్ధంగా యుద్ధం చేయడానికి వెళ్లాడు. అతని సైన్యము నగరాన్ని చుట్టుముట్టింది. హిజ్కియా యూదా రాజుగా ఉన్న నాల్గవ సంవత్సరంలో ఇది జరిగింది. (ఏలా కుమారుడైన హోషేయ ఇశ్రాయేలు రాజుగా ఉన్న ఏడవ సంవత్సరములో ఇది జరిగింది). 10మూడవ సంవత్సరము చివరను షల్మనేసెరు షోమ్రోనుని పట్టు కున్నాడు. హిజ్కియా యూదా రాజుగా ఉన్న ఆరవ సంవత్సరమున, అతను షోమ్రోనుని వశము చేసు కున్నాడు (ఇశ్రాయేలు రాజుగా హోషేయ వున్న తొమ్మిదో సంవత్సరమున ఇది జరిగింది). 11అష్షూరు రాజు ఇశ్రాయేలు వారిని బందీలుగా అష్షూరుకు తీసు కుని వెళ్లాడు. వారిని హాలహు లేక హాబోరు (గోజాను నది), మాదీయుల నగరాలలో నివసింపజేశాడు. 12ఇశ్రాయేలువారు తమ దేవుడైన యెహోవాను పాటించక పోవడంవల్ల ఇలా జరిగింది. వారు యెహోవా ఒడంబడికను విచ్ఛిన్నం చేశారు. యెహోవా సేవకుడైన మోషే చెప్పిన అన్ని విషయాలను వారు పాటించలేదు. యెహోవా ఒడంబడికను ఇశ్రాయేలు ప్రజలు పెడ చెవిని పెట్టారు. లేక చేయమని చెప్పిన పనులు వారు చేయలేదు.

### అష్షూరు యూదాని తీసుకొనుటకు సిద్ధపడుట

13హిజ్కియా రాజుగా వున్న 14వ సంవత్సర ములో అష్షూరు రాజయిన సన్హెరీబు యూదాలోని అన్ని బలిష్ఠ నగరాల మీద దండెత్తి వెళ్లాడు. సన్హెరీబు ఆ నగరాల న్నిటిని ఓడించాడు. 14అప్పుడు యూదా రాజయిన హిజ్కియా అష్షూరు రాజుకి లాకీషు వద్ద ఒక సందేశం పంపాడు. "నేను తప్పు చేశాను. నన్ను వంటరిగా వదలండి. అప్పుడు మీరు ఏమి కోరినా అది నేనిస్తాను" అని హిజ్కియా చెప్పాడు.

తర్వాత అష్షూరు రాజు యూదా రాజయిన హిజ్కియాని 11 టన్నుల వెండి, 1 టన్ను బంగారం ఇమ్మని అడిగాడు. 15హిజ్కియా యెహోవా ఆలయం నుండి రాజుగారి నిధుల నుంచీ వెండి అంతా తీసి ఇచ్చాడు. 16ఆ సమయంలో హిజ్కియా యెహోవా మందిరానికి ద్వారము మెట్లకి గల బంగారమంతా తీయించి వేశాడు. హిజ్కియా రాజు ఆ తలుపుల మీద మెట్లమీద బంగారం ఉంచాడు. హిజ్కియా అష్షూరు రాజుకు ఈ బంగారమంతా ఇచ్చివేశాడు.

### అష్షూరు రాజు యెరూషలేముకు మనుష్యులను పంపుట

17అష్షూరు రాజు అతి ముఖ్యులైన తర్తానును, రబ్బారీసు రబ్సాకేనును అను తన ముగ్గురు సైన్యాధి పతులను, పెద్దసైన్యముతో యెరూషలేములోని హిజ్కియా రాజు వద్దకు పంపాడు. ఆ మనుష్యులు లాకీషు నుంచి యెరూషలేము వెళ్లారు. వారు చేరి 'చాకిరేవు'కు వెళ్లే దారిలోవున్న యెరక కొలను కాలువ

దగ్గర నిలబడ్డారు. 18వారు రాజుని పిలిచారు. హిల్కీయా
కుమారుడైన ఎల్యాకీము (ఎల్యాకీము రాజభవన అధి
కారి), షెబ్నా (కార్యదర్శి), ఆసాపు కొడుకైన యోవా
హును (దస్తావేజులు సంరక్షించేవాడు) వారిని కలుసు
కోడానికి వచ్చారు. 19ఒక సైన్యాధిపతి ఇలా చెప్పాడు,
"అష్షూరు మహా రాజు చెప్పుచున్నది: హిజ్కియాతో
చెప్పు."

నీవు దేనిని విశ్వసిస్తున్నావు? 20నీ మాటలు విలు
వలేనివి. యుద్ధంలో "నాకు సహాయంగా వుండదగి
నంత సలహా, శక్తివున్నాయి" అని నీవు చెప్పు
చున్నావు" కాని నీవు నా పరిపాలన నుండి వేరుపడిన
తర్వాత నీవెవరిని నమ్ముతున్నావు? 21విరిగిపోయిన
రెల్లుతో చేయబడిన చేతికర్రను ఊని ఉన్నావు! ఈ
చేతికర్ర ఈజిప్టు. ఈ చేతికర్రను ఊని నడిస్తే అది
విరిగిపోయి, చేతిలో గుచ్చుకొని గాయపరుస్తుంది.
తనను విశ్వసించే వారికందరికీ ఈజిప్టు రాజు అటు
వంటివాడు. 22 "మీ దేవుడైన యెహోవాని నమ్ము
తున్నట్లు" నీవు చెప్పవచ్చు. కాని ఉన్నత స్థలాలను
బలిపీఠాలను హిజ్కియా తొలగించి యెరూషలేము
లోని బలిపీఠం ఎదురుగా మాత్రమే ఆరాధించాలని
యూదా, యెరూషలేము ప్రజలకు చెప్పినట్లు నాకు
తెలుసు.

23నా యజమాని అయిన అష్షూరు రాజుతో
ఇప్పుడు నీవు ఈ ఒడంబడిక చేసుకో. స్వారీ చేయగల
మనుష్యులుంటే, నీకు రెండు వేలు గుర్రాలు ఇస్తానని
నేను వాగ్దానం చేస్తాను. 24నా యజమానికి గల చాలా
తక్కువ అధిపతిని కూడా నీవు ఓడించలేవు. రథాలకు,
అశ్వికవీరులకు నీవు ఈజిప్టు మీద ఆధారపడి వున్నావు.
25యెహోవా ఆజ్ఞ లేకుండ యెరూషలేమును నాశనం
చేయుటకు నేను రాలేదు. "ఈ దేశానికి విరుద్ధంగా
వెళ్లి దానిని నాశనము చేయుము" అని యెహోవా
నాకు చెప్పాడు.

26అప్పుడు హిల్కీయా కుమారుడైన ఎల్యాకీము,
షెబ్నా యెవాహు ఆ సైన్యాధిపతితో, "దయచేసి
మాతో సిరియా బాషలో మాట్లాడండి. ఆ భాషను
మేము అర్థం చేసుకుంటాము. యూదా భాషలో
మాతో సంభాషించవద్దు. ఎందుకంటే, గోడమీద ఉన్న
వారు ఈ మాటలు వింటారు." అని చెప్పారు.

27కాని రబ్షాకే వారితో ఇట్లనెను: "నా యజమాని
నీతోను మీ రాజుతోను మాత్రమే మాటలాడుటకు
నన్ను పంపలేదు. గోడమీద కూర్చున్న వారితో కూడా
మాటలాడెదను. వారు నీతోపాటు తమ మలమూత్ర
ములను సేవిస్తారు."

28తర్వాత యూదా భాషలో సిరియా సైన్యాధి
పతి బిగ్గరగా అరిచాడు. "అష్షూరు మహారాజు పంపిన
ఈ సందేశం వినండి. 29హిజ్కియా మిమ్మును
మోసము చేయడానికి సమ్మతింపకుడి. నా అధికారం
నుండి అతను మిమ్మును కాపాడలేడు. 30యెహో
వాను మీరు నమ్మునట్లుగా హిజ్కియాని సేవించవద్దు.
యెహోవా మనల్ని కాపాడును, అష్షూరు రాజు ఈ
నగరాన్ని ఓడించలేడు" అని హిజ్కియా చెప్పాడు.
31కాని హిజ్కియా మాటలు వినవద్దు.

"అష్షూరు రాజు ఇది చెప్పుచున్నాడు: నాతో సంధి
చేసుకోండి. నా దగ్గరికి రండి. అప్పుడు ఒక్కొక్కరు
తన సొంత ద్రాక్షలు, తన సొంత అరటి పండ్లు తిన
వచ్చు, తన సొంత బావినుండి నీరు త్రాగవచ్చు. 32నేను
వచ్చి మిమ్మును దూరంగా మీ సొంత ప్రదేశము వలె
ఒక పచ్చిక ప్రదేశానికి తీసుకు వెళ్ళేంత వరకు మీరిది
చేయవచ్చు. అది ధాన్యంగల ప్రదేశము. కొత్త ద్రాక్షా
రసం గలది. ద్రాక్షా పొలాలు, రొట్టె గలది. ఒలీవ
తేనెగల ప్రదేశమది. అప్పుడు మీరు బ్రతకవచ్చు;
చనిపోరు. కాని హిజ్కియా మాటలు వినకుడి. అతను
మీ బుద్ధి మార్చాలని ప్రయత్నిస్తున్నాడు. యెహోవా
మనలను కాపాడ్తాడు" అని అతను చెప్పుచున్నాడు.
33అష్షూరు రాజునుండి ఇతర దేశాల దేవత లెవరైనా
అతని దేశాన్ని రక్షించారా? లేదు. 34హమాతు, అర్పాదు
దేవుళ్లు ఎక్కడున్నారు? సెపర్వయీము, హేన, ఇవ్వా
దేవుళ్లెక్కడున్నారు? నానుండి వారు షోమ్రోనును కాపా
డగలిగినారా? లేదు. 35ఇతర దేశాలలో వున్న ఏ దేవుళ్ళ
యినా నానుండి తమ భూమిని కాపాడుతారా? లేదు.
యెరూషలేముని యెహోవా నానుండి కాపాడుతాడా?
లేదు"

36కాని ప్రజలు మౌనం వహించారు. వారు ఆ
సైన్యాధిపతితో ఒక్కమాట కూడా చెప్పలేదు. కారణం,
హిజ్కియా రాజు, "అతనితో ఏమీ మాటలాడ వద్దు"
అని వారికి ఆజ్ఞాపించాడు.

37హిల్కీయా కొడుకైన ఎల్యాకీము (ఎల్యాకీము
రాజభవనం అధికారి), షెబ్నా (కార్యదర్శి), ఆసాపు
కొడుకైన యోవాహు (దస్తావేజుల సంరక్షకుడు)
హిజ్కియా వద్దకు వచ్చారు. తాము తలక్రిందులై
నామని తెలపడానికై వారి వస్త్రాలు చింపివేయబడ్డవి.
అష్షూరు సైన్యాధిపతి చెప్పిన విషయాలను వారు
హిజ్కియాకు చెప్పారు.

### హిజ్కియా యెషయా ప్రవక్తతో మాటలాడుట

19 హిజ్కియా రాజు ఆ విషయములు అన్నియు
విన్నాడు. అతను తన వస్త్రాలు చింపుకుని
గోనెపట్ట ధరించాడు. (అతను విచారంగాను తలక్రిందు
లైనట్లుగాను అది తెలుపుతుంది.) తర్వాత అతను
యెహోవా ఆలయానికి వెళ్లెను.

2హిజ్కియా, ఎల్యాకీము (రాజభవన అధికారి),
షెబ్నా (కార్యదర్శి) మరియు యాజకులలో పెద్ద
వారిని అమోజు కుమారుడైన యెషయాప్రవక్త వద్దకు
పంపాడు. తాము విచారంగాను తలక్రిందులైనట్లుగాను

తెలుపడానికి గోనెపట్ట ధరించారు. [3]వారు యెష
యాతో ఇలా అన్నారు: "ఇది యిబ్బంది రోజనీ,
మేము తప్పు చేసినట్లుగా తెలిపే రోజనీ హిజ్కియా
చెప్పుచున్నాడు. పిల్లలు పుట్టుటకు ఇది సమయము,
అయితే వారికి పుట్టుక ఇచ్చేందుకు తగిన బలము
లేదు.

[4]అష్షూరు రాజుయొక్క సైన్యాధిపతి సజీవుడైన
దేవుని గురించి చెడు విషయాలు చెప్పడానికి ఇక్కడికి
పంపబడియున్నాడు. మీ దేవుడైన యెహోవా ఒకవేళ
ఆ విషయములు వినవచ్చు. యెహోవా ఆ విరోధిని
శిక్షించవచ్చు. కనుక ఇంకా మిగిలివున్న వారికోసము
ప్రార్థన చేయండి."

[5]హిజ్కియా రాజుయొక్క అధికారులు యెషయా
వద్దకు వెళ్లారు.

[6]"మీ యజమాని అయిన హిజ్కియాకి ఈ విష
యము చెప్పండి. యెహోవా ఇలా చెప్పుచున్నాడు
అష్షూరు రాజు, అధికారులు నన్ను ఎగతాళి చేయడానికి
మీకు చెప్పిన విషయాలు విని మీరు భయపడవద్దు.

[7]నేనతనిలో ఒక ఆత్మను ప్రవేశపెడుతున్నాను.
అతను ఒక వందతి వింటాడు. అప్పుడతను తన దేశానికి
తిరిగి పారిపోతాడు. అతని దేశంలోనే ఒక ఖడ్గంతో
అతను చంపబడేలా నేను చేస్తాను" అని యెషయా
వారితో చెప్పాడు.

### అష్షూరు రాజు మరల హిజ్కియాని హెచ్చరించుట

[8]అష్షూరు రాజు లాకీషు విడిచి వెళ్లినట్లు ఆ సైన్యా
ధిపతి తెలుసుకున్నాడు. అందువల్ల అతను తన రాజు
లిబ్నాకి విరుద్ధముగా పోరు సలుపుతున్నట్లు చూశాడు.
[9]అష్షూరు రాజు కూషు రాజైన తిర్హాకా గురించి
ఒక వదంతి విన్నాడు. "తిర్హాకా నీతో యుద్ధము చేయ
డానికి వచ్చాడు" అన్నదే ఆ వదంతి.

అందువల్ల అష్షూరు రాజు మరల హిజ్కియా వద్దకు
దూతలను పంపించాడు. ఆ దూతలకు ఈ సందేశం
ఇచ్చాడు. ఈ విషయాలు తెలియజేశాడు. [10]యూదా
రాజయిన హిజ్కియాకి ఈ విషయము చెప్పండి.
"నీవు విశ్వసించే దేవుడు నిన్ను అవివేకిగా చేసే విధంగా
చేయకు. అష్షూరు రాజు యెరూషలేముని ఓడించ
లేడు; అని అతడు చెప్పుచున్నాడు గదా. [11]అష్షూరు
రాజులు ఇతర దేశాలకు వ్యతిరేకంగా చేసిన పనులు
నీవు వినియుంటావు. మేము వారిని సర్వ నాశనం
చేశాము. నీవు కాపాడుదువా? లేదు. [12]ఆ దేశాల దేవుళ్లు
ఆ ప్రజలను కాపాడలేదు. నా పూర్వీకులు వారిని
సర్వనాశనము చేశారు. వారు గోజాను, హారాను, రెజె
పులు తెలశ్శారులోని ఏదోను ప్రజలను నాశనం చేశారు.
[13]హమాతు రాజు ఎక్కడ? అర్పాదు రాజు ఎక్కడ?
సెపర్వయీము రాజు? హేనా, ఇవ్వా రాజులు?
అందరూ ముగింపబడ్డారు.

### హిజ్కియా యెహోవాని ప్రార్థించుట

[14]హిజ్కియా దూతలనుండి వచ్చిన ఉత్తరాలు చది
వాడు. అప్పుడు హిజ్కియా యెహోవా ఆలయము
వద్దకు వెళ్లి, యెహోవా ముందు ఆ ఉత్తరాలు
వుంచాడు. [15]హిజ్కియా యెహోవాని ప్రార్థించాడు:
"ఇశ్రాయేలు దేవుడవైన యెహోవా, కెరూబుల
నడుమ రాజుగా ఆసీనుడవై వున్నావు. దేవుడివి నీవే,
ప్రపంచంలోని అన్ని రాజ్యాలకూ నీవే దేవుడివి. నీవు
పరలోకము, భూమిని కల్పించావు. [16]ప్రభువా, నా
మొర విను, ప్రభువా, కళ్లు తెరువు, ఈ ఉత్తరాలు
చూడు. సన్హెరీబు సజీవుడైన దేవుని అవమానిస్తూ
చెప్పిన మాటలు విను. [17]అది నిజము, ప్రభూ. ఆ
దేశాలను అష్షూరు రాజులు నాశనం చేశారు. [18]ఆ
జనాంగాల దేవుళ్లను వారు అగ్నిలోకి కాల్చివేశారు.
కాని వారు నిజమైన దేవుళ్లు కారు. వారు కేవలము
రాయి, కర్రలతో, మనుష్యులు చేసిన ప్రతిమలు.
[19]కనుక ఇప్పుడు, మా దేవుడవైన యెహోవా, మమ్ము
అష్షూరు రాజునుండి కాపాడుము. అప్పుడు భూమిమీది
అన్ని రాజ్యములు యెహోవావైన నీవే దేవుడవని
తెలుసుకుంటారు."

[20]ఆమోజు కొడుకైన యెషయా హిజ్కియాకి ఈ
సందేశము పంపించాడు: "ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా యిది చెప్పుచున్నాడు, 'అష్షూరు రాజు
సన్హెరీబుకి విరుద్ధంగా నీవు నన్ను ప్రార్థించావు. అది
నేను విన్నాను.'

[21]"యెహోవా సన్హెరీబును గూర్చి ఇచ్చిన
సందేశము:

ఈ విధంగా ఉంది: సీయోను (యెరూషలేము)
కుమార్తె అయిన ఆ కన్య నీవు ముఖ్యుడవు
కాదని భావిస్తున్నది. ఆమె నిన్ను ఎగతాళి చేస్తు
న్నది. యెరూషలేము కుమార్తె నీ వెనుక తన
తల ఆడిస్తున్నది.
22 కాని నువ్వెవరిని అవమానించి యెగతాళి చేసావు?
నీవు ఎవరికి విరుద్ధంగా మాట్లాడినావు? నీవు
ఇశ్రాయేలు పవిత్రునికి ప్రతికూలుడిగా వచ్చావు
నీవు అతని కంటె మంచివాడివిగా ప్రవర్తించావు
23 నీ దూతల ద్వారా యెహోవాను అవ మానించి
నీవు ఇలా చెప్పావు: "ఉన్నత పర్వతాలకు నేను
వచ్చాను నా పెక్కు రథాలతో నేను లెబానోను
లోపలికి వచ్చాను నేను ఉన్నత దేవదారుల
వృక్షాలు మరియు లెబానోనులోని ఉత్తమ సరళ
వృక్షాలను ఛేదించాను. పచ్చని అడవికి నేను
వెళ్లాను. అదియె లెబానోనులోని ఉన్నత భాగము
24 నూతన ప్రదేశాలలో నేను బావులు తవ్వాను
మంచినీళ్లు తాగితిని ఈజిప్టు నదులను
ఎండించాను.

25 ఆ దేశము మీదుగా నడిచాను" అదే నీవు చెప్పింది,
కాని నీవు దేవుడు చెప్పింది వినలేదా? "నేను
(దేవుడు) పూర్వమే పథకము వేశాను ప్రాచీన
కాలం నుండి పథకం వేశాను ఇప్పుడది జరుగు
నట్లు చేశాను బలిష్ఠమైన ఆ నగరాలు నాశనము
చేయుటకును రాతి కుప్పలుగా మార్చుటకును
నిన్ననుమతించాను.
26 నగరాలలో ఉన్నవారు శక్తివిహీనులు వారు భీతా
వహులు గందరగోళంలో ఉన్నవారు క్షేత్రంలోని
పచ్చికలా మొక్కలవలె వారు ఛేదింపదగిన వారు.
వాడుటకు పూర్వము పెరగని విధంగా ఇండ్ల
కప్పుల మీద పెరిగే పచ్చికవారు.
27 నీవు ఎప్పుడు క్రింద కూర్చుంటావో నాకు
తెలియును. నీవు యుద్ధానికి వెళ్లడం నాకు
తెలుసు నీవు ఇంటి దగ్గర ఉండినప్పుడు నా
పట్ల విసుగు చెందినది తెలుసును.
28 అవును. నీవు నా పట్ల విసుగు చెందితివి నీ
గర్వపు నిందా వాక్యాలు నేను విన్నాను అందువల్ల
నీ ముక్కుకు గాలం వేస్తున్నాను నీ నోటికి నా
కళ్లెము తగిలిస్తు న్నాను ఆ తర్వాత నిన్ను వెను
కకు మరల్చి నీవు వచ్చిన తోవనే నడిపిస్తాను."

### హిజ్కియాకు యెహోవా సందేశము

29తర్వాత యెషయా హిజ్కియాతో ఈలాగు
చెప్పెను. "నీకు సహాయము చేయనున్నందుకు ఇది
ఒక గుర్తు. ఈ సంవత్సరము తనంతట తానే పెరిగే
ధాన్యము నీవు భుజిస్తావు. ఆ మరు సంవత్సరము
గింజనుండి పెరిగే ధాన్యము నీవు భుజిస్తావు. కాని ఆ
మూడో సంవత్సరము నీవు నాటిన గింజలనుండి
లభించే ధాన్యము నీవు భుజిస్తావు. నీవు ద్రాక్షా పొలాలు
సాగుచేసి, లభించే ఆ ద్రాక్షలు భుజిస్తావు. 30తప్పించు
కున్న ప్రజలు, యూదా వంశంలో మిగిలిన వారు
మరల పండించడము మొదలు పెడతారు. 31కొద్దిమంది
సజీవులై వుంటారు, కనుక వారు యెరూషలేమును
విడిచి వెళతారు. తప్పించుకున్న ప్రజలు సీయోను
కొండలో నుండి వెలుపలికి వెళతారు. యెహోవా
యొక్క గాఢాభిప్రాయం అలా చేస్తుంది.
32"అందువల్ల అష్షూరు రాజుని గురించి యెహోవా
ఇది చెప్తాడు:

అతడీ నగరంలోకి రాడు. అతడీ నగరంలో అస్త్ర
ప్రయోగం చెయ్యలేడు. అతడు తన కవచాలు
ఈ నగరానికి తీసు కురాడు. నగరములను దాడి
చేసేందుకు ముట్టడి దిబ్బను నిర్మించలేడు.
33 అతడు వచ్చిన త్రోవనే తిరిగి వెళ్తాడు. అతడీ
నగరంలోకి రాలేడు అని యెహోవా చెప్పు
చున్నాడు!
34 నేనీ నగరాన్ని రక్షిస్తాను. నేను నా కొరకు ఇది
చేస్తాను నా సేవకుడు దావీదు కొరకు కూడా."
ఇది చేస్తాను.

### అష్షూరు సైన్యం నాశనం చేయబడుట

35రాత్రి, యెహోవా దూత వెలుపలికి పోయి
అష్షూరు శిబిరములోని 185,000 మందిని చంపాడు.
ప్రజలు ఉదయాన మేల్కొనగా, వారు శవాలు చూశారు.
36అందువల్ల అష్షూరు రాజయిన సన్హెరీబు తిరిగివెళ్లి
నీనెవెకి మరలిపోయాడు. అక్కడే అతడు నిలిచాడు.
37ఒకరోజు సన్హెరీబు తన దేవుడైన నిస్రోకు ఆల
యంలో పూజ చేయిస్తూ ఉన్నాడు. అతని కుమారులు
అద్రెమ్మెలెకు మరియు షరెజెరు కత్తితో అతనిని
చంపారు. అప్పుడు అద్రెమ్మెలెకు మరియు షరెజెరు
అరారాతు దేశములోకి తప్పించుకు పోయారు.
మరియు సన్హెరీబు కుమారుడు ఎసర్హద్దోను, అతని
తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### హిజ్కియా మరణకరమైన వ్యాధితో బాధపడుట

20 ఆ సమయమున, హిజ్కియా వ్యాధిగ్రస్తు
డయ్యాడు. దాదాపు మరణం పొందునంతగా
వ్యాధిగ్రస్తుడైనాడు. ఆమోజు కుమారుడు యెషయా
ప్రవక్త హిజ్కియా వద్దకు వెళ్లి, "నీ ఇంటిని సరిదిద్దుకో.
ఎందుకంటే నీవు మరణిస్తావు. నీవు బతకవు" అని
యెహోవా చెప్పుచున్నాడని చెప్పెను. 2హిజ్కియా
తన ముఖము గోడ వైపుకు త్రిప్పుకుని యెహోవాను
ప్రార్థించాడు.
3"యెహోవా, నిన్ను నేను హృదయస్ఫూర్తిగా
సేవించానని జ్ఞాపకము చేసుకో. నీవు మంచివని చెప్పిన
పనులు నేను చేశాను" అని ప్రార్థించాడు. ఆ తర్వాత
హిజ్కియా బిగ్గరగా విలపించాడు.
4యెషయా తన మధ్యగది విడిచి వెళ్లడానికి ముందు
యెహోవా మాట అతనికి వినవచ్చింది. 5నా మనుష్యు
లకు నాయకుడైన హిజ్కియా వద్దకు వెళ్లి అతనితో
చెప్పు. మీ పూర్వీకులైన దావీదు యొక్క యెహోవా
దేవుడనైన నేను, "నీ ప్రార్థన ఆలకించాను. నీ కన్నీళ్లు
చూశాను. అందువల్ల నీ రోగమును నయము చేస్తాను.
మూడవ రోజున, నీవు యెహోవా యొక్క ఆల
యము వద్దకు వెళ్లుము. 6నేను నీ జీవితానికి పదునైదు
యేండ్లు కలుపుతాను. నేను నిన్ను కాపాడతాను.
అష్షూరు రాజు శక్తి నుండి నేను నీ నగరాన్ని కాపాడతాను.
నేనిది నా కోసము చేస్తున్నాను. ఎందుకంటే నేను నా
సేవకుడైన దావీదుకి వాగ్దానం చేశాను కనుక" అని
పలికెను.
7తర్వాత యెషయా, "అత్తికాయల మిశ్రము చేసి,
దానిని వాచిన చోట వుంచుము" అన్నాడు. అందువల్ల
వారు అత్తికాయల మిశ్రం తీసి దానిని హిజ్కియాకు

వాచిన చోటవుంచారు. తర్వాత హిజ్కియా స్వస్థ పడెను.

### హిజ్కియాకి ఒక సంకేతము

8హిజ్కియా యెషయాతో, "యెహోవా నాకు నయం చేసే సంకేతము ఏమిటి? మూడో రోజున యెహోవా ఆలయానికి నేను వెళ్లడానికి సంకేత మేమిటి?" అని అడిగాడు. 9"నీ కేది కావాలి? నీడ పది అడుగులు ముందుకి పోవలెనా లేక పది అడుగులు వెనుకకు పోవలెనా? ఇదే నీకు యెహోవా నుంచి వచ్చే సంకేతము. యెహోవా తాను చేస్తానని చెప్పినది చేసేందుకు సంకేతము" అని యెషయా చెప్పాడు.

10హిజ్కియా, "నీడ పది అడుగులు క్రిందికి వెళ్లడం, నీడకు చాలా సులభమైనది లేదు. నీడని పది అడుగులు వెనుకకు మరల్చుము" అని బదులు చెప్పాడు.

11తర్వాత యెహోవాని యెషయా ప్రార్థించాడు. మరియు యెహోవా నీడను పదిమెట్లు వెనుకకు మరలునట్లు చేసెను. అది పూర్వము వున్నట్లుగా, మెట్ల మీద వెనుకకు పోయాడు.

### హిజ్కియా మరియు బబులోను నుంచి వచ్చిన మనుష్యులు

12ఆ సమయమున, బలదాను కొడుకైన బెరోదక్బలదాను బబులోనుకు రాజుగా వున్నాడు. అతను హిజ్కియాకి ఒక కానుక, ఉత్తరాలు పంపాడు. బెరోదక్బలదాను ఇలా చేయడానికి కారణం, హిజ్కియా వ్యాధిగ్రస్తుడై వున్నాడని విన్నందువల్లనే. 13హిజ్కియా బబులోను నుంచి వచ్చిన మనుష్యుల్ని ఆహ్వానిం చాంచాడు. వారికి తన ఇంటగల అన్ని విలువగల వస్తువులు చూపించాడు. అతడు తన నిధులలో వున్న వెండి బంగారాలు, మసాలా వస్తువులు, ఖరీదైన పరిమళ తైలము, ఆయుధాలు, మొదలైన వాటిని చూపించాడు. తన మొత్తము రాజభవనములో హిజ్కియాకు కలిగిన దానంతటిలో వారికి చూపనిది ఏదీ లేదు. 14తర్వాత ప్రవక్త అయిన యెషయా హిజ్కియా రాజు వద్దకు వచ్చి అతనిని, "ఈ మనుష్యులేమని చెప్పారు" ఎక్కడినుంచి వచ్చారు ?" అని అడిగాడు.

"వారు చాలా దూరదేశమైన బబులోను నుంచి వచ్చారు" అని హిజ్కియా చెప్పాడు.

15"వారు నీ ఇంటిలో ఏమి చూశారు?" అని యెషయా అడిగినాడు. "వారు మా ఇంట అన్నీ చూశారు. నా నిధులలో వారు చూడనిది ఏదీలేదు." అని హిజ్కియా సమాధానమిచ్చాడు.

16అప్పుడు యెషయా హిజ్కియాతో ఇట్లన్నాడు: "యెహోవా నుంచి వచ్చిన ఈ సందేశము విను. 17మీ ఇంటగల వస్తువులన్నీ, నేటిదాకా మీ పూర్వీకులు సమకూర్చిన వస్తువులు బబులోనుకు తీసుకొని పోబడుతుంది. ఏమియు మిగలదు. యెహోవా దీనిని చెప్తున్నాడు. 18బబులోను వారు నీ కుమారులను తీసుకుపోతారు. మరియు నీ కుమారులు బబులోను రాజు అంతఃపురములో నపుంసకులు అవుతారు."

19అప్పుడు యెషయాతో, "యెహోవా నుంచి వచ్చిన ఈ సందేశము మంచిది" అని హిజ్కియా చెప్పాడు.

హిజ్కియా ఇది కూడా చెప్పాడు: "నా జీవిత కాలములో నిజమైన శాంతి నెలకొన్నచో, అది చాలా మంచిది."

20హిజ్కియా చేసిన అన్ని సత్కార్యములు నగరంలోకి నీళ్లు రావడానికిగాను అతను జలాశయము, సొరంగ కాలువను, నిర్మించినది కాలువలు వేయించినది కూడా "యూదా రాజుల చరిత్ర" అనే గ్రంథంలో వ్రాయబడివున్నాయి. హిజ్కియా మరణించగా, 21అతని పూర్వీకులతో పాటుగా, అతనిని సమాధి చేశారు. మరియు హిజ్కియా కుమారుడు మనష్షే అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### యూదాలో మనష్షే దుష్ట పరిపాలన ప్రారంభించుట

21 మనష్షే పరిపాలన చేయడం మొదలుపెట్టిన నాటికి అతను పన్నెండేళ్లవాడు. అతను 55 సంవత్సరాలు యెరూషలేంలో పరిపాలించాడు. అతని తల్లి పేరు హెఫ్సిబా.

2యెహోవా తప్పని చెప్పిన పనులు మనష్షే చేశాడు. ఇతర జాతుల వారు చేసినట్లుగా మనష్షే భయంకరమైన పనులు చేశాడు. (ఇశ్రాయేలు వారు రాగా ఆయా జాతులవారు దేశాన్ని విడిచి వెళ్లునట్లుగా యెహోవా వారిని నిర్బంధించాడు). 3తన తండ్రి హిజ్కియా ధ్వంసం చేయించిన ఉన్నత స్థలాలను మనష్షే మరల నిర్మించాడు. బయలు దేవతకు మరల మనష్షే బలిపీఠాలు నిర్మించెను. ఇశ్రాయేలు రాజు అహాబు వలె, అషెరా స్తంభము ఏర్పాటు చేశాడు. మనష్షే ఆకాశంలోని నక్షత్రాలను కొలిచాడు. 4యెహోవా ఆలయంలో మనష్షే అబద్ధపు దేవుళ్లను గౌరవించేందుకు బలిపీఠాలు నిర్మించాడు. "యెరూషలేములో నా పేరు స్థాపిస్తాను." అని యెహోవా చెప్పిన స్థలం ఇది. 5యెహోవా ఆలయము యొక్క రెండు ఆవరణాలలో ఆకాశంలోని నక్షత్రాలకు మనష్షే బలిపీఠాలు నిర్మించెను. 6మనష్షే తన కుమారుని బలిపీఠము మీద దహన బలిగా ఇచ్చాడు. భవిష్యత్తుని తెలుసుకునేందుకు మనష్షే వేర్వేరు మార్గాలు అవలంబించాడు. అతను కర్ణ పిశాచి గలవారిని సోది చెప్పేవారిని దర్శించాడు.

యెహోవా తప్పని చెప్పిన పనులు మరింత ఎక్కువగా మనష్షే చేశాడు. అందువల్ల యెహోవాకు కోపము వచ్చింది. 7మనష్షే అషెరాదేవి విగ్రహం ఒకటి

మలిచాడు. దానిని అతను ఆలయంలో ఉంచాడు.
ఈ ఆలయం గురించి దావీదుకు, అతని కుమారుడు
సొలొమోనుకు యెహోవా ఇలా చెప్పాడు: “ఇశ్రాయే
లులోని నగరములన్నిటి నుండి నేను యెరూషలే
మును ఎంపిక చేశాను. నేను నా పేరును యెరూషలేము
ఆలయములో ఎన్నటికీ వుంచుతాను. 8తమ దేశం
విడిచి వెళ్లేటట్లుగా నేను ఇశ్రాయేలు ప్రజలను చేయను.
అది వారి పూర్వీకులకు తెలియబడింది. నేను వారికి
ఆజ్ఞాపించినట్లుగా వారు మెలగినచో, నా సేవకుడైన
మోషే వారికి ఇచ్చిన బోధనలను పాటించినచో నేను
వారిని తమ దేశంలోనే వుండేటట్లు చేస్తాను.”
9కాని ప్రజలు యెహోవాకు విధేయులు కాలేదు.
ఇశ్రాయేలు రావడానికి పూర్వం కనానులోని అన్ని
జనాంగముల వారు చేసిన దుష్కార్యాముల కంటె
ఎక్కువగా మనష్షే చేశాడు. మరియు యెహోవా ఆ
జనాంగములను నాశనము చేశాడు; ఇశ్రాయేలు ప్రజలు
తమ దేశాన్ని గ్రహించుటకు వచ్చినప్పుడు ఇది
జరిగింది.
10తన సేవకులైన ప్రవక్తలను ఈ విషయాలు చెప్ప
మని యెహోవా వినియోగించాడు.11“యూదా
రాజైన మనష్షే తనకు పూర్వమున్న ఆ ప్రాంతములో
నివసించిన అమోరీయుల కంటె ఎక్కువగా నీచమైన
దుష్కార్యాలు చేసెను. తన విగ్రహాల కారణంగా,
యూదాని కూడా పాపం చేయడానికి మనష్షే కారకుడ
య్యాడు. 12అందువల్ల ఇశ్రాయేలు దేవుడు చెప్పు
చున్నాడు: ‘చూడండి. విన్న వ్యక్తి కూడా ఆశ్చర్యము
చెందేటట్లుగా, నేను యెరూషలేము, యూదాలకు
విరుద్ధంగా చాలా కష్టము కలిగిస్తాను. 13నేను షోమ్రో
నులో కొలత సూత్రాన్ని సాగదీస్తాను. మరియు
యెరూషలేము మీద అహాబు వంశముయొక్క మట్టపు
గుండును సాగదీస్తాను. ఒక వ్యక్తి పాత్రను కడుగవచ్చు;
తర్వాత దానిని బోర్లించవచ్చు. నేను, ఆ విధంగా
యెరూషలేముకు చేస్తాను. 14అక్కడ ఇంకా నావారు
కొద్ది మంది వుండవచ్చు. కాని నేను వారిని విడిచి
పెడ్తాను. నేను వారిని వారి శత్రువుల పరము చేస్తాను.
వారి శత్రువులు వారిని బందీలుగా చేస్తారు. వారు యుద్ధా
లలో సైనికులు అపహరించుకు వెళ్లే అమూల్య వస్తు
వుల వంటివారు. 15ఎందుకని? నేను తప్పని చెప్పిన
పనులు వారు చేశారు కనుక. తమ పూర్వీకులు ఈజిప్టు
నుంచి వెలుపలికి వచ్చిన నాటి నుంచీ వారు నన్ను
కోపానికి గురిచేసారు. 16మరియు మనష్షే పలువురు
అమాయకులను చంపివేశాడు. అతను యెరూష
లేముని ఒక కొననుంచి మరొక కొనదాకా రక్తముతో
నింపి వేశాడు. ఈ పాపాలన్నీ అదనంగా యూదావారు
పాపము చేయడానికి దోహదపడ్డాయి. యెహోవా
తప్పు అని చెప్పినవాటిని యూదా చేయునట్లుగా
మనష్షే చేశాడు.’”

17మనష్షే చేసిన అన్ని పనులు పాప కార్యములతో
సహా ‘యూదా రాజుల చరిత్ర’ అనే గ్రంథంలో రాయ
బడివున్నాయి. 18మనష్షే మరణించగా, అతని పూర్వీకు
లతో పాటుగా, అతను తన యింటి తోటలో సమాధి
చేయబడ్డాడు. ఆ తోటకు ‘ఉజ్జా ఉద్యాన వనం’ అని
పేరు పెట్టబడింది. మనష్షే కుమారుడు ఆమోను,
అతని తర్వాత కొత్తగా రాజయ్యాడు.

### ఆమోను కొద్ది కాలపు పాలన

19ఆమోను పరిపాలనకు వచ్చేనాటికి 22 యేండ్ల
వయస్సుగలవాడు. అతను యెరూషలేములో రెండు
సంవత్సరములు పాలించాడు. అతని తల్లి పేరు మెషు
ల్లెతు ఆమె యొట్బకి చెందిన హారూసు కుమార్తె.
20యెహోవా తప్పు అని చెప్పిన పనులు ఆమోను
చేశాడు. 21తన తండ్రియైన మనష్షేవలె, ఆమోను కూడ
జీవించాడు. తండ్రి పూజించిన ఆ విగ్రహాలనే ఆమోను
పూజించి అనుసరించాడు. 22తన పూర్వీకుల దేవుని
ఆమోను విడిచిపెట్టాడు. యెహోవా ఆశించిన మార్గా
లను విడనాడి అతను జీవించాడు.
23ఆమోను సేవకులు అతనికి వ్యతిరేకంగా పన్నా
గాలు పన్ని అతనిని అతని ఇంటిలోనే చంపి వేశారు.
24సామాన్య ప్రజలు, ఏఏ అధికారులు ఆమోనుకు
వ్యతిరేకంగా పన్నాగాలు పన్నారో ఆ అధికారులను
చంపివేశారు. అప్పుడు ప్రజలు ఆమోను కుమారుడైన
యోషీయాను కొత్త రాజుగా నియమించారు.
25ఆమోను చేసిన ఇతర పనులు ‘యూదా రాజుల
చరిత్ర’ అనే గ్రంథంలో రాయబడ్డవి. 26ఉజ్జా తోటలో
ఆమోను సమాధి చేయబడ్డాడు. ఆమోను కుమారు
డైన యోషీయా కొత్తగా రాజయ్యాడు.

### యోషీయా యూదాలో తన పరిపాలన ప్రారంభించుట

22 యోషీయా పరిపాలనకు వచ్చేనాటికి, అతను
ఎనిమిదేండ్లవాడు. యెరూషలేములో అతను
31 సంవత్సరాలు పరిపాలించాడు. అతని తల్లి పేరు
యెదీదా. ఆమె బొస్కతుకి చెందిన అదయా కుమార్తె.
2యెహోవా మంచివని చెప్పిన పనులు యోషీయా
జరిగించాడు. తన పూర్వీకుడైన దావీదు వలె,
యోషీయా దేవుని అనుసరించాడు. దేవుడు ఆశించిన
విధంగా యోషియా దేవుని బోధనలు పాటించాడు.

### ఆలయాల మరమ్మతుకి యోషీయా ఆజ్ఞాపించుట

3యోషీయా రాజుగా వున్న 18వ సంవత్సరాన,
అతను కార్యదర్శి అయిన మెషుల్లాము కొడుకైన
అజల్యా కుమారుడు షాఫానును యెహోవా యొక్క
ఆలయానికి పంపాడు. 4“ప్రధాన యాజకుడు అయిన
హిల్కీయా వద్దకు వెళ్లుము. యెహోవా ఆలయానికి
ప్రజలు తీసుకువచ్చిన ధనాన్ని ఎంచమని చెప్పుము.

ప్రజల వద్దనుంచి ద్వారపాలకులు ఆ ధనము వసూలు
చేశారు. 5యెహోవా ఆలయము మరమ్మతుల
కోసము పనివారికి ఆ ధనాన్ని యాజకులు వినియో
గించాలి. యెహోవా ఆలయాన్ని పర్యవేక్షించే వారికి
యాజకులు ఆ డబ్బు ఇవ్వాలి. 6ఆ డబ్బును వడ్రంగు
లకు, రాయి బ్రద్దలు చేసేవారికి, రాతి పనివారికి ఆ
డబ్బు ఉపయోగించబడాలి. ఆలయము కోసము కలప
కొనేందుకు రాళ్లు కొనేందుకు ఆ డబ్బు వినియోగము
కావాలి. 7పనివారికి ఇచ్చే ధనాన్ని లెక్కించవద్దు. పని
వారు నమ్మదగిన వారు” అని యోషీయా చెప్పాడు.

### ఆలయంలో ధర్మశాస్త్ర గ్రంథం కనుగొనబడుట

8ప్రధాన యాజకుడైన హిల్కీయా కార్యదర్శి
అయిన షాఫానుతో, “యెహోవా ఆలయములో నేను
ధర్మశాస్త్ర గ్రంథము కనుగొన్నాను” అని చెప్పాడు.
హిల్కీయా ఆ పుస్తకము షాఫానుకి ఇవ్వగా, షాఫాను
అది చదివాడు.
9కార్యదర్శి షాఫాను యోషీయా రాజు వద్దకు
పోయి జరిగిన విషయము చెప్పాడు. “నీ సేవకులు
ఆలయములో వున్న ధనమునంతా పోగుజేశారు.
యెహోవా ఆలయాన్ని పర్యవేక్షించేవారికి ఆ ధనమును
వారు ఇచ్చివేశారు.” అని షాఫాను చెప్పాడు. 10తర్వాత
షాఫాను కార్యదర్శి రాజుతో, “మరియు ప్రధాన యాజ
కుడు హిల్కీయా నాకు ఈ గ్రంథము ఇచ్చాడు” అని
పలికాడు. తర్వాత షాఫాను రాజుకు ఆ పుస్తకము
చదివి వినిపించాడు.
11రాజు ఆ ధర్మశాస్త్ర గ్రంథములోని మాటలు
వినగానే, తాను తలక్రిందులైనాననీ విచారం చెందినా
ననీ తెలిపేందుకు తన వస్త్రాలు చింపివేశాడు. 12తర్వాత
రాజు యాజకుడు హిల్కీయాకు కార్యదర్శి షాఫానుకు,
అతని కుమారుడు అహీకాముకు, మీకాయా కుమా
రుడు అక్బోరుకు, రాజు సేవకుడు అశాయాకు ఆజ్ఞ
ఇచ్చాడు. 13యోషీయా రాజు, “వెళ్లి, మనమేమి
చేయాలో యెహోవాని అడుగు. నా కోసము, ప్రజల
కోసము, యూదా మొత్తానికి యెహోవాని అడుగుము.
ఈ పుస్తకములోని మాటలు గురించి అడుగు.
యెహోవా మనపట్ల కోపంగా వున్నాడు. మన పూర్వీ
కులు ఈ పుస్తకములోని మాటలు పాటించక పోవడం
వల్ల. మనకోసము రాయబడిన అన్ని ఆజ్ఞలను మనము
పాటించలేదు” అని చెప్పాడు.

### యోషీయా మరియు స్త్రీ ప్రవక్త అయిన హుల్దా

14అందువల్ల హిల్కీయా యాజకుడు, అహీకాము,
అక్బోరు, షాఫాను మరియు అశాయా స్త్రీ ప్రవక్త
అయిన హుల్దా వద్దకు వెళ్లారు. హర్హను కుమారుడు
తిక్వా కుమారుడైన షల్లూము భార్యయే హుల్దా. అతను
యాజకుల వస్త్రాలను జాగరూకతతో చూస్తున్నాడు.
హుల్దా యెరూషలేములో రెండవ ప్రదేశంలో నివసిస్తు
న్నది. వారు హుల్దా వద్దకు పోయి మాట్లాడారు.
15తర్వాత హుల్దా వారితో ఇలా చెప్పింది: “ఇశ్రా
యేలు దేవుడైన యెహోవా చెప్పుచున్నాడు. నా
వద్దకు పంపిన మనిషితో చెప్పు. 16యెహోవా ఇలా
చెప్పుచున్నాడు. ఇక్కడ నివసించే ప్రజలకు, ఈ స్థలా
నికి నేను ఇబ్బంది తెస్తున్నాను. యూదా రాజు చదివిన
పుస్తకములో ఈ కష్టాలు లేక ఇబ్బందులు సూచించ
బడ్డవి. 17యూదా ప్రజలు నన్ను విడిచి వెళ్లారు.
ఇతర దేవుళ్లకు ధూపము వేశారు. వారు నాకు మహా
కోపము తెప్పించారు. వారు ఎక్కువ విగ్రహాలు
తయారు చేశారు. అందువల్ల ఈ స్థలము పట్ల నా
కోపమును ప్రదర్శిస్తాను. నా కోపము ఆర్ప శక్యము
కానట్టి నిప్పు వంటిది.”
18-19“యూదా రాజైన యోషీయా యెహోవా
యొక్క సలహా తెలుసుకొనుమని నిన్ను పంపాడు.
యోషీయకు విషయాలు చెప్పు. నీవు వినే ఈ
మాటలు ఇశ్రాయేలు దేవుడైన యెహోవా సెల
విచ్చాడు. నేనీ స్థలమును గురించీ, ఇక్కడ నివసించే
వారిని గురించీ చెప్పిన మాటలు నీవు విన్నావు. నీ
హృదయము మృదువైనది. ఈ విషయాలు వినగానే
నీవు విచారించావు. ఈ ప్రదేశానికి (యెరూషలేము)
భయంకర సంఘటనలు జరుగుతాయని నేను
చెప్పాను. నీ విచారాన్ని తెలుపడానికి నీ వస్త్రాలు
చింపావు. నీవు విలపించ సాగావు. అందువల్లనే నేను
విన్నాను. యెహోవా ఇది చెప్పుచున్నాడు. 20నీ
పూర్వీకులతో వుంచడానికి నేను నిన్ను తీసుకు
వస్తాను. నీవు మరణిస్తావు. ప్రశాంతంగా నీవు నీ సమాధి
చేరతావు. అందువల్ల నేను ఈ ప్రదేశానికి (యెరూష
లేము) తెచ్చు కష్టాలను నీ కండ్లు చూడలేవు.”
అప్పుడు యాజకుడు హిల్కీయా, అహీకాము,
అక్బోరును, షాఫాను, మరియు యోషీయా రాజుకి
ఆ సందేశము చెప్పారు.

### ప్రజలు ధర్మశాస్త్రము వినుట

23 యూదా నాయకులందరినీ యెరూషలేము
నాయకులను తనను కలుసుకోవలసిందిగా
యోషీయా రాజు చెప్పాడు. 2తర్వాత రాజు
యెహోవా యొక్క ఆలయము వద్దకు వెళ్లాడు.
యూదాలోని మనుష్యులందరు మరియు యెరూష
లేములో నివసించేవారు. అతనితో పాటు వెళ్లారు.
యాజకులు, ప్రవక్తలు, అందరు మనుష్యులు తక్కువ
ప్రాముఖ్యము కలవారి నుండి ఎక్కువ ప్రాముఖ్యం
కలవారి వరకు అతనితోపాటు వెళ్లారు. తర్వాత అతను
ఒడంబడిక పుస్తకము చదివాడు. ఇది యెహోవా
యొక్క ఆలయములో కనిపించిన ధర్మశాస్త్ర
గ్రంథము. యోషీయా అందరు వినేటట్లుగా పుస్తకము

చదివాడు. 3రాజు స్తంభం ప్రక్కగా నిలబడి యెహో
వాతో ఒడంబడిక కుదుర్చుకొన్నాడు. యెహోవా
ఆజ్ఞలను, ఒడంబడికను, అతని నిబంధనలను పాటించ
డానికి అతను సమ్మతించాడు. హృదయపూర్వకంగా
అతను వాటికి సమ్మతించాడు. ఆ పుస్తకంలోని ఒడం
బడికను పాటించడానికి సమ్మతించాడు. రాజు ఒడం
బడికను తాము అంగీకరిస్తున్నట్టుగా ప్రజలందరు నిల
బడ్డారు.
4తర్వాత ప్రధాన యాజకుడు అయిన హిల్కీయా,
ఇతర యాజకులు, ద్వారపాలకులు మొదలైన వారిని
రాజు ఆజ్ఞాపించాడు, యెహోవా యొక్క ఆలయము
నుండి బయలు అషేరాదేవికి, ఆకాశములోని నక్షత్రా
లను గౌరవించేందుకు చేయబడిన అన్ని పాత్రలు
తీసుకు రమ్మని తర్వాత యోషీయా ఆ వస్తువులను
యెరూషలేముకు వెలుపల కిద్రోను లోయలోని మైదా
నలలో కాల్చివేశాడు. తర్వాత వారు బూడిదను బెతే
లుకు తీసుకు వెళ్లారు.
5యూదా రాజులు కొందరు సామాన్యులను యాజ
కులుగా ఎంపిక చేశారు. ఆ మనుష్యులు అహరోను
వంశానికి చెందినవారు కారు. ఆ అబద్ధపు యాజకులు
యూదాలోని ప్రతినగరంలో ఉన్నత స్థానాలలోను
యెరూషలేముకు చుట్టు పక్కలనున్న పట్టణాల
లోను ధూపం వెలిగించారు. వారు బయలునకు సూర్య
చంద్రులను, నక్షత్రగణాలను, ఆకాశంలోని అన్ని
నక్షత్రాలను గౌరవించేందుకు ధూపం వేసారు. కాని
యోషీయా ఆ అబద్ధపు యాజకుల చేతలు ఆపి
వేశాడు.
6యోషీయా యెహోవాయొక్క ఆలయము
నుండి అషేరా స్తంభము తొలగించాడు. అతను అషేరా
స్తంభము యెరూషలేము వెలుపలికి తీసుకువెళ్లి
కిద్రోను లోయను చేరి అక్కడ కాల్చివేశాడు. తర్వాత
ఆ కాల్చిన వస్తువులను ధూళిగా చేసి, ఆ ధూళిని
సామాన్యుల సమాధుల మీద చల్లాడు. 7తర్వాత
యోషీయా రాజు యెహోవా ఆలయంలోని పురుష
వ్యభిచారుల ఇండ్లను ధ్వంసము చేశాడు. ఆ ఇండ్లను
స్త్రీలు కూడా ఉపయోగించి, అబద్ధపు దేవత అషేరా
గౌరవార్థం గుడారపు కప్పులు తయారు చేశారు.
8-9ఆ సమయాన యాజకులు బలులు యెరూషలే
ముకు తీసుకురాలేదు; ఆలయములో బలిపీఠం మీద
వాటిని నివేదించలేదు. యూదా అంతటా నగరాలలో
యాజకులు నివసించారు. ఆ నగరాలలో వారు ఉన్నత
స్థానాలలో ధూపము వేసేవారు. బలులు సమర్పించే
వారు. ఆ ఉన్నత స్థలాలు గెబానుండి బెయేర్షెబా వరకు
అన్ని చోట్ల వుండేవి. మరియు యాజకులు ఆ
పట్టణాలలో పులియని రొట్టెను సామాన్యులతో కలిసి
తింటూ ఉన్నారు. యెరూషలేములో యాజకుల
కోసం ప్రత్యేకించబడిన స్థలంలో కాదు. కాని
యోషీయా రాజు ఆ ఉన్నత స్థానాలను ధ్వంసము
చేసి, యెరూషలేముకి ఆ యాజకులను తీసుకు
వచ్చాడు. యోషీయా యెహోషువ ద్వారానికి ఎడమ
నున్న ఉన్నత స్థానాలను కూడా ధ్వంసము చేశాడు.
(యెహోషువ ఆ నగరపు రాజు).
10అబద్ధపు దేవుడైన మెలెకు గౌరవార్థం ప్రజలు
తమ పిల్లలను చంపి బలిపీఠం మీద కాల్చివేసేవారు.
ఈ పని బెన్హిన్నోము లోయలో తోఫెతు అనే
చోట జరిగేది. యోషీయా ఆ స్థలాన్ని ప్రజలు దానిని
మరల ఉపయోగించు కొనేందుకు వీలులేనంతగా
ధ్వంసము చేశాడు. 11వెనకటి కాలంలో, యూదా
రాజులు యెహోవా యొక్క ఆలయ ప్రవేశ ద్వారం
వద్ద కొన్ని గుర్రాలను, ఒక రథాన్ని ఉంచేవారు. నెత
న్మెలకు అనే ముఖ్య అధికారి గదికి దగ్గరగా వుండేది.
ఆ గుర్రాలూ, రథమూ సూర్యదేవుని గౌరవార్థం నిలప
బడేవి. యోషీయా ఆ గుర్రాలను తొలగించి రథాన్ని
కాల్చివేశాడు.
12వెనుకటి రోజుల్లో, యూదా రాజులు అహాబు
భవనం కప్పు మీద బలిపీఠాలు అమర్చారు. మనష్షే
రాజు కూడా యెహోవా యొక్క ఆలయము రెండు
అంగణాలలో బలిపీఠాలు నిర్మించాడు. యోషీయా
ఆ బలిపీఠాలన్నిటినీ నాశనము చేశాడు. విరిగిపోయిన
ముక్కలను కిద్రోను లోయలోకి విసిరివేశాడు.
13వెనకటి కాలములో, సొలొమోను రాజు యెరూష
లేముకు దగ్గరలో 'నాశన పర్వతము' మీద కొన్ని
ఉన్నత స్థలాలు నిర్మించాడు. ఆ కొండకు దక్షిణంగా
ఆ ఉన్నత స్థలాలు ఉండేవి. ఆ ఉన్నతస్థలాలలో
ఒకటి అష్తారోతు గౌరవార్థము కట్టబడింది. సీదోను
ప్రజలు ఆరాధించే హేయమైన విగ్రహమది. మరియు
సొలొమోను రాజు మిలోము గౌరవార్థం ఒక ఉన్నత
స్థానము నిర్మించాడు. అమ్మోనీయులు కొలిచే హేయ
మైన విగ్రహ మది. కాని యోషీయా రాజు ఆ ఆరాధనా
స్థలాలన్నిటినీ ధ్వంసం చేశాడు. 14యోషీయా రాజు
స్మారక శిలలను పగలగొట్టాడు; అషరా స్తంభాలను
విరగగొట్టాడు. తర్వాత అతను ఆ స్థలము మీద మృత
జీవుల ఎముకలను వెదజల్లాడు.
15యోషీయా బేతేలు వద్ద గల బలిపీఠాన్ని ఉన్నత
స్థలమును ధ్వంసము చేశాడు. నెబాతు కొడుకైన
యరొబాము ఈ బలిపీఠం నిర్మించాడు. యరొబాము
ఇశ్రాయేలుని పాపానికి పాల్పడజేశాడు. యోషీయా
బలిపీఠపు శిలలను ముక్కలు ముక్కలుగా చేశాడు.
యోషీయా బలిపీఠమును ఉన్నత స్థానమును
ధ్వంసము చేశాడు. తర్వాత వాటిని ధూళిగా చేశాడు.
మరియు అతను అషేరా స్తంభమును కాల్చివేసెను.
16యోషీయా చుట్టు ప్రక్కలు చూచెను; కొండమీద
సమాధులు కనిపించాయి. అతను మనుష్యులను
పంపాడు. వారు ఆ సమాధులనుండి ఎముకలు తీసుకు

వచ్చారు. తర్వాత బలిపీఠం మీద ఆ ఎముకలను
కాల్చాడు. ఈ విధంగా యోషీయా బలిపీఠాన్ని అప
విత్రము చేశాడు. దైవజనుడు ప్రకటించెనని
యెహోవా యొక్క సందేశం తెలిపినట్లుగా ఇది జరి
గింది. యరొబాము బలిపీఠం ప్రక్కగా నిలబడి నప్పుడు
దైవజనుడు ఇది ప్రకటించాడు. తర్వాత యోషీయా
చుట్టుప్రక్కల చూశాడు. దైవజనుడి సమాధి చూశాడు.
17"నేను చూస్తున్న సమాధి ఏమిటి?" అని
యోషీయా అడిగాడు. "యూదానుంచి వచ్చిన దైవ
జనుని సమాధి ఇది. బేతేలులోని బలిపీఠానికి నీవు
చేసిన పనులను ఈ దైవజనుడు చెప్పాడు. ఈ విష
యాలను అతను చాలా కాలము క్రిందటనే సూచిం
చాడు" అని ఆ నగర ప్రజలు చెప్పారు.
18 "దైవజనుడను ఒంటరిగా విడిచిపెట్టండి, అతని
ఎముకలను కదిలించ కండి" అని యోషీయా
చెప్పాడు. అందువల్ల వారు అతని ఎముకలు విడిచి
పెట్టారు. షోమ్రోను నుంచి వచ్చిన దైవజనుని ఎము
కలు కూడా విడిచిపెట్టారు.
19యోషీయా షోమ్రోను నగరాలలోని ఉన్నత
స్థలాలలో వున్న అన్ని ఆలయాలను కూడా ధ్వంసము
చేశాడు. ఇశ్రాయేలు రాజులు ఆ ఆలయాలను నిర్మిం
చారు. అది యెహోవాను ఆగ్రహపరిచింది.
యోషీయా బేతేలులోని ఆరాధనాస్థలాలను ధ్వంసము
చేసినట్లుగా, ఆ ఆలయాలను కూడా ధ్వంసము
చేశాడు.
20యోషీయా షోమ్రోనులోని ఉన్నత స్థలాలకు
చెందిన యాజకులందరినీ చంపివేశాడు. ఆ బలిపీఠ
ముల మీద ఆ యాజకులను చంపాడు. బలిపీఠముల
మీద మనుష్యుల ఎముకలు కాల్చాడు. ఈ విధంగా
అతను ఆ ఆరాధనా స్థలాలను పాడు చేశాడు. తర్వాత
అతను యెరూషలేముకు మరలి వెళ్లాడు.

### యూదా ప్రజలు పస్కా పండుగను ఆచరించుట

21తర్వాత యోషీయా రాజు ప్రజలందరకు ఒక
ఆజ్ఞ విధించాడు. "మీ దేవుడైన యెహోవాకు పస్కా
పండుగను ఆచరించండి. ఒడంబడిక పుస్తకంలో
వ్రాయబడినట్లుగా జరపండి" అని అతను చెప్పాడు.
22న్యాయాధిపతులు ఇశ్రాయేలుని పరిపాలించిన
నాటినుంచి ప్రజలు ఈ విధంగా ఆ ఉత్సవము జరప
లేదు. ఇశ్రాయేలు రాజులుగాని, యూదా రాజులుగాని
పస్కా పండుగను అంత బ్రహ్మాండంగా ఆచరించి వుండ
లేదు. 23యోషీయా రాజయిన 18వ సంవత్సరాన
యెరూషలేములో యెహోవాకు ఈ ఉత్సవము
జరిపారు.
24కర్ణపిశాచి గలవారిని, సోదె చెప్పువారిని, గృహదేవ
తలను, విగ్రహాలను, యూదా యెరూషలేములోనున్న
ప్రజలు పూజించే ఆ భయంకర వస్తువులను
యోషీయా నాశనము చేశాడు. హిల్కీయా యాజకుడు
యెహోవాయొక్క ఆలయములో కనుగొన్న ధర్మ
శాస్త్రములోని నియమాలను పాటించేందుకు
యోషీయా ఈ విధముగా చేశాడు.
25అంతకు ముందు యోషీయా వంటి రాజు లేడు.
యోషీయా పూర్ణహృదయముతో, పూర్ణ ఆత్మతో
శక్తినంతా కూడగట్టుకుని యెహోవా వైపు నిలిచాడు.
యోషీయా వలె మోషే ధర్మశాస్త్రాన్ని ఏ రాజు పాటించి
వుండలేదు. ఆ తర్వాత కూడా యోషీయా వంటి
మరొక రాజు లేడు.
26కాని యూదా ప్రజలపట్ల యెహోవా తన ఆగ్ర
హాన్ని మానలేదు. మనష్షే చేసిన అన్ని పనులకు
యెహోవా వారిపట్ల కోపముగానే వున్నాడు. 27"ఇశ్రా
యేలు ప్రజలు తమ దేశాన్ని బలవంతంగా వీడునట్లుగా
నేను చేశాను. యూదాకు కూడా ఇలాగే చేస్తాను. నా
దృష్టినుండి యూదాని మరలిస్తాను. నేను యెరూషలే
మును అంగీకరించను. అవును. నేను నగరాన్ని ఏర్పర
చుకున్నాను. నేను మాటలాడేటప్పుడు యెరూష
లేము గురించి నేను ఇలా అన్నాను: 'నా పేరు అక్కడ
వుంటుంది' అని. కాని నేను ఆ ప్రదేశంలో వున్న
ఆలయాన్ని ధ్వంసము చేస్తాను" అని యెహోవా
చెప్పాడు.
28యోషీయా చేసిన ఇతర పనులు 'యూదా
రాజుల చరిత్ర ' అనే గ్రంథములో వ్రాయబడి వున్నవి.

### యోషీయా మరణం

29యోషీయా పరిపాలనా కాలంలో ఈజిప్టు రాజైన
ఫరోనెకో యూఫ్రటీసు నది వద్ద అపిరియా రాజుమీదికి
దండెత్తి పోయెను. మెగిద్దోలో ఫరో యోషీయాను
కలుసుకోడానికి వెళ్లాడు. ఫరో యోషీయాను చూసి,
అతనిని చంపాడు.
30యోషీయా అధికారులు అతని దేహాన్ని రథము
మీద వుంచి, మెగిద్దోనుంచి యెరూషలేము వరకు
మోసుకుపోయారు. వారు యోషీయాను అతని
సమాధిలో సమాధి చేశారు.
తర్వాత సామాన్యులు యోషీయా కుమారుడైన
యెహోయాహాజును అభిషేకించారు. వారు యెహో
యాహాజును తమ కొత్త రాజుగా చేసు కున్నారు.

### యెహోయాహాజు యూదా రాజుగా నియమింపబడుట

31యెహోయాహాజు రాజగు నాటికి, అతను 23
యేండ్లవాడు. యెరూషలేములో అతను మూడు
నెలలు పరిపాలించాడు. అతని తల్లి పేరు హమూటలు.
ఆమె లిబ్నాకి చెందిన యిర్మీయా కుమార్తె.
32యెహోయాహాజు యెహోవా తప్పు అని చెప్పిన
పనులు చేశాడు. తన పూర్వీకులు చేసిన ఆ పనులనే
యెహోయాహాజు చేశాడు.

33ఫరోనెకో హమాతు దేశములో రిబ్లా చెరసాలలో
యెహోయాహాజును బంధించాడు. 34అందువల్ల
యెహోయాహాజు యెరూషలేములో పరిపాలించలేక
పోయాడు. ఫరోనెకో 7,500 తులాల వెండిని, 75
పౌన్ల బంగారమును యూదా కట్టునట్లుగా చేశాడు.
ఫరోనెకో యోషీయా కుమారుడైన ఎల్యాకీమును
కొత్త రాజుగా చేశాడు. ఫరోనెకో ఎల్యాకీము పేరుని
యెహోయాకీము అని మార్చాడు. మరియు ఫరో
నెకో ఎల్యాకీము యెహోయాహాజుని ఈజిప్టుకు
తీసుకుని పోయాడు. యెహోయాహాజు ఈజిప్టులో
మరణించాడు.
35యెహోయాకీము వెండి బంగారాలు ఫరో
నెకోకి ఇచ్చాడు. కాని యెహోయాకీము ప్రజలచేత
పన్నులు కట్టింపజేసి ఆ ధనాన్ని ఫరోనెకోకి ఇచ్చాడు.
అందువల్ల ప్రతి వ్యక్తి తనవంతు వెండిని, బంగారాన్ని
ఇచ్చాడు. మరియు యెహోయాకీము రాజు ఆ
ధనాన్ని ఫరోనెకోకి ఇచ్చాడు.
36యెహోయాకీము రాజగునాటికి, అతను 25
యేండ్లవాడు. అతను యెరూషలేములో 11 సంవత్స
రాలు పరిపాలించాడు. అతని తల్లి పేరు జెబూదా.
ఆమె రూమాకి చెందిన పెదాయా కుమార్తె.
37యెహోవా తప్పు అని చెప్పిన కార్యములు యెహో
యాకీము చేసాడు. తన పూర్వీకులు చేసిన పనులే
యెహోయాకీము చేశాడు.

### నెబుకద్నేజరు రాజు యూదాకి వచ్చుట

24 యెహోయాకీము కాలంలో బబులోను
రాజయిన నెబుకద్నెజరు యూదా దేశానికి
వచ్చాడు. యెహోయాకీము నెబుకద్నెజరుని
మూడేండ్లు సేవించాడు. తర్వాత యెహోయాకీము
నెబుకర్నెజరుకు ప్రతికూలుడై అతని పరిపాలన నుండి
విముక్తుడయ్యాడు. 2యెహోవా బబులోనువారి
బృందాలు, సిరియనులు, మోయాబీయులు, అమ్మో
నీయులు మొదలైన వారిని యెహోయాకీముకి విరు
ద్ధంగా యుద్ధము చేయునట్లు చేశాడు. యెహోవా
ఆ బృందాలను యూదాని ధ్వంసం చేయమని పంపిం
చాడు. ఇది యెహోవా చెప్పినట్లుగానే జరిగింది.
యెహోవా తన సేవకులైన ప్రవక్తలను అవి చెప్ప
డానికి ఉపయోగించాడు.
3యూదాలో అవి జరుగేటట్లు యెహోవా ఆజ్ఞాపిం
చాడు. ఈ విధంగా యెహోవా వారిని తన దృష్టినుండి
మరల్చాడు. మనష్షే చేసిన పాపాలన్నిటి కారణాన
యెహోవా ఇలా చేశాడు. 4మనష్షే పలువురు అమాయ
కులను చంపినందువల్ల, యెహోవా ఇదంతా చేశాడు.
మనష్షే యెరూషలేముని వారి రక్తముతో నింపివేశాడు.
మరియు యెహోవా ఆ పాపాలను మన్నించడు.
5యెహోయాకీము చేసిన ఇతర కార్యాలు
'యూదా రాజుల చరిత్ర' అనే గ్రంథంలో వ్రాయబడి
నవి. 6యెహోయాకీము మరణించగా, అతని పూర్వీ
కులతో పాటుగా అతనిని సమాధి చేశారు. యెహో
యాకీము కుమారుడు యెహోయాకీను, అతని
తర్వాత కొత్తగా రాజయ్యాడు.
7బబులోను రాజు ఈజిప్టు వాగుకి యూఫ్రటీసు
నదికి మధ్యగల ప్రదేశమంతటిని స్వాధీనము చేసు
కున్నాడు. ఈ ప్రదేశము అంతకు ముందు ఈజిప్టు
వారు తమ అదుపులో ఉంచుకున్నారు. అందువల్ల
ఈజిప్టు రాజు ఈజిప్టుని ఏ మాత్రమూ విడువదలచు
కోలేదు.

### నెబుకద్నెజరు యెరూషలేమును వశం చేసుకొనుట

8యెహోయాకీను, పరిపాలన ప్రారంభించిన
నాడు, అతను 18 యేండ్లవాడు. అతను యెరూషలే
ములో 3 మాసాలు పరిపాలించాడు. అతని తల్లి పేరు
నెహుష్తా ఆమె యెరూషలేముకు చెందిన ఎల్నాతాను
కుమార్తె. 9యెహోవా తప్పని చెప్పిన పనులు
యెహోయాకీను చేశాడు. అతను తన తండ్రి చేసిన
అవే పనులు చేసాడు.
10ఆ సమయమున బబులోను రాజైన నెబుకద్నె
జరు యొక్క అధికారులు యెరూషలేముకు వచ్చి
ముట్టడించారు. 11తర్వాత బబులోను రాజైన నెబుక
ద్నెజరు నగరానికి వచ్చాడు. ఆయన సైన్యము అప్ప
టికే నగరాన్ని చుట్టుముట్టుతూ ఉంది. 12యూదా
రాజు యెహోయాకీను బబులోను రాజుని కలుసు
కోడానికి వెలుపలికి వచ్చాడు. యెహోయాకీను తల్లి,
అతని అధికారులు, నాయకులు, ఉద్యోగులు కూడా
అతనితోపాటు వెళ్లారు. అప్పుడు బబులోను రాజు
యెహోయాకీనుని బంధించాడు. ఇది నెబుకద్నెజరు
పరిపాలనాకాలపు 8వ సంవత్సరమున జరిగింది.
13నెబుకద్నెజరు యెరూషలేమునుండి యెహోవా
యొక్క ఆలయములోని నిధులన్నిటినీ, రాజభవన
ములోని నిధులన్నిటినీ తీసుకొనెను. నెబుకద్నెజరు
ఇశ్రాయేలు రాజయిన సొలొమోను యెహోవా
యొక్క ఆలయములో ఉంచిన అన్ని బంగారు పాత్ర
లను ముక్కలు చేశాడు. యెహోవా చెప్పినట్లుగానే
ఇది సంభవించింది.
14నెబుకద్నెజరు యెరూషలేములోని ప్రజలందరిని
బంధించాడు. అతను నాయకులందరినీ, ధనవంతు
లను బంధించాడు. అతను 10,000 మంది ప్రజలను
బందీలుగా తీసుకువెళ్లాడు. నెబుకద్నెజరు పనిలో
చెయ్యి తిరిగిన వారిని, నిపుణులను తీసుకు వెళ్లాడు.
సామాన్యులలోని నిరుపేదలను తప్ప మరెవ్వరిని విడిచి
పెట్టలేదు. 15నెబుకద్నెజరు యెహోయా కీనుని
బందీగా చేసి బబులోనుకు తీసుకువెళ్లాడు. నెబుక
ద్నెజరు పైగా రాజమాతను, అతని భార్యలను, అధి

కారులను, ప్రముఖ వ్యక్తులను తీసుకువెళ్లాడు. నెబుక
ద్నెజరు వారిని యెరూషలేము నుండి బబులోనుకి
బందీలుగా చేసి తీసుకువెళ్లాడు. 16 7000 మంది సైనికు
లుండిరి. నెబుకద్నెజరు సైనికులందరినీ, 1000 మంది
పనిలో చెయ్యి తిరిగినవారినీ, నిపుణులను తీసుకు
వెళ్లాడు. ఈ వ్యక్తులందరు యుద్ధానికి సిద్ధంగా వుండే
సుశిక్షితులైన సైనికులు. బబులోను రాజు వారినంద
రినీ బబులోనుకు బందీలుగా తీసుకు వెళ్లాడు."

### సిద్కియా రాజు

17బబులోను రాజు మత్తన్యాను కొత్త రాజుగా
చేశాడు. మత్తన్యా యెహోయాకీము యొక్క పిన
తండ్రి. అతను అతని పేరుని సిద్కియా అని మార్చి
వేశాడు. 18సిద్కియా పరిపాలన ప్రారంభించే నాటికి
ఇరవై ఒక్క సంవత్సరములవాడు. అతని తల్లి పేరు
హమూటలు. ఆమె లిబ్నాకి చెందిన యిర్మీయా
కుమార్తె. 19యెహోవా తప్పు అని చెప్పిన పనులు
సిద్కియా చేశాడు. సిద్కియా యెహోయాకీను
చేసిన పనులే చేశాడు. 20యెహోవా యెరూషలేము
యూదాల పట్ల ఆగ్రహం చెందాడు. యెహోవా వారిని
దూరపరచెను.

### నెబుకద్నెజరు సిద్కియా పరిపాలనను అంతము చేయుట

25 సిద్కియా తిరుగుబాటు చేసి బబులోను
రాజుకు విధేయుడై వుండటానికి సమ్మతించ
లేదు. అందువల్ల, బబులోను రాజైన నెబుకద్నెజరు
అతని మొత్తము సైన్యము యెరూషలేముకు ప్రతికూల
ముగా యుద్ధము చేయడానికి వచ్చింది. సిద్కియా
రాజుయొక్క తొమ్మిదో సంవత్సరాన, 10వ నెలలో
10వ రోజున ఇది సంభవించింది. నెబుకద్నెజరు తన
సైన్యాన్ని యెరూషలేము చుట్టు ఉంచి, ప్రజలను
నగరం నుండి వెలుపలికిగాని లోపలికిగాని రానీయకుండ
చేశాడు. ఆ తర్వాత నగరం చుట్టు అతను ఒక మురికి
గోడ నిర్మించాడు. 2నెబుకద్నెజరు సైన్యము
సిద్కియా యూదా రాజుగా వున్న 11వ సంవత్సరము
దాకా యెరూషలేము చుట్టూ ఉండెను. 3నగరంలో
కరువు ఘోరంగా తయారయింది. నాలుగవ నెలలో
9వ రోజున నగరంలోని సామాన్యులకు ఆహారము
లేకపోయింది.

4నెబుకద్నెజరు సైన్యము చివరికి నగర ప్రాకార
మును బద్దలు చేసింది. ఆ రాత్రి సిద్కియా రాజు
అతని సైనికులు పారిపోయారు. వారు రాజుగారి ఉద్యా
నవనము ద్వారా రహస్య ద్వారాన్ని ఉపయోగించి
జంట గోడలద్వారా వెళ్లారు. విరోధి సైనికులు నగరం
చుట్టూ వుండిరి. కాని సిద్కియా అతని మనుష్యులు
మార్గము మీదికి తప్పించుకుని ఎడారికి పారిపోయారు.
5బబులోను సైన్యము సిద్కియా రాజుని వెన్నంటి
పోయి అతనిని యెరికో అనే చోట పట్టుకున్నారు.
సిద్కియా సైనికులందరు అతనిని విడిచిపెట్టి పారి
పోయారు. 6బబులోనువారు సిద్కియా రాజుని బబు
లోను రాజు వద్దకు రిబ్లా అనే చోటికి తీసుకు వెళ్లారు.
బబులోనువారు సిద్కియాని శిక్షింప నిశ్చయించారు.
7వారు సిద్కియా కుమారులను అతని ఎదుటనే చంపి
వేశారు. ఆ తర్వాత సిద్కియా యొక్క కండ్లు పెరికి
వేశారు. అతనికి గొలుసులు బిగించి అతనిని బబులో
నుకు తీసుకువెళ్లారు.

### యెరూషలేమును ధ్వంసం చేయుట

8నెబుకద్నెజరు బబులోను రాజుగా వున్న 19 వ
సంవత్సరమున, నెబుకద్నెజరు 5వ నెలలో 7వ తేదీని
యెరూషలేముకు వచ్చాడు. నెబూజరదాను నెబుకద్నె
జరు అత్యుత్తమ సైనికులకు అధిపతి 9నెబూజరదాను
యెహోవాయొక్క ఆలయమును దగ్ధం చేశాడు. రాజ
భవనాన్ని, యెరూషలేములోని అన్ని ఇళ్లను కూడా
దగ్ధం చేశాడు. అతను పెద్ద ఇళ్లను కూడా దగ్ధం చేశాడు.
10అప్పుడు నెబూజరదానుతో పాటువున్న బబు
లోను సైన్యము యెరూషలేము పరిసరాలలోవున్న
ప్రాకారములను కూలదోసింది. 11నెబూజరదాను నగ
రంలో ఇంకా మిగిలివున్న ప్రజలను బంధించాడు.
నెబూజరదానుకు లోబడిన వారిని సయితము బందీ
లుగా తీసుకువెళ్లాడు. 12సామాన్యులలో అతి పేదవారిని
మాత్రం నెబూజరదాను విడిచిపెట్టాడు. ద్రాక్షలు ఇతర
పంటలను చూసే నిమిత్తం వారిని అక్కడే నివసింప
జేశాడు.

13బబులోను సైనికులు యెహోవా యొక్క
ఆలయములోని అన్ని ఇత్తడి వస్తువులను ముక్కలు
చేశారు. వారు కంచు స్తంభాలను, కంచు మట్లను,
పెద్ద ఇత్తడి చెరువుని ధ్వంసం చేశారు. తర్వాత ఆ
కంచునంతా బబులోనుకు తీసుకువెళ్లాడు. 14బబు
లోనువారు యెహోవా యొక్క ఆలయంలో ఉప
యోగింపబడే కుండలు, నిప్పు తీసే గరిటలు, దీపాలు
చక్కబరిచే ఉపకరణాలు, చెంచాలు, కంచు పాత్రలు
మొదలైనవాటిని తీసుకువెళ్లారు. 15నెబూ జరదాను
బానలు, పాత్రలు కూడా తీసుకు వెళ్లాడు. బంగారము
కోసము బంగారముతో చేయబడిన వస్తువులు వెండి
కోసము వెండితో చేయబడిన వస్తువులను కూడా
తీసుకువెళ్లాడు.

16-17 2కంచు స్తంభాలు (ప్రతి స్తంభం 27 అడుగుల
యెత్తు కలవి. స్తంభాల మీది పై పీటలు నాలుగున్నర
అడుగుల ఎత్తు కలవి. దానిమ్మ పండు మరియు అల్లిక
విన్యాసాలు కంచుతో చేయబడినవి. రెండు స్తంభాల
విన్యాసం ఒకే మోస్తరుగా వుంటుంది) విశాలమైన కంచు
చెరువు. యెహోవాయొక్క ఆలయానికి సొలొమోను

సిద్ధపరచిన రెండు స్తంభములు. ఆ వస్తువుల నుండి గ్రహించిన కంచు తూకం వేయడానికి అలవి కానిది.

### యూదా ప్రజలను బందీలుగా తీసుకుని వెళ్లుట

18ఆలయము నుండి నెబూజరదాను ప్రధాన యాజకుడైన శెరాయాను పట్టుకున్నాడు.

జెఫన్యా అనే రెండవ యాజకుడు, పవేశమును కాచే ఆ ముగ్గురు మనుష్యులను తీసుకున్నాడు.
19నగరంనుండి నెబూజరదాను సైన్యానికి అధికారిగా ఉన్న ఉద్యోగిని నగరంలో మిగిలివున్న ఐదుగురు రాజుగారి సలహాదారులను తీసుకున్నాడు.

సైన్యాధిపతి యొక్క ఒక కార్యదర్శి. అతను సామాన్య ప్రజలను లెక్కించేవాడు. మరియు అతను వారిలోనుండి కొందరు సైనికులను ఎంచుకునేవాడు. నగరంలో అప్పుడున్న 60 మంది ప్రజలను నెబుకద్నెజరు తీసుకున్నాడు.

20-21తరువాత నెబూజరదాను హమాతు ప్రదేశం లోని రిబ్లా దగ్గర ఉన్న బబులోను రాజువద్దకు ప్రజలందరినీ తీసుకువెళ్లాడు. బబులోను రాజు రిబ్లా అనే చోట వారిని చంపివేశాడు. మరియు యూదా ప్రజలను వారి దేశమునుండి బందీలుగా తీసుకుని పోయెను.

### యూదా రాజ్య పాలకుడు అయిన గెదల్యా

22బబులోను రాజైన నెబుకద్నెజరు యూదా దేశంలో కొందరు ప్రజలను విడిచి పెట్టాడు. షాఫాను కుమారుడైన అహీకాం, అతని కుమారుడైన గెదల్యా అనే అతడు ఒకడుండెను. నెబుకద్నెజరు యూదా ప్రజల మీద గెదల్యాను అధిపతిగా నియమించాడు.

23నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు కారేహకు కుమారుడైన నెటోఫాతుకు చెందిన తన్హుమెతు కుమారుడైన శెరాయా, మాయాకాతు కుమారుడైన యజన్యా మొదలయిన వారు సైన్యాధిపతులు. ఈ సైన్యాధిపతులు, వారి మనుష్యులు, బబులోను రాజు గెదల్యాను అధిపతిగా చేసినట్లు విన్నారు. అందువల్ల గెదల్యాను కలుసుకోవడానికి వారు మిస్పాకి వెళ్లారు.
24ఈ అధికారులకు, వారి మనుష్యులకు గెదల్యా వాగ్దానాలు చేశాడు. గెదల్యా వారితో ఇట్లన్నాడు: "బబులోను అధికారులను చూసి మీరు భయపడకండి. ఇక్కడే ఉండి బబులోను రాజుని కొలవండి. ఆ తరువాత, అంతయు మీకు సక్రమముగా ఉంటుంది."

25ఎలీషా కుమారుడైన నెతన్యా కుమారుడు ఇష్మాయేలు రాజ కుటుంబము నుండి వచ్చినవాడు. ఏడవ నెలలో ఇష్మాయేలు మరియు పదిమంది అతని మను ష్యులు గెదల్యా మీద దాడిచేసి మిస్పా వద్ద గెదల్యాతో పాటు ఉన్న కల్దీయులను యూదులను చంపి వేశాడు.
26అప్పుడు సైన్యాధికారులు అందరు మనుష్యులు ఈజిప్టుకు పారిపోయారు. అతి సామాన్యుడు మొదలుకొని అతి ప్రాముఖ్యము కలవాడి వరకు అందరూ పారి పోయారు. ఎందుకనగా, కల్దీయులనగా వారు భయపడ్డారు.
27ఆ తర్వాత ఎవీల్మెరోదకు బబులోనుకు రాజయ్యాడు. అతను యూదా రాజైన యెహోయాకీనును చెరసాలనుండి విముక్తి చేసెను. ఇది యెహోయాకీను బంధింపబడిన 37వ సంవత్సరమున సంభవించింది. ఇది ఎవీల్మెరోదకు పరిపాలన ప్రారంభం చేసిన 12వ నెలనుండి 27వ తేదీ వరకు జరిగింది.
28ఎవీల్మె రోదకు యెహోయాకీను పట్ల దయకలిగి ఉండెను. అతను యెహోయాకీనుకి బబులోనులో తనతో బాటు ఆసీనులయ్యే ఇతర రాజుల కంటె ఎక్కువ ప్రాముఖ్యముగల చోటు ఇచ్చాడు.
29ఎవీల్మెరోదకు యెహోయాకీను చెరసాల దుస్తులు ధరించడం ఆపివేశాడు. మరియు యెహోయాకీను ఒకే మేజాబల్ల మీద కూర్చుని ఎవీల్మెరోదకుతో కలసి భుజించాడు. ఇట్లు అతని శేష జీవితము వరకు జరిగింది.
30అందువల్ల ఎవీల్మెరోదకు రాజు యెహోయాకీనుకు అతని శేష జీవితము వరకూ ప్రతిరోజూ భోజనము పెట్టాడు.

# 1 దినవృత్తాంతములు

### ఆదిమానవుడైన ఆదామునుండి నోవహువరకు వంశ చరిత్ర

1 1-3ఆదాము, షేతు, ఎనోషు, కేయినాను, మహల
లేలు, యెరెదు, హనోకు, మెతూషెల, లెమెకు,
4నోవహు,* షేము, హాము, యాపెతు.

### యాపెతు సంతతివారు

5యాపెతు కుమారులెవరనగా: గోమెరు,
మాగోగు, మాదయి, యావాను, తుబాలు, మెషెకు
మరియు తీరసు.
6అష్కనజు, రీఫతు, తోగర్మాలనేవారు గోమెరు
కుమారులు.
7ఎలీషా, తర్షీషు, కిత్తీము, రోదానీము* అనేవారు
యావాను కుమారులు.

### హాము సంతతివారు

8కూషు, (ఇథియోపియ) మిస్రాయిము, (ఈజిప్టు)
పూతు మరియు కనాను అనేవారు హాము కుమారులు.
9సెబా, హవీలా, సబ్తా, రాయమా, సబ్తకా అనేవారు
కూషు కుమారులు. షెబ, దదాను అనేవారు రాయమా
కుమారులు.
10నిమ్రోదు అనువాడు కూషు సంతతివాడు.
నిమ్రోదు ప్రపంచంలోనే మహా ధైర్యవంతుడు, బల
వంతుడైన సైనికుడయ్యాడు.
11లూదీయులు, అనామీయులు, లెహాబీయులు,
నప్తుహీయులు వీరందరికి మిస్రాయిము (ఈజిప్టు) వంశ
కర్త. 12అంతేకాదు, పత్రుసీయులకు, కస్లూహీ యులకు
మరియు కఫ్తోరీయులకు కూడ మిస్రాయిము వంశ
కర్త. ఫిలిష్తీయులు (పాలస్తీను ప్రజలు) కస్లూహునుండి
వచ్చినవారు.
13కనాను పెద్ద కుమారుని పేరు సీదోను, రెండవ
కుమారుడు హేతు. మరియు హిత్తీయులకు 14యెబూ
సీయులకు, అమోరీయులకు, గిర్గాషీయులకు, 15హివ్వీ
యులకు, అర్కీయులకు, సీనీయులకు, 16అర్వాదీ
యులకు, సెమారీయులకు మరియు హమాతీయు
లకు కూడ కనాను వంశకర్త.

### షేము సంతతివారు

17షేము కుమారులు ఎవరనగా: ఏలాము, అష్షూరు,
అర్పక్షదు, లూదు మరియు అరాము. అరాము కుమా
రులు ఊజు, హూలు, గెతెరు మరియు మెషెకు.*
18అర్పక్షదుకు షెలహు అను కుమారుడు పుట్టాడు.
షెలహునకు ఏబెరు అనువాడు పుట్టాడు.
19ఏబెరుకు ఇద్దరు కుమారులు. ఒకని పేరు
పెలెగు.* అతని కాలంలో ప్రపంచ జనాభా వివిధ
భాషా వర్గాలుగా విడిపోయిన కారణంగా అతనికి పెలెగు
అని పేరు పెట్టారు. పెలెగు సోదరుని పేరు యొక్తాను.
(20అల్మోదాదు, షెలపు, హసర్మావెతు, యెరహు,
21హదోరము, ఊజాలు, దిక్లాను, 22ఏబాలు, అబీమా
యేలు, షేబ, 23ఓఫీరు, హవీలా మరియు యోబాబు.
వీరంతా యొక్తాను కుమారులు.)

### అబ్రాహాము కుటుంబం

24అబ్రాహాము సంతానం ఎవరనగా: షేము, అర్ప
క్షదు, షెలహు, 25ఏబెరు, పెలెగు, రయూ, 26సెరూగు,
నాహోరు, తెరహు,
27మరియు అబ్రాహామను పేరుతో పిలవబడిన
అబ్రాము.
28అబ్రాహామునకు ఇస్సాకు, ఇష్మాయేలు అను
ఇరువురు కుమారులు.

### హాగరు కుమారులు

29ఇష్మాయేలు సంతానం ఎవరనగా: ఇష్మాయేలు
ప్రథమ పుత్రుడు నెబాయోతు. ఇష్మాయేలు ఇతర
కుమారు లెవరనగా కేదారు, అద్బయేలు, మిబ్శాము,
30మిష్మా, దూమా, మశ్శా, హదదు, తేమా,
31యెతూరు, నాపీషు, కెదెమా అనువారు. వీరంతా
ఇష్మాయేలు కుమారులు.

---

**ఆదాము ... నోవహు** ఒకటి నుండి నాలుగవ వచనం వరకు వంశ పరంపర పేర్లు. అనగా ఒక వంశ కర్త పేరు, అతని కుమారుడు లేక కుమారుల పేర్లు.

**రోదానీము** దోదానీము అని పాఠాంతరం.

**మెషెకు** లేక "మాషు" ఆది. 10:23 చూడండి.

**పెలెగు** అనగా విభజన.

### కెతూరా కుమారులు

[32]కెతూరా అబ్రాహాముకు దాసి.* ఆమెకు
జిమ్రాను, యొక్షాను, మెదాను, మిద్యాను, ఇష్బాకు
మరియు షూవహు అను కుమారులు కలిగారు. యొక్షా
నుకు షేబ, దదాను అను కుమారులు పుట్టారు.
[33]ఏయిఫా, ఏఫేరు, హనోకు, అబీదా, ఎల్దాయా
అనువారు మిద్యాను కుమారులు. వీరంతా కెతూరా
సంతతివారు.

### శారా కుమారులు

[34]ఇస్సాకు తండ్రి పేరు అబ్రాహాము. ఇస్సాకు కుమా
రుల పేర్లు ఏశావు, ఇశ్రాయేలు.*
[35]ఎలీఫజు, రెయూవేలు, యెయూషు, యలాము
మరియు కోరహు అనేవారు ఏశావు కుమారులు.
[36]తేమాను, ఓమారు, సెపో,* గాతాము, కనజు,
తిమ్నా మరియు అమాలేకు అనేవారు ఎలీఫజు కుమా
రులు.
[37]నహతు, జెరహు, షమ్మా మరియు మిజ్జ
అనువారు రెయూవేలు కుమారులు.

### శేయీరు సంతతియగు ఎదోమీయులు

[38]లోతాను, శోబాలు, సిబ్యోను, అనా, దిషోను,
ఏసెరు మరియు దిషాను అనువారంతా శేయీరు
కుమారులు.
[39]హోరీ, హోమాను* ఇరువురూ లోతాను
కుమారులు. తిమ్నా అనే యువతి లోతాను సోదరి.
[40]అల్వాను, మనహతు, ఏబాలు, షెపో, ఓనాము
అనువారు శోబాలు కుమారులు. అయ్యా, అనా అను
వారిరువురూ సిబ్యోను కుమారులు.
[41]అనా కుమారుని పేరు దిషోను. అమ్రాము,
ఎష్బాను, ఇత్రాను, కెరాను అనువారు దిషోను
కుమారులు. [42]బిల్హాను, జవాను, యహకాను అనువారు
ఏసెరు కుమారులు. ఊజు, అరాను లిరువురూ దిషాను
కుమారులు.

### ఎదోము రాజులు

[43]ఎదోము రాజుల పేర్లు ఈ విధంగా ఉన్నాయి:
ఇశ్రాయేలులో రాజరిక వ్యవస్థ ఏర్పడటానికి చాలాకాలం
క్రిందటనే ఏదోములో రాజులు పాలించారు.
వీరు ఎవరనగా బెయారు కుమారుడైన బెల. అతని
నగరం పేరు దిన్హాబా.
[44]బెల చనిపోయిన పిమ్మట అతని స్థానంలో
యోబాబు రాజయ్యాడు. యోబాబు తండ్రి పేరు
జెరహు. యోబాబు బొస్రా నగరానికి చెందినవాడు.
[45]యోబాబు చనిపోయిన తరువాత హుషాము
అతని స్థానంలో రాజయ్యాడు. హుషాము తేమానీ
యుల దేశపువాడు.
[46]హుషాము చనిపోయిన పిమ్మట హదదు రాజ
య్యాడు. హదదు తండ్రి పేరు బెదెదు. మోయాబు
దేశంలో మిద్యానీయులను హదదు ఓడించాడు. హదదు
అవీతు నగరంవాడు.
[47]హదదు చనిపోగా శమ్లా రాజయ్యాడు. ఇతడు
మశ్రేకా నగరవాసి.
[48]శమ్లా చనిపోయిన పిమ్మట షావూలు అతని
స్థానంలో రాజయ్యాడు. షావూలు యూఫ్రటీసు నదీ
తీరానగల రెహెబోతు పట్టణపు వాడు.
[49]షావూలు మరణానంతరం బయల్ - హానాను
రాజయ్యాడు. బయల్ - హానాను తండ్రి పేరు
అక్బోరు.
[50]బయల్ - హానాను చనిపోగా హదదు అతని
స్థానంలో రాజయ్యాడు. హదదు నగరం పేరు
పాయు.* హదదు భార్య పేరు మెహేతబేలు. ఈమె
తల్లి పేరు మత్రేదు. మత్రేదు మేజాహాబు కుమార్తె.
[51]కొంత కాలానికి హదదు చనిపోయాడు.
అప్పట్లో ఎదోము రాజ్యంలో తిమ్నా, అల్వా
యతేతు,
[52]అహలీబామా, ఏలా, పీనోను, [53]కనజు,
తేమాను, మిబ్సారు, [54]మగ్దీయేలు మరియు ఈరాము
నాయకులుగా ఉన్నారు. వీరంతా ఎదోము దేశ
నాయకులు.

### ఇశ్రాయేలు కుమారులు

2 రూబేను, షిమ్యోను, లేవి, యూదా, ఇశ్శాఖారు,
జెబూలూను, [2]దాను, యోసేపు, బెన్యామీను,
నఫ్తాలి, గాదు మరియు ఆషేరు అనేవారు ఇశ్రాయేలు
కుమారులు.

### యూదా కుమారులు

[3]ఏరు, ఓనాను, షేలా అనేవారు యూదా కుమా
రులు. వీరి తల్లి పేరు బత్ షూయ.* ఈమె కనానీయు
రాలు. యూదా పెద్ద కుమారుడు ఏరు దుష్టుడై నట్లు
యెహోవా గమనించాడు. అందువల్ల ఆయన అతనిని
చంపివేశాడు. [4]యూదా కోడలు తామారుకు అతని
వల్లనే పెరెసు, జెరహు అను కవల కుమారులు

---

**దాసి** ఉంపుడు గత్తె లేక ఉపపత్ని అని పాఠాంతరం.

**ఇశ్రాయేలు** యాకోబునకు ఇది మరో పేరు. ఆది. 32:28 చూడండి.

**సెపో** లేక జెఫ.

**హోమాను** హోమాము అని పాఠాంతరం. ఆది. 36:22 చూడండి.

**పాయు** లేక పాయి. ఆది 36:39 చూడండి.

**బత్ షూయ** షూయ కుమార్తె అని దీని అర్థం. ఆది. 38:2 చూడండి.

కలిగారు.* ఆ విధంగా యూదాకు ఐదుగురు కుమారు
లయ్యారు. 5పెరెసు కుమారులు హెస్రోను, హామూలు.
6జెరహు సంతానం ఐదుగురుః జిమ్రీ, ఏతాను,
హేమాను, కల్కోలు, దార్ద.
7జిమ్రీ కుమారుడు కర్మీ. కర్మీ కుమారుడు
ఆకాను.* ఇతడు ఇశ్రాయేలు వారికి అనేక కష్టాలు
తెచ్చాడు. ఇతడు యుద్ధంలో తీసుకున్న వస్తువులను
దేవుని కివ్వకుండా తన వద్దనే వుంచుకొన్నాడు.
8ఏతాను కుమారుడు అజర్యా.
9హెస్రోను కుమారులు యెరహ్మెయేలు, రాము,
కెలూబై.*

### రాము సంతతివారు

10రాము కుమారుడు అమ్మీనాదాబు. అమ్మీనా
దాబు కుమారుడు నయస్సోను. నయస్సోను యూదా
ప్రజల నాయకుడు.* 11నయస్సోను కుమారుడు
శల్మా. శల్మా కుమారుడు బోయజు. 12బోయజు
కుమారుడు ఓబెదు. ఓబెదు కుమారుడు యెష్షయి.
13యెష్షయి పెద్ద కుమారుడు ఏలీయాబు. యెష్షయి
రెండవ కుమారుడు అబీనాదాబు. అతని మూడవ
కుమారుడు షమ్మాను (షిమియ). 14నెతనేలు యెష్ష
యికి నాల్గవ కుమారుడు. అతని ఐదవ కుమారుడు
రద్దయి. 15యెష్షయి ఆరవ కుమారుడు ఓజెము కాగా
ఏడవ కుమారుడు దావీదు. 16సెరూయా, అబీగ
యీలు ఇద్దరూ వారి తోడబుట్టిన ఆడపిల్లలు. సెరూ
యాకు అబీషై, యోవాబు, అశాహేలు అనే ముగ్గురు
కుమారులు. 17అబీగయీలు
కుమారుడు అమాశా. అమాశా తండ్రి పేరు
యెతెరు. యెతెరు ఇష్మాయేలీయులవాడు.

### కాలేబు సంతతివారు

18హెస్రోను కుమారుడు కాలేబు. తన భార్య
అజూబా ద్వారా కాలేబు సంతానవంతుడయ్యాడు.
అజూబా యెరీయోతు కుమార్తె. యేషెరు, షోబాబు
మరియు అర్దోను అనేవారు అజూబా కుమారులు.
19అజూబా చనిపోయిన పిమ్మట కాలేబు ఎఫ్రాతాను
పెండ్లిచేసుకొన్నాడు. కాలేబుకు ఎఫ్రాతావల్ల హూరు
అనే కుమారుడు కలిగాడు. 20ఊరి అనేవాడు హూరు
కుమారుడు. ఊరికి బెసలేలు అను కుమారుడు
కలిగాడు.
21పిమ్మట హెస్రోను అరువది సంవత్సరాల వాడై
నప్పుడు మాకీరు కుమార్తెను వివాహమాడాడు. మాకీరు
అనేవాడు గిలాదుకు తండ్రి. హెస్రోను మాకీరు
కుమార్తెను కలియగా ఆమెకు సెగూబు అనేవాడు
పుట్టెను. 22సెగూబుకు పుట్టినవాడు యాయీరు.
యాయీరుకు గిలాదు దేశంలో ఇరవై మూడు నగరా
లున్నాయి. 23కాని గెషూరు వారు, అరాము (సిరియ)
వారు యాయీరు గ్రామాలను తీసుకొన్నారు. వాటిలో
కెనాతు, దాని చుట్టుపట్ల గ్రామాలు వున్నాయి. అవి
మొత్తం అరువది చిన్న చిన్న పట్టణాలు. ఈ పట్టణా
లన్నీ గిలాదు తండ్రి అయిన మాకీరు సంతతివారికి
చెందినవి.
24హెస్రోను కాలేబుదైన ఎఫ్రాతాలో చనిపోయాడు.
హెస్రోను చనిపోయిన తరువాత అతని భార్య అబీయా
ప్రసవించింది. ఆ పుట్టినవాని పేరు అష్షూరు. అష్షూ
రుకు పుట్టినవాడు తెకోవ.

### యెరహ్మెయేలు సంతతివారు

25యెరహ్మెయేలు హెస్రోను పెద్ద కుమారుడు.
రాము, బూనా, ఓరెను, ఓజెము మరియు అహీయా
అనేవారు యెరహ్మెయేలు కుమారులు. యెరహ్మె
యేలు పెద్ద కుమారుడు రాము. 26యెరహ్మెయేలుకు
అటారా అనే మరొక భార్య ఉన్నది. అటారా ఓనాముకు
తల్లి.
27యెరహ్మెయేలు పెద్ద కుమారుడు రాముకు
కుమారులున్నారు. వారి పేర్లు మయజు, యామీను,
ఏకెరు.
28షమ్మయి, యాదా ఇద్దరూ ఓనాము కుమారులు.
నాదాబు, అబీషూరు లిద్దరూ షమ్మయి కుమారులు.
29అబీషూరు భార్య పేరు అబీహయిలు. అబీహ
యిలు అతనికి ఇద్దరు కుమారులను కన్నది. అబాను,
మొలీదు అని వారి పేర్లు.
30సెలెదు, అప్పయీములిద్దరూ నాదాబు కుమా
రులు. సెలెదు సంతానం లేకుండానే చనిపోయాడు.
31అప్పయీము కుమారుని పేరు ఇషీ. ఇషీ కుమా
రుడు షేషాను. షేషాను కుమారుని పేరు అహ్లాయి.
32షమ్మయి సోదరుని పేరు యాదా. యెతెరు,
యోనాతాను ఇద్దరూ యాదా కుమారులు. యెతెరు
సంతానం లేకుండానే మరణించాడు. 33పేలెతు, జాజాలి
ద్దరూ యోనాతాను కుమారులు. ఇది యెరహ్మెయేలు

---

**యూదా ... కలిగారు** యూదా తన కోడలైన తామా రుతో కలియుట వలన ఆమె గర్భవతియైనది. ఆది. 38:12-30 చూడండి.

**ఆకాను** యెహోషువా (7:1) పుస్తకంలో ఆకారు పేరు ఆకాను అని వుంది. కష్టకారకుడని దాని అర్థం. ఇతడు దేవుని ప్రత్యేక నగరమైన యెరికో నుండి వస్తువులను సేకరించి ఇశ్రాయేలుకు కష్టాలు తెచ్చి పెట్టాడు.

**కెలూబై** ఇది కాలేబు అనే పేరుకు మరో రూపం కావచ్చు. 18,19 మరియు 42వ వచనములు చూడండి.

**నయస్సోను ... నాయకుడు** ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు నుంచి విముక్తులై బయటకు వచ్చినప్పుడు నయస్సోను యూదా వంశీయులకు నాయకుడు. సంఖ్యా. 1:7, 2:3 మరియు 7:12 చూడండి.

సంతతి జాబితా. [34]షేషానుకు కుమారులు లేరు. అతనికి అందరూ కుమార్తెలే. షేషాను వద్ద ఈజిప్టుకు చెందిన ఒక సేవకుడున్నాడు. వాని పేరు యర్హా. [35]షేషాను కుమార్తెను, యర్హా వివాహం చేసికొన్నాడు. ఆమెకు ఒక కుమారుడు పుట్టాడు. వాని పేరు అత్తయి.

[36]అత్తయి కుమారుని పేరు నాతాను. నాతాను కుమారుడు జాబాదు. [37]జాబాదు కుమారుడు ఎప్లాలు. ఎప్లాలు కుమారుడు ఓబేదు. [38]ఓబేదు కుమారుడు యెహూ. యెహూ కుమారుడు అజర్యా. [39]అజర్యా కుమారుడు హేలెస్సు. హేలెస్సు కుమారుడు ఎలాశా. [40]ఎలాశా కుమారుడు సిస్మాయీ. సిస్మాయీ కుమారుడు షల్లూము. [41]షల్లూము కుమారుడు యెకమ్యా. యెకమ్యా కుమారుడు ఎలీషామా.

### కాలేబు కుటుంబం

[42]యెరహ్మెయేలు సోదరుడు కాలేబు. కాలేబుకు కొందరు కుమారులున్నారు. అతని మొదటి కుమారుడు మేషా. మేషా కుమారుడు జీఫు. జీఫు కుమారుడు మారేషా. మారేషా కుమారుడు హెబ్రోను.

[43]హెబ్రోను కుమారులు కోరహు, తప్పూయ, రేకెము మరియు షెమ అనువారు. [44]షెమ కుమారుడు రహము. రహము కుమారుడు యోర్కెయాము. రేకెము కుమారుడు షమ్మయి. [45]షమ్మయి కుమారుడు మాయోను. మాయోను కుమారుడు బేత్సూరు.

[46]కాలేబు దాసి పేరు ఏయిఫా. ఏయిఫా కుమారులు హారాను, మోజా మరియు గాజేజు అనువారు. హారాను కుమారుని పేరు కూడ గాజేజు.

[47]యెహ్దాయి కుమారులు రెగెము, యోతాము, గేషాను, పెలెటు, ఏయిఫా మరియు షయపు.

[48]మయకా అనే స్త్రీ కాలేబు యొక్క మరో దాసి. మయకాకు పుట్టిన కుమారులు షెబెరు మరియు తిర్హానా అనేవారు. [49]మయకా ఇంకా షయపు, షెవా అను వారికి కూడ తల్లి. షయపు కుమారుడు మద్మన్నా. షెవా కుమారులు మక్బేనా మరియు గిబ్యా. కాలేబు కుమార్తె పేరు అక్సా.

[50]ఇది కాలేబు సంతతి: కాలేబు మొదటి కుమారుని పేరు హూరు. ఇతడు ఎఫ్రాతాకు పుట్టినవాడు. హూరు కుమారుడు శోబాలు. శోబాలు కుమారుని పేరు కిర్యత్యారీము. [51]తరువాతివారు శల్మా మరియు హారేపు. శల్మా కుమారుడు బెత్లెహేము. హారేపు కుమారుడు బేత్గాదేరు.

[52]శోబాలు కిర్యత్యారీము స్థాపకుడు.* శోబాలు సంతతి వారు: హారోయే మరియు మనుహతీలోని వారిలో సగంభాగం; [53]మరియు కిర్యత్యారీము సంతతి కుటుంబాల వారు. వీరు: ఇత్రీయులు, పూతీయులు, షుమ్మాతీయులు, మిష్రాయీయులు. మిష్రాయీయుల సంతతివారే సారాతీయులు, ఎష్తాయులీయులు.

[54]శల్మా సంతతి వారెవరనగా: బేత్లెహేము, నెటోపాతీయులు, అతారోతు, బేత్యోవాబు ప్రజలు; మనుహతీయులలో సగం మందిగా వున్న జారీయులు, [55]మరియు యబ్బేజులో నివసిస్తున్న చరిత్రాది విషయాలు, దస్తావేజులు రాసే లేఖకులు. ఈ లేఖకులు తిరాతీయులు, షిమ్యాతీయులు, శూకోతీయులకు చెందిన వంశాల వారు. హమాతు సంతతి వారైన కేనీయులే ఈ లేఖకులు. బేత్ – రేకాబు వంశీయులకు హమాతు మూలపురుషుడు.

### దావీదు కుమారులు

3 హెబ్రోను పట్టణంలో దావీదుకు కొందరు కుమారులు పుట్టారు. ఆ కుమారులు ఎవరనగా: దావీదు మొదటి కుమారుడు అమ్నోను. అమ్నోను తల్లి పేరు అహీనోయము. ఆమె యెజ్రెయేలుకు చెందిన స్త్రీ. రెండవ కుమారుని పేరు దానియేలు. అతని తల్లి పేరు అబీగయీలు. ఆమె కర్మేలుకు చెందినది.

[2]మూడవ కుమారుడు అబ్షాలోము. తల్మయి కుమార్తెయగు మయకా అతని తల్లి. తల్మయి గెషూరుకు రాజు. నాల్గవ కుమారుని పేరు అదోనీయా. అతని తల్లి పేరు హగ్గీతు.

[3]ఐదవ కుమారుడు షెఫట్య. అతని తల్లి పేరు అబీటలు. ఆరవవాడు ఇత్రెయాము. ఇతని తల్లి దావీదు భార్య ఎగ్లా. [4]దావీదుకు ఈ ఆరుగురు కుమారులు హెబ్రోనులో జన్మించారు. దావీదు అక్కడ ఏడు సంవత్సరాల ఆరు నెలలపాటు పాలించాడు. దావీదు యెరూషలేములో ముప్పదిమూడు సంవత్సరాలు రాజుగా ఉన్నాడు. [5]దావీదుకు యెరూషలేములో పుట్టిన సంతానమెవరనగా: బత్షెబకు నలుగురు సంతానం. వారు షిమ్యా, షోబాబు, నాతాను మరియు సొలొమోను. బత్షెబ అమ్మీయేలు కుమార్తె. [6-8]దావీదు యొక్క మరి తొమ్మండుగురు కుమారులు ఎవరనగా: ఇభారు, ఎలీషామా, ఎలీపేలెటు, నోగహు, నెపెగు, యాఫీయ, ఎలీషామా, ఎల్యాదా, ఎలీపేలెటు. [9]వారంతా దావీదు కుమారులు. దావీదుకు ఇంకా దాసీ వలన కూడ కుమారులు కలిగారు. తామారు దావీదు కుమార్తె.

### దావీదు తర్వాత యూదా రాజులు

[10]సొలొమోను కుమారుడు రెహబాము. రెహబాము కుమారుడు అబీయా. అబీయా కుమారుడు ఆసా. ఆసా కుమారుడు యెహోషాపాతు. [11]యెహోషాపాతు కుమారుడు యెహోరాము. యెహోరాము కుమారుడు అహజ్యా. అహజ్యా కుమారుడు యోవాషు. [12]యోవాషు కుమారుడు అమజ్యా. అమజ్యా కుమారుడు అజర్యా. అజర్యా కుమారుడు యోతాము.

---

**స్థాపకుడు** అక్షరాలా "తండ్రి" అని వ్రాయబడివుంది.

13యోతాము కుమారుడు ఆహాజు. ఆహాజు కుమా
రుడు హిజ్కియా. హిజ్కియా కుమారుడు మనష్షే.
14మనష్షే కుమారుడు ఆమోను. ఆమోను కుమారుడు
యోషీయా. 15యోషీయా కుమారులెవరనగా:
యోహానాను మొదటి కుమారుడు. రెండవవాడు
యెహోయాకీము. మూడవ కుమారుడు సిద్కియా.
నాల్గవవాడు షల్లూము. 16యెహోయాకీము సంతా
నంలో యెకొన్యా, అతని కుమారుడు; సిద్కియా,
అతని కుమారుడు వున్నారు.*

### యూదా బబులోను వశమైన పిమ్మట వున్న దావీదు కుటుంబం

17యెహోయాకీను* బబులోనులో బందీ
అయిన పిమ్మట యెకొన్యా సంతానం ఎవరనగా:
షయల్తీయేలు, 18మల్కీరాము, పెదాయా, షెనజ్జరు,
యెకమ్యా, హోషామా మరియు నెదబ్యా.
19పెదాయా కుమారులు జెరుబ్బాబెలు, షిమీ.
జెరుబ్బాబెలు కుమారులు మెషుల్లాము, హనన్యా,
షెలోమీతు మరియు వారి సహోదరి. 20జెరుబ్బా
బెలుకు ఐదుగురు కుమారులు. వారి పేర్లు: హషుబా,
ఓహెలు, బెరెక్యా, హసద్యా మరియు యూషబెస్హెదు.
21హనన్యా కుమారులు పెలట్యా, యెషయా,
రెఫయా, అర్నాను, ఓబద్యా మరియు షెకన్యా.*
22షెకన్యా సంతతిలో షెమయా ఒకడు. షెమ
యాకు ఆరుగురు కుమారులు: వారు షెమయా,
హట్టూషు, ఇగాలు, బారియహు, నెయర్యా, షాపాతు.
23నెయర్యాకు ముగ్గురు కుమారులు: వారు ఎల్యో
యేనై, హిజ్కియా, అజ్రీకాము.
24ఎల్యోయేనై కుమారులు ఏడుగురు: వారు
హోదవయా, ఎల్యాషీబు, పెలాయా, అక్కూబు,
యోహానాను, దెలాయ్యా మరియు అనాని.

### ఇతర యూదా కుటుంబ సమూహాలు

4 యూదా కుమారులు ఎవరనగా: పెరెసు,
హెస్రోను, కర్మీ, హూరు, శోబాలు. 2శోబాలు
కుమారుడు రెవాయా. రెవాయా కుమారుడు
యహతు. యహతు కుమారులు అహూమై, లహదు
అనువారు. అహూమై, లహదు వంశీయులే
సొరాతీయులు. అబీయేతాము తండ్రియగు హోరేపు
సంతతివారెవరనగా
3అబీయేతాము కుమారులు యెజ్రెయేలు, ఇష్మా,
ఇద్బాషు అనేవారు. వారి సోదరి పేరు హజ్జెలెల్పోని.
4పెనూయేలు కుమారుడు గెదోరు. ఏజెరు
కుమారుడు హూషా. హూరు సంతతి వారెవరనగా:
హూరు అనువాడు ఎఫ్రాతాకు పెద్ద కుమారుడు.
ఎఫ్రాతా కుమారుడు బేత్లెహేము.
5తెకోవ తండ్రి పేరు అష్హూరు. తెకోవకు హెలా
మరియు నయరా అను ఇద్దరు భార్యలు. 6నయరాకు
అహూజాము, హెపెరు, తేమనీ, హాయహష్తారీ అనేవారు
పుట్టారు. వీరంతా అష్హూరుకు నయరావల్ల పుట్టిన
కుమారులు. 7హెలా కుమారులు జెరెతు, సోహరు,
ఎత్నాను మరియు కోజు అనువారు. 8కోజు కుమా
రులు ఆనూబు, జోబేబా. అహర్హేలు సంతతి వారందరికీ
కోజు మూలపురుషుడు. అహర్హేలు అనేవాడు హారుము
కుమారుడు.
9యబ్బేజు చాలా మంచి వ్యక్తి. అతడు తన సోదరుల
కంటె మంచివాడు. “నేనతనికి యబ్బేజు అని నామ
కరణం చేశాను. ఎందువల్లననగా నేనతనిని ప్రసవించి
నప్పుడు మిక్కిలి బాధ అనుభవించాను” అని అతని
తల్లి చెప్పింది. 10యబ్బేజు ఇశ్రాయేలు దేవునికి ఇలా
ప్రార్థన చేశాడు: “దేవా, నీవు నన్ను తప్పక ఆశీర్వదించా
లని వేడుకొంటున్నాను! నీవు నా దేశాన్ని విస్తరింప
జేయాలని కోరుకుంటున్నాను. నీవు సదా నాకు
తోడుగా ఉండి, నన్నెవ్వరూ బాధించకుండా కాపా
డుము. అప్పుడు నాకేరకమైన వేదనా ఉండదు.”
యబ్బేజు కోరుకున్నట్లు దేవుడు అతనికి అన్నీ కలుగ
జేశాడు.
11కెలూబు అనువాడు షూవహుకు సోదరుడు.
కెలూబు కుమారుని పేరు మెహీరు. మెహీరు కుమారుని
పేరు ఎష్తోను. 12ఎష్తోను కుమారుల పేర్లు బేత్రాఫాను,
పాసెయ మరియు తెహిన్నా. తెహిన్నా కుమారుని
పేరు ఈర్నాహాషు.* వారంతా రేకా నుండి వచ్చిన
వారు. 13కనజు కుమారులు ఇద్దరు: ఒత్నీయేలు,
శెరాయా. ఒత్నీయేలుకు హతతు, మెయానొతై అనే
ఇద్దరు కుమారులు. 14మెయానొతై కుమారుని పేరు
ఒఫ్రా. శెరాయా కుమారుని పేరు యోవాబు.
యోవాబు కుమారుని పేరు గెహరష్షీము. (దీనినే “పని
వారి లోయ” అంటారు). హస్తనైపుణ్యంగల పనివారు
నివసించే చోటు గనుక ఆ ప్రాంతానికి ఆ పేరు
వచ్చింది. 15యెపున్నె కుమారుని పేరు కాలేబు. కాలేబు
కుమారులు ఈరూ, ఏలా, నయము అనేవారు. ఏలా
కుమారుని పేరు కనజు.

**యెహోయాకీము … కుమారుడు వున్నారు** దీనిని రెండు రకాలుగా వివరించవచ్చు మొదటిగా ఈ సిద్కియా యెహోయాకీము కుమారుడు మరియు యెకొన్యా సోదరుడు అనీ; రెండవదిగా ఈ సిద్కియా యెకొన్యా కుమారుడు మరియు యెహోయాకీము మనుమడు అని చెప్పవచ్చు.

**యెహోయాకీను** యెకొన్యా, యెహోయాకీను ఇద్దరూ ఒక్కరే. ఒకే పేరును రెండు రకాలుగా రాయటం జరిగింది.

**21వ వచనము** ఈ వచనంలో వున్న హెబ్రీ భాషను అర్థం చేసుకోవడం కష్టంగా వుంది.

**తెహిన్నా … ఈర్నాహాషు** లేక నాహాషు నగరంలో నివసించే వారికి తెహిన్నా తండ్రి అని అర్థం. ఈర్ అనగా నగరం.

[16]యెహల్లెలేలు కుమారులు జీఫు, జీఫా, తీర్యా,
అశర్యేలు అనేవారు.
[17-18]ఎజ్రా కుమారుల పేర్లు యెతెరు, మెరెదు,
ఏఫెరు, యాలోను. మెరెదు కుమారులు మిర్యాము,
షమ్మయి, ఇష్బాహు అనేవారు. ఇష్బాహు కుమారుడు
ఎష్టెమోను. మెరెదు భార్య ఐగుప్తు (ఈజిప్టు) కు
చెందిన స్త్రీ. ఆమెకు యెరెదు, హెబెరు, యెకూతీ
యేలు అను కుమారులు కలిగారు. యెరెదు కుమారుని
పేరు గెదోరు. హెబెరు కుమారుని పేరు శోకో. యెకూ
తీయేలు కుమారుని పేరు జానోహ. బిత్యా వంశావళి
ఏదనగా: బిత్యా ఫరో కుమార్తె. ఈమె ఐగుప్తు (ఈజిప్టు)
దేశీయురాలు. మెరెదుకు భార్య.
[19]మెరెదు మరో భార్య నహము సోదరి. మెరెదు
యొక్క ఈ భార్య యూదాకు చెందిన స్త్రీ.* మెరెదు
భార్యకు పుట్టిన కుమారులు కెయీలా, ఎష్టెమో అనే
వారికి తండ్రులయ్యారు. కెయీలా గర్మీయులకు
చెందినవాడు. ఎష్టెమో మాయకాతీయులకు చెందిన
వాడు. [20]షీమోను కుమారులు అమ్నోను, రిన్నా,
బెన్హానాను మరియు తీలోను. ఇషీ కుమారులు
జోహేతు మరియు బెన్జోహేతు.
[21-22]యూదా కుమారుని పేరు షేలహు. షేలహు
కుమారులు ఏరు, లద్దా, యోకీము, కోజేబావారి
యోవాషు, శారాపు అనేవారు. ఏరు కుమారుని పేరు
లేకా. మారేషా అను వానికి, బేత్ అషీబయలో నార
బట్టలు నేయు కుటుంబాల వారికి లద్దా తండ్రి.
యోవాషు, శారాపు లిద్దరూ మోయాబీయుల స్త్రీలను
వివాహమాడారు, పిమ్మట వారు బేత్లెహేముకు తిరిగి
వెళ్లారు.* ఈ వంశాన్ని గురించిన వ్రాతలన్నీ మిక్కిలి
ప్రాచీనమైనవి. [23]షేలహు కుమారులు కుమ్మరి పని
వారు. వారంతా నెతాయీములోను, గెదేరాలోను నివ
సించారు. వారా పట్టణాలలో వుంటూ రాజు కొరకు
పనిచేశారు.

### షిమ్యోను కుమారులు

[24]షిమ్యోను కుమారులు నెమూయేలు,
యామీను, యారీబు, జెరహు, షావూలు అనేవారు.
[25]షావూలు కుమారుని పేరు షల్లూము. షల్లూము
కుమారుడు మిబ్శాము. మిబ్శాము కుమారుడు మిష్మా.
[26]మిష్మా కుమారుడు హమ్మూయేలు. హమ్మూయేలు
కుమారుడు జక్కూరు. జక్కూరు కుమారుడు షిమీ.
[27]షిమీకి పదహారుగురు కుమారులు, ఆరుగురు కుమా
ర్తెలు కలిగారు. కాని షిమీ సోదరులకెవరికీ సంతానం
లేదు. షిమీ సోదరులకు పెద్ద కుటుంబాలు కూడా
లేవు. యూదాలో ఇతర కుటుంబాల మాదిరిగా వారి
కుటుంబాలు పెద్దవి కావు.
[28]షిమీ సంతానం బెయేర్షెబాలోను, మోలాదా
లోను, హజర్షువలులోను, [29]బిల్హాలోను, ఎజెములోను,
తోలాదులోను, [30]బెతూయేలులోను, హొర్మాలోను,
సిక్లగులోను, [31]బేత్మర్కా బోతులోను, హాజర్సూసా
లోను, బేత్బీరీలోను, షరాయిములోను నివసించారు.
దావీదు రాజయ్యేవరకు వారా పట్టణాలలో నివసిం
చారు. [32]ఆ పట్టణాల పరిసరాల్లో ఉన్న ఐదు గ్రామాలే
వనగా ఏతాము, అయీను, రిమ్మోను, తోకెను
మరియు ఆషాను. [33]అంతేగాక బయలువరకు అనేక
ఇతర గ్రామాలు కూడవున్నాయి. ఈ ప్రదేశాల్లో వారు
నివసించారు. పైగా వారు తమ వంశచరిత్రను కూడా
రాశారు.
[34-38]ఆయా వంశాల వారి నాయకులు ఈ విధంగా
ఉన్నారు: మెషోబాబు, యమ్లేకు, అమజ్యా కుమారు
డగు యోషా, యావేలు, యోషిబ్యా కుమారుడైన
యెహూ (యోషిబ్యా అనేవాడు శెరాయా కుమారుడు;
శెరాయా తండ్రి పేరు అశీయేలు); ఎల్యోయేనై,
యహకోబా, యెషోహాయా, అశాయా, అదీయేలు,
యెశీమీయేలు, బెనాయా మరియు షిపి కుమారుడైన
జీజా. షిపి అనేవాడు అల్లోను కుమారుడు. అల్లోను
తండ్రి పేరు యెదాయా. యెదాయా తండ్రి పేరు
షిమ్రీ. షిమ్రీ తండ్రి పేరు షెమయా.
ఈ మనుష్యుల కుటుంబాలన్నీ బాగా విస్తరించి
పెరిగాయి. [39]వారు గెదోరుకు, ఆ పైభూభాగాలకు,
తూర్పున ఉన్న లోయ వరకు సంచరించారు. వారు
తమ గొర్రెల మందలకు, ఆవుల మందలకు మేత
బయళ్లు వెదుకుతూ ఆ ప్రాంతాల వరకు సంచ
రించారు. [40]పచ్చిక మెండుగా ఉన్న మంచి భూములను
వారు కనుగొన్నారు. సారవంతమైన పంట భూములను
కూడ వారు చూసారు. ఆ ప్రాంతంలో ప్రశాంత వాతా
వరణం విలసిల్లింది. గతంలో హాము సంతతివారు
అక్కడ నివసించారు. [41]యూదా రాజు హిజ్కియా
కాలంలో ఇది జరిగింది. ఆ మనుష్యులంతా గెదోరుకు
వచ్చి, హామీయులతో పోరాడి, వారి గుడారాలన్నిటినీ
నాశనం చేసారు. వారింకా అక్కడ నివసించే మెయోనీ
యులతో కూడ యుద్ధం చేసి వారిని నాశనం చేసారు.
ఈనాటి వరకు అక్కడ మెయోనీయులు లేరు.
తరువాత ఈ మనుష్యులే అక్కడ నివసించసాగారు.
అక్కడ వారి గొర్రెలకు పుష్కలంగా మేత దొరకడంతో
వారక్కడ స్థిరపడ్డారు. [42]ఐదువందల మంది షిమ్యోనీ
యులు కొండల ప్రాంతమైన శేయీరుకు వెళ్లారు.
ఇషీ కుమారుల నాయకత్వంలో వారు వెళ్లారు. వారి
పేర్లు ఏవనగా: పెలట్యా, నెయర్యా, రెఫాయా, ఉజ్జీ
యేలు. షిమ్యోనీయులు అక్కడి స్థానిక ప్రజలతో

---

**మెరెదు ... చెందిన స్త్రీ** ఈ వాక్యం ప్రాచీన గ్రీకు
అనువాదంలో వుంది.

**వివాహమాడారు ... వెళ్లారు** వారు మోయాబులోను,
యాషూబిలెహెములోను పాలించారు అని పాఠాంతరం.

యుద్ధం చేసారు. [43]అక్కడ చాలా కొద్దిమంది అమాలే
కీయులు మాత్రమే ఉంటున్నారు. షిమ్యోనీయులు
వారిని హతమార్చారు. అప్పటి నుండి ఈనాటి వరకు
షిమ్యోనీయులు శేయీరులో నివసిస్తున్నారు.

### రూబేనీయుల సంతతివారు

5 [1-3]ఇశ్రాయేలు పెద్ద కుమారుని పేరు రూబేను.
రూబేను జ్యేష్ఠ కుమారునికి అర్హమైన ప్రత్యేకాధి
కృతలు అందుకోవలసి ఉంది. కాని రూబేను తన
తండ్రి భార్యలలో ఒకదానితో శయనించిన కారణంగా,
ఆ ప్రత్యేక ఆధిక్యతలు ఇశ్రాయేలు కుమారుడైన
యోసేపు కుమారులకు ఇవ్వబడ్డాయి. కావున వారి
వంశావళిలో రూబేను పేరు జన్మలో మొదటివాడుగా
పేర్కొనబడలేదు. వారి అన్నదమ్ములలో యూదా
మిక్కిలి బలపరాక్రమాలు గలవాడు.

అందువల్ల నాయకులంతా అతని కుటుంబంలో
నుంచే వచ్చారు. కాని యోసేపు కుటుంబానికి జ్యేష్ఠ
పుత్రునికి లభించే ప్రత్యేక ఆదరణ, ఆధిపత్యాలు
లభించాయి. రూబేను కుమారులు హనోకు, పల్లు,
హెత్రోను, కర్మీ అనేవారు.

[4]యోవేలు సంతతి ఈ విధంగా వుంది: షెమయా
అనేవాడు యోవేలు కుమారుడు. షెమయా కుమా
రుడు గోగు. గోగు కుమారుడు షిమీ. [5]షిమీ కుమా
రుడు మీకా. మీకా కుమారుడు రెవాయా. రెవాయా
కుమారుడు బేలు.

[6]బేలు కుమారుడు బెయేర. అష్షూరు (అస్సీరియా)
రాజైన తిగ్లత్పిలేసెరు బెయేరను ఇల్లు వెడలగొట్టాడు.
దానితో బెయేర అష్షూరు రాజుకు బందీ అయ్యాడు.
రూబేను వంశానికి బెయేర పెద్ద.

[7]యోవేలు సోదరుల పేర్లు, అతని వంశావళి వారి
వంశ చరిత్రలో పొందుపర్చబడినట్లే క్రమ పద్ధతిలో
సరిగ్గా వ్రాయబడినాయి. అవి ఏవనగా: యెహీయేలు
మొదటివాడు. తరువాత జెకర్యా మరియు [8]బెల. బెల
తండ్రి పేరు ఆజాజు. ఆజాజు తండ్రి షెమ. షెమ
తండ్రి పేరు యోవేలు. వారంతా అరోయేరు నుండి
నెబో వరకు, బయల్మెయోను వరకు గల ప్రాంతంలో
నివసించారు.

[9]బెల వంశీయులు తూర్పు దిశన యూఫ్రటీసు
నది ఒడ్డున అడవి అంచువరకుగల ప్రాంతంలో నివ
సించారు. గిలాదులో వారికి లెక్క లేనన్ని ఆవుల
మందలు వున్నందున వారక్కడ నివసించసాగారు.
[10]సౌలు రాజుగా ఉన్న కాలంలో బెల వంశీయులు
హగ్రీయీలతో యుద్ధం చేసి వారిని ఓడించారు.
తరువాత వారు హగ్రీయులకు చెందిన గుడారాలను
ఆక్రమించి వాటిలో నివసించారు. గిలాదుకు తూర్పు
ప్రాంతమంతటిలో ఉన్న హగ్రీయుల గుడారాలలో
వారు నివసించసాగారు.

### గాదు సంతతివారు

[11]గాదు వంశం వారు రూబేనీయులకు సమీపంలోనే
నివసించారు. గాదీయులు బాషాను ప్రాంతంలోను,
సల్కా వరకు గల ప్రదేశంలోను నివసించారు. [12]బాషా
నులో యోవేలు మొదటి నాయకుడు (పెద్ద).
షాపాము రెండవ నాయకుడు. పిమ్మట యహనై
షాపాత్ ముఖ్యుడయ్యాడు. [13]వారి కుటుంబాలలో
ఏడుగురు అన్నదమ్ములు. వారు మిఖాయేలు, మెషు
ల్లాము, షేబ, యోరై, యకాను, జీయ మరియు
ఏబెరు. [14]వీరు అబీహాయిలు సంతతివారు. అబీహా
యిలు అనేవాడు హూరీ కుమారుడు. హూరీ తండ్రి
పేరు యారోయ. యారోయ తండ్రి గిలాదు. గిలాదు
తండ్రి మిఖాయేలు. మిఖాయేలు తండ్రి యెషీషై.
యెషీషై తండ్రి యహదో. యహదో తండ్రి బూజు.
[15]అహీ అనువాడు అబ్దీయేలు కుమారుడు. అబ్దీయేలు
తండ్రి పేరు గూనీ. అహీ వారి వంశ పెద్ద.

[16]గాదీయులు గిలాదు ప్రాంతంలో నివసించారు.
వారు బాషానులోను, దాని చుట్టుపట్ల గ్రామాలలోను,
షారోను సరిహద్దు వరకు గల పొలాలలోను కూడ
స్థిరనివాసం ఏర్పరచుకున్నారు

[17]యోతాము, యరోబాముల కాలంలో ఈ ప్రజల
పేర్లన్నీ గాదు వంశ చరిత్రలో వ్రాయబడినాయి.
యోతాము యూదాకు రాజు. యరోబాము ఇశ్రా
యేలుకు రాజు.

### యుద్ధ నైపుణ్యంగల కొందరు సైనికులు

[18]మనష్షే వంశంలో సగం మందిలోను, రూబేను,
గాదు వంశాలలోను మొత్తం నలుబది నాలుగువేల ఏడు
వందల అరవై మంది యుద్ధ వీరులున్నారు. వారు
డాళ్లను, కత్తులను చేపట్టగలవారు. వారు బాణవిద్యలో
నేర్పరులు. చాకచక్యంతో యుద్ధం చేయగలవారు.
[19]వారు హగ్రీయులతోను, యేతూరు, నాపీషు,
నోదాబు వారితోను యుద్ధం చేశారు. [20]మనష్షే వంశం
వారు, రూబేను, గాదు వంశాల ప్రజలు యుద్ధంలో
దేవుని సహాయం అర్థించి ప్రార్థన చేశారు. వారు దేవుని
యందు విశ్వాసమున్న వారు గనుక తమకు సహాయ
పడమని దేవుని అర్థించారు. కావున దేవుడు వారి ప్రార్థన
ఆలకించి సహాయపడ్డాడు. హగ్రీయులను యుద్ధంలో
ఓడించటానికి దేవుడు వారికి సహాయం చేసాడు. హగ్రీ
యులతో వున్న ఇతరులను కూడ వారు ఓడించారు.
[21]హగ్రీయులకు చెందిన పశు సంపదనంతా వారు వశ
పర్చుకున్నారు. వారు ఏబై వేల ఒంటెలను, రెండు
లక్షల ఏబై వేల గొర్రెలను, రెండువేల గాడిదలను,
మరియు ఒక లక్ష మంది మనుష్యులను పట్టుకున్నారు.
[22]యుద్ధంలో రూబేనీయులకు దేవుని సహాయం ఉన్న
కారణంగా హగ్రీయులలో చాలామంది చనిపోయారు.
అప్పుడు మనష్షే, రూబేను, గాదు వంశీయులు

హగ్రీయుల రాజ్యంలో నివసించసాగారు. వారక్కడ బబు
లోను (బాబిలోనియా) సైన్యం ఇశ్రాయేలు ప్రజలను
బందీలుగా బబులోనుకు పట్టుకుపోయే సమయం
వరకు నివసించారు.
23మనష్షే వంశం వారిలో సగంమంది బాషాను
ప్రాంతంలో బెల్‌హెర్మోను వరకు, శెనీరు, హెర్మోను
పర్వతం వరకు నివసించారు. వారి ప్రజలు అధిక
సంఖ్యలో విస్తరించారు.
24మనష్షే కుటుంబంలో ఒక సగంమంది కుటుంబ
పెద్దలు ఎవరనగా ఏషెరు, ఇషీ, ఎలీయేలు, అజ్రీయేలు,
యిర్మీయా, హోదవ్యా మరియు యహదీయేలు.
వీరంతా బలపరాక్రమ సంపన్నులు, ప్రసిద్ధి గాంచిన
వ్యక్తులు. వారి వారి కుటుంబాలకు వారు పెద్దలు.
25కాని, వారి పూర్వీకులు ఆరాధించిన దేవుని పట్ల
వారు పాపం చేశారు. వారు స్థిరపడినచోట వున్న విగ్ర
హాలనే వారు ఆరాధించటం మొదలుపెట్టారు. అటు
వంటి వాళ్లను దేవుడు నాశనము చేసియుండెను.
26ఇశ్రాయేలు దేవుడు పూలును యుద్ధానికి పురి
గొల్పాడు. పూలు అష్షూరు (అస్సీరియా) రాజు.
అతనినే తిగ్లత్పిలేసెరు అని కూడ పిలుస్తారు. అతడు
మనష్షే, రూబేను, గాదు వంశీయులతో యుద్ధం
చేసాడు. వారిని తమ ఇండ్లు వదిలి వేసేలా బలవంతం
చేసి బందీలుగా పట్టుకున్నాడు. తరువాత వారిని
హాలహు, హాబోరు, హారా పట్టణాలకు, గోజాను నదీ
తీరానికి తీసుకొని వెళ్లాడు. అప్పటినుండి ఈనాటికీ
ఆ ఇశ్రాయేలీయుల కుటుంబాల వారు అక్కడ నివసి
స్తున్నారు.

## లేవి సంతతివారు

6 గెర్షోను, కహాతు, మెరారి అనేవారు లేవీ
కుమారులు.
2కహాతు కుమారులు అమ్రాము, ఇస్హారు,
హెబ్రోను, ఉజ్జీయేలు.
3అమ్రాముకు అహరోను, మోషే అనే ఇరువురు
కుమారులు, మిర్యాము అనే కుమార్తె ఉన్నారు.
అహరోనుకు నాదాబు, అబీహు, ఎలియాజరు,
ఈతామారు అనేవారు కుమారులు. 4ఎలియాజరు
అనువాడు ఫీనెహాసుకు తండ్రి. ఫీనెహాసు కుమారుడు
అబీషువ. 5అబీషువ కుమారుడు బుక్కీ. బుక్కీ కుమా
రుడు ఉజ్జీ. 6ఉజ్జీ కుమారుడు జెరహ్యా. జెరహ్యా
కుమారుడు మెరాయోతు. 7మెరాయోతు కుమారుడు
అమర్యా. అమర్యా కుమారుడు అహీటూబు. 8అహీ
టూబు కుమారుడు సాదోకు. సాదోకు కుమారుడు
అహిమయస్సు. 9అహిమయస్సు కుమారుడు అజర్యా.
అజర్యా కుమారుడు యోహానాను. 10యోహానాను
కుమారుడు అజర్యా. (యెరూషలేములో సొలొమోను
కట్టించిన దేవాలయంలోయాజకునిగా పనిచేసిన వ్యక్తే
ఈ అజర్యా). 11అజర్యా కుమారుడు అమర్యా. అమర్యా
కుమారుడు అహీటూబు. 12అహీటూబు కుమారుడు
సాదోకు. సాదోకు కుమారుడు షల్లూము. 13షల్లూము
కుమారుడు హిల్కీయా. హిల్కీయా కుమారుడు
అజర్యా. 14అజర్యా కుమారుడు శెరాయా. శెరాయా
కుమారుడు యెహోజాదాకు.
15యెహోవా యూదా వారిని, యెరూషలేము
వారిని బయటకు పంపివేసినప్పుడు యెహోజాదాకు
కూడ గత్యంతరం లేక వారితో ఇల్లు వదలి పోవలసి
వచ్చింది. ఆ ప్రజలు ఒక కొత్త రాజ్యంలో బందీల
య్యారు. యూదా వారిని, యెరూషలేము వారిని
బందీలు చేయటానికి యెహోవా నెబుకద్నెజరును
వినియోగించాడు.

## లేవి సంతతిలో ఇతరులు

16లేవి కుమారులు గెర్షోను, కహాతు, మెరారి
అనేవారు.
17గెర్షోను కుమారులు లిబ్నీ మరియు షిమీ.
18కహాతు కుమారులు అమ్రాము, ఇస్హారు,
హెబ్రోను మరియు ఉజ్జీయేలు.
19మెరారి కుమారులు మహలి, మూషి.
లేవి వంశంలోగల కుటుంబాలు ఈ విధంగా
ఉన్నాయి. మొదట వారి తండ్రి పేరుతో జాబితా
వ్రాయబడింది.
20గెర్షోను సంతతివారు గెర్షోను కుమారుడు లిబ్నీ.
లిబ్నీ కుమారుడు యహతు. యహతు కుమారుడు
జిమ్మా. 21జిమ్మా కుమారుడు యోవాహు. యోవాహు
కుమారుడు ఇద్దో. ఇద్దో కుమారుడు జెరహు. జెరహు
కుమారుడు యెయతిరయి.
22కహాతు సంతతి వారు ఎవరనగా కహాతు కుమా
రుడు అమ్మీనాదాబు. అమ్మీనాదాబు కుమారుడు
కోరహు. కోరహు కుమారుడు అస్సీరు. 23అస్సీరు కుమా
రుడు ఎల్కానా. ఎల్కానా కుమారుడు ఎబ్యాసాపు.
ఎబ్యాసాపు కుమారుడు అస్సీరు. 24అస్సీరు కుమారుడు
తాహతు. తాహతు కుమారుడు ఊరియేలు. ఊరియేలు
కుమారుడు ఉజ్జియా. ఉజ్జియా కుమారుడు షావూలు.
25ఎల్కానా కుమారులు అమాశై, అహీమోతు.
26ఎల్కానా మరో కుమారుడు జోఫై.* జోఫై కు
మారుడు నహతు. 27నహతు కుమారుడు ఏలీయాబు.
ఏలీయాబు కుమారుడు యెరోహాము. యెరోహాము
కుమారుడు ఎల్కానా. ఎల్కానా కుమారుడు సమూ
యేలు. 28సమూయేలు కుమారులలో పెద్దవాడు
యోవేలు. రెండవవాడు అబీయా.

---

**ఎల్కానా ... జోఫై** ఇక్కడ మూల గ్రంథం విశదంగా లేదు. హెబ్రీలో ఇలా వుంది, ఎల్కానా, అతని కొడుకు ఎల్కానా. అతని కుమారుడు జోఫై.

29మెరారి సంతానం వివరాలు ఏవనగాః మెరారి
కుమారుడు మహలి. మహలి కుమారుడు లిబ్ని. లిబ్ని
కుమారుడు షిమీ. షిమీ కుమారుడు ఉజ్జా. 30ఉజ్జా
కుమారుడు షిమ్యా. షిమ్యా కుమారుడు హగ్గీయా.
హగ్గీయా కుమారుడు అశాయా.

### ఆలయ సంగీత విద్వాంసులు

31యెహెూవా ఒడంబడిక పెట్టె ఆలయంలో
ఉంచిన తరువాత దావీదు కొందరు సంగీత విద్వాం
సులను నియమించాడు. 32వీరు పవిత్ర గుడారంలో
దేవునికి స్తుతి గీతాలు ఆలపించేవారు. పవిత్ర గుడారమే
సమావేశ గుడారమని పిలవబడేది. సొలొమోను
యెరూషలేములో యెహెూవాకు ఆలయాన్ని నిర్మిం
చేవరకు ఈ గాయకులు సంగీత సేవ చేసారు. వారికి
నిర్దేశించిన నియమావళిని వారు అనుసరించి పని
చేసారు. 33సంగీత సేవ చేసిన వారు, వారి కుమారుల
పేర్ల వివరాలు ఇలా వున్నాయిః కహతీయుల సంతతి
వారుః హేమాను గాయకుడు. హేమాను తండ్రి పేరు
యోవేలు. యోవేలు తండ్రి పేరు సమూయేలు.
34సమూయేలు తండ్రి పేరు ఎల్కానా. ఎల్కానా తండ్రి
యెరోహాము. యెరోహాము తండ్రి ఏలీయేలు. ఏలీ
యేలు తండ్రి తోయహు. 35తోయహు తండ్రి సూపు.
సూపు తండ్రి ఎల్కానా. ఎల్కానా తండ్రి మహతు.
మహతు తండ్రి అమాశై. 36అమాశై తండ్రి ఎల్కానా.
ఎల్కానా తండ్రి యోవేలు. యోవేలు తండ్రి అజర్యా.
అజర్యా తండ్రి జెఫన్యా. 37జెఫన్యా తండ్రి తాహతు.
తాహతు తండ్రి అస్సీరు. అస్సీరు తండ్రి ఎబ్యాసాపు.
ఎబ్యాసాపు తండ్రి కోరహు. 38కోరహు తండ్రి ఇస్హారు.
ఇస్హారు తండ్రి కహాతు. కహాతు తండ్రి లేవి. లేవి
తండ్రి ఇశ్రాయేలు.

39హేమాను బంధువు ఆసాపు. హేమాను ఆసాపు
కుడి పక్కన నిలబడేవాడు. ఆసాపు తండ్రి పేరు బెరక్యా.
బెరక్యా తండ్రి షిమ్యా. 40షిమ్యా తండ్రి మిఖాయేలు.
మిఖాయేలు తండ్రి బయశేయా. బయశేయా తండ్రి
మల్కీయా. 41మల్కీయా తండ్రి యెత్నీ. యెత్నీ
తండ్రి జెరహు. జెరహు తండ్రి అదాయా. 42అదాయా
తండ్రి ఏతాను. ఏతాను తండ్రి జిమ్మా. జిమ్మా తండ్రి
షిమీ. 43షిమీ తండ్రి యహతు. యహతు తండ్రి
గెర్షోను. గెర్షోను తండ్రి లేవి.

44మెరారి సంతతి వారు హేమానుకు, ఆసాపుకు
బంధువులు. వారు హేమానుకు ఎడమ పక్కన నిలబడి
స్తోత్రగీతాలు పాడేవారు. ఏతాను తండ్రి పేరు కీషీ.
కీషీ తండ్రి అబ్దీ. అబ్దీ తండ్రి మల్లూకు. 45మల్లూకు
తండ్రి హషబ్యా. హషబ్యా తండ్రి అమజ్యా. అమజ్యా
తండ్రి హిల్కీయా. 46హిల్కీయా తండ్రి అమ్జీ. అమ్జీ
తండ్రి బానీ. బానీ తండ్రి షమెరు. 47షమెరు తండ్రి
మహలి. మహలి తండ్రి మూషి. మూషి తండ్రి మెరారి.
మెరారి తండ్రి లేవి. 48హేమాను, ఆసాపుల సోదరులు
లేవి వంశంలోని వారే. లేవి సంతతినంతా లేవీయులని
పిలుస్తారు. లేవీయులు యెహెూవా పవిత్ర గుడారంలో
సేవా కార్యక్రమ నిర్వహణకు ప్రత్యేకంగా ఎంపిక చేయ
బడినవారు. పవిత్ర గుడారమనగా దేవుని ఇల్లు.

49కాని అహరోను, అతని సంతతి వారు మాత్రమే
బలిపీఠంపై దహనబలులు అర్పించేందుకు అనుమ
తించబడ్డారు. వారికి ధూపపీఠం మీద ధూపంవేసే
హక్కు కూడ వుంది. ఆలయపు అతిపరిశుద్ధ స్థలంలోని
పనంతా వారే చేసేవారు. ఇశ్రాయేలు పాపపరిహారార్థం,
ప్రజల పాపాలకు విచార సూచకంగా వారు ఆలయంలో
ప్రాయశ్చిత్త కార్యాలు నిర్వహించేవారు. మోషే నిర్దేశిం
చిన నియమాలను, నిబంధనలను వారు తప్పక పాటిం
చేవారు. మోషే దేవుని సేవకుడు.

### అహరోను సంతతివారు

50అహరోను కుమారులు ఎవరనగాః అహరోను
కుమారుడు ఎలియాజరు. ఎలియాజరు కుమారుడు
ఫీనెహాసు. ఫీనెహాసు కుమారుడు అబీషూవ. 51అబీ
షూవ కుమారుడు బుక్కీ. బుక్కీ కుమారుడు ఉజ్జీ.
ఉజ్జీ కుమారుడు జెరహ్యా. 52జెరహ్యా కుమారుడు మెరా
యోతు. మెరాయోతు కుమారుడు అమర్యా. అమర్యా
కుమారుడు అహీటూబు. 53అహీటూబు కుమారుడు
సాదోకు. సాదోకు కుమారుడు అహిమయస్సు.

### లేవీయుల కుటుంబాలకు నివాసాలు

54అహరోను సంతతి వారు నివసించిన ప్రదేశాలుః
వారికివ్వబడిన భూములలో స్థావరాలు ఏర్పరచుకొని
వారు నివసించారు. లేవీయుల కియ్యబడిన భూముల్లో
కహాతీయులకు మొదటి భాగం ఇవ్వబడింది. 55వారికి
హెబ్రోను పట్టణం, దాని చుట్టు పక్కల భూములు
ఇవ్వబడ్డాయి. ఇది యూదా దేశంలో వుంది. 56కాని
పట్టణానికి దూరంగావున్న భూములు, హెబ్రోను
పట్టణానికి దగ్గరలో వున్న గ్రామాలు కాలేబుకు ఇవ్వ
బడ్డాయి. కాలేబు తండ్రి పేరు యెఫున్నె. 57అహరోను
సంతతివారికి హెబ్రోను నగరం ఇవ్వబడింది. హెబ్రోను
ఆశ్రయపురం* వారికింకా లిబ్నా, యత్తీరు, ఎష్టెమో,
58హిలేను, దెబీరు, 59ఆషాను, యుట్ట, బేత్షెమెషు
నగరాలు కూడ ఇవ్వబడ్డాయి. ఈ నగరాలతో పాటు
వాటి సమీపంలోని పచ్చిక బయళ్లు కూడ వారికియ్య
బడ్డాయి. 60బెన్యామీను సంతతి వారికి గిబియోను,

---

**ఆశ్రయపురం** ఇశ్రాయేలీయుడు ఎవరినైనా చంపి
నప్పుడు కోపగించిన తన బంధువుల నుండి తనను తాను
కాపాడుకొనేందుకు పారిపోయి సురక్షితంగా దాగివుండే
నగరం. యెహెూషువ 20:1-9 చూడండి.

గెబ, అల్లెమెతు, అనాతోతు నగరాలు ఇవ్వబడ్డాయి.
ఈ నగరాలతో పాటు ఆ ప్రాంతాలలోని పొలాలు
కూడ వారికి ఇవ్వబడ్డాయి.
పదమూడు నగరాలు కహాతీయుల కుటుంబాల
వారికియ్యబడ్డాయి.
61కహాతు సంతతి వారైన వంశాల వారికి మనష్షే
వంశం వారి సగంమందికి పది పట్టణాలు ఇవ్వబడ్డాయి.
62గెర్షోను సంతతి వారైన వంశాల వారికి పదమూడు
నగరాలు ఇవ్వబడ్డాయి. వారికి ఈ నగరాలు ఇశ్శాఖారు,
ఆషేరు, నఫ్తాలి, బాషాను ప్రాంతాలలో నివసించే కొంద
రికి మనష్షే వారినుండి సంక్రమించాయి.
63మెరారీ సంతతి వారైన వంశాల వారికి పన్నెండు
నగరాలు వచ్చాయి. వారికి ఈ నగరాలు రూబేను,
గాదు, జెబూలూను కుటుంబాల వారినుండి
వచ్చాయి. వారికి ఆ నగరాలు చీట్లువేసి ఇచ్చారు.
64ఆ విధంగా ఇశ్రాయేలు ప్రజలు ఆ నగరాలను,
పొలాలను లేవీయులకు ఇచ్చారు. 65పైన పేర్కొన
బడిన ఆ నగరాలన్నీ చీట్లువేసి యూదా, షిమ్యోను,
బెన్యామీను కుటుంబాల వారినుండి తీసుకొనబడి
వారికియ్యబడ్డాయి.
66ఎఫ్రాయిము వంశం వారు కూడ కొందరు
కహాతీయుల కుటుంబాల వారికి కొన్ని పట్టణాలను
ఇచ్చారు. ఈ పట్టణాలను కూడ చీట్లువేసి ఇచ్చారు.
67వారికి షెకెము నగరం ఇవ్వబడింది. షెకెము కూడ
ఒక రక్షణ (ఆశ్రయ) నగరం. వారికి ఇంకను గెజెరు,
68యొక్మెయాము, బేత్హోరోను, 69అయ్యాలోను,
మరియు గత్రిమ్మోను పట్టణాలు కూడ ఇవ్వబడ్డాయి.
ఆ పట్టణాలతో పాటు వారికి పొలాలు కూడ ఇవ్వ
బడ్డాయి. ఆ పట్టణాలు ఎఫ్రాయిము కొండ
ప్రాంతంలో వున్నాయి. 70సగం మనష్షే గోత్రం వారి
నుండి ఆనేరు, బిలియాము పట్టణాలను ఇశ్రాయేలు
వారు తీసుకొని కహాతీయులకు ఇచ్చారు. పట్టణాలతో
పాటు కహాతీయులకు పొలాలు కూడ ఇవ్వబడ్డాయి.

### ఇతర లేవి కుటుంబాలవారు నివాసాలు పొందటం

71గెర్షోను ప్రజలకు బాషాను ప్రాంతంలోని గోలాను
పట్టణం, మనష్షే సగం వంశం వారి నుండి అష్తారోతు
పట్టణం ఇవ్వబడ్డాయి. ఆ పట్టణాలకు దగ్గరలో వున్న
పొలాలు కూడ వారికి ఇవ్వబడ్డాయి.
72-73గెర్షోను కుటుంబాల వారికి ఇశ్శాఖారు వంశం
నుంచి కెదెషు, దాబెరతు, రామోతు మరియు ఆనేము
అను పట్టణాలు లభించాయి. ఆ పట్టణాల సమీపంలో
గల భూములు కూడ వారికివ్వబడ్డాయి. 74-75గెర్షోను
ప్రజలకు ఆషేరు వంశం నుండి మాషాలు, అబ్దోను,
హుక్కోకు మరియు రెహోబు పట్టణాలు లభించాయి.
ఆ పట్టణాల పరిసరాలలోగల భూములు కూడ
వారికివ్వబడ్డాయి. 76గెర్షోను వారు నఫ్తాలి వంశం నుండి
గలిలయలోని కెదెషు, హమ్మోను మరియు కిర్యతా
యిము పట్టణాలను పొందారు. ఆ పట్టణాలతో
పాటు సమీప పొలాలు కూడ వారికి ఇవ్వబడ్డాయి.
77మిగిలిన లేవీయులైన మెరారీయులకు జెబూ
లూను వంశం నుండి యొక్నెయాము, కర్తా, రిమ్మోను
మరియు తాబోరు పట్టణాలు లభించాయి. ఆ పట్టణాల
దగ్గరలో గల భూములు కూడ వారికి ఇవ్వబడ్డాయి.
78-79మెరారీయులు రూబేను వంశం నుండి అరణ్య
ప్రాంతంలోని బేసెరు, యహజా, కెదేమోతు మరియు
మేఫాతు పట్టణాలను పొందారు. రూబేను వంశస్థులు
యొర్దాను నదికి తూర్పున, యెరికో నగరానికి
తూర్పున నివసించారు. మెరారీయులకు పట్టణాలతో
పాటు పరిసర భూములు కూడ ఇవ్వబడ్డాయి.
80-81మెరారీయులు ఇంకను గాదు వంశం నుండి
గిలాదు నందలి రామోతు, మహనయీము, హెష్బోను
మరియు యాజెరు పట్టణాలను పొందారు. వారికి
పట్టణాలతో పాటు సమీప పొలాలు కూడ ఇవ్వ
బడ్డాయి.

### ఇశ్శాఖారు సంతతివారు

7 ఇశ్శాఖారుకు నలుగురు కుమారులు. తోలా,
పువ్వా, యాషూబు, షిమ్రోను అని వారి పేర్లు.
2తోలా కుమారులు ఉజ్జీ, రెఫాయా, యెరీయేలు,
యహ్మయి, యిబ్శాము, షెమూయేలు అనేవారు.
వారంతా వారి వారి కుటుంబ పెద్దలు. వారు, వారి
సంతతివారు వీర సైనికులు. దావీదు రాజుగా ఉన్న
కాలంలో వీరి సంఖ్య ఇరవై రెండువేల ఆరువందలు.
3ఉజ్జీ కుమారుడు ఇజ్రహయా. ఇజ్రహయా
కుమారులు మిఖాయేలు, ఓబద్యా, యోవేలు, ఇష్షీయా
అనేవారు. వీరైదుగురు కుటుంబ పెద్దలు.
4వారి వంశ చరిత్ర పరిశీలిస్తే వారిలో ముప్పది
ఆరువేల మంది యుద్ధ సన్నద్ధులైన సైనికులున్నట్లు
తెలుస్తుంది. వారికి బహు భార్యలు వున్నందువల్ల వారికి
సంతానం ఎక్కువై కుటుంబాలు అధిక సంఖ్యలో
ఉన్నాయి.
5ఇశ్శాఖారు వంశంలో ఎనభై ఏడువేల మంది బలి
ష్ఠులైన సైనికులున్నట్లు వారి వంశ చరిత్ర తెలియ
జేస్తుంది.

### బెన్యామీను సంతతివారు

6బెన్యామీనుకు ముగ్గురు కుమారులు. బెల, బేకరు,
యెదీయయేలు అని వారి పేర్లు. 7బెలకు ఐదుగురు
కుమారులు. ఎస్బోను, ఉజ్జీ, ఉజ్జీయేలు, యెరీమోతు
మరియు ఈరీ అని వారి పేర్లు. వారి కుటుంబాలకు
వారు పెద్దలు. వారిలో ఇరవై రెండువేల రెండువందల
మంది సైనికులున్నట్లు వారివంశ చరిత్ర తెలుపుతుంది.
8బేకరు కుమారులు జెమీరా, యోవాషు, ఎలీయే
జెరు, ఎల్యోయేనై, ఒమ్రీ, యెరీమోతు, అబీయా,

అనాతోతు, ఆలెమెతు అనేవారు. ఇది బేకరు సంతానం.
9వీరి వంశ చరిత్ర వారి పెద్దలను విశదపరుస్తుంది.
వారిలో ఇరవైవేల రెండు వందల మంది సైనికులు
న్నట్లు వారి చరిత్ర తెలియజేస్తుంది.
10యెదీయవేలు కుమారుడు బిల్హాను. బిల్హాను
కుమారులు యూషు, బెన్యామీను, ఏహూదు, కెన
యానా, జేతాను, తర్షీషు, అహీషహరు అనువారు.
11యెదీయవేలు కుమారులంతా వారి వారి కుటుంబ
పెద్దలు. వారిలో పదిహేడువేల రెండువందల మంది
యుద్ధవీరులున్నారు.
12షుప్పీయులు, హుప్పీయులు అనేవారు ఈరు
సంతతివారు. అహేరు కుమారుని పేరు హుషీము.

**నఫ్తాలి సంతతివారు**

13నఫ్తాలి కుమారులు యహసయేలు, గూనీ,
యేసెరు, షిల్లేము అనేవారు. వీరందరూ బిల్హా*
సంతతిగా ఎంచబడిరి.
14మనష్షే సంతతివారు ఎవరనగా: మనష్షే కుమా
రుని పేరు అశ్రీయేలు. మనష్షే దాసియగు అరాము
(సిరియా) దేశపు స్త్రీకి అశ్రీయేలు జన్మించాడు.
ఆమెకు మాకీరు అనే మరొక కుమారుడు కలిగాడు.
మాకీరు కుమారుడు గిలాదు. 15హుప్పీయుల, షుప్పీ
యుల నుండి ఒక స్త్రీని మాకీరు వివాహం చేసు
కొన్నాడు. ఆమె పేరు మయకా. మాకీరు సోదరి
పేరు కూడ మయకా. ఈ సోదరి మయకాకు సెలో
పెహాదు అని మరో పేరువుంది. సెలోపెహాదుకు
అందరూ కుమార్తెలే.
16మాకీరు భార్య మయకా ఒక కుమారుని కన్నది.
మయకా ఈ కుమారునికి పెరెషు అని పేరు పెట్టింది.
పెరెషు సోదరుని పేరు షెరెషు. షెరెషు కుమారుల
పేర్లు ఊలాము, రాకెము.
17ఊలాము కుమారుని పేరు బెదాను. గిలాదు
సంతతి వారెవరనగా: గిలాదు తండ్రి పేరు మాకీరు.
మాకీరు తండ్రి పేరు మనష్షే. 18మాకీరు సోదరియగు
హమ్మోలెకెతుసకు ఇషోదు, అబీయెజెరు, మహలా
అనేవారు జన్మించారు. 19షెమీదా కుమారుల పేర్లు
అహెయాను, షెకెము, లికీ, అనీయాము.

**ఎఫ్రాయిము సంతతివారు**

20ఎఫ్రాయిము సంతతివారి పేర్లు ఏవనగా: ఎఫ్రా
యిము కుమారుని పేరు షూతలహు. షూతలహు
కుమారుడు బెరెదు. బెరెదు కుమారుడు తాహతు.
తాహతు కుమారుడు ఎలాదా. 21ఎలాదా కుమారుడు
తాహతు. తాహతు కుమారుడు జాబాదు. జాబాదు
కుమారుడు షూతలహు. గాతు నగర నివాసులు
కొందరు ఏజెరును, ఎల్యాదును చంపివేసారు. ఏజెరు,
ఎల్యాదు లిద్దరూ గాతు ప్రజల ఆవులను, గొర్రెలను
దొంగిలించటానికి వెళ్లిన కారణంగా వారిని ప్రజలు
చంపివేసారు. 22ఏజెరు, ఎల్యాదు లిరువురూ ఎఫ్రా
యిము కుమారులే. ఏజెరు, ఎల్యాదు చనిపోయి
నందుకు ఎఫ్రాయిము చాలా రోజులు దుఃఖించాడు.
ఎఫ్రాయిము బంధువులంతా వచ్చి అతనిని ఓదార్చారు.
23పిమ్మట ఎఫ్రాయిము తన భార్యతో కలియగా ఆమె
గర్భవతి అయ్యింది. ఆమె ఒక కుమారుని కన్నది.
ఎఫ్రాయిము అతనికి బెరీయా* అని పేరు పెట్టాడు.
ఎందువల్లననగా అతని కుటుంబానికి అప్పుడు కొంత
కీడు జరిగింది. 24ఎఫ్రాయిము కుమార్తె పేరు షెయెరా.
షెయెరా దిగువ బేత్‌హోరోను, ఎగువ బేత్‌హోరోను,
దిగువ ఉజ్జెన్ షెయెరా, ఎగువ ఉజ్జెన్ షెయెరా అనే
పట్టణాలను కట్టించింది.
25ఎఫ్రాయిము కుమారుని పేరు రెపహు. రెపహు
కుమారుని పేరు రెషెపు. రెషెపు కుమారుడు తెలహు.
తెలహు కుమారుడు తహను. 26తహను కుమారుడు
లద్దాను. లద్దాను కుమారుడు అమీహూదు. అమీహూదు
కుమారుడు ఎలీషామా. 27ఎలీషామా కుమారుడు
నూను. నూను కుమారుడు యెహోషువ.
28ఎఫ్రాయిము సంతతి వారు నివసించిన నగరాలు,
ప్రదేశాలు ఏవనగా: బేతేలు, దాని పరిసర గ్రామాలు;
తూర్పున నహరాను, పడమట గెజెరు, దాని సమీప
గ్రామాలు; షెకెము, దాని పరిసర గ్రామాలు మరియు
అయ్యా వరకుగల గ్రామాలు. 29మనష్షే రాజ్య సరి
హద్దుల్లో బేత్షెయాను, తానాకు, మెగిద్దో, దోరు పట్ట
ణాలు మరియు వాటి పరిసర గ్రామాలు వున్నాయి.
ఈ పట్టణాలలో యోసేపు సంతతి వారు నివసించారు.
యోసేపు తండ్రి పేరు ఇశ్రాయేలు.

**ఆషేరు సంతతివారు**

30ఆషేరు కుమారులు ఇమ్నా, ఇష్వా, ఇష్వీ,
బెరీయా అనువారు. వారి సోదరి పేరు శెరహు.
31బెరీయా కుమారులు హెబెరు మరియు మల్కీ
యేలు. మల్కీయేలు కుమారుడు బిర్జాయీతు.
32హెబెరు కుమారులు యప్లేటు, షోమేరు, హోతాము
అనువారు. షూయా వారి సహోదరి. 33యప్లేటు
కుమారులు పాసకు, బింహాలు, అష్వాతు అనేవారు.
వీరంతా యప్లేటు సంతానం.
34షోమేరు కుమారులు అహీ, రోగా, యెహుబ్బా,
అరాము.

---

**బిల్హా** నఫ్తాలి కుమారులకు బిల్హా నాయనమ్మ అవుతుంది. ఆది. 30:6-8 చూడండి.

**బెరీయా** ఇది హెబ్రీ మాటలాంటిది దీని అర్థం ‘చెడు’ లేదా ‘కష్టము.’

35షోమేరు సోదరుని పేరు హేలెము. హేలెము
కుమారులు జోపహు, ఇమ్నా, షెలెషు, ఆమాలు.
36జోపహు కుమారులు సూయ, హర్నెపెరు,
షూయాలు, బేరీ, ఇమ్రా, 37బేసెరు, హోదు, షమ్మా,
షిల్షా, ఇత్రాను, బెయేర.
38ఎతెరు కుమారులు యెఫున్నె, పిస్పా, అరా.
39ఉల్లాము కుమారులు ఆరహు, హన్నియేలు,
రిజెయా.
40వీరంతా ఆషేరు సంతతివారు. వారి వారి కుటుం
బాలకు వారు పెద్దలు. వారు పేరుగాంచిన వ్యక్తులు,
యుద్ధవీరులు, మహా నాయకులు. వారి వంశచరిత్ర
ప్రకారం వారిలో యుద్ధానికి పనికివచ్చే ఇరవై ఆరువేల
మంది సైనికులున్నారు.

### సౌలు రాజు కుటుంబ చరిత్ర

8 బెన్యామీను పెద్ద కుమారుని పేరు బెల. బెన్యా
మీను రెండవ కుమారుని పేరు అష్బేలు. అతని
మూడవ కుమారుడు అహరహు. 2బెన్యామీను నాల్గవ
కుమారుడు నోహా. అయిదవవాడు రాఫా.
3-5బెల కుమారులు అద్దారు, గెరా, అబీహూదు,
అబీషూవ, నయమాను, అహోయహు, గెరా, షెఫూ
ఫాను, హూరాము అనువారు.
6-7ఏహూదు సంతతి వారు గెబలో వారి వారి కుటుం
బాలకు పెద్దలు. వారు బలవంతంగా ఇండ్లు విడిచి
మనహతుకు పోయేలా చేయబడ్డారు. ఏహూదు సంతతి
వారు నయమాను, అహీయా, గెరా అనేవారు. గెరా
వారిని బలవంతంగా ఇండ్లు వదిలిపోయేలా చేసాడు.
గెరా కుమారులు ఉజ్జా, అహీహూదు.
8మోయాబు దేశంలో షహరయీము తన భార్య
లగు హూషీము, బయరాలకు విడాకులిచ్చాడు. ఇది
జరిగిన పిమ్మట మరో భార్య ద్వారా అతనికి పిల్లలు
కలిగారు. 9-10షహరయీముకు యోబాబు, జిబ్యా,
మేషా, మల్కాము, యెవూజును, షాక్యా, మిర్మా అనే
కుమారులు తన భార్యయగు హోదెషు వలన కలిగారు.
వారంతా షహరయీము సంతానం. వారు కుటుంబ
పెద్దలయ్యారు.
11షహరయీముకు హూషీము వల్ల అహీటూబు,
ఎల్పయలు అనేవారు పుట్టారు.
12-13ఎల్పయల కుమారులు ఏబెరు, మిషాము,
షెమెదు, బెరీయా, షెమ అనువారు. ఓనో పట్టణాన్ని,
లోదును, దాని చుట్టూ వున్న గ్రామాలను షెమెదు
నిర్మించాడు. బెరీయా, షెమ అనువారిద్దరూ అయ్యా
లోనులో నివసించే వారి కుటుంబ పెద్దలు. వారు
గాతులో నివసిస్తున్న వారిని వెళ్లగొట్టారు.
14బెరీయా కుమారులు షాషకు, యెరేమోతు,
15జెబద్యా, అరాదు, ఏదెరు, 16మిఖాయేలు, ఇష్పా,
యోహా అనేవారు. 17ఎల్పయలు కుమారులు జెబద్యా,
మెషుల్లాము, హిజికి, హెబెరు, 18ఇష్మెరై, ఇజ్లీయా,
యోబాబు అనేవారు.
19షిమీ కుమారులు యాకీము, జిక్రీ, జబ్ది, 20ఎలీ
యేనై, జిల్లెతై, ఎలీయేలు, 21అదాయా, బెరాయా,
షిమ్రాతు అనేవారు.
22షాషకు కుమారులు ఇష్పాను, ఏబెరు, ఎలీయేలు,
23అబ్దోను, జిఖ్రీ, హానాను, 24హనన్యా, ఏలాము, అంతో
తీయా, 25ఇఫెదయా, పెనూయేలు అనేవారు.
26యెరోహాము కుమారులు షంషెరై, షెహర్యా,
అతల్యా, 27యహరెష్యా, ఏలీయ్యా, జిఖ్రీ అనేవారు.
28వీరంతా కుటుంబ పెద్దలు. వారు తమ వంశ
చరిత్రలో నాయకులుగా పేర్కొనబడ్డారు. వారు
యెరూషలేములో నివసించారు.
29యెహీయేలు అనేవాడు గిబియోను తండ్రి.
యెహీయేలు భార్య మయకా. 30యెహీయేలు పెద్ద
కుమారుడు అబ్దోను. అతని ఇతర కుమారులు సూరు,
కీషు, బయలు, నేరు, నాదాబు, 31గెదోరు, అహ్యో,
జెకెరు, మరియు మిక్లోతు. 32మిక్లోతు కుమారుని
పేరు షిమ్యా. ఈ కుమారులు కూడ వారి బంధువులకు
దగ్గరగనే యెరూషలేములో నివసించారు.
33నేరు కుమారుడు కీషు. కీషు కుమారుడు సౌలు.
సౌలు కుమారులు యోనాతాను, మల్కీషూవ, అబీనా
దాబు, మరియు ఎష్బయలు.
34యోనాతాను కుమారుడు మెరీబ్బయలు. మెరీ
బ్బయలు కుమారుడు మీకా.
35మీకా కుమారులు పీతోను, మెలెకు, తరేయ,
ఆహాజు అనేవారు.
36ఆహాజు కుమారుడు యెహోయాదా. యెహో
యాదా కుమారులు ఆలెమెతు, అజ్మావెతు, జిమ్రీ
అనేవారు. జిమ్రీ కుమారుడు మెజా. 37మెజా కుమా
రుడు బిన్యా. బిన్యా కుమారుడు రాఫా. రాఫా కుమా
రుడు ఎలాశా. ఎలాశా కుమారుడు ఆజేలు.
38ఆజేలుకు ఆరుగురు కుమారులు. వారి పేర్లు
అజ్రీకాము, బోకెరు, ఇష్మాయేలు, షెయర్యా, ఓబద్యా
మరియు హానాను. వీరంతా ఆజేలు కుమారులు.
39ఆజేలు సోదరుని పేరు ఏషెకు. ఏషెకు కుటుంబీ
కులు, ఏషెకు కుమారులెవరనగా: ఏషెకు పెద్ద కుమా
రుడు ఊలాము, రెండవ కుమారుడు యెహూషు,
మూడవ కుమారుడు ఎలీపేలెటు.
40ఊలాము కుమారులు ధనుర్బాణాలు పట్టగల
నేర్పరులు, బలమైన సైనికులు. వారికి చాలా మంది
కుమారులు, మనుమలు ఉన్నారు. కొడుకులు, మను
మలు అంతా నూట ఏబది మంది ఉన్నారు. వీరంతా
బెన్యామీను సంతతివారు.
9 ఇశ్రాయేలు ప్రజల పేర్లన్నీ వారి వారి వంశ చరి
త్రల్లో పొందుపర్చబడ్డాయి. ఆ వంశ చరిత్రలన్నీ
ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథంలో చేర్చబడ్డాయి.

### యెరూషలేము ప్రజలు

యూదా ప్రజలు బందీలుగా పట్టుబడి బలవం
తంగా బబులోనుకు తీసుకొని పోబడ్డారు. దేవునికి
వారు విశ్వాసపాత్రులు కానందువల్ల వారికి అలా జరి
గింది. 2మొట్టమొదటి సారిగా తమ స్థలాలకు, పట్టణా
లకు తిరిగి వచ్చిన వారిలో కొందరు ఇశ్రాయేలీయులు,
యాజకులు, లేవీయులు, ఆలయ సేవకులు ఉన్నారు.
3యెరూషలేములో నివసించిన యూదా, బెన్యా
మీను, ఎఫ్రాయిము, మనష్షే వంశాల ప్రజలు ఎవరనగాః
4అమీహూదు కుమారుడు ఊతై. అమీహూదు
తండ్రి పేరు ఒమ్రీ. ఒమ్రీ తండ్రి పేరు ఇమ్రీ. ఇమ్రీ
తండ్రి బానీ. పెరెసు సంతతివాడు బానీ. యూదా
కుమారుడు పెరెసు.
5యెరూషలేములో నివసించిన షిలోనీయు లెవర
నగాః షిలోనీయులలో మొదటివాడైన ఆశాయా
మరియు అతని కుమారులు.
6యెరూషలేములో నివసించిన జెరహు వంశం
వారిలో యెయుయేలు, అతని బంధువులు వున్నారు.
వారంతా మొత్తం ఆరువందల తొంబదిమంది వున్నారు.
7మెషుల్లాము కుమారుడు సల్లు; మెషుల్లాము తండ్రి
హోదవ్యా; హోదవ్యా తండ్రి హసెనూయా అనేవారు
యెరూషలేములో నివసించిన బెన్యామీను సంతతి
వారు. 8యెహోరాము కుమారుడు ఇబ్నెయా. ఉజ్జీ
కుమారుడు ఏలా. మిక్రి కుమారుడు ఉజ్జీ. షెఫట్యా
కుమారుడు మెషుల్లాము. రగూవేలు కుమారుడు
షెఫట్యా. ఇబ్నీయా కుమారుడు రగూవేలు. 9యెరూ
షలేములో తొమ్మిది వందల ఏబదిఆరు మంది బెన్యా
మీనీయులు ఉన్నట్లు వారి వంశ చరిత్ర తెలుపుతుంది.
వీరంతా ఆయా కుటుంబ పెద్దలు.
10యెరూషలేములో నివసించిన యాజకులు ఎవర
నగాః యెదాయా, యెహోయారీబు, యాకీను,
11మరియు హిల్కీయా కుమారుడైన అజర్యా. మెషు
ల్లాము కుమారుడు హిల్కీయా. సాదోకు కుమారుడు
మెషుల్లాము. మెరాయోతు కుమారుడు సాదోకు.
అహీటూబు కుమారుడు మెరాయోతు. ఆలయ నిర్వ
హణలో అహీటూబు ముఖ్యమైన అధికారి. 12యెరో
హాము కుమారుడు అదాయా అనువాడొకడున్నాడు.
యెరోహాము తండ్రి పేరు పసూరు. పసూరు తండ్రి
పేరు మల్కీయా. అదీయేలు కుమారుడు మశై అను
వాడొకడున్నాడు. అదీయేలు తండ్రి పేరు యహజేరా.
యహజేరా తండ్రి పేరు మెషుల్లాము. మెషుల్లాము
తండ్రి పేరు మెషిల్లేమీతు. మెషిల్లేమీతు తండ్రి పేరు
ఇమ్మేరు.
13యాజకులంతా మొత్తం పదిహేడు వందల అరవై
మంది. వారంతా వారి వారి కుటుంబ పెద్దలు.
ఆలయంలో పూజాది కార్యక్రమ నిర్వహణ బాధ్యత
వారిదే.
14యెరూషలేములో నివసించిన లేవీ గోత్రపు వారె
వరనగాః హష్షూబు కుమారుడు షెమయా. హష్షూబు
తండ్రి పేరు అజ్రీకాము. అజ్రీకాము తండ్రి పేరు
హషబ్యా. హషబ్యా మెరారీ సంతతి వాడు. 15బకబక్కరు,
హెరెషు, గాలాలు మరియు మత్తన్యా కూడా యెరూ
షలేములో నివసించారు. మత్తన్యా తండ్రి పేరు మీకా.
మీకా తండ్రి పేరు జిఖ్రీ. జిఖ్రీ తండ్రి ఆసాపు. 16ఓబద్యా
తండ్రి పేరు షెమయా. షెమయా తండ్రి గాలాలు.
గాలాలు తండ్రి యెదూతూను, మరియు ఆసా కుమా
రుడు బెరెక్యా. ఆసా తండ్రి పేరు ఎల్కానా. నెటో
పాతీయులు నివసించిన గ్రామాలలోనే ఎల్కానా కూడ
నివసించాడు.
17యెరూషలేములో నివసించిన ద్వారపాలకులు
ఎవరనగాః షల్లూము, అక్కూబు, టల్మోను, అహీ
మాను మరియు వారి బంధువులు. షల్లూము వారికి
నాయకుడు. 18తూర్పు దిశలో రాజు ప్రవేశించే దేవా
లయ ద్వారం వద్ద వీరు నిలబడేవారు. వారు లేవి
సంతతికి చెందిన ద్వారపాలకులు. 19షల్లూము తండ్రి
పేరు కోరే. కోరే తండ్రి ఎబ్యాసాపు. ఎబ్యాసాపు తండ్రి
కోరహు. షల్లూము, అతని సోదరులు ద్వారపాలకులే.
వారు కోరహు వంశం వారు. పవిత్ర గుడారపు ద్వారాన్ని
కాపలా కాయటం వారిపని. వారి పూర్వీకులు* చేసిన
విధంగానే వీరుకూడ ఆ పని నిర్వర్తించారు. వారి
పూర్వీకులు పవిత్ర గుడారపు ద్వారాన్ని కాపలా కాస్తూ
వుండేవారు. 20గతంలో ద్వారపాలకుల అధిపతిగా
ఫీనెహాసు వ్యవహరించాడు. ఫీనెహాసు తండ్రి పేరు ఎలి
యాజరు. ఫీనెహాసుకు యెహోవా కృప ఉంది.
21పవిత్ర గుడారపు ద్వారానికి జెకర్యా కూడ కావలి
ఉన్నాడు. 22పవిత్ర గుడారం ద్వారపాలకులుగా మొత్తం
రెండు వందల పన్నెండు మంది ఎంపిక చేయబడ్డారు.
వారి గ్రామాలలో వారి కుటుంబ చరిత్రలలో వారి
పేర్లన్నీ వ్రాయబడినాయి. దావీదు, ప్రవక్తయగు సమూ
యేలు వారిని ఎంపికచేశారు. ఎందువల్లననగా వారు
మిక్కిలి నమ్మకస్తులు. 23యెహోవా నివాసమైన
పవిత్ర గుడారపు ద్వారాలను కాపలా కాసే బాధ్యత
ద్వార పాలకులది వారి సంతతి వారిదైయున్నది.
24తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ ద్వారాలు నాలుగు
పక్కలా వున్నాయి. 25పరిసర గ్రామాలలో నివసించే
ఈ ద్వార పాలకుల బంధువులు అప్పుడప్పుడు వచ్చి
వారికి సహాయపడేవారు. వచ్చినప్పుడల్లా వారు ద్వార
పాలకులకు ఏడేసి రోజులు సహాయంగా ఉండేవారు.
26ద్వారపాలకులందరి మీద నలుగురు ద్వార పాల
కులు నాయకత్వం వహించేవారు. వారు లేవీయులు.
దేవుని నివాసంలో అన్ని గదుల అజమాయిషీ, ధనాగా

---

**పూర్వీకులు** బైబిల్లో ఇక్కడ పూర్వీకులు అనగా వారి తండ్రులు, తాతలు, ముత్తాతలు అని అర్థం.

రాల పరిరక్షణ గావించేవారు. 27వారు రాత్రంతా దేవాల
యాన్ని కాపలా కాసేవారు. పైగా ప్రతిరోజూ ఉదయం
ఆలయ ద్వారం తెరచే పని కూడ వారిదే.
28దేవాలయ ఆరాధనలో వాడే పనిముట్ల విష
యమై శ్రద్ధ తీసుకొనే ద్వారపాలకులు కొందరు
న్నారు. ఆ వస్తుసామగ్రిని లోనికి తెచ్చినపుడు వారు
లెక్కపెట్టేవారు. మళ్లీ వాటిని బయటకు తీసుకొని
వెళ్లేటప్పుడు కూడ లెక్కపెట్టేవారు. 29మరికొందరు
ద్వారపాలకులు గర్భగుడిలో సామాన్లు, ఉపకరణాల
విషయంలో శ్రద్ధ తీసుకోవటం కోసం ఎంపికచేయ
బడ్డారు. పిండి, ద్రాక్షారసం, నూనె, ధూపద్రవ్యాలు,
సుగంధ ద్రవ్యాల సరఫరా విషయంలో కూడ వారు
తగిన శ్రద్ధ తీసుకొనేవారు. 30కాని సుగంధ ద్రవ్యాలను
కలిపే పని మాత్రం యాజకులది.
31నైవేద్యంగా వినియోగించే రొట్టె చేయటానికి
మత్తిత్యా అనే లేవీయుడు నియమించబడ్డాడు.
షల్లూము పెద్ద కుమారుడు మత్తిత్యా. షల్లూము అనే
వాడు కోరహు సంతతివాడు. 32విశ్రాంతి దినాన దేవ
సన్నిధికి సమర్పించే నైవేద్యపు రొట్టె తయారు చేయ
టానికి కోరహు సంతతి ద్వార పాలకులలో కొందరు
నియమించబడ్డారు.
33లేవీయులలో దేవాలయ గాయకులుగా వున్న
వారు, వారి కుటుంబ పెద్దలు దేవాలయపు గదులలో
నివసించేవారు. వారు రాత్రింబవళ్లు దేవాలయ పనిలో
నిమగ్నమై వుండుటచేత మరొక పని చేసేవారు కాదు.
34ఈ లేవీయులంతా వారి వారి కుటుంబ పెద్దలు.
వారి వంశ చరిత్రల్లో పొందుపర్చబడిన విధంగా వారంతా
పెద్దలు. వారు యెరూషలేములో నివసించారు.

## సౌలు రాజు కుటుంబ చరిత్ర

35గిబియోను తండ్రి పేరు యెహీయేలు. యెహీ
యేలు గిబియోను పట్టణంలో నివసించాడు. యెహీ
యేలు భార్య పేరు మయకా. 36యెహీయేలు పెద్ద
కుమారుడు అబ్దోను. అతని మిగిలిన కుమారులు
సూరు, కీషు, బయలు, నేరు, నాదాబు, 37గెదోరు,
అహ్యో, జెకర్యా మరియు మిక్లోతు. 38మిక్లోతు కుమా
రుడు షిమ్యాను. యెహీయేలు కుటుంబం వారు
యెరూషలేములో తమ బంధువుల వద్దనే నివసించారు.
39నేరు కుమారుని పేరు కీషు. కీషు కుమారుని
పేరు సౌలు. సౌలు కుమారులు యోనాతాను, మల్కీ
షూవ, అబీనాదాబు, ఎష్బయలు.
40యోనాతాను కుమారుని పేరు మెరీబ్బయలు.
మెరీబ్బయలు కుమారుడు మీకా.
41మీకా కుమారులు పీతోను, మెలెకు, తరేయ
మరియు ఆహాజు. 42ఆహాజు యెహోయద్దాకు తండ్రి.
యెహోయద్దా కుమారుని పేరు యరా. యరా కుమా
రుల పేర్లు ఆలెమెతు, అజ్మావెతు మరియు జిమ్రీ.
జిమ్రీ కుమారుడు మోజా, 43మోజా కుమారుడు
బిన్యా. బిన్యా కుమారుడు రెఫాయా. రెఫాయా కుమా
రుడు ఎలాశా. ఎలాశా కుమారుడు ఆజేలు.
44ఆజేలుకు ఆరుగురు కుమారులు. వారు అజ్రీ
కాము, బోకెరు, ఇష్మాయేలు, షెయర్యా, ఓబద్యా
మరియు హానాను. వారంతా ఆజేలు కుమారులు.

## సౌలు రాజు మరణం

10 ఫిలిష్తీయులు ఇశ్రాయేలు ప్రజలతో యుద్ధం
చేశారు. ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయుల నుండి
పారిపోయారు. అనేకమంది ఇశ్రాయేలు ప్రజలు
గిల్బోవ పర్వతం మీద చంపబడ్డారు. 2ఫిలిష్తీయులు
సౌలును, అతని కుమారులను తరుముకుంటూ పోయి,
వారిని పట్టుకుని చంపివేశారు. సౌలు కుమారులు
యోనాతాను, అబీనాదాబు, మల్కీ షూవలను ఫిలిష్తీ
యులు చంపివేశారు. 3సౌలు చుట్టూ యుద్ధం ముమ్మ
రంగా సాగింది. విలుకాండ్రు సౌలుపై బాణాలు వదిలి
గాయపర్చారు.
4అప్పుడు తన ఆయుధాలు మోసే వానితో*
సౌలు ఇలా చెప్పాడు: "నీ కత్తి దూసి నన్ను చంపివేయి.
నీవలా చేస్తే ఆ పరదేశీయులు* వచ్చి నన్ను హింసించి
ఎగతాళి చేయరు."
కాని ఆయుధాలు మోసే సౌలు సేవకుడు భయ
పడ్డాడు. సౌలును చంపటానికి నిరాకరించాడు. అప్పుడు
సౌలు తన కత్తినే ఉపయోగించి ఆత్మహత్యకు పాల్ప
డ్డాడు. తన కత్తి మొనపై అతను పడి తనను తాను
చంపుకున్నాడు. 5సౌలు చనిపోవటం ఆయు ధాలు
మోసేవాడు చూసాడు. తర్వాత అతను కూడా తన
కత్తి మొనపై పడి తనను తాను చంపుకున్నాడు. 6ఆ
విధంగా సౌలు, అతని ముగ్గురు కుమారులు మరణిం
చారు. పైగా సౌలు కుటుంబం వారంతా కలిసి చని
పోయారు. 7లోయలో నివసిస్తున్న ఇశ్రాయేలు ప్రజ
లంతా తమ సైన్యం పారిపోవటం చూసారు. సౌలు,
అతని కుమారులు చనిపోవటం ప్రజలు చూసారు.
దానితో వారు కూడ భయపడి తమ పట్టణాలను
వదలి పారిపోయారు. తరువాత ఫిలిష్తీయులు
ఇశ్రాయేలీయులు వదిలిపోయిన పట్టణాలకు వచ్చి,
అక్కడ నివసించసాగారు.

---

**ఆయుధాలు మోసేవాడు** ఉన్నత సైనికాధికారులకు, ప్రముఖులకు సహాయకుడు. ఈ సేవకుడు తన యజమాని తల రక్షణ టోపి, కవచం, కత్తి, బల్లెం, డాలు, బాణాలు మొదలైన వాటిని మోయాలి. అత్యవసర పరిస్థితిలో యుద్ధానికి సంబంధించిన సమాచారాన్ని కూడా చేరవేయాలి.

**పరదేశీయులు** సున్నతి సంస్కారంలేని విదేశీయులు. సున్నతి సంస్కారం ఇశ్రాయేలు ప్రజలకు దేవునితో గల ఒడంబడికకు నిదర్శనం.

8శవాలనుండి విలువైన వస్తువులను సేకరించటానికి
ఫిలిష్తీయులు మరునాడు వచ్చారు. వారు గిల్బోవ
పర్వతం మీద సౌలు శవాన్ని, అతని ముగ్గురు కుమారుల
శవాలను చూసారు.
9ఫిలిష్తీయులు సౌలు శరీరంమీద విలువైన
వస్తువులను తీసుకొన్నారు. వారు సౌలు తలను, అతని
ఆయుధాలను తీసుకొన్నారు. పిమ్మట వారు తమ
దేశం నలుమూలలా ఉన్న బూటకపు దేవుళ్ల గుళ్లకు,
ప్రజలకు ఈ వార్తను అంద జేయటానికి దూతలను
పంపారు. 10సౌలు ఆయుధాలను ఫిలిష్తీయులు తమ
బూటకపు దేవుళ్ల గుళ్లల్లో దాచారు. సౌలు తలను
వారు దాగోను* గుడిలో వేలాడదీసారు.
11యాబేష్గిలాదు పట్టణంలో నివసించే వారంతా
ఫిలిష్తీయులు సౌలుకు చేసినదంతా విన్నారు. 12యాబే
ష్గిలాదులో వున్న యోధులంతా వెళ్లి సౌలు, అతని
కుమారుల శవాలను యాబేష్గిలాదుకు తిరిగి తెచ్చారు.
ఆ యోధులు సౌలు, అతని కుమారుల ఎముకలను
యాబేషులో ఒక పెద్ద చెట్టు కింద పాతిపెట్టారు.
తర్వాత వారు ఏడు రోజులు ఉపవాసమున్నారు.
13సౌలు మరణానికి ముఖ్య కారణం అతను
యెహోవాపట్ల విశ్వాసంగా లేకపోవటం. సౌలు
యెహోవా మాటను లెక్కపెట్టలేదు. 14యెహోవాకు
ప్రార్థన చేయకుండా తన సంశయాలను నివారించు
కొనటానికి, కర్ణపిశాచిగల స్త్రీని ఆశ్రయించాడు. అందు
వల్ల యెహోవా సౌలును చంపి, రాజ్యాన్ని దావీదుకు
అప్పగించాడు. దావీదు తండ్రి పేరు యెష్షయి.

### ఇశ్రాయేలుకు దావీదు రాజవటం

11 ఇశ్రాయేలు ప్రజానీకం హెబ్రోను పట్టణంలో
దావీదు వద్దకు వెళ్లారు. వారు దావీదుతో ఇలా
అన్నారు: "మేము నీ రక్త మాంసాలను పంచుకు పుట్టిన
వాళ్లం (బంధువులం). 2గతంలో మమ్మల్ని నీవు
యుద్ధంలో నడిపించావు. సౌలు రాజుగా వున్నప్పటికీ
మమ్మల్ని నడిపిన వాడవు నీవే! యెహోవా నీతో,
'దావీదూ, ఇశ్రాయేలీయులైన నా ప్రజల కాపరివి నీవే.
నా ప్రజలకు నీవు నాయకుడివవుతావు' అని అన్నాడు."
3ఇశ్రాయేలు పెద్దలంతా హెబ్రోను పట్టణంలో
దావీదు రాజువద్దకు వచ్చారు. యెహోవా సన్నిధిలో
ఆ పెద్దలతో దావీదు ఒక ఒడంబడిక చేసుకొన్నాడు.
పెద్దలు దావీదు తలమీద నూనె పోసి అభిషిక్తుని చేశారు.
ఆ పని దావీదు ఇశ్రాయేలుకు రాజు అయినట్లు తెలుపు
తుంది. ఇది జరుగుతుందని యెహోవా మాటయి
చ్చాడు. ఈ వాగ్దానం యెహోవా సమూయేలు ద్వారా
చేశాడు.

**దాగోను** దాగోను ఫిలిష్తీయుల జాతీయ దేవత. దాని తల, చేతులు, శరీరం మానవాకృతిలో ఉంటాయి. కాని దాని కింది భాగం చేప తోక ఆకారంలో ఉంటుంది.

### దావీదు యెరూషలేమును జయించటం

4దావీదు, ఇశ్రాయేలు ప్రజలందరూ కలిసి యెరూష
లేముకు వెళ్లారు. ఆ కాలంలో యెరూషలేము
"యెబూసు" అని పిలవబడేది. ఆ నగరంలో నివసించే
ప్రజలంతా యెబూసీయులనబడేవారు. ఆ నగర
వాసులు 5దావీదుతో, "నీవు మా నగర ప్రవేశం చేయ
కూడదు" అని అన్నారు. అయినప్పటికీ దావీదు ఆ
ప్రజలను ఓడించాడు. సీయోను కొండ* మీది కోటను
దావీదు వశం చేసుకొన్నాడు. ఈ ప్రదేశమే దావీదు
నగరమని పిలువబడింది.
6"మీలో ఎవరు సైన్యాన్ని యెబూసీయుల మీదికి
విజయ వంతంగా నడిపిస్తారో అతడు నా సైన్యాని
కంతటికి ముఖ్య అధిపతి అవుతాడు" అని దావీదు
ప్రకటించాడు. అది విని యోవాబు దండయాత్రకు
నాయకత్వం వహించి నిర్వహించాడు. యోవాబు
తండ్రిపేరు సెరూయా. యోవాబు సైన్యాధిప
తయ్యాడు.
7దావీదు తన నివాసం కోటలో ఏర్పరచుకొన్నాడు.
అందువల్ల దానికి దావీదు నగరం అని పేరు వచ్చింది.
8కోట చుట్టూ దావీదు నగరాన్ని నిర్మించాడు. మిల్లో*
నుండి బయటి ప్రాకారం వరకు అతడు నగరాన్ని
నిర్మించాడు. యోవాబు ఆ నగరంలో ఇతర ప్రాంతా
లను అభివృద్ధి చేయించాడు. 9రోజురోజుకు దావీదు
గొప్పతనం పెరుగుతూ వచ్చింది. సైన్యాలకు అధిపతి
యైన యెహోవా దావీదుకు తోడైయున్నాడు.

### దావీదు యొక్క ముగ్గురు వీర నాయకులు

10దావీదు సైన్యంలో మహావీరులున్నారు. దావీదు
లాగానే వీరుకూడా శక్తిమంతులయ్యారు. ఇశ్రాయేలు
ప్రజలంతా దావీదు రాజ్యానికి మంచి మద్దతు ఇచ్చారు.
ఈ మహావీరులూ, ఇశ్రాయేలు ప్రజానీకం కలసి దావీ
దును రాజుగా చేశారు. దేవుడు ఇది జరుగుతుందని
వాగ్దానం చేశాడు. 11దావీదు సైన్యంలో మహాయోధులు
ఎవరనగా: హక్మనీయులకు చెందిన యాషాబాము
ఒకడు. యాషాబాము అధికారులకు పైఅధికారి.*
అతడు తన ఈటెను పయోగించి మూడు వందల
మందిని ఎదిరించాడు. ఆ మూడువందల మందిని
ఒక్క వేటుతో చంపివేశాడు. 12దావీదు యోధులలో
ఎలియాజరు మరొకడు. ఎలియాజరు తండ్రి పేరు

**సీయోను కొండ** యెరూషలేము నగరం కట్టబడిన ఒక కొండ పేరు.

**మిల్లో** పాత యెరూషలేములో ఒక భాగం. బైబిలు విద్యార్థులు దీనిని ఒక సమావేశ స్థలంగానో, లోయగానో, లేక నీటి వనరుగల ప్రదేశంగానో పరిగణించవచ్చు.

**యాషాబాము ... అధికారి** దీని అర్థం ముప్పదిమంది కావచ్చు. చూడండి సమూయేలు రెండవ గ్రంథం. 23:8.

దోదో. దోదో అహోహీయుల వంశంవాడు. ముగ్గురు
మహా యోధుల్లో ఎలియాజరు ఒకడు. [13]పస్దమ్మీ
ములో ఎలియాజరు దావీదుతో వున్నాడు. ఫిలిష్తీ
యులు ఆ ప్రదేశానికి యుద్ధానికి సిద్ధమై వచ్చారు.
ఆ ప్రాంతంలో విరగపండిన యవల చేనువుంది.
ఫిలిష్తీయులకు భయపడి ఇశ్రాయేలీయులు ఈ ప్రదేశా
నికి పారిపోయి వచ్చారు.
[14]కాని వారా చేను మధ్యలో నిలబడి పంటను
కాపాడుతూ ఫిలిష్తీయులతో యుద్ధంచేసి వారిని చంపి
వేశారు. అప్పుడు యెహోవా ఇశ్రాయేలీయులకు ఘన
విజయం చేకూర్చాడు.
[15]ముప్పైమంది నాయకులలో ముగ్గురు దావీదు
వద్దకు వెళ్లారు. ఆ సమయంలో దావీదు అదుల్లాము
గుహగల కొండ వద్ద ఉన్నాడు. అదే సమయంలో
ఫిలిష్తీయుల సైనికులు కొందరు రెఫాయిము
లోయలో గుడారాలు వేశారు.
[16]అప్పుడు దావీదు కోటలో వున్నాడు. ఫిలిష్తీ
యుల సైన్యం బేత్లెహేములో దిగివుంది. [17]దావీదుకు
అప్పుడు దాహం వేసింది. అతడు, "ఓహో, ఇప్పుడు
నాకెవరైనా బేత్లెహేము* నగర ద్వారం వద్దగల బావి
నీరు తాగటానికి తెచ్చి ఇవ్వాలని కోరుకుంటున్నాను!"
(దావీదు నిజంగా దీనిని కోరుకోలేదు) అని అన్నాడు.
[18]అప్పుడు ఆ ముగ్గురు యోధులు ఫిలిష్తీయుల
సైన్యాన్ని ఛేదించుకుంటూపోయి, బేత్లెహేము నగర
ద్వారంవద్ద గల బావినుండి నీరు తీసుకొన్నారు. ఆ
ముగ్గురు యోధులు నీటిని తెచ్చి దావీదుకు ఇచ్చారు.
కాని దావీదు ఆ నీటిని తాగ నిరాకరించాడు. ఆ నీటిని
యెహోవాకి అర్పణగా పారపోశాడు.
[19]దావీదు ఇలా అన్నాడు, "యెహోవా నన్ను
ఈ నీటిని తాగకుండా చేయుగాక! ఈ నీటిని నేను
తాగటం సరియైనది కాదు. ఎందువల్లననగా ఈ మను
ష్యులు ఈ నీటిని తేవటానికి తమ ప్రాణాలను లెక్క
చేయలేదు. వారు మృత్యుముఖంలో పడి బయట
పడ్డారు." అందువల్ల దావీదు ఆ నీటిని తాగలేదు. ఆ
విధంగా ఆ ముగ్గురు మహాయోధులు వీరోచిత కార్యాలు
సాధించారు.

## దావీదు ఇతర యోధులు

[20]ముగ్గురు యోధుల దళానికి యోవాబు సోదరుడు
అబీషై నాయకుడు. అతడు మూడు వందల మందిని
తన ఈటెతో ఎదిరించి చంపాడు. ఆ ముగ్గురు యోధు
ల్లాగా అబీషై కీర్తి గడించాడు. [21]కాని అతనికి మిగిలిన
వారికంటె ఎక్కువ గౌరవం దక్కింది. ముగ్గురిలో ఒకడు
కాకపోయినా అతడు అధిపతి అయ్యాడు.

[22]యెహోయాదా కుమారుడు బెనాయా ఒక
పరాక్రమవంతుని కుమారుడు. అతడు కబ్సెయేలు
వంశంవాడు. అతడు కొన్ని సాహస కార్యాలు నెర
వేర్చాడు. మోయాబు దేశానికి చెందిన ఇద్దరు గొప్ప
యోధులను చంపాడు. అతడు భూమిలో పెద్ద
గోతిలోకి వెళ్లి అక్కడ ఒక సింహాన్ని చంపాడు. అది
బాగా మంచుపడే రోజున జరిగింది. [23]ఈజిప్టుకు
చెందిన బలవంతుడైన సైనికుని కూడ బెనాయా
చంపాడు. ఆ మనుష్యుడు ఏడున్నర అడుగుల ఎత్తుగల
వాడు. ఆ ఈజిప్టు వానివద్ద అతి పెద్దదయిన, బరువైన
ఒక ఈటె వుంది. అది నేత నేయువాని మగ్గం దోనెవలె
వుంది. బెనాయా వద్ద ఒక గదలాంటి ఆయుధం
మాత్రమే వుంది. కాని బెనాయా ఆ ఈజిప్టు వాని
వద్ద నుండి ఈటెను లాక్కున్నాడు. దానితోనే వానిని
చంపివేశాడు. [24]ఇవన్నీ యెహోయాదా కుమారుడు
బెనాయా చేసిన పనులు. ముగ్గురు యోధుల్లాగా
బెనాయా పేరు పొందిన వ్యక్తి అయ్యాడు. [25]ఆ ముగ్గురి
యోధుల కంటె బెనాయాకు ఎక్కువ గౌరవం
లభించింది. కాని అతడు ఆ ముగ్గురిలో చేర్చబడలేదు.
దావీదు తన అంగరక్షకులకు అధిపతిగా బెనాయాను
నియమించాడు.

## ముప్పై మంది వీరులు

[26]ముప్పైమంది వీరులైన సైనికులెవరనగా:
యోవాబు సోదరుడైన అశాహేలు. దోదో కుమారుడైన
ఎల్హానాను. ఎల్హానాను బేత్లెహేము నివాసి. [27]హరోరీ
యుడైన షమ్మోతు. పెలోనీయుడైన హేలెస్సు.
[28]ఇక్కేషు కుమారుడైన ఈరా. ఈరా తెకోవ పట్టణా
నికి చెందినవాడు. అనాతోతీయుడైన అబీయెజెరు.
[29]హుషాతీయుడైన సిబ్బెకై. అహోహీయుడైన ఈలై.
[30]నెటోపాతీయుడగు మహరై. బయనా కుమారుడగు
హేలెదు. హేలెదు కూడ నెటోపాతీయుడు. [31]రీబయి
కుమారుడైన ఈతయి. ఈతయి అనేవాడు బెన్యా
మీను దేశంలోని గిబియా పట్టణవాసి. పిరాతోనీయు
డైన బెనాయా, [32]గాయషులోయవాడైన హూరై, అర్బా
తీయుడైన అబీయేలు, [33]బహరూమీయుడైన అజ్మా
వెతు. షయిల్బోనీయుడైన ఎల్యాహ్బా [34]హాషేము
కుమారుడు హాషేము గిజోనీయుడు. షాగే కుమారుడు
యోనాతాను. యోనాతాను హరారీయుడు. [35]శాకారు
కుమారుడు అహీయాము. అహీయాము హరారీ
యుడు. ఊరు కుమారుడు ఎలీపాలు. [36]మెకేరాతీ
యుడైన హెపెరు. పెలోనీయుడగు అహీయా. [37]కర్మె
లీయుడైన హెజ్రో. ఎజ్బయి కుమారుడైన నయరై.
[38]నాతాను సోదరుడైన యోవేలు. హగ్రీ కుమారుడగు
మిబ్హారు. [39]అమ్మోనీయుడగు జెలెకు. బెరోతీయుడగు
నహరై. నహరై అనేవాడు యోవాబు ఆయుధాలు
మోసేవాడు. యోవాబు తండ్రి పేరు సెరూయా.

---

**బేత్లెహేము** బేత్లెహేము దావీదు స్వంత పట్టణం. అందువల్ల ఆ ఊరి బావినుండి నీళ్లు తాగాలని దావీదు కోరుకున్నాడు.

40ఇత్రీయుడైన ఈరా. ఇత్రీయుడగు గారేబు.
41హిత్తీయుడైన ఊరియా. అహ్లాయి కుమారుడు
జాబాదు. 42షీజా కుమారుడు అదీనా. షీజా అనేవాడు
రూబేనీయుడు. అదీనా రూబేను వంశంలో పెద్ద.
అతను తనతోవున్న ముగ్గురు యోధులకు నాయ
కుడు. 43మయకా కుమారుడు హానాను. మిత్నీయు
డైన యెహోషాపాతు. 44ఆష్తెరాతీయుడైన ఉజ్జీయా.
హోతాము కుమారులు షామా, యెహీయేలు.
హోతాము అరోయేరీయుడు. 45షిమ్రీ కుమారుడు
యెదీయవేలు. తిజీయుడగు యోహా. యెదీయవేలు
సోదరుడు యోహా. 46మహవీయుడగు ఎలీయేలు.
ఎల్నయము కుమారులైన యెరీబై, యోషవ్యా.
మోయాబీయుడైన ఇత్మా. 47ఎలీయేలు, ఓబేదు,
మరియు మెజోబాయా వాడైన యహశీయేలు.

### దావీదుతో కలిసిన శూరులు

12 దావీదు సిక్లగు పట్టణంలో ఉన్నాడు. ఆ
సమయంలో కొందరు మనుష్యులు దావీదును
కలుసుకొన్నారు. దావీదు పారిపోయి సౌలుకు కనపడ
కుండా దాగివున్న రోజులవి. కీషు కుమారుడు సౌలు.
ఈ వచ్చిన మనుష్యులు దావీదుకు యుద్ధంలో
సహాయపడ్డారు. 2ఈ మనుష్యులు కుడి చేతితోను,
ఎడమ చేతితోను బాణాలు ఒడుపుగా వేయగల నేర్ప
రులు. వడిసెలకూడ వారు కుడిఎడమల తేడా లేకుండా
తిప్పి రాళ్లు విసరగల సమర్థులు. వారంతా సౌలు బంధు
వులైన బెన్యామీనీయులు.
3వారెవరనగా: అహీయెజెరు వారి నాయకుడు.
వారిలో యోవాషు కూడ వున్నాడు. అహీయెజెరు,
యోవాషులిద్దరూ షెమయా కుమారులు. షెమయా
అనేవాడు గిబియావాడు. వారిలో ఇంకా యెజీయేలు,
పెలెటు వున్నారు. యెజీయేలు, పెలెటు లిరువురూ
అజ్మావెతు కుమారులు. బెరాకా, అనాతోతీయుడైన
యెహూ అనేవారు కూడ వారితో వున్నారు. 4గిబి
యోనీయుడైన ఇష్మయా బలపరాక్రమ సంపన్నుడు,
ముప్పై మంది యోధుల్లో ఒకడు మరియు వారి
నాయకుడు. యిర్మీయా, యహజీయేలు, యోహా
నాను, గెదేరాతీయుడైన యోజాబాదు కూడ వున్నారు.
5ఎలూజై, యెరీమోతు, బెయల్యా మరియు షెమర్యా.
హరీపీయుడైన షెఫట్యా. 6ఎల్కానా, యెష్షీయా, అజ
రేలు, యోహెజెరు, యాషాబాము అనే వారు కోరహు
వంశీయులు.
7యెరోహాము కుమారులైన యోహేలా మరియు
జెబద్యా. వారు గెదోరు గ్రామానికి చెందిన వారు.

### గాదీయులు

8గాదీయులలో కొంతమంది ఎడారి ప్రాంతంలో
కోటలో దాగివున్న దావీదును కలిశారు. వారు బాగా
యుద్ధ శిక్షణ పొందిన సైనికులు. వారు డాలు పట్టి
ఈటెను ఉపయోగించటంలో ఆరితేరినవారు. వారు
సింహం లాంటి ముఖాలతో భయంకరంగా వుంటారు.
వారు కొండల్లో జింకల్లా పరుగెత్తగలరు.
9ఏజెరు గాదు సైన్యానికి అధిపతి. ఓబద్యా రెండవ
ముఖ్యాధికారి. ఏలీయాబు మూడవ స్థానంలో
వున్నాడు. 10మిష్మన్నా నాల్గవ స్థానంలోను,
యిర్మీయా ఐదవ స్థానంలోను వున్నారు. 11అత్తయి
ఆరవ స్థానంలోను, ఏలీయేలు ఏడవ స్థానంలోను
వున్నారు. 12యోహానాను ఎనిమిదవ స్థానంలోను, ఎల్జా
బాదు తొమ్మిదవ స్థానంలోనువున్నారు. 13యిర్మీయా
పదవ స్థానంలోను, మక్బన్నయి పదకొండవ వాడు
గాను వున్నారు. 14వారు గాదీయుల సైన్యంలో అధి
కారులు. వారిలో అతి బలహీనుడైనవాడు కూడ కనీసం
వంద మందితో పోరాడగలడు. వారిలో మిక్కిలి బల
వంతుడు వేయి మంది శత్రు సైనికులను ఎదుర్కొన
గలడు. 15ఈ గాదు వంశీయులే మొదటి నెలలో
యొర్దాను నదికి వరదలు వచ్చే సమయంలో
లోయల్లో వుండే వారందరినీ తరిమికొట్టారు. వారా
ప్రజలను తూర్పునకు, పడమరకు తరిమివేశారు.

### ఇతర సైనికులు దావీదుతో కలవటం

16బెన్యామీను, యూదా వంశాలకు చెందిన ఇతర
ప్రజలు కూడ కోటలో వున్న దావీదు వద్దకు వచ్చారు.
17దావీదు వారిని కలిసేందుకు ఎదురు వెళ్లి, వారితో
ఇలా అన్నాడు: "మీరు శాంతి భావంతో నాకు సహాయం
చేయగోరి వస్తే నేను మిమ్మల్ని ఆహ్వానిస్తాను! నాతో
కలిసి ఉండండి. ఒకవేళ నేను ఏమీ తప్పు చేయక
పోయినా మీరు నా మీద నిఘావేసి నన్ను శత్రువులకు
అప్పజెప్పటానికి కనుక వస్తే, మన పూర్వీకుల దేవుడు
మీరు చేసేది చూచి మిమ్మల్ని శిక్షించుగాక!"
18అప్పుడు దేవుని ఆత్మ అమాశై మీదికి వచ్చింది.
అమాశై ముప్పదిమంది వీరుల నాయకుడు. అమాశై
అప్పుడు ఇలా అన్నాడు:

"ఓ దావీదూ, మేము నీవారం! ఓ యెష్షయి
కుమారుడా, మేము నీతోవున్నాము. శాంతి!
నీకు శాంతి కలుగుగాక! నీకు సహాయపడే
ప్రజలకు కూడ శాంతి. ఎందువల్లననగా నీ
దైవం నీకు సహాయపడుతున్నాడు!"

అప్పుడు దావీదు వారికి స్వాగతం పలికి వారిని
చేరదీశాడు. తన పక్షాన వారిని దళాధిపతులుగా నియ
మించాడు. 19కొందరు మనష్షే వంశంలోని వారు కూడ
వచ్చి దావీదు పక్షం వహించారు. అతడు ఫిలిష్తీయులతో
కలిసి సౌలుపై యుద్ధానికి వెళ్లినప్పుడు వారు వచ్చి
దావీదు పక్షం వహించారు. కాని దావీదు, అతని

మనుష్యులు నిజానికి ఫిలిష్తీయులకు సహాయపడలేదు.
దావీదు తమకు సహాయం చేసే విషయం ఫిలిష్తీయుల
అధికారులు చర్చించి, పిమ్మట అతనిని పంపి వేయ
టానికి నిశ్చయించారు. ఫిలిష్తీయుల పాలకులు ఇలా
అన్నారు: "ఒకవేళ దావీదు మధ్యలో తన యజమాని
సౌలు వద్దకు వెళ్లిపోతే మన తలలు తెగిపోతాయి!"
20దావీదు సిక్లగు పట్టణానికి వెళ్లినప్పుడు అతనితో
కలిసిన మనష్షీయులు ఎవరనగా: అద్నా, యోజాబాదు,
మెదీయవేలు, మిఖాయేలు, యోజాబాదు, ఎలీహు
మరియు జిల్లెతై. వీరిలో ప్రతి ఒక్కడూ మనష్షే వంశీ
యులలో వెయ్యి మందికి నాయకుడు. 21దుష్టశక్తు
లను ఎదు ర్కొనటంలో వారు దావీదుకు తోడ్పడ్డారు.
ఈ దుష్టులు దేశం మీద పడి ప్రజలను దోచుకోసాగారు.
దావీదును చేరిన మనష్షీయులంతా ధైర్యంగల సేనా
నులు. వారు దావీదు సైన్యంలో అధిపతులయ్యారు.
22రోజురోజుకూ దావీదు వద్దకు వచ్చి సహాయ
పడేవారి సంఖ్య పెరుగుతూ వచ్చింది. దానితో
దావీదుకు శక్తివంతమైన ఒక మహా సైన్యం ఏర్పడింది.

### హెబ్రోనులో మరికొందరు దావీదును చేరటం

23దావీదును హెబ్రోను పట్టణంలో కలిసిన వారి
వివరాలు, సంఖ్యాబలం ఈ విధంగా వున్నాయి: వారు
యుద్ధ వీరులు. సౌలు సామ్రాజ్యాన్ని దావీదుకు అప్ప
జెప్పటానికి వచ్చారు. ఇది ఇలా జరుగుతుందని
యెహోవా చెప్పియున్నాడు. వారి బలగం ఏదనగా:
24యుద్ధానికి అర్హతగల యూదా వంశీయులు
ఆరువేల ఎనిమిది వందల మంది వున్నారు. వారు
డాళ్లను, ఈటెలను పట్టగల సమర్థులు.
25షిమ్యోనీయులు ఏడువేల వందమంది వున్నారు.
వారంతా ధైర్య సాహసాలుగల సైనికులు. 26లేవీయులు
నాలుగువేల ఆరువందల మంది వున్నారు. 27యెహో
యాదా ఆ వర్గంలో వాడు. అతడు అహరోను కుటుంబ
పెద్ద. యెహోయాదాతో మూడువేల ఏడువందల
మంది మనుష్యులున్నారు. 28ఆ వర్గంలో సాదోకు
కూడా వున్నాడు. అతడు మంచి ధైర్యంగల యువ
సైనికుడు. అతడు తన కుటుంబీకులలో ఇరవై ఇద్దరు
అధికారులతో వచ్చాడు. 29బెన్యామీను వంశం వారు
మూడువేలమంది వున్నారు. వారంతా సౌలుకు బంధు
వులు. అప్పటి వరకు వారిలో అధిక సంఖ్యాకులు
సౌలు కుటుంబం పట్ల విశ్వాసంగా వున్నారు. 30ఎఫ్రా
యిము వంశంవారు ఇరవై వేల ఎనిమిది వందలమంది
వున్నారు. వారు ధైర్యంగల సేనానులు. వారి వారి
కుటుంబాలలో వారు ప్రసిద్ధిగాంచిన వ్యక్తులు.
31మనష్షే వంశీయులలో సగంమంది నుండి వచ్చిన
వారు పద్దెనిమిదివేల మంది. వారు పేరు పేరున దావీ
దును రాజుగా చేయటానికి ఎంపిక చేయబడినవారు.
32ఇశ్శాఖారు వంశీయులలో తెలివైన పెద్దలు రెండు
వందల మంది. ఇశ్రాయేలుకు చేయదగిన మంచి
యేదో వారు సరియైన సమయంలో గుర్తించారు.
వారి బంధువులంతా వారి మాటకు కట్టుబడి వున్నారు.
33జెబూలూనీయులు ఏబదివేల మంది వున్నారు.
వారంతా అనుభవజ్ఞులైన సైనికులు. వారు రకరకాల
ఆయుధాలు చేపట్టి యుద్ధానికి సిద్ధంగా వున్నారు.
వారు దావీదుకు మిక్కిలి నమ్మకస్తులై వున్నారు.
34నఫ్తాలీయుల నుండి ఒక వెయ్యిమంది అధి
పతులు వచ్చారు. వారికి ముప్పది ఏడువేల మంది
అనుచరులు వున్నారు. వారు ఈటెలు, డాళ్లు పట్టి
వున్నారు. 35దాను వంశం నుండి యుద్ధానికి సిద్ధంగా
వున్న వారు ఇరవై ఎనిమిదివేల ఆరువందల మంది.
36ఆషేరు వంశం నుండి కాకలు తీరిన సైనికులు
యుద్ధానికి సిద్ధమై నలభై వేలమంది వచ్చారు.
37యొర్దాను నదికి ఆవలివైపు (నదికి తూర్పు)
నుండి రూబేను, గాదు, సగం మనష్షే వంశీయుల
నుండి ఒక లక్షా ఇరవై వేల మంది వచ్చారు. వారంతా
రకరకాల ఆయుధాలు ధరించియున్నారు.
38ఆ వచ్చిన మనుష్యులంతా పోరాట యోధులు.
దావీదును ఇశ్రాయేలుకంతటికీ రాజుగా చేయాలనే
కృతనిశ్చయంతో ఆ వీరులందరూ హెబ్రోను పట్టణా
నికి వచ్చారు. మిగిలిన ఇశ్రాయేలీయులు కూడ దావీ
దును రాజుగా చేయటానికి ఒప్పుకున్నారు. 39ఆ
మనుష్యులంతా దావీదుతో మూడు రోజులు హెబ్రో
నులో గడిపారు. వారి బంధువులంతా తగినన్ని ఆహార
పదార్థాలను తయారు చేయటంతో వారు బాగా అన్న
పానాదులు సేవించి కాలం గడిపారు. 40ఇశ్శాఖారు,
జెబూలూను మరియు నఫ్తాలి వంశాల వారి ఇరుగు
పొరుగు వారు కూడ గాడిదలమీద, ఒంటెలమీద, కంచర
గాడిదల మీద, ఎద్దుల మీద ఆహార పదార్థాలు వేసుకొని
వచ్చారు. వారు కావలసినంత పిండిని, అంజూర పండ్ల
భక్ష్యాలను, ఎండుద్రాక్షను, ద్రాక్షారసాన్ని, నూనెను,
పశువులను, గొర్రెలను తీసుకొని వచ్చారు. ఇశ్రాయే
లంతటా సంతోషం వెల్లివిరిసింది.

### ఒడంబడిక పెట్టెను తిరిగి తీసుకొని రావటం

13 దావీదు తన సైన్యంలోని సేనాధిపతులతో
మాట్లాడాడు. అతడు శతదళాధిపతులతోను,
సహస్రదళాధిపతులతోను మాట్లాడాడు. 2పిమ్మట
దావీదు ఇశ్రాయేలు ప్రజలందరినీ సమావేశపర్చాడు.
అతడు వారికి ఇలా చెప్పాడు: "మీ అందరికీ ఇది
మంచిదనిపించితే, ఇది యెహోవా సంకల్పమే అయితే
మనం ఇప్పుడు ఇశ్రాయేలులో మన సోదరులందరికీ
ఒక వర్తమానం పంపుదాము. ఈ వర్తమానాన్ని మన
సోదరులతో పాటు వారి పట్టణాలలోను, పొలాలలోను
నివసిస్తున్న యాజకులకు, లేవీయులకు కూడ అంద
జేద్దాము. వారందరినీ వచ్చి మనల్ని కలవమని వర్త

మానం పంపండి. 3ఒడంబడిక పెట్టెను మనం యెరూ
షలేముకు తీసుకొనివద్దాము. సౌలు రాజుగా వున్న
న్నాళ్లూ ఒడంబడిక పెట్టెను మనం అశ్రద్ధ చేశాము."
4దావీదు చెప్పిన విషయం సరియైనదని గుర్తించి,
ఇశ్రాయేలు ప్రజలంతా అతని సూచనను అంగీ
కరించారు.

5కావున ఈజిప్టులోని షీహోరు నది మొదలు లెబో
హమాతు పట్టణం వరకుగల ఇశ్రాయేలీయు లందరినీ
దావీదు సమావేశపర్చాడు. ఒడంబడిక పెట్టెను కిర్యత్యా
రీము పట్టణం నుండి తిరిగి తెచ్చే నిమిత్తం వారంతా
ఒక చోటికి పిలవబడ్డారు. 6దావీదు మరియు అతనితో
వున్న ఇశ్రాయేలీయులు కలిసి యూదాలోని బాలా
పట్టణానికి వెళ్లారు. (బాలా అనేది కిర్యత్యారీముకు
మరో పేరు.) ఒడంబడిక పెట్టెను బయటకు తేవటా
నికి వారక్కడికి వెళ్లారు. ఒడంబడిక పెట్టె అనేది
యెహోవా దేవుని పవిత్రపెట్టె. యెహోవా కెరూబుల
మధ్య ఆసీనుడై వుంటాడు. ఈ పెట్టె యెహోవా
పేరుతో పిలవబడుతుంది.

7ఒడంబడిక పెట్టెను ప్రజలు అబీనాదాబు ఇంటి
నుండి బయటకు తీసారు. వారు దానిని ఒక కొత్త
బండిమీద పెట్టారు. ఉజ్జా, అహ్యో అనేవారు బండిని
తోలారు. 8దావీదు, ఇశ్రాయేలు ప్రజలు దేవుని ముందు
తమ శక్తికొలది భక్తి శ్రద్ధలతో ఉత్సవం చేస్తున్నారు.
వారు భక్తిగీతాలు పాడుతూ, తంబుర, సితారాలను
వాయిస్తూ, తాళాలు మ్రోగిస్తూ, మద్దెలలు వాయిస్తూ,
బూరలు ఊదుతూ వేడుక చేస్తున్నారు.

9వారు కీదోను నూర్పిడి కళ్లం వద్దకు వచ్చారు.
అక్కడికి రాగానే బండిని లాగే ఎద్దులు కాళ్లు జారి తడ
బడ్డాయి. దానితో బండిమీద ఉన్న ఒడంబడిక పెట్టె
ఇంచుమించు కిందపడినంత పని అయ్యింది. అప్పుడు
ఉజ్జా తనచేయి చాపి పెట్టెను పట్టుకోబోయాడు.
10ఉజ్జా పట్ల దేవునికి చాలా కోపం వచ్చింది. ఉజ్జా
పెట్టెను ముట్టుకున్న నేరానికి దేవుడు అతనిని చంపి
వేసాడు. ఉజ్జా దేవుని ముందే పడి చనిపోయాడు.
11ఉజ్జా పట్ల యెహోవా కోపగించినందుకు దావీదు
కలత చెందాడు. అప్పటినుండి ఇప్పటివరకు ఆ
ప్రదేశం "పెరెజ్ ఉజ్జా"* అని పిలవబడుతూ వుంది.
12ఆ రోజు దావీదు దేవునికి భయపడ్డాడు. "ఒడం
బడిక పెట్టెను నా వద్దకు ఏవిధంగా తీసుకొని వెళ్ల
గలను?" అని అనుకున్నాడు. 13కావున దావీదు ఒడం
బడిక పెట్టెను తనతో దావీదు నగరానికి తీసుకొని
వెళ్లలేదు. ఒడంబడిక పెట్టెను ఓబేదెదోము ఇంటివద్ద
వదిలిపెట్టాడు. ఓబేదెదోము గాతు నగరంవాడు.
14మూడు నెలల పాటు ఒడంబడిక పెట్టె ఓబేదెదోము
ఇంటిలో అతని ఇంటివారి సంరక్షణలో వుంది.
యెహోవా ఓబేదెదోము కుటుంబం వారిని, అతను
కలిగివున్న ప్రతి దానిని దీవించాడు.

## దావీదు రాజ్య విస్తరణ

14 తూరు నగర రాజు పేరు హీరాము. దావీదు
వద్దకు హీరాము దూతలను పంపాడు. హీరాము
దేవదారు కలపను, రాళ్లు చెక్కే వాస్తు శిల్పులను,
వడ్రంగులను దావీదు వద్దకు పంపాడు. దావీదుకు
ఒక భవనం నిర్మించటానికి హీరాము వారిని పంపాడు.
2యెహోవా నిజంగానే తనను ఇశ్రాయేలుకు రాజుగా
చేసినట్లు దావీదు అప్పుడు గుర్తించాడు. యెహోవా
దావీదును, ఇశ్రాయేలు ప్రజలను బాగా ప్రేమించాడు.
అందువల్ల దేవుడు దావీదు రాజ్యాన్ని విస్తరించి, బల
మైన రాజ్యంగా రూపొందించాడు.
3యెరూషలేము నగరంలో దావీదు చాలా మంది
స్త్రీలను వివాహం చేసుకొన్నాడు. అతనికి చాలామంది
కొడుకులు, కూతుళ్లు కలిగారు.
4యెరూషలేములో దావీదుకు పుట్టిన పిల్లల పేర్లు
ఏవనగా: షమ్మూయ, షోబాబు, నాతాను, సొలొమోను,
5ఇభారు, ఎలీషూవ, ఎల్పాలెటు, 6నోగహు, నెపెగు,
యాఫీయ, 7ఎలీషామా, బెయెల్యెదా మరియు
ఎలీపేలెటు.

## దావీదు ఫిలిష్తీయులను ఓడించటం

8దావీదు ఇశ్రాయేలు రాజుగా అభిషిక్తుడయినట్లు
ఫిలిష్తీయులు విన్నారు. కావున ఫిలిష్తీయులంతా దావీ
దును వెదుక్కుంటూ పోయారు. ఆ విషయం దావీదు
విని వారిని ఎదుర్కోవటానికి వెళ్లాడు. 9ఫిలిష్తీయులు
రెఫాయీము లోయలో నివసిస్తున్న వారిపై దాడిచేసి,
వారిని దోచుకున్నారు. 10అప్పుడు దావీదు దేవుని
ప్రార్థించి, "దేవా, నేను ఫిలిష్తీయులతో యుద్ధం
చేయనా? వారిని ఓడించేలా నీవు నాకు సహాయం
చేస్తావా?" అని అడిగాడు.

యెహోవా అందుకు సమాధానంగా, "వెళ్లు.
ఫిలిష్తీయులను నీవు ఓడించేలా నేను చేస్తాను" అని
చెప్పాడు.

11తరువాత దావీదు, అతని మనుష్యులు బయ
ల్పెరాజీము పట్టణానికి వెళ్లారు. అక్కడ వారు ఫిలిష్తీ
యులను ఓడించారు. అప్పుడు దావీదు, "తెగిన ఆన
కట్టలో నుండి నీరు ఉరుకులు పరుగులతో ప్రవహించి
పోయేలా, దేవుడు నా శత్రువులను నానుండి చెల్లా
చెదురు చేశాడు! దేవుడు ఈ కార్యం నాచేత చేయిం
చాడు" అని అన్నాడు. అందువల్లనే ఆ ప్రదేశానికి
బయల్పెరాజీము* అని పేరు పెట్టబడింది.

---

**పెరెజ్ ఉజ్జా** నాశనమైన చోటు అని దీని అర్థం.

**బయల్పెరాజీము** జనులు నీటి ప్రవాహంవలె పారి పోయిన చోటు అని భావం.

12ఫిలిష్తీయులు వారి విగ్రహాలను బయల్పెరాజీములో
వదిలి పెట్టిపోయారు. ఆ విగ్రహాలన్నిటినీ తగుల
బెట్టమని దావీదు తన ప్రజలకు ఆజ్ఞయిచ్చాడు.

### ఫిలిష్తీయులపై మరో విజయం

13రెఫాయీము లోయలో నివసిస్తున్న ప్రజలపై
ఫిలిష్తీయులు మళ్లీ దాడి చేశారు. 14దావీదు మరల
దేవుని ప్రార్థించాడు. దావీదు ప్రార్థనను దేవుడు ఆలకిం
చాడు. యెహోవా ఇలా అన్నాడు: “దావీదూ, నీవు
ఫిలిష్తీయులను ఎదుర్కొన్నప్పుడు కొండమీద నీవు
వారి ముందుకు పోవద్దు. దానికి బదులు నీవు వారిని
చుట్టుముట్టి వెళ్లు. కంబళి చెట్లు వున్న చోటున
దాగివుండు. 15ఒక కాపలాదారుని చెట్ల మీద కూర్చుండ
బెట్టు. ఆ చెట్ల కింద నుండి వాళ్లు నడిచివెళ్లే అడుగుల
చప్పుడు అతడు వినగానే నీవు ఫిలిష్తీయులను ఎది
రించు. నేను నీకు ముందుగా వెళ్లి ఫిలిష్తీయుల సైన్యాన్ని
ఓడిస్తాను!” 16దేవుడు చెప్పిన రీతిగా దావీదు చేసాడు.
ఆ విధంగా దావీదు, అతని మనుష్యులు ఫిలిష్తీయుల
సైన్యాన్ని ఓడించారు. గిబియోను పట్టణం నుండి
గాజెరు వరకు వారు ఫిలిష్తీయుల సైనికులను చంపి
వేసారు. 17అప్పుడు దావీదు అన్ని దేశాలలోను పేరు
పొందాడు. వివిధ రాజ్యాల వారు దావీదును చూచి
భయపడేలా దేవుడు చేశాడు.

### ఒడంబడిక పెట్టె యెరూషలేముకు తేబడుట

15 దావీదు నగరంలో తన కొరకు దావీదు ఇండ్లు
కట్టుకున్నాడు. తరువాత ఒడంబడిక పెట్టెను
పెట్టటానికి అతడొక ప్రదేశాన్ని సిద్ధం చేశాడు. అతడ
క్కడ ఒక గుడారం దాని కొరకు నిర్మించాడు. 2“ఒడం
బడిక పెట్టెను మోయటానికి కేవలం లేవీయులు
మాత్రమే అనుమతించబడ్డారు. ఒడంబడిక పెట్టెను
మోయటానికి, ఆయనను అర్చించటానికి యెహోవా
లేవీయులను శాశ్వతంగా ఎంపిక చేశాడు” అని దావీదు
చెప్పాడు.

3తాను ఏర్పాటు చేసిన స్థలానికి ఒడంబడిక పెట్టెను
తేవటానికి యెరూషలేము ప్రజలందరినీ దావీదు సమా
వేశపర్చాడు. 4అహరోను సంతతి వారిని, లేవీయులను
దావీదు పిలిపించాడు. 5కహాతు సంతతివారు నూట
ఇరవై మంది వున్నారు. వారి నాయకుని పేరు ఊరి
యేలు. 6మెరారి వంశీయులు రెండు వందల ఇరవై
మంది వున్నారు. అశాయా వారికి పెద్ద. 7గెర్షోను
కుటుంబం వారు నూటముప్పది మంది వున్నారు.
యోవేలు వారి అధిపతి.

8ఎలీషాపాను సంతతివారు రెండువందల మంది.
షెమయా వారి నాయకుడు.

9హెబ్రోను సంతతివారు ఎనుబది మంది.
ఎలీయేలు వారి నాయకుడు. 10ఉజ్జీయేలు కుటుంబం
వారు నూట పన్నెండు మంది. అమ్మీనాదాబు వారి
పెద్ద.

### దావీదు యాజకులతో, లేవీయులతో సంప్రదించటం

11యాజకులైన సాదోకును, అబ్యాతారును తన
వద్దకు రమ్మని దావీదు కబురు పంపాడు. మరియు
లేవీయులైన ఊరియేలు, అశాయా, యోవేలు,
షెమయా, ఎలీయేలు, అమ్మీనాదాబు అను వారిని
కూడ దావీదు తన వద్దకు రమ్మని కబురు పంపాడు.
12దావీదు వారితో ఇలా అన్నాడు: “మీరంతా లేవి
సంతతి వారికి నాయకులు. మీరు, మీతోటి వారైన
ఇతర లేవీయులు పవిత్రంగా వుండి, ఒడంబడిక పెట్టెను
నేను ఏర్పాటు చేసిన స్థలానికి తీసుకొనిరండి. 13కిందటి
సారి ఒడంబడిక పెట్టెను ఎలా తీసుకొని రావాలి అనే
విషయం మనం యెహోవాను అడుగలేదు. లేవీ
యులైన మీరు ఒడంబడిక పెట్టెను మోయలేదు.
అందువల్ల యెహోవా మనల్ని శిక్షించాడు.”

14పిమ్మట ఇశ్రాయేలు దేవుని ఒడంబడిక పెట్టెను
తీసుకొని రావటానికి యాజకులు, లేవీయులు శుద్ధి
యైనారు. 15ఒడంబడిక పెట్టెను మోషే ఆజ్ఞాపించిన
విధంగా వారి భుజాలపై మోయటానికి లేవీయులు
ప్రత్యేకమైన కర్రలను వినియోగించారు. యెహోవా
సెలవిచ్చిన ప్రకారమే వారు ఆ ఒడంబడిక పెట్టెను
మోసారు.

### గాయకులు

16వారి సోదరులైన గాయకులను తీసుకొని రమ్మని
దావీదు లేవీయులతో చెప్పాడు. గాయకులంతా
వీణలు, తంబూరాలు, సితారలు, తాళాలు వాయిస్తూ
ఆనందంతో హాయిగా పాడాలి.

17అప్పుడు లేవీయులు హేమానును, అతని సోదరు
లను, ఆసాపును, ఏతానును తీసుకొని వచ్చారు.
హేమాను తండ్రి పేరు యోవేలు. ఆసాపు తండ్రి
పేరు బెరెక్యా. ఏతాను తండ్రి పేరు కూషాయాహు.
వీరంతా మెరారి సంతతివారు. 18లేవీయులలో రెండవ
వర్గం వారు కూడ వున్నారు. వారు జెకర్యా, యహజీ
యేలు, షెమీరామోతు, యెహీయేలు, ఉన్నీ, ఏలీ
యాబు, బెనాయా, మయశేయా, మత్తిత్యా, ఎలీప్లేహు,
మిక్నేయాహు, ఓబేదెదోము, యెహీయేలు. వీరంతా
లేవీయులకు చెందిన ద్వారపాలకులు.

19గాయకులైన హేమాను, ఆసాపు, ఏతాను కంచు
తాళాలు వాయించేందుకు నియమితులయ్యారు.
20జెకర్యా, అజీయేలు, షెమీరామోతు, యెహీయేలు,
ఉన్నీ, ఏలీయాబు, మయశేయా, బెనాయా హెచ్చు
స్థాయి వీణలు వాయించాలి.

21మత్తిత్యా, ఎలీప్లేహు, మిక్నేయాహు, ఓబేదె
దోము, యెహీయేలు మరియు అజజ్యాహు తగ్గుస్థాయి

వీణలు వాయించటానికి నియమింప బడ్డారు. శాశ్వ
తంగా అది వారిపని. 22లేవీయుల నాయకుడు కెనన్యా
సంగీత కార్యక్రమ నిర్వాహకుడు. కెనన్యా ఈ కార్య
క్రమం నిర్వహించటానికి కారణం అతడు ప్రసిద్ధ
గాయకుడు కావటమే.

23ఒడంబడిక పెట్టెకు కాపలాదారులుగా నియ
మితులైన వారిలో బెరెక్యా, ఎల్కానా వున్నారు.
24యాజకులైన షెబన్యా, యెహోషాపాతు, నెతనేలు,
అమాశై, జెకర్యా, బెనాయా మరియు ఎలీయెజెరు
ఒడంబడిక పెట్టెకు ముందు బూరలు వూదారు.
ఓబేదెదోము, యెహీయా లిరువురూ కూడ ఒడంబడిక
మందసానికి కాపలాదార్లు.

25దావీదు, ఇశ్రాయేలు పెద్దలు, వెయ్యిమంది సైని
కులు గల దళాలకు నాయకులు ఒడంబడిక పెట్టెను
తీసుకొని రావటానికి వెళ్లారు. వారు దానిని ఓబేదెదోము
ఇంటినుండి బయటకు తెచ్చినప్పుడు చాలా ఆనం
దంగా వున్నారు. 26ఒడంబడిక పెట్టెను మోసిన లేవీ
యులకు దేవుడు సహాయపడ్డాడు. వారు ఏడు ఎద్దు
లను, ఏడు పొట్టేళ్లను బలియిచ్చారు. 27ఒడంబడిక
పెట్టెను మోసిన లేవీయులంతా సన్నని నారబట్టలు
ధరించారు. భజన సంకీర్తన నిర్వాహకుడుగా వున్న
కెనన్యా, ఇతర గాయకులు సన్నని నారబట్టలు ధరిం
చారు. దావీదు కూడ సన్నని నారబట్టలు ధరించాడు.
సన్నని నారతో నేసిన ఏఫోదు అనబడే ఒక అంగీని
కూడా దావీదు ధరించాడు. 28ఇశ్రాయేలు ప్రజలు జయ
జయ ధ్వనులు చేస్తూ, పొట్టేలు కొమ్ములు, బాకాలు
వూదుతూ, వీణలు, స్వరమండలాలు, తాళాలు
వాయిస్తూ ఒడంబడిక పెట్టెను తీసుకొని వచ్చారు.

29దేవుని ఒడంబడిక పెట్టె దావీదు నగరం చేరి
నప్పుడు మీకాలు కిటికీ గుండా చూసింది. మీకాలు
సౌలు కుమార్తె. రాజైన దావీదు చిందులేస్తూ పాటలు
పాడటం ఆమె చూసింది. అతనినొక మూర్ఖునిగా భావిం
చడంతో దావీదు పట్ల ఆమెకున్న గౌరవం పోయింది.

16 దేవుని ఒడంబడిక పెట్టెను లేవీయులు తెచ్చి
దావీదు దాని కొరకు ప్రత్యేకంగా ఏర్పాటు
చేసిన గుడారంలో వుంచారు. పిమ్మట వారు దేవునికి
దహన బలులు, సమాధాన బలులు సమర్పించారు.
2దావీదు దహన బలులు, సమాధాన బలులు ఇచ్చిన
తర్వాత యెహోవా పేరుతో ప్రజలను ఆశీర్వదిం
చాడు. 3అప్పుడతడు ఒక రొట్టెను, ఖర్జూర పండ్లను,
ఎండు ద్రాక్షాపండ్లను ఇశ్రాయేలు స్త్రీ పురుషులందరికీ
పంచిపెట్టాడు.

4ఆ తరువాత దేవుని ఒడంబడిక పెట్టెకు ముందు
సేవచేయటానికి కొందరు లేవీయులను దావీదు ఎంపిక
చేశాడు. వారు ఇశ్రాయేలు దేవుని ఉత్సవాలు చేయ
టానికి, యెహోవాకు కృతజ్ఞతలు చెల్లించేందుకు,
ఆయనకు జయజయ ధ్వనులు చేసేందుకు నియ
మింపబడ్డారు. 5వీరిలో మొదటి జట్టు వారికి ఆసాపు
పెద్ద. ఆసాపు వర్గం వారు తాళాలు మోగించేవారు.
జెకర్యా రెండవ జట్టు వారికి అధిపతి. మిగిలిన లేవీ
యులు ఎవరనగా ఉజ్జీయేలు, షెమీరామోతు, యెహీ
యేలు, మత్తిత్యా, ఏలీయాబు, బెనాయా, ఓబేదెదోము
మరియు యెహీయేలు. వీరు తీగలు గల వీణాసితార
వాద్యాలను వాయించేవారు. 6యాజకులైన బెనాయా,
యహజీయేలు ఎల్లప్పుడూ దేవుని ఒడంబడిక పెట్టెకు
ముందు బూరలు వూదే వారు. 7అదే సమయంలో
దావీదు ప్రథమంగా ఆసాపు, అతని సోదరులు యెహో
వాకి ఈ స్తుతిగీతం పాడే పని అప్పజెప్పాడు.

### దావీదు కృతజ్ఞతా స్తోత్ర గీతం

8 యెహోవాను స్తుతించండి ఆయన నామమును
ప్రకటించండి. యెహోవా ఘనకార్యాలను ప్రజ
లకు చెప్పండి.
9 యెహోవాకి భజన చేయండి! యెహోవాకు
స్తుతిగీతాలు పాడండి. యెహోవా మహిమలు
ప్రజలకు తెలపండి!
10 యెహోవా పవిత్ర నామం తలంచి గర్వపడండి;
యెహోవా సహాయం కోరిన వారందరూ సుఖ
సంతోషాలు పొందెదరు గాక!
11 యెహోవాను శరణు కోరండి; ఆయన బలాన్ని
ఆశ్రయించండి. ఆయన సన్నిధిని నిత్యం వెద
కండి. 12యెహోవా చేసిన అద్భుత కార్యాలను
జ్ఞాపకం చేసుకోండి. ఆయన నిర్ణయాలను
ఆయన చేసిన ఘనకార్యాలను మననం చేసు
కోండి.
13 యెహోవా సేవకులగు ఇశ్రాయేలు బిడ్డల్లారా,
యాకోబు సంతతి వారలారా మీరు యెహోవా
ఎన్నుకున్న ప్రజలు.
14 యెహోవాయే మన దేవుడు ఆయన శక్తి ప్రతి
స్థలములో వ్యాపించి వున్నది!
15 తన ఒడంబడికను ఆయన జ్ఞాపకముంచు
కుంటాడు. ఆయన మాట వేయితరాల పంట!
16 అది అబ్రాహాముతో యెహోవా చేసుకొన్న
ఒడంబడిక. అది యెహోవా ఇస్సాకుకు చేసిన
వాగ్దానం
17 యాకోబుకు యెహోవా దానిని శాసనంగా
చేశాడు. అది ఇశ్రాయేలుకు యెహోవా
నిరంతరం కొనసాగేలా చేసిన ఒడంబడిక.
18 "కనాను దేశాన్ని నేను మీకు ఇస్తాను. వాగ్దానం
చేయబడిన రాజ్యం నీకు చెందుతుంది!" అని
యెహోవా ఇశ్రాయేలుకు చెప్పియున్నాడు.
19 దేవుని ప్రజలు అప్పుడు కొద్దిమంది మాత్రమే.
వారు ఆ రాజ్యంలో పరాయి వారు.
20 వారు ఒక దేశాన్నుండి మరో దేశానికి వెళ్లారు.

వారు ఒక రాజ్యం నుండి మరో రాజ్యానికి తరలి
పోయారు.
21 కాని ఎవ్వరూ వారికి హాని కలుగజేయకుండా
యెహోవా కాపాడాడు. యెహోవా తన ప్రజ
లను ప్రేమించిన కారణంగా రాజులనే ఆయన
మందలించాడు.
22 "నేను ఎన్నుకున్న నా ప్రజలకు కీడు చేయవద్దు;
నా ప్రవక్తలకు హాని కలుగ జేయవద్దు!" అని
యెహోవా రాజులకు చెప్పియున్నాడు.
23 భూమిపై గల సర్వజనులారా, యెహోవాను
భజించండి! యెహోవా మనలను కాపాడు
తున్న సువార్తను ప్రతినిత్యం చాటండి!
24 యెహోవా మహిమను అన్ని దేశాలలోను
చాటండి. దేవుని అద్భుత కార్యాలను గురించి
ప్రజలందరి కితెలియ జెప్పండి!
25 యెహోవా గొప్ప మహిమాన్వితుడు; ఆయ
నను మిక్కిలిగా సన్నుతించండి అన్య దేవతల
కన్న యెహోవా ఘనంగా ఆరాధించబడాలి.
26 ఎందువల్లననగా మిగిలిన ప్రజలందరి దేవుళ్లు
విగ్రహాలే! కాని యెహోవా ఈ విశాల ఆకాశాన్ని
కలుగజేశాడు.
27 యెహోవా మహిమయు, ఘనతయు కల్గిన
వాడు. యెహోవా మిక్కిలి ప్రకాశ మానంగా
వెలుగొందే జ్యోతివంటి వాడు!
28 పలు వంశీకులారా, సర్వ ప్రజలారా, యెహోవా
మహిమను, శక్తిని పొగడండి!
29 యెహోవా మహిమను కొనియాడండి ఆయన
నామాన్ని ఘనపర్చండి! మీ అర్పణలను
యెహోవా సన్నిధికి తీసుకొనిరండి యెహో
వాను, అతిశయించిన ఆయన పవిత్ర సౌంద
ర్యాన్ని ఆరాధించండి!
30 భూలోక ప్రజలారా, యెహోవా ముందు గజగజ
వణకండి. కాని ఆయన ఈ భూమిని బలంగా
నిర్మించాడు; అది కదల్చబడదు.
31 భూలోకం, పరలోకాలు సంతోషంగా వుండును
గాక! "యెహోవా పరిపాలిస్తున్నాడు" అని
ప్రజలు ప్రతిచోట చెప్పు కొందురుగాక!
32 సముద్రము, దానిలోని ప్రతిదీ ఘోషించుగాక!
పొలాలు, వాటిలోని వన్నీ తమ సంతోషాన్ని
వెలిబుచ్చుగాక!
33 అడవిలోని చెట్లన్నీ యెహోవాముందు ఉల్లా
సంగా పాడుతాయి! ఎందువల్లననగా యెహోవా
వస్తున్నాడు గనుక. ఆయన ప్రపంచానికి తీర్పు
ఇవ్వటానికి వస్తున్నాడు.
34 ఆహా, యెహోవాకు కృతజ్ఞతలు చెల్లించు.
ఆయన మంచివాడు! యెహోవా ప్రేమ
నిరంతరం కొనసాగుతుంది.
35 "మా సంరక్షకుడవగు ఓ దేవా! మమ్ములను
రక్షింపుము! మమ్ము ఒక దగ్గరికి చేర్చి మమ్మల్ని
పరాయి రాజ్యాల నుండి కాపాడుము. అప్పుడు
నీ పవిత్ర నామాన్ని మనసార స్తుతించుకోగలుగు
తాము. మేము నీకు స్తుతిగీతాలు పాడగలుగు
తాము!" అని యెహోవాకు విన్న వించండి.
36 ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు సర్వకాల
సర్వావస్థలయందు జయమగు గాక! అప్పుడు
ప్రజలంతా "ఆమేన్"అన్నారు! యెహోవాను
స్తుతించారు!

37 పిమ్మట ఆసాపును, అతని సోదరులను దావీదు
ఒడంబడిక పెట్టె ముందు ఉంచాడు. నిత్యం దాని
ముందు సేవచేయటానికి దావీదు వారిని అక్కడ నియ
మించాడు.
38 ఓబేదెదోమును, మరి అరువది ఎనిమిది మంది
లేవీయులను కూడ ఆసాపుతోను, అతని సోదరుల
తోను కలిసి సేవచేయటానికి దావీదు నియమించాడు.
ఓబేదెదోము, హోసా ద్వార పాలకులు. ఓబేదెదోము
తండ్రి పేరు యెదూతూను.
39 యాజకుడైన సాదోకును, గిబియోనులో
ఉన్నత స్థలంలో అతనితో కలిసి దేవుని గుడారంలో
సేవ చేసిన ఇతర యాజకులను కూడా దావీదు అక్కడ
నియమించాడు.
40 దహన బలిపీఠం మీద ప్రతిరోజు ఉదయం,
సాయంత్రం సాదోకు, ఇతర యాజకులు దహన
బలులు సమర్పించారు. యెహోవా ఇశ్రాయేలు కిచ్చిన
ధర్మశాస్త్ర నియమాలకు అనుగుణంగా వారాపని చేశారు.
41 హేమాను, యెదూతూను, ఇతర యాజకులు పేరు
పేరునా ఎంపిక చేయబడి యెహోవాకు స్తుతిగీతాలు
పాడటానికి నియమింపబడ్డారు. ఎందు వల్లననగా దేవుని
ప్రేమ నిరంతరం కొనసాగుతుంది గనుక. 42 హేమాను,
యెదూతూను వారితో వుండి బాకాలు వూదుతూ,
తాళాలు వాయించారు. దేవునిపై భక్తిగీతాలు పాడేట
ప్పుడు వారు ఇతర వాద్య విశేషాలను కూడ వాయించే
వారు. యెదూతూను కుమారుడు ద్వారాల వద్ద
కాపలాకై నియమింపబడ్డాడు. 43 పిమ్మట అందరూ తమ
తమ ఇండ్లకు వెళ్లిపోయారు. దావీదు కూడ తన
కుటుంబం వారిని ఆశీర్వదించటానికి ఇంటికి వెళ్లాడు.

## దావీదుకు దేవుని వాగ్దానం

17 దావీదు తన కొత్త ఇంట్లో ప్రవేశించాక యాజ
కుడైన నాతానును పిలిచి ఇలా అన్నాడు:
"చూడండి, నేను దేవదారు కలపతో నిర్మించిన
ఇంటిలో వుంటున్నాను. కాని దేవుని ఒడంబడిక పెట్టె
మాత్రం గుడారంలోనే వుంది! నేను దేవునికి ఒక
ఆలయం నిర్మింపదలిచాను."

[2]“నీవు ఏది చేయదలచుకొంటే అది చేయవచ్చు.
దేవుడు నీకు తోడై వున్నాడు” అని నాతాను దావీదుకు
సమాధానమిచ్చాడు. [3]కాని ఆ రోజు రాత్రి దేవుని
వాక్కు నాతానుకు వినిపించింది. [4]యెహోవా ఇలా
అన్నాడు: “నీవు వెళ్లి నా సేవకుడైన దావీదుతో ఈ
విషయాలు చెప్పు: యెహోవా ఇలా అంటున్నాడు:
‘దావీదూ, నేను నివసించటానికి ఆలయం కట్టించేది
నీవు కాదు. [5-6]ఇశ్రాయేలీయులను నేను ఈజిప్టు నుండి
బయటికి తీసుకొని వచ్చినప్పటి నుండి ఈనాటి వరకు
నేను ఒక ఆలయంలో నివసించలేదు. ఇక్కడికీ, అక్క
డికీ నేను గుడారంలో వుండి కదలి వెళ్తూనే వున్నాను.
ఇశ్రాయేలు ప్రజలకు ప్రత్యేక నాయకులను నేను
ఎంపిక చేస్తూ వచ్చాను. ఆ నాయకులు నా ప్రజలకు
గొర్రెల కాపరులవలె వున్నారు. ఇశ్రాయేలులో నేను
ఒక చోటినుండి మరియొక చోటికి వెళ్లేటప్పుడు ఆ
నాయకులెవ్వరితోనూ, ‘మీరు నాకు దేవదారు కలపతో
ఒక ఆలయాన్ని ఎందుకు కట్టలేదు?’ అని నేను
అనలేదు.
[7]“కనుక, ఇప్పుడు ఈ విషయాలు నా సేవకుడైన
దావీదుకు చెప్పుము: సర్వశక్తిమంతుడగు యెహోవా
ఏమి చెప్పుచున్నాడనగా, ‘పొలాల్లో గొర్రెల మందలను
కాస్తున్న నిన్ను నేను తీసుకొన్నాను. నా ప్రజలకు
నిన్ను రాజుగా చేశాను. [8]నీవు వెళ్లిన ప్రతిచోటా నేను
నీతో వున్నాను. నీకు ముందుగా నేను నడిచాను. నీ
శత్రువులను సంహరించాను. నిన్ను ఇప్పుడు ఈ
భూమిమీద మిక్కిలి ప్రముఖ వ్యక్తిగా చేసాను. [9]ఈ
ప్రదేశాన్ని నా ప్రజలైన ఇశ్రాయేలీయులకు ఇస్తు
న్నాను. వారు తమ మొక్కలను నాటుతారు. వారి
చెట్లకింద వారు ప్రశాంతంగా కూర్చుంటారు. ఇక ఏ
మాత్రం వారు అవస్థపడవలసిన అవసరం లేదు. దుష్టు
లెవ్వరూ ఇకమీదట పూర్వంవలె వారిని బాధించరు.
[10]ప్రమాదాలు సంభవించినందువల్లనే నా ప్రజలైన ఇశ్రా
యేలీయుల సంరక్షణకై నేను నాయ కులను ఎంపిక
చేశాను. నేనింకా నీ శత్రువులను ఓడిస్తాను.
“‘యెహోవా నీకు ఒక నివాసం ఏర్పాటు
చేయునని నేను నీకు చెప్పుచున్నాను.* [11]నీవు చని
పోయి నీ పూర్వీకులను చేరినప్పుడు నీ సంతానాన్ని
నూతన రాజుగా చేస్తాను. కొత్త రాజు నీ కుమారు
లలో ఒకడవుతాడు. అతని రాజ్యాన్ని నేను బలపర్చు
తాను. [12]నీ కుమారుడు నాకొక ఆలయం కట్టిస్తాడు.
నీ కుమారుని సంతానం సదా పరిపాలించేలా నేను
చేస్తాను. [13]నేను అతనికి తండ్రిలా వుంటాను. అతను
నాకు బిడ్డలా వుంటాడు. నీకు ముందు సౌలు రాజుగా
వున్నాడు. సౌలుకు నా మద్దతును ఉపసం హరించు
కున్నాను. కాని నీ కుమారుని మాత్రం నేను సదా
ప్రేమిస్తాను [14]ఎప్పటికీ అతని అధీనంలో నా ఆల
యాన్ని, ఈ రాజ్యాన్ని వుంచుతాను. అతని పాలన
శాశ్వతంగా కొనసాగుతుంది!’”
[15]తనకు కల్గిన దైవ దర్శనాన్ని గురించి, దేవుడు
చెప్పిన విషయాలన్నిటి గురించి దావీదుకు నాతాను
వివరంగా చెప్పాడు.

## దావీదు ప్రార్థన

[16]అది విన్న రాజైన దావీదు పవిత్ర గుడారంలోకి
వెళ్లి యెహోవా ముందు కూర్చున్నాడు. దావీదు
ఇలా ప్రార్థన చేశాడు: “యెహోవా దేవా, నీవు నాకు,
నా కుటుంబానికీ ఎంతో మేలు చేశావు! కారణం
మాత్రం నాకు తెలియదు. [17]వాటన్నిటికీ మించి,
భవిష్యత్తులో నా కుటుంబానికి ఏమి జరుగుతుందో
కూడ నీవు నాకు తెలియపర్చావు. నన్నొక ముఖ్యమైన
వ్యక్తిగా నీవు పరిగణించావు! [18]నేను ఇంతకంటే ఏమి
చెప్పగలను? నీవు నాకు ఎంతో చేసావు! కేవలం
నేను నీ సేవకుడను. అది నీకు తెలుసు! [19]యెహోవా,
ఈ అద్భుతక్రియ నీవు నాపట్ల జరిపించావు. నీవు
సంకల్పించావు గనుక నీవది చేసావు! [20]నీవంటి దేవుడు
మరొక్కడు లేడు ప్రభూ! నీవు తప్ప వేరొక దేవుడు
లేడు! ఈ విధంగా మరేదేవం అద్భుత కార్యాలు జరి
పించినట్లు మేము వినలేదు! [21]ఇశ్రాయేలు వంటి మరో
దేశం వున్నదా? లేదు! ఈ అద్భుతకార్యాలు నీవు
జరిపించిన దేశం భూమి మీద ఇశ్రాయేలు ఒక్కటే.
నీవు మమ్మల్ని ఈజిప్టు నుండి బయటకు తీసు
కొనివచ్చి మాకు స్వేచ్ఛ కలుగజేశావు. ఆ విధంగా నీ
ఘనతను చాటావు! నీ ప్రజలకు ముందుగా నీవు
నడిచి అన్యులు మాకొరకు వారి రాజ్యన్ని విడిచి
పోయేలా చేశావు! [22]ఇశ్రాయేలును నీవు స్వీకరించి
శాశ్వతంగా వారిని నీ ప్రజలుగా చేసుకొన్నావు. ప్రభువా,
నీవు వారికి దేవుడవై యున్నావు!
[23]“యెహోవా నాకు, నా కుటుంబానికి నీవు ఈ
వాగ్దానం చేశావు. సదా నీ మాట నిలబెట్టుకో. దేవా!
నీవు చేస్తానని చెప్పినదంతా జరిగేలా చెయ్యి! [24]నీవు
నమ్మతగిన వాడవని నిరూపించు తండ్రీ! ప్రజలు నీ
పేరును ఎల్లప్పుడూ గౌరవించుదురుగాక! అప్పుడు
సర్వశక్తుడగు యెహోవా ఇశ్రాయేలు దైవమని ప్రజలు
అంటారు! నేను నీ సేవకుడను! దయచేసి నా కుటుం
బాన్ని బలపర్చి, నీ సన్నిధిలో వర్థిల్లేలా చేయి.
[25]“నా దేవా, నీవు నాకొక నివాసం ఏర్పాటు చేస్తాను
అని అన్నావు. అందుచే నీ సేవకుడనైన నేను
మనోధైర్యము కలిగివున్నాను. అందుచే నేను నిన్ను
ఈ సంగతులను చేయమని అడుగుతున్నాను.
[26]యెహోవా, నీవే దేవుడవు. ఈ మేలు చేస్తానని

---

**యెహోవా ... చెప్పుచున్నాను** నివాసం అనగా నిజమైన ఇల్లు కాదు. యెహోవా దావీదు వంశం వారిని చాలా సంవత్సరాల వరకు రాజులుగా చేస్తాడని అర్థం.

నీవు నాకు వాగ్దానం చేశావు. 27యెహోవా, నా కుటుం
బాన్ని దీవించటంలో నీవు చాలా ఉదారంగా వ్యవహ
రించావు! నీ సన్నిధిలో నా కుటుంబం సదా మెలగు
తుందని నీవు అన్నావు. నీవు నా కుటుంబాన్ని
అశీర్వదించావు. యెహోవా, నా కుటుంబం ఎల్లవేళలా
నీ ఆశీర్వాదం పొందుతుంది."

### దావీదు వివిధ రాజ్యాలను జయించుట

18 తరువాత దావీదు ఫిలిష్తీయులపైకి దండెత్తి
వారిని ఓడించాడు. ఫిలిష్తీయులనుండి గాతు
నగరాన్ని, దాని చుట్టు ప్రక్కలనున్న పట్టణాలను వశ
పర్చుకున్నాడు.
2పిమ్మట దావీదు మోయాబు దేశాన్ని ఓడించాడు.
మోయాబీయులు దావీదుకు దాసులయ్యారు. వారు
బంగారం, ఇతర కానుకలను దావీదుకు కప్పంగా
చెల్లించారు.
3హదదెజెరు సైన్యంతో కూడ దావీదు యుద్ధం
చేశాడు. సోబా రాజు హదదెజెరు. ఆ సైన్యంతో దావీదు
హమాతు పట్టణం వరకు యుద్ధం నిర్వహించాడు.
దావీదు అలా ఎందుకు యుద్ధం చేశాడనగా హదదెజెరు
తన సామ్రాజ్యాన్ని యూఫ్రటీసు నదివరకు విస్త
రింపచేయటానికి ప్రయత్నించాడు. 4హదదెజెరుకు
చెందిన వెయ్యి రథాలను, ఏడువేల రథసారధులను,
ఇరవై వేల మంది కాల్బలాన్ని దావీదు వశపర్చు
కున్నాడు. హదదెజెరుకు చెందిన రథాల గుర్రాలలో
చాలా వాటి కాళ్లను దావీదు విరుగగొట్టాడు. కాని వంద
రథాలను లాగటానికి కావలసినన్ని మంచి గుర్రాలను
మాత్రం దావీదు రక్షించాడు. 5దమస్కు నగరంలోని
అరామీయులు (సిరియనులు) హదదెజెరుకు సహాయ
పడే నిమిత్తం వచ్చారు. హదదెజెరు సోబారాజు. కాని
దావీదు వారిని ఓడించి ఇరవై రెండువేల సిరియను
సైనికులను చంపివేశాడు. 6తరువాత దావీదు అరాము
దేశంలోగల దమస్కు నగరంలో తన సైనిక స్థావరాలు
నెలకొల్పాడు. అరామీయులు దావీదుకు సేవకులై
కప్పం చెల్లించారు. ఆ విధంగా దావీదు ఎక్కడికి వెళితే
అక్కడ యెహోవా అతనికి విజయాన్ని చేకూర్చాడు.
7హదదెజెరు సైన్యాధికారుల నుండి బంగారు డాళ్లను
దావీదు తీసుకొని యెరూషలేముకు తెచ్చాడు. 8టెబహు
(టిబ్హాతు), కూను పట్టణాల నుండి దావీదు చాలా
కంచును పట్టుకువచ్చాడు. ఈ పట్టణాలు హదదె
జెరుకు చెందినవి. తరువాత కాలంలో ఈ లోహాన్నే
సొలొమోను ఆలయానికి, కంచు సముద్రం, కంచు
స్తంభాలు, ఇతర వస్తు సామగ్రి చేయటానికి విని
యోగించాడు.
9హమాతు రాజు పేరు తోహూ. సోబారాజు పేరు
హదదెజెరు. హదదెజెరు సైన్యాన్నంతా దావీదు ఓడిం
చాడని తోహూ విన్నాడు. 10తోహూ తన కుమారుడైన
హదోరమును రాజైన దావీదు వద్దకు తాను శాంతి
కోరుతున్నట్లు, తనను దీవించమని అడగటానికి
పంపాడు. హదదెజెరుతో దావీదు యుద్ధం చేసి అతనిని
ఓడించిన సందర్భంగా తోహూ ఇది చేసాడు. ఇంతకు
ముందు తోహూ కూడ హదదెజెరుతో యుద్ధం చేసి
యున్నాడు. హదోరము తనతో వెండి, బంగారం,
కంచు లోహాలతో చేసిన రకరకాల వస్తువులు దావీదుకు
కానుకలుగా తీసుకొని వెళ్లి ఇచ్చాడు. 11రాజైన దావీదు
ఆ వస్తువులన్నిటినీ పవిత్రపరచి యెహోవాకు సమ
ర్పించాడు. పైగా ఎదోము, మోయాబుల నుండి,
అమ్మోనీయుల నుండి, ఫిలిష్తీయులనుండి, అమాలేకీ
యుల నుండి తెచ్చిన వెండి బంగారాలను కూడ
దావీదు యెహోవాకి సమర్పించాడు.
12సెరూయా కుమారుడైన అబీషై "ఉప్పులోయ"
అని పిలవబడే స్థలంలో పద్దెనిమిదివేల ఎదోమీయులను
చంపివేసాడు. 13ఎదోములో అబీషై సైనిక స్థావరాలు
కూడ ఏర్పాటు చేసాడు. ఎదోమీయులంతా దావీదుకు
సేవకులయ్యారు. దావీదు ఎక్కడికి వెళితే అక్కడ
యెహోవా అతనికి విజయం చేకూర్చిపెట్టాడు.

### దావీదు కింద ముఖ్య అధికారులు

14ఇశ్రాయేలంతటికీ దావీదు రాజు. ప్రతి పౌరునికీ
ఏది మంచిదో, న్యాయమైనదో దావీదు వారికి అది
చేశాడు. 15సెరూయా కుమారుడు యోవాబు దావీదు
సైన్యానికి అధిపతి. అహీలూదు కుమారుడైన యెహో
షాపాతు దావీదు చేసిన విషయాలన్నీ గ్రంథ రూపంలో
రాశాడు. 16సాదోకు, అబీమెలెకు యాజకులు.
సాదోకు తండ్రి పేరు అహీటూబు. అబీమెలెకు తండ్రి
అబ్యాతారు. షవ్షా లేఖకుడు. 17కెరేతీయులకు, పెలేతీ
యులకు (రాజు అంగరక్షకులు) నాయకుడుగా
బెనాయా నియమితుడయ్యాడు. బెనాయా తండ్రి
పేరు యెహోయాదా. దావీదు కుమారులు ముఖ్యవ్య
క్తులై దావీదు రాజుకు సహాయకులుగా వున్నారు.

### దావీదు మనుష్యులను అమ్మోనీయులు అవమాన పరచటం

19 అమ్మోనీయుల రాజు పేరు నాహాషు. నాహాషు
చనిపోగా అతని కుమారుడు నూతన రాజ
య్యాడు. 2ఇది విన్న దావీదు, "నాహాషు నాపట్ల చాలా
దయతో వున్నాడు. నేను కూడ నాహాషు కుమారుడు
హానూను పట్ల దయగలిగి వుంటాను" అని అన్నాడు.
కావున తన తండ్రి చనిపోయిన సందర్భంగా హానూ
నును పలకరించే నిమిత్తం దావీదు తన మనుష్యులను
పంపాడు. హానూనును ఓదార్చటానికి దావీదు దూతలు
మోయాబు దేశానికి వెళ్లారు.
3అమ్మోనీయుల పెద్దలు హానూనుతో ఇలా
అన్నారు: "నీవు మోసంలో పడవద్దు. దావీదు నిజంగా

నిన్ను ఓదార్చటానికి గాని, చనిపోయిన నీతండ్రి పట్ల
గౌరవభావంతో గాని తన మనుష్యులను పంపలేదు!
దావీదు తన మనుష్యులను కేవలం నీమీద, నీ రాజ్యం
మీద నిఘావేసి రహస్యాలను సేకరించటానికే పంపాడు.
నిజానికి దావీదు నీ రాజ్యాన్ని నాశనం చేయ సంక
ల్పించాడు.” 4దానితో దావీదు మనుష్యులను హానూను
బంధించి వారి గడ్డాలు* గొరిగించాడు. తొడల
దగ్గర వారి బట్టలు కూడ హానూను కత్తిరించాడు.
తరువాత వారిని పంపివేశాడు.
5దావీదు మనుష్యులు ఆ పరిస్థితిలో ఇంటికి వెళ్ల
టానికి సిగ్గుతో చాలా బాధపడ్డారు. అది చూసిన కొంత
మంది మనుష్యులు దావీదు వద్దకు వెళ్లి అతని మనుష్య
లకు జరిగిన అవమానాన్ని తెలియజేశారు. అది విన్న
దావీదు తన మనుష్యులకు ఇలా కబురు పంపాడుః
“మీ గడ్డాలు పెరిగే వరకు మీరు యెరికో పట్టణంలో
వుండండి. తరువాత మీరు ఇండ్లకు తిరిగిరండి.”
6ఇది జరిగిన పిమ్మట అమ్మోనీయులు తాము
దావీదుకు బద్ధశత్రువులైనట్లు గుర్తించారు. దానితో
హానూను, అమ్మోనీయులు డెబ్బై ఐదువేల పౌనుల*
(రెండువేల మణుగులు) వెండిని వెచ్చించి మెసపొతే
మియా (అరామ్నహరయీము) నుండి రథాలను,
రథసారధులను కొన్నారు. వారింకా అరాములోని
మయకా, సోబా నగరాల నుండి కూడ రథాలను,
వాటిని తోలే వారిని సేకరించారు. 7అమ్మోనీయులు
ముప్పది రెండువేల రథాలను కొన్నారు. వారు
మయకా రాజుకు, అతని సైన్యానికి కొంత సొమ్ము
చెల్లించి వారి సహాయాన్ని కూడ అర్థించారు. మయకా
రాజు, అతని సైనికులు వచ్చి మెదెబా పట్టణం వద్ద
గుడారాలు వేశారు. అమ్మోనీయులు తమ పట్టణాల
నుండి బయటకు వచ్చి యుద్ధానికి సిద్ధమయ్యారు.
8అమ్మోనీయులు యుద్ధానికి సిద్ధమవుతున్నారని
దావీదు విన్నాడు. అతను యోవాబును, ఇశ్రాయేలు
సైన్యాన్నంతటినీ అమ్మోనీయులను ఎదుర్కోటానికి
పంపాడు. 9అమ్మోనీయులంతా బహిరంగంగా వచ్చి
యుద్ధానికి సిద్ధంగా వున్నారు. వారు నగర ద్వారం
వద్ద వున్నారు. వారికి సహాయంగా వచ్చిన రాజులు
వారి సేనలతో బయట పొలాలలో దిగియుండిరి.
10తనపై యుద్ధం చేయటానికి రెండు సైనిక కూటా
లవారు సిద్ధంగా వున్నట్లు యోవాబు చూశాడు. ఒక
వర్గం తనముందు, రెండవ వర్గం తన వెనుక వున్నాయి.
అప్పుడు యోవాబు ఇశ్రాయేలు సైన్యంలో కాకలు
తీరిన వారిని కొంతమందిని ఎంపిక చేశాడు. వారిని
అరాము సైన్యంతో పోరాడటానికి పంపాడు.
11యోవాబు మిగిలిన ఇశ్రాయేలు సైన్యాన్ని అబీషై
అధీనంలో వుంచాడు. యోవాబు సోదరుడే అబీషై.
ఆ సైనికులు అమ్మోనీయుల సైన్యంతో యుద్ధం
చేయటానికి వెళ్లారు. 12అబీషైతో యోవాబు ఇలా
అన్నాడుః “అరాము సైన్యం గనుక నామీద పైచేయిగా
వుంటే నీవు నాకు సహాయంగా రావాలి. ఒకవేళ
అమ్మోనీయుల సైనికులు గనుక నీ శక్తికి మించివుంటే
నేను నీకు సహాయంగా వస్తాను. 13మన ప్రజల కొరకు,
మన దేవుని నగరాల కొరకు పోరాడే ఈ తరుణంలో
మనం చాలా ధైర్యంగా వుండాలి! యెహోవా ఏది
మంచిదని తలుస్తాడో దానిని ఆయన చేయుగాక!”
14యోవాబు, అతని సైనికులు కలిసి అరాము నుండి
వచ్చిన సైన్యాన్ని ఎదుర్కొన్నారు. అరాము సైన్యం
యోవాబు సైనికుల ధాటికి తట్టుకోలేక పారిపోయింది.
15అరాము సైన్యం పారిపోవటం అమ్మోను సైనికులు
చూసి, వారు కూడ పారిపోయారు. వారు అబీషైకి,
అతని సైన్యానికి జడిసి పారిపోయారు. అమ్మోనీ
యులు తమ నగరంలోకి వెళ్లిపోయారు. యోవాబు
యెరూషలేముకు తిరిగి వెళ్లాడు. 16ఇశ్రాయేలు తమను
ఓడించినట్లు అరాము నాయకులు అర్థం చేసు
కున్నారు. యూఫ్రటీసు నదికి తూర్పున నివసిస్తున్న
అరామీయులను సహాయంగా రమ్మని వారు కబురు
పంపారు. అరాముకు చెందిన హదదెజెరు సైన్యానికి
షోపకు అధిపతి. అరాములో ఇతర ప్రాంతాల నుండి
వచ్చిన సైన్యాలను కూడ షోపకు నడిపించాడు.
17అరాము ప్రజలు యుద్ధ ప్రయత్నాలు చేస్తు
న్నారనే వార్త దావీదు విన్నాడు. అందువల్ల దావీదు
ఇశ్రాయేలు ప్రజలందరినీ సమీకరించాడు. దావీదు
వారిని యొర్దాను నదిని దాటించాడు. వారు అరామీయు
లకు ఎదురుపడి నిలబడ్డారు. దావీదు తన సైన్యాన్ని
యుద్ధానికి సమాయత్తపరచి అరామీయులతో తల
పడ్డాడు.
18ఇశ్రాయేలీయుల నుండి అరామీయులు పారి
పోయారు. దావీదు, అతని సైనికులు కలిసి ఏడువేల
మంది అరాము రథసారధులను, నలుబదివేల మంది
అరాము సైనికులను చంపివేశారు.
19ఇశ్రాయేలీయులు తమను ఓడించారని హదదె
జెరు సైన్యాధికారులు తెలుసుకొని, దావీదుతో సంధి
చేసుకొన్నారు. వారు దావీదుకు సేవకులయ్యారు.
అటు తరువాత అరామీయులు ఎన్నడూ అమ్మోనీ
యులకు సహాయం చేయలేదు.

### అమ్మోనీయులను యోవాబు నాశనం చేయటం

20 ఆ తరువాత సంవత్సరం (వసంత కాలం)లో
యోవాబు ఇశ్రాయేలు సైన్యాన్ని యుద్ధానికి
నడిపాడు. సంవత్సరంలో అది రాజులు దండ

---

**దావీదు ... గడ్డాలు** ఇశ్రాయేలీయులు తమ గడ్డాలు గొరిగించుకోవటం మోషే ధర్మశాస్త్రానికి విరుద్ధం.

**డెబ్బై ఐదువేల పౌనులు** మూడువేల మూడువందల అరవై కిలోగ్రాములు.

యాత్రలు చేయటానికి అనువైన సమయం. కాని దావీదు మాత్రం యెరూషలేములోనే వున్నాడు. ఇంతలో ఇశ్రాయేలు సైన్యం అమ్మోను రాజ్యం మీదికి దండెత్తి, దానిని నాశనం చేసింది. పిమ్మట వారు రబ్బా నగరానికి వెళ్లారు. వారు నగరాన్ని చుట్టుముట్టి, ప్రజల రాకపోకలు నిలిపివేసారు. యోవాబు, ఇశ్రాయేలు సైనికులు రబ్బా నగరం నాశనమయ్యే వరకు దానిపై దాడిచేసారు.

2తరువాత దావీదు వచ్చి ఆ రాజు తలపై కిరీటాన్ని
తీసుకున్నాడు. ఆ బంగారు కిరీటం డెబ్బైఐదు పౌనుల (రెండు మణుగుల) బరువుంది. కిరీటంలో విలువైన రత్నాలు పొదగబడ్డాయి. ఆ కిరీటం దావీదు తలపై పెట్టబడింది. రబ్బా నగరం నుండి దావీదు అనేక
విలువైన వస్తు సామగ్రిని తెప్పించాడు. 3రబ్బా నగర
వాసులను దావీదు తీసుకొనివచ్చి వారిచే రంపాలతోను, ఇనుప సమ్మెటలతోను, గొడ్డళ్లతోను బలవంతంగా పని చేయించాడు. ప్రతి అమ్మోనీయుల నగరం లోను దావీదు ఈ విధంగానే చేసాడు. తరువాత దావీదు, అతని సైన్యం యెరూషలేముకు తిరిగి వెళ్లారు.

### ఫిలిష్తీ యోధుల సంహారం

4ఇదంతా అయిన పిమ్మట ఇశ్రాయేలు ప్రజలు
గెజెరు పట్టణం వద్ద ఫిలిష్తీయులతో తలపడ్డారు. ఈసారి హుషాతీయుడైన సిబ్బెకై సిప్పయి అను వానిని చంపివేసాడు. సిప్పయి ఫిలిష్తీ యోధుల సంతతివాడు. దానితో ఫిలిష్తీయులు ఇశ్రాయేలు వారికి బానిసలయ్యారు.

5ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయుల పైకి మరోసారి
యుద్ధానికి వెళ్లారు. యాయీరు కుమారుడైన ఎల్హానాను అనేవాడు లహ్మీని చంపాడు. లహ్మీ అనేవాడు గొల్యాతు సోదరుడు. గొల్యాతు గాతు పట్టణానికి చెందినవాడు. లహ్మీ చేతిలోని ఈటె చాలా పెద్దది. బరువైనది. అది నేతగాని మగ్గం దోనెవలె వుంటుంది.

6గాతు పట్టణం వద్ద ఫిలిష్తీయులతో ఇశ్రాయేలు
వారు మరొక యుద్ధం చేశారు. ఈ పట్టణంలో చాలా పొడుగైన మనిషి ఒకడున్నాడు. వాని కాళ్లకు, చేతులకు ఇరవై నాలుగు వేళ్లున్నాయి. వాని ప్రతి చేతికి, ప్రతి కాలికి ఆరేసి వేళ్లు చొప్పున వున్నాయి. అతడు కూడ ఫిలిష్తీయుల రెఫాయిము సంతానంలోనివాడే. 7ఆ
మనుష్యుడు ఇశ్రాయేలు వారిని చూచి ఎగతాళి చేసినప్పుడు, యోనాతాను వానిని చంపివేశాడు. యెనాతాను తండ్రి పేరు షిమ్యా. షిమ్యా దావీదుకు సోదరుడు.

8ఆ ఫిలిష్తీయులంతా గాతు పట్టణానికి చెందిన
రెఫాయిము సంతానమే. దావీదు, అతని సేవకులు కలిసి ఆ రాక్షసులనందరినీ చంపివేసారు.

### ఇశ్రాయేలీయులను లెక్కించిన దావీదు పాపం

21 ఇశ్రాయేలు ప్రజలకు వ్యతిరేకంగా సాతాను
పనిచేస్తూ వున్నాడు. ఇశ్రాయేలీయుల జనాభా లెక్కలు తీసేటందుకు అతడు దావీదును
ప్రోత్సహించాడు.* 2కావున దావీదు యెవాబును, ఇతర
ప్రజా నాయకులను పిలిచి ఇశ్రాయేలు ప్రజలందరినీ లెక్కపెట్టి ఎంతమంది వున్నారో చెప్పమన్నాడు. "దేశంలో బెయేర్షెబా నుండి దాను పట్టణం వరకు ప్రతి ఒక్కరినీ లెక్కపెట్టి నాకు చెప్పండి. అప్పుడు దేశ జనాభా వివరాలు నాకు తెలుస్తాయి" అని అన్నాడు.

3కాని యోవాబు ఇలా సమాధానమిచ్చాడు:
"యెహోవా తన రాజ్యాన్ని వందరెట్లు అభివృద్ధి చేయుగాక! నా ఏలినవాడా, మహారాజా! ఇశ్రాయేలు ప్రజలంతా నీ సేవకులు. ఈ పని నీవెందుకు చేయదలిచావు? దీనివల్ల నీవు ఇశ్రాయేలు ప్రజలందరినీ పాపం చేసిన నేరస్థులుగా చిత్రిస్తున్నావు!"

4కాని రాజైన దావీదు మొండివైఖరి దాల్చాడు. రాజు
చెప్పినట్లు యోవాబు చేయక తప్పలేదు. అందువల్ల యోవాబు ఇశ్రాయేలు దేశంలో ప్రజలను లెక్కిస్తూ నలుమూలలా తిరిగాడు. తరువాత యోవాబు యెరూషలేముకు తిరిగి వచ్చి 5దేశంలో ఎంత జనాభా వున్నదీ
దావీదుకు చెప్పాడు. ఇశ్రాయేలులో కత్తి పట్టగల యోధులు పదకొండు లక్షల మంది వున్నారు. యూదాలో కత్తి పట్టగల శూరులు నాలుగు లక్షల డెబ్బది వేలమంది వున్నారు. 6లేవి, బెన్యామీను వంశీ
యులను మాత్రం యోవాబు లెక్కించలేదు. రాజైన దావీదు ఆజ్ఞ తనకు ఇష్టం లేనిదైనందుననే యోవాబు ఆ వంశీయులను గణించలేదు. 7దేవుని దృష్టిలో
దావీదు గొప్ప తప్పిదం చేశాడు. అందువల్ల దేవుడు ఇశ్రాయేలును శిక్షించాడు.

### ఇశ్రాయేలును దేవుడు శిక్షించటం

8పిమ్మట దేవునితో దావీదు ఇలా విన్నవించు
కున్నాడు: "నేను చాలా తెలివితక్కువ పనిచేశాను. ఇశ్రాయేలు జనాభా లెక్కలు తీయించి నేను ఒక మహాపాపం చేశాను. ఇప్పుడు నీ సేవకుడనైన నాతప్పు మన్నించి నా పాపాన్ని తొలగించమని వేడుకుంటున్నాను."

9-10గాదు ఒక దీర్ఘదర్శి (ప్రవక్త), దావీదుకు భవిష్య
త్తును చెప్పే మార్గదర్శకుడు. ఒకనాడు గాదుతో యెహోవా ఇలా అన్నాడు: "నీవు వెళ్లి దావీదుకు ఇలా చెప్పుము: 'యెహోవా ఈ విధంగా తెలియ

---

**ఇశ్రాయేలు … ప్రోత్సహించాడు** దావీదు నేరం తన గర్వమే. అసంఖ్యాకంగా వున్న తన సైన్యాన్ని చూసుకుని గర్వపడ్డాడు. కాని తనకున్న దైవ బలాన్ని చూసుకుని గర్వపడలేదు అని భావం.

జేస్తున్నాడు: నేను నీకు మూడు పద్ధతులు సూచి
స్తున్నాను. వాటిలో నీవు ఒక దానిని ఎంపిక చేయాలి.
అప్పుడు నీవు కోరిన విధంగా నిన్ను శిక్షిస్తాను.’”
11-12 ప్రవక్తయగు గాదు తరువాత దావీదు వద్దకు
వెళ్లి ఈ విధంగా చెప్పాడు: యెహోవా సెలవిచ్చున
దేమనగా, “దావీదూ, నీకు ఏ శిక్ష కావాలో నీవే కోరుకో
మూడు సంవత్సరాల కరువు పరిస్థితి, లేక నీ శత్రువులు
కత్తిపట్టి మిమ్మల్ని తరుముకుంటూ రాగా మూడు
నెలల పాటు మీరు వారి నుండి పారిపోవుట లేక
యెహోవా మిమ్మల్ని మూడు రోజులు శిక్షకు
గురిచేయుట. అనగా ఈ మూడు రోజుల్లో దేశమంతా
భయంకర వ్యాధులు ప్రబలుతాయి. యెహోవా దూత
దేశం నలుమూలలా తిరుగుతూ ప్రజానాశనం చేస్తాడు.
దావీదూ, దేవుడు ఇప్పుడు నన్ను పంపియున్నాడు.
కావున దేవునికి నేను ఏమి సమాధానం చెప్పాలో నిర్ణ
యించి నీవు నాకు తప్పక తెలియజేయాలి.’
13 అందుకు ప్రవక్తయగు గాదుతో దావీదు ఇలా
అన్నాడు: “నేను ఆపదలో వున్నాను. నాకు శిక్ష విధించ
టానికి వేరొక మనుష్యుని నిర్ణయం నాకు అక్కరలేదు.
యెహోవా దయామయుడు. కావున నన్ను ఎలా
శిక్షించాలో యెహోవానే నిర్ణయిం చనీయండి.”
14 అప్పుడు యెహోవా ఇశ్రాయేలంతా భయంకర
వ్యాధులు సోకేలా చేశాడు. దానితో డెబ్బయి వేల
మంది ప్రజలు చనిపోయారు. 15 యెరూషలేమును
నాశనం చేయటానికి దేవుడు ఒక దేవదూతను
పంపాడు. ఆ దేవదూత యెరూషలేమును నాశనం
చేయ మొదలు పెట్టినప్పుడు యెహోవా చూసి బాధ
పడ్డాడు. అందువల్ల ఇశ్రాయేలును నాశనం చేయ
కూడదని ఆయన అనుకున్నాడు. ఇశ్రాయేలును
నాశనం చేస్తున్న దేవదూతతో యెహోవా, “అది
చాలు! ఆపివేయి” అని అన్నాడు. యెహోవాదూత
యెబూసీ* యుడగు ఒర్నాను నూర్పిడి కళ్లం వద్ద
నిలబడివున్నాడు.
16 దావీదు తలఎత్తి చూడగా యెహోవాదూత
ఆకాశంలో కన్పించాడు. దేవదూత తన ఖడ్గాన్ని
యెరూషలేము పైకి చాపివున్నాడు. అప్పుడు దావీదు,
తదితర పెద్దలు సాష్టాంగ నమస్కారం చేశారు. దావీదు,
ఇతర పెద్దలు తమ సంతాపాన్ని తెలియజేసే ప్రత్యేక
దుస్తులు ధరించారు.
17 దావీదు యెహోవాతో ఇలా విన్నవించు
కున్నాడు: “పాపం చేసిన వాణ్ణి నేను! జనాభా లెక్కలు
తీయమని నేనే ఆజ్ఞాపించాను! నేను పొరపాటు
చేశాను! కాని ఈ ఇశ్రాయేలు ప్రజలు ఏమి నేరం
చేశారు? నా దేవుడైన యెహోవా, నన్ను, నా
కుటుంబాన్ని శిక్షించుము! నీ ప్రజలను నాశనం
చేస్తున్న మహావ్యాధులను అరికట్టుము!”
18 అప్పుడు యెహోవాదూత ప్రవక్తయగు గాదు
తో ఇలా అన్నాడు: “యెహోవాను ఆరాధించటానికి
ఒక బలిపీఠం నిర్మించమని దావీదుకు చెప్పుము.
యెబూసీయుడగు ఒర్నాను నూర్పిడి కళ్లం వద్దనే
దావీదు ఆ బలిపీఠాన్ని నిర్మించాలి”. 19 గాదు ఆ విష
యాలను దావీదుకు తెలియజేశాడు. దావీదు ఒర్నాను
నూర్పిడి కళ్లం వద్దకు వెళ్లాడు.
20 ఒర్నాను గోధుమ పోతపోస్తున్నాడు. అతను తిరిగి
చూసి యెహోవా దూతను గమనించాడు. ఒర్నాను
నలుగురు కుమారులూ పారిపోయి దాక్కున్నారు.
21 దావీదు ఒర్నాను వద్దకు వస్తున్నాడు. ఒర్నాను తన
కళ్లం వదిలి దావీదు వద్దకు వెళ్లి అతని ముందు
సాష్టాంగపడ్డాడు. 22 దావీదు ఒర్నానుతో, “నీ నూర్పిడి
కళ్లాన్ని నాకివ్వు. ఈ స్థలంలో యెహోవాని ఆరాధించ
టానికి నేనొక బలిపీఠాన్ని నిర్మిస్తాను. ఈ కళ్లాన్ని
పూర్తి ధరకు నాకు అమ్మివేయి. అప్పుడు ఈ భయం
కర వ్యాధులు ఆగిపోతాయి” అని చెప్పాడు.
23 ఒర్నాను దావీదుకు ఇలా సమాధాన మిచ్చాడు:
“ఈ నూర్పిడి కళ్లాన్ని తీసుకొనండి! నీవు నా
ఏలినవాడవైన రాజువు. మీరు కోరిన విధంగా చేయండి.
చూడండి; దహన బలులుగా సమర్పించటానికి నేను
మీకు పశువులను కూడ ఇస్తాను. పీఠం మీద అగ్ని
వెలిగించటానికి మీకు కళ్లంలో వేసే బల్ల చెక్కలను
కూడ ఇస్తాను. ధాన్యార్పణను చెల్లించటానికి నేను
మీకు గోధుమలు కూడ ఇస్తాను. నేను ఇవన్నీ మీకు
ఇస్తాను!”
24 కాని దావీదు ఒర్నానుతో ఇలా అన్నాడు: “వద్దు,
నేను పూర్తి వెలయిచ్చే దీనిని కొనాలి. నీకు చెందిన
దేదీ నేను తీసుకొని యెహోవాకి ఇవ్వను. నాకు
ఊరకనే వచ్చిన దానినేదీ నేను యెహోవాకి అర్పణగా
చెల్లించను.”
25 కావున దావీదు ఒర్నానుకు సుమారు ఆరు
వందల తులాల (పదిహేను పౌనులు) బంగారం ఇచ్చి
ఆ స్థలం తీసుకున్నాడు. 26 యెహోవాను ఆరాధిం
చటానికి అక్కడ దావీదు ఒక బలిపీఠం కట్టించాడు.
దావీదు దహన బలులు, సమాధాన బలులు సమర్పిం
చాడు. దావీదు యెహోవాని ప్రార్థించాడు. ఆకాశం
నుండి అగ్నిని కిందికి పంపి యెహోవా దావీదు
ప్రార్థనను ఆలకించాడు. దహనబలులు ఇచ్చే పీఠం
మీదికి అగ్ని దిగింది. 27 అప్పుడు తన కత్తిని ఒరలో
పెట్టుమని యెహోవా తన దూతకు ఆజ్ఞాపించాడు.
28 యెహోవా ఒర్నాను కళ్లంలో తన ప్రార్థన
ఆలకించాడని దావీదు తెలుసుకొని ఆయనకు బలులు
సమర్పించాడు. 29 (పవిత్ర గుడారం, దహనబలుల బలి

---

**యెబూసీ** ఇశ్రాయేలీయులు యెరూషలేము నగ
రాన్ని కైవశం చేసుకొనక ముందు అక్కడ నివసించిన వ్యక్తి.
“యెబూస్” అన్నది యెరూషలేము పాత పేరు.

పీఠం గిబియోనులో ఎత్తైన స్థలంలో వున్నాయి. ఇశ్రా
యేలీయులు ఎడారిలో వున్నప్పుడు మోషే ఈ పవిత్ర
గుడారాన్ని తయారుచేశాడు. 30దావీదు భయపడిన
కారణంగా అతను పవిత్ర గుడారంలోకి వెళ్లి దేవునితో
మాట్లాడలేక పోయాడు. దావీదు యెహోవా దూతకు,
అతని కత్తికి భయపడ్డాడు.)

22 "యెహోవా దేవుని ఆలయం మరియు
దహనబలులకు బలిపీఠం ఇశ్రాయేలు ప్రజల
ఉపయోగార్థం ఇక్కడ నిర్మింపబడతాయి" అని దావీదు
అన్నాడు.

### ఆలయ నిర్మాణానికి దావీదు వ్యూహం

2ఇశ్రాయేలులో వుంటున్న అన్యజాతి వారందరినీ
ఒకచోట చేరుమని దావీదు ఉత్తరువు ఇచ్చాడు. వారిలో
నుండి రాళ్లు కొట్టే వారిని ఎంపిక చేశాడు. దేవాలయ
నిర్మాణానికి రాళ్లు చెక్కిసిద్ధం చేయటం వారి పని.
3దేవాలయ ద్వారపు తలుపులకు, బందులకు, మేకు
లకు కావలసిన ఇనుమును దావీదు సేకరించాడు.
బరువు తూకం వేయలేనంత కంచును కూడ దావీదు
సమకూర్చాడు. 4దావీదు ఇంకా లెక్కలేనన్ని దేవదారు
దూలాలను కూడా తెప్పించాడు. సీదోను, తూరు
నగర ప్రజలు దావీదుకు చాలా దేవదారు కలప పంపారు.
5దావీదు ఇలా అన్నాడు: "మనం యెహోవాకు
ఒక గొప్ప ఆలయం కడదాము. నా కుమారుడు
సొలొమోను చిన్నవాడు కావటంతో, అతను నేర్చు
కోవాల్సిన విషయాలు ఇంకా నేర్చుకోలేదు.
యెహోవా ఆలయం చాలా గొప్పదై వుండాలి. దాని
అందచందాలలోను, ఔన్నత్యంలోను ఆ దేవాలయం
సాటి రాజ్యాలన్నిటిలోను మేటిదై వుండాలి. అందువల్ల
దేవాలయ నిర్మాణానికి అవసరమైన అనేక ఏర్పాట్లు
చేస్తాను." తాను చనిపోయే ముందు దేవాలయ నిర్మా
ణానికి దావీదు అనేక ఏర్పాట్లు చేశాడు.
6పిమ్మట దావీదు తన కుమారుడైన సొలొమో
నును పిలిచాడు. ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు
ఒక ఆలయాన్ని కట్టుమని దావీదు సొలొమోనుకు
చెప్పాడు. 7సొలొమోనుతో దావీదు ఇలా అన్నాడు:
"నా కూమారుడా! నా దేవుడైన యెహోవానామ
మున నేనొక ఆలయం కట్టించాలనుకున్నాను. 8కాని
యెహోవా నాతో, 'దావీదూ, నీవు చాలా యుద్ధాలు
చేసి అనేకమందిని వధించావు. కావున నా పేరుమీద
నీవు ఆలయం కట్టించలేవు. 9కాని నీకొక శాంతి పరుడైన
కుమారు డున్నాడు. నీ కుమారునికి శాంతియుత
వాతావరణాన్ని కల్పిస్తాను. తనచుట్టూ వున్న అతని
శత్రువులు అతనిని ఏమీ బాధపెట్టరు. అతని పేరు
సొలొమోను.* సొలొమోను రాజుగా వున్న కాలంలో
ఇశ్రాయేలు శాంతి, సౌభాగ్యాలతో విలసిల్లేలా చేస్తాను.
10"నా పేరు మీద సొలొమోను ఒక ఆలయాన్ని
నిర్మిస్తాడు. సొలొమోను నా కుమారునిలా వుంటాడు.
నేనతనికి తండ్రిలా వ్యవహరిస్తాను. నేను సొలొమోను
రాజ్యాన్ని బలపరుస్తాను. పైగా అతని కుటుంబంలో
నుండి ఎవ్వరో ఒక్కరు శాశ్వతంగా రాజవుతూనే
వుంటారు!'"
11దావీదు ఇంకా ఇలా అన్నాడు: "కుమారుడా
ఇప్పుడు యెహోవా నీకు తోడై వుండుగాక!
యెహోవా నీవు నిర్మిస్తావని చెప్పినట్లు, దేవాలయ
నిర్మాణంలో నీవు విజయం సాధించెదవుగాక!
12యెహోవా నిన్ను ఇశ్రాయేలుకు రాజుగా చేస్తాడు.
ఇశ్రాయేలు ప్రజలను సమర్థవంతంగా పాలించే విధంగా
యెహోవా నీకు తెలివితేటలు, అవగాహన యిచ్చు
గాక!నీ దేవుడైన యెహోవా ధర్మశాస్త్రాన్ని అనుస
రించు. 13ఇశ్రాయేలు సంక్షేమం కొరకు దేవుడు
మోషేకు ఇచ్చిన ధర్మశాస్త్రాన్ని, నియమాలను నీవు
పాటించే జాగ్రత్త తీసుకొంటే, నీవు విజయం సాధిస్తావు.
నీవు శక్తిమంతుడవై, ధైర్యంగా వుండు. నీవు భయ
పడవద్దు.
14"సొలొమోనూ! యెహోవా ఆలయ నిర్మాణా
నికి ఏర్పాట్లు చేయటంలో నేను చాలా కష్టపడ్డాను.
నేను రెండు మణుగుల (మూడువేల ఏడువందల ఏభై
టన్నులు) బంగారాన్ని, పదికోట్ల మణుగుల (ముఫై
ఏడువేల ఐదువందల టన్నులు) వెండిని, తూకం వేయ
టానికి సాధ్యం కానంత కంచును, ఇనుమును ఇచ్చాను.
కలపను, రాయిని కూడ ఇచ్చాను. సొలొమోనూ,
నేనిచ్చిన దానికి తోడు నీవింకా కొంత సామగ్రిని
సమకూర్చవచ్చు. 15నీ వద్ద చాలా మంది రాతిని చెక్కే
శిల్పులు, వడ్రంగులు వున్నారు. ప్రతి పనిలోనూ
నిపుణులైన వారు నీకున్నారు. 16బంగారం, వెండి,
కంచు, ఇనుము పనులలో నేర్పరులు, అనుభవం వున్న
వారు నీవద్ద వున్నారు. ప్రవీణతగల పనివారు నీ వద్ద
లెక్కకు మించి వున్నారు. ఇప్పుడు పని మొదలు
పెట్టు. యెహోవా నీకు తోడై ఉండుగాక!"
17తరువాత ఇశ్రాయేలు పెద్దలందరికీ తన కుమా
రుడు సొలొమోనుకు సహాయపడుమని దావీదు ఆజ్ఞ
ఇచ్చాడు. 18ఆ పెద్దలందరికీ దావీదు యిలా చెప్పాడు:
"మీ దేవుడైన యెహోవా మీతో వున్నాడు. ఆయన
మీకు శాంతి నెలకొన్న కాలాన్ని ప్రసాదించాడు. మన
చుట్టూ వున్న దేశాలను ఓడించేలా యెహోవా నాకు
సహాయం చేశాడు. యెహోవా, ఆయన ప్రజలు
ఇప్పుడీ దేశంమీద ఆధిపత్యం వహించి వున్నారు.
19యెహోవా సంకల్పం నెరవేరటానికి మీరంతా
హృదయపూర్వకంగా ఆయనకు అంకిత మవ్వండి.
యెహోవా దేవునికి పవిత్ర ఆలయాన్ని నిర్మించండి.
యెహోవా పేరున ఆలయ నిర్మాణం చేయండి.

---

**సొలొమోను** హెబ్రీ భాషలో సొలొమోను అనగా శాంతి అని అర్థం.

పిమ్మట ఒడంబడిక పెట్టెను, ఇతర పవిత్ర పరికరాలను
ఆలయంలోకి తీసుకురండి.”

### ఆలయ సేవకై లేవీయులకు ఏర్పాట్లు

23 దావీదు ముసలివాడయ్యాడు. అందువల్ల
అతడు తన కుమారుడైన సొలొమోనును ఇశ్రా
యేలుకు కొత్త రాజుగా చేసాడు. సొలొమోను దావీదు
కుమారుడు. 2ఇశ్రాయేలు పెద్దలందరినీ దావీదు పిలి
పించాడు. అతడు యాజకులను, లేవీయులను కూడ
పిలిచాడు. 3లేవీయులలో ముప్పై యేండ్ల వారిని,
అంతకు పైబడిన వయస్సు వారిని దావీదు లెక్కించాడు.
ఆ లేవీయులు మొత్తం ముప్పై ఎనిమిది వేలమంది
వున్నారు. 4దావీదు ఇలా చెప్పాడు: “ఇరవై నాలుగు
వేలమంది లేవీయులు దేవాలయ నిర్మాణ కార్య
క్రమాన్ని పర్యవేక్షిస్తారు. ఆరువేల మంది రక్షక భటులు
గాను, న్యాయాధిపతులుగాను వ్యవహరిస్తారు. 5నాలుగు
వేల మంది లేవీయులు ద్వారపాలకులుగా పనిచేస్తారు.
మరి నాలుగు వేలమంది లేవీయులు ఆలయ గాయకు
లుగా వుంటారు. వారికొరకు నేను ప్రత్యేక వాద్యపరిక
రాలను సిద్ధం చేశాను. వారా వాద్య విశేషాలను యెహో
వాను స్తుతించటానాకి వినియోగిస్తారు.”
6దావీదు లేవీయులను మూడు వర్గాలుగా విభజిం
చాడు. ఆ మూడు వర్గాలకు లేవీ ముగ్గురు కుమారులు
ఆధిపత్యం వహించారు. గెర్షోను, కహాతు, మెరారి అని
ఆ ముగ్గురు కుమారుల పేర్లు.

### గెర్షోను వంశం

7లద్దాను, షిమీ అనేవారు గెర్షోను వంశంలోని వారు.
8లద్దానుకు ముగ్గురు కుమారులు. అతని పెద్ద కుమా
రుని పేరు యెహీయేలు. అతని మిగిలిన కుమారుల
పేర్లు జేతాము, యోవేలు. 9షిమీ కుమారులు
షెలోమీతు, హజీయేలు, హారాను అనువారు. ఈ
ముగ్గురు కుమారులు లద్దాను వంశంలో పెద్దలు.
10షిమీకి మరి నలుగురు కుమారులు. వారి పేర్లు
యహతు, జీజా,* యూషు, బెరీయా. 11యహతు
పెద్ద కుమారుడు. జీజా రెండవవాడు. కాని యూషుకు,
బెరీయాకు ఎక్కువ మంది పిల్లలు లేరు. కావున
యూషు, బెరీయా లిరువురూ ఒకే కుటుంబంగా
పరిగణింపబడ్డారు.

### కహాతు సంతతివారు

12కహాతుకు నలుగురు కుమారులు. వారు
అమ్రాము, ఇస్హారు. హెబ్రోను, ఉజ్జీయేలు.
13అమ్రాము కుమారుల పేర్లు అహరోను, మోషే.
అహరోను చాలా ప్రత్యేకమైన వ్యక్తిగా చూడబడ్డాడు.
అహరోను, అతని సంతతి వారు ఎల్లకాలమూ ప్రత్యేక
మైన వ్యక్తులుగానే ఎంపిక చేయబడ్డారు. వారు శాశ్వత
ప్రాతిపదికపై యాజకులుగా వుండటానికి ప్రత్యేకింప
బడ్డారు. అందువల్లనే వారు శాశ్వతంగా వేరుచేయ
బడ్డారు. అహరోను, అతని సంతతి వారు యెహోవా
ముందు ధూపం వేయటానికి నియమితులయ్యారు.
వారు యాజకులుగా యెహోవా సేవకు నియమితు
లయ్యారు. ఎల్లకాలమూ యెహోవా పేరుమీద వారు
ప్రజలను ఆశీర్వదించటానికి ఎంపిక చేయబడ్డారు.
14మోషే దైవజనుడు. మోషే కుమారులు కూడ
లేవి వంశానికి చెందినవారుగానే పరిగణింపబడ్డారు.
15గెర్షోము, ఎలీయెజెరు అనువారు మోషే కుమారులు.
16గెర్షోము పెద్ద కుమారుని పేరు షూబాయేలు.*
17ఎలీయెజెరు మొదటి కుమారుని పేరు రెహబ్యా.
ఎలీయెజెరుకు కుమారులు మరెవ్వరూ లేరు. కాని
రెహబ్యాకు మాత్రం చాలామంది కుమారులు కలిగారు.
18ఇస్హారు పెద్ద కుమారుని పేరు షెలోమీతు.
19హెబ్రోను పెద్ద కుమారుని పేరు యెరీయా.
హెబ్రోను రెండవ కుమారుడు అమర్యా. మూడవవాడు
యహజీయేలు. నాల్గవవాని పేరు యెక్మెయాము.
20ఉజ్జీయేలు పెద్ద కుమారుని పేరు మీకా.
రెండవవాడు యెషీయా.

### మెరారి సంతతివారు

21మెరారి కుమారులు మహలి, మూషి అనేవారు.
మహలి కుమారుల పేర్లు ఎలియాజరు, కీషు. 22ఎలి
యాజరు కుమారులు లేకుండగనే మరణించాడు.
అతనికి కేవలం కుమార్తెలు మాత్రం వున్నారు. ఎలి
యాజరు కుమార్తెలు తమ బంధువులనే వివాహ
మాడారు. కీషు కుమారులు వారి బంధువులు. 23మూషి
కుమారులు మహలి, ఏదెరు, యెరీమోతు అనే
ముగ్గురు.

### లేవీయుల పని

24లేవి సంతతివారు వారి వారి వంశకర్తల నను
సరించి లెక్కింపబడ్డారు. వారు తమ తమ కుటుంబా
లకు పెద్దలు. ప్రతి ఒక్కని పేరు పట్టికలో రాయ
బడింది. అలా ఎంచబడిన వారిలో ఇరవై ఏండ్లవారు,
అంతకు పైబడిన వయస్సువారు వున్నారు. వారు దేవాల
యంలో సేవ చేశారు.
25దావీదు ఇలా అన్నాడు: “ఇశ్రాయేలు దేవుడగు
యెహోవా తన ప్రజలకు శాంతి సమకూర్చిపెట్టాడు.
యెహోవా ఇశ్రాయేలులో శాశ్వతంగా వుండటానికి
వచ్చాడు. 26కావున లేవీయులు ఇక మీదట పవిత్ర
గుడారాన్ని గాని, దేవుని సేవలో వినియోగించే ఇతర
పరికరాలను గాని మోసే పనిలేదు.”

---

**జీజా** జీనా అని పాఠంతరం.

**షూబాయేలు** షెబూయేలు అని పాఠాంతరం.

27దావీదు ఇశ్రాయేలు వారికి లేవి వంశంవారిని
లెక్కించుమని చివరిసారిగా ఆజ్ఞ ఇచ్చాడు. వారు లేవీ
యులలో ఇరవై ఏండ్లు, అంతకు పైబడిన వారిని
లెక్కించారు.
28అహరోను సంతతివారికి లేవీయులు ఆల
యంలో యెహోవా సేవలో తోడ్పడేవారు. వారు
అలయ ఆవరణ, పక్క గదుల పరిశుభ్రత విషయంలో
కూడ శ్రద్ధ తీసుకొనేవారు. అన్ని పవిత్ర వస్తువులను
అపవిత్రపడకుండ చూసేవారు. ఆ విధంగా దేవాల
యంలో సేవ చేయటం వారి పని. 29ప్రత్యేకంగా
తయారుచేసిన రొట్టెను అర్పణగా ఆలయంలో బల్ల
మీద వుంచటం వారి బాధ్యత. పిండి తయారు
చేయటం, ధాన్యార్పణను చెల్లించటం, పులియని
రొట్టె తయారుచేయటం కూడ వారి బాధ్యత. రొట్టె
లుచేసే పెనాలు, రకరకాల కలగలుపు అర్పణల విష
యంలో వారు శ్రద్ధ తీసుకొనేవారు. ఆయా ద్రవ్యాల
కొలతల విషయంలో కూడ వారు జాగ్రత్త తీసుకొనే
వారు.
30లేవీయులు ప్రతి ఉదయం నిలబడి యెహో
వాకి కృతజ్ఞతాస్తుతులు అర్పించి, స్తుతి పాటలు
పాడేవారు. వారలా ప్రతి సాయంత్రం కూడ చేసేవారు.
31ప్రత్యేక విశ్రాంతి దినాలలోను, అమావాస్య విందుల
సమయంలోను మరియు ప్రత్యేక సెలవు దినాలలోను
లేవీయులు యెహోవాకి దహన బలులు సమర్పించే
వారు. వారు నిత్యం యెహోవా సన్నిధిలో సేవ
చేసేవారు. ప్రతిసారీ ఎంతమంది లేవీయులు సేవ
చేయాలి అనే విషయంలో వారికి ప్రత్యేక నియమా
లుండేవి. 32కావున తాము ఏఏ పనులు చేయాలో
అవన్నీ లేవీయులు నిర్వహించేవారు. వారు పవిత్ర
గుడారం, పవిత్ర స్థలాల విషయంలో కూడ వారు
తగిన జాగ్రత్తలు తీసుకొనేవారు. ఆ విధంగా వారి
బంధువులగు అహరోను వంశీయులకు వారు సహాయ
పడ్డారు. అహరోను సంతతివారెవరనగా యాజకులు,
ప్రధాన యాజకులు. ఆలయంలో యెహోవా సేవలో
ఈ యాజకులకు లేవీయులు సహాయపడ్డారు.

### యాజకులకు సేవను కేటాయించండం

24 అహరోను వంశంవారు ఎవరనగా: నాదాబు,
అబీహు, ఎలియాజరు, ఈతామారు. 2కాని
నాదాబు, అబీహు లిద్దరూ తమ తండ్రి కంటె ముందు
గానే చనిపోయారు. పైగా నాదాబు, అబీహులకు
కుమారులు కలుగలేదు. కావున ఎలియాజరు మరియు
ఈతామారు లిద్దరూ యాజకులుగా సేవచేశారు. 3ఎలి
యాజరు, ఈతామారు వంశం వారిని దావీదు రెండు
గుంపులుగా విభజించాడు. వారి వారి కార్యాలను సక్ర
మంగా నిర్వహించటానికి వీలుగా దావీదు వారిని రెండు
గుంపులుగా ఏర్పాటు చేశాడు. సాదోకు, అహీమెలెకుల
సహాయంతో దావీదు ఈ పనిచేశాడు. సాదోకు
ఎలియాజరు సంతతివాడు. అహీమెలెకు ఈతామారు
సంతతివాడు. 4ఈతామారు వంశంలో కంటె ఎలియా
జరు సంతతివారిలో ఎక్కువమంది నాయకులున్నారు.
ఎలియాజరు సంతతి వారిలో పదహారు మంది నాయ
కులుండగా, ఈతామారు సంతతివారిలో ఎనిమిది
మంది నాయకులు మాత్రమే వున్నారు. 5ప్రతి
వంశంలో నుండి మనుష్యులు ఎన్నుకోబడ్డారు. వారు
చీట్లు వేసి ఎంపిక నిర్వహించారు. పవిత్ర స్థలాన్ని
అధీనంలో వుంచు కొనేందుకు కొంత మందిని ఎన్ను
కొన్నారు. మరికొంత మంది యాజకులుగా సేవచేయ
టానికి ఎంపిక చేయబడ్డారు. వీరంతా ఎలియాజరు,
ఈతామారు వంశాలలోని వారు. 6షెమయా కార్యదర్శి.
ఇతడు నెతనేలు కుమారుడు. షెమయా లేవి సంతతి
వాడు. షెమయా ఆయా సంతతుల వారి పేర్లన్నీ
రాశాడు. రాజైన దావీదు ముందు, వారి పెద్దల ముందు
అతడు పేర్లు రాశాడు. యాజకుడైన సాదోకు, అహీమె
లెకు, యాజకుల కుటుంబాలలో పెద్దలు, ఇతర లేవీ
యుల పేర్లు వున్నాయి. అబ్యాతారు కుమారుడు అహీ
మెలెకు. చీట్లు వేసిన ప్రతిసారీ వారొక మనుష్యుని
ఎంపిక చేశారు. ఆ మనుష్యుని పేరు షెమయా రాసే
వాడు. కావున ఎలియాజరు, ఈతామారు వంశాలలోని
మనుష్యుల మధ్య పని విభజన జరిగింది.

7 మొదట ఎంపిక చేయబడినది యెహోయారీబు
వంశంవారు. రెండవ చీటీలో యెదాయా వంశం
వారు ఎంపిక చేయబడ్డారు.
8 మూడవ వంశం హారీము వారు. నాల్గవ వంశం
శెయొరీము వారు.
9 ఐదవ వంశం మల్కీయాకు చెందినది. ఆరవది
మీయామిను వంశానికి చెందినది.
10 ఏడవ చీటీ హక్కోజు వంశానికి పడింది. ఎనిమిదవ
చీటీలో అబీయా వంశం ఎంపిక చేయబడింది.
11 తొమ్మిదవ చీటీలో యేషూవ వంశం ఎంపిక
అయ్యింది. పదవ వంశం షెకన్యాది.
12 పదకొండవ చీటీ ఎల్యాషీబు వంశానికి పడింది.
పన్నెండవది యాకీము వంశానికి వచ్చింది.
13 పదమూడవ చీటీలో హుప్పా వంశం ఎంపిక
చేయబడింది. పదునాల్గవ చీటీ యెషెబాబు
వంశానికి వచ్చింది.
14 పదిహేనవ చీటి బిల్గావంశానికి పడింది దహారవ
చీటి ఇమ్మేరు వంశం వారికి వచ్చింది.
15 పదిహేడవ చీటి హెజీరు వంశానికి పడింది. పద్దె
నిమిదవది హప్పిస్సేనువంశానికి వచ్చింది.
16 పందొమ్మిదవ చీటీలో పెతహయా వంశం వారు
ఎన్నుకోబడ్డారు. ఇరవయ్యో చీటి యెహెజ్కేలు
వంశానికి వచ్చింది.

17 ఇరవై ఒకటవ చీటి , యాకీను వంశానికి వచ్చింది.
ఇరవై రెండవది గామూలు వర్గానికి వచ్చింది.
18 ఇరవై మూడవ చీటి దెలాయ్యా వంశానికి పడింది.
ఇరవై నాల్గవది మయజ్యా వంశానికి వచ్చింది.

19ఈ వంశాల వారంతా ఆలయంలో సేవ చేయ
టానికి ఎంపిక చేయబడ్డారు. ఆలయపు సేవలో
అహరోను ఆదేశ సూత్రాలను వారు పాటించారు. ఆ
నియమాలను ఇశ్రాయేలు దేవుడైన యెహోవా అహరో
నుకు ఇచ్చాడు.

### ఇతర లేవీయులు

20మిగిలిన లేవి సంతతివారి పేర్లు ఇలా వున్నాయి:

అమ్రాము సంతానం నుండి షూబాయేలు.
షూబాయేలు సంతానం నుండి యెహెద్యాహు.
21 రెహబ్యా వంశం నుండి పెద్దవాడైన ఇష్షీయా.
22 ఇస్హారీ వంశం నుండి షెలోమోతు. షెలోమోతు
వంశం నుండి యహతు.
23 హెబ్రోను పెద్ద కుమారుడు యెరీయా.
హెబ్రోను రెండవ కుమారుడు అమర్యా.
మూడవ వాడు యహజీయేలు. నాల్గవ కుమా
రుడు యెక్మెయాము.
24 ఉజ్జీయేలు కుమారుడు మీకా. మీకా కుమా రుడు
షామీరు.
25 మీకా సోదరుడు ఇష్షీ ఇష్షీ కుమారుడు జెకర్యా.
26 మెరారీ* సంతతి వారు మహలి, మూషి మరియు
అతని కుమారుడైన యహజీయాహు
27 మెరారి కుమారుడు యహ జీయాహునకు
షోహాము, జక్కూరు అను కుమారులు గలరు.
28 మహలి కుమారుడు ఎలియాజరు. కాని ఎలియా
జరుకు కుమారులు లేరు.
29 కీషు కుమారుడు యెరహ్మెయేలు.
30 మూషి కుమారులు మహలి, ఏదెరు మరియు
యెరీమోతు.

వారంతా లేవీయుల కుటుంబాలలో పెద్దలు. వారి
పేర్లు వారి కుటుంబాల ప్రకారం వ్రాయబడ్డాయి.
31వారంతా ప్రత్యేక కార్యాలు నిర్వహించటానికి ఎంపిక
చేయబడ్డారు. యాజకులైన వారి బంధువుల వలెనే
వారుకూడ చీట్లు వేశారు. వారు రాజైన దావీదు,
సాదోకు, అహీమెలెకు, యాజకుల, లేవీయుల పెద్దల
ముందు చీట్లు వేశారు. వారి వారి పనులను కేటాయిం
చేటప్పుడు వారి పెద్ద కుటుంబాలకు, చిన్న కుటుంబా
లకు ఒకే రీతి చీట్లు వేయబడ్డాయి.

**మెరారీ** హెబ్రీలో 26,27 వచనాలు అర్థం చేసి
కోవటం కష్టం.

### గాయక బృందాలు

25 దావీదు, సైన్యాధికారులు కలిసి ఆసాపు
కుమారులను ప్రత్యేక సేవల కొరకు కేటా
యించారు. ఆసాపు కుమారులు హేమాను, యెదూ
తూను అనేవారు. ప్రవచనాలు చెప్పటం, తంబుర,
సితారులను, తాళాలను వాయిస్తూ దేవుని వాక్యం
ప్రకటించటం వారి విశేష సేవా కార్యక్రమం. ఈ
విధమైన అసాధారణ సేవలో వున్న వారి పేర్లు ఏవనగా:
2ఆసాపు కుటుంబం నుండి జక్కూరు, యోసేపు,
నెతన్యా మరియు అషర్యేలా. రాజైన దావీదు ప్రవ
చించటానికి ఆసాపును ఎంపికచేశాడు. ఆసాపు తన
కుమారులకు నాయకత్వం వహించాడు.
3యెదూతూను కుటుంబం నుండి గెదల్యా, జెరీ,
యెషయా, షిమీ, హషబ్యా, మత్తిత్యా అనువారు ఆరు
గురు. యెదూతూను తన కుమారులకు నాయ కత్వం
వహించాడు. యెదూతూను ప్రవచించటానికి సితారు
వాయించే వాడు. యెహోవాకి వందనాలు చెల్లిస్తూ
స్తుతి పాటలు పాడేవాడు.
4దేవుని సేవలో నిమగ్నమైన హేమాను కుమా
రులైన బక్కీయాహు, మత్తన్యా, ఉజ్జీయేలు, షూబా
యేలు మరియు యెరీమోతు, హనన్యా, హనానీ, ఎలీ
య్యాతా, గిద్దల్తీ, రోమమ్తీయెజెరు, యెష్బెకాషా,
మల్లోతి, హోతీరు మరియు మహజీయోతు. 5వీరంతా
హేమాను కుమారులు. హేమాను దీర్ఘదర్శి (ప్రవక్త)
హేమానును బలపరుస్తానని దేవుడు మాటయిచ్చాడు.
అందువల్ల హేమాను బహు సంతానవంతుడయ్యాడు.
దేవుడు హేమానుకు పధ్నాలుగు మంది కుమారులను,
ముగ్గురు కుమార్తెలను కలుగజేశాడు. 6హేమాను తన
కుమారులనందరినీ ఆలయంలో భక్తి పాట సంకీర్తనలో
పాల్గొనేలా చేసాడు. అతని కుమారులంతా తాళాలు,
సితారాలు, వీణలు వాయించేవారు. అది వారు ఆల
యంలో సేవచేసే పద్ధతి. రాజైన దావీదు వారిని ఎంపిక
చేశాడు. 7వారితో పాటు వారి బంధువులైన లేవి వంశీ
యులు కూడ పాటలు పాడటంలో శిక్షణ పొందారు.
అలా దేవునికి స్తుతి పాటలు పాడటం నేర్చుకున్న
వారిలో రెండు వందల ఎనభై ఎనిమిది మంది
వున్నారు.
8ప్రతి ఒక్కడూ ఏ పని చేయాలో నిర్ణయించటానికి
వారు చీట్లు వేసారు. ప్రతి ఒక్కడూ సమానంగా
చూడబడ్డాడు. చీట్లు వేయటంలో చిన్న, పెద్ద,
గురువు, శిష్యుడు అనే తేడా లేకుండా అంతా సమా
నంగా చూడబడ్డారు. 9మొదటిగా ఆసాపు (యోసేపు)
కుమారులు, బంధువుల నుండి పన్నెండు మంది
ఎంపిక చేయబడ్డారు.
రెండవ చీటి ద్వారా గెదల్యా కుమారులు, బంధు
వుల నుండి మొత్తం పన్నెండు మంది ఎంపికైనారు.
10మూడవ చీటి జక్కూరు పేరున పడగా అతని

కుమారులు, బంధువులు పన్నెండు మంది ఎన్నుకో
బడ్డారు.
11నాల్గవసారి యిజ్రీ కుమారులు, బంధువులు
పన్నెండుగురు ఎన్నుకోబడ్డారు.
12ఐదవ చీటీ ద్వారా నెతన్యా కుమారులు,
బంధువులు పన్నెండు మంది ఎంపికైనారు.
13ఆరవ చీటీ ద్వారా బక్కీయాహు కుమారులు,
బంధువులు పన్నెండుగురు ఎన్నుకోబడ్డారు.
14ఏడవ చీటి యెషర్యేలా పేరున వచ్చింది. అతని
కుమారులు, బంధువులు పన్నెండుమంది ఎంపికై
నారు.
15ఎనిమిదవ చీటి ద్వారా ఎంపికైన పన్నెండు మందీ
యెషయా కుమారులు, బంధువులు.
16తొమ్మిదవ చీటీ ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ మత్తన్యా కుమారులు, బంధువులు.
17పదవ చీటీ ద్వారా ఎంపికైన పన్నెండు మందీ
షిమీ కుమారులు, బంధువులు.
18పదకొండవ చీటీ ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ అజరేలు కుమారులు, బంధువులు.
19పన్నెండవ చీటి ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ హష్బయ్యా కుమారులు, బంధువులు.
20పదమూడవ చీటి ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ షూబాయేలు కుమారులు, బంధువులు.
21పధ్నాల్గవ చీటి మత్తిత్యాకు పడింది. అతని
కుమారులు, బంధువులు పన్నెండుగురు ఎంపికైనారు.
22పదిహేనవ చీటి యెరేమోతుకు వెళ్లింది. అతని
కుమారులు, బంధువులు పన్నెండుగురు ఎంపికైనారు.
23పదహారవ చీటీ ద్వారా పన్నెండుగురు ఎంపిక
చేయబడ్డారు. వారు హనన్యా కుమారులు, బంధువులు.
24పదిహేడవ చీటీ ద్వారా పన్నెండుగురు ఎంపిక
చేయబడ్డారు. వారు యొష్బెకాషా కుమారులు,
బంధువులు.
25పద్దెనిమిదవ చీటీ ద్వారా ఎంపికైనవారు పన్నెండు
మంది. వారు హనానీ కుమారులు, బంధువులు.
26పందొమ్మిదవ చీటీ ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ మల్లోతి కుమారులు, బంధువులు.
27ఇరవయ్యో చీటీ ద్వారా ఎంపికైన పన్నెండు
మందీ ఎలీయ్యాతా కుమారులు, బంధువులు.
28ఇరవై ఒకటో చీటి హోతీరుకు పడింది. అతని
కుమారులు, బంధువులు పన్నెండుగురు ఎంపికైనారు.
29ఇరవై రెండవ చీటి గిద్దల్తీకి వచ్చింది. అతని కుమా
రులు, బంధువులు పన్నెండుగురు ఎంపికైనారు.
30ఇరవై మూడవ చీటి మహజీయోతుకు పడింది.
అతని కుమారులు, బంధువులు పన్నెండుమంది
ఎంపికైనారు. 31ఇరవై నాల్గవ చీటీ రోమమ్తీయెజెరుకు
వచ్చింది. అతని కుమారులు, బంధువులు పన్నెండు
మంది ఎంపికైనారు.

## ద్వారపాలకులు

26 కోరహు వంశం నుండి వచ్చిన ద్వారపాలకుల
జట్టులు ఏవనగా: మెషెలెమ్యా మరియు అతని
కుమారులు, (మెషెలెమ్యా తండ్రి పేరు కోరే. అతడు
ఆసాపు వంశంలోని వాడు.) 2మెషెలెమ్యా సంతాన
వంతుడు. జెకర్యా పెద్దవాడు. యెదీయవేలు రెండవ
వాడు. జెబద్యా మూడవవాడు. యత్నీయేలు నాల్గవ
వాడు. 3ఏలాము ఐదవ కుమారుడు. యెహోహానాను
ఆరవవాడు. ఎల్యోయేనై ఏడవ కుమారుడు.
4ఓబేదెదోము, అతని కుమారులు. ఓబేదెదోము
పెద్ద కుమారుడు షెమయా. యెహోజాబాదు అతని
రెండవ కుమారుడు. యోవాహు మూడవవాడు. శాకారు
అతని నాల్గవ కుమారుడు. నెతనేలు అయిదవవాడు.
5అమ్మీయేలు ఆరవవాడు. ఇశ్శాఖారు అతని ఏడవ
కుమారుడు. పెయుల్లెతై అతని ఎనిమిదవ కుమారుడు.
దేవుడు నిజంగా ఓబేదెదోమును* ఆశీర్వదించాడు.
6ఓబేదెదోము కుమారుడు షెమయా. షెమయాకు
కూడ కుమారులున్నారు. తన తండ్రి కుటుంబంలో
షెమయా కుమారులంతా ధైర్యంగల సేనానులు
కావటంతో వారు నాయకులయ్యారు. 7షెమయా
కుమారులు ఒత్ని, రెఫాయేలు, ఓబేదు, ఎల్జాబాదు,
ఎలీహు, మరియు సెమక్యా అనేవారు. ఎల్జాబాదు బంధు
వులు నేర్పరులైన పనివారు. 8వారంతా ఓబేదెదోము
సంతతివారు. వారు, వారి కుమారులు, బంధువులు
అంతా పరాక్రమశాలురు. వారు మంచి రక్షక భటులు.
ఓబేదెదోము సంతతివారు అరువది ఇద్దరు.
9మెషెలెమ్యా కుమారులు, బంధువులు పరాక్రమ
వంతులు. అతని కొడుకులు, బంధువులు కలిసి పద్దె
నిమిది మంది వున్నారు. 10మెరారీ వంశానికి చెందిన
ద్వారపాలకులు ఎవరనగా, హోసా పెద్ద కుమారునిగా
షిమ్రీ పరిగణింపబడ్డాడు. నిజంగా షిమ్రీ పెద్ద కుమా
రుడు కాదు. కాని అతని తండ్రి అతనిని పెద్దవాడుగా
ఆదరించాడు. 11హిల్కీయా అతని రెండవ కుమారుడు.
టెబల్యాహు అతని మూడవ కుమారుడు. జెకర్యా
నాల్గవవాడు. అంతా కలిసి హోసాకు పదముగ్గురు
కుమారులు, బంధువులు వున్నారు. 12వీరు ద్వార
పాలకుల జట్ల నాయకులు. వీరి ఇతర బంధువుల
వలెనే ద్వారపాలకులకు ఆలయ సేవలో ఒక విశిష్ట
మైన పద్ధతి వుంది. 13ప్రతి కుటుంబానికి ఒక ద్వారం
కాపలా కొరకు కేటాయించబడింది. ప్రతి కుటుంబానికీ
ద్వారాలు నిర్ణయించటానికి చీట్లు వేయబడ్డాయి. ఈ
విషయంలో చిన్నా పెద్దా అనే భేదం పాటించకుండా
అంతా సమంగా చూడబడ్డారు.

---

**ఓబేదెదోము** ఒడంబడిక పెట్టె అతని ఇంటిలో వున్న
ప్పుడు, దేవుడు ఓబేదెదోమును ఆశీర్వదించాడు. చూడండి
మొదటి దిన.వృ. 21.

14చీట్లు వేయగా తూర్పుద్వారం షెలెమ్యాకు
వచ్చింది. షెలెమ్యా కుమారుడు జెకర్యాకు కూడ
చీట్లు వేయబడ్డాయి. జెకర్యా చాలా తెలివైన సలహా
దారు. ఉత్తర ద్వారం జెకర్యాకు వచ్చింది. 15ఓబేదె
దోముకు దక్షిణ ద్వారం వచ్చింది. ఓబేదెదోము
కుమారులు విలువైన వస్తువులు దాచే ఇంటి కాపలాకై
ఎంపిక చేయబడ్డారు. 16షుప్పీము, హోసా పడమటి
ద్వారం కాపలాకు, ఎగువ మార్గంలో వున్న షల్లెకెతు
ద్వారం కాపలాకు ఎంపిక చేయబడ్డారు.
భటులు ఒకరి పక్కన ఒకరు వరుసగా నిలబడ్డారు.
17తూర్పుద్వారం వద్ద ప్రతి రోజూ ఆరుగురు లేవీ
యులు కాపలా వుండేవారు. ఉత్తర ద్వారం వద్ద ప్రతి
రోజూ ఐదుగురు లేవీయులు నిలబడేవారు. దక్షిణ
ద్వారం వద్ద నలుగురు లేవీయులు నిలబడేవారు. విలు
వైన వస్తువులు దాచే ఇంటివద్ద ఇద్దరు లేవీయులు
కాపలా వుండేవారు. 18పడమటి సభాస్థానం వద్ద నలు
గురు భటులు కాపలా వుండేవారు. సభాస్థానానికి వెళ్లే
బాటమీద ఇద్దరు భటులు వుండేవారు.
19ఇవి ద్వారపాలకుల జట్లు. ఆ ద్వారపాలకులు
కోరహు (కోరే), మెరారి సంతతివారు.

## కోశాధికారి, మరియు ఇతర అధికారులు

20అహీయా లేవీయుల వంశంవాడు. దేవాల
యంలో విలువైన వస్తువుల పరిరక్షణ అహీయా
బాధ్యత. పవిత్ర వస్తువులు, పరికరాలు వుంచిన స్థలా
లను కాపాడటం కూడా అహీయా బాధ్యత.
21గెర్షోను తెగవారిలో లద్దాను ఒక కుటుంబపు
మూలపురుషుడు. యెహీయేలీ అనేవాడు లద్దాను
వంశంలో ఒక నాయకుడు. 22యెహీయేలీ కుమారులు
జేతాము, అతని సోదరుడైన యోవేలు. దేవాలయంలో
విలువైన వస్తువులన్నిటి పరిరక్షణ వారి బాధ్యత.
23ఇతర నాయకులు అమ్రాము, ఇస్హారు, హెబ్రోను
మరియు ఉజ్జీయేలు వంశాల నుండి ఎంపిక చేయ
బడ్డారు. 24ఆలయంలో విలువైన వస్తువులపై కాపలా
షూబాయేలు బాధ్యత. షూబాయేలు తండ్రి పేరు
గెర్షోము. గెర్షోము తండ్రి పేరు మోషే. 25షూబాయేలు
బంధువుల వివరాలు: ఎలీయెజెరు తరపున అతని
బంధువులు ఎవరనగా: ఎలీయెజెరు కుమారుడు
రెహబ్యా. రెహబ్యా కుమారుడు యెషయా. యెషయా
కుమారుడు యెహోరాము. యోహోరాము కుమా
రుడు జిఖ్రీ. జిఖ్రీ కుమారుడు షెలోమీతు. 26షెలో
మీతు, అతని బంధువులు ఆలయానికై దావీదు సేక
రించిన వస్తువులన్నిటిపై కాపలా వున్నారు.
సైన్యాధికారులు కూడ ఆలయానికి విరాళాలు
ఇచ్చారు. 27వారు యుద్ధాలలో శత్రువుల నుండి తీసు
కొన్న వస్తువులలో కొన్నింటిని కూడ విరాళంగా
ఇచ్చారు. వాటన్నిటినీ వారు యెహోవా ఆలయ
నిర్మాణంలో వినియోగించటానికి ఇచ్చారు. 28షెలో
మీతు, అతని బంధువులు కలిసి దీర్ఘదర్శియగు (ప్రవక్త)
సమూయేలు, రాజైన సౌలు, నేరు కుమారుడగు
అబ్నేరు, సెరూయా కుమారుడైన యోవాబు ఇచ్చిన
పవిత్ర వస్తువులన్నిటి సంరక్షణ బాధ్యత కూడా వహిం
చారు. షెలోమీతు, అతని బంధువులు యెహోవాకు
ఇచ్చిన పవిత్ర వస్తువులన్నిటి విషయంలో జాగ్రత్త
వహించారు.
29కెనన్యా ఇస్హారు కుటుంబంలోని వాడు. కెనన్యా,
అతని కుమారులు మందిరపు బయట బాధ్యతలు
స్వీకరించారు. వారు రక్షక భటులుగాను, న్యాయాధి
పతులుగాను ఇశ్రాయేలులో వివిధ ప్రాంతాలలో పని
చేశారు. 30హషబ్యా హెబ్రోను కుటుంబంలోని వాడు.
హషబ్యా, అతని బంధువులు దేవుని అన్ని కార్యాల
లోను; యోర్దాను నదికి పశ్చిమానగల ఇశ్రాయేలులో
రాజుగారి పనులలోను శ్రద్ధ తీసుకొనే వారు. హషబ్యా
వర్గంలో పదిహేడువేల మంది బలవంతులున్నారు.
31వారికి యెరీయా పెద్ద అని హెబ్రోను కుటుంబ
చరిత్ర తెలుపుతుంది. దావీదు నలుబది ఏండ్లు రాజుగా
వున్న కాలంలో తన ప్రజల వంశ చరిత్రలు చూచి
బలపరాక్రమాలుగల వారిని, నేర్పరులైన పనివారిని
వెదుకమని ఆజ్ఞాపించాడు. అట్టివారిలో కొంతమంది
గిలియాదులో గల యాజేరు పట్టణంలో నివసిస్తున్న
హెబ్రోను వంశీయులలో వున్నట్లు కనుగొన్నారు.
32యెరీయాకు రెండువేల ఏడువందల మంది బల
వంతులైన, కుటుంబ పెద్దలైన బంధువులున్నారు.
యెహోవా కార్యాలు చేయటంలోను, రాజు పనులు
చక్కబెట్టటం లోను రూబేనీయుల, గాదీయుల
మరియు మనష్షే సగం వంశీయుల పనిని పరిశీలిం
చేందుకు రాజైన దావీదు యెరీయ బంధువులైన ఆ
రెండువేల ఏడువందల మందిని నియమించాడు.

## సైనిక సమూహాలు

27 సైన్యంలో చేరి రాజు సేవలో నిమగ్నమైన
ఇశ్రాయేలీయుల వివరణ: ప్రతి సంవత్సరం
లోను ప్రతి సమూహం ఒక నెలపాటు తమ విధికి
హాజరయ్యేది. రాజును సేవించిన వారిలో వంశాలకు
అధిపతులు, శతదళాధిపతులు, సహస్ర దళాధిపతులు,
మరియు రక్షక భటులు వున్నారు. ప్రతి సైనిక విభాగం
లోను ఇరవై నాలుగు వేలమంది మనుష్యులున్నారు.
2మొదటి నెలలో మొదటి దళానికి యాషాబాము
అధిపతి. యాషాబాము తండ్రి పేరు జబ్దీయేలు.
యాషాబాము దళంలో ఇరవై నాలుగు వేలమంది సైని
కులున్నారు.
3యాషాబాము పెరెజు సంతతివారిలో ఒకడు.
యాషాబాము సైనికాధికారులందరికీ మొదటి నెలలో
అధిపతి.

4రెండవ నెలలో సైనిక దళానికి దోదై అధిపతి. అతడు అహూయాయహు సంతతివాడు (అహోహీయుడు). దోదై విభాగంలో ఇరవై నాలుగువేల మంది ఉన్నారు.

5మూడవ అధికారి బెనాయా. మూడవ నెలలో బెనాయా సైనికాధికారి. బెనాయా తండ్రి పేరు యెహోయాదా. యెహోయాదా ప్రముఖ యాజకుడు. బెనాయా దళంలో ఇరవై నాలుగువేల మంది సైనికులున్నారు. 6ముప్పది మంది మహా యోధుల్లో గల బెనాయా ఇతడే. వారిని బెనాయా నడిపించాడు. బెనాయా కుమారుడు అమ్మీజాబాదు. బెనాయా దళానికి నిర్వాహకుడుగా వున్నాడు.

7నాల్గవ అధికారి అశాహేలు. అతడు నాల్గవ నెలలో దళాధిపతి. అశాహేలు యోవాబు సోదరుడు. తరువాత అశాహేలు కుమారుడు జెబద్యా తన తండ్రి స్థానంలో అధిపతి అయ్యాడు. అశాహేలు దళంలో ఇరవై నాలుగు వేలమంది సైనికులు వున్నారు.

8ఐదవ అధికారి షమ్హూతు. షమ్హూతు ఐదవ నెలలో అధిపతి. షమ్హూతు ఇశ్రాహేతీయుడు. షమ్హూతు విభాగంలో ఇరవై నాలుగువేల మంది సైనికులున్నారు.

9ఆరవ అధిపతి ఈరా. ఈరా ఆరవ నెలలో అధిపతి. ఈరా తండ్రి పేరు ఇక్కేషు. ఇక్కేషు తెకోవ పట్టణం వాడు. ఈరా విభాగంలో ఇరవై నాలుగువేల మంది సైనికులున్నారు.

10ఏడవ అధిపతి హేలెస్సు. హేలెస్సు ఏడవ నెలలో అధిపతి. అతడు పెలోనీయుడు. ఎఫ్రాయిము సంతతికి చెందినవాడు. హేలెస్సు దళంలో ఇరవై నాలుగు వేలమంది సైనికులు వున్నారు.

11ఎనిమిదవ అధిపతి సిబ్బెకై. సిబ్బెకై ఎనిమిదవ నెలలో అధిపతి. సిబ్బెకై హుషాతీయుడు. అతడు జెరహు సంతతివాడు. సిబ్బెకై విభాగంలో ఇరవై నాలుగు వేలమంది సైనికులు వున్నారు.

12తొమ్మిదవ అధిపతి అబీయెజెరు. అబీయెజెరు తొమ్మిదవ నెలలో అధిపతి. అబీయెజెరు అనాతోతు పట్టణం వాడు. అతడు బెన్యామీనీయుడు. అబీయెజెరు దళంలో ఇరవై నాలుగువేల మంది సైనికులు వున్నారు. 13పదవ అధిపతి మహరై. మహరై పదవ నెలలో అధిపతి. మహరై నెటోపాతీయుడు. అతడు జెరహు సంతతివాడు. మహరై దళంలో ఇరవై నాలుగువేల మంది సైనికులున్నారు.

14పదకొండవ అధిపతి బెనాయా. బెనాయా పదకొండవ నెలలో అధిపతి. అతడు పిరాతోనీయుడు. బెనాయా ఎఫ్రాయిము సంతతివాడు. బెనాయా వర్గంలో ఇరవై నాలుగువేల మంది సైనికులు వున్నారు.

15పన్నెండవ అధిపతి హెల్దయి. పన్నెండవ నెలలో అధిపతి హెల్దయి. అతడు నెటోపాతీయుడు. హెల్దయి ఒత్నీయేలు కుటుంబీకుడు. హెల్దయి దళంలో ఇరవై నాలుగువేల మంది సైనికులు వున్నారు.

### వంశ నాయకులు

16ఇశ్రాయేలు వంశాలు, వాటి పెద్దలు ఎవరనగా:

రూబేను: జిఖ్రీ కుమారుడైన ఎలీయెజెరు.
“షిమ్యోను: మయకా కుమారుడైన షెఫట్య.
17 లేవీ: కెమూయేలు కుమారుడైన హషబ్యా.
అహరోను: సాదోకు.
18 యూదా: దావీదు సోదరులలో ఒకడైన ఎలీహు.
ఇశ్శాఖారు: మిఖాయేలు కుమారుడగు ఒమ్రీ.
19 జెబూలూను: ఓబద్యా కుమారుడైన ఇష్మయా.
నఫ్తాలి: అజ్రీయేలు కుమారుడైన యెరీమోతు.
20 ఎఫ్రాయిము: అజజ్యాహు కుమారుడైన హోషేయ. పశ్చిమ మనష్షే: పెదాయా కుమారుడైన యోవేలు.
21 తూర్పు మనష్షే: జెకర్యా కుమారుడైన ఇద్దో.
బెన్యామీను: అబ్నేరు కుమారుడగు యహశీయేలు.
22 దాను: యెహోరాము కుమారుడు అజరేలు.
వారంతా ఇశ్రాయేలు వంశాలకు అధిపతులు.

### దావీదుఇశ్రాయేలీయులను లెక్కించటం

23ఇశ్రాయేలు జనాభా లెక్కలు తీయటానికి దావీదు నిర్ణయించాడు. అయితే వారు అసంఖ్యాకంగా వున్నారు. ఎందువల్లననగా దేవుడు ఇశ్రాయేలు వారిని ఆకాశంలో నక్షత్రాల్లా వృద్ధిచేస్తానని చెప్పాడు. అందువల్ల దావీదు ఇరవై ఏండ్ల వయస్సు వారిని, అంతకు పైబడిన వయస్సు వారిని మాత్రమే లెక్కించమన్నాడు. 24సెరూయా కుమారుడైన యోవాబు జనాభా లెక్కలు ప్రారంభించాడు. కాని పూర్తి చేయలేదు.* ఇశ్రాయేలు ప్రజల పట్ల దేవుడు మిక్కిలి కోపం చెందాడు. అందువల్ల రాజైన దావీదు పాలన గురించిన చరిత్ర గ్రంథంలో జనాభాసంఖ్య చేర్చబడలేదు.

### రాజకార్య నిర్వాహకులు

25రాజుయొక్క ఆస్తి కాపాడటంలో బాధ్యతగల వారెవరనగా:

అదీయేలు కుమారుడు అక్మావెతు అధీనంలో రాజగిడ్డంగులు వుంచారు. చిన్న చిన్న పట్టణాలలోను, గామాలలోను, పొలాలలోను, దుర్గాలలోను వున్న వస్తువులను భద్రపరచు గదులకు బాధ్యత ఉజ్జీయా కుమారుడైన యోనాతానుకు* ఇవ్వబడింది.
26 వ్యవసాయ కూలీలపై కెలూబు కుమారుడైన ఎజ్రీ నియమితుడయ్యాడు.

---

**యోవాబు ... చేయలేదు** చూడండి దినవృత్తాంతములు మొదటి గ్రంథం 21:1-30.

**యోనాతాను** యెహోనాతాను అని పాఠాంతరం.

27 ద్రాక్షా తోటల సంరక్షణాధికారి షిమీ. షిమీ రామా
పట్టణానికి చెందినవాడు. ద్రాక్షాతోటల నుండి
సేకరించిన ద్రాక్షా రసపు నిల్వలు, వాటి పరిరక్షణ
బాధ్యత జబ్దికి ఇవ్వబడింది. జబ్ది షెపాము
ఊరివాడు.
28 పడమటి కొండల ప్రాంతంలో ఒలీవ చెట్ల, మేడి
చెట్ల పరిరక్షణ, నిర్వహణ బాధ్యత బయల్
హనాను వహించాడు. బయల్ హనాను గెదేరీ
యుడు. ఒలీవ నూనె నిల్వల మీద అధికారి
యోవాషు.
29 షారోను ప్రాంతంలో మేసే ఆవుల మీద పర్య
వేక్షకుడు షిట్రయి. షిట్రయి షారోను ప్రాంతం
వాడు. లోయలోని ఆవుల మీద అధికారి అద్లయి
కుమారుడైన షాపాతు.
30 ఒంటెలపై అధికారి ఓబీలు ఇష్మాయే లీయుడు.
గాడిదల సంరక్షణాధికారి యెహెద్యాహు. యెహె
ద్యాహు మేరోనో తీయుడు.
31 గొర్రెల విషయం చూసే అధికారి యాజీజు.
యాజీజు హగ్రీయుడు.

నాయకులైన ఈ వ్యక్తులందరూ రాజైన దావీదు
ఆస్తి విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవటానికి
నియమితులయ్యారు.

32యోనాతాను తెలివైన సలహాదారు. పైగా లేఖ
కుడు. యోనాతాను దావీదు పినతండ్రి. రాజకుమా
రుల యోగక్షేమాలు తెలుసుకోవటానికి హక్మోనీ
కుమారుడైన యెహీయేలు నియమింపబడ్డాడు. 33అహీ
తోపెలు రాజుకు సలహాదారు (మంత్రి). హూషై
రాజుకు స్నేహితుడు (చెలికాడు). హూషై అర్కీయుడు.
34అహీతోపెలు తరువాత అతని స్థానంలో యెహో
యాదా మరియు అబ్యాతారు లిరువురూ రాజుకు
సలహాదారులయ్యారు. యెహోయాదా తండ్రిపేరు
బెనాయా. యోవాబు రాజు సేనకు అధిపతి.

### ఆలయం నిర్మాణానికి దావీదు యోచన

28 దావీదు ఇశ్రాయేలు పెద్దలందరినీ సమావేశ
పర్చాడు. వారందరినీ యెరూష లేముకు
రమ్మని ఆజ్ఞాపించాడు. ఆయన పిలిచిన పెద్దలు
ఎవరనగా: వంశాల పెద్దలు, రాజ సేవలో వున్న సైని
కాధికారులు, వేయిమంది సైనికులకు అధిపతులు,
వందమంది గల దళాలకు అధిపతులు, రాజు యొక్క,
రాజకుమారుల యొక్క ఆస్తులను, పశువులను కాపాడే
అధికారులు, రాజు యొక్క ముఖ్యాధికారులు, పరా
క్రమశాలురు మరియు వీర సైనికులు.

2రాజైన దావీదు నిలబడి వారినుద్దేశించి ఇలా
చెప్పాడు: “సోదరులారా, నా ప్రజలారా, మీరంతా నేను
చెప్పేది వినండి. యెహోవా ఒడంబడిక పెట్టెను
ఉంచటానికి ఒక ఆలయాన్ని కట్టటానికి నేను నా
హృదయంలో సంకల్పించాను. దేవుని పాదం మోప
టానికి ఒక స్థానం నిర్మించాలని నేను అనుకున్నాను.
ఆలయ నిర్మాణానికి నేను ఒక పథకం కూడ
తయారుచేశాను. 3కాని దేవుడు నాతో ఇలా అన్నాడు:
‘దావీదూ, వద్దు. నా పేరు మీద నీవు ఆలయం
కట్టించకూడదు. నీవు సైనికుడవై, అనేకమందిని
సంహరించావు. అందువల్ల నీవు ఆలయా నిర్మాణం
చేయకూడదు.”

4“ఇశ్రాయేలు దేవుడగు యెహోవా ఇశ్రాయేలు
పన్నెండు వంశాల వారిని నడిపించటానికి యూదా
వంశాన్ని ఎంపిక చేశాడు. మళ్లీ ఆ వంశంలో నుండి
నా తండ్రి కుటుంబాన్ని యెహోవా ఎంపిక చేశాడు.
ఆ కుటుంబంలో నుండి ఇశ్రాయేలును శాశ్వతంగా
ఏలటానికి యెహోవా నన్ను ఎంపికచేశాడు! దేవుడు
నన్ను ఇశ్రాయేలుకు రాజుగా చేయదలచాడు!
5యెహోవా నాకు చాలా మంది కుమారులను
ఇచ్చాడు. వారందరిలో ఇశ్రాయేలుకు నూతన రాజుగా
సొలొమోనును మాత్రం యెహోవా ఎంపిక చేసాడు.
నిజానికి ఇశ్రాయేలు యెహోవా రాజ్యం. 6యెహోవా
నాతో, ‘దావీదూ, నీ కుమారుడు సొలొమోను నా
ఆలయాన్ని, దాని ప్రాంగణాన్ని నిర్మిస్తాడు. ఎందు
వల్లననగా సొలొమోనును నా కుమారునిగా భావిం
చాను. నేను అతనికి తండ్రిగా వ్యవహరిస్తాను.* 7సొలొ
మోను ఇప్పుడు నా ధర్మాన్ని, ఆజ్ఞలను పాటిస్తు
న్నాడు. అతడు నా ధర్మాన్ని, న్యాయాన్ని నిరంతరం
పాటిస్తే నేను సొలొమోను రాజ్యాన్ని శాశ్వతంగా బల
వంతమైనదిగా చేస్తాను!’” అని అన్నాడు.

8“ఇప్పుడు ఇశ్రాయేలు ప్రజల ముందు, దేవుని
సమక్షాన నేను మీకు ఈ విషయాలు చెప్తున్నాను.
యెహోవా దేవుని శాసనాలన్నిటినీ మీరు పాటించేలా
జాగ్రత్త పడండి! అప్పుడు ఈ మంచి దేశాన్ని మీరు
నిలబెట్టుకోగలుగుతారు. పైగా దీనిని మీరు, మీ తర్వాత
మీ సంతతి వారికి కూడ శాశ్వతంగా అందజేయగలరు.
9కుమారుడా, సొలొమోనూ! నీ తండ్రి యొక్క దేవుని
నీవు తెలుసుకో. పవిత్ర హృదయంతో దేవుని
ప్రార్థించు. దేవుని సేవించటానికి హృదయానందం
కలిగివుండు. ఎందువల్లననగా, ప్రతివాని మనస్సులో
ఏమున్నదో దేవునికి తెలుసు. నీవు ఆలోచించే ప్రతిదీ
యెహోవా అర్థం చేసుకుంటాడు! సహాయం కోరి
యెహోవాను అర్థిస్తే, నీకు సమాధానం దొరుకు
తుంది. నీవు దేవునికి విముఖంగా వుంటే ఆయన
నిన్ను శాశ్వతంగా వదిలివేస్తాడు. 10సొలొమోనూ, తన

---

**నేను ... తండ్రిగా వ్యవహరిస్తాను** దీనివల్ల దేవుడు సొలొమో
నును రాజుగా చేస్తున్నాడని అర్థమవుతుంది. చూడండి
కీర్తనలు 2:7.

పవిత్ర స్థలమైన ఆలయాన్ని నిర్మించటానికి
యెహోవా నిన్ను ఎంపిక చేశాడని నీవు అర్థం చేసు
కోవాలి. ధైర్యంగా వుండి కార్యం నెరవేర్చు.”
11పిమ్మట దావీదు ఆలయ నిర్మాణానికి సిద్ధం
చేసిన నమూనా పత్రాలను తన కుమారుడైన సొలొ
మోనుకు ఇచ్చాడు. ఆ పత్రాలలో ఆలయం చుట్టూ
నిర్మింప తలపెట్టిన ఆవరణ, మండపాలు, వస్తువులను
భద్రపరచు గదులకు, పైగదులు, లోపలి గదులు
మరియు పాపపరిహారం ప్రాయశ్చిత్తం చేయు స్థానం
మొదలగు వాటి నమూనాలు కూడ ఇమిడి వున్నాయి.
12ఆలయపు అన్ని విభాగాలకూ దావీదు నమూనాలు
గీయించాడు. దావీదు ఆ నమూనాలను సొలొమోనుకు
ఇచ్చాడు. ఆలయం చుట్టూ ప్రాంగణానికి, ఇతర
గదులకు,వస్తువులను భద్రపరచు గదులకు, పవిత్ర
వస్తువులను వుంచే కొట్లకు గీచిన నమూనాలను కూడ
దావీదు అతనికి ఇచ్చాడు. 13దావీదు సొలొమోనుకు
యాజకులలోను, లేవీయులలోను గల వర్గీకరణలను
గూర్చి తెలియ జెప్పాడు. ఆలయపు సేవాకార్యక్రమ
వివరాలు, ఆలయాంలో వినియోగించే వస్తుసామగ్రి
విషయాల గూర్చి దావీదు సొలొమోనుకు వివ
రించాడు. 14ఆలయాంలో ఉపయోగించే వస్తు సామగ్రి
చేయటానికి ప్రతి దానికీ ఎంతెంత వెండి బంగారాలు
వినియోగించాలో దావీదు సొలొమోనుకు చెప్పాడు.
15బంగారు దీపాలకు, వెండి దీపాలకు, దీప స్తంభాలకు
విడివిడిగా కొలతలు, నమూనాలు వున్నాయి. ఒక్కొక్క
దీప స్తంభానికి, దాని దీపాలకు* ఉపయోగించే
బంగారం లేక వెండి పరిమాణాన్ని దావీదు సొలొమో
నుకు తెలియజేశాడు. అవసరమైన చోట వివిధ
దీపస్తంభాలు నెలకొల్పవచ్చు. 16నైవేద్యంగా పవిత్ర
రొట్టెను దేవుని ముందు పెట్టటానికి పనికివచ్చే ప్రతి
బల్లకు ఎంత బంగారం వాడాలో దావీదు చెప్పాడు.
వెండి బల్లలకు కావలసిన వెండి పరిమాణం కూడా
దావీదు చెప్పాడు. 17శూలాలకు, నీరు చిలికే పాత్రలకు,
మూతి వెడల్పు చెంబులకు ఎంతెంత శుద్ధ బంగారం
కావాలో దావీదు వివరించాడు. ప్రతి బంగారు పాత్రకు,
ప్రతి వెండి పాత్రకు ఎంతెంత బంగారం కావాలో
దావీదు చెప్పాడు.

18ధూప పీఠానికి కావలసిన శుద్ధ బంగారం విషయం
దావీదు చెప్పాడు. దేవుని రథమైన రెక్కలుచాపి ఒడం
బడిక పెట్టెను కప్పివుండే కెరూబుల నమూనాను
కూడా దావీదు సొలొమోనుకు ఇచ్చాడు. ఇదే ధర్మ
పీఠం. కెరూబు దూతల ప్రతిమలు బంగారంతో
చేయబడ్డాయి. 19“యెహోవా నాకు సూచించిన
మేరకు ఈ నమూనాలన్నీ వ్రాయబడ్డాయి. నమూనా
లలో ప్రతి విషయాన్నీ నేను అర్థం చేసుకొనేలా
యెహోవా నాకు సహాయపడ్డాడు” అని దావీదు
చెప్పాడు.

20దావీదు తన కుమారుడైన సొలొమోనుతో ఇంకా
ఇలా అన్నాడు: “నీవు ధైర్యంగా, నిలకడగా వుండు.
పని మొదలుపెట్టు. నీవు భయపడవద్దు. ఎందు వల్లన
నగా నీ దేవుడైన యెహోవా నీతో వున్నాడు. పనంతా
పూర్తయ్యే వరకు దేవుడు నీకు సహాయం చేస్తాడు.
ఆయన నిన్ను వదిలిపెట్టడు. నీవు యెహోవా
ఆలయం నిర్మిస్తావు. 21ఆలయ నిర్మాణ కార్య
క్రమంలో యాజకులు, లేవీయులు తమ తమ విధులు
నిర్వహించటానికి సిద్ధంగా వున్నారు. నైపుణ్యంగల పని
వారంతా నీకు సహాయం చేయటానికి సిద్ధంగా
వున్నారు. నీవు ఇచ్చే ప్రతి ఆజ్ఞ అధికారులు, ప్రజలు
అంతా శిరసావహిస్తారు.”

## ఆలయం నిర్మాణానికి కానుకలు

29 అక్కడ సమావేశమైన ఇశ్రాయేలు ప్రజలంద
రినీ ఉద్దేశించి రాజైన దావీదు ఇలా అన్నాడు:
“దేవుడు నా కుమారుడు సొలొమోనును ఎంపిక
చేశాడు. సొలొమోను చిన్నవాడు. అందువల్ల తాను
చేయవలసిన పనులన్నిటిలో తగిన అనుభవం లేదు.
కాని పని మాత్రం అతి ముఖ్యమైనది! ఈ భవనం
ప్రజల కొరకు కాదు. ఇది యెహోవా దేవుని ఆలయం.
2నా దేవుని ఆలయం కట్టించటానికి తగిన నమూనాలు,
ఏర్పాట్లు నాశక్తి కొలదీ చేశాను. బంగారంతో చేయదగిన
వస్తు సామగ్రికి కావలసిన బంగారం, వెండితో చేయ
దగిన వస్తువులకు వెండి, కంచు సామగ్రికి కావలసిన
కంచు, ఇనుప పనిముట్లకు కావలసిన ఇనుము, కలప
సామాన్లు చేయటానికి తగిన కలప ఏర్పాటు చేశాను.
పొదగటానికి సులిమాను రాళ్లు అనబడే మణులను,
నల్లరాతిని, విలువైన రంగురంగుల రత్నాలను, పాల
రాతిని కూడ నేను ఇచ్చాను. ఆలయం నిర్మాణానికి
ఈ రకమైన వస్తుసామగ్రిని లెక్కకు మించి ఇచ్చాను.
3నా దేవుని ఆలయానికి వెండి బంగారు వస్తువులను
ప్రత్యేక కానుకలుగా ఇస్తున్నాను. నేనిది ఎందుకు
చేస్తున్నానంటే నిజంగా నేను నా దేవుని ఆలయం
కట్టించ దలిచాను. ఈ పవిత్ర ఆలయ నిర్మాణానికే
ఈ వస్తువులన్నీ నేను ఇస్తున్నాను. 4ఆరువేల మణు
గుల* ఓఫీరు దేశపు బంగారాన్ని, పద్నాలుగు వేల
మణుగుల* శుద్ధమైన వెండిని ఇచ్చాను.ఆలయ

---

**దీపాలు** దీపాలనగా ప్రమిదల వలె వున్న గిన్నెలు. వాటిలో వత్తి వేసి వెలిగిస్తారు. ఈ ప్రమిదెలను నిలపటానికి ఒక నిడుపాటి కడ్డీకి ఆకుల్లాంటి ఆధారాలుంటాయి. ఒకేసారి అనేక దీపాలు వెలిగించవచ్చు.

**ఆరువేల మణుగుల** లక్ష కిలోగ్రాములు.

**పద్నాలుగు వేల మణుగులు** రెండు లక్షల ముప్పది అయిదువేల కిలోగ్రాములు.

భవనాల గోడలపై వెండిరేకుల తొడుగు వేస్తారు. [5]వెండి
బంగారాలతో చేయదగిన వస్తువులకు కావలసిన
వెండిని, బంగారాన్ని ఇచ్చాను. ఆలయానికి పనికివచ్చే
అనేక రకాల వస్తు సామగ్రిని నిపుణతగల పనివారు
చేయగలిగేలా నేను వెండిని, బంగారాన్ని సమకూ
ర్చాను. ఇప్పుడు ఇశ్రాయేలీయులైన మీలో ఎంతమంది
ఈ రోజు యెహోవా కార్యానికి మనసారా కానుకలు
ఇవ్వటానికి సిద్ధంగా వున్నారు?"
[6]కుటుంబాల పెద్దలు, ఇశ్రాయేలీయుల వంశాల
పెద్దలు, సహస్ర సైనిక దళాధిపతులు, శత దళాధి
పతులు, రాజకార్య నిర్వాహకులు వెంటనే తమ విలువైన
వస్తువులు స్వయంగా అర్పించారు. [7]ఆలయానికి
వారిచ్చిన వస్తువులు ఏవనగా: పదివేల మణుగుల
బంగారం, ఇరవై వేల మణుగుల వెండి, ముప్పదియారు
వేల మణుగుల కంచు, రెండు లక్షల మణుగుల ఇనుము.
[8]విలువైన రత్నాలు కలిగివున్న ప్రజలు వాటిని ఆలయా
నికి యిచ్చారు. యెహీయేలు విలువైన రత్నాలన్నిటి
విషయంలో జాగ్రత్త తీసుకొన్నాడు. యెహీయేలు
గెర్షోను వంశీయుడు. [9]తమ నాయకులు అంత ఉదా
రంగా విరాళాలు ఇవ్వటంతో ప్రజలంతా చాలా సంతో
షపడ్డారు. నాయకులు నిండు హృదయంతో విరాళాలు
ఇచ్చి సంతోషపడ్డారు. రాజైన దావీదు కూడ
ఆనందంగా వున్నాడు.

### దావీదు చక్కటి ప్రార్థన

[10]సమావేశపర్చబడిన ప్రజానీకం ముందు దావీదు
పిమ్మట యెహోవాకి స్తోత్రం చేశాడు. దావీదు ఇలా
ప్రార్థన చేశాడు:

"ఇశ్రాయేలు దేవుడవైన యెహోవా, మా తండ్రీ,
సదా నీకు స్తోత్రం చేస్తాము.
11 గొప్పతనము, శక్తి, మహిమ, విజయము, గౌర
వము అన్నీ నీకు చెందినవే ఎందుకంటే పర
లోకమందు, భూమిమీద అన్నీ నీకు చెందినవే.
ఓ దేవా, రాజ్యము నీదైయున్నది. నీవు సమస్త
ప్రజలపై అధి పతివైయున్నావు.
12 భోగభాగ్యాలు, గౌరవం నీ నుండేవస్తాయి. సమస్త
మును పాలించువాడవు నీవు. నీవు బల పరాక్రమ
సంపన్నుడవు. నీవు ఎవరినైనా గొప్ప వాడినిగా
గాని, బలవంతునిగా గాని చేయగల సమర్థుడవు.
13 మా దేవా, మేము నీకు కృతజ్ఞతలు చెల్లించు
చున్నాము. మహిమగల నీ నామమును
స్తుతిస్తాము!
14 ఈ వస్తువులన్నీ నానుండి, నా ప్రజల నుండి
రాలేదు. ఈ వస్తువులన్నీ నీనుండి వచ్చినవే.
నీనుండి వచ్చిన వాటినే మేము తిరిగి నీకు
సమర్పిస్తున్నాము.
15 మేము కొత్త వారిలా, బాటసారుల్లా వున్నాము.
మా పూర్వీకులు కూడ పరాయివారిలా, బాట
సారుల్లా వున్నారు. ఆశలేని మా బ్రతుకులు
ఈ భూమి మీద నీడలాంటివి. ఎవ్వరూ స్థిరంగా
వుండరు.
16 యెహోవా మా దేవా, నీ ఆలయ నిర్మాణానికై
మేము ఈ వస్తువులన్నీ సమకూర్చాము. నీ
నామము ఘనపర్చబడేలా మేము ఈ ఆలయం
నిర్మిస్తాము. కాని ఈ వస్తుసంపదంతా నీ నుండి
వచ్చి నదే. ప్రతిదీ నీకు చెందినదే.
17 నా దేవా, నీవు ప్రజల హృదయాలను పరీక్షిస్తావని
కూడ నాకు తెలుసు. ప్రజలు మంచి పనులు
చేస్తే నీవు సంతోషిస్తావు. ఈ వస్తు సముదాయా
న్నంతా హృదయ పూర్వకంగా (సదుద్దేశంతో)
నేను ఇస్తున్నందుకు సంతోషిస్తున్నాను. నీ ప్రజ
లంతా అనేక కానుకలు సంతోషంగా నీకు ఇవ్వ
టానికి ఇక్కడ చేరియున్నట్లు నేను చూశాను.
18 ఓ దేవా, నీవు మా పితరులైన అబ్రాహాము,
ఇస్సాకు, ఇశ్రాయేలులకు* దేవుడివి. నీ ప్రజలు
సదా నిన్ను కొలిచేలా వారికి దయచేసి సహాయ
పడుము. వారి హృదయాలెప్పుడూ నీ వైపు
తిప్పుకోగలిగేలా వారికి నీవు సహాయపడుము.
19 నీ పట్ల సత్యవర్తనుడై మెలిగేలా నా కుమారుడైన
సొలొమోనుకు సహాయం చేయుము. నీ ఆజ్ఞ
లను, ధర్మశాస్త్రాన్ని, నీ నియమ నిబంధనలను
అతను ఎల్ల వేళలా పాలించేలా నీవతనికి తోడ్ప
డుము. ఈ విషయాలలో నీవు సొలొమోనుకు
సహాయంచేసి, అతను నేను తలపెట్టిన ఆలయ
నిర్మాణకార్యక్రమం పూర్తిచేసేలా తోడ్పడుము."

[20]పిమ్మట దావీదు అక్కడ చేరిన ప్రజాసమూ
హాన్ని ఉద్దేశించి, "ఇప్పుడు మీ దేవుడైన యెహోవాకు
స్తోత్రం చేయండి" అని అన్నాడు. తమ పూర్వీకులు
కొలిచిన దేవుడగు యెహోవాను ప్రజలంతా స్తుతిం
చారు. యెహోవాకి రాజుకు గౌరవ సూచకంగా వారు
సాష్టాంగ నమస్కారం చేశారు.

### సొలొమోను రాజవటం

[21]ఆ మరునాడు ప్రజలంతా యెహోవాకి బలులు
అర్పించారు. యెహోవాకు వారు దహన బలులు
అర్పించారు. వారు వేయి గిత్తలను, వేయి పొట్టేళ్లను,
వేయి గొర్రె పిల్లలను బలి ఇచ్చారు. వారు పానార్ప
ణలను కూడ సమర్పించారు. ఇశ్రాయేలు ప్రజలందరి
తరఫునా లెక్కలేనన్ని బలులు సమర్పించారు.

---

**ఇశ్రాయేలు** యాకోబుకు మరో పేరు. చూడండి
ఆది. 35:19.

[22]ఆ రోజు ప్రజలంతా బాగా తిని, తాగి ఆనందించారు. యెహోవా అక్కడ వారితో వున్నాడు. వారు చాలా ఆనందంగా వున్నారు. తరువాత దావీదు కుమారుడైన సొలొమోనును వారు రెండవసారి* రాజుగా ప్రకటించారు. వారు సొలొమోనును రాజుగాను, సాదోకును యాజకునిగాను అభిషిక్తం చేశారు. యెహోవా నెల కొని వున్నచోటే వారు ఈ పనిచేశారు.

[23]తరువాత సొలొమోను యెహోవా సింహాసనం మీద రాజు హెూదాలో కూర్చున్నాడు. సొలొమోను తన తండ్రి స్థానాన్ని అలంకరించి వర్థిల్లాడు. ఇశ్రాయేలు ప్రజలంతా సొలొమోను ఆజ్ఞలను పాటించారు.

[24]పెద్దలందరు, బలశాలురైన నాయకులు, రాజైన దావీదు కుమారులందరు సొలొమోనును రాజుగా గుర్తించి అతనికి విధేయులై వున్నారు.

[25]యెహోవా సొలొమోనును చాలా గొప్ప వ్యక్తి నిగా చేసాడు. యెహోవా సొలొమోనును చాలా ఉన్నతమైన వ్యక్తిగా చేస్తున్నాడని ఇశ్రాయేలు ప్రజలంతా గుర్తించారు. రాజుకు ఇవ్వవలసిన గౌరవాభిమానాలను యెహోవా సొలొమోనుకు ఇచ్చాడు. సొలొమోనుకు ముందు మరొక రాజెవ్వడూ అంతటి గౌరవాన్ని పొందియుండలేదు.

### దావీదు మరణం

[26-27]దావీదు ఇశ్రాయేలుకు నలభై సంవత్సరాలు రాజుగా వున్నాడు. దావీదు యెష్షయి కుమారుడు. దావీదు హెబ్రోను నగరంలో ఏడు సంవత్సరాలు పాలించాడు. తరువాత దావీదు యెరూషలేము నగరం నుండి మున్పది మూడు సంవత్సరాలు పాలించాడు. [28]దావీదు బాగా వృద్ధుడయినాక మరణించాడు. దావీదు ఉత్తమ జీవితాన్ని దీర్ఘకాలం గడిపాడు. దావీదు అన్ని భోగ భాగ్యాలు, గౌరవాభిమానాలు పొందాడు. తరువాత అతని కుమారుడు సొలొమోను నూతన రాజు అయ్యాడు.

[29]రాజైన దావీదు ఆదినుండి అంతం వరకు చేసిన పనులన్నీ దీర్ఘదర్శియైన సమూయేలు వ్రాసిన వ్రాతల లోను, ప్రవక్తయగు నాతాను వ్రాతలలోను, దీర్ఘదర్శి యైన గాదు వ్రాసిన వృత్తాంతాలలోను పొందు పర్చబడ్డాయి. [30]ఆ వ్రాతలన్నీ ఇశ్రాయేలుకు రాజుగా దావీదు చేసిన పనులన్నిటి గురించి తెల్పుతాయి. అవి దావీదు శౌర్యాన్ని గూర్చి, అతనికి సంభవించిన విషయాలను గూర్చి తెలియజేస్తాయి. ఆ వ్రాతలు ఇశ్రాయేలుకు, దాని పొరుగు రాజ్యాలన్నిటిలో జరిగిన కార్యాలు, వాటి పరిస్థితులను తెలియజేస్తాయి.

---

**తరువాత ... రెండవసారి** తన మారుటి సోదరుడు అదోనీయా తనను తాను రాజుగా ప్రకటించుకొనే ప్రయత్నం చేసినప్పుడు, సొలొమోను మొదటిసారి రాజుగా ఎంపిక చేయబడ్డాడు. చూడండి రాజుల మొదటి గ్రంథం 1:5-39. రెండవసారి బహుశః సొలొమోను తండ్రి దావీదు చనిపోయినప్పుడుగావచ్చు.

# 2 దినవృత్తాంతములు

## సొలొమోను జ్ఞాన భిక్షం కోరటం

1 యెహోవా దేవుని కృపవున్నందువల్ల సొలొమోను చాలా శక్తిమంతుడైన రాజుగా రూపొందాడు. యెహోవా సొలొమోనును గొప్ప వ్యక్తిగా చేశాడు.

2సొలొమోను ఇశ్రాయేలు ప్రజలందరితో మాట్లాడాడు. అతడు సైన్యాధికారులతోను, దళాధిపతులతోను, న్యాయాధిపతులతోను, ఇంకను ఇశ్రాయేలులోని ప్రతి ఒక్క నాయకునితోను, ప్రతి కుటుంబ పెద్దతోను మాట్లాడాడు. 3పిమ్మట సొలొమోను, అతని దగ్గరికి వచ్చిన ప్రజలందరూ కలిసి గిబియోనులో వున్న గుట్టమీదికి (ఉన్నత స్థలం) వెళ్లారు. దేవుని సన్నిధి గుడారం అక్కడ ఉంది. యెహోవా సేవకుడైన మోషే ఇశ్రాయేలు ప్రజలతో కలిసి ఎడారిలో వున్నప్పుడు ఈ గుడారాన్ని నిర్మించాడు. 4దేవుని ఒడంబడిక పెట్టె* దావీదు కిర్యత్యారీము నుండి యెరూషలేముకు తీసుకొని వచ్చాడు. దానిని వుంచటానికి దావీదు యెరూషలేములో ఒక స్థలాన్ని ఏర్పాటు చేశాడు. దేవుని ఒడంబడిక పెట్టెను వుంచటానికి దావీదు యెరూషలేములో ఒక గుడారం ఏర్పాటు చేశాడు. 5బెసలేలు కంచుతో ఒక బలిపీఠాన్ని తయారుచేశాడు. బెసలేలు తండ్రిపేరు ఊరి. ఊరి తండ్రి పేరు హూరు. కాని ఈ కంచు పీఠం గిబియోనులో పవిత్ర గుడారం ఎదుట వుంది. అందువల్ల సొలొమోను, ప్రజలు కలిసి దేవుని సలహా పొందటానికి గిబియోనుకు వెళ్లారు. 6సన్నిధి గుడారం వద్ద దేవుని ముందున్న కంచుపీఠం వద్దకు సొలొమోను వెళ్లాడు. బలిపీఠం మీద సొలొమోను వెయ్యి దహనబలులు అర్పించాడు.

7ఆ రోజు రాత్రి దేవుడు సొలొమోనుకు స్వప్న దర్శనమిచ్చి యిలా అన్నాడు: "సొలొమోనూ, నీకు ఏమి కావాలో కోరుకో."

8సొలొమోను దేవునితో యిలా అన్నాడు: "నా తండ్రి దావీదు పట్ల నీవు చాలా దయకలిగియున్నావు. నా తండ్రి స్థానంలో కొత్త రాజుగా వ్యవహరించటానికి నీవు నన్ను ఎంపిక చేశావు. 9నా ప్రభువైన దేవా నీవు నా తండ్రి దావీదుకు చేసిన వాగ్దానాన్ని ఇప్పుడు నెరవేర్చు. ఒక గొప్ప రాజ్యానికి నన్ను రాజుగా ఎంపిక చేశావు. ఇక్కడి జనాభా భూమి మీద ధూళిలా విస్తారంగా వుంది. 10ఇప్పుడు నాకు తెలివిని, జ్ఞానాన్ని ప్రసాదించు. దానివల్ల ఈ అశేష ప్రజానీకాన్ని సన్మార్గంలో నడిపించగలను. నీ సహాయం లేకుండా ఈ ప్రజానీకాన్ని ఏ ఒక్కడూ పరిపాలించలేడు!"

11అది విని సొలొమోనుతో దేవుడు యిలా అన్నాడు: "నీ ప్రవర్తన బాగుంది. నీవు ఐశ్వర్యాన్ని గాని, ధనికులకుండే భోగ భాగ్యాలను గాని, పేరు ప్రతిష్ఠలనుగాని కోరలేదు. నీ శత్రువులంతా నాశనం కావాలని కూడా నీవు కోరలేదు. నీవు చాలాకాలం బతకాలని దీర్ఘాయుష్షు కోరలేదు. నా ప్రజలను పాలించటానికి నీవు తెలివిని, వివేచననూ, జ్ఞానాన్ని ప్రసాదించమని కోరావు. ఈ ప్రజలకు రాజుగా నిన్ను నేను ఎంపిక చేశాను. 12కావున నీకు నేను తెలివిని, జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను. నీకు ధనాన్ని, భోగ భాగ్యాలను, గౌరవాన్ని కూడ నేను ఇస్తున్నాను. నీకు ముందున్న రాజులెవ్వరూ ఇంతటి ఐశ్వర్యాన్ని, గొప్పతనాన్ని పొందియుండలేదు. నీ తరువాత వచ్చే రాజులుకూడ ఇంతటి భాగ్యాన్ని, ఘనతను కలిగియుండరు."

13సొలొమోను గిబియోనులోని ఆరాధనా స్థలానికి వెళ్లాడు. సన్నిధి గుడారాన్ని వదిలి, ఇశ్రాయేలు రాజుగా పాలించటానికి యెరూషలేముకు తిరిగి వెళ్లాడు.

## సొలొమోను సైన్యాన్ని, ఐశ్వర్యాన్ని వృద్ధిచేయటం

14సొలొమోను గుర్రాలను, రథాలను సేకరించాడు. అతనికి పద్నాలుగువందల రథాలు, పన్నెండువేల గుర్రాలు వున్నాయి. సొలొమోను నగరాలలో ప్రత్యేక రథశాలలు నిర్మించి వాటిని అక్కడ వుంచాడు. యెరూషలేములో కూడా కొన్ని గుర్రాలను, రథాలను సొలొమోను వుంచాడు. యెరూషలేములోనే రాజగృహం కూడా వుంది. 15యెరూషలేములో సొలొమోను విస్తారంగా వెండి బంగారాలను సేకరించి నిల్వచేశాడు. అతడు వెండి బంగారాలను ఎంత మేరకు సేకరించాడనగా వాటి నిల్వలు సామాన్య రాతిగుట్టల్లా వున్నాయి. సొలొమోను సరళ వృక్షాల కలపను చాలా సేకరించాడు.

---

**ఒడంబడిక పెట్టె** దేవుని పది ఆజ్ఞలు వ్రాయబడిన శిలాఫలకాలు, ఇశ్రాయేలు ప్రజలు సీనాయి ఎడారిలోవున్నప్పుడు దేవుడు వారితో వున్నట్లు రుజువు చేసే మరికొన్ని వస్తువులు ఆ శాసనాల పెట్టెలో భద్రపరచబడినాయి.

అతడు సరళ చెట్ల కలపను పల్లపు ప్రాంతాలలో విస్త
రించి వున్న మేడి చెట్లంత ఎక్కువగా సేకరించాడు.
16ఈజిప్టు నుంచి, కవే (సైలీషియా అనబడే దక్షిణ
టర్కీ ప్రాంతం) నుంచి సొలొమోను గుర్రాలను తెప్పిం
చాడు. రాజు వర్తకులు ఈ గుర్రాలను కవేలో కొనేవారు.
17రాజు వర్తకులు ఈజిప్టులో ఒక్కొక్క రథాన్ని ఆరు
వందల తులాల వెండిని, ఒక్కొక్క గుర్రాన్ని నూట
యేబది తులాల వెండిని వెచ్చించి కొనేవారు, ఆ
కాలంలో వర్తకులు గుర్రాలను, రథాలను హిత్తీయుల
రాజులకు, అరాము (సిరియా) రాజులకు కూడ అమ్మే
వారు.

### ఆలయ నిర్మాణానికి సొలొమోను యత్నం

2 యెహోవా పేరు ఘనపర్చబడేలా ఆలయ
నిర్మాణానికి సొలొమోను సన్నాహం చేశాడు. తన
కొరకై ఒక రాజభవనాన్ని కూడ నిర్మించుకోవాలని
సొలొమోను తలచాడు. 2సొలొమోను డెబ్బైవేల
మందిని సరుకు చేరవేయటానికి నియమించాడు. ఎన
బై వేల మందిని కొండల్లో రాళ్లు కొట్టడానికి అతడు
నియమించాడు. పనివాళ్ల మీద నిఘావుంచడానికి
మూడువేల ఆరువందల మందిని నియమించాడు.

3తరువాత సొలొమోను హీరాముకు ఒక వర్తమానం
పంపాడు. హీరాము తూరు నగరపు రాజు. సొలొమోను
హీరాముకు యిలా చెప్పి పంపాడు: "నీవు నా తండ్రి
దావీదుకు సహాయపడినట్లు నాకు కూడ సహాయం
చెయ్యి. తను నివసించే భవన నిర్మాణానికి నీవాయనకు
సరళ వృక్షాల కలపను పంపావు. 4నా దేవుడైన
యెహోవా గౌరవార్థం నేనొక ఆలయం నిర్మింపదలి
చాను. నా ప్రజలు ఆరాధించుకొనటానికి వీలుగా దానిని
నా దేవునికి అంకితం చేస్తాను. యెహోవా ముందు
ధూపం వేసి, ఆయన సన్నిధిని ప్రతినిత్యం పవిత్రమైన
రొట్టెను నైవేద్యంగా వుంచి, బలిపీఠంపై ఉదయం,
సాయంత్రం దహనబలులు అర్పిస్తూ, మేము మా
దేవుని ఆరాధిస్తాము. సబ్బాతు దినాలలోను, అమా
వాస్య రోజులందును, మరి ఇతర ప్రత్యేక ఉత్సవ
దినాలలోను, తనను ఆరాధించుమని మా దేవుడైన
యెహోవా మాకు ఆజ్ఞ యిచ్చాడు. ఇది ఇశ్రాయేలు
ప్రజలు శాశ్వతంగా పాటించే ఒక నియమం.

5"మా దేవుడు మిగిలిన దేవాలకంటె మహోన్న
తుడు గనుక, ఆయనకు నేను నిర్మించే ఆలయం
కూడా ఉన్నతంగా ఉంటుంది.

6నిజానికి మానవ మాత్రుడెవ్వడూ మా దేవునికి
ఆలయం నిర్మించలేడు. పరలోక భూలోకాలే మా
దేవునికి నిలయాలు కాలేనప్పుడు, నేను ఆయనకు
ఆలయం నిర్మాణం చేయ లేను. నేను కేవలం ఆయన
సన్నిధిని ధూపం వేయటా నికి ఒక పీఠం మాత్రమే
నిర్మించగలను.

7"కావున వెండి బంగారు పనులలోను; కంచు,
ఇనుము పనులలోను నేర్పరియైన ఒక పనివానిని
ఇప్పుడు నా వద్దకు పంపించు. అతడు ఊదా, నీలిరంగు
పదార్థాల పనిలో కూడ నేర్పరియై ఉండాలి. నావద్ద
వున్న యూదా, యెరూషలేము శిల్పులతో కలిసి
అతడు చెక్కడపు పనులు చేయగలిగి ఉండాలి. నా
తండ్రియగు దావీదు ఇక్కడ ఈ మనుష్యులను ఎంపిక
చేశాడు. 8సరళ వృక్షాల, దేవదారు వృక్షాల, చందనపు
చెట్ల కలపను లెబానోను అడవుల నుండి పంపించు.
లెబానోనులో చెట్లను కొట్టడంలో నీ మనుష్యులు
అనుభవం కలవారని నాకు తెలుసు. నా సేవకులు నీ
మనుష్యులకు సహాయపడతారు. 9సాధ్యమైనంత
ఎక్కువ కలపను నాకు పంపించు. నేను నిర్మించ
బోయే ఆలయం చాల గొప్పదై, అద్భుతమైనదిగా
వుంటుంది. 10కలప నరికే పనివారికి ఆహారం నిమిత్తం
నేను నాలుగు వందల గరిసెల* గోధుమలు, నాలుగు
వందల గరిసెల యవలు, ఒక లక్షా పదిహేను
వేలగేలనుల (మూడు వేల ఎనిమిది వందల పడులు
లేక ఇరువది వేల బాదులు) ద్రాక్షారసమును, అదే పరి
మాణములో నూనెను కేటాయిస్తున్నాను."

11సొలొమోనుకు సమాధానమిస్తూ, హీరాము ఒక
వర్తమానాన్ని పంపాడు. ఆ వర్తమానం ఇలా వుంది:
"సొలొమోనూ, యెహోవా తన ప్రజలను ప్రేమిస్తు
న్నాడు. అందువల్లనే ఆయన నిన్ను వారికి రాజుగా
నియమించాడు." 12హీరాము తన సందేశంలో ఇంకా
యిలా అన్నాడు: "ఇశ్రాయేలు దేవుడగు యెహోవాకు
స్తోత్రం చేయండి! ఆయన ఆకాశాన్ని, భూమిని సృష్టిం
చాడు. ఆయన రాజైన దావీదుకు ఒక తెలివైన కుమా
రుని ప్రసాదించాడు. సొలొమోనూ, నీకు తెలివి, అవగా
హన వున్నాయి. నీవు యెహోవా కోసం ఒక ఆల
యాన్ని నిర్మిస్తున్నావు. నీకొరకు నీవొక రాజ
భవనాన్ని కూడ నిర్మింప తలపెట్టావు. 13నేను నీ
వద్దకు ఒక నైపుణ్యంగల పనివానిని పంపుతాను. అతడు
రకరకాల కళలలో అభిరుచి, అనుభవం వున్నవాడు.
అతని పేరు హూరాము అబీ. 14అతని తల్లి దాను
వంశస్థురాలు. అతని తండ్రి తూరు నగరవాసి.
హూరాము - అబీ బంగారం, వెండి, కంచు, ఇనుము,
రాతి, కలప పనులలో బహు నేర్పరి. హూరాము-అబీ
ఊదా, నీలి, ఎరుపు రంగుల వస్తువుల, ఖరీదైన వస్త్రాల
పనులలో కూడ మంచి నేర్పరి. పైగా హూరాము-అబీ
చెక్కడపు పనులలో కూడ నిపుణుడు. నీవు చూపిన
ఏ నమూనానైనా అతడు అర్థం చేసికొని దాని ప్రకారం
పనిచేయగల నేర్పరి. అతడు నీ వద్ద వున్న శిల్పులకు,
కళాకారులకు సహాయకారిగా వుంటాడు. దావీదు

---

**నాలుగు వందల గరిసెల** ఇంచుమించు డెబ్బై వేల కిలో
గ్రాములు, లేక రెండు లక్షల తూములు.

ఏర్పరచిన కళాకారులకు కూడ సహాయపడతాడు. నీ
తండ్రియగు దావీదు మాటను నేను అనుసరిస్తాను.
15"నీవు గోధుమలు, యవలు, నూనె, ద్రాక్షారసం
నాకు పంపుతానని రాశావు. వాటిని నా పనివాళ్ల నిమిత్తం
పంపించు. 16లెబానోను దేశంలో మేము కలప నరు
కుతాము. నీకు ఎంతకలప కావాలో అంత కలప
నరుకుతాము. ఆ కలపనంతా తెప్పలుగా కట్టి యొప్పా
పట్టణం నుండి సముద్రం మీద పంపుతాము. తరువాత
ఆ కలపను నీవు యెరూషలేముకు మోయించవచ్చు."
17అప్పుడు సొలొమోను ఇశ్రాయేలులో నివ
సిస్తున్న విదేశీయులందరినీ లెక్కించాడు. ఇది దావీదు
జనాభా లెక్కలు తీయించిన తరువాత జరిగింది.
దావీదు సొలొమోను తండ్రి. దేశంలో ఒక లక్షా ఏభై
మూడువేల ఆరువందల మంది పరదేశీయులున్నట్లు
వారు కనుగొన్నారు. 18బరువులు మోయటానికి డెబ్బై
వేలమంది విదేశీయులను సొలొమోను నియమిం
చాడు. కొండల్లో రాళ్లు చెక్కటానికి ఎనభై వేల మంది
విదేశీయులను దావీదు నియమించాడు. పనివారిపై
విచారణ చేయడానికి మరి మూడువేల ఆరువందల
విదేశీయులను సొలొమోను ఎంపిక చేశాడు.

### సొలొమోను ఆలయాన్ని నిర్మించటం

3 యెరూషలేములో మోరీయా పర్వతం మీద సొలొ
మోను ఆలయ నిర్మాణం మొదలు పెట్టాడు.
ఈ మోరీయా పర్వతం మీదే సొలొమోను తండ్రియైన
దావీదుకు యెహోవా ప్రత్యక్షమయ్యాడు. దావీదు
సిద్ధపర్చిన స్థలంలోనే సొలొమోను ఆలయాన్ని నిర్మిం
చాడు. ఈ స్థలం ఒర్నానుకు చెందిన నూర్పిడి కళ్లంవద్ద
వుంది. ఒర్నాను యెబూసీయుడు. 2తన పాలన ఇశ్రా
యేలులో నాల్గవ సంవత్సరం రెండవ నెల జరుగుతూ
వుండగా సొలొమోను ఆలయ నిర్మాణం చేపట్టాడు.
3ఆలయ నిర్మాణ విషయంలో సొలొమోనుకు
కొలతలు యివ్వబడ్డాయి: దాని పునాది తొంభై అడు
గుల (అరవై మూరలు) పొడవు; ముప్పై అడుగుల
(ఇరవై మూరలు) వెడల్పు. ఆలయ కొలతలు తీసు
కొన్నప్పుడు. సొలొమోను పాత మూర కొలతనే
అనుసరించాడు. 4ఆలయ మండపం పొడవు ముప్పై
అడుగులు; ఎత్తు ముప్పై అడుగులు. అతడు మండ
పము యొక్క లోపలి భాగమంతా మేలిమి బంగారంతో
పొదిగించాడు. 5పెద్దగది గోడల మీద తమాల వృక్షముల
(ఖర్జూరపు చెట్లు) చెక్కలు అమర్చాడు. ఆ తమాల
వృక్షపు చెక్కలమీద మేలిమి బంగారపు రేకులు
తాపించాడు. ఈ బంగారపు రేకుల మీద ఖర్జూరపు
చెట్ల బొమ్మలు చెక్కించి గొలుసుల నగిషీ పని చేయిం
చాడు. 6ఆలయంలో అందం ఇనుమడించే విధంగా
విలువైన రత్నాలు పొదిగించాడు. పర్వయీము నుండి
తెచ్చిన బంగారాన్ని ఈ పనికి వినియోగించాడు.
(అక్కడ బంగారం విస్తారంగా లభించేది. బహుశః ఆ
ప్రదేశం ఓఫీరు దేశంలో ఉండి వుండవచ్చు). 7ఆల
యపు లోపలి భాగాన్నంతా బంగారు రేకులతో కప్పిం
చాడు. పై కప్పు దూలాలకు దర్వాజాలకు, గోడలకు,
తలుపులకు సొలొమోను బంగారు పూత వేయించాడు.
గోడల మీద దేవదూతల (కెరూబులు) చిత్రాలు
చెక్కించాడు.
8తరువాత సొలొమోను అతి పవిత్ర స్థలం*
ఏర్పాటు చేశాడు. అతి పవిత్ర స్థలం పొడవు ముప్పై
అడుగులు; వెడల్పు ముప్పై అడుగులు. ఆలయం
వెడల్పంత వెడల్పు దీనికి కూడ వుంది. అతి పవిత్ర
స్థలం గోడల నిండా మేలిమి బంగారు రేకులు వేయిం
చాడు. ఈ బంగారపు బరువు ఇరవై మూడు టన్నులు
(ఆరువందల తలాంతులు). 9బంగారపు మేకుల
తూకము ఏభై తులాలు. (ఇంచుమించు ఒకటింపావు
పౌనులు). పై గదులకు బంగారు పూత వేయించాడు.
10రెండు కెరూబుల బొమ్మలు అతి పరిశుద్ధ స్థలంలో
పెట్టించటానికి చేయించాడు. పనివారు ఆ కెరూబుల
బొమ్మలకు బంగారు తొడుగు వేశారు. 11ఆ కెరూబుల
ప్రతిదాని రెక్క పొడవు ఏడున్నర అడుగులు ఉంది.
ఆ రెండు కెరూబుల నాలుగు రెక్కల పొడవు ముప్పై
అడుగులు. మొదటి కెరూబు ఒక రెక్క ఒక పక్క
గోడకు ఆనుకొని వుంటుంది. రెండవ రెక్క రెండవ
కెరూబు రెక్కకు తగులుతూ వుంటుంది. 12రెండవ
కెరూబు ఒక రెక్క గది గోడకు రెండవ వైపున ఆను
తుంది. 13రెండు కెరూబుల రెక్కలు మొత్తం ముప్పై
అడుగుల దూరం వ్యాపించి వుంటాయి. దేవదూతల
బొమ్మలు అతి పరిశుద్ధ స్థలంలోకి చూస్తున్నట్లు
నిలబడి వుంటాయి.
14నీలం, ఊదా, ఎరుపు పదార్థాలతోను, ఖరీదైన
పట్టుతోను సొలొమోను తెరలు* చేయించాడు. ఈ
తెరల మీద కూడ కెరూబుల చిత్రాలు చిత్రించాడు.
15ఆలయం ముందు రెండు స్తంభాలను ఏర్పాటు
చేయించాడు. ఒక్కొక్క స్తంభం ఏభై రెండున్నర
అడుగుల (ముప్పైయైదు మూరలు) ఎత్తు వుంటుంది.
ఒక్కొక్క స్తంభం యొక్క శిఖరంమీది పీట యెత్తు
ఏడున్నర అడుగులు. 16కంఠాహారం లాంటి గొలుసు
లను సొలొమోను చేయించాడు. ఆ గొలుసులను
స్తంభాల మీద పీటలకు అలంకరించాడు. వంద దానిమ్మ

**అతి పవిత్ర స్థలం** ఇది ఆలయపు లోపలిగది. ఇందులో దేవుని ఒడంబడిక పెట్టెను వుంచుతారు. దీనినే "పవిత్రాతి పవిత్ర స్థలం" అంటారు. ఇక్కడ దేవుడు నివసిస్తూ, ఆరాధింపబడతాడు.

**తెరలు** ఈ తెరలను ముందు గదికి, అతి పవిత్ర స్థలానికి మధ్య వేలాడదీస్తారు. తద్వారా దేవుని ఒడంబడిక పెట్టెను కెరూబులను ఎవ్వరూ వెంటనే చూడలేరు.

కాయల బొమ్మలు చేయించి గొలుసులకు తగిలిం
చాడు. [17]ఇలా అలంకరించిన స్తంభాలను సొలొమోను
ఆలయం ముందు నిలిపాడు. ఒక స్తంభం కుడి పక్క,
రెండవ స్తంభం ఎడమ పక్కన నిలిపారు. సొలొమోను
కుడి పక్క స్తంభానికి "యాకీను"* అని పేరు పెట్టాడు.
ఎడమ ప్రక్క స్తంభానికి "బోయజు"* అని పేరు
పెట్టాడు.

### ఆలయ సామగ్రి

4 ఒక బలిపీఠాన్ని చేయటానికి సొలొమోను
కంచును వినియోగించాడు. ఆ కంచు పీఠం
ముప్పై అడుగుల పొడవు, ముప్పై అడుగుల వెడల్పు,
పద్దెనిమిది అడుగుల ఎత్తు గలిగి వుంది. [2]కరిగిన
కంచును వినియోగించి సొలొమోను ఒక పెద్ద కోనే
రును* (సముద్రం) చేయించాడు. ఆ కోనేరు
(సముద్రం) గుండ్రని ఆకారంలో వుంది. దాని వ్యాసం
పద్దెనిమిది అడుగులు. దాని ఎత్తు ఏడున్నర అడుగులు.
దాని చుట్టు కొలత నలుబదియైదు అడుగులు.
[3]కోనేరు (సముద్రం) అంచు చుట్టూ పద్దెనిమిది
అడుగుల మేరకు కంచుగిత్తల బొమ్మలున్నాయి. ఆ
గిత్తలు రెండు వరుసల్లో కోనేరు (సముద్రం) ను
పోతపోసినప్పుడే పోతలో వచ్చాయి. [4]ఆ పెద్ద కోనేరు
(సముద్రం) పన్నెండు పెద్ద గిత్తల విగ్రహాలపై నిలప
బడింది. మూడు గిత్తలు ఉత్తరానికి తిరిగి వున్నాయి.
మూడు గిత్తలు పడమటి వైపుకు తిరిగి వున్నాయి.
మూడు గిత్తలు దక్షిణానికి తిరిగి వున్నాయి. మూడు
గిత్తలు తూర్పు వైపుకు చూస్తూవున్నాయి. ఆ పెద్ద
కోనేరు (సముద్రం) ఈ గిత్తల మీద నిలపబడింది. ఆ
గిత్తలన్నీ వాటి వెనుక భాగాలు మధ్యలో ఒకదానికొకటి
ఆనుకొని వుండి నిలబడి వున్నాయి. [5]కంచు కోనేరు
(సముద్రపు) మందం మూడు అంగుళాలు. కోనేరు
సముద్రపు అంచు గిన్నె అంచులాగా వుంది. అంచు
తామర పుష్పంలా అగపడుతుంది. దానిలో పదిహేడు
వేల ఐదువందల గేలనుల (ముప్పై పుట్లు) నీరు
పడుతుంది.

[6]సొలొమోను పది వెడల్పైన తొట్టెలను నిర్మిం
చాడు. వాటిలో ఐదింటిని కోనేరు (సముద్రం) సము
ద్రంకు కుడి పక్కన, ఐదింటిని ఎడమ ప్రక్కన
వుంచాడు. ఈ తొట్లను దహన బలులుగా అర్పించే
జంతువులను కడగటానికి వినియోగిస్తారు. కాని పెద్ద
కోనేరు (సముద్రం) ను మాత్రం యాజకులు తాము
బలులు యిచ్చేముందు పవిత్ర స్నానాలు చేయటానికి
వినియోగించేవారు.

[7]సొలొమోను పది బంగారపు దీప స్తంభాలు చేయిం
చాడు. ఈ దీప ఆలయ స్తంభాలు చేయటానికి, మును
పటి దీపస్తంభాల నమూనాలనే సొలొమోను అను
కరించాడు. ఈ దీపస్తంభాలను అతడు ఆలయంలో
వుంచాడు. కుడిపక్క ఐదు, ఎడమపక్క ఐదు దీప
స్తంభాలను వుంచాడు. [8]సొలొమోను పది బల్లలు
చేయించి ఆలయంలో వుంచాడు. ఆలయంలో ఐదు
బల్లలు కుడిపక్కన, ఐదు బల్లలు ఎడమపక్కన
వుంచాడు. సొలొమోను వంద తొట్లు చేయించటానికి
బంగారం వినియోగించాడు. [9]ఆలయం వెలుపల సొలొ
మోను యాజకుల పురాన్ని, పెద్ద ఆవరణను నిర్మించి
వాటికి వెలుపలి ద్వారాలను ఏర్పాటు చేశాడు. ఆ
ద్వారాల తలుపులకు కంచు రేకులు తాపడం చేయిం
చాడు. [10]పిమ్మట పెద్ద కంచు కోనేరు (సముద్రం)ను
ఆలయంకి కుడి పక్కగా ఆగ్నేయ (తూర్పు-దక్షిణాల
మూల) భాగాన వుంచాడు.

[11]హూరాము కుండలను, పారలను, గిన్నెలను
తయారు చేశాడు. పిమ్మట హూరాము రాజైన సొలొ
మోను తలపెట్టిన ఆలయంలో తన పనంతా పూర్తి
చేశాడు. [12]హూరాము మరి రెండు స్తంభాలు, వాటిపైన
వెడల్పైన పళ్ళెములను చేశాడు. ఆ స్తంభాలపైనున్న
వెడల్పు పళ్ళెములను అలంకారంగా కప్పటానికి రెండు
వలల్లాంటి అల్లికలను కూడ చేశాడు. [13]ఆ రెండు
అల్లికల మీద వేలాడదీయటానికి నాలుగు వందల దాని
మ్మకాయల ప్రతిమలు కూడ చేశాడు. అలంకరణగా
రెండు వరుసల దానిమ్మకాయల బొమ్మలు చుట్ట
బడ్డాయి. స్తంభాల మీదనున్న పెద్ద పళ్ళెములను వలలు
కప్పివున్నాయి. [14]హూరాము తొట్లను, వాటి కింది
కుదురులను కూడ చేశాడు. [15]హూరాము కంచు కోనే
రును (సముద్రం), దాని కింది పన్నెండు గిత్తలను
చేశాడు. [16]హూరాము పాత్రలను, పారలను, శూలాలను,
మరియు రాజైన సొలొమోను నిర్మిస్తున్న ఆలయానికి
కావలసిన తదితర వస్తువులను చేశాడు. ఈ వస్తు
సామగ్రంతా మెరుగు దిద్దిన కంచుతో చేయబడింది.
[17]రాజైన సొలొమోను ముందుగా ఈ వస్తువులను మట్టి
మూసలలో పోతపోయించాడు. ఈ మూసలు
యోర్దానులోయలో సుక్కోతు, జెరేదాతను పట్టణాల
మధ్య తయారు చేయబడ్డాయి. [18]సొలొమోను
చేయించిన ఈ రకమైన వస్తుసామగ్రి ఎంత వుందనగా
వాటికి పట్టిన కంచును తూచి లెక్క గట్టటానికి ఎవ్వరూ
ప్రయత్నించియుండలేదు.

[19]సొలొమోను ఆలయానికి కావలసిన సామాన్లు
కూడ చేయించాడు. సొలొమోను బంగారు బలిపీఠం
చేయించాడు. దైవ సన్నిధిలో నైవేద్యం వుంచటానికి
తగిన బల్లలు చేయించాడు. [20]సొలొమోను దీప

---

**యాకీను** హెబ్రీలో యాకీను అనగా "ఆయనే స్థాపించును" అని అర్థం.

**బోయజు** హెబ్రీలో బోయజు అనగా "ఆయనలోనే శక్తి వున్నది" అని అర్థం.

**కోనేరు** నీళ్లను నింపుటకు చేయు పెద్దతొట్టి లాంటిది.

స్తంభాలు, దీపాలు మేలిమి బంగారంతో చేయించాడు.
అతి పవిత్ర స్థలం ముందు ఈ దీపాలు నిర్ణయించిన
ఒక క్రమపద్ధతిలో వెలుగుతాయి. [21]ప్రమిదలు నిలిపే
పుష్పాలవంటి కుదుర్లు, ప్రమిదలు, పట్టుకారులు, అన్నీ
మేలిమి బంగారంతో సొలొమోను చేయించాడు.
[22]వత్తులు ఎగదోయు పనిముట్లను, తొట్లను, గిన్నె
లను, సాంబ్రాణి పొగవేయు ధూప కలశాలు చేయ
టానికి కూడా సొలొమోను శుద్ధ బంగారం వినియో
గించాడు. ఆలయ ద్వారాలకు, అతి పవిత్ర స్థలం
తలుపులకు, ఆలయం తలుపులకు సొలొమోను శుద్ధ
బంగారం వినియోగించాడు.

5 దానితో సొలొమోను యెహోవా ఆలయ
నిర్మాణానికి తలపెట్టిన పనంతా పూర్తయ్యింది.
తన తండ్రి దావీదు ఆలయానికిచ్చిన వస్తువులన్నిటినీ
సొలొమోను ఆలయంలోకి తెచ్చాడు. వెండి బంగా
రాలతో చేసిన వస్తువులను, తదితర సామానులన్నిటినీ
సొలొమోను లోనికి తెచ్చాడు. ఆ వస్తువులన్నిటినీ
సొలొమోను ఆలయపు ఖజానాలో భద్రపర్చాడు.

### పవిత్ర పెట్టె ఆలయానికి తేబడటం

[2]ఇశ్రాయేలు పెద్దలందరిని, వంశనాయకులందరినీ
ఇశ్రాయేలులో వున్న వంశపెద్దలందరినీ సొలొమోను
పిలిపించాడు. వారందరినీ యెరూషలేములో సమావేశ
పర్చాడు. యెహోవా ఒడంబడిక పెట్టెను దావీదు
నగరం నుండి తెప్పించే ఏర్పాట్లు చేసేటందుకు
సొలొమోను ఈ సమావేశం ఏర్పాటు చేశాడు. దావీదు
నగరానికే సీయోను అని పేరు. [3]ఈ సందర్భంగా
ఏర్పాటైన ఒక పర్ణశాల పండుగలో ప్రజలంతా రాజైన
సొలొమోనును కలిశారు. ఆ సంవత్సరం ఏడవ నెలలో
ఈ విందు ఏర్పాటు చేయబడింది.
[4]ఇశ్రాయేలు పెద్దలంతా వచ్చిన పిమ్మట లేవీ
యులు ఒడంబడిక పెట్టెను లేవదీశారు. [5]పిమ్మట
యాజకులు, లేవీయులు కలిసి ఒడంబడిక పెట్టెను
యెరూషలేముకు మోశారు. యాజకులు, లేవీయులు
సన్నిధి గుడారాన్ని, దానిలో వున్న పవిత్ర వస్తువులను
యెరూషలేముకు తెచ్చారు. [6]రాజైన సొలొమోను,
ఇశ్రాయేలు ప్రజలు ఒడంబడిక పెట్టెముందు గుమి
కూడారు. రాజైన సొలొమోను, ఇశ్రాయేలీయులు
గొర్రెలను, గిత్తలను, బలియిచ్చారు. బలి యిచ్చిన
గొర్రెలు, గిత్త దూడలు ఎవ్వరూ లెక్కపెట్టలేనన్ని
వున్నాయి. [7]తరువాత యాజకులు యెహోవా ఒడం
బడిక పెట్టెను, దానికై నిర్దేశించిన స్థలానికి తీసికొని
వచ్చారు. ఆ స్థలమే ఆలయంలోని అతి పవిత్ర స్థలం.
ఒడంబడిక పెట్టె అతి పవిత్ర స్థలంలో కెరూబుల
రెక్కల కింద వుంచారు. [8]ఒడంబడిక పెట్టె వుంచబడిన
స్థలంమీద కెరూబుల రెక్కలు విప్పివున్నాయి. కెరూ
బులు ఒడంబడిక పెట్టెమీద, దానిని మోసే కర్రమీద
నిలబడివున్నాయి. [9]అతి పవిత్ర స్థలం ముందు నుంచి
చూస్తే వాటి చివరలు కనబడేటంత పొడవుగా పెట్టెను
మోసే కర్రలు వున్నాయి. కాని ఆలయం బయట
నుంచి ఎవ్వరూ ఆ కర్రలను చూడలేరు. ఈనాటికీ
ఆ కర్రలు అక్కడ వున్నాయి. [10]ఒడంబడిక పెట్టెలో
రెండు శిలాఫలకాలు తప్ప మరేమీ లేవు. (అవి దేవుని
పది ఆజ్ఞలున్న ఫలకాలు). హోరేబు పర్వతం మీద
ఆ రెండు ఫలకాలను మోషే ఒడంబడిక పెట్టెలో
వుంచాడు. ఇశ్రాయేలు ప్రజలతో యెహోవా ఒక
ఒడంబడిక చేసికొన్న చోటే ఈ హోరేబు. ఇది ఇశ్రా
యేలు ప్రజలు ఈజిప్టు నుండి స్వతంత్రులై బయటకు
వచ్చిన పిమ్మట జరిగింది.
[11]పిమ్మట అతి పవిత్ర స్థలంలోనికి వెళ్లిన యాజ
కులంతా బయటకు వచ్చారు. వారంతా శుచిగా
వున్నారు. అప్పట్లో వారు యాజకులలో ఏ వర్గానికి
చెందిన వారు అన్నది ముఖ్యంగాదు. వారంతా అతి
పవిత్ర స్థలంలో నుంచి బయటికి వచ్చి తమకు తాము
పరిశుద్ధులైనారు.
[12]బలిపీఠానికి తూర్పు దిశలో లేవీయులకు చెందిన
గాయకులంతా నిలబడ్డారు. ఆసాపు, హేమాను,
యెదూతూను వర్గాలకు చెందిన గాయక బృందాల
వారంతా అక్కడ వున్నారు. వారి కుమారులు,
బంధువులు కూడా అక్కడ వున్నారు. లేవీ గాయకు
లంతా సన్నని నారతో నేసిన తెల్లని వస్త్రాలు ధరించారు.
వారి చేతుల్లో పెద్ద పెద్ద తాళాలు, తంబురలు, సితారలు
వున్నాయి. లేవీ గాయకులతో పాటు నూటఇరవై
మంది యాజకులున్నారు. ఆ నూట ఇరవై మంది
యాజకులు బూరలు ఊదారు.
[13]బూరలు ఊదిన వారు, పాటలు పాడినవారు,
సొంపుగా ఒక్క మనిషివలె ఊది, పాడారు. వారు
యెహోవాకి స్తోత్రం చేసినప్పుడు కృతజ్ఞతలు పలికి
నప్పుడు ఏక కంఠంగా వినిపించింది. బూరలతోను,
తాళాలతోను, ఇతర వాద్య విశేషాలతోను వారు పెద్ద
శబ్దం వచ్చేలా చేశారు. వారు యిలా పాడారు:

“ప్రభువు మంచివాడు, దేవుని కరుణ శాశ్వత
మైనది!”

అటు తర్వాత ఆలయాన్ని ఒక మేఘం ఆవ
రించింది. [14]ఆ మేఘంవల్ల యాజకులు తమ సేవా
కార్యక్రమాన్ని నిర్వహించలేకపోయారు. దానికి కారణ
మేమనగా యెహోవా యొక్క మహిమ ఆలయాన్ని
నింపివేసింది.

6 తరువాత సొలొమోను యిలా అన్నాడు:
“యెహోవా, నల్లని మేఘంలో నివసిస్తానని
అన్నాడు. [2]ఓ ప్రభూ, నీ కొరకు ఒక ఆలయాన్ని
నిర్మించాను. అది ఒక ఉన్నతమైన ఆలయం. శాశ్వ
తంగా నీవు నివసించటానికి అది నిలయం!”

### సొలొమోను ప్రసంగం

3సొలొమోను వెనుదిరిగి తన ముందు నిలబడి
ఉన్న ప్రజలందరినీ దీవించాడు. 4సొలొమోను యిలా
అన్నాడు: "ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు స్తోత్రం
చేయండి! నా తండ్రి దావీదుకు తానేమి చేస్తానని
వాగ్దానం చేశాడో, యెహోవా అదంతా నెరవేర్చినాడు.
యెహోవా దేవుడు యిలా చెప్పియున్నాడు: 5'నా
ప్రజలను ఈజిప్టు నుండి తీసుకొని వచ్చినప్పటినుండి
ఇశ్రాయేలు వంశాలవారున్న ఏ నగరాన్నీ నాకు ఒక
ఆలయాన్ని కట్టించటానికి నేను కోరుకోలేదు. నా
ప్రజలైన ఇశ్రాయేలీయులను నడిపించటానికి నేను ఏ
వ్యక్తినీ నాయకునిగా ఎంపిక చేయలేదు. 6కాని ఇప్పుడు
నా పేరు మీద యెరూషలేమును ఎన్నుకున్నాను.
పైగా నా ప్రజలైన ఇశ్రాయేలీయులను నడిపించటానికి
దావీదును ఎంపిక చేశాను.'

7"ఇశ్రాయేలు దేవుడగు యెహోవాకు నా తండ్రి
యగు దావీదు ఒక ఆలయాన్ని నిర్మింప గోరాడు.
8కాని, యెహోవా నా తండ్రితో, 'దావీదూ, నీవు నా
పేరు మీద ఒక ఆలయాన్ని నిర్మింప తలచటం బాగానే
వుంది. 9కాని, నీవు ఆలయాన్ని నిర్మించకూడదు.
నా పేరు మీద నీ స్వంత కుమారుడు ఒక ఆలయాన్ని
నిర్మిస్తాడు' అని చెప్పాడు. 10యెహోవా ఏమి చేస్తానని
చెప్పాడో ఇప్పుడది చేశాడు. నా తండ్రి స్థానంలో
నేను కొత్త రాజును. దావీదు నా తండ్రి. ఇప్పుడు
నేను ఇశ్రాయేలుకు రాజును. అదే యెహోవా చేసిన
వాగ్దానం. మరి నేను ఇశ్రాయేలు దేవుడగు యెహో
వాకు ఒక ఆలయాన్ని నిర్మించాను. 11ఒడంబడిక
పెట్టెను ఆలయంలో వుంచాను! ఈ ఒడంబడిక పెట్టె
లోనే దేవుని పది ఆజ్ఞల రాతిపలకలు వుంచబడినవి.
దేవుడు ఈ ఒడంబడికను ఇశ్రాయేలు ప్రజలతో చేసు
కొన్నాడు."

### సొలొమోను ప్రార్థన

12సొలొమోను యెహోవా బలిపీఠానికి ఎదురుగా
నిలబడ్డాడు. సమావేశమైన ఇశ్రాయేలు ప్రజల కెదు
రుగా అతడు నిలబడ్డాడు. పిమ్మట సొలొమోను తన
రెండు చేతులూ చాచాడు. 13సొలొమోను కంచుతో
ఒక ఎత్తైన వేదిక నిర్మించాడు. దాని పొడవు ఏడున్నర
అడుగులు; వెడల్పు ఏడున్నర అడుగులు; ఎత్తు ఏడు
న్నర అడుగులు. అతడు దానిని బయట ఆవరణలో
మధ్యగా వుంచాడు. అతడు దానిమీదకు ఎక్కి, సమావేశ
మైన ఇశ్రాయేలు ప్రజానీకం ముందు మోకరించాడు.
సొలొమోను తన చేతులను ఆకాశంలోనికి ఎత్తాడు.
14పిమ్మట సొలొమోను యిలా ప్రార్థన చేశాడు:

"ఇశ్రాయేలు దేవుడవగు ఓ ప్రభూ, నీవంటి దేవుడు
భూమిమీదగాని, ఆకాశంలోగాని మరొక్కరు లేరు.
ప్రేమ, కరుణతో కూడిన నీ ఒడంబడికను నీవు నిల
బెట్టుకున్నావు. నీ ప్రజలంతా పూర్ణహృదయంతో
సన్మార్గులై, నిన్ను అనుసరిస్తే నీ ఒడంబడిక కొన
సాగిస్తావు. 15నీ సేవకుడైన దావీదుకు నీవిచ్చిన వాగ్దా
నాన్ని నెరవేర్చావు. దావీదు నా తండ్రి. స్వయంగా నీ
నోటితో ఆ వాగ్దానం చేశావు. ఈనాడు ఆ వాగ్దానాన్ని
స్వయంగా నీ చేతులతో నిజమయ్యేలా చేశావు.
16ఇశ్రాయేలు దేవుడవగు ఓ ప్రభూ, ఇప్పుడు నీవు నీ
సేవకుడైన దావీదుకు ఇచ్చిన మాట నిలబెట్టుము.
నీవిలా మాట యిచ్చావు: 'దావీదూ, నా సన్నిధిలో
ఇశ్రాయేలు సింహాసనంపై నీ కుటుంబంలో ఒకడు
తప్పక కొనసాగుతాడు. నీ కుమారులు వారు చేసే
కార్యాలలో తగిన జాగ్రత్త వహిస్తేనే ఇది జరుగుతుంది.
నా ధర్మాశాస్త్రాన్ని నీవు అనుసరించిన రీతిలో, నీ
కుమారులు కూడ నా ధర్మాశాస్త్రాన్ని పాటించాలి.'
17ఇశ్రాయేలు దేవుడవగు ఓ ప్రభూ, నీ వాగ్దానం నిజ
మగుగాక! ఈ వాగ్దానం నీ సేవకుడైన దావీదుకు
యిచ్చియున్నావు.

18"ఓ దేవా, నీవు నిజంగా మానవులతో కలిసి
భూమి మీద నివసించవని మాకు తెలుసు. ఆకాశాలు
గాని, మహా ఆకాశాలు గాని నిన్ను నిలుపజాలవు!
అటువంటప్పుడు నేను నిర్మించిన ఈ చిన్న ఆలయం
నిన్ను భరింపలేదని కూడా మాకు తెలుసు! 19కానీ నీ
కరుణ కొరకు నేను చేయు ప్రార్థనను, అభ్యర్థనను
ఆలకించు. నా దేవుడైన ప్రభూ, నా మొరాలకించుము!
నీ కొరకు నా ప్రార్థనయందు శ్రద్ధ వహించుము. నేను
నీ సేవకుడను. 20ఈ ఆలయాన్ని నీవు కన్నులార
రాత్రింబవళ్లు చూడాలని నా ప్రార్థన. ఈ స్థలంలో నీ
పేరును ప్రతిష్ఠిస్తావని నీవు చెప్పియున్నావు. ఈ
ఆలయాన్ని చూస్తూ నేను చేసే నా ప్రార్థనను నీవు
విందువుగాక! 21నేను, నీ ప్రజలైన ఇశ్రాయేలీయులు
చేయు ప్రార్థనలను ఆలకించుము. ఈ ఆలయాన్ని
చూస్తూ మేము చేయు ప్రార్థనలయందు లక్ష్య
ముంచుము. ఆకాశంలో నీవున్న చోటు నుంచే మా
ప్రార్థన వినుము. నీవు మా ప్రార్థనలను విన్నప్పుడు
మమ్మల్ని మన్నించుము.

22"ఒక మనిషి వేరొక మనిషిపట్ల అపచారం చేసిన
నేరానికి పాల్పడవచ్చు. అది జరిగినప్పుడు నిందితుడు
నీ పేరు మీద ఒక ప్రమాణం చేయాలి. ఆలయంలోని
నీ బలిపీఠం ముందు అతడు ప్రమాణం చేయటానికి
వచ్చినప్పుడు 23నీవు ఆకాశంలోని నీ నివాసము నుండి
వినుము. అప్పుడు నీ సేవకులను విచారించి చర్య
తీసుకొనుము. దుష్టుని శిక్షించుము. అతడు ఇతరులను
బాధ పెట్టిన విధంగా తానుకూడ ఆ బాధను అనుభ
వించేలా చేయుము. మంచి కార్యములు చేసిన వాని
నిర్దోషిత్వాన్ని నిరూపింపుము.

24"నీ ప్రజలైన ఇశ్రాయేలీయులు నీపట్ల పాపం
చేసిన కారణంగా ఒక శత్రువు వారిని ఓడించవచ్చు.

తరువాత ఇశ్రాయేలీయులు తిరిగి వచ్చి నీ నామస్మరణ
చేసి నిన్నాశ్రయించి ఈ ఆలయంలో నిన్ను ప్రార్థిస్తూ
వేడుకుంటే, 25ఆకాశంలో వుండి నీ ఇశ్రాయేలీయుల
రోదన విని వారిని క్షమింపుము. నీవు వారికి, వారి
పూర్వీకులకు ఇచ్చిన రాజ్యానికి వారిని తిరిగి తీసుకొని
రమ్ము.

26"వర్షాలు లేకుండ ఆకాశం కుంచుకపోవచ్చు. ఇశ్రా
యేలు ప్రజలు నీపట్ల పాపం చేసినట్లయితే ఇది జరుగు
తుంది. కాని ఇశ్రాయేలీయులు నీ శిక్షకు గురియై
తమ తప్పు తెలిసికొని పశ్చాత్తాపము పొంది, ఆలయం
వైపు తిరిగి నీ నామస్మరణ చేసి ప్రార్థిస్తే, 27నీవు ఆకా
శంలో నుండి వారి మొరాలకించుము. వారి విన్నపము
ఆలకించి వారి పాపాలను క్షమించుము. ఇశ్రాయేలు
ప్రజలు నీ సేవకులు. వారు జీవించవలసిన సన్మార్గాన్ని
వారికి బోధించుము. నీ రాజ్యంలో వర్షాలు కురి
పించుము. నీవు ఈ రాజ్యాన్ని నీ ప్రజలకు ఇచ్చావు.

28"ఈ రాజ్యంలో కరువు రావచ్చు. వ్యాధులు
వ్యాపించవచ్చు. పంటలకు తెగుళ్లు సోకవచ్చు. తోట
లకు తేనెమంచు వ్యాధుల, మిడతల, పురుగుల పీడ
సంభవించవచ్చు. ఇశ్రాయేలీయుల నగరాలపై శత్రుదా
డులు జరిగినప్పుడుగాని, ఇశ్రాయేలులో ఏ రకమైన
వ్యాధులు ప్రబలినా, 29ఇశ్రాయేలు ప్రజలు తమ బాధలు
గ్రహించి నిన్ను ప్రార్థించి వేడుకుంటే, ఏ బాధితుడేగాని
ఈ ఆలయాన్ని చూస్తూ చేతులెత్తి ప్రార్థిస్తే, 30నీ
నివాస స్థలమైన ఆకాశంనుండి వారి అభ్యర్థన ఆల
కించుము. వారి మొరాలకించి, వారిని క్షమించుము.
ప్రతి వ్యక్తికి వానికి అర్హమైన దాని నివ్వుము. ఎందు
వల్లననగా ప్రతివాని హృదయం నీకు తెలుసు. మానవ
హృదయాలను తెలుసుకొనే శక్తి నీ వొక్కనికే వుంది.
31అప్పుడు మా పూర్వీకులకు నీవిచ్చిన ఈ రాజ్యంలో
ప్రజలు నివసించినంత కాలం నీపట్ల భయభక్తులు
కలిగి వుంటారు. 32నీ ప్రజలైన ఇశ్రాయేలీయులకు
చెందని పరదేశీయుడెవడైనా తన సుదూరదేశం నుండి
ఇక్కడికి రావచ్చును. అతడు నీ మహోన్నత నామం
వినిగాని, తిరుగులేని నీ బాహుబలం గూర్చి వినిగాని,
చాచిన నీ చేతుల ప్రభావం వినిగాని రావచ్చును. అతడు
వచ్చి నీ ఆలయంవైపు చూస్తూ ప్రార్థన చేస్తే, 33నీ
ఆకాశ నివాసం నుండి వాని ప్రార్థన ఆలకించుము. ఆ
పరదేశి కోరిన సహాయాన్ని అందించుము. అప్పుడు
ప్రపంచ దేశాలన్నీ నీ నామ మహిమను, నీ ప్రభావాన్ని
తెలుసు కొని, నీ ప్రజలైన ఇశ్రాయేలీయులవలె నీ
పట్ల భయ భక్తులతో మెలుగుతారు. దానితో ప్రపంచ
ప్రజలంతా నేను నిర్మించిన ఈ ఆలయం నీ పేరు
మీద పిలవ బడుతూ వుందని తెలుసుకుంటారు.

34"నీవు నీ ప్రజలను తమ శత్రువుల మీదికి ఒక
చోటికి యుద్ధానికి పంపితే, వారు ఈ నగరంవైపు,
నేను నిర్మించిన ఈ ఆలయంవైపు తిరిగి నిన్ను తలంచి
ప్రార్థన చేసిన పక్షంలో 35వారి ప్రార్థన ఆకాశంనుండి
నీవు ఆలకించి తగిన సహాయం చేయుము.

36"ప్రజలు నీకు విరుద్ధంగా పాపం చేస్తారు. సామా
న్యంగా పాపం చేయని మానవులుండరు. అలాగే ఈ
ప్రజలు నీపట్ల పాపం చేసినప్పుడు నీకు వారిపై కోపం
రావటం సహజం. ఒకానొక శత్రువు వచ్చి వారిని
ఓడించి బందీలుగా దూర దేశానికో, దగ్గర దేశానికో
తీసుకొని పోయేలా నీవు చేయవచ్చు. 37కాని వారు
బందీలుగా వున్న రాజ్యంలో వున్నప్పుడు వారిలో
పరివర్తన వచ్చి నిన్ను ప్రాధేయపడవచ్చు. 'మేము
పాపం చేశాము; మేము తప్పు చేశాము; మేము దుర్మా
ర్గంగా ప్రవర్తించాము,' అని వారు పరితపించవచ్చు.
38పరితపించి వారు మళ్లీ హృదయపూర్వకంగా, ఆత్మ
సాక్షిగా తాము బందీలుగా వున్న దేశంలోనే వారు
నిన్ను ఆశ్రయించవచ్చు. నీవు వారి పితరులకు
యిచ్చిన దేశంవైపు, నీవు ఎంపిక చేసిన నీ నగరంవైపు
చూస్తూ నిన్ను ప్రార్థించవచ్చు. నేను నీ పేరు మీద
నిర్మించిన ఈ ఆలయంవైపు తిరిగి ప్రార్థించవచ్చు.
39ఇలా జరిగిన సందర్భంలో ఆకాశంలో నుండి నీవు
వారి మొర ఆలకించుము. ఆకాశం నీ నివాసం. నీపట్ల
పాపం చేసిన నీ ప్రజలైన వారి ప్రార్థన, వారి మనవి
ఆలకించి, వారిని క్షమించి సహాయపడుము. 40ఓ
నాప్రభూ, నీ నేత్రాలను విప్పుమని, నీ చెవులను ఒగ్గుమని
నేను ప్రాధేయపడుచున్నాను. ఈ స్థానంలో మేము
చేసే ప్రార్థనపట్ల శ్రద్ధ వహించుము.

41 "ఓ ప్రభూ, మేలుకో తండ్రీ, నీ మహత్తర
శక్తికి నిదర్శనమైన ఒడంబడిక పెట్టెతో నీ
విశ్రాంతి ఆలయాన్ని ప్రవేశించుము. నీ
యాజకులు రక్షణ పొందుదురు గాక! ఓ
ప్రభూ, దేవా, పవిత్రులైన నీ ప్రజలకు
సుఖశాంతులను కలుగజేయుము!
42 ఓ దేవా, నీవల్ల అభిషిక్తుడైన వానిని తిరస్క
రించవద్దు. నీ సేవకుడైన దావీదు చేసిన
విశ్వాసపాత్రమైన కార్యాలను జ్ఞాపక ముంచు
కొనుము!"

### ఆలయాన్ని దేవునికి అంకితం చేయుటం

7 సొలొమోను ప్రార్థన పూర్తి చేసేసరికి ఆకాశం
నుండి అగ్ని దిగి దహనబలులను, మిగిలిన అర్పణ
లను దహించి వేసింది. యెహోవా మహిమ ఆల
యాన్ని నింపివేసింది.

2యెహోవా మహిమ నిండి వున్న ఆలయంలో
యాజకులు ప్రవేశించలేక పోయారు. 3ఆకాశం నుండి
అగ్ని దిగిరావటం ఇశ్రాయేలీయులంతా చూశారు.
యెహోవా మహిమ ఆల యాన్ని ఆవరించి వుండటం
కూడ వారు చూశారు. వారంతా బాటపై సాష్టాంగ

పడ్డారు. వారు యెహోవాను స్తుతించి, నమస్క
రించారు. వారింకా యిలా అన్నారు:

"ప్రభువు ఉత్తముడు, ఆయన కరుణ ఎప్ప
టికీ కొనసాగుతుంది."

4పిమ్మట రాజైన సొలొమోను, ఇశ్రాయేలు ప్రజ
లందరు యెహోవా ముందు బలులు అర్పించారు.
5రాజైన సొలొమోను ఇరవై రెండువేల గిత్తలను, ఒక
లక్షా ఇరవై వేల గొర్రెలను బలియిచ్చాడు. రాజు,
ప్రజలు అంతా కలిసి ఆలయాన్ని పవిత్రం చేశారు.
అది యెహోవా ఆరాధనకై వినియోగింపబడాలి.
6యాజకులు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి సిద్ధంగా
నిలబడ్డారు. లేవీయులు కూడ యెహోవా మేళం
వాయించే పనిముట్లు పట్టుకుని నిలిచారు. దేవునికి
వందనాలర్పించే నిమిత్తం ఈ వాద్య విశేషాలను రాజైన
దావీదు చేయించాడు. "దేవుని ప్రేమ అనంతం!" అని
యాజకులు, లేవీయులు పలికారు. లేవీయులకు ఎదు
రుగా నిలబడి యాజకులు బాకాలు ఊదారు. ఇశ్రాయేలీ
యులందరూ నిలబడ్డారు.
7ఆలయం ముందున్న ఆవరణ మధ్య భాగాన్ని
సొలొమోను ప్రతిష్టించాడు. అక్కడే సొలొమోను
దహనబలులు,* సమాధాన బలుల కొవ్వును అర్పిం
చాడు. తాను నిర్మించిన కంచు బలిపీఠం దహనబలులు,
ధాన్యపు అర్పణలు, కొవ్వును పెట్టటానికి చాల
నందున, సొలొమోను ఆలయ ఆవరణ మధ్య భాగాన్ని
వినియోగించాడు.
8సొలొమోను, ఇశ్రాయేలు ప్రజలు కలిసి ఏడు
రోజులపాటు పండుగ చేశారు. సొలొమోనుతో చాలా
మంది జనం వున్నారు. హమాతు పట్టణద్వారం నుండి
ఈజిప్టు సెలయేటి వరకు వున్న ప్రాంత మంతటి
నుండి జనసమూహాలు వచ్చాయి. 9ఏడు రోజుల
పండుగ ఆచరణ ముగిశాక, ఎనిమిదవ రోజున వారు
పవిత్ర సమావేశం ఏర్పాటు చేశారు. బలిపీఠాన్ని వారు
పవిత్రం (శుద్ధి) చేశారు. దానిని దైవారాధనలోనే విని
యోగిస్తారు. వారు ఏడు రోజులు పండుగ ఆచరిం
చారు. 10ఆ సంవత్సరం ఏడవ నెల ఇరవై మూడవ
రోజు సొలొమోను ప్రజలందరినీ తమ తమ ఇండ్లకు
పంపివేశాడు. యెహోవా దావీదుపట్ల, సొలొమోను
పట్ల, ఇశ్రాయేలు ప్రజలపట్ల ఎంతో ఉదారంగా వున్నం
దుకు ప్రజలంతా చాలా సంతోషించారు. వారి హృద
యాలు ఆనందమయమయ్యాయి.

### యెహోవా సొలొమోను వద్దకు రావటం

11సొలొమోను ఆలయాన్ని, రాజభవనాన్ని నిర్మిం
చటం పూర్తిచేశాడు. ఆలయ నిర్మాణంలోను, తన
ఇంటి నిర్మాణంలోను సొలొమోను అనుకున్న పను
లన్నీ పూర్తిచేశాడు. 12ఆ రాత్రి యెహోవా సొలొమో
నుకు దర్శనమిచ్చాడు. యెహోవా ఇలా అన్నాడు:
"సొలొమోనూ, నీ ప్రార్థన నేను విన్నాను. బలులు
యివ్వటానికి అనువైన ప్రదేశంగా ఈ స్థలాన్ని నేనే
ఎంపిక చేశాను. 13వర్షాలు లేకుండా నేను ఆకాశాన్ని
మూసివేసినప్పుడుగాని, దేశాన్ని నాశనం చేసే విధంగా
నేను మిడతల దండులను పంపినప్పుడుగాని, నేను
నా ప్రజలకు వ్యాధులు సోకేలా చేసినప్పుడుగాని, 14నా
పేరు మీద పిలవబడే నా ప్రజలు అణకువతో వుండి
నన్ను ప్రార్థిస్తే, నా కొరకు ఎదురు చూస్తే, వారు
తమ చెడు మార్గాలను విడనాడితే, నేనప్పుడు ఆకాశం
నుండి వారి మొర ఆలకిస్తాను. నేను వారి పాపాలను
క్షమిస్తాను. నేను వారి దేశాన్ని బాగు చేస్తాను. 15నేను
నా నేత్రాలను తెరచియున్నాను. నా చెవులు ఈ
ప్రదేశంలో చేసిన ప్రార్థనలను వింటాయి. 16ఇక్కడ
నా పేరు శాశ్వతంగా ఉండునట్లు నేనీ ప్రదేశాన్ని ఎంపిక
చేసి, దానిని పవిత్రంగా మార్చాను. అవును; నా కళ్ళు,
నా హృదయం ఇక్కడ ఈ ఆలయంలో ఎల్లప్పుడూ
వుంటాయి. 17సొలొమోనూ, నీవిప్పుడు నీ తండ్రి
మెలగిన రీతిలో నా ముందు జీవిస్తే, నా ఆజ్ఞలన్నీ
పాటిస్తే, నా ధర్మశాస్త్రాన్ని, నియమాలను అనుసరిస్తే,
18నిన్నొక శక్తి యుక్తులుగల రాజుగా చేస్తాను. నీ
రాజ్యాన్ని సుస్థిరమైనదిగా చేస్తాను. నీ తండ్రియైన
దావీదుతో అదే ఒడంబడిక చేశాను. 'దావీదూ,
ఇశ్రాయేలు రాజుగా నీ కుటుంబంలో ఒకడు కొన
సాగుతాడు' అని నేను చెప్పియున్నాను.
19"కానీ నీవు నా ధర్మాన్ని, ఆజ్ఞలను శిర
సావహించనిచో, నీవు గనుక అన్యదేవతారాధనకు పాల్ప
డితే, 20అప్పుడు ఇశ్రాయేలు ప్రజలను నేను వారికిచ్చిన
రాజ్యం నుండి బయటకు త్రోసివేస్తాను. నా నామ
ముతో పవిత్రపర్చబడిన ఈ ఆలయాన్ని నేను వదిలి
వేస్తాను. ఇతర దేశాలన్నీ చెడుమాటలు పలికేలా ఈ
ఆలయమును మార్చివేస్తాను. 21అత్యున్నతంగా గౌర
వింపబడిన ఈ ఆలయం ప్రక్కగా వెళ్లే వారెవరైనా
చూసి ఆశ్చర్యపోతారు. 'ఈ రాజ్యానికి, ఈ ఆలయా
నికి, యెహోవా ఎందుకింత భయంకర పరిస్థితి
కల్పించాడు?' అని అనుకుంటారు. 22పిమ్మట వారు
ఈ రకంగా సమాధానం చెప్పుకుంటారు: 'వారి పూర్వీ
కుల దేవుడైన యెహోవాను ఇశ్రాయేలు ప్రజలు
అనుసరించలేదు. ఆయనే వారిని ఈజిప్టు నుండి విముక్తి
చేసి బయటకు తీసుకొనివచ్చాడు. కాని ఇశ్రాయేలు
ప్రజలు అన్యదేవతలను సేవించారు. వారు విగ్రహాలను
కొలిచారు. అందువల్లనే యెహోవాఈ భయంకర పరి

---

**దహనబలులు** దేవునితో స్నేహం కొనసాగించటానికి, పోయిన సహవాసాన్ని తిరిగి పొందటానికిగాను చేయు అర్పణ, ఇందులో బలిపశువు ఒక ప్రత్యేక భాగాన్ని అర్పించి మిగిలిన దానిని ప్రజలుగాని యాజకులుగాని తింటారు.

స్థితులు ఇశ్రాయేలు ప్రజలకు కల్పించాడు అని అను
కుంటారు.'"

### సొలొమోను నిర్మించిన నగరాలు

8 ఆలయ నిర్మాణానికి, తన స్వంత ఇంటి నిర్మా
ణానికి సొలొమోనుకు ఇరవై సంవత్సరాలు
పట్టింది. 2పిమ్మట హీరాము తనకు ఇచ్చిన పట్టణాలను
తిరిగి నిర్మించాడు. ఆ పట్టణాలలో కొంత మంది
ఇశ్రాయేలీయులను సొలొమోను నివసింపనిచ్చాడు.
3దీని తరువాత సొలొమోను సోబాలోని హమాతు నగ
రాన్ని వశపర్చుకున్నాడు. 4సొలొమోను తద్మోరు అనే
పట్టణాన్ని కూడ ఎడారిలో నిర్మించాడు. హమాతు
లోని పట్టణాలన్నిటినీ వస్తుసామగ్రులను నిలవచేయ
టానికి నిర్మించాడు. 5సొలొమోను ఎగువ బేత్
హోరోను, దిగువ బేత్ హోరోను పట్టణాలను కూడ
కట్టించాడు. అతడీ పట్టణాలను బలమైన కోటలుగా
తయారు చేశాడు. వాటి చుట్టూ గోడలు, వాటి
ద్వారాలు, ద్వారాలకు కడ్డీలు ఏర్పాటు చేశాడు. 6బయ
లతు పట్టణాన్ని వస్తువులు నిల్వచేసే ఇతర పట్టణాలను
సొలొమోను మళ్లీ కట్టించాడు. రథశాలలున్న పట్ట
ణాలను, గుర్రాలను నడిపే రౌతుల నగరాలన్నిటినీ
సొలొమోను కట్టించాడు. యెరూషలేములోను, లెబా
నోనులోను, తాను రాజుగా వున్న ప్రాంతాలన్నిటి
లోను సొలొమోను తనకు కావలసిన వాటినన్నిటినీ
కట్టించాడు.

7-8ఇశ్రాయేలీయులు నివసిస్తున్న దేశంలో చాలా
మంది పరదేశీయులున్నారు. వారిలో హిత్తీయులు,
అమోరీయులు, పెరిజ్జీయులు, హివ్వీయులు, యెబూ
సీయులు వున్నారు. ఆ పరదేశీయులందరినీ సొలొ
మోను బానిసలుగా పనిచేయించాడు. వారు ఇశ్రాయేలీ
యులు కారు. వారంతా దేశాన్ని వదలిపోగా మిగిలిన
వారంతా పరదేశీయుల సంతతివారు. పైగా వారు ఇశ్రా
యేలీయులచే చంపబడకుండా మిగిలిపోయినవారు.
ఈ వెట్టి చాకిరి ఈనాటికీ కొనసాగుతూనే వుంది.
9ఇశ్రాయేలీయులైన వారెవరినీ బానిసలుగా చేయమని
సొలొమోను వత్తిడి చేయలేదు. ఇశ్రాయేలు ప్రజలు
సొలొమోను యొక్క పోరాట యోధులు. వారు అతని
సైనికాధికారులలో ముఖ్యులుగాను, రథాలకు అధిపతు
లుగాను, రథసారధులకు నాయకులుగాను నియమింప
బడ్డారు. 10కొంతమంది ఇశ్రాయేలీయులు సొలొమోను
ముఖ్యాధిపతులకు పైఅధికారులుగా వున్నారు. ప్రజల
కార్యకలాపాలు తనిఖీ చేయటానికి ఇలాంటివారు రెండు
వందల ఏభై మంది ఉన్నారు.

11ఫరోరాజు కుమార్తెను దావీదు నగరం నుండి
ఆమె కొరకు కట్టించిన భవంతికి సొలొమోను తీసుకొని
వచ్చాడు. "నా భార్య రాజైన దావీదు ఇంటిలో నివసించ
కూడదు. ఎందువల్లనంటే దేవుని ఒడంబడిక పెట్టె
వెళ్లిన ప్రతిచోటూ పవిత్రమైనది' అని సొలొమోను
అన్నాడు.

12యెహోవా బలిపీఠం మీద సొలొమోను దహన
బలులు అర్పించాడు. 13మోషే ఆజ్ఞాపించిన విధంగా
సొలొమోను ప్రతిరోజూ బలులు అర్పించాడు. బలులు
ప్రతి సబ్బాతు దినాన, ప్రతి అమావాస్య రోజున,
మరియు సంవత్సరంలో వచ్చే మూడు పండుగ సెలవు
రోజులలోను అర్పించేవారు. ఆ మూడు పండుగలకు
పులియని రొట్టెల పండుగ, వారాల పండుగ మరియు
పర్ణశాలల పండుగ అని పేర్లు. 14తన తండ్రి దావీదు
ఉపదేశాలన్నిటినీ సొలొమోను పాటించాడు. సొలొ
మోను వివిధ కార్యాలకు అర్హతగల యాజక వర్గాలను
నియమించాడు. లేవీయులను కూడ వారికి తగిన పను
లకు సొలొమోను నియమించాడు. భక్తిగీతాల కార్య
క్రమ నిర్వహణ, ఆలయంలో దేవుని సేవలో నిత్యం
కావలసిన వస్తువులు చేయుటలో యాజకులకు
తోడ్పడటం లేవీయుల పని. ప్రతి ద్వారంవద్ద సేవ
చేయటానికి తగిన విధంగా జట్లను సొలొమోను ఎంపిక
చేశాడు. ఈ రకంగా చేయమని యెహోవా సేవకుడైన
దావీదు ఆజ్ఞాపించాడు. 15యాజకులకు, లేవీయులకు
సొలొమోను ఇచ్చిన ఆదేశాలను ఇశ్రాయేలు ప్రజలు
మార్చటంగాని, అనాదరించటంగాని చేయలేదు.
కనీసం విలువైన వస్తువుల భద్రత విషయాలలో కూడ
వారు ఏ ఒక్క ఆదేశాన్నీ మార్చలేదు.

16సొలొమోను చేయవలసిన పనంతా పూర్తి
అయ్యింది. ఆలయ నిర్మాణం మొదలైనప్పటి నుండి
అది పూర్తి అయ్యేవరకు పనియావత్తూ ఒక క్రమ
పద్ధతిలో సాగింది. ఆ విధంగా ఆలయం నిర్మింప
బడింది.

17పిమ్మట సొలొమోను ఎసోన్గెబరు, ఏలతు పట్టణా
లకు వెళ్లాడు. ఆ పట్టణాలు ఎదోము దేశంలో ఎర్ర
సముద్ర తీరంలో వున్నాయి. 18హీరాము ఓడలను
సొలొమోను వద్దకు పంపాడు. హీరాము స్వంత మను
ష్యులు ఓడలను నడిపారు. సముద్రయానంలో
హీరాము మనుష్యులు ఆరితేరినవారు. హీరాము మను
ష్యులు సొలొమోను సేవకులతో కలిసి ఓఫీరుకు వెళ్లి
పదిహేడు టన్నుల* బంగారాన్ని రాజైన సొలొమో
నుకు తీసుకొని వచ్చారు.

### షేబదేశపు రాణి సొలొమోనును దర్శించటం

9 షేబ దేశపు రాణి సొలొమోను కీర్తిని గురించి
విన్నది. కఠినమైన, చిక్కు ప్రశ్నలు వేసి సొలొమో
నును పరీక్షించాలని ఆమె యెరూషలేముకు వచ్చింది.
షేబ రాణి తన వెంట అనేకమంది మనుష్యులను

---

**పదిహేడు టన్నులు** నాలుగు వందల ఏభై తలాంతులని
లేక తొమ్మిది వందల మణుగులు అని పాఠాంతరం.

తీసుకొని వచ్చింది. సుగంధ ద్రవ్యాలు, బంగారం,
విలువైన రత్నాలు మోసుకొని వచ్చిన ఒంటెలు
ఆమెతో వున్నాయి. ఆమె సొలొమోను వద్దకు వచ్చి
అతనితో మాట్లాడింది. ఆమె వద్ద సొలొమోనును
అడగటానికి ఎన్నో ప్రశ్నలున్నాయి. [2]ఆమె ప్రశ్నలన్ని
టికీ సొలొమోను సమాధాన మిచ్చాడు. వివరించి చెప్ప
టానికిగాని, సమాధాన మివ్వటానికిగాని సొలొమోనుకు
కష్టమైనదేదీ కన్పించలేదు.

[3]సొలొమోను జ్ఞానాన్ని, అతడు నిర్మించిన
భవంతిని షేబ దేశపు రాణి స్వయంగా చూసింది.
[4]సొలొమోను బల్లమీద రాజ భోజన పదార్థాలను, అతని
ముఖ్య అధికారులనేకమందిని ఆమె చూసింది. అతని
సేవకులు పనిచేసే తీరును, వారు ధరించే దుస్తులను
ఆమె చూసింది. సొలొమోనుకు ద్రాక్షరసము వడ్డించే
వారిని, వారి దుస్తులను ఆమె చూసింది. ఆలయంలో
సొలొమోను అర్పించిన దహన బలులను కూడ ఆమె
చూసింది. షేబ దేశపు రాణి వాటన్నింటినీ చూసి
నప్పుడు ఆమె ఆశ్చర్యపడింది! [5]అప్పుడామె రాజైన
సొలొమోనుతో యిలా అన్నది: "నీ ఘనమైన కార్యా
లను గురించి, నీ అద్భుతమైన తెలివితేటల గురించి
నేను నా దేశంలో విన్న విషయాలన్నీ నిజమని తెలుసు
కున్నాను. [6]నేనిక్కడికి వచ్చి, నా కన్నులతో
స్వయంగా చూచేవరకు నేనా విషయాలను నమ్మలేదు.
ఆహా! నీకున్న మహాజ్ఞానంలో కనీసం సగం కూడ
నాకు చెప్పబడలేదు! నేను విన్న విషయాలను మించి
వున్నావు నీవు! [7]నీ భార్యలు, అధికారులు చాలా
అదృష్టవంతులు! నీకు సేవ చేస్తూనే నీ జ్ఞాన
వాక్కులను వారు వినగలరు!

[8]నీ దేవుడైన ప్రభువుకు వందనాలు! నీ పట్ల ఆయన
సంతోషంగా వున్నాడు. అందువల్ల ఆయన తరపున
రాజ్యమేలటానికి ఆయన సింహాసనంపై నిన్ను కూర్చో
పెట్టాడు. నీ దేవుడు ఇశ్రాయేలును ప్రేమిస్తున్నాడు.
ఆయన సహాయం ఇశ్రాయేలుకు శాశ్వతంగా
వుంటుంది. అందువల్లనే ఏది న్యాయమైనదో, ఏది
మంచిదో అది చేయటానికి యెహోవా నిన్ను
ఇశ్రాయేలుకు రాజుగా చేశాడు:"

[9]తరువాత షేబ దేశపు రాణి సొలొమోను రాజుకు
నాలుగున్నర టన్నుల (రెండు వందల నలభై మణు
గులు) బంగారం, లెక్కకు మించి సుగంధ ద్రవ్యాలు,
విలువైన రత్నాలు ఇచ్చింది. షేబ దేశపు రాణి ఇచ్చినట్లు
రాజైన సొలొమోనుకు ఎవ్వరూ అటువంటి మేలి రకపు
సుగంధ ద్రవ్యాలను ఇచ్చివుండలేదు.

[10]హీరాము సేవకులు, సొలొమోను సేవకులు
ఓఫీరు* నుండి బంగారం తీసుకొని వచ్చారు. వారింకా
చందనపు కర్రను, విలువైన రత్నాలను తెచ్చారు.
[11]ఆలయంలో మెట్ల నిర్మాణానికి, రాజభవన నిర్మాణం
లోను రాజైన సొలొమోను చందనపు కర్రను ఉపయో
గించాడు. సంగీత విద్వాంసుల కొరకు తంబురలు,
సితారాలు చేయటానికి కూడ సొలొమోను ఈ కర్రను
వినియోగించాడు. యూదాలో చందనపు కర్రతో
చేయబడిన చిత్రవిచిత్ర కళాఖండాలను ఎవ్వరూ
ముందెన్నడూ చూసి వుండలేదు.

[12]రాజైన సొలొమోను కూడ షేబ దేశపు రాణికి
ఆమెకు కావలసిన వాటిని, అడిగిన ప్రతి దానిని
ఇచ్చాడు. తనకు ఇవ్వటానికి ఆమె తెచ్చిన దానికంటె
ఎక్కువగానే సొలొమోను ఇచ్చాడు. తరువాత షేబ
దేశపు రాణి, ఆమె పరివారం తమ దేశానికి వెళ్లిపోయారు.

### సొలొమోను మహా భాగ్యం

[13]ఒక్క సంవత్సరంలో సొలొమోను సేకరించిన
బంగారం ఇరవై ఐదు టన్నులు (ఒక వెయ్యి మూడు
వందల ముప్పైరెండు మణుగులు) తూగింది.
[14]సంచార వర్తకులు, వ్యాపారులు సొలొమోనుకు చాలా
బంగారం తెచ్చారు. అరబీ రాజులందరూ, దేశంలో
ప్రాంతీయ పాలకులూ సొలొమోనుకు వెండి బంగా
రాలు తెచ్చియిచ్చారు.

[15]బంగారు రేకులు తాపిన రెండు వందల పెద్ద
డాళ్లను సొలొమోను చేయించాడు. ప్రతి డాలుకూ
సుమారు ఏడున్నర పౌనుల (ఆరు వందల తులాల)
సాగగొట్టిన బంగారం పట్టింది. [16]బంగారు రేకులు
వేయించి మూడు వందల చిన్న డాళ్లను కూడ సొలొ
మోను చేయించాడు. సుమారు మూడు ముప్పాతిక
పౌనుల (మూడు వందల తులాల) బంగారం ఒక్కొక్క
డాలుకు పట్టింది. లెబానోను అరణ్యంలో కట్టిన
భవనంలో రాజైన సొలొమోను ఈ డాళ్లను వుంచాడు.

[17]ఒక పెద్ద దంతపు సింహాసనాన్ని సొలొమోను
రాజు చేయించాడు. మేలిమి బంగారపు రేకులు దానికి
తాపించాడు.

[18]సింహాసనానికి ఆరు మెట్లున్నాయి. బంగారంతో
చేయించిన కాలిపీట దాని ముందు వుంది. సింహాస
నానికిరుపక్కల చేతులు ఆనించటానికి తగిన ఆసరా
ఏర్పాటు వుంది. చేతి ఆసరాలకు రెండు పక్కలా
రెండు సింహపు విగ్రహాలున్నాయి.

[19]ప్రతి మెట్టుకూ అటు ఇటు రెండేసి సింహాల
విగ్రహాలు చొప్పున ఆరు మెట్లకు పన్నెండు సింహపు
విగ్రహాలు అమర్చబడ్డాయి. ఏ యితర సామ్రాజ్యం
లోనూ ఈ రకమైన సింహాసనం చేయించబడలేదు.
[20]సొలొమోను రాజు తాగే గిన్నెలన్నీ బంగారంతో
చేసినవే. లెబానోను అరణ్య భవనంలో వాడే వస్తు
సామగ్రి అంతా శుద్ధ బంగారంతో చేయబడింది. సొలొ
మోను కాలంలో వెండి విలువైన లోహంగా చూడబడ

---

**ఓఫీరు** ఆనాడు బంగారం విస్తారంగా దొరికే ప్రాంతం. దాని
ఉనికి ఈనాటికి ఎవ్వరికీ తెలియదు.

లేదు. 21తర్షీషు* వరకు ప్రయాణం చేసిన ఓడలు
సొలొమోను రాజుకు వున్నాయి. హీరాము మనుష్యులు
సొలొమోను ఓడలను నడిపేవారు. మూడు సంవత్స
రాల కొకసారి ఓడలు వెండి బంగారాలు, ఏనుగు
దంతాలు, కోతులు, నెమళ్లు మొదలగు వాటిని తీసు
కొని సొలొమోను రాజ్యానికి తిరిగి వచ్చేవి.
22భూలోకంలో వున్న రాజులందరికంటె సొలొ
మోను భాగ్యంలోను, తెలివితేటలలోను గొప్ప వాడ
య్యాడు. 23ప్రపంచ దేశాల రాజులంతా సొలొమోను
వివేకవంతమైన న్యాయ నిర్ణయాలను వినటానికి
అతనిని దర్శించేవారు. సొలొమోనుకు ఆ తెలివితేట
లను దేవుడే ప్రసాదించాడు. 24ప్రతి సంవత్సరం సొలొ
మోనును దర్శించటానికి వచ్చే రాజులందరూ కానుకలు
తెచ్చేవారు. వారు వెండి బంగారు వస్తువులు, బట్టలు,
కవచాలు, సుగంధ ద్రవ్యాలు, గుర్రాలు, కంచరగాడి
దలను తెచ్చేవారు.
25సొలొమోనుకు గుర్రాలను, రథాలను వుంచ
టానికి నాలుగువేల శాలలున్నాయి. అతనికి పన్నెండు
వేలమంది రథసారధులున్నారు. రథాలకు ప్రత్యేక నగరా
లను ఏర్పాటుచేసి, మరికొన్ని తనతో యెరూషలే
ములో వుంచుకున్నాడు.
26యూఫ్రటీసు నది మొదలు ఫిలిష్తీయుల దేశం,
మరియు ఈజిప్టు సరిహద్దు వరకు వున్న రాజులందరికీ
సొలొమోను రాజైయున్నాడు.
27సొలొమోను రాజు వద్ద నిలవవున్న వెండి
యెరూషలేములో కొండ గుట్టల్లా పడివుంది. అతని
వద్ద పల్లపు ప్రాంతంలో* వున్న మేడిచెట్లంత విస్తా
రంగా దేవదారు చెట్ల కలపవుంది. 28ఈజిప్టు నుండి,
తదితర దేశాలనుండి ప్రజలు సొలొమోనుకు గుర్రాలను
తెచ్చి యిచ్చేవారు.

### సొలొమోను మరణం

29మొదటినుండి చివరివరకు సొలొమోను చేసిన
పనులన్నీ ప్రవక్తయైన నాతాను ప్రవచనాలోను, షిలో
హువాడైన అహీయా ప్రవచనాలలోను, మరియు దీర్ఘ
దర్శి అయిన ఇద్దో దర్శనాలలోను పొందుపర్చబడి
నాయి. అహీయా షిలోనీయుడు. ఇద్దో దీర్ఘదర్శి
(ప్రవక్త). ఇద్దో యరొబామును గురించి రాశాడు.
యరొబాము నెబాతు కుమారుడు. 30సొలొమోను
నలబై యేండ్లపాటు యెరూషలేము నుండి ఇశ్రాయే
లంతటినీ పాలించాడు. 31పిమ్మట సొలొమోను చని
పోయాడు.* తన తండ్రి దావీదు నగరంలో ప్రజ
లతనిని సమాధి చేశారు. సొలొమోను స్థానంలో అతని
కుమారుడైన రెహబాము నూతన రాజయ్యాడు.

### రెహబాము మూర్ఖంగా ప్రవర్తించటం

10 రెహబాము షెకెము పట్టణానికి వెళ్లాడు. ఎందు
వల్లననగా ఇశ్రాయేలు ప్రజలంతా రెహబా
మును రాజుగా అభిషిక్తుని చేయటానికి అక్కడికి
వెళ్లారు. 2యరొబాము అప్పుడు ఈజిప్టులో వున్నాడు.
అతడు ఇంతకు పూర్వము సొలొమోను రాజుకు
భయపడి పారిపోయి ఈజిప్టులో దాక్కున్నాడు.
యరొబాము తండ్రిపేరు నెబాతు. రెహబాము కొత్త
రాజు కాబోతున్నట్లు యరొబాము విన్నాడు. అందుకని
యరొబాము ఈజిప్టునుండి తిరిగి వచ్చాడు. 3ఇశ్రా
యేలు ప్రజలు తమతో రమ్మని యరొబామును పిలి
చారు. అప్పుడు యరొబాము, ఇశ్రాయేలు ప్రజలు
అంతా కలిసి రెహబాము వద్దకు వెళ్లారు. వారతనితో
యిలా అన్నారు: “రెహబామూ,
4నీ తండ్రి మాకు జీవితం కష్టమయం చేశాడు.
అది మాకు మోయలేని భారమయ్యింది. నీవు మాకా
బరువును తేలిక చెయ్యి. అప్పుడు నీకు మేము సేవ
చేస్తాము.” 5రెహబాము వారితో, “మూడు రోజుల
తరువాత మళ్లీ నా వద్దకు రండి” అని అన్నాడు.
అందుకని ప్రజలు వెళ్లిపోయారు.
6రాజైన రెహబాము గతంలో తన తండ్రిగా సొలొ
మోను వద్ద సేవచేసిన పెద్దలను సంప్రదించాడు. “ఆ
ప్రజలకు నేనేమి సమాధానం చెప్పాలని మీరు నాకు
సలహా యిస్తున్నారు?” అని అడిగాడు.
7పెద్దలు రెహబాముతో యిలా అన్నారు: “నీవు
గనుక ఆ ప్రజల పట్ల దయగలిగి వుంటే, వారిని
సంతోషపెట్టి మంచిమాటలు మాట్లాడితే, వారు నీకు
సదా సేవ చేస్తారు.”
8కాని రెహబాము పెద్దల సలహా పాటించలేదు.
పైగా రెహబాము తనతో పెరిగి తనకు సేవచేస్తున్న
తన స్నేహితులను సంప్రదించాడు. 9రెహబాము
వారితో యిలా అన్నాడు: “మీరు నాకు ఏమి సలహా
యిస్తున్నారు ? ఆ ప్రజలకు మనం ఎలా సమాధానం
చెప్పాలి? వారు తమ పనిని తేలిక చేయమని నన్ను
అడిగారు. నా తండ్రి వారిపై వుంచిన భారాన్ని తగ్గించ
మని వారు నన్ను కోరుతున్నారు.”
10అప్పుడు రెహబాముతో పెరిగిన యువకులు అత
నికి యిలా సలహా యిచ్చారు: “నీతో మాట్లాడిన
ప్రజలకు నీవు చెప్పవలసినది యిది: ‘నీ తండ్రి మా
బ్రతుకు భారం చేశాడు. అది పెద్ద బరువు మోసినట్లుగా

---

**తర్షీషు** ఇది ఇశ్రాయేలుకు చాలా దూరంలో వున్న స్పెయిన్ దేశంలోని ఒక నగరం కావచ్చు. మధ్యధరా సముద్రాలలో ప్రయాణం చేయగల పెద్ద పెద్ద ఓడలకు ఈ తర్షీషు నగరం ప్రసిద్ధిగాంచింది.

**పల్లపు ప్రాంతం** షెఫెలా ప్రదేశమని పాఠాంతరము.

**చనిపోయాడు** అనగా తన పూర్వీకులతో కలిసిపోయాడని అర్థం.

వుంది. కాని ఆ బరువును తగ్గించమని మేము నిన్ను
కోరుతున్నాము' అని వారన్నారు గదా. కాని రెహ
బామూ, నీ సమాధానం యిలా వుండాలి: 'నా చిటికెన
వ్రేలు నా తండ్రి నడుముకంటె లావుగా వుంటుంది!
11నా తండ్రి మీపై చాలా భారం వేశాడు. కాని నేను ఆ
బరువును మరింత ఎక్కువ చేస్తాను. నా తండ్రి
మిమ్మల్ని కొరడాలతో కొట్టాడు. కాని నేను లోహపు
కొక్కెములున్న కొరడాలతో కొట్టిస్తాను" అని
చెప్పమనిరి.

12మూడు రోజుల తరువాత యరొబాము, ప్రజలు
కలిసి రెహబాము వద్దకు వచ్చారు. "మూడు రోజులలో
మీరు నా వద్దకు రండి," అని రెహబాము చెప్పిన
దానికి అనుగుణంగా వారు వెళ్లారు.

13అప్పుడు రెహబాము రాజు వారితో అల్పబుద్ధితో
మాట్లాడాడు. రెహబాము రాజు పెద్దల సలహాను పెడ
చెవిని పెట్టాడు.

14యువకులు తనకు సలహా యిచ్చిన రీతిగా రెహ
బాము రాజు ప్రజలతో మాట్లాడాడు. "నా తండ్రి మీ
బరువు ఎక్కువ చేశాడు. కాని నేను దానిని మరింత
ఎక్కువ చేస్తాను. నా తండ్రి మిమ్మల్ని కొరడాలతో
శిక్షించాడు. కాని నేను మిమ్మల్ని లోహపు కొక్కెము
లున్న కొరడాలతో శిక్షిస్తాను" అని అన్నాడు. 15ఆ
విధంగా రాజైన రెహబాము ప్రజల విన్నపాన్ని వినలేదు.
ప్రజలగోడు అతడు వినని కారణమేమనగా, పరిస్థితు
లలో ఈ మార్పు దేవుడు కల్పించటమే. దేవుడే ఇది
జరిపించాడు. అహీయా ద్వారా యరొబాముకు దేవుడు
చెప్పించిన దానిని నిజం చేసేలా ఇది జరిగింది.
అహీయా షిలోనీయుడు. యరొబాము తండ్రి పేరు
నెబాతు.

16రెహబాము రాజు తమ మనవి ఆలకించలేదని
ఇశ్రాయేలు ప్రజలు అర్థం చేసుకున్నారు. అప్పుడు
వారు రాజుతో యిలా అన్నారు: "మేము దావీదు
కుటుంబంలో భాగస్తులమా? కాదు! యెష్షయి
భూముల్లో మాకేమైనా వస్తుందా? రాదు! అందుకని
ఇశ్రాయేలీయులారా, మనం మన ఇండ్లకు వెళ్లిపోదాం
పదండి. దావీదు సంతతి వాడిని తన ప్రజల్ని ఏలుకో
నీయండి!" తరువాత ఇశ్రాయేలు ప్రజలంతా తమ
తమ ఇండ్లకు వెళ్లిపోయారు.

17కాని యూదా పట్టణాలలో ఇంకా కొంతమంది
ఇశ్రాయేలీయులు నివసిస్తూ వున్నారు. రెహబాము
వారికి కూడ రాజుగానే వున్నాడు.

18బలవంతంగా పని చేయించబడే జనులమీద
అధికారిగా హదోరాము వున్నాడు. రెహబాము అతనిని
ఇశ్రాయేలు ప్రజల వద్దకు పంపాడు. కాని ఇశ్రాయేలు
ప్రజలు హదోరామును రాళ్లతో కొట్టి చంపివేశారు.
దానితో రెహబాము తన రథంలోనికి దుమికి తప్పించు
కున్నాడు. అతడు యెరూషలేముకు పారిపోయాడు.
19అప్పటి నుండి ఇప్పటి వరకు ఇశ్రాయేలీయులు
దావీదు కుటుంబానికి* వ్యతిరేకులై వున్నారు.

11 రెహబాము యెరూషలేముకు వచ్చిన పిమ్మట
ఒక లక్షాఎనభై వేలమంది కాకలు తీరిన సైని
కులను సమీకరించాడు. ఈ సైనికులను యూదా,
బెన్యామీను వంశాల నుండే ఎంపిక చేశాడు. వీరందరినీ
ఇశ్రాయేలుపై దాడి చేసి ఆ రాజ్యాన్ని తిరిగి తన ఏలు
బడిలోకి తీసుకొని రావటానికి సమీకరించాడు. 2కాని
యెహోవా వాక్కు షెమయాకు వినవచ్చింది.
షెమయా దైవజ్ఞుడు. యెహోవా యిలా చెప్పాడు:
3"షెమయా, నీవు వెళ్లి సొలొమోను కుమారుడు,
యూదా రాజు అయిన రెహబాముతో మాట్లాడుము.
యూదాలోను, బెన్యామీను ప్రాంతంలోను నివసిస్తున్న
ఇశ్రాయేలీయులందరితో కూడా మాట్లాడుము. వారికి
యిలా చెప్పుము: 4యెహోవా తెలియజేయున
దేమనగా: 'మీరు మీ సోదరులతో యుద్ధం చేయరాదు!
ప్రతి ఒక్కడూ తన ఇంటికి తిరిగి వెళ్లిపోవాలి. ఇది
యిలా జరిగేలా నేనే చేశాను'" కావున రాజైన రెహబాము,
అతని సైన్యం యెహోవా మాట విని వెనుకకు వెళ్లి
పోయారు. వారు యరొబాముపై దాడి చేయలేదు.

### రెహబాము యూదాను బలపర్చటం

5రెహబాము యెరూషలేములో నివసించాడు.
పరాయి రాజుల దండయాత్రల నుండి రక్షణగా అతడు
యూదాలో బలమైన నగరాలను నిర్మించాడు. 6బేత్లె
హేము, ఏతాము, తెకోవ, 7బేత్సూరు, శోకో, అదు
ల్లాము, 8గాతు, మారేషా, జీపు, 9అదోరయీము,
లాకీషు, అజేకా, 10జొర్యా, అయ్యాలోను, మరియు
హెబ్రోనులో గల నగరాలను బాగుచేయించాడు.
యూదాలోను, బెన్యామీనులోనుగల ఈ నగరాలు బల
మైనవిగా తీర్చిదిద్దబడ్డాయి. 11రెహబాము ఈ నగరా
లను బలపర్చిన తరువాత, వాటిలో అధిపతులను,
నియమించాడు. ఆ నగరాలకు ఆహార పదార్థాలు,
నూనె, ద్రాక్షారసం సరఫరాలను ఏర్పాటు చేశాడు.
12రెహబాము ప్రతి నగరంలో డాళ్లను, ఈటెలను కూడ
వుంచి వాటిని చాలా బలమైనవిగా చేశాడు. యూదా,
బెన్యామీను ప్రజల, నగరాలను రెహబాము తన
అధీనంలో వుంచుకున్నాడు.

13ఇశ్రాయేలులో వున్న యాజకులు, లేవీయులు
అంతా రెహబాముతో ఒక అవగాహనకు వచ్చి, అతనితో
కలిశారు. 14లేవీయులు తమ పచ్చిక బీళ్లను, వారి
స్వంత పొలాలను వదిలి యూదాకు, యెరూషలేముకు
వచ్చారు. లేవీయులు ఇది ఎందుకు చేశారనగా

---

**దావీదు కుటుంబం** బహుశః యూదా వంశం కావచ్చు. దావీదు
కుటుంబం యూదా వంశానికి చెందినది.

యరొబాము, అతని కుమారులు తమను యెహోవా
సేవలో, యాజకులుగా పని చేయనీయటానికి తిరస్క
రించారు. 15ఉన్నత స్థలాలలో ఆరాధనలకై యరొ
బాము తన స్వంత యాజకులను ఎంపిక చేసు
కొన్నాడు. ఆ గుట్టల మీద అతడు తాను చేసిన
మేక, గిత్త దూడల విగ్రహాలను ప్రతిష్ఠించాడు. 16లేవీ
యులు ఇశ్రాయేలును వదిలి పెట్టడంతో, ఇశ్రాయేలు
దేవుడైన యెహోవాలో విశ్వాసమున్న ఇశ్రాయేలు
గోత్రాలవారంతా యెరూషలేముకు వచ్చారు. వారు
తాము పూర్వీకుల దేవునికి బలులు అర్పించటానికి
వచ్చారు.
17వారంతా యూదా రాజ్యాన్ని బలమైనదిగా
చేశారు. వారు సొలొమోను కుమారుడు రెహబాముకు
మూడు సంవత్సరాలపాటు మద్దతు యిచ్చారు. ఆ
విధంగా చేయటానికి కారణమేమనగా ఆ సమయంలో
వారు దావీదు సొలొమోను నడచిన రీతిగా నడుచు
కున్నారు.

### రెహబాము కుటుంబం

18రెహబాము మహలతు అనే స్త్రీని వివాహం చేసి
కొన్నాడు. ఆమె తండ్రి పేరు యెరీమోతు. ఆమె
తల్లి పేరు అబీహాయిలు. యెరీమోతు తండ్రిపేరు
దావీదు. అబీహాయిలు తండ్రిపేరు ఏలీయాబు. ఏలీ
యాబు తండ్రిపేరు యెష్షయి. 19రెహబాముకు మహ
లతు ద్వారా యూషు, షెమర్యా, జహము అనే కుమా
రులు పుట్టారు.
20పిమ్మట రెహబాము మయకాను వివాహం చేసి
కొన్నాడు. మయకా అబ్షాలోము మనుమరాలు.*
రెహబాముకు మయకావల్ల అబీయా, అత్తయి, జీజా,
షెలోమీతు అనువారు పుట్టారు.
21తన ఇతర భార్యల కన్న, దాసీల కన్న, రెహబాము
మయకాను ఎక్కువగా ప్రేమించాడు. మయకా అబ్షా
లోము మనుమ రాలు. రెహబాముకు పద్దెనిమిది మంది
భార్యలు, అరవై మంది దాసీలు వున్నారు. రెహబాముకు
ఇరవై ఎనిమిది మంది కుమారులు,ఇరవై మంది
కుమార్తెలు వున్నారు.
22అబీయాను అతని సోదరులపై నాయకునిగా రెహ
బాము నియమించాడు. అబీయాను రాజుగా చేసే
వుద్దేశంతోనే రెహబాము ఈ పని చేశాడు. 23రెహబాము
చాలా తెలివిగా ప్రవర్తించాడు. తన కుమారులందరినీ
యూదా, బెన్యామీను ప్రాంతాలలో వున్న బలమైన
నగరాలన్నిటికీ పంపాడు. రెహబాము తన కుమారు
లకు ఆహారాది వస్తువులను పుష్కలంగా సరఫరా
చేశాడు. తన కుమారులకు భార్యలను కూడా అతడు
ఎంపిక చేశాడు.

### ఈజిప్టు రాజు షీషకు యెరూషలేముపై దండెత్తుట

12 రెహబాము చాలా శక్తివంతుడైన రాజయ్యాడు.
అతడు తన రాజ్యాన్ని కూడ చాలా బల
పర్చాడు. ఆ తరువాత రెహబాము, యూదా వంశంవారు
యెహోవా ధర్మశాస్త్రాన్ని అనుసరించటం మాని
వేశారు. 2రెహబాము రాజయ్యాక ఐదవ సంవత్సరంలో
షీషకు యెరూషలేముపై దండెత్తాడు. షీషకు ఈజిప్టుకు
రాజు. రెహబాము, యూదా ప్రజలు యెహోవాకు
విశ్వాసపాత్రంగా లేకపోవుటచే ఇది జరిగింది.
3షీషకు వద్ద పన్నెండువేల రథాలు, అరవైవేల
మంది గుర్రపు స్వారీ చేయగలవారు, మరియు
ఎవ్వరూ లెక్క పెట్టలేనంత మంది సైనికులు వున్నారు.
షీషకు యొక్క మహా సైన్యంలో లిబ్యా సైనికులు
(లూబీయులు), సుక్కీయులు, ఇథియోపియనులు
(కూషీయులు) వున్నారు. 4షీషకు యూదాలోని బల
మైన నగరాలను ఓడించాడు. పిమ్మట షీషకు తన
సైన్యాన్ని యెరూషలేముకు నడిపించాడు. 5తరువాత
ప్రవక్తయగు షెమయా రెహబాము వద్దకు, యూదా
నాయకుల వద్దకు వచ్చాడు. ఆ యూదా నాయకు
లంతా షీషకుకి భయపడి యెరూషలేములో సమావేశ
మయ్యారు. షెమయా రెహబాముతోను, యూదా
నాయకుల తోను యిలా చెప్పాడు, "యెహోవా
ఈ విధంగా తెలియజేస్తున్నాడు: 'రెహబామూ, నీవు
మరియు యూదా ప్రజలు నన్ను వదిలి పెట్టారు. నా
ధర్మశాస్త్రాన్ని పాటించటానికి నిరాకరించారు. ఇప్పుడు
మిమ్మల్ని నా సహాయం లేకుండా షీషకును ఎదుర్కో
టానికి వదిలిపెడుతున్నాను.'"
6అది విన్న యూదా నాయకులు, రాజైన రెహ
బాము విచారించి, తమను తాము తగ్గించుకొని విధేయు
లయ్యారు."యెహోవా న్యాయమైనవాడు" అని
అన్నారు. 7రాజు, యూదా పెద్దలు విధేయులైనట్లు
యెహోవా గమనించాడు. పిమ్మట షెమయాకు
యెహోవా వర్తమానం ఒకటి వినవచ్చింది.
యెహోవా షెమయాతో యిలా చెప్పాడు: 'రాజు,
నాయకులు తమను తాము తగ్గించుకున్నారు. కావున
వారిని నేను నాశనం చేయను. పైగా వారికి వెంటనే
రక్షణ కల్పిస్తాను. యెరూషలేము మీద నా కోపాగ్నిని
కురిపించటానికి నేను షీషకును వినియోగించను. 8కాని
యెరూషలేము ప్రజలు మాత్రం షీషకుయొక్క సేవకు
లౌతారు. నాకు సేవచేయటం ఇతర దేశాల రాజులను
సేవించటంకంటె భిన్నమైనదని వారు తెలిసి కొనే
టందుకే ఇది యిలా జరుగుతుంది."
9షీషకు యెరూషలేముపై దండెత్తి ఆలయాన్ని
కొల్లగొట్టాడు. షీషకు ఈజిప్టు రాజు. అతడింకా
రాజభవనంలో వున్న ఖజానాను కూడ కొల్లగొట్టాడు.
షీషకు రికిన ప్రతి వస్తువును తీసుకొని, ధనరాశులను
పట్టుకుపోయాడు. అతడింకా సొలొమోను చేయించిన

---

**మనుమరాలు** కుమార్తె అని శబ్దార్థం.

బంగారు డాళ్లనుకూడా పట్టుకుపోయాడు. 10రాజైన
రెహబాము బంగారు డాళ్ల స్థానంలో కంచుడాళ్లను
చేయించాడు. రాజభవన ప్రధాన ద్వారం వద్ద కాపలా
దారుల అధిపతులకు రెహబాము కంచు డాళ్లను
యిచ్చాడు. 11రాజు ఆలయ ప్రవేశం చేసినప్పుడు
ద్వారపాలకులు కంచుడాళ్లను వెలికితీసి వాడేవారు.
పిమ్మట వారు మళ్లీ ఆ కంచుడాళ్లను ఆయుధా
గారంలో వుంచేవారు. 12రెహబాము తనను తాను
తగ్గించుకున్న తరువాత, యెహోవా అతని పట్ల తన
కోపాన్ని ఉపసంహరించుకున్నాడు. అందువల్ల
యెహోవా రెహబామును పూర్తిగా నాశనం చేయలేదు.
యూదాలో ఇంకా కొంత మంచితనం మిగిలివుంది.

13యెరూషలేములో రెహబాము చాలా శక్తివంత
మైన రాజుగా రూపొందాడు. అతడు రాజయ్యేనాటికి
నలభై ఒక్క సంవత్సరాలవాడు. రెహబాము రాజుగా
యెరూషలేములో పదిహేడు సంవత్సరాలు వున్నాడు.
ఇశ్రాయేలు తెగలన్నిటిలో యెహోవా తనపేరు ప్రతి
ష్ఠాపనకు యెరూషలేమునే ఎన్నుకున్నాడు. రెహ
బాము తల్లి పేరు నయమా. నయమా అమ్మోను దేశ
స్తురాలు. 14దేవుడైన యెహోవాను అనుసరించటం
మాని రెహబాము చెడుకార్యాలకు పాల్పడ్డాడు. ఎందు
కంటే అతడు యెహోవాని అనుసరించాలని హృదయ
మందు తీర్మానించుకొనలేదు.

15రెహబాము రాజైనప్పటి నుండి అతని పాలన
అంతమయ్యేవరకు అతను చేసిన విషయాలన్నీ
షెమయా రచనలలోను, ఇద్దో రచనలలోను పొందు
పర్చబడ్డాయి. షెమయా ఒక ప్రవక్త. ఇద్దో ఒక దీర్ఘదర్శి
వీరిద్దరూ కుటుంబ చరిత్రలు రాశారు. రెహబాము,
యరొబాము రాజులిద్దరూ పాలించిన కాలంలో వారిద్దరి
మధ్య యుద్ధాలు జరిగాయి, 16రెహబాము చనిపోగా
అతనిని దావీదు నగరంలో సమాధిచేశారు. పిమ్మట
రెహబాము కుమారుడు అబీయా కొత్తగా రాజయ్యాడు.

### యూదా రాజుగా అబీయా

13 ఇశ్రాయేలు రాజుగా యరొబాము* పద్దెని
మిదవ సంవత్సరంలో కొనసాగుతూ వుండగా,
అబీయా యూదాకు కొత్తగా రాజయ్యాడు. 2అబీయా
యెరూషలేములో మూడేండ్లు పాలించాడు. అబీయా
తల్లి పేరు మయకా.* మయకా తండ్రిపేరు ఊరి
యేలు. ఊరియేలు గిబియా పట్టణం వాడు. అబీ
యాకు యరొబాముకు మధ్య యుద్ధం జరిగింది.
3అబీయాకు నాలుగు లక్షలమంది ధైర్యంగల సైనికులు
న్నారు. అబీయా ఆ సైన్యాన్ని యుద్ధానికి నడిపిం
చాడు. యరొబాముకు ఎనిమిది లక్షలమంది ధైర్యంగల
సైనికులున్నారు. అబీయాతో యుద్ధానికి యరొ
బాము సిద్ధమయ్యాడు. 4అప్పుడు అబీయా కొండల
దేశమైన ఎఫ్రాయిములో వున్న సెమరాయిము
పర్వతం మీద నిలబడి యిలా అన్నాడు: “యరొ
బామూ, ఇశ్రాయేలీయులందరూ నేను చెప్పేది వినండి.
5ఇశ్రాయేలు దేవుడైన యెహోవా దావీదుకు, అతని
కుమారులకు శాశ్వతంగా ఇశ్రాయేలు రాజులు కావ
టానికి హక్కు ఇచ్చాడని మీరు తెలుసుకోవాలి. ఉప్పు
ఒడంబడిక* ద్వారా దావీదుకు దేవుడు ఈ హక్కు
యిచ్చాడు.

6కాని యరొబాము యెహోవాకు వ్యతిరేకి
అయ్యాడు! యరొబాము నెబాతు కుమారుడు.
నెబాతు దావీదు కుమారుడైన సొలొమోను అధికారు
లలో ఒకడు. 7అయితే పనికి మాలిన, దుష్టవ్యక్తులు
యరొబాముకు స్నేహితులయ్యారు. యరొబాము, ఆ
చెడ్డ మనుష్యులే రెహబాముకు ఎదురు తిరిగారు.
అప్పుడు రెహబాము చిన్నవాడు. అనుభవంలేనివాడు.
అందువల్ల యరొబామును, అతని చెడు స్నేహితులను
రెహబాము అదుపులో పెట్టలేకపోయాడు.

8“ఓ యరొబామూ! నీవు, నీతో వున్న ఇశ్రాయేలు
ప్రజలు ఇప్పుడు యెహోవా రాజ్యానికి వ్యతిరేకంగా
కుట్ర పన్నుతున్నారు యెహోవా రాజ్యం దావీదు
కుమారులకు చెందుతుంది. మీరు చాలామంది
వున్నారు. యరొబాము మీకు బంగారు గిత్తలను
చేయించి వాటిని దేవుళ్లవలె పూజించమన్నాడు. 9మీరు
యెహోవా యాజకులను, లేవీయులను వెళ్లగొట్టారు.
యాజకులు అహరోను సంతతివారు. మీ స్వంత
యాజకులను మీరు ఎంపిక చేసుకున్నారు. ఇది
పరదేశీయులు చేసే పద్ధతి. ఒక గిత్తను గాని, ఏడు
గొర్రె పొట్టేళ్లనుగాని తీసుకొని తనను పరిశుద్ధునిగా
చేసుకోవటానికి ఎవడు వచ్చినా అతడు దేవుళ్ళుకాని
విగ్రహాలకు యాజకులు కావచ్చు.

10“కాని, మా విషయానికి వస్తే యెహోవాయే
మా దేవుడు. యూదా ప్రజలమైన మేము దేవునిపట్ల
భయభక్తులు కలిగియున్నాము. మేము ఆయనను
వదిలిపెట్టలేదు! యెహోవాను సేవించే యాజకులు
అహరోను సంతతివారే. యెహోవా సేవలో యాజ
కులకు లేవీయులు తోడ్పడతారు. 11వారు దహన
బలులు, సుగంధద్రవ్యాలతో ధూపం నిత్యం ఉదయ
సాయంకాలాల్లో సమర్పిస్తారు. ఆలయంలో ప్రత్యేక

---

**ఇశ్రాయేలు ... యరొబాము** ఇది సుమారు క్రీ.పూ. 923వ సంవత్సరం. రాజైన యరొబాము రెహబాముకు ఎదురు తిరిగి, ఇశ్రాయేలు తెగలలో పదింటితో తన స్వంత రాజ్యాన్ని ప్రారంభించాడు. చూడండి 1రాజులు 12:20.

**మయకా** ఈమెకు మికాయా అను మారు పేరు కలదు.

**ఉప్పు ఒడంబడిక** ప్రజలు ఒకచోట కూర్చొని ఉప్పు తింటే ఆ స్నేహ ఒడంబడిక వీడరానిది అని అర్థం. దేవుడు దావీదుతో ఉల్లంఘించరాని ఒడంబడిక చేసికొన్నాడని అబీయా ఇక్కడ చెప్పుతున్నాడు.

మైన బల్లమీద నైవేద్యపు రొట్టెలను వారు వరుసలలో
పెడతారు. వారు ప్రతి సాయంత్రం బంగారు దీపస్తంభం
నిలిపి ప్రమిదలు వెలిగిస్తారు. మన దేవుడైన యెహోవా
ఆజ్ఞను మేము అనుసరిస్తాము. కాని యరొబామూ,
నీవు మరియు నీతోవున్న ఇశ్రాయేలీయులూ యెహో
వాను లక్ష్యపెట్టడంలేదు. మీరు ఆయనను వదిలి
పెట్టారు. 12దేవుడే మాకు తోడై వున్నాడు. ఆయనే
మా అధిపతి. ఆయన యాజకులు మాతో వున్నారు.
మీపై యుద్ధానికి యెహోవా యాజకులు బూరలు
ఊది మమ్మల్ని పిలుస్తారు. ఓ ఇశ్రాయేలు ప్రజలారా,
మీ పూర్వీకుల దేవుడగు యెహోవా మీదికి యుద్ధానికి
పోకండి. ఎందువల్లనంటే, మీరు విజయం
పొందలేరు.!”
13కాని యరొబాము కొంతమంది సైనికులను
అబీయా సైన్యం వెనుక చాటుగా పొంచి వుండటానికి
పంపాడు. యరొబాము సైన్యం అబీయా సైన్యానికి
ఎదురుగా వుంది. యరొబాము సైన్యం నుండి రహ
స్యంగా వెళ్లిన సైనికులు అబీయా సైన్యానికి వెనకగా
వున్నారు. 14యూదాకు చెందిన అబీయా సైన్యంలోని
భటులు వెనుదిరిగి చూచినప్పుడు యరొబాము సైన్యం
తమను ముందు నుండి, వెనుక నుండి ఎదుర్కొంటు
నట్లు భావించారు. యూదా సైనికులు యెహోవాను
పిలిచారు. యాజకులు బూరలు ఊదారు. 15పిమ్మట
అబీయా సైన్యం కేకలు పెట్టింది. యూదా సైనికులు
యుద్ధ నినాదాలు చేసినప్పుడు, దేవుడు యరొబాము
సైన్యాన్ని ఓడించాడు. ఇశ్రాయేలు నుండి వచ్చిన
యరొబాము సైన్యాన్ని యూదా నుంచి వచ్చిన
అబీయా సైన్యం ఓడించింది. 16యూదా సైనికుల
నుండి ఇశ్రాయేలు సైనికులు పారిపోయారు. ఇశ్రా
యేలు సైన్యాన్ని ఓడించేలా దేవుడు యూదా సైన్యానికి
తోడ్పడ్డాడు. 17అబీయా సైన్యం ఇశ్రాయేలు సైన్యాన్ని
చిత్తుగా ఓడించింది. ఐదులక్షల మంది ఇశ్రాయేలు
యోధులు చనిపోయారు. 18ఆ విధంగా అప్పుడు
ఇశ్రాయేలు ప్రజలు ఓడింపబడ్డారు; యూదా ప్రజలు
గెలిచారు. వారి పూర్వీకుల దేవుడైన యెహోవా మీద
వారు ఆధారపడిన కారణంగా యూదా సైన్యం విజయం
సాధించింది. 19అబీయా సైన్యం యరొబాము
సైన్యాన్ని తరిమి కొట్టింది. అబీయా సైన్యం
యరొబాముకు చెందిన బేతేలు, యెషానా, ఎఫ్రోను
పట్టణాలను పట్టుకుంది. వారు ఆ పట్టణాలతోపాటు
వాటి పరిసర గ్రామాలను కూడా వశపర్చుకున్నారు.
20అబీయా నివసించియున్నంత కాలం యరొ బాము
బలమైన రాజు కాలేకపోయాడు. యెహోవా
యరొబామును చంపేశాడు. 21అబీయా మిక్కిలి బల
వంతుడైన రాజయ్యాడు. అతడు పదునల్గురు స్త్రీలను
వివాహమాడాడు. అతడు ఇరువై యిద్దరు కుమారు
లకు, పదహారుగురు కుమార్తెలకు తండ్రి అయ్యాడు.
22అబీయా చేసిన ఇతర కార్యాలన్నీ ప్రవక్తయగు ఇద్దో
రచనల్లో పొందుపర్చబడ్డాయి.

14 అబీయా తన పూర్వీకులతో నిద్రించాడు.
దావీదు నగరంలో ప్రజలు అతనిని సమాధి
చేశారు. పిమ్మట అబీయా కుమారుడు ఆసా అతని
స్థానంలో క్రొత్తగా రాజయ్యాడు. ఆసా పరిపాలనా
కాలంలో పది సంవత్సరాలపాటు దేశంలో శాంతి
నెలకొన్నది.

### యూదా రాజుగా ఆసా

2తన దేవుడైన యెహోవా దృష్టికి మంచివైన,
న్యాయమైన పనులు ఆసా చేశాడు. 3విగ్రహాలను
ఆరాధించటానికి వినియోగించిన వింత బలిపీఠాలను
ఆసా తొలగించాడు. ఆసా ఉన్నత స్థలాలను తీసివేసి,
స్మారక శిలలను* పగులగొట్టాడు. అషేరా దేవతా
స్తంభాలను* కూడా ఆసా విరుగగొట్టాడు. 4యూదా
ప్రజలను దేవుడైన యెహోవాను అనుసరించమని
ఆసా ఆదేశించాడు. ఆయన వారి పూర్వీకులు ఆరా
ధించిన దైవం. అందుచే ఆయన ధర్మశాస్త్రాన్ని ఆజ్ఞ
లను పాటించమని ఆసా వారికి ఆదేశించాడు. 5యూదా
పట్టణాలన్నిటి నుండి ఆసా ఉన్నత స్థలాలను, ధూప
పీఠాలను తీసివేశాడు. ఆసా రాజుగా వున్న కాలంలో
రాజ్యంలో శాంతి నెలకొన్నది. 6యూదాలో శాంతి
విలసిల్లిన కాలంలోనే ఆసా బలమైన నగరాలు నిర్మిం
చాడు. యెహోవా శాంతియుత వాతావరణం కల్పించ
టంతో ఆసాకు ఆ కాలంలో యుద్ధాలు లేవు.
7ఆసా యూదా ప్రజలతో యిలా చెప్పాడు:
“మనమీ పట్టణాలను నిర్మించి, వాటిచుట్టూ ప్రాకా
రాలు కట్టిద్దాము. మనం బురుజులను, ద్వారాలను,
ద్వారాలకు కడ్డీలను ఏర్పాటు చేద్దాము. ఈ దేశంలో
ఇంకను నివసిస్తూండగానే మనమీ పనులు చేద్దాము.
ఈ దేశం మనది. ఎందువల్లననగా మన ప్రభువైన
దేవుని మనం అనుసరించాము. మనచుట్టూ ఆయన
మనకు శాంతియుత వాతావరణం కల్పించాడు.”
పిమ్మట వారు నగర నిర్మాణాలు చేపట్టి విజయం
సాధించారు. 8ఆసాకు మూడు లక్షలమంది యూదా
వంశాల వారున్న సైన్యం; రెండు లక్షల ఎనబైవేల
మంది బెన్యామీను కుటుంబాలకు చెందిన వారు సైన్యం
వున్నాయి. యూదా సైనికులు పెద్ద పెద్ద డాళ్లను,
ఈటెలను ధరించారు. బెన్యామీను సైనికులు చిన్న

---

**స్మారక శిలలు** కనానీయులు తమ బూటకపు దేవతలను ఆరాధించేందుకు రాళ్లను పెట్టేవారు.

**అషేరా దేవతా స్తంభాలు** ఈ స్తంభాలు స్త్రీ దేవత అషేరాకు చిహ్నాలు. కనానీయులు ఈ బూటకపు స్త్రీ దేవతా మూర్తిని ఆరాధించేవారు.

డాళ్లను ధరించి, ధనుస్సులతో బాణాలు వేయగల
నేర్పరులు. వారంతా బలమైన, ధైర్యంగల సైనికులు.
9పిమ్మట జెరహు అనేవాడు ఆసా మీదకి దండె
త్తాడు. జెరహు ఇథియోపియావాడు.* జెరహు
సైన్యంలో పదిలక్షలమంది సైనికులు, మూడు వందల
రథాలు వున్నాయి. జెరహు సైన్యం మారేషా వరకు
చొచ్చుకు వచ్చింది. 10జెరహును ఎదుర్కోవటానికి
ఆసా బయలుదేరి వెళ్లాడు. మారేషా వద్ద జెపాతా
లోయలో ఆసా సైన్యం యుద్ధానికి సిద్ధమయ్యింది.
11ఆసా తన దేవుడైన యెహోవాకు యిలా ప్రార్థన
చేశాడు "ప్రభూ, బలవంతుల నుండి బలహీనులను
రక్షించేవాడవు నీ వొక్కడివే! ఓ ప్రభూ, మా దైవమా
మాకు సహాయం చేయుము! మేము నీమీద ఆధారపడి
యున్నాము. ఈ మహా సైన్యాన్ని నీ పేరుతో మేము
ఎదిరించబోతున్నాము. యెహోవా, నీవు మా
దేవుడవు. నీమీద విజయాన్ని ఎవ్వరికీ చేకూర
నీయకుము!"
12పిమ్మట యెహోవా ఆసా వద్దవున్న యూదా
సైన్యాన్ని ఇథియోపియా (కూషు) సైన్యాన్ని ఓడించ
టానికి వినియోగించాడు. ఇథియోపియా సైన్యం పారి
పోయింది. 13ఆసా సైన్యం ఇథియోపియా సైన్యాన్ని
గెరారు పట్టణం వరకు తరుముకుంటూ పోయింది.
ఇథియోపియా సైనికులు అనేకమంది చనిపోవటంతో
యుద్ధం చేయటానికి మళ్లీ వారు ఒక సైన్యంగా కూడ
గట్టుకోలేకపోయారు. యెహోవా చేత, ఆయన
సైన్యం చేత వారు అణచివేయబడ్డారు. శత్రుసైన్యం
నుండి ఆసా, మరియు అతని సైనికులు అనేక విలువైన
వస్తువులను దోచుకున్నారు. 14ఆసా మరియు అతని
సైన్యం గెరారు దగ్గరలో వున్న అన్ని పట్టణాలను
ఓడించారు. ఆ పట్టణాలలో నివసిస్తున్న ప్రజలు
యెహోవాకు భయపడిపోయారు. ఆ పట్టణాలలో
విలువైన వస్తు సామగ్రి విస్తారంగా వుంది. ఆ విలువైన
వస్తువులన్నిటినీ ఆసా సైన్యం దోచుకుంది. 15ఆసా
సైన్యం గొర్రెల కాపరులు నివసించే ప్రాంతాలమీద
కూడా దాడిచేసింది. వారు చాలా గొర్రెలను, ఒంటె
లను పట్టుకుపోయారు. తరువాత ఆసా సైన్యం యెరూ
షలేముకు వెళ్లిపోయింది.

## ఆసా చేసిన మార్పులు

15 దేవుని ఆత్మ అజర్యా మీదికి వచ్చింది. అజర్యా
ఓబేదు కుమారుడు. 2ఆసాను కలుసు
కోవటానికి అజర్యా వెళ్లాడు. అజర్యా యిలా అన్నాడు:
"ఆసా, యూదా ప్రజలారా, బెన్యామీను ప్రజలారా
నేను చెప్పేది వినండి! మీరు యెహోవాను నమ్ముకొని
ఉన్నన్ని రోజులూ, యెహోవా మీతో వుంటాడు.
మీరు యెహోవాను వెదికితే, మీరాయనను కను
గొంటారు. కాని మీరు ఆయనను వదిలివేస్తే, ఆయన
మిమ్మల్ని వదిలివేస్తాడు. 3చాలాకాలం ఇశ్రాయేలుకు
ఒక నిజమైన దేవుడు లేకుండా వుండిపోయింది. వారు
బోధించే యాజకుడుగాని, ధర్మశాస్త్రంగాని లేకుండా
వుండిపోయారు. 4కాని ఇశ్రాయేలు ప్రజలకు కష్టం
వచ్చినప్పుడు వారు మళ్లీ దేవుడైన యెహోవాను
ఆశ్రయించారు. ఆయన ఇశ్రాయేలు దేవుడు. వారాయ
నను వెదకగా, యెహోవా వారికి కన్పించాడు. 5ఆ
కష్టకాలంలో ఏ ఒక్కడూ క్షేమంగా ప్రయాణం చేయ
గలిగేవాడు కాదు. రాజ్యాలన్నిటిలో అల్లకల్లోల పరిస్థి
తులు ఏర్పడ్డాయి. 6ఒక రాజ్యం మరో రాజ్యాన్ని,
ఒక నగరం మరో నగరాన్ని నాశనం చేసికోసాగాయి.
దేవుడు వాటిని సర్వవిధాలుగా కల్లోల పెట్టిన కారణంగా
ఆ పరిణామాలు వచ్చాయి. 7కావున ఆసా, నీవు
మరియు యూదా, బెన్యామీను ప్రజలు బలవంతులై
యుండండి. బలహీనులు కావద్దు. అధైర్యపడవద్దు.
ఎందుకంటే, మీ మంచి పనులకు తగిన ఫలితం
దొరుకుతుంది!"
8ప్రవక్త ఓబేదు మాటలు, వర్తమానం విన్న ఆసాకు
చాలా ధైర్యం వచ్చింది. తరువాత అతడు యూదా,
బెన్యామీను ప్రాంతాలన్నిటిలో వున్న అసహ్యాకరమైన
విగ్రహాలను తొలగించాడు. తాను వశపర్చుకున్న ఎఫ్రా
యిము కొండల ప్రాంతంలోని పట్టణాలలో వున్న
హేయమైన విగ్రహాలను కూడా ఆసా తొలగించాడు.
ఆలయ ముఖమండపంలో వున్న దేవుని బలిపీఠాన్ని
కూడా అతడు బాగు చేయించాడు.
9పిమ్మట యూదా, బెన్యామీను ప్రజలందరినీ ఆసా
సమావేశపర్చాడు. అంతేగాక ఎఫ్రాయిము, మనష్షే,
మరియు షిమ్యోను కుటుంబాల వారిని కూడా పిలి
చాడు. వీరు ఇశ్రాయేలునుండి వలసపోయి యూదాలో
స్థిరపడినవారు. వారిలో చాలామంది యూదాకు వచ్చిన
కారణమేమంటే, ఆసా దేవుడైన యెహోవా ఆసా పక్షాన
వున్నట్లు వారు గమనించారు.
10ఆసా పరిపాలనలో పదిహేను సంవత్సరాలు దాటి
మూడవనెల గడుస్తూ వుండగా ఆసా, అతని ప్రజలూ
యెరూషలేములో సమావేశమయ్యారు. 11ఆ సమ
యంలో వారు ఏడువందల గిత్త దూడలను, ఏడువేల
గొర్రెలను, మేకలను యెహోవాకు బలి యిచ్చారు.
ఆ జంతువులను, ఇతర విలువైన వస్తువులను ఆసా
సైన్యం తమ శత్రువుల నుండి తీసుకొన్నారు.
12తరువాత వారు తమ పూర్ణ హృదయంతోను, తమ
ఆత్మసాక్షితోను యెహోవాను సేవించటానికి ఒక
ఒడంబడిక చేసుకొన్నారు. ఆయన వారి పూర్వీకులు
సేవించిన దేవుడు. 13ఎవ్వరైనా దేవాధి దేవుని పూజించ
టానికి నిరాకరిస్తే అతడు చంపబడాలి. అట్టి మనిషి
ఉన్నతుడేగాని, అల్పుడేగాని, పురుషుడే గాని, స్త్రీయేగాని

**ఇథియోపియావాడు** లేక కూషీయుడు అని పాఠాంతరం.

ఎవ్వరైనా విచారణ లేకుండా చంపబడవలసినదే.
14అప్పుడు ఆసా మరియు ప్రజలు యెహోవాకు
ఒక ప్రమాణం చేశారు. వారు ఏకగ్రీవంగా పెద్దగా అరి
చారు. వారు బూరలు, పొట్టేలు కొమ్ములు వూదారు.
15యూదా ప్రజలంతా వారు చేసిన ప్రమాణం పట్ల
సంతోషం వ్యక్తం చేశారు. వారు పూర్ణ హృదయంతో
ప్రమాణం చేశారు గనుక వారికా సంతోషం. పూర్ణ
హృదయంతో వారు దేవుని అనుసరించారు. వారు
దేవుని కొరకు వెదకి, ఆయనను దర్శించారు. కావున
యెహోవా వారికి దేశమంతా శాంతియుత వాతావరణం
నెలకొనేలా చేశాడు.

16ఆసా తన తల్లియైన మయకాను రాజమాత పద
వినుండి తొలగించాడు. అషేరా దేవతా స్తంభాన్ని*
నెలకొల్పటం ద్వారా ఆమె చేయించిన హేయమైన
కార్యానికి అతడాపని చేశాడు. అషేరా స్తంభాన్ని ఆసా
నరికించి చిన్న చిన్న ముక్కలు చేశాడు. తరువాత
అతడా ముక్కలను కిద్రోను లోయలో తగులబెట్టాడు.
17అయితే యూదాలో వున్న ఉన్నత స్థలాలు తొల
గింపబడలేదు. అయినప్పటికి ఆసా హృదయం అతని
జీవితాంతం యెహోవాకు విశ్వాసపాత్రంగా వుంది.

18ఆసా తానూ, తన తండ్రీ దేవునికి సమర్పించిన
కానుకలను, ఇతర విలువైన వస్తువులను ఆలయంలో
వుంచాడు. ఆ వస్తువులన్నీ వెండి, బంగారాలతో
చేయించినవి.

19ఆసా పాలనలో ముప్పైయైదవ సంవత్సరం*
వరకు యుద్ధాలు ఏ మాత్రం జరగలేదు.

## ఆసా కడపటి సంవత్సరాలు

16 ఆసా పాలనలో ముప్పై ఆరవ సంవత్సరంలో
యూదా రాజ్యం మీదికి బయెషా దండెత్తాడు.
బయెషా ఇశ్రాయేలు రాజు. అతడు రామా పట్టణానికి
వెళ్లి దానిని కోటలా మార్చాడు. రామా పట్టణాన్ని
బయెషా ఒక కీలక స్థానంగా వినియోగించి యూదా
రాజు ఆసా వద్దకు వెళ్లటానికిగాని, అతని వద్ద నుండి
బయటకు రావటానికి గాని ప్రజలకు ఆస్కారం
లేకుండా చేశాడు.

2ఆలయం ఖజానాలో వున్న వెండి, బంగారు నిల్వ
లను ఆసా తీశాడు. రాజగృహంలో వున్న వెండి, బంగారా
లను కూడ అతడు తీశాడు. తరువాత ఆసా తన
దూతలను బెన్హదదు వద్దకు పంపాడు. బెన్హదదు అరాము
(సిరియా) రాజు. అతడు దమస్కు (డెమాస్కస్)
పట్టణంలో నివసిస్తున్నాడు. ఆసా పంపిన వర్తమానం
యిలా వుంది. 3"బెన్హదదూ, మన ఇద్దరి మధ్య ఒక
ఒడంబడిక కొనసాగేలా చూడు. అది నీ తండ్రికి, నా
తండ్రికి మధ్య కొనసాగిన ఒడంబడికలా వుండాలి.
చూడండి, మీకు నేను వెండి బంగారాలు పంపి
స్తున్నాను. కనుక నీవిప్పుడు ఇశ్రాయేలు రాజైన బయె
షాతో నీకున్న ఒడంబడికను రద్దు చేసుకోవాలి.
తద్వారా అతడు నామీదకు రాకుండా, నన్ను ఒంటరిగా
వదిలి, నన్ను బాధపెట్టడు." 4రాజైన ఆసా వర్త
మానాన్ని బెన్హదదు అంగీకరించాడు. బెన్హదదు తన
సైన్యాధిపతులను ఇశ్రాయేలు పట్టణాలపై దాడులు
జరపమని పంపాడు. ఆ అధిపతులు ఈయోను, దాను,
ఆబేల్మాయీము పట్టణాలపై దాడి చేశారు. నఫ్తాలి
ప్రాంతంలోవున్న పట్టణాలను కూడ వారు ఎదుర్కొ
న్నారు. ఈ పట్టణాలలో ధనాగారాలు వున్నాయి.
5ఇశ్రాయేలు పట్టణాలపై దాడులను గూర్చి బయెషా
విన్నాడు. అది విని రామా పట్టణాన్ని దుర్గంగా మార్చే
పనిని బయెషా విరమించుకున్నాడు. పనిని మధ్యలో
ఆపివేశాడు. 6ఆ తరువాత రాజైన ఆసా యూదా
ప్రజలను సమావేశపర్చాడు. వారంతా రామా పట్టణానికి
వెళ్లి బయెషా కోట కట్టించటానికి తెప్పించిన రాళ్లను,
కలపను పట్టుకుపోయారు. ఆసా, యూదా ప్రజలు
ఆ రాళ్లను, కలపను గెబ, మిస్పా పట్టణాలను బలంగా
కట్టడానికి వినియోగించారు.

7ఆ సమయంలో దీర్ఘదర్శియైన హనానీ యూదా
రాజైన ఆసా వద్దకు వచ్చాడు. హనానీ యిలా అన్నాడు:
"ఆసా, నీకు సహాయం చేయటానికి నీవు అరాము
(సిరియా) రాజుమీద ఆధారపడ్డావు గాని, దేవుడైన
యెహోవాపై ఆధారపడలేదు. నీవు దేవుని మీద
ఆధారపడవలసింది. నీవు సహాయానికి యెహోవా
పై ఆధారపడలేదు గనుక, అరాము రాజు సైన్యం నీ
అధీనం నుండి తప్పించుకున్నది. 8ఇథియోపియ
నులు లూబీయులు (లిబియావారు) చాలా శక్తివంత
మైన పెద్ద సైన్యాలను కలిగియున్నారు. వారికి అనేక
రథాలున్నాయి, రథసారధులు వున్నారు. కాని ఆసా,
అంత పెద్ద సైన్యాన్ని ఓడించటానికి నీవు యెహోవాను
నమ్ముకొని, ఆయన మీద ఆధారపడ్డావు. నీవు వారిని
ఓడించేలా యెహోవా నీకు సహాయపడ్డాడు.
9యెహోవా కండ్లు భూమి నలుమూలలా పరిశీలించి
తన పట్ల భక్తి విశ్వాసాలున్న వారిని చూస్తాయి.
యెహోవా వారిని బలపర్చి రక్షిస్తాడు. ఆసా, నీవొక
బుద్ధిలేని పని చేశావు. అందువల్ల ఇప్పటి నుండి నీవు
యుద్ధాలు చేయవలసి వస్తుంది." 10అతడు చెప్పిన
దానికి హనానీపై ఆసాకు కోపం వచ్చింది. ఆసాకు
ఎంత పిచ్చి కోపం వచ్చిందంటే అతడు హనానీని
చెరసాలలో పెట్టించాడు. అదే సమయంలో ఆసా
కొంతమంది మనుష్యులతో చాలా సంకుచితంగా,

---

**అషేరా దేవతా స్తంభం** అషేరా కనానీయులు ఆరాధించే ఒక స్త్రీ దేవత. వారి ఆరాధన కొరకు ఒక హేయమైన స్తంభాన్ని నిలుపుతారు.

**ఆసా ... సంవత్సరం** అనగా సుమారు క్రీ.పూ 880వ సంవత్సరం.

కఠినంగా ప్రవర్తించాడు. [11]మొదటి నుండి చివరి వరకు
ఆసా చేసిన కార్యాలన్నీ యూదా, ఇశ్రాయేలు రాజుల
చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి. [12]ఆసా రాజుగా
కొనసాగిన ముప్పై తొమ్మిదవ సంవత్సరంలో* అతని
పాదాలకు జబ్బు చేసింది. అతని జబ్బు చాలా ప్రమా
దంగా వున్నప్పటికీ, ఆసా యెహోవా నుండి
సహాయం కోరలేదు. ఆసా వైద్యుల నుండి వైద్య
సహాయంకొరకు చూశాడు. [13]ఆసా తన పరిపాలనలో
నలభై ఒకటవ సంవత్సరంలో చనిపోయాడు. ఆ
విధంగా ఆసా తన పూర్వీకులతో నిద్రించాడు.
[14]దావీదు నగరంలో తనకై తాను సిద్ధ పర్చుకున్న
సమాధిలోనే ప్రజలు ఆసాను వుంచారు. ఆసాకు గౌరవ
సూచకంగా సుగంధ దినుసులతోను, పరిమళ ద్రవ్య
ములతోను నిండిన పడక మీద జనులు వుంచి, అతనిని
దహించారు.*

### యూదారాజుగా యెహోషాపాతు

17 ఆసా స్థానంలో యెహోషాపాతు యూదాకు
కొత్తగా రాజయ్యాడు. యెహోషాపాతు ఆసా
కుమారుడు. యెహోషాపాతు యూదా రాజ్యాన్ని
ఇశ్రాయేలుతో పోరాడగల శక్తిగలదిగా రూపొందించాడు.
[2]కోటలుగా మార్చబడిన పట్టణాలన్నిటిలో అతడు
సైనిక స్థావరాలను ఏర్పాటు చేశాడు. యెహోషాపాతు
యూదాలోను, తన తండ్రియైన ఆసా వశపర్చుకున్న
ఎఫ్రాయిము పట్టణాలలోను కోటలు నిర్మించాడు.
[3]యెహోవా యెహోషాపాతు పక్షాన వున్నాడు.
ఎందువల్లనంటే, యెహోషాపాతు చిన్న వాడైనప్ప
టికి, తన పూర్వీకుడైన దావీదు చేసిన మంచి పనులన్నీ
చేశాడు. యెహోషాపాతు బయలు విగ్రహాలను పూజిం
చలేదు. [4]తన పూర్వీకులు అనుసరించిన యెహోవా
కోసమే యెహోషాపాతు నిరీక్షించాడు. అతడు దేవుని
ఆజ్ఞలను పాటించాడు. ఇశ్రాయేలు ప్రజలు జీవించిన
విధంగా అతడు జీవనాన్ని గడపలేదు. [5]యూదాపై
యెహోషాపాతును ఒక శక్తివంతమైన రాజుగా దేవుడు
చేశాడు యూదా ప్రజలంతా యెహోషాపాతుకు
కానుకలు సమర్పించారు. ఆ విధంగా యెహోషా
పాతుకు ఎక్కువ ధనం, గౌరవం లభించాయి.
[6]యెహోవా మార్గాల ననుసరించటానికి యెహోషా
పాతు హృదయం సంతోషంతో యిష్టపడింది. అతడు
ఉన్నత స్థలాలను, అషేరా దేవతా స్తంభాలను యూదా
రాజ్యం నుండి తీసివేశాడు.

[7]యెహోషాపాతు కొందరు పెద్దలను యూదా
రాజ్యంలో ధర్మశాస్త్రాన్ని బోధించేందుకు పంపిం
చాడు. అది యెహోషాపాతు పాలనలో మూడవ
యేట* జరిగింది. ఆ పెద్దలు ఎవరంటే బెన్హయీలు,
ఓబద్యా, జెకర్యా, నెతనేలు, మరియు మీకాయా. [8]ఈ
పెద్దలతో పాటు యెహోషాపాతు లేవీయులను కూడ
పంపాడు. ఆ లేవీయులు ఎవరంటే షెమయా, నెతన్యా,
జెబద్యా, అశాహేలు, షెమిరామోతు, యెహోనాతాను,
అదోనీయా, మరియు టోబీయా. యెహోషాపాతు
యాజకులైన ఎలీషామా, యెహోరాములను కూడా
పంపాడు. [9]ఆ పెద్దలు, లేవీయులు, యాజకులు
యూదాలో ప్రజలకు బోధించారు. వారి వద్ద
యెహోవా ధర్మ శాస్త్రగ్రంథం వుంది. వారు యూదా
పట్టణాలన్నిటికీ వెళ్లి ప్రజలకు ధర్మశాస్త్రాన్ని
బోధించారు.
[10]యూదా పొరుగు రాజ్యాల వారు యెహోవాకు
భయపడ్డారు. అందువల్ల వారు యెహోషాపాతుపై
యుద్ధం ప్రకటించలేదు.
[11]కొంతమంది ఫిలిష్తీయులు యెహోషాపాతుకు
కానుకలు తెచ్చారు. వారు యెహోషాపాతుకు వెండిని
కూడా తెచ్చారు. కారణమేమంటే యెహోషాపాతు
చాలా శక్తివంతుడైన రాజని వారికి తెలియటమే. అరబీ
యులు కొందరు గొర్రెల మందలను యెహోషా
పాతుకు కానుకలుగా తెచ్చారు. వారు ఏడువేల ఏడు
వందల గొర్రె పొట్టేళ్లను, ఏడువేల ఏడు వందల
మేకలను తెచ్చారు.
[12]యెహోషాపాతు రాను రాను చాలా బలమైన
రాజుగా రూపొందాడు. అతడు యూదా రాజ్యంలో
కోటలను, గిడ్డంగుల పట్టణాలను కట్టించాడు.
[13]సరుకు నిల్వచేసే ఆ పట్టణాలకు నిత్యావసర, తదితర
సామగ్రిని అతడు బాగా రవాణా చేశాడు. బాగా శిక్షణ
పొందిన సైనికులను యెరూషలేములో యెహోషా
పాతు వుంచాడు. [14]ఈ సైనికులువారి పితరుల వంశా
లలో చేర్చబడినవారు. యెరూషలేములో వున్న
సైనికుల వివరాలు ఏవనగా:
యూదా వంశం నుండి నియమింపబడిన వారిలో
సేనాధిపతులున్నారు. అద్నా క్రింద మూడులక్షల
మంది సైనికులున్నారు. [15]యెహోహానాను రెండు
లక్షల ఎనభై వేలమంది వున్న సేనకు అధిపతి.
[16]అమస్యా రెండు లక్షల మంది సైనికులకు అధిపతి.
అమస్యా జిఖ్రీ కుమారుడు. అతడు యెహోవా సేవకు
సంతోషంతో అంకితమయ్యాడు. [17]బెన్యామీను వంశం
నుండి ఎంపిక చేయబడిన సేనాధిపతుల వివరాలు.
ఎల్యాదా కింద విల్లంబులు, డాళ్లు పట్టగల రెండు

---

**ఆసా … సంవత్సరం** అనగా క్రీ.పూ సుమారు 875వ సంవత్సరం.

**పరిమళ … దహించారు** బహుశః దీని అర్థం ప్రజలు సుగంధ ద్రవ్యాలు దూపం వేశారని కావచ్చు లేదా, వారు అతని శవాన్ని దహనం చేశారని కూడా కావచ్చు.

**యెహోషాపాతు … మూడవయేట** సుమారు క్రీ.పూ 871వ సంవత్సరం.

లక్షల మంది సైనికులున్నారు. ఎల్యాదా మిక్కిలి
ధైర్యశాలియైన సేనాని. [18]యెహోజాబాదు కింద
యుద్ధ సన్నద్ధులైన లక్షా నలభై వేల మంది సైనికు
లున్నారు. [19]ఈ సైనికులంతా రాజైన యెహో
షాపాతుకు సేవ చేశారు. రాజుకు యూదాలో వున్న
అన్ని కోటలలో ఇతర సైనికులున్నారు.

### మీకాయా రాజైన అహాబును హెచ్చరించటం

18 యెహోషాపాతుకు ఎక్కువగా ధనం,
గౌరవం లభించాయి. రాజైన అహాబుతో
అతడు వివాహం* ద్వారా ఒక ఒడంబడిక ఏర్పరచు
కొన్నాడు. [2]కొద్ది సంవత్సరాల తరువాత యెహోషా
పాతు సమరయ (షోమ్రోను)లో అహాబును చూడ
టానికి వెళ్లాడు. యెహోషాపాతు, అతని పరివారం
యొక్క గౌరవార్థం అహాబు అనేక గొర్రెలను, ఆవులను
కోయించాడు. ఆ సమయాన రామోత్గిలాదు పట్టణంపై
దాడి చేయటానికి అహాబు యెహోషాపాతును ప్రోత్స
హించాడు. [3]“రామోత్గిలాదుపై దండెత్తటానికి నీవు
నాతో వస్తావా?” అని అహాబు యెహోషాపాతును
అడిగాడు. అహాబు ఇశ్రాయేలు రాజు. యెహోషాపాతు
యూదా రాజు. అహాబుకు యెహోషాపాతు యిలా
సమాధాన మిచ్చాడు: “నేను నీవంటి వాడను. నా
మనుష్యులు నీ మనుష్యుల వంటి వారు. మేము
యుద్ధానికి నీతో వస్తాము. [4]కాని ముందుగా మనం
యెహోవా వర్తమానం ఏమైనా వుంటుందేమో
చూద్దాం,” అని కూడ యెహోషాపాతు అన్నాడు.
[5]అందువల్ల అహాబు నాలుగు వందల మంది ప్రవ
క్తలను పిలిపించాడు. అహాబు వారితో, “మేము రామోత్గి
లాదు పట్టణం మీదికి యుద్ధానికి వెళ్లవచ్చా? లేదా?”
అని అన్నాడు. అప్పుడు ప్రవక్తలు, “వెళ్లండి; ఎందువల్ల
నంటే దేవుడు రామోత్గిలాదును మీరు ఓడించేలా
చేస్తాడు” అని అహాబుకు సమాధాన మిచ్చారు.
[6]కాని యెహోషాపాతు యిలా అన్నాడు: “ఇక్కడ
యెహోవా యొక్క ప్రవక్త ఎవరైనా వున్నారా?
యెహోవా ప్రవక్తలలో ఒకని ద్వారా ఆయన ఏమి
చెప్తున్నాడో తెలుసుకోవలసిన అవసరం వుంది.”
[7]అప్పుడు రాజైన అహాబు యెహోషాపాతుతో
యిలా అన్నాడు: “ఇక్కడ ఇంకా ఒక మనిషి వున్నాడు.
మనం అతని ద్వారా యెహోవాను అడుగుదాం. కాని
ఈ మనిషిని నేను అసహ్యించుకుంటాను. ఎందువల్ల
నంటే అతడు యెహోవా నుండి నాకు ఒక్క మంచి
వర్తమానం కూడ అందచేయడు. నాకు ఎప్పుడూ
చెడువార్తలే తెస్తాడు. ఆ వ్యక్తి పేరు మీకాయా. అతడు
ఇమ్లా కుమారుడు.” కాని యెహోషాపాతు, “అహాబూ,
నీవు అలా అనరాదు” అని అన్నాడు.
[8]అప్పుడు రాజైన అహాబు తన అధికారులలో
ఒకనిని పిలిచి, “ఇమ్లా కుమారుడైన మీకాయాను
త్వరగా తీసుకొని రమ్మని పంపాడు.”
[9]ఇశ్రాయేలు రాజైన అహాబు, యూదా రాజైన
యెహోషాపాతు తమతమ రాజదుస్తులు ధరించారు.
వారిద్దరు సమరయ (షోమ్రోను) నగర ముఖద్వారం
దగ్గర వున్న నూర్పిడి కళ్లం వద్ద తమతమ సింహాస
నాలపై కూర్చున్నారు. అక్కడకు వచ్చియున్న
నాలుగువందల మంది ప్రవక్తలు రాగల సంగతుల
వర్తమానాలను రాజుల ముంగిట చెప్తున్నారు. [10]కెన
యనా కుమారుని పేరు సిద్కియా. సిద్కియా కొన్ని
ఇనుప కొమ్ములు చేయించుకు వచ్చాడు. సిద్కియా
యిలా అన్నాడు: “యెహోవా ఈ రకంగా చెప్పు
చున్నాడు: ‘నీవు ఈ ఇనుప కొమ్ములు వినియోగించి,
అరామీయులు (సిరియనులు) నశించిపోయే వరకు
వారిని పొడుస్తావు.’”
[11]ప్రవక్తలంతా అదే విషయం చెప్పారు. వారిలా
అన్నారు: “రామోత్గిలాదు పట్టణానికి వెళ్లు. నీకు
విజయం చేకూరుతుంది. రాజు అరాము ప్రజలను
ఓడించేలా యెహోవా తోడ్పడుతాడు.”
[12]మీకాయాను పిలవటానికి వెళ్లిన దూత అతనితో
యిలా చెప్పాడు: “మీకాయా, వినండి; ప్రవక్తలంతా
ఒకే రీతిగా ప్రవచిస్తున్నారు. రాజుకు విజయం చేకూరు
తుందని వారు చెప్తున్నారు. వారు చెప్పినట్లుగానే నీవు
కూడా తెలియజేయి. నీవు కూడ మంచి విషయాలే
చెప్పు.”
[13]“యెహోవా జీవముతోడు నేను నా దేవుడు
తెలియజేసిన రీతినే చెపుతాను” అని మీకాయా
అన్నాడు.
[14]పిమ్మట మీకాయా రాజైన అహాబు వద్దకు
వచ్చాడు. రాజు అతనితో, “మీకాయా, మేము రామోత్గి
లాదు పట్టణంపై దండెత్తటానికి వెళ్లవచ్చునో, లేదో
తెలియజేయి” అని అన్నాడు. అందుకు మీకాయా,
“వెళ్లి దాడి చేయి, దేవుడు నీవాప్రజలను ఓడించేలా
చేస్తాడు,” అని చెప్పాడు.
[15]అహాబు రాజు మీకాయాతో, “గతంలో చాలా
సార్లు నిజమే ప్రవచించేలా యెహోవా పేర నీచేత
ప్రమాణం చేయించాను,” అని అన్నాడు. [16]అప్పుడు
మీకాయా యిలా అన్నాడు: “ఇశ్రాయేలు ప్రజలంతా
పర్వతాలపై చిందరవందరై పోయినట్లు నేను చూశాను.
వారు కాపరిలేని గొర్రెల్లా వున్నారు. యెహోవా
చెప్పినదేమంటే, ‘వారికి నాయకుడు లేడు. కావున
ప్రతి ఒక్కడినీ క్షేమంగా ఇంటికి పోనిమ్ము.’”
[17]అది విని ఇశ్రాయేలు రాజు అహాబు యెహోషా
పాతుతో యిలా అన్నాడు: “మీకాయా నాకు ఎప్పుడూ

---

**యెహోషాపాతు ... వివాహం** యెహోషాపాతు కుమా
రుడు యెహోరాము అహాబు కుమార్తె అతల్యాను వివాహ
మాడినాడు. చూడండి 2 దిన. 21:6.

యెహోవా నుండి మంచి వార్త తేడని నేను నీకు
ముందే చెప్పాను! నా గురించి అతడు తెచ్చేవన్నీ
చెడు వర్తమానాలే!"
18మీకాయా ఇంకా యిలా అన్నాడు: "యెహోవా
వర్తమానాన్ని వినండి! యెహోవా తన సింహాసనంపై
కూర్చుని వున్నట్లు నేను చూశాను. పరమండల సైన్య
మంతా ఆయన చుట్టూ చేరివుంది. 19యెహోవా,
'ఇశ్రాయేలు రాజైన అహాబు అక్కడ చంపబడే విధంగా,
యుక్తిగా రామోత్గిలాదుపై అతనిని యుద్ధానికి ఎవరు
పంపగలరు?' అని అడిగినాడు. ఆయన చుట్టూ చేరిన
పలువురు పలురకాలుగా చెప్పారు. 20పిమ్మట ఒక
ఆత్మవచ్చి యెహోవా ముందు నిలబడి, 'అహాబును
నేను మోసపుచ్చుతాను' అని అన్నది. 'ఎలా?' అని
యెహోవా ఆత్మని అడిగాడు.
21'నేను అసత్యలాడే ఆత్మగా మారి అహాబు
ప్రవక్తలలో ప్రవేశించి వారి నోట అబద్ధాలు పలికిస్తాను'
అని ఆత్మ చెప్పింది. అది విని 'అహాబును మోసగించ
టంలో నీకు జయమగు గాక! నీవు బయటకు వెళ్లి
కార్యము సాధించు' అని యెహోవా అన్నాడు.
22"అహాబూ, ఇప్పుడు చూడు; యెహోవా ఒక
అసత్య ఆత్మను నీ ప్రవక్తలలో ప్రవేశపెట్టాడు. నీకు
కీడు మూడుతుందని యెహోవా చెప్పియున్నాడు."
23పిమ్మట సిద్కియా తిన్నగా మీకాయా వద్దకు
వెళ్లి చెంపమీద చాచికొట్టాడు. సిద్కియా తండ్రిపేరు
కెనయనా. సిద్కియా యిలా అన్నాడు: "మీకాయా,
యెహోవా వద్దనుండి వచ్చిన ఆత్మ నన్ను వదిలి
నిన్నావరించటానికి ఎటునుండి వచ్చింది?" 24దానికి
మీకాయా "సిద్కియా, నీవు లోపలి గదిలోకి పోయి
దాగుకొనే రోజున నీవది తెలుసుకొంటావు!" అని
సమాధానమిచ్చాడు.
25పిమ్మట రాజైన అహాబు యిలా అన్నాడు: "మీకా
యాను తీసుకొని వెళ్లి నగరపాలకుడైన ఆమోనుకు,
రాజకుమారుడైన యోవాషుకు అప్పజెప్పండి. 26రాజా
జ్ఞగా ఆమోనుకు, యోవాషుకు యిలా చెప్పండి:
'మీకాయాను చెరసాలలో పెట్టండి. నేను యుద్ధం
నుండి తిరిగి వచ్చేవరకు అతనికి రొట్టె నీరు తప్ప
ఇతర ఆహారమేదీ యివ్వవద్దు.' "
27మీకాయా యిలా సమాధానమిచ్చాడు:
"అహాబూ, నీవు యుద్ధాన్నుండి క్షేమంగా తిరిగి వస్తే,
యెహోవా నా ద్వారా మాట్లాడి యుండలేదని అర్థం.
ఓ ప్రజలారా, నా మాటలు విని జ్ఞాపకం పెట్టుకోండి!"

### రామోత్గిలాదులో అహాబు చంపబడటం

28పిమ్మట ఇశ్రాయేలు రాజైన అహాబు, యూదా
రాజైన యెహోషాపాతు రామోత్గిలాదు పట్టణాన్ని
ముట్టడించారు. 29అహాబు రాజు యెహోషాపాతుతో,
"యుద్ధంలోకి వెళ్లే ముందు నేను నా వేషం మార్చి
వేస్తాను. కాని నీవు మాత్రం నీ రాజదుస్తులే ధరించు"
అని అన్నాడు. ఇశ్రాయేలు రాజు మారువేషం వేసిన
పిమ్మట రాజులిద్దరూ యుద్ధానికి వెళ్లారు.
30అరాము (సిరియా) రాజు తన రథాల అధిపతు
లకు ఒక ఆజ్ఞ యిచ్చాడు. అతడు వారితో యిలా
అన్నాడు: "ఎంత గొప్ప వాడేగాని, ఎంత సామాన్యుడే
గాని, మీరు ఎవ్వరితోనూ పోరాడవద్దు. కాని మీరు
ఇశ్రాయేలు రాజైన అహాబుతోనే యుద్ధం చేయండి."
31రథాధిపతులు యెహోషాపాతును చూచినప్పుడు
అతడే ఇశ్రాయేలు రాజైన అహాబు అనుకున్నారు!
అతన్ని ఎదిరించటానికి వారు యెహోషాపాతు మీదికి
తిరిగారు. కాని యెహోషాపాతు కేకలు పెట్టటంతో
యెహోవా అతనికి సహాయపడ్డాడు. రథాధిపతులు
యెహోషాపాతును వదిలిపోయేలాగు దేవుడు వారి
మనస్సు మార్చాడు. 32వారు యెహోషాపాతు ఇశ్రా
యేలు రాజు కాదని తెలిసికొన్నప్పుడు వారతనిని
తరమటం మానివేశారు.
33కాని ఒక సైనికుడు దేనికీ గురిపెట్టకుండా ఒక
బాణాన్ని మామూలుగా వదిలాడు. కాని ఆ బాణం
ఇశ్రాయేలు రాజైన అహాబుకు తగిలింది. కవచం కప్ప
కుండా వున్న అతని శరీర భాగంలో ఆ బాణం తగిలింది.
అప్పుడు అహాబు తన రథసారధితో, "రథాన్ని వెనుకకు
తిప్పి నన్ను యుద్ధరంగం నుండి బయటకు తీసుకొని
వెళ్లు. నేను గాయపడ్డాను." అని చెప్పాడు. 34ఆ రోజు
యుద్ధం తీవ్రంగా జరిగింది. అహాబు తన రథంలో
ఆనుకొని సాయంత్రమయ్యే వరకు అరామీయులను
(సిరియనులు) చూస్తూ నిలబడివున్నాడు. సూర్యుడు
అస్తమించే సమయంలో అహాబు చనిపోయాడు.

19 యూదా రాజైన యెహోషాపాతు యెరూషలే
ములోని తన యింటికి క్షేమంగా తిరిగి
వచ్చాడు. 2దీర్ఘదర్శియగు యెహూ ఎదురేగి యెహో
షాపాతును కలిశాడు. యెహూ తండ్రిపేరు హనానీ.
యెహోషాపాతుతో యెహూ ఈ విధంగా చెప్పాడు:
"నీవు దుష్టులకు ఎందుకు సహాయపడ్డావు? యెహో
వాను అసహ్యించుకునే వారిని నీ వెందుకు ప్రేమిస్తు
న్నావు? అందువల్లనే యెహోవా నీపట్ల కోపంగా
వున్నాడు. 3కాని నీ జీవితంలో నీవు కొన్ని మంచి
పనులు చేశావు. నీవు అషేరా దేవతా స్తంభాలను ఈ
దేశం నుండి తొలగించావు. దేవుని అనుసరించాలని
నీ హృదయంలో నిశ్చయించుకున్నావు."

### యెహోషాపాతు న్యాయాధిపతులను నియమించటం

4యెహోషాపాతు యెరూషలేములో నివసిం
చాడు. మళ్లీ అతడు ప్రజలను కలియటానికి బెయేర్షెబా
పట్టణం నుండి కొండల ప్రాంతమైన ఎఫ్రాయిము
వరకు సంచారం చేశాడు.

యెహోషాపాతు ప్రజలమధ్య తిరిగి మళ్లీ వారిని
తమ పూర్వీకులు ఆరాధించిన యెహోవా వైపుకు
తిప్పాడు. 5యెహోషాపాతు యూదాలో న్యాయాధిప
తులను నియమించాడు. యూదాలో కోటలుగల
పట్టణాలన్నిటిలో అతడు న్యాయాధిపతులను నియ
మించాడు. 6యెహోషాపాతు ఆ న్యాయాధిపతులతో
యిలా చెప్పాడు: “మీరు చేసే పనిలో మీరు మిక్కిలి
మెళకువతో మెలగండి. ఎందువల్లనంటే మీరు తీర్పు
తీర్చేది ప్రజల తరుపున కాదు. యెహోవా తరపున
మీరొక నిర్ణయం తీసుకొనేటప్పుడు యెహోవా మీతో
వుంటాడు.

7కావున మీలో ప్రతి ఒక్కడూ యెహోవాకు భయ
పడాలి. మీ పనిలో మీరు జాగ్రత్త వహించండి. ఎందు
వల్లనంటే మన దేవుడైన యెహోవా పక్షపాతం లేని
వాడు. న్యాయశీలి. యెహోవా ఎన్నడూ కొందరిని
మరికొందరికంటె ముఖ్యులుగా చూడక సమంగా
చూస్తాడు. తన తీర్పును మార్చటానికి యెహోవా
ధనం ఆశించడు.”

8యెరూషలేములో కొంతమంది లేవీయులను,
యాజకులను, మరికొందరు ఇశ్రాయేలు పెద్దలను
న్యాయాధిపతులుగా యెహోషాపాతు ఎంపిక చేశాడు.
యెరూషలేములో వున్న ప్రజల సమస్యలను పరిష్క
రించటానికి వారు యెహోవా ధర్మశాస్త్రాన్ని ఉప
యోగిస్తారు. 9యెహోషాపాతు యిలా కొన్ని ఆజ్ఞలను
యిచ్చాడు. యెహోషాపాతు యిలా చెప్పాడు: “మీ
నిండు హృదయంతో మీరు విశ్వాసపాత్రంగా సేవ
చేయాలి. మీరు యెహోవాకు భయపడాలి.

10హత్యావిషయాలు, చట్టపరమైన, ఆజ్ఞాపరమైన
నియమ నిబంధనలకు సంబంధించిన నేరాలు అనేకం
మీ దృష్టికి తేబడతాయి. నగరాలలో నివసించే మీ
సోదరుల వద్ద నుండి ఈ విషయాలు మీ తీర్పుకు
వస్తాయి. మీ వద్దకు వచ్చిన నేరస్తులను, వాదాలాడే
వారిని అందరినీ యెహోవాపట్ల పాపం చేయవద్దని
మీరు హెచ్చరించాలి. మీరు నమ్మకంగా పని చేయని
ఎడల మీ మీదికి, మీ సోదరుల మీదికి యెహోవా
కోపాన్ని రప్పించిన వారవుతారు. నేను చెప్పినట్లు
చేయండి. అప్పుడు తప్పు చేశామనే భావన మీకు
వుండదు.

11అమర్యా ప్రముఖ యాజకుడు. యెహోవాకు
సంబంధించిన అన్ని విషయాలలో అతడు మీమీద
ఆధిపత్యం వహిస్తాడు. రాజుకు సంబంధించిన విషయా
లలో మీకు మార్గదర్శకుడుగా జెబద్యావున్నాడు.
జెబద్యా తండ్రి పేరు ఇష్మాయేలు. యూదా వంశంలో
జెబద్యా ఒక పెద్ద. ఇంకను లేవీయులు మీకు లేఖకులుగా
పని చేస్తారు. మీరు ప్రతి పనీ ధైర్యంగా చేయండి.
న్యాయమార్గాన నడిచే ప్రజలకు యెహోవా అండగా
వుండుగాక!”

### యెహోషాపాతు యుద్ధం ఎదిరించటం

20 తరువాత మోయాబీయులు, అమ్మోనీ
యులు, మెయోనీయులలో కొందరు కలిసి
యెహోషాపాతుతో యుద్ధం ప్రారంభించటానికి
వచ్చారు. 2కొందరు మనుష్యులు యెహోషాపాతు
వద్దకు వచ్చి యిలా అన్నారు: “ఎదోము నుంచి ఒక
పెద్ద సైన్యం నీమీదికి వస్తూ వుంది. ఆ సైన్యం మృత
సముద్రానికి అవతలి పక్క నుండి వస్తూ వుంది. వారు
ఇప్పటికే హససోను తామారు అనబడే ఏన్గెదీలో
ఉన్నారు.” 3యెహోషాపాతు భయపడ్డాడు. తాను
ఏమి చేయాలో యెహోవాను అడిగి తెలిసికోవాలని
యెహోషాపాతు నిశ్చయించాడు. యూదాలో ప్రతి
ఒక్కడూ ఉపవాసం చేయాలని ఒక నిర్ణీత సమయాన్ని
ప్రకటించాడు. 4యూదా ప్రజలు యెహోవా
సహాయం కోరటానికి ఒక చోట సమావేశమయ్యారు.
వారు యూదా పట్టణాలన్నిటి నుండీ యెహోవా
సహాయం కోరటానికి వచ్చారు.

5యెహోషాపాతు ఆలయ నూతన ప్రాంగణం
ముందు వున్నాడు. యూదా, యెరూషలేము ప్రజల
సమావేశంలో అతడు నిలబడ్డాడు. 6అతడు ఈ విధంగా
ప్రార్థించాడు:

“మా పూర్వీకుల దేవుడవైన ఓ ప్రభూ, నీవే
పరలోక అధిపతివి. ప్రపంచ రాజ్యాలన్నిటినీ ఏలేవాడవు
నీవే! నీకు అధికారం, బలం వున్నాయి ! నిన్నెదిరించి
ఎవ్వడూ నిలువలేడు! 7నీవు మా దేవుడివి! ఈ దేశంలో
నివసించే ప్రజలను బయటకు పొమ్మని ఒత్తిడి చేశావు.
ఈ పని నీ ప్రజలైన ఇశ్రాయేలీయుల ముంగిట చేశావు.
ఈ రాజ్యాన్ని అబ్రాహాము సంతతివారికి శాశ్వతంగా
యిచ్చావు. అబ్రాహాము నీ స్నేహితుడు. 8అబ్రాహాము
సంతతివారు ఈ రాజ్యంలో నివసించి, నీ పేరు మీద
ఒక ఆలయాన్ని కట్టించారు. 9వారు, ‘యుద్ధాలు, శిక్ష,
వ్యాధులు, కరువు కాటకాలు మొదలైన ఈతి బాధలు
మాకు సంభవించినప్పుడు, ఈ మందిరం ముందు,
నీ సన్నిధిని నిలబడతాము. ఈ మందిరం నీ పేరు
మీద వుంది. మాకు ఆపద వచ్చినప్పుడు నీకు మొర
పెట్టుకొంటాము. అప్పుడు నీవు మా మొరాలకించి
మమ్మును రక్షిస్తావు’ అని అన్నారు.

10“కాని ఇప్పుడు అమ్మోను, మోయాబు, మరియు
శేయీరు పర్వత ప్రాంత మనుష్యులు ఇక్కడ వున్నారు.
ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు నుండి బయటికి వచ్చి
నప్పుడు ఇశ్రాయేలీయులను వారి రాజ్యంలోనికి నీవు
వెళ్లనీయలేదు* అందువల్ల ఇశ్రాయేలు ప్రజలు వారి
జోలికి పోకుండా తిరిగి వచ్చి, వారిని నాశనం చేయ
లేదు. 11కాని మేము వారిని నాశనం చేయకుండా

**వెళ్లనీయలేదు** పూర్తి వివరాలకు చూడండి ద్వితి
యోపదేశకాండము 2:4-7,19.

వదిలిపెట్టినందుకు వారు మాకు ఏ రకమైన ప్రతిఫలం
ఇస్తున్నారో చూడు. నీ దేశం నుండి మమ్మల్ని తరిమి
వేయటానికి వారు వచ్చారు. ఈ దేశాన్ని నీవు మాకు
యిచ్చి యున్నావు.
12మా దేవా, ఆ మనుష్యులను శిక్షించుము !
మామీదికి దండెత్తి వస్తున్న ఈ మహా సైన్యాన్ని
ఎదిరించే శక్తి మాకు లేదు! మేము ఏమి చేయాలో
మాకు తోచటంలేదు! అందువల్ల నీ సహాయం కొరకు
ఎదురు చూస్తున్నాం."* 13యూదా ప్రజలంతా తమ
పసిబిడ్డలు, భార్యలు, పిల్లలతో యెహోవా ముందు
నిలబడ్డారు. 14అప్పుడు యెహోవా ఆత్మ యహజీ
యేలు మీదికి వచ్చింది. యహజీయేలు తండ్రి పేరు
జెకర్యా. జెకర్యా తండ్రి పేరు బెనాయా. బెనాయా
తండ్రి పేరు యెహీయేలు. యెహీయేలు తండ్రి పేరు
మత్తన్యా. యహజీయేలు ఒక లేవీయుడు. ఆసాపు
సంతతిలోనివాడు. సమావేశం మధ్యలో 15యహజీ
యేలు నిలబడి యిలా అన్నాడు: "రాజైన యెహోషా
పాతూ, యూదా, యెరూషలేములలో నివసిస్తున్న
ప్రజలారా వినండి ! యెహోవా మీకు ఈ విధంగా
తెలియజెప్పుతున్నాడు: 'ఈ మహా సైన్యాన్ని చూచి
మీరు భయపడవద్దు. చింతించవద్దు. ఎందువల్లననగా
ఇప్పుడు యుద్ధం మీది కాదు. ఇది దేవుని యుద్ధం.
16రేపు మీరు అక్కడికి వెళ్లి ఆ సైన్యంతో యుద్ధం
చేయండి. వారు జీజు కనుమ ద్వారా వస్తారు.
యెరూవేలు ఎడారికి అవతలి పక్కనున్న లోయ చివర
మీరు వారిని చూస్తారు. 17ఈ యుద్ధంలో మీరు పోరాడ
వలసిన అవసరం లేదు. మీరీ స్థానాలలో దృఢంగా
నిలబడండి. యెహోవా మిమ్మల్ని రక్షించటం మీరు
చూస్తారు. యూదా, యెరూషలేము ప్రజలారా భయ
పడకండి! చింతించవద్దు! యెహోవా మీ పక్షాన
వున్నాడు. కావున రేపు వారి మీదికి వెళ్లండి.'"
18యెహోషాపాతు తన శిరస్సు నేల తాకేలా
సాష్టాంగపడ్డాడు. యూదా ప్రజలు, యెరూషలేములో
వుంటున్న వారు యెహోవా ముందు సాష్టాంగపడ్డారు.
వారంతా యెహోవాను ఆరాధించారు. 19లేవీయు
లలో కహాతీయుల కుటుంబాలవారు, కోరహీయులు
నిలబడి ఇశ్రాయేలీయుల దేవుడగు యెహోవాకు
స్తోత్రం చేశారు. వారు గొంతెత్తి స్తోత్రం చేశారు.
20తెల్లవారుఝామునే యెహోషాపాతు సైన్యం
తెకోవ ఎడారికి వెళ్లింది. వారు బయలుదేరి వెళ్లే
టప్పుడు యెహోషాపాతు నిలబడి యిలా అన్నాడు:
"యూదా ప్రజలారా, యెరూషలేము వాసులారా, నేను
చెప్పేది వినండి. మీ దేవుడైన యెహోవాలో విశ్వాస
ముంచండి. అప్పుడు మీరు దృఢంగా నిలువ
గలుగుతారు. యెహోవా ప్రవక్తలలో విశ్వాస
ముంచండి. మీరు విజయం సాధిస్తారు!" 21యెహోషా
పాతు ప్రజల సలహాను ఆలకించాడు. అతడు గాయకు
లను నియమించాడు. యెహోవా పరిశుద్ధుడు,
అద్భుతమైన వాడు గనుక ఆయనను స్తుతించటానికి
ఆ గాయకులు ఎంపిక చేయబడ్డారు. వారు సైన్యానికి
ముందు నడుస్తూ యెహోవాకు స్తుతి గీతాలు పాడారు.
"యెహోవాకు భజన చేయండి; ఆయన ప్రేమ తరగ
నిది! " అంటూ వారు సంకీర్తన చేశారు. 22ఆ మను
ష్యులు పాడుతూ, దేవుని స్తుతిస్తూ వెళ్తాండగా,
అమ్మోను, మోయాబు ప్రజల మీదికి, శేయీరు పర్వత
ప్రాంతం వారిమీదికి మాటు వేసిన మనుష్యులను
యెహోవా పంపాడు. వారంతా యూదా రాజ్యం మీదికి
దండెత్తి వస్తున్నవారు. వాళ్లు బాగా దెబ్బలు తిన్నారు.
23అమ్మోనీయులు, మోయాబీయులు కలిసి శేయీరు
పర్వత ప్రాంతం వారితో యుద్ధానికి దిగారు. అమ్మో
నీయులు, మోయాబీయులు కలిసి శేయీరు పర్వత
ప్రాంతం వారిని చంపి నాశనం చేశారు. శేయీరు
మనుష్యులను చంపిన తరువాత, వారు మళ్లీ ఒకరి
నొకరు చంపుకున్నారు.
24యూదా సైనికులు ఎడారిలోని కాపలా బురుజు
వద్దకు వచ్చారు. వారు శత్రు సైన్యం వైపు పరిశీలించి
చూశారు. కాని వారు భూమిమీద పడివున్న శవాలను
మాత్రమే చూడగలిగారు, ఒక్కడు కూడ బ్రతికిలేడు.
25శవాలపైగల విలువైన వస్తువులను తీసుకోవటానికి
యెహోషాపాతు, అతని సైన్యం వచ్చారు. వారు జంతు
వులను, డబ్బును, బట్టలను, ఇతర విలువైన వస్తువు
లను చూశారు. యెహోషాపాతు, అతని సైనికులు
ఆ వస్తువులన్నిటినీ తీసుకున్నారు. ఆ వస్తువులన్నీ
యెహోషాపాతు, అతని మనుష్యులు మోసుకుపోలే
నన్ని వున్నాయి. శవాలనుండి తీసుకొన్న వస్తువులను
మోసుకుపోవటానికి వారికి మూడు రోజులు పట్టింది.
అక్కడ వస్తువులు అంత ఎక్కువగా పడివున్నాయి.
26నాల్గవ రోజున యెహోషాపాతు, అతని సైన్యం
బెరాకా* లోయలో సమావేశమైనారు. ఆ స్థలంలో
వారు యెహోవాకి ప్రార్థనలు చేశారు. అందువల్ల ఆ
స్థలానికి ఈనాటికీ "బెరాకాలోయ" అని పేరు.
27తరువాత యూదా నుండి, యెరూషలేము నుండి
వచ్చిన సైనికులను యెహోషాపాతు యెరూషలే
ముకు తీసుకొనిపోయాడు. వారి శత్రువులను ఓడించి,
యెహోవా వారిని చాలా సంతోషపర్చాడు. 28వారు
మేళతాళాలతో యెరూషలేముకు తిరిగి వచ్చి ఆలయా
నికి వెళ్లారు. 29ఇశ్రాయేలు శత్రువులతో యెహోవా
యుద్ధం చేశాడని విని వివిధ దేశాల రాజులందరూ
యెహోవా అంటే భయపడ్డారు. 30అందువల్ల

**చూస్తున్నాం** హెబ్రీ భాషలో "మా కళ్లు నీమీదనే వున్నాయి" అని వుంది.

**బెరాకా** హెబ్రీలో దీవెన లేక పొగడ్త అని అర్థం.

యెహోషాపాతు రాజ్యంలో శాంతి నెలకొన్నది.
యెహోషాపాతు యొక్క దేవుడు అతనికి శాంతియుత
వాతావరణాన్ని కల్పించాడు.

### యెహోషాపాతు పాలన పరిసమాప్తి

[31]యెహోషాపాతు యూదా రాజ్యాన్ని పాలిం
చాడు. యెహోషాపాతు పాలన మొదలయ్యే సరికి
ముప్పై ఐదేండ్లవాడు. అతడు యెరూషలేములో ఇరవై
యైదు సంవత్సరాలు పాలించాడు. అతని తల్లి పేరు
అజూబా. అజూబా తల్లిపేరు షిల్హీ. [32]తన తండ్రి ఆసా
నడిచిన రీతిగా యెహోషాపాతు ఉత్తమ జీవితాన్ని
గడిపాడు. యెహోషాపాతు ఆసా మార్గాన్ని అనుస
రించటానికి వెనుకాడలేదు. యెహోవా దృష్టికి మంచి
పనులన్నీ యెహోషాపాతు చేశాడు. [33]కాని బూటకపు
దేవతల పూజలకు వినియోగించిన గుట్టలను (ఉన్నత
స్థలాలను) అతడు తీసివేయలేదు. ప్రజలు కూడా తమ
పూర్వీకులు ఆరాధించిన దేవుని అనుసరించటానికి
తమ హృదయాలను తిప్పలేదు.
[34]యెహోషాపాతు ఆదినుండి అంతంవరకు చేసిన
పనులన్నీ యెహూ వ్రాసిన గ్రంథాలలో పొందుపర్చ
బడ్డాయి. యెహూ తండ్రిపేరు హనానీ. ఈ విషయాలు
ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి.
[35]చివరి రోజుల్లో యూదా రాజైన యెహోషా
పాతు ఇశ్రాయేలు రాజైన అహజ్యాతో ఒక ఒడంబడిక
కుదుర్చుకున్నాడు. అహజ్యా మిక్కిలి చెడుకార్యాలు
చేశాడు. [36]తర్షీషు* పట్టణానికి పయనించే ఓడలను
చేయించటానికి యెహోషాపాతు అహజ్యాతో కలి
శాడు. వారు ఓడలను ఎసోన్గెబెరులో నిర్మించారు.
[37]అప్పుడు ఎలీయెజెరు అనే ప్రవక్త యెహోషా
పాతుకు వ్యతిరేకంగా ప్రవచించాడు. ఎలీయెజెరు
తండ్రి పేరు దోదావాహు. ఎలీయెజెరు మారేషా
పట్టణానికి చెందినవాడు. అతడు ఈ రకంగా చెప్పాడు:
"యెహోషాపాతూ, నీవు అహజ్యాతో కలిశావు. అందు
వల్ల యెహోవా నీ పనులను సర్వనాశనం చేస్తాడు."
అలానే అతని ఓడలు పగిలిపోయాయి. అందువల్ల
యెహోషాపాతు, అహజ్యాలు తర్షీషుకు ఓడలను
పంపలేకపోయారు.

21 యెహోషాపాతు చనిపోగా, అతనిని అతని
పూర్వీకుల సరసన సమాధిచేశారు. అతడు
దావీదు నగరంలో సమాధి చేయబడ్డాడు. యెహోషా
పాతు స్థానంలో అతని కుమారుడు యెహోరాము
కొత్త రాజయ్యాడు. [2]యెహోరాము సోదరులు
అజర్యా, యెహీయేలు, జెకర్యా, అజర్యా, మిఖాయేలు,
మరియు షెఫట్య అనువారు. వీరంతా యెహోషాపాతు
కుమారులు. యెహోషాపాతు యూదా రాజ్యానికి
రాజు. [3]యెహోషాపాతు తన కుమారులకు వెండి
బంగారు వస్తువులు, తదితర విలువైన కానుకలు
యిచ్చాడు. అతడు యూదాలో బలమైన కోటలు
నిర్మించి యిచ్చాడు. కాని యెహోషాపాతు రాజ్యాన్ని
యెహోరాముకు యిచ్చాడు. ఎందువల్లనంటే అతడు
పెద్ద కుమారుడు.

### యూదా రాజుగా యెహోరాము

[4]యెహోరాము తన తండ్రి రాజ్యాన్ని చేపట్టి
తనను తాను పటిష్ఠ పర్చుకొని స్థిరపడ్డాడు. తరువాత
కత్తిని వినియోగించి తన సోదరులనందరినీ చంపి
వేశాడు. అతడు మరికొందరు ఇశ్రాయేలు పెద్దలను
కూడ నరికివేశాడు. [5]యెహోరాము ఏల నారంభించే
నాటికి ముప్పై రెండు సంవత్సరాలవాడు. అతడు
యెరూషలేములో ఎనిమిది సంవత్సరాలు పాలించాడు.
[6]అతడు ఇశ్రాయేలు రాజులు నివసించిన రీతిలో జీవితం
కొనసాగించాడు. అహాబు కుటుంబం మాదిరిగానే
అతడు కూడ నివసించాడు. ఎందువల్ల నంటే అహాబు
కుమార్తెనే యెహోరాము వివాహమాడాడు. యెహో
రాము యెహోవా దృష్టికి చెడ్డవైన పనులన్నీ చేశాడు.
[7]కాని యెహోవా దావీదుతో చేసుకొన్న ఒడంబడిక
ప్రకారం ఆయన దావీదు కుటుంబాన్ని నాశనం
చేయలేదు. దావీదు కొరకు, ఆయన సంతతివారి
కొరకు యెహోవా శాశ్వతంగా ఒక జ్యోతిని వెలిగించు
తానని మాట యిచ్చివున్నాడు.*
[8]యెహోరాము కాలంలోనే యూదా ఆధిపత్యం
నుండి ఎదోము విడిపోయి, స్వతంత్ర రాజ్యమ
య్యింది. ఎదోమీయులు వారి స్వంత రాజును ప్రక
టించుకున్నారు. [9]అందువల్ల యెహోరాము తన
సైన్యాధిపతులతోను, రథాలతోను ఎదోము మీదికి
వెళ్లాడు. ఎదోమీయుల సైన్యం యెహోరామును,
అతని రథాధిపతులను చుట్టుముట్టింది. కాని యెహో
రాము తీవ్రంగా యుద్ధం చేసి చీకటి పడ్డాక బయట
పడ్డాడు. [10]అప్పటి నుండి ఈనాటి వరకు ఎదోము
రాజ్యం యూదాపై తిరుగబడుతూనే వుంది. లిబ్నా
పట్టణవాసులు కూడా యెహోరాముకు వ్యతిరేకులై
నారు. యెహోరాము యెహోవాను విడనాడినందుకు
ఫలితంగా ఇదంతా జరిగింది. యెహోవా యెహో
రాము పూర్వీకులు ఆరాధించిన దేవుడు. [11]యెహో
రాము యూదా కొండలమీద, గుట్టలమీద క్షుద్ర
దేవతల పూజలకై స్థలాలను నిర్మించాడు. దేవుడు

---

**తర్షీషు** ఇది ఇశ్రాయేలుకు చాలా దూరంలో వున్న ఒక పట్టణం. బహుశః స్పెయిను దేశంలో కావచ్చు. మధ్యధరా సముద్రంలో ప్రయాణం చేసే పెద్ద పెద్ద ఓడలకు తర్షీషు పట్టణం ప్రసిద్ధిగాంచింది.

**యెహోవా...యిచ్చివున్నాడు** ఇక్కడ గ్రంథకర్త ఉద్దేశ్యం దావీదు సంతతివారు శాశ్వతంగా పరిపాలిస్తారని.

ఆశించిన దానిని చేయకుండా యెరూషలేము ప్రజలకు
యెహోరాము అడ్డుపడ్డాడు. అతడు యూదా ప్రజ
లను యెహోవాకు దూరం చేశాడు.

[12]ప్రవక్తయైన ఏలీయా ద్వారా యెహోరాముకు
ఒక వర్తమానం వచ్చింది. ఆ వర్తమానం యిలా వుంది:
"దేవుడైన యెహోవా తెలియజేయునదేమనగా:
ఆయన మీ పూర్వీకుడైన దావీదు ఆరాధించిన దైవం.
యెహోవా చెప్పుచున్నాడు: 'యెహోరామూ, నీ
తండ్రి యెహోషాపాతు నడిచిన మార్గాన్ని నీవు
విడనాడినావు. యూదా రాజైన ఆసా నడిచిన మార్గాన్ని
కూడ నీవు విడనాడినావు. [13]అంతేకాదు నీవు ఇశ్రా
యేలు రాజులు నడచిన పెడమార్గాన్ని అనుసరించావు.
దేవుడు ఆశించిన రీతిగా నడవకుండా నీవు యూదా,
యెరూషలేము ప్రజలను ఆపావు. అదే నేరాన్ని
అహాబు, అతని కుటుంబంవారు చేశారు. వారు దేవుని
పట్ల విశ్వాస ఘాతకులైనారు. నీవు నీ సోదరులను
హత్యచేశావు. నీకంటె నీ సోదరులు మంచివారు.
[14]కావున త్వరలో యెహోవా నీ ప్రజలను కఠినంగా
శిక్షిస్తాడు. యెహోవా నీ పిల్లలను భార్యలను శిక్షించి,
నీ ఆస్తిని పాడుచేస్తాడు. [15]నీకు పేగుల్లో భయంకరమైన
జబ్బు చేస్తుంది. రోజు రోజుకూ నీ జబ్బు ముదురు
తుంది. ఆ భయంకరమైన వ్యాధివల్ల నీ ప్రేగులు
బయటికి వచ్చేస్తాయి.' "

[16]యెహోవా ఫిలిష్తీయులను, ఇథియోపియను
లకు (కూషీయులు) దగ్గరలో నివసిస్తున్న అరబీయు
లను యెహోరాము మీదికి పోయేలా ప్రేరేపించాడు.
[17]ఆ ప్రజలు యూదా రాజ్యం మీదికి దండెత్తారు.
వారు రాజగృహంలోని ధనాన్నంతా కొల్లగొట్టారు.
వారు యెహోరాము కుమారులను, భార్యలను, తీసు
కొనిపోయారు. యెహోరాము చిన్న కుమారుడు
మాత్రం వదిలిపెట్టబడ్డాడు. యెహోరాము చిన్న
కుమారుని పేరు యెహోయాహాజు.*

[18]ఈ సంఘటనలు జరిగిన తరువాత యెహోవా
యెహోరాముకు పేగుల్లో నయంకాని వ్యాధిని కలుగ
జేశాడు. [19]జబ్బు ముదిరి రెండు సంవత్సరాల తరువాత
యెహోరాము పేగులు బయటికి వచ్చాయి. భరించ
లేని బాధతో అతడు చనిపోయాడు. తన తండ్రికి
చేసినట్లు ప్రజలు యెహోరాముకు గౌరవసూచకంగా
పెద్దమంట వేయలేదు. [20]యెహోరాము రాజయ్యే
నాటికి ముప్పై రెండు సంవత్సరాలవాడు. అతడు
యెరూషలేములో ఎనిమిది సంవత్సరాలు పాలించాడు.
యెహోరాము చనిపోయినప్పుడు ఒక్కడు కూడ
విచారించలేదు. యెహోరామును ప్రజలు దావీదు
నగరంలో సమాధి చేశారుగాని, రాజులను వుంచే చోట
అతనిని సమాధి చేయలేదు.

### అహజ్యా యూదా రాజవటం

22 యెహోరాము స్థానంలో యెరూషలేము
ప్రజలు అహజ్యాను* కొత్త రాజునుగా చేసారు.
అహజ్యా యెహోరాము యొక్క చిన్న కుమారుడు.
అరబీయులతో యెహోరాము మీదికి వచ్చిన ప్రజలు
యెహోరాము కుమారులందరినీ చంపివేశారుగాని,
చిన్నవానిని మాత్రం వదిలారు. అందువల్ల అహజ్యా
యూదాలో పరిపాలించగలిగాడు. [2]అహజ్యా పరిపాలన
ఆరంభించే నాటికి ఇరువది రెండేండ్లవాడు.* యెరూష
లేములో అహజ్యా ఒక్క సంవత్సరం పాలించాడు. అతని
తల్లి పేరు అతల్యా. అతల్యా తండ్రి పేరు ఒమ్రీ.
[3]అహాబు కుటుంబం నివసించిన తీరునే అహజ్యా నివ
సించాడు. అతడలా నివసించటానికి కారణం అతని
తల్లి అతనిని దుష్టకార్యాలకు ప్రేరేపించటమే.
[4]యెహోవా దృష్టిలో అహజ్యా పాపకార్యాలు చేశాడు.
అహాబు కుటుంబం కూడా అదే చేసింది. అహజ్యా
తండ్రి చనిపోయినపిమ్మట అతనికి అహాబు కుటుంబం
వారు సలహాదారులయ్యారు. వారు అహజ్యాకు
తప్పుడు సలహాలిచ్చారు. ఆ తప్పుడు సలహాలే అతని
చావుకు దారితీశాయి. [5]అహాబు కుటుంబం అతని
కిచ్చిన సలహానే అహజ్యా పాటించాడు. ఇశ్రాయేలు
రాజైన యోరాముతో కలిసి అహజ్యా అరాము
(సిరియా) రాజైన హజాయేలుపై యుద్ధానికి రామోత్గి
లాదు పట్టణానికి వెళ్లాడు. యెహోరాము తండ్రి ఇశ్రా
యేలు రాజైన అహాబు. కాని అరామీయులు (సిరియ
నులు) యుద్ధంలో యెహోరామును గాయపర్చారు.
[6]యెహోరాము తన గాయాలను నయం చేసికోటానికి
యెజ్రెయేలుకు తిరిగి వెళ్లాడు. అరాము రాజైన హజా
యేలుతో రామోతు వద్ద పోరాడుతూండగా అతడు
గాయపడ్డాడు.

పిమ్మట యెహోరామును చూడటానికి అహజ్యా
(యెహోయాహాజు) యెజ్రెయేలు పట్టణానికి
వెళ్లాడు. అహజ్యా తండ్రి పేరు యూదా రాజైన యెహో
రాము. యెహోరాము తండ్రి పేరు అహాబు. యెహో
రాము గాయపడటంతో అతడు యెజ్రెయేలు పట్టణా
నికి వెళ్లాడు.

[7]యెహోరామును చూడటానికి అహజ్యా వెళ్లి
నప్పుడు దేవుడు అతనికి మరణం కలుగజేశాడు.

---

**యెహోయాహాజు** ఈ పేరు 2 దినవృత్తాంతముల 22:1-12 వచనాలలో అహజ్యా అని వాడబడింది.

**అహజ్యా** యెహోయాహాజు అని పాఠాంతరము.

**అహజ్యా ... రెండేండ్లవాడు** కొన్ని వ్రాత ప్రతులలో నలభై రెండేడ్ల వాడనివుంది. రాజులు రెండవ గ్రంథం 8:26వ వచనంలో అహజ్యా పరిపాలించే నాటికి ఇరవై రెండేండ్లవాడని వుంది.

అహజ్యా వెళ్లి యెహోరాముతో కలిసి యెహూను
చూడటానికి వెళ్లాడు. యెహూ తండ్రి పేరు నింషీ.
అహాబు వంశాన్ని నాశనం చేయటానికి దేవుడు
యెహూను నియమించాడు. [8]అహాబు వంశాన్ని
యెహూ నాశనం చేస్తూవున్నాడు. అప్పుడతడు
యూదా పెద్దలను, అహజ్యా సేవలో వున్న అతని
బంధువులను చూశాడు. యూదా పెద్దలను, అహజ్యా
బంధువులను యెహూ చంపివేశాడు. [9]పిమ్మట అహజ్యా
కొరకు యెహూ వెదికాడు. అతడు సమరయ
(షోమ్రోను) పట్టణంలో దాగుకొనే ప్రయత్నం
చేస్తూండగా యెహూ మనుష్యులు అతనిని పట్టు
కున్నారు. వారు అహజ్యాను యెహూ వద్దకు తీసుకొని
వచ్చారు. వారు అహజ్యాను చంపి, సమాధి చేశారు.
"అహజ్యా యెహోషాపాతు వారసుడు. యెహోషా
పాతు యెహోవాను నిండు హృదయంతో అనుసరిం
చాడు" అని వారు అన్నారు. యూదా రాజ్యాన్ని
సమైక్యంగా వుంచే శక్తి అహజ్యా కుటుంబానికి లేదు.

**రాణి అతల్యా**

[10]అహజ్యా తల్లి పేరు అతల్యా. తన కుమారుడు
చంపబడ్డాడని తెలుసుకోగానే ఆమె యూదాలో రాజ
వంశస్తుల నందరినీ చంపివేసింది. [11]కాని యెహోషె
బతు* అనే స్త్రీ అహజ్యా కుమారుడైన యోవాషును
దాచివేసింది. యోవాషును, అతని దాదిని యెహోషె
బతు లోపలి పడకగదిలో దాచింది. యెహోషెబతు
రాజైన యెహోరాము కుమార్తె. ఆమె యెహో
యాదా భార్య. యెహోయాదా ఒక యాజకుడు.
పైగా యెహోషెబతు అహజ్యాకు సోదరి. యెహో
షెబతు దాచిన కారణంగా, యోవాషును అతల్యా
చంపలేకపోయింది.

[12]ఆలయంలో ఆరు సంవత్సరాల పాటు యోవాషు
యాజకుల వద్ద దాచబడ్డాడు. ఆ సమయంలో అతల్యా
పరిపాలన కొనసాగింది.

**యాజకుడైన యెహోయాదా, రాజైన యోవాషు**

23 ఆరు సంవత్సరాల అనంతరం యెహో
యాదా తన శక్తిని, ధైర్యాన్ని చూపించాడు.
అతడు సైనికాధిపతులతో ఒక ఒడంబడిక చేసు
కున్నాడు. ఆ అధిపతులు ఎవరంటే యెరోహాము
కుమారుడు అజర్యా; యెహోహానాను కుమారుడైన
ఇష్మాయేలు; ఓబేదు కుమారుడైన అజర్యా; అదాయా
కుమారుడైన మయశేయా; మరియు జిఖ్రీ కుమారు
డైన ఎలీషాపాతు. [2]వారు యూదా రాజ్యమంతా తిరిగి,
యూదా పట్టణాలలో వున్న లేవీయులను కూడ
గట్టారు. వారు ఇశ్రాయేలులో కుటుంబ పెద్దలనుకూడ
కలుపుకున్నారు. పిమ్మట వారు యెరూషలేముకు
వెళ్లారు. [3]వీరంతా ఆలయంలో సమావేశమై రాజుతో
ఒక ఒడంబడిక కుదుర్చుకున్నారు.

ఆ ప్రజలనుద్దేశించి యెహోయాదా యిలా
అన్నాడు: "రాజకుమారుడు పరిపాలిస్తాడు. దావీదు
సంతతి వారి విషయంలో యెహోవా ఇదే వాగ్దానం
చేశాడు. [4]ఇప్పుడు మీరు చేయవలసినదేమనగా:
విశ్రాంతి దినాన విధులకు వెళ్లే యాజకులు, లేవీ
యులలో మూడవ వంతు వారు ద్వారాల వద్ద కాపలా
వుండాలి. [5]మీలో ఒక వంతు రాజు ఇంటి వద్ద వుండాలి.
ఇంకొక వంతు ప్రధాన ద్వారం (పునాది ద్వారం)
వద్ద నిఘావేయాలి. మిగిలిన వారంతా ఆలయ ఆవర
ణలలో వుండాలి. [6]యెహోవా ఆలయంలో ఎవ్వరినీ
ప్రవేశించనీయకండి. యాజకుడు, లేవీయులు పరి
శుద్ధులు గనుక వారు మాత్రమే సేవ చేయటానికి
లోనికి అనుమతింపబడాలి. వీరు మినహా, మిగిలిన
వారంతా యెహోవా నిర్దేశించిన తమ తమ పనులను
యధావిధిగా ఆచరించాలి.

[7]లేవీయులు రాజు వద్ద నిలవాలి. ప్రతి ఒక్కడూ
తన కత్తిని తప్పక ధరించి వుండాలి. ఎవ్వడేగాని ఆల
యంలో ప్రవేశించటానికి ప్రయత్నిస్తే వానిని చంపి
వేయండి. రాజు ఎక్కడికి వెళితే అక్కడికి మీరు కూడ
అతనితో వెళ్లాలి."

[8]యాజకుడైన యెహోయాదా ఆజ్ఞాపించిన
దంతా లేవీయులు, యూదా ప్రజలు అంగీకరించారు.
యాజకుల వర్గాలలో ఎవ్వరినీ యాజకుడైన యెహో
యాదా ఉపేక్షించి ఊరు కోలేదు. విశ్రాంతి దినాన
బయటకు వెళ్లిన వారితో కలిసి ప్రతి సైన్యాధిపతి,
అతని మనుష్యులు లోనికి వచ్చారు. [9]యాజకుడైన
యెహోయాదా రాజైన దావీదుకు చెందిన ఈటెలను,
చిన్న పెద్ద డాళ్లను అధికారులకు ఇచ్చాడు. ఆ ఆయు
ధాలన్నీ ఆలయంలో వుంచబడ్డాయి.

[10]పిమ్మట యెహోయాదా ఎవరెక్కడ నిల
బడాలో ఆ మనుష్యులకు చెప్పాడు. ప్రతి ఒక్కడూ
తన ఆయుధాన్ని ధరించివున్నాడు. వారంతా ఆలయా
నికి కుడినుండి ఎడమ ప్రక్కకు బారులుదీరి నిల
బడ్డారు. వారు బలిపీఠానికి, ఆలయానికి రాజుకు దగ్గరగా
నిలబడ్డారు. [11]వారు రాజకుమారుణ్ణి బయటకు తీసి
కొని వచ్చి, వాని తలపై కిరీటం పెట్టారు. ఒక ధర్మశాస్త్ర
గ్రంథ ప్రతిని అతనికిచ్చారు.* తరువాత వారు
యోవాషును రాజుగా ప్రకటించారు. యెహోయాదా,
అతని కుమారులు కలిసి యోవాషును అభిషిక్తుని
చేశారు. వారు "రాజు చిరంజీవియగు గాక!" అని
అన్నారు.

---

**యెహోషెబతు** యెహోషెబ అని పాఠాంతరం.

**ఒక ధర్మశాస్త్ర ... అతనికిచ్చారు** హెబ్రీలో వారతనికి సాక్ష్యము
యిచ్చారు ద్వితీయోపదేశకాండం 17:18 చూడండి.

[12]ప్రజలు ఆలయానికి పరుగెత్తే శబ్దం, రాజును
ప్రశంసించే ధ్వనులు అతల్యా విన్నది. ఆమె
ఆలయంలో వున్న ప్రజలవద్దకు వచ్చింది. [13]ఆమె
రాజును పరికించి చూసింది. ముందు ద్వారం వద్ద
రాజస్తంభం దగ్గర రాజు నిలబడి ఉన్నాడు. అధికారులు,
బూరలు వూదే వారు రాజుదగ్గర వున్నారు. దేశప్రజలు
చాలా సంతోషంగా వున్నారు. వారు బూరలు వూదు
తూవున్నారు. సంగీత వాద్య విశేషాలపై గాయకులు
పాడుతున్నారు. ప్రజలందరి చేత దేవునికి స్తుతి గీతాలు
గాయకులు తమతోపాటు పాడించారు. ఇదంతా చూచి
కలత చెందిన అతల్యా తన బట్టలు చింపుకొని “రాజ
ద్రోహం! రాజద్రోహం!” అని అరిచింది.

[14]యాజకుడైన యెహోయాదా సైన్యాధిప
తులను బయటకు రప్పించాడు.“అతల్యాను బయట
వున్న సైన్యం వద్దకు తీసుకొని వెళ్లండి. ఆమెను
ఎవరైనా అనుసరిస్తే వారిని మీ కత్తులతో నరికి
వేయండి” అని వారికి చెప్పాడు. “కాని, అతల్యాను
ఆలయంలో మాత్రం చంపవద్దు” అని యాజకుడు
సైనికులను హెచ్చరించాడు. [15]తర్వాత అతల్యా రాజ
భవనపు అశ్వద్వారం వద్దకు వచ్చినప్పుడు వారామెను
పట్టుకున్నారు. ఆమెను ఆ భవనం వద్దనే వారు
చంపివేశారు.

[16]అప్పుడు యెహోయాదా ప్రజలతోను, రాజు
తోను ఒక ఒడంబడిక చేసుకున్నాడు. వారంతా
యెహోవా భక్తులై ఆయనను అనుసరించటానికి
ఒప్పుకున్నారు. [17]ఆ జనమంతా బయలు విగ్రహం
ఆలయంలోకి వెళ్లి దానిని నిలువునా పగులగొట్టారు.
బయలు ఆలయంలో వున్న బలిపీఠాలను, ఇతర విగ్ర
హాలను కూడ వారు నాశనం చేశారు. బయలు పీఠాల
ముంగిటనే బయలు దేవత యాజకుడైన మత్తానును
చంపివేశారు.

[18]పిమ్మట యెహోయాదా యెహోవా ఆలయ
బాధ్యతలు స్వీకరించే యాజకులను ఎంపిక చేశాడు.
ఆ యాజకులు లేవీయులు. ఆలయ యాజమాన్యం
పనిని దావీదు వారికి అప్పజెప్పాడు. మోషే ధర్మశాస్త్రా
నుసారం ఆ యాజకులు యెహోవాకు దహనబలులు
సమర్పిస్తారు. దావీదు ఆజ్ఞాపించిన రీతిగా వారు ఆనం
దోత్సాహాలతో బలులు అర్పించారు.[19]ఏరకంగానైనా
సరే అపరిశుభ్రంగా ఎవ్వరూ ఆలయంలో ప్రవేశించ
కుండా యెహోయాదా ఆలయ ద్వారాల వద్ద కాపలా
దారులను నియమించాడు.

[20]యెహోయాదా సైన్యాధిపతులను, ప్రజానాయ
కులను, ప్రాంతీయ పాలకులను, ఇతర ప్రజలందరినీ
తనతో తీసికొని వెళ్లాడు. ఆలయం నుండి రాజును
కూడ తనతో తీసుకొని పై ద్వారం గుండా రాజభవ
నానికి వెళ్లాడు. అక్కడ వారు రాజును సింహాసనంపై
కూర్చుండబెట్టారు.

[21]యూదా ప్రజలంతా చాలా సంతోషపడ్డారు.
అతల్యా కత్తివేటుకు గురియై చనిపోవ టంతో
యెరూషలేము నగరంలో శాంతి నెలకొన్నది.

### యోవాషు ఆలయాన్ని పునరుద్ధరించుట

24 యోవాషు రాజయ్యేనాటికి ఏడేండ్లవాడు.
అతడు యెరూషలేములో నలబై సంవత్స
రాలు పరిపాలించాడు. అతని తల్లిపేరు జిబ్యా. జిబ్యా
బెయేర్షెబా పట్టణ కాపురస్థురాలు. [2]యాజకుడైన
యెహోయాదా జీవించియున్నంత కాలం యోవాషు
యెహోవా సన్నిధిని అన్నీ మంచి పనులు చేశాడు.
[3]యోవాషుకు ఇద్దరు భార్యలను యెహోయాదా
ఎంపిక చేశాడు. యోవాషుకు కుమారులు, కుమార్తెలు
కలిగారు. [4]కొంతకాలం తరువాత ఆలయాన్ని పునరు
ద్ధరిం చాలని యోవాషు నిర్ణయించాడు. [5]యాజకు
లను, లేవీయులను, యోవాషు సమావేశపర్చి, “మీరు
యూదా పట్టణాలకు వెళ్లి ప్రతి సంవత్సరం ఇశ్రాయేలు
ప్రజలిచ్చే సొమ్మును జమచేయండి. ఆ ధనంతో మీ
దేవుని ఆలయాన్ని పునరుద్ధరించండి. ఈ పని త్వరగా
చేయండి” అని చెప్పాడు. కాని, లేవీయులు త్వర
పడలేదు.

[6]ప్రముఖ యాజకుడైన యెహోయాదాను రాజైన
యోవాషు పిలిపించి, “యెహోయాదా, యూదా
నుండి, యెరూషలేము నుండి లేవీయులు పన్ను
వసూలు చేసి తీసుకొని వచ్చేలా నీవు ఎందుకు
ఏర్పాటు చేయలేదు? యెహోవా సేవకుడైన మోషే,
ఇశ్రాయేలు ప్రజలు ఆ పన్ను వసూళ్లను పవిత్ర గుడారా
నికై వెచ్చించే వారుగదా!” అని అన్నాడు.

[7]గతంలో అతల్యా కుమారులు ఆలయంలో జొర
బడ్డారు. యెహోవా ఆలయంలో పవిత్ర వస్తువులన్ని
టినీ వారు బయలు దేవుళ్ళ ఆరాధనకు వినియోగిం
చారు. అతల్యా ఒక దుష్ట స్త్రీ.

[8]రాజైన యోవాషు ఒక పెట్టె చేయించి దానిని
యెహోవా ఆలయ ద్వారం బయట పెట్టించాడు.
[9]పిమ్మట లేవీయులు యూదాలోను, యెరూషలేము
లోను ఒక ప్రకటన చేశారు. ప్రజలందరినీ పన్ను
డబ్బు యెహోవా కొరకు తెమ్మని చెప్పారు. వారు
ఎడారిలో వున్నప్పుడు యెహోవా సేవకుడైన మోషే
ఇశ్రాయేలు ప్రజలను చెల్లించమని చెప్పినదే ఈ పన్ను
ధనం. [10]పెద్దలు, ప్రజలు అంతా చాలా సంతోష
పడ్డారు. వారు తమ వంతు ధనాన్ని తెచ్చి ఆ పెట్టెలో
వుంచారు. ఆ పెట్టె నిండేవరకు ప్రజలు డబ్బు వేస్తూ
వచ్చారు. [11]తరువాత లేవీయులు ఆ పెట్టెను రాజాధి
కారుల యొద్దకు తీసుకొని వెళ్లారు. పెట్టె డబ్బుతో
నిండివున్నట్లు వారు చూశారు. రాజు యొక్క కార్య
దర్శి, ప్రధాన యాజకుని అధికారి వచ్చి పెట్టెలోని
డబ్బును బయటికి తీశారు. మళ్లీ ఆ పెట్టెను యథా

స్థానంలో వుంచారు. వారలా అనేక పర్యాయాలు చేసి
ధనాన్ని విశేషంగా సేకరించారు. 12తరువాత రాజైన
యోవాషు, యెహోయాదా ఆ ధనాన్ని ఆలయ
పునరుద్ధరణకు పనిచేస్తున్న పనివారికి చెల్లించారు.
ఆలయపు పనిలో నిమగ్నమైన వారు నిపుణులైన
కొయ్యచెక్కడపు (నగిషీ) పనివారిని, వడ్రంగులను
ఆలయ పునరుద్ధరణకై కిరాయికి నియమించారు.
ఆలయ పునరుద్ధరణ పనికి ఇనుము, కంచు పనులలో
మంచి అనుభవం వున్నవారిని కూడా వారు కిరాయికి
నియమించారు.

13పనిమీద తనిఖీకై నియమింపబడిన వారు చాలా
నమ్మకస్థులు. ఆలయ పునరుద్ధరణ కార్యక్రమం
విజయవంతంగా ముగిసింది. దాని పూర్వరూపం
ఏమాత్రం మార్చకుండా దానిని పునరుద్ధరించి, ఇంకా
బలంగా తీర్చిదిద్దారు.

14పని పూర్తయ్యాక, మిగిలిన డబ్బును రాజైన
యోవాషుకు, యెహోయాదాకు వారు తిరిగి యిచ్చి
వేశారు. వారాధనాన్ని ఇంకా ఆలయానికి కావలసిన
వస్తుసామగ్రికి, పరికరాలకు వినియోగించారు. ఈ వస్తు
సామగ్రిని ఆలయ ఆరాధనలోను, దహన బలులు సమ
ర్పించటంలో వినియోగించారు. వెండి బంగారాలతో
వారింకా గిన్నెలను, ఇతర పరిక రాలను చేయించారు.
యాజకులు యెహోవా ఆలయంలో యెహో
యాదా బతికివున్నంత కాలం దహనబలులు
అర్పించారు.

15యెహోయాదా వృద్ధుడయ్యాడు. అతడు దీర్ఘ
కాలం జీవించి పిమ్మట చనిపోయాడు. చనిపోయే
నాటికి యెహోయాదా నూటముప్పై యేండ్ల
వయస్సువాడు.

16దావీదు నగరంలో రాజులను వుంచేచోట ప్రజలు
యెహోయాదాను సమాధిచేశారు. ఇశ్రాయేలులో
యెహోవాకు, ఆయన ఆలయానికి తన జీవిత
కాలంలో ఎనలేని సేవ చేసినందువలన ప్రజల తనిని
అక్కడ సమాధి చేశారు.

### యోవాషు దుర్మార్గత

17యెహోయాదా చనిపోయిన పిమ్మట, యూదా
పెద్దలు వచ్చి రాజైన యోవాషుకు తలవంచి నమస్క
రించారు. ఆ పెద్దల విన్నపాన్ని రాజు విన్నాడు. 18రాజు,
పెద్దలు కూడా యెహోవా ఆలయాన్ని తిరస్క
రించారు. వారి పూర్వీకులు యెహోవా దేవుని ఆరా
ధించారు. ఇప్పుడు వీరు అషేరా దేవతా స్తంభాలను,
ఇతర విగ్రహాలను పూజించటం మొదలు పెట్టారు.
రాజు, ప్రజానాయకులు దుష్ట నడక నడచిన కారణంగా
దేవుడు యూదా, యెరూషలేము ప్రజలపట్ల కోప
గించాడు. 19వారిని మళ్లీ సన్మార్గాన్ని అనుసరింప జేయ
టానికి యెహోవా వారివద్దకు ప్రవక్తలను పంపించాడు.
ప్రవక్తలు ప్రజలను హెచ్చరించారు. అయినా ప్రజలు
వారి హెచ్చరికను పెడచెవిని పెట్టారు.

20దేవుని ఆత్మ జెకర్యా మీదికి వచ్చింది. జెకర్యా
తండ్రి యాజకుడైన యెహోయాదా. జెకర్యా ప్రజల
ముందు నిలబడి యిలా అన్నాడు: "దేవుడు యిలా
చెప్తున్నాడు. 'ప్రజలారా, యెహోవా ఆజ్ఞలను మీరు
ఎందుకు మీరుతున్నారు.? మీరు విజయవంతులు
కాలేరు. మీరు యెహోవాని వదిలిపెట్టారు. అందువల్ల
దేవుడు కూడ మిమ్మల్ని వదిలి వేస్తున్నాడు!'"

21కాని ప్రజలు జెకర్యాకు వ్యతిరేకంగా కుట్ర
పన్నారు. జెకర్యాను చంపమని రాజు ప్రజలకు ఆజ్ఞ
ఇవ్వటంతో, వారతనిని రాళ్లతో కొట్టి చంపారు. ప్రజలీ
పని ఆలయ ఆవరణలో చేశారు. 22రాజైన యోవాషు
యెహోయాదా తన పట్ల చూపిన కనికరాన్ని గుర్తు
పెట్టుకోలేదు. యెహోయాదా జెకర్యా తండ్రి. కాని
యెహోయాదా కుమారుడైన జెకర్యాను యోవాషు
చంపివేశాడు. తను చనిపోయేముందు జెకర్యా, "నీ
వేమి చేస్తున్నావో యెహోవా చూచి, నిన్ను శిక్షించు
గాక!" అని అన్నాడు.

23సంవత్సరాంతంలో అరాము (సిరియా) సైన్యం
యోవాషు మీదికి వచ్చింది. వారు యూదా,
యెరూషలేములపై దండెత్తి ప్రజానాయకులందరినీ
చంపివేశారు. వారు విలువైన వస్తువులన్నీ దోచుకుని
వాటిని దమస్కు (డెమాస్కస్) రాజుకు పంపించారు.
24అరాము సైన్యం ఒక చిన్న దండుగా వచ్చినప్పటికీ,
యూదాకు చెందిన ఒక మహా సైన్యాన్ని ఓడించగలిగేలా
యెహోవా వారికి తోడ్పడ్డాడు. వారి పూర్వీకులు
ఆరాధించిన దైవాన్ని యూదా ప్రజలు వదిలిపెట్టిన
కారణంగా యెహోవా ఈ పని చేశాడు. అందువల్లనే
యోవాషు శిక్షింపబడ్డాడు.

25అరామీయులు (సిరియనులు) యోవాషును
వదిలి వెళ్ళేటప్పటికి అతడు తీవ్రంగా గాయపడ్డాడు.
యోవాషు స్వంత సేవకులే అతనిపై కుట్రపన్నారు.
యాజకుడైన యెహో యాదా కుమారుడు జెకర్యాను
యోవాషు చంపిన కారణంగా వారు అలా ప్రవర్తించారు.
యోవాషును అతని పక్క మీదనే సేవకులు హత్య
చేశారు. చనిపోయిన యోవాషును ప్రజలు దావీదు
నగరంలో సమాధి చేశారు. కాని రాజులను వుంచే
చోట మాత్రం అతనిని వారు సమాధి చేయలేదు.

26జాబాదు మరియు యెహోజాబాదు అనే
వారు.యోవాషు మీద కుట్ర పన్నిన సేవకులు.
జాబాదు తల్లి పేరు షిమాతు. షిమాతు అమ్మోనీ
యురాలు. యెహోజాబాదు తల్లిపేరు షిమ్రీతు.
షిమ్రీతు మోయాబు స్త్రీ.

27యోవాషు కుమారుల గురించిన వృత్తాంతాలు,
అతనిని గురించిన గొప్ప ప్రవచనాలు అతడు

ఆలయాన్ని పునరుద్ధ రించిన విధము మొదలైన
విషయాలన్నీ రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయ
బడ్డాయి. అతని తరువాత అమజ్యా కొత్త రాజయ్యాడు.
అమజ్యా యోవాషు కుమారుడు.

### యూదా రాజుగా అమజ్యా

25 రాజు అయ్యేనాటికి అమజ్యా ఇరువదియైదు
సంవత్సరాలవాడు. అతడు యెరూషలేము
నుండి ఇరువై తొమ్మిది సంవత్సరాలు పరిపాలించాడు.
అతని తల్లి పేరు యెహోయద్దాను. యెహోయద్దాను
యెరూషలేముకు చెందిన స్త్రీ. [2]యెహోవా అతని
నుండి ఆశించిన పనులన్నీ అమజ్యా నిర్వర్తించాడు.
కాని అతడు ఆ పనులను తన పూర్ణ హృదయంతో
చేయలేదు. [3]అమజ్యా రాజుగా బలపడ్డాడు. తరువాత
రాజైన తన తండ్రిని చంపిన అధికారులను అతడు
చంపివేశాడు. [4]కాని అమజ్యా ఆ అధికారుల పిల్లలను
మాత్రం చంపలేదు. ఎందువల్లనంటే, మోషే ధర్మ
శాస్త్రంలో వ్రాయబడిన నియమ నిబంధనలను అతడు
పాటించాడు. యెహోవా యిలా ఆజ్ఞాపించాడు: "తమ
పిల్లలు చేసిన నేరానికి వారి తండ్రులు చనిపోరాదు.
తమ తండ్రులు చేసిన పాపాలకు వారి పిల్లలు చని
పోరాదు. ప్రతి వ్యక్తి తన పాపాలకు ఫలితంగా తానే
చనిపోవాలి."*

[5]యూదా ప్రజలందరినీ అమజ్యా సమావేశ
పర్చాడు. వారందరినీ వారి వారి కుటుంబాల వారీగా
విడగొట్టి, సహస్రాధిపతులను, శతాధిపతులను వారిపై
నియమించాడు. ఈ అధికారులు యూదా, బెన్యామీ
నుకు చెందిన సైనికులపై నియమింపబడ్డారు. సైనికు
లుగా ఎన్నుకోబడిన వారంతా ఇరువది ఏండ్ల యువ
కులు, అంతకు పైబడినవారు. ఈటెలు, డాళ్లు పట్టి
యుద్ధానికి సిద్ధంగా వున్న మూడు లక్షల మంది నిపుణు
లైన సైనికులున్నారు. [6]ఇశ్రాయేలు నుండి అమజ్యా
ఒక లక్ష మంది సైనికులను కిరాయికి నియమించాడు.
కిరాయి కింద వారికి రెండు వందల మణుగుల వెండిని
అతడు చెల్లించాడు. [7]కాని ఒక దైవజ్ఞుడు (ప్రవక్త)
అమజ్యా వద్దకు వచ్చాడు. ఆ ప్రవక్త యిలా అన్నాడు:
"రాజా, ఇశ్రాయేలు సైన్యాన్ని నీతో తీసుకొని వెళ్లవద్దు.
యెహోవా ఇశ్రాయేలు పక్షానలేడు. యెహోవా
ఎఫ్రాయిము* ప్రజలతో లేడు.

[8]"బహుశా నీవు యుద్ధానికి మంచి కట్టుదిట్టం
చేసుకొని సిద్ధంగా వుండవచ్చు. కాని దేవుడు నీవు
గెలిచేలా చేయవచ్చు, లేదా ఓడిపోయేలా చేయవచ్చు."

[9]అమజ్యా దైవజ్ఞునితో, "అయితే నేను ఇశ్రాయేలు
సైన్యానికి ఇప్పటి వరకు చెల్లించిన డబ్బు సంగతి
ఏమిటి?" అని అన్నాడు. దానికి దైవజ్ఞుడు, "ప్రభువైన
యెహోవా వద్ద చాలా వుంది. ఆయన నీకు దానికంటె
చాలా ఎక్కువ యివ్వగలడు!" అని చెప్పాడు. [10]అందు
వల్ల అమజ్యా ఇశ్రాయేలు సైన్యాన్ని ఎఫ్రాయిముకు
తిప్పి పంపివేశాడు. ఈ సైనికులకు రాజు మీద, యూదా
ప్రజలమీద చాలా కోపం వచ్చింది. మిక్కిలి కోపంతో
వారు ఇండ్లకు తిరిగి వెళ్లారు.

[11]పిమ్మట అమజ్యా మంచి ధైర్యం తెచ్చుకొని
తన సైన్యాన్ని ఎదోము దేశంలో ఉన్న ఉప్పు లోయకు
నడిపించాడు. ఆ ప్రదేశంలో శేయీరు (ఎదోము)కు
చెందిన పదివేల మందిని అమజ్యా సైన్యం చంపివేసింది.
[12]యూదా సైన్యం శేయీరుకు చెందిన పదివేల
మందిని బందీలుగా పట్టుకున్నది. ఆ బందీలను
శేయీరు నుండి ఒక కొండ శిఖరం మీదికి వారు తీసు
కొని వెళ్లారు. అప్పటికి బందీలంతా బతికే వున్నారు.
వారందరినీ యూదా సైన్యం కొండ శిఖరం నుండి
తోసివేయగా వారి శరీరాలు కింది రాళ్ల పైబడి ముక్కలు
ముక్కలై పోయాయి.

[13]కాని అదే సమయంలో ఇశ్రాయేలు సైన్యం
యూదాలో కొన్ని పట్టణాలపై దాడి చేస్తూ వుంది.
బేత్‌హోరోను నుండి సమరయ (షోమ్రోను) వరకు
వున్న పట్టణాలపై వారు దాడి జరిపారు. వారు కూడ
మూడు వేల మందిని చంపి, చాలా విలువైన వస్తువులను
కొల్లగొట్టారు. అమజ్యా వారిని తన సైన్యంతో కలిసి
యుద్ధానికి రానివ్వక పోవటంతో ఆ సైనికులు చాలా
కోపగించి వున్నారు.

[14]ఎదోమీయులను (శేయీరు వారిని) ఓడించిన
పిమ్మట అమజ్యా ఇంటికి తిరిగి వచ్చాడు. శేయీరు
ప్రజలు పూజించే విగ్రహాలన్నిటినీ అతడు తీసుకొని
వచ్చాడు. అమజ్యా ఆ విగ్రహాలనే పూజించటం
మొదలు పెట్టాడు. అతడా విగ్రహాలకు సాష్టాంగపడి,
వాటికి ధూపం వేయసాగాడు. [15]అమజ్యా పట్ల యెహో
వాకు చాలా కోపం వచ్చింది. యెహోవా అమజ్యా
వద్దకు ఒక ప్రవక్తను పంపాడు. ఆ ప్రవక్త యిలా
అన్నాడు: "అమజ్యా, ఆ ప్రజలు పూజించిన దేవుళ్లను
నీవెందుకు కొలుస్తున్నావు? ఆ దేవుళ్లు వారి ప్రజలనే
నీనుండి కాపాడలేక పోయారు!"

[16]ప్రవక్త చెప్పటం ముగించాక, అమజ్యా ప్రవక్తతో
యిలా అన్నాడు: "మేము నిన్ను రాజుకు సలహాదారుగా
ఎన్నడూ నియమించలేదే! నీవు మాట్లాడవద్దు! నీవు
నోరు మూయకపోతే నీవు చంపబడతావు!" ప్రవక్త
మౌనం వహించాడు. తరువాత ప్రవక్త మళ్లీ యిలా
అన్నాడు: "దేవుడు నిన్ను నాశనం చేయటానికే నిశ్చ
యించాడు. నీవు అటువంటి నీచకార్యాలు చేయ
టంతో పాటు, నా సలహా కూడ పెడచెవిని పెట్టావు."

---

**వారి తండ్రులు ... చనిపోవాలి** ఈ న్యాయ సూత్రం ద్వితీ
యోపదేశకాండం 24:16 కానవస్తుంది.

**ఎఫ్రాయిము** ఎఫ్రాయిము వంశం వారు ఇశ్రాయేలుతో
కలిశారు. ఇశ్రాయేలుకే ఎఫ్రాయిము అని మరో పేరు.

[17]యూదా రాజైన అమజ్యా తన సలహాదారులతో సంప్రదించాడు. తరువాత యెహోయాషుకు ఒక వర్తమానం పంపాడు. యెహోయాషు' "మనం ఒక రితోఒకరు ముఖాముఖి పోరాడదాము" అని అమజ్యా కబురు పంపాడు. యెహోయాషు తండ్రిపేరు యెహోయాహాజు. యెహోయాహాజు తండ్రి పేరు యెహూ. యెహూ ఇశ్రాయేలు రాజు.

[18]పిమ్మట యెహోయాషు తన సమాధానాన్ని అమజ్యాకు పంపాడు. యెహోయాషు ఇశ్రాయేలు రాజు. అమజ్యా యూదా రాజు. యెహోయాషు ఈ కథ చెప్పి పంపాడు: "లెబానోనుకు చెందిన ఒక చిన్న ముండ్ల పొద లెబానోనులోని ఒక పెద్ద దేవదారు వృక్షానికి ఒక వర్తమానం పంపింది. ఆ చిన్న ముండ్ల పొద, 'నా కుమారుణ్ణి నీ కుమార్తెను వివాహం చేసుకోనియ్యి', అని అన్నది. కాని ఈలోపల ఒక అడవి జంతువు వచ్చి ఆ చిన్న ముండ్ల పొదను తొక్కి నాశనం చేసేసింది. [19]'నేను ఎదోమును ఓడించాను' అని నీవు గర్వపడుతున్నావు. గొప్పలు చెప్పుకొంటున్నావు. ఇక నీవు ఇంటి వద్దనే వుండు. కోరి కష్టాలు తెచ్చుకోకు. నీవు నాతో యుద్ధం చేస్తే నీవు, యూదా నాశనమవ్వటం ఖాయం."

[20]కాని అమజ్యా ఈ సలహా వినటానికి నిరాకరించాడు. ఇదంతా దేవుని సంకల్పంతోనే జరుగుతూ వుంది. ఎదోమీయులు కొలిచిన దేవుళ్లను యూదా ప్రజలు ఆరాధించిన నేరానికి, ఇశ్రాయేలు చేతిలో యూదా ఓడిపోయేలా యెహోవా పథకం సిద్ధం చేశాడు. [21]కావున ఇశ్రాయేలు రాజైన యెహోయాషు యూదా రాజైన అమజ్యాను బేత్షెమెషు పట్టణం వద్ద ముఖాముఖి ఎదుర్కొన్నాడు. బేత్షెమెషు పట్టణం యూదాలో వుంది. [22]ఇశ్రాయేలు యూదాను ఓడించింది. యూదా సైన్యంలో ప్రతివాడూ తన ఇంటికి పారిపోయాడు. [23]అమజ్యాను బేత్షెమెషు పట్టణం వద్ద యెహోయాషు పట్టుకుని, యెరూషలేముకు తీసుకొని పోయాడు. అమజ్యా తండ్రి పేరు యోవాషు. యోవాషు తండ్రి పేరు యెహోయాహాజు. యెహోయాషు ఆరువందల అడుగుల (నాలుగువందల మూరలు) మేరకు యెరూషలేము గోడను ఎఫ్రాయిము ద్వారం నుండి మూల ద్వారం వరకు పడగొట్టాడు. [24]పిమ్మట యెహోయాషు వెండిని, బంగారాన్ని, ఇతర పరికరాలన్నిటినీ ఆలయం నుండి పట్టుకుపోయాడు. ఆలయంలో వస్తువుల సంరక్షణ బాధ్యత ఓబేదెదోముది. యెహోయాషు రాజగృహం నుండి విలువైన వస్తువులను కూడ తీసుకొని పోయాడు. కొంతమంది మనుష్యులను బందీలుగా పట్టుకున్నాడు. పిమ్మట అతడు సమరయకు వెళ్లిపోయాడు.

[25]యెహోయాషు చనిపోయిన తరువాత అమజ్యా పదిహేను సంవత్సరాలు బతికాడు. అమజ్యా తండ్రిపేరు యూదా రాజైన యోవాషు. [26]మొదటి నుండి చివరి వరకు అమజ్యా చేసిన ఇతర కార్యాలన్నీ యూదా, ఇశ్రాయేలు రాజుల గ్రంథంలో వ్రాయబడ్డాయి. [27]అమజ్యా యెహోవాకు విధేయుడుగా వుండటం మానివేసినప్పటి నుండి, యెరూషలేము ప్రజలు అమజ్యాకు వ్యతిరేకంగా కుట్రచేశారు. అతడు లాకీషు పట్టణానికి పారిపోయాడు. కాని ప్రజలు కొందరు మనుష్యులను లాకీషు పట్టణానికి పంపగా వారు అమజ్యాను అక్కడ చంపివేశారు. [28]వారతని శవాన్ని గుర్రాల మీద వేసుకొని తెచ్చి యూదా నగరంలో అతని పితరుల దగ్గర సమాధి చేశారు.

### యూదా రాజుగా ఉజ్జియా

26 తరువాత అమజ్యా స్థానంలో కొత్త రాజుగా ప్రజలు ఉజ్జియాను ఎంచుకున్నారు. ఉజ్జియా తండ్రి పేరు అమజ్యా. ఇది జరిగే నాటికి ఉజ్జియా పదహారు సంవత్సరాలవాడు. [2]ఎలతు పట్టణాన్ని ఉజ్జియా తిరిగి నిర్మించి యూదాకు యిచ్చాడు. అమజ్యా చనిపోయి, తన పూర్వీకులతో సమాధి చేయబడిన తరువాత ఉజ్జియా ఇది చేశాడు.

[3]తాను రాజయ్యేనాటికి ఉజ్జియా పదహారు సంవత్సరాలవాడు. యెరూషలేములో అతడు ఏబై రెండు సంవత్సరాలు పాలించాడు. అతని తల్లి పేరు యెకొల్యా. యెకొల్యా యెరూషలేముకు చెందిన స్త్రీ. [4]యెహోవా అతని నుండి ఆశించిన విధంగా ఉజ్జియా తన కార్యకలాపాలు కొనసాగించాడు. తన తండ్రి అమజ్యావలెనే ఉజ్జియా కూడ దేవుని పట్ల భక్తి శ్రద్ధలు కలిగి ఉన్నాడు. [5]జెకర్యా జీవించి ఉన్న కాలంలోనే ఉజ్జియా దేవుని సేవకుడయ్యాడు. ప్రభువైన యెహోవా పట్ల ఎలా భక్తి విశ్వాసాలు కలిగి వుండాలో జెకర్యా ఉజ్జియాకు నేర్పాడు. ఉజ్జియా యెహోవాకు విధేయుడై వున్నంతకాలం, ఆయన అతనికి విజయం చేకూర్చిపెట్టాడు.

[6]ఫిలిష్తీయులతో ఉజ్జియా యుద్ధం చేశాడు. గాతు, యబ్నె, అష్డోదు పట్టణాల చుట్టూ వున్న ప్రాకారాలను అతడు పడగొట్టాడు. అష్డోదు పట్టణానికి దగ్గరగాను, మరియు ఫిలిష్తీయులు నివసించే ప్రాంతాలలోను ఉజ్జియా కొన్ని పట్టణాలను నిర్మించాడు. [7]ఫిలిష్తీయులతోను, గూర్బయలులో నివసిస్తున్న అరబీయులతోను, మెహూనీయులతోను ఉజ్జియా జరిపిన యుద్ధాలలో యెహోవా అతనికి విజయం చేకూర్చాడు. [8]అమ్మోనీయులు ఉజ్జియాకు కప్పం చెల్లించారు. ఈజిప్టు సరిహద్దులవరకు ఉజ్జియా పేరు ప్రతిష్ఠలు వ్యాపించాయి. మిక్కిలి బలపరాక్రమాలు కలవాడగుటచే ఉజ్జియా ప్రసిద్ధిగల వ్యక్తి అయ్యాడు.

[9]యెరూషలేములో మూలద్వారం వద్ద, లోయ ద్వారం వద్ద, మరియు గోడమలుపు వద్ద ఉజ్జియా

బురుజులు కట్టించి బాగా బలపర్చాడు. 10ఎడారిలో
సహితం ఉజ్జియా బురుజులు కట్టించాడు. అతడు
చాలా బావులు కూడా తవ్వించాడు. కొండల (మన్యం)
ప్రాంతంలోను, మైదాన ప్రాంతాలలోను అతనికి
పశుసంపద విస్తారంగా వుంది. పంట సాగుకు అనువైన
కొండలయందు, మైదానములందు ఉజ్జియాకు
వ్యవసాయదారులున్నారు. ద్రాక్షతోటల పెంపకంలో
శ్రద్ధవహించే రైతులు కూడ అతనికి వున్నారు. అతడు
వ్యవసాయ రంగాన్ని అభిమానించాడు.
11ఉజ్జియాకు మంచి శిక్షణ పొందిన సైన్యం ఉంది.
కార్యదర్శి యెహీయేలు, మరో అధికారి మయశేయా
అనేవారు సైన్యాన్ని వివిధ భాగాలుగా విభజించారు.
వారి పైఅధికారి హనన్యా. యెహీయేలు, మయశేయా
సైనికులందరినీ లెక్కించి వారిని పటాలాలుగా విభజిం
చారు. హనన్యా రాజాధికారులలో ఒకడు. 12సైనికులపై
అధికారులే రెండువేల ఆరువందల మంది ఉన్నారు.
13వంశాలవారీ ఎంపికైన సైన్యాధికారుల కింద మొత్తం
మూడు లక్షల ఏడువేల ఐదువందల మంది యుద్ధంలో
కాకలు తీరిన సైనికులున్నారు. ఆ సైనికులు శత్రువుల
నుండి రక్షణ పొందటానికి రాజుకు సహాయపడతారు.
14ఉజ్జియా సైన్యానికి డాళ్లు, ఈటెలు, శిరస్త్రాణాలు
కవచాలు విల్లంబులు, ఒడిసెల రాళ్లు సరఫరా చేశాడు.
15మేధావులు తమ కల్పనా శక్తితో రూపొందించిన
యంత్రాలను ఉజ్జియా యెరూషలేములో తయారు
చేయించాడు. ఆ యంత్రాలను బురుజుల మీద,
గోడలు కలిసిన మూలల మీద ఉంచాడు. ఈ
యంత్రాలు బాణాలు వదలటం, బండరాళ్లు విసరి
వేయటం మొదలైన పనులు చేసేవి. ఉజ్జియా చాలా
ప్రఖ్యాతి గాంచాడు. దూర ప్రదేశాలలో కూడ ప్రజలు
అతని పేరు విన్నారు. అతనికి ఎడతెగని సహాయం
అందటంతో అతను చాలా శక్తివంతమైన రాజు
అయ్యాడు.

16ఉజ్జియా గొప్పవాడు కావటంతో పాటు, గర్విష్ఠి
కూడా అయ్యాడు. అతని గర్వమే అతని వినాశనానికి
కారణమయ్యింది. అతని దేవుడైన యెహోవాకు
అతడు విశ్వాసపాత్రుడు కాలేదు. బలిపీఠం మీద ధూపం
వేయటానికి అతడు ఆలయంలోకి వెళ్లాడు. 17యాజ
కుడైన అజర్యా, మరియు ధైర్యంగల యెహోవా
సేవకులు ఎనుబది మంది ఉజ్జియాను వెంబడించి
ఆలయంలోకి వెళ్ళారు. 18ఉజ్జియా తప్పు చేస్తున్నట్లు
వారతనిని మందలించారు. వారు యిలా అన్నారు:
“ఉజ్జియా, యెహోవాకు ధూపం వేయటం నీ పని
కాదు. ఈ పని చేయటం నీకు మంచిది కాదు. యాజకు
లైన అహరోను సంతానంవారు మాత్రమే యెహోవాకు
ధూపం వేయాలి. ధూపం వేసే పవిత్ర కార్యానికి ఈ
యాజకులు శిక్షణ పొందారు. ఈ అతిపవిత్ర స్థలం
నుండి నీవు బయటకు పొమ్ము. నీవు విశ్వాసంగా
లేవు. ప్రభువైన యెహోవా నీ ఈ ప్రవర్తనకు నిన్ను
గౌరవించడు!”

19కాని ఉజ్జియాకు కోపం వచ్చింది. అతని చేతిలో
ధూపకలశం ఉంది. యాజకులపట్ల ఉజ్జియా కోప
గించుకుంటూ ఉండగనే అతని నుదుటిపై కుష్ఠు
రోగం* పుట్టింది. ఆలయంలో ధూపపీఠం పక్కనే
వున్న యాజకుల ముందే ఇది జరిగింది. 20ప్రధాన
యాజకుడైన అజర్యా, మరియు ఇతర యాజకులు
ఉజ్జియా వైపు చూశారు. అతని నుదుటి మీద కుష్ఠు
రోగాన్ని వారు చూడగలిగారు. యాజకులు వెంటనే
ఉజ్జియాను ఆలయం నుండి బయటికి తరిమేశారు.
యెహోవా అతనిని శిక్షకు గురిచేసిన కారణంగా
ఉజ్జియా తనకుతానే బయటకు వచ్చాడు. 21రాజైన
ఉజ్జియా కుష్ఠురోగి అయ్యాడు. అతడు యెహోవా
ఆలయంలో మళ్లీ ప్రవేశించలేక పోయాడు. ఉజ్జియా
కుమారుడు యోతాము రాజగృహ కార్యక్రమాలు
నిర్వహిస్తూ, రాజు తరపున ప్రజాపాలకుడయ్యాడు.
22మొదటి నుండి చివరి వరకు ఉజ్జియా చేసిన
ఇతర కార్యాలన్నీ ప్రవక్తయైన యెషయా వ్రాశాడు.
యెషయా తండ్రిపేరు ఆమోజు. 23ఉజ్జియా చని
పోయినప్పుడు అతనిని అతని పూర్వీకుల దగ్గరగా
సమాధిచేశారు. ఉజ్జియా కుష్ఠురోగి కావటంవల్ల రాజుల
శ్మశాన వాటికకు దగ్గరలోవున్న పొలంలో అతడు
సమాధి చేయబడ్డాడు. పిమ్మట ఉజ్జియా స్థానంలో
అతని కుమారుడు యోతాము కొత్త రాజు అయ్యాడు.

### యూదా రాజుగా యోతాము

27 యోతాము రాజయ్యేనాటికి ఇరువదియైదు
సంవత్సరాలవాడు. యెరూషలేములో అతడు
పదహారు సంవత్సరాలు పాలించాడు. అతని తల్లి పేరు
యెరూషా. యెరూషా సాదోకు కుమార్తె. 2యెహోవా
కోరిన విధంగా యోతాము కార్యకలాపాలు నిర్వర్తిం
చాడు. తన తండ్రి ఉజ్జియా మాదిరిగానే అతడు దేవునికి
విధేయుడై వున్నాడు. కాని తన తండ్రి చేసిన విధంగా
ధూపం వేయటానికి యోతాము ఆలయం ప్రవేశించ
లేదు. అయినా ప్రజలు మాత్రం తమ దుష్ట నడతను
మానలేదు. 3ఆలయపు పెద్వారాన్ని యోతాము తిరిగి
నిర్మించాడు. ఓపెలు అనే స్థలంలో గోడమీద ఎక్కువ
నిర్మాణాన్ని చేపట్టాడు. 4యూదాలో కొండల
ప్రాంతంలో యోతాము పట్టణాలను నిర్మించాడు.
యోతాము అరణ్యాలలో కోటలను, బురుజులను
కట్టించాడు. 5యోతాము అమ్మోనీయుల రాజుతోను,
అతని సైన్యంతోను పోరాడి వారిని ఓడించాడు. కావున
మూడేళ్లపాటు ప్రతి సంవత్సరం అమ్మోనీయులు

**కుష్ఠురోగం** హెబ్రీ భాషలో ఒక విధమైన భయంకర చర్మవ్యాధి అని అర్థము.

రెండు వందల మణుగుల* వెండి, పదివేల ఏదు
ముల* గోధుమలు, పదివేల ఏదుముల యవలు
కప్పంగా చెల్లించారు.
6తన దేవుడైన యెహోవా పట్ల సత్యవర్తనుడై
విధేయుడైనందున యోతాము చాలా శక్తివంతమైన
రాజు అయ్యాడు.
7యోతాము చేసిన ఇతర కార్యాలు, అతడు నిర్వ
హించిన యుద్ధాలగురించి ఇశ్రాయేలు, యూదా రాజుల
చరిత్ర గ్రంథంలో వ్రాయబడ్డాయి. 8యోతాము రాజ
య్యేనాటికి ఇరువదియైదు సంవత్స రాలవాడు. అతడు
యెరూషలేములో పదహారు సంవత్సరాలు పరిపా
లించాడు. 9తరువాత యోతాము చనిపోగా, అతనిని
తన పూర్వీకులతో సమాధి చేశారు. ప్రజల తనిని
దావీదు నగరంలో* సమాధి చేశారు. యోతాము
స్థానంలో ఆహాజు రాజయ్యాడు. యోతాము
కుమారుడే ఆహాజు.

### యూదా రాజుగా ఆహాజు

28 ఆహాజు రాజయ్యేనాటికి ఇరవై యేండ్లవాడు.
అతడు యెరూషలేములో పదహారు సంవత్స
రాలు పాలించాడు. తన పూర్వీకుడైన దావీదువలె
ఆహాజు మంచి మార్గంలో నడవలేదు. యెహోవా
ఆశించిన విధంగా సత్కార్యాలు చేయలేదు. 2ఇశ్రా
యేలు రాజులు అనుసరించిన చెడుమార్గాన్నే ఆహాజు
కూడా అనుసరించాడు. బయలు దేవతలను ఆరాధించ
టానికి అతడు విగ్రహాలను పోతపోయించాడు. 3బెన్హి
న్నోము లోయలో* ఆహాజు ధూపం వేశాడు. అతడు
తన స్వంత కుమారులనే అగ్నిలో కాల్చి దేవతలకు
బలియిచ్చాడు. ఆ ప్రాంతంలో నివసించే ప్రజలు
ఒడిగట్టే భయంకర పాపాలకే అతడు కూడా పాల్ప
డ్డాడు. ఇశ్రాయేలు ప్రజలు ఆ రాజ్యంలో ప్రవేశించి
నప్పుడు యెహోవా బయటకు తరిమివేసిన నీచ
వ్యక్తులే ఈ ప్రజలు. 4గుట్టలమీద, కొండలమీద, ప్రతి
పచ్చని చెట్టు కిందా ఆహాజు బలులు అర్పించి, ధూపం
వేశాడు. 5-6ఆహాజు పాపం చేయటంతో అతని దేవుడైన
యెహోవా అతనిని అరాము (సిరియా) రాజు చేతిలో
ఓడిపోయేలా చేశాడు. అరాము రాజు, అతని సైన్యం
ఆహాజును ఓడించి, అనేకమంది యూదా వారిని బందీ
లుగా పట్టుకున్నారు. అరాము రాజు ఆ బందీలను
దమస్కు (డెమాస్కస్) నగరానికి పట్టుకుపోయాడు.
ఇశ్రాయేలు రాజైన పెకహు కూడా ఆహాజును ఓడించేలా
యెహోవా చేశాడు. పెకహు తండ్రి పేరు రెమల్యా.
పెకహు, అతని సైన్యం కలిసి ఒక్కరోజులో యూదాకు
చెందిన ఒక లక్షా ఇరవై వేలమంది ధైర్యంగల సైనికులను
చంపివేశారు. వారి పూర్వీకులు విధేయులైవున్న వారి
దేవుడైన యెహోవాకు వారు అవిధేయులైనందువల్ల
పెకహు యూదా ప్రజలను ఓడించ గలిగాడు. 7ఎఫ్రాయి
ముకు చెందిన జిఖ్రి ధైర్యంగల సైనికుడు. రాజైన
ఆహాజు కుమారుడు మయశేయాను, రాజగృహ నిర్వహ
ణాధికారి అజ్రీకామును, మరియు ఎల్కానాను జిఖ్రి
చంపివేశాడు. రాజు తరపున అధికారం చెలాయించే
వారిలో రాజు తరువాతివాడు ఎల్కానా.
8ఇశ్రాయేలు సైన్యం యూదాలో నివసిస్తున్న
తమ బంధువులైన రెండు లక్షల మందిని బందీచేశారు.
వారు యూదా నుంచి స్త్రీలను, పిల్లలను, అనేక విలువైన
వస్తువులను పట్టుకుపోయారు. ఇశ్రాయేలీయులు ఆ
బందీలను, వస్తువులను సమరయకు (షోమ్రోను)
తీసుకొనిపోయారు. 9కాని యెహోవా ప్రవక్తలలో
ఒకడు అక్కడ వున్నాడు. ఈ ప్రవక్త పేరు ఓదేదు.
సమరయకు తిరిగి వచ్చిన ఇశ్రాయేలు సైన్యాన్ని ఓదేదు
కలిశాడు. ఇశ్రాయేలు సైన్యంతో ఓదేదు యిలా
అన్నాడు: “మీ పూర్వీకులు ఆరాధించిన దేవుడైన
యెహోవా యూదా ప్రజలపట్ల కోపంగా వున్న
కారణంగా వారిని మీరు ఓడించగలిగేలా చేశాడు. మీరు
యూదా ప్రజలను నీచమైన విధంగా చంపి, శిక్షించారు.
ఇప్పుడు యెహోవా మీపట్ల కోపంగా వున్నాడు.
10మీరు యూదా, యెరూషలేము ప్రజలను బానిసలుగా
చేయాలని తలస్తున్నారు. మీరు మీ దేవుడైన
యెహోవాపట్ల కూడా పాపం చేశారు. 11ఇప్పుడు
నేను చెప్పేది వినండి. మీరు చెరపట్టిన మీ సోదరులను
వెనుకకు పంపివేయండి. యెహోవా యొక్క భయం
కరమైన కోపం మీమీద వుంది గనుక మీరీపని
చేయండి.”
12ఎఫ్రాయిములో కొంతమంది పెద్దలు ఇశ్రాయేలు
సైనికులు యుద్ధం నుండి తిరిగి రావటం చూశారు.
ఆ పెద్దలు ఇశ్రాయేలు సైనికులను కలిసి వారిని హెచ్చ
రించారు. ఆ పెద్దలు యోహానాను కుమారుడు
అజర్యా, మెషిల్లేమోతు కుమారుడు బెరెక్యా, షల్లూము
కుమారుడు యెహిజ్కియా, మరియు హద్లాయి
కుమారుడు అమాశా. 13వారు ఇశ్రాయేలు సైనికులతో
యిలా చెప్పారు: “యూదా నుండి బందీలను ఇక్కడికి
తీసుకొని రావద్దు. మీరాపని చేస్తే అది యెహోవా
పట్ల మన పాపాన్ని, దోషాన్ని మరింత ఎక్కువ
చేస్తుంది. దానితో ఇశ్రాయేలుపట్ల యెహోవా కోపం
పట్టరానిదవుతుంది.”

---

**మణుగు** మూడు ముప్పాతిక టన్నులు.

**ఏదుము** 62,000 బుషెలులు.

**దావీదు నగరం** యెరూషలేముకు మరో పేరు.

**బెన్హిన్నోము లోయ** బెన్హిన్నోము లోయ యెరుషలేముకు దక్షిణంగా వుంది. అనేక మంది పసిపిల్లలను, చిన్న పిల్లలను బూటకపు దేవతలకు ఈ లోయలో బలి ఇచ్చేవారు.

14అందువల్ల బందీలను, విలువైన వస్తువులను
సైనికులు ఆ పెద్దలకు, ఇశ్రాయేలు ప్రజలకు అప్ప
జెప్పారు. 15ఇంతకుముందు పేర్కొన్న పెద్దలు
(అజర్యా, బెరెక్యా, యెహిజ్కియా, మరియు అమాశా)
నిలబడి బందీలకు సహాయపడ్డారు. ఇశ్రాయేలు సైని
కులు తీసుకొన్న వారి దుస్తులను పెద్దలు తిరిగి
తీసుకొని, దిగంబరంగా ఉన్న బందీలకు యిచ్చారు.
పెద్దలు వారికి పాదరక్షలు కూడా యిచ్చారు. యూదా
నుండి వచ్చిన బందీలకు అన్నపానాదులు కూడా
పెద్దలు యిచ్చారు. సేద తీరటానికి వారికి నూనెతో
కూడ వారు మర్దనా చేశారు. పిమ్మట ఆ ఎఫ్రాయిము
పెద్దలు నీరసంగా వున్న బందీలను గాడిదలపై ఎక్కించి
యెరికో పట్టణంలో తమ ఇండ్లకు తీసుకొని వెళ్లారు.
యెరికోకు ఖర్జూర చెట్ల పట్టణమని పేరు. పిమ్మట
ఆ నలుగురు పెద్దలు సమరయకు తిరిగి వెళ్లారు.
16-17అదే సమయంలో ఎదోమీయులు మళ్లీ వచ్చి
యూదా ప్రజలను ఓడించారు. ఎదోమీయులు ప్రజ
లను బందీలుగా పట్టుకుపోయారు. అందువల్ల రాజైన
ఆహాజు అష్షూరు రాజు సహాయాన్ని అర్థించాడు.
18కొండప్రాంతంలోను, దక్షిణ యూదా ప్రాంతం
లోనుగల పట్టణాలపై ఫిలిష్తీయులు దాడులు జరిపారు.
బేత్షెమెషు, అయ్యాలోను, గెదెరోతు, శోకో, తిమ్నా
మరియు గిమ్జో పట్టణాలను ఫిలిష్తీయులు పట్టు
కున్నారు. వారా పట్టణాలకు సమీపంలో వున్న గ్రామా
లను కూడా ఆక్రమించుకున్నారు. పిమ్మట ఫిలిష్తీ
యులు వాటిలో నివసించసాగారు. 19యూదా రాజైన
ఆహాజు యూదా ప్రజలను పాపకార్యాలకు ప్రోత్స
హించిన కారణంగా యెహోవా వారికి కష్టాలు కల్పిం
చాడు. యెహోవా పట్ల అతడు అసలు విశ్వాసం
లేకుండా ప్రవర్తించాడు. 20అష్షూరు రాజైన తిగ్లత్పిలే
సెరు వచ్చి ఆహాజుకు సహాయం చేయటానికి బదులు
అతనికి కష్టనష్టాలు కల్గించాడు. 21ఆహాజు ఆలయం
నుండి, రాజగృహం నుండి, యువరాజు ఆలయం
నుండి విలువైన వస్తువులు కొన్ని తీశాడు. ఆహాజు
వాటిని అష్షూరు రాజుకు యిచ్చాడు. అయినా ఆ
పని అతనికి సహాయపడలేదు.
22ఆహాజు తన కష్టాలతో సతమతమవుతూ మరిన్ని
పాపాలు చేసి యెహోవా పట్ల మరీ విశ్వాసంలేని
వాడయ్యాడు. 23దమస్కు ప్రజలు ఆరాధించే దేవ
తలకు అతడు బలులు అర్పించాడు. దమస్కు ప్రజలు
ఆహాజును ఓడించారు. అందువల్ల అతడిలా అను
కున్నాడు: "అరాము (సిరియా) ప్రజలు పూజించే
దేవుళ్లు వారికి సహాయపడి వుండవచ్చు. కావున నేను
కూడా ఆ దేవుళ్లకు బలులు అర్పిస్తే బహుశః వారు
నాకు కూడా సహాయం చేయవచ్చు." అందువల్ల
ఆహాజు ఆ దేవుళ్లను ఆరాధించాడు. ఈ రకంగా అతడు
పాపం చేసి, ఇశ్రాయేలు ప్రజలు కూడ పాపం చేయ
టానికి కారకుడయ్యాడు. 24ఆహాజు ఆలయంలో
వున్న వస్తువులను సేకరించి వాటిని ముక్కలు
ముక్కలు చేశాడు. పిమ్మట అతడు ఆలయాన్ని
మూసేశాడు. అతడు బలిపీఠాలు తయారు చేయించి,
వాటిని యెరూషలేములో ప్రతివీధి చివర నెల
కొల్పాడు. 25యూదాలో ప్రతి పట్టణంలోనూ ఆహాజు
ధూపాలు వేసి అన్యదేవతలను ఆరాధించటానికి ఉన్నత
స్థలాలను ఏర్పాటు చేశాడు. ఇవన్నీ చేసి ఆహాజు తన
పూర్వీకులు ఆరాధించిన ప్రభువైన యెహోవాకు
ఎక్కడలేని కోపాన్నీ కల్గించాడు. 26మొదటి నుండి
చివరి వరకు ఆహాజు చేసిన పనులన్నీ యూదా,
ఇశ్రాయేలు రాజుల గ్రంథంలో రాయబడ్డాయి.
27ఆహాజు చనిపోగా, అతడు అతని పూర్వీకులతో పాటు
సమాధి చేయబడ్డాడు. ప్రజలు ఆహాజును యెరూష
లేము నగరంలో సమాధి చేశారు. కాని ఆహాజును
ఇశ్రాయేలు రాజులను సమాధిచేసే చోట మాత్రం
వారు సమాధి చేయలేదు. ఆహాజు స్థానంలో అతని
కుమారుడు హిజ్కియా కొత్త రాజయ్యాడు.

## యూదా రాజుగా హిజ్కియా

29 హిజ్కియా రాజయ్యేనాటికి ఇరువై యైదు
సంవత్సరాలవాడు. అతడు యెరూషలేములో
ఇరవై తొమ్మిది సంవత్సరాలు పరిపాలించాడు. అతని
తల్లి పేరు అబీయా. అబీయా జెకర్యా కుమార్తె.
2ప్రభువైన యెహోవా ఆశించిన మంచి కార్యాలన్నీ
హిజ్కియా చేశాడు. తన పూర్వీకుడైన దావీదులా
అతడు ప్రతి మంచి పనినీ చేశాడు.
3హిజ్కియా ఆలయానికి తలుపులు పెట్టించి,
ద్వారాలను పటిష్ఠంచేశాడు. హిజ్కియా ఆలయాన్ని
మరల తెరిచాడు. అతడు రాజైన మొదటి సంవత్సరం
మొదటి నెలలో ఈ పని చేశాడు. 4-5యాజకులను,
లేవీయులను హిజ్కియా సమావేశపర్చాడు. ఆలయా
నికి తూర్పు భాగానగల ఖాళీ ప్రదేశంలో అతడు వారిని
కలిశాడు. వారితో హిజ్కియా యిలా అన్నాడు:
"లేవీయులారా, ఇది వినండి! మీరంతా పవిత్ర సేవా
కార్యక్రమానికి సిద్ధంకండి. యెహోవా యొక్క
ఆలయాన్ని పవిత్రం చేసే కార్యక్రమానికి అంతా సిద్ధం
చేయండి. యెహోవా మీ పితరులు అనుసరించిన
దేవుడు. ఆలయానికి చెందని వస్తువులన్నీ అక్కడ
నుంచి తీసిపారవేయండి. ఆ వస్తువులు ఆలయాన్ని
పవిత్రం చేయజాలవు. 6మన పూర్వీకులు యెహో
వాను వదిలి పెట్టారు. యెహోవా యొక్క ఆలయాన్ని
చూడకుండా వారి ముఖాలు తిప్పుకున్నారు. 7వారు
మండప ద్వారాలు మూసివేసి, ఆలయ దీపాలను
ఆర్పివేశారు. వారు ఇశ్రాయేలు దేవుని ఆలయపు పవిత్ర
స్థానంలో ధూపం వేయటం, దహనబలులు అర్పిం
చటం మానివేశారు. 8కావున యెహోవా యూదా,

యెరూషలేము ప్రజలపట్ల మిక్కిలి కోపంగా వున్నాడు.
యెహోవా వారిని శిక్షించాడు. అన్యదేశాలవారు
యెహోవా పేరు విని భయపడ్డారు. యూదా,
యెరూషలేము ప్రజలను యెహోవా శిక్షించిన తీరు
చూసి వారు మిక్కిలి విస్మయం చెందారు. అన్యులు
యూదా ప్రజలను చూసి అసహ్యించుకుని, సిగ్గుతో
తలలు ఆడించారు. ఇవన్నీ నిజమైన విషయాలని
మీకు తెలుసు. స్వయంగా మీ కళ్లతో మీరే చూడవచ్చు.
[9]అందువల్లనే మీ పూర్వీకులు యుద్ధంలో చంప
బడ్డారు. మన కుమారులు, కుమార్తెలు, భార్యలు బందీ
లుగా చేయబడ్డారు. [10]కావున హిజ్కియానైన నేను
ఇశ్రాయేలు దేవుడైన యెహోవాతో ఒక ఒడంబడిక
చేసుకోదలిచాను. అప్పుడాయన మనపట్ల ఎంత
మాత్రం కోపగించడు. [11]కావున మీరు సోమరితనం
మానండి. ఏమాత్రం కాలయాపన చేయవద్దు.
యెహోవాకు సేవ చేయటానికి యెహోవాయే
మిమ్మల్ని ఎన్నుకున్నాడు. మీరాయనను సేవించి,
ఆయనకు ధూపం వేయాలి."

[12-14]ఆలయాన్ని శుద్ధి చేయటానికి ఉద్యమించిన
లేవీయులు ఎవరనగా: కహాతీయుల వంశం నుండి
అమాశై కుమారుడై మహతు, మరియు అజర్యా కుమా
రుడైన యోవేలు. మెరారీ వంశం నుండి అబ్దీ
కుమారుడైన కీషు, మరియు యెహాల్లెలేలు కుమారు
డైన అజర్యా. గెర్షోనీయులలో జిమ్మా కుమారుడైన
యోవాహు; యోవాహు కుమారుడైన ఏదేను. ఎలీషా
పాను సంతతిలో షిమ్రీ, యెహీయేలు, ఆసాపు సంత
తిలో జెకర్యా, మత్తన్యా. హేమాను సంతతిలో యెహీ
యేలు, షిమీ. యెదూతూను సంతతిలో షెమయా,
ఉజ్జీయేలు. [15]ఈ లేవీయులు తమ సోదరులనందరినీ
పిలిపించి ఆలయాన్ని సంప్రోక్షించటానికి* సంసిద్ధు
లయ్యారు. యెహోవా సంకల్పంతో వచ్చిన రాజా
జ్ఞను వారు శిరసావహించారు. వారు ఆలయాన్ని శుద్ధి
చేయటానికి లోనికి వెళ్లారు. [16]యాజకులు ఆల
యాన్ని పవిత్ర పర్చటానికి అతి పవిత్ర స్థలంలోనికి
వెళ్లారు. ఆలయంలో వారు చూసిన అపవిత్రమై వస్తువు
లన్నిటినీ తీసివేశారు. నిషేధించబడిన వస్తువులన్నిటినీ
ఆలయపు ఆవరణలోనికి తీసుకొని వచ్చారు. అక్కడ
నుంచి ఆ నిషిద్ధ వస్తువులన్నిటినీ లేవీయులు కిద్రోను
లోయకు తీసికొని వెళ్లి పారవేశారు. [17]మొదటి నెల
మొదటి రోజున లేవీయులు పరిశుద్ధ కార్యక్రమానికి
సంసిద్ధులయ్యారు. నెలలో ఎనిమిదవ రోజున లేవీ
యులు ఆలయ ఆవరణలోకి వచ్చారు. అప్పటి నుంచి
మరో ఎనిమిది రోజులపాటు పవిత్రారాధనకు పనికి
వచ్చేలా ఆలయాన్ని శుద్ధిచేశారు. మొదటి నెలలో
పదహారవ రోజున పని ముగించారు.

[18]పిమ్మట వారు రాజైన హిజ్కియా వద్దకు వెళ్లారు.
వారు ఆయనతో, "హిజ్కియా రాజా, మేము పూర్తి
ఆలయాన్ని, దహనబలుల బలిపీఠాలను ఆలయంలో
ఇతర పరికరాలను శుభ్రపర్చాము. నైవేద్యపు రొట్టెను
వుంచే బల్లను, ఆ బల్ల మీద వుపయోగించే పరికరాలను
శుద్ధి చేశాము.

[19]రాజైన అహాబు విశ్వాసంలేనివాడై, తాను రాజుగా
వున్నప్పుడు కొన్ని వస్తువులను పారవేశాడు. కాని
మేము ఆ వస్తువులన్నిటినీ సేకరించి తిరిగి అక్కడ
వుంచి పవిత్ర సేవాకార్యక్రమానికి సిద్ధం చేసాము.
అవన్నీ ఇప్పుడు యెహోవా బలిపీఠం ముందు
వున్నాయి" అని చెప్పారు.

[20]రాజైన హిజ్కియా నగర అధికారులను సమావేశ
పర్చి, మరునాటి తెల్లవారుఝామునే యెహోవా ఆల
యానికి వెళ్లాడు. [21]వారు ఏడు గిత్తలను, ఏడు గొర్రె
పొట్టేళ్లను, ఏడు గొర్రె పిల్లలను మరియు ఏడు చిన్న
మేకపోతులను తెచ్చారు. ఇవి యూదా రాజ్యం తరఫున
పాపపరిహారార్థ బలుల నిమిత్తం, పవిత్ర స్థలాన్ని శుద్ధి
పర్చటానికి, మరియు యూదా ప్రజల పాపపరిహారం
కొరకు తేబడ్డాయి. యెహోవా బలిపీఠం మీద ఆ
పశువులను బలియిమ్మని రాజైన హిజ్కియా అహరోను
సంతతి వారైన యాజకులను ఆజ్ఞాపించాడు. [22]కావున
యాజకులు గిత్త దూడలను చంపి రక్తాన్ని భద్ర
పర్చారు. పిమ్మట వారు గిత్త దూడల రక్తాన్ని బలిపీఠం
మీద చల్లారు. తరువాత యాజకులు పొట్టేళ్లను చంపి,
వాటి రక్తాన్ని బలిపీఠం మీద చల్లారు. ఆ తరువాత
యాజకులు గొర్రెపిల్లలను చంపి, వాటి రక్తాన్ని బలి
పీఠంమీద చల్లారు. [23-24]పిమ్మట యాజకులు మేక
పోతులను రాజు ముందుకు, అక్కడ చేరిన ప్రజల
ముందుకు తెచ్చారు. ఈ మేకలు పాపపరిహారార్థ బలి
కొరకు తేబడ్డాయి. యాజకులు తమ చేతులను మేకల
మీద వుంచి వాటిని చంపారు. యాజకులు మేకల
రక్తాన్ని బలిపీఠం మీద పాపపరిహారం కొరకు చిలి
కించారు. ఇశ్రాయేలు ప్రజల పాపాలను దేవుడు
క్షమించుగాకయని వారాపని చేశారు. ఇశ్రాయేలు ప్రజ
లందరి తరఫున ఈ దహనబలులు, పాపపరిహార
బలులు అర్పించాలని రాజు చెప్పాడు.

[25]దావీదు, రాజుకు దైవజ్ఞుడైన గాదు, మరియు
ప్రవక్తయైన నాతాను వీరంతా నిర్దేశించిన రీతిగా రాజైన
హిజ్కియా యెహోవా ఆలయంలో తాళములు స్వర
మండలములు, సితారలు వాయించటానికి లేవీయు
లను నియమించాడు. ఇలాగు జరుగవలెనని యెహోవా
ప్రవక్తల మూలకంగా ఆజ్ఞాపించియున్నాడు.

[26]కావున దావీదు చేయించిన వాద్య పరికరాలు
చేతబుచ్చుకొని లేవీయులు, బూరలు పుచ్చుకొని
యాజకులు సిద్ధంగా నిలబడ్డారు. [27]ఆ తరువాత
హిజ్కియా బలిపీఠం మీద దహనబలి అర్పించుమని

---

**సంప్రోక్షించటానికి** పరిశుద్ధ పర్చటానికి.

ఆజ్ఞాపించాడు. దహనబలి మొదలైనప్పుడు దైవప్రార్థన
కూడ మొదలయ్యింది. బూరలు ఊదబడ్డాయి.
ఇశ్రాయేలు రాజైన దావీదు చేయించిన వాద్యాలు
వాయించబడ్డాయి.
28దహనబలి కార్యక్రమం పూర్తయ్యే వరకు సమావేశ
మైన వారంతా తమ శిరస్సులు వంచారు. సంగీత
విద్వాంసులు గానం చేశారు; యాజకులు బూరలు
ఊదారు.
29బలులన్నీ పూర్తి అయిన పిమ్మట రాజైన
హిజ్కియా, అతనితో వున్న ప్రజలంతా శిరస్సులు
వంచి ఆరాధించారు.
30రాజైన హిజ్కియా, అధికారులు యెహోవాకు
స్తుతిగీతాలు పాడుమని ఆజ్ఞ యిచ్చారు. దావీదు, దైవ
జ్ఞుడగు ఆసాపు రచించిన భక్తిగీతాలు వారు ఆల
పించారు. వారు దేవుని కీర్తించి, ఆనందించారు.
వారంతా శిరస్సులు వంచి దేవుని ఆరాధించారు.
31తరువాత హిజ్కియా యిలా అన్నాడు: “యూదా
ప్రజలారా, ఇప్పుడు మీరు మీ ప్రభువైన యెహోవా
సేవకు పునరంకితమయ్యారు. దగ్గరకు రండి. బలులు,
కృతజ్ఞతార్పణలు ఆలయానికి తీసుకొని రండి.” తరు
వాత ప్రజలు బలులు, కృతజ్ఞతా నైవేద్యాలు తెచ్చారు.
సమర్పించాలనుకున్నవారు దహనబలులు కూడ
తెచ్చారు.
32సమావేశమైన, ప్రజలు మందిరానికి తెచ్చిన అనేక
దహన బలులు యిలా వున్నాయి: డెభ్భై గిత్త దూడలు,
వంద పొట్టేళ్లు, మరియు రెండు వందల గొర్రెపిల్లలు.
ఈ జంతువులన్నీ యెహోవాకు దహనబలులుగా
సమర్పించబడ్డాయి.
33యెహోవాకు పరిశుద్ధ బలులుగా ఆరు వందల
గిత్తలు, మరియు మూడువేల మేకలు, గొర్రెలు
వున్నాయి.34దహన బలుల జంతువుల చర్మాలు
తీయటానికి, వాటిని నరకటానికి తగినంత మంది
యాజకులు లేరు. కావున వారి బంధువులగు
లేవీయులు కార్యక్రమం పూర్తయ్యే వరకు, ఇతర
యాజకులు పవిత్ర సేవా కార్యక్రమానికి సిద్ధమై
వచ్చేవరకు సహాయపడ్డారు. లేవీయులు మాత్రం
గంభీరంగా తమ ప్రభువైన యెహోవా కార్య క్రమంలో
నిమగ్నమయ్యారు. వారు యాజకులకంటె ఎక్కువగా
పనిమీద మనస్సు లగ్నం చేశారు. 35అక్కడ దహన
బలులు, సమాధానబలుల కొవ్వు, పానార్పణలు విస్తా
రంగా జరుపబడ్డాయి. ఆ విధంగా ఆలయంలో అర్చన
కార్యక్రమం మళ్లీ మొదలయింది. 36హిజ్కియా, అతని
ప్రజలు దేవుడు తన ప్రజలకొరకు చేసిన ఏర్పాట్ల
పట్ల సంతోషం వెలిబుచ్చారు. ఈ కార్యక్రమం ఇంత
త్వరగా చేయించినందుకు వారిలో ఆనందం వెల్లి
విరిసింది.

### హిజ్కియా పస్కా పండుగ ఆచరించుట

30 రాజైన హిజ్కియా ఇశ్రాయేలు, యూదా
ప్రజలందంకీ వర్తమానం పంపించాడు. అతడు
ఎఫ్రాయిము, మనష్షే* ప్రజలకు కూడా లేఖలు
వ్రాశాడు. ఇశ్రాయేలు దేవుడైన యెహోవా పస్కా*
పండుగ జరిపేందుకు వారందరినీ యెరూషలేములోని
ఆలయానికి రమ్మని హిజ్కియా ఆహ్వానించాడు.
2పస్కా పండుగ రెండవ నెలలో జరపటానికి అధికారుల
తోను, యెరూషలేము సమావేశంలోను చర్చించి
రాజైన హిజ్కియా నిర్ణయించాడు. 3పస్కా పండుగను
మామూలుగా జరిగే సమయానికి వారు జరుపుకోలేక
పోయారు. ఎందువల్లనంటే పవిత్ర సేవా కార్యక్రమానికి
తగినంత మంది యాజకులు సిద్ధం కాలేదు. పైగా
ప్రజలందరూ యెరూషలేములో సమావేశం కాలేదు.
4ఇప్పుడు పండుగ జరిపే తేదీ పట్ల రాజైన హిజ్కియా,
సమావేశమైనవారూ సంతృప్తిని వెలిబుచ్చారు.
5పిమ్మట బెయేర్షెబా పట్టణం మొదలు దాను పట్టణం
వరకు ఇశ్రాయేలంతటా వారీవిషయమై ప్రకటన
చేశారు. ఇశ్రాయేలు దేవుడైన యెహోవాకు పస్కా
పండుగ జరపటానికి ప్రజలంతా యెరూషలేముకు
రావాలని వారు చాటించారు. మోషే ధర్మశాస్త్రంలో
నిర్దేశించబడిన విధంగా చాలాకాలంగా ఇశ్రాయేలు ప్రజ
లలో అధిక సంఖ్యాకులు పస్కా పండుగ జరపలేదు.
6కావున దూతలు రాజు యొక్క లేఖలను ఇశ్రాయేలు,
యూదా ప్రాంతాలన్నిటికీ తీసుకొని వెళ్లారు. ఆలేఖ
లలో యిలా రాయబడి వుంది:

ఇశ్రాయేలు బిడ్డలారా, అబ్రాహాము, ఇస్సాకు, ఇశ్రా
యేలు (యాకోబు) విధేయులై వున్న దేవుడైన
యెహోవా వైపు తిరగండి. అప్పుడు మీలో ఇంకా
బతికివున్న వారి వద్దకు, అష్షూరు రాజు బారినుండి
తప్పించుకున్న వారి వద్దకు యెహోవా వస్తాడు. 7మీ
తండ్రులవలెను, మీ సోదరులవలెను మీరు ప్రవర్తించ
కండి. యెహోవా వారి దేవుడు; కాని వారు ఆయనకు
వ్యతిరేకులయ్యారు. అందువల్ల ప్రజలు వారిని అసహ్యిం
చుకునేలా, వారు నిందలపాలయ్యేలా యెహోవా
చేశాడు. ఇది నిజమని మీ కళ్లతో మీరే స్వయంగా

---

**ఎఫ్రాయిము, మనష్షే** ఎఫ్రాయిము, మనష్షేలిరువురూ యోసేపు కుమారులు, వారిద్దరి కుటుంబాలు తరువాత ఇశ్రాయేలు వంశంగా రూపొందాయి. రాజ్య విభజన జరిగినప్పుడు ఎఫ్రాయిము, మనష్షేలు కొంతకాలం పూర్తి ఇశ్రాయేలు రాజ్యంగా, యూదా రాజ్యానికి విడిగా పరిగణింపబడ్డారు.

**పస్కా** పస్కా యూదులకు ఒక ముఖ్యమైన పండుగ. మోషే కాలంలో వారిని బానిసత్వంనుండి యెహోవా విముక్తి చేసినందుకు జ్ఞాపకార్థంగా ప్రతి సంవత్సరం ఈ రోజున వారు ప్రత్యేక విందు జరుపుకుంటారు. దీనిని పులియని రొట్టెల పండుగ అని కూడ అంటారు.

చూడవచ్చు. 8మీ ముందు తరంవారివలె మీరు
మొండిగా ప్రవర్తించకండి. ఇష్ట పూర్వకమైన మీ
హృదయాలతో యెహోవాకు విధేయులు కండి. అతి
పరిశుద్ధ స్థలానికి తరలిరండి. అతి పరిశుద్ద స్థలాన్ని
యెహోవా శాశ్వతంగా పవిత్ర పర్చాడు. మీ దేవుడైన
యెహోవాను కొలవండి. అప్పుడు యెహోవా
యొక్క భయంకరమైన కోపం మీనుండి తొలగి
పోతుంది. 9మీరు తిరిగివచ్చి యెహోవాకు విధేయు
లైతే, బందీలైన మీ బంధువులు, పిల్లలు వారిని చెరబట్టిన
శత్రువుల నుండి కనికరం పొందుతారు. మీ బంధువులు,
మీ పిల్లలు మళ్లీ ఈ రాజ్యానికి తిరిగి వస్తారు. మీ
దేవుడైన యెహోవా దయగలవాడు; కరుణా మూర్తి.
మీరాయనను ఆశ్రయిస్తే ఆయన మిమ్మల్ని ఎన్నడూ
వదిలిపెట్టడు.

10వార్తాహరులు ఎఫ్రాయిము, మనష్షే ప్రాంతాలలో
ప్రతి పట్టణానికీ వెళ్లారు. వారు సుదూర ప్రాంతమైన
జెబూలూనుకు కూడా వెళ్లారు. కాని అక్కడి ప్రజలు
వార్త తెచ్చిన వారిని చూసి నవ్వి, హేళనచేశారు. 11కాని
అషేరు, మనష్షే మరియు జెబూలూను ప్రాంతాలలో
కొంతమంది మాత్రం తమను తాము తగ్గించుకొని,
అణకువతో యెరూషలేముకు వెళ్లారు. 12యెహోవా
తన వాక్కు ద్వారా రాజైన హిజ్కియా మరియు అతని
అధికారులు ఇచ్చిన ఆజ్ఞలకు యూదా ప్రజలంతా
విధేయులై వుండేలా వారి మనస్సులు మార్చాడు.

13చాలామంది ప్రజలు జట్లు జట్లుగా పులియని
రొట్టెల పండుగ* జరుపుకోటానికి రెండవ నెలలో
యెరూషలేముకు వచ్చారు. ప్రజాసమూహం పెద్దగా
వుంది. 14యెరూషలేములో బూటకపు దేవుళ్ల ఆరాధ
నకు నిర్మింపబడ్డ బలిపీఠాలన్నిటినీ అక్కడ చేరిన
ప్రజలు తొలగించారు. బూటకపు దేవుళ్లకు నిర్మించిన
ధూప పీఠాలను కూడా వారు తీసివేశారు. ఆ బలిపీఠా
లన్నిటినీ వారు కిద్రోను లోయలో పారవేశారు.
15పిమ్మట వారు రెండవ నెల పదునాల్గవ తేదీన పస్కా
గొర్రెపిల్లను చంపారు. యాజకులు, లేవీయులు
సిగ్గుపడి పవిత్ర సేవా కార్యక్రమానికి పరిశుద్ధులై సిద్ధ
మయ్యారు. యాజకులు, లేవీయులు దహనబలులు
ఆలయానికి తీసుకొనివచ్చారు. 16యెహోవా సేవకు
డైన మోషే ధర్మశాస్త్ర ప్రకారం వారంతా ఆలయంలో
తమ తమ స్థానాలను ఆక్రమించారు. లేవీయులు
బలుల రక్తాన్ని యాజకులకిచ్చారు. ఆ రక్తాన్ని యాజ
కులు బలిపీఠం మీద చిలికించారు. 17సమావేశమైన
వారిలో శుచియై సేవా కార్యక్రమానికి సిద్ధం కానివారు
అనేకమంది వున్నారు. కావున వారు పస్కా గొర్రె
పిల్లలను చంపటానికి అనుమతింపబడలేదు. ఆ కార
ణంగా లేవీయులు పరిశుద్ధులు కాని వారందరి తరుపునా
పస్కా బలులు అర్పించవలసి వచ్చింది. లేవీయులు
ప్రతి గొర్రెపిల్లను పవిత్రపర్చి బలికి సిద్ధం చేశారు.

18-19ఎఫ్రాయిము, మనష్షే, ఇశ్శాఖారు మరియు
జెబూలూను ప్రజలలో చాలామంది పస్కా పండుగకు
శాస్త్రీయంగా తమను తాము పవిత్రపర్చుకోలేదు.
మోషే ధర్మశాస్త్రంలో చెప్పబడిన రీతిలో వారు పస్కా
పండుగను సక్రమంగా జరుపుకోలేదు. కాని హిజ్కియా
వారికొరకు ప్రార్థన చేశాడు. హిజ్కియా యిలా ప్రార్థన
చేశాడు: “ప్రభువైన యెహోవా, నీవు మంచివాడవు.
ఈ ప్రజలు నిజానికి నిన్ను ఆచారంగా ఆరాధించా
లనుకున్నారు. కాని ధర్మశాస్త్రం చెప్పిన రీతిగా వారు
తమను తాము పవిత్ర పర్చుకోలేదు. దయచేసి వారిని
క్షమించు. నీవు మా పూర్వీకులు విధేయులైయున్న
దేవుడివి. అతిపవిత్ర స్థానానికి అర్హమైన రీతిలో ప్రజలె
వరైనా తమను తాము పవిత్ర పర్చుకొనకపోయినా
నీవు వారిని క్షమించ కోరుతున్నాను.” 20రాజైన
హిజ్కియా ప్రార్థన యెహోవా ఆలకించాడు. ఆయన
ప్రజలను క్షమించాడు. 21ఇశ్రాయేలు సంతతివారు
యెరూషలేములో ఏడు రోజులపాటు పులియని
రొట్టెల పండుగను జరుపుకున్నారు. వారంతా చాలా
ఆనందోత్సాహాలతో వున్నారు. లేవీయులు, యాజ
కులు ప్రతిరోజు తమ శక్తి కొలదీ యెహోవాకు
స్తోత్రం చేశారు.

22యెహోవా సేవా కార్యక్రమంలో పరిపూర్ణ
జ్ఞానంగల లేవీయులందరినీ రాజైన హిజ్కియా
ప్రోత్సహించాడు. ప్రజలు పండుగను ఏడు రోజులపాటు
జరిపి సమాధాన బలులు అర్పించారు. వారు తమ
పూర్వీకులు ఆరాధించిన ప్రభువైన యెహోవాకు
కృతజ్ఞతాస్తుతులు చెల్లించారు.

23ప్రజలంతా అక్కడ మరి ఏడు రోజులు
వుండటానికి ఇష్టపడ్డారు. పస్కా పండుగను మరి ఏడు
రోజులు జరుపుకున్నందుకు వారు సంతోషించారు.
24యూదా రాజైన హిజ్కియా ఒక వెయ్యి గిత్తలను,
ఏడువేల గొర్రెలను సమావేశమైన ప్రజల ఆహారం
నిమిత్తం ఇచ్చాడు. పెద్దలు కూడా వెయ్యిగిత్తలను,
పదివేల గొర్రెలను ప్రజలకు ఆహారంగా ఇచ్చారు.
చాలామంది యాజకులు పవిత్ర కార్యక్రమానికి
సంసిద్ధులయ్యారు.

25యూదా నుండి వచ్చిన ప్రజా సమూహం,
యాజకులు, లేవీయులు, ఇశ్రాయేలు నుండి వచ్చిన
జనం, మరియు ఇశ్రాయేలు నుండి యూదాకు వచ్చిన

---

**పులియని... పండుగ** దీనినే పస్కా పండుగా అంటారు. ఈ పండుగలో చేసే రొట్టెల పిండిలో ఈస్టు పదార్థం కలిపి పులియ బెట్టరు. ఈస్టు కలిపిన రొట్టెలు కాల్చేటప్పుడు బాగాపొంగుతాయి. ఇశ్రాయేలీయులు ఈజిప్టు వదిలి పెట్టేటప్పుడు (దాటి పోవు సమయం) స్త్రీలు పిండిని పులియ బెట్టటానికి సమయమే దొరకలేదు. అందువల్ల పులియని రొట్టెల పండుగయని పిలుస్తారు.

ఇతర యాత్రీకులు – అందరూ చాలా సంతోషపడ్డారు.
26అందువల్ల యెరూషలేములో ఆనందం వెల్లివిరిసింది.
దావీదు కుమారుడు, ఇశ్రాయేలు రాజు అయిన
సొలొమోను కాలం తరువాత ఇప్పటివరకు ఇంత వైభ
వంగా ఏ ఉత్సవం నిర్వహింపబడలేదు. 27యాజకులు,
లేవీయులు లేచి నిలబడి ప్రజలను దీవించుమని
యెహోవాను ప్రార్థించారు. దేవుడు వారి ప్రార్థన
విన్నాడు. వారి ప్రార్థన యెహోవా పరిశుద్ధ నివాసం
చేరింది.

### రాజైన హిజ్కియా అభివృద్ధి కార్యక్రమం చేపట్టటం

31 పస్కా పండుగ పూర్తి అయ్యింది. యెరూష
లేముకు పండుగ నిమిత్తం వచ్చిన ఇశ్రాయేలీ
యులు యూదాలో వున్న పట్టణాలకు వెళ్ళి, అక్కడ
వున్న రాతి విగ్రహాలన్నిటినీ ముక్కలు చేశారు.
బూటకపు దేవతల ఆరాధనలో వారు ఈ రాతి విగ్రహా
లను ఉపయోగించేవారు. ప్రజలు అషేరా స్తంభాలను
కూడా నరికివేశారు. యూదా, బెన్యామీను రాజ్యాలలో
వున్న ఉన్నత స్థలాలను, బలిపీఠాలను కూలదోశారు.
ఎఫ్రాయిము, మనష్షే ప్రాంతాలలో కూడా ఈ ప్రజలు
అదే పని చేశారు. బూటకపు దేవతల ఆరాధనలో
వినియోగించే వస్తువులన్నీ నాశనమయ్యే వరకు ప్రజలీ
పని చేస్తూనే వున్నారు. తరువాత ఇశ్రాయేలీయులంతా
తమ తమ పట్టణాలకు వెళ్లిపోయారు. ప్రతి వ్యక్తీ తన
ఇంటికి వెళ్లిపోయాడు.
2రాజైన హిజ్కియా మళ్లీ యాజకుల, లేవీయుల
వంశాలను వారివారి విధులు నిర్వర్తించటానికి ఎంపిక
చేశాడు. ప్రతి గుంపుకీ ప్రత్యేకమైన పని నిర్దేశించ
బడింది. దహనబలులు, సమాధానబలులు యివ్వటా
నికి కూడ హిజ్కియా మళ్ళీ యాజకులను, లేవీయు
లను ఎంపిక చేశాడు. ఆ యాజకులు ఆలయంలో
సేవ చేసి, దేవునికి కృతజ్ఞతా స్తోత్రాలు చేశారు. 3దహన
బలులుగా అర్పించటానికి హిజ్కియా తన స్వంత
జంతువులను కొన్నిటిని ఇచ్చాడు. ఈ దహనబలులు
ఉదయ, సాయంకాల సమయాలలోను, వారం చివర
సబ్బాతు దినాలలోను (శనివారం), అమావాస్యలందు,
మరి ఇతర పండుగ దినాలలోను అర్పించేవారు. ఈ
కార్యక్రమమంతా దేవుని ధర్మశాస్త్ర ప్రకారం జరిగింది.
4యాజకులకు, లేవీయులకు చెందిన భాగాన్ని వారికి
ఇవ్వమని యెరూషలేములో నివసిస్తున్న ప్రజలకు
హిజ్కియా ఆజ్ఞాపించాడు. తద్వారా యాజకులు, లేవీ
యులు తమ పూర్తి కాలాన్ని యెహోవా సేవలో,
ధర్మశాస్త్రం బోధించేందుకు వినియోగించగలరు.
5రాజాజ్ఞ దేశమంతా ప్రచారం చేయబడిన వెంటనే,
ఇశ్రాయేలు ప్రజలు స్వచ్ఛందంగా విరాళాలు ఇచ్చారు.
తమ పంటలైన ధాన్యం, ద్రాక్ష, నూనె, తేనె, ఇంకను
వారి పొలాల్లో పండిన తదితర పంటల నుండి మొదటి
భాగాన్ని విరాళంగా ఇచ్చారు. వారి పంటలో పదవ
భాగాన్ని స్వచ్ఛందంగా తీసుకొని వచ్చారు. ఈ సేకరణే
చాలా పెద్ద మొత్తమయ్యింది. 6యూదా పట్టణాలలో
నివసిస్తున్న ఇశ్రాయేలు, యూదా ప్రజలు కూడా తమ
పశుసంపదలో పదవవంతు తెచ్చారు. వారింకా
యెహోవా కొరకు విడిగా ఒక చోట నిల్వచేసిన
వస్తువులలో పదవవంతు తెచ్చారు. వారీ వస్తువులన్నీ
తాము ఆరాధించే దేవుడైన యెహోవా నిమిత్తం
తెచ్చారు. వారు తెచ్చిన పదార్థాలు, వస్తువులు అన్నీ
రాశులుగా పోశారు.
7మూడవ నెలలో (మే/జూన్) ప్రజలు నిల్వచేసిన
వస్తువులన్నీ తేవటం మొదలుపెట్టి ఏడవ నెలలో
(సెప్టెంబర్/అక్టోబర్) పూర్తి చేశారు. 8హిజ్కియా,
మరియు ఇతర పెద్దలు వచ్చి ప్రజలు తెచ్చిన వస్తు
సంపద రాశులుగా పడివుండటం చూశారు. వారు
దేవునికి స్తోత్రం చేసి, ఆయన ప్రజలైన ఇశ్రాయేలీ
యులను శ్లాఘించారు.
9అప్పుడు హిజ్కియా రాసులుగా పడివున్న వస్తు
సంపద గురించి యాజకులను, లేవీయులను అడిగి
తెలుసుకున్నాడు. 10సాదోకు కుటుంబానికి చెందిన
ప్రముఖ యాజకుడు అజర్యా రాజైన హిజ్కియాతో
యిలా చెప్పాడు: "ప్రజలు ఆలయానికి కానుకలు
తేవటం మొదలు పెట్టినప్పటి నుండి తినటానికి మాకు
సమృద్ధిగా ఆహార పదార్థాలు లభిస్తున్నాయి. అంతే
గాదు, మావద్ద ఇంకా అనేక పదార్థాలు మిగిలివున్నాయి.
యెహోవా తన ప్రజలను ఆశీర్వదించాడు. అందుచే
మావద్ద ఇదంతా మిగిలివుంది."
11పిమ్మట ఆలయంలో సరుకు నిల్వచేసే గదులు
కట్టించమని హిజ్కియా యాజకులకు ఆజ్ఞాపించగా,
వారు వాటిని కట్టించారు. 12తరువాత యాజకులు
కానుకలను, దశమ భాగాలను, తదితర వస్తువుల్లో
యెహోవాకై ప్రత్యేకించబడిన వాటిని తెచ్చారు. అలా
సేకరించిన ఆ వస్తుసంపదను ఆలయ గిడ్డంగులలో
భద్రపర్చారు. లేవీయుడైన కొనన్యా వీటిపై పర్యవేక్షకు
డుగా నియమింపబడ్డాడు. అతని తరువాత అధికారిగా
షిమీ నియమితుడయ్యాడు. కొనన్యా సోదరుడే షిమీ.
13కొనన్యా, అతని సోదరుడు షిమీలిద్దరూ యెహీయేలు,
అజజ్యాహు, నహతు, అశాహేలు, యెరీమోతు, యోజా
బాదు, ఎలీయేలు, ఇస్మక్యాహు, మహతు మరియు
బెనాయాలపై పర్యవేక్షణ అధికారులుగా నియమింప
బడ్డారు. రాజైన హిజ్కియా, ఆలయపు నిర్వహణాధికారి
అజర్యాలిద్దరూ ఈ మనుష్యులను ఎంపికచేశారు.
14ప్రజలు దేవునికి ఇచ్చే ఉచిత కానుకల విషయమై
శ్రద్ధ తీసుకొనే అధికారి పేరు కోరే. దేవునికి ఇవ్వబడిన
కానుకల పంపిణీ విషయంలో ఇతడు శ్రద్ధ తీసు
కొంటాడు. దేవునికి ఇవ్వగా పవిత్ర పర్చబడిన ధానాల
పంపిణీ విషయంలో కూడా బాధ్యత ఇతనిదే. కోరే

తూర్పు ద్వారపాలకుడు. ఇతని తండ్రి లేవీయుడైన
ఇమ్నా. 15ఏదెను, మిన్యామీను, యేషూవ, షెమయా,
అమర్యా మరియు షెకన్యా అనేవారు కోరేకు సహాయ
కులుగా పనిచేశారు. వారంతా యాజకులు నివసించే
పట్టణాలలో విశ్వాసపాత్రంగా పనిచేశారు. యాజకు
లలో ప్రతి వర్గం వారి బంధువులకు సేకరించిన
వస్తువులను వారు ఇచ్చేవారు. అవే వస్తువులను మిక్కిలి
గొప్పవారికి, అతి పేదవారికి కూడ వారివారి భాగాలను
వారు ఇచ్చేవారు. 16లేవీయుల వంశ చరిత్రల్లో చేర్చ
బడిన మూడేండ్లు అంతకు పైబడిన వయస్సుగల మగ
పిల్లలకు కూడ సేకరించిన రాశులనుండి వారు
భాగాలను పంచిపెట్టేవారు. ఈ మగవారంతా నిత్యం
ఆలయానికి వెళ్లి అనుదిన సేవా కార్యక్రమాలలో
తమతమ విధులు నిర్వర్తించవలసినవారు. లేవీయు
లలో ప్రతి వంశంవారికి ఒక బాధ్యత అప్పగించబడింది.
17సేకరించిన వస్తుసంపద నుంచి యాజకులకు తమ
భాగం యివ్వబడింది. ఇది వారి కుటుంబాల వారీగా
వంశ చరిత్రలలో రాయబడిన క్రమంలో ఈ పని
జరుపబడింది. సేకరించిన సంపదలో ఇరవై యేండ్లు,
అంతకు పైబడిన వయస్సుగల లేవీయులకు వారి
వంతు భాగాలు ఇవ్వబడ్డాయి. ఇది వారి వారి బాధ్య
తలను బట్టి, వారి వారి కుటుంబాలను బట్టి జరిగింది.
18లేవీయుల పసిపిల్లలు, భార్యలు, కుమారులు,
కుమార్తెలు సేకరించిన సంపదలో భాగస్వాము
లయ్యారు. వంశచరిత్రలో వ్రాయబడిన లేవీయులంద
రికీ యిలా భాగాలు ఇవ్వబడ్డాయి. లేవీయులు విశ్వాస
పాత్రంగా సదా పవిత్రులైవుండి, ప్రభుసేవా పరాయణు
లైనందువల్ల ఆ విధంగా ఏర్పాటు చేయబడింది.
19అహరోను వంశస్థులైన కొంతమంది యాజకులు
లేవీయులు నివసిస్తున్న పట్టణాలకు దగ్గరలో కొన్ని
పంట భూములు కలిగియున్నారు. ఆ పట్టణాలలో
అహరోను సంతతివారు కూడ కొందరు నివసిస్తున్నారు.
అట్టి అహరోను సంతతి వారికి భాగాలు యివ్వటానికి
ప్రతి పట్టణంలోను నివసిస్తున్న పురుషులు పేర్ల వారీగా
ఎంపిక చేయబడ్డారు. పురుషులు, లేవీయుల వంశ
చరిత్రలో వ్రాయబడినవారు సేకరించిన పదార్థాలలో
భాగం పొందారు.

20రాజైన హిజ్కియా అలాంటి మంచి పనులు
యూదా రాజ్యమంతటా చేశాడు. యెహోవా దృష్టికి
మంచిదైన న్యాయమైన విశ్వసనీయమైన ప్రతి పనినీ
అతడు చేశాడు. 21తలపెట్టిన ప్రతి పనిలోను, ఆల
యంలో సేవాకార్యక్రమం పునః ప్రారంభించటం
లోను; దేవుని ధర్మశాస్త్రాన్ని, ఆజ్ఞలను పాటించటం
లోను మరియు అతడు దేవుని అనుసరించటంలోను
అతడు విజయం సాధించాడు. హిజ్కియా ఈ పను
లన్నీ తన హృదయపూర్వకంగా చేశాడు.

### అష్షూరు రాజు హిజ్కియాను దుఃఖ పెట్టుట

32 హిజ్కియా ఈ పనులన్నీ విశ్వసనీయంగా
చేసిన పిమ్మట, అష్షూరు రాజైన సన్హెరీబు
యూదా రాజ్యం మీదికి దండెత్తి వచ్చాడు. సన్హెరీబు
అతని సైన్యంతో వచ్చి కోటలను ముట్టడించి సైనిక
స్థావరాలు ఏర్పాటు చేశాడు. అలా చేసి ఆ పట్టణాలను
తాను జయించాలని అతడు పన్నాగం పన్నాడు.
సన్హెరీబు ఆ పట్టణాలను తాను స్వయంగా గెలవాలని
అనుకున్నాడు. 2యెరూషలేముపై దాడిచేయటానికే
సన్హెరీబు వచ్చాడని హిజ్కియాకు తెలుసు. 3అప్పుడు
హిజ్కియా తన పరిపాలనాధికారులతోను, సైనికాధి
కారులతోను సంప్రదించాడు. వారు నగరం వెలుపల
జలవనరుల నుండి నీటి ప్రవాహాన్ని నిలిపివేయాలని
నిర్ణయించారు. పాలనాధికారులు, సైనికాధికారులు
హిజ్కియాకు తోడ్పడ్డారు. 4అనేకమంది ప్రజలు కలిసి
జలవనరులన్నీ ఆపివేశారు. దేశం మధ్యగా ప్రవహించే
కాలువకు కూడ అడ్డకట్టలు వేశారు. “అష్షూరు రాజు
ఇక్కడికి వచ్చినప్పుడు అతనికి కావలసినంత నీరు
ఇక్కడ దొరకదు” అని వారనుకున్నారు. 5హిజ్కియా
యెరూషలేమును బలమైన నగరంగా తీర్చిదిద్దాడు.
అతడు చేసిన పని ఏమనగా: గోడలు పడిపోయిన
చోటల్లా అతడు తిరిగి కట్టించాడు. అతడు గోడలమీద
బురుజులు నిర్మింపజేసాడు. మొదటి గోడకు
బయటగా మరో గోడను కూడ అతడు నిర్మించాడు.
పాత యెరూషలేములో తూర్పు భాగాన అతడు మళ్లీ
కోటలు నిర్మించాడు. అతడు అనేక ఆయుధాలను,
డాళ్లను తయారు చేయించాడు. 6-7ప్రజలను నడిపిం
చటానికి వారిపై సైనికాధికారులను నియమించాడు.
నగర ద్వారం వద్ద బహిరంగ ప్రదేశంలో అతడీ అధికారు
లను కలుసుకొన్నాడు. హిజ్కియా ఆ అధికారులతో
మాట్లాడి, వారిని ప్రోత్సహించాడు. వారితో అతడిలా
అన్నాడు. “మీరు బలంగా, ధైర్యంగా వుండండి. భయ
పడకండి. అష్షూరు రాజు విషయంలోగాని, అతని మహా
సైన్యం విషయంలోగాని మీరు కలత చెందవద్దు.
అష్షూరు వారి బలం కంటే మనవద్ద మహాశక్తి సంపద
వుంది. 8అష్షూరు రాజు వద్ద కేవలం మనుష్య బలమే
వుంది. కాని మనవద్ద యెహోవా దైవబలం వుంది.
మన దేవుడు మనకు సహాయపడతాడు. మన
యుద్ధాలు ఆయనే నిర్వహిస్తాడు!” ఆ విధంగా యూదా
రాజైన హిజ్కియా ప్రజలను ఉత్సాహపర్చి వారి ధైర్యాన్ని
తట్టి లేపాడు.

9అష్షూరు రాజైన సన్హెరీబు, అతని సైన్యం లాకీషు
నగరం దగ్గరగా స్థావరం ఏర్పాటు చేసి దానిని ఓడిం
చాలని వున్నారు. పిమ్మట యూదా రాజైన హిజ్కియా
వద్దకు, యెరూషలేములో వున్న యూదా ప్రజల
వద్దకు సన్హెరీబు తన సేవకులను పంపాడు. సన్హెరీబు
సేవకులు హిజ్కియాకు, యెరూషలేము ప్రజలకు వర్త

మానాన్ని పట్టుకు వెళ్లారు. 10ఆ సేవకులు ఈ విధంగా
ప్రకటించారు: “అష్షూరు రాజైన సన్హెరీబు యిలా
చెప్పుచున్నాడు: యెరూషలేము ముట్టడిలో వుండగా
మీరు దేనిని నమ్ముకొని ఇంకా అక్కడ వుంటున్నారు?
11హిజ్కియా మిమ్మల్ని మూర్ఖులనుగా చేస్తున్నాడు.
యెరూషలేములోనే వుండి ఆకలి దప్పులతో మాడి
చనిపోయే విధంగా మీరు మోసగింపబడుతున్నారు.
‘అష్షూరు రాజు నుండి మనల్ని మన ప్రభువైన
యెహోవా రక్షిస్తాడు,’ అని హిజ్కియా మీకు చెప్పు
చున్నాడు. 12హిజ్కియా తనకై తాను యెహోవా
ఉన్నత స్థలాలను, బలిపీఠాలను తొలగించి వేశాడు.
కాని యూదా, యెరూషలేము ప్రజలైన మీకు ఒకే
బలిపీఠం మీద పూజచేసి, ధూపం వేయండని చెప్పు
చున్నాడు. 13నిజానికి నేను, నా పూర్వీకులు ఇతర
దేశాల ప్రజలకు ఏమి చేసినదీ మీయందరికీ తెలిసినదే.
అన్యదేశాల దేవుళ్లు వారి ప్రజలను కాపాడలేక
పోయారు. నేను వారి ప్రజలను నాశనం చేయకుండా
ఆ దేవుళ్లు నన్ను ఆపలేకపోయారు. 14నా పూర్వీకులు
ఆ రాజ్యాలను నాశనం చేశారు. తన ప్రజలను నాశనం
చేయకుండా నన్నాపగల దేవుడెవ్వడూ లేడు. కావున
మీ దేవుడు నానుండి మిమ్మల్ని కాపాడగలడని మీరను
కుంటున్నారా? 15హిజ్కియా మిమ్మల్ని మూర్ఖులను
చేయటంగాని, మోసపుచ్చటంగాని చేయనీయవద్దు.
మీరతనిని నమ్మవద్దు. ఎందువల్లననగా ఏ దేశపు దేవుడే
గాని, ఏ రాజ్యపు దేవుడేగాని అతని ప్రజలను నానుండి
నా పూర్వీకుల నుండి సురక్షితంగా వుండేలా ఎన్నడూ
కాపాడలేడు. కావున మీ దేవుడు మిమ్మల్ని నాశనం
చేయకుండ నన్ను ఆపుతాడని మీరు అనుకోవద్దు.”

16ప్రభువగు యెహోవాకు, దేవుని సేవకుడగు
హిజ్కియాకు వ్యతిరేకంగా అష్షూరు రాజు సేవకులు
చాలా నీచంగా మాట్లాడారు. 17ఇశ్రాయేలు దేవుడగు
యెహోవాను అవమానపరుస్తూ అష్షూరు రాజు లేఖలు
కూడ వ్రాశాడు. ఆ లేఖలలో అష్షూరు రాజు యిలా
వ్రాశాడు: “నేను అన్యదేశాల ప్రజలను నాశనం చేసేట
ప్పుడు వారి దేవుళ్లు నన్నాపలేకపోయారు. అలాగే
హిజ్కియా దేవుడు కూడ ఆయన ప్రజలను నాశనం
చేయకుండ నన్ను ఆపలేడు.” 18తరువాత అష్షూరు
రాజు సేవకులు నగర గోడమీద వున్న యెరూషలేము
ప్రజలను చూసి కేకలు పెట్టి అరిచారు. గోడమీద
జనాన్ని చూసి ఆ సేవకులు వారికి తెలిసేలా హెబ్రీ
భాషలో తిట్టి అరిచారు. అష్షూరు రాజు సేవకులు
యెరూషలేము ప్రజలను భయపెట్టేటందుకే అలా
చేసారు. యెరూషలేము నగరాన్ని కైవసం చేసికోవాలనే
వారలా చేసారు.

19ప్రపంచ దేశాల ప్రజలు పూజించే దేవుళ్లపట్ల
కూడ ఆ సేవకులు చెడుగా మాట్లాడారు. కాని ఆ
దేవుళ్లు కేవలం మనుష్యులు తమ చేతులతో చేసిన
బొమ్మలు. అదేరీతిలో ఆ సేవకులు యెరూషలేము
దేవునిపట్ల కూడ నీచంగా మాట్లాడారు.

20రాజైన హిజ్కియా మరియు ఆమోజు కుమా
రుడు, ప్రవక్తయునగు యెషయా ఈ సమస్య విష
యంలో దేవుని ప్రార్థించారు. వారు ఆకాశంవైపు తిరిగి
దేవునికి తమ గోడు కష్టాలు చెప్పుకున్నారు.
21అప్పుడు యెహోవా తన దూత నొకనిని అష్షూరు
రాజు ఉండే స్థలానికి పంపించినాడు. ఆ దేవదూత
అష్షూరు సైన్యంలోని అందరు సైనికులను, నాయకు
లను, అధికారులను చంపివేశాడు. దానితో అష్షూరు
రాజు పలాయనం చిత్తగించి తన దేశంలోగల తన
ఇంటికి పోయాడు. ప్రజలు అతనిని చూచి సిగ్గుపడ్డారు.
అతడు తన దేవుని ఆలయానికి వెళ్లగా అక్కడ తన
స్వంత కుమారులలో కొందరు అతనిని కత్తులతో
నరికి చంపివేశారు. 22ఆ రకంగా యెహోవా హిజ్కి
యాను, యెరూషలేము ప్రజలను అష్షూరు రాజైన
సన్హెరీబు బారినుండి, ఇతర శత్రువుల బారినుండి
రక్షించాడు. యెహోవా హిజ్కియాపట్ల యెరూష
లేము ప్రజలపట్ల తగిన శ్రద్ధ తీసికొన్నాడు. 23అనేక
మంది ప్రజలు యెహోవాకు కానుకలు తీసికొని
యెరూషలేముకు వచ్చారు. యూదా రాజైన హిజ్కి
యాకు కూడా వారు అనేక విలువైన వస్తువులు తెచ్చి
యిచ్చారు. అప్పటి నుండి హిజ్కియాను అన్ని దేశాల
వారు గౌరవించటం మొదలు పెట్టారు.

24ఆ రోజులలోనే హిజ్కియాకు తీవ్రంగా జబ్బు
చేసి చనిపోయే స్థితిలో వున్నాడు. అతడు దేవుని
ప్రార్థించాడు. యెహోవా హిజ్కియాతో మాట్లాడి,
అతనికి ఒక సూచన* ఇచ్చినాడు. 25కాని హిజ్కియా
హృదయం గర్వపడింది. అందువల్ల అతనికి దేవుడు
చేసిన మేలుకు అతడు కృతజ్ఞతలు తెలుపలేదు. ఈ
కారణంవల్ల దేవుడు హిజ్కియా పట్ల మరియు
యూదా, యెరూషలేము ప్రజలపట్ల కోపగించినాడు.
26కాని హిజ్కియా, యెరూషలేము ప్రజలు మళ్లీ
మనస్సు మార్చుకొనినవారై, తమ జీవితాలు మార్చు
కున్నారు. వారు విదేయులై గర్వించటం మాను
కున్నారు. అందువల్ల హిజ్కియా బ్రతికినంత కాలం
దేవుని కోపం వారి మీదికి రాలేదు.

27హిజ్కియా మహా భాగ్యవంతుడయ్యాడు. గొప్ప
గౌరవం లభించింది. వెండి బంగారాలు, విలువైన ఆభర
ణాలు, సుగంధ ద్రవ్యాలు, డాళ్లు, తదితర వస్తువులు
భద్రపర్చటానికి అతడు తగిన స్థానాలు ఏర్పాటు
చేశాడు. 28ధాన్యం, క్రొత్త ద్రాక్షారసం ప్రజలు తనకు
పంపిన నూనెను నిల్వచేయటానికి హిజ్కియా గిడ్డం

---

**సూచన** హిజ్కియాకు సంబంధించిన కథ ప్రభువు అతనికి 15 సంవత్సరాల ఆయుష్షు పొడిగించిన విధము తెలియటానికి చూడండి యెషయా గ్రంథం 38:1-8.

గులు నిర్మించాడు. అన్ని రకాల పశువులశాలలు, గొఱ్ఱె
లకు కొట్టములు కూడ నిర్మించాడు. 29హిజ్కియా
చాలా కొత్త పట్టణాలు నిర్మించాడు. పశుసంపద గొఱ్ఱెల
మందలు ఎక్కువగా అభివృద్ధి చేశాడు. యెహోవా
హిజ్కియాకు లెక్కలేనంత ఐశ్వర్యాన్ని సమకూర్చి
నాడు. 30యెరూషలేములో గిహోను ఎగువ కాలువ
ప్రవాహానికి అడ్డుకట్టలు వేసి నీటిని దావీదు నగరంలో
పడమటి దిశన తిన్నగా ప్రవహించేలా మళ్లించినవాడు
హిజ్కియాయే. హిజ్కియా చేపట్టిన ప్రతి పనిలోను
విజయం సాధించాడు. 31ఒక పర్యాయం బబులోను
పెద్దలు హిజ్కియా వద్దకు దూతలను పంపారు.
అప్పుడు దేశాలలో సంభవించిన ఒక అద్భుత సంఘ
టన* గురించి అడిగి తెలిసికొన్నారు. వారు వచ్చి
నప్పుడు హిజ్కియా మనస్సులో* ఏమున్నదో పరీ
క్షించి పూర్తిగా తెలిసికొనటానికి అతనిని యెహోవా
ఒంటరిగా వదిలినాడు.

32హిజ్కియా పాలనలో అతడు చేసిన ఇతర కార్య
ములను గురించి, అతని భక్తి కార్యక్రమాల గురించి
యూదా, ఇశ్రాయేలు రాజుల చరిత్ర గ్రంథం మరియు
ప్రవక్త ఆమోజు కుమారుడైన యెషయా దర్శనాలలో
వ్రాయబడినాయి. 33హిజ్కియా చనిపోగా అతడు తన
పూర్వీకుల వద్ద సమాధి చేయబడినాడు. దావీదు
పూర్వీకుల సమాధులున్న కొండమీద ప్రజలు హిజ్కి
యాను సమాధి చేశారు. హిజ్కియా చనిపోయి
నప్పుడు యూదా ప్రజలందరు, మరియు యెరూష
లేములో నివసిస్తున్నవారు అతనికి ఘనంగా నివాళుల
ర్పించారు. హిజ్కియా స్థానంలో మనష్షే కొత్త
రాజయ్యాడు. మనష్షే హిజ్కియా కుమారుడు.

### యూదా రాజుగా మనష్షే

33 మనష్షే యూదా రాజయ్యేనాటికి పన్నెండు
సంవత్సరాలవాడు. యెరూషలేములో అతడు
ఏబైయైదు సంవత్సరాలు రాజుగా ఉన్నాడు.
2యెహోవా దృష్టికి చెడ్డవైన పనులన్నీ మనష్షే చేశాడు.
అన్యదేశాల వారి భయంకరమైన, పాప భూయిష్టమైన
ఆచారాలన్నిటినీ అతడు అనుసరించాడు. ఆ రాజ్యాల
వారిని ఇశ్రాయేలీయుల ఎదుటనుండి యెహోవా
బయటకు వెడల గొట్టినాడు. 3తన తండ్రి హిజ్కియా
తొలగించిన ఉన్నత స్థలాలన్నీ మనష్షే మళ్లీ నిర్మిం
చాడు. బయలు దేవతలకు పూజా పీఠాలను, అషేరా
దేవతా స్తంభాలను మనష్షే నిర్మించాడు. నక్షత్ర మండ
లాలకు ప్రణమిల్లి, వాటిని అతడు ఆరాధించాడు.
4యెహోవా ఆలయంలో బూటకపు దేవతలకు
మనష్షే బలిపీఠాలు నిర్మించాడు. కాని, "నా నామము
యెరూషలేములో శాశ్వతంగా వుంటుంది" అని
యెహోవా తన ఆలయ విషయంలో చెప్పి
యున్నాడు.

5రెండు ఆలయ ఖాళీ స్థలాలలోను ప్రతి నక్షత్ర
మండలానికి ఒక్కొక్కటి చొప్పున మనష్షే బలిపీఠాలను
నిర్మించాడు. 6బెన్‌హిన్నోము లోయలో* మనష్షే తన
స్వంత పిల్లలను కూడ దేవతలకు బలియిచ్చాడు.
మనష్షే భవిష్యత్తును తెలిసికోవటానికి మంత్రతంత్ర
విద్యలను ఆశ్రయించి, సోది చెప్పు వారిని, చిల్లంగి
వాండ్రను సంప్రదించాడు. కర్ణపిశాచి విద్యలను పాటించే
వారిని సోదిచెప్పు వారిని ప్రోత్సహించి వారి సలహాలు
తీసికొన్నాడు. దేవుని దృష్టిలో చాలా హేయమైన
పనులు చేశాడు. మనష్షే పాపాలు యెహోవాకు కోపం
వచ్చేటట్లు చేశాయి. 7అతడు ఒక దేవతా విగ్రహాన్ని
కూడ చేయించి దానిని ఆలయంలో నెలకొల్పాడు.
ఈ ఆలయాన్ని గురించి యెహోవా దావీదుకు, అతని
కుమారుడు సొలొమోనుకు యిలా చెప్పినాడు: "ఈ
ఆలయంలోను, యెరూషలేములోను నా నామమును
స్థిరంగా ప్రతిష్ఠించుతాను. ఇశ్రాయేలు కుటుంబాల
వారుంటున్న స్థానములన్నిటిలోను నేను యెరూషలే
మును ఎంపిక చేసికొన్నాను. 8ఇశ్రాయేలీయుల పూర్వీ
కులకు యివ్వడానికి నిశ్చయించిన ఈ రాజ్యంనుండి
మరెన్నడూ నేను వారిని బయటకు వెళ్ల గొట్టను.
కాని వారికి నేను ఆజ్ఞాపించిన విషయాలన్ని టినీ
వారు తప్పక పాటించాలి. ఇశ్రాయేలు ప్రజలకు
అందజేయమని నేను మోషేకు ఇచ్చిన ధర్మాశాస్త్రాన్ని,
నియమ నిబంధనలను, ఆజ్ఞలను వారు తప్పక అను
సరించాలి."

9యూదా ప్రజలను, యెరూషలేము వాసులను
తప్పుడు పనులు చేయటానికి మనష్షే ప్రోత్సహించాడు.
ఇశ్రాయేలీయుల ముందు నుండి యెహోవా చేత
బలవంతంగా వెళ్లగొట్టబడి నాశనం గావింపబడిన వారి
కంటె వారు ఎక్కువ పాపాలు చేశారు.

10యెహోవా మనష్షేతోను, అతని ప్రజలతోను
మాట్లాడినాడుగాని, వారు దేవుని మాట వినటానికి
నిరాకరించారు.

11అందువల్ల అష్షూరు రాజు సైన్యాధి కారులను
యూదాపై దండెత్తటానికి యెహోవా రప్పిం చాడు.
ఆ అధికారులు మనష్షేను పట్టుకుని, అతనికి సంకెళ్లు
వేశారు. మనష్షే చేతులకు వారు ఇత్తడి గొలు సులు
తగిలించారు. వారతనిని బందీగా బబులోనుకు
పట్టుకుపోయారు.

**సంఘటన** యెషయా గ్రంథం 38:1-8 చూడండి.

**మనస్సులో** చూడండి రాజులు రెండవ గ్రంథము 20:12-19.

**బెన్‌హిన్నోము లోయలో** బెన్‌హిన్నోము లోయకే తరువాత గేహన్న అని పేరు వచ్చింది. ఇది యెరూషలేముకు దక్షిణ భాగన వున్నది. చాల మంది పసిపిల్లలను, చిన్న పిల్లలను అన్య దేశాల బూటకపు దేవతలకు బలి నిమిత్తం ఈ లోయలో అగ్నిలో నడిపించేవారు.

[12]మనష్షే చాలా బాధ అనుభవించాడు. ఆ సమ
యంలో తన దేవుడగు యెహోవాను వేడుకున్నాడు.
తన పితరుల దేవుని ముందర మనష్షే మిక్కిలి
విధేయుడైనాడు [13]మనష్షే దేవునికి ప్రార్థన చేసి, తనకు
సహాయపడమని వేడుకున్నాడు. యెహోవా మనష్షే
మనవి ఆలకించి, అతని విషయంలో బాధపడినాడు.
యెహోవా అతనిని యెరూషలేముకు తిరిగి వచ్చి
తన సింహాసనాన్ని మళ్లీ అలంకరించేలా చేసినాడు.
యెహోవాయే నిజమైన దేవుడని మనష్షే అప్పుడు
తెలిసికొన్నాడు.
[14]ఇది జరిగిన పిమ్మట మనష్షే, దావీదు నగరానికి
బయట ఒక గోడ కట్టించాడు. (కిద్రోను) లోయలో
మత్స్యద్వారం ముంగిట నున్న గిహోను నీటి బుగ్గకు
పశ్చిమంగా ఈ గోడవుంది. మనష్షే ఈ గోడను ఓపెలు
కొండ చుట్టూ కట్టించాడు. ఈ గోడ చాలా ఎత్తుగా
కట్టించాడు. పిమ్మట యూదాలో వున్న కోటల
న్నిటిలో అతడు సైనికాధికారులను నియమించాడు.
[15]ఇతర దేవుళ్ల విగ్రహాలన్నిటినీ మనష్షే తీసి పారవేశాడు.
ఆలయంలో వున్న విగ్రహాన్ని అతడు తీసివేశాడు.
యెరూషలేములో ఆలయ ప్రాకారం మీద అతను
నెలకొల్పిన బలిపీఠాలన్నీ తొలగించాడు. ఆ బలిపీఠాల
న్నిటినీ యెరూషలేము నగరంనుండి తీసి బయట
పారవేశాడు. [16]పిమ్మట అతడు యెహోవా బలిపీఠాన్ని
ప్రతిష్ఠించి దాని మీద సమాధానబలులు, కృతజ్ఞ
తార్పణలు సమర్పించాడు. ఇశ్రాయేలు దేవుడైన
యెహోవాను ఘనంగా ఆరాధించుమని మనష్షే
యూదా ప్రజలందరికి ఆజ్ఞాపించాడు. [17]ప్రజలు
ఉన్నత స్థలాలలో బలులు యివ్వటం కొనసాగించారు
గాని వారు అవన్నీ వారి దేవుడగు యెహోవాకే
అర్పించారు.
[18]మనష్షే చేసిన ఇతర విషయాలు, దేవునికి అతడు
చేసిన ప్రార్థన, ఇశ్రాయేలు దేవుని తరపున దీర్ఘదర్శులు
అతనిని గురించి చెప్పిన విషయాలు అన్నీ ఇశ్రాయేలు
రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయబడినాయి. [19]మనష్షే
దేవునికి చేసిన ప్రార్థన, దేవుడు దానిని విన్న విధము,
అది విని దేవుడు బాధపడిన విషయములు దీర్ఘదర్శులు
రచించిన గ్రంథంలో వ్రాయబడినాయి. మనష్షే తనకు
తాను విధేయుడు కాక పూర్వం అతడు చేసిన పాపాలు,
పొరపాట్లు, అతను ఎక్కడెక్కడ ఇతర దేవుళ్లకు ఉన్నత
స్థలాలు, అషేరా దేవతా స్తంభాలు నిలిపిన విషయాలు
దీర్ఘదర్శుల గ్రంథంలో రాయబడ్డాయి. [20]మనష్షే చని
పోయినప్పుడు అతనిని తన పూర్వీకులతో పాటు
సమాధిచేశారు. ప్రజలతనిని తన స్వంత రాజ గృహం
లోనే సమాధి చేశారు.మనష్షే స్థానంలో ఆమోను
కొత్తగా రాజయ్యాడు. ఆమోను మనష్షే కుమారుడు.

### యూదా రాజుగా ఆమోను

[21]యూదాకు రాజయ్యేనాటికి ఆమోను ఇరువది
రెండేండ్లవాడు. యెరూషలేములో అతడు రెండేండ్ల
పాటు రాజుగా ఉన్నాడు. [22]దేవుని సన్నిధిలో ఆమోను
అన్నీ నీచకార్యాలే చేశాడు. తన తండ్రి మనష్షే చేసిన
విధంగా, దేవుడు అతని నుండి ఆశించిన పవిత్ర
కార్యాలేవీ ఆమోను చేయలేదు. తన తండ్రి మనష్షే
చేయించి వుంచిన చెక్కడపు (నగిషీ) బొమ్మల
విగ్రహాలకు ఆమోను బలులు అర్పించాడు. ఆమోను
ఆ విగ్రహాలను ఆరాధించాడు. [23]తన తండ్రి మనష్షే
పరివర్తన చెందినట్లు, ఆమోను దేవుని ముందు విధే
యుడై మెలగలేదు. పైగా ఆమోను రోజు రోజుకు
మరింత పాపం చేయసాగాడు. [24]ఆమోను సేవకులు
అతనిపై కుట్రపన్నారు. వారు ఆమోనును అతని
స్వంత ఇంటిలోనే హత్యచేశారు. [25]కాని యూదా
ప్రజలు రాజైన ఆమోనుపై కుట్ర పన్నిన సేవకు
లందరినీ చంపివేశారు. తరువాత ప్రజలు కొత్త రాజుగా
యోషీయాను ఎంపిక చేశారు. యోషీయా ఆమోను
కుమారుడు.

### యూదా రాజుగా యోషీయా

34 యోషీయా రాజయ్యేనాటికి ఎనిమిది సంవ
త్సరాలవాడు. అతడు యెరూషలేములో
ముప్పై యొక్క సంవత్సరాలు రాజుగా వున్నాడు. [2]ఏది
న్యాయమైనదో అది యోషీయా చేశాడు. యెహోవా
చేయుమని చెప్పినవన్నీ అతడు చేశాడు. తన పూర్వీకు
డైన దావీదువలె అతడు మంచి కార్యాలు చేశాడు.
యోషీయా మంచిపనులు చేయటానికి ఎన్నడూ
వెనుకాడలేదు. [3]యోషీయా రాజైన పిమ్మట ఎనిమిదవ
సంవత్సరం నుండి తన పూర్వీకుడైన దావీదు కొలిచిన
దేవుడినే ఆరాధించాడు. దేవుని అనుసరించే నాటికి
యోషీయా ఇంకా చిన్నవాడే. రాజుగా యోషీయా
పన్నెండవ సంవత్సరంలో వుండగా యూదా, యెరూష
లేములలో వున్న ఉన్నత స్థలాలను, అషేరా దేవతా
స్తంభాలను, చెక్కిన, పోతపోసిన విగ్రహాలను నాశనం
చేయటం మొదలు పెట్టాడు. [4]బయలు దేవతలకు
నిర్మించిన బలిపీఠాలన్నిటినీ ప్రజలు పగులగొట్టారు.
వారిపని యోషీయా ఎదుటనే చేశారు. ప్రజలకు అంద
నంత ఎత్తుగా వున్న ధూప పీఠాలను పిమ్మట
యోషీయా పడగొట్టాడు. చెక్కిన విగ్రహాలను, పోత
విగ్రహాలను అతడు పగులగొట్టాడు. అతడా విగ్రహాల
న్నిటినీ చూర్ణం చేశాడు. తరువాత యోషీయా ఆ
చూర్ణాన్ని బయలుదేవతలను ఆరాధించి, బలులు
అర్పించిన వారి సమాధులపై చల్లాడు. [5]బయలు
దేవతలకు సేవ చేసిన యాజకుల ఎముకలను ఆ
బలిపీఠాలపైనే యోషీయా కాల్చినాడు. ఈ రకంగా
యోషీయా యూదాలోను, యెరూషలేములోను
విగ్రహాలను, విగ్రహారాధనను తుడిచివేశాడు. [6]మనష్షే,
ఎఫ్రాయిము, షిమ్యోను దేశాలలో వున్న పట్టణాల
లోను, నఫ్తాలి వరకుగల పట్టణాలలో కూడ

యోషీయా ఇదేరకంగా చేశాడు. ఆ పట్టణాల పరిసరా
లలో వున్న పాడుబడ్డ ప్రదేశాలలో కూడ అతడీ పని
చేశాడు. 7యోషీయా పీఠాలన్నీ పగులగొట్టి, అషేరా
దేవతా స్తంభాలను పడగొట్టినాడు. విగ్రహాలన్నిటినీ
పిండి పిండిగా గొట్టాడు. ఇశ్రాయేలులో బయలు దేవత
లకు నిర్మించిన ధూప పీఠాలన్నిటినీ అతడు పగుల
గొట్టాడు. పిమ్మట యోషీయా యెరూషలేముకు
తిరిగి వెళ్లాడు.

8యోషీయా తన యూదా రాజ్యపాలనలో పదు
నెనిమిదవయేట షాఫాను, మయశేయా, మరియు
యోవాహును పాడవుతున్న యెహోవా ఆలయాన్ని
పునరుద్ధరించటానికి పంపాడు. షాఫాను తండ్రిపేరు
అజల్యా. మయశేయా నగర పాలకుడు. యోవాహు
తండ్రిపేరు యోహోహాజు. యోవాహు లేఖికుడు.
జరిగిన వృత్తాంతములన్నిటినీ సేకరించి పుస్తకములో
ఎక్కించువాడు. యోషీయా ఆలయాన్ని పునరు
ద్ధరించి యూదాను, యెరూషలేమును మళ్లీ పవిత్ర
పర్చటానికి పూనుకొన్నాడు. ఆమేరకు ఆజ్ఞలు
ఇచ్చాడు.

9ప్రధాన యాజకుడు హిల్కీయా వద్దకు వారు
వచ్చారు. ప్రజలు ఆలయనికి ఇచ్చిన కానుకల ధనాన్ని
వారు హిల్కీయాకు ఇచ్చారు. ద్వారపాలకులుగా ఉన్న
లేవీయులు ఈ ధనాన్ని మనష్షే ఎఫ్రాయిము ప్రజల
నుండి మరియు దేశంలో ఇంకను మిగిలియున్న
ఇశ్రాయేలీయుల వద్దనుండి సేకరించారు. ఈ ధనాన్ని
వారు యూదా, బెన్యామీను ప్రజల నుండి యెరూష
లేము ప్రజల నుండి కూడ సేకరించారు. 10ఆలయపు
పనిని పర్యవేక్షించే ఉద్యోగులకు వారు ఈ ధనాన్ని
ఇచ్చారు. ఈ అధికారులు ధనాన్ని తిరిగి ఆలయాన్ని
తిరిగి కడుతున్న పనివారికి చెల్లించారు.

11ఆ ధనాన్ని వారు వడ్రంగులకు, శిల్పులకు,
చెక్కిన రాళ్లను, కలపను కొనటానికి ఇచ్చారు.
భవనాలను తిరిగి నిర్మించటానికి, భవనాలకు కావలసిన
దూలాలు తయారు చేయటానికి, ఈ కలపను విని
యోగించారు. ఆలయ భవనాల విషయంలో యూదా
రాజులు గతంలో తగిన శ్రద్ధ వహించలేదు. ఆ భవనా
లన్నీ పాతవై శిథిలావస్థలో వున్నాయి. 12-13పని
వారంతా విశ్వాసంగా పనిచేశారు. వారిపై తనిఖీ
అధికారుల పేర్లు యహతు, ఓబద్యా. యహతు, ఓబద్యా
లిరువురూ లేవీయులు. వారు మెరారీ వంశీయులు.
మిగతా పర్యవేక్షకులు జెకర్యా మరియు మెషుల్లాము.
వారు కహాతీయులు. సంగీత వాద్య విశేషములను
వాయించుటలో నేర్పరులైన లేవీయులు కూడా
బరువులు మోసే కూలీల మీద, ఇతర పనివారిమీద
తనిఖీ దారులుగా పనిచేశారు. మరికొందరు లేవీయులు
కార్యదర్శులుగాను, అధికారులుగాను, ద్వారపాలకులు
గాను పనిచేశారు.

### ధర్మశాస్త్ర గ్రంథాన్ని కనుగొనుట

14ఆలయంలో వున్న ధనాన్ని లేవీయులు బయ
టకు తెచ్చారు. ఆ సమయంలో యాజకుడగు
హిల్కీయా ప్రభువైన యెహోవా మోషేద్వారా అంద
జేసిన ధర్మశాస్త్ర గ్రంథాన్ని కనుగొన్నాడు.
15హిల్కీయా కార్యదర్శియగు షాఫానుతో, "ఆల
యంలో నేను ధర్మశాస్త్ర గ్రంథాన్ని కనుగొన్నా" నని
చెప్పాడు. హిల్కీయా గ్రంథాన్ని షాఫానుకు ఇచ్చాడు.
16షాఫాను ఆ గ్రంథాన్ని రాజైన యోషీయా వద్దకు
తెచ్చాడు. షాఫాను రాజు వద్దకు వచ్చి ఆలయ పనిపై
తన నివేదిక ఈ విధంగా సమర్పించాడు: "మీ సేవకులు
మీరు చెప్పిన విధంగా పని కొనసాగిస్తున్నారు. 17వారు
ఆలయంలోవున్న ధనాన్ని తీసి పనిమీద తనిఖీదారు
లకు, పనివారికి చెల్లిస్తున్నారు."

18తరువాత షాఫాను రాజైన యోషీయాతో,
"యాజకుడగు హిల్కీయా నాకొక గ్రంథమిచ్చాడు"
అని చెప్పాడు. పిమ్మట షాఫాను ఆ గ్రంథం నుండి
రాజుముందు చదవటం మొదలుపెట్టాడు. 19రాజైన
యోషీయా ధర్మశాస్త్ర విషయాలు విన్నప్పుడు తన
బట్టలు చింపుకున్నాడు.*

20తరువాత రాజు హిల్కీయాకు, షాఫాను కుమా
రుడు అహీకాముకు, మీకా కుమారుడు అబ్దోనుకు,
కార్యదర్శి షాఫాను మరియు సేవకుడైన ఆశాయాకును
ఒక ఆజ్ఞ యిచ్చాడు. 21రాజు యిలా చెప్పాడు: "మీరు
వెళ్లి నా తరుపున ఇశ్రాయేలులోను, యూదాలోను
మిగిలివున్న ప్రజల తరఫున యెహోవాను మనకు
దొరికిన ధర్మశాస్త్రంలో వ్రాయబడిన విషయాలను
గురించి అడగండి. మన పూర్వీకులు యెహోవా ఆజ్ఞ
లను పాటించని కారణంగా ఆయన మనపట్ల ఎక్కువ
కోపంగా వున్నాడు. ఈ గ్రంథం బోధించిన విషయా
లను వారు పాటించలేదు!"

22హిల్కీయా, రాజసేవకులు* కలిసి ప్రవాదిని
హుల్దా వద్దకు వెళ్లారు. హుల్దా, షల్లూము భార్య.
షల్లూము తాఖతు (తిక్వా) కుమారుడు. తాఖతు
హస్రహా (హస్రా) యొక్క కుమారుడు. హర్హహు
(హస్రా) రాజవస్త్రాల విషయంలో శ్రద్ధ తీసికొనే
అధికారి. హుల్దా క్రొత్త యెరూషలేములో నివసిస్తూ
వుండేది. హిల్కీయా, రాజ సేవకులు జరిగిన
సంగతంతా హుల్దాకు తెలిపారు. 23హుల్దా వారితో
యిలా చెప్పింది: "ఇశ్రాయేలు దేవుడగు యెహోవా

---

**బట్టలు చింపుకున్నాడు** యోషీయా కాలంలో ఎవరైనా తన బట్టలు చింపుకుంటే అది కలతకు, మిక్కిలి విషాదానికి సూచన. తన ప్రజలు యెహోవా ఆజ్ఞలను పాటించ నందుకు యోషీయా మిక్కిలి కలత చెందాడు.

**రాజసేవకులు** "రాజసేవకులు" అనేది హెబ్రీ ప్రతిలో లేదు.

యిలా తెలియజేస్తున్నాడు రాజైన యోషీయాకు
తెలియజేయుము.
24యెహోవా యిలా చెప్పుచున్నాడు: 'ఈ ప్రదేశా
నికి, ఇక్కడ నివసిస్తున్న ప్రజలకు నేను కష్టాలు తెచ్చి
పెడతాను. యూదా రాజు ముందర చదివిన పుస్తకంలో
వ్రాసిన విధంగా భయంకర పరిస్థితులు తీసికొని వస్తాను.
25ఇలా ఎందుకు చేస్తాన నగా ప్రజలు నన్ను వదిలి
అన్య దేవతలకు ధూపం వేయసాగారు. వారు చేసిన
నీచ కార్యాలన్నిటితో వారు నాకు కోపం కలుగజేశారు.
అందువల్ల ఈ ప్రదేశం మీద నా కోపాన్ని క్రుమ్మ
రిస్తాను. బడబాగ్నిలా* నా కోపం చల్లారదు!' 26"కాని
ఈ విషయం యూదా రాజైన యోషీయాకు చెప్పండి.
దేవుని అడుగమని అతడు మిమ్మల్ని పంపాడు. ఇంతకు
ముందు మీరు విన్న విషయాలపై ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా యిలా చెప్పుచున్నాడు: 27 'యోషీయా,
నీవు పశ్చాత్తాప పడినావు. నిన్ను నీవు తగ్గించుకొని,
నీ దుస్తులు చింపుకున్నావు. నాముందు నీవు విల
పించావు. నీ హృదయం మారినది గనుక,
28నేను నిన్ను నీ పూర్వీకుల వద్దకు* తీసుకొని
వెళతాను. నీవు నీ సమాధికి ప్రశాంతంగా వెళతావు.
ఈ ప్రాంతం మీదికి, ఇక్కడ నివసించే ప్రజల మీదికి
నేను రప్పించే గొప్ప నాశనం నీవు చూడవు.'"
హిల్కీయా మరియు రాజు సేవకులు ఈ సందేశాన్ని
రాజైన యోషీయాకు అందజేశారు.
29రాజైన యోషీయా యూదా, యెరూషలేము
పెద్దలందరినీ తనను వచ్చి కలవమని పిలిచాడు. 30రాజు
యెహోవా ఆలయానికి వెళ్లాడు. యూదా ప్రజ
లందరు, యెరూషలేము వాసులు, యాజకులు, లేవీ
యులు, ప్రముఖులు, సామాన్య ప్రజానీకం అంతా
యోషీయావద్దకు వచ్చారు. ఒడంబడిక గ్రంథంలో
వున్న విషయాలన్నీ యోషీయా ప్రజలకు చదివి
వినిపించాడు. ఆ గ్రంథం ఆలయంలో దొరికింది.
31తరువాత రాజు తన స్థానంలో లేచి నిలబడినాడు.
అతడు యెహోవాతో ఒక ఒడంబడిక చేసికొన్నాడు.
యెహోవాను అనుసరించటానికి, ఆయన ఆజ్ఞలు,
ధర్మాశాస్త్రాన్ని నియమాలను పాటించటానికి అతడు
అంగీకరించాడు. హృదయపూర్వకంగా, ఆత్మ పూర్వ
కంగా అనుసరించటానికి యోషీయా అంగీకరించాడు.
ఈ గ్రంథంలో వ్రాసిన ఒడంబడికలోని అంశాలను
పాటించటానికి యోషీయా అంగీకరించాడు.
32పిమ్మట యెరూషలేము, బెన్యామీను ప్రజలందరూ
ఈ ఒడంబడికను అంగీకరించేలా వారిచే యోషీయా
ప్రమాణం చేయించాడు. తమ పూర్వీకులు విధేయులై
వున్న దేవుని ఒడంబడికకు యెరూషలేము ప్రజలు
బద్ధుల య్యారు. 33పైగా ఇశ్రాయేలీయులకు సంబం
ధించిన స్థలాలలో వున్న విగ్రహాలన్నిటినీ యోషీయా
తీసిపార వేశాడు. దేవుడు ఆ విగ్రహాలను అసహ్యించు
కున్నాడు. యోషీయా రాజు ఇశ్రాయేలులో ప్రతి
ఒక్కడిని వారి దేవుడగు యెహోవాను ఆరాధించునట్లు
చేసెను. యోషీయా జీవించినంతకాలం ప్రజలు తమ
పూర్వీకుల దేవుడగు యెహోవాను ఆరాధించటం
మానలేదు.

### యోషీయా పస్కా పండుగ జరుపుట

35 యెరూషలేములో యెహోవాకు యోషీయా
రాజు పస్కా పండుగ జరిపించాడు. మొదటి
నెలలో పదునాల్గవ రోజున పస్కా గొఱ్ఱెపిల్ల చంపబ
డింది. 2వారివారి విధులు నిర్వర్తించటానికి యోషీయా
యాజకులను ఎన్నుకొన్నాడు. ఆలయంలో సేవ
చేస్తున్నప్పుడు యాజకులను యోషీయా ఉత్సాహ
పర్చాడు. 3ఇశ్రాయేలు ప్రజలకు బోధకులుగా వున్న
వారితోను, ఆలయంలో సేవ చేయటానికి పవిత్రులైన
లేవీయులతోను, యోషీయా మాట్లాడినాడు. ఆ లేవీ
యులతో అతడిలా అన్నాడు: "సొలొమోను నిర్మించిన
ఆలయంలో పవిత్ర పెట్టెను వుంచండి. సొలొమోను
దావీదు కుమారుడు. దావీదు ఇశ్రాయేలు రాజు. పవిత్ర
పెట్టెను ఇక మీరు మీభుజాల మీద ఒకచోటు నుండి
మరియొక చోటికి మోయవద్దు. మీ దేవుడైన
యెహోవాకు ఇప్పుడు మీరు సేవ చేయండి. దేవుని
ప్రజలగు ఇశ్రాయేలీయులకు సేవ చేయండి. 4మీమీ
వంశాల ప్రకారం ఆలయంలో సేవచేయటానికి సిద్ధమ
వ్వండి. రాజైన దావీదు, అతని కుమారుడు రాజైన
సొలొమోను మీరు చేయాలని చెప్పిన పనులను మీరు
చేయండి.
5కొంత మంది లేవీయులు పవిత్రస్థలంలో నిల
బడాలి. ప్రజలలో ప్రతి వంశంవారికి సహాయపడే
నిమిత్తం, మీరలా నిలబడండి. 6పస్కా గొఱ్ఱెపిల్లను
వధించి యెహోవా సేవకు మిమ్మల్ని మీరు పవిత్రు
లుగా చేసికొనండి. మీ సోదరులైన ఇశ్రాయేలీయుల
కొరకు గొఱ్ఱె పిల్లలను సిద్ధం చేయండి. యెహోవా
మనలను ఆజ్ఞాపించిన విధంగా మీరు మీ ధర్మాన్ని
సక్రమంగా నిర్వర్తించండి. యెహోవా తన ధర్మాన్ని
మోషేద్వారా మనకు ప్రసాదించాడు." 7పస్కా బలు
లుగా అర్పించేటందుకు ఇశ్రాయేలు ప్రజలకు
యోషీయా ముప్పైవేల గొఱ్ఱెలను ఇచ్చాడు. ప్రజ
లకు అతడింకా మూడువేల పశువులను కూడా
ఇచ్చాడు. ఈ జంతువులన్నీ రాజైన యోషీయా
పశుసంపద నుండి ఇవ్వబడినాయి. 8పస్కా పండుగలో
వినియోగించే నిమిత్తం ప్రజలకు, యాజకులకు, లేవీ
యులకు జంతువులను, ఇతర వస్తువులను కూడా
యోషీయా అధికారులు ఉదారంగా ఇచ్చారు. ప్రధాన

---

**బడబాగ్నిలా** నీటి చివర. నీటి అడుగున వుండు అగ్ని.

**నీ పూర్వీకుల వద్దకు** యోషీయా చనిపోతాడని సూచన.

యాజకుడు హిల్కీయా, జెకర్యా, యెహీయేలు
అనువారు ఆలయ నిర్వహణాధికారులు. వారు యాజ
కులకు పస్కాబలుల నిమిత్తం రెండువేల ఆరువందల
గొర్రె పిల్లలను, మేకలను, మరియు మూడువందల
గిత్తలను ఇచ్చారు. [9]పైగా కొనన్యా, అతని సోదరులు
షెమయా మరియు నెతనేలు, మరియు హషబ్యా,
యెహీయేలు, యోజాబాదు లేవీయులకు పస్కా బలు
లకుగాను ఐదువందల గొర్రెలను, మేకలను, మరియు
ఐదువందల కోడె దూడలను ఇచ్చారు. వారంతా
లేవీయుల పెద్దలు. [10]పస్కా సేవ ప్రారంభానికి
సమస్తము సిద్ధం చేయబడిన తరువాత యాజకులు,
లేవీయులు వారి వారి నియమిత స్థానాలకు వెళ్లారు.
రాజు ఆమేరకు వారిని ఆజ్ఞాపించాడు. [11]పస్కా గొర్రె
పిల్లలు చంపబడ్డాయి. తరువాత లేవీయులు ఆ
జంతువుల చర్మాలను ఒలిచి, వాటి రక్తాన్ని యాజకు
లకు ఇచ్చారు. యాజకులు రక్తాన్ని బలిపీఠం మీద
చల్లారు. [12]పిమ్మట బలియిచ్చిన ఆ జంతువులను
దహనబలులకుగాను వివిధ వంశాల వారికి యిచ్చారు.
మోషే ధర్మశాస్త్రం నిర్దేశించిన విధంగా దహనబలులు
జరగటానికే ఇది ఈ విధంగా చేయబడింది. [13]లేవీ
యులు పస్కా బలుల మాంసాన్ని ధర్మశాస్త్ర ప్రకారం
అగ్నిలో కాల్చారు. పవిత్ర అర్పణలను వారు కుండల
లోను, పాత్రలలోను. పెనముల మీద వుడకబెట్టారు.
వారు తక్షణమే ఆ మాంసాన్ని ప్రజలకు పంచిపెట్టారు.
[14]ఇది జరిగిన తరువాత లేవీ యులు, అహరోను సంతతి
యాజకులు తమ వంతు మాంసాన్ని తీసుకున్నారు.
ఆ యాజకులు చీకటి పడేవరకు పనిలో నిమగ్న
మయ్యారు. దహనబలి మాంసాన్ని అర్పణల కొవ్వును
కాల్చడంలో వారు కష్టపడి పనిచేశారు. [15]రాజైన దావీదు
నిర్ణయించిన స్థలంలో ఆసాపు వంశీయులగు లేవి
గాయకులు నిలబడ్డారు. వారు ఆసాపు, హేమాను,
మరియు రాజు యొక్క ప్రవక్త యెదూతూను. ప్రతి
ద్వారం వద్ద నున్న ద్వారపాలకులు తమ తమ స్థానాలు
వదలవలసిన అవసరం లేకుండ వారి సోదరులగు
లేవీయులు అన్నీ సిద్ధంచేసి వారి పస్కా అవసరాలన్నీ
తీర్చారు.

[16]రాజైన యోషీయా ఆజ్ఞాపించిన విధంగా ఆరోజు
యెహోవా ఆరాధనకు సమస్తం ఏర్పాటు చేయ
బడింది. పస్కా పండుగ జరుపబడింది. యెహోవా
బలిపీఠం మీద దహనబలులు అర్పించబడ్డాయి. [17]అక్క
డున్న ఇశ్రాయేలీయులంతా పస్కాను, పులియని
రొట్టెల పండుగను ఏడు రోజులపాటు జరుపు
కున్నారు. [18]ప్రవక్తయగు సమూయేలు జీవించి
యున్న కాలంనుండి ఈ రకంగా పస్కా పండుగ జరుప
బడలేదు! ఇశ్రాయేలు రాజులలో ఏ ఒక్కడు గతంలో
ఇంత ఘనంగా పస్కాపండుగ జరుపలేదు. రాజైన
యోషీయా, యాజకులు, లేవీయులు, అక్కడున్న
యూదా మరియు ఇశ్రాయేలు ప్రజలు యెరూషలేము
వాసులతో కలిసి పస్కా పండుగను ఘనంగా ఒక ప్రత్యేక
పద్ధతిలో జరిపారు. [19]యోషీయా రాజ్యపాలనలో
పదునెనిమిదవ సంవత్సరం గడుస్తూ వున్నప్పుడు ఈ
పస్కా పండుగ జరుపబడింది.

## యోషీయా మరణం

[20]యోషీయా ఆలయం విషయంలో ఈ మంచి
పనులన్నీ చేసిన పిమ్మట రాజైన నెకో యూఫ్రటీసు
నదీతీర పట్టణమైన కర్కెమీషు మీదికి దండెత్తి
వచ్చాడు. నెకో ఈజిప్టు రాజు. రాజైన యోషీయా
నెకోను ఎదిరించటానికి బయలుదేరి వెళ్లాడు. [21]కాని
నెకో యోషీయా వద్దకు దూతలను పంపాడు. వారు
యిలా అన్నారు: "యోషీయా రాజా, ఈ యుద్ధం
నీకు సంబంధించినదిగాదు. నేను నీమీద యుద్ధానికి
రాలేదు. నేను నా శత్రువుతో పోరాడటానికి వచ్చాను.
దేవుడు నన్ను తొందరచేసి పంపినాడు. దేవుడు నా
పక్షాన వున్నాడు. కావున నీవు అనవసరమైన శ్రమ
తీసికోవద్దు. నీవు గనుక నాతో యుద్ధం చేస్తే, దేవుడు
నిన్ను నాశనం చేస్తాడు!" [22]కాని యోషీయా వెళ్లి
పోలేదు. అతడు నెకోతో యుద్ధం చేయటానికే నిశ్చ
యించాడు. అందువల్ల అతడు తన వేషం మార్చుకొని
యుద్ధానికి వెళ్లాడు. దేవుని ఆజ్ఞ విషయంలో నెకో
చెప్పిన దానిని యోషీయా వినటానికి నిరాకరించాడు.
మెగిద్దో మైదానంలో యుద్ధం చేయటానికి
యోషీయా వెళ్లాడు. [23]రాజైన యోషీయా యుద్ధంలో
వుండగా, అతడు బాణాలతో కొట్టబడ్డాడు. అతడు
తన సేవకులతో, "నన్ను దూరంగా తీసుకొని వెళ్లండి.
నేను తీవ్రంగా గాయపడ్డాను!" అని చెప్పాడు.

[24]దానితో అతని సేవకులు యోషీయాను అతని
రథం నుండి దించి తనతో యుద్ధరంగానికి తెచ్చిన
మరియొక రథంలో అతనిని వుంచారు. వారు యోషీ
యాను యెరూషలేముకు తీసికొని వచ్చారు. రాజైన
యోషీయా యెరూషలేములో చనిపోయాడు. తన
పూర్వీకులు వుంచబడిన సమాధులలోనే యోషీయా
సమాధి చేయబడినాడు. యోషీయా చనిపోయి
నందుకు యూదా, యెరూషలేము ప్రజలంతా చాలా
దుఃఖించారు. [25]యోషీయాపై యిర్మీయా కొన్ని
ప్రగాఢ విలాపగీతికలు వ్రాశాడు. ఆ విలాపగీతికలు ఆల
పిస్తూ స్త్రీ పురుష గాయకులు ఈనాటికీ యోషీయాను
తలచుకొని గౌరవిస్తారు. యోషీయాను తలుస్తూ ఒక
విలాపగీతిక ఆలపించటం ఇశ్రాయేలీయులకు వాడుక
అయ్యింది. ఆ గీతికలు విలాప వాక్యములలో పొందు
పర్చబడినాయి. [26-27]తాను రాజుగా వున్న కాలంలో
యోషీయా మొదటినుండి తన పాలన అంతం అయ్యే
వరకు చేసిన ఇతర కార్యములన్నీ ఇశ్రాయేలు, యూదా
రాజుల చరిత్ర గ్రంథంలో వ్రాయబడినాయి. ఆ

గ్రంథం యెహోవావాపట్ల అతనికున్న ప్రేమ, యెహోవా ధర్మశాస్త్రాన్ని అతను అనుసరించిన తీరును తెలియజేస్తుంది.

### యూదా రాజుగా యెహోయాహాజు

36 యెరూషలేములో కొత్త రాజుగా యూదా ప్రజలు యెహోయాహాజును ఎన్నుకొన్నారు. యెహోయాహాజు యోషీయా కుమారుడు. 2యూదాకు రాజయ్యేనాటికి యెహోయాహాజు ఇరువది మూడేండ్లవాడు. అతడు యెరూషలేములో మూడు నెలలపాటు రాజుగా వున్నాడు. 3పిమ్మట ఈజిప్టు రాజైన నెకో యెహో యాహాజును బందీగా పట్టుకున్నాడు. నెకో యూదా ప్రజలను రెండువందల మణుగుల (మూడు మువ్పావు టన్నులు) వెండిని, రెండు మణుగుల (డెబ్బదియైదు పౌనులు) బంగారాన్ని అపరాధ రుసుముగా చెల్లించేలా చేశాడు. 4యెహోయాహాజు సోదరుని యూదా, యెరూషలేములపై నూతన రాజుగా నెకో నియమించాడు. యెహోయాహాజు సోదరుని పేరు ఎల్యాకీము. పిమ్మట ఎల్యాకీముకు నెకో ఒక క్రొత్త పేరు పెట్టాడు. అతనికి యెహోయాకీము అను మారుపేరు పెట్టాడు. కాని యెహోయాహాజును నెకో ఈజిప్టుకు తీసికొని వెళ్లాడు.

### యూదా రాజుగా యెహోయాకీము

5యూదాకు కొత్త రాజయ్యేనాటికి యెహోయాకీము ఇరువదియైదేండ్లవాడు. యెహోవా కోరిన విధంగా యెహోయాకీము ధర్మంగా ప్రవర్తించలేదు. దేవుడైన యెహోవా పట్ల అతడు పాపం చేశాడు.

6బబులోను (బాబిలోనియా) రాజైన నెబు కద్నెజరు యూదాపై దండెత్తి వచ్చాడు. అతడు యెహోయాకీమును బందీగాచేసి అతనికి కంచు గొలుసులు తగిలించాడు. తరువాత యెహోయాకీమును నెబుకద్నెజరు బబులోనుకు తీసికొని వెళ్లాడు. 7యెహోవా ఆలయం నుండి నెబుకద్నెజరు కొన్ని వస్తువులను దోచుకుపోయాడు. అతడా వస్తువులను బబులోనుకు పట్టుకుపోయి వాటిని తన స్వంత ఇల్లయిన రాజ గృహంలో వుంచాడు. 8యెహో యాకీమును చేసిన ఇతర విషయాలు, అతడు చేసిన భయంకరమైన పాపాలు, మరియు అతనిని దోషిగా నిరూపించే అతని ప్రతి కార్యం గురించి ఇశ్రాయేలు, యూదా రాజుల గ్రంథంలో వ్రాయబడ్డాయి. యెహోయాకీము స్థానంలో అతని కుమారుడు యెహోయాకీను కొత్తగా రాజయ్యాడు.

### యూదా రాజుగా యెహోయాకీను

9యూదాకు రాజయ్యేనాటికి యెహోయాకీను పద్దెనిమిది సంవత్సరాలవాడు. అతడు యెరూషలేములో మూడు నెలల పది రోజులు రాజుగా వున్నాడు. యెహోవా కోరిన విధంగా అతడు తన కార్యాలను నిర్వర్తించలేదు. యెహోవా పట్ల యెహోయాకీను పాపం చేశాడు. 10వసంత ఋతువులో యెహోయాకీనును పట్టి తెమ్మని రాజైన నెబుకద్నెజరు తన మనుష్యులను పంపాడు. వారు యెహోయాకీనును, యెహోవా ఆలయం నుండి కొన్ని ధనరాసులను బబులోనుకు తెచ్చారు. యూదా, యెరూషలేములకు నూతన రాజుగా సిద్కియాను నెబుకద్నెజరు నియమించాడు. సిద్కియా అనువాడు యెహోయాకీనుకు బంధువు.

### యూదా రాజుగా సిద్కియా

11యూదాకు రాజయ్యేనాటికి సిద్కియా ఇరువై ఒక సంవత్సరాలవాడు. అతడు యెరూషలేములో పదకొండు సంవత్సరాలు రాజుగా వున్నాడు. 12యెహోవా కోరినట్లు సిద్కియా ఉత్తమ కార్యాలు చేయలేదు. యెహోవా పట్ల సిద్కియా పాపం చేశాడు. దేవుని ముందు అతడు వినయ విధేయతలు చూపించలేదు. ప్రవక్త యిర్మీయా చెప్పిన విషయాలను పాటించలేదు. యెహోవా సందేశాన్ని యిర్మీయా ప్రవచించాడు.

### యెరూషలేము నాశనమగుట

13రాజైన నెబుకద్నెజరుపై సిద్కియా తిరుగు బాటు చేశాడు. గతంలో నెబుకద్నెజరుకు విశ్వాసంగా వుంటానని సిద్కియాతో బలవంతంగా నెబుకద్నెజరు ప్రమాణం చేయించాడు. నెబుకద్నెజరుకు విశ్వాసంగా వుంటానని సిద్కియా దేవుని మీద ప్రమాణం చేశాడు. కాని సిద్కియా తన జీవన విధానం మార్చుకొని, ఇశ్రాయేలు దేవుడగు యెహోవా మాటవిని, ఆయనకు విధేయుడైయుండటానికి నిరాకరించి మొండి వైఖరి దాల్చాడు. 14యాజకుల నాయకులు, యూదా ప్రజల నాయకులంతా కూడా మరీ ఎక్కువ పాపం చేసి, యెహోవాకు విశ్వాస ఘాతకులయ్యారు. వారు అన్యదేశీయుల చెడు మార్గాన్నే అనుసరించారు. ఆ నాయకులంతా యెహోవా ఆలయాన్ని అపవిత్రపర్చి పాడుచేశారు. యెరూషలేములో ఆలయాన్ని యెహోవా పవిత్రపర్చాడు. 15తమ పూర్వీకుల దేవుడగు యెహోవా తన ప్రజలను హెచ్చరించటానికి అనేక పర్యాయములు ప్రవక్తలను పంపినాడు. తన ప్రజలపట్ల, తన ఆలయంపట్ల సాను భూతిగల వాడు గుటచే యెహోవా అలా చేస్తూ వచ్చాడు. యెహోవా తన ప్రజలనుగాని, తన ఆలయాన్నిగాని నాశనం చేయదల్చలేదు. 16కాని దేవుని యొక్క ప్రజలే దేవుడు పంపిన ప్రవక్తలను ఎగతాళి చేశారు. వారు ప్రవక్తలు చెప్పేదానిని వినలేదు. వారు దేవుని వర్తమానములను అసహ్యించుకున్నారు. ఆఖరికి దేవుడు తన కోపాన్ని

ఎంత మాత్రమూ ఆపుకోలేకపోయాడు. దేవుడు తన
ప్రజలపట్ల కోపపడ్డాడు. ఆ కోపాన్ని ఆపగల శక్తి
ఎవరికీ లేదు. 17అందువల్ల యూదా, యెరూషలేము
ప్రజలను శిక్షించటానికి దేవుడు వారి మీదికి బబులోను
రాజును రప్పించాడు.* బబులోను రాజు యువకులను
ఆలయంలో వుండగానే చంపివేశాడు. అతడు యూదా,
యెరూషలేము ప్రజలమీద ఏమాత్రం కనికరం చూప
లేదు. బబులోను రాజు యువకులను, వృద్ధులను
కూడ చంపివేశాడు. అతడు పురుషులను, స్త్రీలను
చంపాడు. రోగులను, ఆరోగ్యవంతులను కూడ చంపి
వేశాడు. యూదా, యెరూషలేము ప్రజలను శిక్షించ
టానికి దేవుడు నెబుకద్నెజరుకు అనుమతి ఇచ్చినాడు.
18ఆలయంలోని వస్తువులన్నిటినీ నెబుకద్నెజరు
బబులోనుకు పట్టుకుపోయాడు. ఆలయంలోను,
రాజువద్ద, రాజు యొక్క అధికారులవద్దగల విలువైన
వస్తువులన్నిటినీ అతడు పట్టుకుపోయాడు. 19నెబుక
ద్నెజరు, అతని సైన్యం ఆలయాన్ని తగులబెట్టారు.
వారు యెరూషలేము గోడను పడగొట్టి రాజుకు,
రాజాధికారులకు చెందిన ఇండ్లన్నీ తగులబెట్టారు. ప్రతి
విలువైన వస్తువును వారు తీసికొనటం గాని, లేక నాశనం
చేయటంగాని చేశారు. 20చనిపోగా మిగిలిన ప్రజలను
నెబుకద్నెజరు బబులోనుకు తీసుకొని వెళ్లి బానిసలుగా
పనిచేయించాడు. పర్షియా రాజ్యం (పారసీకము)
బబులోను రాజ్యాన్ని ఓడించేవరకు ఆ ప్రజలు
బబులోనులో బానిసలుగా వుండి పోయారు.
21ప్రవక్తయగు యిర్మీయా ద్వారా ఇశ్రాయేలు
ప్రజలకు యెహోవా చెప్పిన విషయాలన్నీ ఆ
విధంగా సంభవించాయి. యిర్మీయా ద్వారా
యెహోవా యిలా చెప్పినాడు: "ఈ ప్రదేశం డెబ్బది
యేండ్లపాటు బంజరు* భూమిగా మారిపోతుంది.
ప్రజలు సబ్బాతు దినాలను* పాటించని కారణాన,
దానికి పరిహారంగా ఇది జరుగుతుంది."
22పర్షియా (పారసీక) రాజు కోరెషు (సైరస్) పాలన
మొదటి సంవత్సరంలో* ఈ విధంగా జరిగింది.
ప్రవక్తయగు యిర్మీయా ద్వారా యెహోవా ప్రక
టించిన విషయాలు ఆయన నిజంగా జరిగేలా చేసి
నాడు. యెహోవా సైరస్ హృదయాన్ని స్పందింపజేసి,
అతనిచే ఒక ఆజ్ఞ వ్రాయించి దూతల ద్వారా తన
రాజ్యమంతా ప్రకటింపజేసినాడు: 23పర్షియా రాజైన
కోరెషు తెలియజేయున దేమనగా: '

ఆకాశమందు ప్రభువైన యెహోవా నన్ను ఈ
భూమండలానికంతకు రాజుగా చేసినాడు. యెరూషలే
ములో ఆయనకొక ఆలయం కట్టించే బాధ్యత నాకు
అప్పజెప్పినాడు. దేవుని ప్రజలైన మీరంతా ఇప్పుడు
యెరూషలేము వెళ్లటానికి స్వేచ్ఛ కలిగియున్నారు.
మీ దేవుడైన యెహోవా మీకు తోడై వుండుగాక.

---

**బబులోను ... రప్పించాడు** క్రీ.పూ. 586 సంవత్సరం చివరిగా బబులోను రాజు యెరూషలేమును నాశన మొనర్చిన సంవత్సరం.

**బంజరు** చూడండి యిర్మీయా 25:11; 29:10.

**దినాలను** ధర్మశాస్త్ర ప్రకారం ప్రతి ఏడవ సంవత్సరం భూమిని సాగు చేయకూడదు, చూడండి లేవీయకాండము 25:1-7.

**సంవత్సరంలో** క్రీ.పూ. 539 వ సంవత్సరం.

# ఎజ్రా

### యూదుల చెర విముక్తికి కోరెషు సహాయం

1 పారశీక రాజ్యానికి కోరెషు రాజైన మొదటి సంవ
త్సరం,* యెహోవా కోరెషును ఒక ప్రకటన
చేయవలసిందిగా ప్రోత్సహించాడు. కోరెషు ఆ ప్రకట
నను వ్రాయించి, తన రాజ్యపు అన్ని ప్రాంతాలలోనూ
చదివి వినిపించే ఏర్పాటు చేశాడు. దేవుడు యిర్మీయా
నోట పలికించిన యీ సందేశం* వాస్తవ రూపం
ధరించేందుకు అనువుగా ఈ ప్రకటన చేయడం జరి
గింది. ఆ ప్రకటన యిలా సాగింది:
2 “పారశీక రాజు కోరెషు తెలియజేసేది ఏమంటే:
పరలోకాధిపతి అయిన యెహోవా దేవుడు భూలోకం
లోని దేశాలన్నింటినీ నాకు అప్పగించాడు. యూదా
దేశంలోని యెరూషలేములో తనకొక ఆలయాన్ని
నిర్మించేందుకుగాను యెహోవా నన్ను ఎంచు
కున్నాడు. 3 యెరూషలేములో వున్న ఇశ్రాయేలీయుల
దేవుడే ప్రభువైన యెహోవా. మీ మధ్య దేవుని మను
ష్యులు ఎవరైనా వున్నట్లయితే, వారిని ఆశీర్వదించ
వలసిందిగా నేను దేవుణ్ణి ప్రార్థిస్తాను. యూదా దేశం
లోని యెరూషలేముకు మీరు వాళ్లని పోనివ్వాలి. మీరు
వాళ్లని దేవుని ఆలయాన్ని నిర్మించనివ్వాలి 4 ఇశ్రాయేలీ
యుల్లో మిగిలి వున్నవాళ్లు* ఎక్కడైనా ఉన్నట్లయితే,
వాళ్లకి అక్కడి ప్రజలు తోడ్పడాలి. ప్రజలు ఆ హతశే
షులకు వెండి బంగారాలు, ఆవులు, వగైరాలు ఇవ్వాలి.
యెరూషలేములో దేవాలయ నిర్మాణం కోసం వాళ్లకి
కానుకలు ఇవ్వాలి.”
5 యూదా, బెన్యామీను వంశాలకు చెందిన కుటుం
బాల పెద్దలు యెరూషలేముకు పోయేందుకు సన్నద్ధ
మయ్యారు. వాళ్లు యెరూషలేములో దేవాలయ నిర్మా
ణానికి పోసాగారు. వాళ్లే కాకుండా, దేవుడు ప్రేరేపించిన
ప్రతి ఒక్క వ్యక్తీ యెరూషలేముకు పోయేందుకు
సంసిద్ధుడయ్యాడు. 6 వాళ్ల ఇరుగుపొరుగు వారు వాళ్లకి
అనేక కానుకలు సమర్పించారు. వెండి బంగారాలు,
ఆవులు, ఖరీదైన ఇతర వస్తువులు ఇచ్చారు. ఇరుగు
పొరుగువారు వాళ్లకి ఈ కానుకలన్నీ స్వచ్ఛందంగా
ఇచ్చారు. 7 పూర్వం నెబుకద్నెజరు యెరూషలేము
నందున్న యెహోవా ఆలయానికి చెందిన కొన్ని
వస్తువులు కొల్లగొట్టి, వాటిని తన అబద్ధపు దేవతల
ఆలయంలో వుంచాడు. వాటిని ఇప్పుడు కోరెషు
మహారాజు బయటికి తీయించాడు. 8 పారశీక రాజైన
కోరెషు ఆ వస్తువులను బయటికి తీసుకురమ్మని తన
ఖజానాదారుని ఆదేశించాడు. ఆ ఖజానాదారుని పేరు
మిత్రిదాతు. మిత్రిదాతు ఆ వస్తువులను బయటికి
తీయించి, వాటిని యూదా నాయకుడైన షేష్బజ్జ
రుకు* అప్పగించాడు.
9 మిత్రిదాతు బయటికి తెచ్చిన దేవాలయ వస్తువుల
జాబితా యిది:

| | | |
|---|---|---|
| | బంగారు గిన్నెలు | 30 |
| | వెండి గిన్నెలు | 1,000 |
| | చాకులు, పెనాలు | 29 |
| 10 | బంగారు పాత్రలు | 30 |
| | బంగారు పాత్రల వంటివే | |
| | వెండి పాత్రలు | 410 |
| | ఇతర పాత్రలు | 1,000 |

11 వెండి బంగారాలతో చేసిన వస్తువులు కలసి
మొత్తం 5,400 వున్నాయి. బబులోను చెరనుండి విడి
పింపబడినవారు యెరూషలేముకు తిరిగి వెళ్లేటప్పుడు,
షేష్బజ్జరు పై వస్తువులన్నింటినీ తనతో యెరూషలే
ముకు తీసుకువెళ్లాడు.

### యెరూషలేముకు తిరిగి వచ్చిన వాళ్ల జాబితా

2 వీళ్లు బబులోను రాజ్యంలో నిర్బంధం నుంచి
తిరిగి వచ్చినవాళ్లు. గతంలో బబులోను రాజైన
నెబుకద్నెజరు వీళ్లని బందీలుగా పట్టుకొని,

**మొదటి సంవత్సరం** క్రీ.పూ 538.

**దేవుడు … సందేశం** యిర్మీయా 25:12-14 చూడండి.

**మిగిలివున్నవాళ్లు** విపత్తునుంచి తప్పించుకుని బయట పడ్డవాళ్లు, ఇక్కడ యూదా, ఇశ్రాయేలీయుల శత్రువుల సైన్యాలు అక్కడ జరిపిన విధ్వంసకాండలో చావక మిగిలిన యూదా ప్రజలని అర్థం.

**షేష్బజ్జరుకు** బహుశాః ఇతను జెరుబ్బాబెల్ అయ్యుంటాడు. జెరుబ్బాబెల్ అన్న పదానికి “బబులోనులో అపరిచిత వ్యక్తి” లేక “బబులోను విడిచిపోయినవాడు” అని అర్థం. షేష్బజ్జరు అన్నది బహుశా అతని అరమాయిక్ పేరు అయ్యుంటుంది.

బబులోనుకు తెచ్చాడు. ఇప్పుడు వాళ్లు యెరూషలే
ముకు, యూదాకు తిరిగివచ్చారు. వాళ్లు తమతమ
సొంత పట్టణాలకి తిరిగి వెళ్లారు. 2జెరుబ్బాబెలుతో
పాటు తిరిగివచ్చిన వాళ్లలో యేషూవా, నెహెమ్యా,
శెరాయా, రెయేలాయా, మొర్దెకై, బిల్షాను, మిస్పె
రేతు, బిగ్వయి, రెహూము, బయనా అనే వాళ్లు న్నారు.
బబులోను నుంచి తిరిగి వచ్చిన ఇశ్రాయేలీయుల
పేర్ల జాబితా, వాళ్ల సంఖ్యల వివరం ఇది:

3 పరోషు వంశస్థులు 2,172
4 షెపట్యా వంశస్థులు 372
5 అరహు వంశస్థులు 775
6 యెషూవ, యోవాబు వంశాలకి
చెందిన పహత్మోయాబు,
మోయాబు వంశస్థులు 2,812
7 ఏలాము వంశస్థులు 1,254
8 జత్తూ వంశస్థులు 945
9 జక్కయి వంశస్థులు 760
10 బానీ వంశస్థులు 642
11 బేబై వంశస్థులు 623
12 అజ్గాదు వంశస్థులు 1,222
13 అదోనీము వంశస్తులు 666
14 బిగ్వయి వంశస్థులు 2,056
15 అదీను వంశస్థులు 454
16 అటేరు వంశస్థులు
(హిజ్కియా కుటుంబం) 98
17 బెజయి వంశస్థులు 323
18 యోరా వంశస్థులు 112
19 హాషుము వంశస్థులు 223
20 గిబ్బారు వంశస్థులు 95
21 బెత్లెహేము పట్నానికి చెందినవాళ్లు 123
22 నెటోపా పట్టణం వాళ్లు 56
23 అనాతోతు పట్టణంవాళ్లు 128
24 అజ్మావెతు పట్టణంవాళ్లు 42
25 కిర్యాతారీము, కెఫీరా,
బెయేరోతు పట్టణాలవాళ్లు 743
26 రమా, గెబా పట్టణాలవాళ్లు 621
27 మిక్మషు పట్టణం వాళ్లు 123
28 బేతేలు, హాయి పట్టణంవాళ్లు 222
29 నెబో పట్టణంవాళ్లు 52
30 మగ్బీషు పట్టణంవాళ్లు 156
31 ఏలాము అనే మరో పట్టణంవాళ్లు 1,254
32 హారీము పట్టణంవాళ్లు 320
33 లోదు, హదీదు, ఓనో
పట్టణాలవాళ్లు 725
34 యెరికో పట్టణంవాళ్లు 345
35 సెనాయా పట్టణంవాళ్లు 3,630

36యాజకులు:
యేషూవ కుటుంబానికి చెందిన
యెదాయ వంశస్థులు 973
37 ఇమ్మేరు వంశస్థులు 1,052
38 పషూరు వంశస్థులు 1,247
39 హారీము వంశస్థులు 1,017

40ఇప్పుడిక లేవీయులలో
హోదవ్యా కుటుంబానికి చెందిన
యేషూవా, కద్మీయేలు వంశస్థులు 74

41గాయకుల జాబితా:
అసాపు వంశస్థులు 128

42దేవాలయపు ద్వారపాలకుల వంశస్థులు
షల్లూము, ఆటేరు, టల్మోను, అక్కూబు,
హటీటా, షోబయి వంశస్థులు 139

43దేవాలయపు ప్రత్యేక సేవకుల వంశస్థులు జీహా,
హశూపా, టబ్బాయోతు,
44 కేరోసు, సీయహా, పాదోను,
45 లెబానా, హగాబా, అక్కూబు,
46 హాగాబు, షల్మయి, హానాను,
47 గిద్దేలు, గహరు, రెవాయా,
48 రెజీను, నెకోదా, గజ్జాము,
49 ఉజ్జా, పాసెయ, బేసాయి,
50 అస్నా, మెహూనీము, నెపూసీము,
51 బక్బూకు, హకూపా, హర్హూరు
52 బజ్లీతు, మెహీదా, హర్షా
53 బర్కోసు, సీసెరా, తెమహు
54 నెజీయాహు, హటీపా,

55సొలొమోను సేవకుల వంశస్థులు: సొటయి, సోపె
రెతు, పెరూదా,
56 యహలా, దర్కోను, గిద్దేలు,
57 షెపట్య, హట్టీలు, పొకెరెతు, జెబాయీము
మరియు అమి
58 దేవాలయ సేవకులూ, మరియు సొలొమోను
సేవకుల వంశస్థులు కలిసి మొత్తం 392

59తేల్మెలహు తేల్హర్షా, కెరూబు, అద్దాను, ఇమ్మేరు పట్ట
ణాలనుంచి యెరూషలేముకు కొందరు వచ్చారు.
అయితే వీళ్లు తమ కుటుంబాల వాళ్లయిన ఇశ్రాయేలీ
యుల కుటుంబాలకు చెందినవాళ్లమని నిరూపించుకో
లేకపోయారు. వాళ్లెవరంటే,
60 దెలాయ్యా, టోబీయా,
నెకోదా సంతతివారు మొత్తం 652

61యాజకుల కుటుంబాలకు చెందిన ఈ క్రింది
వంశస్థులు వున్నారు: హబాయ్యా, హక్కోజు, బర్జిల్లయి
వంశస్థులు. (గిలాదుకు చెందిన ఒకడు బర్జిల్లయి
అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. అతను బర్జిల్లయి
సంతతివాడిగా పరిగణించబడ్డాడు.)
62వీళ్లు తమ వంశ చరిత్రకోసం గాలించారు. కానీ
అది వాళ్లకి లభ్యం కాలేదు. వాళ్ల పేర్లు యాజకుల
జాబితాలో నమోదు కాలేదు.
తమ పూర్వీకులు యాజకులని వాళ్లు నిరూపించ
లేకపోయారు. దానితో, వాళ్లు యాజకులుగా సేవ
చేయలేకపోయారు. 63వాళ్లు ప్రతిష్ఠితమైన వస్తువులను
తినకూడదని రాజ్యాధిపతి ఆజ్ఞ జారీ చేశాడు. ఒక
యాజకుడు ఊరీము, తుమ్మీము* ధరించి, ఏమి
చేయాలని దేవుణ్ణి అడిగేంతవరకు వాళ్లు ప్రతిష్ఠితమైన
వస్తువులేమీ తినలేకపోయారు.
64-65మొత్తంమీద తిరిగివచ్చిన ఆ వంశంలో 42,360
మంది వున్నారు. వాళ్లలో 7,337 మంది స్త్రీ, పురుష
సేవకులను పరిగణలోకి తీసుకోకపోతే తేలిన సంఖ్య
ఇది. వాళ్లతో 200 మంది గాయనీ గాయకులు కూడా
వున్నారు. 66-67వాళ్లకి 736 గుర్రాలు, 245 కంచర గాడి
దలు, 435 ఒంటెలు, 6,720 గాడిదలు ఉన్నాయి.
68ఆ వంశం యెరూషలేములోని దేవుని ఆలయా
నికి చేరుకుంది. తర్వాత కుటుంబ పెద్దలు దేవాలయ
నిర్మాణం కోసం తమ కానుకలు సమర్పించారు. పాత
దేవాలయం నేలమట్టము చేయబడిన చోటనే కొత్త
దేవాలయ నిర్మాణానికి వాళ్లు సమకట్టారు. 69వాళ్లు
దేవాలయ నిర్మాణానికి తమ శక్తి కొద్దీ కానుకలు
ఇచ్చారు 1,100 పౌనుల బంగారం, 3టన్నుల వెండి,
యాజకులు ధరించే 100 దుస్తులు వాళ్లు ఇచ్చారు.
70ఈ విధంగా యాజకులు, లేవీ గోత్రీకులు,
తదితరులు కొంతమంది యెరూషలేముకీ, దాని
చుట్టూవున్న ప్రాంతాలకీ చేరుకున్నారు. ఈ వంశంలో
దేవాలయ గాయకులు, ద్వారపాలకులు, దేవాలయ
సేవకులు వున్నారు. తదితర ఇశ్రాయేలీయులు తమ
తమ సొంత పట్టణాల్లో స్థిరపడ్డారు.

## బలిపీఠ పునర్నిర్మాణం

3 అలా ఏడవ నెల* నాటికి ఇశ్రాయేలీయులు తమ
తమ సొంత పట్టణాలకు చేరుకున్నారు. అప్పుడు
వాళ్లందరూ యెరూషలేములో గుమికూడి ఒక ప్రజగా
సమైక్యమయ్యారు. 2యోజాదా కొడుకైన యేషూవ,
అతనితో వున్న యాజకులూ, షయల్తీయేలు కొడుకు
జెరుబ్బాబెలు, అతని సహచరులు ఇశ్రాయేలు దేవునికి
బలిపీఠం నిర్మించారు. ఇశ్రాయేలీయులు తాము
బలులు సమర్పించ గలిగేందుకు వీలుగా ఆ బలిపీఠాన్ని
నిర్మించారు. సరిగ్గా మోషే ధర్మశాస్త్రంలో పేర్కొన
బడినట్లు వాళ్లు ఆ బలిపీఠాన్ని నిర్మించారు. మోషే
యెహోవాకు ప్రత్యేక సేవకుడు.
3తమకి సమీపంలో నివసిస్తున్న ఇతర ప్రజలంటే
వాళ్లు భయపడ్డారు. అయినా, వాళ్లు ఆగకుండా, పాత
పునాది మీదనే బలిపీఠాన్ని నిర్మించి, ఉదయంపూటా,
సాయంత్రంపూటా దహనబలులు సమర్పిస్తూ
వచ్చారు. 4సరిగ్గా మోషే ధర్మశాస్త్రంలో చెప్పబడినట్లు
వాళ్లు పర్ణశాలల పండుగ చేసుకున్నారు. ఆ పండుగ
రోజులు పొడుగునా ప్రతిరోజూ సరైన సంఖ్యలో
దహన బలులు సమర్పించారు. 5అటు తర్వాత, ప్రతి
రోజూ నిరంతర దహనబలులు, అమావాస్య రోజున
జరిగే బలులు, మరి ఇతర పండుగల రోజులకూ,
శెలవు రోజులకూ, స్వేచ్ఛార్పణలను యెహోవా ఆజ్ఞ
ప్రకారం అర్పించారు. జనం కూడా యెహోవాకు
తాము ఇవ్వాలనుకున్న కానుకలు ఇవ్వనారంభిచారు.
6ఈ విధంగా, ఏడవ నెల మొదటి రోజున, ఆ ఇశ్రాయే
లీయులు యెహోవాకు తిరిగి దహనబలులు ఇవ్వనా
రంభించారు. దేవాలయం అప్పటికి ఇంకా తిరిగి
నిర్మించబడకపోయినా కూడా ఈ బలి అర్పణ సాగింది.

## దేవాలయ పునర్నిర్మాణం

7చెరనుంచి విముక్తులై తిరిగి వచ్చిన వాళ్లు రాళ్లు
చెక్కేవాళ్లకు, వడ్రంగులకు డబ్బులిచ్చారు. వాళ్లు
తూరు, సీదోను ప్రజలకు ఆహారాన్ని, ద్రాక్షారసాన్ని
ఒలీవనూనెను, లెబానోను నుండి దేవదారు చెట్లమొద్దు
లను తెచ్చేందుకు ఇచ్చారు. సొలొమోను మొదటిగా
దేవాలయం నిర్మించినప్పుడు తెప్పించి నట్లే, వాళ్లు
కూడా ఈ దేవదారు చెట్ల మొద్దులను ఓడల్లో సముద్ర
తీర పట్టణమైన యొప్పేకు తెప్పించాలనుకున్నారు.
పారశీక చక్రవర్తి కోరెషు ఇందుకు వారికి అనుమతి
నిచ్చాడు.
8యెరూషలేములోని దేవాలయం దగ్గరకు వాళ్లు
చేరుకున్నమీదట రెండవ ఏడాది రెండవ నెలలో*
షయల్తీయేలు కొడుకైన జెరుబ్బాబెలూ, యెజాదా
కొడుకైన యేషూవ పని ప్రారంభించారు. వాళ్ల సోద
రులు, యాజకులు, లేవీయులు, నిర్బంధంనుంచి
యెరూషలేముకు తిరిగి వచ్చిన వాళ్లందరూ వాళ్లతో
కలిసి పనిచేయ ప్రారంభించారు. లేవీయుల్లో 20 ఏళ్లు
నిండినవాళ్లనీ, అంతకు పైబడినవాళ్లనీ యెహోవా
దేవాలయ నిర్మాణంలో నాయకులుగా నియ

**ఊరీము, తుమ్మీము** తీర్పు చిక్కంలో ఉన్నత యాజకుడు ధరించే ప్రత్యేకమైన రాళ్లు. అవి దైవ నిర్ణయాలను పొందేందుకు వినియోగింపబడేవి. నిర్గమకాండం 28:30 చూడండి.

**ఏడవ నెల** క్రీ.పూ 538 సెప్టెంబరు–అక్టోబరు.

**రెండవ నెలలో** క్రీ.పూ 536 ఏప్రిల్–మే.

మించారు. 9దేవాలయ నిర్మాణ కార్యకలాపాలను ఈ
కింది వారు అజమాయిషీ చేశారు: యేషూవ మరియు
అతని కొడుకులు, మరియు అతని సహోదరులు,
కద్మీ యేలు మరియు అతని కొడుకులు (యూదా
వంశస్థులు); హేనాదాదు, మరియు అతని కొడుకులు,
లేవీయులందరు 10పనివాళ్లు యెహోవా దేవాలయా
నికి పునాది నిర్మాణాన్ని పూర్తిచేశారు. పునాది పూర్త
య్యాక, యాజకులు యాజకదుస్తులు ధరించి,
బూరలు చేతబూనారు. అసాపు కొడుకులు తాళాలు
పట్టుకొని నిలబడ్డారు. వాళ్లందరూ యెహోవాను
స్తుతించేందు కోసం తమతమ స్థానాల్లో నిలిచారు.
ఇదంతా ఇశ్రాయేలు రాజైన దావీదు గతంలో ఆదే
శించిన విధంగా జరిగింది. 11వాళ్లు కృతజ్ఞతాస్తుతులు*
పాడారు. "యెహోవా మంచివాడు. ఆయన నిజమైన
ప్రేమ ఇశ్రాయేలీయుల మీద ఎల్లప్పుడూ నిలిచివుం
టుంది" అంటూ వాళ్లు స్తుతి కీర్తనలు పాడారు. చివరిగా
అక్కడ ఉన్న మనుష్యులందరూ ఏకమై బిగ్గరగా
గొంతెత్తి యెహోవాను కీర్తించారు. యెహోవా దేవాల
యానికి పునాది వేయబడిన సందర్భంగా వాళ్లు గొప్ప
శబ్దంతో యెహోవాకు స్తోత్రాలు చెల్లించారు.
12అయితే, చాలామంది వృద్ధ యాజకులు, లేవీ
యులు, వంశ పెద్దలు విలపించారు. ఎందుకంటే, వాళ్లు
వెనకటి దేవాలయాన్ని చూసినవాళ్లు. వాళ్లు ఆ పూర్వ
వైభవాన్ని జ్ఞాపకం చేసుకొని, ఈ కొత్త దేవాలయాన్ని
చూసినప్పుడు బిగ్గరగా ఏడ్చారు. జనంలో మిగిలిన
చాలామంది సరదాగా సంతోషంగా కేరింతలు కొడు
తూండగా వాళ్లు విలపించారు. 13ఆ ధ్వనులు చాలా
దూరం వరకూ వినబడ్డాయి. వాటిలో ఏవి సంతోష
ధ్వనులో, ఏవి విలాపాలో ఎవరూ చెప్పుకోలేక
పోయారు.

## దేవాలయ పునర్నిర్మాణానికి విరోధులు

4 1-2ఆ ప్రాంతంలో నివసించే చాలామంది యూదా,
బెన్యామీను జాతీయులకు విరోధులు. చెరనుంచి
విముక్తులై తిరిగి వచ్చినవాళ్లు ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాకు దేవాలయం నిర్మిస్తున్నారని విన్న
ఆ శత్రువులు జెరుబ్బాబెలు దగ్గరకీ, వంశ పెద్దల దగ్గరికీ
వచ్చి, "నిర్మాణంలో మీకు మమ్మల్ని తోడ్పడని
వ్వండి. మేమూ మీలాంటివాళ్లమే. మీ దేవుణ్ణి సహాయం
నిమిత్తం మేమూ అర్థిస్తాము. అష్షూరు రాజైన ఏసర్హ
ద్దోను మమ్మల్ని ఇక్కడికి తెచ్చినప్పట్నుంచీ మేము
మీ దేవునికే బలులు సమర్పించాము" అన్నారు.
3కాని, జెరుబ్బాబెలు, యేషూవ, ఇశ్రాయేలుకు
చెందిన ఇతర వంశాల పెద్దలూ వాళ్లకి ఇలా సమాధానం
చెప్పారు: "కుదరదు, మా దేవుని ఆలయ నిర్మాణంలో
మాకు తోడ్పడే అవకాశం మీకు లేదు. యెహోవాకు
ఆలయ నిర్మాణం చేసే హక్కు మాది మాత్రమే.
యెహోవా ఇశ్రాయేలీయుల దేవుడు. ఇది పారశీక
చక్రవర్తి కోరేషు మాకు ఇచ్చిన ఆజ్ఞ."
4ఈ మాటలతో వాళ్లకి కోపం వచ్చింది. దానితో
వాళ్లు యూదులకు ఇబ్బందులు కలిగించ నారంభిం
చారు. దేవాలయం నిర్మించకుండా యూదులను వాళ్లు
నిరుత్సాహపరచి, నిరోధించసాగారు. 5వాళ్లు ప్రభుత్వాధి
కారులకు లంచాలిచ్చి, వాళ్లు యూదా ప్రజలకు వ్యతి
రేకంగా పని చేసేలా చూశారు. ఆ అధికారులు యూదుల
దేవాలయ నిర్మాణ పథకాలను భగ్నం చేసేందుకు
నిరంతరం కృషిచేశారు. కోరెషు పారశీక చక్రవర్తిగా
వున్నకాలంలో దర్యావేషు పారశీక చక్రవర్తి అయ్యేంత
వరకూ వాళ్ల యీ ప్రయత్నం కొనసాగింది. 6యూదు
లను అడ్డుకొనేందుకుగాను ఆ శత్రువులు పారశీక
చక్రవర్తికి లేఖలు సైతం వ్రాశారు. అహష్వేరోషు*
చక్రవర్తి అయిన ఏడాది వాళ్లొక లేఖ వ్రాశారు.

## యెరూషలేము పునర్నిర్మాణానికి విరోధులు

7ఆ తరువాత అర్తహషస్త* పారసీకానికి కొత్తగా
రాజు అయిన కాలంలో, వాళ్లలో కొందరు యూదుల
మీద నిందారోపణలు చేస్తూ లేఖలు రాశారు. అలా
రాసినవాళ్లు: బిష్లాము, మిత్రదాతు, టాబెయేలు, ఆ
బృందానికి చెందిన ఇతరులు. వాళ్లు అర్తహషస్తకు ఆ
లేఖలు అరమాయికు* భాషలో, అరమాయికు లిపిలో
వ్రాశారు. 8*అప్పుడు ప్రాంతీయాధికారి రెహూమూ,
కార్యదర్శి షిమ్షయి కూడా యెరూషలేము ప్రజలకి
వ్యతిరేకంగా ఒక లేఖ వ్రాసి, పారసీక చక్రవర్తి అర్తహషస్తకి
పంపారు. ఆ లేఖలో వాళ్లిలా వ్రాశారు.

9ప్రాంతీయాధికారి రెహూము, కార్యదర్శి
షిమ్షయీ, న్యాయమూర్తులు, టర్పెలాయేలు,
పారసీకం, అర్కె, బబులోను, సూసాకి చెందిన
ఏలాము మరియు ఇతర ప్రాంతాల ప్రజలమీది
ముఖ్యాధికారులు, 10గొప్పవాడైన బలవంతు
డైన అషురుబనిపాలు సమరియా నగరానికి,

**కృతజ్ఞతాస్తుతులు** ఈ కీర్తనల్లో ఒక పదాన్ని ఒక బృందం (లేవీయులు) పాడితే, మరో బృందం (జనం) ప్రతిస్పందించి మరో పదం పాడుతారు. ఇవి బహుశా ఈ కీర్తనలు అయ్యుంటాయి. కీర్తనలు 111-118,136.

**అహష్వేరోషు** సుమారు క్రీ.పూ 485-465 సంవత్సరాల్లో పారశీక చక్రవర్తి .

**అర్తహషస్త** క్రీ.పూ సుమారు 465-424 సంవత్సరాలో పారశీక చక్రవర్తి అయిన అహష్వేరోషు కొడుకు.

**అరమాయిక్** బబులోను సామ్రాజ్యంలో అధికార భాష.

**8వ వచనం** ఇక్కడ మూలభాష హెబ్రీనుండి అరమాయికకు మారుతుంది.

యూఫ్రటీసు నదికి పశ్చిమ ప్రాంతలకూ తర
లించిన ప్రజల మహజరు.
[11]అర్తహషస్త ప్రభువుకి, యూఫ్రటీసు నది
యొక్క పశ్చిమాన నివసించే తమ దాసులు
చేసుకున్న విన్నపం:
[12]అర్తహషస్త మహారాజుగారికి, తమరు తమ
వద్ద నుంచి పంపివేసిన యూదులు ఇక్కడికి
చేరుకున్నారు. ఆ యూదులు ఇప్పుడా నగ
రాన్ని తిరిగి పునర్నిర్మించేందుకు ప్రయత్ని
స్తున్నారు. యెరూషలేము ఒక చెడ్డ నగరం. ఆ
నగర ప్రజలు ఎల్లప్పుడూ ఇతర రాజుల మీద
తిరగబడుతూవచ్చారు. ఇప్పుడు యూదులు
పునాదులు కట్టుదిట్టంచేసి, ప్రాకారాలు
కడుతున్నారు.*
[13]అంతేకాదు అర్తహషస్త మహాప్రభూ,
యెరూషలేము నగరమూ, దాని ప్రాకారాలూ
తిరిగి నిర్మింపబడినట్లయితే, యెరూషలేము
ప్రజలు తమ వృత్తిపన్నులు చెల్లించడం నిలి
పేస్తారు. తమ గౌరవార్థం డబ్బు పంపడం మానే
స్తారు. వాళ్లు సుంకం పన్నులు చెల్లించడం
కూడా మానేస్తారు. ఏలినవారికి ఆ సొమ్మంతా
నష్టమవుతుంది.
[14]ప్రభువుల పట్ల మాకు బాధ్యతవుంది.
తమకి నష్టాలు వాటిల్లడం మేము చూడలేము.
అందుచేతనే తమకి విషయాలు తెలియజేసు
కుంటున్నాము.
[15]అర్తహషస్త మహారాజా, తమకు పూర్వం
రాజ్యమేలిన రాజులు వ్రాయించిన చరిత్ర
పత్రాలు తమరు పరిశీలించండి. ఆ పత్రాలవల్ల
యెరూషలేము ఎల్లప్పుడూ యితర రాజులకు
వ్యతిరేకంగా తిరుగబడినట్లు తమకు తెలియవ
స్తుంది. ఇతర రాజులకూ, రాజ్యాలకూ వీళ్ల
తిరుగుబాట్లు పెద్దకీడుగా పరిణమించాయి.
ప్రాచీనకాలం నుంచీ యీ నగరంలో అనేక
తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి! యెరూష
లేము నాశనం చేయబడినది సరిగ్గా అందుకే!
[16]అర్తహషస్త మహారాజా, ఈ నగరమూ, దాని
ప్రాకారాలూ తిరిగి నిర్మింపబడినట్ల యితే,
యూఫ్రటీసు నదికి పశ్చిమానగల ప్రాంతంమీద
తమకు అదుపు తప్పిపోతుందని తమకు తెలియ
జేయాలని కోరుకుంటున్నాము.

[17]అప్పుడు అర్తహషస్త చక్రవర్తి వాళ్లకి ఇలా సమా
ధానం ఇచ్చాడు:
పాంతీయాధికారి రెహూముకీ, కార్యదర్శి
షిమ్షయికీ, సమరియాలోనూ, యూఫ్రటీసు
నదికి పశ్చిమానా మీతో బాటు నివసించేవారికీ,
శుభాకాంక్షలు.
[18]మీరు మాకు పంపిన లేఖను అనువదించి
మాకు వినిపించారు. [19]నా వెనుకటి రాజుల
పత్రాలు గాలించవలసిందిగా నేను ఆదేశించాను.
ఆ పత్రాలు చదివి వినిపించారు. రాజులకి వ్యతి
రేకంగా తిరుగుబాట్లు చేసిన సుదీర్ఘ చరిత్ర
యెరూషలేముకు ఉన్నట్లు మేము కను
గొన్నాము. యెరూషలేములో తరచూ పితూ
రీలు, తిరుగుబాట్లు సంభవించాయి. [20]యెరూష
లేమునూ, యూఫ్రటీసు నదికి పశ్చిమానగల
ప్రాంతమంతటినీ శక్తిసంపన్నులైన రాజులు
పాలించారు. పన్నులు, రాజుల గౌరవార్థం కాను
కలు, సుంకం పన్నులు ఆ రాజులకు చెల్లింప
బడ్డాయి.
[21]ఇప్పుడిక మీరు చేయవలసినది, వాళ్లని
పని నిలిపివేయవలసినదిగా ఆజ్ఞ జారీ చేయడం.
యెరూషలేము పునర్నిర్మాణం జరగకుండా
మీరా ఆజ్ఞ ఇవ్వాలని నా ఆదేశం. [22]ఈ వ్యవ
హారంలో అశ్రద్ధ జరగకుండా మీరు జాగ్రత్త
వహించాలి. మనం యెరూషలేము పునర్నిర్మా
ణాన్ని కొనసాగనివ్వరాదు. అదే జరిగితే మాకింక
యెరూషలేమునుంచి ఎంత మాత్రమూ డబ్బు
ముట్టదు.

[23]అర్తహషస్త చక్రవర్తి పంపిన ఈ లేఖ నకలు రెహూ
ముకీ, కార్యదర్శి షిమ్షయికీ, వాళ్లతోవున్న ఇతర ప్రజ
లకు అందింది. దాన్ని చదివిన మీదట వాళ్లు వెంటనే
యెరూషలేములోని యూదుల వద్దకు వెళ్లారు. ఆ
యూదుల చేత నిర్మాణపు పనిని వాళ్లు బలవంతాన
నిలిపివేయించారు.

### దేవాలయ నిర్మాణపు పని నిలిచిపోవుట

[24]దానితో, యెరూషలేములోని యెహోవా దేవా
లయ నిర్మాణపు పని నిలిచిపోయింది.* పారసీక చక్ర
వర్తి దర్యావేషు పాలన రెండవ సంవత్సరం* దాకా
తిరిగి ఈ నిర్మాణ కృషి కొనసాగలేదు.

---

**ప్రాకారాలు కడుతున్నారు** నగర రక్షణ చేసుకునే మార్గాల్లో యిదొకటి. యూదులు చక్రవర్తికి వ్యతిరేకంగా తిరుగుబాటు సన్నాహాలు చేస్తున్నట్లు స్ఫురింపచేయడం యీ వ్యక్తుల సంకల్పం.

**దేవాలయ ... నిలిచిపోయింది** అహర్వేరోషు కాలంలో దేవాలయ నిర్మాణం కృషి నిలిపివేయబడిన ఘటనకి యిది ప్రస్తావన. అంతేగాని, అర్తహషస్త కాలంలో నగర ప్రాకారాల నిర్మాణ కృషి నిలిపివేయబడిన దానికి కాదు ప్రస్తావన.

**దర్యావేషు ... రెండవ సంవత్సరం** క్రీ.పూ 520.

5 ఆ కాలంలో ప్రవక్తలైన హగ్గయి,*ఇద్దో కొడుకు
జెకర్యా* దేవుని పేరిట ప్రవచించారు. యూదా,
యెరూషలేములలోని యూదులను వాళ్లు ప్రోత్సహిం
చారు. 2దానితో, షియల్తీయేలు కొడుకు జెరుబ్బా
బెలు, యోజాదాకు కొడుకు యేషూవలు యెరూషలే
ములోని దేవాలయ నిర్మాణ కృషిని తిరిగి ప్రారంభిం
చారు. దేవుని ప్రవక్తలందరూ వారితో ఉండి, ఆ పనికి
తోడ్పడుతూ వచ్చారు. 3ఆ కాలంలో యూఫ్రటీసు
నది పశ్చిమ ప్రాంతానికి తత్తెనై యు అధిపతి. తత్తె
నై యు, షెతర్బోజ్నయి, వారి సహోద్యోగులు
నిర్మాణ కృషి సాగిస్తున్న జెరుబ్బాబెలు, యేషూవ,
తదితరుల వద్దకు వెళ్లి, "ఈ దేవాలయాన్ని పునర్ని
ర్మించి, దీన్ని సరికొత్తదానిగా రూపొందించడానికి మీకు
ఎవరు అనుమతినిచ్చారు?" అని నిలదీశారు. 4అంతే
కాదు, వాళ్లు జెరుబ్బాబెలును, "ఈ భవనం పని చేస్తున్న
వాళ్ల పేర్లు యేమిటి?" అని కూడా ప్రశ్నించారు.
5అయితే, యూదా నాయకుల మీద దేవుని దృష్టి
వుంది. దర్యావేషు చక్రవర్తికి భవన నిర్మాతలు లేఖలు
పంపుకున్నారు. చక్రవర్తి సమాధానం పంపేదాకా, వాళ్లు
పనిని నిలుపు చేయవలసిన అవసరం లేకపోయింది.
వాళ్లు తమ నిర్మాణ కృషిని కొనసాగించారు.
6యూఫ్రటీసు నది పశ్చిమ ప్రాంతాధిపతి అయిన
తత్తెనై యు, షతర్బోజ్నయి, వారి ముఖ్య సహో
ద్యోగులు దర్యావేషు చక్రవర్తికి ఒక లేఖ పంపారు.
7ఆ లేఖ నకలు ఇది: దర్యావేషు చక్రవర్తికి శుభం!

8దర్యావేషు చక్రవర్తికి మేము ఇందు
మూలంగా తెలియజేసేది ఏమంటే, తమ ఆదేశం
మేరకు యూదా రాజ్యంలో గొప్ప దేవుని ఆల
యానికి మేము వెళ్లాము. యూదాలోని ప్రజలు
ఆ ఆలయాన్ని పెద్దపెద్ద రాళ్లతో కడుతున్నారు.
గోడల్లో వాళ్లు పెద్ద దూలాలు పరుస్తున్నారు
ఎంతో శ్రద్ధగా పనిచేస్తున్నారు. వాళ్లు చాలా
వేగంగా నిర్మాణం సాగిస్తున్నారు. త్వరలోనే పని
పూర్త వుతుంది. 9వాళ్లు చేస్తున్న పనిని గురించి
మేము వాళ్ల నాయకుల్ని కొన్ని ప్రశ్నలు అడి
గాము. "ఈ దేవాలయాన్ని తిరిగి నిర్మించేం
దుకూ, కొత్తదానిగా దాన్ని రూపొందిం
చేందుకూ మీకు ఎవరు అనుమతి ఇచ్చారు?"
అని మేము ప్రశ్నించాము. 10మేము వాళ్ల పేర్లు
కూడా అడిగాము. వాళ్లెవరో మీరు తెలుసు
కోగలిగేందుకు వీలుగా మేము వాళ్ల పేర్లు వ్రాసి
పెట్టాలని అనుకున్నాము. 11వాళ్లు మాకు
ఇచ్చిన సమాధానం యిది:

"మేము భూ, పరలోకాల అధిపతియైన
యెహోవా దేవుని సేవకులం. చాలా సంవత్స
రాల క్రితం ఇశ్రాయేలు మహారాజొకడు నిర్మించి
ముగించిన దేవాలయాన్ని మేమిప్పుడు తిరిగి
నిర్మిస్తున్నాం.
12కాని, మా పూర్వీకులు దేవునికి కోపం
తెప్పించారు. ఆయన వారిని బబులోను రాజైన
నెబుకద్నెజరుకు లోబరిచాడు. నెబుకద్నెజరు
ఈ దేవాలయాన్ని నిర్మూలించాడు, ప్రజలను
బలవంతాన బబులోనుకు బందీలుగా తీసుకు
పోయాడు. 13అయితే, కోరెషు చక్రవర్తి దేవా
లయం తిరిగి నిర్మింపబడాలని ఒక ప్రత్యేకాజ్ఞ
జారీ చేశాడు.
14కోరెషు గతంలో యెహోవా దేవాలయం
నుంచి కొల్లగొట్టిన వెండి, బంగారు వస్తువులను
బబులోనులోని అబద్ధపు దేవత ఆలయం
నుంచి బయటికి తీయించాడు. నెబుకద్నెజరు
గతంలో ఆ వస్తువులను యెరూ షలేములోని
ఆలయం నుంచి కొల్లగొట్టి, వాటిని బబులోను
లోని తన అబద్ధపు దేవత దేవాలయంలో
ఉంచాడు. ఇప్పుడు కోరెషు చక్రవర్తి ఆ వెండి,
బంగారు వస్తువులను షేష్బజ్జరుకు ఇచ్చాడు.
కోరెషు షేష్బజ్జరును ప్రాంతీయాధికారిగా
నియమించాడు."
15కోరెషు షేష్బజ్జరును ఇలా ఆదేశించాడు:
"నువ్వీ వెండి, బంగారు వస్తువులను తీసుకు
పోయి, వాటిని తిరిగి యెరూషలేములోని దేవాల
యంలో పెట్టు. గతంలో ఉన్న చోటనే దేవాల
యాన్ని తిరిగి నిర్మింప జేయి." 16షేష్బజ్జరు
వచ్చి, యెరూషలేములోని దేవాలయానికి పునా
దులు నిర్మించాడు. ఆనాటి నుంచి నేటిదాకా
పని కొనసాగింది. అయితే, ఆ పని యింకా
పూర్తి కాలేదు.
17ఇప్పుడిక, తమకి సమ్మతమైతే, చక్రవర్తి
గారి ఆధికారిక చారిత్రక పత్రాలను గాలించండి.
యెరూషలే ములో దేవాలయం నిర్మించుమని
కోరెషు చక్రవర్తి ఆజ్ఞ జారీచేశారన్న మాట నిజ
మేనేమో పరిశీలించండి. తర్వాత తమరీ విష
యంలో తీసుకున్న నిర్ణయమేమిటో దయచేసి
మాకొక లేఖద్వారా తెలియజేయండి.

### దర్యావేషు ఆజ్ఞ

6 దర్యావేషు చక్రవర్తి తన ముందరి రాజుల చారిత్రక
పత్రాలను గాలించవలసిందిగా ఆదేశించాడు. ఆ
పత్రాలు బబులోనులో డబ్బును పదిలపరచిన ఖజానా
లోనే పదిలపరచబడ్డాయి. 2మాదీయ రాష్ట్రంలోని
ఎగ్బతానా కోటలో చుట్టబడిన పత్రం ఒకటి కని

---

**హగ్గయి** హగ్గయి 1:1 చూడండి.

**ఇద్దో కొడుకు జెకర్యా** జెకర్యా 1:1 చూడండి.

పించింది. ఆ చుట్టబడిన పత్రం* లో యిలా వ్రాయ
బడివుంది:

అధికార పత్రం: 3కోరెషు చక్రవర్తి పాలన
మొదటి సంవత్సరంలో, కోరెషు యెరూషలేము
లోని దేవాలయం విషయంలో ఈ కింది ఆజ్ఞ
జారీ చేశాడు. ఆ ఆజ్ఞలో ఇలా పేర్కొన బడింది:
బలులు అర్పించేందుకు అనువైన యెరూష
లేము దేవాలయం తిరిగి నిర్మించబడాలి. దానికి
పునాదులు వెయ్యనియ్యండి, దేవాలయం
(పొడవు 90 అడుగులు, వెడల్పు 90 అడుగులు
వుండాలి.) 4దాని చుట్టూ వుండే గోడ మూడు
వరుసల పెద్ద రాళ్లతో, ఒక వరుస పెద్ద కొయ్య
దూలాలతో నిర్మింపబడాలి. దేవాలయ నిర్మా
ణాని కయ్యే ఖర్చులు చక్రవర్తి ఖజానానుంచి
చెల్లించాలి. 5అంతేకాదు, దేవాలయం నుంచి
తెచ్చిన వెండి, బంగారు వస్తువులు తిరిగి వాటి
వాటి స్థానాల్లో వుంచబడాలి. వెనక, నెబుకద్నె
జరు యెరూషలేములోని దేవా లయం లోంచి
కొల్లగొట్టి, ఆ వస్తువులను బబులోనుకు
తెచ్చాడు. వాటిని తిరిగి ఆ దేవాలయంలో
వుంచాలి.
6ఇప్పుడిక దర్యావేషునైన నేను, యూఫ్రె
టీసు నది పశ్చిమ ప్రాంత అధికారియైన తత్తె
నైయు, షెతర్బోజ్నయినీ, ఆ రాజ్యంలో నివ
సించే అధికారులందరినీ యెరూషలేముకు
దూరంగా వుండవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను.
7అక్కడి పనివాళ్లని వేధించకండి. ఆ దేవా లయ
నిర్మాణాన్ని ఆపేందుకు ప్రయత్నించకండి.
యూదా పాలనాధికారీ, యూదా నాయకులూ
ఆ దేవాలయాన్ని తిరిగి నిర్మించాలి. ఆ దేవా
లయం పూర్వం ఎక్కడున్నదో సరిగ్గా అదే
స్థలంలో దాన్ని తిరిగి నిర్మించాలి.
8ఇప్పుడు నేనీక్రింది ఆజ్ఞను జారీ చేస్తు
న్నాను. దేవాలయం నిర్మిస్తున్న యూదా పెద్ద
లకు, మీరు ఈ కింది పనులు చెయ్యాలి.
దేవాలయ నిర్మాణ ఖర్చులు పూర్తిగా ఖాజానా
నుంచి చెల్లింపబడాలి. ఆ సొమ్ము యూఫ్రటీసు
నది పశ్చిమ ప్రాంతంలోని రాష్ట్రాల నుంచి
పన్నుల రూపంలో వసూలు చేయబడాలి. ఆ
నిర్మాణం ఆగిపోకుండా వుండేందుకుగాను మీరీ
పనులు త్వర త్వరగా చెయ్యాలి. 9వాళ్లకి ఏమి
కావాలన్నా సరే ఇవ్వండి. పరలోక దేవునికి
బలి ఇచ్చేందుకు వాళ్లు దూడలు, పొట్టేళ్లు,
గొర్రెపిల్లలు కావాలంటే, వాటిని వాళ్లకి ఇవ్వండి.
యెరూషలేము యాజకులు గోధుమలు,
ఉప్పు, ద్రాక్షారసం, నూనె కావాలంటే, వాటిని
మీరు ప్రతిరోజూ వాళ్లకి తప్పనిసరిగా ఇవ్వండి.
10పరలోక దేవుని సంతృప్తి పరచేందుకోసం
మీరు వీటిని యూదా యాజకులకు ఇవ్వండి.
ఆ యాజకులు నా కోసం, నా కొడుకుల
కోసం ప్రార్థన చేసేందుకుగాను మీరు వాటిని
వాళ్లకి ఇవ్వండి.
11దీనికి తోడు నా మరో ఆజ్ఞ: ఎవరైనా
ఈ ఆజ్ఞను అతిక్రమిస్తే అతని ఇంటి దూలాన్ని
ఊడపీకి, దానితో అతని పొట్టలో పొడవాలి.
అతని ఇంటిని ధ్వంసంచేసి, దాన్నొక రాళ్ల
కుప్పగా మార్చాలి. 12దేవుడు యెరూషలే
ములో తన నామమును ఉంచాడు. ఈ నా
ఆజ్ఞను ధిక్కరించ ప్రయత్నించే వ్యక్తి ఒక
రాజైనా, మరొకడెవడైనా, అతన్ని ఆ దేవుడు
ఓడిస్తాడని నేను ఆశిస్తున్నాను, యెరూషలేము
లోని ఈ దేవాలయాన్ని ధ్వంసం చేయాలని
ఏ వ్యక్తి అయినా ప్రయత్నిస్తే, దేవుడు అతన్ని
నాశనం చేస్తాడని నేను ఆశిస్తున్నాను. జాగ్రత్త,
ఇది నా (దర్యావేషు చక్రవర్తి) తిరుగులేని ఆజ్ఞ.
దీన్ని విధిగా వెంటనే, పూర్తిగా పాటించాలి!

### దేవాలయ నిర్మాణ పరిపూర్తి, ప్రతిష్ఠ

13సరే, యూఫ్రటీసు నది పశ్చిమ ప్రాంత పాలనాధి
కారి తత్తెనైయు, షెతర్బోజ్నయి, వారి సహోద్యో
గులు దర్యావేషు చక్రవర్తి ఆజ్ఞను సంపూర్ణంగా పాటిం
చారు. 14దానితో, యూదుల పెద్దలు (నాయకులు)
నిర్మాణ కృషిని కొనసాగించారు. ప్రవక్త హగ్గయి, ఇద్దో
కొడుకు జెకర్యాల ప్రోత్సాహంతో వాళ్లు జయప్రదమ
య్యారు. వాళ్ల దేవాలయ నిర్మాణాన్ని పూర్తి చేశారు.
ఇశ్రాయేలీయుల దేవుని ఆజ్ఞాపాలన క్రమంలో యీ
పని పూర్తయింది. ఈ పని పూర్తయ్యేందుకు పారసీక
చక్రవర్తులైన కోరెషు, దర్యావేషు, అర్తహషస్తల ఆజ్ఞలు
పాలింపబడటం కూడా కారణమే.
15దేవాలయ నిర్మాణం అదారు నెల, మూడవ
రోజున* దర్యావేషు చక్రవర్తి పాలన ఆరవ ఏట*
పూర్తయింది.

---

**చుట్టబడిన పత్రం** చర్మంతోను, పపీరస్ అనే చెట్టు పట్ట లతోను చుట్టబడిన పత్రం ఆటిమీద లేఖలు, పుస్తకాలు వ్యవహార రత్రాలు వ్రాయబడేవి.

**అదారు ... మూడవ రోజున** ఫిబ్రవరి-మార్చి, కొందరు ప్రాచీన రచయితలు "అదారు 23వ రోజు"అని పేర్కొన్నారు.

**దర్యావేషు ... ఆరవ ఏట** క్రీ.పూ 515.

16అప్పుడిక ఇశ్రాయేలీయులు, యాజకులు, లేవీ
యులు, నిర్భంధంనుంచి వెనక్కి తిరిగి వచ్చిన ఇత
రులు ఆ దేవాలయ ప్రతిష్ఠను పెద్ద పండుగలా, ఎంతో
సంతోషంగా జరుపుకున్నారు.
17వాళ్లు దేవాలయ ప్రతిష్ఠ పండుగను యిలా జరు
పుకున్నారు: వాళ్లు 100 ఎడ్లను, 200 పొట్టేళ్లను, 400
గొర్రెపోతులను బలి ఇచ్చారు. వాళ్లు 12 మేకపోతులను
ఇశ్రాయేలీయులందరి కొరకు పాపపరిహారార్థ బలిగా
యిచ్చారు. అది ఒక్కొక్క వంశానికి ఒకటి చొప్పున
12 వంశాల ఇశ్రాయేలీయులకు.
18అటు తర్వాత, యెరూషలేము దేవాలయంలో
సేవల నిమిత్తం వాళ్లు తమ వంశాల్లోనూ, లేవీయులు
తమ వంశాల్లోనూ, యాజకులను ఎంపిక చేశారు.
వాళ్లీ కార్యక్రమాలను సరిగ్గా మోషే ధర్మశాస్త్రంలోని
నిబంధనల ప్రకారం చేశారు.

### పస్కా పండుగ

19*మొదటి నెల పద్నాల్గవ రోజున నిర్బంధం
నుంచి వెనక్కి తిరిగి వచ్చిన యూదులు పస్కా పండుగ
జరుపుకున్నారు. 20యాజకులు, లేవీయులు ఆ
రోజున తమను తాము శుద్ధిచేసుకున్నారు. వాళ్లందరూ
తమని తాము శుభ్రం చేసుకుని పస్కా పండుగ నాడు
చేసుకునేందుకు సంసిద్ధులయ్యారు. లేవీయులు
నిర్బంధంనుంచి తిరిగి వచ్చిన యూదులందరి కోసం
పస్కా పండుగ గొర్రెపిల్లల్ని బలియిచ్చారు. వాళ్లీ బలిని
తమ సోదరులైన యాజకుల కోసం, తమకోసం
ఇచ్చారు.
21అలాగ, నిర్బంధంనుంచి తిరిగి వచ్చిన
ఇశ్రాయేలీయులందరూ పస్కా పండుగ భోజనం
చేశారు. ఇతరులు స్నానాదులతో తమని తాము శుభ్రం
చేసుకుని, ఆ దేశంలో నివసించే ఇతర మనుష్యుల
అపరిశుభ్ర అంశాలనుంచి తమని తాము వేరు చేసు
కున్నారు. అలా పరిశుద్ధులైన వాళ్లు కూడా పస్కా
పండుగ భోజనంలో పాల్గొన్నారు. వాళ్లు సహాయం
కోసం, ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా దగ్గరకు
పోగలిగేందుకు, వారు తమ్మును తాము వేరు చేసుకొని
పరిశుద్ధ పరచుకొన్నారు.
22వాళ్లు ఏడు రోజులపాటు పులియని రొట్టెల
పండుగను ఎంతో సంబరంగా జరుపుకున్నారు.
అష్షూరు రాజు* మనోవైఖరిని మార్చి, యెహోవా
వాళ్లకెంతో సంతోషం కలిగిం చాడు. దానితో, అష్షూరు
చక్రవర్తి దేవాలయ పునర్నిర్మాణ కృషిని సాగిం
చేందుకు వాళ్లకి తోడ్పడ్డాడు.

### యెరూషలేముకు ఎజ్రా రాక

7 ఈ సంఘటనల తర్వాత* పారసీక రాజు అర్తహ
షస్త పాలన కాలంలో ఎజ్రా బబులోను నుంచి
యెరూషలేముకి వచ్చాడు. ఎజ్రా శెరాయా కొడుకు.
శెరాయా అజర్యా కొడుకు, అజర్యా హిల్కీయా
కొడుకు, 2హిల్కీయా షల్లూము కొడుకు. షల్లూము
సాదోకు కొడుకు, సాదోకు అహీటూబు కొడుకు,
3అహీటూబు అమర్యా కొడుకు. అమర్యా అజర్యా
కొడుకు. అజర్యా మెరాయోతు కొడుకు. 4మెరా
యోతు జెరహ్యా కొడుకు. జెరహ్యా ఉజ్జీ కొడుకు.
ఉజ్జీ బుక్కీ కొడుకు.
5 బుక్కీ అబీషూవ కొడుకు. అబీషూవ ఫీనెహాసు
కొడుకు. ఫీనెహాసు ఎలియాజరు కొడుకు.
ఎలియాజరు ప్రధాన యాజకుడైన అహ రోను
కొడుకు. 6బబులోను నుండి యెరూషలేముకు వచ్చిన
ఎజ్రా గొప్ప ఉపదేశకుడు.* అతనికి మోషే
ధర్మశాస్త్రం యెహోవా ద్వారా ఇవ్వబడింది.
యెహోవా ఎజ్రాకి తోడుగా వున్నాడు. అందుకని,
అర్తహషస్త మహారాజు ఎజ్రా కోరుకున్నదల్లా ఇచ్చాడు.
7ఎజ్రాతోబాటు అనేక మంది ఇశ్రాయేలీయులు
తిరిగి వచ్చారు. వాళ్లతో యాజకులు, లేవీయులు,
గాయకులు, ద్వార పాలకులు, ఆలయ సేవకులు
వున్నారు. ఆ ఇశ్రాయేలీయులు అర్తహషస్త చక్రవర్తి
పాలన ఏడవ సంవత్సరంలో యెరూషలేముకి తిరిగి
వచ్చారు. 8అర్తహషస్త చక్రవర్తిగా అయిన ఏడవ సంవ
త్సరం, అయిదవ నెలలో ఎజ్రా యెరూషలేముకి
చేరుకున్నాడు. 9ఎజ్రా, అతనితో ఒక బృందం మొదటి
నెల మొదటి రోజున బబులోను నుంచి బయల్దేరారు.
ఎజ్రా యెరూషలేముకి అయిదవ నెల ఒకటవ రోజున
చేరు కున్నాడు. యెహోవా దేవుడు అతనికి తోడుగా
వున్నాడు. 10ఎజ్రా యెహోవా ధర్మశాస్త్ర అధ్యయ
నానికీ, దాన్ని అనుసరిం చేందుకూ తన కాలమంతటినీ
ఎంతో శ్రద్ధగా వినియోగించాడు. ఎజ్రా ఇశ్రాయేలీ
యులకు యెహోవా ఆజ్ఞలనూ, ఆదేశ సూత్రాలనూ
బోధించాలని కోరుకున్నాడు. అంతమాత్రమే కాదు,
ఇశ్రాయేలు ప్రజలు ఆ ఆజ్ఞలను అనుసరించడంలో
వారికి తోడ్పడాలని కూడా అతను కోరుకున్నాడు.

---

**19వ వచనం** ఇక్కడ మూల పాఠం అరామాయికు భాషనుంచి హెబ్రీ భాషకి మారింది.

**అష్షూరు రాజు** బహుశః యిది పారశీక రాజు దర్యావేషు కావచ్చు.

**ఈ సంఘటనల తర్వాత** ఎజ్రా 6కీ, ఎజ్రా 7కీ మధ్య 58 సంవత్సరాల కాలవ్యవధి వుంది. ఎస్తేరు సంఘటన జరిగినది యీ కాలంలోనే.

**ఉపదేశకుడు** శబ్దార్థం "లేఖరి." గ్రంథాలకు ప్రతులు వ్రాసే వ్యక్తి. అలాంటి వ్యక్తులు ఆ గ్రంథాలు అధ్యయనం చేసి, ఉపదేశకులయే వారు.

### ఎజ్రాకి అర్తహషస్త చక్రవర్తి లేఖ

[11]ఎజ్రా యాజకుడు, ఉపదేశకుడు, యెహెూవా ప్రభువు ఆదేశాలను గురించీ, ధర్మశాస్త్ర నిబంధనలను గురించీ అతనికి బాగా తెలుసు.

[12]ఎజ్రా ఉపదేశకునికి అర్తహషస్త మహారాజు పంపిన లేఖనకలు: యాజకుడూ, పరలోక దేవుని ధర్మశాస్త్ర ఉపదేశకుడూ అయినఎజ్రాకి:

అభివందనాలు! [13]ఈ క్రింది ఆజ్ఞ జారీ చేస్తున్నాను, నా సామ్రాజ్యంలో నివసిస్తున్న ఏ వ్యక్తి, యాజకుడు, లేక లేవీయుడు అయినా ఎజ్రాతోబాటు యెరూషలేముకు పోవాలన కుంటే, అతనలా పోవచ్చు.

[14]ఎజ్రా! నా ఏడుగురు మంత్రులూ, నేనూ, నిన్ను పంపిస్తున్నాం. నువ్వు యూదాకి, యెరూషలేముకి వెళ్లాలి. మీ దేవుని ధర్మ శాస్త్రాన్ని మీ ప్రజలు ఎలా ఆచరిస్తున్నారో పరిశీ లించు, పర్యవేక్షించు. ఆ ధర్మశాస్త్రం నీ దగ్గర వుంది కదా.

[15]నా మంత్రులూ, నేనూ ఇశ్రాయేలు దేవు నికి వెండి బంగారాలు యిస్తున్నాం. దేవుడు యెరూషలేములో వుంటాడు. నువ్వు నీతో ఈ వెండి, బంగారాలు తీసుకువెళ్లాలి. [16]అంతే కాదు, నువ్వు బబులోను దేశంలోని రాష్ట్రాలన్నిం ట్లోనూ పర్యటించి, మీ ఇశ్రాయేలు ప్రజల నుంచీ, యాజకులనుంచీ, లేవీయుల నుంచీ కానుకలు పోగుచెయ్యి. ఆ కానుకలు యెరూష లేములోని ఆలయ నిర్మాణం నిమిత్తం ఉద్దేశింప బడ్డాయి.

[17]ఆ సొమ్మును ఎడ్లను, పొట్టేళ్లను, గొర్రె పిల్లలను కొనేందుకు వినియోగించు. ఆ బలుల తోబాటు సమర్పించవలసిన ధాన్యార్పణలనూ, పానార్పణలనూ కొను. తర్వాత యెరూషలేము లోని మీ దేవుని దేవాలయంలో వాటిని బలి ఇవ్వు. [18]తర్వాత నువ్వూ, నీ సోదర యూదులూ ఇంకా మిగిలిపోయిన వెండి బంగా రాలను మీ ఇష్టం వచ్చిన విధంగా వాడు కోవచ్చు. దాన్ని మీ దేవునికి ప్రీతికరమైన పద్ధతిలో ఉపయోగించు. [19]నువ్వు వస్తువు లన్నీ యెరూషలేము దేవుని సన్నిధికి తీసుకుపో. ఆ వస్తువులు మీ దేవుని ఆరాధన కోసం. [20]మీ దేవుని ఆలయం కోసం అవసరమైన అనేక ఇతర వస్తువులను కూడ మీరు పొందవచ్చు. నీకు అవసరమైన ఏ వస్తువు కోసమైనా సొమ్మును రాజ ఖజానా నుంచి తీసుకో.

[21]అర్తహషస్త చక్రవర్తినైన నేను ఈ క్రింది ఆజ్ఞను జారీచేస్తున్నాను: యూఫ్రటీసు నది పశ్చిమ ప్రాంతంలో రాజధనాన్ని పర్యవేక్షిస్తున్న వ్యక్తులందరికీ ఎజ్రా ఏమి కోరుకుంటే, దాన్ని అతనికి ఇవ్వవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను. ఎజ్రా యాజకుడు, పరలోక దేవుని ధర్మశాస్త్రాన్ని బోధించే ఉపదేశకుడు. మీరీ పనిని సత్వరం సంపూర్ణంగా చెయ్యండి. [22]మీరు ఎజ్రా 3,400 కిలోగ్రాముల వెండిని, వెయ్యి తూముల గోధు మను, 2,200 లీటర్ల ద్రాక్షారసమును, 2,200 కిలోగ్రాములు ఒలీవ నూనెను అడిగి నంత ఉప్పును యివ్వండి. [23]పరలోక దేవుడు ఎజ్రా కోసం ఏమి ఆదేశిస్తే, దాన్ని మీరు ఎజ్రాకి సత్వరం, సంపూర్ణంగా ఇవ్వండి. మీరీ పనులు పరలోక దేవుని ఆలయంకోసం చెయ్యండి. దేవునికి నా సామ్రాజ్యం మీదా, నా కొడుకుల మీదా కోపం రావడం నాకు యిష్టం లేదు.

[24]యాజకులు, లేవీయులు, గాయకులు, ద్వారపాలకులు, దేవాలయ సేవకులు, దేవాల యంలోని యితర పనివాళ్ల దగ్గర పన్నులు వసూలు చేయడం ధర్మశాస్త్ర విరుద్ధమన్న విషయం మీరు తెలుసు కోవాలని నేను కోరు కుంటున్నాను. వాళ్ల పన్నులు, రాజుగారికి నజ రానాలు, ఏ విధమైన సుంకపు పన్నులు చెల్లించ నక్కర్లేదు. [25]ఎజ్రా, మీ దేవుని యొద్ద నుంచి నువ్వు పొందిన వివేకాన్ని వినియోగించి పౌర, మతపర న్యాయాధిపతులను ఎంపి కచేసే అధికా రాన్ని నేను నీకు ఇస్తున్నాను. వాళ్లు యూఫ్ర టీసు నది పశ్చిమ ప్రాంతంలో నివసించే ప్రజలందరికీ న్యాయాధిపతులుగా వ్యవహరి స్తారు. నీ దేవుని ఆజ్ఞలను ఎరిగిన ప్రజలకందరికీ వారు తీర్పుతీరుస్తారు. దేవుని ఆజ్ఞలను గురించి వారు తెలియని వారికి నేర్పాలి. [26]మీ దేవుని ధర్మశాస్త్రాన్నిగాని, చక్రవర్తి శాసనాన్నిగాని ఎవ రైనా మన్నించకపోతే, అతను శిక్షించబడాలి. నేరాన్ని బట్టి అతనికి మరణ దండనో లేక దేశాంతరవాస శిక్షో విధించాలి, లేక అతని ఆస్తిని జప్తు చేయాలి, లేక అతన్ని చెరసాలలో పెట్టాలి.

### దేవునికి ఎజ్రా స్తోత్రాలు

27 *యెరూషలేములో వున్న యెహెూవా
ఆలయానికి ఘనత చేకూర్చాలనే తలం
పును రాజు మదిలో నాటిన ప్రభువుకు
మా పూర్వీకుల దేవుడైన యెహెూవాకు
కీర్తి కలుగునుగాక!
28 చక్రవర్తి, ఆయన మంత్రుల, ఇతరేతర
ముఖ్యాధికారుల ఎదుట నాపై నిజమైన

---

**27వ వచనం** ఇక్కడ పాఠం అరామాయికు భాష నుంచి హెబ్రీలోకి మారుతుంది.

ప్రేమను ప్రభువు చూపించాడు. దేవుడైన
యెహోవా నాతో ఉన్నాడు, అందుకే నేను
ధైర్యంగా ఉన్నాను. యెరూషలేముకు
నాతో పోయేందుకు నేను ఇశ్రాయేలీయుల
నాయకులను సమీకరించాను.

### ఎజ్రాతో తిరిగివచ్చిన పెద్దల జాబితా

8 చక్రవర్తి అర్తహషస్త పాలన కాలంలో బబులోను
నుంచి యెరూషలేముకు నాతో (ఎజ్రా)పాటు
తిరిగివచ్చిన ఆయా కుటుంబాల పెద్దల, తదితరుల
పేర్ల జాబితా ఇది: 2ఫీనెహాసు సంతతి నుంచి గెర్షోము;
ఈతామారు సంతతినుంచి దానియేలు; దావీదు
సంతతి నుంచి హట్టూషు; 3షెకన్యా సంతతినుంచి
పరోషు; పరోషు సంతతినుంచి జెకర్యా, మరో 150
మంది పురుషులు; 4పహత్మోయాబు సంతతినుంచి
జెరహ్యా కొడుకు ఎల్యోయేనై, మరో 200 మంది
పురుషులు; 5షెకన్యా సంతతి నుంచి యహజీయేలు
కొడుకు షెకన్యా, మరో 300 మంది పురుషులు;
6అదీను సంతతినుంచి యోనాతాను కొడుకు ఏబెదు,
మరో 50 మంది పురుషులు; 7ఏలాము సంతతి నుంచి
అతల్యా కొడుకు యెషయా, మరో 70 మంది
పురుషులు; 8షెపట్య సంతతినుంచి మిఖాయేలు
కొడుకు జెబద్యా, మరో 80 మంది పురుషులు;
9యోవాబు సంతతినుంచి యెహీయేలు కొడుకు
ఓబద్యా, మరో 218 మంది పురుషులు; 10షెలోమీతు
సంతతినుంచి యోసిఫ్యా కొడుకు షెలోమీతు, మరో
160 మంది పురుషులు; 11 బేబై సంతతినుంచి బేబై
కొడుకు జెకర్యా, మరో 28 మంది పురుషులు;
12అజ్గాదు సంతతినుంచి హక్కాటాను కొడుకు యోహా
నాను, మరో 110 మంది పురుషులు; 13అదోనీకాము
సంతతిలో చివరి వారినుంచి ఎలీఫెలెటు; యెహీ
యేలు, షెమాయా, మరో 60 మంది పురుషులు;
14బిగ్వయి సంతతినుంచి ఊతై యు, జబ్బూదు, మరో
70 మంది పురుషులు.

### యెరూషలేముకు తిరిగి రాక

15నేను (ఎజ్రా) వాళ్లందరినీ అహవా వైపు పారే
ఒక నది దగ్గర సమావేశపరిచాను. మేము మూడు
రోజుల పాటు అక్కడనే యుంటిమి. ఆ బృందంలో
యాజకులు వున్నారుగాని, లేవీయులెవ్వరూ లేరన్న
విషయం నేను గమనించాను.

16అందుకని, నేను ఎలియెజెరు, అరీయేలు,
షెమయా, ఎల్నాతాను, యారీబు, (మరో) ఎల్నా
తాను, నాతాను, జెకర్యా, మెషుల్లాము అనే పెద్దలను
పిలిచాను. వీరికి తోడు యోయారీబు, ఎల్నాతాను
అనే మరో ఇద్దర్ని (వీళ్లిద్దరూ ఉపాధ్యాయులు) కూడా
పిలిచాను. 17వాళ్లని ఇద్దో వద్దకు పంపించాను. ఇద్దో
కాసిఫ్యా పట్టణానికి నాయకుడు. ఇద్దోకీ, అతని బంధు
వులకు ఏమి చెప్పాలో వివరించి నేను నా మనుష్యులను
అక్కడికి పంపాను. ఇద్దో బంధువులు కాసిఫ్యాలో
దేవాలయ సేవకులు దేవాలయంలో పనిచేసే సేవకు
లను పంపవచ్చునన్న ఆశతో నేను నా మనుష్యులను
ఇద్దో దగ్గరికి పంపాను. 18దేవుడు మాతో ఉన్నాడు
కాబట్టి, ఇద్దో బంధువులు ఈ కిందివాళ్లను మాకు
పంపారు: మాహ్లీ సంతతి నుంచి షేరేబ్యా అనే ఒక
వివేకి (మాహ్లీ లేవీ సంతతుల్లో ఒకడు. లేవీ ఇశ్రాయేలు
కొడుకుల్లో ఒకడు. వాళ్లు అతని కొడుకునీ, అన్నద
మ్ముళ్ళీ కూడా పంపారు. మొత్తంమీద ఆ కుటుంబానికి
చెందిన వాళ్లు 18 మంది). 19మెరారీ సంతతివారి
నుంచి హషబ్యా, యెషయా (వాళ్లు తమ కొడుకులను,
సోదరులను, బంధువులను కూడా పంపారు, ఆ
కుటుంబం నుంచి మొత్తం మంది మగాళ్లు వచ్చారు)
20వారితోపాటు 220 మంది దేవాలయ పరిచారకులు
వచ్చారు. (వాళ్లు లేవీయులకు సాయం చేసేవాళ్లు.
వాళ్ల పూర్వీకులు దావీదు చేత, ముఖ్యాధికారుల చేత
ఎంపిక చేయబడినవాళ్లు. వాళ్లందరి పేర్లూ వ్రాసి
వుంచబడ్డాయి).

21అక్కడ, ఆ అహవా నది దగ్గర నేను (ఎజ్రా)
మనమందరం ఉపవాసం చెయ్యాలని ప్రకటించాను.
మన దేవుని ముందు విధేయత చూపేందుకుగాను
మనం ఉపవాసం చెయ్యాలి. మేమూ, మా పిల్లలూ,
మాకున్న సమస్త వస్తువులూ క్షేమంగా యెరూషలేము
చేరేలా దీవించుమని దేవుణ్ణి వేడు కోవాలనుకున్నాము.
22మా పయాణ మార్గంలో మా రక్షణ కోసం సైని
కుల్నీ, అశ్వికుల్నీ పంపమని అర్తహషస్త చక్రవర్తిని
అర్థించడం నాకు సిగ్గుగా తోచింది. మార్గంలో శత్రు
వులున్నారని నాకు తెలుసు. అయితే అర్తహషస్త చక్ర
వర్తికి మేమంతకు ముందు ఇలా చెప్పివున్నాము: "మా
దేవుడు తనని నమ్మే ప్రతి ఒక్కరికీ తోడుగా ఉంటాడు.
అయితే, దేవుడు తనకు ఎడముఖంగా వున్న ప్రతి
ఒక్కనిపట్లా చాలా కోపంగా వుంటాడు." 23అందుకని,
మేము ఉపవాసం వుండి, మా ప్రయాణం గురించి
మేము దేవుణ్ణి ప్రార్థించాము. ఆయన మా ప్రార్థనలకు
జవాబిచ్చాడు .

24తర్వాత నేను పన్నెండుగురు ముఖ్య యాజ
కులను, షెరేబ్యాను, హషబ్యాను, వాళ్ల సోదరులు పది
మందిని ఎంపికచేశాను. 25దేవాలయం కోసం ఇవ్వ
బడిన వెండిని, బంగారాన్ని తదితర వస్తువులను తూకం
వేయించాను. నేను ఎంపికచేసిన పన్నెండుగురు యాజ
కులకు నేను వాటిని అప్పగించాను. అర్తహషస్త చక్రవర్తి,
ఆయన మంత్రులు, ఆయన ముఖ్యాధికారులు, బబు
లోనులోని ఇశ్రాయేలీయులు అందరూ దేవుని దేవా
లయం కోసం యిచ్చిన వస్తువులవి. 26నేను వాట
న్నింటినీ తూకం వేశాను. వెండి 25 టన్నులు వుంది.

వెండిగిన్నెలు, వస్తువులు మూడుమ్ముప్పాతిక టన్ను
లున్నాయి. మూడుమ్ముప్పాతిక టన్నుల బంగారం
వుంది. 27నేను వాళ్లకి 20 బంగారు గిన్నెలు యిచ్చాను.
అవి 19 పౌనుల బరువున్నాయి. నేను వాళ్లకి మెరుగు
పెట్టిన కంచుతో చేసిన అందమైన రెండు పాత్రలు
ఇచ్చాను. అవి బంగారు వస్తువులంతటి విలువైనవి.
28తర్వాత నేనా పన్నెండుగురు యాజకులతో యిలా
చెప్పాను: "యెహోవా దేవుని దృష్టిలో మీరు పవి
త్రులు, ఆ వస్తువులు పవిత్రమైనవి. ప్రజలు యీ
వెండి బంగారాలను మీ పూర్వీకుల దేవునికి యిచ్చారు.
29అందుకని, మీరీ వస్తువులను జాగ్రత్తగా కాపాడండి.
యెరూషలేములోని దేవాలయ పెద్దలకు మీరు వీటిని
అప్పగించేదాకా, యీ వస్తువులకు మీరే బాధ్యులు.
మీరు వీటిని ముఖ్య లేవీయులకి, ఇశ్రాయేలు కుటుంబ
పెద్దలకీ యిచ్చినప్పుడు వాళ్లు వీటిని తూకం వేసి,
యెరూషలేములోని యెహోవా దేవాలయంలోని
గదుల్లో పదిలపరుస్తారు.
30ఎజ్రా తూకం వేసి తమకిచ్చిన వెండి బంగారా
లనూ, ప్రత్యేక వస్తువులనూ యాజకులూ, లేవీయులు
స్వీకరించి, ఎజ్రా చెప్పినట్లు, వాటిని యెరూషలేము
లోని దేవాలయానికి చేర్చేందుకు సంసిద్ధులయ్యారు.
31మొదటి నెల పన్నెండవ రోజున మేము అహవా
నది దగ్గరనుంచి యెరూషలేముకు బయల్దేరాము.
దేవుడు మాకు తోడుగావుండి, మార్గంలో శత్రువుల
నుంచీ, దోపిడిగాండ్రనుంచీ మమ్మల్ని కాపాడాడు.
32చివరకు మేము యెరూషలేము చేరుకున్నాము.
మేమక్కడ మూడు రోజుల పాటు విశ్రాంతి
తీసుకున్నాము.
33నాల్గవ రోజున దేవాలయానికి వెళ్లి వెండి
బంగారాలనూ, ప్రత్యేక వస్తువులనూ తూకం వేశాము.
మేమా వస్తువులను ఊరియా యాజకుని కొడుకైన
మెరేమోతుకు అప్పగించాము. అతనితో ఫీనెహాసు
కుమారుడు ఎలీయాజరు వున్నాడు. వాళ్లతోబాటు
లేవీయులైన యేషూవ కొడుకు యోజాబాదు,
బిన్నూయి కొడుకు నోవద్యా కూడా వున్నారు.
34మేము అన్ని వస్తువులనూ లెక్కపెట్టి, వాటన్నింటినీ
తూకం వేశాము. తర్వాత మేము అప్పటి మొత్తం
బరువును వ్రాసిపెట్టాము. 35అటు తర్వాత నిర్బంధం
నుంచి తిరిగివచ్చిన యూదులు ఇశ్రాయేలు దేవునికి
దహనబలులు అర్పించారు. వాళ్లు ఇశ్రాయేలీయు
లందరి కొరకు 12 ఎడ్లను, 96 పొట్టేళ్లను, 77 మగ
గొర్రెపిల్లలను, పాప పరిహారార్థబలి నిమిత్తం 12 మేక
పోతులను బలి యిచ్చారు. ఇవన్నీ దహనబలిగా
ఇవ్వబడ్డాయి.
36అటుతర్వాత వాళ్లు అర్తహషస్త ఆజ్ఞలను రాజ
ప్రతినిధులైన సామంత నాయకులకు, యూఫ్రటీసు
నది పశ్చిమ ప్రాంతపు పాలనాధి కారులకు అంద
జేశారు. కనుక వారందరూ వచ్చి దేవుని ఆలయపు
పనిలో సహాయపడ్డారు.

## మిశ్రమ వివాహాలు

9 మేమీ పనులన్నీ ముగించాక ఇశ్రాయేలు నాయ
కులు నా దగ్గరకు వచ్చి ఇలా చెప్పారు: "ఎజ్రా,
ఇశ్రాయేలీయులు తమ చుట్టూ వున్నవారితో తమని
తాము వేరుగా నిలుపుకోలేదు. యాజకులు, లేవీ
యులు సైతం తమ ప్రత్యేకతను కాపాడుకోలేదు.
కనాను, హిత్తీ, పెరిజ్జీ, యెబూషీ, అమ్మోను,
మోయాబు, ఈజిప్టు అమోరీ జాతులవారు చేసే పాపపు
పనులతో ఇశ్రాయేలీయులు చెడుగా ప్రభావి తులవు
తున్నారు. 2ఇశ్రాయేలీయులు మన చుట్టూ వున్న
ఆయా జాతులవారిని పెళ్లిళ్లు చేసుకున్నారు. ఇశ్రా
యేలీయులు తమ ప్రత్యేకతను నిలుపుకొని వుండవల
సింది. కాని, వాళ్లు తమ చుట్టూవున్న ఇతర జాతీయు
లను పెళ్లిళ్లు చేసుకున్నారు. ఇశ్రాయేలీయుల నాయ
కులు, ముఖ్య అధికారులు ఈ విషయంలో చెడ్డ విధా
నాన్ని అనుసరించారు." 3ఈ విషయాలు విన్న నేను
నా మనో దుఃఖాన్ని తెలిపేందుకు అంగీని, పైవస్త్రాన్ని
చింపుకున్నాను. నా జుట్టు, గడ్డం పీక్కు న్నాను.
కలత చెంది దిగ్భ్రాంతుడనై నేను కూర్చుండి
పోయాను. 4అప్పుడు, దేవుని ధర్మశాస్త్రాన్ని ధ్యానించే
ప్రతి ఒక్కడూ భయకం పితుడయ్యాడు. చెరనుంచి
తిరిగివచ్చిన ఇశ్రాయేలీయులు దేవుని పట్ల నమ్మక
ద్రోహులుగా వ్యవహరించినందుకు వాళ్లందరూ భయ
పడ్డారు. సాయంత్రపు బలివరకు కలతచెందిన నేను
మాటలాడక అక్కడే కూర్చుండిపోయాను. అందరూ
నా చుట్టూ మూగారు.
5సాయంత్రపు బలివేళ అవడంతో, నేను లేచి నిల
బడ్డాను. నా అంగీ, పై వస్త్రమూ చీలికలు పేలికలై
వున్నాయి. యెహోవా దేవునివైపు చేతులు చాపి
ప్రార్థిస్తూ, మోకరిల్లాను. 6అప్పుడు నేనిలా
ప్రార్థించాను:
"ఓ దేవా, ఎక్కువ సిగ్గుచేత, కలవరపాటుచేత
నేను నీవైపు ముఖము ఎత్తలేకపోతున్నాను. మా
పాపాలు, దోషాలు మా తలల ఎత్తును మీరిపోయి
ఆకాశాన్ని అంటుతున్నాయి. 7మా పూర్వీకుల నాటి
నుంచి నేటి మా తరందాకా మేము అనేకానేక పాపాలు
చేశాము. అందుకే మా రాజులూ, యాజకులూ శిక్షింప
బడ్డారు. విదేశాల రాజులు మా పైన దాడి చేసి మా
ప్రజలను బందీలుగా తీసుకుపోయారు. ఆ రాజులు
మా సంపదను కొల్లగొట్టి, మమ్మల్ని అవమానానికి
గురిచేశారు. ఈ నాటికీ అదే పరిస్థితి కొనసాగుతోంది.
8"చివరికి ఇప్పుడు, దేవా, నీవు మాపట్ల దయ
చూపావు. మాలో కొద్దిమంది చెరనుంచి తప్పించుకొని
ఈ పవిత్ర ప్రాంతంలో నివసించడాన్ని సాధ్యంచేశావు.

ప్రభువా, నీవు మాకు కొత్త జీవితం, దాస్యములో
నుంచి విముక్తి ప్రసాదించావు. 9మేము బానిసలుగా
వున్నమాట నిజమే, కాని, నీవు మమ్మల్ని శాశ్వతంగా
బానిసలుగా ఉండనియ్యవు. నీవు మాపట్ల దయ
చూపావు. పారసీక ప్రభువులు మాపట్ల దయ చూపేలా
నీవు చేశావు. నీ దేవాలయం ధ్వంసం చేయబడింది.
కాని, నీవు మాకు నూతన జీవితం ప్రసాదించి, మేము
నీ ఆలయాన్ని తిరిగి నిర్మించి, దాన్ని సరికొత్తదానిలా
మలచగలిగే అవకాశం మాకు కల్పించావు. దేవా!
యూదా, యెరూషలేములకు రక్షణగా ప్రాకారం కట్టేం
దుకు నీవు మాకు తోడ్పడ్డావు.

10“ఇప్పుడు దేవా, నీకు మేము చెప్పగలిగింది
ఏముంది? మేము మళ్లీ నీ మాట పాటించడం
మానేశాం! 11దేవా, నువ్వు నీ సేవకులైన నీ ప్రవక్తల
ద్వారా ఆ ఆదేశాలను మాకు ఇచ్చావు. నీవు ఇలా
అన్నావు, “మీరు స్వంతం చేసుకొని, నివసించబోయే
ప్రాంతం అపవిత్రమైన భూమి. అక్కడ నివసిస్తూ
వచ్చిన మనుష్యులు చేసిన చెడ్డపనుల మూలంగా అది
అపవిత్రమైనది. వాళ్లు ఈ దేశంలో అన్నిచోట్లా
ఇలాంటి చెడ్డపనులు చాలా చేశారు. వాళ్లు తమ పాపా
లతో ఈ దేశాన్ని అపవిత్రం చేశారు.

12అందుకని, ఇశ్రాయేలీయులారా, మీ బిడ్డలు వారి
బిడ్డలను పెళ్లి చేసుకోకుండా చూడండి. మీరు వాళ్లతో
కలవకండి! నా ఆదేశాలను పాటించండి, వారితో శాంతి
ఒప్పందం చేయకండి. అప్పుడు మీరు శక్తి కలిగి,
దేశంలోని మంచి వాటిని ఆనందంగా
అనుభవించగలుగుతారు. అప్పుడు మీరు ఈ దేశాన్ని
నిలుపుకొని, దాన్ని మీ బిడ్డలకు సంక్రమింప
జేయగలుగుతారు.”

13మనకి వాటిల్లిన కష్టాలకు మన చెడ్డక్రియలే
కారణం. మనం పాపాలు చేశాం, మన దోషాలు అనేక
మైనవి. అయితే, ఓ దేవా, నీవు మమ్మల్ని శిక్షించ
వలసినంతగా శిక్షించలేదు. మేము ఘోరమైన పాపాలు
ఎన్నో చేశాము. మమ్మల్ని నీవు ఇంకెంతో కఠినంగా
శిక్షించియుండవలసింది. మాలో కొందర్ని దాస్యంలో
సహితం తప్పించుకోనిచ్చావు.

14నీ ఆదేశాలను భంగ పరచకూడదని మేము
తెలుసుకున్నాము. మేము వాళ్లను పెళ్లి
చేసుకోకూడదు. వాళ్లు చేసేవి చాలా చెడ్డ పనులు.
దేవా, మేమా చెడ్డవాళ్లతో పెళ్లి పేరంటాలు కొనసాగించి
నట్లయితే, నీవు మమ్మల్ని నాశనం చేస్తా వని మాకు
తెలుసు! అప్పుడిక ఇశ్రాయేలీయుల్లో ఏ ఒక్కడూ
ప్రాణాలతో మిగిలివుండడు.

15యెహోవా, ఇశ్రాయేలు ప్రజల దేవా, నీవు నీతి
మంతుడవై యున్నావు. మాలో కొందర్ని ప్రాణా లతో
మిగిల్చావు. మా దోషం కారణంగా, మాలో ఒక్కడు
కూడా నీ ముందు నిలిచేందుకు అర్హుడుకాడు.

### తమ పాపాలను ఒప్పుకున్న ప్రజలు

10 ఎజ్రా ఎడతెగకుండా శోకిస్తూ, ప్రార్థిస్తున్నాడు.
అతడు దేవుని దేవాలయం ముందు విలపిస్తూ,
సాష్టాంగపడ్డాడు. ఎజ్రా అలా ప్రార్థిస్తూ వుండగా,
ఇశ్రాయేలీయుల పెద్దల బృందం ఒకటి పురుషులు,
స్త్రీలు, బాలబాలికలు అతని చుట్టూ గుమికూడింది.
వాళ్లు కూడా భోరున విలపించసాగారు. 2అప్పుడు
ఏలాము సంతతివాడైన యెహీయేలు కొడుకు షెకన్యా
ఎజ్రాతో ఇలా అన్నాడు: “మేము దేవునికి విశ్వాస
పాత్రంగా వ్యవహరించలేదు. మేము మా చుట్టూ వున్న
పరాయి జాతుల స్త్రీలను పెండ్లాడాము. అయితే, మేమీ
పని చేసినా కూడా, ఇశ్రాయేలీయులకు ఇంకా ఆశ
వుంది. 3ఇప్పుడిక్కడ మనం మన దేవుని ముందు ఆ
స్త్రీలను, వాళ్ల పిల్లలను అందర్నీ బయటికి పంపేస్తామని
ఒడంబడిక చేద్దాము. ఎజ్రా సలహానూ, మన దేవుని
ఆదేశాలను గౌరవించేవారి సలహాలను పాటించేందుకు
గాను మనం యీ పని చేద్దాము. మనం దేవుని ధర్మ
శాస్త్రాన్ని పాటిస్తాము. 4ఎజ్రా, నువ్వులే, ఇది నీ బాధ్యత,
అయితే, మేమూ నీకు తోడ్పాటు ఇస్తాము. అందుకని
నువ్వు ధైర్యంగా వుండి ఈ పని నిర్వహించు.”

5అప్పుడు ఎజ్రా లేచి నిలబడ్డాడు. ముఖ్య యాజ
కుల చేత, లేవీయుల చేత, ఇశ్రాయేలీయులందరి
చేత తాను చెప్పినది చేస్తామని వాగ్దానం చేయించు
కున్నాడు. 6తర్వాత, ఎజ్రా దేవుని ఆలయం ముందు
నుంచి ఎల్యాషీబు కొడుకు యోహానాను గదికి వెళ్లాడు.
ఎజ్రా అక్కడ వున్నప్పుడు తిండి తినలేదు, నీరు
తాగలేదు. యెరూషలేముకి చెరనుండి తిరిగి వచ్చిన
ప్రజలు చేసిన దేవుని చట్ట ఉల్లంఘన విషయంలో
ఇంకా చాలా దుఃఖితుడై వున్న కారణంగానే, అతనలా
తిండి తీర్థాలు ముట్టకుండా ఉండిపోయాడు. 7అటు
తర్వాత, అతను యూదా, యెరూషలేములలో అన్ని
చోట్లా చాటింపు వేయించాడు. ఆ చాటింపు సందే
శంలో నిర్బంధంనుంచి తిరిగి వచ్చిన యూద వ్యక్తు
లందరూ యెరూషలేములో సమావేశమవ్వాలని
పేర్కొనబడింది. 8మూడు రోజుల్లో అలా యెరూషలే
ముకి రాని వ్యక్తి తన ఆస్తినంతటినీ వదులుకోవలసి
వుంటుంది. అతను నివసిస్తున్న ప్రజాబృందం నుంచి
వెలివేయ బడతాడు. ముఖ్య అధికారులూ, యూదా
పెద్దలూ (నాయకులూ) యెరూషలేము వెళ్లాలని
నిర్ణయం చేశారు. 9దానితో, మూడు రోజుల్లో యూదా,
బెన్యామీను వంశాలకు చెందిన పురుషులందరూ
యెరూషలేములో సమావేశమయ్యారు. తొమ్మిదో
నెల* ఇరవయ్యవ రోజున ప్రజలందరూ దేవాలయ
ఆవరణలో సమావేశమయ్యారు. సమావేశ లక్ష్యం
దృష్ట్యానూ, భారీ వర్షం మూలంగానూ వాళ్లందరూ

---

**తొమ్మిదో నెల** నవంబరు – డిశంబరు.

ఎంతో కలవరపడ్డారు. 10అప్పుడు ఎజ్రా యాజకుడు
ఆ జనాన్ని ఉద్దేశించి యిలా ప్రసంగించాడు: “మీరు
దేవునిపట్ల నమ్మకంగా వ్యవహరించలేదు. మీరు
విదేశీయులను పెళ్లాడారు. మీరు అలా చేయడం ద్వారా
ఇశ్రాయేలును మరింతగా నేరస్థం చేశారు. 11మీరిప్పుడు
నేరం చేసినట్లు యెహోవా ముందు ఒప్పుకోవాలి.
యెహోవా మీ పూర్వీకుల దేవుడు. మీరు యెహోవా
ఆజ్ఞను పాటించాలి. మీరు మీ చుట్టూ నివసించే అన్య
ప్రజలనుంచీ, విదేశీ భార్యలనుంచీ వేరుపడాలి.”

12అప్పుడు అక్కడ కూడిన అందరూ ఎజ్రాకి
బిగ్గరగా ఇలా బదులిచ్చారు, “ఎజ్రా, నీవు చెప్పింది
సరైన మాట! మేము నువ్వు చెప్పిన పనులు
చెయ్యాలి. 13అయితే, ఇక్కడ చాలామంది వున్నారు.
ఇది వర్షాకాలం. మేమిక్కడ బయట నిలబడి వుండటం
కష్టం. మేము చాలా తీవ్రమైన పాపం చేశాము. అందు
కని, ఈ సమస్యను ఒకటి రెండు రోజుల్లో పరిష్క
రించడం సాధ్యంకాదు. 14ఇక్కడ సమావేశమైన వాళ్లం
దరి తరఫునా మా నాయకుల్ని నిర్ణయం తీసుకోమ
నండి. అటు తర్వాత, మా పట్టణాల్లో విదేశీ స్త్రీని
పెళ్లి చేసుకున్న ప్రతివ్యక్తీ ఒక నిర్ణీత సమయంలో
యెరూషలేముకి రావాలి. వాళ్లు ఇక్కడికి తమ పెద్దలతో
(నాయకులు) న్యాయాధిపతులతో కలిసి రావాలి.
అప్పుడు మనపట్ల దేవుని కోపం ఆగుతుంది.”

15కొద్దిమంది మాత్రమే ఈ ఏర్పాటును వ్యతిరే
కించారు. అశాహేలు కొడుకు యోనాతాను, తిక్వా
కొడుకు యహజ్యాయు. మెషుల్లాము, షబ్బెతై యు
కూడా యీ తీర్మానాన్ని వ్యతిరేకించారు.

16చెరనుంచి యెరూషలేముకు తిరిగివచ్చిన
ఇశ్రాయేలీయులందరూ ఈ తీర్మానాన్ని ఆమోదిం
చారు. యాజకుడు ఎజ్రా ఆయా వంశాల నాయకు
లను ఎంపికచేశాడు. అతను ఒకొక్క వంశం నుంచి
ఒక్కొక్కరిని పేర్ల వరుసన ఎన్నుకున్నాడు. పదవ
నెల* మొదటి రోజున ఎంపిక చేయబడిన వ్యక్తులు
కూర్చుని ఒక్కొక్కరి విషయాన్ని విచారణ చేయనా
రంభించారు. 17మొదటి నెల* మొదటిరోజు నాటికి
విదేశీ స్త్రీలను పెళ్లి చేసుకున్న వాళ్లందర్ని గురించీ
చర్చలు ముగించారు.

### విదేశీ స్త్రీలను వివాహం చేసుకున్నవాళ్ల జాబితా

18విదేశీ స్త్రీలను వివాహం చేసుకున్న యాజకుల
సంతతివారి పేర్లు యివి: యోజాదాకు కొడుకు
యేషూవ వంశీకుల నుంచి యేషూవ సోదరులు,
మయశేయ, ఎలీయెజెరు, యారీబు, గెదల్యా.
19వీళ్లందరూ తమ భార్యలకు విడా కులు ఇస్తామని
ప్రమాణం చేశారు. తర్వాత వాళ్లలో ప్రతి ఒక్కడూ
తన నేర పరిహారం నిమిత్తం అపరాధ పరిహారార్థ బలిగా
తన మంద నుంచి ఒక్కొక్క పొట్టేలును
సమర్పించారు.

20ఇమ్మేరు సంతతివారు: హనానీ, జెబద్యా

21హారీము సంతతివారు: మయశేయా, ఏలీయా,
షెమయా, యెహీయేలు, ఉజ్జియా. 22పషూరు సంతతి
వారు: ఎల్యోయేనై, మయశేయా, ఇష్మాయేలు,
నెతనేలు, యోజాబాదు, ఎల్యాశా.

23లేవీయుల్లో పరాయి స్త్రీలను పెళ్లి చేసుకున్న
వారు: యోజాబాదు, షిమీ, కెలిథా, పెతహయా,
యూదా, ఎలీయెజెరు.

24గాయకులలో: ఎల్యాషీబు. ద్వారపాలకులలో:
షల్లూము, తెలెము, ఊరి.

25ఇశ్రాయేలీయుల్లో ఈ క్రిందివారు పరజాతి
స్త్రీలను పెళ్లిచేసుకున్నారు. పరోషు సంతతివారు:
రమ్యా, యిజ్జీయా, మల్కీయా, మీయామిను,
ఎలియేజరు, మల్కీయా, బెనాయా.

26ఏలాము సంతతివారు: మత్తన్యా, జెకర్యా, యెహీ
యేలు, అబ్దీ, యెరేమోతు, ఏలియా.

27జత్తూ సంతతివారు: ఎల్యోయేనై, ఎల్యాషీబు,
మత్తన్యా, యెరేమోతు, జాబాదు, అజీజా.

28బేబై వంశీకులు: యెహోహానాను, హనన్యా,
జబ్బయి, అత్లాయి.

29బానీ సంతతివారు: మెషుల్లాము, మల్లూకు,
అదాయా, యాషూబు, షెయాలు, రామోతు.

30పహత్మోయాబు సంతతివారు: అద్నా, కెలాలు,
బెనాయా, మయశేయా, మత్తన్యా, బెసలేలు,
బిన్నూయి, మనష్షే.

31హారీము సంతతివారు: ఎలీయెజెరు, ఇష్షీయా,
మల్కీయా, షెమయా, షిమ్యోను,

32బెన్యామీను, మల్లూకు, షెమర్యా.

33హాషుము సంతతివారు: మత్తెనై, మత్తత్తా,
జాబాదు, ఎలీపేలెటు, యెరేమై, మనష్షే, షిమీ,

34బానీ సంతతివారు: మయదై, అమ్రాము,
ఊయేలు,

35బెనాయా, బేద్యా, కెలూహు, 36వన్యా, మెరే
మోతు, ఎల్యాషీబు, 37మత్తన్యా, మత్తెనై, యహశావు.

38బిన్నూయి సంతతివారు: షిమీ, 39షెమర్యా,
నాతాను, అదాయా, 40మక్నద్బయి, షామై, షారాయి,
41అజరేలు, షెలెమ్యా, షెమర్యా, 42షల్లూము, అమర్యా,
యోసేపు.

43నెబో సంతతివారు: యెహీయేలు, మత్తిత్యా,
జాబాదు, జెబీనా, యద్దయి, యోవేలు, బెనాయా.

44పై పురుషులందరూ పరాయి జాతుల స్త్రీలను
పెళ్లి చేసుకున్నారు. వాళ్లలో కొందరు ఆ స్త్రీల ద్వారా
సంతానం పొందారు కూడా.

---

**పదవ నెల** డిశంబరు – జనవరి.

**మొదటి నెల** మార్చి – ఏప్రిల్.

# నెహెమ్యా

### నెహెమ్యా ప్రార్థన

1 హకల్యా కుమారుడైన నెహెమ్యా మాటలు ఇవి:
“నెహెమ్యా అనే నేను కిస్లేవు నెలలో రాజధాని
నగరమైన షూషనులో ఉన్నాను. అర్తహషస్త రాజ్య
పాలన ఇరవయ్యవ ఏట ఇది జరిగింది. 2నేను షూష
నులో వుండగా, నా సోదరుల్లో ఒకడైన హనానీయ,
మరి కొందరు యూదా నుంచి వచ్చారు. అక్కడ నివ
సిస్తున్న యూదులను గురించి నేను వాళ్లని అడిగాను.
వాళ్లు చెరనుంచి తప్పించుకొని, ఇంకా యూదాలోనే
నివసిస్తున్న యూదులు. నేను వాళ్లని యెరూషలేము
నగరం గురించి కూడా అడిగాను.
3హనానీయ, అతనితో ఉన్న వాళ్లూ ఇలా చెప్పారు:
“నెహెమ్యా, చెరనుంచి తప్పించుకొనిపోయి యింకా
యూదాలోనే ఉన్న యూదులు చాలా యిబ్బందుల్లో
వున్నారు. వాళ్లకి అనేక సమస్యలు ఎదురౌతున్నాయి.
వాళ్లు చాలా సిగ్గుతోను, అనేక కష్టాలతోను వుంటు
న్నారు. ఎందుకంటే, యెరూషలేము ప్రాకారం కూల్చ
బడింది. దాని ద్వారాలు దగ్ధం చేయబడ్డాయి.”
4యెరూషలేము ప్రజలను గురించీ, ప్రాకారం
గురించీ ఈ విషయాలు విన్నాక, నేను చాలా కలత
చెందాను. నేను కూర్చుండి విలపించాను. నా విచారా
నికి అవధి లేకపోయింది. నేను కొన్ని రోజులపాటు
ఉపవాసం వుండి, పరలోక దేవునికి ప్రార్థనలు చేశాను.
5తర్వాత ఈ కింది ప్రార్థన చేశాను:

పరలోక దేవా, యెహోవా ప్రభూ, నీవు
అత్యంత శక్తిశాలివైన మహా దేవుడివి. నిన్ను
ప్రేమించి నీ ఆజ్ఞలు పాటించే మనుష్యులను
నువ్వు కటాక్షించి వారితో ప్రేమ ఒడంబడికను
అమలుపరుస్తావు.
6దయచేసి నీవు కళ్లు తెరిచి, చెవులొగ్గి
ఈ నీ సేవకుడు రాత్రింబగళ్లు నీ సన్నిధి
యందు చేస్తున్న ప్రార్థనలను విను. నేను నీ
సేవకులైన ఇశ్రాయేలీయుల కోసం ప్రార్థిస్తు
న్నాను. మేము నీకు వ్యతిరేకంగా పాపాలు
చేశామన్న విషయాన్ని నేను ఒప్పుకొంటు
న్నాను. నేనూ, నా తండ్రి కుటుంబంలోని
ఇతరులూ నీకు వ్యతిరేకంగా పాపం చేశామని
ఒప్పుకొంటున్నాను. 7ఇశ్రాయేలు ప్రజల
మైన మేము నీపట్ల చాలా చెడుగా వ్యవహరిం
చాము. నువ్వు నీ సేవకుడైన మోషే ద్వారా
యిచ్చిన ఆజ్ఞలనూ, బోధనలనూ, విధులనూ
మేము తృణీకరించాము.
8నువ్వు నీ సేవకుడైన మోషేకి ఇచ్చిన
ఉపదేశాన్ని దయచేసి గుర్తుచేసుకో. దేవా,
నువ్వు ఆయనకి “మీ ఇశ్రాయేలు ప్రజలు
విశ్వసనీయంగా వ్యవహరించక పోయినట్ల
యితే, మిమ్మల్ని యితర దేశాల మధ్యకు
చెదరగొడ్తాను. 9అలాకాక, మీ ఇశ్రాయేలీ
యులు నా వద్దకు తిరిగి వచ్చి, నా ఆదేశాలను
పాటించి నట్లయితే, అప్పుడు నేనిలా చేస్తాను:
మీ ప్రజలు తమ ఇళ్లు వాకిళ్లు వదలటానికి
బలవంతం చేయబడినా, భూలోకపు అంచుల
దాకా పోయినా సరే, నేను వాళ్లని అక్కడనుంచి
తిరిగి ఒక్కచోట చేరుస్తాను. ఎక్కడైతే నా
నామాన్ని ఉంచుటకు ఏర్పాటు చేసు
కున్నానో అక్కడికి తిరిగి వాళ్లని నేను తీసు
కొస్తాను” అని చెప్పావు.
10ఇశ్రాయేలు ప్రజలు నీ సేవకులు, నీ
ప్రజలు. నువ్వు నీ గొప్ప శక్తిని వినియోగించి,
వాళ్లని విడిపించావు. 11కాబట్టి ప్రభువా, నా
ప్రార్థన ఆలకించు. నేను నీ దాసుడను. నీ
నామం పట్ల గౌరవం ప్రదర్శించాలని ఇష్టపడే
నీ సేవకుల ప్రార్థనలు దయచేసి ఆలకించు.
ప్రభూ, నేను రాజుకి ద్రాక్షారసం అందించే
సేవకుణ్ణి.* ఈ విషయం నీకు తెలుసు.
అందుకని దేవా, నాకు ఈనాడు సహాయం
చెయ్యి. నేను రాజు సహాయాన్ని అర్థిస్తు
న్నాను. ఈ నా ప్రయత్నంలో నాకు విజయం
చేకూర్చు. రాజుకి నా పట్ల అభిమానం కలిగేలా
చెయ్యి.

---

**ద్రాక్షారసం ... సేవకుణ్ణి** ఇది చాలా ముఖ్యమైన ఉద్యోగం. ఈ ఉద్యోగి ఎల్లప్పుడూ రాజుగారికి దగ్గర్లో వుంటాడు. రాజుగారి ద్రాక్షాపానీయాన్ని రుచిచూసి, దాంట్లో ఎవరూ విషం కలిపే ప్రయత్నం చేయడం లేదని నిర్ధారణ చేస్తాడు.

### అర్తహషస్త రాజు నెహెమ్యాను యెరూషలేముకు పంపటం

2 అర్తహషస్త రాజు పాలన ఇరవయ్యవ సంవత్సరం, నీసాను నెలలో,* ఎవరో కొంత ద్రాక్షారసం తెచ్చి ఇచ్చారు. నేను ముందు దాన్ని తాగి, పరీక్షించి, తర్వాత దాన్ని రాజుకి అందించాను. నేను రాజు సమక్షంలో వున్నప్పుడెప్పుడూ విచారంగా లేను, కాని అప్పుడు విచారంగా వున్నాను. [2]దానితో, రాజు నన్ను, "నీ ఒంట్లో బాగాలేదా? ఎందుకలా విచారంగా కనిపిస్తున్నావు? నీ గుండెల్లో విచారం గూడు కట్టుకుందన్నట్లు అనిపిస్తోంది" అని ప్రశ్నించారు.

అప్పుడు నేను చాలా భయపడ్డాను. [3]అయితేనేమి, నేను భయపడినా కూడా, రాజుతో, "రాజు చిరంజీవిగా వర్ధిల్లాలి! నా పూర్వీకులు సమాధి చేయబడిన నగరం శిథిలమైంది. ఆ నగర ప్రాకార ద్వారాలు దగ్ధం చేయబడ్డాయి" అని విన్నవించాను.

[4]అప్పుడు రాజు, "నీకు నావల్ల ఏ సహాయం కావాలి?" అని నన్ను అడిగారు.

జవాబిచ్చేందుకు ముందు, నేను పరలోక దేవుణ్ణి ప్రార్థించి. [5]రాజుకి ఇలా సమాధానమిచ్చాను. "రాజుకి దయ కలిగితే, నేను తమపట్ల మంచిగా ప్రవర్తించి వుంటే, దయచేసి నన్ను నా పూర్వీకులు సమాధి చేయబడిన యెరూషలేము నగరానికి పంపండి. నేను అక్కడికి పోయి, ఆ నగరాన్ని తిరిగి నిర్మించాలని కోరుకొంటున్నాను."

[6]అప్పుడు రాణి రాజుగారి పక్కనే కూర్చుని వుంది. రాజు మరియు రాణీ, "నీ ప్రయాణానికి ఎన్ని రోజులు పడుతుంది? నువ్విక్కడకి తిరిగి ఎప్పుడు వస్తావు?" అని అడిగారు. నన్ను పంపేందుకు రాజుగారు సంతోషంగా ఒప్పుకున్నారు. అందుకని, నేను తిరిగి వచ్చినప్పుడే అని చెప్పాను.

[7]నేను రాజుగారితో ఇంకా యిలా మనవి చేసుకున్నాను: "రాజుగారు దయదలిస్తే మరో కోరిక కూడా కోరుకుంటాను. యూఫ్రటీసు నది పశ్చిమ ప్రాంతపు పాలనాధికార్లకు కొన్ని ఉత్తరువు లేఖలు ఇప్పించండి. నేను యూదాకి పోయే మార్గంలో వారివారి ప్రాంతాల్లో క్షేమంగా పోయేందుకు ఆ పాలనాధికార్లు నాకు అనుమతి ఇచ్చేందుకు ఈ లేఖలు నాకు అవసరము. [8]నగర ప్రాకార ద్వారాలకూ, గోడలకూ, ఆలయ ప్రాకారానికీ,* నా యింటికీ కలప కావాలి. తమ అడవులకు బాధ్యుడైన అధికారి ఆసాపుకి ఒక లేఖ ఇవ్వండి."

రాజుగారు నాకు లేఖలే కాకుండా, నేను కోరినవన్నీ ఇచ్చారు. నా పట్ల దేవుని దయ కారణంగా రాజుగారు ఇవన్నీ చేశారు.

[9]సరే, నేను యూఫ్రటీసు నది పశ్చిమ ప్రాంతాల పాలనాధికారి వద్దకు వెళ్లాను. నేను రాజుగారి లేఖలు వారికి యిచ్చాను. రాజుగారు నాకు తోడుగా కొందరు సైనికోద్యోగులను, అశ్విక సైనికులను కూడా పంపారు. [10]నేను చేస్తున్నదేమిటో చూసినవాళ్లు ఇద్దరు, సన్బల్లటు, టోబీయా. వాళ్లు కలత చెందారు. ఇశ్రాయేలు ప్రజలకి తోడ్పడేందుకు ఎవరో వచ్చినందుకు వాళ్లకి కోపం కలిగింది. సన్బల్లటు హోరోనీయుడు, టోబీయా అమ్మోనీయుడు.

### నెహెమ్యా చేత యెరూషలేము గోడల తనిఖీ

[11-12]నేను యెరూషలేముకి పోయి, అక్కడ మూడు రోజులు వున్నాను. తర్వాత రాత్రిపూట కొద్దిమందిని వెంటతీసుకొని బయల్దేరాను. యెరూషలేముకి నేను ఏమి చేయాలన్న సంకల్పం నాకు దేవుడు నా హృదయంలో కలిగించిన దానిని గురించి నేను ఎవరికీ ఏమీ చెప్పలేదు. నేను స్వారీ చేస్తున్న గుర్రం తప్ప నాకు వేరే గుర్రాలేమీ లేవు. [13]చీకట్లో నేను లోయ ద్వారం గుండా బయటికి వెళ్లాను. నేను నక్కల బావి దిక్కుకి సవారీచేస్తూ పోయి, బూడిద రాశుల ద్వారం దగ్గరికి పోయాను. నేను యెరూషలేము గోడలు తనిఖీ చేస్తూ పోయాను. గోడలు శిథిలమయ్యాయి, ద్వారాలు కాలిపోయి వున్నాయి. [14]తర్వాత నేను నీటి బుగ్గ ద్వారంవద్దకు, రాజ కోనేరుల దిశగా స్వారీ చేస్తూ పోయాను. నేను దగ్గరికి పోయేసరికి అక్కడి మార్గం నా గుర్రం పోలేనంతటి యిరుకుగా వుండటం గమనించాను. [15]అందుకని నేను చీకట్లో గోడని పరిశీలిస్తూ లోయపైకి పోయాను. చివరికి నేను వెనక్కి తిరిగి, లోయ ద్వారం గుండా లోనికి పోయాను. [16]అధికారులకీ, ఇశ్రాయేలులోని ప్రముఖులకీ నేనెక్కడికి వెళ్లానో తెలియదు. నేనేమి చేస్తున్నానో తెలియదు. యూదులకి, యాజకులకి, రాజ కుటుంబీకులకి, ఉద్యోగులకి, లేక పని చేయబోయే ఏ యితరులకీ నేను అప్పటికింకా ఏమీ చెప్పలేదు.

[17]తర్వాత నేను వాళ్లందరికీ యిలా చెప్పాను: "మనకి ఇక్కడున్న ఇబ్బందేమిటో మీరు చూడగలరనుకుంటున్నాను. యెరూషలేము శిథిలాల గుట్టలా వుంది. దాని ద్వారాలు మంటలకి కాలిపోయాయి. రండి, యెరూషలేము ప్రాకారాన్ని తిరిగి కట్టెదము. అప్పుడిక మనం ఎప్పటికీ సిగ్గుపడము."

[18]అప్పుడు నేను వాళ్లకి దేవుడు నాపట్ల ఎలా దయ చూపాడో చెప్పాను. రాజుగారు నాతో అన్న మాటలు చెప్పాను. అప్పుడు వాళ్లు, "ఇప్పుడే పని ప్రారంభిద్దాం పదండి!" అన్నారు. దానితో మేమీ మంచి

---

**అర్తహషస్త … నీసాను నెలలో** క్రీ.పూ.443, మార్చి–ఏప్రిల్.

**ఆలయ ప్రాకారానికి** యెరూషలేములో యూదుల దైవారాధనకు ఇది ప్రత్యేక భవనం.

పని ప్రారంభించాము. 19హారోనీయుడైన సన్బల్లటు,
అమ్మోనీయ ఉద్యోగి టోబీయా, అరబీయుడైన
గెషెము మేము తిరిగి నిర్మాణం సాగిస్తున్నామన్న
విషయం విన్నారు. వాళ్లు మమ్మల్ని, "ఏమిటి మీరు
చేస్తున్న పని? రాజుగారి మీదే తిరుగుబాటు చెయ్య
బోతున్నారా?" అంటూ చెడు విధంగా ఎగతాళి చేశారు.
20అయితే, నేను వాళ్లకిలా బదులు చెప్పాను: "పర
లోకమందున్న దేవుడే మా పనిలో మాకు విజయం
చేకూరుస్తాడు. దేవుని దాసులమైన మేము ఈ నగరాన్ని
తిరిగి నిర్మిస్తున్నాము. ఈ కృషిలో మాకు మీరు
సహాయం చెయ్యలేరు. మీ కుటుంబంలో ఏ ఒక్కరూ
ఇక్కడ యెరూషలేములో నివసించలేదు. ఈ నేలలో
కొంచెం కూడా మీకు చెందదు. మీకు యిక్కడ వుండే
హక్కు బొత్తిగా లేదు!"

## ప్రాకార నిర్మాతలు

3 ప్రధాన యాజకుని పేరు ఎల్యాషీబు. ఎల్యాషీబూ,
యాజకులైన అతని సోదరులూ పనిలోకి పోయి,
గొర్రెల ద్వారాన్ని నిర్మించారు. వాళ్లు ప్రార్థనలు జరిపి
యెహోవా పేరిట ఆ ద్వారమును ప్రతిష్ఠ చేశారు.
దాని ద్వారాలను ప్రాకారంలో సరైన చోట వుంచారు.
ఆ యాజకులు యెరూషలేము ప్రాకారాన్ని
హమ్మేయా గోపురం దాకా, హనన్యే గోపురం దాకా
నిర్మించి, అక్కడ ప్రార్థనలు జరిపి, ప్రతిష్ఠించారు.
2యాజకులు కట్టిన గోడ భాగానికి పక్కనే యెరికో
వాసులు గోడను కట్టారు. ఇమ్రీ కుమారుడైన
జక్కూరు యెరికోవాసులు కట్టినదానికి పక్కగా గోడ
భాగమును కట్టాడు.
3హస్సెనాయా కుమారులు మత్స్య ద్వారాన్ని నిర్మిం
చారు. వాళ్లు కొయ్య దూలాలను సరిగ్గా అమర్చి,
కట్టడానికి తలుపులు పెట్టి, తర్వాత ఆ తలుపులకు
గడియలు, తాళాలు అమర్చారు.
4ఊరియా కుమారుడు మెరేమోతు గోడలో
తర్వాత భాగాన్ని నిర్మించాడు. (ఊరియా హక్కోజు
కుమారుడు). బెరెక్యా కుమారుడు మెషుల్లాము
గోడలో తర్వాత భాగాన్ని కట్టాడు. (బెరెక్యా మెషేజబె
యేలు కుమారుడు.)
బయనా కొడుకు సాదోకు గోడలో తర్వాత
భాగము కట్టాడు.
5తెకోవీయులు గోడలో తర్వాతి భాగాన్ని కట్టారు.
అయితే, తెకోవా నాయకులు తమ పాలనాధికారి
నెహెమ్యా కోసం పని చేసేందుకు అంగీకరించలేదు.
6పాసెయ కుమారుడు యెహోయాదా, బెసోద్యా
కుమారుడు మెషుల్లాము పాతద్వారం మరమ్మతు
చేశారు. వాళ్లు దూలాలను సరిగ్గా ఉంచి, తలుపులను
కీలు గుడిదెల మీద నిలిపి, తలుపులకు గడియలు,
తాళాలు అమర్చారు. 7గిబ్యోను వాళ్లూ, మిస్పా వాళ్లూ
గోడలో తర్వాత భాగాన్ని నిర్మించారు. గిబ్యోనుకు
చెందిన మెలట్యా, మేరోనోతుకి చెందిన యాదోనూ
పనిచేశారు. గిబ్యోను, మేరోనోతులు యూఫ్రటీసు
నది పశ్చిమ ప్రాంత పాలనాధికారుల అజమాయిషీలో
వున్నాయి.
8హర్హయా కుమారుడు ఉజ్జీయేలు గోడలో
తర్వాత భాగాన్ని మరమ్మతు చేశాడు. ఉజ్జీయేలు బంగా
రపుపని చేసే కంసాలి. హనన్యా అత్తర్ల తయారీదారు.
వీళ్లు వెడల్పు గోడవరకు యెరూషలేమును కట్టి,
నిలిపారు.
9వీరి పక్కన హూరు కుమారుడు రెఫాయా గోడలో
తదుపరి భాగాన్ని నిర్మించాడు. రెఫాయా యెరూషలే
ములో సగం భాగానికి పాలనాధికారి.
10హరూమపు కొడుకు యెదాయా గోడలో
తర్వాత భాగాన్ని నిలిపాడు. యెదాయా నిలిపిన గోడ
భాగం అతని యింటి పక్కనే వుంది. హషబ్నేయా
కొడుకు హట్టూషు తర్వాత గోడ భాగాన్ని మరమ్మతు
చేశాడు.11హారీము కొడుకు మల్కీయా, పహత్మో
యాబు కొడుకు హష్షూబు తర్వాత భాగాన్నీ, అగ్ని
గుండపు గోపురాన్నీ మరమ్మతు చేశారు.
12గోడలో తర్వాత భాగాన్ని హల్లోహెషు కొడుకు
షల్లూము తన కుమార్తెల సాయంతో మరమ్మతు
చేశాడు. షల్లూము యెరూషలేము రెండవ భాగానికి
పాలనాధికారి.
13హానూను అనేవాడు, జానోవా పట్టణ వాసులూ
కలిసి లోయద్వారాన్ని పునర్నిర్మించారు. వాళ్లు దాని
తలుపులను కీలుల మీద నిలిపారు. తర్వాత ఆ తలు
పులకు వాళ్లు గడియలు, తాళాలు బిగించారు. అంతే
కాక, వాళ్లు 500 గజాల గోడను కూడా బాగుచేశారు.
వాళ్లు బూడిద రాశి ద్వారందాకా ఉన్న గోడను బాగు
చేశారు. 14రేకాబు కొడుకు మల్కీయా పెంట
గుమ్మాన్ని సరిచేశాడు. మల్కీయా, బేత్ హక్కెరెము
ప్రాంతానికి అధిపతి. అతను ఆ ద్వారాన్ని నిలిపి,
దాని తలుపులను కీలులమీద తగిలించి, వాటికి గడియ
లను, తాళాలను అమర్చాడు.
15కొల్హోజె కొడుకు షల్లూము ఇంటి ద్వార
గుమ్మాన్ని బాగుచేశాడు. ఇతను మిస్పా ప్రాంతపు
అధిపతి. అతను ఆ ద్వారాన్ని బాగుచేసి, దానికి
పైకప్పు వేయించాడు. అతను కీలుల మీద తలుపులు
నిలిపి, వాటికి గడియలు, తాళాలు అమర్చాడు. రాజు
గారి తోట పక్కన వున్న సిలోయము కోనేరువరకు
వున్న గోడ భాగాన్ని కూడా షల్లూము బాగుచేశాడు.
దావీదు నగరం నుంచి కిందికి పోయే మెట్లవరకు
వున్న గోడను కూడా అతనే బాగుచేశాడు.
16అజ్బూకు కొడుకు నెహెమ్యా గోడలో తర్వాత
భాగాన్ని బాగుచేశాడు. ఈ నెహెమ్యా బేత్సూరు సగం
ప్రాంతానికి అధిపతి. అతను దావీదు సమాధికి ఎదుట

వున్న స్థలంలోని కోనేరును, యుద్ధ వీరుల భవనాన్నీ
బాగుచేశాడు. [17]తర్వాత భాగాన్ని లేవీ వంశీములు బాగు
చేశారు. ఆ లేవీయులు బానీ కుమారుడు రెహూము
అజమా యిషీలో పనిచేశారు. కెయిలా ప్రాంతంలో
సగం భాగానికి అధిపతి అయిన హషబ్యా తర్వాతి
భాగాన్ని బాగుచేశాడు. అతను తన సొంత ప్రాంతానికి
చెందిన వాటినే బాగుచేశాడు.
[18]వాళ్ల సోదరులు తర్వాతి భాగాన్ని బాగుచేశారు.
వాళ్లు హేనాదాదు కుమారుడు బవ్వై పర్యవేక్షణలో
పని చేశారు. కెయిలా ప్రాంతపు సగంభాగానికి ఈ
బవ్వై అధిపతి.
[19]యేషూవ కుమారుడు ఏజెరు తర్వాతి భాగాన్ని
బాగుచేశాడు. ఏజెరు మిస్పా అధిపతి. అతను ఆయు
ధాగారం నుంచి ప్రాకారం మూలదాకా వున్న భాగాన్ని
బాగుచేశాడు. [20]జబ్బయి కుమారుడు బారూకు
గోడలో తదుపరి భాగాన్ని బాగుచేశాడు. బారూకు విశే
షంగా శ్రమించి, ప్రాకారం మూలనుంచి ప్రధాన యాజ
కుడైన ఎల్యాషీబు ఇంటిదాకా వున్న గోడ భాగాన్ని
బాగుచేశాడు. [21]హక్కోజు మనుమడు, ఊరియా కుమా
రుడు అయిన మెరేమోతు ఎల్యాషీబు ఇంటి ముఖ
ద్వారం నుంచి, ఆ ఇంటి చివరిదాకా వున్న గోడ
భాగాన్ని బాగుచేశాడు. [22]ప్రాకారపు తదుపరి భాగాన్ని
ఆ ప్రాంతంలో* నివసించే యాజకులు బాగుచేశారు.
[23]బెన్యామీను, హష్షూబులు తమ ఇంటి ముందరి
గోడ భాగాన్ని బాగుచేశారు. అనన్యా కుమారుడు,
మయశేయా కొడుకు అయిన అజర్యా తన ఇంటి
పక్కన వున్న గోడ భాగాన్ని బాగుచేశాడు.
[24]హేనాదాదు కొడుకు బిన్నూయి అజర్యా ఇంటి
దగ్గర్నుంచి ప్రాకారపు మలుపుదాకా, అక్కణ్నుంచి
మూలదాకా గోడభాగాన్ని బాగుచేశాడు.
[25]ఊజై కుమారుడు పాలాలు ప్రాకారపు మలుపు
నుంచి గోపురం దాకా పనిచేశాడు. రాజుగారి పై అంతస్తు
దగ్గర, అది రాజుగారి రక్షకభటుల ఆవరణానికి దగ్గర
వున్న గోపురం. పరోషు కొడుకు పెదాయా పాలాలు
పక్కన పని చేశాడు.
[26]ఆలయ సేవకులు ఓపెలు కొండమీద నివసించే
వారు. వాళ్లు జలద్వారం దాకా, దాని దగ్గరవున్న
గోపురం దాకా ఉన్న గోడ తదుపరి భాగాన్ని బాగు
చేశారు.
[27]పెద్ద గోపురం దగ్గర్నుంచి ఓపెలు గోడదాకా
ఉన్న ప్రాకార భాగమంతటినీ తెకోవీయులు బాగు
చేశారు. [28]తమ ఇండ్లకి ఎదురుగా గుర్రపు గుమ్మానికి
పైనున్న ప్రాకార భాగాన్ని యాజకులు బాగుచేశారు.
ప్రతి ఒక్క యాజకుడూ తన స్వగృహానికి ఎదుట
ఉన్న గోడ భాగాన్ని బాగుచేశాడు. [29]ఇమ్మేరు కొడుకైన
సాదోకు తన ఇంటి ముందరి గోడ భాగాన్ని బాగు
చేశాడు. షెకన్యా కొడుకైన షెమయా గోడలో ఆటు
తర్వాత భాగాన్ని బాగుచేశాడు. షెమయా తూర్పు
ద్వార రక్షకుడు.
[30]షెలెమ్యా కొడుకు హనన్యా, జాలాపు కొడుకు
హానూనూ గోడలో మిగిలిన భాగాన్ని బాగుచేశారు.
(హానూను జాలాపు ఆరవ కొడుకు).
బెరెక్యా కొడుకు మెషుల్లాము తన ఇంటి ముందరి
గోడ భాగాన్ని బాగుచేశాడు. [31]ఆలయ సేవకుల,
వ్యాపారస్తుల ఇళ్లదాకా ఉన్న తదుపరి గోడ భాగాన్ని
మల్కీయా బాగుచేశాడు. అంటే, తనిఖీ ద్వారం
దగ్గర్నుంచి అన్నమాట. ప్రాకారపు మూలలో ఉన్న
గదిదాకా ఉన్న గోడ భాగమంతటినీ మల్కీయా బాగు
చేశాడు. మల్కీయా బంగారంపని చేసేవాడు. [32]స్వర్ణకా
రులూ, వ్యాపారస్థులూ మూలనున్న గదినుంచి గొర్రెల
ద్వారం దాకా ఉన్న గోడ భాగాన్ని బాగుచేశారు.

## సన్బల్లటు, టోబీయా

4 మేము యెరూషలేము ప్రాకారాన్ని నిర్మిస్తున్నా
మన్న వార్తను సన్బల్లటు విన్నాడు. అతను
కోపంతో ఉగ్రరూపం దాల్చాడు. అతను యూదులను
ఎగతాళి చెయ్యనారంభించాడు. [2]సన్బల్లటు తన మిత్రు
లతోనూ, షోమ్రోను సైన్యంతోనూ మాట్లాడాడు.
అతను ఇలా అన్నాడు: "ఈ బలహీన యూదులు
చేస్తున్నపని యేమిటి? మనం ఊరుకొంటామని అను
కుంటున్నారా వీళ్లు? తాము బలులు ఇద్దామనే అను
కుంటున్నారా వీళ్లు? బహుశః ఒక్క రోజులో ప్రాకార
నిర్మాణం పని పూర్తి చేస్తామని అనుకుంటున్నట్లుంది
వీళ్లు. ఈ చెత్త, దుమ్ము గుట్టల్నుంచి రాళ్లకు జీవం
పొయడం వీళ్ల తరం కాదు. ఇవి వట్టి బూడిద రాసులు,
ధూళి కుప్పలు!"
[3]సన్బల్లటుతోనే ఉన్న అమ్మోనీయుడు టోబీ
యా ఇలా అందుకున్నాడు: "ఈ యూదులు తామేదో
గొప్పగా కట్టేస్తున్నామని అనుకుంటున్నట్లుంది. దాని
మీద ఒక చిన్న నక్కపిల్ల ఎక్కితే చాలు, వాళ్ల రాతి
గోడ కాస్తా కుప్పకూలిపోతుంది!"
[4]నెహెమ్యా ఇలా దైవ ప్రార్థన చేశాడు: "ఓ మా
దేవా, మా మొర ఆలకించు. వీళ్లకి మేమంటే ద్వేషం.
ఈ సన్బల్లటు, టోబీయా మమ్మల్ని అవమానిస్తు
న్నారు. వాళ్ల నిందలు వాళ్లకే వచ్చేటట్లు చెయ్యి దేవా.
బానిసలుగా, చెరబట్టబడిన వాళ్ల మాదిరిగా వాళ్లను
సిగ్గుపడనియ్యి. [5]వాళ్ల నేరాన్ని తీసివేయవద్దు. వారి
పాపాలను క్షమించవద్దు. ప్రాకారం నిర్మిస్తున్న వాళ్లను
వీళ్లు అవమానించారు, వాళ్లని వీళ్లు నిరుత్సాహ
పరిచారు." [6]మేము యెరూషలేము ప్రాకారాన్ని
నిర్మించాము, మేము నగరం చుట్టూ గోడకట్టాము.

---

**ఆ ప్రాంతంలో** బహుశా "యోర్దాను లోయ" అయ్యుంటుంది.

అయితే, అది ఉండాల్సిన దానికి సగం ఎత్తు మాత్రమే
ఉంది. జనం హృదయపూర్వకంగా పనిచేశారు. అందుకే
మేము ఇంత మాత్రమైనా కట్టగలిగాము.
7కాని, సన్బల్లటు, టోబియా, అరబ్బీయులు,
అమ్మోనీయులు, అష్డోదువాసులు, కోపంతో నిండు
కొనియున్నారు. జనం యెరూషలేము ప్రాకారాలు
బాగుచేసే పని కొనసాగిస్తున్నట్లు, గోడల మధ్య కంత
లను పూడుస్తున్నట్లు వాళ్లు విన్నారు. ఈ విషయమై
వాళ్లు అధికముగా కోపగించుకొని 8ఒకచోట కూడి
యెరూషలేముకు వ్యతిరేకంగా కుట్రలు పన్నారు. వాళ్లు
యెరూషలేముకు వ్యతిరేకంగా కల్లోలం లేవగొట్టాలనీ,
వాళ్లు వచ్చి నగరం మీద పోరాటం జరపాలనీ పథకం
పన్నారు. 9అయితే, మేము మా దేవుణ్ణి ప్రార్థించాము.
అంతేకాదు, వాళ్లు వస్తే, వాళ్లని ఎదిరించి పోరాడగలి
గేందుకుగాను గోడలమీద రాత్రింబగళ్లు కాపలా కోసం
కాపలావారిని పెట్టాం.
10అప్పుడు యూదా వాసులు తమ నిరుత్సాహాన్ని
ఇలా వెలిబుచ్చారు: "పనివాళ్లు అలసిపోతున్నారు.
దోవలో బోలెడు దుమ్మూ, రద్దూ పేరుకు పోయాయి.
మనం గోడ కట్టడాన్ని కొనసాగించలేము. 11పోతే,
మన శత్రువులేమో ఇలా అంటున్నారు: 'యూదులపై
మనము అకస్మాత్తుగా దాడిచేద్దాము. వాళ్లు మనలను
చూడకముందే, మనం ఎవరమో తెలిసికోకముందే
మనం వాళ్ల మధ్య ఉంటాము, వాళ్లని చంపేస్తాము.
దానితో వాళ్ల పని నిలిచిపోతుంది.' "
12తర్వాత మన శత్రువుల మధ్య నివసించే మన
యూదులు మా దగ్గరికి వచ్చి, "మన శత్రువులు మన
చుట్టూ వున్నారు. మేము ఎటు తిరిగితే అటు వాళ్లు
ప్రత్యక్షమౌతున్నారు" అంటూ పదే పదే చెప్పారు.
13అందుకని, నేను కొందర్ని గోడ బాగా పొట్టిగా
వున్న చోట్ల గోడ వెనక కాపలా పెట్టాను. నేను
వాళ్లని గోడకి కంతలున్న స్థలాల్లో నిలిపాను. నేను
ఆయా కుటుంబాలను ఒక చోట చేర్చి, కత్తులు,
శూలాలు, విల్లమ్ములతో నిలిపాను. 14అప్పుడు నేను
ముఖ్యమైన కుటుంబాలతో, ఉద్యోగులతో, మిగిలిన
జనంతో ఇలా చెప్పాను: "మన శత్రువులంటే భయపడ
కండి. మన ప్రభువును తలుచుకోండి. యెహోవా
గొప్పవాడు, శక్తిశాలి! మీరు మీ సోదరుల కోసం, మీ
కుమారుల కోసం, మీ కుమార్తెల కోసం పోరాడాలి!
మీరు మీ భార్యల కోసము, మీ గృహాల కోసం
పోరాడాలి!"
15తమ పథకాలు మాకు తెలిసిపోయాయన్న
విషయం మా శత్రువులు విన్నారు. తమ పథకాలను
దేవుడు భగ్నం చేశాడని వాళ్లు గ్రహించారు. తర్వాత
మేమందరం తిరిగి పని ప్రారంభించాము. ప్రతి ఒక్కడూ
తను వదిలిన పని భాగానికి తిరిగి వెళ్లాడు. 16ఆనాటి
నుంచి నా మనుషుల్లో సగం మంది గోడ కట్టడంలో
నిమగ్నులు కాగా, మిగిలిన సగం మంది ఈటెలు,
బల్లెములు, విల్లమ్ములు, కవచాలతో కాపలా పనిలో
నిమగ్నులయ్యారు. సేనాధిపతులు ప్రాకార నిర్మా
ణంలో నిమగ్నులైన యూదా ప్రజలందరి వెనుక నిలి
చారు. 17గోడ కట్టేవాళ్లు, వాళ్ల సహాయకులు ఒక
చేత్తో పనిముట్లను, మరో చేత్తో ఆయుధాలను పట్టు
కున్నారు. 18పని చేస్తున్న ప్రతి ఒక్క తాపీవాడూ
తన పక్కనే ఒక కత్తిని పెట్టుకున్నాడు. శత్రువుల
రాకను గురించి హెచ్చరించేందుకు బూర ఊదేవాడు
నా పక్కన నిలబడ్డాడు. 19అప్పుడు నేను ఆయా
ప్రముఖ కుటుంబాల వాళ్లను, ఉద్యోగులను, మిగిలిన
జనాన్ని ఉద్దేశించి ఇలా చెప్పాను, "ఇది చాలా పెద్ద
పని. మనం గోడ పొడుగునా విస్తరించివున్నాము. మనం
ఒకరికొకరం దూరంగా వున్నాము. 20అందుకని, మీకు
బూర శబ్దం వినిపించినప్పుడు, అక్కడికి మీరంతా పరు
గున రండి. మనమంతా అక్కడ కలుద్దాము. మన
దేవుడు మన పక్షాన పోరాడుతాడు!"
21ఈ విధంగా మేము యెరూషలేము ప్రాకార నిర్మా
ణపు పని కొనసాగించాము. మాలో సగం మంది
శూలాలు ధరించి నిలబడ్డారు. మేము ఉదయం పొద్దు
పొడిచినప్పటినుంచి రాత్రి చుక్కలు పొడిచే దాకా
పనిచేశాము.
22అప్పుడు నేను వాళ్లకి ఈ విషయాలు కూడా
చెప్పాను: "ప్రతి ఒక్క తాపీవాడూ, అతని సహాయ
కుడూ రాత్రిపూట యెరూషలేములోనే వుండిపోవాలి.
అప్పుడు వాళ్లు రాత్రిళ్లు కాపలాదార్లుగా, పగళ్లు పని
వాళ్లుగా ఉండగలుగుతారు." 23సరే, నేనుగాని, నా సోద
రులుగాని, నా మనుష్యులు గాని, కాపలావాళ్లుగాని,
మాలో ఎవ్వరం మా దుస్తులు విప్పలేదు. మాలో
ప్రతి ఒక్కరూ అన్ని సమయాల్లో, చివరకు నీళ్లకు
వెళ్లినప్పుడూ సైతం, ఆయుధాలు ధరించేవున్నాము.

## బీదలకు నెహెమ్యా సహాయం

5 తమ యూదా సోదరుల మీద చాలామంది బీద
వాళ్లు ఫిర్యాదు చేయసాగారు. 2వాళ్లలో కొందరు,
"మాకు చాలామంది పిల్లపాపలు వున్నారు. మేము
తిండి తిని బతికి వుండాలంటే, మాకు ధాన్యము దొర
కాలి!"అన్నారు.
3మరికొందరు, "ఇది కరువు కాలం. మేము
ధాన్యము కోసం మా పొలాలు, ద్రాక్ష తోటలు, ఇళ్లు
కుదువ పెట్టాల్సి వస్తోంది" అని మొత్తుకున్నారు.
4వేరే కొందరు, "మేము మా పొలాలకీ, ద్రాక్షా
తోటలకీ రాజు విధించిన పన్నులు చెల్లించాలి. అయితే,
ఆ పన్నులు చెల్లించేందుకు మా దగ్గర పైసలు లేక
అప్పులు చేయవలసి వస్తోంది. 5ఆ ధనికుల్ని
చూడండి. మేము వాళ్లలాంటి మనుష్యులం కామా?
వాళ్ల కొడుకులకి మా కొడుకులు ఏమైనా తీసి

పోయారా? అయితేనేమి, మేము మా కొడుకుల్నీ,
కూతుళ్లనీ బానిసలుగా అమ్ముకోవలసి వస్తోంది.
ఇప్పటికే మాలో కొంతమందిమి మా కూతుళ్లను బాని
సలుగా అమ్ముకోవలసి వచ్చింది! మాకు వేరే
గత్యంతరం లేదు! ఇప్పటికే మేము మా పొలాలను,
ద్రాక్షాతోటలను కోల్పోయాము! అవి ఇప్పుడు
ఇతరుల చేతుల్లోకి పోయాయి” అని వాపోయారు.

6వాళ్ల ఫిర్యాదులు వినేసరికి నాకు చాలా కోపం
వచ్చింది. 7నన్ను నేనే అణచుకుని, ఆ ధనిక కుటుం
బాల దగ్గరికీ, ఉద్యోగుల వద్దకీ వెళ్లి, వారి మీద కోపగించు
కొని ఇలా చెప్పాను: “మీరు మీ సోదరులకే అప్పులిచ్చి,
వారిని వడ్డీ కట్టమని అడుగుతున్నారు. మీరిది కట్టి
పెట్టాలి!” అప్పుడు నేను జనులందర్నీ ఒక చోట
సమావేశ పరచి, 8వాళ్లతో ఇలా చెప్పాను, “మన
యూదా సోదరులు ఇతర దేశాల వాళ్లకి బానిసలుగా
అమ్మబడుతున్నారు. మనం వాళ్లని కొని, వాళ్లని స్వతం
త్రులను చేసేందుకు శాయశక్తులా ప్రయత్నించాము.
కాని ఇప్పుడు మీరు మళ్లీ వాళ్లని బానిసలుగా
అమ్మేస్తున్నారు!”

ఆ ధనికులూ, ఉద్యోగులూ మౌనంగా ఉండి
పోయారు. వాళ్లకి ఏమి చెప్పేందుకూ తోచలేదు.
9సరే, నేను ఇంకా ఇలా కొనసాగించాను: “మీరు చేస్తున్న
పని సరైనది కాదు. దేవునిపట్ల భయభక్తులు కలిగి
వుండాలన్న విషయం మీకు తెలుసు. ఇతరులు చేసే
సిగ్గుచేటైన పనులు మీరు చెయ్యకూడదు! 10నా
మనుష్యులూ, నా సోదరులూ, నేను కూడా డబ్బూ,
ధాన్యము అప్పుగా ఇస్తున్నాను. అయితే, ఆ అప్పుల
మీద వడ్డీ చెల్లించమని నిర్బంధించడం మనం
మానుకోవాలి! 11మీరు వాళ్లనుంచి తీసుకున్న పొలాలు,
ద్రాక్షాతోటలు, ఒలీవ పొలాలు, ఇళ్లు వాళ్లకి తక్షణం
తిరిగి ఇచ్చెయ్యాలి! మీరు వాళ్ల దగ్గర వసూలు చేసిన
వడ్డీ సొమ్ము కూడా వాళ్లకి తక్షణం తిరిగి ఇచ్చెయ్యాలి!
వాళ్లకి అప్పుగా ఇచ్చిన డబ్బుకీ, ధాన్యానికీ, తాజా
ద్రాక్షారసానికీ, ఒలీవ నూనెకీ మీరు ఒక శాతం వడ్డీ
తీసుకుంటున్నారు. మీరు సొమ్ము వాళ్లకి తిరిగి ఇచ్చె
య్యాలి! 12అప్పుడా ధనవంతులూ, ఉద్యోగులూ ఇలా
సమాధానమిచ్చారు, “మేము వారి ఆస్తులను, వారిమీద
వేసిన వడ్డీలను తిరిగి ఇచ్చేస్తాము. మేము వాళ్ల
దగ్గర్నుంచి ఇంకేమీ అడగము. నెహెమ్యా, మేము
నువ్వు చెప్పినట్లే చేస్తాము.”

తర్వాత నేను యాజకులను పిలిచాను. ధనికుల
చేతా, ఉద్యోగులచేతా తాము చెప్పిన మాటలను
అమలు చేస్తామని యాజకుల సమక్షంలో దేవునికి
ప్రమాణం చేసేలా చూశాను. 13తర్వాత నేను నా
దుస్తుల మడతలు పోయేలా వాటిని దులిపి, ఇలా
చెప్పాను, “తన వాగ్దాన భంగం చేసిన ప్రతివానికీ
దేవుడు ఇదే చేస్తాడు. దేవుడు వాళ్లని వాళ్ల ఇళ్ల నుంచి
బయటికి విసిరిపారేస్తాడు. తాము కూడబెట్టుకున్న
వన్నీ వాళ్లు కోల్పోతారు! ఆ వ్యక్తి తన సర్వస్వం
కోల్పోతాడు!”

నేను చెప్పిన ఈ విషయాలన్నింటికీ వాళ్లందరూ
ఒప్పుకొనెదమని చెప్పిరి. వాళ్లంతా, “ఆమేన్!”
అన్నారు. యెహోవాను స్తుతించారు. ఆ మనుష్యులు
తాము ఒప్పుకొన్న ప్రకారం అన్ని జరిగించిరి.

14అంతే కాదు, యూదా ప్రాంతానికి నేను అధికారిగా
వున్నంత కాలం, నేనుగాని, నా సోదరులుగాని పాలనాధి
కారికి అనుమతింపబడిన ఆహారం ఎన్నడూ తినలేదు.
నా ఆహారం కొనే నిమిత్తం నేనెన్నడూ జనాన్ని పన్నులు
చెల్లించేలా నిర్బంధించలేదు. నేను అర్తహషస్త రాజ్య
పాలనలో ఇరవయ్యవ ఏడాది నుంచి ముప్పై రెండవ
ఏడాది దాకా* పాలనాధికారిగా వున్నాను. నేను
యూదాకి పన్నెండేళ్లపాటు పాలనాధికారిగా వున్నాను.
15కాని, నా కంటె ముందు పాలించిన అధికార్లు జన
జీవితాన్ని ఎక్కువ భారం చేశారు. వాళ్లు ప్రతి ఒక్క
రినుంచీ నిర్బంధంగా నలభై తులాల* వెండిని వసూలు
చేశారు. అంతేకాదు, వాళ్లు జనం నుంచి తమ ఆహా
రాన్నీ, ద్రాక్షారసాన్నీ రాబట్టుకున్నారు. ఆ అధికార్ల
కింది నాయకులు కూడా జనం మీద అధికారం చలా
యించి, వాళ్ల జీవితాన్ని మరింత దుర్భరం చేశారు.
కాని నేను అందుకు భిన్నంగా దేవునియందు భయ
భక్తులతో వ్యవహరించాను, అందుకే నేను వాళ్లు చేసిన
పనులేవీ చేయలేదు. 16యెరూషలేము ప్రాకార నిర్మా
ణానికి నేను బాగా కష్టించి పనిచేశాను. నా మనుష్య
లందరూ ప్రాకార నిర్మాణం కోసం అక్కడ చేరారు.
మేము ఏ ఒక్కరి దగ్గరినుంచీ భూమి సంపాదించుకో
లేదు!

17అంతే కాదు, నేను నిత్యం నూట ఏభై మంది
యూదులకు భోజనం పెట్టాను. నా భోజనపు బల్ల
దగ్గర వాళ్లకి ఎల్లప్పుడూ ప్రవేశం లభించేది. మా
చుట్టుపట్ల వున్న ఇతర దేశప్రజలు కూడ నా బల్లదగ్గర
భోజనం చేశారు. 18నాతోబాటు నా భోజనశాలలో
భోజనం చేసిన వాళ్లకి ప్రతిరోజూ ఈ కింది ఆహార
పదార్థాలు పెట్టాను: ఒక ఆవు, ఆరు మేలైన గొర్రెలు,
రకరకాల పక్షులు. ప్రతి పది రోజులకి ఒకసారి రకరకాల
ద్రాక్షారసం నా భోజనపు బల్ల వద్దకి తెప్పించబడేవి.
అయితేనేమి, నేను మాత్రం పాలనాధికారికి అను
మతింపబడిన ఆహారాన్ని కానేకావాలని అడగలేదు. నా
భోజనం కోసం నేనెన్నడూ జనం దగ్గర బలవంతాన
పన్నులు వసూలు చేయలేదు. జనం చేస్తున్నపని బాగా
కష్టమైనదని నాకు తెలుసు, 19నా దేవా, ఈ ప్రజలకు

---

**అర్తహషస్త ... ఏడాది దాకా** క్రీ.పూ.444 నుంచి 432 వరకు.

**నలభైతులాల** శబ్దార్థం ప్రకారం 40 షెకెళ్లు.

నేను చేసిన మేలునంతటినీ జ్ఞాపకముంచు కొని నాకు
సహాయం చేయుము.

## ఎదురైన మరిన్ని సమస్యలు

6 నేను ప్రాకార నిర్మాణం పూర్తి చేశానన్న సంగతిని
సన్బల్లటు, టోబీయా, అరబీయుడైన గెషెము
మా ఇతర శత్రువులూ విన్నారు. మేము గోడలోని
కంతలన్నీ పూడ్చాము. అయితే, ద్వారాలకు మేమింకా
తలుపులు అమర్చలేదు. 2సన్బల్లటూ, గెషెమూ నాకు,
"నెహెమ్యా, నువ్వొకసారి వస్తే మనం కలుసు
కుందాము. ఓనో మైదానంలోని కెఫీరిము గ్రామంలో
కలుసుకోవచ్చు" అని కబురంపారు. అయితే, వాళ్లు
నాకు హాని తలపెట్టారని నాకు తెలుసు.
3అందుకని, దూతల ద్వారా నేను వాళ్లకి, "నేను
చాలా ముఖ్యమైన పనిలో నిమగ్నమై వున్నాను. అందు
కని, నేను రాలేను. మిమ్మల్ని కలుసు కొనడానికై
నేను పని చేయుట ఆపినప్పుడు, పని ఆగుట నాకిష్టము
లేదు" అని సమాధానం పంపాను.
4సన్బల్లటూ, గెషెమూ అదే సందేశాన్ని నాకు
నాలుగుసార్లు పంపారు. ప్రతి ఒక్కసారీ నేను వాళ్లకి
నా వెనకటి సమాధానమే పంపాను. 5అప్పుడు అయి
దవసారి, సన్బల్లటు అదే సందేశాన్ని తన సహాయకుని
ద్వారా నాకు పంపాడు. అతడి చేతిలో విప్పియున్న
ఒక లేఖవుంది. 6ఆ లేఖలో ఇలా పేర్కొనబడింది,
"ఒక విషయం నాలుగు పక్కలా ప్రచారమవుతోంది.
ఎక్కడ చూసినా జనం అదే చెప్పుకుంటున్నారు.
మరి, అన్నట్టు, గెషెము అది నిజమే అంటున్నాడు.
నువ్వూ, యూదులూ రాజుగారి మీద తిరగబడాలని
కుట్రపన్నుతున్నట్లు జనం చెప్పుకుంటున్నారు.
అందుకే నువ్వు యెరూషలేము ప్రాకారం నిర్మిస్తున్నా
వట. అంతేకాదు, నువ్వు యూదులకు కాబోయే
రాజువని కూడా జనం చెప్పుకుంటున్నారు.
7యెరూషలేములో నిన్ను గురించి ఈ విషయాన్ని
ప్రకటించేటందుకు నువ్వు ప్రవక్తలను ఎంపిక చేశావన్న
విషయం, 'యూదాలో ఒక రాజు వున్నాడు!' అన్న
విషయం ప్రచారంలో వుంది.
"నెహెమ్యా, ఇప్పుడు నిన్ను నేను హెచ్చరిస్తు
న్నాను. అర్తహషస్త రాజుగారు ఈ విషయం వింటారు.
అందుకని, నువ్వురా, మనం కలిసి కూర్చుని ఈ
విషయం మాట్లాడుకుందాము."
8అందుకని, నేను సన్బల్లటుకి ఈ కింది సమాధానం
పంపాను: "మీరు చెప్తున్నదేమీ ఇక్కడ జరగడం లేదు.
ఇదంతా మీ ఊహా కల్పితం మాత్రమే."
9మన శత్రువులు మనల్ని భయపెట్టేందుకు ప్రయ
త్నిస్తున్నారు. వాళ్ల మట్టుకు వాళ్లు, "ఈ యూదులు
భయంతో బిక్కచచ్చి, జావకారిపోయి పని కొనసాగిం
చేందుకు అసమర్థులవుతారు. అప్పుడిక ప్రాకార
నిర్మాణం పూర్తికాదు" అనుకుంటున్నారు. కాని నేను,
"దేవా, నన్ను బలపరచుము" అని ప్రార్థించాను.
10నేనొక రోజున దెలాయ్యా కొడుకు షెమయా
ఇంటికి వెళ్లాను. దెలాయ్యా మెహేతబేలు కొడుకు.
ఇంటి వద్దనే వుండవలసిన షెమయా ఇలా అన్నాడు:

"నెహెమ్యా, ఆలయానికి పోయి కూర్చుం
దాము. లోపలికి పోయి తలుపులు మూసు
కుందాము. ఎందుకంటే నిన్ను చంపేం
దుకు మనుష్యులు వస్తున్నారు. ఈ రాత్రి
నిన్ను చంపేందుకు వాళ్లొస్తున్నారు."

11అయితే, నేను షెమయాతో ఇలా అన్నాను:
"నాలాంటి మనిషి పారిపోవాలంటావా? నాలాంటి వాడు
తన ప్రాణం కాపాడు కొనేందుకు దేవాలయంలోకి
పారిపోకూడదు, నేనలా వెళ్లను!"
12షెమయాని దేవుడు పంపించలేదని నాకు
తెలుసు. టోబీయా, సన్బల్లటు అతనికి డబ్బు ముట్ట
జెప్పారు కనుక, అతను నాకు వ్యతిరేకంగా హితబోధ
చేశాడు.
13నన్ను ఇరుకున పెట్టేందుకూ, భయ పెట్టేం
దుకూ వాళ్లు షెమయాని కుదుర్చుకున్నారు. భయ
పడి, ఆలయానికి పారి పోవడం ద్వారా నేను పాపం
చెయ్యాలని వాళ్లు కోరుకున్నారు. అప్పుడు, నన్ను
భయపెట్టి, నాకు అపకీర్తి తెచ్చేందుకు నా శత్రువులకి
అవకాశం చిక్కి వుండేది.
14ఓ నా దేవా, దయచేసి టోబియా, సన్బల్ల
టులు చేస్తున్న పనులు గమనించు. వాళ్లు చేసిన
పాపిష్టి పనులు కూడా గుర్తుచేసుకో. నన్ను భయ
పెట్టేందుకు ప్రయత్నిస్తున్న నోవద్యా అనే ప్రవక్త
రాలిని, తదితర ప్రవక్తలను కూడా గుర్తుచేసుకో.

## ప్రాకార నిర్మాణం పూర్తయింది

15ఈ విధంగా యెరూషలేము ప్రాకార నిర్మాణం
ఏలూలు* తొమ్మిదవనెల ఇరవై ఐదవ రోజున పూర్త
యింది. ఆ గోడ కట్టడం పూర్తిచేసేందుకు ఏభై
రెండు రోజులు పట్టింది. 16అప్పుడు, మేము గోడ
కట్టడం పూర్తి చేసినట్లు మా శత్రువులందరూ విన్నారు.
గోడ కట్టడం పూర్తయిందన్న విషయాన్ని మా చుట్టు
పక్కల దేశపు ప్రజలందరూ చూశారు. దానితో, వాళ్లు
ధైర్యం కోల్పోయారు. ఎందుకంటే, ఈ పని మన
దేవుని సహాయం వల్ల జరిగిందని వాళ్లు అర్థం చేసు
కున్నారు.
17అంతేకాదు, ఆ రోజుల్లో, గోడ కట్టడం పూర్త
యిన దరిమిలా, యూదాలోని ధనికులు టోబీయాకి

**ఏలూలు** క్రీ.పూ. 443 ఆగస్టు, సెప్టెంబరు.

ఎన్నో ఉత్తరాలు పంపుతూవచ్చారు. టోబీయా వాళ్ల
జాబులకి సమాధానాలు వ్రాసేస్తూండే వాడు.
18యూదాలో చాలా మంది అతనికి విధేయులుగా
వుంటామని మాట ఇచ్చినందువల్ల, వాళ్లు అతనికి ఆ
జాబులు వ్రాశారు. దీనికి కారణం ఏమిటంటే,
టోబీయా అరహు కుమారుడైన షెకన్యాకి అల్లుడు.
టోబీయా కొడుకు యోహానాను మెషుల్లాము
కూతుర్ని పెళ్లి చేసుకున్నాడు. మెషుల్లాము బెరెక్యా
కొడుకు. 19గతంలో వాళ్లు టోబీయాకి ఒక ప్రత్యేక
వాగ్దానం చేశారు. అందుకని, వాళ్లు నాకు టోబీయా
ఎంతో మంచివాడని చెప్తూ వచ్చారు. నేను చేస్తున్న
పనులను గురించి వాళ్లు టోబీయాకి చెప్తూండేవారు.
నన్ను భయపెట్టేందుకని టోబీయా నాకు లేఖలు
పంపుతూ వచ్చాడు.

7 ఈ విధంగా, మేము ప్రాకార నిర్మాణం పూర్తి
చేశాము. తర్వాత మేము ద్వార పాలకులను
ఎంపిక చేశాము. ఆలయ గాయకులుగా వుంటూ,
యాజకులకు తోడ్పడేవాళ్లను ఎంపిక చేశాము. 2అటు
తర్వాత, నా సోదరుడు హనానీని యెరూషలేముకి
అధికారిగా నియమించాను. హనన్యా అనే మరో వ్యక్తిని
కోటకి సేనాధిపతిగా నియమించాను. నేను హనానీని
ఎందుకు ఎంపిక చేశానంటే, అతను చాలా నిజాయితీ
పరుడు. అత్యధిక సంఖ్యాకుల కంటె, అతను అధిక
దేవుని భయం కలిగినవాడు. 3అప్పుడు నేను హనానీనీ,
హనన్యానీ ఇలా ఆదేశించాను: "కొన్ని గంటలు
పొద్దెక్కిన తర్వాత మాత్రమే మీరు యెరూషలేము
ద్వారాలు తెరవాలి. పొద్దుగుంకేలోగానే మీరు తలుపులు
మూసి, తాళాలు బిగించాలి. అంతేకాదు, కాపలా పనికి
మనుష్యుల్ని యెరూషలేము నుంచి ఎంపిక చెయ్యండి.
వాళ్లలో కొంతమందిని నగర రక్షణకిగాను ప్రత్యేక
స్థానాల్లో నిలపండి. మిగిలిన వాళ్లని వాళ్ల వాళ్ల ఇళ్ల
దగ్గరే పెట్టండి."

### తిరిగి వచ్చిన బందీల జాబితా

4అప్పుడు ఆ నగరం విశాలంగా వుంది, కావలసి
నంతకన్న ఎక్కువ ఖాళీ స్థలం ఏర్పడింది. అయితే,
నగరంలో కొద్దిమందే వున్నారు. ఇళ్లు తిరిగి ఇంకా
నిర్మింపబడలేదు. 5జనం అందర్నీ సమావేశ పర
చాలన్న సంకల్పాన్ని దేవుడు నాకు కలిగించాడు. నేను
ముఖ్యుల్నీ, ఉద్యోగుల్నీ, సామాన్యుల్నీ అందర్నీ
సమావేశానికి పిలిచాను. నేనీ పని కుటుంబాలన్నింటి
జాబితా తయారు చేయగలుగుతానన్న భావంతో
చేశాను. మొదట దేశమునుండి వెళ్లగొట్టబడిన వారిలో
తిరిగి వచ్చిన వాళ్ల కుటుంబాల జాబితాలు నాకు
దొరికాయి. అక్కడ వ్రాసివున్న సమాచారం ఇది.

6చెరనుంచి తిరిగి వచ్చిన వాళ్ల వివరం వుంది.
వెనక బబులోను రాజు నెబుకద్నెజరు వీళ్లని బబులో
నుకి బందీలుగా పట్టుకుపోయాడు. వాళ్లు ఇప్పుడు
యెరూషలేముకీ, యూదాకీ తిరిగి వచ్చారు. వాళ్లలో
ప్రతి ఒకడూ తన సొంత పట్టణానికి పోయాడు. 7ఈ
క్రిందివాళ్లు జెరుబ్బాబెలుతో* కలిసి వచ్చారు:
యేషూవా, నెహెమ్యా, అజర్యా, రయమ్యా, నహమానీ,
మొర్దెకై, బిల్షాను, మిస్పెరేతు, బిగ్వయి, నెహూము,
బయనా. ఇశ్రాయేలుకి చెందిన ఈ క్రింది మనుష్యులు
ఈ క్రింది సంఖ్యలో తిరిగి వచ్చారు:

| | | |
|---|---|---|
| 8 | పరోషు వంశీయులు | 2,172 |
| 9 | షెపట్యా వంశీయులు | 372 |
| 10 | ఆరహు వంశీయులు | 652 |
| 11 | పహత్మోయాబు వంశీయులు (వీళ్లు యేషూవ, యోవాబు కుదుళ్ల వాళ్లు) | 2,818 |
| 12 | ఏలాము వంశీయులు | 1,254 |
| 13 | జత్తూ వంశీయులు | 845 |
| 14 | జక్కయి వంశీయులు | 760 |
| 15 | బిన్నూయి వంశీయులు | 648 |
| 16 | బేబై వంశీయులు | 628 |
| 17 | అజ్గాదు వంశీయులు | 2,322 |
| 18 | అదోనీకాము వంశీయులు | 667 |
| 19 | బిగ్వయి వంశీయులు | 2,067 |
| 20 | ఆదీను వంశీయులు | 655 |
| 21 | హిజ్కియా కుటుంబానికి చెందిన ఆటేరు వంశీయులు | 98 |
| 22 | హాషూము వంశీయులు | 328 |
| 23 | బేజయి వంశీయులు | 324 |
| 24 | హారీపు వంశీయులు | 112 |
| 25 | గిబియోను వంశీయులు | 95 |
| 26 | బేత్లెహేము, నెటోపా పట్టణాల వాళ్లు | 188 |
| 27 | అనాతోతు పట్టణం వాళ్లు | 128 |
| 28 | బేతజ్మావెతు పట్టణం వాళ్లు | 42 |
| 29 | కిర్యతారీము, కెఫీరా, బేయెరోతు పట్నాల వాళ్లు | 743 |
| 30 | రమా, గెబ పట్టణాల వాళ్లు | 621 |
| 31 | మిక్మషు పట్టణం వాళ్లు | 122 |
| 32 | బేతేలు, ఆయి పట్టణాల వాళ్లు | 123 |
| 33 | రెండవ నెబో పట్టణం వాళ్లు | 52 |
| 34 | రెండవ ఏలాము పట్టణం వాళ్లు | 1,254 |
| 35 | హారిము పట్టణం వాళ్లు | 320 |
| 36 | యెరికో పట్టణం వాళ్లు | 345 |

---

**జెరుబ్బాబెలు** జెరుబ్బాబెలుని షేష్బజ్జరు అని కూడా
అంటారు.

37 లోదు హదీదు, ఓనో
పట్టణాల వాళ్లు 721
38 సెనాయా పట్టణం వాళ్లు 3,930

39 వీళ్లూ యాజకులు: యేషూవా కుటుంబం
ద్వారా యెదాయా వంశీయులు 973
40 ఇమ్మేరు వంశీయులు 1,052
41 పషూరు వంశీయులు 1,247
42 హారిము వంశీయులు 1,017

43 లేవీ వంశానికి చెందిన వాళ్లు:
యేషువా, హోదేయా,*
కద్మీయులు 74

44 వీళ్లు గాయకులు: ఆసాపు
వంశీయులు 148

45 వీళ్లు ద్వారపాలకులు: షల్లూము, అటేరు,
టల్మోను, అక్కూబు, హటీటాం,
షోబయి వంశీయులు 138

46 వీళ్లు ఈ కింది వంశాల ఆలయ ప్రత్యేక సేవకులు:
జీహా, హశూఫా, టబ్బాయేలు

47 కేరోసు, సీయహా, పాదోను,
48 లెబానా, హగాబా, షల్మయి,
49 హానాను, గిద్దేలు, గహరు
50 రెవాయ, రెజీను, నెకోదా,
51 గజ్జాము, ఉజ్జా, పాసెయ.
52 బేసాయి, మెహూనీము, నెఫూషేసీము.
53 బక్బూకు, హకూఫా, హర్హూరు,
54 బజ్లీతు, మెహీదా, హర్షా,
55 బర్కోసు, సీసెరా, తెమహు,
56 నెజీయహు, హటీపా.

57 సొలొమోను దాసుల వంశాలకు చెందిన వారు:
సొటయి, సోపెరెతు, పెరూదా,
58 యహలా, దర్కోను, గిద్దేలు,
59 షెఫట్యా, హట్టీలు, పొకెరెతు,
హజ్జెబాయిము, అమోను.
60 ఆలయ సేవకులు, సొలొమోను దాసుల
వంశీయులు కలిసి మొత్తం 392

61 కొందరు ఈ క్రింది పట్టణాలనుంచి యెరూషలే
ముకు వచ్చారు. తేల్మెలెహు, తేల్హర్షా, కెరూబు,
అదోను, ఇమ్మేరు, అయితే, వీళ్లు తమ కుటుంబాలు
ఇశ్రాయేలుకి చెందినవో కావో నిరూపించుకోలేక
పోయారు.

62 దెలాయ్యా, టోబీయా,
నెకొనిదా వంశీయులు 642

63 యాజక కుటుంబాల్లో చేరినవాళ్లు హబాయా,
హక్కోజు, బర్జిల్లయి (గిలాదీయులైన బర్జిల్లయి కుమా
ర్తెలను పెళ్లి చేసుకున్నవాళ్లు బర్జిల్లయి వంశీయులుగా
గణింపబడ్డారు.)

64 వీళ్లు తమ కుటుంబ చరిత్రల కోసం గాలించారు,
కాని అవి వాళ్లకి దొరకలేదు. తాము యాజకులుగా
పని చేయగలిగేందుకు గాను, తమ పూర్వీకులు యాజ
కులన్న విషయాన్ని వాళ్లు నిరూపించలేక పోయారు.
దానితో, వాళ్ల పేర్లు యాజకుల జాబితాలో చేర్చ
బడలేదు. 65 అత్యంత పవిత్రమైన వస్తువులను వాళ్లకి
ఇవ్వరాదని పాలనాధికారి ఆజ్ఞ జారీ చేశాడు. ప్రధాన
యాజకుడు ఊరీము, తుమ్మీము* ఉపయోగించి
దేవుని సంకల్పం తెలుసుకునేందుకోసం అర్థించి
ప్రార్థించేదాకా వాళ్లు ఈ అతి పరిశుద్ధ వస్తువుల్లో వేటికీ
అర్హులు కాకుండా పోయారు.
66-67 మొత్తం మీద, ఆ బృందంలో తిరిగి వచ్చిన
వాళ్లు 42,360 మంది వున్నారు. వాళ్ల 7,337 దాసదాసీలు
ఈ మొత్తం సంఖ్యలో చేర్చబడలేదు. వాళ్లతోబాటు
245 మంది గాయనీ గాయకులు కూడా వున్నారు.
68-69 వాళ్లకి 736 గుర్రాలు, 245 కంచర గాడిదలు,
435 ఒంటెలు, 6,720 గాడిదలు వున్నాయి.
70 కుటుంబ పెద్దలు కొందరు పనినిర్వహణకు
సహాయంగా కొంత డబ్బు ఇచ్చారు. పాలనాధికారి
ఖజానాకు 19 పౌనుల బంగారం ఇచ్చాడు. అతను 50
పళ్లాలు, యాజకులు ధరించేందుకు 530 జతల
దుస్తులు కూడా ఇచ్చాడు. 71 కుటుంబ పెద్దలు పని
నిర్వహణ కోసం 375 పౌనుల, బంగారాన్ని ఖజానాకి
ఇచ్చారు. వాళ్లు 1 1/3 టన్నుల వెండిని కూడ ఇచ్చారు.
72 మొత్తంమీద ఇతరులు 375 పౌనుల బంగారము 1
1/3 టన్నుల వెండిని తులాల వెండి, యాజకుల కోసం
67 రకాల దుస్తులు ఇచ్చారు.
73 ఈ విధంగా యాజకులు, లేవీయులు, ద్వార
పాలకులు, గాయకులు, ఆలయ సేవకులు తమతమ
సొంత పట్టణాలలో స్థిరపడ్డారు. కాగా, ఇతర ఇశ్రా
యేలీయులందరూ తమ సొంత పట్టణాల్లో స్థిర

**హోదేయా** లేక హోదద్యా.

**ఊరీము, తుమ్మీము** తీర్పు సంచిలో వుంచే ప్రత్యేక
మైన రాళ్లు. ప్రధాన యాజకుడు ఈ రాళ్లను చేత పట్టుకొని
దేవుని నుంచి సమాధానాన్ని అర్థిస్తాడు.

పడ్డారు. ఆ సంవత్సరం ఏడవ నెల* నాటికి ఇశ్రాయేలీ
యులందరూ తమ తమ పట్టణాల్లో స్థిరపడ్డారు.

### ఎజ్రా ధర్మశాస్త్రాన్ని చదవటం

8 ఆ విధంగా, ఇశ్రాయేలీయులందరూ ఆ ఏడాది
ఏడవ నెలలో సమావేశమయ్యారు. వాళ్లందరూ
నీటి గుమ్మం ముందరి మైదానంలో ఏక మనస్కులై
ఒకే మనిషి అన్నట్లు గుమికూడారు. వాళ్లు ఎజ్రా ఉప
దేశకుణ్ణి మోషే ధర్మశాస్త్రాన్ని పైకి తీసి పఠించ
వలసిందిగా కోరారు. ఇశ్రాయేలీయులకు యెహోవా
ఇచ్చిన ధర్మశాస్త్రమది. 2యాజకుడైన ఎజ్రా సమావేశ
మైన జనం ముందుకి ధర్మశాస్త్రాన్ని తెచ్చాడు. అది
నెల మొదటి రోజు. అది ఏడాదిలో ఏడవ నెల. ఆ
సమావేశంలో స్త్రీలు, పురుషులు విని, అర్థం చేసుకోగల
వయస్కులు వున్నారు. 3ఎజ్రా ఉదయాన్నుంచి మిట్ట
మధ్యాహ్నంవరకు ధర్మశాస్త్రాన్ని చదివాడు. నీటి
గుమ్మం ఎదుటవున్న మైదానానికి ఎదురుగా నిలబడి,
ఎజ్రా స్త్రీలనీ, పురుషుల్నీ విని అర్థం చేసుకోగల వాళ్లం
దర్నీ ఉద్దేశించి చదివాడు. జనం అందరూ ధర్మశాస్త్ర
గ్రంథం పట్ల భక్తి శ్రద్ధలతో విన్నారు.
4ఎజ్రా ఈ ప్రత్యేక సందర్భంకోసం నిర్మింపబడిన
ఎత్తైన కొయ్య వేదిక మీద నిలబడ్డాడు. ఎజ్రా కుడి
పక్కన మత్తిత్యా, షెమ, అనాయా, ఊరియా,
హిల్కియా, మయశేయాలు ఉన్నారు. ఎజ్రా ఎడమ
పక్కన పెదాయా, మిషాయేలు, మల్కియా, హాషుము,
హష్బద్దానా, జెకర్యా, మెషుల్లాములు వున్నారు.
5అప్పుడు ఎజ్రా గ్రంథం విప్పాడు. ఎజ్రా ఎత్తైన
వేదిక మీద నిలబడి ఉన్నందున జనులందరూ అతన్ని
చూడగలుగుతున్నారు. ఎజ్రా ధర్మశాస్త్ర గ్రంథాన్ని
తెరవగానే, జనం అందరూ గౌరవంగా లేచి నిలబడ్డారు.
6ఎజ్రా మహా దేవుడైన యెహోవాను స్తుతించాడు.
జనులందరూ తమ చేతులు పైకెత్తి బిగ్గరగా, "ఆమేన్!
ఆమేన్!" అన్నారు. తర్వాత జనులందరూ నేలమీద
వంగి నమస్కరించి యెహోవాను ఆరాధించారు.
7జనం అక్కడ నిలబడి వుండగా లేవీయులు ధర్మ
శాస్త్ర నియమాలను జనానికి బోధించారు. అలా బోధిం
చిన లేవీయులు: యేషూవ, బానీ, షేరేబ్యా, యామీను,
అక్కూబు, షబ్బెతై, హూదీయా, మయశాయా,
కెలీటా, అజర్యా, యోజాబాదు, హానాను, పెలాయా.
8ఆ లేవీయులు దేవుని ధర్మశాస్త్ర గ్రంథాన్ని చదివారు.
వాళ్లు జనానికి అర్థం వివరించి దాన్ని సులభం చేశారు.
చదివినదాన్ని జనం తేలిగ్గా అర్థం చేసుకోగలిగేందుకు
గాను వాళ్లు తాత్పర్యాలను వివరించి చెప్పారు. 9తర్వాత
పాలనాధికారి నెహెమ్యా, యాజకుడును, ఉపదేశకుడు
నైన ఎజ్రా, జనానికి బోధిస్తున్న లేవీయులు మాట్లా
డారు. వాళ్లు, "ఈ రోజు మీ దేవుడైన యెహోవాకి
ప్రత్యేక దినం* మీరు విచారంగా వుండకండి, ఏడ్వ
కండి!" అని చెప్పారు. ధర్మశాస్త్రంలోని సందేశాలను
వింటూ జనం అందరూ రోదించనారంభించిన
మూలంగా వాళ్లీ మాటలు చెప్పారు.
10నెహెమ్యా ఇలా చెప్పాడు: "పోయి కొవ్విన
మాంసంతో భోజనం చేయండి, మధుర ద్రాక్షారసం
సేవించండి. ఏ ఆహారమూ తయారు చేసుకోని వాళ్లకి
కొంత ఆహారమూ పానీయాలూ ఇవ్వండి. ఈ రోజు
యెహోవాకి ప్రత్యేకమైన రోజు. విచారాన్ని విడ
నాడండి! ఎందుకంటే, యెహోవా ఆనందం మీకు
పుష్టిని చేకూరుస్తుంది."
11జనం శాంతచిత్తులయ్యేందుకు లేవీయులు
తోడ్పడ్డారు. "శాంతించండి, మౌనంగా వుండండి.
ఇదొక ప్రత్యేక దినం, దుఃఖించకండి."
12అప్పుడిక అందరూ విందు భోజనం చేసేందుకు
వెళ్లారు. వాళ్లు తమ ఆహార పదార్థాలనీ, పానీయాలనీ
పరస్పరం పంచుకున్నారు. ఆ ప్రత్యేక దినాన్ని
వాళ్లెంతో సంతోషంగా జరుపుకున్నారు. వాళ్లు చివరికి
బోధకులు తమకి బోధించ ప్రయత్నిస్తున్న ధర్మశాస్త్ర
గుణపాఠాలను అర్థం చేసుకున్నారు. 13అటు తర్వాత,
నెల రెండవ రోజున* అన్ని కుటుంబాల పెద్దలూ
ఎజ్రానూ, యాజకులనూ, లేవీయులనూ కలుసుకు
నేందుకు వెళ్లారు. వాళ్లందరూ ధర్మశాస్త్రంలోని ప్రవచ
నాలను అధ్యయనం చేసేందుకు ఉపదేశకుడైన ఎజ్రా
చుట్టూ చేరారు.
14-15వాళ్లు ధర్మశాస్త్రన్ని అధ్యయనం చేయగా
దానిలో ఈ దిగువ ఆజ్ఞలు వాళ్లకి కనిపించాయి
యెహోవా మోషే ద్వారా ఈ ఆజ్ఞ ఇచ్చాడు: ఏడాది
ఏడవ నెలలో ఇశ్రాయేలీయులు యెరూషలేముకు
ప్రత్యేకమైన పండుగ జరుపుకు నేందుకు విధిగా పోవాలి.
వాళ్లు తాత్కాలిక పర్ణశాలల్లో ఉండాలి. తమ పట్టణాల
న్నింటికీ, యెరూషలేముకీ పోయి, ఈ కింది మాటలు
ప్రకటించాలి. "పర్వత ప్రాంతానికి పోయి రకరకాల
ఒలీవ చెట్ల కొమ్మలు తీసుకురావాలి. కదంబ, తాటి,
ఈత ఆకులను, అలాగే నీడనిచ్చే ఇతర మొక్కలను
తీసుకురావాలి. ఆ కొమ్మలతో తాత్కాలికమైన పర్ణ
శాలలు వెయ్యాలి. ధర్మశాస్త్ర గ్రంథం చెప్పినట్లు
చెయ్యండి." 16సరే, జనం పోయి, ఆ చెట్ల కొమ్మలు
తెచ్చారు. తర్వాత వాటితో వాళ్లు తమకి తాత్కాలిక

---

**ఏడవ నెల** ఏడవనెల అనగా సెప్టెంబరు, అక్టోబరు.

**ప్రత్యేక దినం** ఇది ప్రత్యేకమైన ఆరాధనా దినం. ఈ రోజున జనం ఒక చోట కూడి, సహవాసపు విందులో పాల్గొనేవారు.

**నెల రెండవ రోజు** ప్రతి నెలా మొదటి, రెండవ రోజులు ప్రత్యేకమైన ఆరాధనా దినాలు. జనం ఒక చోట కూడి స్నేహ పూర్వకమైన భోజనాలు చేసే రోజులు.

పర్ణశాలలు నిర్మించుకున్నారు. వాళ్లా పర్ణశాలలను తమ
ఇళ్ల కప్పు లపైనా, తమ ఆవరణల్లోనూ వేసుకున్నారు.
వాళ్లు ఆలయ ప్రాంగణంలో, నీటి గుమ్మం దగ్గరి
ఖాళీ స్థలంలో, ఎఫ్రాయిము ద్వారం దగ్గర పర్ణశాలలు
నిర్మించారు. 17చెరనుంచి బంధవిముక్తులై తిరిగివచ్చిన
ఇశ్రాయేలీయుల బృందమంతా పర్ణశాలలు కట్టు
కున్నారు. వాళ్లు తాము కట్టుకున్న పర్ణశాలల్లో నివ
సించారు. నూను కుమారుడైన యెహోషువా కాలం
నుంచి ఆనాటిదాకా ఇశ్రాయేలీయులు పర్ణశాలల పండు
గను ఇంత చక్కగా జరుపుకోలేదు. అందరూ ఎంతో
సంతోషించారు!

18ఆ పండుగ ప్రతి రోజూ, మొదటి రోజునుంచి
చివరి రోజు ఎజ్రా వాళ్లకి ధర్మశాస్త్ర గ్రంథాన్ని చదివి
వినిపించాడు. ఇశ్రాయేలు ప్రజలు ఆ పండగను వారం
రోజులపాటు జరుపుకున్నారు. అటు తర్వాత ఎని
మిదో రోజున, ధర్మశాస్త్రం నిర్దేశించినట్లు ఒక ప్రత్యేక
సమావేశం కోసం ఒక చోట కూడారు.

### ఇశ్రాయేలీయులు తమ పాపాలను ఒప్పుకొనటం

9 తర్వాత అదే నెల 24 వ రోజున, ఇశ్రాయేలీయులు
ఒక చోట చేరి సామూహిక ఉపవాసం చేశారు.
వాళ్లు విచార సూచకమైన దుస్తులు ధరించారు. (తమ
విచారాన్ని చూపేందుకు గాను) నెత్తిన బూడిద పోసు
కున్నారు. 2నిజంగా ఇశ్రాయేలీయులైన వాళ్లు అన్య
జనులనుంచి వేరుపడి, ఆలయంలో నిలబడి, తమ
పాపాలనూ, తమ పూర్వీకుల పాపాలనూ ఒప్పు
కొన్నారు. 3వాళ్లక్కడ సుమారు మూడు గంటలసేపు
నిలబడ్డారు, తమ దేవుడైన యెహోవా ధర్మశాస్త్రాన్ని
చదివారు, తర్వాత మరో మూడు గంటలు తమ
పాపాలు ఒప్పుకొని, యెహోవా ముంగిట సాగిల
పడ్డారు.

4అటు తర్వాత, ఈ క్రింది లేవీయులు మెట్లపైన
నిలబడ్డారు: యేషూవా, బానీ, కద్మీయేలు, షెబన్యా,
బున్నీ, షేరేబ్యా, బానీ, కెనానీ. వాళ్లు ఉచ్చ స్వరాల్లో
యెహోవాను పిలిచారు. 5తర్వాత ఈ లేవీయులు
మళ్లీ ప్రసంగించారు: యేషువా, బానీ, కద్మీయేలు,
హషబ్నెయా, షేరేబ్యా, హోదీయా, షబన్యా, పెత
హోయా, వాళ్లు, "లేచి నిలబడి, ప్రభువైన దేవుణ్ణి
స్తుతించండి" అని చెప్పారు.

దేవుడు ఎల్లప్పుడు ఉండును. ఆయన ఎల్ల
ప్పుడూ జీవించును! నీ ఘననామం స్తుతించ
బడాలి. నీ ఘనమైన నామం సకలాశీర్వచన
స్తోత్రాలనూ అధిగమించి పోవాలి!
6 యెహోవా నీవే దేవుడివి!, యెహోవా
ఆకాశం, అత్యున్నత పరలోకాలు, వాటిలో
వున్న సమస్తాన్ని నీవే సృజించావు! భూమినీ,
దానిపైనున్న సమస్తాన్నీ నీవే సృజించావు!
సముద్రాలను సృజించింది నీవే. వాటిలో ఉన్న
సమస్తాన్నీ సృజించింది నీవే! ప్రతిదానికీ
ప్రాణంపోసింది నీవే, దేవదూతలు నీకు నమ
స్కరిస్తారు. నీ సన్నిధియందు సాగిలపడతారు
నిన్ను ఆరాధిస్తారు!
7 యెహోవా, నీవే దేవుడివి. అబ్రామును ఎంచు
కున్నది నీవే. అతన్ని బబులోనులోని ఊరు
నుంచి నడిపించింది నీవే. అబ్రాహాముగా అతని
పేరు మార్చింది నీవే!
8 అతడు నీకు నమ్మకంగా, విశ్వాసంగా ఉండేలా
చూసుకున్నావు. అతనితో నీవొక ఒడంబడిక
చేసుకున్నావు. అతని సంతతి వారికి వాగ్దానం
చేశావు నీవు కనాను, హిత్తీ, అమోరీ, పెరిజ్జీ,
యెబూసీ, గిర్గాషి జాతుల దేశాన్ని ఇస్తానన్న.
నీ మాటను నీవు నిలుపుకున్నావు! నీవు
నిజాయితీగలవాడవు, మాట నిలుపుకున్నావు!
9 మా పూర్వీకులు ఈజిప్టులో బాధలు పడటం
చూశావు! సహాయార్థం ఎర్ర సముద్ర తీరాన
వారి మొరలు ఆలకించావు.
10 నీవు ఫరోకి అద్భుతాలు ప్రదర్శించావు అతని
ఉద్యోగులకీ, ప్రజలకీ దిగ్భ్రాంతికరమైన
పనులు చేసి చూపావు. మా పూర్వీకుల కంటె
తాము గొప్ప అని ఈజిప్టీయులు అనుకోవడం
నీకు తెలుసు. అయితే నువ్వు, నీ వెంత
గొప్పవాడివో నిరూపించుకొన్నావు! ఈనా
టికీ అది వాళ్లు జ్ఞాపకం ఉంచుకొంటారు.
11 నీవు వాళ్ల కళ్ల ముందు ఎర్ర సముద్రాన్ని
విభాగించావు. వాళ్లు పొడినేల మీద నడిచి
పోయారు! ఈజిప్టు సైనికులు వాళ్లని తరుము
తున్నారు కాని, నువ్వు ఆ శత్రువుని సము
ద్రంలో ముంచేశావు. మరి వాళ్లు ఒక రాయిలా
నీటిలో మునిగారు.
12 పగటి పూట మేఘస్తంభంలో వుండి వాళ్లని
నడిపించావు, రాత్రివేళ దీపస్తంభంలో వుండి
వాళ్లని నడిపించావు, ఆ విధంగా నీవు వారి
మార్గాన్ని వెలిగించితివి. వాళ్లు చేరవలసిన
గమ్యాన్ని చూపావు.
13 అప్పుడిక సీనాయి పర్వతం మీదికి దిగి ఆకాశం
నుంచి వాళ్లతో మాట్లాడావు. వాళ్లకి చక్కటి.
ధర్మనియమాలిచ్చావు. వాళ్లకి సదుపదేశా
లిచ్చావు. మంచి ఆజ్ఞలిచ్చావు, చక్కటి
ఆదేశాలిచ్చావు!
14 నీ ప్రత్యేక విశ్రాంతి దినమైన సబ్బాతుని గురించి
వాళ్లకి చెప్పావు. వాళ్లకి ఆజ్ఞలు, చట్టాలు, ఉప
దేశాలు ఇచ్చేందుకు నీ సేవకుడు మోషేని
వినియోగించావు.
15 వాళ్లు ఆకలిగొన్నప్పుడు వాళ్లకి నీవు ఆకాశం

నుంచి తిండినిచ్చావు. వాళ్లు దప్పి గొన్న
ప్పుడు వాళ్లకి నీవు రాయినుంచి మంచి
నీళ్లిచ్చావు. వాళ్లకి చెప్పావు, 'రండి, ఈ భూమి
తీసుకోండని' నీవు నీ శక్తిని వినియోగించి
వారికోసం ఆ భూమిని తీసుకున్నావు!
16 కాని వాళ్లు, మా పూర్వీకులు గర్వపడి కన్ను
గానక ప్రవర్తించారు. వాళ్లు మొండి వారై నీ
ఆజ్ఞలు పాటించక నిరాకరించారు.
17 వాళ్లు నీ మాటలు తిరస్కరించారు. వాళ్లకు
నీవు చేసిన ఆశ్చర్యకార్యాలను అద్భుతా లను
మరిచారు. వాళ్లు మొండివారై ఎదురు తిరిగి
నప్పుడు, వాళ్లు మళ్లీ వెనుకకు తిరిగి బానిసల
య్యారు. నీవు క్షమాశీలివి! నీవు దయామ
యుడివి. కరుణామయుడివి. నీవు ఓర్పుగల
వాడివి. ప్రేమామయుడవు. అందుకే నీవు
వాళ్లను విడువలేదు.
18 వాళ్లు లేగ దూడల బంగారు బొమ్మలు చేసి,
"మమ్మల్ని ఈజిప్టు నుంచి వెలికి తెచ్చిన
దేవుళ్ళు వీరే, వీరే "అన్నా నీవు వాళ్లని
వదిలేయలేదు!
19 నీవెంతో దయామయుడివి! అందుకే వాళ్లని
ఎడారిలో వదిలేయలేదు. పగటివేళ మేఘస్తం
భాన్ని వాళ్లనుంచి తప్పించలేదు. వాళ్లని నడిపి
స్తూనే వచ్చావు. రాత్రివేళ దీపస్తంభాన్ని వాళ్ల
దృష్టినుంచి తొలగించ లేదు. వాళ్ల బాటకి
వెలుగు చూపుతూనే వచ్చి వాళ్లకి మార్గదర్శనం
చేస్తూనే వచ్చావు.
20 వాళ్లని వివేకవంతుల్ని చేసేందుకు నీవు వారికి
నీ మంచి ఆత్మను ఇచ్చావు. వాళ్లకి ఆహారంగా
మన్నా నిచ్చావు. వాళ్ల దప్పిక తీర్చేందుకు
మంచి నీరిచ్చావు.
21 నీవు వాళ్లని నలుబదియేండ్లు పోషించావు!
ఎడారిలో అవసరమైనవన్నీ వాళ్లు పొందారు.
వాళ్ల దుస్తులు చీకిపోలేదు. వాళ్ల పాదాలు వాయ
లేదు, గాయపడలేదు.
22 యెహోవా, నీవు వాళ్లకి రాజ్యాలిచ్చావు, దేశాలి
చ్చావు, జనాభా పలచగావున్న సుదూర
ప్రాంతాలనిచ్చావు. హెష్బోను రాజైన
సీహోను దేశాన్నీ, బాషాను రాజైన ఓగు
దేశాన్నీ పొందారు వాళ్లు.
23 యెహోవా నీవు వాళ్ల సంతతివారిని విస్తరింప
చేసావు. వాళ్లు ఆకాశంలోని నక్షత్రాలంత మంది
ఉండిరి. వాళ్ల పూర్వీకులకి నీవివ్వ జూపిన
దేశానికి నీవు వాళ్లని తీసు కొచ్చావు. వాళ్లు ఆ
భూమిలో ప్రవేశించి, దాన్ని స్వాధీన పరుచు
కున్నారు.
24 ఆ బిడ్డలు ఆ భూమిని వశపరచుకున్నారు.
అక్కడ నివసిస్తున్న కనానీయుల్ని వాళ్లు ఓడిం
చారు. ఆ ప్రజలను వాళ్లోడించేటట్టు నీవు
చేశావు! ఆ దేశ ప్రజలను, రాజులను నీ ప్రజ
లేమి చేయదలచుకుంటే, అది చేయనిచ్చావు!
25 వాళ్లు బలీయమైన నగరాలను ఓడించారు. సార
వంతమైన భూమిని కైవసం చేసుకున్నారు.
మంచి వస్తువులతో నిండిన ఇళ్లూ, అంతకు
ముందే తవ్విన బావులూ వాళ్లకి చిక్కాయి.
వాళ్లకి ద్రాక్షాతోటలు, ఒలీవ చెట్లు, ఎన్నెన్నో
రకాల ఫలవృక్షాలు చిక్కాయి. వాళ్లు కడుపు
నిండ తిని, కొవ్వెక్కారు. వాళ్లకి నీవిచ్చిన
ఎన్నెన్నో వింత వస్తువులు వాళ్లు తనివితీరా
అనుభవించారు.
26 మరి తర్వాత వాళ్లు నీకు ఎదురు తిరిగారు!
వాళ్లు నీ బోధనలను తోసిపుచ్చారు! వాళ్లు
నీ ప్రవక్తల్ని హతమార్చారు. ఆ ప్రవక్తలు చేసిన
తప్పిదం జనాన్ని హెచ్చరించడం, వాళ్లని తిరిగి
నీ వైపుకి తిప్ప ప్రయత్నించడం. కొరకే కాని
మా పూర్వీకులు నీకు ప్రతికూలంగా దారుణా
లెన్నో చేశారు!
27 వాళ్ల శత్రువులు వాళ్లని చెరపట్టడానికి అందుకనే
నీవు అనుమతించావు. శత్రువులు వాళ్లని నానా
ఇబ్బంది పెట్టారు. కష్టాలు ఎదురైనప్పుడు
మా పూర్వీకులు సహాయంకోసం నీకు మొర
పెట్టుకున్నారు. పరలోకంలో వున్న నీవు వాళ్ల
మొర విన్నావు. నీవు చాలా దయాశీలివి. అందు
కని నీవు వాళ్లని కాపాడేందుకు మనుష్యుల్ని
పంపావు. ఆ మనుష్యులు వాళ్లని వాళ్ల శత్రువుల
నుంచి విడిపించారు.
28 సరే, పరిస్థితులు మెరుగవగానే మా పూర్వీ
కులు తిరిగి ఎన్నెన్నో దారుణాలు చేయ
నారంభించారు! నీవు మరలా శత్రువులు వారిని
ఓడించి, శిక్షించేటట్టు చేశావు. వాళ్లు మళ్లీ నీకు
మొర పెట్టుకున్నారు. పరలోకంలో ఉన్న నీవు
ఆ మొర విని వాళ్లకి తోడ్పడ్డావు. నీవెంతో
దయామయుడివి! ఇలా జరిగింది ఎన్నెన్నో
సార్లు!
29 నీవు వాళ్లని హెచ్చరించావు. మంచి మార్గా
నికి తిరిగి రమ్మన్నావు. అయితే, వాళ్లు మరీ
గర్వపడి, నీ ఆదేశాలను, ఆజ్ఞలను మీరారు.
జనం నీ ఆజ్ఞలను పాటిస్తే వాళ్లు నిజంగా
బతుకుతారు. కాని మా పూర్వీకులు నీ ఆజ్ఞలు
ఉల్లంఘించారు వాళ్లు మొండివారై, నీకు పెడ
ముఖమయ్యారు, నీ ఆజ్ఞలు పెడచెవిన
పెట్టారు.
30 నీవు మా పూర్వీకుల పట్ల చాలా ఓర్పు
వహించావు. వాళ్లు నీతో సరిగా వ్యవ హరించక

పోయినా చాలా సంవత్సరాలు వాళ్లని సహిం
చావు. నీ ఆత్మతో వాళ్లని హెచ్చరించావు.
వాళ్లని హెచ్చరించేందుకు ప్రవక్తల్ని పంపావు.
కాని మా పూర్వీకులు వాళ్ల మాటలు వినలేదు.
అందుకే నువ్వు వాళ్లని విదేశాల్లోని మనుష్యు
లకు అప్పగించావు.
31 అయితే, నీవెంతో దయామయుడివి! వాళ్లని
నీవు సర్వనాశనం చేయలేదు. నీవు వాళ్లని
విడువలేదు. నీవెంతో దయామయుడివి, దేవా,
నీవెంతో కరుణామయుడివి!
32 మా దేవా, నీవు మహా దేవుడివి, భయంకరు
డివి, శక్తిశాలియైన యోధుడివి! నీవు దయామ
యుడివి, విశ్వాసనీయుడివి! ఒడంబడికను
తప్పని వాడివి! మాకెన్నో కష్టాలు, కడగళ్లు
వచ్చాయి. మా కష్టాలు నీవు పట్టించు
కుంటావు! మా ప్రజలందరికీ, మా రాజులకీ,
మా పెద్దలకీ, మా యాజకులకీ, మా ప్రవక్తలకీ
ఎన్నెన్నో కష్టాలు వచ్చాయి. అష్షూరు రాజు
పాలన కాలం నుంచి నేటిదాకా అవి వున్నాయి!
కష్టాలు మమ్మల్ని వెన్నాడుతూనే వున్నాయి!
33 అందుకని దేవా మాకు సంభవించే ప్రతి దాన్ని
గురించీ నీదే ఒప్పు, మాదే తప్పు.
34 మా రాజులు, నాయకులు, యాజకులు, మరి
మా పూర్వీకులు నీ ధర్మనిబంధనలు పాటించ
లేదు. వాళ్లు నీ ధర్మశాస్త్రాన్ని మీరారు, నీ
హెచ్చరికను ఖాతరు చేయలేదు.
35 తమ స్వదేశంలో నివసించినప్పుడు సైతం
మా పూర్వీకులు నీకు సేవ చేయలేదు. వాళ్లు
దుష్టకార్యాలు చేయడం మానలేదు.నీవు వాళ్ల
కిచ్చిన అద్భుతమైన వాటన్నిటినీ హాయిగా
అనుభవించారు. వాళ్లు సారవంతమైన భూమిని
అనుభవించారు సువిశాల దేశాన్ని ఏలుకు
న్నారు, అయినా, తమ దుర్మార్గాలు వీడలేదు.
36 మరి ఇప్పుడు, మేము బానిసలము. మేమీ
భూమిలో ఏ భూమినీ, దేని ఫలసాయాలనూ,
ఇక్కడ పెరిగే మంచివాటన్నిటినీ అనుభవించ
మని మా పూర్వీకులకు నీవిచ్చావో, ఆ
భూమిలో మేము ఈనాడు దాసులము.
37 ఈ భూమిలో పంట పుష్కలమైనదే కాని
మేము పాపాలు చేశాము కదా, అందుకని ఆ
పంట నీవు మా నెత్తిన పెట్టిన రాజులకు
పోతుంది. ఆ రాజులు మామీదా, మా పశువుల
పైనా పెత్తనం చలాయిస్తారు. తమకిష్టము
వచ్చినట్లు వ్యవహరిస్తారు. దేవా, మేము చాలా
కష్టాల్లోవున్నాము.
38 వీటన్నింటి మూలంగా, మార్చరాని స్థిరమైన
ఒడంబడిక ఒకటి మేము చేసుకుంటున్నాము.
మేమీ ఒడంబడికను రాత పూర్వకంగా చేసు
కొంటున్నాము. మా నాయకులూ, లేవీ
యులూ, యాజకులూ ఈ ఒడంబడిక మీద
సంతకాలు చేసి, ఒక ముద్రతో దానికి ముద్ర*
వేస్తున్నారు.

10 అలా ముద్ర వేయబడిన ఒడంబడిక మీద
ఉన్న పేర్లు ఇవి: పాలనాధికారి నెహెమ్యా,
నెహెమ్యా హకల్యా కుమారుడు. సిద్కియా, 2శెరాయా,
అజర్యా, యిర్మీయా, 3పషూరు, అమర్యా, మల్కీయా,
4హట్టూషు, షెబన్యా, మల్లూకు, 5హరిము, మెరేమోతు,
ఓబద్యా, 6దానియేలు, గిన్నెతోను, బారూకు,
7మెషుల్లాము, అబీయా, మీయామిను, 8మయజ్యా,
బిల్గయి, షెమయా. ఇవన్నీ ఒడంబడిక మీద సంతకాలు
పెట్టిన యాజకుల పేర్లు.
9ముద్రవేయబడిన ఒడంబడిక మీద సంతకాలు
పెట్టిన లేవీయుల పేర్లు ఇవి: అజన్యా కుమారుడు
యేషువా, హేనాదాదు వంశానికి చెందిన బిన్నూయి,
కద్మీయేలు, 10వాళ్ల సోదరులు: షెబన్యా, హోదీయా,
కెలీటా, పెలాయా, హానాను, 11మీకా, రెహోబు,
హషబ్యా, 12జక్కూరు, షేరేబ్యా, షెబన్యా,
13హోదీయా, బానీ, బెనీను. 14ముద్రవేయబడిన
ఒడంబడిక మీద సంతకాలు చేసిన నాయకుల పేర్లు:
పరోషు, పహత్మోయాబు, ఏలాము, జత్తూ, బానీ,
15బున్నీ, అజ్గాదు, బేబై, 16అదోనీయా, బిగ్వయి,
అదీను, 17అటేరు, హిజ్కియా, అజ్జూరు,
18హోదీయా, హాషుము, బేజయి, 19హారీఫు, అనా
తోతు, నేబై, 20మగ్పీయాషు, మెషుల్లాము, హెజీరు,
21మెషేజబేలు, సాదోకు, యద్దూవ, 22పెలట్యా,
హానాను, అనాయా, 23హోషేయ, హనన్యా, హష్షూబు,
24హల్లోహేషు, పిల్హా,షోబేకు, 25రెహూము, హషబ్నా,
మయశేయా, 26అహీయా, ఆనాను, అనాను,
27మల్లూకు, హరీము, బయనా.
28-29ఈ విధంగా, ఇప్పుడు వీళ్లందరూ దేవునికి
ఈ ప్రత్యేక ప్రమాణం చేస్తున్నారు. తమ ఈ ప్రమా
ణాన్ని నిలుపుకోకపోతే, తామందరికీ చెడు, కీడు
జరపమని వీళ్లంతా అర్థించారు. వీళ్లందరూ దేవుని ధర్మ
శాస్త్ర నియమాలను అనుసరిస్తామని ప్రమాణం చేస్తు
న్నారు. ధర్మశాస్త్రం దేవుని సేవకుడైన మోషే ద్వారా
మాకు ప్రసాదించబడింది. మన దేవుడైన యెహోవా
ఆదేశాలను, నియమ నిబంధనలను, ఉపదేశాలను

---

**ముద్ర** రబ్బరు స్టాంపులా ఉపయోగించడానికి వీలైన చిన్నరాతి ముక్కలు, లేక ఉంగరాలు. తడి మట్టిలో గాని, కరిగిన మైనంలో గాని ఈ ముద్రికను ఒత్తితే, అవి ఒక ప్రత్యేక ముద్రను మిగులుస్తాయి. ఆ ముద్ర సంతకంతో సమానం.

అన్నింటినీ విధేయతతో పాటిస్తామని వీళ్లందరూ
ప్రమాణం చేస్తారు. ఈ ప్రమాణం చేస్తున్నది ఈ
మనుష్యులే: మిగిలిన వాళ్లు యాజకులు, లేవీయులు,
ద్వారపాలకులు, గాయకులు, ఆలయ సేవకులు, తమ
చుట్టూ నివసిస్తున్నవారినుంచి తమని తాము వేరు
చేసుకున్న ఇశ్రాయేలీయులందరూ తాము దేవుని
ధర్మశాస్త్రాన్ని విధేయతతో పాటించేందుకుగాను వాళ్లు
తమని తాము వేరు చేసుకున్నారు. అంతేకాదు,
వాళ్లందరి భార్యలు, విని అర్థం చేసుకోగల వాళ్లందరి
కొడుకులు, కూతుళ్లు కూడా తమని తాము వేరు
చేసుకున్నారు. వీళ్లందరూ దేవుని ధర్మశాస్త్రాన్ని
పాటిస్తామని ప్రమాణం చేసేందుకుగాను తమ సోదరు
లతోనూ, పెద్దలతోనూ జతకూడారు. తాము దేవుని
ధర్మశాస్త్రాన్ని పాటించకపోతే, తమకి కీడు కలిగించే
శాపాన్ని తలదాల్చేందుకు కూడా సిద్ధపడ్డారు.
30 "మా చుట్టు పక్కల వున్న ఇతర ప్రజలను
మా కూతుళ్లు పెళ్లి చేసుకోకుండా, అలాగే మా
కొడుకులు ఇతర ప్రజల కూతుళ్లను పెళ్లి చేసుకో
కుండానూ చూస్తామని మేము ప్రమాణం చేస్తున్నాము.
31 "మేము సబ్బాతు (విశ్రాంతి) రోజున పని చేయ
మని ప్రమాణం చేస్తున్నాము. మా చుట్టూ ఉన్న
ఇతర ప్రజలు సబ్బాతు రోజున తిండి గింజలో, ఇతర
వస్తువులో అమ్మకానికి తెస్తే ఆ ప్రత్యేక దినానగాని,
మరే ఇతర పండగ దినాల్లోగాని మేము వాటిని కొనము.
ప్రతి ఏడేళ్లకీ ఒకసారి ఇతరులు మాకియ్యవలసిన బాకీ
మొత్తాలను రద్దు చేస్తాము.
32 "దేవుని ఆలయం విషయంలో శ్రద్ధ తీసు
కోవాలన్న ఆదేశాల మేరకు మేమా బాధ్యతను స్వీకరి
స్తాము. దేవునికి నిత్యం ధూప దీప నైవేద్యాలు
సక్రమంగా జరిగేందు కోసం మేము ప్రతియేటా
తులము వెండిలో* మూడోవంతు ఇస్తాము. 33 ఆల
యంలో వారు బల్లమీద పెట్టే ప్రత్యేక రొట్టెకోసం,
ప్రతి రోజూ అర్పించే ధాన్యార్పణలు దహనబలుల
కోసం ఈ సొమ్ము యాజకులచేత వినియోగించబడు
తుంది. అలాగే, ఈ సొమ్ము నవధాన్యాలు కొనేందుకు
ధూప దీపాలు పెట్టేందుకు ఉపయోగింపబడుతుంది.
సబ్బాతు రోజుల్లో, అమావాస్య* దినాల్లో నైవేద్యం
నిమిత్తం ఈ సొమ్ము వినియుక్తమవుతుంది. అది పవిత్ర
బలులకోసం, ఇశ్రాయేలీయులను పరిశుద్ధులను చేసే
పాపపరిహారార్థ బలులకోసం వినియోగింపబడుతుంది.

**తులము వెండి** బహుశా యిది ఆ కాలపు నాణెం అయ్యుంటుంది. ఇది ఒక ఔన్సులో 2/5 భాగము 11.5 గ్రాములు.

**అమావాస్య** ఇది హీబ్రూ నెల మొదటి రోజు. దేవుని ఆరాధన కోసం ఆ రోజున ప్రత్యేకమైన సమావేశాలు జరుగుతాయి.

34 "యాజకులము, లేవీయులము, సామాన్య జన
మైన మనము చీట్లు* వేసుకున్నాము. తద్వారా, మా
కుటుంబాల్లో ఏటా మన ఆలయానికి ఏయే నిర్ణీత
దినాల్లో కట్టెల మోపులు (సమిధలు) తేవాలో
తెల్సుకున్నాము. ఆ కట్టెలు మన దేవుడైన యెహోవా
గట్టు మీద హోమం కోసం తెచ్చేవి. అదంతా మేము
సరిగ్గా ధర్మశాస్త్రంలో వ్రాసిన నిబంధనల ప్రకారం
చెయ్యాలి. 35 "మా పంట చేలనుంచీ, ప్రతి ఒక్క ఫల
వృక్షం నుంచీ తొలి ఫలాలను ఏటా యెహోవా ఆరాధ
నాలయానికి తెచ్చి ఇచ్చే బాధ్యతను మేము స్వీకరి
స్తున్నాము.
36 "ధర్మశాస్త్రంలో సరిగ్గా లిఖించబడినట్లే, మేమిలా
చేస్తాము: మా తొలిచూలు కొడుకుల్నీ, అలాగే,
మొదటి ఈత ఆవుల దూడల్నీ, గొర్రెల, మేకల
పిల్లల్నీ మన దేవుని ఆలయానికి, మన యాజకుల
దగ్గరికి తెస్తాము.
37 "యెహోవా ఆలయపు సరుకుల కొట్ల దగ్గరికి
తెచ్చి, ఈ కింది వస్తువులు యాజకులకి సమర్పిస్తాము:
మొదటవిడత ఆడిన పిండి, ధాన్యార్పణలో మొదటి
భాగం, మా ఫల వృక్షాలన్నింటి మొదటి పండ్లు మా
కొత్త ద్రాక్షారసం నుంచీ, నూనె నుంచీ మొదటి భాగం,
మా పంటల్లో పదోవంతును లేవీయులకి సమ
ర్పిస్తాము. మేము పనిచేసే ఆయా ప్రాంతాల్లో లేవీ
యులు వీటిని వసూలు చేస్తారు. అందుకే మేము
వారికి ఇస్తాము. 38 ఆ పంట భాగాలు లేవీయులు
వసూలు చేసేటప్పుడు, వాళ్లతో అహరోను వంశానికి
చెందిన యాజకుడొకడు ఉండాలి. తర్వాత ఆ
లేవీయులు ఆ పంటల్ని విధిగా ఆలయానికి తీసు
కురావాలి. అప్పుడు వాటిని వాళ్లు ఆలయపు ఖజానా
లోని సరుకుల కొట్లలో ఉంచుతారు. 39 ఇశ్రాయేలీ
యులు, లేవీయులు తమ ఆహార ధాన్యాలు, కొత్త
ద్రాక్షారసం, నూనె కానుకలను సరుకుల గదుల వద్దకు
తెస్తారు. ఆలయానికి తెచ్చే వస్తువులన్నీ అక్కడ
ఉంచబడతాయి. సేవలో వున్న యాజకులు అక్కడే
ఉంటారు. గాయకులు, ద్వారపాలకులు కూడా అక్కడే
వుంటారు.
"మా దేవుని ఆలయాన్ని భద్రంగా చూసు కుంటా
మని మేమంతా ప్రమాణం చేశాము!"

### యెరూషలేములో కొత్త ప్రజలు

11 ఇశ్రాయేలు ప్రజల నాయకులు అప్పుడు
యెరూషలేము నగరంలోకి నివాసం
మార్చారు. మిగిలిన ఇశ్రాయేలీయులు నగరంలోకి

**చీట్లు** నిర్ణయాలు తీసుకునేందుకు పాచికల మాదిరిగా కర్రపుల్లలు, రాళ్లు, గవ్వలు వేయడం. సామెతలు 16:33 చూడండి.

ఇంకెవరు రావాలో నిర్ణయించవలసి వచ్చింది. అందుకని వాళ్లు చీట్లు వేశారు. ఇశ్రాయేలీయులు పదిమందిలో ఒకరు పవిత్ర నగరమైన యెరూషలేములో నివసించాలన్నది నిర్ణయం. మిగిలిన తొమ్మండుగురూ తమతమ పట్టణాల్లో నివసించవచ్చు. 2కొందరు యెరూషలేములో నివసించేందుకు స్వచ్ఛందంగా ముందుకు వచ్చారు. వాళ్లు అలా స్వచ్ఛందంగా ముందుకు వచ్చినందుకు మిగిలిన వాళ్లు వాళ్లకి కృతజ్ఞత తెలిపారు.

3యెరూషలేములో నివసించిన నాయకులెవరనగా: (కొందరు ఇశ్రాయేలీయులు, యాజకులు, లేవీయులు, దేవాలయ సేవకులు, సొలొమోను సేవకుల వంశీయులు యూదా పట్టణాల్లో నివసించారు. ఆయా పట్టణాల వాళ్లలో ప్రతి ఒక్కడూ తన సొంత భూమిమీద ఉన్నారు. 4యూదా, బెన్యామీను వంశాలకు చెందిన ఇతరులు యెరూషలేము నగరంలో నివసించారు.)

ఈ క్రింది యూదా వంశీయులు యెరూషలేముకి తరలి వెళ్లారు: ఉజ్జీయా కొడుకు అతాయా (ఉజ్జీయా జెకర్యా కొడుకు. జెకర్యా అమర్యా కొడుకు. అమర్యా షెపట్యా కొడుకు. షెపట్యా మహలేలు కొడుకు. మహలేలు పెరెసు వంశీయుడు), 5బారూకు కొడుకు మయశేయా (బారూకు కొల్హోజె కొడుకు, కొల్హోజె హజాయా కొడుకు. హజాయా అదాయా కొడుకు. అదాయా యోయారీబు కొడుకు. యోయారీబు జెకర్యా కొడుకు. జెకర్యా షెలా వంశీయుడు). 6యెరూషలేములో కాపురమున్న పెరెసు వంశీయులు నాలుగు వందల అరవై మంది. వారందరూ ధైర్యశాలులు.

7యెరూషలేముకి కాపురం మార్చిన బెన్యామీను వంశీయులు: మెషుల్లాము కొడుకు సల్లు (మెషుల్లాము యోవేదు కొడుకు. యోవేదు పెదాయా కొడుకు. పెదాయా కోలాయా కొడుకు. కోలాయా మయశేయా కొడుకు. మయశేయా ఈతీయేలు కొడుకు. ఈతీయేలు యెషయా కొడుకు). 8జెసయ్యను అనుసరించినవారు: గబ్బయి, సల్లయి, వాళ్లు మొత్తం తొమ్మిది వందల ఇరవై ఎనిమిదిమంది. 9జిఖ్రీ కొడుకు యోవేలు వారికి పర్యవేక్షకుడు. హెసెనూయా కొడుకు యూదా యెరూషలేము నగరపు రెండవ ప్రాంతపు పర్యవేక్షకుడు.

10యెరూషలేముకి తరలి వెళ్లిన యాజకులు: యోయారీబు కొడుకు యెదాయా, యాకీను, 11హిల్కీయా కొడుకు శెరాయా (హిల్కీయా మెషూల్లాము కొడుకు, మెషూల్లాము సాదోకు కొడుకు. సాదోకు మెరాయోతు కొడుకు. మెరాయోతు అహీటూబు కొడుకు. అహీటూబు ఆలయంలో పర్యవేక్షకుడు), 12వీరి సోదరులు ఎనిమిది వందల ఇరవై రెండు మంది ఆలయ సేవకులు, యెరోహాము కొడుకు అదాయా (యెరోహాము పెలల్యా కొడుకు, పెలల్యా అమ్జీ కొడుకు, అమ్జీ జెకర్యా కొడుకు, జెకర్యా పషూరు కొడుకు, పషూరు మల్కీయా కొడుకు), 13మల్కీయా సోదరులు రెండువందల నలభైరెండు మంది (వీళ్లు తమతమ కుటుంబాల పెద్దలు) అజరేలు కొడుకు అమష్షయి (అజరేలు అహాజయి కొడుకు, అహాజయి మెషిల్లేమోతు కొడుకు, మెషిల్లేమోతు ఇమ్మేరు కొడుకు), 14ఇమ్మేరు సోదరులు నూట ఇరవై ఎనిమిది మంది (వీళ్లు సాహసికులైన సైనికులు) వీరిపై అధికారి హగెదోలీము కొడుకు జబ్దీయేలు.

15లేవీయుల్లో ఈ కింది వారు యెరూషలేముకు చేరుకున్నారు: హష్షూబు కొడుకు షెమాయా, (హష్షూబు అజ్రీకము కొడుకు, అజ్రీకము హషబియా కొడుకు, హషబియా బున్నీ కొడుకు), 16షబ్బెతయి, యోజాబాదు (వీళ్లిద్దరూ లేవీయుల నాయకులు. వీళ్లు ఆలయం బయటి పనుల పర్యవేక్షకులు), 17మత్తన్యా (మత్తన్యా మీకా కొడుకు, మీకా జబ్ది కొడుకు, జబ్ది ఆసాపు కొడుకు. ఆసాపు దైవ స్తోత్రాలు, ప్రార్థన గేయాలు పాడటంలో గాయకులకి నాయకత్వం వహించేవాడు), బక్బుక్యా (తన సోదరులపై అజమాయిషీలో బక్బుక్యాది రెండవ స్థానం), షమ్మూయ కొడుకు అబ్దా, (షమ్మూయ గాలాలు కొడుకు, గాలాలు యెదూతూను కొడుకు.) 18ఈ విధంగా, పవిత్ర నగరం యెరూషలేముకి తరలి వచ్చిన లేవీయులు రెండు వందల ఎనభై నాలుగు మంది వున్నారు.

19యెరూషలేముకి తరలివచ్చిన ద్వార పాలకులు: అక్కూబు, టల్మోను, వాళ్ల సోదరుల్లో నూటడెబ్బై రెండు మంది. వాళ్లు నగర ద్వారాలను శ్రద్ధగా కాపలా కాశారు.

20ఇశ్రాయేలీయుల్లో ఇతరులు, ఇతర యాజకులు, లేవీయులు యూదాలోని అన్ని పట్టణాల్లోనూ నివసించారు. వాళ్లలో ప్రతి ఒక్కడూ తన పూర్వీకుల సొంత భూమిలోనే నివసించారు. 21ఆలయ సేవకులు ఓఫెలు కొండ మీద ఉన్నారు. ఆలయ సేవకుల నాయకులు జీహా, గిష్పా.

22యెరూషలేములోని లేవీయుల నాయకుడు ఉజ్జీ. ఉజ్జీ బానీ కొడుకు (బానీ హషబియా కొడుకు, హషబియా మత్తనయా కొడుకు, మత్తనయా మీకా కొడుకు), ఉజ్జీ ఆసాపు వంశీయుడు. ఆసాపు వంశీయులు గాయకులు, ఆలయంలో జరిగే సేవకు వాళ్లు బాధ్యులు. 23గాయకులు రాజుగారి ఆజ్ఞలకు బద్ధులు. రాజుగారి ఆజ్ఞలు ఏరోజుకారోజు గాయకులు చేయవలసిన పనులను పేర్కొన్నాయి. 24రాజుగారు నిర్దేశించిన పనులు యేమిటో జనులకు చెప్పిన వాడు పెతహయా (పెతహయా మెషెజబెయేలు కొడుకు. మెషెజబెయేలు జెరహు వంశీయుడు. జెరహు యూదా కొడుకు).

25యూదా ప్రజలు ఈ కింది పట్టణాల్లో నివసించారు: కిర్యతర్బా, దాని చుట్టూవున్న చిన్న

పట్టణాలు, దీబోను, దాని చుట్టూవున్న చిన్న పట్ట
ణాలు; యెకబ్సెయేలు దీని చుట్టూవున్న చిన్న పట్ట
ణాలు, 26యేషూవ, మెలాదా, బేత్పెలెతు, 27హజర్
షువలు, బేర్షెబా, దాని చుట్టూ వున్న చిన్న పట్టణాలు,
28సిక్లగు, మెకోనా, దాని చుట్టూవున్న చిన్న పట్టణాలు,
29ఏన్రిమ్మోను, జొరయా, యర్మూతు, జానోహ,
అదుల్లాము, 30వాటి చుట్టూ వున్న చిన్న పట్టణాలు;
లాకీషు, దాని చుట్టూవున్న పొలాలు; అజేకా, దాని
చుట్టూవున్న చిన్న పట్టణాలు. ఈ విధంగా యూదా
ప్రజలు బేర్షెబానుంచి హిన్నోము లోయ వరకూ
నివాసం వున్నారు.

31గెబకి చెందిన బెన్యామీను వంశస్థులు మిక్మషు,
హాయి, బేతేలు, దాని చుట్టూవున్న చిన్నపట్టణాల్లో,
32అనాతోతు, నోబు, అనన్యాలలో, 33హాసోరు, రామా,
గిత్తంలలో, 34హదీదు, జెబోయిము, నెబల్లాటుల్లో,
35లోదు, ఓనో, చేతి వృత్తుల వాళ్ల లోయలో నివాసం
వున్నారు. 36లేవీయుల కొన్ని బృందాలు బెన్యామీను
ప్రాంతానికి మారారు.

## యాజకులు, లేవీయులు

12 యూదా దేశానికి తిరిగి వచ్చిన యాజకులు,
లేవీయులు వీళ్లు: వీళ్ల షయల్తీయేలు కుమా
రుడు జెరుబ్బాబెలుతో, యేషూవతో కలిసి తిరిగి
వచ్చిన వాళ్లు. వాళ్ల పేర్ల జాబితా ఇది: శెరాయా,
యిర్మీయా, ఎజ్రా, 2అమర్యా, మల్లూకు, హట్టూషు,
3షెకన్యా, రెహూము, మెరే మోతు, 4ఇద్దో, గిన్నెతోను,
అబీయా, 5మియామీను, మయెద్యా, బిల్గా,
6షెమయా, యోయారీబు, యెదాయా, 7సల్లూ,
ఆమోకు, హిల్కియా, యెదాయా, యేషూవ కాలంలో
వీళ్లు యాజకుల నాయకులు, బంధువులు.

8లేవీయులు వీళ్లు: యేషూవ, బిన్నూయి, కద్మీ
యేలు, షేరేబ్యా, యూదా, మత్తన్యా. మత్తన్యా బంధు
వులతోబాటు వీళ్లు దేవుని భజనల విషయంలో
బాధ్యులు. 9బక్బుక్యా, ఉన్నీలు ఆ లేవీయుల బంధు
వులు. వీళ్లిద్దరూ వాళ్లకి ఎదురుగా నిలిచి ఆరాధన
సభలో పాల్గొనేవారు.

10యేషూవా యోయాకీము తండ్రి. యోయా
కీము ఎలియాషీబు తండ్రి. ఎలియాషీబు యోయాదా
తండ్రి. 11యోయాదా యోనాతాను తండ్రి. యోనా
తాను యెద్దూవ తండ్రి.

12యోయాకీము కాలంలో యాజకుల కుటుం
బాల నాయకులు వీళ్లే:

శెరాయా కుటుంబ నాయకుడు మెరాయా.
యిర్మీయా కుటుంబ నాయకుడు హనన్యా.
13 ఎజ్రా కుటుంబ నాయకుడు మెషుల్లాము.
అమర్యా కుటుంబ నాయకుడు యెహోహానాను.
14 మల్లూకు కుటుంబ నాయకుడు యోనాతాను.
షెకన్యా కుటుంబ నాయకుడు యోసేపు.
15 హారీము కుటుంబ నాయకుడు అద్నా. మెరే
మోతు కుటుంబ నాయకుడు హెల్కయి.
16 ఇద్దో కుటుంబ నాయకుడు జెకర్యా. గిన్నె తోను
కుటుంబ నాయకుడు మెషుల్లాము.
17 అబీయా కుటుంబ నాయకుడు జిఖ్రీ, మిన్యా
మీను, మాదేయా కుటుంబాల నాయకుడు
పిల్టయి.
18 బిల్గా కుటుంబ నాయకుడు షమ్మూయి.
షెమాయా కుటుంబ నాయకుడు యెహోనా
తాను.
19 యోయారీబు కుటుంబ నాయకుడు మత్తె
నయి. యెదాయా కుటుంబ నాయకుడు ఉజ్జీ.
20 సల్లయి కుటుంబ నాయకుడు కల్లయి. అమోకు
కుటుంబ నాయకుడు ఏబెరు.
21 హిల్కియా కుటుంబ నాయకుడు హషబ్యా.
యెదాయా కుటుంబ నాయకుడు నెతనేలు.

22పారసీక రాజు దర్యావేషు పాలనకాలంలో ఎల్యా
షీబు, యోదాయా, యోహానాను, యద్దూవ కాలపు
లేవీ కుటుంబాల పెద్దల, యాజకుల పేర్లు నమోదు
చేయబడ్డాయి. 23లేవీ కుటుంబ నాయకులు, ఎల్యా
షీబు కొడుకైన యోహానాను పేర్లు చరిత్ర గ్రంథంలో
లిఖించబడ్డాయి. 24లేవీయుల నాయకులు వీళ్లు:
షేరేబ్యా, కద్మీయేలు కొడుకు యేషూవా, వాళ్ల
సోదరులు. వాళ్ల సోదరులు వీళ్లకి ఎదురుగా నిలబడి
దైవ స్తోత్రాలు, భజన పాటలు పాడేవారు. ఒక బృందం
మరో బృందానికి సమాధానంగా పాడుతుంది. దేవుని
ప్రతినిధి అయిన దావీదు ఆదేశించిన రీతిలో ఈ
స్తుతిపాటలు సాగుతాయి.

25వెలుపలి ద్వారాల పక్కన వున్న సామాన్ల గదు
లను కాసే ద్వారపాలకుల పేర్లు: మత్తన్యా, బక్బుక్యా,
ఓబద్యా, మెషుల్లాము, టల్మోను, అక్కూబు. 26ఈ
ద్వారపాలకులు యెయాకీము కాలంలో కొలువు
చేశారు. యోయాకీము యేషూవా కొడుకు.
యేషూవా యోయాదాకు కొడుకు. ఆ ద్వారపాల
కులు నెహెమ్యా పాలనాధికారిగా వున్న కాలంలో,
యాజకుడు, ఉపదేశకుడు అయిన ఎజ్రా కాలంలో
కూడా కొలువుచేశారు.

## యెరూషలేము ప్రాకార ప్రతిష్ఠ

27ప్రజలు యెరూషలేము ప్రాకారాన్ని ప్రతిష్ఠిం
చారు. వాళ్లు లేవీయులందర్నీ యెరూషలేముకి తీసుకు
వచ్చారు. ఆ లేవీయులు తాము నివసించే ఆయా
పట్టణాలనుంచి వచ్చారు. వాళ్లు యెరూషలేముకి
ప్రాకారం ప్రతిష్ఠించటం కోసం వచ్చారు. లేవీయులు

దైవ స్తోత్రాలు పాడేందుకూ, కీర్తనలు పాడేందుకూ
వచ్చారు. వాళ్లు స్వరమండల సితారలు, తాళాలు
వాయించారు. తంబూరలు మోగించారు.
28-29గాయకులందరూ కూడా యెరూషలేముకి
వచ్చారు. ఆ గాయకులు యెరూషలేము చుట్టూ వున్న
పట్టణాల నుంచి వచ్చారు. వాళ్లు నెటోపా పట్టణం
నుంచి, బేత్‌గిల్గాలు, గెబ, అజ్మావెతుల నుంచి
వచ్చారు. ఆ గాయకులు యెరూషలేము చుట్టుపక్కల
ప్రాంతాల్లో తమకోసం చిన్న చిన్న పట్టణాలు
నిర్మించుకున్నారు.
30యాజకులూ, లేవీయులూ తమని తాము
పవిత్రం చేసుకున్నారు. తర్వాత వాళ్లు యెరూషలేము
ప్రాకారాలన్నీ ఒక ఆచారములో పవిత్రీకరించారు.
31అప్పుడు నేను (నెహెమ్యాను) యూదా నాయ
కులకి పైకెక్కి ప్రాకారం మీద నిలబడమని చెప్పాను.
దైవ స్తుతి, కృతజ్ఞత గీతాలు పాడేందుకు రెండు పెద్ద
గాయక బృందాలను కూడా ఎంపిక చేశాను. వాటిలో
ఒక బృందం కుడివైపున పెంట గుమ్మం దిశగా పోయి
ప్రాకారం పైకి ఎక్కాలి. 32హోషెయా, యూదా
నాయకుల్లో సగంమంది ఆ గాయకుల వెంట వెళ్లారు.
33అజర్యా, ఎజ్రా, మెషుల్లాము, 34యూదా, బెన్యా
మీను, షెమయా, యిర్మీయా, మొదలైనవారు కూడా
వాళ్లతో వెళ్లారు. 35యాజకుల్లో కొందరు కూడా
బూరలు ఊదుతూ వాళ్లని ప్రాకారం దాకా అనుసరిం
చారు, జెకర్యా కూడా వాళ్ల వెంట నడిచాడు (జెకర్యా
యోనాతాను కొడుకు, యోనాతాను షెమయా
కొడుకు, షెమయా మత్తనయా కొడుకు, మత్తనయా
మీకాయా కొడుకు. మీకాయా జక్కూరు కొడుకు,
జక్కూరు ఆసాపు కొడుకు). 36అంతేకాక ఆసాపు
సోదరులు కూడా వున్నారు. వాళ్లు: షెమయా,
అజరేలు, మిలయి, గిలలయి, మాయి, నెతనేలు,
యూదా, హనానీ. వాళ్ల దగ్గర దైవ జనుడయిన దావీదు
తయారు చేసిన సంగీత వాద్యాలు వున్నాయి.
ఉపదేశకుడైన ఎజ్రా ప్రాకారానికి ప్రతిష్ఠ చేసే బృందా
నికి అగ్రభాగాన నడిచాడు. 37వాళ్లు ఊట గుమ్మం
దగ్గరికి వెళ్లారు. వాళ్లు మెట్లు ఎక్కి దావీదు నగరం*
చేరుకున్నారు. వాళ్లు ప్రహరీగోడపైన నిలబడ్డారు.
వాళ్లు దావీదు భవనం దాటి, ఊట గుమ్మం దిశగా
గోడమీద నడిచి వెళ్లారు.
38రెండవ గాయక బృందం రెండో దిశకి ఎడమ
దిశకి బయల్దేరింది. వాళ్లు గోడపైకి వెళ్తున్నప్పుడు
నేను వాళ్లని అనుసరించాను. జనంలో సగంమంది
కూడా వాళ్లని అనుసరించారు. వాళ్లు అగ్ని గుండాల
శిఖరాన్ని దాటి, వెడల్పు గోడను చేరుకున్నారు.
39తర్వాత వాళ్లు ఈ కింది ద్వారాలు దాటారు:
ఎఫ్రాయిము గుమ్మము, పురాతన గుమ్మము, మత్స్య
గుమ్మము హనాన్యేలు శిఖరము, శతశిఖరము, గొర్రెల
ద్వారం దాటి చివరకు కావలి ద్వారం దగ్గర ఆగారు.
40అటు తర్వాత, ఆ గాయక బృందాలు రెండూ దేవుని
ఆలయంలో తమ తమ స్థానాలకు చేరుకున్నాయి.
నేను నా స్థానంలో నిలిచాను. అధికారుల్లో సగంమంది
ఆలయంలో తమతమ స్థానాల్లో నిలబడ్డారు. 41తర్వాత
ఈ క్రింది యాజకులు ఎల్యాకీము, మయశేయా,
మిన్యామీను, మీకాయ, ఎల్యోయేనై, జెకర్యా, హనన్యా
బూరలు పట్టుకుని తమతమ స్థానాల్లో నిలిచారు.
42తర్వాత, మయశేయా, షెమయా, ఎలియాజరు,
ఉజ్జీ, యెహోహానాను, మల్కీయా, ఏలాము, ఏజెరు
అనే యాజకులు ఆలయంలో తమతమ స్థానాల్లో
నిలబడ్డారు. అప్పుడు రెండు గాయక బృందాలూ
ఇజ్రహయా నాయకత్వాన పాడనారంభించాయి. 43ఈ
విధంగా, ఆ ప్రత్యేక దినాన యాజకులు చాలా బలులు
అర్పించారు. ప్రతి ఒక్కరూ చాలా ఆనందంగా
వున్నారు. దేవుడే వారందరినీ ఆనందపరవశుల్ని
చేశాడు. చివరకు స్త్రీలు, పిల్లలు సైతం మహోత్సా
హంతో, ఆనందంలో తేలియాడారు. దూర ప్రాంతాల
వారు సైతం యెరూషలేము నుంచి వెలువడే ఆనంద
కోలాహలాన్ని వినగలిగారు.
44ఆ రోజున వస్తువులను భద్రపరచు గదులలో
భద్రపరచు కొందరిని నియమించారు. జనం తమ
తొలికాపు ఫలాలను, పదోవంతు పంటలను తీసుకు
వచ్చారు. వస్తువులను భద్రపరచువారు వాటిని వస్తు
వులను భద్రపరచు గదులలో పదిలపరిచారు. బాధ్యు
లుగా వున్న యాజకుల, లేవీయుల విషయంలో
యూదా జనసామాన్యం చాలా తృప్తి చెందారు.
అందుకని, వాళ్లు గిడ్డంగుల్లో పెట్టేందుకు చాలా వస్తు
వులు తెచ్చారు. 45యాజకులూ, లేవీయులూ తమ
దేవునిపట్ల భక్తిభావంతో ఈ పనులు చేశారు. వాళ్లు
జనాన్ని పరిశుద్ధులను చేసే విధానాలు ఆచరించారు.
గాయకులూ, ద్వారపాలకులూ తమ తమ విధులను
నిర్వర్తించారు. దావీదూ, సొలొమోనూ ఆదేశించిన
పనులన్నీ వాళ్లు చేశారు.
46(ఎన్నడో పూర్వం, దావీదు కాలంలో, ఆసాపు
ప్రధానుడుగా వున్నాడు. అతనికి చాలా స్తోత్రాలూ,
దైవ సంకీర్తనలూ తెలుసును.)
47ఈ విధంగా, జెరుబ్బాబెలు, నెహెమ్యాల
కాలంలో, ఇశ్రాయేలు ప్రజలందరూ గాయకుల, ద్వార
పాలకుల సహాయార్థం ప్రతిరోజూ ఏదో ఒకటి ఇస్తూనే
వుండేవారు. జనం కూడా తదితర లేవీయుల కోసం
ఏదో ఒకటి, ఎంతో కొంత కేటాయించేవారు. పోతే,
లేవీయులు అహరోను వంశీకుల (యాజకుల) కోసం
కొంత సొమ్ము కేటాయించేవారు.

---

**దావీదు నగరం** యెరూషలేము నగరపు ఆగ్నేయ
మూలనున్న అతి పురాతన ప్రాంతం.

### నెహెమ్యా చివరి ఆదేశాలు

13 ఆ రోజున మోషే గ్రంథం ప్రజలందరికీ విని
పించేలా బిగ్గరగా పఠింపబడింది. అమ్మోనీ
యుల్లోగాని, మోయాబీయుల్లోగాని ఏ ఒక్కరూ దేవుని
ప్రజల మధ్య ఎల్లప్పుడు ఉండుటకు అనుమతింప
బడరన్న నిబంధన మోషే గ్రంథంలో వ్రాసి వుందన్న
విషయం జనం గ్రహించారు. 2ఇశ్రాయేలీయులకి వాళ్లు
ఆహారంగాని, నీరుగాని ఇవ్వలేదు. అందుకే ఈ నిబంధన
లిఖించబడింది. పైగా ఇశ్రాయేలీయులకు శాపం
ఇచ్చేందుకు బిలాముకు డబ్బు కూడా చెల్లించారు.
కాని, దేవుడు ఆ శాపాన్ని తిప్పికొట్టి, దాన్ని మనకొక
వరంగా చేశాడు. 3ఇశ్రాయేలు ప్రజలు ఆ నిబంధనను
విన్నారు. వాళ్లు దాన్ని పాటించారు. విదేశీయుల సంతా
నాల నుంచి వాళ్లు తమని తాము వేరుజేసుకున్నారు.
4-5అయితే, ఇది జరిగేందుకు ముందు, ఎల్యాషీబు
టోబీయాకి ఆలయంలో ఒక గది ఇచ్చాడు. ఎల్యాషీబు
దేవుని ఆలయంలో వస్తువులను భద్రపరచే గదులకు
బాధ్యుడైన యాజకుడు. ఎల్యాషీబు టోబియాకి సన్ని
హిత మిత్రుడు. ఆ గది ధాన్యార్పణలు ధూప సామగ్రి,
ఆలయానికి చెందిన గిన్నెలు, వస్తువులు దాచేందుకు
ఉద్దేశింపబడింది. లేవీయులు, గాయకులు ద్వారపాల
కుల కోసం పంట ధాన్యాల్లో పదోవంతు, కొత్త
ద్రాక్షారసం, నూనె కూడా ఆ గదిలోనే ఉంచారు.
యాజకులకు వచ్చిన కానుకలను కూడా ఆ గదిలోనే
ఉంచారు. కాని, ఎల్యాషీబు ఆ గదిని టోబీయాకి
ఇచ్చాడు.
6ఇదంతా జరుగుతున్నప్పుడు నేను యెరూష
లేములో లేను. నేను బబులోనుకి రాజుగారిని కలిసేం
దుకు వెళ్లాను. అర్తహషస్త బబులోను రాజుగావున్న
32వ ఏట నేను బబులోనుకి వెళ్లాను. తర్వాత, నేనా
రాజుగారిని యెరూషలేముకి తిరిగి వెళ్లేందుకు అనుమతి
అడిగాను. 7అలా నేను యెరూషలేముకి తిరిగి వచ్చాను.
యెరూషలేములో ఎల్యాషీబు చేసిన విచారకరమైన
విషయం నేను విన్నాను. ఎల్యాషీబు టోబీయాకి మన
దేవుని ఆలయంలో ఒక గది యిచ్చాడు! 8ఎల్యాషీబు
చేసిన పనికి నాకు చాలా కోపం వచ్చింది. కనుక
నేను టోబీయా వస్తువులన్నీ గది బయటికి విసిరేశాను.
9ఆ గదులను స్వచ్ఛంగా, పరిశుభ్రం చేయాలని ఆజ్ఞ
నిచ్చాను. తర్వాత నేను గిన్నెలను, వస్తువులను,
ధాన్యం కానుకలను, ధూప సామగ్రిని తిరిగి ఆ గదుల్లో
పెట్టించాను.
10లేవీయులకి వాళ్ల వంతులను జనం ఇవ్వలేదని
కూడా నేను విన్నాను. దానితో లేవీయులూ, గాయ
కులూ తమ సొంత పొలాల్లో పని చేసుకునేందుకు
తిరిగి వెళ్లిపోయారు. 11అందుకని, నేనా అధికారులకు
వాళ్లు చేసింది తప్పని చెప్పాను. “మీరు దేవుని ఆలయం
విషయంలో తగిన శ్రద్ధ ఎందుకు తీసుకోలేదు?” అని
నేను వాళ్లని నిలదీశాను. తర్వాత, లేవీయులందర్నీ
నేను సమావేశపరచాను. నేను వాళ్లకి తమ తమ స్థానా
లకి, ఆలయంలో కొలువులకి తిరిగి రమ్మని చెప్పాను.
12తర్వాత, యూదాలోని వాళ్లందరూ ఆలయంలో
తమ ధాన్యంలో పదోవంతును, కొత్త ద్రాక్షారసాన్ని,
నూనెని సమర్పించారు. ఆ వస్తువులు వస్తువులను
భద్రపరచు గదుల్లో ఉంచబడ్డాయి.
13ఆ గిడ్డంగులకి నేనీ క్రింది వారిని భద్రపరచు
వారుగా నియమించాను: యాజకుడు షెలెమ్యా,
ఉపదేశకుడు సాదోకు, లేవీయుడు పెదయా. వారికి
సహాయకుడుగా హానానును నియమించాను. హానాను
జక్కూరు కొడుకు, మత్తన్యా మనుమడు. వీళ్లు
విశ్వాసపాత్రులన్న విషయం నాకు తెలుసు. వాళ్లు
తమ బంధువులకు ఆయా వస్తువులు అందచేసే విష
యంలో బాధ్యులు. 14దేవా, నేను చేసిన ఈ పనుల
దృష్ట్యా నన్ను గుర్తుపెట్టుకో, నా దేవుని ఆలయ
నిర్మాణంకోసం, దాని కొలువులకోసం నేను చిత్త
శుద్ధితో నమ్మకంగా చేసినవన్నీ గుర్తుంచుకో దేవా.
15ఆ రోజుల్లో యూదాలో జనం సబ్బాతు
(విశ్రాంతి) నాడు కూడా పనిచేయడం నేను గమనిం
చాను. జనం ద్రాక్షాపళ్లు తొక్కి రసం తీయడం
చూశాను. జనం ధాన్యం తీసుకురావడం, దాన్ని గాడి
దలమీద మోపడం చూశాను. నగరంలో జనం ద్రాక్షను,
అత్తిపళ్లను, రకరకాల వస్తువులను తీసుకు రావడం
చూశాను. వాళ్లు సబ్బాతు (విశ్రాంతి) రోజున ఈ
వస్తువులన్నింటినీ యెరూషలేముకి తెస్తున్నారు.
అందుకని, నేను వాళ్లకి ఈ విషయంలో హెచ్చరిక
చేశాను. నేను వాళ్లకి సబ్బాతు రోజున ఆహారం అమ్మ
కూడదని చెప్పాను.
16తూరు నగరానికి చెందిన కొందరు యెరూషలే
ములో వున్నారు. వాళ్లు చేపలను, రకరకాల వస్తువులను
యెరూషలేములోకి తెచ్చి, సబ్బాతు రోజున అమ్ము
తున్నారు. యూదులు ఆ వస్తువులను కొంటున్నారు.
17యూదాలోని ముఖ్యులకు వాళ్లు చేస్తున్నది పొర
పాటని చెప్పాను. నేనా ముఖ్యులకి ఇలా చెప్పాను:
“మీరు చాలా చెడ్డపని చేస్తున్నారు. మీరు సబ్బాతును
నాశనం చేస్తున్నారు. మీరు సబ్బాతును అన్ని ఇతర
రోజుల మాదిరిగా మారుస్తున్నారు.
18మీ పూర్వీకులు కూడా సరిగ్గా ఈ పనులే
చేశారన్న విషయం మీకు తెలుసు. అందుకే యెహోవా
మనకీ, ఈ నగరానికీ, ఈ ఇబ్బందులూ, విపత్తులూ
తెచ్చాడు. మీరు సరిగ్గా అవే పనులు చేస్తున్నారు.
అందుకని, ఇలాంటి చెడుగులే ఇశ్రాయేలుకి మరిన్ని
దాపురిస్తాయి. ఎందుకంటే, సబ్బాతు రోజు ముఖ్యమై
నది కాదన్నట్లు దాన్ని మీరు నాశనం చేస్తున్నారు.”
19అందుకని, నేనేమి చేశానంటే: ప్రతి శుక్రవారము
సాయంత్రము (విశ్రాంతి దినానికి ముందు) చీకటి

పడేందుకు సరిగ్గా ముందు, యెరూషలేము ద్వారాలను మూసేసి, తాళాలు బిగించమని ద్వార పాలకులను నేను ఆదేశించాను. ఆ తలుపులను సబ్బాతు రోజు ముగిసేదాకా తియ్యరాదు. ద్వారాల దగ్గర నా సొంత మనుషుల్లో కొందర్ని పెట్టాను. సబ్బాతు రోజున యెరూషలేము నగరంలోకి ఎట్టి పరిస్థితిల్లోనూ ఎలాంటి సరుకుల మూటలూ రాకుండా చూడమని నేను వాళ్లని కట్టడిచేశాను.

20ఒకటి రెండు సార్లు వ్యాపారస్తులూ, చిల్లర వర్త
కులూ రాత్రి పూట యెరూషలేము ప్రాకారం వెలుపల గడపవలసివచ్చింది.

21అయితే, నేనా వ్యాపారస్తుల్నీ చిల్లర వర్తకుల్నీ, “రాత్రిపూట ద్వారం ముందర గడపవద్దు. మీరు మరోసారి అలా చేస్తే మిమ్మల్ని పట్టుకొంటాను” అని హెచ్చరించాను. దానితో, అప్పట్నుంచి వాళ్లు తమ సరుకులు అమ్ముకునేందుకు సబ్బాతు రోజున మళ్లీ రాలేదు.

22తర్వాత తమని తాము పరిశుద్ధుల్ని చేసుకోమని నేను లేవీయుల్ని ఆదేశించాను. వాళ్లలా చేశాక, వాళ్లు పోయి, ద్వారాలను కావలి కాయాలి. సబ్బాతు రోజును ఒక పవిత్ర దినంగా వుంచేందుకు గాను ఇవన్నీ చేశాను.

ఈ పనుల దృష్ట్యా నన్ను గుర్తుంచుకో దేవా. నామీద దయ వుంచి, ఘనమైన నీ ప్రేమా, దయ నామీద ప్రసరింపచెయ్యి.

23ఆ రోజుల్లో కొందరు యూదులు అష్డోదు, అమ్మోను, మోయాబు దేశాలకు చెందిన స్త్రీలను పెళ్లి చేసుకున్న విషయం కూడా నేను గమనించాను.
24ఆ వివాహాల ఫలితంగా పుట్టిన పిల్లల్లో సగం మందికి యూదా భాషలో మాట్లాడటం చేతకాదు. ఆ పిల్లలు అష్డోదు, అమ్మోను లేక మోయాబు భాష మాట్లాడేవారు.

25అందుకని, వాళ్లు పొరపాటు చేస్తున్నారని నేను వాళ్లకి చెప్పాను. నేను వాళ్లని శపించాను. వాళ్లలో నేను కొందర్ని కొట్టాను కూడా. కొందర్ని జుట్టు పట్టుకొని గుంజాను. వాళ్లచేత నేను బలవంతాన దేవుని సాక్షిగా ప్రమాణం చేయించాను. నేను వాళ్లకి ఇలా చెప్పాను: “మీరు వాళ్ల అమ్మాయిల్ని పెళ్లి చేసుకో కూడదు. ఆ విదేశీయుల కూతుళ్లని మీ అబ్బాయిలు పెళ్లి చేసుకోకుండా చూడండి. అలాగే, మీ అమ్మాయిలు ఆ విదేశీయుల కొడుకుల్ని పెళ్లిచేసుకోకుండా
చూడండి. 26ఇలాంటి పెళ్లిళ్లు సొలొమోను లాంటివాడు సైతం పాపం చేసేందుకు కారణ భూతమయ్యాయని మీకు తెలుసు. ఎన్నెన్నో దేశాల్లో సొలొమోనంతటి గొప్ప రాజు లేడు. సొలొమోను దేవుని ప్రేమ పొందిన వాడు. దేవుడు సొలొమోనును ఇశ్రాయేలు దేశమంతటికీ రాజును చేశాడు. అలాంటి సొలొమోను సైతం విదేశీ స్త్రీల మూలంగా పాపం చేయవలసి వచ్చింది.
27మరి ఇప్పుడు మీరు కూడా అలాంటి ఘోర పాపమే చేస్తున్నట్లు వింటున్నాం. మీరు దేవునిపట్ల నమ్మకంగా వ్యవహరించడం లేదు. మీరు విదేశీ స్త్రీలను పెళ్లి చేసు
కుంటున్నారు.” 28యోయాదా ప్రధాన యాజకుడైన ఎల్యాషీబు కొడుకు. యోయాదా కొడుకుల్లో ఒకడు హెరోనానువాసి అయిన సన్బల్లటుకి అల్లుడు. నేను అతని చోటు విడిచిపెట్టేలా చేశాను. నేనతను పారి పోయేలా కట్టడిచేశాను.

29ఓ నా దేవా, నువ్వు వాళ్లని శిక్షించు. వాళ్లు యాజకత్వాన్ని అపవిత్రం చేశారు. అదేదో అంత ముఖ్యం కాదన్నట్లు వాళ్లు వ్యవహరించారు. యాజకులతోనూ, లేవీయులతోనూ నువ్వు చేసుకున్న ఒడంబడికను వాళ్లు పాటించలేదు. 30అందుకని నేనా యాజ
కులనూ, లేవీయులనూ శుచులనుగా, పరిశుద్ధులనుగా చేశాను. నేను విదేశీయులందర్నీ, వాళ్లు నేర్పిన వింత విషయాల్నీ తొలగించాను. నేను లేవీయులకీ, యాజకులకీ వాళ్ల అసలైన సొంత విధులనూ, బాధ్యతలనూ
అప్పగించాను. 31జనం కట్టెల కానుకలనూ, తొలి ఫలాలనూ సరైన సమయాల్లో పట్టుకు వచ్చేలా చూశాను. ఓ నా దేవా, నేను చేసిన ఈ మంచి పనుల దృష్ట్యా నన్ను గుర్తుంచుకో.

# ఎస్తేరు

1 అహష్వేరోషు రాజ్యపాలన కాలంలో జరిగిన సంఘ
టన యిది. అహష్వేరోషు భారత దేశంనుంచి కూషు
దేశం వరకు నూట ఇరవై ఏడు సంస్థానాలతో కూడిన
సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. 2అహష్వేరోషు తన
రాజధాని నగరమైన షూషనులో సింహాసనాధిష్ఠుతుడై,
తన పాలన సాగించాడు.
3అహష్వేరోషు తన రాజ్యపాలన మూడేళ్లు నిండిన
సందర్భంగా అధికారులకూ, నాయకులకూ విందు
ఏర్పాటు చేశాడు. ఆ విందుకి పారసీక దేశమంతటి
నుంచి, మాదియా దేశం నుంచి సేనానులూ, ప్రముఖ
నాయకులూ హాజరయ్యారు. ఆ విందు నూట ఎనభై
రోజులు కొనసాగింది. 4ఆ విందుసాగిన అన్ని రోజులూ
అహష్వేరోషు రాజు తన రాజ్యంలోని గొప్ప సంపదను
ప్రదర్శించాడు. రాజభవనపు అందాలనూ, ఐశ్వర్యాన్నీ
ప్రదర్శిస్తూ వచ్చాడు.
5ఆ నూట ఎనభై రోజుల విందు ముగిశాక అహష్వే
రోషు మరో విందు ఏర్పాటు చేశాడు. అది వారం
రోజులపాటు కొనసాగింది. ఆ విందు రాజనగరులోని
తోటలో జరిగింది. ఆ విందుకి రాజధాని నగరమైన
షూషనులోని ప్రజలందరినీ, అత్యంత ముఖ్యులు
మొదలుకొని అత్యల్పులను కూడా ఆహ్వానించాడు.
6ఆ లోపలి తోట చుట్టూ తెలుపు, నీలి తెరలు వేలాడదీ
యబడ్డాయి. అవి చలువరాతి స్తంభాలకు, తాపిన వెండి
కమ్ములకు అవిసెనార, నూలు తాళ్లతో బిగించ
బడ్డాయి. అక్కడ ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు
మొదలైన రంగుల విలువైన చలువరాళ్లు పరచిన నేల
మీద వెండి, బంగారాలతో చేసిన పడకలు వున్నాయి.
7అతిథులకు ద్రాక్షాసారా బంగారు పాత్రల్లో అందించ
బడింది. చిత్రమేమిటంటే, ఆ పాత్రల్లో ఒకదాన్ని
పోలినది మరొకటి లేదు! చక్రవర్తి బాగా ఔదార్యవంతు
డేమో, ద్రాక్షాసారాయానికి కొదువ లేకపోయింది.
8చక్రవర్తి ఆజ్ఞమేరకు ద్రాక్షాసారా వడ్డించేవాడు ప్రతి
ఒక్క అతిథికీ అతను కోరినంత సారాపోశాడు. 9మహా
రాణి వష్తి కూడా స్త్రీలకు రాజభవనంలో విందుచేసింది.
10-11ఆ విందు ఏడవ రోజున చక్రవర్తి అహష్వే
రోషు ద్రాక్షారసము ఎక్కువగా సేవించాడు. మంచి
మత్తులో వున్న మహారాజు తనను సేవించిన ఏడు
మంది సేవకులైన మెహూమాను, బిజ్తా, హర్బోనా,
బిగ్తా, అబగ్తా, జేతరు, కర్కసు అనే నపుంసకులకు
మహారాణికి కిరీటం ధరింపజేసి, తన ఎదుటకు తీసుకు
రావాలని ఆజ్ఞాపించాడు. మహారాణి వష్తి మహా సౌందర్య
వతి. ఆమె సౌందర్యాన్ని అధికారులకూ, ప్రముఖులకూ
ప్రదర్శించి మెప్పు పొందాలన్నది అతని సంకల్పం.
12ఆ సేవకులు మహారాణికి మహారాజు ఆజ్ఞను
విన్నవించారు. కాని, ఆమె అందరి ముందుకు వెళ్లేం
దుకు నిరాకరించింది. మహారాజుకు అధికంగా కోపం
వచ్చింది. 13-14న్యాయ చట్టం గురించీ, శిక్షలను గురించి
నిపుణుల సలహాలు అడగటం మహారాజుకి పరిపాటి.
అందుకని, న్యాయనిపుణులైన తన సలహాదారులతో
మహారాజు సంప్రదించాడు. మహా రాజుకి సన్నిహితు
లైన ఆ సలహాదారుల పేర్లు: కర్షెనా, షెతారు, అద్మాతా,
తర్షీషు, మెరెసు, మర్సెనా, మెమూకాను. ఈ యేడు
గురూ పారశీక, మాదీయ దేశాల ప్రముఖులు. మహా
రాజును దర్శించేందుకు ప్రత్యేకమైన అనుమతులు
కలిగినవాళ్లు. సామ్రాజ్యంలో అత్యున్నతమైన అధికా
రులు. 15మహారాజు వాళ్లని ఇలా ప్రశ్నించాడు: “మహా
రాజు తన నపుంసకుల ద్వారా వష్తి మహారాణికి ఒక
ఆజ్ఞ పంపాడు. కాని, ఆమె రాజాజ్ఞను మన్నించలేదు.
న్యాయచట్టం ప్రకారం ఆమెపైన ఎలాంటి చర్య
తీసుకోవాలి?”
16అప్పుడు మెమూకాను యితర అధికారులు
వింటూండగా మహారాజుకి ఇలా సమాధానమిచ్చాడు:
“మహారాణి వష్తి చేసినది నేరం. ఆమె మహారాజు
అహష్వేరోషు పట్లనే కాక రాజ్యములోని ఆయన సంస్థా
నములన్నిటిలోనుండు అధికారుల పట్ల, ప్రముఖుల
పట్ల కూడా నేరం చేసింది. 17నేనీ విషయం ఎందుకు
చెప్తున్నానంటే, మహారాణి వష్తి చేసిన యీ ఆజ్ఞోల్లంఘ
నాన్ని గురించి మిగిలిన స్త్రీలందరూ వింటారు.
అప్పుడింక యితర స్త్రీలు కూడా తమ భర్తల పట్ల
విధేయత చూపడం మానేస్తారు. వాళ్లు తమ భర్తలతో
ఇలా వాదిస్తారు: ‘అహష్వేరోషు మహారాజు వష్తి మహా
రాణిని రమ్మని ఆజ్ఞాపించారు. కాని, ఆమె వచ్చేందుకు
నిరాకరించింది కదా.’
18“పారశీక, మాదీయ నాయకుల భార్యలు
ఈనాడు మహారాణి చేసినదాన్ని గురించి విన్నారు.
ఆమె చేసిన పనిచేత వాళ్లు ప్రభావితులవుతారు. ఆ

స్త్రీలు కూడా మహారాజుగారి ప్రముఖుల పట్ల అలాగే
వ్యవహరిస్తారు. దానితో అవిధేయతా, కోపతాపాలూ
రెచ్చిపోతాయి.
19“మహారాజు సమ్మతిస్తే, నాదొక సూచన, ‘మహా
రాజా, మీరు ఒక శాసనం జారీచెయ్యాలి. దాన్ని పారశీక,
మాదీయ రాజ్యాల న్యాయచట్టాల్లో నమోదు చేయిం
చాలి. అప్పుడిక పారశీక, మాదీయ న్యాయచట్టాలను
మార్చడం సాధ్యంకాదు. వష్తి అహష్వేరోషు మహారాజు
సమక్షంలోకి యిక ఎన్నడూ రాకూడదు. అంతేకాదు,
మహారాజు ఆమె (రాణి) పట్టమహిషిత్వ స్థానాన్ని ఆమె
కంటె మెరుగైన స్త్రీకి ఇవ్వాలి. 20మహారాజు ఆజ్ఞ
ఆయన సువిశాల సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతా
ల్లోనూ చాటిం పబడినాక, స్త్రీలందరూ తమ భర్తలను
గౌరవిస్తారు. అప్పుడిక అల్పుల దగ్గర్నుంచి అధికుల
దాకా స్త్రీ లందరూ తమతమ భర్తల్ని గౌరవిస్తారు.”
21మహారాజుకీ, ఆయన ముఖ్యాధికారులకీ యీ
సలహా నచ్చింది. దానితో అహష్వేరోషు మహారాజు
మెమూకాను చేసిన యీ సూచనను శాసనం చేశాడు.
22అహష్వేరోషు తన సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతా
లకీ, ఆయా ప్రాంతీయ భాషల్లో, యీ తాఖీదును
పంపాడు. ఆ తాఖీదుల మేరకు, ప్రతి పురుషుడూ
తన కుటుంబానికి యజమానిగా ప్రకటింపబడ్డాడు.

## ఎస్తేరు రాణి అయింది

2 దరిమిలా కొంత కాలానికి, అహష్వేరోషు
మహారాజు కోపం చల్లారింది. అప్పుడాయనకి
వష్తీ, ఆమె చేసిన పని, తను జారీచేసిన ఆజ్ఞలు జ్ఞప్తికి
వచ్చాయి. 2అప్పుడు మహారాజు ఆంతరంగిక సేవకులు
ఒక సూచన చేశారు, “మహారాజుగారి కోసం అందమైన
కన్యల అన్వేషణ జరపాలి. 3మహారాజు తన సామ్రాజ్యం
లోని ప్రతి సామంత రాజ్యంలోనూ ఒక్కొక్క నాయ
కుణ్ణి ఎంపిక చేసుకోవాలి. ఆ నాయకులు అందమైన
ప్రతి ఒక్క కన్యనూ రాజధాని నగరమైన షూషనుకి
తీసుకురావాలి. ఆ కన్యలను మహారాజుగారి అంతఃపుర
స్త్రీల బృందంలో వుంచాలి. ఆ కన్యలు అంతఃపుర
స్త్రీలను అదుపాజ్ఞల్లో వుంచే హేగే కొజ్జా అధీనంలో
వుంటారు. వాళ్లందరికీ సౌందర్య పోషక క్రియలు
జరపాలి. 4అటు తర్వాత వీళ్లలో మహారాజుకి నచ్చిన
కన్యను వష్తి స్థానంలో కొత్త మహారాణిని చేయాలి.”
ఈ సలహా మహారాజుకి నచ్చింది. ఆయన దాన్ని
ఆమోదించాడు.
5రాజధాని నగరం షూషనులో బెన్యామీను గోత్రా
నికి చెందిన మొర్దెకై అనే ఒక యూదుడు వున్నాడు.
మొర్దెకై తండ్రి యాయీరు. యాయీరు తండ్రి
కీషు. 6బబులోను రాజైన నెబుకద్నెజరు యూదా
రాజైన యెకోన్యాను బందీగా పట్టుకొన్నాడు యెరూష
లేము నుంచి చెరపట్ట బడినవారిలో మొర్దెకై కూడా
ఒకడు. 7హదస్సా అనే ఒక అమ్మాయి వుంది. ఆమె
మొర్దెకైకి పినతండ్రి కూతురు. ఆమె తల్లితండ్రులు
మరణించినప్పుడు, మొర్దెకై ఆమెని చేరదీసి, తన
సొంత కూతురులా పెంచి పోషించాడు. హదస్సాకి
ఎస్తేరు అనే పేరుకూడా వుంది. ఎస్తేరు అందమైన
రూపమును సుందర ముఖమును గలదై యుండెను.
8మహారాజుయొక్క ఆజ్ఞ ప్రకటింపబడిన మీదట
చాలామంది కన్యలు రాజధాని అయిన షూషను నగరా
నికి తరలింపబడ్డారు. వాళ్లందరూ హేగే కొజ్జా అధీ
నంలో ఉంచబడ్డారు. ఆ యువతుల్లో ఎస్తేరు ఒకతె.
ఎస్తేరును రాజభవనానికి తీసుకుపోయి, మిగిలిన అంతః
పుర స్త్రీలతో బాటు హేగే అధీనంలో ఉంచారు. 9ఎస్తేరు
హేగేకి నచ్చింది. ఆమె అతనికి అభిమాన పాత్రురా
లైంది. దానితో హేగే ఆమెకి సౌందర్యవర్ధక ప్రక్రియను
త్వరలో పూర్తిచేసి, ఆమెకి ప్రత్యేకమైన భోజన పదార్థా
లను సమకూర్చాడు. అప్పుడిక హేగే ఎస్తేరుకీ, ఆమె
ఏడుగురు పరిచారికలకీ అంతఃపుర స్త్రీలు నివసించే
అతి శ్రేష్ఠమైన స్థలంలో నివాసం ఏర్పాటు చేశాడు.
10తను యూదురాలనన్న విషయాన్ని ఎస్తేరు ఎవ్వరికీ
చెప్పలేదు. మొర్దెకై వద్దన్నందున ఆమె తన కుటుంబ
వివరాలేవీ ఎవ్వరికీ తెలియ జెప్పలేదు. 11ఎస్తేరు ఎలా
గుందో, ఆమె విషయంలో ఏమి జరుగుతుందో
తెలుసుకొనేందుకోసం మొర్దెకై ప్రతి రోజూ అంతః
పుర ఆవరణ ముందు అటు ఇటు తిరుగులాడు
తుండేవాడు.
12ఎవరైనా ఒక యువతి అహష్వేరోషు మహారాజు
సన్నిధానానికి తీసుకుపోబడేందుకు ముందు ఆమె
చేయవలసిన పనులు యివి: ఆమె తన పన్నెండు
మాసాల సౌందర్యవర్ధక ప్రక్రియను పూర్తి చేయాలి.
అంటే, ఆమె ఆరునెలలపాటు గోపరస తైలాన్ని వాడి,
తదుపరి ఆరునెలలు పరిమళ ద్రవ్యాలను, భిన్న భిన్న
మైన అలంకరణ సామగ్రులను వాడాలి. 13మహారాజు
సముఖానికి తీసుకు పోబడేందుకు ఇదీ పద్ధతి. ఆ
అమ్మాయికి ఏది కావాలన్నా అంతఃపురం నుంచి ఇవ్వ
బడుతుంది. 14ఆ యువతి రాజ భవనానికి సాయంత్రం
పూట చేరుకుంటుంది. ఆ మరుసటి ఉదయం ఆమె
అంతఃపుర స్త్రీలు నివసించే మరో చోటికి తిరిగి
వెళ్తుంది. అప్పుడామె అక్కడ షయష్గజు అనే కొజ్జా
అజమాయిషీలో ఉంచబడుతుంది. షయష్గజు కొజ్జా
మహారాజు ఉంపుడుగత్తెల పర్య వేక్షకుడు. మహారాజుకు
ఆమెపట్ల ప్రేమ కలిగినప్పుడేగాని ఆ యువతి ఆయన
దగ్గరకు వెళ్లరాదు. అప్పుడాయన ఆమెను పేరుపెట్టి
తిరిగి తనవద్దకు రమ్మని పిలుస్తాడు.
15ఎస్తేరుకి మహారాజు వద్దకు వెళ్లే వంతు వచ్చి
నప్పుడు, ఆమె ఏమీ కావాలని కోరలేదు. అంతఃపుర
పర్యవేక్షకుడైన హేగే తనకేమి సూచించాడో అవే తీసు
కుంది. (ఎస్తేరు మొర్దెకై పెంపుడు కూతురు, అతని

పినతండ్రి అబీహాయిలు కూతురు). ఎస్తేరును చూసిన
ప్రతి ఒక్కరికీ ఆమె నచ్చింది. [16]చివరికి ఎస్తేరు రాజ
భవనంలో మహారాజు సముఖానికి తీసుకెళ్లబడింది. అది
సరిగ్గా టెబేతు అనబడే పదోనెల, అహష్వేరోషు
పాలనలో ఏడవ సంవత్సరం.

[17]మహారాజు యువతులందరిలోకీ ఎస్తేరును బాగా
ప్రేమించాడు. మిగిలిన కన్యలందరి కంటె ఆమె,
ఆయన దయ, అభిమానాలను పొందింది. అందుకని
మహారాజు స్వయంగా ఆమె శిరస్సుపై కిరీటం వుంచి,
వష్తి స్థానంలో ఆమెను మహారాణిని చేశాడు. [18]మహా
రాజు ఎస్తేరు గౌరవార్థం తన సామంతులకూ, అధికారు
లకూ పెద్ద విందు చేశాడు. అన్ని సామంత రాజ్యాల్లోనూ
ఆ రోజును ఆయన సెలవు దినంగా ప్రకటించాడు.
ఉదారవంతుడైన ఆ మహారాజు జనానికి బహుమతులు
పంపాడు.

### మొర్దెకై ఒక కుట్రను కనిపెట్టుట

[19]రెండవసారి యువతులందరూ ఒకచోట చేర్చ
బడినప్పుడు మొర్దెకై మహారాజు భవన ద్వారంవద్దనే
కూర్చుని వున్నాడు. [20]తను యూదురాలనన్న
విషయాన్ని ఎస్తేరు యింకా గుప్తంగానే వుంచింది.
తన కుటుంబ గోత్రాలను గురించి ఆమె ఎవ్వరికీ
చెప్పలేదు. అది ఆమెకు మొర్దెకై ఇచ్చిన ఆజ్ఞ. తను
మొర్దెకై పెంపకంలో ఉన్నప్పటి మాదిరిగానే, యింకా
ఆమె అతని ఆజ్ఞలను పాటిస్తోంది.

[21]మొర్దెకై మహారాజు భవన ద్వారం దగ్గర
కూర్చున్న సమయంలో జరిగిన విషయం ఇదీ:
బిగ్తాను, తెరెషు అనే యిద్దరు రాజభవన ద్వార పాల
కులు మహారాజుపట్ల కుపితులై అహష్వేరోషు మహా
రాజును హతమార్చాలని కుట్ర పన్నుతున్నారు.
[22]అయితే, మొర్దెకై ఈ కుట్ర పథకాలను కనిపెట్టి
ఎస్తేరు మహారాణికి ఈ విషయం చెప్పాడు. అప్పుడి
విషయాన్ని ఆమె మహారాజుకి చెప్పింది. ఈ కుట్రను
గురించి తెలుసుకున్నది మొర్దెకై అని కూడా ఆమె
మహారాజుకు చెప్పింది. [23]తర్వాత ఆ విషయమై విచా
రణ చేయబడింది. విచారణలో మొర్దెకై చెప్పిన సమా
చారం సరైనదేనని తేలింది. మహారాజును హత్యచేయా
లని దుష్ట పథకం వేసిన ద్వారపాలకులిద్దరూ ఉరితీయ
బడ్డారు. మహా రాజు సమక్షంలోనే యీ విషయాలన్నీ
మహారాజుల చరిత్ర విశేషాలగ్రంథంలో నమోదు చేయ
బడ్డాయి.

### యూదుల వినాశనానికి హామాను పథకం

3 ఈ సంఘటనల తర్వాత అహష్వేరోషు మహారాజు
హామానుకు గౌరవనీయ స్థానం ఇచ్చాడు. అగాగీ
యుడైన హామాను హమ్మెదాతా కొడుకు. మహారాజు
హామానుకు ఉన్నత పదవి ఇచ్చి, అతన్ని మిగిలిన
అధికారులందరికంటె ఉన్నత స్థానంలో ఉంచాడు.
[2]రాజభవన ద్వారం దగ్గరవుండే అధికారులందరూ
హామానుకు మోకరిల్లి, నమస్కరించాలని మహారాజు
ఆజ్ఞ జారీచేశాడు. అధికారులందరూ ఈ ఆజ్ఞను
పాటించేవారు. అయితే, మొర్దెకై మాత్రం మోకరి
ల్లేందుకూ, గౌరవాభివందనం చేసేందుకూ నిరాకరిం
చాడు. [3]అప్పుడు ద్వారం దగ్గరి ఉద్యోగులు మొర్దెకైని
"హామాను ముందు మోకరిల్లాలన్న మహారాజు ఆజ్ఞను
నువ్వెందుకు పాటించడం లేదు?" అని ప్రశ్నించారు.
[4]ఆ రాజోద్యోగులు ప్రతిరోజూ మొర్దెకైతో ఈ
విషయమై ప్రస్తావించేవారు. అయితే, హామాను
ముందు మోకరిల్లాలన్న ఆజ్ఞను పాటించేందుకు
మొర్దెకై తిరస్కరిస్తూ వచ్చాడు. దానితో, ఆ ఉద్యో
గులు ఈ విషయాన్ని హామానుకు తెలియ జెప్పారు.
మొర్దెకై విషయంలో హామాను ఏమి చేస్తాడో చూద్దా
మనుకున్నారు. తను యూదుడనన్న విషయాన్ని
మొర్దెకై ఆ ఉద్యోగులకు చెప్పాడు. [5]మొర్దెకై తన
ముందు మోకరిల్లి, గౌరవాభివందనం చేసేందుకు నిరాక
రించాడని విన్న హామాను చాలా కోపం చెందాడు.
[6]మొర్దెకై యూదుడు అన్న విషయం హామానుకు
తెలిసింది. అయితే, ఒక్క మొర్దెకైని మాత్రమే
చంపడం అతనికి తృప్తికరంగా కనిపించలేదు. మొర్దెకై
జాతీయులందర్నీ, అంటే, అహష్వేరోషు సామ్రాజ్యం
లోని రాజ్యాలన్నింట్లో గల యూదులందర్నీ సమూ
లంగా నాశనం చేసే మార్గం వెదక నారంభించాడు.

[7]మహారాజు అహష్వేరోషు పాలనలో పన్నెండవ
సంవత్సరం, నీసాను అనబడే మొదటి నెలలో హామాను
తన కార్యక్రమానికి మంచి రోజును, నెలను ఎంచు
కొనేందుకు చీటీలు వేశాడు. (ఆ రోజుల్లో ఈ చీటీలను
"పూరు" అనేవారు). దాంట్లో అదారు అనబడే
పన్నెండవ నెల ఎన్నిక చేయబడింది. [8]అప్పుడిక
హామాను అహష్వేరోషు మహారాజు దగ్గరకు వెళ్లి ఇలా
అన్నాడు: "మహారాజా, మీ సామ్రాజ్యంలోని అన్ని
సామంత రాజ్యాల్లోనూ చెదురుమదురుగా ఒక జాతి
వాళ్లు వున్నారు. వాళ్లు ఆ దేశాల ప్రజలతో కలిసి
వుండక వేరుగా వుంటారు. వాళ్ల ఆచార సంప్రదా
యాలు మిగిలిన ప్రజలవాటికి భిన్నమైనవి. వాళ్లు
మహారాజు శాసనాలను పాటించరు. వాళ్లను మీ సామ్రా
జ్యంలో ఉండనివ్వడం క్షేమ దాయకం కాదు.
[9]"మహారాజు మన్నిస్తే నాదొక సలహా. ఆ జాతి
ప్రజలను హతమార్చేందుకు ఆజ్ఞ జారీ చెయ్యండి.
ఇందుకయ్యే ఖర్చుకుగాను నేను 10,000 వెండి
నాణ్యాలు రాజ్య ఖజానాలో జమకడతాను. ఈ కార్య
క్రమాన్ని నిర్వహించేవారికి వేతనాలు చెల్లిం చేందుకు
ఈ మొత్తాన్ని వినియోగించవచ్చు."
[10]మహారాజు రాజముద్రిక ఉన్న ఉంగరాన్ని తీసి
హామానుకి ఇచ్చాడు. హామాను అగాగీయుడైన హమ్మె

దాతా కొడుకు. హామాను యూదులకు బద్ధ శత్రువు.
11మహారాజు హామానుతో ఇలా అన్నాడు, “ఆ సొమ్ము
నీ దగ్గరే వుంచుకో. ఆ జాతివాళ్ల విషయంలో నువ్వేమి
చెయ్యదలచుకున్నావో చెయ్యి.”
12అటు తర్వాత మొదటి నెల 13వ రోజున మహా
రాజుగారి లేఖకులు పిలువనంపబడ్డారు. వాళ్లు హామాను
ఆజ్ఞలన్నింటినీ ఒక్కొక్క దేశపు భాషాలిపిలో వ్రాశారు.
వాళ్లు వాటిని ఆయా ప్రజాబృందాల భాషల్లో వ్రాశారు.
వాళ్లు మహారాజు సామంతులకు, ఆయా ప్రాంతాల
పాలకులకు ఆ తాఖీదులు పంపారు. వాళ్లు ఆ తాఖీదు
లను మహారాజు పేరిట, మహారాజు ముద్రికతో
పంపారు.
13వార్తాహరులు ఆయా సామంత దేశాలకు యీ
తాఖీదు పత్రాలను తీసుకెళ్లారు. యూదులందర్నీ చంపి
వేయాలి, ఆ జాతి మొత్తాన్ని సర్వనాశనం చేయాలి,
యిదీ మహారాజు ఆజ్ఞ. అంటే, యూదులందరూ
పిల్లపాపలూ, యువతీ యువకులూ, ముసలి, వయ
స్సులో వున్నవాళ్లు, వయస్సు మళ్లినవాళ్లు, ఒక్క
రోజులో హతమార్చ బడాలన్నమాట. ఆ రోజు
అదారు అనబడే 12వ నెలలో 13వ రోజు అవుతుంది.
ఆ ఆజ్ఞలో మరో అంశం యూదులకు చెందిన వస్తువు
లన్నింటినీ తీసేసు కోవడం ఈలాగున ఆ తాఖీదు
పత్రాలలో వ్రాయబడియున్నది.
14ఆ ఆజ్ఞల ప్రతులు రాజశాసనంగా అందరికీ పంప
బడ్డాయి. ఈ తాఖీదును అన్ని సామంత రాజ్యాల్లోనూ
శాసనంగా చెల్లుబడి చెయ్యాలి, దాన్ని సామ్రాజ్యంలో
అన్ని జాతుల ప్రజలకీ ప్రకటించాలి. 15రాజాజ్ఞ మేరకు
వార్తాహరులు హుటాహుటిగా బయల్దేరారు. రాజధాని
నగరం షూషనులో కూడా యీ తాఖీదు ప్రతులు
పంచబడ్డాయి. మహారాజూ, హామానూ మద్యం సేవిస్తూ
కూర్చుండగా, అటు షూషను నగరం గందరగోళంలో
మునిగిపోయింది.

## సహాయం చేయుమని ఎస్తేరుకు మొర్దెకై నచ్చచెప్పటం

4 మొర్దెకై జరిగిన సంగతంతా తెలుసుకున్నాడు.
యూదులకు వ్యతిరేకంగా మహారాజు ఆజ్ఞలను
గురించి విన్న మొర్దెకై తన బట్టలు చింపుకొని, తన
నెత్తిమీద బూడిద పోసుకొని, విషాద సూచకమైన
దుస్తులు ధరించి, నగరంలోకి పోయిగట్టిగా ఏడ్వ
నారంభించాడు. 2కాని, మొర్దెకై రాజభవన ద్వారం
వరకు మాత్రమే పోగలిగాడు. అయితే, విషాద సూచక
దుస్తులు ధరించినవారెవరూ ఆ ద్వారంలో ప్రవే
శించేందుకు అనుమతింపబడరు. 3రాజాజ్ఞ చేరిన ప్రతి
సామంత రాజ్యంలోనూ యూదుల్లో విచారం అలుము
కొంది. ఏడ్పులు చెలరేగాయి. వాళ్లు శోకాలు పెడుతూ,
ఉపవాసాలుండసాగారు. చాలామంది యూదులు నెత్తిన
బూడిద పోసుకొని, సంతాప సూచక దుస్తులు వేసుకొని
నేలమీద పడి వున్నారు.
4-5ఎస్తేరు పరిచారికలు, కొజ్జాలు ఆమె దగ్గరికి వెళ్లి,
ఆమెకి మొర్దెకై గురించి చెప్పారు. దానితో, ఎస్తేరు
మహారాణి గాభరా చెందింది, బాగా విచారగ్రస్తి అయింది.
విషాద సూచకమైన దుస్తులు వదలి, వాటి స్థానంలో
వేసుకొనేందుకు మంచి దుస్తులు ఆమె మొర్దెకైకి
పంపింది. కాని, అతను ఆ దుస్తులు ధరించేందుకు
నిరాకరించాడు. హతాకు అనే కొజ్జా ఎస్తేరు ప్రధాన
సేవకుడు. ఎస్తేరు అతన్ని మొర్దెకై వద్దకు పోయి
అతన్ని కలవరపరుస్తున్నదేమిటో, దానికి కారణం
ఏమిటో కనుక్కోమని పంపింది. 6రాజభవన ద్వారం
ముందర నగరంలోని, ఖాళీ స్థలంలో వున్న మొర్దెకైని
హతాకు పోయి కలిశాడు.
7అప్పుడు మొర్దెకై తన విషయంలో జరిగినదంతా
హతాకుకి వివరించి చెప్పాడు. యూదులను హత
మార్చేందుకు గాను రాజు గారి బొక్కసంలో సరిగ్గా
ఎంత మొత్తం సొమ్ము జమ చేస్తానని హామాను వాగ్దానం
చేశాడో చెప్పాడు. 8యూదులను చంపేయాలన్న
మహారాజు ఆజ్ఞ ప్రతిని కూడా మొర్దెకై హతాకుకి
ఇచ్చాడు. ఆ తాఖీదు షూషను నగరమంతటా ఎలా
చాటబడిందో చెప్పాడు. ఆ ఆజ్ఞను ఎస్తేరుకి చూపించ
మనీ, విషయాలన్నీ వివరించి చెప్పమనీ, మహారాజు
దగ్గరికి పోయి, మొర్దెకైకీ, తన స్వజనానికీ, క్షమాభిక్షను
అర్థించేలా ఎస్తేరును ప్రోత్సహించమని అతను హతాకుకి
చెప్పాడు.
9హతాకు రాణివాసానికి తిరిగి వెళ్లి, మొర్దెకై తనకి
చెప్పిన విషయాలన్నీ ఎస్తేరుకి చెప్పాడు.
10అప్పుడు ఎస్తేరు మొర్దెకైకి ఈ కింది మాటలు
చెప్పమని హతాకును ఆజ్ఞాపించింది:
11“మొర్దెకై పిలువ నంపితేగాని స్త్రీగాని, పురుషుడు
గాని మహారాజు సన్నిధికి వెళ్లడం నిషిద్ధం. అలా వెళ్లే
వ్యక్తి మరణ శిక్షకి గురి అవుతాడు. మహారాజు సామంతు
లందరికీ, ఆయా సామంత దేశాల ప్రజలందరికీ యీ
విషయం తెలుసు. ఆ వ్యక్తిని మహారాజు తన బంగారపు
దండంతో అంటినప్పుడు మాత్రమే ఆ మరణ శిక్ష
అమలు జరపబడదు. మహారాజు అలా చేస్తే, ఆ వ్యక్తి
ప్రాణం నిలుస్తుంది. 30 రోజులుగా మహారాజుగారు
నన్ను పిలువనంపలేదు. మరి నేనెలా వెళ్లాలి?”
12-13అలా ఎస్తేరు పంపిన సందేశానికి బదులుగా
మొర్దెకై ఆమెకి ఇలా సమాధానం పంపాడు: “ఎస్తేరూ,
నువ్వు రాజభవనంలో వున్నావు, అంతమాత్రాన,
యూదులందరిలో నీకొక్కదానికే రక్షణ వుంటుందని
భ్రమపడకు. 14ఒకవేళ నువ్విప్పుడు మౌనం వహిస్తే
యూదులకు స్వేచ్ఛా సహాయాలు మరొక చోటు
నుంచి వస్తాయి. కాని నువ్వూ, నీ తండ్రి కుటుంబ
సభ్యులూ అందరూ మరణిస్తారు. బహుశా నువ్వీ

మహాత్కార్యం కోసమే మహారాణిగా ఈ సమయంలో
ఎంచు కోబడ్డావేమో ఆలోచించుకో."
15-16అప్పుడు ఎస్తేరు మొర్దెకైకి ఈ క్రింది సమా
ధానం పంపింది: "మొర్దెకై! పోయి షూషను నగరం
లోని యూదులందర్నీ కూడగట్టు, నా కోసం ఉప
వాసం ఉండండి. నేను మూడు రాత్రులూ పగళ్లూ
అన్నపానాలు విసర్జిస్తాను. నేను నీలాగే ఉపవాస
ముంటాను. అలాగే, నా పరిచారికలు కూడా ఉపవాసం
వుంటారు. మా ఉపవాస దినం ముగిశాక, నేను మహా
రాజు సన్నిధికి వెళ్తాను, ఆయన నన్ను పిలువనంపక
పోయినా సరే, వెళ్తాను. పిలుపు రాకుండా మహారాజు
సమక్షానికి వెళ్లడం చట్టవిరుద్ధమని నాకు తెలుసు.
అయినా సరే, నేను వెళ్తాను. నేను చనిపోతే చని
పోతాను."
17మొర్దెకై అక్కడ్నుంచి వెళ్లిపోయి, ఎస్తేరు చెయ్య
మన్నట్లు చేశాడు.

### మహారాజుతో ఎస్తేరు మాటలు

5 మూడవ రోజున ఎస్తేరు ప్రత్యేకమైన దుస్తులు
ధరించి, రాజ నగరులోని, రాజభవన మెదుట
వున్న లోపలి భవనములో నిలిచింది. మహారాజు
అక్కడ సింహాసనం మీద కూర్చుని వున్నాడు. ఆయన
న్యాయస్థానంలోకి జనం ప్రవేశించే దిశగా చూపు తిప్పి
కూర్చున్నాడు. 2అప్పుడు ఆయన దృష్టి లోపలి
ఆవరణలో నిలిచివున్న ఎస్తేరుపై పడింది. ఆమెను
అక్కడ చూచినంతనే మహారాజు మనస్సు సంతోష
భరితమైంది. ఆయన తన చేతిలోని బంగారు దండాన్ని
ఆమె వైపు చాపాడు. ఎస్తేరు రాజు దర్బారు మందిరం
లోకి పోయి బంగారు దండపు కొనని తాకింది.
3అప్పుడు మహారాజు ఎస్తేరుతో ఇలా అన్నాడు:
"మహారాణీ, ఏమిటి నీ దిగులు? నువ్వు నన్ను కోరాల
నుకున్నదేమిటో కోరుకో, నువ్వేమి కోరుకున్నా, అర్ధ
రాజ్యమైనా ఇచ్చేస్తాను."
4ఎస్తేరు, "నేను తమకీ, హామానుకీ ఒక విందు
ఏర్పాటు చేశాను. దయచేసి మీరూ, హామానూ యీ
రోజు నా విందుకి రావాలని నా కోరిక" అని అడిగింది.
5అప్పుడు మహారాజు సేవకులకు, "మహారాణి
ఎస్తేరు కోర్కెను మేము తీర్చాలి. వెంటనే పోయి,
హామానును తొందరగా తీసుకురండి" అని ఆజ్ఞా
పించాడు.
ఎస్తేరు ఏర్పాటు చేసిన విందుకి మహారాజూ,
హామానూ వెళ్లారు. 6వాళ్లు ద్రాక్షారసం సేవిస్తూండగా,
మహారాజు ఎస్తేరును మళ్లీ ఇలా అడిగాడు: "ఎస్తేరూ,
నువ్వేదైనా కోరుకో. అర్ధ రాజ్యమైనా సరే కోరుకో,
నేను నీకిస్తాను."
7అందుకు ఎస్తేరిలా సమాధానమిచ్చింది, "నేను
మిమ్మల్ని కోరదలుచుకున్నది యిదీ మహారాజా!
8తమరికి నా మనవి అంగీకారమై, నేను కోరినది ఇవ్వాల
నుకుంటే, రేపు నేనివ్వబోయే మరో విందుకి మీరూ,
హామానూ తప్పక వేంచేయాలి. నా అసలు మనవి
ఏమిటో నేను అప్పుడు విన్నవించుకుంటాను."

### మొర్దెకై పట్ల హామాను కోపాతిరేకం

9హామాను ఆ రోజున రాజభవనం నుంచి ఇంటికి
మంచి హుషారుగా, మహానందంగా వెళ్లాడు. కాని, రాజ
భవన ద్వారం దగ్గర మరల కనబడిన మొర్దెకై తనని
చూసి కూడా లేచి, భయభక్తులతో తనకి నమస్క
రించక పోయేసరికి హామానుకు తల కొట్టేసినట్ల
యింది. అతని కోపం మిన్నుముట్టింది. 10అయినా,
హామాను తన కోపాన్ని అదుపుచేసుకొని, ఇంటికి
వెళ్లిపోయాడు. అక్కడ తన మిత్రులనూ, తన భార్య
జెరెషునూ పిలిచి కూర్చోబెట్టి, 11తన ఐశ్వర్యం
గురించి గొప్పలు చెప్పడం మొదలెట్టాడు. తనకి చాలా
మంది కొడుకులున్నారనీ, మహారాజు తనని ఎన్నో
విధాల గౌరవించాడనీ, మిగిలిన నాయకు లందరికంటె
మహారాజు తనకి ఉన్నత స్థానమిచ్చాడనీ, చెప్పు
కున్నాడు. 12హామాను యింకా ఇలా అన్నాడు, "అంతే
ననుకున్నారేమో, కాదు." "ఎస్తేరు మహారాణి తను
యిచ్చిన విందుకి మహారాజుతోబాటు నన్నొక్కడినే
ఆహ్వానించింది. రేపు తను యివ్వబోయే మరో
విందుకి కూడా మహారాజుతో బాటు నన్ను కూడా
మహారాణి ఆహ్వానించింది. 13అయినా నాకివన్నీ
ఏమంత పెద్దగా ఆనందం కలిగించే విషయాలు కావు.
ఆ యూదుడైన మొర్దకై రాజభవన ద్వారం దగ్గర
కూర్చొని ఉండటం ఎప్పటి వరకు నేను చూస్తూ
ఉంటానో, అప్పటివరకు నేను నిజంగా సంతోషించ
లేను."
14అప్పుడు హామాను భార్య జెరెషూ, అతని
మిత్రులందరూ ఇలా సలహా యిచ్చారు: "మొర్దెకైని
ఉరితీసేందుకుగాను ఒక స్తంభం పాతుమని ఎవరినైనా
పురమాయించు! ఆ ఉరికొయ్య 75 అడుగుల పొడుగు
వుండాలి! ఇంకేముంది, రేపు ఉదయం మహారాజుతో
ఆ ఉరికొయ్య మీద ఆ యూదుని ఉరితీయించమని
చెప్పు. మహారాజుతో కలిసి విందుకి వెళ్లు. అప్పుడిక
చూసుకో, నీ ఆనందానికి మేరవుండదు."
హామానుకి ఆ సలహా నచ్చింది. వెంటనే అతను
ఉరి కంబం సిద్ధం చేయమని ఒకణ్ణి ఆజ్ఞాపించాడు.

### మొర్దెకైకి గౌరవ సత్కార్యాలు

6 సరిగ్గా ఆ రాత్రి మహారాజుకి నిద్రపట్టలేదు. అందు
కని రాజవంశ చరిత్ర గ్రంథాన్ని తెచ్చి తనకి చదివి
వినిపించమని ఒక ఉద్యోగికి పురమాయించాడు. (ఆ
చరిత్ర గ్రంథంలో ఒక్కొక్క రాజు పరిపాలన కాలంలో
సంభవించిన ప్రతి సంఘటనా నమోదు చెయ్యబడు

తుంది.) 2ఆ ఉద్యోగి మహారాజుకి ఆ గ్రంథం చదివి
వినిపించాడు. అహష్వేరోషు మహారాజును హత్య చేసేం
దుకు జరిగిన కుట్రను గురించీ, బిగ్తాను, తెరెషు అనే
యిద్దరు రాజభవన ద్వారపాలకులు ఇద్దరు చేస్తున్న
యీ కుట్ర గురించి మొర్దెకై పసిగట్టి ఆ సమాచారాన్ని
ఎవరికో తెలియజెయ్యడం గురించి ఆ ఉద్యోగి చది
వాడు.
3అప్పుడు మహారాజు, "ఇందుకు ప్రతిఫలంగా ఆ
మొర్దెకైకి ఎలాంటి ఆదర సత్కార్యాలు జరిగాయి?"
అని ప్రశ్నించాడు.
"మొర్దెకైకి ఎలాంటి పారితోషికమూ దొరకలేదు
మహారాజా" అని ఉద్యోగులు సమాధానమిచ్చారు.
4హామాను సరిగ్గా అప్పుడే రాజభవనపు వెలుపటి
ఆవరణలో ప్రవేశించాడు. తను నాటింపజేసిన ఉరి
కంబం మీద మొర్దెకైని ఉరితీయించేందుకు మహారాజు
అనుమతిని కోరేందుకే అతను వచ్చాడు. అతని అడు
గుల చప్పుడు మహారాజు విన్నాడు. "ఆవరణ లోపలికి
వచ్చింది ఎవరు?" అన్న మహారాజు ప్రశ్నకి 5రాజోద్యో
గులు "హామాను ఆవరణలో వేచివున్నాడు మహారాజా"
అని సమాధానమిచ్చారు.
మహారాజు, "అతన్ని లోపలికి తీసుకురండి" అని
ఆదేశించాడు.
6హామాను లోపలికి వచ్చాక మహారాజు అతన్ని,
"మహారాజు ఎవరికైనా గౌరవ సత్కార్యాలు చెయ్యా
లంటే, ఏం చెయ్యాలి హామానూ" అని ప్రశ్నించాడు.
హామాను తనలో తను, "మహారాజు నన్ను కాక
మరెవరిని సత్కరించాలని అనుకుంటారు? మహారాజు
అంటున్నది నిస్సందేహంగా నన్ను సత్కరించాలనే
అయివుంటుంది." అని తర్కించుకున్నాడు.
7దానితో హమాను మహారాజుకి ఇలా సమాధాన
మిచ్చాడు: "మహారాజు గౌరవించాలనుకున్న వ్యక్తి విష
యంలో యిలా చెయ్యాలి. 8మహారాజు స్వయంగా
ధరించిన రాజవస్త్రాలను సేవకులచేత తెప్పించాలి.
మహారాజు స్వారీచేసిన ఒక గుర్రాన్ని కూడా తెప్పిం
చాలి. సేవకులచేత ఆ గుర్రం ముఖాన తురాయివంటి
ప్రత్యేకమైన ఒక గుర్తు వేయించాలి.
9తర్వాత ఆ పట్టు వస్త్రాన్ని, ఆ గుర్రాన్నీ ఒక
ప్రముఖ ఉద్యోగి వద్ద వుంచాలి. అప్పుడు మహారాజు
సత్కరించాలనుకున్న ఆ వ్యక్తిని ఆ ముఖ్య అధికారి
గుర్రం మీద కూర్చోబెట్టి నగర వీధుల్లో ఊరేగిస్తూ,
'ఈయనకి మహారాజు చేస్తున్న సన్మానం ఇది' అంటూ
చాటాలి."
10అప్పుడు మహారాజు హామానుకి ఇలా ఆజ్ఞా
పించాడు: "వెన్వెంటనే పోయి, పట్టు వస్త్రాలూ
గుర్రము తీసుకువచ్చి. భవనద్వారం దగ్గర కూర్చున్న
యూదుడైన మొర్దెకైకి నువ్వు చెప్పిన సత్కార కార్య
క్రమమంతా అమలు జరుపుము."
11హామాను పోయి పట్టు వస్త్రమూ, గుర్రమూ
తెచ్చాడు. ఆ వస్త్రాన్ని మొర్దెకైకి కప్పి, అతన్ని గుర్రం
మీద కూర్చోబెట్టి, తను గుర్రం ముందు నడుస్తూ
మొర్దెకైని నగర వీధుల్లో ఊరేగిస్తూ, "మహారాజు సత్క
రించ కోరిన వ్యక్తికి జరుగుతున్న సన్మానం ఇదే" అని
చాటాడు.
12అటు తర్వాత మొర్దెకై రాజభవన ద్వారం దగ్గరికి
తిరిగి వెళ్లాడు. కాని, హామాను సిగ్గుతో తల్లడిల్లుతూ
హడావిడిగా ఇంటికి వెళ్లిపోయాడు. 13 తన భార్య
జెరెషుకీ, తన మిత్రులందరికీ తనకి జరిగిన పరాభవ
మంతటిని గురించి సవివరంగా చెప్పాడు. హామాను
భార్య, అతనికి ఇంతకు ముందు సలహా ఇచ్చిన
మిత్రులూ అతనితో ఇలా అన్నారు: "మొర్దెకై
యూదుడే అయితే, నువ్వు జయం పొందడం
అసాధ్యం. నీ పతనం యిప్పటికే ప్రారంభమైంది. నీ
నాశనం తథ్యం!"
14హామానుతో వాళ్లింకా మాట్లాడుతూనే వున్నారు.
అంతలోనే మహారాజుగారి కొజ్జాలు హామాను ఇంటికి
వచ్చారు. వాళ్లు హామానుని ఎస్తేరు సన్నద్ధం చేసిన
విందుకి వెళ్లేందుకు తొందరచేశారు.

### హామాను ఉరితీయ బడుట

7 మహారాజూ, హామానూ మహారాణి ఎస్తేరు విందుకి
వెళ్లారు. 2విందు రెండోరోజున వాళ్లు ద్రాక్షారసం
సేవిస్తూవుండగా మహారాజు ఎస్తేరును మరల ఇలా
అడిగాడు: "మహారాణి ఎస్తేరూ, నీకేం కావాలి? నువ్వేమి
కోరుకున్నా సరే, దాన్ని నీకు ఇస్తాను. నీ కోరిక
ఏమిటి? నీకు ఏదైనా సరే, చివరకు అర్ధ రాజ్యమైనా
సరే ఇస్తాను."
3అప్పుడు మహారాణి ఎస్తేరు ఇలా సమాధానం
యిచ్చింది: "మహారాజా, మీకు నేనంటే ఇష్టంవుంటే,
మీరు నన్ను అనుగ్రహిస్తే, నాకూ, నా ప్రజలకీ కూడా
ప్రాణదానం చెయ్యండి! నేను కోరుకొనేది అంత
మాత్రమే. 4ఎందుకంటే నాశనం చేయబడేందుకు,
చంపివేయబడేందుకు, నిర్మూలించ బడేందుకు నేనూ,
నా ప్రజలూ అమ్మివేయబడ్డాం. మేము కేవలం బానిస
లుగా అమ్మివేయబడివుంటే, నేను ఊరక ఉండి
పోదును. ఎందుకంటే, అది మహారాజును విసిగించవల
సినంతటి సమస్య అయ్యుండేది కాదు."
5మహారాజు అహష్వేరోషు మహారాణి ఎస్తేరును
ఇలా ప్రశ్నించాడు: "మీ విషయంలో ఇలా చేసింది
ఎవరు? నీ ప్రజలకు ఇలా చేయ సాహసించిన వ్యక్తి
ఎవరు?"
6"మాకు విరోధి, శత్రువు దుర్మార్గుడైన ఈ
హామానే" అని జవాబిచ్చింది ఎస్తేరు. దానితో, మహా
రాజుకీ, మహారాణికీ ముందు నిలబడ్డ హామాను భయ
భీతుడయ్యాడు.

7మహారాజుకి పట్టరాని కోపం వచ్చింది. ఆయన
లేచి నిలబడ్డాడు. ద్రాక్షారసం అక్కడే వదిలేసి, బయటి
తోటలోకి వెళ్లాడు. కాని, హామాను మహారాణిని
క్షమాభిక్ష వేడుకునేందుకు అక్కడే నిలిచిపోయాడు.
అప్పటికే మహారాజు తనని చంపి వేయాలని నిర్ణయిం
చుకున్నట్లు హామాను గ్రహించినందువల్లనే, మహారాణి
ఎస్తేరును క్షమాభిక్ష అడుక్కునేందుకు అక్కడ ఉండి
పోయాడు. 8సరిగ్గా తోటనుంచి విందుశాలకి వస్తున్న
ప్పుడే ఎస్తేరు వాలి కూర్చున్న శయ్యమీద హామాను
పడుతూవుండటం మహారాజు కంటపడింది. మహారాజు
కోపస్వరంతో, “నేనీ ఇంట్లో ఉండగానే నువ్వు
మహారాణి మీద దాడి చేస్తున్నావా?”అని గర్జించాడు.
మహారాజు కేక వినగానే, సేవకులు లోనికి వచ్చి
హామానుని పట్టుకున్నారు.
9మహారాజు సేవకుల్లో ఒకడి పేరు హార్బోనా. ఆ
కొజ్జా మహారాజుతో ఇలా చెప్పాడు: “హామాను యింటి
దగ్గర 75 అడుగుల ఉరికంబం వుంది మహారాజా.
దానిమీద మొర్దెకైని ఉరి తీయించేందుకు హామాను
దాన్ని నిర్మింపజేశాడు. మిమ్మల్ని హత్య చేసేందుకు
కుట్రలు పన్నుతున్నప్పుడు, ఆ సమాచారాన్ని
తెలియజేసి, మీకు సహాయపడినది యీ మొర్దెకైయే
నండి.”

“హామానుని అదే ఉరికంబం మీద ఉరి తియ్యండి”
అని ఆజ్ఞాపించాడు మహారాజు.
10దానితో, మొర్దెకైని ఉరితీయించేందు కోసం
హామాను నిర్మించిన ఉరికంబం మీదనే హామాను ఉరితీ
యబడ్డాడు.

### యూదులకు అనుకూలంగా మహారాజు శాసనం

8 అదే రోజున అహష్వేరోషు మహారాజు యూదు
లకు శత్రువైన హామానుకు చెందిన చర స్థిరాస్తుల
న్నింటినీ ఎస్తేరు మహారాణికి దత్తం చేశాడు. మొర్దెకై
తనకు బంధువన్న విషయాన్ని ఎస్తేరు మహారాజుకి
చెప్పింది. అప్పుడు మొర్దెకై మహారాజు దర్శనానికి
వచ్చాడు. 2మహారాజు తన రాజముద్రికను హామాను
నుంచి వెనక్కి తెప్పించి, తన వేలికి పెట్టుకున్నాడు.
మహారాజు ఆ ఉంగరాన్ని మొర్దెకైకి ఇచ్చాడు. అప్పు
డింక ఎస్తేరు హామానుకి చెందిన ఆస్తులన్నింటి అజమా
యిషీనీ మొర్దెకైకి అప్పగించింది.
3తర్వాత ఎస్తేరు మహారాజుతో మళ్లీ మాట్లాడింది.
ఆమె రోదిస్తూ మహారాజు పాదాలపైపడి, అగాగీయు
డైన హామాను దుష్ట పథకాన్ని రద్దు చేయవలసిందిగా
మహారాజును వేడుకుంది. యూదులను హింసించేం
దుకు హామాను పన్నిన దుష్ట పథకం అది. 4మహారాజు
తన బంగారు రాజదండంతో ఎస్తేరును తాకాడు. ఎస్తేరు
లేచి, మహారాజు ముందు నిలబడింది. 5అప్పుడు ఎస్తేరు
మహారాజుతో ఇలా విన్నవించుకుంది: “మహారాజా,
మీకు నేనంటే ఇష్టంవుంటే, తమ దయవుంటే, నా
కోసం ఇలా చెయ్యండి. ఇది మంచి ఊహ అను
కుంటేనే ఈ పని చేయండి. నేను తమకి ప్రీతిపాత్రురా
లినైతే, హామాను పంపిన ఆజ్ఞను రద్దుచేస్తూ ఒక
శాసనం చేయండి. అగాగీయుడైన హామాను మహారాజా
వారి సామంత దేశాలన్నింటిలోని యూదులందరినీ
సమూలంగా నాశనం చేయమని తాఖీదులు జారీచేశాడు.
6నా ప్రజలు ఇలాంటి ఘోరమైన విపత్తులకు
గురికావడం నేను సహించలేను. నా కుటుంబ సభ్యులు
హతమార్చ బడటం నేను భరించలేను. అందుకే, మహా
రాజావారిని ఈ ఘోరాన్ని ఆపు చెయ్యవలసిందిగా
అర్థిస్తున్నాను.”
7అహష్వేరోషు మహారాజు ఎస్తేరు మహారాణికీ,
యూదుడైన మొర్దెకైకీ ఇలా సమాధానమిచ్చాడు,
“హామాను యూదులకు శత్రువు కనుకనే వాని ఆస్తిని
ఎస్తేరుకి ఇచ్చాను. నా సైనికులు వాడిని ఉరికంబాని
కెక్కించి, ఉరిదీశారు. 8ఇప్పుడిక మహారాజు ఆజ్ఞ మేరకు
మరో ఆజ్ఞాపత్రం వ్రాయండి. మీకు సర్వోత్తమమని
తోచిన పద్ధతిలో, యూదులకు తోడ్పడే విధంగా
శాసనాన్ని వ్రాయండి. తర్వాత దానిమీద రాజముద్రి
కతో ముద్రవేసి మూసెయ్యండి. మహారాజు ఆజ్ఞ
మేరకు వ్రాయబడి, దానిమీద రాజముద్రిక గుర్తువేయ
బడిన ఏ ఆధికారిక ఆజ్ఞాపత్రాన్ని రద్దుచేయ సాధ్యం
కాదు.”
9మహారాజు వెంటనే లేఖకులను పిలువనంపిం
చాడు. మూడవ నెల, అనగా సీవాను నెల 23వ రోజున
యీ ఘటన జరిగింది. లేఖకులు మొర్దెకై ఆజ్ఞలన్నిం
టినీ వ్రాశారు. అవి యూదులకీ, సామంత రాజులకీ,
రాజ్యాధిపతులకీ, 127 దేశాల అధికారులకీ పంప
బడ్డాయి. ఆ దేశాలు భారత దేశంనుంచి ఇథియోపియా
దాకా విస్తరించి వున్నాయి. ఆ ఆజ్ఞాపత్రాలు ఆయా
దేశాల భాషల్లో వ్రాయబడ్డాయి. ఆవి ఆయా ప్రజాబృం
దాల భాషల్లోకి అనువదించబడ్డాయి. కాగా ఆ ఆజ్ఞాప
త్రాలు యూదులకు వాళ్ల సొంత భాషలో, సొంత
లిపిలో వ్రాయబడ్డాయి. 10మొర్దెకై ఆ ఆజ్ఞలను అహ
ష్వేరోషు మహారాజు ఆమోదంతో వ్రాశాడు. తర్వాత
అతను వాటిమీద రాజముద్రికతో ముద్ర వేయించాడు.
అప్పుడిక, మొర్దెకై అశ్వారూఢులైన వార్తాహరుల
ద్వారా వాటిని పంపించాడు. మహారాజు అశ్వశాలలోని
గుర్రాలు అవి.
11ఆ లేఖల్లోని మహారాజు ఉత్తరువు ఇలా సాగింది:

ప్రతి ఒక్క నగరంలోని యూదులూ తమ,
ప్రాణ రక్షణ కోసం ఒకచోట గుమిగూడే
హక్కు కలిగున్నారు. తమ స్త్రీలపైనా, తమ
బిడ్డలపైనా ఏ జాతీయులకు చెందిన ఏ
సైన్యాన్నయినా సరే నాశనం చేసే, హత

మార్చే, పూర్తిగా రూపు మాపే హక్కు వాళ్లకి
వుంది. యూదులకు తమ శత్రువుల ఆస్తిని
వశంచేసుకొనే హక్కూ, నాశనం చేసే హక్కూ
వున్నాయి.

12యూదులకు ఈ హక్కు ఒక్క రోజే వుంటుంది.
ఆ రోజు అదారు అనబడే 12వ నెల 13వ రోజు.
అహష్వేరోషు సామ్రాజ్యంలోని దేశాలన్నింట్లోనూ
యూదులకు హక్కు దాఖలు చేయబడింది. 13మహా
రాజు ఆజ్ఞాపత్రపు ప్రతి ఒకటి బయటికి పంపబడింది.
అదొక శాసనం అయింది. అది అన్ని సామంత దేశా
ల్లోనూ శాసనం అయింది. సామ్రాజ్యంలో నివసించే
ప్రతి ఒక జాతి ప్రజలకీ ఈ శాసనం చాటబడింది.
యూదులు ప్రత్యేకమైన ఈ రోజున సర్వసన్నద్ధంగా
ఉండేందుకు వీలుగా వాళ్లీపని చేశారు. యూదులు
తమ శత్రువులకు బదులు దెబ్బ కొట్టేందుకు ఆ
రోజున అనుమతింపబడతారు. 14వార్తాహరులు మహా
రాజావారి గుర్రాలమీద వేగంగా సాగిపోయారు. మహా
రాజు ఆ గుర్రాల రౌతులను వేగంగా వెళ్లమని ఆదేశిం
చాడు. ఆ ఆజ్ఞ రాజధాని అయిన షూషను నగరానికి
కూడా వర్తింప జేయబడింది. 15మొర్దెకై మహారాజు
సమక్షం నుంచి బయల్దేరాడు. అతను మహారాజు
సమర్పించిన నీలం, తెలుపు, ప్రత్యేక దుస్తులు, ఒక
పెద్ద బంగారు కిరీటం ధరించాడు. అతని పైవస్త్రం
ఊదా రంగులోవుంది. అది చాలా మంచి ఉన్నితో
నేసినది. ఆ రోజున షూషను నగరంలో ప్రత్యేకమైన
ఒక ఉత్సవం జరుగుతోంది. 16అది యూదులకు
ప్రత్యేకించి ఆనంద దాయకమైన రోజుగా, అందరికీ
సంతోషానంద భరితమైన రోజుగా పరిణమించింది.
17మహారాజు ఆజ్ఞ చేరిన ప్రతి దేశంలోనూ, ప్రతి
నగరంలోనూ, యూదుల్లో ఆనందోత్సాహాలు వెల్లివిరి
శాయి. యూదులు విందులు, వేడుకలు చేసుకున్నారు.
ఇతర జాతులకు చెందిన చాలామంది సామాన్య ప్రజ
లకు యూదులంటే భయంకలిగి, వాళ్లు యూదా
మతం పుచ్చుకున్నారు.

### యూదుల విజయం

9 పన్నెండో నెల (అదారు) 13వ రోజున ప్రజలం
దరూ మహారాజు ఆజ్ఞను మన్నించవలసి వుంది.
అది యూదులను ఓడించాలని యూదుల శత్రువులు
ఆశించిన రోజు. అయితే, యిప్పుడు ఆ పరిస్థితులు
తారుమారయ్యాయి. తమను ద్వేషించిన తమ శత్రువు
లకంటె యూదులు ఇప్పుడు బలంగా వున్నారు. 2అహ
ష్వేరోషు మహారాజు సామ్రాజ్యంలోని అన్ని నగరా
ల్లోని యూదులూ సమావేశమయ్యారు. తమను
నాశనం చేయాలని కోరినవారి పైన దాడిచేసేటంత
బలాన్ని సమకూర్చుకునేందుకుగాను వాళ్లు సమ
కూడారు. దానితో, వాళ్లని ఎదిరించి నిలబడగల శక్తిగల
వారు ఎవ్వరూ లేకపోయారు. యూదులంటే జనం
భయపడ్డారు. 3సామంత రాజ్యాల్లోని అధికారులు,
సామ్రాజ్యాధిపతులు, రాజ్య పాలకులు, రాజోద్యోగులు
అందరూ యూదులకు తోడ్పడ్డారు. వాళ్ల ఈ తోడ్పా
టుకి మొర్దెకై పట్లనున్న భయమే కారణం. 4మహారాజు
భవనంలోని అతి ముఖ్యుల్లో మొర్దెకై ఒకడయ్యాడు.
సామంత రాజ్యాల్లోని ప్రతి ఒక్కరికీ మొర్దెకై పేరు
తెలుసు. అతనికెంత ప్రాముఖ్యం వుందో తెలుసు.
మొర్దెకై నానాటికీ మరింత శక్తివంతమైన వ్యక్తి
అయ్యాడు.
5యూదులు తమ శత్రువులందర్నీ ఓడించారు.
వాళ్లు తమ శత్రువుల్ని హతమార్చేందుకూ, నాశనం
చేసేందుకూ కత్తులు ప్రయోగించారు. తమని ద్వేషిం
చినవారి పట్ల యూదులు తమ చిత్తం వచ్చినట్లు
వ్యవహరించారు. 6యూదులు రాజధాని అయిన
షూషను నగరంలో 500 మందిని హతమార్చి, నాశనం
చేశారు. 7యూదులు ఈ క్రిందివారిని కూడా మట్టు
పెట్టారు: 8పర్షందాతా, దల్ఫోను, అస్పాతా, 9పోరాతా,
అదల్యా, అరీదాతా, పర్మష్తా, అరీసై, అరీదై, వైజాతా.
10ఈ పదిమందీ హామాను కొడుకులు. హమ్మెదాతా
కొడుకైన హామాను యూదులకు గర్భశత్రువు.
యూదులు హామాను కొడుకులందర్నీ చంపేశారుగాని,
వాళ్లకి చెందిన ఆస్తిపాస్తులు వేటినీ వాళ్లు తాకలేదు.
11ఆ రోజున రాజధాని అయిన షూషను నగరంలో
చంపివేయబడిన వాళ్ల సంఖ్యను మహారాజు తెలుసు
కున్నాడు. 12అప్పుడు మహారాజు మహారాణి ఎస్తేరుతో
ఇలా అన్నాడు: "షూషను నగరంలో యూదులు
హామాను కొడుకులు పదిమందితో బాటు 500
మందిని చంపేశారు. ఇప్పుడిక మహారాజు సామ్రాజ్యం
లోని యితర సామంత రాజ్యాల్లో ఏమి జరగాలని
నువ్వు కోరుకుంటున్నావో చెప్పు. నేను అలా చేయి
స్తాను. నువ్వు కోరుకో, కోరుకున్నదేదైనా సరే, నేను
చేయిస్తాను."
13ఎస్తేరు ఇలా కోరింది, "మహారాజుకి సమ్మత
మైతే, షూషను నగరంలోని యూదులను రేపుకూడా
యీ కార్యక్రమం కొనసాగించనివ్వండి, హామాను
కొడుకులు పదిమంది కళేబరాలనూ ఉరికంబం మీద
వేలాడదీయించండి."
14మహారాజు అలాగే ఉత్తరువు ఇచ్చాడు. ఆ
ఉత్తరువు షూషను నగరంలో మరొక రోజు అమలు
జరిగింది. హామాను కొడుకులు పదిమందీ ఉరి కొయ్యె
లకు వేలాడదీయబడ్డారు.
15అదారు నెల 14 వ రోజున షూషను నగరంలో
యూదులందరూ గుమికూడి, మరో 300 మంది పురు
షులను చంపేశారు. అయితే, వాళ్లకి చెందిన ఏ వస్తు
వుల్నీ యూదులు ముట్టలేదు.

16అదే సమయంలో యితర సామంత రాజ్యాల్లోని
యూదులు కూడా తమని తాము కాపాడుకోగల
బలాన్ని పుంజుకునేందుకు గాను వాళ్లు సమావేశ
మయ్యారు. వాళ్లు అలా తమ శత్రువులను వదిలించు
కున్నారు. యూదులు తమ శత్రువుల్లో 75,000
మందిని హతమార్చారు. అయితే, వాళ్లకి చెందిన వస్తు
వులు వేటినీ యూదులు చేజిక్కించుకోలేదు.
17అదారు నెల 13వ రోజున యిది జరిగింది. 14
వ రోజున యూదులు విశ్రమించారు. యూదులు ఆ
రోజును తమ సంతోషకరమైన సెలవు దినం చేసు
కున్నారు.

### పూరీము పండుగ

18షూషను నగరంలోని యూదులు అదారు నెల
13,14 తేదీల్లో సమావేశమయ్యారు. తర్వాత 15వ
రోజున వాళ్లు విశ్రమించారు. అందుకని, 15వ రోజును
వాళ్లు సంతోషకరమైన పండుగ దినం చేసుకున్నారు.
19కాగా దేశంలో, చిన్నచిన్న గ్రామాల్లో జీవించే
యూదులు ఈ పూరీము పండుగను అదారు నెల
14వ రోజున జరుపుకుంటారు. వాళ్లీ 14వ రోజును
ఆనందదాయకమైన పండుగగా జరుపుకుంటారు. వాళ్లు
ఆ రోజున విందులు జరుపుకుంటారు. ఒకరి కొకరు
బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు.
20అప్పుడు జరిగిన ఘటనలన్నింటినీ మొర్దెకై
గ్రంథస్తం చేయించాడు. తర్వాత అతను అహష్వేరోషు
మహారాజు సామంత రాజ్యాలన్నింటిలోని యూదు
లందరికీ లేఖలు పంపాడు. అతనా లేఖలను దగ్గర
ప్రాంతాలకే కాకుండా దూర ప్రాంతాలకు కూడా
పంపాడు.
21ఏటా అదారు నెల 14, 15 తేదీల్లో యూదు
లందరూ పూరీము పండుగను పాటించాలని తెలియ
చెప్పేందుకుగాను మొర్దెకై ఈ పని చేశాడు. 22అవి
యూదులు తమ శత్రువులను నిశ్శేషం చేసిన రోజులు.
అందుకని యూదులు పండుగ దినాలుగా జరుపు
కోవాలి. తమ దుఃఖం సంతోషంగా మారిన ఆ నెలను
కూడా వాళ్లు పండుగ మాసంగా జరుపుకోవాలి. వాళ్ల
రోదన పండుగ దినాలుగా మారిన నెల అది. మొర్దెకై
యూదులందరికీ లేఖలు వ్రాశాడు. అతను ఆ రోజులను
ఆనందం వెల్లివిరిసే పండుగ దినాలుగా జరుపుకోమని
యూదులకు ఆజ్ఞాపించాడు. వాళ్లా రోజుల్లో విందులు
జరుపుకోవాలి, ఒకరికొకరు బహుమతులు ఇచ్చు
కోవాలి, పేదలకు కానుకలివ్వాలి.
23యూదులు మొర్దెకై తమకు వ్రాసిన విధంగా
చేసేందుకు అంగీకరించారు. తాము ప్రారంభించిన
వేడుకలను కొనసాగించేందుకు సమ్మతించారు.
24అగాగీయుడైన హమ్మెదాతా కొడుకు హామాను
యూదులందరికీ గర్భ శత్రువు. యూదులను నాశనం
చేసేందుకుగాను వాళ్లకి వ్యతిరేకంగా అతనొక దుష్ట
పథకం వేశాడు. యూదులను నాశనం చేసేందుకూ,
నిర్మూలించేందుకూ అనువైన రోజును ఎంపిక
చేసేందుకుగాను అతను చీట్లు వేశాడు. ఆ కాలంలో
దాన్ని "పూరు" అనేవారు, అందుకే ఆ పండుగను
"పూరీము" అంటారు 25హామాను దుష్కార్యాలు
చేశాడు. ఎస్తేరు మహారాజు సన్నిధికి వెళ్లి, మాట్లాడింది.
దానితో ఆయన కొత్త ఆజ్ఞలు పంపాడు. ఆ ఆజ్ఞలు
హామాను దుష్ట పథకాలను భగ్నం చేయడమేగాక,
హామాను దుష్ట పథకంలోని దుష్కార్యాలు హామానుకీ,
అతని కుటుంబ సభ్యులకీ సంభవించేలా చేశాయి!
దానితో హామానూ, అతని కొడుకులూ ఉరికంబాలకు
వేలాడదీయబడ్డారు.
26-27ఆ కాలంలో చీట్లను "పూరీము" అనేవారు,
అందుకే ఈ పండుగను "పూరీము" అంటారు. మొర్దెకై
ఒక లేఖ వ్రాసి, యూదులను ఈ పండుగ చేసు
కోవాల్సిందిగా ఆజ్ఞాపించాడు. అందుకే, యూదులు
ఏటా ఈ పండుగను రెండు రోజులపాటు జరుపు
కోవడం ఆచారం అయింది. 28వాళ్లీ పండుగను తమకు
గతంలో జరిగినవాటిని గుర్తుంచు కోగలిగేందుకు గాను
జరుపుకుంటారు. యూదులూ, వాళ్లతో చేరేవాళ్లూ
ఏటా యీ పండుగను సరైన కాలంలో, సక్రమమైన
పద్ధతిలో జరుపుకుంటారు. ప్రతి తరమూ, ప్రతి
కుటుంబమూ యీ రెండు రోజులనూ గుర్తుంచు
కుంటాయి. వాళ్లీ పండుగను ప్రతి సామంత రాజ్యం
లోనూ, ప్రతి పట్టణంలోనూ జరుపుకుంటారు.
పూరీము రోజుల్లో పండుగ జరుపుకోవడాన్ని
యూదులు ఎన్నడూ మానరు. యూదుల ప్రతి
తరమూ, ప్రతి కుటుంబమూ ఈ పండుగను సదా
గుర్తుంచు కుంటారు. 29పూరీమును గురించిన ఉత్తరువు
లేఖను అబీహాయిలు కూతురు ఎస్తేరు మహారాణీ,
యూదుడైన మొర్దెకైలు కలిసి వ్రాశారు. ఈ రెండవ
లేఖ నిజమని నిరూపించేందుకుగాను దాన్ని వారు మహా
రాజు పూర్తి అనుమతి (ఆజ్ఞ)తో వ్రాశారు.
30మొర్దెకై ఆ లేఖలను అహష్వేరోషు మహారాజు
వారి 127 సామంత రాజ్యాల్లోని యూదులందరికీ
పంపాడు. ఈ పండుగ శాంతినీ, ప్రజల మధ్య పరస్పర
విశ్వాసాన్నీ* పెంపొందించాలని జనానికి మొర్దెకై
సూచించాడు. 31పూరీము పండుగ సంబరాలు మొదలు
పెట్టమని చెప్పేందుకుగాను మొర్దెకై ఈ లేఖలు
వ్రాశాడు. ఈ కొత్త పండుగను ఎప్పుడు మొదలు
పెట్టాలోకూడా అతను ఆ లేఖల్లో వాళ్లకి తెలియ
చేశాడు. యూదులకు యీ ఉత్తరువును యూదుడైన

---

**శాంతిని ... విశ్వాశాన్ని** లేక "సహవాసము," మరియు సత్యం. జెకర్యా 8:19లో జనం పండుగలను ఎలా జరుపుకోవాలో దానిని దేవుడు వాళ్లకెందుకు యిచ్చాడో తెలియజేస్తాడు.

మొర్దెకై, మహారాణి ఎస్తేరూ పంపారు. తద్వారా వాళ్లు
యీ రెండు రోజుల పండుగను తమ తరతరాల
యూదుల కోసం స్థిర పరిచారు. తాము ఉపవాసాలు
చేసి, జరిగిన చెడుగుల విషయంలో విలపించే ఇతర
పండుగలను గుర్తు పెట్టు కునేటట్లే యూదులు ఈ
పండుగను కూడా గుర్తు పెట్టుకుంటారు.
32 ఎస్తేరు ఉత్తరువు పూరీము పండుగ నియమాలను
స్థిరపరచింది. ఆ విషయాలు గ్రంథాల్లో నమోదు
చేయబడ్డాయి.

## మొర్దెకైకి గౌరవస్థానం

10 అహష్వేరోషు మహారాజు ప్రజల దగ్గర్నుంచి
పన్నులు వసూలు చేసేవాడు. సుదూర
ప్రాంతాల్లో సముద్ర తీరాన వున్న నగర వాసులతో
బాటు, సామ్రాజ్యంలోని ప్రజలందరూ పన్నులు చెల్లిం
చవలసి వచ్చేది. 2 అహష్వేరోషు మహారాజు చేసిన
ఘనకార్యాలన్నీ మాదీయ, పారశీక రాజ్యాల చరిత్ర
గ్రంథంలో లిఖింపబడ్డాయి. అలాగే మొర్దెకై చేసిన
ఘనకార్యాలన్నీ కూడా ఆ చరిత్ర గ్రంథాల్లో చేర్చ
బడ్డాయి. మహారాజు మొర్దెకైకి ఘనమైన గౌరవస్థానం
కల్పించాడు. 3 సామ్రాజ్యంలో అహష్వేరోషు తర్వాత
ప్రాముఖ్యంలో మొర్దెకైది ద్వితీయ స్థానం. యూదు
లందరిలో మొర్దెకైయే అతి ముఖ్యమైన వ్యక్తి. అతని
తోటి యూదులు అతన్నెంతగానో గౌరవించేవారు.
మొర్దెకై తన జాతీయ ప్రజల సంక్షేమ సౌభాగ్యాల
కోసం విశేషంగా కృషిచేశాడు. మొర్దెకై యూదులందరికీ
శాంతిని చేకూర్చాడు. అందుకే, సాటి యూదులందరికీ
మొర్దెకై అంటే ఎంతో గౌరవం.

# యోబు

## యోబు మంచి మనిషి

1 ఊజు దేశంలో ఒక మంచి మనిషి జీవించాడు.
అతని పేరు యోబు. యోబు మంచివాడు, నమ్మక
మైనవాడు. యోబు తన జీవితాంతము దేవుని ఆరాధిం
చాడు. యోబు చెడు క్రియలకు దూరంగా ఉండేవాడు.
2యోబుకు ఏడుగురు కుమారులు, ముగ్గురు కుమార్తె
లుండిరి. 3యోబుకు ఏడు వేల గొర్రెలు, మూడు
వేల ఒంటెలు, వెయ్యి ఎద్దులు, ఐదు వందల ఆడ
గాడిదలు సొంతంగా ఉన్నాయి. వీటికి తోడు అతనికి
చాలా మంది పనివాళ్లు ఉన్నారు. తూర్పు ప్రాంతంలో
యోబు మిక్కిలి ధనవంతుడుగా ఉండేవాడు.

4యోబు కుమారులు వంతుల ప్రకారం వారి
ఇండ్లలో విందులు చేసుకొంటూ, వారి సోదరీలను
ఆహ్వానిస్తుండేవారు. 5యోబు పిల్లలు విందు చేసు
కొన్న తర్వాత, అతడు ఉదయం పెందలాడే లేచేవాడు.
అతడు తన పిల్లల్లో ఒక్కొక్కరి కోసం ఒక్కొక్క
దహనబలి అర్పించేవాడు. "ఒకవేళ నా పిల్లలు నిర్లక్ష్యంగా
ఉండి, వారి విందులో దేవునికి విరోధంగా పాపం చేశా
రేమో" అని అతడు తలచేవాడు. తన పిల్లలు వారి
పాపాల విషయంలో క్షమించబడాలని అతడు ఎల్ల
ప్పుడు ఇలా చేస్తూ ఉండేవాడు.

6అప్పుడు దేవదూతలు యెహోవా సముఖంలో
సమావేశమయ్యే రోజు వచ్చింది. అప్పుడు ఆ దేవదూ
తలతోబాటు సాతానుకూడ వచ్చాడు. 7"ఎక్కడి నుండి
వస్తున్నావు?" అని సాతానును యెహోవా అడిగాడు.

"నేను భూలోకంలో సంచారం చేస్తూ ఉన్నాను"
అని యెహోవాకు సాతాను జవాబు చెప్పాడు.

8అంతట యెహోవా, "నా సేవకుడైన యోబును
నీవు చూశావా? భూమి మీద అతనిలాంటి వారు
ఎవ్వరూ లేరు. యోబు నిజంగా మంచి మనిషి మరియు
నమ్మకమైనవాడు. అతడు దేవుణ్ణి ఆరాధిస్తాడు.
దుర్మార్గపు పనులకు అతడు దూరంగా ఉంటాడు"
అని సాతానుతో అన్నాడు.

9"ఓ తప్పకుండా! కానీ యోబు దేవుణ్ణి ఆరాధించ
టానికి ఒక గట్టి కారణం ఉంది! 10అతణ్ణి, అతని
కుటుంబాన్ని, అతనికి ఉన్న సర్వాన్ని నీవు ఎల్లప్పుడూ
కాపాడుతూ ఉన్నావు. అతడు చేసే ప్రతిపనిలో నీవు
అతణ్ణి విజయుణ్ణి చేస్తున్నావు. అవును, నీవు అతణ్ణి
ఆశీర్వదించావు. అతడు చాలా ధనికుడు గనుక అతని
పశువుల మందలు, గొర్రెల మందలు దేశం అంతటా
నిండి ఉన్నాయి. 11కానీ అతనికి ఉన్న సర్వాన్నీ నీవు
గనుక నాశనం చేస్తే అతడు నీకు వ్యతిరేకంగా, నీ
ముఖం మీదనే శపిస్తాడని ప్రమాణం చేస్తున్నాను" అని
సాతాను జవాబిచ్చాడు.

12"సరే, యోబుకు ఉన్న వాటన్నింటికీ నీవు
ఏమైనా చేయి. కాని అతని శరీరానికి మాత్రం హాని
చేయవద్దు" అని యెహోవా సాతానుతో చెప్పాడు.
అప్పుడు సాతాను యెహోవా సన్నిధి నుండి
వెళ్లిపోయాడు.

## యోబు సర్వం పోగొట్టుకొన్నాడు

13ఒకరోజు యోబు కుమారులు, కుమార్తెలు
అతని జ్యేష్ఠ కుమారుని ఇంటివద్ద తినుచూ ద్రాక్షారసం
తాగుతూ ఉన్నారు. 14అంతలో ఒక సందేశకుడు
యోబు దగ్గరకు వచ్చి, "ఎడ్లు దున్నుతూ, ఆ దగ్గర
లోనే గాడిదలు గడ్డి మేస్తూ వుండగా, 15షెబాయీ
యులు* మా మీద దాడి చేసి నీ జంతువులను
తీసుకొనిపోయారు! నన్ను తప్ప మిగిలిన నీ సేవకుల
నందరినీ షెబాయీయులు చంపేశారు. నీతో చెప్పటా
నికే నేనొక్కడినే తప్పిం చుకొన్నాను" అని చెప్పాడు.

16ఆ సందేశకుడు ఇంకా మాట్లాడుతూ ఉండగానే
మరో సందేశకుడు యోబు దగ్గరకు వచ్చాడు. "ఆకాశం
నుండి మెరుపుల ద్వారా అగ్నిపడి నీ గొర్రెలను,
సేవకులను కాల్చివేసింది. నీతో చెప్పేందుకు నేను
ఒక్కణ్ణి మాత్రమే తప్పించుకొన్నాను!" అని రెండో
సందేశకుడు చెప్పాడు.

17ఆ సందేశకుడు ఇంకా మాట్లాడు తూండగానే ఇంకో
సందేశకుడు వచ్చాడు. "కల్దీయులు పంపిన మూడు
గుంపులవారు వచ్చి మా మీద పడి ఒంటెలను తీసుకొని
పోయారు. పైగా వారు సేవకులను చంపేశారు. నీతో
చెప్పేందుకు నేనొక్కణ్ణి మాత్రం తప్పించుకొన్నాను"
అని ఈ మూడో సందేశకుడు చెప్పాడు. 18మూడో

---

**షెబాయీయులు** ఎడారి ప్రాంతపు ఒక జన సమూహం. వాళ్లు ప్రజలను ఎదుర్కొని వాళ్ల వస్తువులను దోచుకొనే వారు.

సందేశకుడు ఇంకా చెబుతూ ఉండగానే మరో
సందేశకుడు వచ్చాడు. "నీ పెద్ద కుమారుని యింటి
వద్ద నీ కుమారులు, కుమార్తెలు భోజనం చేస్తూ,
ద్రాక్షారసం తాగుతూ ఉండగా 19అకస్మాత్తుగా ఎడారి
నుండి ఒక బలమైన గాలి వీచి ఇంటిని పడ గొట్టేసింది.
ఆ ఇల్లు నీ కుమారులు, కుమార్తెల మీద పడగానే
వారు మరణించారు. నీతో చెప్పేందుకు నేను ఒక్కణ్ణి
మాత్రమే తప్పించుకొన్నాను" అని నాలుగో సందే
శకుడు చెప్పాడు.
20యోబు ఇది వినగానే తన విచారాన్ని, కలవరాన్ని
తెలియజేయడానికి తన బట్టలు చింపుకొని, తల
గుండు చేసుకొన్నాడు. తరువాత యోబు సాష్టాంగపడి
దేవుణ్ణి ఆరాధించాడు. 21అతడు ఇలా చెప్పాడు:

"నేను ఈ లోకంలో పుట్టినప్పుడు నేను దిగంబ
రిని, నాకు ఏమీ లేదు. నేను మరణించి లోకాన్ని
విడిచి పెట్టేటప్పుడు నేను దిగంబరినిగా
ఉంటాను. నాకు ఏమీ ఉండదు. యెహోవా
ఇచ్చాడు. యెహోవా తీసుకున్నాడు.
యెహోవా నామాన్ని స్తుతించండి!"

22ఇవన్నీ సంభవించినా కానీ యోబు మాత్రం
పాపం చేయలేదు. అతడు దేవుణ్ణి నిందించనూలేదు.

### సాతాను యోబును మరల చికాకు పెట్టటం

2 మరో రోజు దేవదూతలు* యెహోవాను కలుసు
కొనేందుకు వచ్చారు. సాతాను వారితో కూడా
ఉన్నాడు. సాతాను యెహోవాను కలుసుకొనేందుకు
వచ్చాడు. 2"ఎక్కడికి వెళ్లావు?" అని సాతానును
యెహోవా అడిగాడు. "నేను భూలోకంలో సంచారం
చేస్తూ ఉన్నాను" అని సాతాను యెహోవాకు జవాబు
ఇచ్చాడు.
3"నా సేవకుడైన యోబును నీవు గమనిస్తున్నావా?
భూమి మీద ఎవ్వరూ అతని వంటివారు లేరు. నిజంగా
అతడు మంచి మనిషి. అతడు తన దేవుడైన నన్ను
మాత్రమే ఆరాధిస్తాడు. చెడుకార్యాలకు అతడు
దూరంగా ఉంటాడు. అతనికి ఉన్నవాటన్నింటినీ నిష్కా
రణంగా నాశనం చేయమని నీవు నన్ను అడిగినప్పటికీ,
అతడు ఇంకా నమ్మకంగా ఉన్నాడు" అని సాతానుతో
యెహోవా అన్నాడు. 4"చర్మానికి చర్మం* బతికి
ఉండటానికి మనిషి తనకు ఉన్నదంతా ఇస్తాడు. 5అతని
శరీరానికి హాని చేసేందుకు నీవు నాకు అనుమతిస్తే,
అప్పుడు అతడు నీ ముఖం మీదే శపిస్తాడు!" అని
సాతాను జవాబు ఇచ్చాడు.
6"సరే, యోబు నీ అధికారం కింద ఉన్నాడు. కాని
అతనిని చంపేందుకు నీకు అనుమతి లేదు" అని
సాతానుతో యెహోవా చెప్పాడు.
7అప్పుడు సాతాను యెహోవా దగ్గర నుండి
వెళ్లిపోయి, యోబుకు బాధకరమైన పుండ్లు కలిగిం
చాడు. యోబు అరికాలు మొదలుకొని నడి నెత్తివరకు,
అతని శరీరం అంతటా బాధకరమైన పుండ్లు ఉన్నాయి.
8కనుక యోబు పెంటకుప్ప దగ్గర కూర్చున్నాడు.
అతడు తన పుండ్లను గీకుకొనేందుకు ఒక చిల్లపెంకు
ఉపయోగించాడు. 9యోబు భార్య, "ఇంకా నీవు దేవు
నికి నమ్మకంగా ఉంటావా? నీ వెందుకు దేవుణ్ణి శపించి,
చావకూడదు?" అని అతనితో అంది.
10యోబు తన భార్యతో, "నీవు తెలివి తక్కువ
స్త్రీలా మాట్లాడుతున్నావు! దేవుడు మనకు మంచి
వాటిని ఇచ్చినప్పుడు, మనం వాటిని స్వీకరిస్తున్నాం.
కనుక కష్టాల్ని కూడా మనం స్వీకరించాలి గాని ఆరోపణ
చేయకూడదు" అని జవాబిచ్చాడు. ఇవన్నీ జరిగిన
ప్పటికీ కూడా యోబు పాపం చేయలేదు. దేవునికి
విరుద్ధంగా ఏమియు మాట్లాడనూలేదు.

### ముగ్గురు స్నేహితులు యోబును చూడటానికి వచ్చారు

11తేమాను వాడైన ఎలీఫజు, షూహీవాడైన బిల్దదు,
నయమాతీవాడైన జోఫరు అనే ముగ్గురు యోబుకు
స్నేహితులు. యోబుకు సంభవించిన చెడు సంగతుల
నన్నింటిని గూర్చి ఈ ముగ్గురు స్నేహితులూ విన్నారు.
ఈ ముగ్గురు స్నేహితులూ వారి ఇండ్లు విడిచి ఒకచోట
సమావేశమయ్యారు. వారు వెళ్లి యోబుకు సానుభూతి
చూపించి, ఆదరించాలని తీర్మానించుకున్నారు. 12కాని
ఆ స్నేహితులు ముగ్గురూ యోబును దూరమునుండి
చూచి, అతడు చాలా వేరుగా కనబడటం చేత అతడు
యోబు అని సరిగ్గా గుర్తించ లేక పోయారు. వారు
గట్టిగా ఏడ్వటం మొదలు పెట్టారు. వారు తమ వస్త్రాలు
చింపుకొని, తాము విచారంగాను, కలవరంగాను
ఉన్నట్టు తెలియ చేయడానికి తమ తలల మీద
దుమ్మెత్తి పోసుకొన్నారు. 13తరువాత ఆ ముగ్గురు
స్నేహితులూ యోబుతో పాటు ఏడు రాత్రుళ్లు, ఏడు
పగళ్లు నేలమీద కూర్చున్నారు. యోబు చాలా శ్రమ
పడుతూ ఉన్న కారణంగా వారిలో ఏ ఒక్కరూ
యోబుతో ఒక్క మాట కూడా పలుకలేదు.

### యోబు తన పుట్టిన రోజును శపించుట

3 అప్పుడు యోబు తన నోరు తెరచి, తాను పుట్టిన
రోజును శపించాడు. 2-3అతడు ఇలా అన్నాడు:

"నేను పుట్టిన ఆ రోజు ఉండకుండా పోవును గాక.
'పిల్లవాడు పుట్టాడు!' అని చెప్పబడిన ఆ రాత్రి
ఉండకుండా పోవునుగాక. అది పోవునుగాక.

---

**దేవదూతలు** అక్షరాలా 'దేవుని కుమారులు.'

**చర్మానికి చర్మం** బాధ తప్పించుకోటానికి ఏదైనా చేస్తారని అర్థం.

4 ఆ రోజు చీకటి అవును గాక. ఆ రోజును దేవుడు
లక్ష్యపెట్టకుండును గాక. ఆ రోజున వెలుగు ప్రకా
శింపకుండును గాక.
5 ఆ రోజు మరణాంధకారమవును గాక. ఆ రోజును
ఒక మేఘము కప్పివేయును గాక. నేను పుట్టిన
ఆనాటి వెలుగును కారు మేఘాలు భయపెట్టి
వెళ్లగొట్టును గాక.
6 గాఢాంధకారము ఆ రాత్రిని పట్టుకొనును గాక. ఆ
రాత్రి సంవత్సరపు దినములలో ఒకటిగా ఎంచబడ
కుండును గాక. ఆ రాత్రిని ఏ నెలలో కూడ
చేర్చవద్దు.
7 ఆ రాత్రి ఎవడును జననం కాకపోవును గాక. ఆ
రాత్రి ఏ ఆనంద శబ్దం వినుపించకుండా ఉండును
గాక.
8 "శాపాలు పెట్టే మంత్రగాళ్లు నేను పుట్టిన ఆ రోజును
శపించెదరు గాక. సముద్రపు రాక్షసికి కోపం
పుట్టించుట ఎట్లో ఎరిగిన మనుష్యులు వారు.
9 ఆ నాటి వేకువ చుక్క చీకటి అవునుగాక. ఆ
రాత్రి ఉదయపు వెలుగుకోసం కనిపెట్టి ఉండును
గాక. కానీ ఆ వెలుగు ఎన్నటికీ రాకుండును గాక.
ఆ రాత్రి సూర్యోదయపు మొదటి కిరణాలు చూడ
కుండును గాక.
10 ఎందుకనగా ఆ రాత్రి, నా తల్లి గర్భద్వారాలను
మూసివేయలేదు. (అది పుట్టకుండా అరికట్టలేదు)
అది నా కన్నులనుండి కష్టాలను దాచలేదు.
11 నేను పుట్టినప్పుడే నేనెందుకు మరణించలేదు?
నా తల్లి గర్భం నుండి వచ్చేటప్పుడు నేనెందుకు
మరణించలేదు?
12 నా తల్లి ఎందుకు నన్ను తన మోకాళ్లమీద పెట్టు
కొంది? నా తల్లి స్తనములు నాకెందుకు పాలి
చ్చాయి?
13 నేను పుట్టినప్పుడే నేను మరణించి ఉంటే ఇప్పుడు
నేను ప్రశాంతంగా ఉండేవాణ్ణి.
14 భూమి మీద బతికిన రాజులు, జ్ఞానులతో బాటు
విశ్రాంతిలో ఉంటే ఎంత బాగుండును ఆ రాజులు,
జ్ఞానులచే నిర్మింపబడిన ఆ కట్టడాలు ఇప్పుడు
నాశనమై పోయాయి.
15 నేను కూడ ఆ పాలకులతో పాటు పాతిపెట్టబడి
ఉంటే ఎంత బాగుండును. వారికి బంగారం ఉంది,
వారి ఇండ్లను వెండితో నింపుకొన్నారు!
16 నేను పుట్టినప్పుడే చనిపోయి, మట్టిలో పాతి
పెట్టబడిన శిశువుగా ఎందుకు ఉండలేదు?
ఎన్నడూ వెలుగు చూడని శిశువులా నేను ఉంటే
ఎంత బాగుండును.
17 చెడ్డ మనుష్యులు సమాధిలో ఉన్నప్పుడు తొందర
కలిగించటం మానివేస్తారు. అలసిపోయిన మను
ష్యులకు సమాధిలో విశ్రాంతి లభిస్తుంది.
18 ఖైదీలు కూడా సమాధిలో సుఖంగా ఉంటారు.
కాపలాదారుల స్వరం వారు వినరు.
19 ప్రముఖ ప్రజలు, సామాన్య ప్రజలు అన్ని రకాల
ప్రజలు సమాధిలో ఉంటారు. మరియు బానిస
తన యజమాని నుండి విడుదల అవుతాడు.
20 శ్రమ పడుతూ, చాలా విచారంగా ఉన్న మనిషిని
ఇంకా బతుకుతూ ఉండనియ్యటం ఎందుకు?
ఆత్మ వేదనతో ఉన్న వానికి జీవం ఇవ్వబడటం
ఎందుకు?
21 ఆ మనిషి చావాలని కోరుకొంటాడు. కాని చావు
రాదు. విచారంలో ఉన్న ఆ మనిషి దాగి ఉన్న
ఐశ్వర్యాలకంటే మరణంకోసం ఎక్కువగా వెదకు
తాడు.
22 ఆ మనుష్యులు సమాధిని కనుగొన్నప్పుడు చాలా
సంతోషిస్తారు. వారు పాతిపెట్ట బడినప్పుడు
ఆనందిస్తారు.
23 దేవుడు వారి భవిష్యత్తును రహస్యంగా ఉంచుతాడు.
వారి చుట్టూ ఒక గోడ కడతాడు.
24 నేను భోజనం చేయను. కాని నేను దుఃఖధ్వనులు
చేస్తాను. కాని సంతోషంతో కాదు. నా ఆరోపణలు
నీళ్లలా ప్రవహిస్తున్నాయి.
25 నాకు ఏదో దారుణం జరుగుతుందేమో అని భయ
పడ్డాను. అలానే జరిగింది నాకు!
26 నాకు శాంతి లేదు. విశ్రాంతి లేదు. నాకు విశ్రాంతి
లేదు. కష్టం మాత్రమే ఉంది!"

### ఎలీఫజు మాట్లాడుతున్నాడు

4 1-2అప్పుడు తేమానువాడైన ఎలీఫజు జవాబు
ఇచ్చాడు: "నీతో ఎవరైనా మాట్లాడేందుకు
ప్రయత్నిస్తే అది నిన్ను కలవర పెడుతుందా?
నేను మాట్లాడాల్సి ఉంది!
3 "యోబూ, ఎంతో మంది మనుష్యులకు నీవు ఉప
దేశాన్ని చేసావు. బలహీన హస్తాలకు నీవు బలం
ఇచ్చావు.
4 తొట్రిల్లిన మనుష్యులకు నీ మాటలు ఆదరణ
కలిగించాయి. బలహీనమైన మోకాళ్లను నీవు బల
పరిచావు.
5 కాని ఇప్పుడు నీకు కష్టం వస్తే నీవు అధైర్య
పడుతున్నావు. కష్టం నిన్ను దెబ్బతీస్తే నీవు తల్లడిల్లి
పోయావు!
6 నీవు దేవున్ని ఆరాధిస్తూ ఆయన పట్ల నమ్మకంగా
ఉన్నావు. కనుక నీవు నీ విశ్వాస్యతను నమ్ము
కోవాలి. నీవు నిర్దోషివి కనుక అదే నీకు నిరీక్షణగా
ఉండును గాక.
7 "యోబూ, ఇప్పుడు దీనిని గూర్చి ఆలోచించు
నిర్దోషియైన మనిషి ఎవ్వరూ, ఎన్నడూ నాశనం

చేయబడలేదు. మంచి మనుష్యులు ఎన్నడూ
నాశనం చేయబడలేదు.
8 కీడు, కష్టం ప్రారంభించే మనుష్యులను నేను
గమనించాను. వారికి కూడా అవే సంభవిస్తాయి.
9 దేవుని శ్వాస ఆ మనుష్యులను చంపేస్తుంది. దేవుని
కోపం వారిని నాశనం చేస్తుంది.
10 దుర్మార్గులు సింహాలవలె గర్జించి గుర్రు పెడతారు.
కాని దేవుడు దుర్మార్గులను నోరు మూయిస్తాడు.
మరియు దేవుడు వారి పళ్లు విరుగగొడతాడు.
11 దుర్మార్గులు తినుటకు ఏమీ లేని సింహాలవలె
ఉంటారు. వారు చస్తారు, వారి పిల్లలు చెదరి
పోతారు."
12 "రహస్యంగా నాకు ఒక సందేశం అందించబడింది.
ఆ గుసగుసలు నా చెవులు విన్నాయి.
13 రాత్రివేళ వచ్చే ఒక చెడ్డ కలలా అది నా నిద్రను
భంగం చేసింది.
14 నేను భయపడి వణకిపోయాను. నా ఎముకలన్నీ
వణకిపోయాయి!
15 ఒక ఆత్మ నా ముఖాన్ని దాటిపోగా నా శరీరం
మీది వెంట్రుకలు వేగంగా చలించాయి!
16 ఆత్మ ఇంకా నిలిచి ఉంది. కాని అదేమిటో నేను
చూడలేకపోయాను. ఒక ఆకారం నా కళ్ల ఎదుట
నిలిచింది. నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు నేను ఒక
మెల్లని స్వరం చెప్పడం విన్నాను.
17 'ఒక మనిషి దేవుని కంటే ఎక్కువ (నీతిమంతుడు)గా
ఉండలేడు. మనిషి తనను చేసిన వానికంటే ఎక్కువ
పరిశుద్ధంగా ఉండలేడు.
18 దేవుడు తన పరలోకపు సేవకులను కూడా
నమ్మలేడు. తన దేవదూతల విషయంలో కూడా
దేవుడు తప్పులు పట్టుకోగలడు
19 కనుక దేవుడు మనుష్యుల విషయంలో మరి
ఎక్కువ తప్పులు పట్టుకోగలడు. మనుష్యులు
మట్టి ఇండ్లలో* నివసిస్తారు. ఈ మట్టి ఇండ్ల
పునాదులు మట్టిలో ఉన్నాయి. వారు చిమ్మెట
కంటే తేలికగా చావగొట్టబడతారు.
20 సూర్యోదయం, సూర్యాస్తమయం మధ్య ఈ మను
ష్యులు మరణిస్తారు, వారిని ఎవ్వరూ గుర్తించరు.
వారు శాశ్వతంగా నశించిపోతారు.
21 వారి గుడారాల తాళ్లు లాగివేయబడతాయి, ఈ
మనుష్యులు బుద్ధిలేకుండా చస్తారు.'

5 "యోబూ, నీవు కావాలంటే గట్టిగా పిలువు. కాని
నీకు ఎవ్వరూ జవాబు ఇవ్వరు! నీవు ఏ
దేవదూతల తట్టూ తిరుగలేవు!
2 తెలివి తక్కువ మనిషి యొక్క కోపం వానినే
చంపివేస్తుంది. బుద్ధిహీనుని అసూయ వానినే
చంపివేస్తుంది.
3 బాగా వేరూనుకొని, వృద్ధిపొందుతున్న ఒక బుద్ధి
హీనుణ్ణి చూశాను. (అతను బలంగా, క్షేమంగా ఉన్నా
ననుకొన్నాడు). అయితే అకస్మాత్తుగా వాని ఇల్లు
శపించబడింది.
4 ఆ బుద్ధిహీనుని పిల్లలు క్షేమంగా లేరు. (న్యాయ
స్థానంలో) వారిని ఆదుకొనేందుకు నగరద్వారం
వద్ద ఎవ్వరూలేరు.
5 ఆ బుద్ధిహీనుని పంటలను ఆకలిగొన్న ప్రజలు
తీసుకొంటారు. ఆకలిగొన్న ఆ మనుష్యులు
ముండ్లలో పెరుగుతున్న ధాన్యపు గింజలను కూడా
తీసుకొంటారు. ఆశగలవారు అతని ఐశ్వర్యాన్ని
తీసుకొంటారు.
6 చెడ్డ కాలాలు మట్టిలోనుండి రావు. కష్టం నేలలో
నుండి పెరగదు.
7 నిప్పులో నుండి రవ్వలు పైకి లేచినంత నిశ్చ
యంగా మనిషి కష్టం కోసమే పుట్టాడు.
8 "కాని యోబూ, నేనే గనుక నీవైతే నేను దేవుని
తట్టు తిరిగి నా సమస్య ఆయనతో చెబుతాను.
9 దేవుడు చేసే ఆశ్చర్యకరమైన వాటిని మనుష్యు
లెవ్వరు గ్రహించలేరు. దేవుడు చేసే అద్భుతాలకు
అంతం లేదు.
10 దేవుడు భూమి మీద వర్షం కురిపిస్తాడు. ఆయన
పొలాలకు నీళ్లు పంపిస్తాడు.
11 దీనుడైన మనిషిని దేవుడు లేవనెత్తుతాడు.
దుఃఖంలో ఉన్న వ్యక్తిని ఆయన చాలా సంతోష
పరుస్తాడు.
12 తెలివిగల దుర్మార్గులకు విజయం కలుగకుండా
దేవుడు వారి పథకాలను నివారిస్తాడు.
13 దేవుడు తెలివిగల మనుష్యులను వారి కుయుక్తి
పథకాల్లోనే పట్టేస్తాడు. అందుచేత తెలివిగల మనిషి
యొక్క పథకాలు విజయవంతం కావు.
14 పగటివేళ సైతం ఆ తెలివిగల మనుష్యులు చీక
టిలో వలె తడబడుతారు. మధ్యాహ్నపు వేళల్లో
సైతం రాత్రిపూటలా తడువులాడుతారు.
15 దేవుడు పేద ప్రజలను మరణం నుండి రక్షిస్తాడు.
బలవంతుల హస్తాలనుండి పేదలను ఆయనే
రక్షిస్తాడు.
16 కనుక పేద ప్రజలకు నిరీక్షణ ఉంది. న్యాయంగా
లేని దుర్మార్గులను దేవుడు నాశనం చేస్తాడు.
17 "దేవుడు సరిదిద్దే మనిషి సంతోషంగా ఉంటాడు.
కనుక సర్వశక్తిమంతుడైన దేవుడు నిన్ను శిక్షించి
నప్పుడు, దానిని తోసిపుచ్చకు.
18 దేవుడు చేసిన గాయాలకు ఆయన కట్లు కడతాడు.
ఆయనే గాయపరుస్తాడు, కాని ఆయన చేతులే
తిరిగి స్వస్థపరుస్తాయి.

---

**మట్టి ఇండ్లు** మానవ శరీరం.

19 ఆరు కష్టాలనుండి ఆయన నిన్ను రక్షిస్తాడు;
అవును, ఏడు కష్టాల్లో కూడా నీవు బాధించబడవు.
20 కరువు వచ్చినప్పుడు దేవుడు నిన్ను మరణం
నుండి రక్షిస్తాడు. యుద్ధంలో దేవుడు నిన్ను
మరణం నుండి కాపాడుతాడు.
21 మనుష్యులు వాడిగల తమ నాలుకలతో నిన్ను
గూర్చి చెడుగా మాట్లాడినప్పుడు దేవుడు నిన్ను
రక్షిస్తాడు. నాశనం వచ్చినప్పుడు నీవు భయ
పడాల్సిన పనిలేదు.
22 నాశనం, కరువును చూసి నీవు నవ్వుతావు. అడవి
జంతువులను చూసి నీవు భయపడాల్సిన అవసరం
లేదు.
23* నీ ఒడంబడిక దేవునితో ఉంది కనుక నీవు
దున్నే పొలాల్లో బండలు ఉండవు. మరియు అడవి
మృగాలు ఎన్నటికీ నీ మీద పడవు.
24 నీ గుడారం క్షేమంగా ఉంది గనుక నీవు శాంతంగా
జీవిస్తావు. నీవు నీ ఆస్తి లెక్కించగా ఏదీ పోయి
ఉండదు.
25 నీకు చాలామంది పిల్లలు ఉంటారు. నేలమీద గడ్డి
పరకల్లా నీ పిల్లలు చాలామంది ఉంటారు.
26 కోతకాలం వరకు సరిగ్గా పెరిగే గోధుమలా నీవు
ఉంటావు. అవును, నీవు పక్వమయిన వృద్ధాప్యం
వరకు జీవిస్తావు.
27 "యోబూ, ఈ విషయాలు మేము పరిశీలించాం.
అవి సత్యమైనవని మాకు తెలుసు. అందుచేత
యోబూ, మేము చెప్పు సంగతులను విని, నీ
మట్టుకు నీవే వాటిని తెలుసుకో."

### ఎలీఫజుకు యోబు జవాబిచ్చుట

6 1-2అప్పుడు యోబు ఇలా జవాబిచ్చాడు:
"నా శ్రమే గనుక తూచబడితే, నా కష్టం అంతా
త్రాసులో ఉంచబడితే,
3 సముద్రాల ఇసుక కంటె నా దుఃఖం ఎక్కువ
బరువయిందని నీవు గ్రహిస్తావు! అందుకే నా
మాటలు వెర్రిగా కనిపిస్తాయి.
4 సర్వశక్తిమంతుడైన దేవుని బాణాలు నాలో
ఉన్నాయి. ఈ బాణాల విషం నా ఆత్మ తాగు
తుంది. దేవుని దారుణ విషయాలు అన్నీ కలిపి
నాకు విరోధంగా ఉంచబడ్డాయి.
5 (ఏ చెడుగూ జరగనప్పుడు మాటలాడడం
సులభం) అడవి గాడిద తినేందుకు గడ్డి ఉంటే
అదేమి గొడవ చెయ్యదు. ఆవుకు ఆహారం ఉంటే
అది ఆరోపణ చెయ్యదు.
6 రుచిలేని భోజనం ఉప్పు లేకుండా తినగలమా?
గ్రుడ్డులోని తెల్లసొన రుచిలేనిది.
7 (ఇప్పుడు నీ మాటలు వీటివలెనే ఉన్నాయి) దానిని
నేను ముట్టుకో వటానికి గూడా ఒప్పుకోను;
అలాంటి భోజనం నన్ను జబ్బు మనిషిలా
చేస్తుంది.

8 "నేను అడిగింది నాకు దొరకాలని కోరుకుంటాను.
నేను దేనికోసం కనిపెట్టుకొని ఉంటానో, దాన్ని
దేవుడు నాకు ఇవ్వాలని కోరుకుంటాను.
9 దేవుడు నన్ను చితకగొట్టేందుకు ఇష్టపడి, నన్ను
చంపివేస్తాడని నేను నిరీక్షిస్తున్నాను!
10 ఆయన నన్ను చంపివేస్తే, ఒక్క విషయంలో నేను
ఆదరణ పొందుతాను. ఎడతెగని నా బాధల్లోనే
నేను ఒక్క విషయంలో సంతోషిస్తాను. పరిశుద్ధుని
ఆదేశాలకు విధేయత చూపేందుకు నేను తిరస్క
రించలేదు.
11 "నా బలం క్షీణించిపోయింది, గనుక నేను ఇంకా
బతుకుతాను అనే ఆశాకిరణం నాకు లేదు. చివరికి
నాకు ఏమి జరుగుతుందో నాకు తెలియదు.
అందుచేత నేను సహనంగా ఉండాల్సిన కారణం
ఏమీ లేదు.
12 బండలాంటి బలం నాకు లేదు. నా శరీరం కంచుతో
చేయబడలేదు.
13 ఇప్పుడు నాకు నేను సహాయం చేసుకొనే శక్తి
నాకు లేదు. ఎందుకంటే విజయం నా వద్దనుండి
తొలగించి వేయబడింది.
14 "ఒక మనిషి కష్టాల్లో ఉంటే, అతని స్నేహితులు
అతని మీద దయ చూపాలి. ఒక మనిషి, తన
స్నేహితుడు సర్వశక్తిమంతుడైన దేవుని నుండి
దూరంగా పోయినా సరే అతడు ఆ స్నేహితునికి
నమ్మకంగా ఉండాలి.
15 కానీ, నా సోదరులారా, మీరు నమ్మకస్థులు కారు.
నేను మీ మీద ఆధారపడలేదు. ఒక్కొక్కప్పుడు
ప్రవహించి, ఒక్కొక్కప్పుడు నిలిచిపోయే కాలు
వల్లా ఉన్నారు మీరు.
16 మంచు గడ్డలు కరిగిపోయే హిమం అడ్డుకొన్న
ప్పుడు పొంగి ప్రవహించే కాలువల్లా ఉన్నారు మీరు.
17 కానీ ఆ కాలువలు ఎండిపోయిన వేళ ప్రవహించవు.
వేడిగాలి వీచినప్పుడు నీళ్లు ఉండవు. కాలువలు
ప్రవహించవు.
18 వ్యాపారస్థుల బృందాలు వారి మార్గాలలోని
మలుపులు కొసలు తిరిగి పనికిమాలిన నేల మీదకు
వెళ్లి అక్కడ మరణిస్తారు.
19 తేమా వర్తక బృందాలు నీళ్లకోసం వెదుకుతారు.
షేబా ప్రయాణీకులు ఆశగా (నీళ్ల కోసం)
చూస్తారు.

---

**23వ వచనం హీబ్రూలో** పొలాలలోవున్న రాళ్లతో ఒక నిబంధనను ఏర్పరచుకొంటావు. మరియు జంతువులు నీతో శాంతియుతంగా ఉంటాయి.

20 నీళ్లు దొరుకునని వారు గట్టిగా నమ్మారు. కానీ
ఈసారి వారు అక్కడికి రాగానే నిరాశ చెందారు.
21 ఇప్పుడు మీరూ ఆ కాలువల్లా ఉన్నారు. మీరు
సహాయం చేయరు. మీరు నా కష్టాలు చూచి
భయపడుతున్నారు.
22 నాకు ఏమైనా ఇవ్వండి, మీ ఐశ్వర్యంలోనుండి
నాకు ధనం ఇవ్వండి అని నేను ఎన్నడూ చెప్ప
లేదు.
23 'శత్రువు బలంనుండి నన్ను రక్షించండి. మూర్ఖు
లైన వారి నుండి నన్ను రక్షించండి' అని నేను
ఎన్నడూ చెప్పలేదు.
24 కనుక, ఇప్పుడు నాకు నేర్పించండి. నేను నెమ్మ
దిగా ఉంటాను. నేను ఏమి తప్పు చేశానో నాకు
చూపించండి.
25 నిజాయితీ మాటలు శక్తి గలవి. కానీ మీ వాదాలు
దేనినీ రుజువు చేయవు.
26 నేను చెప్పే వాటిని మీరు విమర్శిస్తారా? మరింత
నిరుత్సాహం కలిగించే మాటలు పలుకుతారా?
27 అవును, తండ్రులు లేని పిల్లలకు చెందిన వాటిని
సంపాదించటం కోసం మీరు జూదమైనా సరే
ఆడతారు. మీరు మీ స్నేహితుణ్ణి అమ్ముకొంటారు.
28 కానీ, ఇప్పుడు దయచేసి నా ముఖం పరిశీలించండి.
నేను మీతో అబద్ధం చెప్పను.
29 కనుక ఇప్పుడు మీ మనసు మార్చుకోండి. అన్యా
యంగా ఉండవద్దు. అవును, మళ్లీ ఆలోచించండి.
నేను తప్పు ఏమీ చేయలేదు.
30 నేను అబద్ధం చెప్పటం లేదు. నా మాటల్లో చెడు
ఏమీ లేదు. తప్పు, ఒప్పు నాకు తెలుసు."

7 యోబు చెప్పాడు,
"మనిషికి భూమి మీద కష్టతరమైన సంఘర్షణ
ఉంది. అతని జీవితం రోజు కూలివానిదిలా ఉంది.
2 ఒక ఎండ రోజున కష్టపడి పనిచేసిన తర్వాత
చల్లటి నీడ కావాల్సిన బానిసలా ఉన్నాడు మనిషి.
జీతంరోజు కోసం ఎదురు చూసే కూలివానిలా
ఉన్నాడు మనిషి.
3 అదే విధంగా నాకూ నెల తర్వాత నెల ఇవ్వబడు
తోంది. ఆ నెలలు శూన్యంతో, విసుగుతో నిండి
పోయి ఉంటాయి. శ్రమ రాత్రుళ్లు ఒకదాని వెంట
ఒకటి నాకు ఇవ్వబడ్డాయి.
4 నేను పండుకొన్నప్పుడు, ఆలోచిస్తాను, 'నేను
లేచేందుకు ఇంకా ఎంత సమయం ఉంది?' అనే
రాత్రి జరుగుతూనే ఉంటుంది. సూర్యుడు వచ్చేం
తవరకు నేను అటూ యిటూ దొర్లుతూనే
ఉంటాను.
5 నా శరీరం పురుగులతోనూ, మురికితోనూ కప్ప
బడింది. నా చర్మం పగిలిపోయి, రసి కారుతూన్న
పుండ్లతో నిండిపోయింది.
6 "నేతగాని నాడెకంటె తొందరగా నా దినాలు గతి
స్తున్నాయి. నిరీక్షణ లేకుండా నా జీవితం అంతం
అవుతుంది.
7 దేవా, నా జీవితం కేవలం ఒక ఊపిరి మాత్రమే
అని జ్ఞాపకం చేసుకో. నా కళ్లు మంచిదానిని దేనినీ
మరల చూడవు.
8 నీవు నన్ను ఇప్పుడు చూస్తావు. కానీ నన్ను మరల
చూడవు. నీవు నాకోసం చూస్తావు. కాని నేను
చనిపోయి వుంటాను.
9 ఒక మేఘం కనబడకుండ మాయమవుతుంది. అదే
విధంగా మరణించిన ఒక మనిషి సమాధిలో పాతి
పెట్టబడతాడు. మరల తిరిగిరాడు.
10 అతడు తన ఇంటికి ఎన్నటికీ తిరిగిరాడు. అతని
స్థలం అతన్ని ఇంకెంత మాత్రం గుర్తించదు.
11 అందుచేత నేను మౌనంగా ఉండను. నేను గట్టిగా
మాట్లాడతాను. నా ఆత్మ శ్రమ పడుతోంది. నా
ఆత్మ వేదనపడుతోంది గనుక నేను ఆరోపణ
చేస్తాను.
12 ఓ దేవా, నీ వెందుకు నాకు కాపలా కాస్తున్నావు?
నేను ఏమైనా సముద్రాన్నా, లేక సముద్ర
రాక్షసినా?
13 నా పడక నాకు విశ్రాంతి నివ్వాలి నా మంచం
నాకు విశ్రాంతి, విరామాన్ని ఇవ్వాలి
14 కాని, దేవా! నీవు నన్ను కలలతో భయపెడుతు
న్నావు. దర్శనాలతో నన్ను భయపెడుతున్నావు.
15 అందుచేత బతకటం కంటె గొంతు నులుమి చంప
బడటం నాకు మేలు.
16 నా బదుకు నాకు అసహ్యం. నేను శాశ్వతంగా
జీవించాలని కోరను నన్ను ఒంటరిగా ఉండనివ్వు.
నా జీవితానికి అర్థం శూన్యం.
17 దేవా, ఎందుకు మనిషి అంటే నీకు ఇంత ముఖ్యం?
నీవు అతనిని ఎందుకు గౌరవించాలి? మనిషికి
నీవసలు గుర్తింపు ఎందుకు ఇవ్వాలి?
18 నీవు ప్రతి ఉదయం మనిషిని ఎందుకు దర్శిస్తావు,
ప్రతిక్షణం ఎందుకు పరీక్షిస్తావు?
19 దేవా, నీవు ఎన్నడూ నన్ను విడిచి అవతలకు
ఎందుకు చూడవు? ఒక క్షణమైన నీవు నన్ను,
ఒంటరిగా ఉండనియ్యవు?
20 మనుష్యులను గమనించువాడా, నేను పాపం చేశా
నంటావా, సరే మరి, నన్నేం చేయమంటావు?
దేవా, గురిపెట్టేందుకు ప్రయోగంగా నీవు నన్నెం
దుకు ఉపయోగించావు? నేను నీకు ఒక భారమై
పోయానా?
21 నీవు నా తప్పిదాలు క్షమించి, నా పాపాలను
ఎందుకు క్షమించకూడదు? త్వరలోనే నేను చచ్చి
సమాధిలో ఉంటాను. అప్పుడు నీవు నాకోసం
వెదకుతావు. నేను పోయి ఉంటాను."

## బిల్దదు యోబుతో మాట్లాడటం

8 అప్పుడు షూహీ వాడైన బిల్దదు జవాబిచ్చాడు:
2 "ఎన్నాళ్ల వరకు నీవు అలా మాట్లాడతావు? నీ
మాటలు బలంగా వీచే గాలిలా ఉన్నాయి.
3 దేవుడు ఎల్లప్పుడూ న్యాయంగా ఉంటాడు. సక్ర
మంగా ఉన్నవాటిని, న్యాయాన్ని లేక నీతిని, సర్వ
శక్తిమంతుడైన దేవుడు ఎన్నటికీ చెరపడు.
4 నీ పిల్లలు దేవునికి వ్యతిరేకంగా పాపం చేసి ఉంటే,
ఆయన వారిని శిక్షించాడు. వారు వారి పాపాలకు
వెల చెల్లించారు.
5 అయితే యోబూ, ఇప్పుడు దేవుని వైపు చూడు.
ఆ సర్వశక్తిమంతునికి ప్రార్థించు.
6 నీవు పరిశుద్ధంగా, మంచివానిగా ఉంటే ఆయన
వచ్చి నీకు సహాయం చేస్తాడు. మరియు నీ కుటుం
బాన్ని, నీ వస్తువులను ఆయన తిరిగి నీకు ఇస్తాడు.
7 నీకు మొదట ఉన్నదానికంటె ఎక్కువగా వస్తుంది.
8 "వబూ వృద్ధులను అడిగి వారుతమ పూర్వీకుల
నుండి ఏమి నేర్చుకొన్నారో తెలుసుకో.
9 ఎందుకంటే మనం నిన్ననే జన్మించినట్టు
ఉంటుంది గనుక. మనకు ఏమీ తెలియదు. భూమి
మీద మన జీవితాలు, ఒక నీడలా ఉన్నవి.
10 చాలాకాలం క్రిందట జీవించిన మనుష్యులు నీకు
నేర్పిస్తారు. వారి అవగాహనతో వారు నీకు ఒక
జ్ఞాన సందేశం ఇస్తారు."
11 బిల్దదు చెప్పాడు, "ఎండిన నేలమీద జమ్ము ఎత్తుగా
పెరుగుతుందా? నీళ్లు లేకుండా రెల్లు పెరుగు
తుందా?
12 లేదు, నీళ్లు గనుక ఎండిపోతే అవి వెంటనే ఎండి
పోతాయి. వాటిని కోసి, ఉపయోగించలేనంత
చిన్నవిగా అవి ఉంటాయి.
13 దేవుణ్ణి మరచిపోయే ఏ మనిషైనా సరే ఆ రెల్లు
లాగానే ఉంటాడు. దేవుణ్ణి మరచిపోయే మనిషికి
భవిష్యత్తు ఉండదు.
14 ఆ మనిషి నమ్మకం బలహీనంగా ఉంటుంది. ఆ
మనిషి నమ్మకం సాలెగూడును పోలివుంటుంది.
15 ఆ మనిషి సాలెగూటిమీద ఆనుకోగా ఆ గూడు
తెగిపోతుంది. అతడు సాలెగూటిని పట్టుకొని
ఉంటాడు కాని అది అతనికి ఆధారాన్ని ఇవ్వదు.
16 సమృద్ధిగా నీళ్లు, సమృద్ధిగా సూర్యరశ్మి ఉన్న
మొక్కల్లా అతడు ఉంటాడు. ఆ మొక్క కొమ్మలు
తోట అంతటా వ్యాపిస్తాయి.
17 అది దాని వేళ్లను బండల చుట్టూరా అల్లి ఆ
బండల్లో ఎదిగేందుకు చోటుకోసం చూస్తూ
ఉంటుంది.
18 కాని మొక్క దాని చోటునుండి పెరికివేయబడి
నప్పుడు అది అక్కడే ఉండేదని ఎవరికీ తెలియదు.
'నేను ఇంతకు ముందు ఎన్నడూ నిన్ను చూడ
లేదు' అని ఆ తోట అంటుంది.
19 కనుక ఆ మొక్కకు ఉన్న సంతోషం అంతా అంతే.
తర్వాత బురదలోనుంచి ఇతర మొక్కలు పెరుగు
తాయి.
20 నిర్దోషియైన మనిషిని దేవుడు విడువడు. చెడ్డ
మనుష్యులకు ఆయన సహాయం చేయడు.
21 అప్పటికీ దేవుడు నీ నోటిని నవ్వుతోను, నీ
పెదవులను సంతోష ధ్వనులతోను నింపుతాడు.
22 కానీ నీ శత్రువులను దేవుడు సిగ్గుపరుస్తాడు. దుష్టుల
గృహాలను ఆయన నాశనం చేస్తాడు.

## బిల్దదుకు యోబు జవాబు

9 అప్పుడు యోబు ఇలా జవాబిచ్చాడు:
2 "అవును, నీవు చెప్పేది సత్యమే అని నాకు
తెలుసు. అయితే మానవుడు దేవుని దృష్టిలో
ఎలా నిర్దోషిగా ఉండగలడు?
3 ఒక మనిషి దేవునితో వాదించలేడు. దేవుడు వెయ్యి
ప్రశ్నలు అడుగవచ్చు. కానీ ఒక్కదానికి కూడా ఏ
మనిషీ జవాబు యివ్వలేడు.
4 దేవుని జ్ఞానం లోతైనది, ఆయన శక్తి గొప్పది.
దేవునితో పోరాడిన ఏ మనిషీ బాధపడకుండా
తప్పించుకోలేడు.
5 దేవుడు పర్వతాలను కదిలిస్తాడు. కాని వాటికి తెలి
యదు. ఆయనకు కోపం వచ్చినప్పుడు పర్వతా
లను తలక్రిందులు చేస్తాడు.
6 భూమిని కంపింప చేయటానికి దేవుడు భూకంపా
లను పంపిస్తాడు. భూమి పునాదులను దేవుడు
కంపింపజేస్తాడు.
7 దేవుడు సూర్యునితో మాట్లాడి దానిని ఉదయిం
చకుండా చేయగలడు. ప్రకాశించకుండా, నక్షత్రా
లకు ఆయన తాళం వేసి పెట్టగలడు.
8 దేవుడే ఆకాశాలను చేశాడు. మహాసముద్ర తరంగాల
మీద ఆయన నడుస్తాడు.
9 స్వాతి, మృగశీర్షము, కృత్తిక అనేవాటిని చేసినవాడు
ఆయనే. దక్షిణ ఆకాశాన్ని దాటిపోయే గ్రహాలను
ఆయన చేశాడు.
10 మనుష్యులు గ్రహించలేని ఆశ్చర్యకర కార్యాలను
దేవుడు చేస్తాడు. దేవుని మహా అద్భుతాలకు
అంతం లేదు.
11 దేవుడు నన్ను దాటి వెళ్లేటప్పుడు నేను ఆయనను
చూడలేను. దేవుడు పక్కగా వెళ్లేటప్పుడు ఆయన
గొప్పతనాన్ని నేను గ్రహించలేను.
12 దేవుడు దేనినైనా తీసివేస్తే, ఏ ఒక్కరూ ఆయన్ని
వారించలేరు. 'ఏమిటి నీవు చేస్తున్నది?' అని
ఎవ్వరూ ఆయనతో అనలేరు.

13 దేవుడు తన కోపాన్ని తగ్గించుకోడు. రాహాబు
సహాయకులకు కూడా దేవుడంటే భయం."
14 యోబు ఇంకా ఇలా చెప్పాడు: "కనుక నేను
దేవునితో వాదించలేను. ఆయనతో వాదించేం
దుకు నేను వాడాల్సిన మాటలు నాకు తెలియవు.
15 యోబు అనే నేను నిర్దోషిని. కానీ ఆయనకు
నేను జవాబు ఇవ్వలేను. నా న్యాయమూర్తిని
(దేవుని) ప్రాధేయపడడం మాత్రమే నేను చేయ
గలిగింది అంతా.
16 ఒకవేళ నేను ఆయనకు మొరపెట్టినా, ఆయన
జవాబిచ్చినా, దేవుడు నా ప్రార్థన విన్నాడని నేను
నమ్మను.
17 నన్ను అణచివేయటానికి దేవుడు తుఫానులు పంపి
స్తాడు. ఏ కారణం లేకుండానే ఆయన నాకు
ఇంకా ఎక్కువ గాయాలు కలిగిస్తాడు.
18 దేవుడు నన్ను మళ్లీ శ్వాస పీల్చనీయడు. ఆయన
నన్ను ఇంకా ఎక్కువ కష్టపెడతాడు.
19 నేను దేవుణ్ణి ఓడించలేను. దేవుడు శక్తిమంతుడు.
దేవుని న్యాయస్థానానికి వెళ్లి నాకు న్యాయం చేకూ
ర్చేటట్టు నేను చేయలేను. దేవుణ్ణి న్యాయస్థానానికి
రమ్మని ఆయనను ఎవరు బలవంతం చేస్తారు?
20 యోబు అనే నేను నిర్దోషిని, కాని నేను చెప్పే
మాటలు నేను దోషిలా కనబడేటట్టు చేస్తాయి.
కనుక, నేను నిర్దోషిని, కాని నా నోరు నేను దోషిని
అని ప్రకటిస్తుంది.
21 నేను నిర్దోషిని, కాని నన్ను గూర్చి నేను లక్ష్య
పెట్టను. నా సొంత జీవితం నాకు అసహ్యం.
22 జీవితం ఎప్పుడూ ఒకేలా ఉంటుంది. కనుక
'దేవుడు నిర్దోషులను, దుర్మార్గులను కూడా
నాశనం చేస్తాడు' అని నేను తలస్తాను.
23 ఏదో ఒక దారుణం జరిగి ఒక నిర్దోషి అకస్మాత్తుగా
చనిపోయినప్పుడు అతని శ్రమను చూసి దేవుడు
నవ్వుతాడు.
24 భూమిని దుర్మార్గుడు చేజిక్కించుకున్నప్పుడు
దేవుడు న్యాయమూర్తులను గుడ్డివాళ్లను చేస్తాడా?
ఇది దేవుడు చేయకపోతే ఇంకెవరు చేశారు?
25 "పరుగెత్తేవాని కంటె వేగంగా నా రోజులు గడిచి
పోయాయి. నా రోజులు ఎగిరిపోతున్నాయి,
వాటిలో సంతోషం లేదు.
26 జమ్ము పడవలు పోయేలా నా రోజులు వేగంగా
పోతున్నాయి. పక్షిరాజులు తాము పట్టుకొన్న
జంతువుల మీదికి దూసుకు వచ్చినట్లుగా నా
రోజులు వేగంగా గడిచి పోతున్నాయి.

27 "నేను ఆరోపణలు చేయను, నేను నా బాధ
మరచిపోతాను, నా ముఖం మార్చుకొని, నవ్వుతూ
ఉంటాను' అని ఒక వేళ నేను చెప్పినా,
28 నాకు నా శ్రమ అంతటిని గూర్చి ఇంకా భయమే.
ఎందుకంటే నేను దోషిని అని దేవుడు ఇంకా
చెబుతున్నాడని నాకు తెలుసు గనుక.
29 నేను దోషిని అని ఇది వరకే తీర్పు తీర్చబడింది.
కనుక నేను ఇంకా ఎందుకు ప్రయత్నిస్తూ ఉండాలి.
పోనీ దానిని, 'మర్చిపో' అని అంటాను నేను.
30 మంచుతో నన్ను నేను కడుగుకొన్నా, సబ్బుతో
నేను నా చేతులు కడుగుకొన్నా
31 దేవుడు నన్ను చావు గోతిలో* పడవేస్తాడు.
అప్పుడు నా వస్త్రాలే నన్ను ద్వేషిస్తాయి.
32 దేవుడు నాలా మనిషి కాడు. అందుకే నేను ఆయ
నకు జవాబు ఇవ్వలేను. న్యాయస్థానంలో మేము
ఒకరి నొకరం కలుసుకోలేం.
33 మాకు మధ్య నిలబడేందుకు ఎవరైనా ఉంటే
బాగుండును. మా ఇద్దరికీ న్యాయంగా తీర్పు
తీర్చేవారు ఎవరైనా ఉంటే బాగుండును.
34 దేవుని శిక్షా దండాన్ని తీసువేసుకొనే వారు ఎవరైనా
ఉంటే బాగుండును. అప్పుడు దేవుడు నన్ను
ఇంకెంత మాత్రము భయపెట్టడు.
35 అప్పుడు నేను దేవునికి భయపడకుండా నేను
చెప్పదలచుకొన్నది చెప్పగలుగుతాను. కానీ
ఇప్పుడు నేను అలా చేయలేను.

10 "నా స్వంత జీవితం నాకు అసహ్యం. అందు
చేత నేను స్వేచ్ఛగా ఆరోపణలు చేస్తాను.
నా ఆత్మ చాలా వేదనగా ఉంది కనుక ఇప్పుడు
నేను మాట్లాడతాను.
2 నేను దేవునితో చెబుతాను, 'నన్ను నిందించవద్దు.
నేను ఏమి తప్పు చేశాను, నాకు చెప్పు. నా మీద
నీకు ఎందుకు విరోధం?
3 దేవా, నీవు నన్ను ఇలా చులకనగా చూడటం
నీకు సంతోషమా? చూస్తుంటే, నీవు చేసిన దాని
గూర్చి నీకు శ్రద్ధ లేనట్లుంది. దుర్మార్గులు వేసే
పథకాలకు నీవు సంతోషిస్తున్నావా?
4 దేవా, నీకు మానవ నేత్రాలు ఉన్నాయా? మను
ష్యులు చూసినట్టుగా నీవు సంగతులు చూస్తు
న్నావా?
5 మా రోజుల్లాగ మీవి కొద్దిపాటి రోజులా? మా
సంవత్సరాల్లా మీవి కొన్ని సంవత్సరాలేనా?
6 నీవు నా తప్పుకోసం చూస్తూ నాపాపం కోసం
వెదకుతున్నావు.
7 కానీ నేను నిర్దోషిని అని నీకు తెలుసు. అయితే
నీ శక్తినుండి నన్ను ఎవ్వరూ రక్షించలేరు!
8 దేవా, నీ చేతులు నన్ను చేశాయి, నా శరీరాన్ని
తీర్చిదిద్దాయి. కానీ ఇప్పుడు నీవే నన్ను నాశనం
చేస్తున్నావు.

---

**చావు గోతి** అక్షరాల గోరి.

9 దేవా, నీవు నన్ను మట్టిలా చేసావని జ్ఞాపకం
చేసుకో. కానీ, నీవు ఇప్పుడు నన్ను మరల మట్టిగా
ఎందుకు మారుస్తున్నావు?
10 పాలు ఒలుకబోసినట్టుగా నీవు నన్ను పోస్తున్నావు.
నన్ను వెన్న చిలకరించినట్లుగా చేస్తున్నావు.
11 ఎముకల్ని, మాంసాన్ని ఒకటిగా కలిపి నీవు నన్ను
చేశావు. తర్వాత చర్మంతో, మాంసంతో నీవు
నన్ను కప్పివేశావు.
12 నీవు నాకు జీవం ఇచ్చావు. నాకు చాలా దయ
చూపించావు. నా విషయమై నీవు శ్రద్ధ చూపిం
చావు. నా ఆత్మను కాపాడావు.
13 కానీ నీవు నీ హృదయంలో దాచుకొన్నది ఇది. నీ
హృదయంలో నీవు రహస్యంగా తలపెట్టింది ఇదేనని
నాకు తెలుసు. అవును, నీ మనసులో ఉన్నది
ఇదేనని నాకు తెలుసు.
14 ఒకవేళ నేను పాపం చేస్తే, నేను చేసిన తప్పుకు
నన్ను శిక్షించవచ్చునని నీవు నన్ను గమనిస్తూ
ఉంటావు.
15 నేను పాపం చేసినప్పుడు, నేను దోషిని. అది
నాకు చాలా చెడు అవుతుంది. కానీ నేను నిర్దోషిని
అయినా సరే, నేను నా తల ఎత్తుకోలేను. ఎందు
కంటే, నేను సిగ్గుతో, బాధతో నిండిపోయాను
గనుక.
16 ఒకవేళ నాకు జయం కలిగి నేను అతిశయిస్తోంటే
ఒకడు సింహాన్ని వేటాడినట్టు నీవు నన్ను వేటాడు
తావు. నీవు మరోసారి నా మీద నీ శక్తి చూపిస్తావు.
17 నాకు విరోధంగా సాక్ష్యం చెప్పేందుకు నీకు ఎల్ల
ప్పుడూ ఎవరో ఒకరు ఉంటారు. నామీద నీ కోపం
ఎక్కువ అవుతుంది. నీవు నా మీదికి కొత్త సైన్యా
లను పంపిస్తావు.
18 అందుచేత, దేవా అసలు నీవు నన్ను ఎందుకు
పుట్టనిచ్చావు? నన్ను ఎవరూ చూడక ముందే
నేను మరణించి ఉంటే ఎంత బాగుండేది.
19 నేను ఎన్నడూ ఒక మనిషిని కాకుండా ఉంటే
బాగుండును. నేను నా తల్లి గర్భం నుండి తిన్నగా
సమాధికి మోసికొనిపోబడితే ఎంత బాగుండేది.?
20 నా జీవితం దాదాపు అయిపోయింది. కనుక నన్ను
ఒంటరిగా వదిలెయ్యి. ఏదో కొద్దిపాటి వసతుల్ని
అనుభవించనివ్వు.
21 ఏ చోటునుండి అయితే ఎవ్వరూ ఎన్నడూ తిరిగి
రారో, అంధకారం, మరణం ఉండే ఆ చోటుకు
నేను వెళ్లక ముందు, నాకు మిగిలి ఉన్న కొద్ది
సమయం నన్ను అనుభవించనివ్వు.
22 ఎవ్వరూ చూడలేని, అంధకార ఛాయల, గందర
గోళ స్థలానికి నేను వెళ్లకముందు నన్ను అనుభ
వించ నివ్వు. అక్కడ వెలుగు కూడా చీకటిగా
ఉండి ఉంటుంది."

### జోఫరు యోబుతో మాట్లాడటం

11 అప్పుడు నయమాతీ దేశపువాడైన జోఫరు
యోబుకు జవాబిచ్చాడు:
2 "ఈ మాటల ప్రవాహానికి జవాబు ఇచ్చి తీరాల్సిందే!
ఈ వాగుడు అంతా కలిసి, యోబు చెప్పింది సరే
అనిపిస్తోందా? లేదు.
3 యోబూ, నీకు చెప్పేందుకు మా వద్ద జవాబు
లేదనుకొంటున్నావా? నీవు దేవునిగూర్చి నవ్వి
నప్పుడు, నిన్ను ఎవ్వరూ హెచ్చరించరు అను
కొంటున్నావా?
4 యోబూ! నీవు దేవునితో, 'నా నమ్మకాలు సరి
యైనవే, కనుక చూడు నేను పరిశుద్ధమైన వాడినే'
అని చెబుతున్నావు.
5 యోబూ! దేవుడే నీకు జవాబిచ్చి, నీవు చేసేది
తప్పు అని చెబితే బాగుండును అని నేను ఆశి
స్తున్నాను.
6 అప్పుడు జ్ఞాన రహస్యాలు దేవుడు నీతో చెప్ప
గలడు. ప్రతి విషయానికీ, నిజంగా రెండు వైపులు
ఉంటాయని ఆయన నీతో చెబుతాడు. అది నిజ
మైన జ్ఞానం! యోబూ! ఇది తెలుసుకో: దేవుడు
నిన్ను నిజంగా శిక్షించాల్సిన దానికంటె తక్కువగానే
శిక్షిస్తున్నాడు.
7 "యోబూ, దేవుని రహస్య సత్యాలను నీవు గ్రహించ
గలవా? సర్వశక్తిమంతుడైన దేవుని గొప్పదనాన్నీ,
శక్తినీ చూపించే హద్దులను నీవు గ్రహించలేవు.
8 అతని జ్ఞానం ఆకాశమంత ఎత్తయినది! ఆ హద్దులు
సమాధి లోతులకంటె లోతైనవి. కానీ, అది నీవు
గ్రహించలేవు!
9 దేవుడు భూమికంటే గొప్పవాడు, సముద్రంకంటే
పెద్దవాడు.
10 "దేవుడు ఒకవేళ నిన్ను బంధిస్తే, నిన్ను న్యాయ
స్థానానికి తీసుకొనివస్తే, ఏ మనిషీ ఆయనను
వారించలేడు.
11 నిజంగా, ఎవరు పనికిమాలిన వాళ్లో దేవునికి
తెలుసు. దేవుడు దుర్మార్గాన్ని చూసినప్పుడు,
ఆయన దానిని జ్ఞాపకం ఉంచుకొంటాడు.
12 ఒక అడవి గాడిద ఎలాగైతే ఒక మనిషికి జన్మ
ఇవ్వలేదో, అలాగే బుద్ధిహీనుడు ఎన్నటికీ జ్ఞాని
కాజాలడు.
13 "అయితే యోబూ! దేవుణ్ణి మాత్రమే సేవించటా
నికి, నీవు నీ హృదయాన్ని సిద్ధం చేసుకోవాలి.
ఆయన తట్టు నీవు నీ చేతులు ఎత్తి ఆరాధించాలి.
14 నీ ఇంట్లో ఉన్న పాపం నీవు తొలగించి వేయాలి.
నీ గుడారంలో చెడు నివాసం చేయనియ్యకు.
15 అప్పుడు నీవు సిగ్గుపడకుండా దేవుని తట్టు
నిశ్చలంగా చూడగలుగుతావు. నీవు బలంగా
నిలబడతావు. భయపడవు.

16 యోబూ! అప్పుడు నీవు నీ కష్టం మరచిపోగలవు.
నీ కష్టాలను దొర్లిపోయిన నీళ్లలా నీవు జ్ఞాపకం
చేసుకొంటావు.
17 అప్పుడు మధ్యాహ్నపు సూర్యకాంతి కంటె నీ
జీవితం ఎక్కువ ప్రకాశమానంగా ఉంటుంది. జీవి
తపు గాఢాంధకార ఘడియలు సూర్యోదయంలా
ప్రకాశిస్తాయి.
18 యోబూ! నిరీక్షణ ఉంది గనుక నీవు క్షేమంగా
ఉంటావు. దేవుడు నిన్ను సురక్షితంగా వుంచి నీకు
విశ్రాంతినిస్తాడు.
19 నీవు విశ్రాంతిగా పండుకొంటావు. నిన్ను ఎవ్వరూ
ఇబ్బంది పెట్టరు, బాధించరు. మరియు అనేక
మంది నీ సహాయం వేడుకొంటారు.
20 కానీ, చెడ్డవాళ్లు సహాయం కోసం చూస్తారు,
అయితే ఆశ ఏమీ ఉండదు. వారు వారి కష్టాలు
తప్పించుకోలేరు. వారు చస్తారు అనేది ఒక్కటే
వారికి ఉన్న ఆశ."

### జోఫరుకు యోబు జవాబు

12 అప్పుడు యోబు జోఫరుకు ఇలా జవాబు
ఇచ్చాడు:

2 "సందేహము లేకుండ, మీరు మాత్రమే జ్ఞానం గల
వాళ్లని మీరు తలస్తారు. మీరు చనిపోయినప్పుడు
మీతో బాటు జ్ఞానం గతిస్తుందని మీరు తలస్తారు.
3 అయితే మీరు ఎంత జ్ఞానంగలవాళ్లో నేనూ అంత
జ్ఞానంగలవాడిని. నేను మీకంటే తక్కువేమి కాదు.
ఇది సత్యం అని ఇతరులకు కూడా తెలుసు.

4 "ఇప్పుడు నా స్నేహితులు నన్ను చూసి నవ్వుతారు.
వారిలా అంటారు: 'వీడు దేవుణ్ణి ప్రార్థించాడు.
వీనికి ఆయన జవాబు ఇచ్చాడు.' "కానీ నేను
మంచివాణ్ణి, నిర్దోషిని. అయినప్పటికీ ఇంకా నన్ను
చూసి నా స్నేహితులు నవ్వుతూనే ఉన్నారు.
5 కష్టాలు లేని మనుష్యులు కష్టాలు ఉన్న వాళ్లను
హేళన చేస్తారు. అలాంటి వాళ్లు పడిపోతున్న
వాళ్లను కొట్టేస్తారు
6 దొంగల గుడారాలకు ఇబ్బంది లేదు. దేవునికి
కోపం రప్పించే వాళ్లు శాంతిగా జీవిస్తారు. వారి
ఒకే దేవుడు వారి స్వంత బలమే.

7 "అయితే జంతువుల్ని అడగండి, అవి మీకు నేర్పి
స్తాయి. లేక ఆకాశ పక్షుల్ని అడగండి, అవి మీకు
నేర్పిస్తాయి.
8 లేక భూమితో మాట్లాడండి, అది మీకు నేర్పి
స్తుంది. లేక సముద్రపు చేపలను వాటి జ్ఞానం
గూర్చి మీతో చెప్పనివ్వండి.
9 వాటిని యెహోవా సృష్టించాడని ప్రతి ఒక్కరికీ
తెలుసు.
10 బతికి ఉన్న ప్రతి జంతువూ శ్వాస పీల్చే ప్రతి
మనిషీ దేవుని శక్తి క్రిందనే.
11 భోజనం రుచి చూడడం నాలుకకు ఎంత ఆనం
దమో చెవులు అవి వినే మాటలను పరీక్షించవా:
12 ముసలి వాళ్లకు కూడా జ్ఞానం ఉంది. దీర్ఘాయుష్షు
అవగాహన కలిగిస్తుంది. అని మేము అన్నాము.
13 జ్ఞానం, బలం దేవునికి చెందుతాయి. మంచి సలహా
మరియు గ్రహింపు ఆయనవే.
14 ఒక వేళ దేవుడు దేనినైనా పడగొడితే మనుష్యులు
దాన్ని తిరిగి నిర్మించలేరు. ఒక వేళ దేవుడు ఒక
మనిషిని చెరసాలలో పెడితే మనుష్యులు అతనిని
విడుదల చేయలేరు.
15 ఒక వేళ దేవుడు గాని వర్షాన్ని ఆపివేస్తే భూమి
ఎండి పోతుంది. ఒక వేళ దేవుడు గాని వర్షాన్ని
రానిస్తే అది భూమిని వరదతో నింపివేస్తుంది.
16 దేవుడు బలవంతుడు, ఆయన ఎల్లప్పుడూ గెలు
స్తాడు. మోసపోయిన వాడు మోసం చేసిన వారూ
ఇద్దరూ దేవునికి చెందిన వారే.
17 రాజుల జ్ఞానమును దేవుడు తీసి వేస్తాడు.
నాయకులు వెర్రిగా ప్రవర్తించేటట్టు చేస్తాడు
18 రాజులు వారి బందీలకు గొలుసులు వేస్తారు. కాని
దేవుడు వాటిని తీసివేస్తాడు. అప్పుడు దేవుడు ఆ
రాజుల మీద నడికట్టు వేస్తాడు.
19 తన వంశాన్ననుసరించి రక్షణ ఉందనుకొనే యాజ
కుల బలాన్ని దేవుడు అణచి, వాళ్లను క్రిందికి
దిగజారేటట్లు చేస్తాడు.
20 నమ్మకమైన సలహాదారులను దేవుడు నిశ్శబ్దం
చేస్తాడు. వృద్ధుల జ్ఞానమును ఆయన తీసివేస్తాడు.
21 నాయకులను అప్రముఖులనుగా చేస్తాడు. పాల
కుల బలాన్ని ఆయన తీసివేస్తాడు.
22 లోతైన అంధకారంలో నుండి రహస్య సత్యాలను
దేవుడు చూపిస్తాడు. మరణం లాంటి చీకటి గల
స్థలాలలోనికి ఆయన వెలుగు పంపిస్తాడు.
23 దేవుడు రాజ్యాలను పెద్దవిగా, శక్తిగలవిగా విస్తరింప
జేస్తాడు. అప్పుడు ఆయన వాటిని నాశనం చేస్తాడు.
ఆయన రాజ్యాలను పెద్దవిగా పెరగనిస్తాడు.
అప్పుడు ఆ రాజ్యాల్లోని ప్రజలను ఆయన చెదర
గొడతాడు.
24 భూలోక నాయకులను వెర్రివార్ని గాను అర్థం
చేసుకోలేని వార్ని గాను దేవుడు చేస్తాడు. మార్గం
లేని అరణ్యంలో సంచరించేందుకు ఆయన వారిని
పంపిస్తాడు.
25 ఆ నాయకులు చీకటిలో ముందుకు సాగుతారు.
వారికి ఏ వెలుగూ లేదు. వారు తాగుబోతుల్లా
నడిచేటట్టు దేవుడు వారిని చేస్తాడు."

13 యోబు ఇలా అన్నాడు: “ఇదంతా ఇదివరకే
నా కళ్లు చూశాయి. మీరు చెప్పేదిఅంతా నేను
ఇదివరకే విన్నాను. అదంతా నేను గ్రహించాను. 2మీకు
తెలిసింది అంతా నాకు తెలుసు. నేను మీకంటే తక్కువ
కాదు. 3కానీ (మీతో వాదించటం నాకు ఇష్టం లేదు)
సర్వశక్తిమంతుడైన దేవునితో మాట్లాడాలని నేను కోరు
తున్నాను. నా కష్టాల గూర్చి నేను దేవునితో వాదించా
లని కోరుతున్నాను. 4కానీ, మీరు ముగ్గురూ మీ అజ్ఞా
నాన్ని అబద్ధాలతో కప్పిపుచ్చాలని ప్రయత్నిస్తున్నారు.
ఎవరినీ బాగుచేయలేని పనికిమాలిన వైద్యుల్లా మీరు
ఉన్నారు. 5మీరు పూర్తిగా నిశ్శబ్దంగా ఉంటే బాగుండేది.
అది మీరు చేయగలిగిన అతి జ్ఞానంగల పని.

6 “ఇప్పుడు, నా వాదం వినండి. నేను నా విన్నపం చెబుతుండగా, వినండి
7 మీరు దేవుని కోసం అబద్ధాలు చెబుతున్నారా? మీరు చెప్పాలని దేవుడు కోరుతున్నవి మీరు చెప్పుతున్నవి అబద్ధాలే అని మీరు నిజంగా నమ్ముచున్నారా?
8 మీరు నాకు విరోధంగా దేవుని ఆదుకొనేందుకు ప్రయత్నిస్తున్నారా? న్యాయస్థానంలో మీరు దేవుని ఆదుకొంటారా?
9 దేవుడు మిమ్మల్ని సూక్ష్మంగా పరిశీలిస్తే ఆయనకు మంచి ఏమైనా కనబడుతుందా? మీరు మనుష్యులను మోసం చేసినట్టే దేవునిని కూడా మోసం చేయగలమని నిజంగా అనుకొంటున్నారా?
10 మీరు కనుక న్యాయస్థానంలో ఒకరి పక్షం వహించాలని రహస్యంగా నిర్ణయిస్తే దేవుడు నిజంగా మిమ్మల్ని గద్దిస్తాడు.
11 దేవుని ప్రభావం మిమ్మల్ని భయపెట్టేస్తుంది. ఆయన్ను చూచి మీరు భయపడతారు.
12 (మీరు తెలివిగానూ, జ్ఞానంగానూ మాట్లాడుతున్నాం అనుకొంటారు). కానీ మీ మాటలు బూడిదలా పనికిమాలినవే. మీ వాదాలు మట్టిలా బలహీనమైనవే.
13 నిశ్శబ్దంగా ఉండి, నన్ను మాట్లాడనివ్వండి. అప్పుడు నాకు ఏం జరగాల్సి ఉందో అది జరగనివ్వండి.
14 నాకు నేను అపాయంలో చిక్కుకొనుచున్నాను, నా ప్రాణం నా చేతుల్లోకి తీసుకొంటున్నాను.
15 దేవుడు నన్ను చంపివేసినా సరే నేనాయన్ని నమ్ముతూనే వుంటాను. ముఖాముఖిగా, ఆయన ముందు నా విధానాలను రుజువు చేస్తాను.
16 కాని దేవుని ఎదుట నేను ధైర్యంగా ఉన్నాను, గనుక ఒక వేళ ఆయన నన్ను రక్షిస్తాడేమో. చెడ్డ మనిషీ ఎవ్వరూ దేవుణ్ణి ముఖాముఖిగా కలుసుకోడానికి సాహసించరు.
17 నేను చెప్పేది జాగ్రత్తగా విను. నేను వివరిస్తూండగా నీ చెవులను విననివ్వవు.
18 ఇప్పుడు నన్ను నేను ఆదుకోవడానికి సిద్ధంగా ఉన్నాను. నేను జాగ్రత్తగా నా వాదనలను మీ ముందు ఉంచుతాను. నాదే సరి అని నాకు చూపించబడుతుంది అని నాకు తెలుసు.
19 నాది తప్పు అని ఏ మనిషీ రుజువు చేయలేడు. అలా ఎవరైనా చేయగలిగితే నేను మౌనంగా ఉండి మరణిస్తాను.
20 “దేవా, కేవలం రెండు సంగతులు నాకు దయచేయుము. అప్పుడు నేను నీవద్ద దాగుకొనను.
21 నన్ను శిక్షించడము ఆపివేయి. నీ భయాలతో నన్ను బెదిరించకు.
22 అప్పుడు నన్ను పిలువు, అప్పుడు నేను నీకు జవాబు ఇస్తాను. లేదా నన్ను నీతో మాట్లాడనివ్వు. నీవు నాకు జవాబు ఇవ్వు.
23 నేను ఎన్ని పాపాలు చేశాను? నేను ఏం తప్పు చేశాను? నా పాపాలు, నా తప్పులు నాకు చూపించు.
24 దేవా, నీవు నన్ను ఎందుకు తప్పిస్తున్నావు? నన్ను నీ శత్రువులా ఎందుకు చూస్తున్నావు?
25 నీవు నన్ను బెదిరించటానికి ప్రయత్నిస్తున్నావా? నేను (యోబు) గాలి చెదరగొట్టే ఒక ఆకును. ఎండిపోయిన ఒక చిన్న గడ్డిపరక మీద నీవు దాడిచేస్తున్నావు.
26 దేవా, నా మీద నీవు కఠినమైన మాటలు పలుకుతున్నావు. నేను యువకునిగా ఉన్నప్పుడు చేసిన పాపాలకు నీవు నన్ను శ్రమ పెడుతున్నావు.
27 నా పాదాలకు నీవు గొలుసులు వేశావు. నేను వేసే ప్రతి అడుగూ నీవు జాగ్రత్తగా గమనిస్తున్నావు. నా అడుగులను నీవు తక్కువ చేస్తున్నావు.
28 అందుచేత కుళ్లిపోయిన దానిలా, చిమ్మెటలు తిని వేసిన గుడ్డ పేలికలా నేను నిష్ప్రయోజనం అయిపోతున్నాను.”

14 యోబు ఈ విధంగా చెప్పాడు: “మనమందరం
కష్టంతో నిండిన కొద్దిపాటి జీవితం కోసమే
పుట్టాం. 2మనిషి జీవితం పువ్వులాంటిది. అతడు
త్వరగా పెరిగి, తర్వాత చస్తాడు. కొంచెం సేపు ఉండి,
ఆ తర్వాత ఉండని నీడలాంటిది మనిషి జీవితం. 3దేవా,
నీవు అలాంటి మనిషిని గమనిస్తావా? నీతో తీర్పు
పొందటానికి నన్ను నీ ముందుకు తీసుకొనిరమ్ము.
4 “మురికి దానిలో నుండి శుభ్రమైన దాన్ని ఎవరు తీయగలరు? ఎవ్వరూ తీయలేరు.
5 నరుని జీవితం పరిమితం. దేవా, నరుని మాసాల సంఖ్య నీవు నిర్ణయం చేశావు. నరుడు మార్చజాలని హద్దులు నీవు ఉంచావు.

6 కనుక దేవా, నరునికి దూరంగా చూడు. వానిని ఒంటరిగా విడిచిపెట్టు. అతని కాలం తీరేవరకు అతని కష్టజీవితం అతణ్ణి అనుభవించనివ్వు.
7 “అయితే ఒక చెట్టుకు నిరీక్షణ ఉంది. దాన్ని నరికివేస్తే, అది మరల పెరుగుతుంది. అది కొత్త కొమ్మలు వేస్తూనే ఉంటుంది.
8 భూమిలో దాని వేర్లు పాతవైపోవచ్చును. దాని మొద్దు మట్టిలో చీకిపోవచ్చును.
9 కానీ నీళ్లు ఉంటే అది కొత్త చిగుళ్లు వేస్తుంది. మొక్కల్లా అది కొమ్మలు వేస్తుంది.
10 అయితే మనిషి మరణిస్తాడు. అతని శరీరం పాతి పెట్టబడుతుంది. మనిషి చనిపోయినప్పుడు, అతడు వెళ్లిపోయాడు.
11 సముద్రంలో నీరు ఇంకిపోయినట్టు, ఒక నది నీరు ఎండిపోయినట్టు
12 సరిగ్గా అదే విధంగా ఒక వ్యక్తి మరణించినప్పుడు, అతడు పండుకొని, మళ్లీ లేవలేడు. మరణించే మనుష్యులు, ఆకాశాలు ఉండకుండా పోయేంత వరకు మేల్కొనరు, నిద్రించటం మానుకోరు.
13 “మీరు నన్ను నా సమాధిలో దాచిపెడితే బాగుండు నని నా (యోబు) ఆశ. నీ కోపం పోయేవరకు, నీవు నన్ను అక్కడ దాచిపెడితే బాగుండు ననిపిస్తుంది నాకు. అప్పుడు నన్ను జ్ఞాపకం చేసు కొనేందుకు నీవు ఒక సమయాన్ని ఏర్పరచు కోవచ్చు
14 ఒక మనిషి మరణిస్తే, అతడు మరల బతుకుతాడా? నేను వేచి ఉంటాను, నేను విడుదల అయ్యేంత వరకు కష్టపడి పోరాడుతాను.
15 దేవా, నీవు నన్ను పిలుస్తావు, నేను (యోబు) నీకు జవాబు ఇస్తాను. నన్ను నీవు చేశావు, నన్ను నీవు కోరుతావు
16 అప్పుడు నేను వేసే ప్రతి అడుగూ నీవు గమనిస్తావు. కానీ, నేను చేసిన పాపాలు నీవు జ్ఞాపకం చేసుకోవు.
17 నీవు నా పాపాలు ఒక సంచిలో కట్టివేసి, దూరంగా పారవేయి.
18 “సరిగ్గా ఒక పర్వతం కూలిపోయినట్టు ఒక బండ దాని స్థలం నుండి తొలగించబడినట్టు
19 నీళ్లు రాళ్లను కడిగివేసి వాటిని అరగ దీసినట్టు, నీళ్లు నేలమీద మట్టిని కొట్టుకుపోవునట్లు, అదే విధంగా, దేవా నీవు ఒక మనిషి ఆశను నాశనం చేస్తావు.
20 నీవు మనిషిని ఒకసారి ఓడించి ముగిస్తే మనిషి పోయినట్టే. నీవు వాని ముఖాన్ని చావు ముఖంగా మార్చివేసి శాశ్వతంగా వానిని పంపించివేస్తావు.
21 వాని కుమారులు గౌరవించబడినా అది ఎన్నటికీ అతనికి తెలియదు. అతని కుమారుడు చెడు చేస్తే అతడు ఎన్నటికీ దానిని చూడడు.
22 మనిషి తన స్వంత శరీరంతో బాధ అనుభవిస్తాడు. అతడు తన కోసమే ఎక్కువగా దుఃఖిస్తాడు.”

### యోబుకు ఎలీఫజు జవాబు

15 అప్పుడు తేమానువాడైన ఎలీఫజు యోబుకు జవాబిచ్చాడు:

2 “యోబూ! నీవు నిజంగా జ్ఞానం గలవాడవైతే నీవు వట్టి మాటలతో జవాబు ఇవ్వవు. జ్ఞానం గల మనిషి పూర్తిగా తూర్పు వేడిగాలి (పనికిమాలిన మాటల) తో ఉండడు.
3 జ్ఞానం గల మనిషి పనికిమాలిన మాటలతో, అర్థం లేని ఉపన్యాసాలతో వాదిస్తాడని నీవు తలుస్తావా?
4 యోబూ! నీ యిష్టం వచ్చినట్టు నీవు ఉంటే ఎవ్వరూ దేవుణ్ణి గౌరవించరు, ఆయన్ని ప్రార్థిం చరు. దేవుని సన్నిధియందు చేసే ధ్యానానికి నీవు ఆటంకం తెస్తావు.
5 నీవు చెప్పే విషయాలు నీ పాపాన్ని తేటగా చూపి స్తాయి. యోబూ! నీవు తెలివిగల మాటలు ప్రయో గించి నీ పాపాన్ని దాచిపెట్టాలని ప్రయత్ని స్తున్నావు.
6 నీది తప్పు అని నేను నీకు రుజువు చేయాల్సిన అవసరం లేదు. ఎందుకు? నీ స్వంత నోటితో నీవు పలికే విషయాలే నీ తప్పును తెలియ జేస్తున్నాయి. నీ స్వంత పెదాలు నీకు విరోధంగా మాట్లాడుతున్నాయి.
7 “యోబూ! మొట్ట మొదట పుట్టింది నీవే అని తలుస్తున్నావా? కొండలు చేయబడక ముందే నీవు జన్మించావా?
8 దేవుని రహస్య పథకాలు నీవు విన్నావా? నీ మట్టుకు నీవు ఒక్కడవు మాత్రమే జ్ఞానం గలవాడవని తలుస్తున్నావా?
9 యోబూ! నీకు తెలిసిన దానికంటే మాకు ఎక్కువ తెలుసు. నీవు గ్రహించలేని విషయాలు మేము గ్రహిస్తాం.
10 తల నెరసిన మనుషులు మరియు వృద్ధులు మాతో ఏకీభవిస్తారు. అవును, చివరికి నీ తండ్రికంటే పెద్ద వాళ్లు కూడా మా పక్షంగా ఉన్నారు.
11 దేవుడు నిన్ను ఆదరించేందుకు ప్రయత్నిస్తాడు కానీ నీకు అది మాత్రమే చాలదు. సౌమ్యమయిన పద్ధతిలో దేవుని సందేశం మేము నీకు చెప్పాము.
12 యోబూ! నీవెందుకు అర్థం చేసుకోవు? సత్యాన్ని ఎందుకు చూడలేక పోతున్నావు?
13 నీవు ఈ కోపపు మాటలు చెప్పినప్పుడు నీవు దేవునికి విరోధంగా ఉన్నావు.
14 “ఒక మనిషి వాస్తవంగా పరిశుద్ధంగా ఉండలేడు. స్త్రీ నుంచి జన్మించిన మనిషి. దేవునితో సరిపడి ఉండ జాలడు.

15 దేవుడు కనీసం తన దూతలను కూడ నమ్మడు.
దూతలు నివసించే ఆకాశం కూడా పవిత్రమైనది
కాదు.
16 మానవుడు అంతకంటే దౌర్భాగ్యుడు. మానవుడు
అసహ్యమైనవాడు మరియు పాడైపోయాడు.
అతడు మంచి నీళ్లు తాగినట్టుగా కీడును తాగు
తాడు.
17 “యోబూ, నా మాట విను. నేను దానిని నీకు
వివరిస్తాను. నాకు తెలిసిన దానిని నేను నీతో
చెబుతాను.
18 జ్ఞానం గల మనుష్యులు నాతో చెప్పిన విషయాలు
నేను నీతో చెబుతాను. ఆ జ్ఞానం గల మనుష్యుల
పూర్వీకులు ఈ విషయాలను వారితో చెప్పారు.
ఆ జ్ఞానులు రహస్యాలేమీ నా దగ్గర దాచిపెట్టలేదు.
19 వారికే (జ్ఞానులకే) దేశం ఇవ్వబడింది. వారిని
ఇబ్బంది పెట్టేందుకు పరాయివాళ్లు ఎవరూ ఆ
దేశంలో లేరు.
20 దుర్మార్గుడు తన జీవితకాలమంతా బాధతో శ్రమ
పడతాడు. క్రూరమైన మనిషి తన కోసం దాచ
బడిన సంవత్సరాలన్నింటిలో శ్రమపడతాడు,
21 భయంకర శబ్దాలు అతని చెవులకు వినిపిస్తాయి
మరియు అతడు క్షేమంగా ఉన్నానని అనుకొన్న
ప్పుడు శత్రువు అతని మీద దాడి చేస్తాడు.
22 దుర్మార్గపు వ్యక్తి చాలా విసిగిపోతాడు. చీకటి నుండి
తప్పించుకొనే ఆశ అతనికి ఉండదు. అతణ్ణి చంపివే
సేందుకు ఎక్కడో ఒక ఖడ్గం కనిపెడుతూనే
ఉంటుంది.
23 అతడు అటూ ఇటూ ఆహారం కోసం ‘ఎక్కడ
అది’ అంటూ సంచరిస్తూనే ఉంటాడు. కాని అతని
శరీరం రాబందులకు ఆహారం అవుతుంది. అతనికి
చావు మూడిందని అతనికి తెలుసు.
24 చింత, శ్రమ అతణ్ణి భయపెడుతున్నాయి. అతణ్ణి
నాశనం చేసేందుకు ఒక రాజు సిద్ధంగా ఉన్నట్టు
ఈ విషయాలు అతనిపై దాడి చేస్తాయి
25 ఎందుకంటే దుర్మార్గుడు దేవుని మీద తన పిడికిలి
బిగిస్తాడు కనుక దుర్మార్గుడు దేవునికి విధేయుడ
య్యేందుకు నిరాకరిస్తాడు. సర్వశక్తిమంతుడైన
దేవునికి విరోధంగా దుర్మార్గుడు బలవంతునిగా
ఉండేందుకు ప్రయత్నిస్తాడు.
26 ఆ మనిషి చాలా మొండివాడు. దుర్మార్గుడు తన
బలమైన లావుపాటి కేడెముతో దేవుని మీద దాడి
చేస్తాడు.
27 దుర్మార్గుడు ధనవంతుడై ముఖం కొవ్వుతో నిండి
ఉండివుండవచ్చు. వాని నడుం కొవ్వు పొరలతో
బలిసి ఉండవచ్చు.
28 కానీ శిథిలమైన పట్టణాల్లో వాడు నివసిస్తాడు.
ఎవరూ నివసించని ఇండ్లలో ఆ దుర్మార్గుడు నివ
సిస్తాడు. అవి పడిపోయేట్టు ఉన్న శిథిల గృహాలు.
29 దుర్మార్గుడు ధనికుడుగా ఉండవచ్చు. అతని
ఐశ్వర్యం ఎక్కువ కాలం ఉండదు. అతని పంటలు
ఎక్కువగా పండవు.
30 దుర్మార్గుడు చీకటిని తప్పించుకోలేడు. అగ్నిచేత
కొమ్మలు కాలిపోయిన చెట్టులా అతడు ఉంటాడు.
దేవుని శ్వాస దుర్మార్గుని తుడిచివేస్తుంది.
31 దుర్మార్గుడు పనికిమాలిన వాటిని నమ్ముకొని
తనను తానే మోసం చేసుకోకూడదు. ఎందుకంటే,
వానికి ఏమీ దొరకదు కనుక.
32 దుర్మార్గుని ఆయుష్షు తీరిపోకముందే వాడు ముసలి
వాడై, ఎండిపోతాడు. మళ్లీ ఎన్నటికి పచ్చగా
ఉండని ఎండిపోయిన కొమ్మలా అతడు ఉంటాడు.
33 ద్రాక్షాపండ్లు పక్వానికి రాకముందే రాలిపోతున్న
ద్రాక్షావల్లిలా దుర్మార్గుడు ఉంటాడు. ఆ వ్యక్తి పూలు
రాలిపోయిన ఒలీవ చెట్టులా ఉంటాడు.
34 ఎందుకంటే, దేవుడు లేని ప్రజల పని వ్యర్థము.
డబ్బును ప్రేమించే మనుష్యుల ఇండ్లు అగ్నిచేత
నాశనం చేయబడతాయి.
35 వారు కష్టాలకు పథకం వేసి దుర్మార్గపు పనులు
చేస్తారు. మనుష్యులను మోసం చేసేందుకు వారు
ప్రయత్నం చేస్తారు.”

### ఎలీఫజుకు యోబు జవాబు

16 అప్పుడు యోబు ఇలా జవాబు ఇచ్చాడు:
2 “ఈ విషయాలు నేను యిదివరకే విన్నాను.
మీరు ముగ్గురూ నాకు కష్టమే కలిగిస్తున్నారు కాని
ఆదరణ కాదు.
3 మీ దీర్ఘ ఉపన్యాసాలకు అంతం లేదు. మీరెందుకు
వాదము కొనసాగిస్తారు?
4 నా కష్టాలే మీకు ఉంటే ఇప్పుడు మీరు చెబుతున్న
మాటలు నేనూ చెప్పగలను. మీకు విరోధంగా
జ్ఞానం గల మాటలు చెప్పి, మిమ్మల్ని చూచి
నేను తల ఊపగలను.
5 కాని నేను చెప్పే మాటలతో నేను మిమ్మల్ని
ప్రోత్సహించి మీకు ఆశ ఇవ్వగలను.
6 “అయితే నేను చెప్పేది ఏదీ నా బాధ పోయేట్టుగా
చేయలేదు. కానీ నేను మాట్లాడకపోతే నాకు
ఆదరణ లేదు.
7 నిజంగా దేవా, నీవు నా బలం తీసివేశావు. నా
కుటుంబం మొత్తాన్ని నీవు నాశనం చేశావు.
8 నీవు నన్ను కట్టివేశావు. అది ప్రతి ఒక్కరూ
చూడగలరు. నా శరీరం రోగంతో ఉంది, నేను
భయంకరంగా కనబడుతున్నాను. దాని అర్థం నేను
దోషిని అని ప్రజలు తలస్తున్నారు.
9 “దేవుడు నా మీద దాడి చేస్తున్నాడు, ఆయన నా
మీద కోపంగా ఉండి నా శరీరాన్ని చీల్చి వేస్తున్నాడు.

దేవుడు నా మీద తన పళ్లు కొరుకుతున్నాడు.
నా శత్రువుల కళ్లు ద్వేషంతో చూస్తున్నవి.
10 మనుష్యులు నన్ను చూచి నవ్వుతారు. వాళ్లంతా
నా చుట్టూ చేరి నన్ను అవమానించి నా ముఖం
మీద కొట్టడానికి సమ్మతిస్తారు.
11 దేవుడు నన్ను దుర్మార్గులకు అప్పగించాడు.
12 నా విషయం అంతా బాగానే ఉంది. నేను నెమ్మదిగా
జీవిస్తూ వచ్చాను. కాని దేవుడు నన్ను చితుక
గొట్టేశాడు. అవును ఆయన నన్ను మెడపట్టి లాగి,
నన్ను ముక్కలు ముక్కలుగా విరుగగొట్టాడు. గురి
చూసి కొట్టడం అభ్యసించడానికి దేవుడు నన్ను
ప్రయోగిస్తున్నాడు.
13 దేవుని విలుకాండ్లు నా చుట్టూరా ఉన్నారు. నా
మూత్రపిండాలలో ఆయన బాణాలు కొడుతు
న్నాడు. ఆయన దయ చూపించడు. ఆయన
నా పైత్య రసాన్ని నేలమీద ఒలక బోస్తాడు
14 మరల మరల దేవుడు నా మీద దాడి చేస్తాడు.
యుద్ధంలో సైనికునిలా ఆయన నా మీదకు పరు
గెత్తుతాడు.
15 "నేను (యోబు) చాలా విచారంగా ఉన్నాను, కనుక
గోనెపట్టతో చేయబడిన బట్టలు నేను ధరిస్తాను.
నేను ఇక్కడ దుమ్ములో, బూడిదలో కూర్చొని
ఓడిపోయినట్టుగా భావిస్తున్నాను.
16 ఏడ్చుట మూలంగా నా ముఖం ఎర్రబడింది.
ఛాయలు నా కళ్ల చుట్టూరా ఉంగరాల్లా ఉన్నాయి.
17 నేను ఎన్నడూ క్రూరమైన నేరం ఏదీ చేయలేదు.
నా ప్రార్థన నిర్మలమయినది.
18 "భూమీ, నా రక్తాన్ని దాచి పెట్టకు. (నాకు జరిగిన
చెడుగులను కప్పిపెట్టకు). న్యాయం కోసం అరిచే
నా అరుపులను (ప్రార్థనలను) ఆగిపోనీయకు.
19 ఇప్పుడు కూడ పరలోకంలో ఎవరో ఒకరు
ఉన్నారు. నా పక్షంగా (నా పక్కన) ఉండి నాకు
సాక్షిగా ఉన్నాడు.
20 నా స్నేహితులు నాకు విరోధంగా ఉన్నారు. కాని
నా కన్నులు దేవుని కోసం కన్నీళ్లు కారుస్తున్నాయి.
21 ఒక మనిషి తన స్నేహితుని కోసం బతిమలాడి
నట్టుగా, నా కోసం దేవునిని బతిమలాడే ఒక మనిషి
నాకు కావాలి.
22 "నేను ఏ చోట నుండి (మరణం) తిరిగి రానో ఆ
చోటికి నేను వెళ్లేందుకు ఇంకా కొద్ది సంవత్సరాలే
జరగాల్సి ఉంది.

17 నా ఆత్మ భగ్నమై పోయింది. విడిచి పెట్టే
సేందుకు నేను సిద్ధం. నా జీవితం దాదాపు
గతించిపోయింది, సమాధి నాకోసం నిరీక్షిస్తోంది.
2 మనుష్యులు నా చుట్టూరా నిలిచి నన్ను చూసి
నవ్వుతున్నారు. వారు నన్ను ఆట పట్టిస్తూ అవ
మానిస్తూ ఉంటే నేను వారిని గమనిస్తున్నాను.
3 "దేవా, నీవు నన్ను (యోబు) నిజంగా బలపరుస్తు
న్నావని చూపించు, మరి ఎవ్వరూ నన్ను బల
పరచరు.
4 నా స్నేహితుల మనస్సులను నీవు బంధించేశావు,
కనుక వారు నన్ను అర్థం చేసుకోరు. దయచేసి
వారిని జయించనీయకు.

5 'ఒకడు తన స్వంత పిల్లలను నిర్లక్ష్యం చేసి తన
స్నేహితులకు* సహాయం చేస్తాడు' అని ప్రజలు
చెబుతారని నీకు తెలుసా? కాని ఇప్పుడు నా
స్నేహితులే నాకు విరోధం అయ్యారు.
6 దేవుడు నా పేరును (యోబు) ప్రతి ఒక్కరికీ ఒక
చెడ్డ పదంగా చేశాడు. ప్రజలు నా ముఖం మీద
ఉమ్మి వేస్తారు.
7 నేను చాలా బాధపడుతూ, చాలా విచారంగా
ఉన్నాను, కనుక నా కన్నులు దాదాపు గుడ్డివి
అయ్యాయి. నా మొత్తం శరీరం ఒక నీడలా చాలా
సన్నం అయ్యింది.
8 మంచి మనుష్యులు దీని విషయమై కలవరపడు
తున్నారు. దేవుని గూర్చి లక్ష్యపెట్టని ప్రజల
విషయమై నిర్దోషులు కలవర పడుతున్నారు.
9 కాని నీతిమంతులు వాళ్ల పద్ధతులనే చేపడతారు.
నిర్దోషులు మరింత బలవంతులవుతారు.

10 "కానీ రండి, మీరంతా కలసి, మొత్తం తప్పు నాదే
అని నాకు చూపించడానికి మరల ప్రయత్నం
చేయండి. మీలో ఎవరూ జ్ఞానం గల వారుకారు.
11 నా జీవితం గతించి పోతోంది. నా ఆలోచనలన్నీ
నాశనం చేయబడ్డాయి. నా ఆశ అడుగంటింది.
12 కాని నా స్నేహితులు రాత్రిని పగలు అనుకొంటారు.
చీకటి పడినప్పుడు వెలుగు వస్తోంది, అని వారు
అంటారు.
13 నేను కనిపెడుతున్న ఒకే గృహం కనుక పాతాళం
అయితే, అంధకార సమాధిలో నేను నా పడక
వేసుకొంటే
14 సమాధిని చూచి, 'నీవు నా తండ్రివి అని'
పురుగులను చూసి, 'నా తల్లివి' లేక 'నా సోదరివి'
అని నేను చెప్పవచ్చు
15 కాని అదే నాకు ఆశ అయితే నాకు ఎలాంటి ఆశ
లేదు. మరియు ప్రజలు నాయందు ఏ ఆశ చూడ
లేరు.
16 (నా ఆశ నాతోనే చనిపోతుందా?) అది నేను చని
పోయే స్థలంయొక్క లోతుల్లోకి వెళ్తుందా? మన
మంతా చేరి బురదలోకి వెళ్తామా?"

---

**ఒకడు ... స్నేహితులకు** అక్షరాలా అతడు తన స్నేహితులకు ఒక వాటాను వాగ్దానం చేస్తాడు మరియు అతని పిల్లలు గుడ్డివాళ్లయ్యారు.

### యోబుకు బిల్దదు జవాబు

18 అప్పుడు షూహీ దేశస్థుడైన బిల్దదు యోబుకు
ఇలా జవాబు చెప్పాడు:

2 "యోబూ! ఈ మాటలన్నీ ఎప్పుడు చాలిస్తావు?
నీవు మౌనంగా ఉండి వినాలి. అప్పుడు మనం
మాట్లాడుకోవచ్చు
3 మేము పశువుల్లా బుద్ధిహీనులం అని నీవు ఎందుకు
తలస్తావు?
4 యోబూ! నీ కోపంతో నీకు నీవే హాని చేసు
కొంటున్నావు. కేవలం నీ కోసం మనుష్యులు
ఈ భూమిని విడిచిపోవాలా? కేవలం నిన్ను తృప్తి
పరచటం కోసం దేవుడు పర్వతాలను కదిపివేస్తాడని
నీవు తలస్తున్నావా?

5 "అవును నిజమే, దుర్మార్గుని దీపం ఆరిపోతుంది.
అతని అగ్ని కాలకుండా ఆగిపోతుంది.
6 అతని ఇంటిలోని వెలుగు చీకటి అవుతుంది. అతని
పక్కగా ఉన్న దీపం ఆరిపోతుంది.
7 ఆ మనిషి అడుగులు మరల గట్టిగా, వేగంగా
ఉండవు. కానీ అతడు నిధానంగా నడుస్తాడు, బల
హీనంగా ఉంటాడు. అతని స్వంత దుర్మార్గపు ఆలో
చనలే అతడు పడిపోయేట్టు చేస్తాయి.
8 అతని స్వంత పాదాలే అతనిని వలలో పడదో
స్తాయి. అతడు బోనులోనికి నడచి, అందులో
చిక్కుకొంటాడు.
9 ఒక బోను అతని మడిమెను పట్టేస్తుంది. ఒక
బోను అతన్ని గట్టిగా బంధిస్తుంది.
10 అతని కోసం నేలమీద ఒక తాడు దాచబడి
ఉంటుంది. అతని తోవలో ఒక బోను సిద్ధంగా
ఉంది.
11 అతని చుట్టూరా భయం పొంచి ఉంది. అతడు
వేసే ప్రతి అడుగు వెనుకా భయం ఉంటుంది.
12 చెడ్డ కష్టాలు అతని కోసం ఆకలితో వున్నాయి.
అతడు పడిపోయినప్పుడు పతనం, నాశనం అతని
కోసం సిద్ధంగా ఉన్నాయి.
13 భయంకర రోగం అతని చర్మంలో కొన్ని భాగా
లను తినివేస్తుంది. అది అతని చేతులను, కాళ్లను
కుళ్లిపోచేస్తుంది.
14 దుర్మార్గుడు క్షేమంగా ఉన్న తన ఇంటిలో నుండి
తీసుకొని పోబడతాడు. భయాల రాజును ఎదుర్కొ
నేందుకు అతడు నడిపించబడతాడు.
15 అతనికి తన ఇంటిలో ఏమీ విడిచిపెట్టబడదు.
ఎందుకంటే అతని ఇంటినిండా, మండుతున్న
గంధకం చల్లబడుతుంది.
16 కింద అతని వేర్లు ఎండిపోతాయి. పైన అతని
కొమ్మలు చస్తాయి
17 భూమి మీద మనుష్యులు అతనిని జ్ఞాపకం
చేసుకోరు. ఏ వ్యక్తికూడ అతన్ని ఇంకెంత మాత్రం
జ్ఞాపకం చేసికోడు.
18 మనుష్యులు అతనిని వెలుతురు నుండి నెట్టివేస్తారు.
అతడు చీకటిలోనికి శిక్షించబడతాడు. వారు అతన్ని
లోకంలో నుండి తరిమివేస్తారు.
19 అతనికి పిల్లలు లేక మనుమలు ఎవ్వరూ ఉండరు.
అతని కుమారుల నుండి వారసులు ఉండరు. అతని
యింట యింక సజీవంగా ఉండే మనుష్యులు
ఎవ్వరూ ఉండరు.
20 దుర్మార్గునికి సంభవించిన దానిని గూర్చి విన్న
ప్పుడు పడమట ఉన్న ప్రజలు అదిరిపోతారు.
తూర్పున ఉన్న ప్రజలు భయంతో మెత్తబడి
పోతారు.
21 ఇది నిజం, దుర్మార్గునికి, అతని ఇంటికి ఇలాగే
జరుగుతుంది. దేవుని గూర్చి లక్ష్యపెట్టని వానికి
ఇలాగే జరుగుతుంది!"

### యోబు జవాబు

19 అప్పుడు యోబు ఇలా జవాబు చెప్పాడు:

2 "ఎంతకాలం మీరు నన్ను బాధిస్తారు; మాటలతో
నన్ను నలుగగొడతారు?
3 ఇప్పటికి మీరు నన్ను పదిసార్లు అవమానించారు.
మీరు నా మీద దాడి చేసేటప్పుడు ఎలాంటి సిగ్గూ
ఉండదు మీకు.
4 ఒకవేళ నేను పాపం చేసినా, అది నా సమస్య.
అది మిమ్మల్ని బాధించదు.
5 మీరు కేవలం నా కంటే మంచివాళ్లలా చూపించు
కోవాలని కోరుతున్నారు. నా కష్టాలకు కారణం
నా తప్పు మాత్రమే అని మీరు అంటారు.
6 కానీ నాకు అపకారం చేసినవాడు దేవుడు. ఆయన
నన్ను పట్టుకోవటానికి తన వలను నా చుట్టూరా
వేశాడు.
7 'నాకు అపకారం జరిగింది.' అని నేను కేకలు వేస్తాను.
నాకు జవాబు ఏమీ రాదు. సహాయం కోసం నేను
గట్టిగా కేకలు వేసినా న్యాయం కోసమైనా నా
మొర ఎవరూ వినరు.
8 నేను ముందుకు వెళ్లలేకుండా దేవుడు నా మార్గం
మూసివేశాడు. నా తోవను ఆయన చీకట్లో దాచి
పెట్టేశాడు.
9 నా ఐశ్వర్యాన్ని దేవుడు తీసివేసుకొన్నాడు. నా
తలమీద కిరీటాన్ని ఆయన తీసివేసుకొన్నాడు.
10 నేను చచ్చేంతవరకు నన్ను ఈ పక్క నుండి ఆ
పక్కవరకు దేవుడు విరుగగొడతాడు. ఒక చెట్టు
దాని వేళ్లతో సహా పెల్లగించబడ్డట్టు ఆయన నా
ఆశ తీసివేస్తాడు

11 దేవుని కోపం నాకు వ్యతిరేకంగా మండుతుంది.
ఆయన నన్ను తన శత్రువు అని పిలుస్తున్నాడు.
12 నా మీద దాడి చేసేందుకు దేవుడు తన సైన్యాన్ని
పంపుతాడు. వారు నా చుట్టూరా దుర్గాలు నిర్మి
స్తారు. నా గుడారం చుట్టూరా వారు బసచేస్తారు.

13 "నా సోదరులు నన్ను ద్వేషించేటట్టు దేవుడు
చేశాడు. నా స్నేహితులందరికీ నేను పరాయి
వాడను.
14 నా బంధువులు నన్ను విడిచిపెట్టేశారు. నా స్నేహి
తులు నన్ను మరచిపోయారు.
15 నా ఇంట్లో అతిథులు, పనికత్తెలు నేనేదో పరాయి
వాడిలా, విదేశీయునిలా నన్ను చూస్తారు.
16 నేను నా సేవకుని పిలిస్తే వాడు జవాబివ్వడు.
సహాయం కోసం నేను బతిమలాడినా నా సేవకుడు
జవాబు ఇవ్వడు.
17 నా శ్వాస వాసన అంటే నా భార్యకు అసహ్యం.
నా స్వంత సోదరులు నన్ను ద్వేషిస్తారు.
18 చిన్న పిల్లలు కూడా నన్ను గేళి చేస్తారు. నేను
వాళ్ల దగ్గరకు వస్తే వాళ్లు నాకు విరోధంగా చెడు
సంగతులు మాట్లాడుతారు.
19 నాకు సన్నిహితమైన స్నేహితులు అందరూ నన్ను
అసహ్యించుకొంటారు. చివరికి నేను ప్రేమించే
మనుష్యులు కూడా నాకు విరోధులయ్యారు.

20 "నేను ఎంత సన్నగా ఉన్నానంటే నా ఎముకల
మీద నా చర్మం వ్రేలాడుతూ ఉంది. నాలో నాకు
కొద్దిపాటి ప్రాణం మాత్రమే మిగిలి ఉంది.
21 "నన్ను దయ చూడండి, నా స్నేహితులారా, నన్ను
దయ చూడండి. దేవుని హస్తం నాకు విరోధంగా
వుంది.
22 దేవుడు చేసినట్టు, మీరు ఎందుకు నన్ను
హింసిస్తారు? నన్ను బాధించి మీరెందుకు ఎన్నడూ
తృప్తి చెందటం లేదు?
23 "నేను (యోబు) చెప్పేది ఎవరో ఒకరు జ్ఞాపకం
ఉంచుకొని, ఒక గ్రంథంలో వ్రాస్తే బాగుంటుందని
నా ఆశ. నేను చెప్పే మాటలు ఒక గ్రంథపు
చుట్టలో వ్రాయబడాలని నా ఆశ.
24 నేను చెప్పే మాటలు శాశ్వతంగా ఉండేటట్టు సీసం
మీద ఇనుప పోగరతో చెక్కబడాలని లేదా ఒక
బండమీద వ్రాయబడాలని నా ఆశ.
25 నన్ను ఆదుకొనేవారు ఎవరో ఒకరు ఉన్నారని
నాకు తెలుసు. అంతంలో ఆయన నా పక్షంగా
నిలబడతాడని నాకు తెలుసు.
26 నేను ఈ శరీరం విడిచిపెట్టిన తర్వాత నా చర్మం
పాడైపోయిన తర్వాత కూడా నేను దేవుణ్ణి
చూస్తానని నాకు తెలుసు.
27 నా స్వంత కళ్లతో నేను దేవుణ్ణి చూస్తాను. సాక్షాత్తూ
దేవుణ్ణే, ఇంకెవరినీ కాదు. నాలో నా హృదయం
బలహీనం అవుతోంది.
28 "ఒకవేళ మీరు, 'మనం యోబును ఇబ్బంది పెడ్దాం,
అతణ్ణి నిందించటానికి ఏదైనా కారణం వెదుకుదాం'
అనుకోవచ్చును.
29 కానీ మీ మట్టుకు మీరే ఖడ్గానికి భయపడాలి.
ఎందుకంటే, పాపంమీద దేవుని కోపం శిక్షను
రప్పిస్తుంది. మిమ్మల్ని శిక్షించేందుకు యెహోవా
ఖడ్గం ప్రయోగిస్తాడు. అప్పుడు తీర్పు ఉంది అని
మీరు తెలుసుకొంటారు."

### జోఫరు జవాబు

20 అప్పుడు నయమాతీయుడైన జోఫరు ఇలా
జవాబిచ్చాడు:
2 "యోబూ! నా తలంపులు నాకు జవాబిస్తాయి.
నేను అనుకొంటున్నది ఏమిటో నేను త్వరపడి
నీకు చెప్పాలి.
3 మేము చెప్పిన దానికి నీవు ఇచ్చిన జవాబులు
మాకు అవమానకరంగా ఉన్నాయి. కానీ నేను
జ్ఞానం గలవాడను, నీకు ఎలా జవాబు ఇవ్వాలో
నాకు తెలుసు.
4-5 "మొట్ట మొదటిసారిగా ఆదాము భూమి మీద చేయ
బడినప్పటి నుండి ఒక దుర్మార్గుని సంతోషం
ఎక్కువ సేపు ఉండదు అనే విషయం చాలా
కాలంగా నీకు తెలిసిందే. దేవుని లక్ష్యపెట్టని వాని
ఆనందం కొంతసేపు మాత్రమే ఉంటుంది.
6 ఒకవేళ దుర్మార్గుని గర్వం ఆకాశాన్ని అంటవచ్చు.
అతని తల మేఘాలను తాకవచ్చు.
7 కానీ అతని స్వంత మలం పోయినట్లే అతడు
శాశ్వతంగా పోతాడు. అతన్ని ఎరిగిన ప్రజలు,
'అతడు ఎక్కడ?' అని అన్నారు.
8 ఒక కల వేగంగా ఎగిరిపోయినట్టు అతడు ఎగిరి
పోతాడు. ఏ మనిషీ మరల అతణ్ణి చూడడు. అతడు
పోయి ఉంటాడు. రాత్రి పూట పీడకలలా అతడు
విదిలించబడతాడు.
9 అతనిని చూచిన మనుష్యులు అతన్ని మరల
చూడరు అతని కుటుంబం అతన్ని మరల
ఎన్నడూ చూడదు.
10 దుర్మార్గుని పిల్లలు, పేదవారి దగ్గర అతడు తీసు
కొన్న వాటిని తిరిగి ఇచ్చివేస్తారు. దుర్మార్గుని స్వహ
స్తాలే తన ఐశ్వర్యాన్ని తిరిగి ఇచ్చివేయాలి.
11 అతడు యువకునిగా ఉన్నప్పుడు, అతని శరీరం
బలంగా ఉంది. కాని త్వరలోనే అది మట్టి అవు
తుంది.
12 "దుర్మార్గుని నోటిలో దుర్మార్గం తియ్యగా
ఉంటుంది. అతడు దానిని తన నాలుక కింద
దాచిపెడతాడు.

13 చెడ్డ మనిషి తన దుర్మార్గాన్ని అలాగే పెట్టుకొని
ఉంటాడు. దానిని పోనియ్యటం అతనికి అసహ్యం.
కనుక అతడు దానిని తియ్యని పదార్థంవలె తన
నోటిలో ఉంచుకొంటాడు.
14 కానీ అతని భోజనం అతని కడుపులో విషం అవు
తుంది. అది అతని లోపల చేదు విషంలా, పాము
విషంలా అవుతుంది.
15 దుష్టుడు ఐశ్వర్యం దిగమింగాడు. కానీ అతడు
వాటిని కక్కివేస్తాడు. అవును, దుష్టుని కడుపు
వాటిని కక్కివేసేట్టుగా దేవుడు చేస్తాడు.
16 దుష్టుడు పాముల విషం పీల్చుతాడు. పాము
కోరలు వానిని చంపివేస్తాయి.
17 అప్పుడు నదులు తేనెతో, వెన్నతో ప్రవహించటం
చూచి దుష్టుడు ఆనందించ లేడు.
18 దుష్టుడు తన లాభాలను ఇచ్చివేసేలా బలాత్కారం
చేయబడతాడు. అతని కష్టార్జితం అనుభవించ
టానికి అతనికి అనుమతి ఇవ్వబడదు.

19 దుష్టుడు పేద ప్రజలను సక్రమంగా చూడలేదు
గనుక. అతడు వారి విషయమై పట్టించుకోలేదు,
మరియు అతడు వారి వస్తువులను తీసుకొన్నాడు.
ఇంకెవరో కట్టిన ఇండ్లు అతడు తీసివేసుకొన్నాడు.
20 దుష్టునికి ఎన్నటికీ తృప్తిలేదు. వాని ఐశ్వర్యం వానిని
రక్షించలేదు.
21 అతడు భోజనం చేసినప్పుడు ఏమీ మిగలదు.
అతని విజయం కొనసాగదు:
22 దుర్మార్గునికి సమృద్ధిగా ఉన్నప్పటికీ అతడు
కష్టంతో కృంగిపోతాడు. అతని సమస్యలు అతని
మీదకు దిగి వస్తాయి.
23 దుర్మార్గుడు తనకు కావలసినదంతా తినివేసిన
తర్వాత దేవుడు తన కోపాన్ని ఆ మనిషి మీదకి
మళ్లిస్తాడు. దుర్మార్గుని మీద దేవుడు శిక్షా వర్షం
కురిపిస్తాడు.

24 ఒకవేళ దుర్మార్గుడు ఇనుప ఖడ్గం నుండి పారి
పోతాడేమో కానీ ఒక ఇత్తడి బాణం వానిని కూల
గొడుతుంది.
25 ఆ ఇత్తడి బాణం అతని శరీరం అంతటిలో గుచ్చు
కొని పోయి అతని వీపులో నుండి బయటకు
వస్తుంది. ఆ బాణం యొక్క మెరుపు కొన అతని
కాలేయంలో గుచ్చుకు పోతుంది. అతడు
భయంతో అదిరిపోతాడు.
26 అతని ఐశ్వర్యాలన్నీ నాశనం చేయబడుతాయి. ఏ
మనిషీ ఆరంభించని ఒక అగ్ని అతణ్ణి నాశనం
చేస్తుంది. అతని ఇంటిలో మిగిలివున్నదాన్ని అగ్ని
నాశనం చేస్తుంది.
27 దుర్మార్గుడు దోషి అని ఆకాశం రుజువు చేస్తుంది.
భూమి అతనికి విరోధంగా సాక్ష్యం ఇస్తుంది.
28 అతని ఇంట్లో ఉన్న సమస్తం దేవుని కోప ప్రవా
హంలో కొట్టుకొని పోతుంది.
29 దుర్మార్గానికి దేవుడు చేయాలని తలపెడుతోంది
అదే. దేవుడు వారికి ఇవ్వాలని తలస్తోంది అదే.”

### యోబు జవాబు

21 అప్పుడు యోబు ఇలా జవాబిచ్చాడు:
2 “నేను చెప్పేది వినండి. మీరు వినటమే మీరు
నాకు ఇచ్చే ఆదరణ.
3 నేను మాట్లాడేటప్పుడు ఓపిగ్గా ఉండండి. ఆ
తర్వాత నేను మాట్లాడటం ముగించాక మీరు
నన్ను గేళి చేయవచ్చు.
4 “నేను మనుష్యుల మీద ఆరోపణ చేయటం లేదు.
నేను ఓపికగా ఉండకపోవటానికి ఒక మంచి కారణం
ఉంది.
5 నన్ను చూచి, అదరిపొండి. మీ నోటిమీద చేయి
పెట్టుకొని అదురుతో నన్ను అలానే తేరి
చూడండి.
6 నాకు సంభవించిన దానిని గూర్చి తలచినప్పుడు
నేను భయపడతాను, నా శరీరం వణకుతుంది.
7 దుర్మార్గులు చాలాకాలం బతుకుతారెందుకు?
వారు ముసలివాళ్లవ్వటం, విజయం పొందటం
ఎందుకు?
8 దుర్మార్గులు వారితోబాటు వారి పిల్లలు ఎదగటం
చూస్తారు. దుర్మార్గులు వారి మనుమలు, మనుమ
రాండ్రను చూసేంత వరకు బతుకుతారు.
9 వారి ఇండ్లు భద్రంగా ఉన్నాయి. వారికి భయం
లేదు. దుర్మార్గులను శిక్షించడానికి దేవుడు తన
దండం ఉపయోగించడు.
10 వారి ఆబోతులు ఆవులను దాటటం తప్పవు.
వారి ఆవులకు దూడలు ఉన్నాయి. ఆ దూడలు
పుట్టినప్పుడు అవి ఎన్నడూ చావవు.
11 దుర్మార్గులు వారి పిల్లలు ఆడుకొనేందుకు గొర్రె
పిల్లల్లా బయటకు పంపిస్తారు. వారి పిల్లలు గంతులు
వేస్తారు.
12 స్వరమండలాలు, పిల్లనగ్రోవుల ధ్వనులతోబాటు
వారి పిల్లలు పాడుతూ, నాట్యం చేస్తారు.
13 దుర్మార్గులు వారి జీవితకాలంలో విజయం అనుభ
విస్తారు. అనగా వారు మరణించి, శ్రమ అనుభవించ
కుండానే తమ సమాధికి వెళ్తారు.
14 కానీ దుర్మార్గులు, దేవునితో ఇలా చెబుతారు,
‘మమ్మల్ని ఇలా విడిచిపెట్టండి, మేము ఏమి చేయా
లని మీరు కోరుతారో అది మాకు లెక్కలేదు’
అంటారు.
15 మరియు దుర్మార్గులు, ‘సర్వశక్తిమంతుడైన
దేవుడు ఎవరు? మేము ఆయనను సేవించాల్సిన

అవసరం లేదు. ఆయనకు ప్రార్థన చేసిన లాభం
లేదు' అంటారు.
16 "దుర్మార్గులు తమ మూలంగానే వారికి విజయం
కలుగుతుందని తలస్తారు. కానీ నేను వారి తలం
పును అంగీకరించను.
17 అయితే దుర్మార్గుల దీపం ఆర్పివేయబడటం
అనేది, ఎంత తరచుగా జరుగుతుంది? దుర్మార్గు
లకు ఎన్నిసార్లు కష్టం వస్తుంది? దేవుడు వారి
మీద కోపగించి వారిని శిక్షిస్తాడా?
18 గాలి గడ్డిని ఎగురగొట్టినట్టు, బలమైన గాలి ఊకను
ఎగురగొట్టినట్లు దేవుడు దుర్మార్గులను ఎగుర
గొట్టి వేస్తాడా?
19 'తండ్రి పాపాల మూలంగా దేవుడు అతని కుమా
రుణ్ణి శిక్షిస్తాడు' అని మీరంటారు. కాదు! ఆ దుర్మా
ర్గుడినే దేవుడు శిక్షించనివ్వండి. అప్పుడు ఆ దుర్మా
ర్గుడు తన స్వంత పాపాల కోసమే శిక్షించబడు
తున్నట్టు అతనికి తెలుస్తుంది.
20 పాపి తన స్వంత శిక్షను చూడాలి. సర్వశక్తిమంతు
డైన దేవుని కోపాన్ని అతడు అనుభవిస్తాడు.
21 దుర్మార్గుని జీవిత కాలం అయిపోయి, అతడు
చనిపోయినప్పుడు అతడు విడిచిపెడుతున్న తన
కుటుంబం విషయమై అతడు లెక్కచేయడు.

22 "దేవునికి ఎవరూ జ్ఞానం ఉపదేశించలేరు. ఉన్నత
స్థానాల్లో ఉండే మనుష్యులకు కూడ దేవుడు తీర్పు
తీరుస్తాడు.
23 ఒక వ్యక్తి నిండుగా, విజయవంతంగా జీవించాక
మరణిస్తాడు. అతడు పూర్తిగా క్షేమం, సుఖం ఉన్న
జీవితం జీవించాడు.
24 అతని శరీరం బాగా పోషించబడింది, అతని ఎము
కలు మూలుగతో యింకా బలంగా ఉన్నాయి
25 అయితే మరో మనిషి కష్టతరంగా జీవించి, వేదన
గల ఆత్మతో మరణిస్తాడు. అతడు మంచిది
ఎన్నడూ, ఏదీ అనుభవించలేదు.
26 వీళ్లిద్దరూ ఒకే చోట దుమ్ములో పండుకొని
ఉంటారు. వాళ్లిద్దర్నీ పురుగులు పట్టేస్తాయి.
27 "కానీ మీరు ఏమి ఆలోచిస్తున్నారో నాకు తెలుసు.
మరియు మీరు నాకు అపకారం చేయాలని
తలపెడుతున్నారని నాకు తెలుసు.
28 యువరాజు ఇల్లు ఎక్కడ?' దుర్మార్గుడు నివసించిన
ఆ ఇల్లు ఏది?, అని మీరు అంటారు.
29 "కానీ ప్రయాణం చేసే మనుష్యులను మీరు
ఎన్నడూ అడగలేదు. వారి కథలను మీరు అంగీ
కరించనూ లేదు.
30 విపత్తు కలిగినప్పుడు దుర్మార్గులు వదలిపెట్ట
బడుతారు. ఏ రోజు దేవుడు కోపంతో శిక్షిస్తాడో
ఆ రోజు వాళ్లు రక్షింపబడతారు.
31 దుర్మార్గుడు చేసిన దుర్మార్గాన్ని గూర్చి దుర్మార్గుని
ముఖంమీదే అతణ్ణి విమర్శించే వ్యక్తి ఎవ్వడూ
లేడు. అతడు చేసిన కీడుకు అతనిని ఎవ్వరూ
శిక్షించరు.
32 దుర్మార్గుడు సమాధికి మోసికొని పోబడినప్పుడు
ఒక కాపలావాడు అతని సమాధి దగ్గర నిలుస్తాడు.
33 ఆ దుర్మార్గునికి లోయలోని మట్టి తియ్యగా
ఉంటుంది. వాని చావు ఊరేగింపులో వేలాది మంది
ఉంటారు.
34 "అందుచేత మీ వట్టి మాటలతో మీరు నన్ను
ఆదరించలేరు. మీ జవాబులు ఇంకా అబద్ధాలే!"

### ఎలీఫజు జవాబు

22 అప్పుడు తేమానువాడైన ఎలీఫజు జవాబు
యిచ్చాడు:

2 "దేవునికి నరుడు ఉపకారికాగలడా? జ్ఞానం గల వ్యక్తి
తప్పక తనకు తానే ఉపయోగికారిగా వుంటాడు.
3 ఒకవేళ నీవు సక్రమమయినదే చేసినప్పటికీ, సర్వ
శక్తిమంతుడైన దేవునికి అది సంతోషం కలిగించదు.
నీవు ఎల్లప్పుడూ మంచివాడివిగానే వున్నా దేవునికి
ఏమీ లాభంలేదు.
4 "యోబూ, దేవుడు నిన్ను శిక్షించినది ఆయనను
నీవు ఆరాధించినందుకా?
5 కాదు, అది నీవు విస్తారంగా పాపం చేసినందువల్లనే.
యోబూ, నీ పాపాలు ఎప్పటికీ నిలిచిపోవు.
6 యోబూ, నీ సోదరులు నీకు ఋణపడి ఉన్న
ధనాన్ని నీకు తిరిగి చెల్లించేందుకు నీవు వారిని
బలవంతం చేశావు. అది కారణం లేకుండా నీవు
చేశావు. ప్రజల దగ్గర్నుండి వస్త్రాలు నీవు లాగేసు
కొని, వారు ధరించటానికి ఏమీ లేకుండా చేశావు.
7 అలసిపోయిన మనుష్యులకు నీవు నీళ్లు ఇవ్వలేదు.
ఆకలిగొన్న మనుష్యులకు నీవు అన్నం పెట్టలేదు.
8 యోబూ! నీవు అధికారం, ఐశ్వర్యం గలవాడవై
నప్పటికీ నీవు ఆ ప్రజలకు సహాయం చేయలేదు.
నీకు చాలా భూమి ఉంది, నీవు చాలా గౌరవం
పొందినవాడవు.
9 కాని విధవలకు నీవు ఏమీ ఇవ్వకుండానే వారిని
పంపించివేశావు. యోబూ! అనాథ పిల్లలను నీవు
దోచుకొని నీవు వారి యెడల చెడుగా ప్రవ
ర్తించావు.
10 అందుకే నీ చుట్టూరా బోనులు ఉన్నాయి.
మరియు ఆకస్మిక కష్టం నిన్ను భయపెడుతుంది.
11 అందుకే నీవు చూడలేనంత కటిక చీకటిగా ఉంది.
మరియు అందుకే నీళ్ల ప్రవాహం నిన్ను కప్పేస్తుంది.
12 "ఆకాశంలో అతి ఉన్నత స్థానంలో దేవుడు
నివసిస్తాడు. మహా ఎత్తయిన నక్షత్రాలను దేవుడు

వంగి కిందికి చూస్తాడు. నక్షత్రాలు ఎంత ఎత్తుగా
ఉన్నాయో నీవు చూడగలవు.
13 కాని యోబూ, 'నీవు దేవునికి ఏమీ తెలియదు!
అంధకార మేఘాల్లోంచి దేవుడు మాకు ఎలా తీర్పు
తీరుస్తాడు?
14 ఆయన ఆకాశపు అత్యున్నత స్థానంలో నడిచే
టప్పుడు మనం చూడకుండా మేఘాలు ఆయ
నను కప్పివేస్తాయి.' అని అంటావు.
15 "యోబూ! దుర్మార్గులు తిరిగే పాత మార్గంలోనే
నీవు నడుస్తున్నావు.
16 దుర్మార్గులు మరణించాల్సిన సమయం రాకముందే
వారు తీసుకోబడ్డారు. ఒక వరదలో వారు కొట్టు
కొని పోయారు.
17 'మమ్మల్ని ఒంటరిగా విడిచిపెట్టండి. సర్వశక్తి
మంతుడైన దేవుడు మమ్మల్ని ఏమీ చేయలేడు'
అని దేవునితో చెప్పేవాళ్లు ఆ మనుష్యులే.
18 కానీ ఆ మనుష్యులనే దేవుడు విజయం పొందిన
ధనికులుగా చేశాడు. దుర్మార్గులు తలచే పద్ధతి
నేను అంగీకరించలేను.
19 దుర్మార్గులు నాశనం అయినప్పుడు మంచివాళ్లు
చూచి సంతోషిస్తారు. నిర్దోషులు దుర్మార్గులను
చూచి నవ్వుతూ,
20 'మన శత్రువులు నిజంగా నాశనం చేయబడ్డారు.
వారి ఐశ్వర్యాలను అగ్ని కాల్చేస్తుంది' అని
అంటారు.

21 "యోబూ, నిన్ను నీవు దేవునికి అప్పగించుకో.
అప్పుడు నీకు ఆయనతో శాంతి ఉంటుంది. ఇలా
నీవు చేస్తే, నీవు ధన్యుడవవుతూ, విజయం పొందు
తావు.
22 ఈ ఉపదేశము స్వీకరించి ఆయన మాటలు నీ
హృదయంలో భద్రం చేసికో.
23 యోబూ! సర్వశక్తిమంతుడైన దేవుని దగ్గరకు నీవు
తిరిగి వస్తే, నీకు మరల మామూలు స్థితి ఇవ్వ
బడుతుంది. నీవు మాత్రం దుర్మార్గాన్ని నీ ఇంటి
నుండి దూరంగా తొలగించి వేయాలి.
24 నీ బంగారాన్ని నీవు మట్టిపాలు చేయాలి, ఓఫీరు
నుండి తెచ్చిన నీ బంగారాన్ని నదుల్లోని బండలకేసి
విసిరికొట్టు.
25 సర్వశక్తిమంతుడైన దేవుడే నీకు బంగారంగాను,
వెండిగాను ఉండనియ్యి.
26 అప్పుడు నీవు ఎంతో సంతోషిస్తావు. సర్వశక్తి
మంతుడైన దేవునిలో ఆనందం కనుగొంటావు.
నీవు నీ ముఖాన్ని దేవుని వైపు ఎత్తగలవు.
27 నీవు ఆయనను ప్రార్థించినప్పుడు ఆయన నీ
ప్రార్థన వింటాడు. నీవు ఏం చేస్తానని ఆయనకు
ప్రమాణం చేస్తావో దానిని నీవు చేస్తావు.
28 నీవు చేసే ప్రతి దానిలో విజయం పొందుతావు.
నీ త్రోవలో వెలుగు ప్రకాశిస్తుంది
29 గర్విష్ఠులను దేవుడు సిగ్గు పరుస్తాడు కానీ దీనులను
దేవుడు రక్షిస్తాడు.
30 నిర్దోషి కాని మనిషిని కూడా దేవుడు రక్షిస్తాడు. నీ
చేతుల పవిత్రత మూలంగా అతడు రక్షించ
బడతాడు."

### యోబు జవాబు

23 అప్పుడు యోబు ఇలా జవాబు ఇచ్చాడు:
2 "ఈవేళ నేను ఇంకా కోపంగా ఆరోపిస్తూనే ఉన్నాను.
దేవుడు నన్ను కఠినంగా శిక్షిస్తున్నాడు, కనుక నేను
ఆరోపిస్తూనే ఉంటాను.
3 దేవునిని ఎక్కడ వెదకాలో ఆయన యొద్దకు ఎలా
వెళ్లాలో నాకు తెలిస్తే బాగుండేది, అని నా ఆశ.
4 నేను దేవునికి నా గాథ వివరించుకొంటాను. నేను
నిర్దోషిని అని చూపించటంకోసం నా నోరు వాదా
లతో నిండిపోతుంది.
5 నా వాదాలకు దేవుడు ఎలా జవాబు ఇస్తాడో నేను
తెలిసికోవాలని కోరుతున్నాను. అప్పుడు నేను
దేవుని జవాబులు గ్రహిస్తాను.
6 దేవుడు గొప్ప శక్తితో నాకు విరోధంగా ఉంటాడా?
లేదు, ఆయన నా మాట వింటాడు!
7 అక్కడ, దేవుని యెదుట ఒక మంచి మనిషి తన
గాథను దేవునికి వివరించవచ్చును. అప్పుడు నా
న్యాయమూర్తి నన్ను విముక్తుణ్ణి చేయవచ్చును.
8 "కానీ నేను తూర్పుకు వెళ్తే దేవుడు అక్కడ లేడు.
ఒకవేళ నేను పడమటికి వెళ్తే ఇంకా దేవుడు నాకు
కనబడలేదు.
9 దేవుడు ఉత్తరాన పని చేస్తున్నప్పుడు నాకు ఆయన
కనబడడు. దేవుడు దక్షిణంగా తిరిగినప్పుడు ఇంకా
ఆయన నాకు కనబడడు.
10 కానీ నేను వేసే ప్రతి అడుగూ దేవునికి తెలుసు.
ఆయన నన్ను పరీక్షించటం ముగించినప్పుడు
నాలో మైల ఏమీ లేనట్టుగా ఆయన చూస్తాడు.
నేను స్వచ్ఛమైన బంగారంలా ఉన్నట్టు ఆయన
చూస్తాడు.
11 నేను ఎల్లప్పుడూ దేవుడు కోరిన మార్గంలోనే
నడిచాను. దేవుని మార్గం అనుసరించకుండా నేను
ఎన్నడూ తిరిగిపోలేదు.
12 దేవుడు ఆజ్ఞాపించే వాటినే నేను ఎల్లప్పుడూ
చేస్తాను. నా భోజనం కంటే దేవుని నోటినుండి
వచ్చే మాటలు నాకు ఇష్టం.
13 "కానీ దేవుడు ఎన్నటికీ మారడు. ఏ మనిషీ ఆయ
నకు విరోధంగా నిలబడలేడు. దేవుడు అనుకొన్నది
ఆయన చేస్తాడు.

14 దేవుడు నాకు వ్యతిరేకంగా ఏమి పథకం వేశాడో
దాన్ని ఆయన చేస్తాడు. నా కోసం ఆయనకు
ఇంకా ఎన్నో పథకాలు ఉన్నాయి.
15 అందుకే నేను దేవుని ఎదుట జీవిస్తూ ఉండగా
నేను భయపడతాను. వీటన్నింటిని గూర్చి నేను
తలచినప్పుడు దేవునికి నేను భయపడతాను.
16 దేవుడు నా హృదయాన్ని బలహీనం చేస్తాడు.
నేనేమో నా ధైర్యం కోల్పోతాను. సర్వశక్తిమంతు
డైన దేవుడు నన్ను భయపెడతాడు.
17 కానీ చీకటి నేను మౌనంగా ఉండేటట్టు చేయదు.
గాఢాంధకారం నా ముఖాన్ని కప్పేస్తుంది.

24 "సర్వశక్తిమంతుడైన దేవుడు న్యాయవిచారణ
కోసం ఒక సమయాన్ని ఎందుకు నిర్ణ
యించడు? దేవునికి విధేయులయ్యే మనుష్యులు ఆ
న్యాయవిచారణ సమయం కోసం అనవసరంగా
ఎందుకు వేచి ఉండాలి?"

2 "మనుష్యులు తమ పొరుగు వారి భూమిని ఆక్ర
మించేందుకు సరిహద్దు రాళ్లను జరిపివేస్తారు. మను
ష్యులు మందలను దొంగిలించి ఇతర పచ్చిక బయ
ళ్లకు వాటిని తోలుకొని పోతారు.
3 అనాథల గాడిదను వారు దొంగిలిస్తారు. ఒక విధవ
వారి బాకీ తీర్చేంత వరకు ఆమె యొక్క ఆవును
వారు తోలుకొని పోతారు.
4 ఇల్లు లేకుండా ఒక చోటు నుండి మరో చోటికి
సంచారం చేసేటట్టు ప్రజలను వారు బలవంతం
చేస్తారు. పేద ప్రజలంతా ఈ దుర్మార్గుల బారి
నుండి దాగుకొనేలా బలవంతం చేయబడుతారు.
5 "అరణ్యంలో ఆహారం కోసం వెదకులాడే అడవి
గాడిదలా ఉన్నారు ఈ పేద ప్రజలు. పేద ప్రజలకూ
వారి పిల్లలకూ ఎడారి ఆహారమును ఇస్తుంది.
6 పేద ప్రజలు ఇంకెంత వరకు వారి స్వంతం కాని
పొలాలలో గడ్డి, గడ్డిపరకలు కూర్చుకోవాలి?
దుర్మార్గుల ద్రాక్షా తోటల నుండి వారు పండ్లు
ఏరుకొంటారు.
7 పేద ప్రజలు బట్టలు లేకుండానే రాత్రిపూట వెళ్ల
బుచ్చాలి. చలిలో వారు కప్పుకొనేందుకు వారికి
ఏమీ లేదు.
8 కొండల్లోని వర్షానికి వారు తడిసిపోయారు. వాతా
వరణం నుండి వారిని వారు కాపాడుకొనేందుకు
వారికి ఏమీ లేదు కనుక వారు పెద్ద బండలకు
దగ్గరలో ఉండాలి.
9 దుర్మార్గులు తండ్రిలేని బిడ్డను తల్లి దగ్గర నుండి
లాగివేసుకొంటారు. పేద మనిషియొక్క బిడ్డను
వారు తీసివేసుకొంటారు. పేద మనిషి బాకీపడి
ఉన్న దానిని చెల్లించటం కోసం దుర్మార్గులు ఆ
చిన్న బిడ్డను బానిసగా చేస్తారు.
10 పేద ప్రజలకు బట్టలు లేవు. కనుక వారు దిగంబ
రులుగా పని చేస్తారు. దుర్మార్గుల కోసం వారు
పనలు మోస్తారు. కానీ పేద ప్రజలు ఇంకా ఆకలి
తోనే ఉంటారు.
11 పేద ప్రజలు ఒలీవ నూనె పిండుతారు. వారు
ద్రాక్షాగానుగను తిప్పుతారు. కానీ వారు ఇంకా
దాహంతోనే ఉంటారు.
12 మరణిస్తున్న మనుష్యులు చేస్తున్న విచారకరమైన
శబ్దాలు పట్టణంలో వినిపిస్తున్నాయి. బాధించబడిన
మనుష్యులు సహాయం కోసం అరుస్తున్నారు. కానీ
దేవుడు వినటం లేదు.
13 "వెలుగు మీద తిరుగుబాటు చేసే మనుష్యులు
ఉన్నారు. వారు ఏమి చేయాలని దేవుడు కోరుతు
న్నాడో తెలుసుకోవటం వారికి ఇష్టం లేదు. వారు
దేవుని మార్గంలో నడవరు.
14 నరహంతకుడు ఉదయాన్నే లేచి పేద ప్రజలను,
అక్కరలో ఉన్న ప్రజలను చంపుతాడు. రాత్రివేళ
అతడు దొంగగా మారిపోతాడు.
15 వ్యభిచారం చేసే వాడు రాత్రి కోసం వేచి ఉంటాడు.
'నన్ను ఎవ్వరూ చూడడం లేదు' అని అతడు
అనుకొంటాడు. కనుక అతడు తన ముఖం కప్పు
కొంటాడు.
16 రాత్రి వేళ చీకటిగా ఉన్నప్పుడు దుర్మార్గులు ఇళ్లలో
చొరబడతారు. కానీ పగటివేళ వారు వారి స్వంత
ఇళ్లలో దాగుకొంటారు. వెలుగును వారు తప్పించు
కొంటారు.
17 ఆ దుర్మార్గులకు చీకటి ఉదయంలా ఉంటుంది.
చీకటి దారుణాలకు వారు స్నేహితులు.
18 "కాని వరద నీటిపైనున్న నురగవలె దుర్మార్గులు
తీసుకొని పోబడతారు. వారి స్వంత భూమి శపించ
బడింది. కనుక ద్రాక్షా తోటలలో ద్రాక్షాపండ్లు
కోసే పనికి వారు వెళ్లరు.
19 వేడిగా, పొడిగా ఉండే గాలి శీతాకాలపు మంచు
నీళ్లను తొలగించి వేస్తుంది. అదే విధంగా దుర్మా
ర్గులు కూడా తీసుకొని పోబడతారు.
20 దుర్మార్గుడు చనిపోయినప్పుడు అతని స్వంత తల్లి
సహితం వానిని మరచిపోతుంది. దుర్మార్గుని శరీ
రాన్ని పురుగులు తినివేస్తాయి. అతడు ఇంకెంత
మాత్రం జ్ఞాపకం చేసికోబడడు. దుర్మార్గులు పడి
పోయిన ఒక చెట్టులా నాశనం చేయబడతారు.
21 దుర్మార్గులు గొడ్రాలికి అక్రమాలు చేస్తారు. పిల్లలు
లేని స్త్రీని వారు బాధిస్తారు. వారు విధవరాలికి
దయ చూపెట్టరు.
22 కానీ బలంగల మనుష్యులను నాశనం చేసేందుకు
దేవుడు తన శక్తిని ఉపయోగిస్తాడు. బలంగల మను
ష్యులు శక్తిమంతులవుతారు. కాని వారి స్వంత
జీవితాలను గూర్చిన నమ్మకం వారికి లేదు.

23 ఒకవేళ దేవుడు శక్తిగల మనుష్యులను కొద్ది కాలం
వరకు క్షేమంగా ఉండనిస్తాడేమో కాని దేవుడు వారిని
ఎల్లప్పుడూ గమనిస్తూనే ఉంటాడు.
24 కొద్ది కాలం పాటు దుర్మార్గులు విజయం సాధి
స్తారు. ఆ తరువాత వారు అంతమై పోతారు. మను
ష్యులందరిలాగే వారూ ఒక చోట చేర్చబడతారు.
తర్వాత వారు కోసివేయబడిన ధాన్యపు గింజల్లా
మరణిస్తారు.
25 "ఈ విషయాలు సత్యం కాకపోతే, నేను అబద్ధం
చెప్పానని ఎవరు రుజువు చేయగలరు?" నా
మాటలు వట్టివి అని ఎవరు చెప్పగలరు?

### యోబుకు బిల్దదు జవాబు

25 అప్పుడు షూహీయుడైన బిల్దదు ఇలా జవాబు
ఇచ్చాడు:

2 "దేవుడే పాలకుడు. ప్రతి మనిషీ దేవునికి భయపడి
గౌరవించాలి. దేవుడు తన పరలోక రాజ్యాన్ని
శాంతిగా ఉంచుతాడు.
3 దేవుని దూతలను ఏ మనిషీ లెక్కించలేడు. దేవుని
సూర్యుడు మనుష్యులందరి మీద ఉదయిస్తాడు.
4 కానీ దేవుని ఎదుట ఒక మనిషి నిజంగా మంచి
వాడుగా ఉండలేడు. స్త్రీకి జన్మించిన మనిషి నిజంగా
పరిశుద్ధంగా ఉండలేడు.
5 దేవుని దృష్టికి చంద్రుడు కూడా ప్రకాశంగా
ఉండడు. దేవుని దృష్టికి నక్షత్రాలు పరిశుద్ధంగా
లేవు.
6 మనిషి అంతకంటే తక్కువ. మనిషి మట్టి పురుగు
లాంటివాడు. పనికి మాలిన పురుగులాంటివాడు!"

### బిల్దదుకు యోబు జవాబు

26 అప్పుడు యోబు ఇలా జవాబు ఇచ్చాడు:

2 "బిల్దదూ, జోఫరూ, ఎలీఫజూ మీరు బలహీనులైన
మనుష్యులకు నిజంగా సహాయం చేయగలరు.
అవును, మీరు నన్ను ప్రోత్సహించారు. బలహీనమైన
నా చేతులను మీరు తిరిగి బలం గలవిగా చేసారు.
3 అవును, జ్ఞానంలేని మనిషికి మీరు అద్భుతమైన
సలహా ఇచ్చారు. మీరు చాలా జ్ఞానం ప్రదర్శించారు.
4 ఈ సంగతులు చెప్పటానికి మీకు ఎవరు సహాయం
చేశారు. ఎవరి ఆత్మ మిమ్మల్ని ప్రేరేపించింది?
5 "మరణించిన వారి ఆత్మలు భూమి కింద నీళ్లలో
విలవిల్లాడుతున్నాయి.
6 మరణ స్థలం దేవుని దృష్టికి బాహాటం. దేవునికి
మరణం మరుగు కాదు.
7 ఉత్తర ఆకాశాన్ని శూన్య అంతరిక్షంలో దేవుడు
విస్తరింపజేశాడు. దేవుడు భూమిని శూన్యంలో
వేలాడతీశాడు.
8 మేఘాలను దేవుడు నీళ్లతో నింపుతున్నాడు. కానీ
నీటి భారం మూలంగా మేఘాలు బద్దలు కాకుండా
దేవుడు చూస్తాడు.
9 పున్నమి చంద్రుని దేవుడు కప్పివేస్తాడు. దేవుడు
తన మేఘాలను చంద్రుని మీద విస్తరింపచేసి,
దానిని కప్పుతాడు.
10 మహా సముద్రం మీది ఆకాశపు అంచులను చీకటి
వెలుగులకు మధ్య సరిహద్దుగా దేవుడు చేస్తాడు.
11 ఆకాశాలను ఎత్తిపట్టు పునాదులను దేవుడు
బెదిరించగా అవి భయంతో వణకుతాయి.
12 దేవుని శక్తి సముద్రాన్ని నిశ్శబ్దం చేస్తుంది. దేవుని
జ్ఞానము రాహాబు సహాయకులను నాశనం చేసింది.
13 దేవుని శ్వాస ఆకాశాలను తేటపరుస్తుంది. తప్పించు
కోవాలని ప్రయత్నించిన సర్పాన్ని దేవుని హస్తం
నాశనం చేస్తుంది.
14 దేవుని శక్తిగల కార్యాల్లో ఇవి కొన్ని మాత్రమే.
దేవుని నుండి ఒక చిన్న స్వరం మాత్రమే మనం
వింటాం. కానీ దేవుడు ఎంత గొప్పవాడో, శక్తి
గలవాడో ఏ మనిషీ నిజంగా అర్థం చేసుకోలేడు."

27 అప్పుడు యోబు మాట్లాడటం కొన
సాగించాడు:
2 "నిజంగా దేవుడు జీవిస్తున్నాడు. మరియు దేవుడు
జీవించటం ఎంత సత్యమో ఆయన నాకు
అన్యాయం చేశాడు. అనటం కూడ అంతే సత్యం.
అవును, సర్వశక్తిమంతుడైన దేవుడు నా జీవితాన్ని
బాధించాడు.
3 కానీ నాలో జీవం ఉన్నంతవరకు దేవుని జీవ
వాయువు నా నాసికా రంధ్రాలలో ఉన్నంతవరకు,
4 నా పెదవులు చెడు సంగతులు మాట్లాడవు.
మరియు నా నాలుక ఎన్నడూ ఒక్క అబద్ధం
చెప్పదు.
5 మీదే సరి అని నేను ఎన్నటికీ అంగీకరించను.
నేను నిర్దోషిని అని నేను చచ్చే రోజువరకు చెబు
తూనే ఉంటాను.
6 నేను చేసిన సరియైన వాటిని నేను గట్టిగా పట్టు
కొని ఉంటాను. సరియైన వాటిని చేయటం నేను
ఎన్నటికీ మాని వేయను. నేను బతికి ఉన్నంత
కాలం నా మనస్సాక్షి నన్ను బాధించదు.

7 "ప్రజలు నాకు వ్యతిరేకులయ్యారు. నా శత్రువులు
దుర్మార్గులు శిక్షించబడినట్లు శిక్షించబడుదురు గాక.
8 దేవుని లక్ష్యపెట్టని మనిషి చనిపోయినప్పుడు
అతనికి ఆశ ఏమీ ఉండదు. అతని జీవాన్ని దేవుడు
తీసివేసినప్పుడు అతనికి ఆశ లేదు.
9 ఆ దుర్మార్గునికి కష్టాలు వచ్చి, దేవునికి మొరపెడితే
దేవుడు వినడు.

10 సర్వశక్తిమంతుడైన దేవుడు ఇచ్చే సంతోషాన్ని ఆ వ్యక్తి కోరుకొని ఉండాల్సింది. ఆ వ్యక్తి సదా దేవుని ప్రార్థించి ఉండాల్సింది.

11 "దేవుని శక్తిని గూర్చి నీకు నేను నేర్పిస్తాను. సర్వ శక్తిమంతుడైన దేవుని పథకాలను నేను దాచి పెట్టను.
12 దేవుని శక్తిని మీరు మీ కళ్లారా చూశారు. కనుక మీరు అలాంటి పనికిమాలిన మాటలు ఎందుకు చెబుతారు?
13 దుర్మార్గులకు దేవుడు తలపెట్టినది ఇదే. సర్వ శక్తిమంతుడైన దేవుని నుండి క్రూర మానవులకు లభించేది ఇదే.
14 ఒకవేళ దుర్మార్గునికి చాలామంది పిల్లలు ఉండ వచ్చునేమో కాని వాని పిల్లలు యుద్ధంలో చంపి వేయబడతారు. దుర్మార్గుని పిల్లలు తినేందుకు సరిపడినంత ఆహారం ఎన్నడూ ఉండదు.
15 దుర్మార్గుడు చనిపోయిన తర్వాత అతని పిల్లలు ఇంకా బతికి ఉంటే భయంకర రోగం వారిని చంపే స్తుంది. అతని కుమారుల విధవలు వారి కోసం విచారించరు.
16 ఒకవేళ దుర్మార్గుడు దుమ్ములా విస్తారమైన వెండిని రాశిగా పోయవచ్చు. ఒకవేళ మట్టి పోగుల్లా అతనికి చాలా బట్టలు ఉండవచ్చును.
17 దుర్మార్గుడు సంపాదిస్తూ విడిచిపోయిన బట్టలను ఒక మంచి మనిషి ధరిస్తాడు. దుర్మార్గుని వెండిని నిర్దోషులు పంచుకొంటారు.
18 దుర్మార్గుడు నిర్మించే యిల్లు ఎక్కువ కాలం నిలువదు. అది సాలె గూడులా ఉంటుంది లేక కావలివాని గుడారంలా ఉంటుంది.
19 దుర్మార్గుడు ధనికునిగా నిద్రకు ఉపక్రమిస్తాడు. కానీ ఆ తర్వాత అతను కళ్లు తెరిచినప్పుడు అతని సంపదంతా పోయినట్లు అతనికి తెలుస్తుంది.
20 ఆకస్మిక వరదలా భయాలు అతణ్ణి పట్టు కొంటాయి. రాత్రి వేళ ఒక తుఫాను అతణ్ణి కొట్టు కొని పోతుంది.
21 తూర్పుగాలి అతణ్ణి కొట్టుకొని పోతుంది. అప్పుడు అతడు అంతమై పోతాడు. తుఫాను అతణ్ణి అతని యింటినుండి తుడుచుకుని పోతుంది.
22 తుఫాను బలం నుండి దుర్మార్గుడు పారిపోవాలని ప్రయత్నిస్తున్నాడు. కానీ తుఫాను అతణ్ణి నిర్దాక్షి ణ్యంగా కొడుతుంది.
23 దుర్మార్గుడు పారిపోతూ ఉండగా మనుష్యులు చప్పట్లు కొడతారు. దుర్మార్గుడు తన యింటి నుండి పారిపోతూంటే, వానికి విరోధంగా వాళ్లు ఈల వేస్తారు.

28 "మనుష్యులకు వెండి లభించే గనులు ఉన్నాయి. మనుష్యులు బంగారాన్ని కరిగించి, దానిని శుభ్రం చేసే స్థలాలు ఉన్నాయి.
2 మనుష్యులు భూమినుండి ఇనుమును తవ్వుతారు. బండల నుండి రాగి కరిగించబడుతుంది.
3 పనివాళ్లు గుహల్లోకి దీపం తీసుకొని వస్తారు. ఆ గుహల్లో లోపలికి వారు వెదుకుతారు. లోపలి చీకటిలో బండల కోసం వారు వెదుకుతారు.
4 మనుష్యులు నివసించే చోటికి దూరంగా పనివాళ్లు గోతులు తవ్వుతారు. మరి ఏ మనిషీ కూడ గోతులను ఎన్నడూ తాకలేదు. పనివాడు లోతైన ఆ గోతుల్లోనికి తాళ్లతో దిగేటప్పుడు అతడు యితరులకు చాలా దూరంలో ఉంటాడు.
5 భూమిపై నుండి ఆహారం వస్తుంది. కానీ భూమి కింద, వస్తువులను మంట మార్చివేసినట్టు, అది మార్చివేయబడుతుంది.
6 నేలక్రింద బండలలో నీల రత్నాలు లభ్యమ వుతాయి. నేల కింద మట్టిలో బంగారం ఉంది.
7 ఆహారం కోసం జంతువులను తినే పక్షులకు భూమి కింద మార్గాలు తెలియవు. డేగ కూడా ఈ మార్గం చూడదు.
8 క్రూర మృగాలు ఈ మార్గంలో నడవలేదు. సింహాలు ఈ మార్గంలో పయనించలేదు.
9 పనివాళ్లు కఠిన శిలలను తవ్వుతారు. ఆ పనివాళ్లు పర్వతాలను తవ్వి, వాటిని ఖాళీ చేస్తారు.
10 పనివాళ్లు బండల్లోనుంచి సొరంగాలు తవ్వుతారు. బండల్లోని ఐశ్వర్యాలు అన్నింటినీ వాళ్లు చూస్తారు.
11 నీళ్లు ప్రవహించకుండా నిలిపేందుకు పనివాళ్లు ఆన కట్టలు కడతారు. దాగి ఉన్న వాటిని వారు వెలుగు లోనికి తీసికొని వస్తారు.
12 "అయితే మనిషికి జ్ఞానం ఎక్కడ దొరుకుతుంది? గ్రహించటం ఎలా అనేది నేర్చుకొనేందుకు మనం ఎక్కడికి వెళ్లాలి?
13 జ్ఞానం చాలా అమూల్యమయిందని మనుష్యులు గ్రహించరు. భూమి మీద నివసించే మనుష్యులకు జ్ఞానం లేదు.
14 'జ్ఞానం నాలో లేదు' అని అగాధ మహాసముద్రం అంటుంది. 'జ్ఞానం నా దగ్గరా లేదు' అని సముద్రం అంటుంది.
15 అతి ఖరీదైన బంగారంతో జ్ఞానం కొనలేము. జ్ఞానం ఖరీదు వెండితో లెక్క కట్టబడజాలదు.
16 ఓఫీరు బంగారంతో గాని, విలువైన గోమేధికంతో గాని, నీలంతో గాని అది కొనబడేది కాదు.
17 బంగారం, స్ఫటికం కంటే జ్ఞానం విలువైనది. బంగా రంతో చేయబడిన చాలా ఖరీదైన నగలతో జ్ఞానం కొనబడజాలదు.

18 జ్ఞానం పగడాలకంటె, పచ్చలకంటె విలువగలది. జ్ఞానం కెంపులకంటె ఖరీదైనది.
19 ఇథియోపియా (కూషు) దేశపు పుష్యరాగం జ్ఞానం కంటె విలువైనది కాదు. మేలిమి బంగారంతో మీరు జ్ఞానమును కొనలేరు.
20 “అలాగైతే జ్ఞానం కనుగొనాలంటే మనం ఎక్కడికి వెళ్లాలి? అవగాహన చేసికోవటం నేర్చుకోనేందుకు మనం ఎక్కడికి వెళ్లాలి?
21 భూమి మీద ప్రతి మనిషి నుండీ జ్ఞానం దాచ బడింది. ఎత్తుగా ఆకాశంలో ఉన్న పక్షులు కూడా జ్ఞానాన్ని చూడలేవు.
22 ‘మేము జ్ఞానమును గూర్చిన ప్రచారం మాత్రమే విన్నాం’ అని మరణం, నాశనం చెబుతాయి.

23 “కానీ జ్ఞానానికి మార్గం దేవునికి మాత్రమే తెలుసు. జ్ఞానం ఎక్కడ నివసిస్తుందో దేవునికి తెలుసు.
24 భూదిగంతాలకు గల మొత్తం మార్గాన్ని దేవుడు చూస్తాడు గనుక ఆయనకు జ్ఞానం తెలుసు. ఆకాశాల కింద ఉన్న సర్వాన్ని దేవుడే చూస్తాడు.
25 గాలికి దాని శక్తిని దేవుడు ఇచ్చినప్పుడు, మహా సముద్రాలు ఎంత పెద్దవిగా ఉండాలో ఆయన నిర్ణయించినప్పుడు,
26 వర్షాన్ని ఎక్కడ కురిపించాలి, ఉరుముల తుఫానులు ఎటువైపుగా వెళ్లాలి అని దేవుడు నిర్ణయించి నప్పుడు
27 అది దేవుడు జ్ఞానాన్ని చూచిన సమయం, జ్ఞానం యొక్క విలువ ఎంతో చూచేందుకు దానిని పరీక్షించిన సమయం అవుతుంది. జ్ఞానాన్ని దేవుడు నిర్ధారణ చేశాడు.
28 “యెహోవాకు భయపడి, ఆయనను గౌరవించటం జ్ఞానం అవుతుంది. చెడు సంగతుల నుండి తప్పుకోవటం అవగాహన అవుతుంది” అని దేవుడు ప్రజలతో చెప్పాడు.

### యోబు తన మాటలు కొనసాగించటం

29 యోబు మాట్లాడటం కొనసాగించాడు. యోబు ఇలా అన్నాడు:
2 “దేవుడు నన్ను కాపాడి, నా విషయం జాగ్రత్త తీసుకొన్న ఇటీవలి మాసాల్లో ఉన్నట్టుగానే నా జీవితం ఉంటే బాగుండునని నేను ఆశిస్తున్నాను.
3 నేను చీకటిలో నడచినప్పుడు నాకు వెలుగు ఇచ్చుటకు నా తలమీద దేవుని వెలుగు ప్రకాశించే సమయం వస్తే బాగుండునని నేను ఆశిస్తున్నాను. (నేను జీవించవలసిన సరియైన మార్గాన్ని దేవుడు నాకు చూపించాడు).
4 నా జీవితం ఎంతో విజయవంతంగా ఉండి దేవుడు నాకు సన్నిహితమైన స్నేహితునిగా ఉండే రోజుల కోసం నేను ఆశిస్తున్నాను. అవి దేవుడు నా ఇంటిని ఆశీర్వదించిన రోజులు.
5 సర్వశక్తిమంతుడైన దేవుడు ఇంకా నాతో ఉండగా నా పిల్లలు నా దగ్గర ఉన్న సమయం కోసం నేను ఆశిస్తున్నాను.
6 అది నా జీవితం ఎంతో బాగున్నప్పటి మాట. నా మార్గం అంతా మీగడతో నిండిపోయినట్టు, నా కోసం ఒలీవ నూనెను నదులుగా ప్రవహించి నట్టు అది కనబడింది.

7 “నేను పట్టణ ద్వారం దగ్గరకు వెళ్లి పట్టణ పెద్దలతో కలిసి ఆరుబయట కూర్చున్న రోజులు అవి.
8 అక్కడ ప్రజలంతా నన్ను గౌరవించేవారు. యువకులు నన్ను చూచినప్పుడు పక్కకు తప్పుకొనేవారు. పెద్దలు నా యెడల గౌరవ సూచకంగా లేచి నిలబడేవారు.
9 ప్రజానాయకులు నన్ను చూడగానే మాట్లాడటం నిలిపివేసి నోటిమీద చేయి వేసుకొనేవారు (ఇతరులను నిశ్శబ్దంగా ఉంచటానికి).
10 చాలా ప్రముఖ నాయకులు కూడా, నేను వారిని సమీపించినప్పుడు వారి స్వరాలు తగ్గించేవారు. అవును వారి నాలుకలు వారి అంగిట అంటుకొని పోయినట్లు కనిపించేది.
11 నేను మాట్లాడటం విన్నవారు ఎవరైనా సరే, నన్ను గూర్చి మంచి మాటలు చెప్పేవారు. నన్ను చూచిన వారు నన్ను పొగిడారు.
12 ఎందుకంటే, పేదవాడు ఒకడు సహాయం కోసం వేడుకొంటే, నేను సహాయం చేశాను. తల్లి దండ్రులు లేని బిడ్డ విషయం శ్రద్ధ తీసుకోనే వారు ఎవరూ లేనప్పుడు నేను సహాయం చేశాను.
13 మరణించే మనిషీ నన్ను ఆశీర్వదించాడు. అవసరంలో ఉన్న విధవలకు నేను సహాయం చేసాను.
14 సక్రమంగా జీవించటం నాకు వస్త్రం. న్యాయం నాకు అంగీలా, తలపాగాలా ఉండేది.
15 గుడ్డివారికి నా కళ్లతో నేను సహాయం చేశాను. కుంటివారికి నా పాదాలతో నేను సహాయం చేశాను.
16 పేద ప్రజలకు నేను ఒక తండ్రిలా ఉన్నాను. కష్టాలలో ఉన్న పరాయివారి పక్షం నేను వహించాను.
17 దుర్మార్గుల శక్తిని నేను నాశనం చేశాను. దుర్మార్గుల బారి నుండి నిర్దోషులను నేను రక్షించాను.
18 “నేను ఎల్లప్పుడూ ఇలా తలచేవాణ్ణి. నేను చాలా కాలం బతుకుతాను. తర్వాత నా స్వంత ఇంటిలో మరణిస్తాను.
19 వేర్లు ఎల్లప్పుడూ నీటిని తాకుతూ ఆకులు ఎల్లప్పుడు మంచుతో తడిగా ఉండే చెట్టులా నేను ఉన్నాను.

20 నాలో నా మహిమ ఎల్లప్పుడూ కొత్తదిగా
ఉంటుంది. నాచేతిలో ఒక కొత్త విల్లు ఉన్నట్టుగా
నేను ఎల్లప్పుడూ బలంగా ఉంటాను.
21 నేను మాట్లాడటం చాలించిన తరువాత నా
మాటలు వింటున్న ప్రజలు చెప్పాల్సింది ఇంకేమీ
ఉండేది కాదు. నా మాటలు వారి చెవులకు
సౌమ్యంగా వినిపించేవి.
22 ప్రజలు వర్షంకోసం వేచి ఉన్నట్టు, నేను మాట్లాడా
లని వారు వేచి ఉండేవారు. నా మాట వసంతకాలపు
వర్షంలా ఉండేది నా మాటల్ని వారు పానం చేసే
వారు.
23 అధైర్య పడిన వారిని చూచి నేను చిరునవ్వు నవ్వే
వాడిని.
24 నా ప్రసన్న ముఖం క్రుంగిన ప్రజలకు మంచి
అనుభూతిని కలిగించేది.
25 ప్రజల పట్ల బాధ్యత వహించి నేను నిర్ణయాలు
చేసాను. నేను నాయకుణ్ణి అయ్యాను. తన సైన్య
దళాలలో ఒక రాజులా నేను జీవించాను. చాలా
విచారంలో ఉన్న ప్రజలకు ఆదరణ ఇచ్చే మనిషిలా
నేను ఉన్నాను.

30 కాని యిప్పుడు నన్ను హేళన చేసే వారు
నాకంటే చిన్నవారు. ఆ యువకులకు పనికి
మాలిన తండ్రులు ఉన్నారు. వారి తండ్రులను
నా గొర్రెలను కాపలా కాసే కుక్కలతో కూడా
నేను ఉండనివ్వను.
2 నాకు సహాయం చేసేందుకు వాళ్లకు బలం లేదు.
వారు అలసిపోయిన వృద్ధులు.
3 ఆ మనుష్యులు చచ్చిన వాళ్లతో సమానం. ఎందు
కంటే వారికి ఏమీ లేక ఆకలితో ఉన్నారు. ఎండి
పోయిన ఖాళీ నేలను కూడా వారు తినటానికి
ప్రయత్నిస్తున్నారు.
4 ఆ మనుష్యులు వారి ఎడారిలోని తుత్తి చెట్లను
పెరికి వేస్తారు. తంగేడు చెట్టు వేర్లను వారు
తింటారు.
5 ఆ మనుష్యులు ఇతర మనుష్యుల దగ్గర నుండి
బలవంతంగా వెళ్లగొట్టబడతారు. మనుష్యులు
దొంగల మీద అరచినట్టుగా వారి మీద అరుస్తారు.
6 ఎండిపోయిన నదులలోను, బండలలోను, కొండ
గుహలలోను, నేలలోని గుంటలలోను నివసిం
చేందుకు వారి వృద్ధులు బలాత్కారం చేయ
బడతారు.
7 వారు పొదలలో అరుస్తారు. ముళ్ల కంపల్లో వారంతా
ఒక్కచోట చేరుతారు.
8 వాళ్లు పనికిమాలిన అనామకుల గుంపు. వాళ్లు వారి
దేశం నుండి బలవంతంగా వెళ్లగొట్టబడిన వాళ్లు.
9 “ఇప్పుడు ఆ మనుష్యుల కొడుకులు నన్ను హేళన
చేసేందుకు నన్ను గూర్చి పాటలు పాడుతారు.
వాళ్లకు నా పేరు చెడ్డ మాట అయింది.
10 ఆ యువకులు నన్ను ద్వేషిస్తారు, వారు నాకు
దూరంగా నిలుస్తారు, వారు నాకంటే మంచివాళ్లము
అనుకొంటారు. చివరికి వాళ్లు నా ముఖం మీద
ఉమ్మి కూడా వేస్తారు.
11 నా వింటి నారిని దేవుడు తీసుకొని నన్ను బల
హీనుణ్ణి చేశాడు. ఆ యువకులు తమని తాము
వారించుకొనక నిండు కోపంతో నాకు విరోధంగా
తిరుగుతారు.
12 నా కుడి ప్రక్క ఆ యువకులు నామీద పడుతు
న్నారు. నేను పడిపోయేలా వాళ్లు చేస్తున్నారు.
వారు నామీద దాడి చేసి, నన్ను నాశనం చేసేందుకు
నా చుట్టూరా పట్టణానికి ముట్టడి దిబ్బ వేసినట్లు
వేస్తున్నారు.
13 నేను పారిపోయే మార్గాన్ని ఆ యువకులు కాపలా
కాస్తున్నారు. నన్ను నాశనం చేయటంలో వారు
విజయం పొందుతున్నారు. వారు నన్ను నాశనం
చేయటానికి వారికి ఎవరి సహాయం అవసరం లేదు.
14 గోడలోని కన్నంగుండా వెళ్లిపోయినట్టు వారు
నామీద దాడి చేస్తున్నారు. వారు దూకేసి నా మీదకు
విరగబడుతున్నారు.
15 భయాలు నన్ను ఆవరించేస్తున్నాయి. వస్తువులను
గాలి చెదరగొట్టినట్లు ఆ యువకులు నా గౌరవాన్ని
అవమానపరుస్తున్నారు. నా భద్రత మబ్బులా
మాయమవుతోంది.

16 “ఇప్పుడు నా జీవితం దాదాపు అయిపోయింది.
నేను త్వరలోనే మరణిస్తాను. శ్రమదినాలు నన్ను
పట్టివేశాయి.
17 రాత్రివేళ నా ఎముకలు అన్నీ నొప్పెడతాయి.
బాధ నన్ను నమిలివేయటం ఎన్నడూ ఆగిపోలేదు.
18 దేవుడు మహాబలంగా నా చొక్కా పట్టి లాగుతు
న్నాడు. ఆయన నా బట్టలను నలిపి వేస్తున్నాడు.
19 దేవుడు నన్ను బురదలో పడదోస్తున్నాడు. నేను
మట్టిలా, బూడిదలా అయిపోతున్నాను.

20 “దేవా, సహాయం కోసం నేను నీకు మొరపెడు
తున్నాను. కానీ నీవు జవాబు ఇవ్వవు. నేను నిలబడి
ప్రార్థన చేస్తాను. కానీ నీవు నాకు జవాబు ఇవ్వవు.
21 దేవా, నీవు నా ఎడల అసహ్యంగా ప్రవర్తిస్తున్నావు.
నన్ను బాధపెట్టేందుకు నీవు నీ శక్తిని ప్రయోగి
స్తున్నావు.
22 దేవా, బలమైన గాలి నన్ను కొట్టుకొని పోయేటట్టు
నీవు చేస్తున్నావు. నీవు నన్ను తుఫానులో పడదో
స్తున్నావు.

23 నీవు నన్ను నా మరణానికి తీసుకొని పోతున్నావని
నాకు తెలుసు. మరణం ప్రతి మనిషికి ఏర్పాటు
చేయబడిందే.
24 “కానీ అప్పటికే నాశనమయి, సహాయంకోసం అల
మటించేవాణ్ణి నిశ్చయంగా ఎవ్వరూ బాధించరు.
25 దేవా, కష్టాల్లో ఉన్న ప్రజల పక్షంగా నేను మొర్ర
పెట్టానని నీకు తెలుసు. పేద ప్రజల కోసం నా
హృదయం ఎంతో విచారించిందని నీకు తెలుసు.
26 కానీ నేను మంచివాటి కోసం ఎదురు చూస్తే
వాటికి బదులు చెడ్డవి జరిగాయి. వెలుగుకోసం
నేను చూస్తే చీకటి వచ్చింది.
27 అంతరంగంలో నేను చీల్చివేయబడ్డాను. శ్రమలు
ఎన్నటికీ ఆగిపోవు. శ్రమకాలాలు నా యెదుట
ఉన్నాయి.
28 నేను ఎల్లప్పుడూ ఎంతో విచారంగా ఉంటాను
గాని, నాకు ఆదరణ లభ్యం కాదు. నేను సమా
జంలో నిలబడి సహాయం కోసం కేకలు వేస్తాను.
29 నేను అడవి కుక్కలకు సోదరుడినయ్యాను. నిప్పు
కోళ్లు నాకు జతగాళ్లు.
30 నా చర్మం చాలా నల్లబడిపోయింది. నా శరీరం
జ్వరంతో వేడిగా ఉంది.
31 దుఃఖమయ గీతాలు వాయించేందుకు నా స్వర
మండలములను శృతి చేయబడింది. విచారంగా
ఏడుస్తున్న శబ్దాలు నా పిల్లనగ్రోవి చేస్తుంది.

31 “ఒక యువతిని కామవాంఛతో చూడ కూడ
దని నా కళ్లతో నేను ఒప్పందం చేసు
కొన్నాను.
2 సర్వశక్తిమంతుడైన దేవుడు తన ప్రజలకు ఏమి
చేస్తున్నాడు? దేవుడు ఉన్నతమైన తన పరలోక
గృహంలో ఉండి ప్రజలకు తిరిగి ఎలా ప్రతిఫలం
ఇస్తున్నాడు?
3 దుర్మార్గులకు దేవుడు కష్టాన్ని, నాశనాన్ని పంపి
స్తాడు. తప్పు చేసేవారికి సర్వనాశనం కలిగిస్తాడు.
4 నేను చేసేది ప్రతిదీ దేవునికి తెలుసు. నేను వేసే
ప్రతి అడుగూ ఆయన చూస్తున్నాడు.
5 నేను అబద్ధాల జీవితం జీవించి ఉంటే, లేక ప్రజలకు
అబద్దాలు చెప్పి, మోసం చేసేందుకు నేను పరుగు
లెత్తి ఉంటే,
6 అప్పుడు నన్ను తూచేందుకు దేవుడు న్యాయపు
త్రాసు వాడవచ్చును. అప్పుడు నేను నిర్దోషినని
దేవునికే తెలుస్తుంది.
7 నేను సరియైన మార్గం నుండి తొలగిపోతే నా
కళ్లు నా హృదయాన్ని దుష్టత్వానికి నడిపించి ఉంటే
లేదా నా చేతులు పాపంతో మైలగా ఉంటే,
8 అప్పుడు నేను నాటిన పంటలను ఇతరులు తిని
వేయుదురు గాక, నా పంటలు పెరికి వేయబడును
గాక.
9 “నేను స్త్రీల పట్ల కామవాంఛ కలిగి ఉంటే లేదా
నేను నా పొరుగువాని భార్యతో వ్యభిచార పాపం
చేయటానికి అతని ద్వారం దగ్గర వేచి ఉంటే,
10 అప్పుడు నా భార్య మరొకనికి వంట చేయును
గాక. ఇతర పురుషులు ఆమెతో పండుకొందురు
గాక.
11 ఎందుకంటే లైంగిక పాపం అవమానకరం. అది
శిక్షించబడాల్సిన పాపం.
12 లైంగికపాపం కాల్చివేసి, నాశనంచేసే అగ్నిలాంటిది.
లైంగిక పాపంనాకు గల సర్వాన్నీ నాశనం చేస్తుంది.
13 “నా మగ సేవకులు, ఆడ సేవకులు నాకు విరో
ధంగా ఆరోపణ చేసినప్పుడు, ఒక వేళ నేను
వారికి న్యాయం చేకూర్చేందుకు నిరాకరిస్తే,
14 నేను దేవుణ్ణి ఎదుర్కోవాల్సి వచ్చినప్పుడు నేను
ఏమి చేస్తాను? నేను చేసిన దాని గూర్చి వివరించు
మని దేవుడు నన్ను పిలిచినప్పుడు నేను ఏమి
జవాబిస్తాను?
15 దేవుడు నన్ను నా తల్లి గర్భంలోనే చేశాడు. నా
సేవకులను కూడా దేవుడే చేసాడు. మమ్మల్ని
ఇద్దరినీ మా తల్లి గర్భంలో దేవుడే రూపొం
దించాడు.

16 “పేద ప్రజలకు సహాయం చేసేందుకు నేను
ఎన్నడూ నిరాకరించలేదు. విధవలను దిక్కు
మాలిన వారిగా నేను ఎన్నడూ ఉండనియ్యలేదు.
17 నా భోజనం విషయంలో నేను ఎన్నడూ
స్వార్థంతో ఉండలేదు. అనాథ పిల్లలను నేను
ఎన్నడూ ఆకలితో ఉండనీయలేదు.
18 నా జీవిత కాలం అంతా తండ్రిలేని పిల్లలకు నేను
ఒక తండ్రిలా ఉన్నాను. నా జీవిత కాలం అంతా
విధవల పట్ల నేను శ్రద్ధ చూపాను.
19 ఎవరో ఒకరు బట్టలు లేక శ్రమపడటం నేను
చూచినప్పుడు, లేక పేదవాడు చొక్కా లేకుండా
ఉన్నప్పుడు,

20 “నేను ఎల్లప్పుడూ వారికి బట్టలు ఇచ్చాను. వారికి
వెచ్చదనం కోసం నా గొర్రెల స్వంతబొచ్చు నేను
ఉపయోగించాను. అప్పుడు వారు హృదయపూర్వ
కంగా నన్ను ఆశీర్వదించారు.
21 న్యాయస్థానంలో నేను గెలుస్తానని తెలిసికూడ ఒక
అనాథ బిడ్డను నేను మోసం చేస్తే,
22 నేను ఒకవేళ అలాచేస్తే నా భుజం నుండి నా
చేయి ఊడి పడిపోవును గాక. నా చేయి దాని
కీలు నుండి పడిపోవును గాక.
23 కాని ఆ చెడ్డ పనులు ఏవీ నేను చేయలేదు. ఎందు
కంటే, దేవుని శిక్షకు నేను భయపడ్డాను. ఆయన
మహాత్మ్యము నన్ను బెదరగొట్టెను.

24 “నా ఐశ్వర్యాలను నేను ఎన్నడూ నమ్ముకొనలేదు. ‘నీవే నా ఆశ అని’ స్వచ్ఛమైన బంగారంతో నేను ఎన్నడూ చెప్పలేదు.
25 నేను ధనికుడను అని ఎన్నడు గర్వంతో నిండి పోలేదు. లేక నేను సంపాదించిన ఐశ్వర్యాలతో మురిసిపోలేదు.
26 నేను ఎన్నడూ ప్రకాశమైన సూర్యుణ్ణి లేక అంద మైన చంద్రుణ్ణి ఆరాధించలేదు.
27 సూర్య చంద్రులకు భక్తితో పూజ చేసేందుకు నేను ఎన్నడూ మోసగించబడలేదు.
28 అలాంటివి ఏవైనా, ఎన్నడైనా నేను చేసి ఉంటే అవి నేను శిక్షించబడాల్సిన పాపాలే. ఎందుచేత నంటే ఆ చెడు కార్యాలు చేయటం మూలంగా సర్వశక్తిమంతుడైన దేవునికి నేను అపనమ్మకమైన వాడినవుతాను.
29 “నా శత్రువులు నాశనం చేయబడినప్పుడు నేను ఎన్నడూ సంతోషించలేదు. నా శత్రువులకు కష్టాలు కలిగినప్పుడు నేను ఎన్నడూ నవ్వలేదు.
30 నా శత్రువులను శపించటం ద్వారానూ, వారు చావాలని కోరుకోవటం ద్వారానూ, నేను ఎన్నడూ నా నోటితో పాపం చేయలేదు.
31 పరాయి వాళ్లకు నేను ఎల్లప్పుడూ భోజనం పెట్టినట్లు నా ఇంట్లోని వాళ్లందరకూ తెలుసు.
32 పరాయి వాళ్లు రాత్రి పూట వీధుల్లో నిద్రపోవాల్సిన అవసరం లేకుండా నేను అలాంటి వారిని ఎల్ల ప్పుడూ నా ఇంటికి ఆహ్వానించేవాడను.
33 ఇతరులు తమ పాపాలు దాచిపెట్టేందుకు ప్రయత్ని స్తారు. కాని నేను నా దోషాన్ని దాచిపెట్టలేదు.
34 ఎందుకంటే, ప్రజలు ఏమనుకుంటారో అని నేను ఎన్నడూ భయపడలేదు. నేను ఎన్నడూ మౌనంగా ఉండలేదు. బయటకు వెళ్లకుండా ఉండలేదు. ఎందుకంటే,ప్రజలు నన్ను ద్వేషిస్తారనే భయం నాకు లేదు గనుక.
35 “ఆహా, ఎవరైనా నా మాటలు వినేవారు ఉంటే బాగుండును. ఇప్పుడు నేను నా వాదం చెబుతాను. సర్వశక్తిమంతుడైన దేవుడు నాకు జవాబిచ్చును గాక. నన్ను నిందించే ఆయన, నేను చేశానని నిందించబడుతున్న సంగతులను రాసి పెట్టును గాక.
36 నిశ్చయంగా ఆ రాతను నేను నా భుజం మీద ధరిస్తాను. నేను దానిని కిరీటంలా ధరిస్తాను.
37 నేను చేసినది సమస్తం దేవునికి నేను వివరిస్తాను. నేను ఒక అధికారిలా నా తలపైకి ఎత్తుకొని దేవుని దగ్గరకు వస్తాను.
38 “నేను సాగుచేస్తున్న భూమిని దాని సొంతదారుని దగ్గర దొంగిలించి తీసుకొని ఉంటే, ఆ భూమి దాని సొంత కన్నీళ్లతో తడిసి ఉంటే,
39 ఆ భూమి పండించిన వాటిని రైతులకు విలువ చెల్లించకుండానే నేను దొంగిలించి ఉంటే,
40 అవును, ఈ చెడుకార్యాలు నేను కనుక చేసి ఉంటే పొలాల్లో గోధుమకు బదులు ముండ్లు, యవలకు బదులుగా కలుపు మొక్కలు మొలుచును గాక!” యోబు మాటలు సమాప్తం.

### ఎలీహు తన వాదాన్ని పెంచటం

32 అప్పుడు యోబు స్నేహితులు ముగ్గురూ
యోబుకు జవాబు ఇచ్చే ప్రయత్నం విర
మించుకొన్నారు. యోబు తన మట్టుకు తాను నిర్దోషి
నని అనుకోవడం చేత వారు విరమించుకొన్నారు.
2 ఎలీహు అనే పేరు గల ఒకతను అక్కడ ఉన్నాడు.
ఎలీహు బరకెయేలు కుమారుడు. బరకెయేలు బూజు
సంతతి వాడు. ఎలీహు రాము వంశస్థుడు. ఎలీహు
యోబు మీద చాలా కోపగించాడు. ఎందుకంటే
యోబు తన మట్టుకుతానే మంచివాడినని చెప్పు
కొంటున్నాడు. మరియు యోబు తాను దేవునికంటే
నీతిమంతుణ్ణి అని చెబుతున్నాడు. 3 కాబట్టి ఎలీహు
యోబు స్నేహితుల మీద కూడా కోపగించాడు. ఎందు
కంటే యోబు స్నేహితులు ముగ్గురూ యోబు ప్రశ్న
లకు జవాబులు ఇవ్వలేక యోబుదే తప్పు అని రుజువు
చేయలేకపోయారు.
4 అక్కడ ఉన్న వారిలో ఎలీహు చాలా చిన్నవాడు.
కనుక ప్రతి ఒక్కరూ మాట్లాడటం అయ్యేంత వరకు
అతడు వేచి ఉన్నాడు. అప్పుడు అతడు మాట్లాడటం
ప్రారంభించవచ్చు అనుకొన్నాడు. 5 యోబు స్నేహి
తులు ముగ్గురూ చెప్పాల్సింది ఇంక ఏమీలేదని ఎలీహు
చూచినప్పుడు అతనికి కోపం వచ్చింది. 6 కనుక ఎలీహు
మాట్లాడటం ప్రారంభించాడు. అతడు ఇలా అన్నాడు:
“నేను చిన్నవాడిని. మీరు పెద్దవాళ్లు. అందుకే నేను అనుకొంటున్నది ఏమిటో మీతో చెప్పడానికి భయపడుతున్నాను.
7 ‘పెద్దవాళ్లు ముందుగా మాట్లాడాలి. చాలా సంవత్స రాలు బతికిన మనుష్యులు తమ జ్ఞానాన్ని పంచి ఇవ్వాలి’ అని నాలో నేను అనుకొన్నాను.
8 కాని ఒక వ్యక్తిలో దేవుని ఆత్మ, సర్వశక్తిమంతుడైన దేవుని ‘ఊపిరి’ ఆ వ్యక్తికి జ్ఞానం ప్రసాదిస్తుంది.
9 వృద్ధులు మాత్రమే జ్ఞానం గల మనుష్యులు కారు. వయస్సు పైబడిన వాళ్లు మాత్రమే సరియైన అవగాహన గలవారు కారు.
10 “అందువల్లనే ఎలీహు అనే నేను నా మాట వినమని చెబుతున్నాను. నేను తలచేదేమిటో కూడా నేను మీతో చెబుతాను.
11 మీరు మాట్లాడుతూ ఉన్నంతసేపూ నేను సహ నంతో వేచి ఉన్నాను. మీరు యోబుకు చెప్పిన జవాబులు నేను విన్నాను.

12 మీరు తెలివిగల మాటలతో యోబుకు జవాబు
చెప్పటానికి ప్రయత్నం చేస్తున్నంతసేపూ నేను
శ్రద్ధగా విన్నాను. కాని యోబుదే తప్పు అని మీరు
ముగ్గురూ రుజువు చేయలేదు. యోబు వాదాలకు
మీలో ఒక్కరూ జవాబు చెప్పలేదు.
13 మీరు ముగ్గురూ జ్ఞానం కనుగొన్నట్టు చెప్పలేరు.
యోబు వాదాలకు దేవుడే జవాబు చెప్పాలి కాని
మనుష్యులు కాదు.
14 కాని యోబు నాతో వాదించలేదు. అందుచేత
మీరు ముగ్గురూ ప్రయోగించిన వాదాలను నేను
ఉపయోగించను.
15 "యోబూ, నీ ముగ్గురు స్నేహితులూ ఇబ్బంది
పడిపోతున్నారు. వారు చెప్పాల్సింది ఇంక ఏమీ
లేదు. వారి వద్ద జవాబులు ఇంకేమీ లేవు.
16 ఈ ముగ్గురు మనుష్యులూ మౌనంగా ఉన్నారు,
అక్కడే నిలబడ్డారు, జవాబు ఏమీ లేదు. కనుక
నేను ఇంకా వేచి ఉండాలా?
17 లేదు! నేను కూడా నా జవాబు చెబుతాను. నేను
తలుస్తున్నది కూడ నీతో చెబుతాను.
18 ఎందుకంటే, నేను చెప్పాల్సింది చాలా ఉంది. నాలో
ఉన్న ఆత్మ నన్ను మాట్లాడమని బలవంతం
చేస్తోంది.
19 కొద్ది సేపట్లో పొర్లిపోయే ద్రాక్షారసంలా నా అంత
రంగంలో నేను ఉన్నాను. త్వరలో పగిలిపోబో
తున్న కొత్త ద్రాక్షా తిత్తిలా నేను ఉన్నాను.
20 కనుక నేను మాట్లాడాలి. అప్పుడు నాకు బాగుం
టుంది. నేను నా పెదాలు తెరచి యోబు ఆరోప
ణలకు జవాబు చెప్పాలి.
21 ఈ వాదంలో నేను ఎవరి పక్షమూ వహించను.
నేను ఎవరినీ పొగడను. నేనేమి చెప్పాలో దానిని
చెబుతాను.
22 ఒక మనిషిని ఎలా పొగడాలో నాకు తెలియదు.
ఒకరిని ఎలా పొగడాలో నాకు తెలిసి ఉంటే వెంటనే
దేవుడు నన్ను శిక్షిస్తాడు.

33 "అయితే యోబూ, దయచేసి నా సందేశాన్ని
విను. నేను చెప్పే మాటలు గమనించు.
2 త్వరలోనే నేను మాట్లాడటం మొదలు పెడతాను.
చెప్పటానికి నేను దాదాపు సిద్ధంగా ఉన్నాను.
3 నా హృదయం నిజాయితీ గలది. కనుక నిజాయి
తీగల మాటలను నేను చెబుతాను. నాకు తెలిసిన
సంగతులను గూర్చి నేను సత్యం చెబుతాను.
4 దేవుని ఆత్మ నన్ను చేసింది. నా జీవం సర్వశక్తి
మంతుడైన దేవుని నుండి వచ్చింది.
5 యోబూ, విను. నీవు చెప్పగలవనుకొంటే నాకు
జవాబు చెప్పు. నీవు నాతో వాదించగలిగేందుకు
నీ జవాబులు సిద్ధం చేసుకో.
6 దేవుని ఎదుట నీవు, నేను సమానం. మన ఇద్దరిని
చేసేందుకు దేవుడు మట్టినే ఉపయోగించాడు.
7 యోబూ, నన్ను గూర్చి భయపడకు. నేను నీ
యెడల కఠినంగా ఉండను.
8 "కాని యోబూ, నీవు చెబుతూండగా నేను విన్నది
ఇదే.
9 నీవు అన్నావు: 'యోబు అనే నేను నిర్దోషిని,
నేను పాపం చేయలేదు. లేక ఏ తప్పు చేయలేదు.
నేను దోషిని కాను.
10 నేను ఏ తప్పు చేయక పోయినప్పటికి దేవుడు
నాలోఏదో తప్పుకనుగొన్నాడు. యోబు అనేనేను
దేవుని శత్రువును అని ఆయన తలుస్తున్నాడు.
11 కనుక దేవుడు నా పాదాలకు సంకెళ్లు వేస్తున్నాడు.
నేను చేసేది సమస్తం దేవుడు గమనిస్తున్నాడు.'
12 "కాని యోబూ, దీని విషయం నీది తప్పు అని
నేను నీతో చెప్పాలి. ఎందుకంటే దేవునికి అందరి
కంటే ఎక్కువ తెలుసు కనుక.
13 యోబూ, నీవు ఎందుకు ఆరోపణ చేస్తూ దేవు
నితో వాదిస్తావు? దేవుడు చేసే ప్రతిదాని గూర్చీ
ఆయన నీకు వివరించటం లేదని నీవెందుకు
ఆలోచిస్తావు?
14 అయితే దేవుడు చేసే దాన్ని గూర్చి ఆయన
వివరిస్తాడు. దేవుడు వేరువేరు విధానాలలో మాట్లా
డతాడు. కానీ మనుష్యులు దాన్ని గ్రహించరు.
15-16 ఒక వేళ మనుష్యులు గాఢ నిద్రలో ఉన్నప్పుడు
కలలో లేక రాత్రి వేళ దర్శనంలో ఆయన వారి
చెవులలో చెబుతాడేమో. అప్పుడు వారు దేవుని
హెచ్చరికలు విని చాలా భయపడతారు.
17 మనుష్యులు చెడు సంగతులు జరిగించటం మాని
వేయాలని, గర్విష్టులు, కాకుండా ఉండాలని
దేవుడు హెచ్చరిస్తాడు.
18 "మనుష్యులు మరణస్థానానికి వెళ్లకుండా రక్షించా
లని హెచ్చరిస్తాడు. ఒక వ్యక్తి నాశనం చేయబడ
కుండా రక్షించటానికి దేవుడు అలా చేస్తాడు.
19 "లేక ఒక వ్యక్తి పడక మీద ఉండి దేవుని శిక్ష
అనుభవిస్తున్నప్పుడు దేవుని స్వరం వినవచ్చును.
ఆ వ్యక్తిని దేవుడు బాధతో హెచ్చరిస్తున్నాడు. ఆ
వ్యక్తి ఎముకలన్నీ నొప్పి పెట్టినట్లు అతడు బాధ
పడుతున్నాడు.
20 ఆ వ్యక్తి భోజనం చేయలేడు. శ్రేష్టమైన భోజనం
కూడ అసహ్యించుకొనేంతగా అతడు బాధ
పడతాడు.
21 అతని చర్మం వేలాడేటంతగా, అతని ఎముకలు
పొడుచుకొని వచ్చేంతగా అతని శరీరం పాడై
పోతుంది.
22 ఆ మనిషి ఖనన స్థలానికి సమీపంగా ఉన్నాడు.
అతని జీవితం చావుకు దగ్గరగా ఉంది.

23 "కాని ఒకవేళ ఆ మనిషికి సహాయం చేయటానికి
ఒక దేవదూత ఉండునేమో. నిజంగా దేవునికి వేలాది
దూతలు ఉంటారు. అప్పుడు ఆ దూతలు ఆ
మనిషి చేయాల్సిన సరియైన సంగతిని అతనికి
తెలియజేస్తాడు.
24 మరియు ఆ దేవదూత ఆ మనిషి ఎడల దయగా
ఉంటాడు, 'ఈ మనిషిని చావు స్థలం నుండి
రక్షించండి. అతని పక్షంగా చెల్లించేందుకు నేను
ఒక మార్గం కనుగొన్నాను'
25 అప్పుడు ఆ మనిషి శరీరం మరల యవ్వనాన్ని,
బలాన్ని పొందుతుంది. ఆ మనిషి యువకునిగా
ఉన్నప్పటివలెనే ఉంటాడు.
26 ఆ మనిషి దేవునికి ప్రార్థన చేస్తాడు. దేవుడు అతని
ప్రార్థన వింటాడు. అప్పుడు ఆ మనిషి దేవుని
ఆరాధిస్తూ సంతోషంగా ఉంటాడు. ఎందుకంటే,
దేవుడు అతనికి సహజమైన మంచి జీవితాన్ని
మరల ఇస్తాడు గనుక.
27 అప్పుడు ఆ మనిషి ప్రజల దగ్గర ఒప్పుకొంటాడు.
అతడు చెబుతాడు, 'నేను పాపం చేశాను. మంచిని
నేను చెడుగా మార్చాను. కానీ దేవుడు శిక్షించాల్సి
నంత కఠినంగా నన్ను శిక్షించలేదు.
28 నా ఆత్మ ఖనన స్థలానికి వెళ్లకుండా దేవుడు నన్ను
రక్షించాడు. నేను చాలాకాలం జీవిస్తాను. నేను
మరల జీవితాన్ని అనుభవిస్తాను.'
29 "ఒక మనిషికి దేవుడు ఈ సంగతులను మరల
మరల చేస్తాడు.
30 ఆ మనిషిని హెచ్చరించి, అతని ఆత్మను మరణ
స్థలం నుండి రక్షించేందుకు. అప్పుడు ఆ మనిషి
తన జీవితాన్ని అనుభవించవచ్చు.
31 "యోబూ, నా మాట గమనించు. నా మాట
విను. మౌనంగా ఉండి, నన్ను మాట్లాడనియ్యి.
32 యోబూ, నీవు చెప్పాల్సింది ఏమైనా ఉంటే నన్ను
విననీ. ఎందుకంటే, నీవు నిర్దోషివి అని రుజువు
చేయగోరుతున్నాను గనుక. నీ వాదాన్ని సరిదిద్దే
లాగా నాకు వినిపించు.
33 కానీ యోబూ, నీవు చెప్పాల్సింది ఏమీ లేకపోతే
నా మాట విను. మౌనంగా ఉండు, జ్ఞానం గలిగి
ఉండటం ఎలాగో నేను నేర్పిస్తాను."

34 అప్పుడు ఎలీహు మాట్లాడటం కొన
సాగించాడు:
2 "జ్ఞానంగల మనుష్యులారా, నేను చెప్పే విషయాలు
వినండి. తెలివిగల మనుష్యులారా నా మాటలు
గమనించండి.
3 చెవి తను వినే సంగతులను పరీక్షిస్తుంది. అదే
విధంగా నాలుక, తన తాకే వాటిని రుచి చూస్తుంది.
4 అందుచేత మనం ఈ పరిస్థితిని పరిశీలించాలి.
ఏది సరైనదో మనమే నిర్ణయించాలి. ఏది మంచిది
అనేది కూడా మనం అంతా ఏకంగా నేర్చు
కొంటాం.
5 యోబు అంటున్నాడు, 'యోబు అనే నేను నిర్దో
షిని. కానీ దేవుడు నాకు న్యాయం చేయలేదు.
6 నాది సరిగ్గా ఉంది, కానీ ప్రజలు నాది తప్పు అను
కొంటారు. నేను అబద్దీకుణ్ణి అని వాళ్లు అను
కొంటారు. నేను నిర్దోషిని అయినప్పటికీ నా
గాయం మానదు.'

7 "యోబు లాంటి వ్యక్తి మరొకడు లేడు. మీరు
యోబును అవమానించినప్పటికి అతడు లెక్క
చేయడు.
8 చెడ్డ వాళ్లతో యోబు స్నేహంగా ఉన్నాడు. దుర్మా
ర్గులతో కలిసి సహవాసం యోబుకు యిష్టం.
9 'ఎందుకంటే, ఒకడు దేవునికి విధేయత చూపిం
చేందుకు ప్రయత్నిస్తే దానివల్ల అతనికి ప్రయో
జనం ఏమీ కలుగదు' అని యోబు చెబుతున్నాడు.

10 "కనుక గ్రహించగలిగిన ఓ మనుష్యులారా, నా మాట
వినండి. దేవుడు ఎన్నటికీ చెడు చేయడు. సర్వ
శక్తిమంతుడైన దేవుడు ఎన్నటికీ తప్పు చేయడు.
11 ఒకడు చేసిన విషయాలనే తిరిగి దేవుడు అతనికి
చెల్లిస్తాడు. మనుష్యులకు రావలసిందే దేవుడు
వారికి ఇస్తాడు.
12 ఇది సత్యం. దేవుడు తప్పు చేయడు. సర్వశక్తి
మంతుడైన దేవుడు ఎల్లప్పుడూ న్యాయంగానే
ఉంటాడు.
13 భూమికి పర్యవేక్షకునిగా ఉండేందుకు దేవుణ్ణి ఎవరు
నియమించారు? భూభారాన్ని దేవునికి ఎవరు అప్ప
గించారు? (దేవుడు అన్నింటినీ పుట్టించాడు
మరియు అన్నీ ఆయన అధీనంలో ఉంటాయి.)
14 దేవుడు తన ఆత్మను, తన ప్రాణవాయువును
మనుష్యుల్లోనుండి తీసివేయాలని ఒకవేళ అను
కొంటే
15 అప్పుడు భూమి మీద మనుష్యులు అందరూ చని
పోతారు. అప్పుడు మనుష్యులు మరల మట్టి
అయిపోతారు.

16 'మీరు జ్ఞానంగల వారైతే, నేను చెప్పేది వినండి.
17 న్యాయంగా ఉండటం యిష్టంలేని మనిషి పరి
పాలకునిగా ఉండజాలడు. యోబూ, బలమైన
మంచి దేవుణ్ణి నీవు దోషిగా తీర్చగలవని నీవు
తలుస్తున్నావా?
18 'మీరు పనికిమాలిన వాళ్లు' అని రాజులతో చెప్పే
వాడు దేవుడు. 'మీరు దుర్మార్గులు' అని నాయకు
లతో దేవుడు చెబుతాడు.
19 దేవుడు నాయకులను మనుష్యులకంటె ఎక్కు

వేమీ ప్రేమించడు. దేవుడు ధనికులను దరిద్రుల
కంటే ఎక్కువేమీ ప్రేమించడు. ఎందుకంటే, ప్రతి
మనిషినీ దేవుడే చేశాడు గనుక.
20 ఒక వ్యక్తి రాత్రిపూట అకస్మాత్తుగా మరణించ
వచ్చును. మనుష్యులను దేవుడు రోగులుగా
చేస్తాడు. వారు మరణిస్తారు. ఏ కారణం లేకుండానే
శక్తిగల మనుష్యులు మరణిస్తారు.

21 "మనుష్యులు ఏమి చేస్తున్నదీ దేవుడు గమనిస్తూ
ఉంటాడు. ఒక వ్యక్తి నడిచే ప్రతి నడత దేవునికి
తెలుసు.
22 దుర్మార్గుడు దేవునికి కనబడకుండా దాగుకొ
నేందుకు చీకటి చోటు ఏమీ లేదు. ఏ చోటైన
చీకటిగా ఉండదు.
23 మనుష్యులను మరింత పరీక్షించేందుకు దేవునికి
ఒక నిర్ణీత సమయం అవసరం లేదు. మనుష్యులకు
తీర్పు తీర్చేందుకు దేవుడు వారిని తన ఎదుటికి
తీసుకొని రానవసరం లేదు.
24 దేవుడు ప్రశ్నలు అడగాల్సిన అవసరం లేదు. కానీ
దేవుడు శక్తివంతమైన వారిని నాశనం చేసి ఇతరు
లను వారి స్థానంలో ఉంచుతాడు.
25 కనుక మనుష్యులు ఏమి చేస్తారో దేవునికి తెలుసు.
అందుకే దేవుడు దుర్మార్గులను రాత్రిపూట
ఓడించి, వారిని నాశనం చేస్తాడు.
26 చెడ్డవాళ్లు చేయు దుర్మార్గపు పనులను బట్టి
దేవుడు వారిని నాశనం చేస్తాడు. ఆ చెడ్డవారిని
అందరూ చేసేలా ఆయన శిక్షిస్తాడు
27 ఎందుకంటే ఆ చెడ్డవాళ్లు దేవునికి విధేయత
కావటం మానివేశారు గనుక. మరియు ఆయన
కోరిన వాటిని చేయటం ఆ చెడ్డవాళ్లు లక్ష్య
పెట్టలేదు గనుక.
28 పేద ప్రజలను బాధించి, వారు సహాయం కోసం
దేవునికి మొర పెట్టేలాగా ఆ చెడ్డవాళ్లు చేశారు.
మరియు పేదవారు సహాయం కోసం మొరపెట్టి
నప్పుడు ఆయన వింటాడు.
29 కానీ ఒకవేళ పేద ప్రజలకు సహాయం చేయ
కూడదని కనుక దేవుడు నిర్ణయంచేస్తే ఎవరూ
ఆయనను దోషిగా నిర్ణయించలేరు ఒకవేళ దేవుడు
ప్రజలకు తన ముఖం మరుగు చేసికొంటే వారికి
సహాయం చేయగలవాడు ఎవడూ ఉండడు.
అయితే ఆయన వ్యక్తులను, రాజ్యాలను
పాలిస్తాడు.
30 తర్వాత దేవునికి విరోధంగా ఉండి మనుష్యులను
మోసగించే వ్యక్తిని దేవుడు పాలకునిగా ఉండ
నివ్వడు.
31 ఒకవేళ ఒక వ్యక్తి దేవునితో అనవచ్చును: 'నేను
దోషిని, నేను ఇంకెంత మాత్రం పాపం చేయను.
32 దేవా, నాకు తెలియని విషయాలు నాకు నేర్పించు.
నేను తప్పు చేసి ఉంటే ఇకమీదట ఎన్నటికి
మరల దానిని చేయను.'
33 కానీ యోబూ, నీవు మారటానికి తిరస్కరిస్తూ
ఉండగా, నీవు ఏ విధంగా ప్రతిఫలం కావాలని
కోరుకొంటావో అలా దేవుడు నీకు ప్రతిఫలం
ఇవ్వాలా? యోబూ, ఇది నీ తీర్మానం, నాది కాదు.
నీవు ఏమి అనుకొంటున్నావో నాకు చెప్పు.
34 జ్ఞానం గలిగి, గ్రహింపు ఉన్న ఏ మనిషిగాని నాతో
ఏకీభవిస్తాడు. నా మాటలు వినే జ్ఞానం గల మనిషి
ఎవరైనా సరే అని అంటారు,
35 'యోబు తెలియనివానిలా మాట్లాడతాడు. యోబు
చెప్పే మాటలకు అర్థం లేదు.'
36 యోబును పరీక్షించేందుకు అతనికి ఇంకా ఎక్కువ
కష్టాలు వస్తే బాగుండునని, నా ఆశ. ఎందుకంటే
ఒక దుర్మార్గుడు జవాబిచ్చినట్టుగా యోబు మనకు
జవాబు ఇస్తున్నాడు గనుక.
37 యోబు తన పాపం అంతటికి తిరుగుబాటుతనం
అదనంగా కలిపాడు. యోబు మనలను అవమా
నించి, మన ఎదుట దేవుణ్ణి హేళన చేస్తున్నాడు."

35 ఎలీహు మాట్లాడటం కొనసాగించాడు.
అతడు అన్నాడు:
2 "యోబూ, నీవు యోబు అనే నేను 'దేవునికంటె
ఎక్కువ సక్రమంగా ఉన్నాను' అని చెప్పటం
న్యాయం కాదు.
3 యోబూ, నీవు దేవుణ్ణి, 'దేవా, ఒక మనిషి, దేవుని
సంతోష పరచుటవలన ఏమి పొందుతాడు? నా
పాపం నిన్నెలా బాధిస్తుంది? నేను పాపం చేయక
పోతే నాకేం మంచి లభిస్తుంది?' అని అడుగు.
4 "యోబూ, ఎలీహు అనే నేను నీకు, ఇక్కడ నీతో
ఉన్న స్నేహితులకు జవాబు ఇవ్వగోరుతున్నాను.
5 యోబూ, పైన ఆకాశం చూడు. పైకి చూచి,
మేఘాలు నీకంటే ఎత్తుగా ఉన్నాయని తెలుసుకో.
6 యోబూ, నీవు పాపం చేస్తే అది దేవుణ్ణి బాధ
పెట్టదు. ఒకవేళ నీ పాపాలు చాలా ఉంటే అవి
దేవునికి ఏమీ చేయలేవు.
7 యోబూ, నీవు మంచివానిగా ఉంటే అదేమి దేవునికి
సహాయం చేయదు. నీనుండి దేవునికి ఏమీ రాదు.
8 యోబూ, నీవు చేసే మంచిచెడ్డలు నీలాంటి
వాళ్లను మాత్రమే బాధిస్తాయి. (అవి దేవునికి
సహాయకారి కావు మరియు దేవుణ్ణి బాధించవు.)
9 "మనుష్యులు దుర్మార్గంగా, అన్యాయంగా పరాము
ర్శించబడితే సహాయం కోసం వారు మొరపెడ
తారు. శక్తివంతమైన వాళ్లు తమకు సహాయాన్ని
చేయాలని వారు బతిమలాడుతారు.
10 కానీ సహాయం కోసం వారు దేవుని వేడుకోరు.
'నన్ను తయారు చేసి, నా ఆనందం కోసం

రాత్రులలో పాటలు ఇచ్చినటువంటి దేవుడెక్కడ?
అని ఎవరూ అనరు.
11 సహాయం కోసం వారు దేవుని అడగరు. దేవుడే
మనుష్యుల్ని జ్ఞానం గల వారినిగా చేశాడు. జంతువు
లను, పక్షులను దేవుడు జ్ఞానంగల వాటినిగా చేయ
లేదు.'
12 "కాని చెడ్డవాళ్లు గర్వంగా ఉంటారు. కనుక వారు
సహాయం కోసం దేవునికి మొరపెడితే దేవుడు
వారికి జవాబు ఇవ్వడు.
13 వారి పనికిమాలిన విన్నపం దేవుడు వినడు, అది
నిజం. సర్వశక్తిగల దేవుడు వారిపట్ల శ్రద్ధ చూపడు.
14 యోబూ, అదే విధంగా దేవుడు నీకు కనబడలేదని
నీవు చెప్పినప్పుడు, దేవుడు నీ మాట వినడు.
దేవుణ్ణి కలుసుకొని, నీ నిర్దోషిత్వాన్ని నిరూపించు
కొనే అవకాశంకోసం నిరీక్షిస్తున్నానని నీవు అంటు
న్నావు.
15 యోబూ, దేవుడు దుర్మార్గులను శిక్షించడనీ,
పాపాన్ని దేవుడు లక్ష్యపెట్టడనీ నీవు తలస్తున్నావు.
16 కనుక యోబు తన పనికిమాలిన మాటలు కొన
సాగిస్తున్నాడు. యోబు మాట్లాడుతోంది ఏమిటో
అతనికే తెలియదు."

36 ఎలీహు మాట్లాడటం కొనసాగించాడు.
2 "యోబూ, నాతో ఇంకొంచెం ఓపికగా
ఉండు. దేవుని పరంగా చెప్పాల్సింది ఇంకా ఉందని
నేను నీకు చూపిస్తాను.
3 నా జ్ఞానాన్ని అందరితోనూ పంచుకొంటాను.
దేవుడు నన్ను సృష్టించాడు. దేవుడు న్యాయంగల
వాడని నేను రుజువు చేస్తాను.
4 యోబూ, నేను చెప్పేది ప్రతీదీ సత్యం. నేను
చెప్పున్నదేమిటో తెలిసే చెప్పున్నాను.
5 "దేవుడు శక్తివంతమైనవాడు, కానీ ఆయన మనుష్య
లను ద్వేషించడు. దేవుడు మహత్తర శక్తిమంతుడు,
ఆయన సంకల్పాలు ఆయనకు ఉన్నాయి.
6 దుర్మార్గులను దేవుడు బ్రతుకనివ్వడు. పేద
ప్రజలకు దేవుడు ఎల్లప్పుడు న్యాయం జరిగిస్తాడు.
7 ఏది సరైనదో, దాన్ని చేసే ప్రజల విషయం
దేవుడు శ్రద్ధ చూపిస్తాడు. మంచి వాళ్లను ఆయన
పాలకులుగా ఉండనిస్తాడు. మంచి వాళ్లకు దేవుడు
శాశ్వతమైన ఘనత ఇస్తాడు.
8 కానీ మనుష్యులు శిక్షించబడుతూ సంకెళ్లతో ఉంటే
ఒకవేళ మనుష్యులు శ్రమపడుతూ, కష్టాలు అనుభ
విస్తోంటే,
9 వారు చేసిన తప్పు ఏమిటో ఆయన వారికి చెబు
తాడు. వారు పాపం చేశారని, వారు అతిశయించారని
దేవుడు వారికి చెబుతాడు.
10 దేవుడు వాళ్ల చెవులు వినేలా తెరుస్తాడు. వారు
పాపం చేయటం చాలించాలని ఆయన వారికి
ఆజ్ఞ ఇస్తాడు.
11 ఆ మనుష్యులు దేవుని మాట విని ఆయనకు
విధేయులైతే, దేవుడు వారిని విజయవంతమైన
ఆనంద జీవితాన్ని జీవింపనిస్తాడు.
12 కానీ ఆ మనుష్యులు దేవునికి విధేయుల
య్యేందుకు నిరాకరిస్తే వారు మృతుల లోకంలో
చేరిపోతారు. ఏది నిజమైన జ్ఞానమో తెలియకుండా
వాళ్లు (మూర్ఖులుగా) చనిపోతారు.

13 "దేవుని గూర్చి లక్ష్యపెట్టని మనుష్యులు ఎల్ల
ప్పుడూ కక్షతో ఉంటారు. దేవుడు వారిని శిక్షించి
నప్పటికీ, వారు సహాయం కోసం దేవుని ప్రార్థించ
నిరాకరిస్తారు.
14 ఆ మనుష్యులు ఇంకా యవ్వనంలో ఉండగానే
మరణిస్తారు. మగ వ్యభిచారులతోబాటు వారు
కూడా అవమానంతో మరణిస్తారు.
15 కానీ శ్రమ పడుతున్న మనుష్యులను దేవుడు వారి
కష్టాల్లోనుంచి రక్షిస్తాడు. మనుష్యులు మేల్కొని
దేవుని మాట వినేలా ఆయన ఆ కష్టాలను ప్రయో
గిస్తాడు.
16 యోబూ, దేవుడు నీ మీద దయ చూపించి, నీ
కష్టాల నుండి నిన్ను బయటకు రప్పించి నీకు
సహాయం చేయాలని దేవుడు కోరుతున్నాడు.
దేవుడు నీకు క్షేమకరమైన స్థలం ఇవ్వాలనీ నీ
బల్లమీద సమృద్ధిగా భోజనం ఉంచాలనీ కోరు
తున్నాడు.
17 కానీ యోబూ, దుర్మార్గులవలె నీవు శిక్షించబడు
తున్నావు. దేవుని న్యాయం, తీర్పు నిన్ను
పట్టేశాయి.
18 యోబూ, ధనం నీ చేత తప్పు చేయించనీయ
కుండును గాక. విస్తారమైన ధనాశ చూపించినందు
వల్ల మోసపోవద్దు.
19 నీ ధనం అంతా ఇప్పుడు నీకు సహాయం చేయ
లేదని నీకు తెలుసు. శక్తిమంతుల సహాయం కోసం
మొరపెట్టినందువల్ల ఏమి లాభం లేదు.
20 ప్రజలు నశించిపోయే సమయంలో రాత్రికోసం
ఆశించకు. (వాళ్లు దేవున్నుండి దాక్కోగలమని
అనుకొంటున్నారు.)
21 యోబూ, తప్పు చేయకుండా జాగ్రత్త పడు.
ఎందుకంటే నీవు ఈ కష్టాన్ని ఎన్నుకొన్నావు.
22 "దేవునికి చాలా శక్తి ఉంది. దేవుడే అందరిలోకెల్ల
గొప్ప ఉపదేశకుడు.
23 ఏమి చేయాలి అనేది దేవునికి ఎవరూ చెప్పలేరు.
'దేవా నీవు తప్పు చేశావు' అని ఎవరూ దేవునికి
చెప్పలేరు.
24 "దేవునిని తాను చేసిన పనిని బట్టి స్తుతించటం
మరువకు. మనుష్యులు దేవునిని కీర్తనలతో
స్తుతించారు.

25 ప్రతి మనిషీ దేవుని పనిని చూశాడు. మనుష్యులు
దేవుని పనిని దూరం నుండి చూశారు.
26 దేవుడు గొప్పవాడు. అది నిజం. ఆయన గొప్ప
తనాన్ని మనం గ్రహించలేం. దేవునికి ఎన్ని సంవత్స
రాలో ఏ మనిషీ లెక్కించలేడు.
27 "దేవుడు భూమి నుండి నీళ్లు తీసుకొని దాన్ని
వర్షంగా మారుస్తాడు.
28 ఆయన మేఘాన్ని చేసి వాటి నీళ్లను కుమ్మరిస్తాడు.
మనుష్యుల మీద అధిక వర్షం కురుస్తుంది.
29 దేవుడు మేఘాలను ఎలా వ్యాపింపజేస్తాడో మనిషి
గ్రహించలేడు. దేవుడు నివసించే ఆకాశంలోనుంచి
ఉరుము ఎలా ఉరుముతుందో ఏ మనిషీ గ్రహించ
లేడు.
30 అగాధ సముద్రాన్ని ఆవరిస్తూ ఆకాశం అంతటా
దేవుడు మెరుపును ఎలా విస్తరింపజేస్తాడో చూడు.
31 రాజ్యాలను అదుపులో ఉంచి సమృద్ధిగా ఆహారం
ఇచ్చేందుకు దేవుడు ఈ మేఘాలను ప్రయో
గిస్తాడు.
32 దేవుడు మెరుపులను తన చేతితో పట్టుకొంటాడు.
దేవుడు కోరుకొన్న చోటనే పిడుగుపడేటట్టు
దానికి ఆజ్ఞాపిస్తాడు.
33 తుఫాను వస్తోందని ఉరుము తెలియజేస్తుంది.
తుఫాను వస్తోందని చివరికి పశువులకు కూడా
తెలుసు.

37 "ఉరుములు, మెరుపులు నన్ను భయపెడ
తాయి. నేను ఈ విషయాలు తలచినప్పుడు
నా గుండె చాలా వేగంగా కొట్టుకొంటుంది.
2 ప్రతి ఒక్కరూ వినండి. దేవుని స్వరం ఉరుములా
ధ్వనిస్తుంది. దేవుని నోటి నుండి వస్తోన్న ఉరుము
శబ్దం వినండి
3 మొత్తం ఆకాశం అంతటా వెలిగేలా దేవుడు తన
మెరుపును పంపిస్తాడు. అది భూమి అంతట మెరి
సింది.
4 మెరుపు మెరిసిన తర్వాత గర్జించే దేవుని స్వరం
వినవచ్చును. దేవుడు తన ఆశ్చర్యకరమైన
స్వరంతో ఉరుముతాడు. మెరుపు మెరుస్తూ
ఉండగా దేవుని స్వరం ఉరుముతుంది.
5 దేవుడు ఉరిమే స్వరం అద్భుతం. మనం గ్రహించ
జాలని గొప్ప కార్యాలు ఆయన చేస్తాడు.
6 'నేలమీద పడు' అని ఆయన మంచుతో చెబు
తాడు. 'నేలమీద వర్షించు' అని దేవుడు వర్షంతో
చెబుతాడు.
7 దేవుడు ఏమి చేయగలడో అనేది ఆయన
సృజించిన మనుష్యులంతా తెలుసుకొనేందుకు
అలా చేస్తాడు.
8 మృగాలు వాటి గుహల్లోకి పరుగెత్తిపోయి, అక్కడ
నివసిస్తాయి.
9 తుఫాను దక్షిణం నుండి వస్తుంది. చలి ఉత్తరం
నుండి వస్తుంది.
10 దేవుని ఊపిరి మంచును చేస్తుంది. అది మహా
సముద్రాలను గడ్డ కట్టిస్తుంది
11 దేవుడు మేఘాలను నీళ్లతో నింపుతాడు. ఆయన
తన మెరుపును మేఘాల ద్వారా విస్తరింప చేస్తాడు.
12 భూమి మీద అంతటికీ చెదరిపోయేలా దేవుడు
మేఘాలను ఆజ్ఞాపిస్తాడు. దేవుడు ఏమి చెబితే
అది మేఘాలు చేస్తాయి.
13 దేవుడు మనుష్యులను శిక్షించేందుకు, వరదలను
లేదా తన ప్రేమ చూపుటకై వర్షం రప్పించేందుకు
మేఘాలను తీసుకొని వస్తాడు.
14 "యోబూ, ఒక నిమిషం ఆగి విను. ఆగి, దేవుడు
చేసే అద్భుత విషయాలను గూర్చి ఆలోచించు.
15 యోబూ, దేవుడు మేఘాలను ఎలా అదుపు
చేస్తాడో నీకు తెలుసా? దేవుడు తన మెరుపును
ఎలా ప్రకాశింప చేస్తాడో నీకు తెలుసా?
16 ఆకాశంలో మేఘాలు ఎలా వేలాడుతాయో నీకు
తెలుసా? దేవుని జ్ఞానం పరిపూర్ణం. మేఘాలు,
దేవుని ఆశ్చర్య కార్యాలు.
17 లేదు, "యోబూ, ఈ సంగతులు నీకు తెలియవు.
దక్షిణపు వేడి గాలిలో భూమి నిశ్చలంగా ఉన్న
ప్పుడు నీకు చెమటపోసి, నీ బట్టలు జిడ్డుగా
ఉండటం మాత్రమే నీకు తెలుసు.
18 యోబూ, ఆకాశాన్ని విశాలపరచేందుకు మెరుగు
దిద్దిన అద్దంలా దానిని గట్టిగా చేసేందుకు నీవు
దేవునికి సహాయం చేయగలవా?
19 "యోబూ, దేవునితో మేము ఏమి చెప్పాలో చెప్పు.
మేము చీకటిలో ఉన్నందువల్ల సరియైన మా
వాగ్వివాదాన్ని దేవునికి మేము చెప్పలే కున్నాము.
(దేవుని సన్నిధిలో) ఏమి చెప్పడానికీ మాకు
తెలియడంలేదు.
20 నేను దేవునితో మాట్లాడాలని నేను ఆయనతో
చెప్పను. అలా చెప్పటం నాశనం చేయమని అడిగి
నట్టే ఉంటుంది.
21 ఇప్పుడు ప్రకాశిస్తున్న సూర్యుణ్ణి ఏ మనిషీ చూడ
లేడు. గాలి మేఘాలను తరిమి వేసిన తరువాత
అది ఆకాశంలో చాలా తేజోవంతంగా ప్రకాశిస్తుంది.
22 (అదే విధంగా దేవుడు ఉన్నాడు) దేవుని బంగారు
మహిమ ఉత్తరం నుండి ప్రకాశిస్తుంది. దేవుడు
అద్భుత మహిమతో వస్తాడు.
23 సర్వశక్తిమంతుడైన దేవుడు నిజంగా గొప్పవాడు.
మనం దేవుని దగ్గరగా వెళ్లలేం. దేవుడు మనుష్యుల్ని
ఎల్లప్పుడూ సరిగ్గాను, న్యాయంగాను చూస్తాడు.
24 అందువల్లనే మనుష్యులు దేవుని గౌరవిస్తారు. కానీ
తెలివిగల వాళ్లం అనుకొనే గర్విష్ఠులను దేవుడు
లక్ష్యపెట్టడు."

## దేవుడు యోబుతో మాట్లాడటం

38 అప్పుడు యెహోవా తుఫానులో నుండి
యోబుకు జవాబు ఇచ్చాడు. దేవుడు
చెప్పాడు:
2 "నా జ్ఞానమును అంగీకరించక పనికిమాలిన, తెలివి
తక్కువ మాటలతో నన్ను ప్రశ్నించే ఈ మనిషి
ఎవరు?"
3 యోబూ, మగవాడిలా గట్టిగా ఉండు. నేను నిన్ను
అడిగే ప్రశ్నలకు జవాబు ఇచ్చేందుకు సిద్ధంగా
ఉండు.
4 యోబూ, నేను భూమిని చేసినప్పుడు నీవు ఎక్కడ
ఉన్నావు? నీవు అంత తెలివిగల వాడవైతే నాకు
జవాబు చెప్పు.
5 యోబూ, ప్రపంచం ఎంత పెద్దగా ఉండాలో నిర్ణ
యించింది ఎవరు? నీకు తెలిసినట్టే ఉంది! కొల
బద్దతో ప్రపంచాన్ని ఎవరు కొలిచారు.
6 భూమికి ఆధారాలు దేనిమీద ఉన్నాయి? భూమికి
అత్యంత ముఖ్యమైన రాయిని దాని పునాదిలో
వేసింది ఎవరు?
7 అది జరిగినప్పుడు ఉదయ నక్షత్రాలు కలిసి
పాడాయి. దేవదూతలు కేకలు వేసి, ఎంతో సంతో
షించారు.

8 "యోబూ, భూమి అగాధములో నుండి సముద్రం
ప్రవహించినప్పుడు దానిని నిలిపేందుకు దాని
తలుపులు మూసినవారు ఎవరు?
9 ఆ సమయంలో నేనే సముద్రాన్ని మేఘాలతో
కప్పి వేశాను. మరియు సముద్రాన్ని చీకటితో
చుట్టి వేశాను.
10 సముద్రానికి హద్దులు నేనే నియమించాను.
మూయబడిన ద్వారాల వెనుక నేను దానిని
ఉంచాను.
11 నీవు ఇంత మట్టుకు రావచ్చు. కాని ఇంకా
ముందుకు రాకూడదు. నీ గర్వపు అలలు ఆగి
పోవాల్సింది ఇక్కడే, అని నేను సముద్రంతో
చెప్పాను.
12 "యోబూ, ప్రారంభం కావాలని ఉదయంతోను,
ప్రారంభం కావాలని రోజుతోను నీ జీవితంలో
నీవు ఎప్పుడైనా చెప్పావా?
13 యోబూ, ఉదయపు వెలుగు భూమిని ఆవరిం
చాలని, దుర్మార్గులు తాము దాగుకొనే స్థలాలు
విడిచిపెట్టేలా ఉదయపు వెలుగు వారిని బలవంతం
చేయాలని నీవు ఎన్నడయినా దానితో చెప్పావా?
14 ఉదయపు వెలుగు కొండలు, లోయలు కనబడే
టట్టు చేస్తుంది. పగటి వెలుగు భూమి మీదికి
వచ్చినప్పుడు ఆ స్థలాల ఆకారాలు చొక్కా
మడతల్లా తేటగా కనబడతాయి. అచ్చు వేయబడిన
మెత్తని మట్టిలా ఆ స్థలాల ఆకారాలు రూపొందు
తాయి.
15 దుర్మార్గులకు పగటి వెలుగు ఇష్టం లేదు. అది
బాగా ప్రకాశించినప్పుడు, వారు వారి చెడ్డ పనులు
చేయకుండా అది వారిని వారిస్తుంది.
16 "యోబూ, సముద్రం మొదలయ్యే దాని లోతైన
చోట్లకు నీవు ఎప్పుడైనా వెళ్లావా? మహా సముద్రపు
అట్టడుగున నీవు ఎప్పుడైనా నడిచావా?
17 యోబూ, మరణపు చీకటి చోటు ఎదుట నిలిచే
ద్వారాలను ఎవరైనా, ఎన్నడయినా నీకు చూపిం
చారా?
18 యోబూ, భూమి ఎంత పెద్దదో నిజంగా నీవు
గ్రహిస్తున్నావా? ఇదంతా నీకు తెలిస్తే నాతో చెప్పు.
19 "యోబూ, వెలుగు వచ్చే దిశగా పోయేందుకు
ఎటు వెళ్లాలి? చీకటి ఎక్కడ నుండి వస్తుంది?
20 యోబూ, చీకటి వెలుగు ఎక్కడ నుండి వస్తాయో
అక్కడికి వాటిని నీవు తీసుకొని వెళ్లగలవా? అవి
నివసించే చోటుకు ఎటుగా వెళ్లాలో నీకు తెలుసా?
21 యోబూ, నీవు చాలా ముసలివాడివి కదా? భూమి
చేయబడినప్పుడు నీవు అక్కడ ఉన్నావు కనుక
నీకు ఈ సంగతులన్నీ తెలుసు అని నాకు గట్టిగా
తెలుసు. నీవు లేవూ?

22 "యోబూ, నేను హిమమును, వడగండ్లను నిలువ
ఉంచే గిడ్డంగులకు నీవు ఎప్పుడైనా వెళ్లావా?
23 కష్టదినాల్లో ఉపయోగించేందుకు యుద్ధాన్ని,
పోరాట దినాలకు ఉపయోగించేందుకు హిమ
మును, వడగండ్లను నేను దాచిపెడతాను.
24 యోబూ, సూర్యుడు ఎక్కడ నుండి పైకి వస్తాడో
అక్కడికి నీవు ఎన్నడయినా వెళ్లావా? భూమి
అంతటా వీచేందుకు తూర్పు గాలులు ఎక్కడ
నుండి వస్తాయో అక్కడికి నీవు ఎన్నడయినా
వెళ్లావా?
25 యోబూ, భారీ వర్షం కోసం ఆకాశంలో మార్గాన్ని
ఎవరు తవ్వారు? ఉరుములోని మెరుపుకు మార్గం
ఎవరు చేశారు?
26 యోబూ, మనుష్యులు ఎవరూ నివసించని చోట
నీళ్లు ఉండునట్లు.
27 బీడు భూమిని తృప్తిపరచుటకు దానిని విస్తారమైన
గడ్డితో పచ్చగా చేయుటకు నీళ్లు ఇచ్చి, ఈ
సంగతులను చేసిన వారు ఎవరు?
28 యోబూ, వర్షానికి తండ్రి ఉన్నాడా? మంచు బిందు
వులు ఎక్కడ నుండి వస్తాయి?
29 యోబూ, హిమమునకు తల్లి ఎవరు? ఆకాశం
నుండి కురిసే మంచుకు జన్మ ఇచ్చేది ఎవరు?
30 జలాలు బండలా గట్టిగాను మహా సముద్రాల పైభా
గాలు గట్టిగాను ఎప్పుడు బిగిసిపోతాయి?

31 "యోబూ, కృత్తిక నక్షత్రాలను నీవు బిగించగలవా?
మృగశీర్షకు కట్లు నీవు విప్పగలవా?
32 యోబూ, నక్షత్రరాసులు సరియైన కాలములలో
సమకూడునట్లు నీవు చేయగలవా? లేక ఎలుగు
బంటిని దాని పిల్లలతో నీవు నడిపించగలవా?
33 యోబూ, ఆకాశాన్ని పాలించే నియమాలు నీకు
తెలియునా? భూమి మీద వాటి పాలనను నీవు
ప్రారంభించగలవా?
34 యోబూ, మేఘాలు భారీ వర్షంతో నిన్ను ముంచె
త్తునట్లు నీవు కేకవేసి వాటికి ఆజ్ఞలు ఇవ్వగలవా?
35 యోబూ, నీవు కోరిన చోటికి మెరుపును పంప
గలవా? మెరుపు నీ దగ్గరకు వచ్చి యోబూ,
'ఇదిగో మేము వచ్చాం, నీకు ఏమి కావాలి?' అని
అంటాయా?
36 ఒక మనిషి మనస్సులో జ్ఞానం కలిగించేది ఎవరు?
మనస్సుకు గ్రహింపును ఇచ్చేది ఎవరు?
37 యోబూ, మేఘాలను లెక్కించుటకు, అవి వాటి
వర్షమును కురియునట్లు వాటికి అంచం ఇచ్చు
టకు అంతటి తెలివిగలవారు ఎవరు?
38 ఆ వర్షం దుమ్మును గట్టి పరుస్తుంది. ఆ మట్టి
గడ్డలు ఒక్కటిగా అతుక్కుంటాయి.
39 "యోబూ, ఆడ సింహమునకు ఆహారం నీవు
కనుగొంటావా? ఆకలితో ఉన్న సింహపు పిల్లలకు
నీవు ఆహారం పెడతావా?
40 అవి దాగుకొనే చోట్ల వాటి గుహలలో పండుకొని
లేక కూర్చొని ఉంటాయి.
41 యోబూ, కాకి పిల్లలు దేవునికి మొరపెట్టినప్పుడు
ఆహారం లేక అటు ఇటు తిరుగునప్పుడు కాకులను
పోషించేది ఎవరు?

39 "యోబూ, కొండ మేకలు ఎప్పుడు
పుట్టాయో నీకు తెలుసా? తల్లి జింక పిల్లను
పెట్టేటప్పుడు నీవు గమనిస్తావా?
2 యోబూ, తల్లి కొండ మేక, తల్లి జింక వాటి పిల్ల
లను ఎన్నాళ్లు మోస్తాయో నీకు తెలుసా? అవి
పుట్టడానికి సరైన సమయం ఎప్పుడో నీకు
తెలుసా?
3 అవి పండుకొంటాయి, వాటి పిల్లలు పుడతాయి.
అప్పుడు వాటి పురిటినొప్పులు పోతాయి.
4 తల్లి కొండ మేక పిల్లలు, తల్లి జింక పిల్లలు పొలాల్లో
బలంగా పెరుగుతాయి. అప్పుడు అవి వాటి
నివాసాలు వదలి పోతాయి, తిరిగి రావు.
5 "యోబూ, అడవి గాడిదలను స్వేచ్ఛగా తిరుగని
చ్చినది ఎవరు? వాటి తాళ్లు ఊడదీసి, వాటిని
స్వేచ్ఛగా పోనిచ్చినది ఎవరు?
6 అడవి గాడిదకు నివాసంగా అరణ్యాన్ని ఇచ్చింది
నేనే (యెహోవాను). అవి నివాసం ఉండుటకు
ఉప్పు భూములను నేను వాటికి ఇచ్చాను.
7 అడవి గాడిద అల్లరి పట్టణాలకు దగ్గరగా వెళ్లదు.
ఏ మనిషీ వాటిని సాధువు చేసి, బండి లాగుటకు
బలవంతం చేయలేడు.
8 అడవి గాడిదలు కొండల్లో నివసిస్తాయి. అక్కడే
అవి గడ్డి తింటాయి. తినుటకు పచ్చగా ఏమైనా
ఉంటుందేమో అని అక్కడే అవి చూస్తాయి.
9 "యోబూ, అడవి ఆబోతు నీకు పని చేయటానికి
లోబడుతుందా? రాత్రిపూట అది నీ కొట్టంలో
ఉంటుందా?
10 యోబూ, కేవలం తాడుతోనే అడవి ఆబోతు నీ
పొలం దున్నేటట్టు చేయగలవా? నీ కోసం అది
లోయలను దున్నుతుందా?
11 యోబూ, అడవి ఆబోతు బలాన్ని నీ పని కోసం
ఉపయోగించుకొనేందుకు నీవు దానిమీద ఆధార
పడగలవా? మహా కష్టతరమైన నీ పని అది చేస్తుంది
అనుకొంటావా?
12 నీ ధాన్యాన్ని పోగుచేసి నీ కళ్లం చోటుకు అది
తీసుకొని వస్తుందని దాన్ని నీవు నమ్మగలవా?
13 "నిప్పుకోడి సంతోషంగా ఉంది, గనుక అది దాని
రెక్కలు రెప రెప లాడిస్తుంది. (కానీ అది ఎగుర
లేదు) కానీ నిప్పుకోడి రెక్కలు కొంగ రెక్క
ల్లాంటివి కావు.
14 నిప్పుకోడి నేలమీద గుడ్లు పెడుతుంది. ఇసుకలో
అవి వెచ్చగా అవుతాయి.
15 ఎవరైనా ఆ గుడ్లు మీద నడచి వాటిని పగుల
గొట్టవచ్చని లేక ఏదైనా అడవి జంతువు వాటిని
పగుల గొట్టవచ్చని నిప్పుకోడి మరచిపోతుంది.
16 "నిప్పుకోడి తన పిల్లలను చూడదు. ఆ పిల్లలు
తనవి కానట్టే చూస్తుంది. దాని పిల్లలు చస్తే దాని
ప్రయాస అంతా వ్యర్థం అయిందనే విషయం
దానికి లక్ష్యం లేదు.
17 ఎందుకంటే, నేను (దేవుణ్ణి) నిప్పుకోడికి జ్ఞానం
ఇవ్వలేదు. నిప్పుకోడి తెలివి తక్కువది. నేను
దాన్ని అలాగే చేశాను.
18 కానీ నిప్పుకోడి పరుగెత్తటానికి లేచినప్పుడు
గుర్రాన్ని, దాని రౌతును చూచి అది నవ్వుతుంది.
ఎందుకంటే, అది గుర్రం కంటే వేగంగా పరుగెత్తు
తుంది గనుక.
19 "యోబూ, గుర్రానికి బలం నీవు ఇచ్చావా? లేక
దాని మెడ మీద జూలు వెంట్రుకలను నీవు
పెట్టావా?
20 యోబూ, మిడత ఎగిరినట్టుగా నీవు గుర్రాన్ని
దూకించగలవా? గుర్రం గట్టిగా సకిలిస్తుంది, మను
ష్యుల్ని భయపెడ్తుంది.
21 గుర్రం, తనకు చాలా బలం ఉందని సంతోషిస్తుంది.
అది నేలమీద కాలితో గీకుతుంది. యుద్ధానికి వెళ్లే
టప్పుడు గుర్రం వేగంగా పరుగెత్తుతుంది

22 భయాన్ని చూచి గుర్రం నవ్వుతుంది. అది భయ
పడదు. యుద్ధం నుండి అది పారిపోదు.
23 గుర్రం మీద అంబులపొది వణకుతుంది. దాని
రౌతువద్ద ఉన్న బల్లెం, ఆయుధాలు సూర్య
కాంతిలో తళతళలాడుతాయి.
24 గుర్రం చాలా ఉల్లాసంగా ఉంటుంది. నేలమీద అది
చాలా వేగంగా పరుగెత్తుతుంది. బూరధ్వని వింటే
గుర్రం ఇంక నిలబడలేదు.
25 బూర మ్రోగినప్పుడు గుర్రం 'ఓహో' అంటుంది.
దూరం నుంచే అది యుద్ధాన్ని పసికడుతుంది.
సేనాని కేకలు వేసే ఆజ్ఞలను, ఇతర యుద్ధ
ధ్వనులను అది వింటుంది.

26 "యోబూ, డేగ దాని రెక్కలు విప్పి దక్షిణంగా
ఎగిరేటప్పుడు ఎలా ఎగరాలో డేగకు నీవు
నేర్పించావా?
27 యోబూ, పక్షిరాజు ఎగరాలని, పర్వతాల్లో ఎత్తుగా
దాని గూడు కట్టుకోవాలని నీవు దానికి ఆజ్ఞా
పించావా?
28 పక్షిరాజు కొండ మీద బండపైన నివసిస్తుంది. ఆ
బండ పక్షిరాజు యొక్క కోట.
29 పక్షిరాజు తన దుర్గంలోనుండి తన ఆహారం కోసం
వెదకుతుంది. దూరంలో ఉన్న ఆహారాన్ని అది
చూడగలదు.
30 పక్షిరాజు పిల్లలు రక్తం తాగుతాయి. అవి చచ్చిన
శవాల చుట్టూరా చేరుతాయి."

40 యోబుతో యెహోవా ఇలా చెప్పాడు:
2 "యోబూ, సర్వశక్తిమంతుడైన దేవునితో నీవు
వాదించావు. తప్పు చేశానని నీవు నాకు తీర్పు
చెప్పావు. ఇప్పుడు నీవు తప్పుచేశావని ఒప్పు
కుంటావా? నాకు జవాబు ఇస్తావా?"
3 అప్పుడు దేవునికి యోబు ఇలా జవాబు చెప్పాడు.
యోబు అన్నాడు:

4 "నేను ముఖ్యం కాదు. నీకు నేను ఏమి చెప్పగలను?
నీకు నేను జవాబు ఇవ్వలేను. నా చేతితో నేను
నా నోరు మూసుకొంటాను.
5 నేను ఒకసారి మాట్లాడాను కానీ నేను మరల జవాబు
ఇవ్వను. నేను రెండుసార్లు మాట్లాడాను. కానీ
నేను ఇంకా ఏమీ చెప్పను."
6 అప్పుడు యెహోవా తుఫానులోంచి మరల
యోబుతో ఇలా మాట్లాడాడు. యెహోవా
అన్నాడు:
7 "యోబూ, మగవాడిలా నిలబడు. నేను నిన్ను కొన్ని
ప్రశ్నలు అడుగుతాను నీవు నాకు జవాబు చెప్పు.
8 యోబూ నేను న్యాయంగా లేనని నీవు తలుస్తు
న్నావా? నీదే సరిగ్గా ఉన్నట్లు కనబడేలా చేయాలని,
నేను తప్పు చేశానని నీవు నన్ను నిందిస్తావా?
9 యోబూ, నీ చేతులు దేవుని చేతులంత బలంగా
ఉన్నాయా? నీ స్వరాన్ని నా స్వరంలా ఉరిమేట్టు
నీవు చేయగలవా?
10 ఒకవేళ నీవు అలా దేవునిలా చేయగలిగితే నీకు
నీవే ఘనత, మహిమ, ఆపాదించుకో. మహిమ,
తేజస్సును వస్త్రాల్లా ధరించు.
11 యోబూ, నీవు నావలె ఉంటే గర్విష్ఠులను తక్కు
వగా చూడు. యోబూ, ఆ గర్విష్ఠుల మీద నీ
కోపం కుమ్మరించు. ఆ గర్విష్ఠులను దీనులుగా
చేయి.
12 అవును, యోబూ, ఆ గర్విష్ఠులను చూడు. వారిని
దీనులనుగా చేయి. దుర్మార్గులను వారు ఉన్న
చోటనే చితుకగొట్టు.
13 గర్విష్ఠులందరినీ మట్టిలో పాతిపెట్టు. వారి శరీరా
లను చుట్టేసి వారి సమాధులలో పెట్టు
14 యోబూ, నీవు గనుక వీటన్నింటినీ చేయగలిగితే
అప్పుడు నిన్ను నీవే రక్షించుకొనుటకు సమర్థుడ
వని నీ దగ్గర నేను ఒప్పుకొంటాను.
15 యోబూ, నీటి గుర్రాన్ని చూడు. నేను (దేవుణ్ణి)
నీటి గుర్రాన్ని చేశాను. మరియు నిన్నూ (యోబు)
నేను చేశాను. నీటి గుర్రం ఆవులా గడ్డి తింటుంది.
16 నీటి గుర్రం శరీరంలో చాలా బలం ఉంది. దాని
కడుపులోని కండరాలు చాలా శక్తివంతంగా
ఉంటాయి.
17 నీటి గుర్రం తోక దేవదారు వృక్షంలా బలంగా
నిలుస్తుంది. దాని కాలి కండరాలు చాలా బలంగా
ఉంటాయి.
18 నీటి గుర్రం యొక్క ఎముకలు ఇత్తడిలా గట్టిగా
ఉంటాయి. దాని కాళ్లు ఇనుప కడ్డీలా ఉంటాయి.
19 నీటి గుర్రం నేను (దేవుణ్ణి) చేసిన మహా అద్భుత
జంతువు. కాని నేను దానిని ఓడించగలను.
20 అడవి జంతువులు ఆడుకొనే కొండల మీద నీటి
గుర్రం తినే గడ్డి పెరుగుతుంది.
21 తామర చెట్ల కింద నీటి గుర్రం పండుకుంటుంది.
జమ్ము గడ్డి మడుగులలో నీటి గుర్రం దాక్కుం
టుంది.
22 తామర మొక్కలు తమ నీడలో నీటి గుర్రాన్ని
దాచిపెడతాయి. నది సమీపంగా పెరిగే నిరవంజి
చెట్ల కింద అది నివసిస్తుంది.
23 నది వరదలై పొర్లినా నీటి గుర్రం పారిపోదు.
యొర్దాను నది దాని ముఖం మీద చిమ్మితే అది
భయపడదు.
24 నీటి గుర్రానికి కళ్లు కట్టి ఒక ఉచ్చులో దానిని
ఎవరూ పట్టుకొనలేరు.

41 “యోబూ, నీవు మొసలిని గాలముతో
పట్టుకొనగలవా? దాని నాలుకను తాడుతో
కట్టివేయగలవా?
2 యోబూ, మొసలి ముక్కులోనుంచి తాడును నీవు
వేయగలవా? లేక దాని దవడకు గాలపు ముల్లు
ఎక్కించగలవా?
3 యోబూ, తన్ను స్వేచ్ఛగా పోనిమ్మని మొసలి
నిన్ను బతిమలాడుతుందా? అది మర్యాద మాట
లతో నీతో మాట్లాడుతుందా?
4 యోబూ, మొసలి నీతో ఒడంబడిక చేసు
కుంటుందా? శాశ్వతంగా నిన్ను సేవిస్తానని వాగ్దానం
చేస్తుందా?
5 యోబూ, నీవు ఒక పిట్టతో ఆడుకొన గలవా
మొసలితో ఆడుకో గలవా? నీ దాసీలు దానితో
ఆడుకొనేందుకు దానికి ఒక తాడు కట్టగలవా?
6 యోబూ, జాలరులు నీవద్ద మొసలిని కొనుటకు
ప్రయత్నిస్తారా? వారు దానిని వ్యాపారులకు
అమ్మేందుకు దానిని ముక్కలుగా కోయగలరా?
7 యోబూ, మొసలి చర్మం మీదికి ఎన్నో శూలాలు
నీవు విసరగలవా? లేక చేపలను వేటాడే అలుగులు
అనేకం దాని తలమీద కొట్టగలవా?
8 “యోబూ, ఒక వేళ నీవు నీ చేతిని మొసలి మీద
ఉంచితే దానితో నీ గట్టి పోరాటాన్ని నీవు ఎప్పటికీ
మరచిపోలేవు. మరియు నీవు దానితో మరల ఎన్న
టికీ పోరాడవు.
9 ఒక వేళ నీవు మొసలిని ఓడించగలనని అనుకుంటే
అది మరచిపో! అలాంటి ఆశ ఏమీ లేదు! దాన్ని
చూస్తేనే నీకు భయం పుడుతుంది.
10 మొసలికి కోపం పుట్టించగలిగినంత ధైర్యంగల
మనిషి ఎవరూ లేరు. కనుక అలాంటప్పుడు
యోబూ, నాకు విరోధంగా నిలువగలవాడు ఎవడు?
11 నేను (దేవుణ్ణి) ఎవరికీ ఏమీ బాకీ లేను. ఆకా
శమంతటి క్రింద ఉన్న సర్వము నాదే.

12 “యోబూ, మొసలి కాళ్లను గూర్చి, దాని బలం,
దాని అందమైన ఆకారం గూర్చి నేను నీతో
చెబుతాను.
13 మొసలి చర్మాన్ని ఎవరూ ఊడదీయలేరు. ఒక
కళ్లెం పట్టుకొని ఎవ్వరూ దాని సమీపంగా
రాజాలరు.
14 మొసలి దవడలు తెరిపించడానికి ఎవరూ దానిని
బలవంతం చేయలేరు. దాని దవడల్లోని పళ్లు మను
ష్యులను భయపెడతాయి.
15 మొసలి వీపు మీది గట్టి పొలుసుల వరుసలు దగ్గర
దగ్గరగా కుదించబడ్డాయి.
16 గాలి జొరబడలేనంత దగ్గర దగ్గరగా ఆ పొలుసులు
ఉంటాయి.
17 ఆ పొలుసులు ఒక దానితో ఒకటి జత చేయ
బడ్డాయి. వాటిని ఊడబెరుకుటకు వీలులేనంత
గట్టిగా ఒకదానినొకటి అంటిపెట్టుకొని ఉంటాయి.
18 మొసలి తుమ్మినప్పుడు అది వెలుగు ప్రకాశించి
నట్టుగా ఉంటుంది. దాని కళ్లు ఉదయపు వెలుగులా
ఉంటాయి.
19 దాని నోటి నుండి మండుతున్న జ్వాలలు బయ
టకు వస్తాయి. నిప్పు కణాలు బయటకు లేస్తాయి.
20 ఉడుకుతూ ఉన్న కుండ కింద కాలుతున్న పిచ్చి
మొక్కలనుండి పొగవచ్చినట్టుగా మొసలి ముక్కు
నుండి పొగ వస్తుంది.
21 మొసలి శ్వాస బొగ్గులను మండిస్తుంది. దాని నోటి
నుండి అగ్ని జ్వాలలు వస్తాయి.
22 మొసలి మెడ చాలా బలంగా ఉంటుంది. మను
ష్యులు దానిని చూచి భయపడి దాని నుండి
పారిపోతారు.
23 మొసలి శరీరంలో బలహీనత ఏమీ లేదు. అది
ఇనుములా గట్టిగా ఉంటుంది.
24 మొసలి గుండె బండలా ఉంటుంది. దానికి భయం
ఏమీ లేదు. అది తిరుగలి కింది రాయిలా గట్టిగా
ఉంటుంది.
25 మొసలి మేల్కొన్నప్పుడు బలమైన మనుష్యులు
భయపడతారు. మొసలి తోక ఆడించినప్పుడు
వారు పారిపోతారు.
26 ఖడ్గం, బల్లెం, బాణం మొసలిని కొడితే అవి తిరిగి
వస్తాయి. ఆ ఆయుధాలు దానికే మాత్రం హాని
చేయవు.
27 మొసలికి ఇనుమును గడ్డి పరకలా విరుగ గొట్టడం
తేలిక. ఇత్తడిని కుళ్లిపోయిన చెక్కలా విరుగ
గొట్టటం తేలిక.
28 బాణాలు మొసలిని పారిపోయేటట్టు చేయలేవు.
దానిమీద విసిరిన బండలు ఎండి గడ్డిపోచల్లా
ఉంటాయి.
29 దుడ్డు కర్రతో మొసలిని కొట్టినప్పుడు అది దానికి
ఒక గడ్డి పరకలా అనిపిస్తుంది. మనుష్యులు దాని
మీద ఈటెలు విసిరినప్పుడు అది నవ్వుతుంది.
30 మొసలి శరీరం క్రింద ఉన్న చర్మం పగిలి పోయిన
చాలా వాడి చిల్లపెంకుల్లా ఉంటుంది. అది నడిచి
నప్పుడు మట్టిలో నురిపిడి కొయ్యలా గుంటలు
చేస్తుంది.
31 కాగుతున్న కుండలోని నీళ్లను అది బుడగలు పొంగి
స్తుంది. నూనె మసులుతున్న కుండలా అది నీటిని
పొంగిస్తుంది.
32 మొసలి ఈ దినప్పుడు దాని వెనుక ఒక దారి
ఏర్పడుతుంది. అది నీళ్లను పొంగింప జేసినప్పుడు
దాని వెనుక తెల్లని నురుగు ఉంటుంది.
33 భూమి మీద ఏ జంతువూ మొసలిలాంటిది లేదు.

అది భయం లేని జంతువుగా చేయబడింది.
34 మహా గర్విష్ఠి జంతువులను మొసలి చిన్న చూపు
చూస్తుంది. క్రూర జంతువులన్నిటికీ అది రాజు."
మరియు మొసలిని చేసినది నేనే, యెహోవాను.

### యెహోవాకు యోబు జవాబు

42 అప్పుడు యెహోవాకు యోబు ఇలా
జవాబు చెప్పాడు. యోబు అన్నాడు:
2 "యోహోవా, నీవు అన్నీ చేయగలవని నాకు
తెలుసు. నీవు పథకాలు వేస్తావు, నీ పథకాల్లో ఏదీ
మార్చబడజాలదు, నిలిపివేయబడదు.
3 'నా సలహాను గూర్చి ఈ వెర్రి ప్రశ్నలు అడుగు
తున్న ఇతడు ఎవరు?' అని యెహోవా, నీవు
ప్రశ్నించావు. నేను (యోబును) నాకు అర్థం కాని
విషయాలు యెహోవాని అడిగాను. నేను తెలిసి
కోలేనంత మరీ విపరీతమైన ఆశ్చర్యకరమైన
అద్భుతాలను గూర్చి నేను మాట్లాడాను.
4 "యెహోవా, 'నీవు నాతో యోబూ, నేను నీతో
మాట్లాడుతాను. నేను నిన్ను ప్రశ్నలు అడుగు
తాను. నీవు నాకు జవాబు ఇవ్వాలి' అన్నావు.
5 యెహోవా, ఇదివరకు నిన్ను గూర్చి నేను
విన్నాను. కానీ ఇప్పుడు నా స్వంత కళ్లతో నేను
నిన్ను చూశాను.
6 కనుక ఇప్పుడు, నన్ను గూర్చి నేను సిగ్గుపడుతు
న్నాను. యెహోవా, నేను విచారిస్తున్నాను. నేను
ఈ ధూళిలో, బూడిదలో కూర్చొని ఉండగానే
నేను నా జీవితం, నా హృదయం మార్చుకొంటా
నని వాగ్దానం చేస్తున్నాను."

### యోబుకు తన ఐశ్వర్యాలను యెహోవా తిరిగి యివ్వటం

7యెహోవా యోబుతో మాట్లాడటం చాలించిన
తర్వాత, ఆయన ఎలీఫజుతో మాట్లాడినాడు. ఎలీఫజు
తేమాను పట్టణస్థుడు. ఎలీఫజుతో యెహోవా ఇలా
చెప్పాడు: "నీ మీద, నీ యిద్దరు స్నేహితుల మీద
నేను కోపంగా ఉన్నాను. ఎందుకంటే మీరు నన్ను
గూర్చి సరిగా చెప్పలేదు. కానీ యోబు నన్ను గూర్చి
సరైన సంగతులు చెప్పాడు. యోబు నా సేవకుడు.
8కనుక ఎలీఫజూ ఇప్పుడు ఏడు ఎద్దులను, ఏడు పొట్టే
ళ్లను నీవే తీసుకో. వాటిని నా సేవకుడు యోబు దగ్గ
రకు తీసుకొని వెళ్లి, మీ నిమిత్తం దహనబలిగా వాటిని
అర్పించండి. నా సేవకుడు యోబు మీ కోసం
ప్రార్థిస్తాడు. అప్పుడు నేను అతని ప్రార్థనకు తప్పక
జవాబు ఇస్తాను. అప్పుడు మీరు శిక్షించబడాల్సిన
విధంగా నేను మిమ్మల్ని శిక్షంచను. మీరు చాలా అవివే
కంగా ఉన్నారు గనుక మీరు శిక్షించబడాలి. మీరు నన్ను
గూర్చి సరైన సంగతులు చెప్పలేదు. కానీ నా సేవకుడు
యోబు, నన్ను గూర్చి సరైన సంగతులు చెప్పాడు."
9కనుక తేమానువాడగు ఎలీఫజు, షూహి దేశస్థుడైన
బిల్దదు, నయమాతీ పట్టణస్థుడైన జోఫరు యెహో
వాకు విధేయులయ్యారు. అప్పుడు యెహోవా చెప్పి
నట్లు వాళ్లు చేశారు. అప్పుడు యెహోవా యోబు
ప్రార్థనకు జవాబు ఇచ్చాడు.
10కనుక యోబు తన స్నేహితుల కోసం ప్రార్థిం
చటం ముగించాడు. అప్పుడు యెహోవా యోబుకు
మరల విజయం ఇచ్చాడు. యోబుకు అంతకు ముందు
ఉన్నదానికి రెండంతలుగా దేవుడు ఇచ్చాడు. 11యోబు
సోదరులు, ఆడపడుచులు అందరూ తిరిగి యోబు
ఇంటికి వచ్చారు. అంతకు ముందు యోబును ఎరిగిన
ప్రతి ఒక్కరూ అతని ఇంటికి వచ్చారు. వాళ్లంతా
యోబుతో కలిసి విందు భోజనం చేశారు. యోబుకు
యెహోవా చాలా కష్టం కలిగించాడు గనుక వాళ్లంతా
అతనిని ఓదార్చారు. ఒక్కొక్కరు ఒక్కొక్క వెండి
నాణెం, ఒక బంగారు ఉంగరం యోబుకు ఇచ్చారు.
12యోబు జీవితంలో మొదటి భాగం కంటే రెండో
భాగాన్ని యెహోవా అధికంగా ఆశీర్వదించాడు. పద్నా
లుగు వేల గొర్రెలు, ఆరు వేల ఒంటెలు, రెండు వేల
ఆవులు, వెయ్యి ఆడ గాడిదలు యోబుకు స్వంతం
అయ్యాయి.
13యోబుకు ఏడుగురు కుమారులు, ముగ్గురు
కుమార్తెలు కూడ ఉన్నారు. 14యోబు మొదటి కుమా
ర్తెకు యెమీమా అని పేరు పెట్టాడు. యోబు రెండో
కుమార్తెకు కెజీయా అని పేరు పెట్టాడు. యోబు
మూడో కుమార్తెకు కెరెంహప్పుక్ అని పేరు పెట్టాడు.
15దేశం అంతటిలో యోబు కుమార్తెలు మహా
గొప్ప సౌందర్యవతులు. యోబు తన కుమార్తెలకు
తన ఆస్తిలో భాగం ఇచ్చాడు. వారి సోదరులు కూడ
తమ తండ్రి ఆస్తిలో వాటా పొందారు.
16కనుక యోబు మరో నూటనలభై సంవత్సరాలు
జీవించాడు. అతడు తన పిల్లలను, మనుమలు మనుమ
రాండ్రను, మునిమనుమలు మనుమరాండ్రను, వారి
పిల్లలను చూచేంతవరకు జీవించాడు. 17యోబు చని
పోయినప్పుడు అతడు కడువృద్ధుడు. యోబు సుదీర్ఘ
మైన కాలం జీవించాడు.

# కీర్తనల గ్రంథము

## మొదటి భాగం
## కీర్తన 1

1 ఒకడు నిజంగా ఎప్పుడు సంతోషంగా ఉంటా
డంటే, అతడు చెడ్డవారి సలహాలు పాటించన
ప్పుడు, అతడు పాపులవలె జీవించనప్పుడు, దేవు
నికి విధేయులు కానివారితో అతను కలిసి మెలిసి
వుండనప్పుడు.
2 ఆ మంచి మనిషి, యెహోవా ఉపదేశాలను ప్రేమి
స్తాడు. ఆ ఉపదేశాలను గూర్చి రాత్రింబవళ్లు అతడు
తలపోస్తూంటాడు.
3 కనుక ఆ మనిషి నీటి కాలువల ఒడ్డున చెట్టువలె
బలంగా ఉంటాడు. సకాలంలో ఫలాలు ఫలించే
ఒక చెట్టువలె అతడు ఉంటాడు. అతడు ఆకులు
వాడిపోని చెట్టువలె ఉంటాడు. అతడు చేసేది
అంతా సఫలం అవుతుంది.
4 అయితే చెడ్డవాళ్లు అలా ఉండరు. వాళ్లు గాలి
చెదరగొట్టివేసే పొట్టువలె ఉంటారు.
5 ఒక న్యాయ నిర్ణయం చేసేందుకు మంచి మను
ష్యులు గనుక సమావేశమైతే, అప్పుడు చెడ్డ మను
ష్యులు దోషులుగా రుజువు చేయబడతారు. ఆ
పాపాత్ములు నిర్దోషులుగా తీర్చబడరు.
6 ఎందుకంటే యెహోవా మంచి మనుష్యులను
కాపాడుతాడు, చెడ్డ మనుష్యులు ఆయన చేత
నాశనం చేయబడతారు.

## కీర్తన 2

1 యూదులు కాని ప్రజలకు అంత కోపం ఎందుకు
వచ్చింది? ఆ రాజ్యాలు తెలివి తక్కువ పథకాలు
ఎందుకు వేస్తున్నట్టు?
2 యెహోవాకు, ఆయన ఏర్పరచుకొన్న రాజుకు,
వ్యతిరేకంగా ఉండేందుకు ఆ దేశాల రాజులు, నాయ
కులు ఒకటిగా సమావేశం అవుతున్నారు.
3 "దేవునికిని, ఆయన ఏర్పాటు చేసికొన్న రాజుకు,
వ్యతిరేకంగా మనం తిరుగుబాటు చేద్దాం. "మన
లను బంధించిన తాళ్లను, గొలుసులను తెంపిపార
వేద్దాం." అని ఆ నాయకులు చెప్పుకొన్నారు.
4 కాని నా ప్రభువా, పరలోకంలో ఉన్న రాజు ఆ
ప్రజలను చూచి నవ్వుతున్నాడు.
5-6 దేవుడు కోపగించి, ఆ ప్రజలతో చెబుతున్నాడు:
"రాజుగా ఉండేందుకు నేను ఈ మనిషిని నిర్ణయిం
చాను. అతడు సీయోను కొండమీద ఏలుబడి
చేస్తాడు, సీయోను నా ప్రత్యేక పర్వతం." మరియు
అది ఆ యితర నాయకులను భయపడేలా
చేస్తుంది.
7 యెహోవా ఒడంబడికను గూర్చి ఇప్పుడు నేను
నీతో చెబుతాను. యెహోవా నాతో చెప్పాడు,
"నేడు నేను నీకు తండ్రినయ్యాను! మరియు
నీవు నా కుమారుడివి.
8 నీవు నన్ను అడిగితే నేను నీకు రాజ్యాలనే యిస్తాను.
భూమి మీద మనుష్యులంతా నీవాళ్లవుతారు!
9 ఒక ఇనుప కడ్డీ, మట్టి కుండను పగులగొట్టినట్లు
ఆ రాజ్యాలను నాశనం చేయటానికి నీకు శక్తి
ఉంటుంది."
10 అందుచేత రాజులారా, మీరు తెలివిగా ఉండండి.
పాలకులారా, మీరంతా ఈ పాఠం నేర్చుకోండి.
11 అధిక భయంతో యెహోవాకు విధేయులుగా
ఉండండి.
12 మరియు మీరు దేవుని కుమారునికి విశ్వాస పాత్రు
లుగా ఉన్నట్టు చూపించండి* మీరు ఇలా చేయ
కపోతే అప్పుడాయన కోపగించి, మిమ్ములను
నాశనం చేస్తాడు. యెహోవాయందు విశ్వాసం
ఉంచేవారు సంతోషిస్తారు. కానీ ఇతరులు జాగ్రత్తగా
ఉండాలి. ఆయన తన కోపం చూపించడానికి
సిద్ధంగా ఉన్నాడు.

## కీర్తన 3

**దావీదు తన కుమారుడైన అబ్షాలోము నుండి పారిపోతున్న సమయంలో వ్రాసిన కీర్తన.**

1 "యెహోవా, నాకు ఎందరెందరో శత్రువులు
ఉన్నారు. అనేకమంది ప్రజలు నాకు విరోధంగా
తిరిగారు.
2 చాలామంది మనుష్యులు నా విషయమై మాట్లాడు
తున్నారు. "అతన్ని దేవుడు తప్పించడు!" అని
ఆ మనుష్యులు అంటారు.

---

**దేవుని ... చూపించండి** అక్షరార్థం కుమారునికి ముద్దు పెట్టుకోండి.

3 అయితే, యెహోవా, నీవు నాకు కేడెము. నీవే
నా అతిశయం. యెహోవా, నీవు నన్ను ప్రముఖు
నిగా* చేస్తావు.
4 యెహోవాకు నేను ప్రార్థిస్తాను. ఆయన తన
పవిత్ర పర్వతం నుండి నాకు జవాబు ఇస్తాడు!
5 నేను పడుకొని విశ్రాంతి తీసుకోగలను, మరి నేను
మేల్కొందును. ఇది నాకు ఎలా తెలుస్తుంది??
ఎందుచేతనంటే యెహోవా నన్ను ఆవరించి,
కాపాడును గనుక!
6 వేలకు వేలుగా సైనికులు నా చుట్టూ మోహరించి
ఉండవచ్చును. కానీ ఆ శత్రువులకు నేను భయ
పడను.
7 యెహోవా, లెమ్ము* నా దేవా, వచ్చి నన్ను
రక్షించుము! నీవు చాలా బలవంతుడవు! నా దుష్ట
శత్రువుల దవడమీద నీవు కొట్టి, వారి పళ్లన్నీ
నీవు విరుగగొడతావు.
8 యెహోవా తన ప్రజలను రక్షించగలడు.
యెహోవా, దయచేసి నీ ప్రజలకు నీవు మంచి
సంగతులను జరిగించుము.

## కీర్తన 4

*సంగీత నాయకునికి.*

*తంతి వాద్యాలతో పాడదగిన దావీదు కీర్తన.*

1 నా మంచి దేవా, నేను నిన్ను ప్రార్థించినప్పుడు
నాకు జవాబు ఇమ్ము. నా ప్రార్థన ఆలకించి, నా
యెడల దయ చూపించుము! ఎప్పుడైనా నాకు
కష్టాలు వస్తే, వాటిని తొలగించుము.*
2 ప్రజలారా, ఎన్నాళ్లు మీరు నన్నుగూర్చి చెడ్డ
మాటలు చెబుతారు ? ప్రజలారా, మీరు నన్ను
గూర్చి చెప్పుటకు కొత్త అబద్ధాలకోసం చూస్తూనే
ఉంటారు. అలాంటి అబద్ధాలు చెప్పటం అంటే
మీకు ఇష్టం.
3 యెహోవా తన మంచి ప్రజల మొర వింటాడని
మీకు తెలుసు. నేను యెహోవాను ప్రార్థించి
నప్పుడు, ఆయన నా ప్రార్థన వింటాడు.
4 మిమ్మలను ఏదైనా ఇబ్బంది పెడుతుంటే,
అప్పుడు కోప్పడవచ్చు. కాని పాపం చేయవద్దు.
మీరు పడకకు వెళ్లినప్పుడు ఆ విషయాలను
గూర్చి ఆలోచించండి, అప్పుడు విశ్రాంతి తీసు
కోండి.
5 దేవునికి మంచి బలులు అర్పించండి. మరి
యెహోవాయందు విశ్వాసం ఉంచండి.
6 "దేవుని మంచితనాన్ని మనకు ఎవరు చూపిస్తారు?
యెహోవా! ప్రకాశించే నీ ముఖాన్ని మమ్మల్ని
చూడనిమ్ము." అని చాలామంది ప్రజలు అంటారు.
7 యెహోవా, నీవు నన్ను చాలా సంతోషపెట్టావు.
ధాన్యం, ద్రాక్షారసం మాకు విస్తారంగా ఉన్నందు
చేత పంట కోత సమయంలో సంబరపడే దాని
కంటే ఇప్పుడు మేము ఎక్కువ సంతోషంగా
ఉన్నాము.
8 నేను పడకకు వెళ్లి, ప్రశాంతంగా నిద్రపోతాను.
ఎందుకంటె యెహోవా, నీవే నన్ను భద్రంగా
నిద్ర పుచ్చుతావు గనుక.

## కీర్తన 5

*సంగీత నాయకునికి.*

*పిల్లన గ్రోవులతో పాడదగిన దావీదు కీర్తన.*

1 యెహోవా, నా మాటలు ఆలకించుము. నేను
నీకు చెప్పటానికి ప్రయత్నిస్తున్న దాన్ని వినుము.
2 నా రాజా, నా దేవా నా ప్రార్థన ఆలకించుము.
3 యెహోవా, ప్రతి ఉదయం నేను నా కానుకను
నీ ముందు ఉంచుతాను. సహాయం కోసం నేను
నీ వైపు చూస్తాను. మరి నీవు నా ప్రార్థనలు
వింటావు.
4 యెహోవా, నీవు దుష్టులను నీ దగ్గర వుండడానికి
ఇష్టపడవు చెడ్డవాళ్లు నీ మందిరంలో నిన్ను ఆరా
ధించేందుకు రావటం నీకు ఇష్టం లేదు.
5 గర్విష్ఠులు, అహంకారులు నీ దగ్గరకు రాలేరు.
ఎప్పుడూ చెడ్డపనులు చేసే మనుష్యులను నీవు
అసహ్యించుకొంటావు.
6 అబద్ధాలు చెప్పే మనుష్యులను నీవు నాశనం
చేస్తావు. ఇతరులకు హాని చేయుటకు రహస్యంగా
పథకాలు వేసే మనుష్యులను యెహోవా అస
హ్యించుకొంటాడు.
7 యెహోవా, నేను నీ మందిరానికి వస్తాను. నీవు
చాలా దయగల వాడవని నాకు తెలుసు.
యెహోవా, నీ పవిత్ర మందిరం వైపు నేను వంగి
నప్పుడు, నీకు నేను భయపడతాను. నిన్ను
గౌరవిస్తాను.
8 యెహోవా, ప్రజలు నాలో బలహీనతల కోసం
చూస్తున్నారు. కనుక నీ నీతికరమైన జీవిత విధానం
నాకు చూపించుము. నేను ఎలా జీవించాలని నీవు
కోరుతావో అది నాకు తేటగా చూపించుము.
9 ఆ మనుష్యులు సత్యం చెప్పరు. వాళ్లు జనాన్ని
నాశనం చేయకోరుతారు. వారి నోళ్ళు ఖాళీ సమా
ధుల్లా ఉన్నాయి. ఆ మనుష్యులు ఇతరులకు

---

**నీవు … ప్రముఖునిగా** అక్షరాల నాతల పైకెత్తువాడవు నీవే.

**యెహోవా, లెమ్ము** ఒప్పందపు పెట్టెను ప్రజలు పైకెత్తి, యుద్ధంలోకి తీసుకొని పోయినప్పుడు ఇలా చెప్పేవారు. అనగా దేవుడు వారితో ఉన్నాడని అర్థం.

**తొలగించుము** అక్షరార్థముగా 'నాకు గదిని ఇమ్ము.'

చక్కనిమాటలు చెబుతారు. కాని వాళ్లను చిక్కుల్లో
పెట్టుటకు మాత్రమే వారు ప్రయత్నిస్తున్నారు.
10 దేవా! వారిని శిక్షించుము. వారి ఉచ్చులలో వారినే
పట్టుబడనిమ్ము. ఆ మనుష్యులు నీకు విరోధంగా
తిరిగారు కనుక వారి విస్తార పాపాల నిమిత్తం వారిని
శిక్షించుము.
11 అయితే దేవునియందు విశ్వాసం ఉంచే ప్రజలం
దరినీ సంతోషించనిమ్ము. ఆ ప్రజలను శాశ్వతంగా
సంతోషించనిమ్ము. దేవా, నీ నామమును ప్రేమించే
ప్రజలకు భద్రత, బలం ప్రసాదించుము.
12 యెహోవా, మంచి మనుష్యులకు నీవు మంచి
వాటిని జరిగిస్తే అప్పుడు నీవు వారిని కాపాడే
గొప్ప కేడెంలా ఉంటావు.

## కీర్తన 6

***సంగీత నాయకునికి. అష్టమ శృతిమీద తంతి వాయిద్యాలతో పాడదగిన దావీదు కీర్తన.***

1 యెహోవా, కోపగించి నన్ను గద్దించవద్దు. కోప
గించి నన్ను శిక్షించవద్దు.
2 యెహోవా, నా మీద దయ ఉంచుము. నేను
రోగిని, బలహీనుడిని నన్ను స్వస్థపరచుము. నా
ఎముకలు వణకుతున్నాయి.
3 నా శరీరం మొత్తం వణకుతోంది. యెహోవా
నన్ను నీవు స్వస్థపర్చటానికి ఇంకెంత కాలం పడు
తుంది.?
4 యెహోవా, మరల నన్ను విముక్తుని చేయుము.
నీవు చాలా దయగలవాడవు గనుక, నన్ను
రక్షించుము.
5 చనిపోయిన వాళ్లు, వారి సమాధుల్లో నిన్ను జ్ఞాపకం
చేసుకోరు. చావు స్థలంలో ప్రజలు నిన్ను స్తుతిం
చరు. అందుచేత నన్ను స్వస్థపరచుము.
6 యెహోవా, రాత్రి అంతా, నిన్ను ప్రార్థించాను.
నా కన్నీళ్లతో నా పడక తడిసిపోయింది. నా
పడకనుండి కన్నీటి బొట్లు రాలుచున్నాయి. నీకు
మొరపెట్టి నేను బలహీనంగా ఉన్నాను.
7 నా శత్రువులు నాకు చాలా కష్టాలు తెచ్చిపెట్టారు.
ఇది నన్ను విచారంతో చాలా దుఃఖపెట్టింది.
ఏడ్చుటవల్ల ఇప్పుడు నా కండ్లు నీరసంగాను
అలసటగాను ఉన్నాయి.
8 చెడ్డ మనుష్యులారా, వెళ్లిపొండి! ఎందుకంటె నేను
ఏడ్వటం యెహోవా విన్నాడు గనుక.
9 యెహోవా నా ప్రార్థన విన్నాడు. మరియు
యెహోవా నా ప్రార్థన అంగీకరించి, జవాబు
ఇచ్చాడు.
10 నా శత్రువులంతా తలక్రిందులై, నిరాశపడతారు.
వారు త్వరగా సిగ్గుపడతారు కనుక వారు తిరిగి
వెళ్లిపోతారు.

## కీర్తన 7

***యెహోవాకు దావీదు పాడిన కీర్తన. బెన్యామీను వంశానికి చెందిన కీషు కుమారుడైన సౌలును గూర్చినది ఈ పాట.***

1 యెహోవా నా దేవా, నిన్ను నేను నమ్ము
కొన్నాను. నన్ను తరుముతున్న మనుష్యుల బారి
నుండి నన్ను రక్షించుము. నన్ను తప్పించుము.
2 నాకు నీవు సహాయం చేయకపోతే అప్పుడు నేను
సింహంచే పట్టబడి చీల్చబడిన జంతువులాగ
ఉంటాను. నేను ఈడ్చుకొని పోబడతాను. ఏ
మనిషి నన్ను రక్షించజాలడు.
3 యెహోవా నా దేవా, నేను తప్పు చేసిన దోషిని
కాను. నేనేమీ తప్పు చేయలేదు.
4 నా స్నేహితునికి నేనేమీ కీడు చేయలేదు. నా
స్నేహితుని శత్రువులకు నేను సహాయం చేయ
లేదు.
5 కానీ నేను పాపము కలిగియుండిన యెడల శత్రువు
నన్ను తరుమనిమ్ము. నన్ను పట్టుకొనినిమ్ము,
నా జీవితాన్ని నేలమీద తొక్కనిమ్ము. మరియు
నా ప్రాణాన్ని మట్టిలోనికి నెట్టివేయనిమ్ము.
6 యెహోవా, లెమ్ము నీ కోపాన్ని చూపెట్టుము.
నా శత్రువు కోపంగా ఉన్నాడు కనుక నిలిచివానికి
విరోధంగా పోరాడుము. లేచి న్యాయంకోసం
వాదించుము.
7 జనాలను నీ చుట్టూ ప్రోగుచేసి, వారి మీద పైనుండి
పరిపాలించుము.
8 ప్రజలకు తీర్పు తీర్చుము యెహోవా, నాకు
తీర్పు తీర్చుము. నేను సరిగ్గా ఉన్నట్టు రుజువు
చేయుము. నేను నిర్దోషిని అని రుజువు చేయుము.
9 చెడ్డవాళ్లను శిక్షించి మంచివాళ్లకు సహాయం
చేయుము. దేవా, నీవు మంచివాడవు, మరియు
ప్రజల హృదయపు లోతుల్లోనికి నీవు చూడగలవు.
10 నిజాయితీ హృదయాలుగల వారికి దేవుడు
సహాయం చేస్తాడు. కనుక దేవుడు నన్ను
కాపాడుతాడు.
11 దేవుడు మంచి న్యాయమూర్తి, మరియు ఏ సమ
యంలోనైనా దేవుడు తన కోపాన్ని చూపిస్తాడు.
12 దేవుడు ఒక నిర్ణయం చేస్తే ఆయన తన మనస్సు
మార్చుకోడు.
13 ప్రజలను శిక్షించే శక్తి దేవునికి ఉంది.
14 కొంతమంది మనుష్యులు చెడ్డపనులు చేసేం దుకే
ఎల్లప్పుడూ ఆలోచిస్తుంటారు. అలాంటివారు
రహస్య పథకాలు వేస్తూ, అబద్ధాలు చెబుతారు.
15 వారు యితరులను ఉచ్చులో వేసి, హాని చేయాలని
ప్రయత్నిస్తారు. అయితే వారి స్వంత ఉచ్చుల్లో
వారే చిక్కుబడతారు.

16 వారు పొందాల్సిన శిక్ష వారు పొందుతారు. ఇత
రులయెడల వారు క్రూరంగా ప్రవర్తించారు. అయితే
వారు దేనికి పాత్రులో దానిని పొందుతారు.
17 యెహోవా మంచివాడు గనుక నేను ఆయనను
స్తుతిస్తాను. మహోన్నతుడైన యెహోవా
నామాన్ని నేను స్తుతిస్తాను.

## కీర్తన 8

*సంగీత నాయకునికి, గిత్తీత్ రాగం.*
*దావీదు కీర్తన.*

1 యెహోవా నా ప్రభువా! నీ పేరు భూమి అంతా
ప్రసిద్ధి పొందింది.
2 పరలోకమంతా నీ పిల్లల కీర్తి చంటి పిల్లల నోళ్ల
నుండి వెలికి వస్తున్నది. నీ శత్రువుల నోరు
మూయించడానికి నీవు యిలా చేస్తావు.
3 యెహోవా, నీవు నీ చేతులతో చేసిన ఆకాశాల
వైపు నేను చూస్తున్నాను. నీవు సృష్టించిన సూర్య
చంద్ర, నక్షత్రాలను నేను చూచి ఆశ్చర్య
పడుతున్నాను.
4 మానవుడు ఎందుకు నీకు అంత ప్రాముఖ్యుడు?
నీవు వానిని ఎందుకు జ్ఞాపకం చేసుకొంటావు?
మానవ మాత్రుడు నీకెందుకు అంత ముఖ్యం?
నీవు వానిని గమనించటం ఎందుకు?
5 అయితే మానవుడు నీకు ముఖ్యం. వానిని నీవు
దాదాపు దేవుని అంతటి వానిగా చేశావు. మరియు
మహిమా ఘనతలు నీవు వానికి కిరీటంగా ధరింప
జేసావు.
6 నీవు చేసిన సమస్తము మీద మనుష్యునికి అధికార
మిచ్చియున్నావు. ప్రతిదానిని నీవు వాని అధీనంలో
వుంచావు.
7 గొర్రెలు, పశువులు, అడవి మృగాలు అన్నింటి
మీద ప్రజలు ఏలుబడి చేస్తారు.
8 ఆకాశంలోని పక్షుల మీద, మహా సముద్రంలో
ఈదుచుండే చేపల మీద వారు ఏలుబడి చేస్తారు.
9 మా దేవా, యెహోవా భూలోమంతటిలో కెల్లా
నీ నామము మహా అద్భుతమైనది!

## కీర్తన 9

*సంగీత నాయకునికి. ముత్లబ్బేను రాగం.*
*దావీదు కీర్తన.*

1 పూర్ణ హృదయంతో నేను యెహోవాను స్తుతి
స్తాను. యెహోవా, నీవు చేసిన అద్భుతకార్యా
లన్నింటిని గూర్చి నేను చెబుతాను.
2 నీవు నన్ను ఎంతగానో సంతోషింపజేస్తున్నావు.
మహోన్నతుడవైన దేవా, నీ నామానికి నేను
స్తుతులు పాడుతాను.
3 నా శత్రువులు నీ నుండి పారిపోయేందుకు మళ్లు
కొన్నారు. కానీ వారు పడిపోయి, నాశనం చేయ
బడ్డారు.
4 నీవే మంచి న్యాయమూర్తివి. న్యాయమూర్తిగా నీవు
నీ సింహాసనం మీద కూర్చున్నావు. యెహోవా,
నీవు నా వ్యాజ్యెం విన్నావు. మరియు నన్ను గూర్చి
న్యాయ నిర్ణయం చేశావు.
5 యూదులు కాని ఆ మనుష్యులతో నీవు కఠినంగా
మాట్లాడావు. యెహోవా, ఆ చెడ్డ మనుష్యుల్ని
నీవు నాశనం చేశావు. బతికి ఉన్న మనుష్యుల
జాబితాలో నుండి శాశ్వతంగా ఎప్పటికి వారి పేర్లను
నీవు తుడిచి వేసావు.
6 శత్రువు పని అంతం అయిపోయింది. యెహోవా,
వారి పట్టణాలను నీవు నాశనం చేశావు. ఇప్పుడు
శిథిల భవనాలు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఆ
దుర్మార్గపు ప్రజలను జ్ఞాపకం చేసుకొనేటట్టు
చేసేది ఏమీ మిగల్లేదు.
7 అయితే యెహోవా శాశ్వతంగా పరిపాలిస్తాడు.
యెహోవా తన రాజ్యాన్ని బలమైనదిగా చేసాడు.
లోకానికి న్యాయం చేకూర్చేందుకు ఆయన దీనిని
చేశాడు.
8 భూమి మీద మనుష్యులందరికీ యెహోవా
న్యాయంగా తీర్పు తీరుస్తాడు. యెహోవా రాజ్యాల
న్నింటికి ఒకే విధంగా తీర్పు తీరుస్తాడు.
9 అనేకమంది ప్రజలకు అనేక కష్టాలు ఉన్నాయి
గనుక వారు చిక్కుబడి, బాధ పొందుతున్నారు.
ఆ ప్రజలు వారి సమస్యల భారంతో నలిగిపోతు
న్నారు. యెహోవా, వారు పారిపోవుటకు భద్రతా
స్థలంగా ఉండుము.
10 నీ నామం తెలిసిన ప్రజలు నీమీద విశ్వాసం ఉంచాలి.
యెహోవా, ప్రజలు నీ దగ్గరకు వస్తే సహాయం
చేయకుండా నీవు వారిని విడిచి పెట్టవు.
11 సీయోనులో నివసిస్తున్న ప్రజలారా మీరు
యెహోవాకు స్తుతులు పాడండి. యెహోవా
చేసిన గొప్ప కార్యాలను గూర్చి ఇతర దేశాలతో
చెప్పండి.
12 సహాయం కోసం యెహోవా దగ్గరకు వెళ్లిన
వారిని ఆయన జ్ఞాపకం చేసుకొన్నాడు. ఆ దీన
ప్రజలు సహాయం కోసం మొరపెట్టారు. మరి
యెహోవా వారిని మరచిపోలేదు.
13 దేవుణ్ణి నేను ఇలా ప్రార్థించాను: "యెహోవా,
నా మీద దయ చూపుము. నా శత్రువులు నాకు
హాని చేస్తున్న విధం చూడుము. 'మరణ ద్వారాల'
నుండి నన్ను రక్షించుము.
14 తర్వాత యెరూషలేము గుమ్మాల దగ్గర,
యెహోవా, నేను నీకు స్తుతులు పాడగలను. నీవు

నన్ను రక్షించావు గనుక నేను చాలా సంతోషంగా
ఉంటాను."
15 యూదులు కాని ఆ ప్రజలు, ఇతర ప్రజలను
ఉచ్చులో వేయుటకు గోతులు త్రవ్వారు. కాని,
యూదులుకాని ఆ ప్రజలు, వారి ఉచ్చులో వారే
పడ్డారు. ఆ మనుష్యులు ఇతర ప్రజలను పట్టడానికి
వలలు మాటున పెట్టారు. కాని, వారి పాదాలే ఆ
వలల్లో చిక్కుబడ్డాయి.
16 యెహోవా న్యాయం జరిగిస్తాడని ప్రజలు తెలు
సుకొన్నారు. యెహోవా చేసిన దాని మూలంగా
ఆ దుర్మార్గులు పట్టుబడ్డారు. దాని విషయం ఆలో
చించుము. హిగ్గాయోన్*
17 దేవుని మరచే ప్రజలు దుష్టులు. ఆ మనుష్యులు
చచ్చినవారి చోటికి వెళ్తారు.
18 ఆ పేదలకు ఇక నిరీక్షణ లేదేమో అన్నట్లు కని
పిస్తుంది. కాని నిజంగా దేవుడు వారిని శాశ్వతంగా
మరచిపోడు.
19 యెహోవా, లేచి దేశాలకు తీర్పు తీర్చుము. వారే
శక్తిగలవారు అని ప్రజలను తలచనీయకుము.
20 ప్రజలకు పాఠం నేర్పించు. వారు కేవలం మానవ
మాత్రులేనని వారిని తెలుసుకోనిమ్ము.

## కీర్తన 10

1 యెహోవా నీవెందుకు అంత దూరంగా ఉంటావు?
కష్టాల్లో ఉన్న ప్రజలు నిన్ను చూడలేరు.
2 గర్విష్ఠులు, దుష్టులు వారి దుష్ట పథకాలు వేస్తారు.
మరియు పేద ప్రజలను వారు బాధిస్తారు.
3 దుష్టులు వారికి కావలసిన వాటిని గూర్చి అతిశయ
పడతారు. లోభులు యెహోవాను దూషిస్తారు.
ఈ విధంగా దుష్టులు యెహోవాను ద్వేషిస్తున్నట్టు
వ్యక్తం చేస్తారు.
4 ఆ దుర్మార్గులు చాలా గర్విష్ఠులు కనుక దేవుని
అనుసరించరు. వాళ్లు తమ పాపిష్టి పథకాలన్నీ
తయారు చేస్తారు. పైగా దేవుడే లేడు అన్నట్టు
వారు ప్రవర్తిస్తారు.
5 ఆ దుర్మార్గులు ఎల్లప్పుడూ వంకర పనులే చేస్తుం
టారు. కనీసం నీ చట్టాలను, వివేకవంతమైన నీ
ఉపదేశాలను కూడా వారు పట్టించుకోరు. దేవుని
శత్రువులు ఆయన బోధనలను నిర్లక్ష్యం చేస్తారు.
6 వాళ్లకు కీడు ఎన్నటికీ జరగదని ఆ మనుష్యులు
తలుస్తారు. "మాకు ఎన్నడూ కష్ట సమయాలు
ఉండవు" అని వారు అంటారు.
7 ఆ మనుష్యులు ఎల్లప్పుడూ దూషిస్తారు. ఇతరుల
విషయంలో వారు ఎల్లప్పుడూ చెడు సంగతులే
చెబుతారు. దుష్టకార్యాలు చేసేందుకే వారు ఎల్ల
ప్పుడూ పథకం వేస్తుంటారు.
8 ఆ మనుష్యులు రహస్య స్థలాల్లో దాగుకొని ప్రజ
లను పట్టుకొనేందుకు కనిపెడతారు. ప్రజలను
బాధించుటకు వారికోసం చూస్తూ దాగుకుంటారు.
నిర్దోషులను వారు చంపుతారు.
9 తినవలసిన జంతువులను పట్టుకోవటానికి ప్రయ
త్నించే సింహాలవలె వారుంటారు. ఆ దుర్మార్గులు,
పేదల మీద దాడిచేస్తారు. దుష్టులు వేసే ఉచ్చులలో
పేదలు చిక్కుకొంటారు.
10 పేదలను, బాధపడేవారిని, ఆ దుష్టులు మరల,
మరల బాధిస్తారు.
11 అందుచేత ఆ పేదలు ఈ సంగతులను ఇలా
ఆలోచించటం మొదలు పెట్టారు: "దేవుడు
మమ్మల్ని మరచిపోయాడు! దేవుడు మా నుండి
శాశ్వతంగా విముఖుడయ్యాడు! మాకు ఏమి జరుగు
తుందో దేవుడు చూడటం లేదు!"
12 యెహోవా, లేచి ఏదైనా చేయుము! దేవా, దుష్టు
లను శిక్షించుము! పేదలను మాత్రం మరువ కుము!
13 దుష్టులు ఎందుకు దేవునికి వ్యతిరేకంగా ఉంటారు?
ఎందుకంటే దేవుడు వారిని శిక్షించడు అను
కొంటారు గనుక.
14 యెహోవా, దుర్మార్గులు చేసే క్రూరమైన చెడ్డ
సంగతులను నీవు నిజంగా చూస్తున్నావు. నీవు
వాటిని చూచి వాటి విషయమై ఏదో ఒకటి
చేయుము. ఎన్నో కష్టాలతో ప్రజలు నీ దగ్గరకు
సహాయం కోసం వస్తారు. యెహోవా, తల్లి
దండ్రులు లేని పిల్లలకు సహాయం చేసే వాడివి
నీవే. కనుక వారికి సహాయం చేయుము.
15 యెహోవా, దుర్మార్గులను నాశనం చేయుము.
16 యెహోవా నిరంతరం రాజైయున్నాడు. ఆ
ప్రజలు ఆయన దేశంలోనుండి నశించెదరు గాక!
17 యెహోవా, పేదలు కోరుకొనే వాటిని గూర్చి
నీవు విన్నావు. నీవు వారిని ప్రోత్సాహ పరచెదవు.
వారి ప్రార్థనలు ఆలకించెదవు.
18 యెహోవా, అనాథ పిల్లలను కాపాడుము.
దుఃఖంలో ఉన్న వారిని ఇంకా ఎక్కువ కష్టాలు
పడనీయకుము. దుర్మార్గులు ఇక్కడ ఉండ
కుండుటకు చాలా భయపడేటట్టుగా చేయుము.

## కీర్తన 11

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 నేను యెహోవాను నమ్ముకొన్నాను గదా! నన్ను
పారిపోయి, దాగుకోమని మీరెందుకు నాకు
చెప్పారు? "పక్షిలాగ, నీ పర్వతం మీదికి ఎగిరిపో"
అని మీరు నాతో చెప్పారు!

---

**హిగ్గాయోన్** అర్థం మౌనంగా ఆలోచించు సమయము.

2 వేటగానిలా, దుర్మార్గులు విల్లు ఎక్కుపెడ్తారు. వారి
బాణాలను వారు గురి చూస్తారు. మరియు చీకటి
లోనుండి దుర్మార్గులు నీతి, నిజాయితీగల ప్రజల
గుండెల్లోనికి బాణాలు కొట్టుటకు సిద్ధంగా
ఉన్నారు.
3 నీతి అంతటిని వారు నాశనం చేస్తే ఏమవుతుంది?
అప్పుడు నీతిమంతులు ఏమి చేస్తారు?
4 యెహోవా తన పవిత్ర స్థలంలో ఉన్నాడు.
యెహోవా పరలోకంలో తన సింహాసనం మీద
కూర్చున్నాడు. మరియు జరిగే ప్రతీది యెహోవా
చూస్తున్నాడు. మనుష్యులు మంచివాళ్లో, చెడ్డ
వాళ్లో చూసేందుకు యెహోవా కళ్లు ప్రజలను
నిశితంగా చూస్తాయి.
5 యెహోవా మంచివారి కొరకు అన్వేషిస్తాడు.
చెడ్డవాళ్లు ఇతరులను బాధించటానికి ఇష్టపడతారు.
క్రూరమైన ఆ మనుష్యులను యెహోవా అస
హ్యించుకొంటాడు.
6 వేడి నిప్పులు, మండుతున్న గంధకం, ఆ దుర్మా
ర్గుల మీద వర్షంలాగ పడేటట్టు యెహోవా
చేస్తాడు. ఆ దుర్మార్గులకు లభించేది అంతా మండు
తున్న వేడి గాలి మాత్రమే.
7 అయితే దయగల యెహోవా మంచి పనులను
చేసే ప్రజలను ప్రేమిస్తాడు. మంచి మనుష్యులు
ఆయన ముఖ దర్శనం చేసుకొంటారు.

## కీర్తన 12

*సంగీత నాయకునికి. షెమినిత్ రాగం.*
*దావీదు కీర్తన.*

1 యెహోవా, నన్ను రక్షించుము! మంచి మనుష్య
లంతా పోయారు. భూమి మీద ఉన్న మనుష్య
లందరిలో సత్యవంతులైన విశ్వాసులు ఎవ్వరూ
మిగల్లేదు.
2 మనుష్యులు వారి పొరుగువారితో అబద్ధాలు చెబు
తారు. ప్రతి ఒక్క వ్యక్తీ, తన పొరుగువారికి అబద్ధాలు
చెప్పి, ఉబ్బిస్తాడు.
3 అబద్ధాలు చెప్పేవారి పెదవులను యెహోవా కోసి
వేయాలి. పెద్ద గొప్పలు పలికే వారి నాలుకలను
యెహోవా కోసి వేయాలి.
4 "మన అబద్ధాలే మనలను ప్రముఖులుగా అయ్యేం
దుకు తోడ్పడతాయి. మన నాలుకలు ఉండగా,
మన మీద ఎవ్వరూ పెద్దగా ఉండరు." అని ఆ
ప్రజలు ఈ సంగతులు చెప్పుకొంటారు.
5 కానీ యెహోవా చెబుతున్నాడు, "దుర్మార్గులు
పేదల దగ్గర వస్తువులు దొంగిలించారు. ఆ నిస్స
హాయ ప్రజలు వారి దుఃఖం వ్యక్తం చేయటానికి
గట్టిగా నిట్టూర్చారు. కానీ ఇప్పుడు నేను నిలిచి,
దాన్ని కోరేవారికి క్షేమము నిచ్చెదను."
6 యెహోవా మాటలు సత్యం, నిర్మలం. నిప్పుల
కుంపటిలో కరగించిన స్వచ్ఛమైన వెండిలా పవి
త్రంగా ఆ మాటలు ఉంటాయి. కరిగించబడి ఏడు
సార్లు పోయ బడిన వెండిలా నిర్మలముగా ఆ
మాటలు ఉంటాయి.
7 యెహోవా, నిస్సహాయ ప్రజల విషయమై జాగ్రత్త
తీసుకొంటావు. ఇప్పుడు, శాశ్వతంగానూ నీవు
వారిని కాపాడుతావు.
8 మనుష్యుల మధ్యలో దుష్టత్వము చెడుతనము
పెరిగినప్పుడు ఆ దుర్మార్గులు వారేదో ప్రముఖులై
నట్టు తిరుగుతుంటారు.

## కీర్తన 13

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 యెహోవా, ఎన్నాళ్లు నన్ను మరచిపోతావు? నీవు
నన్ను శాశ్వతంగా మరచిపోతావా? నీవు నన్ను
స్వీకరించకుండా ఎన్నాళ్లు నిరాకరిస్తావు?
2 నీవు ఒకవేళ నన్ను మరచిపోయావేమోనని ఇంకె
న్నాళ్లు నేను తలంచాలి? ఇంకెన్నాళ్లు నేను నా
హృదయంలో దుఃఖ అనుభూతిని పొందాలి? ఇంకె
న్నాళ్లు నా శత్రువు నా మీద విజయాలు సాధిస్తాడు?
3 నా దేవా, యెహోవా, నన్ను చూడుము. నా
ప్రశ్నలకు జవాబిమ్ము. నన్ను ఆ జవాబు తెలుసు
కో నిమ్ము. లేదా నేను చనిపోతాను!
4 అప్పుడు నా శత్రువు, "నేనే వానిని ఓడించాను"
అనవచ్చు. నేను అంతం అయ్యానని నా శత్రువు
సంతోషిస్తాడు.
5 యెహోవా, నాకు సహాయం చేయుటకు నీ
ప్రేమనే నేను నమ్ముకొన్నాను. నీవు నన్ను రక్షించి,
నన్ను ఆనందింపజేశావు.
6 యెహోవా నాకు మేలు కార్యాలు చేశాడు. కనుక
నేను యెహోవాకు ఒక ఆనందగీతం పాడుతాను.

## కీర్తన 14

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 "దేవుడు లేడు" అని బుద్ధిహీనులు తమ హృద
యంలో అనుకొంటారు. బుద్ధిహీనులు దారుణ
మైన, చెడు కార్యాలు చేస్తారు. వారిలో కనీసం
ఒక్కడు కూడా మంచి పనులు చేయడు.
2 పరలోకం నుండి యెహోవా క్రింద మనుష్య
లను చూశాడు. వివేకంగలవాణ్ణి కనుక్కోవాలని
దేవుని ప్రయత్నించాడు. (వివేకంగల వాడు
సహాయం కోసం దేవుని తట్టు తిరుగుతాడు.)
3 కానీ ప్రతి మనిషి దేవుని నుండి తిరిగిపోయాడు.
మొత్తం మనుష్యులంతా చెడ్డవాళ్లయ్యారు. కనీసం
ఒక్క వ్యక్తి కూడా మంచి పనులు చేయలేదు.

4 దుర్మార్గులు నా ప్రజలను నాశనం చేశారు. ఆ
దుర్మార్గులు దేవుణ్ణి అర్థం చేసుకోరు. దుర్మార్గులు
తినుటకు ఆహారం సమృద్ధిగా ఉంది. ఆ మను
ష్యులు యెహోవాను ఆరాధించరు.
5-6 దుష్టులైన మీరు పేదవారి ఆలోచనలను చెడ
గొడ్తారు. కాని పేదవాడు తన రక్షణకొరకు దేవుని
మీద ఆధారపడ్డాడు. కానీ ఆ దుర్మార్గులు చాలా
భయపడి పోయారు. ఎందుకంటే దేవుడు తను
మంచి మనుష్యులతో ఉన్నాడు గనుక.
7 సీయోనులోని ఇశ్రాయేలీయులను ఎవరు రక్షి
స్తారు? ఇశ్రాయేలీయులను రక్షించేవాడు యెహో
వాయే. యెహోవా ప్రజలు తీసుకొనిపోబడ్డారు.
బలవంతంగా బందీలుగా చేయబడ్డారు. కానీ
యెహోవా తన ప్రజలను వెనుకకు తీసుకొని
వస్తాడు. ఆ సమయంలో యాకోబు (ఇశ్రాయేలు)
ఎంతో సంతోషిస్తాడు.

## కీర్తన 15

**దావీదు కీర్తన.**

1 యెహోవా, నీ పవిత్ర గుడారంలో ఎవరు నివ
సించగలరు? నీ పవిత్ర పర్వతం మీద ఎవరు
నివసించగలరు?
2 ఎవరైతే పరిశుద్ధ జీవితం జీవించగలరో, మంచి
కార్యాలు చేయగలరో తమ హృదయంలో నుండి
సత్యం మాత్రమే మాట్లాడుతారో అలాంటి
వ్యక్తులు మాత్రమే నీ పర్వతం మీద నివసించ
గలరు.
3 అలాంటి వ్యక్తి ఇతరులను గూర్చి చెడు సంగతులు
మాట్లాడడు. ఆ మనిషి తన పొరుగు వారికి కీడు
చేయడు. ఆ మనిషి తన స్వంత కుటుంబం
గూర్చి సిగ్గుకరమైన విషయాలు చెప్పడు.
4 ఆ మనిషి దేవుని చేత నిరాకరింపబడిన ప్రజలను
గౌరవించడు. అయితే యెహోవాను సేవించే
వారందరినీ ఆ మనిషి గౌరవిస్తాడు. ఆ మనిషి
గనుక తన పొరుగువానికి ఒక వాగ్దానం చేస్తే అతడు
ఏమి చేస్తానన్నాడో దాన్ని నెరవేరుస్తాడు.
5 ఆ మనిషి ఎవరికైనా అప్పిస్తే అతడు దాని మీద
వడ్డీ తీసుకోడు. నిర్దోషులకు కీడు చేయుటకు
గాను అతడు డబ్బు తీసుకోడు. ఒక మనిషి ఆ
మంచి వ్యక్తిలాగ జీవిస్తే అప్పుడు ఆ మనిషి
ఎల్లప్పుడూ దేవునికి సన్నిహితంగా ఉంటాడు.

## కీర్తన 16

**దావీదుకు అభిమాన కావ్యము.**

1 దేవా నేను నీమీద ఆధారపడ్డాను గనుక నన్ను
కాపాడుము.
2 "యెహోవా, నీవు నా యజమానివి నాకు గల
ప్రతి మంచిది నీ నుండి నాకు లభిస్తుంది" అని
నేను యెహోవాతో చెప్పాను.
3 దేశములో పవిత్రమైనవి అని పిలువబడే విగ్రహము
లకు సంబంధించిన వాటియందు ఆనందించు
వారందరు శాపగ్రస్తులగుదురు గాక!
4 కానీ ఇతర దేవుళ్లను పూజించుటకు పరుగులెత్తే
మనుష్యులకు అధిక బాధ కలుగుతుంది. ఆ
దేవతలకు వారు ఇచ్చే రక్తపు అర్పణల్లో నేను
భాగం పంచుకోను. ఆ దేవతల పేర్లు కూడ నేను
పలుకను.
5 నా భాగం, నా పాత్ర యెహోవా దగ్గర్నుండి
మాత్రమే వస్తుంది. యెహోవా, నీవే నన్ను బల
పరచావు. యెహోవా, నీవే నా వంతు నాకు
ఇమ్ము.
6 నా వంతు చాలా అద్భుతమయింది. నా స్వాస్థ్యము
చాలా అందమయింది.
7 యెహోవా నాకు చక్కగా నేర్పించాడు. కనుక
నేను ఆయనను స్తుతిస్తాను. రాత్రియందు, నా
అంతరంగపు లోతుల్లోనుండి ఉపదేశములు
వచ్చాయి.
8 నేను ఎల్లప్పుడూ యెహోవాను నా యెదుట
ఉంచుకొంటాను. ఎందుకనగా ఆయన నా కుడి
ప్రక్కన వున్నాడు. నేను ఎన్నడూ కదల్చబడను.
ఆయన కుడిప్రక్కను నేను ఎన్నడూ విడువను.
9 కనుక నా ఆత్మ, నా హృదయము ఎంతో సంతో
షంగా ఉన్నాయి. నా శరీరం కూడ క్షేమంగా బతుకు
తుంది.
10 ఎందుకంటే, యెహోవా, నీవు నా ఆత్మను చావు
స్థలంలో విడిచిపెట్టవు గనుక. నీ పరిశుద్ధుడిని సమా
ధిలో కుళ్లిపోనీయవు.
11 సరైన జీవిత విధానాన్ని నీవు నాకు నేర్పిస్తావు.
యెహోవా, నీతో ఉండటమే నాకు సంపూర్ణ
సంతోషం కలిగిస్తుంది. నీ కుడిపక్కన ఉండటం
నాకు శాశ్వత సంతోషం కలిగిస్తుంది.

## కీర్తన 17

**దావీదు ప్రార్థన.**

1 యెహోవా, న్యాయంకోసం నా ప్రార్థన ఆలకిం
చుము. నా ప్రార్థనా గీతం వినుము. యదార్థమైన
నా ప్రార్థన వినుము.
2 యెహోవా, నన్ను గూర్చిన సరైన తీర్పు నీ
దగ్గర్నుండే వస్తుంది. నీవు సత్యాన్ని చూడగలవు.
3 నీవు నా హృదయాన్ని పరీక్షించుటకు దాన్ని
లోతుగా చూశావు. రాత్రి అంతా నీవు నాతో
ఉన్నావు. నీవు నన్ను ప్రశ్నించావు, నాలో తప్పేమి
కనుగొన లేదు. నేనేమి చెడు తలపెట్టలేదు.

4 నీ ఆదేశాలకు విధేయుడనగుటకు నేను మానవ
పరంగా సాధ్యమైనంత కష్టపడి ప్రయత్నించాను.
5 నేను నీ మార్గాలు అనుసరించాను. నీ జీవిత విధానం
నుండి నా పాదాలు, ఎన్నడూ తొలగిపోలేదు.
6 దేవా, నేను నీకు మొరపెట్టినప్పుడెల్ల నీవు నాకు
జవాబు యిచ్చావు. కనుక ఇప్పుడు నా మాట
వినుము.
7 ఆశ్చర్యమైన నీ ప్రేమను చూపించుము. నీ ప్రక్కన
కాపుదలను వెదకేవారిని వారి శత్రువులనుండి నీవు
రక్షించుము. నీ అనుచరులలో ఒకనిదైన ఈ
ప్రార్థన వినుము.
8 నీ కంటిపాపవలె నన్ను కాపాడుము. నీ రెక్కల
నీడను నన్ను దాచిపెట్టుము.
9 యెహోవా, నన్ను నాశనం చేయాలని చూస్తున్న
దుర్మార్గుల నుండి నన్ను రక్షించుము. నన్ను
బాధించుటకు నా చుట్టూరా ఉండి ప్రయత్నిస్తున్న
మనుష్యుల బారి నుండి నన్ను కాపాడుము.
10 ఆ దుర్మార్గులు దేవుని మాట కూడ విననంతటి
గర్విష్ఠులు అయ్యారు. మరియు వారిని గూర్చి
వారు డంబాలు చెప్పుకొంటారు.
11 ఆ మనుష్యులు నన్ను తరిమారు. ఇప్పుడు
వాళ్లంతా నా చుట్టూరా ఉన్నారు. నన్ను నేలకు
పడ గొట్టవలెనని వారు సిద్ధంగా ఉన్నారు.
12 చంపటానికి సిద్ధంగా ఉన్న సింహాలవలె ఉన్నారు
ఆ దుర్మార్గులు. వారు సింహాలవలె దాగుకొని మీద
పడుటకు వేచియున్నారు.
13 యెహోవా, లెమ్ము, శత్రువు దగ్గరకు వెళ్లి వారు
లొంగిపొయేటట్టుగా చేయుము. నీ ఖడ్గాన్ని
ప్రయోగించి, ఆ దుర్మార్గుల నుండి నన్ను
రక్షించుము.
14 యెహోవా, నీ శక్తిని ప్రయోగించి, సజీవ ప్రజల
దేశంలో నుండి ఆ దుర్మార్గులను తొలగించుము.
యెహోవా, నీ యొద్దకు అనేకులు సహాయం
కోసం వస్తారు. వాళ్ళకు ఈ జీవితంలో ఏమీ
లేదు. ఆ ప్రజలకు ఆహారం సమృద్ధిగా ఇచ్చి వాళ్ల
కడుపులను నింపుము. అందువల్ల వారి పిల్లలు
తినుటకు కూడా సమృద్ధిగా ఉంటుంది. దీనివల్ల
వాళ్ల మనుమలు కూడా తినడానికి సమృద్ధిగా
ఉంటుంది.
15 న్యాయం కోసం నేను ప్రార్థించాను. కనుక
యెహోవా, నేను నీ ముఖం చూస్తాను. మరియు
యెహోవా, నేను మేలుకొన్నప్పుడు నిన్ను చూచి
పూర్తిగా తృప్తి చెందుతాను.

## కీర్తన 18

*సంగీత నాయకునికి. యెహోవా సేవకుడు దావీదు
కీర్తన. సౌలు బారి నుండి, యితర శత్రువుల నుండి
యెహోవా దావీదును రక్షించినప్పుడు అతడు
వ్రాసిన పాట.*

1 "యెహోవా, నా బలమా నేను నిన్ను ప్రేమిస్తు
న్నాను!" అతడీలాగన్నాడు..
2 యెహోవా నా బండ, నా కోట, నా రక్షకుడు.
నా దేవుడే ఆ బండ. నేను ఆశ్రయంకోసం ఆయన
యొద్దకు పరుగెత్తుతాను. దేవుడు నా డాలు,
ఆయనే శక్తి నన్ను రక్షిస్తాడు. ఎత్తైన కొండలలో
యెహోవా నా దాగుకొను స్థలము.
3 యెహోవాకు నేను మొరపెడ్తాను. యెహోవా
స్తుతించబడుటకు అర్హుడు మరియు నా శత్రువుల
బారినుండి నేను రక్షించబడుతాను.
4-5 నా శత్రువులు నా యెదుట ఎన్నో ఉచ్చులు
పెట్టారు. మరణకరమైన ఉచ్చులు నా యెదుట
ఉన్నాయి. మరణపాశాలు నా చుట్టూరా చుట్టబడి
ఉన్నాయి. నాశనకరమైన వరదనీళ్లు నన్ను భయ
పెడుతున్నాయి. మరణపాశాలు అన్నీ చుట్టూరా
ఉన్నాయి.
6 చిక్కులో పడి, నేను సహాయం కోసం యెహో
వాకు మొరపెట్టాను. నేను నా దేవుని ప్రార్థించాను.
దేవుడు తన పవిత్ర స్థలం నుండి నా ప్రార్థన
విన్నాడు. సహాయంకోసం నేను చేసిన ప్రార్థనలు
ఆయన విన్నాడు.
7 యెహోవా నాకు సహాయం చేయటానికి వస్తు
న్నాడు. భూమి కంపించి వణికినది. పర్వతాలు
కంపిం చాయి. ఎందుకంటే ప్రభువు కోపించాడు.
8 ఆయన ముక్కుల్లో నుండి పొగ లేచింది.
యెహోవా నోటి నుండి మండుతున్న జ్వాలలు
వచ్చాయి. నిప్పు కణాలు ఆయన నుండి రేగాయి.
9 యెహోవా గగనం చీల్చుకొని దిగి వచ్చాడు.
ఆయన పాదాల క్రింద నల్లటి మేఘాలు ఉన్నాయి.
10 ఎగిరే కెరూబులు మీద ఆయన స్వారీ చేశాడు.
ఆయన గాలుల మీద పైకెగిరాడు.
11 యెహోవాను ఆవరించిన మహా దట్టమైన
మేఘంలో ఆయన మరుగైయున్నాడు. దట్టమైన
ఉరుము మేఘంలో ఆయన మరుగైయున్నాడు.
12 అప్పుడు, దేవుని ప్రకాశమానమైన వెలుగు మేఘాల
నుండి బయలు వెడలినది. అంతట వడగండ్లు,
మెరుపులు వచ్చినవి.
13 యెహోవా యొక్క స్వరం ఆకాశంలో గట్టిగా
ఉరిమింది. సర్వోన్నతుడైన దేవుడు తన స్వరాన్ని
వినిపించాడు. వడగండ్లు, మెరుపులు కలిగాయి.

14 యెహోవా తన బాణాలు వేయగా శత్రువు చెదరి
పోయాడు, అనేకమైన ఆయన మెరుపు పిడు
గులు వారిని ఓడించాయి.
15 యెహోవా, నీవు బలంగా మాట్లాడావు, మరియు
నీవు నీ నోటినుండి* బలమైన గాలిని ఊదావు.
నీళ్లు వెనక్కు నెట్టివేయబడ్డాయి, సముద్రపు అడు
గును మేము చూడగలిగాము. భూమి పునాదులను
మేము చూడగలిగాము.
16 పై నుండి యెహోవా కిందికి అందుకొని నన్ను
రక్షించాడు. నా కష్టాల్లోనుండి* ఆయన నన్ను
బయటకు లాగాడు.
17 నా శత్రువులు నాకంటె బలవంతులు. ఆ మను
ష్యులు నన్ను ద్వేషించారు. పైగా వారు నాకంటె
బలం కలవారు. అయినను దేవుడు నన్ను
రక్షించాడు.
18 నా కష్టకాలంలో ఆ మనుష్యులు నా మీద దాడి
చేశారు. కానీ యెహోవా నన్ను బలపర్చాడు.
19 యెహోవా నన్ను ప్రేమిస్తున్నాడు. కనుక ఆయన
నన్ను కాపాడాడు. ఆయన నన్ను క్షేమ స్థలానికి
తీసికొని వెళ్లాడు.
20 నేను నిర్దోషిని కనుక యెహోవా నాకు ప్రతి
ఫలమిచ్చాడు. నేను ఏ తప్పు చేయలేదు. కనుక
ఆయన నాకు తిరిగి చెల్లించాడు.
21 నేను యెహోవాను అనుసరించాను. నా దేవునికి
విరుద్ధంగా నేను చెడు కార్యాలు చేయలేదు.
22 యెహోవా చట్టాలు, అన్నింటినీ నేను జ్ఞాపకం
ఉంచుకున్నాను. ఆయన ఆదేశాలను నేను త్రోసి
వేయ లేదు.
23 ఆయన ఎదుట నేను నిర్దోషిగా ఉన్నాను. నన్ను
నేను పాపమునుండి దూరం చేసుకొన్నాను.
24 నేను సరైనదాన్ని చేసినందుకు యెహోవా నాకు
ప్రతిఫలమిచ్చాడు. నా క్రియలు దేవుని ఎదుట
నిర్దోషమైనవి. అందుకే ఆయన నాకు మంచి
చేస్తాడు.
25 యెహోవా, నమ్మదగిన మనుష్యులకు నీవు నమ్మ
దగినవాడవు. మరియు మంచి మనుష్యులకు నీవు
మంచివాడవు.
26 యెహోవా, మంచివాళ్లకు, పవిత్రమైన వాళ్లకు
నీవు మంచివాడవు, పవిత్రమైన వాడవు. కానీ,
గర్విష్ఠులను, టక్కరి వాళ్లను నీవు అణచివేస్తావు.
27 యెహోవా, నీవు పేదలకు సహాయం చేస్తావు.
కానీ గర్విష్ఠులను నీవు ప్రాముఖ్యత లేని వారిగా
చేస్తావు.
28 యెహోవా, నీవు నా దీపం వెలిగిస్తావు. నా దేవా,
నా చీకటిని నీవు వెలుగుగా చేస్తావు.
29 యెహోవా, నీ సహాయంతో నేను సైన్య దళా
లతో పరుగెత్తగలను. నీ సహాయంతో, నేను
శత్రువు గోడలు ఎక్కగలను.
30 దేవుని మార్గాలు పవిత్రం, మంచివి. యెహోవా
మాటలు సత్యం. ఆయనయందు విశ్వాసం ఉంచే
వాళ్లను ఆయన భద్రంగా ఉంచుతాడు.
31 యెహోవా తప్ప నిజమైన దేవుడు ఒక్కడూ
లేడు. మన దేవుడు తప్ప మరో బండ* లేదు.
32 దేవుడు నాకు బలం ఇస్తాడు. ఆయన నా జీవి
తాన్ని పావనం చేస్తాడు.
33 దేవుడు నా కాళ్లను లేడి కాళ్లవలె వేగంగా ఉంచు
తాడు. ఆయన నన్ను స్థిరంగా ఉంచుతాడు. ఎత్త
యిన బండలమీద పడకుండా ఆయన నన్ను
కాపాడుతాడు.
34 యుద్ధంలో ఎలా పోరాడాలో దేవుడు నాకు నేర్పి
స్తాడు. ఇత్తడి విల్లును ఎక్కుపెట్టుటకు నా చేతు
లకు ఆయన బలాన్ని ఇస్తాడు.
35 దేవా, నీ డాలుతో నన్ను కాపాడితివి. నీ కుడి
చేతితో నన్ను బలపరుచుము. నీ సహాయం నన్ను
గొప్పవానిగా చేసినది.
36 నా అడుగులకు నీవు విశాలమైన మార్గాన్నిచ్చావు.
నా పాదాలు జారిపోలేదు.
37 నేను నా శత్రువులను తరిమి, వారిని పట్టుకొ
న్నాను. వారు నాశనం అయ్యేవరకు నేను తిరిగిరా
లేదు.
38 నా శత్రువులను నేను ఓడిస్తాను. వారిలో ఒక్కరు
గూడా తిరిగి లేవరు. నా శత్రువులు అందరూ నా
పాదాల దగ్గర పడ్డారు.
39 దేవా, యుద్ధంలో నాకు బలం ప్రసాదించుము.
నా శత్రువులంతా నా యెదుట పడిపోయేట్టు
చేయుము.
40 యెహోవా, నా శత్రువులను వెనుదిరిగేటట్లు
చేశావు. నీ సహాయంవల్లనే నన్ను ద్వేషించే వారిని
నేను నాశనం చేసాను.
41 నా శత్రువులు సహాయం కోసం అడిగారు, కానీ
ఎవ్వరూ వారికి సహాయం చేసేందుకు రాలేదు.
వారు యెహోవాకు కూడా మొరపెట్టారు. కాని
ఆయన వారికి జవాబు ఇవ్వలేదు.
42 నా శత్రువులను నేను ధూళిగా నలగగొట్టాను.
వారు గాలికి చెదరిపోయే దుమ్ములా ఉన్నారు.
నేను వాళ్లను వీధుల బురదగా పారవేసాను.

**నోటినుండి** లేక ముక్కునుండి.

**కష్టాలనుండి** అక్షరాల మనోబాధలనుండి.

**బండ** దేవునికి మరో పేరు. బలమైన క్షేమ స్థానం అని
భావం.

43 నాకు వ్యతిరేకంగా పోరాడే మనుష్యుల నుండి
నన్ను కాపాడావు. ఆ రాజ్యాలకు నన్ను నాయకు
నిగా చేయుము. నేను ఎరుగని ప్రజలు నాకు
సేవ చేస్తారు.
44 ఆ మనుష్యులు నా గురించి విన్నప్పుడు విధేయు
లయ్యారు. ఇతర రాజ్యాల ప్రజలు నేనంటే భయ
పడ్డారు.
45 ఆ విదేశీ ప్రజలు నేనంటే భయపడ్డారు, కనుక
వారు భయంతో వణుకుతూ సాష్టాంగపడ్డారు.
వారు దాక్కొనే తమ స్థలాలనుండి బయటకు
వచ్చారు.
46 యెహోవా సజీవంగా ఉన్నాడు. నా ఆశ్రయ
దుర్గమైన వానిని నేను స్తుతిస్తాను. నా దేవుడు
నన్ను రక్షిస్తాడు. అందుచేత ఆయనను స్తుతులతో
పైకెత్తండి.
47 నాకోసం నా శత్రువులను శిక్షించాడు. ఆ ప్రజ
లను ఓడించేందుకు యెహోవా నాకు సహాయం
చేసాడు.
48 యెహోవా, నీవే నా శత్రువుల నుండి నన్ను
తప్పించావు. క్రూరులైన వారి నుండి నీవు నన్ను
రక్షించావు. నాకు విరుద్ధంగా నిలిచినవారిని ఓడించు
టకు నీవు నాకు సహాయం చేశావు.
49 కనుక మనుష్యులందరి యెదుట యెహోవాను
నేను స్తుతిస్తాను. నీ నామ కీర్తన గానము చేస్తాను.
50 యెహోవా ఏర్పాటు చేసుకొన్న రాజుకు, ఆయన
గొప్ప విజయాలిచ్చాడు. ఆయన ఏర్పాటు చేసు
కొన్న రాజుకు అనగా దావీదుకు, తన సంతానానికీ
నిరంతరం ఆయన ఎంతో దయ చూపాడు.

## కీర్తన 19

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 ఆకాశాలు దేవుని మహిమను తెలియజేస్తున్నాయి.
యెహోవా చేతులు చేసిన మంచివాటిని అంత
రిక్షం తెలియజేస్తుంది.
2 పతి క్రొత్త రోజూ ఆ గాథను మరింత చెబుతుంది.
ప్రతి రాత్రి దేవుని గురించి మరింత ఎక్కువగా
తెలియజేస్తుంది.
3 నిజానికి నీవు ఏ ఉపన్యాసం గాని మాటలుగాని
వినలేవు. మనం వినగలిగిన శబ్దం ఏదీ అవి చేయవు.
4 అయినా వాటి "స్వరం" ప్రపంచం అంతా ప్రసరి
స్తుంది. వాటి "మాటలు" భూమి చివరి వరకూ
వెళ్తాయి. అంతరిక్షం సూర్యునికి ఒక ఇల్లు లాంటిది.
5 తన పడక గది నుండి వచ్చే సంతోష భరితుడైన
పెండ్లి కుమారునిలా సూర్యుడు బయటకు
వస్తాడు. పందెంలో పరుగెత్తడానికి ఆత్రంగా ఉన్న
ఆటగానిలా సూర్యుడు ఆకాశంలో తన దారిని
మొదలు పెడతాడు.
6 సూర్యుడు అంతరిక్షంలోని ఒక దిశలో మొదలు
పెడ్తాడు, మరియు ఆవలి దిశకు అది పరిగెడు
తుంది. దాని వేడి నుండి ఏదీ దాక్కోలేదు.
యెహోవా ఉపదేశాలు అలా ఉన్నాయి.
7 యెహోవా ఉపదేశాలు పరిపూర్ణం. అవి దేవుని
ప్రజలకు బలాన్నిస్తాయి. యెహోవా ఒడంబడిక
విశ్వసించదగింది. జ్ఞానం లేని మనుష్యులకు అది
జ్ఞానాన్ని ఇస్తుంది.
8 యెహోవా చట్టాలు సరియైనవి. అవి మనుష్యు
లను సంతోషపెడ్తాయి. యెహోవా ఆదేశాలు పరి
శుద్ధమైనవి. ప్రజలు జీవించుటకు సరైన మార్గాన్ని
చూపడానికి అవి కన్నులకు వెలుగునిస్తాయి.
9 యెహోవాను ఆరాధించుట మంచిది. అది నిరం
తరము నిలుస్తుంది. యెహోవా తీర్పులు సత్యమై
నవి, న్యాయమైనవి. అవి సంపూర్ణంగా సరియైనవి.
10 శ్రేష్ఠమైన బంగారంకంటె యెహోవా ఉపదేశాలను
మనము ఎక్కువగా కోరుకోవాలి. సరాసరి తేనె
పట్టు నుండి వచ్చే శ్రేష్ఠమైన తేనె కంటె అవి
మధురంగా ఉంటాయి.
11 యెహోవా ఉపదేశాలు నీ సేవకుణ్ణి చాలా తెలివి
గలవాణ్ణిగా చేస్తాయి. నీ చట్టాలు పాటించేవారు
గొప్ప ప్రతిఫలాన్ని పొందుతారు.
12 యెహోవా, ఏ వ్యక్తీ, తన స్వంత తప్పులన్నింటినీ
చూడలేడు. కనుక నేను రహస్య పాపాలు చేయ
కుండా చూడుము.
13 యెహోవా, నేను చేయాలనుకొనే పాపాలు చేయ
కుండా నన్ను ఆపుచేయుము. ఆ పాపాలు నా
మీద అధికారం చెలాయించ నీయకుము. నీవు
నాకు సహాయం చేస్తే అప్పుడు నేను గొప్ప
పాపము నుండి, పవిత్రంగా దూరంగా ఉండగలను.
14 నా మాటలు, తలంపులు నిన్ను సంతోష పెడ్తా
యని నేను ఆశిస్తున్నాను. యెహోవా, నీవే నా
ఆశ్రయ దుర్గం. నీవే నన్ను రక్షించేవాడవు.

## కీర్తన 20

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 నీకు కష్టాలు కలిగినప్పుడు సహాయంకోసం నీవు
చేసే ప్రార్థనకు యెహోవా నీకు జవాబు ఇచ్చును
గాక. యాకోబు దేవుడు నీ పేరును ప్రసిద్ధి
చేయును గాక.*

---

**యాకోబును … చేయును గాక** యాకోబు దేవుని పేరు నిన్ను కాపాడునుగాక అని దీని అర్థం.

2 దేవుడు తన పవిత్ర స్థలం నుండి నీకు సహాయం
పంపించునుగాక. సీయోను* నుండి ఆయన
నిన్ను బలపర్చునుగాక!
3 నీవు అర్పించిన కానుకలు అన్నింటినీ దేవుడు
జ్ఞాపకం చేసుకొనునుగాక. నీ బలి అర్పణలు అన్నిం
టిని ఆయన స్వీకరించును గాక.
4 నీకు నిజంగా కావల్సిన వాటిని దేవుడు నీకు అను
గ్రహించును గాక. నీ పథకాలన్నింటినీ ఆయన
నెరవేర్చును గాక.
5 దేవుడు నీకు జయము నిచ్చినప్పుడు మనం
సంతోషించుదముగాక. దేవుని నామమునకు
స్తోత్రము కలుగును గాక. నీవు అడిగినది అంతా
యెహోవా నీకు అనుగ్రహించును గాక.
6 ఇప్పుడు, యెహోవా ఏర్పాటు చేసుకొన్న
రాజుకు ఆయనే సహాయం చేస్తాడని నాకు
తెలుసు. దేవుడు తన పవిత్ర పరలోకంలో నుండి,
ఆయన ఏర్పాటు చేసుకొన్న రాజుకు జవాబు
ఇచ్చాడు. ఆ రాజును రక్షించుటకు దేవుడు తన
మహత్తర శక్తిని ప్రయోగించాడు.
7 కొందరు మనుష్యులు వారి రథాలను నమ్ము
కొంటారు. మరికొందరు మనుష్యులు వారి గుర్రా
లను నమ్ముకొంటారు. కానీ మనం మన దేవుడైన
యెహోవాను నమ్ముకొంటాము.
8 ఆ ఇతర మనుష్యులు ఓడించబడ్డారు, వారు
యుద్ధంలో మరణించారు. కానీ మనం గెలిచాము!
మనం విజయులముగా నిలిచాము!
9 దేవుడు రాజును రక్షించును గాక! మేము సహా
యము కొరకు పిలుచునప్పుడు మాకు ఉత్తర
మిమ్ము.

## కీర్తన 21

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 యెహోవా, నీ బలం రాజును సంతోష పరు
స్తుంది. నీవు అతన్ని రక్షించినప్పుడు అతడు ఎంత
గానో సంతోషించాడు.
2 రాజు కోరినవాటిని నీవు అతనికిచ్చావు. రాజు
కొన్నింటికోసం అడిగాడు. మరియు యెహోవా,
రాజు అడిగిన వాటిని నీవు అతనికిచ్చావు.
3 యెహోవా, నీవు నిజంగా ఎన్నో మంచి వాటిని
రాజుకిచ్చావు. బంగారు కిరీటం నీవు అతని తలకు
ధరింపజేసావు.
4 దేవా, జీవంకోసం అతడు నిన్ను అడిగాడు. నీవు
దానిని అతనికిచ్చావు. నీవు రాజుకు నిరంతరం
సాగే దీర్ఘాయువు నిచ్చావు.
5 రాజుకు నీవు విజయాన్నిచ్చావు కనుక అతనికి
గొప్ప కీర్తి ఉంది. నీవు అతనికి గౌరవం, ఘనత
ఇచ్చావు.
6 దేవా, నీవు రాజుకు నిజంగా శాశ్వత ఆశీర్వాదాలు
ఇచ్చావు. నీ సన్నిధానము రాజును ఎక్కువగా
సంతోషపెస్తుంది.
7 రాజు వాస్తవంగా యెహోవాను నమ్ముతున్నాడు.
సర్వోన్నతుడైన దేవుడు అతన్ని నిరాశపర్చడు.
8 రాజా! నీవు బలవంతుడవని నీ శత్రువులందరికీ
నీవు చూపిస్తావు. నిన్ను ద్వేషించే ప్రజలను నీ
శక్తి ఓడిస్తుంది.
9 నీవు కనబడినప్పుడు ఆ శత్రువులను వేడి పొయ్యి
లోని నిప్పువలె చేస్తావు. యెహోవా కోపము
వేడి మంటవలె కాలుస్తుంది. మరియు ఆయన
ఆ శత్రువులను నాశనం చేస్తాడు.
10 ఆ శత్రువుల కుటుంబాలు నాశనం చేయబడ
తాయి. వారు భూమి మీద నుండి తొలగిపోతారు.
11 ఎందుకంటే, యెహోవా, ఆ ప్రజలు నీకు విరో
ధంగా దుష్టపథకాలు వేసారు. చెడుకార్యాలు చేయా
లని వారు యోచించారు గాని వారు సాధించలేదు.
12 కాని యెహోవా, వారు వెనుతిరిగి పారిపోయేలా
చేస్తావు. ఎందుకంటే నీవు విల్లును వారి ముఖాలకు
గురిపెడతావు.
13 యెహోవా, నీ బలంతో లెమ్ము. నీ గొప్పదనం
గూర్చి మేము కీర్తనలు పాడుతాము, వాద్యాలు
వాయిస్తాము.

## కీర్తన 22

*సంగీత నాయకునికి. అయ్యలెత్ షహరు రాగం.*
*దావీదు కీర్తన.*

1 నా దేవా, నా దేవా నన్ను ఎందుకు విడిచిపెట్టావు?
నన్ను రక్షించటానికి నీవు చాలా దూరంగా ఉన్నావు.
సహాయం కోసం నేను వేసే కేకలను వినటానికి
నీవు చాలా దూరంగా ఉన్నావు.
2 నా దేవా, పగలు నేను నీకు మొరపెట్టాను. కాని
నీవు నాకు జవాబు ఇవ్వలేదు. మరియు నేను
రాత్రిపూట నీకు మొరపెడుతూనే ఉన్నాను.
3 దేవా, నీవు పవిత్రుడవు. నీవు రాజుగా కూర్చు
న్నావు. ఇశ్రాయేలీయుల స్తుతులే నీ సింహాసనం.
4 మా పూర్వీకులు నిన్ను నమ్ముకొన్నారు. అవును
దేవా, వారు నిన్ను నమ్ముకొన్నారు. నీవేమో వారిని
రక్షించావు.
5 మా పూర్వీకులు సహాయంకోసం నిన్ను వేడు
కొన్నారు, దేవా, తమ శత్రువుల నుంచి వారు
తప్పించుకొన్నారు. వారు నిన్ను నమ్ముకొన్నారు.
కనుక వారు నిరాశ చెందలేదు.

---

**సీయోను** యెరూషలేము కట్టబడిన కొండ దక్షిణ ప్రాంతం.
కొన్ని సంధర్భాలలో అక్కడి దేవుని ప్రజలు అని అర్థం.

6 అందుచేత నేను మనిషిని కానా, పురుగునా? మను
ష్యులు నన్ను దూషిస్తారు. ప్రజలు నన్ను
ద్వేషిస్తారు.
7 నన్ను చూచే ప్రతి ఒక్కరూ నన్ను ఎగతాళి
చేస్తారు. నన్ను చూచి, వారు తలలు ఎగురవేస్తూ,
నన్ను వెక్కిరిస్తారు.
8 వారు నాతో అంటారు: "నీకు సహాయం చేయు
మని నీవు యెహోవాను అడగాలి. ఒకవేళ ఆయన
నిన్ను రక్షిస్తాడేమో! నీవంటే ఆయనకు అంత
ఇష్టమైతే అప్పుడు ఆయన తప్పక నిన్ను
రక్షిస్తాడు."
9 దేవా, నిజంగా నేను నీ మీద ఆధార పడియు
న్నాను. నన్ను గర్భమునుండి బయటకు లాగిన
వాడవు నీవే. నేను యింకా నా తల్లి పాలు త్రాగుతూ
ఉన్నప్పుడే నీవు నాకు అభయం ఇచ్చావు, ఆద
రించావు.
10 నేను పుట్టిన రోజునుండి నీవు నాకు దేవునిగా
ఉన్నావు. నేను నా తల్లి గర్భంలోనుండి వచ్చి
నప్పటి నుండి నేను నీ జాగ్రత్తలోనే ఉంచబడ్డాను.
11 కనుక దేవా, నన్ను విడువకు. కష్టం దగ్గర్లో ఉంది.
పైగా నాకు సహాయం చేసే వారు ఎవ్వరూ లేరు.
12 మనుష్యులు రంకెవేసే ఆబోతుల్లాగా నా చుట్టూ
వున్నారు. వారు బలిసిన బాషాను ఆబోతుల వలె
నన్ను చుట్టుముట్టియున్నారు. (బాషాను అనగా
యొర్దాను నది తూర్పు ప్రాంతం. అది పశువులకు
ప్రసిద్ధికెక్కిన ప్రాంతం.)
13 ఒక జంతువును చీల్చివేస్తూ, గర్జిస్తున్న సింహాల్లా
ఉన్నారు వారు. వారి నోళ్లు పెద్దగా తెరచు కొని
ఉన్నాయి.
14 నేలమీద పోయబడ్డ నీళ్లలా నా బలం పోయినది.
నా ఎముకలు విడిపోయాయి. నా ధైర్యం
పోయినది.
15 నా నోరు ఎండి, పగిలిపోయిన చిల్ల పెంకులా
ఉన్నది. నా నాలుక నా అంగిటికి అతుక్కొని
పోతోంది. "మరణ ధూళిలో" నీవు నన్ను
ఉంచావు.
16 "కుక్కలు" నా చుట్టూరా ఉన్నాయి. ఆ దుష్టుల
దండు నన్ను చుట్టు ముట్టింది. సింహంలాగా వారు
నా చేతుల్ని, నా పాదాలను గాయపర్చారు.
17 నేను నా ఎముకల్ని చూడగలను. ఆ ప్రజలు నా
వైపు తేరి చూస్తున్నారు. వారు నన్ను అలా
చూస్తూనే ఉంటారు!
18 ఆ ప్రజలు నా వస్త్రాలను వారిలో వారు పంచు
కొంటున్నారు. నా అంగీ కోసం వారు చీట్లు
వేస్తున్నారు.
19 యెహోవా, నన్ను విడువకుము! నీవే నా బలం.
త్వరపడి నాకు సహాయం చేయుము!
20 యెహోవా, ఖడ్గం నుండి నా ప్రాణాన్ని రక్షిం
చుము. ప్రశస్తమైన నా ప్రాణాన్ని ఆ కుక్కల
నుండి రక్షించుము.
21 సింహం నోటినుండి నన్ను రక్షించుము. ఆబోతు
కొమ్ముల నుండి నన్ను కాపాడుము.
22 యెహోవా, నిన్ను గూర్చి నేను నా సోదరులతో
చెబుతాను. ప్రజల మహా సమాజంలో నేను నిన్ను
స్తుతిస్తాను.
23 యెహోవాను ఆరాధించే ప్రజలారా! మీరంతా
ఆయనను స్తుతించండి. ఇశ్రాయేలు వంశస్థులారా
యెహోవాను ఘనపర్చండి. ఇశ్రాయేలు వంశీ
యులారా! మీరంతా యెహోవాకు భయపడి,
ఆయనను గౌరవించండి.
24 ఎందుకంటే కష్టాలలో ఉన్న పేద ప్రజలకు
యెహోవా సహాయం చేస్తాడు. ఆ పేద ప్రజల
విషయం యెహోవా సిగ్గుపడడు. యెహోవా
వారిని ద్వేషించడు. ప్రజలు సహాయం కోసం
యెహోవాను వేడుకొన్నప్పుడు ఆయన వారికి
కనబడకుండా ఉండడు. వారి మొరను వింటాడు.
25 యెహోవా, మహా సమాజంలో నా స్తుతి నీ నుండే
వస్తుంది. నేను చేస్తానని వాగ్దానం చేసిన వాట
న్నింటినీ, ఈ ఆరాధికులందరి ఎదుటనే నేను
చేస్తాను.
26 పేద ప్రజలు తిని, తృప్తి పొందుతారు. యెహోవా
కోసం చూస్తూ వచ్చే ప్రజలారా, మీరు ఆయనను
స్తుతించండి. మీ హృదయాలు ఎప్పటికీ సంతో
షంగా ఉండునుగాక!
27 దూరదేశాల్లోని ప్రజలంతా యెహోవాను జ్ఞాపకం
చేసుకొని ఆయన వద్దకు తిరిగి వస్తారు.
28 ఎందుకనగా యెహోవాయే రాజు. దేశాలన్నింటినీ
ఏలేవాడు ఆయనే. ఆయనే సకల రాజ్యాలనూ
పాలిస్తాడు.
29 నిజంగా, భూమిలో నిద్రించబోయే వారందరూ
ఆయన్ని ఆరాధిస్తారు. సమాధిలోనికి దిగిపోయేవా
రందరూ ఆయనకు తలవంచు తారు. మరియు
వారి ప్రాణాలను కాపాడుకొన లేనివారు కూడా
తల వంచుతారు. చచ్చిన ప్రతి మనిషి ఆయ
నకు తలవంచాలి.
30 భవిష్యత్తులో మన వారసులు యెహోవాను సేవి
స్తారు. యెహోవా విషయమై వారు, నిత్యం
చెప్పుతారు.
31 ఇంకా పుట్టని మనుష్యులకు వచ్చి దేవుని మంచి
తనం గూర్చి చెబుతారు. దేవుడు నిజంగా చేసిన
మంచి కార్యాలను గూర్చి ఆ మనుష్యులు
చెబుతారు.

## కీర్తన 23
**దావీదు కీర్తన.**

1 యెహోవా నా కాపరి నాకు కొరత ఉండదు
2 పచ్చటి పచ్చిక బయళ్లలో ఆయన నన్ను పడుకో
పెడతాడు. ప్రశాంతమైన నీళ్లవద్దకు ఆయన నన్ను
నడిపిస్తాడు.
3 ఆయన తన నామ ఘనత కోసం నా ఆత్మకు
నూతన బలం ప్రసాదిస్తాడు. ఆయన నిజంగా
మంచివాడని చూపించేందుకు ఆయన నన్ను
మంచితనపు మార్గాల్లో నడిపిస్తాడు.
4 చివరికి మరణాంధకారపు లోయలో నడిచిన
ప్పుడు కూడా నేను భయపడను. ఎందుకంటే,
యెహోవా, నీవు నాతో ఉన్నావు నీ చేతికర్ర,
నీ దండం నన్ను ఆదరిస్తాయి కనుక.
5 యెహోవా, నా శత్రువుల ఎదుటనే నీవు నాకు
భోజనం సిద్ధం చేశావు. నూనెతో నా తలను
నీవు అభిషేకిస్తావు. నా పాత్ర నిండి, పొర్లిపోతుంది.
6 నా మిగిలిన జీవితం అంతా మేలు, కరుణ నాతో
ఉంటాయి. మరియు నేను ఎల్లకాలం యెహోవా
ఆలయంలో నివసిస్తాను.

## కీర్తన 24
**దావీదు కీర్తన.**

1 భూమి, దాని మీద ఉన్న సమస్తం యెహోవాకు
చెందినవే. ప్రపంచం, దానిలో ఉన్న మనుష్యులు
అంతా ఆయనకు చెందినవారే.
2 జలాల మీద భూమిని యెహోవా స్థాపించాడు.
ఆయన దానిని పారుతున్న నీళ్ల మీద నిర్మించాడు.
3 యెహోవా పర్వతం మీదికి ఎవరు ఎక్కగలరు?
యెహోవా పవిత్ర ఆలయంలో ఎవరు నిలువ
గలరు?
4 అక్కడ ఎవరు ఆరాధించగలరు? చెడుకార్యాలు
చేయని వాళ్లు, పవిత్రమైన మనస్సు ఉన్న
వాళ్ళునూ, అబద్ధాలను సత్యంలా కనబడేట్టు
చేయటం కోసం నా నామాన్ని ప్రయోగించని
మనుష్యులు, అబద్ధాలు చెప్పకుండా, తప్పుడు
వాగ్దానాలు చేయకుండా ఉన్న మనుష్యులు.
అలాంటి మనుష్యులు మాత్రమే అక్కడ ఆరాధించ
గలరు.
5 మంచి మనుష్యులు, ఇతరులకు మేలు చేయుమని
యెహోవాను వేడుకొంటారు. ఆ మంచి మను
ష్యులు వారి రక్షకుడైన దేవుణ్ణి మేలు చేయుమని
వేడుకొంటారు.
6 దేవుని వెంబడించటానికి ప్రయత్నించేవారే ఆ
మంచి మనుష్యులు. సహాయంకోసం యాకోబు
దేవుణ్ణి వారు ఆశ్రయిస్తారు.
7 గుమ్మాల్లారా, మీ తలలు పైకెత్తండి. పురాతన
తలుపుల్లారా తెరచుకోండి. మహిమగల రాజు
లోనికి వస్తాడు.
8 ఈ మహిమగల రాజు ఎవరు? ఆ రాజు యెహోవా.
ఆయన శక్తిగల సైనికుడు. యెహోవాయే ఆ
రాజు. ఆయన యుద్ధ వీరుడు.
9 గుమ్మాల్లారా, మీ తలలు పైకెత్తండి! పురాతన
తలుపుల్లారా, తెరచుకోండి. మహిమగల రాజు
లోనికి వస్తాడు.
10 ఆ మహిమగల రాజు ఎవరు? ఆ రాజు సర్వశక్తిగల
యెహోవాయే. ఆయనే ఆ మహిమగల రాజు.

## కీర్తన 25
**దావీదు కీర్తన.**

1 యెహోవా, నేను నీకు నన్ను అర్పించు
కొంటాను.
2 నా దేవా, నేను నిన్ను నమ్ముకొంటున్నాను. నేను
నిరాశచెందను. నాశత్రువులు నన్ను చూచినవ్వరు.
3 నిన్ను నమ్ముకొనే ఏ మనిషి నిరాశచెందడు. కానీ
నమ్మక ద్రోహులు నిరాశపడతారు. వారికి ఏమీ
దొరకదు.
4 యెహోవా, నీ మార్గాలు నేర్చుకొనుటకు నాకు
సహాయం చేయుము. నీ మార్గాలను ఉపదే
శించుము.
5 నన్ను నడిపించి, నీ సత్యాలు నాకు ఉపదేశిం
చుము. నీవు నా దేవుడవు, నా రక్షకుడవు. రోజంతా
నేను నిన్ను నమ్ముతాను.
6 యెహోవా, నా ఎడల దయ చూపుటకు జ్ఞాపకం
ఉంచుకొనుము. నీవు ఎల్లప్పుడూ చూపిస్తూ
వచ్చిన ఆ ప్రేమను నాయెడల చూపించుము.
7 నేను యౌవ్వనంలో ఉన్నప్పుడు చేసిన పాపాలు
చెడు కార్యాలు జ్ఞాపకం చేసుకోవద్దు. యెహోవా,
నీ నామ ఘనతకోసం ప్రేమతో నన్ను జ్ఞాపకం
చేసుకొనుము.
8 యెహోవా నిజంగా మంచివాడు. జీవించాల్సిన
సరైన మార్గాన్ని పాపులకు ఆయన ఉపదేశిస్తాడు.
9 దీనులకు ఆయన తన మార్గాలను ఉపదేశిస్తాడు.
న్యాయంగా ఆయన వారిని నడిపిస్తాడు.
10 యెహోవా ఒడంబడికను, వాగ్దానాలను అనుస
రించే మనుష్యులందరికి ఆయన మార్గాలు దయ
గలవిగా, వాస్తవమైనవిగా ఉంటాయి.
11 యెహోవా, నేను ఎన్నెన్నో తప్పులు చేసాను.
కానీ, నీ మంచితనం చూపించుటకు గాను, నేను
చేసిన ప్రతి దానిని నీవు క్షమించావు.
12 ఒక వ్యక్తి యెహోవాను అనుసరించాలని కోరు
కొంటే అప్పుడు శ్రేష్ఠమైన జీవిత విధానాన్ని
దేవుడు ఆ వ్యక్తికి చూపిస్తాడు.

13 ఆ వ్యక్తి మేళ్లను అనుభవిస్తాడు. అతనికిస్తానని
దేవుడు వాగ్దానం చేసిన భూమిని ఆ వ్యక్తి పిల్లలు
వారసత్వంగా పొందుతారు.
14 యెహోవా తన అనుచరులకు తన రహస్యాలు
చెబుతాడు. ఆయన తన అనుచరులకు తన
ఒడంబడికను ఉపదేసిస్తాడు.
15 నా కళ్లు సహాయం కోసం ఎల్లప్పుడూ యెహోవా
వైపు చూస్తున్నాయి. ఆయన నన్ను ఎల్లప్పుడూ
నా కష్టాల్లో నుంచి విడిపిస్తాడు.
16 యెహోవా, నేను బాధతో ఒంటరిగా ఉన్నాను.
నా వైపు తిరిగి, నాకు నీ కరుణ ప్రసాదించుము.
17 నా కష్టాలనుంచి నన్ను విడిపించుము. నా సమ
స్యలు పరిష్కరించబడుటకు నాకు సహాయం
చేయుము.
18 యెహోవా, నా పరీక్షలు, కష్టాలు చూడుము.
నేను చేసిన పాపాలు అన్నింటి విషయంలో నన్ను
క్షమించుము.
19 నాకు ఉన్న శత్రువులు అందరినీ చూడుము, నా
శత్రువులు నన్ను ద్వేషిస్తూ, నాకు హాని చేయాలని
కోరుతున్నారు.
20 దేవా, నన్ను కాపాడుము, నన్ను రక్షించుము. నేను
నిన్ను నమ్ముకొన్నాను కనుక నన్ను నిరాశపర్చ
వద్దు.
21 దేవా, నీవు నిజంగా మంచివాడివి నిన్ను నేను
నమ్ముకొన్నాను కనుక నన్ను కాపాడుము.
22 దేవా, ఇశ్రాయేలు ప్రజలను, వారి కష్టములనుండి
రక్షించుము.

## కీర్తన 26

*దావీదు కీర్తన.*

1 యెహోవా, నాకు తీర్పు తీర్చుము, నేను పవిత్ర
జీవితం జీవించినట్టు రుజావు చేయుము. యెహో
వాను నమ్మకోవటం నేనెన్నడూ మానలేదు.
2 యెహోవా, నన్ను పరిశోధించి, నన్ను పరీక్షించి.
నా హృదయంలోనికి, నా మనసులోనికి నిశ్చింతగా
చూడుము.
3 నేను ఎల్లప్పుడూ నీ ప్రేమను చూస్తాను. నీ సత్యాల
ప్రకారం నేను జీవిస్తాను.
4 పనికిమాలిన ఆ మనుష్యుల్లో నేను ఒకడ్ని కాను.
5 ఆ దుర్మార్గపు ముఠాలంటే నాకు అసహ్యం. ఆ
దుష్టుల ముఠాలలో నేను చేరను.
6 యెహోవా, నేను నా చేతులు కడుగుకొంటాను.
నేను నీ బలిపీఠం దగ్గరకు వస్తాను.
7 యెహోవా, నేను నీకు స్తుతి కీర్తనలు పాడుతాను.
నీవు చేసిన అద్భుత విషయాలను గూర్చి నేను
పాడుతాను.
8 యెహోవా, నీ గుడారం అంటే నాకు ప్రేమ.
మహిమగల నీ గుడారాన్ని నేను ప్రేమిస్తున్నాను.
9 యెహోవా, ఆ పాపులతో నన్ను జత చేయ
కుము. ఆ హంతకులను నీవు చంపేటప్పుడు,
నన్ను చంపకుము.
10 ఆ మనుష్యులకు దుష్ట పథకాలున్నాయి. చెడు
కార్యాలు చేయటానికి ఆ మనుష్యులు లంచం
తీసుకొంటారు.
11 కానీ నేను నిర్దోషిని. కనుక దేవా నన్ను కరుణించి,
రక్షించుము.
12 నేను సురక్షితమైన స్థలాల్లో నిలుస్తాను. యెహోవా,
నీ అనుచరులు సమావేశమైనప్పుడు నేను నిన్ను
స్తుతిస్తాను.

## కీర్తన 27

*దావీదు కీర్తన.*

1 యెహోవా, నీవే నా వెలుగు, నా రక్షకుడవు.
నేను ఎవరిని గూర్చి భయపడనక్కర్లేదు.
యెహోవా నీవే నా జీవిత క్షేమస్థానం. కనుక
నేను ఎవరికి భయపడను.
2 దుర్మార్గులు నా మీద దాడి చేయవచ్చు. వారు
నా శరీరాన్ని నాశనం చేసేందుకు ప్రయత్నించ
వచ్చు. వారు నా శత్రువులు, విరోధులు. వారు
కాలు తప్పి పడిపోదురు.
3 అయితే నా చుట్టూరా సైన్యం ఉన్నప్పటికీ నేను
భయపడను. యుద్ధంలో ప్రజలు నామీద విరు
చుకు పడ్డప్పటికీ నేను భయపడను. ఎందుకంటే
నేను యెహోవాను నమ్ముకొన్నాను.
4 యెహోవా నాకు అనుగ్రహించాలని నేను ఆయ
నను అడిగేది ఒకే ఒకటి ఉంది. నేను అడిగేది
ఇదే: "నా జీవిత కాలం అంతా నన్ను యెహోవా
ఆలయంలో కూర్చుండనిచ్చుట. ఆయన రాజ
భవనాన్ని నన్ను సందర్శించనిచ్చుట. యెహోవా
సౌందర్యాన్ని నన్ను చూడనిమ్ము."
5 నేను ఆపదలో ఉన్నప్పుడు యెహోవా నన్ను
కాపాడుతాడు. ఆయన తన గుడారంలో నన్ను
దాచిపెడతాడు. ఆయన తన క్షేమ స్థానానికి నన్ను
తీసుకొని వెళ్తాడు.
6 నా శత్రువులు నన్ను చుట్టుముట్టేశారు. కానీ
ఇప్పుడు వారిని ఓడించటానికి యెహోవా నాకు
సహాయం చేస్తాడు. అప్పుడు నేను ఆయన గుడా
రంలో బలులు అర్పిస్తాను. సంతోషంతో కేకలు
వేస్తూ ఆ బలులు నేను అర్పిస్తాను. యెహోవాను
ఘనపరచుటకు నేను వాద్యం వాయిస్తూ గానం
చేస్తాను.
7 యెహోవా, నా స్వరం ఆలకించి నాకు జవాబు
ఇమ్ము. నా మీద దయ చూపించుము.

8 యెహోవా, నా హృదయం నిన్ను గూర్చి మాట్లా
డమంటున్నది. వెళ్లు నీ యెహోవాను ఆరాధించ
మంటున్నది అందువల్ల యెహోవా నేను నిన్ను
ఆరాధించటానికి వచ్చాను.
9 యెహోవా, నా దగ్గర్నుండి తిరిగిపోకుము. కోప
గించవద్దు, నీ సేవకుని దగ్గర్నుండి తిరిగి వెళ్లి
పోవద్దు. నీవు నాకు సహాయమైయున్నావు, నన్ను
త్రోసివేయకుము. నన్ను విడిచిపెట్టవద్దు. నా
దేవా, నీవు నా రక్షకుడవు.
10 నా తల్లి, నా తండ్రి నన్ను విడిచిపెట్టారు. అయితే
యెహోవా నన్ను తీసుకొని, తన వానిగా చేసాడు.
11 యెహోవా, నాకు శత్రువులు ఉన్నారు, కనుక
నాకు నీ మార్గాలు నేర్పించుము. సరైన వాటిని
చేయటం నాకు నేర్పించుము.
12 నా శత్రువుల కోరికకు నన్నప్పగించవద్దు. నన్ను
గూర్చి వాళ్లు అబద్ధాలు చెప్పారు. నాకు హాని
కలిగించేందుకు వాళ్లు అబద్ధాలు చెప్పారు.
13 నేను చనిపోక ముందు యెహోవా మంచితనాన్ని
నేను చూస్తానని నిజంగా నేను నమ్ముచున్నాను.
14 యెహోవా సహాయం కోసం కనిపెట్టి ఉండుము.
బలంగా, ధైర్యంగా ఉండుము. యెహోవా
సహాయం కోసం కనిపెట్టుము.

## కీర్తన 28

**దావీదు కీర్తన.**

1 యెహోవా, నీవే నా బండవు. సహాయం కోసం
నేను నిన్ను పిలుస్తున్నాను. నా ప్రార్థనలకు నీ
చెవులు మూసుకోవద్దు. సహాయంకోసం పిలు
స్తున్న నా పిలుపుకు నీవు జవాబు ఇవ్వకపోతే
అప్పుడు నేను సమాధిలో నున్న శవాల్లాగే
ఉంటాను.
2 యెహోవా, నేను నా చేతులు ఎత్తి, నీ అతి
పవిత్ర స్థలం వైపు ప్రార్థిస్తున్నాను. నేను నిన్ను
వేడుకొన్నప్పుడు, నా మాట ఆలకించుము. నా
మీద దయ చూపించుము.
3 యెహోవా, నేను చెడ్డవాళ్లవలె ఉన్నానని తల
చవద్దు. చెడు కార్యాలు చేసే దుర్మార్గుల్లోకి నన్ను
లాగకుము. ఆ మనుష్యులు వారి పొరుగువారిని
"షాలోం"* అని అభినందిస్తారు. కానీ వారి హృద
యాల్లో వారి పొరుగు వారిని గూర్చి వారు చెడ్డ
పథకాలు వేస్తున్నారు.
4 యెహోవా, ఆ మనుష్యులు ఇతరులకు కీడు
చేస్తారు. కనుక వారికి కూడ కీడు జరిగేటట్టుగా
చేయుము. ఆ చెడ్డవాళ్లు శిక్షించబడాల్సిన విధంగా
వారిని శిక్షించుము.

**షాలోం** అనగా శాంతి అని అర్థం.

5 యెహోవా చేసే మంచి పనులను చెడ్డవాళ్లు
గ్రహించరు. ఆయన చేసే మంచి వాటిని వారు
చూడరు, అర్థం చేసుకోరు. వారు నాశనం చేయ
టానికి ప్రయత్నిస్తారు.
6 యెహోవాను స్తుతించండి. కరుణించుమని నేను
చేసిన నా ప్రార్థన ఆయన విన్నాడు.
7 యెహోవా నా బలం, ఆయనే నా డాలు. నేను
ఆయనను నమ్ముకొన్నాను. ఆయన నాకు
సహాయం చేసాడు. నేను చాలా సంతోషంగా
ఉన్నాను. మరియు నేను ఆయనకు స్తుతి కీర్తనలు
పాడుతాను.
8 యెహోవా తన ప్రజలకు బలమైయున్నాడు.
ఆయన ఏర్పాటు చేసుకొన్నవానికి* శక్తి, విజయా
లను ఆయన ఇస్తాడు.
9 దేవా, నీ ప్రజలను రక్షించుము. నీకు చెందిన
ప్రజలను ఆశీర్వదించుము. కాపరిలా వారిని నిత్యం
నడిపించుము.

## కీర్తన 29

**దావీదు కీర్తన.**

1 దేవుని కుమారులారా, యెహోవాను స్తుతించండి.
ఆయన మహిమ ప్రభావాలను స్తుతించండి.
2 యెహోవాను స్తుతించండి, ఆయన నామాన్ని
కీర్తించండి. మీరు ప్రత్యేక వస్త్రాలు ధరించి,
ఆయన్ని ఆరాధించండి.
3 యెహోవా సముద్రం వద్ద తన స్వరం విని
పింపజేస్తున్నాడు. మహిమగల దేవుని స్వరం మహా
సముద్రం మీద ఉరుమువలె వినిపిస్తుంది.
4 యెహోవా స్వరం ఆయన శక్తిని తెలుపుతుంది.
ఆయన స్వరం ఆయన మహిమను తెలుపుతుంది.
5 యెహోవా స్వరం దేవదారు మహా వృక్షాలను
ముక్కలుగా విరుగ గొట్టును. లెబానోను దేవదారు
మహా వృక్షాలను యెహోవా విరగ్గొడతాడు.
6 లెబానోను పర్వతాలను యెహోవా కంపింప
జేస్తాడు. అవి గంతులు వేస్తున్న దూడలా కని
పిస్తాయి. షిర్యోను కంపిస్తుంది. అది మేకపోతు
గంతులు వేస్తున్నట్టు కనిపిస్తుంది.
7 యెహోవా స్వరం అగ్ని జ్వాలలను మండిస్తుంది.
8 యెహోవా స్వరం అరణ్యాన్ని కంపింపజేస్తుంది.
యెహోవా స్వరాన్ని విని కాదేషు అరణ్యం వణకు
తుంది.
9 యెహోవా స్వరం లేడి భయపడేటట్టు చేస్తుంది.
ఆయన అరణ్యాలను నాశనం చేస్తాడు. ఆయన ఆల

**ఏర్పాటు చేసుకొన్నవానికి** అభిషేకించబడ్డ వానికి సాధార
ణంగా ప్రత్యేకంగా ఆయన ఏర్పాటు చేసుకొన్న రాజు.

యంలో ఆయన మహిమను గూర్చి ప్రజలు
పాడుతారు.
10 వరదలను యెహోవా అదుపు చేసాడు. మరియు
యెహోవా ఎల్లప్పుడూ సమస్తాన్నీ తన అదుపులో
ఉంచుకొనే రాజు.
11 యెహోవా తన ప్రజలను కాపాడును గాక.
యెహోవా తన ప్రజలకు శాంతినిచ్చి ఆశీర్వ
దించును గాక.

## కీర్తన 30

***దావీదు కీర్తన. ఆలయ ప్రతిష్ఠ కీర్తన.***

1 యెహోవా, నా కష్టాల్లో నుంచి నీవు నన్ను పైకి
ఎత్తావు. నా శత్రువులు నన్ను ఓడించి, నన్ను
చూచి నవ్వకుండా నీవు చేశావు. కనుక నేను
నిన్ను ఘనపరుస్తాను.
2 యెహోవా, నా దేవా నేను నిన్ను ప్రార్థించాను.
నీవు నన్ను స్వస్థపరచావు.
3 సమాధిలో నుండి నీవు నన్ను పైకి లేపావు. నీవు
నన్ను బ్రతకనిచ్చావు. చచ్చిన వాళ్లతోబాటు నేను
గోతిలో* ఉండవలసిన పనిలేదు.
4 దేవుని అనుచరులారా! యెహోవాకు స్తుతులు
పాడండి. ఆయన పవిత్ర నామాన్ని స్తుతించండి.
5 దేవునికి కోపం వచ్చింది కనుక "మరణం" నిర్ణయం
చేయబడింది కానీ ఆయన తన ప్రేమను చూపిం
చాడు. నాకు "జీవం" ప్రసాదించాడు. రాత్రి పూట,
నేను ఏడుస్తూ పండుకొంటాను. మర్నాటి
ఉదయం నేను సంతోషంగా పాడుతూ ఉంటాను.
6 ఇప్పుడు నేను ఇది చెప్పగలను, ఇది సత్యం అని
నాకు గట్టిగా తెలుసు. నేను ఎన్నటికీ ఓడించ
బడను.
7 యెహోవా, నీవు నామీద దయ చూపావు. బల
మైన పర్వతంలా నీవు నన్ను నిలువబెట్టావు. కొద్ది
కాలంపాటు, నీవు నా నుండి తిరిగిపోయావు. మరి
నేను చాలా భయపడిపోయాను.
8 దేవా, నేను మరల, నిన్ను ప్రార్థించాను. నామీద
దయ చూపించమని నేను నిన్ను అడిగాను.
9 "దేవా, నేను మరణించి సమాధిలోకి దిగిపోతే ఏమి
లాభం? ధూళి నిన్ను స్తుతిస్తుందా? అది నీ
నమ్మకమును గూర్చి చెప్పుతుందా?
10 యెహోవా, నా ప్రార్థన విని నామీద దయ చూపిం
చుము. యెహోవా, నాకు సహాయం చేయుము."
11 నేను ప్రార్థించినప్పుడు, నీవు నాకు సహాయం
చేశావు.. నా ఏడ్పును నీవు నాట్యంగా మార్చావు.
నా దుఃఖ వస్త్రాలను నీవు తీసివేశావు. నీవు నాకు
సంతోషమనే వస్త్రాలు ధరింపజేశావు.
12 యెహోవా, నా దేవా నిన్ను నేను శాశ్వతంగా
స్తుతిస్తాను. ఎన్నటికీ మౌనంగా ఉండను. నా దేవా!
నిన్ను ఎల్లప్పుడూ స్తుతిస్తాను.

## కీర్తన 31

***సంగీత నాయకునికి. దావీదు కీర్తన.***

1 యెహోవా, నీవే నా కాపుదల. నన్ను నిరాశపర
చవద్దు. నా మీద దయ ఉంచి, నన్ను రక్షించుము.
2 దేవా నా మాట ఆలకించుము. వేగంగా వచ్చి
నన్ను రక్షించి నా బండగా ఉండుము. నా క్షేమ
స్థానంగా ఉండుము. నా కోటగా ఉండుము. నన్ను
కాపాడుము.
3 దేవా, నీవే నా బండవు, కోటవు కనుక నీ నామ
ఘనత కోసం నన్ను నడిపించుము, నాకు దారి
చూపించుము.
4 నా శత్రువులు నా ఎదుట ఉచ్చు ఉంచారు. వారి
ఉచ్చు (వల) నుండి నన్ను రక్షించుము. నీవే నా
క్షేమస్థానం.
5 యెహోవా, నీవే మేము నమ్ముకోదగిన దేవుడవు.
నా జీవితం నేను నీ చేతుల్లో పెడ్తున్నాను. నన్ను
రక్షించుము.
6 వ్యర్థమైన విగ్రహాలను పూజించే వాళ్లంటే నాకు
అసహ్యం. యెహోవాను మాత్రమే నేను నమ్ము
కొన్నాను.
7 దేవా, నీ దయ నన్ను ఎంతో సంతోషపెడ్తుంది.
నా కష్టాలు నీవు చూశావు. నాకు ఉన్న కష్టాలను
గూర్చి నీకు తెలుసు.
8 నీవు నన్ను నా శత్రువులకు అప్పగించవు. వారి
ఉచ్చుల నుండి నీవు నన్ను విడిపిస్తావు.
9 యెహోవా, నాకు చాలా కష్టాలున్నాయి. కనుక
నా మీద దయ ఉంచుము. నేను ఎంతో తల్లడిల్లి
పోయాను కనుక నా కళ్లు బాధగా ఉన్నాయి. నా
గొంతు, కడుపు నొప్పెడుతున్నాయి.
10 నా జీవితం దుఃఖంతో ముగిసిపోతూవుంది.
నిట్టూర్పులతో నా సంవత్సరాలు గతించిపోతు
న్నాయి. నా కష్టాలు నా బలాన్ని తొలగించి
వేస్తున్నయి. నా బలం తొలగిపోతుంది.*
11 నా శత్రువులు నన్ను ద్వేషిస్తారు. నా పొరుగు
వాళ్లంతా నన్ను కూడా ద్వేషిస్తారు . నా బంధువు
లంతా వీధిలో నన్ను చూచి భయపడతారు. వారు
నానుండి దూరంగా ఉంటారు.
12 నేను ఏదో పోయిన పనిముట్టులా ఉన్నాను. నేను
చనిపోయానేమో అన్నట్టు ప్రజలు నన్ను పూర్తిగా
మరచిపోయారు.

---

**గోతిలో** అనగా పాతాళ లోకం.

**నా … తొలగిపోతుంది** అక్షరాలా ఎముకలు క్షీణిస్తు న్నాయి.

13 ప్రజలు నన్ను గూర్చి చెప్పే దారుణ విషయాలు
నేను వింటున్నాను. ప్రజలు నాకు విరోధంగా
తిరిగారు. వాళ్లు నన్ను చంపాలని తలుస్తున్నారు.
14 యెహోవా, నేను నిన్ను నమ్ముకొన్నాను. నీవే
నా దేవుడవు.
15 నా ప్రాణం నీ చేతుల్లో ఉంది. నా శత్రువుల
నుండి నన్ను రక్షించుము. నన్ను తరుముతున్న
మనుష్యుల నుండి నన్ను రక్షించుము.
16 దేవా, నీ సేవకునికి దయతో స్వాగతం పలుకుము.
నన్ను రక్షించుము.
17 యెహోవా, నేను నిన్ను ప్రార్థించాను. కనుక
నేను నిరాశ చెందను. చెడ్డవాళ్లు నిరాశ చెందుతారు,
మౌనంగా వారు సమాధికి వెళ్తారు.
18 ఆ చెడ్డవాళ్లు గర్వించి, మంచి వాళ్లను గూర్చి
అబద్ధాలు చెబుతారు. ఆ చెడ్డవాళ్లు చాలా గర్వి
ష్ఠులు. కాని అబద్ధాలు చెప్పే వారి పెదవులు నిశ్శబ్దం
అవుతాయి.
19 దేవా, ఆశ్చర్యకరమైన అనేక సంగతులను నీవు నీ
అనుచరులకు మరుగు చేశావు. నిన్ను నమ్ముకొనే
వారికోసం నీవు ప్రతి ఒక్కరి ఎదుట మంచి
కార్యాలు చేస్తావు.
20 మంచివాళ్లకు హాని చేయటానికి చెడ్డవాళ్లు ఒక
టిగా గుమికూడుతారు. ఆ చెడ్డవాళ్లు కలహాలు
రేపటానికి చూస్తారు. కానీ ఆ మంచివాళ్లను నీవు
దాచిపెట్టి కాపాడతావు. మంచివాళ్లను నీవు నీ
ఆశ్రయంలో కాపా డుతావు.
21 యెహోవాను స్తుతించండి. పట్టణం శత్రువుల
చేత ముట్టడి వేయబడినప్పుడు ఆయన తన
అద్భుత ప్రేమను నాకు చూపించాడు. ఈ క్షేమ
స్థానంలో ఆయన తన ప్రేమను నాకు
చూపించాడు.
22 నేను భయపడి, “దేవుడు చూడగలిగిన స్థలంలో
నేను లేను” అన్నాను. కానీ దేవా, నేను నిన్ను
ప్రార్థించాను. మరియు సహాయం కోసం నేను
గట్టిగా చేసిన ప్రార్థనలు నీవు విన్నావు.
23 దేవుని వెంబడించు వారలారా, మీరు యెహో
వాను ప్రేమించాలి. యెహోవాకు నమ్మకంగా
ఉండే ప్రజలను ఆయన కాపాడుతాడు. కానీ తమ
శక్తిని బట్టి గొప్పలు చెప్పే గర్విష్ఠులను యెహోవా
శిక్షి స్తాడు.
24 యెహోవా సహాయం కొరకు నిరీక్షించే వారలారా
గట్టిగా, ధైర్యంగా ఉండండి.

## కీర్తన 32

*దావీదు కీర్తన.*

1 పాపాలు క్షమించబడిన వాడు ధన్యుడు. తన
పాపాలు తుడిచి వేయబడినవాడు ధన్యుడు.
2 అపరాధి అని యెహోవా చేత ప్రకటించబడని
వాడు ధన్యుడు. తన పాపాలను దాచిపెట్టేందుకు
ప్రయత్నించని వాడు ధన్యుడు.
3 దేవా నేను నీతో మరల మరల మాట్లాడాను. కానీ
నా రహస్య పాపాలను గూర్చి నేను చెప్పలేదు.
నేను ప్రార్థించిన ప్రతిసారీ నేను బలహీనుడను
మాత్రమే అయ్యాను.
4 దేవా, నీవు రాత్రింబవళ్లు నా జీవితాన్ని నాకు
మరింత కష్టతరమైనదిగా చేశావు. తీవ్రమైన
వేసవిలో బాగా ఎండిపోయిన భూమిలా నేను
తయారయ్యాను.
5 అయితే అప్పుడు నేను నా పాపాలన్నిటినీ
యెహోవా దగ్గర ఒప్పుకోవాలని నిర్ణయించు
కొన్నాను. కనుక యెహోవా, నా పాపాలను
గూర్చి నేను నీతో చెప్పుకొన్నాను. నా దోషాన్ని
ఏదీ నేను దాచిపెట్టలేదు. మరియు నీవు నా
పాపాలను క్షమించావు.
6 దేవా, ఈ కారణంచేత నీ అనుచరులు అందరూ
నీకు ప్రార్థించాలి. కష్టాలు మహా ప్రవాహంలా వచ్చి
నాసరే, నీ అనుచరులు నిన్ను ప్రార్థించాలి.
7 దేవా నేను దాగుకొనేందుకు నీవే ఆశ్రయం. నా
కష్టాల నుండి నీవే నన్ను విడిపించుము. నీవు
నన్ను ఆవరించి, కాపాడుము. నీవు నన్ను రక్షించిన
విధమును గూర్చి నేను పాటలు పాడతాను.
8 యెహోవా చెబుతున్నాడు, “నీవు పోవాల్సిన
మార్గం గూర్చి నేను నీకు నేర్పించి, నడిపిస్తాను.
నేను నిన్ను కాపాడుతాను, నీకు మార్గదర్శిగా
ఉంటాను.
9 కనుక గుర్రంలా, గాడిదలా తెలివి తక్కువగా ఉండ
కుము. ఆ జంతువులు కళ్లెంతోను, వారుతోను
నడిపించబడతాయి. నీవు కళ్లెంను వారు ఉప
యోగిస్తే గాని ఆ జంతువులు నీ దగ్గరకు రావు.”
10 చెడ్డవాళ్లకు ఎన్నో బాధలు కలుగుతాయి. కానీ
యెహోవాను నమ్ముకొనే వారిని ప్రేమ ఆవరి
స్తుంది.
11 మంచి మనుష్యులారా, యెహోవాయందు ఆనం
దించండి, బాగుగా సంతోషించండి. పవిత్ర హృద
యాలుగల మనుష్యులారా మీరంతా ఆనందిం
చండి.

## కీర్తన 33

1 మంచి మనుష్యులారా, యెహోవాయందు ఆనం
దించండి. నమ్మకమైన మంచి మనుష్యులారా,
ఆయనను స్తుతించండి.
2 సితారా వాయిస్తూ, యెహోవాను స్తుతించండి.
యెహోవాకు పదితంతుల స్వర మండలాన్ని
వాయించండి.

3 ఆయనకు ఒక కొత్త కీర్తన పాడండి. ఆనంద గీతాన్ని అందంగా పాడండి.
4 దేవుని మాట సత్యం! ఆయన చేసే ప్రతిదాని మీద నీవు ఆధారపడవచ్చును.
5 నీతి, న్యాయాలను దేవుడు ప్రేమిస్తాడు. యెహోవా భూమిని తన ప్రేమతో నింపాడు.
6 యెహోవా ఆజ్ఞ ఇవ్వగానే లోకం సృష్టించబడింది. భూమి మీద ఉన్న సమస్తాన్నీ దేవుని నోటి నుండి వచ్చే శ్వాస సృజించింది.
7 సముద్రంలోని నీరు అంతటినీ దేవుడు ఒక్కచోట రాశిగా కూర్చాడు. మహా సముద్రాన్ని దాని స్థానంలో ఆయనే ఉంచాడు.
8 భూమి మీద ప్రతి మనిషీ యెహోవాకు భయపడి ఆయనను గౌరవించాలి. ఈ లోకంలో జీవించే మనుష్యులందరూ ఆయనకు భయపడాలి.
9 ఎందుకంటే దేవుడు ఆదేశించిన తక్షణం దాని ప్రకారం నెరవేరుతుంది. ఏదైనా “నిలిచిపోవాలని” ఆయన ఆజ్ఞ ఇస్తే అప్పుడు అది ఆగిపోతుంది.
10 జనసమూహాల పథకాలను పనికిమాలినవిగా యెహోవా చేయగలడు. వారి తలంపులన్నింటినీ ఆయన నాశనం చేయగలడు.
11 అయితే యెహోవా సలహా శాశ్వతంగా మంచిది. ఆయన తలంపులు తర తరాలకు మంచివి.
12 యెహోవా ఎవరికి దేవుడుగా ఉంటాడో ఆ ప్రజలు ధన్యులు. దేవుడే వారిని తన స్వంత ప్రజలుగా ఏర్పాటు చేసుకొన్నాడు.
13 యెహోవా పరలోకం నుండి కిందికి చూసాడు. మనుష్యులందరిని ఆయన చూశాడు.
14 భూమి మీద నివసిస్తున్న మనుష్యులందరినీ ఆయన తన ఉన్నత సింహాసనం నుండి చూశాడు.
15 ప్రతి మనిషి మనస్సునూ దేవుడు సృష్టించాడు. ప్రతి మనిషి ఏమి చేస్తున్నాడో అది ఆయన గ్రహిస్తాడు.
16 ఒక రాజు తన స్వంత గొప్ప శక్తితో రక్షించ బడడు. ఒక సైనికుడు తన స్వంత గొప్ప బలంతో రక్షించబడడు.
17 యుద్ధంలో గుర్రాలు నిజంగా విజయం తెచ్చి పెట్టవు. తప్పించుకొనేందుకు వాటి బలం నిజంగా నీకు సహాయపడదు.
18 యెహోవాను అనుసరించే మనుష్యులను ఆయన కాపాడుతాడు, ఆయన నిజమైన ప్రేమయందు నిరీక్షణయుంచు వారిని జాగ్రత్తగా చూస్తాడు. ఆయన మహా ప్రేమ, ఆయనను ఆరాధించే వారిని కాపాడుతుంది.
19 ఆ మనుష్యులను మరణం నుండి రక్షించేవాడు దేవుడే. ఆ మనుష్యులు ఆకలిగా ఉన్నప్పుడు ఆయన వారికి బలాన్ని యిస్తాడు.
20 అందుచేత మనం యెహోవా కోసం కనిపెట్టు కుందాము. ఆయన మనకి సహాయం, మన డాలు.
21 దేవుడు నన్ను సంతోషపరుస్తాడు. నేను నిజంగా ఆయన పవిత్ర నామాన్ని నమ్ముకొంటాను.
22 యెహోవా, మేము నిజంగా నిన్ను ఆరాధిస్తు న్నాము. కనుక నీ గొప్ప ప్రేమ మాకు చూపించుము.

## కీర్తన 34

**దావీదు కీర్తన. అబీమెలెకు తనని పంపించి వేయాలని దావీదు వెర్రివానిలా నటించినప్పటిది అలా చేసి దావీదు అతన్ని విడిచిపెట్టాడు.**

1 నేను యెహోవాను ఎల్లప్పుడూ స్తుతిస్తాను. ఆయన స్తుతి ఎల్లప్పుడూ నా పెదాల మీద ఉంటుంది.
2 దీన జనులారా, విని సంతోషించండి నా ఆత్మ యెహోవాను గూర్చి ఘనంగా కీర్తిస్తుంది.
3 యెహోవా మహాత్మ్యం గూర్చి నాతో పాటు చెప్పండి. మనం ఆయన నామాన్ని కీర్తిద్దాం.
4 సహాయం కోసం నేను దేవుణ్ణి ఆశ్రయించాను. ఆయన విన్నాడు. నేను భయపడే వాటన్నింటి నుండి ఆయన నన్ను రక్షించాడు.
5 సహాయం కోసం దేవుని తట్టు చూడండి. మీరు స్వీకరించబడుతారు. సిగ్గుపడవద్దు.
6 ఈ దీనుడు సహాయంకోసం యెహోవాను వేడు కొన్నాడు. యెహోవా నా మొర విన్నాడు. నా కష్టాలన్నింటినుండి ఆయన నన్ను రక్షించాడు.
7 యెహోవాను వెంబడించే ప్రజల చుట్టూ ఆయన దూత కావలివుంటాడు. ఆ ప్రజలను యెహోవా దూత కాపాడి, వారికి బలాన్ని ఇస్తాడు.
8 యెహోవా ఎంత మంచివాడో రుచిచూచి తెలుసు కోండి. యెహోవా మీద ఆధారపడే వ్యక్తి ధన్యుడు.
9 యెహోవా పవిత్ర జనులు ఆయనను ఆరాధిం చాలి. ఆయన్ని అనుసరించే వారికి సురక్షిత స్థలం మరేదీలేదు.
10 యౌవనసింహాలు* బలహీనమై, ఆకలిగొంటాయి. అయితే సహాయం కోసం దేవుని ఆశ్రయించే వారికి ప్రతి మేలు కలుగుతుంది. మంచిదేదీ కొరత గావుండదు.
11 పిల్లలారా, నా మాట వినండి. యెహోవాను ఎలా సేవించాలో నేను నేర్పిస్తాను.
12 ఒక వ్యక్తి జీవితాన్ని ప్రేమిస్తోంటే, ఒక వ్యక్తి మంచి దీర్ఘకాల జీవితం జీవించాలనుకొంటే

**యౌవనసింహాలు** ‘యౌవన సింహాలవలె బలమైనవారు’ అని అర్థము.

13 అప్పుడు ఆ వ్యక్తి చెడ్డ మాటలు మాట్లాడకూడదు, ఆ వ్యక్తి అబద్ధాలు పలుకకూడదు,
14 చెడ్డ పనులు చేయటం చాలించండి. మంచి పనులు చేయండి. శాంతికోసం పని చేయండి. మీకు దొరికేంతవరకు శాంతికోసం వెంటాడండి.
15 మంచి మనుష్యులను యెహోవా కాపాడుతాడు. ఆయన వారి ప్రార్థనలు వింటాడు.
16 కానీ చెడు కార్యాలు చేసే వారికి యెహోవా విరోధంగా ఉంటాడు. ఆయన వారిని పూర్తిగా నాశనం చేస్తాడు.
17 ప్రార్థించండి, యెహోవా మీ ప్రార్థన వింటాడు. ఆయన మిమ్మల్ని మీ కష్టాలన్నింటి నుండీ రక్షిస్తాడు.
18 గర్విష్ఠులు కాని మనుష్యులకు యెహోవా సమీపంగా ఉంటాడు. ఆత్మలో అణగిపోయిన మనుష్యులను ఆయన రక్షిస్తాడు.
19 మంచి మనుష్యులకు అనేక సమస్యలు ఉండవచ్చు. కానీ ఆ మంచి మనుష్యులను వారి ప్రతి కష్టం నుండి యెహోవా రక్షిస్తాడు.
20 వారి ఎముకలన్నింటినీ యెహోవా కాపాడుతాడు. ఒక్క ఎముక కూడా విరువబడదు.
21 అయితే దుష్టులను కష్టాలు చంపేస్తాయి. చెడ్డ వాళ్లు మంచి మనుష్యులను ద్వేషిస్తారు. కానీ ఆ చెడ్డ వాళ్లు నాశనం చేయబడతారు.
22 యెహోవా తన సేవకులలో ప్రతిఒక్కరి ఆత్మనూ రక్షిస్తాడు. తన మీద ఆధారపడే ప్రజలను నాశనం కానీయడు.

## కీర్తన 35

***దావీదు కీర్తన.***

1 యెహోవా, నా పోరాటాలు పోరాడుము నా యుద్ధాలు పోరాడుము.
2 యెహోవా, కేడెము, డాలు పట్టుకొని, లేచి, నాకు సహాయం చేయుము.
3 ఈటె, బరిసె తీసుకొని నన్ను తరుముతున్న వారితో పోరాడుము. "నేను నిన్ను రక్షిస్తాను" అని, యెహోవా, నా ఆత్మతో చెప్పుము,
4 కొందరు మనుష్యులు నన్ను చంపాలని చూస్తున్నారు. ఆ ప్రజలు నిరాశచెంది, సిగ్గుపడేలా చేయుము. వారు మళ్లుకొని పారిపోయేట్టు చేయుము. ఆ మనుష్యులు నాకు హాని చేయాలని తలస్తున్నారు. వారిని ఇబ్బంది పెట్టుము.
5 ఆ మనుష్యుల్ని గాలికి ఎగిరిపోయే పొట్టులా చేయుము. యెహోవా దూత వారిని తరిమేలా చేయుము.
6 యెహోవా, వారి మార్గం చీకటిగాను, జారిపోయేటట్టు చేయుము. యెహోవా దూత వారిని తరుమును గాక!
7 నేనేమీ తప్పు చేయలేదు. కానీ ఆ మనుష్యులు నన్ను ఉచ్చులో వేసి చంపాలని ప్రయత్నించారు. నేను తప్పు ఏమీ చేయలేదు. కానీ వారు నన్ను పట్టు కోవాలని ప్రయత్నించారు.
8 కనుక యెహోవా, ఆ మనుష్యులను వారి ఉచ్చులలోనే పడనిమ్ము. వారి సొంత ఉచ్చులలో వారినే తొట్రిల్లి పడనిమ్ము. తెలియని ఆపద ఏదైనా వారిని పట్టుకోనిమ్ము.
9 అంతట నేను యెహోవాయందు ఆనందిస్తాను. ఆయన నన్ను రక్షించినప్పుడు నేను సంతోషంగా ఉంటాను.
10 "యెహోవా, నీ వంటివాడు ఒక్కడూ లేడు. యెహోవా, బలవంతుల నుండి పేదవారిని నీవు రక్షిస్తావు. దోచుకొను వారి నుండి నిస్సహాయులను పేదవారిని నీవు రక్షిస్తావు" అని నా పూర్ణ వ్యక్తిత్వంతో నేను చెబుతాను.
11 ఒక సాక్షి సమూహం నాకు హాని చేయాలని తలుస్తున్నది. ఆ మనుష్యులు నన్ను ప్రశ్నలు అడుగుతారు. వాళ్లు దేనిని గూర్చి మాట్లాడుకొంటున్నారో నాకు తెలియదు.
12 నేను మంచి పనులు మాత్రమే చేశాను. కానీ ఆ మనుష్యులు నాకు చెడ్డ వాటినే చేస్తారు. వారు నా ప్రాణం తీయుటకు పొంచియుంటారు.
13 ఆ మనుష్యులు రోగులుగా ఉన్నప్పుడు నేను వారిని గూర్చి విచారించాను. ఉపవాసం ఉండుట ద్వారా నా విచారం వ్యక్తం చేశాను. నా ప్రార్థనకు జవాబు లేకుండా పోయింది.
14 ఆ మనుష్యుల కోసం విచార సూచక వస్త్రాలు నేను ధరించాను. ఆ మనుష్యులను నా స్నేహితులుగా, లేక నా సోదరులుగా నేను భావించాను. ఒకని తల్లి చనిపోయినందుకు ఏడుస్తున్న మనిషిలా నేను దుఃఖించాను. ఆ మనుష్యులకు నా విచారాన్ని తెలియజేసేందుకు నేను నల్లని వస్త్రాలు ధరించాను. దుఃఖంతో నేను నా తల వంచుకొని నడిచాను.
15 అయితే నేను ఒక తప్పు చేసినప్పుడు ఆ మనుష్యులే నన్ను చూసి నవ్వారు. ఆ మనుష్యులు నిజంగా స్నేహితులు కారు. వాళ్లు నా చుట్టూరా చేరి, నా మీద పడ్డారు. వాళ్లను నేను కనీసం ఎరుగను.
16 వాళ్లు దుర్భాషలు మాట్లాడి, నన్ను హేళన చేసారు. ఆ మనుష్యులు పళ్లు కొరికి నా మీద కోపం చూపారు.
17 నా ప్రభువా, ఎన్నాళ్లు ఇలా చెడు కార్యాలు జరుగుతూండటం చూస్తూ ఉంటావు? ఆ మనుష్యులు నన్ను నాశనం చేయాలని చూస్తున్నారు. యెహోవా, నా ప్రాణాన్ని రక్షించుము. ఆ

దుర్మార్గుల బారి నుండి నా ప్రియ జీవితాన్ని
రక్షించుము. వాళ్లు సింహాల్లా ఉన్నారు.
18 యెహోవా, మహా సమాజంలో నేను నిన్ను
స్తుతిస్తాను. నేను పెద్ద సమూహంతో ఉన్నప్పుడు
నిన్ను స్తుతిస్తాను.
19 అబద్ధాలు పలికే నా శత్రువులు నవ్వుకోవటం
కొనసాగదు. నా శత్రువులు వారి రహస్య పథకాల
నిమిత్తం తప్పక శిక్షించబడతారు.
20 నా శత్రువులు నిజంగా శాంతికోసం ప్రయత్నాలు
చేయటంలేదు. ఈ దేశంలో శాంతియుతంగా ఉన్న
ప్రజలే చెడు కార్యాలు చేయాలని వారు రహస్యంగా
పథకాలు వేస్తున్నారు.
21 నన్ను గూర్చి నా శత్రువులు చెడు విషయాలు
చెబుతున్నారు. వారు అబద్ధాలు పలుకుతూ,
"ఆహా, నీ వేమీ చేస్తున్నావో మాకు తెలుసులే
అంటారు."
22 యెహోవా జరుగుతున్నది ఏమిటో నీకు తప్పక
తెలుసు. కనుక మౌనంగా ఉండవద్దు. నన్ను విడిచి
పెట్టవద్దు.
23 యెహోవా మేలుకో! లెమ్ము! నా దేవా, నా
యెహోవా నా పక్షంగా పోరాడి నాకు న్యాయం
చేకూర్చుము.
24 యెహోవా, నా దేవా, నీ న్యాయంతో నాకు
తీర్పు తీర్చుము. ఆ మనుష్యలను నన్ను చూచి
నవ్వ నీయవద్దు.
25 "ఆహా! మాకు కావాల్సింది మాకు దొరికి పోయింది"
అని ప్రజలు చెప్పుకోకుండా చేయుము.
"యెహోవా, మేము అతణ్ణి నాశనం చేశాము"
అని వాళ్లు చెప్పుకోకుండా చేయుము.
26 నా శత్రువులు అందరూ నిరాశచెంది, ఒక్కుమ్మ
డిగా సిగ్గుపడేలా చేయుము. నాకు కీడు జరిగి
నప్పుడు ఆ మనుష్యులు సంతోషించారు. తాము
నాకంటె మేలైనవారము అని వారు తలచారు.
కనుక ఆ మనుష్యుల్ని అవమానంతోను సిగ్గుతోను
నింపి వేయుము.
27 నీతిని ప్రేమించే మనుష్యులారా మీరు సంతోషిం
చండి. ఎల్లప్పుడూ ఈ మాటలు చెప్పండి:
"యెహోవా గొప్పవాడు. ఆయన తన సేవకునికి
ఉత్తమమైనదాన్ని కోరుతాడు."
28 యెహోవా, నీవు ఎంత మంచివాడివో ప్రజలకు
చెబుతాను. నేను ప్రతి దినము స్తుతిస్తాను.

## కీర్తన 36

***సంగీత నాయకునికి యెహోవా సేవకుడైన దావీదు కీర్తన.***

1 "నేను దేవునికి భయపడను, గౌరవించను" అని
దుర్మార్గుడు తనలో తాను చెప్పుకొన్నప్పుడు
అతడు చాలా చెడ్డ పని చేస్తున్నాడు.
2 ఆ మనిషి తనకు తానే అబద్ధం చెప్పుకొంటు
న్నాడు. ఆ మనిషి తన సొంత తప్పులను చూడడు.
కనుక అతడు క్షమాపణ వేడుకోడు.
3 అతని మాటలు కేవలం పనికిమాలిన అబద్ధాలే.
అతడు తెలివిగలవాడు కాజాలడు, మేలు చేయడం
నేర్చుకోలేడు.
4 రాత్రిపూట, అతడు పనికిమాలిన సంగతులు తలు
స్తూంటాడు. అతడు మేల్కొన్నప్పుడు, ఏ మేలూ
చేయడు. ఏ చెడు కార్యం చేయటానికైనా అతడు
నిరాకరించడు.
5 యెహోవా, నీ నిజమైన ప్రేమ ఆకాశాల కంటె
ఉన్నతమైనది. నీ నమ్మకత్వం మేఘాలకంటె
ఉన్నతం.
6 యెహోవా, నీ నీతి "దేవతల పర్వతాల కంటె
ఉన్నతమైనది." నీ న్యాయం లోతైన మహా
సముద్రం కంటే లోతైనది. యెహోవా, నీవు
మానవుని, జంతువులను కాపాడుతావు.
7 ప్రేమగల నీ దయకంటె ఎక్కువ ప్రశస్తమైనది
ఇంకేది లేదు. కాపుదల కోసం మనుష్యులు, దేవ
దూతలు నీ దగ్గరకు వస్తారు.
8 యెహోవా, నీ ఇంటిలోని సమృద్ధియైన ఆహారం
నుండి వారు నూతన బలం పొందుతారు. అద్భుత
మైన నీ నదిలోనుండి నీవు వారిని తాగనిస్తావు.
9 యెహోవా, జీవపు ఊట నీ నుండి ప్రవహిస్తుంది.
నీ వెలుగు మమ్మల్ని వెలుగు చూడనిస్తుంది.
10 యెహోవా, వాస్తవంగా నిన్ను ఎరిగిన వారిని
ప్రేమించటం కొనసాగించుము. నీకు నమ్మకంగా
వుండే ప్రజలకు నీ మేలు కలుగనిమ్ము
11 యెహోవా, గర్విష్ఠుల మూలంగా నన్ను పట్టు
బడనివ్వకుము. దుర్మార్గుల చేత తరుమబడనియ్య
కుము.
12 వారి సమాధుల మీద ఈ మాటలు చెక్కుము.
"ఇక్కడే దుర్మార్గులు పడిపోయారు. వారు చితుక
గొట్టబడ్డారు. వారు మళ్లీ ఎన్నటికీ లేచి
నిలబడరు."

## కీర్తన 37

***దావీదు కీర్తన.***

1 దుర్మార్గుల పట్ల కోపగించకుము చెడు పనులు
చేసేవారి పట్ల అసూయచెందకు.
2 గడ్డి, పచ్చటి మొక్కలు త్వరలోనే వాడిపోయి
చస్తాయి. దుర్మార్గులు సరిగ్గా అలానే ఉంటారు.
3 నీవు యెహోవా యందు నమ్మకం ఉంచి, మంచి
పనులు చేస్తే నీవు బతికి, దేశం ఇచ్చే అనేక వస్తు
వులను అనుభవిస్తావు.
4 యెహోవాను సేవించటంలో ఆనందించుము.
ఆయన నీకు కావల్సిన వాటినియిస్తాడు.

5 యెహోవా మీద ఆధారపడుము. ఆయనను
నమ్ముకొనుము. జరగాల్సినదాన్ని ఆయన
జరిగిస్తాడు.
6 నీ మంచితనం, న్యాయం మధ్యాహ్నపు సూర్యు
నిలా ప్రకాశింపనిమ్ము.
7 యెహోవాను నమ్ముకోనుము. ఆయన
సహాయం కోసం కనిపెట్టుము. చెడ్డవాళ్లు జయించి
నప్పుడు కలవరపడకుము. చెడ్డవాళ్లు చెడు తలం
పులు తలచగా వారి తలంపులు జయించినప్పుడు
కలవర పడకుము.
8 కోపగించ వద్దు, ఆవేశపడవద్దు, నీవు కూడ కీడు
చెయ్యాలి అనిపిస్తే అంతగా తొందరపడిపోకుము.
9 ఎందుకంటే దుర్మార్గులు నాశనం చేయబడతారు.
కానీ సహాయం కోసం యెహోవాను వేడుకొనే
వారికి దేశం సొంతమవుతుంది.
10 కొద్ది కాలానికి ఇక దుర్మార్గులు ఉండరు. అలాంటి
మనుష్యుల కోసం నీవు చూడవచ్చు. కాని వాళ్లు
కనబడరు.
11 దీనులు భూమిని జయిస్తారు, వాళ్లు శాంతిని అనుభ
విస్తారు.
12 దుర్మార్గులు మంచి వాళ్లకు విరోధంగా కీడు చేయా
లని తలుస్తారు. ఆ దుర్మార్గులు మంచి మను
ష్యుల మీద పండ్లు కొరికి, తమ కోపం వ్యక్తం
చేస్తారు.
13 అయితే మన ప్రభువు ఆ దుర్మార్గులను చూచి
నవ్వుతాడు, వారికి సంభవించే సంగతులను
ఆయన చూస్తాడు.
14 దుర్మార్గులు వారి ఖడ్గాలు తీసుకొంటారు, విల్లు
ఎక్కుపెడ్తారు. పేదలను, నిస్సహాయులను వాళ్లు
చంపాలని చూస్తారు. మంచి వాళ్లను, నిజాయితీ
పరులను వాళ్లు చంపాలని చూస్తారు.
15 కానీ వారి విల్లులు విరిగిపోతాయి. వారి ఖడ్గాలు
వారి స్వంత గుండెల్లో గుచ్చుకు పోతాయి.
16 దుష్టుల ఐశ్వర్యంకంటే మంచివాని అల్పభాగమే
ఉత్తమమైనది.
17 ఎందుకంటే దుర్మార్గులు నాశనం చేయబడుతారు.
కానీ మంచివాళ్ల విషయమై యెహోవా శ్రద్ధ పుచ్చు
కొంటాడు.
18 పవిత్రమైన మనుష్యుల్ని వారి జీవితాంతం వరకూ
యెహోవా కాపాడుతాడు. వారి ప్రతిఫలం శాశ్వ
తంగా ఉంటుంది.
19 కష్టం వచ్చినప్పుడు మంచి మనుష్యులు నాశనం
చేయబడరు. కరువు కాలం వచ్చినప్పుడు మంచి
మనుష్యులకు భోజనం సమృద్ధిగా ఉంటుంది.
20 కానీ దుర్మార్గులు యెహోవాకు శత్రువులు, ఆ
దుర్మార్గులు నాశనం చేయబడుతారు. వారు పొలం
లోని పువ్వులవలె అదృశ్యమౌతారు. వారు పొగవలె
కనబడకుండా పోతారు.
21 దుర్మార్గుడు త్వరగా అప్పు చేస్తాడు. అతడు దాన్ని
మరల చెల్లించడు. కానీ మంచి మనిషి సంతో
షంతో ఇతరులకు ఇస్తాడు.
22 ఒకవేళ ఒక మంచి మనిషి ప్రజలను ఆశీర్వదిస్తే
అప్పుడు ఆ ప్రజలు దేవుడు వాగ్దానం చేసిన
భూమిని పొందుతారు. కానీ ప్రజలకు కీడు జర
గాలని గనుక అతడు అడిగితే అప్పుడు ఆ మను
ష్యులు నాశనం చేయబడతారు.
23 ఒక సైనికుడు జాగ్రత్తగా నడిచేందుకు యెహోవా
సహాయం చేస్తాడు. వాని నడవడియందు
యెహోవా ఆనందిస్తాడు.
24 సైనికుడు తొట్రుపడినా పడిపోడు, ఎందుకంటే
యెహోవా వాని చేయిపట్టుకొని పడిపోకుండా
చేస్తాడు.
25 నేను యువకునిగా ఉండేవాడ్ని, ఇప్పుడు ముసలి
వాడినయ్యాను. మంచి మనుష్యులకు దేవుడు
సహాయం చేయకుండా విడిచిపెట్టడం నేను
ఎన్నడూ చూడలేదు. మంచి మనుష్యుల పిల్లలు
భోజనం కోసం భిక్షం ఎత్తుకోవడం నేను ఎన్నడూ
చూడలేదు.
26 మంచి మనిషి ఇతరులకు ఎల్లప్పుడూ ఉచితం
గానే ఇస్తూంటాడు. మంచి మనిషి పిల్లలు ఆశీ
ర్వాదం పొందుతారు.
27 నీవు చెడు పనులు చేయటం మానివేసి మంచి
పనులు చేస్తే అప్పుడు నీవు శాశ్వతంగా జీవిస్తావు.
28 యెహోవా న్యాయాన్ని ప్రేమిస్తాడు. ఆయన తన
భక్తులకు సహాయం చేయకుండా విడిచిపెట్టడు.
యెహోవా తన భక్తులను ఎల్లప్పుడూ కాపాడ
తాడు. కానీ దుష్టులను ఆయన నాశనం చేస్తాడు.
29 మంచి మనుష్యులకు దేవుడు వాగ్దానం చేసిన
భూమి దొరుకుతుంది. వారు దానిమీద శాశ్వతంగా
నివసిస్తారు.
30 మంచి మనిషి మంచి సలహా యిస్తాడు. అతని
నిర్ణయాలు ప్రతి ఒక్కరికి న్యాయంగా ఉంటాయి.
31 యెహోవా ఉపదేశాలు మంచి మనిషి హృద
యంలో ఉంటాయి. అతడు సరిగా జీవించే
విధానాన్ని విడిచిపెట్టడు.
32 కానీ చెడ్డవాళ్లు, మంచివాళ్లను బాధించే మార్గా లను
వెదకుతారు. మరియు చెడ్డవాళ్లు మంచివాళ్లను
చంపటానికి ప్రయత్నిస్తారు.
33 యెహోవా దుష్టుల శక్తికి మంచి వారిని వదిలి
వేయడు. మంచి వారిని దోషులుగా ఆయన తీర్చ
బడనీయడు.
34 యెహోవా సహాయం కోసం కనిపెట్టుము.
యెహోవాను అనుసరించుము. దుర్మార్గులు

నాశనం చేయబడతారు. కాని యెహోవా నిన్ను
ప్రముఖునిగా చేస్తాడు, మరియు దేవుడు వాగ్దానం
చేసిన భూమిని నీవు పొందుతావు.
35 శక్తిమంతులైన దుర్మార్గులను నేను చూశాను. వారి
శక్తి ఒక బలమైన, ఆరోగ్యమైన వృక్షంలా పెరు
గుతూ వచ్చింది.
36 కానీ తర్వాత వారు లేకుండా పోయారు. నేను
వారికోసం చూశాను, కానీ వారు నాకు కనబడలేదు.
37 నీతి, నిజాయితీ కలిగి ఉండి, సమాధానపరచు
వారి సంతతి నిలుస్తుంది. అది శాంతి కలిగిస్తుంది.
38 అయితే చట్టాన్ని ఉల్లంఘించే వారందరు నాశనం
చేయబడతారు.
39 నీతిమంతులను యెహోవా రక్షిస్తాడు. నీతిమంతు
లకు కష్టాలు వచ్చినప్పుడు యెహోవా వారికి
బలంగా ఉంటాడు.
40 నీతిమంతులకు యెహోవా సహాయం చేస్తాడు.
వారిని రక్షిస్తాడు. నీతిమంతులు సహాయంకోసం
యెహోవా దగ్గరకు వస్తారు, మరియు యెహోవా
దుర్మార్గుల నుండి వారిని రక్షిస్తాడు.

## కీర్తన 38

*జ్ఞాపకార్థ దినం* కోసం. దావీదు కీర్తన.*

1 యెహోవా, నీవు నన్ను విమర్శించేటప్పుడు కోప
గించకు నీవు నన్ను సరిదిద్దేటప్పుడు కోప
గించకుము.
2 యెహోవా, నీవు నన్ను బాధించావు. నీ బాణాలు
లోతుగా నాలో గుచ్చుకొన్నాయి.
3 నీవు నన్ను శిక్షించావు. నా శరీరం అంతా బాధగా
ఉంది. నేను పాపం చేశాను, నీవు నన్ను శిక్షించావు.
అందుచేత నా ఎముకలన్నీ బాధగా ఉన్నాయి.
4 నేను చెడు కార్యాలు చేసిన దోషిని, ఆ దోషం
నా భుజాలమీద పెద్ద బరువుగా ఉంది.
5 నేను తెలివి తక్కువగా ఉన్నాను. ఇప్పుడు నాకు
అవి కంపుకొడ్తున్న పుండ్లు అయ్యాయి.
6 నేను దుఃఖించేవానిలా రోజంతా విచారంగా
ఉన్నాను. రోజంతా నేను కృంగిపోయి ఉన్నాను.
7 నా నడుము వేడిగా కాలిపోతోంది. నా శరీరం
అంతా బాధగా ఉంది.
8 నేను పూర్తిగా బలహీనంగా ఉన్నాను. నేను బాధతో
ఉన్నాను గనుక నేను మూలుగుతున్నాను.
9 ప్రభువా, నీవు నా మూలుగు విన్నావు. నా నిట్టూ
ర్పులు నీకు మరుగు కాలేదు.
10 నా గుండె తడబడచున్నది. నా బలం పోయింది.
నా చూపు దాదాపు పోయింది.
11 నా రోగం మూలంగా నా స్నేహితులు, నా
పొరుగువారు నన్ను చూసేందుకు రావటం లేదు.
నా కుటుంబం నా దగ్గరకు రాదు.
12 నన్ను చంపగోరేవారు తమ ఉచ్చులను వేసియు
న్నారు. నాకు హాని చేయగోరేవారు నా నాశనం
గూర్చి మాట్లాడు కొంటున్నారు. వారు రోజంతా
అబద్ధాలు చెప్తున్నారు.
13 అయితే నేను వినబడని చెవిటి వానిలా ఉన్నాను.
మాట్లాడలేని మూగవానిలా నేను ఉన్నాను.
14 ఒకని గూర్చి మనుష్యులు చెప్పే మాటలు వినలేని
చెవిటి వానిలా నేను ఉన్నాను. నేను వాదించి, నా
శత్రువులదే తప్పు అని రుజువు చేయలేను.
15 కనుక యెహోవా, నీవు నన్ను కాపాడాలని వేచి
యుంటాను. నా దేవా, నా ప్రభువా నా శత్రువులకు
సత్యం చెప్పుము.
16 నన్ను చూచి వారిని నవ్వనియ్యవద్దు. నేను తొట్రు
పడినప్పుడు వారిని గర్వపడనియ్యవద్దు.
17 నేను పడిపోయేటట్టు ఉన్నాను. నేను నా బాధను
మరచిపోలేను.
18 యెహోవా, నేను చేసిన చెడు కార్యాలను గూర్చి,
నేను నీకు చెప్పాను. నా పాపాలను గూర్చి నేను
విచారిస్తున్నాను.
19 నా శత్రువులు ఇంకా ఆరోగ్యంగా జీవిస్తూ ఉన్నారు,
వారు ఎన్నెన్నో అబద్ధాలు చెప్పారు.
20 నా శత్రువులు నాకు కీడు చేస్తారు, నేను వారికి
మంచి పనులు మాత్రమే చేశాను. మంచి పనులు
చేయటానికి మాత్రమే నేను ప్రయత్నించాను.
కానీ ఆ మనుష్యులు నాకు విరోధం అయ్యారు.
21 యెహోవా, నన్ను విడిచిపెట్టకు. నా దేవా, నాకు
సన్నిహితంగా ఉండు.
22 త్వరగా వచ్చి నాకు సహాయం చేయుము. నా
దేవా నన్ను రక్షించుము.

## కీర్తన 39

*సంగీత నాయకునికి. యెదూతూనునకు..*
*దావీదు కీర్తన.*

1 "నేను జాగ్రత్తగా నడచుకొంటాను. నా నాలుకతో
నన్ను పాపం చేయనివ్వను" అని నేను అన్నాను.
2 నేను దుర్మార్గులకు సమీపంగా ఉన్నప్పుడు నేను
నా నోరు మూసుకొంటాను.* మాట్లాడుటకు
నేను తిరస్కరించాను. నేనేమి చెప్పలేదు. కానీ
నేను నిజంగా తల్లడిల్లిపోయాను.
3 నాకు కోపం వచ్చింది. దీని విషయం నేను
తలంచిన కొలది నాకు మరింత కోపం వచ్చింది.
కనుక నేను ఏదో అన్నాను.

---

**జ్ఞాపకార్థ దినం** ప్రాచీన గ్రీకు అనువాదమందు "సబ్బాతు
దినం" అని వ్రాయబడి ఉంది.

**నా నోరు మూసుకొంటాను** అక్షరాల నా నోటికి కళ్ళెం
పెట్టుకుంటాను.

4 యెహోవా, నాకు ఏమి జరుగుతుందో చెప్పుము.
నేను ఎన్నాళ్లు జీవిస్తానో నాకు చెప్పుము. నిజానికి
నా జీవితం ఎంత కొద్దిపాటిదో నాకు చెప్పుము.
5 యెహోవా, నీవు నాకు కొద్దికాలం జీవితం
మాత్రమే ఇచ్చావు. నా జీవితం నీ ఎదుట శూన్యం.
ప్రతి మనిషి యొక్క జీవితం ఒక మేఘంలాంటిది
మాత్రమే. ఏ మనిషి శాశ్వతంగా జీవించడు.
6 మేము జీవించే జీవితం తేద్దం లోని ప్రతిబింబం
వంటిది. మా ప్రయాసలన్నియు వ్యర్థము. మేము
సామగ్రి సమకూర్చుకొంటూనే ఉంటాము. కానీ
ఆ సామగ్రి ఎవరికి దొరుకుతుందో మాకు
తెలియదు.
7 కనుక ప్రభూ, నాకు ఏమి ఆశ ఉంది? నీవే నా
ఆశ.
8 యెహోవా, నేను చేసిన చెడు కార్యాలనుండి
నీవు నన్ను రక్షిస్తావు. దేవునియందు నమ్మకము
లేనివానిలా, వెర్రివాడిలా నన్ను యితరులు చూడ
కుండా నీవు చేస్తావు.
9 నేను నా నోరు తెరవను. నేను ఏమీ చెప్పను.
యెహోవా, నీవు చేయవలసింది చేశావు.
10 దేవా, నన్ను శిక్షించటం మానివేయుము. నీ శిక్షవల్ల
నేను అలసిపోయాను.
11 యెహోవా, తప్పు చేసిన వారిని నీవు శిక్షించుము.
ప్రజలు జీవించాల్సిన సరైన విధానాన్ని నీవు అలా
నేర్పిస్తావు. వారికి ప్రియమైన దాన్ని చిమ్మటవలె
నీవు నాశనం చేస్తావు. మా జీవితాలు అంతలోనే
మాయమయ్యే మేఘంలా ఉన్నాయి.
12 యెహోవా, నా ప్రార్థన ఆలకించుము. నేను నీకు
మొరపెట్టే మాటలు వినుము. నా కన్నీళ్లు తెలి
యనట్లు ఉండవద్దు. నేను దాటిపోతున్న ఒక
అతిథిని. నా పూర్వీకులందరిలాగే నేను కూడా
ఒక బాటసారిని.
13 యెహోవా, నా వైపు చూడకుము. నేను చనిపోక
ముందు నన్ను సంతోషంగా ఉండనిమ్ము. కొంచెం
కాలంలో నేను ఉండకుండా పోతాను.

## కీర్తన 40

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 నేను సహనంగా యెహోవా కోసం వేచియు
న్నాను. ఆయన తన చెవి నిచ్చి, నా మొర ఆలకిం
చెను. నా వైపుకు ఒంగియున్నాడు. ఆయన నా
మొరలు విన్నాడు.
2 నాశనపు గుంటలోనుండి యెహోవా నన్ను పైకి
లేపాడు. ఆ బురద గుంటలో నుండి ఆయన
పైకి లేపాడు. ఆయన నన్ను పైకి లేపి, ఒక బండ
మీద నన్ను ఉంచాడు. ఆయన నా పాదాలను
స్థిరపరచాడు.
3 ఒక కొత్త కీర్తనను, నాకొక స్తుతి కీర్తనను
యెహోవా నా నోట ఉంచాడు. నాకు జరిగిన
విషయాలను అనేకమంది చూస్తారు. వారు దేవుని
ఆరాధిస్తారు. వారు యెహోవాను నమ్ము
కొంటారు.
4 ఒక మనిషి యెహోవాను నమ్ముకొంటే ఆ మనిషి
నిజంగా సంతోషంగా ఉంటాడు. ఒక మనిషి
సహాయం కోసం దయ్యాల తట్టు మరియు
తప్పుడు దేవుళ్ళ తట్టు, విగ్రహాల తట్టు, తిరుగ
కుండా ఉంటే ఆ మనిషి నిజంగా సంతోషంగా
ఉంటాడు.
5 యెహోవా, మా దేవా, నీవు ఎన్నో అద్భుత
కార్యాలు చేశావు. మాకోసం నీ వద్ద అద్భుత
పథకాలు ఉన్నాయి. యెహోవా, నీవలె ఎవడూ
లేడు. నీవు చేసిన పనులను గూర్చి నేను మరల
మరల చెబుతాను. నేను లెక్కించగలిగిన వాటికంటే
ఎక్కువ విషయాలున్నాయి.
6 యెహోవా, నీవు నాకు ఈ గ్రహింపు కలిగించావు.
బలులు, ధాన్యార్పణలు నిజంగా నీవు కోరలేదు.
దహన బలులు, పాపపరిహారార్థపు బలులు నిజంగా
నీవు కోరలేదు.
7 అందుచేత నేను అన్నాను, "ఇదిగో, నేను
వస్తున్నాను. నన్ను గూర్చి గ్రంథంలో ఈలాగు
వ్రాయబడింది.
8 నా దేవా, నీవు కోరినట్టే నేను చేయగోరుతున్నాను.
నీ ఉపదేశాలు నా హృదయంలో ఉన్నాయి.
9 మంచితనాన్ని గూర్చిన శుభవార్త మహా సమాజానికి
నేను చెబుతాను. యెహోవా, నేను నా నోరు
మూసికొని ఉండనని నీకు తెలుసు.
10 యెహోవా, నీవు చేసిన మంచి కార్యాలను గూర్చి
నేను చెబుతాను. ఆ మంచి కార్యాలను నా హృద
యంలోనే రహస్యంగా ఉంచుకోను. యెహోవా,
ప్రజల ఎడల నీవు ఎలా వాస్తవంగాను, నమ్మకం
గాను ఉన్నావో అది నేను చెబుతాను. నీవు ప్రజల్ని
ఎలా రక్షిస్తావో అది చెబుతాను. నీ దయ, నమ్మక
త్వాన్ని గూర్చి సమాజంలోని మనుష్యులకు నేను
దాచిపెట్టను.
11 కనుక యెహోవా, నీ కనికరం నాకు మరుగు
చేయవద్దు. నీ దయ, కనికరం ఎల్లప్పుడూ నన్ను
కాపాడనిమ్ము."
12 దుష్టులు నన్ను చుట్టుముట్టారు. లెక్కించాలంటే
వారు చాలా మంది ఉన్నారు. నా పాపాలు నన్ను
పట్టుకొన్నాయి. నేను వాటిని తప్పించుకో లేను.
నా తలమీది వెంట్రుకల కంటె నా పాపాలు ఎక్కు
వగా ఉన్నాయి. నేను ధైర్యాన్ని కోల్పోయాను.
13 యెహోవా, నా దగ్గరకు పరుగెత్తి వచ్చి నన్ను
రక్షించుము. త్వరగా వచ్చి నాకు సహాయం
చేయుము.

14 ఆ దుర్మార్గులు నన్ను చంపాలని చూస్తున్నారు.
యెహోవా, ఆ మనుష్యులు సిగ్గుపడి, నిరాశ చెందే
టట్టుగా చేయుము. ఆ మనుష్యులు నాకు హాని
చేయాలని కోరుతున్నారు. వాళ్లను సిగ్గుతో పారిపో
నిమ్ము.
15 ఆ చెడ్డ మనుష్యులు నన్ను ఎగతాళి చేస్తారు.
వాళ్లు మాట్లాడలేనంతగా వారిని ఇబ్బంది పడ
నిమ్ము.
16 కానీ నీకోసం చూచే మనుష్యుల్ని సంతోషంగా
ఉండనిమ్ము. "యెహోవాను స్తుతించుము." అని
ఆ మనుష్యుల్ని ఎల్లప్పుడూ చెప్పనిమ్ము. నీ చేత
రక్షించబడటం ఆ మనుష్యులకు ఎంతో ఇష్టం.
17 ప్రభూ, నేను కేవలం నిస్సహాయ, నిరుపేద మనిషిని.
యెహోవా నన్ను గూర్చి ఆలోచించును గాక!
నాకు సహాయం చేయుము. నన్ను రక్షించుము,
నా దేవా, త్వరగా రమ్ము.

## కీర్తన 41

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 పేద ప్రజలకు సహాయం చేసే మనిషి అనేక ఆశీర్వా
దాలు పొందుతాడు. కష్టాలు వచ్చినప్పుడు
యెహోవా ఆ మనిషిని రక్షిస్తాడు.
2 ఆ మనిషిని యెహోవా కాపాడి అతని ప్రాణాన్ని
రక్షిస్తాడు. ఆ మనిషికి ఈ దేశంలోఅనేక ఆశీర్వా
దాలు ఉంటాయి. దేవుడు అతని శత్రువుల
మూలంగా అతన్ని నాశనం కానివ్వడు.
3 ఆమనిషి రోగిగా పడకలో ఉన్నప్పుడు యెహోవా
అతనికి బలాన్ని ఇస్తాడు. ఆ మనిషి రోగిగా పడకలో
ఉండవచ్చు, కానీ యెహోవా అతనిని బాగు
చేస్తాడు.
4 నేను చెప్పాను, "యెహోవా, నాకు దయ చూపిం
చుము. నేను నీకు విరోధంగా పాపం చేసాను.
కాని నన్ను క్షమించి నన్ను బాగుచేయుము."
5 నా శత్రువులు నన్ను గూర్చి చెడు సంగతులు
పలుకుతున్నారు. "వీడెప్పుడు చచ్చి మరువబడు
తాడు?" అని వారంటున్నారు.
6 కొందరు మనుష్యులు వచ్చి నన్ను దర్శిస్తున్నారు.
కాని వాళ్లు నిజంగా ఏమి తలుస్తున్నారో చెప్పరు.
ఆ మనుష్యులు నన్ను గూర్చిన వార్తలు తెలుసు
కొనేందుకు మాత్రమేవస్తారు, మరియు వారు వెళ్లి,
వారి గాలి కబుర్లను ప్రచారం చేస్తారు.
7 నా శత్రువులు నన్ను గూర్చి చెడ్డ సంగతులను
రహస్యంగా చెబుతారు. వారు నాకు విరోధంగా
చెడు సంగతులను తలపెడుతున్నారు.
8 "ఇతడు ఏదో తప్పుచేసాడు, అందుచేత ఇతడు
రోగి అయ్యాడు. ఇతడు తన పడక మీద నుండి
ఎన్నటికి తిరిగి లేవడు" అని వారు అంటారు.
9 నా మంచి స్నేహితుడు నాతో భోజనం చేసాడు.
నేను అతన్ని నమ్మాను. కానీ ఇప్పుడు నా మంచి
స్నేహితుడు కూడా నాకు విరోధి అయ్యాడు.
10 కనుక యెహోవా, దయతో నన్ను కరుణించి,
బాగుపడనిమ్ము. అప్పుడు నేను వారికి తగిన
విధంగా చేస్తాను.
11 యెహోవా నా శత్రువులు నన్ను బాధించని ఎడల
అప్పుడు నీవు నన్ను స్వీకరించావని నేను తెలుసు
కొంటాను.
12 నేను నిర్దోషినై యుండగా నాకు సహాయం చేసి
తివి. నీ సన్నిధానంలో నీవు నన్ను ఎల్లప్పుడూ
నిలుచుండనిస్తావు.
13 ఇశ్రాయేలీయుల యెహోవా దేవుడు స్తుతింప
బడును గాక. ఆయన ఎల్లప్పుడూ స్తుతించబడ్డాడు.
మరియు ఎల్లప్పుడూ స్తుతించబడతాడు. ఆమేన్
ఆమేన్!

## రెండవ భాగం

## కీర్తన 42

*సంగీత నాయకునికి.*

*కోరహు కుటుంబంనుండి మస్కీల్.*

1 దప్పిగొన్న దుప్పి, చల్లటి సెలయేటి ఊటల్లో
నీళ్లు తాగాలని ఆశిస్తుంది. అలాగే దేవా నీకోసం
నా ఆత్మ దాహంగొని ఉంది.
2 సజీవ దేవుని కోసం, నా ఆత్మ దాహంగొని ఉంది.
ఆయనను కలుసుకొనుటకు నేను ఎప్పుడు
రాగలను?
3 నా కన్నీళ్లే రాత్రింబవళ్లు నా ఆహారం. "నీ దేవుడు
ఎక్కడ? అంటూనే ఉన్నాడు నా శత్రువు ఎంతసే
పూను."
4 కనుక నన్ను వీటన్నిటినీ జ్ఞాపకం ఉంచుకోనిమ్ము.
నా ఆత్మను క్రుమ్మరించనిమ్ము. దేవుని ఆలయా
నికి నడవటం ప్రజల గుంపులను నడిపించటం
నాకు జ్ఞాపకం. అనేకమంది ప్రజలు పండుగ చేసు
కొంటూ సంతోష స్తుతిగానాలు పాడటం నాకు
జ్ఞాపకం.
5 నేను ఎందుకు అంత విచారంగా ఉన్నాను?
ఎందుకు నేనంత తల్లడిల్లిపోయాను? దేవుని
సహాయం కోసం నేను వేచి ఉండాలి. ఆయనను
ఇంకా స్తుతించుటకు నాకు అవకాశం దొరుకు
తుంది. ఆయన నన్ను కాపాడుతాడు.
6 నాకు సహాయమైన దేవా! నా మనస్సులో నేను
కృంగియున్నాను. కనుక నేను నిన్ను యొర్దాను
ప్రదేశమునుండియు, హెర్మోను ప్రాంతం
నుండియు, మీసారు కొండ నుండియు జ్ఞాపకం
చేసుకొంటున్నాను.

7 నీ జలపాతాల ఉరుము ధ్వని అఘాతంలో నుండి
పిలుస్తోంది. నీ అలలు, అన్నియు నామీదుగా దాటి
యు న్నవి.
8 ప్రతిరోజూ యెహోవా తన నిజమైన ప్రేమను
చూపిస్తాడు. అప్పుడు రాత్రిపూట నేను ఆయన
పాటలు పాడుతాను. నా సజీవ దేవునికి నేను
ప్రార్థన చేస్తాను.
9 ఆశ్రయ బండ అయిన నా దేవునితో,
"యెహోవా! నీవు నన్ను ఎందుకు మరిచావు?
నా శత్రువుల క్రూరత్వాన్ని బట్టి నేనెందుకు
విచారంగా ఉండాలి?" అని నేను వేడుకుంటాను.
10 నా శత్రువులు నన్ను చంపుటకు ప్రయత్నిం
చారు. "నీ దేవుడు ఎక్కడ" అని వారు అన్నప్పుడు
"వారు నన్ను ద్వేషిస్తున్నట్టు వారు చూపెట్టారు."
11 నేను ఎందుకు ఇంత విచారంగా ఉన్నాను? నేను
ఎందుకు ఇంతగా తల్లడిల్లిపోయాను? దేవుని
సహాయం కోసం నేను వేచి ఉండాలి. నేను ఇంకా
ఆయన్ని స్తుతించే అవకాశం దొరుకుతుంది. నా
సహాయమా! నా దేవా!

## కీర్తన 43

1 దేవా, నిన్ను వెంబడించని ప్రజలమీద నా ఆరో
పణను ఆలకించుము. నా వివాదం నాలకించి,
ఎవరిది సరిగ్గా ఉందో నిర్ధారించుము. ఆ మను
ష్యులు అబద్ధాలు చెబుతున్నారు. ఆ ప్రజలు వంకర
మనుష్యులు. దేవా, ఆ మనుష్యుల నుండి నన్ను
రక్షించుము.
2 దేవా, నీవే నా క్షేమ స్థానం. నీవు నన్నెందుకు
విడిచిపెట్టావు? నా శత్రువుల క్రూరత్వాన్ని బట్టి
నేనెందుకు విచారంగా ఉండాలి?
3 దేవా, నీ సత్యము, నీ వెలుగును నా మీద ప్రకాశింప
నిమ్ము. నీ వెలుగు, సత్యాలు నన్ను నడిపిస్తాయి.
నీ పరిశుద్ధ పర్వతానికి నన్ను నడిపించుము. నీ
ఇంటికి నన్ను చేర్చుము.
4 దేవుని బలిపీఠం దగ్గరకు నేను వస్తాను. దేవుని
దగ్గరకు నేను వస్తాను. ఆయన నన్ను సంతోషింప
జేస్తాడు. దేవా, నా దేవా, సితారాతో నిన్ను
స్తుతిస్తాను.
5 నేనెందుకు ఇంత విచారంగా ఉన్నాను? నేనెం
దుకు ఇంతగా తల్లడిల్లిపోతున్నాను? దేవుని
సహాయం కోసం నేను కనిపెట్టి ఉండాలి. నేను
ఇంకను దేవుని స్తుతించే అవకాశం లభిస్తుంది. నా
దేవుడే నాకు సహాయము.

## కీర్తన 44

*సంగీత నాయకునికి.*

*కోరహు కుటుంబం వారి దైవ ధ్యానం.*

1 దేవా, నిన్ను గూర్చి మేము విన్నాము. మా పూర్వీ
కుల కాలంలో నీవు చేసిన కార్యాలను గూర్చి
మా తండ్రులు మాతో చెప్పారు. చాలా కాలం
క్రిందట నీవు చేసిన వాటిని గూర్చి వారు మాతో
చెప్పారు.
2 దేవా, నీ మహా శక్తితో ఇతరుల నుండి ఈ దేశాన్ని
నీవు తీసుకొన్నావు. మరియు మా తండ్రులను
ఇక్కడ ఉంచావు. ఆ విదేశీ ప్రజలను నీవు చితుక
గొట్టావు. వారు ఈ దేశం వదిలిపెట్టేలా బలవంతం
చేశావు. నీవు మా తండ్రులను స్వతంత్రులుగా
చేశావు.
3 ఈ దేశాన్ని మా తండ్రుల ఖడ్గాలు స్వాధీనం చేసి
కోలేదు. వారిని విజేతలుగా చేసింది వారి బలమైన
హస్తాలు కావు. నీవు మా తండ్రులకు తోడుగా
ఉన్న కారణం చేతనే అది జరిగింది. దేవా, నీ
మహా శక్తి మా తండ్రులను రక్షించింది. ఎందుకంటే
వారిని నీవు ప్రేమించావు గనుకనే!
4 నా దేవా, నీవు నా రాజువు. నీ ఆజ్ఞలే యాకోబు
ప్రజలను విజయానికి నడిపించాయి.
5 నా దేవా, నీ సహాయంతో మా శత్రువులను మేము
వెనుకకు తోసివేసాము. నీ నామంతో, మా శత్రు
వుల మీదుగా మేము నడిచాము.
6 నా విల్లును, బాణాలను నేను నమ్ముకోను. నా
ఖడ్గం నన్ను రక్షించజాలదు.
7 దేవా, మా విరోధుల నుండి నీవు మమ్మల్ని రక్షిం
చావు. మా శత్రువుల్ని నీవు సిగ్గుపరచావు.
8 మేము ప్రతిరోజూ దేవుని స్తుతిస్తాము! నీ నామాన్ని
శాశ్వతంగా మేము స్తుతిస్తాము!
9 కాని, దేవా, నీవు మమ్మల్ని విడిచిపెట్టావు. నీవు
మమ్మల్ని ఇబ్బంది పెట్టావు. నీవు మాతో కూడ
యుద్ధంలోనికి రాలేదు.
10 మా శత్రువులు మమ్మల్ని వెనుకకు నెట్టివేయ
నిచ్చావు. మా శత్రువులు మా ఐశ్వర్యాన్ని దోచు
కున్నారు.
11 గొర్రెల్ని ఆహారంగా తినుటకు ఇచ్చినట్టు నీవు
మమ్మల్నిచ్చి వేశావు. రాజ్యాల మధ్య నీవు
మమ్మల్ని చెదరగొట్టావు.
12 దేవా, నీ ప్రజలను నీవు విలువ లేకుండా అమ్మి
చేశావు. ధర విషయం నీవేమీ వాదించలేదు.
13 మా యిరుగు పొరుగు వారికి నీవు మమ్మల్ని
హాస్యాస్పదం చేశావు. మా యిరుగు పొరుగు వారు
మమ్మల్ని చూచి నవ్వుతూ హేళన చేస్తారు.
14 మేము ప్రజలు చెప్పుకొనే హాస్యాస్పద కథలలో
పాత్రల్లా ఉన్నాము. ప్రజలు మమ్మల్ని చూచి
నవ్వుతూ వారి తలలు ఊపుతారు.
15 నేను సిగ్గుతో కప్పబడి ఉన్నాను. రోజంతా నా
అవమానాన్ని నేను చూస్తున్నాను.
16 నా శత్రువు నన్ను ఇబ్బంది పెట్టాడు. నా శత్రువు
నన్ను హేళన చేయడం ద్వారా నా మీద కక్ష
సాధిస్తున్నాడు.

17 దేవా, మేము నిన్ను మరచిపోలేదు. అయినప్ప
టికీ వాటన్నిటినీ నీవు మాకు చేస్తున్నావు. మేము
నీతో మా ఒడంబడికపై సంతకం చేసినప్పుడు
మేము అబద్ధమాడలేదు!
18 దేవా, మేము నీ నుండి తిరిగిపోలేదు. నిన్ను అనుస
రించటం మేము మానుకోలేదు.
19 కాని, దేవా, నక్కలు నివసించే ఈ స్థలంలో నీవు
మమ్మల్ని చితుక గొట్టావు. మరణం అంత చీక
టిగా ఉన్న ఈ స్థలంలో నీవు మమ్మల్ని కప్పి
వేశావు.
20 మా దేవుని పేరు మేము మరచిపోయామా?
అన్యదేవతలకు మేము ప్రార్థించామా? లేదు!
21 నిజంగా ఈ విషయాలు దేవునికి తెలుసు. లోతైన
రహస్యాలు సహితం ఆయనకు తెలుసు.
22 దేవా, నీకోసం ప్రతి రోజూ చంపబడుతున్నాము!
చంపటానికి నడిపించబడే గొర్రెల్లా ఉన్నాము
మేము.
23 నా ప్రభువా, లెమ్ము! నీవేల నిద్రపోవుతున్నావు?
లెమ్ము! మమ్మల్ని శాశ్వతంగా విడిచిపెట్టకుము!
24 దేవా, మానుండి నీవేల దాక్కుంటున్నావు. మా
బాధ, కష్టాలు నీవు ఎందుకు మరచిపోయావు?
25 బురదలోకి మేము తోసివేయబడ్డాము. మేము
దుమ్ములో బోర్లా పడి ఉన్నాము.
26 దేవా, లేచి మాకు సహాయం చేయుము! నీ
మంచితనాన్ని బట్టి మమ్మల్ని రక్షించుము.

## కీర్తన 45

*సంగీత నాయకునికి, శోషనీయ రాగం*
*కోరహు కుటుంబం రచించిన దైవ ధ్యానం*
*మరియు ఒక ప్రేమగీతం.*

1 రాజుకోసం నేను ఈ విషయాలు వ్రాస్తూ ఉండగా
అందమైన పదాలు నా మనస్సును నింపేస్తు
న్నాయి. నైపుణ్యంగల రచయిత కలంనుండి వెలు
వడే మాటల్లా నా నాలుక మీద మాటలు దొర్లి
పోతున్నాయి.
2 నీవు అందరికంటె ఎంతో అందంగా ఉన్నావు! నీ
పెదవులనుండి దయ వెలువడుతుంది కనుక
దేవుడు నిన్ను శాశ్వతంగా ఆశీర్వదిస్తాడు.
3 నీవు ఖడ్గం ధరించు, యుద్ధ వీరుడువలె, మహి
మను, ఘనతను ధరించుము.
4 నీవు అద్భుతంగా కనబడుతున్నావు! వెళ్లి, నీతి
న్యాయం కోసం పోరాటంలో గెలువుము. అద్భుత
కార్యాలు చేసేందుకు శక్తిగల నీ కుడి చేతిని
ప్రయోగించుము.
5 నీ బాణాలు సిద్ధంగా ఉన్నాయి. అవి రాజు శత్రు
వుల హృదయాల్లోకి ప్రవేశిస్తాయి అనేక మంది
ప్రజలను నీవు ఓడిస్తావు.
6 దేవా, నీ సింహాసనం శాశ్వతంగా కొనసాగుతుంది!
నీ నీతి రాజదండమయి ఉంది.
7 నీవు నీతిని ప్రేమిస్తావు, కీడును నీవు ద్వేషిస్తావు.
కనుక దేవా, నిన్ను నీ స్నేహితుల మీద రాజుగా
నీ దేవుడు కోరుకొన్నాడు.
8 నీ వస్త్రాలు గోపరసం, అగరు, లవంగి, పట్టావంటి
కమ్మని సువాసనగా ఉన్నాయి. నిన్ను సంతోష
పరచుటకు దంతం పొదుగబడిన భవనాల నుండి
సంగీతం వస్తుంది.
9 నీవు ఘనపరచే స్త్రీలలో రాజకుమార్తెలున్నారు.
నీ పెండ్లి కుమార్తె ఓఫీరు బంగారంతో చేయబడిన
కిరీటం ధరించి నీ చెంత నిలుస్తుంది.
10 కుమారీ, నా మాట వినుము. నీ ప్రజలను, నీ
తండ్రి కుటుంబాన్నీ మరచిపోకుము.
11 రాజు నీ సౌందర్యాన్ని ప్రేమిస్తున్నాడు. ఆయనే
నీకు కొత్త భర్తగా ఉంటాడు. నీవు ఆయన్ని ఘన
పరుస్తావు.
12 తూరు పట్టణ ప్రజలు నీ కోసం కానుకలు తెస్తారు.
నీ కోసం ధనవంతులు నిన్ను కలుసుకోవాలని
కోరుతారు.
13 రాజకుమారి రాజ గృహంలో బహు అందమైనది.
ఆమె వస్త్రం బంగారపు అల్లికగలది.
14 ఆమె అందమైన తన వస్త్రాలు ధరిస్తుంది. మరియు
రాజు దగ్గరకు తీసుకొని రాబడుతుంది. ఆమె వెనుక
కన్యకల గుంపు కూడా రాజు దగ్గరకు తీసుకొని
రాబడుతుంది.
15 సంతోషంతో నిండిపోయి వారు వస్తారు. సంతో
షంతో నిండిపోయి రాజభవనంలో వారు ప్రవేశి
స్తారు.
16 రాజా, నీ తరువాత నీ కుమారులు పరిపాలిస్తారు.
దేశవ్యాప్తంగా వారిని రాజులుగా నీవు చేస్తావు.
17 నీ పేరును శాశ్వతంగా నేను ప్రసిద్ధి చేస్తాను.
శాశ్వతంగా, ఎల్లకాలం ప్రజలు నిన్ను స్తుతిస్తారు.

## కీర్తన 46

*సంగీత నాయకునికి.*
*కోరహు కుమారుల అలామోతు రాగ గీతం.*

1 దేవుడు మా ఆశ్రయం, మా శక్తి. ఆయన యందు,
మాకు కష్ట కాలంలో ఎల్లప్పుడూ సహాయం
దొరుకుతుంది.
2 అందుచేత భూమి కంపించినప్పుడు, మరియు
పర్వతాలు సముద్రంలో పడినప్పుడు మేము భయ
పడము.
3 సముద్రాలు పొంగినను, చీకటితో నిండినను,
భూమి, మరియు పర్వతాలు కంపించినను మేము
భయపడము.

4 ఒక నది ఉంది. దాని కాలువలు దేవుని నివాసానికి,
మహోన్నత దేవుని పరిశుద్ధ పట్టణానికి సంతోషం
తెచ్చి పెడ్తాయి.
5 ఆ పట్టణంలో దేవుడు ఉన్నాడు. కనుక అది
ఎన్నటికీ నాశనం చేయబడదు. సూర్యోదయానికి
ముందే దేవుడు సహాయం చేస్తాడు.
6 రాజ్యాలు భయంతో వణకుతాయి. యెహోవా
కేక వేయగా ఆ రాజ్యాలు కూలిపోతాయి. భూమి
పగిలిపోతుంది.
7 సర్వశక్తిమంతుడైన యెహోవా మనతో ఉన్నాడు.
యాకోబు దేవుడు మనకు ఆశ్రయం.
8 చూడండి, యెహోవా చేసే మహత్తర కార్యాలు
చూడండి. ఆ కార్యాలు భూమి మీద యెహోవాను
ప్రసిద్ధి చేస్తాయి.
9 భూమి మీద ఎక్కడైనా సరే యుద్ధాలను
యెహోవా ఆపివేయగలడు. సైనికుల విల్లులను,
వారి ఈటెలను ఆయన విరుగగొట్టగలడు. రథా
లను ఆయన అగ్నితో కాల్చివేయగలడు.
10 దేవుడు చెబుతున్నాడు, "మౌనంగా ఉండి, నేను
దేవుణ్ణి అని తెలుసుకోనండి. రాజ్యాలతో నేను
స్తుతించబడతాను. భూమిమీద మహిమపర్చ
బడతాను."
11 సర్వశక్తిమంతుడైన యెహోవా మనతో ఉన్నాడు.
యాకోబు దేవుడు మనకు ఆశ్రయం

## కీర్తన 47

*సంగీత నాయకునికి. కోరహు కుమారుల గీతం.*

1 సర్వజనులారా చప్పట్లు కొట్టండి. సంతోషంగా
దేవునికి కేకలు వేయండి.
2 మహోన్నతుడగు యెహోవా భీకరుడు. భూలో
కమంతటికీ ఆయన రాజు.
3 ఆయన ప్రజలను మనకు లోపరిచాడు. ఆ రాజ్యా
లను మన పాదాల క్రింద ఉంచాడు.
4 దేవుడు మన కోసం మన దేశాన్ని కోరుకున్నాడు.
యాకోబు కోసం అద్భుత దేశాన్ని ఆయన కోరు
కున్నాడు. యాకోబు ఆయన ప్రేమకు పాత్రుడు.
5 బూర మ్రోగగానే యుద్ధనాదం వినబడగానే
యెహోవా దేవుడు లేచాడు.
6 దేవునికి స్తుతులు పాడండి. స్తుతులు పాడండి.
మన రాజుకు స్తుతులు పాడండి. స్తుతులు పాడండి.
7 దేవుడు సర్వలోకానికి రాజు. స్తుతిగీతాలు పాడండి.
8 దేవుడు తన పరిశుద్ధ సింహాసనం మీద కూర్చు
న్నాడు. దేవుడు సకల రాజ్యాలనూ పాలిస్తున్నాడు.
9 రాజ్యాల నాయకులు దేవుని ప్రజలతో సమావేశ
మయ్యారు. దేవుని ప్రజలు అబ్రాహాము వంశ
స్థులు. వారి జనాంగమును కాపాడును. నాయకు
లందరూ దేవునికి చెందినవారు. దేవుడు
మహోన్నతుడు.

## కీర్తన 48

*కోరహు కుమారుల స్తుతి పాట.*

1 యెహోవా గొప్పవాడు. మన దేవుని పట్టణంలో,
ఆయన పరిశుద్ధ పట్టణంలో స్తుతులకు ఆయన
పాత్రుడు.
2 దేవుని పరిశుద్ధ పర్వతం అందమైనది, ఎత్తైనది.
అది భూమి అంతటికీ సంతోషాన్ని తెస్తుంది.
సీయోను పర్వతం దేవుని నిజమైన పర్వతం.*
అది మహారాజు పట్టణం.
3 ఇక్కడ ఆ పట్టణంలోని, భవనాలలో దేవుడు కోట
అని పిలువబడుతున్నాడు.
4 ఒకప్పుడు రాజులు కొందరు సమావేశ మయ్యారు.
వారు ఈ పట్టణంపై దాడి చేయాలని పథకం
వేసారు. వారంతా కలిసి ముందుకు వచ్చారు.
5 ఆ రాజులు చూసారు, వారు ఆశ్చర్యపోయారు,
వారు బెదరిపోయారు. మరియు వారంతా పారి
పోయారు!
6 ఆ రాజులందరికీ భయం పట్టుకొంది. ప్రసవ వేదన
పడుతున్న స్త్రీలలా వారు వణికారు.
7 దేవా, బలమైన తూర్పుగాలితో తర్షీషు ఓడలను
బద్దలు చేశావు.
8 మేము ఏమి విన్నామో దాన్ని మహా శక్తిగల దేవుని
పట్టణంలో చూశాము, మన సర్వశక్తిమంతుడైన
యెహోవా పట్టణంలో. దేవుడు ఆ పట్టణాన్ని
శాశ్వతంగా బలపరుస్తాడు.
9 దేవా, నీ ప్రేమా కనికరాలను గూర్చి మేము నీ
ఆలయంలో జాగ్రత్తగా ఆలోచిస్తాము.
10 దేవా, నీవు ప్రఖ్యాతిగలవాడవు. భూలోక మంతటా
ప్రజలు నిన్ను స్తుతిస్తారు. నీ కుడిచేయి నీతితో
నిండియున్నది.
11 సీయోను పర్వతం సంతోషిస్తుంది. మరియు
యూదా నగరాలు ఆనందంగా వున్నాయి. దేవా,
ఎందుకంటే నీవు మంచి తీర్పులు చేశావు.
12 సీయోను చుట్టూ తిరుగుతూ ఆ పట్టణాన్ని
చూడండి, గోపురాలు లెక్కించండి.
13 ఎత్తైన గోడలు చూడండి. సీయోను రాజనగరుల
ద్వారా వెళ్ళండి. అప్పుడు తరువాత తరాలకు
మీరు దాన్ని గూర్చి చెప్పగలుగుతారు.

---

**దేవుని నిజమైన పర్వతం** అక్షరార్థముగా "ఉత్తర దిక్కు ఏట వాలులు" లేదా "జఫోను ఏటవాలు" ఫోయే నేసియాలోని జెఫోను పర్వతం మీద తమ దేవుళ్లు నివసించారని కనానీయులు నమ్మారు. లేఖకుడు యిక్కడ యిలా అంటున్నాడు– సీయోను పర్వతం మీద దేవుడు నిజంగా ప్రసన్నుడై యున్నాడు.

14 దేవుడు నిజంగా ఎల్లప్పుడూ శాశ్వతంగా మన
దేవుడై ఉంటాడు. ఆయనే మనలను శాశ్వతంగా
నడిపిస్తాడు. మరియు ఆయన ఎన్నటికీ మర
ణించడు!

## కీర్తన 49

*సంగీత నాయకునికి. కోరహు కుమారుల కీర్తన.*

1 సర్వ దేశములారా ఇది వినండి. భూమి మీద
నివసించే సకల ప్రజలారా ఇది వినండి.
2 ప్రతి మనిషీ, ధనికులు, దరిద్రులు కలసి వినాలి.
3 నేను మీకు కొన్ని జ్ఞాన విషయాలు చెప్పుతాను.
నా ఆలోచనలు బుద్ధినిస్తాయి.
4 సామెతపైనా ఆసక్తినుంచుతాను. ఇప్పుడు నా
సితారాను వాయిస్తూ విప్పుడు కథను వివరిస్తాను.
5 అపాయాన్ని గూర్చి నేను భయపడాల్సిన అవసరం
నాకేమీ లేదు. నా దుష్ట శత్రువులు నన్ను చుట్టు
ముట్టినప్పుడు నేను భయపడాల్సిన కారణం ఏమీ
లేదు.
6 ఆ ప్రజలు తమ స్వంత బలాన్ని నమ్మి తమ
ఐశ్వర్యాన్ని గూర్చి గొప్పలు చెప్పుకొంటారు.
7 ఎవడూ తనకు తాను విడుదల చేసుకోలేడు. నీవు
ఒకని జీవితపు వెలను దేవునికి చెల్లించలేవు.
8 ఏ మనిషీ తన సొంత ప్రాణాన్ని కొనుక్కు నేందుకు
సరిపడేంత డబ్బు ఎన్నటికీ సంపాదించలేడు.
9 ఏ మనిషీ శాశ్వతంగా జీవించే హక్కు కొనుక్కు
నేందుకు సరిపడేంత డబ్బు ఎన్నటికీ సంపాదించ
లేడు, మరియు తన సొంత శరీరం సమాధిలో
కుళ్లిపోకుండా రక్షించుకోలేడు.
10 చూడు, వెఱ్ఱివాళ్లు, బుద్ధిహీనులు చనిపోయినట్టే
జ్ఞానులు కూడా చనిపోతారు. మరియు వారు తమ
ఐశ్వర్యమంతటినీ ఇతరులకు విడిచిపెడతారు.
11 శాశ్వతంగా సదాకాలం సమాధి ప్రతి ఒక్కరి
గృహంగా ఉంటుంది. వారికి సొంతంగా ఎంత భూమి
ఉన్నా సరే లెక్కలేదు.
12 ధనికులు నిరంతరం జీవించలేరు. వారు జంతు
వుల్లా మరణిస్తారు.
13 బుద్ధిహీనులకి, మరియు వారు చెప్పేది అంగీకరించే
వారికి ఇలాగే జరుగుతుంది.
14 మనుష్యులందరూ గొర్రెల్లా ఉన్నారు. సమాధి వారి
దొడ్డి. మరణం వారి కాపరి. వారి శరీరాలు సమా
ధిలో కుళ్లిపోయి వ్యర్థమైపోతాయి.
15 కాని దేవుడు విలువ చెల్లించి నా ప్రాణాన్ని
విమోచిస్తాడు. సమాధి శక్తి నుండి ఆయన నన్ను
విడుదల చేస్తాడు.
16 మనుష్యుడు కేవలం ధనికుడని వానికి భయపడ
వద్దు. తన ఇంటి ఐశ్వర్యం పెరిగిందని వానికి
భయపడవద్దు.
17 ఆ మనుష్యుడు చనిపోయినప్పుడు వాని వెంట
వాడేమీ తీసుకొనిపోడు. వాని ఐశ్వర్యం వానితో
సమాధిలోనికి దిగిపోదు.
18 అయినప్పటికీ, అతడు జీవించినంత కాలం సంతో
షంగా ఉంటాడు. ఒక మనుష్యుడు తనకు తాను
మంచి చేసికొని పొగడ్తలు పొందినా,
19 అతడు తన పూర్వీకుల వద్దకు వెళ్తాడు. అతడు
ఇక వెలుగును ఎన్నటికి చూడడు.
20 మనుష్యుడు తన వైభవంలో ఎక్కువ కాలం నిలిచి
యుండలేడు. అతడు నశించే మృగంలాంటి వాడు.

## కీర్తన 50

*ఆసాపు కీర్తనలలో ఒకటి.*

1 దేవాది దేవుడు యెహోవా మాట్లాడాడు. సూర్యో
దయ దిక్కు నుండి సూర్యాస్తమయ దిక్కు వరకు
భూమి మీది ప్రజలందరినీ ఆయన పిలుస్తున్నాడు.
2 సీయోను నుండి దేవుడు ప్రకాశిస్తున్నాడు. ఆ
పట్టణపు అందము పూరిపూర్ణమైనది.
3 మన దేవుడు వస్తున్నాడు, ఆయన మౌనంగా
ఉండడు. ఆయన యెదుట అగ్ని మండుతుంది.
ఆయన చుట్టూరా గొప్ప తుఫాను ఉంది.
4 తన ప్రజలకు తీర్పు చెప్పుటకు పైన ఆకాశాన్ని,
కింద భూమిని ఆయన పిలుస్తున్నాడు.
5 "నా అనుచరులను నా చుట్టూరా చేర్చండి. వారు
బలియర్పణ ద్వారా నాతో ఒడంబడిక చేసు
కున్నారు" అని చెప్పారు.
6 అప్పుడు ఆకాశాలు ఆయన న్యాయాన్ని
చెప్పాయి. ఎందుకంటే, దేవుడే న్యాయమూర్తి.
7 దేవుడు చెబుతున్నాడు: "నా ప్రజలారా, నా మాట
వినండి. ఇశ్రాయేలు ప్రజలారా మీకు విరోధంగా
నా రుజువును కనపరుస్తాను. నేను దేవుణ్ణి, మీ
దేవుణ్ణి.
8 నేను మీ బలుల విషయంలో మిమ్ములను సరి
చేయటంలేదు. గద్దించటంలేదు. ఇశ్రాయేలు ప్రజ
లారా మీరు మీ దహన బలులను ఎల్లప్పుడూ
తెస్తున్నారు. ప్రతిరోజు వాటిని మీరు నాకిస్తున్నారు.
9 మీ ఇంటినుండి యెద్దులను తీసుకోను. మీ శాలల
నుండి మేకలు నాకవసరం లేవు.
10 ఆ జంతువులు నాకు అవసరం లేదు. అరణ్యంలో
ఉన్న జంతువులన్నీ ఇది వరకే నా సొంతం. వేలాది
పర్వతాల మీద జంతువులన్నీ ఇది వరకే నా
సొంతం.
11 కొండల్లో వుండే ప్రతి పక్షి నాకు తెలుసు. పొలాల్లో
చలించే ప్రతీదీ నా సొంతం
12 నాకు ఆకలి వేయదు! నాకు ఆకలిగా ఉంటే ఆహారం
కోసం నేను మిమ్మల్ని అడగాల్సిన అవసరం లేదు

ప్రపంచం, అందులో ఉన్న సమస్తమూ, నా
సొంతం.
13 నేను ఎద్దుల మాంసం తినను. నేను మేకల రక్తం
తాగను."
14 దేవునికి కృతజ్ఞతార్పణలను ఇవ్వండి. మహో
న్నతుడైన దేవునికి మీ మొక్కుబడిని చెల్లించండి,
దేవుడు ఇలా అన్నాడు: మీరు వాగ్దానం చేసినది
ఇవ్వండి.
15 "ఇశ్రాయేలు ప్రజలారా మీకు కష్టాలు వచ్చి
నప్పుడు నన్ను ప్రార్థించండి! నేను మీకు
సహాయం చేస్తాను. అప్పుడు మీరు నన్ను
గౌరవించవచ్చు."
16 దుర్మార్గులతో దేవుడు చెబుతున్నాడు, "నా
న్యాయ విధులను చదువుటకు నా ఒడంబడికకు
బద్ధులమని ప్రకటించుటకును మీకేమి హక్కు
న్నది?*
17 కనుక నేను మిమ్మల్ని సరిదిద్దినప్పుడు దానిని
మీరు ద్వేషిస్తారు. నేను మీతో చెప్పే సంగతులను
మీరు నిరాకరిస్తారు.
18 మీరు ఒక దొంగను చూస్తారు, వానితో చేయి
కలపడానికి పరుగెడుతారు. వ్యభిచార పాపం చేసే
మనుష్యులతో పాటు మీరు మంచం మీదికి
దూకుతారు.
19 మీరు చెడు సంగతులు చెబుతారు, అబద్ధాలు
పలుకుతారు.
20 మీరు మీ సహోదరుని గూర్చి ఎడతెగక చెడ్డ
సంగతులు చెబుతారు. మీరు మీ తల్లి కుమారుని
అపనిందలపాలు చేస్తారు.
21 మీరు ఈ చెడ్డ విషయాలు చేసారు. నేను మౌనంగా
ఉండిపోయాను నేను మీలాంటివాడినని మీరను
కొన్నారు. కాని నేనిప్పుడు మిమ్ములను కోపంతో
గద్దిస్తాను. మరియు మీ ముఖంమీద నింద
మోపుతాను.
22 నేను మిమ్ములను చీల్చివేయకముందే, దేవుని
మరచిన జనాంగమైన మీరు, ఈ విషయంను
గూర్చి ఆలోంచించాలి. అదే కనుక జరిగితే, ఏ
మనిషి మిమ్మల్ని రక్షించలేడు.
23 ఒక వ్యక్తి కృతజ్ఞతా అర్పణను చెల్లిస్తే, అప్పుడు
అతడు నన్ను గౌరవిస్తాడు. నా మార్గాన్ని అనుస
రించే వానికి రక్షించగల దేవుని శక్తిని నేను
చూపిస్తాను."

---

**నా ... మీకేమి హక్కున్నది?** ఇది బహుశ ఒక ఆచార వేడుకను సూచిస్తుండవచ్చును. అందులో దేవునితో ఒడం బడికకు ప్రజలు తమ సమర్పణను తిరిగి దృఢపరుస్తారు.

## కీర్తన 51

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*
*బత్షెబతో దావీదు పాపం చేసిన తర్వాత నాతాను ప్రవక్త దావీదు దగ్గరికి వెళ్లినప్పుడు వ్రాసిన కీర్తన.*

1 దేవా నీ నమ్మకమైన ప్రేమ మూలంగా నా మీద
దయ చూపించుము. నీ మహా దయ మూలంగా
నా పాపాలన్నీ తుడిచివేయుము.
2 దేవా, నా దోషం అంతా తీసివేయుము. నా పాపాలు
కడిగివేసి, నన్ను మరల శుద్ధి చేయుము.
3 నేను పాపం చేశానని నాకు తెలుసు. నేను ఎల్ల
ప్పుడు నా పాపాన్ని ఎరిగియున్నాను.
4 తప్పు అని నీవు చెప్పే వాటినే నేను చేసాను.
దేవా, నీకే వ్యతిరేకంగా నేను పాపం చేసాను. కనుక
నేను దోషినని నీవు అన్నప్పుడు నీ మాట నిజమే.
నీవు నన్ను నిందించేటప్పుడు నీవు న్యాయ
వంతుడవే.
5 నేను పాపంలో పుట్టాను. పాపంలోనే నా తల్లి
నన్ను గర్భాన ధరించింది.
6 దేవా, సంపూర్ణ భక్తిని లేదా యదార్థతను నీవు
కోరతావు. అందుచేత నా హృదయంలో నాకు
జ్ఞాన మును బోధించుము.
7 హిస్సోపు ముక్కను ప్రయోగించి నన్ను పవిత్రం
చేసే క్రమం జరిగించుము. నేను హిమం కంటె
తెల్లగా ఉండేంతవరకు నన్ను కడుగుము.
8 నీవు విరుగ గొట్టిన ఎముకలను సంతోషించ
నిమ్ము. నన్ను సంతోషపరచుము! మరల నన్ను
సంతోషపరచుము.
9 నా పాపాలను చూడకుము! వాటన్నింటినీ తుడిచి
వేయుము.
10 దేవా, నాలో పవిత్ర హృదయాన్ని కలిగించుము
నా ఆత్మను నూతనపరచి బలపరచుము.
11 నన్ను తోసివేయకుము! నీ పవిత్ర ఆత్మను
నాలోనుండి తీసివేయకుము.
12 నీచేత రక్షించబడుట మూలంగా కలిగే ఆనందం
నాకు తిరిగి ఇమ్ము! నీకు విధేయత చూపుటకు
నా ఆత్మను సిద్ధంగా, స్థిరంగా ఉంచుము.
13 నీ జీవిత మార్గాలను నేను పాపులకు నేర్పిస్తాను.
వారు తిరిగి నీ దగ్గరకు వచ్చేస్తారు.
14 దేవా, నన్ను ఘోర మరణమునుండి రక్షించుము.
నా దేవా, నీవే నా రక్షకుడవు. నీవు ఎంత మంచి
వాడవోనని నన్ను పాడనిమ్ము.
15 నా ప్రభువా, నా నోరు తెరచి, నీ స్తుతులు
పాడనిమ్ము.
16 నీవు బలులు కోరటం లేదు. లేనియెడల నేను
వాటిని అర్పిస్తాను. దహనబలులను నీవు కోరవు.
17 దేవా, నా విరిగిన ఆత్మయే నీకు నా బలి అర్పణ.
దేవా, విరిగి నలిగిన హృదయాన్ని నీవు త్రోసి
వేయవు.

18 దేవా, సీయోను యెడల మంచితనము, దయ
కలిగి ఉండుము. యెరూషలేము గోడలను
కట్టుము.
19 అప్పుడు నీవు సరియైన బలులను, సంపూర్ణ దహన
బలులను అనుభవిస్తావు. మరియు ప్రజలు మరల
నీ బలిపీఠం మీద ఎద్దులను అర్పిస్తారు.

## కీర్తన 52

*సంగీత నాయకునికి దావీదు దైవధ్యానాల్లో ఒకటి. ఎదోము వాడైన దోయేగు సౌలు దగ్గరకు వచ్చి దావీదు అహీమెలెకు ఇంటిలో ఉన్నాడని చెప్పినప్పటిది.*

1 పెద్ద మనిషి, దైవజనులకు విరోధంగా చేసే చెడ్డ
పనులను గూర్చి నీవెందుకు అతిశయిస్తున్నావు?
2 వంకర పనులు చేయాలనే నీవు పథకం వేస్తుం
టావు. నీ నాలుక పదునుగల కత్తిలా ఉంది. ఎందు
కంటే నీ నాలుక అబద్ధాలు పలుకుతుంది.
3 మంచి కంటె కీడునే నీవు ఎక్కువగా ప్రేమిస్తు
న్నావు. సత్యం పలుకుటకంటె ఎక్కువగా అబ
ద్ధాలు చెప్పటం నీకు ఇష్టం.
4 నీవూ, నీ అబద్ధాల నాలుక మనుష్యులను బాధిం
చటానికే ఇష్టపడతుంది.
5 అందుచేత దేవుడు నిన్ను శాశ్వతంగా నాశనం
చేస్తాడు. ఆయన నిన్ను పట్టి నీ గుడారము నుండి
బయటకు లాగివేస్తాడు. సజీవుల దేశంలోనుండి
ఆయన నిన్ను వేళ్లతో పెళ్లగిస్తాడు.
6 మంచి వాళ్లు ఇది చూచి, దేవునిని గౌరవిస్తారు.
వారు నిన్ను చూచి నవ్వి ఇలా అంటారు,
7 "దేవుని మీద ఆధారపడని ఆ మనిషికి ఏమి సంభ
వించిందో చూడండి. ఆ మనిషి తనకు సహాయం
చేసేందుకు ఐశ్వర్యాన్ని, తనకున్న దానిని
మూర్ఖంగా నమ్ముకున్నాడు."
8 అయితే దేవుని ఆలయంలో నేను పచ్చని ఒలీవ
మొక్కలా ఉన్నాను. నేను శాశ్వతంగా ఎప్పటికీ
దేవుని ప్రేమనే నమ్ముకొన్నాను.
9 దేవా, నీవు చేసిన వాటి మూలంగా నేను నిన్ను
శాశ్వతంగా స్తుతిస్తాను. నీ అనుచరుల సముఖములో
నీవు మంచివాడవని నేను ప్రకటిస్తాను.

## కీర్తన 53

*సంగీత నాయకునికి. మాహలతు రాగంలో పాడతగిన దావీదు ధ్యానం.*

1 తెలివి తక్కువ వాడు మాత్రమే దేవుడు లేడని
తలుస్తాడు. అలాంటి మనుష్యులు చెడిపోయిన
వారు, చెడు విషయాలను చేస్తారు. సరియైన దాన్ని
చేసేవాడు ఒక్కడూ లేడు.
2 నిజంగా దేవుడు పరలోకంలో ఉండి మనల్ని
చూస్తూ ఉన్నాడు. దేవునికొరకు చూసే జ్ఞానంగల
వాళ్లు ఎవరైనా ఉన్నారేమో అని కనుగొనేందుకు
దేవుడు చూస్తూ ఉన్నాడు.
3 కానీ ప్రతి మనిషీ దేవునికి వ్యతిరేకంగా తిరిగి
పోయాడు. ప్రతి మనిషీ చెడ్డవాడే. మంచి
చేసేవాడు లేడు. ఒక్కడూ లేడు.
4 దేవుడు చెబుతున్నాడు, "ఆ దుర్మార్గులకు సత్యం
బాగా తెలుసు. కాని వారు నన్ను ప్రార్థించరు. ఆ
దుర్మార్గులు వారి భోజనం తినటానికి ఎంత
సిద్ధంగా ఉంటారో నా ప్రజలను నాశనం చేయ
టానికి కూడ అంత సిద్ధంగా ఉంటారు."
5 కాని ఆ దుర్మార్గులు ఇంతకు ముందెన్నడూ భయ
పడనంతగా భయపడిపోతారు. ఆ దుర్మార్గులు ఇశ్రా
యేలీయులకు శత్రువులు. దేవుడు ఆ దుర్మార్గు
లను నిరాకరించాడు. కనుక మీరు వారిని ఓడిస్తారు.
దేవుడు మీ శత్రువుల ఎముకలను చెదరగొట్టేస్తాడు.
6 ఇశ్రాయేలు ప్రజలారా, సీయోనుకు విజయాన్ని
ఎవరిస్తారు? దేవుడు తన ప్రజలను తిరిగి వర్ధిల్ల
జేసేటప్పుడు యాకోబు సంతోషిస్తాడు. ఇశ్రా
యేలు బహుగా ఆనందిస్తాడు.

## కీర్తన 54

*సంగీత నాయకునికి వాయిద్యాలతో, దావీదు ధ్యానము. జిఫీయులు సౌలు దగ్గరకు వెళ్లి "దావీదు మా ప్రజల వద్ద దాక్కొన్నాడని తలస్తున్నాము" అని అతనితో చెప్పినప్పటిది.*

1 దేవా, నీ నామం ద్వారా నన్ను రక్షించుము. నన్ను
విడుదల చేయుటకు నీ శక్తి ఉపయోగించుము.
2 దేవా నా ప్రార్థనను, నేను చెప్పే సంగతులను
ఆలకించుము.
3 పరదేశీయులు నాకు విరోధంగా తిరిగారు. బలా
ఢ్యులైన మనుష్యులు నన్ను చంపుటకు ప్రయత్ని
స్తున్నారు. దేవా ఆ మనుష్యులు నిన్ను కనీసం
ఆరాధించరు.
4 చూడండి, నా దేవుడు నాకు సహాయం చేస్తాడు.
నా ప్రభువు నన్ను బలపరుస్తాడు.
5 తమ స్వంత దుష్టత్వముతో నాపై గూఢచార
త్వము చేసే జనులను దేవుడు శిక్షిస్తాడు. దేవా,
నీవు నాకు నమ్మకస్తుడవై ఉండుటనుబట్టి ఆ
జనులను నాశనం చేయుము.
6 దేవా, నేను నీకు స్వేచ్ఛార్పణలు ఇస్తాను.
యెహోవా, నేను నీకు వందనాలు చెల్లిస్తాను.
ఎందుకంటే నీవు మంచివాడవు.
7 నీవు నా కష్టాలన్నిటినుండి నన్ను రక్షించావు.
మరియు నా శత్రువులు ఓడిపోవటం నేను
చూసాను.

## కీర్తన 55

*సంగీత నాయకునికి వాయిద్యాలతో.*
*దావీదు ప్రార్థన.*

1 దేవా నా ప్రార్థన వినుము. దయచేసి నాకు విము
ఖుడవు కావద్దు.
2 దేవా దయతో నా ప్రార్థన విని నాకు జవాబు
అనుగ్రహించుము. నా ఇబ్బందులు నీతో చెప్పు
కోనిమ్ము.
3 నా శత్రువులు నాకు విరోధముగా చెప్పిన దాన్ని
బట్టి, మరియు దుష్టుల అణచివేతనుబట్టి నేను
కలవరం చెందాను. నా శత్రువులు కోపముతో
నా మీద దాడి చేశారు. వారు నా మీదకు కష్టాలు
విరుచుకు పడేటట్టు చేసారు.
4 నాలో నా గుండె అదురుతోంది. నాకు చచ్చి
పోయేటంత భయంగా ఉంది.
5 నాకు భయము మరియు వణకుగా ఉంది. నేను
భయపడిపోయాను.
6 ఆహా, నాకు పావురమువలె రెక్కలు ఉంటే ఎంత
బాగుంటుంది. నేను ఎగిరిపోయి విశ్రాంతి స్థలం
వెతుక్కుందును కదా.
7 నేను చాలా దూరంగా అరణ్యంలోనికి వెళ్లిపోదును.
8 నేను పరుగెత్తి పోదును. నేను తప్పించుకొని పారి
పోదును. ఈ కష్టాల తుఫాను నుండి నేను పారి
పోదును
9 నా ప్రభువా, వారి అబద్ధపు మాటలను తారుమారు
చేయుము. ఈ పట్టణంలో చాలా బలాత్కారం
పోట్లాటలను నేను చూస్తున్నాను.
10 పట్టణం చుట్టూ దాని గోడల మీద రాత్రింబగళ్లు
బలాత్కారము, యుద్ధము నడుస్తున్నాయి. ఈ
పట్టణంలో దారుణమైన సంగతులు జరుగు
తున్నాయి.
11 వీధుల్లో చాలా నేరం ప్రబలుతుంది. ఎక్కడ
చూచినా మనుష్యులు అబద్ధాలాడుతూ ప్రజలను
మోసం చేస్తున్నారు.
12 ఒకవేళ శత్రువు నన్ను అవమానించటమే అయితే
దానిని నేను భరించగలను. ఒకవేళ నా శత్రు వులు
నాపై దాడిచేస్తే నేను దాక్కోగలను.
13 కానీ, అది నీవే అవటంవల్ల నేను భయపడను.
ఎందుకంటే నీవు, నాకు తగినవాడవు, నా సహ
వాసివి, నా దగ్గర స్నేహితుడివి. నీవే నాకు కష్టాలు
కలిగిస్తున్నావు.
14 మనం కలిసి మధుర సంభాషణ చేసే వాళ్లము.
దేవుని ఆలయంలో మనము కలిసి సహవాసంలో
నడిచాము.
15 నా శత్రువులు వారి సమయం రాకముందే మరణి
స్తారనుకొంటాను. వారు సజీవంగానే సమాధి చేయ
బడ్తారని ఆశిస్తాను. ఎందుచేతనంటే వారు తమ
ఇండ్లలో అలాంటి దారుణ విషయాలకు పథకాలు
వేస్తారు.
16 నేను సహాయం కోసం దేవునికి మొరపెడతాను.
యెహోవా నాకు జవాబు ఇస్తాడు.
17 సాయంత్రం, ఉదయం, మధ్యాహ్నం నా ఆరోప
ణలు దేవునికి నేను చెబుతాను. ఆయన నా మాట
వింటాడు.
18 నేను చాలా యుద్ధాలు చేశాను. కానీ దేవుడు నన్ను
రక్షిస్తాడు. ప్రతి యుద్ధం నుండి క్షేమంగా ఆయన
నన్ను తిరిగి తీసుకొని వస్తాడు.
19 దేవుడు అనాది కాలంనుండి సింహాసనాసీనుడు.
నా మొర వింటాడు. ఆయన నా శత్రువులను
ఓడిస్తాడు. నా శత్రువులు వారి బతుకులు మార్చు
కోరు. వారు దేవునికి భయపడరు, గౌరవించరు.
20 నా స్నేహితుడు తన స్నేహితుల మీద దాడి చేసాడు.
అతడు తన ఒప్పందాన్ని నిలబెట్టుకోలేదు.
21 అతడు వెన్నవలె మెత్తగా మాట్లాడుతాడు. కాని
నిజానికి వాడు యుద్ధం తలపెడతాడు. వాని
మాటలు నూనె అంత నునుపుగా ఉంటాయి కాని
ఆ మాటలు కత్తిలా కోస్తాయి.
22 నీ చింతలన్నిటినీ యెహోవాకు అప్పగించు
ఆయన నీ విషయమై శ్రద్ధ పుచ్చుకుంటాడు.
మంచి మనుష్యులను ఎన్నడూ ఓడిపోనివ్వడు.
23 కాని దేవా! దుష్టులను దుర్నీతి అనే గుంటలోనికి
అణచివేస్తావు.
24 రక్తం చిందించే మనుష్యులు, విశ్వాసఘాతకులు
అర్థకాలమైనా జీవించరు. కానీ నేనైతే నీయందే
విశ్వ సిస్తాను.

## కీర్తన 56

*సంగీత నాయకునికి రాగం.*
*"దూరపు సింధూర వృక్షములోని పావురము"*
*ఫిలిష్తీయులు దావీదును గాతులో పట్టుకొన్నప్పుడు*
*అతడు రచించిన అనుపదగీతం.*

1 దేవా , ప్రజలు నా మీద దాడి చేస్తారు గనుక
నాకు దయ చూపించుము. రాత్రింబగళ్లు వారు
నన్ను తరుముతూ పోరాడుతున్నారు.
2 నా శత్రువులు రోజంతా నా మీద దాడి చేసారు.
నాకు విరోధంగా పోరాడేవారు అనేకులు.
3 నేను భయపడినప్పుడు నేను నిన్ను నమ్ము
కొంటాను.
4 నేను దేవుని నమ్ముకొన్నాను. కనుక నేను భయ
పడను. మనుష్యులు నన్ను బాధించలేరు. దేవుడు
నాకు ఇచ్చిన వాగ్దానం కోసం నేనాయనను
స్తుతిస్తాను.
5 నా శత్రువులు ఎల్లప్పుడూ నా మాటలు మెలి
తిప్పుతున్నారు. వారు ఎల్లప్పుడూ నాకు విరో
ధంగా చెడు పథకాలు వేస్తున్నారు.

6 వారంతా కలసి దాక్కొని నా ప్రతీ కదలికనూ గమనిస్తున్నారు. నన్ను చంపుటకు ఏదో ఒక మార్గం కోసం ఎదురు చూస్తున్నారు.
7 దేవా, వారిని తప్పించుకోనియ్యకుము, వారు చేసే చెడ్డ పనుల నిమిత్తం వారిని శిక్షించుము.
8 నేను చాలా కలవరపడిపోయానని నీకు తెలుసు. నేను ఎంతగా ఏడ్చానో నీకు తెలుసు నిజంగా నీవు నా కన్నీళ్ల లెక్క వ్రాసే ఉంటావు.
9 కనుక సహాయం కోసం నేను నీకు మొర పెట్టి నప్పుడు నా శత్రువులు ఓడింపబడతారు. ఇది నాకు తెలుసు. ఏమంటే, దేవుడు నాతో ఉన్నాడు.
10 దేవుడి వాగ్దానం కోసం నేను ఆయనను స్తుతి స్తాను. యెహోవా నాకు చేసిన వాగ్దానం కోసం నేను ఆయనను స్తుతిస్తాను.
11 నేను దేవుని నమ్ముకొన్నాను అందుచేత నేను భయపడను. మనుష్యులు నన్ను బాధించలేరు.
12 దేవా, నేను నీతో ప్రత్యేక ప్రమాణం చేసాను. దాన్ని నెరవేరుస్తాను. నా కృతజ్ఞతార్పణ నేను నీకు యిస్తాను.
13 ఎందుకంటే మరణం నుండి నీవు నన్ను రక్షించావు. నేను ఓడిపోకుండా నీవు కాపాడావు. కనుక బతికి ఉన్న మనుష్యులు మాత్రమే చూడగల వెలుగులో నేను దేవుని ఆరాధిస్తాను.

## కీర్తన 57

***సంగీత నాయకునికి . "నాశనం చేయవద్దు." దావీదు అనుపదగీతం. గుహలో సౌలు నుండి అతడు పారిపోయినప్పటిది.***

1 దేవా, నన్ను కరుణించు నా ఆత్మ నిన్నే నమ్ముకొన్నది గనుక దయ చూపించుము. కష్టం దాటి పోయేవరకు నేను నీ శరణు జొచ్చియున్నాను.
2 మహోన్నతుడైన దేవునికి సహాయం కోసం నేను ప్రార్థించాను. దేవుడు నా విషయమై సంపూర్ణ జాగ్రత్త తీసుకొంటాడు.
3 పరలోకము నుండి ఆయన నాకు సహాయం చేసి, నన్ను రక్షిస్తాడు. నన్ను ఇబ్బందిపెట్టే మనుష్యులను ఆయన ఓడిస్తాడు. దేవుడు తన నిజమైన ప్రేమను నాకు చూపిస్తాడు.
4 నా జీవితం ప్రమాదంలో ఉంది. నా శత్రువులు నా చుట్టూరా ఉన్నారు. ఈటెలు, బాణాలు వంటి పదునైన పళ్లు, ఖడ్గంలా పదునైన నాలుకలుగల మనుష్యులను తినే సింహాల్లా వారున్నారు.
5 దేవా నీవు ఆకాశాలకంటె ఎత్తుగా హెచ్చింపబడ్డావు. నీ మహిమ భూమిని ఆవరించి ఉంది.
6 నా శత్రువులు నాకు ఉచ్చు వేసారు. వారు నన్ను ఉచ్చులో పట్టుకోవాలని చూస్తున్నారు. నేను పడుటకు వారు గొయ్యి తవ్వారు. కాని వారే దానిలో పడ్డారు.
7 దేవా, నిన్ను విశ్వసించటంలో నా హృదయం నిబ్బరంగా వున్నది. నేను ఆయనకు స్తుతులు పాడుతాను.
8 నా ఆత్మా, మేలుకోనుము! స్వరమండలమా, సితారా, మేలుకోండి వేకువను మనం మేల్కొందాము
9 నా ప్రభూ, నేను నిన్ను ప్రతి ఒక్కరి వద్దా స్తుతిస్తాను. ప్రతీ జనంలో నేను నిన్ను గూర్చిన స్తుతి గీతాలు పాడుతాను.
10 నీ నిజమైన ప్రేమ ఆకాశంలో కెల్లా అత్యున్నత మేఘాలకంటె ఎత్తయింది.
11 ఆకాశాలకంటె దేవుడు ఎక్కువగా ఘనపర్చబడ్డాడు. ఆయన మహిమ భూమి మీద నిండి పోయింది.

## కీర్తన 58

***సంగీత నాయకునికి. "నాశనం చేయవద్దు." దావీదు అనుపదగీతం.***

1 న్యాయమూర్తుల్లారా, మీరు మీ నిర్ణయాల్లో న్యాయంగా ఉండటంలేదు. మీరు ప్రజలకు న్యాయంగా తీర్పు చెప్పటంలేదు.
2 లేదు, మీరు చేయగల కీడును గూర్చి మాత్రమే మీరు తలుస్తారు. ఈ దేశంలో మీరు బలాత్కారపు నేరాలే చేస్తారు.
3 ఆ దుర్మార్గులు తాము పుట్టగానే తప్పులు చేయటం మొదలు పెట్టారు. పుట్టినప్పటి నుండి వారు అబద్ధికులే.
4 వారు సర్పాలంత ప్రమాదకరమైన వాళ్లు. విన తలచని తాచుపాముల్లా, ఆ దుర్మార్గులు సత్యాన్ని వినేందుకు నిరాకరిస్తారు.
5 తాచుపాములు సంగీతంగాని, పాములను ఆడించే వాని నాగ స్వరంగాని వినవు. ఆ దుర్మార్గులు అలా ఉన్నారు.
6 యెహోవా, ఆ మనుష్యులు సింహాల్లా ఉన్నారు. కనుక యెహోవా, వారి పళ్లు విరుగగొట్టుము.
7 ఖాళీ అవుతున్న నీళ్లలా ఆ మనుష్యులు మాయమవుదురుగాక. బాటలోని కలుపు మొక్కల్లా వారు అణగదొక్కబడుదురు గాక.
8 మట్టిలో దూరిపోయే నత్తల్లా వారు ఉందురుగాక. చచ్చి పుట్టి, పగటి వెలుగు ఎన్నడూ చూడని శిశువులా వారు ఉందురు గాక.
9 కుండకింద వున్న నిప్పువేడిలో అతిత్వరగా కాలిపోయే ముళ్లకంపలా వారు వెంటనే నాశనం చేయబడుదురు గాక.
10 మనుష్యులు తమకు చేసిన చెడు పనుల నిమిత్తం వారికి శిక్ష విధించబడినప్పుడు మంచివాడు సంతో

షిస్తాడు. ఆ దుర్మార్గుల రక్తంలో అతడు తన
పాదాలు కడుగుకొంటాడు.
11 అది జరిగినప్పుడు, ప్రజలు ఇలా అంటారు: "మంచి
మనుష్యులకు నిజంగా ప్రతిఫలం కలిగింది. లోకా
నికి తీర్పు తీర్చే దేవుడు నిజంగానే ఉన్నాడు."

## కీర్తన 59

***సంగీత నాయకునికి ."నాశనం చేయవద్దు." దావీదు అనుపదగీతం. దావీదును చంపేందుకు అతని యింటిని చూచి రమ్మని సౌలు తన మనుష్యులను పంపిన సందర్భం.***

1 దేవా, నా శత్రువుల నుండి నన్ను రక్షించుము
నాతో పోరాడేందుకు నా మీదికి వచ్చేమనుష్యులను
జయించేందుకు నాకు సహాయం చేయుము.
2 కీడు చేసే మనుష్యుల నుండి నన్ను రక్షించుము.
ఆ నరహంతకుల నుండి నన్ను రక్షించుము.
3 చూడు బలాఢ్యులు నా కోసం కనిపెట్టి ఉన్నారు.
నన్ను చంపేందుకు వారు కనిపెట్టుకున్నారు. నేను
పాపం చేసినందువలన లేక ఏదో నేరం చేసినందు
వలన కాదు.
4 వారు నన్ను తరుముతున్నారు. నేను మాత్రం ఏ
తప్పు చేయలేదు. యెహోవా, వచ్చి నీ మట్టుకు
నీవే చూడు!
5 నీవు సర్వశక్తిమంతుడవైన దేవుడవు, ఇశ్రాయేలీ
యుల దేవుడవు. లేచి జనాంగములన్నిటినీ శిక్షిం
చుము. ఆ దుర్మార్గపు ద్రోహులకు ఎలాంటి
దయా చూపించకుము.
6 ఆ దుర్మార్గులు సాయంకాలం పట్టణములోకి
వస్తారు. వారు మొరిగే కుక్కల్లా పట్టణమంతా తిరుగు
తారు.
7 వారి బెదరింపులు, అవమానాలు వినుము. వారు
అలాంటి క్రూరమైన సంగతులు చెబుతారు.
వాటిని వింటున్నది ఎవరో వారికి అనవసరం.
8 యెహోవా, వారిని చూసి నవ్వుము. ఆ జనాలను
గూర్చి ఎగతాళి చేయుము
9 దేవా, నీవే నా బలం, నేను నీకోసం కనిపెట్టు
కొన్నాను. దేవా, నీవే పర్వతాలలో ఎత్తయిన నా
క్షేమస్థానం.
10 దేవుడు నన్ను ప్రేమిస్తున్నాడు. జయించుటకు
ఆయనే నాకు సహాయం చేస్తాడు. నా శత్రువులను
జయించుటకు ఆయనే నాకు సహాయం చేస్తాడు.
11 దేవా, వారిని ఊరకనే చంపివేయకు. లేదా నా
ప్రజలు మరచిపోవచ్చును. నా ప్రభువా, నా సంరక్ష
కుడా, నీ బలంతో వారిని చెదరగొట్టి, వారిని
ఓడించుము.
12 ఆ దుర్మార్గులు శపించి ఆబద్ధాలు చెబుతారు. వారు
చెప్పిన విషయాలను బట్టి వారిని శిక్షించుము.
వారి గర్వం వారిని పట్టుకొనేలా చేయుము.
13 నీ కోపంతో వారిని నాశనం చేయుము. వారిని
పూర్తిగా నాశనం చేయుము. అప్పుడు యాకోబు
ప్రజలనూ, సర్వప్రపంచాన్నీ దేవుడు పాలిస్తున్నా
డని మనుష్యులు తెలుసుకొంటారు.
14 అప్పుడు ఆ దుర్మార్గులు సాయంకాలం పట్టణం
లోకి వస్తే మొరిగే కుక్కల్లా పట్టణం అంతా తిరు
గుతూ ఉంటే
15 అప్పుడు వారు తినుటకు ఏమైనా దొరుకు
తుందని వెదకుతూ పోతారు. వారికి ఆహారం దొర
కదు. నిద్రించుటకంత స్థలం దొరకదు.
16 మరి నేను నీకు స్తుతి గీతాలు పాడుతాను. ఉద
యాలలో నీ ప్రేమయందు ఆనందిస్తాను. ఎందు
కంటే ఎత్తయిన పర్వతాలలో నీవే నా క్షేమ స్థానం,
కష్టాలు వచ్చినప్పుడు నేను నీ దగ్గరకు పరుగెత్తి
పోగలను.
17 నేను నీకు నా స్తుతిగీతాలు పాడుతాను. ఎందు
కంటే ఎత్తయిన పర్వతాలలో నీవే నా క్షేమస్థానం.
నీవు నన్ను ప్రేమించే దేవుడవు.

## కీర్తన 60

***సంగీత నాయకునికి. "ఒప్పందపు లిల్లి పుష్పం" రాగం. దావీదు అనుపదగీతం. ఉపదేశించదగినది. దావీదు అరమ్న హరాయీమీయులతోను, ఆరమోజబాయీలతోను యుద్ధం చేయగా యోవాబు ఉప్పు లోయలో 12,000 మంది ఎదోమీయులను చంపి తిరిగి వచ్చినప్పటిది.***

1 దేవా, నీవు మమ్మల్ని విడిచి పెట్టేశావు. నీవు
మమ్మల్ని ఓడించావు. మా మీద నీవు కోపగిం
చావు. దయచేసి మమ్ములను ఉద్ధరించుము.
2 భూమి కంపించి పగిలి తెరచుకొనేలా నీవు చేశావు.
మా ప్రపంచం పగిలిపోతోంది. దయచేసి దాన్ని
బాగు చేయుము.
3 నీ ప్రజలకు నీవు చాలాకష్టాలు కలిగించావు. తాగు
బోతు మనుష్యుల్లా మేము తూలి పడిపోతున్నాము.
4 నీకు భయపడే వారికి నీ సత్యమైన వాగ్దానాలను
స్థిరపరచుటకు ఒక ధ్వజమునెత్తావు.
5 నీ మహా శక్తిని ప్రయోగించి మమ్మల్ని రక్షించు,
నా ప్రార్థనకు జవాబు యిచ్చి, నీవు ప్రేమించే
ప్రజలను రక్షించుము.
6 దేవుడు తన ఆలయంలో నుండి* మాట్లాడు
తున్నాడు. "నేను గెలుస్తాను, ఆ విజయం గూర్చి
సంతోషిస్తాను. నా ప్రజలతో కలిసి ఈ దేశాన్ని

---

**దేవుడు ... నుండి** ఆయన ఆలయమునుండి లేదా "ఆయన
పరిశుద్ధతలో."

నేను పంచుకొంటాను. షెకెము, సుక్కోతు లోయ
లను నేను విభజిస్తాను.
7 గిలాదు, మనష్షే నాది. ఎఫ్రాయిము నా శిరస్త్రా
ణము. యూదా నా రాజదండము.
8 మోయాబును నా పాదాలు కడుక్కొనే పళ్లెంగా
నేను చేస్తాను. ఎదోము నా చెప్పులు మోసే
బానిసగా ఉంటుంది. ఫిలిష్తీ ప్రజలను నేను
ఓడిస్తాను.”
9 బలమైన భద్రతగల పట్టణానికి నన్ను ఎవరు తీసు
కొని వస్తారు? ఎదోముతో యుద్ధం చేయుటకు
నన్ను ఎవరు నడిపిస్తారు?
10 దేవా, వీటిని చేసేందుకు నీవు మాత్రమే నాకు
సహాయం చేయగలవు. కాని నీవు మమ్మల్ని విడిచి
పెట్టేసావు. దేవుడు మాతోను, మా సైన్యాలతోను
వెళ్లడు.
11 దేవా, మా శత్రువులను ఓడించుటకు సహాయం
చేయుము. మనుష్యులు మాకు సహాయం చేయ
లేరు.
12 కాని దేవుని సహాయంతో మేము జయించగలం.
దేవుడు మా శత్రువులను ఓడించగలడు.

## కీర్తన 61

*సంగీత నాయకునికి తంతి*
*వాయిద్యాలతో పాడదగిన దావీదు కీర్తన.*

1 దేవా, నా ప్రార్థనా గీతం వినుము. నా ప్రార్థన
ఆలకించుము.
2 నేను ఎక్కడ ఉన్నా ఎంత బలహీనంగా ఉన్నా,
సహాయం కోసం నీకు మొరపెడతాను. ఎత్తయిన
క్షేమస్థలానికి నన్ను మోసికొనిపొమ్ము.
3 నీవే నా క్షేమ స్థానం. నా శత్రువుల నుండి నన్ను
కాపాడే బలమైన గోపురం నీవే.
4 నీ గుడారంలో* నేను శాశ్వతంగా నివసిస్తాను.
నీవు నన్ను ఎక్కడ కాపాడగలవో అక్కడ దాక్కుం
టాను.
5 దేవా, నేను నీకిస్తానని చేసిన ప్రమాణం నీవు
విన్నావు. కాని నిన్ను ఆరాధించేవారికి ఉన్న
సమస్తం నీవద్ద నుండే వస్తుంది.
6 రాజుకు దీర్ఘాయుష్షు దయచేయుము. అతన్ని
శాశ్వతంగా జీవించనిమ్ము.
7 అతన్ని దేవుని ఎదుట శాశ్వతంగా జీవించనిమ్ము.
నీ నిజమైన ప్రేమతో మరియు విశ్వాసంతో అత
నిని కాపాడుము.
8 నేను నీ నామాన్ని శాశ్వతంగా స్తుతిస్తాను. నేను
ప్రమాణం చేసిన వాటిని ప్రతి రోజూ చేస్తాను.

**నీ గుడారంలో** యెరూషలేములోని పరిశుద్ధాలయము లేదా దేవాలయము కట్టుటకు ముందు పరిశుద్ధ గుడారములో దేవుడు ఆరాధింపబడ్డాడు.

## కీర్తన 62

*సంగీత నాయకునికి . యెదూతూను రాగం.*
*దావీదు కీర్తన.*

1 దేవుడు నన్ను రక్షించాలని నేను సహనంతో వేచి
వుంటాను.
2 దేవుడు నా కోట. దేవుడు నన్ను రక్షిస్తున్నాడు.
పర్వతం మీద ఎత్తయిన నా క్షేమస్థానం దేవుడే.
మహా సైన్యాలు కూడా నన్ను ఓడించలేవు.
3 ఇంకెంత కాలం నా మీద దాడి చేస్తూ ఉంటావు.
నేను ఒరిగిపోయిన గోడలా ఉన్నాను. పడిపోతున్న
కంచెలా ఉన్నాను.
4 ఆ మనుష్యులు నన్ను నాశనం చేయటానికి పథ
కాలు వేస్తున్నారు. వారు నన్ను గూర్చి అబద్ధాలు
చెబుతున్నారు. బహిరంగంగా వారు నన్ను గూర్చి
మంచి మాటలు చెబుతారు, కాని రహస్యంగా వారు
నన్ను శపిస్తారు.
5 దేవుడు నన్ను రక్షించాలని నేను సహనంతో వేచి
ఉన్నాను. దేవుడు ఒక్కడే నా నిరీక్షణ.
6 దేవుడు నా కోట. దేవుడు నన్ను రక్షిస్తాడు. పర్వతం
మీద ఎత్తయిన నా క్షేమ స్థానం దేవుడే.
7 నా మహిమా విజయం దేవుని నుండి వస్తుంది.
ఆయన నా బలమైన కోట. దేవుడు నా క్షేమ
స్థానం
8 ప్రజలారా, ఎల్లప్పుడూ దేవుని యందు నమ్మిక
ఉంచండి. మీ సమస్యలు దేవునితో చెప్పండి.
దేవుడే మన క్షేమ స్థానం.
9 మనుష్యులు నిజంగా సహాయం చేయలేరు. నిజంగా
సహాయం కోసం నీవు వారిని నమ్ముకోలేవు. వారు
గాలిబుడగల్లా వట్టి ఊపిరియే యున్నారు.
10 బలవంతంగా విషయాలను చేజిక్కించు కొను
టకు నీ శక్తిని నమ్ముకోవద్దు. దొంగిలించడం
ద్వారా నీకు ఏదైనా లాభం కలుగుతుందని తలచ
వద్దు. నీవు ధనికుడవైతే నీ సహాయం కోసం
ధనాన్ని నమ్ముకొన వద్దు.
11 నీవు నిజంగా ఆధారపడదగినది ఒకటి ఉన్నదని
దేవుడు చెబుతున్నాడు, “బలము దేవుని నుండే
వస్తుంది.”
12 నా ప్రభువా, నీ ప్రేమ నిజమైనది. ఒకడు చేసిన
వాటిని బట్టి నీవతనికి బహుమానం ఇస్తావు లేదా
శిక్షిస్తావు.

## కీర్తన 63

*దావీదు కీర్తన. అతడు యూదా అరణ్యంలో*
*ఉన్నప్పటిది.*

1 దేవా, నీవు నా దేవుడవు. నాకు నీవు ఎంతగానో
కావాలి. నా ఆత్మ, నా శరీరం నీళ్లులేక ఎండిపోయిన
భూమిలా నీకొరకు దాహంగొని ఉన్నాయి.

2 అవును, నీ ఆలయంలో నేను నిన్ను చూశాను.
నీ బలము నీ మహిమలను నేను చూశాను.
3 నీ ప్రేమ జీవం కన్నా గొప్పది. నా పెదాలు
నిన్ను స్తుతిస్తున్నాయి.
4 అవును, నా జీవితంలో నేను నిన్ను స్తుతిస్తాను.
నీ పేరిట నేను నా చేతులెత్తి నీకు ప్రార్థిస్తాను.
5 నేను శ్రేష్ఠమైన ఆహారం భుజించినట్లు నేను తృప్తి
పొందుతాను. నా నోరు నిన్ను స్తుతిస్తుంది.
6 నేను నా పడక మీద ఉండగా నిన్ను జ్ఞాపకం చేసు
కొంటాను. రాత్రి ఝాములలో నిన్ను నేను జ్ఞాపకం
చేసుకొంటాను.
7 నీవు నిజంగా నాకు సహాయం చేశావు. నీవు నన్ను
కాపాడినందుకు నేను సంతోషిస్తున్నాను.
8 నా ఆత్మ నిన్ను హత్తుకొంటుంది. నీ కుడిచెయ్యి
నన్నెత్తి పట్టుకొంటుంది.
9 కొంతమంది మనుష్యులు నన్ను చంపుటకు
ప్రయత్నిస్తున్నారు. కాని వారు నాశనం చేయబడ
తారు. వారు వారి సమాధుల్లోకి దిగిపోతారు.
10 ఖడ్గములతో వారు చంపబడతారు. అడవి కుక్కలు
వారి మృత దేహాలను తింటాయి.
11 అయితే రాజు తన దేవుని పట్ల సంతోషంగా
ఉంటాడు. ఆయనకు విధేయులుగా ఉంటామని
ప్రమాణంచేసిన మనుష్యులంతా ఆయనను స్తుతి
స్తారు. ఎందుకంటే ఆ అబద్ధికులందరినీ ఆయన
ఓడించాడు.

## కీర్తన 64

*సంగీత నాయకునికి. దావీదు కీర్తన.*

1 దేవా, నా ప్రార్థన ఆలకించుము. నా శత్రువులను
గూర్చి నేను భయపడుతున్నాను. నా ప్రాణమును
కాపాడుము.
2 నా శత్రువుల రహస్య పన్నాగాల నుండి నన్ను
కాపాడుము. ఆ దుర్మార్గుల బారి నుండి నన్ను
దాచి పెట్టుము.
3 వారు నన్ను గూర్చి ఎన్నో చెడ్డ అబద్ధాలు
చెప్పారు. వారి నాలుకలు వాడిగల కత్తులవలె
ఉన్నాయి, వారి కక్ష మాటలు బాణాల్లా ఉన్నాయి.
4 వారు దాక్కొని ఆ తరువాత తమ బాణాలను
సామాన్యమైన ఒక నిజాయితీ పరుని మీద వేస్తారు.
అతడు దానిని గమనించకముందే అతడు గాయ
పరచబడ్డాడు.
5 అతన్ని ఓడించుటకు వారు చెడ్డ పనులు చేస్తారు.
“వారు వారి ఉరులను పెడతారు.” వారిని ఎవరూ
పట్టుకోరని, చూడరని వారనుకొంటారు.
6 మనుష్యులు చాలా యుక్తిగా ఉండగలరు. మను
ష్యులు ఏమి తలస్తున్నారో గ్రహించటం ఎంతో
కష్టం.
7 కాని దేవుడు తన “బాణాలను” వారిమీద వేయ
గలడు. అది వారు గమనించకముందే దుర్మార్గులు
గాయపరచబడతారు.
8 దుర్మార్గులు ఇతరులకు కీడు చేయుటకు పథకం
వేస్తారు. కానీ దేవుడు వారి పథకాలను పాడుచేయ
గలడు. ఆ కీడు వారికే సంభవించేలా ఆయన
చేయగలడు. అప్పుడు వారిని చూసే ప్రతి ఒక్కరూ
ఆశ్చర్యంతో వారి తలలు ఊపుతారు.
9 దేవుడు చేసిన వాటిని మనుష్యులు చూస్తారు.
వారు దేవుని క్రియలను ప్రకటిస్తారు. అప్పుడు
ప్రతి ఒక్కరూ దేవుని గూర్చి ఎక్కువగా తెలిసి
కొంటారు. ఆయనకు భయపడి గౌరవించడం
వారు నేర్చుకొంటారు.
10 మంచివాళ్లు యెహోవా యందు సంతోషంగా
ఉండాలి. వారు ఆయన్ని నమ్ముకోవాలి. మంచి
మనుష్యులారా మీరంతా యెహోవాను
స్తుతించండి.

## కీర్తన 65

*సంగీత నాయకునికి. దావీదు స్తుతి కీర్తన.*

1 సీయోను మీద ఉన్న దేవా, నేను నిన్ను స్తుతి
స్తాను. నేను వాగ్దానం చేసిన వాటిని నేను నీకు
ఇస్తాను.
2 నీవు చేసిన వాటిని గూర్చి మేము చెబుతాము
మరియు నీవు మా ప్రార్థనలు వింటావు. నీ దగ్గరకు
వచ్చే ప్రతి మనిషి యొక్క ప్రార్థనలూ నీవు
వింటావు.
3 మా పాపాలు మేము భరించలేనంత భారమైన
ప్పుడు, ఆ పాపాలను నీవు తీసివేస్తావు.
4 దేవా, నీ ప్రజలను నీవు ఏర్పరచుకొన్నావు. నీ
ఆలయానికి వచ్చి నిన్ను ఆరాధించుటకు నీవు
మమ్మల్ని ఏర్పాటు చేసికొన్నావు. మాకు చాలా
సంతోషంగా ఉంది! నీ ఆలయంలో నీ పరిశుద్ధ
ఇంటిలో మాకన్నీ అద్భుత విషయాలే ఉన్నాయి.
5 దేవా, నీవు మమ్మల్ని రక్షించుము. మంచి మను
ష్యులు నిన్ను ప్రార్థిస్తారు. నీవు వారి ప్రార్థనలకు
జవాబిస్తావు. వారి కోసం నీవు ఆశ్చర్య కార్యాలు
చేస్తావు. ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు నిన్ను నమ్ము
కొంటారు.
6 దేవుడు తన మహా శక్తిని ఉపయోగించి పర్వ తాలను
చేశాడు. మనచుట్టూరా ఆయన శక్తిని చూడగలము.
7 ఘోషించే సముద్రాలను దేవుడు నిమ్మళింప
చేస్తాడు. మరియు ప్రపంచంలో ‘అనేకంగా’ ఉన్న
మనుష్యులందరినీ దేవుడు చేస్తాడు.
8 దేవుడు చేసే శక్తివంతమైన విషయాలకు భూమి
మీద ప్రతి మనిషీ భయపడతాడు. దేవా, నీవు

సూర్యుని ఉదయింపజేసి, అస్తమింపజేసే ప్రతి
చోటా ప్రజలు నిన్ను స్తుతిస్తారు.
9 నీవు భూమిని గూర్చి శ్రద్ధ తీసుకొంటావు. నీవు
దానికి నీరు పోస్తావు, అది దాని పంటలు పండించేలా
నీవు చేస్తావు. దేవా, నీవు కాలువలను నీళ్లతో
నింపుతావు. పంటలు పండింపచేస్తావు. నీవు దీనిని
ఇలా చేస్తావు
10 దున్నబడిన భూమి మీద వర్షం కురిసేటట్టు నీవు
చేస్తావు. భూములను నీవు నీళ్లతో నానబెడతావు.
నేలను నీవు వర్షంతో మెత్తపరుస్తావు. అప్పుడు
నీవు మొలకలను ఎదిగింపచేస్తావు.
11 కొత్త సంవత్సరాన్ని మంచి పంటతో నీవు ప్రారం
భింప చేస్తావు. బండ్లను నీవు అనేక పంటలతో
నింపుతావు.
12 ఆరణ్యము, కొండలు పచ్చగడ్డితో నిండి
పోయాయి.
13 పచ్చిక బయళ్లు గొర్రెలతో నిండిపోయాయి.
లోయలు ధాన్యంతో నిండిపోయాయి. పచ్చిక
బయళ్లు, లోయలు సంతోషంతో పాడుతున్న
ట్లున్నాయి.

## కీర్తన 66

***సంగీత నాయకునికి. ఒక స్తుతి కీర్తన.***

1 భూమి మీద ఉన్న సమస్తమా దేవునికి ఆనంద
ధ్వని చేయుము!
2 మహిమగల ఆయన నామాన్ని స్తుతించండి. స్తుతి
గీతాలతో ఆయనను ఘనపరచండి
3 ఆయన కార్యాలు అద్భుతమైనవి. ఆయనకు ఇలా
చెప్పండి. దేవా, నీ శక్తి చాలా గొప్పది. నీ శత్రు
వులు సాగిలపడతారు. వారికి నీవంటే భయం.
4 సర్వలోకం నిన్ను ఆరాధించుగాక. నీ నామము
నకు ప్రతి ఒక్కరూ స్తుతి కీర్తనలు పాడుదురు
గాక.
5 దేవుడు చేసిన అద్భుత విషయాలను చూడండి.
అవి మనల్ని ఆశ్చర్యపరుస్తాయి.
6 సముద్రాన్ని* ఆరిపోయిన నేలలా దేవుడు చేశాడు.
ఆయన ప్రజలు నదిని దాటి వెళ్లారు.* అక్కడ
వారు ఆయనపట్ల సంతోషించారు.
7 దేవుడు తన మహా శక్తితో ప్రపంచాన్ని పాలిస్తు
న్నాడు. సర్వత్రా మనుష్యులను దేవుడు గమనిస్తు
న్నాడు. ఏ మనిషీ ఆయన మీద తిరుగుబాటు
చేయలేడు.
8 ప్రజలారా మా దేవుని స్తుతించండి. స్తుతి కీర్తనలు
ఆయన కోసం గట్టిగా పాడండి.
9 దేవుడు మాకు ఆ జీవాన్ని ఇచ్చాడు. దేవుడు
మమ్మల్ని కాపాడుతాడు.
10 దేవుడు మమ్మల్ని పరీక్షించాడు. మనుష్యులు
నిప్పుతో వెండిని పరీక్షించునట్లు దేవుడు మమ్మల్ని
పరీక్షించాడు.
11 దేవా, నీవు మమ్మల్ని ఉచ్చులో పడనిచ్చావు.
భారమైన బరువులను నీవు మాపైన పెట్టావు.
12 మా శత్రువులను నీవు మా మీద నడువ నిచ్చావు.
అగ్నిగుండా, నీళ్ల గుండా నీవు మమ్మల్ని ఈడ్చావు.
కాని క్షేమ స్థలానికి నీవు మమ్మల్ని తీసుకొచ్చావు.
13-14 కనుక నేను నీ ఆలయానికి బలులు తీసు
కొస్తాను. నేను కష్టంలో ఉన్నప్పుడు నిన్ను నేను
సహాయం కోసం అడిగాను. నేను నీకు చాల
వాగ్దానాలు చేసాను. ఇప్పుడు, నేను వాగ్దానం చేసిన
వాటిని నీకు ఇస్తున్నాను.
15 నేను నీకు పాపపరిహారార్థ బలులు ఇస్తున్నాను.
నేను నీకు పొట్టేళ్లతో ధూపం* ఇస్తున్నాను. నేను
నీకు ఎద్దులను, మేకలను ఇస్తున్నాను.
16 దేవుని ఆరాధించే ప్రజలారా మీరంతా రండి.
దేవుడు నా కోసం ఏమి చేసాడో నేను మీతో
చెబుతాను.
17 నేను ఆయన్ని ప్రార్థించాను. నేను ఆయన్ని
స్తుతించాను.
18 నా హృదయం పవిత్రంగా ఉంది. కనుక నా
యెహోవా నా మాట విన్నాడు.
19 దేవుడు నా మొరను విన్నాడు. దేవుడు నా ప్రార్థన
విన్నాడు.
20 దేవుని స్తుతించండి! దేవుడు నాకు విముఖుడు
కాలేదు. ఆయన నా ప్రార్థన విన్నాడు. దేవుడు
తన ప్రేమను నాకు చూపించాడు!

## కీర్తన 67

***సంగీత నాయకునికి. వాయిద్యాలతో స్తుతి కీర్తన.***

1 దేవా మమ్ములను కనికరించి, మమ్ములను ఆశీర్వ
దించుము. దయచేసి మమ్ములను స్వీకరించుము.
2 దేవా, భూమి మీద ప్రతి మనిషినీ నిన్ను గూర్చి
తెలుసుకోనిమ్ము. నీవు మనుష్యులను ఎలా
రక్షిస్తావో ప్రతి దేశం నేర్చుకోనిమ్ము.
3 దేవా, ప్రజలు నిన్ను స్తుతించెదరుగాక! మనుష్య
లంతా నిన్ను స్తుతించెదరుగాక!
4 దేశాలన్నీ ఆనందించి, సంతోషించుగాక! ఎందు
కంటే నీవు మనుష్యులకు న్యాయంగా తీర్పు తీరు
స్తావు మరియు ప్రతి దేశాన్నీ నీవు పాలిస్తావు.

---

**సముద్రాన్ని** ఎర్ర సముద్రం నిర్గ. 14:21.

**నదిని దాటి వెళ్లారు** యెహోషువ 3:14-17.

**ధూపం** ఎండుచెట్టుయొక్క రసాన్ని కాల్చినప్పుడు సువాసన పొగవస్తుంది. ఇది దేవునికి కానుకగా ఇవ్వబడింది.

5 దేవా, ప్రజలు నిన్ను స్తుతించెదరు గాక! మనుష్య
లంతా నిన్ను స్తుతించెదరు గాక!
6 దేవా, మా దేవా, మమ్మల్ని దీవించుము. మా
భూమి మాకు గొప్ప పంట ఇచ్చేటట్టుగా
చేయుము.
7 దేవుడు మమ్మల్ని దీవించుగాక. భూమిమీద వున్న
ప్రతి ఒక్కరూ దేవునికి భయపడి, ఆయనను
గౌరవించెదరు గాక.

## కీర్తన 68

*సంగీత నాయకునికి. దావీదు స్తుతి కీర్తన.*

1 దేవా, లేచి నీ శత్రువులను చెదరగొట్టుము. ఆయన
శత్రువులు అందరూ ఆయన దగ్గర్నుండి పారి
పోయెదరుగాక!
2 గాలికి ఎగిరిపోయే పొగలా నీ శత్రువులు చెదరి
పోవుదురుగాక. అగ్నిలో మైనం కరిగిపోయేలా నీ
శత్రువులు నాశనం చేయబడుదురుగాక.
3 కాని మంచి మనుష్యులు సంతోషంగా ఉన్నారు.
మంచి మనుష్యులు దేవునితో కలసి సంతోషంగా
గడుపుతున్నారు. మంచి మనుష్యులు ఆనందం
అనుభవిస్తూ సంతోషంగా ఉన్నారు.
4 దేవుని స్తుతించండి. ఆయన నామమునకు
స్తుతులు పాడండి. ఆయనకు మార్గం సిద్ధపర
చండి. ఆరణ్యంలో ఆయన తన రథం మీద
వెళ్తాడు. ఆయన పేరు యాహ్.* ఆయన
నామాన్ని స్తుతించండి.
5 ఆయన పవిత్ర ఆలయంలో దేవుడు అనాధలకు
తండ్రిలా ఉన్నాడు. దేవుడు విధవరాండ్రను గూర్చి
జాగ్రత్త పుచ్చుకొంటాడు.
6 ఒంటరిగా ఉన్న మనుష్యులకు దేవుడు ఒక ఇంటిని
ఇస్తాడు. దేవుడు తన ప్రజలను కారాగారం నుండి
విడిపిస్తాడు. వారు చాలా సంతోషంగా ఉన్నారు.
కాని దేవునికి విరోధంగా తిరిగే మనుష్యులు
దహించు సూర్య వేడిమిగల దేశంలో నివసిస్తారు.
7 దేవా, నీ ప్రజలను నీవు ఈజిప్టు నుండి బయటకు
రప్పించావు. ఎడారిగుండా నీవు నడిచావు.
8 భూమి కంపించింది. దేవుడు, ఇశ్రాయేలీయుల
దేవుడు, సీనాయి కొండ మీదికి వచ్చాడు. మరియు
ఆకాశం కరిగిపోయింది.
9 దేవా, నీవు వర్షం కురిపించావు మరియు నిస్సార
మైన పాత భూమిని నీవు మరల బలపరిచావు.
10 నీ పశువులు ఆ దేశానికి తిరిగి వచ్చాయి. దేవా,
అక్కడ పేద ప్రజలకు నీవు ఎన్నో మంచి వాటిని
యిచ్చావు.

**యాహ్** ఇది హీబ్రూ భాషలో దేవునికున్న పేర్లలో ఒకటి.

11 దేవుడు ఆజ్ఞ ఇచ్చాడు. నా శుభవార్త చెప్పడానికి
అనేక మంది ప్రజలు వెళ్లారు.
12 "శక్తిగల రాజుల సైన్యాలు పారిపోతున్నాయి.
యుద్ధం నుండి సైనికులు తెచ్చే వస్తువులు ఇంటి
వద్ద స్త్రీలు పంచుకొంటారు. ఇంటి దగ్గర ఉండి
పోయిన మనుష్యులు ఆ ఐశ్వర్యాలను పంచు
కొంటారు.
13 వారు పావురపు రెక్కలకు వెండిపూత పూస్తారు.
ఆ రెక్కలను వారు బంగారు పూతతో తళ తళ
మెరిపిస్తారు."
14 సల్మోను కొండ మీద శత్రురాజులను దేవుడు
చెదరగొట్టాడు. వారు పడిపోతున్న మంచులా
ఉన్నారు.
15 బాషాను పర్వతం చాలా గొప్ప పర్వతం, బాషాను
పర్వతానికి ఎన్నో శిఖరాలు ఉన్నాయి.
16 బాషాను పర్వతమా, నీవేల సీయోను కొండను
చిన్న చూపు చూస్తున్నావు? దేవుడు ఆ కొండను
ప్రేమిస్తున్నాడు. యెహోవా తాను శాశ్వతంగా
అక్కడ నివసించాలని నిర్ణయించుకొన్నాడు.
17 యెహోవా పరిశుద్ధమైన సీయోను కొండకు వస్తు
న్నాడు. ఆయన వెనుక ఆయన రథాలు లక్షలాదిగా
ఉన్నాయి.
18 ఆయన ఎత్తయిన చోట్లకు వెళ్లాడు. ఆయన తన
బందీల బృందాలను నడిపించాడు. ఆయన మను
ష్యులనుండి అనగా ఆయనను వ్యతిరేకించిన ప్రజల
నుండి కూడ కానుకలు తీసుకొన్నాడు.*
19 యెహోవాను స్తుతించండి. మనం మోయాల్సిన
బరువులు మోయటంలో ప్రతిరోజూ ఆయన
మనకు సహాయం చేస్తాడు. దేవుడు మనల్ని
రక్షిస్తాడు.
20 ఆయనే మన దేవుడు. ఆయనే మనలను రక్షించే
దేవుడు. మన యెహోవా దేవుడు మనల్ని మరణం
నుండి రక్షిస్తాడు.
21 దేవుడు తన శత్రువులను ఓడించినట్టు చూపి
స్తాడు.* దేవుడు తనకు విరోధంగా పోరాడిన వారిని
శిక్షిస్తాడు.
22 నా ప్రభువు ఇలా చెప్పాడు: "శత్రువును తిరిగి
బాషాను నుండి నేను రప్పిస్తాను. సముద్రపు
లోతుల నుండి శత్రువును నేను రప్పిస్తాను.
23 కనుక నీవు వారి రక్తంలో నడువవచ్చు కనుక మీ
కుక్కలు వారి రక్తం నాకవచ్చు."

**కానుకలు తీసుకొన్నాడు** 'ఆయన మనుష్యులను కానుకగా స్వీకరించాడు" లేదా "ఆయన మనుష్యులకు కానుకల నిచ్చాడు". ఇది ప్రాచీన సిరియాక్ మరియు అరమేయిక్ తర్జుమాల ప్రకారం. ఎఫెసి. 4:8 చూడండి.

**దేవుడు ... చూపిస్తాడు** అక్షరార్థముగా దేవుడు తన శత్రువుల తలలను చితుకగొడతాడు.

24 విజయ ఊరేగింపును దేవుడు నడిపించటం ప్రజలు
చూస్తారు. నా పరిశుద్ధ దేవుడు, నా రాజు విజ
యంతో ఊరేగింపు నడిపించటం ప్రజలు
చూస్తారు.
25 గాయకులు ముందు నడుస్తారు. వారి వెనుక
వాయిద్య బృందం నడుస్తారు. మధ్యలో ఆడపడు
చులు తంబురలు వాయిస్తారు.
26 మహా సమాజంలో దేవుని స్తుతించండి. ఇశ్రాయేలు
ప్రజలారా, యెహోవాను స్తుతించండి.
27 చిన్న బెన్యామీను వారిని నడిపిస్తున్నాడు. యూదా
మహా వంశం అక్కడ ఉంది. జెబూలూను, నఫ్తాలి
నాయకులు అక్కడ ఉన్నారు.
28 దేవా, నీ శక్తి మాకు చూపించుము, దేవా, గత
కాలంలో మాకోసం నీవు ఉపయోగించిన నీ శక్తి
మాకు చూపించుము.
29 రాజులు వారి ఐశ్వర్యాలను నీ వద్దకు, యెరూష
లేములోని మందిరానికి తీసుకొని వస్తారు.
30 ఆ "జంతువులు" నీవు చెప్పినట్లు చేసేలా నీ
దండాన్ని ఉపయోగించుము. ఆ దేశాలలోని
"ఎద్దులు, ఆవులు" నీకు లోబడేలా చేయుము
ఆ రాజ్యాలను యుద్ధంలో నీవు ఓడించావు.
ఇప్పుడు వారు నీ వద్దకు వెండి తీసుకొని వచ్చు
నట్లు చేయుము.
31 వారు ఈజిప్టు నుండి ఐశ్వర్యం తీసుకొని వచ్చేలా
చేయుము. దేవా, ఇథియోపియా (కూషు) వారు
వారి ఐశ్వర్యాన్ని నీ వద్దకు తెచ్చేలా చేయుము.
32 భూ రాజులారా దేవునికి పాడండి. మన
యెహోవాకు స్తుతి కీర్తనలు పాడండి.
33 దేవునికి పాడండి. ప్రాచీన ఆకాశాలలో ఆయన
తన రథాల మీద పయనిస్తున్నాడు. ఆయన శక్తిగల
స్వరాన్ని ఆలకించండి.
34 మీ దేవుళ్లు అందరి కంటె యెహోవా ఎక్కువ
శక్తిగలవాడు. ఇశ్రాయేలీయుల దేవుడు తన
ప్రజలను బలపరుస్తాడు.
35 దేవుడు తన ఆలయంలో ఆశ్చర్యకరుడు. ఇశ్రాయే
లీయుల దేవుడు తన ప్రజలకు శక్తి, బలాన్ని
ఇస్తాడు. దేవుని స్తుతించండి.

## కీర్తన 69

*సంగీత నాయకునికి. "పుష్పాల రాగం."*
*దావీదు కీర్తన.*

1 దేవా, నా కష్టాలన్నిటి నుండీ నన్ను రక్షించుము.
నా నోటి వరకు నీళ్లు లేచాయి.
2 నిలబడి ఉండుటకు ఏదీ లేదు. నేను మునిగిపోతు
న్నాను. కింద బురదలోకి దిగజారిపోతున్నాను.
లోతైనజలాల్లో నేనున్నాను. అలలు నా చుట్టూకొ
ట్టుకొంటున్నాయి. నేను మునిగిపోబోతున్నాను.
3 సహాయం కోసం పిలిచి పిలిచి నేను బలహీనుడ
నౌతున్నాను. నా గొంతు నొప్పిగా ఉంది. నా
కళ్లకు నొప్పి కలిగినంతవరకు నేను నీ సహాయం
కోసం కని పెట్టి చూశాను.
4 నా తలపైగల వెంట్రుకల కంటే ఎక్కువ మంది
శత్రువులు నాకున్నారు. ఏ కారణం లేకుండానే
వారు నన్ను ద్వేషిస్తున్నారు. వారు నన్ను నాశనం
చేయడానికి గట్టిగా ప్రయత్నిస్తున్నారు. నా
శత్రువులు నన్ను గూర్చి అబద్ధాలు చెబుతున్నారు.
వారు అబద్ధమాడి నేను వస్తువులు దొంగిలించానని
చెప్పారు. ఆ తరువాత నేను దొంగిలించని వాటికి
నా చేత బలవంతంగా డబ్బు కట్టించారు.
5 దేవా, నేను ఏ తప్పు చేయలేదని నీకు తెలుసు.
నా పాపము నీ నుండి దాచి పెట్టబడలేదు.
6 నా దేవా, సర్వశక్తిమంతుడవైన యెహోవా, నా
మూలంగా నీ అనుచరులను సిగ్గుపడనియ్యకుము.
ఇశ్రాయేలీయుల దేవా, నా మూలంగా నీ ఆరాధ
కులను ఇబ్బంది పడనీయకుము.
7 నా ముఖం సిగ్గుతో నిండి ఉంది. నీ కోసం ఈ
సిగ్గును నేను భరిస్తాను.
8 నా సోదరులు నన్ను పరాయి వానిలా చూస్తారు.
నా తల్లి కుమారులు నన్నొక విదేశీయునిలా
చూస్తారు.
9 నీ ఆలయాన్ని గూర్చిన నా ఉత్సాహము నన్ను
దహించుచున్నది. నిన్ను ఎగతాళి చేసే మనుష్యుల
అవమానాలను నేను పొందుతున్నాను.
10 నేను ఉపవాసం ఉండి ఏడుస్తున్నాను. అందు
నిమిత్తం వారు నన్ను ఎగతాళి చేస్తున్నారు.
11 నా విచారాన్ని చూపించేందుకు నేను మోటు
బట్టలు ధరిస్తున్నాను. ప్రజలు నన్ను గూర్చి పరి
హాసాలు చెప్పుకొంటున్నారు.
12 బహిరంగ స్థలాల్లో వారు నన్ను గూర్చి మాట్లాడు
కొంటున్నారు. తాగుబోతులు నన్ను గూర్చి
పాటలు పాడుతున్నారు.
13 నా మట్టుకైతే యెహోవా, ఇదే నీకు నా ప్రార్థన.
నీవు నన్ను స్వీకరించాలని కోరుతున్నాను. దేవా,
ప్రేమతో నీవు నాకు జవాబు ఇవ్వాలని కోరు
తున్నాను.
14 బురదలో నుండి నన్ను పైకిలాగుము. బురద
లోకి నన్ను మునిగిపోనియ్యకు. నన్ను ద్వేషించే
మనుష్యుల నుండి నన్ను రక్షించుము. లోతైన
ఈ జలాల నుండి నన్ను రక్షించుము.
15 అలలు నన్ను ముంచివేయనీయకుము. లోతైన
అగాధం నన్ను మ్రింగివేయనీయకుము. సమాధి
తన నోరును నా మీద మూసికొననీయకుము.
16 యెహోవా, నీ ప్రేమ మంచిది. నీ ప్రేమ అంత
టితో నాకు జవాబు ఇమ్ము. నీ పూర్ణ దయతో
నాకు సహాయం చేయుటకు మళ్లుకోనుము.

17 నీ సేవకునికి విముఖుడవు కావద్దు. నేను కష్టంలో
ఉన్నాను. త్వరపడి నాకు సహాయం చేయుము.
18 వచ్చి నా ఆత్మను రక్షించుము. నా శత్రువులనుండి
నన్ను తప్పించుము.
19 నా అవమానం నీకు తెలుసు. నా శత్రువులు నన్ను
అవమాన పరిచారని నీకు తెలుసు. వారు నన్ను
కించపరచటం నీవు చూసావు.
20 సిగ్గు నన్ను కృంగదీసింది. అవమానం చేత నేను
చావబోతున్నాను. సానుభూతి కోసం నేను ఎదురు
చూశాను. కాని ఏమీ దొరకలేదు. ఎవరైనా నన్ను
ఆదరిస్తారని నేను ఎదురుచూశాను. కాని ఎవరూ
రాలేదు.
21 వారు నాకు భోజనం కాదు విషం పెట్టారు. ద్రాక్షా
రసానికి బదులుగా చిరకను వారు నాకు ఇచ్చారు.
22 వారి బల్లల మీద భోజన పానాలు పుష్కలంగా
ఉన్నాయి. విందులు జరుగుతుంటాయి. వారి భోజ
నాలే వారికి ఎక్కువ అగును గాక.
23 వారి కన్నులకు చీకటి కలిగి చూడలేక పోదురు
గాక! వారి నడుములు ఎడతెగకుండా వణుకునట్లు
చేయుము.
24 నీ కోపమును వారిపై కుమ్మరించుము. నీ భయం
కర కోపమును వారు సహించనిమ్ము.
25 వారి కుటుంబాలు, ఇండ్లు పూర్తిగా నాశనం చేయ
బడునుగాక.
26 నీవు వారిని శిక్షించుము. వారు పారిపోతారు.
అప్పుడు బాధను గూర్చివారు మాట్లాడుకుంటారు.
27 వారు చేసిన చెడ్డ పనులకు గాను వారిని శిక్షిం
చుము. నీవు ఎంత మంచి వాడవుగా ఉండగలవో
వారికి చూపించవద్దు.
28 జీవ గ్రంథంలో నుండి వారి పేర్లు తుడిచి
వేయుము. మంచి మనుష్యుల పేర్లతో పాటు
వారి పేర్లను గ్రంథంలో వ్రాయవద్దు.
29 నేను విచారంగాను, బాధతోను ఉన్నాను. దేవా
నన్ను లేవనెత్తుము. నన్ను రక్షించుము.
30 దేవుని నామమును కీర్తనతో నేను స్తుతిస్తాను. కృత
జ్ఞతా గీతంతో నేను ఆయన్ని స్తుతిస్తాను.
31 ఆబోతును వధించుట, జంతువునంతటిని బలి
అర్పించుటకంటె ఇది ఉత్తమము. ఇది దేవుణ్ణి
సంతోషింపజేస్తుంది.
32 పేద ప్రజలారా మీరు దేవుని ఆరాధించుటకు
వచ్చారు. పేద ప్రజలారా ఈ సంగతులను తెలుసు
కొనేందుకు మీరు సంతోషిస్తారు.
33 నిరుపేదల, నిస్సహాయ ప్రజల ప్రార్థన యెహోవా
ఆలకిస్తాడు. యెహోవా కారాగారంలో ఉన్న తన
వారిని విసర్జించడు.
34 ఆకాశమా, భూమీ, సముద్రమా, దానిలోని సమ
స్తమా, యెహోవాను స్తుతించండి.
35 యెహోవా సీయోనును రక్షిస్తాడు. యూదా పట్ట
ణాలను యెహోవా తిరిగి నిర్మిస్తాడు. ఆ భూమి
స్వంతదారులు మరల అక్కడ నివసిస్తారు.
36 ఆయన సేవకుల సంతతివారు ఆ దేశాన్ని పొందు
తారు. ఆయన నామాన్ని ప్రేమించే ప్రజలు అక్కడ
నివసిస్తారు.

## కీర్తన 70

***సంగీత నాయకునికి. ప్రజలు జ్ఞాపకం చేసికొనేందుకు సహాయంగా దావీదు కీర్తన.***

1 దేవా, నన్ను రక్షించుము. దేవా త్వరపడి నాకు
సహాయం చేయుము.
2 మనుష్యులు నన్ను చంపుటకు ప్రయత్నిస్తు
న్నారు. వారిని నిరాశపరచుము. వారిని అవమానిం
చుము. మనుష్యులు నాకు చెడు కార్యాలు చేయా
లని కోరుతున్నారు. వారు పడిపోయి సిగ్గు అనుభవి
స్తారని నా నిరీక్షణ.
3 మనుష్యులు నన్ను హేళన చేసారు. వారికి తగిన
దాన్ని పొందుతారని నా నిరీక్షణ.
4 నిన్ను ఆరాధించే ప్రజలంతా ఎంతో సంతోషంగా
ఉన్నారని నేను ఆశిస్తున్నాను. నీ మూలంగా రక్షించ
బడుటకు ఇష్టపడే మనుష్యులు ఎల్లప్పుడూ నిన్ను
స్తుతించగలుగుతారు.
5 నేను నిరుపేదని, నిస్సహాయుణ్ణి. దేవా, త్వరపడి!
వచ్చి నన్ను రక్షించుము. దేవా, నన్ను తప్పించగల
వాడవు నీవు ఒక్కడవు మాత్రమే. ఆలస్యం
చేయవద్దు!

## కీర్తన 71

1 యెహోవా, నేను నిన్ను నమ్ముకొన్నాను. కనుక
నేను ఎన్నటికీ నిరాశ చెందను.
2 నీ మంచితనాన్ని బట్టి నీవు నన్ను రక్షిస్తావు. నీవు
నన్ను తప్పిస్తావు. నా మాట వినుము. నన్ను
రక్షించుము.
3 భద్రత కోసం నేను పరుగెత్తి చేరగల గృహంగా,
నా కోటగా ఉండుము. నన్ను రక్షించుటకు ఆజ్ఞ
ఇమ్ము. నీవు నా బండవు కనుక నా క్షేమస్థానమై
ఉన్నావు.
4 నా దేవా, దుర్మార్గుల నుండి రక్షించుము. క్రూర
మైన దుర్మార్గుల నుండి నన్ను రక్షించుము.
5 నా ప్రభువా, నీవే నా నిరీక్షణ. నేను నా యౌవ్వన
కాలంనుండి నిన్ను నమ్ముకొన్నాను.
6 నేను పుట్టినప్పటినుండి నీమీదనే ఆధారపడ్డాను.
నా తల్లి గర్భమునుండి నీవు నన్ను జన్మింపజేశావు.
నేను ఎల్లప్పుడూ నిన్నే ప్రార్థించాను.
7 ఇతరులకు నేను మాదిరిగా ఉన్నాను. ఎందుకంటే
నీవే నా బలానికి ఆధారం.

8 నీవు చేసే అద్భుత కార్యాలను గూర్చి నేను ఎల్ల
ప్పుడూ పాడుతున్నాను.
9 కనుక నేను ముసలివాడినని నన్ను తోసివేయ
కుము. నా బలము క్షీణిస్తూండగా నన్ను విడిచి
పెట్టకుము.
10 నా శత్రువులు నిజంగా నాకు విరోధంగా పథకాలు
వేసారు. ఆ మనుష్యులు నిజంగా కలుసుకొని నన్ను
చంపుటకు పథకం వేసారు.
11 "దేవుడు అతన్ని విడిచిపెట్టేశాడు, వెళ్లి అతన్ని పట్టు
కోండి. అతనికి ఎవరూ సహాయం చేయరు" అని
నా శత్రువులు అంటున్నారు.
12 దేవా, నన్ను విడిచిపెట్టకుము. దేవా, త్వర
పడుము! వచ్చి నన్ను రక్షించుము.
13 నా శత్రువులను ఓడించుము. వారిని పూర్తిగా
నాశనం చేయుము. వారు నన్ను బాధించుటకు
ప్రయత్నిస్తున్నారు. వారు సిగ్గు, అవమానం అనుభ
విస్తారని నా నిరీక్షణ.
14 అప్పుడు నేను నిన్నే ఎల్లప్పుడూ నమ్ము
కొంటాను. నేను నిన్ను ఇంకా ఇంకా ఎక్కువగా
స్తుతిస్తాను.
15 నీవు ఎంత మంచివాడవో దానిని నేను ప్రజలకు
చెబుతాను. నీవు నన్ను రక్షించిన సమయాలను
గూర్చి నేను ప్రజలతో చెబుతాను. లెక్కించేందుకు
అవి ఎన్నెన్నో సమయాలు.
16 యెహోవా, నా ప్రభూ, నీ గొప్పతనాన్ని గూర్చి
నేను చెబుతాను. నిన్ను గూర్చి నీ మంచితనం
గూర్చి మాత్రమే నేను మాట్లాడుతాను.
17 దేవా, నేను చిన్న వానిగా ఉన్నప్పటి నుండి నీవు
నాకు నేర్పించావు. నీవు చేసే అద్భుత విషయా
లను గూర్చి ఈనాటివరకు నేను చెబుతూనే
ఉన్నాను.
18 దేవా, నేను తల నెరసిన వృద్ధుడుగా ఉన్నప్పుడు
కూడా నన్ను విడిచిపెట్టవని నాకు తెలుసు. నీ
శక్తి, గొప్పదనాలను గూర్చి ప్రతి కొత్త తరానికీ
నేను చెబుతాను.
19 దేవా, నీ మంచితనం ఆకాశాల కంటే ఎంతో ఉన్నత
మైనది. దేవా, నీ వంటి దేవుడు మరొకడు లేడు.
నీవు ఆశ్చర్యకర కార్యాలు చేశావు.
20 నన్ను నీవు అనేక కష్టాలను, ప్రయాసములను
చూడనిచ్చావు. కాని వాటిలో ప్రతి ఒక్క దాని
నుండీ నీవు నన్ను రక్షించావు. మరియు బ్రతికించి
ఉంచావు. భూమి లోతులనుండి కూడా నీవు నన్ను
తిరిగి పైకి తీస్తావు.
21 ఇదివరకటి కంటే గొప్ప కార్యాలు చేయుటకు
నాకు సహాయం చేయుము. నన్ను ఆదరిస్తూనే
ఉండుము.
22 స్వరమండలంతో నేను నిన్ను స్తుతిస్తాను. నా
దేవా, నీవు నమ్మదగిన వాడవని నేను పాడుతాను.
ఇశ్రాయేలీయుల పరిశుద్ధ దేవునికి నా సితారాతో
నేను పాటలు పాడుతాను.
23 నీవు నా ఆత్మను రక్షించావు. నా ఆత్మ సంతో
షంగా ఉంటుంది. నేను నా పెదవులతో స్తుతి కీర్త
నలు పాడుతాను.
24 అన్ని వేళలా నా నాలుక నీ మంచితనమును గూర్చి
పాడుతుంది. నన్ను చంపాలని కోరే ప్రజలు ఓడిం
చబడి అవమానం పొందుతారు.

## కీర్తన 72

**సొలొమోను కీర్తన.**

1 దేవా, రాజు నీవలె జ్ఞానముగల తీర్మానాలు చేయు
టకు సహాయం చేయుము. రాజకుమారుడు నీ
మంచి తనం గూర్చి నేర్చుకొనేందుకు సహాయం
చేయుము
2 నీ ప్రజలకు న్యాయంగా తీర్పు తీర్చేందుకు
రాజుకు సహాయం చేయుము. నీ పేద ప్రజలకు
ఏది మంచిదో దానిని చేయుటకు అతనికి
సహాయం చేయుము.
3 దేశం అంతటా శాంతి, న్యాయం ఉండనీయుము.
4 పేద ప్రజలకు రాజు న్యాయంగా ఉండునుగాక.
నిస్సహాయులకు అతణ్ణి సహాయం చేయనిమ్ము.
వారిని బాధించే ప్రజలను అతణ్ణి శిక్షించనిమ్ము.
5 సూర్యుడు ప్రకాశించునంత వరకు ఆకాశంలో
చంద్రుడు ఉన్నంత వరకు ప్రజలు రాజుకు భయ
పడి గౌరవిస్తారని ఆశిస్తున్నాను. ప్రజలు అతనికి
శాశ్వతంగా భయపడి గౌరవిస్తారని నేను ఆశి
స్తున్నాను.
6 పొలాల మీద కురిసే వర్షంలా రాజు ఉండునట్లు
అతనికి సహాయం చేయుము. నేలమీద పడే
జల్లులా ఉండుటకు అతనికి సహాయం చేయుము.
7 అతడు రాజుగా ఉండగా మంచితనం వికసించ
నిమ్ము. చంద్రుడున్నంతవరకు శాంతిని కొన
సాగనిమ్ము.
8 సముద్రం నుండి సముద్రానికి, నది నుండి భూమి
మీద దూర స్థలాలకు అతని రాజ్యాన్ని విస్తరింప
నిమ్ము.
9 అరణ్యంలో నివసించే ప్రజలను అతనికి సాగిలపడ
నిమ్ము అతని శత్రువులందరూ ధూళిలో వారి
ముఖాలు పెట్టుకొని అతని యెదుట సాగిల
పడనిమ్ము.
10 తర్షీషు రాజులు మరియు దూర తీరాల రాజులు
అతనికి కానుకలు సమర్పించుదురు గాక. షేబ

మరియు సెబా రాజులు అతనికి కప్పం చెల్లించెదరు గాక.
11 రాజులందరూ మన రాజుకు సాగిలపడుదురు గాక. రాజ్యాలన్నీ అతన్ని సేవించెదరు గాక.
12 మన రాజు సహాయం లేని వారికి సహాయం చేస్తాడు. మన రాజు పేదలకు, నిస్సహాయులకు సహాయం చేస్తాడు.
13 పేదలు, నిస్సహాయులు ఆయన మీద ఆధారపడ తారు. రాజు వారిని బతికించి ఉంచుతాడు.
14 వారిని బాధించుటకు ప్రయత్నించే క్రూరుల బారి నుండి రాజు వారిని రక్షిస్తాడు. ఆ పేద ప్రజల ప్రాణాలు రాజుకు చాలా ముఖ్యం.
15 రాజు దీర్ఘాయుష్మంతుడగును గాక. షేబ నుండి బంగారం అతడు తీసుకొనును గాక. రాజుకోసం ఎల్లప్పుడూ ప్రార్థించండి. ప్రతిరోజూ అతణ్ణి దీవించండి.
16 పొలాలు పుష్కలంగా ధాన్యం పండించునుగాక. కొండలు పంటలతో నిండిపోవునుగాక. పొలాలు లెబానోనులోని పొలాలవలె సారవంతంగా ఉండును గాక. పొలాలు గడ్డితో నిండి పోయినట్లు పట్టణాలు ప్రజలతో నిండిపోవును గాక.
17 రాజు శాశ్వతంగా ప్రసిద్ధినొందునుగాక. సూర్యుడు ప్రకాశించునంతవరకు ప్రజలు అతని పేరును జ్ఞాపకం చేసికొందురు గాక. అతని మూలంగా ప్రజ లందరూ ఆశీర్వదించబడుదురు గాక. మరియు వారందరూ అతన్ని దీవించెదరుగాక.
18 ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాను స్తుతిం చండి. అలాంటి అద్భుతకార్యాలు చేయగల వాడు దేవుడు ఒక్కడే.
19 ఆయన మహిమగల నామాన్ని శాశ్వతంగా స్తుతిం చండి. ఆయన మహిమ ప్రపంచమంతా వ్యాపిం చును గాక. ఆమేన్, ఆమేన్!
20 యెష్షయి కుమారుడు దావీదు ప్రార్థనలు ఇంత టితో సమాప్తం.

## మూడవ భాగం
## కీర్తన 73

**ఆసాపు స్తుతి కీర్తన.**

1 దేవుడు నిజంగా ఇశ్రాయేలీయుల యెడల మంచి వాడు. పవిత్ర హృదయాలు కల ప్రజలకు దేవుడు మంచివాడు.
2 నేను దాదాపుగా జారిపోయి, పాపం చేయటం మొదలుపెట్టాను.
3 దుర్మార్గులు సఫలమవటం నేను చూసాను. ఆ గర్విష్ఠులైన ప్రజలను గూర్చి నేను అసూయ పడ్డాను.
4 ఆ మనుష్యులు ఆరోగ్యంగా ఉన్నారు. వారు జీవించుటకు శ్రమపడరు.*
5 మేము కష్టాలు అనుభవిస్తున్నట్టు ఆ గర్విష్ఠులు కష్టాలు పడరు. ఇతర మనుష్యుల్లా వారికి కష్టాలు లేవు.
6 కనుక వారు చాలా గర్విష్ఠులు, ద్వేష స్వభావులు. వారు ధరించే అందమైన బట్టలు, నగలు ఎంత తేటగా ఉన్నాయో ఈ విషయం అంత తేట తెల్లం.
7 ఆ మనుష్యులకు కనబడింది ఏదైనా వారికి నచ్చితే వారు వెళ్లి దాన్ని తీసుకొంటారు. వారు కోరుకొన్న పనులు వారు చేస్తారు.
8 ఇతరులను గూర్చి క్రూరమైన చెడ్డ మాటలు వారు చెబుతారు. వారు ఇతరులను ఎగతాళి చేస్తారు. వారు గర్విష్ఠులు, మొండివారు, ఇతరులను వారు ఉపయోగించుకోటానికి ప్రయత్నిస్తారు.
9 ఆ గర్విష్ఠులు వారే దేవుళ్లని అనుకుంటారు. వారు భూమిని పాలించేవారని తలుస్తారు.
10 కనుక దేవుని ప్రజలు సహితం ఆ దుర్మార్గుల వైపు తిరిగి వారు చెప్పే సంగతులు నమ్ముతారు.
11 "మేము చేసే సంగతులు దేవునికి తెలియవు. సర్వో న్నతుడైన దేవునికి తెలియదు అని ఆ దుర్మార్గులు చెబుతారు."
12 ఆ గర్విష్ఠులు దుర్మార్గులు, ధనికులు. మరియు వారు ఎల్లప్పుడూ మరింత ధనికులౌతున్నారు.
13 కనుక నేనెందుకు ఇంకా నా హృదయాన్ని పవిత్రం చేసుకోవాలి? నేనెందుకు ఎల్లప్పుడూ నా చేతు లను పవిత్రం చేసుకోవాలి?
14 దేవా, రోజంతా నేను శ్రమ పడుతున్నాను. నీవేమో ప్రతి ఉదయం నన్ను శిక్షిస్తున్నావు.
15 ఈ సంగతులు నేను ఇతరులతో చెప్పాలని అను కొన్నాను. కాని దేవా, నేను నీ ప్రజలను ద్రోహంగా అప్పగిస్తానని నాకు తెలిసియుండినది.
16 ఈ సంగతులను నా మనస్సునందు గ్రహించుటకు నేను ప్రయత్నించాను. కాని నేను నీ ఆలయానికి వెళ్లేదాకా దానిని గ్రహించడం ఎంతో కష్టతరమైనది.
17 నేను దేవుని ఆలయానికి వెళ్లాను, వారి చివరి గమ్యాన్ని నేను గ్రహించాను.
18 దేవా, ఆ మనుష్యులను నీవు నిజంగా అపాయ కరమైన పరిస్థితిలో పెట్టావు. వారు పడిపోయి నాశనం అవడం ఎంతో సులభం.
19 కష్టం అకస్మాత్తుగా రావచ్చును. అప్పుడు ఆ దుర్మా ర్గులు నాశనం అవుతారు. భయంకరమైన సంగ తులు వారికి సంభవించవచ్చు. అప్పుడు వారు అంతమైపోతారు.

---

**వారు … శ్రమపడరు** అక్షరార్థముగా వారి మరణానికి బంధాలు లేవు.

20 యెహోవా, మేము మేల్కొన్నప్పుడు మరచి
పోయే కలవంటి వారు ఆ మనుష్యులు. మా
కలలో కనిపించే రాక్షసుల్లా ఆ మనుష్యులను నీవు
కనబడకుండా చేస్తావు.
21-22 నేను చాలా తెలివి తక్కువ వాడను. ధనికు
లను దుర్మార్గులను గూర్చి నేను తలంచి చాలా
తల్లడిల్లి పోయాను. దేవా , నేను నీ మీద కోపగించి
తల్లడిల్లి పోయాను. తెలివి తక్కువగాను, బుద్ధిలేని
పశువుగాను నేను ప్రవర్తించాను.
23 నాకు కావలసిందంతా నాకు ఉంది నేను ఎల్ల
ప్పుడూ నీతో ఉన్నాను. దేవా, నీవు నా చేయి
పట్టు కొనుము.
24 దేవా, నీవు నన్ను నడిపించి నాకు మంచి సలహా
ఇమ్ము. ఆ తరువాత మహిమలో నేను నీతో
ఉండుటకు నీవు నన్ను తీసుకొని వెళ్తావు.
25 దేవా, పరలోకంలో నాకు నీవు ఉన్నావు. మరియు
నేను నీతో ఉన్నప్పుడు భూమిమీద నాకు ఏమి
కావాలి?
26 ఒకవేళ నా మనస్సు,* నా శరీరం నాశనం చేయ
బడుతాయేమో. కాని నేను ప్రేమించే బండ*
నాకు ఉంది. నాకు శాశ్వతంగా దేవుడు ఉన్నాడు.
27 దేవా, నిన్ను విడిచిపెట్టే ప్రజలు తప్పిపోతారు.
నీకు నమ్మకంగా ఉండని మనుష్యులను నీవు
నాశనం చేస్తావు.
28 కాని నేను దేవునికి సన్నిహితంగా ఉన్నాను. దేవుడు
నా యెడల దయ చూపించాడు. నా యెహోవా
నా కోసం శ్రద్ధ తీసుకొంటాడు. నా ప్రభువైన
యెహోవా నా క్షేమస్థానం. దేవా, నీవు చేసిన
వాటన్నిటిని గూర్చి నేను చెబుతాను.

## కీర్తన 74

***ఆసాపు ధ్యాన గీతం.***

1 దేవా, నీవు మమ్మల్ని శాశ్వతంగా విడిచిపెట్టేశావా?
నీవు నీ ప్రజల మీద ఇంకా కోపంగా ఉన్నావా?
2 చాలా కాలం క్రిందట నీవు కొన్న ప్రజలను జ్ఞాపకం
చేసుకో. నీవు మమ్మల్ని రక్షించావు. మేము నీకు
చెందిన వాళ్లం. నీ నివాస స్థానమైన సీయోను
పర్వతాన్ని జ్ఞాపకముంచుకోనుము.
3 దేవా, నీవు వచ్చి ఈ పురాతన శిథిలాల మధ్య
నడువుము. శత్రువు నాశనం చేసిన పవిత్ర స్థలానికి
మరలా రమ్ము.
4 శత్రువులు ఆలయంలో యుద్ధపు కేకలు వేసారు.
యుద్ధంలో తాము గెలిచినట్లు చూపించుటకు
వారు జెండాలను ఆలయంలో ఉంచారు.
5 శత్రుసైనికులు గొడ్డలితో కలుపు మొక్కలను నరికే
మనుష్యుల్లా ఉన్నారు.
6 ఈ సైనికులు తమ గొడ్డళ్లను సమ్మెటలను
ప్రయోగించి దేవా, నీ ఆలయంలోని నగిషీ గల
చెక్క పనిని నరికివేశారు.
7 దేవా, ఆ సైనికులు నీ పవిత్ర స్థలాన్ని కాల్చివేశారు.
వారు నీ ఆలయాన్ని నేల మట్టంగా కూల్చివేశారు.
ఆ ఆలయం నీ నామ ఘనత కోసం నిర్మించ
బడింది.
8 శత్రువు మమ్మల్ని పూర్తిగా చితుకగొట్టాలని నిర్ణ
యించాడు. దేశంలోని ప్రతి ఆరాధనా స్థలాన్నీ
వారు కాల్చివేసారు.
9 మా సొంత గుర్తులు ఏవీ మేము చూడలేక
పోయాము. ఇంకా ప్రవక్తలు ఎవరూ లేరు. ఏమి
చేయాలో ఎవ్వరికీ తెలియదు.
10 దేవా, ఇకెంత కాలం శత్రువు మమ్మల్ని ఎగతాళి
చేస్తాడు? నీ శత్రువు నీ నామమును శాశ్వతంగా
అవమానించనిస్తావా?
11 దేవా, నీవెందుకు మమ్మల్ని అంత కఠినంగా
శిక్షించావు? నీవు నీ మహా శక్తిని ప్రయోగించి
మమ్మల్ని పూర్తిగా నాశనం చేశావు.
12 దేవా చాలా కాలంగా నీవే మా రాజువు. నీవు ఎల్ల
ప్పుడూ మమ్ములను విడుదలచేసి నీవు భూమిమీద
రక్షణ తెస్తావు.
13 దేవా, ఎర్ర సముద్రాన్ని పాయలు చేసేందుకు
నీవు నీ మహా శక్తిని ప్రయోగించావు.
14 మకరపు తలలను నీవు చితుకగొట్టావు. దాని శరీ
రాన్ని అడవి జంతువులు తినివేయుటకు విడిచి
పెట్టావు.
15 జల ఊటలను, భూగర్భ జలాన్ని నీవు తెరచి
ప్రపంచాన్ని వరదపాలు చేశావు. మరియు నదులు
ఎండిపోవునట్లు నీవు చేశావు.
16 దేవా, పగటిని నీవు ఏలుతున్నావు. మరియు
రాత్రిని నీవు ఏలుతున్నావు. సూర్యుని, చంద్రుని
నీవే చేశావు.
17 భూమి మీద ఉన్న సమస్తానికీ నీవే హద్దులు నియ
మించావు. వేసవికాలం, చలికాలం నీవే సృష్టించావు.
18 దేవా, ఈ సంగతులు జ్ఞాపకం చేసుకో. మరియు
శత్రువు నిన్ను అవమానించాడని జ్ఞాపకం చేసుకో.
ఆ తెలివి తక్కువ ప్రజలు నీ నామాన్ని ద్వేషిస్తారు.
19 దేవా, ఆ అడవి మృగాలను నీ పావురాన్ని* తీసు
కోనివ్వకుము. నీ పేద ప్రజలను శాశ్వతంగా మరచి
పోకుము.
20 నీ ఒడంబడికను జ్ఞాపకం చేసుకోనుము. ఈ దేశం
లోని ప్రతి చీకటి స్థలంలోనూ బలాత్కారమే ఉంది.

**మనస్సు** అక్షరార్థముగా "హృదయము."

**బండ** దేవుని సహాయం.

**పావురము** ఇశ్రాయేలీయుల జీవితానికి గురుతు.

21 దేవా, నీ ప్రజలకు అవమానం కలిగింది. వారిని
ఇంకెంత మాత్రం బాధపడనివ్వకుము. నిస్సహాయు
లైన నీ పేద ప్రజలు నిన్ను స్తుతిస్తారు.
22 దేవా, లేచి పోరాడుము. ఆ తెలివి తక్కువ ప్రజలు
ఎల్లప్పుడూ నిన్ను అవమానించారని జ్ఞాపకం
చేసుకోము.
23 ప్రతి రోజూ నీ శత్రువులు నిన్ను గూర్చి చెప్పిన
చెడు సంగతులు మరచిపోకుము. ఎడతెగక నీ
శత్రువులు చేసే గర్జనను మరువవద్దు.

## కీర్తన 75

***సంగీత నాయకునికి . "నాశనం చేయకు."***

***ఆసాపు స్తుతి కీర్తన.***

1 దేవా, మేము నిన్ను స్తుతిస్తున్నాము. మేము నీ
నామాన్ని స్తుతిస్తున్నాము. నీవు చేసే అద్భుత
కార్యాలను గూర్చి మేము చెబుతున్నాము.
2 దేవుడు ఇలా చెబుతున్నాడు: "తీర్పు సమయాన్ని
నేను నిర్ణయిస్తాను. న్యాయంగా నేను తీర్పు
తీరుస్తాను.
3 భూమి, దాని మీద ఉన్న సమస్తం కంపిస్తూ ఉన్న
ప్పుడు దాని పునాది స్థంభాలను స్థిర పరచేవాడను
నేనే."
4-5 "కొందరు మనుష్యులు చాలా గర్విష్ఠులు. తాము
శక్తిగల వారని, ప్రముఖులమని తలుస్తారు. కాని
'అతిశయ పడవద్దు' 'అంతగా గర్వపడవద్దు'." అని
నేను ఆ మనుష్యులతో చెబుతాను.
6 తూర్పునుండిగాని పడమరనుండిగాని ఎడారి నుండి
గాని వచ్చే ఎవరూ ఒక మనిషిని గొప్ప చేయలేరు.
7 దేవుడే న్యాయమూర్తి, ఏ మనిషి ప్రముఖుడో
దేవుడే నిర్ణయిస్తాడు. దేవుడు ఒక వ్యక్తిని ప్రముఖ
స్థానానికి హెచ్చిస్తాడు. ఆయనే మరొక వ్యక్తిని
తక్కువ స్థానానికి దించివేస్తాడు.
8 దుర్మార్గులను శిక్షించుటకు దేవుడు సిద్ధంగా
ఉన్నాడు. యెహోవా చేతిలో ఒక పాత్రవుంది.
అది ద్రాక్షారసంలో కలిసిన విషపూరితమైన మూలి
కలతో నిండివుంది. ఆయన ఈ ద్రాక్షారసాన్ని
(శిక్ష) కుమ్మరిస్తాడు. దుర్మార్గులు చివరి బొట్టు
వరకు దాన్ని తాగుతారు.
9 ఈ సంగతులను గూర్చి నేను ఎల్లప్పుడూ ప్రజ
లకు చెబుతాను. ఇశ్రాయేలీయుల దేవునికి నేను
స్తుతి పాడుతాను.
10 దుర్మార్గుల నుండి శక్తిని నేను తీసివేస్తాను. మంచి
మనుష్యులకు నేను శక్తినిస్తాను.

## కీర్తన 76

***సంగీత నాయకునికి. వాయిద్యాలతో.***

***ఆసాపు స్తుతి కీర్తన.***

1 యూదాలో ప్రజలు దేవుని ఎరుగుదురు. దేవుని
నామం నిజంగా గొప్పదని ఇశ్రాయేలుకు తెలుసు.
2 దేవుని ఆలయం షాలేములో* ఉంది. దేవుని
గృహం సీయోను కొండ మీద ఉంది.
3 అక్కడ విల్లులను, బాణాలను కేడెములను, కత్తు
లను ఇతర యుద్ధ ఆయుధాలను దేవుడు విరుగ
గొట్టాడు.
4 దేవా, నీవు నీ శత్రువులను ఓడించిన ఆ కొండల
నుండి తిరిగి వస్తూండగా నీవు ఎంతో మహిమతో
ఉన్నావు.
5 ఆ సైనికులు చాలా బలం కలవారని తలంచారు.
కాని యిప్పుడు వారు చచ్చి పొలాల్లో పడి ఉన్నారు.
వారికి ఉన్నదంతా వారి శరీరాల నుండి దోచుకో
బడింది. బలవంతులైన ఆ సైనికులలో ఒక్కరు
కూడా వారిని కాపాడుకోలేకపోయారు.
6 యాకోబు దేవుడు ఆ సైనికులను గద్దించాడు.
రథాలు, గుర్రాలుగల ఆ సైన్యం చచ్చిపడింది.
7 దేవా, నీవు భీకరుడవు. నీవు కోపంగా ఉన్నప్పుడు
ఏ మనిషి నీకు విరోధంగా నిలువలేడు.
8-9 యెహోవా న్యాయమూర్తిగా నిలిచి తన నిర్ణ
యాన్ని ప్రకటించాడు. దేశంలోని దీన ప్రజలను
దేవుడు రక్షించాడు. పరలోకం నుండి ఆయన
తీర్మానం ఇచ్చాడు. భూమి అంతా భయంతో
నిశ్శబ్దం అయ్యింది.
10 దేవా, నీవు దుర్మార్గులను శిక్షించినప్పుడు ప్రజలు
నిన్ను స్తుతిస్తారు. నీవు నీ కోపం చూపిస్తావు.
బతికి ఉన్నవారు మరింత బలంగలవారు అవుతారు.
11 ప్రజలారా! మీ దేవుడైన యెహోవాకు మీరు
వాగ్దానాలు చేశారు. ఇప్పుడు మీరు వాగ్దానం చేసిన
దాన్ని ఆయనకు ఇవ్వండి. అన్ని చోట్లనుండీ
ప్రజలు తాము భయపడే దేవునికి కానుకలు
తెస్తారు.
12 దేవుడు మహా నాయకులను ఓడిస్తాడు. భూలోక
రాజులందరూ ఆయనకు భయపడుతారు.

## కీర్తన 77

***సంగీత నాయకునికి. యెదూతూను రాగం.***

***ఆసాపు కీర్తన.***

1 సహాయం కోసం నేను దేవునికి గట్టిగా మొరపెడ
తాను. దేవా నేను నిన్ను ప్రార్థిస్తాను. నా ప్రార్థన
వినుము.
2 నా దేవా నాకు కష్టం వచ్చినప్పుడు నేను నీ
దగ్గరకు వస్తాను. రాత్రి అంతా నీకోసం నా చేయి
చాపి ఉన్నాను. నా ఆత్మ ఆదరణ పొందుటకు
నిరాకరించింది.

---

**షాలేము** యెరూషలేముకు మరియొక పేరు. దాని అర్థము "సమాధానము."

3 నేను దేవుని గూర్చి తలుస్తాను. నేనాయనతో
మాట్లాడుటకు, నాకు ఎలా అనిపిస్తుందో ఆయ
నతో చెప్పుటకు ప్రయత్నిస్తాను. కాని నేనలా
చేయలేను.
4 నీవు నన్ను నిద్రపోనియ్యవు. నేనేదో చెప్పాలని
ప్రయత్నించాను. కాని నేను చాలా కలవరపడి
పోయాను.
5 గతాన్ని గూర్చి నేను తలపోస్తూ ఉండిపోయాను.
చాలా కాలం క్రిందట సంభవించిన సంగతులను
గూర్చి నేను ఆలోచిస్తూ ఉండిపోయాను.
6 రాత్రివేళ నా పాటలను గూర్చి ఆలోచించుటకు
నేను ప్రయత్నిస్తాను. నాలో నేను మాట్లాడుకొని
గ్రహించుటకు ప్రయత్నిస్తాను.
7 "మా ప్రభువు మమ్మల్ని శాశ్వతంగా విడిచి పెట్టే
శాడా? ఆయన ఎన్నడైనా తిరిగి మమ్మల్ని కోరు
కొంటాడా?
8 దేవుని ప్రేమ శాశ్వతంగా పోయిందా? ఆయన
మరల ఎన్నడైనా మాతో మాట్లాడుతాడా?
9 కనికరం అంటే ఏమిటో దేవుడు మరచి పోయాడా?
ఆయన జాలి కోపంగా మార్చబడిందా" అని నాకు
అనిపిస్తుంది.
10 అప్పుడు నేను, "సర్వోన్నతుడైన దేవుడు తన
శక్తిని పోగొట్టుకున్నాడా? అనే విషయం నిజంగా
నన్ను బాధిస్తుంది" అని తలచాను.
11 యెహోవా చేసిన శక్తిగల కార్యాలు నేను జ్ఞాపకం
చేసుకొంటాను. దేవా, చాలా కాలం క్రిందట నీవు
చేసిన అద్భుత కార్యాలు నేను జ్ఞాపకం చేసు
కొంటాను.
12 నీవు చేసిన సంగతులన్నింటిని గూర్చి నేను ఆలో
చించాను. ఆ విషయాలను గూర్చి నేను
మాట్లాడాను.
13 దేవా, నీ మార్గాలు పవిత్రం. దేవా, ఏ ఒక్కరూ నీ
అంతటి గొప్పవారు కాలేరు.
14 నీవు అద్భుత కార్యాలు చేసిన దేవుడివి. నీవు నీ
మహా శక్తిని ప్రజలకు చూపెట్టావు.
15 నీవు నీ శక్తిని బట్టి నీ ప్రజలను రక్షించావు.
యాకోబు, యోసేపు సంతతివారిని నీవు
రక్షించావు.
16 దేవా, నీళ్లు నిన్ను చూచి భయపడ్డాయి. లోతైన
జలాలు భయంతో కంపించాయి.
17 దట్టమైన మేఘాలు వాటి నీళ్లను కురిపించాయి.
ఎత్తైన మేఘాలలో పెద్ద ఉరుములు వినబడ్డాయి.
అప్పుడు నీ మెరుపు బాణాలు ఆ మేఘాలలో
ప్రజ్వరిల్లాయి.
18 పెద్ద ఉరుముల శబ్దాలు కలిగాయి. మెరుపు ప్రపం
చాన్ని వెలిగించింది. భూమి కంపించి వణికింది.
19 దేవా, నీవు లోతైన జలాలలో నడుస్తావు. లోతైన
సముద్రాన్ని నీవు దాటి వెళ్లావు. కాని నీ అడుగుల
ముద్రలు ఏవీ నీవు ఉంచలేదు.
20 అదే విధంగా నీ ప్రజలను గొర్రెల వలె నడి
పించేందుకు మోషేను, అహరోనును నీవు వాడు
కొన్నావు.

## కీర్తన 78

***ఆసాపు ధ్యాన గీతం.***

1 నా ప్రజలారా నా ఉపదేశాలను వినండి. నేను
చెప్పే విషయాలు వినండి.
2 ఈ కథ మీతో చెబుతాను. ఈ పురాతన కథ
నేను మీతో చెబుతాను.
3 ఈ కథ మనం విన్నాము. ఇది మనకు బాగా
తెలుసు. మన తండ్రులు ఈ కథ మనకు చెప్పారు.
4 ఈ కథను మనము మరచిపోము. మన ప్రజలు
చివరి తరం వారి వరకు ఈ కథ చెబుతారు. మన
మంతా యెహోవాను స్తుతిద్దాము. ఆయన చేసిన
అద్భుత కార్యాలను గూర్చి చెబుదాము.
5 యాకోబుతో యెహోవా ఒక ఒడంబడికను చేసు
కున్నాడు. దేవుడు ఇశ్రాయేలీయులకు ధర్మ
శాస్త్రాన్ని ఇచ్చాడు. మన పూర్వీకులకు దేవుడు
ఆదేశాలు ఇచ్చాడు. మన పూర్వీకులు తమ సంతతి
వారికి న్యాయచట్టం బోధించాలని ఆయన వారితో
చెప్పాడు.
6 ఈ విధంగా ప్రజలు, చివరి తరంవారు సహా ధర్మ
శాస్త్రాన్ని తెలుసుకొంటారు. కొత్త తరాలు పుడు
తాయి వారు పెద్దవారిగా ఎదుగుతారు. వారు వారి
పిల్లలకు ఈ కథ చెబుతారు.
7 కనుక ఆ ప్రజలంతా దేవుని నమ్ముతారు. దేవుడు
చేసిన పనులను వారు మరచిపోరు. వారు ఆయన
ఆదేశాలకు జాగ్రత్తగా విధేయులవుతారు.
8 ఒక వేళ ప్రజలు తమ పిల్లలకు దేవుని ఆదేశాలు
ఉపదేశిస్తే, అప్పుడు ఆ పిల్లలు తమ పూర్వీకుల్లా
ఉండరు. వారి పూర్వీకులు దేవునికి విరోధంగా
తిరిగారు. వారు ఆయనకు విధేయులగుటకు తిర
స్కరిం చారు. ఆయన ఆజ్ఞలకు విధేయులగుటలో
వారు మొండి ప్రజలు.
9 ఎఫ్రాయిము కుటుంబ దళంలోని పురుషులు వారి
విసురు కర్రలు* కలిగి ఉన్నారు. కాని వారు
యుద్ధంలో నుండి పారిపోయారు.

---

**విసురు కర్రలు** ఇది ఒక వంకర కర్ర, పక్షులను చంపడానికి ఉపయోగిస్తారు. దీన్ని సరిగ్గా ప్రయోగిస్తే నేరుగా ఎగిరి, భూమికి వంగి, మరల గాలిలోకి ఒక్కసారిగా ఎగురగలరు. ఒక్కొక్కసారి ఇది మళ్లీ ప్రయోగించిన వానివద్దకే రాగలదు. అక్షరాలా విసురుడు బాణం.

10 వారు యెహోవాతో తమ ఒడంబడికను నిలుపు
కోలేదు. దేవుని ఉపదేశాలకు విధేయులగుటకు
వారు నిరాకరించారు.
11 ఎఫ్రాయిముకు చెందిన ఆ ప్రజలు దేవుడు చేసిన
గొప్ప కార్యాలను మరచిపోయారు. ఆయన వారికి
చూపించిన అద్భుతకార్యాలను వారు మరిచి
పోయారు.
12 ఈజిప్టులోను, సోయను వద్దను దేవుడు తన మహా
శక్తిని వారి తండ్రులకు చూపెట్టాడు.
13 దేవుడు ఎర్ర సముద్రాన్ని పాయలుగా చీల్చి
ప్రజలను దాటించాడు. వారికి రెండు వైపులా నీళ్లు
బలమైన గోడల్లా నిలబడ్డాయి.
14 ప్రతిరోజూ మేఘం నీడలో దేవుడు ఆ ప్రజలను
నడిపించాడు. ప్రతిరాత్రి అగ్ని స్తంభం నుండి వచ్చే
వెలుగు చేత దేవుడు వారిని నడిపించాడు.
15 అరణ్యంలో దేవుడు బండను చీల్చాడు. భూమి
అగాధం నుండి ఆ ప్రజలకు ఆయన నీళ్లు ఇచ్చాడు.
16 బండ నుండి దేవుడు నీళ్లను ప్రవహింప చేసాడు.
అది ఒక నదిలా ఉంది.
17 కాని ప్రజలు దేవునికి విరోధంగా పాపం చేస్తూనే
పోయారు. అరణ్యంలో కూడ సర్వోన్నతుడైన
దేవు నికి వారు విరోధంగా తిరిగారు.
18 అప్పుడు ఆ ప్రజలు దేవుని పరీక్షించాలని తీర్మా
నించారు. కేవలం వారి ఆకలిని తృప్తి పరచుటకు
ఆహారం కోసం వారు దేవుని అడిగారు.
19 వారు దేవునికి విరోధంగా మాట్లాడారు. "ఎడారిలో
దేవుడు మనకు ఆహారం ఇవ్వగలడా?
20 దేవుడు బండను కొట్టాడు. కాగా నీళ్ల ప్రవాహం
బయటకు వచ్చింది. తప్పక ఆయన మనకు
కొంత రొట్టె, మాంసం ఇవ్వగలడు" అని
వారన్నారు.
21 ఆ ప్రజలు చెప్పింది యెహోవా విన్నాడు.
యాకోబు* మీద దేవునికి చాలా కోపం వచ్చింది.
ఇశ్రాయేలు మీద దేవునికి చాలా కోపం వచ్చింది.
22 ఎందుకంటే ఆ ప్రజలు ఆయనయందు నమ్మక
ముంచలేదు. దేవుడు వారిని రక్షించగలడని వారు
విశ్వసించలేదు.
23-24 కాని అప్పుడు దేవుడు పైన మేఘాలను తెరి
చాడు. వారికి ఆహారంగా ఆయన మన్నా కురిపిం
చాడు. అది ఆకాశపు ద్వారాలు తెరచినట్టు ఆకా
శంలోని ధాన్యా గారం నుండి ధాన్యం పోసినట్టు
ఉంది.
25 ప్రజలు దేవదూతల ఆహారం తిన్నారు. ఆ ప్రజ
లను తృప్తిపరచుటకు దేవుడు సమృద్ధిగా ఆహారం
పంపించాడు.
26-27 అంతట దేవుడు తూర్పు నుండి ఒక బలమైన
గాలి వీచేలా చేశాడు. వర్షం కురిసినట్లుగా పూరేళ్లు*
వారిమీద వచ్చి పడ్డాయి. దేవుని మహా శక్తి తేమాను
నుండి గాలి వీచేలా చేసింది. ఆ పక్షులు చాలా
విస్తారంగా ఉండినందుచేత నీలాకాశం నల్లగా మారి
పోయింది.
28 ఆ ప్రజల గుడారాల చుట్టూరా, వారి ఇండ్ల మధ్యలో
ఆ పక్షులు వచ్చి పడ్డాయి.
29 తినేందుకు వారికి సమృద్ధిగా ఉంది. కాని తమ
ఆకలి తమని పాపం చేసేలా వారు చేసుకున్నారు.
30 వారు వారి ఆకలిని అదుపులో పెట్టుకోలేదు. అందు
చేత ఆ పక్షుల రక్తం కార్చివేయక ముందే వారు
ఆ పూరేళ్లను తినివేసారు.
31 ఆ ప్రజల మీద దేవునికి చాలా కోపం వచ్చింది
వారిలో అనేక మందిని ఆయన చంపివేసాడు.
ఆరోగ్యవంతులైన అనేకమంది పడుచువాళ్లు చచ్చే
టట్టుగా దేవుడు చేశాడు.
32 కాని ఆ ప్రజలు యింకా పాపం చేశారు. దేవుడు
చేయగల ఆశ్చర్యకరమైన విషయాల మీద వారు
ఆధారపడలేదు.
33 కనుక దేవుడు వారి పనికిమాలిన జీవితాలను ఏదో
విపత్తుతో అంతం చేశాడు.
34 దేవుడు వారిలో కొందరిని చంపినప్పుడల్లా మిగి
లిన వారు ఆయన వైపుకు మళ్లుకొన్నారు. వారు
పరుగెత్తుకుంటూ దేవుని దగ్గరకు తిరిగి వచ్చారు.
35 దేవుడే తమ బండ అని ఆ ప్రజలు జ్ఞాపకం చేసు
కొంటారు. సర్వోన్నతుడైన దేవుడే తమని రక్షిం
చాడని వారు జ్ఞాపకం చేసుకొంటారు.
36 వారు ఆయన్ని ప్రేమిస్తున్నామని అన్నారు, కాని
వారి మాట నిజంకాదు. వారు అబద్ధం చెప్పారు.
37 వారి హృదయాలు నిజంగా దేవునితో లేవు. వారు
ఒడంబడికకు నమ్మకంగా లేరు.
38 కాని దేవుడు దయకలిగినవాడు. వారి పాపాల విష
యంలో ఆయన వారిని క్షమించాడు. ఆయన
వారిని నాశనం చేయలేదు. అనేకసార్లు దేవుడు
తన కోపాన్ని అణచుకొన్నాడు. దేవుడు తనకు
మరీ ఎక్కువ కోపాన్ని రానీయలేదు.
39 వారు కేవలం మనుష్య మాత్రులే అని దేవుడు
జ్ఞాపకం చేసుకొన్నాడు. మనుష్యులు అప్పుడే వీచి,
అంతలోనే మాయమై పోయే గాలి వంటివారు.
40 అయ్యో, ఎడారిలో ఆ ప్రజలు దేవునికి అనేక
తొందరలు కలిగించారు. ఆ ఎడారి దేశంలో వారు
ఆయన్ని ఎంతో దుఃఖ పెట్టారు.
41 ఆ ప్రజలు దేవుని సహనాన్ని మరలా మరలా
పరీక్షించారు. ఇశ్రాయేలీయుల పరిశుద్ధునికి నిజంగా
వారు ఎంతో బాధ కలిగించారు.

**యాకోబు** ఇశ్రాయేలుకు మరో పేరు.

**పూరేళ్లు** ఒక విధమైన పక్షి.

42 ఆ ప్రజలు దేవుని శక్తిని గూర్చి మరచిపోయారు
శత్రువు బారినుండి దేవుడు తమని అనేకసార్లు
రక్షించిన విషయం వారు మరచిపోయారు.
43 ఈజిప్టులో ఆయన చేసిన అద్భుతాలను వారు
మరచిపోయారు. సోయను పొలాలలో జరిగిన
అద్భుతాలను వారు మరచిపోయారు.
44 నదులను దేవుడు రక్తంగా మార్చాడు! ఈజిప్టు
వారు నీళ్లు తాగలేకపోయారు.
45 ఈజిప్టు ప్రజలను కుట్టిన జోరీగల దండులను
దేవుడు పంపించాడు. ఈజిప్టు వారి బ్రతుకులను
పాడు చేయగలిగిన కప్పలను దేవుడు పంపించాడు.
46 దేవుడు వారి పంటలను చీడ పురుగులకు అప్ప
గించాడు. వారి ఇతర మొక్కలను మిడతలకు అప్ప
గించాడు.
47 ఈజిప్టు వారి ద్రాక్షాతీగెలను నాశనం చేయటానికి
దేవుడు వడగండ్లను వాడుకొన్నాడు. వారి చెట్లను
నాశనం చేయుటకు ఆయన హిమమును వాడు
కొన్నాడు.
48 దేవుడు వారి జంతువులను వడగండ్ల చేతను వారి
పశువులను పిడుగుల చేతను చంపేశాడు.
49 దేవుడు తన భయంకరమైన కోపాన్ని ఈజిప్టు
వారికి చూపించాడు. నాశనం చేసే తన దేవదూత
లను వారికి విరోధంగా ఉండుటకు ఆయన
పంపించాడు.
50 దేవుడు తన కోపాన్ని చూపించుటకు ఒక మార్గం
కనుగొన్నాడు. ఆ ప్రజలలో ఎవరినీ ఆయన బతక
నివ్వలేదు. వారినందరినీ ఓ భయంకర రోగంతో
ఆయన చావనిచ్చాడు.
51 ఈజిప్టులో ప్రథమ సంతానాన్ని దేవుడు చంపి
వేసాడు. హాము* సంతానంలో ప్రతి మొదటి
బిడ్డనీ ఆయన చంపివేసాడు.
52 తర్వాత దేవుడు ఇశ్రాయేలీయులను గొర్రెల
కాపరిలా నడిపించాడు. ఆయన తన ప్రజలను
అరణ్యం లోనికి గొర్రెలను నడిపించినట్లుగా నడి
పించాడు.
53 ఆయన తన ప్రజలను క్షేమంగా నడిపించాడు.
దేవుని ప్రజలు భయపడాల్సింది ఏమీ లేదు. వారి
శత్రువులను దేవుడు ఎర్ర సముద్రంలో ముంచి
వేసాడు.
54 దేవుడు తన ప్రజలను తన పవిత్ర దేశానికి నడి
పించాడు. తన స్వంత శక్తితో సీయోను పర్వతానికి
ఆయన నడిపించాడు.
55 ఇతర రాజ్యాలు ఆ దేశాన్ని విడిచిపెట్టేటట్టు దేవుడు
వారిని బలవంతం చేసాడు. దేవుడు తన ప్రజ
లకు వారి వంతు దేశాన్ని ఇచ్చాడు. అందుచేత
ఇశ్రాయేలీయులు వారి స్వంత గృహాలలో నివ
సించారు.
56 కానీ ఇశ్రాయేలు ప్రజలు సర్వోన్నతుడైన దేవుని్ని
ఇంకను పరీక్షించి ఆయన్ని దుఃఖపెట్టారు. ఆ
ప్రజలు దేవుని ఆదేశాలకు విధేయులు కాలేదు.
57 ఇశ్రాయేలు ప్రజలు దేవుని నుండి మళ్లు కొన్నారు.
వారు వారి తండ్రుల్లాగే ద్రోహులుగాను, అపనమ్మ
కస్తులుగాను ఉన్నారు. వారు మోసకరమైన విల్లులా
వంకర తిరిగారు.
58 ఇశ్రాయేలు ప్రజలు ఎత్తయిన గోపురాలు నిర్మించి
దేవునికి కోపం పుట్టించారు. దేవతల విగ్రహాలను
వారు తయారు చేసి దేవునికి రోషం పుట్టించారు.
59 దేవుడు ఇది విని చాలా కోపగించాడు. మరియు
ఇశ్రాయేలీయులను దేవుడు పూర్తిగా తిరస్కరిం
చాడు.
60 షిలోహులో పవిత్ర గుడారాన్ని దేవుడు విడిచి
పెట్టేశాడు. ఇది ప్రజల మధ్య నివసించిన దేవుని
గుడారం.
61 అప్పుడు దేవుడు ఇతర రాజ్యాల ద్వారా తన
ప్రజలను బందీలుగా చేయనిచ్చాడు. దేవుని "అంద
మైన ఆభరణాన్ని" శత్రువులు తీసుకొన్నారు.
62 తన ఇశ్రాయేలు ప్రజల మీద దేవుడు తన కోపం
చూపించాడు. ఆయన వారిని యుద్ధంలో చంప
బడనిచ్చాడు.
63 యువకులు చనిపోయేవరకు కాల్చబడ్డారు. పెళ్లి
కావాల్సిన యువతులు పెళ్లిపాటలు ఏమి పాడలేదు.
64 యాజకులు చంపివేయబడ్డారు. కాని విధవలు వారి
కోసం ఏడ్వలేదు.
65 తాగి కేకలువేసే బలాఢ్యుడైన మనిషివలె, నిద్ర
నుండి మేల్కొన్న మనిషివలె ప్రభువు లేచాడు.
66 దేవుడు తన శత్రువును వెనుకకు తరిమి వారిని
ఓడించాడు. దేవుడు తన శత్రువులను ఓడించి,
శాశ్వతంగా వారిని అవమానించాడు.
67 కానీ యోసేపు కుటుంబాన్ని దేవుడు నిరాకరిం
చాడు. ఎఫ్రాయిము కుటుంబాన్ని దేవుడు
కోరుకోలేదు.
68 దేవుడు యూదావారిని ఎంచుకొన్నాడు. మరియు
దేవుడు తనకు ప్రియమైన సీయోను పర్వతాన్ని
కోరుకొన్నాడు.
69 ఆ పర్వతం మీద ఎత్తుగా దేవుడు తన పవిత్ర
ఆలయాన్ని నిర్మించాడు. భూమిలాగే, తన పవిత్ర
ఆలయం శాశ్వతంగా ఉండేటట్టు దేవుడు
నిర్మించాడు.
70 తర్వాత తన ప్రత్యేక సేవకునిగా దావీదును దేవుడు
ఏర్పాటు చేసుకొన్నాడు. దావీదు గొర్రెలను కాస్తూ
ఉన్నాడు. కానీ దేవుడు అతన్ని ఆ పని నుండి
తీసివేసాడు.

**హాము** ఈజిప్టువాళ్లు హాము సంతానం.

71 గొర్రెలను కాపాడే పని నుండి దేవుడు దావీదును
తొలగించి, తన ప్రజలను, యాకోబు ప్రజలను,
ఇశ్రాయేలు ప్రజలను, దేవుని సొత్తును కాపాడే
పని దావీదుకు యిచ్చాడు.
72 మరియు దావీదు పవిత్ర హృదయంతో ఇశ్రా
యేలు ప్రజలను నడిపించాడు. అతడు చాలా
జ్ఞానంతో వారిని నడిపించాడు.

## కీర్తన 79

*ఆసాపు స్తుతి కీర్తన.*

1 దేవా, కొందరు మనుష్యులు నీ ప్రజలతో యుద్ధం
చేసేందుకు వచ్చారు. ఆ మనుష్యులు నీ పవిత్ర
ఆలయాన్ని అపవిత్రపరచి నాశనం చేసారు.
యెరూషలేమును వారు శిథిలాలుగా విడిచి పెట్టారు.
2 అడవి పక్షులు తినేందుకుగాను నీ సేవకుల దేహా
లను శత్రువు విడిచిపెట్టాడు. అడవి మృగాలు తినేం
దుకు నీ అనుచరుల దేహాలను వారు విడిచిపెట్టారు.
3 దేవా, నీ ప్రజల రక్తం నీళ్లలా యెరూషలేమంతటి
చుట్టూ ప్రవహించేంతవరకు శత్రువు వారిని
చంపాడు. మృత దేహాలను పాతి పెట్టేందుకు ఏ
ఒక్కరూ విడువ బడలేదు.
4 మా పొరుగు రాజ్యాలు మమ్మల్ని అవమానిం
చాయి. మా చుట్టూరా ఉన్న ప్రజలంతా మమ్మల్ని
చూచి నవ్వుతూ, ఎగతాళి చేస్తున్నారు.
5 దేవా, నీవు మా మీద ఎప్పటికీ కోపంగానే
ఉంటావా? బలమైన నీ భావాలు అగ్నిలా మండు
తూనే ఉంటాయా?
6 దేవా, నిన్ను ఎరుగని రాజ్యాల మీదికి నీ కోపాన్ని
మరల్చుము. నీ నామాన్ని ఆరాధించని రాజ్యాల
మీదికి నీ కోపాన్ని మరల్చుము.
7 ఎందుకంటే ఆ రాజ్యాలు యాకోబును నాశనం
చేశాయి. వారు యాకోబు దేశాన్ని నాశనం చేశారు.
8 దేవా, మా పూర్వీకుల పాపాలకోసం దయచేసి
మమ్మల్ని శిక్షించకుము. త్వరపడి, నీ దయ మాకు
చూపించుము. నీవు మాకు ఎంతో అవసరం.
9 మా దేవా! రక్షకా, మాకు సహాయం చేయుము.
నీ స్వంత నామానికి నీవు మహిమ తెచ్చునట్లుగా
మాకు సహాయం చేయుము. మమ్మల్ని రక్షిం
చుము. నీ నామ క్షేమం కోసం మా పాపాలు
తుడిచివేయుము.
10 "మీ దేవుడు ఎక్కడ? ఆయన మీకు సహాయం
చేయలేడా?" అని ఇతర రాజ్యాలవారు మాతో
అననీయకు. దేవా, మేము చూడగలుగునట్లుగా
ఆ ప్రజలను శిక్షించుము. నీ సేవకులను చంపి
నందుకు వారిని శిక్షించుము.
11 దయచేసి, ఖైదీల మూల్గులు వినుము! దేవా,
మరణించుటకు ఏర్పరచబడిన ఈ ప్రజలను నీ
మహా శక్తివలన రక్షించుము.
12 దేవా, మా చుట్టూరా ఉన్న ప్రజలు మాకు చేసిన
వాటిని బట్టి ఏడు మార్లు వారిని శిక్షించుము. ఆ
ప్రజలు నిన్ను అవమానించిన సమయాలనుబట్టి
వారిని శిక్షించుము.
13 మేము నీ ప్రజలం, మేము నీ మందలోని గొర్రెలం.
మేము శాశ్వతంగా నిన్ను స్తుతిస్తాము. దేవా, శాశ్వ
తంగా, సదాకాలం మేము నిన్ను స్తుతిస్తాము.

## కీర్తన 80

*సంగీత నాయకునికి. "ఒప్పందం పుష్పాలు" రాగం.*
*ఆసాపు స్తుతి కీర్తన.*

1 ఇశ్రాయేలీయుల కాపరీ, నా మాట వినుము.
యోసేపు గొర్రెలను (ప్రజలను) నీవు నడిపిం
చుము. కెరూబులపై నీవు రాజుగా కూర్చున్నావు.
ప్రకాశించుము.
2 ఇశ్రాయేలీయుల కాపరీ, ఎఫ్రాయిము, బెన్యా
మీను, మనష్షేలకు నీ మాహాత్మ్యం చూపించుము.
వచ్చి మమ్మల్ని రక్షించుము.
3 దేవా, మరల మమ్మల్ని స్వీకరించుము. మేము
రక్షించబడునట్లు నీ ముఖాన్ని మా మీద ప్రకాశింప
చేయుము.
4 సర్వశక్తిగల యెహోవా దేవా నీవు మా మీద
ఎప్పటికీ కోపంగానే ఉంటావా? మా ప్రార్థనలు
నీవు ఎప్పుడు వింటావు?
5 నీవు నీ ప్రజలకు కన్నీళ్లే ఆహారంగా ఇచ్చావు. నీ
ప్రజల కన్నీళ్లతో నిండిన పాత్రలే నీవు నీ ప్రజలకు
ఇచ్చావు. అవే వారు తాగుటకు నీళ్లు.
6 మా పొరుగు వారు పోరాడుటకు నీవు మమ్మల్ని
హేతువుగా ఉండనిచ్చావు. మా శత్రువులు
మమ్మల్ని చూచి నవ్వుచున్నారు.
7 సర్వశక్తిమంతుడవైన దేవా, మరల మమ్మల్ని అంగీ
కరించుము. నీ ముఖము మామీద ప్రకాశించునట్లు
మమ్మల్ని రక్షించుము.
8 గతకాలంలో నీవు మమ్మల్ని ప్రాముఖ్యమైన
మొక్కలా చూశావు. ఈజిప్టు నుండి నీవు నీ "ద్రాక్షా
లత" తీసుకొని వచ్చావు. ఇతర ప్రజలను ఈ
దేశం నుండి నీవు వెళ్లగొట్టావు. నీ "ద్రాక్షావల్లిని"
నీవు నాటుకొన్నావు.
9 "ద్రాక్షావల్లి" ఎదుగుటకు నేలను నీవు సిద్ధం చేశావు.
దాని వేర్లు బలంగా ఎదుగుటకు నీవు సహాయం
చేశావు త్వరలోనే "ద్రాక్షావల్లి" దేశం అంతా
వ్యాపించింది.
10 అది పర్వతాలను కప్పివేసింది. దాని ఆకులు మహా
దేవదారు వృక్షాలను సహా కప్పివేసాయి.
11 దాని తీగెలు మధ్యధరా సముద్రం వరకు విస్త
రించాయి. దాని కొమ్మలు యూఫ్రటీసు నది
వరకూ విస్తరించాయి.

12 దేవా, నీ “ద్రాక్షావల్లిని” కాపాడుతున్న గోడను
నీవెందుకు పడగొట్టావు? ఇప్పుడు దారిన పోయే
ప్రతిమనిషీ దాని ద్రాక్షాపండ్లను కోసు
కొంటున్నాడు.
13 అడవి పందులు వచ్చి నీ “ద్రాక్షావల్లి” మీద నడు
స్తాయి. అడవి మృగాలు వచ్చి ఆకులు తింటాయి.
14 సర్వశక్తిగల దేవా, తిరిగి రమ్ము పరలోకం నుండి
నీ “ద్రాక్షావల్లిని” చూడుము. దానిని కాపాడుము.
15 దేవా, నీ స్వంత చేతులతో నీవు నాటుకొన్న నీ
“ద్రాక్షావల్లిని” చూడుము. నీవు పెంచిన ఆ లేత
మొక్కలను* చూడుము.
16 అగ్నితో నీ “ద్రాక్షావల్లి” కాల్చివేయబడింది. నీవు
దానిమీద కోపగించి నీవు దాన్ని నాశనం చేశావు.
17 దేవా, నీ కుడి ప్రక్క నిలిచి ఉన్న నీ కుమారుని
ఆదుకొనుము. నీవు పెంచిన నీ కుమారుని
అదుకొనుము.
18 అతడు మరల నిన్ను విడువడు. అతన్ని బదుక
నీయుము. అతడు నీ నామాన్ని ఆరాధిస్తాడు.
19 సర్వశక్తిమంతుడైన యెహోవా, దేవా, తిరిగి మా
దగ్గరకు రమ్ము. నీ ముఖ మహిమను మామీద
ప్రకాశించనీయుము. మమ్మల్ని రక్షించుము.

## కీర్తన 81

*సంగీత నాయకునికి. గిత్తీత్ రాగం. ఆసాపు కీర్తన.*

1 సంతోషించండి, మన బలమైన దేవునికి గానం
చేయండి. ఇశ్రాయేలీయుల దేవునికి సంతోషంతో
కేకలు వేయండి.
2 సంగీతం ప్రారంభించండి గిలక తప్పెట వాయిం
చండి. స్వరమండలం, సితారాల శ్రావ్యంగా వాయిం
చండి.
3 నెలవంక నాడు గొర్రెపోతు కొమ్ము ఊదండి.
పౌర్ణమినాడు* గొర్రెపోతు కొమ్ము ఊదండి.
ఆనాడే మన పండుగ ఆరంభం.
4 అది ఇశ్రాయేలు ప్రజలకు న్యాయచట్టం. ఆ
ఆదేశాన్ని యాకోబుకు దేవుడు ఇచ్చాడు.
5 ఈజిప్టునుండి యోసేపును* దేవుడు తీసుకొని
పోయిన సమయంలో దేవుడు వారితో ఈ ఒడం
బడిక చేసాడు. ఈజిప్టులో నేను గ్రహించని భాష
విన్నాను.
6 దేవుడు ఇలా చెపుతున్నాడు: “మీ భుజంమీద
నుండి బరువు నేను దింపాను. నేను మీ మోతగంప
పడవేయనిచ్చాను.
7 మీరు కష్టంలో ఉన్నప్పుడు మీరు సహాయం కోసం
వేడుకొన్నారు. నేను మిమ్మల్ని స్వతంత్రుల్ని
చేశాను. తుఫాను మేఘాలలో దాగుకొని నేను
మీకు జవాబు ఇచ్చాను. నీళ్ల వద్ద నేను మిమ్మల్ని
పరీక్షించాను.”
8 “నా ప్రజలారా, నా మాట వినండి. నా ఒడం
బడిక* నేను మీకు యిస్తాను. ఇశ్రాయేలూ, నీవు
దయచేసి నా మాట వినాలి!
9 విదేశీయులు పూజించే తప్పుడు దేవుళ్ళను ఎవరినీ
ఆరాధించవద్దు.
10 నేను యెహోవాను, నేనే మీ దేవుడను. మిమ్మల్ని
ఈజిప్టు నుండి బయటకు తీసుకొని వచ్చిన
దేవుడను నేనే. ఇశ్రాయేలూ, నీ నోరు తెరువు,
నేను దానిని నింపుతాను.
11 కాని నా ప్రజలు నా మాట వినలేదు. ఇశ్రాయేలు
నాకు విధేయత చూపలేదు.
12 కనుక వారు చేయగోరిన వాటిని నేను చేయ
నిచ్చాను. ఇశ్రాయేలీయులు వారి ఇష్టం వచ్చిందల్లా
చేసారు.
13 ఒకవేళ నా ప్రజలు గనుక నిజంగా నా మాట
వింటే ఇశ్రాయేలు జీవించాలని నేను కోరిన విధంగా
గనుక వారు జీవిస్తే,
14 అప్పుడు నేను ఇశ్రాయేలీయుల శత్రువులను ఓడి
స్తాను. ఇశ్రాయేలీయులకు కష్టాలు కలిగించే ప్రజ
లను నేను శిక్షిస్తాను.
15 యెహోవా శత్రువులు యెహోవాను కాదం
టారు, అందుచేత వారు శిక్షించబడతారు.
16 దేవుడు తన ప్రజలకు శ్రేష్ఠమైన గోధుమలు
ఇస్తాడు. తన ప్రజలకు తృప్తి కలిగేంతవరకు వారికి
ఆ కొండ తేనె ఇస్తాడు.

## కీర్తన 82

*ఆసాపు స్తుతి కీర్తన.*

1 దైవ సమాజంలో దేవుడు తన స్థానాన్ని తీసు
కొన్నాడు. సమాజంలో దేవుడు నిలుస్తున్నాడు.
ఆ దేవుళ్ళ సమాజంలో ఆయన తీర్పునిస్తాడు.
2 ప్రజలారా, “ఎంతకాలం మీరు అన్యాయపు తీర్పు
తీరుస్తారు? దుర్మార్గులు శిక్షించబడకుండా ఎన్నాళ్లు
తప్పించుకోనిస్తారు?” అని దేవుడు అంటున్నాడు.
3 “అనాధలను, పేద ప్రజలను కాపాడండి. న్యాయం
జరగని పేద ప్రజల, అనాదుల హక్కులను కాపా
డండి.

---

**లేత మొక్కలు** అక్షరార్థముగా “కుమారుడు”

**పౌర్ణమినాడు** ఇది హెబ్రీయుల నెల మధ్య. అనేక ప్రత్యేక సమావేశములు, సెలవు దినములు పౌర్ణమి సమయాన ప్రారంభమయ్యేవి.

**యోసేపు** ఇక్కడ యోసేపు కుటుంబము అని అర్థము, అనగా ఇశ్రాయేలీయులు.

**ఒడంబడిక** అక్షరార్థంగా “సాక్ష్యము.” ఇది దేవునికి ఇశ్రాయేలీయులకు మధ్యనున్న ఒప్పందం యొక్క రుజువు.

4 పేదలకు, నిస్సహాయ ప్రజలకు సహాయం చేయండి. దుర్మార్గుల బారినుండి వారిని రక్షించండి.

5 "ఏమి జరుగుతుందో ఇశ్రాయేలు ప్రజలకు తెలియదు. వారు గ్రహించరు. వారు చేస్తున్నది ఏమిటో వారికి తెలియదు. వారి ప్రపంచం వారి చుట్టూరా కూలిపోతుంది."

6 నేను (దేవుడు) మీతో చెప్పాను, "మీరు దైవాలు, మీరందరూ సర్వోన్నతుడైన దేవుని కుమారులు.

7 కాని మనుష్యులందరూ మరణించినట్టుగానే మీరు కూడా మరణిస్తారు. ఇతర నాయకులందరి వలెనే మీరు కూడామరణిస్తారు."

8 దేవా, లెమ్ము నీవే న్యాయమూర్తివిగా ఉండుము! దేవా, రాజ్యములన్నీ నీకు చెందినవే.

## కీర్తన 83

*ఆసాపు స్తుతి గీతం.*

1 దేవా, మౌనంగా ఉండవద్దు! నీ చెవులు మూసికోవద్దు! దేవా, దయచేసి ఊరుకోవద్దు.

2 దేవా, నీ శత్రువులు నీకు వ్యతిరేకంగా పథకాలు వేస్తున్నారు. నీ శత్రువులు త్వరలోనే దాడి చేస్తారు.

3 నీ ప్రజలకు వ్యతిరేకంగా వారు రహస్య పథకాలు వేస్తారు. నీవు ప్రేమించే ప్రజలకు విరోధంగా నీ శత్రువులు పథకాలను చర్చిస్తున్నారు.

4 "ఆ మనుష్యులను పూర్తిగా నాశనం చేద్దాం రమ్ము. అప్పుడు 'ఇశ్రాయేలు' అనే పేరు తిరిగి ఎవ్వరూ జ్ఞాపకంచేసుకోరు," అని శత్రువులు చెబుతున్నారు.

5 దేవా, నీకు విరోధంగా పోరాడేందుకు నీవు మాతో చేసిన ఒడంబడికకు విరోధంగా పోరాడేందుకు ఆ ప్రజలంతా ఏకమయ్యారు.

6-7 ఆ శత్రువులు మనకు విరోధంగా పోరాడేందుకు ఏకమయ్యారు. ఎదోము, ఇష్మాయేలు ప్రజలు; మోయాబు, హగ్రీ సంతతివారు; గెబలువారు; అమ్మోను, అమాలేకీ ప్రజలు; ఫిలిష్తీ ప్రజలు; తూరులో నివసించే ప్రజలంతా మనతో పోరాడుటకు ఏకమయ్యారు.

8 అష్షూరు సైన్యం లోతు వంశస్థులతో చేరి, వారంతా నిజంగా బలముగలవారయ్యారు.

9 దేవా, మిద్యానును నీవు ఓడించినట్టు, కీషోను నది దగ్గర సీసెరానును, యాబీనును నీవు ఓడించినట్టు శత్రువును ఓడించుము.

10 ఫన్దోరు వద్ద నీవు వారిని ఓడించావు. వారి దేహాలు నేల మీద కుళ్లిపోయాయి.

11 దేవా, శత్రువుల నాయకులను ఓడించుము. ఓరేబుకు, జెయేబుకు నీవు చేసిన వాటిని వారికి చేయుము. జెబహు, సల్మున్నా అనేవారికి నీవు చేసిన వాటిని వారికి చేయుము.

12 దేవా, మేము నీ దేశం విడిచేందుకు ఆ ప్రజలు మమ్మల్ని బలవంత పెట్టాలని అనుకొన్నారు.

13 గాలికి చెదరిపోయే కలుపు మొక్కవలె* ఆ ప్రజలను చేయుము. గాలి చెదరగొట్టు గడ్డిలా ఆ ప్రజలను చేయుము.

14 అగ్ని అడవిని నాశనం చేసినట్టు కారుచిచ్చు కొండలను తగులబెట్టునట్లు శత్రువును నాశనం చేయుము.

15 దేవా, తుఫానుకు ధూళి ఎగిరిపోవునట్లు ఆ ప్రజలను తరిమివేయుము. సుడిగాలిలా వారిని కంపింపజేసి, విసరివేయుము.

16 దేవా, వారి ముఖాలను సిగ్గుతో కప్పుము. అప్పుడు వారు నీ నామం ఆరాధించాలని కోరుతారు.

17 దేవా, ఆ ప్రజలు శాశ్వతంగా భయపడి సిగ్గు పడునట్లు చేయుము. వారిని అవమానించి, నాశనం చేయుము.

18 అప్పుడు నీవే దేవుడవు అని ఆ ప్రజలు తెలుసుకొంటారు. నీ పేరు యెహోవా అని వారు తెలుసుకొంటారు. నీవే లోకమంతటిపై మహోన్నతుడవైన దేవుడవు అని వారు తెలుసుకొంటారు.

## కీర్తన 84

*సంగీత నాయకునికి. గిత్తీత్ రాగం.*

*కోరహు కుమారుల స్తుతి కీర్తన*

1 సర్వశక్తిమంతుడువైన యెహోవా, నీ ఆలయం నిజంగా రమ్యమైనది.

2 యెహోవా, నేను వేచియుండి అలసిపోయాను. నేను నీ ఆలయంలో ఉండాలని ఆశిస్తున్నాను. నాలోని ప్రతి అవయవం జీవంగల దేవునికి ఆనంద గానం చేస్తుంది.

3 సర్వశక్తిమంతుడువైన యెహోవా, నా రాజా, నా దేవా, పిచ్చుకలకు, వానకోవెలలకు సహితం నివాసాలు ఉన్నాయి. ఆ పక్షులు నీ బలిపీఠం దగ్గర గూళ్లు పెట్టుకొంటాయి. అక్కడే వాటి పిల్లలు ఉంటాయి.

4 నీ ఆలయం వద్ద నివసించే ప్రజలు చాలా సంతోషంగా ఉంటారు. వారు ఎల్లప్పుడూ నిన్ను స్తుతిస్తారు.

5 ఎవరైతే వారి బలానికి నిన్ను ఆధారంగా ఉండనిస్తారో వారు సంతోషిస్తారు.* వారు నిన్నే నడిపించ నిస్తారు.

---

**కలుపు మొక్కవలె** ఇది పొట్టి వ్రేళ్లున్న పెద్ద కలుపు మొక్క, బలమైన గాలి వీచినప్పుడు ఈ ఎండిన కలుపు మొక్క వ్రేళ్లతో కదలించబడి గాలికి కొట్టు కొనిపోవును. ఇది దొర్లిపోయే కలుపు మొక్క.

**వారు … సంతోషిస్తారు** అక్షరార్థముగా "వారు వారి హృదయాల్లో రహదారిని కలిగియున్నారు" దినాల్లో యెరూషలేముకు ప్రయాణించే ప్రజల విషయం ఇది చెప్పుతూ ఉండవచ్చు.

6 దేవుడు నీటి ఊటగా చేసిన తొలకరి వాన నీటి
మడుగులు నిలిచే బాకా లోయగుండా వారు పయ
నిస్తారు.
7 వారు దేవుని కలుసుకొనే సీయోనుకు పోయే
మార్గంలో ఆ ప్రజలు పట్టణం నుండి పట్టణానికి
ప్రయాణం చేస్తారు.
8 సర్వశక్తిమంతుడవైన యెహోవా దేవా, నా ప్రార్థన
ఆలకించే యాకోబు దేవా, నా మాట వినుము.
9 దేవా, మా సంరక్షకుని కాపాడుము. నీవు ఏర్పరచు
కొన్న రాజుకు దయ చూపుము.*
10 దేవా, నేను మరో స్థలంలో వెయ్యి రోజులు
గడుపుటకంటె నీ ఆలయంలో ఒక్కరోజు
ఉండుట మేలు. దుర్మార్గుల ఇంటిలో నివసించుట
కంటె నా దేవుని ఆలయ ద్వారము దగ్గర నేను
నిలిచియుండుట మేలు.
11 యెహోవా మా సంరక్షకుడు, మహిమగల రాజు.
దేవుడు మమ్మల్ని దయ, మహిమతో దీవిస్తు
న్నాడు. యెహోవాను వెంబడించి ఆయనకు విధే
యులయ్యే ప్రజలకు ఆయన అన్ని మేళ్లూ
అనుగ్రహిస్తాడు.
12 సర్వశక్తిమంతుడవైన యెహోవా, నిన్ను నమ్ము
కొనే ప్రజలు నిజంగా సంతోషిస్తారు.

## కీర్తన 85

***సంగీత నాయకునికి. కోరహు కుమారుల***
***స్తుతి కీర్తన.***

1 యెహోవా, నీ దేశం మీద దయ చూపించుము.
యాకోబు ప్రజలు విదేశంలో ఖైదీలుగా ఉన్నారు.
ఖైదీలను తిరిగి వారి దేశానికి తీసుకొని రమ్ము.
2 యెహోవా, నీ ప్రజలను క్షమించుము! వారి
పాపాలు తుడిచివేయుము.
3 యెహోవా, కోపంగాను, ఆవేశంగా నుండవద్దు.
4 మా దేవా, రక్షకా, మా మీద కోపగించటం మాని
వేసి, మమ్మల్ని మరల స్వీకరించు.
5 నీవు మామీద శాశ్వతంగా కోపగిస్తావా?
6 దయచేసి మమ్మల్ని మరల బ్రతికించుము! నీ
ప్రజలను, సంతోషింపజేయుము.
7 యెహోవా, నీవు మమ్మల్ని ప్రేమిస్తున్నట్టుగా
మాకు చూపించుము. మమ్మల్ని రక్షించుము.
8 దేవుడు చెప్పేది నేను వింటున్నాను. తన ప్రజ
లకు శాంతి కలుగుతుందని యెహోవా చెబుతు
న్నాడు. ఆయన అనుచరులు వారి అవివేక జీవిత
విధానాలకు తిరిగి వెళ్లకపోతే వారికి శాంతి
ఉంటుంది.
9 దేవుడు తన అనుచరులను త్వరలో రక్షిస్తాడు.
మేము త్వరలోనే మా దేశంలో గౌరవంగా బతుకు
తాము.
10 దేవుని నిజమైన ప్రేమ ఆయన అనుచరులకు
లభిస్తుంది. మంచితనం, శాంతి, ఒకదానితోఒకటి
ముద్దు పెట్టుకొంటాయి.
11 భూమి మీద మనుష్యులు దేవునికి నమ్మకంగా
వుంటారు. పరలోకపు దేవుడు వారికి మేలు అను
గ్రహిస్తాడు.
12 యెహోవా మనకు అనేకమైన మంచివాటిని
ఇస్తాడు. భూమి అనేక మంచి పంటలను ఇస్తుంది.
13 మంచితనం దేవునికి ముందర నడుస్తూ ఆయన
కోసం, దారి సిద్ధం చేస్తుంది.

## కీర్తన 86

***దావీదు ప్రార్థన.***

1 నేను నిరుపేద, నిస్సహాయుణ్ణి . యెహోవా,
దయతో నా మాట విని నా ప్రార్థనకు జవాబు
ఇమ్ము.
2 యెహోవా, నేను నీ అనుచరుడను. దయతో
నన్ను కాపాడు. నేను నీ సేవకుడను. నీవు నా
దేవుడవు. నేను నిన్ను నమ్ముకొన్నాను. కనుక
నన్ను రక్షించుము.
3 నా ప్రభువా నా మీద దయ చూపించుము.
రోజంతా నేను నీకు ప్రార్థన చేస్తున్నాను.
4 ప్రభువా, నా జీవితాన్ని నేను నీ చేతుల్లో పెడు
తున్నాను. నన్ను సంతోషపెట్టుము, నేను నీ
సేవకుడను.
5 ప్రభువా, నీవు మంచివాడవు, దయగలవాడవు.
సహాయం కోసం నిన్ను వేడుకొనే నీ ప్రజలను
నీవు నిజంగా ప్రేమిస్తావు.
6 యెహోవా, దయకోసం నేను మొరపెట్టుకునే
నా ప్రార్థనలు ఆలకించుము.
7 యెహోవా, నా కష్టకాలంలో నేను నిన్ను ప్రార్థిస్తు
న్నాను. నీవు నాకు జవాబు యిస్తావని నాకు
తెలుసు.
8 దేవా, నీవంటివారు మరొకరు లేరు. నీవు చేసిన
వాటిని ఎవ్వరూ చేయలేరు.
9 ప్రభువా, నీవే అందరినీ సృష్టించావు. వారందరూ
నిన్ను ఆరాధించెదరు గాక. వాళ్లంతా నీ నామాన్ని
ఘనపరిచెదరు గాక.
10 దేవా, నీవు గొప్పవాడవు! నీవు అద్భుత కార్యాలు
చేస్తావు. నీవు మాత్రమే దేవుడవు.
11 యెహోవా నీ మార్గాలు నాకు నేర్పించు నేను నీ
సత్యాలకు లోబడి జీవిస్తాను. నిన్నారాధించుటయే
నా జీవితంలోకెల్లా అతి ముఖ్యాంశంగా చేయుము.

---

**దయ చూపుము** అక్షరార్థముగా “దేవుడు మా డాలును కాపాడును. నీ అభిషిక్తునికి దయచూపుము.”

12 దేవా, నా ప్రభువా నేను నా పూర్ణ హృదయంతో
నిన్ను స్తుతిస్తాను. నీ నామాన్ని నేను శాశ్వతంగా
కీర్తిస్తాను.
13 దేవా నా యెడల నీకు ఎంతో గొప్ప ప్రేమ
ఉంది. మరణపు అగాథ స్థలం నుండి నీవు నన్ను
రక్షిస్తావు.
14 దేవా, గర్విష్ఠులు నాపై పడుతున్నారు. క్రూరులైన
మనుష్యుల గుంపు నన్ను చంపుటకు ప్రయత్నిస్తు
న్నారు. ఆ మనుష్యులు నిన్ను గౌరవించటం లేదు.
15 ప్రభూ, నీవు, దయ, కరుణగల దేవుడవు. నీవు
సహనం నమ్మకత్వం, ప్రేమతో నిండి ఉన్నావు.
16 దేవా, నీవు నా మాట వింటావని నా యెడల
దయగా ఉంటావని చూపించుము. నాకు బలాన్ని
అను గ్రహించుము. నేను నీ సేవకుడను. నన్ను
రక్షించుము. నేను నీ సేవకుడను.
17 దేవా, నీవు నాకు సహాయం చేస్తావని రుజువు
చేయుటకు ఏదైనా చేయుము. అప్పుడు నా శత్రు
వులు నిరాశ చెందుతారు. ఎందుకంటే ప్రభూ,
నీవు నా యెడల దయ చూపించావని, నాకు
సహాయం చేశావని అది తెలియచేస్తుంది.

## కీర్తన 87

***కోరహు కుమారుల స్తుతి కీర్తన.***

1 యెరూషలేము కొండల మీద దేవుడు తన
ఆలయం నిర్మించాడు.
2 ఇశ్రాయేలులో ఏ ఇతర స్థలాల కంటె సీయోను
ద్వారాలు యెహోవాకు ఎక్కువ ఇష్టం.
3 దేవుని పట్టణమా, ప్రజలు నిన్ను గూర్చి ఆశ్చర్య
కరమైన సంగతులు చెబుతారు.
4 దేవుడు తన ప్రజలందరిని గూర్చి ఒక జాబితా
ఉంచుతున్నాడు. దేవుని ప్రజలు కొందరు ఈజిప్టు
లోను బబులోనులోను జీవిస్తున్నారు. ఆయన
ప్రజలు కొందరు ఫిలిష్తీయలో, తూరులో, చివరికి
ఇతియోపియాలో జన్మించినట్లు ఆ జాబితా
తెలియజేస్తుంది.
5 సీయోను గడ్డ మీద జన్మించిన ప్రతి ఒక్క వ్యక్తినీ
దేవుడు ఎరుగును. సర్వోన్నతుడవైన దేవుడు ఆ
పట్టణాన్ని నిర్మించాడు.
6 దేవుడు తన ప్రజలు అందరిని గూర్చి ఒక జాబితా
ఉంచుతాడు. ఒక్కో వ్యక్తి ఎక్కడ జన్మించింది
దేవునికి తెలుసు.
7 దేవుని ప్రజలు ప్రత్యేక పండుగలు ఆచరించుటకు
యెరూషలేము వెళ్తారు. దేవుని ప్రజలు పాటలు
పాడుతూ, నాట్యం చేస్తూ చాలా సంతోషంగా
ఉన్నారు. "మంచివన్నీ యెరూషలేము నుండి
వస్తాయి" అని వారు అంటారు.

## కీర్తన 88

***కోరహు కుమారుల స్తుతి కీర్తన. సంగీత నాయకునికి. బాధాకరమైన ఒక వ్యాధిని గూర్చి ఎజ్రాహివాడైన హేమాను ధ్యాన గీతం.***

1 యెహోవా దేవా, నీవు నా రక్షకుడవు. రాత్రిం
బగళ్లు నేను నిన్ను ప్రార్థిస్తున్నాను.
2 దయచేసి నా ప్రార్థనలను గమనించుము. కరుణ
కోసం నేను చేస్తున్న ప్రార్థనలు ఆలకించుము.
3 నా కష్టాలు అన్నింటితో నేను విసిగిపోయాను.
మరణించుటకు నేను సిద్ధంగా ఉన్నాను.
4 జీవించుటకు బహు బలహీనుడివలె చనిపోయిన
మనిషివలె ప్రజలు నాతో వ్యవహరిస్తున్నారు.
5 మరణించుటకు నేను ఒంటరిగా విడువబడ్డాను.
నేను సమాధిలో ఉన్న శవంలా ఉన్నాను. నీనుండీ
నీ జాగ్రత్తనుండి నీవు వేరుచేసిన మృతులలో
ఒకనివలె నేనున్నాను. మనుష్యులు వారిని పూర్తిగా
మరచిపోతారు.
6 యెహోవా, నీవు నన్ను భూమి కింద సమాధిలో
ఉంచావు. నీవు నన్ను ఆ చీకటి స్థలంలో ఉంచావు.
7 నీవు నా మీద కోపగించావు. నీవు నన్ను శిక్షించావు.
8 నా స్నేహితులు నన్ను విడిచిపెట్టేశారు. అంటరాని
మనిషిలా వారంతా నన్ను తప్పించి వేస్తారు. నేను
యింటిలో బంధించబడ్డాను, నేను బయటకు
వెళ్లలేను.
9 నా బాధ అంతటినీ గూర్చి ఏడ్చి నా కళ్లు నొప్పిగా
ఉన్నాయి. యెహోవా, నేను ఎడతెగకుండా
నిన్ను ప్రార్థిస్తున్నాను. ప్రార్థనలో నేను నీకు నా
చేతులు జోడిస్తున్నాను.
10 యెహోవా, చనిపోయిన వారి కోసం నీవు అద్భు
తాలు చేస్తావా? లేదు! దురాత్మలు లేచి నిన్ను
స్తుతిస్తాయా? లేదు!
11 చనిపోయిన వాళ్లు వారి సమాధుల్లో నీ ప్రేమను
గూర్చి మాట్లాడలేరు. చనిపోయిన వారు మృతుల
లోకంలో ఉండి నీ నమ్మకత్వం గూర్చి మాట్లాడ
లేరు.
12 చీకటిలో పడివున్న మృతులు నీవు చేసే అద్భుత
కార్యాలు చూడలేరు. మరచిపోయిన వారి లోకంలో
ఉన్న మృతులు నీ మంచితనం గూర్చి మాట్లాడ
లేరు.
13 యెహోవా, నాకు సహాయం చేయుమని నేను
నిన్ను అడుగుతున్నాను. ప్రతి వేకువ ఝామునా
నేను నిన్ను ప్రార్థిస్తాను.
14 యెహోవా, నీవెందుకు నన్ను విడిచిపెట్టేశావు?
నానుండి నీ ముఖాన్ని ఎందుకు దాచు
కొంటున్నావు?
15 నేను బాలుడిగా ఉన్నప్పటినుండి నేను బలహీను
డను, రోగిని. నేను నీ కోపాన్ని అనుభవించాను,
నేను నిస్సహాయుడను.

16 యెహోవా, నీవు నా మీద చాలా కోపగించావు.
శిక్ష నన్ను చంపేస్తుంది.
17 నాకు నొప్పులు, బాధలు ఎల్లప్పుడూ ఉన్నాయి.
నా నొప్పులు, బాధల్లో నేను మునిగి పోతున్నట్టుగా
నాకు అనిపిస్తుంది.
18 మరియు యెహోవా, నా స్నేహితులు, నా
ప్రియులు అంతా నన్ను విడిచి పెట్టివేసేటట్టుగా
నీవు చేశావు. చీకటి మాత్రమే నాకు మిగిలింది.

## కీర్తన 89

### ఎజ్రాహీవాడైన ఏతాను ధ్యానగీతం.

1 యెహోవా ప్రేమను గూర్చి నేను ఎల్లప్పుడూ
పాడుతాను. ఆయన నమ్మకత్వం గూర్చి శాశ్వ
తంగా, ఎప్పటికీ నేను పాడుతాను!
2 యెహోవా, నీ ప్రేమ శాశ్వతంగా నిలుస్తుందని
నేను నిజంగా నమ్ముతాను. నీ నమ్మకత్వం ఆకాశా
లవలె కొనసాగుతుంది!
3 దేవుడు చెప్పాడు, “నేను ఏర్పరచుకొన్న రాజుతో
నేను ఒడంబడిక చేసుకొన్నాను. నా సేవకుడైన
దావీదుకు నేను ఒక వాగ్దానం చేసాను.
4 దావీదూ, నీ వంశం శాశ్వతంగా కొనసాగేట్టు నేను
చేస్తాను. నీ రాజ్యాన్ని శాశ్వతంగా ఎప్పటికీ నేను
కొనసాగింపజేస్తాను.”
5 యెహోవా, నీవు చేసే అద్భుత కార్యాలను గూర్చి
ఆకాశాలు స్తుతిస్తున్నాయి. పరిశుద్ధుల సమాజం
నీ నమ్మకత్వం గూర్చి పాడుతుంది.
6 పరలోకంలో ఎవ్వరూ యెహోవాకు సమానులు
కారు. “దేవుళ్లు” ఎవ్వరూ యెహోవాకు సాటికారు.
7 యెహోవా పరిశుద్ధ దూతలను కలిసినప్పుడు ఆ
దేవ దూతలు భయపడి యెహోవాను గౌరవిస్తారు.
వారు ఆయన పట్ల భయముతో నిలబడుతారు.
8 సర్వశక్తిమంతుడైన యెహోవా, దేవా, నీ అంతటి
శక్తిగల వారు ఒక్కరూ లేరు. మేము నిన్ను పూర్తిగా
నమ్మగలము.
9 ఉప్పొంగే మహా సముద్రపు అలలపై నీవు అధి
కారం చేస్తావు. దాని కోపపు అలలను నీవు
నిమ్మళింప జేయగలవు.
10 దేవా, నీవు రహబును* ఓడించావు. నీ మహా
శక్తితో, నీవు నీ శత్రువును ఓడించావు.
11 దేవా, ఆకాశంలోనూ, భూమి మీదనూ ఉన్న సర్వం
నీదే. ప్రపంచాన్నీ, అందులో ఉన్న సర్వాన్నీ నీవు
చేశావు.
12 ఉత్తర దక్షిణాలను నీవే సృష్టించావు. తాబోరు
పర్వతం, హెర్మోను పర్వతం నీ నామాన్ని కీర్తి
స్తాయి. స్తుతి పాడుతాయి.
13 దేవా, నీకు శక్తి ఉంది! నీ శక్తి గొప్పది! విజయం
నీదే!
14 సత్యం, న్యాయం మీద నీ రాజ్యం కట్టబడింది.
ప్రేమ, నమ్మకత్వం నీ సింహాసనం ఎదుట
సేవకులు.
15 దేవా, నమ్మకమైన నీ అనుచరులు నిజంగా సంతో
షంగా ఉన్నారు. వారు నీ దయ వెలుగులో
జీవిస్తారు.
16 నీ నామం వారిని ఎల్లప్పుడూ సంతోష పరుస్తుంది.
వారు నీ మంచితనాన్ని స్తుతిస్తారు.
17 నీవే వారి అద్భుత శక్తివి, వారి శక్తి, నీ నుండే
లభిస్తుంది.
18 యెహోవా, నీవే మమ్మల్ని కాపాడేవాడవు. ఇశ్రా
యేలీయుల పరిశుద్ధుడు మా రాజు.
19 కనుక నిజమైన నీ అనుచరులతో దర్శనంలో
నీవు మాట్లాడావు. నీవు చెప్పావు: ‘ ప్రజల్లోనుండి
నేను ఒక యువకుని ఏర్పాటు చేసికొన్నాను. ఆ
యువకుని నేను ప్రముఖుణ్ణి చేసాను. ‘నేను యుద్ధ
వీరునికి శక్తిని అనుగ్రహించాను.
20 నా సేవకుడైన దావీదును నేను కనుగొన్నాను.
నా ప్రత్యేక తైలంతో నేను అతన్ని అభిషేకించాను.
21 నా కుడిచేతితో నేను దావీదును బలపరచాను.
మరి నా శక్తితో నేను అతన్ని బలముగల వానిగా
చేశాను.
22 ఏర్పాటు చేసికోబడిన రాజును శత్రువు ఓడించ
లేకపోయాడు. దుర్మార్గులు అతన్ని ఓడించలేక
పోయారు.
23 అతని శత్రువులను నేను అంతం చేసాను. ఏర్పర
చబడిన రాజును ద్వేషించిన వారిని నేను
ఓడించాను.
24 ఏర్పరచబడిన రాజును నేను ఎల్లప్పుడూ ప్రేమి
స్తాను. బలపరుస్తాను. నేను ఎల్లప్పుడూ అతన్ని
బలవంతునిగా చేస్తాను.
25 ఏర్పరచబడిన నా రాజును సముద్రం మీద నాయ
కునిగా ఉంచుతాను. నదులను అతడు అదుపులో
ఉంచుతాడు.
26 ‘నీవు నా తండ్రివి నీవు నా దేవుడవు, నా బండవు,
నా రక్షకుడవు’ అని అతడు నాతో చెబుతాడు.
27 మరి నేను అతనిని నా ప్రథమ సంతానంగా చేసు
కొంటాను. భూ రాజులకంటె అతడు ఉన్నతంగా
చేయబడుతాడు.
28 ఏర్పరచబడిన రాజును నా ప్రేమ శాశ్వతంగా కాపా
డుతుంది. అతనితో నా ఒడంబడిక ఎప్పటికీ
అంతంకాదు.
29 అతని వంశం శాశ్వతంగా కొనసాగుతుంది. ఆకా
శాలు ఉన్నంతవరకు అతని రాజ్యం కొనసాగు
తుంది.

---

**రహబు** సముద్ర రాక్షసి. అది దేవునికి శత్రువు అని కొన్ని పురాతన గాథలు చెబుతాయి.

30 అతని సంతతి వారు నా ధర్మశాస్త్రాన్ని పాటించటం
మానివేస్తే, నా ఆదేశాలను పాటించటం వారు
మానివేస్తే అప్పుడు నేను వారిని శిక్షిస్తాను.
31 ఏర్పరచబడిన రాజు సంతతివారు నా ఆజ్ఞలను
ఉల్లంఘించి, నా ఆదేశాలను పాటించకపోతే
32 అప్పుడు నేను వారిని కఠినంగా శిక్షిస్తాను.
33 కానీ వారిపట్ల నా ప్రేమను మాత్రం నేను ఎన్నటికీ
తీసివేయలేను. నేను ఎల్లప్పుడూ వారికి నమ్మకంగా
ఉంటాను.
34 దావీదుతో నా ఒడంబడికను నేను ఉల్లంఘించను.
మా ఒడంబడికను నేను మార్చను.
35 నా పరిశుద్ధత మూలంగా, దావీదుకు నేను ఓ
ప్రత్యేక వాగ్దానం చేసాను. మరి నేను దావీదుకు
అబద్ధం చెప్పను.
36 దావీదు వంశం శాశ్వతంగా కొనసాగుతుంది.
సూర్యుడు ఉన్నంతవరకు అతని రాజ్యం కొనసాగు
తుంది.
37 చంద్రునిలా అది శాశ్వతంగా కొనసాగుతుంది.
ఒడంబడిక సత్యమనేందుకు ఆకాశాలు సాక్ష్యం. ఆ
సాక్ష్యం నమ్మదగినది."
38 కానీ దేవా, ఏర్పరచబడిన నీ రాజు* మీద నీకు
కోపం వచ్చింది. నీవు అతన్ని ఒంటరి వానిగా
విడిచి పెట్టావు.
39 నీ ఒడంబడికను నీవు తిరస్కరించావు. రాజు
కిరీటాన్ని నీవు దుమ్ములో పారవేసావు.
40 రాజు పట్టణపు గోడలను నీవు కూలగొట్టావు.
అతని కోటలన్నింటినీ నీవు నాశనం చేశావు.
41 రాజు పొరుగువారు అతన్ని చూచి నవ్వుతారు.
దారినపోయే మనుష్యులు అతని నుండి వస్తువులు
దొంగిలిస్తారు.
42 రాజు శత్రువులందరికీ నీవు సంతోషం కలి
గించావు. అతని శత్రువులను యుద్ధంలో నీవు
గెలువనిచ్చావు.
43 దేవా, వారిని వారు కాపాడుకొనేందుకు నీవు వారికి
సహాయం చేశావు. నీ రాజు యుద్ధంలో గెలి
చేందుకు నీవు అతనికి సహాయం చేయలేదు.
44 అతని సింహాసనాన్ని నీవు నేలకు విసరివేశావు.
45 అతని ఆయుష్షు నీవు తగ్గించి వేశావు. నీవు అతన్ని
అవమానించావు.
46 యెహోవా, నీవు శాశ్వతంగా మా నుండి మరుగై
యుంటావా ? నీ కోపం అగ్నిలా ఎప్పటికీ
మండుతూ ఉంటుందా? ఎంత కాలం యిలా
సాగుతుంది?
47 నా ఆయుష్షు ఎంత తక్కువో జ్ఞాపకం చేసి
కొనుము. అల్పకాలం జీవించి, తర్వాత మరణిం
చేందుకు నీవు మమ్మల్ని సృష్టించావు.
48 ఏ మనిషీ జీవించి, ఎన్నటికీ చావకుండా ఉండ
లేడు. ఏ మనిషీ సమాధిని తప్పించుకోలేడు.
49 దేవా, గతంలో నీవు చూపించిన ప్రేమ ఎక్కడ?
దావీదు కుటుంబానికి నీవు నమ్మకంగా ఉంటావని
అతనికి నీవు వాగ్దానం చేశావు.
50–51 ప్రభూ, ప్రజలు నీ సేవకులను ఎలా అవ
మానించారో దయచేసి జ్ఞాపకం చేసుకొనుము.
యెహోవా, నీ శత్రువులనుండి ఆ అవమానాల
న్నింటినీ నేను వినాల్సి వచ్చింది. ఏర్పరచబడిన
నీ రాజును ఆ మనుష్యులు అవమానించారు.
52 యెహోవాను శాశ్వతంగా స్తుతించండి. ఆమేన్,
ఆమేన్!*

## నాల్గవ భాగం
## కీర్తన 90

**దేవుని భక్తుడైన మోషే ప్రార్థన.**

1 ప్రభూవా, శాశ్వతంగా నీవే మా నివాసం.
2 పర్వతాలు, భూమి, ప్రపంచం చేయబడక ముందే
నీవు దేవుడిగా ఉండినావు. దేవా, ఇదివరకు ఎల్ల
ప్పుడూ నీవే దేవుడవు మరియు ఎప్పటికి నీవే
దేవునిగా ఉంటావు.
3 మనుష్యులను తిరిగి మట్టిగా మారుస్తావు. మనుష్య
కుమారులారా, తిరిగి రండని నీవు చెప్పుతావు.
4 నీ దృష్టిలో వేయి సంవత్సరాలు గడచిపోయిన
ఒక రోజువలె ఉంటాయి. గత రాత్రిలా అవి
ఉన్నాయి.
5 నీవు మమ్మల్ని ఊడ్చివేస్తావు. మా జీవితం ఒక
కలలా ఉంది. మర్నాడు ఉదయం మేము ఉండము.
మేము గడ్డిలా ఉన్నాము.
6 ఉదయం గడ్డి పెరుగుతుంది సాయంత్రం అది
ఎండిపోయి వుంటుంది.
7 దేవా, నీకు కోపం వచ్చినప్పుడు మేము నాశనం
అవుతాము. నీ కోపం మమ్మల్ని భయపెడుతుంది!
8 మా పాపాలు అన్నింటిని గూర్చి నీకు తెలుసు.
దేవా, మా రహస్య పాపాలలో ప్రతి ఒక్కటి నీవు
చూస్తావు.
9 నీ కోపం నా జీవితాన్ని అంతం చేయవచ్చు.
మా సంవత్సరాలు నిట్టూర్పులా అంతమయి
పోతాయి.
10 మేము 70 సంవత్సరాలు జీవిస్తాము. బలంగా వుంటే
80 సంవత్సరాలు జీవిస్తాము. మా జీవితాలు కష్ట
తరమైన పనితోను బాధతోను నిండి ఉన్నాయి.
అప్పుడు అకస్మాత్తుగా మా జీవితాలు అంతం అవు
తాయి. మేము ఎగిరిపోతాము.

---

**ఏర్పరచబడిన నీ రాజు** అక్షరార్థంగా అభిషేకించబడిన వ్యక్తి.

**ఆమేన్** నిజంగానే అని అర్థం. అవతలి వారు చెప్పినట్టే ఒప్పుకొంటున్నాను. అని తెలియజేయుటకు ఉపయోగించ బడిన పదం.

11 దేవా, నీ కోపం యొక్క పూర్తి శక్తి ఏమిటో
నిజంగా ఎవరికీ తెలియదు. కాని దేవా, నీ యెడల
మాకున్న భయము, గౌరవం నీ కోపమంత
గొప్పవి.
12 మాకు జ్ఞానోదయం కలిగేలా మా జీవితాలు
నిజంగా ఎంత కొద్దిపాటివో మాకు నేర్పించుము.
13 యెహోవా, ఎల్లప్పుడూ మా దగ్గరకు తిరిగి
రమ్ము. నీ సేవకులకు దయ చూపించుము.
14 ప్రతి ఉదయం నీ ప్రేమతో మమ్మల్ని నింపుము.
మేము సంతోషించి, మా జీవితాలు అనుభవించ
గలిగేలా చేయుము.
15 మా జీవితాల్లో చాలా దుఃఖం, కష్టాలు నీవు కలి
గించావు. ఇప్పుడు మమ్మల్ని సంతోషింప
చేయుము.
16 వారి కోసం నీవు చేయగల ఆశ్చర్య కార్యాలను నీ
సేవకులను చూడనిమ్ము. వారి సంతానాన్ని నీ
ప్రకాశమును చూడనిమ్ము.
17 మా దేవా, మా ప్రభూ, మా యెడల దయ
చూపించుము. మేము చేసే ప్రతిదానిలో మాకు
సఫలత అనుగ్రహించుము.

## కీర్తన 91

1 మహోన్నతుడైన దేవుని ఆశ్రయంలో నివసించే
వాడు సర్వశక్తిమంతుడైన దేవుని నీడలో విశ్రాంతి
తీసుకొంటాడు.
2 "నీవే నా క్షేమ స్థానం, నా కోట. నా దేవా, నేను
నిన్నే నమ్ముకొన్నాను." అని నేను యెహోవాకు
చెబుతాను.
3 దాగి ఉన్న అపాయాలన్నింటి నుండి దేవుడు
నిన్ను రక్షిస్తాడు. ప్రమాదకరమైన రోగాలన్నింటి
నుండి దేవుడు నిన్ను రక్షిస్తాడు.
4 కాపుదలకోసం నీవు దేవుని దగ్గరకు వెళ్లవచ్చు.
పక్షి తన రెక్కలతో దాని పిల్లలను కప్పునట్లు
ఆయన నిన్ను కాపాడుతాడు. దేవుడు కేడెంగా,
నిన్ను కాపాడే గోడలా ఉంటాడు.
5 రాత్రివేళ నీవు దేనికీ భయపడవు. పగటివేళ శత్రువు
బాణాలకు నీవు భయపడవు.
6 చీకటిలో దాపురించే రోగాలకు గాని మధ్యాహ్నం
వేళ దాపురించే వ్యాధులకుగాని నీవు భయపడవు.
7 నీ పక్కన వేయిమంది, నీ కుడిచేతి పక్కన పది
వేలమంది శత్రుసైనికులను ఓడిస్తావు. నీ శత్రు
వులు నిన్ను కనీసం తాకలేరు.
8 ఊరికే చూడు, ఆ దుర్మార్గులు శిక్షించబడినట్లుగా
నీకు కనబడుతుంది.
9 ఎందుకంటే నీవు యెహోవాను నమ్ముకొన్నావు
గనుక. సర్వోన్నతుడైన దేవుణ్ణి నీ క్షేమ స్థానంగా
చేసుకొన్నావు గనుక.
10 కీడు ఏమీ నీకు జరగదు. నీ ఇంట ఎలాంటి
వ్యాధి ఉండదు.
11 ఎందుకంటే నిన్ను కనిపెట్టుకొని ఉండుటకు
దేవుడు తన దూతలకు ఆజ్ఞాపిస్తాడు. నీవు ఎక్కడికి
వెళ్లినా వారు నిన్ను కాపాడుతారు.
12 నీ పాదం రాయికి తగులకుండా దేవదూతలు వారి
చేతులతో నిన్ను పైకి ఎత్తుతారు.
13 సింహాల మీద, విషసర్పాల మీద నడిచే శక్తి నీకు
ఉంటుంది.
14 యెహోవా చెబుతున్నాడు: "ఒక వ్యక్తి నన్ను
నమ్ముకొంటే, నేను అతన్ని రక్షిస్తాను. నా పేరు
అతనికి తెలుసు కనుక నేను కాపాడుతాను.
15 నా అనుచరులు సహాయంకోసం నాకు మొర
పెడ్తారు. నేను వారికి జవాబు ఇస్తాను. వారికి కష్టం
కలిగినప్పుడు నేను వారితో ఉంటాను. నేను వారిని
తప్పించి, ఘనపరుస్తాను.
16 నా అనుచరులకు నేను దీర్ఘాయుష్షు యిస్తాను.
నేను వాళ్లను రక్షిస్తాను."

## కీర్తన 92

*సబ్బాతుకోసం స్తుతి కీర్తన.*

1 యెహోవాను స్తుతించుట మంచిది. సర్వోన్న
తుడైన దేవా, నీ నామాన్ని కీర్తించుట మంచిది.
2 ఉదయం నీ ప్రేమను గూర్చి పాడటం, రాత్రివేళ
నీ నమ్మకత్వాన్ని గూర్చి పాడటం మంచిది.
3 దేవా, పదితంత్రుల వాయిద్యాలను స్వరమండల
ములను నీ కోసం వాయించటం మంచిది. సితారా
మీద నీ కోసం సంగీతనాదం చేయటం మంచిది.
4 యెహోవా, నీవు చేసిన పనుల మూలంగా నిజంగా
నీవు మమ్మల్ని సంతోషింపచేస్తావు. నీవు చేసిన
వాటిని గూర్చి మేము సంతోషంగా పాడుకొంటాం.
5 యెహోవా, నీవు గొప్ప కార్యాలు చేశావు. నీ
తలంపులు మేము గ్రహించటం మాకు ఎంతో
కష్టతరం.
6 నీతో పోల్చినట్లయితే మనుష్యులు బుద్ధిలేని జంతు
వుల్లాంటి వారు. మేము ఏదీ గ్రహించలేని బుద్ధిలేని
వాళ్లలా ఉన్నాము.
7 దుర్మార్గులు గడ్డిలా మొలిచినా, చెడ్డవాళ్లు అభివృద్ధి
చెందినా వారు శాశ్వతంగా నాశనం అవుతారు.
8 కాని యెహోవా, నీవు శాశ్వతంగా గౌరవించ
బడతావు.
9 యెహోవా, నీ శత్రువులు అందరూ నాశనం చేయ
బడతారు. చెడు కార్యాలు చేసే ప్రజలందరూ
నాశనం చేయబడుతారు.
10 కాని నీవు నన్ను బలపరుస్తావు. బలమైన కొమ్ము
లుగల పొట్టేలువలె నీవు నన్ను చేస్తావు. సేదదీర్చే
నీ తైలాన్ని నీవు నా మీద పోశావు.

11 నా శత్రువుల పతనాన్ని నా కండ్లారా చూచాను. నా శత్రువుల నాశనాన్ని నా చెవులారా విన్నాను.
12 నీతిమంతులు ఖర్జూరపు చెట్టులా అభివృద్ధి చెందు తారు. వారు లెబానోనులోని దేవదారు వృక్షంలా పెరుగుతారు.
13 మంచి మనుష్యులు యెహోవా ఆలయంలో నాట బడిన మొక్కలవలె బలంగా ఉంటారు. వారు మన దేవుని ఆలయంలో బలంగా ఎదుగుతారు.
14 వారు వృద్ధులైన తరువాత కూడా ఫలిస్తూనే ఉంటారు. వారు ఆరోగ్యంగా ఉన్న పచ్చని మొక్కల్లా వుంటారు.
15 యెహోవా మంచివాడని నేను చెబుతున్నాను. ఆయనే నా బండ. ఆయనలో అవినీతి లేదు.

## కీర్తన 93

1 యెహోవాయే రాజు! ప్రభావము, బలము, ఆయన వస్త్రములవలె ధరించాడు. కనుక ప్రపంచం నాశనం చేయబడదు.
2 దేవా, నీవూ, నీ రాజ్యమూ శాశ్వతంగా కొన సాగుతాయి.
3 యెహోవా, నదుల ధ్వని చాలా పెద్దగా ఉంది. ఎగిరిపడే అలలు చాలా పెద్దగా ధ్వనిస్తున్నాయి,
4 పెద్దగా లేస్తున్న సముద్రపు అలలు హోరెత్తు తున్నాయి, శక్తివంతంగా ఉన్నాయి. కాని పైన ఉన్న యెహోవా అంతకంటే శక్తిగలవాడు. యెహోవా, నీ న్యాయవిధులు శాశ్వతంగా కొన సాగుతాయి. నీ పవిత్ర ఆలయం చాలాకాలం వరకు నిలిచి ఉంటుంది.

## కీర్తన 94

1 యెహోవా, నీవు మనుష్యులను శిక్షించే దేవుడవు. నీవు వచ్చి మనుష్యులకు శిక్ష తెచ్చే దేవుడవు.
2 నీవు భూలోకమంతటికీ న్యాయమూర్తివి. గర్విష్ఠు లకు రావలసిన శిక్షతో వారిని శిక్షించుము.
3 యెహోవా, దుర్మార్గులు ఎన్నాళ్లవరకు తమ సరదా అనుభవిస్తారు? యెహోవా, ఇంకెన్నాళ్లు?
4 ఆ నేరస్థులు వారు చేసిన చెడు విషయాలను గూర్చి ఇంకెన్నాళ్లు అతిశయిస్తారు?
5 యెహోవా, ఆ మనుష్యులు నీ ప్రజలను బాధిం చారు. నీ ప్రజలు శ్రమపడునట్లు వారు చేసారు.
6 మా దేశంలో నివసించే విధవరాండ్రను పరదేశ స్తులను ఆ దుర్మార్గులు చంపుతారు. తల్లిదండ్రులు లేని పిల్లలను వారు చంపుతారు.
7 వారు ఆ చెడు కార్యాలు చేయటం యెహోవా చూడటం లేదని వారు చెబుతారు. జరుగుతున్న విషయాలను ఇశ్రాయేలీయుల దేవుడు గ్రహిం చడం లేదని వారు చెబుతారు.
8 దుర్మార్గులారా, మీరు బుద్ధిలేనివారు. మీరు మీ పాఠం ఇంకెప్పుడు నేర్చుకొంటారు? దుర్మార్గు లారా, మీరు అవివేకులు మీరు గ్రహించుటకు ప్రయత్నం చేయాలి.
9 దేవుడు మన చెవులను చేశాడు. కనుక తప్పని సరిగా ఆయనకు చెవులు ఉంటాయి. జరిగే విష యాలను ఆయన వినగలడు. దేవుడు మన కళ్లను చేశాడు. కనుక తప్పనిసరిగా ఆయనకు కళ్లు ఉంటాయి. జరుగుతున్న సంగతులను ఆయన చూడగలడు.
10 ఆ ప్రజలను దేవుడే క్రమశిక్షణలో ఉంచుతాడు. ప్రజలు చేయవలసిన వాటిని దేవుడే వారికి నేర్పిస్తాడు.
11 ప్రజలు తలచే విషయాలు దేవునికి తెలుసు. ప్రజలు గాలి వీచినట్లుగా వుంటారని దేవునికి తెలుసు.
12 యెహోవా శిక్షించిన వాడు సంతోషంగా ఉంటాడు. సరియైన జీవిత విధానాన్ని దేవుడు అతనికి నేర్పిస్తాడు.
13 దేవా, ఆ మనిషికి కష్టాలు వచ్చినప్పుడు అతడు మౌనంగా ఉండుటకు నీవు సహాయం చేస్తావు. దుర్మార్గులు వారి సమాధిలో పాతిపెట్టబడేంత వరకు అతడు నెమ్మదిగా ఉండుటకు నీవు అతనికి సహాయం చేస్తావు.
14 యెహోవా తన ప్రజలను విడిచిపెట్టడు. సహాయం చేయకుండా ఆయన తన ప్రజలను విడిచిపెట్టడు.
15 న్యాయాన్ని తోడుకొని ధర్మం తిరిగి వస్తుంది. అప్పుడు మనుష్యులు మంచివాళ్లుగా, నిజాయి తీగల వాళ్లుగా ఉంటారు.
16 దుర్మార్గులకు విరోధంగా పోరాడుటకు ఏ మనిషి నాకు సహాయం చేయలేదు. చెడు కార్యాలు చేసే వారికి విరోధంగా పోరాడుటకు నాతో ఎవ్వరూ నిలువలేదు.
17 యెహోవా నాకు సహాయం చేసి ఉండకపోతే నేను వెంటనే మరణ నిశ్శబ్దంలో నివసించే వాడిని.
18 నేను పడిపోవుటకు సిద్ధంగా ఉన్నట్టు నాకు తెలుసు. కాని యెహోవా తన అనుచరుని బల పరిచాడు.
19 నేను చాలా చింతించి తల్లడిల్లిపోయాను. కాని యెహోవా, నీవు నన్ను ఆదరించి సంతోషింప చేశావు.
20 దేవా, వక్ర న్యాయవాదులకు నీవు సహాయం చేయవు. ఆ చెడ్డ న్యాయవాదులు ప్రజల జీవి తాలను దుర్భరం చేయటానికే న్యాయచట్టాన్ని ఉపయోగిస్తారు.

21 ఆ న్యాయమూర్తులు మంచి మనుష్యులపై పడు
తున్నారు. అమాయక ప్రజలు దోషులని చెప్పి
వారిని చంపుతారు.
22 అయితే పర్వతం మీద ఎత్తయిన నా క్షేమ స్థానం
యెహోవాయే. నా దుర్గమైన దేవుడు నా
క్షేమస్థానం.
23 ఆ దుర్మార్గపు న్యాయవాదులు చేసిన చెడు
పనులకోసం దేవుడు వారిని శిక్షిస్తాడు. వారు పాపం
చేశారు గనుక దేవుడు వారిని నాశనం చేస్తాడు.
మన యెహోవా దేవుడు ఆ దుర్మార్గపు న్యాయ
వాదులను నాశనం చేస్తాడు.

## కీర్తన 95

1 రండి, మనం యెహోవాని స్తుతించుదాము. మన
రక్షణా బండైన ప్రభువుకు సంతోషగానం చేద్దాము.
2 యెహోవాకు మనం కృతజ్ఞతా కీర్తనలు పాడు
దాము. సంతోష గీతాలు మనం ఆయనకు
పాడుదాము.
3 ఎందుకంటే అయన మహా గొప్ప దేవుడు గనుక.
ఆయన యితర "దేవుళ్లందరినీ" పాలించే మహా
రాజు.
4 లోతైన గుహలు, ఎత్తయిన పర్వతాలు
యెహోవాకు చెందుతాయి.
5 మహా సముద్రమూ ఆయనదే ఆయనే దాన్ని
సృష్టించాడు. దేవుడు తన స్వహస్తాలతో పొడి
నేలను చేశాడు.
6 రండి, మనం సాగిలపడి ఆయనను ఆరాధించు
దాము. మనలను సృష్టించిన దేవున్ని మనం
స్తుతిద్దాము.
7 ఆయన మన దేవుడు, మనం ఆయన ప్రజలము.
మనం ఆయన స్వరం వింటే నేడు మనం ఆయన
గొర్రెలము.
8 దేవుడు చెబుతున్నాడు, "మెరీబా* దగ్గర మీరు
ఉన్నట్టుగా అరణ్యంలో మస్సా దగ్గర మీరు ఉన్న
ట్టుగా మొండిగా ఉండకండి.
9 మీ పూర్వీకులు నన్ను శోధించారు. వారు నన్ను
పరీక్షించారు. కానీ అప్పుడు నేను ఏమి చేయ
గలిగానో వారు చూశారు.
10 ఆ ప్రజలతో 40 సంవత్సరాలు నేను సహనంగా
ఉన్నాను. వారు నమ్మకస్తులు కారని నాకు తెలుసు.
ఆ ప్రజలు నా ఉపదేశాలు అనుసరించటానికి
నిరాకరించారు.
11 అందుచేత నాకు కోపం వచ్చి, వారు నా విశ్రాంతి
దేశంలో ప్రవేశించరు అని ప్రమాణం చేశాను."

**మెరీబా** నిర్గ. కా. 17:1-7 చూడండి.

## కీర్తన 96

1 యెహోవా చేసిన కొత్త కార్యాలను గూర్చి ఒక
కొత్త కీర్తన పాడుడి! సర్వలోకం యెహోవాకు
కీర్తనలు పాడును గాక!
2 యెహోవాకు కీర్తన పాడండి. ఆయన నామాన్ని
స్తుతించండి. శుభవార్త ప్రకటించండి. ఆయన ప్రతి
రోజూ మనలను రక్షించుటను గూర్చి
ప్రకటించండి.
3 దేవుడు నిజంగా ఆశ్చర్యకరుడని ఇతర ప్రజలతో
చెప్పండి. దేవుడు చేసే అద్భుత కార్యాలను గూర్చి
అన్నిచోట్లా ప్రజలకు చెప్పండి.
4 యెహోవా గొప్పవాడు, స్తుతికి పాత్రుడు. ఇతర
"దేవుళ్లు" అందరికంటె ఆయన భీకరుడు.
5 ఇతర జనాల "దేవుళ్లంతా" కేవలం విగ్రహాలే. కానీ
యెహోవా ఆకాశాలను సృష్టించాడు.
6 ఆయన యెదుట అందమైన మహిమ ప్రకాశిస్తూ
ఉంటుంది. దేవుని పవిత్ర ఆలయంలో బలం,
సౌందర్యం ఉన్నాయి.
7 వంశములారా, రాజ్యములారా యెహోవా మహి
మకు, స్తుతి కీర్తనలు పాడండి.
8 యెహోవా నామాన్ని స్తుతించండి. మీ కానుకలు
తీసుకొని ఆలయానికి వెళ్లండి.
9 యెహోవా అందమైన ఆలయంలో ఆయనను
ఆరాధించండి! భూమి మీద ప్రతి మనిషి ఆయన
ముందు వణకాలి.
10 యెహోవా రాజు అని జనాలకు ప్రకటించండి!
కనుక ప్రపంచం నాశనం చేయబడదు. యెహోవా
తన ప్రజలను న్యాయంగా పరిపాలిస్తాడు.
11 ఆకాశములారా సంతోషించండి! భూమీ, ఆనం
దించుము! సముద్రమా, అందులోని సమస్తమా,
సంతోషంతో ఘోషించుము!
12 పొలాల్లారా, వాటిలో పండే సమస్తమా సంతో
షించండి! అరణ్యంలో వృక్షాల్లారా, పాడుతూ
సంతోషించండి.
13 యెహోవా వస్తున్నాడు గనుక సంతోషంగా
ఉండండి. ప్రపంచాన్ని పాలించుటకు*
యెహోవా వస్తున్నాడు. న్యాయంగా, ధర్మంగా
ఆయన ప్రపంచాన్ని పాలిస్తాడు.

## కీర్తన 97

1 యెహోవా ఏలుతున్నాడు, భూమి సంతోషి
స్తోంది. దూర దేశాలన్నీ సంతోషిస్తున్నాయి.
2 దట్టమైన చీకటి మేఘాలు యెహోవాను ఆవ
రించాయి. నీతి న్యాయాలు ఆయన రాజ్యాన్ని
బలపరుస్తాయి.

**ప్రపంచాన్ని పాలించుటకు** పాలించుట లేదా న్యాయం
తీర్చుట.

3 యెహోవా ముందర అగ్నిజ్వాలలు వెళ్తూ ఆయన
శత్రువులను నాశనం చేస్తుంది.
4 ఆయన మెరుపు ఆకాశంలో తళుక్కుమంటుంది.
ప్రజలు దాన్ని చూచి భయపడతారు.
5 యెహోవా ఎదుట పర్వతాలు మైనంలా కరగి
పోతాయి. భూలోక ప్రభువు ఎదుట అవి కరిగి
పోతాయి.
6 ఆకాశములారా, ఆయన మంచితనం గూర్చి
చెప్పండి. ప్రతి మనిషీ దేవుని మహిమను చూచును
గాక!
7 మనుష్యులు వారి విగ్రహాలను పూజిస్తారు. వారు
వారి "దేవుళ్లను" గూర్చి అతిశయిస్తారు. కానీ ఆ
ప్రజలు యిబ్బంది పడుతారు. వారి "దేవుళ్లు"
యెహోవాకు సాగిలపడి ఆయనను ఆరాధిస్తారు.
8 సీయోనూ, విని సంతోషించుము! యూదా పట్టణ
ములారా, సంతోషించండి! ఎందుకంటే
యెహోవా జ్ఞానముగల నిర్ణయాలు చేస్తాడు.
9 సర్వోన్నతుడవైన యెహోవా, నిజంగా నీవే
భూమిని పాలించేవాడవు. ఇతర "దేవుళ్ల" కంటే
నీవు చాలా మంచివాడవు.
10 యెహోవాను ప్రేమించే ప్రజలు దుర్మార్గాన్ని
ద్వేషిస్తారు. కనుక దేవుడు తన అనుచరులను రక్షి
స్తాడు. దేవుడు దుర్మార్గులనుండి తన అనుచరు
లను రక్షిస్తాడు.
11 మంచి మనుష్యుల మీద వెలుగు, సంతోషం
ప్రకాశిస్తాయి.
12 మంచి మనుష్యులారా యెహోవాయందు ఆనం
దించండి. ఆయన పవిత్ర నామాన్ని ఘనపరచండి.

## కీర్తన 98

***స్తుతి కీర్తన.***

1 యెహోవా, నూతన అద్భుత క్రియలు చేశాడు
గనుక ఆయనకు ఒక కొత్త కీర్తన పాడండి.
2 ఆయన పవిత్ర కుడి హస్తం ఆయనకు విజయం
తెచ్చింది.
3 యెహోవా రక్షించగల తన శక్తిని రాజ్యాలకు చూపె
ట్టాడు. యెహోవా తన నీతిని వారికి చూపించాడు.
4 ఇశ్రాయేలీయుల యెడల ఆయన తన దయను,
నమ్మకమును జ్ఞాపకముంచుకొన్నాడు. రక్షించగల
మన దేవుని శక్తిని దూరదేశాల ప్రజలు చూసారు.
5 భూమి మీది ప్రతి జనము యెహోవాకు ఆనంద
ధ్వని చేయండి. త్వరగా స్తుతి కీర్తనలు పాడటం
ప్రారంభించండి.
6 స్వరమండలములారా, యెహోవాను స్తుతించండి.
స్వరమండల సంగీతమా, ఆయనను స్తుతించుము.
7 బూరలు, కొమ్ములు ఊదండి. మన రాజైన
యెహోవాకు ఆనంద ధ్వని చేయండి.
8 భూమి, సముద్రం, వాటిలో ఉన్న సమస్త జీవుల్లారా
బిగ్గరగా పాడండి.
9 నదులారా చప్పట్లు కొట్టండి. పర్వతములారా
ఇప్పుడు మీరంతా కలిసి గట్టిగా పాడండి.
10 యెహోవా ప్రపంచాన్ని పాలించుటకు వస్తు
న్నాడు గనుక ఆయన ఎదుట పాడండి. ఆయన
ప్రపంచాన్ని న్యాయంగా పాలిస్తాడు. నీతితో
ఆయన ప్రజలను పాలిస్తాడు.

## కీర్తన 99

1 యెహోవాయే రాజు. కనుక రాజ్యాలు భయంతో
వణకాలి. కెరూబు* దూతలకు పైగా దేవుడు
రాజుగా కూర్చున్నాడు. అందుచేత ప్రపంచం
భయంతో కదలిపోతుంది.
2 సీయోనులో యెహోవా గొప్పవాడు. ప్రజలం
దరి మీద ఆయన గొప్ప నాయకుడు.
3 ప్రజలంతా నీ నామాన్ని స్తుతించెదరుగాక. దేవుని
నామం భీకరం. దేవుడు పరిశుద్ధుడు.
4 శక్తిగల రాజు న్యాయాన్ని ప్రేమిస్తాడు. దేవా నీతిని
నీవు చేశావు. యాకోబుకు (ఇశ్రాయేలు) నీతి
న్యాయాలను నీవే జరిగించావు.
5 మన దేవుడైన యెహోవాను స్తుతించండి. ఆయన
పవిత్ర పాదపీఠాన్ని* ఆరాధించండి.
6 మోషే, అహరోనులు దేవుని యాజకులలో
కొందరు, మరియు దేవుని ఆరాధకులలో సమూ
యేలు ఒకడు. వారు యెహోవాను ప్రార్థించారు.
దేవుడు వారికి జవాబు యిచ్చాడు.
7 ఎత్తయిన మేఘం నుండి దేవుడు మాట్లాడాడు.
వారు ఆయన ఆదేశాలకు విధేయులయ్యారు.
దేవుడు వారికి ధర్మశాస్త్రం ఇచ్చాడు.
8 మా దేవా, యెహోవా, నీవు వారి ప్రార్థనలకు
జవాబు ఇచ్చావు. నీవు క్షమించే దేవుడవని, చెడు
కార్యాలు చేసినందుకు ప్రజలను నీవు శిక్షిస్తావని
వారికి చూపించావు.
9 మన దేవుడైన యెహోవాను స్తుతించండి. ఆయన
పవిత్ర పర్వతంవైపు సాగిలపడి ఆయనను ఆరాధిం
చండి. మన దేవుడైన యెహోవా నిజంగా
పరిశుద్ధుడు.

## కీర్తన 100

***కృతజ్ఞత కీర్తన.***

1 భూమీ, యెహోవాను గూర్చి పాడుము!
2 నీవు యెహోవాను సేవిస్తూ సంతోషంగా ఉండు!
ఆనంద గీతాలతో యెహోవా ఎదుటికి రమ్ము.

---

**కెరూబులు** దేవునినుండి విశేషమైన దూతలు.

**పాదపీఠం** ఇది దేవాలయం అని అర్థము కావచ్చు.

3 యెహోవా దేవుడని తెలుసుకొనుము. ఆయనే
మనలను సృజించాడు. మనం ఆయన ప్రజలము.
మనము ఆయన గొర్రెలము.
4 కృతజ్ఞతా కీర్తనలతో యెహోవా పట్టణంలోనికి
రండి. స్తుతి కీర్తనలతో ఆయన ఆలయంలోనికి
రండి. ఆయననుగౌరవించండి. ఆయన నామాన్ని
స్తుతించండి.
5 యెహోవా మంచివాడు. ఆయన ప్రేమ నిరంతరం
ఉంటుంది. ఆయన్ని శాశ్వతంగా నమ్ము కోవచ్చు.

## కీర్తన 101

**దావీదు కీర్తన.**

1 ప్రేమ, న్యాయాలను గూర్చి నేను పాడుతాను.
యెహోవా, నేను నీకు భజన చేస్తాను.
2 నేను జాగ్రత్తగా పరిశుద్ధ జీవితం జీవిస్తాను. నేను
నా ఇంటిలో పరిశుద్ధ జీవితం జీవిస్తాను.
యెహోవా నీవు నా దగ్గరకు ఎప్పుడు వస్తావు?
3 నా యెదుట ఏ విగ్రహాలు* ఉంచుకోను. అలా
నీకు విరోధంగా తిరిగే వారిని నేను ద్వేషిస్తాను.
నేను అలా చేయను!
4 నేను నిజాయితీగా ఉంటాను. నేను దుర్మార్గపు
పనులు చేయను.
5 ఒకవేళ ఎవరైనా తన పొరుగువారిని గూర్చి రహ
స్యంగా చెడ్డమాటలు చెబితే అలా చేయకుండా
అతన్ని నేను ఆపివేస్తాను. మనుష్యులు ఇతరుల
కంటే తామే మంచి వారమని తలుస్తూ అతిశయిం
చడం నేను జరుగ నివ్వను.
6 నమ్మదగిన మనుష్యులకోసం నేను దేశం అంతటా
చూస్తాను. ఆ మనుష్యులను మాత్రమే నేను
నాకోసం పని చేయనిస్తాను. యదార్థ జీవితాలు
జీవించే వాళ్లు మాత్రమే నా సేవకులుగా ఉండ
గలరు.
7 అబద్ధీకులను నేను నా ఇంటిలో ఉండనివ్వను.
అబద్ధీకులను నేను నా దగ్గర ఉండనివ్వను.
8 ఈ దేశంలో నివసించే దుర్మార్గులను నేను ఎల్ల
ప్పుడూ నాశనం చేస్తాను. దుర్మార్గులను
యెహోవా పట్టణం నుండి బలవంతంగా వెళ్ల
గొడతాను.

## కీర్తన 102

***శ్రమపడుతున్న వ్యక్తి ప్రార్థన. బలహీనంగా ఉండి తన ఆరోపణలను యెహోవాకు చెప్పాలని అతడు తలంచినప్పటిది.***

1 యెహోవా, నా ప్రార్థన విను. సహాయం కోసం
నేను పెడుతున్న నా మొర వినుము.
2 యెహోవా, నాకు కష్టాలు వచ్చినప్పుడు నా
నుండి తిరిగి పోకుము. నా మాట వినుము.
సహాయం కోసం నేను మొర పెట్టినప్పుడు వెంటనే
నాకు జవాబు ఇమ్ము.
3 పొగ వెళ్లినట్లుగా నా జీవితం వెళ్లిపోతుంది. నా
జీవితం నిదానంగా కాలిపోతున్న మంటలా ఉంది.
4 నా బలం పోయింది. నేను ఎండిపోయి చస్తున్న
గడ్డిలా ఉన్నాను. నా కష్టాల మూలంగా నేను నా
ఆహారాన్ని తినటం కూడా మరచిపోయాను.
5 నా విచారం వల్ల నా బరువు తగ్గిపోతూంది.*
6 అరణ్యంలో నివసిస్తున్న గుడ్లగూబలా నేను ఒంట
రిగా ఉన్నాను. శిథిలమైన పాత కట్టడాలలో
బతుకుతున్న గుడ్లగూబలా నేను ఒంటరిగా
ఉన్నాను.
7 నేను నిద్రపోలేను. పై కప్పు మీద ఒంటరిగా
నివసించే పక్షిలా నేను ఉన్నాను.
8 నా శత్రువులు నన్ను ఎల్లప్పుడూ అవమానిస్తారు.
నన్ను హేళన చేసే మనుష్యులు నన్ను శపించే
టప్పుడు నా పేరు ప్రయోగిస్తారు.
9 నా అధిక విచారమే నా భోజనం. నా కన్నీళ్లు నా
పానీయాల్లో పడతాయి.
10 ఎందుకంటే, నీవు నా మీద కోపగించావు.
యెహోవా, నీవు నన్ను లేవనెత్తావు, నీవు నన్ను
కిందకు విసిరేశావు.
11 సాయంకాలమయ్యేసరికి దీర్ఘమైన నీడలు అంతం
అయిపోయినట్లు, నా జీవితం దాదాపుగా అంతం
అయి పోయింది. నేను ఎండిపోయి చస్తున్న గడ్డిలా
ఉన్నాను.
12 అయితే యెహోవా, నీవు శాశ్వతంగా జీవిస్తావు.
నీ నామం శాశ్వతంగా కొనసాగుతుంది.
13 నీవు లేచి సీయోనును ఆదరిస్తావు. నీవు సీయోను
యెడల దయగా ఉండే సమయం వస్తూంది.
14 యెరుషలేము పట్టణపు రాళ్లను వారు ప్రేమిస్తారు.
15 జనసముదాయాలు యెహోవా నామాన్ని ఆరా
ధిస్తారు. దేవా, భూమి మీద రాజులందరూ నిన్ను
గౌరవిస్తారు.
16 ఎందుకంటే యెహోవా సీయోనును మరల
నిర్మిస్తాడు. యెరూషలేము మహిమను ప్రజలు
మరల చూస్తారు.
17 దేవుడు సజీవులుగా విడిచిపెట్టిన ప్రజల ప్రార్థనలు
వింటాడు. దేవుడు వారి ప్రార్థనలు వింటాడు.
18 రాబోయే తరం వారు చదువుకొనేందుకు ఈ
సంగతులు రాసి పెట్టు. అప్పుడు భవిష్యత్తులో
ఆ ప్రజలు యెహోవాను స్తుతిస్తారు.

---

**విగ్రహాలు** అక్షరార్థముగా భయంకర సంగతులు.

**నా బరువు తగ్గిపోతూంది** అక్షరార్థంగా నా ఎముకలు నా చర్మానికి అంటుకుపోతవి.

19 యెహోవా పైవున్న తన పవిత్ర స్థానం నుండి
కిందకు చూస్తాడు. యెహోవా పరలోకం నుండి
కింద భూమిని చూస్తాడు.
20 ఖైదీల ప్రార్థనలు ఆయన వింటాడు. మరణశిక్ష
విధించబడిన ప్రజలను ఆయన విడుదల చేస్తాడు.
21 సీయోను ప్రజలు యెహోవాను గూర్చి చెబు
తారు. వారు యెహోవా నామాన్ని యెరూషలే
ములో స్మరిస్తారు.
22 జనసమూహములు కలిసి పోగుచేయ బడునప్పుడు
రాజ్యాలు యెహోవాకు సేవచేయటానికి వచ్చి
నప్పుడు ఇది జరుగుతుంది.
23 నాలో బలం పోయింది. నా జీవితం తక్కువగా
చేయబడింది.
24 కనుక నేను ఇలా చెప్పాను, “నేను ఇంకా యువకు
నిగా ఉండగానే నన్ను చావనివ్వకు. దేవా, నీవు
శాశ్వతంగా జీవిస్తావు.
25 చాలా కాలం క్రిందట నీవు ప్రపంచాన్ని సృష్టిం
చావు. ఆకాశాన్ని నీ స్వహస్తాలతో చేశావు.
26 ప్రపంచం, ఆకాశం అంతం అవుతాయి. కానీ నీవు
శాశ్వతంగా జీవిస్తావు. అవి బట్టల్లా పాడైపోతాయి.
మరియు వస్త్రాలు మార్చినట్టుగా నీవు వాటిని
మార్చి వేస్తావు. అవన్నీ మార్చివేయబడతాయి.
27 కాని, దేవా, నీవు ఎన్నటికీ మారవు. నీవు శాశ్వ
తంగా జీవిస్తావు!
28 ఈ వేళ మేము నీ సేవకులము. భవిష్యత్తులో
మా సంతతి వారిక్కడ నివసిస్తారు. మరియు వారి
సంతతి వారిక్కడ నిన్ను ఆరాధిస్తారు.

## కీర్తన 103

***దావీదు కీర్తన.***

1 నా ప్రాణమా! యెహోవాను స్తుతించుము. నా
సర్వ అంగములారా ఆయన పవిత్ర నామాన్ని
స్తుతించండి.
2 నా ప్రాణమా, యెహోవాను స్తుతించుము.
ఆయన నిజంగా దయగలవాడని మరచిపోకుము.
3 మనం చేసిన పాపాలన్నింటినీ దేవుడు క్షమిస్తు
న్నాడు. మన రోగాలన్నింటినీ ఆయన బాగు
చేస్తున్నాడు.
4 దేవుడు మన ప్రాణాన్ని సమాధి నుండి రక్షిస్తు
న్నాడు. ఆయన ప్రేమ, జాలి మనకు ఇస్తున్నాడు.
5 దేవుడు మనకు విస్తారమైన మంచి వస్తువులు
ఇస్తున్నాడు. ఆయన మనలను పక్షిరాజు పిల్లవలె
మరల పడుచువారినిగా చేస్తున్నాడు.
6 యెహోవా న్యాయం కలవాడు. ఇతర మనుష్యుల
ద్వారా గాయపరచబడి దోచుకొనబడిన ప్రజలకు
దేవుడు న్యాయం జరిగిస్తాడు.
7 దేవుడు తన న్యాయ చట్టాలను మోషేకు నేర్పాడు.
తాను చేయగల శక్తివంతమైన పనులను ఇశ్రాయేలీ
యులకు దేవుడు చూపించాడు.
8 యెహోవా జాలిగలవాడు, దయగలవాడు. దేవుడు
సహనంగలవాడు, ప్రేమపూర్ణుడు.
9 యెహోవా ఎల్లప్పుడూ విమర్శించడు.
యెహోవా ఎల్లప్పుడూ మన మీద కోపంతో
ఉండడు.
10 మనం దేవునికి విరోధంగా పాపం చేశాం. కాని
మనకు రావలసిన శిక్షను దేవుడు మనకివ్వలేదు.
11 భూమిపైన ఆకాశం ఎంత ఎత్తుగా ఉన్నదో అంత
ఎత్తుగా తన అనుచరుల ఎడల దేవుని ప్రేమ
ఉన్నది.
12 పడమటినుండి తూర్పు దూరంగా ఉన్నట్లు దేవుడు
మననుండి మన పాపాలను అంత దూరం తీసి
వేశాడు.
13 తండ్రి తన పిల్లల యెడల దయగా ఉంటాడు.
అదే విధంగా, యెహోవా తన అనుచరులపట్ల
కూడా దయగా ఉంటాడు.
14 మనల్ని గూర్చి దేవునికి అంతా తెలుసు. మనం
మట్టిలో నుండి చేయబడ్డామని దేవునికి తెలుసు.
15 మన జీవితాలు కొద్దికాలమని దేవునికి తెలుసు.
మన జీవితాలు గడ్డిలాంటివని ఆయనకు తెలుసు.
16 మనం ఒక చిన్న అడవి పువ్వులాంటి వాళ్లం అని
దేవునికి తెలుసు. ఆ పువ్వు త్వరగా పెరుగుతుంది.
ఆ తరువాత వేడిగాలి వీస్తుంది; పువ్వు వాడి
పోతుంది. త్వరలోనే ఆ పువ్వు ఎక్కడ ఎగురు
తుందో నీవు చూడలేకపోతావు.
17 కాని యెహోవా ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
దేవుడు తన అనుచరులను శాశ్వతంగా ప్రేమిస్తాడు.
దేవుడు వారి పిల్లలయెడల, వారి పిల్లల పిల్లల
యెడల, ఎంతో మంచివాడుగా ఉంటాడు.
18 దేవుని ఒడంబడికకు విధేయులయ్యేవారికి ఆయన
మంచివాడు. దేవుని ఆదేశాలకు విధేయులయ్యే
వారికి ఆయన మంచివాడు.
19 దేవుని సింహాసనం పరలోకంలో ఉంది. మరియు
ఆయన సమస్తాన్నీ పరిపాలిస్తున్నాడు.
20 దేవదూతలారా, యెహోవాను స్తుతించండి దేవ
దూతలారా, మీరే దేవుని ఆదేశాలకు విధేయులయ్యే
శక్తిగల సైనికులు. మీరు దేవుని మాట విని ఆయన
ఆదేశాలకు విధేయులవ్వండి.
21 యెహోవా సర్వసైన్యములారా, ఆయనను స్తుతిం
చండి. మీరు ఆయన సేవకులు, దేవుడు కోరే
వాటిని మీరు చేస్తారు.
22 అన్ని చోట్లా అన్నింటినీ యెహోవా చేశాడు.
అన్నిచోట్లా సమస్తాన్నీ దేవుడు పాలిస్తాడు. అవన్నీ
యెహోవాను స్తుతించాలి! నా ప్రాణమా,
యెహోవాను స్తుతించుము!

## కీర్తన 104

1 నా ప్రాణమా, యెహెూవాను స్తుతించు!
యెహెూవా, నా దేవా, నీవు ఎంతో గొప్పవాడవు.
మహిమ, ఘనత నీవు వస్త్రాలుగా ధరించావు.
2 ఒక వ్యక్తి నిలువుపాటి అంగీ ధరించినట్లుగా నీవు
వెలుగును ధరిస్తావు. ఆకాశాలను నీవు తెరగా
పరుస్తావు.
3 దేవా వాటికి పైగా నీవు నీ ఇంటిని నిర్మించావు.
దట్టమైన మేఘాలను నీవు నీ రథంగా ఉపయోగి
స్తావు. గాలి రెక్కల మీద నీవు ఆకాశంలో
ప్రయాణం చేస్తావు.
4 దేవా, నీ దూతలను నీవు గాలిలా చేశావు. నీ
సేవకులను అగ్నిలా చేశావు.
5 దేవా, భూమిని దాని పునాదులపై నీవు నిర్మిం
చావు. కనుక అది ఎప్పటికీ నాశనం చేయబడదు.
6 దుప్పటి కప్పినట్టుగా నీవు భూమిని నీళ్లతో కప్పి
వేశావు. నీళ్లు పర్వతాలను కప్పి వేశాయి.
7 కానీ నీవు ఆజ్ఞ ఇవ్వగానే, నీళ్లు వేగంగా వెళ్లి
పోయాయి. దేవా, నీవు నీళ్లతో చెప్పగానే నీళ్లు
వెంటనే వెళ్లిపోయాయి.
8 పర్వతాలనుండి లోయల్లోనికి, ఆ తరువాత నీవు
వాటికోసం చేసిన స్థలాల్లోకి నీళ్లు ప్రవహించాయి.
9 సముద్రానికి నీవు హద్దులు నియమించావు. నీళ్లు
భూమిని కప్పివేసేట్టుగా మరల ఎన్నటికీ
ఉప్పొంగవు.
10 దేవా, నీటి ఊటలనుండి నీటి కాలవలలోనికి నీవే
నీళ్లను ప్రవహింప చేస్తావు. పర్వతాల జలధారల
ద్వారా నీవు నీటిని కిందికి కాలువలా ప్రవహింప
జేసావు.
11 నీటి ప్రవాహాలు అడవి జంతువులన్నిటికీ నీళ్లను
ఇస్తాయి. అక్కడ నీళ్లు తాగటానికి అడవి గాడిదలు
కూడ వస్తాయి.
12 నీటి మడుగుల చెంత నివసించుటకు అడవి పక్షులు
వస్తాయి. సమీపంలో ఉన్న చెట్ల కొమ్మల మీద
నుండి అవి పాడుతాయి.
13 దేవుడు పర్వతాల మీదికి వర్షం పంపిస్తాడు. దేవుడు
చేసిన పనులు భూమికి అవసరమైన ప్రతి దాన్నీ
ఇస్తాయి.
14 దేవా, పశువులకు ఆహారంగా గడ్డి ఎదిగేలా నీవు
చేస్తావు. మేము పెంచుటకు ప్రయాసపడే
మొక్కల్ని నీవు మాకిస్తావు. ఆ మొక్కలే ఈ భూమి
మీద నుండి మాకు లభించే ఆహారం.
15 దేవా, మమ్మల్ని సంతోషపెట్టే ద్రాక్షారసం నీవు
మాకు ఇస్తావు. మా చర్మాన్ని నునుపు* చేసే
తైలాన్ని నీవు మాకిస్తావు. మమ్మల్ని బలంగల
వారిగా చేయుటకు నీవు మాకు భోజనం ఇస్తావు.
16 లెబానోను మహా దేవదారు వృక్షాలను దేవుడు
నాటాడు. ఆ మహా వృక్షాలు ఎదుగుటకు వాటికి
సమృద్ధిగా నీళ్లున్నాయి.
17 పక్షులు ఆ వృక్షాలపై గూళ్లు పెడతాయి. పెద్ద
కొంగలు దేవదారు వృక్షాలలో నివాసం చేస్తాయి.
18 పెద్ద కొండలు అడవి మేకలకు నివాసం, పెద్ద
బండలు కుందేళ్లు దాక్కొనే చోట్లు.
19 దేవా, కాల సూచికగా ఉండుటకు నీవు మాకు
చంద్రుణ్ణిచ్చావు. దాని మూలంగా పండుగ రోజు
లను తెలుసుకోగలుగుతాము. ఎక్కడ అస్తమిం
చాలో సూర్యునికి ఎల్లప్పుడూ తెలుసు.
20 చీకటిని నీవు రాత్రిగా చేశావు. ఆ సమయాన
అడవి జంతువులు బయటికి వచ్చి చుట్టూరా
సంచరిస్తాయి.
21 సింహాలు దాడి చేసేటప్పుడు గర్జిస్తాయి. అవి
దేవుడు వాటికిచ్చే ఆహారంకోసం ఆయనను
అడుగుతున్నట్టు ఉంటుంది.
22 మరల సూర్యుడు ఉదయించినప్పుడు ఆ జంతు
వులు తిరిగి వాటి నివాసాలకు వెళ్లి విశ్రమిస్తాయి.
23 అప్పుడు ప్రజలు వారి పనుల కోసం బయటకు
వెళ్తారు. సాయంత్రం వరకు వారు పని చేస్తారు.
24 యెహెూవా, నీవు ఎన్నో ఆశ్చర్యకార్యాలు చేశావు.
భూమి నీ కార్యాలతో నిండిపోయింది. నీవు చేసే
ప్రతి పనిలో నీవు నీ జ్ఞానాన్ని ప్రదర్శిస్తావు.
25 మహా సముద్రాన్ని చూడు. అది ఎంతో పెద్దది
మహా సముద్రంలో రకరకాల ప్రాణులు నివసి
స్తాయి. వాటిలో కొన్ని ప్రాణులు పెద్దవి కొన్ని
చిన్నవి. మహా సముద్రంలో ఉండే వాటిని లెక్కిం
చుటకు అవి చాలా విస్తారంగా ఉన్నాయి.
26 మహా సముద్రంలో ఓడలు ప్రయాణం చేస్తాయి.
నీవు చేసిన సముద్ర ప్రాణి మకరం* ఆ సము
ద్రంలో ఆడుకుంటుంది.
27 దేవా, ఆ ప్రాణులన్నీ నీ మీద ఆధారపడి ఉన్నాయి.
దేవా, వాటికి సరియైన సమయంలో నీవు ఆహారం
యిస్తావు.
28 దేవా, జీవించే ప్రాణులన్నీ తినే ఆహారం నీవే
వాటికి ఇస్తావు. మంచి భోజనంతో నిండిన నీ
గుప్పిళ్లు నీవు విప్పగా అవి కడుపు నిండేంత వరకు
భోజనము చేస్తాయి.
29 నీవు వాటి నుండి తిరిగిపోయినప్పుడు అవి భయ
పడిపోతాయి. వాటి ప్రాణం వాటిని విడిచి నప్పుడు
అవి బలహీనమై చస్తాయి. మరియు అవి మరల
మట్టి అయిపోతాయి.

---

**చర్మాన్ని నునుపు** అక్షరార్థంగా “మా ముఖాల్ని ప్రకాశింప జేసే”, “మమ్మల్ని సంతోషపెట్టే” అనే అర్థం యివ్వవచ్చు.

**మకరం** సముద్ర రాక్షసి. సముద్రపు మహా శక్తికి గురుతు.

30 కాని యెహోవా, నీ ఆత్మను పంపినపుడు, అవి మరల ఆరోగ్యంగా ఉంటాయి. భూమి మరల కొత్తదిగా అవుతుంది.
31 యెహోవా మహిమ శాశ్వతంగా కొనసాగును గాక. యెహోవా చేసిన వాటిని ఆయన అనుభవించునుగాక.
32 యెహోవా భూమివైపు చూసేటప్పుడు అది వణకుతుంది. ఆయన పర్వతాలను ముట్టేటప్పుడు వాటినుండి పొగ లేవటానికి ప్రారంభిస్తుంది.
33 నా జీవితకాలం అంతా నేను యెహోవాకు పాడుతాను. నేను బతికి ఉండగా యెహోవాకు స్తుతులు పాడుతాను.
34 నేను చెప్పిన విషయాలు ఆయనను సంతోషపెడతాయని నేను ఆశిస్తున్నాను. యెహోవా విషయమై నేను సంతోషిస్తున్నాను.
35 భూమి మీద నుండి పాపం కనబడకుండా పోవును గాక. దుర్మార్గులు శాశ్వతంగా తొలగిపోవుదురు గాక. నా ప్రాణమా, యెహోవాను స్తుతించు! యెహోవాను స్తుతించు!

## కీర్తన 105

1 యెహోవాకు కృతజ్ఞతలు చెల్లించుము. ఆయన నామాన్ని ఆరాధించుము. ఆయన చేసే అద్భుత కార్యాలను గూర్చి జనాలతో చెప్పు.
2 యెహోవాను గూర్చి పాడుము. ఆయనకు స్తుతులు పాడుము. ఆయన చేసే అద్భుతకార్యాలు అన్నింటిని గూర్చి చెప్పు.
3 యెహోవా పవిత్ర నామాన్ని గూర్చి అతిశయించు. యెహోవాను ఆరాధించే ప్రజలారా, మీరంతా సంతోషించండి.
4 బలంకోసం యెహోవా దగ్గరకు వెళ్లండి. సహాయంకోసం ఎల్లప్పుడూ ఆయన దగ్గరకు వెళ్లండి.
5 యెహోవా చేసే ఆశ్చర్య కార్యాలను జ్ఞాపకం చేసుకోండి. ఆయన అద్భుతాలను, జ్ఞానంగల నిర్ణయాలను జ్ఞాపకం చేసుకోండి.
6 దేవుని సేవకుడైన అబ్రాహాము సంతతివారు మీరు. దేవుడు ఏర్పరచుకొన్న యాకోబు సంతతివారు మీరు.
7 యెహోవా మన దేవుడు. యెహోవా సర్వ లోకాన్నీ పాలిస్తాడు.*
8 దేవుని ఒడంబడికను శాశ్వతంగా జ్ఞాపకం చేసికోండి. 1000 తరాలవరకు ఆయన ఆదేశాలను జ్ఞాపకం ఉంచుకోండి.
9 దేవుడు అబ్రాహాముతో ఒక ఒడంబడిక చేసాడు. ఇస్సాకుకు దేవుడు వాగ్దానం చేశాడు.
10 యాకోబుకు (ఇశ్రాయేలు) దేవుడు ధర్మశాస్త్రం ఇచ్చాడు. ఇశ్రాయేలుతో దేవుడు తన శాశ్వత ఒడంబడిక చేసాడు.
11 "నేను నీకు కనాను దేశాన్ని ఇస్తాను, ఆ దేశం నీకు చెందుతుంది." అని దేవుడు చెప్పాడు.
12 అబ్రాహాము కుటుంబం చిన్నదిగా ఉన్నప్పుడు దేవుడు ఆ వాగ్దానం చేశాడు. మరియు వారు కనానులో నివసిస్తున్న యాత్రికులు మాత్రమే.
13 దేశం నుండి దేశానికి, రాజ్యం నుండి రాజ్యానికి వారు ప్రయాణం చేసారు.
14 కానీ యితర మనుష్యులు ఆ కుటుంబాన్ని బాధించనియ్యకుండా దేవుడు చేసాడు. వారిని బాధించవద్దని దేవుడు రాజులను హెచ్చరించాడు.
15 "నేను ఏర్పాటు చేసుకొన్న నా ప్రజలను బాధించవద్దు. నా ప్రవక్తలకు ఎలాంటి కీడూ చేయవద్దు." అని దేవుడు చెప్పాడు.
16 దేవుడు ఆ దేశంలో ఒక కరువు వచ్చేటట్టు చేశాడు. ప్రజలకు తినుటకు సరిపడినంత ఆహారం లేదు.
17 అయితే దేవుడు వారికి ముందుగా వెళ్లుటకు యోసేపు అనే మనిషిని పంపించాడు. యోసేపు ఒక బానిసవలె అమ్మబడ్డాడు.
18 యోసేపు కాళ్లను తాళ్లతో వారు కట్టివేశారు. అతని మెడకు వారు ఒక ఇనుప కంటె వేశారు.
19 యోసేపు చెప్పిన సంగతులు నిజంగా జరిగేంతవరకు అతడు బానిసగా యోసేపు చెప్పింది సరియైనది అని యెహోవా సందేశం రుజువు చేసింది.
20 కనుక యోసేపును విడుదల చేయమని ఈజిప్టు రాజు ఆదేశించాడు. అనేక మందికి అధికారిగా ఉన్న అతనిని కారాగారం నుండి వెళ్లనిచ్చాడు.
21 అతడు యోసేపును తన ఇంటికి యజమానిగా నియమించాడు. రాజ్యంలో అన్ని విషయాలను గూర్చి యోసేపు జాగ్రత్త తీసుకొన్నాడు.
22 యోసేపు యితర నాయకులకు హెచ్చరిక ఇచ్చాడు. పెద్ద మనుష్యులకు యోసేపు నేర్పించాడు.
23 తరువాత ఇశ్రాయేలు ఈజిప్టుకు వచ్చాడు. యాకోబు హాము దేశంలో* నివసించాడు.
24 యాకోబు కుటుంబం చాలా పెద్దది అయింది. వారు వారి శత్రువులకంటే శక్తిగలవారయ్యారు.
25 కనుక ఈజిప్టు ప్రజలు యాకోబు వంశాన్ని ద్వేషించటం మొదలు పెట్టారు. ఈజిప్టువారు బానిసలకు విరోధంగా పథకాలు వేయటం ప్రారంభించారు.
26 కనుక దేవుడు తన సేవకుడైన మోషేను, తాను ఏర్పాటు చేసుకొన్న యాజకుడు అహరోనును పంపించాడు.

---

**యెహోవా ... పాలిస్తాడు** అక్షరార్థముగా "ఆయన ఆజ్ఞలు ప్రపంచమంతటిలో ఉన్నవి."

**హాము దేశం** ఈజిప్టువారు హాము వంశస్థులని బైబిలు తెలియజేస్తుంది.

27 హాము దేశంలో అనేక అద్భుతాలు చేయటానికి
దేవుడు మోషే, అహరోనులను వాడుకొన్నాడు.
28 దేవుడు కటిక చీకటిని పంపించాడు. కాని ఈజిప్టు
వాళ్లు ఆయన మాట వినలేదు.
29 కనుక దేవుడు నీళ్లను రక్తంగా మార్చాడు. వాళ్ల
చేపలన్నీ చచ్చాయి.
30 ఆ దేశం కప్పలతో నింపివేయబడింది. రాజు గదు
లలో కూడ కప్పలు ఉన్నాయి.
31 దేవుడు ఆజ్ఞ ఇవ్వగా జోరీగలు, దోమలు
వచ్చాయి. అన్నిచోట్లా అవే ఉన్నాయి.
32 దేవుడు వర్షాన్ని వడగండ్లుగా చేశాడు. ఈజిప్టువారి
దేశంలో అన్ని చోట్లా అగ్ని మెరుపులు కలిగాయి.
33 ఈజిప్టువారి ద్రాక్షా తోటలను, అంజూరపు చెట్లను
దేవుడు నాశనం చేశాడు. వారి దేశంలో ప్రతి
చెట్టునూ దేవుడు నాశనం చేసాడు.
34 దేవుడు ఆజ్ఞ ఇవ్వగా మిడుతలు, పచ్చిగడ్డి మిడు
తలు వచ్చాయి. అవి లెక్కింపజాలనంత విస్తారంగా
ఉన్నాయి.
35 మిడుతలు, పచ్చిగడ్డి మిడుతలు దేశంలోని మొక్క
లన్నింటినీ తినివేశాయి. నేల మీద పంటలన్నిం
టినీ అవి తినివేశాయి.
36 అప్పుడు ఈజిప్టు దేశంలో ప్రతి మొదటి సంతా
నాన్నీ దేవుడు చంపేశాడు. వారి జ్యేష్ఠ కుమారు
లను దేవుడు చంపివేశాడు.
37 అప్పుడు దేవుడు ఈజిప్టు నుండి తన ప్రజలను
బయటకు తీసుకొని వచ్చాడు. వారు వెండి
బంగారాలు వారి వెంట తెచ్చారు. దేవుని ప్రజలు
ఎవ్వరూ తొట్రిల్లి పడిపోలేదు.
38 దేవుని ప్రజలు వెళ్లిపోవటం చూచి ఈజిప్టు సంతో
షించింది. ఎందుకంటే దేవుని ప్రజలను గూర్చి
వారు భయపడ్డారు.
39 దేవుడు తన మేఘాన్ని ఒక దుప్పటిలా పరిచాడు.
రాత్రివేళ తన ప్రజలకు వెలుగు ఇచ్చుటకు దేవుడు
తన అగ్ని స్తంభాన్ని ఉపయోగించాడు.
40 ప్రజలు భోజనం కోసం అడిగినప్పుడు దేవుడు
వారికి పూరేళ్లను రప్పించాడు. దేవుడు వారికి
ఆకాశం నుండి సమృద్ధిగా రొట్టెను యిచ్చాడు.
41 దేవుడు బండను చీల్చగా నీళ్లు ఉబుకుతూ
వచ్చాయి. ఎడారిలో ఒక నది ప్రవహించడం మొద
లైంది.
42 దేవుడు తన పవిత్ర వాగ్దానం జ్ఞాపకం చేసి
కొన్నాడు. దేవుడు తన సేవకుడు అబ్రాహాముకు
చేసిన వాగ్దానాన్ని జ్ఞాపకం చేసికొన్నాడు.
43 దేవుడు తన ప్రజలను ఈజిప్టునుండి బయటకు
రప్పించాడు. ప్రజలు వారి సంతోష గీతాలు
పాడుతూ ఆనందంగా బయటకు వచ్చారు.
44 అప్పుడు యితరులు నివసిస్తున్న దేశాన్ని దేవుడు
తన ప్రజలకు ఇచ్చాడు. ఇతరుల కష్టార్జితాన్ని
దేవుని ప్రజలు పొందారు.
45 దేవుడు తన ప్రజలు తన న్యాయ చట్టాలకు విధే
యులవుతారని ఇలా చేసాడు. వారు ఆయన ఉప
దేశములకు జాగ్రత్తగా విధేయులు కావాలని దేవుడు
ఇలా చేసాడు. యెహోవాను స్తుతించండి.

## కీర్తన 106

1 యెహోవాను స్తుతించండి! యెహోవా మంచి
వాడు గనుక ఆయనకు కృతజ్ఞతలు చెల్లించండి.
దేవుని ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
2 యెహోవా నిజంగా ఎంత గొప్పవాడో ఏ ఒక్కరూ
వర్ణించలేరు. ఏ ఒక్కరూ సరిపడినంతగా దేవుని
స్తుతించలేరు.
3 దేవుని ఆదేశాలకు విధేయులయ్యేవారు సంతో
షంగా ఉంటారు. ఆ ప్రజలు ఎల్లప్పుడూ మంచి
పనులు చేస్తూంటారు.
4 యెహోవా, నీవు నీ ప్రజల యెడల దయ చూపేట
ప్పుడు నన్ను జ్ఞాపకం చేసుకొనుము. నన్ను
కూడా రక్షించుటకు జ్ఞాపకం ఉంచుకొనుము.
5 యెహోవా, నీ జనులకు నీవు చేసేమంచి వాటిలో
నన్ను పాలుపొందనిమ్ము నీ ప్రజలతో నన్ను
సంతోషంగా ఉండనిమ్ము. నీ జనంతో నన్ను నీ
విషయమై అతిశయించనిమ్ము.
6 మా పూర్వీకుల్లా మేము కూడా పాపం
చేసాము. మేము తప్పులు చెడుకార్యాలు చేసాము.
7 యెహోవా, ఈజిప్టులో నీవు చేసిన అద్భుతాలను
మా పూర్వీకులు సరిగ్గా అర్థం చేసుకోలేదు. నీ
అపరిమితమైన ప్రేమను వారు జ్ఞాపకముంచు
కోలేదు. కాని, ఎర్రసముద్రం వద్ద మహోన్నతు
డైన దేవునికి విరోధంగా ఎదురు తిరిగారు.
8 అయినా ఆయన తన నామము కోసం వారిని
రక్షించాడు, ఎందుకంటే తన మహాశక్తిని వారికి
తెలియజేయాలని.
9 దేవుడు ఆజ్ఞ ఇవ్వగా ఎర్రసముద్రం ఎండి
పోయింది. దేవుడు మన పూర్వీకులను లోతైన
సముద్రంలో ఎడారివలె ఎండిన నేలను ఏర్పరచి,
దానిమీద నడిపించాడు.
10 మా పూర్వీకులను వారి శత్రువుల నుండి దేవుడు
రక్షించాడు. వారి శత్రువుల బారి నుండి దేవుడు
వారిని కాపాడాడు.
11 అప్పుడు దేవుడు వారి శత్రువులను సముద్రంలో
ముంచేశాడు కప్పివేసాడు. వారి శత్రువులు ఒక్కరూ
తప్పించుకోలేదు!
12 అప్పుడు మన పూర్వీకులు దేవుణ్ణి నమ్మారు.
వారు ఆయనకు స్తుతులు పాడారు.

13 కాని దేవుడు చేసిన వాటిని మన పూర్వీకులు వెంటనే మరచిపోయారు. వారు దేవుని సలహా వినలేదు.
14 మన పూర్వీకులు ఎడారిలో ఆకలిగొన్నారు. అరణ్యంలో వారు దేవుణ్ణి పరీక్షించారు.
15 కాని మన పూర్వీకులు అడిగిన వాటిని దేవుడు వారికి ఇచ్చాడు. అయితే దేవుడు వారికి ఒక భయంకర రోగాన్ని కూడా ఇచ్చాడు.
16 ప్రజలు మోషే మీద అసూయ పడ్డారు. యెహోవా పవిత్ర యాజకుడు అహరోను మీద వారు అసూయపడ్డారు.
17 కనుక ఆ అసూయాపరులను దేవుడు శిక్షించాడు. భూమి తెరచుకొని దాతానును మింగివేసింది. తరువాత భూమి మూసుకొంటూ అబీరాము సహచరులను కప్పేసింది.
18 అప్పుడు ఒక అగ్ని ఆ ప్రజాసమూహాన్ని కాల్చి వేసింది. ఆ అగ్ని ఆ దుర్మార్గులను కాల్చివేసింది.
19 హోరేబు కొండవద్ద ప్రజలు ఒక బంగారు దూడను చేశారు. వారు ఆ విగ్రహాన్ని ఆరాధించారు.
20 ఆ ప్రజలు గడ్డి తినే ఒక ఎద్దు విగ్రహాన్ని వారి మహిమ గల దేవునిగా మార్చేశారు.
21 మన పూర్వీకులు వారిని రక్షించిన దేవుణ్ణి గూర్చి మర్చిపోయారు. ఈజిప్టులో అద్భుతాలు చేసిన దేవుణ్ణి గూర్చి వారు మర్చిపోయారు.
22 హాము దేశంలో* దేవుడు అద్భుత కార్యాలు చేశాడు. దేవుడు ఎర్ర సముద్రం దగ్గర భీకర కార్యాలు చేశాడు.
23 దేవుడు ఆ ప్రజలను నాశనం చేయాలని కోరాడు. కాని దేవుడు ఏర్పరచుకొన్న సేవకుడు మోషే ఆయనను నివారించాడు. దేవునికి చాలా కోపం వచ్చింది. కాని దేవుడు ఆ ప్రజలను నాశనం చేయ కుండా మోషే అడ్డుపడ్డాడు.
24 అంతట ఆ ప్రజలు ఆనందకరమైన కనాను దేశం లోనికి వెళ్లేందుకు నిరాకరించారు. ఆ దేశంలో నివసిస్తున్న ప్రజలను ఓడించుటకు దేవుడు వారికి సహాయం చేస్తాడని ఆ ప్రజలు నమ్మలేదు.
25 మన పూర్వీకులు దేవునికి విధేయులవుటకు నిరాక రించారు.
26 అందుచేత వారు అరణ్యంలోనే మరణిస్తారని దేవుడు ప్రమాణం చేసాడు.
27 వారి సంతతివారిని ఇతర ప్రజలు ఓడించేలా చేస్తా నని దేవుడు ప్రమాణం చేసాడు. మన పూర్వీకు లను రాజ్యాలలో చెదరగొడతానని దేవుడు ప్రమాణం చేసాడు.
28 బయల్పెయోరు దగ్గర దేవుని ప్రజలు బయలు దేవత పూజలో పాల్గొన్నారు. చచ్చినవారికి, విగ్ర హానికి బలియిచ్చిన మాంసాన్ని దేవుని ప్రజలు తిన్నారు.
29 దేవుడు తన ప్రజల మీద చాలా కోపగించాడు. మరియు దేవుడు వారిని రోగులనుగా చేసాడు.
30 కాని ఫీనెహాసు దేవుని ప్రార్థించాడు. దేవుడు రోగాన్ని ఆపుచేసాడు.
31 ఫీనెహాసు చాలా మంచి పని చేసాడు అని దేవునికి తెలుసు. మరియు శాశ్వతంగా ఎప్పటికి దేవుడు దీనిని జ్ఞాపకం చేసుకొంటాడు.
32 మెరీబా వద్ద ప్రజలకు కోపం వచ్చింది. మోషేతో ఏదో చెడు కార్యము వారు చేయించారు.
33 ఆ ప్రజలు మోషేను చాలా కలవర పెట్టారు. అందుచేత మోషే అనాలోచితంగా మాటలు అనేశాడు.
34 కనానులో నివసిస్తున్న ఇతర రాజ్యాలను నాశనం చేయమని యెహోవా ప్రజలకు చెప్పాడు. కాని ఇశ్రాయేలు ప్రజలు దేవునికి విధేయులు కాలేదు.
35 ఇశ్రాయేలు ప్రజలు ఇతర ప్రజలతో కలిసి పోయారు. ఇతర ప్రజలు చేస్తున్న వాటినే వీరు కూడా చేశారు.
36 ఆ ఇతర ప్రజలు దేవుని ప్రజలకు ఉచ్చుగా తయారయ్యారు. ఆ ఇతర ప్రజలు పూజిస్తున్న దేవుళ్లను దేవుని ప్రజలు పూజించటం మొదలు పెట్టారు.
37 దేవుని ప్రజలు తమ స్వంత బిడ్డలను సహితం చంపి ఆ బిడ్డలను ఆ దయ్యాలకు బలియిచ్చారు.
38 దేవుని ప్రజలు నిర్దోషులను చంపివేసారు. వారు తమ స్వంత బిడ్డలనే చంపి ఆ బూటకపు దేవుళ్లకు అర్పించారు.
39 కనుక ఆ ఇతర ప్రజల పాపాలతో దేవుని ప్రజలు మైలపడ్డారు. దేవుని ప్రజలు తమ దేవునికి అపనమ్మకస్తులై ఆ ఇతర ప్రజలు చేసిన పనులనే చేసారు.
40 దేవునికి తన ప్రజల మీద కోపం వచ్చింది. దేవుడు వారితో విసిగిపోయాడు!
41 దేవుడు తన ప్రజలను ఇతర రాజ్యాలకు అప్పగిం చాడు. వారి శత్రువులు వారిని పాలించేటట్టుగా దేవుడు చేసాడు.
42 దేవుని ప్రజలను శత్రువులు వారిని తమ అదు పులో పెట్టుకొని వారికి జీవితాన్నే కష్టతరం చేసారు.
43 దేవుడు తన ప్రజలను అనేకసార్లు రక్షించాడు. కాని వారు దేవునికి విరోధంగా తిరిగి వారు కోరిన వాటినే వారు చేశారు. దేవుని ప్రజలు ఎన్నెన్నో చెడ్డపనులు చేసారు.

**హాము దేశం** ఈజిప్టు.

44 కాని దేవుని ప్రజలు ఎప్పుడు కష్టంలో ఉన్నా
వారు సహాయం కోసం ఎల్లప్పుడూ దేవునికి మొర
పెట్టారు. ప్రతిసారీ దేవుడు వారి ప్రార్థనలు
విన్నాడు.
45 దేవుడు తన ఒడంబడికను ఎల్లప్పుడూ జ్ఞాపకం
చేసుకొన్నాడు. దేవుడు ఎల్లప్పుడూ తన గొప్ప
ప్రేమతో వారిని ఆదరించాడు.
46 ఆ ఇతర ప్రజలు దేవుని ప్రజలను ఖైదీలుగా పట్టు
కొన్నారు. అయితే దేవుడు తన ప్రజల యెడల
ఆ మనుష్యులు దయ చూపునట్లు చేశాడు.
47 మా దేవుడవైన యెహోవా, మమ్ములను రక్షించు.
నీ పవిత్ర నామాన్ని స్తుతించగలిగేలా నా జనముల
మధ్యనుండి మమ్మల్ని సమీకరించుము. కనుక
ఆయనకు మనం స్తుతులు పాడగలం.
48 ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాను స్తుతిం
చండి. దేవుడు ఎల్లప్పుడూ జీవిస్తున్నాడు, ఆయన
శాశ్వతంగా జీవిస్తాడు. మరియు ప్రజలందరూ,
"ఆమేన్! యెహోవాను స్తుతించండి!" అని
చెప్పారు.

## అయిదవ భాగం
## కీర్తన 107

1 యెహోవా మంచివాడు గనుక ఆయనకు కృతజ్ఞ
తలు చెల్లించండి. ఆయన ప్రేమ శాశ్వతం.
2 యెహోవా రక్షించిన ప్రతి మనిషి ఆ మాటలు
చెప్పాలి. వారి శత్రువుల నుండి యెహోవా
రక్షించిన ప్రతి మనిషి ఆయనను స్తుతించాలి.
3 అనేక దేశాల నుండి యెహోవా తన ప్రజలను
ఒక్కచోట సమావేశపర్చాడు. తూర్పు పడమరల
నుండి, ఉత్తర దక్షిణాల* నుండి ఆయన వారిని
తీసుకొని వచ్చాడు.
4 ప్రజల్లో కొందరు ఎండిన ఎడారిలో సంచరిం
చారు. వారు నివసించుటకు ఒక పట్టణంకోసం
ఆ ప్రజలు వెదకుతున్నారు. కానీ వారికి ఒక్క
పట్టణం కూడా దొరకలేదు.
5 ఆ ప్రజలు ఆకలితో, దాహంతో ఉండి బలహీనం
అయ్యారు.
6 అప్పుడు వారు సహాయం కోసం యెహోవాకు
ఏడ్చి, మొరపెట్టి వేడుకొన్నారు. యెహోవా ఆ
ప్రజలను వారి కష్టాలన్నింటి నుండి రక్షించాడు.
7 ఆ ప్రజలు ఏ పట్టణంలో నివసించాలో సరిగ్గా ఆ
పట్టణానికే దేవుడు ఆ ప్రజలను నడిపించాడు.
8 యెహోవా ప్రేమకోసం ఆయనకు వందనాలు
చెప్పండి! ప్రజల కోసం, దేవుడు చేసే ఆశ్చర్య
కార్యాల కోసం ఆయనకు వందనాలు చెల్లించండి.
9 దాహంతో ఉన్న ప్రాణాన్ని దేవుడు తృప్తిపరు
స్తాడు. ఆకలితో ఉన్న ప్రాణాన్ని మంచి పదా
ర్థాలతో దేవుడు నింపుతాడు.
10 దేవుని ప్రజల్లో కొందరు కటిక చీకటి కారాగా
రాల్లో కటకటాల వెనుక ఖైదీలుగా ఉన్నారు.
11 ఎందుకంటే దేవుడు చెప్పిన విషయాలకు ఆ
ప్రజలు విరోధంగా పోరాడారు. సర్వోన్నతుడైన
దేవుని సలహా వినుటకు వారు నిరాకరించారు.
12 ఆ ప్రజలు చేసిన పనుల మూలంగా దేవుడు వారికి
జీవితాన్ని కష్టతరం చేశాడు. వారు తొట్రిల్లి, పడి
పోయారు. మరి వారికి సహాయం చేసేవారు
ఎవ్వరూ లేకపోయారు.
13 ఆ ప్రజలు కష్టంలో ఉన్నారు; కనుక వారు
సహాయంకోసం యెహోవాను వేడుకొన్నారు.
వారి కష్టాల నుండి యెహోవా వారిని రక్షించాడు.
14 దేవుడు వాళ్లను వారి కటిక చీకటి కారాగారాల
నుండి బయటకు రప్పించాడు. మరియు వారు
బంధించబడిన తాళ్లను దేవుడు తెంచివేసాడు.
15 యెహోవా ప్రేమకోసం ఆయనకు వందనాలు
చెల్లించండి. ప్రజలకోసం ఆయన చేసే ఆశ్చర్య
కార్యాల కోసం ఆయనకు వందనాలు చెల్లించండి.
16 దేవా, మా శత్రువులను ఓడించుటకు మాకు
సహాయం చేయుము. వారి ఇత్తడి తలుపులను
దేవుడు పగులగొట్టగలడు. వారి ద్వారాల మీది
ఇనుప గడియలను దేవుడు చితకగొట్టగలడు.
17 కొందరు ప్రజలు తమ తిరుగుబాటు మార్గాల
ద్వారా తెలివితక్కువ వాళ్లయ్యారు. మరియు వారి
పాపాలవల్ల కష్టాన్ని అనుభవించారు.
18 ఆ మనుష్యులు తినటానికి నిరాకరించారు, వారు
చావుకు సమీపించారు
19 వారు కష్టంలో ఉన్నారు, అందుచేత సహాయం
కోసం యెహోవాకు మొరపెట్టారు. యెహోవా
వారిని వారి కష్టాల నుండి రక్షించాడు.
20 దేవుడు ఆజ్ఞ ఇచ్చి, ప్రజలను స్వస్థపర్చాడు. కనుక
ఆ ప్రజలు సమాధి నుండి రక్షించబడ్డారు.
21 యెహోవా ప్రేమకోసం ఆయనకు వందనాలు
చెల్లించండి. ప్రజలకోసం యెహోవా చేసే
ఆశ్చర్యకార్యాల కోసం ఆయనకు వందనాలు
చెల్లించండి.
22 యెహోవా చేసిన వాటన్నింటికీ కృతజ్ఞతగా ఆయ
నకు బలులు అర్పించండి. యెహోవా చేసిన
పనులను గూర్చి సంతోషంగా చెప్పండి.
23 కొందరు ఓడలో సముద్రం మీద ప్రయాణం
చేశారు. వారు సముద్రాల మీద వ్యాపారం చేశారు.
24 ఆ ప్రజలు యెహోవా చేయగలిగిన సంగతులను
చూశారు. సముద్రం మీద యెహోవా చేసిన
ఆశ్చర్యకార్యాలను వారు చూశారు.

---

**దక్షిణం** అక్షరార్థంగా హీబ్రూలో 'సముద్రము' అని ఉంది. కానీ ఒక చిన్న మార్పు ఏమంటే అది దక్షిణ.

25 దేవుడు ఆజ్ఞ ఇచ్చాడు, బలమైన గాలి వీచటం మొదలయింది. అలలు అంతకంతకు పెద్ద వయ్యాయి.
26 అలలు ఆకాశమంత ఎత్తు లేస్తున్నాయి. తుఫాను మహా ప్రమాదకరంగా ఉండటంచేత మనుష్యులు ధైర్యాన్ని కోల్పోయారు.
27 ఆ మనుష్యులు తూలిపోతూ, తాగుబోతుల్లా పడి పోతున్నారు. నావికులుగా వారి నైపుణ్యం నిష్ప్రయోజనం.
28 వారు చిక్కులో పడ్డారు. అందుచేత సహాయం కోసం వారు యెహోవాకు మొర పెట్టారు. మరియు యెహోవా వారిని వారి కష్టాల్లోనుంచి రక్షించాడు.
29 దేవుడు తుఫానును ఆపివేసి, అలలను నెమ్మది పర్చాడు.
30 సముద్రం నిమ్మళించినందుకు నావికులు సంతోషించారు. వారు వెళ్లాల్సిన స్థలానికి దేవుడు వారిని క్షేమంగా నడిపించాడు.
31 యెహోవా ప్రేమకోసం ఆయనకు వందనాలు చెల్లించండి. ప్రజలకోసం యెహోవా చేసే ఆశ్చర్యకార్యాల కోసం ఆయనకు వందనాలు చెల్లించండి.
32 మహా సమాజంలో యెహోవాను స్తుతించండి. పెద్దలు సమావేశమైనప్పుడు ఆయనను స్తుతించండి.
33 దేవుడు నదులను ఎడారిగా మార్చాడు. నీటి ఊటలు ప్రవహించకుండా ఆయన నిలిపివేశాడు.
34 సారవంతమైన భూమిని పనికి మాలిన ఉప్పు భూమిగా దేవుడు మార్చాడు. ఎందుకంటే, అక్కడ నివసిస్తున్న ప్రజలు చేసిన చెడ్డపనులవల్లనే.
35 దేవుడు ఎడారిని సరస్సులుగల దేశంగా మార్చాడు. ఎండిన భూమి నుండి నీటి ఊటలు ప్రవహించేలా చేశాడు.
36 దేవుడు ఆకలితో ఉన్న ప్రజలను ఆ మంచి దేశానికి నడిపించాడు. ఆ ప్రజలు నివాసం ఉండుటకు ఒక పట్టణాన్ని నిర్మించాడు.
37 ఆ ప్రజలు వారి పొలాల్లో విత్తనాలు చల్లారు. పొలంలో ద్రాక్షలు వారు నాటారు. వారికి మంచి పంట వచ్చింది.
38 దేవుడు ఆ ప్రజలను ఆశీర్వదించాడు. వారి కుటుంబాలు పెద్దవయ్యాయి. వారికి ఎన్నెన్నో పశువులు ఉన్నాయి.
39 విపత్తు, కష్టాల మూలంగా వారి కుటుంబాలు చిన్నవిగా బలహీనంగా ఉన్నాయి.
40 దేవుడు వారి నాయకులను ఇబ్బంది పెట్టి అవమానించాడు. బాటలు లేని ఎడారిలో దేవుడు వారిని తిరుగులాడనిచ్చాడు.
41 అయితే, అప్పుడు దేవుడు ఆ పేద ప్రజలను వారి దౌర్భాగ్యం నుండి తప్పించాడు. ఇప్పుడు వారి కుటుంబాలు గొర్రెల మందల్లా పెద్దవిగా ఉన్నాయి.
42 మంచి మనుష్యులు యిది చూచి సంతోషిస్తారు. కాని దుర్మార్గులు యిది చూచి ఏమి చెప్పాలో తెలియక ఉంటారు.
43 ఒక వ్యక్తి తెలివిగలవాడైతే అతడు ఈ సంగతులను జ్ఞాపకం ఉంచుకొంటాడు. ఒక వ్యక్తి తెలివిగలవాడైతే నిజంగా దేవుని ప్రేమ అంటే ఏమిటో గ్రహిస్తాడు.

## కీర్తన 108

**దావీదు స్తుతి కీర్తన.**

1 దేవా, నా హృదయం నా ఆత్మ నిశ్చలముగా నున్నది. నేను పాడుటకు, స్తుతి కీర్తనలు వాయించుటకు సిద్ధంగా ఉన్నాను.
2 స్వర మండలములారా, సితారలారా మనం సూర్యున్ని* మేల్కొలుపుదాం
3 యెహోవా, ఆయా జనములలో మేము నిన్ను స్తుతిస్తాము. ఇతర ప్రజల మధ్య మేము నిన్ను స్తుతిస్తాము.
4 యెహోవా, నీ ప్రేమ ఆకాశాల కన్న ఉన్నతమైనది. నీ నిజమైన ప్రేమ మహా ఎత్తయిన మేఘాల కన్న ఉన్నతమైనది. నీ సత్యం ఆకాశాల వరకు కూడా చేరుకున్నది.
5 దేవా, ఆకాశాలకు పైగా లెమ్ము! సర్వ ప్రపంచం నీ మహిమను చూడనిమ్ము.
6 దేవా, నీకిష్టులైనవారిని రక్షించుము. నా ప్రార్థనకు జవాబు ఇచ్చి నాకు సహాయం చేయుము.
7 యెహోవా తన ఆలయము నుండి* మాట్లాడి యిలా చెప్పాడు, "యుద్ధంలో నేను గెలుస్తాను! ఆ గెలుపును బట్టి సంతోషంగా ఉంటాను. (ఈ భూమిని నా ప్రజలకు విభాగించి ఇస్తాను) నా ప్రజలకు షెకెమును ఇస్తాను. వారికి సుక్కోతు లోయను ఇస్తాను.
8 గిలాదు, మనష్షే నావి. ఎఫ్రాయిము నా శిరస్త్రాణం. యూదా నా రాజ దండం .
9 మోయాబు నా పాదాలు కడుగుకొనే పళ్లెం. ఎదోము నా చెప్పులు మోసే బానిస. ఫిలిష్తీయులను జయించాక నేను విజయంతో కేకలు వేస్తాను."

---

**సూర్యున్ని** ఇది ఆలయంలో ఉదయం బలి అర్పణల సమయం కావచ్చు.

**ఆలయము నుండి** లేదా "ఆయన పరిశుద్ధతలో."

10 శత్రు దుర్గములోనికి నన్ను ఎవరు నడిపిస్తారు? ఎదోమును జయించటానికి నాకు ఎవరు సహాయం చేస్తారు?
11 దేవా, నీవు మమ్మల్ని విడిచిపెట్టేశావని మా సైన్యంతో నీవు వెళ్లవు అని అనటం నిజమేనా?
12 దేవా, మా శత్రువును ఓడించుటకు దయచేసి మాకు సహాయం చేయుము మనుష్యులు మాకు సహాయం చేయలేరు!
13 దేవుడు మాత్రమే మమ్మల్ని బలపరచగలడు. దేవుడు మాత్రమే మా శత్రువులను ఓడించగలడు.

## కీర్తన 109

*సంగీత నాయకునికి. దావీదు స్తుతి కీర్తన.*

1 దేవా, నా ప్రార్థనలను పెడచెవిని పెట్టవద్దు.
2 దుర్మార్గులు నన్ను గూర్చి అబద్ధాలు చెబుతు న్నారు. నిజం కాని సంగతులు ఆ అబద్ధికులు చెబుతున్నారు.
3 ప్రజలు నన్ను గూర్చి ద్వేషపూరిత విషయాలు చెబుతున్నారు. ఏ కారణం లేకుండానే ప్రజలు నా మీద దాడి చేస్తున్నారు.
4 నేను వారిని ప్రేమిస్తున్నాను. కాని వారు నన్ను ద్వేషిస్తున్నారు. కనుక దేవా, ఇప్పుడు నేను నిన్ను ప్రార్థిస్తున్నాను.
5 ఆ ప్రజలకు నేను మంచి పనులు చేశాను. కాని వారు నాకు చెడ్డపనులు చేస్తున్నారు. నేను వారిని ప్రేమించాను. కాని వారు నన్ను ద్వేషించారు.
6 నా శత్రువు చేసిన చెడు కార్యాల కోసం అతనిని శిక్షించుము. వానిదే తప్పు అని రుజువు చేయగల ఒక మనిషిని చూడుము.
7 నా శత్రువు తప్పు చేసిన దోషి అని న్యాయ వాదిని తీర్పు చెప్పనీయుము. నా శత్రువు చెప్పే ప్రతి సంగతీ వానికి చెడుగావుండేటట్టు చేయుము.
8 నా శత్రువును త్వరగా చావనీమ్ము. నా శత్రువు ఉద్యోగం మరొకరు తీసికొనును గాక!
9 నా శత్రువు పిల్లలను అనాథలు కానిమ్ము, వాని భార్య విధవరాలు అగుగాక!
10 వాళ్లు వారి ఇల్లు పోగొట్టుకొని భిక్షగాళ్లు అగుదురు గాక!
11 నా శత్రువు ఎవరికైతే పైకం బాకీ ఉన్నాడో వాళ్లు అతనికి ఉన్నదంతా తీసుకోనివ్వుము. అతని కష్టా ర్జితం అంతా తెలియని వాళ్లెవరినో తీసికోనివ్వుము.
12 నా శత్రువుకు ఎవ్వరూ దయ చూపించకూడదని నా ఆశ. అతని పిల్లలకు ఎవ్వరూ దయ చూపించ కూడదని నా ఆశ.
13 నా శత్రువును పూర్తిగా నాశనం చేయుము. తర్వాత తరంవారు అన్నిటిలోనుండి అతని పేరు తొల గించి వేయుదురు గాక.
14 నా శత్రువు తండ్రి పాపాలను, తల్లి పాపాలను యెహోవా శాశ్వతంగా జ్ఞాపకం చేసికొంటాడని నా ఆశ.
15 ఆ పాపాలను యెహోవా శాశ్వతంగా జ్ఞాపకం చేసికొంటాడని నా ఆశ. ప్రజలు నా శత్రువును పూర్తిగా మరచిపోయేటట్టు యెహోవా వారిని బల వంతం చేస్తాడని నా ఆశ.
16 ఎందుకంటే, ఆ దుర్మార్గుడు ఎన్నడూ ఏ మంచీ చేయలేదు. అతడు ఎన్నడూ ఎవరినీ ప్రేమించ లేదు. అతడు నిరుపేద, నిస్సహాయ ప్రజలకు జీవితం ఎంతో కష్టతరం చేసాడు.
17 ప్రజలకు సంభవించే చెడు సంగతులు శాపము చూడటానికి ఆ దుర్మార్గునికి ఎంతో ఇష్టం. కనుక ఆ చెడు సంగతులు అతనికే సంభవించనిమ్ము. ప్రజల కోసం మంచి సంగతులు జరగాలని ఆ దుర్మార్గుడు ఎన్నడూ అడుగలేదు. కనుక అతనికి మంచి సంగతులేవీ జరుగనివ్వకుము.
18 శాపాలే వానికి వస్త్రాలుగా ఉండనిమ్ము. దుర్మా ర్గులు తాగేందుకు శాపాలే నీళ్లుగా ఉండనిమ్ము. శాపాలే వాని శరీరం మీద తైలంగా ఉండనిమ్ము.
19 శాపాలే ఆ దుర్మార్గునికి చుట్టే వస్త్రాలుగా ఉండ నిమ్ము. శాపాలే వాని నడుం చుట్టూ దట్టిగా ఉండ నిమ్ము.
20 నా శత్రువుకు వాటన్నిటినీ యెహోవా చేస్తా డని నేను ఆశిస్తున్నాను. నన్ను చంపాలని చూస్తున్న మనుష్యులందరికీ వాటన్నిటినీ యెహోవా చేస్తాడని నేను ఆశిస్తున్నాను.
21 యెహోవా, నీవే నాకు ప్రభువు. కనుక నీ నామానికి గౌరవం కలిగే విధంగా నన్ను పరామర్శించు. నీకు ఎంతో గొప్ప ప్రేమ ఉంది. కనుక నన్ను రక్షించుము.
22 నేను కేవలం నిరుపేద, నిస్సహాయ మనిషిని, నేను నిజంగా దుఃఖంగా ఉన్నాను, నా హృదయం పగిలి పోయింది.
23 దినాంతంలో దీర్ఘ ఛాయలవలె నా జీవితం అయి పోయినట్టు నాకు అనిపిస్తుంది. ఎవరో నలిపివేసిన నల్లిలా ఉన్నట్టు నాకు అనిపిస్తుంది.
24 నేను ఉపవాసం ఉండుటవలన నా మోకాళ్లు బల హీనంగా ఉన్నాయి. నా బరువు తగ్గిపోయి నేను సన్నబడుతున్నాను.
25 చెడ్డవాళ్లు నన్ను అవమానిస్తారు. వారు నన్ను చూచి వారి తలలు ఊపుతారు.
26 దేవా, యెహోవా! నాకు సహాయం చేయుము! నీ నిజమైన ప్రేమను చూపించి నన్ను రక్షించుము.
27 అప్పుడు నీవు నాకు సహాయం చేశావని ఆ ప్రజలు తెలుసుకొంటారు. నాకు కలిగిన సహాయం నీ శక్తివల్ల అని వారు తెలుసుకొంటారు.

28 ఆ దుర్మార్గులు నాకు శాపనార్థాలు పెడతారు; కాని
యెహోవా, నీవు నన్ను ఆశీర్వదించగలవు. వారు
నా మీద దాడి చేశారు కనుక వారిని ఓడించుము.
అప్పుడు నీ సేవకుడనైన నేను సంతోషిస్తాను.
29 నా శత్రువులను ఇబ్బంది పెట్టుము! వారు వారి
సిగ్గును వారి అంగీలా ధరించనిమ్ము.
30 యెహోవాకు నేను కృతజ్ఞతలు చెల్లిస్తున్నాను.
అనేక మంది ప్రజల ఎదుట నేను ఆయనను
స్తుతిస్తాను.
31 ఎందుకంటే, నిస్సహాయ ప్రజల పక్షంగా యెహోవా
నిలిచి ఉన్నాడు. వారిని మరణానికి అప్పగించాలని
ప్రయత్నించే వారి నుండి దేవుడు వారిని రక్షిస్తాడు.

## కీర్తన 110

***దావీదు స్తుతి కీర్తన.***

1 "నీ శత్రువులను నీ పాదాల కింద పీఠంగా నేను
ఉంచేవరకు ఇక్కడ నా కుడి పక్కన కూర్చో."
అని నా ప్రభువుతో యెహోవా చెప్పాడు.
2 నీ రాజ్యం విస్తరించేలా యెహోవా సహాయం
చేస్తాడు. నీ రాజ్యం సీయోను వద్ద మొదలై నీవు
నీ శత్రువులను వారి స్వంత దేశాలలో పాలించు
నంత వరకు అది విస్తరిస్తుంది.
3 నీవు రాజువైన రోజుననే నీ ప్రజలు నీతో కలు
స్తారు. నీవు పుట్టినప్పటినుండి పవిత్రమైన అందం
నీకు ఉంది. ఇప్పుడు నీ బాల్యం నుండి నీకు
ఉన్న ఆ ఆశీర్వాదం రాజుగా నీ క్రొత్త జీవితంలోనికి
వస్తుంది.*
4 యెహోవా ఒక వాగ్దానం చేసాడు. యెహోవా
తన మనస్సు మార్చుకోడు. "నీవు నిత్యము
యాజకుడివే గాని అహరోను కుటుంబ వర్గం
నుండి కాదు. నీది వేరైన యాజకత్వం. అది
మెల్కీసెదెక్ వర్గానికి చెందిన యాజకునిలా
వున్నట్లు ఉంది."
5 నా ప్రభువు నీ కుడి పక్కన వున్నాడు. ఆయన
కోపమముతో రాజులను చితకగొడతాడు.
6 దేవుడు రాజ్యాలకు తీర్పు తీర్చాడు. ఆ గొప్ప
దేశంలో దేవుడు చచ్చిన వారి శవాలతో నేల
నిండి పోయింది!
7 మార్గంలోని సెలయేటినుండి* రాజు మంచినీరు
తాగుతాడు. ఆయన నిజంగా తన తల ఎత్తుతాడు,
చాలా శక్తివంతంగా ఉంటాడు.

---

**ఇప్పుడు ... వస్తుంది** హెబ్రీ భాషలో ఈ వాక్యాన్ని అర్థం చేసుకోవటం కష్టం. ఇది అక్షరార్థంగా : "గర్భంనుండి పరిశుద్ధ ప్రకాశం నీది. నీ యౌవనపు నీ మంచు నీకు సూర్యోదయగా అయినది.

**సెలయేరు** ఇది యెరూషలేములో గీహోను ఊట కావచ్చు. రాజుగా అభిషేకించుటకు వెళ్ళినప్పుడు ఆయన ఇక్కడ ఆగివుండవచ్చు.

## కీర్తన 111

1 యెహోవాను స్తుతించండి! మంచి మనుష్యులు
సమావేశమయ్యే సమాజంలో నేను నా హృదయ
పూర్తిగా యెహోవాకు వందనాలు చెల్లిస్తాను.
2 యెహోవా ఆశ్చర్యకార్యాలు చేస్తాడు. దేవుని
నుండి లభ్యమయ్యే మంచిది ప్రతి ఒక్కటి ప్రజ
లకు కావాలి.
3 దేవుడు వాస్తవంగా మహిమగల ఆశ్చర్యకార్యాలు
చేస్తాడు. ఆయన మంచితనం నిరంతరం కొనసాగు
తుంది.
4 దేవుడు ఆశ్చర్యకార్యాలు చేస్తాడు. కనుక
యెహోవా దయ, జాలిగలవాడని మనం జ్ఞాపకం
చేసుకొంటాము.
5 దేవుడు తన అనుచరులకు ఆహారం ఇస్తాడు.
దేవుడు తన ఒడంబడికను శాశ్వతంగా జ్ఞాపకం
ఉంచుకొంటాడు.
6 దేవుడు చేసిన శక్తివంతమైన పనులు ఆయన తన
ప్రజలకు వారి దేశాన్ని ఇస్తున్నాడని తెలియ
జేస్తున్నాయి.
7 దేవుడు చేసే ప్రతిది మంచిది, న్యాయమయింది
కూడా. ఆయన ఆదేశాలు అన్నీ నమ్మదగినవి.
8 దేవుని ఆదేశాలు నిత్యం కొనసాగుతాయి. ఆ
ఆదేశాలు ఇవ్వటంలోగల దేవుని కారణాలు నిజా
యితీగలవి, పవిత్రమైనవి.
9 దేవుడు తన ప్రజలను రక్షిస్తాడు. దేవుడు తన
ఒడంబడికను శాశ్వతంగా కొనసాగేందుకు చేసాడు.
దేవుని నామం అద్భుతం, పవిత్రం!
10 దేవుడంటే భయము, భక్తివుంటేనే జ్ఞానం
ప్రారంభం అవుతుంది. దేవుణ్ణి గౌరవించే ప్రజలు
చాలా జ్ఞానంగలవారు. శాశ్వతంగా దేవునికి స్తుతులు
పాడుతారు.

## కీర్తన 112

1 యెహోవాను స్తుతించండి. యెహోవాకు భయ
పడి, ఆయనను గౌరవించే వ్యక్తి చాలా సంతోషంగా
ఉంటాడు. ఆ వ్యక్తికి దేవుని ఆదేశాలంటే ఇష్టం.
2 ఆ మనిషి సంతతివారు భూమి మీద చాలా గొప్పగా
ఉంటారు. మంచివారి సంతతివారు నిజంగా
ఆశీర్వదించబడతారు.
3 ఆ వ్యక్తి కుటుంబీకులు చాలా ధనికులుగా
ఉంటారు. అతని మంచితనం శాశ్వతంగా కొనసాగు
తుంది.
4 మంచివాళ్లకు దేవుడు చీకట్లో ప్రకాశిస్తున్న వెలుతు
రులా ఉంటాడు. దేవుడు మంచివాడు, దయగల
వాడు, జాలిగలవాడు.
5 ఒక మనిషికి దయగా ఉండటం, ధారాళంగా ఇచ్చే
గుణం కలిగి ఉండటం, అతనికి మంచిది. తన

వ్యాపారంలో న్యాయంగా ఉండటం అతనికి
మంచిది.
6 ఆ మనిషి ఎన్నటికీ పడిపోడు. ఒక మంచి మనిషి
ఎల్లప్పుడు జ్ఞాపకం చేసికోబడుతాడు.
7 మంచి మనిషి చెడు సమాచారాలకు భయ పడాల్సిన
అవసరం లేదు. ఆ మనిషి ధైర్యంగా ఉంటాడు,
యెహోవాను నమ్ముకొంటాడు.
8 ఆ మనిషి ధైర్యంగా ఉంటాడు. అతడు భయ
పడడు. అతడు తన శత్రువులను ఓడిస్తాడు.
9 ఆ మనిషి పేదవారికి వస్తువులను ఉచితంగా ఇస్తాడు.
అతడు చేసే మంచి పనులు శాశ్వతంగా కొన
సాగుతాయి.
10 దుష్టులిది చూచి కోపగిస్తారు. వారు కోపంతో
పళ్లు కొరుకుతారు, అప్పుడు వారు కనబడకుండా
పోతారు. దుష్టులకు ఎక్కువగా కావాల్సిందేదో అది
వారికి దొరకదు.

## కీర్తన 113

1 యెహోవాను స్తుతించండి! యెహోవా సేవకు
లారా, ఆయనను స్తుతించండి! యెహోవా
నామాన్ని స్తుతించండి.
2 ఇప్పుడు, ఎల్లప్పుడూ, యెహోవా నామము
స్తుతించబడాలని నేను కోరుతున్నాను.
3 తూర్పున ఉదయించే సూర్యుడి దగ్గర్నుండి,
సూర్యుడు అస్తమించే స్థలం వరకు యెహోవా
నామం స్తుతించబడాలని నేను కోరుతున్నాను.
4 యెహోవా జనాలన్నింటికంటె ఉన్నతమైన
వాడు. ఆయన మహిమ ఆకాశాలంత ఉన్నతం.
5 ఏ మనిషీ మన యెహోవా దేవునిలా ఉండడు.
దేవుడు పరలోకంలో ఉన్నతంగా కూర్చుంటాడు.
6 ఆకాశాలను, భూమిని దేవుడు చూడాలంటే ఆయన
తప్పక కిందికి చూడాలి.
7 దేవుడు పేదవారిని దుమ్ములో నుండి పైకి
లేపుతాడు. భిక్షగాళ్లను చెత్తకుండీలో నుండి
బయటకు తీస్తాడు.
8 ఆ మనుష్యులను దేవుడు ప్రముఖులుగా చేస్తాడు.
ఆ మనుష్యులను దేవుడు ప్రముఖ నాయకులుగా
చేస్తాడు.
9 ఒక స్త్రీకి పిల్లలు లేకపోవచ్చును. కానీ దేవుడు
ఆమెకు పిల్లలను ఇచ్చి ఆమెను సంతోషపరుస్తాడు.
యెహోవాను స్తుతించండి!

## కీర్తన 114

1 ఇశ్రాయేలు ఈజిప్టు విడిచిపెట్టాడు. యాకోబు
(ఇశ్రాయేలు) ఆ విదేశాన్ని విడిచిపెట్టాడు.
2 ఆ కాలంలో యూదా దేవుని ప్రత్యేక ప్రజల
య్యారు. ఇశ్రాయేలు ఆయన రాజ్యం అయింది.
3 ఎర్ర సముద్రం యిది చూచి పారిపోయింది.
యొర్దాను నది వెనుదిరిగి పరుగెత్తింది.
4 పర్వతాలు పొట్టేళ్లలా నాట్యం చేశాయి. కొండలు
గొర్రెపిల్లల్లా నాట్యం చేశాయి.
5 ఎర్ర సముద్రమా, ఎందుకు పారిపోయావు?
యొర్దాను నదీ, నీవెందుకు వెనుదిరిగి పరిగెత్తావు?
6 పర్వతాల్లారా, మీరెందుకు పొట్టేళ్లలా నాట్యం
చేశారు? కొండలూ మీరెందుకు గొర్రె పిల్లల్లా
నాట్యం చేశారు?
7 యాకోబు దేవుడైన యెహోవా యెదుట భూమి
కంపించింది.
8 బండ నుండి నీళ్లు ప్రవహించేలా చేసినవాడు
యెహోవాయే. ఆ కఠిన శిల నుండి నీటి ఊట
ప్రవహించునట్లు దేవుడే చేసాడు.

## కీర్తన 115

1 యెహోవా, ఏ ఘనతా మేము స్వీకరించకూడదు.
ఘనత నీకే చెందుతుంది. నీ ప్రేమ, నమ్మకం
మూలంగా ఘనత నీదే.
2 మా దేవుడు ఎక్కడ అని జనాంగాలు ఎందుకు
ఆశ్చర్యపడాలి?
3 దేవుడు పరలోకంలో ఉన్నాడు, ఆయన కోరింది
చేస్తాడు.
4 ఆ జనాంగాల "దేవుళ్లు" వెండి బంగారాలతో చేయ
బడ్డ విగ్రహాలే. ఎవరో ఒక మనిషి చేతులతో
చేసిన విగ్రహాలే అవి.
5 ఆ విగ్రహాలకు నోళ్లున్నాయి కాని అవి మాట్లాడ
లేవు. వాటికి కళ్లున్నాయి కానీ అవి చూడలేవు.
6 వాటికి చెవులున్నాయి కానీ అవి వినలేవు. వాటికి
ముక్కులున్నాయి కానీ అవి వాసన చూడలేవు.
7 వాటికి చేతులు ఉన్నాయి కానీ అవి తాకలేవు.
వాటికి కాళ్లు ఉన్నాయి కానీ అవి నడవలేవు. వాటికి
గొంతుల్లోనుంచి ఏ శబ్దాలూ రావు.
8 ఆ విగ్రహాలను చేసేవారు. వాటిని నమ్ముకొనే
వారు కూడ సరిగ్గా వాటివలె అవుతారు.
9 ఇశ్రాయేలూ, యెహోవాను నమ్ము. యెహోవా
వారి బలము, ఆయన వారి డాలు.
10 అహరోను వంశస్తులు యెహోవాను నమ్ముతారు.
యెహోవావారి బలము, డాలు అయివు న్నాడు.
11 యెహోవా అనుచరులు యెహోవాను నమ్ము
కొంటారు. యెహోవా తన అనుచరులకు
సహాయం చేసి కాపాడుతాడు.
12 యెహోవా మమ్మల్ని జ్ఞాపకం చేసికొంటాడు.
యెహోవా మమ్మల్ని ఆశీర్వదిస్తాడు. యెహోవా
ఇశ్రాయేలును ఆశీర్వదిస్తాడు. యెహోవా
అహరోను వంశాన్ని ఆశీర్వదిస్తాడు.

13 యెహోవా పెద్దవారైనా, చిన్నవారైనా తన అను
చరులను ఆశీర్వదిస్తాడు.
14 యెహోవా మీ కుటుంబాలను పెద్దవిగా చేస్తాడని
నేను ఆశిస్తున్నాను. ఆయన మీ పిల్లల కుటుం
బాలను పెద్దవిగా చేస్తాడని నేను ఆశిస్తున్నాను.
15 యెహోవా నిన్ను ఆశీర్వదిస్తాడు. ఆకాశాన్ని,
భూమిని యెహోవా చేశాడు.
16 ఆకాశం యెహోవాకు చెందుతుంది. కానీ భూమిని
ఆయన మనుష్యులకు ఇచ్చాడు.
17 చనిపోయినవాళ్లు యెహోవాను స్తుతించరు. కింద
సమాధిలో ఉన్న మనుష్యులు యెహోవాను
స్తుతించరు.
18 అయితే మనం యెహోవాను స్తుతిస్తాం. మనం
యిప్పటినుండి ఎప్పటికీ ఆయనను స్తుతిస్తాము!
యెహోవాను స్తుతించండి!

## కీర్తన 116

1 యెహోవా నా ప్రార్థనలు విన్నప్పుడు నాకు
ఎంతో సంతోషం.
2 సహాయంకోసం నేను ఆయనకు చేసిన మొర
ఆయన విన్నప్పుడు నాకు ఇష్టం.
3 నేను దాదాపు చనిపోయాను. మరణ పాశాలు నన్ను
చుట్టుకొన్నాయి. సమాధి నా చుట్టూరా మూసి
కొంటుంది. నేను భయపడి చింతపడ్డాను.
4 అప్పుడు నేను యెహోవా నామం స్మరించి,
"యెహోవా, నన్ను రక్షించుము." అని అన్నాను.
5 యెహోవా మంచి వాడు, జాలిగల వాడు.
యెహోవా దయగలవాడు.
6 నిస్సహాయ ప్రజలను గూర్చి యెహోవా శ్రద్ధ
తీసుకొంటాడు. నేను సహాయం లేకుండా
ఉన్నాను, యెహోవా నన్ను రక్షించాడు.
7 నా ఆత్మా, విశ్రమించు! యెహోవా నిన్ను గూర్చి
శ్రద్ధ తీసుకొంటాడు.
8 దేవా, నా ఆత్మను నీవు మరణం నుండి రక్షించావు.
నా కన్నీళ్లను నీవు నిలిపివేశావు. నేను పడిపోకుండా
నీవు నన్ను పట్టికొన్నావు.
9 సజీవుల దేశంలో నేను యెహోవాను సేవించటం
కొనసాగిస్తాను.
10 "నేను నాశనమయ్యాను!" అని నేను చెప్పినప్పుడు
కూడా నేను నమ్ముకొనే ఉన్నాను.
11 నేను భయపడి "మనుష్యులంతా అబద్ధీకులే" అని
చెప్పినప్పుడు కూడా నేను నమ్ముకొంటూనే
ఉన్నాను.
12 యెహోవాకు నేను ఏమివ్వగలను? నాకు ఉన్న
దంతా యెహోవాయే నాకిచ్చాడు.
13 నన్ను రక్షించినందుకు నేను ఆయనకు పానా
ర్పణం యిస్తాను. యెహోవా నామమున నేను
ప్రార్థిస్తాను.
14 నేను వాగ్దానం చేసిన వాటిని నేను యెహోవాకు
యిస్తాను. ఇప్పుడు నేను ఆయన ప్రజలందరి
యెదుటికి వెళ్తాను.
15 యెహోవా అనుచరులలో ఎవరి మరణమైనా
ఆయనకు ఎంతో దుఃఖకరము. యెహోవా, నేను
నీ సేవకుల్లో ఒకడ్ని.
16 నేను నీ సేవకుడను. నీ సేవకులలో ఒకరి కుమా
రుడ్ని నేను. యెహోవా, నీవే నా మొదటి గురువు.
17 నేను నీకు కృతజ్ఞత అర్పణ యిస్తాను. యెహోవా
నామమున నేను ప్రార్థిస్తాను.
18 నేను వాగ్దానం చేసిన వాటిని నేను యెహోవాకు
యిస్తాను. ఇప్పుడు నేను ఆయన ప్రజలందరి
ఎదుటికి వెళ్తాను.
19 యెరూషలేములో ఆయన ఆలయానికి నేను
వెళ్తాను. యెహోవాను స్తుతించండి!

## కీర్తన 117

1 సర్వ దేశములారా, యెహోవాను స్తుతించండి.
సర్వ ప్రజలారా, యెహోవాను స్తుతించండి.
2 దేవుడు మనలను ఎంతో ప్రేమిస్తున్నాడు. దేవుడు
శాశ్వతంగా మన పట్ల నమ్మకంగా ఉంటాడు.
యెహోవాను స్తుతించండి!

## కీర్తన 118

1 యెహోవా దేవుడు గనుక ఆయనకు కృతజ్ఞత
తెలపండి. నిజమైన ఆయన ప్రేమ శాశ్వతంగా
కొనసాగుతుంది.
2 "నిజమైన ఆయన ప్రేమ శాశ్వతంగా కొన సాగు
తుంది" అని ఇశ్రాయేలూ, నీవు చెప్పుము.
3 "నిజమైన ఆయన ప్రేమ శాశ్వతంగా కొన సాగు
తుంది" అని యాజకులారా, మీరు చెప్పండి.
4 "నిజమైన ఆయన ప్రేమ శాశ్వతంగా కొన సాగు
తుంది" అని యెహోవాను ఆరాధించే ప్రజలారా,
మీరు చెప్పండి.
5 నేను కష్టంలో ఉన్నాను. గనుక సహాయం కోసం
నేను యెహోవాకు మొర పెట్టాను, యెహోవా
నాకు జవాబిచ్చి, నన్ను విముక్తుని చేశాడు.
6 యెహోవా నాతో ఉన్నాడు గనుక నేను భయ
పడను. నన్ను బాధించుటకు మనుష్యులు ఏమీ
చేయలేరు.
7 యెహోవా నా సహాయకుడు; నా శత్రువులు
ఓడించబడటం నేను చూస్తాను.
8 మనుష్యులను నమ్ముకొనుటకంటే యెహోవాను
నమ్ముట మేలు.
9 మీ నాయకులను నమ్ముకొనుట కంటే
యెహోవాను నమ్ముకొనుట మేలు.

10 అనేకమంది శత్రువులు నన్ను చుట్టుముట్టారు.
యెహోవా శక్తితో నేను నా శత్రువులను
ఓడించాను.
11 శత్రువులు మరల మరల నన్ను చుట్టుముట్టారు.
యెహోవా శక్తితో నేను వారిని ఓడించాను.
12 తేనెటీగల దండులా శత్రువులు నన్ను చుట్టు
ముట్టారు. కాని వేగంగా కాలిపోతున్న పొదలా వారు
అంతం చేయబడ్డారు. యెహోవా శక్తితో నేను
వారిని ఓడించాను.
13 నా శత్రువు నా మీద దాడి చేసి దాదాపుగా నన్ను
నాశనం చేశాడు. కాని యెహోవా నాకు సహాయం
చేశాడు.
14 యెహోవా నా బలం, నా విజయ గీతం!
యెహోవా నన్ను రక్షిస్తాడు!
15 మంచివాళ్ల ఇండ్లలో విజయ ఉత్సవం మీరు విన
గలరు. యెహోవా తన మహా శక్తిని మరల
చూపించాడు.
16 యెహోవా చేతులు విజయంతో పైకి ఎత్త
బడ్డాయి. యెహోవా తన మహా శక్తిని మరల
చూపించాడు.
17 నేను జీవిస్తాను! కాని మరణించను. మరియు
యెహోవా చేసిన వాటిని గూర్చి నేను చెబుతాను.
18 యెహోవా నన్ను శిక్షించాడు, కాని ఆయన నన్ను
చావనియ్య లేదు.
19 మంచి గుమ్మములారా నా కోసం తెరచుకోండి,
నేను లోనికి వచ్చి యెహోవాను ఆరాధిస్తాను.
20 అవి యెహోవా గుమ్మాలు. ఆ గుమ్మాలలో
నుండి మంచివాళ్లు మాత్రమే వెళ్లగలరు.
21 యెహోవా, నా ప్రార్థనకు జవాబు ఇచ్చినందుకు
నేను నీకు కృతజ్ఞతలు చెల్లిస్తున్నాను. నన్ను
రక్షించినందుకు నేను నీకు కృతజ్ఞతలు
చెల్లిస్తున్నాను.
22 ఇల్లు కట్టువారు నిరాకరించిన రాయి మూల రాయి
అయ్యింది.
23 ఇలా జరుగునట్లు యెహోవా చేశాడు. అది ఆశ్చ
ర్యంగా ఉందని అనుకొంటున్నాము.
24 ఈ వేళ యెహోవా చేసిన రోజు. ఈ వేళ మనం
ఆనందించి సంతోషంగా ఉందాము!
25 ప్రజలు ఇలా చెప్పారు, "యెహోవాను స్తుతిం
చండి. దేవుడు, మమ్మల్ని రక్షించెను. దేవా, దయ
చేసి మమ్మల్ని వర్ధిల్లజేయుము.
26 యెహోవా నామమున వస్తున్న వానికి స్వాగతం
చెప్పండి." యాజకులు ఇలా జవాబు ఇచ్చారు,
"యెహోవా ఆలయానికి మేము నిన్ను ఆహ్వాని
స్తున్నాము!
27 యెహోవాయే దేవుడు. ఆయన మనలను అంగీ
కరిస్తాడు. బలి కోసం గొర్రెపిల్లను కట్టివేయండి.
బలిపీఠపు కొమ్ముల* వద్దకు గొర్రెపిల్లను మోసి
కొని రండి."
28 యెహోవా, నీవు నా దేవుడవు. నేను నీకు కృతజ్ఞత
చెల్లిస్తున్నాను. నేను నిన్ను స్తుతిస్తున్నాను.
29 యెహోవా మంచివాడు గనుక ఆయనకు కృతజ్ఞత
తెలపండి. నిజమైన ఆయన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.

## కీర్తన 119

### ఆలెఫ్*

1 పవిత్ర జీవితాలు జీవించేవాళ్లు సంతోషంగా
ఉంటారు. ఆ మనుష్యులు యెహోవా ఉపదేశాలను
అనుసరిస్తారు.
2 యెహోవా ఒడంబడికకు విధేయులయ్యే ప్రజలు
సంతోషిస్తారు. వారు వారి హృదయపూర్తిగా
యెహోవాకు విధేయులవుతారు.
3 ఆ మనుష్యులు చెడ్డ పనులు చెయ్యరు. వారు
యెహోవాకు విధేయులవుతారు.
4 యెహోవా, నీవు మాకు నీ ఆజ్ఞలిచ్చావు. ఆ
ఆజ్ఞలకు మేము పూర్తిగా విధేయులము కావాలని
నీవు మాతో చెప్పావు.
5 యెహోవా, నేను నీ ఆజ్ఞలకు ఎల్లప్పుడూ
విధేయుడనౌతాను,
6 అప్పుడు నేను నీ ఆజ్ఞలను ఎప్పుడు చదివినా
సిగ్గుపడను.
7 అప్పుడు నేను నీ న్యాయం, నీ మంచితనం గూర్చి
చదివి నిన్ను నిజంగా ఘనపర్చగలుగుతాను.
8 యెహోవా, నేను నీ ఆజ్ఞలకు విధేయుడనవు
తాను. కనుక దయచేసి నన్ను విడిచిపెట్టకుము!

### బేత్

9 యువకుడు పవిత్ర జీవితం ఎలా జీవించగలడు?
నీ ఆజ్ఞలను అనుసరించుట ద్వారానే.
10 నేను నా హృదయపూర్తిగా దేవుని సేవించుటకు
ప్రయత్నిస్తాను. దేవా, నీ ఆజ్ఞలకు విధేయుడ
నవుటకు నాకు సహాయం చేయుము.
11 నీ ఉపదేశాలను నేను చాలా జాగ్రత్తగా ధ్యానం
చేసి నా హృదయంలో భద్రపరచుకొంటాను.
ఎందుకంటే, నేను నీకు విరోధంగా పాపం చేయను
12 యెహోవా, నీకే స్తుతి. నీ న్యాయ చట్టాలు నాకు
నేర్పించుము.

---

**బలిపీఠపు కొమ్ములు** బలిపీఠపు మూలలు.

**ఆలెఫ్** హెబ్రీ అక్షరాలలో మొదటిది. హెబ్రీ పాత నిబంధ నలోని ఈ కీర్తనలో ప్రతి భాగము హెబ్రీ అక్షరాల క్రమములో ప్రారంభమౌతుంది. అనగా మొదటి భాగం మొదటి అక్షరం, రెండవ భాగం రెండవ అక్షరం.

13 జ్ఞానంగల నీ నిర్ణయాలను గూర్చి నేను మాట్లాడు
తాను.
14 ఒకడు గొప్ప ఐశ్వర్యంలో ఆనందించేలా నేను నీ
ఆజ్ఞలు అనుసరించటంలో ఆనందిస్తాను.
15 నీ నియమాలను నేను చర్చిస్తాను. నీ జీవిత విధానం
నేను అనుసరిస్తాను.
16 నీ న్యాయ చట్టాలలో నేను ఆనందిస్తాను. నీ
మాటలు నేను మరచిపోను.

## గీమెల్

17 నీ సేవకుడనైన నాకు మేలుగా నుండుము.
తద్వారా నేను జీవించగలను. నేను నీ ఆజ్ఞలకు
విధేయుడను అవుతాను.
18 యెహోవా, నా కళ్లు తెరువుము, అప్పుడు నేను
నీ ఉపదేశములను అనుసరించి నీవు చేసిన ఆశ్చర్య
కార్యాలను గూర్చి చదువుతాను.
19 ఈ దేశంలో నేను పరాయివాణ్ణి. యెహోవా, నీ
ఉపదేశాలు నాకు దాచిపెట్టకుము.
20 నేను ఎంతసేపూ నీ నిర్ణయాలను గూర్చి చద
వాలని కోరుతున్నాను.
21 యెహోవా, గర్వించే ప్రజలను నీవు గద్దిస్తావు.
ఆ గర్విష్ఠులకు కీడులే సంభవిస్తాయి. నీ ఆజ్ఞలకు
విధేయులవుటకు వారు నిరాకరిస్తారు.
22 నన్ను సిగ్గుపడనియ్యకు, ఇబ్బంది పడనియ్యకు.
నేను నీ ఒడంబడికకు విధేయుడనయ్యాను.
23 నాయకులు కూడ నన్ను గూర్చి చెడు విషయాలు
చెప్పారు. అయితే యెహోవా, నేను నీ సేవకు
డను; మరియు నేను నీ న్యాయ చట్టాలు చదువు
తాను.
24 నీ ధర్మశాస్త్రమే నాకు శ్రేష్ఠమైన స్నేహితుడు. అది
నాకు మంచి సలహా ఇస్తుంది.

## దాలెత్

25 నేను త్వరలోనే చనిపోతాను. యెహోవా, నీ
మాటలతో నన్ను ఉజ్జీవింప జేయుము.
26 నా జీవితం గూర్చి నేను నీతో చెప్పాను. నీవు
నాకు జవాబు ఇచ్చావు. ఇప్పుడు నాకు నీ న్యాయ
చట్టాలు నేర్పించు.
27 యెహోవా, నీ న్యాయ చట్టాలు గ్రహించుటకు
నాకు సహాయం చేయుము. నీవు చేసిన ఆశ్చర్య
కార్యాలను నన్ను ధ్యానం చేయనిమ్ము.
28 నేను అలసిపోయి విచారంగా ఉన్నాను. ఆజ్ఞ
యిచ్చి నన్ను మరల బలపర్చుము.
29 యెహోవా, నన్ను కపటంగా జీవించనియ్యకు,
నీ ఉపదేశాలతో నన్ను నడిపించుము.
30 యెహోవా, నేను నీకు నమ్మకంగా ఉండాలని
కోరుకొన్నాను. జ్ఞానంగల నీ నిర్ణయాలను నేను
జాగ్రత్తగా చదువుతాను.
31 యెహోవా, నేను నీ ఒడంబడికకు కట్టుబడతాను.
నన్ను నిరాశ పరచవద్దు.
32 నేను నీ ఆజ్ఞలవైపు పరుగెత్తి విధేయుడనవుతాను.
యెహోవా, నీ ఆజ్ఞలు నన్ను ఎంతో సంతోష
పెడతాయి.

## హే

33 యెహోవా, నీ న్యాయచట్టాలు నాకు నేర్పిం
చుము. నేను ఎల్లప్పుడూ వాటికి విధేయుడ
నౌతాను.
34 గ్రహించుటకు నాకు సహాయం చేయుము. నేను
నీ ఉపదేశాలకు విధేయుడనవుతాను. నేను వాటికి
పూర్తిగా విధేయుడనవుతాను.
35 యెహోవా, నీ ఆజ్ఞల మార్గంలో నన్ను
నడిపించు. నేను నీ ఆజ్ఞలను నిజంగా ప్రేమిస్తు
న్నాను.
36 నేను ఏ విధంగా ధనికుడను కాగలనో అని తల
చుటకు బదులు నీ ఒడంబడికను గూర్చి తలచు
టకు నాకు సహాయం చేయుము.
37 యెహోవా, అయోగ్యమైన విషయాలనుండి నా
కళ్లను మరలించుము. నీ మార్గంలో జీవించుటకు
నాకు సహాయం చేయుము.
38 యెహోవా, నేను నీ సేవకుడను కనుక నీవు
వాగ్దానం చేసిన వాటిని జరిగించుము. నిన్ను ఆరా
ధించే ప్రజలకు నీవు వాటిని వాగ్దానం చేశావు.
39 యెహోవా, నేను భయపడుతున్న అవమానాన్ని
తొలగించు. జ్ఞానం గల నీ నిర్ణయాలు మంచివి.
40 చూడు, నీ ఆజ్ఞలను నేను ప్రేమిస్తున్నాను. నా
యెడల మంచితనం చూపించి నన్ను బతుక
నిమ్ము.

## వావ్

41 యెహోవా, నీ నిజమైన ప్రేమ నాకు చూపిం
చుము. నీవు వాగ్దానం చేసినట్టే నన్ను రక్షించుము.
42 అప్పుడు నన్ను అవమానించే ప్రజలకు నా దగ్గర
జవాబు ఉంటుంది. యెహోవా, నీవు చెప్పే విష
యాలు నేను నిజంగా నమ్ముతాను.
43 నీ సత్యమైన ఉపదేశాలను నన్ను ఎల్లప్పుడూ చెప్ప
నిమ్ము. యెహోవా, జ్ఞానంగల నీ నిర్ణయాల మీద
నేను ఆధారపడుతున్నాను.
44 యెహోవా, నేను శాశ్వతంగా ఎప్పటికీ నీ ఉప
దేశాలను అనుసరిస్తాను.
45 అందుచేత నేను క్షేమంగా జీవిస్తాను. ఎందుకంటే,
నీ న్యాయ చట్టాలకు విధేయుడనగుటకు నేను
కష్టపడి ప్రయత్నిస్తాను గనుక.
46 యెహోవా ఒడంబడికను గూర్చి నేను రాజులతో
చర్చిస్తాను. వారి ఎదుట భయపడకుండా నేను
మాట్లాడుతాను.

47 యెహోవా, నీ ఆజ్ఞలను చదువటము నాకు
ఆనందం. ఆ ఆజ్ఞలంటే నాకు ప్రేమ.
48 యెహోవా, నేను నీ ఆజ్ఞలను గౌరవిస్తున్నాను.
వాటిని నేను ప్రేమిస్తున్నాను. మరియు నేను
వాటిని ధ్యానం చేస్తూ వాటిని గూర్చి మాట్లాడు
తాను.

## జాయిన్

49 యెహోవా, నాకు చేసిన నీ వాగ్దానం జ్ఞాపకం
చేసుకొనుము. ఆ వాగ్దానం నాకు ఆశనిస్తుంది.
50 నేను శ్రమ పడుతున్నప్పుడు నీవు నన్ను ఆద
రించావు. నీ మాటలు నన్ను మరల బతికించాయి.
51 నా కంటే తామే మంచివాళ్లు అనుకొన్న మను
ష్యులు ఎడతెగక నన్ను అవమానించారు. కాని
యెహోవా, నీ ఉపదేశాలను అనుసరించటం నేను
మానుకోలేదు.
52 జ్ఞానంగల నీ నిర్ణయాలను నేను ఎల్లప్పుడూ
జ్ఞాపకం ఉంచుకొంటాను. యెహోవా, జ్ఞానంగల
నీ నిర్ణయాలు నన్ను ఆదరిస్తాయి.
53 నీ ఉపదేశాలను అనుసరించటం మానివేసిన దుర్మా
ర్గులను చూస్తే నాకు చాలా కోపం వస్తుంది.
54 నా మట్టుకైతే, నీ న్యాయ చట్టాలు నా ఇంట
పాటల్లా ఉంటాయి.
55 యెహోవా రాత్రివేళ నేను నీ నామం జ్ఞాపకం
చేసుకొంటాను. నీ ఉపదేశాలను నేను జ్ఞాపకం
చేసుకొంటాను. నీ న్యాయ చట్టాన్ని నేను అను
సరిస్తాను.
56 నీ ఆజ్ఞలకు నేను జాగ్రత్తగా విధేయుడను అవుతాను
కనుక నాకు ఈలాగు జరుగుతుంది.

## హేత్

57 యెహోవా, నీ ఆజ్ఞలకు విధేయుడనగుట నా
విధి అని నేను తీర్మానించుకొన్నాను.
58 యెహోవా, నేను పూర్తిగా నీమీద ఆధార పడు
తున్నాను. నీ వాగ్దానం ప్రకారం నాకు దయ
చూపించుము.
59 నేను నా జీవితాన్ని గూర్చి చాలా జాగ్రత్తగా ఆలో
చించాను. మళ్లీ నీ ఒడంబడికను అనుసరించటానికే
వచ్చాను.
60 ఆలస్యం లేకుండా నీ ఆజ్ఞలకు విధేయత
చూపాలని నేను త్వరగా మళ్లుకొన్నాను.
61 దుర్మార్గులు కొందరు నన్ను చుట్టుముట్టారు.
అయితే యెహోవా, నేను నీ ఉపదేశాలు మరచిపో
లేదు.
62 నీ మంచి నిర్ణయాల కోసం నీకు కృతజ్ఞత చెల్లిం
చటానికి అర్థరాత్రి వేళ నేను మేల్కొంటాను.
63 నిన్ను ఆరాధించే ప్రతి మనిషికీ నేను స్నేహి
తుడను. నీ ఆజ్ఞలకు విధేయత చూపే ప్రతి మనిషికి
నేను స్నేహితుడను.
64 యెహోవా, నీ నిజమైన ప్రేమ భూమిని నింపు
తుంది. నీ న్యాయ చట్టాలు నాకు నేర్పించుము.

## తేత్

65 యెహోవా, నీ సేవకుడనైన నాకోసం నీవు మంచి
వాటిని జరిగించావు. నీవు చేస్తానని వాగ్దానం చేసిన
వాటినే సరిగా నీవు చేశావు.
66 యెహోవా నేను జ్ఞానంగల నిర్ణయాలు చేయ
డానికి నాకు గ్రహింపును ప్రసాదించు. నేను నీ
ఆజ్ఞలను నమ్ముకొంటున్నాను.
67 నేను శ్రమపడక ముందు అనేక తప్పులు చేశాను.
కాని ఇప్పుడు నీ ఆజ్ఞలకు నేను జాగ్రత్తగా విధే
యుడనవుతున్నాను.
68 దేవా, నీవు మంచివాడవు, నీవు మంచి వాటినే
చేస్తావు. నీ న్యాయ చట్టాలు నాకు నేర్పించుము.
69 నాకంటే తామే మంచి వాళ్లు అనుకొనే మను
ష్యులు నన్ను గూర్చి చెడ్డ అబద్ధాలు చెబుతారు.
కాని యెహోవా, నేను నా హృదయపూర్తిగా నీ
ఆజ్ఞలకు లోబడుతూ, అలాగే కొనసాగుతున్నాను.
70 ఆ మనుష్యులు చాల తెలివితక్కువ వాళ్లు. నీ
ఉపదేశాలు ధ్యానించటం నాకు ఆనందం.
71 శ్రమపడటం నాకు మంచిది. నేను నీ న్యాయ
చట్టాలు నేర్చుకొన్నాను.
72 యెహోవా, నీ ఉపదేశాలు నాకు మంచివి. 1000
వెండి, బంగారు నాణెముల కంటే నీ ఉపదేశాలు
మంచివి.

## యోద్

73 యెహోవా, నీవు నన్ను చేశావు, నీ చేతులతో
నన్ను నిలబెడుతావు. నీ ఆదేశాలు నేర్చుకొని
గ్రహించుటకు నాకు సహాయం చేయుము.
74 యెహోవా, నీ అనుచరులు నన్ను చూచి సంతో
షిస్తారు. నీవు చెప్పే విషయాలను నేను నమ్ము
తాను. కనుక వారికి చాలా సంతోషం.
75 యెహోవా, నీ నిర్ణయాలు న్యాయంగా ఉంటా
యని నాకు తెలుసు. నీవు నన్ను శిక్షించటం
నీకు సరియైనదే.
76 ఇప్పుడు నిజమైన నీ ప్రేమతో నన్ను ఆదరిం
చుము. నీ వాగ్దాన ప్రకారం నన్ను ఆదరించుము.
77 యెహోవా, నన్ను ఆదరించి, నన్ను బతుక
నిమ్ము. నీ ఉపదేశములలో నిజంగా నేను ఆనంది
స్తాను.
78 నాకంటే తామే మంచివాళ్లు అనుకొనే మనుష్యులు
నన్ను గూర్చి అబద్ధం చెప్పారు కనుక వారిని
సిగ్గుపరచు. యెహోవా, నేను నీ ఆజ్ఞలను అధ్య
యనం చేస్తాను.

79 నీ అనుచరులను తిరిగి నా దగ్గరకు రానిమ్ము. నీ
ఒడంబడిక తెలిసిన మనుష్యులను తిరిగి నా దగ్గరకు
రానిమ్ము.
80 యెహోవా, నన్ను నీ ఆజ్ఞలకు పరిపూర్ణంగా విధే
యుడను కానిమ్ము. అందుచేత నేను అవమానించ
బడను.

## కఫ్

81 నీవు నన్ను రక్షిస్తావని నిరీక్షిస్తూ నేను చని
పోబోతున్నాను. కాని యెహోవా, నీవు చెప్పే
విషయాలు నేను నమ్ముతాను.
82 నీవు వాగ్దానం చేసిన వాటికోసం నేను ఎదురు
చూస్తూనే ఉంటాను. కాని నా కళ్లు అలసిపోతు
న్నాయి. యెహోవా, నీవు నన్ను ఎప్పుడు
ఆదరిస్తావు?
83 నేను పొగలో ఎండిపోయిన ద్రాక్ష తొక్కలా
ఉన్నప్పుడు కూడా నీ న్యాయ చట్టాలను నేను
మరచిపోలేదు.
84 నేను ఎంత కాలం జీవిస్తాను? యెహోవా, నన్ను
హింసించే మనుష్యులకు ఎప్పుడు తీర్పు
తీరుస్తావు?
85 కొందరు గర్విష్ఠులు వారి అబద్ధాలతో నన్ను
పొడిచారు. మరి అది నీ ఉపదేశాలకు విరుద్ధం.
86 యెహోవా, మనుష్యులు నీ ఆజ్ఞలన్నింటినీ నమ్మ
గలరు. అబద్ధికులు నన్ను హింసిస్తారు. నాకు
సహాయం చేయుము!
87 ఆ అబద్ధీకులు నన్ను దాదాపుగా నాశనం చేశారు.
నేను మాత్రం నీ ఆదేశాలను అనుసరించటం మాన
లేదు.
88 యెహోవా, నిజమైన నీ ప్రేమ చూపించి నన్ను
జీవించనిమ్ము. నీవు చెప్పే వాటిని నేను చేస్తాను.

## లామెద్

89 యెహోవా, నీ మాట శాశ్వతంగా కొనసాగు
తుంది. నీ మాట పరలోకంలో శాశ్వతంగా కొన
సాగుతుంది.
90 నీవు ఎప్పటికీ నమ్మదగిన వాడవు. యెహోవా,
భూమిని నీవు చేశావు, అది ఇంకా నిలిచి ఉంది.
91 నీ ఆజ్ఞ మూలంగా, ఇంకా అన్నీ కొనసాగుతాయి.
యెహోవా, అన్నీ నీ సేవకుల్లా నీ ఆజ్ఞకు లోబడు
తాయి.
92 నీ ఉపదేశాలు నాకు స్నేహితుల్లా ఉండకపోతే, నా
శ్రమ నన్ను నాశనం చేసి ఉండేది.
93 యెహోవా, నీ ఆజ్ఞలు నన్ను జీవింపజేస్తాయి
కనుక నేను ఎన్నటికీ వాటిని మరచిపోను.
94 యెహోవా, నేను నీ వాడను. నన్ను రక్షించుము.
ఎందుకంటే, నేను నీ ఆజ్ఞలకు విధేయుడనగుటకు
కష్టపడి ప్రయత్నిస్తాను.
95 దుష్టులు నన్ను నాశనం చేయాలని ప్రయ
త్నించారు. అయితే నీ ఒడంబడిక నాకు తెలివి
నిచ్చింది.
96 నీ ధర్మశాస్త్రానికి తప్ప ప్రతిదానికీ ఒక హద్దు ఉంది.

## మేమ్

97 నీ ధర్మశాస్త్రాన్ని నేనెంతగా ప్రేమిస్తానో! దిన
మంతా అదే నా ధ్యానం.
98 నీ ఆజ్ఞ నన్ను నా శత్రువులకంటే జ్ఞానవంతునిగా
చేస్తుంది.
99 నా గురువులందరికంటే నాకు ఎక్కువ గ్రహింపు
ఉన్నది. ఎందుకంటే నీ ఉపదేశాలే నా ధ్యానం
కాబట్టి.
100 ముసలివారి కంటే నేనెక్కువ అర్థం చేసు
కొంటాను. కారణం ఏమిటంటే, నేను నీ
శాసనాలను అనుసరిస్తాను.
101 నీ వాక్కు ప్రకారం నడుచుకోటానికి ప్రతి చెడు
మార్గంనుండి నేను తప్పించుకొంటాను.
102 యెహోవా, నీవు నా ఉపాధ్యాయుడవు కనుక
నేను నీ న్యాయ చట్టాలకు విధేయుడనవటం
మానను.
103 నీ మాటలు నా నోటికి తేనెకంటే మధురం.
104 నీ ఉపదేశాలు నన్ను తెలివిగలవాణ్ణి చేస్తాయి,
అందుచేత తప్పుడు ఉపదేశాలు నాకు అసహ్యము.

## నూన్

105 యెహోవా, నీ వాక్యాలు నా బాటను వెలిగించే
దీపాల్లా ఉన్నాయి.
106 నీ న్యాయ చట్టాలు మంచివి. నేను వాటికి విధేయు
డనవుతానని వాగ్దానం చేస్తున్నాను. మరియు నా
వాగ్దానాన్ని నిలబెట్టుకుంటాను.
107 యెహోవా, నేను చాలాకాలం శ్రమ అనుభవిం
చాను. దయచేసి ఆజ్ఞయిచ్చి, నన్ను మరల
జీవించనిమ్ము!
108 యెహోవా, నా స్తుతి అంగీకరించు. నీ న్యాయ
చట్టాలు నాకు నేర్పించుము.
109 నా జీవితం ఎల్లప్పుడూ ప్రమాదంలోనే ఉంది.
కానీ యెహోవా, నేను నీ ఉపదేశాలు మరచిపో
లేదు.
110 దుర్మార్గులు నన్ను ఉచ్చులో పట్టాలని ప్రయ
త్నించారు కానీ నేను నీ ఆజ్ఞలకు అవిధేయుడను
కాలేదు.
111 యెహోవా, శాశ్వతంగా నేను నీ ధర్మశాస్త్రాన్ని
అనుసరిస్తాను. అది నన్ను ఎంతో సంతోషింప
జేస్తుంది.

112 నీ ఆజ్ఞలు అన్నిటికీ విధేయుడనగుటకు నేను ఎల్లప్పుడూ కష్టపడి ప్రయత్నిస్తాను.

## సామెహ్

113 స్థిరమైన మనస్సు లేనివాళ్లంటే నాకు అసహ్యం. నేను నీ ఉపదేశాలను ప్రేమిస్తున్నాను.
114 నన్ను దాచిపెట్టి, కాపాడుము. యెహోవా, నీవు చెప్పే ప్రతిదీ నేను నమ్ముతాను.
115 యెహోవా, దుర్మార్గపు ప్రజలను నా దగ్గరకు రానీయకు. నేను మాత్రం నా దేవుని ఆజ్ఞలకు విధేయుడనవుతాను.
116 యెహోవా, నీ వాగ్దానం ప్రకారం నాకు చేయూత నిమ్ము. నేను జీవిస్తాను.నేను నిన్ను నమ్ముకొన్నాను, నన్ను నిరాశపరచకు.
117 యెహోవా, నాకు సహాయం చేయుము. నేను రక్షించబడుతాను. నీ ఆజ్ఞలను నేను నిరంతరం అధ్యయనం చేస్తాను.
118 యెహోవా, నీ ఆజ్ఞలను ఉల్లంఘించే ప్రతి మనిషినీ నీవు తిప్పికొడతావు. ఎందుకంటే ఆ మనుష్యులు నిన్ను అనుసరిస్తామని ఒడంబడిక చేసుకున్నప్పుడు అబద్ధం చెప్పారు.
119 యెహోవా, భూమి మీద దుష్టులను నీవు చెత్తలా చూస్తావు. కనుక నేను శాశ్వతంగా నీ ధర్మశాస్త్రాన్ని ప్రేమిస్తాను.
120 యెహోవా, నీవంటే నాకు భయం, నీ చట్టాలకు నేను భయపడి వాటిని గౌరవిస్తాను.

## అయిన్

121 యెహోవా, సరియైనవి, మంచివి నేను చేశాను. నన్ను బాధించాలని కోరేవారికి నన్ను అప్పగించవద్దు.
122 నీవు నాకు సహాయం చేస్తావని ప్రమాణం చేయుము. యెహోవా, నేను నీ సేవకుడను, ఆ గర్విష్ఠులను నాకు హాని చేయనియ్యకుము.
123 యెహోవా, నన్ను రక్షించుటకు నీవు మంచి ప్రమాణం చేశావు. కాని నన్ను రక్షిస్తావని నీ కోసం ఎదురు చూచి నా కళ్లు అలసిపోయాయి.
124 నిజమైన నీ ప్రేమ నా మీద చూపించుము. నేను నీ సేవకుడను. నీ న్యాయ చట్టాలు నాకు నేర్పించుము.
125 నేను నీ సేవకుడను నేను నీ ఒడంబడికను నేర్చుకొని, గ్రహించుటకు నాకు సహాయం చేయుము.
126 యెహోవా, యిది నీవు ఏమైనా చేయాల్సిన సమయం. ప్రజలు నీ న్యాయ చట్టం ఉల్లంఘించారు.
127 యెహోవా, నీ ఆజ్ఞలు మేలిమి బంగారంకంటె నాకు ఎక్కువ ఇష్టం.
128 నీ ఆజ్ఞలన్నింటికి నేను జాగ్రత్తగా విధేయుడనవుతాను. తప్పుడు బోధలు నాకు అసహ్యం.

## పే

129 యెహోవా, నీ ఒడంబడిక అద్భుతం, అందుకే నేను దానిని అనుసరిస్తాను.
130 ప్రజలు నీ మాట గ్రహించడం మొదలుపెట్టినప్పుడు అది వారికి సరైన జీవన విధానాన్ని చూపెట్టి దీపంలా ఉంటుంది. నీ మాట తెలివి తక్కువ జనులను కూడా తెలివిగల వారినిగా చేస్తుంది.
131 యెహోవా, నేను నిజంగా నీ ఆజ్ఞలు ధ్యానించాలని కోరుతున్నాను. నేను కష్టంగా ఊపిరి పీలుస్తూ, అసహనంగా కనిపెడ్తున్న మనిషిలా ఉన్నాను.
132 దేవా, నావైపుకు తిరిగి, నా మీద దయ చూపించుము. నీ నామమును ప్రేమించే వారికి సరియైనవి ఏవో వాటిని చేయుము.
133 యెహోవా, నీ వాగ్దానం ప్రకారం నన్ను నడిపించుము. నాపై ఏ దుష్టత్వమూ అధికారం చేయనీయవద్దు.
134 యెహోవా, నన్ను బాధించు ప్రజల నుండి నన్ను రక్షించుము. నేనేమో, నీ ఆజ్ఞలకు విధేయుడనవుతాను.
135 యెహోవా, నీ సేవకుని అంగీకరించి నీ న్యాయ చట్టాలు నేర్పించుము.*
136 ప్రజలు నీ ఉపదేశాలకు లోబడనందువల్ల నదిలా నా కన్నీళ్లు ప్రవహించేట్టు నేను ఏడ్చాను.

## సాదె

137 యెహోవా, నీవు మంచివాడవు. నీ చట్టాలు న్యాయమైనవి.
138 ఒడంబడికలో నీవు మాకు ఇచ్చిన న్యాయ చట్టాలు మంచివి. యెహోవా, మేము నీ న్యాయ చట్టాలపై నిజంగా నమ్మకముంచగలము.
139 నా ఉత్సాహం నాలో కృంగిపోయినది. ఎందుకంటే, నా శత్రువులు నీ న్యాయ చట్టాలను మరచిపోయారు.
140 యెహోవా, మేము నీ మాట నమ్మగలుగుటకు మాకు రుజువు ఉంది. అదంటే నాకు ప్రేమ.
141 నేను యువకుడను ప్రజలు నన్ను గౌరవించరు. కానీ నేను నీ ఆజ్ఞలు మరచిపోను.
142 యెహోవా, నీ మంచితనం శాశ్వతంగా ఉంటుంది. నీ ఉపదేశాలు నమ్మదగినవి.

---

**నీ … నేర్పించుము** నీ సేవకుని మీద నీ ముఖాన్ని ప్రకాశింపనిమ్ము, నీ న్యాయ శాసనములను నాకు భోధించుము.

143 నాకు కష్టాలు, చిక్కులు కలిగాయి. కాని నీ ఆజ్ఞలు నాకు ఆనందకరము.
144 నీ ఒడంబడిక శాశ్వతంగా మంచిది. నేను జీవించ గలుగునట్లు నీ ఒడంబడికను గ్రహించుటకు నాకు సహాయం చేయుము.

## ఖాఫ్

145 యెహోవా, నా హృదయపూర్తిగా నేను నీకు మొరపెడ్తున్నాను. నాకు జవాబు ఇమ్ము. నేను నీ ఆజ్ఞలకు విధేయుడను.
146 యెహోవా, నేను నీకు మొరపెట్టుతున్నాను నన్ను రక్షించుము. నేను నీ ఒడంబడికకు విధేయు డనవుతాను.
147 యెహోవా, నిన్ను ప్రార్థించుటకు నేను వేకువనే మేల్కొన్నాను. నీ మాటకోసం నేను వేచియుం టాను. నీవు చెప్పేవాటియందు నేను నమ్మిక ముంచుతాను.
148 నీ వాక్యాన్ని ధ్యానించుటకు నేను చాలా రాత్రి వరకు మెళకువగా ఉన్నాను.
149 నీవు దయతో నా మాట విను. యెహోవా, నీ న్యాయ శాస్త్రాను సారముగా నన్ను జీవింప నిమ్ము.
150 మనుష్యులు నాకు విరోధంగా కీడు పథకాలు వేస్తున్నారు. యెహోవా, ఆ మనుష్యులు నీ ఉప దేశాలను అనుసరించరు.
151 యెహోవా, నీవు నాకు సన్నిహితంగా ఉన్నావు. నీ ఆజ్ఞలు అన్నీ నమ్మదగినవి.
152 నీ ఉపదేశాలు శాశ్వతంగా కొనసాగుతాయని చాలా కాలం క్రిందట నీ ఒడంబడిక నుండి నేను నేర్చు కొన్నాను.

## రేష్

153 యెహోవా, నా శ్రమను చూచి, నన్ను తప్పిం చుము. నీ ఉపదేశాలను నేను మరువలేదు.
154 యెహోవా, నాకోసం నా పోరాటం నీవు పోరాడి, నన్ను రక్షించుము. నీ వాగ్దానం ప్రకారం నన్ను జీవించనిమ్ము.
155 దుష్టులు జయించరు ఎందుకంటే, వారు నీ న్యాయ చట్టాలను అనుసరించరు.
156 యెహోవా, నీవు చాలా దయగలవాడవు. నీవు చెప్పే సరియైన వాటిని చేసి, నన్ను జీవించ నిమ్ము.
157 నన్ను బాధించుటకు ప్రయత్నిస్తున్న శత్రువులు నాకు చాలామంది ఉన్నారు. కాని నేను మాత్రం నీ ఒడంబడికను అనుసరించటం ఆపివేయలేదు.
158 ఆ ద్రోహులను నేను చూస్తున్నాను. ఎందుకంటే యెహోవా, వారు నీ మాటకు విధేయులు కారు.
159 చూడు, నీ ఆజ్ఞలకు విధేయుడనగుటకు నేను కష్టపడి ప్రయత్నిస్తాను. యెహోవా, నీ ప్రేమ అంతటితో నన్ను జీవించనిమ్ము.
160 యెహోవా, ఆది నుండి నీ మాటలు అన్నీ నమ్మదగినవి. నీ మంచి ధర్మశాస్త్రం శాశ్వతంగా నిలుస్తుంది.

## షీన్

161 ఏ కారణం లేకుండానే బలమైన నాయకులు నా మీద దాడి చేశారు. కానీ నేను మాత్రం నీ ధర్మశాస్త్రా నికే భయపడి, దాన్ని గౌరవిస్తాను.
162 యెహోవా, అప్పుడే ఐశ్వర్యపు నిధి దొరికిన వానికి ఎంత సంతోషమో, నీ వాక్యం నన్ను అంత సంతోష పరుస్తుంది.
163 అబద్ధాలంటే నాకు అసహ్యం! నేను వాటిని తృణీ కరిస్తాను. యెహోవా, నీ ఉపదేశాలు నాకు ఇష్టం.
164 నీ మంచి న్యాయ చట్టాలను బట్టి నేను రోజుకు ఏడుసార్లు నిన్ను స్తుతిస్తాను.
165 నీ ఉపదేశాలను ప్రేమించే మనుష్యులకు నిజమైన శాంతి లభిస్తుంది. ఆ మనుష్యులను ఏదీ పడగొట్ట లేదు.
166 యెహోవా, నీవు నన్ను రక్షించాలని నేను కనిపెడ్తున్నాను. నేను నీ ఆజ్ఞలకు విధేయుడన య్యాను.
167 నేను నీ ఒడంబడికను అనుసరించాను. యెహోవా, నీ న్యాయ చట్టాలు అంటే నాకు ఎంతో ప్రేమ.
168 నీ ఒడంబడికకు, నీ ఆజ్ఞలకు నేను విధేయుడన య్యాను. యెహోవా, నేను చేసింది ప్రతిది నీకు తెలుసు.

## తౌ

169 యెహోవా, నా సంతోష గీతం ఆలకించుము. నీ వాగ్దాన ప్రకారం నన్ను జ్ఞానం గలవానిగా చేయుము.
170 యెహోవా, నా ప్రార్థన వినుము. నీవు వాగ్దానం చేసినట్టే, నన్ను రక్షించుము.
171 నీవు నీ న్యాయ చట్టాలు నాకు నేర్పించావు కనుక నేను స్తుతి గీతాలతో ఉప్పొంగి పోతాను.
172 నీ మాటలకు నన్ను జవాబు చెప్పనిమ్ము. నా పాట నన్ను పాడనిమ్ము. యెహోవా, నీ న్యాయ చట్టాలన్నీ మంచివి.
173 నేను నీ ఆజ్ఞలను అనుసరించాలని నిర్ణయించు కొన్నాను గనుక నన్ను ఆదుకొని, నాకు సహాయం చేయుము.
174 యెహోవా, నీవు నన్ను రక్షించాలని నేను కోరుతున్నాను. కానీ నీ ఉపదేశాలు నన్ను సంతోష పరుస్తాయి.

175 యెహోవా, నన్ను జీవించనిమ్ము నిన్ను స్తుతించ నిమ్ము. నీ న్యాయ చట్టాలు నాకు సహాయం చేయనిమ్ము.
176 నేను తప్పిపోయిన గొర్రెలా తిరిగాను. యెహోవా, నా కోసం వెదకుతూ రమ్ము. నేను నీ సేవకుడను. మరియు నేను నీ ఆజ్ఞలను మరువ లేదు.

## కీర్తన 120

*యాత్ర కీర్తన.*

1 నేను కష్టంలో ఉన్నాను. సహాయం కోసం నేను యెహోవాకు మొరపెట్టాను. ఆయన నన్ను రక్షించాడు.
2 యెహోవా, మోసకరమైన నాలుకనుండి, నాకు వ్యతిరేకంగా అబద్ధం చెప్పిన వారినుండి నన్ను రక్షించుము.
3 అబద్ధికులారా, యెహోవా మిమ్మల్ని ఎలా శిక్షి స్తాడో మీకు తెలుసా? మీరేమి పొందుతారో మీకు తెలుసా?
4 మిమ్మల్ని శిక్షించటానికి దేవుడు సైనికుని వాడిగల బాణాన్ని, మండుతున్న నిప్పులను ఉప యోగిస్తాడు.
5 అబద్ధికులారా, మీ దగ్గర్లో నివసించటం మెషెకులో నివసించటంలాగే ఉంటుంది. అది కేదారు* గుడారాల్లో నివసించినట్టే ఉంటుంది.
6 శాంతిని ద్వేషించే ప్రజలతో నేను చాలా ఎక్కువ కాలం జీవించాను.
7 నాకు శాంతి కావాలి. అది నేను చెప్పినట్లు ఆ ప్రజలకు యుద్ధం కావాలి.

## కీర్తన 121

*యాత్ర కీర్తన.*

1 కొండల తట్టు నేను చూసాను. కానీ నిజానికి నా సహాయం ఎక్కడనుండి వస్తుంది?
2 భూమిని, ఆకాశాన్ని సృష్టించిన యెహోవా దగ్గర నుండి నాకు సహాయం వస్తుంది.
3 దేవుడు నిన్ను పడిపోనివ్వడు. నిన్ను కాపాడేవాడు నిద్రపోడు.
4 ఇశ్రాయేలును కాపాడేవాడు కునుకడు. దేవుడు ఎన్నడూ నిద్రపోడు.
5 యెహోవాయే నిన్ను కాపాడేవాడు. యెహోవా తన మహా శక్తితో నిన్ను కాపాడుతాడు.
6 పగటి సూర్యుడు నీకు బాధ కలిగించడు. రాత్రివేళ చంద్రుడు నీకు బాధ కలిగించడు.
7 ప్రతి అపాయం నుండి యెహోవా నిన్ను కాపాడు తాడు. యెహోవా నీ ప్రాణాన్ని కాపాడుతాడు.
8 నీవు వెళ్లేటప్పుడు వచ్చేటప్పుడు యెహోవా నీకు సహాయంగా ఉంటాడు. ఇప్పుడు, ఎల్లప్పుడూ యెహోవా నీకు సహాయంగా ఉంటాడు.

## కీర్తన 122

*దావీదు యాత్ర కీర్తన.*

1 "మనం యెహోవా ఆలయానికి వెళ్దాం" అని ప్రజలు నాతో చెప్పినప్పుడు నేను చాలా సంతోషించాను.
2 ఇక్కడ యెరూషలేము ద్వారాల దగ్గర మనం నిలిచి ఉన్నాము.
3 కొత్త యెరూషలేము ఒకే ఐక్యపట్టణంగా మరల కట్టబడింది.
4 దేవునికి చెందిన గోత్రాల వారు అక్కడికి వెళ్తారు. యెహోవా నామాన్ని స్తుతించుటకు ఇశ్రాయేలు ప్రజలు అక్కడికి వెళ్తారు.
5 ప్రజలకు న్యాయం తీర్చడానికి, రాజులు వారి సింహా సనాలు వేసుకొనే స్థలం అది. దావీదు వంశపు రాజులు వారి సింహాసనాలు అక్కడే వేసుకొన్నారు.
6 యెరూషలేములో శాంతి కోసం ప్రార్థించండి. "నిన్ను ప్రేమించే ప్రజలకు అక్కడ శాంతి లభిస్తుం దని నేను ఆశిస్తున్నాను. నీ ప్రాంగణాలలో శాంతి ఉంటుందని నేను ఆశిస్తున్నాను. నీ మహాభవనాల్లో భద్రత ఉంటుందని నేను ఆశిస్తున్నాను."
7 నా పొరుగువారు, ఇతర ఇశ్రాయేలీయులు క్షేమం గాను, శాంతితోను ఉండాలని నేను ప్రార్థిస్తున్నాను.
8 మన యెహోవా దేవుని ఆలయక్షేమం కోసం ఈ పట్టణానికి మంచి సంఘటనలు సంభవించాలని నేను ప్రార్థిస్తున్నాను.

## కీర్తన 123

*యాత్ర కీర్తన.*

1 దేవా, నేను నీవైపు చూచి ప్రార్థిస్తున్నాను. నీవు పరలోకంలో రాజుగా కూర్చుని ఉన్నావు.
2 బానిసలు వారి అవసరాల కోసం వారి యజమా నుల మీద ఆధారపడతారు. బానిస స్త్రీలు వారి యజమానురాండ్ర మీద ఆధారపడతారు.
3 అదే విధంగా మేము మా దేవుడైన యెహోవా మీద ఆధారపడుతాము. దేవుడు మా మీద దయ చూపించాలని మేము ఎదురు చూస్తాము.
4 యెహోవా, మా మీద దయ చూపించుము. మేము చాలాకాలంగా అవమానించబడ్డాము. కనుక దయ చూపించుము.
5 ఆ గర్విష్ఠుల ఎగతాళితో మా ప్రాణం అధిక భారాన్ని పొందింది. మా హింసకుల తిరస్కారంతో వారు సుఖంగా వున్నారు.

---

**మెషెకులో … కేదారు** ఈ స్థలాల్లో వుండిన ప్రజలు ప్రసిద్ధికెక్కిన యుద్ధ వీరులు.

## కీర్తన 124

### దావీదు యాత్ర కీర్తన.

1 గత కాలంలో యెహోవాయే మన పక్షంగా ఉండక పోతే మనకు ఏమి జరిగి ఉండేదో? ఇశ్రాయేలూ, నాకు జవాబు చెప్పుము.
2 గత కాలంలో యెహోవాయే మన పక్షంగా ఉండక పోతే మాకు ఏమి జరిగి ఉండేదో? ప్రజలు మన మీద దాడి చేసినప్పుడు ఏమి జరిగి ఉండేదో?
3 అప్పుడు మన శత్రువులకు మన మీద కోపం వచ్చినప్పుడల్లా వాళ్లు మనల్ని సజీవంగా మింగేసి ఉండేవాళ్లు.
4 అప్పుడు మన శత్రుసైన్యాలు మనల్ని కొట్టుకు పోయే ప్రవాహంలా, మనల్ని ముంచివేసే నదిలా ఉండేవి.
5 అప్పుడు ఆ గర్విష్ఠులు నోటి వరకూ పొంగుతూ మనల్ని ముంచి వేసే నీళ్లలా పొంగుతూ ఉండేవాళ్లు.
6 యెహోవాను స్తుతించండి. మన శత్రువులు మనల్ని పట్టి చంపకుండునట్లు యెహోవా చేశాడు.
7 మనం వలలో పట్టబడి తర్వాత తప్పించుకొన్న పక్షిలా ఉన్నాము. వల తెగిపోయింది. మనం తప్పించుకొన్నాము.
8 మనకు సహాయం యెహోవా దగ్గర నుండే వచ్చింది. భూమిని, ఆకాశాన్ని యెహోవా చేశాడు.

## కీర్తన 125

### యాత్ర కీర్తన.

1 యెహోవాను నమ్ముకొనేవారు సీయోను కొండలా ఉంటారు. వారు ఎన్నటికీ కదలరు. వారు శాశ్వతంగా కొనసాగుతారు.
2 యెరూషలేము చుట్టూరా పర్వతాలు ఉన్నాయి. అదే విధంగా యెహోవా తన ప్రజల చుట్టూరా ఉన్నాడు. యెహోవా తన ప్రజలను నిరంతరం కాపాడుతాడు.
3 దుర్మార్గులు మంచి ప్రజల దేశాన్ని శాశ్వతంగా వశం చేసుకోరు. దుర్మార్గులు అలా చేస్తే అప్పుడు మంచి మనుష్యులు కూడా చెడ్డ పనులు చేయటం మొదలుపెడతారేమో.
4 యెహోవా, మంచి మనుష్యులకు మంచి వాడవుగా ఉండుము. పవిత్ర హృదయాలు గల మనుష్యులకు మంచి వాడవుగా ఉండుము.
5 యెహోవా, దుర్మార్గులను నీవు శిక్షించుము. వాళ్లు వక్రమైన పనులు చేస్తారు. ఇశ్రాయేలులో శాంతి ఉండనిమ్ము.

## కీర్తన 126

### యాత్ర కీర్తన.

1 యెహోవా మమ్మల్ని దేశ బహిష్కరణ నుండి తిరిగి వెనుకకు తీసుకొని వచ్చినప్పుడు అది ఒక కలలా ఉంది!
2 మేము నవ్వుకుంటున్నాము. మరియు మేము అకస్మాత్తుగా సంతోషగానాలు పాడటం మొదలు పెట్టే వాళ్లము. “దేవుడు ఇశ్రాయేలు ప్రజల కొరకు గొప్ప కార్యాలు చేశాడు.”
3 ఇతర రాజ్యాల ప్రజలు దాన్ని గూర్చి చెప్పు కొన్నారు. “ఇశ్రాయేలు ప్రజల కోసం యెహోవా మాకు ఆశ్చర్యకరమైన పనులు చేశాడు” అని ఆ ప్రజలు చెప్పారు. మేము చాలా ఆనందంగా ఉన్నాము!
4 యెహోవా మేము ఖైదీలముగా ఉన్నాము. ఇప్పుడు ఎడారిని వికసింప చేసే నీటి ప్రవాహంలా మమ్మల్ని తిరిగి స్వతంత్రులుగా చేయుము.
5 విత్తనాలు నాటేటప్పుడు ఒకడు దుఃఖముగా వుండ వచ్చు, కాని పంట కూర్చుకొనేటప్పుడు సంతోషంగా ఉంటాడు.
6 అతడు బయట పొలాల్లోనికి విత్తనం మోసికొని పోవునప్పుడు ఏడ్వవచ్చు, కాని పంటను ఇంటికి తెచ్చునప్పుడు అతడు సంతోషిస్తాడు.

## కీర్తన 127

### సొలొమోను యాత్ర కీర్తన.

1 ఇల్లు కట్టేవాడు యెహోవా కాకపోయినట్లయితే కట్టేవాడు తన పనిని వ్యర్థంగా చేస్తున్నట్టు. పట్టణాన్ని కాపలా కాసేవాడు యెహోవా కాకపోతే కాపలా వాళ్లు వారి సమయం వృధా చేసి కొంటున్నట్టే.
2 నీవు వేకువనే లేవటం, చాలా ఆలస్యంగా పని చేయటం కేవలం నీవు తినే ఆహారం కోసమే అయితే నీవు నీ సమయం వృధా చేసుకొంటు న్నట్టే. దేవుడు తనకి ప్రియమైనవాళ్ల విషయం శ్రద్ధ తీసుకొంటాడు. వారు నిద్రపోతున్నప్పుడు కూడా ఆయన శ్రద్ద తీసుకొంటాడు.
3 పిల్లలు యెహోవానుండి లభించే కానుక. వారు తల్లి గర్భమునుండి వచ్చే బహుమానం.
4 యువకుని కుమారులు, సైనికుని బాణాల సంచి లోని బాణాల్లాంటి వారు.
5 తన బాణాల సంచిని కుమారులతో నింపుకొనే వాడు చాలా సంతోషంగా ఉంటాడు.

6 ఆ మనిషి ఎన్నటికీ ఓడించబడడు. బహిరంగ
స్థలాల్లో* అతని కుమారులు అతని శత్రువుల
నుండి అతణ్ణి కాపాడుతారు.

## కీర్తన 128

**యాత్ర కీర్తన.**

1 యెహోవా అనుచరులందరూ సంతోషంగా
ఉంటారు. ఆ ప్రజలు యెహోవా కోరిన విధంగా
జీవిస్తారు.
2 నీవు వేటికోసం పని చేస్తావో వాటిలో ఆనంది
స్తావు. ఎవ్వరూ వాటిని నీ వద్దనుండి తీసుకోలేరు.
నీవు సంతోషంగా ఉంటావు. మంచి విషయాలు
నీకు సంభవిస్తాయి.
3 ఇంట్లో నీ భార్య ఫలించే ద్రాక్షావల్లిలా ఉంటుంది.
బల్లచుట్టూరా నీ పిల్లలు, నీవు నాటిన ఒలీవ
మొక్కల్లా ఉంటారు.
4 యెహోవా తన అనుచరులను నిజంగా ఈ విధంగా
ఆశీర్వదిస్తాడు.
5 యెహోవా సీయోనులోనుండి నిన్ను ఆశీర్వ
దిస్తాడని నేను ఆశిస్తున్నాను. నీవు నీ జీవిత కాల
మంతా యెరూషలేములో ఆశీర్వాదాలు అనుభవి
స్తావని నేను ఆశిస్తున్నాను.
6 నీవు నీ మనుమలను, మనుమరాండ్రను చూచేంత
వరకు జీవిస్తావని నేను ఆశిస్తాను. ఇశ్రాయేలులో
శాంతి ఉండునుగాక.

## కీర్తన 129

**యాత్ర కీర్తన.**

1 నా జీవిత కాలమంతా నాకు ఎంతోమంది శత్రు
వులు. ఇశ్రాయేలూ, ఆ శత్రువులను గూర్చి మాకు
చెప్పుము.
2 నా జీవిత కాలమంతా నాకు ఎంతో మంది శత్రు
వులు ఉన్నారు కానీ వారు ఎన్నడూ జయించ
లేదు.
3 నా వీపుమీద లోతైన గాయాలు అయ్యేంతవరకు
వారు నన్ను కొట్టారు. నాకు చాలా పెద్ద, లోతైన
గాయాలు అయ్యాయి.
4 అయితే దయగల యెహోవా తాళ్ళను తెగకోసి
ఆ దుర్మార్గులనుండి నన్ను విడుదల చేసాడు.
5 సీయోనును ద్వేషించిన మనుష్యులు ఓడించ
బడ్డారు. వారు పోరాటం మానివేసి పారిపోయారు.
6 ఆ మనుష్యులు ఇంటి కప్పు మీద మొలచిన
గడ్డిలాంటి వాళ్లు. ఆ గడ్డి ఎదుగక ముందే చస్తుంది.
7 పని వానికి ఆ గడ్డి గుప్పెడు కూడా దొరకదు.
ధాన్యపు పన కట్టేందుకు కూడా అది సరిపోదు.
8 ఆ దుర్మార్గుల పక్కగా నడుస్తూ వెళ్లే మనుష్యులు,
"యెహోవా మిమ్మల్ని ఆశీర్వదించునుగాక అని
చెప్పారు." "యెహోవా నామమున మేము
మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాము" అని చెబుతూ
మనుష్యులు వారిని ఏమీ అభినందించరు.

## కీర్తన 130

**యాత్ర కీర్తన.**

1 యెహోవా, నేను గొప్ప కష్టంలో ఉన్నాను. కనుక
సహాయం కోసం నిన్ను పిలుస్తున్నాను.
2 నా ప్రభువా, నా మాట వినుము. సహాయం కోసం
నేను చేస్తున్న మొర వినుము.
3 యెహోవా, మనుష్యులను వారి పాపాలన్నిటి బట్టి
నీవు శిక్షిస్తే ఒక్క మనిషి కూడా మిగలడు.
4 యెహోవా, నీ ప్రజలను క్షమించుము. అప్పుడు
నిన్ను ఆరాధించుటకు మనుష్యులు ఉంటారు.
5 యెహోవా నాకు సహాయం చేయాలని నేను
కనిపెడుతున్నాను. నా ఆత్మ ఆయన కోసం కని
పెడుతుంది. యెహోవా చెప్పేది నేను నమ్ము
తున్నాను.
6 నా ప్రభువు కోసం నేను కనిపెడుతున్నాను.
ఎప్పుడు తెల్లారుతుందా అని ఆశతో కనిపెడు
తున్న కావలివాండ్లలా నేను ఉన్నాను.
7 ఇశ్రాయేలూ, యెహోవాను నమ్ముకో. నిజమైన
ప్రేమ యెహోవా దగ్గర మాత్రమే కనబడుతుంది.
యెహోవా మనలను మరల, మరల రక్షిస్తాడు.
మరియు యెహోవా ఇశ్రాయేలీయుల పాపాలు
అన్నింటి విషయంలో వారిని క్షమిస్తాడు.

## కీర్తన 131

**యాత్ర కీర్తన.**

1 యెహోవా, నేను గర్విష్ఠిని కాను. నేను ప్రముఖు
డిని అన్నట్టు ప్రవర్తించ ప్రయత్నించను. నేను
గొప్ప పనులు చేయాలని ప్రయత్నించను. నాకు
మరీ కష్టతరమైన వాటిని గూర్చి నేను చింతించను.
2 నేను మౌనంగా ఉన్నాను. నా ప్రాణం నెమ్మదిగా
ఉంది.
3 తల్లి చేతుల్లో సంతృప్తిగా ఉన్న ఒక శిశువులా నా
ప్రాణం మౌనంగా, నెమ్మదిగా ఉంది.
4 ఇశ్రాయేలూ, యెహోవానే నమ్ముకో. ఇప్పుడు
ఆయనను నమ్ముకో, ఎప్పటికీ ఆయన్నే
నమ్ముకో.

---

**బహిరంగ స్థలాలు** అక్షరార్థంగా "ద్వారము" ఎప్పుడైనా ఒక వ్యక్తి యొక్క శత్రువులు అతన్ని న్యాయ స్థానానికి తీసుకు వెళ్లాలని ప్రయత్నిస్తే అతని కుమారులు అతన్ని రక్షిస్తారు అని దీని అర్థము కావచ్చు.

## కీర్తన 132
యాత్ర కీర్తన.

1 యెహోవా, దావీదు శ్రమపడిన విధానం జ్ఞాపకం చేసుకోమ్మ.
2 కాని దావీదు యెహోవాకు ఒక ప్రత్యేక ప్రమాణం చేసాడు. ఇశ్రాయేలీయుల మహత్తర శక్తిగల దేవునికి దావీదు ఒక ప్రత్యేక ప్రమాణం చేసాడు.
3 దావీదు చెప్పాడు, "నేను నా యింట్లోకి వెళ్లను. నేను నా పడక మీద పండుకొనను,
4 నేను నిద్రపోను, నేను నా కండ్లకు విశ్రాంతి నివ్వను,
5 యెహోవా కోసం నేను ఒక మందిరాన్ని కను గొనేంత వరకు ఆ పనుల్లో ఏదీ నేను చేయను! ఇశ్రాయేలీయుల మహ శక్తిగల దేవునికి నేనొక గృహం చూస్తాను!"
6 ఎఫ్రాతాలో* మేము దాని గూర్చి విన్నాం. ఒడం బడికపెట్టెను కిర్యత్యారీము* దగ్గర మేము కను గొన్నాము.
7 మనం పవిత్ర గుడారానికి వెళ్దాం రండి. దేవుడు తన పాదాలు పెట్టుకొనే పీఠం దగ్గర మనము ఆయనను ఆరాధించుకొందాం.
8 యెహోవా, నీ విశ్రమ స్థానం నుండి లెమ్ము. యెహోవా, నీవు నీ శక్తిగల ఒడంబడిక పెట్టెతో రమ్ము.
9 యెహోవా, నీ యాజకులు నీతిని వస్త్రాలుగా ధరించనిమ్ము. నీ అనుచరులు చాలా సంతోషంగా ఉన్నారు.
10 నీ సేవకుడైన దావీదు కోసం నీవు ఏర్పరచు కొన్న రాజును నిరాకరించవద్దు.
11 యెహోవా దావీదుతో ఒక స్థిరప్రమాణం చేశాడు. యెహోవా దావీదుతో వెనుక తిరుగని ప్రమాణం చేశాడు. దావీదు వంశం నుండి రాజులు వస్తారని యెహోవా ప్రమాణం చేశాడు.
12 "దావీదూ, నీ పిల్లలు నా ఒడంబడికకు, నేను వారికి నేర్పించే నా న్యాయ చట్టాలకు విధేయులయితే అప్పుడు నీ వంశంలో నుండి ఎవరో ఒకరు ఎల్ల ప్పుడూ రాజుగా ఉంటాడు" అని యెహోవా చెప్పాడు.
13 యెహోవా, తన ఆలయ స్థానంగా ఉండుటకు సీయోనును ఎంచుకున్నాడు. తన నివాసస్థలంగా దాన్ని కోరు కొనియున్నాడు.
14 యెహోవా చెప్పాడు, "శాశ్వతంగా ఇదే నా స్థలం. నేను ఉండే చోటుగా ఈ స్థలాన్ని ఎంచు కొంటున్నాను.
15 సమృద్ధిగా ఆహారం యిచ్చి నేను ఈ పట్టణాన్ని ఆశీర్వదిస్తాను. ఇక్కడ పేదవాళ్లకు కూడా తిను టకు సమృద్ధిగా ఉంటుంది.
16 యాజకులకు నేను రక్షణను ధరింపచేస్తాను. మరియు నా అనుచరులు ఇక్కడ చాలా సంతో షంగా ఉంటారు.
17 ఈ స్థలంలో, దావీదుకు ఒక కొమ్ముమొలిచేలా చేస్తాను. నేను ఏర్పాటు చేసుకొన్న రాజుకు నేను ఒక దీపాన్ని సిద్ధం చేస్తాను.
18 దావీదు శత్రువులను నేను అవమానంతో కప్పు తాను. కాని దావీదు కిరీటం దేదీప్యమానంగా ప్రకాశి స్తుంది."

## కీర్తన 133
దావీదు యాత్ర కీర్తనల్లో ఒకటి.

1 సహోదరులు ఐక్యంగా శాంతి కలిగి జీవించటం ఎంతో మంచిది, ఎంతో ఆనందం.
2 అది యాజకుని తల మీద పోయబడిన కమ్మని వాసనగల తైలంలాగా ఉంటుంది. అది అహరోను గడ్డం మీదికి కారుతున్న తైలంలాగా ఉంటుంది. అది అహరోను ప్రత్యేక వస్త్రాల మీదికి కారుతున్న తైలంలాగ ఉంటుంది.
3 అది హెర్మోను పర్వతం మీద నుండి సీయోను కొండ మీద పడుతున్న మంచులా ఉంటుంది.
4 సీయోను వద్దనే యెహోవా తన ఆశీర్వాదం ఇచ్చాడు. శాశ్వతజీవాన్ని ఆశీర్వాదంగా యెహోవా ఇచ్చాడు.

## కీర్తన 134
యాత్ర కీర్తన.

1 యెహోవా సేవకులారా, మీరందరూ ఆయన్ని స్తుతించండి! రాత్రి అంతా ఆలయంలో సేవించిన సేవకులారా, మీరందరూ ఆయన్ని స్తుతించండి.
2 సేవకులారా, మీ చేతులు ఎత్తి యెహోవాను స్తుతించండి.
3 యెహోవా సీయోనులో నుండి మిమ్మల్ని ఆశీ ర్వదించునుగాక! యెహోవా ఆకాశాన్ని, భూమిని చేశాడు.

## కీర్తన 135

1 యెహోవాను స్తుతించండి. యెహోవా సేవకు లారా, యెహోవా నామాన్ని స్తుతించండి.
2 యెహోవా ఆలయంలో నిలిచి ఉండే ప్రజలారా, ఆయన నామాన్ని స్తుతించండి! ఆలయ ప్రాంగ ణంలో నిలబడే ప్రజలారా, ఆయన నామాన్ని స్తుతించండి!

---

**ఎఫ్రాతా** దావీదు పుట్టిన బెత్లెహేం పట్టణం.

**కిర్యత్యారీము** అరణ్యం అని అర్థం వచ్చే ఈ మాట ఈ పట్టణానికి పేరు.

3 యెహోవా మంచివాడు గనుక ఆయనను స్తుతిం
చండి. యెహోవాను స్తుతించుట ఆనంద
దాయకం గనుక ఆయన నామాన్ని స్తుతించండి.
4 యెహోవా యాకోబును కోరుతున్నాడు.
యెహోవా ఇశ్రాయేలును తన విశేషమైన సొత్తుగా
ఎన్నుకొన్నాడు.
5 యెహోవా గొప్పవాడని నాకు తెలుసు. మన
ప్రభువు ఇతర దేవుళ్లందరికంటె గొప్పవాడు!
6 ఆకాశంలో, భూమి మీద, సముద్రాల్లో, అగాధపు
మహా సముద్రాల్లో యెహోవా ఏది చేయాలను
కొంటే అది చేస్తాడు.
7 భూమికి పైగా మేఘాలను దేవుడు చేస్తాడు. మెరు
పులను, వర్షాన్ని దేవుడు చేస్తాడు. దేవుడు గాలిని
తన నిధిలోనుండి రప్పిస్తాడు.
8 ఈజిప్టు మనుష్యులలో జ్యేష్ఠులందరినీ, జంతువు
లలో మొదట పుట్టినవాటన్నిటినీ దేవుడు నాశనం
చేసాడు.
9 దేవుడు ఈజిప్టులో అనేకమైన ఆశ్చర్య కార్యాలు,
అద్భుతాలు చేసాడు. ఫరోకు, అవి అతని అధికారు
లకు ఆ సంగతులు సంభవించేలా దేవుడు చేశాడు.
10 దేవుడు అనేక రాజ్యాలను ఓడించాడు. బలమైన
రాజులను దేవుడు చంపేసాడు.
11 అమోరీయుల రాజైన సీహోనును దేవుడు ఓడిం
చాడు. బాషాను రాజైన ఓగును దేవుడు ఓడిం
చాడు. కనానులోని జనాంగాలన్నింటినీ దేవుడు
ఓడించాడు.
12 వారి దేశాన్ని దేవుడు ఇశ్రాయేలీయులకు ఇచ్చాడు.
దేవుడు ఆ దేశాన్ని తన ప్రజలకు ఇచ్చాడు.
13 యెహోవా, నీ పేరు శాశ్వతంగా ఖ్యాతి కలిగియుం
టుంది. యెహోవా, ప్రజలు నిన్ను జనాంగాల్ని
ఎప్పటికీ జ్ఞాపకం చేసుకొంటారు.
14 యెహోవా జనాంగాల్ని శిక్షించాడు. కాని తన
సేవకుల యెడల దయ చూపించాడు.
15 ఇతర మనుష్యుల దేవుళ్లు కేవలం వెండి, బంగారు
విగ్రహాలే. వారి దేవుళ్లు కేవలం మనుష్యులు చేసిన
విగ్రహాలే.
16 ఆ విగ్రహాలకు నోళ్లు ఉన్నాయి. కానీ అవి మాట్లాడ
లేవు. కళ్లు వున్నాయి కానీ అవి చూడలేవు.
17 ఆ విగ్రహాలకు చెవులు ఉన్నాయి కానీ అవి వినలేవు.
ముక్కులు ఉన్నాయి కానీ అవి వాసన చూడలేవు.
18 మరియు ఆ విగ్రహాలను తయారు చేసిన మను
ష్యులు సరిగ్గా ఆ విగ్రహాల్లాగానే అవుతారు. ఎందు
కంటే వారికి సహాయం చేయాలని వారు ఆ
విగ్రహాల మీదనే నమ్మకముంచారు.
19 ఇశ్రాయేలు వంశమా, యెహోవాను స్తుతించు!
అహరోను వంశమా, యెహోవాను స్తుతించు.
20 లేవీ వంశమా, యెహోవాను స్తుతించు! యెహో
వాను ఆరాధించే ప్రజలారా, యెహోవాను
స్తుతించండి.
21 సీయోనులో నుండి, తన నివాసమైన యెరూష
లేములో నుండి, యెహోవా స్తుతించబడును గాక!
యెహోవాను స్తుతించండి!

## కీర్తన 136

1 యెహోవా మంచివాడు గనుక ఆయనను స్తుతిం
చండి. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
2 దేవుళ్లకు దేవుణ్ణి స్తుతించండి! ఆయన నిజమైన
ప్రేమ నిరంతరం ఉంటుంది.
3 యెహోవా దేవున్ని స్తుతించండి. ఆయన నిజ
మైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
4 ఆశ్చర్యకరమైన అద్భుతాలు చేసే ఆయన్ని
మాత్రమే స్తుతించండి. ఆయన నిజమైన ప్రేమ
ఎల్లప్పుడు ఉంటుంది.
5 జ్ఞానంచేత ఆకాశాన్ని సృజించిన దేవుణ్ణి స్తుతిం
చండి. ఆయన నిజమైన ప్రేమ ఎల్లకాలం
ఉంటుంది.
6 దేవుడు సముద్రం మీద ఆరిన నేలను చేశాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
7 దేవుడు గొప్ప జ్యోతులను చేశాడు. ఆయన
నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
8 దేవుడు పగటిని ఏలుటకు సూర్యుణ్ణి చేసాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
9 దేవుడు రాత్రిని ఏలుటకు చంద్రుని, నక్షత్రాలను
చేసాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
10 దేవుడు ఈజిప్టు మనుష్యులలో మొదటివారిని,
జంతువులలోను మొదటివాటిని చంపేసాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
11 దేవుడు ఈజిప్టునుండి ఇశ్రాయేలును విడిపించాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
12 దేవుడు తన గొప్ప శక్తిని బలాన్ని చూపించాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
13 దేవుడు ఎర్రసముద్రాన్ని రెండు పాయలుగా
చేసాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
14 దేవుడు తన ఇశ్రాయేలును ఎర్రసముద్రంలో
నుండి నడిపించాడు. ఆయన నిజమైన ప్రేమ
శాశ్వతంగా ఉంటుంది.
15 దేవుడు ఫరోను, అతని సైన్యాన్ని ఎర్ర సము
ద్రంలో ముంచివేశాడు. ఆయన నిజమైన ప్రేమ
శాశ్వతంగా ఉంటుంది.

16 దేవుడు తన ప్రజలను ఉడారిలో నడిపించాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
17 దేవుడు శక్తిగల రాజులను ఓడించాడు. ఆయన
నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
18 దేవుడు బలమైన రాజులను ఓడించాడు. ఆయన
నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
19 దేవుడు అమోరీయుల రాజైన సీహోనును
ఓడించాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
20 దేవుడు బాషాను రాజైన ఓగును ఓడించాడు.
ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
21 దేవుడు వారి దేశాన్ని ఇశ్రాయేలీయులకు
యిచ్చాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
22 దేవుడు ఆ దేశాన్ని ఒక కానుకగా ఇశ్రాయేలీయు
లకు యిచ్చాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వ
తంగా ఉంటుంది.
23 దేవుడు, మనం ఓడించబడినప్పుడు మనలను
జ్ఞాపకం చేసికొన్నాడు. ఆయన నిజమైన ప్రేమ
శాశ్వతంగా ఉంటుంది.
24 దేవుడు మన శత్రువుల నుండి మనలను రక్షిం
చాడు. ఆయన నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది.
25 దేవుడు ప్రతి ప్రాణికీ ఆహారం యిస్తాడు. ఆయన
నిజమైన ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.
26 పరలోకపు దేవుని స్తుతించండి! ఆయన నిజమైన
ప్రేమ శాశ్వతంగా ఉంటుంది.

## కీర్తన 137

1 బబులోను నదుల దగ్గర మనం కూర్చొని
సీయోనును జ్ఞాపకం చేసికొని ఏడ్చాం.
2 దగ్గర్లో ఉన్న నిరవంజి చెట్లకు* మన సితారాలు
తగిలించాము.
3 బబులోనులో మనల్ని బంధించిన మనుష్యులు
మనల్ని పాటలు పాడమని చెప్పారు. సంతోష
గీతాలు పాడమని వారు మనకు చెప్పారు.
సీయోను గూర్చి పాటలు పాడుమని వారు మనకు
చెప్పారు.
4 కానీ విదేశంలో మనం యెహోవాకు కీర్తనలు
పాడలేము!
5 యెరూషలేమా, ఎన్నడైనా నేను నిన్ను మరచి
పోతే నా కుడిచేయి ఎన్నడూ వాయించకుండా
ఎండి పోవును గాక!
6 యెరూషలేమా, ఎన్నడైనా నేను నిన్ను మరచి
పోతే నా నాలుక పాడకుండా అంగిటికి అంటుకు
పోవును గాక! నేను ఎన్నటికీ నిన్ను మరువనని
వాగ్దానం చేస్తున్నాను.
7 యెరూషలేము ఎప్పటికీ నా మహా ఆనందం అని
నేను ప్రమాణం చేస్తున్నాను! యెహోవా, యెరూ
షలేము పడిన రోజున ఎదోమీయులు ఏమి
చేసారో జ్ఞాపకం చేసుకోనుము. దాని పునాదుల
వరకు పడగొట్టండి అని వారు అరిచారు.
8 బబులోనూ, నీవు నాశనం చేయబడతావు! నీకు
రావాల్సిన శిక్ష నీకు యిచ్చేవాడు ఆశీర్వదించ
బడునుగాక! నీవు మమ్మల్ని బాధించినట్టు, నిన్ను
బాధించేవాడు ఆశీర్వదించబడును గాక!
9 నీ చంటి బిడ్డలను తీసుకొని వారిని బండమీద
చితుక గొట్టేవాడు ధన్యుడు.

## కీర్తన 138

**దావీదు కీర్తన.**

1 దేవా, నా హృదయపూర్తిగా నేను నిన్ను స్తుతిస్తాను.
దేవుళ్లందరి యెదుట నేను నీ కీర్తనలు పాడుతాను.
2 దేవా, నీ పవిత్ర ఆలయం వైపు నేను సాగిలపడ
తాను. నీ నామం, నీ నిజప్రేమ, నీ నమ్మకములను
బట్టి నేను స్తుతిస్తాను. నీ నామాన్ని, నీ వాక్యాన్ని
అన్నిటికన్నా పైగా హెచ్చించావు..
3 దేవా, సహాయం కోసం నేను నీకు మొరపెట్టాను.
నీవు నాకు జవాబు ఇచ్చావు. నీవు నాకు బలం
ఇచ్చావు.
4 యెహోవా, భూరాజులందరూ నిన్ను స్తుతిం
చెదరు గాక! నీవు చెప్పిన విషయాలను వారు
విన్నారు.
5 ఆ రాజులు అందరూ యెహోవా మార్గాన్ని గూర్చి
పాడాలి అని నేను ఆశిస్తున్నాను. యెహోవా
మహిమ గొప్పది.
6 దేవుడు గొప్పవాడు. అయితే దీనులను గూర్చి
దేవుడు శ్రద్ధ వహిస్తాడు. గర్విష్ఠులు చేసే పనులు
యెహోవాకు తెలుసు. కానీ ఆయన వారికి సన్ని
హితంగా ఉండడు.
7 దేవా, నేను కష్టంలో ఉంటే నన్ను బతికించుము.
నా శత్రువులు నా మీద కోపంగా ఉంటే నన్ను
వారినుండి తప్పించుము.
8 యెహోవా, నీవు వాగ్దానం చేసిన వాటిని నాకు
ఇమ్ము. యెహోవా, నీ నిజమైన ప్రేమ శాశ్వతంగా
ఉంటుంది. యెహోవా, నీవు మమ్మల్ని చేశావు
కనుక మమ్మల్ని విడిచిపెట్టవద్దు.

## కీర్తన 139

**సంగీత నాయకునికి. దావీదు స్తుతి కీర్తన**

1 యెహోవా, నీవు నన్ను పరీక్షించావు. నన్ను
గూర్చి నీకు అంతా తెలుసు.

---

**నిరవంజి చెట్టు** బూరుగవంటి ఒక అడవి చెట్టు.

2 నేను ఎప్పుడు కూర్చునేది ఎప్పుడు లేచేది నీకు తెలుసు. దూరంలో ఉన్నా, నా తలంపులు నీకు తెలుసు.
3 యెహోవా, నేను ఎక్కడికి వెళ్లుతున్నది, ఎప్పుడు పండుకొంటున్నది నీకు తెలుసు. నేను చేసే ప్రతీది నీకు తెలుసు.
4 యెహోవా, నా మాటలు నా నోటిని దాటక ముందే నేను ఏమి చెప్పాలనుకొన్నానో అది నీకు తెలుసు.
5 యెహోవా, నీవు నా ముందు, నా వెనుక, నా చుట్టూరా ఉన్నావు. నీవు నెమ్మదిగా నీ చేయి నామీద వేస్తావు.
6 నీకు తెలిసిన విషయాలను గూర్చి నాకు ఆశ్చ ర్యంగా ఉంది. గ్రహించటం నాకు కష్టతరం.
7 నేను వెళ్లే ప్రతీచోటా నీ ఆత్మ ఉంది. యెహోవా, నేను నీ నుండి తప్పించుకోలేను.
8 నేను ఆకాశానికి ఎక్కితే, నీవు అక్కడ ఉన్నావు. పాతాళానికి నేను దిగిపోతే నీవు అక్కడ కూడా ఉన్నావు.
9 యెహోవా, సూర్యుడు ఉదయించే తూర్పు దిశకు నేను వెళ్తే నీవు అక్కడ ఉన్నావు. పశ్చిమంగా సముద్రం దగ్గరకు వెళ్తే, నీవు అక్కడ ఉన్నావు.
10 అక్కడ కూడ నీవు నీ కుడిచేయి చాచి, ఆ చేతితో నన్ను నడిపిస్తావు.
11 యెహోవా, నేను నీకు కనబడకుండా దాగు కోవాలని ప్రయత్నిస్తే, "పగలు రాత్రిగా మారి పోయింది. తప్పక చీకటి నన్ను దాచిపెడుతుంది" అని చెప్పవచ్చు
12 కాని యెహోవా, చీకటి నీకు చీకటి కాదు. రాత్రి నీకు పగటి వెలుగువలె ఉంటుంది.
13 యెహోవా, నా శరీరమంతటినీ* నీవు చేశావు. నేను ఇంకా నా తల్లి గర్భంలో ఉన్నప్పుడే నేను నీకు తెలుసు.
14 యెహోవా, నీవు నన్ను సృష్టించినప్పుడు నీవు చేసిన ఆశ్చర్యకరమైన కార్యాలు అన్నింటి కోసం నేను నీకు వందనాలు అర్పిస్తున్నాను. నీవు చేసే పనులు ఆశ్చర్యం, అది నాకు నిజంగా తెలుసు.
15 నన్ను గూర్చి నీకు పూర్తిగా తెలుసు నా తల్లి గర్భంలో దాగి ఉండి, నా శరీరం రూపాన్ని దిద్దు కుంటున్నప్పుడు నా ఎముకలు పెరగటం నీవు గమనించావు.
16 యెహోవా, నా తల్లి గర్భంలో నా శరీరం పెరగటం నీవు చూశావు. ఈ విషయాలన్నీ నీ గ్రంథంలో వ్రాయబడ్డాయి. ప్రతిరోజు నీవు నన్ను మరువక గమనించావు.
17 దేవా, నీ తలంపులు గ్రహించటం ఎంతో కష్టతరం. నీకు ఎంతో తెలుసు!
18 వాటిని లెక్కించగా అవి భూమి మీద ఉన్న యిసుక రేణువుల కంటే ఎక్కువగా ఉంటాయి. కాని నేను వాటిని లెక్కిం చటం ముగించిన తర్వాత కూడా యింకా నీతోనే ఉంటాను.
19 దేవా, దుర్మార్గులను చంపివేయుము. ఆ హంత కులను నా దగ్గర నుండి తీసివేయుము.
20 ఆ చెడ్డ మనుష్యులు నిన్ను గూర్చి చెడు సంగ తులు చెబుతారు. వారు నీ నామాన్ని గూర్చి చెడు సంగతులు చెబుతారు.
21 యెహోవా, నిన్ను ద్వేషించే ప్రజలను నేను ద్వేషిస్తాను. నీకు విరోధంగా తిరిగే మనుష్యులను నేను ద్వేషిస్తాను.
22 నేను వారిని పూర్తిగా ద్వేషిస్తాను! నీ శత్రువులు నాకూ శత్రువులే.
23 యెహోవా, నన్ను చూచి నా హృదయాన్ని తెలుసుకొనుము. నన్ను పరీక్షించి నా తలంపులు తెలుసుకొనుము.
24 చూచి నాలో చెడు తలంపులు ఏమి లేవని తెలుసు కొనుము. శాశ్వతంగా ఉండే నీ మార్గంలో నన్ను నడిపించుము.

## కీర్తన 140

*సంగీత నాయకునికి. దావీదు స్తుతి కీర్తన.*

1 యెహోవా, దుర్మార్గుల నుండి నన్ను రక్షించుము. క్రూరుల నుండి నన్ను కాపాడుము.
2 ఆ మనుష్యులు కీడు పనులు చేయాలని ఆలోచి స్తున్నారు. వాళ్లు ఎల్లప్పుడూ కొట్లాటలు మొదలు పెడ్తారు.
3 వారి నాలుకలు విషసర్పాల నాలుకల్లాంటివి వారి నాలుక క్రింద సర్పవిషం ఉంది.
4 యెహోవా, దుర్మార్గుల నుండి నన్ను రక్షించుము. క్రూరుల నుండి నన్ను కాపాడుము. ఆ మనుష్యులు నన్ను తరిమి, బాధించుటకు ప్రయత్ని స్తారు.
5 ఆ గర్విష్ఠులు నా కోసం ఉచ్చు పెడతారు. నన్ను పట్టుకొనేందుకు వాళ్లు వల పన్నుతారు. నా దారిలో వారు ఉచ్చు పెడతారు.
6 యెహోవా, నీవు నా దేవుడవని నీతో చెప్పు కొన్నాను. యెహోవా, నా ప్రార్థన ఆలకించుము.
7 యెహోవా, నీవు నాకు బలమైన ప్రభువు. నీవు నా రక్షకుడవు. నీవు ఇనుప టోపీవలె యుద్ధంలో నా తలను కాపాడుతావు.

---

**శరీరము** అక్షరార్థంగా మూత్రపిండాలు. ప్రాచీన ఇశ్రాయేలీ యులు ఉద్రేకములు మూత్ర పిండాల్లో కేంద్రీకృతమై యున్నవని తలంచేవాళ్లు. గనుక ఈ వ్యక్తి తను పుట్టుటకు ముందే ఎలా అనుభవాన్ని పొందాడో అని దేవునికి తెలుసు అనే అర్థము కూడా వుండవచ్చు.

8 యెహోవా, ఆ దుర్మార్గులు కోరినట్టుగా వారికి
జరగనివ్వవద్దు. వారి పథకాలు నెగ్గనీయకు.
9 యెహోవా, నా శత్రువులను గెలువనియ్యకుము.
ఆ మనుష్యులు చెడు కార్యాలు తలపెడుతున్నారు.
అయితే ఆ చెడుగులు వారికే సంభవించునట్లు
చేయుము.
10 వాళ్ల తలలమీద మండుచున్ననిప్పులు పోయుము.
నా శత్రువులను అగ్నిలో పడవేయుము. వారు
ఎన్నటికీ ఎక్కిరాలేని గోతిలో వారిని పడ
వేయుము.
11 యెహోవా, ఆ అబద్ధికులను బతుకనియ్యకుము.
ఆ దుర్మార్గులకు చెడు సంగతులు జరుగనిమ్ము.
12 పేదవాళ్లకు యెహోవా న్యాయంగా తీర్పు తీరు
స్తాడని నాకు తెలుసు. నిస్సహాయులకు దేవుడు
సహాయం చేస్తాడు.
13 యెహోవా, మంచి మనుష్యులు నీ నామాన్ని
స్తుతిస్తారు. నీ సన్నిధానంలో వారు నివసిస్తారు.

## కీర్తన 141

**దావీదు స్తుతి కీర్తన.**

1 యెహోవా, సహాయం కోసం నేను నీకు మొర
పెట్టాను. నేను నిన్ను ప్రార్థిస్తూండగా, నీవు నా
మనవి వినుము. త్వరపడి నాకు సహాయం
చేయుము.
2 యెహోవా, నా ప్రార్థన అంగీకరించి, అది ఒక
కానుకలా ఉండనిమ్ము. నా ప్రార్థన నీకు సాయం
కాల బలిగా ఉండనిమ్ము.
3 యెహోవా, నేను చెప్పే విషయాలను అదుపులో
ఉంచుకొనేందుకు నాకు సహాయం చేయుము.
నేను చెప్పే విషయాలను గమనించుటకు నాకు
సహాయం చేయుము.
4 నా హృదయం ఏ చెడు సంగతులవైపూ మొగ్గేలా
అనుమతించవద్దు. చెడ్డ మనుష్యులతో చేరకుండా,
తప్పు చేయకుండా ఉండుటకు నాకు సహాయం
చేయుము. చెడ్డవాళ్లు చేస్తూ ఆనందించే విష
యాల్లో నన్ను భాగస్థుడను కాకుండా చేయుము.
5 ఒక మంచి మనిషి నన్ను సరిదిద్ది విమర్శించ
వచ్చు. అది నాకు మంచిదే. వారి విమర్శను నేను
అంగీకరిస్తాను. నా ప్రార్థన ఎల్లప్పుడూ చెడు
చేసేవారి పనులకు విరోధంగా వుంటుంది.
6 ఎత్తయిన కొండ శిఖరం నుండి వారి పాలకులు
కిందికి పడదోయబడతారు. అప్పుడు నేను
చెప్పింది సత్యం అని ప్రజలు తెలుసుకుంటారు.
7 మనుష్యులు నేలను తవ్వి దున్నుతారు. మట్టి
వెదజల్లబడుతుంది. అదే విధంగా ఆ దుర్మార్గుల
యెముకలు వారి సమాధిలో వెదజల్లబడుతాయి.
8 యెహోవా నా ప్రభువా, సహాయం కోసం నేను
నీ తట్టు చూస్తున్నాను. నేను నిన్ను నమ్ము
కొన్నాను. దయచేసి నన్ను చావనివ్వకుము.
9 ఆ దుర్మార్గుల ఉచ్చులోకి నన్ను పడనియ్య
కుము. ఆ దుర్మార్గులచే నన్ను ఉచ్చులో పట్టుబడ
నివ్వకుము.
10 నేను హాని లేకుండా తప్పించుకొనగా ఆ దుర్మా
ర్గులు తమ ఉచ్చులలోనే పట్టుబడనిమ్ము.

## కీర్తన 142

***దావీదు ధ్యాన గీతం. అతడు గుహలో ఉన్నప్పటి ప్రార్థన.***

1 సహాయం కోసం నేను యెహోవాకు మొర
పెడతాను. యెహోవాను నేను ప్రార్థిస్తాను.
2 నా సమస్యలను గూర్చి నేను యెహోవాకు చెబు
తాను. నా కష్టాలను గూర్చి నేను యెహోవాకు
చెబుతాను.
3 నా శత్రువులు నా కోసం ఉచ్చు పెట్టారు. నా
ప్రాణం నాలో మునిగిపోయింది. అయితే నాకు
ఏమి జరుగుతుందో యెహోవాకు తెలుసు.
4 నేను చుట్టూరా చూస్తే నా స్నేహితులు ఎవ్వరూ
కనిపించలేదు. పారిపోవుటకు నాకు స్థలం లేదు.
నన్ను రక్షించటానికి ఏ మనిషీ ప్రయత్నం
చేయటం లేదు.
5 కనుక సహాయం కోసం నేను యెహోవాకు మొర
పెడుతున్నాను. యెహోవా, నీవే నా క్షేమ స్థానం.
యెహోవా, నీవు నన్ను జీవింపనియ్యగలవు.
6 యెహోవా, నా ప్రార్థన విను. నీవు నాకు ఎంతో
అవసరం. నన్ను తరుముతున్న మనుష్యుల నుండి
నన్ను రక్షించుము. నాకంటే ఆ మనుష్యులు చాలా
బలంగల వాళ్లు.
7 ఈ ఉచ్చు తప్పించుకొనేందుకు నాకు సహాయం
చేయుము. యెహోవా, అప్పుడు నేను నీ
నామాన్ని స్తుతిస్తాను. నీవు నన్ను రక్షిస్తే మంచి
మనుష్యులు సమావేశమై, నిన్ను స్తుతిస్తారని నేను
ప్రమాణం చేస్తాను.

## కీర్తన 143

***దావీదు స్తుతి కీర్తన.***

1 యెహోవా, నా ప్రార్థన వినుము. నా ప్రార్థన
ఆలకించుము. అప్పుడు నా ప్రార్థనకు జవాబు
యిమ్ము. నిజంగా నీవు మంచివాడవని, నమ్మక
మైన వాడవని నాకు చూపించుము.
2 నేను నీ సేవకుడను, నాకు తీర్పు తీర్చవద్దు. నీ
ఎదుట బతికియున్న మనుష్యుడెవడూ నీతిమంతు
నిగా ఎంచబడడు.

3 కానీ నా శత్రువులు నన్ను తరుముతున్నారు. వారు
నా జీవితాన్ని మట్టిలో కుక్కివేశారు.
ఆ శాశ్వత చీకటి సమాధిలోనికి నన్ను తోసి
వేయాలని వారు ప్రయత్నిస్తున్నారు.
4 నాలోవున్న నా ఆత్మ దిగజారిపోయింది. నేను
నా ధైర్యాన్ని పోగొట్టుకొంటున్నాను.
5 కానీ చాలకాలం క్రిందట జరిగిన విషయాలను
నేను జ్ఞాపకం చేసికొంటాను. నీ క్రియలన్నిటినీ
నేను ధ్యానిస్తున్నాను. యెహోవా, నీవు నీ శక్తితో
చేసిన అనేక అద్భుత కార్యాలను గూర్చి నేను
ధ్యానిస్తున్నాను.
6 యెహోవా, నేను నా చేతులు ఎత్తి నిన్ను ప్రార్థి
స్తున్నాను. ఎండిన భూమి వర్షం కోసం ఎదురు
చూచినట్టుగా నేను నీ సహాయం కోసం ఎదురు
చూస్తున్నాను.
7 యెహోవా, త్వరపడి నాకు సమాధానం
యిమ్ము! నేను నా ధైర్యం పోగొట్టుకొన్నాను.
నా నుండి తిరిగిపోకు, నన్ను చావనివ్వకుము.
సమాధిలో చచ్చిపడిన శవాల్లా ఉండనీయకుము.
8 యెహోవా, ఈ ఉదయం నీ నిజమైన ప్రేమను
నాకు చూపించుము నేను నిన్ను నమ్ముకొన్నాను.
సరియైన మార్గాన్ని నాకు చూపించుము. నేను
నా ప్రాణాన్ని నీ చేతుల్లో పెడుతున్నాను!
9 యెహోవా, కాపుదల కోసం నేను నీ దగ్గరకు
వస్తున్నాను. నా శత్రువుల నుండి నన్ను
రక్షించుము.
10 నేను ఏమి చేయాలని నీవు కోరుతున్నావో అది
నాకు చూపించుము. నీవు నా దేవుడవు.
11 యెహోవా, ప్రజలు నిన్ను స్తుతించునట్లు నన్ను
జీవించనిమ్ము. నీవు నిజంగా మంచివాడవని నాకు
చూపించి నా శత్రువుల నుండి నన్ను రక్షించుము.
12 యెహోవా, నీ ప్రేమ నాకు చూపించి, నన్ను
చంపటానికి చూస్తున్న నా శత్రువులను ఓడిం
చుము. ఎందుకంటే నేను నీ సేవకుడను.

## కీర్తన 144

### దావీదు కీర్తన.

1 యెహోవా నా దుర్గం* యెహోవాను స్తుతిం
చండి. యెహోవా నన్ను యుద్ధానికి సిద్ధం
చేస్తాడు. యెహోవా నన్ను పోరాటానికి సిద్ధం
చేస్తాడు.
2 యెహోవా నన్ను ప్రేమిస్తున్నాడు, నన్ను కాపాడు
తున్నాడు. పర్వతం మీద ఎత్తయిన స్థలంలో
యెహోవా నా క్షేమ స్థానం. యెహోవా నన్ను
రక్షిస్తాడు, యెహోవా నా కేడెం. నేను ఆయనను
నమ్ముతాను. నేను నా ప్రజలను పాలించుటకు
యెహోవా నాకు సహాయం చేస్తాడు.
3 యెహోవా, మనుష్యులు ఎందుకు నీకు ముఖ్యం?
నీవు మనుష్యకుమారులను ఎందుకు గమనిస్తావు?
4 మనిషి జీవితం గాలి బుడగలాంటిది. వాని జీవితం
దాటిపోతున్న నీడలాంటిది.
5 యెహోవా, ఆకాశం తెరచి దిగి రమ్ము. పర్వ
తాలను తాకు, వాటినుండి పొగ వస్తుంది.
6 యెహోవా, మెరుపును పంపించి, నా శత్రువులు
పారిపోవునట్లు చేయుము. నీ బాణాలు వేసి, వారు
పారిపోవునట్లు చేయుము.
7 యెహోవా, ఆకాశంనుండి నీ చేయి చాపి నన్ను
రక్షించుము. ఈ శత్రు సముద్రంలో నన్ను మునిగి
పోనీయకుము. ఇతరుల నుండి నన్ను రక్షించుము.
8 ఈ శత్రువులు అబద్ధీకులు. వారు అసత్య విష
యాలు చెబుతారు.
9 యెహోవా, నీవు చేసే ఆశ్చర్యకర కార్యాలను
గూర్చి నేను కొత్త కీర్తన పాడగలిగేలా నన్ను
రక్షించుము. పది తంతుల సితారాతో నిన్ను నేను
స్తుతిస్తాను.
10 రాజులు యుద్ధాల్లో జయించుటకు యెహోవా
సహాయం చేస్తాడు. యెహోవా సేవకుడు
దావీదును అతని శత్రువు ఖడ్గాలనుండి ఆయన
రక్షించాడు.
11 ఇతరుల చేతినుండి నన్ను రక్షించుము. ఈ శత్రు
వులు అబద్ధీకులు. వారు అసత్యాలు చెబుతారు.
12 మన యువ కుమారులు బలమైన పెద్ద వృక్షాల్లా
ఉంటారని నేను ఆశిస్తున్నాను. మన కుమార్తెలు
రాజభవన నిర్మాణానికి చెక్కబడిన మూల స్థంభాల
వలె ఉంటారు.
13 మన ధాన్యపు కొట్టాలు అన్ని రకాల పంటలతో
నిండి ఉంటాయని నేను ఆశిస్తున్నాను. మన పొలా
ల్లోని గొర్రెలు వేలకు వేలుగా పిల్లల్ని పెడతాయని
నేను ఆశిస్తున్నాను.
14 మన బలమైన పశువులు భారమైన బరువులను
లాగగలవని నేను ఆశిస్తున్నాను. శత్రువులు ఎవరూ
మన మీద దాడి చేయటానికి రారని నేను ఆశిస్తు
న్నాను. మనం ఎన్నటికీ యుద్ధానికి వెళ్లం అని
నేను ఆశిస్తున్నాను. మన వీధుల్లో ప్రమాదాల
కేకలు ఏమీ ఉండవని నేను ఆశిస్తున్నాను.
15 ఆ సంగతులు జరిగినప్పుడు ప్రజలు చాలా సంతో
షిస్తారు. యెహోవా ఎవరికి దేవుడో ఆ మను
ష్యులు చాలా సంతోషిస్తారు.

## కీర్తన 145

### దావీదు ప్రార్థన.

1 నా దేవా, నా రాజా నిన్ను నేను స్తుతిస్తాను. నిరం
తరం నిన్ను నేను స్తుతిస్తాను.

---

**దుర్గం** దేవుడు క్షేమ స్థానం అని అర్థం.

2 ప్రతిరోజూ నిన్ను నేను స్తుతిస్తాను. ఎప్పటికీ నీ
నామాన్ని నేను స్తుతిస్తాను.
3 యెహోవా గొప్పవాడు. ప్రజలు ఆయనను
ఎంతో స్తుతిస్తారు. ఆయన చేసే గొప్ప కార్యాల
న్నింటినీ మనం లెక్కించలేము.
4 యెహోవా, ఒక తరం నీ పనులను స్తుతిస్తూ
ఇంకొక తరానికి అందిస్తారు. నీవు చేసే గొప్ప
కార్యాలను గూర్చి ప్రజలు ఇతర ప్రజలతో
చెబుతారు.
5 ఆశ్చర్యకరమైన నీ ఘనత, మహిమను గూర్చి
మనుష్యులు చెప్పుకొంటారు. నీ అద్భుతాలను
గూర్చి నేను చెబుతాను.
6 యెహోవా, నీవు చేసే అద్భుత కార్యాలను గూర్చి
మనుష్యులు చెప్పుకొంటారు. నీవు చేసే గొప్ప
సంగతుల్ని గూర్చి నేను చెబుతాను
7 నీవు చేసే మంచి పనులను గూర్చి ప్రజలు చెప్పు
కొంటారు. యెహోవా, ప్రజలు నీ మంచితనం
గూర్చి పాడుకొంటారు.
8 యెహోవా దయగల వాడు, కరుణగల వాడు.
యెహోవా సహనంగల వాడు, ప్రేమ పూర్ణుడు.
9 యెహోవా, అందరి యెడలా మంచివాడు. దేవుడు
చేసే ప్రతిదానిలో తన కరుణ చూపిస్తాడు.
10 యెహోవా, నీవు చేసే పనులు నీకు స్తుతి
కలిగిస్తాయి. నీ అనుచరులు నిన్ను స్తుతిస్తారు.
11 ఆ ప్రజలు నీ మహిమ రాజ్యం గూర్చి చెప్పు
కొంటారు. నీవు ఎంత గొప్పవాడవో ఆ ప్రజలు
చెప్పుకొంటారు.
12 కనుక యెహోవా, నీవు చేసే గొప్ప కార్యాలను
గూర్చి ఇతర జనులు ఈ రీతిగా నేర్చుకొంటారు.
మహా ఘనమైన నీ మహిమ రాజ్యం గూర్చి ప్రజలు
చెప్పుకొంటారు
13 యెహోవా, నీ రాజ్యం శాశ్వతంగా ఉంటుంది.
నీవు శాశ్వతంగా పాలిస్తావు.
14 పడిపోయిన మనుష్యులను యెహోవా లేవనెత్తు
తాడు. కష్టంలో ఉన్న మనుష్యులకు యెహోవా
సహాయం చేస్తాడు.
15 యెహోవా, జీవిస్తున్న సకల ప్రాణులూ వాటి
ఆహారం కోసం నీవైపు చూస్తాయి. సకాలంలో
నీవు వాటికి ఆహారం యిస్తావు.
16 యెహోవా, నీవు నీ గుప్పెడి విప్పి, జీవిస్తున్న
సకల ప్రాణులకూ వాటికి కావాల్సినవన్నీ యిస్తావు.
17 యెహోవా చేసే ప్రతీదీ మంచిది. యెహోవా
చేసే ప్రతి దానిలోనూ ఆయన తన నిజప్రేమ
చూపిస్తాడు.
18 యెహోవా సహాయం కోసం తనను పిలిచే ప్రతి
యొక్కనికీ సమీపంగా ఉన్నాడు. యెహోవాను
యదార్థంగా ఆరాధించే ప్రతి వ్యక్తికీ ఆయన సమీ
పంగా ఉన్నాడు.
19 ఆయన జరిగించాలని ఆయన అనుచరులు కోరే
వాటినే యెహోవా జరిగిస్తాడు. యెహోవా తన
అనుచరుల మొర విని వారిని రక్షిస్తాడు. మరియు
యెహోవా వారి ప్రార్థనలకు జవాబిచ్చి, వారిని
రక్షిస్తాడు.
20 యెహోవాను ప్రేమించే ప్రతి వ్యక్తినీ ఆయన
కాపాడుతాడు. దుర్మార్గులను యెహోవా నాశనం
చేస్తాడు.
21 నేను యెహోవాను స్తుతిస్తాను! ప్రతి మనిషీ సదా
ఆయన పవిత్ర నామాన్ని స్తుతించాలని నా కోరిక!

## కీర్తన 146

1 యెహోవాను స్తుతించండి! నా ప్రాణమా!
యెహోవాను స్తుతించు!
2 నా జీవిత కాలమంతా నేను యెహోవాను స్తుతి
స్తాను. నా జీవిత కాలమంతా నేను ఆయనకు
స్తుతులు పాడుతాను.
3 సహాయం కోసం మీ నాయకుల మీద ఆధార
పడవద్దు. మనుష్యులు నిన్ను రక్షించలేరు గనుక
మనుష్యులను నమ్ముకోవద్దు.
4 మనుష్యులు చనిపోయి, పాతిపెట్టబడుతారు.
అప్పుడు నీకు సహాయం చేసేందుకు వారు వేసిన
పథకాలన్నీ పోయినట్టే.
5 సహాయం కోసం దేవుణ్ణి అడిగేవారు చాలా సంతో
షంగా ఉంటారు. ఆ మనుష్యులు వారి దేవుడైన
యెహోవా మీద ఆధారపడతారు.
6 భూమిని, ఆకాశాన్ని యెహోవా చేశాడు. సము
ద్రాన్నీ, అందులో ఉన్న సమస్తాన్నీ యెహోవా
చేశాడు. యెహోవా వాటిని శాశ్వతంగా కాపాడు
తాడు.
7 అణచివేయబడిన ప్రజలకు యెహోవా సరియైన
సహాయం చేస్తాడు. ఆకలితో ఉన్న ప్రజలకు
దేవుడు ఆహారం ఇస్తాడు. చెరలోవున్న ప్రజలను
యెహోవా విడుదల చేస్తాడు.
8 గుడ్డివారు మరల చూచుటకు యెహోవా
సహాయం చేస్తాడు. కష్టంలో ఉన్న ప్రజలకు
యెహోవా సహాయం చేస్తాడు. మంచి మనుష్య
లను యెహోవా ప్రేమిస్తాడు.
9 మన దేశంలో నివసిస్తున్న పరాయి వాళ్లను
యెహోవా కాపాడుతాడు. విధవరాండ్రు, అనాథల
విషయమై యెహోవా శ్రద్ధ తీసికొంటాడు.
అయితే దుర్మార్గుల పథకాలను యెహోవా
నాశనం చేస్తాడు.
10 యెహోవా శాశ్వతంగా పాలిస్తాడని నేను ఆశిస్తు
న్నాను. సీయోనూ, నీ దేవుడు శాశ్వతంగా పాలి
స్తాడని నేను ఆశిస్తున్నాను. యెహోవాను
స్తుతించండి!

## కీర్తన 147

1 యెహోవా మంచివాడు గనుక ఆయనను స్తుతిం
చండి. మన దేవునికి స్తుతులు పాడండి. ఆయనను
స్తుతించుట మంచిది, అది ఎంతో ఆనందం.
2 యెహోవా యెరూషలేమును నిర్మించాడు. బందీ
లుగా తీసికొనిపోబడిన ఇశ్రాయేలు ప్రజలను
దేవుడు వెనుకకు తీసికొనివచ్చాడు.
3 పగిలిన వారి హృదయాలను దేవుడు స్వస్థపరచి,
వారి గాయాలకు కట్లు కడతాడు.
4 దేవుడు నక్షత్రాలను లెక్కిస్తాడు, వాటి పేర్లనుబట్టి
వాటన్నిటినీ ఆయన పిలుస్తాడు.
5 మన ప్రభువు చాలా గొప్పవాడు ఆయన చాలా
శక్తిగలవాడు. ఆయన పరిజ్ఞానానికి పరిమితం లేదు.
6 పేదలను యెహోవా బలపరుస్తాడు. కాని చెడ్డ
ప్రజలను ఆయన ఇబ్బంది పెడతాడు.
7 యెహోవాకు కృతజ్ఞతలు చెల్లించండి. స్వర
మండలాలతో మన దేవుని స్తుతించండి.
8 దేవుడు ఆకాశాన్ని మేఘాలతో నింపుతాడు. భూమి
కోసం దేవుడు వర్షాన్ని సృష్టిస్తాడు. పర్వతాల మీద
దేవుడు గడ్డిని మొలిపిస్తాడు.
9 జంతువులకు దేవుడు ఆహారం యిస్తాడు. పక్షి
పిల్లల్ని దేవుడు పోషిస్తాడు.
10 యుద్ధాశ్వాలు, బలంగల సైనికులు ఆయనకు
ఇష్టం లేదు.
11 యెహోవాను ఆరాధించే ప్రజలు ఆయనకు
సంతోషాన్ని కలిగిస్తారు. ఆయన నిజమైన
ప్రేమను నమ్ముకొనే ప్రజలు యెహోవాకు
సంతోషం కలిగిస్తారు.
12 యెరూషలేమా, యెహోవాను స్తుతించుము.
సీయోనూ, నీ దేవుని స్తుతించుము!
13 యెరూషలేమా, దేవుడు నీద్వారబంధాలను బల
పరుస్తాడు. నీ పట్టణంలోని ప్రజలను దేవుడు
ఆశీర్వదిస్తాడు.
14 నీ దేశానికి దేవుడు శాంతి కలిగించాడు. కనుక
యుద్ధంలో నీ శత్రువులు నీ ధాన్యం తీసుకొని
పోలేదు. ఆహారం కోసం నీకు ధాన్యం సమృద్ధిగా
ఉంది.
15 దేవుడు భూమికి ఒక ఆజ్ఞ ఇస్తాడు. దానికి వెంటనే
అది లోబడుతుంది.
16 నేల ఉన్నిలా తెల్లగా అయ్యేంతవరకు మంచు
కురిసేటట్టు దేవుడు చేస్తాడు. ధూళిలా గాలిలో
మంచు విసిరేటట్టు చేస్తాడు.
17 దేవుడు ఆకాశం నుండి బండలవలె వడగండ్లను
పడేలా చేస్తాడు. ఆయన పంపే చలికి ఎవడూ
నిలువ జాలడు.
18 అప్పుడు, దేవుడు మరో ఆజ్ఞ ఇస్తాడు, వెచ్చటి
గాలి మరల వీస్తుంది. మంచు కరిగిపోతుంది. నీళ్లు
ప్రవహించటం మొదలవుతుంది.
19 దేవుడు యాకోబుకు (ఇశ్రాయేలు) తన ఆజ్ఞ
ఇచ్చాడు. దేవుడు ఇశ్రాయేలుకు తన న్యాయ
చట్టాలు, ఆదేశాలు ఇచ్చాడు.
20 దేవుడు యిలా మరి ఏ దేశానికీ చెయ్యలేదు. ఇతర
మనుష్యులకు దేవుడు తన న్యాయ చట్టం ఉప
దేశించలేదు. యెహోవాను స్తుతించండి!

## కీర్తన 148

1 యెహోవాను స్తుతించండి! పైన ఉన్న దూత
లారా, ఆకాశంలో యెహోవాను స్తుతించండి!
2 సకల దూతలారా, యెహోవాను స్తుతించండి!
ఆయన సర్వ సైనికులారా* ఆయనను
స్తుతించండి!
3 సూర్యచంద్రులారా యెహోవాను స్తుతించండి.
ఆకాశంలోని నక్షత్రాలూ, వెలుతురూ
యెహోవాను స్తుతించండి!
4 మహా ఉన్నతమైన ఆకాశంలోని యెహోవాను
స్తుతించండి. ఆకాశం పైగా ఉన్న జలములారా
ఆయనను స్తుతించండి.
5 యెహోవా నామాన్ని స్తుతించండి. ఎందుకనగా
దేవుడు ఆజ్ఞ యివ్వగా ప్రతి ఒక్కటీ సృష్టించ
బడింది.
6 ఇవన్నీ శాశ్వతంగా కొనసాగేందుకు దేవుడు చేశాడు.
ఎన్నటికి అంతంకాని న్యాయచట్టాలను దేవుడు
చేశాడు.
7 భూమి మీద ఉన్న సమస్తమా. యెహోవాను
స్తుతించు! మహా సముద్రాలలోని గొప్ప సముద్ర
జంతువుల్లారా యెహోవాను స్తుతించండి.
8 అగ్ని, వడగండ్లు, హిమము, ఆవిరి, తుఫాను
గాలులు అన్నింటినీ దేవుడు చేశాడు.
9 పర్వతాలను, కొండలను, ఫలవృక్షాలను, దేవదారు
వృక్షాలను దేవుడు చేశాడు.
10 అడవి జంతువులను, పశువులను, పాకే ప్రాణు
లను, పక్షులను అన్నింటినీ దేవుడు చేశాడు.
11 భూమి మీద రాజ్యాలను రాజులను దేవుడు చేశాడు.
నాయకులను, న్యాయాధిపతులను దేవుడు
చేశాడు.
12 యువతీ యువకులను దేవుడు చేశాడు. వృద్ధు
లను, యవ్వనులను దేవుడు చేశాడు.
13 యెహోవా నామాన్ని స్తుతించండి! ఆయన
నామాన్ని శాశ్వతంగా ఘనపర్చండి! భూమిపైన,
ఆకాశంలోను ఉన్న సమస్తం ఆయనను
స్తుతించండి!
14 దేవుడు తన ప్రజలను బలవంతులుగా చేస్తాడు.
దేవుని అనుచరులను మనుష్యులు పొగడుతారు.

---

**ఆయన సర్వసైనికులారా** అనగా “దేవదూతలు” లేదా “నక్ష
త్రాలు మరియు గ్రహాలు” లేదా“సైనికులు” అని అర్థము.

ఎవరి పక్షంగా అయితే దేవుడు పోరాడుతున్నాడో
ఆ ఇశ్రాయేలీయులను మనుష్యులు పొగడుతారు.
యెహోవాను స్తుతించండి!

## కీర్తన 149

1 యెహోవాను స్తుతించండి. యెహోవా చేసిన
కొత్త సంగతులను గూర్చి ఒక కొత్త కీర్తన పాడండి!
ఆయన అనుచరులును కూడుకొనే సమావేశంలో
ఆయనకు స్తుతి పాడండి.
2 ఇశ్రాయేలును దేవుడు చేశాడు. ఇశ్రాయేలును
యెహోవాతో కలసి ఆనందించనివ్వండి.
సీయోను మీది ప్రజలను వారి రాజుతో కూడా
ఆనందించ నివ్వండి.
3 ఆ ప్రజలు వారి తంబురాలు, స్వరమండలాలు
వాయిస్తూ నాట్యమాడుతూ దేవుని స్తుతించ
నివ్వండి.
4 యెహోవా తన ప్రజలను గూర్చి సంతోషి
స్తున్నాడు. దేవుడు తన దీన ప్రజలకు ఒక అద్భుత
క్రియ చేశాడు. ఆయన వారిని రక్షించాడు!

5 దేవుని అనుచరులారా, మీ విజయంలో ఆనందిం
చండి. పడకలు ఎక్కిన తరువాత కూడ సంతోషిం
చండి.
6 ప్రజలు దేవునికి గట్టిగా స్తుతులు చెల్లించెదరుగాక.
ప్రజలు తమ చేతులలో వారి ఖడ్గాలు పట్టుకొని
7 వెళ్లి వారి శత్రువులను శిక్షించెదరుగాక. వారు వెళ్లి
యితర ప్రజలను శిక్షించెదరుగాక.
8 ఆ రాజులకు, ప్రముఖులకు దేవుని ప్రజలు
గొలుసులు వేస్తారు.
9 దేవుడు ఆజ్ఞాపించినట్టే దేవుని ప్రజలు వారి శత్రు
వులను శిక్షిస్తారు. దేవుని అనుచరులకు ఆయన
ఆశ్చర్యకరుడు. యెహోవాను స్తుతించండి!

## కీర్తన 150

1 యెహోవాను స్తుతించండి! దేవుని ఆలయంలో
ఆయనను స్తుతించండి! ఆకాశంలో ఆయన శక్తిని
బట్టి ఆయనను స్తుతించండి!
2 ఆయన గొప్ప కార్యములను బట్టి ఆయనను
స్తుతించండి! ఆయన గొప్పతనమంతటికోసం
ఆయనను స్తుతించండి!
3 బూరలతో, కొమ్ములతో ఆయనను స్తుతిం
చండి! స్వరమండలాలతో, సితారాలతో ఆయనను
స్తుతించండి!
4 తంబురలతో, నాట్యంతో దేవుని స్తుతించండి!
తీగల వాయిద్యాలతో, పిల్లన గ్రోవితో ఆయనను
స్తుతించండి!
5 పెద్ద తాళాలతో దేవుని స్తుతించండి! పెద్దగా శబ్దం
చేసే తాళాలతో ఆయనను స్తుతించండి!
6 సజీవంగా ఉన్న ప్రతీది యెహోవాను స్తుతించాలి!
యెహోవాను స్తుతించండి.

# సామెతలు

### పరిచయం

1 ఈ మాటలు దావీదు కుమారుడైన సొలొమోను
చెప్పిన సామెతలు. సొలొమోను ఇశ్రాయేలీయుల
రాజు.
2ప్రజలు జ్ఞానము కలిగి, సరైన వాటిని చేయటం
తెలుసుకొనేందుకు ఈ సంగతులు రాయబడ్డాయి.
నిజమైన అవగాహన కలిగి ఉండేందుకు ప్రజలకు ఈ
మాటలు సహాయం చేస్తాయి. 3ప్రజలు జీవించేందుకు
శ్రేష్ఠమైన విధానాన్ని ఈ మాటలు నేర్పిస్తాయి. నీతి,
నిజాయితీ, మంచితనం కలిగి ఉండేందుకు సరైన
మార్గాన్ని ప్రజలు నేర్చుకుంటారు. 4జ్ఞానమును నేర్చు
కోవాల్సిన సాధారణ మనుష్యులకు జ్ఞానముగల ఈ
మాటలు నేర్పిస్తాయి. యువతీ యువకులు ఈ
మాటల మూలంగా జ్ఞానము, దాని ప్రయోగాన్ని నేర్చు
కొంటారు. 5ఈ మాటల్లోని ఉపదేశాలను జ్ఞానముగల
వారు కూడ జాగ్రత్తగా అనుసరించాలి. అప్పుడు వాళ్లు
ఇంకా ఎక్కువ నేర్చుకొని, ఇంకా జ్ఞానముగల వారు
అవుతారు. మంచి చెడుల తారతమ్యం తెలుసుకోవ
టంలో నిపుణతగల వారు యింకా ఎక్కువ అవగాహన
సంపాదిస్తారు. 6అప్పుడు జ్ఞానముగల కథలు, పొడుపు
కథలు మనుష్యులు గ్రహించగలుగుతారు. జ్ఞానముగల
వారు చెప్పే విషయాలను మనుష్యులు గ్రహించగలుగు
తారు. 7ఒక వ్యక్తి యెహోవాను గౌరవించి, ఆయనకు
విధేయత చూపించటమే, నిజమైన తెలివికి మూలము.
కానీ పాపాన్ని ప్రేమించే మనుష్యులు జ్ఞానాన్ని, సరైన
ఉపదేశాన్ని ద్వేషిస్తారు.

### సొలొమోను తన కుమారునికి ఇచ్చిన సలహా

8నా కుమారుడా, నీ తండ్రి ఉపదేశానికి నీవు విధే
యుడవు కావాలి. మరియు నీ తల్లి ఉపదేశాలు కూడ
నీవు పాటించాలి. 9నీ తల్లిదండ్రుల మాటలు నీ తలను
మరింత అందంగా తీర్చిదిద్దే పూల కిరీటంలా
ఉంటాయి. ఆ ఉపదేశాలు నీ మెడకు అందమైన
హారంలా ఉంటాయి.

### చెడ్డవాళ్లతో చేరకుండా హెచ్చరిక

10నా కుమారుడా, పాపాన్ని ప్రేమించే ప్రజలు
తమతో కూడ పాపాన్ని చేయించటానికి పయత్ని
స్తారు. నీవు వారిని అనుసరించకూడదు. 11ఆ పాపులు
ఇలా చెప్పవచ్చు: “మాతో వచ్చేయి! మనం దాక్కొని,
ఎవరినైనా అమాయకుణ్ణి చంపటానికి కనిపెడదాం.
12ఎవరైనా ఒక నిర్దోషిమీద మనం దాడి చేద్దాం. మనం
అతణ్ణి చంపుదాం. ఆ మనిషిని పితృ లోకానికి మనం
పంపిద్దాం. అతణ్ణి మనం నాశనం చేసి, సమాధికి
పంపిద్దాం. 13చాలా ధనం, విలువ చేసే అన్ని రకాల
వస్తువులు మనం దొంగిలిద్దాం. ఈ వస్తువులతో మనం
మన గృహాలు నింపుకొందాం. 14కనుక మాతో వచ్చి,
వీటిని చేయటానికి మాకు సహాయం చేయి. మనకు
దొరికే వస్తువులన్నింటినీ మనం అందరం పంచు
కొందాం.”
15నా కుమారుడా, పాపాన్ని ప్రేమించే మనుష్యు
లను వెంబడించవద్దు. వారు జీవించే విధానంలో
మొదటి మెట్టు కూడా నీవు ఎక్కవద్దు. 16ఆ చెడ్డ
మనుష్యులు కీడు చేయటానికి ఎల్లప్పుడూ సిద్ధంగా
ఉంటారు. వారు ఎంతసేపూ మనుష్యులను చంపాలని
ఆశిస్తూంటారు.
17ఒక పక్షి నిన్ను చూస్తూండగా ఆ పక్షిని పట్టాలని
వల వేయటం నిష్ప్రయోజనం. కనుక ఆ దుర్మార్గు
లను కనిపెట్టి ఉండు. జాగ్రత్తగా ఉండు. ఆ దుర్మార్గులు
ఇతరులను చంపాలని ఉచ్చు వేస్తున్నారు. 18కానీ నిజా
నికి వారికి వారే ఉచ్చు వేసుకొంటారు. వారి స్వంత
ఉచ్చుతో వారే నాశనం చేయబడుతారు. 19ఇవి దురాశ
పరుల పద్ధతులు అలాంటి దురాశ అది కలిగివున్నవారికి
ప్రాణాంతక మవుతుంది.

### జ్ఞానము – మంచి స్త్రీ

20ఇలా విను! జ్ఞానము ప్రజలకు ఉపదేశించటానికి
ప్రయత్నిస్తుంది. ఆమె (జ్ఞానము) వీధుల్లో, సంతల్లో
అరుస్తుంది. 21రద్దీగల వీధి మూలల్లో ఆమె (జ్ఞానము)
పిలుస్తోంది. ఆమె (జ్ఞానము) తన మాటలు వినేందుకు
ప్రజలను సమకూర్చేందుకు ప్రయత్నిస్తూ పట్టణ
ద్వారాల దగ్గర ఉంటూ (జ్ఞానము) చెపుతుంది:
22“మీరు వెర్రివాళ్లు. ఇంకెన్నాళ్లు మీరు ఇలా వెర్రి
పనులు చేస్తూనే ఉంటారు? ఎన్నాళ్లు మీరు తెలివిని
ద్వేషిస్తూ ఉంటారు? 23మీరు పశ్చాత్తాపపడి నా సలహా,
నా ఉపదేశం విని ఉంటే, నాకు తెలిసింది అంతా నేను

మీతో చెప్పి ఉండేదాన్ని. నాకు ఉన్న తెలివి అంతా మీకు ఇచ్చి ఉండేదాన్ని.

24“కానీ మీరు నా మాట వినేందుకు తిరస్కరించారు. సహాయం చేయటానికి నేను ప్రయత్నించాను. నేను నా చేయి అందించాను. కానీ నా సహాయం స్వీకరించటానికి మీరు నిరాకరించారు. 25నా సలహా అంతటినీ మీరు నిర్లక్ష్యం చేసి, తిప్పికొట్టారు. నా మాటలు స్వీకరించటానికి మీరు నిరాకరించారు. 26అందుచేత నేను మీ కష్టం చూచి నవ్వుతాను. మీకు కష్టం కలగటం చూచి నేను సరదా పడతాను. 27గొప్ప కష్టం తుఫానులా మీ మీదికి వస్తుంది. సమస్యలు ఒక బలమైన గాలిలా మీ మీద కొడతాయి. మీ కష్టాలు, మీ విచారం మీ మీద మహా గొప్ప భారంగా ఉంటాయి.

28“ఈ సంగతులన్నీ జరిగినప్పుడు మీరు నా సహాయం కోసం అడుగుతారు. కానీ నేను మీకు సహాయం చేయను. మీరు నాకోసం వెదుకుతారు, కానీ మీరు నన్ను కనుగొనలేరు. 29మీరు ఎన్నడూ నా తెలివిని కోరుకోలేదు, గనుక నేను మీకు సహాయం చేయను. మీరు యెహోవాకు భయపడి ఆయనను గౌరవించుటకు నిరాకరించారు. 30నా సలహా మాటలు వినేందుకు ప్రజలారా మీరు నిరాకరించారు. నేను సరైన దారి మీకు చూపించినప్పుడు మీరు నా మాట వినేందుకు నిరాకరించారు. 31కనుక మీరు మీ స్వంత విధానంలోనే పనులు చేసుకోవాలి. మీ స్వంత కీడు మార్గాల్లో జీవిస్తూ మిమ్మల్ని మీరే నాశనం చేసుకొంటారు.

32“అవివేకులు జ్ఞానాన్ని అనుసరించేందుకు నిరాకరించిన మూలంగా మరణిస్తారు. వారి బుద్ధిహీన పద్ధతులలో కొనసాగటం వారికి సంతోషం, అదే వారిని చంపుతుంది. 33కానీ, నాకు విధేయత చూపే వ్యక్తి క్షేమంగా జీవిస్తాడు. ఆ వ్యక్తి సుఖంగా ఉంటాడు. అతడు కీడుకు భయపడాల్సిన అవసరం ఉండదు.”

## జ్ఞానం చెప్పేది వినండి

2 నా కుమారుడా, నేను చెప్పే ఈ సంగతులు అంగీకరించు. నా ఆజ్ఞలు జ్ఞాపకం ఉంచుకో. 2జ్ఞానం చెప్పేది విని, గ్రహించటానికి నీ శక్తి కొలది ప్రయత్నించు. 3జ్ఞానం కోసం గట్టిగా మొరపెట్టు, అవగాహన కోసం గట్టిగా అడుగు. 4వెండికోసం వెదకినట్టు జ్ఞానం కోసం వెదుకు. దాచబడిన ధనం కోసం వెదకినట్టు దానికోసం వెదుకు. 5వీటిని నీవు చేస్తే అప్పుడు నీవు యెహోవాను గౌరవించటం నేర్చుకొంటావు. నీవు నిజంగా దేవుణ్ణి గూర్చి నేర్చుకొంటావు.

6యెహోవా జ్ఞానము ప్రసాదిస్తాడు. జ్ఞానము, అవగాహన ఆయన నోటి నుండి వస్తాయి. 7ఆయన నిజాయితీ పరులకు మంచి జ్ఞానం దాచి సమకూర్చి ఇస్తాడు. ఆయన నిజాయితీగా నడుచుకొనేవారికి కవచం లాంటివాడు. 8ఇతరుల యెడల న్యాయంగా ఉండేవాళ్లను ఆయన కాపాడతాడు. ఆయన తన పవిత్ర ప్రజలను కాపాడతాడు.

9కనుక యెహోవా తన జ్ఞానమును ప్రసాదిస్తాడు. అప్పుడు మంచివి, న్యాయమైనవి మరియు సరియైనవి నీవు గ్రహిస్తావు. 10నీ హృదయంలోనికి జ్ఞానం వస్తుంది, నీ ఆత్మ జ్ఞానం కలిగి ఆనందిస్తుంది.

11జ్ఞానం నిన్ను కాపాడుతుంది, వివేచన నీకు కావలి కాస్తుంది. 12దుర్మార్గులు జీవించే చెడు మార్గంలో జీవించకుండ జ్ఞానము, వివేచన మిమ్మల్ని వారిస్తాయి. ఆ మనుష్యులు వారు చెప్పే వాటిలో కూడా దుర్మార్గులు 13వారు మంచితనం విడిచి పెట్టి, ఇప్పుడు చీకట్లో (పాపంలో) జీవిస్తున్నారు. 14వారు తప్పుచేసి సంతోషిస్తూ, దుర్మార్గపు చెడు మార్గాలలో ఆనందిస్తున్నారు. 15ఆ మనుష్యులు నమ్మదగిన వారు కారు వారు అబద్ధాలాడి మోసం చేస్తారు. కానీ మీ జ్ఞానం, వివేచన వాటన్నిటి నుండి మిమ్మల్ని దూరంగా ఉంచుతాయి.

16మరో దేశపు స్త్రీ ఎవరైనా నీవు ఆమెతో పాపము చేసేందుకు నిన్ను ఒప్పించేందుకని, దుర్మార్గులు తియ్యటి మాటలు ప్రయోగించవచ్చు. 17ఆమె చిన్నదిగా ఉన్నప్పుడే వివాహం చేసుకుంది కాని ఆమె తన భర్తను విడిచి పెట్టింది. ఆమె తన వివాహ ప్రమాణాన్ని నిలుపుకోవటం లేదు. ఆమె తన దేవుని నిబంధనను మర్చిపోతుంది. కాని లేదు అని ఆమెతో చెప్పేందుకు జ్ఞానం నీకు సహాయం చేస్తుంది. 18నీవు బలహీనుడవై ఆమె ఇంట ప్రవేశిస్తే నాశనం (మరణం) వైపు మొదటి మెట్టు మీద నడచినట్టే. నీవు ఆమెను అలానే వెంబడిస్తే ఆమె నిన్ను సమాధికి నడిపిస్తుంది. 19ఆమె ఒక సమాధిలా ఉంది. ఒకవేళ ఏ పురుషుడైనా ఆ స్త్రీ దగ్గరకు వెళ్తే, అతడు ఎన్నటికీ తిరిగి రాడు. ఆ మనిషి జీవితం మరలా ఎన్నటికి మొదటిలా ఉండదు.

20కనుక నీవు మంచి మనుష్యుల అడుగుజాడలను అనుసరించేలా, మంచి మనుష్యులు జీవించే విధంగా జీవించునట్లు జ్ఞానం సహాయం చేస్తుంది. 21సరిగ్గా జీవించే ప్రజలు దేశాన్ని తామే స్వంతంగా కలిగి ఉంటారు. మంచిని జరిగించే మనుష్యులు వారి భూమిలో జీవిస్తారు. 22కానీ దుర్మార్గులు వారి భూమిని పోగొట్టుకొంటారు. ఆ దుర్మార్గులు దేశం నుండి తొలగించి వేయబడతారు.

## సరిగ్గా జీవించటం నీ జీవితానికి లాభం

3 నా కుమారుడా, నా ఉపదేశాన్ని మరచిపోకు. నీవు చేయాలని నేను చెప్పిన సంగతులు జ్ఞాపకం ఉంచుకో. 2నీకు నేను నేర్పిస్తున్న ఈ సంగతులు నీకు సుదీర్ఘమైన సంతోష జీవితాన్ని ఇస్తాయి. 3ప్రేమించటం ఎన్నటికీ చాలించకు. ఎల్లప్పుడూ

నమ్మకంగా ఉండు. ఈ విషయాలను నీ జీవితంలో
ఒక భాగంగా ఎంచుకో. వాటిని నీ మెడ చుట్టూ
కట్టుకో. వాటిని నీ హృదయం మీద వ్రాసుకో.
4అప్పుడు దేవుని దృష్టియందును, మానవుల దృష్టి
యందును నీవు దయనొంది మంచివాడవనిపించు
కొందువు.

## యెహోవాను నమ్ముకో

5పూర్తిగా యెహోవాను నమ్ముకో! నీ స్వంత
తెలివి మీద ఆధారపడవద్దు. 6నీవు చేసే వాటన్నిటిలో
దేవుని మీద నమ్మకం ఉంచు. అప్పుడు ఆయన నీకు
సహాయం చేస్తాడు. 7నీ స్వంత జ్ఞానం మీద ఆధార
పడవద్దు. కాని యెహోవాను గౌరవించి, దుర్మార్గానికి
దూరంగా ఉండు. 8నీవు ఇలా చేస్తే, అప్పుడు నీ శరీరా
నికి మంచి ఆరోగ్యమునూ నీ ఎముకలకు సత్తువా
కలుగుతుంది.

## యెహోవాకు ఇమ్ము

9నీ ఆరోగ్యంతో యెహోవాను ఘనపరచు. నీ
రాబడి అంతటిలో ప్రథమ ఫలము ఆయనకు ఇమ్ము.
10అప్పుడు నీకు కావలసినవి అన్నీ నీకు ఉంటాయి.
నీ కొట్లాలు ధాన్యంతో నిండి ఉంటాయి, నీ పీపాల్లో
ద్రాక్షారసం పొర్లుతూ ఉంటుంది.

## యెహోవా శిక్షను అంగీకరించు

11నా కుమారుడా, నీవు తప్పు చేస్తున్నావని కొన్ని
సార్లు యెహోవా నీకు చూపిస్తాడు. కాని ఈ శిక్షను
గూర్చి కోపించకు. దాని నుండి నేర్చు కొనేందుకు
ప్రయత్నించు. 12ఎందుకంటే, యెహోవా తాను
ప్రేమించే మనుష్యులను ఆయన సరిచేస్తాడు. అవును,
తాను ప్రేమించే కుమారుని శిక్షించే ఒక తండ్రిలాంటి
వాడు దేవుడు.

## జ్ఞానము మూలంగా ఆశీర్వాదాలు

13జ్ఞానమును సంపాదించి చాలా సంతోషంగా
ఉంటాడు. ఆ మనిషి అర్థం చేసుకోవటం మొదలు
పెట్టినప్పుడు అతడు ధన్యుడు. 14జ్ఞానము మూలంగా
వచ్చే లాభం వెండి కంటే మంచిది. జ్ఞానము మూలంగా
వచ్చే లాభం మంచి బంగారు కంటే మేలు. 15జ్ఞానము
నగల కంటే ఎంతో ఎక్కువ విలువ గలది. నీవు
కోరుకో దగినది ఏదీ జ్ఞానము అంతటి విలువ గలది
కాదు! 16జ్ఞానము సుదీర్ఘ జీవితాన్ని, ఐశ్వర్యాలు, ఘన
తలను నీకు ఇస్తుంది. 17జ్ఞానముగల మనుష్యులు శాంతి,
సంతోషం, కలిగి జీవిస్తారు. 18జ్ఞానము జీవవృక్షంలా
ఉంటుంది. దానిని స్వీకరించే వారికి అది నిండు జీవి
తాన్ని ఇస్తుంది. జ్ఞానమును కలిగినవారు నిజంగా సంతో
షంగా ఉంటారు.

19భూమిని చేయుటకు యెహోవా తన తెలివిని
ఉపయోగించాడు. ఆకాశాలను చేయుటకు యెహోవా
తెలివి ఉపయోగించాడు. 20నీళ్లను చేయుటకు
యెహోవా తెలివి ప్రయోగించాడు. ఆయన జ్ఞానము
ద్వారా ఆకాశాలు వర్షాన్ని కురిపిస్తాయి.
21నా కుమారుడా, నీ జ్ఞానము, వివేకాన్ని భద్రంగా
ఉంచుకో. వీటిని పోగొట్టుకోవద్దు. 22జ్ఞానము, వివే
కము నీ జీవితాన్ని మరింత అందంగా తీర్చిదిద్దుతాయి.
23అప్పుడు నీవు క్షేమంగా జీవిస్తావు, నీవు పడిపోకుండా
ఉంటావు. 24నీవు పండుకొనునప్పుడు నీవు భయ
పడవు. నీవు విశ్రాంతి తీసుకొనునప్పుడు నీ నిద్ర
ప్రశాంతంగా ఉంటుంది. 25-26నీకు ఆకస్మికంగా సంభ
వించబోయేవాటిని గూర్చి భయపడకు. ఎందుకంటే
యెహోవా నీతో ఉన్నాడు. ఆయన నిన్ను క్షేమంగా
ఉంచుతాడు. మరియు ఆ చెడ్డ విషయాలు చెడ్డ
మనుష్యులకే సంభవిస్తాయి.

## సక్రమంగా జీవించే జ్ఞానం

27మేలు చేయుట నీచేతనైనప్పుడు దాన్ని పొంద
దగినవారికి చేయకుండా వెనుదీయకుము. 28నీ పొరుగు
వాడు అతని స్వంత వస్తువులను తిరిగి ఇచ్చి వేయుమని
నిన్ను అడిగితే వాటిని అప్పుడే అతనికి ఇచ్చివేయుము.
"తిరిగి రేపు రమ్మని" అతనితో చెప్పవద్దు.
29నీ పొరుగువాడు నీతో శాంతియుతంగా జీవిస్తు
న్నాడు, గనుక అతనికి విరోధంగా కీడు తలపెట్టవద్దు.
30మరో వ్యక్తి నీ యెడల ఎలాంటి తప్పూ చేయక
పోతే అతనిని న్యాయస్థానానికి తీసుకొని పోవద్దు.
31కొంతమంది మనుష్యులు తేలికగా కోపం తెచ్చు
కొని వెంటనే కీడు చేస్తారు. వారు జీవించే విధంగా
జీవించకు. 32ఎందుకంటే దుర్మార్గులను యెహోవా
ద్వేషిస్తాడు. కాని సక్రమంగా జీవించే ప్రజలను
యెహోవా బలపరుస్తాడు.
33దుర్మార్గుల కుటుంబాలకు యెహోవా విరో
ధంగా ఉంటాడు. కాని సక్రమంగా జీవించే వారి కుటుం
బాలను ఆయన ఆశీర్వదిస్తాడు.
34ఒక వేళ ఒక వ్యక్తి గర్వించి, ఇతరులకంటే అతడే
మంచివాడని తలచి, హేళన చేస్తే యెహోవా అతనిని
శిక్షించి, అతని గూర్చి హేళన చేస్తాడు. కాని దీనులకు
యెహోవా సహాయం చేస్తాడు. 35జ్ఞానముగల మను
ష్యులు దేవుని వెంబడిస్తారు. జ్ఞానముగల మనుష్యులను
యెహోవా ఘనపరుస్తాడు. బుద్ధిహీనులు దేవుణ్ణి వెంబ
డించరు. బుద్ధిహీనులు అవమానించబడతారు.

## జ్ఞానము, వివేకం ప్రాముఖ్యత

4 కుమారులారా, "మీ తండ్రి ఉపదేశములు
వినండి." మీరు గ్రహించగలుగునట్లు గమనిం
చండి. 2ఎందుకనగా నేను మీకు నేర్పిస్తున్న సంగతులు

ప్రాముఖ్యమైనవి, మంచివి. అందుచేత నా ఉపదేశ
ములు ఎన్నడూ మరువవద్దు.
3నేను నా తండ్రికి పసివాడను. నేను నా తల్లికి
ఒకే కుమారుణ్ణి. 4నా తండ్రి నాకు నేర్పిస్తూ నాతో
ఇలా చెప్పాడు: “నేను చెప్పే సంగతులు జ్ఞాపకం
ఉంచుకో, నీవు నా ఆజ్ఞలకు విధేయుడవైతే జీవిస్తావు.
5జ్ఞానము, వివేకం సంపాదించు! నా మాటలు మరు
వకు. నా ఉపదేశాలు ఎల్లప్పుడూ పాటించు. 6జ్ఞానము
నుండి తొలగిపోవద్దు. అప్పుడు జ్ఞానము నిన్ను
కాపాడుతుంది. జ్ఞానాన్ని ప్రేమించు, జ్ఞానము నిన్ను
భద్రంగా కాపాడుతుంది.”
7జ్ఞానము సంపాదించాలని నీవు తీర్మానించినప్పుడే
జ్ఞానము మొదలవుతుంది. అందుచేత జ్ఞానము సంపా
దించేందుకు నీకున్న సమస్తం వినియోగించు,
అప్పుడు నీవు జ్ఞానివి అవుతావు. 8జ్ఞానాన్ని ప్రేమించు.
జ్ఞానం నిన్ను గొప్పవాణ్ణి చేస్తుంది. జ్ఞానాన్ని అతి
ముఖ్యమైనదిగా ఎంచు, జ్ఞానము నీకు ఘనత తెచ్చి
పెడుతుంది. 9ఆమె (జ్ఞానము) అందమైన మాలను
నీతల మీద ఉంచుతుంది. సొగసైన కిరీటమును నీకు
బహూకరిస్తుంది.
10కనుక నా మాట విను. నేను చెప్పే సంగతులను
జరిగించు. అప్పుడు నీవు ఎక్కువ కాలం జీవిస్తావు.
11జ్ఞానాన్ని గూర్చి నేను నీకు నేర్పిస్తున్నాను. నేను
నిన్ను మంచి మార్గంలో నడిపిస్తున్నాను. 12ఈ
మార్గాన్ని అనుసరించు, అప్పుడు నీ పాదం ఉచ్చులో
చిక్కుకోదు. నీవు తూలిపోకుండా పారిపోవచ్చు. నీవు
చేయాలని ప్రయత్నించే వాటిలో నీవు క్షేమంగా
ఉంటావు. 13ఈ పాఠాలు ఎల్లప్పుడూ జ్ఞాపకం
ఉంచుకో. ఈ పాఠాలు మరచిపోకు. అవే నీకు జీవం!
14దుర్మార్గులు నడిచే మార్గాన్ని అనుసరించకు.
అలా నడుచుకొనవద్దు. వారిలా ఉండేందుకు ప్రయ
త్నించవద్దు. 15దుర్మార్గానికి దూరంగా ఉండు. దానికి
దగ్గరగా వెళ్లవద్దు. దానిని దాటి తిన్నగా వెళ్లిపో. 16చెడ్డ
వాళ్లు ఏదో ఒక చెడు చేసేటంత వరకు నిద్రపోలేరు.
ఆ మనుష్యులు మరో వ్యక్తిని బాధించేటంతవరకు
నిద్రపోలేరు. 17ఆ మనుష్యులు దౌర్జన్యము అనే మద్యం
తాగుతూ దుర్మార్గము అనే రొట్టెను తింటారు. ఇతరు
లను బాధించకుండా జీవించలేరు.
18మంచి మనుష్యులు ఉదయకాంతిలా ఉంటారు.
సూర్యోదయమౌతుంది. ఆ రోజు మరింత ప్రకాశ
వంతంగా సంతోషంగా తయారవుతుంది. 19చెడు మను
ష్యులు చీకటి రాత్రివలె ఉంటారు. వారు చీకటిలో
తప్పిపోయి, వారికి కనపడని వాటి మీద పడిపోతూ
వుంటారు.
20నా కుమారుడా, నేను చెప్పే విషయాలు గమ
నించు. నా మాటలు జాగ్రత్తగా విను. 21నా మాటలు
నిన్ను విడిచి పోనియ్యకు. నేను చెప్పే సంగతులు
జ్ఞాపకం ఉంచుకో. 22నా ఉపదేశము వినే వారికి అది
జీవం కలిగిస్తుంది నా మాటలు శరీరానికి మంచి
ఆరోగ్యంలాంటివి.
23నీవు తలంచే విషయాలలో నీవు జాగ్రత్తగా
ఉండటమే నీకు అతి ముఖ్యమైన విషయం. నీ
తలంపులు నీ జీవితాన్ని ఆధీనంలో ఉంచుకుంటాయి.
24సత్యమును వక్రం చేయ వద్దు, సరికాని మాటలు
చెప్పవద్దు. అబద్ధాలు చెప్పకు. 25నీ యెదుట ఉన్న
జ్ఞానముగల మంచి ఆశయాలనుండి నిన్ను నీవు తిరిగి
పోనివ్వకు. 26సరైన విధంగా జీవించుటకు చాలా
జాగ్రత్తగా ఉండు, అప్పుడు నీకు స్థిరమైన మంచిజీవితం
ఉంటుంది. 27తిన్నని మార్గం విడిచిపెట్టకు అది
మంచిది, సరైనది. కాని కీడు నుండి ఎల్లప్పుడూ
తిరిగిపో.

## మరొకని భార్యకు దూరంగా ఉంచే జ్ఞానము

5 నా కుమారుడా, నా జ్ఞానోపదేశము విను. వివేకము
గల నా మాటలు గమనించు. 2అప్పుడు జీవించు
టకు సరైన మార్గం నీవు తెలుసుకుంటావు. నీవు
జ్ఞానివి అని నీ మాటలు తెలియజేస్తాయి. 3మరొకరి
భార్య పెదవులు తేనెలా తియ్యగా ఉండవచ్చు. ఆమె
ముద్దులు తైలం కంటే మెత్తగా ఉండవచ్చు. 4కాని
అంతలో కక్ష, బాధ, మాత్రమే ఆమె తెచ్చిపెడుతుంది.
ఆ బాధ విషమంత చేదుగాను, ఖడ్గమంత వాడిగాను
ఉంటుంది. 5ఆమె పాదాలు చావుకు దారితీస్తాయి.
ఆమె నిన్ను తిన్నగా సమాధికి నడిపిస్తుంది. 6ఆమెను
వెంబడించవద్దు! ఆమె సరైన మార్గాలో నుంచి తప్పి
పోయింది. అది ఆమెకు తెలియదు, జాగ్రత్తగా ఉండు!
జీవమార్గాన్ని వెంబడించు!

## వ్యభిచారం నిన్ను నాశనం చేయగలదు

7నా కుమారులారా, ఇప్పుడు నా మాట వినండి.
నేను చెప్పే మాటలు మరచిపోవద్దు. 8వేశ్యకు దూరంగా
ఉండండి. ఆమె ఇంటి గుమ్మం దగ్గరకు కూడ వెళ్లవద్దు.
9ఒకవేళ నీవు అలా చేస్తే నీ మీద ప్రజలకున్న గౌరవం
పోగొట్టుకుంటావు. ఇతరులు నీవు సంవత్సరాలు
తరబడి సంపాదించినది అంతా తీసివేసుకుంటారు.
10నీకు తెలియని ప్రజలు నీ ఐశ్వర్యమంతా తీసివేసు
కుంటారు. నీ కష్టార్జితం ఇతరుల పాలవుతుంది. 11నీ
జీవితాంతం కూడా నీవు మూల్గుతావు. నీ శరీరం,
నీకు ఉన్న సమస్తం హరించుకుపోతుంది. 12-13అప్పుడు
నీవు, “నా తల్లిదండ్రుల మాటలు నేనెందుకు వినలేదు?
నా ఉపదేశకుల మాటలు నేనెందుకు వినలేదు? క్రమ
శిక్షణతో ఉండుటకు నేను నిరాకరించాను, సరిదిద్దబడు
టకు నేను నిరాకరించాను. 14ఇప్పుడు అంతంలో,
నా జీవితం వ్యర్థం అయిపోయినట్లు నేను

చూస్తున్నాను. మనుష్యులంతా నా అవమానం
చూస్తున్నారు” అని నీవు అంటావు.

### నీ స్వంత భార్యను అనుభవించు

15-16నీ స్వంత బావి నుండి ప్రవహించు నీళ్లు
మాత్రమే త్రాగు. మరియు నీ నీళ్లను బయట వీధుల్లోకి
ప్రవహించ నీయకు. (నీ స్వంత భార్యకు ఒక్కదానికి
మాత్రమే, నిన్ను నీవు అప్పగించుకో. నీవు నీ ప్రత్యేక
ప్రేమను ఇవ్వాల్సింది ఆమె మాత్రమే. నీ కుటుంబానికి
వెలుపల పిల్లలకు నీవు తండ్రివి కావద్దు). 17నీ పిల్లలు
నీకు మాత్రమే చెందినవారై ఉండాలి. నీ స్వంత ఇంటికి
వెలుపలి వారితో నీవు నీ పిల్లల్ని పంచుకోరాదు.
18అందుచేత నీ స్వంత భార్యతో సంతోషించు. నీవు
యువకుడుగా ఉన్నప్పుడు నీవు పెళ్లాడిన స్త్రీతో అను
భవించు. 19ఆమె అందమైన లేడి వంటిది, అందమైన
దుప్పిలాంటిది. ఆమె ప్రేమ నిన్ను పూర్తిగా తృప్తి
పరచనివ్వు. ఆమె ప్రేమ నిన్ను బంధించి వేస్తుంది.
20మరొకని భార్య నిన్ను అదే విధానంల్లో బంధించ
నియ్యకు. మరొకని ప్రేమ నీకు అవసరం లేదు.
21ప్రతి మనిషి చేసే ప్రతీది యెహోవా తేటగా
చూస్తాడు. మనుష్యులు చేసే ప్రతీదాన్ని యెహోవా
క్షుణ్ణంగా చూస్తాడు. 22దుర్మార్గుని పాపాలు వానినే
పట్టుకొంటాయి. అతని పాపాలు అతణ్ణి బంధించే
పాశాల్లా ఉంటాయి. 23ఈ మనిషి క్రమశిక్షణలో ఉంచేం
దుకు నిరాకరించిన మూలంగా మరణిస్తాడు. అతడు
తన స్వంత బుద్ధిహీనమైన కోరికల వల్లనే పట్టు
బడతాడు.

### అప్పు ఇప్పించుటలో ప్రమాదాలు

6 నా కుమారుడా, ఇంకొకని అప్పుకు బాధ్యునిగా
ఉండకు. ఆ వ్యక్తి తన అప్పు చెల్లించలేనని చెబితే,
అది నీవే చెల్లిస్తానని వాగ్దానం చేశావా? మరో మనిషి
అప్పులకు నిన్ను నీవే బాధ్యునిగా చేసుకొన్నావా?
2అలాగైతే నీవు పట్టుబడ్డట్టే! నీ మాటలే నిన్ను
చిక్కుల్లో పెట్టేశాయి! 3నీవు ఆ మనిషి శక్తి కింద
ఉన్నావు. కనుక అతని దగ్గరకు వెళ్లి, నిన్ను నీవే
విముక్తుని చేసుకో. అతని బాకీ నుండి నిన్ను విడిపించు
మని నీవు అతణ్ణి బ్రతిమాలు. 4నిద్రపోయి, విశ్రాంతి
తీసుకొనేంతవరకు వేచి ఉండవద్దు. 5వేటగాని బారి
నుండి పారిపోతున్న లేడివలె ఆ ఉచ్చు నుండి తప్పిం
చుకో. ఉచ్చులో నుండి పారిపోతున్న పక్షివలె, నిన్ను
నీవే విడుదల చేసుకో.

### బద్ధకంగా ఉండుటవల్ల అపాయాలు

6సోమరీ, నీవు చీమల దగ్గరకు వెళ్లి చీమలు ఏమి
చేస్తుంటాయో చూడు. చీమ దగ్గర నేర్చుకో. 7చీమకు
పాలకుడు, అధికారి, నాయకుడు అంటూ ఎవరూలేరు.
8కానీ చీమ, దాని ఆహారాన్ని వేసవిలో కూర్చు
కొంటుంది. చీమ, దాని ఆహారాన్ని దాచుకొంటుంది.
చలికాలంలో దానికి సమృద్ధిగా ఆహారం ఉంటుంది.
9సోమరీ, ఇంకెంతసేపు నీవు అక్కడ పండు
కొంటావు. నీ విశ్రాంతి నుండి నీవు యింకెప్పుడు
లేస్తావు? 10“నాకు ఇంకొంచెం నిద్ర కావాలి. యింకా
కొంచెంసేపు నేను ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాను”
అని సోమరి చెబుతాడు. 11కాని అతడు నిద్రపోతాడు,
మళ్లీ నిద్రపోతాడు; అతడు దరిద్రుడంటే దరిద్రుడ
వుతాడు. త్వరలోనే అతనికి ఏమీ ఉండదు. ఒక దొంగ
వాడు వచ్చి సమస్తం దోచుకున్నట్టు ఉంటుంది.

### దుర్మార్గపు మనిషి

12దుర్మార్గుడు, పనికిమాలినవాడు అబద్ధాలు చెబు
తాడు. చెడ్డ సంగతులే చెబుతాడు. 13అతడు కన్ను
గీటి, సూచనలు చేసి మనుష్యులను మోసం చేస్తాడు.
14ఆ మనిషి దుర్మార్గుడు. ఎంతసేపూ అతడు దుర్మా
ర్గపు పథకాలే వేస్తాడు. అన్నిచోట్లా అతడు చిక్కులు
పెడుతుంటాడు. 15కాని అతడు శిక్షించబడతాడు. కష్టం
అతనికి అకస్మాత్తుగా వచ్చేస్తుంది. అతడు త్వరగా
నాశనం చేయబడతాడు. అతనికి ఎవరూ సహాయం
చేయరు.

### యెహోవా అసహ్యించుకొనే ఏడు సంగతులు

16 ఈ ఆరు విషయాలను యెహోవా అస
హ్యించుకొంటాడు: కాదు ఏడును ఆయన
అసహ్యించుకొంటాడు.
17 ఇతరులకంటే తానే మంచివాడు అనుకొనే
మనిషి. అబద్ధాలు చెప్పే మనిషి. నిర్దోషు
లను చంపే మనిషి.
18 చెడ్డపనులు చేయాలని త్వరపడే మనిషి.
దుర్మార్గం చేయాలని కోరే మనిషి.
19 అబద్ధం వెంబడి అబద్ధం చెప్పే మనిషి.
వాదాలకు పూనుకొని ప్రజల మధ్య
కలహాలు పెట్టే మనిషి.

20నా కుమారుడా నీ తండ్రి ఆజ్ఞలు జ్ఞాపకం
ఉంచుకో. మరియు నీ తల్లి ఉపదేశాలు మరువకు.
21వారి మాటలు ఎల్లప్పుడూ జ్ఞాపకం ఉంచుకో. వారి
ఉపదేశములను నీ జీవితంలో ఒక భాగంగా చేసుకో.
22నీవు ఎక్కడికి వెళ్లినా వారి ఉపదేశములు నీకు దారి
చూపిస్తాయి. నీవు నిద్రపోయినప్పుడు అవి నిన్ను
కనిపెట్టుకొని ఉంటాయి. మరియు నీవు మేల్కొన్న
ప్పుడు అవి నీతో మాట్లాడి నిన్ను నడిపిస్తాయి.
23నీ తల్లిదండ్రుల ఆజ్ఞలు, ఉపదేశములు నీకు సరైన
దారి చూపించే వెలుగులా ఉంటాయి. నీవు జీవ
మార్గాన్ని వెంబడించేందుకు నిన్ను అవి సరిదిద్ది, నీకు

శిక్షణ ఇస్తాయి. 24నీవు చెడు స్త్రీ దగ్గరకు వెళ్లకుండా
వారి ఉపదేశము నిన్ను వారిస్తుంది. తన భర్తను విడిచి
పెట్టేసిన భార్య మెత్తటి మాటల నుండి వారి మాటలు
నిన్ను కాపాడుతాయి. 25ఆ స్త్రీ అందమైనది కావచ్చు.
కాని ఆ అందం నీలో నిన్ను మండింపచేసి శోధించ
నీయకు. ఆమె కండ్లను నిన్ను బంధించనియ్యకు.
26ఒక వేశ్య ఖర్చు ఒక రొట్టె ముక్క కావచ్చు. కాని
మరో పురుషుని భార్య నీ జీవితమంతా ఖర్చు చేయ
వచ్చు.

27ఒకడు తన మీద నిప్పువేసుకుంటే అతని బట్టలు
కూడా కాలిపోతాయి. 28ఒకడు వేడి నిప్పుల మీద
కాలుపెడితే అతని పాదం కాలుతుంది. 29మరొకడి
భార్యతో పండుకొనే ఏ మనిషి విషయమైనా ఇంతే.
ఆ మనిషి నష్టపోతాడు.

30-31ఒకడు ఆకలితో ఉండి తినుటకు భోజనం
దొంగిలించవచ్చు. ఒకవేళ అతడు పట్టుబడితే అతడు
దొంగిలించిన దానికి ఏడు రెట్లు అదనంగా చెల్లించాలి.
అతనికి ఉన్న సమస్తం దీని మూలంగా ఖర్చు కావ
చ్చును. కాని ఇతరులు గ్రహిస్తారు. అతని మీద వారికి
గల గౌరవం అంతా పోదు.

32అయితే, వ్యభిచారం చేసే పురుషుడు బుద్ధి
హీనుడు. అతడు తనకు తానే నాశనం చేసుకుంటాడు.
తన నాశనానికి తానే కారణం అవుతాడు. 33ప్రజలకు
అతని మీద ఉన్న గౌరవం అంతా పోతుంది. మరియు
ఆ అవమానాన్ని అతడు ఎన్నటికీ మరచిపోడు. 34ఆ
స్త్రీ యొక్క భర్తకు రోషం వస్తుంది. ఆ భర్తకు చాలా
కోపం వస్తుంది. అవతలి వాడిని శిక్షించేందుకు ఇతడు
చేయగలిగింది ఏదైనా చేసేస్తాడు. 35ఏ విధంగా
చెల్లించినా ఎంత డబ్బు చెల్లించినా అతని కోపాన్ని
ఆపేందుకు చాలదు!

### జ్ఞానము నిన్ను వ్యభిచారం నుండి కాపాడుతుంది

7 నా కుమరుడా, నా మాటలు జ్ఞాపకం ఉంచుకో
నేను నీకు ఇచ్చే ఆజ్ఞలు మరువకు. 2నా ఆజ్ఞలకు
విధేయుడవు కమ్ము, నీకు జీవం కలుగుతుంది. నా
ఉపదేశాన్ని కనుపాపలాగ ఎంచుకో. (నీ జీవింతలోకెల్లా
అతి ముఖ్యమైనది). 3నా ఆజ్ఞలను ఉపదేశాలను ఎల్ల
ప్పుడూ నీతో ఉంచుకో. వాటిని నీ వ్రేళ్లకు కట్టుకో.
వాటిని నీ హృదయం మీద వ్రాసుకో. 4జ్ఞానాన్ని నీ
సోదరిగా ఎంచు. తెలివిని నీ కుటుంబంలో ఒక భాగంగా
చూసుకో. 5అప్పుడు అవి పరస్త్రీనుండి నిన్ను కాపాడు
తాయి. నిన్ను పాపములోకి ఈడ్చివేయగల చక్కటి
మాటలనుండి నిన్ను కాపాడతాయి.

6ఒక రోజు నేను నా కిటికీలో నుండి బయటకు
చూసాను. 7నాకు బుద్ధిలేని యువకులు చాలా మంది
కనబడ్డారు. మరీ బుద్ధిలేని ఒక యువకుడిని నేను
చూసాను. 8ఒక చెడ్డ స్త్రీ ఇంటి దగ్గర వీధిలోకి అతడు
నడిచాడు. ఆ యువకుడు ఆ స్త్రీ ఇంటిమూలకు నడి
చాడు. 9సూర్యుడు అస్తమిస్తూండగా దాదాపు చీకటి
పడింది. రాత్రి మొదలవుతూంది. 10ఆ స్త్రీ అతనిని
కలుసుకొనేందుకు తన ఇంటి నుండి బయటకు
వచ్చింది. ఆమె వేశ్యలా బట్టలు ధరించింది. ఆమె
అతనితో పాపం చేయటానికి ప్రయత్నిస్తుంది. 11పాపం
గూర్చి ఆమె లెక్కచేయలేదు. మంచి చెడును గూర్చి
ఆమె లెక్క చేయలేదు. ఆమె తన ఇంటివద్ద ఎన్నడూ
నిలిచి వుండదు. 12కాని ఆమె వీధుల్లో తిరుగుతూ
ఉంటుంది. ఎవరైనా దొరుకుతారు అని చూస్తూ ఆమె
అన్ని మూలలకూ వెళ్తుంది. 13ఆమె ఆ యువకుడ్ని
గట్టిగా పట్టేసి ముద్దు పెట్టుకుంది. సిగ్గులేకుండా ఆమె
ఇలా చెప్పింది: 14"ఈవేళ నేను సాంగత్య బలి
అర్పించాలి. నేను ఇస్తానని వాగ్దానం చేసింది అంతా
ఇచ్చేశాను. (ఇంకా నా దగ్గర భోజనం చాలా మిగిలి
ఉంది). 15అందుచేత నిన్ను కూడా నా దగ్గరకు రమ్మని
ఆహ్వానించటానికి నేనిలా బయటకు వచ్చాను. నేను
నీకోసం ఎంతో ఎంతో వెదికాను. ఇప్పుడు నీవు కన
బడ్డావు! 16నా మంచం మీద శుభ్రమైన దుప్పట్లు
నేను పరిచాను. అవి చాలా, అందమైన ఈజిప్టు
దుప్పట్లు. 17నా మంచం మీద నేను పరిమళాలు,
బోళం, అగరు పోల్చిన చెక్క నేను ఉపయోగించాను.
18వచ్చేయి, తెల్లారే వరకు మనం వలపు తీర్చు
కొందాం. రాత్రంతా మనం హాయిగా అనుభవించ
వచ్చు. 19నా భర్త వెళ్లిపోయాడు. అతడు వ్యాపారం
పని మీద వెళ్లిపోయాడు. 20దీర్ఘప్రయాణానికి సరిపడి
నంత ధనం అతడు తీసుకొని వెళ్లాడు. రెండు వారాల
వరకు అతడు తిరిగి ఇంటికి రాడు."

21ఆ యువకుని శోధించటానికి ఆ స్త్రీ ఆ మాటలు
ప్రయోగించింది. ఆమె మెత్తని మాటలు అతణ్ణి మాయ
చేశాయి. 22ఆ యువకుడు ఉచ్చులోనికి ఆమెను వెంబ
డించాడు. వధకు తీసుకొనిపోబడుతున్న ఎద్దులా
ఉన్నాడు అతడు. బోనులోనికి నడుస్తున్న జింకలా
అతడు ఉన్నాడు.

23దాని గుండెల్లోకి బాణం గుచ్చడానికి వేటగాడు
సిద్ధంగా ఉన్నట్టు ఉంది. వలలోకి ఎగురుతోన్న పక్షిలా
ఉన్నాడు ఆ యువకుడు. అతడు చిక్కుకొన్న
అపాయం అతనికి తెలియదు.

24కుమారులారా, ఇప్పుడు నా మాట వినండి.
నేను చెప్పే మాటలు గమనించండి. 25చెడు స్త్రీని
మిమ్మల్ని పట్టుకోనివ్వకండి. ఆమె మార్గాలు వెంబ
డించకండి.

26ఆమె చాలా మంది పురుషులను పడ వేసింది.
ఆమె చాలా మంది పురుషులను నాశనం చేసింది.
27ఆమె ఇల్లు మరణ స్థానం. ఆమె మార్గం తిన్నగా
మరణానికి నడిపిస్తుంది!

### జ్ఞానము, ఒక మంచి స్త్రీ

8 జ్ఞానం మిమ్మల్ని పిలుస్తుంది, వినండి! మీరు
వినాలని తెలివి మిమ్మల్నిపిలుస్తోంది.
2 మార్గం ప్రక్కగా, దారులు కలిసే చోట
కొండ శిఖరము మీద అవి నిలబడ్డాయి.
3 పట్టణంలోకి ద్వారాలు తెరచుకొనే చోట
అవి వున్నాయి. తెరువబడిన ద్వారాల్లో
నుంచి అవి పిలుస్తున్నాయి.
4 జ్ఞానము చెబుతోంది: "పురుషులారా,
మిమ్మల్ని నేను పిలుస్తున్నా మనుష్య
లందరినీ నేను పిలుస్తున్నా.
5 మీరు బుద్ధిహీనులైతే, జ్ఞానం గలిగి ఉండటం
నేర్చుకోండి. అవివేకులారా, తెలివిగలిగి
ఉండటం నేర్చుకోండి.
6 వినండి! నేను ఉపదేశించే విషయాలు చాలా
ముఖ్యమైనవి. సరైన విషయాలు నేను
మీకు చెబుతాను.
7 నా మాటలు సత్యం. చెడు అబద్ధాలు నాకు
అసహ్యం.
8 నేను చెప్పే విషయాలు సరైనవి. నా
మాటల్లో తప్పుగాని, అబద్ధంగాని ఏమీలేదు.
9 తెలివిగల వాడికి ఈ విషయాలన్నీ తేటగా
ఉంటాయి. తెలివిగల మనిషి ఈ సంగతులు
గ్రహిస్తాడు.
10 నా క్రమశిక్షణ అంగీకరించండి. అది వెండి
కంటె విలువైనది. ఆ తెలివి మంచి బంగారం
కంటె ఎక్కువ విలువగలది.
11 జ్ఞానము ముత్యాలకంటె విలువగలది.
ఒకడు కోరుకోదగిన దేనికంటే కూడ
జ్ఞానము ఎక్కువ విలువగలది."

### జ్ఞానము కలిగి ఉండటం

12 "నేను జ్ఞానాన్ని, నేను మంచి తీర్పుతో
జీవిస్తాను. తెలివితో, మంచి పథకాలతో
నేను ఉండటం మీరు చూడగలరు.
13 ఒక మనిషి యెహోవాను గౌరవిసే ఆ వ్యక్తి
కీడును ద్వేషిస్తాడు. నేను (జ్ఞానము) గర్విష్ఠు
లను, ఇతరులకంటె మేమే గొప్ప అనుకొనే
వాళ్లను అసహ్యించుకొంటాను. చెడు
మార్గాలు, అబద్ధపు నోరు నాకు అసహ్యం.
14 కానీ మంచి నిర్ణయాలు చేయటానికి, మంచి
తీర్పు చెప్పటానికి మనుష్యులకు నేను
(జ్ఞానము) సామర్థ్యం ఇస్తాను. తెలివీ శక్తిని
నేను వారికి ఇస్తాను!
15 రాజులు పరిపాలించుటకు నన్ను
(జ్ఞానము) ఉపయోగిస్తారు. న్యాయ
చట్టాలు చేయటానికి అధికారులు నన్ను
ఉపయోగిస్తారు.
16 భూమిమీద ప్రతీ మంచి పాలకుడూ తన
కింద ఉన్న ప్రజలను పాలించుటకు నన్ను
(జ్ఞానము) ఉపయోగిస్తాడు.
17 నన్ను ప్రేమించే మనుష్యులను నేను
(జ్ఞానము) ప్రేమిస్తాను. నన్ను కను
గొనేందుకు కష్టపడి ప్రయత్నిస్తే, నన్ను
కనుగొంటారు.
18 నేను (జ్ఞానము) ఇచ్చేందుకు నా దగ్గర
ఐశ్వర్యాలు, ఘనత ఉన్నాయి. నిజమైన
ఐశ్వర్యం, విజయం నేను ఇస్తాను.
19 నేను ఇచ్చేవి మేలిమి బంగారంకంటె
మంచివి. నా కానుకలు స్వచ్ఛమైన
వెండికంటే మంచివి.
20 నేను (జ్ఞానము) మనుష్యులను సరైన
మార్గంలో నడిపిస్తాను. సరైన తీర్పు
మార్గంలో నేను వారిని నడిపిస్తాను.
21 నన్ను ప్రేమించే మనుష్యులకు నేను
ఐశ్వర్యం ఇస్తాను. అవును, వారి గృహాలను
ఐశ్వర్యాలతో నేను నింపుతాను.
22 ఆదిలో మొట్టమొదటగా చాలా కాలం
క్రిందట యెహోవాచేత చేయబడింది నేనే
23 నేను (జ్ఞానము) ఆదిలో చేయబడ్డాను.
ప్రపంచం ప్రారంభం గాక ముందే నేను
చేయబడ్డాను.
24 నేను (జ్ఞానము) మహా సముద్రాలు పుట్టక
ముందే పుట్టాను. నీళ్లు లేక ముందు నేను
చేయబడ్డాను.
25 నేను (జ్ఞానము) పర్వతాలకంటె ముందు
పుట్టాను. కొండలు రాక ముందే నేను
పుట్టాను.
26 యెహోవా భూమిని చేయకముందే నేను
(జ్ఞానము) పుట్టాను. పొలాలకంటె ముందు
నేను పుట్టాను. ప్రపంచంలోని మొదటి
ధూళిని,
దేవుడు చేయక ముందే నేను పుట్టాను.
27 యెహోవా ఆకాశాలను చేసినప్పుడు నేను
(జ్ఞానము) అక్కడ ఉన్నాను. యెహోవా
భూమి చుట్టూరా సరిహద్దు వేసినప్పుడు,
మహా సముద్రానికి ఆయన హద్దులు నిర్ణ
యించినప్పుడు నేను (జ్ఞానము) అక్కడ
ఉన్నాను.
28 ఆకాశంలో యెహోవా మేఘాలను ఉంచక
ముందే నేను పుట్టాను. మహా సముద్రంలో
యెహోవా నీళ్లు ఉంచినప్పుడు నేను
అక్కడ ఉన్నాను.

29 సముద్రాలలో నీళ్లకు యెహోవా హద్దులు
పెట్టినప్పుడు నేను అక్కడ ఉన్నాను.
యెహోవా అనుమతించిన దానికంటె నీళ్లు
ఎత్తుగా పోవు, భూమికి యెహోవా పునా
దులు వేసినప్పుడు నేను అక్కడ ఉన్నాను.
30 నైపుణ్యంగల పనివానిలా నేను ఆయన
ప్రక్కనే ఉన్నాను. నా మూలంగా
యెహోవా ప్రతి రోజూ సంతోషించాడు.
ఆయన ముందు నేను ఎల్లప్పుడూ
సంతోషంగా ఉన్నాను.
31 యెహోవా తాను చేసిన ప్రపంచాన్ని చూచి
ఉప్పొంగి పోయాడు. అక్కడ ఆయన మను
ష్యుల విషయమై సంతోషించాడు.
32 "పిల్లలారా, ఇప్పుడు నా మాట వినండి.
మీరు నా మార్గాలు వెంబడిస్తే మీరు కూడా
సంతోషంగా ఉండగలరు"
33 నా ఉపదేశాలు విని బుద్ధిమంతులుకండి.
వినుటకు తిరస్కరించకుడి.
34 ఏ వ్యక్తి అయితే వింటాడో అతడు
సంతోషంగా ఉంటాడు. అతను అనుదినం
నా ద్వారాల దగ్గర వేచి యుంటాడు.
35 నన్ను కనుగొనినవాడు జీవమును కను
గొనును యెహోవా వద్దనుండి అతడు
మంచివాటిని పొందును.
36 అయితే నాకు విరోధముగా పాపముచేయు
వ్యక్తి తనకు తానే హాని చేసుకొనును. నన్ను
అసహ్యించు కొనువారు మరణమును
ప్రేమించెదరు."

### జ్ఞానము మరియు బుద్ధిహీనత

9 జ్ఞానము తన నివాసమును కట్టుకొనెను. దానికి
ఏడు స్తంభములను ఆమె నిలబెట్టెను. 2ఆమె
(జ్ఞానము) భోజనం సిద్ధం చేసి, ద్రాక్షారసమును కలిపి,
భోజనమును బల్లపై ఉంచెను. 3అప్పుడు ఆమె
(జ్ఞానము) తన సేవకులను, ప్రజలను నగరములోని
ఎత్తయిన స్థలమునకు తనతోపాటు తినుటకు ఆహ్వా
నించెను. కొండ మీదికి వచ్చి, ఆమెతో కూడ భోజనం
చేసేందుకు మనుష్యులను ఆహ్వానించుటకు తన సేవ
కులను ఊళ్లోనికి పంపింది. 4"నేర్చుకోవాల్సిన అవసరం
ఉన్న మనుష్యులారా, మీరు రండి" అని ఆమె చెప్పింది.
బుద్ధిహీనులను కూడా ఆమె పిలిచింది. 5"నా జ్ఞాన
భోజనం ఆరగించండి, రండి. నేను చేసిన ద్రాక్షారసం
తాగండి. 6మీ పాత బుద్ధిహీన పద్ధతులు విడిచి పెట్టండి.
మీకు జీవం ఉంటుంది. తెలివిగల మార్గాన్ని అనుస
రించండి" అని ఆమె చెప్పింది.
7ఒక గర్విష్ఠికి, అతడు చేసింది తప్పు అని చూపించ
టానికి నువ్వు ప్రయత్నిస్తే అతడు నిన్నే విమర్శిస్తాడు.
ఆ మనిషి దేవుని జ్ఞానము గూర్చి హేళన చేస్తాడు.
ఒక దుర్మార్గుడిదే తప్పని నీవు చెబితే అతడు నిన్ను
హేళన చేస్తాడు. 8కనుక ఒకడు ఇతరుల కంటే తాను
మంచి వాడినని తలిస్తే అతనిది తప్పు అని అతనికి
చెప్పవద్దు. దానివల్ల అతడు నిన్ను ద్వేషిస్తాడు. కాని
జ్ఞానముగల ఒక మనిషికి సహాయం చేయటానికి నీవు
ప్రయత్నిస్తే అతడు నిన్ను గౌరవిస్తాడు. 9జ్ఞానముగల
ఒక మనిషికి నీవు ఉపదేశము చేస్తే అతడు ఇంకా
జ్ఞానము గలవాడవుతాడు. ఒకవేళ మంచి మనిషికి నీవు
ఉపదేశము చేస్తే అతడు ఇంకా ఎక్కువ నేర్చు
కుంటాడు.
10యెహోవా యెడల భయము కలిగియుండుట
జ్ఞానము సంపాదించుటకు మొదటి మెట్టు.
యెహోవాను గూర్చిన జ్ఞానము తెలివి సంపాదిం
చుటకు మొదటి మెట్టు. 11నీకు జ్ఞానము ఉంటే
అప్పుడు నీ జీవితం ఎక్కువ కాలం ఉంటుంది. 12నీవు
జ్ఞానివి అయితే నీ మంచి కోసమే నీవు జ్ఞానముగల
వాడవు అవుతావు. కాని నీవు గర్వంగలవాడవై, యితరు
లను హేళన చేస్తే అప్పుడు నీ కష్టానికి నిన్ను నీవే
నిందించుకోవాలి.
13బుద్ధిహీనుడు గట్టిగా అరిచే చెడు స్త్రీలాంటివాడు.
ఆమెకు తెలివి లేదు. 14ఆమె తన ఇంటి గుమ్మంలో
కూర్చుంటుంది. పట్టణంలో కొండ మీద తన
కుర్చీలో ఆమె కూర్చుంటుంది. 15ప్రజలు ఆ ప్రక్కగా
నడచినప్పుడు ఆమె వారిని పిలుస్తుంది. ఆ మనుష్యు
లకు ఆమెయందు ఆసక్తి లేదు. కాని 16"నేర్చుకోవాల్సిన
ప్రజలారా రండి" అని ఆమె అంటుంది. బుద్ధిహీనులను
కూడ ఆమె ఆహ్వానించింది. 17"మీరు నీళ్లు దొంగిలిస్తే
అవి మీ స్వంత నీళ్లకంటే ఎక్కువ రుచిగా ఉంటాయి.
మీరు రొట్టెను దొంగిలిస్తే మీరు స్వయంగా తయారు
చేసుకొనే రొట్టెకంటె అది ఎక్కువ రుచిగా ఉంటుంది"
అని ఆమె చెబుతుంది. 18ఆమె ఇల్లు దయ్యాలతో
మాత్రమే నిండి వుందని ఆ బుద్ధిహీనులకు తెలియదు.
మరణస్థానపు లోతుల్లోకి వారిని ఆహ్వానించింది!

### సొలొమోను సామెతలు

10 ఇవి సొలొమోను సామెతలు (జ్ఞానముగల
మాటలు):
జ్ఞానముగల కుమారుడు తన తండ్రిని సంతోష
పెడతాడు. కాని బుద్ధిలేని కుమారుడు తన తల్లికి
దుఃఖం కలిగిస్తాడు.
2ఒకడు చెడు కార్యములు చేయుట వలన అతనికి
డబ్బు వస్తే అది పనికిమాలిన డబ్బు అవుతుంది.
కాని మంచిని జరిగించిన ఎడల అది మరణం నుండి
నిన్ను రక్షించగలుగుతుంది.
3యెహోవా మంచి మనుష్యుల విషయమై శ్రద్ధ
పుచ్చుకొంటాడు. వారికి అవసరమైన భోజనాన్ని

ఆయన వారికి ఇస్తాడు. కాని దుర్మార్గులకు అవసరమైన
వాటిని యెహోవా తొలగించి వేస్తాడు.
4బద్ధకస్తుడు పేదవాడుగా ఉంటాడు. కాని కష్టపడి
పనిచేసేవాడు ధనికుడు అవుతాడు.
5తెలివిగల వాడు సకాలంలో పంట కూర్చు
కొంటాడు. కాని కోత కాలంలో నిద్రపోయేవాడు అవ
మానము కలిగించే కుమారుడు.
6మంచి మనిషిని ఆశీర్వదించమని మనుష్యులు
దేవుని అడుగుతారు. ఆ మంచి విషయాలను చెడ్డవారు
చెప్పవచ్చు కాని వారు తలపెడుతున్న చెడు విషయా
లను వారి మాటలే కప్పిపుచ్చుతాయి.
7మంచి మనుష్యుల కార్యములను జ్ఞాపకం చేసు
కోవటం ఆశీర్వాదకరము. కాని చెడ్డవారి పేరు మరువ
బడును.
8జ్ఞానముగల మనిషితో ఎవరైనా ఏదైనా చేయుమని
చెబితే అతడు విధేయుడవుతాడు. కాని బుద్ధిహీనుడు
వాదించి తనకు తానే కష్టం తెచ్చుకుంటాడు.
9నిజాయితీగల ఒక మంచి మనిషి క్షేమంగా
ఉంటాడు. కాని మోసం చేసే కపటియైన వ్యక్తి పట్టు
బడతాడు.

10సత్యమును దాచిపెట్టే మనిషి కష్టాలు కలిగిస్తాడు.
బాహాటంగా మాట్లాడేవాడు శాంతి కలిగిస్తాడు.
11ఒక మంచి మనిషి మాటలు జీవితాన్ని మెరుగు
పరుస్తాయి. కానీ ఒక దుర్మార్గుని మాటలు అతని
అంతరంగంలో ఉన్న చెడును చూపిస్తాయి.
12ద్వేషం వాదాలు పుట్టిస్తుంది. కానీ మనుష్యులు
చేసే ప్రతి తప్పునూ ప్రేమ క్షమిస్తుంది.
13జ్ఞానముగల వారు వినదగిన మాటలు చెబుతారు.
కానీ బుద్ధిహీనులు వారి పాఠం వారు నేర్చుకొనక ముందే
శిక్షించబడాలి.
14జ్ఞానముగల వారు నెమ్మదిగా ఉంటారు, కొత్త
విషయాలు నేర్చుకొంటారు. కానీ బుద్ధిహీనులు
మాట్లాడి వారికి వారే కష్టాలు తెచ్చుకొంటారు.
15ధనికుడ్ని ఐశ్వర్యం కాపాడుతుంది. మరియు
పేదవాడ్ని పేదరికం పాడు చేస్తుంది.
16ఒక మనిషి మంచి చేస్తే, అతనికి బహుమానం
ఇవ్వబడుతుంది. అతనికి జీవం యివ్వబడుతుంది.
దుర్మార్గత శిక్షను మాత్రమే తెచ్చిపెడుతుంది.
17తన శిక్ష మూలంగా నేర్చుకొన్నవాడు ఇతరులు
జీవించటానికి సహాయం చేయగలుగుతాడు. అయితే
నేర్చుకొనేందుకు అంగీకరించని వాడు మనుష్యులను
తప్పు త్రోవలో మాత్రమే నడిపించగలడు.
18తన ద్వేషాన్ని దాచిపెట్టేవాడు అబద్ధం చెబుతూ
ఉండవచ్చు. కానీ బుద్ధిహీనుడు తాను మాత్రమే
ప్రచారం చేసేందుకు చెప్పేటటువంటి మాటల కోసం
ప్రయత్నిస్తాడు.
19అధికంగా మాట్లాడేవాడు తనకు తానే కష్టం
తెచ్చుకొంటాడు. జ్ఞానముగలవాడు ఊరక ఉండుట
నేర్చుకొంటాడు.
20మంచి మనిషి మాటలు స్వచ్ఛమైన వెండిలా
ఉంటాయి. కానీ దుర్మార్గుని తలంపులు పనికి మాలిన
విగా ఉంటాయి.
21ఒక మంచి మనిషి మాటలు అనేకులకు
సహాయం చేస్తాయి. కానీ బుద్ధిహీనుని మూర్ఖత్వం
అతన్నే పాడు చేస్తాయి.
22యెహోవా దీవెన నీకు ఐశ్వర్యం ఇస్తుంది.
మరియు ఆ ఐశ్వర్యం దానితో బాటు కష్టాలు తీసుకొని
రాదు.
23బుద్ధిహీనుడు తప్పు చేయుటలో ఆనందిస్తాడు.
కానీ జ్ఞానముగలవాడు జ్ఞానములో ఆనందిస్తాడు.
24దుర్మార్గుడు తాను భయపడే విషయాల
మూలంగా ఓడించబడుతాడు. కానీ మంచివాడు తాను
కోరుకొనే వాటిని పొందుతాడు.
25సుడిగాలి వీచినప్పుడు దుర్మార్గులు నాశనమ
వుదురు. కానీ మంచివాళ్లకు శాశ్వతమైన పునాది
వుంటుంది. వాళ్లు శాశ్వతంగా ఉంటారు.
26బద్ధకస్తుణ్ణి ఎన్నడూ నీ కోసం ఏదీ చేయ
నీయకు. నీ నోట చిరకలా, లేక నీ కళ్లలో పొగలా
అతడు నిన్ను చికాకు పెడతాడు.
27నీవు యెహోవాను గౌరవిస్తే, నీవు చాలా కాలం
బతుకుతావు. కానీ దుర్మార్గులు వారి జీవితంలోనుండి
కొన్ని సంవత్సరాలు పోగొట్టుకొంటారు.
28మంచి మనుష్యులు నిరీక్షించే విషయాలు
సంతోషం కలిగిస్తాయి. దుర్మార్గులు నిరీక్షించే విష
యాలు నాశనం తెచ్చిపెడతాయి.
29మంచి మనుష్యులను యెహోవా కాపాడుతాడు.
కానీ తప్పు చేసే వారిని యెహోవా నాశనం చేస్తాడు.
30మంచి మనుష్యులు ఎల్లప్పుడూ క్షేమంగా
ఉంటారు. కానీ దుర్మార్గులు బలవంతంగా దేశం నుండి
వెళ్లగొట్టబడతారు.
31మంచి మనుష్యులు జ్ఞానముగల మాటలు చెబు
తారు. కానీ కష్టం తెచ్చిపెట్టే వాని మాటలు వినటం
మనుష్యులు మానివేస్తారు.
32మంచి మనుష్యులకు సరైన సంగతులు చెప్పటం
తెలుసు. కానీ దుర్మార్గులు కష్టం తెచ్చిపెట్టే మాటలు
చెబుతారు.

11 వస్తువులను సరిగ్గా తూచలేని త్రాసులను
కొందరు మనుష్యులు ఉపయోగిస్తారు. మను
ష్యులను మోసం చేయటానికి వారు ఆ త్రాసులను
ఉపయోగిస్తారు. ఆ తప్పుడు త్రాసులు యెహోవాకి
అసహ్యం. కానీ సరిగ్గా ఉండే త్రాసులు యెహోవాకు
ఇష్టం.

[2]గర్వించి, గొప్పలు చెప్పుకొనే మనుష్యులు ఎన్నిక లేని వారవుతారు. కానీ దీనులు జ్ఞానముగల వారవుతారు.

[3]మంచి, నిజాయితీగల మనుష్యులు నిజాయితీ పంథాను అనుసరిస్తారు. కానీ దుర్మార్గులు ఇతరులను మోసం చేసినప్పుడు వారిని వారే నాశనం చేసు కొంటారు.

[4]దేవుడు మనుష్యులకు తీర్పు తీర్చేనాడు, డబ్బుకి విలువ ఏమీ ఉండదు. కానీ మంచితనం మనుష్యులను మరణం నుండి రక్షిస్తుంది.

[5]ఒక మంచి మనిషి గనుక నిజాయితీగా ఉంటే, అతని జీవితం సులభంగా ఉంటుంది. కానీ దుర్మార్గుడు అతడు చేసే చెడు పనుల మూలంగా నాశనం చేయ బడతాడు.

[6]నిజాయితీగల మనిషిని మంచితనం రక్షిస్తుంది. కానీ దుర్మార్గులు వారు చేయాలనుకొన్న చెడు విష యాల ఉచ్చులో పట్టుబడతారు.

[7]దుర్మార్గుడు చనిపోయిన తర్వాత అతనికి నిరీక్షణ ఏమీలేదు. అతడు ఆశించినది అంతా పోతుంది అదంతా మొత్తం ఏ విలువలేనిది అవుతుంది.

[8]మంచి మనిషి కష్టాన్ని తప్పించుకొంటాడు. ఆ కష్టం మరొక దుర్మార్గునికి సంభవిస్తుంది.

[9]ఒక దుర్మార్గుడు చెప్పే విషయాల మూలంగా అతడు ఇతరులను బాధించగలడు. కానీ మంచి మను ష్యులు వారి జ్ఞానము చేత కాపాడబడుతారు.

[10]మంచి మనుష్యులకు విజయం కలిగినప్పుడు పట్టణం అంతా సంతోషిస్తుంది. దుర్మార్గులు నాశనం చేయబడినప్పుడు ప్రజలు సంతోషంతో కేకలు వేస్తారు.

[11]నిజాయితీగల మనుష్యులు వారు నివసిస్తున్న పట్టణానికి తమ దీవెనలు ఇచ్చినప్పుడు, అది గొప్పది అవుతుంది. కానీ ఒక దుర్మార్గుడు చెప్పే విషయాలు ఒక పట్టణాన్ని నాశనం చేయగలవు.

[12]బుద్ధిహీనుడు ఇతరులను విమర్శిస్తాడు. అయితే జ్ఞానముగలవానికి ఎప్పుడు మౌనంగా ఉండాలో తెలుసు. [13]ఇతరులను గూర్చి రహస్యాలు చెప్పే వారె వరూ నమ్మదగినవారు కారు. కానీ నమ్మదగిన మనిషి చెప్పే మాటలను వ్యాపింపచేయడు.

[14]ఒక దేశానికి సమర్థత లేని నాయకులు ఉంటే, ఆ దేశం పతనం అవుతుంది. అయితే అనేకమంది మంచి సలహాదారులు ఆ దేశాన్ని క్షేమంగా ఉంచుతారు.

[15]ఇంకో మనిషి బాకీ నీవు చెల్లిస్తానని వాగ్దానం చేస్తే, అప్పుడు నీవు విచారిస్తావు. అలాంటి వ్యవహా రాలను నీవు తిరస్కరిస్తే నీవు క్షేమంగా ఉంటావు.

[16]దయగల, మర్యాదస్థురాలు గౌరవం సంపాది స్తుంది. చొచ్చుకుపోయే పురుషులు ధనం మాత్రమే సంపాదిస్తారు.

[17]దయగల మనిషి లాభం పొందుతాడు. కానీ నీచుడు తనకు తానే కష్టం తెచ్చుకొంటాడు.

[18]దుర్మార్గుడు మనుష్యులను మోసం చేసి, వారి డబ్బు తీసుకొంటాడు. అయితే న్యాయంగా ఉండి, సరైనది చేసేవాడు నిజమైన బహుమానం పొందు తాడు.

[19]నిజంగా, మంచితనం జీవాన్ని తెచ్చిపెడ్తుంది. కానీ దుర్మార్గులు దుర్మార్గాన్ని వెంటాడి, మరణం తెచ్చుకొంటారు.

[20]దుర్మార్గం చేయుటానికి ఇష్టపడే వాళ్లు యెహోవాకు అసహ్యం. అయితే మంచిని చేసేందుకు ప్రయత్నించే వాళ్ల విషయం యెహోవాకు సంతోషం.

[21]దుర్మార్గులు నిశ్చయంగా శిక్షించబడతారు అనేది సత్యం. మంచివాళ్లు స్వతంత్రులుగా చేయబడతారు.

[22]ఒక స్త్రీ అందంగా ఉండి, అవివేకంగా ఉంటే అది అందమైన బంగారు ఉంగరం పంది ముక్కుకు ఉన్నట్టే ఉంటుంది.

[23]మంచి మనుష్యులకు వారు కోరిందిలభించి నప్పుడు దాని అంతం ఎల్లప్పుడూ మంచిదిగానే ఉంటుంది. కానీ దుర్మార్గులకు వారు కోరింది లభించి నప్పుడు, చివరికి అది చిక్కుగానే ఉంటుంది.

[24]ఒక మనిషి ధారాళంగా ఇస్తే, అప్పుడు అతనికి అంతకంటే ఎక్కువ లభిస్తుంది. కాని ఒకడు ఇచ్చేం దుకు నిరాకరిస్తే, అప్పుడు అతడు దరిద్రుడు అవుతాడు.

[25]ధారాళంగా ఇచ్చే మనిషి లాభం పొందుతాడు. నీవు యితరులకు సహాయం చేస్తే, అప్పుడు నీకు ఇంకా ఎక్కువ లాభం వస్తుంది.*

[26]తన ధాన్యం అమ్మేందుకు నిరాకరించే దురాశగల మనిషి మీద ప్రజలు కోపగిస్తారు. అయితే ఇతరులకు ఆహారం పెట్టేందుకు తన ధాన్యం అమ్మేవాని విష యంలో ప్రజలు సంతోషిస్తారు.

[27]మంచిని చేయుటకు ప్రయత్నించే మనిషిని ప్రజలు గౌరవిస్తారు. కాని దుర్మార్గం చేసే మనిషికి కష్టం మాత్రమే వస్తుంది.

[28]తన ఐశ్వర్యాలను నమ్ముకొనే మనిషి పడి పోతాడు. కాని, మంచి మనిషి పచ్చటి చిగురాకులా పెరుగుతాడు.

[29]ఒక మనిషి గనుక తన కుటుంబానికి కష్టం కలిగిస్తే అతనికి లాభం ఏమీ కలుగదు. చివరికి బుద్ధిహీనుడు జ్ఞానముగల మనిషికి సేవ చేయుటకు బలవంతం చేయబడతాడు.

[30]మంచి మనిషి చేసే విషయాలు జీవవృక్షంలా ఉంటాయి. ఒక జ్ఞానముగల మనిషి ప్రజలకు కొత్త జీవితం ఇస్తాడు.

---

**ధారాళంగా ... వస్తుంది** హెబ్రీ భాషలో “నీళ్లు పోయు వానికి నీళ్లు పోయబడును.”

31మంచి మనుష్యులకు భూమి మీద ప్రతిఫలం
ఇవ్వబడితే, నిశ్చయంగా దుర్మార్గులు, పాపులు వారికి
తగిన దానిని పొందుతారు.

12 ఒక మనిషి జ్ఞానము కలిగి ఉండాలి అనుకొంటే,
అతడు తప్పు చేసినప్పుడు దానిని ఎవరైనా
అతనికి చెప్పగా అతనికి కోపంరాదు. తాను చేసింది
తప్పు అని ఎవరైనా తనకు చెప్పటం ఇష్టంలేని మనిషి
మూర్ఖుడు.
2మంచి మనిషి విషయం యెహోవా సంతోషి
స్తాడు. కాని దుర్మార్గుని దోషిగా యెహోవా తీర్పు
చెబుతాడు.
3దుర్మార్గపు మనిషి ఎన్నడూ క్షేమంగా ఉండడు.
అయితే మంచి మనుష్యులు సురక్షితంగా ఉండగలరు.
4మంచి భార్య విషయమై భర్త సంతోషించి అతిశ
యిస్తాడు. కాని ఒక స్త్రీ తన భర్తను అవమానిస్తే,
అప్పుడు ఆమె అతని శరీరంలో ఒక వ్యాధిలా ఉంటుంది.
5మంచి మనుష్యులు తాము చేయాలని తలపెట్టే
విషయాల్లో నిజాయితీగా, న్యాయంగా ఉంటారు. కాని
దుర్మార్గుడు నీతో చెప్పే విషయాలను నమ్మవద్దు.
6దుర్మార్గుల మాటలు రక్తంకోసం పొంచి
వుంటాయి. కాని మంచి మనుష్యుల మాటలు వారిని
అపాయం నుండి తప్పిస్తాయి.
7దుర్మార్గులు నాశనం చేయబడగా ఇంకేమీ
మిగులదు. అయితే మంచి మనుష్యులు వెళ్లిపోయిన
తరువాత చాలా కాలం వరకు మనుష్యులు వారిని
జ్ఞాపకం చేసికొంటారు.
8జ్ఞానము గల మనిషిని ప్రజలు పొగుడుతారు. కాని
మూర్ఖుడైన మనిషిని ప్రజలు గౌరవించరు.
9భోజనం లేకపోయినా, ప్రముఖునిలా నటించే
మనిషిలా ఉండటంకంటె, ప్రముఖుడు కాకపోయినా
కష్టపడి పనిచేసే మనిషిలా ఉండటం మేలు.
10మంచి మనిషి తన పశువుల విషయం శ్రద్ధ తీసు
కొంటాడు. కానీ దుర్మార్గులు దయగా ఉండలేరు.
11తన పొలంలో పనిచేసే రైతుకు ఆహారం సమృ
ద్ధిగా ఉంటుంది. కాని పనికిమాలిన ఆలోచనలతో
సమయం వృధా చేసేవాడు బుద్ధిహీనుడు.
12దుర్మార్గులు ఎల్లప్పుడూ చెడు పనులు చేయా
లని చూస్తుంటారు. కానీ మంచివాళ్లకు చెట్ల వేర్లవలె
లోతుకు చొచ్చుకొనిపోయే బలం ఉంటుంది.
13దుర్మార్గుడు తెలివి తక్కువ విషయాలు
మాట్లాడి, తన మాటలచేత పట్టుబడతాడు. కానీ మంచి
మనిషి అలాంటి కష్టం నుండి తప్పించుకొంటాడు.
14ఒక వ్యక్తి తాను చెప్పే మంచి విషయాల
మూలంగా బహుమానం పొందుతాడు. అదే విధంగా
అతడు చేసే పనివల్ల అతనికి లాభం కలుగుతుంది.
15బుద్ధిహీనుడు ఎల్లప్పుడూ తన స్వంత విధానమే
మంచిదని తలస్తాడు. కానీ జ్ఞానముగలవాడు ఇతరులు
తనతో చెప్పే మాటలు వింటాడు.
16బుద్ధిహీనుడు త్వరగా కలవరం చెందుతాడు.
అయితే ఇతరులు ఏదైనా తప్పు చెప్పినప్పుడు తెలివి
గలవాడు త్వరగా క్షమిస్తాడు.
17ఒక వ్యక్తి సత్యం చెబితే, అతడు చెప్పే విష
యాల్లో నిజాయితీ గలవాడే. కానీ ఒకడు అబద్ధాలు
గనుక చెబితే, అది కష్టాలకు దారి తీస్తుంది.
18ఒక వ్యక్తి ఆలోచన లేకుండా మాట్లాడితే,
అప్పుడు ఆ మాటలు ఖడ్గంలా బాధించవచ్చు. అయితే
జ్ఞానముగలవాడు అతడు చెప్పే విషయాల గూర్చి
జాగ్రత్తగా ఉంటాడు. అతని మాటలు ఆ బాధను నయం
చేయవచ్చును.
19ఒక వ్యక్తి అబద్ధం చెబితే, ఆ మాటలు వేగంగా
వ్యర్థం అవుతాయి. కానీ సత్యం శాశ్వతంగా జీవిస్తుంది.
20దుర్మార్గులు ఎల్లప్పుడూ కష్టం కలిగించాలని
కోరుకొంటారు. అయితే శాంతికోసం పని చేసేవారు
సంతోషంగా ఉంటారు.
21మంచి మనుష్యులు యెహోవా చేత క్షేమంగా
కాపాడబడుతారు. కానీ చెడ్డవాళ్లకు చాలా కష్టాలు
ఉంటాయి.
22అబద్ధాలు చెప్పే వాళ్లంటే యెహోవాకు
అసహ్యం. అయితే సత్యం చెప్పే వాళ్ల విషయం
యెహోవాకు సంతోషం.
23చురుకైనవాడు తనకు తెలిసిన అన్నీ విష
యాలూ చెప్పడు. కానీ బుద్ధిహీనుడు అన్నీ చెప్పి,
తాను బుద్ధిహీనుడను అని చూపెట్టుకొంటాడు.
24కష్టపడి పనిచేసే మనుష్యులు ఇతరుల మీద అధి
కారులుగా నియమించబడుతారు. అయితే సోమరి
బానిసలా పనిచేయాల్సి ఉంటుంది.
25చింతించటం ఒక మనిషి సంతోషాన్ని తీసివేయ
గలదు. కానీ దయగల ఒక మాట ఒక మనిషిని సంతోష
పెట్టగలదు.
26మంచివాడు తన చుట్టూవున్న వాళ్లకంటే ఎక్కువ
పొందుతాడు. దుర్మార్గుల చెడు నడతలే వాళ్లను చెడు
మార్గాలలో పెట్టి, విజయం నుండి తప్పిస్తాయి.
27బద్ధకస్తుడు తాను కోరుకొనే వాటి వెనుక వెళ్లడు.
కానీ కష్టపడి పనిచేసే వానికి ఐశ్వర్యాలు వస్తాయి.
28నీవు సరైన విధంగా జీవిస్తే, అప్పుడు నీకు నిజ
మైన జీవం ఉంటుంది. అదే శాశ్వతంగా జీవించటానికి
మార్గం.

13 ఒక తెలివిగల కుమారుడు అతడు ఏమి చేయా
లని అతని తండ్రి చెబుతాడో, దానిని జాగ్రత్తగా
వింటాడు. కానీ గర్విష్ఠి వినడు. తనది తప్పు అని
అతడు ఎన్నడూ నమ్మడు.
2మంచి వాళ్లు, తాము చెప్పే మంచి విషయాలకు
బహుమానం పొందుతారు. కానీ దుర్మార్గులు ఎల్ల
ప్పుడూ చెడు చేయాలని ఆలోచిస్తారు.

[3]తాను చెప్పే విషయాలను గూర్చి జాగ్రత్తగా ఉండే
మనిషి తన ప్రాణం కాపాడుకొంటాడు. కానీ ఆలోచన
లేకుండా మాట్లాడే మనిషి నాశనం చేయబడతాడు.
[4]బద్ధకస్తునికి వస్తువులు కావాలి, కానీ అతడు వాటిని
ఎన్నటికీ పొందలేడు. కానీ కష్టపడి పని చేసేవాళ్లు,
తాము కోరుకొనే వాటిని పొందుతారు.
[5]మంచివాళ్లు అబద్ధాలను అసహ్యించుకొంటారు.
దుర్మార్గులు అవమానించబడతారు.
[6]మంచితనం, నిజాయితీగల మనిషిని మంచితనం
కాపాడుతుంది. కానీ పాపం చేయాలని ఇష్టపడేవాడికి
కీడు కలుగుతుంది.
[7]కొంతమంది మనుష్యులు ధనికుల్లా నటిస్తారు,
కానీ వారికి ఏమీ వుండదు. ఇతరులు పేదవాళ్లలా నటి
స్తారు, కానీ వాస్తవానికి వారు ధనికులు.
[8]ఒక ధనికుడు తన ప్రాణం కాపాడుకొనేందుకు
వెల చెల్లించాల్సి వస్తుందేమో. కానీ పేదవాళ్లకు అలాంటి
బెదిరింపులు ఏమీ వుండవు.
[9]ఒక మంచి మనిషి ప్రకాశవంతంగా వెలిగే దీపంలా
ఉంటాడు. కానీ దుర్మార్గుడు ఆరిపోయే దీపంలా
ఉంటాడు.
[10]ఇతరులకంటె తామే మంచివాళ్ళము అనుకొనే
మనుష్యులు కష్టం మాత్రమే కలిగిస్తారు. అయితే ఇత
రులు తమకు చెప్పే విషయాలను వినేవారు జ్ఞానము
గలవారు.
[11]డబ్బు సంపాదించటంకోసం ఒక వ్యక్తి మోసం
చేస్తే, ఆ డబ్బు త్వరలోనే పోతుంది. అయితే తన
డబ్బును కష్టపడి సంపాదించే మనిషి దానిని మరీ
ఎక్కువగా పెంచుకొంటాడు.
[12]నిరీక్షణ లేకపోతే హృదయానికి దుఃఖం. నీవు
కోరుకొన్నది సంభవిస్తే, అప్పుడు ఆనంద భరితుడవు.
[13]ఒక వ్యక్తికి ఇతరులు సహాయం చేయటానికి
ప్రయత్నించినప్పుడు అతడు వినిపించుకోకపోతే,
అప్పుడు అతడు తనకు తానే కష్టం తెచ్చుకొంటాడు.
అయితే ఇతరులు తనకు చెప్పిన సంగతులను గౌరవిం
చేవాడు బహుమానం పొందుతాడు.
[14]జ్ఞానముగల మనిషి యొక్క ఉపదేశాలు జీవాన్ని
ఇస్తాయి. ఆ మాటలు మరణ బంధకాల నుండి తప్పిం
చుకొనుటకు సహాయం చేస్తాయి. [15]తెలివిగల మనిషిని
మనుష్యులు గౌరవిస్తారు. కానీ ఒక వ్యక్తి నమ్మదగిన
వాడు కానప్పుడు అతనికి కష్టం కలుగుతుంది.
[16]జ్ఞానముగల మనిషి ఏదైనా చేయకముందే అతడు
ఆలోచిస్తాడు. అయితే బుద్ధిహీనుడు చేసే బుద్ధిహీనత
వలన అతడు మూర్ఖుడౌతాడు.
[17]ఒక వార్తాహరుడు నమ్మజాలని వాడైతే, అప్పుడు
అతని చుట్టూ కష్టం ఉంటుంది. అయితే ఒక వ్యక్తి
నమ్మదగిన వాడైతే శాంతి ఉంటుంది.
[18]ఒక వ్యక్తి తన తప్పుల మూలంగా నేర్చు
కొనేందుకు నిరాకరిస్తే, అప్పుడు అతడు పేదవాడై,
సిగ్గుపడతాడు. కానీ ఒక మనిషి విమర్శించ బడినప్పుడు,
శిక్షించబడినప్పుడు వినుపించుకొంటే లాభం పొందు
తాడు.
[19]ఒక మనిషి ఏదైనా కోరుకొని దానిని పొందితే,
అతనికి చాలా సంతోషం. కానీ మూర్ఖులు కీడునే
కోరుకొంటారు. వారు మారుటకు అంగీకరించరు.
[20]జ్ఞానముగల వారితో స్నేహంగా ఉండు, అప్పుడు
నీవు జ్ఞానివి అవుతావు. కానీ బుద్ధిహీనులను నీ స్నేహి
తులుగా నీవు ఎంచుకొంటే అప్పుడు నీవు కష్టాల్లో
పడతావు.
[21]పాపులు ఎక్కడికి వెళ్లినా కష్టం వారిని తరుము
తుంది. కానీ మంచివాళ్లకు మంచి సంగతులు జరుగు
తాయి.
[22]మంచి మనిషి దగ్గర అతడు తన పిల్లలకు, మనవ
లకు ఇచ్చేందుకు ఐశ్వర్యం ఉంటుంది. చివరికి చెడ్డ
వాళ్లకు ఉన్నవి అన్నీ మంచివాళ్ల పాలవుతాయి.
[23]ఒక పేదవానికి విస్తారమైన ఆహారం పండించగల
మంచి భూమి ఉండవచ్చును. కానీ అతడు చెడు నిర్ణ
యాలు చేసి, ఆకలితో ఉంటాడు.
[24]ఒక వ్యక్తి తన పిల్లలను నిజంగా ప్రేమిస్తే, వారు
తప్పు చేసినప్పుడు అతడు వారిని సరిదిద్దుతాడు.
నీవు నీ కుమారుని ప్రేమిస్తే, అతనికి సరైన మార్గం
నేర్పించేందుకు నీవు జాగ్రత్తగా ఉంటావు.
[25]మంచి వాళ్లకు నిజంగా వారికి కావాల్సినవి
ఉంటాయి. కానీ దుర్మార్గుకి అవసరత కలిగివుంటుంది.

14 జ్ఞానముగల స్త్రీ తన ఇల్లు ఎలా ఉండాలో
అలా చేసుకొనేందుకు జ్ఞానము ప్రయో
గిస్తుంది. కానీ బుద్ధిహీనురాలు ఆమె చేసే బుద్ధిహీనమైన
పనుల మూలంగా తన ఇల్లు నాశనం చేసికొంటుంది.
[2]సరిగ్గా జీవించే మనిషి యెహోవాను గౌరవిస్తాడు.
కానీ నిజాయితీ లేని మనిషి యెహోవాను ద్వేషిస్తాడు.
[3]బుద్ధిహీనుని మాటలు అతనికి కష్టం తెచ్చిపెడ
తాయి. కాని జ్ఞానముగలవాని మాటలు అతణ్ణి కాపాడ
తాయి.
[4]పని చేయటానికి ఎద్దులు లేకపోతే గాదెలో ధాన్య
ముండదు ఒక గొప్ప పంట పండించటానికి మను
ష్యులు ఎద్దు బలాన్ని ఉపయోగించవచ్చు.
[5]సత్యవంతుడు అబద్ధం చెప్పడు. అతడు మంచి
సాక్షి. కాని నమ్మదగని వ్యక్తి ఎన్నడూ సత్యం చెప్పడు
అతడు చెడ్డ సాక్షి.
[6]ఇతరులకంటె తాను మంచివాడను అని తలంచే
గర్విష్ఠుడు ఒకవేళ జ్ఞానిగా ఉండాలి అనుకోవచ్చు.
కానీ ఆ గర్విష్ఠుడు ఎన్నటికీ జ్ఞాని కాజాలడు. అయితే
నిజంగా జ్ఞానముగల వానికి (దేవుని నమ్మినవానికి)
తెలివి సులభంగా అబ్బుతుంది.
[7]తెలివి తక్కువ వానితో స్నేహం చేయవద్దు. తెలివి
తక్కువ మనిషి నీకు నేర్పించగలది ఏమీ లేదు.

[8]తెలివిగల మనుష్యులు వారు చేసే విషయాలను గూర్చి జాగ్రత్తగా ఆలోచిస్తారు, గనుక వారు జ్ఞానము గలవారు. కానీ బుద్ధిహీనులు మోసం చేసి జీవించవచ్చు. అనుకొంటారు గనుక వారు తెలివితక్కువ వారు.
[9]తెలివి తక్కువ వాడు, తాను చేసిన చెడు విషయాలకు శిక్ష పొందాలి అనే మాటను గూర్చి నవ్వేస్తాడు. కానీ మంచి మనుష్యులు క్షమాపణ పొందటానికి చాలా కష్టపడి ప్రయత్నిస్తారు.
[10]ఒక మనిషి విచారంగా ఉంటే దాని ప్రభావం అతను ఒక్కడే అనుభవిస్తాడు. అదే విధంగా ఒక మనిషి సంతోషంగా ఉంటే అతను ఒక్కడు మాత్రమే ఆ ఆనందం అనుభవిస్తాడు.
[11]దుర్మార్గుని ఇల్లు నాశనం చేయబడుతుంది. కానీ మంచివాని ఇల్లు శాశ్వతంగా ఉంటుంది.
[12]సరిగ్గా ఉంది అని మనుష్యులు తలంచే ఒక మార్గం ఉంది. కానీ ఆ మార్గం మరణానికి మాత్రమే దారి తీస్తుంది.
[13]ఒక మనిషి నవ్వుతూ ఉన్నా, అతడు విచారంగానే ఉండవచ్చు. నవ్వటం అయిపొయ్యాకగూడ ఆ విచారం అలాగే ఉంటుంది.
[14]దుర్మార్గులు చేసే చెడుపనులకు వారికి పూర్తిగా చెల్లించబడుతుంది (శిక్షించబడుతారు). మరియు మంచివాళ్లు చేసే మంచి పనులకు పూర్తిగా బహుమానం పొందుతారు.
[15]బుద్ధిహీనుడు ఏది వింటే అది నమ్ముతాడు. కానీ జ్ఞానము గలవాడు ప్రతిదాని గూర్చి జాగ్రత్తగా ఆలోచిస్తాడు.
[16]జ్ఞానముగలవాడు యెహోవాను గౌరవిస్తాడు, దుర్మార్గానికి దూరంగా ఉంటాడు. కానీ బుద్ధిహీనుడు ఆలోచన లేకుండా పనులు చేస్తాడు జాగ్రత్తగా ఉండడు.
[17]త్వరగా కోపగించుకొనేవాడు బుద్ధిహీనమైన పనులు చేస్తాడు. కాని జ్ఞానముగలవాడు ఓర్పు కలిగి ఉంటాడు.
[18]తెలివితక్కువ వారు తమ తెలివితక్కువ తనాన్ని బట్టి శిక్షించబడుతారు. కానీ జ్ఞానముగలవారికి తెలివి బహుమానంగా ఇవ్వబడుతుంది.
[19]చివరికి చెడ్డవారిమీద మంచి వాళ్లు గెలుస్తారు. చెడ్డవాళ్లు మంచివాళ్లకు సేవ చేయుటకు బలవంతం చేయబడుతారు.
[20]పేదవానికి స్నేహితులు ఎవ్వరూ ఉండరు. అతనికి పొరుగువారు కూడ ఉండరు. కానీ ధనికులకు చాలా మంది స్నేహితులు ఉంటారు.
[21]ఇతరులకంటే నీవే మంచివాడవని తలచటం తప్పు. నీవు సంతోషంగా ఉండాలంటే పేదవారి యెడల దయ కలిగి ఉండు.
[22]దుర్మార్గం చేయాలనే వ్యక్తి ఎవరైనా సరే అతడు తప్పు చేస్తున్నాడు. అయితే మంచి జరిగించడానికి ప్రయత్నించే వ్యక్తికి, అతన్ని ప్రేమించి అతన్ని నమ్ముకొనే స్నేహితులు ఉంటారు.
[23]నీవు కష్టపడి పని చేస్తే, అప్పుడు నీవు కోరుకొనేవి నీకు ఉంటాయి. కాని నీవు మాట్లాడటం తప్ప పని ఏమీ చేయకపోతే నీవు పేదవానివిగా ఉంటావు.
[24]జ్ఞానముగలవారు ఐశ్వర్యాన్ని బహుమానంగా పొందుతారు. కాని బుద్ధిహీనులు తెలివితక్కువ తనాన్ని బహుమానంగా పొందుతారు.
[25]సత్యం పలికే మనిషి ఇతరులకు సహాయం చేస్తాడు. అబద్ధాలు చెప్పే మనిషి ఇతరులకు హాని చేస్తాడు.
[26]యెహోవాను గౌరవించే మనిషి క్షేమంగా ఉంటాడు. మరియు అతని పిల్లలు క్షేమంగా జీవిస్తారు.
[27]యెహోవా యెడల భక్తి నిజమైన జీవాన్ని ప్రసాదిస్తుంది. అది ఒక వ్యక్తిని మరణపు ఉచ్చునుండి రక్షిస్తుంది.
[28]ఒక రాజు అనేకమంది ప్రజలను పాలిస్తే అతడు గొప్పవాడు. కాని ప్రజలు ఎవ్వరూ లేకపోతే అప్పుడు ఆ రాజు యొక్క విలువ శూన్యం.
[29]సహనంగల మనిషి చాలా తెలివిగలవాడు. త్వరగా కోపపడు మనిషి బుద్ధిహీనుడని కనపరచుకుంటాడు.
[30]ఒక మనిషి మనస్సులో శాంతి ఉంటే అతని శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. కానీ అసూయ శరీరంలో వ్యాధి కలిగిస్తుంది.
[31]పేద ప్రజలకు కష్టాలు కలిగించే మనిషి దేవుణ్ణి గౌరవించటం లేదని చూపెడతాడు. ఇద్దరినీ దేవుడే చేశాడు. కాని ఒక మనిషి పేద ప్రజల యెడల దయ కలిగి ఉంటే, అప్పుడు అతడు దేవుని గౌరవిస్తాడు.
[32]కష్టకాలంలో దుర్మార్గులు ఓడించబడతారు. కాని మంచివాళ్లు మరణ సమయంలో కూడా విజయం పొందుతారు.
[33]జ్ఞానముగల మనిషి ఎల్లప్పుడూ జ్ఞానముగల విషయాలే తలుస్తాడు. కాని బుద్ధిహీనునికి జ్ఞానమును గూర్చి అసలు ఏమీ తెలియదు.
[34]మంచితనం ఒక దేశాన్ని గొప్పగా చేస్తుంది. కాని పాపం వలన ఏ ప్రజలకైనా అవమానమే కలుగుతుంది.
[35]ఒక రాజుకు జ్ఞానముగల నాయకులు ఉంటే అతడు సంతోషిస్తాడు. కాని తెలివితక్కువ నాయకుల విషయమై రాజుకు కోపం.

15 శాంతియుతమైన జవాబు కోపాన్ని పోగొడ్తుంది. కాని దురుసు జవాబు కోపాన్ని పెంచుతుంది.
[2]జ్ఞానముగల మనిషి మాట్లాడినప్పుడు ఇతరులు వినాలని ఆశిస్తారు. కాని బుద్ధిహీనుడు మాట్లాడేది
తెలివితక్కువ తనమే అవుతుంది. [3]అన్నిచోట్లా జరిగే
వాటన్నింటినీ యెహోవా చూస్తాడు. దుర్మార్గులను, మంచి వాళ్లను యెహోవా గమనిస్తాడు.

4దయగల మాటలు జీవవృక్షంలా ఉంటాయి. కాని
అబద్ధాల మాటలు ఒక మనిషి ఆత్మను అణచివేస్తాయి.
5తెలివితక్కువ వాడు తన తండ్రి సలహా వినేందుకు
నిరాకరిస్తాడు. కాని జ్ఞానముగలవాడు మనుష్యులు
అతనికి నేర్పించటానికి ప్రయత్నించినప్పుడు జాగ్ర
త్తగా వింటాడు.
6మంచి మనుష్యులు అనేక విషయాలలో ఐశ్వర్య
వంతులుగా ఉంటారు. కాని ఒక దుర్మార్గునికి ఉన్నవి
అతనికి కష్టం మాత్రమే కలిగిస్తాయి.
7జ్ఞానము గలవాడు మాట్లాడినప్పుడు అతడు జ్ఞాన
ముతో మాట్లాడుతాడు. కాని బుద్ధిహీనులు వినదగినది
ఏమీ చెప్పరు.
8దుర్మార్గులు అర్పించే అర్పణలు యెహోవాకు
అసహ్యం. అయితే మంచి మనిషి చేసే ప్రార్థనలు
వినటం యెహోవాకు సంతోషం.
9దుర్మార్గులు జీవించే విధానం యెహోవాకు
అసహ్యం. మంచి పనులను చేయాలని ప్రయత్నించే
మనుష్యులను యెహోవా ప్రేమిస్తాడు.
10ఒక వ్యక్తి అక్రమంగా జీవించటం మొదలు పెడితే
అతడు శిక్షించబడుతాడు. సరిదిద్దబడటానికి ఇష్టపడని
మనిషి నాశనం చేయబడతాడు.
11మరణస్థానంలో జరిగేదానితో సహా, సమస్తం
యెహోవాకు తెలుసు. కనుక మనుష్యుల హృద
యాల్లో, మనస్సుల్లో ఏమి జరుగుతుందో
యెహోవాకు నిశ్చయంగా తెలుసు.
12బుద్ధిహీనుడు తప్పు చేసినప్పుడు అది అతనికి
చెబితే ఇష్టం ఉండదు. అతడు జ్ఞానముగల వారిని
సలహా అడగటానికి నిరాకరిస్తాడు.
13ఒక వ్యక్తి సంతోషంగా ఉంటే అతని ముఖం
ఆనందంగా ఉంటుంది. అయితే ఒక మనిషి హృద
యంలో విచారం ఉంటే, అప్పుడు అతని స్వభావంలో
ఆ దుఃఖం వ్యక్తం అవుతుంది.
14జ్ఞానముగలవాడు ఇంకా ఎక్కువ తెలివి సంపాదిం
చాలని ప్రయత్నం చేస్తాడు. కానీ బుద్ధిహీనునికి ఇంకా
ఎక్కువ బుద్ధిహీనత కావాలి.
15కొంతమంది పేదవాళ్లు ఎంతసేపూ విచారం గానే
ఉంటారు. అయితే హృదయాల్లో సంతోషంగల పేద
వాళ్లకు జీవితం ఒక పెద్ద విందులా ఉంటుంది.
16ధనికునిగా అనేక కష్టాలు కలిగి ఉండటంకంటె,
దరిద్రునిగా ఉండి యెహోవాను గౌరవించటం మేలు.
17ద్వేషం ఉన్నచోట విస్తారంగా భోజనం చేయటం
కంటే, ప్రేమగల చోట కొద్దిగా భోజనం చేయటం
మేలు.
18త్వరగా కోపపడేవారు కష్టాన్ని కలిగిస్తారు. కానీ
సహనంగల మనిషి శాంతిని కలిగిస్తాడు.
19బద్ధకస్తునికి అంతటా కష్టమే ఉంటుంది. కానీ
నిజాయితీగల మనుష్యులకు జీవితం తేలిగ్గా ఉంటుంది.
20జ్ఞానముగల కుమారుడు తన తండ్రికి సంతోషం
కలిగిస్తాడు. అయితే బుద్ధిహీనుడు తన తల్లికి అవమానం
తెస్తాడు. 21తెలివితక్కువ వానికి తెలివితక్కువ తనమే
ఆనందం. కానీ జ్ఞానముగలవాడు సరైన వాటినే చేయ
టానికి జాగ్రత్తపడతాడు.
22ఒక వ్యక్తి సరిపడినంత సలహా తీసుకొనకపోతే,
అతని తలంపులు విఫలమవుతాయి. అయితే ఒక వ్యక్తి
జ్ఞానముగలవారు తనకు చెప్పే విషయాలు వింటే
విజయం పొందగలడు.
23ఒక మనిషి మంచి జవాబు ఇచ్చినప్పుడు
సంతోషిస్తాడు. మరియు సరైన సమయంలో సరైన
మాట చెప్పటం చాలా మంచిది.
24జ్ఞానముగల మనిషి చేసే పనులు విజయానికి
నడిపిస్తాయి. అతడు మరణ స్థానానికి దిగజారిపోకుండా
ఆ విషయాలు అతనిని వారిస్తాయి.
25గర్విష్ఠికి ఉన్న గృహమును యెహోవా నాశనం
చేస్తాడు. అయితే విధవరాలి వస్తువులను యెహోవా
కాపాడుతాడు.
26చెడు ఆలోచనలు యెహోవాకు అసహ్యం. కానీ
దయగల మాటల విషయంలో యెహోవా సంతో
షిస్తాడు.
27ఒక వ్యక్తి వస్తువులు సంపాదించటం కోసం
దురాశపడితే అతడు తన కుటుంబానికి కష్టం తెచ్చి
పెడ్తాడు. కానీ లంచగొండితనాన్ని ద్వేషించే నిజా
యితీపరుడు బతుకుతాడు. 28మంచి మనుష్యులు
జవాబు చెప్పక ముందు ఆలోచిస్తారు. అయితే దుర్మా
ర్గులు ఆలోచించక ముందే మాట్లాడేస్తారు. అది వారికి
కష్టం కలిగిస్తుంది.
29యెహోవా దుర్మార్గులకు చాలా దూరంగా
ఉంటాడు. కానీ మంచివాళ్ల ప్రార్థనలు ఆయన ఎల్ల
ప్పుడూ వింటాడు.
30నవ్వుతూ ఉండే మనిషి ఇతరులను సంతోష
పెడ్తాడు. శుభవార్త మనుష్యులకు మంచి సంతోషాన్ని
కలిగిస్తుంది.
31ఒక మనిషి తాను తప్పు చేసిననప్పుడు, దానిని
సరిదిద్దుటకు చెప్పినప్పుడు జాగ్రత్తగా వినేవాడు చాలా
జ్ఞానముగలవాడు.
32ఒకడు నేర్చుకొనేందుకు నిరాకరిస్తే అతడు
తనకు తానే హాని చేసుకుంటున్నాడు. అయితే ఒక
మనిషి తాను చేసింది తప్పు అని చెప్పినప్పుడు వినే
మనిషి మరీ ఎక్కువగా గ్రహిస్తాడు.
33యెహోవాను గౌరవించువాడు జ్ఞానము గలిగి
ఉండటానికి నేర్చుకొంటున్నాడు. ఒక వ్యక్తి నిజంగా
యెహోవాను గౌరవించేముందు, వినమ్రుడవాలి.
16 మనుష్యులు తమ ఆలోచనలు చేస్తారు.
అయితే ఆ విషయాలు జరిగేటట్టుగా చేసే
వాడు యెహోవాయే.

2ఒకడు తాను చేసేది అంతా సరిగ్గా ఉంది అను
కొంటాడు. అయితే మనుష్యులు చేసే వాటికిగల అస
లైన కారణాలు ఏమిటో యెహోవా తీర్పు చెబుతాడు.
3నీవు చేసే ప్రతీదానిలో సహాయం కోసం ఎల్ల
ప్పుడూ యెహోవా వైపు తిరుగు, నీవు జయం
పొందుతావు.
4ప్రతీదానికీ యెహోవా ఏర్పాటు ఒకటి ఉంది.
యెహోవా ఏర్పాటులో దుర్మార్గులు నాశనం చేయ
బడతారు.
5ఇతరులకంటే తానే మంచివాడిని అనుకొనే ప్రతి
మనిషీ యెహోవాకు అసహ్యుడు. ఆ గర్విష్ఠులనంద
రినీ యెహోవా తప్పక నాశనం చేస్తాడు.
6నిజమైన ప్రేమ, నమ్మకం నిన్ను పవిత్రం
చేస్తాయి. యెహోవాను గౌరవించు, నీవు దుర్మార్గానికి
దూరంగా ఉంటావు.
7ఒక వ్యక్తి యెహోవాను సంతోషపెట్టే విధంగా
మంచి జీవితం జీవిస్తూంటే అప్పుడు అతని శత్రువులు
కూడా అతనితో సమాధానంగా ఉంటారు.
8మోసం చేసి విస్తారంగా సంపాదించుటకంటే,
సరైన విధంగా కొంచెం మాత్రమే సంపాదించుట
మేలు.
9ఒక మనిషి తాను చేయాలనుకొనే వాటి విష
యంలో పథకాలు వేయవచ్చు. అయితే ఏమి జరుగు
తుంది అనేది నిర్ణయించే వాడు యెహోవా.
10ఒక రాజు మాట్లాడితే, అతని మాటలు చట్టం
అవుతాయి. అతని నిర్ణయాలు ఎల్లప్పుడూ న్యాయంగా
ఉండాలి.
11త్రాసులు, తూనిక రాళ్లు అన్నీ నిజాయితీగా
ఉండాలని యెహోవా కోరుతాడు. వ్యాపార ఒప్పందా
లన్నీ న్యాయంగా ఉండాలని ఆయన కోరుతాడు.
12కీడు చేసే మనుష్యులను రాజులు అసహ్యించు
కొంటారు. మంచితనం అతని రాజ్యాన్ని మరింత బల
మైనదిగా చేస్తుంది.
13రాజులు సత్యం వినాలని కోరుతారు. అబద్ధాలు
చెప్పని ప్రజలు రాజులకు ఇష్టం.
14రాజుకు కోపం వస్తే, అతడు ఎవరినైనా చంప
వచ్చును. జ్ఞానముగలవాడు రాజును సంతోష పెట్టడా
నికి ప్రయత్నిస్తాడు.
15రాజు సంతోషంగా ఉన్నప్పుడు ప్రతి ఒక్కరికీ
జీవితం సంతోషంగా ఉంటుంది. నీ విషయమై రాజు
సంతోషిస్తే, అది మేఘం నుండి కురిసిన వర్షపు ఊటలా
ఉంటుంది.
16జ్ఞానము బంగారంకంటె చాలా ఎక్కువ విలువ
గలది. అవగాహన వెండికంటె చాలా ఎక్కువ విలువ
గలది.
17మంచి మనుష్యులు దుర్మార్గానికి దూరంగా
ఉండేందుకు ప్రయత్నిస్తూ తమ జీవితాలు జీవిస్తారు.
తన జీవితం కాపాడుకొనేవాడు తన ఆత్మను భద్రము
చేసుకొంటున్నాడు.
18ఒక వ్యక్తి గనుక గర్వంగా ఉంటే, అప్పుడు అతడు
నాశనకరమైన అపాయంలో ఉన్నాడు. ఒక మనిషి
ఇతరులకంటె తానే మంచివాడినని అనుకొంటే అతడు
ఓడిపోయే ప్రమాదంలో ఉన్నాడు.
19ఇతరులకంటె గొప్పవాళ్లం అనుకొనే వాళ్లతో
ఐశ్వర్యాలు పంచుకోవటంకంటె, దీనులైన, పేద
వాళ్లతో కలిసి జీవించటం మేలు.
20మనుష్యులు తనకు నేర్పించుటకు ప్రయత్నించి
నప్పుడు, వినే వ్యక్తి లాభం పొందుతాడు. యెహోవాను
నమ్ముకొనేవాడు ఆశీర్వదించబడుతాడు.
21ఒకవేళ ఒక మనిషి జ్ఞానముగల వాడైతే అది
ప్రజలు తెలుసుకొంటారు. జాగ్రత్తగా ఎంచుకొని
మాటలు మాట్లాడే మనిషి, చాలా ఒప్పించదగిన
వాడుగా ఉంటాడు.
22జ్ఞానముగల వారికి అది నిజమైన జీవాన్ని తెచ్చి
పెడుతుంది. కానీ బుద్ధిహీనులు మరింత బుద్ధిహీనంగా
ఉండటమే నేర్చుకొంటారు.
23జ్ఞానముగల మనిషి మాట్లాడక ముందు ఎల్ల
ప్పుడూ ఆలోచిస్తాడు. అతడు చెప్పే మాటలు
మంచివి, వినదగినవి.
24దయగల మాటలు తేనెలా ఉంటాయి. వాటిని
అంగీకరించటం సులభం, అవి నీ ఆరోగ్యానికి మంచివి.
25మనుష్యుల దృష్టికి సరైనదిగా కనుపించే మార్గం
ఒకటి ఉంది. కానీ ఆ మార్గం మరణానికి మాత్రమే
నడిపిస్తుంది.
26పనివాని ఆకలి అతణ్ణి పని చేయిస్తూనే ఉంటుంది.
అతడు భోజనం చేయగలిగేటట్టు, అతని ఆకలి అతణ్ణి
పని చేయిస్తుంది.
27పనికిమాలిన మనిషి చెడు పనులు చేయాలని
పథకం వేస్తాడు. అతని సలహా నిప్పులా నాశనం
చేస్తుంది.
28చిక్కులు పెట్టేవారు ఎల్లప్పుడూ సమస్యలు పుట్టి
స్తూంటారు. చెప్పుడు మాటలు వ్యాపింపజేసే వాడు
సన్నిహితులైన మిత్రుల మధ్య చిక్కు కలిగిస్తాడు.
29త్వరగా కోపం వచ్చే మనిషి తన స్నేహితులకు
చిక్కు తెచ్చిపెడ్తాడు. మంచిది కాని మార్గంలో అతడు
వారిని నడిపిస్తాడు. 30కన్నుగీటి, చిరునవ్వు నవ్వేవాడు
ఏదో అక్రమం, కీడు తలపెడ్తున్నాడు.
31నెరసిన తల వెంట్రుకలు, మంచి జీవితాలు
జీవించిన వారికి మహిమ కిరీటం.
32బలమైన ఒక సైనికునిగా ఉండటంకంటే సహనం
గలిగి ఉండటం మంచిది. ఒక పట్టణం అంతటిని
స్వాధీనం చేసికోవటంకంటే, నీ కోపాన్ని స్వాధీనం
చేసికోవటం మేలు.

33నిర్ణయాలు చేయటానికి మనుష్యులు చీట్లు
వేస్తారు. కానీ నిర్ణయాలు ఎల్లప్పుడూ దేవుని దగ్గ
ర్నుండి వస్తాయి.

17 ఇంట్లో ప్రతి ఒక్కరూ వాదులాడుతూ ఆ ఇంటి
నిండా భోజనం ఉండటంకంటె, శాంతి కలిగి
భోంచేయటానికి ఒక ఎండిపోయిన రొట్టెముక్క
ఉంటే చాలు.

2యజమాని యొక్క సోమరిపోతు కుమారుని మీద
తెలివిగల సేవకుడు ఆధిపత్యం సంపాదిస్తాడు. తెలివిగల
ఆ సేవకుడు అన్నదమ్ములతో పాటు పిత్రార్జితము
పంచుకొంటాడు.

3బంగారం, వెండి శుద్ధి చేయబడేందుకు అగ్నిలో
వేయబడతాయి. అయితే మనుష్యుల హృదయాలను
పవిత్రం చేసేవాడు యెహోవా. 4దుర్మార్గులు ఇతరులు
చెప్పే దుర్మార్గపు సంగతులు వింటారు. అబద్ధాలు
చెప్పేవారు కూడా అబద్ధాలు వింటారు.

5కొంతమంది పేదవాళ్లను హేళన చేస్తారు. సమ
స్యలు ఉన్నవాళ్లను చూచి వారు ఎగతాళి చేస్తారు.
వారిని సృష్టించిన దేవుణ్ణి వారు గౌరవించరు అని ఇది
సూచిస్తుంది. ఈ దుర్మార్గులు శిక్షించబడుతారు.

6మనుమలు మనుమరాళ్లు ముసలివాళ్లను సంతోష
పెడ్తారు. మరియు పిల్లలు వారి తల్లిదండ్రులను గూర్చి
అతిశయిస్తారు.

7ఒక బుద్ధిహీనుడు అధికంగా మాట్లాడటం జ్ఞాన
ముగల పనికాదు. అదే విధంగా ఒక అధికారి అబద్ధాలు
చెప్పటం జ్ఞానముగల పనికాదు.

8లంచం కళ్లను మెరిపించే ఒక ప్రకాశవంతమైన
వెలగల రాయిలాంటిది, అది ఇచ్చేవారి మనస్సును
మారుస్తుంది. ఎక్కడికి వెళ్లినా అదిపని చేస్తుంది అను
కొంటారు. 9నీ విషయంలో తప్పు చేసినవాణ్ణి నీవు
క్షమిస్తే, మీరు స్నేహితులుగా ఉంటారు. కానీ అతడు
చేసిన తప్పును నీవు ఇంకా జ్ఞాపకం చేసికొంటూనే
ఉంటే, అది మీ స్నేహానికి హాని చేస్తుంది.

10తెలివిగలవాడు తాను చేసే తప్పుల మూలంగా
నేర్చుకొంటాడు. కానీ బుద్ధిహీనుడు నూరు పాఠాల
తర్వాత కూడా ఏమీ నేర్చుకోడు.

11దుర్మార్గుడు తప్పు మాత్రమే చేయాలని కోరు
తాడు. అంతంలో అతణ్ణి శిక్షించేందుకు దేవుడు ఒక
దూతను పంపిస్తాడు.

12ఒక తల్లి ఎలుగుబంటి, దాని పిల్లలు ఎత్తు
కొనిపోబడి, కోపంగా ఉన్నప్పుడు దాన్ని కలుసు
కోవటం చాలా ప్రమాదకరం. కానీ తెలివి తక్కువ
పనులు చేయటంలో నిమగ్నం అయిపోయి ఉన్న
బుద్ధిహీనుణ్ణి కలుసుకోవటంకంటే అది మేలు.

13నీకు మంచి పనులు చేసేవారికి నీవు చెడు పనులు
చేయకు. నీవు గనుక చేస్తే, మిగిలిన నీ జీవితం అంతా
నీకు కష్టాలే ఉంటాయి.

14నీవు వాదం మొదలుపెడ్తే అది ఆనకట్టకు గండి
కొట్టినట్టే ఉంటుంది. అందుచేత వాదం అలా అలా
పెద్దది కాక ముందే దాన్ని నిలిపివేయి.

15ఏ తప్పూ చేయని వాణ్ణి శిక్షించటం, దోషిని
క్షమించటం ఇవి రెండూ యెహోవాకు అసహ్యం.

16బుద్ధిహీనునికి డబ్బు ఉంటే అది వ్యర్థం అవు
తుంది. ఎందుకంటే జ్ఞాని అయ్యేందుకు ఆ డబ్బును
బుద్ధిహీనుడు ఉపయోగించడు.

17స్నేహితుడు అన్ని వేళలా ప్రేమిస్తాడు. నిజమైన
సోదరుడు ఎల్లప్పుడూ కష్ట సమయాల్లో కూడా నిన్ను
బలపరుస్తాడు.

18మరొకని అప్పులకు బాధ్యత వహిస్తానని బుద్ధి
హీనుడు మాత్రమే వాగ్దానం చేస్తాడు.

19జగడాల్లో ఆనందించేవాడు పాపంలోనూ ఆనంది
స్తాడు. నిన్ను గూర్చి నీవు అతిశయిస్తే, నీవు కష్టాన్ని
ఆహ్వానించినట్టే అవుతుంది.

20దుర్మార్గునికి లాభం ఉండదు. అబద్ధాలు చెప్పే
వాడికి కష్టాలు ఉంటాయి.

21తెలివితక్కువ కుమారుడున్నా తండ్రికి విచారం.
బుద్ధిహీనుని తండ్రికి సంతోషం ఉండదు.

22సంతోషం ఒక మంచి మందులాంటిది. కానీ
దుఃఖం ఒక రోగంలాంటిది.

23దుర్మార్గుడు మోసం చేయటానికి రహస్యంగా
డబ్బు తీసికొంటాడు.

24జ్ఞానముగలవాడు ఎల్లప్పుడూ శ్రేష్ఠమైన దాన్ని
చేసేందుకే తలుస్తూ ఉంటాడు. కానీ బుద్ధిహీనుడు
ఎంతసేపూ అందనివాటి కోసం కలగంటూ ఉంటాడు.

25తెలివి తక్కువ కుమారుడు తన తండ్రికి దుఃఖం
కలిగిస్తాడు. మరియు తెలివి తక్కువ కుమారుడు
తనకు జన్మ నిచ్చిన తల్లికి విచారం కలిగిస్తాడు.

26ఏ తప్పూ చేయని వానిని శిక్షించటం తప్పు.
నాయకులు నిజాయితీగా ఉన్నప్పుడు వారిని శిక్షిం
చటం తప్పు.

27జ్ఞానముగలవాడు మాటల్ని జాగ్రత్తగా ప్రయోగి
స్తాడు. జ్ఞానముగలవాడు త్వరగా కోపగించు కోడు.

28బుద్ధిహీనుడు కూడా నెమ్మదిగా ఉన్నప్పుడు
జ్ఞానిలా కనిపిస్తాడు. అతడు ఏమీ చెప్పకపోతే జ్ఞానము
గలవాడు అని ప్రజలు అనుకొంటారు.

18 ఇతరులు అంటే గిట్టనివాడు తాను చేసే
వాటిలో స్వార్థపరుడుగా ఉంటాడు. ప్రజలు
మంచి సలహాను ఇచ్చినప్పుడు అతడు కోపగించు
కుంటాడు.

2బుద్ధిహీనుడు గ్రహించటానికి ఇష్టపడడు. ఆ వ్యక్తి
ఎంతసేపూ తన స్వంత ఆలోచనలే చెప్పాలను
కొంటాడు. 3ఎక్కడ పాపం ఉంటుందో, అక్కడ అవ
మానం ఉంటుంది. ఎక్కడ అవమానం, ఉంటుందో
అక్కడ ఘనత ఉండదు.

4ఒక వ్యక్తి చెప్పే విషయాలు జ్ఞానముగలవిగా
ఉండవచ్చు. ఆ మాటలు లోతైన మహా సముద్రంలా
లేక ప్రవహిస్తున్న ఏరులా ఉండవచ్చును.
5ఒకడు నేరస్థుడైతే వానికి సహాయం చేయవద్దు.
అతడు తప్పు ఏమీ చేయకపోతే అతని యెడల
న్యాయంగా ఉండు.
6బుద్ధిహీనుడు తాను చెప్పే మాటలవల్ల తనకు
తానే కష్టం కలిగించుకొంటాడు. అతని మాటల వలన
వివాదం మొదలు కావచ్చును.
7బుద్ధిహీనుడు మాట్లాడినప్పుడు అతడు తనను
తానే నాశనం చేసుకొంటాడు. అతని స్వంత మాటలే
అతన్ని పట్టేస్తాయి.
8మనుష్యులకు ఎంతసేపూ ముచ్చట్లు వినటం
ఇష్టం. ఆ ముచ్చట్లు పొట్టలోనికి పోతోన్న మంచి
భోజనంలా ఉంటాయి.
9బద్ధకస్థుడు నాశనం చేసే వాని అంతటి చెడ్డవాడు.
10యెహోవా పేరులో ఎంతో బలం ఉంది. అది
బలమైన ఒక దుర్గంలాంటిది. మంచివాళ్లు ఆ దుర్గం
దగ్గరకు పరుగెత్తి వెళ్లి, క్షేమంగా ఉంటారు.
11ధనికులు వారి ఐశ్వర్యం వారిని కాపాడుతుంది
అనుకొంటారు. అది ఒక బలమైన కోటలా ఉంది
అని వారు తలుస్తారు.
12ఒక దీనుడు గౌరవించబడతాడు. కానీ గర్విష్ఠుడు
పతనం అవుతాడు.
13ఒకడు పూర్తిగా వినక ముందే జవాబిస్తే అతడు
ఇబ్బంది పడిపోయి, తాను తెలివితక్కువ వాడిని అని
చూపించుకొంటాడు.
14ఒక మనిషి వ్యాధితో ఉన్నప్పుడు అతని మనస్సు
అతణ్ణి బ్రతికించి ఉంచగలదు. కానీ ఆ మనిషి అంతా
పోయింది అనుకొంటే అప్పుడు ఆశ అంతా వదలు
కొన్నట్టే!
15జ్ఞానముగలవాడు ఎల్లప్పుడూ ఇంకా ఎక్కువ
నేర్చుకోవాలి అని అనుకుంటాడు. మరింత జ్ఞానము
కోసం అతడు జాగ్రత్తగా వింటాడు.
16ఒక ప్రముఖ వ్యక్తిని నీవు కలుసుకోవాలి అని
అంటే అతనికి ఒక కానుక ఇవ్వాలి. అప్పుడు నీవు
అతనిని తేలికగా కలుసుకోగలవు.
17ఇంకో మనిషి వచ్చి ప్రశ్నించే అంత వరకు
మొదట మాట్లాడిన వానిది సరిగ్గా ఉన్నట్టే కనిపిస్తుంది.
18ఇద్దరు శక్తిగల మనుష్యులు వాదిస్తోంటే వారి
వాదాన్ని తీర్మానించటానికి చీట్లు వేయటమే శ్రేష్ఠమైన
పద్ధతి.
19నీ స్నేహితునికి నీవు సహాయం చేస్తే అతడు
ఒక బలమైన పట్టణపు గోడలా నిన్ను కాపాడుతాడు.
వివాదాలు కోట గుమ్మాల అడ్డగడియవలె ప్రజలను
వేరుపరుస్తాయి.
20నీవు చెప్పే విషయాలు నీ జీవితం మీద ఏదో
విధంగా పనిచేస్తాయి. తన నోటి ఫలముచేత ఒక
మనిషి నింపబడుతాడు.
21జీవం, మరణం, తెచ్చే మాటలు నాలుక మాట్లాడ
గలదు. ప్రజలు మాట్లాడటం ఇష్టపడేవారు. అది ఏమి
తెచ్చునో దాన్ని తీసుకొనుటకు సిద్ధముగా ఉండ
వలయును.
22నీకు భార్య దొరికినట్లయితే నీవు మేలు పొంది
నట్టే. నీ విషయమై యెహోవాకు సంతోషం.
23పేదవాడు సహాయము కొరకు అడుక్కుంటాడు.
కాని ధనికుడు కఠినముగా సమాధానము చెప్పవచ్చు.
24ఒక మనిషికి స్నేహితులు చాలా మంది ఉంటే
అది అతనిని పాడు చేయవచ్చును. కాని ఒక సోదరుని
కంటే ఒక మంచి స్నేహితుడు మేలు.

19 అబద్ధాలు చెప్పి, మోసం చేసే బుద్ధిహీనునిగా
ఉండుటకంటే, నిజాయితీగల పేదవానిగా
ఉండుట మేలు.
2దేనిగూర్చిగాని ఉద్వేగ పడిపోవటం మాత్రం
చాలదు. నీవు చేస్తోంది ఏమిటో కూడా నీకు తెలిసి
ఉండాలి. నీవు తొందరపడి ఏదీ చేయకూడదు. లేక
పోతే నీవు తప్పు చేసేస్తావు.
3ఒక మనిషి యొక్క బుద్ధిహీనత అతని జీవితాన్ని
పాడు చేస్తుంది. కానీ అతడు యెహోవాను నిందిస్తాడు.
4ఒకడు ధనవంతుడైతే అతని ఐశ్వర్యం అతనికి
అనేకమంది మిత్రులను తెచ్చిపెడ్తుంది. కానీ ఒకడు
పేదవాడైతే అతని స్నేహితులంతా అతనిని విడిచి
పెట్టేస్తారు.
5మరొకనికి విరోధంగా అబద్ధం చెప్పేవాడు శిక్షించ
బడుతాడు. అబద్ధాలు చెప్పేవాడు క్షేమంగా ఉండడు.
6అధికారులతో అనేకమంది స్నేహంగా ఉండాలని
కోరుకొంటారు. కానుకలు ఇచ్చే వానితో ప్రతి ఒక్కరూ
స్నేహంగా ఉండాలని కోరుకొంటారు.
7ఒక మనిషి పేదవాడైతే, అతని కుటుంబం కూడా
అతనికి విరోధంగా ఉంటుంది. అతని స్నేహితులంతా
అతని దగ్గరనుండి వెళ్లిపోతారు. ఆ పేదవాడు సహాయం
కోసం వారిని భిక్షం అడగవచ్చు. కానీ వారు అతని
దగ్గరకు కూడా వెళ్లరు.
8తెలివిని సంపాదించుకొనుటకు ప్రయత్నించే
మనిషి తనను తాను ప్రేమిస్తున్నట్టు సూచిస్తాడు. జ్ఞాన
మును ప్రేమించేవాడు లాభం పొందుతాడు.
9అబద్ధాలు చెప్పేవాడు శిక్షించబడతాడు. అబద్ధాలు
చెబుతూనే ఉండేవాడు నాశనం చేయబడతాడు.
10బుద్ధిహీనుడు ధనవంతునిగా ఉండకూడదు. అది
రాజకుమారుల మీద బానిస పరిపాలన చేసినట్టుగా
ఉంటుంది.
11ఒక మనిషి జ్ఞానము గలవాడైతే, ఆ జ్ఞానము
అతనికి సహనాన్ని ఇస్తుంది. అతని యెడల తప్పు

చేసిన వారిని అతడు క్షమించటం అతనికి ఘనతగా ఉంటుంది.

12ఒక రాజు కోపంగా ఉన్నప్పుడు అది సింహ గర్జనలా ఉంటుంది. కాని అతడు నీతో సంతోషంగా ఉంటే అది మృదువైన వర్షంలా ఉంటుంది.

13తెలివి తక్కువ కుమారుడు తన తండ్రిని నాశనం చేయగలడు. వాదులాడే భార్య ఎడతెగక కారే నీటి చుక్కల మాదిరి విసుగు కలిగించేదిగా ఉంటుంది.

14మనుష్యులు ఇండ్లు, ధనం వారి తలిదండ్రుల నుండి పొందుతారు. అయితే మంచి భార్య యెహోవా నుండి దొరికే వరం.

15సోమరివానికి నిద్ర చాలా ఎక్కువ వస్తుంది. కాని అతడు చాలా ఆకలిగా కూడా ఉంటాడు.

16దైవాజ్ఞకు విధేయునిగా ఉండేవాడు తన ఆత్మను క్షేమంగా ఉంచుకొంటాడు. కాని దైవాజ్ఞను వినుటకు నిరాకరించేవాడు మరణిస్తాడు.

17పేద ప్రజలకు డబ్బులిచ్చేవాడు యెహోవాకు అప్పిచ్చువాడు. అతడు చేసే పనుల కోసం యెహోవా అతనికి బహుమానం ఇస్తాడు.

18నీ కుమారునికి బోధించి, వాడు తప్పు చేసినప్పుడు వానిని శిక్షించు. అదొక్కటే ఆశ. అలా చేయటానికి తిరస్కరిస్తే తనను తానే నాశనం చేసుకొనుటకు నీవు అతనికి సహాయం చేస్తున్నావు.

19ఒకడు తేలికగా కోపం తెచ్చుకొంటే అతడు దాని విలువ చెల్లించాలి. అతడు కష్టంలో నుండి బయట పడుటకు నీవు అతనికి సహాయం చేస్తే అతడు తిరిగి నీకూ అలానే చేస్తాడు.

20సలహా విని నేర్చుకో. అప్పుడు నీవు జ్ఞానముగలవాడవు అవుతావు.

21మనుష్యులు ఎన్నో పథకాలు వేస్తారు. కాని యెహోవా కోరేవి మాత్రమే జరుగుతాయి.

22నిజాయితీ, మరియు విశ్వసనీయత మనిషిలో కోరదగ్గవి. విశ్వసనీయత కోల్పోవడం కంటే బీదవాడుగా ఉండటం మేలు.

23యెహోవా యెడల గౌరవం నిజమైన జీవానికి నడిపిస్తుంది. అప్పుడు మనిషికి శాంతి ఉంటుంది. కష్టంలో క్షేమంగా ఉంటాడు.

24సోమరి తనను పోషించుకొనేందుకు తాను చేయాల్సిన పనులు కూడ చేయడు. తన పళ్లెంలోని భోజనం తన నోటి వద్దకు ఎత్తుకోటానికి కూడా అతనికి బద్ధకమే.

25దేనికి గౌరవం చూపనివారు శిక్షించబడాలి. అప్పుడు బుద్ధిహీనులు ఒక పాఠం నేర్చుకొంటారు. జ్ఞానముగల మనిషి విమర్శించ బడినప్పుడు నేర్చుకొంటాడు.

26ఒక వ్యక్తి తన తండ్రి దగ్గర దొంగతనం చేసి తన తల్లిని బలవంతంగా వెళ్లగొడితే, అతడు చాలా దుర్మార్గుడు. అతడు తనకు తానే సిగ్గు, అవమానం తెచ్చుకొంటాడు.

27నేర్చుకొనేందుకు నీవు నిరాకరిస్తే, అప్పటికే నీకు తెలిసిన విషయాలను త్వరలోనే నీవు మరచిపోతావు.

28సాక్షి నమ్మకంగా లేకపోతే అప్పుడు తీర్పు న్యాయంగా ఉండదు. దుర్మార్గులు చెప్పే విషయాలు మరింత దుర్మార్గం తెచ్చి పెడతాయి.

29ఇతరులకంటే తానే మంచి వాడిని అనుకొనే మనిషి శిక్షించబడతాడు. బుద్ధిహీనుడు తనకోసం దాచ బడిన శిక్షను పొందుతాడు.

20 ద్రాక్షారసం నిన్ను ధైర్యవంతునిగా చేస్తుంది. మద్యము కొట్లాటలు పుట్టిస్తుంది. విపరీతమైన తాగుబోతు బుద్ధిహీనుడు.

2ఒక రాజు కోపం సింహగర్జనలా ఉంటుంది. నీవు రాజుకు కోపం పుట్టిస్తే నీ ప్రాణం పోగొట్టుకుంటావు.

3ఏ బుద్ధిహీనుడైనా ఒక వివాదం మొదలు పెట్టగలడు. కనుక వివాదాలకు దూరంగా ఉండే మనిషిని గౌరవించాల్సిందే.

4సోమరి మనిషికి విత్తనాలు చల్లటానికి కూడా బద్ధకమే. అందుచేత కోత సమయంలో అతడు భోజనం కోసం చూస్తాడు, కాని ఏమీ దొరకదు.

5ఒక మనిషి ఆలోచనలను నీవు చూడలేవు. అవి లోతైన నీళ్లలాంటివి. అయితే జ్ఞానముగలవాడు, ఒకరు ఏమి తలస్తున్నారో గ్రహించగలడు.

6చాలామంది మనుష్యులు నమ్మకంగా ఉన్నామని, నిండు ప్రేమతో ఉన్నామని చెబుతారు. కాని నిజంగా అలా ఉన్నవారిని కనుగొనడం చాలా కష్టం.

7ఒక మంచి మనిషి మంచి జీవితం జీవిస్తాడు. మరియు అతని పిల్లలు ఆశీర్వదించబడతారు.

8రాజు కూర్చొని ప్రజలకు తీర్పు చెప్పేటప్పుడు దుర్మార్గాన్ని ఆయన స్వంత కళ్లతో చూడగలడు.

9ఒక మనిషి ఎల్లప్పుడూ శ్రేష్ఠమైన దానినే చేస్తానని నిజంగా చెప్పగలడా? తనలో పాపం లేదని ఎవరైనా నిజంగా చెప్పగలరా? లేదు!

10అన్యాయపు తూనిక రాళ్లు, కొలతలు ఉపయోగించి ఇతరులను మోసం చేసే వాళ్లంటే యెహోవాకు అసహ్యం.

11ఒక బిడ్డ తాను చేసే పనుల మూలంగా తన మంచి లేక చెడు చూపిస్తుంది. ఆ బిడ్డను నీవు గమనించి నిజాయితీ, మంచితనం ఆ బిడ్డకు ఉన్నాయో లేదో నీవు తెలిసికోవచ్చు.

12మనకు చూసేందుకు కళ్లు, వినేందుకు చెవులు ఉన్నాయి. వాటిని మన కోసం యెహోవా చేశాడు!

13నీవు నిద్రను ప్రేమిస్తే, నీవు నిరుపేదవు అవుతావు. పనిచేసేందుకు నీ సమయాన్ని ఉపయోగించు. అప్పుడు నీకు తినేందుకు సమృద్ధిగా ఉంటుంది.

14నీవద్ద ఏదైనా కొనే మనిషి, "బాగుండలేదు! చాలా ఖరీదు ఉంది!" అని చెబుతాడు. తరువాత అతడు

వెళ్లిపోయి, తాను ఒక మంచి వ్యవహారం చేసినట్టుగా ఇతరులతో చెప్పుకొంటాడు.

15జ్ఞానముగల విషయాలు చెప్పటం బంగారం కంటే, ముత్యాలకంటే చాలా ఎక్కువ విలువగలది.

16మరో మనిషి అప్పులకు నీవు బాధ్యత వహిస్తే నీవు నీ చొక్కా పోగొట్టుకొంటావు.

17దగాచేసి సంపాదించిన ఆహారము ఒక మనుష్యునికి తీపిగా వుంటుంది. కాని తర్వాత అతని నోరు మట్టితో నిండుతుంది. మోసం చేసి నీవు ఏదైనా సంపాదిస్తే అది మంచిదానిలా కనబడవచ్చు. కాని చివరికి దాని విలువ శూన్యం.

18నీవు పథకాలు వేయకముందు మంచి సలహా తీసికో. నీవు గనుక ఒక యుద్ధం ప్రారంభిస్తూంటే నిన్ను నడిపించేందుకు మంచి మనుష్యులను చూసుకో.

19ఇతరులను గూర్చి చెప్పుడు మాటలు చెప్పే మనిషి నమ్మదగిన వాడు కాడు. కనుక అధిక ప్రసంగం చేసే మనిషితో స్నేహంగా ఉండవద్దు.

20ఒక వ్యక్తి తన తల్లికిగాని తండ్రికిగాని విరోధముగా మాట్లాడితే, అప్పుడు ఆ వ్యక్తి చీకటిగా మారిపోతున్న వెలుగులా ఉంటాడు.

21నీ ఐశ్వర్యాన్ని నీవు తేలికగా సంపాదించి ఉంటే, అది నీకు ఎక్కువ విలువగలది కాదు.

22ఎవరైనా నీకు విరోధంగా ఏదైనా చేస్తే, నీ అంతట నీవే అతన్ని శిక్షించటానికి ప్రయత్నించకు. యెహోవా కోసం వేచి ఉండు. అంతంలో ఆయన నీకే విజయం ఇస్తాడు.

23అన్యాయపు త్రాసులు, తూనికలు ఉపయోగించి ఇతరులను మోసం చేసేవాళ్లంటే యెహోవాకు అసహ్యం. అవి ఆయన్ని సంతోషపరచవు.

24ప్రతి మనిషికీ ఏమి జరుగుతుంది అనే విషయం నిర్ణయించేది యెహోవా, అలాంటప్పుడు ఎవరైనా సరే వారి జీవితంలో ఏమి జరుగుతుందో ఎలా గ్రహించ గలరు?

25దేవునికి నీవు ఏదైనా ఇస్తానని వాగ్దానం చేయక ముందే జాగ్రత్తగా ఆలోచించుకో. తర్వాత అలాంటి వాగ్దానం చేసి ఉండకపోతే మంచిది అనిపించవచ్చు.

26ఏ మనుష్యులు దుర్మార్గులో జ్ఞానముగల రాజు నిర్ణయిస్తాడు. మరియు ఆ ప్రజలను ఆ రాజు శిక్షిస్తాడు.

27ఒక మనిషి అంతరంగంలో ఉండే విషయాలు తెలిసికొనే సమర్థుడు యెహోవా.

28ఒక రాజు న్యాయంగా, నిజాయితీగా ఉంటే, అతడు తన అధికారాన్ని ఉంచుకోగలుగుతాడు. ప్రజలు అతన్ని ప్రేమిస్తే, అతడు తన పరిపాలన కొనసాగిస్తాడు.

29ఒక యువకుని బలాన్ని బట్టి మనం అతణ్ణి మెచ్చుకొంటాం. కానీ నెరసిన తలను చూచి ఒక వృద్ధుని మనం గౌరవిస్తాం అతడు పూర్ణ జీవితం జీవించినట్టు అది సూచిస్తుంది.

30మనం శిక్షించబడితే, మనం తప్పు చేయటం మానివేస్తాం. నొప్పి ఒక మనిషిని మార్చగలదు.

21 (రైతులు తమ పొలాలకు నీళ్లు పెట్టటానికి చిన్న చిన్న కాలువలు తవ్వుతారు. ఒక కాలువను మూసి ఇంకొక కాలువకు నీళ్లు మళ్లిస్తారు) నీరు ప్రవహించు కాలువలాగ రాజు హృదయము యెహోవా చేతిలో వున్నది. ఆయన తన ఇష్టము వచ్చిన వైపుకు తిప్పుతాడు.

2ఒక మనిషి తాను చేసేది అంతా సరైనదే అనుకొంటాడు. అయితే మనుష్యులు చేసే వాటికి అసలైన కారణాలను యెహోవా చెబుతాడు.

3సరైనవి, న్యాయమైనవి చేయుము. బలులకంటె వాటిని యెహోవా ఎక్కువ ప్రేమిస్తాడు.

4ఇతరులు పనికిమాలిన వాళ్లు అన్నట్టు కళ్లతోను, హృదయ నేత్రాలతోను చూచేవారు పాపులు. ఇతరుల కంటె మేము మంచివాళ్లం అని నమ్మే హృదయం పాప భూయిష్టం.

5జాగ్రత్తగల ఏర్పాటులు లాభం తెచ్చిపెడ్తాయి. కానీ నీవు జాగ్రత్త లేకుండా, మరీ తొందరపడి పనులు చేస్తే, నీవు దరిద్రుడివి అవుతావు.

6ఐశ్వర్యవంతుడివి కావాలని నీవు మోసం చేస్తే, నీ ఐశ్వర్యం త్వరలోనే పోతుంది. మరియు నీ ఐశ్వర్యాలు నీ మరణానికి దారి తీస్తాయి.

7దుర్మార్గులు చేసే దుష్ట కార్యాలు వారినే నాశనం చేస్తాయి. సరైనది చేయటానికి వారు నిరాకరిస్తారు.

8దుర్మార్గులు ఎల్లప్పుడూ ఇతరులను మోసం చేయాలని ప్రయత్నిస్తారు. కానీ మంచి వాళ్లు నిజాయితీగా న్యాయంగా ఉంటారు.

9వివాదం పెట్టాలని కోరుకునే భార్యతో కలసి ఒక ఇంటిలో ఉండటం కంటే, ఇంటి కప్పు మీద నివసించటం మేలు.

10దుర్మార్గులు ఎల్లప్పుడూ ఇంకా ఎక్కువ దుర్మార్గం చేయాలని కోరుతూంటారు. ఆ మనుష్యులు వారి చుట్టూరా ఉండే వారి మీద ఎలాంటి దయ చూపించరు.

11ఒక వ్యక్తి ఇతరులకంటే తానే మంచివాడిని అని తలచినప్పటికీ, అతడు శిక్షించబడితే ప్రతి ఒక్కరూ ఒక పాఠం నేర్చుకొంటాడు. జరిగే సంగతుల మూలంగా జ్ఞానముగలవాడు ఎల్లప్పుడూ నేర్చుకొంటాడు. ఆ వ్యక్తి ఇంకా, ఇంకా ఎక్కువ తెలివి సంపాదిస్తాడు.

12దేవుడు మంచివాడు. దేవునికి దుర్మార్గులు ఎవరో తెలుసు, ఆయన వారిని శిక్షిస్తాడు.

13పేద ప్రజలకు సహాయం చేసేందుకు ఒక వ్యక్తి తృణీకరిస్తే తర్వాత అతనికి అవసరమైనప్పుడు ఏ సహాయమూ దొరకదు.

14ఒక వ్యక్తికి నీ మీద కోపం ఉంటే అతనికి రహస్యంగా ఒక కానుక ఇవ్వు. రహస్యంగా ఇచ్చిన కానుక గొప్ప కోపాన్ని వారించగలదు.

15న్యాయమైన తీర్పు మంచి మనుష్యులను సంతో
షింపజేస్తుంది. కాని దుర్మార్గులను అది భయపెడు
తుంది.
16ఒక మనిషి జ్ఞానమార్గాన్ని విసర్జిస్తే అతడు
నాశనానికే పోతున్నాడు.
17ఒక మనిషికి సరదా మాత్రమే అతి ముఖ్యం
అయితే ఆ మనిషి దరిద్రుడు అవుతాడు. ఒకవేళ
అతడు ద్రాక్షారస, భోజన ప్రియుడు అయితే అతడు
ఎన్నటికీ ధనికుడు కాలేడు.
18మంచి మనుష్యులకు దుర్మార్గులు చేసే దుర్మా
ర్గపు పనులన్నిటికీ తగిన శిక్ష అనుభవించాల్సి
ఉంటుంది. నిజాయితీ లేని మనుష్యులు నిజాయితీగల
వాళ్లకు చేసే వాటన్నింటికీ శిక్ష చెల్లించాల్సి ఉంటుంది.
19వివాదం అంటే మక్కువ పడే కోపిష్టి భార్యతో
ఉండటంకంటే ఎడారిలో నివసించటం మేలు.
20జ్ఞానము గలవాడు తనకు అవసరమైన వాటిని
భద్రం చేసికొంటాడు. కాని తెలివి తక్కువవాడు దొరి
కిన దాన్ని దొరికినంత త్వరగానే వాడేస్తాడు.
21ఎల్లప్పుడూ ప్రేమ, దయ చూపించాలని ప్రయ
త్నించే మనిషి మంచి జీవితం, ఐశ్వర్యం, ఘనత
కలిగి ఉంటాడు.
22జ్ఞానముగలవాడు దాదాపు ఏదైనా చేయగలడు.
బలంగల మనుష్యులు కాపలా కాస్తున్న పట్టణంపై
అతడు దాడి చేయగలడు. వారిని కాపాడుతాయని
నమ్ముకొన్న గోడలను అతడు నాశనం చేయగలడు.
23ఒక మనిషి అతడు చెప్పే విషయాలలో జాగ్రత్తగా
ఉంటే అతడు కష్టం నుండి తనను తాను తప్పించు
కోగలడు.
24ఇతరులకంటే తానే మంచివాడిని అనుకొనే వాడు
గర్విష్ఠి. తాను చేసే పనుల ద్వారా అతడు తను
దుర్మార్గుడని చూపిస్తాడు.
25-26సోమరి తను ఇంకా ఇంకా కావాలని కోరి
నప్పుడు తనను తానే నాశనం చేసికొంటాడు. అతడు
వాటికోసం పనిచేసేందుకు నిరాకరిస్తాడు గనుక, తనను
తానే నాశనం చేసికొంటాడు. కాని మంచి మనిషికి
పుష్కలంగా ఉంటుంది గనుక అతడు యివ్వగలడు.
27దుర్మార్గులు బలులు అర్పించినప్పుడు,
ముఖ్యంగా ఆ దుర్మార్గులు యెహోవా దగ్గర నుండి
ఏదైనా సంపాదించాలని ప్రయత్నించినప్పుడు ఆయన
సంతోషించడు.
28అబద్ధాలు చెప్పేవాడు నాశనం చేయబడతాడు.
అయితే ఆ అబద్దాలు వినే వ్యక్తి అతనితో పాటు
నాశనం చేయబడతాడు.
29మంచివాడు తాను చేస్తు న్నది సరైనది అని
ఎల్లప్పుడూ తెలిసే ఉంటాడు. కాని దుర్మార్గుడు
నటించాల్సి ఉంటుంది.
30ఒక పథకానికి యెహోవా విరోధంగా ఉంటే
దానిని విజయవంతం చేయగలిగినంత జ్ఞానముగల
వాడు ఎవడూ లేడు.
31మనుష్యులు గుర్రాలను, సమస్తాన్ని యుద్ధం
కోసం సిద్ధం చేయవచ్చు, కాని యెహోవా వారికి
విజయం ఇస్తేనే తప్ప వారు జయించలేరు.

22 ఐశ్వర్యవంతునిగా ఉండుటకంటే గౌరవింపబ
డటం మేలు. బంగారం, వెండి కంటే మంచి
పేరు ఎక్కువ ముఖ్యం.
2ధనికులు, దరిద్రులు అంతా ఒక్కటే. వాళ్లందంనీ
యెహోవాయే సృష్టించాడు. 3జ్ఞానముగలవారు కష్టం
రావటం చూచి దాని దారిలో నుండి తప్పుకొంటారు.
కానీ తెలివి తక్కువ వాళ్లు తిన్నగా కష్టంలోనికి వెళ్లి,
దాని మూలంగా శ్రమపడతారు.
4యెహోవాను గౌరవించి దీనుడవుగా ఉండు.
అప్పుడు నీకు ఐశ్వర్యం, ఘనత నిజజీవం ఉంటాయి.
5దుర్మార్గులు అనేక కష్టాలవల్ల పట్టుబడతారు.
అయితే తన ఆత్మ విషయం జాగ్రత్త గలవాడు కష్టాలకు
దూరంగా ఉంటాడు.
6ఒక బిడ్డ చిన్నగా ఉన్నప్పుడే, జీవించుటకు సరైన
మార్గం నేర్పించు. అప్పుడు ఆ బిడ్డ పెద్దవాడైనప్పుడు
కూడ ఆ మార్గంలోనే జీవించటానికి కొనసాగిస్తాడు.
7పేదవాళ్లు ధనికులకు సేవకులు. అప్పు పుచ్చు
కొనేవాడు, అప్పు ఇచ్చేవానికి సేవకుడు.
8కష్టాలను విస్తరించే మనిషి కష్టాల పంటనే కోస్తాడు.
ఆ మనిషి ఇతరులకు కలిగించిన కష్టాల మూలంగా
చివరికి అతడు నాశనం చేయబడతాడు.
9ధారాళంగా ఇచ్చేవాడు ఆశీర్వదించబడతాడు.
అతడు తన ఆహారం పేదవారితో పంచుకొంటాడు.
గనుక ఆశీర్వదించబడుతాడు.
10ఒక వ్యక్తి యితరులకంటె తానే మంచివాడిని
అని తలిస్తే, వానిని బలవంతంగా వెళ్లగొట్టండి. అతడు
వెళ్లి పోయినప్పుడు అతనితోబాటు ఆ కష్టం కూడా
వెళ్లిపోతుంది. అంతటితో వివాదాలు అంతరిస్తాయి.
11పవిత్ర హృదయం, దయగల మాటలను నీవు
ప్రేమిస్తే రాజు నీ స్నేహితుడు అవుతాడు.
12యెహోవాను ఎరిగిన మనుష్యులను ఆయన
కాపాడుతూ, భద్రంగా ఉంచుతాడు. కానీ ఆయనకు
విరోధంగా ఉండే వారిని ఆయన నాశనం చేస్తాడు.
13“నేను ఇప్పుడు పనికి వెళ్లలేను. బయట సింహం
ఉంది. అది నన్ను చంపేస్తుందేమో” అంటాడు సోమరి
వాడు.
14వ్యభిచార పాపం ఒక లోతైన గొయ్యి లాంటిది.
ఆ గొయ్యిలో పడే మనిషి అంటే యెహోవాకు
చాలా కోపం వస్తుంది.
15పిల్లలు తెలివి తక్కువ పనులు చేస్తారు. కానీ
నీవు వారిని శిక్షిస్తే, వారు అలాంటి పనులు చేయకుండా
ఉండటం నేర్చుకొంటారు.

16నిన్ను నీవే ధనికుణ్ణి చేసుకొనేందుకుగాను, పేదవాళ్లను బాధించటం, ధనికులకు కానుకలు ఇవ్వటం ఇవి రెండూ నిన్ను దరిద్రునిగాచేస్తాయి.

### ముప్పయి జ్ఞాన సూక్తులు

17నేను చెప్పే మాటలు విను. జ్ఞానులు చెప్పిన మాటలు నేను నీకు నేర్పిస్తాను. ఈ ఉపదేశాల ద్వారా నేర్చుకో. 18వీటిని నీవు జ్ఞాపకం ఉంచుకోవటం నీకు మంచిది. ఒకవేళ నీ పెదవులు ఒప్పుకొనేందుకు అలవాటు పడితే అది నీకు సహాయంగా ఉంటుంది. 19ఈ విషయాలు ఇప్పుడు నీకు నేను నేర్పిస్తాను. నీవు యెహోవాను నమ్ముకోవాలని నేను కోరుతున్నాను. 20నీ కోసం నేను ముప్పయి సూక్తులు వ్రాశాను. ఇవి సలహాలు, జ్ఞానముగల మాటలూను. 21ఈ మాటలు సత్యమైన ముఖ్య విషయాలను నీకు నేర్పిస్తాయి. అప్పుడు నిన్ను పంపిన వానికి నీవు మంచి జవాబులు ఇవ్వగలవు.

*-1-*

22పేదవారివద్ద నుండి దొంగిలించటం సులభం. కానీ అలా చేయవద్దు. న్యాయస్థానంలో పేదవాణ్ణి అణగ తొక్కవద్దు. 23యెహోవా వారి పక్షంగా ఉన్నాడు. ఆయన వారిని బలపరుస్తాడు, వారివద్ద నుండి తీసి కొన్నవి ఎవరినైనా సరే వారి వస్తువులను ఆయన తీసివేస్తాడు.

*-2-*

24త్వరగా కోపపడే వానితో స్నేహంగా ఉండవద్దు. త్వరగా వెర్రి ఎక్కేవానికి దగ్గరగా పోవద్దు. 25నీవు వెళ్తే, నీవు కూడ అతనిలా ఉండటం నేర్చుకొంటావేమో! అలా అయితే అతనికి ఉన్న చిక్కులే నీకూ ఉంటాయి.

*-3-*

26మరో వ్యక్తి అప్పులకు నీదే బాధ్యత అని ప్రమాణం చేయవద్దు. 27అతని అప్పు నీవు తీర్చలేక పోతే, అప్పుడు నీకు ఉన్నవన్నీ నీవు పోగొట్టు కొంటావు. నీవు పండుకొనే నీ పడకను నీవు ఎందుకు పోగొట్టుకోవాలి?

*-4-*

28నీ పూర్వీకులు ఎప్పుడో గుర్తించిన ఆస్తి సరిహద్దు గీతను ఎప్పుడూ జరిపివేయవద్దు.

*-5-*

29ఒక వ్యక్తి తన పనిలో నిపుణతగలవాడై ఉంటే, అతడు రాజుల సేవ చేయటానికి అర్హుడవుతాడు. ప్రముఖులు కాని వారి వద్ద అతడు పని చేయాల్సిన అవసరం ఉండదు.

*-6-*

23 నీవు ఒక ప్రముఖునితో భోజనానికి కూర్చున్నప్పుడు, నీవు ఎవరితో ఉన్నావో జ్ఞాపకం ఉంచుకో. 2నీకు చాలా ఆకలిగా ఉన్నాసరే, ఎప్పుడూ మరీ ఎక్కువ తినవద్దు. 3అతడు వడ్డించే శ్రేష్ఠమైన భోజనం మరీ ఎక్కువ తినవద్దు. అది ఒక ఎత్తు కావచ్చు.

*-7-*

4ధనవంతుడు కావాలనుకొని, నీ ఆరోగ్యాన్ని పాడు చేసుకోకు. నీవు బుద్ధిమంతుడవైతే ఓర్పుతో ఉండు. 5పక్షులు రెక్కలెలా విచ్చుకొని ఎగురుతాయో అదే విధంగా డబ్బు చాలా తొందరగా వెళ్లిపోతుంది.

*-8-*

6స్వార్థపరునితో కలిసి భోజనం చేయవద్దు. అతనికి వచ్చిన ప్రత్యేక భోజన పదార్థాలకు దూరంగా ఉండు. 7అతడు ఎంతసేపూ ఖర్చు గూర్చి ఆలోచించే రకం. "తినుము, తాగుము" అని అతడు నీతో చెప్పవచ్చు. కాని అతడు నిజంగా కోరుకునేది అదికాదు. 8అతని భోజనం నీవు తింటే, నీవు రోగివి కావచ్చు. నీవు యిబ్బంది పడిపోతావు.

*-9-*

9తెలివి తక్కువ వానికి నేర్పించేందుకు ప్రయత్నించకు. జ్ఞానముగల నీ మాటలను అతడు ఎగతాళి చేస్తాడు.

*-10-*

10ఆస్తి పాత సరిహద్దు గీతను ఎన్నడూ జరపవద్దు. మరియు అనాథలకు చెందిన భూమిని ఎన్నడూ తీసికొనవద్దు. 11యెహోవా నీకు విరోధంగా ఉంటాడు. యెహోవా శక్తిగలవాడు, అనాథలను ఆయన కాపాడుతాడు.

*-11-*

12నీ ఉపదేశకుని మాటలు విని నీకు చేతనైనంత నేర్చుకో.

*-12-*

13ఒక బిడ్డకు శిక్ష అవసరమైనప్పుడెల్లా శిక్షించు. వానిని దెబ్బలు కొట్టడం వానికేమీ బాధ కలిగించదు. 14నీవు వానిని కొట్టినట్లయితే నీవు వాని జీవితం కాపాడవచ్చు.

*-13-*

[15]నా కుమారుడా, నీవు జ్ఞానముగల వాడివైతే
నాకెంతో సంతోషం. [16]నీవు సరైన సంగతులు
చెబుతూ ఉంటే నేను విని నా హృదయంలో ఎంతో
సంతోషిస్తాను.

*-14-*

[17]దుర్మార్గులను చూచి అసూయపడకు. అయితే
యెహోవాను గౌరవించేందుకు ఎల్లప్పుడూ నీవల్ల
అయినంత గట్టిగా ప్రయత్నించు. [18]ఎల్లప్పుడూ ఆశ
ఉంటుంది. ఆ ఆశ ఎన్నటికీ పోదు.

*-15-*

[19]కనుక నా కుమారుడా ఆలకించి, జ్ఞానముగల
వానిగా ఉండు. సరైన జీవితం జీవించేందుకు ఎల్ల
ప్పుడూ జాగ్రత్త కలిగి ఉండు. [20]ద్రాక్షారసం విపరీతంగా
తాగుతూ, విపరీతంగా భోజనం చేసే వారితో స్నేహంగా
ఉండవద్దు. [21]విపరీతంగా తాగి, విపరీతంగా తినే మను
ష్యులు దరిద్రులు అవుతారు. తిని, తాగి నిద్రపోవటమే
వాళ్లు చేసేది అంతాను. కనుక త్వరలోనే వారికి ఏమీ
ఉండదు.

*-16-*

[22]నీ తండ్రి నీతో చెప్పే విషయాలు విను. నీ
తండ్రి లేకుండా నీవు ఎన్నడూ పుట్టి ఉండేవాడివి
కావు. నీ తల్లి వృద్ధురాలైనప్పుడు కూడా ఆమెను గౌర
వించు. [23]సత్యము, జ్ఞానము, అభ్యాసము, వివేకము,
ఇవి డబ్బు చెల్లించదగినంత విలువగలవి. అవి అమ్మేం
దుకు మరీ విపరీతమైన విలువగలవి. [24]ఒక మంచి
మనిషి యొక్క తండ్రి చాలా సంతోషంగా ఉంటాడు.
ఒక మనిషికి జ్ఞానముగల బిడ్డ ఉంటే, ఆ బిడ్డ ఆనందం
కలిగిస్తుంది. [25]అందుచేత నీ విషయంలో నీ తల్లిదండ్రు
లను సంతోషించనివ్వు. నీ తల్లిని ఆనందించనిమ్ము.

*-17-*

[26]నా కుమారుడా, నేను చెప్పే దానిని జాగ్రత్తగా
వినుము. నా జీవితం నీకు మాదిరిగా ఉంచుకో.
[27]వేశ్యలు, చెడు స్త్రీలు ఒక ఉచ్చులాంటివారు. నీవు
బయట పడలేనంత లోతైన బావిలాంటివారు. [28]ఒక
చెడు స్త్రీ ఒక దొంగలా నీ కోసం పొంచి ఉంటుంది.
అనేక మందిని పాపులు అయ్యేటట్టుగా ఆమె చేస్తుంది.

*-18-*

[29-30]ద్రాక్షారసం, ఘాటు పానీయాలు విపరీతంగా
తాగే మనుష్యులకు అవి చాలా చెడు అవుతాయి. ఆ
మనుష్యులకు చాలా కొట్లాటలు, వివాదాలు ఉంటాయి.
వారి కళ్లు ఎర్రగా ఉండి వారు తూలిపోతూ, వాళ్లను
వాళ్లే బాధపెట్టుకుంటారు. వారు ఈ కష్టాలను తప్పించు
కొని ఉండగలిగేవారే.
[31]అందుచేత ద్రాక్షారసం విషయం జాగ్రత్తగా
ఉండు. అది అందంగా, ఎర్రగా ఉంటుంది. పాత్రలో
అది మెరుస్తుంది. నీవు దానిని తాగినప్పుడు బాగున్నట్టు
అనిపిస్తుంది. [32]కాని అంతలో అది ఒక సర్పంలా కాటు
వేస్తుంది,
[33]ద్రాక్షారసం నీవు వింత విషయాలను చూచే
టట్టుగా చేస్తుంది. నీ మనస్సు గందరగోళం అవుతుంది.
[34]నీవు పండుకొన్నప్పుడు నీవు ఉప్పొంగుతున్న
సముద్రంమీద ఉన్నట్టుగా నీవు అనుకొంటావు. నీవు
ఒక ఓడమీద పండుకొన్నట్టుగా నీకు అనిపిస్తుంది.
[35]"వారు నన్ను కొట్టారు. కానీ నాకేమీ అనిపించలేదు.
వారు నన్ను కొట్టారు. కాని అది నాకు జ్ఞాపకం లేదు.
ఇప్పుడు నేను లేవలేను. నేను మరోసారి తాగాలి"
అని నీవు చెబుతావు.

*-19-*

24 దుర్మార్గులను చూచి అసూయపడవద్దు.
వారితో వుండేందుకు నీ సమయం వ్యర్థం
చేసుకోకు. [2]కీడు చేయాలని వారు వారి హృదయాల్లో
పథకం వేస్తారు. వారు మాట్లాడేది అంతా కష్టం
కలిగించాలని మాత్రమే.

*-20-*

[3]మంచి గృహాలు జ్ఞానము, వివేకము మీద కట్టబడ
తాయి. [4]జ్ఞానంవల్ల గదులు అన్నీ ప్రశస్తమైన మరియు
సంతోషకరమైన సంపదలతో నింప బడతాయి.

*-21-*

[5]జ్ఞానము ఒక మనిషిని శక్తివంతం చేస్తుంది. తెలివి
ఒక మనిషికి బలం ఇస్తుంది. [6]నీవు యుద్ధం ప్రారంభిం
చక ముందు జాగ్రత్తగా పథకాలు వేయాలి. నీవు
విజయం కావాలి అని అనుకొంటే నీకు మంచి సలహా
దారులు చాలా మంది ఉండాలి.

*-22-*

[7]బుద్ధిహీనులు జ్ఞానమును గ్రహించలేరు. మను
ష్యులు ముఖ్యమైన విషయాలను చర్చిస్తున్నప్పుడు
బుద్ధిహీనులు ఏమీ చెప్పలేరు.

*-23-*

[8]నీవు కష్టాలు కలిగించాలని ఎల్లప్పుడూ తలు
స్తూంటే, నీవు కష్టాలు పెట్టే మనిషివి అని ప్రజలు
తెలుసుకొంటారు. మరియు వారు నీ మాట వినరు.

9బుద్ధిహీనుడు చేయాలని తలపెట్టే విషయాలు పాపం.
ఇతరుల కంటే తానే మంచి వాడిని అనుకొనే మనిషిని
ప్రజలు అసహ్యించుకొంటారు.

### - 24-

10కష్ట సమయాలలో నీవు బలహీనంగా ఉంటే
అప్పుడు నీవు నిజంగా బలహీనుడివే.

### -25-

11మనుష్యులు ఒక వ్యక్తిని చంపాలని ప్రయత్ని
స్తూంటే నీవు వానిని రక్షించుటకు ప్రయత్నించాలి.
12"ఇది నా పని కాదు" అని నీవు చెప్పకూడదు.
యెహోవాకు అంతా తెలుసు. నీవు వాటిని ఎందుకు
చేస్తావో ఆయనకు తెలుసు. యెహోవా నిన్ను గమ
నిస్తూ ఉంటాడు. ఆయనకు తెలుసు. నీవు చేసే
పనులకు యెహోవా నీకు బహుమానం ఇస్తాడు.

### -26-

13నా కుమారుడా, తేనె తాగు. అది మంచిది.
తేనెపట్టులోని తేనె తియ్యగా ఉంటుంది. 14అదే విధంగా
జ్ఞానము నీ ఆత్మకు మంచిది. నీకు జ్ఞానము ఉంటే,
అప్పుడు నీకు ఆశ ఉంటుంది. నీ ఆశకు అంతం
ఉండదు.

### -27-

15మంచిమనిషి దగ్గర దొంగతనం చేయాలని లేక
వాని ఇల్లు తీసివేసుకోవాలని కోరుకొనే దొంగలా ఉండ
వద్దు. 16ఒక మంచి వాడు ఏడుసార్లు పడిపోయినా
సరే, అతడు ఎల్లప్పుడూ మరల నిలబడతాడు. కానీ
దుర్మార్గులు ఎల్లప్పుడూ కష్టంచేత ఓడించబడతారు.

### -28-

17నీ శత్రువుకు కష్టాలు వచ్చినప్పుడు సంతోష
పడకు. అతడు పడిపోయినప్పుడు సంతోషపడకు.
18నీవు అలా చేస్తే, అది యెహోవా చూస్తాడు. నీ
విషయంలో యెహోవా సంతోషించడు. అప్పుడు
యెహోవా ఒకవేళ నీ శత్రువుకు సహాయం చేయ
వచ్చు.

### -29-

19దుర్మార్గులను నీకు చింత కలిగించనీయకు.
దుర్మార్గుల విషయమై అసూయపడకు. 20ఆ దుర్మార్గు
లకు ఆశ లేదు. వారి వెలుగు చీకటి అవుతుంది.

### -30-

21నా కుమారుడా, యెహోవాను మరియు రాజును
గౌరవించు. వారికి విరోధంగా ఉండేవారితో చేరవద్దు.
22ఎందుకంటే, అలాంటి వాళ్లు త్వరగా నాశనం చేయ
బడవచ్చు. దేవుడు, రాజుకూడ వారి శత్రువులకు ఎంత
కష్టం కలిగించగలరో నీకు తెలియదు.

### మరిన్ని జ్ఞాన సూక్తులు

23ఇవి జ్ఞానుల మాటలు:
ఒక న్యాయమూర్తి న్యాయంగా ఉండాలి. ఒకడు
తనకు తెలిసినవాడైనంత మాత్రాన ఆయన అతనిని
బలపరచకూడదు.
24ఒక నేరస్థుడు స్వేచ్ఛగా వెళ్లిపోవచ్చని గనుక
న్యాయమూర్తి చెబితే, అప్పుడు ప్రజలు అతనికి
విరోధంగా ఉంటారు. అతని గూర్చి దేశాలే చెడుగా
చెప్పుకుంటాయి. 25అయితే ఒక న్యాయమూర్తి ఒక
నేరస్తుని శిక్షిస్తే, అప్పుడు ప్రజలంతా అతనితో కలిసి
ఆనందిస్తారు.
26నిజాయితీగల జవాబు ప్రజలందరికీ సంతోషం
కలిగిస్తుంది అది పెదాలమీద ముద్దు పెట్టుకున్నట్టు
ఉంటుంది.
27నీ పొలంలో నాట్లు వేయక ముందు నీ ఇల్లు
కట్టుకోవద్దు. నీవు నివసించేందుకు ఒక గృహం కట్టు
కొనకముందే, నీవు ఆహారం పండించటానికి సిద్ధంగా
ఉన్నట్టు గట్టిగా తెలుసుకో.
28గట్టి కారణం లేకుండా ఎవరికీ విరోధంగా
మాట్లాడవద్దు. మరియు అబద్ధాలు మాట్లాడకు.
29"అతడు నాకు హాని చేశాడు, గనుక నేను అతనికి
అలానే చేస్తాను. అతడు నాకు చేసిన వాటిని బట్టి
నేను అతణ్ణి శిక్షిస్తాను" అని చెప్పవద్దు.
30ఒక సోమరివాని పొలం పక్కగానే నేను నడిచాను.
జ్ఞానములేని ఒక మనిషి ద్రాక్షాతోట పక్కగా నేను నడి
చాను. 31ఆ పొలాల నిండా కలుపు మొక్కలు పెరుగు
తున్నాయి. నేలమీద పనికిమాలిన మొక్కలు పెరుగు
తున్నాయి. పొలాల చుట్టూ గోడ విరిగిపోయి పడి
పోతుంది. 32నేను అది చూచి, దాని గూర్చి ఆలోచిం
చాను. అప్పుడు ఈ విషయాల నుండి నేను ఒక
పాఠం నేర్చుకున్నాను. 33కొంచెం నిద్ర, కొంచెం
విశ్రాంతి, నీ చేతులు ముడుచుకొని, ఒక నిద్ర
తియ్యటం. 34ఈ విషయాలు నిన్ను త్వరగా దరిద్రుని
చేస్తాయి. నీకు ఏమీ ఉండదు. ఒక దొంగ అకస్మాత్తుగా
వచ్చి అంతా దోచుకొని పోయినట్టుగా అది ఉంటుంది.

### సొలొమోను చెప్పిన మరికొన్ని జ్ఞానసూక్తులు

25 ఇవి సొలొమోను చెప్పిన మరికొన్ని జ్ఞాన
సూక్తులు: యూదా రాజు హిజ్కియా సేవ
కులు నకలు చేసిన మాటలు ఇవి:
2మనం తెలిసికోగూడదని దేవుడు కోరే విషయా
లను దాచిపెట్టేందుకు ఆయనకు అధికారం ఉంది.

కాని ఒక రాజు విషయమును పరిశోధించుట మూలం
గానే ఘనపర్చబడతాడు.
3ఆకాశం మనకు పైన చాలా ఎత్తుగాను, భూమి
మన కింద చాలా లోతువరకును ఉన్నాయి. రాజుల
మనస్సులు కూడ అదే విధంగా ఉంటాయి. మనం
వాటిని గ్రహించలేం.
4వెండి నుండి పనికిమాలిన పదార్థాలను నీవు
తీసివేసినట్లయితే అప్పుడు పనివాడు దానితో అంద
మైన వస్తువులు చేయగలడు. 5అదే విధంగా ఒక రాజు
సమక్షం నుండి దుర్మార్గపు సలహాదారులను నీవు తొల
గించి వేస్తే అప్పుడు మంచితనం అతని రాజ్యాన్ని
బలమైనదిగా చేస్తుంది.
6ఒక రాజు ఎదుట నిన్ను గూర్చి నీవు అతిశ
యించవద్దు. నీవు చాలా ప్రఖ్యాత వ్యక్తివి అని చెప్పు
కోవద్దు.
7రాజుగారే నిన్ను ఆహ్వానించటం చాలా మంచిది.
కాని నిన్ను నీవే ఆహ్వానించుకొంటే అప్పుడు నీవు
ఇతరుల ఎదుట ఇబ్బంది పడవచ్చును.
8నీవు చూచిన దానిని గూర్చి న్యాయమూర్తికి
చెప్పుటకు త్వరపడవద్దు. నీవు చెప్పింది తప్పు అని
మరో వ్యక్తి గనుక చెబితే అప్పుడు నీవు ఇబ్బంది
పడాల్సి వస్తుంది.
9నీవూ మరో వ్యక్తీ ఏకీభవించలేకపోతే ఏమి
చేయాలి? అనే విషయం, మీ మధ్యనే నిర్ణయం కావాలి.
మరో వ్యక్తి రహస్యాన్ని చెప్పవద్దు. 10నీవలా చేస్తే
నీకు అవమానం కలుగుతుంది. ఆ చెడ్డ పేరు నీకు
ఎప్పటికీ పోదు.
11సమయానికి తగిన రీతిగా పలుక బడిన మంచి
మాటలు వెండి పళ్లెంలో ఉంచిన బంగారు పండులా
ఉంటుంది.
12జ్ఞానముగల ఒక మనిషి నీకు ఒక హెచ్చరిక
ఇస్తే బంగారు ఉంగరాలకంటే లేక మేలిమి బంగారు
నగలకంటే అది ఎక్కువ విలువగలది.
13నమ్మదగిన వార్తాహరుడు అతనిని పంపిన వారికి
ఎంతో విలువగలవాడు. అతడు కోతకాలపు ఎండ
రోజుల్లో చల్లటి నీళ్లలాంటివాడు.
14కానుకలు ఇస్తామని వాగ్దానం చేసి, వాటిని
ఎన్నడూ ఇవ్వని వారు వర్షం కురిపించని మేఘాలు,
గాలిలాంటివారు.
15సహనంగా మాట్లాడటం ఏ వ్యక్తినేగాని, చివరికి
ఒక అధికారి ఆలోచననేగాని మార్చుతుంది. నిదానంగా
మాట్లాడటం చాలా శక్తివంతమైనది.
16తేనె మంచిది. కానీ దానిని మరీ ఎక్కువగా
తినవద్దు. నీవలా చేస్తే నీకు జబ్బు వస్తుంది. 17అదే
విధంగా నీ పొరుగు వాని ఇంటికి మరీ తరచుగా వెళ్లవద్దు.
నీవలా చేస్తే అప్పుడు అతడు నిన్ను అసహ్యించు
కోవటం మొదలు పెడతాడు.
18సత్యం చెప్పని మనిషి ప్రమాదకరమైనవాడు.
అతడు ఒక గునపం, లేక ఖడ్గం లేక వాడిగల బాణం
లాంటివాడు. 19కష్టకాలంలో అబద్ధీకుని మీద ఎన్నడూ
ఆధారపడవద్దు. ఆ మనిషి నొప్పెడుతున్న పన్నులా
లేక కుంటిపాదంలా ఉంటాడు. నీకు అతడు ఎంతో
అవసరమైనప్పుడే అతడు నిన్ను బాధపెడతాడు.
20దుఃఖంలో ఉన్న మనిషి దగ్గర ఆనంద గీతాలు
పాడటం అతనికి చలిపెడుతున్నప్పుడు అతని గుడ్డలు
తీసివేయటంలా ఉంటుంది. అది సోడా, చిరకా మిళితం
చేసినట్టు ఉంటుంది.
21నీ శత్రువు ఆకలితో ఉన్నప్పుడు తినేందుకు
అతనికి భోజనం పెట్టు. నీ శత్రువు దాహంతో ఉంటే
తాగేందుకు అతనికి నీళ్లు యివ్వు. 22నీవు ఇలా చేస్తే
నీవు అతనిని సిగ్గుపడేలా చేస్తావు. అది మండుతున్న
నిప్పులు అతని తల మీద ఉంచినట్టు ఉంటుంది.
మరియు నీ శత్రువుకు నీవు మంచి చేశావు గనుక
యెహోవా నీకు ప్రతిఫలం ఇస్తాడు.
23ఉత్తరం నుండి వీచే గాలి వర్షాన్ని తెస్తుంది. అదే
విధంగా చెప్పుడు మాటలు కోపం రప్పిస్తాయి.
24వివాదం కోరుకొనే భార్యతో కలిసి ఇంటిలో
ఉండటంకంటె, ఇంటికప్పు మీద బతకటం మేలు.
25దూరస్థలం నుండి వచ్చిన శుభవార్త నీకు వేడిగా,
దాహంగా ఉన్నప్పుడు చల్లటి నీళ్లు తాగినట్టు
ఉంటుంది.
26ఒక మంచి మనిషి బలహీనుడై ఒక దుర్మార్గుని
వెంబడిస్తే, అది మంచి నీళ్లు బురద నీళ్లు అయినట్టుగా
ఉంటుంది.
27నీవు చాలా ఎక్కువ తేనెను తింటే అది నీకు
మంచిది కాదు. అదే విధంగా నీకోసం మరీ ఎక్కువ
ఘనత తెచ్చుకోవాలని ప్రయత్నించకు.
28ఒక మనిషి తనను తాను అదుపులో ఉంచు
కోలేకపోతే, అప్పుడు అతడు కూలిపోయిన గోడలుగల
పట్టణంలా ఉంటాడు.

### బుద్ధిహీనులను గూర్చిన జ్ఞాన సూక్తులు

26 తెలివి తక్కువ వానిని గౌరవించటం వ్యర్థం.
అది వేసవిలో మంచులా, కోతకాలంలో
వర్షంలా ఉంటుంది.
2నీకు చెడు సంగతులు సంభవించాలని ఒక మనిషి
కోరుకొంటే చింతపడవద్దు. నీవు తప్పు ఏమీ చేయక
పోతే నీకేమీ చెడు సంభవించదు. ఆ మనిషి మాటలు
నీ పక్కగా ఎగురుతూ, ఎన్నడూ ఆగని పక్షుల్లా
ఉంటాయి.
3గుర్రాన్ని చబుకుతో కొట్టాలి. గాడిదకు కళ్లెం
పెట్టాలి. బుద్ధిహీనుణ్ణి బెత్తంతో కొట్టాలి.
4ఇక్కడ ఒక కష్టతరమైన పరిస్థితి ఉంది. ఒక బుద్ధి
హీనుడు ఒక మూర్ఖ ప్రశ్న నిన్ను అడిగితే, నీవు మూర్ఖ

జవాబు ఇవ్వవద్దు, అలా ఇస్తే నీవుకూడ బుద్ధిహీనునిలా
కనబడతావు. [5]కానీ ఒక బుద్ధిహీనుడు ఒక మూర్ఖ ప్రశ్న
అడిగితే, అప్పుడు నీవు తగిన మూర్ఖపు జవాబు ఇవ్వాలి,
లేకపోతే అతడు తాను చాలా తెలివిగలవాడిని అను
కొంటాడు.

[6]తెలివి తక్కువ వాణ్ణి ఎన్నడూ నీ సందేశం తీసికొని
వెళ్లనివ్వకు. నీవు అలా చేస్తే, నీ స్వంత కాళ్లు కోసి
కొన్నట్టు ఉంటుంది. నీవు కష్టం అడిగి తెచ్చు
కొంటావు.

[7]బుద్ధిహీనుడు జ్ఞానముగలది చెప్పటానికి ప్రయ
త్నించినప్పుడు, అది ఒక కుంటివాడు నడవటానికి
ప్రయత్నించినట్టు ఉంటుంది.

[8]బుద్ధిహీనునికి గౌరవం చూపించటం వడిసెలలో
బండను కట్టడానికి ప్రయత్నించినట్టు ఉంటుంది.

[9]ఒక బుద్ధిహీనుడు జ్ఞానముగల మాట చెప్పటానికి
ప్రయత్నిస్తే, అది ఒక తాగుబోతువాడు తన చేతిలోని
ముల్లు తీసికోవటానికి ప్రయత్నించినట్టు ఉంటుంది.

[10]ఒక బుద్ధిహీనుణ్ణి లేక దారిన పోయే వాళ్లను
ఎవరినంటే వారిని కూలికి పెట్టుకోవటం ప్రమాదకరం.
ఎవరికి హాని జరుగుతుందో నీకు తెలియదు.

[11]ఒక కుక్క ఆహారం తింటుంది. తరువాత దానికి
జబ్బుచేసి, వాంతి చేసికొంటుంది. తర్వాత ఆ కుక్క
ఆ ఆహారాన్ని మళ్లీ తింటుంది. ఒక బుద్ధిహీనుని
విషయం కూడ అలానే ఉంటుంది. అతడు బుద్ధిహీన
మైన అదే పనిని మరల మరల చేస్తాడు.

[12]ఒక మనిషి జ్ఞానము లేకుండానే జ్ఞానిని అని
తలిస్తే అతడు బుద్ధిహీనునికంటె దౌర్భాగ్యుడు.

### సోమరుల గూర్చి జ్ఞాన సూక్తులు

[13]"నేను ఇల్లు విడిచి వెళ్లలేను. వీధిలో సింహం
ఉంది " అంటాడు ఒక సోమరి.

[14]ఒక సోమరి ఒక తలుపులాంటివాడు. ఒక తలుపు
దాని బందుల మీద తిరిగినట్టు తన పడక మీద అటు
ఇటు తిరగటమే అతడు చేసేది అంతాను. అతడు
ఎన్నడూ ఎక్కడికి వెళ్లడు.

[15]ఒక సోమరి మనిషి తన పళ్లెంలో నుండి తన
భోజనాన్ని తన నోటి వరకు గూడ ఎత్తని మరీ
బద్ధకస్తుడు.

[16]ఒక సోమరి మనిషి తాను చాలా జ్ఞానము గల
వాడను అనుకుంటాడు. వారి తలంపులకు మంచి కార
ణాలు ఇవ్వగలిగిన ఏడుగురు మనుష్యులకంటే తాను
చాలా ఎక్కువ తెలివిగల వాడనని అతడు తలస్తాడు.

[17]ఇద్దరు వ్యక్తుల మధ్య వివాదంలో పాల్గొనడం
ప్రమాదకరం. అది దారిన పోతూ ఒక కుక్క చెవులు
పట్టి లాగినట్టు ఉంటుంది.

[18-19]మరో మనిషిని మాయచేసి, ఊరకనే సరదాగా
అలా చేసాను అనేవాడు, అగ్ని బాణాలు గాలిలోకి
కొట్టి, ప్రమాదవశాత్తు ఎవరినో చంపిన పిచ్చివాడిలా
ఉంటాడు.

[20]మంటకు కట్టెలు లేకపోతే మంట చల్లారి
పోతుంది. అదే విధంగా చెప్పుడు మాటలు లేకపోతే
వివాదం సమసిపోతుంది.

[21]బొగ్గులు బూడిదను మండింపచేస్తూ ఉంటాయి.
కట్టెలు మంటను మండిస్తూ ఉంటాయి. అదే విధంగా
చిక్కులు పెట్టే మనుష్యులు వివాదాన్ని బతకనిస్తారు.

[22]మనుష్యులు చెప్పుడు మాటలను ప్రేమిస్తారు.
అది మంచి ఆహారాన్ని భోంచేసినట్టు ఉంటుంది.

[23]ఒక దుర్మార్గపు పథకాన్ని దాచిపెట్టే మంచి
మాటలు ఒక చవకబారు మట్టి కుండ మీద వెండి
పూతలా ఉంటాయి. [24]ఒక దుర్మార్గుడు తాను చెప్పే
విషయాల ద్వారా తాను మంచివానిలా చూపెట్టు
కుంటాడు. కాని అతడు తన దుర్మార్గపు పథకాలను
తన హృదయంలో దాచిపెడతాడు. [25]అతడు చెప్పే
విషయాలు మంచివిగా కనబడవచ్చు. కాని అతణ్ణి నమ్మ
వద్దు. అతని హృదయం దురాలోచనలతో నిండి
పోయింది. [26]అతడు తన దుర్మార్గపు పథకాలను చక్కని
మాటలతో దాచిపెడతాడు. కాని అతడు నీచుడు.
చివరికి అతడు చేసే దుర్మార్గపు విషయాలను మనుష్యు
లందరు చూస్తారు.

[27]ఒక మనిషి ఇతరులను ఇక్కట్టులో పెట్టాలని
ప్రయత్నించి, గొయ్యి తవ్వితే అతడు తానే ఆ గోతిలో
పడతాడు. మరో మనిషి మీదకు ఒక బండను దొర్లిం
చాలని ప్రయత్నిస్తే అతడు తనను తానే చితుక
గొట్టుకుంటాడు.

[28]అబద్ధాలు చెప్పే మనిషి తనకు భోధించే వారిని
ద్వేషిస్తాడు. మరియు ఒక మనిషి చెప్పే విషయాలు
అర్థవంతంగా చెప్పకపోతే అతడు తనను తానే బాధించు
కొంటాడు.

## 27

భవిష్యత్తులో జరిగే దానిని గూర్చి అతిశ
యించవద్దు. రేపు ఏమి సంభవిస్తుందో నీకు
తెలియదు.

[2]నిన్ను నీవే ఎన్నడూ పొగడుకోవద్దు. ఆ పని
ఇతరులను చేయనివ్వు.

[3]మోయుటకు ఒక బండ బరువుగాను యిసుక
గట్టిగాను ఉంటాయి. కాని ఒక బుద్ధిహీనుని కోపము
మూలంగా కలిగిన కష్టాన్ని మోయటం ఆ రెండింటి
కంటే సహించడం కష్టం.

[4]కోపం క్రూరమైంది. నీచమైంది. అది నాశనం
కలిగిస్తుంది. కాని అసూయ మరీ దౌర్భాగ్యం.

[5]దాచబడిన ప్రేమకంటె బహిరంగ విమర్శ మేలు.

[6]ఒక స్నేహితుడు అప్పుడప్పుడు నిన్ను బాధించ
వచ్చు. కాని ఎల్లప్పుడూ ఇలాగే చేయాలని అతడు
కోరుకోడు. ఒక శత్రువు విషయం వేరుగా ఉంటుంది.
ఒక శత్రువు నీ మీద దయగా ఉన్నప్పటికీ అతడు
నిన్ను బాధించగోరుతాడు.

7నీకు ఆకలి లేకపోతే అప్పుడు నీవు తేనె కూడా
తినలేవు. కాని ఆకలిగా ఉంటే ఏదైనా తినేస్తావు దాని
రుచి బాగులేకున్నా సరే.
8తన ఇంటికి దూరంగా ఉన్న మనిషి తన గూటికి
దూరంగా ఉన్న పక్షిలాంటివాడు.
9పరిమళాలు, సువాసన వస్తువులు నిన్ను సంతోష
పెడ్తాయి. కాని ఆపత్తు నీ మనశ్శాంతిని భంగం చేస్తుంది.
అదే రీతిగా స్నేహితుని హృదయం నుండి వచ్చే మధుర
మైన హితవు వుంటుంది.
10నీ స్నేహితులను, నీ తండ్రి స్నేహితులను
మరువకు. మరియు నీకు కష్టం వస్తే సహాయం కోసం
చాలా దూరంలో ఉన్న నీ సోదరుని ఇంటికి వెళ్లవద్దు.
చాలా దూరంలో ఉన్న నీ సోదరుని ఇంటికి వెళ్లడం
కంటే నీ దగ్గరలో ఉన్న నీ పొరుగువారిని అడగటం
మంచిది.
11నా కుమారుడా జ్ఞానము కలిగివుండు. ఇది నాకు
సంతోషాన్ని కలిగిస్తుంది. అప్పుడు నన్ను విమర్శించే
వారికి ఎవరికైనా సరే నేను జవాబు చెప్పగలను.
12జ్ఞానముగల వారు చిక్కు వస్తూ వుండటం
గమనించి, దాని దారిలో నుండి తప్పుకుంటారు. కాని
బుద్ధిహీనుడు సూటిగా చిక్కులోకి వెళ్లి దాని మూలంగా
శ్రమపడతాడు.
13మరో మనిషి అప్పుల కోసం నీవు బాధ్యత
వహిస్తే, నీవు నీ చొక్కా పోగొట్టుకుంటావు.
14"శుభోదయం" అని గట్టిగా అరుస్తూ తెల్ల
వారకట్లనే నీ పొరుగు వారిని మేలుకొలుపవద్దు. అది
అతనికి ఒక శాపం అనుకుంటాడే కాని దీవెన అనుకోడు.
15ఎప్పుడూ వివాదం పెట్టుకోవాలని చూచే భార్య
వర్షపు రోజున ఆగకుండా కురిసే చినుకుల్లాంటిది.
16ఆ స్త్రీని వారించటం పెను గాలిని వారించ ప్రయ
త్నించినట్టే ఉంటుంది. అది నీ చేతితో నూనె పిండేం
దుకు ప్రయత్నించినట్టు ఉంటుంది.
17ఇనుప కత్తులను పదును చేసేందుకు ఇనుప
ముక్కలను మనుష్యులు వాడుతారు. అదే విధంగా
మనుష్యులు ఒకరి నుండి ఒకరు నేర్చుకొని ఒకరిని
ఒకరు పదును చేస్తారు.
18అంజూరపు చెట్ల విషయం శ్రద్ధగలవాడు దాని
ఫలాలు తినగలుగుతాడు. అదే విధంగా తన యజ
మానుని విషయమై శ్రద్ధగలవాడు ప్రతిఫలం పొందు
తాడు. అతని యజమాని అతని గూర్చి శ్రద్ధ పుచ్చు
కుంటాడు.
19ఒక మనిషి నీళ్లలోనికి చూసినప్పుడు అతడు
తన స్వంత ముఖాన్నే చూడగలుగుతాడు. అదే విధంగా
ఒక మనిషి హృదయం నిజానికి అతడు ఎలాంటివాడో
తెలియచేస్తుంది.
20మరణస్థానం మరియు నాశన స్థలము ఎన్నటికీ
తృప్తిపడవు. మానవుని కన్నులు కూడ ఎన్నటికీ తృప్తి
నొందవు. 21బంగారాన్ని, వెండిని శుద్ధి చేయటానికి
మనుష్యులు అగ్నిని ఉపయోగిస్తారు. అదే విధంగా
ఒక మనిషికి ప్రజలు ఇచ్చే మెప్పుద్వారా అతడు
పరీక్షించబడతాడు.
22ఒక బుద్ధిహీనుని నీవు పొడుంగా నూర్చినా అతని
లోని తెలివి తక్కువ తనాన్ని నీవు బయటకు నెట్టి
వేయలేవు.
23నీ గొర్రెలను, పశువులను జాగ్రత్తగా చూసుకో.
నీకు చేతనైనంత బాగా వాటిని గూర్చి శ్రద్ధ తీసికో.
24ఐశ్వర్యం శాశ్వతంగా ఉండదు. రాజ్యాలు కూడా
శాశ్వతంగా ఉండవు.
25మనుష్యులు ఎండుగడ్డి కోస్తే కొత్త గడ్డి పెరగటం
మొదలవుతుంది. తరువాత కొండల మీద పెరుగుతున్న
ఆ గడ్డిని వారు కోస్తారు.
26(అందుచేత నీకు ఉన్న దానితో సంతృప్తిగా
ఉండు.) నీ గొర్రెపిల్లల బొచ్చు నుండి నీవు బట్టలు
చేసికోవచ్చు. నీ మేకలు అమ్మగా వచ్చిన డబ్బుతో
నీవు భూమి కొనవచ్చును. 27మిగిలిన నీ మేకలు
సమృద్ధిగా పాలు ఇస్తాయి. కనుక నీకు, నీ కుటుంబానికి
కూడా సరిపడినంత ఆహారం ఉంటుంది. నీ దాసీలను
ఆరోగ్యవంతులుగా చేస్తుంది.

28 దుర్మార్గులకు ప్రతిదానిగూర్చి భయమే.
అయితే మంచి మనిషి సింహం అంత ధైర్యంగా
ఉంటాడు.
2ఒక దేశంలో పాపాలు చాలా ఉంటే, ఆ దేశాన్ని
అనేక మంది నాయకులు పాలించటానికి ప్రయత్ని
స్తారు. అయితే బలమైన రాజ్యానికి చాలాకాలం దాన్ని
పాలించగల మంచి జ్ఞానముగల ఒకే నాయకుడు
ఉంటాడు.
3ఒక అధికారి తన బీద ప్రజలకు కష్టం కలిగిస్తే,
అతడు పంటలను పాడు చేసే భారీ వర్షంలా ఉంటాడు.
4న్యాయచట్టానికి లోబడేందుకు నీవు తిరస్కరిస్తే,
నీవు దుర్మార్గుల పక్షాన ఉన్నట్టే. కానీ నీవు న్యాయ
చట్టానికి లోబడితే, నీవు వారికి విరోధంగా ఉన్నట్టే.
5దుర్మార్గులు న్యాయాన్ని అర్థం చేసికోరు.
యెహోవాను ప్రేమించే వారు దానిని అర్థం చేసు
కొంటారు.
6ధనికుడై దుర్మార్గునిగా ఉండటంకంటె, దరిద్రుడై
నిజాయితీగా ఉండటం మేలు.
7న్యాయచట్టానికి విధేయుడయ్యే మనిషి తెలివి
గలవాడు. కానీ పనికిమాలిన వాళ్లతో స్నేహం చేసే
వ్యక్తి తన తండ్రికి అవమానం తెస్తాడు.
8పేద ప్రజలను మోసం చేసి మరి వారిపై ఎక్కువ
వడ్డీ వేసి నీవు ధనికుడవైతే నీ ధనం పోగొట్టుకొంటావు.
వారి యెడల దయగల మరో మనిషికి అది చెందు
తుంది.

9ఒక మనిషి దేవుని ఉపదేశాలు వినేందుకు తిరస్క
రిస్తే, అప్పుడు దేవుడు అతని ప్రార్థనలు వినేందుకు
తిరస్కరిస్తాడు.
10ఒక చెడ్డ మనిషి ఒక మంచి మనిషికి హాని
చేసేందుకు పథకాలు వేయవచ్చు. కానీ ఆ చెడ్డ మనిషి
తన గోతిలో తానే పడిపోతాడు. మరియు మంచి
మనిషికి మంచి సంగతులే సంభవిస్తాయి.
11ధనికులు జ్ఞానముగల వారమని ఎల్లప్పుడూ
తలస్తారు. అయితే జ్ఞానముగల పేదవాడు సత్యమును
చూడగలడు.
12మంచి మనుష్యులు నాయకులైనప్పుడు ప్రతి
ఒక్కరూ సంతోషిస్తారు. అయితే ఒక దుర్మార్గుడు
ఎన్నుకోబడినప్పుడు ప్రజలంతా వెళ్లిపోయి
దాక్కుంటారు.
13తన పాపాలు దాచిపెట్టడానికి ప్రయత్నించే
మనిషి ఎన్నటకీ విజయం పొందడు. కాని ఒక మనిషి
తాను తప్పులు చేశానని ఒప్పుకొని మరియు తన
పాపాలు విడిచినట్లయితే దేవుడు మరియు ప్రతి
ఒక్కరూ అతని యెడల దయ చూపిస్తారు.
14ఒక మనిషి గనుక ఎల్లప్పుడూ యెహోవాను
గౌరవిస్తే ఆ మనిషి ఆశీర్వదించబడతాడు. కాని ఒక
మనిషి మొండిగా ఉండి, యెహోవాను గౌరవిం
చేందుకు తిరస్కరిస్తే అతనికి కష్టం వస్తుంది.
15ఒక దుర్మార్గుడు బలహీనుల మీద పరిపాలన
చేస్తే అతడు కోపంగా ఉన్న ఒక సింహంలా లేక పోట్లా
డేందుకు సిద్ధంగా ఉన్న ఒక ఎలుగుబంటిలా ఉంటాడు.
16ఒక అధికారి జ్ఞానము లేనివాడైతే అతడు తన
కిందనున్న ప్రజలను బాధిస్తాడు. కాని నిజాయితీ గలిగి,
మోసాన్ని అసహ్యించుకొనే అధికారి చాలాకాలం
పరిపాలిస్తాడు.
17ఒక మనిషి మరో మనిషిని చంపి నేరస్తుడైతే ఆ
మనిషికి ఎన్నటికీ శాంతి ఉండదు. ఆ మనిషిని బల
పరచవద్దు.
18ఒక మనిషి సరిగ్గా జీవిస్తూ ఉంటే అప్పుడు అతడు
క్షేమంగా ఉంటాడు. కాని ఒక మనిషి దుర్మార్గుడైతే
అతడు తన అధికారాన్ని పోగొట్టుకుంటాడు.
19కష్టపడి పనిచేసే వాడికి తినేందుకు సమృద్ధిగా
ఉంటుంది. కాని కలలు కంటూ తన సమయాన్ని
వ్యర్థం చేసే మనిషి ఎల్లప్పుడూ పేదవానిగా ఉంటాడు.
20దేవుని వెంబడించే మనిషిని ఆయన ఆశీర్వ
దిస్తాడు. అయితే కేవలం ధనికుడు కావాలని మాత్రమే
ప్రయత్నించే మనిషి శిక్షించబడతాడు.
21ఒక న్యాయమూర్తి న్యాయంగా ఉండాలి. కేవలం
ఒక వ్యక్తి తనకు తెలిసిన వాడైనంత మాత్రాన అతడు
వానిని బలపరచ కూడదు. అయితే కొందరు న్యాయ
మూర్తులు కొద్దిపాటి డబ్బు చెల్లింపునకే వారి నిర్ణ
యాలు మార్చివేస్తారు.
22ఒక స్వార్థపరుడు ధనికుడు కావాలని మాత్రమే
కోరుకుంటాడు. ఆ మనిషి దరిద్రుడు అయ్యేందుకు
చాలా దగ్గరలో ఉన్నాడని అతడు గ్రహించడు.
23ఒక వ్యక్తి తప్పు చేస్తున్నాడని అతనితో చెప్పటం
ద్వారా నీవు సహాయం చేస్తే, తర్వాత అతడు నిన్ను
గూర్చి సంతోషిస్తాడు. ఎల్లప్పుడూ పొగిడే మనుష్యుల
కంటే అది చాలా మంచిది.
24కొందరు మనుష్యులు వారి తల్లిదండ్రుల దగ్గర
దొంగతనం చేస్తారు. “అదేమీ తప్పుకాదు” అని వారు
అంటారు. కానీ ఒక వ్యక్తి ఇంటిలోపలకు వచ్చి ఆ
ఇంట్లో ఉన్న వాటన్నిటినీ పగలకొట్టడం ఎంత
చెడ్డదో, అదీ అంత చెడ్డదే.
25ఒక స్వార్థపరుడు కష్టం కలిగిస్తాడు. కాని
యెహోవాను నమ్ముకునేవాడు ప్రతిఫలం పొందు
తాడు. 26ఒక మనిషి తనను తానే నమ్ముకొంటే అతడు
బుద్ధిహీనుడు. కానీ ఒక మనిషి జ్ఞానముగలవాడైతే
అతడు నాశనాన్ని తప్పించు కొంటాడు.
27ఒక మనిషి పేద ప్రజలకు ఇచ్చినట్లయితే
అప్పుడు అతనికి అవసరమైనవన్నీ ఉంటాయి. కాని
ఒక వ్యక్తి పేద ప్రజలకు సహాయం చేసేందుకు
నిరాకరిస్తే అప్పుడు అతనికి చాలా చిక్కు కలుగుతుంది.
28ఒక దుర్మార్గుడు పాలించేందుకు ఎన్నుకోబడితే
అప్పుడు ప్రజలంతా దాక్కుంటారు. కాని ఆ దుర్మా
ర్గుడు ఓడించబడితే అప్పుడు మరలా మంచివారు
పాలన చేస్తారు.

29 ఒక మనిషి మొండివాడై, అతడు చేస్తున్నది
తప్పు అని ప్రజలు అతనితో చెప్పినప్పుడల్లా
అతనికి మరింత కోపం వస్తే అప్పుడు ఆ మనిషి ఆక
స్మాత్తుగా నాశనం చేయబడతాడు. ఆశ ఏమీ ఉండదు.
2పాలించేవాడు మంచి మనిషి అయితే ప్రజలంతా
సంతోషిస్తారు. కాని ఒక దుర్మార్గుడు పాలన చేస్తే
అప్పుడు ప్రజలంతా నిట్టూర్చి ఆరోపణ చేస్తారు.
3ఒక మనిషి జ్ఞానమును ప్రేమిస్తే అప్పుడు అతని
తండ్రికి చాలా సంతోషం. కాని ఒక మనిషి తన
డబ్బును వేశ్యల కోసం వ్యర్థం చేస్తే అప్పుడు అతడు
తన ఐశ్వర్యాన్ని పోగొట్టుకొంటాడు.
4ఒక రాజు న్యాయంగా ఉంటే, అప్పుడు ఆ రాజ్యం
బలంగా ఉంటుంది. కాని రాజు స్వార్థపరుడై ప్రజల
కోసం చేసే పనులన్నిటికి వారు అతనికి డబ్బు చెల్లిం
చాల్సి వస్తే, అప్పుడు ఆ దేశం బలహీనంగా ఉంటుంది.
5ఒక వ్యక్తి మనుష్యులకు చక్కని మాటలు చెప్పి
తాను కోరింది సంపాదించాలని ప్రయత్నిస్తే, అప్పుడు
అతడు తనకు తానే ఒక ఉచ్చు పెట్టుకుంటున్నట్టు
అవుతుంది.
6దుర్మార్గులు వారి స్వంత పాపం మూలంగానే
ఓడించబడతారు. కాని ఒక మంచి మనిషి పాడుతూ
సంతోషంగా ఉండగలడు.

[7]మంచి మనుష్యులు పేద ప్రజలకోసం సరైనదానిని చేయాలని కోరుతారు. కాని చెడ్డవాళ్లు ఏమీ పట్టించుకోరు.
[8]ఇతరులకంటే మేమే మంచివాళ్లం అనుకొనే మనుష్యులు చాలా చిక్కులు కలిగిస్తారు. వారు మొత్తం పట్టణాలనే గందరగోళం చేయగలరు. కాని జ్ఞానముగల మనుష్యులు శాంతి కలిగిస్తారు.
[9]జ్ఞానముగల మనిషి తెలివి తక్కువ వానితో ఒక సమస్యను పరిష్కరించాలని ప్రయత్నిస్తే ఆ తెలివి తక్కువ వాడు వాదం పెట్టుకొని మూర్ఖంగా మాట్లాడు తాడు. ఆ ఇద్దరూ ఎన్నటికీ ఏకీభవించరు.
[10]నరహంతకులు నిజాయితీగల మనుష్యులను ఎల్లప్పుడూ ద్వేషిస్తారు. ఆ దుర్మార్గులు నిజాయితీగల మంచి మనుష్యులను చంపాలని అనుకొంటారు.
[11]తెలివితక్కువ వానికి త్వరగా కోపం వస్తుంది. కాని జ్ఞానముగల మనిషి సహనం కలిగి తనను తాను సంబాళించుకొంటాడు.
[12]ఒక పాలకుడు అబద్ధాలు వింటే అప్పుడు అతని అధికారులంతా దుర్మార్గులు అవుతారు.
[13]ఒక పేద మనిషి, పేదవాని దగ్గర దొంగిలించే మనిషి ఒక విధంగా ఇద్దరూ ఒకటే. వారిద్దరినీ యెహోవా చేశాడు.
[14]ఒక రాజు పేదవారి యెడల న్యాయంగా ఉంటే అతడు చాలా కాలం పరిపాలిస్తాడు.
[15]దెబ్బలు కొట్టటం, ఉపదేశాలు పిల్లలకు మంచివి. ఒక బిడ్డను తన ఇష్టానుసారంగా తల్లిదండ్రులు చేయ నిస్తే అప్పుడు ఆ బిడ్డ తన తల్లికి అవమానం తీసికొని వస్తాడు.
[16]దుర్మార్గులు గనుక దేశాన్ని పాలిస్తూంటే, అప్పుడు ఎక్కడ చూసినా పాపమే ఉంటుంది. కాని చివరికి మంచి మనుష్యులు జయిస్తారు.
[17]నీ కుమారుడు తప్పు చేసినప్పుడు వానిని శిక్షించు, అప్పుడు వాడిని గూర్చి నీవు ఎల్లప్పుడూ అతిశయిస్తావు. వాడు నిన్ను ఎన్నడూ సిగ్గుపడ నియ్యడు.
[18]ఒక దేశం గనుక దేవునిచే నడిపించబడకపోతే అప్పుడు ఆ దేశంలో శాంతి ఉండదు. కానీ దేవుని న్యాయచట్టానికి లోబడే దేశం సంతోషంగా ఉంటుంది.
[19]ఒక సేవకునితో నీవు ఊరక మాటలే చెబితే అతడు పాఠం నేర్చుకోడు. ఆ సేవకుడు నీ మాటలు గ్రహించవచ్చుగాని అతడు లోబడడు.
[20]ఒక మనిషి ఆలోచన లేకుండా మాట్లాడితే వానికి ఆశ లేదు. ఆలోచన లేకుండా మాట్లాడే ఒక మనిషికంటే ఒక బుద్ధిహీనునికి ఎక్కువ ఆశ ఉంది.
[21]నీ సేవకునికి కావలసినవి అన్నీ నీవు ఎల్లప్పుడూ ఇస్తూ ఉంటే చివరికి వాడు మంచి సేవకునిగా ఉండడు.
[22]కోపంగల మనిషి చిక్కు కలిగిస్తాడు. మరియు కోపపడే మనిషి అనేక పాపాలతో దోషిగా ఉంటాడు.
[23]ఒక మనిషి ఇతరులకంటే తానే మంచి వాడిని అనుకొంటే అదే అతనిని నాశనం చేస్తుంది. కాని ఒక మనిషి వినమ్రంగా ఉంటే అప్పుడు యితరులు అతనిని గౌరవిస్తారు.
[24]కలిసి పని చేసే ఇద్దరు దొంగలు శత్రువులు. ఒక దొంగ మరో దొంగను బెదిరిస్తాడు. కనుక అతడు సత్యం చెప్పేందుకు న్యాయస్థానంలో బలవంతం చేయబడితే మాట్లాడేందుకు కూడ అతడు ఎంతో భయపడతాడు.
[25]భయం ఒక ఉచ్చులాంటిది. కాని యెహోవా యందు నీవు నమ్మకం ఉంచితే, నీవు క్షేమంగా ఉంటావు.
[26]చాలా మంది మనుష్యులు ఒక అధికారికి స్నేహితు లుగా ఉండాలని కోరుకొంటారు. కాని ప్రజలకు న్యాయంగా తీర్పు తీర్చేవాడు యెహోవా మాత్రమే.
[27]నిజాయితీ లేని మనుష్యులను మంచి మనుష్యులు అసహ్యించుకొంటారు. మరియు దుర్మార్గులు నిజా యితీగల మనుష్యులను అసహ్యించుకొంటారు.

## యాకె కుమారుడు ఆగూరు జ్ఞాన సూక్తులు

30 యాకె కుమారుడు ఆగూరు చెప్పిన జ్ఞాన సూక్తులు ఇవి: అతడు ఈతీయేలుకు, ఉక్కా లుకు ఇచ్చిన సందేశం:
[2]భూమి మీద నేను అతి దౌర్భాగ్యుడను. నేను
గ్రహించాల్సిన విధంగా గ్రహించటంలేదు. [3]జ్ఞానము కలిగి
ఉండటం నేను నేర్చుకోలేదు. మరియు దేవుని గురించి నాకు ఏమీ తెలియదు.
[4]ఏ మనిషీ ఎన్నడూ పరలోకంలోని సంగతులను గూర్చి నేర్చుకోలేదు. ఏ మనిషీ ఎన్నడూ గాలిని తన చేతిలో పట్టుకోలేదు. ఏ మనిషీ ఎన్నడూ నీటిని ఒక గుడ్డ ముక్కలో పట్టుకోలేడు. ఏ మనిషీ ఎన్నడూ భూమి హద్దులను నిజంగా తెలిసికోలేడు. ఈ సంగతు లను తెలిసికో గలిగిన మనిషి ఎవరైనా ఉంటే ఆ మనిషి ఎవరు? అతని కుటుంబం ఎక్కడ ఉంది?
[5]దేవుడు చెప్పే ప్రతి మాటా పరిపూర్ణం. దేవుని దగ్గరకు వెళ్లే మనుష్యులకు ఆయన ఒక క్షేమస్థానం
[6]కనుక దేవుడు చెప్పే విషయాలను మార్చేందుకు ప్రయత్నించకు. నీవు అలా చేస్తే ఆయన నిన్ను శిక్షించి, నీవు అబద్ధాలు చెబుతున్నట్టు రుజువు చేస్తాడు.
[7]యెహోవా, నేను చనిపోక ముందు నా కోసం రెండు పనులు చేయుమని నేను నిన్ను అడుగు
తున్నాను. [8]అబద్ధాలు చెప్పకుండా ఉండేందుకు నాకు సహాయం చేయి. నన్ను మరీ ధనికునిగా లేక మరీ దరిద్రునిగా చేయవద్దు. ప్రతిరోజూ నాకు అవసరమైన

వాటిని మాత్రమే అనుగ్రహించు. 9నాకు అవసరమైన
దానికంటే నాకు ఎక్కువగా ఉంటే, అప్పుడు నీతో
నాకు అవసరం లేదని నేను తలస్తాను. కాని నేను
దరిద్రుడనైతే ఒకవేళ నేను దొంగతనం చేస్తానేమో.
అప్పుడు నేను యెహోవా నామానికి అవమానం
తెస్తాను.

10ఒక సేవకునికి విరోధంగా అతని యజమానితో
చెడ్డ మాటలు ఎన్నడూ చెప్పవద్దు. నీవు అలా చేస్తే
ఆ యజమాని నిన్ను నమ్మడు. నీవు దోషివని అతడు
తలస్తాడు.

11కొందరు మనుష్యులు వారి తండ్రులకు విరో
ధంగా మాట్లాడతారు. మరియు వారి తల్లులను
గౌరవించరు.

12కొందరు చాలా మంచివాళ్లం అనుకొంటారుగాని
వారు చాలా చెడ్డవాళ్లు.

13కొంతమంది చాలా మంచివాళ్లం అనుకొంటారు.
వారు యితరులకంటే చాలా మంచివాళ్లు అను
కొంటారు.

14ఖడ్గాల్లాంటి పళ్లు ఉన్నవారు కొందరు ఉంటారు.
వారి దవడలు కత్తుల్లా ఉంటాయి. వారు పేద ప్రజల
నుండి సమస్తం దోచుకోవటానికి వారి సమయం అంతా
ఉపయోగిస్తారు.

15కొంతమంది వారికి చేతనైనంత మట్టుకు అంతా
తీసికోవాలి అనుకొంటారు. “నాకివ్వు, నాకివ్వు,
నాకివ్వు” అనటం మాత్రమే వారు చెప్పేది అంతాను.
ఎన్నటికీ తృప్తిపడనివి మూడు ఉన్నాయి వాస్తవానికి
సరిపడినంతగా ఎన్నడూ లేనివి నాలుగు ఉన్నాయి.
16చావు స్థలం, పిల్లలు లేని స్త్రీ, వర్షం కావాల్సిన
బీడుభూమి, వారించజాలని వేడి నిప్పు.

17తన తండ్రిని ఎగతాళి చేసే మనిషి, తన తల్లికి
లోబడని మనిషీ ఎవరైనా సరే శిక్షించబడుతారు. అది
అతని కళ్లు రాబందులు, లేక క్రూరపక్షులు తినివేసినట్టు
ఉంటుంది.

18నేను గ్రహించేందుకు కష్టతరమైనవి మూడు సంగ
తులు ఉన్నాయి వాస్తవానికి నేను గ్రహించనివి నాలుగు
సంగతులు ఉన్నాయి. 19ఆకాశంలో ఎగిరే పక్షిరాజు,
ఒక బండ మీద పాకుచున్న ఒక పాము, మహా
సముద్రంలో తిరిగే ఓడ, ఒక స్త్రీతో ప్రేమలోవున్న
మగవాడు.

20తన భర్తకు నమ్మకంగా లేని ఒక భార్య తాను
ఏమీ తప్పు చేయనట్టు నటిస్తుంది. ఆమె భోంచే
స్తుంది, స్నానం చేస్తుంది, నేను ఏమీ తప్పు చేయలేదు
అంటుంది.

21భూమి మీద చిక్కు కలిగించేవి మూడు సంగ
తులు ఉన్నాయి. వాస్తవానికి భూమి భరించలేనివి
నాలుగు ఉన్నాయి. 22రాజైన ఒక సేవకుడు, తనకు
కావాల్సినవి అన్నీ కలిగి ఉన్న ఒక బుద్ధిహీనుడు,
23ద్వేషంతో పూర్తిగా నిండిపోయినా, ఒక భర్తను పొంద
గలిగిన స్త్రీ, ఏ స్త్రీ దగ్గర సేవ చేస్తుందో, ఆ స్త్రీ మీద
అధికారిణి అయిన దాసి.

24భూమి మీద చిన్నవిగా ఉన్నవి నాలుగు
ఉన్నాయి. అయితే ఇవి చాలా జ్ఞానము గలవి.

25చీమలు చిన్నవి, బలహీనమైనవి. కానీ అవి వేసవి
కాలం అంతా ఆహారం నిల్వచేసు కొంటాయి.
26కుందేలు చిన్న జంతువు. కానీ అది బండల్లో నివాసం
ఏర్పాటు చేసు కోగలుగుతుంది.

27మిడతలకు రాజు లేడు. కానీ అవన్నీ కలిసికట్టుగా
పని చేయగలుగుతున్నాయి.

28బల్లులు నీవు చేతితో పట్టుకోగలిగినంత చిన్నవి.
కానీ అవి రాజుల గృహాలలో నివసించటం నీవు చూడ
గలవు. 29నడుస్తున్నప్పుడు ముఖ్యమైనవిగా కనుపిం
చేవి మూడు ఉన్నాయి. నిజానికి నాలుగు ఉన్నాయి.
30సింహం జంతువులలోకెల్ల చాలా బలమైనది. అది
దేనికీ భయపడదు.

31చాలా గర్వంగా నడిచే కోడి పుంజు, ఒక మేక
పోతు, తన ప్రజల మధ్య ఉన్న రాజు.

32నీవు తెలివితక్కువ వాడవై యుండి ఇతరులకంటె
నీవే మంచివాడవు అని తలిస్తే, మరియు నీవు దుర్మా
ర్గాన్ని తలపెడితే, నీవు ఆగిపోయి, నీవు చేస్తున్న
దాన్ని గూర్చి ఆలోచించాలి.

33ఒక మనిషి పాలను చిలికి వెన్న చేస్తాడు. ఒకడు
మరొకని ముక్కు మీద కొడితే, రక్తం వస్తుంది. అదే
విధంగా నీవు ప్రజలకు కోపం పుట్టిస్తే నీవు చిక్కు
కలిగిస్తావు.

## లెమూయేలు రాజు చెప్పిన జ్ఞాన సూక్తులు

31 లెమూయేలు రాజు చెప్పిన జ్ఞాన సూక్తులు
ఇవి. ఈ విషయాలను అతని తల్లి అతనికి
నేర్పించింది.

2నీవు నా కుమారుడవు. నేను ప్రేమించే నా కుమా
రుడివి. నాకు కావాలని నేను ప్రార్థించిన కుమారుడివి
నీవు. 3స్త్రీలకోసం నీ బలం వ్యర్థం చేయవద్దు. స్త్రీలే
రాజులను నాశనం చేసేవాళ్లు. వారికోసం నిన్ను నీవు
వ్యర్థం చేసుకోవద్దు. 4లెమూయేలూ, రాజులు ద్రాక్షా
రసం తాగటం జ్ఞానముగల పనికాదు. మద్యము కోరుట
పరిపాలకులకు జ్ఞానముగల పనికాదు. 5వారు విపరీ
తంగా తాగేసి న్యాయచట్టం చెప్పేదానిని మరచి
పోవచ్చు. అప్పుడు వారు పేద ప్రజల హక్కులు అన్నీ
తీసివేస్తారు. 6మద్యం పేద ప్రజలకు ఇమ్ము. ద్రాక్షారసం
కష్టంలో ఉన్న ప్రజలకు ఇమ్ము. 7అప్పుడు వారు
అది తాగి, వారు పేదవాళ్లు అనే మాట మరచిపోతారు.
వాళ్లు తాగేసి వారి కష్టాలన్నీ మరచిపోతారు. 8ఒకడు
తనకు తానే సహాయం చేసికోలేకపోతే అప్పుడు నీవు

అతనికి సహాయం చేయాలి. కష్టంలో ఉన్న ప్రజలంద
రికీ నీవు సహాయం చేయాలి. 9సరైనవి అని నీకు
తెలిసిన విషయాల కోసం నీవు నిలబడు. మనుష్యు
లందరికీ న్యాయంగా తీర్పు తీర్చు. పేద ప్రజల, నీ
అవసరం ఉన్న ప్రజల హక్కులను కాపాడు.

### పరిపూర్ణమైన భార్య

10 "పరిపూర్ణమైన స్త్రీ" దొరకటం ఎంతో
కష్టం. కాని ఆమె నగలకంటె ఎంతో
ఎక్కువ అమూల్యం.
11 ఆమె భర్త ఆమెను నమ్మగలడు. అతడు
ఎన్నడూ దరిద్రునిగా ఉండడు.
12 మంచి భార్య తన జీవితకాలం అంతా తన
భర్తకు మంచినే చేస్తుంది. ఆమె ఎన్నడూ
అతనికి చిక్కు కలిగించదు.

13 ఆమె ఉన్నిబట్ట తయారు చేస్తూ ఎల్ల
ప్పుడూ పనిలో నిమగ్నమవుతుంది.
14 ఆమె దూరము నుండి వచ్చిన ఓడలా
ఉంటుంది. అన్ని చోట్ల నుండీ ఆమె
ఆహారం తీసుకొని వస్తుంది.
15 ఆమె అతి వేకువనే మేలుకొంటుంది. తన
కుటుంబానికి భోజనం, తన పని వారికి
భోజనం ఆమె వండుతుంది.
16 ఆమె పొలాన్ని చూస్తుంది. దాన్నికొం
టుంది. ఆమె ద్రాక్షతోట నాటేందుకు ఆమె
దాచుకొన్న డబ్బు ఉపయోగిస్తుంది.
17 ఆమె చాలా కష్టపడి పని చేస్తుంది. ఆమె
బలంగా ఉండి తన పని అంతా చేసుకో
గలుగుతుంది.
18 ఆమె తయారు చేసిన వాటిని అమ్మి
నప్పుడు ఆమె ఎల్లప్పుడూ లాభం సంపాది
స్తుంది. మరియు రాత్రి చాలా పొద్దుపోయే
దాకా ఆమె పని చేస్తుంది.
19 ఆమె స్వంతంగా దారం తయారు చేసికొని
తన స్వంత బట్ట నేస్తుంది.
20 ఆమె ఎల్లప్పుడూ పేద ప్రజలకు పెడు
తుంది. అవసరంలో ఉన్న వారికి సహాయం
చేస్తుంది!
21 చలిగా ఉన్నప్పుడు ఆమె తన కుటుంబం
విషయం దిగులు పడదు. ఆమె వారందరికి
మంచి వెచ్చని దుస్తులు ఇస్తుంది.
22 ఆమె దుప్పట్లు నేసి పడకలమీద పరుస్తుంది.
సన్నని నారతో చేయబడ్డ వస్త్రాలు ఆమె
ధరిస్తుంది.
23 ఆమె భర్తను ప్రజలు గౌరవిస్తారు. అతడు
దేశ నాయకులలో ఒకడు.
24 ఆమె మంచి వ్యాపార దక్షతగల స్త్రీ. ఆమె
బట్టలు, నడికట్లు తయారు చేసి వాటిని
వ్యాపారస్థులకు అమ్ముతుంది.
25 ఆమె బలంగా ఉంటుంది. మరియు, ప్రజలు
ఆమెను గౌరవిస్తారు. ఆమె స్థానము బలం
గాను మరియు సురక్షితంగాను ఉంటుంది.
భవిష్యత్తును గురించి సంతోషిస్తుంది.
26 ఆమె మాట్లాడినప్పుడు జ్ఞానముగా
ఉంటుంది. ఆమె జ్ఞానం ఉపదేశముతో
నిండి ఉంటుంది.
27 ఆమె ఎన్నడూ బద్ధకంగా ఉండదు. కాని
ఆమె తన ఇంటి విషయాలను గూర్చి
జాగ్రత్త తీసుకొంటుంది.
28 ఆమె పిల్లలు పెద్దవారై ఆమెను ఘనపరు
స్తారు. మరియు ఆమె భర్త ఆమెను గూర్చి
ఎన్నో మంచి విషయాలు చెబుతాడు.
29 "ఎంతో మంది స్త్రీలు మంచి భార్యలు అవు
తారు. కాని నీవు శ్రేష్ఠమైన దానివి" అని
ఆమె భర్త చెబుతాడు.
30 సౌందర్యము, అందము నిన్ను మోసగించ
వచ్చు. అయితే యెహోవాను గౌరవించే
స్త్రీ పొగడబడాలి.
31 ఆమెకు అర్హమైన ప్రతిఫలం రావాలి.ఆమె
చేసిన విషయాల కోసం ప్రజలు ఆమెను
బహిరంగంగా ఘనపర్చాలి.

# ప్రసంగి

1 ఇవి దావీదు కుమారుడును, యెరూషలేము రాజు
అయిన ప్రసంగి చెప్పిన ప్రవచనాలు.
2అన్నీ పరమ అర్థరహితాలు. 'సమస్తం వృథా కాల
యాపన!'* అంటాడు ప్రసంగి. 3ఈ జీవితంలో
తాము చేసే కాయకష్టమంతటికీ మనుష్యులు లాభం
ఏమైనా పొందుతున్నారా?* (లేదు!)

### ఏవీ ఎన్నడూ మారవు

4ఒక తరం మారి మరొకతరం వస్తుంది. కాని, ఈ
భూమి శాశ్వతంగా ఉంటుంది. 5సూర్యుడు ఉదయిం
చును మరియు అస్తమించును. మరల ఉదయించే
చోటుకు త్వరగా వెళతాడు.
6గాలి దక్షిణ దిశకి వీస్తుంది, తిరిగి ఉత్తర దిశకి
వీస్తుంది. గాలి, చుట్టూ తిరిగి తిరిగి చివరకు తాను
బయల్దేరిన చోటుకే రివ్వున వస్తుంది.
7నదులన్నీ మరల మరల ఒక్క చోటుకే ప్రవ
హిస్తాయి. అవన్నీ సముద్రంలోకే పోయి పడినా
సముద్రం నిండదు.
8ఆయా విషయాలను మాటలు పూర్తిగా వివరించ
లేవు.* అయితేనేమి, మనుష్యులు మాట్లాడు తూనే
వుంటారు.* మాటలు మళ్లీ మళ్లీ మన చెవుల్లో పడు
తూనే వుంటాయి. అయినా, మన చెవులకి తృప్తి
తీరదు. మన కళ్లు ఎన్నింటినో చూస్తూ ఉంటాయి.
అయినా మనకి తనివి తీరదు.

### కొత్తదంటూ ఏదీ లేదు

9అన్నీ ఆదినుంచి ఉన్నట్లే కొనసాగుతున్నాయి.
ఇంతకు ముందు జరిగినవే ఇక ముందూ ఎల్లప్పుడూ
జరుగుతాయి. ఆ జీవితంలో కొత్తదంటూ ఏదీ లేదు.
10ఎవరైనా, "చూడండి, ఇదిగో ఇది కొత్తది" అని
చెప్పవచ్చుగాక. కాని, అది ఎప్పుడూ ఇక్కడ ఉన్నదే.
మనం పుట్టక ముందు అది ఇక్కడ ఉన్నదే!
11పూర్వం ఎప్పుడో జరిగిన విషయాలు మనుష్య
లకి గుర్తుండవు. ఇప్పుడు జరుగుతున్న విషయాలు
భవిష్యత్తులో జనానికి గుర్తుండవు. దానికి తర్వాత,
అప్పటివాళ్లకి, తమ పూర్వపు వాళ్లు చేసిన పనులు
గుర్తుండవు.

### జ్ఞానం ఆనందాన్ని ఇస్తుందా?

12ప్రసంగి అనే ఉపదేశకుడినైన నేను యెరూషలే
ములోని ఇశ్రాయేలు రాజును. 13నేను విద్యను అభ్య
సించి, దానివల్ల లభ్యమైన జ్ఞానాన్ని ఈ జీవితంలో
జరిగే అన్ని విషయాలనూ అవగాహన చేసుకొనేందుకు
వినియోగించుకోవాలని నిర్ణయించుకున్నాను. ఆ
క్రమంలో, ఇది దేవుడు మనకి అప్పగించిన చాలా
కఠినమైన పని అని నేను గ్రహించాను.14ఈ భూమిమీద
జరిగేవాటన్నింటినీ నేను పరిశీలనగా చూశాను. అవన్నీ
వ్యర్థమని గ్రహించాను. అది గాలిని మూటగట్ట ప్రయ
త్నించడం వంటిది.
15(వీటిని వేటినీ మనం మార్చలేము.) వంకరగా
వున్నదాన్ని అది తిన్నగా వుందని మనం చెప్పలేము.
ఏదైనా ఒకటి అక్కడ లేనప్పుడు అది అక్కడ వుందని
మనం చెప్పలేము.
16"నేను చాలా తెలివైనవాడిని. నాకంటె ముందు
యెరూషలేమును పాలించిన రాజులందరికంటె నేను
వివేకవంతుడిని. వివేకం, జ్ఞానం వీటి గూర్చి నాకు
తెలుసు!" అని నాలో నేను అనుకున్నాను.
17వివేకం, జ్ఞానం వెర్రితనం మరియు బుద్ధి తక్కువ
ఆలోచనలు చెయ్యడంకంటె ఎలా మెరుగైనవో తెలు
సుకోవాలని తీర్మానించుకున్నాను. కాని, ఆ క్రమంలో
వివేకం సంపాదించ ప్రయత్నించడం గాలిని పోగుచేసి,
మూటగట్ట ప్రయత్నించడం వంటిదేనని నేను గ్రహిం
చాను.
18వివేకం పెరిగే కొద్దీ మనిషికి నిరాశా నిస్పృహలు
పెరుగుతాయి. వివేకం పెరిగిన మనిషి మరింత
దుఃఖాన్ని కూడగట్టుకుంటాడు.

---

**అర్థరహితాలు ... కాలయాపన** ఈ హెబ్రీ పదానికి "ఆవిరి లేక ఊపిరి" లేక "పనికిమాలినది, అర్థరహితమైనది, శుష్కమైనది, పొరపాటైనది లేక వృథా కాలయాపన" అని అర్థం.

**ఈ జీవితంలో ... పొందుతున్నారా?** మూలంలో ఈ పదానికి సూర్యుడి కింద అని అర్థం.

**విషయాలను ... వివరించలేవు** అన్ని మాటలూ (విషయాలూ) నిస్సారమైనవే అని వ్యాఖ్యార్థం.

**అయితేనేమి ... ఉంటారు** ఈ హీబ్రూ మాటలకి "మాట్లాడగల శక్తి మనిషికి లేదు" అని అర్థం కూడా చెప్పుకోవచ్చు.

### సరదాలు సుఖాన్నిస్తాయా?

2 నాలో నేను, “నేను సరదాగా గడపాలి. నేను నా
శాయశక్తులా సమస్త సుఖాలూ అనుభవించాలి”
అనుకున్నాను. కాని, అది కూడా నిష్ప్రయోజనమైన
పనే అని గ్రహించాను. 2(ఎల్లప్పుడు) సరదాగా
నవ్వుతూ గడపడం మూర్ఖత్వం. సరదాగా గడిపేయడం
ద్వారా కలిగే మేలేమీ లేదు.
3అందుకని, కడుపునిండా ద్రాక్షారసం తాగుతూ
మన స్సును జ్ఞానంతో నింపుదామని అనుకున్నాను.
సంతోషంగా వుండాలన్న ప్రయత్నంలో నేనీ మూర్ఖ
త్వానికి చోటిచ్చాను. తమ స్వల్పకాల జీవితంలో
జనానికి ఏది మంచిదో కనుక్కోవాలనుకున్నాను.

### కఠిన శ్రమ సుఖాన్నిస్తుందా?

4అప్పుడిక నేను పెద్ద పెద్ద పనులు చెయ్య
నారంభించాను. నేను నాకోసం భవనాలు కట్టించాను.
ద్రాక్షాతోటలు నాటించాను. 5తోటలు వేయించాను,
ఉద్యానవనాలు నెలకొల్పాను. నేను రకరకాల పండ్ల
చెట్లు నాటించాను. 6నేను నాకోసం నీటి మడుగులు
తవ్వించి, వాటిలోని నీటిని పెరుగుతున్న చెట్లకు
పోసేందుకు వినియోగించాను. 7నేను మగ, ఆడ బాని
సలను ఖరీదు చేశాను. నా భవనంలోనే కొందరు
బానిసలు పుట్టారు. నాకు బోలెడు గొప్ప వస్తువులు
ఉన్నాయి. నాకు పశువుల మందలు, గొర్రెల మందలు
ఉన్నాయి. యెరూషలేములో ఏ ఒక్కనికన్న నాకు
ఎక్కువ వస్తువులు ఉన్నాయి.
8నేను దండిగా వెండి బంగారాలు కూడబెట్టాను.
ఆయా రాజుల, రాజ్యాల సంపదలను కొల్లగొట్టాను.
నా ఆస్థానంలో గాయనీ, గాయకులు ఉన్నారు. నేను
ఏ ఒకరినైన కోరుకోగలను.
9నేను బాగా ధనవంతుణ్ణీ, కీర్తిమంతుణ్ణీ అయ్యాను.
యెరూషలేములో నా వెనుకటి వారందరికంటె నేను
గొప్పవాడినయ్యాను. పోతే, నా జ్ఞానం వివేకం నాకు
సహాయం చేశాయి. 10నేను చూసి, కోరుకున్నదల్లా
నేను పొందాను. నేను చేసినవన్నీ నా మనస్సుకి తృప్తిని
కలిగించాయి. నేను చేసిన శ్రమ అంతటికీ ప్రతిఫలం
నా ఈ ఆనందమే. 11అయితే, అటు తర్వాత నేను
చేసినవాటన్నింటినీ నేనొకసారి సమీక్షించుకున్నాను.
నేను పడ్డ శ్రమ అంతటినీ బేరీజు వేసుకున్నాను.
అదంతా వృథా శ్రమ అన్న నిర్ణయానికి వచ్చాను!
అది గాలిని మూట కట్టుకొనే ప్రయత్నంలాంటిది.*
ఈ జీవితంలో మనం చేసే పనులన్నింటి వల్లా మనం
పొందే లాభం ఏమీ లేదు.

### జ్ఞానమే వీటన్నింటికీ పరిష్కారమేమో

12ఒక రాజు చేయగలిగినదానికంటె ఎక్కువ మరొక
డెవడూ చేయలేడు. నీవీనాడు చేయాలని కోరుకో
గలవాటన్నింటినీ ఏదో ఒక రాజు ఎన్నడో చేసే
వున్నాడు.* (రాజు చేసే పనులు సైతం కూడా వ్యర్థ
మేనని నేను గ్రహించాను.) అందుకని జ్ఞానార్జన గురించీ,
మూర్ఖపు పనులు, మతిలేని పనులు చేయడం గురించీ
నేను మరోసారి ఆలోచించ నారంభించాను. 13చీకటి
కంటే వెలుగు మెరుగైనట్లే, మూర్ఖత్వంకంటె జ్ఞానం
మెరుగైనదని నేను గ్రహించాను. 14అదెలాగంటే: తెలి
వైనవాడు తానెక్కడికి వెళ్తున్నది గ్రహించేందుకు తన
మనస్సును కళ్లలా ఉపయోగించుకుంటాడు. కాగా, ఒక
మూర్ఖుడు అంధకారంలో నడుస్తున్న వ్యక్తి వంటివాడు.
అయితే, బుద్ధిమంతుడిది, బుద్ధిహీనుడిది కూడా
ఒకటే గతి అని నేను గ్రహించాను. (ఇద్దరూ మరణిస్తారు)
15నాలో నేను ఇలా అనుకున్నాను, “ఒక బుద్ధిహీనుడికి
పట్టే గతే నాకూ పడుతుంది. మరి జ్ఞానార్జన కోసం
నేనెందుకు అంతగా తంటాలు పడినట్లు?” నేనింకా
ఇలా అనుకున్నాను: “జ్ఞానార్జనకూడా ప్రయోజనం
లేనిదే.” 16జ్ఞానవంతుడూ, అజ్ఞానీ ఇద్దరూ మరణిస్తారు!
మరి జనం వివేకినీ శాశ్వతంగా గుర్తుంచుకోరు, అవివేకినీ
శాశ్వతంగా గుర్తుంచుకోరు. భవిష్యత్తులో, వాళ్లు చేసిన
పనులన్నింటినీ మరచిపోతారు. కాగా వాస్తవంలో
వివేకికీ, అవివేకికీ మధ్య తేడా యేమీ లేదు.

### జీవితంలో అసలైన ఆనందమంటూ ఉందా?

17దీనితో నాకు జీవితం పట్ల ద్వేషం కలిగింది.
ఈ జీవితంలో అన్నీ వ్యర్థమైనవే, గాలిని మూట
కట్టుకొను ప్రయత్నించడం వంటివే అనిపించి, నాకు
విచారం కలిగింది.
18దానితో, నేను వెనక చేసిన గట్టి శ్రమ అంతటినీ
ద్వేషించనారంభించాను. నేను గట్టి కృషిచేశాను.
అయితే, నా కృషి ఫలితాలను నా తర్వాత తరాలవాళ్లు
అనుభవిస్తారని గ్రహించాను. నేను వాటిని నాతో తీసుకు
పోలేను. 19నేను వేటికోసం అధ్యయనం చేశానో, వేటి
కోసం పాటుపడ్డానో, వాటన్నింటిపైనా మరొకడెవడో
అదుపు కలిగివుంటాడు. అతడు వివేకి అవుతాడో,
అవివేకి అవుతాడో నాకు తెలియదు. ఇది కూడ తెలివి
లేనిది.
20అందుకని, నేను చేసిన శ్రమ అంతా నాకు విచార
మే కలిగించింది. 21తన వివేకం, జ్ఞానం, నైపుణ్యం
వీటన్నింటినీ వినియోగించి ఒకడు బాగా కష్టించి పని
చేయవచ్చు. కాని, అతను మరణిస్తాడు, అతని శ్రమ
ఫలితాలన్నింటిని ఇతరులు పొందుతారు. వాళ్లు ఏ

---

**గాలిని ... ప్రయత్నంలాంటిది** లేక ‘మనస్సును బాగా వ్యాకులపరచేది, బాధపెట్టేది శుష్కమైనది.’

**మరొకడెవడూ ... చేసేవున్నాడు** హీబ్రూ భాషలో ఈ వాక్యం ఈ సందర్భంలో అస్పష్టంగా వుంది.

శ్రమా చెయ్యలేదు. కాని, వాళ్లకి అన్నీ లభ్యమవుతాయి. ఇది నాకు చాలా విచారం కలిగిస్తుంది. ఇది అన్యాయమే కాదు, అర్థరహితం కూడా.

22ఒక మనిషి ఈ జీవితంలో నానా తంటాలూ పడి, ఎంతో శ్రమ చేస్తాడు. చివరికి అతని చేతికి చిక్కేదే మిటి?

23చచ్చేదాకా అతను అనుభవించేది బాధలు, నిరాశా నిస్పృహలు, చేసేది (గొడ్డు) చాకిరీ. రాత్రి పూట కూడా మనిషి మనస్సు విశ్రాంతికి నోచు కోదు. ఇది కూడా అర్థరహితమైనదే.

24-25జీవితంలో సుఖాలు అనుభవించేందుకు నాకంటె ఎక్కువగా ప్రయత్నించిన మనిషి మరొకడెవ డైనా ఉన్నాడా? లేడు! నేను గ్రహించిన దేమిటంటే: మనిషి చెయ్యగలిగిన అత్యుత్తమమైన పని యేమిటంటే, తినడం, తాగడం, తాను చేసి తీరవలసిన పనిని సరదాగా చెయ్యడం. దేవుని ఆదేశం కూడా ఇదేనని నేను గ్రహించాను.* 26మనిషి మంచి చేసి, దేవుణ్ణి సంతృప్తిపరిస్తే, అప్పుడిక దేవుడు ఆ మనిషికి వివేకాన్నీ, జ్ఞానాన్నీ, సుఖసంతోషాలనీ అనుగ్రహిస్తాడు. అయితే, పాపాలు చేసేవాడికి దేవుడు ప్రయాసపడే పని, పోగుచేసే పని, కుప్పలుగా పోసే పని మాత్రమే ఇస్తాడు. దేవుడు చెడ్డవానినుంచి తీసుకొని మంచివానికి ఇస్తాడు. అయితే, ఈ పని అంతా వ్యర్థమైనదిగానూ, గాలిని మూటకట్టు కొనే ప్రయత్నంగానూ కనిపిస్తుంది.

## ప్రతిదానికి ఒక తరుణం

3 ప్రతిదానికి సరైన సమయం ఒకటుంది. ఈ భూమి మీద ప్రతీది సరైన సమయంలో సంభవిస్తుంది.

2 పుట్టేందుకొక సమయం వుంది, చనిపో
యేందుకొక సమయం వుంది. మొక్కలు
నాటేందుకొక సమయం వుంది, మొక్కలు
పెరికేందుకొక సమయం వుంది.
3 చంపేందుకొక సమయం వుంది, గాయం
మాన్పేందుకొక సమయం వుంది. నిర్మూ
లించేందుకొక సమయం వుంది, నిర్మించేందు
కొక సమయం వుంది.
4 ఏడ్చేందుకొక సమయం వుంది, నవ్వేందు కొక
సమయం వుంది. దుఃఖించేందుకొక సమయం
వుంది, సంతోషంతో నాట్య మాడేందుకొక
సమయం వుంది.
5 ఆయుధాలు పడవేసేందుకొక సమయం
వుంది, వాటిని తిరిగి చేపట్టేందుకొక సమయం
వుంది. ఒకరిని కౌగిలించు కొనేందుకొక
సమయం వుంది, ఆ కౌగిలిని సడలించేందుకొక
సమయం ఉంది.*
6 దేన్నయినా వెదికేందుకొక సమయం వుంది,
అది పోగొట్టుకొనేందుకొక సమయం వుంది.
వస్తువులు పదిల పర్చు కొనే సమయం వుంది,
వాటిని పారవేసే సమయం వుంది.
7 వస్త్రం చింపేందుకొక సమయం వుంది,
దాన్ని కుట్టేందుకొక సమయం వుంది.
మౌనానికి కొక సమయం వుంది. మాట్లాడేందు
కొక సమయం వుంది.
8 ప్రేమించేందుకొక సమయం వుంది, ద్వేషిం
చేందుకొక సమయం వుంది. సమరానికొక
సమయం వుంది, శాంతికొక సమయం వుంది.

## దేవుడు తన జగత్తుని అదుపు చేస్తాడు

9మనిషి చేసే కష్ట భూయిష్టమైన పనికిగాను అతనికి నిజంగా ఏమైనా లభిస్తుందా? (ఉండదు!) 10చేసేందుకు దేవుడు మనకిచ్చే కష్ట భూయిష్టమైన పనులన్నీ ఏమిటో నేను గుర్తించాను.

11తన జగత్తును గురించి ఆలోచించే సామర్థ్యాన్ని దేవుడు మనకి యిచ్చాడు.* అయితే దేవుడు చేసే వాటన్నింటినీ మనం ఎన్నడూ పూర్తిగా తెలుసు కోలేము. అయితేనేమి, దేవుడు అన్ని పనుల్నీ సరిగ్గా సరైన సమయంలోనే చేస్తాడు.

12తాము బతికినంత కాలము సంతోషంగా ఉండటం, తనివితీరా సుఖాలు అనుభవించడం ఇవి మనుష్యులు చేయవలసిన అత్యుత్తమమైన పని అన్న విషయం నేను గ్రహించాను.

13ప్రతి మనిషి తినాలి, తాగాలి, తాను చేసే పనిని ఆహ్లాదంగా చెయ్యాలి ఇది దేవుడు కోరుకునేది. ఇవి దేవుడిచ్చిన వరాలు.

14దేవుడు చేసేది ప్రతీది శాశ్వతంగా కొనసాగు తుందని నేను తెలుసుకున్నాను. దేవుడు చేసినదానికి మనుష్యులు దేన్నీ ఎంతమాత్రం జోడించలేరు మరియు దేవుడు చేసే పనినుండి దేనినీ తీసుకొనలేరు. మనుష్యులు తనని గౌరవించేందుకే దేవుడు ఇదంతా చేశాడు.

15గతంలో జరిగినవేవో జరిగాయి, (మరి మనం వాటిని మార్చలేము.) భవిష్యత్తులో జరగ బోయేవేవో జరుగుతాయి. (మనం వాటిని మార్చలేము) అయితే, ఎవరైతే చెడ్డగా చూడబడ్డారో, వారికి దేవుడు మంచి

---

**జీవితంలో ... గ్రహించాను** దేవుడు లేనిదే ఎవడూ అన్న పానాలూ, సుఖసంతోషాలూ పొందజాలడు.

**ఆయుధాలు ... సమయం ఉంది** అక్షరాలా “రాళ్లు పారేసేందుకొక సమయం ఉంది, వాటిని పోగుచేసేందుకొక సమయం ఉంది.”

**జగత్తును ... యిచ్చాడు** లేక, “భవిష్యత్తును తెలుసు కోవాలన్న వాంఛను.”

చెయ్యాలని కోరుకుంటాడు.* [16]ఈ ప్రపంచములో
యీ విషయాలన్నీ నేను చూశాను. న్యాయ స్థానాల్లో
మంచితనము, న్యాయము నిండుగా ఉండాలి, అయితే
అక్కడ మనం కను గొంటుంది చెడుగు. [17]అందుకని,
నాలో నేను ఇలా అనుకున్నాను: "దేవుడు ప్రతి పనికి
ఒక కాలాన్ని ఎంచుకున్నాడు. అంతేకాదు, మనుష్యులు
చేసే పనులన్నింటిని విచారించేందుకు దేవుడు ఒక
ప్రత్యేక కాలాన్ని ఎంచుకున్నాడు. దేవుడు మంచివాళ్లని
విచారిస్తాడు, చెడ్డవాళ్లని విచారిస్తాడు."

### మనుష్యులకి జంతువులకి భేదమే లేదా?

[18]మనుష్యులు ఒకరిపట్ల మరొకరు వ్యవహరించే
తీరును గమనించిన నేను నాలో నేనిలా అనుకున్నాను,
"తాము జంతువుల మాదిరిగా వున్నామన్న విషయాన్ని
మను ష్యులు గమనించాలని దేవుడు కోరుకున్నాడు.
[19]మనిషి జంతువుకంటే మెరుగైనవాడా? (కాడు)
ఎందుకని? ఎందుకంటే, అన్ని నిష్ప్రయోజనం కనుక.
మను ష్యులూ మరణిస్తారు. జంతువులూ మరణిస్తాయి.
ఒకే "ఊపిరి"* మనుష్యుల్లోనూ, జంతువుల్లోనూ
ఉన్నది. చనిపోయిన జంతువుకి, మనిషికి మధ్య తేడా
ఏమైనా ఉందా? [20]అన్ని ఒక్క చోటుకే పోతాయి.
అవి ఏ మట్టినుంచి పుట్టాయో చివరికి ఆ మట్టిలోకే
పోతాయి. [21]మనిషి ఆత్మకి ఏమి జరుగుతుందో ఎవ
రికెరుక? జంతువు ఆత్మ పాతాళానికి పోతే, మనిషి
ఆత్మ పైకి దేవుని దగ్గరికి వెళ్తుందేమో ఎవరికి
తెలుసు?"

[22]అందుకని, మనిషి తాను చేసే పనిలో ఆనందం
పొందడమే అత్యుత్తమమైనదని నేను గ్రహించాను. అదే
వాళ్ల భాగ్యం. (మరో విషయంయేమంటే, భవిష్యత్తు
గురించి మనిషి దిగులు పెట్టుకోకూడదు.) ఎందుకంటే
భవిష్యత్తులో ఏమి జరుగుతుందో తెలుసుకొనేందుకు
మనిషికి ఎవ్వరూ తోడ్పడలేరు.

### మరైతే చనిపోవడం మెరుగా?

4 నేను చూసిన మరో విషయం ఏ మిటంటే, చాలా
మంది సరిగ్గా చూడరు. వాళ్లు కన్నీళ్లు పెట్టు
కోవడం నేను చూశాను. ఆ విచారగ్రస్తుల్ని ఓదార్చే
వాళ్లు ఎవరూ లేరన్న విషయం, క్రూరులైనవాళ్ల చేతు
ల్లోనే అధికారమంతా ఉందన్న విషయం కూడా నేను
గమనించాను. ఆ క్రూరుల చేతుల్లో బాధలుపడేవాళ్లకు
ఉపశమనం కలిగించే వాడెవడూ లేడని నేను గమనిం
చాను. [2]ఇంకా బతికున్నవాళ్ల కంటె చనిపోయిన వాళ్ల
పరిస్థితులే మెరుగ్గా ఉన్నాయని నేను తీర్మానించు
కున్నాను. [3](పురిట్లోనే చనిపోయే వాళ్ల) పరిస్థితి
అంతకంటే కూడా మెరుగ్గా ఉంది! ఎందుకంటే, ఈ
ప్రపంచంలో జరిగే ఏ చెడుగునూ వాళ్లెన్నడూ
చూడరు.

### మరీ కష్టపడి పనిచెయ్యడం ఎందుకు?

[4]తర్వాత నేనిలా అనుకున్నాను, "మనుష్యులు
మరింత కష్టపడి పనిచేస్తారెందుకు?" కొందరు
విజయం సాధించి ఇతరులకంటె మెరుగవాలని ప్రయ
త్నించడం నేను చూశాను. ఎందుకంటే, వాళ్లలో ఈర్ష్య
ఉంది. తమకి ఉన్నదానికంటె ఇతరులు అధికంగా
కలిగివుండటం వాళ్లకి ఇష్టం లేదు. ఇది కూడా బుద్ధి
హీనత. ఇది గాలిని మూట కట్టుకొనే ప్రయత్నం.
[5]కొందరు ఇలా అంటారు: "ఏమీ చెయ్యకుండా
చేతులు ముడుచుకొని కూర్చోవడం మూర్ఖత్వం.
మీరు పనిచెయ్యకపోతే పస్తులుండి చస్తారు." [6]బహుశా
ఈ మాట నిజమే కావచ్చు. మరికొన్ని సంపాదించు
కోవాలని సదా తంటాలు పడటం కంటె, ఉన్న కొద్ది
వాటితో తృప్తి చెందడం మెరుగని నా ఉద్దేశం.
[7]మతిమాలిన మరో విషయం నేను గమనించాను,
[8]ఒక వ్యక్తి ఉంటాడు. అతనికి కుటుంబం ఉండక
పోవచ్చు. ఒక కొడుకో, ఒక సోదరుడో ఉండక
పోవచ్చు. అయితేనేమి, అతను రెక్కలు విరుచుకొని
అతిగా పని చేస్తూనే ఉంటాడు. తనకి ఉన్నదానితో
అతను ఎన్నడూ తృప్తిచెందడు. అతను నిర్విరామంగా
కష్టించి పనిచేసి, "నేనిలా ఎందుకు రెక్కలు విరుచుకొని
పనిచేస్తున్నట్లు? నేను నా జీవితాన్ని హాయిగా ఎందుకు
గడపకూడదు?" అని అడగడు. ఇది కూడా చెడ్డదే,
అర్థరహితమైనదే.

### మిత్రులు, కుటుంబం యిచ్చే బలం

[9]ఒకరికంటె ఇద్దరు మెరుగు. ఇద్దరు కలిసి పనిచేస్తే,
తాము చేసే పనికి ఎక్కువ ప్రతిఫలం పొందుతారు.
[10]ఒకడు పడిపోతే రెండోవాడు అతనికి సహాయం
చెయ్యగలుగుతాడు. ఒంటరిగాడు పడి పోయినప్పుడు
అతను నిస్సహాయుడవుతాడు. అక్కడ అతనికి సాయప
డేవాడు ఎవడూ వుండడు.

[11]ఇద్దరు జంటగా పడుకుంటే, వాళ్లకి వెచ్చగా
ఉంటుంది. ఒంటిగా నిద్రించేవాడికి వెచ్చదనం
ఉండదు.

[12]ఒంటరి వ్యక్తిని శత్రువు ఓడించగలుగుతాడు.
అయితే, అదే శత్రువు ఇద్దర్ని ఓడించలేడు. అదే ముగ్గు
రుంటే, ఇంకా ఎక్కువ బలం కలిగివుంటారు. ముప్పేట
తాడును తెంచలేనట్లే, వాళ్లని దెబ్బతియ్యడం చాలా
కష్టసాధ్యమవుతుంది.

---

**దేవుడు ... కోరుకుంటాడు** లేక, "ఇప్పుడు జరుగుతున్నది గతంలో కూడా జరిగింది. భవిష్యత్తులో జరగబోయేది కూడా గతంలో జరిగాయి. దేవుడు ఆయా విషయాలు మళ్లీ మళ్లీ జరిగేలా చేస్తాడు."

**ఊపిరి** ఆత్మ ప్రాణం.

### జనం, రాజకీయాలు, ప్రజల్లో పలుకుబడి

13 వృద్ధుడే అయినా బుద్ధిహీనుడైన రాజుకంటె,
బీద వాడే అయినా బుద్ధిశాలి అయిన యువ నాయకుడు
మేలు. ఆ ముసలి రాజు హెచ్చరికలను చెవిన పెట్టడు.
14 ఆ యువరాజు రాజ్యంలో పేదవాడై పుట్టి ఉండ
వచ్చు. బహుశః అతను చెరనుండి బయటకు వచ్చిన
రాజు అవ్వొచ్చు. 15 నేనీ ప్రపంచంలో మనుష్యుల్ని
పరిశీలించాను. నాకీ విషయం తెలుసు: జనం ఆ
యువకుణ్ణే అనుసరిస్తారు. అతనే కొత్త రాజు
అవుతాడు. 16 తండోపతండాలుగా జనం ఆ యువకుణ్ణి
అనుసరిస్తారు. అయితే, దరిమిలా, ఆ జనమే అతనంటే
ఇష్టపడరు. ఇది అర్థరహితమే. ఇది గాలిని మూటగట్ట
ప్రయత్నించడం లాంటిదే.

### మొక్కుల విషయంలో జాగ్రత్తగా వుండండి

5 దేవుణ్ణి ఆరాధించేందుకు వెళ్లినప్పుడు చాలా
జాగ్రత్తగా ఉండండి. మూఢ జనం మాదిరిగా
బలులు ఇవ్వడం కంటె (దైవవాణిని ) వినడం మేలు.
మూఢులు తరచు చెడ్డ పనులు చేస్తూ ఉంటారు.
వాళ్లకి తమ పనులు చెడ్డవని కూడా తెలియదు. 2 దేవు
నికి మీరు మొక్కులు మొక్కేటప్పుడు మీరు జాగ్రత్త
వహించండి. దేవునికి మీ సమర్పణ విషయంలో జాగ్ర
త్తగా ఉండండి. ఆవేశంలో తొందరపడి నోరుజారకండి.
దేవుడు పైన పరలోకంలో ఉన్నాడు, మీరు క్రింద
భూమిమీద వున్నారు. అందుకని దేవునికి వేడుకొనుట
కొద్దిగా మాత్రమే మీరు చెయ్యండి. (ఈ కింది లోకోక్తి
లోని వాస్తవాన్ని గమనించండి)

3 అధిక వ్యాకుల మనస్కులు పీడకలలు
కంటారు, బుద్ధిహీనులు అతిగా వాగుతారు.

4 దేవునికి నువ్వేదైనా మొక్కుకుంటే, దాన్ని
చెల్లించు. నువ్వు మొక్కుకున్నదాన్ని చెల్లించడంలో
ఆలస్యం చేయకు. బుద్ధిహీనుల విషయంలో దేవుడు
ప్రసన్నుడు కాడు. దేవునికి ఇస్తానన్నదాన్ని
నువ్వాయనకి ఇయ్యి. 5 ఏదైనా వాగ్దానం చేసి దాన్ని
చేయలేక పోవడం కంటె, అసలేమీ మొక్కుకోక
పోవడమే మేలు. 6 అందుకని, నీ మాటలు పాపకారణం
కాకుండా చూసుకో. “నేను అన్న మాట అర్థం అది
కాదు!” అని నీ యాజకుడితో చెప్పబోకు.* నువ్వా
పని చేస్తే, దేవునికి నీ మాటల పట్ల కోపం రావచ్చు,
నువ్వు శ్రమించి సాధించిన దాన్నంతటినీ నాశనం
చెయ్యవచ్చు. 7 నీ పనికిమాలిన స్వప్నాలూ, బీరాలూ
(నీకు హాని కలిగించకుండా) చూసుకో. నువ్వు దేవుని
పట్ల భక్తి కలిగి ఉండు.

### ప్రతి అధికారిపైనా మరొక అధికారి ఉంటాడు

8 ఏ దేశమైనా తీసుకో. బీదవాళ్ల రెక్కలు ముక్కలు
చేసుకొని పని చేయక గత్యంతరం లేని పరిస్థితి నువ్వు
చూస్తావు. బీదల విషయంలో ఇది అన్యాయ వర్తన
అని, బీదల హక్కులకు ఇది విరుద్ధమని నువ్వు చూడ
గలుగుతావు. అయితే, నువ్వెందుకు ఆశ్చర్యపడబోకు!
వాళ్లచేత అలా బలవంతాన పనిచేయించే అధికారి పైన,
మరో అధికారి ఉంటాడు. ఈ ఇద్దరు అధికారులపైనా
పెత్తనం చలాయించి పనిచేయించే మరో పై అధికారి
వుంటాడు. 9 రాజు కూడా బానిసే. అతడి రాజ్యం
అతని యజమాని.

### సంతోషం కొనుక్కోగల వస్తువు కాదు

10 డబ్బు పట్ల వ్యామోహం ఉన్నవాడు తనకి ఉన్న
డబ్బుతో ఎన్నడూ తృప్తి చెందడు. ఐశ్వర్యాన్ని
ప్రేమించేవాడు తనకి ఇంకా ఇంకా వచ్చి పడినా తృప్తి
చెందడు. ధన వ్యామోహం కూడా అర్థరహిత మైనదే.
11 ఒక వ్యక్తికి ఎంత ఎక్కువ ఆస్తి ఉంటే, దాన్ని
ఖర్చు పెట్టడంలో తోడ్పడే “మిత్రులు” అంత ఎక్కువ
మంది ఉంటారు. దానితో, వాస్తవంలో ఆ ధనికుడు
పొందే లాభమేమీ ఉండదు. అతను తన సంపదని
చూసుకుని మురిసిపోగలడు. అంత మాత్రమే.
12 రోజంతా చెమటోర్చి కష్టపడేవాడు యింటికి
తిరిగి వచ్చి తక్కువగా తిన్నా లేక ఎక్కువగా తిన్నా
నిశ్చింతగా నిద్రపోతాడు. శ్రమజీవికి తినేందుకు
కొంచెమే వున్నా, ఎక్కువ వున్నా అతనికి అదేమంత
ముఖ్యంకాదు. కాని, ధనికుడికి తన సంపద విషయంలో
బెంగతో నిద్రపట్టదు.
13 ఈ ప్రపంచంలో చాలా విచారకరమైన విషయం
ఒకటి నేను గమనించాను. ఒకడు భవిష్యత్తు కోసం
డబ్బు పొదుపు చేస్తాడు. 14 తర్వాత ఏదో విపత్తు
వచ్చి, తన ఆస్తి సర్వస్వం కోల్పోతాడు. అప్పుడిక
తన కొడుక్కి ఇచ్చేందుకు అతని దగ్గర గుడ్డి గవ్వ
కూడా మిగలదు.

### పోయేనాటికి పూచిక పుల్లయినా వెంబడిరాదు

15 తల్లి గర్భం నుంచి వ్యక్తి పుట్టినప్పుడు అతని
దగ్గర ఏమీ ఉండదు. ఆ వ్యక్తి చనిపోయినప్పుడు
తనతో తీసుకెళ్లేది ఏమీ ఉండదు. అతను ఆయా
వస్తువుల కోసం చచ్చేలా శ్రమిస్తాడు. కాని, తాను
చనిపోయి నప్పుడు అతను తన వెంట తీసుకువెళ్ల
గలిగింది ఏమీ ఉండదు. 16 ఇది చాలా విచారకరమైన
విషయం. తను ఈ లోకంలోకి ఎలా వస్తాడో అలాగే
పోతాడు. కాగా, “గాలిని మూటగట్టుకొనేందుకు చేసే

---

**యాజకుడితో చెప్పబోకు** లేక “దేవత” “దూత” ఇది ఒక దేవత కావచ్చు, లేక దేవుని తరుపున మాట్లాడే ప్రవక్త కావచ్చు.

ప్రయత్నం” వల్ల మనిషికి ఒరిగేదేమిటి? 17దుఃఖంతో,
విచారంతో నిండిన రోజులు. నిరాశా నిస్పృహలు
అనారోగ్యాలు, చికాకులు చివరికి అతనికి మిగిలేవి ఇవే!

### మీ జీవిత కృషి ఫలితాన్ని అనుభవించండి

18ఈ భూమిమీద ఉత్తమమైనది ఏమనగా,
తనకున్న స్వల్ప జీవితకాల వ్యవధిలో మనిషి అన్న
పానాలు తృప్తిగా సేవించాలి, తన పని ఫలితాన్ని సుఖంగా
అనుభవించాలి. దేవుడు అతనికి ఇచ్చినది ఈ కొద్ది
రోజులు మాత్రమే అన్న విషయాన్ని దృష్టిలో వుంచు
కోవాలి ఇదే మనిషి చేయగలిగినదన్న విషయాన్ని
నేను గమనించాను.

19దేవుడు ఒక వ్యక్తికి సంపదని, ఆస్తిని వాటిని
హాయిగా అనుభవించే శక్తినీ ఇస్తే, ఆ వ్యక్తి వాటిని
అనుభవించాలి. ఆ వ్యక్తి తనకున్న వాటిని స్వీకరించాలి.
దేవుని వరమైన తన పనిని సంతోషంగా చెయ్యాలి.
20మనిషి ఆయుష్షు సుదీర్ఘమైనది కాదు కనుక, అతని
విషయాలన్నీ తన జీవితం పొడుగునా గుర్తుంచు
కోవాలి. ఆ మనిషి ఇష్టంగా చేసే పనిలో దేవుడు
అతన్ని నిమగ్నుణ్ణి చేస్తాడు.*

### ఐశ్వర్యం సంతోషాన్ని ఇవ్వదు

6 నేను ఈ ప్రపంచంలో అసమంజసమైన మరో
విషయాన్ని గమనించాను. దాన్ని అర్థం చేసు
కోవడం చాలా కష్టం. 2దేవుడు ఒక మనిషికి గొప్ప
సంపద, ఆస్తి మరియు గౌరవమూ ప్రసాదిస్తాడు. అత
నికి కావలసినవన్నీ, అతను కోరుకోగలిగిన సమస్తం
వుంటాయి. అయితే, ఆ వ్యక్తి వాటిని అనుభవించ
కుండా చేస్తాడు దేవుడు. ఒక అపరిచితుడు వస్తాడు,
వాటన్నింటినీ చేజిక్కించుకుంటాడు. ఇది కూడా
అర్థరహితమైన చాలా చెడ్డ విషయమే.

3ఒక వ్యక్తి దీర్ఘకాలం జీవించవచ్చు. అతనికి వంద
మంది సంతానం ఉండవచ్చు. అయితే, ఈ మంచి
విషయాలు అతనికి తృప్తి కలిగించలేదనీ, అతని మరణా
నంతరం* ఏ ఒక్కరూ అతన్ని జ్ఞాపకం ఉంచుకోరనీ
అనుకోండి, అప్పుడు అతనికంటె పురిట్లోనే చనిపోయే
శిశువు మెరుగని నేనంటాను. 4మృత శిశువుగా పుట్టడం
నిజంగానే అర్థరహితం. పేరైనా లేని ఆ శిశువుని చటు
క్కున తీసుకుపోయి సూర్యరశ్మి చొరని చీకటి సమా
ధిలో పూడ్చేస్తారు. 5సూర్యరశ్మినైనా చూడని ఆ
శిశువుకి బొత్తిగా ఏది ఏమాత్రం తెలియదు. కాని,
దేవుడు తనకిచ్చిన మంచివాటిని అనుభవించని ఆ
మనిషికంటె ఆ శిశువు ఎక్కువ ప్రశాంతిని అనుభవి
స్తుంది. 6ఆ మనిషి రెండు వేల సంవత్సరాలు బతకవచ్చు
గాక. అయినా అతను తనకు ఇచ్చిన జీవితాన్ని
అనుభవించక పోతే అతనికంటె గర్భంలో చనిపోయిన
శిశువు సులభమయిన మార్గంతో ఆ అంత్యదశను
పొందిందనవచ్చు.

7మనిషి చచ్చేలా పాటుపడతాడు తిండి కోసం.
అయితే, అతను ఎన్నడూ తృప్తి చెందడు. 8వివేక
వంతుడు అవివేకికంటె విశేషమైనవాడు కాడు. అంత
కంటె, ఉన్నదున్నట్లు జీవితాన్ని స్వీకరించడం తెలిసిన
బీదవాడు మేలు. 9ఉన్నదానితో తృప్తి చెంది సంతో
షంగా ఉండటం ఎప్పుడూ ఇంకా ఇంకా ఏదో కావాలని
ఆశించడం మేలు. ఎప్పుడూ ఇంకా ఇంకా కావాలని
కోరుకోవడం వృథా ప్రయాసం. అది గాలిని మూట
గట్టుకొనేందుకు చేసే ప్రయత్నమే.

10-11మనిషి ఎందుకు సృష్టింపబడ్డాడు? మనిషిగా
ఉండేందుకు మాత్రమే. దీన్ని గురించి చర్చించడం
వృథా ప్రయాసమే. దీన్ని గురించి మనిషి దేవునితో
చర్చించలేడు. ఎందుకంటే, మనిషికంటె దేవుడు శక్తి
మంతుడు. సుదీర్ఘంగా వాదించినంత మాత్రాన ఈ
వాస్తవం మారిపోదు.

12భూమిమీద స్వల్ప కాలం జీవించే మనిషికి, ఆ
స్వల్ప కాలంలో అతనికి ఏది అత్యుత్తమమైనదో ఎవరికి
తెలుస్తుంది? అతని జీవితం నీడలా గడిచిపోతుంది.
తర్వాత ఏమి జరుగుతుందో ఎవరూ అతనికి చెప్పలేరు.

### సుభాషితాలు

7 మంచి పరిమళ ద్రవ్యంకంటె మంచి పేరు
(గౌరవం) కలిగివుండటం మేలు. జన్మ దినం
కంటె మరణ దినం మేలు.

2 విందుకి పోవడంకంటె, మరణించినవారి అంత్య
క్రియలకి హాజరవడం మేలు. ఎందుకంటే, పుట్టిన
వాళ్లెవరూ గిట్టకమానరు, బతికున్న ప్రతివాడు
ఈ విషయం గుర్తుంచుకోవాలి. 3నవ్వుకంటె
దుఃఖం మరింత మేలు, ఎందుకంటే, మన ముఖం
విచారగ్రస్త మైనప్పుడు, మన మనస్సు మెరుగవు
తుంది.

4 అవివేకి సరదాగా హాయిగా గడపాలని మాత్రమే
ఆలోచిస్తాడు, కాని, వివేకి మృత్యువు గురించి
ఆలోచిస్తాడు.

5 మూర్ఖుడి పొగడ్త పొందడం కంటె, వివేకిచే
విమర్శింప బడటం మేలు.

6 మూర్ఖుల ఇక ఇకలూ పకపకలూ, కుండ కింద
చిటపట మండే ముళ్లలా ఉంటాయి. (కుండ
వేడైనా ఎక్కకముందే, ఆ ముళ్లు చురచుర మండి
పోతాయి.) ఇది కూడా నిష్ప్రయోజనమే.

7 వడైనా తగినంత డబ్బు ముట్టచెప్పితే వివేక

---

**దేవుడు … చేస్తాడు** లేక, “దేవుడు ఆ వ్యక్తికి తాను ఏమి
చెయ్యదలచుకొంటాడో అది చేస్తాడు.”

**మరణానంతరం** హెబ్రీ భాషలో అతను సమాధి చేయ
బడలేదు.

వంతుడైనా తన వివేకాన్ని విస్మరిస్తాడు. ఆ డబ్బు అతని విచక్షణను నాశనం చేస్తుంది.
8 ఏదైనా మొదలెట్టడం కంటె దాన్ని ముగించడం మేలు. అహంభావం, అసహనం కంటె సాధుత్వం, సహనము మేలు.
9 తొందరపడి కోపం తెచ్చుకోకు ఎందుకంటే అది అవివేకం (మూర్ఖులు అవి చేస్తారు)
10 "గడిచి పోయిన రోజులే మేలు" అనబోకు. "అప్పుడు జరిగినదేమిటి?" ఇది అవివేకమైన ప్రశ్న.

11నీకు ఆస్తితో బాటు జ్ఞానం కూడా ఉంటే మరింత మంచిది. నిజానికి, వివేకవంతులు కావలసిన దానికంటే అధికంగానే ఐశ్వర్యాన్ని పొందుతారు.
12వివేకవంతుడు సంపన్నుడవగలడు. ధనం అండ అయినట్టే వివేకం అండ అవుతుంది. కాని జ్ఞానంయొక్క ప్రయోజనం ఏమంటే, వివేకం తన యజమానికి అండ అవుతుంది.
13దేవుడు చేసినవాటిని పరిశీలించి చూడండి. వాటిలో ఏదైనా ఒకటి పొరపాటైనదని నువ్వు అనుకున్నా వాటిలో ఏ ఒక్కదాన్ని నువ్వు మార్చలేవు!
14రోజులు బాగున్నప్పుడు, నువ్వు దాన్ని అనుభవించు. కాని, రోజులు బాగుండనప్పుడు, దేవుడు మనకి మంచి రోజులు, చెడ్డ రోజులు వ్రాసి పెట్టాడన్న విషయం మరచిపోకు. ముందేమి జరుగుతుందో ఏ ఒక్కరికీ తెలియదు.

## పూర్తి మంచివాళ్లుగా ఉండటం అసాధ్యం

15నా స్వల్ప జీవిత కాలంలో నేను అన్ని చూశాను. మంచివాళ్లు చిన్న వయస్సులోనే మరణించడం చూశాను. చెడ్డవాళ్లు సుదీర్ఘ కాలం జీవించడం చూశాను.
16-17అందుకని అ కాలంగా నిన్ను నువ్వే చంపుకోవడం దేనికి? అతి మంచిగా కాని, అతి చెడ్డగా కాని ఉండకు. అతి తెలివిగా కాని అతి మూర్ఖంగా కాని ఉండకు. నీ ఆయువు తీరక ముందే నువ్వెందుకు చనిపోవాలి?
18దీనిని పట్టుకో గాని దానిని చేయి విడువకుండా ఉండటం మేలు. దేవునికి భయపడేవారు కూడా కొన్ని మంచికార్యాలు, కొన్ని చెడ్డకార్యాలు చేస్తారు.
19-20ఎప్పుడు మంచి పనులే చేసి, ఎన్నడూ పాపాలు చేయని మంచివాడంటూ లేడని ఖచ్చితంగా చెప్పవచ్చు.జ్ఞానం మనిషికి శక్తిని చేకూరుస్తుంది. నగరంలో పదిమంది (మూర్ఖులైన) నాయకులకంటె ఒక్క వివేకవంతుడు ఎక్కువ బలవంతుడై ఉంటాడు.
21జనం చెప్పే మాటలన్ని చెవిని చొరనీయకు. నీ స్వంత నౌకరే నీ గురించి చెడ్డ మాటలు చెప్పడం నువ్వు వినవచ్చు.
22నీవు కూడా అనేకసార్లు యితరులను గురించి చెడ్డ మాటలు చెప్పియుండ వచ్చునని నీకు తెలుసు.
23నేను నా వివేకాన్ని వినియోగించి, ఈ విషయాలన్నింటిని గురించి ఆలోచించాను. నేను సరైన వివేకిగా వుండాలని కోరుకున్నాను. కాని అది దుస్సాధ్యం.
24విషయాలెందుకిలా ఉన్నాయో నేను అర్థం చేసుకోలేను. దాన్ని అర్థం చేసుకోవడం ఎవరికైనా చాలా కష్టమే.
25నేను అధ్యయనం చేసి, సరైన జ్ఞానాన్ని అన్వేషించేందుకు చాలా గట్టి ప్రయత్నం చేశాను. ప్రతి ఒక్కదానికి హేతువును కనుక్కునేందుకు నేను ప్రయత్నించాను. (నేనేమి తెలుసుకున్నాను?) చెడ్డగా ఉండటం మూర్ఖత్వమనీ, మూర్ఖంగా వ్యవహరించడం పిచ్చితనమనీ నేను తెలుసుకున్నాను.
26(కొందరు) స్త్రీలు వలల మాదిరిగా ప్రమాదకారులు అన్న విషయం కూడా నేను తెలుసుకున్నాను. వాళ్ల హృదయాలు వలల్లాంటివి, వాళ్ల చేతులు గొలుసుల్లాంటివి. ఆ స్త్రీల చేతుల్లో చిక్కడం మరణం కంటె హీనం. దేవుణ్ణి అనుసరించే వ్యక్తి అలాంటి స్త్రీలనుండి పారిపోతాడు. అయితే, పాపులు సరిగ్గా వాళ్లకే చిక్కుతారు.
27-28ప్రసంగి అనే నేను చెప్పేదేమిటంటే, "వీటన్నింటికీ సమాధానాలు కనుగొనగలనేమోనని నేను పై విషయాలన్నీ మొత్తంగా పరిశీలించాను. సమాధానాల కోసం నేనిప్పటికీ అన్వేషిస్తూనే వున్నాను. అయితే, నేను కనుగొన్నది ఇది: నాకు వెయ్యి మందిలో ఒక్క మంచి మగాడు కనిపించగా, వెయ్యి మందిలో ఒక్క మంచి స్త్రీ కూడా కనిపించలేదు.
29 " నేను తెలుసుకున్న మరో విషయం: దేవుడు మనుష్యుల్ని నిజాయితీగల (మంచి) వాళ్లుగా సృష్టించాడు. కాని, మనుష్యులు చెడ్డగా ఉండేందుకు అనేక మార్గాలు కనుగొన్నారు."

## జ్ఞానం, శక్తి

8 ఆయా విషయాలను ఒక జ్ఞాని అర్థం చేసుకుని, వివరించి చెప్పగలిగినట్లు మరొకరెవరూ చెయ్యలేరు. అతని జ్ఞానం అతనికి ఆనందాన్నిస్తుంది. జ్ఞానం వల్ల ముఖంలో విచారం తొలగి, ఆనందం చోటు చేసుకుంటుంది.
2నేను చెప్పేదేమిటంటే, నువ్వు ఎల్లప్పుడూ రాజాజ్ఞను పాలించాలి. నువ్వు దేవుని ఎదుట ప్రమాణం చేశావు కనుక నువ్వీ పని చెయ్యాలి.
3రాజుకి సలహాలు ఇచ్చేందుకు భయపడకు. చెడ్డదాన్ని దేన్ని సమర్థించకు. కాని ఒక విషయం గుర్తుంచుకో: రాజు తనకు సంతోషం కలిగించే ఆజ్ఞలు ఇస్తాడు.
4రాజుకి ఆజ్ఞలు ఇచ్చే అధికారం ఉంది. రాజు ఏమి చెయ్యాలో అతనికి ఎవరూ చెప్పలేరు.
5రాజాజ్ఞను పాటించే వ్యక్తి క్షేమంగా వుంటాడు. అయితే, వివేకవంతుడికి ఈ పని చేయవలసిన సరైన తరుణం ఏదో, ఆ సరైన పని ఎప్పుడు చెయ్యాలో తెలుస్తుంది.
6మనిషి ఏ పనైనా చెయ్య

వలసినప్పుడు, దానికి సరైన సమయం, సరైన మార్గం వుంటాయి. (ప్రతి వ్యక్తి ప్రయత్నించి, తాను చెయ్యవలసింది ఏమిటో నిర్ణయించుకోవాలి.) తనకి అనేక ఇబ్బందులు ఉన్నప్పుడు, ఏమి జరుగుతుందో తెలియనప్పుడు కూడా అతనీ పని చెయ్యాలి. 7ఎందుకంటే, భవిష్యత్తులో ఏమి జరుగుతుందో ఏ ఒక్కరూ చెప్పలేరు గనుక.

8తన ఆత్మ తొలగిపోకుండా నిలుపుకోగల శక్తి ఏ ఒక్కరికి లేదు. తన మృత్యువును ఆపు చేయగల శక్తి ఏ ఒక్కరికీ లేదు. యుద్ధ సమయంలో తన ఇష్టంవచ్చిన చోటుకి పోగల స్వేచ్ఛ సైనికుడికి ఎలా వుండదో, అలాగే ఒక వ్యక్తి పాపం చేస్తే, ఆ పాపం అతన్ని స్వేచ్ఛగా వుండనివ్వదు.

9నేనీ విషయాలన్నీ గమనించాను. ఈ ప్రపంచంలో జరిగే విషయాలను గురించి నేను తీవ్రంగా ఆలోచించాను. మనుష్యులు ఎప్పుడూ యితరుల మీద అధి కారం చలాయించే శక్తిని సంపాదించుకునేందుకు తంటాలు పడుతూ ఉంటారన్న విషయం నేను గమనించాను. ఇది వాళ్లకి చెరుపు చేస్తుంది.

10దుర్మార్గులకి ఘనంగా అంత్యక్రియలు జరగడం కూడా నేను చూశాను అంత్యక్రియలు ముగించి, మనుష్యులు ఇళ్లకి తిరిగివెళ్లేటప్పుడు, చనిపోయిన దుర్మార్గుణ్ణి గురించి మంచి మాటలు చెప్పడం నేను విన్నాను. ఆ దుర్మార్గులు అనేకానేకమైన చెడ్డ పనులు చేసిన పట్టణాల్లో కూడా అర్థరహితమైన పని జరిగింది. అది అర్థరహితమైనది.

## న్యాయం, బహుమతులు, దండన

11కొన్ని సందర్భాల్లో, మనుష్యులు చేసిన చెడ్డ పనులకుగాను, వాళ్లు వెంటనే శిక్షింపబడరు. శిక్ష తాపీగా వస్తుంది. దానితో, యితరులకి కూడా చెడ్డ పనులు చెయ్యాలన్న కోర్కె కలుగుతుంది.

12ఒకానొక పాపి నూరు చెడు పనులు చేసియుండవచ్చు, అతను దీర్ఘాయుష్షు కలిగియుండవచ్చు. అయినప్పటికీ, దేవుడిపట్ల విధేయత, గౌరవం కలిగివుండటం మేలన్న విషయం నాకు తెలుసు. 13దుర్మార్గులు దేవుణ్ణి గౌరవించరు. అందుకని, నిజంగానే వాళ్లకి మంచి ఫలితాలు లభించవు. ఆ దుర్మార్గులు దీర్ఘకాలం జీవించరు. (సూర్యుడు కిందకి వాలిన కొద్దీ) పొడుగయ్యే నీడల్లాగా వాళ్ల జీవితాలు దీర్ఘంకావు.

14న్యాయంగా కనిపించని మరొకటి కూడా భూమి మీద సంభవిస్తూ ఉంటుంది. చెడ్డవాళ్లకి చెడు, మంచి వాళ్లకి మంచి జరగాలి. కాని, కొన్ని సందర్భాల్లో మంచి వాళ్లకి చెడు, చెడ్డవాళ్లకి మంచి జరుగుతూ ఉంటుంది. ఇది సరైనది కాదు. 15అందుకని, జీవితాన్ని హాయిగా అనుభవించడం మరింత మెరుగైనదని నేను తీర్మానించుకున్నాను. ఈ ప్రపంచంలో మనుష్యులు చెయ్యగలిగిన అత్యుత్తమమైన పనేమిటంటే, తినడం, తాగడం, జీవితాన్ని హాయిగా అనుభవించడమే. కనీసం అలా చేస్తేనైనా, తమ జీవితకాలంలో దేవుడు తమకిచ్చిన కఠిన శ్రమని మనుష్యులు సరదాగా సంతోషంగా చేసేందుకు అది తోడ్పడుతుంది.

## దేవుడు చేసేవన్ని మనకు బోధపడవు

16ఈ ప్రపంచంలో మనుష్యులు చేసే పనులను నేను శ్రద్ధగా పరిశీలించాను. మనుష్యులు ఎంత హడావుడిగా ఉంటారో నేను చూశాను. వాళ్లు రాత్రింబగళ్లు శ్రమిస్తారు. వాళ్లు దాదాపు నిద్రేపోరు. 17దేవుడు చేసేవాటిలో అనేకం కూడా నేను చూశాను. ఈ భూమిమీద దేవుడు చేసేదాన్నంతటినీ మనుష్యులు అర్థంచేసుకోలేరు. మనిషి వాటిని అర్థం చేసుకునేందుకు ఎంతైనా ప్రయత్నించవచ్చు. కాని, అతను అర్థంచేసు కోలేడు. దేవుడు చేసినదాన్ని తాను అర్థం చేసుకున్నానని ఒక జ్ఞాని అనవచ్చు. కాని, అది నిజం కాదు. వాటన్నింటినీ ఏ ఒక్కడూ అర్థం చేసుకోలేడు.

## పుట్టినవాడు గిట్టక మానడు

9 నేనీ విషయాలన్నీ చాలా జాగ్రత్తగా ఆలోచించాను. సజ్జనులు, వివేకవంతులు చేసేవాటినీ, వాళ్లకి సంభవించేవాటినీ దేవుడు అదుపుచేస్తాడన్న విషయం నేను గమనించాను. తాము ప్రేమించబడతారో లేక ద్వేషింపబడతారో మనుష్యులకి తెలియదు. భవి ష్యత్తులో ఏమి జరుగుతుందో మనుష్యులకి తెలియదు.

2అయితే, మనుష్యులందరికీ ఉమ్మడి అంశం ఒకటుంది మనుష్యులందరూ మరణించడమే అది! మంచివాళ్లూ మరణిస్తారు, చెడ్డవాళ్లూ మరణిస్తారు. చావు పరిశుద్ధులకి వస్తుంది అపరిశుద్ధులకీ వస్తుంది. చావు బలులు ఇచ్చేవాళ్లకీ వస్తుంది, ఇవ్వనివాళ్లకీ వస్తుంది. పాపి ఎలా చనిపోతాడో, మంచివాడూ సరిగ్గా అలాగే చనిపోతాడు. దేవునికి ప్రత్యేకమైన ప్రమాణాలు చేసే వాళ్లూ ఆ ప్రమాణాలు చెయ్యనివాళ్ల మాదిరిగానే చనిపోతారు.

3ఈ జీవితంలో సంభవించే వాటన్నింట్లోనూ పరమ దౌర్భాగ్యమైనదేమిటంటే, అందరూ ఒకేలాగ గతించడమే. అయితే, మనుష్యులు ఎల్లప్పుడూ పాపపు ఆలోచనలూ, మూర్ఖపు ఆలోచనలూ చేస్తూ వుంటారు, ఇది బాగా చెడ్డదే. ఆ ఆలోచనలు మరణానికి దారితీస్తాయి. 4మనిషి ఇంకా బతికివుంటే, అతను ఎవరైనా, అతనికి ఆశ ఉంటుంది. అయితే, ఈ నానుడి నిజం చచ్చిన సింహం కంటె, బతికివున్న కుక్క మేలు.

5బతికివున్న మనుష్యులకి తాము చనిపోతామన్న విషయం తెలుసు. అయితే చనిపోయిన మనుష్యులకి యేమీ తెలియదు. చనిపోయినవాళ్లకి యిక యే ప్రతిఫలము ఉండదు. జనం వాళ్లని త్వరలోనే మరచి

పోతారు. [6]ఒక వ్యక్తి చనిపోయాక, అతని ప్రేమ, ద్వేషం, ఈర్ష్య అన్నీ అంతరించిపోతాయి. చనిపోయినవాళ్లు భూమిమీద జరిగే వేటిలోనూ ఏమీ, ఎన్నడు ఇక పాలుపంచుకోలేరు.

### నీకు సాధ్యమైనప్పుడే జీవితాన్ని అనుభవించు

[7]అందుకని, పో, పోయి తిండి తిను, దాంట్లోని ఉల్లాసాన్ని అనుభవించు. నీ ద్రాక్షారసం సేవించి, ఆనందం పొందు. ఈ పనులు దేవుని దృష్టిలో తప్పేమీ కావు. [8]చక్కటి దుస్తులు ధరించి, నిన్ను నీవు బాగా కనిపించేలా చూసుకో. [9]నువ్వు ప్రేమించే భార్యతో సుఖం అనుభవించు. నీ స్వల్పకాలిక జీవితంలో ప్రతి ఒక్క రోజునూ సుఖంగా గడుపు. దేవుడు నీకీ భూమి మీద ఈ స్వల్ప జీవితాన్ని ఇచ్చాడు, నీకున్నదంతా ఇంతే. అందుకని, నువ్వు ఈ జీవితంలో చేయవలసిన పనిని సరదాగా చెయ్యి. [10]నీకు పని దొరికిన ప్రతి సారి, నువ్వు దాన్ని నీ శాయశక్తులా అత్యుత్తమంగా చెయ్యి. సమాధిలో పనేమీ ఉండదు. అక్కడ ఆలోచన, జ్ఞానం, వివేకం ఏ ఒక్కటి ఉండదు. మనందరి గమ్యమూ ఆ మృత్యు స్థానమే.

### అదృష్టమో, దురదృష్టమో అనుభవించక మనం చెయ్యగలిగిందేమిటి?

[11]ఈ ప్రపంచంలో నేను చూసిన సక్రమం కాని విషయాలు ఇంకా ఉన్నాయి: అతి వేగంగా పరిగెత్తేవాడు పరుగు పోటీలో ఎల్లప్పుడూ గెలవలేడు. అత్యంత బలీయమైన సైన్యమైనా యుద్ధంలో ఎల్లప్పుడూ గెలవ లేదు. మిక్కిలి వివేకవంతుడు కూడా తాను సంపా దించిన ఆహారాన్ని ఎల్లప్పుడూ పొందలేడు. మిక్కిలి చురుకైనవాడు కూడా సంపదను ఎల్లప్పుడూ సాధించు కోలేడు. విద్యావంతుడికైనా ఎల్లప్పుడూ తనకి యోగ్య మైన ప్రశంస అభ్యంకాదు. చెడు కాలము దాపురించి నప్పుడు ప్రతి ఒక్కరికి కష్టాలు వస్తాయి.

[12]తనకి మరు క్షణంలో ఏమి జరగనున్నదో మనిషికి ఎన్నడూ తెలియదు. మనిషి వలలో చిక్కిన చేపలాంటి వాడు. ముందేమి జరగబోతున్నదీ ఆ చేపకి తెలియదు. అతను పంజరంలో చిక్కిన పక్షిలాంటివాడు, ఆ పక్షికి ముందేమి జరగనున్నది తెలియదు. అదే విధంగా, మనిషి కూడా తనకి ఆకస్మికంగా సంభవించే కీడుల బోనులో చిక్కుకుంటాడు.

### జ్ఞాన శక్తి

[13]ఈ భూమిమీద ఒక వ్యక్తి వివేకవంతమైన ఒక పని చెయ్యడం కూడా నేను చూశాను. అది చాలా ముఖ్యమైన పని అని నాకు అనిపించింది. [14]స్వల్ప జనాభా కలిగిన ఒక చిన్న పట్టణం వుంది. ఒక గొప్ప రాజు ఆ పట్టణం మీదకి దండెత్తి, దాని చుట్టూ తన సేనలను నిలిపాడు. [15]కాని, ఆ పట్టణంలో ఒక జ్ఞాని వున్నాడు. ఆ జ్ఞాని పేదవాడు. అయితే, అతను తన జ్ఞానాన్ని తన పట్టణాన్ని కాపాడేందుకు వినియోగిం చాడు. అన్నీ ముగిసిపోయాక, జనం అతన్ని గురించి మరచిపోయారు. [16]అయినప్పటికీ, ఆ జ్ఞానం ఆ బలం కంటె మెరుగైనదని నేనంటాను. ఆ జనం ఆ పేదవాని జ్ఞానం గురించి మరచిపోయారు. అతని మాటలను ఆ జనం పట్టించుకోవడం మానేశారు. (అయినా కూడా ఆ జ్ఞానం మెరుగైనదని నేను నమ్ముతాను.)

17 మూర్ఖుడైన ఒక రాజు వేసే కేకల* కంటె
ఒక జ్ఞాని పలికే మెల్లని పలుకులు మరెంతో
మెరుగైనవి.*
18 యుద్ధంలో ఆయుధాల కంటె జ్ఞానం
గొప్పది. అయితే ఒక్క మూర్ఖుడు ఎన్ని
మంచి పనులైనా పాడు చేయగలడు.

10 అత్యంత పరిమళ భరితమైన తైలాన్ని గబ్బు పట్టించేందుకు చచ్చిన కొద్దిపాటి ఈగలే చాలు. అదే విధంగా, జ్ఞానాన్నీ, గౌరవాన్నీ, మంటగలి పేందుకు కొద్దిపాటి మూర్ఖత్వం చాలు.

[2]వివేకవంతుడి ఆలోచనలు అతన్ని సరైన మార్గంలో నడిపిస్తాయి. అయితే, అవివేకి ఆలోచనలు అతన్ని తప్పు మార్గంలో నడిపిస్తాయి. [3]మూర్ఖుడు అలా దారి వెంట పోయేటప్పుడు సైతం తన మూర్ఖ త్వాన్ని ప్రదర్శిస్తాడు. దానితో, వాడొక మూర్ఖుడన్న విషయాన్ని ప్రతి ఒక్కడూ గమనిస్తాడు.

[4]యజమాని కేవలం నీపట్ల కోపం ప్రదర్శించి నంత మాత్రాన నువ్వు నీ కొలువు వదిలెయ్యబోకు. నువ్వు ప్రశాంతంగా, సాయంగా వుంటే, పెద్దపెద్ద పొర పాట్లను కూడా నువ్వు సరిదిద్దవచ్చు.* [5]ప్రపంచంలో జరిగే మరో అంశం నా దృష్టికి వచ్చింది. అది సమంజ సమైనది కాదు. సాధారణంగా అది పరిపాలకులు చేసే పొరపాటు: [6]అవివేకులకు ముఖ్యమైన పదవులు, జ్ఞాన సంపన్నులకు అప్రధానమైన పదవులు కట్టబెడతారు.

[7]సేవకులుగా ఉండదగినవాళ్లు గుర్రాలపై స్వారీ చేస్తుండగా, అధికారులుగా ఉండదగిన వాళ్లు (వాళ్ల సరసన బానిసల మాదిరిగా) నడుస్తూవుండటం నేను చూశాను.

---

**మూర్ఖుడైన ... కేకల** జ్ఞాని పలుకులు.

**జ్ఞాని ... మెరుగైనవి** మూర్ఖ జనులకు పాలకుడిచ్చే ఆజ్ఞల కంటె, ప్రశాంతంగా చెవినబెట్టే జ్ఞాని మాటలు మెరుగు.

**యజమాని ... సరిదిద్దవచ్చు** వ్యాఖ్యార్థంలో "పెను పాపాలను సైతం చికిత్సకుడు శమింపజేయగలడు." 'చికిత్సకుడు' అన్న మాటకి క్షమించే స్వభావం కలిగి, ఇతరులకు సహాయ పడేవాడని అర్థం.

### ప్రతి పనికీ, దాని ప్రమాదాలు దానికి వుంటాయి

[8]గొయ్యి తవ్వే వ్యక్తి, తానే దానిలో పడవచ్చు.
గోడ కూలగొట్టేవాణ్ణి పాము కాటెయ్యవచ్చు.
[9]పెద్దబండలను దొర్లించేవాడికి వాటివల్లనే గాయాలు
కావచ్చు. చెట్లు నరికేవాడికి కూడా ప్రమాదం
లేకపోలేదు, (ఆ చెట్లు అతని మీద కూలవచ్చు.)
[10]అయితే, పరిజ్ఞానంవుంటే, ఏ పనైనా సులభ
తరం అవుతుంది. మొండి కత్తితో కొయ్యడం చాలా
కష్టం. అయితే, మనిషి దానికి పదును పెడితే, అప్పుడు
పని సులభతరమవుతుంది. (జ్ఞానం అంత సునిశిత
మైనది.)
[11]ఒక వ్యక్తికి పాముల్ని ఎలా అదుపు చేయాలో
తెలియవచ్చు. కాని, అతను అందుబాటులో లేనప్పుడు
పాము ఎవరినైనా కాటేస్తే, ఆ నైపుణ్యం వ్యర్థమే.
(జ్ఞానం అలాంటిది.)

12 వివేకవంతుడి మాటలు ప్రశంసా పాత్రలు.
అయితే అవివేకి మాటలు వినాశకరమైనవి.

[13]ఆదిలోనే మూర్ఖుడు అవకతవకగా మాట్లాడ
తాడు. చివర్లో ఇక అతనివి ఉన్మత్త ప్రలాపాలుగా ముగు
స్తాయి. [14]అజ్ఞాని ఎడతెగకుండా (తను చెయ్యబోయే
వాటిని గురించి) మాట్లాడతాడు. అయితే, భవిష్యత్తులో
ఏమి జరగబోయేది ఎవరికీ తెలియదు. తర్వాత ఏమి
జరిగేది ఏ ఒక్కడికి తెలియదు.

15 తన గమ్యానికి చేరుకునే మార్గం యేమిటో
తెలుసుకునే నేర్పు మూర్ఖుడికి వుండదు,
అందుకే అతను జీవితకాలమంతా కష్టించి పని
చెయ్యాలి.

### పని విలువ

[16]రాజు శిశుప్రాయుడైనా, బానిస అయినా ఆ
రాజ్యానికి చాలా చెరుపు జరుగుతుంది. అధికారులు
తిండిపోతులై, తమ కాలమంతా భోజన పానాదుల
తోనే వినియోగించేవాళ్లయితే, ఆ దేశానికి చాలా చెరుపే
జరుగుతుంది.
[17]ఒక దేశపు రాజు కులీనుడైతే, ఆ దేశానికి ఎంతో
మంచి జరుగుతుంది.* దేశాధికారులు తిండిపోతులు,
తాగుబోతులు కాక, శక్తి పుంజుకు నేందుకు మాత్రమే
అన్నపానాలు మితంగా సేవించే వారైతే, ఆ దేశానికి
ఎంతో క్షేమం.

18 మనిషి మరి బద్ధకస్తుడైతే అతని ఇల్లు కురవ
నారంభిస్తుంది, ఇంటి పైకప్పు కూలి
పోతుంది.

[19]మనుష్యులకి తిండి సంతృప్తి నిస్తుంది, ద్రాక్షారసం
వాళ్లని మరింత ఆనంద పరుస్తుంది. అయితే, డబ్బుంటే
అనేక సమస్యలు పరిష్కారమవుతాయి.

### గప్పాలు తెచ్చే తిప్పలు

[20]రాజును గురించి చెడుగా మాట్లాడకు. రాజును
గురించి చెడ్డ ఆలోచనలు కూడా చేయకు. నీ యింట
నీవు ఒంటరిగా ఉన్నప్పుడు కూడా ధనికులను గురించి
చెడుగా మాట్లాడకు. ఎందుకంటావేమో, గోడలకి చెవు
లుంటాయి. నువ్వన్న మాటలన్నీ పిట్టలు చేర
వేస్తాయి. వాళ్లకి చేరుతాయి.

### భవిష్యత్తును ధైర్యంగా ఎదుర్కో

11 నువ్వెక్కడకి వెళ్లినా అక్కడ మంచి పనులు
చెయ్యి. కొంతకాలం గడిచాక నీ మంచి పను
లనే విత్తులు మొలకలెత్తి పంట రూపంలో నీకు తిరిగి
వస్తాయి.*
[2]నీకున్నది వేర్వేరు వాటిమీద మదుపు పెట్టు.*
ప్రపంచంలో ఏమి చెడుగులు సంభవించనున్నాయో
నీకు తెలియదు.
[3](నువ్వు ఖచ్చితంగా తెలుసుకోగలిగిన విషయాలు
కొన్ని వున్నాయి.) మేఘాలు నీళ్లతో నిండివుంటే,
అవి నేలపై వర్షిస్తాయి. చెట్టు నేలపైన కూలితే కూలి
నది ఉత్తరానికైనా, దక్షిణానికైనా అది పడ్డచోటునే
వుంటుంది.
[4](అయితే, కొన్ని విషయాలు నువ్వు ఖచ్చితంగా
తెలుసుకోలేవు. అలాంటప్పుడు, నువ్వు సాహసించి
ఏదోఒకటి చెయ్యాలి.) మంచి వాతావరణం, పరిస్థితుల
కోసం ఎదురు చూసేవాడు ఎన్నడూ తన విత్తనాలు
చల్లలేడు. ప్రతి మేఘమూ వర్షించేస్తుందని భయపడే
వాడు తన పంట కుప్పలు ఎన్నడూ నూర్చుకోలేడు.
[5]గాలి ఎటు వీస్తుందో నీకు తెలియదు. బిడ్డ తన
తల్లి గర్భంలో ఎలా పెరుగుతుందో నీకు తెలియదు.
అలాగే, దేవుడు యేమి చేస్తాడో నీకు తెలియదు,
కాని, అన్నీ జరిపించేది ఆయనే.
[6]అందుకని, ప్రొద్దుటే నాట్లు వెయ్యడం మొదలెట్టు.
సాయంత్రమయ్యేదాకా పని చాలించకు. ఎందుకంటే,

---

**దేశానికి ... జరుగుతుంది** అక్షరాలా 'స్వేచ్ఛాపరుల పుత్రుడైతే' అంటే ఎన్నడూ బానిస కానివాడు, తన తల్లి తండ్రులు బానిసలుగా కానివాడు.

**నువ్వెక్కడికి ... తిరిగివస్తాయి** లేదా, "నీ ఆహారాన్ని నీళ్ల మీద వేయుము, చాలా దినములైన తరువాత అది నీకు కనబడుతుంది."

**నీకున్నది ... మదుపు పెట్టు** లేక, "ఒక భాగాన్ని ఏడుగురికో, ఎనమండుగురికో పంచి ఇయ్యి."

ఏవి నిన్ను సంపన్నుని చేస్తాయో నీకు తెలియదు.
ఏమో, నీ పనులు అన్నీ జయప్రదమ వుతాయేమో.
7బతికి ఉండటం మంచిది! సూర్యకాంతి కళ్లకి
యింపు గొలుపుతుంది. 8నువ్వు ఎంత కాలం
జీవించినా, నీ జీవితంలో ప్రతి ఒక్క రోజునూ అను
భవించు. అయితే, ఏదో ఒక రోజున నువ్వు మర
ణించక తప్పదని గుర్తుంచుకో. నీ జీవిత కాలంకంటె,
నీ మరణానంతర కాలం చాలా ఎక్కువ. నువ్వు మరణిం
చాక, నువ్వు చెయ్యగలిగినది శూన్యం, ఏమీ ఉండదు!.

### నీ యౌవ్వన కాలంలోనే దేవుని సేవచెయ్యి

9అందుకని, యువజనులారా, మీ యౌవ్వన కాలం
లోనే మీరు సుఖాలు అనుభవించండి. ఆనందంగా
ఉండండి! మీ మనస్సుకి ఏది తోస్తే, మీరు ఏది కోరు
కుంటే అది చెయ్యండి. అయితే, మీరు చేసే పనుల
న్నింటికీ దేవుడు మిమ్మల్ని విచారిస్తాడని మాత్రం
మరచిపోకండి. 10మీ కోపానికి మీరు లొంగిపోకండి.
మీ శరీరం మిమ్మల్ని పాప మార్గాన నడపకుండా చూసు
కోండి.* ప్రజలు జీవిత ప్రారంభ దశలో తాము
యౌవనస్థులుగా ఉన్నప్పుడు తెలివిలేని పనులు
చేస్తారు.

### వృద్ధాప్యంలో ఎదురయ్యే సమస్యలు

12 చెడ్డకాలం దాపురించక ముందు (నీవు ముసలి
వాడవు కాకముందు), “నా జీవితం వృథా చేసు
కున్నాను”* అని నువ్వు వాపోయే వయస్సు రాక
ముందు, నువ్వింకా యౌవ్వనావస్థలో వుండగానే నీ
సృష్టికర్తని నువ్వు గుర్తుచేసుకో.
2సూర్య చంద్రులూ, నక్షత్రాలూ నీ కంటి దృష్టికి
ఆనని కాలం దాపురించక పూర్వం, (నువ్వింకా
యౌవన ప్రాయంలో ఉండగానే, నీ సృష్టికర్తని నువ్వు
జ్ఞాపకం చేసుకో). ఒక తుఫాను తర్వాత మరొక
తుఫాను వచ్చినట్లే, (కష్టాలు పదే పదే వస్తాయి).
3ఆ వయస్సులో నీ చేతులు శక్తి కోల్పోతాయి.
నీ కాళ్లు బలము లేక వంగుతాయి. నీ పళ్లు ఊడి
పోతాయి, నువ్వు నీ ఆహారం నమలలేవు. నీ కళ్లు
మసకబారతాయి. 4నీ వినికిడి శక్తి మందగిస్తుంది. వీధు
ల్లోని శబ్దాలు నీకు వినిపించవు. నీ గోధుమలు విసిరే
తిరగలి శబ్దం కూడా నీకు వినిపించదు. స్త్రీలు పాడే
పాటలు కూడా నువ్వు వినలేవు. అయితే, పక్షి చేసే
కిలకిలారావానికే నీకు వేకువజామున మెలుకువ వచ్చే
స్తుంది. (మరెందుకో కాదు, నీకు నిద్రరాదు,
అందుకు.)
5ఎత్తయిన ప్రదేశాలంటే నీకు భయం వేస్తుంది.
నీ దోవలో ఏ చిన్న వస్తువు ఉన్నా, దానిమీద కాలువేస్తే
ఎక్కడ బోల్తాపడిపోతానో అని నీకు బెదురు కలుగు
తుంది. నీ జుట్టు నెరిసి, బాదం చెట్టు పూతలా కనిపి
స్తుంది. నువ్వు కాళ్లీడ్చుకుంటూ మిడతలా నడుస్తావు.
నువ్వు నీ కోరికను కోల్పోతావు (జీవించటానికి).
అప్పుడిక నువ్వు నీ శాశ్వత నివాసానికి (సమాధిలోకి)
పోతావు. (నీ శవాన్ని సమాధికి మోసుకెళ్తూ) విలాప
కులు* వీధుల్లో గుమిగూడి శోకనాలు పెడతారు.

### మరణం

6 నీ వెండి మొలతాడు తెగక ముందే, బంగారు
గిన్నె నలగక ముందే. బావి దగ్గర పగిలిన
మట్టి కుండలా, (నీ జీవితం వృథా కాక ముందే)
పగిలి బావిలో పడిపోయిన రాతి మూతలా నీ
జీవితం వృథా కాకముందే నీ యౌవన
కాలంలోనే నువ్వు నీ సృష్టికర్తను స్మరించుకో.
7 మట్టిలో నుంచి పుట్టిన నీ శరీరం నువ్వు మర
ణించినప్పుడు తిరిగి ఆ మట్టిలోనే కలిసి
పోతుంది. కానీ, దేవుని దగ్గర్నుంచి వచ్చిన నీ
ఆత్మ నువ్వు మరణించినప్పుడు తిరిగి ఆ
దేవుడి దగ్గరకే పోతుంది.

8అంతా వ్యర్థం, శుద్ధ అర్థరహితం. ఇదంతా కాలాన్ని
వ్యర్థం చెయ్యడం అంటాడీ ప్రసంగి!

### ముగింపు మాటలు

9ప్రసంగి గొప్ప జ్ఞాని. ఆయన తన జ్ఞానాన్ని
జనానికి బోధ చేసేందుకు వినియోగించాడు. అనేక
వివేకవంతమైన బోధనలను ఆయన ఎంతో శ్రద్ధగా
అధ్యయనం చేసి, జాగ్రత్తగా విభజించాడు.* 10ప్రసంగి
సరైన పదాలు ఎంచుకునేందుకు చాలా శ్రమించాడు.
ఆయన యథార్థమైన, ఆధారపడదగిన ఉపదేశాలు
రచించాడు.

---

**మీ కోపానికి … చూసుకోండి** లేక, ఆయా విషయాలను గురించి సతమతమవకండి. ఇబ్బందులనుంచి మిమ్మల్ని మీరు కాపాడుకోండి.

**నా జీవితం వృథా చేసుకున్నాను** వ్యాఖ్యార్థం, “నాకు వాటిలో ఏ ఆనందమూ లేదు.” దీని అర్థం యిలా కూడా చెప్పు కోవచ్చు “నా యౌవనంలో నేను చేసిన పనులు నాకు నచ్చలేదు,” లేక, “నా ఈ వృద్ధాప్యంలో నా జీవితం నాకు ఆనందం యివ్వడంలేదు.”

**విలాపకులు** లేక ఆకలి, లేక కామవాంఛ. ఈ సందర్భంలో వాడబడిన హీబ్రూ మాటలు అన్వయక్లిష్టంగా ఉన్నాయి. అంత్యక్రియల దగ్గర శోకనాలు పెట్టేవాళ్లు. బైబిలు కాలంలో, మరణించిన వ్యక్తి అంత్యక్రియల సందర్భంగా, అతని బంధు వులు తమ దుఃఖాతిరేకాన్ని ప్రదర్శించేందుకు కిరాయికి కుదుర్చుకొనే వృత్తి విలాపకులు.

**ఆయన … విభజించాడు** ఈ హీబ్రూ మాటకి “సరళం చేయు, పొందుపరచు, సరిదిద్దు లేక సవరించు” అని అర్థం.

11జ్ఞానుల మాటలు, జనం తమ పశువులను సరైన
బాటలో నడిపేందుకు ఉపయోగించే ముల్లు కర్రల
వంటివి. ఆ ఉపదేశాలు విరగని గట్టి గూటాల వంటివి.
(నీకు సరైన జీవన మార్గాన్ని చూపే సరైన మార్గదర్శు
లుగా నువ్వా బోధనల పైన ఆధారపడవచ్చు) ఆ
జ్ఞానోపదేశాలన్నీ ఒకే కాపరి (దేవుని) నోట నుండి
వచ్చినవి.
12అందుకని కుమారుడా, (ఆ ఉపదేశాలను
అధ్యయనం చెయ్యి) అయితే ఇతర గ్రంథాలను
గురించి ఒక హెచ్చరిక. రచయితలు గ్రంథాలు
ఎప్పుడూ వ్రాస్తూనే ఉన్నారు. అతిగా అధ్యయనం
చేయడం నీకు చాలా అలసట కలిగిస్తుంది.
13-14సరే,
ఈ గ్రంథంలోని విషయాలన్నీ చదివి మనం
నేర్చుకోవలసింది ఏమిటి? మనిషి చేయగలిగిన
అత్యంత ముఖ్యమైన పనేమిటంటే, దేవుని పట్ల భయ
భక్తులు కలిగివుండటం, దేవుని ఆజ్ఞలు పాటించడం.
ఎందుకంటే, మనుష్యులు చేసే పనులన్నీ గుప్త కార్యా
లతో బాటు దేవునికి తెలుసు. ఆయనకి మనుష్యుల
మంచి పనులను గురించీ చెడ్డ పనులను గురించీ సర్వం
తెలుసు. మనుష్యుల పనులేవీ దేవుని విచారణకు
రాకుండా పోవు.

# పరమ గీతము

1 సొలొమోను అత్యద్భుత గీతం

### తాను ప్రేమించిన పురుషునితో స్త్రీ

2 ముద్దులతో నన్ను ముంచెత్తు, ఎందుకంటే ద్రాక్షా మద్యంకన్నా బాగుంటుంది నీ ప్రేమ.
3 నీ పరిమళ ద్రవ్యం అద్భుతమైన సువాసననిస్తుంది, కాని మిక్కిలి ఉత్తమ పరిమళ ద్రవ్యం కన్నా నీ పేరు* తియ్యనైనది. అందుకే యువతులు నిన్ను ప్రేమిస్తారు.
4 నన్ను నీతో తీసికొనిపో! మనం పారిపోదాం పద! రాజు తన గదిలోనికి నన్ను తీసుకు పోయాడు.

### యెరూషలేము స్త్రీలు పురుషునితో

మేము ఆనందిస్తాం నీకోసం హాయిగా ఉంటాం. జ్ఞాపక ముంచుకో, నీ ప్రేమ ద్రాక్షారసము కన్నా బాగుంటుంది మంచి కారణంతోనే యువతులు నిన్ను ప్రేమిస్తారు.

### ఆమె స్త్రీలతో అంటుంది

5 యెరూషలేము పుత్రికలారా, నేను నల్లగా అందంగా ఉన్నాను. కేదారు, సల్మా* గుడారాలంత నల్లగా ఉన్నాను.
6 నేనెంత నల్లగా ఉన్నానో చూడవద్దు, సూర్యుడు నన్నెంత నల్లగా చేశాడో చూడవద్దు. నా సోదరులు నా మీద కోపగించారు. వాళ్ల ద్రాక్షా తోటలకు కాపలా కాయుమని నన్ను బలవంత పెట్టారు. అందువల్ల నన్ను గురించి నేను శ్రద్ధ తీసుకోలేక పోయాను.*

### ఆమె అతనితో అంటుంది

7 నా ఆత్మ అంతటితోను నిన్ను ప్రేమిస్తాను! నీ గొర్రెల్ని ఎక్కడ మేపుతావో? మధ్యాహ్నం వాటిని ఎక్కడ పడుకో బెడతావో నాకు చెప్పు. నీతో ఉండటానికి నేను రావాలి లేదా నీ మిత్రుల గొర్రెల కోసం పాటుపడే అద్దెకు తీసుకున్న స్త్రీ* అవుతాను!

### అతను ఆమెతో అంటున్నాడు

8 నువ్వు అంత అందమైనదానవు! నిజంగా నీకు తెలుసు ఏమి చెయ్యాలో. వెళ్లు, గొర్రెలను అనుసరించు. నీ చిన్న మేకల్ని గొల్లవాళ్ల గుడారాల వద్ద మేపు.
9 నా ప్రియురాలా, ఫరోరథాలు* లాగుతున్న మగ గుర్రాల్ని ఆకర్షించే ఆడ గుర్రం* కన్నా నువ్వు నన్ను ఎక్కువ సంతోషపరుస్తున్నావు. ఆ గుర్రాలకు అందమైన అలంకరణలున్నాయి. వాటి ముఖాల పక్కన, వాటి మెడల చుట్టూ
10-11 నీకోసం చేసిన అలంకరణలివిగో, బంగారు తలకట్టు* వెండి గొలుసు. నీ బుగ్గలు ఎంతో అందంగా ఉన్నాయి బంగారు అలంకరణలతో, నీ మెడ ఎంతో అందంగా ఉంది వెండి అల్లికలతో.

### ఆమె అంటుంది

12 నా పరిమళ ద్రవ్యపు సువాసన తన మంచంమీద పడుకున్న రాజును చేరుతుంది.
13 రాత్రంతా నా స్తనాల మధ్య పడివున్న నా మెడలో వున్న చిన్న గోపరసం* సంచిలాంటి వాడు నా ప్రియుడు.

---

**పేరు** హీబ్రూభాషలో ఈ మాట 'పరిమళం'లా ధ్వనిస్తుంది.

**కేదారు, సల్మా** అరేబియా జాతులు. 'సల్మా'కు హీబ్రూలో 'సొలొమోను' అని ఉందికాని సల్మా, 'సల్మోను' పదాలను రూతు 4:20-21తో పోల్చిచూడండి.

**అందువల్ల … తీసుకోలేకపోయాను** శబ్దార్థ ప్రకారం "నా సొంత ద్రాక్ష తోట."

**అద్దెకు … స్త్రీ** లేదా, "ముసుగు వేసుకున్న స్త్రీలు." వ్యభిచారిణి అనే అర్థం కూడా ఇవి ఇవ్వవచ్చును.

**ఫరోరథాలు** శబ్దార్థం ప్రకారం "ఓ ప్రియురాలా! నిన్ను ఫరో రథాలలోని ఆడ గుర్రంతో పోలుస్తున్నాను."

**మగ … గుర్రం** రథాలు లాగడానికి మగ గుర్రాల్ని మాత్రమే ఉపయోగించేవారు. ఆ రథాలను పక్కదారి పట్టించడానికి శత్రువులు ఆడ గుర్రాలను ఎరగా చూపేవారు.

**బంగారు తలకట్టు** ఈ హీబ్రూ పదానికి సరియైన అర్థం తెలియడం లేదు. బహుశః అది బుగ్గలమీద వ్రేలాడే అలంకరణలతో కూడిన తలకట్టు కావచ్చు.

**చిన్నగోపరసం** కొన్ని మొక్కల జిగురు నుండి చేయబడిన ఒక పరిమళ ద్రవ్యం.

14 ఏన్గెదీ ద్రాక్షాతోటల దగ్గరున్న గోరంటు* పూల
గుత్తిలాంటివాడు నా ప్రియుడు.

### అతడు అంటున్నాడు

15 నా ప్రియురాలా, నువ్వెంతో అందంగా ఉన్నావు!
ఓహో! నువ్వు సుందరంగా ఉన్నావు! నీ కళ్లు
పావురాల్లా వున్నాయి.

### ఆమె అంటుంది

16 నా ప్రియుడా, నువ్వెంతో సొగసుగా ఉన్నావు!
అవును, అత్యంత మనోహరంగా ఉన్నావు! మన
శయ్య స్వచ్ఛంగా సంతోషకరంగా ఉంది*
17 మనింటి దూలాలు దేవదారువి వాసాలు జాజి
పలకలవి.

2 నేను మైదానంలో కుంకుమ పువ్వును*
లోయలలో కస్తూరి పుష్పాన్ని.

### అతడు అంటున్నాడు

2 నా ప్రియురాలా, ఇతర స్త్రీల మధ్య నీవు ముళ్ల
మధ్య కస్తూరి పుష్పంలా ఉన్నావు!

### ఆమె అంటుంది

3 నా ప్రియుడా, ఇతర పురుషుల మధ్య నీవు అడవి
చెట్ల మధ్య ఆపిలు చెట్టులా ఉన్నావు!

### ఆమె స్త్రీలతో అంటుంది

ఆనంద భరితనై నేనతని నీడన కూర్చుంటాను!
నా ప్రియుని నీడలో కూర్చుని నేను ఆనందిస్తాను,
అతని పండు నాకెంతో తియ్యగా వుంది.
4 నా ప్రియుడు నన్ను మద్యగృహానికి తీసుకుని
వెళ్లాడు, నా మీద అతని ఉద్దేశం ప్రేమ.
5 ఎండు ద్రాక్షాలతో* నాకు బలాన్నివ్వండి, ఆపిలు
పండ్లతో నా అలసట తీర్చండి, ఎందుకంటే నేను
ప్రేమతో బలహీనమయ్యాను.*
6 నా ప్రియుని ఎడమ చేయి నా తల కింద ఉంది,
అతని కుడి చేయి నన్ను పట్టుకొంది,

7 యెరూషలేము స్త్రీలారా, నాకు వాగ్దానం
చెయ్యండి, దుప్పులమీదా అడవి లేళ్ల మీదా ఒట్టేసి,
నేను సిద్ధపడేవరకూ.* ప్రేమను లేపవద్దు, ప్రేమను
పురికొల్పవద్దు.

### ఆమె మళ్లీ అంటుంది

8 నా ప్రియుని గొంతు వింటున్నాను. అదిగో అతడు
వస్తున్నాడు. పర్వతాల మీది నుంచి దూకుతూ
కొండల మీది నుంచి వస్తున్నాడు.
9 నా ప్రియుడు దుప్పిలా ఉన్నాడు లేదా లేడి పిల్లలా
ఉన్నాడు. మన గోడ వెనుక నిలబడివున్న అతన్ని
చూడు, కిటికీలోనుంచి తేరి పార చూస్తూ, అల్లిక
కిటికీలోనుంచి* చూస్తూ
10 నా ప్రియుడు నాతో అంటున్నాడు, "లే, నా
బంగారు కొండా, నా సుందరాంగీ, మనం పోదాం
పద!
11 చూడు, శీతాకాలం వెళ్లిపోయింది, వానలు
వచ్చాయి వెళ్లాయి.
12 పొలాల్లో పూలు వికసిస్తున్నాయి ఇది పాడే
సమయం!* కోలాహలపు పావురాలు తిరిగి
వచ్చాయి.
13 అరటి చెట్లమీద చిన్న పండ్లు ఎదుగుతున్నాయి.
పూలు పూస్తున్న ద్రాక్షా తీగల వాసన చూడు.
లే, నా బంగారు కొండా, నా సుందరాంగీ, మనం
పోదాం పద!"
14 ఇక్కడ ఈ పర్వతం మీద కనపడని ఎత్తైన
శిఖరంమీద గుహల్లో దాక్కొన్న నా పావురమా!
నిన్ను చూడనిమ్ము, నీ గొంతు విననిమ్ము, నీ
గొంతు ఎంతో మధురం, నువ్వెంతో సుందరం!

### ఆమె స్త్రీలతో అంటుంది

15 మాకోసం గుంటనక్కల్ని పట్టుకో ద్రాక్షాతోటల్ని
పాడుచేసే చిన్న గుంటనక్కల్ని! మా ద్రాక్షాతోట
ఇప్పుడు పూతమీద ఉంది.
16 నా ప్రియుడు నావాడు, నేను అతని దానను!
అతడు పద్మాల నడుమ గొర్రెలను మేపు
తున్నాడు!
17 రోజు తన చివరి శ్వాసను విడిచినప్పుడు నీడలు
పరుగెత్తినప్పుడు, నా ప్రియుడా, చీలిన పర్వతాల*
మీద దుప్పిలా, లేడిపిల్లలా తిరుగు!

---

**గోరంటు** తియ్యటి వాసన వచ్చే ఒక మొక్క దానికి ద్రాక్షా వల్లిలా గుత్తులు గుత్తులుగా పూచే నీలి పసుపు పచ్చపూలు ఉంటాయి.

**మనశయ్య ... ఉంది** లేదా 'సవనవలాడుతూ పచ్చగా' కొత్త పచ్చిక బీడులా ఉంది.

**నేను ... కుంకుమ పువ్వును** "షారోను గులాబి."

**ఎండు ద్రాక్షాలు** లేదా "ఎండు ద్రాక్ష రొట్టెలు."

**ప్రేమతో బలహీనమయ్యాను** లేదా "నేను ప్రేమ రోగిని."

**నేను సిద్ధపడేవరకూ** శబ్దార్థ ప్రకారం "అది కోరేవరకు."

**అల్లిక కిటికీలోనుంచి** లేదా "కిటికీమీద ఉండే కొయ్యతెర."

**పాడే సమయం** లేదా "చక్కదిద్దే."

**చీలిన పర్వతాలు** లేదా "బెథెర్ పర్వతాలు" లేదా "సుగంధ ద్రవ్యాల పర్వతాలు."

### ఆమె అంటుంది

3 రాత్రి నా పక్క మీద, నేను ప్రేమించిన వానికోసం
చూస్తాను. అతని కోసం చూశాను, కాని అతణ్ణి
కనుగొనలేకపోయాను!
2 ఇప్పుడు మేల్కొంటాను! నగరమంతా తిరుగు
తాను. వీధుల్లోను కూడలి స్థలాల్లోను సంత వీధు
ల్లోనూ నేను ప్రేమించిన వ్యక్తికోసం చూస్తాను.
అతని కోసం చూశాను, కాని అతణ్ణి కనుక్కోలేక
పోయాను!
3 నగరంలో పాహరా తిరిగే కావలివాళ్లు నన్ను
చూశారు. వారినడిగాను, "నేను ప్రేమించిన వ్యక్తిని
మీరు చూశారా?"
4 కావలివాళ్లను దాటిన వెంటనే నేను ప్రేమించిన
వ్యక్తిని కనుక్కున్నాను! అతణ్ణి పట్టుకున్నాను.
అతణ్ణి పోనివ్వలేదు, నా తల్లి ఇంటికి అతణ్ణి తీసు
కొని పోయేవరకూ నన్ను కన్న తల్లి గదికి తీసుకొని
పోయేవరకూ.

### ఆమె స్త్రీలతో అంటుంది

5 యెరూషలేము స్త్రీలారా, నాకు వాగ్దానం
చెయ్యండి, దుప్పులమీదా అడవి లేళ్లమీదా ఒట్టు
పెట్టి, నేను సిద్ధపడేవరకూ. ప్రేమను లేపవద్దు,
ప్రేమను పురికొల్పవద్దు.

### అతను—అతని పెండ్లి కూతురు

6 పెద్ద జనం గుంపుతో ఎడారినుండి వస్తున్న* ఈ
స్త్రీ ఎవరు? కాలుతున్న గోపరసం, సాంబ్రాణి*
ఇతర సుగంధ ద్రవ్యాల* నుండి పొగమబ్బులు
వచ్చినట్లుగా వారి వెనుక దుమ్ము లేస్తోంది.
7 చూడు, సొలొమోను ప్రయాణపు కుర్చీ!*
అరవై మంది సైనికులు దానిని కాపలా కాస్తున్నారు.
బలశాలులైన ఇశ్రాయేలు సైనికులు!
8 వారందరూ సుశిక్షితులైన పోరాటగాండ్రు, వారి
పక్కనున్న కత్తులు, ఏ రాత్రి ప్రమాదానికైనా
సిద్ధం!
9 రాజు సొలొమోను తనకోసం ఒక ప్రయాణపు
కుర్చీ చేయించాడు, దాని కొయ్య లెబానోను
నుండి వచ్చింది.
10 దాని కాళ్లు వెండితో చేయబడ్డాయి, ఆధారాలు
బంగారంతో చేయబడ్డాయి, కూర్చొనే భాగం
ధూమ్ర వర్ణం వస్త్రంతో కప్పబడింది. యెరూష
లేము స్త్రీల ప్రేమతో అది పొదగబడింది.
11 సీయోను స్త్రీలారా, బయటకు రండి రాజు సొలొ
మోనును చూడండి అతని పెండ్లి రోజున అతడు
చాలా సంతోషంగా ఉన్న రోజున అతని తల్లి
పెట్టిన కిరీటాన్ని* చూడండి!

### అతను ఆమెతో అంటున్నాడు

4 నా ప్రియురాలా, నువ్వెంతో అందంగా ఉన్నావు!
ఓహో, నువ్వు సుందరంగా ఉన్నావు! నీ మేలి
ముసుగు కింద నీ కళ్లు పావురాల్లా ఉన్నాయి. నీ
శిరోజాలు పొడుగ్గా జారుతున్నాయి గిలాదు పర్వత
సానువుల కింద నృత్యం చేసే మేకపిల్లల్లా.
2 అప్పుడే స్నానం చేసి వస్తున్న ఆడ మేకల్లా నీ
పళ్లు తెల్లగావున్నాయి. అవన్నీ కవలపిల్లల్ని
కంటాయి, వాటిలో ఒక్కదానికి కూడా పిల్ల చావ
లేదు.
3 నీ పెదవులు ఎర్ర పట్టు దారంలా ఉన్నాయి. నీ
నోరు అందంగా ఉంది నీ మేలి ముసుగు కింది నీ
చెక్కిళ్లు రెండు దానిమ్మపండు చెక్కల్లా ఉన్నాయి.
4 నీ మెడ పొడుగ్గా సన్నగా దావీదు గోపురంలా
ఉంది శక్తిమంతులైన సైనికుల డాళ్లు వెయ్యి డాళ్లు
దాని గోడల మీద అలంకరించడం కోసం ఆ
గోపురాన్ని కట్టారు.
5 నీ స్తనాలు, తెల్ల కలువల్లో మేస్తున్న కవల జింక
పిల్లల్లా ఉన్నాయి కవల దుప్పి పిల్లల్లా ఉన్నాయి.
6 పగలు తన తుది శ్వాస విడిచేటప్పుడు నీడలు
పారిపోయేటప్పుడు నేను ఆ గోపరస పర్వతానికి
వెడతాను ఆ సాంబ్రాణి కొండకు వెడతాను.
7 నా ప్రియురాలా! నీ శరీరమంతా అందంగానే ఉంది.
నీకెక్కడా వికారమైన గుర్తుల్లేవు!
8 నా పెళ్లికూతురా! లెబానోను నుండి నాతోరా
లెబానోను నుండి నాతోరా. అమాన పర్వత శిఖరా
న్నుండి శెనీరు హెర్మోనుల కొండకొనల నుండి
సింహగుహల నుండి చిరుత పులుల పర్వతాల
నుండి రా!
9 నా ప్రేయసీ!* నా ప్రియ వధూ నన్ను ఉద్రేక
పరుస్తావు. ఒకే ఒక చూపుతో నీ హారంలోని ఒకే
ఒక రత్నంతో నా హృదయాన్ని దోచుకున్నావు.

---

**ఎడారినుండి వస్తున్న** చూడండి 8:5.

**గోపరసం, సాంబ్రాణి** కాల్చినప్పుడు తియ్యగా గుబాళించే ఖరీదైన సుగంధ ద్రవ్యాలు.

**సుగంధ ద్రవ్యాలు** శబ్దార్థ ప్రకారం, "వర్తకుడి చూర్ణాలు". "విదేశాలనుండి దిగుమతి చేసుకోవసిన సుగంధ ద్రవ్యాలు, ధూపాలు."

**ప్రయాణపు కుర్చీ** ధనికులు కూర్చుని ప్రయాణం చేసే ఒకరకమైన కుర్చీ. ఈ కుర్చీలు పైన కప్పబడి వుంటాయి. వీటికి పొడుగాటి కర్రలు దూర్చి, వాటిని బానిసలు మోస్తూ ఉంటారు.

**కిరీటము** ఇది బహుశః అతని పెండ్లి సమయంలో తల మీద ధరించిన పూలదండ కావచ్చును.

**ప్రేయసీ** శబ్దార్థ ప్రకారం "సోదరి."

10 నా ప్రేయసీ! నా ప్రియ వధూ! నీ ప్రేమ చాలా
సుందరమైనది ద్రాక్షారసంకన్నా నీ ప్రేమ గొప్పది,
నీ పరిమళ ద్రవ్యపు సువాసన ఏ రకమైన సుగంధ
ద్రవ్యం కన్నా గొప్పది!
11 నా ప్రియవధూ నీ పెదవులు తేనెలూరుతున్నాయి
నీ నాలుక (కింద) నుంచి తేనే, పాలూ జాలువారు
తున్నాయి నీ దుస్తులు మధుర పరిమళాన్ని*
గుబాళిస్తున్నాయి.
12 నా ప్రియా, నా వధూ, నీవు పరిశుద్ధురాలివి
మూయబడిన ఉద్యానవనం, మూయబడిన జలా
శయం, బిగించబడిన జలధారల వంటి దానివి.
13 నీ శరీరమొక తోటను పోలినది దానిమ్మ వృక్షాలతో
తదితర మధుర ఫల వృక్షాలతో గోరింట, జటా
మాంసి,
14 కుంకుమ పువ్వు, నిమ్మగడ్డి, లవంగ, సాంబ్రాణి
బోళం, అగరు యిత్యాది అతి శ్రేష్ఠ సుగంధ ద్రవ్యాల
నిచ్చే తరులతాదులతో నిండిన నందనవనాన్ని
పోలినది.
15 నీవు ఉద్యాన జలాశయం వంటిదానివి మంచినీటి
ఊటల బావిలాంటిదానివి, లెబానోను పర్వతం
నుంచి జాలువారే సెలయేరు వంటిదానివి.

### ఆమె అంటుంది

16 ఉత్తర పవనమా లే! దక్షిణ పవనమా రా! నా
ఉద్యానవనంపై వీచి, దాని మధుర సౌరభాన్ని వెద
జల్లండి. నా ప్రియుడు తన ఉద్యానవనానికి రావాలి
అందలి మధుర ఫలాలు ఆరగించాలి.

### అతను అంటాడు

5 నా ప్రియ సఖీ, నా ప్రియ వధూ, నేను నా
తోటలో ప్రవేశించాను, నేను నా బోళం సుగంధ
ద్రవ్యాలను ఏరుకున్నాను, తేనె తాగాను తేనె పొర
తిన్నాను నేను నా మధుక్షీరాలు సేవించాను.

### ప్రేయసీ ప్రియులతో స్త్రీలు అంటారు

ప్రియాతి ప్రియ నేస్తాల్లారా తినండి, తాగండి!
ప్రేమను జుర్రి మత్తిల్లండి!

### ఆమె అంటుంది

2 నేను నిద్రించానేగాని నా హృదయం మేల్కొనే
వుంది. నా ప్రియుడు తలుపు తట్టి ఇలా అనడం
విన్నాను "నా ప్రియ సఖీ, ప్రేయసీ నా గువ్వపిట్టా,
సుగుణ ఖనీ! నా తల మంచుతో తడిసింది నా
జుట్టు రేమంచు జడికి నానింది."
3 "నేను నా వస్త్రం తొలగించాను, దాన్ని తిరిగి
ధరించాలని అనిపించలేదు. నేను నా పాదాలు కడు
క్కున్నాను. అవి తిరిగి మురికి అవడం ఇష్టం లేక
పోయింది."
4 తలుపు సందులో నా ప్రియుడు చేతినుంచాడు*
నేనతని పట్ల జాలినొందాను.*
5 నా చేతుల నుంచి జటామాంసి జారగా, నా వేళ్ల
నుంచి జటామాంసి పరిమళ ద్రవం తలుపు గడియ
పైకి జాలువారగా నేను నా ప్రియునికి తలుపు
తీయ తలంచాను.
6 నేను నా ప్రియుడికి తలుపు తెరిచాను, కాని
అప్పటికే నా ప్రియుడు వెనుదిరిగి వెళ్లిపోయాడు!
అతడు వెళ్లిపోయినంతనే నా ప్రాణం కడగట్టింది.*
నేనతని కోసం గాలించాను. కాని అతడు కనిపించ
లేదు. నేనతన్ని పిలిచాను, కాని అతడు బదులీయ
లేదు.
7 నగరంలో పారా తిరిగేవారు నాకు తారసిల్లారు
నన్ను కొట్టి, గాయపరిచారు. ప్రాకారం కావలివారు
నా పై దుస్తును కాజేశారు.
8 యెరూషలేము స్త్రీలారా, నా ప్రియుడు మీ కంట
పడితే చెప్పండి, నీ ప్రియురాలు నీ ప్రేమతో
కృంగి కృశించి పోతోందని.

### ఆమెకి యెరూషలేము స్త్రీల ప్రశ్నలు

9 అతిలోక సుందరి, ఇతర ప్రియులకంటె నీ
ప్రియుని విశేషం ఏమిటి? ఇతర ప్రియుల కన్న
నీ ప్రియుడు వేటివేటిలో ఎక్కువా? అంతగా
ఎక్కువ కనుకనేనా, మాచేత ప్రమాణం చేయించు
కున్నావు?

### యెరూషలేము స్త్రీలకు ఆమె సమాధానం

10 నా ప్రియుడు కమిలి ప్రకాశించు కాయమ్ము
కలవాడు, పదివేలలోనైన రాణించగలవాడు.
11 మేలిమి బంగారు పోలిన శిరస్సు గలవాడు తుమ్మెద
రెక్కలవంటి నొక్కునొక్కుల కారునల్లటి శిరో
జాలవాడు.

---

**మధుర పరిమళాలు** పరిమళ ద్రవ్యం లేక "లెబానోను."

**తలుపు … చేతినుంచాడు** లేక, "తలుపు సందునుంచి తన చేతిని లాక్కున్నాడు" తాళానికీ, తాళం చెవికీ ఇది సూచన కావచ్చు. పురాతనమైన కొన్ని తాళం చెవులు చేయి ఆకారంలో ఉండేవి. ఆ తాళం చెవి తలుపు సందులోంచి లోపలికి జొరపబడేవి. ఆ తాళం చెవికి వున్న "వేళ్లు" ప్రత్యేకమైన రంధ్రాల్లోకి పోయి, గడియను ప్రక్కకి నెట్టేవి. ఈ విధంగా తాళం వేయడం, తీయడం జరిగేది.

**నేనతని పట్ల జాలినొందాను** శబ్దార్థ ప్రకారం, "నా అంతరంగం అతనికోసం స్పందించింది."

**నా ప్రాణం కడగట్టింది** అతను మాట్లాడినప్పుడు నా హృదయము అతని వైపు తిరిగెను.

12 అతని కనులేమో సెలయేటి ఒడ్డున ఎగిరేటి గువ్వల పోలు పాల మునిగిన పావురాల పోలు బంగారం తాపిన రత్నాల పోలు.
13 అతడి చెక్కిళ్లు సుగంధ ఉద్యానాల పరిమళ పుష్ప రాశుల పోలు అతని పెదవులు బోళంతో తడిసిన అత్తరు వారు కెందామరలు.
14 అతని చేతులు వజ్రాలు పొదిగిన బంగారు కడ్డీల పోలు అతని కాయము నీలాలు తాపిన నున్నటి దంత దూలమ్ము పోలు.
15 అతని పాదాలు బంగారు దిమ్మమీది పాలరాతి స్తంభాల పోలు అతని సుదీర్ఘ శరీరం లెబానోను పర్వతం మీది నిటారైన దేవదారు వృక్షాన్ని తలపింపజేయు.
16 ఔనౌను, యెరూషలేము కుమార్తెలారా, నా ప్రియుడు అత్యంత వాంఛనీయుడు, అతని అధరం అత్యంత మధురం అతనే నా ప్రియుడు, నా ప్రాణ సఖుడు.

### యెరూషలేము స్త్రీలు ఆమెకి చెప్తారు

6 అతిలోక సుందరి, ఎచ్చటికి వెళ్ళాడు నీ ప్రియుడు? ఏ దిక్కు కెళ్లాడు? నీ ప్రియుని మాకు తెలుపు వెదుకుటకు మేము నీకు తోడ్పడతాము.

### ఆమె వారికిచ్చిన సమాధానం

2 ఎర్రటి పద్మాలను ఏరుకొనుటకు నా ప్రియుడు వెళ్లాడు ఉద్యాన వనానికి సుగంధాలు వెదజల్లు పూలమొక్కల మళ్లకి గొర్రెల మేప పోయాడు తోటలకు కెందామరల కోసి రాశి వేయుటకు
3 మేపు నా ప్రియుడు నావాడు నేనతనిదానను ఈనాడు ఏనాడు. నేను ఎర్రని పద్మాల నడుమ గొర్రెలు మేపుతున్న నా ప్రియునిదానను.

### అతడు ఆమెతో అంటారు

4 ఓ నా ప్రియసఖీ, నీవు తిర్సా* నగరమంత సుందర మైనదానివి, యెరూషలేమంత ఆహ్లాదకరమైన దానివి, నగర దుర్గాలంతటి భయంకరురాలివి.*
5 నీవు నా వైపు చూడకు! నీ చూపులు నన్ను పురికొల్పి ఉన్మత్తున్ని చేస్తాయి గిలాదు పర్వత చరియల నుండి గెంతులేస్తూ దిగివచ్చే గొర్రెపిల్లల మాదిరిగా నీ సుదీర్ఘ శిరోజాలు జాలువారు తున్నాయి.
6 జోడు జోడు పిల్లల్ని కని (వాటిలో ఏ ఒక్కటి పిల్లల్ని కోల్పోని) అప్పుడే శుభ్రంగా స్నానం చేసి వస్తున్న తెల్లటి ఆడ గొర్రెల బారులా ఉంది నీ పలువరుస
7 బురఖా కింది నీ కణతలు దానిమ్మ చెక్కల్లా వున్నాయి.
8 అరవై మంది రాణులు ఎనభై మంది సేవకు రాండ్రు* లెక్కకు మించిన కన్యలు ఉందురుగాక నాకు.
9 కాని, నా గువ్వ పిట్ట నిష్కళంకురాలు ఒక్కతే (నాకైన స్త్రీ) ఆమె తన తల్లికి ముద్దుబిడ్డ. తన తల్లికి గారాల కూచి! కన్యలే ఏమి, రాణులు, సేవకు రాండ్రు కూడా ఆమెను చూచినంతనే ప్రశంసిస్తారు.

### ఆమెకి స్త్రీల ప్రశంసలు

10 ఎవరా యువతి? అరుణోదయంలా మెరుస్తోంది. చంద్రబింబమంత అందమైనది సూర్యుడంత ధగ ధగలాడుతోంది, పరలోక సేనలంతటి* విభ్రాంతి గొలుపు ఆ యువతి ఎవరు?

### ఆమె మాట్లాడుతుంది

11 నేను బాదం తోపుకి వెళ్లాను ఫలసాయమెలా ఉందో చూసేందుకు ద్రాక్షా తీగెలు పూశాయేమో చూసేందుకు దానిమ్మలు మొగ్గతొడిగాయేమో చూసేందుకు,
12 నేనింకా గ్రహించక ముందే* నా తనువు నన్ను రాజోద్యోగుల* రథాల్లోకి చేర్చినది

### యెరూషలేము స్త్రీలు ఆమెను ఇలా పిలుస్తారు

షూలమ్మీతీ* తిరిగిరా, తిరిగిరా మేము నిన్ను చూసేందుకు తిరిగి రా, తిరిగి రా, మహనయీము* నాట్యమాడు షూలమ్మీతీ నేల తేరిపార చూస్తారు?

---

**తిర్సా** ఇశ్రాయేలు ఉత్తర భాగంలోని రాజధానుల్లో ఒకటి.

**నగర దుర్గాలంతటి భయంకరురాలివి** ఇక్కడ వాడబడిన హీబ్రూ పదానికి అర్థం అంత స్పష్టంగా తెలియడం లేదు.

**సేవకురాండ్రు** ఉంపుడుగత్తెలు. పురుషునికి భార్యలా వ్యవహ రించే బానిస స్త్రీలు.

**పరలోక సేనలంతటి** ఇక్కడా నాల్గవ వచనములోనూ వున్న హీబ్రూపదం అర్థం రీత్యా అస్పష్టంగా ఉంది.

**నేనింకా గ్రహించక ముందే** హీబ్రూలో ఈ పదబంధం అస్పష్టంగా ఉంది.

**రాజోద్యోగులు** "అమ్మినదీ" లేక, నా రాజు పరివారం.

**షూలమ్మీతీ** లేక షూలమిత్, ఈ మాట "సొలొమోను"కి స్త్రీలింగ రూపం కావచ్చు. ఆమె సొలొమోను భార్య, లేక సొలొమోను వధువు అవుతుంది అని దీని అర్థం కావచ్చు. ఈ పేరుకి అర్థం "శాంతమతి" లేక "షూనేమునుంచి వచ్చిన స్త్రీ" కావచ్చు.

**మహనయీము** లేక "విజయోత్సవ నృత్యం", లేక "రెండు శిబిరాల నాట్యం" కావచ్చు.

### అతను ఆమె అందాన్ని ఇలా ప్రశంసిస్తాడు

7 రాకుమారీ,* ఆ పాదరక్షల్లో నీ పాదాలెంతో
అందంగా ఉన్నాయి నీ తొడల వంపులు శిల్పి
మలిచిన ఆభరణాల్లా ఉన్నాయి.
2 నీ నాభి గుండ్రటి కలశంలా ఉంది దానికెన్నడూ
ద్రాక్షారసం కొరత లేకుండుగాక. నీ ఉదరం పద్మ
వలయితమైన గోధుమ రాశిలా ఉంది.
3 నీ స్తనాలు లేజవరాలైన జింక అప్పుడే కన్న కవల
పిల్లల్లా ఉన్నాయి.
4 నీ మెడ దంతపు గోపురంలా ఉంది నీ నేత్రాలు
బాత్‌రబ్బీన్ సరసన ఉన్న హెష్బోనులోని తటా
కాల్లా ఉన్నాయి. నీ నాసిక దమస్కు దిక్కుకి
చూచే లెబానోను శిఖరంలా ఉంది.
5 నీ తల కర్మెలు పర్వతంలా, నీ తల నీలాలు
పట్టుకుచ్చుల్లా వున్నాయి. నీ సుదీర్ఘ కేశాలు
చూసిన రాజు కూడా నీ వశం అవుతాడు.
6 నీవు అతిలోక సుందరివి! అత్యంత మనోహరివి!
ప్రియదర్శినివి! అందమైన, ఆహ్లాదకరమైన
యువతివి!
7 నీవు తాళవృక్షంలా పొడుగరివి. నీ స్తనాలు తాటిపళ్ల
గెలల్లా వున్నాయి.
8 నాకు ఆ చెట్టుపైకి ఎక్కాలని, దాని మట్టలు
పట్టాలని ఉంది. నీ స్తనాలు ద్రాక్షా గుత్తుల్లా నీ
ఊపిరి ఆపిలు సువాసనలా ఉన్నాయి.
9 నీ నోరు శ్రేష్ఠమైన ద్రాక్షారసంలా అది నీ నోట
జాలువారి నిద్రాముద్రిత ప్రియుని అధరాలను
స్పృజించే మధువులా ఉండాలి.

### ఆమె అతనితో అంటుంది

10 నేను నా ప్రియునిదానను నన్నతను వాంఛిస్తాడు!
11 ఓ నా ప్రియుడా రా, చేలల్లోకి పోదాము రా,
పల్లెల్లో రేయి గడుపుదాము రా,
12 పెందలకడ లేచి ద్రాక్షాతోటలకు పోదాము ద్రాక్షా
తీగలు మొగ్గ తొడిగాయో లేదో ఆ మొగ్గలు
విచ్చుకున్నాయో లేదో దానిమ్మ చెట్లు విరబూ
శాయో లేదో తనివితీరా చూద్దాము రా. అక్కడ
నేనిచ్చు నా ప్రేమ అందుకొన రా.
13 ప్రేమ వర్ధక మండ్రేక ఓషధుల్నీ మా గుమ్మాన
వేలాడే పరిమళభరితమైన పువ్వుల్నీ చూడు! ఓ
నా ప్రియుడా, నీకై దాచి ఉంచాను ఎన్నెన్నో
పండువీ, దోరవీ పండ్లు తిని చూడు!

8 తల్లి పాలు కుడిచే నా చిన్నారి తమ్ముడిలా నువ్వు
చిట్టి పాపవే అయితే, నువ్వు నాకు బయట
అగుపిస్తే, నిన్ను నేను ముద్దాడగలిగి ఉండేదాన్ని.
అప్పుడు నన్నెవరూ తప్పు పట్టేవారు కారు!
2 నేను నిన్ను నాకు అన్నీ నేర్పిన మా తల్లి ఇంటి
గదిలోకి తీసుకుపోయి ఉండేదాన్ని. దానిమ్మ పళ్ల
రసంతో చేసిన సురభిళ మధువును నీకు ఇచ్చి
ఉండేదాన్ని.

### ఆమె స్త్రీలతో అంటుంది

3 అతను తన ఎడమ చేతిని నా తల కింద ఉంచి
తన కుడిచేతితో పొదివి పట్టుకుంటాడు.
4 యెరూషలేము స్త్రీలారా మీరు నాకొక వాగ్దానం
చేయండి నా ప్రేమ స్వయం ప్రేరితమయ్యేదాకా,
ప్రేమను జాగృతం చేయకండి ప్రేమను పురిగొల్ప
కండి.

### యెరూషలేము స్త్రీలు

5 ఎడారి వెంట, తన ప్రియుని ఆనుకొని వస్తున్న
ఈ స్త్రీ ఎవరు?

### ఆమె అతనితో

ఆపిలు చెట్టు నీడలో నిన్ను తట్టి నే లేపాను.
అచ్చటే నీ తల్లి తన గర్భాన నిన్ను మోసింది,
కన్నది.
6 నీ హృదయ పీఠం మీద నా రూపం ముద్రించు,
నీ వేలికి ముద్రికలా ధరించు. మృత్యువంత బల
మైనది ప్రేమ కోపాతిరేకం స్మశానంతో సమమైనది.
రోష విస్ఫులింగాలు జ్వాల అవుతాయి జ్వాలలు
పెచ్చుమీరి మహాజ్వాల* అవుతాయి.
7 ఉప్పెన కూడా ప్రేమజ్వాలను ఆర్పజాలదు నది
జలాలూ ప్రేమను ముంచెత్తజాలవు. ఒకడు ప్రేమ
కోసం తన సర్వస్వం ధారపోస్తే, అతణ్ణి ప్రజలు
మూర్ఖుడిగా పరిగణించరు. ఎవడూ తప్పు పట్ట
జాలడు!

### ఆమె సోదరులు

8 మాకు ఉన్నదొక చిన్న చెల్లెలు ఆమెకింకా యుక్త
వయస్సు రాలేదు. దాన్ని వివాహం చేసుకొనుటకు
ఒక పురుషుడు వస్తే, మా చెల్లెలి విషయంలో
మేమేమి చెయ్యాలి?
9 అది ప్రాకారమైతే, దాని చుట్టూ వెండి నగిషీ*
చేస్తాము అది తలుపైతే, దాని చుట్టూ దేవదారు
పలకలతో అంచులు అలంకరిస్తాము.

---

**రాకుమారీ** శబ్దార్థం “బాత్ నదీబ్: రాకుమారుడి కుమార్తె.” ఇది అమ్మినదీబ్ పోలిన మాట.

**మహాజ్వాల** అది యెహోవా కలుగజేసిన మహాజ్వాల.

**వెండి నగిషీ** లేక మోపు దుంగలు. తరచు కోట ప్రాకారాలకు దృఢత్వం కోసం దూలాలు అమరుస్తారు, అవి ధృడంగా ఉండటానికి దిమ్మలు కడతారు. కాని ఇక్కడ అలంకారాలు లేక నగిషీలు అనిపిస్తుంది.

### ఆమె తన సోదరులతో

10 నేను ప్రాకారం వంటిదాన్ని నా వక్షోజాలు గోపుర
ప్రాయాలు అతనికి నేనంటే తనివి, తృప్తి!*

### అతను

11 బయలు హామోనులో సొలొమోనుకొక ద్రాక్షా
తోట ఉంది. ఆ తోటనాతడు కొందరు రైతులకు
కౌలుకిచ్చాడు. వారిలో ఒక్కొక్క రైతు వెయ్యి
వెండి షెకెళ్లు* ఇచ్చాడు.
12 సొలొమోనూ, ఆ వెయ్యి షెకెళ్లూ నీవే ఉంచుకో,
వాటిలో యిన్నూరేసి ఒక్కొక్క రైతుకిచ్చేసెయ్యి
అతడు తెచ్చిన ద్రాక్షాలకు మించువలె కానైతే,
నా ద్రాక్షాతోట నా ఒద్దికలోనే ఉంటుంది!

### అతను ఆమెతో

13 ద్రాక్షాతోటలో కూర్చున్న ఓ సఖీ, నీ చెలికత్తెలు
నీ స్వరం వింటున్నారు, నీ మధుర స్వరాన్ని
నన్నూ విననీయి.

### ఆమె అతనితో

14 ప్రియ సఖా, వేగిరం వచ్చెయ్యి. జింకలూ, లేడి
పిల్లల్లా పరిమళ వృక్ష సముదాయం పెరిగిన
పర్వతాలపై నుంచి చెంగుచెంగున వచ్చెయ్యి.

---

**అతనికి నేనంటే తనివి, తృప్తి** "అతని కళ్లలో నాకు శాంతి కానవస్తుంది" అని శబ్దార్థం. హీబ్రూలో ఇది "సొలొమోను," "షూలమ్మీతీ" అనే పదాలను కూడా స్ఫురింపజేస్తుంది.

**వెయ్యి వెండి షెకెళ్లు** 25 పౌనులతో సమానం.

# యెషయా

1 ఆమోజు కుమారుడు యెషయా దర్శనం ఇది.
యూదాకు, యెరూషలేముకు సంభవించే సంగతు
లను దేవుడు యెషయాకు చూపించాడు. ఉజ్జియా,
యోతాము, ఆహాజు, హిజ్కియా యూదాకు రాజు
లుగా ఉన్న కాలవ్యవధిలో ఈ సంగతులను యెషయా
చూశాడు.

### తన ప్రజల విరుద్ధంగా దేవుని వాదం

2ఆకాశమా, భూమీ యెహోవా మాట వినండి!
యెహోవా ఇలా చెబుతున్నాడు.

“నా పిల్లల్ని నేను పెంచాను. నా పిల్లలు పెరగ
టానికి నేను సహాయం చేసాను. కానీ నా
పిల్లలు నా మీద తిరగబడ్డారు.
3 ఎద్దుకు తన కామందు తెలుసు. గాడిదకు
దాని సొంతదారుడు మేత పెట్టే చోటు
తెలుసు. కానీ ఇశ్రాయేలు ప్రజలకు నేను
తెలియదు. నా ప్రజలు గ్రహించరు.”

4ఇశ్రాయేలు ప్రజలు దోషులు. ఈ దోషం ప్రజలు
మోయాల్సిన భారమైన బరువులా ఉంది. ఆ ప్రజలు
చెడు కుటుంబాలకు చెందిన దుర్మార్గపు పిల్లల్లా
ఉన్నారు. వారు యెహోవాను విడిచిపెట్టేశారు. ఇశ్రా
యేలీయుల పరిశుద్ధుణ్ణి (దేవుడు) ఆ ప్రజలు అవమా
నించారు. వాళ్లు దేవుణ్ణి విడిచిపెట్టి, పరాయి వాళ్లలా
ఉన్నారు.
5దేవుడు చెబుతున్నాడు: “ ప్రజలారా నేనెందుకు
మిమ్మల్ని శిక్షిస్తూనే ఉండాలి? నేను మిమ్మల్ని శిక్షిం
చాను. కాని మీరు మారలేదు. మీరు నా మీద తిరుగు
బాటు చేస్తూనే ఉన్నారు. ఇప్పుడు ప్రతి తల, ప్రతి
గుండె వ్యాధితో ఉన్నాయి. 6మీ అరికాలు మొదలుకొని
మీ నడినెత్తి వరకు శరీరమంతా గాయాలు, దెబ్బలు,
పచ్చిపుండ్లు ఉన్నాయి. మీ పుండ్లను గూర్చి మీరు
శ్రద్ధ తీసుకోలేదు. మీ పుండ్లు శుభ్రం చేయబడలేదు.
వాటికి కట్లు కట్టలేదు.
7“మీ దేశం పాడైపోయింది. మీ పట్టణాలు అగ్నితో
కాల్చివేయబడ్డాయి. మీ దేశాన్ని మీ శత్రువులు
స్వాధీనం చేసుకొన్నారు. సైన్యం నాశనం చేసిన
దేశంలా మీ భూమి పాడు చేయబడింది. 8ఇప్పుడు
సీయోను కుమార్తె (యెరూషలేము) ద్రాక్ష తోటలో
విడువబడిన ఖాళీ గుడారంలా ఉంది. దోస పాదుల్లో
విసర్జించబడిన పాత గుడిసెలాగ ఉంది. అది శత్రువుల
చేత ఓడించబడిన పట్టణంలా ఉంది.” 9ఇది నిజమే,
కానీ సర్వశక్తిమంతుడైన యెహోవా కొద్ది మంది ప్రజ
లను బతకనిచ్చాడు. సొదొమ, గొమొర్రా పట్టణాల్లా
మనం సర్వనాశనం చేయబడలేదు.

### దేవుడు నిజమైన సేవను కోరుతాడు

10సొదొమ నాయకులారా, యెహోవా సందేశం
వినండి. గొమొర్రా ప్రజలారా, దేవుని ఉపదేశాలు
వినండి. 11దేవుడు అంటున్నాడు: “ఇంకా ఎందుకు
మీరు నాకు బలులు అర్పిస్తూనే ఉన్నారు? మీ మేకల
బలులు, దూడల కొవ్వు, గొర్రెలు, మేకలు నాకు
వెక్కసం అయ్యాయి.
12“మీరు నన్ను కలుసుకొనేందుకు వచ్చినప్పుడు,
నా ఆవరణం అంతా తిరుగుతారు. మిమ్మల్ని ఇలా
చేయమన్నది ఎవరు?
13“నా కోసం పనికిమాలిన బలులు ఇక మీదట
తీసుకొని రావద్దు. మీరు నాకు అర్పించే ధూపం నాకు
అసహ్యం మీ అమావాస్య, సబ్బాతు, పవిత్ర రోజుల
పండుగలను నేను సహించను. మీ పరిశుద్ధ సమా
వేశాలలో మీరు చేసేచెడు నాకు అసహ్యం. 14మీ నెలసరి
సమావేశాలు, సభలు నాకు బొత్తిగా అసహ్యం. ఈ
సమావేశాలు నాకు చాలా బరువులా తయారయ్యాయి.
ఆ బరువులు మోయటం నాకు విసుగు.
15“మీరు నన్ను ప్రార్థించాలని మీ చేతులు పైకి
ఎత్తుతారు కానీ నేను మిమ్మల్ని చూడటానికి కూడా
ఒప్పుకోను. మీరు మరిన్ని ప్రార్థనలు చేస్తారు కాని
నేను మీ ప్రార్థనలు వినేందుకు ఒప్పుకోను. ఎందు
కంటే మీ చేతులు రక్తమయము.
16“మిమ్మల్ని మీరు కడుక్కోండి. మిమ్మల్ని మీరు
పరిశుభ్రం చేసుకోండి. మీరు చేస్తున్న చెడు పనులు
చాలించండి. ఆ చెడు పనులు చూడటం నాకు ఇష్టం
లేదు. తప్పు చేయటం మానివేయండి. 17మంచి
పనులు చేయటం నేర్చుకోండి. ఇతరుల విషయంలో
న్యాయంగా ఉండండి. ఇతరులను బాధించే వారిని

శిక్షించండి. తల్లిదండ్రులు లేని పిల్లలకు సహాయం
చేయండి. భర్తలు చనిపోయిన స్త్రీలకు సహాయం
చేయండి.”
18యెహోవా చెబుతున్నాడు, “రండి, ఈ విష
యాలు మనం పరిష్కరించుకొందాము. మీ పాపాలు
కెంపులాగా ఎర్రగా ఉన్నా సరే వాటిని కడగవచ్చు,
మీరు మంచులా తెల్లగా అవుతారు. మీ పాపాలు చాలా
ఎర్రగా ఉన్నా సరే మీరు మాత్రం ఉన్నిలాగ తెల్లగా
మారవచ్చును.
19“నేను చెప్పే మాటలు మీరు వింటే అప్పుడు
ఈ దేశపు మంచి పదార్థాలు మీరు అనుభవిస్తారు.
20కానీ మీరు వినేందుకు నిరాకరిస్తే, మీరు నాకు వ్యతి
రేకమే. మీ శత్రువులు మిమ్మల్ని నాశనం చేసేస్తారు.”
యెహోవా తానే ఈ విషయాలు చెప్పాడు.

### యెరూషలేము దేవునికి నమ్మకంగా లేదు

21దేవుడు చెబుతున్నాడు: “యెరూషలేమును
చూడండి. అది నన్ను నమ్మి వెంబడించిన పట్టణం.
అది ఓ వేశ్య అయ్యేట్టుగా చేసింది ఏమిటి? ఇప్పుడు
అది నన్ను వెంబడించటం లేదు. యెరూషలేము
న్యాయంతో నిండి ఉండాలి. యెరూషలేము నివాసులు
యెహోవా కోరిన విధంగా జీవించాలి, కానీ ఇప్పుడు
నరహంతకులు అక్కడ నివసిస్తున్నారు.
22“మంచితనం వెండిలాంటిది. కానీ మీ వెండి పని
కిమాలినదిగా తయారయింది. మీ ద్రాక్షారసం నీళ్లతో
కలపబడి నిస్సారమయింది. 23మీ అధికారులు తిరుగు
బాటు దారులు, దొంగల స్నేహితులు. మీ అధికారులు
అందరూ లంచాలు అడుగుతారు, తప్పుడు పనులు
చేయటం కోసం డబ్బు స్వీకరిస్తారు. మీ అధికారు
లంతా ప్రజలను మోసం చేసేందుకు డబ్బు పుచ్చు
కొంటారు. మీ అధికారులు అనాథ పిల్లలకు సహాయం
చేసేందుకు ప్రయత్నం చేయరు. భర్తలు చనిపోయిన
స్త్రీల అవసరాలను గూర్చి మీ అధికారులు విని
పించుకోరు.”
24ఈ విషయాలన్నింటి మూలంగా, ఆ యజమాని,
సర్వశక్తిమంతుడైన యెహోవా, ఇశ్రాయేలీయుల
మహాబలశాలి ఇలా చెబుతున్నాడు, “నా శత్రువులారా,
నేను మిమ్మల్ని శిక్షిస్తాను. ఇంకెంత మాత్రం మీరు
నాకు కష్టం కలిగించరు. 25వెండిని శుద్ధిచేయటానికి
మనుష్యులు క్షారం వాడుతారు. అదే విధంగా మీ తప్పు
లన్నిటినీ నేను శుద్ధి చేసేస్తాను. మీలోంచి పనికిమాలిన
వాటన్నింటినీ నేను తీసివేస్తాను. 26ఆరంభంలో మీకు
ఉన్నమాదిరి న్యాయమూర్తుల్ని నేను మళ్లీ తీసుకొని
వస్తాను. మీ సలహాదారులు చాలాకాలం క్రిందట మీకు
ఉన్న సలహాదారుల్లా ఉంటారు. అప్పుడు మీరు మంచి,
నమ్మకమైన పట్టణం”’ అని పిలువబడతారు. 27దేవుడు
మంచివాడు, ఆయన సరైన వాటినే చేస్తాడు. కనుక
ఆయన సీయోనును, తన దగ్గరకు తిరిగి వచ్చే ప్రజ
లను రక్షిస్తాడు. 28అయితే నేరస్థులు, పాపులు అందరూ
నాశనం చేయబడతారు. (వారు యెహోవాను
వెంబడించని ప్రజలు.)
29మీరు పూజించటానికి ఏర్పరచుకొనే మస్తకి
వృక్షాలు, ప్రత్యేక వనాలు చూచి భవిష్యత్తులో ప్రజలు
సిగ్గుపడతారు. 30మీరు ఎండిపోతున్న ఆకుల మస్తకి
వృక్షాల్లా ఉంటారు. కనుక ఇలా జరుగుతుంది. నీళ్లులేక
ఎండిపోతున్న తోటలా మీరుంటారు. 31శక్తిమంతులైన
ప్రజలు ఎండిపోయిన చిన్న చెక్క ముక్కల్లా ఉంటారు.
ఆ ప్రజలు చేసే పనులు నిప్పు రాజబెట్టే నిప్పురవ్వల్లా
ఉంటాయి. శక్తిమంతులైన ప్రజలూ, వారు చేసే
పనులూ కాలిపోవటం మొదలవుతుంది. ఆ అగ్నిని
ఎవరూ ఆర్పివేయలేరు.

2 యెరూషలేము, యూదాలను గూర్చి ఆమోజు
కుమారుడు యెషయా ఈ సందేశం చూశాడు.
2యెహోవా ఆలయం ఒక కొండమీద ఉంది.
చివరి రోజుల్లో ఆ కొండ, పర్వతాలన్నింటిలో ఎత్తయి
నదిగా చేయబడుతుంది. ఆ పర్వతం కొండల శిఖరాల
న్నింటికంటె ఎత్తు చేయబడుతుంది. అన్ని రాజ్యాల
ప్రజలూ అక్కడికి వెళ్తారు. 3అనేకమంది ప్రజలు అక్క
డికి వెళ్తారు. “మనం యెహోవా పర్వతానికి వెళ్దాం.
యాకోబు దేవుని మందిరానికి మనం వెళ్లాలి. అప్పుడు
యెహోవా తన జీవన విధానం మనకు ఉపదేశిస్తాడు.
మనం ఆయనను వెంబడిస్తాం” అని వాళ్లు చెబుతారు.
దేవుని ఉపదేశాలు, యెహోవా సందేశం యెరూష
లేములో, సీయోను కొండమీద ప్రారంభమై, ప్రపంచం
అంతటికీ వ్యాపిస్తుంది. 4అప్పుడు అన్ని రాజ్యాల ప్రజ
లకూ యెహోవా న్యాయమూర్తిగా ఉంటాడు. అనేకుల
వాదాలను దేవుడు అంతంజేస్తాడు. ఆ మనుష్యులు
తమ పోరాటానికి తమ ఆయుధాలు ఉపయోగించటం
మానివేస్తారు. వారు తమ ఖడ్గాలతో నాగటి నక్కులు
చేస్తారు. వారు, తమ ఈటెలను మొక్కలు కత్తిరించే
పరికరాలుగా ప్రయోగిస్తారు. ప్రజలు ప్రజలతో
పోరాటం మానివేస్తారు. ప్రజలు యుద్ధానికి మళ్లీ
ఎన్నడూ శిక్షణ పొందరు.
5యాకోబు వంశస్తులారా, మీరు యెహోవాను
వెంబడించాలి. 6మీరు మీ ప్రజలను విడిచిపెట్టేశారు
కనుక నేను మీతో దీనిని చెబుతున్నాను. తూర్పు
దేశాల తప్పుడు అభిప్రాయాలతో మీ ప్రజలు నిండి
పోయారు. ఫిలిష్తీయుల్లాగే మీ ప్రజలు జ్యోతిష్యం
చెప్పటానికి ప్రయత్నించారు. ఆ వింత అభిప్రాయా
లను మీ ప్రజలు పూర్తిగా స్వీకరించారు. 7ఇతర
స్థలాలకు చెందిన వెండి బంగారాలతో మీ దేశం నిండి
పోయింది. అక్కడ చాలా చాలా ఐశ్వర్యాలున్నాయి.
మీ దేశం గుర్రాలతో నిండిపోయింది. అక్కడ ఎన్నెన్నో
రథాలు ఉన్నాయి. 8ప్రజలు పూజించే విగ్రహాలతో

మీ దేశం నిండిపోయింది. ప్రజలే చేసిన ఆ విగ్రహాలను
ప్రజలు పూజిస్తారు. 9ప్రజలు మరింతగా చెడిపోయారు.
ప్రజలు మరీ హీనస్థితికి దిగజారి పోయారు. దేవా,
నిజంగా నీవు వాళ్లను క్షమించవు గదూ?

### దేవుని శత్రువులు భయపడతారు

10వెళ్లి ధూళిలో, బండల చాటున దాక్కొనండి.
యెహోవాను గూర్చి మీరు భయపడాలి. ఆయన
మహా ప్రభావం నుండి మీరు దాక్కోవాలి.
11గర్విష్ఠులు గర్వంగా ఉండటం మానివేస్తారు. ఆ
గర్విష్ఠులు అవమానంతో నేలమీద సాగిలపడ్తారు. ఆ
సమయంలో యెహోవా మాత్రమే ఇంకా ఉన్నతు
డుగా నిలుస్తాడు.
12యెహోవా ఒక ప్రత్యేక దినాన్ని ఏర్పాటు
చేశాడు. ఆ రోజు అహంకారులను, అతిశయం గల
వారిని యెహోవా శిక్షిస్తాడు. అప్పుడు ఆ గర్విష్ఠులు
ఎన్నికలేనివారుగా చేయబడతారు. 13గర్విష్ఠులైన ఆ
మనుష్యులు లెబానోను కేదారు వృక్షాల్లా ఉంటారు.
వారు బాషాను మహా మస్తకి వృక్షాల్లా ఉంటారు. కానీ
ఆ మనుష్యులను దేవుడు శిక్షిస్తాడు.
14గర్విష్ఠులైన ఆ ప్రజలు ఎత్తయిన పర్వతాల్లా,
కొండల్లా ఉన్నారు. 15ఆ గర్విష్ఠులు ఎత్తయిన గోపు
రాల్లా చాలా బలమైన గోడల్లా ఉన్నారు. కానీ ఆ ప్రజ
లను దేవుడు శిక్షిస్తాడు. 16ఆ గర్విష్ఠులు తర్షీషు గొప్ప
ఓడల్లా ఉన్నారు. (ఈ ఓడలు చాలా విలువైన వస్తువు
లతో నిండి ఉంటాయి.) కానీ ఆ గర్విష్ఠులను దేవుడు
శిక్షిస్తాడు.
17ఆ సమయంలో ప్రజలు గర్వంగా ఉండటం
మానివేస్తారు. ఇప్పుడు గర్వంగా ఉన్న మనుష్యులు
నేలమీద సాగిలపడతారు. మరియు ఆ సమయంలో
యెహోవా మాత్రమే ఉన్నతంగా నిలుస్తాడు.18విగ్ర
హాలు (అబద్ధపు దేవతలు) అన్నీ తొలగి పోతాయి.
19బండల చాటున, నేల బీటల్లో మనుష్యులు దాక్కొం
టారు. యెహోవాను గూర్చి ఆయన మహా ప్రభావం
గూర్చి ప్రజలు భయపడ్తారు. ఇదంతా భూమిని గజగజ
వణకించుటకు యెహోవా నిలబడినప్పుడు జరుగు
తుంది.
20ఆ సమయంలో ప్రజలు వారి వెండి, బంగారు
విగ్రహాలను పారవేస్తారు. (ప్రజలు పూజించుటకు
మనుష్యులే ఆ విగ్రహాలను తయారు చేశారు.) ప్రజలు
ఆ విగ్రహాలను నేలమీది కన్నాలలో ఉండే ఎలుకలకు,
గబ్బిలాలకు వేస్తారు.
21అప్పుడు ప్రజలు బండ సందులలో దాక్కొం
టారు. యెహోవాను గూర్చి, ఆయన మహా శక్తిని
గూర్చి భయపడి వారు అలా చేస్తారు. భూమిని గజగజ
వణికించుటకు యెహోవా నిలబడినప్పుడు ఇది
జరుగుతుంది.

### ఇశ్రాయేలు దేవున్ని నమ్ముకోవాలి

22మిమ్మల్ని రక్షించుట కోసం ఇతరులను నమ్ము
కోవటం మీరు మానివేయాలి. వాళ్లూ మనుష్యులే,
మనుష్యులు మరణిస్తారు. అందుచేత వాళ్లు కూడా
దేవునిలా బలం గల వాళ్లు అని మీరు తలంచవద్దు.
3 నేను మీకు చెబుతున్న ఈ విషయాలు గ్రహిం
చండి. యెరూషలేము, యూదాలు ఆధారపడే
వాటన్నింటిని, ప్రభువు, సర్వశక్తిమంతుడైన
యెహోవా తొలగించి వేస్తాడు. భోజనం, నీళ్లు మొత్తం
దేవుడు తీసివేస్తాడు. 2వీరులందరిని, శూర సైనికు
లందరిని దేవుడు తొలగించి వేస్తాడు. న్యాయమూర్తు
లను, మాంత్రికులను, పెద్దలను అందరిని దేవుడు
తొలగించి వేస్తాడు. 3సైనిక అధికారులను, ప్రభుత్వ
అధికారులను దేవుడు తొలగించివేస్తాడు. నైపుణ్యం
గల సలహాదార్లను, మంత్రాలు వేస్తూ, జ్యోతిష్యం చెప్ప
టానికి ప్రయత్నించే తెలివిగల వాళ్లందరిని దేవుడు
తొలగించి వేస్తాడు.
4దేవుడు చెబుతున్నాడు: "యువకులు మీకు
నాయకులయ్యేట్టు నేను చేస్తాను. 5ప్రతి ఒక్కరు ఒకరికి
ఒకరు విరోధం అవుతారు. చిన్నవాళ్లు పెద్దవాళ్లను
గౌరవించరు. సామాన్యులు ప్రముఖులను లెక్క
చేయరు."
6ఆ సమయంలో ఒకడు తన స్వంత కుటుంబం
లోంచి తన సోదరుణ్ణి ఒకణ్ణి పట్టుకొచ్చి, "నీకు రాజ
వస్త్రము ఉంది గనుక నీవే మాకు నాయకుడివి. ఈ
శిథిలాలు అన్నింటి మీద నీవే నాయకుడివి" అని
అతనితో చెబుతాడు.
7అయితే ఆ సోదరుడు లేచి, "నేను నీకు సహాయం
చేయలేను. సరిపడినంత ఆహారంగాని బట్టలుగాని నా
ఇంట్లో లేవు. నన్ను మీ నాయకుడిని చేయవద్దు"
అని చెబుతాడు.
8యెరూషలేము తొట్రిల్లి, తప్పు చేసింది గనుక
ఇలా జరుగుతుంది. యూదా పతనమై, యెహోవాను
వెంబడించటం మానివేసింది. వారు చెప్పేవి, చేసేవి
యెహోవాకు విరుద్ధం. యెహోవా మహిమ నేత్రాలు
వీటన్నింటిని తేటగా చూస్తాయి.
9మనుష్యులు తప్పు చేసిన దోషులని వారి
ముఖాలు చెబుతున్నాయి. పైగా వారు వారి పాపము
గూర్చి అతిశయిస్తున్నారు. వారు సొదొమ పట్టణ
ప్రజల్లా ఉన్నారు. వారి పాపాన్ని ఎవరు చూసినా
లెక్క చేయరు. అది వారికి ఎంతో కీడు. వాళ్లకు వాళ్లే
చాలా కష్టం తెచ్చుకొన్నారు.
10మంచి వారికి మంచి సంగతులు జరుగు తాయని
మంచి వారితో చెప్పుము. వారు చేసే మంచి పనులకు
వారికి బహుమానం లభిస్తుంది. 11కానీ చెడ్డ వాళ్లకు
అది చాలా చెడుగా ఉంటుంది. వారికి చాలా కష్టం
వస్తుంది. వారు చేసిన చెడు పనులన్నింటి కోసం

వారు శిక్షించబడతారు. 12చిన్న పిల్లలు నా ప్రజలను
ఓడించేస్తారు. స్త్రీలు నా ప్రజల మీద ఏలుబడి చేస్తారు.
నా ప్రజలారా మీ మార్గ దర్శకులు మిమ్మల్ని తప్పు
దారిలో నడిపిస్తున్నారు. సరియైన దారినుండి వారు
మిమ్మల్ని తప్పించేస్తున్నారు.

## తన ప్రజల గురించి దేవుని నిర్ణయం

13ప్రజలకు తీర్పు తీర్చేందుకు యెహోవా నిలు
స్తాడు. 14పెద్దలు, నాయకులు చేసిన పనుల మూలంగా
యెహోవా వారికి తీర్పు తీరుస్తాడు.

యెహోవా చెబుతున్నాడు, "మీరు ద్రాక్ష తోట
లను తగులబెట్టేశారు (యూదా) పేద ప్రజల దగ్గ
ర్నుండి మీరు తీసుకొన్న వస్తువులు ఇంకా మీ ఇండ్లలో
ఉన్నాయి. 15నా ప్రజలను బాధించుటకు మీకు హక్కు
ఎక్కడిది? పేద ప్రజల ముఖాలను కృంగదీ యుటకు
మీకు హక్కు ఎక్కడిది?" నా ప్రభువు, సర్వశక్తిమంతు
డైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

16యెహోవా అంటున్నాడు: "సీయోను స్త్రీలు
చాలా గర్విష్ఠులయ్యారు. వారు ఇతరుల కంటె మంచి
వాళ్లము అన్నట్టు తలలు పైకెత్తి నడుస్తున్నారు. ఆ
స్త్రీలు ఓర చూపులు చూస్తారు. కాళ్ల గజ్జెలు మోగిస్తూ
వయ్యారంగా కులుకుతూ నడుస్తారు."

17సీయోనులో ఆ స్త్రీల తలలమీద నా ప్రభువు
పుండ్లు పుట్టిస్తాడు. ఆ స్త్రీలు వారి తలలు విరబోసు
కొనేట్టుగా యెహోవా చేస్తాడు.

18ఆ సమయంలో, వారు గర్వించే వస్తువుల
న్నింటినీ యెహోవా తొలగించి వేస్తాడు, అందమైన
కాలి గజ్జలు, సూర్యహారాలు, చంద్రహారాలు, 19చెవుల
దుద్దులు, కడియాలు, మేలి ముసుగులు, 20రుమాళ్లు,
పట్టా గొలుసులు, నడుముకు ధరించే వడ్డాణాలు,
పరిమళాల బరిణెలు, హారాల మీద అలంకారాలు,
21ముద్ర ఉంగరాలు, ముక్కు కమ్మలు, 22శ్రేష్ఠమైన
వస్త్రాలు, ఉత్తరీయాలు, దుప్పట్లు సంచులు,
23అద్దాలు, మేలిమి వస్త్రాలు, తలపాగాలు, శాలువాలు.

24ఇప్పుడు ఆ స్త్రీలకు సువాసనల పరిమళాలు
ఉన్నాయి కానీ ఆ సమయంలో వారి పరిమళాలు
కుళ్లుగాను మురుగుడుగాను అవుతాయి. ఇప్పుడు వాళ్లు
వడ్డాణాలు పెట్టుకొంటున్నారు. కానీ ఆ సమయంలో
వారు కట్టుకొనేందుకు తాళ్లు మాత్రమే ఉంటాయి.
ఇప్పుడు వారి తల వెంట్రుకలు అలంకారంగా అల్ల
బడుతున్నాయి. కానీ ఆ సమయంలో వారి తలలు
గుండ్లు గీయబడతాయి. వారికి శిరోజాలు ఉండవు.
ఇప్పుడు వారికి విందు వస్త్రాలు ఉన్నాయి. కాని
అప్పుడు విచారం వ్యక్తం చేసే వస్త్రాలే వారికి
ఉంటాయి. ఇప్పుడు వారి ముఖాల మీద సౌందర్య
చిహ్నాలు ఉన్నాయి. కానీ అప్పుడు వారి ముఖాల
మీద వాతలు ఉంటాయి.

25ఆ సమయంలో మీ పురుషులు ఖడ్గాలతో చంప
బడతారు. మీ వీరులు యుద్ధంలో చస్తారు. 26పట్టణ
ద్వారాల దగ్గర సమావేశ స్థలాల్లో ఏడ్పు, దుఃఖం
ఉంటుంది. దొంగలు, బందిపోటులు సర్వం దోచు
కొన్న స్త్రీలాగ యెరూషలేము శూన్యంగా కూర్చుని
ఉంటుంది. ఆమె నేల మీద కూర్చుని ఏడుస్తుంది.

4 ఆ కాలంలో ఏడుగురు స్త్రీలు ఒక్క మగవాణ్ణి
పట్టుకొని, "మా స్వంత భోజనం మేము
తింటాము, మా స్వంత బట్టలు మేము కట్టు
కొంటాము, నీ పేరు మాత్రం మాకు పెట్టి, మా
అవమానం తొలగించుము" అని చెబుతారు.

2ఆ సమయంలో యెహోవా మొక్క (యూదా)
చాలా అందంగా, గొప్పగా ఉంటుంది. అప్పటికి ఇంకా
ఇశ్రాయేలులో జీవించి ఉండే ప్రజలు ఆ దేశంలో
పండే వాటిని చూచి ఎంతో గర్విస్తారు. 3ఆ సమ
యంలో ఇంకా సీయోనులో, యెరూషలేములో జీవి
స్తున్న ప్రజలు పరిశుద్ధ (ప్రత్యేక) ప్రజలు అని పిలువ
బడతారు. ఒక ప్రత్యేక జాబితాలో పేర్లు ఉన్న ప్రజ
లందరికీ ఇలా జరుగుతుంది. బతికేందుకు అనుమతించ
బడిన ప్రజల జాబితా అది.

4సీయోను స్త్రీల కల్మషాన్ని యెహోవా కడిగి
వేస్తాడు. యెరూషలేములోని రక్తమంతా యెహోవా
కడిగివేస్తాడు. దేవుడు న్యాయ ఆత్మను ప్రయోగించి,
న్యాయంగా తీర్పు తీరుస్తాడు. మరియు ఆయన
దహించే ఆత్మను ప్రయోగించి, సమస్తాన్నీ శుద్ధి
చేస్తాడు.

5ఆయన తన ప్రజలతో ఉన్నట్టు ఆ సమయంలో
దేవుడు రుజువు చేస్తాడు. పగలు పొగల మేఘాన్ని,
దేవుడు చేస్తాడు. రాత్రి ప్రకాశించే అగ్ని జ్వాలను
దేవుడు చేస్తాడు. ఇవి ప్రతి ఇంటిమీద, ఆకాశంలోను,
సీయోను కొండమీద, ప్రజల ప్రతి సమావేశం మీద
నిలిచి ఉంటాయి. ప్రతి వ్యక్తి మీద కాపుదల ఉంటుంది.

6ఆ కాపుదల ఒక భద్రతా స్థలం. ఆ కాపుదల
సూర్యుని వేడినుండి ప్రజలను కాపాడుతుంది. అన్ని
రకాల వర్షాలు వరదల నుండి దాగుకొనేందుకు ఆ
కాపుదల క్షేమ స్థానంగా ఉంటుంది.

## ఇశ్రాయేలు, దేవుని ప్రత్యేక తోట

5 ఇప్పుడు నేను నా స్నేహితునికి (దేవుడు) ఒక
పాట పాడుతాను. నా స్నేహితునికి తన ద్రాక్షావనం
మీద (ఇశ్రాయేలు) ఉన్న ప్రేమను గూర్చిన పాట
ఇది.

మంచి సారవంతమైన భూమిలో నా స్నేహితునికి
ఒక ద్రాక్షతోట ఉంది.
2 నా స్నేహితుడు పొలందున్ని చదును చేశాడు.
అక్కడ మంచి ద్రాక్ష మొక్కల్ని అతడు నాటాడు.

ఆ పొలం మధ్యలో అతడు ఒక గోపురం కట్టాడు.
అక్కడ మంచి ద్రాక్షలు పండుతాయని నా స్నేహి
తుడు ఎదురు చూశాడు. కాని అక్కడ కారు ద్రాక్షలే
పండాయి.
3 కనుక దేవుడు చెప్పాడు: "యెరూషలేములో
నివసిస్తున్న ప్రజలారా, ఓ యూదా మనిషి, నన్ను
గూర్చి, నా ద్రాక్షాతోట గూర్చి ఆలోచించు.
4 నా ద్రాక్షా తోటకు సహాయపడుటకు ఇంతకంటె
ఎక్కువ నేనేం చేయాలి? నేను చేయగలిగింది
అంతా చేశాను. మంచి ద్రాక్షలు పండుతాయని
నేను ఎదురు చూశాను. కానీ కారు ద్రాక్షాలే
ఉన్నాయి ఎందుకు అలా జరిగింది ?

5నా ద్రాక్షాతోటకు నేను ఏమి చేస్తానో ఇప్పుడు
నేను మీతో చెబుతాను.

తోటను కాపాడుతోన్న ముళ్ల కంచెను నేను
లాగివేసి దాన్ని కాల్చేస్తాను. దాని రాతి గోడను
నేను కూలగొట్టేస్తాను. ఆ రాళ్లు కాళ్ల కింద తొక్క
బడతాయి.
6 నా ద్రాక్షా తోటను నేను బీడు భూమిగా చేస్తాను.
దాని మొక్కల్ని ఎవరూ లెక్క చేయరు. ఆ
పొలంలో ఎవ్వరూ పని చేయరు. కలుపు
మొక్కలు, ముళ్ల పొదలు అక్కడ పెరుగుతాయి.
ఆ పొలం మీద వర్షించ వద్దని మేఘాలకు నేను
ఆజ్ఞాపిస్తాను."

7సర్వశక్తిమంతుడైన యెహోవాకు చెందిన ద్రాక్షా
తోట ఇశ్రాయేలు రాజ్యం యెహోవాకు ప్రియమైన
ద్రాక్షావల్లి యూదా మనిషి. *

యెహోవా న్యాయం కోసం నిరీక్షించాడు. కాని
అక్కడ చంపటం మాత్రమే ఉంది. అంతా లక్ష
ణంగా ఉంటుంది అని యెహోవా నిరీక్షించాడు.
కానీ అక్కడ బాధించబడిన ప్రజల ఆర్త ధ్వనులే
ఉన్నాయి.

8మీరు చాలా కిక్కిరిసి నివసిస్తారు. ఇంక దేనికి
స్థలంలేనంతగా మీరు ఇళ్లు నిర్మించేస్తారు. కానీ
యెహోవా మిమ్మల్ని శిక్షిస్తాడు. మీరు ఒంటరిగా
జీవించాల్సి వస్తుంది. దేశం మొత్తంలో మీరు మాత్రమే
ఉంటారు. 9సర్వశక్తిమంతుడైన యెహోవా నాతో ఇలా
చెప్పాడు, నేను అది విన్నాను, "ఇప్పుడు చాలా ఇళ్లు
ఉన్నాయి. అయితే అ ఇళ్లన్నీ నాశనం చేయబడుతా
యని నేను ప్రమాణం చేస్తున్నాను. ఇప్పుడు
అందమైన పెద్ద భవనాలు ఉన్నాయి. కానీ ఆ ఇళ్లు
ఖాళీ అయిపోతాయి. 10ఆ సమయంలో ఒక పదెకరాల
ద్రాక్షాతోట కొంచెం మాత్రమే ద్రాక్షారసం ఇస్తుంది.
చాలా బస్తాల గింజలతో కొద్దిపాటి ధాన్యం మాత్రం
దిగుబడి అవుతుంది."

11మీరు ఉదయాన్నే లేచి మద్యం తాగాలని చూస్తుం
టారు. ద్రాక్షారసంతో మత్తెక్కి రాత్రి చాలాసేపు మెళకు
వగా ఉంటారు. 12మీరు ద్రాక్షారసంతో, సితారాలు,
డప్పులు, పిల్లన గ్రోవులు, ఇతర సంగీత వాయి
ద్యాలతో మీరు విందులు చేసుకొంటారు. యెహోవా
చేసిన కార్యాలు మీరు చూడరు. యెహోవా హస్తాలు
ఎన్నెన్నో కార్యాలు చేశాయి. కాని మీరు వాటిని
గమనించరు. అందుచేత అది మీకు చాలా కీడు.

13యెహోవా చెబుతున్నాడు: "నా ప్రజలు బంధిం
చబడి తీసుకొని పోబడతారు. ఎందుకంటే వారు
నిజంగా నన్నెరుగరు. ఇశ్రాయేలులో నివసిస్తున్న మను
ష్యులు ఇప్పుడు చాలా ప్రముఖులు. వారి సుఖ జీవ
నాలతో వారు సంతోషంగా ఉన్నారు. అయితే ఆ
గొప్ప వాళ్లంతా దప్పిగొంటారు, ఆకలితో ఉంటారు.
14అప్పుడు వారు చనిపోతారు, పాతాళం మరింత మంది
మనుష్యులతో నిండిపోతుంది. ఆ మరణ స్థానం అపరి
మితంగా దాని నోరు తెరుస్తుంది. అప్పుడు ఆ మనుష్య
లంతా ఆ పాతాళంలోకి వెళ్లిపోతారు."

15ఆ మనుష్యులు తగ్గించబడతారు. ఆ గొప్ప
వాళ్లంతా తలలు వంచి నేలమీదికి చూస్తారు. 16సర్వ
శక్తిమంతుడైన యెహోవా న్యాయంగా తీర్పు తీరు
స్తాడు, ఆయన గొప్పవాడని ప్రజలు తెలుసు
కొంటారు. పవిత్ర దేవుడు సరైన వాటినే చేస్తాడు,
ప్రజలు ఆయనను గౌరవిస్తారు. 17ఇశ్రాయేలు ప్రజలు
వారి దేశం విడిచి వెళ్లిపోయేట్టుగా దేవుడు చేస్తాడు,
దేశం శూన్యం అవుతుంది. గొర్రెలు వాటికి ఇష్టం
వచ్చిన చోటుకు వెళ్తాయి. ఒకప్పుడు ధనికులదైన
భూమిమీద గొర్రె పిల్లలు నడుస్తాయి.

18ఆ మనుష్యుల్ని చూడండి. మనుష్యులు తాళ్లతో
బండ్లను లాగినట్టు, వాళ్లు తమ పాపాల్ని దోషాన్ని
వారి వెనుక లాగుతున్నారు. 19వాళ్లు అంటారు: "
దేవుడు చేయాలనుకొనే పనులు ఆయన త్వరగా
చేస్తే బాగుండును. అప్పుడు జరిగేది ఏమిటో మాకు
తెలుస్తుంది. యెహోవా పథకం త్వరగా జరిగిపోతే
బాగుండును. ఆయన పథకం ఏమిటో అప్పుడు మాకు
తెలుస్తుంది."

20ఆ మనుష్యులు మంచివాటిని చెడ్డవి అంటారు,
చెడ్డవాటిని మంచివి అంటారు. వెలుగును చీకటి అని,
చీకటిని వెలుగు అని వాళ్లు అనుకొంటారు. వాళ్లు
చేదును తీపి, తీపిని చేదు అనుకొంటారు. 21వాళ్లు
చాలా తెలివిగల వాళ్లు అని ఆ మనుష్యులు తలస్తారు.

---

**యూదా మనిషి** ఇది "యూదా రాజు" లేక, "యూదా
ప్రజలు" అయివుండవచ్చు.

వాళ్లు చాలా జ్ఞానంగలవాళ్లు అని తలస్తారు. 22ద్రాక్షారసం
తాగటంలో ఆ మనుష్యులు చాలా ప్రసిద్ధి. మద్యము
కలపటంలో వారు ప్రముఖులు. 23మీరు వారికి డబ్బు
చెల్లిస్తే, వారు నేరస్థుల్ని క్షమించేస్తారు. కానీ వారు
మంచి వాళ్లకు న్యాయం జరుగనివ్వరు. 24ఆ మనుష్యు
లకు చెడు సంగతులు సంభవిస్తాయి. గడ్డి, ఆకులు
అగ్నితో కాల్చివేయబడినట్టు, వారి సంతతి వారు
పూర్తిగా నాశనం చేయబడతారు. చచ్చి, ధూళిగా
తయారయ్యే వేరులా వారి సంతానం వారు పూర్తిగా
నాశనం చేయబడతారు. అగ్ని నాశనం చేసిన ఒక
పువ్వులా వారి సంతతి వారు నాశనం చేయబడతారు.
దాని బూడిద గాలితో కొటుకొని పోతుంది.

సర్వశక్తిమంతుడైన యెహోవా దేవుని ఉపదేశాలకు
విధేయులయ్యేందుకు వారు నిరాకరించారు. ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుని (దేవుని) సందేశాన్ని ఆ ప్రజలు
అసహ్యించుకొన్నారు.

25అందుచేత యెహోవా తన ప్రజల మీద చాలా
కోపగించాడు. యెహోవా తన చేయి పైకెత్తి, వాళ్లను
శిక్షిస్తాడు. పర్వతాలు సహా భయపడి పోతాయి. చచ్చిన
శవాలు చెత్తలా వీధుల్లో పడి ఉంటాయి. కానీ దేవుడు
మాత్రం ఇంకా కోపంగానే ఉంటాడు. ఆ ప్రజలను
శిక్షించుటకు ఆయన హస్తం ఇంకా పైకెత్తబడి
ఉంటుంది.

### ఇశ్రాయేలును శిక్షించటానికి దేవుడు సైన్యాలను రప్పిస్తాడు

26చూడండి! చాలా దూరంలో ఉన్న దేశాలకు
దేవుడు ఒక సంకేతం ఇస్తున్నాడు. దేవుడు ఒక పతా
కాన్ని ఎగుర వేస్తున్నాడు, మరియు ఆ ప్రజలను పిలి
చేందుకు ఆయన ఈల వేస్తున్నాడు. శత్రువు దూర
దేశం నుండి వస్తున్నాడు. త్వరలోనే శత్రువు దేశంలో
ప్రవేశిస్తాడు. వారు చాలా వేగంగా కదలుతున్నారు.
27శత్రువు ఎన్నటికీ అలసిపోడు, పడిపోడు. వారెన్నటికీ
నిద్రబోతులుగా నిద్రపోరు. వారి ఆయుధ పట్టాలు
ఎల్లప్పుడూ సిద్ధమే. వారి చెప్పుల తాళ్లు ఎప్పటికి
తెగిపోవు. 28శత్రువుల బాణాలు చాలా పదునుగా
ఉంటాయి. వారి బాణాలన్నీ కొట్టడానికి సిద్ధంగా
ఉంటాయి. గుర్రాల డెక్కలు బండలా గట్టిగా
ఉంటాయి. వాటి రథాల వెనుక ధూళి మేఘాలుగా
లేస్తుంది.

29శత్రువు గట్టిగా అరిస్తే, అది సింహగర్జనలా
ఉంటుంది. అది కొదమ సింహపు గర్జన అంత గట్టిగా
ఉంటుంది. శత్రువు తాను పోరాడుతున్న ప్రజలను
ఎదురులేకుండా పట్టి లాగుకొని పోతాడు. ప్రజలు
కొట్టుమిట్టాడి, తప్పించుకొనేందుకు ప్రయత్నం
చేస్తారు. కానీ వాళ్లను రక్షించేవాడు ఎవ్వడూ ఉండడు.
30కనుక "సింహం" గట్టిగా సముద్ర ఘోషలా గర్జిస్తుంది.
బంధించబడిన ప్రజలు నేలమీదికే చూస్తుంటారు,
అప్పుడు చీకటి మాత్రమే ఉంటుంది. దట్టమైన ఈ
మేఘంలో వెలుగంతా చీకటిగానే ఉంటుంది.

### దేవుడు, యెషయాను ప్రవక్తగా ఉండమని ఆదేశించటం

6 ఉజ్జియా రాజు చనిపోయిన సంవత్సరం నా ప్రభు
వును నేను చూశాను. మహా ఎత్తయిన సింహాసనం
మీద ఆయన కూర్చొని ఉన్నాడు. ఆయన అంగీతో
దేవాలయం నిండిపోయింది. 2సెరాపులనే దేవదూతలు
ఆయన పైగా నిలబడ్డారు. ఒక్కొక్క సెరాపు దేవ
దూతకు ఆరు రెక్కలు ఉన్నాయి. ఆ దేవదూతలు
వారి ముఖాలు కప్పుకొనేందుకు రెండేసి రెక్కలు,
పాదాలు కప్పుకొనేందుకు రెండేసి రెక్కలు మరియు
ఎగిరేందుకు రెండేసి రెక్కలు ఉపయోగించారు. 3దేవ
దూతలు ఒకరితో ఒకరు, "ప్రభువైన యెహోవా
పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, ఆయన మహిమ
భూలోకమంతా నిండిపోయింది" అని ఘనంగా స్తుతి
స్తున్నారు. 4వారి స్వరాలు గడప కమ్ముల్ని కదలించి
వేశాయి. అంతలో దేవాలయం ధూమంతో నిండి
పోవటం మొదలయింది.

5"అయ్యో! నాకు శ్రమ, నేను నాశనమయ్యాను.
నేను అశుద్ధమైన పెదవులున్న వాడను, నేను అపరిశుద్ధ
మైన పెదవులున్న జనుల మధ్య నివసిస్తున్నాను. సైన్య
ములకధిపతియైన యెహోవాను నేను చూశాను."

6బలిపీఠం మీద అగ్ని ఉంది. సెరాపు దేవదూతల్లో
ఒకరు ఆ అగ్నిలో నుండి మండుచున్న ఒక నిప్పు
కణాన్ని తీయటానికి ఒక పట్టకారు ఉపయోగించారు.
మండుతున్న ఆ నిప్పుకణం చేతపట్టుకొని ఆ దేవ
దూత నా దగ్గరకు ఎగిరి వచ్చాడు. 7ఆ సెరాపు దేవ
దూత ఆ వేడి నిప్పుకణంతో నా నోటిని తాకాడు.

అప్పుడు ఆ దూత, "చూడు, ఈ వేడి నిప్పుకణం
నీ పెదాలను తాకింది గనుక నీవు చేసిన తప్పులన్నీ
నీలో నుండి పోయాయి. ఇప్పుడు నీ పాపాలు తుడిచి
వేయబడ్డాయి." అని చెప్పాడు.

8అప్పుడు నా ప్రభువు స్వరం నేను విన్నాను.
"నేను ఎవర్ని పంపగలను? మా కోసం ఎవరు వెళ్తారు?"
అన్నాడు యెహోవా.

కనుక నేను "ఇదుగో నేను ఉన్నాను, నన్ను
పంపించు" అన్నాను.

9అప్పుడు యెహోవా చెప్పాడు, "వెళ్లి, ప్రజలతో
ఇది చెప్పు: 'మీరు దగ్గరగా వచ్చి వింటారు గాని
గ్రహించరు! దగ్గరగా వచ్చి చూస్తారు గాని నేర్చుకోరు.
10ప్రజల్ని గందరగోళం చేయి. ప్రజలు విని, చూచే
విషయాలు వారు గ్రహించకుండా ఉండేటట్టు చేయి.
నీవు ఇలా చేయకపోతే, ప్రజలు వారి చెవులతో వినే
విషయాలను నిజంగానే గ్రహించవచ్చు. ప్రజలు వారి

మనస్సుల్లో నిజంగానే అర్థం చేసుకోవచ్చు. ఒకవేళ
వారు అలా కనుక చేస్తే, ఆ ప్రజలు మళ్లీ నా దగ్గరకు
తిరిగి వచ్చి, స్వస్థత పొందుతారేమో (క్షమాపణ)!"
11అప్పుడు నేను "ప్రభూ, ఎన్నాళ్లు నేను ఇలా
చేయాలి?" అని అడిగాను.

యెహోవా జవాబిచ్చాడు, "పట్టణాలు నాశనం
చేయబడి, ప్రజలు వెళ్లిపోయేంత వరకు ఇలా చేయి.
ఇళ్లలో మనుష్యులు ఎవ్వరూ నివసించకుండా ఉండే
అంతవరకు ఇలా చేయి. దేశం నాశనం చేయబడి,
నిర్జనం అయ్యేంతవరకు ఇలా చేయుము."
12ప్రజలు దూరంగా వెళ్లిపోయేట్టు యెహోవా
చేస్తాడు. దేశంలో విస్తారమైన ప్రదేశాలు నిర్జనంగా
ఉంటాయి.
13అయితే పదోవంతు ప్రజలు దేశంలో ఉండేం
దుకు అనుమతించబడతారు. ఈ ప్రజలు యెహోవా
దగ్గరకు తిరిగి వస్తారు గనుక వీరు నాశనం చేయబడరు.
ఈ ప్రజలు సింధూర వృక్షంలాంటి వారు. చెట్టు నరికి
వేయబడినప్పుడు, దాని మొద్దు విడువబడుతుంది. ఈ
మొద్దు (మిగిలిన ప్రజలు) చాలా ప్రత్యేకమైన విత్తనం.

## సిరియాతో చిక్కు

7 ఆహాజు యోతాము కుమారుడు. యోతాము
ఉజ్జియా కుమారుడు. సిరియా రాజు రెజీను
రెమల్యా కుమారుడు, పెకహు ఇశ్రాయేలు రాజు.
ఆహాజు యూదాకు రాజుగా ఉన్న కాలంలో, రెజీను,
పెకహు యెరూషలేము మీద యుద్ధానికి వెళ్లారు. కాని
వారు ఆ పట్టణాన్ని ఓడించలేక పోయారు.
2దావీదు కుటుంబానికి ఒక సందేశం ఇవ్వబడింది.
"అరాము (సిరియా) సైన్యం, ఎఫ్రాయిము (ఇశ్రా
యేలు) సైన్యం ఒకటిగా కలిశాయి. రెండు సైన్యాలు
కలిసి బస చేస్తున్నాయి" అనేది ఆ సందేశం.

ఆహాజు రాజు ఈ సందేశం విన్నప్పుడు అతడు,
ప్రజలు చాలా భయపడిపోయారు. అరణ్యంలో గాలికి
కొట్టుకొనే చెట్లలా వారు భయంతో వణకి పోయారు.
3అప్పుడు యెషయాతో యెహోవా చెప్పాడు,
"నీవూ, నీ కుమారుడూ షెయార్యాషూబు వెళ్లి ఆహా
జుతో మాట్లాడండి. పైకోనేటిలోకి నీళ్లు ప్రవహించే
చోటికి వెళ్లండి. ఇది చాకలివాని పొలానికి పోయే
దారిలో ఉంది.
4"ఆహాజుతో చెప్పండి, జాగ్రత్తగా ఉండండి, గాని
నెమ్మదిగా ఉండండి. భయపడవద్దు. వాళ్లిద్దరు మను
ష్యులు, అంటే రెజీను, రెమల్యా కుమారుడు మిమ్మల్ని
భయపెట్టనివ్వకండి. వాళ్లు కాలిపోయిన రెండు కట్టె
ల్లాంటి వాళ్లు. గతంలో వాళ్లు వేడిగా మండుతూండే
వాళ్లు. కాని ఇప్పుడు వాళ్లు వట్టి పొగ మాత్రమే.
రెజీను, సిరియా, రెమల్యా కుమారుడు కోపంగా
ఉన్నారు. 5వారు మీకు విరోధంగా పథకాలు వేశారు.
6మనం వెళ్లి యూదా మీద యుద్ధం చేయాలి.
యూదాను మనలో మనం పంచుకొందాం. టాబె
యేలు కుమారుణ్ణి యూదాకు క్రొత్త రాజుగా చేద్దాము"
అని వారన్నారు.
7నా దేవుడైన యెహోవా చెబుతున్నాడు, "వారి
పథకం పనిచేయదు. అది సంభవించదు. 8రెజీను దమ
స్కుకు పాలకునిగా ఉన్నంతవరకు అది జరుగదు.
ఎఫ్రాయిము (ఇశ్రాయేలు) ఇప్పుడు ఒక రాజ్యం.
కానీ అరవై ఐదు సంవత్సరాల తర్వాత ఎఫ్రాయిము
(ఇశ్రాయేలు) రాజ్యంగా ఉండదు. 9ఎఫ్రాయిముకు
షోమ్రోను రాజధానిగా ఉన్నంత వరకు, రెమల్యా కుమా
రుడు దాని పాలకునిగా ఉన్నంతవరకు వారి పథకం
నెరవేరదు. ఈ సందేశాన్ని నీవు నమ్మకపోతే ప్రజలు
నిన్ను నమ్మగూడదు."

## ఇమ్మానుయేలు–దేవుడు మనతో ఉన్నాడు

10అప్పుడు యెహోవా ఆహాజుతో మాట్లాడటం
కొనసాగించాడు. 11యెహోవా చెప్పాడు: "ఈ సంగ
తులు సత్యం అని నీ మట్టుకు నీవు రుజువు చేసుకొ
నేందుకు ఒక సూచన కోసం అడుగు. నీకు కావాల్సిన
ఏ సూచన కోసమైనా నీవు అడగవచ్చు. ఆ సూచన
పాతాళమంత లోతునుండి రావచ్చు, లేక ఆ సూచన
ఆకాశమంత ఎత్తునుండి అయినా రావచ్చును."
12కాని ఆహాజు, "రుజువుగా సూచన కావాలి అని
నేను అడగను. యెహోవాను నేను పరీక్షించను"
అన్నాడు.
13అప్పుడు యెషయా చెప్పాడు, "దావీదు
వంశమా, జాగ్రత్తగా ఆలకించు. మీరు ప్రజల సహనాన్ని
పరీక్షిస్తారు. కానీ అది మీకు ముఖ్యంకాదు. కనుక మీరు
ఇప్పుడు నా దేవుని సహనాన్ని పరీక్షిస్తున్నారు. 14కాబట్టి
ఆయనే మీకు ఒక సూచన చూపిస్తాడు.

ఇదిగో ఒక కన్య గర్భము ధరించి, ఒక కుమా
రుడ్ని కని, ఆయన్ని ఇమ్మానుయేలు అనే
పేరుతో పిలుస్తుంది.
15 అతను పెరుగు, తేనె తినును చెడును విసర్జించి
మంచిని చేపట్టి తెలివి వచ్చేవరకు అతను ఇలా
జీవిస్తాడు.
16 కానీ ఆ బాలుడు మంచి, చెడులను తెలుసు
కొనక ముందే ఎఫ్రాయిము (ఇశ్రాయేలు),
సిరియా నిర్జనం అయి పోతాయి.

"మీరు ఆ ఇద్దరు రాజులను గూర్చి భయపడు
తున్నారు. 17కానీ మీరు యెహోవాను గూర్చి భయ
పడాలి. ఎందుకంటే యెహోవా మీకు కొన్ని కష్ట
కాలాలను తీసుకొని వస్తాడు. మీ ప్రజలకు, మీ తండ్రి
వంశ ప్రజలకు ఆ కష్టాలు వస్తాయి. దేవుడేమి చేస్తాడు?

మీ మీద యుద్ధం చేయటానికి అష్షూరు రాజును
యెహోవా తీసుకొని వస్తాడు.
18“ఆ సమయంలో యెహోవా ‘జోరీగల్ని’ రప్పి
స్తాడు. (ఆ ‘జోరీగలు’ ఇప్పుడు ఈజిప్టు నదుల దగ్గర
ఉన్నాయి) మరియు యెహోవా కందిరీగల్ని రప్పి
స్తాడు. (కందిరీగలు ఇప్పుడు అష్షూరు దేశంలో
ఉన్నాయి.) ఈ శత్రువులు మీ దేశానికి వస్తాయి.
19ఈ శత్రువులు అరణ్యపు బండ సందుల దగ్గర మెట్టల
లోయల్లోను, పొదల దగ్గర, నీటి మడుగుల దగ్గర
ఉంటాయి. 20యూదాను శిక్షించటానికి యెహోవా
అష్షూరును వాడుకొంటాడు. అష్షూరు కూలికి విని
యోగించబడే మంగలి కత్తిలా ఉపయోగించబడు
తుంది. అది యూదా తలమీద, కాళ్లమీద, వెంట్రుక
లను యెహోవా తానే గీసేస్తున్నట్టుగా ఉంటుంది.
అది యూదా గడ్డాన్ని యెహోవా గీసేస్తున్నట్టుగా
ఉంటుంది.
21“ఆ సమయంలో ఒక మనిషి ఒక ఆవును, రెండు
గొర్రెలను మాత్రమే ప్రాణంతో ఉంచుకో గలుగు
తారు. 22ఆ ఒక్క మనిషి తినడానికి సరిపోయే పెరుగు,
పాలు మాత్రమే ఉంటాయి. దేశంలో ప్రతి మనిషి
పెరుగు, తేనె మాత్రమే తింటారు. 23ఈ దేశంలో
వెయ్యేసి ద్రాక్షా వల్లులు ఉన్న పొలాలు ఇప్పుడు
ఉన్నాయి. ఒక్కో ద్రాక్ష వల్లి వెయ్యి వెండి నాణాల
విలువ చేస్తుంది. కానీ ఈ పొలాలు గచ్చ పొదలు,
బలు రక్కసి చెట్లతో నిండిపోతాయి. 24దేశం అడవిగా
తయారై, వేట ప్రదేశంగా మాత్రమే ఉపయోగ
పడుతుంది. 25ఒకప్పుడు ఈ కొండల మీద ప్రజలు
పనిచేసి, ఆహారం పండించారు. కానీ ఆ సమయంలో
మనుష్యులు అక్కడికి వెళ్లరు. దేశమంతా గచ్చ
పొదలతో, బలు రక్కసి చెట్లతో నిండిపోతుంది.
గొర్రెలు, పశువులు మాత్రమే ఆ స్థలాలకు వెళ్తాయి.”

## అష్షూరు త్వరలో వస్తుంది

8 యెహోవా నాతో చెప్పాడు, “వ్రాయటానికి ఒక
పెద్ద పలక తీసుకో. ఘంటంతో (పెన్నుతో)
ఈ మాటలు వ్రాయి: ‘మహేరు, షాలాల్, హాష్ బజ్.’
(అంటే ‘త్వరలోనే దోపిడి, దొంగతనం జరుగుతుంది’
అని అర్థం.)”
2సాక్షులుగా నమ్మదగిన కొందరు మనుష్యుల్ని నేను
సమావేశపర్చాను. (వీళ్లు ఊరియా, యెబెరెక్యా,
జెకర్యా) నేను ఈ విషయాలు రాయటం ఈ మను
ష్యులు గమనించారు. 3తర్వాత నేను ప్రవక్త దగ్గరకు
వెళ్లాను. నేను ఆమెతో ఉన్న తర్వాత ఆమె గర్భ
వతియై, ఒక కుమారుని కన్నది. అప్పుడు యెహోవా
నాతో చెప్పాడు, ‘పిల్లవాడికి మహేరు షాలాల్ హాష్
బజ్ అని పేరు పెట్టు. 4ఎందుకంటే ఆ పిల్లవాడు
‘అమ్మా’ ‘నాన్నా’ అనటం నేర్చుకొనక ముందే
దమస్కు, షోమ్రోనుల ధనం, ఐశ్వర్యాలు దేవుడు
తీసుకొని, వాటిని దేవుడు అష్షూరు రాజుకు
ఇచ్చివేస్తాడు.”
5దేవుడు మళ్లీ నాతో మాట్లాడాడు. 6నా ప్రభువు
చెప్పాడు: “ఈ ప్రజలు నిదానంగా ప్రవహించే
షిలోహు* జలాలను స్వీకరించేందుకు నిరాకరించారు.
రెజీను, రెమల్యా కుమారునితో (పెకహు) వీళ్లు
సంతోషపడి పోతున్నారు. 7అందుచేత చూడు నా
యెహోవా మహా గొప్ప యూఫ్రటీసు నదీ ప్రవాహం
లాగా అష్షూరును దాని శక్తి అంతటిని తీసుకొని వస్తు
న్నాడు. వారు ఒక నది పొంగి పొరల్లేలా, ప్రవాహంలా
మీ దేశంలోనికి వస్తారు. 8ఆ నదిలోంచి నీళ్లు పొంగి
యూదాలోకి ప్రవహిస్తాయి. యూదా గొంతుల వరకు
నీళ్లు పొంగి, యూదాను దాదాపుగా ముంచేస్తాయి.
“ఇమ్మానుయేలూ, నీ దేశం అంతటినీ ముంచి
వేసేంతగా ఈ వరద విస్తరిస్తుంది.”

## యెహోవా తన సేవకులను రక్షిస్తాడు

9 సర్వ దేశాల్లారా, యుద్ధానికి సిద్ధపడండి. కాని
మీరు ఓడిపోతారు. దూర దేశాలన్నీ ఆలకించండి.
యుద్ధానికి సిద్ధపడండి. కానీ మీరు ఓడిపోతారు
10 యుద్ధానికి మీ వ్యూహాలు పన్నండి. కానీ మీ
వ్యూహాలు అన్నీ ఓడిపోతాయి. మీ సైన్యాలకు
ఆజ్ఞాపించండి. కానీ మీ ఆజ్ఞలు నిష్ప్రయోజనమే.
ఎందుకంటే, దేవుడు మాతో ఉన్నాడు* గనుక.

## యెషయాకు హెచ్చరికలు

11యెహోవా తన మహా శక్తితో నాతో మాట్లా
డాడు. ఈ ఇతర మనుష్యుల్లా ఉండొద్దని యెహోవా
నన్ను హెచ్చరించాడు. “ప్రతివారూ ఇతరులు తమకు
వ్యతిరేకంగా పథకాలు వేస్తున్నట్టు చెబుతున్నారు. నీవు
ఆ విషయాలు నమ్మవద్దు. ఆ ప్రజలు భయపడే
వాటికి నీవు భయపడవద్దు. వాటిగూర్చి నీవు భయ
పడవద్దు” అని యెహోవా నాతో చెప్పాడు.
13సర్వశక్తిమంతుడైన యెహోవా ఒక్కడే మీరు
భయపడాల్సిన వాడు. మీరు గౌరవించాల్సిన వాడు
ఆయనే. మీరు భయపడాల్సింది ఆయనకే.
14మీరు యెహోవాను గౌరవించి, ఆయనను పవి
త్రునిగా ఎంచుకొంటే, అప్పుడు ఆయనే మీకు క్షేమ
స్థానంగా ఉంటాడు. కానీ మీరు ఆయనను గౌరవించరు.
కనుక మీరు పడిపోయేట్టు చేసే బండ ఆయనే.
ఇశ్రాయేలు యొక్క రెండు కుటుంబాలను తొట్రిల్లేలా
చేసే బండ ఆయనే. యెరూషలేము ప్రజలందరినీ

---

**షిలోహు** అనగా యెరూషలేములో కోనేరు.

**దేవుడు మాతో ఉన్నాడు** అనగా ఇమ్మానుయేలు అని
భావం.

పట్టుకొనే బోను యెహోవాయే. 15(అనేకమంది
మనుష్యులు ఈ బండ తగిలి పడిపోతారు. వాళ్లు పడి
పోయి, విరిగిపోతారు. వారు బోనులో పట్టుబడతారు.)
16యెషయా చెప్పాడు, "ఒక ఒడంబడిక చేసి,
దాన్ని ముద్రించండి. నా ఉపదేశాలను భవిష్యత్తు కోసం
భద్రపర్చండి. నన్ను అనుసరించే వాళ్లు చూస్తూ
ఉండగా దీనిని చేయండి.
17ఆ ఒడంబడిక ఇదే:

యెహోవా మాకు సహాయం చేసేవరకు
నేను వేచి ఉంటాను. యాకోబు (ఇశ్రా
యేలు) వంశం విషయం యెహోవా సిగ్గు
పడుతున్నాడు. ఆయన వాళ్లను చూచేం
దుకు నిరాకరిస్తున్నాడు. కానీ నేను
యెహోవా కోసం నిరీక్షిస్తాను. ఆయనే
మమ్మల్ని రక్షిస్తాడు.

18"ఇశ్రాయేలు ప్రజలకు నేనూ, నా పిల్లలే సూచ
నగా రుజువుగా ఉన్నాము. సీయోను కొండమీద
నివాసం చేసే సర్వశక్తిమంతుడైన యెహోవా
మమ్మల్ని పంపించాడు."
19కొంతమంది, "జ్యోతిష్కుల దగ్గరకు, మాంత్రి
కుల దగ్గరకు వెళ్లి, ఏమి చేయాలో తెలుసుకోండి"
అంటున్నారు. (ఈ జ్యోతిష్కులు, మాంత్రికులు
పిట్టల్లా కిచకిచలాడి తమకి చాలా తెలివిగల తలపులు
ఉన్నట్టు మనుష్యులు తలచాలని గుసగుసలాడుతారు.)
అయితే వాళ్లు వాళ్ల దేవుణ్ణి సహాయం అడుక్కోవాలి
అని నేను చెబుతున్నాను. ఆ జ్యోతిష్కులు, మాంత్రి
కులు వారు ఏమి చేయాలి అనేది చచ్చిపోయిన వాళ్లను
అడుగుతారు. బతికి ఉన్న వాళ్లు చచ్చిన వాళ్లను ఏదైనా
ఎందుకు అడగాలి?
20మీరు ఉపదేశాలను, ఒడంబడికను అనుసరించాలి.
ఈ ఆదేశాలు మీరు అనుసరించకపోతే, మీరు తప్పు
ఆదేశాలను పాటించవచ్చు. (తప్పు ఆదేశాలు అంటే
జ్యోతిష్కులు, మాంత్రికులు దగ్గర్నుండి వచ్చేవి. అవి
ఎందుకూ పనికి రాని ఆదేశాలు. ఆ ఆదేశాలను
పాటించటంవల్ల మీకేమీ లాభం ఉండదు.)
21ఆ తప్పు ఆదేశాలను మీరు పాటిస్తే దేశంలో కష్టాలు,
ఆకలి ఉంటాయి. ప్రజలు ఆకలితో ఉంటారు.
అప్పుడు వాళ్లకు కోపం వచ్చి రాజును, అతని దేవుళ్లను
తిడతారు. అప్పుడు వాళ్లు సహాయం కోసం దేవుని
వైపు చూస్తారు.
22వారు వారి దేశంలో చుట్టూరా చూస్తే, కష్టం
కృంగదీసే చీకటి దేశంనుండి బలవంతంగా వెళ్లగొట్ట
బడిన ప్రజల దుఃఖపు చీకటి మాత్రమే వారికి కనబడు
తుంది. మరియు ఆ చీకట్లో పట్టుబడిన మనుష్యులు
తమను తాము విడిపించు కోలేరు.

### ఒక కొత్త రోజు వస్తుంది

9 గతంలో జెబూలూను దేశం, నఫ్తాలి దేశం ముఖ్యం
కాదు అనుకొన్నారు. కానీ ఉత్తరార్థంలో దేవుడు
ఆ దేశాన్ని గొప్ప చేస్తాడు. సముద్రం దగ్గర దేశం,
యొర్దాను నది అవతల దేశం, యూదులు కానివారు
నివసించే గలిలయ.
2ఇప్పుడు ఆ ప్రజలు చీకట్లో జీవిస్తున్నారు. కానీ
వారు గొప్ప వెలుగు చూస్తారు. మరణంలాంటి చీకటి
చోట ఆ ప్రజలు జీవిస్తున్నారు. కానీ "గొప్ప వెలుగు"
వారిమీద ప్రకాశిస్తుంది.
3దేవా, నీవే రాజ్యాన్ని పెద్ద చేస్తావు. ప్రజల్ని నీవు
సంతోషపరుస్తావు. ఆ ప్రజలు వారి సంతోషాన్ని నీకు
తెలియజేస్తారు. అది కోతకాలపు సంతోషంలా
ఉంటుంది. ప్రజలు యుద్ధంలో గెలిచిన సామగ్రిని
పంచుకొన్నప్పుడు కలిగిన సంతోషంలా ఉంటుంది.
4ఎందుకంటే, భారాన్ని నీవు తొలగించేస్తావు కనుక.
ప్రజల వీపుల మీద నుండి భారమైన కాడిని నీవు
తొలగించేస్తావు గనుక. నీ ప్రజలను శిక్షించేందుకు
శత్రువు వినియోగించే కొరడాను నీవు తొలగించేస్తావు.
అది నీవు మిద్యాను ఓడించిన సమయంలా ఉంటుంది.
5యుద్ధంలో కదం తొక్కిన ప్రతి కాలిజోడు నాశనం
చేయబడుతుంది. రక్తపు మరకలైన యుద్ధ వస్త్రం
ప్రతీది నాశనం చేయబడుతుంది. అవన్నీ అగ్నిలో
పడద్రోయబడతాయి. 6మనకు ఒక బాలుడు పుట్టి
యున్నాడు. మనకు ఒక కుమారుడు ఇవ్వబడి
యున్నాడు. ఆయన భుజం మీద ప్రభుత్వమున్నది.
"ఆశ్చర్యకరుడైన ఆలోచనకర్త, శక్తిగల దేవుడు, నిత్యం
జీవించే తండ్రి, సమాధాన రాజు" అనేది ఆయన
పేరు. 7ఆయన రాజ్యంలో శాంతి, శక్తి ఉంటాయి.
దావీదు వంశపు ఈ రాజుకు అది కొనసాగుతుంది.
ఈ రాజు మంచితనం, న్యాయపు తీర్పు ప్రయోగించి,
రాజ్యాన్ని శాశ్వతంగా ఎప్పటికీ పాలిస్తాడు.
సర్వశక్తిమంతుడైన యెహోవాకు తన ప్రజల మీద
బలీయమైన ప్రేమ ఉంది. ఈ బలీయమైన ప్రేమ
ఆయనను ఈ పనులు చేసేటట్టుగా చేస్తుంది.

### దేవుడు ఇశ్రాయేలును శిక్షిస్తాడు

8యాకోబు (ఇశ్రాయేలు) ప్రజలకు విరోధంగా
నా ప్రభువు ఒక ఆదేశం ఇచ్చాడు. ఇశ్రాయేలీయులకు
విరోధంగా ఇవ్వబడిన ఆదేశానికి విధేయత చూపబడు
తుంది. 9అప్పుడు ఎఫ్రాయిం (ఇశ్రాయేలు)లో ప్రతి
వ్యక్తి, చివరికి సమరయ నాయకులు కూడా దేవుడు
తమని శిక్షించాడని తెలుసుకొంటారు.
ఇప్పుడు ఆ ప్రజలు చాలా గర్వంగా, అతిశయంగా
ఉన్నారు. 10"ఈ ఇటుకలు పడిపోవచ్చు గాని మేము
మళ్లీ నిర్మిస్తాం. ఇంకా గట్టి రాయితో మేము నిర్మిస్తాం.
ఈ చిన్న చెట్లు నరికి వేయబడవచ్చును. కానీ మేము

అక్కడ కొత్త చెట్లు వేస్తాము. ఆ కొత్త చెట్లు ఇంకా
పెద్దగా, గట్టిగా ఉంటాయి." అని ఆ ప్రజలు అంటారు.
11అందుచేత ఇశ్రాయేలీయులతో యుద్ధం చేసేం
దుకు యెహోవా మనుష్యుల్ని చూస్తాడు. వారి మీదికి
రెజీను శత్రువులను యెహోవా తీసుకొని వస్తాడు.
12తూర్పు నుండి సిరియన్లను, పడమటి నుండి ఫిలిష్తీ
యులను యెహోవా తీసుకొని వస్తాడు. ఆ శత్రువులు
తమ సైన్యాలతో ఇశ్రాయేలును ఓడిస్తారు. కానీ
యెహోవా మాత్రం ఇంకా ఇశ్రాయేలు మీద కోపంగానే
ఉంటాడు. యెహోవా ఆ ప్రజలను శిక్షించటానికి
ఇంకా సిద్ధంగానే ఉంటాడు.
13దేవుడు ప్రజలను శిక్షిస్తాడు గాని వాళ్లు మాత్రం
పాపం చేయటం మానరు. వాళ్లు ఆయన దగ్గరకు
మళ్లుకోరు. సర్వశక్తిమంతుడైన యెహోవాను వారు
అనుసరించరు. 14అందుచేత యెహోవా ఇశ్రాయేలీ
యుల తల, తోక కత్తిరించి వేస్తాడు. కాండాన్ని
కొమ్మను కూడ ఒక్క రోజునే యెహోవా నరికి
వేస్తాడు. (తల అంటే పెద్దలు, ప్రముఖ నాయకులు
తోక అంటె అబద్ధాలు చెప్పే ప్రవక్తలు.)
16ప్రజలను నడిపించే మనుష్యులు వారిని తప్పు
త్రోవన నడిపిస్తున్నారు. కనుక వారిని అనుసరించే
ప్రజలు నాశనం చేయబడతారు.
17మనుష్యులు అంతా చెడ్డవాళ్లే. అందుచేత యువ
కుల విషయం యెహోవా వాకు సంతోషం లేదు. వారి
విధవలకు, అనాధలకు యెహోవా దయ చూపించడు.
ఎందుకంటే, ప్రజలంతా చెడ్డవాళ్లే గనుక. దేవునికి
విరోధమైన వాటిని మనుష్యులు చేస్తారు. మనుష్యులు
అబద్ధాలు చెబుతారు. అందుచేత దేవుడు మనుష్యుల
మీద కోపంగానే ఉంటాడు. దేవుడు మనుష్యుల్ని
శిక్షిస్తూనే ఉంటాడు.
18చెడు అనేది చిన్న నిప్పులాంటిది. ఆ నిప్పు
మొదట పొదలను, ముళ్లకంపల్ని తగలెడుతుంది:
తర్వాత అరణ్యంలో ఉండే పెద్ద పొదలను ఆ నిప్పు
తగలెడుతుంది. చివరికి అది పెద్ద అగ్నిగా మారుతుంది.
అంతా పొగలో కలిసిపోతుంది.
19సర్వశక్తిమంతుడైన యెహోవా కోపంగా
ఉన్నాడు, కనుక దేశం కాల్చి వేయబడుతుంది. మను
ష్యులంతా ఆ అగ్నిలో కాల్చి వేయబడతారు. ఎవ్వడూ
తన సోదరుణ్ణి రక్షించే ప్రయత్నం చేయడు. 20ప్రజలు
కుడిపక్క ఏదో కొంత చేజిక్కించుకున్నా ఆకలిగానే
ఉంటారు. ఎడమ పక్కన వాళ్లు ఏదో తింటారు,
అయినా వాళ్లకు కడుపు నిండదు. అప్పుడు ప్రతివాడూ
తిరిగి, తన స్వంత శరీరాన్నే తింటాడు. 21(అంటే
ఎఫ్రాయిముకు వ్యతిరేకంగా మనష్షే యుద్ధం చేస్తాడు.
మనష్షేకు వ్యతిరేకంగా ఎఫ్రాయిము యుద్ధం చేస్తాడు.
తర్వాత వాళ్లిద్దరు యూదా మీద తిరగబడతారు అని
అర్థం.) యెహోవా ఇశ్రాయేలు మీద ఇంకా కోపంగానే
ఉన్నాడు. యెహోవా ఇంకా తన ప్రజల్ని శిక్షించటానికి
సిద్ధంగానే ఉన్నాడు.

10 చెడు చట్టం వ్రాసే చట్టాల నిర్మాతలను
చూడండి. ప్రజలకు జీవితాన్ని దుర్భరం చేసే
చట్టాలు ఆ నిర్మాతలు రాస్తారు.
2ఆ చట్ట నిర్మాతలు పేద ప్రజలకు న్యాయం
చేకూర్చలేదు. పేద ప్రజల హక్కులను వారు తీసి
వేస్తారు. వారు విధవల వద్ద, అనాధల వద్ద ప్రజలను
దొంగిలించనిస్తారు.
3చట్ట నిర్మాతలారా, మీరు చేసిన పనులను మీరు
వివరించాల్సి ఉంటుంది. ఆ సమయంలో మీరేమి
చేస్తారు? దూరదేశంనుండి మీ నాశనం వస్తుంది.
సహాయం కోసం మీరు ఎక్కడికి పరుగెత్తుకు వెళ్తారు?
మీ ధనం, మీ ఐశ్వర్యాలు మీకేం సాయం చేయవు.
4ఒక ఖైదీలా మీరు శిరస్సు వంచాలి. చచ్చిన వాడిలా
మీరు పడిపోతారు. కాని దానివల్ల మీకు సహాయం
జరగదు. దేవుడు ఇంకా కోపంగానే ఉంటాడు. దేవుడు
ఇంకా మిమ్మల్ని శిక్షించటానికి సిద్ధంగానే ఉంటాడు.
5దేవుడు అంటాడు: "అష్షూరును నేను ఒక కర్రలా
వాడుకొంటాను. కోపంతో నేను ఇశ్రాయేలును శిక్షించ
డానికి అష్షూరును వాడుకొంటాను." 6చెడుకార్యాలు
చేసే వారిమీద యుద్ధం చేయటానికి నేను అష్షూరును
పంపిస్తాను. వాళ్ల మీద నేను కోపంగా ఉన్నాను. వారిమీద
యుద్ధం చేయమని అష్షూరుకు నేను ఆజ్ఞాపిస్తాను.
వారిని అష్షూరు ఓడించి, వారి ఐశ్వర్యాలను కొల్లగొట్టు
కొంటారు. ఇశ్రాయేలీయులు, వీధుల్లో అష్షూరు వారి
పాదాల కింద తొక్కబడే ధూళిలా ఉంటారు.
7"అయితే అష్షూరును నేను వాడుకొంటాను" అనే
విషయం వారికి తెలియదు. అష్షూరు నాకు ఒక సాధనం
అని అతనికి తెలియదు. ఇతరులను నాశనం చేయటమే
అష్షూరుకు కావాలి. అష్షూరు అనేక రాజ్యాలను నాశనం
చేయాలని మాత్రమే పథకం వేస్తుంది. 8అష్షూరు
తనకు తాను ఇలా చెప్పుకొంటాడు, 'నా నాయకు
లంతా రాజుల్లాంటి వాళ్లు. 9కల్నో పట్టణం కర్కెమీషు
పట్టణంలా ఉంటుంది. అర్పాదు పట్టణం హమాతు
పట్టణంలా ఉంటుంది. షోమ్రోను పట్టణం దమస్కు
పట్టణంలా ఉంటుంది.
10అనేక విగ్రహాలున్న ఆ రాజ్యాలను నేను ఓడిం
చేశాను, ఇప్పుడు అవి నా అధికారంలో ఉన్నాయి.
వాళ్లు పూజించే విగ్రహాలు యెరూషలేము, సమర
యలో ఉన్న విగ్రహాలకంటె గొప్పవి.
11"షోమ్రోనును, దాని విగ్రహాలను నేను ఓడిం
చాను. యెరూషలేమును, దాని ప్రజలు తయారుచేసిన
విగ్రహాలను కూడ నేను ఓడిస్తాను."
12యెరూషలేముకు, సీయోను కొండకు నా
ప్రభువు చేయదలచిన వాటిని చేయటం ముగిస్తాడు.
అప్పుడు యెహోవా అష్షూరును శిక్షిస్తాడు. అష్షూరు

రాజు చాలా గర్విష్ఠి. అతడు గర్వం చేత చాలా చెడ్డ
పనులు చేశాడు. అందుచేత దేవుడు అతణ్ణి శిక్షిస్తాడు.
13అష్షూరు రాజు అంటున్నాడు: “నేను చాలా
తెలివిగలవాడ్ని. నా స్వంత జ్ఞానం, శక్తి మూలంగా
నేను ఎన్నో గొప్ప కార్యాలు చేశాను. అనేక రాజ్యాల్ని
నేను ఓడించాను. వారి ఐశ్వర్యం నేను దోచుకొన్నాను.
వారి ప్రజలను నేను బానిసలుగా చేసుకొన్నాను. నేను
చాలా శక్తిగలవాణ్ణి. 14ఒకడు పక్షి గూటిలో నుండి
గుడ్లు తీసినట్టుగా, నేను నా స్వంత చేతుల్తో ఈ
ప్రజలందరి సంపదలు తీసుకొన్నాను. ఒక పక్షి తన
గూడును, గుడ్లను తరచు విడిచిపెడ్తుంటుంది. ఆ
గూటిని కాపాడేందుకు ఏమీ లేదు. కిచకిచలాడ్తూ,
తన రెక్కలతో, ముక్కుతో కొట్లాడేందుకు అక్కడ
ఏ పక్షి లేదు. అందుచేత మనుష్యులు ఆ గుడ్లు తీసు
కొంటారు. అదే విధంగా భూలోకంలోని మనుష్య
లందరినీ నేను తీసుకొనకుండా నన్ను ఆపగలిగిన
వాడు ఎవడూ లేడు.”

### అష్షూరు బలగాన్ని దేవుడు అదుపు చేస్తాడు

15గొడ్డలి, దానిని ప్రయోగించే వానికంటె గొప్పదేం
కాదు. రంపం, దానితో కోసే వానికంటె గొప్పదేం
కాదు. కాని అష్షూరు తాను దేవునికంటే ముఖ్యం అను
కొంటుంది. ఎవరినైనా శిక్షించేందుకు ఒకడు బెత్తం
తీసుకొని ప్రయోగిస్తే, అతనికంటె ఆ బెత్తం ఎక్కువ
శక్తి గలది, ముఖ్యమయింది అన్నట్టు ఉంటుంది.
16అష్షూరు చాల గొప్పవాడ్ని అని అనుకొంటాడు.
కానీ సర్వశక్తిమంతుడైన యెహోవా అష్షూరు మీదికి
గొప్ప రోగం పంపిస్తాడు. ఒక రోగి బరువు కోల్పోయి
నట్టు అష్షూరు తన ఐశ్వర్యాన్ని శక్తిని పోగొట్టు
కొంటాడు. అప్పుడు అష్షూరు మహిమ నాశనం అవు
తుంది. సర్వం పోయేవరకు మండుతూ ఉండే అగ్నిలా
అది ఉంటుంది. 17ఇశ్రాయేలు వెలుగు (దేవుడు)
అగ్నిలా ఉంటాడు. ఆ పరిశుద్ధుడు ఒక జ్వాలలా
ఉంటాడు. మొట్టమొదట పొదలను, ముళ్లకంపలను
కాల్చేసే అగ్నిలా ఆయన ఉంటాడు. 18ఆ తర్వాత
అగ్ని మహా వృక్షాలను, ద్రాక్షతోటలను కాల్చివేస్తుంది.
చివరికి సర్వం, ప్రజలతో సహా నాశనం చేయబడు
తుంది. దేవుడు అష్షూరును నాశనం చేసినప్పుడు
అలా ఉంటుంది. అష్షూరు కుళ్లిపోతున్న మొద్దులా
ఉంటుంది. 19అరణ్యంలో కొన్ని చెట్లు మాత్రం నిలిచి
ఉండవచ్చు. కానీ అవి ఒక పిల్లవాడు కూడ లెక్కబెట్ట
గలిగినన్ని ఉంటాయి.
20ఆ సమయంలో ఇశ్రాయేలులో ఇంకా బతికి
ఉన్నవారు, యాకోబు వంశ ప్రజలు, వారిని కొట్టే
వాని మీద ఆధారపడరు. ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడైన
యెహోవా మీద నిజంగా ఆధారపడటం వారు నేర్చు
కొంటారు. 21యాకోబు వంశంలో మిగిలిన ప్రజలు
శక్తివంతుడైన దేవుని మరల వెంబడిస్తారు. 22మీ ప్రజలు
చాలామంది ఉన్నారు. వారు సముద్రపు ఇసుకలా
ఉన్నారు. కానీ ఆ ప్రజల్లో కొద్ది మంది మాత్రమే
యెహోవా దగ్గరకు తిరిగి వచ్చేందుకు మిగిలి
ఉంటారు. ఆ ప్రజలు దేవుని దగ్గరకు తిరిగి వస్తారు.
కాని ముందు మీ దేశం నాశనం చేయ బడుతుంది.
దేశాన్ని నాశనం చేస్తానని దేవుడు ప్రకటించాడు. ఆ
తర్వాత దేశానికి మంచి కలుగుతుంది. అది నిండుగా
ప్రవహిస్తున్న నదిలా ఉంటుంది. 23నా ప్రభువు, సర్వ
శక్తిమంతుడైన యెహోవా నిశ్చయంగా ఈ దేశాన్ని
నాశనం చేస్తాడు. 24నా ప్రభువు, సర్వశక్తిమంతుడైన
యెహోవా చెబుతున్నాడు: “సీయోనులో నివసి
స్తున్న నా ప్రజలారా, అష్షూరు గూర్చి భయపడకండి.
గతంలో ఈజిప్టు మిమ్మల్ని కొట్టినట్టు అతడు
మిమ్మల్ని కొడతాడు. మిమ్మల్ని కొట్టడానికి అష్షూరు
బెత్తం ఉపయోగించినట్టు అది ఉంటుంది. 25అయితే
కొంచెం కాలం కాగానే నా కోపం నిలిచిపోతుంది.
అష్షూరు మిమ్మల్ని తగినంతగా శిక్షించిందని నేను
తృప్తి పడతాను.”
26అప్పుడు సర్వశక్తిమంతుడైన యెహోవా కొర
డాతో అష్షూరును కొడతాడు. గతంలో యెహోవా
ఓరేబు బండ దగ్గర మిద్యానును ఓడించాడు.
యెహోవా అష్షూరు మీద దాడి చేసినప్పుడు కూడా
అలాగే ఉంటుంది. గతంలో యెహోవా ఈజిప్టును
శిక్షించాడు. ఆయన సముద్రం మీద కర్ర ఎత్తి, తన
ప్రజలను ఈజిప్టునుండి బయటకు నడిపించాడు.
యెహోవా తన ప్రజలను అష్షూరు నుండి రక్షించి
నప్పుడు కూడ అలాగే ఉంటుంది.
27మీరు మీ భుజాల మీద కాడిపైన మోయాల్సిన
బరువుల్లాంటి కష్టాలు అష్షూరు మీకు కలిగిస్తాడు. కాని
ఆ కాడి మీ మెడమీద నుండి తొలగించ బడుతుంది.
మీ (దేవుడు) బలం చేత ఆ కాడి విరుగగొట్టబడుతుంది.

### అష్షూరు సైన్యం ఇశ్రాయేలును ఆక్రమించుకొంటుంది

28“శిథిలాల” (ఆయాతు) దగ్గర సైన్యం చొరబడు
తుంది. సైన్యం “కళ్లం” (మిగ్రోను) మీద నడచి
పోతుంది. సైన్యం తన ఆహారాన్ని “గిడ్డంగిలో” దాచు
కొంటుంది. 29సైన్యం రేవు దగ్గర (మాబారా) నది
దాటుతుంది. గెబలో సైన్యం నిద్రపోతుంది. రామా
భయపడుతుంది. సౌలు గిబ్యాలో ప్రజలు పారిపోతారు.
30బాత్ గల్లీము గట్టిగా కేకలు వేయి! లాయిషా,
ఆలకించు ! అనాతోతూ, నాకు జవాబు చెప్పు,
31మద్మేనా ప్రజలు పారిపోతున్నారు. గిబాని ప్రజలు
దాక్కుంటున్నారు. 32ఈ రోజే సైన్యం నోబు దగ్గర
నిలుస్తుంది. యెరూషలేము పర్వతంలో సీయోను
కొండకు విరోధంగా యుద్ధం చేయటానికి సైన్యం
సిద్ధం అవుతుంది.

33చూడండి! మన ప్రభువు, సర్వశక్తిమంతుడైన
యెహోవా ఆ మహా వృక్షాన్ని (అష్షూరు) నరికి
వేస్తాడు. యెహోవా తన మహా శక్తితో దీన్ని చేస్తాడు.
గొప్ప వాళ్లు, ప్రముఖులు నరికివేయబడి, ముఖ్యత
లేని వారవుతారు. 34యెహోవా తన గొడ్డలితో
అరణ్యం నరికి వేస్తాడు. లెబానోనులో మహా వృక్షాలు
(ప్రముఖ వ్యక్తులు) పడిపోతాయి.

### సమాధాన ప్రభువు వస్తున్నాడు

11 యెష్షయి మొద్దునుండి (వంశం నుండి) ఒక
చిగురు (శిశువు) పుడుతుంది. యెష్షయి వేరుల
నుండి అంకురం ఎదుగుతుంది. 2ఆ శిశువులో
యెహోవా ఆత్మ ఉంటుంది. జ్ఞానం, అవగాహన,
నడిపింపు, శక్తిని ఆత్మ ఇస్తుంది. ఈ శిశువు యెహో
వాను తెలుసుకొని, ఘనపర్చటానికి ఆత్మ సహాయం
ఉంటుంది. 3ఈ శిశువు యెహోవాను ఘనపరుస్తాడు.
అందువల్ల శిశువు సంతోషంగా ఉంటాడు. ఈ శిశువు
కనబడే వాటిని బట్టి తీర్పు తీర్చడు. అతడు వినే
విషయాలను బట్టి తీర్పు తీర్చడు.
4-5బీదలకు అతడు న్యాయంగా, నిజాయితీగా తీర్పు
చెబుతాడు. దేశంలో పేద ప్రజలకు జరగాల్సిన విష
యాల్లో నిర్ణయాలు చేయాల్సినప్పుడు అతడు
న్యాయంగా ఉంటాడు. ప్రజలు కొట్టబడాలని అతడు
నిర్ణయిస్తే, అప్పుడు అతడు ఆదేశం ఇస్తాడు, ఆ ప్రజలు
కొట్టబడతారు. ఎవరైనా చావాలని అతడు నిర్ణయం
చేస్తే, అప్పుడు అతడు ఆదేశం ఇస్తాడు. ఆ దుష్టులు
చంపబడతారు. మంచితనం, న్యాయం ఈ శిశువుకు
బలం ప్రసాదిస్తాయి. అవి అతడు తన నడుముకు
కట్టుకొనే పట్టాలా ఉంటాయి.
6ఆ సమయంలో తోడేళ్లు గొర్రెపిల్లలతో కలిసి
శాంతిగా జీవిస్తాయి. పెద్ద పులులు మేక పిల్లలతో
కలిసి శాంతంగా పండుకొంటాయి. దూడలు, సింహాలు,
ఎద్దులు కలిసి శాంతిగా జీవిస్తాయి. ఒక చిన్న పిల్లాడు
వాటిని తోల్తాడు. 7ఆవులు, ఎలుగుబంట్లు కలిసి
శాంతిగా జీవిస్తాయి. వాటి పిల్లలన్నీ కలసి పండు
కొంటాయి, ఒక దానిని ఒకటి బాధించవు. సింహాలు,
ఆవుల్లా గడ్డి మేస్తాయి. చివరికి సర్పాలు కూడా మను
ష్యులకు హాని చేయవు. 8ఒక చిన్నబిడ్డ నాగుపాము
పుట్ట దగ్గర ఆడుకొంటుంది. విషసర్పం పుట్టలో ఒక
చిన్న పాప చేయి పెట్టగలుగుతుంది.
9అంతా శాంతిగా ఉంటుందనీ, ఎవరూ ఒకరిని ఒకరు
బాధించుకోరనీ ఈ విషయాలు తెలియ జేస్తున్నాయి.
నా పరిశుద్ధ పర్వతం మీద ప్రజలు దేనినీ నాశనం
చేయాలని ఆశించరు. ఎందుకంటే, ప్రజలు వాస్తవంగా
యెహోవాను తెలుసుకొని ఉంటారు గనుక. సముద్రం
నీళ్లతో నిండిపోయినట్టు, వారు దైవజ్ఞానంతో నిండి
పోయి ఉంటారు.
10ఆ సమయంలో యెష్షయి కుటుంబంలో ఒక
ప్రత్యేక వ్యక్తి ఉంటాడు. ఈ వ్యక్తి ఒక పతాకంలా
ఉంటాడు. రాజ్యాలన్నీ తన చుట్టూ సమావేశం కావాలని
ఈ "పతాకం" చూపిస్తుంది. తాము చేయాల్సిన వాటిని
గూర్చి రాజ్యాలు అతణ్ణి అడుగుతాయి. అతడు ఉండే
స్థలం మహిమతో నిండిపోతుంది.
11ఆ సమయంలో నా ప్రభువు (దేవుడు) మరల
తన చేయిచాచి, మిగిలిన తన ప్రజలను తీసు
కొంటాడు. దేవుడు ఇలా చేయటం రెండోసారి.
(అష్షూరు, ఉత్తర ఈజిప్టు, దక్షిణ ఈజిప్టు, ఇథియో
పియ, ఏలాము, బబులోను, హమాతు ప్రపంచంలోని
దూర దేశాలన్నింటిలో మిగిలి ఉన్న దేవుని ప్రజలు
వీరు.)
12దేవుడు ఈ "పతాకాన్ని" మనుష్యులందరికీ ఒక
సంకేతంగా నిలబెడతాడు. ఇశ్రాయేలు, యూదా ప్రజలు
బలవంతంగా వారి దేశంనుండి వెళ్ల గొట్టబడ్డారు. ఆ
ప్రజలు భూమిమీద దూర దేశాలన్నింటికీ చెదర
గొట్టబడ్డారు. అయితే దేవుడు వాళ్లందరినీ మళ్లీ ఒక
చోట సమావేశపరుస్తాడు.
13ఆ సమయంలో ఎఫ్రాయిము (ఇశ్రాయేలు)
యూదాపై అసూయపడదు. యూదాకు శత్రువులు
ఎవ్వరూ మిగిలి ఉండరు. మరియు యూదా, ఎఫ్రా
యిముకు కష్టం కలిగించదు.
14అయితే ఎఫ్రాయిము, యూదా కలిసి ఫిలిష్తీ
యుల మీద దాడిచేస్తారు. ఈ రెండు రాజ్యాలు భూమి
మీద ఒక చిన్న జంతువును పట్టుకొనేందుకు, కిందగా
ఎగిరే రెండు పక్షుల్లా ఉంటారు. వారిద్దరూ కలిసి తూర్పు
ప్రజల ఐశ్వర్యాలు దోచుకొంటారు. ఎదోము,
మోయాబు, అమ్మోను ప్రజలను ఎఫ్రాయిము,
యూదా తమ ఆధీనంలో ఉంచుకొంటారు.
15యెహోవా కోపగించి ఎర్ర సముద్రాన్ని
పాయలు చేశాడు. అదే విధంగా యూఫ్రటీసు నది
మీద యెహోవా తన చేయి ఊపుతాడు. ఆయన
నదిని కొడ్తాడు. ఆ నది ఏడు చిన్న నదులుగా విభ
జించబడుతుంది. ఆ చిన్న నదులు లోతుగా ఉండవు.
ప్రజలు చెప్పులతోనే ఆ నదులు దాటగలుగుతారు.
16దేవుని శేషజనం అష్షూరును విడిచి వెళ్లటానికి వారికి
దారి ఉంటుంది. అది, ఇశ్రాయేలీయులను దేవుడు
ఈజిప్టు నుండి బయటకు నడిపించినప్పటిలా
ఉంటుంది.

### దేవునికి ఒక స్తుతిపాట

12 ఆ సమయంలో మీరంటారు:
"యెహోవా, నిన్ను నేను స్తుతిస్తున్నాను.
నీకు నామీద కోపం వచ్చింది. కానీ ఇప్పుడు
నామీద కోపగించకుము. నీ ప్రేమ నాకు
చూపించు."

2 దేవుడు నన్ను రక్షిస్తున్నాడు. ఆయన్నే నేను
నమ్ముకొంటాను. నాకేం భయంలేదు. ఆయన
నన్ను రక్షిస్తాడు. యెహోవా, యెహోవాయే
నా బలం.* ఆయన నన్ను రక్షిస్తున్నాడు. నేను
ఆయనకు స్తోత్రగీతాలు పాడుతాను.
3 రక్షణ ఊటల్లో నుండి మీ నీళ్లు తెచ్చు కోండి.
అప్పుడు మీరు సంతోషిస్తారు.
4 "యెహోవాకు స్తోత్రాలు! ఆయన నామం ఆరా
ధించండి! ఆయన చేసిన కార్యాలను గూర్చి
ప్రజలందరితో చెప్పండి" అని అప్పుడు మీరు
అంటారు.
5 యెహోవాను గూర్చిన స్తోత్రగీతాలు పాడండి.
ఎందుకంటే, ఆయన గొప్ప కార్యాలు చేశాడు
గనుక. దేవుని గూర్చిన ఈ వార్త ప్రపంచ
వ్యాప్తంగా ప్రకటించండి. పజలందర్నీ ఈ విష
యాలు తెలుసుకోనివ్వండి.
6 సీయోను ప్రజలారా, ఈ సంగతులను గూర్చి
కేకలు వేయండి. ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు
శక్తివంతంగా మీతో ఉన్నాడు. అందుచేత,
సంతోషంగా ఉండండి!

### బబులోనుకు దేవుని సందేశం

13 బబులోను విషయంలో విచారకరమైన ఈ
సందేశాన్ని ఆమోజు కుమారుడు యెషయాకు
దేవుడు చూపించాడు. 2దేవుడు చెప్పాడు:

"పతాకాన్ని బోడి కొండమీద* ఎగుర వేయండి.
మగ సిపాయిలను పిలువండి. మీ చేతులు
ఊపండి. ప్రముఖుల ద్వారాల్లోంచి ప్రవేశించమని
వారితో చెప్పండి."

3దేవుడు చెప్పాడు:
"వాళ్లను నేను ప్రజల్లో నుండి వేరు చేశాను. నేనే
వాళ్లకు సారథ్యం వహిస్తాను." నేను కోపంగా
ఉన్నాను. ప్రజలను శిక్షించటం కోసం నేను నా
పరాక్రమవంతుల్ని సమావేశపర్చాను. ఆనంద
భరితులైన ఈ మనుష్యులను గూర్చి నేను
గర్విస్తున్నాను.
4 "కొండల్లో పెద్ద శబ్దం అవుతోంది. ఆ శబ్దం
వినండి! అది విస్తారమైన ప్రజల శబ్దంలా ఉంది.
అనేక రాజ్యాల ప్రజలు కూడుకొంటున్నారు.
సర్వశక్తిమంతుడైన యెహోవా తన సైన్యాలను
ఒక్కటిగా చేరుస్తున్నాడు.
5 ఈ సైన్యం, యెహోవా, చాలా దూరదేశం
నుండి వస్తున్నారు. ఆకాశపు అంచుల ఆవలి
నుండి వారు వస్తున్నారు. యెహోవా తన కోపం
ప్రదర్శించటానికి ఈ సైన్యాన్ని ఒక ఆయుధంలా
వాడుకొంటాడు. ఈ సైన్యం దేశం మొత్తాన్ని
నాశనం చేస్తుంది."

6యెహోవా ప్రత్యేక దినం దగ్గర్లో ఉంది. అందు
చేత ఏడ్చి, మీ కోసం దుఃఖపడండి. శత్రువు మీ ఐశ్వ
ర్యాలు దొంగిలించే సమయం వస్తుంది. సర్వశక్తిమంతు
డైన దేవుడు దానిని సంభవింపజేస్తాడు. 7ప్రజలు వారి
ధైర్యం కోల్పోతారు. భయం ప్రజలను బలహీనులను
చేస్తుంది. 8ప్రతి వ్యక్తి భయపడుతూంటాడు. స్త్రీ ప్రసవ
వేదనలా, వారి భయం వారికి కడుపులో బాధ పుట్టి
స్తుంది. వారి ముఖాలు అగ్నిలా ఎర్రగా మారుతాయి.
ఈ భయం చూపులు వారి పొరుగువారందరి ముఖాల
మీద కూడా కనబడతాయి గనుక ప్రజలు ఆశ్చర్య
పడతారు.

### బబులోనుకి విరుద్ధంగా దేవుని తీర్పు

9చూడండి, యెహోవా ప్రత్యేక దినం వచ్చేస్తుంది.
అది చాలా భయంకర దినం. దేవుడు మహా కోపంతో,
దేశాన్ని నాశనం చేస్తాడు. పాపం చేసే వాళ్లందరినీ
దేవుడు దేశంలో నుండి బలవంతంగా వెళ్లగొట్టేస్తాడు.
10ఆకాశాలు చీకటి అవుతాయి. సూర్యుడు, చంద్రుడు,
నక్షత్రాలు ప్రకాశించవు.
11దేవుడు చెబుతున్నాడు, "నేను ప్రపంచానికి కీడు
జరిగిస్తాను. చెడ్డవాళ్ల పాపాన్ని బట్టి వాళ్లను నేను
శిక్షిస్తాను. గర్విష్ఠుల గర్వం పోయేట్టు నేను చేస్తాను.
ఇతరుల యెడల నీచంగా ప్రవర్తించే వారి అతిశయాన్ని
నేను నిలిపివేస్తాను. 12కొద్దిమంది ప్రజలు మాత్రమే
మిగిలి ఉంటారు. బంగారం దొరకటం అరుదులాగే
మనుష్యులు కూడ అరుదుగా కొద్ది మంది మాత్రమే
ఉంటారు. ఈ మనుష్యులు స్వచ్ఛమైన బంగారం కంటె
ఎక్కువ విలువగలిగి ఉంటారు.
13నేను, నా కోపంతో ఆకాశాన్ని వణికిస్తాను. భూమి
స్థానం తప్పుతుంది."
సర్వశక్తిమంతుడైన యెహోవా తన కోపం ప్రద
ర్శించిన రోజున అది జరుగుతుంది.
14అప్పుడు బబులోను ప్రజలు గాయపడిన జింకల్లా
పారిపోతారు. కాపరి లేని గొర్రెల్లా వారు పారిపోతారు.
యుద్ధానికి వచ్చే ప్రతి సైనికుడూ వెనుదిరిగి తన
స్వదేశానికి, స్వజనుల దగ్గరకు పారిపోతాడు.
15అయితే శత్రువు బబులోను ప్రజలను తరుము
తాడు. మరియు శత్రువు ఒక మనిషిని పట్టుకొన్న
ప్పుడు, అతనిని శత్రువు ఖడ్గంతో చంపేస్తాడు. 16వారి
ఇండ్లలో సమస్తం దోచు కోబడుతుంది. వారి భార్యలు

---

**యెహోవా ... బలం** ఇది నిర్గమకాండములోని మోషే విజయ గీతంలోనిది (నిర్గమ. 15:2.)

**కొండమీద** బబులోనుమీద అని కూడా చెప్పవచ్చు.

మానభంగం చేయబడతారు. ప్రజలు చూస్తూ ఉండ
గానే వారి పిల్లలను చచ్చేవరకు కొడతారు.
17దేవుడు చెబుతున్నాడు: “చూడండి, మాదీయ
సైన్యాలు బబులోను మీద దాడి చేసేట్టు నేను
చేస్తాను.” మాదీయ సైన్యాలకు వెండి బంగారాలు
చెల్లించినా సరే, వారు దాడి చేయటం ఆపు చేయరు.
18సైనికులు దాడి చేసి బబులోను యువకులను చంపే
స్తారు. పిల్లల మీద కూడ ఆ సైనికులు జాలి చూపిం
చరు. బాలుర యెడల ఆ సైనికులు దయ చూపించరు.
బబులోను నాశనం చేయబడుతుంది. అది సొదొమ
గొమొర్రాల సర్వనాశనంలా ఉంటుంది. దేవుడు ఈ
వినాశం కలుగజేస్తాడు, అక్కడ ఏమీ మిగిలి ఉండదు.
19“రాజ్యాలన్నింటిలో బబులోను చాలా అందమ
యింది. బబులోను ప్రజలకు వారి పట్టణం గూర్చి
చాలా అతిశయం. 20కానీ బబులోను అందంగా ఇక
ఉండదు. భవిష్యత్తులో ప్రజలు యికమీదట అక్కడ
నివసించరు. అరబ్బులు అక్కడ వారి గుడారాలు
వేయరు. గొర్రెలను అక్కడ మేపేందుకు కాపరులు
వాటిని అక్కడికి తీసుకొనిరారు. 21అక్కడ నివసించే
జంతువులు అడవి మృగాలు మాత్రమే. ప్రజలు బబు
లోనులోని ఇండ్లలో నివసించరు. ఆ ఇండ్ల నిండా
గుడ్లగూబలు, పెద్ద పక్షులు ఉంటాయి. అడవి మేక
పోతులు ఆ ఇండ్లలో ఆడుతూంటాయి. 22బబులో
నులోని అందమైన గొప్ప భవనాలలో అడవి కుక్కలు,
తోడేళ్లు మొరుగుతూ ఉంటాయి. బబులోను అంతం
అయిపోతుంది. బబులోను అంతం దగ్గర్లో ఉంది.
బబులోను నాశనాన్ని తర్వాత వరకు వేచి ఉండ
నివ్వను.”

### ఇశ్రాయేలు తిరిగి వస్తుంది?

14 భవిష్యత్తులో యెహోవా, తన ప్రేమను
యాకోబుకు మరల చూపిస్తాడు. ఇశ్రాయేలీ
యులను యెహోవా మరల ఏర్పాటు చేసికొంటాడు.
ఆ సమయంలో యెహోవా ఆ ప్రజలకు వారి దేశాన్ని
ఇస్తాడు. అప్పుడు యూదులు కాని వారు, యూదా
ప్రజల్లో చేరిపోతారు. ఈ ఇద్దరూ ఒకటిగా యాకోబు
వంశం అవుతారు. 2ఆ రాజ్యాలు ఇశ్రాయేలు ప్రజలను
ఇశ్రాయేలు దేశంలో చేర్చుకుంటారు. ఇతర రాజ్యాలకు
చెందిన ఆ స్త్రీ పురుషులు ఇశ్రాయేలుకు బానిసలు
అవుతారు. గతంలో ఆ ప్రజలే ఇశ్రాయేలు ప్రజలను
తమకు బానిసలుగా చేసుకొన్నారు. కాని ఈ సమ
యంలో ఇశ్రాయేలు ప్రజలు ఆ రాజ్యాలను ఓడించి,
వారి మీద ఏలుబడి చేస్తారు. 3యెహోవా మీ కష్టమైన
పని తీసివేసి, మిమ్మల్ని ఆదరిస్తాడు. గతంలో మీరు
బానిసలు. ప్రతి కష్టమైన పనినీ మనుష్యులు మీతో
బలవంతంగా చేయించారు. అయితే యెహోవా మీకు
ఈ కష్టతరమైన పనిని అంతం చేస్తాడు.

### బబులోను రాజు గురించి ఒక గీతం

4 ఆ సమయంలో, బబులోను రాజును గూర్చి
మీరు ఈ పాట పాడటం మొదలు పెడ్తారు. ఆ
రాజు మమ్మల్ని పాలించినప్పుడు నీచంగా
ఉన్నాడు. కానీ ఇప్పుడు అతని పాలన అయి
పోయింది.
5 చెడ్డ పాలకుల దండాన్ని యెహోవా విరుగగొడ
తాడు. వారి అధికారాన్ని యెహోవా తొలగించి
వేస్తాడు.
6 బబులోను రాజు కోపంతో ప్రజలను కొట్టాడు
దుష్టుడైన ఆ పాలకుడు ప్రజలను కొట్టడం
మానలేదు దుష్టుడైన ఆ పాలకుడు కోపంతో
ప్రజలను పాలించాడు. ప్రజలకు కీడు చేయటం
అతడు ఎన్నడూ ఆపు జేయలేదు.
7 అయితే ఇప్పుడు దేశం మొత్తం విశ్రాంతి తీసు
కొంటూంది. దేశం నెమ్మదిగా ఉంది. ప్రజలు
ఇప్పుడు ఉత్సవం చేసుకోవటం మొదలు
బెడుతున్నారు.
8 నీవు ఒక దుష్ట రాజువు కానీ ఇప్పుడు నీ పని
అయిపోయింది. చివరికి తమాల వృక్షాలు కూడా
సంతోషిస్తున్నాయి. లెబానోను దేవదారు
వృక్షాలు కూడా సంతోషిస్తున్నాయి. ఆ చెట్లు
అంటున్నాయి, “రాజు మమ్మల్ని నరికి వేశాడు.
కానీ ఇప్పుడు రాజే పడిపోయాడు. అతడు మళ్లీ
ఎన్నటికీ నిలబడడు.”
9 నీవు వస్తున్నందుకు, మరణ స్థానమైన పాతాళం
హర్షిస్తుంది. భూలోక నాయకులందరి ఆత్మ
లనూ పాతాళం నీ కోసం మేల్కొలుపుతుంది.
పాతాళం, రాజులను వారి సింహాసనాల మీద
నుండి లేపి నిలబెడుతుంది. నీ రాకకు వారు
సిద్ధంగా ఉంటారు.
10 ఈ నాయకులంతా నిన్ను హేళన చేస్తారు.
“ఇప్పుడు నీవు కూడా మాలాగే చచ్చిన శవానివి.
ఇప్పుడు నీవూ మాలాగే ఉన్నావు.” అని
వారంటారు.
11 నీ గర్వం పాతాళానికి పంపబడింది. నీ సితారాల
సంగీతం, నీ గర్విష్ఠి ఆత్మ రాకను ప్రకటిస్తు
న్నాయి. కీటకాలు నీ శరీరాన్ని తినివేస్తాయి.
వాటి మీద నీవు పరుపులా పడి ఉంటావు.
పురుగులు దుప్పటిలా నీ శరీరాన్ని కప్పేస్తాయి.
12 ఓ ప్రకాశవంతమైన నక్షత్రమా! ఉదయ పుత్రా!
నీవు ఆకాశం నుండి ఎలా పడిపోయావు.? జనాం
గాన్ని పతనం చేసే నీవు భూమి మీదికి ఎలా
నరికి వేయబడ్డావు.
13 నీలో నీవు ఎల్లప్పుడూ ఇలా చెప్పు కొన్నావు:
“సర్వోన్నతుడైన దేవునిలా నేనూ ఉంటాను.

పైన ఆకాశాల్లోకి నేను వెళ్లిపోతాను. నేను, నా
సింహాసనాన్ని దేవుని నక్షత్రాలకంటె పైకి హెచ్చి
స్తాను. పరిశుద్ధ సభా పర్వతం మీద నేను కూర్చుం
టాను. దాగియున్న ఆ కొండ మీద దేవుళ్లను
నేను కలుసుకొంటాను.
14 మేఘాల మీద నేను బలిపీఠం దగ్గరకు వెళ్తాను.
నేను, మహోన్నతుడైన దేవు నిలా ఉంటాను."
15 కానీ అది జరుగలేదు. నీవు దేవునితో ఆకాశం
లోనికి వెళ్లలేదు. అగాధపు గోతి లోనికి పాతాళా
నికి నీవు కిందికి తీసుకొని రాబడ్డావు.
16 ప్రజలు నిన్ను చూచి, నీ విషయం ఆలోచిస్తారు.
నీవు కేవలం చచ్చిన శవం మాత్రమేనని ప్రజలు
గమనిస్తారు. ప్రజలు అంటారు, "భూలోక రాజ్యా
లన్నింటిలో భయం పుట్టించినవాడు ఇతడేనా?
17 పట్టణాలను నాశనం చేసినవాడు ఇతడేనా?
దేశాన్ని ఎడారిగా మార్చినవాడు ఇతడేనా?
యుద్ధంలో మనుష్యుల్ని బంధించి, వారిని
ఇంటికి వెళ్లనీయనివాడు ఇతడేనా?"
18 భూమిమీద ప్రతి రాజూ ఘనంగా మరణించాడు.
ప్రతి రాజుకూ స్వంత సమాధి ఉంది.
19 అయితే నీవు, దుష్ట చక్రవర్తివి నీ సమాధిలో
నుండి తోసి వేయబడ్డావు. నరకబడిన చెట్టు
కొమ్మలా నీవున్నావు. ఆ కొమ్మ నరకబడి, పార
వేయబడింది. నీవు యుద్ధంలో చచ్చిపడిన
వానిలా ఉన్నావు. మిగతా సైనికులు వాని మీద
నడిచారు. ఇప్పుడు చచ్చిన ఇతరుల్లాగే ఉన్నావు.
నీవు చావు గుడ్డల్లో చుట్టబడ్డావు.
20 ఇంకా ఎంతో మంది రాజులు చనిపోయారు.
వారందరికీ వారి సమాధులు ఉన్నాయి. కానీ
నీవు వాళ్లను చేరవు. ఎందుకంటే, నీవు నీ స్వంత
దేశాన్ని నాశనం చేశావు గనుక నీ స్వంత ప్రజల్నే
నీవు చంపేశావు. నీవు చేసినట్టు నీ పిల్లలు నాశనం
చేయటం కొనసాగించరు. నీ పిల్లలు ఆపుజేయ
బడతారు.
21 అతని పిల్లలను చంపటానికి సిద్ధపడండి. వారి
తండ్రి దోషి గనుక వాళ్లను చంపండి. అతని
పిల్లలు మళ్లీ ఎన్నటికీ ఆ దేశాన్ని స్వాధీనం
చేసుకోరు. అతని పిల్లలు మళ్లీ ఎన్నటికీ
ప్రపంచాన్ని తమ పట్టణాలతో నింపరు.

22"నేను నిలబడి ఆ ప్రజలకు విరోధంగా యుద్ధం
చేస్తాను. ప్రఖ్యాత బబులోను పట్టణాన్ని నేను నాశనం
చేస్తాను. బబులోను ప్రజలందరినీ నేను నాశనం
చేస్తాను. వారి పిల్లలను, మనుమళ్లను, మునిమను
మళ్లను నేను నాశనం చేస్తాను" అని సర్వశక్తిమంతుడైన
యెహోవా చెప్పాడు. యెహోవా తానే ఆ విష
యాలు చెప్పాడు. 23బబులోనును నేను మార్చేస్తాను.
ఆ స్థలం మనుష్యుల కోసం కాదు, జంతువుల కోసమే.
ఆ స్థలం నీటి మడుగు అవుతుంది. బబులోనును
తుడిచి వేయటానికి 'నాశనం అనే చీపురును' నేను
ప్రయోగిస్తాను" అని యెహోవా చెప్పాడు. సర్వశక్తి
మంతుడైన యెహోవా ఆ సంగతులు చెప్పాడు.

### దేవుడు అష్షూరును కూడా శిక్షిస్తాడు

24సర్వశక్తిమంతుడైన యెహోవా ఒక ప్రమాణం
చేశాడు. యెహోవా చెప్పాడు, "సరిగ్గా నేను తలచినట్టే
ఈ సంగతులు జరుగుతాయని నేను ప్రమాణం చేస్తు
న్నాను. ఈ విషయాలు సరిగ్గా నా పథకం ప్రకారమే
జరుగుతాయి. 25అష్షూరు రాజును నేను నా దేశంలో
నాశనం చేస్తాను. నా కొండలపై నేను ఆ రాజు మీద
నడుస్తాను. ఆ రాజు నా ప్రజలను తనకు బానిసలుగా
చేశాడు. వారి మెడల మీద అతడు ఒక కాడిపెట్టాడు.
యూదా మెడమీద నుండి ఆ కాడి తొలగించి వేయ
బడుతుంది. ఆ భారం తొలగించబడుతుంది. 26నేను
నా ప్రజల కోసం చేయాలనీ ఉద్దేశించిన సంగతి అది.
రాజ్యాలన్నింటినీ శిక్షించటానికి నేను నా చేతి బలం
ప్రయోగిస్తాను."

27యెహోవా ఒక పథకం వేసినప్పుడు ఆ పథకాన్ని
ఎవ్వరూ అడ్డగించలేరు. ప్రజలను శిక్షించేందుకు
యెహోవా తన చేయి పైకెత్తినప్పుడు, దానిని
ఎవ్వరూ అడ్డగించలేరు.

### ఫిలిష్తీయులకు దేవుని సందేశం

28విచారకరమైన ఈ సందేశం ఆహాజు రాజు చని
పోయిన సంవత్సరం ఇవ్వబడింది.

29ఓ ఫిలిష్తీ దేశమా, నిన్ను కొట్టే రాజు చనిపో
యాడని నీవు సంతోషిస్తున్నావు. కానీ నీవు నిజంగా
సంతోషపడకు. అతని పరిపాలన అంతమయిపో
యింది, నిజమే. కానీ రాజు కుమారుడు వస్తాడు. పరి
పాలిస్తాడు. అది ఒక సర్పం తనకంటె మరింత ఎక్కువ
ప్రమాదకరమైన సర్పానికి జన్మ ఇచ్చినట్టు ఉంటుంది.
30కానీ నా దీన ప్రజలు మాత్రం క్షేమంగా భోజనం
చేయగలుగుతారు. వారి పిల్లలు క్షేమంగా ఉంటారు.
మీ దీనప్రజలు పండుకొని, క్షేమంగా ఉంటారు. కానీ
నేను మీ కుటుంబాన్ని ఆకలితో చంపేస్తాను. మిగిలిన
మీ ప్రజలంతా చనిపోతారు. 31పట్టణ ద్వారం దగ్గర
ఉండే ప్రజలారా కేక వేయండి.

పట్టణ ప్రజలారా, గట్టిగా కేకలు వేయండి. ఫిలిష్తి
యాలోని ప్రజలారా, మీరు భయపడతారు. మీ ధైర్యం
వేడి మైనంలా కరిగిపోతుంది. ఉత్తరంగా చూడండి.
అక్కడ ధూళి మేఘం ఉంది. అష్షూరు నుండి ఒక
సైన్యం వస్తోంది. ఆ సైన్యంలో మనుష్యులంతా
బలంగా ఉన్నారు.

[32] ఆ సైన్యం, వారి దేశానికి సందేశం తీసుకువెళ్లే
వారిని పంపుతుంది. ఆ సందేశకులు వారి ప్రజలకు
ఏమని చెబుతారు? ఫిలిష్తియా ఓడిపోయింది. అని
వారు ప్రకటిస్తారు. కానీ సీయోనును యెహోవా బల
పర్చాడు. ఆయన దీన ప్రజలు భద్రత కోసం అక్కడికి
వెళ్లారు.

### మోయాబుకు దేవుని సందేశం

15 ఇది మోయాబును గూర్చి విచారకరమైన
సందేశం:
ఒక రాత్రి ఆర్మోయాబు నుండి ఐశ్వర్యాలను
సైన్యం దోచుకొంది. ఆ రాత్రి పట్టణం నాశనం
చేయబడింది. ఒక రాత్రి కిర్మోయాబు నుండి
ఐశ్వర్యాలను సైన్యం దోచుకొంది. ఆ రాత్రే
పట్టణం నాశనం చేయబడింది.
2 రాజ కుటుంబం, దీబోను ప్రజలు ఉన్నతమైన
పూజాస్థలాల్లో మొరపెట్టేందుకు వెళ్తున్నారు.
నెబో కోసం, మేదెబా కోసం మోయాబు ప్రజలు
మొరపెడ్తున్నారు. ప్రజలంతా వారి విచారం వ్యక్తం
చేయటానికి తలలు బోడిగుండ్లు చేసుకొన్నారు.
3 మోయాబు అంతటా ఇంటి కప్పుల మీద,
వీధుల్లో ప్రజలు నల్ల బట్టలు ధరిస్తున్నారు.
ప్రజలు ఏడుస్తున్నారు.
4 హెష్బోను, ఏలాలేయు పట్టణాల ప్రజలు చాలా
గట్టిగా ఏడుస్తున్నారు. చాలా దూరంలో ఉన్న
యహసు పట్టణంలో మీరు వారి ఏడ్పులు విన
వచ్చును. చివరికి సైనికులు కూడా భయపడు
తున్నారు. సైనికులు భయంతో వణకు
చున్నారు.
5 మోయాబు విషయంలో దుఃఖంతో నా
హృదయం ఘోషిస్తుంది. ప్రజలు భద్రత కోసం
పారిపోతున్నారు. దూరంలో ఉన్న సోయరుకు
వారు పారిపోతున్నారు. ఎగ్లాతు షెలిషియాకు
వారు పారిపోతున్నారు. ప్రజలు కొండ మార్గంగా
లూహీతుకు వెళ్తున్నారు. ప్రజలు ఏడుస్తున్నారు.
ప్రజలు హొరొనయీము మార్గంలో వెళ్తున్నారు.
ప్రజలు చాలా గట్టిగా విలపిస్తున్నారు.
6 కానీ నిమ్రీము యేరు ఎడారిలా ఎండిపోయింది.
మొక్కలన్నీ చచ్చాయి. ఏదీ పచ్చగా లేదు.
7 అందుచేత ప్రజలు వారి స్వంత సామగ్రి సర్దుకొని
మోయాబు విడిచిపెడ్తున్నారు. వారు ఆ సామగ్రి
మోస్తూ నిరవంజి చెట్ల నది దగ్గర సరిహద్దు
దాటుతున్నారు.
8 ఏడ్వటం మోయాబు అంతటా వినబడు తుంది.
చాలా దూరంలో ఉన్న ఎగ్లయీము పట్టణంలో
ప్రజలు ఏడుస్తున్నారు. బెయేరేలీము పట్టణంలో
ప్రజలు ఏడుస్తున్నారు.
9 దీమోను పట్టణపు నీళ్లు పూర్తిగా రక్తమయం అయి
పోయాయి. మరియు నేను (యెహోవాను)
దీమోనుకు ఇంకా ఎక్కువ కష్టాలు కలిగిస్తాను.
మోయాబులో నివసిస్తున్న కొద్దిమంది శత్రువు
నుండి తప్పించుకొన్నారు. కానీ ఆ ప్రజలను
తిని వేయటానికి నేను సింహాలను పంపిస్తాను.

16 ఆ దేశపు రాజుకు మీరు ఒక కానుక పంపాలి.
సెలానుండి అరణ్యంగుండా సీయోను కుమార్తె
కొండకు (యెరూషలేము) మీరు ఒక గొర్రెపిల్లను
పంపాలి.

2 మోయాబు స్త్రీలు అర్నోను నది దాటేందుకు
ప్రయత్నిస్తారు. సహాయం కోసం వారు ఒకచోట
నుండి మరోచోటుకు పరుగులెత్తుతారు. వారు,
గూడు నేల కూలినప్పుడు తప్పిపోయిన చిన్న
పిట్ట పిల్లలా ఉంటారు.
3 "మాకు సహాయం చేయండి, మేం ఏం చేయాలో
మాకు చెప్పండి! మధ్యాహ్నపు ఎండనుండి నీడ
కాపాడినట్టు మా శత్రువుల నుండి మమ్మల్ని
కాపాడండి. మా శత్రువుల నుండి మేం పారి
పోతున్నాం మమ్మల్ని దాచిపెట్టండి. మమ్మల్ని
మా శత్రువులకు అప్పగించకండి' అని
వారంటారు.
4 ఆ మోయాబు ప్రజలు వారి ఇండ్లనుండి బల
వంతంగా వెళ్లగొట్టబడ్డారు. కనుక వాళ్లను మీ
దేశంలో నివాసం ఉండనియ్యండి. వారి శత్రువుల
నుండి వారిని కాపాడండి. దోచుకోవటం ఆగిపో
తుంది. శత్రువు ఓడించబడతాడు. ఇతరులను
బాధించే పురుషులు దేశం నుండి వెళ్లిపోతారు.
5 అప్పుడు కొత్త రాజు వస్తాడు. ఈ రాజు దావీదు
వంశంవాడు. ఆయన నిజాయితీ పరుడు. ఆయన
ప్రేమ, దయగలవాడు. ఈ రాజు న్యాయంగా
తీర్పు తీరుస్తాడు. సరియైనవి, మంచివి ఆయన
చేస్తాడు.

[6]మోయాబు ప్రజలు చాలా గర్విష్ఠులని, మోసగాళ్లని
మేము విన్నాం. ఈ ప్రజలు తిరుగు బాటు దారులు,
గర్విష్ఠులు. అయితే వారి గొప్పలన్నీ వట్టి మాటలే.
[7]ఆ గర్వం చేత మొత్తం మోయాబు దేశం శ్రమ
అనుభవిస్తుంది. మోయాబు ప్రజలంతా ఏడుస్తారు.
ప్రజలు విచారిస్తారు. గతంలో వారికి ఉన్నవన్నీ మళ్లీ
కావాలనుకొంటారు. కీర్హరెశెతు ద్రాక్షపండ్ల అడలు
కావాలని వారు కోరుకొంటారు. [8]హెష్బోను పొలాలు,
సిబ్మా ద్రాక్ష వల్లులు, ద్రాక్ష పండ్లు ఫలించటం లేదని
ప్రజలు విచారంగా ఉంటారు. విదేశీ పాలకులు ద్రాక్ష
వల్లులను నరికివేశారు. శత్రుసైన్యాలు యాజరు

పట్టణం వరకు చాలా దూరం, అరణ్యంలోనికి విస్త
రించారు. సముద్రం వరకు వారు విస్తరించారు.

### మోయాబును గూర్చి విషాద గీతం

9 "ద్రాక్ష పండ్లు నాశనం చేయబడ్డాయి. కనుక
యాజరు, సిబ్మా ప్రజలతోబాటు నేనూ
ఏడుస్తాను. పంట ఉండదు గనుక హెష్బోను,
ఏలాలే ప్రజలతోబాటు నేనూ ఏడుస్తాను. వేసవి
పండ్లు ఏమీ ఉండవు. సంతోషపు కేకలు అక్కడ
ఉండవు.
10 కర్మెలులో పాటలు పాడటం మరియు
సంతోషం ఉండదు. పంట కోత సమయంలో
సంతోషం అంతా నేను నిలిపివేస్తాను. ద్రాక్షపండ్లు
ద్రాక్షరసం అయ్యేందుకు సిద్ధంగా ఉన్నాయి.
కానీ అవన్నీ వ్యర్థం అవుతాయి.
11 అందుచేత మోయాబు గూర్చి నాకు చాలా
విచారం కీర్హరెశు గూర్చి నాకు చాలా విచారం
ఈ పట్టణాల గూర్చి నాకు ఎంతెంతో దుఃఖం.
12 మోయాబు ప్రజలు ఎత్తయిన వారి పూజా
స్థలాలకు వెళ్తారు. ప్రజలు ప్రార్థించాలని ప్రయ
త్నిస్తారు. కానీ సంభవించిన సంగతులన్నీ వారు
చూస్తారు, ప్రార్థించలేనంత బలహీనుల
వుతారు."

13 మోయాబును గూర్చి ఈ విషయాలు
యెహోవా ఎన్నోసార్లు చెప్పాడు. 14 ఇప్పుడు
"మూడు సంవత్సరాల్లో (కూలీ వాని కాలం లెక్క
ప్రకారం) ఆ ప్రజలందరూ ఉండరు, వారికి అతిశయా
స్పదమైనవన్నీ పోతాయి. కొంత మంది మనుష్యులు
మిగిలి ఉంటారు. కానీ వారు ఎక్కువ మంది ఉండరు"
అని యెహోవా చెబుతున్నాడు.

### సిరియాకు దేవుని సందేశం

17 ఇది దమస్కుకు విచారకరమైన సందేశం.
దమస్కుకు ఈ సంగతులు సంభవిస్తాయని
యెహోవా సెలవిస్తున్నాడు:

"దమస్కు ఇప్పుడు పట్టణం కానీ దమస్కు
నాశనం చేయబడుతుంది. దమస్కులో శిథిలాలు
మాత్రమే మిగుల్తాయి.
2 ప్రజలు అరోయేరు పట్టణాలు విడిచి పెట్టేస్తారు.
ఆ ఖాళీ పట్టణాల్లో గొర్రెల మందలు విచ్చల
విడిగా తిరుగుతాయి. వాటిని పట్టించుకొనే వాడు
ఎవ్వడూ ఉండడు.
3 ఎఫ్రాయిము ప్రాకార పట్టణాలు (ఇశ్రా యేలు)
నాశనం చేయబడతాయి. దమస్కులో
ప్రభుత్వం అంతమవుతుంది. ఇశ్రాయేలుకు
సంభవించినదే సిరియాకు సంభవిస్తుంది. ప్రము
ఖులంతా తీసుకొని పోబడతారు." ఆ సంగతులు
జరుగుతాయని సర్వశక్తిమంతుడైన యెహోవా
చెప్పాడు.
4 ఆ సమయంలో యాకోబు (ఇశ్రాయేలు)
ఐశ్వర్యం అంతాపోతుంది. వ్యాధి మూలంగా
చాలా బరువు తగ్గిపోయినమనిషిలా యాకోబు
ఉంటాడు.

5 ఆ సమయం రెఫాయీము లోయలో ధాన్యపు
కోతలా ఉంటుంది. పొలంలో పెరిగిన మొక్కలను
పనివాళ్లు ఒక చోట వేస్తారు. తర్వాత మొక్కల నుండి
గింజలను వారు కోస్తారు. ధాన్యం వారు కుప్పవేస్తారు.
6 ఆ సమయం, ప్రజలు ఒలీవ పండ్లు కోసే
సమయంలా ఉంటుంది. ప్రజలు ఒలీవ చెట్లనుండి
ఒలీవ పండ్లు రాల్చుతారు. అయితే సాధారణంగా చెట్ల
కొమ్మలకు కొన్ని ఒలీవ పండ్లు మిగిలిపోతాయి. కొన్ని
పై కొమ్మలకు నాలుగైదు ఒలీవ పండ్లు మిగిలి
పోతాయి. ఆ పట్టణాలకు గూడ అలానే ఉంటుంది.
సర్వశక్తిమంతుడైన యెహోవా ఆ సంగతులు
చెప్పాడు.
7 ఆ సమయంలో ప్రజలు వారిని చేసిన దేవునివైపు
చూస్తారు. వారి కన్నులు ఇశ్రాయేలీయుల పరిశుద్ధుని
చూస్తాయి. 8 ప్రజలు, వారు చేసిన గొప్ప వాటిని
నమ్ముకోరు. అబద్ధపు దేవుళ్ల కోసం వారు తయారు
చేసిన ప్రత్యేక తోటలకు, బలిపీఠాలకు వారు వెళ్లరు.
9 ఆ కాలంలో కోటలుగల పట్టణాలన్నీ ఖాళీగా
ఉంటాయి. ఆ పట్టణాలు, ఆ దేశానికి ఇశ్రాయేలు
ప్రజలు రాకముందు ఉన్న కొండలు, అడవుల్లా
ఉంటాయి. గతంలో ఇశ్రాయేలు ప్రజలు వస్తున్నారంటే
ప్రజలంతా పారిపోయేవారు. భవిష్యత్తులో దేశం మళ్లీ
ఖాళీగా ఉంటుంది. 10 మిమ్మల్ని రక్షించే దేవుణ్ణి మీరు
మరచిపోయారు గనుక ఇలా జరుగుతుంది. దేవుడే
మీ భద్రతా స్థానం అని మీరు జ్ఞాపకం ఉంచుకోలేదు.
చాలా దూర స్థలాల నుండి మీరు కొన్ని మంచి
ద్రాక్షా వల్లులను తెచ్చి నాటవచ్చును గాని ఆ మొక్కలు
ఎదగవు. 11 ఒకనాడు మీరు మీ ద్రాక్ష వల్లులను నాటి,
వాటిని పెంచటానికి ప్రయత్నం చేస్తారు. మర్నాడు
మొక్కలు పెరగటం మొదలవుతుంది. అయితే కోత
కాలంలో మొక్కల నుండి పండ్లు కోయటానికి మీరు
వెళ్తారు గాని అవి మొత్తం చచ్చి ఉండటం మీరు
చూస్తారు. ఆ మొక్కలన్నింటినీ ఒక రోగం చంపే
స్తుంది.

12 ఎంతెంతో మంది ప్రజలు చెప్పేది విను.
సముద్రఘోషలా వారు గట్టిగా ఏడుస్తున్నారు.
ఆ ఘోష విను. ఆ ఏడుపు సముద్రపు ఘోషలా
ఉంది. సముద్రంలో అలలూ అలలూ ఢీకొన్న
ఘోషలా ఉంది.

13 ప్రజలు ఆ అలల్లా ఉంటారు. దేవుడు ఆ ప్రజలతో
కఠినంగా మాట్లాడతాడు. వారు పారిపోతారు.
ప్రజలు గాలికి కొట్టుకొని పొయ్యే పొట్టులా
ఉంటారు. ప్రజలు తుఫానుకు కొట్టుకొని
పొయ్యే కలుపు మొక్కల్లా ఉంటారు. గాలి విసురు
తుంది కలుపు కొట్టుకొని పోతుంది.
14 ఆ రాత్రి ప్రజలు చాలా భయంగా ఉంటారు.
తెల్లవారే సరికి ఏమీ మిగలదు. కనుక మన శత్రువు
లకు ఏమీ లభించదు. వారు మన దేశం వస్తారు.
కానీ అక్కడ ఏమీ ఉండదు.

### ఇథియోపియాకు దేవుని సందేశం

18 ఇథియోపియా నదుల తీరంలో దేశాన్ని
చూడు. దేశం కీటకాలతో నిండిపోయింది.
నీవు వాటి రెక్కల పటపట శబ్దం వినవచ్చు. 2ఆ
దేశం సముద్రం మీద జమ్ము పడవల్లో మనుష్యులను
ఆవలికి పంపిస్తుంది.
వేగంగా పోయే సందేశహరులు, ఎత్తుగా బలంగా
ఉండే మనుష్యుల దగ్గరకు వెళ్తారు. (ఎత్తుగా బలంగా
ఉండే ఈ మనుష్యులంటే అన్ని చోట్ల ప్రజలకు
భయం. వారు బలంగల రాజ్యం. వారి రాజ్యం ఇతర
రాజ్యాలను జయిస్తుంది. నదుల మూలంగా విభజించ
బడిన దేశంలో వారు ఉన్నారు). 3వారికి ఏదో కీడు
జరుగుతుంది అని ఆ ప్రజలకు హెచ్చరిక చేయి. ఆ
రాజ్యానికి ఈ సంగతి సంభవించటం ప్రపంచంలోని
ప్రజలంతా చూస్తారు. ఒక కొండ మీద ఎగురవేసిన
పతాకంలా ప్రజలు ఈ విషయాన్ని తేటగా చూస్తారు.
ఎత్తయిన ఈ మనుష్యులకు సంభవించే ఆ సంగతిని
గూర్చి భూలోకంలో జీవించే ప్రజలంతా వింటారు.
యుద్ధానికి ముందు ఊదే శంఖంలా వారు దీనిని తేటగా
వింటారు. 4యెహోవా చెప్పాడు: "నా కోసం సిద్ధం
చేయ బడిన స్థలంలో నేను ఉంటాను. ఈ సంగతులు
సంభ వించటం నేను మౌనంగా చూస్తాను. 5అందమైన
ఒక వేసవి రోజు, మధ్యాహ్నం ప్రజలు విశ్రాంతి తీసు
కొంటూ ఉంటారు. (అది వర్షాలు లేని ఎండాకాలపు
కోత సమయం, ఉదయపు మంచు మాత్రమే
ఉంటుంది) అప్పుడు ఏదో జరుగుతుంది. అది
పూవులు వికసించిన తరువాత సమయం క్రొత్త
ద్రాక్షలు మొగ్గ తొడిగి, పెరుగుతూ ఉంటాయి. అయితే
కోతకు ముందు శత్రువు వచ్చి, మొక్కలు నరికేస్తాడు.
శత్రువు ద్రాక్షలను చితుకగొట్టి, పారవేస్తాడు. 6కొండ
పక్షులు, అడవి జంతువులు తినటానికి ఆ ద్రాక్ష తీగలు
విడిచిపెట్టబడతాయి. వేసవిలో ఆ ద్రాక్షతీగల మీద
పక్షులు నివాసం ఉంటాయి. ఆ చలికాలం అడవి జంతు
వులు ఆ ద్రాక్షతీగలను తింటాయి."
7ఆ కాలంలో, సర్వశక్తిమంతుడైన యెహోవాకు
ఒక అర్పణ తీసుకొని రాబడుతుంది. ఎత్తుగా బలంగా
ఉండే ఆ ప్రజల దగ్గర్నుండే ఆ కానుక వస్తుంది.
(ఎత్తుగా, బలంగా ఉండే ఈ ప్రజలంటే అన్ని చోట్ల
మనుష్యులందరికీ భయమే. వారు చాలా బలమైన
రాజ్యం. వారి రాజ్యం ఇతర రాజ్యాలను ఓడిస్తుంది.
నదులచే విభజించబడిన దేశంలో వారు ఉన్నారు.)
ఈ కానుక, సీయోను కొండలోని యెహోవా స్థానానికి
తీసుకొని రాబడుతుంది.

### ఈజిప్టుకు దేవుని సందేశం ఈజిప్టును గూర్చిన విచారకరమైన సందేశం

19 చూడండి! వేగంగా పోయే మేఘం మీద
యెహోవా వస్తున్నాడు. యెహోవా ఈజి
ప్టులో ప్రవేశిస్తాడు, అప్పుడు ఈజిప్టు అబద్ధ దేవుళ్లంతా
భయంతో వణికిపోతారు. ఈజిప్టు ధైర్యంగలది కానీ
ఆ ధైర్యం వేడి మైనంలా కరగిపోతుంది.
2దేవుడు చెబుతున్నాడు: "ఈజిప్టు ప్రజలు వారికి
వారే విరోధంగా పోరాడుకొనేట్టు నేను చేస్తాను. మను
ష్యులు వారి సోదరులతో పోరాడుతారు. పొరుగువారు
పొరుగువారికి విరోధం అవుతారు. పట్టణాలు పట్టణా
లకు విరోధం అవుతాయి. రాష్ట్రాలు రాష్ట్రాలకు
విరోధం అవుతాయి. 3ఈజిప్టు ప్రజలు గందరగోళ
పడిపోతారు. వారు చేయాల్సింది ఏమిటి అని ప్రజలు
వారి అబద్ధ దేవుళ్లను, జ్ఞానులను అడుగుతారు. ప్రజలు
వారి మాంత్రికులను, భూత వైద్యులను అడుగుతారు.
కానీ వారి సలహా నిష్ప్రయోజనం."
4సర్వశక్తిమంతుడైన యెహోవా, ప్రభువు చెబుతు
న్నాడు, "నేను (దేవుణ్ణి) ఈజిప్టును కఠినమైన యజ
మానికి అప్పగిస్తాను. శక్తిగల ఒక రాజు ప్రజలను పాలి
స్తాడు. 5నైలునది ఎండిపోతుంది. 6నదులన్నీ చెడ్డ
కంపు కొడ్తాయి. ఈజిప్టులో కాలువలు ఎండిపోయి,
నీరు ఉండకుండా పోతుంది. నీటి మొక్కలు అన్నీ
కుళ్లిపోతాయి.
7నదీ తీరాల్లోని మొక్కలన్నీ ఎండిపోయి, కొట్టు
కొని పోతాయి. నది మహా విశాలంగా ఉన్న చోట
గూడా మొక్కలు చస్తాయి.
8"నైలునదిలో చేపలుపట్టే జాలరులు అందరూ
దుఃఖపడి ఏడుస్తారు. వారు తమ ఆహారంకోసం నైలు
నదిమీద ఆధారపడతారు. కానీ అది ఎండిపోతుంది.
9బట్టలు తయారు చేసే వాళ్లంతా చాలా దుఃఖపడతారు.
పీచువస్త్రాలు తయారు చేయటానికి ప్రజలకు పీచు
కావాలి. కానీ నది ఎండిపోయి ఈ పీచు మొక్కలు
పెరగవు.
10నీళ్లు నిల్వ చేసేందుకు ఆనకట్టలు కట్టే వారికి
పని ఉండదు గనుక దుఃఖంగా ఉంటారు.
11"సోయను పట్టణ నాయకులు తెలివి తక్కువ
వాళ్లు. ఫరోయొక్క 'తెలివిగల నాయకులు' తప్పు
సలహాలు ఇస్తారు. వారు తెలివిగల వాళ్లని ఆ నాయకులు

అంటారు. వారు పూర్వపు రాజుల కుటుంబాలకు
చెందినవాళ్లం అంటారు. కానీ వారు, వాళ్లు అను
కొన్నంత తెలివిగలవాళ్లు కారు.”
12ఈజిప్టూ, నీ జ్ఞానులు ఎక్కడ? సర్వశక్తిమంతు
డైన యెహోవా ఈజిప్టు కోసం వేసిన పథకం ఏమిటో
ఆ జ్ఞానులు తెలుసుకోవాలి. ఏం జరుగ బోతుందో
అది నీకు చెప్పాల్సినవాళ్లు వారే.
13సోయను నాయకులు వెర్రివాళ్లుగా చేయ
బడ్డారు. నోఫు నాయకులు దొంగ సంగతులు నమ్మే
సారు. అందుచేత నాయకులు ఈజిప్టును తప్పు
త్రోవను నడిపించారు. 14ఆ నాయకులను యెహోవా
గందరగోళపర్చాడు. వాళ్లు తిరుగులాడుచూ, ఈజి
ప్టును తప్పుదారిలో నడిపిస్తారు. ఆ నాయకులు చేసేది
అంతా తప్పే. వాళ్లు త్రాగి రోగంతో వీధిలో దొర్లాడే
వాళ్లలా ఉన్నారు. 15ఆ నాయకులు చేయగలిగింది
ఏమీ లేదు. (ఈ నాయకులే “తలలు, తోకలు.” వారే,
“మొక్కల కొమ్మలు, కాండాలు.”)*
16ఆ కాలంలో ఈజిప్టు వాళ్లు బెదరిపోయిన
ఆడవాళ్లలా ఉంటారు. సర్వశక్తిమంతుడైన యెహో
వాకు వారు భయపడతారు. ప్రజలను శిక్షించటానికి
యెహోవా తన చేయి పైకి ఎత్తుతాడు, వారు భయ
పడతారు. 17యూదా దేశం, ఈజిప్టు ప్రజలందరికి
భయం పుట్టించే దేశం అవుతుంది. ఈజిప్టులో ఎవ
రైనా సరే యూదా పేరు వింటే భయపడతారు. సర్వ
శక్తిమంతుడైన యెహోవా ఈజిప్టులో భయంకర సంగ
తులు జరగాలని పథకం వేసాడు గనుక ఇవి జరుగు
తాయి. 18ఆ కాలంలో ప్రజలు కనాను భాష(యూదుల
బాష) మాట్లాడే పట్టణాలు ఈజిప్టులో అయిదు
ఉంటాయి. ఈ పట్టణాల్లో ఒక దానికి “నాశన
పట్టణం”* అని పేరు పెట్టబడుతుంది.
సర్వశక్తిమంతుడైన యెహోవాను వెంబడిస్తాం అని
ప్రజలు ప్రమాణం చేస్తారు. 19ఆ కాలంలో ఈజిప్టు
కేంద్రంలో యెహోవాకు ఒక బలిపీఠం ఉంటుంది.
యెహోవాకు సన్మాన సూచకంగా ఈజిప్టు సరి
హద్దులో ఒక స్తంభం ఉంటుంది.
20సర్వశక్తిమంతుడైన యెహోవా శక్తివంతమైన
పనులు చేస్తాడు అని చూపించేందుకు ఇది ఒక సంకేతం.
యెహోవా దగ్గర్నుండి సహాయం కావాలని ప్రజలు
మొర పెట్టినప్పుడల్లా, యెహోవా సహాయం పంపి
స్తాడు. ప్రజలను రక్షించి, కాపాడుటకు ఒక వ్యక్తిని
యెహోవా పంపిస్తాడు. ఆ ప్రజలకు అక్రమమైన
వాటిని జరిగించే మనుష్యుల బారినుండి ఆ వ్యక్తి వారిని
విమోచిస్తాడు.
21ఆ సమయంలో ఈజిప్టులోని ప్రజలు యెహో
వాను వాస్తవంగా తెలుసుకొంటారు. ఈజిప్టు ప్రజలు
దేవుణ్ణి ప్రేమిస్తారు. ప్రజలు దేవుణ్ణి సేవిస్తారు, అనేక
బలులు అర్పిస్తారు. వారు యెహోవాకు ప్రమాణాలు
చేస్తారు. వారు ఆ ప్రమాణాలను నిలబెట్టుకొంటారు.
22ఈజిప్టు ప్రజలను యెహోవా శిక్షిస్తాడు.
మరియు అప్పుడు ఆయన వారిని స్వస్థపరుస్తాడు.
(క్షమిస్తాడు) వారు యెహోవా దగ్గరకు తిరిగి వస్తారు.
యెహోవా వారి ప్రార్థనలు వింటాడు, వారిని స్వస్థ
పరుస్తాడు. (క్షమిస్తాడు).
23ఆ కాలంలో ఈజిప్టు నుండి అష్షూరుకు రాజ
మార్గం ఉంటుంది. అప్పుడు ప్రజలు అష్షూరు నుండి
ఈజిప్టు వెళ్తారు, ఈజిప్టు నుండి ప్రజలు అష్షూరు
వెళ్తారు. ఈజిప్టు అష్షూరుతో కలిసి పనిచేస్తుంది.
24ఆ కాలంలో ఇశ్రాయేలు, అష్షూరు, ఈజిప్టు కలిసి
దేశాన్ని తమ ఆధీనంలో ఉంచుకొంటారు. ఇది దేశానికి
ఆశీర్వాదం.
25సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ దేశాలను
ఆశీర్వదిస్తాడు. “ఈజిప్టూ, మీరే నా ప్రజలు అష్షూరూ,
నిన్ను నేను సృష్టించాను. ఇశ్రాయేలూ, నీవు నా
స్వంతం. మీరంతా ఆశీర్వదించబడిన వాళ్లు” అని
ఆయన అంటాడు.

### అష్షూరు ఈజిప్టును, ఇథియోపియాను ఓడిస్తుంది

20 అష్షూరు రాజు సర్గోను. అష్దోదు మీద యుద్ధం
చేయటానికి సర్గోను తర్తానును ఆ పట్టణం
మీదికి పంపించాడు. తర్తాను అక్కడికి వెళ్లి ఆ పట్టణాన్ని
పట్టుకొన్నాడు. 2ఆ సమయంలో ఆమోజు
కుమారుడు యెషయా ద్వారా యెహోవా
మాట్లాడాడు: “వెళ్లు, నీ నడుముకు కట్టిన దుఃఖవస్త్రం
తీసివేయి. నీ పాదాల జోళ్లు తీసివేయి” అని
యెహోవా చెప్పాడు. యెషయా యెహోవాకు విధే
యుడయ్యాడు. మరియు యెషయా బట్టలు
లేకుండా, చెప్పులు లేకుండా అక్కడ అంతా తిరిగాడు.
3అప్పుడు యెహోవా చెప్పాడు: “బట్టలు
లేకుండ, చెప్పులు లేకుండా యెషయా మూడు సంవ
త్సరాలు తిరిగాడు. ఇది ఈజిప్టుకు, ఇథియోపియాకు
సంకేతం. 4అష్షూరు రాజు ఈజిప్టును, ఇథియోపి
యాను ఓడిస్తాడు. అష్షూరు బందీలను పట్టుకొని,
వారి దేశాల నుండి తీసుకొనిపోతాడు. పెద్దవాళ్లు,
యువతీ యువకులు బట్టలు, చెప్పులు లేకుండానే
తీసుకొని పోబడతారు. వారు సొంతం నగ్నంగా
ఉంటారు. ఈజిప్టు ప్రజలు అవమానిం చబడతారు.
5ప్రజలు సహాయం కోసం ఇథియోపియా వైపు
చూస్తారు. ఆ ప్రజలు భగ్నమైపోతారు. ఈజిప్టు
ఔన్నత్యం చూచి ప్రజలు ఆశ్చర్యచకితులయ్యారు.
అలాంటి ప్రజలు అవమానించబడతారు.”

---

**ఈ ... కాండాలు** యెషయా 9:14-15 చూడండి.

**నాశన పట్టణం** ఈ పేరు “సూర్య పట్టణము” అనే అర్థంగల పేరులాంటిది. ఇది బహుశాః ఓను పట్టణం కావచ్చు.

[6]సముద్రానికి దగ్గరగా ఉన్న ప్రజలు, “ఆ దేశాలు మాకు సహాయం చేస్తాయని వాటిని నమ్ముకొన్నాము. అవి మమ్మల్ని అష్షూరు రాజు నుండి విమోచిస్తాయని మేం వాటి దగ్గరకు పరుగెత్తాం. కానీ వాటిని చూడండి. ఆ దేశాలు పట్టుకోబడ్డాయి, మరి మనం ఎలా తప్పించుకోగలుగుతాం?” అని అంటారు.

### బబులోనుకు దేవుని సందేశం

21 సముద్రతీరంలో ఉన్న అడవి ప్రాంతానికి విచారకరమైన సందేశం:

అరణ్యం నుండి ఏదో వస్తోంది? నెగెవ్‌నుండి
వీచే గాలిలా అది వస్తోంది. అది ఒక
భయంకర దేశం నుండి వస్తోంది.
2 జరుగబోయే దారుణమైన ఒక సంగతి నేను
చూసాను. దేశద్రోహులు నీకు విరోధంగా
లేవటం నేను చూశాను. ప్రజలు నీ ఐశ్వర్యం
తీసుకోవటం నేను చూశాను. ఏలాము, వెళ్లి
ఆ ప్రజలతో యుద్ధం చేయి. మాద్యా,
పట్టణం చుట్టూరా నీ సైన్యాలను ఉంచి,
దాన్ని జయించు. ఆ పట్టణంలో చెడు
సడుగులన్నింటినీ నేను అంతం చేస్తాను.

[3]ఆ భయంకర విషయాలు నేను చూశాను, ఇప్పుడు నేను భయపడ్తున్నాను. నా భయంవల్ల నా కడుపులో దేవేస్తోంది. ఆ బాధ ప్రసవవేదనలా ఉంది. నేను వినే విషయాలు నన్ను చాలా భయపెట్టేస్తాయి. నేను చూచే విషయాలు నన్ను భయంతో వణకిస్తాయి. [4]నేను దిగులుగా ఉన్నాను, భయంతో వణకిపోతున్నాను. సంతోషకరమైన నా సాయంపూట, భయం పుట్టే రాత్రిగా తయారయింది

5 అంతా బాగానే వుందని ప్రజలు తలస్తు
న్నారు. ప్రజలు అంటారు: “బల్ల సిద్ధం
చేయండి! బల్లమీద బట్ట పరచండి!
తినండి! తాగండి!” కానీ ప్రజలు, “నాయ
కులారా, లేవండి, యుద్ధానికి సిద్ధపడండి”
అని చెప్పాలి.

[6]ఎందుకంటే నా ప్రభువు, నాతో ఈ విషయాలు చెప్పాడు: “వెళ్లి, పట్టణాన్ని కాపాడేందుకు ఒక మనిషి కోసం చూడు.

[7]కావలివాడు గుర్రాల మీద సైనికుల్ని, గాడిదలు, లేక ఒంటెలను చూస్తే కావలివాడు జాగ్రత్తగా, చాలా జాగ్రత్తగా వినాలి.”

[8]అప్పుడు ఆ కావలివాడు ‘సింహం’ అనే హెచ్చరిక మాట గట్టిగా చెప్పాలి.”

కావలివాడు యెహోవాతో చెప్పాడు: “నా ప్రభూ! ప్రతిరోజూ నేను కావలి కాస్తూ కావలి గోపురం మీద ఉన్నాను. ప్రతిరాత్రి నేను నిలబడి కావలి కాస్తూనే ఉన్నాను, కానీ [9]అదిగో, వాళ్లు వచ్చేస్తున్నారు, బారులు తీరిన మనుష్యులు, గుర్రాల మీద సైనికులు నాకు కనబడుతున్నారు.”

అప్పుడు పురుషుల్లో ఒకడు అన్నాడు:
“బబులోను ఓడించబడింది. బబులోను
నేల మట్టంగా కూలిపోయింది. దాని అబద్ధ
దేవుళ్ల విగ్రహాలన్నీ నేలకు కొట్టబడ్డాయి
ముక్కలు ముక్కలుగా విరిగి పోయాయి.”

[10]యెషయా చెప్పాడు, “నా ప్రజలారా, ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడైన యెహోవా నుండి నేను విన్న వాటన్నింటినీ మీకు చెప్పాను. కళ్లంలో ధాన్యంలా మీరు చితుకగొట్ట బడతారు.

### ఎదోముకు దేవుని సందేశం

[11]దూమాను గూర్చిన విచారకరమైన సందేశం:

శేయీరునుండి ఎవరో నన్ను పిలిచి అడుగు
తున్నారు, “కావలివాడా, రాత్రి ఎంత వేళ
యింది? కావలివాడా, రాత్రి ఎంత వేళయింది?”
12 కావలివాడు జవాబిచ్చాడు, “ఉదయం అవు
తుంది, రాత్రి కూడా అవుతుంది. నీవు
అడగాల్సింది ఏమైనా ఉంటే తిరిగి వచ్చి
అడుగుము.”

### అరేబియాకు దేవుని సందేశం

[13]అరేబియాను గూర్చి విచారకరమైన సందేశం:

దెదాను నుండి వచ్చిన ఒంటెల ప్రయాణీకులు
అరబి ఎడారిలో కొన్ని చెట్ల దగ్గర రాత్రి గడిపారు.
14 దాహంతో ఉన్న కొందరు ప్రయాణీకులకు వారు
నీళ్లు ఇచ్చారు. పయాణం చేస్తున్న కొందరు
ప్రజలకు తేమా ప్రజలు భోజనం పెట్టారు
15 చంపడానికి సిద్ధంగా ఉన్న కత్తులనుండి ఆ
ప్రజలు పారిపోతూ ఉన్నారు. గురిపెట్టి కొట్టడా
నికి సిద్ధంగా ఉన్న బాణాలనుండి వారు పారిపో
తున్నారు. కష్టతరమైన యుద్ధంనుండి వారు
పారిపోతున్నారు.

[16]ఆ సంగతులు జరుగుతాయని నా ప్రభువైన యెహోవా నాతో చెప్పాడు: “ఒక్క సంవత్సరంలో (కూలివాని కాలమానం ప్రకారం) కేదారు ఘనత అంతా పోతుంది. [17]ఆ సమయంలో కేదారు మహా వీరుల్లో

కొద్దిమంది విలుకాండ్రు మాత్రమే బతికి ఉంటారు.”
ఇశ్రాయేలీయుల దేవుడు యెహోవా ఈ సంగతులు
నాకు చెప్పాడు.

## యెరూషలేముకు దేవుని సందేశం

22 దర్శన లోయను గూర్చిన విచారకరమైన
సందేశం:

ప్రజలారా మీకు ఏమయింది? మీరు ఎందుకు
మీ ఇంటి కప్పుల మీద దాక్కొంటున్నారు?
2 గత కాలంలో ఈ పట్టణం చాలా పని తొందరగా
ఉండేది ఈ పట్టణం చాలా అల్లరిగా చాలా ఉల్లా
సంగా ఉండేది. కానీ ఇప్పుడు పరిస్థితులు మారి
పోయాయి. నీ ప్రజలు చంపి వేయబడ్డారు. కానీ
కత్తులతో కాదు. ప్రజలు మరణించారు కానీ
యుద్ధం చేస్తూ కాదు.
3 మీ నాయకులంతా ఒక్కుమ్మడిగా పారి పోయారు
కానీ వాళ్లంతా బాణాలు లేకుండానే బంధించ
బడ్డారు. నాయకులంతా కలిసి దూరంగా పారి
పోయారు. కానీ వాళ్లు బంధించబడ్డారు.
4 అందుకే నేనంటాను, “నా వైపు చూడవద్దు! నన్ను
ఏడ్వనివ్వండి. యెరూషలేము నాశనం గూర్చి
నన్ను ఆదరించాలని పరు గెత్తి రాకండి.”

5యెహోవా ఒక ప్రత్యేక దినం ఏర్పాటు చేసు
కొన్నాడు. ఆనాడు తిరుగుబాట్లు, గందరగోళంగా
ఉంటుంది. దర్శనపు లోయలో ప్రజలు ఒకరినొకరు
తొక్కుకుంటారు. పట్టణ ప్రాకారాలు కూలగొట్ట బడ
తాయి. లోయలో ఉన్న ప్రజలు కొండమీద పట్ట
ణంలో ఉన్న ప్రజలను చూచి కేకలు వేస్తారు. 6ఏలాము
గుర్రాల సైనికులు వారి బాణాల సంచులు తీసుకొని
యుద్ధానికి స్వారీ చేస్తారు. కీరుప్రజలు వారి డాళ్లతో
శబ్దాలు చేస్తారు. 7సైన్యాలు మీ ప్రత్యేక లోయలో
కలుసుకొంటాయి. లోయంతా రథాలతో నిండిపో
తుంది. గుర్రాల సైనికులు పట్టణ ద్వారాల ముందు
ఉంటారు. 8యూదా వారు అరణ్య భవనంలో దాచు
కొన్న వారి ఆయుధాలను ఆ సమయంలో ప్రయో
గించాలని కోరుకొంటారు.
యూదాను కాపాడుతున్న గోడలను శత్రువు
కూలగొట్టేస్తాడు. 9-11దావీదు పట్టణపు గోడలు బీటలు
వారటం మొదలవుతుంది, ఆ బీటలు మీరు చూస్తారు.
కనుక మీరు ఇళ్లను లెక్కబెట్టి, ఆ ఇండ్ల రాళ్లను గోడలు
బాగుచేయటానికి ఉపయోగిస్తారు. పాత కాలువ నీళ్లు
నిల్వచేయటానికి రెండు గోడల మధ్య మీరు ఖాళీ
ఉంచుతారు, మీరు నీటిని నిల్వచేస్తారు. ఇదంతా
మిమ్మల్ని మీరు కాపాడుకొనేందుకు చేస్తారు. కానీ
వీటన్నింటినీ చేసిన దేవుణ్ణి మీరు నమ్ముకోరు. వీట
న్నింటినీ చాలకాలం క్రిందట చేసిన వానిని (దేవుణ్ణి)
మీరు చూడరు.

12కనుక నా ప్రభువు, సర్వశక్తిమంతుడైన
యెహోవా ప్రజలను ఏడ్చి, చనిపోయిన వారి స్నేహి
తుల కోసం దుఃఖంగా ఉండమని చెబుతాడు. ప్రజలు
గుండ్లు గీసికొని, విచార సూచక వస్త్రాలు ధరిస్తారు.
13అయితే చూడండి, ప్రజలు ఇప్పుడు సంతోషంగా
ఉన్నారు. ప్రజలు ఆనందంగా ఉన్నారు. ప్రజలు ఇలా
అంటున్నారు:

మనం వేడుక చేసుకొందాం పశువుల్ని,
గొర్రెల్ని వధించండి మీరు భోజనం తిని,
ద్రాక్షరసం తాగండి తినండి, తాగండి,
ఎందుకంటె రేపు మనం చస్తాం.

14సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ సంగతులు
నాతో చెప్పాడు, నేను నా చెవులారా దానిని విన్నాను:
“మీరు చెడుకార్యాలు చేసిన అపరాధులు. ఈ అపరాధం
క్షమించబడక ముందే మీరు మరణిస్తారని నేను
ప్రమాణం చేస్తున్నాను.” నా ప్రభువు సర్వశక్తిమంతు
డైన యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

## షెబ్నాకు దేవుని సందేశం

15నా ప్రభువు, సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ
సంగతులు నాతో చెప్పాడు: “ఆ సేవక షెబ్నా దగ్గరకు
వెళ్లు. ఆ సేవకుడు భవనం అధికారి. 16నీవు ఇక్కడ
ఏమి చేస్తున్నావు? నీ కుటుంబం వారు ఎవరైనా
ఇక్కడ సమాధి చేయబడ్డారా? నీవెందుకు ఇక్కడ
సమాధి తయారు చేస్తున్నావు?” అని ఆ సేవకుడ్ని
అడుగు.
యెషయా చెప్పాడు, “ఈ మనిషిని చూడండి!
ఎత్తయిన స్థలంలో అతడు తన సమాధి సిద్ధం చేసు
కొంటున్నాడు. తన సమాధి కోసం అతడు బండను
తొలుస్తున్నాడు.
17-18“ఓ మనిషీ, యెహోవా నిన్ను చితక గొట్టే
స్తాడు. యెహోవా నిన్ను ఒక చిన్న ఉండలా చుట్టేసి,
చాలా దూరంలో చేతులు చాచుకొని ఉన్న మరో
దేశంలోకి నిన్ను విసిరివేస్తాడు. అక్కడ నీవు చస్తావు.”
యెహోవా చెప్పాడు: “నీ రథాల మూలంగా నీకు
చాలా గర్వం. కానీ ఆ దూరదేశంలో నీ క్రొత్త పాలకునికి
ఇంకా మంచి రథాలు ఉంటాయి. అతని స్థలంలో నీ
రథాలు ఎన్నదగినవిగా కనబడవు. 19ఇక్కడి నీ ప్రముఖ
పదవినుండి నిన్ను నేను వెళ్లగొడతాను. నీ ప్రముఖ
పదవి నుండి, నీ క్రొత్త పాలకుడు నిన్ను తీసుకొని
వెళ్లిపోతాడు. 20ఆ సమయంలో హిల్కీయా కుమా
రుడు, నా సేవకుడు ఎల్యాకీమును నేను పిలుస్తాను.
21నేను నీ అంగీ తీసి ఆ సేవకుని మీద వేస్తాను. నీ
నడికట్టు అతనికి ఇస్తాను. నీ ముఖ్య పదవి అతనికి
ఇస్తాను. యెరూషలేము ప్రజలకు, యూదా వంశానికి
ఈ సేవకుడు ఒక తండ్రిలా ఉంటాడు.

[22]"దావీదు ఇంటి తాళపు చెవిని అతని మెడలో నేను కడతాను. అతడు ఒక ద్వారం తెరిస్తే, అది తెర చుకొనే ఉంటుంది. ఏ మనిషీ దాన్ని మూసి వేయలేడు. అతడు ఒక ద్వారం మూసివేస్తే, ఆ ద్వారం మూసికొనే ఉంటుంది. ఏ మనిషీ దానిని తెరవలేడు. ఆ సేవకుడు తన తండ్రి ఇంటిలో ఘనమైన పీఠంలా ఉంటాడు. [23]గట్టిచెక్కకు కొట్టబడిన మేకులా అతణ్ణి నేను బలంగా చేస్తాను. [24]అతని తండ్రి ఇంటిలో ఘనమైన వాటిని, గొప్పవాటిని నేను అతని మీద వేలాడదీస్తాను. పెద్దలు, పిల్లలు అందరూ అతని మీద ఆధారపడతారు. ఆ మనుష్యులు ఆయన మీద వేలాడుతోన్న చిన్న పాత్రల్లా, పెద్ద నీళ్ల చెంబుల్లా ఉంటారు.

[25]"ఆ సమయంలో, ప్రస్తుతం గట్టి చెక్కకు కొట్ట బడిన మేకు (షెబ్నా) బలహీనమవుతుంది, విరిగిపో తుంది. ఆ మేకు నేలమీద పడిపోతుంది, ఆ మేకుకు వేలాడుతున్న వస్తువులన్నీ నాశనం అవుతాయి. అప్పుడు, ఈ సందేశంలో నేను చెప్పిన సంగతులు అన్నీ సంభవిస్తాయి." (యెహోవా చెప్పాడు గనుక ఆ సంగతులు జరుగుతాయి.)

### లెబానోనుకు దేవుని సందేశం

23 తూరును గూర్చి విచారకరమైన సందేశం:
తర్షీషు ఓడలారా, మీరు విచారించండి. మీ ఓడరేవు పాడుచేయబడింది. (ఈ ఓడల మీద ఉన్న ప్రజలు కిత్తీయుల దేశం నుండి ప్రయాణం చేస్తూ ఉండగా వారికి ఈ వార్త చెప్పబడింది).

[2]సముద్ర ప్రాంతంలో నివసిస్తున్న ప్రజలారా ఆగండి, దుఃఖించండి. తూరు, " సీదోను వ్యాపారి." సముద్ర పక్కన ఉన్న ఆ పట్టణం సముద్రాల మీదుగా వ్యాపారులను పంపింది, ఆ మనుష్యులు మిమ్మల్ని ఐశ్వర్యాలతో నింపారు. [3]ఆ మనుష్యులు ధాన్యం కోసం వెదుకుతూ సముద్రాల మీద ప్రయాణం చేశారు. నైలు నది దగ్గర పండే ధాన్యం తూరు మనుష్యులు కొని, ఆ ధాన్యాన్ని ఇతర దేశాలకు విక్రయించేవారు.

[4]సీదోనూ, నీవు చాలా దుఃఖించాలి. ఎందుకంటే, ఇప్పుడు సముద్రం, సముద్రపు కోట చెబుతున్నాయి.

నాకు పిల్లలు లేరు. నాకు ప్రసవవేదన కలగలేదు
నేను పిల్లలను కనలేదు నేను బాల బాలికలను
పెంచలేదు.
5 తూరును గూర్చిన వార్త ఈజిప్టు వింటుంది.
ఈ వార్త ఈజిప్టును దుఃఖంతో బాధిస్తుంది.
6 ఓడలారా మీరు తర్షీషుకు తిరిగి రావాలి.
సముద్రం దగ్గర్లో నివసిస్తున్న ప్రజలారా మీరు
విచారించాలి.
7 గతకాలంలో మీరు తూరు పట్టణాన్ని అనుభ
వించారు. అనాది నుండీ ఆ పట్టణం పెరుగు
తూనే ఉంది. ఆ పట్టణం ప్రజలు జీవనోపాధి
కోసం దూర దేశాలు తిరిగారు.
8 తూరు పట్టణం చాలామంది నాయకులను
తయారు చేసింది. ఆ పట్టణపు వ్యాపారులు
యువరాజుల్లా ఉన్నారు. క్రయ విక్రయ దారులు
ఎక్కడ చూచినా గౌరవించబడ్డారు. కనుక
తూరుకు వ్యతి రేకంగా పథకాలు వేసింది ఎవరు?
9 సర్వశక్తిమంతుడైన యెహోవాయే. వాళ్లను
ప్రముఖులుగా ఉండకుండా చేయాలని ఆయన
నిర్ణయించాడు.
10 తర్షీషు ఓడలారా, మీరు తిరిగి మీ దేశం వెళ్లిపోండి.
సముద్రం ఒక చిన్న నదిలా దాటండి. మిమ్మల్ని
ఇప్పుడు ఆపు చేయడు.
11 యెహోవా సముద్రం మీద తన హస్తం చాపాడు.
తూరుకు విరోధంగా యుద్ధం చేసేందుకు
యెహోవా రాజ్యాలను సమ కూరుస్తున్నాడు.
తన భద్రతా స్థలం తూరును నాశనం చేయమని
యెహోవా కనానుకు ఆదేశిస్తున్నాడు.
12 "సీదోను కన్యా* నీవు పాడు చేయబడతావు
నీవు ఇంకెంత మాత్రం ఆనందించవు" అని
యెహోవా చెబుతున్నాడు. అయితే తూరు
ప్రజలు, "కిత్తీము మాకు సహాయం చేస్తుంది"
అంటున్నారు. కానీ మీరు సముద్రం దాటి
కిత్తీము వెళ్తే అక్కడ మీకు విశ్రాంతి స్థలం
దొరకదు.
13 అందుచేత తూరు ప్రజలు, "బబులోను ప్రజలు
మాకు సహాయం చేస్తారు" అంటున్నారు. కానీ
కల్దీయుల దేశం చూడండి. బబులోను ఇప్పుడు
ఒక దేశం కాదు. బబులోను మీద అష్షూరు
దాడి చేసి దాని చుట్టూ యుద్ధ గోపురాలు
కట్టింది. అందమైన గృహాలనుండి సైన్యం
సమస్తం దోచుకొంది. అష్షూరు బబులోనును
అడవి మృగాలకు స్థావరంగా చేసింది బబులో
నును వారు శిథిలాలుగా మార్చేశారు.
14 అందుచేత, తర్షీషు ఓడలారా, దుఃఖించండి మీ
క్షేమ స్థానం (తూరు) నాశనం చేయబడుతుంది.

[15]ప్రజలు తూరును డెబ్భయి సంవత్సరాలపాటు మరచిపోతారు. (అది ఒక రాజు పరిపాలనా కాలవ్యవధి) డెబ్భయి సంవత్సరాల తర్వాత తూరు ఈ పాటలోని వేశ్యలా ఉంటుంది.

16 ప్రజలు మరచిన ఓ ఆడదానా నీ స్వర మండలం
తీసుకొని పట్టణంలో నడు. నీ పాటను చక్కగా
వాయించు నీ పాటను తరచుగా పాడు. అప్పుడు
ప్రజలు నిన్ను జ్ఞాపకం ఉంచుకొంటారు.

---

**సీదోను కన్యా** అనగా సీదోను నగరం.

17డెబ్బయి సంవత్సరాల తర్వాత తూరు విషయం
యెహోవా పునః పరిశీలిస్తాడు, ఆయన దానికి తన
నిర్ణయం తెలియజేస్తాడు. తూరు మళ్లీ వ్యాపారం
చేస్తుంది. భూమి మీద రాజ్యాలన్నింటికీ తూరు ఒక
వేశ్యలా ఉంటుంది.
18కాని తూరు తాను సంపాదించిన ధనం ఉంచు
కోదు. తూరు తన వ్యాపారం ద్వారా సంపాదించిన
ధనం యెహోవా కోసం దాచబడుతుంది. యెహో
వాను సేవించే వారికి ఆ ధనాన్ని తూరు ఇస్తుంది.
కనుక యెహోవా సేవకులు తృప్తి పడేంతవరకు
భోజనం చేస్తారు, మంచి దుస్తులు ధరిస్తారు.

### దేవుడు ఇశ్రాయేలును శిక్షిస్తాడు

24 చూడండి, యెహోవా ఈ దేశాన్ని నాశనం
చేస్తాడు. దేశంలోంచి పూర్తిగా సమస్తం
యెహోవా శుద్ధి చేస్తాడు. యెహోవా ప్రజలను
బలవంతంగా దూరం వెళ్లగొడతాడు.
2ఆ కాలంలో సామాన్య ప్రజలు యాజకులు
ఒక్కటే, బానిసలు, యజమానులు ఒక్కటే. ఆడ బాని
సలు, యజమానురాండ్రు ఒక్కటే. అమ్మేవారు కొనే
వారు ఒక్కటే. అప్పు ఇచ్చే వాళ్లు, పుచ్చుకొనే వాళ్లు
ఒక్కటే. వడ్డీకి ఇచ్చేవారు, వడ్డీకి తీసుకొనేవారు
ఒక్కటే.
3ప్రజలంతా దేశంలో నుండి వెళ్లగొట్టబడతారు.
సంపద దోచుకోబడుతుంది. యెహోవా ఆదేశించాడు
గనుక ఇది జరుగుతుంది. 4దేశం ఖాళీగా దుఃఖంగా
ఉంటుంది. ప్రపంచం ఖాళీగా బలహీనంగా ఉంటుంది.
ఈ దేశంలోని గొప్ప ప్రజానాయకులు బలహీనులు
అవుతారు.
5దేశంలోని ప్రజలు దేశాన్ని మైల చేసారు. ఇది
ఎలా జరిగింది? ప్రజలు దేవుని ఉపదేశాలకు విరోధంగా
తప్పుడు పనులు చేశారు. దేవుని చట్టాలకు ప్రజలు
విధేయులు కాలేదు. ప్రజలు చాలాకాలం క్రిందట
దేవునితో ఒక ఒడంబడిక చేసుకున్నారు. కానీ ఆ
ప్రజలే దేవునితో గల ఒడంబడికను ఉల్లంఘించారు.
6ఈ దేశంలో నివసిస్తున్న ప్రజలు తప్పుచేసిన అప
రాధులు. అందుచేత దేశాన్ని నాశనం చేస్తానని దేవుడు
ప్రమాణం చేసాడు. ప్రజలు శిక్షించబడతారు. కొద్ది
మంది ప్రజలు మాత్రమే బతుకుతారు. 7ద్రాక్ష వల్లులు
చస్తున్నాయి. కొత్త ద్రాక్షరసం చెడి పోయింది. గతంలో
ప్రజలు సంతోషంగా ఉన్నారు. కానీ ఇప్పుడు ఆ
ప్రజలు విచారంగా ఉన్నారు. 8ప్రజలు వారి ఆనందం
ప్రదర్శించటం మానివేశారు. ఆనంద ధ్వనులన్నీ ఆగి
పోయాయి. సితారా, మృదంగ సంగీత సంతోషం
సమసిపోయింది. 9ప్రజలు వారి ద్రాక్షరసం తాగే
టప్పుడు సంతోషంగా పాటలు పాడారు. మద్యం
తాగేవాడికి దాని రుచి ఇప్పుడు చేదుగా ఉంది.
10"పూర్తి గందరగోళం" అనేది ఈ పట్టణానికి సరి
పోయే మంచి పేరు. పట్టణం నాశనం చేయబడింది.
ప్రజలు ఇళ్లలో ప్రవేశించలేరు. ద్వారాలు బంధించ
బడ్డాయి. 11ప్రజలు ఇంకా బజారుల్లో ద్రాక్షరసం కోసం
అడుగుతున్నారు. కానీ సంతోషం అంతా పోయింది.
ఆనందం దూరంగా తీసుకుపోబడింది. 12పట్టణానికి
నాశనం మాత్రమే మిగిలింది. చివరికి తలుపులు కూడా
చితుక గొట్టబడ్డాయి.

13 కోతకాలంలో ప్రజలు ఒలీవ చెట్లనుండి ఒలీవ
పండ్లు రాల్చుతారు. కానీ చెట్లకు కొన్ని ఒలీవ
పండ్లే మిగిలి ఉన్నాయి. రాజ్యాల మధ్య ఈ
దేశానికి గూడ అలానే ఉంటుంది.
14 విడిచి పెట్టబడిన ప్రజలు కేకలు వేయటం
మొదలు పెడ్తారు. ప్రజలు సముద్ర ఘోషకంటె
గట్టిగా కేకలు వేస్తారు యెహోవా గొప్పతనంవల్ల
ప్రజలు సంతోషిస్తారు.
15 ఆ ప్రజలు అంటారు: "తూర్పు దిశనున్న
ప్రజలారా యెహోవాను స్తుతించండి! దూర
దేశాల ప్రజలారా, యెహోవాను స్తుతించండి!
యెహోవా ఇశ్రాయేలీయుల దేవుడు."
16 భూలోకంలో ప్రతి చోటనుండి యెహోవాకు
స్తుతి కీర్తనలు మనం వింటాము. ఈ కీర్తనలు
మంచి దేవుణ్ణి స్తుతిస్తాయి. కానీ నేనంటాను:
"చాలు, నాకు సరిపోయింది! నేను చూస్తున్న
సంగతులు భయంకరం. దేశ ద్రోహులు ప్రజల
మీద తిరుగబడి వారిని బాధిస్తున్నారు.
17 దేశంలో నివసిస్తున్న ప్రజలకు ప్రమాదం నాకు
కనబడుతోంది. వారికి భయం, గుంటలు,
ఉచ్చులు నాకు కనబడుతున్నాయి.
18 ప్రమాదాన్ని గూర్చి ప్రజలు వింటారు. వారు
భయపడిపోతారు. కొంతమంది ప్రజలు పారి
పోతారు. కానీ వారు గుంటల్లో, ఉచ్చుల్లో పడి
పోతారు వాళ్లలో కొంతమంది ఆ గుంటల్లో
నుండి ఎక్కి బయటపడ్తారు. కానీ వారు మరో
ఉచ్చులో పట్టుబడతారు." పైన ఆకాశంలో
తూములు తెరచుకొంటాయి. వరదలు మొదల
వుతాయి. భూమి పునాదులు వణకటం
ప్రారంభం అవుతుంది.
19 భూకంపాలు వస్తాయి. భూమి పగిలి తెరచు
కొంటుంది.
20 లోకంలో పాపాలు చాలా భారంగా ఉన్నాయి.
అందుచేత భూమి ఆ భారం కింద పడిపోతుంది.
ప్రాచీన గృహంలా భూమి వణుకుతుంది తాగు
బోతు వాడిలా భూమి పడిపోతుంది. భూమి ఇక
కొనసాగలేదు.

21 ఆ సమయంలో, పరలోక సైన్యాలకు పరలో
కంలోను భూరాజులకు భూలోకంలోను
యెహోవా తీర్పు తీరుస్తాడు.
22 ఎందరెందరో ప్రజలు ఒకటిగా సమావేశం చేయ
బడతారు. కొంతమంది ప్రజలు గోతిలో బంధిం
చబడ్డారు. వీరిలో కొంతమంది చెరలో ఉన్నారు.
కానీ చివరికి, చాలా కాలం తర్వాత వీరికి తీర్పు
తీర్చబడుతుంది.
23 యెహోవా యెరూషలేములో సీయోను కొండ
మీద రాజుగా పాలిస్తాడు. పెద్దల యెదుట ఆయన
మహిమ ఉంటుంది. చంద్రుడు సిగ్గుపడి,
సూర్యుడు అవమానం పొందే అంత ప్రకాశమా
నంగా ఉంటుంది ఆయన మహిమ.

### దేవునికి స్తుతి గీతం

25 యెహోవా, నీవు నా దేవుడివి నిన్ను నేను
ఘనపరుస్తాను,

నీ నామం స్తుతిస్తాను. అద్భుతమైన కార్యాలు
నీవు చేసావు. చాలాకాలం క్రిందట నీవు చెప్పిన
మాటలు పూర్తిగా సత్యము. నీవు జరుగుతుందని
చెప్పినట్టు సమస్తం జరిగింది.
2 పట్టణాన్ని నీవు నాశనం చేసావు. అది బలీ యమైన
కోటగోడలతో కాపాడబడ్డ పట్టణం. కానీ
ఇప్పుడు అది ఒక రాళ్లకుప్ప మాత్రమే విదేశీ
భవనం నాశనం చేయబడింది. అది ఎన్నటికీ
కట్టబడదు.
3 బలమైన రాజ్యాల ప్రజలు నిన్ను ఘనపరుస్తారు.
బలమైన పట్టణాల బలాఢ్యులు నీకు భయ
పడతారు.
4 యెహోవా, అక్కరలో ఉన్న పేద ప్రజలకు
నీవు క్షేమ స్థానంగా ఉన్నావు. అనేక సమస్యలు
ఈ ప్రజల్ని ఓడించటం మొదలు పెట్టాయి.
కానీ నీవు వారిని కాపాడుతావు. యెహోవా, నీవు
వరదలనుండి, వేడి నుండి ప్రజలను కాపాడే
గృహంలా ఉన్నావు. కష్టాలు భయంకర గాలుల్లో,
వర్షంలా ఉన్నాయి. వాన గోడమీద పడి జారి
పోతుంది, కాని ఇంట్లో ఉన్న మనుష్యులకు దెబ్బ
తగలదు.
5 శత్రువులు కేకలు వేసి శబ్దం చేస్తారు. భయంకర
శత్రువులు సవాళ్లు విసరుతారు. అయితే దేవా,
నీవు వారిని ఆపుజేస్తావు. వేడి, పొడి కాలంలో
వేడి భూమిని నిస్సారం చేస్తుంది. అదేవిధంగా
నీవు శత్రువులకంటె బలం ఉన్నవాడివి దట్టమైన
మేఘాలు వేసవి వేడిని ఆపుజేస్తాయి. అదే విధంగా,
భయంకర శత్రువుల కేకలు నీవు ఆపుజేస్తావు.

### తన సేవకులకు, దేవుని విందు

6ఆ కాలంలో, సర్వశక్తిమంతుడైన యెహోవా ప్రజ
లందరికీ ఈ కొండ మీద విందు చేస్తాడు. ఆ విందులో
శ్రేష్ఠమైన భోజనాలు, ద్రాక్షరసాలు ఉంటాయి. మాంసం
లేతగా బాగుంటుంది. 7కానీ ఇప్పుడు రాజ్యాలన్నింటినీ,
ప్రజలనూ కప్పి వేసే ముసుగు ఉంది. ఈ ముసుగు
"మరణం" అని పిలువబడుతుంది 8కానీ మరణం శాశ్వ
తంగా నాశనం చేయబడుతుంది మరియు నా ప్రభువు
యెహోవా ప్రతి ఒక్కరి చెంపల మీదా ప్రతీ కన్నీటి
బొట్టునూ తుడిచి వేస్తాడు. గతంలో ఆయన ప్రజలు
అందరూ విచారంగా ఉన్నారు. అయితే దేవుడు ఆ
విచారాన్ని భూమి మీద నుండి తీసి వేస్తాడు. ఇలా
జరుగుతుంది అని యెహోవా చెప్పాడు గనుక ఇదంతా
జరుగుతుంది.

9 ఆ సమయంలో ప్రజలు అంటారు, "ఇదిగో
మన దేవుడు ఇక్కడ ఉన్నాడు. మనం కని
పెట్టుతున్నవాడు ఈయనే. మనల్ని రక్షించటానికి
ఈయన వచ్చాడు. మనం మన యెహోవా
కోసం కని పెడుతున్నాం. అందుచేత యెహోవా
మనలను రక్షించినప్పుడు మనం ఆనందించి,
సంతోషంగా ఉందాం."
10 యెహోవా హస్తం (శక్తి) ఈ కొండ మీద ఉంది.
మరియు మోయాబు ఓడించబడుతుంది.
యెహోవా శత్రువును అణగ త్రొక్కుతాడు.
చెత్త కుప్ప మీద వరిగడ్డిపై నడిచినట్టుగా అది
ఉంటుంది.
11 ఈత కొట్టేవానిలా యెహోవా తన చేతులు
చాపుతాడు అప్పుడు ప్రజలు అతి శయించే
వాటన్నిటినీ యెహోవా సమ కూరుస్తాడు వారు
తయారు చేసిన అందమైన వాటన్నింటినీ
యెహోవా సమకూరుస్తాడు. యెహోవా వాట
న్నింటినీ కింద పారవేస్తాడు
12 ప్రజల ఎత్తయిన గోడల, భద్రతా స్థలాలు అన్నిం
టిని యెహోవా నాశనం చేస్తాడు. యెహోవా
వాటిని నేల ధూళిలో పార వేస్తాడు.

### దేవునికొక స్తుతి గీతం

26 ఆ సమయంలో యూదాలో ప్రజలు ఈ
పాటలు పాడుతారు:
యెహోవా మాకు రక్షణనిస్తాడు మాకు ఒక
బలమైన పట్టణం ఉంది. మా పట్టణానికి బలమైన
గోడలు, భద్రత ఉన్నాయి.
2 తలుపులు తెరవండి, మంచివాళ్లు ప్రవేశిస్తారు.
ఆ ప్రజలు దేవుని యొక్క మంచి జీవన
విధానాన్ని అవలంబిస్తారు.

3 యెహోవా, నీవే నిజమైన శాంతి ప్రసాదిస్తావు
నీ మీద ఆధారపడే ప్రజలకు నీవు శాంతిని
ప్రసాదిస్తావు. నీయందు విశ్వాస ముంచే ప్రజలకు
నీవు శాంతిని ప్రసాదిస్తావు.
4 కనుక ఎల్లప్పుడు యెహోవాను విశ్వసించాలి.
నీవు యెహోవాను నిజంగా శాశ్వతంగా విశ్వ
సించాలి.
5 అయితే గర్వించిన పట్టణాన్ని యెహోవా
నాశనం చేస్తాడు. అక్కడ నివసించే ప్రజలను
ఆయన శిక్షిస్తాడు. ఆ ఎత్తయిన పట్టణాన్ని నేల
మట్టానికి ఆయన పడద్రోస్తాడు అది ధూళితో
పడిపోతుంది.
6 అప్పుడు పేదలు, దీనులైన ప్రజలు ఆ శిథిలాల
మీద నడుస్తారు.
7 మంచి వాళ్లకు నిజాయితీయే జీవన విధానం
మంచి మనుష్యులు సూటి సత్య మార్గం అవ
లంబిస్తారు. మరియు దేవా, ఆ మార్గాన్ని అనుస
రించటానికి దానిని నీవు తేలికగా మృదువుగా
చేస్తావు.
8 కానీ యెహోవా, మేము నీ న్యాయ మార్గం
కోసం ఎదురు చూస్తున్నాం. నిన్ను, నీ నామాన్ని
మా ఆత్మలు జ్ఞాపకం చేసుకోవాలని
ఆశిస్తున్నాయి.
9 నా ఆత్మ రాత్రిపూట నీతో ఉండాలని ఆశిస్తుంది.
ప్రతి నూతన దినపు సంధ్యా సమయంలో నీతో
ఉండాలని నా ఆత్మ నాలో కోరుతుంది.
దేశంలోనికి నీ న్యాయ మార్గం వచ్చినప్పుడు
ప్రజలు సరైన జీవన విధానం నేర్చుకొంటారు.
10 చెడ్డవాడికి నీవు దయ మాత్రమే చూపిస్తే వాడు
మంచి చేయటం నేర్చుకోడు. చెడ్డవాడు మంచి
ప్రపంచంలో జీవించినప్పటికీ వాడు చెడ్డ పనులే
చేస్తూ ఉంటాడు. ఆ చెడ్డ వ్యక్తి యెహోవా
గొప్ప తనాన్ని ఎప్పటికీ చూడకపోవచ్చు.
11 కానీ, యెహోవా, అలాంటి ప్రజలను నీవు శిక్షిస్తే
వారు దానిని చూస్తారు. యెహోవా నీ ప్రజల
మీద నీకు ఉన్న బలమైన ప్రేమను నీవు చెడ్డ
మనుష్యులకు చూపించు. అప్పుడు చెడ్డవాళ్లు
సిగ్గుపడ తారు. నీ శత్రువులు నీ స్వంత అగ్నిలో
కాలిపోతారు.
12 యెహోవా, మేము చేయాలని ప్రయత్నించిన
వాటన్నింటినీ చేయటంలో నీదే విజయం. కనుక
మాకు శాంతి ప్రసాదించు.

### తన ప్రజలకు దేవుడు కొత్త జీవితాన్ని ఇస్తాడు

13 యెహోవా, నీవే మా దేవుడివి. అయితే గతంలో
మేము ఇతర ప్రభువులను అనుసరించాం. మేము
ఇతర యజమానులకు చెందిన వాళ్లం కానీ
ప్రజలు ఇప్పుడు ఒకే ఒక్క పేరు, నీపేరు
మాత్రమే జ్ఞాపకం చేసుకోవాలని మేము
కోరుతున్నాం.
14 ఆ అబద్ధ దేవుళ్లు జీవం లేనివి ఆ దయ్యాలు
మరణం నుండి మళ్లీ లేవవు నీవు వాటిని నాశనం
చేయాలని నిర్ణయించావు. మేము వాటిని జ్ఞాపకం
చేసుకొనేటట్టు చేసే వాటన్నింటినీ నీవు నాశనం
చేశావు.
15 నీవు ప్రేమించే దేశానికి నీవు సహాయం చేశావు
ఇతరులు ఆ దేశాన్ని జయించకుండ నీవు నిలిపి
వేశావు.
16 యెహోవా, ప్రజలు కష్టంలో ఉన్నప్పుడు
నిన్ను జ్ఞాపకం చేసుకొంటారు. నీవు ప్రజలను
శిక్షించినప్పుడు వారు మౌన ప్రార్థనలు నీకు
చేస్తారు.
17 యెహోవా, మేం నీతో లేనప్పుడు మేం ప్రసవ
వేదన పడుతున్న స్త్రీలా ఉంటాం ఆమె ఏడు
స్తుంది, ప్రసవ బాధ పడుతుంది.
18 అదే విధంగా మాకు బాధ ఉంది మేము కంటాము,
కాని, గాలిని మాత్రమే. ప్రపంచానికి మేం కొత్త
మనుష్యుల్ని తయారు చేయం. దేశానికి మేం
రక్షణ కలిగించం
19 కాని యెహోవా చెప్పేదేమంటే, "నీ ప్రజలు
మరణించారు కానీ వారు మళ్లీ లేస్తారు నా ప్రజల
శరీరాలు మరణం నుండి లేస్తాయి. భూమిలోని
మృతులు లేచి, సంతోషిస్తారు. నిన్ను కప్పి
యున్న మంచు, ఒక కొత్త రోజు వెలుతురులా
ఉంది. ఒక కొత్త కాలం వస్తోందని అది సూచి
స్తుంది ప్రజలు ఇప్పుడు భూమిలో పాతిపెట్ట
బడ్డారు, కాని వారు నూతన జీవం పొందుతారు."

### తీర్పు: బహుమానం లేక శిక్ష

20 నా ప్రజలారా, మీ గదుల్లోకి వెళ్లండి. తలుపులకు
తాళాలు వేసుకోండి. కొద్దికాలం పాటు మీ
గదుల్లో దాక్కోండి. దేవుని కోపం తగ్గేంతవరకు
దాక్కోండి.
21 యెహోవా తన నివాసం విడిచి వస్తున్నాడు.
ప్రపంచంలోని మనుష్యులు చేసిన చెడు కార్యా
లను బట్టి దేవుడు వారికి తీర్పు తీరుస్తాడు.
చంపబడిన వారి రక్తాన్ని భూమి చూపిస్తుంది
భూమి ఇక ఎన్నటికీ చని పోయిన వాళ్లను
కప్పెట్టదు

27 ఆ సమయంలో వంకర సర్పమైన మక
రానికి ఆయన తీర్పు తీర్చును. యెహోవా
తన ఖడ్గం ప్రయోగిస్తాడు కఠినమైన, తన శక్తిగల
ఖడ్గంతో ఆయన మకర సర్పాన్ని ఆ మెలికల

సర్పాన్ని శిక్షిస్తాడు. ఆ పెద్ద ప్రాణిని సముద్రం
లోనే యెహోవా చంపేస్తాడు.
2 ఆ సమయంలో సంతోషకరమైన ద్రాక్ష తోటను
గూర్చి ప్రజలు పాటలు పాడుతారు.
3 “యెహోవాను, నేనే ఆ తోట విషయం శ్రద్ధ
తీసుకుంటాను. సరైన సమయంలో తోటకు
నీళ్లు పెడతాను. రాత్రింబవళ్లు ఆ తోటను నేను
కాపాడుతాను. ఆ తోటకు ఎవ్వరూ హాని
చేయరు.
4 నేను కోపంగా లేను. కానీ యుద్ధంలో ఎవరైనా
సరే ముళ్ల పొదల కంచె వేస్తే అప్పుడు నేను
దాని మీదికి వెళ్లి దానిని కాల్చివేస్తాను.
5 అయితే ఎవరైనా భద్రత కోసం నా దగ్గరకు
వస్తే నాతో సమాధాన పడాలని కోరితే, అలాంటి
వాడు వచ్చి నాతో సమా ధానపడాలి.
6 ప్రజలు నా దగ్గరకు వస్తారు మంచి వేరుల గల
మొక్కలా యాకోబు బలంగా ఉండేందుకు ఆ
ప్రజలు సహాయం చేస్తారు. వికసించ మొదలు
బెట్టిన మొక్కలా ఇశ్రాయేలు ఎదుగునట్లు ఆ
ప్రజలు చేస్తారు. అప్పుడు చెట్ల ఫలాల్లా, ఇశ్రా
యేలు పిల్లలతో దేశం నిండిపోతుంది.”

### దేవుడు ఇశ్రాయేలును దూరంగా పంపించి వేస్తాడు

[7]యెహోవా తన ప్రజలను ఎలా శిక్షిస్తాడు? గతంలో శత్రువులు ప్రజలను బాధించారు. యెహోవా కూడా అదే విధంగా బాధిస్తాడా? గతంలో ఎందరెందరో చంపివేయబడ్డారు. యెహోవా కూడా అలాగే చేసి, అనేక మందిని చంపేస్తాడా?

[8]యెహోవా తన ప్రజల భయాన్ని వెళ్లగొట్టేసి, వారిలో తనకుగల వివాదాన్ని పరిష్కరిస్తాడు. ఇశ్రాయేలీయులతో యెహోవా కఠినంగా మాట్లాడుతాడు. ఆయన మాటలు ఎడారి వేడి గాడ్పులా మండుతాయి.

[9]యాకోబు దోషం ఎలా క్షమించబడుతుంది? అతని పాపాలు తీసివేయబడేట్లుగా ఏం సంభవిస్తుంది? ఈ సంగతులు సంభవిస్తాయి: బలిపీఠం బండలు ధూళిగా చితుకగొట్టబడతాయి. తప్పు దేవుళ్లను పూజించేందుకు ఉపయోగించే విగ్రహాలు, బలిపీఠాలు నాశనం చేయబడతాయి.

[10]ఆ సమయంలో మహా పట్టణం ఖాళీగా, ఎడారిలా ఉంటుంది. ప్రజలంతా పారిపోయి ఉంటారు. ఆ పట్టణం పచ్చిక బయలులా ఉంటుంది. అక్కడ దూడలు గడ్డి తింటాయి. ద్రాక్ష కొమ్మల ఆకులను పశువులు తింటాయి. [11]ద్రాక్ష వల్లులు ఎండిపోతాయి. రెమ్మలు విరిగి పోతాయి. ఆ రెమ్మలను ఆడవాళ్లు పొయ్యిలో కట్టెలుగా ఉపయోగిస్తారు. ప్రజలు అర్థం చేసుకొనేందుకు నిరాకరిస్తారు. కనుక దేవుడు వారి సృష్టికర్త, వారిని ఆదరించడు. వారి సృష్టికర్త వారి మీద దయ చూపించడు. [12]ఆ సమయంలో యెహోవా తన ప్రజలను ఇతరులనుండి ప్రత్యేకించటం ప్రారంభిస్తాడు. యూఫ్రటీసు నది దగ్గర ఆయన ప్రారంభిస్తాడు. యూఫ్రటీసు నది మొదలు ఈజిప్టు నదివరకు గల తన ప్రజలందరినీ యెహోవా సమావేశ పరుస్తాడు.

మీరు ఇశ్రాయేలీయులు ఒక్కొక్కరుగా, ఒకే చోట చేర్చబడుతారు. [13]నా ప్రజలు అనేకమంది ఇప్పుడు అష్షూరులో నశించారు. నా ప్రజలు కొంతమంది ఈజిప్టుకు పారిపోయారు. అయితే ఆ సమయంలో గొప్ప బూర ఊదబడుతుంది. ఆ ప్రజలంతా యెరూషలేముకు తిరిగి వస్తారు. ఆ పరిశుద్ధ పర్వతం మీద యెహోవా యెదుట ఆ ప్రజలు సాష్టాంగ పడతారు.

### ఉత్తర ఇశ్రాయేలుకు హెచ్చరికలు

28 షోమ్రోనును చూడండి! ఎఫ్రాయిము
తాగుబోతులు ఆ పట్టణానికి గూర్చి గర్వి
స్తున్నారు. చుట్టూ ఐశ్వర్యవంతమైన లోయగల
కొండ మీద ఆ పట్టణం ఆసీన మయింది.
షోమ్రోను ప్రజలు తమ పట్టణం అందమైన పూల
కిరీటం అనుకొంటారు. కానీ వారు మద్యంతో
మత్తెక్కి ఉన్నారు మరియు “అందమైన ఈ
కిరీటం” కేవలం చస్తున్న ఒక మొక్క మాత్రమే.
2 చూడు, బలమూ, ధైర్యమూ గల ఒకడు నా
పభువు దగ్గర ఉన్నాడు. ఆ వ్యక్తి వడగండ్ల వర్షపు
తుఫానులా దేశంలోనికి వస్తాడు. తుఫాను వచ్చి
నట్టు ఆయన దేశంలోనికి వస్తాడు. దేశాన్ని
వరదలో ముంచెత్తే బల మైన నీటి ప్రవాహంలా
ఆయ ఉంటాడు. ఆ కిరీటాన్ని (సమరయి)
ఆయన నేలకేసి కొడ్తాడు.
3 ఎఫ్రాయిము తాగుబోతులు, తమ “అందమైన
కిరీటం” గూర్చి గర్విస్తున్నారు. కానీ ఆ పట్టణం
కాళ్ల కింద తొక్కబడుతుంది.
4 చుట్టూరా ఐశ్వర్యవంతమైన లోయగల ఆ
పట్టణం ఒక కొండమీద ఆసీనమై ఉంది. అయితే
ఆ “అందాల పూల కిరీటం” కేవలం చస్తున్న
ఒక మొక్క మాత్రమే ఆ పట్టణం వసంత కాలానికి
ముందు కాసే అంజూర పండులా ఉంటుంది.
ఒక వ్యక్తి ఆ అంజూరాలు ఒకటి చూస్తే అతడు
వెంటనే అంజూరం తెంపి, తింటాడు.

[5]ఆ సమయంలో సర్వశక్తిమంతుడైన యెహోవా “సౌందర్య కిరీటం” అవుతాడు. విడువబడిన తన ప్రజలకు ఆయనే “పూల అద్భుత కిరీటం” అవుతాడు. [6]అప్పుడు ప్రజలకు తీర్పు తీర్చే న్యాయమూర్తులకు యెహోవా జ్ఞానం ప్రసాదిస్తాడు. పట్టణ ద్వారం దగ్గర యుద్ధాలలో ఉండే ప్రజలకు యెహోవా బలం ప్రసా

దిస్తాడు. 7కానీ ఆ నాయకులు ఇప్పుడు తాగి మత్తులుగా
ఉన్నారు. యాజకులు, ప్రవక్తలు అందరూ ద్రాక్షరసం,
మద్యం తాగి మత్తెక్కి ఉన్నారు. వారు తూలి పడుతు
న్నారు. ప్రవక్తలు వారి దర్శనాలు చూచినప్పుడు
మత్తులుగా ఉన్నారు. న్యాయమూర్తులు వారి నిర్ణ
యాలు చేసేటప్పుడు మత్తులుగా ఉన్నారు. 8ప్రతి
బల్లా వాంతులతో నిండిపోయింది. ఎక్కడా శుభ్రమైన
స్థలం లేదు.

### దేవుడు తన ప్రజలకు సహాయం చేయాలని కోరుతున్నాడు

9యెహోవా ప్రజలకు ఒక పాఠం నేర్పించాలని
ప్రయత్నిస్తున్నాడు. ప్రజలు తన ఉపదేశాలను గ్రహిం
చేట్టు చేయాలని యెహోవా ప్రయత్నిస్తున్నాడు.
కానీ ప్రజలు చిన్న శిశువుల్లా ఉన్నారు. కొన్నాళ్ల నుంచే
తల్లి పాలు తాగటం మొదలు పెట్టిన చిన్న శిశువుల్లా
వారు ఉన్నారు. 10కనుక వాళ్లు చిన్న శిశువులు అన్నట్టే
యెహోవా వాళ్లతో మాట్లాడుతున్నాడు.

ఇక్కడ ఒక ఆజ్ఞ, అక్కడ ఒక ఆజ్ఞ ఇక్కడ
ఒక నియమం, అక్కడ ఒక నియమం
ఇక్కడ ఒక పాఠం, అక్కడ ఒక పాఠం.

11యెహోవా ఈ వింత విధానంలో మాట్లాడటం
ప్రయోగిస్తాడు, ఈ ప్రజలతో మాట్లాడటానికి ఆయన
ఇతర భాషలు ఉపయోగిస్తాడు.
12గతంలో దేవుడు ఆ ప్రజలతో మాట్లాడి "ఇదిగో
విశ్రాంతి స్థలం, ఇదే శాంతి స్థలం. అలసిపోయిన మను
ష్యులు వచ్చి విశ్రాంతి తీసుకోండి. ఇదే శాంతి స్థలం"
అని చెప్పాడు.

కానీ ప్రజలు దేవుని మాట వినపించుకోలేదు.
13అందుచేత దేవుని మాటలు విదేశీ భాషలా ఉన్నాయి:

ఇక్కడ ఒక ఆజ్ఞ, అక్కడ ఒక ఆజ్ఞ ఇక్కడ
ఒక నియమం, అక్కడ ఒక నియమం
ఇక్కడ ఒక పాఠం, అక్కడ ఒక పాఠం.

వారు చేసిందే వారికి నచ్చింది. కనుక ప్రజలు
వెనక్కు తగ్గి, ఓడించబడ్డారు. ప్రజలు పట్టుబడి, బంధిం
చబడ్డారు.

### దేవుని న్యాయ తీర్పును ఎవరూ తప్పించుకోలేరు

14యెరూషలేములో ఉన్న నాయకులారా,
యెహోవా సందేశం మీరు వినాలి. కానీ ఇప్పుడు
ఆయన మాట వినడానికి మీరు నిరాకరిస్తున్నారు.
15"మరణంతో మేము ఒక ఒడంబడిక చేసుకున్నాం.
చావు స్థలం, పాతాళంతో మాకు ఒక ఒప్పందం ఉంది.
కనుక మేము శిక్షించబడం. శిక్ష మమ్మల్ని బాధించ
కుండానే దాటి పోతుంది. మా మాయలు అబద్ధాల
చాటున మేము దాక్కొంటాం" అని మీరు చెబు
తున్నారు. 16ఆ విషయాల మూలంగా, నా ప్రభువు
యెహోవా చెబుతున్నాడు: "సీయోనులో నేల మీద
నేను ఒక బండను, ఒక మూలరాయిని ఉంచుతాను.
ఇది చాలా ప్రశస్తమైన రాయి. ముఖ్యమైన ఈ బండ
మీదనే సమస్తం నిర్మించబడుతుంది. ఆ బండను విశ్వ
సించిన వారు ఎవ్వరూ నిరాశ చెందరు.

17"ఒక గోడ తిన్నగా ఉన్నట్టు చూపించటానికి
మనుష్యులు గుండు కట్టిన దారం ఉపయోగిస్తారు.
అదే విధంగా ఏది సరైనదో చూపించేందుకు నేను
న్యాయం, మంచితనం ఉపయోగిస్తాను.

"చెడ్డ వాళ్లయిన మీరు మీ అబద్ధాలు, మాయల
వెనుక దాగుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. కానీ మీరు
శిక్షించబడతారు. మనం దాగుకొనే స్థలాలను నాశనం
చేసేందుకు వస్తున్న తుఫాను, లేక వరదలా అది
ఉంటుంది. 18మరణంతోటి మీ ఒడంబడిక తుడిచి
వేయబడుతుంది. పాతాళంతో మీ ఒడంబడిక మీకు
సహాయం చేయదు.

"ఒక వ్యక్తి వచ్చి మిమ్మల్ని శిక్షిస్తాడు. ఆయన
మిమ్మల్ని తన పాద ధూళిగా చేస్తాడు. 19ఆ వ్యక్తి
వచ్చి మిమ్మల్ని తీసుకొని వెళ్లిపోతాడు. మీ శిక్ష భయం
కరంగా ఉంటుంది. మీ శిక్ష ఉదయం పెందలాడే వచ్చి,
చాలా రాత్రి వరకు ఉంటుంది.

20"అప్పుడు మీకు ఈ కథ అర్థం అవుతుంది :
ఒక మనిషి చాల పొట్టి మంచం మీద నిద్రపోయేందుకు
ప్రయత్నించాడు. కప్పుకొనేందుకు సరిపడేంత
వెడల్పు లేని దుప్పటి అతని దగ్గర ఉంది. మంచం,
దుప్పటి నిష్ప్రయోజనమే, మీ ఒడంబడికలు
అలాంటివే."

21యెహోవా పెరాజీము వద్ద చేసినట్టు యుద్ధం
చేస్తాడు. గిబియోను లోయలో ఆయన కోపగించి
నట్టు యెహోవా కోపగిస్తాడు. తర్వాత యెహోవా
చేయాల్సిన వాటిని చేస్తాడు. యెహోవా కొన్ని వింత
పనులు చేస్తాడు. అయితే ఆయన తన పని ముగిస్తాడు.
ఆయన పని ఒక కొత్తవాని పని. 22మీరు వాటికి వ్యతి
రేకంగా పోరాడకూడదు. మీరు గనుక పోరాడితే మీ
చూట్టూ ఉన్న తాళ్లు మరింత బిగిసిపోతాయి.

నేను విన్న మాటలు మారవు. భూమి అంతటినీ
పాలించే సర్వశక్తిమంతుడైన యెహోవా నుండి ఆ
మాటలు వచ్చాయి. ఆ విషయాలు జరిగించ
బడతాయి.

### యెహోవా న్యాయంగా శిక్షిస్తాడు

23నేను మీతో చెప్పే సందేశాన్ని శ్రద్ధగా వినండి.
24ఒక రైతు తన పొలాన్ని ఎప్పటికీ దున్నుతూనే

ఉంటాడా? లేదు. అతడు ఎప్పుడూ భూమిని చదును
చేస్తూనే ఉంటాడా? లేదు. 25రైతు భూమిని సిద్ధం
చేసి, విత్తనాలు వేస్తాడు. రైతు వేర్వేరు విత్తనాలను
వేర్వేరు పద్ధతుల్లో వేస్తాడు. రైతు నల్ల జీలకర్ర
విత్తనాలు వెదజల్లుతాడు. తెల్ల జీలకర్ర విత్తనాలను
రైతు నేలమీద చల్లుతాడు. రైతు గోధుమలను వరుస
క్రమంలో నాటుతాడు. రైతు యవలను దాని ప్రత్యేక
స్థలంలో నాటుతాడు, మిరప మొలకలను తన పొలం
గట్ల మీద నాటుతాడు.

26మీకు ఒక పాఠం నేర్పించేందుకు మన దేవుడు
దీనిని వాడుతున్నాడు. దేవుడు తన ప్రజలను శిక్షించి
నప్పుడు న్యాయంగానే ఉన్నాడు అని ఈ ఉదాహరణ
తెలియజేస్తుంది. 27నల్ల జీలకర్ర దంచటానికి రైతు,
పదును పళ్లున్న పెద్ద పలకల్ని ఉపయోగిస్తాడా? లేదు.
జీలకర్ర దంచటానికి రైతు బండిని ఉపయోగిస్తాడా?
లేదు. ఆ విత్తనాల మీద గుల్లలను రాల్చడానికి అతడు
ఒక చిన్న కర్రను ఉపయోగిస్తాడు.

28ఒక స్త్రీ రొట్టె చేసేటప్పుడు ఆమె తన చేతులతో
ముద్దను చేసి, పిసుకుతుంది. కానీ ఆమె ఎప్పటికీ
అదే పని చేస్తూ ఉండదు. అదే విధంగా యెహోవా
తన ప్రజలను శిక్షిస్తాడు. బండి చక్రంతో ఆయన
వారిని భయపెడతాడు గాని ఆయన వారిని పూర్తిగా
చితుకగొట్టడు. అనేక గుర్రాలు వారిని అణగ తొక్క
నీయడు.

29ఇది సర్వశక్తిమంతుడైన యెహోవా సందేశం
యెహోవా అద్భుతమైన సలహా ఇస్తాడు. దేవుడు
నిజంగా జ్ఞానం గలవాడు.

### యెరూషలేము యెడల దేవుని ప్రేమ

29 దేవుడు చెబుతున్నాడు, "అరీయేలును
చూడండి! అరీయేలు, దావీదు మజిలీ చేసిన
పట్టణం. దాని పండుగలు సంవత్సరం సంవత్సరం కొన
సాగుతున్నాయి. 2అరీయేలును నేను శిక్షించాను ఆ
పట్టణం దుఃఖంతో, ఏడ్పుతో నిండిపోయింది. కానీ
అది ఎప్పటికీ నా అరీయేలే. 3"నీ చుట్టూ సైన్యాలను
ఉంచాను అరీయేలూ. నీకు విరోధంగా నేను యుద్ధ
గోపురాలను లేపాను. 4నీవు ఓడించబడి, నేల మట్టం
చేయబడ్డావు. ఇప్పుడు ఒక పిశాచి స్వరంలా నీ స్వరం
నేలల్లోంచి నాకు వినవస్తోంది. ధూళిలోంచి మెల్లగా
వినబడే స్వరంలా నీ మాటలు వినవస్తున్నాయి."
5అక్కడ చాలామంది కొత్తవాళ్లు దుమ్ముకణాల్లా
ఉన్నారు. గాలికి ఎగిరే పొట్టులాంటి క్రూరమైన మను
ష్యులు చాలామంది అక్కడ ఉన్నారు. 6సర్వశక్తిమంతు
డైన యెహోవా మిమ్మల్ని శిక్షించాడు. ఉరుములు,
భూకంపాలు, మహా గొప్ప శబ్దాలు ప్రయోగించి
యెహోవా మిమ్మల్ని శిక్షించాడు తుఫానులు, బలమైన
గాలులు, కాల్చివేసే అగ్ని ఉపయోగించి యెహోవా
నాశనం చేశాడు. 7అరీయేలు మీద ఎన్నెన్నో దేశాలు
యుద్ధం చేశాయి. అది రాత్రి వేళ కలిగే భయంకర
పీడ కలలాంటిది. అరీయేలు చుట్టూ సైన్యాలు వచ్చేసి
దానిని శిక్షించాయి. 8కానీ ఆ సైన్యాలకు గూడ అది
ఒక కలలా ఉంటుంది ఆ సైన్యాలకు అవసరమైనవి
దొరకవు. ఆకలితో ఉన్నవానికి అన్నం గూర్చి కల
వచ్చినట్టు ఉంటుంది. వాడు మేల్కొన్నప్పుడు ఆకలి
అలానే ఉంటుంది. దప్పిగొన్నవాడు నీళ్లను గూర్చి
కలగన్నట్టు ఉంటుంది. వాడు మేల్కొంటాడు, దాహం
తోనే ఉంటాడు. సీయోనుకు విరోధంగా పోరాడే రాజ్యా
లన్నింటి విషయంలోను ఇదే సత్యం. ఆ రాజ్యాలకు
కావాలనుకొన్నవి దొరకవు.

9 ఆశ్చర్యపడండి, విస్మయం చెందండి! మీరు
మత్తులవుతారు కాని ద్రాక్షరసంతో కాదు, చూచి
ఆశ్చర్యపడండి! మీరు తూలి, పడతారు కానీ
మద్యంతో కాదు.
10 యెహోవా మిమ్మల్ని నిద్రబుచ్చుతాడు
యెహోవా మీ కళ్లు మూస్తాడు (ప్రవక్తలే మీ
కళ్లు) యెహోవా మీ తలలు కప్పుతాడు
(ప్రవక్తలే మీ తలలు.)

11ఈ సంగతులు సంభవిస్తాయి, కానీ మీరు
గ్రహించరు అని నేను మీతో చెబుతున్నాను. మూసి
వేయబడి, ముద్ర వేయబడిన పుస్తకంలోని మాట
ల్లాంటివి నా మాటలు చదవటం వచ్చిన వానికి మీరు
పుస్తకం ఇచ్చి, చదవమని వానితో చెప్పండి.

కానీ ఆ వ్యక్తి, "ఈ పుస్తకం నేను చదవలేను. ఇది
మూయబడి ఉంది. నేను దీన్ని తెరువలేను" అంటాడు.
12లేకపోతే చదవటం రానివాడికి మీరు ఆ పుస్తకం
ఇచ్చి, వాడిని చదవమని చెప్పండి. ఆ వ్యక్తి, "నాకు
చదవటం రాదు గనుక నేను చదవలేను" అంటాడు.

13నా ప్రభువు అంటున్నాడు, "ఈ ప్రజలు నన్ను
ప్రేమిస్తున్నామని వారు అంటారు. వారి నోటి మాట
లతో నన్ను ఘనపరుస్తారు. కానీ వారి హృదయాలు
నాకు చాలా దూరంగా ఉన్నాయి. మానవపరమైన
నియమాలను కంఠస్థం చేయటం తప్ప వారు నాకు
చూపించే గౌరవం ఇంకొకటి లేదు. 14అందుచేత
శక్తిగల, అద్భుత కార్యాలు ఇంకా చేస్తూనే ఉండి, నేను
ఈ ప్రజలను ఆశ్చర్యపరుస్తూనే ఉంటాను. వారి
జ్ఞానులు తమ జ్ఞానం పోగొట్టుకొంటారు. వారి జ్ఞానులు
గ్రహించలేక పోతారు." 15ఆ ప్రజలు విషయాలను
యెహోవాకు తెలియకుండా దాచిపెట్టాలని ప్రయత్ని
స్తారు. యెహోవా గ్రహించలేడు అని వారు అను
కొంటారు. వారు తమ చెడుకార్యాలను చీకట్లో చేస్తారు.
"మనల్ని ఎవరూ చూడలేరు. మనం ఎవరయిందీ
ఎవరూ తెలుసుకోలేరు" అని వారు చెప్పుకొంటారు.

[16]మీరు గందరగోళం అయ్యారు. మట్టి, కుమ్మరికి సమానం అని అనుకొంటారు మీరు. "నీవేమి నన్ను తయారు చేయలేదు" పొమ్మని సృష్టించబడినది, తనను సృష్టించిన వానితో చెప్పొచ్చని మీరు తలస్తారు. "నీకు తెలియదులే" అని కుమ్మరితో కుండ చెప్పినట్టుంది ఇది.

### ఒక మంచి సమయం వస్తుంది

[17]అసలు సత్యం ఇది. కొంచెం కాలం తర్వాత కర్మెలు పర్వతంలాగే లెబానోను పర్వతం కూడ మంచి నేల అవుతుంది. మరియు కర్మెలు పర్వతం దట్టమైన అరణ్యంలా ఉంటుంది. [18]చెవిటివారు కూడ గ్రంథంలోని మాటలు వింటారు. గ్రుడ్డివారు చీకటి, మంచు గుండా చూస్తారు. [19]పేద ప్రజలను యెహోవా సంతోషపరుస్తాడు. ఇశ్రాయేలీయుల పరిశుద్ధునిలో పేద ప్రజలు ఆనందిస్తారు.

[20]నీచులు, క్రూరులు అంతమయిన తర్వాత ఇది జరుగుతుంది. చెడు కార్యాలు చేయటంలో ఆనందించే వాళ్లు పోయిన తర్వాత ఇది జరుగుతుంది. [21](ఆ మనుష్యులు మంచివాళ్ల గూర్చి అబద్ధం చెబుతారు. వారు న్యాయస్థానంలో ప్రజలను మోసం చేయాలని చూస్తారు. నిర్దోషులను వారు నాశనం చేయాలని చూస్తారు.)

[22]కనుక యాకోబు వంశంతో యెహోవా మాట్లాడుతున్నాడు. (ఈ యెహోవాయే అబ్రాహామును విడిపించింది.) యెహోవా చెబు తున్నాడు: "ఇప్పుడు యాకోబు (ఇశ్రాయేలు ప్రజలు) ఇబ్బందిపడడు, సిగ్గుపడడు. [23]అతడు తన పిల్లలందర్నీ చూస్తాడు, నా నామం పవిత్రం అని చెబుతాడు. ఈ ప్రజలందర్నీ నా చేతులతో నేనే చేశాను, యాకోబు యొక్క పరిశుద్ధుడు (దేవుడు) చాలా ప్రత్యేకం అని ఈ ప్రజలు చెబుతారు. ఈ ప్రజలు ఇశ్రాయేలు దేవుణ్ణి సన్మానిస్తారు.

[24]ఈ ప్రజల్లో చాలా మందికి అర్థం గాక చెడ్డ పనులు చేశారు. ఈ ప్రజలు అర్థం చేసికోలేదు కానీ వాళ్ల పాఠం వాళ్లు నేర్చుకొంటారు."

### ఇశ్రాయేలు, దేవుణ్ణి నమ్మాలి, కాని ఈజిప్టును కాదు

**30** యెహోవా చెప్పాడు, "ఈ పిల్లల్ని చూడండి. వాళ్లు నాకు లోబడరు. వాళ్లు పథకాలు వేస్తారు గాని సహాయం చేయమని నన్ను అడగరు. ఇతర దేశాలతో వారు ఒడంబడికలు చేసుకుంటారు. కానీ నా ఆత్మ ఆ ఒడంబడికలను కోరటం లేదు. ఈ ప్రజలు ఇంకా మరిన్ని పాపాలు వారికి చేర్చుకొంటున్నారు.

[2]ఈ ప్రజలు సహాయం కోసం ఈజిప్టుకు దిగి వెళ్తున్నారు కానీ చేయాల్సిన సరైన పని అదేనా అని వారు నన్ను అడగలేదు. ఫరోచేత తాము రక్షించబడతామని వారు నిరీక్షిస్తున్నారు. వాళ్లను ఈజిప్టు కాపాడాలని వారి కోరిక.

[3]"అయితే నేను మీకు చెబుతున్నాను, ఈజిప్టులో దాగుకోవటం మీకేం సహాయపడదు. ఈజిప్టు మిమ్మల్ని కాపాడజాలదు. [4]మీ నాయకులు సోయనుకు వెళ్లారు, మీ రాయబారులు హానేసుకు వెళ్లారు. [5]కానీ వారు నిరాశ చెందుతారు. వారికి సహాయం చేయలేని దేశం మీద వారు ఆధారపడ్తున్నారు. ఈజిప్టు నిష్ప్రయోజనమయింది. ఈజిప్టు ఏ సహాయం చేయలేదు. ఈజిప్టు కేవలం సిగ్గు, అవమానం కలిగిస్తుంది."

### యూదాకు దేవుని సందేశం

[6]నెగెవ్‌లో జంతువులను గూర్చి విచారకరమైన సందేశం:

నెగెవ్ ప్రమాదకరమైన స్థలం. ఈ దేశంనిండా సింహాలు, సివంగులు, తాపకరమైన త్రాచుపాములు ఉంటాయి. కానీ కొంతమంది ప్రజలు నెగెవ్‌గుండా ప్రయాణం చేస్తున్నారు. వారు ఈజిప్టు వెళ్తున్నారు. ఆ మనుష్యులు వారి ధనాన్ని గాడిదల మీదవేశారు. ఆ మనుష్యులు వారి సంపదలను ఒంటెల మీదవేశారు. అంటే ఆ ప్రజలు సహాయం చేయలేని రాజ్యంమీద ఆధారపడుతున్నారని దీని అర్థం. [7]ఈజిప్టు పనికిమాలిన దేశం ఈజిప్టు సహాయం విలువ శూన్యం. కనుక ఈజిప్టును, "ఏమీ చేయలేని మహా సర్పం" అని నేను పిలుస్తాను.

[8]ఇప్పుడు, ప్రజలందరూ చూడగలిగేట్టు దీనిని ఒక పలక మీద వ్రాయి. దీనిని ఒక గ్రంథంలో వ్రాయి. చివరి దినాలకోసం దీనిని వ్రాయి. అది ఎప్పుడో భవిష్యత్తులో చాలాకాలం తర్వాత.

[9]తల్లిదండ్రులకు విధేయులు కాని పిల్లల్లా ఉన్నారు ఈ ప్రజలు. వారు అబద్ధాలు చెప్పి, యెహోవా ఉపదేశాలు ఆలకించేందుకు నిరాకరిస్తారు. [10]వారు ప్రవక్తలతో చెబుతారు: "మేము చేయాల్సిన వాటిని గూర్చి దర్శనాలు చూడకండి. మాతో సత్యం చెప్పకండి. మాకు చక్కని విషయాలు చెప్పి, మాకు హాయి కలిగించండి. మాకోసం మంచి వాటినే చూడండి. [11]నిజంగానే జరిగే వాటిని చూడటం మానేయండి. మా దారిలోంచి తప్పుకోండి. ఇశ్రాయేలీయుల పరిశుద్ధుని గూర్చి మాకు చెప్పటం చాలించండి."

### యూదా సహాయం కేవలం దేవునినుంచి వస్తుంది

[12]ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు (దేవుడు) చెబుతున్నాడు: "యెహోవా నుండి వచ్చిన ఈ సందేశాన్ని అంగీకరించటానికి మీరు నిరాకరించారు. మీ సహాయం కోసం మీరు పోరాటం మీద, అబద్ధాల మీద ఆధారపడాలని కోరుకొంటున్నారు. [13]ఈ విషయాల్లో మీరు

దోషులు గనుక మీరు బీటలు వారిన గోడల్లా ఉన్నారు.
ఆ గోడ పడిపోయి చిన్న చిన్న ముక్కలై పోతుంది.
14ఆ ముక్కలు పనికిమాలినవి. ఆ ముక్కలు మంట
ల్లోంచి ఒక నిప్పుకణం తెచ్చేందుకు పనికిరావు, చెరువు
లోంచి నీళ్లు తెచ్చేందుకు పనికిరావు."
15"మీరు తిరిగి నా దగ్గరకు వస్తే మీరు రక్షించ
బడుతారు. మీరు నన్ను విశ్వసిస్తే, మీకు ఉన్న ఒకే
బలం మీకు వస్తుంది. అయితే మీరు మౌనంగా
ఉండాలి" అంటున్నాడు ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు,
యెహోవా, నా ప్రభువు. కానీ అలా చేయటం మీకు
ఇష్టం లేదు.
16మీరు "మేము ఎక్కి పారిపోయేందుకు మాకు
గుర్రాలు అవసరం" అంటారు. అది నిజమే, మీరు
గుర్రాల మీద పారిపోతారు. కానీ శత్రువు మిమ్మల్ని
తరుముతాడు. మరియు మీ గుర్రాలకంటె మీ శత్రువు
వేగం ఎక్కువ. 17ఒక శత్రువు బెదిరిస్తే, మీ వాళ్లు
వేయిమంది పారిపోతారు. శత్రువులు అయిదుగురు
బెదిరిస్తే, మీరు మొత్తం వారినుండి పారిపోతారు. మీ
సైన్యంలో మిగిలేదల్లా, ఏదో ఒక కొండమీద జెండా
కర్ర మాత్రమే.
18యెహోవా మీకు తన దయ చూపించాలని
కోరుతున్నాడు. యెహోవా కనిపెడ్తున్నాడు.
యెహోవా లేచి, మిమ్మల్ని ఆదరించాలని కోరు
తున్నాడు. యెహోవా దేవుడు న్యాయవంతుడు,
యెహోవా సహాయం కోసం వేచి ఉండే ప్రతి వ్యక్తి
ఆశీర్వదించబడతాడు.
19యెహోవా ప్రజలు సీయోను కొండమీద
యెరూషలేములో నివసిస్తారు. మీరు ఏడుస్తూనే
ఉండరు. యెహోవా మీ ఏడ్పు వింటాడు, ఆయన
మిమ్మల్ని ఆదరిస్తాడు. యెహోవా మీ మొర
వింటాడు. ఆయన మీకు సహాయం చేస్తాడు.

### దేవుడు తన ప్రజలకు సహాయం చేస్తాడు

20గతంలో నా ప్రభువు (దేవుడు) మీకు దుఃఖం,
విచారం ఇచ్చాడు. అది మీరు ప్రతిరోజూ రొట్టె
తిన్నట్టు, నీళ్లు తాగినట్టుగా ఉండేది. అయితే, దేవుడు
మీ ఉపదేశకుడు, ఆయన ఇకమీదట మీనుండి దాగు
కొని ఉండడు. మీ ఉపదేశకుని మీరు మీ కళ్లారా
చూస్తారు. 21అప్పుడు మీరు తప్పుచేసి, తప్పు
మార్గంలో పోతే (కుడికి కావచ్చు, ఎడమకు కావచ్చు)
"ఇదే సరైన మార్గం, మీరు ఇలా వెళ్లాలి" అని ఒక
స్వరం మీ వెనుకనుండి చెప్పటం మీరు వింటారు.
22వెండి బంగారాల పూత విగ్రహాలు మీకు
ఉన్నాయి. ఆ తప్పుడు దేవుళ్లు మిమ్మల్ని మైల
(పాప భూయిష్టం) చేశారు. కానీ ఆ తప్పుడు దేవుళ్లను
కొలవటం మీరు చాలిస్తారు. పనికిమాలిన మైలగుడ్డల్లా
ఆ దేవుళ్లను మీరు పారవేస్తారు. 23ఆ కాలంలో
యెహోవా మీకు వర్షం పంపిస్తాడు. భూమిలో మీరు
విత్తనాలు నాటుతారు, భూమి మీకు పంట పండిస్తుంది.
మీకు విస్తారమైన పంట లభిస్తుంది. మీ పశువులకు
మీ పొలాల్లో విస్తారమైన మేత ఉంటుంది. మీ గొర్రెలకు
విశాలమైన బీళ్లు ఉంటాయి. 24మీ పశువులకు, గాడి
దలకు కావలసినంత ఆహారం ఉంటుంది. ఆహారం
సమృద్ధిగా ఉంటుంది. మీ పశువులు తినే మేతను
పరచేందుకు మీరు చేటను, జల్లెడను ఉపయో గించాల్సి
వస్తుంది. 25ప్రతి పర్వతం, కొండపైన నీటి వాగులు
నిండుగా ప్రవహిస్తాయి. అనేక మంది ప్రజలు మర
ణించిన తర్వాత గోపురాలు కూలగొట్టబడిన తర్వాత
ఈ సంగతులు జరుగుతాయి.
26ఆ సమయంలో చంద్రకాంతి సూర్యకాంతిలా
ప్రకాశిస్తుంది. సూర్యకాంతి ఇప్పటికంటె ఏడు రెట్లు
ఎక్కువ ప్రకాశవంతంగా ఉంటుంది. ఒక్కరోజు సూర్య
కాంతి నిండు వారపు కాంతిలా ఉంటుంది. యెహోవా
తన ప్రజల గాయాలను కట్టి, వారు తిన్న దెబ్బల
బాధను స్వస్థపరచిన తరువాత ఈ సంగతులు జరుగు
తాయి.
27చూడండి! చాలా దూరం నుండి యెహోవా
పేరు వస్తోంది. ఆయన కోపం దట్టమైన పొగ మేఘా
లతో కూడిన అగ్నిలా ఉంది. యెహోవా నోరు
కోపంతో నిండి ఉంది, ఆయన నాలుక మండుతోన్న
మంటలా ఉంది. 28యెహోవా ఊపిరి (ఆత్మ) గొంతు
వరకు పొంగిన మహా నదిలా ఉంది. యెహోవా రాజ్యా
లకు తీర్పు తీరుస్తాడు. 'నాశనం చేసే జల్లెడలో'
ఆయన వారిని జల్లించినట్టు ఉంటుంది. యెహోవా
వారిని అదుపులో ఉంచుతాడు. ఒక జంతువును అదు
పులో ఉంచే కళ్లెం, మనుష్యుల దవడల్లో ఉంచినట్టుగా
అది ఉంటుంది.
29ఆ సమయంలో మీరు ఆనందగీతాలు పాడు
తారు. ఆ సమయంలో మీరు ఒక పండుగ ప్రారంభిం
చిన రాత్రిలా ఉంటుంది. యెహోవా పర్వతానికి నడిచే
టప్పుడు మీరు ఎంతో సంతోషిస్తారు. ఇశ్రాయేలీ
యుల బండ, యెహోవాను ఆరాధించేందుకు వెళ్లే
మార్గంలో పిల్లనగ్రోవి వినేటప్పుడు మీరు ఎంతగానో
సంతోషిస్తారు.
30యెహోవా ప్రజలంతా తన మహా స్వరం ఆల
కించేట్టు చేస్తాడు. యెహోవా తన శక్తిగల హస్తం
కోపంగా దిగి రావటం ప్రజలంతా చూచేట్టుగా చేస్తాడు.
ఆ హస్తం సమస్తం కాల్చివేసే మహా మంటలా ఉంటుంది.
విస్తారమైన వడగండ్లు, వర్షంతో నిండిన గొప్ప తుఫా
నులా ఉంటుంది యెహోవా శక్తి. 31అష్షూరు
యెహోవా స్వరం విన్నప్పుడు భయపడుతాడు.
యెహోవా అష్షూరును దండంతో కొడతాడు.
32యెహోవా అష్షూరును కొడతాడు, అది డప్పుల
మీద, సితార మీద సంగీతం వాయించినట్టుగా

ఉంటుంది. యెహోవా తన గొప్ప హస్తంతో అష్షూరును ఓడిస్తాడు. 33తోపెతు చాలాకాలంగా సిద్ధం చేయబడి ఉంది. అది రాజుకోసం సిద్ధంగా ఉంది. అది చాలా లోతుగా వెడల్పుగా చేయబడింది. అక్కడ చాలా పెద్దగా కట్టెలు పేర్చి ఉన్నాయి. అగ్ని ఉంది. మరియు యెహోవా ఊపిరి (ఆత్మ) అగ్ని గంధక ప్రవాహంలా వచ్చి, దానిని కాల్చివేస్తుంది.

### ఇశ్రాయేలు దేవుని శక్తిమీద ఆధార పడాలి

31 సహాయం కోసం ఈజిప్టుకు దిగి వెళ్తున్న ఆ ప్రజలను చూడండి. ప్రజలు గుర్రాల కోసం అడుగుతున్నారు. గుర్రాలు వారిని రక్షిస్తాయని వారనుకొంటున్నారు. ఈజిప్టు రథాలు, గుర్రాలపై సైనికులు వారిని కాపాడుతారని ఆ ప్రజలు నిరీక్షిస్తున్నారు. ఆ సైన్యం చాలా పెద్దది. కనుక వారు క్షేమంగా ఉన్నాం అని ప్రజలు అనుకొంటున్నారు. ఇశ్రాయేలీయుల పరిశుద్ధుని (దేవుడు) ప్రజలు విశ్వసించటం లేదు. ప్రజలు సహాయం కోసం యెహోవాను అడుగుట లేదు.

2అయితే జ్ఞానం గలవాడు యెహోవాయే. మరియు వారికి కష్టం రప్పించేవాడూ యెహోవాయే. యెహోవా ఆదేశాన్ని ప్రజలు మార్చజాలరు. యెహోవా లేచి దుష్టుల మీద (యూదా) పోరాడుతాడు. వారికి సహాయం చేయాలని ప్రయత్నించే వారి (ఈజిప్టు) మీద యెహోవా పోరాడుతాడు.

3ఈజిప్టు ప్రజలు కేవలం మానవమాత్రులే దేవుడు కారు. ఈజిప్టు గుర్రాలు కేవలం జంతువులే, ఆత్మకావు. యెహోవా తన హస్తం చాపగా, సహాయకుడు (ఈజిప్టు) ఓడించబడతాడు. సహాయం కోరిన ప్రజలు (యూదా) పతనం అవుతారు. ఆ మనుష్యులంతా ఒక్కుమ్మడిగా నాశనం చేయబడతారు.

4"ఒక సింహంగాని, సింహపు పిల్లగాని తినటానికి ఒక జంతువును పట్టుకొంటే, ఆ సింహం, చచ్చిన జంతువు మీద నిలబడి గర్జిస్తుంది. ఆ సమయంలో ఆ గొప్ప సింహాన్ని ఏదీ భయపెట్టలేదు. మనుష్యులు వచ్చి, సింహం మీద కేకలు వేస్తే, సింహం భయపడదు. మనుష్యులు పెద్ద ధ్వని చేయవచ్చు కానీ సింహం మాత్రం పారిపోదు" అని యెహోవా నాతో చెప్పాడు.

అదే విధంగా సర్వశక్తిమంతుడైన యెహోవా సీయోను కొండమీద దిగివస్తాడు. ఆ కొండ మీద యెహోవా పోరాడతాడు. 5పక్షులు వాటి గూళ్ల చుట్టూ ఎగిరినట్టు, సర్వశక్తిమంతుడైన యెహోవా యెరూషలేమును కాపాడుతాడు. యెహోవా దానిని రక్షిస్తాడు. యెహోవా "దానిపై దాటి," యెరూషలేమును రక్షిస్తాడు.

6ఇశ్రాయేలీయులారా, మీరు దేవుని మీద తిరుగుబాటు చేశారు. మీరు తిరిగి దేవుని దగ్గరకు రావాలి. 7మీరు తయారు చేసిన వెండి, బంగారు విగ్రహాలను ప్రజలు పూజించటం అప్పుడు మానివేస్తారు. మీరు ఆ విగ్రహాలను తయారు చేసినప్పుడు మీరు నిజంగా పాపం చేసారు.

8నిజమే, అష్షూరు ఖడ్గం చేత ఓడించబడుతుంది, కానీ ఆ ఖడ్గం మానవ ఖడ్గం కాదు. అష్షూరు ఓడించబడుతుంది. కానీ ఆ నాశనం మనిషి ఖడ్గం ద్వారా జరగదు. అష్షూరు దేవుని ఖడ్గం నుండి పారిపోతుంది. కానీ యువకులు పట్టుబడి, బానిసలవుతారు.

9వారి భద్రతా స్థలం నాశనం చేయబడుతుంది. వారి నాయకులు ఓడించబడి, వారి పతాకాన్ని విడిచి పెడ్తారు. ఆ విషయాలన్నీ యెహోవా చెప్పాడు. యెహోవా అగ్ని (బలిపీఠం) సీయోను మీద ఉంది. యెహోవా కొలిమి (బలిపీఠం) యెరూషలేములో ఉంది.

### నాయకులు మంచివారిగాను, నీతిమంతులుగాను ఉండాలి

32 నేను చెప్పే విషయాలు విను. ఒక రాజు మంచిని పెంచే విధంగా పాలించాలి. నాయకులు ప్రజలను నడిపించేటప్పుడు వారు న్యాయమైన తీర్మానాలు చేయాలి. 2ఇలా జరిగితే, అప్పుడు గాలి వాన నుండి దాగుకొనే చోటులా ఉంటాడు ఆ రాజు. అది ఎండిన భూమిలో నీటి కాలువలు ప్రవహించినట్టుగా ఉంటుంది. వేడి ప్రదేశంలో ఒక పెద్ద బండ చాటున చల్లని నీడలా ఉంటుంది అది. 3ప్రజలు సహాయం కోసం రాజువైపు తిరుగుతారు, వారు ఆయన చెప్పే మాటలు నిజంగా వింటారు. 4ఇప్పుడు గందరగోళంలో పడిన మనుష్యులు గ్రహించగలుగుతారు. ఇప్పుడు తేటగా మాట్లాడలేని మనుష్యులు, అప్పుడు తేటగా, వేగంగా మాట్లాడగలుగుతారు. 5వెర్రివాళ్లు గొప్పవాళ్లని పిలువబడరు. రహస్య పథకాలు వేసే వారిని ప్రజలు గౌరవించరు.

6తెలివి తక్కువ వాడు తెలివి తక్కువ సంగతులు చెబుతాడు, అతడు చెడ్డపనులు చేయాలని తన మనసులో ఆలోచిస్తాడు. తెలివి తక్కువ వాడు తప్పు పనులు చేయాలనుకొంటాడు. తెలివి తక్కువ వాడు యెహోవాను గూర్చి చెడ్డ మాటలు చెబుతాడు. తెలివి తక్కువ వాడు ఆకలితో ఉన్న వాళ్లను అన్నం తిననీయడు. తెలివి తక్కువ వాడు దప్పిగొన్న వారిని నీళ్లు తాగనివ్వడు. 7ఆ తెలివి తక్కువ వాడు చెడును సాధనంగా వాడుకొంటాడు. పేద ప్రజల దగ్గర్నుండి సమస్తం దోచుకొనేందుకు అతడు పథకం వేస్తాడు. ఆ తెలివి తక్కువ వాడు పేద ప్రజలను గూర్చి అబద్ధాలు చెబుతాడు. వాని అబద్ధాలు పేదవారికి న్యాయం జరుగకుండా చేస్తాయి. 8అయితే మంచి నాయకుడు మంచి పనులు చేయాలని ఆలోచిస్తాడు. ఆ మంచి పనులే అతణ్ణి మంచి నాయకుడ్ని చేస్తాయి.

### కఠిన సమయాలు వస్తున్నాయి

9స్త్రీలు కొందరు ఇప్పుడు నెమ్మదిగా ఉన్నారు.
మీరు క్షేమం అనుకొంటున్నారు. కానీ మీరు లేచి,
నేను చెప్పే మాటలు వినాలి. 10స్త్రీలారా మీరు ఇప్పుడు
క్షేమంగా ఉన్నాం అనుకొంటున్నారు. కానీ ఒక సంవ
త్సరం తర్వాత మీకు కష్టం వస్తుంది. ఎందుకంటే
వచ్చే సంవత్సరం మీరు కూర్చుకొనేందుకు ద్రాక్ష
పండ్లు ఉండవు గనుక మీరు ద్రాక్ష పండ్లు ఏరుకోరు.
11స్త్రీలారా మీరు ఇప్పుడు నెమ్మదిగా ఉన్నారు.
కానీ మీరు భయపడాలి. స్త్రీలారా, ఇప్పుడు మీరు
క్షేమంగా ఉన్నాం అనుకొంటున్నారు. కానీ మీరు దిగులు
పడాలి. మీ అందమైన వస్త్రాలు తీసివేసి, విచార వస్త్రాలు
ధరించండి. ఆ బట్టలు మీ నడుములకు చుట్టుకోండి.
12దుఃఖంతో నిండిన మీ రొమ్ములను ఆ దుఃఖ
వస్త్రాలతో కప్పుకొనండి.

మీ పొలాలు ఖాళీగా ఉన్నాయి గనుక ఏడ్వండి.
మీ ద్రాక్ష తోటలు ఒకప్పుడు ద్రాక్ష పండ్లు ఇచ్చాయి
కానీ ఇప్పుడు అవి ఖాళీ. 13నా ప్రజల భూమి కోసం
ఏడ్వండి, ముళ్లకంపలు, గచ్చ పొదలు మాత్రమే
అక్కడ పెరుగుతాయి గనుక ఏడ్వండి. పట్టణం కోసం,
ఒకప్పుడు ఆనందంతో నిండిన అన్ని గృహాల కోసం
ఏడ్వండి. 14ప్రజలు రాజధాని నగరం విడిచి పెట్టేస్తారు.
రాజ భవనం, గోపురాలు ఖాళీగా విడిచిపెట్టబడతాయి.
ప్రజలు ఇండ్లలో నివసించరు. వారు గుహలలో నివ
సిస్తారు. అడవి గాడిదలు, గొర్రెలు పట్టణంలో నివ
సిస్తాయి. పశువులు అక్కడ గడ్డి మేయటానికి వెళ్తాయి.
15-16దేవుడు పైనుండి తన ఆత్మను మనకు
ఇచ్చేంతవరకు ఇది కొనసాగుతుంది. ఇప్పుడు దేశంలో
మంచి లేదు. అది ఒక అరణ్యంలా ఉంది. కానీ భవిష్య
త్తులో ఆ అరణ్యం కర్మెలు దేశంలా ఉంటుంది, అక్కడ
న్యాయమైన తీర్పు వుంటుంది. మరియు కర్మెలు
పచ్చని అడవిలా ఉంటుంది. అక్కడ మంచితనం
ఉంటుంది. 17ఆ మంచితనం శాంతి, భద్రతలు తెచ్చి
పెడ్తుంది. 18అందమైన శాంతి వనంలో నా ప్రజలు
నివసిస్తారు. క్షేమకరమైన గుడారాల్లో నా ప్రజలు
నివసిస్తారు. నెమ్మదైన, శాంతస్థలాల్లో వారు నివసిస్తారు.
19కానీ ఈ సంగతులు జరుగక ముందు అరణ్యం
కూలిపోవాలి. ఆ పట్టణం ఓడించబడాలి. 20మీలో
కొంతమంది ప్రతి కాలువ దగ్గరా విత్తనాలు విత్తుతారు.
మీ పశువులను, గాడిదలను మీరు స్వేచ్ఛగా తిరుగ
నిస్తారు, తిననిస్తారు. మీరు చాలా సంతోషంగా
ఉంటారు.

### చెడుగు మరింత చెడుగును పుట్టిస్తుంది

33 మీరు యుద్ధం చేసి ప్రజల దగ్గర్నుండి దొంగి
లిస్తారు, ఆ ప్రజలు మాత్రం మీ దగ్గర
ఎన్నడూ ఏమీ దొంగిలించలేదు. మీరు ప్రజల మీద
దాడిచేస్తారు. ఆ ప్రజలు మిమ్మల్ని ఎన్నడూ ఎదిరించ
లేదు. కనుక మీరు దొంగిలించటం మాని వేసినప్పుడు
ఇతరులు మీ దగ్గర దొంగిలించటం మొదలు పెడ్తారు.
మీరు ప్రజల మీద పడటం మానివేసినప్పుడు, ఆ
ప్రజలు మీ మీద పడటం మొదలు పెడ్తారు. అప్పుడు
మీరంటారు.

2 “యెహోవా మామీద దయ చూపు నీ సహాయం
కోసం మేము కనిపెట్టాం యెహోవా, ప్రతి
ఉదయం మాకు బలం దయచేయి. మేం
కష్టంలో ఉన్నప్పుడు మమ్మల్ని రక్షించు.
3 నీ శక్తిగల స్వరం ప్రజలను భయపెడ్తుంది కనుక
వారు నీ దగ్గర్నుండి పారిపోతారు. నీ
మాహాత్మ్యం రాజ్యాలనే పారిపోయేట్టు
చేస్తుంది.”

4మీరు యుద్ధంలో వస్తువులు దొంగిలించారు. ఆ
వస్తువులు మీ దగ్గర్నుండి తీసుకోబడతాయి. చాలా,
చాలామంది వచ్చి మీ ధనాన్ని దోచుకొంటారు. అది
మిడతలు వచ్చి మీ పంటలన్నింటినీ తినివేసే సంద
ర్భంలాగా వుంటుంది.
5యెహోవా ఎంతో గొప్పవాడు. ఆయన మహా
ఉన్నత స్థలంలో ఉంటాడు. సీయోనును న్యాయంతో,
మంచితనంతో యెహోవా నింపుతాడు.
6యెరూషలేమూ, నీవు దేవుని జ్ఞానంతో, తెలివితో
ఐశ్వర్యవంతంగా ఉన్నావు. నీవు రక్షణతో ఐశ్వర్య
వంతంగా ఉన్నావు. నీవు యెహోవాను గౌరవిస్తావు.
అది నిన్ను ఐశ్వర్యవంతురాలిగా చేస్తుంది. కనుక నీవు
కొనసాగుతావు అని నీవు తెలుసుకోవచ్చు.
7కానీ, విను! బయట దేవదూతలు ఏడుస్తున్నారు.
శాంతి సందేశం తీసుకొనివచ్చే ఆ దూతలు చాలా
గట్టిగా ఏడుస్తున్నారు. 8రోడ్లు నాశనం అయ్యాయి.
వీధుల్లో ఎవ్వరూ నడవటం లేదు. ప్రజలు వారు
చేసుకున్న ఒడంబడికలను ఉల్లంఘించారు. సాక్షుల
రుజువులను అంగీకరించటానికి ప్రజలు నిరాకరిస్తు
న్నారు. ఎవ్వరూ ఇతరులను గౌరవించటంలేదు. 9దేశం
వ్యాధిగ్రస్తమై, చస్తూ ఉంది. లెబానోను చస్తూ ఉంది,
షారోను లోయ ఎండిపోయి, ఖాళీగా ఉంది. బాషాను,
కర్మెలులో ఒకప్పుడు అందమైన మొక్కలు పెరిగాయి
కానీ ఆ మొక్కలు ఎదగటం మానేశాయి.
10యెహోవా చెబుతున్నాడు, “ఇప్పుడు నేను
లేచి నా మహిమను చూపిస్తాను. నేను ఇప్పుడు ప్రజ
లకు ప్రముఖుడనవుతాను. 11ప్రజలారా మీరు పనికి
మాలిన పనులు చేశారు. ఆ పనులు గడ్డిలా, గడ్డిపోచలా
ఉన్నాయి. అవి దేనికీ పనికిరావు. మీ ఆత్మ అగ్నిలా
ఉండి మిమ్మల్ని కాల్చేస్తుంది. 12మనుష్యుల ఎముకలు
సున్నంలా అయ్యేంత వరకు వారు కాల్చబడుతారు.

ప్రజలు ముళ్లకంపల్లా, ఎండిపోయిన పొదల్లా త్వరగా
కాలిపోతారు.
13“దూరదేశాల్లో ఉన్న ప్రజలారా నేను చేసిన కార్యా
లను గూర్చి వినండి. నాకు దగ్గర్లో వున్న ప్రజలారా,
మీరు నా శక్తిని గూర్చి తెలుసుకోండి.”
14సీయోనులో పాపులు భయపడుతున్నారు. చెడ్డ
పనులు చేసేవారు భయంతో వణకుతున్నారు.
“మనల్ని నాశనం చేసే ఈ అగ్నిలో నుండి మనలో
ఎవరైనా బతకగలమా? శాశ్వతంగా మండుతూ ఉండే
ఈ అగ్ని దగ్గర ఎవరు బతకగలరు?” అని
వారంటున్నారు.
15మంచివాళ్లు, నిజాయితీపరులు డబ్బుకోసం
ఇతరులను బాధించని వాళ్లు ఆ అగ్నిగుండా బతుకు
తారు. ఆ ప్రజలు లంచాలు నిరాకరిస్తారు. ఇతరులను
హత్య చేసే పథకాలను గూర్చి వినటానికి గూడ వారు
నిరాకరిస్తారు. చెడ్డ పనులు చేసేందుకు వేసిన పథకా
లను చూచేందుకు గూడా వారు నిరాకరిస్తారు.
16ఆ ప్రజలు ఉన్నతమైన స్థలాల్లో క్షేమంగా జీవి
స్తారు. ఎత్తయిన బండల కోటలలో వారు భద్రంగా
కాపాడబడతారు. ఆ ప్రజలకు ఆహారం, నీళ్లు ఎల్ల
ప్పుడూ ఉంటాయి.
17రాజును (దేవుణ్ణి) ఆయన సంపూర్ణ సౌంద
ర్యంలో మీరు చూస్తారు. ఆ మహా దేశాన్ని మీరు
చూస్తారు. 18-19గతంలో మీకు కలిగిన కష్టాలను గూర్చి
మీరు ఆలోచిస్తారు. “ఆ ఇతర దేశాల మనుష్యులు
ఎక్కడ? మనకు అర్థం కాని భాషలు వాళ్లు మాట్లాడారు.
ఇతర దేశాల అధికారులు, పన్ను వసూలు చేసే వాళ్లు
అంతా ఏమయ్యారు? మన రక్షణ గోపురాలను లెక్కిం
చిన ఆ గూఢచారులు ఎక్కడ? వాళ్లంతా పోయారు!”
అని మీరు అనుకొంటారు.

## దేవుడు యెరూషలేమును కాపాడుతాడు

20మన మతపరమైన పండుగల పట్టణం సీయో
నును చూడు. ఆ అందమైన విశ్రాంతి స్థలం యెరూష
లేమును చూడు. ఎన్నటికీ కదలని ఒక గుడారంలా
ఉంది యెరూషలేము. దానిని తన స్థానంలో ఉంచే
మేకులు ఎన్నటికి పెరికి వేయబడవు. దాని తాళ్లు
ఎన్నటికీ తెగిపోవు. 21-22ఎందుకంటే, శక్తిగల
యెహోవా అక్కడ ఉన్నాడు గనుక. ఆ దేశం ఏరులు,
పెద్ద నదులు ఉన్న దేశం. కాని ఆ నదుల్లో శత్రు
పడవలుగాని లేక బలమైన ఓడలుగాని ఏమీ ఉండవు.
ఆ పడవల్లో పనిచేసే మనుష్యులారా, మీరు మీ త్రాళ్ల
పని విడిచి పెట్టవచ్చును. ఓడ కొయ్యను చాలినంత
గట్టిగా చేయలేరు. మీరు మీ తెర చాపలను తెరువలేరు.
ఎందుకంటే, యెహోవాయే మన న్యాయమూర్తి మన
చట్టాలను యెహోవా చేస్తాడు. యెహోవా మన
రాజు. ఆయన మనలను రక్షిస్తాడు. అందుచేత
యెహోవా మనకు విస్తారమైన ఐశ్వర్యం ఇస్తాడు.
కుంటివాళ్లు సహా యుద్ధంలో గొప్ప ఐశ్వర్యాలు సంపా
దిస్తారు. 24అక్కడ జీవించే ఏ మనిషీ “నాకు జబ్బు”
అని చెప్పడు. అక్కడ నివసించే ప్రజలు పాపాలు
క్షమించబడిన ప్రజలు.

## దేవుడు తన శత్రువులను శిక్షిస్తాడు

34 సకల రాజ్యములారా, దగ్గరగా వచ్చి, వినండి.
ప్రజలారా, మీరంతా దగ్గరగా ఉండి వినండి.
భూమి, భూమిమీద ఉన్న ప్రజలు అందరూ ఈ
సంగతులు వినాలి. 2సకల రాజ్యాల మీదా, వాటి
సైన్యాల మీదా యెహోవా కోపంగా ఉన్నాడు.
యెహోవా వాళ్లందర్ని నాశనం చేస్తాడు వాళ్లందరు
చంపబడేట్టు యెహోవా చేస్తాడు. 3వారి శరీరాలు
బయట పారవేయబడుతాయి. ఆ శవాలనుండి కంపు
వస్తుంది. వారి రక్తం కొండల నుండి ప్రవహిస్తుంది.
4ఆకాశాలు కాగితం చుట్టలా చుట్టబడతాయి. నక్షత్రాలు
చచ్చి, ద్రాక్ష లేక అంజూర చెట్ల ఆకులు రాలినట్లు
రాలిపోతాయి. ఆకాశంలోని నక్షత్రాలన్నీ కరిగి
పోతాయి. 5“ఆకాశంలో నా ఖడ్గం రక్తసిక్తమైనప్పుడు
ఇది జరుగుతుంది” అని యెహోవా చెబుతున్నాడు.
చూడండి! యెహోవా ఖడ్గం ఎదోముగుండా
దూసుకొనిపోతుంది. ఆ ప్రజలు దోషులని యెహోవా
తీర్పు చెప్పాడు, గనుక వారు చావాల్సిందే. 6ఎందు
కంటే, బొస్రాలో, ఎదోములో చంపబడే సమయం
ఒకటి ఉండాలని యెహోవా నిర్ణయించాడు గనుక.
7కనుక పొట్టేళ్లు, పశువులు, బలమైన కోడె దూడలు
చంపబడుతాయి. దేశం వాటి రక్తంతో నిండిపోతుంది.
దుమ్ము వాటి కొవ్వుతో నిండిపోతుంది.
8శిక్షా సమయం ఒకటి యెహోవా ఏర్పాటు చేశాడు
గనుక ఆ సంగతులు జరుగుతాయి. ప్రజలు సీయో
నుకు చేసిన కీడులకు వారు బదులు చెల్లించటానికి
యెహోవా ఒక సంవత్సరాన్ని ఎంచుకొన్నాడు.
9ఎదోము నదులు వేడి తారులా ఉంటాయి. ఎదోము
నేల మండుతున్న గంధకంలా ఉంటుంది. 10అగ్ని
రాత్రింబవళ్లు మండుతూ ఉంటుంది. అగ్నిని ఎవ్వరూ
ఆర్పివేయలేరు. ఎదోమునుండి పొగ శాశ్వతంగా
లేస్తుంది. ఆ దేశం శాశ్వతంగా ఎప్పటికీ నాశనం చేయ
బడుతుంది. ఆ దేశంగుండా మళ్లీ ఎవ్వరూ ఎన్నడూ
ప్రయాణం చేయరు. 11పక్షులు, చిన్న జంతువులు
ఆ దేశాన్ని స్వంతంగా వాడుకొంటాయి. గుడ్లగూబలు,
కాకులు అక్కడ నివసిస్తాయి. ఆ దేశం “శూన్య ఎడారి”
అని పిలువబడుతుంది. 12స్వతంత్రులు, నాయకులు
అంతా పోతారు. వారు పాలించేందుకు అక్కడ ఏమీ
మిగిలి ఉండదు.
13అక్కడి అందమైన గృహాలన్నింటిలో ముళ్ల
కంపలు, పిచ్చిపొదలు పెరుగుతాయి. అడవి కుక్కలు,

గుడ్లగూబలు ఆ ఇండ్లలో నివసిస్తాయి. అడవి జంతు
వులు అక్కడ నివాసం ఏర్పాటు చేసుకొంటాయి.
అక్కడ పెరిగే గడ్డి దుబ్బుల్లో పెద్ద పక్షులు నివసిస్తాయి.
14అడవి పిల్లులు నక్కలతో కలిసి అక్కడ నివసిస్తాయి.
అడవి మేకలు వాటి స్నేహితులను పిలుచుకొంటాయి.
రాత్రులు తిరిగే జంతువులు అక్కడ విశ్రాంతి స్థలం
చూచుకొంటాయి. 15పాములు అక్కడ పుట్టలు
పెడ్తాయి. పాములు అక్కడ గుడ్లు పెడ్తాయి. గుడ్లు
పగులుతాయి. పాము పిల్లలు ఆ చీకటి స్థలాల్లో పాకు
తాయి. చచ్చిన శవాలను తినే పక్షులు, ఆడవాళ్లు
వారి స్నేహితురాళ్లను కలుసుకొన్నట్టుగా అక్కడ
కలుసుకొంటాయి.

16యెహోవా గ్రంథాన్ని చూడండి. అక్కడ ఏమి
వ్రాసి ఉందో చదవండి. ఏమీ తప్పిపోలేదు. ఆ జంతు
వులు కలిసి ఉంటాయని ఆ గ్రంథములో వ్రాయబడి
ఉంది. వాటిని ఒక్క చోట చేరుస్తానని దేవుడు
చెప్పాడు. కనుక దేవుని ఆత్మ వాటిని ఒక్క చోట
చేర్చటం జరుగుతుంది. 17వాటి విషయంలో చేయా
ల్సిన దాన్ని దేవుడు నిర్ణయం చేశాడు. అప్పుడు దేవుడు
వాటికి ఒక చోటు నిర్ణయించాడు. దేవుడు ఒక గీతగీసి,
వాటి స్థలం వాటికి చూపించాడు. అందుచేత ఆ దేశం
ఆ జంతువులకు శాశ్వతంగా స్వంతం. సంవత్సరం
వెంబడి సంవత్సరం అవి అక్కడే నివసిస్తాయి.

### దేవుడు తన ప్రజలను ఓదారుస్తాడు

35 ఎండిన అరణ్యం సంతోషిస్తుంది. అరణ్యం
ఉల్లసించి, కస్తూరి పుష్పంలా పూస్తుంది.
2అరణ్యం వికసించే పూలతో నిండిపోయి దాని సంతో
షాన్ని వ్యక్తం చేయటం మొదలుపెడ్తుంది. అరణ్యం
ఆనందంతో నాట్యం చేస్తున్నట్టు అనిపిస్తుంది. లెబా
నోను అరణ్యంలా, కర్మెలు పర్వతంలా, షారోను
లోయలా అరణ్యం సౌందర్యంగా ఉంటుంది. ప్రజలంతా
యెహోవా మహిమ* చూస్తారు గనుక ఇలా జరుగు
తుంది. ప్రజలు మన యెహోవా మాహాత్మ్యం
చూస్తారు.

3బలహీనమైన చేతుల్ని మళ్లీ బలపర్చండి. బల
హీనమైన మోకాళ్లను బలపర్చండి. 4ప్రజలు భయంతో,
కలవరపడుతున్నారు. "బలంగా ఉండండి, భయపడ
వద్దు" అని ఆ మనుష్యులతో చెప్పండి. చూడండి,
మీ దేవుడు వచ్చి, మీ శత్రువులను శిక్షిస్తాడు. ఆయన
వచ్చి మీ బహుమానం మీకు ఇస్తాడు. యెహోవా
మిమ్మల్ని రక్షిస్తాడు. 5అప్పుడు గుడ్డివాళ్లు మళ్లీ
చూస్తారు. వారి నేత్రాలు తెరువబడతాయి. అప్పుడు
చెవిటివాళ్లు వినగలుగుతారు. వారి చెవులు తెరువబడు
తాయి. 6కుంటివాళ్లు లేడిలా గంతులు వేస్తారు.
ఇప్పుడు మాట్లాడలేని మూగవాళ్లు, వారి కంఠం ఎత్తి
ఆనంద గీతాలు పాడుతారు. అరణ్యంలో జల ఊటలు
పారటం మొదలైనప్పుడు ఇది జరుగుతుంది. ఎండిన
భూమిలో నీటి ఊటలు ప్రవహిస్తాయి. 7ఇప్పుడు
నీళ్లలా కనిపించే ఎండమావుల్ని ప్రజలు చూస్తున్నారు.
కానీ ఆ సమయంలో నిజంగానే నీళ్ల కొలనులు
ఉంటాయి. ఎండిన భూమిలో బావులు ఉంటాయి.
భూమిలో నుండి నీళ్లు ఉబుకుతాయి. ఒకప్పుడు అడవి
మృగాలు ఏలిన చోట ఎత్తయిన నీటి మొక్కలు
పెరుగుతాయి.

8ఆ సమయంలో అక్కడ ఒక రాజమార్గం
ఉంటుంది. ఈ రాజమార్గం "పవిత్ర రాజమార్గం" అని
పిలువబడుతుంది. ఆ రాజమార్గంలో చెడ్డవాళ్లను నడవ
నీయరు. తెలివి తక్కువ వాళ్లెవరూ ఆ మార్గానికి వెళ్లరు.
మంచివాళ్లు మాత్రమే ఆ మార్గంలో వెళ్తారు. 9ఆ
మార్గంలో అపాయాలు ఏమీ ఉండవు. ప్రజలకు హాని
చేసేందుకు ఆ మార్గంలో సింహాలు ఉండవు. ప్రమాద
కరమైన జంతువులు ఏమీ ఆ మార్గంలో ఉండవు. ఆ
మార్గం దేవుడు రక్షించే ప్రజలకోసమే ఉంటుంది.
10దేవుడు తన ప్రజలను స్వతంత్రులను చేస్తాడు. ఆ
ప్రజలు ఆయన దగ్గరకు తిరిగి వస్తారు. ప్రజలు
సీయోను లోనికి వచ్చినప్పుడు సంతోషిస్తారు. ఆ
ప్రజలు ఎప్పటికీ సంతోషంగా ఉంటారు. వారి
సంతోషం వారి తలల మీద ఒక కిరీటంలా ఉంటుంది.
వారి సంతోషం, ఆనందం వారిని సంపూర్ణంగా నింపే
స్తాయి. విచారం, దుఃఖం దూరదూరాలకు పారి
పోతాయి.

### అష్షూరీయులు యూదాను ఆక్రమించుట

36 యూదాకు హిజ్కియా రాజు. అష్షూరుకు
సన్హెరీబు రాజు. హిజ్కియా రాజైన పదు
నాలుగవ సంవత్సరంలో సన్హెరీబు యూదా పట్టణాల
మీద యుద్ధం చేశాడు. మరియు సన్హెరీబు ఆ పట్టణా
లను ఓడించేశాడు. 2యెరూషలేము మీద యుద్ధం
చేయటానికి సన్హెరీబు తన సైన్యాధిపతిని పంపించాడు.
ఆ సైన్యాధిపతి లాకీషును విడిచి, యెరూషలేములోని
హిజ్కియా దగ్గరకు వెళ్లాడు. ఆ సైన్యాధిపతి బలమైన
తన సైన్యాన్ని తనతో కూడా నడిపించాడు. ఆ
సైన్యాధిపతి, అతని సైన్యం చాకలివాని పొలం దగ్గర
ఉన్న దారికి వెళ్లారు. మెట్ట మీది కొలను నుండి
వచ్చే జంట కాల్వల దగ్గర ఈ మార్గం ఉంది.

3ఆ సైన్యాధిపతితో మాట్లాడుటకు ముగ్గురు మను
ష్యులు యెరూషలేము నుండి బయటకు వెళ్లారు.
వీరు హిల్కీయా కుమారుడు ఎల్యాకీము, ఆసాపు
కుమారుడు యోవాహు, షెబ్నా, ఎల్యాకీము రాజభవన
సంరక్షకుడు. యెహోవా అధికార పత్రాలు భద్ర
పరచేవాడు; షెబ్నా రాజ్యపు కార్యదర్శి.

---

**యెహోవా మహిమ** నిర్గమ. 40:34-36 చూడండి.

4సైన్యాధిపతి వారితో చెప్పాడు, “మీరు రాజైన
హిజ్కియాతో ఈ సంగతులు చెప్పండి: మహారాజు,
అష్షూరు రాజు చెబుతున్నాడు, మీ సహాయం కోసం
మీరు దేనిని నమ్ముకొంటున్నారు? 5మీరు గనుక మీ
బలాన్నీ, తెలివిగల మీ యుద్ధ తంత్రాలనూ నమ్ము
కొంటే అవన్నీ నిష్ప్రయోజనమే అని నేను చెబు
తున్నాను. అవి వట్టి మాటలు తప్ప ఇంకేమీ లేదు.
కనుక మీరు నాకు విరోధంగా ఎందుకు యుద్ధం
చేస్తారు? 6ఇప్పుడు నేను మళ్లీ అడుగుతున్నాను, మీ
సహాయం కోసం మీరు ఎవరిని నమ్ముకొంటున్నారు?
మీ సహాయం కోసం మీరు ఈజిప్టు మీద ఆధార
పడ్తున్నారా? ఈజిప్టు విరిగిపోయిన కర్రలా ఉంది.
ఆధారంగా మీరు దానిమీద ఆనుకొంటే, అది మీకు
బాధ మాత్రమే కలిగిస్తుంది, మీ చేతికి గాయం చేస్తుంది.
ఈజిప్టు రాజు ఫరో సహాయంకోసం అతని మీద ఆధార
పడే వాళ్లెవ్వరూ అతణ్ణి నమ్మలేరు.

7అయితే మీరు అనవచ్చు, “మా సహాయం
కోసం మేం మా దేవుడు యెహోవాను
విశ్వసిస్తున్నాం’ అని. అయితే యెహోవా బలి
పీఠాలను, ఆరాధించే ఉన్నత స్థలాలను
హిజ్కియా నాశనం చేసేశాడు అని నేనంటు
న్నాను. ఇది నిజం, అవునా? యూదాకు,
యెరూషలేముకు హిజ్కియా ఈ సంగతులు
చెప్పటం సత్యం, “ఇక్కడ యెరూషలేములో
ఒకే బలిపీఠం దగ్గర మీరు ఆరాధిస్తారు.”
8అయినా మీరు ఇంకా యుద్ధం చేయాలనే
అనుకొంటే, నా ప్రభువు, అష్షూరు రాజు మీతో
ఈ ఒడంబడిక చేస్తాడు! ‘యుద్ధ రంగంలో
స్వారీ చేయగల రెండువేల మంది మీకు ఉంటే,
నేను మీకు అన్ని గుర్రాలు ఇస్తాను.’ 9అలాగైనా
సరే, నా యజమాని బానిసల్లో ఒక్కడిని,
చివరికి ఒక చిన్న అధికారిని కూడా మీరు
ఓడించలేరు. అందుచేత ఈజిప్టు సైనికుల మీద
రథాల మీద ఎందుకు మీరు ఆధారపడతారు?
10మరియు నేను వచ్చి ఈ దేశంలో యుద్ధం
చేసినప్పుడు యెహోవా నాతో ఉన్నాడని
కూడ జ్ఞాపకం ఉంచుకోండి. నేను పట్టణాలను
నాశనం చేసినప్పుడు యెహోవా నాతో
ఉన్నాడు. “లేచి నిలబడే ఈ దేశానికి వెళ్లి,
దీన్ని నాశనం చేయి” అని యెహోవా నాతో
చెప్పాడు.

11ఎల్యాకీము, షెబ్నా, యోవాహు, “దయచేసి
సిరియా భాషలో మాతో మాట్లాడు. మా యూదా
భాషలో మాతో మాట్లాడవద్దు. నీవు యూదా భాషలో
మాట్లాడితే, నగరం గోడమీద మనుష్యులు అర్థం చేసు
కొంటారు” అని ఆ సైన్యాధిపతితో చెప్పారు. 12కానీ
సైన్యాధిపతి, “మీకూ, మీ యజమానుడు హిజ్కి
యాకూ మాత్రమే చెప్పమని మా యజమాని నన్ను
పంపించలేదు. ఆ గోడల మీద కూర్చొన్న మనుష్య
లతో కూడ చెప్పమని నా యజమాని నన్ను పంపిం
చాడు. ఆ మనుష్యులకు ఆహారంగాని భోజనం గాని
ఉండదు. వాళ్లు కూడా మీలాగే, వారి మల మూత్రాలనే
తిని, తాగుతారు” అని చెప్పాడు.

13అప్పుడు సైన్యాధికారి లేచి, పెద్ద స్వరంతో
మాట్లాడాడు. అతడు యూదా భాషలో మాట్లాడాడు.
14సైన్యాధికారి చెప్పాడు, “మహారాజు అష్షూరు రాజు
మాటలు వినండి:

హిజ్కియా మిమ్మల్ని మోసం చేయనివ్వ కండి.
అతడు మిమ్మల్ని రక్షించలేడు. 15‘యెహోవా మీద
విశ్వాసం ఉంచండి, యెహోవా మనలను రక్షిస్తాడు.
అష్షూరు రాజు మన పట్టణం గెలవకుండా యెహోవా
చేస్తాడు’ అని హిజ్కియా చెప్పినప్పుడు అతని
మాటలు నమ్మవద్దు.

16హిజ్కియా చెప్పే ఆ మాటలు వినవద్దు. అష్షూరు
రాజు మాట వినండి. అష్షూరు రాజు చెబుతున్నాడు,
“మనం ఒక ఒడంబడిక చేసుకొందాం. ప్రజలారా, మీరు
పట్టణం వదలి పెట్టి నా దగ్గరకు రండి. అప్పుడు
ప్రతి ఒక్కరు స్వతంత్రులుగా ఇంటికి వెళ్లవచ్చును.
ప్రతి ఒక్కరు తన స్వంత ద్రాక్షవల్లినుండి ద్రాక్షపండ్లు
తినేందుకు స్వేచ్ఛ ఉంటుంది. ప్రతి వ్యక్తీ తన స్వంత
అంజూరపు చెట్టు ఫలాలు తినే స్వేచ్ఛ ఉంటుంది.
ప్రతి వ్యక్తీ తన స్వంత బావి నుండి నీళ్లు తాగే స్వేచ్ఛ
ఉంటుంది. 17నేను వచ్చి, మీ స్వంత దేశంలాంటి
దేశానికి మిమ్మల్ని ఒక్కొక్కరిని తీసుకొని వెళ్లేంత
వరకు మీరు ఇలా చేయవచ్చు. ఆ కొత్త దేశంలో
మీకు మంచి ధాన్యం, కొత్త ద్రాక్షరసం ఉంటాయి. ఆ
దేశంలో భోజనం, ద్రాక్షవనాలు ఉంటాయి.”

18హిజ్కియా మిమ్మల్ని వెర్రివాళ్లనుగా చేయ
నియ్యకండి. “యెహోవా మనలను రక్షిస్తాడు.” అని
అతడు అంటాడు. అయితే యితర రాజ్యాల్లోని యితర
దేవుళ్లు ఎవరైనా సరే వారిని అష్షూరు బలంనుండి
రక్షించారా అని నేను మిమ్మల్ని అడుగుతున్నాను.
లేదు. ఆ ప్రజల్లో ప్రతి ఒక్కరినీ మేము ఓడించాం.
హమాతు, అర్పదు దేవుళ్లు ఏమయ్యారు? వారు ఓడించ
బడ్డారు. సెపర్వయీం దేవతలు ఎక్కడ? వారు ఓడించ
బడ్డారు. సమరయ దేవుళ్లు ఆ ప్రజలను నా బలం
నుండి రక్షించారా? లేదు.

20ఆ రాజ్యాలన్నింటిలో నా బలం నుండి తన
ప్రజలను రక్షించగలిగిన ఒక్క దేవుని పేరు నాకు
చెప్పండి. నేను వాళ్లందర్నీ ఓడించేశాను. అందుచేత
నా బలంనుండి యెహోవా యెరూషలేమును
రక్షించజాలడు.

21యెరూషలేములోని ప్రజలు చాలా మౌనంగా
ఉన్నారు. ఆ సైన్యాధికారికి వారు జవాబు చెప్పలేదు.
(హిజ్కియా ప్రజలకు ఒక ఆజ్ఞ ఇచ్చాడు. "ఆ సైన్యాధి
కారికి జవాబు చెప్పవద్దు" అని హిజ్కియా
ఆజ్ఞాపించాడు.)
22అప్పుడు రాజభవన అధికారి (హిజ్కియా కుమా
రుడు ఎల్యాకీము) రాజ్య కార్యదర్శి (షెబ్నా) అధికార
పత్రాలు భద్రపరిచే అధికారి (ఆసాపు కుమారుడు
యోవాహు) వారి బట్టలు చింపివేశారు. (వారు చాలా
విచారించినట్టు ఇది సంకేతం) ఆ ముగ్గురు మను
ష్యులూ హిజ్కియా దగ్గరకు వెళ్లి, సైన్యాధికారి తమతో
చెప్పిన సంగతులన్నీ అతనితో చెప్పారు.

## హిజ్కియా దేవుణ్ణి సహాయం చేయమని అడుగుట

37 సైన్యాధికారి సందేశం హిజ్కియా విన్నాడు.
ఆ సందేశం అతడు విన్నప్పుడు, హిజ్కియా
తన బట్టలు చింపేసుకొన్నాడు. అప్పుడు హిజ్కియా
సంతాప సూచకమైన ప్రత్యేక వస్త్రాలు ధరించి
యెహోవా మందిరానికి వెళ్లాడు. 2రాజభవన అధికారిని
(ఎల్యాకీము), రాజ్య కార్యదర్శిని (షెబ్నా), యాజ
కుల్లో పెద్దలను, ఆమోజు కుమారుడు యెషయా
దగ్గరకు హిజ్కియా పంపించాడు. ఈ ముగ్గురు మను
ష్యులూ సంతాప వస్త్రాలు ధరించారు.
3ఈ మనుష్యులు యెషయాతో చెప్పారు: "ఈ
రోజు దుఃఖం, విచారం వ్యక్తం చేసే ప్రత్యేక సంతా
పదినంగా ఉండాలని హిజ్కియా రాజు ఆదేశిం చాడు.
ఇది చాలా విచారకరమైన రోజుగా ఉంటుంది. ఆ
రోజు శిశువు జన్మించాల్సినప్పటికీ, తల్లిలో నుండి
బయటకు వచ్చే శక్తి లేక అది బయటకు రాని రోజులా
అది ఉంటుంది. 4ఒక వేళ, మీ దేవుడు యెహోవా,
ఆ సైన్యాధికారి చెప్పిన సంగతులు వింటాడేమో జీవం
గల దేవుణ్ణి గూర్చి చాలా చెడ్డ మాటలు మాట్లాడేందుకు
అష్షూరు రాజు సైన్యాధికారిని పంపించాడు. మరియు
మీ దేవుడు యెహోవా ఆ చెడు సంగతులు విన్నాడు.
మిగిలి ఉన్న కొద్దిమంది ఇశ్రాయేలు ప్రజల కోసం
దయచేసి ప్రార్థించండి."
5-6 హిజ్కియా సేవకులు యెషయా దగ్గరకు
వెళ్లారు. యెషయా వాళ్లతో చెప్పాడు: "మీ యజమాని
యైన హిజ్కియాకు ఈ విషయాలు చెప్పండి:
యెహోవా చెప్పునదేమనగా, 'సైన్యాధిపతి నుండి
విన్న మాటలకు మీరు భయపడవద్దు. అష్షూరు రాజు
దగ్గర నుండి వచ్చిన ఆ "కుర్రవాళ్లు" నన్ను గూర్చి
చెప్పిన చెడు విషయాలు నమ్మవద్దు. 7చూడండి,
అష్షూరుకు విరోధంగా నేను ఒక ఆత్మను పంపిస్తాను.
అష్షూరు రాజు యొక్క దేశానికి ఒక ప్రమాదం గూర్చి
హెచ్చరిక చేస్తూ అతనికి సమాచారం అందుతుంది.
కనుక అతడు తిరిగి తన దేశం వెళ్లిపోతాడు. ఆ సమ
యంలో అతని స్వంత దేశంలోనే నేను అతణ్ణి ఒక
ఖడ్గంతో చంపేస్తాను.'"

## సిరియా సైన్యం యెరూషలేమును విడచుట

8-9అష్షూరు రాజుకు సమాచారం అందింది. "ఇథి
యోపియా రాజు తిర్హాకా నీతో యుద్ధం చేయటానికి
వస్తున్నాడు" అని ఆ సమాచారం తెలియజేసింది.
కనుక అష్షూరు రాజు లాకీషు పట్టణం విడిచి లిబ్నాకు
వెళ్లాడు. సైన్యాధికారి ఇది విని, అష్షూరు రాజు యుద్ధం
చేస్తున్న లిబ్నా పట్టణం వెళ్లాడు. అప్పుడు సైన్యాధికారి
హిజ్కియా దగ్గరకు సందేశకులను పంపించాడు. సైన్యా
ధికారి చెప్పాడు. 10"యూదా రాజు హిజ్కియాతో
మీరు ఈ సంగతులు చెప్పండి:
నీవు నమ్ముకొన్న దేవుని ద్వారా వెర్రివాడవు
కావద్దు. "అష్షూరు రాజు చేత యెరూషలేమును దేవుడు
ఓడిపోనివ్వడు!" అని చెప్పవద్దు.
11వినండి, అష్షూరు రాజులను గూర్చి మీరు
విన్నారు. ప్రతి దేశంలోని ప్రజలను వారు ఓడించారు.
మరియు అష్షూరు రాజు నిన్నుకూడ ఓడించి, చంపు
తాడు. 12ఆ ప్రజల దేవుళ్లు వాళ్లను రక్షించారా? లేదు.
నా తండ్రులు (పూర్వీకులు) వారిని నాశనం చేశారు.
గోజాను, హారాను, రెజెపు పట్టణాలను, తెలశ్శారులో
నివసిస్తున్న ఏదేను ప్రజలను నా ప్రజలు ఓడించారు.
13హమాతు, అర్పాదు రాజులు ఎక్కడ? సెపర్వ
యీము రాజు ఎక్కడ? హేన, ఇవ్వా రాజులు ఎక్కడ?
వారి పని అయిపోయింది. వాళ్లంతా నాశనం చేయ
బడ్డారు.

## హిజ్కియా దేవునికి ప్రార్థించుట

14హిజ్కియా ఆ మనుష్యుల దగ్గర నుండి ఆ
ఉత్తరం అందుకొని, దానిని చదివాడు. అప్పుడు
హిజ్కియా యెహోవా మందిరానికి వెళ్లాడు.
హిజ్కియా ఉత్తరం తెరిచి, దానిని యెహోవా ముందర
దానిని పరిచాడు. 15హిజ్కియా యెహోవాను ప్రార్థిం
చటం మొదలు పెట్టాడు. హిజ్కియా చెప్పాడు:
16సర్వశక్తిమంతుడైన యెహోవా, ఇశ్రాయేలీ
యుల దేవా, కెరూబు దూతల మధ్య నీవు రాజుగా
ఆసీనుడవయ్యావు. భూలోక రాజ్యాలన్నింటినీ
పాలించే దేవుడవు నీవు ఒక్కడవే, భూమ్యాకాశాలను
నీవే చేశావు. 17నా ప్రార్థన ఆలకించు! నీ నేత్రాలు
తెరచి, సన్హెరీబు పంపిన ఈ వార్త చూడు. సన్హెరీబు
నాకు ఈ సందేశం పంపించాడు జీవముగల దేవుడవైన
నిన్ను గూర్చి చెడు విషయాలను ఈ సందేశం చెబు
తోంది.
18యెహోవా, అష్షూరు రాజులు నిజంగానే అన్ని
దేశాలనూ, వాటి స్థలాలనూ నాశనం చేశారు. 19ఆ
దేశాల దేవుళ్లను అష్షూరు రాజులు కాల్చివేశారు. అయితే

వారు నిజమైన దేవుళ్లు కారు. అవి కేవలం మనుష్యులు
చేసిన విగ్రహాలే. అవి కేవలం రాయి, చెక్క మాత్రమే.
అందుకే వాటిని వారు నాశనం చేయగలిగారు. [20]కానీ
నీవు యెహోవా, మా దేవుడివి. కనుక అష్షూరు రాజు
బలంనుండి దయతో మమ్మల్ని రక్షించు. అప్పుడు
నీవే యెహోవా అని, నీవు మాత్రమే దేవుడవు అని
మిగిలిన రాజ్యాలన్నీ తెలుసుకొంటాయి.

### హిజ్కియాకు దేవుని జవాబు

[21]అప్పుడు ఆమోజు కుమారుడు యెషయా
హిజ్కియాకు ఒక సందేశం పంపించాడు. యెషయా
చెప్పాడు, "ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు
నీవు ప్రార్థన చేశావు, 'సన్హెరీబు దగ్గర్నుండి వచ్చిన
సందేశాన్ని గూర్చి నీవు ప్రార్థించావు.'
[22]"యెహోవా నీ ప్రార్థన విన్నాడు, నన్ను నీ
దగ్గరకు రమ్మన్నాడు. "ఇదే యెహోవా నుండి వచ్చిన
సందేశం:

ఓ సీయోను పెండ్లి కుమార్తె (యెరూషలేము)
ప్రజలు నీ దగ్గర దొంగిలించారు ప్రజలు నిన్ను
ఎగతాళి చేశారు. యెరూషలేము కుమారీ ప్రజలు
నిన్ను గూర్చి చెడు విషయాలు తలచారు.
3 ఓ అష్షూరు రాజా, నన్ను గూర్చి నీవు చెడు
విషయాలు చెప్పావు. నీవు నాకు విరోధంగా
మాట్లాడావు. నేను ఎవరినో నీకు తెలుసా? నీ
కళ్లు పైకెత్తి ఆకాశం వైపు చూడు. ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుణ్ణి గూర్చి నీవు చెడు విషయాలు
చెప్పినట్టు నీవు చూస్తావు."
24 యెషయా ఇంకా ఇలా చెప్పాడు, "నా ప్రభువు
యెహోవాను గూర్చి చెడు సంగతులు చెప్పడా
నికి నీవు నీ సేవకులను వాడుకొన్నావు. నీవు
ఇలా అన్నావు: నేను చాలా శక్తిమంతుణ్ణి. నాకు
ఎన్నెన్నో రథాలు ఉన్నాయి. లెబానోను మహా
పర్వతాల మీదుగా దాటించి నా రథాలను నేను
తీసుకొని వచ్చాను. లెబానోను మహా వృక్షాలను
(సైన్యాలను) అన్నింటినీ నేను నరికివేశాను.
25 ఈజిప్టులోని ప్రతి నదికీ నేను వెళ్లాను. ఆ
నదులన్నింటి నీళ్లతో నేను నా చేతులు నింపు
కొన్నాను. నేను ఆ నీళ్లు తాగాను. నా స్వంత
శక్తితో, ఈజిప్టులోని నదులన్నింటినీ (శక్తిని) నేను
నాశనం చేశాను."
26 అని నీవు చెప్పావు. అయితే నేను చెప్పినది
నీవు వినలేదా? "అష్షూరు రాజా, దేవుడనైన
నేనే ఆ సంగతులను చేశానని నిశ్చయంగా నీవు
ఎప్పుడో విన్నావు. చాలాకాలం కిందట నేను
అష్షూరును చేశాను. ఇప్పుడు నిన్ను ఇక్కడికి
నేనే తీసుకొని వచ్చాను. మిగిలిన ఇతర పట్టణా
లను నిన్ను నాశనం చేయనిచ్చాను. నా పనిలో
నేనే నిన్ను వాడు కొని, ఆ పట్టణాలను రాళ్ల
కుప్పలుగా చేశాను.
27 "ఆ పట్టణాల్లో జీవించిన మనుష్యులు బల
హీనులు. ప్రజలు భయపడేవాళ్లు, సిగ్గుపడే వాళ్లు.
ఆ మనుష్యులు పొలంలో గడ్డిలాంటి వాళ్లు. వారు
ఇండ్ల కప్పుల మీద మొలకెత్తే గడ్డిలాంటి వారు.
ఆ గడ్డి ఎదుగక ముందే వేడి ఎడారి గాలికి కాలి
పోతుంది.
28 "నీ సైన్యం, నీ యుద్ధాలు అన్నింటిని గూర్చి
నాకు తెలుసు. నీవు ఎప్పుడు విశ్రాంతి తీసు
కొన్నావో నాకు తెలుసు. నీవు ఎప్పుడు యుద్ధా
నికి వెళ్లావో నాకు తెలుసు. యుద్ధంనుండి నీవు
ఇంటికి ఎప్పుడు తిరిగి వచ్చావో నాకు తెలుసు.
నీవు నా మీద కోపంగా ఉన్నావని నాకు తెలుసు.
29 "నీవు నా మీద కోపంగా ఉన్నావు, నన్ను గూర్చి
చెడ్డగా మాట్లాడావు. నీవు చెప్పిన విషయాలు
నేను విన్నాను. కనుక నిన్ను నేను శిక్షిస్తాను. నీ
ముక్కుకు నేను గాలం వేస్తాను; నీ నోటికి
నేను కళ్లెం వేస్తాను. అప్పుడు నీవు నా దేశాన్ని
విడిచి, నీవు వచ్చిన దారినే పోయేట్టు నేను
నిన్ను వెళ్లగొడతాను."

### హిజ్కియాకు యెహోవా సందేశం

[30]అప్పుడు యెహోవా హిజ్కియాతో చెప్పాడు:
"హిజ్కియా, ఈ మాటలు సత్యమని నీకు చూపించ
టానికి నీకు నేను ఒక గురుతు ఇస్తాను. ఈ సంవత్సరం
తినేందుకు మీరు ధాన్యపు గింజలు నాటారు. కనుక
పోయిన సంవత్సరపు పంటనుండి విచ్చలవిడిగా పండిన
ధాన్యాన్ని ఈ సంవత్సరం మీరు తింటారు. కానీ మూడు
సంవత్సరాలకు మీరు నాటుకొన్న ధాన్యం మీరు
తింటారు. ఆ పంటలను మీరు కోస్తారు. తినేందుకు
మీకు సమృద్ధిగా ఉంటుంది. మీరు ద్రాక్ష వల్లులు నాటి,
వాటి ఫలాలు తింటారు.
[31]"యూదా వంశంలో కొంతమంది ప్రజలు రక్షించ
బడతారు. ఆ కొద్దిమంది మనుష్యులు చాలా పెద్ద
రాజ్యంగా తయారవుతారు. ఆ ప్రజలు భూమిలో
లోతుగా వేర్లు తన్ని, బలంగా ఎదిగే మొక్కల్లా ఉంటారు.
అప్పుడు ప్రజలకు నేలమీద విస్తారమైన ఫలం (పిల్లలు)
ఉంటుంది. [32]ఎందుకంటే, యెరూషలేము నుండి కొద్ది
మంది మనుష్యులు బతికివస్తారు. సీయోను కొండ
నుండి బతికిన వారు వస్తారు." సర్వశక్తిమంతుడైన
యెహోవా బలీయమైన ప్రేమ దీనిని చేస్తుంది.
[33]కనుక అష్షూరు రాజు గురించి యెహోవా
చెబుతున్నాడు,

"నీవు ఈ పట్టణంలో ప్రవేశించవు. నీవు ఈ
పట్టణం మీద ఒక బాణంకూడ వేయవు. నీ

డాళ్లతో నీవు ఈ పట్టణం మీద యుద్ధానికి
కదలి రాలేవు. పట్టణం గోడలకు నీవు ఒక్క
దిబ్బను కూడ కట్టలేవు.
34 "నీవు వచ్చిన దారినే నీ దేశానికి తిరిగి వెళ్లిపోతావు.
నీవు ఈ పట్టణంలో ప్రవేశించవు. ఈ సందేశం
యెహోవా దగ్గ ర్నుండి వచ్చింది.
35 ఈ పట్టణాన్ని నేను కాపాడి, రక్షిస్తాను. నా
కోసమూ, నా సేవకుడు దావీదు కోసమూ నేను
దీనిని చేస్తాను."

36కనుక యెహోవా దూత వెళ్లి, అష్షూరి వారి
బసలో ఒక లక్ష ఎనభై అయిదు వేలమంది మనుష్యు
లను చంపేశాడు. మర్నాడు ఉదయం మనుష్యులు
లేచి చూడగా, వారి చుట్టూ చచ్చిన శవాలే. వారికి
కనబడ్డాయి. 37కనుక అష్షూరు రాజు నీనెవెకు తిరిగి
వెళ్లి అక్కడే ఉండిపోయాడు.
38ఒక రోజు సన్హెరీబు అతని దేవుడు నిస్రోను గుడిలో
పూజిస్తూ ఉన్నాడు. ఆ సమయంలో అతని ఇద్దరు
కుమారులు, అద్రమ్మెలెకు, షెరెజెరు కత్తితో అతనిని
చంపేశారు. తర్వాత ఆ కుమారులు అరారాతుకు పారి
పోయారు. అందుచేత సన్హెరీబు కుమారుడు ఎసర్హ
ద్దోను అష్షూరుకు కొత్త రాజు అయ్యాడు.

### హిజ్కియా జబ్బు

38 ఆ కాలంలో హిజ్కియాకు జబ్బు చేసింది.
అతనికి దాదాపు మరణ పరిస్థితి ఏర్పడింది.
ఆమోజు కుమారుడు యెషయా ప్రవక్త అతన్ని
చూడటానికి వెళ్లాడు.
"నేను ఈ సంగతులు నీతో చెప్పాలని యెహోవా
నాకు చెప్పాడు. 'త్వరలోనే నీవు మరణిస్తావు. కనుక
నీవు చనిపోయినప్పుడు నీ కుటుంబం వారు ఏం
చేయాలో నీవు వారితో చెప్పాలి. నీవు మళ్లీ బాగుపడవు'
అని యెషయా రాజుతో చెప్పాడు."
2హిజ్కియా దేవాలయపు గోడ తట్టు తిరిగి ప్రార్థన
చేయటం మొదలుపెట్టాడు. అతడు చెప్పాడు,
3"యెహోవా, నేను నీ యెదుట ఎల్లప్పుడూ నమ్మక
మైన పవిత్ర హృదయంతో జీవించానని దయచేసి
జ్ఞాపకం చేసికొనుము. నీవు మంచివి అనే పనులే
నేను చేశాను." తర్వాత హిజ్కియా గట్టిగా ఏడ్వటం
మొదలు బెట్టాడు. 4యెహోవా దగ్గర్నుండి యెషయా
ఈ సందేశాన్ని స్వీకరించాడు;
5"హిజ్కియా దగ్గరకు వెళ్లి అతనితో చెప్పు, నీ
పూర్వీకుడైన దావీదు దేవుడు, యెహోవా చెప్పే
సంగతులు ఇవి, 'నీ ప్రార్థనలు నేను విన్నాను, నీ
దుఃఖపు కన్నీళ్లు నేను చూశాను. నేను నీ ఆయుష్షు
పదిహేను సంవత్సరాలు ఎక్కువ చేస్తాను.6అష్షూరు
రాజు నుండి నిన్ను నేను కాపాడుతాను. నిన్ను, ఈ
పట్టణాన్ని నేను రక్షిస్తాను." 22* కానీ హిజ్కియా,
"నేను బాగవుతానని రుజువు చేసేందుకు యెహోవా
దగ్గర్నుండి వచ్చే గురుతు ఏమిటి? నేను యెహోవా
మందిరానికి వెళ్ల గలుగుతానని రుజువుచేసే సంకేతం
ఏమిటి?" అని యెషయాను అడిగాడు.
7యెహోవా చెప్పిన వాటిని చేస్తాడని నీకు
చూపించేందుకు యిదే సంకేతం.
8"చూడు, ఆహాజు మెట్ల మీద ఉన్న నీడను పది
అడుగులు వెనుకకు వెళ్లేటట్టు నేను చేస్తున్నాను.
దిగిపోయిన సూర్యుని నీడ పది అడుగులు వెనుకకు
వెళ్తుంది."
21* అప్పుడు యెషయా, "నీవు అంజూరపు
పండ్లను దంచి, నీ పుండ్ల మీద వేయాలి, అప్పుడు,
నీవు స్వస్థపడతావు" అని హిజ్కియాతో చెప్పాడు.
9హిజ్కియా రోగమునుండి స్వస్థత పొంది నప్పుడు
వ్రాసిన ఉత్తరం:

10 నేను వృద్ధుడనయ్యేంత వరకు బతుకుతానని
నాలో నేను అనుకొన్నాను. కానీ నేను పాతాళ
ద్వారాలగుండా వెళ్లాల్సిన సయయం అది.
ఇప్పుడు నేను నా సమయమంతా అక్కడే
గడపాలి.
11 కనుక నేను చెప్పాను: "సజీవుల దేశంలో ప్రభు
వైన యెహోవాను నేను మరల చూడను.
భూమిమీద మనుష్యులు జీవిం చుట నేను మరల
చూడను.
12 నా ఇల్లు, నా గొర్రెల కాపరి గుడారంలాగి వేయ
బడి నానుండి తీసివేయబడుతుంది. మగ్గము
నుండి ఒకడు బట్టను చుట్టి కత్తిరించినట్టు నా
పని అయిపోయింది. ఒక్క రోజులో ఉదయం
నుండి రాత్రి వరకు నీవు నన్ను ఇంతవరకు
తీసుకొని వచ్చావు.
13 రాత్రి అంతా నేను సింహంలా గట్టిగా అరిచాను.
అయితే సింహం ఎముకలు నమిలినట్టు నా ఆశలు
అణగ దొక్కబడ్డాయి. ఒక్క రోజులో ఉదయం
నుండి రాత్రి వరకు నీవు నన్ను ఇంతవరకు
తీసుకొని వచ్చావు.
14 నేను గువ్వలా మూల్గాను. నేను పక్షిలా ఏడ్చాను.
నా కళ్లు క్షీణించాయి కానీ నేను ఆకాశం తట్టు
చూస్తూనే ఉన్నాను. నా ప్రభువా, నాకు కష్టాలు
ఉన్నాయి. నాకు సహాయం చేస్తానని వాగ్దానం
చేయుము."

---

**22వ వచనము** హీబ్రూ ప్రతుల్లో ఇది ఈ అధ్యాయపు
చివరి వచనము.

**21వ వచనము** హీబ్రూ ప్రతుల్లో ఇది చివరిలో 21వ వచన
ముగా వ్రాయబడివుంది.

15 నేనేం చెప్పగలను? జరిగేదేమిటో నా ప్రభువా
నాకు చెప్పాడు. నా యజమాని దానిని జరిగి
స్తాడు. నా ఆత్మలో నాకు ఈ కష్టాలు కలి
గాయి. కనుక ఇప్పుడు నేను జీవితాంతం దీను
డనుగా ఉంటాను.
16 నా ప్రభూ, నా ఆత్మ మరల జీవించేట్టుగా ఈ
కష్ట సమయాన్ని ఉపయోగించు నా ఆత్మ బల
పడి, ఆరోగ్యంగా ఉండేందుకు సహాయం
చేయుము. నేను బాగుపడేందుకు సహాయం
చేయి. మరల జీవించేందుకు నాకు సహాయం
చేయుము.
17 చూడండి, నా కష్టాలు తొలగి పోయాయి.
ఇప్పుడు నాకు శాంతి ఉంది. నీవు నన్ను ఎంతో
ప్రేమిస్తున్నావు. నీవు నన్ను సమాధిలో మురిగి
పోనివ్వలేదు. నీవు నా పాపాలన్నీ క్షమించావు.
నీవు నా పాపాలను దూరంగా పారవేశావు.
18 చచ్చినవాళ్లు నీకు స్తుతులు పాడరు. పాతాళం
లోని ప్రజలు నిన్ను స్తుతించరు. చచ్చినవాళ్లు
సహాయం కోసం నిన్ను నమ్ముకోరు వారు భూగ
ర్భంలోనికి వెళ్తారు, మరల ఎన్నటికీ మాట్లాడరు.
19 నేడు నాలాగే బతికి ఉన్న మనుష్యులే నిన్ను
స్తుతించేవారు. నీవు నమ్మదగిన వాడవని ఒక
తండ్రి తన పిల్లలతో చెప్పాలి.
20 కనుక నేను అంటాను: "యెహోవా నన్ను రక్షిం
చాడు కనుక మా జీవిత కాలమంతా మేము
యెహోవా ఆలయంలో పాటలు పాడి, వాయి
ద్యాలు వాయిస్తాం."

### బబులోను నుంచి సందేశహరులు

39 ఆ కాలంలో బలదాను కుమారుడు మెరోద
క్బలదాను బబులోనుకు రాజు. మెరోదక్ ఉత్త
రాలు, కానుకలు హిజ్కియాకు పంపించాడు.
హిజ్కియా జబ్బుపడి బాగయ్యాడని విన్నందువల్ల
మెరోదక్ కానుకలు పంపించాడు.
2ఈ కానుకలు హిజ్కియాకు చాలా సంతోషం
కలిగించాయి. అందుచేత హిజ్కియా, మెరోదక్ మను
ష్యులను తన రాజ్యంలోని ప్రత్యేక వస్తువులను చూడ
నిచ్చాడు. తన సకల ఐశ్వర్యాలు, వెండి, బంగారం,
ఖరీదైన తైలాలు, పరిమళాలు ఆ మనుష్యులకు
హిజ్కియా చూపించాడు. యుద్ధంలో ఉపయోగించే
కత్తులు, డాళ్లు హిజ్కియా చూపించాడు. హిజ్కియా
దాచి ఉంచినవన్నీ వారికి చూపించాడు. తన ఇంట్లో,
రాజ్యంలో ఉన్నవి అన్నీ హిజ్కియా వారికి
చూపించాడు.
3ప్రవక్త యెషయా, హిజ్కియా దగ్గరకు వెళ్లి, "ఈ
మనుష్యులు ఏమన్నారు? వాళ్లు ఎక్కడ్నుంచి
వచ్చారు?" అని అతన్ని అడిగాడు.
"ఈ మనుష్యులు చాలా దూరదేశం నుండి నా
దగ్గరకు వచ్చారు. ఈ మనుష్యులు బబులోను నుండి
వచ్చారు." అని హిజ్కియా చెప్పాడు.
4కనుక యెషయా, "నీ రాజ్యంలో వాళ్లు ఏమి
చూశారు?" అని అతణ్ణి అడిగాడు.
"నా రాజభవనంలో సమస్తమూ వాళ్లు చూశారు.
నా ఐశ్వర్యాలన్నీ నేను వారికి చూపించాను" అని
చెప్పాడు హిజ్కియా. 5హిజ్కియాతో యెషయా ఇలా
చెప్పాడు: "సర్వ శక్తిమంతుడైన యెహోవా మాటలు
ఆలకించు. 6భవి ష్యత్తులో, నీకు ఉన్నదంతా బబులో
నుకు తీసుకొని పోబడుతుంది. ధనం అంతా తీసుకొని
పోబడుతుంది. ఏమీ విడువబడదు. సర్వశక్తిమంతుడైన
యెహోవా చెప్పాడు ఇది. 7బబులోను రాజు నీ
కుమారులను నీనుండి పుట్టే కుమారులను తీసుకొని
పోతాడు. నీ కుమారులు బబులోను రాజభవనంలో
అధికారులు అవుతారు."
8హిజ్కియా, "యెహోవానుండి వచ్చిన ఈ
మాటలు వినుటకు నాకు ఇంపుగా ఉన్నాయి" అని
యెషయాతో చెప్పాడు. ("నేను రాజుగా ఉన్నంత
వరకు కష్టం ఏమీ ఉండదు, శాంతి ఉంటుంది" అను
కొన్నందువల్ల హిజ్కియా ఇలా చెప్పాడు.)

### ఇశ్రాయేలు శిక్ష ముగుస్తుంది

40 మీ దేవుడు చెబుతున్నాడు, "ఆదరించండి,
నా ప్రజలను ఆదరించండి!
2 యెరూషలేముతో దయగా మాట్లాడండి. 'నీ సేవా
సమయం అయిపోయింది నీ పాపాలకు విలువ
నీవు చెల్లించావు' అని యెరూషలేముతో చెప్పండి
యెరూషలేము చేసిన ప్రతి పాపానికి రెండేసి
సార్లు యెహోవా యెరూషలేమును శిక్షించాడు.
3 వినండి!ఒక మనిషి గట్టిగా ఎడారిలో బోధిస్తున్న
శబ్దం మీరు వినగలరు. "యెహోవా మార్గాన్ని
సిద్ధం చేయండి. ఎడారిలో మన దేవుని కోసం
తిన్ననిదైన ఒక రాజమార్గాన్ని వేయండి.
4 ప్రతి లోయనూ పూడ్చండి ప్రతి పర్వతాన్ని
కొండను చదును చేయండి. వంకర మార్గాలను
చక్కగా చేయండి. కరకు నేలను సమనేలగా
చేయండి.
5 అప్పుడు యెహోవా మహిమ కనబడుతుంది
మనుష్యులందరూ కలిసి యెహోవా మహిమను
చూస్తారు. సాక్షాత్తూ యెహోవాయే ఈ సంగ
తులు చెప్పాడు కనుక ఇది జరుగుతుంది."
6 ఒక స్వరం పలికింది, "మాట్లాడు" అని. కనుక
ఆ మనిషి అన్నాడు, "నేనేమి చెప్పను?" ఆ
స్వరం అంది, "ఇలా చెప్పు: మనుష్యులు
అందరూ గడ్డిలా ఉన్నారు. మనుష్యుల మంచి
తనం కొత్త గడ్డి పరకలా ఉంది.

7 యెహెూవా నుండి ఒక బలమైన గాలి గడ్డిమీద
వీస్తుంది. ఆ గడ్డి ఎండిపోయి, చస్తుంది. సత్యం
ఏమిటంటే: మనుష్యులంతా గడ్డి.
8 గడ్డి చచ్చిపోయి ఎండిపోతుంది. కానీ మన దేవుని
మాటలు శాశ్వతంగా నిలిచి ఉంటాయి."

### రక్షణ: దేవుని శుభ వార్త

9 సీయోనూ, నీవు చెప్పాల్సిన శుభవార్త ఉంది.
ఎత్తయిన పర్వతం మీదకు ఎక్కి గట్టిగా ప్రక
టించు. యెరూషలేమూ, నీవు చెప్పాల్సిన శుభ
వార్త ఉంది. భయపడవద్దు. గట్టిగా మాట్లాడు.
యూదా పట్టణాలన్నింటికి ఈ విషయాలు
చెప్పు: "చూడు, ఇదిగో మీ దేవుడు!
10 చూడు, యెహెూవా, నా ప్రభువు శక్తితో వస్తు
న్నాడు. మనుష్యులందరినీ పాలించుటకు
ఆయన తన శక్తిని ప్రయోగిస్తాడు. యెహెూవా
తన ప్రజలకు ప్రతిఫలం తెస్తాడు. వారి జీతం
యెహెూవా దగ్గర ఉంది.
11 గొర్రెల కాపరి తన గొర్రెలను నడిపించినట్టు
యెహెూవా తన ప్రజలను నడిపిస్తాడు.
యెహెూవా తన హస్తాన్ని (శక్తిని) ఉపయోగించి
తన గొర్రెలను ఒక చోట చేరుస్తాడు. గొర్రె
పిల్లలను యెహెూవా పట్టుకొని వాటిని ఆయన
తన చేతుల్లో ఎత్తుకొంటాడు. వాటి తల్లులు
ఆయన చెంత నడుస్తాయి."

### దేవుడు లోకాన్ని చేశాడు; దాన్ని ఆయన పరిపాలిస్తాడు

12 మహా సముద్రాలను తన పిడికిటిలో కొలి చింది
ఎవరు? ఆకాశాన్ని కొలిచేందుకు తన చేతిని
ఉపయోగించింది ఎవరు? భూమిమీద ధూళి
అంతటినీ కొలి చేందుకు పాత్రను ఉపయోగిం
చింది ఎవరు? పర్వతాలను, కొండలను తూకం
వేసేందుకు త్రాసులను ఉపయోగించింది
ఎవరు? యెహెూవాయే.
13 యెహెూవా చేయాల్సింది ఏమిటో ఆయన
ఆత్మకు ఎవరూ చెప్పలేదు. యెహెూవా చేసిన
వాటిని ఎలా చేయాలో ఆయనకు చెప్పిన
వారెవరూ లేరు.
14 యెహెూవా ఎవరి సహాయమైనా అడిగాడా?
న్యాయంగా ఉండటం ఎలా అనేది ఎవరైనా
యెహెూవాకు నేర్పించారా? యెహెూవాకు
ఎవరైనా తెలివిని ఉపదేశించారా? యెహెూవా
జ్ఞానాన్ని వినియోగించటం ఆయనకు ఎవరైనా
నేర్పించారా? లేదు. ఇవన్నీ యెహెూవాకు
ముందే తెలుసు.
15 చూడండి, యెహెూవా లోకంలో రాజ్యాలన్నీ
ఒక చిన్న భాగమే. రాజ్యాలు చేదలోనుంచి జారే
ఒక బొట్టు వంటివి. దూర దేశాలన్నింటినీ
యెహెూవా తీసుకొని ఆయన వాటిని తన
త్రాసులో వేస్తే అవి చిన్న ధూళి కణాల్లా
ఉంటాయి.
16 యెహెూవాకు సమిధలుగా లెబానోను చెట్లన్నీ
చాలవు. లెబానోను జంతువులన్నీ యెహెూ
వాకు బలి అర్పణగా చాలవు.
17 లోక రాజ్యాలన్నింటినీ దేవునితో నీవు పోలిస్తే
రాజ్యాలు శూన్యం దేవునితో పోలిస్తే రాజ్యాలన్నీ
కలిసి ఏ మాత్రం విలువ చేయవు.

### దేవుడు ఎలాంటివాడని ప్రజలు ఊహించలేరు

18 నీవు దేనినైనా దేవునితో పోల్చగలవా? లేదు
నీవు దేవుని పటము చేయగలవా? లేదు.
19 కానీ కొందరు మనుష్యులు బండనుండి చెక్క
నుండి విగ్రహాలు చేసి వాటికి దేవుళ్లని పేరు
పెడుతున్నారు. ఒక పనివాడు ఒక విగ్రహం
చేస్తాడు. బంగారం పనివాడు ఆ విగ్రహానికి
బంగారం పూత పూస్తాడు. అప్పుడు అతడు ఆ
విగ్రహానికి వెండి గొలుసులు చేస్తాడు.
20 పేదవాడు ఖరీదైన ఆ విగ్రహాలు కొనలేడు. కనుక
పేదవాడు కుళ్లిపోని ఒక చెట్టును చూస్తాడు.
తర్వాత ఒక మనిషికి డబ్బిచ్చి దానిమీద ఒక
దేవుని బొమ్మ చెక్కిస్తాడు. అదీ, పేదవాని
దేవుడు. మరి ఆ "దేవుడు" కనీసం కదలడు.
21 తప్పకుండా సత్యం నీకు తెలుసు కదూ? తప్పక
అది నీవు విన్నావు. ఆదిలోనే ఎవరో ఒకరు
నీతో సత్యం చెప్పారు. భూమిని చేసింది ఎవరో
తప్పక నీకు తెలుసు.
22 నిజమైన దేవుడు భూగోళానికి పైగా కూర్చుని
ఉంటాడు. ఆయనతో పోల్చి చూస్తే మనుష్యులు
మిడతల్లా ఉంటారు. ఆయన ఆకాశాలను బట్ట
తెరచినట్టు తెరిచాడు. ఆయన ఆకాశాలను ఒక
గుడారంలా దాని కింద కూర్చునేందుకు
పరిచాడు.
23 నిజమైన దేవుడు పరిపాలకులను పాము ఖ్యాత
లేనివారినిగా చేస్తాడు. ఆయన ఈ లోకపు న్యాయ
మూర్తులను పూర్తిగా నిష్ప్రయోజకులనుగా
చేస్తాడు.
24 ఆ పరిపాలకులు మొక్కల్లా ఉన్నారు వారు
భూమిలో నాటబడ్డారు కానీ వారు నేలలో వేరు
తన్నుకొనక ముందే దేవుడు ఆ మొక్కల మీద
గాలి విసరజేస్తాడు. దాంతో అవి చచ్చి, ఎండి
పోతాయి. గాలి వాటిని గడ్డి పరకల్లా కొట్టుకొని
పోజేస్తుంది.
25 పరిశుద్ధుడు (దేవుడు) చెబుతున్నాడు: "నన్ను
నీవు ఎవరితోనైనా పోల్చగలవా? లేదు. నాకు
ఎవరు సమానం కాదు.

26 పైన ఆకాశాలను చూడు ఆ నక్షత్రాలన్నింటినీ
ఎవరు సృష్టించారు? ఆకాశంలోని ఆ 'సైన్యాలు'
అన్నింటిని ఎవరు సృష్టించారు? ప్రతి నక్షత్రం
దాని పేరుతో సహా ఎవరికి తెలుసు? సత్యవంతు
డైన దేవుడు చాలా బలం, శక్తి గలవాడు, అందు
చేత ఈ నక్షత్రాల్లో ఒక్కటి కూడ తప్పిపోదు."
27 యాకోబూ, ఇది నిజం! ఇశ్రాయేలూ, దీనిని
నీవు నమ్మాలి! "నేను జీవించే విధము
యెహోవా చూడలేదు దేవుడు నన్ను కనుగొని
శిక్షించాడు" అని నీవెందుకు చెపుతున్నావు?
28 యెహోవా అలసిపోడు, ఆయనకు విశ్రాంతి
అవసరంలేదు. భూమిమీద దూర స్థలాలన్నింటినీ
యెహోవాయే సృష్టించాడు యెహోవా
నిత్యమూ జీవిస్తాడు.
29 బలహీనులు బలంగా ఉండేటట్టు యెహోవా
సహాయం చేస్తాడు. శక్తిలేని వాళ్లను ఆయన శక్తి
మంతులుగా చేస్తాడు.
30 యువకులు అలసిపోతారు, వారికి విశ్రాంతి
కావాలి. చివరికి బాలురు కూడ తొట్రిల్లి, పడి
పోతారు.
31 కాని యెహోవా మీద విశ్వాసం ఉంచి, ఆయన
మీద ఆధారపడే మనుష్యులు తిరిగి బలంగల
వాళ్లవుతారు. అది వారు పక్షి రాజులా రెక్కలు
కలిగి ఉన్నట్టుగా ఉంటుంది. వారు విశ్రాంతి
అవసరం లేకుండా పరుగుల మీద పరుగులు
తీస్తూ ఉంటారు. వారు అలసి పోకుండా
నడుస్తారు.

### యెహోవా శాశ్వతమైన సృష్టికర్త

41 యెహోవా చెబుతున్నాడు: "దూర
దేశాల్లారా, మౌనంగా ఉండి నా దగ్గరకు
రండి. దేశాల్లారా ధైర్యంగా ఉండండి. నా దగ్గరకు
వచ్చి మాట్లాడండి. మనం కలిసికొందాం. ఎవరిది
సరియైనదో నిర్ణయించేద్దాం.
2 ఈ ప్రశ్నలకు నాకు జవాబు చెప్పండి: తూర్పు
నుండి వస్తోన్న ఆ మనిషిని మేల్కొలిపింది
ఎవరు? మంచితనం నాతో కూడ నడుస్తుంది.
అతడు తన ఖడ్గం ఉపయోగించి రాజ్యాలను
ఓడిస్తాడు. వారు ధూళి అవుతారు. అతడు తన
విల్లును ఉపయోగించి రాజులను జయిస్తాడు.
వారు గాలికి కొట్టుకొని పోయే పొట్టులా పారి
పోతారు.
3 అతడు సైన్యాలను తరుముతాడు, ఎన్నడూ బాధ
నొందడు. అతడు అంతకు ముందు ఎన్నడూ
వెళ్లని స్థలాలకు వెళ్తాడు.
4 "ఈ సంగతులు జరిగేట్టు చేసింది ఎవరు? ఇది
ఎవరు చేశారు? ఆదినుండి మనుష్యులందరినీ
పిలిచింది ఎవరు? యెహోవాను నేనే ఈ సంగ
తులను చేశాను. యెహోవాను నేనే మొట్ట
మొదటి వాడ్ని ఆరంభానికి ముందే నేను ఇక్కడ
ఉన్నాను. అన్నీ ముగింపు అయిన తర్వాత కూడ
నేను ఇక్కడ ఉంటాను.
5 దూర దూర స్థలాలూ మీరంతా చూచి
భయపడండి. భూమ్మీద దూరంగా ఉన్న
స్థలాలూ మీరంతా భయంతో వణకండి. మీరంతా
దగ్గరగా రండి, నా మాటలు వినండి."

6 "పనివాళ్లూ, ఒకరికి ఒకరు సహాయం చేసు
కొంటారు. ఒకరిని ఒకరు బలపర్చుకొంటారు. 7 ఒక
పనివాడు ఒక విగ్రహం చేసేందుకు కర్ర కోస్తాడు. ఆ
వ్యక్తి కంసాలికి ప్రోత్సాహాన్ని ఇస్తాడు. మరో మనిషి
సుత్తెతో లోహాన్ని మెత్తగా చేస్తాడు. అప్పుడు ఆ
పనివాడు దాగలితో పని చేసేవాడ్ని ప్రోత్సహిస్తాడు.
'ఈ పని బాగుంది, లోహం ఊడిపోదు' అంటాడు ఈ
చివరి పనివాడు. అందుచేత అతడు ఆ విగ్రహాన్ని ఒక
పీటకు మేకులతో బిగిస్తాడు. విగ్రహం పడిపోదు. అది
ఎప్పటికీ కదలదు."

### యెహోవా మాత్రమే మనలను రక్షించగలడు

8 యెహోవా చెబుతున్నాడు: "ఇశ్రాయేలూ, నీవు
నా సేవకుడివి యాకోబూ, నిన్ను నేను ఏర్పర
చుకొన్నాను. నీవు అబ్రాహాము వంశంవాడివి.
అబ్రాహామును నేను ప్రేమించాను.
9 భూమిమీద నీవు చాలా దూరంగా ఉన్నావు.
నీవు చాలా దూర దేశంలో ఉన్నావు. అయితే
నేను నిన్ను పిలిచి, నీవు నా సేవకుడివి. నేను
నిన్ను ఏర్పరచుకొన్నాను. నేను నీకు విరో
ధంగా తిరుగలేదు అని చెప్పాను.
10 దిగులుపడకు, నేను నీతో ఉన్నాను. భయ
పడకు, నేను నీ దేవుణ్ణి. నేను నిన్ను బలంగా
చేశాను. నేను నీకు సహాయం చేస్తాను. నేను
మంచితనపు కుడిహస్తంతో నిన్ను బల
పరుస్తాను.
11 చూడు, కొంతమంది మనుష్యులు నీ మీద
కోపంగా ఉన్నారు. కానీ వాళ్లు సిగ్గుపడతారు. నీ
శత్రువులు అదృశ్యమై నశిస్తారు.
12 నీ విరోధుల కోసం నీవు వెదకుతావు. కానీ
నీవు వారిని కనుగొనలేవు. నీకు విరోధంగా
యుద్ధం చేసినవాళ్లు పూర్తిగా కనబడకుండా
పోతారు.
13 నేను యెహోవాను, నీ దేవుణ్ణి నేను నీ కుడి
చేయి పట్టుకొన్నాను. నీవు భయపడవద్దు, నేను
నీకు సహాయం చేస్తాను. అని నేను నీతో
చెబుతున్నాను.

14 పశస్తమైన యూదా, భయపడకు ప్రియమైన
నా ఇశ్రాయేలు ప్రజలారా భయపడవద్దు. నిజంగా
నేను మీకు సహాయం చేస్తాను." సాక్షాత్తూ
యెహోవాయే ఆ మాటలు చెప్పాడు. ఇశ్రా
యేలు పరిశుద్ధుడు (దేవుడు), నిన్ను రక్షించే
వాడు ఈ సంగతులు చెప్పాడు:
15 "చూడు, నిన్ను నేను ఒక కొత్త నూర్పిడి చెక్కగా
చేశాను. ఈ పనిముట్టుకు పదునైన పండ్లు చాలా
ఉన్నాయి. ధాన్యపు గింజల గుల్లలు పగుల
గొట్టుటకు రైతులు దీనిని ఉపయోగిస్తారు. నీవు
పర్వతాలను అణగ దొక్కి, చితుక గొడ్తావు.
కొండలను నీవు పొట్టులా చేస్తావు.
16 వాటిని గాలిలో విసిరివేస్తావు. గాలి దానిని విసరి,
చెదరగొడ్తుంది. అప్పుడు నీవు యెహోవా
యందు సంతోషంగా ఉంటావు. ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుని (దేవుని) గూర్చి నీవు ఎంత
గానో అతిశయిస్తావు.
17 "పేదలు, అక్కరలో ఉన్నవారు నీళ్లకోసం వెదకు
తారు. కానీ వారికి ఏమీ దొరకవు. వారు
దాహంతో ఉన్నారు. వారి నాలుకలు పిడచ
కట్టాయి. నేను వారి ప్రార్థనలకు జవాబిస్తాను.
నేను వాళ్లను విడువను, చావనివ్వను.
18 ఎండిపోయిన కొండల మీద నేను నదులను
ప్రవహింపజేస్తాను. లోయలో నీటి ఊటలను
నేను ప్రవహింపజేస్తాను. అరణ్యాన్ని నీటి సర
సుగా నేను చేస్తాను. ఎండిన భూములలో నీటి
బుగ్గలు ఉబుకుతాయి.
19 అరణ్యంలో వృక్షాలు పెరుగుతాయి. దేవదారు
వృక్షాలు, తుమ్మ చెట్లు గొంజి చెట్లు, తైల
వృక్షాలు తమాల వృక్షాలు, సరళ వృక్షాలు అక్కడ
ఉంటాయి.
20 "ఈ సంగతులు జరగడం ప్రజలు చూస్తారు.
యెహోవా శక్తిచేత ఇవి జరిగాయని వారు
తెలుసుకొంటారు. ప్రజలు ఈ సంగతులు
చూస్తారు. వారు గ్రహించటం మొదలుబెడతారు.
ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు (దేవుడు) ఈ
సంగతులను చేసినట్టు వారు తెలును
కొంటారు."

### అబద్ధపు దేవతలతో యెహోవా పందెం

21యాకోబు రాజు, యెహోవా చెబుతున్నాడు:
"రండి మీ వివాదాలు నాతో చెప్పండి. మీ రుజువులు
చూపించండి, సరియైన విధంగా మనం నిర్ణయం
చేద్దాం. 22జరుగుతోన్న వాటిని గూర్చి, మీ విగ్రహాలు
(అబద్ధపు దేవతలు) వచ్చి మాతో చెప్పాలి.

"మొదట్లో ఏమి జరిగింది? భవిష్యత్తులో ఏమి
జరుగుతుంది? మాతో చెప్పండి. మేమి జాగ్రత్తగా
వింటాం. అప్పుడు తర్వాత ఏమి జరుగుతుంది అనేది
మాకు తెలుస్తుంది. 23ఏమి జరుగుతుందో తెలుసు
కొనేందుకు గాను మేము ఎదురు చూడాల్సిన వాటిని
గూర్చి చెప్పండి. అప్పుడు మీరు నిజంగానే దేవుళ్లు
అని మేము నమ్ముతాం. ఏదో ఒకటి చేయండి. ఏదైనా
సరే మంచిగాని చెడుగాని చేయండి. అప్పుడు మీరు
బతికే ఉన్నారని మాకు తెలుస్తుంది. మేము మిమ్మల్ని
వెంబడించగలుగుతాం.

24"చూడండి, తప్పుడు దేవుళ్లారా, మీరు శూన్యం
కంటె తక్కువ. మీరు ఏమీ చేయలేరు. ఉత్త పనికి
మాలిన మనిషి మాత్రమే మిమ్మల్ని పూజించాలను
కొంటాడు."

### యెహోవా తానొక్కడే దేవుడని బుజువు చేయటం

25 "ఉత్తరాన నేను ఒక మనిషిని మేల్కొపాను.
సూర్యోదయమయ్యే తూర్పు దిశనుండి అతడు
వస్తున్నాడు. అతడు నా నామాన్ని ఆరాధిస్తాడు.
కుమ్మరి మట్టి ముద్దను తొక్కుతాడు. అదే
విధంగా ఈ ప్రత్యేక మనిషి రాజులను అణగ
దొక్కుతాడు."
26 ఇది జరుగక ముందే దీనినిగూర్చి మాతో ఎవరు
చెప్పారు? ఆయన్ను మనం దేవుడు అని
పిలవాలి. మీ విగ్రహాల్లో ఒకటి ఈ సంగతులను
మాకు చెప్పిందా? లేదు. ఆ విగ్రహాల్లో ఏదీ
మాకేమీ చెప్పలేదు. ఆ విగ్రహాలు ఒక్క మాట
కూడ చెప్పలేదు. మరియు మీరు చెప్పే ఒక్క
మాట కూడ ఆ అబద్ధపు దేవుళ్ళు వినలేవు.
27 ఈ విషయాలను గూర్చి యెహోవాను, నేనే
మొట్టమొదట సీయోనుకు చెప్పాను.
"చూడండి, మీ ప్రజలు తిరిగి వస్తున్నారు" అనే
ఒక సందేశం ఇచ్చి ఒక సందేశహరుని యెరూష
లేముకు నేను పంపించాను.
28 ఆ తప్పుడు దేవుళ్లను నేను చూశాను. వారిలో
ఎవరూ ఏమీ చెప్పగల తెలివి లేనివాళ్లు. వాళ్లను
నేను ప్రశ్నలు అడిగాను. కానీ వారు ఒక్క మాట
కూడా పలుకలేదు.
29 ఆ దేవుళ్లంతా శూన్యంకంటె తక్కువ. వాళ్లు
ఏమీ చేయలేరు. ఆ విగ్రహాలు బొత్తిగా పనికి
మాలినవి.

### యెహోవా యొక్క ప్రత్యేకమైన సేవకుడు

42 "నా సేవకుణ్ణి చూడండి! నేను అతన్ని
బలపరుస్తాను. నేను ఏర్పరచుకొన్నవాడు
అతడే. అతని గూర్చి నేను ఎంతో ఆనంది
స్తున్నాను. నా ఆత్మను నేను అతనిలో ఉంచాను.
జనాలన్నింటికి అతడు న్యాయం చేకూరుస్తాడు.
2 అతడు వీధుల్లో కేకలు వేయడు అతడు గట్టిగా
అరిచి శబ్దం చేయడు.

3 అతడు సౌమ్యుడు అతడు నలిగిన గడ్డిపరకను గూడ
విరువడు. మిణుకు మిణుకు మంటున్న మంటను
గూడ అతడు ఆర్పడు. అతడు న్యాయాన్ని
ప్రయోగించి ఏది సత్యమో తెలుసుకొంటాడు.
4 లోకానికి న్యాయం చేకూర్చేవరకు అతడు బల
హీనం కాడు, నలిగిపోడు. దూర స్థలాల్లోని ప్రజలు
అతని ఉపదేశాలను విశ్వసిస్తారు."

## ప్రపంచాన్ని చేసినవాడు, పరిపాలించేవాడు యెహోవా

5 యెహోవా, సత్యదేవుడు ఈ సంగతులు
చెప్పాడు: (ఆకాశాలను యెహోవా చేశాడు. ఆకాశాలను
భూమిమీద విస్తరింపజేసినవాడు యెహోవా. ఆయనే
భూమిమీద సమస్తం చేసాడు. భూమిమీద మనుష్యు
లందరికి ఆయనే జీవం ప్రసాదిస్తాడు. భూమిమీద
నడిచే ప్రతి వ్యక్తికి ఆయనే ప్రాణం పోస్తాడు.)
6 "మీరు సరైనది చేయాలని నిన్ను పిలిచింది నేనే,
యెహోవాను. నేను నీ చేయి పట్టుకొంటాను. నేను
నిన్ను కాపాడుతాను. ప్రజలతో నాకు ఒక ఒడంబడిక
ఉంది. అని తెలియజేసేందుకు నీవే ఒక సంకేతం
నీవు ప్రజలందరి కోసం ప్రకాశించే వెలుగుగా ఉంటావు.
7 గుడ్డివాళ్ల కళ్లు నీవు తెరుస్తావు. వాళ్లు చూడ
గలుగుతారు. అనేక మంది ప్రజలు చెరలో ఉన్నారు.
ఆ ప్రజలను నీవు విడుదల చేస్తావు. అనేక మంది
ప్రజలు చీకట్లో జీవిస్తున్నారు. ఆ బందీ గృహంనుండి
నీవు వారిని బయటకు నడిపిస్తావు.
8 "నేను యెహోవాను. నా పేరు యెహోవా నేను
నా మహిమను మరొకరికి ఇవ్వను. నాకు చెందాల్సిన
స్తుతిని విగ్రహాలను (అబద్ధపు దేవుళ్ళను) తీసు
కోనివ్వను.
9 కొన్ని సంగతులు జరుగుతాయని మొదట్లోనే
నేను చెప్పాను, ఆ సంగతులు జరిగాయి. ఇప్పుడు,
భవిష్యత్తులో జరుగబోయే సంగతులను గూర్చి, అవి
జరుగక ముందే నేను మీకు వాటిని గూర్చి చెబుతాను."

## దేవునికొక స్తుతి గీతం

10 యెహోవాకు కొత్త కీర్తన పాడండి. భూమి మీద
చాలా దూరంలో ఉన్న సర్వ ప్రజలారా, సము
ద్రాల్లో ప్రయాణం చేసే సర్వ ప్రజలారా, మహా
సముద్రాల్లోని సర్వ ప్రాణులారా, దూర స్థలాల్లో
ఉన్న సర్వ పజలారా యెహోవాను
స్తుతించండి!
11 అరణ్యాలు, పట్టణాలు కేదారు పొలాలు యెహో
వాను స్తుతించండిసెలా నివాసులారా ఆనందంగా
పాడండి. మీ పర్వత శిఖరం మీదనుండి పాడండి.
12 యెహోవాకు మహిమ ఆపాదించండి. దూర
దేశాల్లోని ప్రజలంతా ఆయనను స్తుతించాలి.
13 యెహోవా ఒక పరాక్రమ సైనికునిలా బయలు
దేరుతున్నాడు. ఆయన యుద్ధం చేయటానికి
సిద్ధంగా ఉన్న వానిలా ఉంటాడు. ఆయన చాలా
ఉద్రేకతలూగుతూంటాడు. ఆయన గట్టిగా
కేకలు వేసి అరుస్తాడు. ఆయన తన శత్రువులను
ఓడిస్తాడు.

## దేవుడు చాలా ఓర్పుగలవాడు

14 "చాలా కాలంగా నేను మౌనంగా ఉన్నాను.
నేను అలానే మౌనంగా ఉండి, నన్ను నేను
నిగ్రహించుకొన్నాను. కానీ ఇప్పుడు శిశువును
కంటున్న స్త్రీలా నేను గట్టిగా అరుస్తాను. నేను
కఠినంగా, గట్టిగా ఊపిరి పీలుస్తాను.
15 కొండలను, పర్వతాలను నేను నాశనం చేస్తాను.
అక్కడ మొలిచే మొక్కలన్నింటిని నేను ఎండి
పోయేట్టు చేస్తాను. నదులను నేను పొడి నేలగా
చేస్తాను. నీటి మడుగులను నేను ఎండిపోయేట్టు
చేస్తాను.
16 గుడ్డివారికి ఇదివరకు తెలియని మార్గంలో నేను
వారిని నడిపిస్తాను ఆ గుడ్డివారు ఇదివరకు
ఎన్నడూ తిరుగని బాటలలో నేను వారిని నడిపి
స్తాను. చీకటిని నేను వారికి వెలుగుగా చేస్తాను.
కరకు నేలను నేను చదును చేస్తాను. నేను
వాగ్దానం చేసే పనులను నేను చేస్తాను. నా
ప్రజలను నేను విడువను.
17 కానీ కొంతమంది మనుష్యులు నన్ను వెంబ
డించటం మానివేశారు. బంగారపు పూత పూయ
బడిన విగ్రహాలు వారికి ఉన్నాయి. 'మీరే మా
దేవుళ్లు' అని వారు ఆ విగ్రహాలతో చెబుతారు.
ఆ ప్రజలు వారి అబద్ధపు దేవుళ్లను నమ్ము
తారు. కానీ ఆ ప్రజలు నిరాశ చెందుతారు."

## దేవుని మాట వినటానికి ఇశ్రాయేలు నిరాకరించింది

18 "చెవిటి ప్రజలారా నా మాట వినాలి. గుడ్డి మను
ష్యులారా మీరు కళ్లు తెరిచి, నన్ను చూడాలి.
19 పపంచం అంతటిలో కెల్లా నా సేవకుడు*
ఎక్కువ గుడ్డివాడు. నేను ప్రపంచంలోకి పంపిం
చిన నా సేవకుడు మహా చెవిటి. నేను ఒడంబడిక
చేసు కొన్న ఆ వ్యక్తి యెహోవా సేవకుడు
అందరికంటె మహా గుడ్డివాడు.
20 ఈ సేవకుడు తాను ఏమి చేయాలో అది
చూడాలి. కానీ అతడు నాకు విధేయత చూపడం
లేదు. అతడు తన చెవులతో వినగలడు. కానీ
అతడు నా మాట వినుటకు నిరాకరిస్తున్నాడు."

---

**నా సేవకుడు** ఇక్కడ ఇది ఇశ్రాయేలు ప్రజలు అని కూడా అర్థం చెప్పవచ్చు.

21 యెహోవా తన సేవకుని ఎడల న్యాయం చూప
గోరుతున్నారు. కనుక అద్భుతమైన ఉపదేశాల
ను యెహోవా తన ప్రజలకు చేస్తాడు.
22 అయితే ప్రజలను చూడండి ఇతరులు వారిని
ఓడించి, వారి దగ్గర దొంగిలించారు. యువకు
లంతా భయపడ్తున్నారు. వారు చెరలో బంధించ
బడ్డారు. మనుష్యులు వారి ధనం వారి దగ్గర్నుండి
దోచుకొన్నారు. వారిని రక్షించేందుకు ఏ మనిషి
లేడు. ఇతరులు వారి డబ్బు దోచుకొన్నారు.
"దానిని తిరిగి ఇచ్చేయండి" అని చెప్పగల వాడు
ఒక్కడూ లేడు.

23మీలో ఎవరైనా దేవుని మాట విన్నారా? లేదు.
కానీ మీరు ఆయన మాటలు జాగ్రత్తగా విని, జరిగిన
దానిని గూర్చి ఆలోచించాలి. 24యాకోబు, ఇశ్రాయేలు
నుండి ధనాన్ని దోచుకోనిచ్చింది ఎవరు? యెహో
వాయే వారిని ఇలా చేయనిచ్చాడు. మనం యెహో
వాకు విరోధంగా పాపం చేశాం. అందుచేత యెహోవా
మన ధనాన్ని ఇతరులు దోచుకోనిచ్చాడు. యెహోవా
కోరిన విధంగా జీవించటానికి ఇశ్రాయేలు ప్రజలు
ఇష్టపడలేదు. ఇశ్రాయేలు ప్రజలు ఆయన ఉపదేశాలను
వినిపించు కోలేదు. 25అందుచేత యెహోవా వారిమీద
కోపగించాడు. యెహోవా వారి మీదకు గొప్ప
యుద్ధాలు వచ్చేట్టు చేశాడు. ఇశ్రాయేలు ప్రజలకు
వారి చుట్టూరా అగ్ని ఉన్నట్టుగా ఉంది. కానీ జరుగు
తోంది ఏమిటో వారికి తెలియలేదు. వారు కాలిపోతు
న్నట్టే ఉంది. కానీ జరుగుతోన్న సంగతులను గ్రహిం
చేందుకు వారు ప్రయత్నించ లేదు.

## దేవుడు ఎల్లప్పుడు తన ప్రజలతో ఉన్నాడు

43 యాకోబూ, యెహోవా నిన్ను సృష్టించాడు.
ఇశ్రాయేలు, యెహోవా నిన్ను సృజించాడు.
ఇప్పుడు యెహోవా చెబుతున్నాడు: "భయపడవద్దు.
నేను నిన్ను రక్షించాను. పేరుపెట్టి నిన్ను పిలిచాను.
నీవు నా స్వంతం. 2నీకు కష్టాలు వచ్చినప్పుడు నేను
నీకు తోడుగా ఉన్నాను. నీవు నదులు దాటి వెళ్లే
టప్పుడు, అవి నీమీద పొర్లి పారవు. నీవు అగ్ని మధ్య
నడిచేటప్పుడు కాలిపోవు, జ్వాలలు నిన్ను కాల్చవు.
3ఎందుకంటే యెహోవానైన నేను నీకు దేవుడను
గనుక, ఇశ్రాయేలు పరిశుద్ధుడనైన నేను మీకు రక్షకుణ్ణి
గనుక. మీకు విలువగా చెల్లించేందుకు నేను ఈజిప్టును
ఇచ్చాను. నిన్ను నా స్వంతం చేసుకొనేందుకు ఇథి
యోపియాను, సెబాను నేను ఇచ్చాను. 4నీవు నాకు
ప్రియుడివి గనుక నేను నిన్ను ఘనపరుస్తాను. నేను
నిన్ను ప్రేమిస్తున్నాను, నీవు బతుకునట్లు నీకు
మనుష్యులనూ, నీకిష్టమైన జనాంగాలను నేను ఇచ్చి
వేస్తాను."

## దేవుడు తన పిల్లలను ఇంటికి తీసుకొని వస్తాడు

5"కనుక భయపడవద్దు. నేను నీకు తోడుగా
ఉన్నాను. నేను నీ పిల్లలను సమకూర్చి వారిని నీ
దగ్గరకు రప్పిస్తాను. తూర్పునుండి, పడమరనుండి నేను
వారిని సమకూరుస్తాను. 6నా మనుష్యుల్ని నాకు ఇచ్చి
వేయి అని నేను ఉత్తరానికి చెబుతాను. నా మనుష్యుల్ని
బందీలుగా చెరసాలలో ఉంచవద్దు అని నేను దక్షిణానికి
చెబుతాను. దూర దేశాలనుండి నా కుమారులను,
కుమార్తెలను నా దగ్గరకు తీసుకొని రండి. 7నా
ప్రజలందరినీ, నీ నామం పెట్టబడిన మనుష్యులందరినీ
నా దగ్గరకు తీసుకొని రండి. నేను వారిని నా కోసమే
సృష్టించుకొన్నాను. వాళ్లను నేనే సృష్టించాను. వాళ్లు
నావాళ్లు."

## ప్రపంచానికి దేవుని యొక్క సాక్షి ఇశ్రాయేలు

8"కళ్లుండి చూడలేని వాళ్లను బయటకు తీసుకొని
రండి. చెవులు ఉండి వినలేని వాళ్లను బయటకు తీసు
కొని రండి. 9ప్రజలందరూ, రాజ్యాలు అన్నీ సమావేశ
పర్చబడాలి. ఆదిలో జరిగిన దానిని గూర్చి వాళ్ల
తప్పుడు దేవుళ్లలో ఎవరైనా వారితో చెప్పాలని
కోరుతున్నారేమో, వారు వారి సాక్షులను తీసుకొని
రావాలి. సాక్షులు సత్యం చెప్పాలి. వారిదే సరి అని
ఇది తెలియజేస్తుంది."

10యెహోవా చెబుతున్నాడు: "ప్రజలారా, మీరే
నా సాక్షులు. నేను ఏర్పాటు చేసికొన్న ఆ సేవకులు
మీరే. ప్రజలు నన్ను విశ్వసించుటకు వారికి మీరు
సహాయం చేస్తారని నేను మిమ్మల్ని ఏర్పాటు చేసు
కొన్నాను. 'నేనే ఆయనను' అని, నేనే సత్య దేవుడను
అని మీరు గ్రహించాలని నేను మిమ్మల్ని ఏర్పాటు
చేసుకున్నాను. నాకు ముందుగా ఏ దేవుడూ లేడు,
నా తర్వాత ఏ దేవుడూ ఉండడు. 11నా మట్టుకు నేనే
యెహోవాను. నేను ఒక్కడనే రక్షకుడను, మరి ఎవరూ
లేరు.

12మీతో మాట్లాడిన వాడను నేనే. నేనే మిమ్మల్ని
రక్షించాను. ఆ సంగతులు నేనే మీకు చెప్పాను. మీతో
ఉన్న ఎవరో కొత్తవాడు కాదు. మీరే నా సాక్షులు,
నేనే దేవుడను." సాక్షాత్తు యెహోవా చెప్పిన మాటలు
ఇవి. 13"నేను ఎల్లప్పుడూ దేవునిగానే ఉన్నాను.
నేనేదైనా చేశాను అంటే నేను చేసిన దానిని ఎవరూ
మార్చలేరు. నా శక్తి నుండి మనుష్యులను ఎవ్వరూ
రక్షించలేరు."

14యెహోవా, ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు
మిమ్మల్ని రక్షిస్తాడు. యెహోవా చెబుతున్నాడు,
"నేను మీ కోసం సైన్యాలను బబులోనుకు పంపిస్తాను.
అనేక మంది ప్రజలు బంధించబడతారు. ఆ కల్దీయుల
ప్రజలు వారి స్వంత పడవల్లోనే తీసుకొనిపోబడతారు.
(కల్దీ ప్రజలకు ఆ పడవలను గూర్చి చాలా గర్వం)

15నేను యెహోవాను, మీ పరిశుద్ధుడ్ని. ఇశ్రాయేలును
నేను సృష్టించాను. నేను మీ రాజును."

### దేవుడు తన ప్రజలను మరల రక్షిస్తాడు

16యెహోవా సముద్రంలో మార్గాలు వేస్తాడు.
కల్లోలిత జలాలలో గూడ ఆయన తన ప్రజలకు ఒక
బాట వేస్తాడు. మరియు యెహోవా చెబుతున్నాడు,
17"రథాలు, గుర్రాలు, సైన్యాలతో నాకు విరోధంగా
యుద్ధం చేసేవారు ఓడించబడుతారు. వాళ్లు మళ్లీ ఎన్న
టికి లేవరు. వారు నాశనం చేయబడుతారు. క్రొవ్వువత్తి
మంట ఆర్పినట్టుగా వారు ఆపుజేయబడతారు. 18కనుక
మొదట్లో జరిగిన సంగతులను జ్ఞాపకం చేసుకోవద్దు.
చాలా కాలం కిందట జరిగిన ఆ సంగతులను గూర్చి
ఆలోచించవద్దు. 19ఎందుకంటే నేను నూతన కార్యాలు
చేస్తాను. ఇప్పుడు మీరు కొత్త మొక్కలా ఎదుగుతారు.
ఇది సత్యమని మీకు గట్టిగా తెలుసు. నేను నిజంగానే
అరణ్యంలో బాట వేస్తాను. నిజంగానే నేను ఎడారిలో
నదులు ప్రవహింపజేస్తాను. 20అడవి జంతువులు కూడ
నాకు కృతజ్ఞత కలిగి ఉంటాయి. నిప్పుకోళ్లు, పెద్ద
జంతువులు నన్ను ఘన పరుస్తాయి. అరణ్యంలో నేను
నీళ్లను ప్రవహింప చేసినప్పుడు అవి నన్ను ఘన
పరుస్తాయి. ఎడారిలో నేను నదులను ప్రవహింప జేసి
నప్పుడు అవి ఘన పరుస్తాయి. నేను ఏర్పరచుకొన్న
నా ప్రజలకు నీళ్లు ఇవ్వటానికి నేను దానిని చేస్తాను.
21వీరే నేను చేసిన మనుష్యులు. ఈ ప్రజలు నన్ను
స్తుతించుటకు పాటలు పాడతారు.

22"యాకోబూ, నీవు నాకు మొరపెట్టలేదు.
ఎందుకంటే ఇశ్రాయేలూ, నీవు నాతో విసిగిపోయావు.
23ప్రజలారా, మీరు మీ బలి అర్పణ గొర్రెలను నా
దగ్గరకు తీసుకొని రాలేదు. మీరు నన్ను ఘనపర్చలేదు.
మీరు నాకు బలులు అర్పించలేదు, మీరు నాకు బలులు
ఇవ్వాలని నేను మిమ్మల్ని బలవంతం చేయలేదు.
మీకు విసుగు కలిగేంత వరకు మీరు నాకు ధూపం
వేయమని మిమ్మల్ని నేను బలవంతపెట్టలేదు. 24కనుక
మీరు నన్ను ఘనపర్చేందుకు అవసరమైన వస్తువులు
కొనుటకు మీరు మీ డబ్బును ఉపయోగించలేదు.
కానీ నేను మీ సేవకునిలా ఉండాలని మీరే నన్ను బల
వంతం చేశారు. మీ చెడు క్రియలన్నీ నన్ను చాలా
విసిగించే వరకు పాపం చేశారు.

25"నేను, నేనే మీ పాపాలు తుడిచివేసే వాడ్ని. నా
ఆనందం కోసం నేను దీన్ని చేస్తాను. నేను మీ పాపాలు
జ్ఞాపకం చేసుకోను. 26కానీ మీరు నన్ను జ్ఞాపకం ఉంచు
కోవాలి. మనం సమావేశంగా కలుసు కొని ఏది సరైనదో
నిర్ణయించాలి. మీరు చేసిన వాటిని గూర్చి చెప్పి,
మీదే సరిగ్గా ఉంది అని చూపించాలి. 27మీ మొదటి
తండ్రి పాపం చేశాడు. మీ న్యాయవాదులు నాకు
విరోధమైన వాటిని చేశారు. 28మీ పవిత్ర పాలకులను
పవిత్రులు గాకుండా నేను చేస్తాను. యాకోబు సంపూ
ర్తిగా నావాడయ్యేటట్టు నేను చేస్తాను. ఇశ్రాయేలుకు
చెడుగులు సంభవిస్తాయి."

### యెహోవా ఒక్కడు మాత్రమే దేవుడు

44 "యాకోబూ నీవు నా సేవకుడవు. నా మాట
విను. ఇశ్రాయేలూ నేను నిన్ను ఏర్పాటు
చేసుకొన్నాను. నేను చెప్పే సంగతులు విను. 2నేను
యెహోవాను, నేనే నిన్ను సృజించాను. నీవు ఏమై
యున్నావో అలా ఉండేందుకు నిన్ను సృజించిన
వాడను నేనే. నీవు నీ తల్లి గర్భంలో ఉన్నప్పటి
నుంచి నేను నీకు సహాయం చేశాను. యాకోబూ,
నా సేవకా, భయపడవద్దు. యెషూరూనూ,* నిన్ను
నేను ఏర్పాటు చేసుకొన్నాను.

3"దాహంగా ఉన్న మనుష్యులకు నేనే నీళ్లు పోస్తాను.
ఎండిన భూమిమీద నేనే కాలువలను ప్రవహింపజేస్తాను.
నీ పిల్లల మీద నేనే నా ఆత్మను కుమ్మరిస్తాను. అది
మీ కుటుంబం మీద పార్లుతున్న ఒక నీటి ప్రవాహంలా
ఉంటుంది. 4వారు ప్రపంచంలో ప్రజల మధ్య ఎదుగు
తారు. నీటి కాలువల పక్కగా పెరిగే చెట్లలా ఉంటారు
వారు. 5"ఒక వ్యక్తి అంటాడు, 'నేను యెహోవాకు
చెందిన వాడను' అని, మరోవ్యక్తి 'యాకోబు' పేరు
చెప్పు కొంటాడు. ఇంకొక వ్యక్తి నేను యెహోవా
వాడను, అని తన పేరు వ్రాసుకొంటాడు. ఇంకొకరు
'ఇశ్రా యేలు' పేరు ప్రయోగిస్తాడు."

6యెహోవా ఇశ్రాయేలీయుల రాజు. సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇశ్రాయేలును రక్షిస్తాడు.
యెహోవా చెబుతున్నాడు: "నేను ఒక్కడను మాత్రమే
దేవుణ్ణి. ఇంక ఏ దేవుళ్లూ లేరు. నేనే ఆది, అంతము.
7నావంటి దేవుడు ఇంకొకడు లేడు. అలా ఉంటే, ఆ
దేవుడు ఇప్పుడు మాట్లాడాలి. ఆ దేవుడు వచ్చి,
తాను నావలె ఉన్నట్టు రుజువు చూపించాలి. శాశ్వతంగా
ఉండే ఈ ప్రజలను నేను సృజించినప్పుడు ఏమి జరి
గిందో ఆ దేవుడు నాతో చెప్పాలి. భవిష్యత్తులో ఏమి
జరుగుతుందో అది అతనికి తెలిసినట్టు చూపించుటకు
ఆ దేవుడు సూచనలు ఇవ్వాలి. 8భయపడవద్దు! దిగులు
పడవద్దు! ఏమి జరుగుతుందో అది నేను నీతో ఎల్ల
ప్పుడూ చెప్పాలేదా? మీరే నాకు సాక్షులు. నాతో
పాటు ఇంకొక దేవుడున్నాడా? ఏ దేవుడూ లేడు.
నేను ఒక్కడను మాత్రమే. ఇంకొక దేవుడున్నట్టు
నాకు తెలియదు."

### అబద్ధపు దేవుళ్ళు నిష్ప్రయోజనం

9కొంత మంది మనుష్యులు విగ్రహాలు (అబద్ధపు
దేవుళ్ళు) చేసుకొంటారు. కానీ అవి నిష్ప్రయోజనం.

---

**యెషూరూనూ** ఇశ్రాయేలు యొక్క మరోపేరు. "మంచిది"
లేక "సత్యమైనది" అని అర్థం.

ప్రజలు ఆ విగ్రహాలను ప్రేమిస్తారు. కానీ ఆ విగ్రహాలు
నిష్ప్రయోజనం. ఆ మనుష్యులే ఆ విగ్రహాలకు
సాక్షులు, కానీ అవి మాట్లాడవు. వారికి ఏమీ తెలియదు.
వారు చేసే పనుల విషయం వారు సిగ్గుపడేంత మాత్రం
కూడా వారికి తెలియదు.
[10]ఈ తప్పుడు దేవుళ్లను ఎవరు చేశారు? పని
కిమాలిన ఈ విగ్రహాలను ఎవరు చేశారు? [11]చేతి
పనివారు ఆ దేవుళ్లను చేశారు. ఆ పనివాళ్లంతా మను
ష్యులే, దేవుళ్లు కారు. ఆ మనుష్యులంతా కలిసి వచ్చి,
ఈ విషయాలను చర్చిస్తే, అప్పుడు వాళ్లంతా సిగ్గు
పడతారు, భయపడతారు.
[12]ఒక పనివాడు వేడి నిప్పుల మీద ఇనుము వేడి
చేయటానికి తన పనిముట్లు వాడతాడు. లోహాన్ని
కొట్టడానికి ఇతడు తన సుత్తెను ఉపయోగిస్తాడు,
అప్పుడు ఆ లోహం ఒక విగ్రహం అవుతుంది. ఈ
మనిషి బలమైన తన చేతులను ఉపయోగిస్తాడు.
అయితే అతనికి ఆకలి వేసినప్పుడు అతని బలం
పోతుంది. అతడు నీళ్లు తాగకపోతే, అతడు బలహీనం
అవుతాడు.
[13]మరో పనివాడు చెక్కమీద గీతలు గీసేందుకు
నూలు వేసి చీర్ణంతో గీతలు గీస్తాడు. అతడు ఎక్కడ
కోయాలో ఇది తెలియజేస్తుంది. అప్పుడు అతడు
తన ఉలితో చెక్క నుండి విగ్రహాన్ని చెక్కుతాడు. ఆ
విగ్రహాన్ని కొలిచేందుకు అతడు కర్కాటం ఉపయో
గిస్తాడు. ఈ విధంగా ఆ పనివాడు ఆ చెక్క సరిగ్గా
మనిషిలా కనబడేట్టు చేస్తాడు. మరియు ఈ మనిషిని
పోలిన విగ్రహం ఇంట్లో కూర్చోవటం తప్ప చేసేది
ఏమీ లేదు.
[14]ఒకడు దేవదారు, సరళ లేక సింధూర వృక్షాన్ని
నరికివేయవచ్చును. (ఆ చెట్లు పెరిగేటట్టు అతడేం
చేయలేదు. ఆ చెట్లు అడవిలో వాటి స్వంత శక్తి
మూలంగా పెరిగాయి. ఒకడు ఒక తమాల వృక్షాన్ని
నాటితే వర్షం దాన్ని పెంచుతుంది.) [15]అప్పుడు అతడు
మంట వేసుకొనేందుకు ఆ చెట్టును వాడుకొంటాడు.
అతడు ఆ వృక్షాన్ని చిన్న కట్టె ముక్కలుగా నరుకు
తాడు. వంట చేసుకొనేందుకు, చలి కాచుకొనేందుకు
అతడు ఆ కట్టెలను వాడుకొంటాడు. కొన్ని కట్టెలతో
అతడు మంట చేసి, రొట్టె కాల్చుకొంటాడు. అయితే
అతడు ఆ కట్టెల్లో ఒక భాగాన్ని దేవునిగా చేయటానికి
ఉపయోగిస్తాడు. మరియు ఆ మనిషి ఆ దేవుణ్ణి పూజి
స్తాడు. ఆ దేవుడు ఆ మనిషి చేసిన విగ్రహమే కానీ ఆ
మనిషి ఆ విగ్రహం ముందు సాష్టాంగపడతాడు. [16]ఆ
మనిషి సగం కట్టెలు మంటలో కాలుస్తాడు. అతడు
ఆ కట్టెలతో మాంసం వండుకొని, కడుపు నిండే
అంతవరకు ఆ మాంసం తింటాడు. అతడు వెచ్చదనం
కోసం ఆ కట్టెలను మంట పెడతాడు. “బాగుంది,
ఇప్పుడు నాకు వెచ్చగా ఉంది. మంట ద్వారా వెలుగు
వస్తుంది గనుక ఇప్పుడు నేను చూడ గలను” అని
అతడు అంటాడు. [17]అయితే కొంచెం కట్టె మిగిలింది.
కనుక అతడు ఆ కట్టెతో ఒక విగ్రహం చేసి, దాన్ని
తన దేవుడు అని పిలుస్తాడు. ఈ దేవుని ముందు
అతడు సాష్టాంగపడి, దానిని పూజిస్తాడు. అతడు ఆ
దేవుని ప్రార్థించి, “నీవే నా దేవుడివి, నన్ను రక్షించు”
అంటాడు.
[18]ఆ మనుష్యులు ఏమి చేస్తున్నారో వారికే తెలి
యదు. అది వారు గ్రహించరు. అది వారి కళ్లు మూసు
కొనిపోయి, వారు చూడలేనట్టు ఉంటుంది. వారి
హృదయాలు (మనసులు) అర్థం చేసుకొనేందుకు
ప్రయత్నించవు. [19]ఆ మనుష్యులు ఈ విషయాలను
గూర్చి ఆలోచించలేదు. ఆ మనుష్యులు గ్రహించరు
గనుక, “సగం కట్టెలు నేనే కాల్చేశాను, నా రొట్టె
కాల్చుకొనేందుకు, నా మాంసం వండుకొనేందుకు
ఆ నిప్పులు నేను వాడుకొన్నాను. ఆ మాంసం నేను
తిన్నాను. మరి మిగిలిన కట్టెను ఉపయోగించి ఈ
భయంకరమైన పని చేశాను. నేను ఒక చెక్క ముక్కనే
పూజిస్తున్నాను” అని వారి మట్టుకు వారు ఎన్నడూ
తలంచలేదు.
[20]ఆ మనిషి ఏమి చేస్తున్నాడో అతనికి తెలియదు.
అతడు గందరగోళం అయ్యాడు, కనుక అతని
హృదయం అతన్ని తప్పు మార్గంలో నడిపించింది.
అతడు తనను తాను రక్షించుకోలేడు. అతడు చేస్తు
న్నది తప్పు అని అతడు చూడలేడు. “నేను పట్టుకొన్న
ఈ విగ్రహం అబద్ధపు దేవుడు” అని అతడు చెప్పడు.

## నిజమైన దేవుడైన యెహోవా ఇశ్రాయేలుకు సహాయం చేస్తాడు

21 “యాకోబూ, ఈ విషయాలు జ్ఞాపకం ఉంచుకో.
ఇశ్రాయేలూ, నీవు నా సేవకుడవని జ్ఞాపకం
ఉంచుకో. నిన్ను నేను సృజించాను. నీవు నా
సేవకుడవు. కనుక ఇశ్రాయేలూ, నన్ను మరచి
పోవద్దు.
22 నీ పాపాలు ఒక పెద్ద మేఘంలా ఉండేవి. కాని
ఆ పాపాలను నేను తుడిచి వేశాను. గాలిలో
అదృశ్యమైన ఒక మేఘంలా నీ పాపాలు
పోయాయి. నేను నిన్ను తప్పించి కాపాడాను,
కనుక తిరిగి నా దగ్గరకు వచ్చేయి.”
23 యెహోవా గొప్ప కార్యాలు చేశాడు. గనుక
ఆకాశాలు ఆనందిస్తున్నాయి. భూమి, దాని
అగాధ స్థలాల్లో సహితం సంతోషిస్తుంది. పర్వ
తాలు దేవునికి వందనాలు చెల్లిస్తూ పాటలు
పాడుతున్నాయి. అరణ్యంలో చెట్లన్నీ ఆనం
దంగా ఉన్నాయి. ఎందుకు? ఎందుకంటే
యాకోబును యెహోవా రక్షించాడు గనుక
ఇశ్రాయేలుకు యెహోవా గొప్ప కార్యాలు
చేశాడు గనుక.

24 నీవు ఏమైయున్నావో అలా నిన్ను యెహోవా
చేశాడు. నీవు ఇంకా నీ తల్లి గర్భంలో ఉన్న
ప్పుడే యెహోవా దీనిని చేశాడు. "యెహో
వాను, నేనే సమస్తం చేశాను. ఆకాశాలను నేనే
అక్కడ ఉంచాను. నేనే భూమిని నా యెదుట
పరచాను." అని యెహోవా చెబుతున్నాడు.

25అబద్ధపు ప్రవక్తలు అబద్ధాలు చెబుతారు. అయితే
వారి అబద్ధాలు, అబద్ధాలుగా యెహోవా చూపిస్తాడు.
మంత్రాలు చేసే మనుష్యులను యెహోవా వెర్రివారిగా
చేస్తాడు. జ్ఞానులను గూడ యెహోవా కలవరపెడ్తాడు.
వారికి చాలా తెలుసు. అని వారు అనుకొంటున్నారు.
కాని వాళ్లు వెర్రివాళ్లలా కనిపించేట్టు యెహోవా
చేస్తాడు. 26ప్రజలకు సందేశాలు అందించేందుకు
యెహోవా తన సేవకులను పంపిస్తాడు. ఆ సందే
శాలను యెహోవా వాస్తవం చేస్తాడు. ప్రజలు చేయా
ల్సిన వాటిని గూర్చి వారికి చెప్పడానికి యెహోవా
సందేశహరులను పంపిస్తాడు. వారి సలహా మంచిది
అని యెహోవా సూచిస్తున్నాడు.

### యూదాను పునర్మించటానికి దేవుడు కోరెషును ఎన్ను కొంటాడు

" ప్రజలు మరల నీలో నివసిస్తారు" అని యెరూష
లేముతో యెహోవా చెబుతున్నాడు. "మీరు
మరల నిర్మించబడతారు" అని యూదా పట్టణా
లతో యెహోవా చెబుతున్నాడు. "నేను మరల
మిమ్మల్ని పట్టణాలుగా చేస్తాను" అని నాశనం
చేయబడిన పట్టణాలతో యెహోవా
చెబుతున్నాడు.

27 "ఎండిపోండి! మీ కాలువలను నేను ఎండి
పోయేట్టు చేస్తాను" అని లోతైన జలాలతో
యెహోవా చెబుతున్నాడు.

28 యెహోవా కోరేషు*తో చెబుతున్నాడు, "నీవు
నా గొర్రెల కాపరివి. నేను కోరిన వాటిని నీవు
చేస్తావు. 'నీవు మరల కట్టబడతావు' అని యెరూ
షలేముతో నీవు చెబుతావు. 'నీ పునాదులు
మరల నిర్మించబడతాయి'" అని నీవు అల
యంతో చెబుతావు.

### ఇశ్రాయేలును విమోచించటానికి దేవుడు కోరెషును ఎన్నుకొంటాడు

45 యెహోవా ఏర్పాటు చేసుకొన్న తన రాజు
కోరెషుతో ఆయన చెప్పిన సంగతులు ఇవి:
"కోరెషు కుడిచేయి నేను పట్టుకొంటాను. రాజుల
దగ్గర నుండి అధికారం తీసివేసుకొనేందుకు నేను
అతనికి సహాయం చేస్తాను. పట్టణ ద్వారాలు
కోరెషును ఆపు జేయలేవు. పట్టణ ద్వారాలు
నేను తెరు స్తాను, కోరెషు లోనికి ప్రవేశిస్తాడు.

2 "కోరెషూ, నీ సైన్యాలు ముందడుగు వేస్తాయి.
నేను నీకు ముందుగా వెళ్తాను. పర్వతాలను నేను
చదును చేస్తాను. పట్టణం ఇత్తడి తలుపులు నేను
పగులగొడ్తాను. తలుపుల మీది ఇనుప గడియ
లను నేను విరుగ గొడ్తాను.

3 చీకట్లో దాచిపెట్టబడిన ధనం నేను నీకు ఇస్తాను.
దాచబడిన ఐశ్వర్యాలను నేను నీకు ఇస్తాను.
నేను యెహోవాను అని నీవు తెలుసుకొనేం
దుకు నేను దీనిని చేస్తాను. ఇశ్రాయేలీయుల
దేవుడను నేనే, నిన్ను పేరుపెట్టి పిలుస్తున్నాను.

4 నా సేవకుడు యాకోబు కోసం నేను వీటిని
చేస్తున్నాను. ఏర్పాటు చేయబడిన నా పజలు
ఇశ్రాయేలీయుల కోసం నేను వీటిని చేస్తున్నాను.
కోరెషూ, నేను నిన్ను పేరు పెట్టి పిలుస్తున్నాను.
నీవు నన్ను ఎరుగవు, కానీ నేను నిన్ను పేరుపెట్టి
పిలుస్తున్నాను.

5 నేను యెహోవాను. నేను ఒక్కడినే దేవు డను.
ఇంక ఏ దేవుడూ లేడు. నేనే నీకు బట్టలు
ధరింపజేసినవాడను. అయినా నీవు ఇంకా నన్ను
ఎరుగవు.

6 నేను ఒక్కడను మాత్రమే దేవుడనని ప్రజ అంతా
తెలుసుకోవాలని నేను ఈ సంగతులను చేస్తాను.
నేనే యెహోవాను అని, నేను తప్ప ఇంకో
దేవుడు లేడని తూర్పు నుండి పడమటి వరకు
ప్రజలు తెలుసుకొంటారు.

7 నేనే వెలుగును కలిగించాను. మరి నేనే చీకటిని
చేశాను. నేనే సమాధానం కలిగిస్తాను. నేనే కష్టాలు
కల్గిస్తాను. నేను యెహోవాను నేనే ఈ సంగతు
లన్నింటిని చేస్తాను.

8 పైన ఆకాశంలోని మేఘాలు మంచితనాన్ని
భూమిమీద వర్షంగా కురిపించుగాక! భూమి
నెరదలు విడిచి రక్షణను ఫలింపజేయును గాక!
దానితోబాటు మంచితనం పెరుగును గాక!
యెహోవాను నేనే అతణ్ణి* సృజించాను.

### దేవుడు తన సృష్టిని అదుపులో ఉంచుతాడు

9"ఈ ప్రజలను చూడు! వాళ్లు వారిని సృజించిన
వానితో వాదిస్తున్నారు. వాళ్లు నాతో వాదించటం
చూడు. వాళ్లు పగిలిపోయిన కుండ పెంకులా ఉన్నారు.
ఒకడు కుండ చేయటానికి జిగట మన్ను ఉపయోగి
స్తాడు. మరి ఆ మట్టి, 'ఓ మనిషీ, ఏం చేస్తున్నావు?'

---

**కోరేషు** పర్షియా రాజు. ఇతడు క్రీ.పూ. 550-530 వరకు
పాలించాడు.

**అతణ్ణి** "కోరేషు" అయి ఉండవచ్చు.

అని అడగదు. తయారు చేయబడిన వస్తువులకు
వాటిని తయారుచేసిన వానిని ప్రశ్నించే అధికారం
లేదు. మనుష్యులు ఈ మట్టిలాగే ఉన్నారు. 10ఒక
తండ్రి తన పిల్లలకు ప్రాణం పోస్తాడు. మరి పిల్లలు,
'నీవెందుకు నాకు ప్రాణం పోస్తున్నావు?' అని అడి
గేందుకు అధికారం లేదు. పిల్లలు తల్లిని పట్టుకొని,
'నీవెందుకు నాకు జన్మనిస్తున్నావు?' అని ప్రశ్నిం
చేందుకు వీల్లేదు."

11యెహోవా దేవుడు ఇశ్రాయేలీయుల పరిశు
ద్ధుడు. ఆయనే ఇశ్రాయేలీయులను సృజించాడు.
మరియు యెహోవా అంటున్నాడు:

"నా కుమారులారా, మీకు ఒక సంకేతం చూపించ
మని నన్ను అడిగారు. నేను చేసిన వాటిని
మీకు చూపించమని మీరు నాకు ఆదేశించారు.

12 కనుక చూడండి! భూమిని నేనే సృజించాను.
దానిమీద జీవించే మనుష్యులందరినీ నేనే సృజిం
చాను. నా స్వంత చేతులు ఉపయోగించి ఆకాశా
లను సృజించాను. ఆకాశ సమూహాలన్నింటినీ
నేనే ఆజ్ఞాపించాను.

13 కోరెషు మంచి పనులు చేసేందుకు అతని శక్తిని
నేనే అతనికి ఇచ్చాను. అతని పని నేను సులభం
చేస్తాను. కోరెషు నా పట్టణాన్ని మరల నిర్మి
స్తాడు. అతడు నా ప్రజలను స్వతంత్రులను
చేస్తాడు. కోరెషు నా ప్రజలను నాకు అమ్మడు.
అతడు ఈ పనులు చేసేందుకు అతనికి నేనేమీ
చెల్లించాల్సిన అవసరంలేదు. ప్రజలు విమోచించ
బడతారు. దానికి నాకేమీ ఖర్చు కాదు." సర్వశక్తి
మంతుడైన యెహోవా ఈ సంగతులు
చెప్పాడు.

14 యెహోవా చెబుతున్నాడు, "ఈజిప్టులో, ఇథి
యోపియాలో ఎన్నో సంగతులు చేయ
బడ్డాయి. అయితే ఇశ్రాయేలు ప్రజలారా మీరు
వాటిని పొందుతారు. ఆజానుబాహులైన సెబా
ప్రజలు మీ వాళ్లవుతారు. వారు మెడలలో
సంకెళ్లతో మీ వెనుక నడుస్తారు. వాళ్లు మీ
ఎదుట సాష్టాంగపడతారు. వాళ్లు మీకు విన్నపం
చేసుకొంటారు." ఇశ్రా యేలూ, దేవుడు నీకు
తోడుగా ఉన్నాడు. మరి ఇంకే దేవుడూ లేడు.

15 దేవా, నీవు ప్రజలు చూడలేని దేవుడవు. నీవు
ఇశ్రాయేలు రక్షకుడవు.

16 చాలామంది ప్రజలు తప్పుడు దేవుళ్లను చేసు
కొంటారు. కానీ ఆ ప్రజలు నిరాశ చెందుతారు.
ఆ ప్రజలంతా సిగ్గుతో తిరిగి వెళ్లిపోతారు.

17 కానీ ఇశ్రాయేలు యెహోవా చేత రక్షించ
బడును. ఆ రక్షణ శాశ్వతంగా కొనసాగుతుంది.
మరల ఎన్నటెన్నటికి ఇశ్రాయేలు సిగ్గుపడదు.

18 యెహోవాయే దేవుడు. ఆయనే భూమిని,
ఆకాశాలను సృజించాడు. భూమిని యెహోవా
దాని స్థానంలో ఉంచాడు. యెహోవా భూమిని
చేసినప్పుడు, అది ఖాళీగా ఉండాలని ఆయన
కోరలేదు. భూమి మీద జీవం ఉండాలని
యెహోవా కోరాడు. యెహోవా చెబుతు
న్నాడు: "నేనే యెహోవాను. నేను తప్ప ఇంకో
దేవుడు లేడు.

19 నేను రహస్యంగా మాట్లాడలేదు. నేను స్వేచ్ఛగా
మాట్లాడాను. ప్రపంచపు చీకటి స్థలాల్లో నేను
నా మాటలను దాచిపెట్టలేదు. ఖాళీ ప్రదేశాల్లో
నన్ను వెదకమని యాకోబు ప్రజలకు నేను
చెప్పలేదు. నేనే యెహోవాను, నేను సత్యం
మాట్లాడుతాను. నేను మాట్లాడినప్పుడు సరై
నవే నేను చెబుతాను.

**యెహోవా తానొక్కడే దేవుడని ఋజువు చేస్తాడు**

20"ప్రజలారా మీరు ఇతర దేశాలనుండి తప్పించు
కొని పోయారు. కనుక మీరు సమావేశమై నా ఎదుటికి
రండి. (ఈ మనుష్యులు తప్పుడు దేవుళ్ల విగ్రహాలను
మోసుకొని వెళ్తారు. ఈ ప్రజలు పనికిమాలిన ఆ
దేవుళ్లకు ప్రార్థన చేస్తారు. కానీ వాళ్లు చేస్తోంది ఏమిటో
ప్రజలకు తెలియదు.) 21ఈ ప్రజలను నా దగ్గరకు
రమ్మని వారికి చెప్పండి. వారు వచ్చి ఈ సంగతులను
నాతో మాట్లాడమని చెప్పండి.)

"చాలా కాలం క్రిందట జరిగిన వాటిని గూర్చి
మీకు ఎవరు చెప్పారు? చాలాకాలం నుండి ఈ
సంగతులను విడువక మీకు ఎవరు చెప్పారు? యెహో
వాను నేనే, ఈ సంగతులు మీకు చెప్పాను. నేను
ఒక్కడను మాత్రమే దేవుడను. నావంటి దేవుడు
ఇంకొకరు ఉన్నారా? ఇంకో మంచి దేవుడు ఉన్నాడా?
తన ప్రజలను రక్షించే ఇంకో దేవుడూ ఉన్నాడా?
లేడు. మరి ఏ దేవుడు లేడు. 22దూర దేశాల్లో ఉన్న
ప్రజలారా, మీరంతా ఆ తప్పుడు దేవుళ్లను వెంబ
డించటం మానివేయాలి. మీరు నన్ను వెంబడించి,
రక్షణ పొందాలి. నేను దేవుణ్ణి. వేరొక దేవుడు ఎవ్వడూ
లేడు. నేను ఒక్కణ్ణి మాత్రమే దేవుడను.

23"నేను నా స్వంత శక్తితో ఒక వాగ్దానం చేస్తాను.
నేను ఏదైనా ఒకటి చేస్తానని వాగ్దానం చేస్తే, ఆ వాగ్దానం
ఒక ఆదేశం అవుతుంది. ఏదైనా జరగాలని నేను
ఆదేశిస్తే, అది జరుగుతుంది. ప్రతి మనిషి నా (దేవుడు)
ఎదుట సాగిలపడతాడని నన్ను వెంబడిస్తాడని
ప్రమాణం చేస్తున్నాను. ప్రతి మనిషి నన్ను వెంబడి
స్తాడని ప్రమాణం చేస్తాడు. 24'మంచితనం, అధికారం
యెహోవా నుండి మాత్రమే లభిస్తాయి'" అని ప్రజలు
చెబుతారు.

కొంత మంది మనుష్యులు యెహోవా మీద

కోపగిస్తారు. అయితే యెహోవా సాక్షులు వచ్చి,
యెహోవా చేసిన వాటిని గూర్చి సాక్ష్యం చెబుతారు.
అందుచేత కోపగించిన ఆ మనుష్యులు సిగ్గుపడతారు.
25ఇశ్రాయేలు ప్రజలు మంచిని జరిగించటానికి
యెహోవా సహాయం చేస్తాడు, మరియు ప్రజలు
వారి దేవుని గూర్చి ఎంతో గర్విస్తారు.

### అసత్య దేవతలు నిష్ప్రయోజనం

46 బేలు, నెబో నా ఎదుట సాగిలపడతారు.
తప్పుడు దేవుళ్లు వట్టి విగ్రహాలే. మనుష్యులే
ఆ విగ్రహాలను జంతువులమీద పెడతారు. మోయాల్సిన
బరువులు మాత్రమే ఆ విగ్రహాలు. తప్పుడు దేవుళ్లు
ప్రజలను విసిగించటం తప్ప ఇంకేం చేయవు. 2ఆ
తప్పుడు దేవుళ్లన్నీ సాగిలబడతాయి, అవన్నీ పడి
పోతాయి. ఆ తప్పుడు దేవుళ్లు తప్పించుకోలేవు.
అవన్నీ బందీలవలె తీసుకొనిపోబడుతాయి.

3“యాకోబు వంశమా, నా మాట విను. ఇంకా
బతికే ఉన్న ఇశ్రాయేలు ప్రజలారా, మీరంతా నా మాట
వినండి. నేను మిమ్మల్ని మోశాను. మీరు మీ తల్లి
ఒడిలో ఉన్నప్పటి నుండి నేను మిమ్మల్ని ఎత్తు
కొన్నాను. 4మీరు పుట్టినప్పుడు నేను మిమ్మల్ని
ఎత్తుకొన్నాను, మీరు ముసలి వాళ్లయినప్పుడు నేను
మిమ్మల్ని మోస్తాను. నేను మిమ్మల్ని సృజించాను.
కనుక మీ తల వెంట్రుకలు నెరసిపోయినప్పుడు కూడా
నేను మిమ్మల్ని మోస్తాను. నేను మిమ్మల్ని మోస్తూనే
ఉంటాను, నేను మిమ్మల్ని రక్షిస్తాను.

5“మీరు నన్ను ఇంకెవరితోనైనా పోల్చగలరా?
లేదు. ఎవ్వరూ నాకు సమానులు కారు. నన్ను గూర్చి
మీరు పూర్తిగా గ్రహించలేరు. నావంటిది ఇంకేమీ లేదు.
6కొంత మంది వెండి, బంగారం ఉండి ఐశ్వర్యవంతులు.
వారి చేతి సంచుల్లోంచి బంగారం రాలుతుంది, వారు
వారి వెండిని త్రాసులో తూకం వేస్తారు. వారు ఒక
కళాకారునికి డబ్బిచ్చి, చెక్కతో ఒక తప్పుడు దేవుణ్ణి
చేయించుకొంటారు. అప్పుడు ఆ ప్రజలు ఆ తప్పుడు
దేవునికి సాగిలపడి, దానికి పూజ చేస్తారు. 7ఆ మను
ష్యులు ఆ తప్పుడు దేవుణ్ణి తమ భుజాల మీద పెట్టు
కొని మోస్తారు. ఆ తప్పుడు దేవుడు నిష్ప్రయోజనం
ప్రజలు వానిని మోయాల్సి ఉంటుంది. ప్రజలు ఆ
విగ్రహాన్ని నేలమీద పెడ్తారు, ఆ తప్పుడు దేవుడు
కదల్లేడు. ఆ తప్పుడు దేవుడు, వాని స్థానం నుండి
ఎన్నడూ నడిచిపోడు. ప్రజలు వానిమీద కేకలు వేయ
వచ్చు, కాని అది జవాబు ఇవ్వదు. ఆ తప్పుడు
దేవుడు వట్టి విగ్రహం మాత్రమే. అది ప్రజలను వారి
కష్టాల్లోంచి రక్షించజాలదు.

8“ప్రజలారా, మీరు పాపం చేశారు. ఈ సంగతులను
గూర్చి మీరు మరల ఆలోచన చేయాలి. ఈ సంగ
తులను జ్ఞాపకం చేసుకొని బలవంతంగా ఉండండి.
9చాలాకాలం కిందట జరిగిన సంగతులను జ్ఞాపకం
చేసుకోండి. నేనే దేవుడను అని జ్ఞాపకం ఉంచుకోండి.
నేనే అని జ్ఞాపకం ఉంచుకోండి. మరో దేవుడంటూ
లేడు. ఆ తప్పుడు దేవుళ్లు నావంటివారు కారు.

10“అంతంలో జరిగే సంగతులను గూర్చి మొద
ట్లోనే నేను మీకు చెప్పాను. ఇంకా సంభవించని సంగ
తులను గూర్చి చాలాకాలం కిందట నేను మీకు
చెప్పాను. నేను ఒకటి తలపెట్టాను. అది జరిగి తీరు
తుంది. నేను చేయాలనుకొన్నవి చేస్తాను. 11తూర్పు
నుండి నేను ఒక మనిషిని పిలుస్తున్నాను. ఆ మనిషి
గద్దలా ఉంటాడు. అతడు చాలా దూర దేశం నుండి
వస్తాడు, నేను చేయాలని నిర్ణయించిన వాటిని అతడు
చేస్తాడు. నేను ఇలా చేస్తానని నేను మీతో చెబు
తున్నాను, నేను తప్పక దీనిని చేస్తాను. నేనే అతన్ని
చేశాను. నేనే అతడ్ని తీసుకొని వస్తాను.

12“మీకు గొప్ప శక్తి ఉందని మీలో కొందరు
తలుస్తారు. కానీ మీరు మంచి పనులు చేయరు. నా
మాట వినండి! 13 నేను మంచి పనులు చేస్తాను.
త్వరలో నేను నా ప్రజలను రక్షిస్తాను. సీయోనుకు,
అద్భుతమైన నా ఇశ్రాయేలుకు నేను రక్షణ తీసుకొని
వస్తాను.”

### బబులోనుకు దేవుని సందేశం

47 “కల్దీయుల కుమారీ, కన్యకా మట్టిలో పడి,
అక్కడే కూర్చో. నేల మీద కూర్చో.
ఇప్పుడు నీవు పరిపాలించటం లేదు. ప్రజలు
ఇంక నిన్ను చక్కనిదానా అని అందగత్తె అని
పిలువరు.

2 ఇప్పుడు నీవు కష్టపడి పనిచేయాలి.అందమైన
నీపై వస్త్రాలు తీసివేయి. తిరుగటి రాళ్లు తీసు
కొని పిండి విసురు. మనుష్యులకు నీ కాళ్లు
కనబడేంతమట్టుకు నీ పై వస్త్రం లేపి నదులు
దాటు. నీ దేశాన్ని విడిచిపెట్టు.

3 మనుష్యులు నీ శరీరాన్ని చూస్తారు. మను ష్యులు
నిన్ను లైంగికంగా వాడుకొంటారు. నీవు చేసిన
చెడ్డ పనులకు నీచేత నేను విలువ కట్టిస్తాను.
మరియు ఎవ్వడూ వచ్చి నీకు సహాయం
చేయడు.

4 దేవుడు మమ్మల్ని రక్షిస్తాడు. ఆయన పేరు
సర్వశక్తిమంతుడైన యెహోవా ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుడు” అని నా ప్రజలు అంటారు.

5 అందుచేత బబులోనూ, నీవు మౌనంగా కూర్చో
వాలి. కల్దీయుల కుమారీ* చీకట్లోనికి వెళ్లు
ఎందుకంటే నీవు ఇక మీదట ‘రాజ్యాలకు
యజమానురాలివి’ కావు.

---

**కల్దీయుల కుమారీ** ఇది బబులోను యొక్క మరో పేరు.

6 నేను నా ప్రజల మీద కోపగించాను. ఈ ప్రజలు
నావాళ్లే కానీ నేను కోపగించాను, అందుచేత
నేను వాళ్లకు ప్రాముఖ్యం లేకుండా చేశాను.
నేను వాళ్లను నీకు అప్పగించాను. నీవు వారిని
శిక్షించావు. నీవు వారికి ఎలాంటి దయా
చూపించలేదు. వాళ్లు ముసలి వాళ్ల కోసం చాలా
కష్టపడి పనిచేసేట్టు నీవు చేశావు.
7 'నేను శాశ్వతంగా జీవిస్తాను. శాశ్వతంగా నేను
రాణిగానే ఉంటాను' అని నీవు చెప్పావు. నీవు
ఆ ప్రజలకు చేసిన చెడు కార్యాలను నీవు
గమనించలేదు. ఏమి జరుగుతుందో అని నీవు
గమనించలేదు.
8 కనుక 'అందమైన అమ్మాయీ', ఇప్పుడు నా
మాట విను. నీవు క్షేమంగానే ఉన్నాను అను
కొంటున్నావు. 'నేను ఒక్కదాన్నే ప్రాముఖ్య
మైన దాన్ని, ఇంకెవ్వరూ నా అంతటి ప్రము
ఖులు కారు. నేను ఎప్పటికీ విధవను కాను.
నాకు ఎల్లప్పుడూ పిల్లలు ఉంటారు' అని నీలో
నీవు అనుకొంటున్నావు.
9 నీకు ఈ రెండు సంగతులు జరుగుతాయి: మొట్ట
మొదట నీవు నీ పిల్లలను పోగొట్టుకొంటావు.
(ప్రజలు) తర్వాత నీవు నీ భర్తను పోగొట్టు
కొంటావు. (రాజ్యం) ఈ సంగతులు నీకు
నిజంగా జరుగుతాయి. నీ మంత్రాలన్నీ, శక్తివంత
మైన నీ ఉపాయాలన్నీ నిన్ను రక్షించవు.
10 నీవు చెడ్డ పనులు చేసి కూడ క్షేమంగా ఉన్నానని
అనుకొంటున్నావు. 'నేను చేసే తప్పు పనులు
ఎవరూ చూడటం లేదు' అని నీవు అను
కొంటావు. నీవు తప్పు చేస్తావు. కానీ నీ జ్ఞానం,
నీ తెలివి నిన్ను రక్షిస్తాయి అనుకొంటావు. 'నేను
ఒక్క దాన్ని తప్ప నా అంతటి ప్రముఖులు
ఇంకెవరూ లేరు' అని నీవు అంటావు.
11 అయితే నీకు కష్టాలు వస్తాయి. అది ఎప్పుడు
జరుగుతుందో నీకు తెలియదు. కాని నాశనం
వచ్చేస్తుంది. ఆ కష్టాలను ఆపుజేసేందుకు నీవు
ఏమీ చేయలేవు. నీవు త్వరగా నాశనం చేయ
బడతావు. నీకు ఏమి జరిగిపోయిందో కూడా
నీకు తెలియదు.
12 నీ జీవితాంతం నీవు కష్టపడి పనిచేశావు. ఉపా
యాలు, మంత్రాలు నేర్చుకొన్నావు. కనుక నీ
ఉపాయాలు, మంత్రాలు ప్రయోగించటం
ప్రారంభించు. ఒకవేళ ఆ ఉపాయాలు నీకు
సహాయపడతాయేమో! ఒకవేళ నీవు ఎవరినైనా
భయపెట్టగలుగుతావేమో.
13 నీకు ఎంతెంతో మంది సలహాదారులు వాళ్లు
నీకిచ్చే సలహాలతో నీవు విసిగిపోయావా? నక్షత్ర
శాస్త్రం తెలిసిన నీ మనుష్యులను వాళ్లు బయ
టకు పంపిస్తారు. నెల ప్రారంభం ఎప్పుడో
వాళ్లు చెప్పగలుగుతారు. ఒకవేళ నీ కష్టాలు
ఎప్పుడు మొదలవుతాయో వాళ్లు చెప్పగలుగు
తారేమో.
14 అయితే ఆ మనుష్యులు కనీసం వాళ్లనే వాళ్లు
రక్షించుకోలేరు. వాళ్లు గడ్డిలా కాలిపోతారు. వాళ్లు
త్వరగా కాలిపోయినందుచేత రొట్టె కాల్చు
కొనేందుకు గూడ నిప్పులు మిగులవు. వెచ్చగా
కాచుకొనేందుకు మంటగూడా మిగలదు.
15 నీవు కష్టపడి సంపాదించిన దానంతటికీ అలా
జరుగుతుంది. నీవు చిన్న పిల్లగా ఉన్నప్ప
ట్నుంచీ నీతో వ్యాపారం చేసిన వారు నిన్ను
వదిలివేస్తారు ప్రతివాడూ వాని వాని దారిన
పోతాడు. నిన్ను రక్షించేందుకు ఒక్క మనిషి
కూడా ఉండడు."

### దేవుడు తన ప్రపంచాన్ని పాలిస్తాడు

48 యెహోవా చెబుతున్నాడు:
"యాకోబు వంశమా, నా మాట విను!
మిమ్మల్ని మీరు 'ఇశ్రాయేలు' అని చెప్పు
కొంటారు. మీరు యూదా వంశస్థులు. ప్రమా
ణాలు చేయటానికి మీరు యెహోవా నామం
ప్రయోగిస్తారు. ఇశ్రాయేలు దేవుణ్ణి మీరు స్తుతి
స్తారు. కానీ ఈ సంగతులను మీరు చేస్తున్నప్పుడు
మీరు నమ్మకంగా ఉండరు."
2 ప్రజలారా, పవిత్ర పట్టణంలో సభ్యులని మీరు
పిలువబడుతున్నారు. ఇశ్రాయేలు దేవుని మీద
మీరు ఆధారపడుతున్నారు. సర్వశక్తిమంతుడైన
యెహోవా ఆయన పేరు.

3 "జరుగబోయే సంగతులను గూర్చి చాలా కాలం
కిందట నేను మీకు చెప్పాను. వాటిని గూర్చి
నేను మీకు చెప్పాను. అకస్మాత్తుగా ఆ సంగతులు
సంభవించేట్టు నేను చేశాను.
4 మీరు మొండి వాళ్లని నాకు తెలుసు గనుక నేను
అలా చేశాను. నేను చెప్పిన ప్రతిది మీరు నమ్మ
టానికి నిరాకరించారు. వంగని ఇనుములా మీరు
చాలా మొండివాళ్లు. మీ తల ఇత్తడితో చేసినట్టుగా
ఉంది.
5 కనుక జరుగబోయే సంగతులను గూర్చి నేను
మీతో చెప్పాను. ఆ సంగతులు జరుగకముందే
చాలాకాలం క్రిందటనే నేను మీకు చెప్పాను.
'మా స్వంత శక్తితో మేమే వీటిని చేశాము' అని
మీరు చెప్పకుండా నేనిలా చేశాను. 'మా ప్రతిమలు
-విగ్రహాలే వీటిని జరిగించాయి' అని మీరు
చెప్పకుండా ఉండాలనే నేను ఇలా చేసాను."

### ఇశ్రాయేలీయులను పవిత్రం చేసేందుకు దేవుడు వారిని శిక్షించటం

6 "జరిగిన సంగతులన్నింటినీ మీరు చూశారు,
విన్నారు గనుక మీరు ఇతరులకు ఈ వార్త
చెప్పాలి. మీకు ఇంకా తెలియని కొత్త సంగ
తులను ఇప్పుడు నేను మీకు చెబుతాను.
7 ఇవి చాలాకాలం కిందట జరిగిపోయిన సంగతులు
కావు. ఇవి ఇప్పుడు సంభవించటం మొదలైన
సంగతులు. ఈ సంగతులను గూర్చి ఈ వేళకు
ముందు మీరు ఎన్నడూ వినలేదు. అందుచేత
'అది మాకు ముందే తెలుసు' అని మీరు
చెప్పజాలరు.
8 కానీ భవిష్యత్తులో ఏమి జరుగబోతుందో అది
నేను మీకు చెప్పినప్పటికీ మీరు ఇంకా నా మాట
వినేందుకు నిరాకరిస్తారు. మీరు నేర్చు కొనేది
శూన్యం. నేను మీకు చెప్పింది ఎన్నడూ ఏదీ
మీరు వినలేదు. మీరు నాకు వ్యతిరేకంగా ఉంటా
రని మొదట్నుండి నాకు తెలుసు. మీరు పుట్టి
నప్పట్నుండి తప్పుడు పనులే చేశారు.
9 కానీ నేను ఓపిగ్గా ఉంటాను. నా కోసమే నేను
ఇలా చేస్తాను. నేను కోపగించి మిమ్మల్ని నాశనం
చేయనందుకు ప్రజలు నన్ను స్తుతిస్తారు.
సహించినందుకు మీరూ నన్ను స్తుతిస్తారు.
10 చూడండి, నేను మిమ్మల్ని పవిత్రం చేస్తాను.
వెండిని పవిత్రం చేసేందుకు ప్రజలు వేడినిప్పును
ప్రయోగిస్తారు. కానీ నేను మీకు కష్టాలు కలి
గించటం ద్వారా మిమ్మల్ని పవిత్రం చేస్తాను.
11 నా కోసం- నా కోసమే నేను ఇలా చేస్తాను.
ప్రాముఖ్యం లేని వానిగా మీరు నన్ను చేయ
లేరు. నా మహిమ, స్తుతులను ఎవరో తప్పుడు
దేవతలను నేను తీసుకోనివ్వను.
12 యాకోబూ, నా మాట విను! ఇశ్రాయేలు ప్రజ
లారా, మీరు నా ప్రజలుగా ఉండుటకు నేను
మిమ్మల్ని పిలిచాను. కనుక నా మాట వినండి.
నేనే ఆది, నేనే అంతం.
13 నా స్వహస్తాలతో (శక్తితో) నేనే భూమిని చేశాను.
ఆకాశాన్ని నా కుడి హస్తం చేసింది. మరియు
నేను గనుక వాటిని పిలిస్తే అవి కలిసి నా ఎదుటికి
వస్తాయి.
14 కనుక మీరంతా సమావేశమై, నా మాట వినండి!
ఈ సంగతులు జరుగుతాయని తప్పుడు
దేవుళ్ళలో ఏదైనా చెప్పిందా? లేదు."
యెహోవా ఇశ్రాయేలును ప్రేమిస్తున్నాడు. బబు
లోను, కల్దీయులకు యెహోవా ఏమి చేయా
లనుకొంటే అది చేస్తాడు.
15 యెహోవా చెబుతున్నాడు, "నేను అతన్ని*
పిలుస్తానని నేను మీతో చెప్పాను. మరియు
నేను అతణ్ణి తీసుకొని వస్తాను. అతడు జయిం
చేట్టు నేను చేస్తాను.
16 నా దగ్గరకు వచ్చి, నా మాట వినండి. ప్రజలు
నా మాట వినగలుగునట్లు మొదటనుంచి నేను
తేటగా మాట్లాడాను. బబులోను ఒక దేశంగా
ప్రారంభమయినప్పుడు నేను అక్కడ ఉన్నాను."

అంతట యెషయా, "ఇప్పుడు ఈ సంగతులు,
ఆయన ఆత్మను మీతో చెప్పేందుకు నా ప్రభువైన
యెహోవా నన్ను పంపుతున్నాడు" అని అన్నాడు.
17 ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు, రక్షకుడు, యెహోవా
చెబుతున్నాడు, "నేనే మీ దేవుణ్ణి, యెహోవాను.

మంచి పనులు చేయమని నేను మీకు ఉపదేశి
స్తాను. మీరు నడవాల్సిన మార్గంలో నేను
మిమ్మల్ని నడిపిస్తాను.
18 మీరు నాకు విధేయులై ఉంటే అప్పుడు మీకు
నిండుగా ప్రవహిస్తోన్న నదివలె శాంతి లభించి
ఉండేది. సముద్ర తరంగాల్లా మంచివి మీ వద్దకు
ప్రవహించి ఉండేవి.
19 మీరు నాకు విధేయులై ఉంటే అప్పుడు మీకు
ఎంతోమంది పిల్లలు పుట్టి ఉండేవారు. వాళ్లు
ఇసుక రేణువులంత మంది ఉండేవాళ్లు. మీరు
నాకు విధేయులై ఉంటే అప్పుడు మీరు నాశనం
చేయబడి ఉండేవాళ్లు కాదు. మీరు నాతోనే
కొనసాగి ఉండేవాళ్లు."
20 నా ప్రజలారా, బబులోను విడిచిపెట్టండి. నా
ప్రజలారా, కల్దీయుల దగ్గర్నుండి పారిపొండి.
ఈ వార్త సంతోషంగా ప్రజలకు చెప్పండి. భూమి
మీద దూర ప్రాంతాల వరకు ఈ వార్త వ్యాపింప
చేయండి. ప్రజలతో ఇలా చెప్పండి:
"యెహోవా తన సేవకుడు యాకోబును
విమోచించాడు!
21 యెహోవా తన ప్రజలను అరణ్యంలో నడి
పించాడు. ఆ ప్రజలు ఎన్నడూ దప్పిగొనలేదు.
ఎందుకంటే, ఆయన తన ప్రజలకోసం బండ
నుండి నీళ్లు ప్రవహింపజేశాడు గనుక. ఆయన
బండను చీల్చాడు. నీళ్లు ప్రవహించాయి."
22 కానీ "చెడ్డ వారికి శాంతి లేదు" అని యెహోవా
చెబుతున్నాడు.

### దేవుడు తన ప్రత్యేక సేవకుణ్ణి పిలవడం

49 దూర ప్రాంతాల్లో ఉన్న ప్రజలారా,
మీరంతా నామాట వినండి! భూమి మీద
నివసిస్తున్న ప్రజలారా, మీరంతా వినండి! నేను
పుట్టక మునుపే యెహోవా నన్ను తన సేవ
కోసం పిలిచాడు. నేను నా తల్లి గర్భంలో ఉండ
గానే యెహోవా నాకు పేరు పెట్టాడు.

---

**అతన్ని** అంటే యెషయా మరణం తర్వాత నూటేభై సంవత్సరాలకు జీవించిన పర్షియా రాజు కోరెషు కావచ్చును.

2 తన పక్షంగా మాట్లాడేందుకు యెహోవా నన్ను
వాడుకొంటాడు. పదునైన ఖడ్గాన్ని ఒక సైనికుడు
వాడుకొన్నట్టు ఆయన నన్ను వాడుకొంటాడు.
అయితే ఆయన నన్ను తన చేతిలో దాచి
ఉంచి కాపాడుతాడు కూడాను. వాడిగల బాణంలా
యెహోవా నన్ను వాడుకొంటాడు. అయితే
ఆయన నన్ను తన బాణాల పొదిలో దాచి
ఉంచుతాడు కూడాను.

3 "ఇశ్రాయేలూ, నీవు నా సేవకుడివి. నీతో నేను
అద్భుత కార్యాలు చేస్తాను" అని యెహోవా
నాతో చెప్పాడు.
4 నేను చెప్పాను, "వట్టిగానే నేను కష్టపడి పని
చేశాను. నేను చాలా అలసిపోయాను. కాని
ప్రయోజనకరమైనది ఏమీ నేను చేయలేదు. నా
శక్తి అంతటిని ఉపయోగించాను. కానీ వాస్తవానికి
నేను చేసింది ఏమీ లేదు. కనుక నా విషయం
ఏమి చేయాలో యెహోవాయే నిర్ణయించాలి.
దేవుడే నా బహుమానం నిర్ణయించాలి.
5 నా తల్లి గర్భంలో యెహోవా నన్ను చేసాడు.
నేను ఆయన సేవకునిగా ఉండుటకు ఆయన
అలా చేసాడు. యాకోబును, ఇశ్రాయేలును నేను
తిరిగి ఆయన దగ్గరకు నడిపించునట్లు ఆయన
నన్ను అలా చేసాడు. యెహోవా నన్ను సన్మా
నిస్తాడు. నా దేవుని నుండి నేను నా బలం
పొందుతాను." యెహోవా నాతో చెప్పాడు,

6 "నీవు నాకు చాలా ప్రాముఖ్యమైన సేవకుడివి.
ఇశ్రాయేలు ప్రజలు ఖైదీలు. వారు తిరిగి నా
వద్దకు తీసుకొని రాబడతారు. అప్పుడు
యాకోబు కుటుంబ దళాలు తిరిగి నా వద్దకు
వస్తారు. అయితే నీకు మరో పని ఉంది; అది
దీనికంటె ఇంకా ముఖ్యమయింది. సమస్త రాజ్యా
లకు నిన్ను నేను వెలుగుగా చేస్తాను, భూమిమీద
మనుష్యులందరినీ రక్షించేందుకు నీవే నా
మార్గంగా ఉంటావు."
7 యెహోవా, ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు. ఇశ్రా
యేలును కాపాడుతాడు. మరియు యెహోవా
చెబుతున్నాడు, "నా సేవకుడు దీనుడు. అతడు
పాలకులను సేవిస్తాడు. ప్రజలు అతన్ని ద్వేషి
స్తారు. కానీ రాజులు అతన్ని చూచి, అతడ్ని
సన్మానించేందుకు నిలబడతారు. మహా
నాయకులు అతని ఎదుట సాగిలపడతారు."
ఇశ్రాయేలీయుల పరిశుద్ధుడు, యెహోవా కోరి
నందుచేత ఇది జరుగుతుంది. మరియు
యెహోవా నమ్మదగినవాడు. నిన్ను కోరుకొన్న
వాడు ఆయనే.

### రక్షణ దినం

8 యెహోవా చెబుతున్నాడు: "సరైన సమ
యంలో నేను నీకు దయను చూపిస్తాను. ఆ
సమయమందు నీ ప్రార్థనలకు జవాబు ఇస్తాను.
రక్షణ దినాన నేను నీకు సహాయం చేస్తాను,
నేను నిన్ను కాపాడుతాను. ప్రజలతో నాకు
ఒక ఒడంబడిక ఉంది అనేందుకు మీరు ఒక
నిదర్శనం. ఇప్పుడైతే దేశం నాశనం చేయబ
డింది, అయితే మీరు దేశాన్ని తిరిగి దాని స్వంత
దారులకు ఇచ్చివేస్తారు.
9 'చెరలోనుండి బయటకు వచ్చేయండి' అని ఖైదీ
లతో మీరు చెబుతారు. 'చీకటిలోనుండి బయ
టకు వచ్చేయండి' అని చీకటిలో ఉన్న ప్రజ
లతో మీరు చెబుతారు. ప్రజలు పయనిస్తూ
భోజనం చేస్తారు. ఖాళీ కొండలమీద కూడా
వారికి భోజనం ఉంటుంది.
10 ప్రజలు ఆకలితో ఉండరు. వారు దాహంతో
ఉండరు. సూర్యుని వేడి గాల్పులు వారికి హాని
చేయవు. ఎందుకంటే, వారిని ఆదరించే వాడు
(దేవుడు) వారిని నడిపిస్తాడు గనుక. ప్రజలను
నీటి ఊటల దగ్గరకు ఆయన నడిపిస్తాడు.
11 "నా ప్రజలకు నేను బాట వేస్తాను. పర్వతాలు
సమతలం చేయబడతాయి. పల్లపు తోవలు
ఎత్తు చేయబడతాయి.

12 "చూడండి! చాలా దూర ప్రదేశాల నుండి ప్రజలు
నా దగ్గరకు వస్తున్నారు. ఉత్తరం నుండి,
పశ్చిమం నుండి ప్రజలు వస్తున్నారు. ~~ఈజిప్టు~~
లోని అస్వాను నుండి ప్రజలు వస్తున్నారు."
13 భూమి, ఆకాశములారా సంతోషించండి. పర్వ
తములారా, ఆనందంగా కేకలు వేయండి. ఎందు
కంటే, యెహోవా తన ప్రజలను ఆదరిస్తాడు
గనుక. తన దీన జనులకు యెహోవా దయ
చూపిస్తాడు.

### సీయోను ఒంటరిగా విడువబడిన స్త్రీ

14 కానీ ఇప్పుడు సీయోను అంటుంది, "యెహోవా
నన్ను విడిచిపెట్టాడు. నా యజమాని నన్ను
మరచిపోయాడు" అని.
15 అయితే నేనంటాను, "ఓ స్త్రీ తన శిశువును
మరచిపోగలదా? లేదు. తన గర్భంనుండి వచ్చిన
శిశువును ఒక స్త్రీ మరువగలదా? లేదు. ఒక స్త్రీ
తన పిల్లలను మరువజాలదు. మరి నేను
(యెహోవాను) మిమ్ములను మరువజాలను.
16 చూడు, నేను నీ పేరు నా చేతి మీద వ్రాసు
కొన్నాను. ఎల్లప్పుడు నేను నిన్నుగూర్చి
తలుస్తాను.

17 నీ పిల్లలు నీ దగ్గరకు తిరిగివస్తారు. ప్రజలు నిన్ను
ఓడించారు, కానీ ఆ ప్రజలు నిన్ను ఒంటరిగా
విడుస్తారు."

### ఇశ్రాయేలు ప్రజలు తిరిగి రావటం

18 పైకి చూడు! నీ చుట్టూ చూడు! నీ పిల్లలు
అందరూ సమావేశమై నీ దగ్గరకు వస్తున్నారు.
యెహోవా చెబుతున్నాడు: "నేను సజీవంగా
ఉన్నాను, నేను మీకు ఈ వాగ్దానం చేస్తున్నాను:
నీ పిల్లలు నీకు కంఠహారంగా ఉంటారు. పెండ్లి
కుమార్తె ధరించే ఒడ్డాణంలా నీ పిల్లలు ఉంటారు.
19 ఇప్పుడైతే నీవు ఓడించబడి, నాశనం చేయబడి
ఉన్నావు. నీ భూమి నిష్ప్రయోజనం. అయితే
కొంతకాలం తర్వాత నీ దేశంలో ఎంద రెందరో
మనుష్యులు ఉంటారు. నిన్ను నాశనం చేసిన
ఆ మనుష్యులు చాలా చాలా దూరంగా ఉంటారు.
20 నీవు పోగొట్టుకున్న పిల్లలకోసం నీవు విచా రంగా
ఉన్నావు. అయితే ఆ పిల్లలు, 'ఈ స్థలం మేము
నివసించేందుకు చాలా చిన్నదిగా ఉంది. మేము
నివసించేందుకు పెద్ద స్థలం ఇవ్వు' అని నీతో
చెబుతారు.
21 అప్పుడు నీలో నీవు అనుకొంటావు, 'ఈ పిల్ల
లందర్నీ నాకు ఎవరు ఇచ్చారు? ఇది చాలా
బాగుంది. నేను విచారంగా, ఒంటరిగా ఉన్నాను.
నేను ఓడించబడి, నా ప్రజలకు దూరమయ్యాను.
అందుచేత ఈ పిల్లలను నాకిచ్చింది ఎవరు?
చూడు, నేను ఒంటరిగా విడువబడ్డాను. ఈ పిల్ల
లంతా ఎక్కడనుండి వచ్చారు?' "

22 నా ప్రభువు యెహోవా చెబుతున్నాడు,
"చూడు, రాజ్యాలకు నేను నా చేయి ఊపుతాను.
ప్రజలందరూ చూడగలిగేట్టు నేను నా పతాకాన్ని
ఎగురవేస్తాను. అప్పుడు ఆ ప్రజలు నీ పిల్లలను
నీ దగ్గరకు తీసుకొని వస్తారు. ఆ ప్రజలు నీ
పిల్లలను వారి భుజాలమీద ఎత్తుకొంటారు,
మరియు వారు తమ చేతుల్లో వారిని పట్టు
కొంటారు.
23 నీ పిల్లలకు రాజులు ఉపాధ్యాయులుగా ఉంటారు.
రాజకుమార్తెలు ఆ పిల్లల విషయమై శ్రద్ధ
పుచ్చుకొంటారు. రాజులు, వారి కుమార్తెలు నీ
ఎదుట సాష్టాంగ పడ్తారు. నీ పాదాల కింద ధూళిని
వారు ముద్దు పెట్టుకొంటారు. అప్పుడు నేనే
యెహోవానని నీవు తెలుసుకొంటావు. నా
యందు విశ్వాసం ఉంచే వాడెవడూ నిరాశ
చెందడని నీవు తెలుసుకొంటావు."
24 బలమైన సైనికుడు ఒకడు యుద్ధంలో గనుక
ఐశ్వర్యం గెలుచుకొంటే ఆ ఐశ్వర్యాన్ని అతని
దగ్గర్నుండి నీవు తీసుకోలేవు. బలమైన సైనికుడు
ఒక ఖైదీకి కాపలా ఉంటే ఆ ఖైదీ తప్పించుకోలేడు.
25 అయితే యెహోవా చెబుతున్నాడు, "బలమైన
సైనికుని దగ్గర్నుండి ఖైదీలు తప్పించబడతారు.
ఆ ఖైదీలు తప్పించుకొంటారు. ఇది ఎలా జరుగు
తుంది? నీ యుద్ధాలు నేను పోరాడుతాను నీ
పిల్లల్ని నేను రక్షిస్తాను.
26 "స్వంత శరీరాన్ని తినేట్టుగా, మిమ్మల్ని కష్టపెట్టే
వారిని నేను బలవంతం చేస్తాను. వారి రక్తమే
వారిని మత్తెక్కించే ద్రాక్షరసం అవుతుంది.
అప్పుడు నేను మిమ్మల్ని రక్షించే యెహోవానని
ప్రతి ఒక్కరు తెలుసుకొంటారు. యాకోబు
యొక్క మహా శక్తిమంతుడే మిమ్మల్ని రక్షించే
వాడు అని మనుష్యులందరూ తెలుసు
కొంటారు."

### ప్రజలు పాపం చేసినందువల్ల ఇశ్రాయేలు శిక్షించబడింది

50 యెహోవా చెబుతున్నాడు: "ఇశ్రాయేలు
ప్రజలారా, మీ తల్లి యెరూషలేముకు నేను
విడాకులిచ్చానని మీరంటున్నారు. అయితే
ఆమెను నేను విడనాడినట్టు నిదర్శన కాయితాలు
ఏవి? నా పిల్లలారా, ఎవరికైనా నేను డబ్బు
రుణం ఉన్నానా? అప్పు తీర్చటానికి నేను
మిమ్మల్ని అమ్ముకొన్నానా? లేదు. చూడండి,
మీరు చేసిన చెడ్డ పనుల మూలం గానే నేను
మిమ్మల్ని విడిచి పెట్టేసాను. మీ తల్లి (యెరూష
లేము) చేసిన చెడ్డ పనుల వల్లనే ఆమెను నేను
పంపివేశాను.
2 నేను ఇంటికి వచ్చాను, ఎవరూ కనబడలేదు.
నేను పిలిచి, పిలిచి, ఎంత పిలిచినా ఎవరూ పలుక
లేదు. నేను మిమ్మల్ని రక్షించలేనని మీరు తలుస్తు
న్నారా? మీ కష్టాలనుండి మిమ్మును రక్షించే శక్తి
నాకు ఉంది. చూడండి, సముద్రాన్ని ఎండి
పొమ్మని నేను ఆజ్ఞాపిస్తే అది ఎండిపోతుంది!
అక్కడ నీళ్లు ఉండవు గనుక చేపలు చస్తాయి,
అవి కుళ్లిపోతాయి.
3 ఆకాశాన్ని నేను చీకటి కమ్మివేసేలా చేయ గలను.
విచార వస్త్రాల్లా ఆకాశం నల్లగా అవుతుంది."

### దేవుని సేవకుడు నిజంగా దేవుని మీద ఆధారపడతాడు

4ఉపదేశం చేయగల సామర్థ్యాన్ని నా ప్రభువైన
యెహోవా నాకు ఇచ్చాడు. కనుక ఈ విచారగ్రస్థ
ప్రజలకు ఇప్పుడు నేను ఉపదేశము చేస్తాను. ప్రతి
ఉదయం ఆయన నన్ను మేల్కొలిపి, ఒక విద్యార్థిలా
నాకు ఉపదేశిస్తాడు. 5నేను నేర్చుకొనేందుకు నా ప్రభు
వైన యెహోవా నాకు సహాయం చేస్తాడు. మరియు

నేను ఆయన మీద తిరుగబడలేదు. నేను ఆయనను
వెంబడించటం మానను. 6నేను ఆ ప్రజల్ని నన్ను
కొట్టనిస్తాను. వాళ్లను నా గడ్డం పీకనిస్తాను. వాళ్లు
నన్ను చెడ్డ మాటలు తిట్టి, నా మీద ఉమ్మి వేసినప్పుడు
నేను నా ముఖం దాచుకోను. 7నా ప్రభువైన
యెహోవా నాకు సహాయం చేస్తాడు. కనుక వారు
చెప్పే చెడ్డ మాటలు నాకు హాని కలిగించవు. నేను
బలవంతుడనై ఉంటాను. నేను నిరాశ చెందనని నాకు
తెలుసు. 8యెహోవా నాతో ఉన్నాడు. నేను
నిర్దోషినని ఆయనకు తెలుసును. కనుక నేను దోషినని
ఎవరూ చూపించలేరు. నాదే తప్పు అని ఎవరైనా
రుజువు చేయాలనుకొంటే, ఆ వ్యక్తి నా దగ్గరకు రావాలి.
మేము ఒక తీర్పు జరిగిస్తాం. 9అయితే చూడండి, నా
ప్రభువైన యెహోవా నాకు సహాయం చేస్తాడు.
అందుచేత నేను చెడ్డవాడినని ఎవ్వరూ చూపించలేరు.
అలాంటి వాళ్లంతా పనికిమాలిన గుడ్డల్లా అవుతారు.
వాటిని చెదలు తినేస్తాయి.
10యెహోవాను గౌరవించే ప్రజలు ఆయన సేవ
కుని మాటకూడా వింటారు. ఆ సేవకుడు ఏం జరుగు
తుందో తెలియకుండానే సంపూర్ణంగా దేవుణ్ణి నమ్ము
కొని జీవిస్తాడు. అతడు వాస్తవంగా యెహోవా
నామాన్నే నమ్ముకొంటాడు, మరియు ఆ సేవకుడు
తన దేవుని మీద ఆధారపడతాడు.
11“ప్రజలారా, చూడండి, మీరు మీ ఇష్టం వచ్చి
నట్టుగా జీవించాలనుకొంటున్నారు. మీ మంటలను,
జ్వాలలను మీరే అంటిస్తున్నారు. అలానే, మీ దారిన
మీరు జీవిస్తున్నారు. కానీ మీరు శిక్షించబడతారు. మీరు
మీ మంటల్లో, జ్వాలల్లో పడతారు, మీరు కాల్చి
వేయబడుతారు. అలా జరిగేట్టు నేను చేస్తాను.

### ఇశ్రాయేలు అబ్రాహాము వలె ఉండాలి

51 “మీలో కొంతమంది ప్రజలు మంచి జీవితాలు
జీవించాలని కష్టపడి ప్రయత్నిస్తారు.
సహాయంకోసం మీరు యెహోవా దగ్గరకు వెళ్తారు.
నా మాట వినండి. మీ తండ్రి అబ్రాహామును మీరు
చూడాలి. మీరు ఏ బండనుండి చెక్కబడ్డారో, ఆ
బండ ఆయనే. 2అబ్రాహాము మీ తండ్రి, మీరు ఆయన్ని
చూడాలి. మీకు జన్మనిచ్చిన మాతృమూర్తి శారాను
మీరు చూడాలి. అబ్రాహామును నేను పిలిచినప్పుడు
అతడు ఒంటరిగా ఉన్నాడు. అప్పుడు నేను అతణ్ణి
ఆశీర్వదించాను, అతడు ఒకగొప్ప వంశాన్ని ప్రారంభిం
చాడు. అనేకానేక మంది అతనినుండి ఉద్భవించారు.”
3అదే విధంగా సీయోనును* యెహోవా ఆశీ
ర్వదిస్తాడు. ఆమెను గూర్చి, ఆమె ప్రజలను గూర్చి
యెహోవా విచారించి, ఆమెకోసం ఒక గొప్ప కార్యం
చేస్తాడు. అరణ్యాన్ని యెహోవా మార్చేస్తాడు.
అరణ్యం ఏదెను వనంలా ఒక వనం అయిపోతుంది.
ఆ దేశం ఖాళీగా ఉంది గాని అది యెహోవా తోటలా
తయారవుతుంది. అక్కడ ప్రజలు సంతోషంగా
ఉంటారు. అక్కడ ప్రజలు వారి ఆనందాన్ని ప్రదర్శి
స్తారు. కృతజ్ఞత, విజయాలను గూర్చి వారు పాటలు
పాడుతారు.

4 “నా ప్రజలారా, నా మాట వినండి! ప్రజలు
ఎలా జీవించాలో అది వారికి చూపించే దీపా
ల్లాంటివి నా నిర్ణయాలు.
5 నేను న్యాయవంతుడనని త్వరలోనే నేను చూపి
స్తాను. త్వరలోనే నేను నిన్ను రక్షిస్తాను. నేను
నా శక్తిన్ని ప్రయోగించి, రాజ్యాలన్నింటికి తీర్పు
తీరుస్తాను. దూర ప్రదేశాలన్నీ నాకోసం కని
పెట్టుకొని ఉన్నాయి. నా శక్తి వారికి సహాయం
చేయాలని అవి కనిపెట్టుకొని ఉన్నాయి.
6 ఆకాశాలవైపు చూడండి. మీ చుట్టూ కింద ఉన్న
భూమిని చూడండి. ఆకాశాలు పొగ మేఘాల్లా
మాయమై పోతాయి. భూమి పనికి మాలిన పాత
గుడ్డల్లా అవుతుంది. భూమి మీద మనుష్యులు
మరణిస్తారు. అయితే నా రక్షణ శాశ్వతంగా కొన
సాగుతుంది. నా దయ ఎప్పటికీ అంతంకాదు.
7 దయను అవగాహన చేసికొనే ప్రజలారా, మీరు
నా మాట వినాలి. నా ఉపదేశాలను పాటించే
ప్రజలారా నేను చెప్పే మాటలు మీరు వినాలి.
దుష్ట ప్రజల విషయం భయపడకండి. వారు
మీకు చెప్పే చెడ్డ విషయాలను గూర్చి భయ
పడకండి.
8 ఎందుకంటే వారు పాత గుడ్డల్లా ఉంటారు గనుక.
చిమ్మెటలు వాటిని తినివేస్తాయి. వారు గొర్రె
బొచ్చులా ఉంటారు. పురుగులు వాటిని తిని
వేస్తాయి. అయితే నా దయ శాశ్వతంగా కొనసాగు
తుంది. నా రక్షణ శాశ్వతంగా సదా కొనసాగు
తుంది.”

### దేవుని స్వంత శక్తి తన ప్రజలను రక్షిస్తుంది

9 యెహోవా హస్తమా (శక్తి) మేలుకో! మేలుకో!
నీ బలం సిద్ధం చేయి. చాలాకాలం కిందట నీవు
చేసినట్టు పూర్వకాలాల్లో నీవు చేసినట్టు నీ
బలాన్ని ప్రయోగించు. రాహాబును ఓడించిన శక్తి
నీవే. మకరాన్ని నీవే ఓడించావు.
10 సముద్రం ఎండిపోయేట్టు నీవే చేశావు. మహా
అగాధ జలాలను ఎండిపోయేట్టు నీవు చేశావు.
సముద్రపు అతి లోతైన స్థలాలను నీవు త్రోవగా
చేశావు. నీ ప్రజలు ఆ మార్గాన వెళ్లి రక్షించబడ్డారు.

---

**సీయోను** యెరూషలేము కట్టబడిన కొండకు దక్షిణపు భాగం. కొన్ని సార్లు యెరూషలేములోవున్న దేవుని ప్రజలు అని దీని భావం.

11 యెహోవా తన ప్రజలను రక్షిస్తాడు. వారు
ఆనందంగా సీయోనుకు తిరిగి వస్తారు. వారు
ఎంతో ఎంతో సంతోషంగా ఉంటారు. వారి
ఆనందం వారి తలలమీద శాశ్వత కిరీటంలా
ఉంటుంది. ఆనందంతో వారు పాటలు పాడు
తూంటారు. దుఃఖం అంతా దూరమై పోతుంది.
12 యెహోవా చెబుతున్నాడు, "నిన్ను ఆదరించే
వాడను నేనే. కనుక ఇతరులను గూర్చి నీవెందుకు
భయపడాలి? వాళ్లు కేవలం బతికి, చచ్చే మను
ష్యులు మాత్రమే. వాళ్లు కేవలం మానవ
మాత్రులువారు కూడా గడ్డిలాగే చస్తారు."
13 యెహోవా మిమ్మల్ని చేశాడు. తన శక్తితో
ఆయన భూమిని చేశాడు. తన శక్తితో ఆకాశా
లను భూమికి పైగా ఆయన విస్తరింపజేసాడు.
కానీ ఆయనను, ఆయన శక్తిని మీరు మరచి
పోతారు. కనుక మీకు హాని చేసే కోపిష్ఠులైన
మనుష్యులను గూర్చి ఎల్లప్పుడు మీరు భయ
పడుతుంటారు. ఆ మనుష్యులు మిమ్మును
నాశనం చేయాలని పథకం వేసారు. కానీ ఇప్పుడు
వాళ్లెక్కడ? వాళ్లంతా పోయారు.
14 చెరసాలలోని మనుష్యులు త్వరలోనే విడుదల
చేయబడతారు. వాళ్లు చెరసాలలోనే మరణించి,
కుళ్లిపోరు. ఆ మనుష్యులకు సరిపడినంత
ఆహారం ఉంటుంది.
15 "నేను యెహోవాను, మీ దేవుడను. నేను సము
ద్రాన్ని కదలిస్తాను, కెరటాలు పుట్టిస్తాను.'
(ఆయన పేరు సర్వశక్తిమంతుడైన యెహోవా.)

16"నా సేవకా, నీవు చెప్పాలని నేను కోరే మాటలను
నేనే నీకు ఇస్తాను. నా చేతులతో నిన్ను నేను కప్పి
ఉంచి కాపాడుతాను. కొత్త ఆకాశాన్ని, కొత్త భూమిని
చేసేందుకు నిన్ను నేను ఉపయోగించుకొంటాను.
'మీరు నా ప్రజలు' అని ఇశ్రాయేలుతో చెప్పేందుకు
నిన్ను నేను వాడుకొంటాను." '

## ఇశ్రాయేలును దేవుడు శిక్షించాడు

17 మేలుకో! మేలుకో! యెరూషలేమా, లెమ్ము! నీ
మీద యెహోవా చాలా కోపగించాడు. అందువల్ల
నీవు శిక్షించబడ్డావు. నీవు తాగాల్సిన ఒక విషపు
పాత్రలా ఉంది ఆ శిక్ష. నీవు దానిని తాగావు.
18యెరూషలేముకు చాలామంది ప్రజలు ఉన్నారు.
కానీ వారిలో ఎవ్వరూ ఆమెకు నాయకులు కాలేదు.
ఆమె పెంచిన పిల్లలు ఎవ్వరు ఆమెను నడిపించే
మార్గదర్శులు కాలేదు.
19యెరూషలేముకు జంట జంటలుగా కష్టాలు
వచ్చాయి, దొంగిలించటం, చొరబడటం, మహా ఆకలి
- పోరాటం.
నీవు శ్రమ అనుభవిస్తున్నప్పుడు నీకు ఎవ్వరూ
సహాయం చేయలేదు. ఎవరూ నీ మీద దయ
చూపించలేదు. 20నీ ప్రజలు బలహీనులయ్యారు. వారు
నేలమీద పడి, అలానే ఉండిపోయారు. ప్రతి వీధి
మలుపులోను వారు పడివున్నారు. వారు వలలో పట్ట
బడిన జంతువుల్లా ఉన్నారు. వారు ఇంకెంత మాత్రం
భరించలేనంతగా, యెహోవా కోపంచేత శిక్షించ
బడ్డారు. దేవుడు వారికి ఇంకా ఎక్కువ శిక్ష విధిస్తాను
అన్నప్పుడు వారు మరీ బలహీనులై పోయారు.
21అయ్యో, యెరూషలేమా, నా మాట విను. ఒక
తాగుబోతువానిలా నీవు బలహీనంగా ఉన్నావు, కానీ
నీవు ద్రాక్షరసం తాగినందు చేత కాదు మత్తుగా ఉన్నది.
నీవు ఆ "విషపు పాత్ర" మూలంగా బలహీనంగా
ఉన్నావు. 22నీ దేవుడు, యజమానియైన యెహోవా
తన ప్రజలకోసం పోరాడుతాడు. ఆయన నీతో ఇలా
అంటున్నాడు: "చూడు, ఈ 'విషపు పాత్రను' (శిక్షను)
నీ వద్దనుండి నేను తొలగించి వేస్తున్నాను. నీ మీద
నా కోపాన్ని తీసివేస్తున్నాను. ఇంకెంత మాత్రం నీవు
నా కోపం మూలంగా శిక్షించబడవు. 23నీకు హాని చేసిన
వారిని శిక్షించ టానికి ఇప్పుడు నేను నా కోపాన్ని విని
యోగిస్తాను. ఆ ప్రజలు నిన్ను చంపటానికి ప్రయత్నిం
చారు. 'మా యెదుట సాష్టాంగ పడు, మేము నీ మీద
నడుస్తాం' అని వారు నీతో చెప్పారు. వాళ్ల ముందు
సాష్టాంగ పడేట్టు వారు నిన్ను బలవంతం చేశారు.
అప్పుడు ఆ మనుష్యులు నడుచుటకు నీ వీపును
ధూళిగా చేశారు. వారు ప్రయాణం చేయుటకు నీవు
ఒక తోవలా ఉన్నావు.'

## ఇశ్రాయేలు రక్షించబడుతుంది

52 మేలుకో! మేలుకో! సీయోనూ మేలుకో.
నీవు వస్త్రాలు ధరించు. నీ బలం
తొడుగుకో. పవిత్ర యెరూషలేమా, నిలుచో!
దేవుణ్ణి వెంబడించేందుకు ఒప్పు కొని ప్రజలు,*
పవిత్రంగా లేని ప్రజలు నీలో మరల ప్రవేశింపరు.
2 ధూళి దులిపివేయి! అద్భుతమైన నీ వస్త్రాలు
ధరించు! సీయోను కుమారీ, యెరూషలేమా,
నీవు ఒక ఖైదీవి. కాని ఇప్పుడు నీ మెడ చుట్టూ
ఉన్న గొలుసుల నుండి నిన్ను నీవు విడుదల
చేసికో!
3 యెహోవా చెబుతున్నాడు, "నీవు డబ్బుకు
అమ్మబడలేదు. అందుచేత డబ్బు లేకుండనే నీవు
రక్షించబడతావు."

4నా ప్రభువు యెహోవా చెబుతున్నాడు: "నా
ప్రజలు నివాసం ఉండేందుకు మొదట ఈజిప్టుకు దిగి

**దేవుణ్ణి … ప్రజలు** "సున్నతి లేకుండా అపవిత్రంగా వున్న
మనుష్యులు అని ప్రజలు నీలో మరల ప్రవేశింపరు."

పోయారు, ఆ తర్వాత వారు బానిసలయ్యారు. ఆ
తర్వాత వారిని అష్షూరు బానిసలను చేసింది. [5]ఇప్పుడు
చూడండి ఏమయిందో! మరో రాజ్యం నా ప్రజలను
తీసుకొంది. నా ప్రజలను బానిసలుగా తీసుకొన్న ఆ
రాజ్యం ఏది? నా ప్రజలను తీసుకొనేందుకు ఈ రాజ్యం
ఏమీ చెల్లించలేదు. ఈ రాజ్యం నా ప్రజలను పాలిస్తూ,
వారిని చూచి నవ్వుతుంది. ఆ మనుష్యులు ఎప్పుడూ
నన్ను గూర్చి చెడ్డ మాటలే చెబుతుంటారు."
[6]"నా ప్రజలు నన్నుగూర్చి నేర్చుకొనేందుకు ఇది
జరిగింది. నేను ఎవరినో నా ప్రజలు తెలుసుకొంటారు.
నా ప్రజలు నా పేరు తెలుసుకొంటారు, ఉన్న
వాడను* అనే నేను వారితో మాట్లాడుతున్నానని
వారు తెలుసుకొంటారు" అని యెహోవా చెబు
తున్నాడు.
[7]శుభవార్తతో కొండల మీదుగా ఒక వార్తాహరుడు
రావటం ఎంతో అద్భుతంగా ఉంటుంది. "శాంతి ఉంది!
మేము రక్షించబడ్డాం! మీ దేవుడే రాజు!" అని ఒక
వార్తాహరుడు ప్రకటించగా వినటం అద్భుతం.

8 పట్టణపు కావలి వాళ్లు* కేకలు వేయటం మొదలు
పెట్టారు. వాళ్లంతా కలిసి ఆనందిస్తున్నారు.
ఎందుకు? ఎందుకంటే, యెహోవా సీయో
నుకు* తిరిగి రావటం వారిలో ప్రతి ఒక్కరూ
చూస్తారు. [9]యెరూ షలేమా, నాశనం చేయబడిన
నీ కట్టడాలు మరల సంతోషిస్తాయి. మీరంతా
కలిసి ఆనందిస్తారు. ఎందుకంటే, యెరూషలేము
మీద యెహోవా దయగలిగి ఉంటాడు.
యెహోవా తన ప్రజలను విమోచిస్తాడు.
10 యెహోవా తన పవిత్ర శక్తిని సకల రాజ్యాలకు
చూపిస్తాడు. మరియు దేవుడు తన ప్రజలను
ఎలా రక్షిస్తాడో అది దూర దేశాలన్నీ చూస్తాయి.
11 పజలారా మీరు బబులోను విడిచిపెట్టాలి. ఆ
స్థలం విడిచిపెట్టండి! ఆరాధనలో ఉపయోగించే
వస్తువులను మోసే మనుష్యులారా మిమ్మల్ని
మీరు పవిత్రం చేసుకోండి. అపవిత్రమైన దేన్ని
ముట్టుకో వద్దు.
12 మీరు బబులోను విడిచిపెడ్తారు. కానీ మీరు
ఆత్రంగా విడిచిపెట్టేందుకు బలవంతం చేయ
బడరు. పారిపోయేందుకు మీరు బలవంతం
చేయబడరు. మీరు బయటకు నడుస్తారు
మరియు యెహోవా మీతో నడుస్తాడు.
యెహోవా మీకు ముందు ఉంటాడు. ఇశ్రాయేలీ
యుల దేవుడు మీ వెనుక ఉంటాడు.*

### దేవుని సేవకుడు శ్రమపడటం

[13]"నా సేవకుని చూడు. అతనికి విజయం కలుగు
తుంది. అతడు చాలా ప్రముఖుడవుతాడు. భవిష్యత్తులో
ప్రజలు అతన్ని సన్మానించి, గౌరవిస్తారు.
[14]"కానీ చాలా మంది మనుష్యులు నా సేవకుని
చూచి అదరిపోయారు. అతణ్ణి ఒక మనిషిగా వారు
గుర్తించలేనంతగా అతడు బాధించబడ్డాడు. [15]కానీ అంత
కంటె ఎక్కువమంది ప్రజలు ఆశ్చర్యపోతారు. రాజులు
అతన్ని చూచి ఆశ్చర్యపోయి, నోట మాట రాకుండా
ఉండిపోతారు. నా సేవకుని గూర్చిన కథ వారు వినలేదు
– జరిగింది వారు చూశారు. ఈ ప్రజలు ఆ కథ
వినలేదు గాని వారు గ్రహించారు."

### పీడిత సేవకుడు

53 మేము ప్రకటించిన సంగతులను నిజంగా
ఎవరు నమ్మారు? యెహోవా హస్తం ఎవరికి
బయలు పరచబడింది?
[2]యెహోవా ఎదుట ఆయన ఒక చిన్న మొక్కవలె
ఉన్నాడు. ఎండిన భూమిలో ఎదుగుతున్న మొక్కవలె
పెరిగాడు.మనము ఆయనలో చూడతగిన రూపము
గాని తేజస్సుగాని, ఏమి లేదు. మనం ఆయన్ని
చూడటానికి ఇష్టపడుటకు ఆయనలో ప్రత్యేకత ఏమీ
మనకు కనబడదు.
[3] ఆయన నీచంగా ఎంచబడ్డాడు, మనుష్యల చేత
విడిచి పెట్టబడ్డాడు, ఆయన ఎంతో బాధ పొందిన
మనిషి. రోగం బాగా ఎరిగిన వాడు. కనీసం ఆయన్ని
కన్నెత్తి చూసేందుకు మనుష్యులు ముఖాన్ని
దాచుకొన్నారు. ఆయన నీచంగా ఎంచబడ్డాడు. కనుక
మనం ఆయన్నిలెక్క చేయలేదు. [4]నిశ్చయంగా
ఆయన మన వ్యాధులను భరించాడు. మన బాధలను
మోశాడు. అయినా, ఆయన్ని కొట్టిన వానిగాను,
హింసించిన వానిగాను, బాధించిన వానిగాను, మనం
తలంచాం.
[5]కాని మనం చేసిన చెడ్డ పనులకు ఆయన శ్రమ
పొందాల్సి వచ్చింది. మన దోషం మూలంగానే ఆయన
నలుగగొట్టబడ్డాడు. మనకు సమాధాన మిచ్చిన శిక్ష
ఆయన మీద పడింది. ఆయన గాయాల మూలంగా
మనకు స్వస్థత కలిగింది. [6]కానీ ఆయన ఇలా చేసిన
తర్వాత కూడా మనం అందరం గొర్రెలవలె త్రోవ
తప్పి పోయి తిరిగాం. మనం మనకు ఇష్టమైన దారిలో
పోయాం. మన అందరి దోషాన్ని యెహోవా ఆయన
మీద వేశాడు.

**ఉన్నవాడను** ఇది, హీబ్రూలో దేవుని పేరు, ఇది దేవుడు శాశ్వతంగా నివసించును. తన ప్రజలతో శాశ్వతంగా ఉంటాడు అని సూచిస్తుంది. నిర్గ. 3:13-17 చూడండి.

**కావలి వాళ్లు** ఇక్కడ వీరు ప్రవక్తలు కావచ్చును.

**సీయోను** యెరూషలేములో ఉన్న దేవుని ప్రజలు అని కూడ అర్థం.

**యెహోవా ... ఉంటాడు** ఇది యెహోవా తన ప్రజలను కాపాడతాడని సూచిస్తుంది. నిర్గ. 14:19,20 చూడండి.

[7]ఆయన బాధించబడ్డాడు, శిక్షించబడ్డాడు,కానీ ఎన్నడూ ఎదురు చెప్పలేదు. వధించబడుటకు తీసు కొని పోబడే గొర్రెవలె ఆయన మౌనంగా ఉన్నాడు. ఒక గొర్రె పిల్ల బొచ్చు కత్తిరించేటప్పుడు ఎలా మౌనంగా ఉంటుందో అలా ఆయన మౌనంగా ఉన్నాడు. తనను తాను రక్షించుకోవటానికి ఆయన నోరు తెరవలేదు.

[8]ఆయన అబద్ధపు తీర్పుపొంది, బంధించబడి తీసుకొని పోబడ్డాడు. ఆయన తరంలో ఈ విషయాలు ఎవరు మనస్సుకు తీసుకొన్నారు? ఆయన భూమి మీద నివసిస్తున్న వారిలో నుండి తొలగించబడ్డాడు. నా ప్రజల అపరాధాల కోసం ఆయన నలుగ కొట్టబడ్డాడు.

[9]ఆయన చనిపోయి ధనికునితో పాతి పెట్టబడ్డాడు. దుష్టులతో పాటు ఆయన సమాధి చేయబడ్డాడు. ఆయన దౌర్జన్యం చేయలేదు. ఆయన ఎన్నడూ మోసం చేయలేదు.

[10]అయినా ఆయన్ని నలుగ గొట్టాలని శ్రమ కలి గించాలని, యెహోవాకు ఇష్టం. యెహోవా ఆయన ప్రాణాన్ని పాపపరిహార బలిగా అర్పించితే ఆయన బహూకాలం జీవించి తన సంతానాన్ని చూస్తాడు. ఆయనలో యెహోవా చిత్తం సఫలమవుతుంది.

[11]ఆయన తన ఆత్మలో ఎన్నో శ్రమలు పొందిన తర్వాత వెలుగును చూచి సంతృప్తి చెందుతాడు. నీతి మంతుడైన నా సేవకుడు తన జ్ఞానం వల్ల అనేకులను నీతిమంతులుగా చేస్తాడు.

[12]ఈ కారణం చేత నేను గొప్ప ప్రజలతో ఆయన్ని గొప్పవాడినిగా చేస్తాను. బలముగల ప్రజలందరిలో ఆయనకు అన్నింటిలోనూ భాగం ఉంటుంది. ఎందు కంటే మనుష్యుల కోసం ఆయన తన ప్రాణం ఇచ్చి మరణించాడు. ఆయన నేరస్థులలో ఒకనిగా లెక్కించ బడ్డాడు. అనేకుల పాపాల్ని ఆయన మోసి అపరాదుల కోసం విజ్ఞాపన చేసాడు.

### దేవుడు తన ప్రజలను ఇంటికి తీసుకొనివస్తాడు

54 ఓ స్త్రీ , సంతోషంగా ఉండు! నీకు పిల్లలు పుట్టలేదు, కానీ నీవు చాలా సంతోషంగా ఉండాలి. "భర్తగల స్త్రీకంటె ఒంటరి స్త్రీ* ఎక్కువ మంది పిల్లలను కంటుంది." అని యెహోవా చెబుతున్నాడు.

2 నీ గుడారం విశాలం చేయి. నీ ద్వారాలు పూర్తిగా తెరువు. నీ కుటుంబాన్ని వృద్ధి చేయటం ఆపు జేయకు. నీ గుడారాన్ని విశాలం చేయి, బలంగా చేయి.

3 ఎందుకంటే నీవు చాలా పెరిగిపోవటం మొదలు పెడతావు. నీ పిల్లలు అనేక రాజ్యాల నుండి ప్రజలను తీసుకొనివస్తారు. నాశనం చేయబడిన పట్టణాల్లో ఆ పిల్లలు తిరిగి నివసిస్తారు.

4 భయపడవద్దు! నీవు నిరాశ చెందవు. నీ మీద ప్రజలు చెడ్డ మాటలు చెప్పరు. నీవేమీ ఇబ్బంది పడవు. నీవు చిన్నదానివిగా ఉన్నప్పుడు నీవు సిగ్గుపడ్డావు. కానీ ఆ సిగ్గు నీవు ఇప్పుడు మరచి పోతావు. నీ భర్త పోయినప్పుడు నీకు కలిగిన అవమానాన్ని నీవు జ్ఞాపకం చేసుకోవు.

5 ఎందుకంటే నిన్ను చేసిన వాడు నీ భర్త (దేవుడు) గనుక ఆయన పేరు సర్వశక్తిమంతుడైన యెహోవా. ఇశ్రాయేలును రక్షించేవాడు ఆయనే. ఆయన ఇశ్రాయేలు పరిశుద్ధుడు. ఆయన సర్వ భూమికి దేవుడు అని పిలువ బడతాడు.

6 నీవు భర్త విడిచిన భార్యవలె ఉన్నావు. ఆత్మలో నీవు చాలా దుఃఖించావు. కానీ యెహోవా నిన్ను తనదిగా ఉండేందుకు పిలిచాడు. యవ్వనంలో వివాహమై, భర్తచే విడిచి పెట్టబడిన స్త్రీలా నీవు ఉన్నావు. కానీ దేవుడు నిన్ను తనదానిగా ఉండు టకు పిలిచాడు.

7 దేవుడు చెబుతున్నాడు, "నేను నిన్ను విడిచి పెట్టాను. కానీ కొంతకాలం మట్టుకే. నేను నిన్ను మళ్లీ నా దగ్గరకు చేర్చుకొంటాను. నేను నీకు గొప్ప దయ చూపిస్తాను.

8 నేను చాలా కోపగించి కొద్ది కాలం పాటు నీ నుండి దాక్కున్నాను. కానీ శాశ్వతంగా నిన్ను నేను దయతో ఆదరిస్తాను.' నీ రక్షకుడైన యెహోవా ఇది చెప్పాడు.

### దేవుడు తన ప్రజలను ఎల్లప్పుడూ ప్రేమిస్తాడు

9 దేవుడు చెబుతున్నాడు: "నోవహు కాలంలో ప్రళయంతో నేను ప్రపంచాన్ని శిక్షించినట్టుగా ఉంది ఇది. ప్రపంచాన్ని మళ్లీ ఎన్నడూ ప్రళ యంతో ముంచివేయనని నోవహుకు నేను వాగ్దానం చేశాను. అదే విధంగా, నేను మరల ఎన్నడు నీ మీద కోపగించి, నిన్నుగూర్చి చెడుగా మాట్లాడనని ప్రమాణం చేస్తున్నాను."

10 యెహోవా చెబుతున్నాడు: "పర్వతాలు కని పించకుండా పోవచ్చు, కొండలు ధూళి కావ చ్చును. కానీ నా దయ నిన్ను ఎన్నటికీ విడు వదు. నేను నీతో సమాధానపడతాను, అది ఎన్న టికీ అంతం కాదు." యెహోవా నీ యెడల కరుణ చూపిస్తాడు. మరియు ఈ సంగతులు చెప్పిన వాడు ఆయనే.

11 "అయ్యో, దీన పట్టణమా! తుఫానులు నిన్ను బాధించాయి, మరియు నీవు ఓదార్చబడలేదు.

---

**ఒంటరి స్త్రీ** ఈ హీబ్రూ పదం "నాశనం అయింది" అనే పదంవంటిది. బహుశా "నాశనమైన యెరూషలేము" కావచ్చును.

నేను నిన్ను మరల నిర్మిస్తాను. ప్రశస్తమైన రాళ్లను
ఉపయోగించి నేను నీ పునాదులు వేస్తాను.
నీలాంజనాలు, నీలాలు నేను ఉపయోగిస్తాను.
12 మాణిక్య మణులతో నేను నీ గోడలు కడతాను.
సూర్యకాంతాలతో నేను నీ ద్వారాలు కడతాను.
ప్రశస్త రత్నాలతో నేను నీ గోడలన్నింటినీ
కడతాను.
13 నీ పిల్లలు దేవుని వెంబడిస్తారు, ఆయన వారికి
ఉపదేశం చేస్తాడు. నీ పిల్లలకు ఎంతో శాంతి
ఉంటుంది.
14 న్యాయం ప్రయోగించి నేను నిర్మిస్తాను. కనుక
నీవు అన్యాయానికి, క్రూరత్వానికి దూరంగా
ఉండాలి.అప్పుడు నీవు భయపడాల్సింది. ఏమీ
ఉండదు. ఏదీ నిన్ను బాధించుటకు రాదు.
15 నా సైన్యాలు ఏవీ నీకు వ్యతిరేకంగా పోరాడవు.
మరియు ఏ సైన్యమైనా నీ మీద దాడి చేసేందుకు
ప్రయత్నిస్తే నీవు ఆ సైన్యాన్ని ఓడిస్తావు.

16"చూడు, కమ్మరిని నేను చేశాను. అగ్నిని రాజ
బెట్టేందుకు అతడు నిప్పుమీద విసరుతాడు. అప్పుడు
అతడు వేడి ఇనుమును తీసుకొని, తాను చేయదలచు
కొన్న పనిముట్టును చేస్తాడు. అదేవిధంగా నాశనం
చేసే 'నాశన కర్తను' నేను సృజించాను.
17"నీ మీద పోరాడుటకు మనుష్యులు ఆయుధాలు
చేస్తారు. కానీ ఆ ఆయుధాలు నిన్ను ఓడించవు. కొంత
మంది నీకు వ్యతిరేకంగా మాట్లాడుతారు. కానీ నీకు
వ్యతిరేకంగా మాట్లాడే ప్రతి వ్యక్తిది తప్పు అని చూపించ
బడుతుంది."
"యెహోవా సేవకులకు ఏమి లభిస్తుంది? నా
దగ్గర లభించే మంచి వాటన్నింటినీ వారు పొందు
తారు" అని యెహోవా చెబుతున్నాడు.

### నిజంగా సంతృప్తిపరచే ఆహారం దేవుడు ఇస్తాడు

55 "దాహంతో ఉన్న ప్రజలారా మీరంతా వచ్చి
నీళ్లు తాగండి! మీ వద్ద డబ్బు లేకపోతే
చింతపడకండి. రండి, మీకు తృప్తి కలిగేంతవరకు
తినండి, తాగండి! మీకు డబ్బు అవసరం లేదు.
మీకు తృప్తి కలిగేంతవరకు తినండి, తాగండి.
ఆహారం, ద్రాక్షారసం ఉచితం!
2 నిజంగా ఆహారం కానిదానికోసం మీ ధనం వ్యర్థం
చేయటం ఎందుకు? మిమ్మల్ని నిజంగా సంతృప్తి
పరచని దానికోసం మీరు ప్రయాసపడటం
ఎందుకు? నా మాట జాగ్రత్తగా వినండి, అప్పుడు
మీరు మంచి ఆహారం భోజనం చేస్తారు. మీ
ఆత్మను తృప్తిపరచే ఆహారం మీరు భోజనం
చేస్తారు.
3 నేను చెప్పే మాటలు జాగ్రత్తగా వినండి, మీ
ఆత్మలు జీవించునట్లుగా మీరు నా మాట వినండి.
నా వద్దకు రండి! శాశ్వతంగా కొనసాగే ఒడంబడిక
నేను మీతో చేస్తాను. అది నేను దావీదుతో చేసిన
ఒడంబడికలా ఉంటుంది. దావీదు ఎడల శాశ్వ
తంగా దయగలిగి ఉంటానని నేను అతనికి వాగ్దానం
చేసాను. మరి మీరు ఆ వాగ్దానాన్ని నమ్ముకో
వచ్చు.
4 రాజ్యాలన్నింటిలో నా శక్తికి దావీదును సాక్షిగా
నేను చేశాను. దావీదు అనేక రాజ్యాలకు పరిపాలకు
నిగాను, సర్వసేనానిగాను ఉంటాడని నేను అతనికి
వాగ్దానం చేశాను."
5 నీవు యెరుగని స్థలాల్లో రాజ్యాలు ఉన్నాయి,
కానీ ఆ రాజ్యాలను నీవు పిలుస్తావు. ఆ రాజ్యాలకు
నీవు తెలియదు. కానీ అవి నీ దగ్గరకు పరుగెడ
తాయి. నీ దేవుడు యెహోవా ఇలా కోరు
తున్నాడు కనుక ఇది జరుగుతుంది. ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుడు నిన్ను గౌరవిస్తున్నాడు. కనుక
ఇది జరుగుతుంది.
6 కనుక సమయం మించిపోక ముందే నీవు
యెహోవా కోసం వెదకాలి. ఆయన సమీపంగా
ఉన్నప్పుడు, ఇప్పుడే నీవు ఆయనను వేడు
కోవాలి.
7 దుర్మార్గులు వారి దుర్మార్గ జీవితాలు విడిచి
పెట్టాలి. వారు తమ దురాలోచనలు నిలిపి
వేయాలి. వారు తిరిగి యెహోవా దగ్గరకు
రావాలి. అప్పుడు యెహోవా వారిని ఆదరిస్తాడు.
మన దేవుడు క్షమిస్తాడు గనుక ఆ మనుష్యులు
యెహోవా దగ్గరకు రావాలి.

### మనుష్యులు దేవుణ్ణి అర్థం చేసుకోలేరు

8 యెహోవా చెబుతున్నాడు, "మీ తలంపులు
నా తలంపుల వంటివి కావు. మీ మార్గాలు నా
మార్గాలవంటివి కావు.
9 ఆకాశాలు భూమికంటె ఉన్నతంగా ఉన్నాయి.
అదే విధంగా మీ మార్గాలకంటె నా మార్గాలు
ఉన్నతంగా ఉన్నాయి. మరియు మీ తలంపుల
కంటె నా తలంపులు ఉన్నతంగా ఉన్నాయి."
యెహోవా తానే ఈ సంగతులు చెప్పాడు.
10 "వర్షం, మంచు ఆకాశం నుండి కురుస్తాయి. అవి
నేలను తాకి, నేలను తడిచేయకుండా తిరిగి
ఆకాశానికి వెళ్లవు. అప్పుడు నేల మొక్క లను
మొలిపించి, ఎదిగింప చేస్తుంది. ఈ మొక్కలు
రైతుకోసం విత్తనాలు సిద్ధం చేస్తాయి. ప్రజలు
ఆహారంగా రొట్టెలకోసం ఈ విత్తనాలు విని
యోగిస్తారు.
11 అదే విధంగా నా నోటినుండి నా మాటలు
బయలు వెళ్తాయి. అవి సంగతులను సంభవింప

చేసేంతవరకు తిరిగి రావు. నేను ఏ సంగతులు
సంభవించాలని అనుకొంటానో వాటిని నా
మాటలు సంభవింపచేస్తాయి. ఏమి చేయాలని
నేను నా మాటలను పంపిస్తానో వాటిని నా
మాటలు సాధిస్తాయి.
12 నా మాటలు సంతోషంగా బయలు వెళ్తాయి.
అవి శాంతి కలిగిస్తాయి. పర్వతాలు, కొండలు
సంతోషంగా నాట్యంచేయటం మొదలు పెడ
తాయి పొలాల్లోని చెట్లన్నీ చప్పట్లుకొడ్తాయి.
13 పొదలు ఉన్నచోట పెద్ద దేవదారు వృక్షాలు
పెరుగుతాయి. కలుపు మొక్కలు ఉన్నచోట
గొంజి వృక్షాలు పెరుగుతాయి. ఈ సంగతులు
యెహోవాను ప్రసిద్ధుని చేస్తాయి. యెహోవా
శక్తిమంతుడు అనేందుకు ఈ సంగతులు రుజువు.
ఈ రుజువు ఎన్నటికి నాశనం చేయబడదు.”

### అన్ని దేశాలు యెహోవాను వెంబడిస్తాయి

56 యెహోవా ఈ సంగతులు చెప్పాడు, “మను
ష్యులందరికి న్యాయం చూపండి. సరైన
వాటినే చేయండి. ఎందుకంటే త్వరలోనే నా రక్షణ
మీకు లభిస్తుంది. నా మంచితనం* త్వరలోనే సర్వ
లోకానికి చూపించబడుతుంది గనుక.”

2సబ్బాతును* గూర్చిన దేవుని చట్టానికి విధేయత
చూపే వ్యక్తి ఆశీర్వదించబడును. ఏ కీడు చేయని
వ్యక్తి సంతోషంగా ఉంటాడు. 3యూదులు కాని మను
ష్యులు కొందరు యెహోవా వైపు తిరుగుతారు.
“యెహోవా తన ప్రజలతో పాటు నన్ను స్వీకరిం
చడు” అని ఆ మనుష్యులు చెప్పకూడదు. “నేను
ఎండిన కట్టె ముక్కను, నాకు పిల్లలు పుట్టరు” అని
నపుంసకుడు చెప్పకూడదు.

4-5“సబ్బాతుకు సంబంధించిన చట్టాలకు విధేయు
లయ్యే నపుంసకులకు నేను శక్తి, కీర్తి ప్రసాదిస్తాను.
నేను కోరే వాటిని జరిగించే నపుంసకులకు నేను శక్తి,
కీర్తి ప్రసాదిస్తాను. వారు నా ఆలయంలో, నా పట్ట
ణంలో ఉంటారు. నా ఒడంబడికను* పాటించే నా
ప్రజలందరికీ నేను ఈ విషయాలు జరిగిస్తాను. కుమా
రులు, కుమార్తెలకంటె శ్రేష్ఠమైన దానిని నేను వారికి
ఇస్తాను. శాశ్వతంగా కొనసాగే పేరు నేను వారికి ఇస్తాను”
అని యెహోవా చెబుతున్నాడు గనుక వారు ఆ
మాటలు చెప్పకూడదు.

6యూదులు కాని మనుష్యులు కొందరు
యెహోవావైపు చేరుతారు. యెహోవాను సేవించి,
ఆయనను ప్రేమించగలిగేట్టు వారు ఇలా చేస్తారు. వారు
యెహోవాకు సేవకులు అయ్యేందుకు యెహోవా
వైపు చేరుతారు. సబ్బాతును ప్రత్యేక ఆరాధన రోజుగా
వారు పాటిస్తారు, నా ఒడంబడిక (ధర్మశాస్త్రాన్ని) సన్ని
హితంగా పాటించటం కొనసాగిస్తారు.

7“ఆ మనుష్యులను నా పరిశుద్ధ పర్వతానికి నేను
తీసుకొని వస్తాను. నా ప్రార్థనా మందిరంలో నేను
వారిని సంతోషింప చేస్తాను. వారు నాకు అర్పించే
అర్పణలు, బలులు నాకు సంతోషం కలిగిస్తాయి.
ఎందుకంటే, నా ఆలయం సకల రాజ్యాలకూ ప్రార్థనా
మందిరం అని పిలువబడుతుంది గనుక” అని
యెహోవా చెబుతున్నాడు. 8నా ప్రభువు యెహోవా
ఈ విషయాలు చెప్పాడు.

ఇశ్రాయేలు ప్రజలు వారి దేశంనుండి బలవంతంగా
వెళ్లగొట్టబడ్డారు. కానీ యెహోవా వారిని మరల ఒక్క
చోట చేరుస్తాడు. “ఈ ప్రజలను నేను మరల ఒక్క
చోట చేరుస్తాను” అని యెహోవా చెబుతున్నాడు.

### మనుష్యులందరూ దేవుని సేవించాలని ఆయన ఆహ్వానిస్తున్నాడు

9 అరణ్యంలోని అడవి మృగములారా తినుటకు
రండి!
10 కావలి వాళ్లు (ప్రవక్తలు) అందరు గుడ్డివాళ్లు.
వారు చేస్తుంది ఏమిటో వారికే తెలియదు. వారు
మొరగటం చేతకాని కుక్కల్లాంటి వాళ్లు. వారు
నేలమీద పండుకొని, నిద్రపోతారు. ఆహా,
నిద్రపోవటం వారికి ఇష్టం.
11 వారు ఆకలిగొన్న కుక్కల్లా ఉన్నారు. వారు
ఎన్నటికి తృప్తిపొందరు. ఆ కాపరులు ఏమి
చేస్తున్నది. వారికే తెలియదు. తప్పిపోయి
తిరుగుతున్న వారి గొర్రెల్లానే ఉన్నారు
వారూను. వారు దురాశాపరులు. వారు చేయాలని
ఆశించేది అంతా వారిని వారు తృప్తిపరచు
కోవటమే.
12 “నేను కొంచెం ద్రాక్షరసం తాగుతాను. నేను
కొంచెం మద్యం తాగుతాను. నేను రేపు కూడా
ఇలానే చేస్తాను. ఆ తర్వాత నేను ఇంకా ఎక్కువ
కూడా తాగుతాను” అని వారు వచ్చి చెబుతారు.

### ఇశ్రాయేలీయులు దేవుని వెంబడించరు

57 మంచి మనుష్యులు పోయారు. కానీ ఏ
వ్యక్తి అది గమనించలేదు. ఏం జరుగు
తుందో ప్రజలు గ్రహించరు. కానీ వారు మంచి
మనుష్యులందరిని సమావేశపరచారు. కష్టాలు
వస్తున్నాయని ప్రజలు గ్రహించరు. మంచి

---

**నా మంచితనం** లేక “విజయం.”

**సబ్బాతు** యూదుల విశ్రాంతి, ఆరాధనలకు ప్రత్యేకమైన రోజు.

**ఒడంబడిక** సాధారణంగా ఇది మోషే ద్వారా దేవుడు ఇశ్రాయేలీయులతో చేసిన ఒప్పందం. ఇక్కడ యెషయా 55:3 లో ఒప్పందం కావచ్చు.

వాళ్లంతా భద్రతకోసం సమావేశం చేయబడ్డారని
వారికి తెలియదు.
2 అయితే శాంతి కలుగుతుంది. మరియు ప్రజలు
వారి స్వంత పడకలమీద విశ్రాంతి తీసుకొంటారు.
వారు ఎలా జీవించాలని దేవుడు కోరుతాడో
వారు అలా జీవిస్తారు.

3 "దయ్యాల పిల్లల్లారా, ఇక్కడకు రండి. మీ తండ్రి
లైంగిక పాపాల మూలంగా దోషి. మరియు మీ
తల్లి లైంగిక పరంగా తన శరీరాన్ని అమ్ము
కొంటుంది. ఇక్కడకు రండి!
4 మీరు అబద్ధాలు చెప్పేవాళ్లు, చెడ్డవాళ్లు. మీరు
నన్ను ఎగతాళి చేస్తారు. మీరు నన్ను వెక్కి
రిస్తారు. మీరు నా మీద నాలుకలు చాపుతారు.
5 మీరు చేయగోరేదంతా ఏమిటంటే ప్రతి పచ్చని
చెట్టు కింది తప్పుడు దేవుళ్ళనూ పూజించటమే.
మీరు ప్రతికాలువ ప్రక్క పిల్లల్నీ చంపుతారు,
బండల స్థలాల్లో వారిని బలి ఇస్తారు.
6 నదులలో నున్నటి రాళ్లను పూజించటం మీకు
ఇష్టం. వాటిని పూజించుటకు మీరు వాటిమీద
ద్రాక్షరసం పోస్తారు. మీరు వాటికి బలులు ఇస్తారు.
కానీ మీకు దొరికేది అంతా ఆ రాళ్లే. ఇది నాకు
సంతోషం కలిగిస్తుందని మీరు తలుస్తున్నారా?
లేదు! అది నాకు సంతోషం కలిగించదు. మీరు
ప్రతి కొండ మీద, ప్రతి పర్వతంమీద మీ పడక
వేసుకొంటారు.

7 మీరు ఆ స్థలాలకు వెళ్లి బలులు అర్పిస్తారు.
8 తర్వాత మీరు ఆ పడకల మీదికి వెళ్లి, ఆ దేవుళ్ళను
ప్రేమించటం ద్వారా నాకు వ్యతిరేకంగా పాపం
చేస్తారు. మీరు ఆ దేవతలను ప్రేమిస్తారు. వాటి
దిగంబర దేహాలను చూడటం మీకు ఇష్టం. మీరు
నాతో ఉన్నారు కాని వాటితో ఉండేందుకు మీరు
నన్ను విడిచి పెట్టారు. నన్ను జ్ఞాపకం చేసు
కొనేందుకు సహాయపడే వాటిని మీరు దాచి
పెట్టేస్తారు. గుమ్మాల వెనుక, ద్వారబంధాల
వెనుక వాటిని మీరు దాచిపెట్టేస్తారు. మరియు
మీరు వెళ్లి ఆ తప్పుడు దేవుళ్ళతో ఒడంబడికలు
చేసుకుంటారు.
9 మొలెక్* దేవతకు అందంగా కనబడాలని మీరు
తైలాలు, పరిమళాలు ఉపయోగిస్తారు. మీరు మీ
సందేశకులను దూరదేశాలకు పంపించారు. ఇది
మిమ్మల్ని పాతాళానికి, మరణ స్థానానికి తీసుకొని
వస్తుంది.

**ఇశ్రాయేలు దేవుణ్ణి నమ్ముకోవాలి గాని విగ్రహాలను కాదు**

10 "ఈ పనులు చేయటానికి మీరు కష్టపడి పని
చేశారు కానీ మీరు ఎన్నడూ అలసిపోలేదు. మీరు
కొత్త బలం కనుగొన్నారు. ఎందుకంటే, వీటిలో
మీరు ఆనందించారు గనుక.
11 మీరు నన్ను జ్ఞాపకం చేసికోలేదు మీరు నన్ను
కనీసం గుర్తించలేదు. కనుక మీరు ఎవరిని గూర్చి
చింతిస్తున్నారు? మీరు ఎవరినిగూర్చి భయపడు
తున్నారు? మీరెందుకు అబద్ధం పలికారు?
చూడండి, చాలాకాలంగా నేను మౌనంగా
ఉన్నాను. మరి మీరు నన్ను గౌరవించలేదు.
12 మీ 'మంచితనం' గూర్చి, మీరు చేసే 'మతపర
మైన' పనులు అన్నింటిని గూర్చి నేను చెప్ప
గలను. కానీ అవన్నీ పనికిమాలినవి.
13 మీకు సహాయం అవసరమైనప్పుడు మీరు మీ
చుట్టూరా ప్రోగుచేసుకొన్న ఆ తప్పుడు దేవు
ళ్ళకు మొరపెట్టండి. అయితే, వాట న్నింటినీ
గాలి కొట్టిపారేస్తుందని నేను మీకు చెబుతు
న్నాను. ఒక్క గాలి విసురు వాటన్నింటినీ మీ
వద్దనుండి తొలగించివేస్తుంది. అయితే నా మీద
ఆధారపడే వ్యక్తి భూమిని సంపాదించు
కొంటాడు. ఆ వ్యక్తికి నా పరిశుద్ధ పర్వతం
దొరుకుతుంది.

**యెహోవా తన ప్రజలను రక్షిస్తాడు**

14 మార్గం సరళం చేయండి; మార్గం సరళం
చేయండి. నా ప్రజలకోసం మార్గం చక్క
జేయండి.
15 మహోన్నతుడైన దేవుడు, పైకిఎత్త బడిన
వాడు శాశ్వతంగా జీవించేవాడు, పవిత్రుడైన
దేవుడు అనే నామం గలవాడు చెబుతున్నాడు
నేను ఉన్నతమైన పవిత్ర స్థానంలో నివసిస్తాను.
అయితే దుఃఖంలో ఉన్న దీన జనులతో కూడా
ఉంటాను. ఆత్మలో దీనంగా ఉండేవారికి నేను
నూతన జీవం ప్రసాదిస్తాను. హృదయమందు
విచారంగా ఉన్నవారికి నేను నూతన జీవితం
ప్రసాదిస్తాను.
16 నేను శాశ్వతంగా పోరాటం కొనసాగించను. నేను
ఎప్పటికీ కోపంగానే ఉండను. నేను కోపంగా
కొనసాగితే మనిషి ఆత్మ, వారికి నేను ఇచ్చిన
జీవం నా ఎదుటనే మరణిస్తుంది.
17 ఈ ప్రజలు చెడు కార్యాలు చేశారు. అది నాకు
కోపం కలిగించింది. కనుక నేను ఇశ్రాయేలును
శిక్షించాను. నేను కోపంగా ఉన్నాను గనుక అతని
నుండి నేను తిరిగిపోయాను. మరియు ఇశ్రా
యేలు నన్ను విడిచిపెట్టాడు. ఇశ్రాయేలు తనకు
ఇష్టం వచ్చిన చోటికి వెళ్లాడు.

---

**మొలెక్** తప్పుడు దేవత. హీబ్రూలో "రాజు" అని అర్థం
ఇచ్చే మాటలాంటిది ఈ పేరు.

18 ఇశ్రాయేలు ఎక్కడికి వెళ్లింది నాకు తెలుసు. కనుక నేను అతణ్ణి స్వస్థపరుస్తాను (క్షమిస్తాను). నేను అతణ్ణి ఆదరించి, అతడు బాగానే ఉంది అనుకొనేట్టు చేసే మాటలు నేను చెబుతాను. అప్పుడు అతడు, అతని ప్రజలు విచారంగా ఉండరు.

19 ఆ ప్రజలకోసం 'శాంతి' అనే కొత్త పదం నేను ఉపదేశిస్తాను. నాకు సమీపంగా ఉన్న ప్రజలకు, చాలా దూరంగా ఉన్న ప్రజలకు, నేను శాంతి ప్రసాదిస్తాను. ఆ ప్రజలను నేను స్వస్థపరుస్తాను (క్షమిస్తాను)." ఈ సంగతులు యెహోవా చెప్పాడు.

20అయితే చెడ్డవాళ్లు భీకరంగా ఉన్న మహా సము
ద్రంలాంటి వాళ్లు. వారు నెమ్మదిగా, శాంతంగా ఉండ
లేరు. వారు కోపంగా ఉన్నారు, మహా సముద్రంలా
మట్టిని కెలుకుతారు. "దుష్టులకు శాంతి లేదు" అని
నా దేవుడు చెబుతున్నాడు.

### ప్రజలు దేవుని వెంబడించాలని చెప్పాలి

58 మీకు చేతనైనంత గట్టిగా కేకలు వేయండి. మీరు ఆపవద్దు. బూరలా కేకలు వేయండి. ప్రజలు చేసిన చెడు పనులను గూర్చి వారికి చెప్పండి. యాకోబు వంశానికి వారి పాపా లను గూర్చి చెప్పండి.

2 అప్పుడు వారు నన్ను ఆరాధించేందుకు రోజూ వస్తారు. మరియు ప్రజలు నా మార్గాలు తెలుసు కోవాలని కోరుతారు. అప్పుడు వారు సరైన పనులు చేసే ఒక రాజ్యం అవుతారు. ఆ ప్రజలు దేవుని మంచి ఆదేశాలను పాటించడం మాని వేయరు. వారికి న్యాయంగా తీర్పు తీర్చమని ఆ ప్రజలు నన్ను అడుగుతారు. దేవుని న్యాయ నిర్ణయాలకోసం వారు దేవుని దగ్గరకు వెళ్లాలని కోరుకొంటారు.

3ఇప్పుడు ఆ ప్రజలు చెబుతారు: "నీ గౌరవ సూచ
కంగా మేము భోజనం మానివేశాం. నీవెందుకు
మమ్మల్ని చూడవు? నీ గౌరవ సూచకంగా మేము
మా దేహాలను బాధించుకొంటాం. నీవెందుకు
మమ్మల్ని గమనించవు?"

అయితే యెహోవా అంటున్నాడు, "ఆ ప్రత్యేక
దినాల్లో భోజనం చేయకుండా ఉండి మిమ్మల్ని మీరే
సంతోషపెట్టుకొనేందుకు ఈ పనులు చేస్తారు.
మరియు మీరు మీ శరీరాలను గాక, మీ సేవకుల్ని
శిక్షిస్తారు. 4మీరు ఆకలిగా ఉన్నారు కాని అన్నంకోసం
కాదు. ఆహారంకోసం గాక వాదనకోసం, పోరాటం
కోసం మీరు ఆకలిగా ఉన్నారు. మీ చెడ్డ చేతులతో
ప్రజలను కొట్టాలని మీరు ఆకలిగా ఉన్నారు. మీరు
భోజనం మానివేయటం నాకోసం కాదు. నన్ను స్తుతిం
చుటకు మీరు మీ స్వరం వినియోగించటం మీకు
ఇష్టం లేదు. నేను కోరేది అంతా

5ఆ ప్రత్యేక దినాల్లో ప్రజలు భోజనం మానివేసి,
వారి శరీరాలను శిక్షించు కోవటం చూడాలని మాత్ర
మేనని మీరు తలస్తున్నారా? ప్రజలు దుఃఖంగా కన
బడాలని నేను కోరుతున్నానని మీరు తలస్తున్నారా?
ప్రజలు చచ్చిన మొక్కల్లా తలలు వంచుకోవాలనీ,
దుఃఖసూచక వస్త్రాలు ధరించాలని నేను కోరుతు
న్నానని మీరు తలస్తున్నారా? ప్రజలు వారి దుఃఖాన్ని
తెలియచేసేందుకు బూడిదలో కూర్చోవాలని నేను
కోరుతున్నానని మీరు తలుస్తున్నారా? భోజనం మాని
వేసే ఆ ప్రత్యేక దినాల్లో మీరు చేసేది అదే. యెహోవా
కోరేది కూడా అదే అని మీరు తలస్తున్నారా?

6"నేను కోరే ప్రత్యేక రోజు, ప్రజలను స్వతంత్రు
లను చేసే రోజు ఎలాంటిదో నేను మీకు చెబుతాను.
ప్రజల మీద నుండి భారాన్ని మీరు తొలగించే రోజు
నాకు కావాలి. కష్టాలుపడే ప్రజలను మీరు స్వతంత్రు
లుగా చేసే రోజు నాకు కావాలి. వారి భుజాలమీది
భారాన్ని మీరు తొలగించే రోజు నాకు కావాలి. 7ఆకలి
గొన్న ప్రజలతో మీరు మీ భోజనం పంచుకోవాలని
నేను కోరుతున్నాను. ఇళ్లులేని పేద ప్రజలను మీరు
వెదికి, వారిని మీరు మీ స్వంత ఇళ్లలోనికి తీసుకొని
రావాలని నేను కోరుతున్నాను. బట్టలు లేనివాడ్ని
మీరు చూచినప్పుడు, మీ బట్టలు వానికి ఇవ్వండి. ఆ
మనుష్యులకు సహాయం చేయకుండా దాచుకోవద్దు;
వాళ్లూ మీలాంటి వారే."

8వీటిని మీరు చేస్తే, మీ వెలుగు ఉదయకాంతిలా
ప్రకాశిస్తుంది. అప్పుడు మీ గాయాలు బాగవుతాయి.
మీ "మంచితనం" (దేవుడు) మీకు ముందు నడువగా,
యెహోవా మహిమ మీ వెనుకగా మిమ్మల్ని వెంబ
డిస్తుంది. 9అప్పుడు మీరు యెహోవాకు మొరపెడ్తారు,
యెహోవా మీకు జవాబు ఇస్తాడు. మీరు యెహో
వాకు గట్టిగా కేకలు వేస్తారు. ఆయన "ఇదిగో నేనిక్కడే
ఉన్నాను" అంటాడు.

### దేవుని ప్రజలు సరియైనది చేయాలి

మీరు ప్రజలకు కష్టాలు, భారాలు కలిగించటం మాని
వేయాలి. విషయాలను బట్టి మీరు ప్రజలమీద కోపంగా
మాట్లాడటం. వారిని నిందించటం మీరు మాని
వేయాలి. 10ఆకలితో ఉన్న ప్రజలను గూర్చి మీరు
విచారపడి, వారికి భోజనం పెట్టాలి. కలవరపడిన వారికి
మీరు సహాయం చేయాలి వారి అవసరాలు తీర్చాలి.
అప్పుడు మీ వెలుగు చీకటిలో ప్రకాశిస్తుంది. మరియు
మీకు దుఃఖం ఉండదు. మధ్యాహ్నపు సూర్యకాంతిలా
మీరు ప్రకాశిస్తారు.

11అప్పుడు యెహోవా మిమ్మల్ని సదా నడి
పిస్తాడు. ఎండిన భూములలో ఆయన మీ ఆత్మకు
సంతృప్తినిస్తాడు. మీ ఎముకలకు యెహోవా బలం
ఇస్తాడు. విస్తారమైన నీళ్లుగల తోటలా మీరు ఉంటారు.
ఎల్లప్పుడు నీళ్ల ఉబుకుతూ ఉండే ఊటలా
మీరుంటారు.
12ఎన్నెన్నో సంవత్సరాలుగా మీ పట్టణాలు నాశనం
చేయబడ్డాయి. కానీ కొత్త పట్టణాలు నిర్మించబడ
తాయి. మరియు ఈ పట్టణాల పునాదులు ఎన్నెన్నో
సంవత్సరాల వరకు నిలిచి కొనసాగుతాయి. “కంచెలను
బాగు చేసేవాడు” అని నీవు పిలువబడతావు, “త్రోవలు,
ఇళ్లు నిర్మించువాడు” అని నీవు పిలువబడతావు.
13సబ్బాతు విషయంలో దేవుని ధర్మశాస్త్రానికి వ్యతి
రేకంగా నీవు పాపం చేయటం మానివేసినప్పుడు అది
జరుగుతుంది. మరియు ఆ ప్రత్యేక రోజున నీ
సంతోషం కోసం నీవు పనులు చేయటం మాని వేసిన
ప్పుడు అది జరుగుతుంది. సబ్బాతు సంతోష దినంగా
నీవు ఎంచుకోవాలి. యెహోవా ప్రత్యేక రోజును నీవు
గౌరవించాలి. మిగిలిన ప్రతిరోజూ నీవు చెప్పేవి, చేసేవి
మానివేయటం ద్వారా నీవు ఆ ప్రత్యేక రోజును
గౌరవించాలి.

14 అప్పుడు నీవు యెహోవా, నాయందు దయ
చూపమని అడగవచ్చు. మరియు యెహోవా
అంటాడు, భూమికి పైగా ఉన్నతమైన
చోట్లకు నేను నిన్ను మోసికొనివెళ్తాను. నేను
నీకు భోజనం పెడ్తాను. నీ తండ్రి యాకో
బుకు కలిగిన వాటిని నేను నీకు ఇస్తాను.
ఈ విషయాలు యెహోవా చెప్పాడు గనుక
అవి జరుగుతాయి.

## చెడ్డవాళ్లు వారి జీవితాలు మార్చుకోవాలి

59 చూడు, నిన్ను రక్షించుటకు యెహోవా శక్తి
చాలు. సహాయంకోసం నీవు ఆయనను అడిగి
నప్పుడు ఆయన వినగలడు. 2కానీ నీ పాపాలు నిన్ను
నీ దేవుని నుండి వేరుచేశాయి. యెహోవా నీ పాపాలు
చూసి, నీ నుండి తిరిగిపోతాడు.
3నీ చేతులు మైలగా ఉన్నాయి, అవి రక్తంతో
నిండి ఉన్నాయి. నీ వేళ్లు దోషంతో నిండి ఉన్నాయి.
నీవు నీ నోటితో అబద్ధాలు చెబుతున్నావు. నీ నాలుక
చెడు విషయాలు పలుకుతుంది. 4ఎవ్వరూ ఇతరులను
గూర్చి సత్యం చెప్పరు. ప్రజలు ఒకరి మీద ఒకరు
న్యాయస్థానంలో ఫిర్యాదు చేస్తారు, వారి వ్యవహారం
గెలుచుకొనేందుకు వారు తప్పుడు వాదాలమీద
ఆధారపడతారు. వారు ఒకరిని గూర్చి ఒకరు అబద్ధాలు
చెబుతారు. వారు చిక్కులతో నిండిపోయి, కీడును
పుట్టిస్తారు. 5విషసర్పాల గ్రుడ్లవలె, వారు కీడును
పొదుగుతారు. ఆ గ్రుడ్లు ఒకటి తింటే నీవు చస్తావు.
ఆ గ్రుడ్లలో ఒకదాన్ని నీవు పగులగొడితే, ఒక విష
సర్పం బయటకు వస్తుంది.
ప్రజలు అబద్ధాలు చెబుతారు. ఈ అబద్ధాలు సాలె
గూళ్లలా ఉంటాయి. 6వారు అల్లే ఈ గూళ్లు బట్టలకు
ఉపయోగపడవు. ఆ గూళ్లతో నిన్ను నీవు కప్పుకోలేవు.
కొంతమంది మనుష్యులు చెడ్డపనులు చేస్తారు, ఇతరు
లను బాధించుటకు వారి చేతులు ప్రయోగిస్తారు.
7కీడుకు పరుగులెత్తుటకు ఆ ప్రజలు వారి పాదాలను
ఉపయోగిస్తారు. ఏ తప్పూ చేయని వారిని చంపటానికి
వారు త్వరపడతారు. వారు చెడు తలంపులు తలుస్తారు.
దౌర్జన్యం, దొంగతనం వారి జీవిత విధానం.
8ఆ ప్రజలకు శాంతి మార్గం తెలియదు. వారి జీవి
తాల్లో మంచితనం ఏమీలేదు. వారి మార్గాలు నిజా
యితీగా లేవు. వారు జీవించినట్టుగా జీవించేవారెవరి
జీవితాల్లోనూ ఎన్నటికి శాంతి ఉండదు.

## ఇశ్రాయేలీయుల పాపం కష్టాన్ని తెస్తుంది

9 న్యాయం, మంచితనం అంతా పోయింది. చీకటి
మాత్రమే మనవద్ద ఉంది. అందుచేత మనం
వెలుగుకోసం కనిపెట్టాలి. ప్రకాశవంతమైన వెలు
గుకోసం మనం నిరీక్షిస్తాం. కానీ మనకు ఉన్న
దంతా చీకటి మాత్రమే.
10 మనం కళ్లులేని ప్రజల్లా ఉన్నాం. మనం గుడ్డి
వాళ్లలా గోడల మీదికి నడుస్తాం. అది రాత్రి
యైనట్టు మనం జారి పడ్తాం. పగటి వెలుగులో
కూడా మనం చూడలేం. మధ్యాహ్న సమ
యంలో మనం చచ్చినవాళ్లలా పడిపోతాం.
11 మనం అందరం ఎంతో విచారంగా ఉన్నాం.
పావురాల్లా, ఎలుగుబంట్లలా విచారకరమైన
శబ్దాలు మనం చేస్తాం. మనుష్యులు న్యాయంగా
ఉండేకాలం కోసం మనం ఎదురుచూస్తున్నాం.
కానీ ఇంకా న్యాయం ఏమీ లేదు. మనం రక్షించ
బడాలని ఎదురు చూస్తున్నాం, కానీ రక్షణ ఇంకా
దూరంగానే ఉంది.
12 ఎందుకంటే మనం మన దేవునికి వ్యతి రేకంగా
ఎన్నెన్నో తప్పు పనులు చేశాం గనుక. మనదే
తప్పు అని మన పాపాలు చూపెడ్తున్నాయి.
ఈ పనులు చేసి మనం దోషులంగా ఉన్నామని
మనకు తెలుసు.
13 మనం పాపంచేసి, యెహోవాకు విరోధంగా
తిరిగాం. మనం యెహోవా నుండి తిరిగిపోయి,
ఆయన్ని విడిచిపెట్టేశాం. చెడు విషయాలను
మనం ఆలోచించాం. దేవునికి వ్యతిరేకమైన
వాటినే మనం ఆలోచించాం. వీటిని గూర్చి
మనం ఆలోచించి, మన హృదయాల్లో వాటి
పథకాలు వేసుకొన్నాం.

14 మన దగ్గర్నుండి న్యాయం తొలగిపోయింది.
న్యాయం దూరంగా నిలుస్తుంది. సత్యం వీధుల్లో
పడిపోయింది. మంచితనం పట్టణంలో ప్రవేశిం
చటానికి అనుమతించబడటంలేదు.
15 సత్యం పోయింది. మంచి జరిగించాలను కొనే
మనుష్యులు దోచుకోబడ్డారు. యెహోవా
చూశాడు, కానీ మంచితనం ఏమీ ఆయనకు
కనబడలేదు. ఇది యెహోవాకు ఇష్టం కాలేదు.
16 యెహోవా చూశాడు. నిలిచి, ప్రజలకు
సహాయం చేసే వ్యక్తి ఒక్కడూ ఆయనకు కని
పించలేదు. కనుక యెహోవా తన స్వంత శక్తి,
తన స్వంత మంచితనం ప్రయోగించాడు.
మరియు యెహోవా ప్రజలను రక్షించాడు.
17 యెహోవా యుద్ధానికి సిద్ధమయ్యాడు.
యెహోవా మంచితనాన్ని ఒక కవచంలా కప్పు
కొన్నాడు. రక్షణ శిరస్త్రాణం ధరించాడు. శిక్షను
వస్త్రాలుగా ధరించాడు. బలీయమైన ప్రేమ అంగీ
ధరించాడు.
18 యెహోవా తన శత్రువుల మీద కోపంగా
ఉన్నాడు కనుక వారికి తగిన శిక్షను యెహోవా
వారికి ఇస్తాడు. యెహోవా తన శత్రువులమీద
కోపంగా ఉన్నాడు. కనుక దూరస్థలాలు అన్నింటి
లోను ప్రజలను యెహోవా శిక్షిస్తాడు. వారికి
తగిన శిక్షను యెహోవా వారికి ఇస్తాడు.
19 అప్పుడు పశ్చిమాన ప్రజలు యెహోవా
నామాన్ని గౌరవిస్తారు. తూర్పున ప్రజలు
యెహోవా మహిమను గూర్చి భయపడతారు.
వేగంగా ప్రవహించే ఒక నదిలా యెహోవా
వెంటనే వస్తాడు. యెహోవా ఈ నదిమీద
విసరగా వచ్చిన శక్తివంతమైన గాలిలా అది
ఉంటుంది.

20 అప్పుడు సీయోనుకు ఒక రక్షకుడు వస్తాడు.
పాపం చేసినప్పటికి, తిరిగి దేవుని దగ్గరకు వచ్చిన
యాకోబు ప్రజల దగ్గరకు ఆయన వస్తాడు.
21 “ఆ ప్రజలతో నేను ఒక ఒడంబడిక చేసు
కుంటాను. నీ నోట నేను ఉంచే నా ఆత్మ, నా
మాటలు నిన్ను ఎన్నడూ విడిచిపోవు అని నేను
ప్రమాణం చేస్తున్నాను. నీ పిల్లలతోను, నీ పిల్లల
పిల్లలతోను అవి ఉంటాయి. అవి ఇప్పుడు, ఎల్లప్పుడు
నీతో ఉంటాయి” అని యెహోవా చెబుతున్నాడు.

## దేవుడు వస్తున్నాడు

60 “నా వెలుగైన యెరూషలేమా లెమ్ము! నీ
వెలుగు (దేవుడు) వస్తున్నాడు. యెహోవా
మహిమ నీ మీద ప్రకాశిస్తుంది.

2 ఇప్పుడు భూమిని, దాని ప్రజలను చీకటి ఆవ
రించి ఉంది. కానీ యెహోవా నీ మీద ప్రకాశి
స్తాడు. నీ చుట్టూరా ఆయన మహిమను ప్రజలు
చూస్తారు.
3 ఆ సమయంలో రాజ్యాలు నీ వెలుగు (దేవుడు)
దగ్గరకు వస్తాయి. ప్రకాశవంతమైన నీ వెలుగు
దగ్గరకు రాజులు వస్తారు.
4 నీ చుట్టూ చూడు, చూడు ప్రజలు చుట్టూ
చేరి, నీ దగ్గరకు వస్తున్నారు. ఆ ప్రజలు దూరం
నుండి వస్తున్న నీ కుమారులు. మరియు వారితో
నీ కుమార్తెలు వస్తున్నారు.
5 భవిష్యత్తులో ఇది సంభవిస్తుంది. ఆ సమయంలో
నీ ప్రజలను నీవు చూస్తావు. ఆనందంతో మీ
ముఖాలు ప్రకాశిస్తాయి. మొదట, మీరు భయపడ
తారు, కానీ తర్వాత మీరు సంబరపడతారు. సము
ద్రాల ఆవలి రాజ్యాల ఐశ్వర్యాలన్నీ నీ ముందు
ఉంచబడతాయి. రాజ్యాల ఐశ్వర్యాలు నీకు
సంక్రమిస్తాయి.
6 “మిద్యాను, ఏయిఫాల నుండి ఒంటెల మందలు
నీ దేశంలో నిండిపోతాయి. షేబనుండి ఒంటెలు
బారులు తీరి వస్తాయి. బంగారం, బోళం అవి
తెస్తాయి. ప్రజలు యెహోవాకు స్తుతులు
పాడతారు.
7 కేదారు గొర్రెలు అన్నీ నీకు ఇవ్వబడుతాయి.
నెబాయోతు పొట్టేళ్లు నీకోసం తీసుకొని రాబడ
తాయి. అవి నా బలిపీఠం మీద స్వీక రించదగిన
బలి అర్పణలవుతాయి. ఆశ్చర్యకరమైన నా
ఆలయాన్ని నేను ఇంకా అందంగా తీర్చి
దిద్దుతాను.
8 “ప్రజలను చూడు! ఆకాశాన్ని వేగంగా దాటి పోయే
మేఘాల్లా వారు త్వరపడుతున్నారు. వాటి
గూళ్లకు ఎగిరిపోతున్న పావురాల్లా ఉన్నారు వారు
9 దూర దేశాలు నాకోసం కనిపెడ్తున్నాయి. తర్షీషు
మహా ఓడలు వెళ్లేందుకు సిద్ధంగా ఉన్నాయి.
దూర దేశాలనుండి నీ పిల్లలను తీసుకొని
వచ్చేందుకు ఆ ఓడలు సిద్ధంగా ఉన్నాయి.
మరియు వారి వెండి బంగారాలను ఆ ఓడలు
తీసుకొని వస్తాయి. నీ దేవుడు యెహోవాను
గౌరవించుటకు ఇది జరుగుతుంది. ఇశ్రాయేలీ
యుల పరిశుద్ధుడు అద్భుత కార్యాలు చేస్తాడు
గనుక ఇది జరుగుతుంది.
10 ఇతర దేశాలనుండి వచ్చిన పిల్లలు నీ గోడలను
తిరిగి నిర్మిస్తారు. వారి రాజులు నిన్ను సేవి
స్తారు. “నేను కోపగించినప్పుడు, నేను నిన్ను
బాధించాను. కానీ ఇప్పుడు, నేను నీకు దయ
చూపించ గోరుతున్నాను. కనుక నేను నిన్ను
ఆదరిస్తాను.
11 నీ ద్వారాలు ఎల్లప్పుడూ తెరచి ఉంటాయి.
రాత్రిగాని పగలుగాని అవి మూయబడవు.

రాజులు, రాజ్యాలు వారి ఐశ్వర్యాలను నీకు తీసు
కొని వస్తారు.
12 కొన్ని దేశాలు, రాజ్యాలు నిన్ను సేవించవు.
కానీ ఆ దేశాలు, రాజ్యాలు పాడైపోయి, నాశనం
అవుతాయి.
13 "లెబానోనులోని గొప్పవన్నియు నీకు ఇవ్వబడు
తాయి. దేవదారు, సరళ, గొంజి వృక్షాలను
ప్రజలు నీ వద్దకు తీసుకొని వస్తారు. నా పరిశుద్ధ
ఆలయాన్ని మరింత అందంగా తీర్చిదిద్దేందుకు
నీవు ఈ వృక్షాలను ఉపయోగిస్తావు. (ఈతావు
నా సింహాసనం ఎదుట పాదపీఠంలా ఉంటుంది.
నేను దానికి చాలా ఘనత ఇస్తాను.)
14 గతంలో ప్రజలు నిన్ను బాధించారు. ఆ ప్రజలు
నీ ఎదుట సాష్టాంగ పడతారు. గతంలో ప్రజలు
నిన్ను ద్వేషించారు. ఆ ప్రజలు నీ పాదాల
దగ్గర సాగిలపడతారు. 'యెహోవా పట్టణం'
అని 'ఇశ్రాయేలు పరిశుద్ధుని సీయోను' అనీ ఆ
ప్రజలు నిన్ను పిలుస్తారు."

## కొత్త ఇశ్రాయేలు శాంతి దేశం

15 "నీవు మళ్లీ ఎన్నటికీ ఒంటరిగా విడువబడవు.
నీవు మరల ఎన్నడు ద్వేషించబడవు. నీవు మరల
ఎన్నడూ ఖాళీగా ఉండవు. నిన్ను నేను శాశ్వ
తంగా గొప్ప చేస్తాను. నీవు ఎప్పటికి, శాశ్వతంగా
సంతోషిస్తావు.
16 నీకు అవసరమైన వస్తువులను రాజ్యాలు నీకు
ఇస్తాయి. అది ఒక బిడ్డ తన తల్లి దగ్గర పాలు
తాగినట్టుగా ఉంటుంది. నీవైతే రాజులనుండి
ఐశ్వర్యాలను తాగుతావు. అప్పుడు, నిన్ను
రక్షించు యెహోవాను నేనే అని నీవు తెలుసు
కొంటావు. యాకోబు యొక్క మహా గొప్ప
వాడు నిన్ను కాపాడును అని నీవు తెలుసు
కొంటావు.
17 "ఇప్పుడు నీకు ఇత్తడి ఉంది. నేను నీకు బంగారం
తెస్తాను. ఇప్పుడు నీకు ఇనుము ఉంది, నేను
నీకు వెండి తెస్తాను. నీ చెక్కను నేను ఇత్తడిగా
మార్చేస్తాను. నీ బండలను ఇనుముగా నేను
మార్చేస్తాను. నీ శిక్షను నేను శాంతిగా మార్చే
స్తాను. ఇప్పుడు ప్రజలు నిన్ను బాధిస్తున్నారు.
కానీ ప్రజలు నీకు మంచి కార్యాలు చేస్తారు.
18 ప్రజలు మరల ఎన్నడూ నీ ఎడల నీచంగా
ఉండరు. నీ దేశంలో నీ దగ్గర్నుండి ప్రజలు
మరల ఎన్నడూ దొంగిలించరు. 'రక్షణ' అని నీ
గోడలకు నీవు పేరుపెడతావు. 'స్తుతి' అని నీ
ద్వారాలకు నీవు పేరుపెడతావు.
19 ఇంకెంత మాత్రం పగలు సూర్యుడు నీకు వెలు
గుగా ఉండడు. చంద్రకాంతి ఇంకెంత మాత్రం
నీకు వెలుగుగా ఉండదు. ఎందుకు? ఎందుకంటే
యెహోవాయే నీకు శాశ్వత వెలుగుగా
ఉంటాడు. నీ దేవుడే నీ మహిమ.
20 నీ 'సూర్యుడు' ఇక ఎన్నటికీ అస్తమించడు. నీ
'చంద్రుడు' ఇక ఎన్నటికి చీకటిగా ఉండడు.
ఎందుకు? ఎందుకంటే యెహోవా నీకు శాశ్వత
వెలుగుగా ఉంటాడు. మరియు నీ దుఃఖకాలం
అంతం అవుతుంది.
21 నీ ప్రజలు అందరూ మంచివారుగా ఉంటారు.
ఆ ప్రజలు భూమిని శాశ్వతంగా పొందుతారు.
నేనే ఆ ప్రజలను చేశాను. నా స్వహస్తాలతో
నేనే చేసిన అద్భుతమైన మొక్క వారు.
22 అతి చిన్న కుటుంబం ఒక పెద్ద వంశం అవు
తుంది. కడసారపు వ్యక్తి ఒక బలమైన రాజ్యం
అవుతాడు. సమయం సరిగ్గా ఉన్నప్పుడు,
యెహోవాను, నేను త్వరగా వస్తాను. నేను
ఈ సంగతులను జరిగిస్తాను.'

## యెహోవా స్వాతంత్ర్య సందేశం

61 యెహోవా సేవకుడు చెబుతున్నాడు, "నా
ప్రభువు యెహోవా తన ఆత్మను నాలో
ఉంచాడు. కొన్ని ప్రత్యేకమైన పనులు చేయటానికి
యెహోవా నన్ను ఏర్పరచుకొన్నాడు. పేద ప్రజలకు
శుభవార్త ప్రకటించుటకు, దుఃఖంలో ఉన్న మను
ష్యులను ఓదార్చుటకు, స్వాతంత్ర్యంలేని ప్రజలకు
స్వాతంత్రం ప్రకటించుటకు, బలహీన ప్రజలకు
నూతన బలం ఇచ్చేందుకు, 2యెహోవా తన దయ
చూపించే సమయాన్ని ప్రకటించేందుకు; దుష్టులను
మన దేవుడు శిక్షించే సమయాన్ని ప్రకటించేందుకు;
దుఃఖంలో ఉన్న వాళ్లను ఆదరించేందుకు; 3దుఃఖంలో
ఉన్న సీయోను వాసులకు గౌరవం చేకూర్చేందుకు
(ఇప్పుడు వారికి బూడిద మాత్రమే ఉంది); సీయోను
ప్రజలకు ఆనందతైలం ఇచ్చుటకు (ఇప్పుడు వారికి
దుఃఖం మాత్రమే ఉంది); సీయోను ప్రజలకు దేవుని
స్తుతిగీతాలు ఇచ్చుటకు (ఇప్పుడు వారికి దుఃఖం
మాత్రమే ఉంది;) 'మంచి వృక్షాలు' అని ఆ ప్రజలకు
పేరు పెట్టుటకు; 'యెహోవా అద్భుత చెట్టు' అని
వారికి పేరు పెట్టుటకు.
4"పాడు చేయబడిన పాత పట్టణాలు ఆ సమ
యంలో మరల నిర్మించబడతాయి. ఆ పట్టణాలు
మొదట్లో ఉన్నట్టే మరల నూతనంగా చేయబడతాయి.
ఎన్నెన్నో సంవత్సరాలుగా పాడు చేయబడిన ఆ
పట్టణాలు కొత్తవాటిలా చేయబడతాయి.
5"అప్పుడు మీ శత్రువులు మీ దగ్గరకు వచ్చి, మీ
గొర్రెలను గూర్చి జాగ్రత్త వహిస్తారు. మీ శత్రువుల
పిల్లలు మీ పొలాల్లోనూ, మీ తోటల్లోనూ పనిచేస్తారు.
6మీరు 'యెహోవా యాజకులు' అని, 'మన దేవుని

సేవకులు' అని పిలువబడతారు. భూమి మీద ఉన్న
రాజ్యాలన్నింటి నుండీ వచ్చిన ఐశ్వర్యాలు మీకు
ఉంటాయి. అది మీకు ఉన్నందువల్ల మీరు గర్విస్తారు.
7"గతంలో ఇతరులు మిమ్మల్ని అవమానించి
మిమ్మల్ని చెడ్డ మాటలు అన్నారు. ఏ ఇతర ప్రజల
కంటెకూడా మీరు ఎక్కువగా అవమానించబడ్డారు.
కనుక ఇతర ప్రజలకంటె రెండంతలు ఎక్కువగా మీరు
మీ దేశంలో పొందుతారు. శాశ్వతంగా కొనసాగే
సంతోషం మీకు లభిస్తుంది. 8ఎందుకు ఇలా జరగు
తుంది? ఎందుకంటె, నేను యెహోవాను గనుక,
న్యాయం అంటే నాకు ఇష్టం గనుక. దొంగతనం,
సమస్త చెడుగు నాకు అసహ్యం. కనుక ప్రజలకు తగిన
శిక్ష నేను ఇస్తాను. "నా ప్రజలతో శాశ్వతంగా నేను
ఒక ఒడంబడిక చేసుకొన్నాను. 9అన్ని రాజ్యాలలో
ప్రతి ఒక్కరూ నా ప్రజలను తెలుసుకొంటారు. నా
దేశం పిల్లలను ప్రతి ఒక్కరు తెలుసుకొంటారు.
యెహోవా వారిని ఆశీర్వదించునని, వారిని చూచే
ప్రతి వ్యక్తికి తెలుస్తుంది."

### దేవుని సేవకుడు రక్షణను, తీసుకొనివస్తాడు

10"యెహోవా నన్ను ఎంతో ఎంతో సంతోషింప
జేస్తాడు. నా దేవునియందు నేను సంపూర్ణంగా సంతోషి
స్తున్నాను. రక్షణ వస్త్రాలతో యెహోవా నన్ను
కప్పాడు. ఆ వస్త్రాలు ఒకడు తన పెండ్లికి ధరించే
వస్త్రాల్లా ఉన్నాయి. దయ అనే పైబట్టతో యెహోవా
నన్ను కప్పాడు. ఈ పైబట్ట ఒక స్త్రీ తన పెండ్లికి
ధరించే అందమైన వస్త్రాల్లా ఉంది.
11భూమి మొక్కలను మొలిపిస్తుంది. ప్రజలు
తోటలో విత్తనాలు చల్లుతారు. ఆ తోట ఆ విత్తనాలను
ఎదిగింపజేస్తుంది. అదే విధంగా యెహోవా దయను
ఎదిగింప జేస్తాడు. సకల రాజ్యాలలో యెహోవా స్తుతిని
ఎదిగింప జేస్తాడు."

### కొత్త యెరూషలేము మంచితనంలో నిండిన నగరం

62 "సీయోను అంటే నాకు ప్రేమ. అందుచేత
నేను ఆమె పక్షంగా ఇంకా మాట్లాడతాను.
యెరూషలేము అంటే నాకు ప్రేమ. అందు చేత
నేను మాట్లాడటం చాలించను. మంచి తనం
పెద్ద వెలుగుగా ప్రకాశించేంత వరకు నేను మాట్లా
డతాను. ఒక జ్వాలలా రక్షణ నుండి ప్రకాశించేంత
వరకు నేను మాట్లా డతాను.

2 అప్పుడు సకల రాజ్యాలు నీ మంచితనాన్ని
చూస్తాయి. రాజులందరూ నీ గౌరవాన్ని
చూస్తారు. అప్పుడు నీకు ఒక కొత్త పేరు ఇవ్వ
బడుతుంది. ప్రజలారా, యెహోవా తానే మీకు
ఆ కొత్త పేరు ఇస్తాడు.

3 యెహోవా మీ విషయం ఎంతో అతిశ యిస్తాడు.
యెహోవా చేతిలో అందాల కిరీటంలా ఉంటారు
మీరు.

4 'దేవుడు విడిచిపెట్టిన ప్రజలు' అని ఇంకెన్నడూ
మీరు పిలువబడరు. 'దేవుడు నాశనం చేసిన దేశం'
అని మీ దేశం ఇంకెన్నటికి పిలువబడదు. 'దేవుడు
ప్రేమించే ప్రజలు' అని మీరు పిలువబడుతారు.
'దేవుని వధువు' అని మీ దేశం పిలువబడుతుంది.
ఎందుకంటె యెహోవా మిమ్మల్ని ప్రేమిస్తు
న్నాడు గనుక. మరియు మీ దేశం ఆయనకు
చెందుతుంది.

5 ఒక యువకుడు ఒక స్త్రీని ప్రేమించినప్పుడు
అతడు ఆమెను పెండ్లి చేసుకొంటాడు. మరియు
ఆమె అతనికి భార్య అవుతుంది. అదేవిధంగా మీ
దేశం మీ పిల్లలకు చెందుతుంది. ఒకడు తన
నూతన భార్యతో ఎంతో సంతోషిస్తాడు. అదే
విధంగా, మీ దేవుడు మీతో ఎంతో
సంతోషిస్తాడు."

### దేవుడు తన వాగ్దానాలు నెరవేర్చుతాడు

6 "కావలి ఉండుటకు యెరూషలేము గోడల మీద
కావలివారిని (ప్రవక్తలను) నేను ఉంచుతాను. ఈ
కావలివారు మౌనంగా ఉండరు. రాత్రింబ వళ్లు
వారు కనిపెట్టి ఉంటారు." యెహోవాను గూర్చి
ఉపదేశించే మీరు ఎన్నటికీ మౌనంగా ఉండ
కూడదు. యెహోవాను ప్రార్థించటం మీరు
చాలించకూడదు.

7 మీరు ఎల్లప్పుడూ యెహోవాను ప్రార్థించాలి.
ఆయన యెరూషలేమును మరల ఒక పట్టణంగా
చేసేంతవరకు యెహోవాకు ప్రార్థించండి.
భూమిమీద ప్రజలంతా పొగడే పట్టణంగా ఆయన
యెరూషలేమును చేసేంతవరకు యెహోవాకు
ప్రార్థించండి.

8 యెహోవా ఒక వాగ్దానం చేశాడు. యెహోవా
తన స్వంత శక్తిని రుజువుగా వినియోగించి ఆ
వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానాన్ని నిలుపు కొనేం
దుకు యెహోవా తన శక్తిని ప్రయోగిస్తాడు.
యెహోవా చెప్పాడు, "మీ ఆహారాన్ని మరె
న్నడూ మీ శత్రువులకు ఇవ్వనని నేను వాగ్దానం
చేస్తున్నాను. మీరు తయారు చేసే మీ ద్రాక్ష
రసాన్ని మీ శత్రువులు ఎన్నటికీ తీసుకోరని
నేను వాగ్దానం చేస్తున్నాను.

9 ఆహారం కూర్చుకొనేవాడు దానిని తింటాడు.
మరియు ఆ వ్యక్తి యెహోవాను స్తుతిస్తాడు.
ద్రాక్షపండ్లను కూర్చుకొనేవాడు ఆ ద్రాక్షపండ్ల
రసం తాగుతాడు. ఈ సంగతులన్నీ నా పవిత్ర
దేశంలో జరుగుతాయి."

10 గుమ్మాలద్వారా రండి, ప్రజలకు దారి సరళం
చేయండి. మార్గం సిద్ధం చేయండి! మార్గం
లోని రాళ్లన్నీ తీసివేయండి. ప్రజలకు గుర్తుగా
పతాకం ఎగురవేయండి!
11 వినండి, దూర దేశాల ప్రజలందరితో యెహోవా
మాట్లాడుతున్నాడు: "సీయోను ప్రజలకు
చెప్పండి. చూడండి, మీ రక్షకుడు వస్తున్నాడు.
ఆయన మీ బహుమానం మీ కోసం తెస్తున్నాడు.
ఆయన ఆ బహుమానాన్ని తనతో కూడ
తెస్తున్నాడు."

12 ఆయన ప్రజలు, "పరిశుద్ధ ప్రజలు" "విమో
చించబడిన యెహోవా ప్రజలు" అని పిలువ
బడతారు. "దేవుడు కోరే పట్టణం" "దేవుడు
తోడుగా ఉన్న పట్టణం" అని యెరూషలేము
పిలువబడుతుంది.

### యెహోవా తన ప్రజలకు తీర్పు తీరుస్తాడు

63 ఎదోమునుండి వస్తున్న ఇతడు ఎవరు?
ఎర్రటి వస్త్రాలు ధరించి బొస్రానుండి
అతడు వస్తున్నాడు. అతడు తన వస్త్రాల్లో
శోభిల్లుతున్నాడు. అతడు మహా శక్తితో అతిశ
యంగా నడుస్తున్నాడు. "మిమ్మల్ని రక్షించే శక్తి
నాకు ఉంది. నేను నిజాయితీగా మాట్లాడు
చున్నాను" అని అతడు చెబుతున్నాడు.
2 "నీ వస్త్రాలు ఎందుకు అంత మరీ ఎర్రగా
ఉన్నాయి? ద్రాక్షపండ్ల నుండి ద్రాక్షరసం చేసే
వానిలా ఎర్రగా ఉన్నాయెందుకు నీ వస్త్రాలు?"
3 అతడు జవాబిస్తున్నాడు, "నా మట్టుకు నేను
ద్రాక్షగానుగలో నడిచాను. నాకు ఎవ్వరూ
సహాయం చేయలేదు. నాకు కోపం వచ్చింది,
ద్రాక్షపండ్ల మీద నడిచాను. ద్రాక్ష పండ్ల రసం
నా బట్టలమీద చిమ్మింది. కనుక ఇప్పుడు నా
బట్టలు మైల పడ్డాయి.
4 ప్రజలను శిక్షించుటకు నేను ఒక సమయం
ఏర్పరచుకొన్నాను. నా ప్రజలను నేను రక్షించి,
కాపాడవలసిన సమయం ఇప్పుడు వచ్చింది.
5 చుట్టూ కలియజూశాను, కానీ నాకు సహాయం
చేసేవాడు ఒక్కడూ నాకు కనబడలేదు. నన్ను
ఒక్కరూ బలపర్చకపోవటం నాకు ఆశ్చర్యం
కలిగించింది. కనుక నా ప్రజలను రక్షించుటకు
నా స్వంత శక్తి నేను ప్రయోగించాను. నా కోపమే
నాకు బలం ఇచ్చింది.
6 నేను కోపంగా ఉన్నప్పుడు, నేను ప్రజల మీద
నడిచాను. నాకు వెర్రికోపం వచ్చినప్పుడు నేను
వారిని శిక్షించాను. నేను వారి రక్తం నేలమీద
ఒలకబోశాను."

### యెహోవా తన ప్రజల ఎడల దయ చూపిస్తూ ఉన్నాడు

7 యెహోవా దయగలవాడు అని నేను జ్ఞాపకం
చేసుకొంటాను. మరియు యెహోవాను స్తుతిం
చటం నేను జ్ఞాపకం చేసుకొంటాను. ఇశ్రాయేలు
వంశానికి యెహోవా అనేకమైన మంచివాటిని
ఇచ్చాడు. యెహోవా మా యెడల చాలా దయ
చూపించాడు. యెహోవా మా యెడల కరుణ
చూపించాడు.
8 "వీరు నా పిల్లలు. ఈ పిల్లలు అబద్ధమాడరు"
అని యెహోవా చెప్పాడు. కనుక యెహోవా
ఈ ప్రజలను రక్షించాడు.
9 ప్రజలకు చాలా కష్టాలు వచ్చాయి. కానీ
యెహోవా వారికి విరోధంగా లేడు. యెహోవా
ప్రజలను ప్రేమించాడు. వారిని గూర్చి ఆయన
విచారించాడు. కనుక యెహోవా ప్రజలను
రక్షించాడు. వారిని రక్షించేందుకు ఆయన తన
ప్రత్యేక దేవదూతను పంపించాడు. మరియు
యెహోవా ఆ ప్రజలను గూర్చి శ్రద్ధ తీసు
కోవటం శాశ్వతంగా కొనసాగిస్తాడు. ఆ ప్రజలను
గూర్చి శ్రద్ధ తీసుకోవటం ఎన్నడైనా చాలించాలని
యెహోవా కోరలేదు.
10 అయితే ప్రజలు యెహోవాకు విరోధం
అయ్యారు. ఆయన పరిశుద్ధాత్మను ప్రజలు
చాలా దుఃఖపర్చారు. అందుచేత యెహోవా
వారికి శత్రువు అయ్యాడు. యెహోవా ఆ
ప్రజలకు విరోధంగా పోరాడాడు.
11 కానీ యెహోవా చాలా పూర్వకాలాన జరిగి
నదాన్ని ఇంకా జ్ఞాపకం ఉంచుకొంటాడు. మోషే,
అతని ప్రజలూ యెహోవాకు జ్ఞాపకం.
సముద్రంలోనుండి ప్రజలను బయటకు తీసు
కొనివచ్చిన వాడు యెహోవాయే. యెహోవా
తన మందను (ప్రజలు) నడిపించటానికి తన
కాపరులను (ప్రవక్తలను) వాడుకొన్నాడు.
అయితే మోషేలో తన ఆత్మను ఉంచిన ఆ
యెహోవా ఇప్పుడు ఎక్కడ?
12 యెహోవా తన కుడిచేత మోషేను నడి
పించాడు. మోషేను నడిపించుటకుగాను
యెహోవా తన అద్భుత శక్తిని ఉపయో
గించాడు. ప్రజలు సముద్రంలోనుండి నడువ
గలిగేట్టు యెహోవా నీళ్లను పాయలు చేశాడు.
ఈ గొప్ప కార్యాలు చేయటం వల్ల యెహోవా
తన నామాన్ని ప్రఖ్యాతి చేసు కొన్నాడు.
13 లోతైన సముద్రాల మధ్యనుండి తన ప్రజలను
యెహోవా నడిపించాడు. ప్రజలు పడిపోకుండా
నడిచారు. అరణ్యంలో గుర్రం నడచినట్టు వారు
నడిచారు.

14 ఒక ఆవు ఊరికే పొలంలో నడుస్తూ పడిపోదు.
అదేవిధంగా ప్రజలు సముద్రంలోనుండి వెళ్తూ
పడిపోలేదు. ఒక విశ్రాంతి స్థలానికి ప్రజలను
యెహోవా ఆత్మ నడిపించింది. అంతవరకు
ప్రజలు క్షేమంగా ఉన్నారు. యెహోవా, నీవు
నీ ప్రజలను నడిపించిన విధం అది. ప్రజలను
నీవు నడిపించావు, నీ నామాన్ని నీవు ఆశ్చర్య
కరమైనదిగా చేసుకొన్నావు.

**తన ప్రజలకు సహాయం చేయమని దేవునికొక ప్రార్థన**

15 యెహోవా, పరలోకము నుండి చూడుము.
ఇప్పుడు జరుగుతున్న సంగతులు చూడుము.
పరలోకంలో ఉన్న నీ మహాగొప్ప పవిత్ర
నివాసంనుండి కిందనున్న మమ్మల్ని చూడుము.
మా మీద నీ బలమైన ప్రేమ ఏది? నీ అంత
రంగంలో నుండి బయలువెడలే నీ శక్తివంతమైన
కార్యాలు ఏవి? నామీద నీ కరుణ ఏది? నామీద
నీ దయగల ప్రేమను ఎందుకు దాచిపెడ్తున్నావు?
16 చూడు, నీవు మా తండ్రివి! మేము అబ్రాహాము
పిల్లలమని అతనికి తెలియదు. ఇశ్రాయేలు
(యాకోబు) మమ్మల్ని గుర్తించలేడు.
యెహోవా, నీవు మా తండ్రివి. మమ్మల్ని
ఎల్లప్పుడూ రక్షించినవాడవు నీవే.
17 యెహోవా, నీవు మమ్మల్ని నీ దగ్గర్నుండ
ఎందుకు తోసివేస్తున్నావు? మేము నిన్ను అను
సరించటం మాకు కష్టతరంగా నీవెందుకు చేస్తు
న్నావు? యెహోవా, మా దగ్గరకు తిరిగి రమ్ము.
మేము నీ సేవకులం. మా దగ్గరకు వచ్చి మాకు
సహాయం చేయి. మా కుటుంబాలు నీకు
చెందినవి.
18 నీ పరిశుద్ధ ప్రజలకు ఇప్పుడు చాలా కష్టాలు
వచ్చాయి. మా శత్రువులు నీ పరిశుద్ధ ఆలయం
మీద నడుస్తున్నారు.
19 కొందరు మనుష్యులు నిన్ను వెంబడించరు. ఆ
ప్రజలు నీ నామం ధరించరు. మరియు మేము
ఆ ప్రజల్లాగే ఉన్నాము.

64 నీవు ఆకాశాలను చీల్చుకొని భూమి మీదికి
దిగివస్తే అప్పుడు సమస్తం మారిపోతుంది.
పర్వతాలు నీ ఎదుట కరగిపోతాయి.
2 మండుతున్న పొదల్లా, పర్వతాలు అగ్ని జ్వాలల్లో
కాలిపోతాయి. నిప్పుమీది నీళ్లలా పర్వతాలు
కాగిపోతాయి. అప్పుడు నీ శత్రువులు నిన్ను
గూర్చి తెలుసుకొంటారు. అప్పుడు రాజ్యాలన్ని
నిన్ను చూడగా భయంతో వణుకుతాయి.
3 (కానీ నీ ఈ సంగతులు జరిగించాలని మేము
నిజంగా కోరటంలేదు. పర్వతాలు నీ ఎదుట
కరగిపోతాయి.)
4 నీ ప్రజలు నిజంగా ఎన్నడూ నీ మాట వినలేదు.
నీవు చెప్పిన విషయాలను నీ ప్రజలు నిజంగా
ఎన్నడూ వినలేదు. నీవంటి దేవుణ్ణి ఏ మనిషి
ఎన్నడూ చూడలేదు. నీవు తప్ప ఇంక ఏ దేవుడూ
లేడు. ప్రజలు సహనంతో నీకొరకు కనిపెట్టి
వుంటే అప్పుడు నీవు వారికోసం గొప్ప కార్యాలు
చేస్తావు.
5 మేలు చేయటంలో ఆనందించే మనుష్యు లతో
నీవు ఉన్నావు. నీ జీవన విధానాలను ఆ మను
ష్యులు జ్ఞాపకం చేసుకొంటారు. కానీ చూడు,
గతంలో మేము నీకు విరోధంగా పాపం చేశాము
అందుచేత నీవు మా మీద కోపగించావు.
6 మేమందరం పాపంతో మైలపడ్డాం. మా “నీతి”
అంతా పాత మైల గుడ్డల్లాంటిదే. మేమందరం
ఎండిపోయిన ఆకుల్లా ఉన్నాము. మా పాపాలు
మమ్మల్ని గాలిలా కొట్టుకుపోయాయి.
7 మేము నిన్ను ఆరాధించటం లేదు, నీ నామం
మేము విశ్వసించలేదు. నిన్ను వెంబడించాలనే
సంబరం మాలో ఎవ్వరికీ లేదు. అందుచేత నీవు
మా వద్దనుండి తిరిగిపోయావు. మేము పాపంతో
నిండిపోయాం గనుక నీ ఎదుట మేము నిస్స
హాయులం.
8 కానీ, యెహోవా, నీవు మా తండ్రివి. మేము
మట్టిలాంటి వాళ్లం. నీవు కుమ్మరివి. నీ చేతులే
మమ్మల్ని అందర్ని చేశాయి.
9 యెహోవా, మా మీద ఇంకా కోపంతోనే
ఉండకు. మా పాపాలను శాశ్వతంగా జ్ఞాపకం
చేసుకోవద్దు. దయచేసి మమ్మల్ని చూడు,
మేము నీ ప్రజలము.
10 నీ పవిత్ర పట్టణాలు శూన్యంగా ఉన్నాయి. ఆ
పట్టణాలు ఇప్పుడు అరణ్యాలవలె ఉన్నాయి.
సీయోను ఒక అరణ్యం. యెరూషలేము నాశనం
చేయబడింది.
11 మా పవిత్ర ఆలయం అగ్నిచేత కాల్చి వేయ
బడింది. ఆ ఆలయం మాకు ఎంతో గొప్పది.
మా తండ్రులు అక్కడ నిన్ను ఆరాధించారు.
మాకు ఉండిన మంచి వస్తువులన్నీ ఇప్పుడు
నాశనం చేయబడ్డాయి.
12 నీవు నీ ప్రేమను ఎన్నటికీ మాకు చూపకుండా
ఉంచుతాయా ఈ వస్తువులు? నీవు ఏమీ పలుక
కుండనే కొనసాగుతావా? శాశ్వతంగా నీవు
మమ్మల్ని శిక్షిస్తావా?

**ప్రజలందరూ దేవుని గూర్చి నేర్చుకొంటారు**

65 యెహోవా చెబుతున్నాడు: “సలహాకోసం నా
వద్దకు రాని ప్రజలకు నేను సహాయం చేశాను.
నన్ను కనుగొన్నవారు నాకోసం వెదకిన వారు కారు.

నా పేరు పెట్టబడని ఒక ప్రజతో నేను మాట్లాడాను.
'నేనిక్కడ ఉన్నాను, నేను ఇక్కడ ఉన్నాను' అని నేను
చెప్పాను.
2"నాకు విరోధంగా తిరిగిపోయిన వారిని చేర్చు
కొనేందుకు నేను సిద్ధంగా నిలబడ్డాను. ఆ ప్రజలు నా
దగ్గరకు వస్తారని నేను కనిపెట్టాను. కానీ వారు చెడు
మార్గంలోనే జీవించటం కొనసాగించారు. వారి హృద
యాలు కోరినవన్నీ వారు చేశారు. 3ఆ మనుస్యులు
నాకు ఎల్లప్పుడూ కోపం పుట్టిస్తూ, నా యెదుట
ఉన్నారు. ఆ ప్రజలు వారి ఉద్యానవనాల్లో బలులు
అర్పిస్తారు. ధూపం వేస్తారు. 4ఆ మనుష్యులు సమా
ధుల్లో కూర్చొంటారు. చనిపోయిన వారి దగ్గర్నుండి
సందేశాలకోసం వారు కనిపెడ్తారు. వారు శవాలమధ్య
కూడా నివసిస్తారు. వారు పంది మాంసం తింటారు.
వారి కత్తులు, గరిటెలు కుళ్ళిపోయిన మాంసంతో
మైలపడ్డాయి.
5కానీ ఆ ప్రజలే, "దగ్గరకు రాకు, నేను నిన్ను
శుద్ధి చేసేంతవరకు నన్ను ముట్టకు" అని ఇతరులతో
చెబుతారు. ఆ ప్రజలు నా కంటికి పొగలా ఉన్నారు.
మరియు వారి అగ్ని ఎంతసేపూ మండుతూనే
ఉంటుంది."

### ఇశ్రాయేలు శిక్షింపబడాలి

6"చూడు, నీవు చెల్లించాల్సిన లెక్క చీటి ఒకటి
ఇక్కడ ఉంది. నీ పాపాల మూలంగా నీవు దోషివి అని
ఈ లెక్క చీటి చూపిస్తుంది. ఈ లెక్క చీటి చెల్లించే
వరకు నేను ఊరుకోను, నేను మిమ్మల్ని శిక్షించటం
ద్వారా లెక్క చీటి చెల్లిస్తాను.
7"మీ పాపాలు, మీ తండ్రుల పాపాలు అన్నీ ఒకటే."
యెహోవా ఇలా చెప్పాడు, "మీ తండ్రులు పర్వతాల్లో
ధూపం వేసినప్పుడు ఈ పాపాలు చేశారు. ఆ కొండల
మీద వారు నన్ను అవమానించారు. మరియు నేను
మొదట వాళ్లను శిక్షించాను. వారు పొందాల్సిన శిక్ష
నేను వారికి ఇచ్చాను."

### ఇశ్రాయేలును దేవుడు సర్వనాశనం చేయడు

8యెహోవా చెబుతున్నాడు: "ద్రాక్షపండ్లలో కొత్త
రసం ఉన్నప్పుడు, ప్రజలు ఆ ద్రాక్షరసాన్ని పిండు
తారు. కాని ద్రాక్ష పండ్లను మాత్రం వారు పూర్తిగా
నాశనం చేయరు. ఆ ద్రాక్షపండ్లు ఇంకా ఉపయోగ
పడ్తాయి. కనుక వారు యిలా చేస్తారు. నా సేవకులకు
కూడ నేను అలాగే చేస్తాను. నేను వారిని పూర్తిగా
నాశనం చేయను.
9యాకోబు (ఇశ్రాయేలు) ప్రజలు కొందరిని నేను
ఉంచుతాను. యూదా ప్రజలు కొందరికి నా పర్వతం
లభిస్తుంది. నా సేవకులు అక్కడ నివసిస్తారు. అక్కడ
నివసించాల్సిన మనుష్యులను నేను ఏర్పరచు
కొంటాను. 10అప్పుడు షారోను లోయ* గొర్రెలకు
పొలం అవుతుంది. ఆకోరు లోయ* పశువులు విశ్రాంతి
తీసుకొనే చోటు అవుతుంది. ఈ సంగతులన్నీ నా
ప్రజలకోసం – నా కోసం వెదకే ప్రజలకోసమే.
11"అయితే యెహోవాను విడిచిపెట్టిన ప్రజలారా,
మీరు శిక్షించబడతారు. నా పవిత్ర పర్వతం* గూర్చి
మరచిపోయిన ప్రజలు మీరు. మీరు అదృష్టాన్ని
ఆరాధించే ప్రజలు. మీరు కర్మ అనే తప్పుడు దేవతమీద
ఆధారపడే మనుష్యులు. 12కానీ మీ భవిష్యత్తును నేను
నిర్ణయిస్తాను. మరియు నా ఖడ్గం ప్రయోగించి నేను
మిమ్మల్ని శిక్షిస్తాను. మిమ్మల్ని శిక్షించే ఆయన ఎదుట
మీరంతా దీనులుగా ఉంటారు. నేను మిమ్మల్ని
పిలిచాను, మీరు నాకు జవాబు ఇవ్వటానికి నిరాక
రించారు. నేను మీతో మాట్లాడాను కానీ మీరు వినిపించు
కోలేదు. కీడు అని నేను చెప్పిన వాటినే మీరు చేశారు.
నాకు ఇష్టం లేని వాటినే చేయాలని మీరు తీర్మానించు
కొన్నారు."

13 కనుక యెహోవా నా ప్రభువు ఈ మాటలు
చెప్పాడు: "నా సేవకులు భోజనం చేస్తారు
కానీ దుర్మార్గులైన మీరు ఆకలితో ఉంటారు.
నా సేవకులు పానం చేస్తారు. కానీ దుష్టులైన
మీరు దాహంతో ఉంటారు. నా సేవకులు సంతో
షంగా వుంటారు. కానీ దుష్టులైన మీరు సిగ్గు
నొందుతారు.
14 నా సేవకుల హృదయాల్లో మంచితనం
ఉంటుంది. కనుక వారు సంతోషంగా ఉంటారు.
కానీ దుష్టులైన మీ హృదయాల్లో బాధ
ఉంటుంది గనుక మీరు ఏడుస్తారు. మీ ఆత్మలు
భగ్నమై పోతాయి గనుక మీరు చాలా దుఃఖిస్తారు.
15 మీ పేర్లు నా సేవకులకు చెడ్డ మాటల్లా
ఉంటాయి." నా ప్రభువు, యెహోవా మిమ్మల్ని
చంపేస్తాడు. మరియు ఆయన తన సేవకులను
కొత్త పేర్లతో పిలుస్తాడు.
16 ఇప్పుడు ప్రజలు ఆశీర్వదించమని భూమిని
వేడుకొంటున్నారు. కానీ భవిష్యత్తులో వారు
ఆశీర్వాదాలకోసం నమ్మకమైన దేవుణ్ణి అడుగు
తారు. ఇప్పుడు ప్రజలు ప్రమాణాలు చేసి
నప్పుడు వారు భూశక్తిని నమ్ముకొంటున్నారు.
కానీ భవిష్యత్తులో వారు నమ్మకమైన దేవుణ్ణి
నమ్ముకొంటారు. ఎందుకంటే గతంలోని

---

**షారోను లోయ** పాలస్తీనా తీరపు పల్లపు భూమి.

**ఆకోరు లోయ** యెరూషలేము పది మైళ్లు ఉత్తరానగల ఒక లోయ.

**పవిత్ర పర్వతం** యెరూషలేము కట్టబడిన సీయోను పర్వతం.

కష్టాలు మరువబడుతాయి గనుక. ఆ కష్టాలను
నా ప్రజలు యింక ఎన్నటికీ జ్ఞాపకం చేసుకోరు.

### ఒక క్రొత్త సమయం వస్తుంది

17 "చూడు, నేను ఒక కొత్త ఆకాశాన్ని ఒక కొత్త
భూమిని చేస్తాను. గత విషయాలను ప్రజలు
జ్ఞాపకం చేసుకోరు. ఆ విషయాలు ఏవీ నా
ప్రజల జ్ఞాపకాల్లో ఉండవు.
18 నా ప్రజలు విచారంగా ఉండరు. లేదు, వారు
సంతోషంగా ఉండి, శాశ్వతంగా దేవుని స్తుతి
స్తారు. నేను చేసే సంగతుల మూలంగా వారు
సంతోషంగా ఉంటారు. సంపూర్ణ ఆనందంతో
నిండిన ఒక యెరూషలేమును నేను చేస్తాను.
మరియు వారిని సంతోషించే ప్రజగా నేను
చేస్తాను.
19 అప్పుడు యెరూషలేము గూర్చి నేను సంతో
షిస్తాను. నా ప్రజలను గూర్చి నేను సంతో
షిస్తాను. ఆ పట్టణంలో మరల ఎన్నడూ ఏడుపు,
దుఃఖం ఉండవు.
20 జన్మించి, కొన్నాళ్లు మాత్రమే జీవించే శిశువు
అంటూ ఎవ్వరు ఆ పట్టణంలో ఉండరు.
కొన్నాళ్లకే ఆయుష్షు తీరిపోయే వ్యక్తులు
ఎవ్వరూ ఆ పట్టణంలో ఉండరు. జన్మించే
ప్రతి శిశువు దీర్గకాలం జీవిస్తుంది. వృద్ధులు ప్రతి
ఒక్కరూ చాలాకాలం జీవిస్తూనే ఉంటారు. వంద
సంవత్సరాలు జీవించిన వ్యక్తి యువకుడు అని
పిలువబడతాడు. (అయితే పాపం చేసినవాడు
వంద సంవత్సరాలు బతికినా అన్నీ కష్టాలే.)
21 ఆ పట్టణంలో ఒక వ్యక్తి ఇల్లు కడితే ఆ వ్యక్తి
అక్కడ నివసిస్తాడు. ఒక వ్యక్తి గనుక ద్రాక్షతోట
నాటితే ఆ వ్యక్తి ఆ తోటలోని ద్రాక్ష పండ్లు
తింటాడు.
22 ఒకడు ఇల్లు కట్టగా మరొకడు ఆ ఇంటిలో నివ
సించటం అనేది జరుగదు. ఒకడు ఒక తోటను
నాటగా మరొకడు ఆ తోట ఫలాలు తినటం
అనేది జరుగదు. వృక్షాలు బతికినంత కాలం నా
ప్రజలు బతుకుతారు. నేను ఏర్ప రచుకొనే
ప్రజలు, వారు తయారుచేసే వాటిని అను
భవిస్తారు.
23 ప్రతిఫలం ఏమి లేకుండా ప్రజలు మరల
ఎన్నడూ పనిచేయరు. చిన్నతనంలోనే మర
ణించే పిల్లల్ని ప్రజలు మరల ఎన్నడు కనరు.
నా ప్రజలంతా యెహోవాచేత ఆశీర్వదించ
బడతారు. నా ప్రజలు, వారి పిల్లలు ఆశీర్వ
దించబడుతారు.
24 వారికి అవసరమైనవి, వారు అడగకముందే నేను
తెలుసుకొంటాను. సహాయంకోసం వారు నన్ను
అడుగుట ముగించక ముందే నేను వారికి
సహాయం చేస్తాను.
25 తోడేళ్లు, గొర్రెపిల్లలు కలిసి మేతమేస్తాయి.
సింహాలు పశువులతో కలిసి మేస్తాయి. నా పవిత్ర
పర్వతం మీద నేలపై పాము ఎవరినీ భయ
పెట్టదు, బాధించదు." ఇవన్నీ యెహోవా
చెప్పాడు.

### దేశాలన్నింటికీ దేవుడు తీర్పు తీరుస్తాడు

66 యెహోవా చెబుతోంది ఇదే, "ఆకాశాలు
నా సింహాసనం. భూమి నా పాదపీఠం.
అందుచేత నాకు ఒక గృహం నిర్మించగలం అని
మీరనుకొంటున్నారా? లేదు, నిర్మించ లేరు.
2 నా అంతట నేనే అన్నింటినీ చేశాను. అన్నింటిని
నేను చేసాను కనుక అవి అన్నీ ఇక్కడ ఉన్నాయి."
యెహోవా ఈ సంగతులు చెప్పాడు. "నేను ఏ
ప్రజల్ని లక్ష్యపెడతాను, నాతో చెప్పండి? పేద
ప్రజల్ని నేను లక్ష్యపెడతాను. వీరు చాల
దుఃఖంలో ఉన్న ప్రజలు. నా మాటలకు విధేయు
లయ్యే వారిని నేను లక్ష్య పెడతాను
3 కొంతమంది నాకు బలులు ఇచ్చేందుకు ఎడ్లను
వధిస్తారు. కానీ వారు ప్రజల్నికూడా కొడతారు.
ఆ మనుష్యులు నాకు బలులు ఇచ్చేందుకని
గొర్రెలను వధిస్తారు. అయితే వారు కుక్కల
మెడలు కూడ విరుగగొడ్తారు. మరియు పందుల*
రక్తం వారు నాకు అర్పిస్తారు. ఆ మనుష్యులు
ధూపం వేయటం జ్ఞాపకం ఉంచుకొంటారు. కాని
పనికిమాలిన వారి విగ్రహాలను కూడా వారు
ప్రేమిస్తారు. ఆ మనుష్యులు నా మార్గాలను గాక
వారి స్వంత మార్గాలనే ఎంచుకొంటారు. భయం
కరమైన వారి విగ్రహాలనే వారు పూర్తిగా
ప్రేమిస్తారు.
4 కనుక వారి స్వంత రహస్యాలనే నేను ఉపయోగిం
చాలని నేను నిర్ణయించుకొన్నాను. అంటే,
దేనికైతే వారు ఎక్కువగా భయపడతారో వాటినే
ప్రయోగించి వారిని శిక్షించాలని నా ఉద్దేశం. నేను
ఆ ప్రజలను పిలిచాను కాని వారు వినిపించు
కోలేదు. నేను వారితో మాట్లాడాను కానీ వారు
నా మాట వినలేదు కనుక నేనుకూడా వారికి
అదే విధంగా చేస్తాను. నేను కీడు అని చెప్పిన
వాటినే ఆ ప్రజలు చేశారు. నాకు ఇష్టంలేని వాటినే
వారు జరిగించేందుకు ఎంచుకొన్నారు."
5 యెహోవా ఆజ్ఞలకు విధేయులయ్యే ప్రజలారా,
మీరు యెహోవా చెప్పేవాటిని వినాలి. "మీ
సోదరులు మిమ్మల్ని ద్వేషించారు. మీరు నన్ను

---

**కుక్కల ... పందులు** దేవుని ప్రజలు వీటిని బలులుగా
అర్పించాలని దేవుడు కోరలేదు.

వెంబడించినందువల్ల వారు మీకు విరోధంగా తిరిగారు. యెహోవా ఘనపరచబడినప్పుడు మేము తిరిగి మీ దగ్గరకు వస్తాము. అప్పుడు మేము మీతోకూడ సంతోషిస్తాం, అని మీ సోదరులు చెప్పారు. ఆ మనుష్యులు శిక్షించబడతారు.”

### శిక్ష మరియు ఒక కొత్త రాజ్యం

6వినండి! పట్టణం నుండి, దేవాలయం నుండి
పెద్ద శబ్దం వస్తుంది. యెహోవా తన శత్రువులను
శిక్షిస్తున్న శబ్దం అది. వారికి రావాల్సిన శిక్షనే యెహోవా
వారికి ఇస్తున్నాడు.
7-8“ఒక స్త్రీ నొప్పులు లేకుండా ప్రసవించదు.
ఒక స్త్రీ నొప్పులు అనుభవించకుండనే తన శిశువును
చూడటం అనేది ఎన్నడూ సంభవించలేదు. అదే
విధంగా, ఒకే రోజున ఒక కొత్త ప్రపంచం ప్రారంభం
అగుట ఎవ్వరూ ఎన్నడూ చూడలేదు. ఒకే రోజున
ఒక కొత్త రాజ్యం ప్రారంభం అయినట్లు ఎవ్వరూ
ఎన్నడూ వినలేదు. ప్రసవ వేదనలాంటి నొప్పులు
దేశం మొదట అనుభవించాలి. ప్రసవ వేదనల తర్వాత
దేశం తన పిల్లలకు – ఒక కొత్త దేశానికి – జన్మనిస్తుంది.
9అదే విధంగా ఏదో కొత్తది జన్మించాల్సిన అవసరం
లేకుండా నేను బాధ కలిగించను.”

యెహోవా ఇది చెబుతున్నాడు: “నేను నీకు పురిటి నొప్పులు రానిచ్చినట్లయితే, అప్పుడు నీ కొత్త దేశం నీకు రాకుండా నేను ఆపుజేయను.” మీ దేవుడే ఇది చెప్పాడు.

10 యెరూషలేమా, సంతోషించు! యెరూషలేమును ప్రేమించే మీరందరూ సంతోషించండి. విచారకరమైన విషయాలు యెరూషలేముకు సంభవించాయి. కనుక మీరు కొంతమంది మనుష్యులు విచారించారు. కానీ, అలాంటి మీరు ఇప్పుడు ఎంతో ఎంతో సంతోషించాలి.

11 ఎందుకంటే ఆమె స్థనాలనుండి పాలు వచ్చినట్లుగా మీకు కరుణ లభిస్తుంది. ఆ ‘పాలు’ నిజంగా మిమ్మల్ని తృప్తిపరుస్తాయి. ప్రజలారా, మీరు పాలు తాగుతారు. మరియు మీరు యెరూషలేము మహిమను నిజంగా అనుభవిస్తారు.

12 యెహోవా చెబుతున్నాడు: “చూడండి, నేను మీకు శాంతినిస్తాను. ఒక మహానది ప్రవాహంలా ఈ శాంతి మీ దగ్గరకు ప్రవహించి వస్తుంది. భూమి మీద రాజ్యాలన్నింటిలోని ఐశ్వర్యాలు అన్నీ మీ వద్దకు ప్రవహిస్తూ వస్తాయి. ఒక వరద ప్రవాహంలా ఈ ఐశ్వర్యాలు ప్రవహిస్తాయి. మీరు చిన్న పిల్లల్లా ఉంటారు. మీరు పాలు తాగుతారు. మీరు ఎత్తబడి నా కౌగిటిలో ఉంటారు. మీరు నా మోకాళ్లమీద ఊపబడతారు.

13 యెరూషలేములో మీరు ఓదార్చబడతారు. ఒక తల్లి తన బిడ్డను ఓదార్చేలా నేను మిమ్మల్ని ఓదార్చుతాను.

14 మీరు నిజంగా అనుభవించేవాటిని మీరు చూస్తారు. మీరు స్వతంత్రులై, గడ్డి పెరుగునట్లు పెరుగుతారు. యెహోవా సేవకులు ఆయన శక్తిని చూస్తారు. కానీ యెహోవా శత్రువులు ఆయన కోపాన్ని చూస్తారు.

15చూడండి, యెహోవా అగ్నితో వస్తున్నాడు.
యెహోవా సైన్యాలు ధూళిమేఘాలతో వస్తున్నాయి.
ఆ ప్రజలను యెహోవా తన కోపంతో శిక్షిస్తాడు.
యెహోవా కోపంగా ఉన్నప్పుడు, ఆ ప్రజలను శిక్షించు
టకు ఆయన అగ్ని జ్వాలలను ప్రయోగిస్తాడు.
16యెహోవా ప్రజలకు తీర్పు తీరుస్తాడు. తర్వాత
యెహోవా తన ఖడ్గంతోను, అగ్నితోను ఆ ప్రజలను
నాశనం చేస్తాడు. యెహోవా అనేకమంది ప్రజలను
నాశనం చేస్తాడు.
17ఆ ప్రజలు వారి ప్రత్యేక తోటలో* ఆరాధించు
కొనేందుకు, వారిని పవిత్రం చేసుకోవాలని చెప్పి,
వారిని వారు కడుగుకొంటారు. ఈ ప్రజలు వారి
తోటల్లోనికి ఒకరిని ఒకరు వెంబడిస్తారు. ఆ తర్వాత
వారి విగ్రహాలను వారు పూజిస్తారు. కానీ, యెహోవా
ఆ ప్రజలందరిని నాశనం చేస్తాడు.
“పందులు, ఎలుకల మాంసం, ఇతర మైల వస్తు
వులు ఆ ప్రజలు తింటారు. అయితే ఆ ప్రజలంతా
ఏకంగా నాశనం చేయబడతారు.” (సాక్షాత్తూ
యెహోవా ఈ సంగతులు చెప్పాడు.) 18“ఆ మనుష్య
లకు దుష్ట తలంపులు ఉన్నాయి, దుష్టకార్యాలు
చేస్తారు. అందుచేత వారిని శిక్షించేందుకు నేను
వస్తున్నాను. రాజ్యాలన్నింటిని, ప్రజలందరినీ నేను
సమావేశం చేస్తాను. ప్రజలంతా కలిసి వచ్చి నా శక్తిని
చూస్తారు.
19కొంతమంది మనుష్యులకు నేను ఒక గుర్తు
వేస్తాను – వారిని నేను రక్షిస్తాను. రక్షించబడిన ఆ
ప్రజల్లో కొందరిని తర్షీషు, లిబియా, లూద్, (విలు
కాండ్ర దేశం), తూబాలు, గ్రీసు, దూరదేశాలు
అన్నింటికీ నేను పంపిస్తాను. ఆ ప్రజలు నా ఉపదేశాలు
ఎన్నడూ వినలేదు. ఆ ప్రజలు నా మహిమను ఎన్నడూ
చూడలేదు. అందుచేత రక్షించబడిన ప్రజలు నా మహి
మను గూర్చి దేశాలకు చెబుతారు.
20మరియు వారు అన్ని దేశాలనుండి మీ సోదరు
లను, సోదరీలను తీసుకొని వస్తారు. నా పవిత్ర పర్వతం
యెరూషలేముకు మీ సోదరీలను వారు తీసుకొని
వస్తారు. గుర్రాలు, గాడిదలు, ఒంటెలు, రథాలు, బండ్ల

**ప్రత్యేక తోటలో** ఏ తోటల్లోనైతే అబద్ధపు దేవుళ్ళను కొలుస్తారో ఆ తోటలు.

మీద మీ సోదరులు, సోదరీలు వస్తారు. ఇశ్రాయేలీ
యులు పవిత్ర పళ్లెములలో యెహోవా మందిరానికి
తీసుకొనివచ్చే కానుకలవలె మీ సోదరులు, సోదరీలు
ఉంటారు. 21ఈ మనుష్యుల్లో నుండి కూడ కొందరిని
యాజకులుగా, లేవీలుగా ఉండేందుకు నేను ఏర్పరచు
కొంటాను." (యెహోవా ఈ సంగతులు చెప్పాడు.)

### క్రొత్త ఆకాశం, క్రొత్త భూమి

22"నేను ఒక నూతన ప్రపంచాన్ని చేస్తాను మరియు
నూతన ఆకాశం, నూతన భూమి శాశ్వతంగా నిలు
స్తాయి. అదే విధంగా మీ పేర్లు, మీ పిల్లలు శాశ్వతంగా
నాతో కూడ ఉంటారు. 23ప్రతి ఆరాధన రోజు, ప్రజ
లంతా నన్ను ఆరాధించేందుకు వస్తారు. ప్రతి సబ్బాతు
నాడూ, ప్రతి నెల మొదటిరోజున వారు వస్తారు.

24"ఈ ప్రజలు నా పవిత్ర పట్టణంలో ఉంటారు.
మరియు పట్టణం బయటకు వెళ్తే నాకు విరోధంగా
పాపం చేసిన మనుష్యుల శవాలను వారు చూస్తారు.
ఆ శవాలు పురుగులు పట్టి ఉంటాయి. ఆ పురుగులు
ఎన్నటికి చావవు. అగ్ని జ్వాలలు ఆ శవాలను కాల్చి
వేస్తాయి మరియు ఆ జ్వాలలు ఎన్నటికీ ఆరిపోవు."

# యిర్మీయా

1 ఇవి యిర్మీయా వర్తమానాలు. యిర్మీయా తండ్రి
పేరు హిల్కీయా. అనాతోతు నగరంలో నివ
సించే* యాజకుల కుటుంబానికి చెందిన వాడు
యిర్మీయా. ఆ నగరం బెన్యామీను వంశానికి చెందిన
వారి ప్రాంతంలో వుంది. 2యూదా రాజ్యాన్ని
యోషీయా పాలిస్తున్న రోజులలో యెహోవా యిర్మీ
యాతో మాట్లాడటం మొదలు పెట్టాడు. యోషీయా
తండ్రి పేరు ఆమోను. యోషీయా రాజ్యపాలన పద
మూడవ సంవత్సరం* జరుగుతూ ఉండగా యెహోవా
యిర్మీయాతో మాట్లాడటం ప్రారంభించాడు.
3యెహోయాకీము యూదాకు రాజైయున్న
కాలం వరకు యెహోవా యిర్మీయాతో మాట్లాడటం
కొనసాగించాడు. యెహోయాకీము తండ్రి పేరు
యోషీయా. సిద్కియా రాజ్యపాలన యూదాపై పద
కొండు సంవత్సరాల ఐదు మాసాలు జరిగే వరకు
యెహోవా యిర్మీయాతో మాట్లాడటం సాగించాడు.
సిద్కియా కూడ యోషీయా కుమారుడే. సిద్కియా
పాలనలో పదకొండు సంవత్సరాలు దాటి ఐదవ నెల
జరుగుతూ ఉండగా యెరూషలేములో ఉన్న ప్రజలు
బందీలుగా కొనిపోబడ్డారు.

### యిర్మీయాకు దేవుని పిలుపు

4యెహోవా వాక్కు నాకు చేరింది. ఈ వర్తమానం
యెహోవా వద్ద నుండి వచ్చింది.

5 “నీ తల్లి గర్భంలో నిన్ను నేను రూపించక ముందే
నిన్ను నేనెరిగియున్నాను. నీవు పుట్టకముందే
నిన్నొక ముఖ్యమైన పనికి ఎన్నుకున్నాను.
దేశాలకు నిన్నొక ప్రవక్తగా నియమించాను.”

6అప్పుడు, యిర్మీయానగు నేను “సర్వశక్తిమంతు
డనైన యెహోవా! నేనెలా మాట్లాడాలో నాకు
తెలియదు. నేను బాలుడను” అని అన్నాను.
7కాని యెహోవా ఇలా అన్నాడు:

“బాలుడనని అనవద్దు. నేను నిన్నెక్కడికి పంపు
తానో నీవచ్చటికి తప్పక వెళ్లాలి. నిన్ను ఏమి
చెప్పమని అంటానో అదంతా నీవు చెప్పాలి.
8 ఎవ్వరికీ భయపడకు. నేను నీతో ఉన్నాను.
నేను నిన్ను కాపాడతాను”. ఈ వర్తమానం
యెహోవా నైన నా వద్దనుండి వచ్చినది.

9పిమ్మట యెహోవా తన చేయి చాచి నా నోటిని
తాకాడు. యెహోవా నాతో ఇలా అన్నాడు:
“యిర్మీయా, నేను నా వాక్కును నీ నోటిలో
ఉంచుతున్నాను.

10 దేశాలను, సామ్రాజ్యాలను ఈ రోజు నీ జవాబు
దారిలో ఉంచుతున్నాను. నీవు వారిని కూకటి
వేళ్లతో పెకలించి చీల్చివేస్తావు. నీవు వాటిని సర్వ
నాశనం చేసి పడత్రోస్తావు. నీవు వాటిని కట్టి
నాటుతావు.”

### రెండు దర్శనాలు

11యెహోవా యొక్క సందేశం నాకు చేరింది.
యెహోవా ఇలా అన్నాడు: “యిర్మీయా, నీవు ఏమి
చూస్తూ ఉన్నావు?” అప్పుడు యెహోవాకు నేనిలా
సమాధాన మిచ్చాను: “బాదపు చెట్టుకొమ్మతో చేయ
బడిన ఒక కర్రను నేను చూస్తున్నాను.”
12“నీవు చాలా బాగా కనిపెట్టావు. నేను నీకిచ్చిన
సందేశం నిజం కావాలని ఎదురు చూస్తున్నాను”*
అని యెహోవా అన్నాడు.
13యెహోవా సందేశం నాకు మళ్లీ వినిపించింది.
యెహోవా ఇలా అన్నాడు: “యిర్మీయా, నీవు ఏమి
చూస్తున్నావు?”

---

**అనాతోతు ... నివసించే** బహుశా ఈ యాజకులు అబ్యాతారు వంశానికి చెందినవారు కావచ్చు. దావీదు రాజు కాలంలో అబ్యాతారు యెరూషలేములో ప్రధాన యాజకుడు. రాజైన సొలొమోను అతనిని అనాతోతు పంపివేశాడు. (చూడండి: రాజుల మొదటి గ్రంథం 2:26).

**యోషీయా ... సంవత్సరం** అనగా క్రీ.పూ. 627వ సంవత్సరం.

**నేను ... చూస్తున్నాను** హెబ్రీలో బాదం కర్ర అనే పదాన్ని ‘షాకేదు’ అని అంటారు. దానికి ‘కనిపెట్టుట’ అనే అర్థం వుంది. అయితే అది ద్వంద్వార్థంగా వాడబడింది.

“నేను ఒక మరుగుతున్న నీళ్ల కుండను చూస్తు
న్నాను. ఆ కుండ ఉత్తర దిశనుండి ఒరిగి ఉంది” అని
నేను యెహోవాకు చెప్పాను.

14 నాతో యెహోవా ఇలా అన్నాడు: “ఉత్తర
దిశనుండి ఉపద్రవం రాబోతూవుంది. ఈ
దేశంలో నివసిస్తూ ఉన్న వారందరికీ ఆ విపత్తు
వస్తుంది.
15 అనతి కాలంలోనే ఉత్తర ప్రాంత సామ్రాజ్యాల
ప్రజలందరికీ నేను పిలుపు యిస్తాను.” ఇది
యెహోవా వాక్కు. “ఆయా రాజ్యాధినేతలు
వస్తారు. యెరూషలేము ద్వారాల వద్ద వారు
తమ సింహాసనాలను ప్రతిష్ఠించుతారు. యెరూ
షలేము నగర గోడలమీదికి దండెత్తి వస్తారు.
యూదా రాజ్యంలోని అన్ని నగరాలపై వారు
దండయాత్రలు చేస్తారు.
16 అప్పుడు నా ప్రజలపై నా తీర్పును ప్రకటిస్తాను.
వారు చెడు నడతగల వారగుటచేతను, వారు
నాపట్ల విముఖులైనందువల్లను నేనిది చేస్తు
న్నాను. నా ప్రజలు నన్ను విడిచిపెట్టారు. ఇతర
దేవతలకు వారు బలులు అర్పించారు. వారి
చేతితో వారు చేసిన బొమ్మలనే వారు ఆరా
ధించారు.
17 “యిర్మీయా, నీవు మాత్రం సిద్ధంగా ఉండు.
ధైర్యంగా నిలబడి ప్రజలతో మాట్లాడు. నిన్ను
ఏమి చెప్పమని అంటానో అదంతా వారికి తెలి
యజేయి. ప్రజలకు నీవు భయపడవద్దు. నీవు
ప్రజలకు భయపడితే, వారిముందు నీవు భయ
పడటానికి తగిన కారణం కల్పిస్తాను.
18 నేను మాత్రం ఈ రోజు నిన్నొక బలమైన
నగరం మాదిరిగాను, ఒక ఇనుప స్థంభం వలెను,
ఒక కంచుగోడ వలెను బలపరుస్తాను. దానివల్ల
ఈ రాజ్యంలో ప్రతి వాని ఎదుట నీవు ధైర్యంగా
నిలువగలవు. యూదా రాజుల ఎదుట, యూదా
నాయకుల ఎదుట, యూదా యాజకుల
ఎదుట, మరియు యూదా ప్రజల ఎదుట నీవు
ధైర్యంగా నిలువగలవు.
19 వారంతా నిన్నెదిరిస్తారు; కాని నిన్ను ఓడించ
లేరు. ఎందుకంటె నేను నీతో ఉన్నాను; నేను
నిన్ను ఆదుకుంటాను.” ఇది యెహోవా నుండి
వచ్చిన సందేశం.

### విశ్వాసంలేని యూదా

2 యెహోవా యొక్క వర్తమానం నాకు విని
పించింది. యెహోవా వాక్కు ఇలా వుంది:
2 “యిర్మీయా, నీవు వెళ్లి యెరూషలేము ప్రజలతో
మాట్లాడుము. నీవు ఇలా చెప్పాలి:

“‘నీవొక చిన్న రాజ్యంగా ఉన్నప్పుడు నీవు నాకు
విశ్వాసంగా ఉన్నావు. ఒక యౌవ్వన వధువులా
నీవు నన్ననుసరించావు. ఎడారులలోను, సాగు
చేయని బీడు భూములలోను నీవు నన్ను అను
సరించావు.

3 “ఇశ్రాయేలు ప్రజలు యెహోవాకు ఒక పవిత్ర
మైన బహుమానము: వారు యెహోవా ఏర్పచు
కొన్న ప్రథమ ఫలం. ఇశ్రాయేలుకు హాని చేయ
బోయిన ప్రజలంతా దోషులుగా నిలిచారు. ఆ
దుష్టులు అనేక కష్టనష్టాలకు గురవుతారు.’” ఇది
యెహోవా వాక్కు.
4 యాకోబు వంశీయులారా! యెహోవా వార్త
వినండి. ఇశ్రాయేలు సంతతి కుటుంబాల
గుంపుల వారందరూ! ఈ వర్తమానం వినండి.
5 యెహోవా ఇలా చెప్పాడు: “మీ పూర్వీకులపట్ల
నేను ఉదారంగా ప్రవర్తించి యుండలేదా?
అందుకేనా వారు నాపట్ల విముఖులైనారు? మీ
పూర్వీకులు పనికిమాలిన విగ్రహాలను ఆరాధిం
చారు. తద్వారా వారుకూడ పనికిమాలిన
వారైనారు.
6 ‘మమ్మల్ని ఈజిప్టు నుండి విముక్తిచేసి తీసుకుని
వచ్చిన యెహోవా ఎక్కడ ఉన్నాడు? మాకు
ఎడారులలో మార్గదర్శి అయిన యెహోవా
ఎక్కడ ఉన్నాడు? మమ్మల్ని నిర్జల ప్రాంతాల
లోను, కొండల్లో, కోనల్లో సురక్షితంగా నడి
పించిన యెహోవా ఎక్కడ ఉన్నాడు? ఎవరూ
నివసించని గాఢాంధకారములోనూ, ప్రమాదకర
మైన భూమియందు యెహోవా మమ్ముడు
నడిపించాడు. ప్రజలు ఆ ప్రదేశం గుండా ప్రయా
ణించరు. కానీ యెహోవా మమ్మును దాని
గుండా నడిపించాడు.’ మీ పూర్వీకులు ఈ విష
యాలు మీకు చెప్పలేదు.”
7 ఒక మంచి, మరియు సారవంతమైన అనేక మంచి
వస్తువులతో నిండివున్న రాజ్యానికి మిమ్మల్ని
తీసుకొనివచ్చాను. మీరు ఆ ఫలాలను తినాలనీ,
అక్కడ పండే ధాన్యాలను మీరు ఉత్పత్తి చేయా
లనీ నేనలా చేశాను. కాని మీరు వచ్చి నా దేశాన్ని
అపవిత్ర పర్చారు. ఆ దేశాన్ని మీకు నేనిచ్చాను.
అయితే మీరు దానిని చెడ్డ దేశంగా మార్చివేశారు.
8 “యెహోవా ఎక్కడ అని యాజకులు అడగలేదు.
నా ఉపదేశాలను అనుసరించేవారు నన్ను తెలుసు
కోవటానికి నిరాకరించారు. ఇశ్రాయేలు ప్రజా
నాయకులు నాకు వ్యతిరేకులయ్యారు. బూట
కపు దేవతైన బయలు పేరిట ప్రవక్తలు ప్రవచ
నాలు చేశారు. వారు పనికిమాలిన విగ్రహాలను
ఆరాధించారు.”

9 కావున మిమ్మల్నీ, మీ పుత్ర పౌత్రులను నేను నిందిస్తున్నాను.
10 సముద్రం మీదుగా కిత్తీయుల ద్వీపానికి* వెళ్లి చూడండి. ఒకనిని కేదారు* రాజ్యానికి పంపి శ్రద్ధగా పరిశీలించమనండి. అక్కడ ఎవరైనా ఈ రకంగా ప్రవర్తించి యున్నారేమో పరిశీలించండి.
11 ఏ దేశవాసులైనా తమ పాత దేవుళ్లను కొత్త దేవుళ్లతో మార్చుకున్నారా? లేదు! (నిజానికి వారి దేవుళ్లు వాస్తవ దేవుళ్లు కానేకారు అయినను నా ప్రజలు తమ మహిమాన్వితుడైన దేవుని ఆరాధించటం మానుకొని పనికిమాలిన విగ్రహాలను పూజించటం ప్రారంభించారు అని యెహోవా అన్నాడు.
12 ఆకాశములారా, జరిగిన విషయాలకు విస్మయము చెందండి. భయకంపితులుకండి!" యెహోవా ఇలా చెప్పాడు.
13 నా ప్రజలు రెండు చెడు కార్యాలు చేశారు: వారు జీవజల (ఊటనైన) నన్ను విడిచేసారు పైగా వారు వారివారి తొట్లను తవ్వుకున్నారు. (వారు ఇతర దేవుళ్ళవైపు మొగ్గారు.) కాని వారి తొట్లు పగిలి పోయాయి. అవి నీటిని పట్ట జాలవు.
14 "ఇశ్రాయేలు ప్రజలు బానిసలైపోయారా? వారు పుట్టుకతో బానిసలుగా తయారైనారా? ఇశ్రాయేలు ప్రజలను ఇతరులు ఎందుకు కొల్లగొడుతున్నారు?
15 యువకిశోరాలు (శత్రువులు) ఇశ్రాయేలు రాజ్యంపై గర్జిస్తున్నాయి. సింహాలు కోపంతో గుర్రుమంటున్నాయి. ఇశ్రాయేలు ప్రజల దేశాన్ని సింహాలు నాశనం చేశాయి. ఇశ్రా యేలు నగరాలు తగులబెట్టబడ్డాయి. అవి నిర్మానుష్యమైనాయి. వాటిలో ప్రజలెవ్వరూ లేరు.
16 మెమ్ఫిస్, తహపనేసు* వీటినుండి వచ్చిన యోధులు నీ తల చితుకగొట్టారు.
17 ఈ కష్టానికంతటికి నీ తప్పులే కారణం! చక్కని మార్గంలో మిమ్మల్ని సరైన మార్గంలో నడిపిస్తున్న* మీ దేవుడైన యెహోవా నుండి మీరు తొలగిపోయారు
18 యూదా ప్రజలారా, మీరిది ఆలోచించండి: ఈజిప్టుకు వెళ్లటం వలన ఏమైనా మేలు జరిగిందా? నైలునది (షీహోరు) జలాన్ని తాగినందువల్ల ఏమి మేలు జరిగింది? లేదు. ఏమీ లేదు! అష్షూరుకు వెళ్లుట వలన ఏమి జరిగింది? యూఫ్రటీసు నదీజలాన్ని తాగినందువల్ల ఏమి కలిసి వచ్చింది. లేదు. ఏమీలేదు.
19 మీరు చెడు పనులు చేశారు. మీచెడ్డ పనులు మీకు శిక్షను తెస్తాయి. మీకు కష్టాలు సంభవిస్తాయి. ఆ ఆపద మీకు తగిన గుణపాఠం నేర్పుతుంది. దీనిని గురించి యోచన చేయండి! మీకై మీరు మీ దేవునికి దూరమగుట ఎంతటి ఘోరమైన విషయమో అప్పుడు మీకు అర్థమవుతుంది. నేనంటే భయ భక్తులు లేకపోవుట తగనిపని! ఈ వర్తమానం నా ప్రభువును, సర్వశక్తిమంతుడయిన దేవుని వద్దనుండి వచ్చినది.
20 "యూదా, చాలాకాలం క్రితమే నీవు నీకాడిని పారవేసినావు. నాకు దగ్గరగా ఉంచుకొనేందుకు నిన్నులాగి పట్టిన పగ్గాలను తెంచుకున్నావు. 'నేను నిన్ను సేవించను' అని నన్ను తిరస్కరించావు. నిజంగా నీవు ప్రతి కొండమీద, ప్రతి పచ్చని చెట్టుకింద పండుకొని పచ్చి వేశ్యలా ప్రవర్తించావు.*
21 యూదా, నిన్నొక మేలు రకం ద్రాక్షపాదువలె నాటాను. మీరంతా మేలురకం విత్తనాల్లా ఉన్నారు. కాని నాసిరకం పండ్లనిచ్చే వేరొక రకం ద్రాక్షలతల్లా ఎలా తయారయ్యారు?
22 క్షారజలంతో స్నానం చేసుకున్నా, నీవు విస్తరించి సబ్బు వినియోగించినా నేను నీ దోష కళంకాన్ని చూడగలను." ఈ వర్తమానం దేవుడైన యెహోవాది.
23 యూదా, 'నేను దోషినికానని, బయలు విగ్రహాలను ఆరాధించలేదని' నీవెలా నాకు చెప్పగలవు? లోయలో నీవు చేసిన పనులు గూర్చి ఒకసారి ఆలోచించుకో. నీవు ఏమిచేశావో గుర్తుకు తెచ్చుకో. నీవొక వడిగల ఆడ ఒంటెవలె ఒక చోటినుండి మరో చోటికి పరుగెత్తావు.
24 ఎడారిలో తిరిగే ఒక అడవి గాడిదలా నీవున్నావు. సంగమ సమయంలో అది గాలిని వాసనచూస్తూ తిరుగుతుంది. మిక్కిలి ఎదగొన్నప్పుడు దానిని ఎవ్వరూ వెనుకకు మరల్చలేరు. ఎదకాలంలో దానిని కోరే ప్రతీ మగజంతువూ దానిని పొందగలదు. అప్పుడు దానిని కనుగొనటం తేలిక.

---

**కిత్తీయుల ద్వీపానికి** ఈ పేరుకు అర్థము ప్రద్వీపము కాని ఈ పేరు తరచుగా ఇతర ద్వీపాలకు, మధ్యధరా సముద్రతీర ప్రాంతాలకు వాడబడింది.

**కేదారు** ఇది పాలస్తీను (ఫిలిష్తీయ)కు తూర్పునవున్న ఎడారిలో నివసించిన అరబీయ వంశం యొక్క పేరు.

**మెమ్ఫిస్, తహపనేసు** ఇవి రెండూ ఈజిప్టులోని నగరాలు.

**చక్కని ... నడిపిస్తున్న** ఈ పంక్తి గ్రీకు తర్జుమాలో లేదు.

**ప్రతి పచ్చని ... ప్రవర్తించావు** గతంలో ఆ ప్రజలు కొండలమీద, పచ్చని చెట్ల కింద పలు అన్యదేవుళ్లను పూజించారని దీనికి గూఢార్థం.

25 యూదా, ఇక నీవు విగ్రహాలను అనుసరించటం
మానాలి. ఇతర దేవుళ్ల కొరకు దాహాన్ని వదిలి
పెట్టు. కానీ, 'లాభం లేదు! నేను వదల్లేను!
నేను పరదేవుళ్లనే ప్రేమిస్తాను. నేను వాటినే
ఆరాధిస్తాను' అని నీవంటావు.
26 "ప్రజలు పట్టుకున్నప్పుడు దొంగ సిగ్గుపడతాడు
అదేరీతిగా ఇశ్రాయేలు ప్రజలు అవమానం పాల
వుతారు. ఇశ్రాయేలు రాజులు, ప్రజానాయ
కులు, యాజకులు, ప్రవక్తలు అందరూ సిగ్గుతో
తలవంచుకుంటారు.
27 ఈ ప్రజలు కర్రముక్కలతో మాట్లాడతారు!
దానితో 'నీవే నా తండ్రివి' అంటారు. ఈ ప్రజలు
ఒక రాతి బండతో మాట్లాడతారు. దానితో,
'నీవేమాకు జన్మనిచ్చావు' అంటారు. ఆ
ప్రజలంతా అవమానం పొందుతారు. ఆ ప్రజలు
నావైపుకు చూడరు. వారు విముఖులైనాకు
వెన్ను చూపుతారు. కాని యూదా ప్రజలు కష్టాల
పాలైనపుడు, 'వచ్చి, మమ్మును ఆదుకోమని!'
నన్నడుగుతారు.
28 ఆ విగ్రహాలనే వచ్చి మిమ్మును ఆదుకోనివ్వండి!
మీకై మీరు చేసిన ఆ విగ్రహాలు ఎక్కడ
వున్నాయి? మీకష్టకాలంలో ఆ విగ్రహాలు వచ్చి
మిమ్మును ఆదుకుంటాయేమో చూద్దాము.
యూదా ప్రజలారా, మీనగరాలెన్ని వున్నాయో
మీ విగ్రహాలు కూడా అన్ని వున్నాయి!
29 "మీరు నాతో ఎందుకు వాదిస్తారు? మీరంతా
నాకు వ్యతిరేకులయ్యారు." ఈ వర్తమానం
యెహోవానుండి వచ్చినది.

30 "యూదా ప్రజలారా, నేను మిమ్మును శిక్షించాను.
కాని అది పనిచేయలేదు. మిమ్మల్ని శిక్షించి
నప్పుడు కూడా మీరు వెనక్కి మరలలేదు. మీ
వద్దకు వచ్చిన ప్రవక్తలను మీరు మీకత్తులతో
చంపారు. మీరొక భయంకర సింహంలా ప్రవ
ర్తించి వారిని సంహరించారు."
31 ఈ తరం ప్రజలారా, యెహోవా వర్తమానం
పట్ల శ్రద్ధవహించండి. "ఇశ్రాయేలు ప్రజలకు
నేనొక ఎడారిలా ఉన్నానా? వారికి నేనొక అంధ
కారంతో నిండిన ప్రమాదకరమైన దేశంలా
ఉన్నానా? 'మేము మా యిష్టానుసారంగా నడవ
టానికి మాకు స్వేచ్ఛ ఉంది. యెహోవా,
మేము తిరిగి నీ చెంతకు రాము,' అని నా
ప్రజలు అంటారు. కానీ, వారలా ఎందుకు
మాట్లాడతారు?
32 ఏ కన్యకగాని తన నగలను మర్చిపోతుందా?
లేదు. మర్చిపోదు! ఏ పెండ్లి కుమార్తెగాని తన
దుస్తులకు ఒడ్డాణం మర్చిపోతుందా? లేదు.
మర్చిపోదు! కాని నా ప్రజలు లెక్కలేనన్నిసార్లు
నన్ను మర్చిపోయారు.
33 యూదా, ప్రేమికులను (బూటకపు దేవుళ్లను)
వెంబడించటం నీకు బాగా తెలుసు. కావున దుష్ట
కార్యాలు చేయుట నీకై నీవే నేర్చుకున్నావు.
34 మీ చేతులు రక్తసిక్తమైనాయి!* అది పేదవాళ్ల,
అమాయకుల రక్తం. నిష్కారణముగా నీవు ప్రజ
లను చంపావు. కనీసం వారు నీవు పట్టుకున్న
దొంగలైనా కారు. నీవటువంటి చెడ్డ పనులు
చేస్తావు.
35 కాని, 'నేను అమాయకుడను, దేవుడు నా ఎడల
కోపంగా లేడు' అని నీవు చెప్పుకుంటూ
ఉంటావు. అందువల్ల నీవు అబద్ధం చెప్పిన నేరా
నికి కూడా నిన్ను దోషిగా నేను న్యాయ నిర్ణయం
చేస్తాను, ఎందుకంటే 'నేనేమీ పాపం చేయలేదు'
అని నీవంటున్నావు.
36 నీ మనస్సు మార్చుకోవటం నీకు చాలా సులభ
మైన పని! అష్షూరు నీకు ఆశాభంగం కలి
గించింది. అందుచేత అష్షూరును* వదిలి ఈజి
ప్టుకు వెళ్లి సహాయం అర్థించినావు. ఈజిప్టు
కూడా నీకు ఆశాభంగం కల్గిస్తుంది.
37 చివరకు నీవు ఈజిప్టును కూడా వదిలివేస్తావు.
అవమానంతో నీవు నెత్తిన చేతులు పెట్టు
కుంటావు. నీవు ఆ రాజ్యాలను నమ్మినావు.
కాని ఆ రాజ్యాల సహకారంతో నీవేమీ సాధించ
లేవు. ఎందువల్లనంటే యెహోవా ఆ రాజ్యాలను
తిరస్కరించాడు.

3 "ఒక వ్యక్తి తన భార్యకు విడాకులిస్తే, ఆమె
అతన్ని వదిలి వెళ్లి మరో వివాహం చేసికొంటే,
ఆ వ్యక్తి మళ్లీ ఆమెవద్దకు తిరిగి రాగలడా? లేదు.
రాలేడు! ఆ వ్యక్తి ఆ స్త్రీ వద్దకు* తిరిగి వెళితే
ఆ రాజ్యం పూర్తిగా 'మాలిన్య'మైపోతుంది.
యూదా, నీవు అనేకమంది విటులతో (అబద్ధపు
దేవుళ్లు) వట్టి వేశ్యవలె ప్రవర్తించావు. మరల

---

**రక్తసిక్తమైనాయి** రక్తంతో తడవటం.

**అష్షూరు** (అస్సీరియా) పాతనిబంధన కాలంలో చాల ముఖ్యమైన దేశం. ఇశ్రాయేలు రాజుల కాలంలోను, ప్రవక్తల కాలంలోను అష్షూరీయులు ఇశ్రాయేలీయులను జయించి ఏలారు. నీనెవె దీనికి రాజధాని. కాలహు రెండవ రాజధాని.

**ఆ వ్యక్తి ఆ స్త్రీ వద్దకు** మోషే ధర్మశాస్త్ర ప్రకారం తను విడాకులిచ్చిన స్త్రీ మరో వ్యక్తిని వివాహమాడినప్పుడు ఆ వ్యక్తి మరల ఆ స్త్రీ వద్దకు వెళ్లటం నిషిద్ధం. ఒకవేళ ఆమె నూతన భర్త ఆమెకు విడాకులిచ్చినా, లేక చనిపోయినా, ఆమె మొదటి భర్త తిరిగి ఆమెను వివాహం చేసికోవటం ధర్మశాస్త్ర విరుద్ధం.

నీవిప్పుడు నా వద్దకు రావాలని కోరుతున్నావా?"
అని యెహోవా పలికాడు.
2 యూదా, దిశగా ఉన్న కొండ శిఖరాలను చూడు.
నీవక్కడ తిరుగని చోటు ఉందా? నీవు బాట
పక్కన విటుల (అబద్ధపు దేవుళ్ల) కోసం వేచి
వున్నావు. ఎడారిలో కూర్చున్న అరబీయునివలె
నీవక్కడ కూర్చున్నావు. నీవు దేశాన్ని 'అపవిత్రం'
చేశావు! ఏమైనంటావా? నీవు చాలా దుష్కార్యాలు
చేశావు. నీవు నాకు విశ్వాసపాత్రంగా లేవు.
3 నీవు పాపం చేశావు. అందుచే వర్షాలు లేవు.
వసంత కాలపు వానలూ లేవు. అయినా నీ ముఖ
లక్షణాలు వేశ్యాలక్షణాల్లా ఉన్నాయి. నీ అకృత్యా
లకు సిగ్గుపడటంకూడా మానివేశావు.
4 కాని నీవు నన్నిప్పుడు పిలుస్తున్నావు. 'నా తండ్రీ'
నా బాల్యంనుండి 'నీవు నాకు ప్రియ మిత్రునిలా
ఉన్నావు.'
5 'దేవుడు నా పట్ల ఎల్లప్పుడూ కోపంగ ఉండడు.
దేవుని కోపం అల్పమైనది. అది శాశ్వతంగా
ఉండదు' అని అంటున్నావు. "యూదా, నీవీ
విషయాలు అంటూనే నీవు ఎంత చెడు చేయ
గలవో అంతా చేస్తున్నావు."

### చెడ్డ తోబుట్టువులు – ఇశ్రాయేలు మరియు యూదా

6రాజైన యోషీయా యూదా రాజ్యాన్ని పాలించే
కాలంలో యెహోవా నాతో మాట్లాడినాడు. ఆయన
ఇలా అన్నాడు: "యిర్మీయా, ఇశ్రాయేలు* చేసిన
చెడ్డపనులు నీవు చూశావు. నా పట్ల ఆమె ఎలా విశ్వా
సరహితంగా ఉన్నదో నీవు చూశావు! ప్రతి కొండమీద,
ప్రతి పచ్చని చెట్టు కింద విగ్రహాలతో వ్యభిచరించిన
పాపానికి ఇశ్రాయేలు పాల్పడింది. 7'ఈ చెడు కార్యా
లన్నీ చేయటం పూర్తయిన పిమ్మట ఇశ్రాయేలు
తప్పక నావద్దకు తిరిగి వస్తుంది' అని నేననుకున్నాను.
కాని ఆమె నా వద్దకు రాలేదు. విశ్వాస ఘాతకురాలైన
ఇశ్రాయేలు సోదరియగు యూదా ఆమె ఏమి చేసిందో
చూసింది. 8ఇశ్రాయేలు విశ్వాసపాత్రంగా లేదు. ఆమెను
నేనెందుకు పంపి వేశానో ఇశ్రాయేలుకు తెలుసు. ఆమె
వ్యభిచార దోషానికి పాల్పడినందుకే నేనామెకు విడాకు
లిచ్చానని ఇశ్రాయేలుకు తెలుసు. కాని అది విశ్వాస
ఘాతకురాలైన ఆమె సోదరిని భయపెట్టలేదు.
యూదా భయపడలేదు. యూదాకూడా తెగించి వ్యభి
చారిణిలా ప్రవర్తించింది. 9తానొక మరుగులేని వ్యభి
చారిణిలా ప్రవర్తిస్తున్నాననే చింతన చేయలేదు. అలా
ఆమె తన దేశాన్ని 'మలిన' (అపవిత్ర)పర్చింది.
రాతితోను, చెక్కలతోను చేసిన విగ్రహాలను ఆరాధించి,
వ్యభిచార పాపానికి ఒడిగట్టుకుంది. 10ఇశ్రాయేలు
యొక్క విశ్వాస ఘాతకురాలైన సోదరి (యూదా)
హృదయ పూర్వకంగా నావద్దకు తిరిగి రాలేదు.
నావద్దకు తిరిగి వచ్చినట్లు ఆమె నటించింది." ఈ
వాక్కు యెహోవా నుండి వచ్చినది.

11యెహోవా నాతో ఇలా చెప్పినాడు "ఇశ్రాయేలు
నాకు విశ్వాసపాత్రంగా లేదు. విశ్వాసం లేని యూదా
కంటె ఇశ్రాయేలుకు చెప్పుకొనేందుకు ఒక మంచి
సాకు వుంది. 12యిర్మీయా, నీవు వెళ్లి ఈ వర్తమానాన్ని
ఉత్తర దేశంలో చెప్పు:

'విశ్వాసంలేని ఇశ్రాయేలీయులారా తిరిగి రండి.'
ఇది యెహోవా వాక్కు. 'నిన్ను చూచి ముఖం
తిప్పుకోను. నేను నిండు దయతో ఉన్నాను.'
ఈ వాక్కు యెహోవాది. 'నీపట్ల నేను శాశ్వత
మైన కోపంతో ఉండను.
13 నీవు నీ పాపాన్ని గుర్తించాలి. నీ యెహోవా
దేవునికి నీవు వ్యతిరేకమయ్యావు నీ పాపం అదే.
ఇతర దేశాలనుండి వచ్చిన వారి విగ్రహాలను
నీవు ఆరాధించినావు నీవు ప్రతి పచ్చని చెట్టు
కిందా విగ్రహారాధన చేశావు నీవు నా ఆజ్ఞను
మన్నించలేదు."' ఇదే యెహోవా వాక్కు.

14"విశ్వాసంలేని ప్రజలారా, నావద్దకు రండి" అని
యెహోవా అంటున్నాడు "నేను మీ యజమానిని.
ప్రతి నగరంనుంచీ ఒక్కొక్క వ్యక్తిని, ప్రతి కుటుంబం
నుంచీ ఇద్దరు మనుష్యులను తీసుకొని మిమ్మల్ని
సీయోనుకు తీసుకొని వస్తాను. 15అప్పుడు మీకు
నూతన కాపరులను (పాలకులు) ఇస్తాను. ఆ పాలకులు
నాకు విశ్వాస పాత్రులై ఉంటారు. వారు జ్ఞానంతోను,
అవగాహనతోను మిమ్మల్ని నడిపిస్తారు.

16ఆ రోజుల్లో, రాజ్యంలో మీ సంతతి పెరిగి మీర
నేకులై ఉంటారు." ఈ వాక్కు యెహోవాది.

"ఆ సమయంలో ప్రజలు తాము దేవుని నిబంధన
మందసాన్ని కలిగివున్న రోజులు గుర్తున్నట్లు చెప్పరు.
ఆ యెహోవా ఒడంబడికను గూర్చి వారెంత మాత్రం
తలంచరు. వారు దానిని గుర్తుంచుకోరు. పోగొట్టు
కోరు. వారు మరో పవిత్ర ఒడంబడికను చేయరు.
17ఆ సమయంలో యెరూషలేము నగరం 'యెహోవా
సింహాసనం' అని పిలువబడుతుంది. దేశ దేశాల ప్రజలు
యెరూషలేము నగరంలో కలిసి యెహోవాను
స్మరించి ఆయన నామాన్ని గౌరవిస్తారు. ప్రజలు తమ
మొండి హృదయాలను ఇక ఎంత మాత్రం అను
సరించరు. 18ఆ రోజుల్లో యూదా వంశం ఇశ్రాయేలు
వంశంతో కలుస్తుంది వారు ఉత్తర ప్రాంతంలో ఒకే

---

**ఇశ్రాయేలు** ఇక్కడ ఇశ్రాయేలు అనగా ఇశ్రాయేలు యొక్క ఉత్తర ప్రాంతం. యిర్మీయా కాలానికి వంద సంవత్సరాల ముందు అష్షూరు వారిచే ఇశ్రాయేలు నాశనం చేయబడింది.

చోటునుండి కలిసి వస్తారు. వారి పితరులకు నేనిచ్చిన
రాజ్యంలోకి వారు వస్తారు.

19 “యెహోవానైన నేనిలా అనుకున్నాను,
‘మిమ్మల్ని నా స్వంత బిడ్డలవలె చూసుకోవటం
నాకు సంతోషదాయకం. మీకో మంచి రాజ్యాన్ని
వ్వటం నాకు తృప్తినిస్తుంది. ఆ రాజ్యం ఇతర
రాజ్యాలకంటె సుందరంగా ఉంటుంది.’ మీరు
నన్ను ‘తండ్రీ’ అని పిలుస్తారనుకున్నాను. మీరు
నన్ను ఎల్లప్పుడూ అనుసరిస్తారని అను
కున్నాను.
20 కాని తన భర్త పట్ల వంచనగా నడిచే స్త్రీవలె
మీరు తయారయ్యారు. ఇశ్రాయేలు వంశమా,
నీవు నా పట్ల విశ్వాస పాత్రంగా మెలగ లేదు!”
ఇది యెహోవా నుండి వచ్చిన వర్తమానం.
21 నగ్నంగా ఉన్న కొండలమీద రోదన నీవు విన
వచ్చు. ఇశ్రాయేలు ప్రజలు దయాభిక్ష కోరు
కుంటూ ఏడుస్తూ ప్రార్థన చేస్తున్నారు. వారు
బహు దుష్టులైనారు! వారు తమ యెహోవా
దేవున్ని మర్చిపోయారు.

22 “విశ్వాసఘాతకులగు ఇశ్రాయేలీయులారా
నావద్దకు తిరిగి రండి.

నన్నాశ్రయించి రండి. నా పట్ల వంచనతో
మెలిగినందుకు క్షమిస్తాను.” “అవును. మేము నీ
వద్దకు వస్తాము. నీవు మా యెహోవా దేవుడవు
23 కొండల మీద విగ్రహాలను పూజించుట
అవివేకం. కొండలమీద ఆడంబరంగా జరిగే
పూజా కార్యక్రమమంతా మోసం. నిజానికి, ఇశ్రా
యేలుకు రక్షణ యెహోవా దేవుని వద్దనుండే
వస్తుంది.
24 ఆ భయంకరమైన బయలుదేవత మన తండ్రుల
ఆస్తిని మ్రింగివేసింది. మనం పిల్లలం కావటంతో
ఇదంతా జరిగింది. ఆ భయంకరమైన దేవత*
మన తండ్రుల గొర్రెలను, పశువులను, వారి
కుమారులను, కుమార్తెలను చంపింది.
25 మనం సిగ్గుతో తలవంచుకుందాం. మన అవ
మానం మనల్ని దుప్పటిలా కప్పివేయనీయండి.
మన యెహోవా దేవునిపట్ల మనం తీవ్రమైన
పాపం చేశాం. మనం, మన తండ్రులు కూడా
పాపానికి ఒడిగట్టాము. మన చిన్నతనం నుండి
ఇప్పటివరకు యెహోవా దేవుని ఆజ్ఞను మనం
పాటించలేదు” అని చెప్పాలి.

---

**ఆ భయంకరమైన దేవత** ఇక్కడ బయలు దేవతకు
అన్వయం.

4 ఇదే యెహోవా వాక్కు. “ఇశ్రాయేలూ, నీవు
రావాలనుకుంటే, తిరిగి నా వద్దకు రమ్ము నీ
విగ్రహాలను విసరివేయి! నానుండి దూరంగా
పోవద్దు!
2 నీవు ఆ విధంగా చేస్తే, నీవు ప్రమాణం చేయటానికి
ఈ మాటలు చెప్పగలవు ‘నిత్యుడైన యెహోవా
తోడు’ అని నీవనగలవు నీవీ మాటలు సత్యమైన,
న్యాయమైన, నీతిమార్గాన పలుకగలవు. నీవీ
పనులు చేస్తే, యెహోవా రాజ్యాలను దీవిస్తాడు.
యెహోవా చేసిన పనులను వారు పొగడుతారు.”
3 యూదా ప్రజలకు, యెరూషలేము నగరవాసు
లకు యెహోవా ఇలా చెపుతున్నాడు: “మీ
భూములు దున్నబడలేదు. వాటిని దున్నండి!
ముండ్లపొదలలో విత్తనాలు చల్లవద్దు.
4 యెహోవా యొక్క ప్రజలుగా మీరు తయారు
కండి. మీ హృదయాలను మార్చుకోండి.*
యూదా ప్రజలారా, యెరూషలేము వాసులారా,
మీలో పరివర్తన రాకపోతే నాకు చాలా కోపం
వస్తుంది. నా కోపం అగ్నిలా ప్రజ్వరిల్లుతుంది.
నా కోపం మిమ్మల్ని దహించి వేస్తుంది. ఆ అగ్ని
జ్వాలల్ని ఎవ్వరూ ఆర్పలేరు! అసలు ఇదంతా
ఎందుకు జరుగుతుంది? మీరు చేసిన పాపకార్యాల
వల్లనే ఇదంతా జరుగుతుంది.

### ఉత్తర దిశ నుండి విపత్తు

5 “ఈ వర్తమానాన్ని యూదా ప్రజలకు ప్రక
టించుము: యెరూషలేములో ప్రతి పౌరునికి
తెలియజేయుము, దేశమంతా బూర వూది బాహా
టంగా ఇలా చెప్పుము, ‘మీరంతా కలిసి రండి!
రక్షణకై మనమంతా బలమైన నగరాలకు
తప్పించుకుపోదాం!’
6 సీయోను వైపుకు సంకేత ధ్వజాన్ని ఎగుర
వేయుము. మీ ప్రాణరక్షణకై పారిపొండి!
ఆలస్యం చేయవద్దు! ఇది మీరు త్వరగా
చేయండి. ఎందువల్లననగా ఉత్తర దిశనుండి*

---

**యెహోవా ... మార్చుకోండి** “ప్రభువు పేరిట సున్నతి
సంస్కారం కలిగివుండండి. మీ హృదయాల మీది పొరను
కత్తిరించండి” అని పాఠాంతరం. ఒకవ్యక్తి తను దేవుని పక్షాన
వున్నట్లు తెలుపుటకు తన మర్మావయవము మీది ముందు
చర్మాన్ని కత్తిరించుట ఇశ్రాయేలీయుల సాంప్రదాయం. కాని
నిజమైన సున్నతి సంస్కారం వ్యక్తియొక్క హృదయం
(మనస్సు)లో మొదలవుతుందని యిర్మీయా చెపు
తున్నాడు.

**ఉత్తర దిశనుండి** యూదా రాజ్యం మీదికి బబులోను సైన్యం
ఈ దిశనుండే దండెత్తి వచ్చింది. ఇశ్రాయేలుకు పశ్చిమంగా,
ఉత్తరంగా వున్న దేశాల సైన్యాలు తరుచు యూదా, ఇశ్రా
యేలు మీదికి దండెత్తి వచ్చేవి.

నేను విపత్తును తీసుకొని వస్తున్నాను. నేను అతి భయంకరమైన వినాశనాన్ని తీసుకొని వస్తున్నాను.

7 తన గుహనుండి ఒక "సింహం బయటికి వచ్చింది. రాజ్యాలను నాశనం చేసేవాడు కదలి వస్తున్నాడు. నీ రాజ్యాన్ని సర్వ నాశనం చేయటానికి అతడు ఇల్లు వదిలి వస్తున్నాడు. నీ పట్టణాలు ధ్వంస మవుతాయి. వాటిలో నివసించటానికి ఒక్కడూ మిగలడు.

8 కావున నారబట్టలు* ధరించండి. మిక్కిలిగా విల పించండి! ఎందువల్లనంటే యెహోవా మీపట్ల చాలా కోపంగా ఉన్నాడు."

9 ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది. "ఇది జరిగే సమయంలో రాజు, ఇతర నాయ కులు తమ ధైర్యాన్ని కోల్పోతారు. యాజకులు బెదరిపోతారు! ప్రవక్తలు భయపడి, విస్మయం పొందుతారు!"

10అప్పుడు యిర్మీయానైన నేను ఇలా చెప్పాను, "నా ప్రభువగు యెహోవా, నీవు నిజంగా యూదా, యెరూషలేము ప్రజలను మోసపుచ్చావు. 'మీకు శాంతి కలుగుతుంది' అని వారికి చెప్పియున్నావు. కాని ఇప్పుడు వారి గొంతులమీద కత్తి ఉంది!"

11 ఆ సమయంలో యూదా, యెరూషలేము ప్రజ లకు ఒక వర్తమానం ఇవ్వబడుతుంది: "వట్టి కొండలపైనుండి వేడిగాలి వీస్తుంది. అది ఎడారి నుండి నీ ప్రజల మీదికి వీస్తుంది. అది రైతులు నూర్చిన ధాన్యం పోతపోయటానికి పనికి వచ్చే పైరుగాలిలాంటిది కాదు.

12 ఇది దీనికంటె బలమైన గాలి; పైగా అది నావద్ద నుండి వీస్తుంది. ఇప్పుడు, యూదా ప్రజలపై నా న్యాయనిర్ణయం ప్రకటిస్తాను."

13 చూడు, శత్రువు మేఘంలా లేచి వస్తాడు! అతని రథాలు సుడిగాలిలా కన్పిస్తాయి! అతని గుర్రాలు గ్రద్దలకంటె వేగం కలవి! అది మనకు హానికరం! మనం సర్వ నాశనమయ్యాము!

14 యెరూషలేము ప్రజలారా, మీ హృదయాలనుంచి చెడును కడిగి వేయండి. మీరు పరిశుద్ధ హృద యాలు కలిగి ఉండండి; తద్వారా మిమ్మల్ని మీరు రక్షించుకోండి. దుష్ట ఆలోచనలు చేయటం మానివేయండి.

15 వినండి! దానునుండి* వచ్చిన వార్తాహరుడు మాట్లాడుతున్నాడు. కొండల ప్రాంతమైన ఎఫ్రా యిము* నుండి ఇతడు దుర్వార్త తెస్తున్నాడు.

16"దానిని ఈ దేశమంతా ప్రకటించండి. ఆ వార్తను యెరూషలేము నగరవాసులకు తెలియ జేయండి. బహుదూరపు దేశంనుండి శత్రువు వస్తు న్నాడు. యూదా నగరాలపై శత్రువులు యుద్ధ ధ్వని చేస్తున్నారు.

17 చేను చుట్టూ పంటను కాపాడే మనుష్యులు న్నట్లు యెరూషలేమును శత్రువులు చుట్టుముడ తారు యూదా, నీవు నాకు ఎదురు తిరిగావు! అందువల్లనే శత్రువు నిన్నెదిరించి వస్తున్నాడు!" ఇది యెహోవా వాక్కు.

18 నీవు నివసించిన తీరు, నీవు చేసిన దుష్కార్యాలే ఈ విపత్తును తీసికొని వచ్చాయి. నీ దుష్ట జీవితమే నీ గుండెల్ని చీల్చే బాధను తెచ్చింది."

## యిర్మీయా రోదన

19 అయ్యయ్యో, నా దుఃఖం, ఆవేదనతో నేను మూలుగుచున్నాను. నేను బాధతో క్రుంగి పోతు న్నాను. అయ్యో, నేను భయ భ్రాంతుడ నయ్యాను. నాలో నా గుండె దద్దరిల్లుతూ ఉంది. నేను ప్రశాంతంగా ఉండలేను. ఎందువల్లనంటే నేను బూర ధ్వని విన్నాను. అది యుద్ధ నాదం. సైన్యాన్ని అది పిలుస్తోంది!

20 ఒకదాని తరువాత ఒకటి ఆపదల పరంపర! దేశం యావత్తూ సర్వనాశనమయ్యింది. అనుకోని విధంగా నా డేరాలన్నీ నాశనం చేయబడ్డాయి! నా పరదాలు (తెరలు) చించబడ్డాయి!

21 యెహోవా, నేనెంత కాలం యుద్ధ ధ్వజాలను చూడాలి? ఎంతకాలం యుద్ధ నాదం నేను వినాలి?

22 దేవుడు ఇలా అన్నాడు: "నా ప్రజలు మూర్ఖులు. వారు నన్నెరుగరు. వారు మంద బుద్ధిగల పిల్లల వలె ఉన్నారు. వారికి అవగాహనే లేదు. కాని వారు చెడు చేయటంలో నేర్పరులు. మంచి పని ఎలా చేయాలో వారికి తెలియనే తెలియదు."

---

**నారబట్టలు** మృతుల కోసం సంతాప సూచకంగా ధరించే ఒక రకమైన ముతకబట్ట.

**దానునుండి** దాను వంశస్థులు ఇశ్రాయేలు దేశపు ఉత్తర భాగాన సరిహద్దుల్లో స్థిరపడ్డారు. ఉత్తరంనుండి వచ్చే విప త్తులో ముందుగా శత్రువు వాత పడేది వారే.

**ఎఫ్రాయిము** ఇశ్రాయేలు యొక్క ఉత్తర రాజ్యాలలో ఎఫ్రాయిము మధ్యప్రాంతంగా ఉండేది.

### ముంచుకు వచ్చే ముప్పు

23 నేను భూమివైపు చూశాను. భూమి ఖాళీగా ఉంది;
దానిపై ఏమీ లేదు. నేను ఆకాశం వైపు చూశాను.
వెలుగు పోయింది.*
24 నేను పర్వతాల వైపు చూశాను, అవి కదిలిపోతు
న్నాయి. కొండలన్నీ కంపించి పోతున్నాయి.
25 నేను చూడగా, అక్కడ మనుష్యులు లేరు. ఆకా
శంలో పక్షులు లేకుండా పోయాయి.
26 నేను చూడగా సుక్షేత్రమైన రాజ్యం ఎడారిలా
కన్పించింది. ఆ రాజ్యంలో నగరాలన్నీ సర్వనాశన
మయ్యాయి. ప్రభువే ఇదంతా కలుగజేశాడు.
అధికమైన యెహోవా కోపమే దీనిని కలుగ
చేసింది.
27 యెహోవా ఇలా అన్నాడు: "దేశం యావత్తూ
నాశనమవుతుంది. (కానీ దేశాన్ని పూర్తిగా నాశనం
చేయను)
28 అందువల్ల దేశంలో మిగిలినవారు చనిపోయిన
వారి కొరకు విలపిస్తారు. ఆకాశం చీకటవుతుంది.
నా మాటకు తిరుగులేదు. నేనొక నిర్ణయాని
కొచ్చాను; మరల నేను మనస్సు మార్చుకోను."
29 గుర్రపు రౌతుల రవాళింపులు, విలుకాండ్ర శబ్దా
లను యూదా ప్రజలు విని పారిపోతారు!
కొందరు గుహలలో దాగుకొంటారు. కొంత
మంది పొదలలో తలదాచుకుంటారు. మరి
కొందరు కొండల మీదికి ఎక్కుతారు. యూదా
నగరాలన్నీ నిర్మానుష్యమవుతాయి. అక్కడ
ఎవ్వరూ నివసించరు.
30 యూదా, నీవు నాశనం చేయబడ్డావు. నీవేమి
చేస్తున్నావు? నీ అందమైన ఎర్రని దుస్తులు
ఎందుకు ధరించావు? నిన్ను బంగారు ఆభర
ణాలతో ఎందుకు అలంకరించుకొన్నావు? నీ
కంటికి అలంకరణ ఎందుకు చేసుకున్నావు? నీ
అలంకరణ వ్యర్థం. నీ ప్రేమికులు నిన్నసహ్యించు
కుంటారు. వారు నిన్ను చంపాలని చూస్తున్నారు.
31 ప్రసవ వేదనలో స్త్రీ అరచినట్లుగా నేనొక రోదన
విన్నాను. అది ప్రథమ కాన్పులో స్త్రీ పడిన
వేదనవంటిది. అది సీయోను కుమార్తె* రోదన.
ఆమె చేతులెత్తి ప్రార్థిస్తూ, "అయ్యో, నేను
మూర్ఛపోతున్నాను! హంతకులు నన్ను చుట్టు
ముట్టారు!" అని అంటున్నది.

---

**భూమి ... పోయింది** యిర్మీయా తన దేశాన్ని భూమి మీద జీవరాసులను సృష్టించే ముందున్న కాలానికి పోల్చి చూశాడు. (చూడండి: ఆదికాండము 1:1.)

**సీయోను కుమార్తె** యెరూషలేము నగరానికి ఇది మరోపేరు.

### యూదా వారి దౌష్ట్యం

5 "యెరూషలేము నగర వీధులలో తిరుగుతూ
చుట్టు పక్కల పరిశీలిస్తూ ఈ విషయాలపై
ఆలోచించు. నగర కూడలి స్థలాలలో వెదకి ఏ
ఒక్కడైనా మంచి వ్యక్తి కనిపిస్తాడేమో చూడు. నీతిగా
వ్యవహరించే ఏ ఒక్కడు గాని, సత్యాన్వేషిగాని ఉన్నా
డేమో చూడు. ఏ ఒక్క మంచి వ్యక్తిని చూడ గలిగినా,
నేను యెరూషలేమును క్షమిస్తాను!
2 ప్రజలు ప్రమా
ణాలు చేస్తూ 'నిత్యుడైన యెహోవాతోడు' అంటారు.
కాని అది పేరుకు మాత్రం. వారు చెప్పింది చేయరు."

3 యెహోవా, నీవు ప్రజలలో నమ్మకస్థులకై
చూస్తున్నావని నాకు తెలుసు. యూదా వారిని
నీవు కొట్టావు, అయినా వారికి నొప్పి కలుగలేదు.
వారిని నాశనం చేశావు, అయినా వారొక గుణపాఠం
నేర్చుకోటానికి తిరస్కరించారు. వారు మొండి
వైఖరి దాల్చారు. వారి దుష్కార్యాలకు వారు
చింతించ నిరాకరించారు.
4 కాని నేను (యిర్మీయా) ఇలా అనుకున్నాను:
"కేవలం పేద మరియు సామాన్య వర్గాల వారే
అలా మూర్ఖులై వుండాలి. వారే యెహోవా
మార్గాన్ని అనుసరించటం నేర్చుకోలేదు. పేదలు
వారి దేవుని బోధనలు తెలుసుకోలేదు.
5 కావున యూదా ప్రజల నాయకుల వద్దకు నేను
వెళతాను. నేను వారితో మాట్లాడతాను. నాయ
కులు తప్పక యెహోవా మార్గాన్ని మరియు
ఉపదేశాలను అర్థం చేసికుంటారు. వారి దేవుని
న్యాయమార్గం వారికి తెలుస్తుందనే నమ్మిక నాకు
ఉంది!" కాని నాయకులంతా యెహోవా సేవను
నిరాకరించే నిమిత్తం ఏకమైనారు.*
6 వారు దేవునికి వ్యతిరేకులైనారు. అందువల్ల
అరణ్యంలోనుండి ఒక సింహం వారిని ఎదిరిస్తుంది.
ఎడారిలో నుండి ఒక తోడేలు వచ్చి వారిని చంపు
తుంది. వారి నగరాల దాపున ఒక చిరుత పులి
పొంచి ఉంది. నగరంలో నుంచి ఎవడు బయటికి
వచ్చినా చిరుత పులి చీల్చి చెండాడుతుంది.
యూదా ప్రజలు మరల మరల చేసిన పాపాల
ఫలితంగా ఇదంతా జరుగుతుంది. అనేక పర్యాయ
ములు వారు యెహోవాకు దూరమైనారు."
7 దేవుడిలా అన్నాడు: "యూదా, నేను నిన్నెందుకు
క్షమించాలో ఒక కారణం చూపించు. నీ పిల్లలు
నన్ను త్యజించారు. దేవుళ్లే కానటువంటి వ్యర్థమైన
విగ్రహాలకు వారు ప్రమాణాలు చేశారు. నీ సంతా
నానికి కావలసిన ప్రతీది నేను యిచ్చి వున్నాను.

---

**కాని ... ఏకమైనారు** అక్షరార్థంగా వారు కాడి విరిచి, బంధాలను తెంచుకున్నారు.

అయినా వారింకా నా పట్ల విశ్వాసఘాతకులై
ఉన్నారు! వారెక్కువ కాలం వ్యభిచార గృహాల
లోనే గడిపారు
8 వారు తినటానికి సమృద్ధిగా ఉండి, సంభోగించ
టానికి సిద్ధంగా ఉన్న గుర్రాలవలె ఉన్నారు.
పొరుగువాని భార్య కోసం మదించి సకిలిస్తున్న
గుర్రంలా వున్నారు.
9 ఈ పనులన్నీ చేసినందుకు యూదా ప్రజలను
నేను శిక్షించవద్దా?" ఇదే యెహోవా వాక్కు.
"అవును! ఇటువంటి దేశాన్ని నేను శిక్షించాలి
గదా. వారికి తగిన శిక్ష విధించాలి.
10 యూదా వారి ద్రాక్షతోటల వరుసలగుండా వెళ్లు.
ద్రాక్ష లతలన్నీ నరికివేయుము. (కాని వాటిని
మొద్దులను నరికి నాశనం చేయవద్దు). వాటి
కొమ్మలన్నీ నరికివేయి. ఎందువల్లనంటే, ఈ
తీగెలు యెహోవాకు చెందినవికావు.*
11 ఇశ్రాయేలు వంశీయులు, యూదా వంశీయులు
ప్రతి విషయంలోనూ నాకు విశ్వాసఘాతుకంగా
ఉన్నారు." ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చింది.

12 "యెహోవా విషయంలో ఆ ప్రజలు అబద్ధ
మాడారు. వారిలా అన్నారు: 'యెహోవా
మమ్మల్ని ఏమీ చేయడు. మాకు ఏ రకమైన
కీడూ రాదు. మమ్మల్ని ఏ శత్రు సైన్యం ఎది
రించగా మేము చూడము. మేము ఆకలికి
మాడిపోము.'
13 తప్పుడు ప్రవక్తలు కేవలం వట్టి మాటలు పలుకు
వారు, దేవుని వాక్కు వారియందు లేదు. వారికి
కీడు మూడుతుంది."
14 సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
తెలియజేసాడు: "నేను వారిని శిక్షించనని ఆ
ప్రజలు అన్నారు. కావున యిర్మీయా, నేను
నీకు చెప్పిన మాటలు అగ్నిలా ఉంటాయి. ఆ
ప్రజలు కొయ్యలాంటివారు. అగ్ని ఆ కట్టెనంతా
దహించివేస్తుంది.
15 ఓ ఇశ్రాయేలు వంశీయులారా, యెహోవా ఇలా
చెప్పినాడు: "మీ మీదికి బహు దూరంలో ఉన్న
ఒక దేశాన్ని తీసుకొని వస్తున్నాను.
అది ఒక ప్రాచీన రాజ్యం అది ఒక శక్తివంతమైన
రాజ్యం. మీకు అర్థంకాని భాషను వారు మాట్లాడ
తారు. వారు చెప్పేది మీకు అర్థం కాదు.
16 వారి అమ్ముల పొదులు తెరచిన సమాధుల్లా
వున్నాయి. వారంతా యోధనా యోధులు.
17 మీరు పండించిన పంటనంతా ఆ సైనికులు
తినివేస్తారు. మీ ఆహారాన్నంతా వారు తినివేస్తారు.
మీ కుమారులను, కుమార్తెలను వారు నాశనం
చేస్తారు. వారు మీ గొర్రెల మందలను, పశువుల
మందలను తింటారు. మీ ద్రాక్షాపంటను,
అంజూరపు చెట్లను వారు తింటారు. కత్తులతో
వారు మీ బలమైన నగరాలను నాశనం చేస్తారు.
మీరు నమ్మి తల దాచుకున్న బలమైన నగరాలను
వారు నాశనం చేస్తారు!"
18 యెహోవా ఇలా చెపుతున్నాడు: "కాని ఆ
భయంకరమైన రోజులు వచ్చినప్పుడు, ఓ
యూదా, నేను నిన్ను పూర్తిగా నాశనం కానివ్వను.
19 యూదా ప్రజలు నిన్ను, 'యిర్మీయా, మా
దేవుడైన యెహోవా మాకెందుకీ ఆపద తెచ్చి
పెట్టాడు?' అని అడుగుతారు. అప్పుడు నీవు,
'ఓ యూదా ప్రజలారా, మీరు యెహోవాను
విస్మరించారు. మీ స్వంత దేశంలోనే పరదేశాల
వారి విగ్రహాలను పూజించారు. మీరలా ప్రవర్తిం
చారు గనుక ఇప్పుడు మీరు పరాయి రాజులను
మీకు చెందని రాజ్యంలో సేవించవలసి ఉంది!'
అని సమాధానం చెప్పు.' "
20 యెహోవా ఇలా అన్నాడు: "యాకోబు వంశ
స్తులకు ఈ వర్తమానం అందజేయుము. యూదా
రాజ్యానికి ఈ సమాచారం తెలియజేయుము.
21 బుద్ధిహీనులైన మూర్ఖపు జనులారా ఈ వర్తమానం
వినండి: 'మీకు కళ్లు ఉండికూడా చూడరు! మీకు
చెవులు ఉండి కూడా వినరు!'"
22 నేనంటే మీరు నిజంగా భయపడటం లేదు.' ఈ
వాక్కు యెహోవా నుండి వచ్చినది "మీరు
నాముందు భయంతో కంపించాలి. సముద్రానికి
తీరాన్ని ఏర్పరచిన వాడను నేనే. తద్వారా
సముద్రజలాలు తమ పరిధిలో శాశ్వతంగా
ఉండేలా చేశాను. అలల తాకిడికి సముద్రతీరం
దెబ్బతినదు. అలలు ఘోషిస్తూ తీరాన్ని చేర
తాయి, కాని అవి దానిని దాటిపోవు.
23 కాని యూదా ప్రజలు మొండి వైఖరి వహించారు.
వారు నాకు వ్యతిరేకంగా తిరగటానికి అనేక
మార్గాలు అన్వేషిస్తున్నారు. నాకు విముఖులై,
నానుండి వారు దూరంగా పోయారు.
24 మనం మన దేవుడైన యెహోవా పట్ల భయ
భక్తులు కలిగి ఉండాలని, ఆయన మనకు
శరత్కాల, వసంతకాల వర్షాలు సకాలంలో ఇస్తు
న్నాడనీ, ఆయన సకాలంలో, సవ్యంగా మనం
పంటనూర్పిడి చేసుకొనేలా చేస్తున్నాడనీ'
యూదా ప్రజలు ఎన్నడూ అనుకోలేదు.
25 యూదా ప్రజలారా, మీరు చెడు చేశారు. అందు
వల్ల వర్షాలు లేవు; నూర్పిళ్లు లేవు. నీవు

**యూదా ... చెందినవికావు** ఇక్కడ ప్రవక్త యూదాను ద్రాక్ష
తీగతో పోల్చుతున్నాడు.

యెహోవా ఇచ్చే అనేక మంచి విషయాలను
మీరు అనుభవించకుండా మీ పాపాలు అడ్డు
పడుతున్నాయి.
26 నా ప్రజల మధ్య దుష్ట వ్యక్తులున్నారు. ఆ
దుష్టులు పక్షులను పట్టటానికి వలలు పన్నే
కిరాతకుల్లా* ఉన్నారు. వారు తమ బోనులు
సిద్ధంచేసి పొంచి వుంటారు. కాని వాళ్లు పక్షులకు
బదులు మనుష్యులను పట్టుకుంటారు.
27 పంజరం నిండా పక్షులున్నట్లుగా, ఈ దుష్టుల
ఇండ్ల నిండా అబద్దాలే! వారి అబద్ధాలు వారిని
ధనికులుగా, శక్తివంతులుగా చేశాయి.
28 వారు చేసిన దుష్కార్యాల ద్వారా వారు బాగా
ఎదిగి, కొవ్వెక్కినారు. వారు చేసే అకృత్యాలకు
అంతం లేదు. వారు అనాధ శిశువుల తరపున
వాదించరు. వారు అనాధలను ఆదుకోరు. వారు
పేదవారికి న్యాయం జరిగేలా చూడరు.
29 వారు ఈ కృత్యాలన్నీ చేస్తున్నందుకు యూదా
ప్రజలను నేను శిక్షించవద్దా?" ఈ వాక్కు
యెహోవా నుండి వచ్చినది. "ఈ రకమైన
దేశాన్ని నేను శిక్షించాలని నీకు తెలుసు. వారికి
తగిన శిక్ష నేను విధించాలి."
30 యెహోవా ఇలా అన్నాడు, "యూదా రాజ్యంలో
ఆశ్చర్య కలిగించే ఒక భయానక సంఘటన జరి
గింది. అదేమంటే,
31 ప్రవక్తలు అబద్ధం చెప్పటం; యాజకులు దేన్ని
చేయుటకై ఎంచుకోబడ్డారో దానిని చేయరు.*
నా ప్రజలు దానినే ఆదరించారు. కానీ, ఓ ప్రజ
లారా చివరలో మీరు శిక్షకు గురియైన నాడు
మీరేమి చేస్తారు?"

### శత్రువులు యెరూషలేమును ముట్టడించుట

6 బెన్యామీనీయులారా, మీరు సురక్షిత ప్రాంతా
నికి పారిపోండి! యెరూషలేము నగరం నుండి
పారిపోండి! తెకోవ నగరంలో యుద్ధ సంకేతంగా
బూర వూదండి. బేత్‌హక్కెరెము నగరంలో
హెచ్చరిక ధ్వజాన్ని ఎగురవేయండి! ఉత్తర దిశ*
నుండి ఆపద తొంగిచూస్తూ వున్నది కనుక మీరీ
పనులు చేయండి. మహా భయంకరమైన విపత్తు
మీకు రాబోతూ ఉంది!
2 సీయోను కుమారీ, నీవెంతో అందమైన దానివి,
సుకుమారివి.*
3 కాపరులు తమ గొర్రెల మందలను తోలుకొని
యెరూషలేముకు వస్తారు. వారు నగరం చుట్టూ
తమ గుడారాలు నిర్మించుకుంటారు. ప్రతి
గొర్రెల కాపరీ తన మంద విషయమై తగిన
జాగ్రత్త తీసుకుంటాడు.
4 వారిలా అంటారు: "యెరూషలేము నగరాన్ని
ముట్టడించటానికి తగిన సన్నాహాలు చేయండి.
లేవండి! మధ్యాహ్నం నగరంపై దండెత్తుదాం!
ఇప్పటికే ఆలస్యమైంది. సాయంకాలపు నీడలు
సాగుతున్నాయి.
5 కావున లేవండి! మనం నగరాన్ని రాత్రిపూట
ముట్టడిద్దాం. యెరూషలేము యొక్క రక్షణ దుర్గా
లను కూల్చివేద్దాం!"
6 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెపు
తున్నాడు: "యెరూషలేము చుట్టూ ఉన్న వృక్షా
లను పడగొట్టండి. ఆ కర్రలతో, మట్టితో నగర
గోడకు దిబ్బలు నిర్మించి గోడ ఎక్కటానికి వీలు
కల్పించండి. ఈ నగరం శిక్షించబడాలి. ఈ
నగరంలో అక్రమం తప్ప మరేమీ లేదు.
7 బావి తన నీటిని తాజాగా ఉంచుతుంది. అలాగే,
యెరూషలేము తన దుర్మార్గాన్ని నిత్య నూత
నంగా ఉంచుతుంది. ఈ నగరంలో దౌర్జన్యం,
విధ్వంసం గూర్చి ఎప్పుడూ వింటున్నాను.
యెరూషలేములో అస్వస్థత, గాయాలు నిత్యం
నేను చూస్తూనే ఉన్నాను.
8 యెరూషలేమూ, ఈ హెచ్చరికను ఆలకించు.
మీరు వినకపోతే, మీనుండి నేను వెనుదిరిగి
పోతాను. మీ దేశాన్ని ఒక పనికిరాని ఎడారిగా
మార్చివేస్తాను. అక్కడ ఎవ్వరూ నివసించలేరు!"
9 సర్వశక్తిమంతుడగు యెహోవా ఇలా చెప్పినాడు:
"ఈ రాజ్యంలో మిగిలిన వారినందరినీ ప్రోగు
చేయుము.* నీవు ద్రాక్షతోటలో చివరకు ఏరు
కొనే ద్రాక్షా కాయల్లా కూడదీయుము. ద్రాక్ష
కాయలను ఏరు వాని రీతిగా నీవు ప్రతి తీగను
వెదకుము."
10 నేనెవరితో మాట్లాడగలను? ఎవరిని హెచ్చరించ

---

**నా ప్రజల … కిరాతకుల్లా** ఇక్కడ హెబ్రీ భాష బహు కష్టం గావుండి, భావం స్పష్టంగా అర్థం కాదు.

**యాజకులు … చేయరు** ఇక్కడ హెబ్రీ భాష జటిలమైనది సులభగ్రాహ్యం కాదు.

**ఉత్తరదిశ** ఇది బబులోను సైన్యం ఉత్తర దిశనుండి యూదా రాజ్యంపై దండెత్తి రావటానికి సంబంధించినది.

**సుకుమారివి** ఇచ్చట హెబ్రీ భాష జటిలంగా వుంది. సులభగ్రాహ్యం కాదు.

**ప్రోగు చేయుము** రైతులు పంట కోత సమయంలోను, నూర్పిడి సమయంలోను, కొంత పంటను, ధాన్యాన్ని పొలంలో వదలుట ఆనవాయితి. తద్వారా పేద ప్రజలు, బాటసారులు తమ ఆహారానికి సిద్ధంగా కొంత ధాన్యాన్ని పొందగలుగుతారు. ఈ వదలిన ధాన్యాన్ని తీసికొనే దానికి పరిగ ఏరుకోవటం, లేక ధాన్యపు గింజలు ఏరుకోవటం అని అంటారు.

గలను? నా మాట ఎవరు వింటారు? ఇశ్రాయేలు
ప్రజలు నా హెచ్చరికలు వినపడకుండా తమ
చెవులు మూసుకున్నారు. యెహోవా ఉపదేశ
ములు వారికిష్టము లేదు. కావున నా హెచ్చరికలు
వారు వినలేరు. యెహోవా యొక్క బోధనలను
ప్రజలు సహించరు. యెహోవా మాటలను విను
టకు వారు ఇష్టపడరు.
11 కాని యెహోవా కోపం నాలో (యిర్మీయా)
నిండి ఉంది! దానిని నేను లోపల ఇముడ్చుకో
లేక పోతున్నాను! అప్పుడు యెహోవా ఇలా
అన్నాడు: "నా కోపాన్ని వీధులలో ఆడుకొనే
పిల్లల మీదను, గుమిగూడియున్న యువకుల
మీదను కుమ్మరించు. భార్యాభర్తలిరువురూ
బందీలుగా పట్టుబడుదురు. వృద్ధులు, శత
వృద్ధులు బందీలవుతారు.
12 వారి ఇండ్లు ఇతరులకు ఇవ్వబడతాయి. వారి
పొలాలు, వారి భార్యలు ఇతరులకివ్వబడతారు.
నా చెయ్యెత్తి యూదా రాజ్య ప్రజలను శిక్షి
స్తాను." ఈ వాక్కు యెహోవా నుండి
వచ్చినది.
13 "ఇశ్రాయేలు ప్రజలంతా ఇంకా, ఇంకా ధనం కావా
లని కోరుతారు. కింది వర్గాలనుండి పై తరగతి
వ్యక్తుల వరకు అందరూ ధనాపేక్ష కలిగి
ఉంటారు! ప్రవక్తలు, యాజకులు అంతా కపట
జీవనం సాగిస్తారు.
14 ప్రవక్తలు, యాజకులు నా ప్రజల గాయాలను
మాన్పజూస్తారు. అవేవో స్వల్ప గాయాలుగా
భావిస్తారు. 'ఏమీ పరవాలేదు, ఏమీ పరవాలేదు'
అని అంటారు. కాని, నిజానికి ప్రమాదం చాలా
ఉంది.
15 ప్రవక్తలు, యాజకులు వారు చేయు చెడుకార్యా
లకు సిగ్గుపడాలి! కాని వారికి సిగ్గనేది లేదు.
వారి పాపానికి తగిన కలవరపాటు వారెరుగరు.
అందువల్ల ఇతరులందరితో పాటు వారుకూడా
శిక్షించబడతారు. నేను వారిని శిక్షించేటప్పుడు
వారు నేల కరచేలా కిందికి తోయబడతారు."
ఇది యెహోవా వాక్కు.
16 యెహోవా ఈ విషయాలు చెప్పినాడు:
"నాలుగు మార్గాల కూడలి స్థలంలో నిలబడి
చూడుము. పాతబాట ఏదో అడిగి తెలిసికో.
ఏది మంచి మార్గమో అడిగి తెలుసుకో.
అప్పుడు ఆ మార్గంపై పయనించుము.
అప్పుడు మీరు మీకొరకు విశ్రాంతిని కను
గొంటారు. కాని మీరేమన్నారో తెలుసా? 'మేము
మంచి మార్గంపై పయనించ'మన్నారు.
17 నేను మీపై కాపలా కాయుటకు, కాపలాదారు
లను ఎన్నుకొన్నాను. నేను వారితో చెప్పాను
'యుద్ధ బూర ధ్వని వినండి' అని. కాని
వారన్నారు: 'మేము వినము.'
18 కావున, సర్వదేశవాసులారా వినండి! ఆయా
దేశాల ప్రజలారా, ధ్యానముంచండి.* నేను
యూదా ప్రజలకు చేయబోయే విషయాలను
వినండి!
19 భూలోకవాసులారా, ఇది వినండి: యూదా ప్రజ
లకు నేను ఘోర విపత్తు తెస్తున్నాను. ఎందు
కంటే? ఆ ప్రజలు పన్నిన చెడు పనులన్నిటి
కారణంగానే. వారు నా వర్తమానాలను లెక్కచేయ
నందుకు ఫలితంగా ఇది జరుగుతుంది. నా
న్యాయ మార్గాన్ని అనుసరించటానికి వారు నిరా
కరించారు."
20 యెహోవా ఇలా అన్నాడు: "మీరు షేబ* దేశం
నుండి నాకొరకు ధూపానికై సాంబ్రాణి ఎందుకు
తెస్తున్నారు? దూరదేశాలనుండి సువాసనగల
చెరుకును నాకు నైవేద్యంగా ఎందుకు తెస్తు
న్నారు? మీ దహనబలులు నన్ను సంతోష
పర్చవు! మీ బలులు నన్ను సంతృప్తి పర్చ
జాలవు"
21 అందువల్ల యెహోవా ఇలా చెప్పినాడు:
"యూదా ప్రజలకు నేను సమస్యలు సృష్టిస్తాను.
ప్రజల ఎదుట అడ్డబండలు నేను వేస్తాను.
రాళ్లవలె అవి వుంటాయి. తండ్రులు, కొడుకులు
వాటిపై తూలిపోతారు. స్నేహితులు, పొరుగు
వారు చనిపోతారు."
22 యెహోవా ఇలా అన్నాడు: "ఉత్తర ప్రాంతం
నుండి ఒక సైన్యం వచ్చి పడుతూవుంది. భూమి
పైగల ఒక పెద్ద దేశం దూరంనుండి వస్తూ
వున్నది.
23 సైనికులు విల్లంబులు, ఈటెలు పట్టుకొని
వస్తారు. వారు బహు క్రూరులు. వారికి దయా,
దాక్షిణ్యం ఉండవు. వారు మిక్కిలి శక్తిమంతులు!
వారు గుర్రాలనెక్కి స్వారీ చేస్తూ వచ్చేటప్పుడు
ఘోషించే మహా సముద్రంలా శబ్దం వస్తుంది.
ఆ సైన్యం సర్వ సన్నద్ధమై యుద్ధానికి వస్తుంది.
ఓ సీయోను కుమారీ, ఆ సైన్యం నిన్నెదిరించ
టానికి వస్తూ ఉంది."
24 ఆ సైన్యాన్ని గూర్చిన వర్తమానం మనం
విన్నాము. భయకంపితులమై నిస్సహాయులంగా

---

**సర్వదేశవాసులారా ... ధ్యానముంచండి** ఇచ్చట హెబ్రీ భాష జటిలమై సులభ గ్రాహ్యముగా లేదు.

**షేబ** షేబ దేశం ఇశ్రాయేలుకు దక్షిణంగా వున్నది. అనగా ఇప్పటి సౌదీ అరేబియాలో అది భాగమైవుంది. యిర్మీయా కాలంలో సుగంధ ద్రవ్యాల వ్యాపారంలో షేబ దేశం ప్రఖ్యాతి వహించింది.

ఉన్నాము. కష్టాల ఉచ్చులో పడినట్లు ఉన్నాము.
స్త్రీ ప్రసవవేదన అనుభవించినట్లు మేము బాధలో
ఉన్నాము.
25 మీరు పొలాల్లోకి వెళ్లవద్దు! మీరు బాట వెంబడి
వెళ్లవద్దు. ఎందువల్లనంటే శత్రువువద్ద కత్తు
లున్నాయి. పైగా ఎటు చూచినా ప్రమాదమే
వుంది.
26 ఓ నా ప్రజలారా, మీరు గోనెపట్టలు ధరించండి.
బూడిదలో పొర్లండి.* చనిపోయినవారి కొరకు
బాగా దుఃఖించండి! మీకున్న ఒక్కగానొక్క
కుమారుడు మరణించినట్లు విచారించండి.
ఇవన్నీ మీరు చేయండి; కారణమేమంటే శత్రువు
శరవేగంతో మనపైకి వస్తాడు!
27 "యిర్మీయా, నేను (యెహోవా) నిన్నొక లోహ
పరీక్షకునిగా నియమించినాను. నీవు నా ప్రజల
నడవడిని పరీక్షించు, వారిని గమనిస్తూ ఉండుము.
28 నా ప్రజలే నాకు వ్యతిరేకులయ్యారు; వారు
చాలా మొండివారు. వారు ఇతరుల గురించి
చెడు విషయాలు చెప్తారు. వారు తుప్పుంతో
కప్పబడియున్న కంచు, ఇనుము లాంటివారు.
వారంతా దుష్టులు.
29 నీవొక వెండిని శుద్ధిచేసే పనివానిలా ఉన్నావు.
కొలిమి తిత్తిలో బాగా గాలి వూదబడింది. అగ్ని
ప్రజ్వరిల్లింది. కాని మంటలోనుండి కేవలం సీసం
మాత్రమే వచ్చింది!* శుద్ధ వెండిని చేయాలను
కోవటం వృధా ప్రయాస. వృధా కాలయాపన.
అదే విధంగా నా ప్రజలలో దుర్నడత పోలేదు.
30 'తిరస్కరించబడిన వెండి' వంటివారని నా
ప్రజలు పిలవబడతారు. యెహోవా వారిని
ఆమోదించలేదు గనుక వారికాపేరు పెట్ట
బడింది."

## యిర్మీయా దేవాలయ ప్రసంగం

7 యిర్మీయాకు యెహోవా నుండి ఇలా వర్తమానం
వచ్చింది: [2]"యిర్మీయా, నీవు దేవాలయ ద్వారం
వద్ద నిలబడి, ఈ వర్తమానం ప్రజలకు బోధించుము:
"ఓ యూదా ప్రజలారా యెహోవా వాక్కు ఆల
కించండి! యెహోవా ఆరాధించటానికి ఈ ఆలయ
ద్వారం ద్వారా వచ్చే ప్రజలారా ఈ వర్తమానం వినండి!
[3]సర్వశక్తిమంతుడైన యెహోవా ఇశ్రాయేలీయుల
దేవుడు ఇలా చెపుతున్నాడు, మీ జీవన విధానం మార్చు
కోండి. సత్కార్యములు చేయండి! మీరలా చేస్తే, ఈ
స్థలంలో మిమ్మల్ని నివసించేలాగు చేస్తాను*.
[4]కొందరు వ్యక్తులు చెప్పే అబద్ధాలను మీరు నమ్మ
కండి. "ఇదే యెహోవా ఆలయం;* ఇదే దేవా
లయం; ఇదే దేవాలయం!" అని వల్లిస్తారు. [5]మీరు
మీ జీవితాలను మార్చుకొని మంచి పనులు చేస్తే,
మిమ్మల్ని ఈ ప్రదేశంలో నివసించేలా చేస్తాను. మీరు
ఒకరికొకరు సత్యవర్తనులై మెలగాలి. [6]కొత్తవారి పట్ల
న్యాయం పాటించండి. అనాథ శిశువులకు, విధవ స్త్రీల
సంక్షేమానికి మంచి పనులు చేయండి. అమాయకు
లను చంపవద్దు! ఇతర దేవుళ్లను అనుసరించ వద్దు!
ఎందువల్లనంటే ఆ దేవతలు మీ జీవితాలను నాశనం
చేస్తాయి.
[7]మీరు నా మాట మన్నిస్తే, నేను మిమ్మల్ని ఈ
రాజ్యంలో నివసించేలా చేస్తాను. ఈ రాజ్యాన్ని నేను
మీ పూర్వీకులకు శాశ్వతంగా ఇచ్చాను.
[8]""కాని మీరు అబద్ధాలనే నమ్ముతున్నారు. అబ
ద్ధాలు అప్రయోజనకరమైనవి. [9]మీరు దొంగతనాలు,
హత్యలు చేస్తారా? వ్యభిచార పాపానికి ఒడిగడతారా?
మీరు ఇతరులపై అకారణంగా నేరారోపణ చేస్తారా?
బూటకపు బయలు దేవుణ్ణి ఆరాధిస్తారా? మీకు తెలి
యని ఇతర దేవుళ్లను అనుసరిస్తారా? [10]మీరీ పాపాలు
చేసి, నా పేరుతో పిలవబడే ఈ ఆలయంలో నా
ముందు మీరు నిలవగలమని అనుకొంటున్నారా? ఈ
చోటులో నాముందు నిలబడి "మేము సురక్షితం"
అని ఎలా అనుకోగలరు? మీరీ చెడుకార్యాలు చేయటా
నికి మీకు రక్షణ వుందని అనుకొంటున్నారా? [11]ఈ
ఆలయం నా పేరుతో పిలవబడుతూ ఉంది! అయితే
మీకు ఈ స్థలం ఒక దొంగల గుడారముకంటె భిన్నంగా
కన్పించటం లేదా? నేను మిమ్మల్ని కనిపెడుతూనే
ఉన్నాను!"" ఈ వాక్కు యెహోవా నుండి వచ్చినది!
[12]"యూదా ప్రజలారా, ఇప్పుడు మీరు షిలోహు
నగరానికి వెళ్లండి. అక్కడ నేను మొదటిసారిగా ఎక్క
డైతే నా నామం కోసం ఒక ఇంటిని నిర్మించానో ఆ
చోటుకు వెళ్లండి. ఇశ్రాయేలీయులు కూడ దుష్ట
కార్యాలు చేశారు. వారు చేసిన పాపకార్యాలకు ప్రతిగా

**బూడిదలో పొర్లండి** ప్రజలు యిలా చేస్తే వారు మహా దుఃఖంలో వున్నట్లుగాని, లేక చనిపోయిన వారికొరకు విచారించుచున్నట్లుగాని సూచన.

**అగ్ని ... వచ్చింది** వెండివంటి లోహాలను శుద్ధి చేయటానికి వారు వాటిని కడుగుతారు. అందులోని సీసపు మిశ్రమం ముందుగా కరుగుతుంది. దానిని కంసాలి కిందపోస్తాడు. మూసలో శుద్ధ లోహం మిగిలివుంటుంది. ఇక్కడ ప్రజలంతా చెడ్డవారేనని యిర్మీయా చెపుతున్నాడు. వారు కేవలం సీసంలాంటివారు. అక్కడ వెండి లేనేలేదు.

**ఈ స్థలంలో... చేస్తాను** అంటే, "నేను మీతో ఉంటాను" అని కూడా అర్థం.

**యెహోవా ఆలయం** దేవుని ఆలయం యెరూషలేములో వున్నంత మాత్రాన దేవుడు ఎల్లప్పుడూ యెరూషలేమును రక్షిస్తాడని చాలామంది ప్రజలు అనుకుంటారు. ప్రజలెంత దుష్టులైనా దేవుడు యెరూషలేమును రక్షిస్తాడని వారను కుంటారు.

ఆ స్థలానికి నేను ఏమి చేసియున్నానో వెళ్లి చూడండి.*
13ఇశ్రాయేలీయులారా మీరీ చెడుకార్యాలు చేస్తూ
ఉన్నారు." ఈ వాక్కు యెహోవా నుండి వచ్చినది!
"నేను మీతో అనేక పర్యాయాలు మాట్లాడి
యున్నాను. కాని మీరు వినటానికి నిరాకరించారు.
నేను మిమ్మల్ని పిలిచాను. అయినా మీరు పలకలేదు.
14అందుచే యెరూషలేములో నాపేరు మీద పిలవబడే
ఈ ఆలయాన్ని నాశనం చేస్తాను. షిలోహును నాశనం
చేసినట్లు ఆ ఆలయాన్ని నాశనం చేస్తాను! ఆ ఆల
యంలో మీరు విశ్వాసముంచారు. నేనా స్థలాన్ని మీకు,
మీ పూర్వీకులకు ఇచ్చియున్నాను. 15మీ సోదరుల
నందరినీ నేను ఎఫ్రాయిమునుండి వెడల గొట్టినట్లు,
నానుండి మిమ్మల్ని దూరంగా వెడలగొడతాను.

16"యిర్మీయా, నీవు మాత్రం యూదా ప్రజల
కొరకు ప్రార్థన చేయవద్దు. వారి కొరకు నీవు
అడుగవద్దు; వారి కొరకు నీవు చేసే ప్రార్థన నేను
ఆలకించను. 17యూదా పట్టణాలలో ఆ ప్రజలు ఏమి
చేస్తున్నారో నీవు గమనిస్తున్నావని నాకు తెలుసు.
యెరూషలేము నగర వీధుల్లో వారేమి చేస్తున్నారో
నీవు చూడవచ్చు. 18యూదా ప్రజలు ఏమి చేస్తున్నా
రనగా: పిల్లలు కట్టెలను పోగుచేయటం; తండ్రులు
వాటితో నిప్పు రాజేయటం; స్త్రీలు పిండి కలిపి,
ఆకాశ రాణికి* నివేదించటానికి రొట్టెలు చేయటం,
యూదా ప్రజలు ఇతర దేవతా రాధనలో పానీయార్ప
ణలను కుమ్మరిస్తున్నారు. నాకు కోపం తెప్పించటానికే
ఇవన్నీ చేస్తున్నారు. 19కాని వాస్తవానికి యూదా ప్రజలు
బాధపర్చేది నన్నుగాదు వారిని వారే బాధపర్చుకుంటు
న్నారు. వారిని వారే అవమాన పర్చుకుంటున్నారు"
ఇది యెహోవా వాక్కు,

20కావున యెహోవా ఇంకా ఇలా అంటున్నాడు:
"నా కోపాన్ని ఈ ప్రదేశంపై చూపిస్తాను. నేను మను
ష్యులను, జంతువులను శిక్షిస్తాను. పొలాల్లో చెట్లను,
భూమి మీద పంటను నాశనం చేస్తాను. నా కోపం
ప్రళయాగ్నిలా వుంటుంది. దానిని ఆర్పగల శక్తి
ఎవ్వరికీ లేదు."

### యెహోవా కోరేది బలులు కాదు – విధేయత

21సర్వశక్తిమంతుడైన ఇశ్రాయేలు దేవుడు ఇలా
అంటున్నాడు: "మీరు వెళ్లి మీరు కోరినన్ని దహన
బలులు, సాధారణ బలులు అర్పించండి. తద్వారా
వచ్చిన మాంసాన్ని మీరే తినండి. 22మీ పూర్వీకులను
నేను ఈజిప్టునుండి తీసుకొని వచ్చాను. నేను వారితో
మాట్లాడాను. కాని దహన బలుల గురించి, సాధారణ
బలుల గురించి నేను వారికి ఏ రకమైన ఆజ్ఞలూ
ఇవ్వలేదు. 23వారికి ఈ ఆజ్ఞ మాత్రమే ఇచ్చి
యున్నాను, 'నాకు విధేయులై వుండండి. అప్పుడు
నేను మీ దేవుడనై యుంటాను. మీరు నా ప్రజలై
యుంటారు. నేను చెప్పినదంతా చేయండి. మీకు
శుభం కలుగుతుంది.'

24"కాని మీ పూర్వీకులు నా మాట వినలేదు.
నన్ను లెక్కచేయలేదు. మొండిగా, వారు చేయదలచు
కున్నదంతా చేశారు. వారు సన్మార్గులు కాలేదు. వారు
మరింత దుష్టులయ్యారు. ముందుకు సాగక వెనుకకు
తిరిగారు. 25మీ పూర్వీకులు ఈజిప్టును వదలిన నాటి
నుండి ఈనాటి వరకు నా సేవకులను మీవద్దకు పంపి
యున్నాను. వారే ప్రవక్తలు. వారిని మీ వద్దకు అనేకసార్లు
పంపాను. 26కాని మీ పూర్వీకులు వారి మాట వినలేదు.
వారు నన్ను లెక్కచేయలేదు. వారు మిక్కిలి మొండి
వారు. వారి తండ్రుల కంటె వారు ఎక్కువ చెడు
కార్యాలు చేశారు.

27"యిర్మీయా, నీవు ఇవన్నీ యూదా ప్రజలకు
చెపుతావు. అయినా వారు నీమాట వినరు! నీవు వారిని
పిలుస్తావు. కాని వారు పలుకరు. 28అందువల్ల వారికి
నీవీ మాటలు చెప్పాలి: తన యెహోవా దేవునికి
విధేయతగా లేని దేశం ఇదే. దేవుని ఉపదేశములను
ఈ ప్రజలు వినలేదు. సత్య ప్రవచనాలు ఈ ప్రజలు
ఎరుగరు.

### కసాయి లోయ

29"యిర్మీయా, నీ జుట్టు కత్తిరించి పారవేయి.*
కొండమీదికి వెళ్లి దుఃఖించుము. ఎందుకంటావా?
యెహోవా ఈ తరం ప్రజలను తిరస్కరించినాడు.
ఈ ప్రజలకు యెహోవా విముఖుడైనాడు. కోపంతో
ఆయన వారిని శిక్షిస్తాడు. 30ఏడ్వండి, ఎందుకంటే
యూదా ప్రజలు చెడుకార్యాలు చేయటం నేను చూసి
యున్నాను." ఇది యెహోవా వాక్కు. "వారు విగ్రహా
లను ప్రతిష్ఠించారు. నేనా విగ్రహాలను అసహ్యించు
కుంటున్నాను! నా పేరుతో పిలవబడే ఆలయంలో
వారు విగ్రహాలను పెట్టినారు. నా నివాసాన్ని వారు

---

**వారు ... చూడండి** ఏలీ, సమూయేలు కాలంలో బహుశా ఆ స్థలాన్ని ఫిలిష్తీయులు నాశనం చేసివుండవచ్చు. సమూయేలు మొదటి గ్రంథం చూడండి.

**ఆకాశ రాణి** బహుశా బూటకపు దేవతైన అష్తారోతు కావచ్చు. ఆమె కామశాస్త్ర, యుద్ధ శాస్త్రాదుల ఆధి దేవత అని చెప్ప బడింది. మెసపొటేమియ (అరాము లేక ప్రస్తుత ఇరాక్ దేశ ప్రాంతం) ప్రజలు ఆనాడు ఈ దేవతను ఆరాధించారు. ఆకాశంలో నక్షత్రంలా కనపడే వీనస్ (శుక్ర) గ్రహం అని వారు తలచేవారు. (ఆకాశ రాణి అని పాఠాంతరం)

**కత్తిరించి పారవేయి** ఈ పని విచారాన్ని తెలియ పరుస్తుంది. ఆయన రాజ్యంతో మాట్లాడుతూ, తన భయంకర స్థితిని గూర్చి ఏడ్వమని చెప్తున్నాడు.

అపవిత్రపర్చారు. 31యూదా ప్రజలు బెన్ హిన్నోము
లోయలలో తోఫెతు అనబడే ఉన్నత స్థలాలు*
నిర్మించారు. వారక్కడ తమ కుమారులను, కుమార్తె
లను చంపి వారిని బలులుగా సమర్పించారు. ఇటు
వంటిది నేనెన్నడూ ఆజ్ఞాపించలేదు. ముందెన్నడూ
ఈ రకమైన ఆలోచనే నా మనస్సుకు రాలేదు! 32కావున
నిన్ను హెచ్చరిస్తున్నాను. ప్రజలు ఈ స్థలాన్ని తోఫెతు
అనిగాని, బెన్ హిన్నోములోయ అనిగాని పిలవకుండా
వుండే రోజులు వస్తున్నాయి" ఇది యెహోవా వాక్కు.
పైగా వారు దీనిని కసాయి లోయ* అని పిలుస్తారు.
"వారు ఈ పేరు పెడతారు కారణమేమంటే తోఫెతులో
ఏమాత్రం ఇంకెవ్వరినీ పాతిపెట్టేందుకు ఖాళీ లేకుండా
చనిపోయిన వారిని పాతిపెడతారు. 33తరువాత శవాలను
వట్టి నేలపై పడవేస్తారు. అవి పక్షులకు ఆహారమ
వుతాయి. ఆ శవాలను అడవి జంతువులు పీక్కొని
తింటాయి. శవాలను తినే పక్షులను, జంతువులను
తోలి వేయటానికి అక్కడ బతికి వున్న మనుష్యు
డొక్కడూ మిగలడు. 34యూదా పట్టణాలలోను,
యెరూషలేము నగర వీధులలోను ఆనందోత్సాహాలు
లేకుండా చేస్తాను. యూదాలోను, యెరూషలేము
లోను పెండ్లి సందడులు, వేడుకలు ఇక వుండవు. ఈ
రాజ్యం పనికిరాని ఎడారిలా మారిపోతుంది."

8 ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది:
"ఆ సమయంలో యూదా రాజులయొక్క, ముఖ్య
పాలకుల యొక్క ఎముకలను ప్రజలు సమాధుల
నుండి తీస్తారు. వారు యాజకుల యొక్క, ప్రవక్తల
యొక్క ఎముకలను సమాధులనుండి తీస్తారు. యెరూ
షలేము ప్రజల ఎముకలను కూడ వారి సమాధుల
నుండి తీస్తారు. 2ఆ మనుష్యులు ఆ ఎముకలను
ఆరుబయట సూర్యునికి, చంద్రునికి, నక్షత్రాలకు కన
పడేలా పడవేస్తారు. యెరూషలేము ప్రజలు సూర్య
చంద్రులను, నక్షత్రాలను ఆరాధించటానికి యిష్టపడ
తారు. ఆ ఎముకలను తిరిగి ఎవ్వరూ ప్రోగుచేసి
పాతిపెట్టరు. కావున ఆ యెముకలన్నీ పశువుల పేడవలె
బయట పారవేయబడును.

3"యూదా ప్రజలు వారి ఇండ్లను, రాజ్యాన్ని వదిలి
పోయేలా నేను ఒత్తిడి చేస్తాను. ఆ ప్రజలు వారి దేశా
న్నుండి పరరాజ్యానికి తీసికొని పోబడతారు.
యుద్ధంలో చావగా మిగిలిన యూదా ప్రజలు (ఈ
దుష్ట ప్రజలు) తాము కూడ చనిపోతే బాగుండేదని
భావిస్తారు," ఈ వాక్కు యెహోవా నుండి వచ్చినది.

### పాపము శిక్ష

4యిర్మీయా, ఈ విషయం యూదా ప్రజలకు
తెలియజేయుము: యెహోవా ఈ విషయాలు
చెప్పినాడు

"ఒక వ్యక్తి కింద పడితే తిరిగి లేస్తాడని మీకు
తెలుసు. ఒక వ్యక్తి తప్పుదారిలో వెళ్లితే అతడు
మరల తిరిగి వెనుకకు వస్తాడు.
5 యూదా ప్రజలు చెడు జీవితం గడిపారు. కాని
యెరూషలేము ప్రజలు ఎప్పుడూ ఎందుకు
పెడమార్గాన వెళ్లుచున్నారు. వారి అబద్ధాలను
వారే నమ్ముతారు. వారు వెనుదిరిగి రావటానికి
నిరాకరిస్తారు.
6 వారు చెప్పేది నేను బహు శ్రద్ధగా ఆలకించాను.
కాని వారు ఏది సరైనదో తెలియజెప్పరు. ప్రజలు
వారి పాపాలకు విచారించుట లేదు. ప్రజలు
వారు చేసిన నేరాల గురించి ఆలోచించుట లేదు.
ప్రజలు ఆలోచనారహితంగా పనులు చేస్తారు.
వారు యుద్ధానికి పరుగెత్తే గుర్రాల్లా ఉన్నారు.
7 ఆకాశంలో ఎగిరే పక్షులకు సైతం తమ పనులకు
ఒక నిర్ణీత కాలం తెలుసు. కొంగలు, గువ్వలు,
వాన కోవిలలు, ఓదెకరువులు (ఒక జాతి కొంగ)
వీటన్నిటికీ ఇతర ప్రాంతాలకు వలసపోయే
కాలము క్రమము తప్పక తెలుసు. కాని నా
ప్రజలకు మాత్రం వారి యెహోవా వారిని ఏమి
చేయమని కోరుతున్నాడో తెలియదు.

8 "యెహోవా ధర్మశాస్త్రం (ఉపదేశములు) మావద్ద
ఉన్నది! అందువల్ల మేము తెలివిగలవారము!'
అని మీరు చెప్పుకుంటూ వుంటారు. కాని అది
నిజం కాదు. ఎందువల్లనంటే లేఖకులు* (వ్రాత
గాండ్రు) వారి కలాలతో అబద్ధమాడారు.
9 ఈ 'తెలివిగలవారు' యెహోవా ఉపదేశములను
వినటానికి నిరాకరించారు. కావున నిజంగా వారు
జ్ఞానవంతులు కారు. ఆ 'జ్ఞానవంతు'లనబడే వారు
మోసంలో పడ్డారు. వారు విస్మయం పొంది,
సిగ్గుపడ్డారు.

---

**ఉన్నత స్థలాలు** ప్రత్యేక స్థలాలను ఎంపిక చేసి చాలామంది వ్యర్థ దేవతలను ఆరాధించటానికి ఉన్నత స్థలాలనబడే బలిపీఠాలను నిర్మిస్తారు. సాధారణంగా వీటిని కొండలపై నిర్మిస్తారు. కాని కొన్నిటిని లోయలలో నిర్మించటం కూడా వుంది.

**కసాయి లోయ** కసాయి శాలలో జంతువులను చంపి మాంసానికి పనికి వచ్చేలా నరుకుతారు. ఇక్కడ మనుష్యులనే జంతువుల రీతి నరుకుతారని భావం.

**లేఖకులు** లేఖకులంటే చెప్పేది వ్రాసేవారు, లేక చూచి వివిధ విషయాలు తిరిగ వ్రాసేవారు. పాత నిబంధన గ్రంథములో చేర్చబడిన కొన్ని గ్రంథములు కూడా అలాంటి వ్రాతలలో వున్నాయి. వ్రాయగా, వ్రాయగా ఆ గ్రంథాలు ఏమి చెపుతున్నాయో వారికి తేలికగా తెలిసి వారు ఆరితేరిన వారయ్యారు.

10 కావున వారి భార్యలను నేనితరులకిచ్చి వేస్తాను. వారి పొలాలను కొత్త యజమానులకిచ్చి వేస్తాను. ఇశ్రాయేలు ప్రజలంతా అధిక ధన సంపాదనపై ఆసక్తిగలవారు. ప్రాముఖ్యంలేని అతి సామాన్యుల నుండి ముఖ్యుల వరకు ప్రజ లంతా అలాంటివారే. ప్రవక్తల నుండి యాజకుల వరకు ప్రజలంతా అబద్ధాలు చెప్పేవారే.

11 నా ప్రజలు బాగా గాయపడ్డారు. కాని అదేదో బహు చిన్న గాయమైనట్లు ప్రవక్తలు, యాజ కులు నా ప్రజలకు తగిలిన దెబ్బను మాన్పజూ స్తారు. 'అంతా మంచిగా వుంది; అంతా మంచిగా వుంది!' అని వారంటారు. కాని పరిస్థితి ఏమీ బాగా లేదు!

12 ఆ ప్రజలు తాము చేసే దుష్కార్యాలకు చాలా సిగ్గుపడాలి. కాని వారు సిగ్గుపడనే లేదు. వారి పాపాలకు వారు కలవరపాటు చెందాలనేది కూడా వారికి తెలియదు. అందరితో పాటు వారూ శిక్షించబడతారు. నేను వారిని శిక్షిస్తాను; వారిని కిందికి పడవేస్తాను." ఇది యెహోవా వాక్కు.

13 వారి ఫలాలను, పంటను నేను తీసుకుంటాను. అందుచేత అక్కడ పంటకోత ఉండదు." ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది "ద్రాక్ష తీగలపై కాయలేమాత్రం ఉండవు. అంజూరపు చెట్లకు కూడ కాయలుండవు. వాటి ఆకులు సైతం ఎండిపోయి చనిపోతాయి. నేను వారి కిచ్చినవన్నీ తిరిగి తీసుకుంటాను.*

14 "మనమిక్కడ అనవసరంగా ఎందుకు కూర్చు న్నాము? రండి, బలమైన నగరాలకు పారి పోదాం. మన దేవుడైన యెహోవా మనల్ని చంపబోతూవుంటే, మనం అక్కడే చనిపోదాం. మనం యెహోవా పట్ల తీరని పాపం చేశాం. అందుచేత దేవుడు విషం కలిపిన నీటిని మనకు తాగటానికి ఇచ్చాడు.

15 మనం శాంతిని కోరుకున్నాం; కాని శాంతి కలుగ లేదు. స్వస్థత సమయం కొరకు ఎదురు చూశాం, కాని విపత్తు మాత్రమే ముంచు కొచ్చింది.

16 దాను వంశీయుల రాజ్యంనుండి శత్రు గుర్రాల పగర్పులు వినిపిస్తూ ఉన్నాయి. వాటి డెక్కల తాకిడికి భూమి కంపిస్తూ ఉంది. వారీ దేశాన్ని, దానిలో నివసిస్తున్న ప్రతి దాన్నీ నాశనం చేయా లని వచ్చియున్నారు. వారీ నగరాన్ని, నగరవాసు లను సర్వనాశనం చేయటానికి వచ్చారు.

17 "యూదా ప్రజలారా, మీ మీదికి విషసర్పాలను* పంపుతున్నాను. ఆ సర్పాలను అదుపుచేయటం సాధ్యపడదు. ఆ విషనాగులు మిమ్మల్ని కాటు వేస్తాయి." ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది.!

18 దేవా, నాకు దుఃఖం వస్తూ ఉంది; భయమేస్తూ ఉంది.

19 నా ప్రజల మొరాలకించుము! దేశంలో ప్రతి చోటా వారు సహాయాన్ని అడుగుచున్నారు. "సీయోనులో యెహోవా ఇంకా వున్నాడా? సీయోను రాజు ఇంకా అక్కడ ఉన్నాడా?" అని వారంటున్నారు. కాని దేవుడిలా అంటున్నాడు: "యూదా ప్రజలు వారి విగ్రహాలను ఆరాధించి నాకెందుకు కోపం కల్గించారు? వారు అన్యదేశాల వారి పనికిమాలిన విగ్రహాలను ఆరాధించారు."

20 మళ్లీ ప్రజలు ఈ విధంగా అన్నారు: "పంటకోత కాలం అయిపోయింది. వేసవి వెళ్లిపోయింది. అయినా మేము రక్షించబడలేదు."

21 నా జనులు బాధపడియుండుటచేత* బాధ పడుతున్నాను. నేను మాటలాడలేనంత విచార ముగా ఉన్నాను.

22 వాస్తవానికి గిలియాదులో తగిన ఔషధం ఉంది! వాస్తవానికి గిలియాదులో వైద్యుడు కూడా ఉన్నాడు! అయితే నా ప్రజల గాయాలు ఎందుకు నయం చేయబడలేదు?

9 నా తల నీటితో నిండియున్నట్లయితే, నా నేత్రాలు కన్నీటి ఊటలైతే హతులైన నా ప్రజల కొరకై నేను రాత్రింబవళ్లు దుఃఖిస్తాను!

2 ప్రయాణీకులు రాత్రిలో తలదాచుకొనే ఇల్లు వంటి ప్రదేశం ఎడారిలో నాకొకటి ఉంటే అక్కడ నా ప్రజలను వదిలి వేయగలను. వారినుండి నేను దూరంగా పోగలను! ఎందువల్లనంటే వారంతా దేవునికి విధేయులై లేరు. వారంతా దేవునికి వ్యతిరేకులవుతున్నారు.

3 "వారి నాలుకలను వారు విల్లంబుల్లా వినియోగి స్తున్నారు. వాటినుండి బాణాల్లా అబద్ధాలు దూసుకు వస్తున్నాయి. సత్యం కాదు కేవలం అసత్యం దేశంలో ప్రబలిపోయింది. వారు ఒక పాపం విడిచి మరో పాపానికి ఒడిగట్టుతున్నారు. వారు నన్నెరుగకున్నారు." ఈ విషయాలు యెహోవా చెప్పియున్నాడు.

4 "మీ పొరుగు వారిని కనిపెట్టి ఉండండి! మీ స్వంత సోదరులనే మీరు నమ్మవద్దు! ఎందువల్లనంటే

---

**నేను ... తీసుకుంటాను** హీబ్రూలో ఈ వాక్యంచాలా క్లిష్టంగా వుంది.

**విషసర్పాలను** అనగా యూదా శత్రువులు కావచ్చు.

**బాధపడియుండుటచేత** 'కుంగిపోగా' అని పాఠాంతరం.

ప్రతి సోదరుడూ మోసగాడే. ప్రతి పొరుగు వాడూ
నీ వెనుక చాటున మాట్లాడేవాడే.
5 ప్రతివాడూ తన పొరుగువానితో అబద్ధములు
చెప్పును. ఎవ్వడూ సత్యం పలుకడు. యూదా
ప్రజలు అబద్ధమాడుటలో తమ నాలుకలకు
తగిన శిక్షణ ఇచ్చారు. వారి పాపం ఆకాశమంత
ఎత్తుకు చేరింది!
6 ఒక దుష్టకార్యాన్ని మరో దుష్టకార్యం అనుస
రించింది. అబద్ధాలను అబద్ధాలు అనుస
రించాయి! ప్రజలు నన్ను తెలుసుకోవటానికి
నిరాకరించారు." ఈ విషయాలను యెహోవా
చెప్పినాడు!
7 కావున, సర్వశక్తిమంతుడైన దేవుడు ఇలా చెపుతు
న్నాడు, "లోహాలను అగ్నిలో కాల్చి పరీక్ష చేసి
నట్లు నేను యూదా ప్రజలను తప్పకుండా పరీ
క్షిస్తాను! నాకు వేరే మార్గం లేదు.
నా ప్రజలు పాపం చేశారు.
8 యూదా ప్రజలు వాడి బాణాల్లాంటి నాలుకలు
కలిగి ఉన్నారు. వారి నోర్లు అబద్ధాలనే మాట్లాడ
తాయి. ప్రతివాడూ తన పొరుగు వానితో పైకి
ఇంపుగానే మాట్లాడతాడు. కాని అతడు తన
పొరుగు వానిని ఎదిరించటానికి రహస్య పథకాలు
వేస్తాడు.
9 మరి యూదా ప్రజలు ఈ పనులన్నీ చేస్తు
న్నందుకు నేను వారిని శిక్షించవద్దా? "ఆ రకమైన
ప్రజలను నేను శిక్షించాలని నీకు తెలుసు. నేను
వారికి అర్హమైన శిక్ష విధించాలి." ఇది యెహోవా
వాక్కు.
10 నేను (యిర్మీయా) కొండల కొరకు మిక్కిలి
దుఃఖిస్తాను. వట్టి పొలాల కొరకు నేను విషాద
గీతాన్ని పాడతాను. ఎందువల్లనంటే జీవించివు
న్నవన్నీ పోయినాయి. ఎవ్వడూ అక్కడ పయ
నించడు. ఆ ప్రదేశాలలో పశువుల అరుపులు
వినరావు. పక్షులు ఎగిరి పోయాయి; పశువులు
పారిపోయాయి.
11 "నేను (యెహోవా నయిన) యెరూషలేము
నగరాన్ని చెత్తకుప్పలాగున చేస్తాను. అది గుంట
నక్కలకు* స్థావరమవుతుంది. నేను యూదా
రాజ్యపు నగరాలను నాశనం చేస్తాను. అందుచే
అక్కడ ఎవ్వరూ నివసించరు." 12 ఈ విషయా
లను అర్థం చేసుకోగల జ్ఞానవంతుడు ఎవడైనా
ఉన్నాడా? యెహోవాచే బోధింపబడిన వాడెవ
డైనా ఉన్నాడా? యెహోవా వార్త ఎవ్వడైనా
వివరించగలడా? రాజ్యం ఎందువలన నాశనం
చేయబడింది? జనసంచారం లేని వట్టి ఎడారిలా
అది ఎందుకు మార్చివేయబడింది.
13 యెహోవాయే ఈ ప్రశ్నలకు సమాధాన
మిచ్చాడు. ఆయన ఇలా చెప్పినాడు: "ఆ విధంగా
జరుగుటకు కారణమేమంటే యూదా ప్రజలు
నా మాట వినలేదు. వారికి నా ఉపదేశములు
ఇచ్చాను. కాని వారు వినటానికి నిరాకరించారు.
వారు నా ఉపదేశములను అనుసరించుట
విడిచారు.
14 యూదా ప్రజలు తమకు ఇష్టమొచ్చిన విధంగా
వారు జీవించారు. వారు మొండివారు. వారు
బూటకపు దేవతైన బయలును అనుసరించారు.
బూటకపు దేవుళ్లను అనుసరించుట వారికి వారి
తండ్రులే నేర్పారు."
15 సర్వశక్తిమంతుడైన ఇశ్రాయేలు దేవుడు ఇలా
చెపుతున్నాడు, "యూదా ప్రజలు త్వరలో
చేదైన ఆహారం తినేలా చేస్తాను. విషం కలిపిన
నీరు తాగేలా చేస్తాను.
16 యూదా ప్రజలు ఇతర దేశాలలో చెల్లా
చెదరై పోయేలా చేస్తాను. వారు పరాయి రాజ్యా
లలో నివసించవలసి వస్తుంది. వారు గాని, వారి
తండ్రులు గాని ఆ రాజ్యాలను ముందెన్నడూ
ఎరిగియుండలేదు. కత్తులు చేతబట్టిన వారిని
నేను పంపిస్తాను. యూదా ప్రజలను వారు చంపి
వేస్తారు. ప్రజలెవ్వరూ మిగలకుండా వారు
చంపివేస్తారు."
17 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా అంటు
న్నాడు, "ఇప్పుడు నీవీ విషయాల గురించి
ఆలోచించుము! శవాలకు అంత్యక్రియలు జరి
పించేటప్పుడు విలపించేందుకు సొమ్ము తీసు
కొనే స్త్రీలను పిలిపించుము. కార్యములు నిర్వ
హించుటలో అనుభవమున్న వారిని పిలువ
నంపుము.
18 'ఆ స్త్రీలను వెంటనే వచ్చి మాకొరకు విలపించ
మనండి. అప్పుడు మా నేత్రాలు కన్నీటితో
నిండిపోతాయి. కన్నీరు కాలువలై ప్రవహిస్తుంది'
అని ప్రజలంటారు.
19 "సీయోను నుండి గట్టిగా విలపించే రోదన,
'మేము నిజంగా నాశనమయ్యాము! మేము
నిజంగా అవమానం పాలైనాము! మా ఇండ్లు
నాశనం చేయబడినాయి కావున మేము మా
రాజ్యాన్ని వదిలి పోవాలి' అంటూ వినిపిస్తూ
ఉంది."
20 యూదా స్త్రీలారా, యెహోవా వర్తమానం
మీరిప్పుడు వినండి. యెహోవా వాక్కు విన
టానికి మీ చెవులనొగ్గండి. యెహోవా ఇలా
అంటున్నాడు, "మీ కుమార్తెలకు గగ్గోలుగా విల

---

**గుంట నక్కలకు** మనుష్య సంచారం లేనిచోట నివసించే, కుక్కను పోలిన ఒక అడవి జంతువు.

పించటం ఎలానో నేర్పండి. ప్రతీ స్త్రీ ఈ విలాప
గీతం పాడటం నేర్చుకోవాలి:
21 'మృత్యువు మా కిటికీలగుండా ఎక్కి లోనికి
వచ్చింది. మృత్యువు మా భవనాలలో ప్రవే
శించింది. వీధుల్లో ఆడుకొంటున్న మా పిల్లల
వద్దకు మృత్యువు వచ్చింది. బహిరంగ స్థలాలలో
కలుసుకొనే యువకుల వద్దకు మృత్యువు
వచ్చింది.'
22 "యిర్మీయా, 'ఇది యెహోవా వాక్కు' అని
చెప్పుము, పొలాలలో పశువుల పేడలా శవాలు
పడివుంటాయి. పంటకోత కాలంలో చేల నిండా
వేసిన పనల్లా శవాలు భూమి మీద పడివుంటాయి.
కాని వాటిని తీసివేయటానికి ఒక్కడూ
ఉండడు.'"
23 యెహోవా ఇలా చెపుతున్నాడు: "తెలివిగల
వారు తమ ప్రజ్ఞా విశేషాల గురించి గొప్పలు
చెప్పుకోరాదు. బలవంతులు తమ బలాన్ని
గురించి గొప్పలు చెప్పుకోరాదు. శ్రీమంతులు
తమ ఐశ్వర్యాన్ని గూర్చి గొప్పలు చెప్పుకో
రాదు.
24 ఎవడైనా గొప్పలు చెప్పుకోదలిస్తే వానిని ఈ
విషయాలపై చెప్పుకోనిమ్ము. నన్నతను అర్థం
చేసికున్నట్లు, నన్ను తెలుసుకున్నట్లు గొప్పలు
చెప్పుకోనిమ్ము. నేనే నిజమైన దేవుడనని తను
అర్థం చేసికున్నట్లు గొప్పలు చెప్పుకోనిమ్ము.
నేను దయామయుడనని, న్యాయవర్తనుడనని
గొప్పలు చెప్పనియి. యెహోవానైన నేను
భూమి మీద మంచి కార్యాలు నెరవేర్చుతానని
గొప్పలు చెప్పనీయుము. నేను ఆ పనులన్నీ
చేయటానికి యిష్టపడతాను." ఈ వర్తమానం
యెహోవా వద్దనుండి వచ్చినది.

25 ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది:
"శారీరకంగా మాత్రమే సున్నతి సంస్కారం పొందిన
వారిని నేను శిక్షించే సమయమాసన్న మవుతూ ఉంది.
26 తమ చెంపలను కత్తిరించే ఈజిప్టు, యూదా,
ఎదోము, అమ్మోను, మోయాబు ప్రజలు మరియు
ఎడారిలో నివసించే జనులందరిని గూర్చి నేను మాట్లా
డుతున్నాను. ఈ దేశాలలోని పురుషులు శారీరకంగా
సున్నతి సంస్కారం పొందియుండలేదు. కాని ఇశ్రా
యేలు కుటుంబం నుండి వచ్చిన ప్రజలు హృదయ
సంబంధమైన సున్నతి సంస్కారం కలిగియుండలేదు."

### దేవుడు మరియు విగ్రహాలు

10 ఇశ్రాయేలు వంశీయులారా యెహోవా చెప్పే
మాట వినుము! 2 యెహోవా ఇలా
చెప్పుచున్నాడు:
"అన్యదేశ ప్రజలవలె నీవు జీవించవద్దు! ఆకాశంలో
వచ్చే ప్రత్యేక సంకేతాలకు * నీవు భయపడవద్దు!
అన్యదేశాలవారు ఆకాశంలో తాము చూచే కొన్ని
సంకేతాలకు భయపడతారు. కాని మీరు మాత్రం
అలాటి వాటికి భయపడరాదు.
3 ఇతర దేశ ప్రజల ఆచారాలు లెక్క చేయవలసినవి
కావు. వారి విగ్రహాలు అడవిలో దొరికే కర్ర
ముక్కల కంటే వేరేమీ కాదు. వారి విగ్రహాలను
ఒక పనివాడు తన ఉలితో కొట్టి మలుస్తాడు.
4 వెండి బంగారాలతో వారి విగ్రహాలను అందంగా
తీర్చిదిద్దుతారు. వాటిని పడిపోకుండా సుత్తులతో
మేకులు కొట్టి నిలబెడతారు.
5 బీర తోటలోని దిష్టి బొమ్మల్లా వారి విగ్రహా
లుంటాయి. వారి విగ్రహాలు మాట్లాడవు. వారి
విగ్రహాలు నడవలేవు. ఆ విగ్రహాలను మనుష్యులు
మోయాలి! కావున ఆ విగ్రహాలకు భయపడకు.
అవి నిన్ను ఏమీ చేయలేవు. పైగా అవి నీకసలు
ఏ రకమైన సహాయమూ చేయలేవు!"
6 యెహోవా, నీవంటి దైవం మరొకరు లేరు!
నీవు గొప్పవాడవు! నీ నామము గొప్పది మరియు
శక్తి గలది.
7 ఓ దేవా, ప్రతివాడూ నిన్ను గౌరవించాలి. సర్వ
దేశాలకూ నీవు రాజువు. వారందరి గౌరవానికి
నీవు అర్హుడవు. ప్రపంచ దేశాలలో చాలామంది
జ్ఞానులున్నారు. కాని వారిలో ఏ ఒక్కడు నీకు
సాటిరాడు.
8 అన్యదేశవాసులు మందబుద్ధులు, మూర్ఖులు. వారి
బోధనలన్నీ పనికిరాని చెక్క బొమ్మల పేరుతో
వచ్చినవి.
9 వారు తర్షీషు నగరం నుండి వెండిని, ఉఫాజు
నగరం నుండి బంగారాన్ని తెచ్చి విగ్రహాలను
చేస్తారు. విగ్రహాలు వడ్రంగులచే, లోహపు పని
వారిచే చేయబడతాయి. ఈ విగ్రహాలను నీలి
రంగు, ఊదారంగు బట్టలతో అలంకరిస్తారు.
"జ్ఞానులు" ఆ "దేవుళ్ల"ని చేస్తారు.
10 కాని యెహోవా నిజమైన దేవుడు. ఆయన
మాత్రమే నిజంగా జీవిస్తున్న దేవుడు! శాశ్వతంగా
పాలించే రాజు ఆయనే. దేవునికి కోపం వచ్చి
నప్పుడు భూమి కంపిస్తుంది. ప్రపంచ రాజ్యాల
ప్రజలు ఆయన కోపాన్ని భరించలేరు.
11-12 "ఈ వర్తమానం ఆ ప్రజలకు తెలియ
జేయుము, 'ఆ బూటకపు దేవతలు భూమిని,

---

**ఆకాశంలో ... సంకేతాలు** ఆకాశంలో వచ్చే తోక చుక్కలు, ఉల్కలు, సూర్య చంద్ర గ్రహణాల ద్వారా భవిష్యత్తులో ఏమి జరుగబోతూ వున్నదో తెలుసుకోవచ్చునని ప్రజల నమ్మిక.

ఆకాశాన్ని సృష్టించలేదు. ఆ చిల్లర దేవుళ్లు నాశనం
చేయబడతారు. వారు భూమి నుండి, ఆకాశము
నుండి మాయమవుతారు.'"* తన శక్తితో
భూమిని సృష్టించినది నిత్యుడగు దేవుడే. దేవుడు
తన జ్ఞాన సంపదచే ఈ ప్రపంచాన్ని సృష్టించి
నాడు. తన అవగాహనతో దేవుడు ఆకాశాన్ని
భూమిపైన వ్యాపింపజేశాడు.
13 భయంకరమైన శబ్దంగల పిడుగులను దేవుడే
కలుగజేస్తాడు. ఆకాశంనుండి ధారాపాతంగా వర్షం
పడేలా కూడా దేవుడే చేస్తాడు. భూమి నలు
మూలల నుండీ ఆకాశంలోకి మేఘాలు లేచేలా
ఆయన చేస్తాడు. ఆయన ఉరుములు మెరుపు
లతో వానపడేలా చేస్తాడు. ఆయన తన
గిడ్డంగుల నుండి గాలి వీచేలా చేస్తాడు.
14 ప్రజలు మందబుద్ధి గలవారయ్యారు! లోహపు
పనివారు వారు చేసిన విగ్రహాల చేత మూర్ఖు
లయ్యారు. వారి బొమ్మలు అబద్ధాలకు ప్రతీ
కలు. అవి జడపదార్థములు.*
15 ఆ విగ్రహాలు ఎందుకూ కొరగానివి. అవి హాస్యా
స్పదమైనవి. తీర్పు తీర్చే కాలంలో ఆ విగ్రహాలు
నాశనం చేయబడతాయి.
16 కాని యాకోబు యొక్క దేవుడు* ఆ విగ్రహాల
వంటి వాడు కాదు. ఆయన సర్వసృష్టికి కార
కుడు. ఇశ్రాయేలు తన ప్రజగా వర్థిల్లటానికి
ఆయన దానిని ఎంపిక చేసినాడు. ఆయన పేరు
"యెహోవా సర్వశక్తిమంతుడు."

### నాశనం వస్తూవుంది

17 మీకున్నదంతా సర్దుకొని వెళ్లటానికి సిద్ధమ
వ్వండి. యూదా ప్రజలారా మీరు నగరంలో
చిక్కుకున్నారు. శత్రువులు నగరాన్ని చుట్టు
ముట్టారు.
18 యెహోవా ఇలా చెప్పాడు, "ఈసారి యూదా
ప్రజలను ఈ దేశంనుండి వెళ్ల గొడతాను. వారికి
బాధను, శ్రమను కలుగజేస్తాను. వారికి ఒక గుణ
పాఠం నేర్పటానికి నేనిదంతా చేస్తాను."*
19 అయ్యో నేను (యిర్మీయా) బాగా గాయపడ్డాను
నా గాయం మానరానిది. "ఇది నా రోగం, నేను
దానిచే బాధ పడవలసినదే" అని నేను తల
పోశాను.
20 నా గుడారం పాడైపోయింది. దాని తాళ్లన్నీ
తెగిపోయాయి. నా పిల్లలు నన్ను వదిలేశారు.
వారు వెళ్లిపోయారు. నా గుడారం మరల
నిర్మించటానికి సహాయం చేయుటకు ఒక్కడు
కూడా మిగలలేదు. నాకు ఆశ్రయం కల్పించ
టానికి ఒక్కడూ మిగలలేదు.
21 గొర్రెల కాపరులు (నాయకులు) మందమతుల
య్యారు! వారు యెహోవాను కనుగొనే
ప్రయత్నం చేయరు, వారు జ్ఞాన శూన్యులు.
అందువల్లనే వారి మందలు (ప్రజలు) చెల్లా
చెదరై తప్పిపోయాయి.
22 ఒక పెద్ద శబ్దం వస్తోంది, వినుము! ఆ పెద్ద
శబ్దం ఉత్తర దిశనుండి వస్తూ వుంది. అది యూదా
నగరాలను నాశనం చేస్తుంది. యూదా ఒక వట్టి
ఎడారిలా మారుతుంది. అది గుంట నక్కలకు
స్థావరమవుతుంది.
23 యెహోవా, వారి స్వంత జీవితాలను వారి
స్వాధీనంలో ఉంచుకోరని నాకు తెలుసు.
ప్రజలు వారి భవిష్యత్తును గూర్చి పథకాలను
వేసుకోలేరు. జీవించుటకు సరైన మార్గం వారికి
తెలియదు. ఏది సన్మార్గమో ప్రజలకు నిజంగా
తెలియదు.
24 యెహోవా, మమ్మల్ని సరిదిద్దుము! నీవు
మమ్మే నశింపజేయవచ్చు కాని మాపట్ల నిష్పక్ష
పాతంగా వుండుము! కోపంలో మమ్మల్ని
శిక్షించవద్దు!
25 నీకు కోపంవస్తే, అన్యదేశాలను శిక్షించుము.
వారు నిన్నెరుగరు; గౌరవించరు. ఆ ప్రజలు
నిన్ను పూజించరు. ఆ రాజ్యాలు యాకోబు
వంశాన్ని నాశనం చేశాయి. వారు ఇశ్రాయేలును
పూర్తిగా నాశనం చేశారు. వారు ఇశ్రాయేలు
యొక్క స్వంత దేశాన్ని నాశనం చేశారు.

### ఒడంబడిక ఉల్లంఘన

11 ఈ వర్తమానం యిర్మీయాకు వచ్చింది. ఈ
వర్తమానం యెహోవా వద్దనుండి వచ్చినదిః
2 "యిర్మీయా, ఈ ఒడంబడికలోని మాటలను
వినుము. యూదా ప్రజలకు వీటి విషయం తెలియ

---

**ఈ వర్తమానం ... మాయమవుతారు** ఈ భాగం అరాము భాషలో వ్రాయబడింది. హెబ్రీలో వ్రాయబడలేదు. ఈ భాషను ఇతర దేశాల వారికి వ్రాసేటప్పుడు వాడేవారు. బబులోనులో కూడా ఈ భాషనే మాట్లాడేవారు.

**అవి జడపదార్థములు** అక్షరార్థముగా "ఆత్మలేనివి" దాని అర్థమేమనగా అవి జీవించి లేవు, లేక దేవుని ఆత్మ వాటిలో లేదు అని.

**యాకోబు యొక్క దేవుడు** "యాకోబు భాగము" అని శబ్దార్థం. దేవుడు, ఇశ్రాయేలు ఒక ప్రత్యేకమైన సంబంధంగల వారు అని ఇది చూపిస్తుంది. దేవుడు ఇశ్రాయేలుకు సంబంధించిన వాడు. ఇశ్రాయేలు దేవునికి సంబంధించినది.

**వారికి ... చేస్తాను** ఇచ్చట హెబ్రీ భాష మిక్కిలి జటిలంగా వుంది.

జేయుము. యెరూషలేము నగర వాసులకు కూడా
ఈ విషయాలు తెలియజేయుము. 3ఇశ్రాయేలీయుల
దేవుడైన చెప్పినది ఇది: ‘ఈ ఒడంబడికను అను
సరించని ప్రతి వానికీ కీడు వాటిల్లుతుంది.’ 4నేను నీ
పూర్వీకులతో చేసుకొన్న ఒడంబడిక విషయం మాట్లా
డుతున్నాను. వారిని ఈజిప్టునుండి నేను తీసుకొని
వచ్చినప్పుడు నేనా ఒడంబడికను వారితో చేసు
కొన్నాను. ఈజిప్టు అనేక కష్టాలున్న స్థలము అది
ఇనుము కూడా కరిగి పోయేటంత వేడిగల పొయ్యిలా
ఉంది. నాకు విధేయులై, నేనాజ్ఞాపించినదంతా
చేయండని ఆ ప్రజలకు చెప్పాను. మీరిది చేస్తే, మీరు
నా ప్రజలవుతారు. పైగా నేను మీ దేవుడనవుతాను.
5“నేను మీ పూర్వీకులకు చేసిన వాగ్దానం నెరవేర్చ
టానికి నేనిది చేశాను. వారికి నేనొక సారవంతమైన
భూమిని ప్రసాధిస్తానని వాగ్దానం చేశాను. పాలు, తేనెలు
ప్రవహించే భూమి ఇస్తానని అన్నాను. ఈనాడు మీరు
ఆ రాజ్యంలో నివసిస్తున్నారు.”
నేను (యిర్మీయా) “ఆ ప్రకారమే జరగాలి
ప్రభువా” అని అన్నాను.
6నాతో యెహోవా ఇలా అన్నాడు: “యిర్మీయా,
ఈ సమాచారం యూదా పట్టణాలలోను, యెరూష
లేము వీధులలోను ప్రకటించుము: ఈ ఒడంబడిక
నియమాలు వినండి. ఆ ఒడంబడికలోని న్యాయ
సూత్రాలను పాటించండి. 7ఈజిప్టునుండి విడుదల
చేసి మీ పితరులను నేను తీసుకొని వచ్చినప్పుడు
వారికి ఒక హెచ్చరిక చేశాను. ఈ రోజువరకూ వారికి
పదే పదే హెచ్చరికలు చేస్తూనే వచ్చాను. నాకు
విధేయులై వుండమని వారికి చెప్పాను. 8కాని మీ
పూర్వీకులు నా మాట వినలేదు. వారు మొండివైఖరి
దాల్చారు. వారి దుష్ట హృదయాలు ఎలా చెపితే అలా
ప్రవర్తించారు. ఒడంబడిక ప్రకారం వారు దానిని అను
సరించకపోతే వారికి కీడు వాటిల్లుతుంది. అందువల్లనే
వారికి కష్టాలు సంభవించేలా నేను చేశాను! ఒడం
బడికకు కట్టుబడి ఉండమని వారికి నేను ఆజ్ఞ ఇచ్చాను.
కాని వారు పాటించలేదు.”
9నాతో యెహోవా ఇలా అన్నాడు: “యిర్మీయా!
యూదా ప్రజలు, యెరూషలేము వాసులు రహస్య
పథకాలు వేశారని నాకు తెలుసు. 10ఆ ప్రజలు వారి
పితరులు చేసిన పాపములన్నీ చేస్తున్నారు! వారి పూర్వీ
కులు నా వర్తమానం వినటానికి నిరాకరించారు. వారు
అన్యదేవతలను అనుసరించి, ఆరాధించారు. ఇశ్రా
యేలు వంశం వారు, యూదా వంశం వారు వారి
పూర్వీకులతో నేను చేసిన ఒడంబడికను ఉల్లంఘించి
నారు.” 11కావున యెహోవా ఇలా చెప్పినాడు,
“త్వరలో యూదా వారికి భయంకర విపత్తు సంభ
వించేలా చేస్తాను. వారు దానినుండి తప్పించుకోలేరు!
వారు దుఃఖపడతారు. వారు నా సహాయంకొరకు
రోదిస్తారు. అయినా నేను వారి రోదన వినను.
12అప్పుడు యూదా వారు, యెరూషలేము వాసులు
తమ విగ్రహాలవద్దకు వెళ్లి సహాయం అర్థిస్తారు. వారు
విగ్రహాలకు సాంబ్రాణి పొగ వేస్తారు. కాని ఆ విపత్కాలం
వచ్చినపుడు ఆ విగ్రహాలు యూదా ప్రజలను
ఆదుకోలేవు.
13“యూదా ప్రజలారా, మీకు చాలా విగ్రహాలు
న్నాయి. యూదా రాజ్యంలో ఎన్ని పట్టణాలున్నాయో
అన్ని విగ్రహాలు మీలో ఇన్నాయి. ఆ ఏహ్యామైన
బయలు దేవతను ఆరాధించటానికి మీరు చాలా
బలిపీఠములను నిర్మించారు. యెరూషలేములో ఎన్ని
వీధులున్నాయో అన్ని బలిపీఠాలున్నాయి.
14“యిర్మీయా, నీవు మాత్రం యూదా ప్రజల
కొరకు ప్రార్థన చేయవద్దు. వారి కొరకు అర్థించవద్దు.
వారి కొరకు నీవు చేసే ప్రార్థన నేను వినను. ఆ
ప్రజలకు బాధలు మొదలవుతాయి. అప్పుడు
సహాయం కొరకు నన్ను పిలుస్తారు. కాని నేను వినను.

15 *“నా ప్రేయసి (యూదా) నా ఇంట్లో
(ఆలయం) ఎందుకు ఉన్నది? అక్కడ ఉండే
హక్కు ఆమెకు లేదు. ఆమె చాలా చెడుపనులు
చేసింది. యూదా! నీవర్పించే ప్రత్యేక ప్రమా
ణాలు, బలులు నీవు నాశనంగాకుండా ఆపగలవని
నీవనుకుంటున్నావా? నాకు బలులు అర్పిం
చటం ద్వారా నీవు శిక్షనుండి తప్పించుకోగలవని
తలుస్తున్నావా?”
16 యెహోవా నీకొక పేరు ఇచ్చాడు. ‘కంటికిం
పైన పచ్చని ఒలీవ చెట్టు’ అని నిన్ను పిలిచాడు
కాని ఆ చెట్టును బలమైన గాలిచే విసరబడే
అగ్నితో యెహోవా కాల్చివేస్తాడు. దాని కొమ్మ
లన్నీ బూడిదై పోతాయి.
17 సర్వశక్తిమంతుడైన యెహోవా మిమ్ములను
నాటి స్థిరపర్చినా కాని ఆయనే మీకు విపత్తు
వస్తుందని ప్రకటించాడు. ఎందువల్లనంటే, ఇశ్రా
యేలు వంశం వారు, యూదావంశం వారు చెడు
కార్యాలు చేశారు. మీరు బూటకపు దేవత బయ
లుకు బయట బలులు సమర్పించి యెహో
వాకు కోపం తెప్పించారు.

## యిర్మీయాపై కుట్ర

18అనాతోతు ప్రజలు* నాపై కుట్ర పన్ను
తున్నారని యెహోవా నాకు తెలియపరిచాడు. వారు

---

**15, 16వ వచనాలు** ఈ వచనాల సరియైన అర్థం మనకు రూఢిగా తెలియదు.

**అనాతోతు ప్రజలు** అనాతోతు యిర్మీయా స్వస్థలం. తనపై కుట్రపన్నిన వారిలో తన స్వంత బంధువులు కూడ వున్నారు. చూడండి: యిర్మీయా 12:6.

చేసే పనులు యెహోవా నాకు చూపాడు. అందుచే
వారు నాకు వ్యతిరేకంగా ఉన్నారని నాకు తెలిసింది.
19వారు నాకు వ్యతిరేకంగా ఉన్నారని యెహోవా
తెలియపర్చక ముందు, నేనొక అమాయకపు గొర్రె
పిల్లవలె నరకబడటానికి సిద్ధంగా వున్నాను. వారు నాకు
వ్యతిరేకంగా ఉన్నారని నేను అర్థం చేసికోలేదు. నన్ను
గురించి వారిలా అంటున్నారు: "మనం చెట్టును, దాని
పండును నాశనం చేద్దాం! మనం వానిని చంపివేద్దాం!
అప్పుడు ప్రజలు అతన్ని మర్చిపోతారు."
20యెహోవా, నీవు సత్య వర్తనుడవైన న్యాయాధి
పతివి. ప్రజల మనస్సులను, హృదయాలను పరీక్షించే
విధానం నీకు బాగా తెలుసు. నేను నా వాదనలను
నీకు వినిపిస్తాను. వారికి అర్హమైన శిక్ష నీవే యిమ్ము.
21అనాతోతు మనుష్యులు యిర్మీయాను చంపు
టకు పథకం పన్నుచుండిరి. వారు యిర్మీయాతో
ఇలా అన్నారు: "నీవు యెహోవా పేరుతో ప్రకటనలు
చేయవద్దు. లేనిచో నిన్ను మేము చంపివేస్తాం."
అనాతోతు మనుష్యుల విషయంలో యెహోవా ఒక
నిర్ణయానికి వచ్చాడు. 22సర్వశక్తిమంతుడైన
యెహోవా ఇలా చెప్పాడు, "నేను త్వరలో అనాతోతు
ప్రజలను శిక్షిస్తాను. వారి యువకులు యుద్ధంలో
మరణిస్తారు. వారి కుమారులు, కుమార్తెలు ఆకలితో
మాడి చనిపోతారు. 23అనాతోతులో ఒక్కడు కూడా
వదిలిపెట్టబడడు. ఎవ్వడూ బతకడు. వారిని నేను
శిక్షిస్తాను. వారికి కీడు దాపురించేలా నేను చేస్తాను."

### యిర్మీయా దేవునికి ఫిర్యాదు చేయుట

12 యెహోవా, నేను నీతో వాదించినట్లయితే,
నీవే ఎల్లప్పుడూ సరైనవాడవుగా ఉంటావు!
కానీ న్యాయంగా కనబడని కొన్ని విషయాల
గురించి నేను నిన్ను అడగాలను కొంటున్నాను.
దుర్మార్గు లెందుకు విజయవంతులవుతున్నారు?
నమ్మదగని ప్రజలు ఎలా సులభమైన జీవితం
గడుపుతున్నారు?

2 ఈ దుర్మార్గులను నీవిక్కడ ఉంచినావు. మొక్కలు
బాగా వేరూనినట్లు వారు బాగా స్థిరపడి, అభి
వృద్ధిచెంది కాయలు కాసారు. నీవు వారికి చాలా
ప్రియమైన వాడివని వారు నోటితో చెప్పుతారు.
కాని వారి హృదయాలలో నీవు లేవు. వారు నీకు
చాలా దూరంగా ఉన్నారు.

3 ఓ ప్రభువా, నా హృదయం నీకు తెలుసు. నన్ను
నీవు చూస్తూనే ఉన్నావు. నా మనస్సును పరీక్షి
స్తూనే ఉన్నావు. గొర్రెలను నరకటానికి లాగినట్టు,
ఆ దుర్మార్గపు మనుష్యులను లాగివేయి. సంహా
రపు రోజునకు వారిని ఎంపిక చేయి.

4 ఎన్నాళ్లు ఈ భూమి వర్షపాతం లేక ఎండిపోయి
ఉండాలి? ఎన్నాళ్లీ నేలపై గడ్డి ఎండి, చచ్చిపోయి
ఉండాలి? దేశంలో పశువులు, పక్షులు అన్నీ చని
పోయాయి. ఈ దుష్ట జనుల చెడుపనులే ఈ
పరిస్థితికి కారణం. పైగా, "మాకు ఏమి జరుగు
తుందో చూడటానికి యిర్మీయా ఎక్కువ కాలం
బతకడు" అని ఆ దుర్మార్గులే అంటున్నారు.

### యిర్మీయాకు దేవుని సమాధానం

5 "యిర్మీయా, మానవులతో పరుగు పందెమునకే
నీవు అలసిపోతే, మరి గుర్రాలతో నీవు ఎలా
పరుగు పెట్టగలవు? సురక్షిత దేశంలోనే నీవు
అలసిపోతే, యొర్దాను నదీ తీరాన పెరిగే ముండ్ల
పొదలలోకి వస్తే నీవు ఏమి చేస్తావు?

6 ఈ మనుష్యులు నీ స్వంత సోదరులు. నీ
కుటుంబ సభ్యులే నీకు వ్యతిరేకంగా పన్నాగాలు
పన్నుతున్నారు. నీ ఇంటివారే నిన్ను జూచి
అరుస్తున్నారు. వారు నీతో స్నేహితులవలె
మాట్లాడినా నీవు వారిని నమ్మవద్దు.

### యెహోవా తన యూదా ప్రజలను తిరస్కరించుట

7 "నేను (యెహోవా) నా ఇంటిని వదిలివేశాను.
నా స్వంత ఆస్తిని* నేను వదిలివేశాను. నేను
ప్రేమించే దానిని (యూదా) ఆమె శత్రువులకే
అప్పగించాను.

8 నా ఆస్తే నాకు ఒక భయంకర సింహంలా
తయారయ్యింది. అది నన్ను చూచి గర్జిస్తూ
వుంది. అందుచే దాన్ని నేను అసహ్యించు
కుంటున్నాను.

9 నా ఆస్తి రాబందులచే ఆవరింపబడిన చనిపోయే
జంతువులా వుంది. ఆ పక్షులు దాని చుట్టూ
ఎగురుతాయి. వన్య (అడవి) మృగములారా,
రండి. రండి, తినటానికి ఆహారం తీసుకోండి.

10 చాలామంది గొర్రెల కాపరులు (నాయకులు)
నా ద్రాక్షా తోటను నాశనం చేసారు. ఆ కాపరులు
నా తోటలోని మొక్కలపై నడిచారు. వారు నా
అందాల తోటను వట్టి ఎడారిగా మార్చివేశారు.

11 వారు నా భూమిని ఎడారిలా చేశారు. అది ఎండి
చచ్చిపోయింది. అక్కడ ఎవ్వరూ నివసించరు.
దేశం యావత్తూ వట్టి ఎడారి అయ్యింది. అక్కడ
ఆ భూమిని గూర్చి శ్రద్ధ వహించే వారు ఎవ్వరూ
లేరు.

12 సైనికులు ఎడారిలోని నీళ్లగుంటలను దోచు
కొనుటకు వచ్చారు. యెహోవా ఆ సైన్యాలను
ఆ రాజ్యాన్ని శిక్షించటానికి వినియోగించు
కున్నాడు. రాజ్యంలో ఒక మూలనుండి మరో
మూల వరకు గల ప్రజలంతా శిక్షింపబడ్డారు. ఏ
ఒక్కరికీ రక్షణ లేదు.

---

**నా స్వంత ఆస్తి** అనగా యూదా ప్రజలు.

13 ప్రజలు గోధుమ పైరు నాటుతారు. కాని వారు
కోసేది ముండ్లను మాత్రమే. వారు బాగా అలసి
పోయేటంతగా శ్రమిస్తారు. కాని వారి శ్రమకు
ఫలం శూన్యం. వారి పంట విషయంలో వారు
సిగ్గు చెందుతారు. యెహోవా కోపకారణంగా
ఇదంతా జరిగింది."

### ఇశ్రాయేలు పొరుగు వారికి దేవుని వాగ్దానం

14యెహోవా ఇలా చెప్పాడు, "ఇశ్రాయేలు చుట్టు
పట్లవుండే ప్రజలకు నేనేమి చేస్తానో నీకు చెపుతాను.
ఆ జనులు చాలా దుర్మార్గులు. నేను ఇశ్రాయేలీయుల
కిచ్చిన రాజ్యాన్ని వారు ధ్వంసం చేశారు. ఆ దుష్ట
జనులను నేను పెల్లగించి, వారి రాజ్యంనుండి బయటికి
త్రోసివేస్తాను. వారితో పాటు యూదా వారిని కూడా
పెల్లగించుతాను. 15నేను వారిని తమ రాజ్యం నుండి
భ్రష్టులను చేశాక, వారి విషయంలో నేను బాధపడ
తాను. తరువాత ప్రతి కుటుంబాన్నీ దాని స్వస్థలానికి,
స్వంత ఆస్తికి తీసుకొని వస్తాను. 16కాకపోతే ఆ ప్రజలు
తగిన గుణపాఠం నేర్చుకోవాలని నాకోరిక. గతంలో
వారు నా ప్రజలకు బయలు దేవత పేరు మీద వాగ్దానాలు
చేయటం నేర్పినారు. ఇప్పుడు ఆ ప్రజలు తగిన
గుణపాఠం నేర్చుకోవాలని నా ప్రయత్నం. వారు నా
పేరు ఉపయోగించుట నేర్చుకోవాలి. 'నిత్యుడైన
దేవుని సాక్షిగా...' అని వారు చెప్పుట నేర్చుకోవాలి.
అప్పుడు నేను వారిని నా ప్రజల మధ్య నిత్యము నివ
సించేలా చేస్తాను. 17కాని ఏ దేశమైనా మాట వినకపోతే,
అప్పుడు నేను వారిని సర్వ నాశనం చేస్తాను. చచ్చిన
మొక్కలవలె వారిని లాగి పారవేస్తాను." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది.

### నడికట్టు బట్ట సంకేతం

13 యెహోవా నాతో ఇలా అన్నాడు,
"యిర్మీయా, నీవు వెళ్లి నారతో చేసిన ఒక
నడికట్టు బట్టకొని* తీసుకురా. దానిని నీవు
ధరించుము. కాని దానిని తడవనీయవద్దు."
2కావున యెహోవా చెప్పిన విధంగా నేనొక నడి
కట్టు వస్త్రం కొని ధరించాను. 3అప్పుడు రెండవసారి
యెహోవా వాక్కు నాకు వినిపించింది. 4ఆ వాక్కు
ఇలా వుంది: "యిర్మీయా, నీవు కొని ధరించిన నడికట్టు
వస్త్రం తీసుకొని ఫరాతుకు* వెళ్లుము. అక్కడ ఒక
బండ బీటలో ఆ నడికట్టు వస్త్రాన్ని దాచి పెట్టు."
5అందుచేత నేను ఫరాతు (యూఫ్రటీసు) కు వెళ్లి
ఒక బండ బీటలో నడికట్టు వస్త్రాన్ని (చల్లడము)
అక్కడ యెహోవా చెప్పిన రీతిలో దాచాను. 6చాలా
రోజుల తరువాత యెహోవా నాతో, "యిర్మీయా,
ఇప్పుడు ఫరాతుకు వెళ్లుము. బండ బీటలో నిన్ను
దాయమని చెప్పిన నడికట్టు వస్త్రాన్ని తీసుకొని
రమ్ము" అని చెప్పాడు.
7అప్పుడు నేను ఫరాతుకు వెళ్లి నడికట్టు వస్త్రాన్ని
తవ్వి తీశాను. నేను దాచిన బండ బొరియలోనుండి
దానిని వెలికి తీశాను. కాని నేను దానిని ధరించ
లేకపోయాను. కారణమేమంటే అది జీర్ణించిపోయింది.
అది ఎందుకూ పనికిరానిదయ్యింది.

8అప్పుడు యెహోవా వర్తమానం నాకు చేరింది.
9యెహోవా ఇలా చెప్పినాడు: "నడికట్టు బట్ట జీర్ణించి,
ఎందుకూ పనికిరానిదయి పోయింది. అదే విధంగా,
యూదాలోను, యెరూషలేములోనుగల గర్విష్ఠుల
నందరినీ నాశనం చేస్తాను. 10యూదాలోని గర్విష్ఠు
లను, దుష్టులను నాశనం చేస్తాను. వారు నా వాక్కు
వినటానికి నిరాకరిస్తున్నారు. మొండి వైఖరి దాల్చి,
వారు చేయదలచుకున్న పనులే వారు చేస్తారు. వారు
అన్యదేవుళ్లను అనుసరించి, ఆరాధిస్తారు. అటువంటి
యూదా వారంతా ఈ నార నడికట్టు బట్టలా అయి
పోతారు. వారు సర్వనాశనమవుతారు. వారెందుకూ
పనికిరారు. 11నడికట్టు వస్త్రాన్ని మనుష్యులు తమ
నడుము చుట్టూ గట్టిగా కట్టుకుంటారు. అదే మాదిరి
ఇశ్రాయేలు సంతతి వారిని, యూదా వంశంవారిని
నాచుట్టూ కప్పుకొన్నాను." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది "నేనలా ఎందుకు చేసినా
నంటే వారంతా నా ప్రజలు కావాలని. నా ప్రజలు
నాకు ఖ్యాతిని, మహిమను, గౌరవాన్ని తెస్తారను
కున్నాను. కాని నా ప్రజలు నా మాటనే వినలేదు."

### యూదాకు హెచ్చరికలు

12"యిర్మీయా, యూదా ప్రజలకు ఇశ్రాయేలీ
యుల దేవుడు ఇలా చెపుతున్నాడని తెలియ
జేయుము: 'ప్రతి ద్రాక్షరసపు తిత్తియు* ద్రాక్షారస
ముతో నింపాలి'. అది విన్న ఆ జనులు నవ్వి, 'అవును.
ప్రతి ద్రాక్షారసపు తిత్తీ ద్రాక్షారసంతోనే నింపాలని
మాకు తెలుసు' అని నీతో అంటారు. 13అప్పుడు
నీవిలా చెప్పాలి, 'యెహోవా ఇలా అంటున్నాడు:

---

**నడికట్టు బట్ట** ప్రాచీన యూదా రాజ్యంలో ఇది సర్వ సామాన్యమైన చల్లడము. (అడుగునధరించే వస్త్రము). అది నడుమునుండి తొడల దిగువ వరకు వుంటుంది.

**ఫరాతు** బహుశః ఫరాతు అనేది యెరూషలేము దగ్గర ఒక ఊరు కావచ్చు. బెన్యామీను రాజ్యనగరాలుగా పేర్కొనబడిన వాటిలో ఇది ఒకటికావచ్చును. చూడండి: యెహోషువ 18:23; కాని 'ఫరాతు' అనే పదాన్ని యూఫ్రటీసు నదికి పర్యాయపదంగా కూడా వాడినారు.

**ద్రాక్షరసపు తిత్తి** ద్రాక్షారసమును ఒక రకపు జంతు చర్మంతో చేసిన తిత్తులలో నిల్వచేసే వారు.

ఈ రాజ్యంలో నివసించే ప్రతివాని తాగిన వానిలా
నిస్సహాయుని చేస్తాను. దావీదు సింహాసనం మీద
కూర్చున్న రాజులను గురించి నేను మాట్లాడుతు
న్నాను. ఇంకా నేను యాజకుల గురించి, ప్రవక్తల
గురించి యెరూషలేము వారందరిని గురించి నేను
మాట్లాడుతున్నాను. [14]యూదా ప్రజలందరినీ తూలి
పోయి ఒకరిమీద ఒకరు పడేలా చేస్తాను. తండ్రులు,
కొడుకులు ఒకరిమీద ఒకరు పడిపోతారు.'" ఈ వర్త
మానం యెహోవా వద్దనుండి వచ్చినది "'నేను వారిని
గురించి విచారించటంగాని, జాలిపడటంగాని జరుగదు.
యూదా ప్రజలను నాశనం చేయుటలో అనుతాపాన్ని
(కనికరం) నన్ను అడ్డగించనివ్వను.'"

15 శ్రద్ధగా ఆలకించండి. యెహోవా మీతో మాట్లా
డీయున్నాడు. మీరు గర్విష్ఠులు కావద్దు.
16 మీ యెహోవా దేవుని గౌరవించండి. ఆయనను
స్తుతించండి. లేనిచో ఆయన మీకు అంధకారాన్ని
సృష్టిస్తాడు. మీరు చీకటి కొండల్లో పడిపోక
ముందుగానే మీరాయనను స్తోత్రం చేయండి.
యూదా ప్రజలారా మీరు వెలుగుకై ఎదురు
చూస్తున్నారు. కాని యెహోవా ఆ వెలుగును
కటిక చీకటిగా మార్చుతాడు. యెహోవా వెలు
గును మహా అంధకారంగా మార్చగలడు.
17 యూదా ప్రజలారా, మీరు యెహోవా వాక్కు
వినకపోతే నేను దాగుకొని విలపిస్తాను. మీ గర్వం
నన్ను విలపించేలా చేస్తోంది. నేను బిగ్గరగా
విలపిస్తాను. నా కన్నీరు వరదలై పారుతుంది.
ఎందువల్లనంటే, యెహోవా మంద* బందీయై
పోయింది.
18 ఈ విషయం రాజుకు, ఆయన భార్యకు తెలియ
జెప్పండి: "మీ సింహాసనాల నుండి మీరు
దిగిరండి. మీ అందాల కిరీటాలు మీ తలలనుండి
కిందికి పడిపోయాయి."
19 నెగెవు* ఎడారిలో మీ నగరాలు మూసివేయ
బడ్డాయి. వాటిని ఎవ్వరూ తెరువలేరు. యూదా
ప్రజలంతా చెరపట్టబడ్డారు. వారంతా బందీలుగా
కొనిపోబడ్డారు.
20 యెరూషలేమా, పైకి చూడు! ఉత్తర దిశనుండి
వచ్చే శత్రువును చూడు. నీ మంద ఎక్కడ? ఆ
అందమైన మందను దేవుడు నీకిచ్చాడు. ఆ మంద
రక్షణ బాధ్యత నీదైవుంది.

**యెహోవా మంద** యూదా ప్రజలకు ఈ పేరు అలంకారికంగా పెట్టబడింది. యెహోవా కాపరిగాను, ఆయన ప్రజలు గొర్రెల మందగాను భావించబడిరి.

**నెగెవు** యూదా సామ్రాజ్యానికి దక్షిణానవున్న ఎడారి ప్రాంతానికి నెగెవు అని పేరు.

21 ఆ మంద ఏమైనదని దేవుడు నిన్నడిగితే నీవేమి
చెపుతావు? నీవు దేవుని గురించి ప్రజలకు
బోధించవలసివుంది. నీ నాయకులు ప్రజలను
నడిపించవలసి ఉంది. కాని వారి పని వారు చేయ
లేదు! కావున నీవు మిక్కిలి బాధను, కష్టాలను
అనుభవిస్తావు. నీ బాధ స్త్రీయొక్క ప్రసవవేదన
లాంటిది.

22 "నాకెందుకీ చెడు దాపురించింది?" అని నీకు
నీవే ప్రశ్నించుకో. నీవు చేసిన అనేక పాపాల
ఫలమే నీకు వచ్చిన కష్టాలు. నీ పాపాల కారణంగా
నీ అంగీ చిరిగిపోయింది. నీ పాదరక్షలు తీసుకొని
పోబడ్డాయి. నిన్ను చిక్కులు పెట్టటానికే వారలా
చేశారు.
23 నల్లని వ్యక్తి తన శరీరపు రంగును మార్చలేడు.
చిరుతపులి తన మచ్చలను మార్చుకోలేదు.
అలాగే, ఓ యెరూషలేమా, నీవు మారి మంచి
పనులు చేయలేవు. నీవు ఎల్లప్పుడూ చెడు
చేయటానికే అలవాటడ్డానావు.

24 "మీరు మీ ఇండ్లు వదిలిపోయేలా వత్తిడి తెస్తాను.
మీరు పారిపోయేటప్పుడు చెల్లా చెదరై అన్ని
వైపులకూ పారిపోతారు. ఎడారి గాలికి కొట్టుకు
పోయే పొట్టులాంటి వారు మీరు.
25 ఈ విషయాలన్నీ నీకు సంభవిస్తాయి. నా
ప్రణాళికల్లో నీ పాత్ర ఇదే." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది. "ఇది ఎందుకు
సంభవిస్తుంటే నీవు నన్ను మర్చిపోయావు. నీవు
బూటకపు దేవుళ్ల నమ్మావు.
26 యెరూషలేమా, నీ అంగీని అంచుబట్టి నీ
ముఖంమీదికి లాగుతాను. ప్రతివాడూ నిన్ను
చూస్తారు నీవు అవమానం పాలవుతావు.
27 నీవు చేసిన భయంకరమైన పనులను నేను
చూశాను.* నీవు విజృంభించి ప్రియులతో వ్యభి
చరించటం చూశాను. వేశ్యలా ప్రవర్తించాలనే నీ
పథకం నాకు తెలుసు. నీవు కొండలమీద, మైదా
నాల మీద పాపాలు చేయుట నేను చూశాను.
యెరూషలేమా, ఇది నీకు చాలా చెడ్డదిగా
ఉంటుంది. అసహ్యమైన ఈ పాపాలు నీవెన్నాళ్లు
సాగిస్తావోనని నేను ఆశ్చర్యపోతున్నాను."

**నీవు ... చూశాను** బూటకపు దేవతలను ఆరాధించే విషయం కావచ్చు. దేవాలయ వేశ్యలతో, పురుషగాములతో వ్యభిచరించటం అనేది ఆ విగ్రహారాధనలో ఒక భాగం లాంటిది.

### అనావృష్టి కపట ప్రవక్తలు

14 అనావృష్టి విషయమై ఇది యిర్మీయాకు యెహోవా పంపిన వర్తమానం:

2 "యూదా రాజ్యం చనిపోయిన వారికొరకు రోధిస్తుంది. యూదా నగరాల ప్రజలు నానాటికీ బలహీనమౌతారు. వారు నేలమీద పడతారు. యెరూషలేము నుండి ఒక రోదన దేవుని వద్దకు వెళుతుంది.
3 ప్రజా నాయకులు వారి సేవకుల నీటికొరకు పంపుతారు. సేవకులు జలాశయాల వద్దకు వెళతారు. కాని వారికి నీరు దొరకదు. సేవకులు ఖాళీ కూజాలతో తిరిగి వస్తారు. దానితో వారు సిగ్గుపడి, కలత చెందుతారు. అవమానంతో వారి తలలు బట్టతో కప్పుకుంటారు.
4 ఒక్కడు కూడా భూమిని దున్ని సాగుచేయడు* రాజ్యంలో వర్షం కురియదు. రైతులు నిరాశతో కుంగి పోతారు. వారు సిగ్గుతో తమ ముఖాలు కప్పుకుంటారు.
5 పొలంలో ఈనిన దుప్పి సహితం తన పిల్లను వదిలిపోతుంది. పచ్చిక దొరకని కారణంగా అది అలా చేస్తుంది.
6 అడవి గాడిదలు వట్టి కొండలపైన నిలబడతాయి. గుంటనక్కల్లా అవి గాలిని వాసన చూస్తాయి. వాటి కంటికి ఆహారమే కన్పించదు. ఎందు వల్లనంటే వాటికి తినటానికి ఎక్కడా మొక్కలు లేవు.

### సహాయం కొరకు దేవునికి ప్రార్థన

7 "నా ప్రజలిలా నాకు మొరపెట్టుకుంటారు: జరిగిన విషయాలన్నిటకీ మా తప్పులే కారణమని మాకు తెలుసు. మా పాపాల ఫలంగా మేమి ప్పుడు కష్టాలనుభవిస్తున్నాము. యెహోవా, నీ నామ ఘనత కొరకు ఏదో ఒకటి చేసి మాకు సహాయపడుము. నిన్ను అనేక సార్లు మేము వదిలిపెట్టినట్లు మేము ఒప్పుకుంటున్నాము. నీ పట్ల మేము పాపం చేశాము.
8 ఓ దేవా! ఇశ్రాయేలుకు నీవు ఆశాజ్యోతివి! కష్ట కాలంలో ఇశ్రాయేలును ఆదుకొనేవాడవు నీవే. అయినా ఇప్పుడి దేశంలో పరాయి వానిలా ప్రవ ర్తిస్తున్నావు. ఒక్కరాత్రి ఉండిపోయే బాటసారిలా ఉన్నావు.
9 ఆకస్మికంగా దాడి చేయబడిన వ్యక్తిలా ఉన్నావు. ఎవ్వరినీ రక్షించలేని అశక్తుడైన సైనికునిలా ఉన్నావు. అయినా నీవు మాతో ఉన్నావు. యెహోవా, నీ పేరుతో మేము పిలువబడుతూ ఉన్నావు. మమ్మల్ని నిస్సహాయులుగా వదిలి పెట్టవద్దు!"

### యూదాకి దేవుని సందేశం

10యూదా ప్రజల విషయంలో యెహోవా ఇలా
చెపుతున్నాడు: "యూదా ప్రజలు నన్ను వదిలి
పెట్టటానికి ఇష్టపడ్డారు. వారు నన్ను వదిలి వెళ్లటంలో
ఏమాత్రం వెనుకాడరు. కనుక ఇప్పుడు నేను వారిని
అంగీకరించను. వారు చేసిన దుష్టకార్యాలను నేను గుర్తు
పెట్టుకుంటాను. వారి పాపాలకు నేను వారిని శిక్షిస్తాను."
11పిమ్మట యెహోవా నాతో ఇలా అన్నాడు:
"యిర్మీయా, యూదా ప్రజలకు శుభం కలగాలని
ప్రార్థన చేయవద్దు. 12యూదా ప్రజలు ఉపవాసాలు
మొదలుపెట్టి నన్ను ప్రార్థించవచ్చు. కాని నేను వారి
ప్రార్థనలు వినను. వారు నాకు దహనబలులు
అర్పించినా, ధాన్యార్పణలు సమర్పించినా ఆ ప్రజలను
నేను అంగీకరించను. యుద్ధం ద్వారా యూదా వారిని
నేను నాశనం చేస్తాను. వారి ఆహార ధాన్యాలను తీసు
కుంటాను. వారు ఆకలితో అలమటిస్తారు. పైగా వారిని
భయంకర వ్యాధులకు గురి చేసి నాశనం చేస్తాను."
13కాని నేను యెహోవాతో ఇలా అన్నాను: "నా
ప్రభువా, ప్రజలకు ప్రవక్తలు వేరొక రకంగా చెపు
తున్నారు. ప్రజలు శత్రువు కత్తికి గురికావలసిన గతి
పట్టదనీ, వారికి కరువు రాదనీ, యెహోవా ఈ
రాజ్యంలోనే వారికి సుఖశాంతులు కలుగజేస్తాడనీ ప్రవ
క్తలు చెపుతున్నారు."
14అప్పుడు యెహోవా నాతో ఇలా అన్నాడు:
"యిర్మీయా, ఆ ప్రవక్తలు నా పేరుతో అబద్ధాలు
బోధిస్తున్నారు. ఆ ప్రవక్తలను నేను పంపలేదు. నేను
వారికి ఆజ్ఞ ఇవ్వలేదు. వారితో నేను మాట్లాడలేదు.
ఆ ప్రవక్తలు బోధించేదంతా అబద్ధపు దర్శనాలు. వట్టి
కనికట్టు. అది వారి స్వంత కల్పన. 15అందువలన నా
పేరుతో భవిష్యత్తును చెప్పే ప్రవక్తల విషయంలో
నేను చెప్పేదేమంటే వారిని నేను పంపలేదు. ఆ ప్రవ
క్తలు, 'కత్తిపట్టిన శత్రువెవ్వడూ ఈ రాజ్యంమీదికి రాడు.
ఈ రాజ్యంలో కరువనేది ఉండదు', అని కదా చెప్పారు.
చూడుము; ఆ ప్రవక్తలే ఆకలితో మాడి చనిపోతారు.
శత్రువు కత్తికి బలియైపోతారు. 16ఆ ప్రవక్తలు ఏ ప్రజ
లతో మాట్లాడినారో, వారు వీధిలోనికి లాగబడతారు.
ఆ ప్రజలు ఆకలితో చనిపోతారు. శత్రువుల కత్తి వారిని
నరికివేస్తుంది. వారినిగాని, వారి భార్యలను గాని, వారి
కుమారులను లేక కుమార్తెలను గాని పాతి పెట్టటానికి
ఒక్కడుకూడా మిగలడు! నేను వారిని శిక్షిస్తాను.

---

**ఒక్కడు ... సాగుచేయడు** ప్రాచీన గ్రీకు అను వాదాన్న నుసరించి ఇక్కడ వ్రాయబడింది. ఈ భాగంలో హెబ్రీ భాష సులభతరముగా లేదు.

17 "యిర్మీయా, యూదా ప్రజలకు ఈ వర్తమానం
అందజేయి. 'నా కండ్లు కన్నీళ్ళతో నిండాయి.
రాత్రింబవళ్లు నేను ఎల్లప్పుడూ విలపిస్తాను.
కన్యయగు నా కుమార్తె* కొరకు విలపిస్తాను.
నా ప్రజలకొరకు నేను దుఃఖిస్తాను. ఎందువల్ల
నంటే అన్యుడొకడు వారిని గాయపర్చినాడు;
వారిని అణగ ద్రొక్కినాడు. వారు తీవ్రంగా గాయ
పర్చబడినారు.
18 నేను పల్లెపట్టులకు వెళితే, కత్తులతో సంహరింప
బడినవారిని చూస్తాను. నేను నగరానికి వెళితే
అక్కడ నేను తిండి లేక రోగగ్రస్థులైన వారిని
చూస్తాను. యాజకులు, ప్రవక్తలు వారెరుగని
అన్యదేశానికి కొనిపోబడ్డారు.'"

### యూదా ప్రజల అభ్యర్థన

19 యెహోవా, యూదా రాజ్యాన్ని నీవు పూర్తిగా
విడనాడావా? యెహోవా, సీయోనును నీవు
ప్రేమించడం లేదా? నీవు మమ్ములను గాయ
పర్చిన రీతి చూస్తే, మేము తిరిగి కోలుకొనలే
మనిపిస్తున్నది. నీవు ఆ పని ఎందుకు చేశావు?
మేము శాంతిని కోరుకుంటున్నాము. కాని దాని
వల్ల ఏమీ మంచి జరుగలేదు. మేము స్వస్థపడే
సమయం కొరకు ఎదురుచూశాము; కాని
భయము పుట్టుచున్నది.
20 యెహోవా, మేము చాలా దుర్మార్గులమని మాకు
తెలుసు. మా పూర్వీకులు చెడుపనులు చేసినట్లు
మాకు తెలుసు. అవును. మేము నీ పట్ల పాపం
చేశాము.
21 యెహోవా, ఉన్నతమైన నీ నామము కొరకైనా
మమ్మల్ని తోసివేయవద్దు! దివ్యమైన నీ సింహా
సనపు గౌరవాన్ని తగ్గించవద్దు. మాతో నీవు చేసిన
ఒడంబడికను గుర్తుంచుకోవాలి. ఆ నిబంధనను
మరువవద్దు.
22 అన్య దేవతల విగ్రహాలకు వర్షం కురిపించే
శక్తిలేదు. ఆకాశానికి వర్షాలను పంపే ప్రభావము
లేదు. నీవే మాకు దిక్కు. నీవే ఈ కార్యములన్నీ
జరిపించేది."

15 యెహోవా నాతో ఇలా అన్నాడు:
"యిర్మీయా, చివరకు మోషే మరియు
సమూయేలు ఇక్కడికి వచ్చి యూదా కొరకు ప్రార్థన
చేసినా, ఈ ప్రజలకై నేను విచారపడను. నానుండి
యూదా ప్రజలను దూరంగా పంపివేయి! పొమ్మని
వారికి చెప్పు! 2 'మేమెక్కడికి వెళతాము, అని వారడుగ
వచ్చు. అప్పుడు వారితో యెహోవా ఇలా అంటు
న్నాడని చెప్పు:

'నేను వారిలో కొంతమంది అసహజంగా చని
పోవటానికి ఉద్దేశించాను. వారు మృత్యువు వాత
బడతారు. కొంతమందిని కత్తికి బలిచేయటానికి
ఉద్దేశించాను. వారు కత్తులతో యుద్ధానికి పోయి
చనిపోతారు. కొందరిని ఆకలి చావులకు ఉద్దే
శించాను. వారు కరువుకు గురవుతారు. మరి
కొందరిని అన్యదేశాలలో బందీలు కావటానికి ఉద్దే
శించాను. వారు బందీలై పరదేశానికి తీసుకుపో
బడతారు.
3 నేను నాలుగు రకాల విధ్వంసకారులను వారిపైకి
పంపుతాను. ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది 'నేను ఖడ్గధారులైన శత్రువులను సంహా
రానికి పంపుతాను. చనిపోయినవారి శరీరాలను
లాగివేయటానికి కుక్కలను పంపుతాను. వారి
శవాలను తినివేయటానికి, నాశనం చేయటానికి
పక్షులను, అడవి జంతువులను పంపుతాను.
4 ప్రపంచ ప్రజలందరికీ భీతావహంగా ఉండేలా
యూదా ప్రజలను భయంకరమైన దానికి ఒక
ఉదాహరణగా చూపిస్తాను. మనష్షే* రాజు
యెరూషలేములో చేసిన దానిని బట్టి యూదా
ప్రజలకు నేనీ విధంగా చేస్తాను. మనష్షే యూదా
రాజైన హిజ్కియా కుమారుడు. మనష్షే యూదా
రాజ్యానికి ఒక రాజు.'
5 "యెరూషలేము నగరమా, నీకొరకు ఒక్కడు
కూడా విచారించడు. ఎవ్వరూ నిన్ను గూర్చి
విలపించరు. నీ యోగ క్షేమాలు తెలుసుకొ
నేందుకు కూడా ఎవ్వరూ దగ్గరకు రారు.
6 యెరూషలేమా, నీవు నన్ను వదిలిపెట్టావు." ఈ
వర్తమానం యెహోవా నుండి వచ్చినది. "అనేక
పర్యాయములు నీవు నన్ను చేరలేదు! కావున
నిన్ను నేను శిక్షించి నాశనం చేస్తాను. మీ శిక్షను
మీ మీదకు రాకుండా పట్టుకొని నేను అలసి
పోయాను.
7 యూదా ప్రజలను నా కొంకె కర్రతో* వేరు
చేస్తాను. వారిని రాజ్యంలోగల నగర ద్వారాలవద్ద
నిరుపయోగంగా పారవేస్తాను. నా ప్రజలలో
మార్పు రాలేదు. అందుచే నేను వారిని నాశనం
చేస్తాను. వారి పిల్లలను నేను తీసుకొని పోతాను.

---

**కన్యయగు నా కుమార్తె** యెరూషలేముకు ఇది మరో పేరు.

**మనష్షే** మనష్షే బహుదుష్టుడైన యూదారాజు. అతడు చాలా అన్యదేవతలను ఆరాధించాడు. రాజులు రెండవ గ్రంథం 21:1-16 చూడండి.

**కొంకె కర్ర** కొంకె కర్రలు, పంగల కర్రలు గడ్డి మొదలగు వాటిని గుచ్చి లాగటానికి వినియోగిస్తారు.

8 అనేకమంది స్త్రీలు తమ భర్తలను కోల్పోతారు.
సముద్రతీరాన ఉన్న ఇసుకకంటె ఎక్కువగా
విధవ స్త్రీలు వుంటారు. మధ్యాహ్న సమయంలో
నేను నాశన కారులను తీసుకొని వస్తాను. యూదా
యువకుల తల్లులపైవారు దాడి చేస్తారు.
యూదా ప్రజలకు బాధను, భయాన్ని కలుగ
జేస్తాను. ఇదంతా అతి త్వరలో సంభవించేలా
చేస్తాను.
9 శత్రువు కత్తులతో దాడిచేసి ప్రజలను చంపు
తాడు. మిగిలిన యూదా వారిని వారు చంపు
తారు. ఒక స్త్రీకి ఏడుగురు కుమారులుండవచ్చు,
కాని వారంతా హత్య చేయబడతారు. ఆమె ఏడ్చి
ఏడ్చి సొమ్మసిల్లిపోతుంది. ఆమె కలవరపడి,
తబ్బిబ్బై పోతుంది. దుఃఖంవల్ల పట్టపగలే
ఆమెకు చీకటి కలుగుతుంది."

### దేవునికి మరల యిర్మీయా తెలియజేయుట

10 తల్లీ, నీవు నాకు జన్మ ఇవ్వనట్లయితే బాగుండేది.
నేను దుఃఖపడుతున్నాను. నేను దురదృష్టవంతు
డను. ఈ సమస్త రాజ్యాన్నీ నేను (యిర్మీయా)
నిందిస్తూ, విమర్శిస్తూ ఉన్నాను. నేనెవరికీ ఏదీ
అప్పు యివ్వలేదు; అరువు తీసుకోలేదు. కాని
ప్రతివాడూ నన్ను శపిస్తున్నాడు!
11 యెహోవా, నేను నిన్ను భక్తితో సేవించాను.
ఆపదకాలం వచ్చినప్పుడు నా శత్రువుల గురించి
నేను నిన్ను వేడుకున్నాను.

### యెహోవానుండి యిర్మీయాకు జవాబు

12 "యిర్మీయా, ఇనుప ముక్కను నుగ్గుచేయటం
ఎవరితరమూ కాదని నీకు తెలుసు. అంటే నా
ఉద్దేశ్యం ఉత్తరాన్నుంచి వస్తున్న ఇనుమువలె
ఉంటుంది.* అలాగే ఇనుప ముక్కను చిదుక
గొట్టే వారెవరు?
13 యూదా ప్రజలకు ధనము, ఐశ్వర్యం ఉన్నాయి.
ఆసంపదను పరులకు ఇస్తాను. అన్యులు ఆ
సంపదను ఖరీదు చేయనక్కరలేదు. నేనే వారికి
స్వయంగా ఇచ్చివేస్తాను. ఎందువల్లనంటే
యూదా చాలా పాపాలు చేసింది. యూదా
దేశంలో ప్రతిచోటా పాపాలు జరిగాయి.
14 యూదా ప్రజలారా, మీ శత్రువులకు మిమ్మల్ని
బానిసలుగా చేస్తాను. ముందెన్నడూ ఎరుగని
రాజ్యంలో మీరు బానిసలవుతారు. నేను మిక్కిలి
కోపంతో ఉన్నాను. నా కోపం రగులుతున్న
అగ్నిలా ఉంది. అందులో మీరు కాలిపోతారు."
యిర్మీయా ఈ విధంగా చెప్పాడు:
15 యెహోవా, నీవు నన్ను అర్థంచేసుకో. నన్ను
గుర్తుంచుకొని, నా గురించి శ్రద్ధ తీసుకో. ప్రజలు
నన్ను గాయ పర్చుతున్నారు. వారికి తగిన శిక్ష
విధించుము. ఆ ప్రజలపట్ల నీవు చాలా ఓపిక
పట్టినావు. వారి పట్ల ఓపికపడుతూ, నన్ను
నాశనం కానీయకు. నా గురించి ఆలోచించుము.
యెహోవా, నీ గురించి నేననుభవిస్తున్న
నొప్పిని గురించి నీవు జ్ఞాపకం చేసుకో.
16 నీ వర్తమానం నాకు అందినప్పుడు, నీ మాటలు
నేను పొందుకున్నాను . నీ వాక్కు నన్ను మిక్కిలి
సంతోషపర్చింది. నా సంతోషానికి కారణమే
మంటే నీ పేరు మీద నేను పిలువబడ్డాను. నీ
పేరు సర్వశక్తిమంతుడు.
17 నేను ప్రజలతో కలసి ఎన్నడూ కూర్చోలేదు.
కారణమేమనగా వారు నన్ను చూచి నవ్వి,
ఎగతాళి చేశారు. నామీద నీ ప్రభావం పడుట
వలన నాకు నేను ఒంటరిగా కూర్చున్నాను.
నాచుట్టూ ఉన్న చెడు వాతావరణంపట్ల నేను
కోపగించుకొనేలా చేశావు.
18 నేనింకా ఎందుకు బాధపడుతున్నానో నాకు
అర్థం కావటంలేదు. నా గాయం ఎందుకు
నయంకాలేదో, ఎందుకు తగ్గడంలేదో నాకు
అర్థంకావటం లేదు. యెహోవా, నీవు మారి
పోయావేమోనని అనుకుంటున్నాను. నీవు
ఎండిపోయిన సెలయేటిలా ఉన్నావు. నీవు ఇంకి
పోయిన నీటిబుగ్గలా ఉన్నావు.
19 అప్పుడు యెహోవా ఇలా అన్నాడు:
"యిర్మీయా, నీలో మార్పు వచ్చి తిరిగి
నావద్దకు వస్తే నిన్ను నేను శిక్షించను. నీవు
మారి నావద్దకు వస్తే నీవు నన్ను వెంబడించ
గలవు. వ్యర్థ ప్రసంగాలు మాని, నీవు అనుకూ
లంగా మాట్లాడితే నాగురించి నీవు మాట్లాడ
గలవు. యూదా ప్రజలు మార్పుచెంది నీవద్దకు
తిరిగిరావాలి. అంతేగాని నీవు మారి వారిలా
వుండకూడదు.
20 నిన్ను శక్తిమంతునిగా చేస్తాను. నిన్నుచూచి
వారంతా కంచుగోడలాంటి వాడని అను
కుంటారు. యూదావారు నీతో పోట్లాడుతారు.
కాని వారు నిన్ను ఓడించలేరు. ఎందువల్లంటే
నేను నీతో వున్నాను. నేను నీకు సహాయ పడ
తాను; నిన్ను రక్షిస్తాను." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది.
21 "ఆ దుష్టులనుండి నేను నిన్ను రక్షిస్తాను. వారు
నిన్ను బెదరగొడతారు. కాని వారి బారినుండి
నిన్ను నేను రక్షిస్తాను."

---

**ఉత్తరాన్నుంచి ... ఉంటుంది** ఇది బబులోను సైన్యం. ఈ సైన్యం ఉత్తరాన్నుంచి వచ్చి, యూదాపై దాడి చేయటాన్ని సూచిస్తుంది.

### ఆ పదవ రోజు

16 యెహోవా వర్తమానం నాకు వచ్చింది:
2"యిర్మీయా, నీవు వివాహం చేసికోరాదు.
ఈ స్థలములో నీవు కొడుకులను, కూతుళ్లను కలిగి
యుండరాదు."
3యూదా రాజ్యంలో పుట్టిన కొడుకులు, కూతు
ళ్లను గురించి యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
మరియు ఆ పిల్లల తల్లిదండ్రులను గూర్చి యెహోవా
ఇలా సెలవిచ్చాడు: 4"ఆ ప్రజలు ఒక భయంకరమైన
చావు చస్తారు! వారిని గురించి ఒక్కడు కూడా ఏడ్వడు,
విచారించడు. వారినెవ్వడూ సమాధి చేయడు. పశువుల
పేడవలె వారి శవాలు నేలమీద పడివుంటాయి. వారు
శత్రువు కత్తికి బలియైపోతారు. లేదా ఆకలితో మాడి
చనిపోతారు. వారి శవాలు ఆకాశ పక్షులకు, అడవి
జంతువులకు ఆహారమవుతాయి."
5'అందువల్ల యెహోవా ఇలా చెప్పాడు:
"యిర్మీయా, ఏ ఇంటిలోనయితే చావు దినపు భోజ
నాలు జరుగుతూ వుంటాయో, నీవా ఇంటిలోనికి
పోవద్దు. చనిపోయిన వారికొరకు విలపించటానికి గాని,
నీ సంతాపాన్ని వెలిబుచ్చటానికి గాని నీవక్కడికి వెళ్ల
వద్దు. ఆ పనులు నీవు చేయవద్దు. ఎందువల్లనంటే,
నా ఆశీర్వాదాన్ని నేను తిరిగి తీసుకున్నాను. యూదా
ప్రజలకు నేను కరుణ చూపను. వారి కొరకు నేను
బాధపడను." ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది.
6"యూదా రాజ్యంలో ప్రముఖులు, సామాన్యులు
అంతా చనిపోతారు. వారినెవరూ సమాధిచేయరు. లేక
వారి కొరకు ఎవ్వరూ దుఃఖించరు. మృతుల కొరకు
దుఃఖ సూచకంగా ఎవ్వడూ తన శరీరం చీరుకొన
టంగాని, తల గొరిగించుకోవటం గాని చేయడు. 7చని
పోయిన వారికొరకై విలపించేవారికి ఎవ్వరూ ఆహారం
తెచ్చియివ్వరు. తల్లిదండ్రులు చనిపోయి విల
పించేవారిని ఎవ్వరూ ఓదార్చరు. మృతుల కొరకు
రోదించేవారిని ఆదరించుటకు ఎవ్వరూ తాగటానికి
నీరు ఇవ్వరు.
8"విందు జరుపుకుంటూన్న ఏ ఇంటిలోనికీ నీవు
వెళ్లవద్దు. ఆ ఇంట్లోకి వెళ్లి తాగటానికి, తినటానికి
కూర్చోవద్దు. 9ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇలా చెప్పినాడు: 'వేడుక
చేసుకొనే వారి ఆనందమును నేను వెంటనే ఆపి
వేస్తాను. ఇది నీ జీవితకాలంలోనే జరుగుతుంది. ఇవన్నీ
త్వరలోనే చేస్తాను.'
10"యిర్మీయా, యూదా ప్రజలకు నీవు ఈ
విషయాలన్నీ చెపుతావు. తిరిగి వారు నిన్నిలా అడుగు
తారు: 'మా విషయంలో దేవుడు ఆ భయంకర విష
యాలు జరుగుతాయని ఎందుకు చెప్పాడు? మేము
చేసిన తప్పేమిటి? మా యెహోవా దేవునికి వ్యతిరే
కంగా మేము చేసిన పాపం ఏమిటి?' 11అప్పుడు వారికి
నీవు ఈ విషయాలు చెప్పాలి: 'ఈ భయంకర పరిణా
మాలు జరగబోవడానికి కారణం మీ పితరులు నన్ను
అనుసరించటం మానివేయటమే' ఈ వాక్కు
యెహోవా నుండి వచ్చినది – వారు నన్ను వదిలి
అనేక ఇతర దైవముల ననుసరించి ఆరాధించినారు.
మీ పితరులు నన్ను వదిలి, నా ధర్మశాస్త్రాన్ని అను
సరించుట మానివేశారు. 12కాని మీరు మీ పూర్వీకుల
కంటె నీచంగా పాపం చేశారు. మీరు కఠినాత్ములై
చాలా మొండివైఖరి దాల్చారు. మీరు చేయదలచు
కున్నదే మీరు చేస్తున్నారు. మీరు నాకు విధేయులుగా
లేరు. మీకు యిష్టమైనదే మీరు చేస్తున్నారు. 13కావున
మిమ్మల్ని ఈ దేశంనుండి బహిష్కరిస్తాను. మిమ్మల్ని
అన్యదేశానికి తరిమివేస్తాను. మీరు, మీ పూర్వీకులు
ముందెన్నడూ చూడని దేశానికి మీరు వెళతారు. అక్కడ
మీ ఇష్టం వచ్చినట్టు బూటకపు దేవతలను వెంబడించ
వచ్చు. నేను మీకు సహాయం చేయను. ఏ రకమైన
ఉపకారమూ చేయను.'
14"ప్రజలు ప్రమాణాలు చేస్తూ, 'ఇశ్రాయేలీయు
లను ఈజిప్టునుండి తీసుకొని వచ్చిన నిత్యుడైన
దేవునితోడు' అని వారు అంటారు. కాని ప్రజలు ఈ
మాటలు అనకుండా ఉండే సమయం ఆసన్నమవుతూ
ఉంది." ఇది యెహోవా వాక్కు. 15ప్రజలు వాగ్దానాలు
చేసి అంటారు: 'నిత్యుడైన దేవుని సాక్షిగా' అని,
'ఇశ్రాయేలీయులను ఉత్తర దేశంనుండి తీసుకొని
వచ్చినది నిత్యుడైన యెహోవాయే!' అని, 'ఇశ్రాయే
లీయులను ఆయన పంపిన దేశాలనుండి మరల
తీసుకొని వచ్చినది ఆయనే' అని అంటారు. ప్రజలు
ఇలా ఎందుకు అంటారు? ఎందువల్లనంటే ఇశ్రాయే
లీయులను వారి పూర్వీకులకు నేనిచ్చిన రాజ్యానికి
మరల తీసుకొనివస్తాను.
16"ఈ రాజ్యానికి చాలామంది జాలరులను త్వరలో
పంపిస్తాను" ఇది యెహోవా వాక్కు "ఆ జాలరులు
యూదా ప్రజలను పట్టుకుంటారు. అది జరిగిన
పిమ్మట ఈ రాజ్యానికి చాలామంది వేట గాండ్రను
పిలిపిస్తాను. ఈ వేటగాండ్రు* యూదావారిని ప్రతి
కొండమీద, పర్వతంమీద, కొండ బొరియల్లోను
వేటాడతారు. 17వారు చేసేదంతా నేను చూస్తాను.
యూదా వారు చేసేది దేనినీ నానుండి దాచలేరు.
వారి పాపం నానుండి మరుగు పర్చబడలేదు. 18యూదా
ప్రజలు చేసిన దుష్కార్యాలకు తగిన శిక్ష విధిస్తాను.
వారి ప్రతి పాపానికీ రెండు సార్లు శిక్షిస్తాను. ఇది ఎందుకు
చేస్తానంటే, వారు నా రాజ్యాన్ని 'అపవిత్ర' పర్చారు.
వారు నా రాజ్యాన్ని భయంకరమైన విగ్రహాలతో 'కలు

---

**ఆ జాలరులు ... ఈ వేటగాండ్రు** ఇక్కడ వేటగాండ్రు అనగా బబులోను సైనికులని అర్థం.

షితం' చేశారు. ఆ విగ్రహాలను నేను అసహ్యించు
కుంటాను. కాని వారు నా దేశాన్నంతా ఘోరమైన
చెడు విగ్రహాలతో నింపివేశారు."

19 యెహోవా, నీవేనాకు బలం; నీవే నాకు రక్షణ.
ఆపదలో తలదాచుకోటానికి నీవే సురక్షితమైన
చోటు. ప్రపంచ దేశాలన్నీ నీ శరణు వేడి
వస్తాయి. ఆ దేశాల వారంతా ఇలా అంటారు:
"మా పితరులు చాలామంది బూటకపు దేవుళ్లను
నమ్మారు. వారా పనికిమాలిన విగ్రహాలను ఆరా
ధించారు. కాని ఆ విగ్రహాలు వారికి ఏ రకంగానూ
సహాయపడలేదు."
20 ప్రజలు వారికై వారు నిజమైన దేవతలను చేయ
గలరా? చేయలేరు! వారు విగ్రహాలను మాత్రమే
చేయగలరు. కాని ఆ బొమ్మలు నిజానికి దేవుళ్లే
కారు!"
21 "అందుచేత బొమ్మల దేవుళ్లను చేసేవారికి నేను
గుణపాఠం నేర్పుతాను. ఇప్పుడే వారికి నా శక్తిని
గురించీ, నా బలాన్ని గురించీ తెలియజెబుతాను.
అప్పుడు నేనే దేవుడననే జ్ఞానం వారికి కలుగు
తుంది. నేనే యెహోవా అని వారు తెలుసు
కుంటారు."

### నేరం గుండెలపై వ్రాయబడింది

17 "యూదా ప్రజల పాపం తుడిచి వేయలేని
చోట వ్రాయబడింది. వారి పాపాలు ఇనుప
కలంతో రాతిలోకి చెక్కబడ్డాయి. వారి పాపాలు
వజ్రపు మొనతో రాతిలోకి చెక్కడ్డాయి. వారి
గుండెలే ఆ రాతిఫలకాలు.
2 బూటకపు దేవుళ్లకు అంకితం చేసిన బలిపీఠాలు
వారి పిల్లలకు గుర్తున్నాయి. ఆ పాపాలన్నీ బలి
పీఠం కొమ్ములమీద* చెక్కబడినాయి. అషేరా
దేవతకు అంకితం చేయబడిన దేవతా చెక్క
స్తంభాలు కూడ వారికి గుర్తున్నాయి. కొండల
మీద, పచ్చని చెట్లకింద జరిగిన తంత్రాలన్నీ
వారికి గుర్తున్నాయి.
3 మైదాన ప్రదేశాలలోగల పర్వాతాల మీద జరిగిన
సంగతులు వారికి గుర్తున్నాయి. యూదా ప్రజ
లకు నిధి నిక్షేపాలున్నాయి. వాటిని నేను అన్య
ప్రజలకు ఇచ్చివేస్తాను! మీ దేశంలోగల ఉన్నత
స్థలాలన్నీ (పూజా ప్రదేశాలు) ప్రజలు నాశనం
చేస్తారు. ఆ ప్రదేశాలలో ఆరాధనలు చేసి మీరు
పాపం చేశారు.
4 నేను మీకిచ్చిన రాజ్యాన్ని పోగొట్టుకుంటారు.
మీ విరోధులు మమ్మల్ని బానిసలుగా తీసుకొని
పోయేలా చేస్తాను. ఎందువల్లనంటే, నేను చాలా
కోపంగా ఉన్నాను. నా కోపం దహించే అగ్నిలా
ఉంది. మీరందులో శాశ్వతంగ కాలిపోతారు."

### ప్రజలలో నమ్మిక – దేవునిలో నమ్మిక

5 యెహోవా ఈ విషయాలు చెప్పుచున్నాడు:
"ఇతర ప్రజలను నమ్మేవారికి కీడు జరుగుతుంది.
బలం కొరకు ఇతర ప్రజలపై ఆధారపడేవారికి
కష్ట నష్టాలు వస్తాయి. ఎందువల్లనంటే ప్రజలు
యెహోవాను నమ్ముట మాని వేశారు.
6 ఆ ప్రజలు ఎడారిలో పొదలావున్నారు. ఆ పొద
వున్న ప్రాంతంలో ఎవ్వరూ నివసించరు. ఆ
పొద బీటలు వారిన ఉష్ణ ప్రదేశంలో ఉంది. ఆ
పొద చవుడు భూమిలో ఉంది. ఆ పొదకు దేవుడు
ఇవ్వగల అనేక శుభాలను గురించి తెలియదు.
7 కాని యెహోవాలో నమ్మిక గల వ్యక్తి ఆశీర్వ
దింపబడతాడు. ఎందువల్లనంటే తనను నమ్మ
వచ్చని యెహోవా నిరూపిస్తాడు.
8 నీటి వనరులున్నచోట నాటిన చెట్టువలె ఆ
వ్యక్తి ఏపుగా, బలంగా ఉంటాడు. నీటి వనరులున్న
చెట్టుకు బలమైన వేర్లుంటాయి. ఆ చెట్టు వేసవి
వేడికి తట్టుకుంటుంది. దాని ఆకులు నిత్యం
పచ్చగా ఉంటాయి. ఒక సంవత్సరం వర్షాలు
కురియకపోయినా దానికి భయముండదు. ఆ
చెట్టు ఎల్లప్పుడు కాయలుకాస్తుంది.
9 "మానవ మనస్సు మిక్కిలి కపటంతో కూడివుంది.
మనస్సు చాలా వ్యాధిగ్రస్తమయ్యింది. మానవ
మనస్సును ఎవ్వరూ సరిగా అర్థం చేసికోలేరు.
10 కాని యెహోవానైన నేను ఒక వ్యక్తి హృదయం
లోకి సూటిగా చూడగలను. వ్యక్తి మనస్సును
నేను పరీక్షించగలను. అందువల్ల ఎవ్వరెవ్వరికి
ఏమేమి కావాలో నేను నిర్ణయించగలను. ప్రతి
వ్యక్తికీ వాని పనికి తగిన జీతభత్యం నేను
ఇవ్వగలను.
11 ఒకానొక పక్షి తను గ్రుడ్లు పెట్టకుండానే వేరే
పక్షులు పెట్టిన గ్రుడ్లను పొదుగుతుంది. డబ్బు
కోసం ఇతరులను మోసం చేసే వాడుకూడా
అలాంటి పక్షిలాంటి వాడే. వాని జీవితం సగం
గడిచే సరికి వాని ధనం పోతుంది. తన జీవిత
ఆఖరి (చివరి) దశలో వాడు పరమ మూర్ఖుడై
పోతాడనేది విదితమైన విషయం."
12 ఆదినుంచీ మన దేవాలయం ప్రఖ్యాతిగాంచిన
దేవుని సింహాసనమై ఉన్నది. అది చాలా
ముఖ్యమైన స్థలం.

---

**ఆ పాపాలన్నీ ... కొమ్ములమీద** బలిపీఠం మూలలు కొమ్ముల ఆకారంలో మలచబడతాయి. ఇది ప్రజలకు రక్షణ కల్పించే ప్రదేశం. తప్పు చేసినవాడెవడైనా ఇచ్చటికి పరుగున రావచ్చు. ఆ వచ్చినవాడు నేరస్థుడని నిరూపించబడినాకనే వాడు శిక్షకు అర్హుడు. ఇక్కడ యిర్మీయా యూదా ప్రజలకు రక్షణ స్థలమేదీలేదని చెప్పుచున్నాడు.

13 యెహోవా, నీవు ఇశ్రాయేలీయులకు ఆశా
జ్యోతివి. దేవా, నీవు జీవజలధారలా ఉన్నావు!
ఆయనను విడిచిపెట్టిన వారు అవమానానికి
గురవుతారు. వారు అవమానించబడుతారు.
జీవిత ప్రమాణం తగ్గిపోతుంది.*

### యిర్మీయా మూడవ విన్నపం

14 యెహోవా, నీవు నన్ను బాగుచేస్తే నేను నిజంగా
స్వస్థపడతాను! నన్ను రక్షిస్తే, నేను నిజంగా
రక్షింపబడతాను. యెహోవా, నిన్ను నేను స్తుతి
స్తున్నాను.
15 యూదా ప్రజలు నన్ను ప్రశ్నలడుగుతూ
వుంటారు. "యిర్మీయా, యెహోవా వర్తమానం
ఎక్కడ? ఆ వర్తమానం నెరవేరేలా చేయి!" అని
వారంటారు.
16 యెహోవా, నేను నీనుండి దూరంగా పారి
పోలేదు. నేను నిన్ను అనుసరించాను. నీవు కోరిన
విధంగా నేను గొర్రెలకాపరినయ్యాను. ఆ భయం
కరమైన రోజు రావాలని నేను కోరుకోలేదు.*
యెహోవా, నేను చెప్పిన విషయాలు నీకు
తెలుసు. జరుగుతున్నదంతా నీవు చూస్తూనే
ఉన్నావు.
17 యెహోవా, నన్ను నాశనం చేయవద్దు. కష్ట
కాలంలో నేను నిన్నాశ్రయిస్తాను.
18 ప్రజలు నన్ను హింసిస్తున్నారు. వారిని సిగ్గుపడేలా
చేయి. కాని నాకు ఆశాభంగం కలుగ చేయకు.
ఆ ప్రజలనే పారిపోయేలా చేయుము. కాని నన్ను
మాత్రం పారి పోనీయవద్దు. ఆ భయంకరమైన
దుర్దినాన్ని నా శత్రువు పైకి రప్పించుము. వారిని
పూర్తిగా సర్వనాశనం చేయుము. వారిని పూర్తిగా
భంగపర్చుము.

### సబ్బాతు దినాన్ని పవిత్రపర్చటం

19యెహోవా ఈ విషయాలు నాకు చెప్పాడు:
"యిర్మీయా, నీవు వెళ్లి యెరూషలేము 'ముఖ
ద్వారం'* వద్ద నిలబడు. అక్కడ యూదా రాజులు
లోనికి, బయటికి వెళ్తూ ఉంటారు. అక్కడ ప్రజలకు
నా వర్తమానం అందజేయి. తరువాత అన్ని ద్వారాల
వద్దకూ వెళ్లి అలాగే చేయి.
20 "ఆ ప్రజలకు ఇలా చెప్పుము: "యెహోవా
వర్తమానం వినండి. యూదా రాజులారా, వినండి.
యూదా ప్రజలారా, వినండి. ఈ ద్వారం ద్వారా
యెరూషలేములోనికి వచ్చే ప్రజలారా, మీరంతా నేను
చెప్పేది వినండి!' 21యెహోవా ఈ విషయాలు చెప్పి
నాడు 'సబ్బాతు దినాన మీరేమీ బరువులు మోయ
కుండా జాగ్రత్త తీసుకోండి. యెరూషలేము నగర
ద్వారాల గుండా విశ్రాంతి దినాన ఏమీ బరువులు తేవద్దు.
22మీ ఇండ్లనుండి కూడా పవిత్ర విశ్రాంతి దినాన
బరువులు తేవద్దు. ఆ రోజున మీరు ఏపనీ చేయవద్దు.
మీరు విశ్రాంతి దినాన్ని పవిత్ర పర్చాలి. ఇదే రకపు
ఆజ్ఞను మీ పూర్వీకులకు కూడ యిచ్చియున్నాను.
23కాని మీ పూర్వీకులు నా ఆజ్ఞను శిరసావహించలేదు.
వారు నేను చెప్పిన దానిని లక్ష్య పెట్టలేదు. మీ పితరులు
బహు మొండివారు. నేను వారిని శిక్షించాను. కాని
దానివల్ల ఏమీ మంచి జరగలేదు. వారు నేను చెప్పినది
వినలేదు. 24కాని మీరు నా ఆజ్ఞను అనుసరించేలా
జాగ్రత్తపడాలి." ఇది యెహోవా వాక్కు. "మీరు ఎట్టి
పరిస్థితిలోనూ విశ్రాంతి దినాన యెరూషలేము నగర
ద్వారాలనుండి బరువులు తేరాదు. మీరు విశ్రాంతి
దినాన్ని పవిత్రపర్చాలి. అనగా మీరు ఆ రోజు ఏ పనీ
చేయకుండా దాని పవిత్రతను కాపాడవచ్చు.
25"మీరీ ఆజ్ఞను పాటిస్తే, దావీదు సింహాసనంపై
కూర్చునే రాజులంతా యెరూషలేము నగర ద్వారం
గుండా వస్తారు. ఆ రాజులు రథాలమీద, గుర్రాల మీద
ఎక్కి వస్తారు. ఆ రాజులవెంట యూదా, యెరూష
లేము ప్రజానాయకులు కూడా వుంటారు. యెరూష
లేము నగరంలో శాశ్వతంగా ప్రజలు నివసిస్తారు.
26యూదా పట్టణాలనుండి ప్రజలు యెరూషలేము
నగరానికి వస్తారు. చుట్టుపట్లవున్న చిన్న చిన్న గ్రామా
లనుండి కూడా ప్రజలు యెరూషలేము నగరానికి
వస్తారు. బెన్యామీను వంశీయులున్న రాజ్యంనుండి
కూడా ప్రజలు వస్తారు.* పడమట నున్న కొండవాలు
ప్రాంతం నుండి, మన్యప్రాంతం నుండి కూడా ప్రజలు
వస్తారు. మరియు యూదా దక్షిణ ప్రాంతంనుండి
కూడా నెగెవు ప్రజలు వస్తారు. ఆ ప్రజలు కృతజ్ఞ
తార్పణలు, దహన బలులు, బలులు, ధాన్యార్పణలు,
ధూపద్రవ్యాలు, తెస్తారు. వారా అర్పణలను, బలులను
యెహోవా ఆలయానికి తెస్తారు.
27"అయితే, మీరు నామాట వినక నాకు విధే
యులై యుండకపోతే మీకు కీడు సంభవిస్తుంది.
సబ్బాతు దినాన యెరూషలేముకు మీరు బరువులు

---

**వారు ... తగ్గిపోతుంది** అతడు దుమ్ములో వ్రాయబడతాడని శబ్దార్థం. అనగా వానిపేరు త్వరలో చనిపోయే వారి పట్టికలో వ్రాయబడుతుందని అర్థం. లేదా ఇసుకలో వ్రాసిన పేరులా వాని జీవితం క్షణంలో మాయమవుతుంది, అని పాఠాంతరం.

**ఆ భయంకరమైన ... కోరుకోలేదు.** రాబోతున్న విపత్తును గురించి యిర్మీయా ప్రవచనాలిచ్చాడు, కాని అవి నెరవేరాలని అతను ఇష్టపడలేదు.

**ముఖద్వారం** యెరూషలేము నగర ప్రతి ద్వారానికీ ఒక పేరు వుంటుంది.

**బెన్యామీను ... వస్తారు** బెన్యామీను రాజ్యం యూదా రాజ్యానికి ఉత్తర భాగానవున్నది.

మోసుకువస్తే మీరు దానిని పవిత్ర దినంగా పరిగణిం
చుట లేదని అర్థం. అప్పుడు నేను ఆర్పజాలని అగ్నిని
ప్రజ్వరిల్ల జేస్తాను. ఆ అగ్ని యెరూషలేము ద్వార
ములవద్ద మొదలవుతుంది. అది భవనాలన్నిటినీ దగ్ధం
చేసేవరకు మంటలు చెలరేగుతూనే ఉంటాయి.”

## కుమ్మరి మరియు బంకమట్టి

18 ఈ వర్తమానం యిర్మీయాకు యెహోవా
నుండి వచ్చినది: 2“యిర్మీయా, కుమ్మరి వాని
ఇంటికి వెళ్లు. నా వర్తమానం నీకు అక్కడ యిస్తాను.”
3నేను కుమ్మరివాని ఇంటికి వెళ్లాను. ఆ కుమ్మరి
తన సారె (చక్రం) పై కుండలు చేస్తున్నాడు. 4బంక
మన్నుతో అతడొక కుండను చేస్తున్నాడు. కాని ఆ
కుండరూపులో ఏదో లోపం వచ్చింది. చేసే కుండను
తీసివేసి ఆ మట్టితో కుమ్మరి మరో కుండను చేశాడు.
తన చేతి వ్రేళ్లను నైపుణ్యంగా ఉపయోగించి తను
కోరిన రీతిగా కుండను మలిచాడు.
5అప్పుడు యెహోవా వాక్కు నాకు వినిపించింది:
6“ఇశ్రాయేలు వంశమా, నేను (యెహోవా) నీ విష
యంలో కూడా అదేరీతిగా చేయగలనని నీకు తెలుసు.
నీవు కుమ్మరి చేతిలో మట్టిలా వున్నావు. నేను కుమ్మరి
వానిలా వున్నాను! 7నేను ఒక దేశాన్ని గురించిగాని,
ఒక సామ్రాజ్యాన్ని గురించి గాని మాట్లాడే సమయం
రావచ్చు. నేనారాజ్యాన్ని పెరికి వేయగలనని చెప్ప
వచ్చు. లేదా, ఆ దేశాన్నిగాని, ఆ సామ్రాజ్యాన్నిగాని
కిందికి లాగి నాశనం చేస్తానని నేను అంటాను. 8అయితే
ఆ దేశపు ప్రజలు మనస్సు మార్చుకొని తమ నడ
వడికను సరిచేసికోవచ్చు. ఆ దేశ ప్రజలు దుష్టకార్యాలు
చేయటం మానివేయవచ్చు. అప్పుడు నా మనస్సును
కూడా నేను మార్చుకుంటాను. ఆ దేశానికి బాధలు
తెచ్చిపెట్టినా పథకాన్ని నేను అమలుపర్చను. 9ఒక
దేశాన్ని గురించి నేను ప్రస్తావించే మరో సమయం
రావచ్చు. నేనా దేశాన్ని తీర్చిదిద్ది, దాన్ని సుస్థిర పరు
స్తానని అనవచ్చు. 10కాని ఆ దేశ ప్రజలు నాకు విధే
యులుకాకుండా దుష్టకార్యాలు చేస్తూ ఉండవచ్చు.
అప్పుడు ఆ దేశానికి చేయదలచుకున్న మంచి పనుల
విషయంలో నేను పునరాలోచించవలసి వుంటుంది.
11“కావున యిర్మీయా, యూదా ప్రజలకు,
యెరూషలేము నగర వాసులకు యెహోవా ఇలా
చెపుతున్నాడని చెప్పుము: ‘మీకు నేనిప్పుడే కష్టాలు
సిద్ధం చేస్తున్నాను. మీకు వ్యతిరేకంగా పథకాలు
తయారు చేస్తున్నాను. కావున మీరు చేస్తున్న దుష్ట
కార్యాలు చేయటం మానివేయాలి. ప్రతి ఒక్కడూ
మార్పు చెందాలి. సత్కార్యాలు చేయటం మొదలు
పెట్టాలి!’ 12కాని యూదా ప్రజలు ఇలా సమాధాన
మిస్తారు, ‘మార్చుటకు ప్రయత్నం చేయుటవల్ల ఏమీ
ప్రయోజనముండదు. మేము చేయదలచుకున్నదేదో
అదే చేస్తూపోతాము. మాలో ప్రతివాడూ తన కఠిన
మైన దుష్టమైన హృదయం ఎలా చెపితే అలా
నడుచుకుంటాడు.’”

13 యెహోవా చెప్పే విషయాలు వినండి: “అన్య
దేశాల ప్రజలను ఈ ప్రశ్న అడగండి: ఇశ్రాయేలు
చేసినటువంటి దుష్కార్యాలు మరెవరైనా చేస్తు
న్నట్లు మీరెప్పుడైనా విన్నారా?’ పైగా ఇశ్రా
యేలు దేవుని వధువులా ఉంది!
14 పొలాల్లో నుండి బండలు తమంత తాము బయ
టికి పోవని నీకు తెలుసు.* లెబానోను పర్వతాల
నుండి మంచు ఎన్నడూ కరిగిపోదని కూడా
నీకు తెలుసు. అక్కడ ప్రవహించే శీతల వాగులు
ఎన్నడూ ఎండిపోవని కూడా నీకు తెలుసు.
15 కాని నా ప్రజలు నన్ను గురించి మర్చిపోయారు.
వారు పనికిరాని విగ్రహాలకు బలులు సమర్పిం
చారు. నా ప్రజలు వారు చేసే పనులలో తొట్రు
పాటు చెందుతారు. వారి పితరులు నడచిన పాత
దారిలో నడిచి తడబడతారు. నా ప్రజలు వేరే
మార్గాన నడుస్తారు. గతుకుల బాటలపై నడు
స్తారు. కాని వారు మంచి మార్గంపై నన్నను
సరించరు!
16 యూదా రాజ్యం వట్టి ఎడారిగా మారిపోతుంది!
ఆ దారిన పోయే వారందరు దాని గతిచూచి
ఆశ్చర్యంతో తలలు ఆడిస్తారు. ఆ దేశం ఎలా
నాశనమైపోయిందా అని వారు తికమక పడతారు!
17 యూదా ప్రజలను వారి శత్రువులముందు పనికి
రానివారిగా పడవేస్తాను. బలమైన తూర్పుగాలి
వస్తువులను చెల్లాచెదరు చేసేలా నేను వారిని
విసరివేస్తాను. నేనా ప్రజలను నాశనం చేస్తాను.
ఆ సమయంలో నేను వారికి అండగా వస్తున్నట్టు
నన్ను చూడలేరు. మరియు!నేను వారిని వదిలి
పెడుతున్నట్లుగా చూస్తారు!”

## యిర్మీయా నాల్గవ విన్నపం

18పిమ్మట యిర్మీయా శత్రువులు ఇలా అన్నారు:
“రండి. మనం యిర్మీయా పై కుట్ర పన్నుదాము.
నిశ్చయముగా యాజకుడు చెప్పిన ధర్మశాస్త్రము
వృధాపోదు. జ్ఞానులు చెప్పిన సలహాలు ఇంకా మనతో
ఉంటాయి. ప్రవక్తల మాటలు మనకు ఇంకా
ఉంటాయి. అందువల్ల మనం అతనిపై అబద్ధప్రచారం

---

**పొలాల్లో ... తెలుసు** ఇది మాటలతో ఆడే ఆట అక్షరార్థముగా ఇది అంటుంది: ‘ఎవరైనా షద్దే (శిలను) విడచిపెడతారా?’ అని భావం. ఇవి రెండూ దేవుని సూచించే పేర్లు లేకపోతే “లెబానోను మంచు షద్దే పర్వతం మీదినుంచి ఎన్నడైనా కరిగిపోతుందా?” అని కూడా అనువదించవచ్చు. ఇది బహుశ హెర్మోను కొండను సూచించవచ్చు.

చేద్దాం. అది అతనిని నాశనం చేస్తుంది. అతడి మాట
లను మనం వినము.”

19 యెహోవా, నా మనవి ఆలకించుము. నా
శత్రువుల మాట విని వారిని మంచి మార్గంలో
నడిచేలా నీవే నిర్ణయించుము.
20 నేను యూదా ప్రజలకు మేలు చేశాను. వారు
నాకు ప్రతిగా కీడు చేస్తున్నారు. నన్ను చంపే
ఉద్దేశ్యంతో వారు గోతిని తవ్వి సిద్ధం చేశారు.
21 కావున నీవిప్పుడు వారి పిల్లలు క్షామంలో తిండి
లేక మాడి పోయేలా జేయి. వారి శత్రువులు
వారిని కత్తులతో ఓడించును గాక! వారి భార్యలు
తమ పిల్లలను భర్తలను పోగొట్టు కొందురు గాక!
యూదా రాజ్యంలో పురుషులంతా చనిపోవు
దురు గాక! వారి భార్యలను వితంతువులుగా
చేయి. వారి యువకులు యుద్ధంలో కత్తి వేటుకు
చనిపోవును గాక.
22 వారి ఇండ్లలో రోదనలు కలుగును గాక! నీవు
వారిపైకి ఆకస్మికంగా శత్రువును రప్పించినపుడు
వారు మిక్కిలి విలపించేలా చేయి. నా శత్రువులు
నన్ను మోసం చేయదలచినందుకు ఇదంతా
వారికి సంభవించును గాక! నా అడుగు పడ్డ
వెంటనే పట్టడానికి బోనులు అమర్చారు.
23 యెహోవా, నన్ను చంపటానికి వారి ఎత్తు
గడలన్నీ నీకు తెలుసు. వారి నేరాలను క్షమించ
వద్దు. వారి పాపాలను తుడిచి వేయవద్దు. నా
శత్రువులను మట్టు బెట్టు! నీకు కోపం వచ్చి
నపుడు వారిని శిక్షించు!

### పగిలిన జాడీ

19 యెహోవా నాతో ఇలా చెప్పినాడు:
“యిర్మీయా, నీవు ఒక కుమ్మరి వాని వద్దకు
వెళ్లి ఒక మట్టి జాడీ కొనుగోలు చేయి. 2యెరూషలేము
నగర కుమ్మరి ద్వారానికి* ఎదురుగా ఉన్న బెన్‌హి
న్నోము లోయలోనికి వెళ్లు. నీతో పాటు కొందరు
నాయకులను, యాజకులను తీసికొని వెళ్లు. ఆ
స్థలంలో నేను నీకు ఏమి చెపుతానో దానిని వారికి
తెలియజేయుము. 3నీతో ఉన్న వారితో ఇలా చెప్పు,
‘యూదా రాజా, యెరూషలేము నగర వాసులారా,
యెహోవా వాక్కు వినండి! ఇశ్రాయేలీయుల దేవుడు,
సర్వశక్తిమంతుడైన యెహోవా యిలా చెప్పు
చున్నాడు: ఈ ప్రదేశానికి త్వరలో నేను ఘోర విపత్తు
సంభవించేలా చేస్తాను! దానిని గురించి విన్న ప్రతి
ఒక్కరు ఆశ్చర్యపడి భయంతో నిండిపోతాడు. 4నేను
ఇదంతా ఎందుకు చేస్తాననగా యూదా ప్రజలు నన్ను
సరించటం మానివేశారు. ఈ ప్రదేశాన్ని వారు పరదేశాల
ఇతర దేవుళ్లకు స్థావరంగా మార్చి వేశారు. అన్య
దేవతలకు యూదా ప్రజలు ఇక్కడ ధూపనైవేద్యాలు
సమర్పించారు. పూర్వ కాలంలో ఆ దేవతలను ప్రజలు
ఆరాధించలేదు. వారి పూర్వీకులు ఆ దేవతలను
ఆరాధించలేదు. ఇవి ఇతర దేశాల నుండి దిగుమతి
అయిన క్రొత్త దేవతలు. యూదా రాజులు ఈ ప్రదే
శాన్ని అమాయక పిల్లల రక్తంతో నింపివేశారు. 5బయలు
దేవతకు యూదా రాజులు ఉన్నత (పూజా) స్థలాలను
నిర్మించినారు. ఆ స్థలాలను వారు తమ కుమారులను
అగ్నిలో కాల్చి బయలు ముందు బలి అర్పించటానికి
ఉపయోగించారు. బయలు దేవతకు వారి కుమారు
లను దహన బలులుగా అర్పించారు. అలా చేయమని
నేనెన్నడూ వారికి చెప్పియుండలేదు. మీ కుమారులను
బలియివ్వమని నేనెన్నడూ మిమ్మల్ని అడగలేదు.
అటువంటి అకృత్యాన్ని నేను మనసులో కూడా
ఎన్నడూ తలపోయలేదు. 6మరియు బెన్‌హిన్నో
ములో గల ఈ స్థలాన్ని వారిప్పుడు తోఫెతు అని
పిలుస్తారు. కాని నేను మీకీ హెచ్చరిక ఇస్తున్నాను:
ప్రజలీ స్థలాన్ని కసాయి లోయ అని పిలిచే రోజులు
వస్తున్నాయి. ఇది యెహోవా వాక్కు. 7యూదా
ప్రజల, యెరూషలేము వాసుల పథకాలన్నీ నేనీ
ప్రదేశంలో వమ్ము జేస్తాను. శత్రువు ఈ ప్రజలను
తరిమికొడతాడు. యూదా ప్రజలు ఈ ప్రదేశంలో
శత్రువు కత్తికి ఆహుతైపోయేలా నేను చేస్తాను. వారి
శవములను పక్షులకు, అడవి మృగాలకు ఆహార
మయ్యేలా చేస్తాను. 8ఈ నగరాన్ని నేను సర్వనాశనం
చేస్తాను. యెరూషలేము మీదుగా వెళ్లే ప్రయాణీకులు
విభ్రాంతితో చలించి తమ తలలు పంకిస్తారు. నగరం
నాశనం చేయబడిన తీరు చూచి వారు విస్మయం
చెందుతారు. 9శత్రు సైన్యాలు నగరాన్ని చుట్టు
ముడతాయి. ఆ సైన్యం నగర వాసులను తమ ఆహారం
సంపాదించుకోవటానికి బయటికి పోనీయదు. అందు
వల్ల నగర వాసులు ఆకలితో అలమటిస్తారు. వారు
ఆకలి భాధను తట్టుకోలేక తమ పిల్లల శరీరాలనే
తినివేస్తారు. ఆ తరువాత వారు ఒకరి నొకరు చంపుకు
తింటారు.’

10“యిర్మీయా, ఈ విషయాలన్నీ వారికి తెలియ
చెప్పు. వారు చూస్తూ ఉండగా నీ వద్ద నున్న జాడీని
కింద పడవేసి పగుల గొట్టుము. 11అప్పుడీ మాటలు
చెప్పు: ‘ఒకానొకడు మట్టి జాడీని పగులగొట్టినట్లు
నేను యూదా రాజ్యాన్ని, యెరూషలేము నగరాన్నీ
విచ్ఛిన్నం చేస్తానని సర్వశక్తిమంతుడగు యెహోవా
చెపుతున్నాడు! ఈ ముక్కలను మరల కొత్త జాడీగా
కూర్చలేము. 12యూదా రాజ్యం విషయంలో కూడ
అలాగే జరుగు తుంది. చనిపోయిన వారంతా తోఫె

---

**కుమ్మరి ద్వారం** యెరూషలేము నగర ప్రతిద్వారానికి ఒక
పేరు వుంది.

తులో, సందు లేకుండా పాతిపెట్టబడతారు. 13యెరూ
షలేములోని ఇండ్లన్నీ తోఫెతువలె "అపవిత్ర" పర్చ
బడతాయి. తోఫెతువలె యూదా రాజుల రాజభవనా
లన్నీ పాడవుతాయి. ఇది ఎందువల్ల జరుగుతుందంటే
ప్రజలు వారి ఇండ్లలో కప్పుల మీద బూటకపు దేవ
తలను ఆరాధించినారు. నక్షత్రాలను వారు ఆరాధించి,
వాటి గౌరవార్థం బలులు సమర్పించేవారు. బూటకపు
దేవతలకు పానీయార్పణలు సమర్పించారు."

14తోఫెతును వదిలి, దేవుడు తనను బోధించమన్న
చోటికి యిర్మీయా వెళ్లాడు. యిర్మీయా దేవాలయా
నికి వెళ్లి, గుడి ఆవరణలో నిలబడినాడు. అక్కడి ప్రజల
నుద్దేశించి యిర్మీయా ఇలా అన్నాడు: 15"ఇశ్రాయేలు
దేవుడు, సర్వశక్తిమంతుడగు యెహోవా యిలా సెల
విచ్చినాడు: "యెరూషలేముకు, దాని చుట్టు పట్ల
గ్రామాలకు చాలా విపత్తులను కలుగజేస్తానని చెప్పి
యున్నాను. త్వరలోనే నేనీ విషయాలను జరిపిస్తాను.
ఎందువల్లననగా ప్రజలు మొండి వారయ్యారు. నేను
చెప్పేది వారు వినటం లేదు. నాకు విధేయులై వుండ
టానికి నిరాకరిస్తున్నారు.'"

## యిర్మీయా పషూరు

20 ఆ దేవాలయంలో పషూరు అనబడే ఒక
యాజకుడున్నాడు. అతడు దేవాలయంలో
ప్రధానాధికారి. పషూరు తండ్రి పేరు ఇమ్మేరు.
యిర్మీయా ఈ భవిష్యత్ విషయాలు ఆలయ ప్రాంగ
ణంలో చెప్పటం పషూరు విన్నాడు. 2అతడు ప్రవక్త
యైన యిర్మీయాను కొట్టించినాడు. అతనికి దేవా
లయం సమీపానగల బెన్యామీను పైద్వారం వద్ద బొండ
కొయ్య* వేయించాడు. 3ఆ మరునాడు యిర్మీయాను
పషూరు బొండ కొయ్య బంధం నుండి తొలగించాడు.
అప్పుడు యిర్మీయా పషూరుతో ఇలా అన్నాడు,
"దేవుడు నిన్ను పిలిచే పేరు పషూరు కాదు. ఆయన
నీకు మాగోర్ మిస్సాబీబ్* అని పేరు పెడతాడు.
4ఎందువల్లనంటే దేవుడు ఇలా చెపుతున్నాడు: 'నీ
వంటే నీకే భీతి కలిగేలా త్వరలో చేస్తాను! అంతే
గాదు. నీవంటే నీ స్నేహితులందరికీ భయాందోళనలు
కలిగేలా చేస్తాను. నీ స్నేహితులంతా శత్రువుల కత్తికి
గురియై చనిపోతూ వుంటే నీవు చూస్తూ వుంటావు.
యూదా ప్రజలందరినీ బబులోను రాజుకు అప్ప
గిస్తాను. అతడు యూదా వారందరినీ బబులోను దేశా
నికి తీసికొని పోతాడు. తన సైనికులు యూదా ప్రజ
లను కత్తులతో నరికి వేస్తారు. 5యెరూషలేము నగర
వాసులు ధనాన్ని కూడబెట్టటానికి, ఇతర నిర్మాణ
కార్యక్రమాలకు చాలా కష్టపడినారు. కాని వాటన్నిటినీ
వారి శత్రువులకు ఇచ్చివేస్తాను. యెరూషలేములోని
రాజుకు ధనాగారాలు వున్నాయి. ఆ ధనాగారాలను
నేను శత్రువుకు ఇచ్చివేస్తాను. శత్రువు ఆ ధనరాశులను
తీసుకొని బబులోను దేశానికి పట్టుకు పోతాడు. 6ఓ
పషూరా, నీవు, మరియు నీ ఇంటి వారందరునూ
కూడా తీసుకొని పోబడతారు. బబులోనులో నివ
సించటానికి నీవు బలవంతంగా కొనిపోబడతావు! నీవు
బబులోనులోనే చనిపోతావు. నీవా అన్య దేశంలోనే
సమాధి చేయబడతావు. నీ స్నేహితులకు నీవు అబ
ద్ధాలు బోధించావు. నేను చెప్పే విషయాలన్నీ జరగవని
నీవు చెప్పినావు. నీ సహచరులంతా బబులోనులో
చనిపోయి అక్కడే సమాధి చేయబడతారు.'"

## ఐదవసారి యిర్మీయా విన్నపం

7 యెహోవా, నీవు నన్ను భ్రమలో పడవేశావు.
నేను నిజంగా మోసగింపబడ్డాను. నీవు నాకంటె
బలవంతుడవు, అందువల్ల నీవు గెలిచావు.
నేను నవ్వుల పాలయ్యాను. రోజంతా ప్రజలు
నన్ను జూచి నవ్వటం ఎగతాళి చేయటం
మొదలు పెట్టారు.
8 నేను మాట్లాడిన ప్రతిసారీ అరుస్తున్నాను.
దౌర్జన్యం గురించి, వినాశనాన్ని గురించి నేను
ఎప్పుడూ అరుస్తున్నాను. యెహోవా నుంచి
నాకు అందిన సమాచారాన్నే నేను బహిరంగంగా
చెపుతున్నాను. కాని నా ప్రజలు నన్ను కేవలం
అవమాన పర్చి, హేళన చేస్తున్నారు.
9 "నేనిక దేవుని గురించి మర్చిపోతాను. ఇక ఏ
మాత్రం దేవుని నామం పేరిట నేను మాట్లా
డను!" అని నేను కొన్ని సార్లు అనుకున్నాను.
కాని నేనలా అన్నప్పుడు దేవుని వర్తమానం నాలో
అగ్నిలా రగులుతుంది! అది నన్ను లోపల
దహించి వేస్తుంది. దేవుని వర్తమానం నాలో
ఇముడ్చుకొన ప్రయత్నించి వేసారి పోయాను.
ఇక ఎంత మాత్రం దానిని నాలో వుంచుకోలేను.
10 అనేక మంది నాకు వ్యతిరేకంగా గుసగుసలాడు
కోవటం నేను వింటున్నాను. ప్రతి చోటా నన్ను
భయపెట్టే విషయాలు వింటున్నాను. నా స్నేహి
తులు కూడా నాకు వ్యతిరేకంగా మాట్లాడు
తున్నారు, నేనేదైనా తప్పు చేయాలని జనం
కనిపెట్టుకుని వున్నారు. "మనం అబద్ధమాడి
అతడేదైనా తప్పు చేశాడని చెపుదాం! లేదా

---

**బొండ కొయ్య** బొండ కొయ్య అనగా ఒక పెద్ద దుంగను ఒక గొలుసుతో నేరస్థుని కాలికి కట్టటం. అతడు కదలాలంటే ఆ దుంగను భుజాన వేసుకోవాలి. ఇంకొక రకం బొండ కొయ్య శిక్షవుంది. బారుగావున్న చెక్కలకు కంతలుంటాయి. ఆకంతలలో నేరస్థుల కాళ్లను పెట్టించి పైన ఇంకొక చెక్క బిగిస్తారు. వారలా కాళ్లు చాచుకొని కూర్చొన వలసినదే. కదలటానికి వీలు లేదు. ఇది ఒక రకమైన బంధము.

**మాగోర్ మిస్సాబీబ్** అన్ని చోట్లా భయాన్ని కలుగ జేయువాడు, భయంకరుడు.

యిర్మీయాను మనం మోసపుచ్చవచ్చు!
అప్పుడతనిని మనం ఎలాగో ఇరికించవచ్చు.
తద్వారా అతనిని మనం వదిలించు కోవచ్చు.
లేదా అప్పుడు మనం అతనిని పట్టుకొని మన
కక్ష తీర్చుకోవచ్చు"నని వారంటున్నారు.
11 కాని యెహోవా నాతో వున్నాడు. యెహోవా
ఒక బలమైన సైనికునిలా వున్నాడు. కావున
నన్ను తరిమే వారంతా పడిపోతారు. వారు నన్ను
ఓడించలేరు. వారి ప్రయత్నం వ్యర్థం. వారు
ఆశా భంగం చెందుతారు. వారు అవమానం
పాలవుతారు. వారి అవమానాన్ని వారెన్నడు
మరువలేరు.
12 సర్వశక్తిమంతుడవైన ఓ యెహోవా, నీవు మంచి
వారిని పరీక్షిస్తావు. మనిషి గుండెలోకి, మనస్సు
లోకి సూటిగా నీవు చూడగలవు. ఆ ప్రజలకు
వ్యతిరేకంగా నావాదాన్ని నేను నీకు విన్నవించాను
కావున నీవు వారికి తగిన శిక్ష విధించటం నన్ను
చూడనిమ్ము.
13 యెహోవాను ఆరాధించుము! యెహోవాను
స్తుతించుము! యెహోవా పేద వారిని ఆదు
కుంటాడు! ఆయన వారిని దుర్మార్గుల బారి
నుండి రక్షిస్తాడు!

### యిర్మీయా ఆరవసారి మొరపెట్టుకొనుట

14 నేను పుట్టిన రోజు శపింపబడును గాక! నా
తల్లీ! నన్ను నీవు కన్న రోజును ఆశీర్వదించ
వద్దు.
15 నేను పుట్టినట్లు నా తండ్రికి వర్తమానం యిచ్చిన
మనుష్యుని శపించుము "నీకు పుత్ర సంతానం
కలిగింది" అని చెప్పి అతడు నా తండ్రిని మిక్కిలి
సంతోష పరిచాడు.
16 యెహోవా సర్వనాశనం చేసిన ఆ నగరాల మాది
రిగానే* ఆ మనుష్యుడు కూడా దౌర్భాగ్యుడగును
గాక! యెహోవా ఆ నగరాలపై ఏమాత్రం
కనికరం చూపలేదు వారు ఉదయాన్నే యుద్ధ
నినాదాలను విందురుగాక! మధ్యాహ్న సమ
యంలో అతడు యుద్ధశోకాలు వినును గాక!
17 ఎందువల్లననగా అతడు నేను నా తల్లి గర్భంలో
ఉండగానే నన్ను చంపలేదు. అతడే గనుక
అప్పుడు నన్ను చంపి వుంటే నా తల్లి గర్భమే
నాకు నా సమాధి అయివుండేది. నేను పుట్టి
వుండే వాడినే కాను.
18 నా తల్లి గర్భం నుండి నేనెందుకు బయటికి
వచ్చినట్లు? నేను వచ్చి చూచినదంతా కష్టము,
దుఃఖమే! నా జీవితం అవమానంతో అంతమవు
తుంది.

### సిద్కియా రాజు అభ్యర్థనను దేవుడు తిరస్కరించుట

21 యెహోవా వర్తమానం మళ్లీ యిర్మీయాకు
వినిపించింది. అప్పుడు యూదా రాజు
సిద్కియా అనేవాడు, రాజు పషూరు* అనే వానిని,
యాజకుడగు జెఫన్యాను పిలిపించి యిర్మీయా వద్దకు
పంపినపుడు రాజుకు ఈ వార్తను వినిపించిరి. పషూరు
అనేవాడు మల్కీయా కుమారుడు. జెఫన్యా అనేవాడు
మయశేయా అనువాని కుమారుడు. పషూరు,
జెఫన్యాలిరువురూ యిర్మీయాకు ఒక వర్తమానం
తెచ్చారు. 2యిర్మీయాతో పషూరు, జెఫన్యాలు ఇలా
అన్నారు. మా కొరకు దేవుని ప్రార్థించుము. మాకు
ఏమి జరుగుతుందో యెహోవాను అడిగి తెలుసు
కొనుము. బబులోను రాజైన* నెబుకద్నెజరు మా
మీదికి దండెత్తి వస్తున్నాడు. కనుక ఇది మేము
తెలుసుకోవాలనుకుంటున్నాము. గతంలో చేసినట్లు
బహుశః యెహోవా మా కొరకు ఘనమైన కార్యాలు
జరిపించవచ్చు. బహుశః నెబుకద్నెజరు మామీదికి
రాకుండా ఆపి అతనిని యెహోవా వెనుకకు
పంపించవచ్చు."
3అప్పుడు పషూరు, జెఫన్యాలకు యిర్మీయా ఇలా
సమాధాన మిచ్చినాడు: "రాజైన సిద్కియాకు ఇలా
చెప్పండి: ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా ఏమి
చెప్పుచున్నాడనగా, 'నీ చేతిలో మారణా యుధాలు
న్నాయి. నీవా ఆయుధాలను బబులోను రాజు నుండి,
కల్దీయుల* నుండి నిన్ను రక్షించుకోవటానికి వుప
యోగించనున్నావు. కాని ఆ ఆయుధాలన్నీ నిరుప
యోగ మయ్యేలా నేను చేస్తాను.
4"బబులోను సైన్యం నగరం చుట్టూ వున్న రక్షణ
గోడ వెలుపల మూగి ఉంది. ఆ సైన్యం నగరాన్ని
చుట్టు ముట్టింది. త్వరలోనే ఆ సైన్యాన్ని యెరూష
లేము లోనికి రప్పిస్తాను. 5యూదా ప్రజలైన మీతో
నేనే యుద్ధం చేస్తాను. శక్తివంతమైన నా చేతితో నేనే
మీతో పోరాడతాను. నేను మీ పట్ల మిక్కిలి కోపంగా
ఉన్నాను. అందువల్ల నా శక్తివంతమైన చేతితో కఠినంగా
నేను మీతో పోరాడతాను. నేను మీతో యుద్ధం చేసి,
మీపట్ల నేనెంత కోపంగా వున్నానో తెలియజేస్తాను.
6యెరూషలేములో నివసిస్తున్న ప్రజలను చంపుతాను.
మనుష్యులతో పాటు పశువులను కూడా చంపుతాను.

---

**యెహోవా … మాదిరిగానే** నాశనం చేయబడిన నగరాలంటే సొదొమ, గొమొర్రా నగరాలు. చూడండి ఆదికాండం 19.

**పషూరు** ఈ పషూరు గ్రంథం 20:1 లో తటస్థించిన పషూరు కాడు.

**బబులోను రాజు** నెబుకద్నెజరు అని పాఠాంతరం.

**కల్దీయుల** కల్దీయుల వంశంలోని వాడే నెబుకద్నెజరు. ఆ కాలంలో బబులోను వారి అధీనంలో వుంది.

నగరమంతా వ్యాపించే భయంకరమైన వ్యాధుల ద్వారా
వారంతా చనిపోతారు. 7అదే జరిగిన తరువాత
"యూదా రాజైన సిద్కియాను బబులోను రాజైన
నెబుకద్నెజరుకు అప్పగిస్తాను. ఇదే యెహోవా
వాక్కు. అంతేగాదు, సిద్కియా అధికారులను కూడా
నెబుకద్నెజరుకు అప్పగిస్తాను. యెరూషలేములో
కొందరు ప్రబలిన వ్యాధులకు గురియై చనిపోతారు.
మరికొంత మంది శత్రువు కత్తివాతకి గురియై చని
పోతారు. మరికొంత మంది ఆకలితో మాడి చావరు.
కాని నేనా ప్రజలను నెబుకద్నెజరుకు అప్పగిస్తాను.
యూదా యొక్క శత్రువు గెలిచేలా నేను చేస్తాను.
నెబుకద్నెజరు సైన్యం యూదా ప్రజలను హత
మార్చాలని చూస్తూ వుంది. కావున యూదా ప్రజలు,
యెరూషలేము నగరవాసులు కత్తివాతకి చనిపోతారు.
నెబుకద్నెజరు ఏ మాత్రం కనికరం చూపడు. ఆ ప్రజల
గతికి అతడు విచారించడు.'

8"యెరూషలేము నగర వాసులకు ఈ విషయాలు
కూడా చెప్పండి. యెహోవా ఇలా చెపుతున్నాడు:
'బతకటమో, చనిపోవటమో అనే విషయాన్ని నేను
మీకే వదిలి వేస్తున్నానని అర్థం చేసుకోమనండి!
9యెరూషలేములో ఉండే వాడెవడైనా చనిపోతాడు!
వాడు కత్తివల్లగాని, ఆకలిచే గాని, లేక భయంకర వ్యాధి
వల్ల గాని చనిపోతాడు! ఎవరైతే యెరూషలేము నుండి
బయటికి పోయి కల్దీయుల సైన్యానికి లొంగి పోతారో
వారే బతుకుతారు! ఆ సైన్యం నగరాన్ని చుట్టు
ముట్టింది. అందువల్ల ఎవ్వడూ నగరంలోనికి ఆహా
రాన్ని చేరవేయలేడు. కాని ఎవడు నగరం వదిలి
పోతాడో వాడు తన ప్రాణాన్ని రక్షించుకోగలడు.
10యెరూషలేము నగరానికి విపత్తు వచ్చేలా చేయటానికి
నేను సంకల్పించాను. ఇదే యెహోవా వాక్కు "బబు
లోను రాజుకు ఈ యెరూషలేము నగరాన్ని ఇచ్చి
వేస్తాను. దీనిని అతడు అగ్నితో తగులబెడతాడు."

11 "యూదా రాజ కుటుంబానికి ఈ విషయాలు
చెప్పండి: యెహోవా వర్తమానాన్ని వినండి!
12 దావీదు వంశమా, యెహోవా ఇలా సెలవి
స్తున్నాడు: నీవు ప్రతి రోజా ప్రజల పట్ల సరి
యైన న్యాయ నిర్ణయం చేయాలి. నేరస్థుల
దౌష్ట్యానికి గురి అయిన వారిని సంరక్షించుము.
నీవది చేయకపోతే నాకు చాలా కోపం వస్తుంది
నా కోపం ఎవ్వరూ ఆపలేని దహించు అగ్నిలా
ఉంటుంది. మీరు దుష్ట కార్యాలు చేశారు గనుక
ఇది జరుగుతుంది.
13 "యెరూషలేమా, నేను నీకు వ్యతిరేకినైనాను. నీవు
పర్వత శిఖరంపై కూర్చుంటావు. నీవు ఈ
లోయలో మహరాణీలా కూర్చుంటావు. యెరూ
షలేము వాసులారా 'మమ్మల్ని ఎవ్వరూ ఎదు
ర్కొన లేరు, ఎవ్వడూ మా పటిష్ఠమైన నగరం
లోకి ప్రవేశించలేడు' అని మీరంటారు. కాని
యెహోవా నుండి వచ్చిన ఈ వర్తమానం
వినండి.
14 మీకు తగిన శిక్ష మీరనుభవిస్తారు! మీ అడవుల్లో
అగ్ని చెలరేగేలా చేస్తాను. ఆ అగ్ని మీ చుట్టూ
ఉన్న ప్రతి దానిని కాల్చి వేస్తుంది."

## దుర్మార్గపు రాజులకు వ్యతిరేకంగా తీర్పు

22 యెహోవా ఇలా అన్నాడు: "యిర్మీయా,
నీవు రాజభవనానికి వెళ్లు. అక్కడ యూదా
రాజును కలిసి ఈ వర్తమానాన్ని అతనికి చెప్పు. 2'ఓ
యూదా రాజా, యెహోవా యొక్క ఈ వర్తమానాన్ని
ఆలకించు. నీవు దావీదు సింహాసనంపై కూర్చుని పరి
పాలిస్తున్నావు గనుక, ఇది వినుము. ఓ రాజా! నీవును
నీ అధికారులును శ్రద్ధగా వినండి. యెరూషలేము
ద్వారాల నుండి వచ్చే నీ ప్రజలంతా ఈ యెహోవా
వాక్కును తప్పక వినాలి. 3యెహోవా ఇలా చెపుతు
న్నాడు: న్యాయమైన, నీతిగల పనులనే చేయండి.
దోపిడిగాండ్ర బారి నుండి దోచుకోబడిన వారిని ఆదు
కోండి. అనాధ పిల్లలను, వితంతువులను బాధించవద్దు.
వారిపట్ల మీరు అపచారం చేయవద్దు. అమాయకులను
చంపవద్దు. 4ఈ ఆదేశ సూత్రాలను మీరు పాటిస్తే,
మీకు ఈ మంచి పనులు జరుగుతాయి: దావీదు
సింహాసనంపై కూర్చున్న రాజులంతా నగర ద్వారాల
గుండా యెరూషలేముకు నిరంతరం రాగలుగుతారు.
ఆ రాజులు వారి అధికారులతో సహా నగర ద్వారాల
నుండి వస్తారు. ఆ రాజులు, వారి అధికారులు, వారి
ప్రజలు అందరూ రథాలలోను, గుర్రాల మీదను స్వారీ
చేస్తూ వస్తారు. 5కాని మీరీ ఆదేశాలను పాటించకపోతే
యెహోవా ఇలా చెప్పుచున్నాడు: యెహోవానైన
నేను ప్రమాణ పూర్వకంగా చెప్పేదేమంటే, ఈ
రాజగృహం నాశనం చేయబడుతుంది. ఇది కేవలం
ఒక రాళ్ల గుట్టగా మారిపోతుంది"
6యూదా రాజు నివసించే భవనాన్ని గురించి
యెహోవా చెప్పేదేమంటే:

"గిలియాదు అడవుల్లా ఈ భవంతి చాలా ఎత్తుగా
ఉంది లెబానోను పర్వతాలవలె ఈ భవంతి ఎత్తుగా
వుంది కాని నేను నిజంగా దీనిని ఎడారిలా మార్చి
వేస్తాను. నిర్మానుష్యంగా వున్న నగరంవలె ఈ
భవంతి ఖాళీగా వుండి పోతుంది.
7 ఈ భవనాన్ని నాశనం చేయటానికి నేను మనుష్యు
లను పంపుతాను. ఆ రాజగృహ నాశనానికి వచ్చిన
ప్రతి వాని చేతిలోను ఒక ఆయుధం ఉంటుంది.
అందమైన, బలమైన మీ దేవదారు దూలాలను
వారు నరికి వేస్తారు. నరికిన ఆ దూలాలను వారు
తగలబెడతారు.

[8]“ఇతర దేశాల ప్రజలెందరో ఈ నగరం పక్కగా వెళతారు. వారంతా, ‘యెహోవా యెరూషలేమున కెందుకీ దుర్గతి పట్టించాడు? యెరూషలేము ఒక గొప్ప నగరం’ అని ఒకరి నొకరు అడుగుతారు. [9]దానికి సమాధానమిది: ‘యూదా రాజ్య ప్రజలు వారి యెహోవా దేవుని నిబంధనను అనుసరించటం, మాని వేయటం మూలంగా దేవుడు యెరూషలేమును నాశనం చేశాడు. ఆ ప్రజలు అన్య దేవుళ్ళను కొలిచి ఆరాధించారు.’”

## రాజైన యెహోయాహాజుకు (షల్లూము) వ్యతిరేకంగా తీర్పు

10 చనిపోయిన రాజు కొరకు దుఃఖించవద్దు.* అతని కొరకు విచారించవద్దు. కాని ఇక్కడ నుండి వెళ్లి పోయే రాజు కొరకు మిక్కిలిగా దుఃఖించండి.* అతని కొరకు దుఃఖించండి; ఎందువల్లనంటే అతడు మరి తిరిగి రాడు. యెహోయాహాజు తన మాతృ భూమిని మరల చూడడు.

[11]యోషీయా కుమారుడైన షల్లూము (యెహోయాహాజు తన తండ్రి మరణానంతరం అతడు రాజయ్యాడు) ను గురించి యెహోవా యిలా అంటున్నాడు: “యెహోయాహాజు యెరూషలేము నుండి దూరంగా వెళ్లిపోయాడు. యెరూషలేముకు అతడు మరల తిరిగి రాడు. [12]ఈజిప్టీయులు యెహోయాహాజును ఎక్కడికి తీసుకొని వెళ్లారో అతనక్కడే చనిపోతాడు. ఈ రాజ్యాన్ని అతడు మరల చూడడు.”

## రాజైన యెహోయాకీముకు వ్యతిరేకంగా తీర్పు

13 రాజైన యెహోయాకీముకు వ్యతిరేకంగా ఇది మిక్కిలి కీడు. తన భవన నిర్మాణానికి అతడు మిక్కిలి చెడ్డ పనులు చేస్తున్నాడు. పై అంతస్తులో గదులు కట్టడానికి అతడు ప్రజలను మోసగిస్తున్నాడు. నా ప్రజలచే అతడు వూరికే పని చేయిస్తూ ఉన్నాడు. వారి పనికి అతడు ప్రతి ఫలం ఇవ్వటం లేదు.
14 “నా కొరకు నేనొక గొప్ప భవంతిని నిర్మిస్తాను. పై అంతస్తులో ఎన్నో గదులు నిర్మిస్తాను,” అని యెహోయాకీము అంటాడు. అలా అని అతడు తన భవంతిని పెద్ద పెద్ద కిటికీలతో నిర్మిస్తాడు. వాటి చట్రాలకు, తలుపులకు దేవదారు కలపను ఉపయోగించాడు. వాటికి అందంగా ఎరుపు రంగు వేశాడు.
15 యెహోయాకీమా, నీ ఇంటిలో విశేషించి ఉన్న దేవదారు కలప నిన్ను గొప్ప రాజును చేయదు. నీ తండ్రియగు యోషీయా తనకు కావలసిన ఆహారపానీయాలతో తృప్తి పడ్డాడు. అతడు ఏది న్యాయమైనదో, ఏది సత్యమైనదో దానిని చేశాడు. యోషీయా సత్ప్రవర్తనుడైనందున అతనికి అంతా సవ్యంగా జరిగిపోయింది.
16 యోషీయా పేదవారిని, అవస్థలో ఉన్న వారిని ఆదుకున్నాడు. యోషీయా అలా చేయుట వల్ల అతనికి అంతా సవ్యంగా జరిగి పోయింది. యెహోయాకీమా, “దేవుని తెలుసు కొనుట” అంటే ఏమిటి? దీనులకు దరిద్రులకు సహాయం చేయటం మరియు న్యాయంగా ప్రవర్తించటమే నన్ను తెలుసుకొనే మార్గాలు.” ఇదే యెహోవా వాక్కు.
17 యెహోయాకీమా నీకు ఏది లాభదాయకంగా ఉంటుందా, అని నీ కళ్లు వెదకుతూ ఉంటాయి. ఇంకా, ఇంకా ఎలా సంపాదించాలా అని సదా నీ మనస్సు దానిపై లగ్నమై ఉంటుంది. అందుకు అమాయకులను బలి చేయటానికి కూడా నీవు సిద్ధంగా ఉన్నావు ఇతరుల సొమ్మును దొంగిలించటానికి నీవు ఇష్ట పడుతున్నావు.
18 కావున యోషీయా కుమారుడైన యెహోయాకీము రాజునకు యెహోవా చెప్పుచున్నదేమనగా: “యూదా ప్రజలు యెహోయాకీమును గూర్చి ఏడ్వరు ‘అయ్యో, నా సోదరుడా, నేను యెహోయాకీమును గురించి దుఃఖిస్తున్నాను! అయ్యో, నా సహోదరీ, నేను యెహోయాకీమును గురించి విచారిస్తున్నాను!’ అని ప్రజలు ఒకరి కొకరు చెప్పుకోరు. యూదా ప్రజలు యెహోయాకీమును గురించి విచారించరు. ‘ఓ యజమానీ, నేను మిక్కిలి దుఃఖిస్తున్నాను. ఓ రాజా, నేను నీకై విచారిస్తున్నాను!’ అని వారతనిని గురించి చెప్పరు.
19 చచ్చిన గాడిదను పూడ్చి పెట్టినట్లు యెరూషలేము ప్రజలు యెహోయాకీమును పాతిపెడతారు. అతని శవాన్ని వారు ఈడ్చి పార వేస్తారు. వారు అతని శవాన్ని యెరూషలేము తలుపుల బయటికి విసరి వేస్తారు.
20 “యూదా! లెబానోను పర్వతం మీదికి వెళ్లి కేకలు వేయి. నీ స్వరము బాషాను పర్వతాలలో విని పించనియ్యి. అబారీము పర్వతాలలో మిక్కిలి

---

**చనిపోయిన ... దుఃఖించవద్దు** క్రీ.పూ. 609 లో ఈజిప్టీయులతో జరిగిన యుద్ధంలో చనిపోయిన రాజు యోషీయా అని యిక్కడ అర్థం.

**వెళ్లిపోయే ... దుఃఖించండి** అనగా యోషీయా కుమారుడైన యెహోయాహాజు యోషీయా చనిపోయిన పిమ్మట యూదాకు రాజైనాడు. ఇతనినే షల్లూము అని పిలుస్తారు. ఈజిప్టు రాజైన నెకోఅనునతను యోషీయాను ఓడించాడు. పిమ్మట నెకోరాజు యెహోయాహాజును రాచరికాన్నుండి తొలగించి ఈజిప్టుకు బందీగా తీసికొనిపోయాడు.

రోదించు. ఎందువల్లనంటే నీవు మోహించిన
వారంతా నాశనమవబోతున్నారు.
21 యూదా! నీవు చాలా సురక్షితంగా ఉన్నట్టు
భావించావు. కాని నిన్ను నేను హెచ్చరించాను!
నేను నిన్ను హెచ్చరించినా నీవు లక్ష్యపెట్టలేదు!
నీవు చిన్న వయస్సులో ఈ విధంగా నివ
సించావు. యూదా, నీ చిన్న వయస్సు నుండే
నీవు నాకు విధేయుడవు కాలేదు
22 యూదా, నేను విధించే శిక్ష తుఫానులా వస్తుంది.
అది నీ గొర్రెల కాపరుల నందరినీ (నాయకు
లను) ఊది వేస్తుంది. ఇతర దేశాలు కొన్ని
నీకు సహాయపడతాయని అనుకున్నావు. కాని
ఆ రాజ్యాలు కూడ ఓడింపబడతాయి. అప్పుడు
నీకు తప్పక అవమానము కలుగుతుంది. నీవు
చేసిన దుష్కార్యాలను తలచుకొని నీవు సిగ్గు
చెందుతావు.
23 ఓ రాజా, కొండ మీద దేవదారు కలపతో
నిర్మించిన భవనంలో నీవు నివసిస్తున్నావు. ఈ
కలప తేబడిన లెబానోను దేశంలోనే నీ వున్న
ట్లుగా వుంది. కొండ మీది ఆ పెద్ద భవంతిలో
నీకు నీవు సురక్షితం అనుకుంటున్నావు. కాని
నీకు శిక్ష వచ్చినప్పుడు నీవు నిజంగా రోదిస్తావు.
స్త్రీ ప్రసవ వేదన అనుభవించినట్లు నీవు బాధ
పడతావు."

### యెహోయాకీను (కొన్యా) పై తీర్పు

24"యెహోయాకీము కుమారుడవు, యూదా
రాజువైన యెహోయాకీనూ, "నేను నివసించునంత
నిశ్చయముగా" చెపుతున్నాను. ఇది యెహోవా
వాక్కు. ఇది నీకు చేస్తాను. "నీవు నా చేతి ఉంగరమైనా
నిన్ను నేను లాగి పడవేస్తాను! 25యెహోయాకీనూ,
నిన్ను నేను బబులోను రాజైన నెబుకద్నెజరుకు,
కల్దీయులకు అప్పగిస్తాను. వారిని గురించే నీవు భయ
పడుతున్నావు. వారు నిన్ను చంపచూస్తున్నారు.
26నిన్ను, నీ తల్లినీ మీరు పుట్టని దేశానికి త్రోసి వేస్తాను.
నీవు, నీ తల్లి ఆ పరాయి దేశంలో చనిపోతారు.
27యెహోయాకీనూ, నీ మాతృ భూమికి రావాలని
నీవు గాఢంగా కోరుకుంటావు. కాని నీ కోరిక తీరదు."
నీవు వచ్చుటకు నేను అనుమతించను.

28 ఒక వ్యక్తిచే నేలకు విసరి కొట్టబడిన మట్టి కుండ
మాదిరి, కొన్యా యొక్క (యెహోయాకీను)
స్థితి వున్నది. ఎవ్వరికీ పనికిరాని ఓటి కుండ
మాదిరిగా అతడున్నాడు. యెహోయాకీను,
అతని పిల్లలు ఎందుకు విసర్జించబడతారు?
వారెందుకు అన్య దేశానికి తోయబడతారు?
29 యూదా రాజ్యమా, ఓ రాజ్యమా, ఓ రాజ్యమా!
యెహోవా వర్తమానం వినుము!
30 యెహోవా ఇలా అంటున్నాడు: "యెహోయా
కీను గురించి ఈ విషయం వ్రాసి పెట్టండి:
'అతడు పిల్లలు లేని వానితో లెక్క! తన జీవిత
కాలంలో యెహోయాకీను ఏమీ సాధించలేడు.
అతని పిల్లలలో ఎవ్వడూ దావీదు సింహాసనం
మీద కూర్చోడు. అతని సంతానంలో ఎవడూ
యూదా రాజ్యాన్ని ఏలడు."

### పాపులైన గొర్రెల కాపరులు

23 "యూదా కాపరులకు (నాయకులకు) చాలా
చెడ్డదిగా ఉంటుంది. వారు నా గొర్రెలను
(ఇశ్రాయేలీయులను) చెదరు గొట్టుతున్నారు. నా
పచ్చిక బయలు నుండి గొర్రెలను పొమ్మని నలుదిశలా
తోలి వేస్తున్నారు." ఇది యెహోవా నుంచి వచ్చిన
వాక్కు.
2ఆ కాపరులు (నాయకులు) నా ప్రజలకు
బాధ్యులు. ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఆ కాప
రులకు ఈ విషయాలు చెపుతున్నాడు: "ఓ కాపరులారా
(నాయకులు), మీరు నా గొర్రెల మందను నలుదిశలా
పారిపోయేలా చేశారు. వారు పోవటానికి మీరు ఒత్తిడి
తెచ్చారు. మీరు వారిని గురించి శ్రద్ధ వహించలేదు.
కాని నేను మీతో వ్యవహరిస్తాను. మీరు చేసిన చెడు
కార్యాలకు నేను మిమ్మల్ని శిక్షిస్తాను." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది. 3"నేను నా గొర్రెల
మందను (ప్రజలను) ఇతర దేశాలకు పంపాను.
పోయిన నా మందలను (ప్రజలను) నేను చేరదీస్తాను.
వాటిని పచ్చిక బయలుకు (దేశానికి) మరల చేర్చు
తాను. నా మందలు (ప్రజలు) వాటి పచ్చిక బీటికి
(దేశానికి) తిరిగి చేరుకోగానే వాటికి సంతానోత్పత్తి
జరిగి, అభివృద్ధి చెందుతాయి. 4నా గొర్రెల మందపై
నేను కొత్త కాపరులను (నాయకులను) నియమిస్తాను.
ఆ కాపరులు నా మంద విషయమై శ్రద్ధ వహిస్తారు.
నా మంద బెదరిపోయేలా గాని, జడిసి పోయేలా గాని
చేయబడదు. నా మందలో ఒక్క గొర్రె కూడా
తప్పిపోదు." ఇదే యెహోవా వాక్కు.

### నీతియుక్తమైన "అంకురం" (కొత్త రాజు)

5 "నేనొక నీతి యుక్తమైన అంకురాన్ని* మొలిపింప
జేసే సమయం వస్తూవుంది," ఇదే యెహోవా
వాక్కు. అతడు మంచి తెలివి తేటలతో పరిపా
లించగల రాజు. దేశానికి ఏది యోగ్యమైనదో,
ఏది మంచిదో అతడది చేస్తాడు.
6 శుద్ధమైన మంచి బీజోత్పత్తి సమయమందు
యూదా ప్రజలు రక్షింపబడతారు. ఇశ్రాయేలు

**అంకురము** దావీదు వంశంలో నుండి ఒక కొత్త రాజు
వస్తాడని దీని భావం.

సురక్షితంగా నివసిస్తుంది. "యెహోవా మనకు
న్యాయం*" అని అతనికి పేరుగా ఉంటుంది.

7కావున సమయం ఆసన్నమవుతూ ఉంది ఇదే
యెహోవా వాక్కు, "అప్పుడు ప్రజలు ఎంత మాత్రం
యెహోవా పేరుమీద' పాతవిధంగా ప్రమాణం
చేయరు. 'నిత్యుడగు యెహోవా తోడు' అనేది
'ఈజిప్టు దేశం నుండి ఇశ్రాయేలును విడిపించి తీసికొని
వచ్చిన యెహోవా తోడు' అనేవి పాత ప్రమాణాలు.
8కాని ఇశ్రాయేలు ప్రజలు కొత్త విధంగా ప్రమాణం
చేస్తారు. 'నిత్యుడగు యెహోవా తోడు.' యెహోవా
తన ప్రజలను ఉత్తర రాజ్యం నుండి విముక్తి చేసి
తీసుకొని వచ్చాడు. ఆయన వారిని పంపిన రాజ్యా
లన్నిటి నుండి ప్రజలను తిరిగి తీసికొని వచ్చాడు"
అని ప్రజలు చెప్పుకుంటారు. అప్పుడు ఇశ్రాయేలు
ప్రజలు వారి స్వదేశంలో నివసిస్తారు."

### దొంగ ప్రవక్తలకు వ్యతిరేకంగా తీర్పు

9 ప్రవక్తలకు పవిత్రమైన మాటలు: నేను విచా
రంగా ఉన్నాను. నా హృదయం పగిలింది. నా
ఎముకలు వణుకుతున్నాయి. నేను
(యిర్మీయా) ఒక తాగుబోతు వ్యక్తిలా ఉన్నాను.
యెహోవాను బట్టి, ఆయన పవిత్ర వాక్కును
బట్టి నేనిలా వున్నాను.
10 యూదా రాజ్యం వ్యభిచరించే వారితో నిండి
పోయింది. వారనేక విధాలుగా అవిశ్వాసులై
ఉన్నారు. యెహోవా రాజ్యాన్ని శపించాడు.
అందుచే అది బీడై పోయింది. పచ్చిక బయ
ళ్లలో మొక్కలు ఎండి చచ్చిపోతున్నాయి. పొలా
లన్నీ ఎడారుల్లా మారినాయి. ప్రవక్తలంతా దుష్టు
లయ్యారు. ప్రవక్తలు వారి శక్తియుక్తుల్ని
తప్పుడు విధంగా వినియోగిస్తున్నారు.
11 "ప్రవక్తలు, యాజకులు కూడా దుష్టులయ్యారు.
వారు నా ఆలయంలోనే దుష్టకార్యాలు చేయటం
నేను చూశాను." ఇదే యెహోవా వాక్కు.
12 "కావున నా సందేశం ఇక మీదట వారికివ్వను.
వారి జీవితం బలవంతంగా అంధకారంలో నడిచి
నట్లుంటుంది. ప్రవక్తలకు, యాజకులకు
మార్గం అతి నునుపై జారిపడేలా ఉంటుంది.
గాఢాంధకారంలో ప్రవక్తలు, యాజకులు
జారిపడతారు. వారి మీదికి విపత్తును తీసుకొని
వస్తాను. ఆ సమయంలో ఆ ప్రవక్తలను, యాజ
కులను శిక్షిస్తాను." ఇదే యెహోవా వాక్కు.

13 "సమరయ* ప్రవక్తలు చెడు చేయటం నేను
చూశాను. బూటకపు దేవత బయలు పేరిట
వారు భవిష్య విషయాలు చెప్పటం నేను
చూశాను. ఆ ప్రవక్తలు ఇశ్రాయేలు ప్రజలను
యెహోవాకు దూరం చేశారు.
14 యూదా ప్రవక్తలు యెరూషలేములో ఘోరమైన
పనులు చేయటం నేను చూశాను. ఈ ప్రవక్తలు
వ్యభిచార దోషానికి పాల్పడ్డారు. వారు అబద్ధా
లను వింటారు. వారు తప్పుడు బోధనలను
అనుసరించారు. వారు దుర్మార్గులను, చెడు
కార్యాలు చేయటానికి ప్రోత్సహించారు. అందు
వల్ల ప్రజలు పాపం చేయటం మానలేదు. వారు
సొదొమ నగరంవలె ఉన్నారు. యెరూషలేము
ప్రజలు నా దృష్టిలో గొమొర్రా నగరంవలె
ఉన్నారు!"
15 అందువల్ల సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ
ప్రవక్తల విషయంలో ఇలా చెపుతున్నాడు. "ఆ
ప్రవక్తలను నేను శిక్షిస్తాను. ఆ శిక్ష విషము
తిన్నట్లు, చేదు నీరు తాగినట్లు ఉంటుంది. ఆ
ప్రవక్తలు ఆధ్యాత్మిక పరమైన ఒక రుగ్మతను
ప్రబలింప చేశారు. ఆ రోగం దేశ వ్యాప్తంగా
చెలరేగింది. కావున ఆ ప్రవక్తలను నేను శిక్షిస్తాను.
ఆ రోగం యెరూషలేములోని ప్రవక్తల నుండే
సంక్రమించింది."
16 సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పుతున్నాడు: "ఆ ప్రవక్తలు మీకు చెప్పే
విషయాలను మీరు లక్ష్యపెట్టవద్దు. వారు
మిమ్మల్ని మోసపుచ్చాలని ప్రయత్నిస్తున్నారు.
ఆ ప్రవక్తలు దర్శనాలను గురించి మాట్లాడతారు.
కాని వారా దర్శనాలను నానుండి పొందలేదు.
వారి దర్శనాలన్నీ వారి కల్పనాలే. 17కొంత
మంది ప్రజలు యెహోవా యొక్క నిజమైన
సందేశాలను సైతం అసహ్యించుకుంటారు.
అందువల్ల ప్రవక్తలు ఆ ప్రజలకు రకరకాల విష
యాలు చెపుతారు. 'మీకు శాంతి సమకూరు
తుంది' అని వారంటారు. కొంత మంది ప్రజలు
బహు మొండివారు. వారు చేయదలచుకు
న్నదేదో అదే చేస్తారు. కావున వారికి ఆ ప్రవక్తలు,
'మీకు ఏ కీడూ రాదు!' అని చెపుతారు.
18 కాని ఈ ప్రవక్తలలో ఏ ఒక్కడూ పరలోక
సభలో* నిలవలేదు. వారిలో ఏ ఒక్కడూ

---

**యెహోవా ... న్యాయం** ఇది ద్వంద్వార్థం. ఇది సిద్కియా పేరు లాంటిది. ఈ భవిష్యద్వాణి యివ్వబడినప్పుడు యూదాకి రాజు. కాని యిర్మీయా వేరొక రాజును గురించి పలుకుచున్నాడు.

**సమరయ** ఇది ఇశ్రాయేలు ఉత్తర రాజ్యపు ముఖ్య పట్టణం. ఆ ప్రజలు మిక్కిలి నీచ కార్యాలు చేయటం వలన దేవుడే రాజ్యాన్ని నాశనం చేశాడు. సమరయకు షోమ్రోను మరో పేరు.

**పరలోక సభ** పాతనిబంధన గ్రంథంలోని ప్రజలు స్వర్గ సభానాయకునిగా దేవుని చిత్రీకరించి మాట్లాడేవారు. చూడండి రాజులు మొదటి గ్రంథము 22:19-23 యెషయా 6:1-8; యోబు 1-2.

యెహోవాను గాని, యెహోవా వాక్కును గాని
దర్శించలేదు. వారిలో ఏ ఒక్కడూ యెహోవా
సందేశం పట్లశ్రద్ధ వహించలేదు.
19 ఇప్పుడు యెహోవా నుండి శిక్ష తుఫానులా
వస్తుంది! యెహోవా కోపం ఉగ్రమైన గాలి
వానలా ఉంటుంది! ఆ దుష్టుల తలలు చితికి
పోయేలా అది వారి మీదికి విరుచుకు పడుతుంది.
20 యెహోవా చేయదలచుకున్నదంతా చేసే
వరకు ఆయన కోపం చల్లారదు. అంత్యదినాల్లో
దీనిని మీరు సరిగా అర్థం చేసికుంటారు.
21 ఆ ప్రవక్తలను నేను పంపియుండలేదు. కాని
వారికి వారే తమ వర్తమానాలను చాటటానికి
పరుగున పోయారు. నేను వారితో మాట్లాడ
లేదు. కాని వారు నా పేరుతో ప్రవచించారు
22 వారు నా సర్వ సభలో నిలిచి ఉండినట్లయితే
వారు నా సందేశాలను యూదా ప్రజలకు చెప్పి
ఉండేవారు. ప్రజలు చెడు మార్గాలు తొక్క
కుండా ఆపేవారు. వారు దుష్ట కార్యాలు చేయ
కుండా ఆపేవారు."
23 "ఇక్కడ ఈ స్థలములో నేను దేవుడను. నేను
దూర ప్రాంతంలో కూడా దేవుడను. ఇది
యెహోవా నుండి వచ్చిన వర్తమానం "నేను
దూరంలో లేను!
24 ఒక వ్యక్తి నాకు కనపడకుండా రహస్య స్థావరంలో
దాగటానికి ప్రయత్నించవచ్చు. కాని వానిని
చూడటం నాకు తేలిక ఎందువల్లనంటే నేను
స్వర్గంలోను, భూమి మీద సర్వత్రా వ్యాపించి
వున్నాను!"

25"నా పేరు మీద అబద్ధాలు బోధించే ప్రవక్త
లున్నారు. 'నాకు స్వప్న దర్శనమయింది. నాకు
స్వప్న దర్శనమయింది,' అని వారంటారు. వారు అలా
చెప్పటం నేను విన్నాను. 26ఎంత కాలం ఇది కొన
సాగుతుంది? ఆ ప్రవక్తలు అబద్ధాలనే ఆలో చిస్తారు.
వారు ఆలోచించిన అబద్ధాలనే ప్రజలకు భోధిస్తారు.
27యూదా ప్రజలు నా పేరు మర్చి పోయేలా చేయ
టానికి ఈ ప్రవక్తలు ప్రయత్నిస్తున్నారు. వారొకరి
కొకరు ఈ దొంగ కలల గురించి చెప్పుకొనటం
ద్వారా ఇది సాధించాలని చూస్తున్నారు. తమ పూర్వీ
కులు నన్ను మర్చిపోయిన రీతిగా, ఇప్పుడు నా ప్రజలు
నన్ను మర్చిపోయేలా చేయాలని వారు ప్రయత్ని
స్తున్నారు. వారి పూర్వీకులు నన్ను మర్చిపోయి,
బూటకపు దేవత బయలును ఆరాధించారు. 28ఎండు
గడ్డి, గోధుమలు ఒక్కటి గావు! అదే రీతిగా, ఆ ప్రవక్తల
కలలు నా సందేశాలు కానేరవు. ఎవరైనా తన కలలను
గూర్చి చెప్పుకోదలిస్తే చెప్పనివ్వండి. కాని నా వర్త
మానం విన్నవాడు మాత్రం దానిని యదార్థంగా
చెప్పాలి. 29నా సందేశం అగ్నిలావుంటుంది" ఇదే
యెహోవా వాక్కు "అది ఒక బండను పగులకొట్టే
సమ్మెటలా ఉంటుంది.

30"కావున ఆ దొంగ ప్రవక్తలకు నేను వ్యతిరేకిని."
ఇది యెహోవా నుండి వచ్చిన వర్తమానం "ఈ
ప్రవక్తలు ఒకరి నుండి ఒకరు నా మాటలు దొంగి
లించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు.* 31నేను ఈ
దొంగ ప్రవక్తలకు వ్యతిరేకిని." ఇదే యెహోవా వాక్కు.
వారు కల్పించిన మాటలనే వారు ఉపయోగిస్తూ, అది
నా సందేశమన్నట్లు నటిస్తారు. 32అసత్య దర్శనాలను
బోధించే ఈ ప్రవక్తలకు నేను వ్యతిరేకిని." ఇదే
యెహోవా వాక్కు.

"వారి అబద్ధాల ద్వారా అసత్య ప్రచారాల ద్వారా
వారు నా ప్రజలను తప్పు దోవ పట్టిస్తున్నారు. ప్రజ
లకు బోధించే నిమిత్తం ఆ ప్రవక్తలను నేను పంపియుం
డలేదు! నా తరఫున ఏమి చేయటానికీ నేను వారికి
ఆజ్ఞ ఇవ్వలేదు! యూదా ప్రజలకు వారేరకంగా
సహాయపడలేరు." ఇదే యెహోవా వాక్కు

### యెహోవా నుండి విషాద వార్త

33"యూదా ప్రజలు గాని, ఒక ప్రవక్త గాని, లేక
ఒక యాజకుడు గాని నిన్ను పిలిచి, 'యిర్మీయా,
యెహోవా ఏమి ప్రకటిస్తున్నాడు?' అని అడుగవచ్చు.
అప్పుడు వారికి సమాధానంగా,' యెహోవాకు మీరే
భారంగా* ఉన్నారు! ఈ పెద్ద భారాన్ని కిందికి విసరి
వేస్తాను. ఇదే యెహోవా వాక్కు,' అని నీవు చెప్పు.
34"ఒక ప్రవక్తే గాని, యాజకుడే గాని, లేక ప్రజలలో
ఎవ్వరే గాని, ' ఇది యెహోవా నుండి వచ్చిన ప్రకటన
...' అని చెప్పితే, అది అబద్ధం. అటువంటి వ్యక్తిని,
వాని కుటుంబాన్నంతటినీ నేను శిక్షిస్తాను. 35మీరొక
రికొకరు ఇలా చెప్పుకోండి, 'యెహోవా ఏమి సమా
ధానమిచ్చాడు? లేక 'యెహోవా ఏమి చెప్పాడు?'
36అంతేగాని మరెన్నడు, 'యెహోవా ప్రకటన (పెద్ద
భారం) ' అనే పదాన్ని తిరిగి మరలా వాడరు. ఎందు

---

**ఈ ప్రవక్తలు ... ఉంటారు** బహుశా ఆయన నిజమైన ప్రవక్తల మాటలను, భావాలను అనుకరించే దొంగ ప్రవక్తలను గూర్చి చెప్పుచుండవచ్చు. అలా చేయుట ద్వారా వారు నిజమైన మరియు దొంగ ప్రవక్తల మధ్య తేడాను గుర్తించలేని ప్రజలను మోసగిస్తున్నారు.

**యెహోవాకు మీరే భారంగా** ఇది ద్వంద్వార్థంగా, వ్యంగంగా వాడిన పదం. హెబ్రీభాషలో 'పెద్ద భారం' అనే పదం, 'ప్రకటన' అనే పదం ఒకే రకంగా పలుకుతాయి. ఈ పదాన్ని దైవావేశంలో ప్రకటనలు చేసే అర్థంలో దొంగ ప్రవక్తలు కూడా వాడినారు. అందువల్ల వారి నిజ స్వరూపం బయట పడే రీతిలో యిర్మీయా వ్యంగ్యంగా అదే మాటను వారి పట్ల వాడినాడు. వారి బూటకపు ప్రవర్తనలో వారు దేవునికి భారమయ్యారని భావం.

వల్లనంటే యెహోవా సందేశం ఎన్నడూ, ఎవరికీ
భారం కాకూడదు. కాని మీరు మన దేవుని మాటలు
మార్చివేశారు! ఆయన నిత్యుడైన సర్వశక్తిమంతుడగు
యెహోవా!'
37"మీరు దేవుని సందేశం తెలుసుకొనదలిస్తే ఒక
ప్రవక్తను, 'యెహోవా నీకేమి సమాధానం చెప్పాడు"
అని గాని; 'యెహోవా ఏమి చెప్పినాడు? అని గాని
అడగండి. 38కాని, 'యెహోవా ప్రకటన (పెద్ద భారం)
ఏమిటి? అని అడగవద్దు. మీరామాటలు వాడితే,
అప్పుడు యెహోవా మీకు ఈ మాటలు చెప్పుతాడు:
'మీరు నా సందేశాన్ని యెహోవా ప్రకటన (పెద్ద
భారం) అని చెప్పకుండా ఉండవలసింది. ఆ మాటలు
వాడవద్దని నేను మీకు చెప్పి యున్నాను. 39కాని నా
సందేశాన్ని పెద్ద భారమని పిలిచారు. కావున మిమ్మల్ని
పెద్ద భారంలా ఎత్తి నా నుండి విసరి పారవేస్తాను.
యెరూషలేము నగరాన్ని మీ పూర్వీకులకు నేను
ఇచ్చియున్నాను. కాని మిమ్మల్ని, మీ నగరాన్నీ నా
నుండి దూరంగా పార వేస్తాను. 40పైగా మీకు శాశ్వతంగా
తలవంపులు కలిగేలా చేస్తాను. మీ సిగ్గును మీరెన్నడూ
మరువలేరు."

### మంచి అంజూరపు పండ్లు, చెడ్డ అంజూరపు పండ్లు

24 యెహోవా నాకు ఈ వస్తువులను చూపిం
చాడు: యెహోవా మందిరం ముందు ఉంచ
బడిన రెండు బుట్టల అంజూరపు పండ్లను చూశాను.
(నాకు ఈ దర్శనం బబులోను రాజైన నెబుకద్నెజరు
యెకోన్యాను* బందీగా తీసుకొని పోయిన తరువాత
కలిగింది. యెకోన్యా రాజైన యెహోయాకీము
కుమారుడు. యెకోన్యా, అతని ముఖ్యమైన అధికారులు
యెరూషలేము నుండి తీసుకొని పోబడినారు. వారు
బబులోనుకు బందీలుగా కొనిపోబడినారు. నెబుకద్నె
జరు యూదా రాజ్యంలోని చాలా మంది వడ్రంగులను,
లోహపు పనివారలను కూడ తీసుకొనిపోయాడు.) 2ఒక
బుట్ట నిండా మంచి అంజూరపు పండ్లున్నాయి. అవి
వాటి కాలం కంటే ముందు పండిన పండ్లవలె ఉన్నాయి.
కాని రెండవ బుట్టలో కుళ్లిపోయిన అంజూరపు పండ్లు
న్నాయి. అవి తినటానికి పనికి రాకుండా కుళ్లి
పోయాయి.
3"యిర్మీయా, నీవు ఏమి చూస్తున్నావు? అని
యెహోవా నన్ను అడిగాడు. "నేను అంజూరపు
పండ్లను చూస్తున్నాను. అవి చాలా మంచి పండ్లు.
చెడిపోయిన పండ్లు కుళ్లి పోయాయి. అవి తినటానికి
పనికి రాకుండా కుళ్లిపోయాయి," అని నేను సమాధాన
మిచ్చాను.

4పిమ్మట యెహోవా వర్తమానం నాకు చేరింది.
5ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఇలా చెప్పాడు:
"యూదా ప్రజలు తమ దేశాన్నుండి బయటకు
కొనిపోబడ్డారు. వారి శత్రువు వారిని బబులోనుకు
తీసుకొనిపోయాడు. ఆ ప్రజలు ఈ మంచి అంజూర
పండ్లలా ఉన్నారు. ఆ ప్రజల పట్ల నేను కనికరం
చూపుతాను. 6నేను వారిని రక్షిస్తాను. నేను వారిని
తిరిగి యూదా రాజ్యానికి తీసుకొని వస్తాను. నేను
వారిని చీల్చి పారవేయను. వారిని పైకి తీసుకొని
వస్తాను! వారిని పెరికి వేయను. వారు అభివృద్ధి చెంద
టానికి వారిని స్థిరంగా నాటుతాను. 7వారు నన్ను
తెలుసుకొనగోరేలా చేస్తాను. నేనే యెహోవానని వారు
తెలుసుకుంటారు. వారు నా ప్రజలు; నేను వారి
దేవుడను. బబులోనులో వున్న ఆ బందీలంతా
పూర్ణహృదయ పరివర్తనతో నా వైపు తిరుగుతారు
గనుక నేనిదంతా చేస్తున్నాను.
8"కాని యూదా రాజైన సిద్కియా మాత్రం తిన
టానికి పనికిరాకుండా కుళ్లిపోయిన అంజూరపు పండ్ల
వలె అవుతాడు. సిద్కియా, అతని ఉన్నతాధి కారులు,
యెరూషలేములో యింకా మిగిలి వున్న ప్రజలు,
మరియు ఈజిప్టులో నివసిస్తున్న యూదా ప్రజలు
కుళ్లిన ఈ అంజూరపు పండ్లవలె ఉంటారు.
9"నేను వారిని శిక్షిస్తాను. ఆ శిక్ష భూమిమీద ప్రజ
లందరికీ భయంతో కూడిన విస్మయాన్ని కల్గిస్తుంది!
యూదా వారిని చూచి తక్కిన ప్రజలు హేళన చేస్తారు.
వారిని గూర్చి హాస్యోక్తులు పలుకుతారు. నేను వారిని
చిందర వందర చేసి పడవేసిన అన్ని ప్రదేశాలలో
ప్రజలు వారిని శపిస్తారు. 10వారి మీదికి కత్తిని, కరువును,
రోగాలను పంపుతాను. వారంతా చనిపోయే వరకు
వారిని ఎదుర్కొంటూ వుంటాను. వారికి, వారి పితరు
లకు నేనిచ్చిన భూమిమీద వారిక ఎంత మాత్రము
ఉండరు."

### యిర్మీయా యొక్క బోధనల సంగ్రహం

25 యూదా ప్రజలందరి గురించి యిర్మీయాకు
చేరిన సందేశం ఇది. యెహోయాకీము
యూదాకు రాజై పాలిస్తున్న నాల్గవ సంవత్సరంలో*
ఈ సందేశం వచ్చింది. యోషీయా కుమారుడు
యెహోయాకీము. ఇతని పాలనలో నాల్గవ సంవత్సరం
అయ్యే సరికి నెబుకద్నెజరు బబులోనుకు రాజు
కావటం, పరిపాలన ఒక సంవత్సరం కొనసాగించటం
జరిగింది. 2ప్రవక్తయైన యిర్మీయా యూదా ప్రజ
లందరికి, యెరూషలేము వాసులందరికి ఈ సందేశం
ఇచ్చాడు:
3యెహోవా నుండి వచ్చిన సందేశాలను గత ఇరవై
మూడు సంవత్సరాలలో నేను మీకు పదే పదే ఇచ్చి

**యెకోన్యా** రాజైన యెహోయాకీనుకు ఇది మరో పేరు. యెహోయాకీను క్రీ.పూ. 597లో బందీగా కొనిపోబడ్డాడు.

**నాల్గవ సంవత్సరం** అనగా క్రీ.పూ. 605వ సంవత్సరం.

యున్నాను. ఆమోను కుమారుడైన యోషీయా
యూదా రాజ్యాన్ని పదమూడవ సంవత్సరంలో
పాలిస్తూ ఉన్నప్పటినుండి నేను ప్రవక్తగా కొనసాగు
తున్నాను. ఆనాటి నుండి ఈనాటి వరకు నేను మీకు
యెహోవా సందేశాలను అందజేస్తూ వస్తున్నాను. కాని
మీరు వినిపించుకోలేదు. [4]యెహోవా తన సేవకులైన
ప్రవక్తలను మరల, మరల మీ వద్దకు పంపాడు. కాని
వారు చెప్పేది మీరు వినలేదు. మీరసలు వారిని లక్ష్య
పెట్టలేదు.

[5]ఆ ప్రవక్తలు," మీ జీవిత విధానం మార్చుకోండి.
ఆ చెడు కార్యాలు చేయటం మానండి. మీలోమార్పు
వస్తే, ఏనాడో దేవుడు మీరు నివసించుటకు మీ పిత
రులకు ఇచ్చిన రాజ్యానికి మీరు తిరిగి రాగలరు. మీరు
శాశ్వతంగా నివసించటానికి ఈ రాజ్యాన్ని ఆయన
మీకిచ్చాడు. [6]అన్య దేవతలను అనుసరించకండి.
వాటిని సేవించవద్దు. ఆరాధించవద్దు. మానవ హస్తా
లతో చేసిన విగ్రహాలను పూజించకండి. అదే మీపట్ల
నాకు కోపం కల్గిస్తూ వుంది. ఇది చేయటం వల్ల
మీకు మీరే హాని కలుగజేసుకుంటున్నారు!" *

[7]"కాని మీరు నా మాట వినలేదు" ఇది యెహోవా
వాక్కు "ఎవడో ఒక వ్యక్తి చేసిన విగ్రహాలను మీరు
పూజించారు. అది నన్ను ఆగ్రహపర్చింది. అదే మిమ్మ
బాధ పెట్టింది."

[8]కావున సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా
చెప్పుతున్నాడు: "మీరు నా వర్తమానాలను వినలేదు.
[9] అందుచేత నేను శీఘ్రమే ఉత్తరదేశం నుండి ప్రజ
లందరి కొరకు ఒకనిని పంపుతాను."

ఇదే యెహోవా వాక్కు. "బబులోను రాజైన
నెబుకద్నెజరును వెంటనే పిలిపిస్తాను. అతడు నా
సేవకుడు. ఆ జనాన్ని యూదా రాజ్యం మీదికి, దాని
ప్రజలపైకి రప్పిస్తాను. అంతేగాదు. వారిని మీ చుట్టూ
వున్న దేశాల మీదికి కూడ రప్పిస్తాను. ఆయా
దేశాలన్నిటినీ నేను నాశనం చేస్తాను. వాటిని శాశ్వతమైన
ఎడారిగా మార్చి వేస్తాను. ప్రజలు ఆయా దేశాలను
చూచి అవి ఎలా నాశనమయినాయో అని విస్మయం
పొందుతారు. [10]ఆ ప్రాంతంలో ఆనందోత్సాహాలను
అంతం చేస్తాను. వివాహ వేడుకలు ఏ మాత్రం ఉండవు.
తిరుగలి రాళ్ల శబ్దాలను, దీపాల వెలుగును మాయం
చేస్తాను. [11]ఆ ప్రాంతమంతా ఒక పనికిరాని ఎడారిలా
మారి పోతుంది. ఆ ప్రజలంతా బబులోను రాజు
కింద డెబ్బయి ఏండ్ల పాటు బానిసలవుతారు.

[12]"కాని డెబ్బయి సంవత్సరాల అనంతరం నేను
బబులోను రాజును శిక్షిస్తాను. బబులోను రాజ్యాన్ని
కూడా శిక్షకు గురి చేస్తాను."

ఇది యెహోవా నుండి వచ్చిన వర్తమానం "కల్దీ
యుల దేశాన్ని కూడా వారి పాపాల నిమిత్తంగా శిక్షిస్తాను.
ఆ ప్రాంతాన్ని శాశ్వతంగా ఎడారిలా మార్చివేస్తాను.
[13]బబులోనుకు చాలా కష్టనష్టాలు కలుగుతాయని చెప్పి
యున్నాను. అవన్నీ జరిగి తీరుతాయి. యిర్మీయా
ఆ పరాయి రాజ్యాల గురించి ప్రవచించియున్నాడు.
ఆ హెచ్చరికలన్నీ ఈ గ్రంథంలో వ్రాయబడినాయి.
[14]అవును. బబులోను ప్రజలు చాలా దేశాలలో పెక్కు
మంది గొప్ప రాజులకు సేవలు చేయాల్సి ఉంటుంది.
వారు చేసే పనులన్నిటికీ అర్హమైన శిక్ష వారికి నేను
విధిస్తాను."

## ప్రపంచ రాజ్యాలపై తీర్పు

[15]ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఈ విషయాలు
నాకు చెప్పాడు: "యిర్మీయా, ఈ ద్రాక్షా రసపు
గిన్నెను నా చేతి నుండి తీసుకో. ఇది నా కోపరసం.
నిన్ను నేను వివిధ దేశాలకు పంపుతున్నాను. ఆయా
దేశాల వారిని ఈ గిన్నె నుండి తాగేలా చేయుము.
[16]వారీ ద్రాక్షారసాన్ని తాగుతారు. పిదప వారు వాంతి
చేసుకొని, పిచ్చివారిలా ప్రవర్తిస్తారు. నేను త్వరలో
వారి పైకి పంపబోయే కత్తి దృష్ట్యా వారలా చేస్తారు."

[17]కావున యెహోవా చేతి నుండి నేను ఆ గిన్నె
అందుకొని యెహోవా పంపిన ప్రజలందరి యొద్దకు
వెళ్లాను. [18]యెరూషలేము వాసులకు, యూదా వారికి
ఈ ద్రాక్షారసం పోశాను. యూదా రాజులను, నాయకు
లను ఈ గిన్నె నుండి తాగేలా చేశాను. వారిని ఎడారిలా
మార్చివేయాలని. నేనీ విధంగా ఎందుకు చేశానంటే
ఆ ప్రదేశం సర్వనాశనం కావాలని, అది చూచి ప్రజలు
కలవర పడిరి. దానిని శపించితిని. చివరికి అలానే
జరిగింది. యూదా ఇప్పుడు అలానే తయారయింది.
[19]ఈజిప్టు రాజైన ఫరోను కూడా ఈ గిన్నె నుండి
తాగేలా చేశాను. అతని అధికారులను, అతని ముఖ్య
నాయకులను, మరియు అతని ప్రజలందరినీ
యెహోవా కోపపు గిన్నె నుండి తాగేలా చేశాను.

[20]అరబి దేశీయులు, మరియు ఊజు దేశపు
రాజులందరు ఈ గిన్నె నుండి తాగేలా నేను చేశాను.
ఫిలిష్తీయుల రాజులను కూడా ఈ గిన్నెతో తాగేలా
చేశాను. వీరు అష్కెలోను, గాజ, ఎక్రోను నగరాల
రాజులు, మరియు అష్డోదులో మిగిలిన రాజ్యానికి అధి
పతులు.[21]పిమ్మట ఎదోము, మోయాబు, మరియు
అమ్మోను ప్రజలు ఈ గిన్నెతో తాగేలా చేశాను.
[22]తూరు రాజులు సీదోను రాజులు కూడ ఈ గిన్నెతో
తాగేలా చేశాను.

దూరదేశపు రాజులందరి చేత ఆ గిన్నెతో తాగిం
చాను. [23]దదాను ప్రజలు, తేమానీయులు, బూజీయు
లందరూ ఈ గిన్నెతో తాగేలా చేశాను. కణతల వద్ద
తమ వెంట్రుకలు గొరిగించుకొనే వారందరినీ ఈ

---

**ఇది ... కలుగజేసుకుంటున్నారు** ఈ వాక్యం ప్రాచీన గ్రీకు ప్రతులననుసరించి వ్రాయబడింది. హెబ్రీలో మాత్రం, "అప్పుడు మీకు నేను హాని చేయను" అని వుంది.

గిన్నెతో తాగేలా చేశాను. [24]అరబి రాజులంతా ఈ
గిన్నె నుండి తాగేలా చేశాను. ఈ రాజులు ఎడారిలో
నివసిస్తారు. [25]జిమ్రీ రాజులు, ఏలాము రాజులు,
మరియు మాదీయుల రాజులు ఈ గిన్నె నుండి తాగేలా
చేశాను. [26]దగ్గరలో ఉన్న, దూరాన ఉన్న ఉత్తర దేశపు
రాజులందరు ఈ గిన్నె నుండి తాగేలా చేశాను. ఒకరి
తరువాత ఒకరు వారంతా తాగేలా చేశాను. యెహోవా
కోపపు గిన్నె నుండి భూమిమీద గల రాజ్యాల వారంతా
తాగేలా చేశాను. కాని బబులోను రాజు మాత్రం ఇతర
రాజ్యాల వారంతా తాగిన పిమ్మట ఆ గిన్నె నుండి
ఆఖరికి తాగుతాడు.

[27]"యిర్మీయా! ఇశ్రాయేలు దేవుడు, సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇలా చెపుతున్నాడని ఆయా
రాజ్యాల వారికి తెలియజేయుము: 'నా కోపపు గిన్నె
నుండి తాగండి. మైకం వచ్చేలా తాగి వాంతి చేసు
కోండి! కింద పడి మరల లేవకుండా ఉండండి. ఎందు
వల్లనంటే మిమ్మల్ని చంపటానికి కత్తిని మీమీదికి
పంపుతున్నాను!'

[28]"ఆ ప్రజలు నీ చేతి నుండి గిన్నెను తీసికోవటానికి
నిరాకరిస్తారు. వారు దాని నుండి త్రాగటానికి ఒప్పు
కోరు. అయినా నీవు వారిని పిలిచి ఇలా చెప్పాలి: '
సర్వశక్తిమంతుడైన దేవుడీ సంగతులు తెలియ
జేస్తున్నాడు. మీరు నిజానికి ఈ గిన్నె నుండి తాగాలి!
[29]నా పేరుతో పిలవబడే యెరూషలేము నగరానికి
ముప్పు తేవటం మొదలు పెట్టాను. బహుశః మీరు
శిక్షింపబడక పోవచ్చునని మీరనుకుంటూ ఉండవచ్చు.
అయితే మీరు పొరబడుతున్నారు. మీరు శిక్షింపబడ
తారు. భూమి మీదనున్న ప్రజలందరినీ ఎదుర్కోవ
టానికి నేను కత్తిని పంపుతున్నాను.'" ఇదే యెహోవా
వాక్కు.

[30] "యిర్మీయా, ఈ వర్తమానం వారికి అందజేయి:
'ఉన్నతమైన, పవిత్రమైన తన ఆలయం నుండి
యెహోవా ఎలుగెత్తి చాటుతున్నాడు.
యెహోవా తన పచ్చిక బీడు (ప్రజలు)కు
వ్యతిరేకంగా చాటుతున్నాడు. ఆయన ద్రాక్షా
రసం తీసే వారిలా బిగ్గరగా కేకలేస్తున్నాడు.
[31] ఆ శబ్దం మోత భూమిపై ప్రజలందరికి చేరు
తుంది. అసలీ శబ్దం ఎందుకు? యెహోవా
అన్ని దేశాల ప్రజలనూ శిక్షిస్తున్నాడు.
యెహోవా ప్రజలకు వ్యతిరేకంగా తన వాదన
తెలియజెప్పాడు ఆయన ప్రజలపై తీర్పు
ఇచ్చాడు. ఆయన కత్తితో దుష్ట సంహారం
చేస్తున్నాడు.'" ఇది యెహోవా నుండి వచ్చిన
సందేశం.
[32] సర్వశక్తిమంతుడైన యెహోవా చెప్పినదే
మంటే: "ఒక దేశాన్నుండి మరొక దేశానికి విప
త్తులు త్వరలో వ్యాపిస్తున్నాయి. అవి పెను
తుఫానులా భూమిపై సుదూర తీరాల వరకు
వ్యాపిస్తాయి!"

[33]ఆ ప్రజల శవాలు దేశం ఒక అంచు నుండి
మరో అంచువరకు పడి ఉంటాయి. చనిపోయిన వారి
కొరకు విలపించే వారొక్కరూ ఉండరు. ఆ శవాలను
ఎవ్వరూ సేకరించి సమాధి చేయరు. పశువుల పేడవలె
అవి నేలపై పడి ఉంటాయి.

[34] కాపరులారా (నాయకులారా), మీరు మందను
(ప్రజలను) కాయవలసి ఉంది. కాని ఓ గొప్ప
నాయకులారా, రోదించటం మొదలు పెట్టండి.
గొర్రెల కాపరులారా, నేలమీద పడి బాధతో
పొర్లండి ఎందువల్లనంటే మీరు సంహరించబడే
సమయం సమీపిస్తూ ఉంది. మిమ్ములను కొట్టి
చెల్లా చెదరు చేస్తాను. పగిలిన కుండ పెంకుల్లా
మీరు చిందర వందరై పోతారు!
[35] గొర్రెల కాపరులు (నాయకులు) దాగటానికి తావే
దొరకదు! ఆ నాయకులు తప్పించుకోలేరు!
[36] కాపరులు (నాయకులు) అరవటం నేను వింటు
న్నాను. మంద (ప్రజలు) కాపరులు రోదించటం
నేను వింటున్నాను! యెహోవా వారి పచ్చిక
బయళ్లను (దేశం) నాశనం చేస్తున్నాడు!
[37] ఆ ప్రశాంతమైన పచ్చిక బయళ్లు (భవనాలు)
నాశనం చేయబడి వట్టి ఎడారిలా అవుతాయి.
యెహోవా మిక్కిలి కోపంగా వున్న కారణంగా
ఇది జరిగింది.
[38] తన గుహనుండి బయటికి వస్తున్న ఒక భయం
కరమైన సింహంలా యెహోవా ఉన్నాడు.
యెహోవా కోపంగా ఉన్నాడు! యెహోవా
కోపం ఆ ప్రజలకు హాని కల్గించింది! వారి రాజ్యం
వట్టి ఎడారిలా అయిపోయింది.

## దేవాలయం వద్ద యిర్మీయా పాఠం

**26** యూదా రాజ్యాన్ని యెహోయాకీము పాలి
స్తున్న మొదటి సంవత్సరంలో* ఈ వర్త
మానం యెహోవా నుండి వచ్చింది. రాజైన యెహో
యాకీము యోషీయా కుమారుడు. [2]యెహోవా ఇలా
అన్నాడు: "యిర్మీయా, నీవు దేవాలయ ప్రాంగణంలో
నిలబడు. దేవుని ఆరాధించుటకై వచ్చే యూదా
ప్రజలందరికి ఈ సందేశాన్ని అందజేయుము. నేను
నిన్ను మాట్లాడమని చెప్పినదంతా వారికి చెప్పుము.
నా సందేశంలో ఏ భాగాన్ని వదిలి పెట్టవద్దు. [3]బహుశః
వారు నా సందేశాన్ని విని ఆచరించవచ్చు. బహుశః

---

**మొదటి సంవత్సరం** క్రీ.పూ. 609వ సంవత్సరం.

వారా దుర్మార్గపు జీవితాన్ని విడనాడవచ్చు. వారు గనుక
మారితే, నేను వారిని శిక్షించాలనే నా పథకాన్ని కూడా
మార్చు కుంటాను. వారు చేసిన అనేక దుష్టకార్యాల
దృష్ట్యా నేను వారిని శిక్షించే పథకాన్ని తయారు
చేస్తున్నాను. [4]నీ విధి వారికి చెప్పుము, 'యెహోవా
ఇలా అంటున్నాడు: నా ఉపదేశాలను మీకు
అందించాను. మీరు నాకు విధేయులై, నా సూక్తులను
పాటించాలి! [5]నా సేవకులు (నా ప్రవక్తలు) మీకు
చెప్పే విషయాలను మీరు ఆలకించాలి. నా ప్రవక్తలను
మీ వద్దకు మరల, పంపియున్నాను. కాని మీరు వారు
చెప్పేది ఆలకించలేదు. [6]మీరు నన్ను అనుసరించక
పోతే యెరూషలేములో ఉన్న నా ఆలయాన్ని షిలో
హులో వున్న నా పవిత్ర గుడారం* మాదిరిగా చేసి
వేస్తాను. ప్రపంచంలోని ప్రజలెవరైనా తమకు గిట్టని
నగరాలకు కీడు జరగాలని తలిస్తే, యెరూషలేముకు
జరిగినట్లు జరగాలని కోరుకుంటాను."

[7]దేవాలయంలో యిర్మీయా ఈ మాటలు
చెప్పటం యాజకులు, ప్రవక్తలు, దేవుని ఆలయానికి
వచ్చిన ప్రజలందరూ విన్నారు. [8]ప్రజలకు చెప్పమని
యెహోవా ఆజ్ఞ యిచ్చినదంతా యిర్మీయా చెప్పటం
ముగించాడు. పిమ్మట యాజకులు, ప్రవక్తలు, ప్రజలు
అంతా యిర్మీయాను పట్టు కున్నారు. "ఈ భయం
కరమైన విషయాలు చెప్పి నందుకు నీవు చని
పోవలసినదే! యెహోవా పేర అటువంటి విషయాలు
చెప్పటానికి నీకు ఎంత ధైర్యం! షిలోహులోని పవిత్ర
గుడారంలా ఈ దేవాలయం నాశనమవుతుందని చెప్ప
టానికి నీకు ఎంత ధైర్యం! యెరూషలేములో ఎవ్వరూ
నివసించని రీతిలో అది ఎడారిలా మారిపోతుందని
చెప్పటానికి నీకు ఎన్ని గుండెలు!" అని వారంతా
యిర్మీయాను గద్దించారు. యెహోవా గుడిలో
వారంతా యిర్మీయాను చుట్టు ముట్టారు.

[10]ఇప్పుడు యూదా పాలకులు జరుగుతున్న
విషయాలన్నీ విన్నారు. కావున వారు రాజభవనం
నుండి బయటికి వచ్చారు. వారు దేవాలయానికి
వెళ్లారు. అక్కడ దేవాలయానికి తిన్నగా వెళ్లే నూతన
ద్వారం వద్ద తమ తమ స్థానాలను అలంకరించారు.
[11]అప్పుడు యాజకులు, ప్రవక్తలు కలిసి పాలకుల
తోను, తదితర ప్రజలతోను మాట్లాడారు.
"యిర్మీయా చంపబడాలి. యెరూషలేమును గురించి
అతడు చాలా చెడ్డ విషయాలు చెప్పాడు. అతడా
విషయాలు చెప్పటం మీరు కూడా విన్నారు" అని
వారంతా చెప్పారు.

[12]పిమ్మట యిర్మీయా యూదా పాలకు లందరి
తోను, ఇతర ప్రజలతోను మాట్లాడాడు. అతనిలా
చెప్పాడు: "ఈ ఆలయాన్ని గురించి, ఈ నగరాన్ని
గురించి ఈ విషయాలు చెప్పమని యెహోవా నన్ను
పంపాడు. మీరు వినియున్నదంతా యెహోవా తెలియ
జేసినదే. [13]ఓ జనులారా, మీ జీవిత విధానం మార్చు
కోండి! మీరు సత్కార్యాలు చేయుట మొదలుపెట్టండి!
మీ దేవుడైన యెహోవాను మీరు అనుసరించాలి.
మీరలా చేస్తే యెహోవా తన మనస్సు మార్చు
కుంటాడు. యెహోవా మీకు వ్యతిరేకంగా తలపెట్టిన
హానికరమైన పనులు చేయడు. [14]ఇక నా విషయానికి
వస్తే, నేను మీ అధీనంలో ఉన్నాను. మీకు ఏది
ఉచితమని, న్యాయమని తోస్తే, నాకు అది చేయండి.
[15]కాని మీరు నన్ను చంపితే, ఒక్క విషయం మాత్రం
గుర్తుంచుకోండి. మీరు ఖచ్చితంగా ఒక అమాయక
వ్యక్తిని చంపిన నేరానికి పాల్పడిన వారవుతారు. అంతే
కాదు మీరీ నగరాన్ని, అందులోని ప్రతి పౌరుణ్ణీ కూడ
నేరస్థులుగా చేసిన వారవుతారు. యెహోవా నిజంగా
నన్ను మీ వద్దకు పంపియున్నాడు. మీరు విన్న సందేశం
వాస్తవంగా యెహోవా నుండే వచ్చినది."

[16]తరువాత పాలకులు, ప్రజలు అందరూ మాట్లా
డారు. ఆ ప్రజలు యాజకులతోను "యిర్మీయా
చంపబడకూడదు. యిర్మీయా మనకు చెప్పిన విష
యాలు మన యెహోవా దేవుని నుండి వచ్చినవే"
అని అన్నారు.

[17]అప్పుడు నగర పెద్దలలో (నాయకులు)
కొందరు లేచి ప్రజలతో ఇలా అన్నారు: [18]"ప్రవక్తయైన
మీకా మోరష్తీ నగర వాసి. యూదా రాజైన హిజ్కియా
పాలనా కాలంలో మీకా ప్రవక్తగా వున్నాడు. యూదా
ప్రజలందరికీ మీకా* ఈ విషయాలు చెప్పియున్నాడు:

> "సర్వశక్తిమంతుడైన యెహోవా చెప్పినదే
> మంటే: సీయోను దున్నబడిన పొలంలా
> అవుతుంది! యెరూషలేము ఒక రాళ్ల
> గుట్టలా తయారవుతుంది! గుడివున్న
> పర్వతం, ఒక ఖాళీ కొండ* పొదలతో
> నిండినట్లవుతుంది.

[19]"హిజ్కియా యూదాకు రాజుగా వున్నప్పుడు
హిజ్కియా మీకాను చంపలేదు. యూదా ప్రజలెవ్వరూ
మీకాను చంపలేదు. హిజ్కియా యెహోవా పట్ల భక్తి
శ్రద్ధలు కలిగి ఉన్నాడని మీకు తెలుసు. అతడు దేవుని

---

**నా ఆలయాన్ని ... గుడారం** షిలోహులో వున్న పవిత్ర స్థలం బహుశః సమూయేలు కాలంలో నాశనం చేయబడి వుండవచ్చు. చూడండి, యిర్మీయా 7 మరియు సమూయేలు మొదటి గ్రంథం 4.

**మీకా** మీకా 3:12 చూడండి.

**ఖాళీ కొండ** లేక 'ఉన్నత స్థలము' ఈ పదము సాధారణంగా స్థానిక ప్రజల ఆరాధనా స్థలాలకు వాడబడుతుంది. ఇక్కడ ప్రజలు విగ్రహాలను ఆరాధించేవారు.

సంతోష పరచాలని కోరుకున్నాడు. యూదా రాజ్యానికి
కీడు చేస్తానని యెహోవా అన్నాడు. కాని హిజ్కియా
యెహోవాను ప్రార్థించాడు. అందువల్ల యెహోవా
తన మనస్సు మార్చుకున్నాడు. యెహోవా ముందుగా
అన్నట్లు ఏ కీడూ చేయలేదు. ఇప్పుడు మనం
యిర్మీయాను గాయపర్చితే, మనం మన మీదికే అనేక
కష్టాలు తెచ్చిపెట్టుకుంటాము. ఆ కష్టాలన్నీ మన
స్వంత తప్పులు."

[20]గతంలో యెహోవా సందేశాన్ని ప్రవచించిన
మరో వ్యక్తి వున్నాడు. అతని పేరు ఊరియా. అతడు
షెమయా అనేవాని కుమారుడు. ఊరియా కిర్య
త్యారీము నగరవాసి. యిర్మీయా చెప్పిన మాదిరిగానే
ఈ నగరాన్ని గురించి, ఈ రాజ్యాన్ని గురించి ఊరియా
కూడ చెప్పియున్నాడు. [21]రాజైన యెహోయాకీము,
అతని సైన్యాధికారులు, మరియు యూదాలోని ప్రజా
నాయకులు ఊరియా బోధించినదంతా విన్నారు.
వారికి చాలా కోపం వచ్చింది. రాజైన యెహోయా
కీము ఊరియాను చంపగోరాడు. కాని యెహోయా
కీము తనను చంపగోరుతున్నట్లు ఊరియా విన్నాడు.
ఊరియా భయపడ్డాడు. అందుచే అతడు ఈజిప్టుకు
తప్పించుకు పోయాడు. [22]కాని ఎల్నాతాను అనే
వ్యక్తిని, మరి కొందరు మనుష్యులను రాజైన యెహో
యాకీము ఈజిప్టుకు పంపాడు. ఎల్నాతాను అనేవాడు.
అక్బోరు అనేవాని కుమారుడు.

[23]ఆ మనుష్యులు ఊరియాను ఈజిప్టు నుండి
తీసికొని వచ్చారు. వారు ఊరియాను రాజైన యెహో
యాకీము వద్దకు తీసికొని వెళ్లారు. ఊరియాను కత్తితో
నరికి చంపమని యెహోయాకీము ఆజ్ఞ యిచ్చాడు.
పేద ప్రజల స్మశాన వాటికలో అతని శవం పారవేయ
బడింది.

[24]షాఫాను కుమారుడైన అహీకాము అనే ప్రముఖ
వ్యక్తి ఒకడున్నాడు. అహీకాము యిర్మీయాకు అండగా
వున్నాడు. అందుచే అహీకాము యాజకుల బారి నుండి,
ప్రవక్తల బారి నుండి చంపబడకుండా యిర్మీయాను
రక్షించాడు.

### యెహోవా నెబుకద్నెజరును పాలకునిగా చేయుట

27 యెహోవా నుండి ఒక వర్తమానం యిర్మీ
యాకు వచ్చింది. సిద్కియా యూదాకు
రాజైన పిమ్మట తన పరిపాలనలో నాలుగవ సంవ
త్సరం* జరుగుతూ ఉండగా ఈ వర్తమానం వచ్చింది.
రాజైన సిద్కియా యోషీయా కుమారుడు.
[2]యెహోవా నాకు ఈ విధంగా చెప్పాడు.
"యిర్మీయా! వారులతోను, నిలువు కట్టెతోను ఒక
కాడి తయారు చేయి. ఆ కాడిని నీ మెడపై వేసుకో.
[3]తరువాత ఎదోము, మోయబు, అమ్మోను, తూరు,
సీదోను రాజుల వద్దకు వర్తమానాలు పంపు. యూదా
రాజైన సిద్కియాను చూడటానికి యెరూషలేముకు
వచ్చే ఆయా రాజ దూతల ద్వారా వర్తమానాలను
పంపు.* [4]ఈ వర్తమానాన్ని వారి యజమానులకిమ్మని
ఆ దూతలతో ఇలా చెప్పుము. 'ఇశ్రాయేలు దేవుడు,
సర్వశక్తిమంతుడైన యెహోవా చెప్పేదేమంటే: మీ
యజమానులతో [5]నేనే భూమండలాన్ని, దానిపై ఉండే
మనుష్యులందరినీ సృష్టించానని చెప్పండి. భూమి
పైగల జంతుజలాన్ని కూడ నేనే సృష్టించాను. ఇదంతా
నా గొప్ప మహిమ చేతను, నా దృఢమైన హస్తముతోను
చేసియున్నాను. ఈ భూమిని నా ఇష్టమైన వాని కెవని
కైనా ఇచ్చి వేయగలను. [6]ఇప్పుడు మీ దేశాలన్నిటినీ
బబులోను రాజైన నెబుకద్నెజరుకు ఇచ్చి వేశాను.
అతడు నా సేవకుడు. అడవి జంతువులు కూడ అతనికి
లోబడి వుండేలా చేస్తాను. [7]దేశాలన్నీ నెబుకద్నెజరుకు,
అతని కుమారునికి, అతని మనుమనికి దాసులై సేవ
చేస్తాయి. ఆ తరువాత బబులోను పతనానికి సమయం
ఆసన్నమౌతాది. చాలా రాజ్యాలు, గొప్ప రాజులు
బబులోనును వశపర్చుకొని దాస్యం చేయించు
కుంటారు.

[8]"కాని ఇప్పుడు కొన్ని దేశాలు, రాజ్యాలు
నెబుకద్నెజరుకు దాస్యం చేయటానికి నిరాకరించ
వచ్చు. వారు అతని కాడిని తమ మెడపై పెట్టుకోటానికి
నిరాకరించవచ్చు. (తమపై అతని ఆధిపత్యాన్ని
తిరస్కరించ వచ్చు.) అది గనుక జరిగితే, ఆయా
దేశాలను, రాజ్యాలను కత్తితోను, ఆకలితోను, రోగాల
తోను శిక్షిస్తాను.' " ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది "ఆ దేశాన్ని నాశనం చేసే వరకు నేనది
చేస్తాను. నెబుకద్నెజరును వ్యతిరేకించే రాజ్యం పైకి
అతనినే వినియోగించి దానిని నాశనం చేయిస్తాను.
[9]కావున మీరు మీ ప్రవక్తలు చెప్పే దానిని వినవద్దు.
మంత్ర విద్యచే మోసం చేసి భవిష్యత్తును చెప్పజూచే
వారి మాయలో పడవద్దు. కలల ఆంతర్యాలను
చెపుతామనే వారి మాటలు నమ్మవద్దు. చనిపోయిన
వారితో మాట్లాడుతామనేవారు, కనికట్టు విద్యలను ఆచ
రించే వారు చెప్పే మాటలు వినవద్దు. ఆ మనుష్యులు,
'మీరు బబులోను రాజుకు బానిసలు కానేరరు' అని
చెపుతారు. [10]కాని వారు మీతో అబద్ధమాడుతున్నారు.
వారు కేవలం మీరు మీ మాతృదేశం నుండి దూర
దేశాలకు తీసుకొని పోబడటానికి కారకులవుతారు.

---

**సిద్కియా ... నాలుగవ సంవత్సరం** హెబ్రీ గ్రంథంలో యెహోయాకీము పరిపాలన ఆరంభంలో అని వుంది. ఇది వ్రాత పొరపాటు కావచ్చు. యిర్మీయా 28:1 నాల్గవ సంవత్సరం అని చెపుతుంది. మూడవ వచనం సిద్కియాను గురించి చెపుతుంది. ఇది క్రీ. పూ. 594 - 593 వ సంవత్సరం.

**యిర్మీయా ... పంపు** అక్షరార్థముగా "తరువాత అటువంటి కాడినే పంపు."

మీరు మీ ఇండ్లు వాకిళ్లు వదిలి పోయేలా నేను వత్తిడి
చేస్తాను. పైగా మీరు వేరొక దేశంలో చనిపోతారు.
11"తమ మెడవంచి బబులోను రాజు కాడిని ధరించి
అతనికి విధేయులై ఉన్న దేశాల వారు జీవిస్తారు. అటు
వంటి వారిని బబులోను రాజును సేవిస్తూ తమ దేశం
లోనే ఉండేలా చేస్తాను." ఈ వర్తమానం యెహోవా
నుండి వచ్చినది "ఆయా దేశాల వారంతా తమ తమ
స్వదేశాలలోనే ఉంటూ, తమ భూముల్లో సేద్యం
చేసుకుంటూ ఉంటారు."
12"యూదా రాజైన సిద్కియాకు కూడ ఇదే
సందేశం ఇచ్చాను. నేనిలా చెప్పాను: 'సిద్కియా,
బబులోను రాజు యొక్క కాడి క్రింద నీ మెడ వుంచి
అతనికి విధేయుడవై వుండాలి. నీవు బబులోను
రాజుకు, అతని ప్రజలకు దాస్యం చేస్తే నీవు బతుకు
తావు. 13నీవు బబులోను రాజుకు దాస్యం చేయటానికి
ఒప్పుకొనకపోతే నీవు, నీ ప్రజలు శత్రువు యొక్క
కత్తి వాత బడి, ఆకలితోను, భయంకర రోగాలతోను
చనిపోతారు. ఇవి జరిగి తీరుతాయని యెహోవా
చెప్పాడు! 14కాని అబద్ధ ప్రవక్తలు మాత్రం, 'నీవు
బబులోను రాజుకు బానిసవు కానేరవు' అని
చెపుతున్నారు.
"ఆ ప్రవక్తలు చెప్పేది వినవద్దు. ఎందువల్లనంటే
వారు నీకు అబద్దాలు చెపుతున్నారు. 15నేనా ప్రవక్తలను
పంపలేదు." ఇదే యెహోవా వాక్కు "వారు అబద్దాలు
బోధిస్తున్నారు. పైగా, ఆ సందేశం నా నుండి వచ్చినదే
అని కూడ చెపుతున్నారు. కావున ఓ యూదా
ప్రజలారా, మిమ్మల్ని దూరంగా పంపివేస్తాను. మీరు
చని పోతారు! మీకు బోధించే ఆ ప్రవక్తలు కూడా
చనిపోతారు."
16అప్పుడు యిర్మీయానైన నేను యాజకుల
తోను, ఆ ప్రజలందరితోను ఇలా చెప్పాను:
"యెహోవా చెప్పేదేమంటే ఆ అబద్ధ ప్రవక్తలు,
'బబులోనీయులు యెహోవా నుండి ఎన్నో వస్తువులు
తీసుకొని పోయారు. అవన్నీ శీఘ్రమే తిరిగి తీసుకొని
రాబడుతాయి.' అని చెపుతున్నారు. వారి మాటలు
మీరు నమ్మవద్దు. ఎందువల్లనంటే వారు మీకు అబద్ధ
ప్రవచాలను బోధిస్తున్నారు. 17ఆ ప్రవక్తలు చెప్పే
వాటిని మీరు వినవద్దు. బబులోను రాజుకు దాస్యం
చేయండి. మీ శిక్షను మీరు ఆమోదించండి. మీరు
జీవిస్తారు. ఈ యెరూషలేము నగరం సర్వనాశనం
అయ్యేలా మీరు చేయటానికి కారణమే కన్పించటం
లేదు. 18ఈ మనుష్యులు నిజంగానే ప్రవక్తలయితే,
వారికి యెహోవా సందేశం అందితే వారిని ప్రార్థన
చేయనివ్వండి. ఇంకా దేవునిలో వున్న వస్తువుల
గురించి ప్రార్థన చేయనివ్వండి. రాజ భవనంలో
యింకా మిగిలివున్న వస్తువుల గురించి వారిని ప్రార్థన
చేయనివ్వండి. ఇంకా యెరూషలేములో వున్న వాటిని
గురించి ప్రార్థన చేయ నివ్వండి. ఆయా వస్తు
సముదాయాలు బబులోనుకు తీసుకొని పోబడకుండా
వుండేలా ఆ ప్రవక్తలను ప్రార్థన చేయనివ్వండి."
19సర్వశక్తిమంతుడైన యెహోవా యెరూషలే
ములో ఇంకా మిగిలివున్న వస్తువులను గూర్చి ఇది
చెపుతున్నాడు. దేవాలయంలో స్తంభాలు, కంచు
కోనేరు, కదిలించగల దిమ్మెలు ఇంకా ఇతరమైన వస్తు
సామగ్రి ఉంది.* బబులోను రాజైన నెబుకద్నెజరు
వీటిని యెరూషలేములో వదిలి వేశాడు.
20యూదా రాజైన యెహోయాకీనును* బందీగా
కొనిపోయేటప్పుడు నెబుకద్నెజరు వాటన్నిటినీ
తీసుకొని పోలేదు. రాజైన యెహోయాకీను యెహో
యాకీము కుమారుడు. యూదా నుండి, యెరూష
లేము నుండి ఇతర ప్రముఖ వ్యక్తులను కూడా నెబుక
ద్నెజరు బందీలుగా పట్టుకుపోయాడు. 21దేవాలయం
లోను, రాజభవనంలోను, మరియు యెరూషలేము
లోను ఇంకా మిగిలివున్న వస్తువుల విషయంలో ఇశ్రా
యేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడైన యెహోవా
ఇలా చెపుతున్నాడు. ఆ వస్తువులన్ని బబులోనుకు
తీసుకొని పోబడతాయి. 22నేను వాటిని తిరిగి తీసుకొని
వచ్చే రోజు వరకు అవి అక్కడే వుంచబడతాయి."
ఇది యెహోవా వాక్కు. "పిమ్మట వాటిని నేను
తీసుకొని వస్తాను. తిరిగి వాటిని యధాస్థానంలో
వుంచుతాను.

### అబద్ధ ప్రవక్త హనన్యా

28 యూదా రాజుగా సిద్కియా పాలన నాలుగు
సంవత్సరాలు* దాటి ఐదవ నెల గడుస్తూ
ఉండగా ప్రవక్త హనన్యా నాతో మాట్లాడాడు. హనన్యా
తండ్రి పేరు అజ్జూరు. హనన్యా గిబియోను పట్టణవాసి.
హనన్యా నాతో మాట్లాడినప్పుడు అతడు దేవాల
యంలో వున్నాడు. యాజకులు, ఇతర ప్రజలు
అందరు కూడ అక్కడ చేరి వున్నారు. హనన్యా ఇలా
చెప్పాడు. 2"ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతు
డగు యెహోవా ఇలా చెపుతున్నాడు. 'యూదా
ప్రజల మెడపై బబులోను రాజు వుంచిన కాడిని నేను
విరిచి వేస్తాను. 3రెండు సంవత్సరాలు గడిచేలోగా
యెహోవా గుడి నుండి బబులోను రాజు నెబుక
ద్నెజరు తీసుకొనిపోయిన వస్తువులన్నిటినీ నేను తిరిగి
తెస్తాను. నెబుకద్నెజరు ఆ వస్తువులన్నిటినీ బబులో
నుకు తీసుకొని పోయాడు. కాని వాటన్నిటినీ నేను

---

**స్తంభాలు ... వుంది** వివరాలకు చూడండి రాజుల మొదటి గ్రంథం 7:23-37.

**యెహోయాకీను** ఇతనినే యెకొన్యా అని, కొన్యా అని కూడ పిలుస్తారు.

**నాలుగు సంవత్సరాలు** ఇది క్రీ.పూ. 594వ సంవత్సరం.

తిరిగి యెరూషలేముకు తీసుకొని వస్తాను. 4యూదా
రాజైన యెహోయాకీనును కూడా ఈ స్థానానికి
నేను తీసుకొని వస్తాను. యెకోన్యా యెహోయాకీము
కుమారుడు. నెబుకద్నెజరు బలవంతం చేసి తమ
ఇండ్ల నుండి బబులోనుకు తీసుకొని పోయిన యూదా
ప్రజలందరినీ నేను తిరిగి తీసుకొని వస్తాను. ఇది
యెహోవా నుంచి వచ్చిన సమాచారం 'కావున
బబులోను రాజు యూదా ప్రజల మెడపై ఉంచిన
కాడిని నేను విరుగగొడతాను!' "

5అప్పుడు ప్రవక్త యిర్మీయా ప్రవక్త హనన్యాకు
ఇలా సమాధానం చెప్పాడు. వారు దేవాలయంలో
నిలబడి వున్నారు. యాజకులు, మరియు అక్కడ
చేరిన ప్రజలు యిర్మీయా సమాధానం వినగలిగారు.
6హనన్యాతో యిర్మీయా ఇలా అన్నాడు: "తథాస్తు!
నిజంగా యెహోవా అలా చేయుగాక! నీవు ప్రవచించిన
వర్తమానం యెహోవా నిజం చేయుగాక! బబులోను
నుంచి దేవాలయ సంబంధిత వస్తువులన్నీటినీ
యెహోవా ఇక్కడికి తీసుకొని వచ్చుగాక! బల
వంతంగా తమ ఇండ్లు వదిలి పోయేలా చేయబడిన
ప్రజలందరినీ యెహోవా మరల ఇక్కడికి తీసికొని
వచ్చు గాక!

7"కాని హనన్యా! నేను చెప్పేది విను. ప్రజలారా,
మీరందరు నేను చెప్పేది వినండి. 8హనన్యా! నీవు,
నేను ప్రవక్తలం అవటానికి పూర్వం చాలా ముందు
కాలంలో ప్రవక్తలుండినారు. చాలా దేశాలకు, మహా
సామ్రాజ్యాలకు యుద్ధాలు, కరువులు, భయంకరమైన
రోగాలు వస్తాయని వారు చెప్పియున్నారు. 9కాని
మనకు సుఖ సంతోషాలు, శాంతి లభిస్తాయని చెప్పే
ప్రవక్త నిజంగా యెహోవాచే పంపబడినవాడేనా అని
మనం నిర్ధారణ చేయవలసి వుంది. ఆ ప్రవక్త చెప్పినది
నిజమయ్యే పక్షంలో, అతడు నిజంగా యెహోవాచే
పంపబడిన వాడని ప్రజలు తెలుసుకోవచ్చు."

10యిర్మీయా ఒక కాడిని తన మెడకు తగిలించు
కుని ఉన్నాడు. ప్రవక్త హనన్యా ఆ కాడిని యిర్మీయా
మెడనుండి తీసి విరుగగొట్టాడు. 11పిమ్మట అక్కడ
చేరిన ప్రజలంతా వినేలా హనన్యా ఇలా బిగ్గరగా
చెప్పాడు: "యెహోవా సెలవిచ్చినదేమంటే, 'ఇదే
రీతిని బబులోను రాజు నెబుకద్నెజరు వేసిన కాడిని
నేను విరిచి వేస్తాను. అతడు ఆ కాడిని ప్రపంచ దేశాల
న్నిటిపై వేశాడు. కాని రెండు సంవత్సరాల కాలం
లోపల నేనా కాడిని విరిచివేస్తాను."

హనన్యా అలా చెప్పిన పిమ్మట యిర్మీయా
దేవాలయం నుండి వెళ్లి పోయాడు.

12తరువాత యెహోవా సందేశం యిర్మీయాకు
వచ్చింది. యిర్మీయా మెడ నున్న కాడిని తీసి హనన్యా
విరచి వేసిన తరువాత ఇది జరిగింది. 13యెహోవా
యిర్మీయాతో ఇలా చెప్పాడు, "నీవు వెళ్లి హనన్యాతో
ఇలా చెప్పుము, 'యెహోవా ఇలా అంటున్నాడు,
నీవు చెక్కతో చేయబడిన కాడిని విరుగగొట్టావు. కాని
దానికి బదులు నేనొక ఇనుప కాడిని వేస్తున్నాను.'
14ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడైన
అయిన యెహోవా ఇలా అన్నాడు: 'ఆ దేశాలన్నిటి
పైన నేనొక ఇనుప కాడిని వేస్తున్నాను. బబులోను
రాజు నెబుకద్నెజరుకు వారంతా దాస్యం చేయాలనే
ఉద్దేశంతో నేనలా చేస్తున్నాను. వారు అతనికి బాని
సలవుతారు. క్రూరమృగాలను కూడ అదుపులో పెట్టగల
శక్తిని నెబుకద్నెజరుకు ప్రసాదిస్తాను.' "

15అప్పుడు ప్రవక్త యిర్మీయా ప్రవక్త హనన్యా
వద్దకు వచ్చి ఇలా చెప్పాడు, "హనన్యా, వినుము!
యెహోవా నిన్ను పంపలేదు. కాని యూదా ప్రజలు
అబద్ధాలు నమ్మేలా చేశావు. 16అందువల్ల యెహోవా
ఇలా చెపుతున్నాడు,' హనన్యా, త్వరలో నిన్ను ఈ
ప్రపంచం నుండి తీసుకొని వెళతాను. ఈ సంవత్సరమే
నీవు చనిపోతావు. ఎందువల్లనంటే ప్రజలు యెహో
వాకు వ్యతిరేకంగా తిరిగేలా నీవు బోధించావు గనుక."

17హనన్యా అదే సంవత్సరం ఏడవ నెలలో చని
పోయాడు.

## బబులోనులో బందీలుగా ఉన్న యూదులకు లేఖ

29 బబులోనులో బందీలుగా* వున్న యూదు
లకు యిర్మీయా ఒక లేఖ పంపాడు. బబులో
నులో ఉంటున్న పెద్దలకు (నాయకులు), యాజకు
లకు, ప్రవక్తలకు, తదితర ప్రజలకు అతడు దానిని
పంపాడు. వీరంతా నెబుకద్నెజరుచే యెరూషలేము
నుండి బబులోనుకు తీసుకొని రాబడినవారే. 2(రాజైన
యెకోన్యా, రాణియగు అతని తల్లి, యూదా, యెరూష
లేముల అధికారులు, నాయకులు, వడ్రంగులు,
లోహపు పనివారు మొదలైన వారంతా యెరూషలేము
నుండి తీసుకొని పోబడిన పిమ్మట ఈ లేఖ పంప
బడింది) 3బబులోనులోని రాజైన నెబుకద్నెజరు
వద్దకు ఎల్యాశాను, గెమర్యా అనే వారిని యూదా రాజైన
సిద్కియా పంపాడు. ఎల్యాశా అనువాడు షాఫాను
కుమారుడు. యిర్మీయా తన లేఖను బబులోనుకు
తీసుకొని వెళ్లటానికి వారిద్దరికీ ఇచ్చాడు. ఆ లేఖలో
యిలా వ్రాయబడివుంది.

4ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడు
అయిన యెహోవా యెరూషలేము నుండి బబులో
నుకు తాను బందీలుగా పంపిన ప్రజలందరి నుద్దేశించి
ఈ విషయాలు చెపుతున్నాడు. 5"మీరు ఇండ్లు కట్టు
కొని వాటిలో నివసించండి. ఆ రాజ్యంలో స్థిరపడండి.
తోటలను పెంచి, మీరు పండించిన పండ్లను తినండి.

---

**బబులోనులో బందీలు** బబులోనుకు బందీలుగా కొని
పోబడిన యూదా జాతివారు అని యిక్కడ అర్థం.

6వివాహాలు చేసుకొని సంతానవంతులై వర్ధిల్లండి. మీ
కుమారులకు కూడ వధువులను వెదకండి. మీ
కుమార్తెలకు వివాహాది శుభకార్యాలు చేయండి. వారు
కూడ తమ సంతానాన్ని అభివృద్ధి చేసుకొనే నిమిత్తం
మీరలా చేయండి. మీ సంతానాన్ని విస్తరింపజేసి పెంచి
బబులోనులో మీరు బాగా వ్యాపించండి. మీ సంఖ్యా
బలం తగ్గిపోకూడదు. 7నేను మిమ్ములను పంపిన నగరా
నికి మీరంతా మంచి పనులు చేయండి. మీరు నివసి
స్తున్న నగరశ్రేయస్సుకు మీరు ప్రార్థనలు చేయండి.
ఎందువల్లనంటే, ఆ నగరంలో శాంతి నెలకొంటే మీకూ
శాంతి లభిస్తుంది." 8ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వ
శక్తిమంతుడు అయిన యెహోవా చెప్పేదేమనగా "మీ
ప్రవక్తల, మంత్ర విద్యలు చేసే వారి యొక్క మోసంలో
మీరు పడకండి. వారు కనిన కలలను మీరు వినవద్దు.
9వారు అబద్ధాలను బోధిస్తున్నారు. వారు చెప్పే వర్త
మానం నానుండి వచ్చినదేనని అంటున్నారు! కాని
నేను పంపలేదు!" ఇదే యెహోవా వాక్కు.

10యెహోవా ఇంకా ఇలా చెపుతున్నాడు:
"బబులోను డెబ్బయి సంవత్సరాల పాటు బల
మైన రాజ్యంగా ఉంటుంది. ఆ తరువాత బబులో
నులో నివసిస్తున్న మీ వద్దకు వస్తాను. మిమ్మల్ని
తిరిగి యెరూషలేముకు తీసుకొని వస్తానని నేను
మీకిచ్చిన నా మంచి వాగ్దానాన్ని నేను నెర వేర్చు
తాను. 11ఇది నేనెందుకు చెపుతున్నానంటే మీ
అభివృద్ధి కొరకు వేసిన నా ప్రణాళికలన్నీ నాకు
తెలుసు." ఇది యెహోవా నుండి వచ్చిన
సందేశం "మీ సంక్షేమం కొరకు నాకు ఎన్నో
మంచి ఆలోచనలున్నాయి. మీకు కీడు చేయా
లని నేనెన్నడూ ఆలోచించను. మీకు ఆశను,
మంచి భవిష్యత్తును కలుగజేయ టానికి వ్యూహ
రచన చేస్తాను. 12అప్పుడు మీరు నా పేరున
నన్ను పిలుస్తారు. మీరు నాదరి చేరి, నన్ను
ప్రార్థిస్తారు. నేను మీ ప్రార్థన ఆలకిస్తాను. 13మీరు
నా కొరకు అన్వేషిస్తారు. మీరు మీ హృదయ
పూర్వకంగా నా కొరకు వెదకితే, మీరు నన్ను
కనుగొంటారు. 14మీరు నన్ను కనుగొనేలా నేనే
చేస్తాను." ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది. "పైగా నేను మీకు బంధ విముక్తి
కలుగజేసి తిరిగి తీసుకొని వస్తాను. నేనే మిమ్మల్ని
ఈ స్థలం వదిలి పెట్టి పోయేలా వత్తిడి చేశాను.
కాని మిమ్మల్ని ఏ దేశాలకు, ఏ ప్రాంతాలకు
నేను పంపియున్నానో ఆయా ప్రాంతాలనుండి
మిమ్మల్నందరినీ నేను తిరిగి కూడదీస్తాను." ఇదే
యెహోవా వాక్కు "మరియు మిమ్మల్ని ఈ
ప్రదేశానికి తీసుకొని వస్తాను."
15"అయితే యెహోవా మాకు ఇక్కడ బబు
లోనులో ప్రవక్తలనిచ్చియున్నాడు" అని మీరు
చెప్పవచ్చు.
16కాని బబులోనుకు తీసుకొని పోబడకుండా
ఇక్కడే ఉన్న మీ బంధువుల గురించి యెహోవా
ఈ విషయాలు చెపుతున్నాడు. ఇప్పుడు దావీదు
సింహాసనంపై కూర్చున్న రాజును గురించి,
యెరూషలేములో మిగిలి ఉన్న తదితర ప్రజల
విషయమై నే మాట్లాడుతున్నాను. 17సర్వశక్తి
మంతుడైన యెహోవా యిలా చెపుతున్నాడు:
"యెరూషలేములో ఇంకా మిగిలి ఉన్న ప్రజల
పైకి నేను త్వరలో కత్తిని, ఆకలిని, భయంకర
రోగాలను పంపుతాను. తినటానికి పనికి రాకుండా
కుళ్లిపోయిన అంజూరపు పండ్లవలె వారిని
చేస్తాను. 18యెరూషలేములో ఇంకా వున్న వారిని
నేను కత్తితోను, కరువుతోను, రోగాలతోను
వెంటాడతాను. ఈ ప్రజలకు సంభవించే భయం
కర విపత్తులను చూచి ప్రపంచ రాజ్యాలన్నీ
భయభ్రాంతులయ్యేందుకే నేనిది చేయదల
చాను. ఆ ప్రజలు నాశనం చేయబడతారు. వారికి
సంభ వించిన విపత్తును గురించి విన్న ప్రజలంతా
సంభ్ర మాశ్చర్యాలతో నిండిపోతారు. ప్రజలు
తమ శత్రువులకు కీడు తలంచినపుడు వీరికి
జరిగిన రీతిగా జరగాలని కోరుకుంటారు. నేను
వారిని ఎక్కడికి బలవంతంగా పంపితే అక్కడ
వారు అవమానాల పాలవుతారు. 19యెరూష
లేము ప్రజలు నా సందేశాన్ని పెడచెవిని పెట్టారు
గనుక నేనివన్నీ చేయ సంకల్పించాను." ఇదే
యెహోవా వాక్కు. "నా సందేశాన్ని వారికి అనేక
పర్యాయాలు పంపియున్నాను. నా సేవకులైన
ప్రవక్తలను నా సందేశం ఆ ప్రజలకు అంద
జేయటానికి వినియోగించాను. కాని ఆ ప్రజలు
వినలేదు." ఇది యెహోవా వాక్కు. 20"మీరంతా
బందీలు. నేనే మిమ్మల్ని యెరూషలేము వదిలి
బబులోనుకు పోవల సిందిగా బలవంతం చేశాను.
కావున, యెహోవా సందేశం వినండి."
21సర్వశక్తిమంతుడైన యెహోవా కోలాయా
కుమారుడైన అహాబును గురించి, మయశేయా
కుమారుడైన సిద్కియాను గురించి ఇలా చెపు
తున్నాడు: "ఈ ఇద్దరు మనుష్యులు మీకు
అబద్ధాలు బోధిస్తున్నారు. వారు చెప్పే సందేశం
నానుండి వచ్చినదేనని అంటున్నారు. కాని వారు
అబద్ధమాడుతున్నారు. ఆ ఇద్దరు ప్రవక్తలను
బబులోను రాజైన నెబుకద్నెజరుకు అప్పగిస్తాను.
అప్పుడు నెబుకద్నెజరు బబులోనులో బందీ
లుగా వున్న మీ అందరి ముందు ఆ ప్రవక్తలను
చంపుతాడు. 22యూదా జాతి బందీలంతా తమ
శత్రువులకు కీడు తలంచినప్పుడు వీరికి జరిగిన

శాస్తి వంటిది జరగాలని కోరుకుంటారు. అనగా
శాపగ్రస్తులలో వీరొక ఉదాహరణగా మిగిలి
పోతారు. బందీలంతా ఇలా అంటారు: 'సిద్కి
యాకు, అహాబుకు పట్టిన గతినే మీకూ
యెహోవా పట్టించు గాక! బబులోను రాజు
వారిద్దరినీ అగ్నిలో కాల్చివేశాడు!' 23ఆ ప్రవక్త
లిద్దరూ ఇశ్రాయేలు ప్రజలమధ్య బహునీచ
కార్యాలు చేశారు. తమ పొరుగు వారి భార్యలతో
వ్యభిచారం చేశారు. వారు అబద్ధాలు కూడ
చెప్పారు. పైగా వాటిని యెహోవానైన నానుండి
వచ్చిన సందేశంగా చెప్పుకున్నారు. ఈ పను
లన్నీ చేయమని వారికి నేనెప్పుడు చెప్పియుండ
లేదు. వారేమి చేశారో నాకు తెలుసు. వాటికి
నేనే సాక్షిని." ఇది యెహోవా నుండి వచ్చిన
వర్తమానం.

### షెమయాకు దేవుని సందేశం

24షెమయాకు కూడ ఒక సందేశం ఇవ్వు.
షెమయా నెహెలామీయుడు. 25ఇశ్రాయేలు దేవుడు
సర్వశక్తుడుఅయిన యెహోవా ఇలా చెపుతున్నాడు.
"షెమయా, నీవు యెరూషలేములో ఉన్న ప్రజలంద
రికీ, యాజకులందరికీ లేఖలు పంపావు. మయశేయా
కుమారుడు, యాజకుడునయిన జెఫన్యాకు నీవు
లేఖలు పంపావు. లేఖలన్నీ నీవు నీ పేరుమీదనే పంపావు.
అంతేగాని యెహోవా అధికారంతో పంపలేదు.
26షెమయా, నీ లేఖలో జెఫన్యాకు ఇలా చెప్పావు.
'జెఫన్యా, యెహోవా నిన్ను యెహోయాదా
స్థానంలో యాజకునిగా చేశాడు. దేవాలయ నిర్వాహణా
ధికారం నీవు కలిగి ఉంటావు. పిచ్చివానిలా* ప్రవర్తించే
ప్రతి వానినీ లేదా ప్రవక్తలా నటించే ప్రతి వానినీ,
నీవు నిర్బంధించవచ్చు. వానికి నీవు బొండ కొయ్య*
దండన విధించవచ్చు. వాని మెడకు ఇనుప చక్రం*
వేసి దానికి గొలుసులు తగిలించవచ్చు. 27ఇప్పుడు
యిర్మీయా ప్రవక్తలా ప్రవర్తిస్తున్నాడు. కావున నీవతనిని
ఎందువల్ల నిర్బంధించలేదు? 28బబులోనులో వున్న
మనకు యిర్మీయా యిలా వర్తమానం పంపాడు.
ఇశ్రాయేలు నుండి తీసుకురాబడి "బబులోనులో వున్న
ప్రజలారా, మీరక్కడ బహుకాలం వుంటారు. కావున
ఇండ్లు నిర్మించుకొని స్థిరపడండి. తోటలు పెంచి,
మీరు పండించిన పండ్లను తినండి."'"

29ప్రవక్త యిర్మీయాకు ఈ లేఖను యాజకుడైన
జెఫన్యా చదివి వినిపించాడు. 30పిమ్మట యిర్మీయాకు
యెహోవా నుండి వర్తమానం వచ్చింది.
31"యిర్మీయా, ఈ సందేశం బబులోనులో ఉన్న
బందీలందరికి పంపించుము 'నెహెలామీయుడైన షెమ
యాను గురించి యెహోవా ఇలా అంటున్నాడు.
షెమయా మీకు ప్రవచించాడు. కాని నేనతనిని
పంపలేదు. షెమయా ఒక అబద్ధాన్ని మీరు నమ్మేలా
చేశాడు. 32షెమయా అలా చేసిన కారణంగా
యెహోవా యిలా చెప్పుతున్నాడు. నేను త్వరలో
నెహెలామీయుడైన షెమయాను శిక్షిస్తాను. పూర్తిగా
అతని వంశం నాశనం గావిస్తాను. నా ప్రజలకు నేను
చేసే మేలులో అతను పాలుపంచుకోలేడు." ఇదే
యెహోవా వాక్కు "ప్రజలు యెహోవాకు వ్యతిరే
కంగా తిరిగేలా షెమయా బోధించాడు గనుక నేను
షెమయాను శిక్షిస్తాను."

### ఆశాజనకమైన వాగ్దానాలు

30 ఈ వర్తమానం యిర్మీయాకు యెహోవా
నుండి వచ్చింది. 2ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా ఇలా చెప్పాడు: "యిర్మీయా, నేను నీతో
మాట్లాడిన విషయాలన్నీ ఒక పుస్తక రూపంలో
వ్రాయుము. నీవే ఈ పుస్తకాన్ని (పత్రము) రాయాలి.
3ఎందువల్లనంటే, బందీలుగావున్న ఇశ్రాయేలు,
యూదా ప్రజలను నేను తిరిగి తీసుకొనివచ్చే రోజులు
వస్తాయి." ఇది యెహోవా సందేశం: "వారి పూర్వీకు
లకు నేనిచ్చిన దేశంలో వారిని నేను మరల స్థిరపడేలా
చేస్తాను. మళ్లీ నా ప్రజలు ఆ రాజ్యాన్ని స్వంతం
చేసుకుంటారు!" ఇదే యెహోవా వాక్కు.
4యెహోవా సందేశాన్ని ఇశ్రాయేలు, యూదా ప్రజ
లను గూర్చి చెప్పాడు. 5యెహోవా చెప్పినది ఇలా
ఉంది:

"భయంతో ప్రజలు చేసే ఆక్రందన మనం
వింటున్నాం! ప్రజలు భీతావహులయ్యారు!
వారికి శాంతి లేదు!
6 ఈ ప్రశ్న అడిగి, దాన్ని గురించి ఆలోచించుము:
ఎవడైనా ఒక పురుషుడు బిడ్డను కనగలడా?
అసంభవం! అయితే ప్రతి బలవంతుడు పురిటి
నొప్పులతో బాధపడే స్త్రీవలే తన కడుపు పట్టు
కొనటం నేనెందుకు చూస్తున్నాను? ఎందువల్ల
ప్రతివాని ముఖం శవంలా తెల్లనై వెలవెలబో
తుంది? ఎందుకంటే పురుషులు మిక్కిలి భయ
పడి ఉన్నారు!
7 "యాకోబుకు ఇది గొప్ప సంకట సమయం.
ఇది బహు కష్ట కాలం. ఇటువంటి కాలం మరి
ఉండబోదు. అయినా యాకోబు సంరక్షింప
బడతాడు.

---

**పిచ్చివానిలా** షెమయా ఇక్కడ యిర్మీయాను గురించి పరోక్షంగా ప్రస్తావిస్తున్నాడు. చూడండి 27-28 వచనములు.

**బొండ కొయ్య** నిందితుల, నేరస్థుల కాళ్లకు కదలకుండా కొయ్య చెక్కలు బిగించుట.

**ఇనుప చక్రం** మెడకు ఇనుప చక్రం వేసి దానికి గొలుసులు తగిలించుట వంటివి ప్రాచీన కాలంలో దండనో పాయాలు.

[8]"అప్పుడు నేను ఇశ్రాయేలు, యూదా ప్రజల
మెడపై కాడిని విరచి వేస్తాను." ఇది సర్వశక్తిమంతుడైన
యెహోవా నుండి వచ్చిన వర్తమానం: మిమ్మల్ని
బంధించిన తాళ్లను తెంచివేస్తాను. విదేశీయులెవ్వరూ
మరెన్నడు నా ప్రజలను బానిసలుగా చేసుకోవాలని
బలవంతం చేయరు. [9]ఇశ్రాయేలు, యూదా ప్రజలు
విదేశాలలో దాస్యం చేయరు. ఎన్నడూ చేయరు!
వారి దేవుడైన యెహోవానే వారు సేవిస్తారు. వారి
రాజైన దావీదుకు* వారు సేవచేస్తారు. ఆ రాజును
నేను వారివద్దకు పంపుతాను.

10 "కావున నా సేవకుడవైన యాకోబూ, నీవు
భయపడవద్దు!" ఇదే యెహోవా వాక్కు: "ఇశ్రా
యేలూ, భయపడవద్దు! ఆ సుదూర దేశంనుండి
నిన్ను నేను రక్షిస్తాను. ఆ దూర దేశంలో మీరు
బందీలై వున్నారు. మీ సంతతివారిని ఆ భూమి
నుండి తిరిగి తీసుకొస్తాను. యాకోబుకు తిరిగి
శాంతి సమకూరుతుంది. ప్రజలు యాకోబును
బాధ పెట్టరు. నా ప్రజలను భయపెట్టుటకు
ఇక శత్రువులుండరు.
11 ఇశ్రాయేలు, యూదా ప్రజలారా, నేను మీతో
వున్నాను!" ఇదే యెహోవా వాక్కు. "నేను
మిమ్మల్ని రక్షిస్తాను. నేనే మిమ్మల్ని ఆయా
దేశాలకు చెదరగొట్టాను. కాని ఆ రాజ్యాలను
నేను పూర్తిగా నాశనం చేస్తాను. ఇది నిజం. నేనా
దేశాలను నాశనం చేస్తాను. కాని నేను మిమ్మల్ని
మాత్రం నాశనం చేయను. అయితే మీరు చేసిన
దుష్కార్యాలకు మీరు తప్పక శిక్షింపబడాలి. నేను
మిమ్మల్ని బాగా క్రమశిక్షణలోకి తెస్తాను."
12 యెహోవా ఇలా అంటున్నాడు: "ఓ ఇశ్రాయేలు,
యూదా ప్రజలారా, మీకు బాగుకాని గాయం
ఉంది. మీకు తగిలిన దెబ్బ నయం కానిది.
13 మీ పుండ్లను గురించి శ్రద్ధ తీసికొనే వ్యక్తి లేడు.
అందుచేత మీరు స్వస్థపర్చబడరు.
14 మీరనేక దేశాలతో స్నేహం కుదుర్చుకున్నారు.
అయినా ఆ రాజ్యాలు మిమ్మల్ని గురించి పట్టిం
చుకోవు. మీ స్నేహితులనబడేవారు మిమ్మల్ని
మర్చిపోయారు. ఒక శత్రువువలె మిమ్మల్ని
గాయపర్చాను! మిమ్మల్ని చాలా కఠినంగా శిక్షిం
చాను! మీరు చేసిన ఘోరమైన నేరం కారణంగా
నేనలా చేశాను. మీరు చేసిన అనేక పాపాల కార
ణంగా నేనలాచేశాను.
15 ఇశ్రాయేలూ, యూదా! మీ గాయం గురించి
ఎందుకు రోదిస్తున్నారు. మీ గాయం బాధాకర
మైనది. పైగా దానికి చికిత్స లేదు. ఘోరమైన
మీ అపరాధం కారణంగా, యెహోవానైన నేను
మీకవన్నీ కలుగజేశాను. మీరు చేసిన అనేక
పాపాల కారణంగా నేను మీకు ఈ కష్టాలు కలుగ
జేశాను.
16 ఆ రాజ్యాలవారు మిమ్మల్ని నాశనం చేశారు.
కాని ఇప్పుడా రాజ్యాలే నాశనం చేయబడతాయి.
ఇశ్రాయేలూ, యూదా! మీ శత్రువులే బందీల
వుతారు! ఆ ప్రజలు మీ ఆస్తిపాస్తులు పొంది
యున్నారు. కాని ఇతర ప్రజలు వారి ఆస్తిపాస్తులు
దోచుకుంటారు. ఆ ప్రజలు యుద్ధంలో మీ
వస్తువులను తీసుకున్నారు. అలాగే యితరులు
యుద్ధంలో వారి వస్తువులు తీసుకుంటారు.
17 అయినా నేను మీకు మరల ఆరోగ్యం చేకూర్చు
తాను. మీ గాయాలన్నీ మాన్పుతాను." ఇదే
యెహోవా వాక్కు. "ఎందువల్లననగా అన్యులు
మిమ్మల్ని వెలివేసి భ్రష్టులన్నారు. 'సీయోనును
ఎవ్వరూ లెక్కచేయరు' అని వారన్నారు!"
18 యెహోవా ఇలా చెప్పుచున్నాడు: "యాకోబు
సంతానం ఇప్పుడు బందీలైయున్నారు. కాని
వారు తిరిగివస్తారు. యాకోబు నివాసులపై నేను
కనికరం కలిగివుంటాను. నగరమంతా* కూలి
పోయిన భవనాలతో కప్పబడిన కొండలా ఉంది.
కాని నగరం మళ్లీ నిర్మింపబడుతుంది. రాజ
భవనం కూడా దాని యథాస్థానంలో తిరిగి
నిర్మింపబడుతుంది.
19 ఆ ప్రదేశాలలో ప్రజలు స్తుతిగీతాలుఆలపిస్తారు.
ఉల్లాసమైన నవ్వుల కిలకిలలు వినిపిస్తాయి. వారి
సంతానం అభివృద్ధి అయ్యేలా చేస్తాను. ఇశ్రా
యేలు, యూదా అల్ప రాజ్యాలుగా ఉండవు.
వాటికి కీర్తిప్రతిష్ఠలు కలుగజేస్తాను. ఎవ్వరూ
వారిని చిన్నచూపు చూడరు.
20 "యాకోబు వంశం తన పూర్వ వైభవాన్ని సంత
రించుకుంటుంది. ఇశ్రాయేలు, యూదా ప్రజ
లను నేను శక్తివంతులుగా చేస్తాను. అంతేగాదు;
వారిని హింసించేవారిని నేను శిక్షిస్తాను.
21 వారి స్వజనులలో ఒకడు వారికి నాయకత్వం
వహిస్తాడు. ఆ పాలకుడు నా ప్రజలలోనుండే
వస్తాడు. నేను పిలిస్తేనే ప్రజలు నావద్దకు
రాగలరు. అందుచేత ఆ నాయకుని నావద్దకు
పిలుస్తాను. అతడు నాకు సన్నిహితుడవుతాడు.
22 మీరు నా ప్రజలై ఉంటారు. నేను మీ దేవుడనై
ఉంటాను.
23 "యెహోవా మిక్కిలి కోపంగా ఉన్నాడు! ఆయన

**రాజైన దావీదు** ఈ దావీదు మరో ఇశ్రాయేలు రాజు. ఇతను కూడ దావీదు రాజులా ఖ్యాతి చెందిన వాడు.

**నగరము** నగరమనగా యెరూషలేము కావచ్చును. కాని ఇశ్రాయేలు యూదాలోని నగరాలన్నీ అని కూడా అర్థం కావచ్చు.

ప్రజలను శిక్షించినాడు. ఆ శిక్ష తుఫానులా వచ్చి
పడింది. ఆ శిక్ష దుష్టులపైకి పెనుతుఫానులా
వచ్చి పడింది.
24 తన పథకం ప్రకారం అన్నీ జరిగేవరకు
యెహోవా కోపోద్రిక్తుడై ఉంటాడు. ఆ రోజు
సంభవించినప్పుడు (అంత్య దినాల్లో) మీరు
అర్థం చేసుకుంటారు."

### కొత్త ఇశ్రాయేలు

31 "ఆ సమయంలో ఇశ్రాయేలు వంశస్థులందరికి
నేను దేవుడనై యుందును. వారు నా
ప్రజలై యుందురు" ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది.

2 యెహోవా ఇలా చెపుతున్నాడు: "శత్రువు
యొక్క కత్తికి గురికాకుండా కొంతమంది మిగిలి
పోతారు. వారికి ఎడారిలో ఆదరణ లభిస్తుంది.
ఇశ్రాయేలు విశ్రాంతికొరకు అన్వేషిస్తూ అక్కడికి
వెళ్తుంది." "యెహోవా తన ప్రజలకు దూరము
నుండి దర్శనమిస్తాడు.
3 ఆయన ఇలా అన్నాడు: "ప్రజలారా మిమ్మల్ని
నేను శాశ్వతమైన ప్రేమతో ప్రేమిస్తున్నాను.
అందుకే నా కృప శాశ్వతంగా మీ పట్ల చూపిస్తూ
వచ్చాను. నేను మీ పట్ల సదా సత్యంగా ఉంటాను.
4 ఓ నా ఇశ్రాయేలు కన్యకా, నిన్ను నేను పునర్ని
ర్మిస్తాను. నీవు మరల ఒక దేశంలా అవుతావు.
నీవు మరలా తంబుర మీటుతావు. వేడుక చేసికొనే
ప్రజలందరితో కలిసి నీవు నాట్యం చేస్తావు.
5 ఇశ్రాయేలు రైతులారా, మీరు మళ్లీ పంటలు
పండిస్తూ, ద్రాక్షాతోటలు పెంచుతారు. సమరయ
నగర పరిసరాల్లో వున్న కొండలనిండా మీరు
ద్రాక్ష తోటలు పెంచుతారు. ఆ ద్రాక్షా తోటల
ఫల సాయాన్ని రైతులంతా అనుభవిస్తారు.
6 కావలి వారు ఈ వర్తమానాన్ని చాటే సమయం
వస్తుంది: 'రండి మనమంతా సీయోనుకు వెళ్లి
మన దేవుడైన యెహోవాను ఆరాధించుదాము!'
కొండల ప్రాంతమైన ఎఫ్రాయిములో కూడ
కావలివారు ఆ వర్తమానాన్ని చాటి చెప్పుతారు!"
7 యెహోవా ఇలా చెప్పుచున్నాడు: "సంతోషంగా
ఉండండి. యాకోబు కొరకు పాటలు పాడండి!
రాజ్యాలలో కెల్ల మేటియైన ఇశ్రాయేలు విష
యంలో ఎలుగెత్తి చాటండి. మీ స్తుతి గీతాలు
పాడండి! ఇలా చాటి చెప్పండి: 'యెహోవా
తన ప్రజలను కాపాడినాడు!* ఇశ్రాయేలు
దేశంలో జీవంతో మిగిలిన వారిని యెహోవా
రక్షించినాడు!'
8 ఉత్తరాన గల దేశం నుండి ఇశ్రాయేలీయులను
తీసికొని వస్తానని తెలిసికొనండి. భూమి మీద
వివిధ దూర దేశాలలో చెదరియున్న ఇశ్రాయే
లును నేను తిరిగి కూడదీస్తాను. వారిలో చాలా
మంది గుడ్డి వారు, కుంటి వారు అయ్యారు.
కొందరు స్త్రీలు నిండు గర్భిణీలై కనటానికి
సిద్ధంగా ఉన్నారు. ఎంతో మంది ప్రజలు తిరిగి
వస్తారు.
9 వారు తిరిగి వచ్చే సమయంలో ఎంతగానో
దుఃఖిస్తారు. కాని నేను వారికి మార్గదర్శినై, వారిని
ఓదార్చుతాను. నేను వారిని ప్రవహించే సెలయేళ్ల
పక్కగా నడిపించుతాను. వారు తూలిపోకుండా
తిన్ననైన బాటపై వారిని నడిపిస్తాను. నేనా
విధంగా వారికి దారి చూపుతాను. కారణమేమంటే
నేను ఇశ్రాయేలుకు తండ్రిని మరియు ఎఫ్రా
యిము నా ప్రథమ పుత్రుడు.

10 "ఓ రాజ్యములారా (ప్రజలారా), యెహోవా
యొక్క ఈ వర్తమానం వినండి! ఈ సందేశాన్ని
దూర సముద్రతీర వాసులందరికి తెలియ
జెప్పండి. 'ఇశ్రాయేలు ప్రజలను చెల్లా చెదరు
చేసిన ఆ సర్వోన్నతుడే తిరిగి వారందరినీ ఒక్క
చోటికి కూడదీస్తాడు. గొర్రెల కాపరిలా తన
మందను (ప్రజలను) కాచి రక్షిస్తాడు.'
11 యెహోవా యాకోబును తిరిగి తీసికొని వస్తాడు.
యెహోవా తన ప్రజలను వారి కంటె బల
వంతుల బారి నుండి రక్షిస్తాడు.'
12 ఇశ్రాయేలు ప్రజలు సీయోను కొండ పైకి
వస్తారు. వారు ఆనందంతో కేకలు వేస్తారు.
యెహోవా వారికి చేసిన అనేక సదుపాయాల
కారణంగా వారి ముఖాలు ఆనందంతో వెలిగి
పోతాయి. యెహోవా వారికి ఆహార ధాన్యాలను,
కొత్త ద్రాక్షారసాన్ని, నూనెను, గొర్రె పిల్లలను,
ఆవులను ఇస్తాడు. నీరు పుష్కలంగా లభించే
ఒక తోటలా వారు విలసిల్లుతారు. ఇశ్రాయేలు
ప్రజలు ఇక మీదట ఎంత మాత్రము ఇబ్బంది
పెట్టబడరు.
13 ఇశ్రాయేలు యువతులంతా సంతోషంతో
నాట్యం చేస్తారు. యువకులు, వృద్ధులు
నాట్యంలో పాల్గొంటారు. వారి విచారాన్ని సంతో
షంగా మార్చుతాను. ఇశ్రాయేలు ప్రజలను
ఓదార్చుతాను! వారి దుఃఖాన్ని ఆనందంగా
మార్చుతాను!
14 యాజకులకు సమృద్ధిగా ఆహారం దొరుకు
తుంది. నేనిచ్చే పారితోషికాలతో నా ప్రజలు

---

**యెహోవా ... కాపాడినాడు** యెహోవా నీ ప్రజలను
కాపాడుము అని పాఠాంతరం.

నిండిపోయి తృప్తి చెందుతారు!" ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చినది!
15 యెహోవా ఇలా సెలవిస్తున్నాడు: "రామాలో
రోదన వినవచ్చింది. అది ఒక తీవ్రమైన రోదన;
గొప్ప విషాదం. రాహేలు* తన పిల్లలు హతులైన
కారణంగా ఆమె ఓదార్పు పొందుటకు
నిరాకరిస్తుంది."
16 కాని యెహోవా ఇలా అంటున్నాడు: "విల
పించుట ఆపి వేయుము. నీవు కంటి తడి
పెట్టవద్దు! నీ పనికి తగిన ప్రతిఫలం నీకు
దక్కుతుంది!" ఇది యెహోవా సందేశం. "ఇశ్రా
యేలు ప్రజలు తమ శత్రు రాజ్యం నుండి తిరిగి
వస్తారు.
17 కావున, ఇశ్రాయేలూ, మంచి భవిష్యత్తుకు నీవు
ఆశతో ఎదురు చూడుము." ఇది యెహోవా
వాక్కు. "నీ పిల్లలు వారి రాజ్యానికి తిరిగి వస్తారు.
18 ఎఫ్రాయిము విలపిస్తున్నట్లు నేను విన్నాను.
ఎఫ్రాయిము ఇలా అంటూవుండగా నేను
విన్నాను: 'యెహోవా, నీవు నిజంగా నన్ను
శిక్షించావు! నేను మంచి గుణపాఠం నేర్చు
కున్నాను. నేనిక ఎన్నడూ తర్భీతు పొందని
కోడెదూడలా ఉన్నాను. దయచేసి నన్ను శిక్షిం
చటం మానివేయుము. నేను తిరిగి నీ యొద్దకు
వస్తాను. నీవే నిజమైన నా యెహోవా దేవుడవు.
19 యెహోవా, నేను నీకు దూరమయ్యాను. కాని
నేను చేసిన దుష్కార్యాలను నేను గుర్తించాను.
కావున నేను నా జీవన విధానాన్ని మార్చుకొని,
హృదయ పరివర్తన కలిగియున్నాను. నా చిన్న
తనంలో నేను చేసిన మూర్ఖపు పనులకు సిగ్గుపడి
కలవరపడి యున్నాను.'"
20 దేవుడు ఇలా చెప్పు చున్నాడు: "ఎఫ్రాయిము
నా ముద్దు బిడ్డ అని మీకు తెలుసు. ఆ బిడ్డను
నేను ప్రేమిస్తున్నాను. అవును, నేను ఎఫ్రాయి
ముకు వ్యతిరేకంగా తరచు మాట్లాడియున్నాను.
అయినా నేను అతనిని జ్ఞాపకం చేసికుంటూ
ఉంటాను. నేనతన్ని గాఢంగా ప్రేమిస్తున్నాను.
నేను నిజంగా అతన్ని ఓదార్చ గోరుతున్నాను."
ఇది యెహోవా సందేశం.
21 "ఇశ్రాయేలు ప్రజలారా, రహదారి గుర్తులను నెల
కొల్పండి. ఇంటి మార్గాన్ని సూచించే గుర్తులను
నిలబెట్టండి. మార్గాన్ని కనిపెట్టుకొని ఉండండి.
మీరు పయనించే దారిని శ్రద్ధగా పరిశీలిస్తూ
ఉండండి. ఇశ్రాయేలూ, నా కన్యకా, ఇంటికి
రమ్ము! నీ నగరాలకు తిరిగిరా.
22 నీవు విశ్వాసం లేని కుమార్తెవై ఉన్నావు. కాని
ఇంకెంత కాలం అక్కడిక్కడ తిరుగుతావు.
ఎప్పుడు ఇంటికి వస్తావు ? నీ దేశంలో ఒక
నూతనమైన దానిని యెహోవా సృష్టించి
నప్పుడు ఒక స్త్రీ తన పురుషుని ఆవరిస్తుంది."*

23 ఇశ్రాయేలు దేవుడు సర్వశక్తిమంతుడు అయిన
యెహోవా ఇలా అంటున్నాడు: "యూదా ప్రజలకు
నేను మళ్లీ మంచి పనులు చేస్తాను. వారిని తిరిగి నేను
నిర్బంధము నుండి తీసికొస్తాను. ఆ సమయంలో
యూదా రాజ్యంలో దాని నగరాల్లోని ప్రజలు మళ్లీ
ఇలా అంటారు: 'ఓ నీతిగల నివాసమా, ఓ పవిత్ర
పర్వతమా, యెహోవా నిన్ను దీవించు గాక!'*
24 "యూదా పట్టణాలలోని ప్రజలంతా శాంతి
యుత సహజీవనం చేస్తారు. రైతులు, స్థిరంగా లేకుండా
తిరిగే పశువుల కాపరులు, అంతా యూదాలో ప్రశాం
తంగా కలిసి జీవిస్తారు. 25 బలహీనులకు, అలసిపోయిన
ప్రజలకు నేను విశ్రాంతిని, బలాన్ని ఇస్తాను. దుఃఖిస్తున్న
వారి కోరికను తీరుస్తాను."
26 అది విన్న తరువాత నేను (యిర్మీయా)
మేల్కొని చూట్టూ చూశాను. అదెంతో హాయిని
గూర్చిన నిద్ర.
27 "ఇశ్రాయేలు వంశీయులు, యూదా వంశీయులు
అభివృద్ధి చెందేలా నేను సహాయపడే రోజులు వస్తు
న్నాయి." ఇది యెహోవా వాక్కు. "వారి సంతానం,
వారి పశుసంపద వర్ధిల్లేలా కూడా నేను సహాయ
పడతాను. నేను చేసే ఆ పని ఒక మొక్కను నాటి
దానిని పెంచినట్లుగా ఉంటుంది. 28 గతంలో ఇశ్రా
యేలు, యూదావారు చేసే కార్యకలాపాలపై నేను
నిఘా వేసి ఉన్నాను. వారిని మందలించే సమయం
కోసం నేను వేచి ఉన్నాను. సమయం వచ్చింది;
వారిని చీల్చి చెండాడాను. వారికి అనేక కష్ట నష్టాలు
కలుగ జేశాను. కాని ఇప్పుడు వారిని పైకి తీసికొని
రావటానికి, వారిని బలపర్చటానికి నేను వారిని
గమనిస్తూ ఉన్నాను." ఇది యెహోవా నుండి వచ్చిన
వర్తమానం.
29 "ఆ సమయంలో ప్రజలు ఈ సామెత చెప్పరు:

తండ్రులు పుల్లని ద్రాక్ష తిన్నారు, కాని పిల్లల పళ్లు
పులిశాయి.*

**రాహేలు** ఈమె యాకోబు భార్య, కాని బబులోనుతో యుద్ధంలో చనిపోయిన తమ భర్తల, కుమారుల కొరకు విలపించే స్త్రీలందరు అని పాఠాంతరం.

**ఒక ... ఆవరిస్తుంది** వాక్యం సులభ గ్రాహ్యం కాదు. యిర్మీయా కాలంలో వాడుకలో వున్న ఒక సామెతలో ఈ వాక్యం భాగం కావచ్చు.

**ఓ నీతిగల ... దీవించు గాక** సీయోను పర్వతానికి, దానిమీద నిర్మించిన దేవాలయానికి ఇది ఒక ఆశీర్వచనం.

**తండ్రులు ... పులిశాయి** తల్లిదండ్రులు చేసిన నేరానికి పిల్లలు శిక్ష అనుభవిస్తున్నారని దీని అర్థం.

30కాని ప్రతివాడు తన పాపాల కారణంగా చని
పోతాడు. పుల్లని ద్రాక్షా తిన్న వాని పండ్లే పులుస్తాయి."

### కొత్త ఒడంబడిక

31"ఇశ్రాయేలు వంశంతోను, యూదా వంశంతోను
నేనొక కొత్త ఒడంబడికను కుదుర్చుకునే సమయం
ఆసన్న మవుతూ ఉంది. 32ఇది నేను వారి పూర్వీకు
లతో చేసికొన్న ఒడంబడిక వంటిది గాదు. వారిని నా
చేతితో ఈజిప్టు నుండి నడిపించి తీసికొని వచ్చి
నప్పుడు మేమా ఒడంబడిక చేసికొన్నాము. నేను
వారి యెహోవాను, కాని వారే ఆ ఒడంబడికను
ఉల్లంఘించారు." ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది.

33"భవిష్యత్తులో నేను ఇశ్రాయేలుతో ఈ రకమైన
ఒడంబడిక చేసికుంటాను." ఇదే యెహోవా వాక్కు.
"నా బోధనలన్నీ వారి మనస్సులో నాటింప చేస్తాను.
పైగా వాటిని వారి హృదయాల మీద రాస్తాను. నేను
వారి దేవుణ్ణి, వారు నా ప్రజలై ఉందురు. 34యెహో
వాను గురించి తెలిసికొనేందుకు ప్రజలు వారి పొరుగు
వారికి, బంధువులకు బోధించనక్కర లేదు. ఎందువల్ల
నంటే అన్ని తరగతుల ప్రజలు తమతమ భేదం
లేకుండా నన్ను తెలిసికుంటారు." ఇదే యెహోవా
వాక్కు– "వారు చేసిన చెడ్డ పనులన్నిటినీ నేను క్షమి
స్తాను. వారి పాపాలను నేను గుర్తు పెట్టుకోనను."

### యెహోవా ఇశ్రాయేలును విడవక పోవటం

35 యెహోవా ఇలా చెప్పుచున్నాడు: "సూర్యుడు
పగలు ప్రకాశించేలా యెహోవా చేశాడు.
చంద్రుడు, నక్షత్రాలు రాత్రి పూట కాంతిని వెద
జల్లేలా యెహోవా చేశాడు. సముద్రాలను
ఘోషింపజేసి అలలు తీరాన్ని ముంచెత్తేలా
చేసిందీ యెహోవాయే. ఆయన పేరే సర్వశక్తి
మంతుడగు యెహోవా."

36 యెహోవా ఈ విషయాలు చెప్పుతున్నాడు:
"ఇశ్రాయేలు సంతతి ఒక రాజ్యంగా జాతిగా
ఉండుట ఎప్పుడూ మానరు. సూర్య చంద్ర
నక్షత్ర సముద్రాలపై నా అదుపు తప్పిన నాడు
మాత్రమే వారు రాజ్యంగా జాతిగా ఉండలేరు."

37 యెహోవా ఇలా చెప్పుతున్నాడు: "ఇశ్రాయేలు
సంతతిని నేనెన్నడు తిరస్కరించను. ప్రజలు
ఆకాశాన్ని కొలవగలిగిననాడు, వారు భూమి
యొక్క సర్వ రహస్యాలను తెలిసికోగలిగిననాడు!
నేను ఇశ్రాయేలీయుల సంతతి వారిని తిరస్క
రిస్తాను. అప్పుడు మాత్రం వారు చేసిన అకృ
త్యాల కారణంగా నేను వారిని తిరస్కరిస్తాను."
ఇది యెహోవా నుండి వచ్చిన వర్తమానం.

### కొత్త యెరూషలేము

38"యెహోవా నిమిత్తం యెరూషలేము నగరం
తిరిగి నిర్మింపబడే రోజులు వస్తున్నాయి. ఇదే
యెహోవా వాక్కు. హనన్యేలు బురుజు నుండి మూల
ద్వారం వరకు మొత్తం నగరమంతా తిరిగి కట్టబడు
తుంది. 39భూమి కొలత గీత గొలుసు మూల ద్వారం
నుండి గారెబు కొండ వరకును, అక్కడ నుండి గోయా
అను ప్రదేశం వరకు పరచబడుతుంది. 40శవాలను,
బూడిదను పడవేసిన లోయ అంతా యెహోవాకు
పవిత్రమైనదిగా ఉంటుంది. తూర్పున వున్న కిద్రోను
లోయకు ఎగువనున్న భూములన్ని గుర్రాల ద్వారం
వరకు అన్నీ కలపబడుతాయి. యెరూషలేము నగరం
మరెన్నడు విచ్ఛిన్నం చేయబడదు. నాశనం చేయ
బడదు."

### యిర్మీయా భూమిని కొనుట

32 యూదా రాజైన సిద్కియా పాలనలో పదవ
సంవత్సరం* గడుస్తు ఉండగా యెహోవా
నుండి ఈ వర్తమానం యిర్మీయాకు వచ్చింది.
సిద్కియా పాలన పదవ సంవత్సరం జరుగుతూ ఉండగా
నెబుకద్నెజరు పాలన పదునెనిమిదవ సంవత్సరంలో
ఇది జరిగింది. 2ఆ సమయంలో బబులోను రాజు
సైన్యం యెరూషలేమును ముట్టడిస్తూ వచ్చింది.
(3యూదా రాజైన సిద్కియా యిర్మీయాను ఆ
ప్రదేశంలో ఖైదు చేశాడు. యిర్మీయా, చెప్పిన భవిష్య
వాణి సిద్కియాకు నచ్చలేదు. యిర్మీయా ఇలా
చెప్పాడు: "యెహోవా ఇలా అన్నాడు, 'యెరూషలేము
నగరాన్ని నేను త్వరలో బబులోను రాజుకు ఇవ్వబో
తున్నాను. నెబుకద్నెజరు ఈ నగరాన్ని స్వాధీనపర్చు
కుంటాడు. 4కల్దీయుల సైనికుల నుండి యూదా
రాజైన సిద్కియా తప్పించుకోలేడు. అతడు నిశ్చ
యంగా బబులోను రాజుకు అప్పగించబడతాడు.
సిద్కియా బబులోను రాజుతో ఎదురుపడి ముఖా
ముఖిగా మాట్లాడుతాడు. సిద్కియా స్వయంగా అతనిని
తన కన్నులతో చూస్తాడు. 5బబులోను రాజు సిద్కి
యాను బబులోనుకు తీసికొని పోతాడు. సిద్కియాను
నేను శిక్షించేవరకు అతనక్కడ ఉంటాడు.' ఇదే
యెహోవా వాక్కు. 'నీవు కల్దీయుల సైన్యంతో
పోరాడినా నీవు గెలవలేవు.'")

6యిర్మీయా బందీగా వుండగా అతనిలా చెప్పాడు,
"యెహోవా సందేశం నాకు అందినది. ఆ సందేశం
ఇలా ఉంది: 7నీ పినతండ్రి కుమారుడైన హనమేలు
త్వరలో నీ వద్దకు వస్తాడు. అతడు నీ తండ్రి సోదరుడైన

---

**యూదా ... పదవ సంవత్సరం** ఇది క్రీ.పూ. 588-587వ
సంవత్సరంలోనే నెబుకద్నెజరు యెరూషలేమును నాశనం
చేశాడు.

షల్లూము కుమారుడు. హనమేలు నీ వద్దకు వచ్చి,
'అనాతోతు వద్ద నున్న తన పొలం కొనమని నిన్ను
అడుగుతాడు. నీవు అతని దగ్గరి బంధువు గనుక తన
పొలం కొనమని అడుగుతాడు. ఆ పొలాన్ని కొనటానికి
నీకు హక్కు ఉన్నది. అది నీ బాధ్యత అయి కూడ
ఉంది' అని అంటాడు.
[8]"తరువాత యెహోవా చెప్పినట్లే జరిగింది. నా
పినతండ్రి కుమారుడైన హనమేలు రక్షక భటుని
ఆవరణలోనున్న నా యొద్దకు వచ్చాడు. హనమేలు
నాతో ఇలా అన్నాడు, 'యిర్మీయా, అనాతోతు
పట్టణం వద్ద నున్న నా పొలాన్ని కొను. ఆ పొలం
బెన్యామీను వంశం వారి రాజ్యంలో వుంది. నీవా పొలం
కొనుగోలు చేయి. ఎందుకంటే అది నీవు కొని స్వంతం
చేసికొనే హక్కు నీకుంది.'" అయితే ఇది యెహోవా
నుండి వర్తమానం అని నాకు అర్థమయ్యింది.
[9]అనాతోతు వద్ద వున్న పొలాన్ని నా పినతండ్రి
కుమారుడైన హనమేలు నుండి కొన్నాను. దాని వెలగా
పదునేడు తులాల వెండిని తూచి ఇచ్చినాను. [10]క్రయ
దస్తావేజు మీద సంతకం చేశాను. దాని ప్రతినొక దానిని
తీసికొని ముద్ర వేయించాను. ఇందుకు సాక్షులను
కూడా నియమించాను. వారి ఎదుట వెండిని
తూచాను. [11]మడత పెట్టి ముద్ర వేసిన దస్తావేజును,
ముద్ర వేయించి దాని ప్రతిని నేను తీసికున్నాను.
[12]తరువాత వాటిని నేను బారూకునకు ఇచ్చినాను.
బారూకు అనేవాడు నేరీయా కుమారుడు. నేరీయా
అనేవాడు మహసేయా అను వాని కుమారుడు.
ముద్రవేసి మూసిన క్రయ దస్తావేజులో నేను పొలం
ఖరీదు చేసిన నియమ నిబంధనావళి ఉంది. నా
పినతండ్రి కుమారుడైన హనమేలు, మరియు ఇతర
సాక్షుల యెదుట నేనా దస్తావేజులను బారూనకు
ఇచ్చాను. ఆ సాక్షులు కూడా దస్తావేజుల మీద సంత
కాలు చేశారు. ఆ ఆవరణలో కూర్చుని వున్న అనేక
మంది యూదా ప్రజలు కూడా నేను బారుకునకు
దస్తావేజులను అప్పగించటం చూశారు.
[13]ఆ ప్రజలంతా చూస్తూ ఉండగా, నేను
బారూకుతో ఇలా చెప్పాను: [14]"సర్వశక్తిమంతుడు, ఇశ్రా
యేలు దేవుడు అయిన యెహోవా చెప్పుచున్నాడు:
'ముద్రవేసిన, ముద్రవేయని దస్తావేజుల రెంటినీ నీవు
తీసికొని ఒక మట్టి కుండలో భద్రం చేయుము. ఆ
దస్తావేజులు ఎక్కువ కాలం సురక్షితంగా ఉండేలాగున
నీవు ఆ విధంగానే చేయుము.' [15]ఇశ్రాయేలు దేవుడు,
సర్వశక్తిమంతుడునగు యెహోవా ఇలా అంటున్నాడు:
'భవిష్యత్తులో నా ప్రజలు తిరిగి ఇండ్లను, పొలాలను,
ద్రాక్షతోటలను ఇశ్రాయేలులో కొనుగోలు చేస్తారు.'"
[16]నేరీయా కుమారుడైన బారూకునకు దస్తావే
జులను ఇచ్చిన పిమ్మట నేను దేవుని ప్రార్థించాను.
నేనిలా అన్నాను:

[17]"యెహోవా నా దేవా, చాపబడిన నీ బల
ప్రభావాలచే నీవీ భూమ్యాకాశాలను సృష్టించావు.
తిరుగులేని నీ మహిమచే వాటిని నీవు సృష్టించినావు.
నీవు చేసే పనులలో నీకు ఆశ్చర్యకరమైనది, అసాధ్య
మైనది ఏదియు లేదు. [18]యెహోవా, నీవు వేలాది
ప్రజలకు దయా మయుడవు, నమ్మకస్తుడవు అయి
వున్నావు. కాని పెద్దల తప్పులకు వారి పిల్లలను కూడా
శిక్షింపగలవాడవు. మహోన్నతుడవు, శక్తి సంప
న్నుడవు, సర్వశక్తిమంతుడైన యెహోవా అని నీకు
పేరు. [19]దేవా, నీవు యోచించి ఘనమైన కార్యాలు
సాధిస్తావు. ప్రజలు చేసే ప్రతీ పనినీ నీవు చూస్తావు.
మంచి పనులు చేసేవారికి ప్రతిఫలాలిస్తావు. చెడు
కార్యాలు చేసే వారికి తగిన శిక్ష విధిస్తావు. [20]యెహోవా,
ఈజిప్టు రాజ్యంలో నీవు అమోఘమైన అద్భుతాలు
జరిపించినావు. ఈనాటి వరకు నీవు నీ శక్తివంతమైన
కార్యాలు జరిపిస్తూనే ఉన్నావు. ఆ పనులు నీవు ఇశ్రాయే
లులో మాత్రమే గాక, నీ ప్రజలు ఎక్కడ వుంటే
అక్కడ నీవా అద్భుత కార్యాలు చేశావు. వీటి కారణంగా
నీవు మిక్కిలి ఘనత వహించినావు. [21]యెహోవా,
నీవు ఎన్నో మహాశక్తిగల అద్భుతాలు జరిపించి, ఇశ్రా
యేలు ప్రజలను ఈజిప్టునుండి బయటికి తీసికొని
వచ్చావు. నీ శక్తివంతమైన హస్తాన్ని వినియోగించి నీవీ
పనులు చేశావు! నీ శక్తి ఆశ్చర్యాన్ని కలుగ జేస్తూ
ఉంది!
[22]"యెహోవా, నీవీ దేశాన్ని ఇశ్రాయేలు ప్రజల
కిచ్చావు. ఈ దేశాన్ని ఇస్తానని వారి పితరులకు నీవు
ఏనాడో వాగ్దానం చేశావు. ఈ దేశం మిక్కిలి చాలా
మంచిది. ఇది ఎన్నో మంచి వస్తువులతో నిండివున్నది.
[23]ఇశ్రాయేలీయులు ఈ దేశంలోనికి వచ్చి దీనిని వారు
స్వంతం చేసికున్నారు. కాని ఆ ప్రజలే నీకు విధేయులు
కాకుండా పోయారు. వారు నీ బోధనలను అనుసరించ
లేదు. నీవు ఆజ్ఞాపించినట్లు వారు నడుచుకోలేదు.
అందువల్లనే ఇశ్రాయేలు ప్రజలకు ఈ భయంకర
మైనవన్నీ జరిగేటట్టు నీవు చేశావు.
[24]"మరియు ఇప్పుడు శత్రువులు నగరాన్ని చుట్టు
ముట్టారు. యెరూషలేము నగర ప్రాకారం చుట్టూ
దిమ్మలు, మెట్లు నిర్మిస్తున్నారు. తద్వారా వారు నగరపు
గోడను సులభంగా ఎక్కి నగరాన్ని పట్టుకోవాలని
చూస్తున్నారు. శత్రువుల కత్తుల మూలంగా కరువులు,
రోగాలు మొదలైన ఈతి బాధల కారణంగా, కల్దీయుల
సైన్యం యెరూషలేము నగరాన్ని ఓడిస్తుంది. ఇప్పుడు
బబులోను సైన్యం నగరాన్ని ఎదుర్కొంటూ వుంది!
యెహోవా, ఇది జరుగుతుందని నీవు చెప్పావు. పైగా
అది నీవు చూస్తూ వుండగానే జరుగుతూ ఉంది.
[25]"నా యెహోవా ప్రభువా, ఆపద ముంచుకు
వస్తున్నది. కాని, నీవు నాతో, 'యిర్మీయా, వెండి
నిచ్చి పొలం కొనమనీ, ఆ కొనుగోలుకు సాక్షులను

నియమించు!"మనీ చెపుతున్నావు. కల్దీయుల సైన్యం నగరాన్ని కైవసం చేసికోడానికి సిద్ధంగా ఉన్న సమయంలో నీవు నాకీ విషయం చెపుతున్నావు. నా ధనం అలా ఎందుకు వృధా చేయాలి?"

26అప్పుడు యెహోవా నుండి ఈ వర్తమానం యిర్మీయాకు వచ్చింది: 27"యిర్మీయా, నేనే యెహోవాను, ఈ భూమి మీద ప్రతి వానికి నేనే దైవాన్ని. యిర్మీయా, నాకు అసాధ్యమైనదేదీ లేదని నీకు తెలుసు." 28యెహోవా ఇంకా ఇలా అన్నాడు: "యెరూషలేము నగరాన్ని నేను అతి త్వరలో కల్దీయుల సైన్యానికి, బబులోను రాజైన నెబుకద్నెజరుకు అప్పగిస్తాను. ఆ సైన్యం నగరాన్ని పట్టుకుంటుంది. 29కల్దీయుల సైన్యం ఇప్పటికే యెరూషలేము నగరాన్ని ఎదుర్కొంటూ వుంది. వారు త్వరలో నగరం ప్రవేశించి నిప్పు పెడతారు. వారీ నగరాన్ని తగులబెడతారు. బూటకపు దేవతైన బయలుకు ప్రజలు ఇండ్ల పైకప్పులపై బలులు అర్పించారు. అలా నాకు కోపం తెప్పించిన కొన్ని ఇండ్లు ఈ నగరంలో వున్నాయి. విగ్రహాలకు మద్యం సమర్పించి పూజించిన వారు కూడ ఉన్నారు. ఆ నివాసములన్నిటినీ కల్దీయుల సైన్యం తగుల బెడుతుంది. 30ఇశ్రాయేలు ప్రజలను, యూదా ప్రజలను నేను గమనిస్తూ వున్నాను. వారు చేసే ప్రతీదీ దుష్టకరమైనది! వారి చిన్నతనం నుండి వారు చెడు కార్యాలకు పాల్పడ్డారు. ఇశ్రాయేలీయులు నాకు మిక్కిలి కోపం తెప్పించారు. చేతులతో చేసిన విగ్రహాలను పూజించి ఇశ్రాయేలీయులు నాకు మిక్కిలి కోపం కలుగజేశారు!" ఇది యెహోవా వాక్కు. 31"యెరూషలేము కట్టబడినప్పటి నుండి ఇప్పటి వరకు ఆ నగర ప్రజలు నాకు కోపం కల్గిస్తూనే ఉన్నారు. ఈ నగరం నాకెంతో కోపం తెప్పించింది. కావున నేను దానిని నా దృష్టి పథం నుండి తొలగిస్తాను.

32ఇశ్రాయేలు, యూదా ప్రజలు చేసిన చెడు కార్యాల కారణంగా నేను యెరూషలేము నగరాన్ని నాశనం చేస్తాను. ప్రజలు, రాజులు, నాయకులు, వారి యాజకులు, ప్రవక్తలు, యూదా ప్రజలు, యెరూషలేము నగర వాసులు అందరూ నాకు కోపం కలుగజేశారు.

33"ఆ ప్రజలు సహాయం కొరకు నన్ను చేరవలసింది. కాని వారు నాకు విముఖులైనారు. వారికి నేను పదే పదే బుద్ధి చెప్ప చూశాను. కాని వారు నా మాట వినిపించుకోలేదు. నేను వారిని సరిజేయ చూశాను. అయినా వారు పట్టించుకోలేదు. 34వారు విగ్రహాలను చేస్తూనే వచ్చారు. నేనా విగ్రహాలను ఏవగించుకున్నాను. పైగా నా పేరు మీద పిలవబడే ఆలయంలో వారా విగ్రహాలను ప్రతిష్ఠించారు. ఈ విధంగా వారు నా మందిరాన్ని 'అపవిత్రం' చేశారు.

35 "బెన్ హిన్నోము* లోయలో వారు బూటకపు దేవత బయలుకు ఉన్నత పూజా స్థలాలు ఏర్పాటు చేశారు. వారా పూజా స్థలాలలో తమ కుమారులను, కుమార్తెలను శిశు బలులుగా మొలెకుకు సమర్పించటానికి ఏర్పాటు చేశారు. అటువంటి భయంకరమైన పని చేయమని నేనెప్పుడు ఆజ్ఞ ఇవ్వలేదు! అటువంటి ఘోరమైన పని యూదా ప్రజలు చేస్తారని కూడా నేనెప్పుడు అనుకోలేదు!

36"మీ ప్రజలిలా అంటున్నారు, 'బబులోను రాజు యెరూషలేమును పట్టుకుంటాడు. అతడు కత్తిని వినియోగిస్తాడు. కరువు, రోగాలు ఆవరిస్తాయి. ఈ నగరాన్ని ఓడించటానికి అతనికి అవి తోడ్పడుతాయి.' కాని ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఇలా అంటున్నాడు: 37 'ఇశ్రాయేలు, యూదా ప్రజలను తమ దేశం వదిలి పోయేలా నేనే ఒత్తిడి చేశాను. నేను వారి పట్ల మిక్కిలి కోపగించియున్నాను. కాని వారందరిని నేను మరల ఈ ప్రదేశానికి తీసికొని వస్తాను! నేను బలవంతంగా పంపిన అన్ని దేశాల నుండి వారిని మరల కూడదీస్తాను. కూడదీసి ఈ దేశానికి మరల తీసికొని వస్తాను. వారు శాంతి కలిగి జీవించేలా చేస్తాను. 38ఇశ్రాయేలు, యూదా ప్రజలు నా ప్రజలుగా వర్ధిల్లుతారు. నేను వారి దేవుడనవుతాను. 39వాస్తవంగా వారంతా ఒకే ప్రజగా జీవించాలనే ఆకాంక్ష నేను వారికి కలిగిస్తాను. వారంతా తమ జీవితాంతం నిజంగా నన్నే ఆరాధించాలనే ధ్యేయం కలిగివుంటారు. నన్ను ఆరాధించి, గౌరవించటం వారికిని, వారి పిల్లలకు మంచిని చేస్తుంది.

40"'ఇశ్రాయేలు, యూదా ప్రజలతో నేనొక ఒడంబడిక కుదుర్చుకుంటాను. ఈ నిబంధన శాశ్వతంగా ఉంటుంది. ఈ నిబంధన ప్రకారం నేనెప్పుడూ వారికి దూరం కాను. నేను వారికెప్పుడు సుముఖంగా ఉంటాను. వారు నన్ను గౌరవించాలనే కోరికతో ఉండేలా చేస్తాను. వారిక ఎన్నడూ నాకు విముఖులు కారు. 41వారు నన్ను సంతోష పర్చుతారు. వారికి మేలు చేయటానికి నేనెంతో ఉత్సాహం చూపిస్తాను. వారిని ఖచ్చితంగా ఈ దేశంలో నాటి వారు బాగా ఎదిగేలా తోడ్పడతాను. ఇది నా పూర్ణ హృదయంతోను, ఆత్మ సాక్షిగాను చేస్తాను.'"

42యెహోవా ఇంకా ఇలా అంటున్నాడు: "ఇశ్రాయేలు, యూదా ప్రజలకు ఈ మహా విపత్తును నేనే సంభవింపజేశాను. అదే మాదిరి నేను వారికి మేలు కూడా చేస్తాను. వారికి శుభం కలుగజేస్తానని వాగ్దానం

---

**బెన్ హిన్నోము** ఈ లోయను 'గెహెన్నా' అని కూడా అంటారు. ఈ పేరు హెబ్రీ పేరు 'గేహిన్నోము-హిన్నోము యొక్క లోయ' అను పదంనుండి వచ్చింది. దుష్టులను దేవుడు ఎలా శిక్షిస్తాడో చూపటానికి ఈ ప్రదేశం ఒక ఉదాహరణ అయ్యింది.

చేస్తున్నాను. 43ప్రజలు, ఈ దేశం వట్టి ఎడారి భూమి.
ఇందులో మనుష్యులు, లేరు జంతువులు గాని లేవు.
కల్దీయుల సైన్యం ఈ దేశాన్ని నాశనం చేసింది లేదు.
అని అనుకుంటారు. కాని భవిష్యత్తులో ప్రజలు మళ్లీ
ఇక్కడ పొలాలు కొంటారు. 44ప్రజలు తమ ధనాన్ని
వెచ్చించి పంట భూములు కొంటారు. ప్రజలు తమ
క్రయదస్తావేజులపై సంతకాలు చేసి వాటిపై ముద్రలు
వేసి భద్రపరుస్తారు. ప్రజలు తమ దస్తావేజులపై
సంతకాలు చేయునట్లు సాక్షులను నియమిస్తారు.
బెన్యామీను వంశస్తులు నివసించే ప్రాంతంలో కూడా
ప్రజలు మళ్లీ భూములు కొంటారు. వారు యెరూష
లేము చుట్టుపట్ల పొలాలు కొంటారు. వారు యూదా
పట్టణ ప్రాంతాలలోను, మన్య ప్రాంతాల లోను,
పడమటి కొండవాలు ప్రాంతం లోను, మరియు దక్షిణ
ఎడారి ప్రాంతంలోను భూములు కొంటారు. మీ ప్రజ
లందరిని నేను తిరిగి స్వదేశానికి తీసికొని వస్తాను
గనుక ఇదంతా జరుగుతుంది.” ఈ సందేశం
యెహోవా నుండి వచ్చినది.

## దేవుని వాగ్దానం

33 యెహోవా నుండి సందేశం రెండవసారి
యిర్మీయాకు వచ్చింది. యిర్మీయా ఇంకను
రక్షక భటుని ఆవరణలో బందీయైయున్నాడు.
2యెహోవా భూమిని సృష్టించాడు. ఆయన దానిని
సురక్షితంగా ఉంచుతాడు. ఆ సృష్టికర్త పేరే యెహోవా!
యెహోవా ఇలా అంటున్నాడు: 3“ఓ యూదా, నన్ను
ప్రార్థించు. నేను నీకు జవాబిస్తాను. నేను నీకు అతి
ముఖ్యమైన రహస్యాలను తెలియజేస్తాను. అవి నీవు
ముందెన్నడు విని ఎరుగవు. 4యెహోవా ఇశ్రాయేలీ
యుల దేవుడు. యెరూషలేములోని ఇండ్ల విషయం,
యూదా రాజుల భవనాల గురించి యెహోవా ఈ
విషయాలు తెలియజేస్తున్నాడు. శత్రువు ఆ ఇండ్లను
నేల మట్టం చేస్తాడు. శత్రువు నగర గోడల చుట్టూ
పై వరకు దిమ్మలు నిర్మిస్తాడు. శత్రువు కత్తి పట్టి ఈ
నగరాల ప్రజలతో యుద్ధం చేస్తాడు.
5“యెరూషలేము నగరంలో ప్రజలు చాలా చెడు
కార్యాలు చేశారు. వారి పట్ల నేను చాలా కోపంగా
ఉన్నాను. నేను ఈ పట్టణానికి విముఖుడనైనాను.
కావున వారిలో చాలా మందిని చంపివేస్తాను. కల్దీయుల
సైన్యం యెరూషలేముతో యుద్ధానికి వస్తుంది.
యెరూషలేము నగరంలోని ఇండ్లలో అనేక మంది
శవాలు పడి ఉంటాయి.
6“కాని ఆ నగరంలోని ప్రజలను నేను స్వస్థపరచి
వారికి ఉపశమనం కలుగజేస్తాను. వారు శాంతి, రక్షణ
కలిగి ఉండేలా చేస్తాను. 7యూదాను, ఇశ్రాయేలును
గతంలో మాదిరిగా మిక్కిలి బలపడేలా చేస్తాను. 8వారు
నాకు విరోధంగా పాపం చేశారు కాని నేను ఆ పాపాన్ని
కడిగి వేస్తాను. నాకు విరోధంగా వారు పోరాడారు కాని
వారిని క్షమిస్తాను. 9అప్పుడు యెరూషలేము ఒక
అద్భుతమైన స్థలంగా మారి పోతుంది. ప్రజలు సంతో
షంగా ఉంటారు. (ఇతర దేశాల ప్రజలు దిగ్భ్రాంతుల
వుతారు. మరియు నేను ఇశ్రాయేలీయులకు కలుగజేసే
క్షేమాన్ని విశ్రాంతిని చూచి వణకుతారు. అనేక మంచి
పనులు జరగడం గురించి వారు విన్నప్పుడు ఇది
జరుగుతుంది. ఇతర రాష్ట్రాల వారు నేను ఇశ్రాయేలుకు
అనుగ్రహించిన మంచి వాటిని గురించి వింటారు.
10“ప్రజలారా మీరిలా అంటున్నారు, ‘మా దేశం
వట్టి ఎడారి అయిపోయింది. మనుష్యులు గాని, జంతు
జాలం గాని ఏదీ ఇక్కడ నివసించటం లేదు.’ యెరూష
లేము వీధులలోను, యూదా పట్టణాలలోను ఇప్పుడు
ప్రశాంతత నెలకొన్నది. కాని త్వరలో అక్కడ సందడి
ఏర్పడుతుంది. 11అక్కడ తిరిగి సుఖ సంతోషాలు వెల్లి
విరుస్తాయి. వధూవరుల వేడుకలు నెలకొంటాయి.
దేవాలయానికి కానుకలు తెచ్చే జన సందోహాల సందడి
వినిపిస్తుంది. ‘సర్వశక్తిమంతుడయిన యెహోవాకు
జయగీతం పాడండి! యెహోవా దయామయుడు.
ఆయన కరుణ శాశ్వతంగా మనకు లభిస్తుంది!’ అని
ప్రజలు అంటారు. యూదాకు నేను మళ్లీ మంచి
పనులు చేస్తాను. గనుక ప్రజలా మాటలు చెపుతారు.
అప్పుడు యూదా తన పూర్వ వైభవం తిరిగి నెల
కొంటుంది.” ఇదే యెహోవా వాక్కు.
12సర్వశక్తిమంతుడయిన యెహోవా ఇలా అంటు
న్నాడు: “ఈ ప్రదేశం ఇప్పుడు ఖాళీగా వుంది. ఇది
నిర్మానుష్యంగా, జంతు సంచారం కూడ లేకుండా
ఉంది. కాని యూదా పట్టణాలన్నీ ప్రజలతో నిండి
పోతాయి. గొర్రెల కాపరులుంటారు. పచ్చిక బయళ్లు
మళ్లీ చిగురిస్తాయి. గొర్రెల మందలు పచ్చిక మేసి
హాయిగా వాటిలో విశ్రమిస్తాయి. 13 గొర్రెలు తమ
ముందు నడుస్తూ ఉండగా, కాపరులు వారి గొర్రెలను
లెక్కిస్తారు. మన్యం ప్రాంతంలో, పచ్చిమ కొండవాలు
ప్రాంతంలో, నెగేవు ఎడారి ప్రాంతంలో, ఇంకా
యూదా పట్టణాలన్నిటిలో ప్రజలు తమ తమ
గొర్రెలను లెక్కపెట్టుకుంటూ ఉంటారు.”

## ఒక మంచి కొమ్మ

14ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినది:
“నేను ఇశ్రాయేలు, యూదా ప్రజలకు ఒక ప్రత్యేకమైన
వాగ్దానం చేసియున్నాను. నేనిచ్చిన మాట నెరవేర్చు
కునే సమయం ఆసన్నమవుతూ వుంది. 15ఆ సమ
యంలో దావీదు వంశం నుండి ఒక మంచి ‘కొమ్మ’
చిగురించి పెరిగేలా చేస్తాను. ఆ మంచి ‘కొమ్మ’ (రాజు)
దేశానికి ఏది మంచిదో, ఏది నీతి దాయకమో అది
చేస్తుంది. 16 ఈ ‘కొమ్మ’ చిగిర్చిన కాలంలో యూదా
ప్రజలు రక్షింపబడతారు. యెరూషలేములో ప్రజలు

సురక్షితంగా జీవిస్తారు. ఈ కొమ్మ పేరు 'యెహో
వాయే మా నీతి.'"
17యెహోవా ఇలా చెపుతున్నాడు, "దావీదు వంశం
లోని ఒక వ్యక్తి సదా సింహాసనం మీద కూర్చుని
ఇశ్రాయేలీయులను పరిపాలిస్తాడు. 18లేవీయుల వంశం
లోనివారే ఎల్లప్పుడూ యాజకులుగా ఉంటారు. ఆ
యాజకులు సదా నా ఎదుట నిలచి నాకు దహన
బలులు, ధాన్యార్పణలు, బలులు అర్పిస్తారు."
19యిర్మీయాకు యెహోవా నుండి ఈ వర్తమానం
వచ్చింది. 20యెహోవా ఇలా అన్నాడు: "నాకు రాత్రిం
బవళ్లతో ఒక ఒడంబడిక ఉంది. అవి అలా ఎల్లప్పుడూ
సరైన సమయంలో వస్తాయి. ఆ ఒడంబడికను మీరు
మార్చలేరు! దివారాత్రులు క్రమం తప్పక అలా వస్తూనే
ఉంటాయి. మీరా నిబంధన మార్చగల్గిననాడు, 21నా
సేవకుడైన దావీదు, నా సేవకులైన లేవీయులతో
యాజకులతో నా ఒడంబడికను కూడా మార్చగల్గు
తారు. అప్పుడు దావీదు వంశంలోని వారు రాజులు
కాలేరు. లేవీ వంశం వారు యాజకులు కాలేరు. 22కాని
నేను నా సేవకుడైన దావీదు వంశం, లేవీ వంశం అభి
వృద్ధి పొందేలా చేస్తాను. ఆకాశంలో నక్షత్రాల్లా వారి
సంతతి వృద్ధి పొందుతుంది. ఆ నక్షత్రాలను ఎవ్వరూ
లెక్కపెట్టలేరు. మరియు వారి సంతానం సముద్ర
తీరాన గల ఇసుక రేణువుల్లా వృద్ధి పొందుతుంది. ఆ
ఇసుక రేణువులను ఎవ్వరూ లెక్క పెట్టలేరు."
23యిర్మీయా ఈ వర్తమానాన్ని యెహోవా నుండి
విన్నాడు: 24"యిర్మీయా, ప్రజలేమను కుంటున్నారో
నీవు విన్నావా? 'యెహోవా ఇశ్రాయేలు, యూదా
రెండు వంశాల వారికి విముఖుడయాడు. యెహోవా
వారిని ముందు ఎన్నుకున్నాడు. కాని ఇప్పుడాయన
వారిని తిరస్కరించాడు.' వారు మా ప్రజలను ఎంతగా
ద్వేషిస్తున్నారంటే, మా ప్రజలు ఒక రాజ్యంగా కూడా
అంగీకరించటం లేదు,'"
25అయితే యెహోవా ఇలా అంటున్నాడు:
"దివారాత్రులతో నా ఒడంబడిక కొనసాగకపోతే,
భూమ్యాకాశాలకు సంబంధించిన న్యాయసూత్రాలను
నేను చేయకపోతే, బహుశః నేనా ప్రజలను వదిలి
వేస్తాను. 26బహుశః అప్పుడు యాకోబు సంతతి నుండి
నేను దూరంగా ఉంటాను. బహుశః అప్పుడే నేను
దావీదు వంశం వారు అబ్రాహాము, ఇస్సాకు, యాకోబు
సంతతి వారిని ఏలకుండా చేస్తాను. కానీ నిర్బంధంలో
నుండి వారిని మరలా వారి స్వదేశానికి తెస్తాను. ఆ
ప్రజల పట్ల దయగలిగి ఉంటాను."

## యూదా రాజైన సిద్కియాకు హెచ్చరిక

34 యిర్మీయాకు యెహోవా నుండి వర్తమానం
వచ్చింది. బబులోను రాజైన నెబుకద్నెజరు
యెరూషలేముతోను, దాని చుట్టు పట్ల నున్న పట్టణా
లతోను యుద్ధం చేసే సమయంలో ఈ వర్తమానం
వచ్చింది. నెబుకద్నెజరు పాలన కింద ఉన్న మహా
సామ్రాజ్యంలోని దేశాల, సామంతుల సైన్యంతో పాటు
తన సైన్యం యావత్తూ నెబుకద్నెజరుతో యెరూష
లేమును ముట్టడించుటకు కదలి వచ్చింది.
2ఆ వర్తమానం ఇలా వుంది: "ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవా యిలా అంటున్నాడు:
యిర్మీయా, యూదా రాజైన 'సిద్కియా వద్దకు వెళ్లి
ఈ సందేశాన్ని అందజేయి: సిద్కియా, యెహోవా
ఈ విధంగా తెలియ జెప్పుచున్నాడు: యెరూషలేము
నగరాన్ని అతి త్వరలో నేను బబులోను రాజుకు
ఇవ్వబోతున్నాను. అప్పుడతను దానిని తగలబెడ
తాడు! 3సిద్కియా, బబులోను రాజు నుండి నీవు
తప్పించుకోలేవు. నీవు ఖచ్చితంగా పట్టుబడి అతనికి
అప్పగింపబడతావు. బబులోను రాజును నీ కళ్లతో
స్వయంగా చూస్తావు.! అతడు నీతో ముఖాముఖిగా
మాట్లాడుతాడు. నీవు బబులోనుకు వెళతావు. 4కాని,
యూదా రాజువైన సిద్కియా! యెహోవా వాగ్దానం
శ్రద్దగా వినుము. నిన్ను గురించి యెహోవా యిలా
చెప్పుచున్నాడు: నీవు కత్తిచేత చంపబడవు. 5నీవు
ప్రశాంతంగా చనిపోతావు. నీ కంటె ముందు ఏలిన
రాజులైన నీ పూర్వీకులు చనిపోయినప్పుడు వారి
గౌరవార్థం ప్రజలు దహన సంస్కారాలు జరిపినారు.
అదే రీతిగా ప్రజలు నీ గౌరవార్థం కూడా దహనక్రియలు
జరుపుతారు. వారు నీ కొరకు విలపిస్తారు. 'అయ్యో,
మా నాయకుడా!' అని విచారిస్తారు. నాకై నేనే ఈ
వాగ్దానం చేస్తున్నాను.'" ఇదే యెహోవా వాక్కు.
6యెహోవా యొక్క ఈ సమాచారాన్ని
యెరూషలేములో వున్న సిద్కియాకు యిర్మీయా
ఇచ్చాడు. 7అది బబులోను సైన్యం యెరూషలేముతో
యుద్ధం చేస్తున్న సమయం. కైవసం చేసికొనని
యూదా నగరాలతో కూడ బబులోను సైన్యం
పోరాడుతూ ఉంది. అవి లాకీషు, అజేకా అనే నగరాలు.
చుట్టూ ప్రాకారాలతో పటిష్టం చేయబడిన యూదా
రాజ్య నగరాలలో అవి రెండు మాత్రమే మిగిలి
ఉన్నాయి.

## ప్రజలు ఒప్పందాలలో ఒక దాన్ని ఉల్లంఘించుట

8హెబ్రీ బానిసలకు స్వేచ్ఛ నివ్వాలని రాజైన
సిద్కియా యెరూషలేము ప్రజలందరితో ఒక ఒడం
బడిక చేశాడు. సిద్కియా ఆ ఒడంబడిక చేసిన పిమ్మట
యెహోవా వాక్కు యిర్మీయాకు వినవచ్చింది. 9ప్రతి
పౌరుడు తనవద్ద ఉన్న హెబ్రీ బానిసలను విడుదల
చేయవలసి ఉంది. స్త్రీ పురుష భేదం లేకుండ హెబ్రీ
బానిసలందరూ విడుదల చేయబడాలి. యూదా వంశీ
యులలో ఎవ్వరినీ ఏ ఒక్కరూ బానిసగా ఉంచకో
రాదు. 10అందువల్ల యూదా నాయకులు, ప్రజలు

ఈ ఒడంబడికకి అంగీకరించారు. ప్రతి పౌరుడు తన
వద్దగల హెబ్రీ స్త్రీ, పురుష బానిసలను విడుదల
చేయాలి. వారిని ఎంత మాత్రము బానిసలుగా పని
చేయించరాదు. అందుకు ప్రతి పౌరుడు ఒప్పు
కున్నాడు. దానితో బానిసలంతా స్వేచ్ఛగా వదిలి వేయ
బడ్డారు. 11కాని ఆ తరువాత* బానిసల యజమాను
లంతా తమ మనస్సు మార్చుకున్నారు. వారు స్వేచ్ఛగా
వదిలిన బానిసలందరినీ మరల బానిసలుగా నియ
మించుకొన్నారు.

12పిమ్మట యెహోవా వాక్కు యిర్మీయాకు
చేరింది: 13ఇశ్రాయేలు దేవుడైన యెహోవా ఇలా
చెపుతున్నాడు: "యిర్మీయా, బానిసలుగా ఉన్న మీ
పూర్వీకులను ఈజిప్టు నుండి నేను తీసుకొని వచ్చాను.
నేనా పని చేసినప్పుడు, వారితో నేనొక నిబంధన
చేసినాను. 14మీ పితరులతో నేనిలా చెప్పాను: 'ప్రతి
ఏడు సంవత్సరాల అనంతరం ప్రతి పౌరుడు తన వద్ద
ఉన్న హెబ్రీ బానిసలను వదిలి వేయాలి. మీకు
అమ్ముడు పోయిన మీ సాటి హెబ్రీయుడు మీవద్ద
నుంటే, అతడు ఆరు సంవత్సరాల పాటు సేవ చేసినాక
అతనిని మీరు వదిలివేయాలి.' కాని మీ పూర్వీకులు
నామాట వినలేదు. నన్ను లక్ష్యపెట్టలేదు. 15కొద్ది కాలం
కిందట మీరు మీ హృదయాలను మార్చుకొని ఏది
సక్రమమైనదో దానిని చేయటానికి సిద్ధమయ్యారు.
బానిసలుగా ఉన్న సాటి హెబ్రీయులకు మీలో ప్రతి
ఒక్కడూ స్వేచ్ఛ నిచ్చాడు. నా నామాన్ని పిలువబడే
నా ఆలయంలో నా ముందు ఈ మేరకు మీరొక
ఒడంబడిక కూడ చేశారు. 16కాని ఇప్పుడు మీరు
మనస్సు మార్చుకున్నారు. మీరు నా పేరును గౌరవించ
రని నిరూపించుకున్నారు. ఇది మీరెలా చేశారు? వదిలి
పెట్టిన ప్రతి స్త్రీ, పురుష బానిసను మీలో ప్రతివాడూ
తిరిగి తీసుకున్నారు. వారు తిరిగి బానిసలయ్యేలా ఒత్తిడి
చేశారు.

17"అందుచేత యెహోవా ఇలా అంటున్నాడు:
'ప్రజలారా, నాకు మీరు విధేయులుగా లేరు. మీరు మీ
సాటి హెబ్రీయులకు స్వేచ్ఛ నివ్వలేదు. మీరు నా
ఒడంబడికను ఉల్లంఘించిన కారణంగా నేను "స్వేచ్ఛ"
నిస్తాను. కత్తికి, కరువుకు, భయంకర రోగాలకు నేను
"స్వేచ్ఛ" నిస్తాను. అవి మిమ్మల్ని చంపివేస్తాయి.'
ఇదే యెహోవా వాక్కు. ' మిమ్మల్ని గురించి చెప్పగానే
ప్రపంచ రాజ్యాలన్నీ ఆశ్చరం చెందేలా మీకు మహా
విపత్తు కలుగజేస్తాను. 18నా ఒడంబడికను ఉల్లంఘించిన
వారిని, నా ముందు తాము చేసిన వాగ్దానాన్ని నిలబెట్టు
కోలేని వారిని నేను శత్రువుకు అప్పగిస్తాను. ఈ మను
ష్యులంతా నా ముందు తాము కోడె దూడను రెండు
ముక్కలుగా నరికి, ఆ ముక్కల మధ్య నుండి నడచిన
వారే.* 19యూదా, యెరూషలేము నాయకులు,
న్యాయస్థాన అధికారులు, మరియు యాజకులూ,
రాజ్యంలోని ప్రజలు నా ముందు ఒడంబడిక చేసి
కోడెదూడ ముక్కల మధ్య నడచిన వారిలో ఉన్నారు.
20కావున ఆ ప్రజలను వారి శత్రువులకు అప్పగిస్తాను.
వారిని చంప తలపెట్టిన ప్రతివానికి వారిని వదిలి వేస్తాను.
వారి శవాలు పక్షులకు, క్రూర మృగాలకు ఆహారమ
వుతాయి. 21యూదా రాజైన సిద్కియాను, అతని
ప్రజానాయకులను వారి శత్రువుకు, వారిని చంపదలిచే
ప్రతి వానికి అప్పగిస్తాను. బబులోను సైన్యం యెరూష
లేమును వదిలి* నప్పటికి, సిద్కియాను, అతని
ప్రజలను బబులోను రాజు సైన్యానికి అప్పగిస్తాను.
22"బబులోను సైన్యాన్ని యెరూషలేముకు పిలి
పిస్తాను. ఇదే యెహోవా వాక్కు 'ఆ సైన్యం యెరూష
లేముతో పోరాడుతుంది. వారు నగరాన్ని పట్టుకొని,
దానికి నిప్పుపెట్టి తగలబెడతారు. నేను యూదా
రాజ్యంలోని నగరాలను నాశనం చేస్తాను. ఆ నగరాలు
వట్టి ఎడారులవలె మారి పోతాయి. మనుష్యులెవ్వరూ
అక్కడ నివసించరు.'"

## మార్గదర్శకమైన రేకాబీయుల మంచి కుటుంబం

35 యెహోయాకీము యూదా రాజ్యాన్ని పరి
పాలించే కాలంలో యిర్మీయాకు యెహోవా
నుండి ఒక సందేశం వచ్చింది. రాజైన యెహో

---

**కాని ఆ తరువాత** ఆ తరువాత అనగా క్రీ.పూ. 588వ సంవత్సరపు వేసవి కాలం. అప్పుడు ఈజిప్టు సైన్యం యెరూషలేముకు సహాయంగా వచ్చింది. ఈజిప్టు సైన్యంతో తలపడటానికి బబులోను సైనికులు తాత్కాలికంగా యెరూషలేమును వదిలిపెట్ట వలసి వచ్చింది. అయితే, యెరూషలేము ప్రజలు మాత్రం దేవుడు వారికి సహాయపడినాడని తలంచారు. మళ్లీ మామూలు పరిస్థితులు నెలకొన్నాయని అనుకొన్నారు. అందువల్ల వారు తమ వాగ్ధానాన్ని మర్చి, దానిని అనుసరించలేదు. వారు వదిలిన బానిసలను తిరిగి వారి బానిసలుగా నియమించారు.

**ఈ మనుష్యులు ... నడిచినవారే** ప్రజలు ఒక ముఖ్యమైన ఒడంబడిక చేసి కొన్నప్పుడు తాము జరిపే క్రతువులో ఇది ఒక భాగం. ఒక కోడె దూడను గాని, మరే ఇతర జంతువును గాని తెచ్చి దానిని రెండు ముక్కలుగా నరుకుతారు. ఒడంబడిక చేసికొనే వారు ఈ రెండు ముక్కల మధ్యగా నడుస్తారు. నడిచేటప్పుడు, నేను ఈ ఒడంబడికను పాటించక పోతే నాకు కూడ ఇదే గతి పట్టుగాక!" అని పలకటం ఆచారం.

**యెరూషలేమును వదిలి** ఈజిప్టు నుండి ఒక సైన్యం క్రీ.పూ. 588 వ సంవత్సరపు వేసవిలో యెరూషలేముకు సహాయంగా వచ్చింది. అందువల్ల బబులోను వారి సేన తాత్కాలికంగా యెరూషలేమును వదిలి ఈజిప్టు సైన్యాన్ని ఎదుర్కొవటానికి వెళ్లింది. యిర్మీయా 37:5; మరియు యిర్మీయా 34:11 లో వ్రాయబడిన పుటలో క్రింది వివరణలో చూడండి.

యాకీము యోషీయా కుమారుడు. యెహోవా
సందేశం ఇలా ఉంది: 2"యిర్మీయా, రేకాబీయుల*
వద్దకు వెళ్లుము. యెహోవా దేవాలయపు ప్రక్క
గదులలో ఒక దాని లోనికి వారిని ఆహ్వానించుము.
వారు తాగటానికి ద్రాక్షారసాన్ని అందించుము."
3కావున నేను (యిర్మీయా) యజన్యాను*
తీసికొని రావటానికి వెళ్లాను. యజన్యా యిర్మీయా*
అనువాని కుమారుడు. యిర్మీయా హబజ్జిన్యా కుమా
రుడు. యజన్యా సోదరులను; కుమారులను కూడ
ఆహ్వానించాను. రేకాబీయుల కుటుంబం వారినందరినీ
పిలువనంపాను. 4ఆ రేకాబీయుల నందరినీ మందిరం
లోనికి తీసికొని వచ్చాను. అందరం హానాను కుమా
రుల గది అనబడే దానిలోనికి వెళ్లాము. హానాను
అనువాడు యిగ్దల్యా కుమారుడు. హానాను ఒక దైవ
జనుడు. ఈ గది యూదా రాజు ముఖ్యఅధికారులు
బస చేసే గది పక్కనే ఉంది. ఇది మయశేయా గదిపైన
వుంది. మయశేయా అనేవాడు షల్లూము కుమారుడు.
మయశేయా దేవాలయంలో ద్వారపాలకుడు.
5పిమ్మట నేను (యిర్మీయా) ద్రాక్షారసం పోసిన కొన్ని
పాత్రలు, మరికొన్ని గిన్నెలు రేకాబీయుల ముందు
ఉంచాను. "కొంచెం ద్రాక్షారసం తీసుకోండి' అని నేను
వారికి చెప్పాను.
6కాని రేకాబీయులు ఇలా సమాధాన మిచ్చారు:
"మేమెన్నడూ ద్రాక్షారసం తాగము. మా పితరుడైన
రేకాబు కుమారుడైన యెహోనాదాబు మాకు ఆజ్ఞ
యిచ్చిన కారణంగా మేము దానిని తాగము. ఆయన
ఆజ్ఞ ఏమనగా: 'మీరు మీ సంతతివారు ఎన్నడూ ద్రాక్షా
రసం త్రాగవద్దు. 7పైగా మీరు ఎన్నడు ఇండ్లు కట్టవద్దు,
విత్తనములు నాటవద్దు. ద్రాక్షా తోటలు పెంచవద్దు.
వీటిలో దేనినీ మీరు ఎన్నడూ చేయరాదు. మీరు
కేవలం గుడారాలలోనే నివసించాలి. మీరిలా చేస్తే, ఒక
ప్రాంతం నుండి మరో ప్రాంతానికి తిరుగుతూ మీరీ
దేశంలో చిరకాలం జీవించగలుగుతారు.' 8కావున రేకాబీ
యులమైన మేము మా పితరుడైన యెహోనాదాబు
ఇచ్చిన ఆజ్ఞకు బద్ధులమైయున్నాము. మేమెన్నడూ
ద్రాక్షారసం తాగము. మా భార్యలు, కుమారులు,
కుమార్తెలు కూడా ద్రాక్షారసం తాగరు. 9నివసించటా
నికి మేము ఇండ్లను నిర్మించము. ద్రాక్షాతోటలు గాని,
పొలాలు గాని మేము కలిగివుండము. మేమెన్నడూ
పంటలు పండించము. 10మేము గుడారాల్లో నివసిస్తూ,
మా పూర్వీకుడైన యెహోనాదాబు యొక్క ఆజ్ఞలన్నీ
పాలిస్తున్నాము. 11బబులోను రాజైన నెబుకద్నెజరు
యూదా రాజ్యాన్ని ముట్టడించినప్పుడు, మేము
యెరూషలేములో ప్రవేశించాము. అప్పుడు మాలో
మేము, 'రండి, మనమంతా యెరూషలేము నగరానికి
వెళదాం. అలా వెళ్లి బబులోను సైన్యం నుండి, అరాము
దేశ (కల్దీయుల) సైన్యం నుండి మనల్ని మనం
రక్షించుకుందాము' అని అనుకున్నాము. ఆ విధంగా
మేము యెరూషలేములో ఉండి పోయాము."
12పిమ్మట యెహోవా వాక్కు యిర్మీయాకు విన
వచ్చింది: 13ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తి
మంతుడు ఆయిన యెహోవా ఇలా చెపుతున్నాడు:
"యిర్మీయా, ఈ వర్తమానం యూదా వారికి, యెరూ
షలేము ప్రజలకు తెలియ జేయుము. ఓ ప్రజలారా,
మీరొక గుణపాఠం నేర్చుకొని, నా సందేశాన్ని పాటిం
చాలి." ఇదే యెహోవా వాక్కు. 14"రేకాబు కుమారు
డైన యెహోనాదాబు ద్రాక్షారసం తాగవద్దని తన
కుమారులకు ఆజ్ఞ ఇచ్చాడు. ఆ ఆజ్ఞ శిరసావహించ
బడింది. ఈ రోజు వరకూ యెహోనాదాబు సంతతి
వారు తమ పితరుని ఆజ్ఞను పాటిస్తూ వచ్చారు. వారు
ద్రాక్షారసం తాగరు. కాని నేను యెహోవాను. యూదా
ప్రజలైన మీకు అనేక పర్యాయాలు సందేశాలు
పంపియున్నాను. కాని మీరు నాకు విధేయులుకాలేదు.
15ఇశ్రాయేలు, యూదా ప్రజలారా, మీ వద్దకు నా
సేవకులగు ప్రవక్తలను పంపాను. వారిని అనేక పర్యా
యాలు మీవద్దకు పంపినాను. ఆ ప్రవక్తలు మీతో,
'ఇశ్రాయేలు, యూదా ప్రజలారా, మీలో ప్రతి ఒక్కడు
చెడు కార్యాలు చేయటం మానివేయాలి. మంచి
చెయ్యండి, ఇతర దేవతలను వెంబడించవద్దు, పూజించ
వద్దు, మీరు నాకు విధేయులై, మీ పూర్వీకులకు,
మీకు నేను ఇచ్చిన భూమియందు మీరు నివసించ
వచ్చు' అని అన్నాను. కాని మీరు నా మాటను వినుటకు
తిరస్కరించారు. 16యెహోనాదాబు సంతతివారు వారి
పూర్వీకుడు ఇచ్చిన ఆజ్ఞను తప్పక పాటించారు. కాని
యూదా ప్రజలు మాత్రం నాకు విధేయులు కాలేదు."
17కావున ఇశ్రాయేలీయులు దేవుడు, సర్వశక్తి
మంతుడు అయిన యెహోవా ఇలా అంటున్నాడు:
"యూదాకు, యెరూషలేముకు చాలా కష్టాలు సంభవి
స్తాయని నేను చెప్పియున్నాను. త్వరలో ఆ విపత్తు
లన్నీ సంభవించేలా చేస్తాను. నేను ఆ ప్రజలతో మాట్లా
డాను. కాని వారు వినటానికి నిరాకరించారు. నేను
వారిని పిలిచాను. కాని వారు సమాధానం మియ్యలేదు."
18రేకాబీయులతో యిర్మీయా ఇలా అన్నాడు: "ఇశ్రా
యేలు దేవుడు, సర్వశక్తిమంతుడగు యెహోవా ఇలా
చెపుతున్నాడు, 'మీరంతా మీ పితరుడైన యెహోనా

---

**రేకాబీయులు** వీరు రేకాబు కుమారుడైన యెహోనాదాబు సంతతి వారు. తరువాత వాక్యములు చూడండి. ఈ వంశం వారు యెహోవా పట్ల చాలా భక్తి విశ్వాసాలు గలవారు. యెహోనాదాబు కథ కొరకు రాజుల రెండవ గ్రంథం 10:15-18 చూడండి.

**యజన్యా** ఇతడు ఆనాటి రేకాబీయులకు పెద్ద.

**యిర్మీయా** ఈ యిర్మీయా ప్రవక్తయైన యిర్మీయా కాడు. ఆ పేరు గల మరోవ్యక్తి.

దాబు ఆజ్ఞ పాటించినారు. యెహోనాదాబు బోధన
లను మీరు అనుసరించారు. ఆయన చెప్పినదంతా
మీరు ఆచరించారు. 19కావున ఇశ్రాయేలీయుల దేవుడు,
సర్వశక్తిమంతుడగు యెహోవా ఇలా చెపుతున్నాడు.
రేకాబు కుమారుడైన యెహోనాదాబు సంతతిలో
ఒకడు సదా నాసేవలో నిమగ్నమై ఉంటాడు.'"

## యిర్మీయా పుస్తకాన్ని రాజైన యెహోయాకీము తగలబెట్టటం

36 యిర్మీయాకు యెహోవా నుండి వర్తమానం
వచ్చింది. ఇది యోషీయా కుమారుడైన
యెహోయాకీము యూదా రాజ్యాన్ని పాలిస్తున్న
నాల్గవ సంవత్సరం. యెహోవా వర్తమానం ఇలా వుంది:
2"యిర్మీయా, నీవు పుస్తకపు చుట్ట తీసుకొని నేను
యిచ్చే సందేశాలన్నిటినీ గ్రంథస్థం చేయుము. ఇశ్రా
యేలు, యూదా రాజ్యాల గురించి, తదితర రాజ్యాల
గురించి నేను నీతో మాట్లాడియున్నాను. యోషీయా
రాజైనప్పటి నుండి ఈనాటి వరకు నేను నీతో చెప్పిన
మాటలన్నీ వ్రాయుము. 3యూదా వంశం వారికి నేను
చేయాలని ప్రయత్నిస్తున్న కీడు అంతా బహుశః వారు
వినవచ్చు. బహుశః వారు దుష్కార్యాలు చేయటం
మాని వేయవచ్చు. వారలాచేస్తే గతంలో వారు చేసిన
మహా పాపాలన్నిటినీ నేను క్షమిస్తాను."
4కావున బారూకు అనే వానిని యిర్మీయా పిలి
చాడు. బారూకు తండ్రి పేరు నేరీయా. యెహోవా
తనతో చెప్పిన సందేశాలన్నిటిని యిర్మీయా బయటికి
పలికాడు. యిర్మీయా మాట్లాడుతూ ఉండగా,
బారూకు గ్రంథస్థం* చేశాడు. 5పిమ్మట బారూకుతో
యిర్మీయా ఇలా అన్నాడు: "నేను దేవాలయంలోనికి
వెళ్లలేను. నేనక్కడికి వెళ్లటానికి అనుమతి లేదు.
6అందుచేత నీవే దేవాలయానికి వెళ్లాలని నా కోరిక.
ఉపవాసాల రోజున నీవక్కడికి వెళ్లి, నీవు రాసిన విష
యాలు ప్రజలకు చదివి వినిపించుము. నీవు రాసిన
యెహోవా వర్తమానాలను నేను నీకు చెప్పిన విధంగా
చదివి వినిపించు. యూదా పట్టణాల నుండి యెరూషలే
ముకు వచ్చే ప్రజలందరికి ఆ వర్తమానాలను చదివి
వినిపించు. 7బహుశః ఆ ప్రజలు తమకు సహాయ
పడమని యెహోవాను వేడు కొనవచ్చు. బహుశః
ప్రతి ఒక్కడూ చెడుకార్యాలు చేయటం మానివేయ
వచ్చు. వారిపట్ల తాను చాలా కోపంగా వున్నట్లు
యెహోవా ప్రకటించియున్నాడు." 8కావున నేరీయా
కుమారుడైన బారూకు ప్రవక్త అయిన యిర్మీయా
చెప్పిన ప్రకారం చేశాడు. బారూకు తాను గ్రంథస్థం
చేసిన యెహోవా వర్తమానాన్ని బిగ్గరగా చదివాడు.
ఆయన దానిని యెహోవా ఆలయంలో చదివాడు.
9రాజైన యెహోయాకీము పాలన ఐదు సంవ
త్సరాలు దాటి తొమ్మిదవ నెల జరుగుతూ ఉండగా
ఉపవాస దినం ప్రకటించబడింది. యెరూషలేము నగర
వాసులు, యూదా పట్టణాల నుంచి యెరూషలేముకు
వచ్చి నివసిస్తున్న వారందరం యెహోవా ముందు
ఉపవాసము చేయవలసి ఉంది. 10ఆ సమయంలో
యిర్మీయా మాటలన్నిటినీ తాను రాసి ఉంచిన పుస్తకం
నుండి బారూకు చదివాడు. దానినతడు దేవాలయంలో
చదివాడు. దేవాలయంలో చేరిన ప్రజలంతా వినేలా
బారూకు తాను రాసిన పుస్తకాన్ని చదివాడు. తన
పత్రం (పుస్తకం) చదివినప్పుడు బారూకు పై
ఆవరణలో ఉన్న గెమర్యా గదిలో ఉన్నాడు. ఆలయ
నూతన ద్వారం వద్ద ఆ గది నిర్మింపబడి ఉంది.
గెమర్యా తండ్రి పేరు షాఫాను. గెమర్యా అను వ్యక్తి
దేవాలయంలో వ్రాయువాడు (లేఖికుడు.)
11పుస్తకం నుండి బారూకు చదివిన యెహోవా
వర్తమానాలన్నిటినీ మీకాయా అనువాడు విన్నాడు.
మీకాయా తండ్రి పేరు గెమర్యా. గెమర్యా తండ్రి పేరు
షాఫాను. 12పుస్తకం నుండి చదవబడిన యెహోవా
వర్తమానాలను విన్న మీకాయా రాజభవనంలో ఉన్న
కార్యదర్శి గదికి వెళ్లాడు. రాజభవనంలో ఉన్నతాధి
కారులంతా కూర్చుని ఉన్నారు. అక్కడ ఉన్నవారిలో
కార్యదర్శి ఎలీషామా, షెమాయా కుమారుడైన
దెలాయ్యా, అక్బోరు కుమారుడైన ఎల్నాతాను,
షాఫాను కుమారుడైన గెమర్యా, హనన్యా కుమారుడైన
సిద్కియా మరియు తదితర రాజోద్యోగులు ఉన్నారు.
13పుస్తకంలో నుండి బారూకు ప్రజలందరి ముందు
చదవగా తాను విన్నదంతా మీకాయా ఆ అధికారులకు
తెలియజేశాడు.
14ఆ అధికారులంతా కలిసి యెహూదియను వానిని
బారూకు వద్దకు పంపారు. యెహూది తండ్రి పేరు
నెతన్యా. నెతన్యా తండ్రి పేరు షెలెమ్యా. షెలెమ్యా
తండ్రి పేరు కూషి. యెహూది అనేతను బారూకు
వద్దకు వెళ్లి, "నీవు చదివిన పుస్తకం తీసికొని నా
వెంట రమ్మని" అన్నాడు.
నేరీయా కుమారుడైన బారూకు పుస్తకాన్ని తీసికొని
యెహూది వెంట అధికారుల వద్దకు వెళ్లాడు.
15ఆ అధికారులు బారూకును చూచి, "కూర్చో!
మాకు ఆ పత్రాన్ని చదివి వినిపించు" అని అన్నారు.
అప్పుడు బారూకు ఆ పత్రాన్ని వారికి చదివి
వినిపించాడు.
16గ్రంథస్థం చేయబడిన ఆ వర్తమానాలనన్నిటినీ
అధికారులు విన్నారు. వాటిని విని వారంతా భయపడి
ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. వారు బారూ

---

**గ్రంథస్థం** చెప్పిన దానిని ఒక కాగితంపై వ్రాయుట. ఇది పలుచని చర్మంగాని చెట్టు పట్టగాని, చుట్టబడిన కాగితంగాని, పత్రంగాని కావచ్చు. స్థూలంగా దీనిని పుస్తకం అని చెప్పటం జరిగింది.

కుతో ఇలా అన్నారు, “నీవు గ్రంథస్థం చేసిన వర్తమా
నాల విషయం మేము రాజైన యెహోయాకీముతో
తప్పక చెప్పాలి.” 17తరువాత ఆ అధికారులు బారూ
కును ఒక ప్రశ్న అడిగారు. “బారూకూ, నీవు రాసిన
ఈ వర్తమానములు నీకెలా లభ్యమైనాయి?
యిర్మీయా నీతో మాట్లాడిన విషయాలను నీవు రాసి
యున్నావా?” అని అడిగారు.
18అవునని బారూకు చెప్పాడు. “యిర్మీయా
మాట్లాడగా, ఆ వర్తమానాన్నిటినీ నేను సిరాతో ఈ
పత్రంపై వ్రాసి ఉంచాను” అని అన్నాడు.
19అది విన్న రాజ్యాధికారులు బారూకుతో, “నీవు,
యిర్మీయా పోయి తప్పక దాగుకోవాలి మీరెక్కడ
దాగియున్నారో ఎవ్వరికీ తెలియనీయవద్దు” అని
అన్నారు. 20పిమ్మట రాజ్యాధికారులు ఆ పత్రాన్ని
(పుస్తకం) లేఖికుడైన ఎలీషామా గదిలో ఉంచారు.
వారు రాజైన యెహోయాకీము వద్దకు వెళ్లి ఆ పుస్తకం
గురించి అంతా చెప్పారు.
21అప్పుడు రాజైన యెహోయాకీము ఆ
పత్రాన్ని* తేవటానికి యెహూదిని పంపించాడు. లేఖకు
డైన ఎలీషామా గదినుండి యెహూది ఆ పుస్తకాన్ని
తెచ్చాడు. రాజుకు, ఆయన వద్ద నిలబడి ఉన్న సిబ్బం
దికి యెహూది ఆ పుస్తకాన్ని చదివి వినిపించాడు.
22ఇది జరిగే నాటికి సంవత్సరంలో తొమ్మిదవ నెల*
కావటంతో, రాజైన యెహోయాకీము శీతకాలపు
గదిలో (వెచ్చని గది) కూర్చుని ఉన్నాడు. రాజు
ముందు ఒక చిన్న నిప్పుగూటిలో మంట రగులుతూ
వుంది. 23చుట్టబడిన పత్ర రూపంలో ఉన్న ఆ
గ్రంథాన్ని యెహూది చదవటం మొదలు పెట్టాడు.
అతడు రెండు మూడు పుటల విషయాలు చదవగానే
రాజైన యెహోయాకీము ఆ పత్రాన్ని గుంజుకుని,
ఒక చిన్న కత్తితో చదివిన భాగాన్ని కోసి మండే
నిప్పులో వేయసాగాడు. ఆ విధంగా మొత్తం పుస్తక
మంతా తగులబెట్టాడు. 24పైగా రాజైన యెహోయా
కీము, అతని సిబ్బంది ఆ వర్తమానాన్ని విని భయ
పడలేదు. వారి పాపాలకు చింతిస్తున్న సూచనగా వారు
తమ బట్టలను చించుకొనలేదు.
25ఎల్నాతాను, దెలాయ్యా మరియు గెమర్యా
అనేవారు రాజుతో మాట్లాడి గ్రంథాన్ని తగులబెట్ట
కుండా చేయాలని ప్రయత్నించారు గాని రాజు విన
లేదు. 26రాజైన యెహోయాకీము లేఖకుడైన బారూ
కును, ప్రవక్తయైన యిర్మీయాను నిర్బంధించు మని
కొందరు మనుష్యులను ఆదేశించాడు. అలా ఆదేశిం
చబడిన మనుష్యులు రాజకుమారుడు యెరహ్మె
యేలు, అజ్రీయేలు కుమారుడైన శెరాయా, మరియు
అబ్దెయేలు కుమారుడైన షెలెమ్యా అనువారు. అయితే
యెహోవా బారూకును, యిర్మీయాను దాచివేసిన
కారణంగా ఆ మనుష్యులు వారిని కనుక్కో లేక
పోయారు.
27యెహోవా వాక్కు యిర్మీయాకు వినిపించింది.
యెహోవా నుండి వచ్చిన సందేశాలన్నీ పొందుపర్చ
బడిన సుదీర్ఘ పుస్తకాన్ని రాజైన యెహోయాకీము
తగులబెట్టిన పిమ్మట ఇది జరిగింది. యిర్మీయా ఆ
విషయాలు బారూకుతో చెప్పగా, బారూకు వాటన్ని
టినీ పుస్తకంగా వ్రాశాడు. యిర్మీయాకు వచ్చిన
యెహోవా సందేశం ఇలా ఉంది:
28“యిర్మీయా, మరో పత్రం తీసికో. దానిమీద
మొదటి చుట్టలో వున్న వర్తమానములన్నిటినీ నీవు
తిరిగి వ్రాయుము. ఆ మొదటి పుస్తకాన్నే యూదా
రాజైన యెహోయాకీము తగుల బెట్టాడు.
29యిర్మీయా, యూదా రాజైన యెహోయాకీముకు
ఈ విషయం కూడా చెప్పు, ‘యెహోవా ఇలా
అంటున్నాడు: యెహోయాకీమా, నీవా పుస్తకాన్ని
తగులబెట్టావు. “బబులోను రాజు వచ్చి నిశ్చయంగా
ఈ రాజ్యాన్ని నాశనం చేస్తాడని యిర్మీయా ఎందుకు
రాశాడు? ఈ దేశంలో గల మనుష్యులను, జంతువులను
బబులోను రాజు నాశనం చేస్తాడని ఎందుకు
చెప్పాడు?” అని నీవు అన్నావు. 30కావున, యూదా
రాజైన యెహోయాకీము విషయంలో యెహోవా
ఇలా అంటున్నాడు: యెహోయాకీము సంతతివారు
దావీదు సింహాసనంపై కూర్చొనరు. యెహో
యాకీము చనిపోయినప్పుడు రాజ లాంఛనాలతో
అంత్యక్రియలు జరగవు. అతని కళేబరం నేలమీద
పారవేయబడుతుంది. అతని శవం పగలు ఎండకు
ఎండి, రాత్రి మంచుకు నానిపోతుంది. 31ప్రభువునైన
నేను యెహోయాకీమును, అతని సంతానాన్ని శిక్షి
స్తాను. అతని అధికారులను కూడ నేను శిక్షిస్తాను.
వారు దుర్మార్గులు గనుక నేనలా చేస్తాను. ఆ అధికారుల
పైకి, యెరూషలేము ప్రజలపైకి, యూదా ప్రజలపైకి
మహా విపత్తును తీసికొని వస్తానని నేను అనియున్నాను.
నేను చెప్పిన విధంగా వారికి అష్ట కష్టాలను తెచ్చి
పెడతాను. కారణమేమంటే, వారు నేను చెప్పినది
వినలేదు.’”
32యిర్మీయా మరో పత్రాన్ని తీసికొని లేఖకుడు
నేరీయా కుమారుడు బారూకుకు ఇచ్చాడు. రాజైన
యెహోయాకీము నిప్పులో వేసి తగులబెట్టిన పుస్త
కంలో వున్న వర్తమానములన్నిటినీ యిర్మీయా చెప్పు
చుండగా బారూకు ఆ పత్రం మీద మరల వ్రాశాడు.
పాత వర్తమానాల వంటివే మరికొన్ని కొత్తగా ఈ
రెండవ గ్రంథములో చేర్చబడ్డాయి.

---

**పత్రము** పుస్తకము లేక గ్రంథము, చుట్టబడిన కాగితము లేక పత్రము అని పర్యాయ పదాలుగా వాడబడ్డాయి.

**తొమ్మిదవ నెల** నవంబరు డిసెంబరు ప్రాంతం.

### యిర్మీయాను నిర్బంధించటం

37 నెబుకద్నెజరు బబులోను రాజు. యూదా
రాజుగా యెహోయాకీము కుమారుడైన
యెహోయాకీను* స్థానంలో సిద్కియాను నెబుకద్నె
జరు నియమించాడు. సిద్కియా రాజైన యోషీయా
కుమారుడు. 2యెహోవా యిర్మీయాకు బోధన
నిమిత్తం ఇచ్చిన వర్తమానాలను సిద్కియా లక్ష్య
పెట్టలేదు. సిద్కియా సేవకులు, యూదా ప్రజలు
కూడ యెహోవా వర్తమానాల పట్ల శ్రద్ధ వహించలేదు.
3యెహూకలు అనువానిని, యాజకుడైన జెఫన్యాను
రాజైన సిద్కియా ప్రవక్తయగు యిర్మీయా వద్దకు
ఒక సందేశమిచ్చి పంపాడు. యెహూకలు తండ్రి పేరు
షెలెమ్యా. యాజకుడైన జెఫన్యా తండ్రి పేరు మయ
శేయా. వారు యిర్మీయాకు తెచ్చిన వర్తమానం యిలా
ఉంది: "యిర్మీయా, మా కొరకు మన యెహోవా
దేవుని ప్రార్థించు."
4(ఆ సమయంలో ఇంకా యిర్మీయా చెరసాలలో
నిర్బంధించబడలేదు. కావున అతనెక్కడికి వెళ్లాలన్నా
స్వేచ్ఛ కలిగియున్నాడు. 5అదే సమయంలో ఈజిప్టు
నుండి ఫరో సైన్యం కూడా యూదా వైపుకు కదలి
వచ్చింది. కల్దీయుల సైన్యం యెరూషలేమును ఓడించ
టానికి దానిని చుట్టుముట్టింది. అయితే, ఈజిప్టు నుండి
వచ్చిన సైన్యం తమ మీదికి వస్తున్నట్లు వారు విన్నారు.
కావున బబులోను సైన్యం. యెరూషలేమును వదలి
ఈజిప్టు సైన్యాన్ని ఎదిరించటానికి వెళ్లింది.)
6యెహోవా నుండి ఒక వర్తమానం ప్రవక్తయైన
యిర్మీయాకు వచ్చింది: 7"ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా ఈ వర్తమానం చెప్పుచున్నాడు: 'యెహు
కలు మరియు జెఫన్యా! యూదా రాజైన సిద్కియా
నన్ను ప్రశ్నలడిగే నిమిత్తం మిమ్మల్ని నావద్దకు పంపి
నట్లు నాకు తెలుసు. రాజైన సిద్కియాకు ఇలా
చెప్పండి: ఫరో సైన్యం బబులోను సైన్యాన్ని ఎదు
ర్కొనే విషయంలో నీకు సహాయం చేయాలని ఈజిప్టు
నుండి ఇక్కడికి కదలి వస్తున్నది. కాని ఫరో సైన్యం
ఈజిప్టుకు తిరిగి వెళ్లిపోతుంది. 8ఆ తరువాత బబులోను
సైన్యం ఇక్కడికి తిరిగి వస్తుంది. వారు యెరూషలేము
మీద దాడి చేస్తారు. బబులోను సైన్యం ఆ పిమ్మట
యెరూషలేమును వశపర్చుకొని దానిని తగులబెడు
తుంది. 9యెహోవా ఇలా అంటున్నాడు: 'యెరూష
లేము ప్రజలారా మిమ్మల్ని మీరు మోసగించుకోవద్దు.
"బబులోను సైన్యం మమ్మల్ని వదిలి తప్పక వెళ్లి
పోతుంది" అని మీకు మీరు అనుకోవద్దు. వారు
మిమ్మల్ని వదలరు. 10యెరూషలేము ప్రజలారా,
మిమ్మల్ని ఎదుర్కొనే కల్దీయుల సైన్యాన్నంతా మీరు
ఓడించగలిగినా వారి డేరాలలో కొద్దిమంది గాయపడిన
సైనికులు మిగులుతారు. ఆ కొద్దిమంది గాయపడిన
మనుష్యులే వారి డేరాల నుండి వచ్చి యెరూషలేమును
తగలబెడతారు.'"
11కల్దీయుల సైన్యం ఈజిప్టు రాజైన ఫరో సైన్యాన్ని
ఎదుర్కొనటానికి యెరూషలేమును వదిలిన సమ
యంలో 12యిర్మీయా యెరూషలేము నుండి బెన్యా
మీను దేశానికి* వెళ్లగోరాడు. అక్కడ తన కుటుంబ
ఆస్తుల పంపకం విషయంలో యిర్మీయా వెళ్లాడు.
13కాని యెరూషలేములో బెన్యామీను ద్వారం* వద్దకు
వెళ్లే సరికి రక్షక భటాధికారి యిర్మీయాను నిర్బం
ధించాడు. ఈ అధికారి పేరు ఇరీయా. ఇరీయా తండ్రి
పేరు షెలెమ్యా. షెలెమ్యా తండ్రి పేరు హనన్యా.
రక్షక భటాధికారి అయిన ఇరీయా యిర్మీయాను
నిర్బంధంలోకి తీసికొని, "యిర్మీయా, నీవు మమ్మల్ని
వదిలి బబులోను పక్షం వహించటానికి వెళ్తున్నావు"
అని అన్నాడు.
14"అది నిజం కాదు! నేను బబులోను పక్షం వహించ
టానికి వెళ్లటం లేదు" అని యిర్మీయా ఇరీయాతో
అన్నాడు. కాని యిర్మీయా చెప్పేది ఇరీయా వినటానికి
నిరాకరించాడు. యిర్మీయాను ఇరీయా నిర్బంధించి
యెరూషలేములో రాజ్యాధి కారుల వద్దకు తీసికొని
వెళ్లాడు. 15ఆ అధికారులు యిర్మీయా పట్ల చాలా
కోపగించారు. యిర్మీయాను దండించాలని వారు ఆజ్ఞ
ఇచ్చారు. వారు యిర్మీయాను కారాగారంలో నిర్బం
ధించారు. యోనాతాను అనేవాని ఇంటిలో ఈ చెరసాల
ఉంది. యోనాతాను యూదా రాజుకు లేఖకుడు.
యోనాతాను ఇంటిని చెరసాలగా మార్చారు. 16యోనా
తాను ఇంటి కిందవున్న చెరసాల గదిలో వారు యిర్మీ
యాను నిర్బంధించారు. అది ఇంటి కింద భూమిలో
కట్టిన ఒక చెరసాల గది. యిర్మీయా అందులో
చాలాకాలం ఉన్నాడు.
17పిమ్మట రాజైన సిద్కియా మనుష్యులను పంపగా
వారు యిర్మీయాను రాజభవనానికి తీసికొని వచ్చారు.
యిర్మీయాతో సిద్కియా ఏకాంతంగా మాట్లడ్డాడు.
"యెహోవా నుండి ఏమైనా సందేశం వచ్చిందా?"
అని యిర్మీయాను అడిగాడు.
"అవును. యెహోవా సందేశం ఒకటి ఉంది.
సిద్కియా, నీవు బబులోను రాజుకు ఇవ్వబడతావు"
అని యిర్మీయా సమాధాన మిచ్చాడు. 18తరువాత

---

**యెహోయాకీను** ప్రవక్తయైన యిర్మీయా యెహూయాకీమును గూర్చి అతడు యెకొన్యావాడనియు, కొన్యాయనియు తన ప్రవచనాలలో ఉదహరించాడు.

**బెన్యామీను దేశం** బెన్యామీను దేశంలోవున్న తన స్వస్థలమైన అనాతోతు పట్టణానికి యిర్మీయా వెళ్లుచున్నాడు.

**బెన్యామీను ద్వారం** ఈ ద్వారం యెరూషలేము నుండి ఉత్తర దిశగా బెన్యామీను దేశానికి పోయే బాటకు కలిసి వుంటుంది.

యిర్మీయా రాజైన సిద్కియాతో ఇలా అన్నాడు:
"నేను ఏమి తప్పు చేశాను? నీ పట్లగాని, నీ అధికారుల
పట్లగాని యెరూషలేము ప్రజల పట్లగాని, నేను చేసిన
నేరం ఏమిటి? నన్నెందుకు కారాగృహంలో పడవేశావు?
[19]సిద్కియా రాజా, నీ ప్రవక్తలు ఇప్పుడు ఎక్కడ
ఉన్నారు? ఆ ప్రవక్తలు నీకు తప్పుడు వర్తమానం
యిచ్చారు. 'బబులోను రాజు నిన్నుగాని, ఈ యూదా
రాజ్యాన్ని గాని ఎదుర్కోడు' అని వారన్నారు. [20]కాని
మహారాజా, ఇప్పుడు నేను చెప్పేది దయచేసి వినండి.
దయచేసి నా విన్నపం ఆలకించండి. నేనడిగేది
ఏమంటే లేఖకుడైన యోనాతాను ఇంటికి నన్ను మరల
పంపవద్దు. మీరు నన్ను మరల పంపితే నేనక్కడ
చనిపోతాను."
[21]కావున యిర్మీయాను రాజభవనపు ఆవరణ లోనే
నిర్బంధించి ఉంచాలని రాజైన సిద్కియా ఆజ్ఞాపిం
చాడు. వీధిలోని రొట్టెల దుకాణము నుండి రొట్టె
తెచ్చి యిర్మీయాకు ఇవ్వాలని కూడ రాజు ఆజ్ఞాపిం
చాడు. నగరంలో అమ్మే రొట్టెలు అయిపోయే వరకు
యిర్మీయాకు రొట్టెలు ఇవ్వబడ్డాయి. ఆ విధంగా
రాజ ప్రాంగణంలో యిర్మీయా బందీగా ఉన్నాడు.

### యిర్మీయా నీళ్లగోతిలోనికి తోయబడటం

38 కొంతమంది రాజ్యాధికారులు యిర్మీయా
బోధిస్తున్నది విన్నారు. వారు మత్తాను కుమా
రుడైన షెఫట్య, పషూరు కుమారుడైన గెదల్యా,
షెలెమ్యా కుమారుడైన యూకలును మరియు
మల్కియా కుమారుడైన పషూరు. యిర్మీయా ఈ
వర్తమానాన్ని ప్రజలందరికి ఇలా చెప్పుచున్నాడు:
[2]"యెహోవా సెలవిస్తున్నదేమనగా, 'యెరూష
లేములో ఉన్న ప్రతి ఒక్కడు కత్తివల్లగాని, ఆకలివలన
గాని, రోగంతోగాని చనిపోతాడు. కాని బబులోను సైన్యా
నికి లొంగిపోయిన ప్రతి ఒక్కడూ బతుకుతాడు. వారు
వారి ప్రాణాలతో తప్పించుకో గలుగుతారు.'
[3]యెహోవా ఇంకా ఇలా అంటున్నాడు: 'ఈ యెరూ
షలేము నగరం నిశ్చయంగా బబులోను రాజుకు ఇవ్వ
బడుతుంది. అతడి నగరాన్ని పట్టుకుంటాడు.'"
[4]ప్రజలకు ఈ విషయాలను యిర్మీయా తెలియ
పర్చుతూ ఉండగా విన్న రాజ్యాధికారులు రాజైన
సిద్కియా వద్దకు వెళ్లారు. వారు వెళ్లి, "యిర్మీయాను
చంపివేయాలి. నగరంలో ఇంకా ఉన్న సైనికులను
అధైర్యపర్చుస్తున్నాడు. తాను చెప్పే విషయాలతో
యిర్మీయా ప్రతి ఒక్కడినీ నిరుత్సాహ పరుస్తున్నాడు.
యిర్మీయా మనకు శుభం కలగాలని కోరుకోవటం
లేదు. అతడు యెరూషలేము ప్రజలను నాశనం చేయా
లని కోరుకుంటున్నాడు" అని చెప్పారు.
[5]"యిర్మీయా మీ స్వాధీనంలోనే ఉన్నాడు.
మిమ్మల్ని ఆపటానికి నేనేమీ చేయను" అని రాజైన
సిద్కియా అన్నాడు.
[6]దానితో ఆ అధికారులు యిర్మీయాను మల్కియా
యొక్క నీళ్లగోతిలోనికి* దించారు. (మల్కియా రాజు
యొక్క కుమారుడు) రాజభటుడు ఉండే ప్రాంగణం
లోనే ఆ నీటి గొయ్యి ఉంది. ఆ అధికారులు తాళ్ల
సహాయంతో యిర్మీయాను గోతిలోనికి దించారు.
గోతిలో నీరు లేదు గాని, అడుగున బురద పేరుకొని
ఉంది. ఆ బురదలో యిర్మీయా కూరుకుపోయాడు.
[7]కాని ఎబెద్మెలెకు అనేవాడు అధికారులు యిర్మీ
యాను నీటిగోతిలోకి దించినట్లు విన్నాడు. ఎబెద్మె
లెకు కూషీయుడు (ఇతియోపియ అనే దేశపువాడు)
అతడు నపుంసకుడు (కొజ్జా)* రాజ భవనంలో
ఉద్యోగి. రాజైన సిద్కియా బెన్యామీను ద్వారం వద్ద
కూర్చుని ఉండగా ఎబెద్మెలెకు రాజభవనం నుండి
రాజును కలిసి మాట్లాడటానికి ద్వారం వద్దకు వెళ్లాడు.
[8–9]ఎబెద్మెలెకు ఇలా అన్నాడు: "నా ఏలినవాడవగు ఓ
రాజా, ఆ అధికారులు చాలా క్రూరంగా ప్రవర్తించారు.
ప్రవక్తయైన యిర్మీయా పట్ల వారు బహు క్రూరంగా
వ్యవహరించారు. వారతనిని నీళ్లు నిలువజేసే గోతిలో
పడవేశారు. అతనక్కడ చని పోయేలా వదిలి వేశారు."*
[10]అప్పుడు రాజైన సిద్కియా ఇతియోపియ
వాడగు ఎబెద్మెలెకుకు ఒక ఆజ్ఞ ఇచ్చాడు. అది ఇలా
ఉంది: "ఎబెద్మెలెకూ, రాజభవనం నుంచి నీతో
ముగ్గురు* మనుష్యులను తీసికొని వెళ్లు. యిర్మీయా
చనిపోకముందే వారి సహాయంతో అతనిని గోతిలో
నుండి పైకి తియ్యి."
[11]తరువాత ఎబెద్మెలెకు తనతో మనుష్యులను
తీసుకొని వెళ్లాడు. ముందుగా అతడు రాజభవనంలో
సామాను భద్రపరచే గిడ్డంగి కిందవున్న గదిలోనికి
వెళ్లాడు. ఆ గదినుండి కొన్ని పాత బట్టలను, చింపిరి
గుడ్డలను అతడు తీసికొన్నాడు. కొన్ని తాళ్ల సహా
యంతో ఆ బట్టలను గోతిలో ఉన్న యిర్మీయాకు
వదిలాడు. [12]ఇతియోపియ వాడగు ఎబెద్మెలెకు యిర్మీ
యాను పిలిచి ఇలా అన్నాడు: "ఈ గుడ్డ పేలికలను,
పాత బట్టలను నీ చంకలలో పెట్టుకో. మేము నిన్ను
పైకిలాగినప్పుడు ఈ బట్టలు నీ చంకలలో మెత్తలవలె
ఉండి తాళ్ల వలన నీకు బాధ కలుగదు." ఎబెద్మెలెకు
చెప్పినట్లుగా యిర్మీయా చేశాడు. [13]ఆ మనుష్యులు

---

**నీళ్లగోతి** నీటిని నిలువ చేయటానికి నిర్మించిన గొయ్యి లేక కుండీ. ఇది భూమిలోనికి తవ్వబడివుంటుంది.

**నపుంసకుడు** షండుడు లేక కొజ్జా అనగా పురుషత్వ ములేనివాడు. తరచూ రాజుయొక్క ముఖ్య అధికారులు నపుంసకులే.

**వారతనిని ... వేశారు** నగరంలోవున్న దుకాణాలలోగల రొట్టెలన్నీ అయిపోవటంతో అతను ఆకలితో మాడి చని పోతాడు అని పాఠాంతరం.

**ముగ్గురు** కొన్ని హెబ్రీ ప్రతులలో 30 అని ఉంది.

యిర్మీయాను తాళ్ల సహాయంతో పైకిలాగి, నీళ్ల
గొయ్యి నుండి బయటికి తీశారు. ఆలయ ఆవరణలోనే
యిర్మీయా రక్షకభటుల అధీనంలో ఉన్నాడు.

### యిర్మీయాను సిద్కియా మరల ప్రశ్నలడగటం

14పిమ్మట రాజైన సిద్కియా తన సేవకునితో
ప్రవక్తయైన యిర్మీయాను పిలిపించాడు. దేవాల
యంలో మూడవ ద్వారం వద్దకు అతడు యిర్మీ
యాను పిలువనంపాడు. అప్పుడు రాజు "యిర్మీయా,
నేను నిన్నొక విషయం అడగదలిచాను. ఏమీ దాయ
కుండా చిత్త శుద్ధితో అంతా చెప్పు" అని అన్నాడు.
15"నేను నీకు సమాధానం ఇస్తే నీవు నన్ను
చంపివేస్తావు. నేను నీకేదైనా సలహా ఇచ్చినా నీవు దానిని
వినిపించుకోవు" అని యిర్మీయా సిద్కియాతో
అన్నాడు. 16కాని రాజైన సిద్కియా యిర్మీయాకు ఒక
ప్రమాణం చేశాడు. సిద్కియా ఇది రహస్యంగా చేశాడు.
సిద్కియా ఇలా ప్రమాణం చేశాడు "యిర్మీయా, మనం
దరికీ జీవం పోసిన ప్రాణదాత, నిత్యుడు అయిన
యెహోవా సాక్షిగా నిన్ను నేను చంపను. అంతే గాదు.
నిన్ను చంపజూచే అధికారులకు నిన్ను అప్పగించనని
కూడా నేను నీకు ప్రమాణం చేస్తున్నాను."
17అప్పుడు యిర్మీయా రాజైన సిద్కియాతో ఇలా
అన్నాడు: "ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతు
డైన యెహోవా ఈ విధంగా చెప్పాడు, 'నీవు
బబులోను అధికారులకు లొంగిపోతే నీ ప్రాణం
కాపాడబడుతుంది. యెరూషలేము నగరం కూడ తగుల
బెట్టబడదు. నీవు, నీ కుటుంబం సజీవంగా ఉంటారు.
18నీవు బబులోను రాజుయొక్క అధికారులకు లొంగి
పోవటానికి నిరాకరిస్తే, యెరూషలేము కల్దీయుల సైన్యా
నికి ఇవ్వబడుతుంది. వారు యెరూషలేమును తగుల
బెడతారు. నీవు కూడ వారి బారి నుండి తప్పించు
కోలేవు.'" 19"కాని ఇప్పటికే బబులోను సైన్యపు పక్షం
వహించిన యూదా ప్రజల విషయంలో నేను భయ
పడతున్నాను. పైగా సైనికులు నన్ను యూదా
ప్రజలకు ఇస్తే వారు నన్ను అవమానపర్చి, గాయపర్చు
తారని కూడ నేను భయపడుతున్నాను" అని
యిర్మీయాకు రాజైన సిద్కియా బదులు చెప్పాడు.
20అందుకు యిర్మీయా ఇలా అన్నాడు: "సైనికులు
నిన్ను ఆ యూదా ప్రజలకు అప్పజెప్పరు. నేను
చెప్పినట్లు విని యెహోవాకు విధేయుడవై ఉండుము.
అప్పుడు పరిస్థితులు నీకు అనుకూలిస్తాయి. నీ ప్రాణం
రక్షింపబడుతుంది. 21కాని నీవు బబులోను సైన్యానికి
లొంగిపోవటానికి నిరాకరిస్తే ఏమి జరుగుతుందో
యెహోవా నాకు చూపించాడు. యెహోవా ఇలా
అన్నాడు: 22యూదా రాజగృహంలో మిగిలివున్న
స్త్రీలంతా బయటకు లాగబడతారు. వారు బబులోను
రాజు ముఖ్య అధికారుల వద్దకు తేబడుతారు. నీ స్త్రీలే
నిన్ను ఒక పాట పాడి ఎగతాళి చేస్తారు. ఆ స్త్రీలు
ఇలా అంటారు.

నీ మంచి స్నేహితులే నిన్ను తప్పుదోవ పట్టిం
చారు. నీవారు నీకంటె బలవంతులైనారు.
అటువంటి స్నేహితులనే నీవు నమ్మావు. నీ
కాళ్లు బురదలో కూరుకున్నాయి. నీ స్నేహితులు
నిన్ను వదిలిపెట్టారు.

23"నీ భార్యలు, పిల్లలు అందరూ బయటకు ఈడ్వ
బడతారు. వారు కల్దీయుల సైన్యానికి అప్పగించ
బడతారు. నీవు కూడ బబులోను సైన్యం నుండి
తప్పించుకోలేవు. నీవు బబులోను రాజుచే పట్టు
కొనబడతావు. యెరూషలేము తగులబెట్టబడు
తుంది."
24అప్పుడు సిద్కియా యిర్మీయాతో ఇలా
అన్నాడు: "నేను నీతో మాట్లాడుతున్నానని ఎవ్వరికీ
తెలియనీయవద్దు. చెప్పితే నీవు చనిపోతావు. 25ఆ
అధికారులు నేను నీతో మాట్లాడినట్లు తెలిసికోవచ్చు.
అప్పుడు వారు నీ వద్దకు వచ్చి, 'యిర్మీయా, నీవు
రాజైన సిద్కియాకు ఏమి చెప్పావో అది మాకు తెలియ
జేయుము. రాజైన సిద్కియా నీకు ఏమి చెప్పినాడో
కూడ మాకు చెప్పు. మాకు నిజాయితీగా అంతా
చెప్పు. లేకుంటే మేము నిన్ను చంపివేస్తాం' అని
అంటారు. 26వారు నీతో అలా అన్నప్పుడు, 'నన్ను
మరల యెనాతాను ఇంటి కిందగల చెరసాల గదిలోకి
పంపవద్దని రాజును వేడుకుంటున్నాను. మళ్లీ నేనా
చెరసాల గదికి పంపబడితే చనిపోతాను' " అని అన్నట్లు
చెప్పు.
27అనుకున్నదంతా జరిగింది. రాజ్యాధికారులు
యిర్మీయాను ప్రశ్నించటానికి వచ్చారు. యిర్మీయా
మాత్రం రాజు ఆజ్ఞానుసారం ఆయన చెప్పిన రీతిగా
వారికి సమాధానమిచ్చాడు. అప్పుడా అధికారులు
యిర్మీయాను ఒంటరిగా వదిలారు. యిర్మీయా
మరియు రాజు ఏమి మాట్లాడారో ఏ ఒక్కరూ వినలేదు.
28యెరూషలేము ముట్టడింపబడేనాటి వరకు
యిర్మీయా ఆలయ ప్రాంగణంలో బందీగా ఉన్నాడు.

### యెరూషలేము పతనం

39 యెరూషలేము ఈ విధంగా లోబరచు కోబ
డింది: యూదా రాజ్యంలో సిద్కియా పాలన
తొమ్మిది సంవత్సరాలు దాటి పదవ నెల గడుస్తూ
ఉంది. అప్పుడు బబులోను రాజైన నెబుకద్నెజరు
తన సైన్యాన్నంతా కూడగట్టుకొని యెరూషలేము
మీదికి తరలి వచ్చాడు. దానిని ఓడించటానికి అతడు
నగరాన్ని ముట్టడించాడు. 2సిద్కియా పాలనలో పద
కొండు సంవత్సరాల నాలుగు నెలలు దాటి తొమ్మిదవ

రోజున యెరూషలేము నగర ప్రాకారం (గోడ)
పగులగొట్టబడింది. 3దానితో బబులోను రాజు యొక్క
ఉన్నతాధికారులంతా యెరూషలేము నగరం ప్రవే
శించారు. వారు మధ్య ద్వారం వద్దకు వచ్చి కూర్చు
న్నారు. ఆ వచ్చిన వారిలో సిమ్గరు జిల్లాకు పాలకుడైన
నేర్గల్‌షరేజరు; మరొక ప్రముఖమైన అధికారి శర్సెకీము;
తదితర ఉన్నతాధికారులు ఉన్నారు.

4యూదా రాజగు సిద్కియా బబులోను నుంచి
వచ్చిన అధికారులను చూచి తన సైనికులతో కలిసి
పారిపోయాడు. రాత్రి సమయంలో వారు యెరూష
లేమును వదిలి రాజుయొక్క ఉద్యానవనం ద్వారా బయ
టకు వెళ్లారు. రెండు గోడల మధ్య వున్న ద్వారం
గుండా వారు వెళ్లారు. వారక్కడి నుండి ఎడారివైపు
వెళ్లారు. 5కాని కల్దీయుల సైన్యం సిద్కియాను, అత
నితో ఉన్న సైనికులను తరుముకుంటూ పోయారు.
కల్దీయుల సైన్యం సిద్కియాను యెరికో మైదానాలలో
పట్టుకున్నారు. వారు సిద్కియాను పట్టుకుని
బబులోను రాజగు నెబుకద్నెజరు వద్దకు తీసికొని
వెళ్లారు. నెబుకద్నెజరు ఆ సమయంలో హమాతు
రాజ్యంలో ఉన్న రిబ్లా పట్టణంలో ఉన్నాడు. ఆ ప్రదే
శంలో సిద్కియాకు వ్యతిరేకంగా నెబుకద్నెజరు తన
తీర్పును ఇచ్చాడు. 6రిబ్లా పట్టణంలో సిద్కియా
కుమారులను అతను చూస్తూ ఉండగానే బబులోను
రాజు చంపివేశాడు. మరియు సిద్కియా చూస్తూ
ఉండగానే యూదా రాజ్యాధికారులందరినీ నెబుక
ద్నెజరు చంపివేశాడు. 7తరువాత సిద్కియా కండ్లను
నెబుకద్నెజరు పెరికివేశాడు. అతడు సిద్కియాకు
కంచు సంకెళ్లను తగిలించి బబులోనుకు తీసికొని
పోయాడు.

8బబులోను సైన్యం రాజగృహానికి, యెరూషలేము
వాసుల ఇండ్లకు నిప్పుపెట్టారు. మరియు వారు యెరూ
షలేము గోడలను పడగొట్టారు. 9నెబూజరదాను అను
వ్యక్తి బబులోను రాజు ప్రత్యేక అంగరక్షకుల దళానికి
అధిపతి. అతడు యెరూషలేములో ఉన్న వారిని బందీ
లుగా పట్టుకున్నాడు. అతడు వారిని బబులోనుకు
తీసికొని పోయాడు. 10కాని ప్రత్యేక అంగరక్షకుల
దళాధికారి నెబూజరదాను యూదాలోని కొంతమంది
పేద ప్రజలను నగరంలో వదిలివేశాడు. వారు ఆస్తి
పాస్తులు ఏమీ లేనివారు. కావున ఆ రోజున నెబూజ
రదాను యూదాలోని పేద ప్రజలకు ద్రాక్షాతోటలను,
పొలాలను ఇచ్చాడు.

11కాని యిర్మీయా విషయంలో నెబుకద్నెజరు
ప్రత్యేక అంగరక్షక దళాధికారి నెబూజరదానుకు కొన్ని
ఆజ్ఞలు ఇచ్చాడు. 12"యిర్మీయాను వెదకి తెలిసికొని
అతని విషయంలో జాగ్రత్త తీసికో. అతనిని గాయ
పర్చవద్దు. అతనేదడిగితే అది యివ్వు" అని ఆజ్ఞ
ఇచ్చాడు.

13ప్రత్యేక అంగరక్షక దళాధికారి నెబూజరదాను,
బబులోను సైన్యంలో ముఖ్యాధికారియైన నెబూ
షజ్బాను, మరో ఉన్నతాధికారి నేర్గల్ షరేజరు మరియు
ఇతర బబులోను సైన్యాధికారులు యిర్మీయాను
పిలిపించారు. 14యూదా రాజు రక్షకుల ఆధీనంలో
ఆలయ ప్రాంగణంలో వున్న యిర్మీయాను ఆ వచ్చిన
వ్యక్తులు బయటకు తీసికొని వెళ్లారు. బబులోను
సైన్యాధికారులు యిర్మీయాను గెదల్యాకు* అప్ప
గించారు. గెదల్యా అనేవాడు అహీకాము కుమారుడు.
అహీకాము అనేవాడు షాఫాను కుమారుడు. యిర్మీ
యాను తిరిగి ఇంటికి తీసికొనిపోవటానికి గెదల్యాకు
ఆజ్ఞ ఇవ్వబడింది. అందువల్ల యిర్మీయా తన ఇంటికి
తీసికొనిపోబడగా అతడు తన ప్రజలతో కలిసి
నివసించాడు.

### ఎబెద్మెలెకునకు యెహోవా వర్తమానం

15ఆలయ ప్రాంగణంలో యిర్మీయా బందీగా ఉన్న
ప్పుడు యెహోవా నుండి ఒక వర్తమానం అతనికి
వచ్చింది. ఆ వర్తమానం ఇలా ఉంది: 16"యిర్మీయా,
నీవు వెళ్లి ఈ వర్తమానాన్ని ఇతియోపియవాడగు ఎబె
ద్మెలెకునకు అందజేయుము: 'ఇశ్రాయేలీయుల
దేవుడు సర్వశక్తుడు అయిన యెహోవా ఇలా చెప్పు
చున్నాడు, ఈ యెరూషలేము నగర విషయంలో నా
వర్తమానాలన్నీ అతి త్వరలో నిజమయ్యేలా చేస్తాను.
వినాశనం ద్వారా నా వర్తమానాలు నిజమవుతాయి
గాని శుభ కార్యాల ద్వారా కాదు. నేను చెప్పినదంతా
నిజమవటం నీ కళ్లతో నీవే చూస్తావు. 17కాని
ఎబెద్మెలెకూ, ఆ రోజున నిన్ను నేను రక్షిస్తాను' –
ఇది యెహోవా సందేశం – 'నీవు ఎవరిని చూచి
భయపడుతున్నావో వారికి నిన్ను అప్పగించను.
18ఎబెద్మెలెకూ, నిన్ను నేను రక్షిస్తాను. నీవు కత్తివాతబడి
చనిపోవు. నీవు తప్పించుకొని జీవిస్తావు. నీవు నన్ను
నమ్మావు. గనుక అలా జరుగుతుంది.' " ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చింది.

### యిర్మీయా విడుదల

40 యిర్మీయా రామా నగరంలో విడుదలైన
పిమ్మట యెహోవా వాక్కు అతనికి విని
పించింది. బబులోను రాజు ప్రత్యేక అంగరక్షక దళాధి
పతియైన నెబూజరదాను యిర్మీయాను రామా
నగరంలో ఉన్నట్లు కనుగొన్నాడు. యిర్మీయా గొలు
సులతో బంధింపబడ్డాడు. యెరూషలేము నుండి,
యూదా నుండి తేబడిన బందీలందరితో పాటు యిర్మీ
యా కూడా ఉన్నాడు. ఆ ప్రజలంతా బందీలుగా

---

**గెదల్యా** నెబుకద్నెజరు గెదల్యాను యూదా రాజ్యానికి
పాలకునిగా నియమించాడు.

బబులోనుకు తీసికొని పోబడుతున్నారు. 2దళాధిపతి
నెబూజరదాను యిర్మీయాను చూచినప్పుడు అత
నితో మాట్లాడి ఇలా అన్నాడు: “యిర్మీయా, నీ దేవు
డైన యెహోవా ఈ విపత్తు ఈ ప్రదేశానికి వస్తుందని
చెప్పియున్నాడు. 3యెహోవా ఏమి చేస్తానని చెప్పి
యున్నాడో అంతా జరిగేలా చేశాడు. మీ యూదా
ప్రజలంతా యెహోవాపట్ల పాపం చేశారు. కావున
మీకు ఈ ఆపద సంభవించింది. మీ ప్రజలు దేవునికి
విధేయులుగా లేరు. 4కాని యిర్మీయా, నిన్ను నేని
ప్పుడు విడుదల చేస్తాను. నీ మణికట్టుల నుండి
సంకెళ్లను తీసివేస్తున్నాను. నీవు రాదలచుకొంటే నాతో
బబులోనుకు రా. వస్తే నీ యోగక్షేమాల విషయంలో
నేను తగిన శ్రద్ధ తీసికొంటాను. నీకు నాతో రావటానికి
ఇష్టం లేకపోతే రావద్దు. చూడు; దేశమంతా నీకు
బాహాటంగా తెరచబడి ఉంది. నీ ఇష్టము వచ్చిన చోటికి
వెళ్లు. 5లేక షాఫాను పుత్రుడైన అహీకాము కుమారుడు
గెదల్యావద్దకు తిరిగి వెళ్లు.* యూదా పట్టణాల
పరిపాలనా నిర్వహణకై బబులోను రాజు గెదల్యాను
పాలకునిగా ఎంపిక చేశాడు. నీవు వెళ్లి గెదల్యాతో
కలిసి ప్రజల మధ్య నివసించు. లేదా నీ ఇష్టమొచ్చిన
మరెక్కడికైనా సరే వెళ్లు.”
పిమ్మట నెబూజరదాను యిర్మీయాకు కొంత
ఆహారాన్ని, ఒక కానుకను ఇచ్చి అతనిని పంపివేశాడు.
6కావున యిర్మీయా మిస్పా వద్ద వున్న అహీకాము
కుమారుడైన గెదల్యా వద్దకు వెళ్లాడు. యిర్మీయా
గెదల్యాతో కలిసి యూదా రాజ్యంలో మిగిలి ఉన్న
ప్రజల మధ్య నివసించాడు.

### గెదల్యా యొక్క స్వల్పకాలిక పాలన

7యెరూషలేము నాశనం చేయబడినప్పుడు
యూదా రాజ్య సైన్యంలోని కొంతమంది, సైనికులు
అధికారులు, తదితర మనుష్యులు బయట ప్రాంతంలో
వుండిపోయారు. రాజ్యంలో మిగిలిన ప్రజలను పాలించ
టానికి అహీకాము కుమారుడైన గెదల్యాను బబులోను
రాజు నియమించినట్లు ఆ సైనికులు విన్నారు. యూదా
రాజ్యంలో మిగిలిన ప్రజలలో మిక్కిలి పేదవారు, బబు
లోనుకు బందీలుగా తీసికొనిపోవటానికి అనువుగాని
స్త్రీ పురుషులు, పిల్లలు వున్నారు. 8కావున ఆ సైనికులు
మిస్పావద్ద గెదల్యాను కలవటానికి వచ్చారు. ఆ వచ్చిన
సైనికులలో నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు,
కారేహ కుమారులైన యోహానాను మరియు యోనా
తాను, తన్హుమెతు కుమారుడైన శెరాయా, నెటోపాతీ
యుడైన ఏపయి యొక్క కుమారుడు, మాయకాతీ
యుని కుమారుడైన యెజన్యా, వారితో ఉన్న మను
ష్యులు ఉన్నారు.
9షాఫాను మనుమడు, అహీకాము కుమారుడు
అయిన గెదల్యా ఆ సైనికులకు, వారితోఉన్న మనుష్యు
లకు భద్రత కల్పించటానికి ఒక ప్రమాణం చేశాడు.
గెదల్యా ఇలా అన్నాడు: “సైనికులారా, కల్దీయులకు
సేవ చేయటానికి మీరు భయపడకండి. రాజ్యంలో
స్థిరపడి బబులోను రాజుకు సేవ చేయండి. మీరిది
చేస్తే, మీకు అంతా సవ్యంగా జరిగిపోతుంది. 10నేను
కూడా మిస్పాలోనే నివసిస్తాను. కల్దీయులు ఇక్కడికి
వచ్చినప్పుడు మీ తరపున నేను వారితో మాట్లాడ
తాను. మీరు ఆ పనిని నాకు వదలండి. వేసవి ద్రాక్షపంట
నుండి రసం తీయాలి. నూనె కూడ తీయాలి. మీరు
తయారు చేసినవన్నీ జాడీలలో నిలువ చేయండి.
మీరు ఆక్రమించుకున్న పట్టణాలలో నివసించండి.”
11మోయాబు, అమ్మోను, ఎదోము, ఇంకను ఇతర
దేశాలలో వున్న యూదా ప్రజలంతా బబులోను రాజు
యూదా రాజ్యంలో కొంతమందిని వదిలి వెళ్లినట్లు
విన్నారు. షాఫాను మనుమడు, అహీకాము కుమారుడు
అయిన గెదల్యాను బబులోను రాజు వారిపై పాలకునిగా
నియమించినట్లు కూడ విన్నారు. 12ఆ యూదా
ప్రజలు ఈ వార్త విన్న తరువాత యూదా రాజ్యానికి
తిరిగి వచ్చారు. చిందరవందరగా వివిధ దేశాల్లో ఉన్న
యూదా వారంతా మిస్పాకు తిరిగి వచ్చి గెదల్యాను
ఆశ్రయించారు. తిరిగి వచ్చి, వారు చాలా ద్రాక్షరసాన్ని
తీసి, వేసవి పండ్లను సేకరించారు.
13బయట పల్లెల్లో ఉన్న కారేహ కుమారుడైన
యోహానాను, ఇతర యూదా సైన్యాధికారులు గెదల్యా
యొద్దకు వచ్చారు. గెదల్యా మిస్పా పట్టణంలో
ఉన్నాడు. 14యోహానాను, మరియు అతనితో ఉన్న
అధికారులు గెదల్యాతో, “అమ్మోనీయుల రాజైన బయ
లీను నిన్ను చంపజూస్తున్నాడు. అది నీకు తెలుసా?
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును నిన్ను చంప
టానికి పంపాడు” అని అన్నారు. కాని అహీకాము కుమా
రుడైన గెదల్యా వారి మాట నమ్మలేదు.
15పిమ్మట కారేహ కుమారుడైన యోహానాను
మిస్పాలో గెదల్యాతో ఏకాంతంగా మాట్లాడాడు. గెద
ల్యాతో యోహానాను ఇలా అన్నాడు: “నెతన్యా కుమా
రుడైన ఇష్మాయేలును నన్ను వెళ్లి చంపనిమ్ము. దానిని
గురించి ఎవ్వరికీ తెలియకుండా నేను చేస్తాను. ఇష్మా
యేలు నిన్ను చంపకుండా మేము చూస్తాము. అతడు
నిన్ను చంపితే నిన్నాశ్రయించి వచ్చిన యూదా ప్రజ
లంతా మళ్లీ వివిధ దేశాలకు చెల్లాచెదరై పోతారు.
అంటే మిగిలిన కొద్దిమంది యూదావారు కూడా నశించి
పోతారన్నమాట.”
16కాని, అహీకాము కుమారుడైన గెదల్యా తన
హితంగోరి చెప్పిన కారేహ కుమారుడైన యోహానా
నుతో, “ఇష్మాయేలును చంపవద్దు. నీవు ఇష్మాయే
లును గురించి చెప్పుచున్న విషయాలు నిజం కావు”
అని అన్నాడు.

---

**లేక … వెళ్లు** ఇలా వుంది: “అతడు తిరిగి రాక ముందే
వెళ్లుము.”

41 ఎలీషామా మనుమడును, నెతన్యా కుమా
రుడు అగు ఇష్మాయేలు ఏడవ మాసంలో
అహీకాము కుమారుడైన గెదల్యా వద్దకు వచ్చాడు.
అతనితో తమ మనుష్యులు పదిమంది ఉన్నారు. వారు
మిస్పా పట్టణానికి వచ్చారు. ఇష్మాయేలు రాజ కుటుం
బంలో ఒక సభ్యుడు. యూదా రాజు అధికారులలో
ఒకడు. ఇష్మాయేలు, అతని మనుష్యులు గెదల్యాతో
కలిసి భోజనం చేశారు. 2 వారంతా కలిసి భోజనం
చేస్తూవుండగా, ఇష్మాయేలు మరియు అతని పదిమంది
మనుష్యులు లేచి అహీకాము కుమారుడైన గెదల్యాను
కత్తితో పొడిచి చంపారు. గెదల్యా యూదా పాలకుడుగా
బబులోను రాజుచే ఎంపిక చేయబడిన వ్యక్తి. 3 మిస్పా
పట్టణంలో గెదల్యాతో ఉన్న యూదా ప్రజలందరిని
కూడ ఇష్మాయేలు చంపివేశాడు. అంతేగాదు. గెద
ల్యాతో వున్న కల్దీయుల సైనికులను కూడ ఇష్మా
యేలు చంపివేశాడు.

4-5 గెదల్యా హత్య గావింపబడిన మరుసటి రోజు
ఎనభై మంది మనుష్యులు మిస్పాకు వచ్చారు. వారు
ధాన్యపు నైవేద్యాలు, ధూపానికి సాంబ్రాణిని దేవాల
యానికి తీసికొని వస్తున్నారు. ఆ ఎనభై మంది
వ్యక్తులూ వారి గడ్డాలు గీయించుకొని తమ బట్టలు
చింపుకొని, తమ శరీరాలను చీరుకొన్నారు* వారు
షెకెము, షిలోహు, షోమ్రోనుల నుండి వచ్చారు.
వారిలో ఏ ఒక్కరికి గెదల్యా హత్య గావింపబడినట్లు
తెలియదు. 6 ఆ ఎనభై మందిని కలవటానికి
ఇష్మాయేలు మిస్పా పట్టణం నుండి వారికి ఎదురేగాడు.
అతడు వారిని కలవటానికి వెళుతూ రోదించాడు.*
ఇష్మాయేలు ఆ ఎనభై మంది మనుష్యులనూ కలిసి
కొని, “నాతో రండి. మనం అహీకాము కుమారుడైన
గెదల్యాను కలుద్దాము” అని చెప్పాడు. 7 ఆ ఎనభై
మంది మిస్పా పట్టణంలోకి వెళ్లారు. అప్పుడు ఇష్మా
యేలు, అతని మనుష్యులు కలిసి ఆ వచ్చిన వారిలో
డెబ్బయి మందిని చంపివేశారు. వారా శవాలను నీళ్లను
నిల్వచేయటానికి నిర్మించిన నూయి వంటి గోతిలో
పడవేశారు. 8 కాని మిగిలిన పదిమంది ఇష్మాయేలుతో,
“మమ్మల్ని చంపవద్దు! మావద్ద గోధుమ, యవధా
న్యాలు ఉన్నాయి. మావద్ద తైలము, తేనె కూడ
ఉన్నాయి. వాటిని మేమొక పొలంలో దాచాము (వాటిని
మీకు ఇస్తాము)” అని చెప్పారు. అందువల్ల ఇష్మాయేలు
ఆ పది మందినీ వదిలిపెట్టాడు. ఇతరులతో పాటు
అతడు వారిని చంపలేదు. 9 (ఈ నీటి గొయ్యి చాలా
పెద్దది. ఆసా అనే యూదా రాజుచే అది నిర్మించ
బడింది. యుద్ధ కాలంలో నీటిని నిలువచేయటానికి
రాజైన ఆసా* దానిని నిర్మింప చేశాడు. ఇశ్రాయేలు
రాజైన బయషా నుండి తన పట్టణాన్ని రక్షించుకోవ
టానికి ఆసా ఇలా చేశాడు. అయితే ఇష్మాయేలు
మాత్రం ఆ గొయ్యి నిండేవరకు దానిలో శవాలను
పడవేశాడు.)

10 మిస్పా పట్టణంలో ఉన్న ఇతర ప్రజలందరినీ
ఇష్మాయేలు పట్టుకున్నాడు. అలా పట్టుకున్న వారిలో
రాజు కుమార్తెలు మరియు అక్కడ మిగిలియున్న
ఇతర ప్రజలు వున్నారు. ఎవరినైతే నెబూజరదాను
పాలించమని గెదల్యాను నియమించాడో, వారే ఆ
ప్రజలు. నెబూజరదాను బబులోను రాజుయొక్క
ప్రత్యేక అంగరక్షక దళాధిపతి. ఇష్మాయేలు తాను పట్టు
కున్న ప్రజలను తీసికొని అమ్మోను దేశానికి పోవటానికి
బయలుదేరాడు.

11 కారేహ కుమారుడైన యోహానాను మరియు
అతనితో ఉన్న సైన్యాధికారులు ఇష్మాయేలు చేసిన
క్రూరమైన పనులన్నిటి గురించి విన్నారు. 12 కావున
యోహానాను, అతనితో వున్న సైన్యాధికారులు తమ
సైనికులను వెంట తీసికొని నెతన్యా కుమారుడైన
ఇష్మాయేలును ఎదుర్కోవటానికి వెళ్లారు. గిబియోను
వద్ద గల పెద్ద చెరువు దగ్గర వారు ఇష్మాయేలును
పట్టుకున్నారు. 13 ఇష్మాయేలును బందీలుగా పట్టుకు
పోతున్న యోహానానును, సైన్యాధికారులను చూచి
జనులు చాలా సంతోషించారు. 14 అప్పుడు మిస్పా
పట్టణంలో ఇష్మాయేలు బందీలుగా తీసికొన్న
వారంతా కారేహ కుమారుడైన యోహానాను వద్దకు
పరుగెత్తారు. 15 కాని ఇష్మాయేలు మరియు అతనితో
ఉన్న వారిలో ఎనిమిది మంది యోహానాను నుండి
తప్పించుకున్నారు. వారు అమ్మోనీయుల వద్దకు పారి
పోయారు.

16 ఆ విధంగా కారేహ కుమారుడైన యోహానాను,
సైనికాధికారులు బందీలను రక్షించారు. ఇష్మాయేలు
గెదల్యాను హత్య చేసి ఆ ప్రజలను మిస్పా పట్టణంలో
పట్టుకున్నాడు. బతికి బయటపడిన వారిలో సైనికులు,
స్త్రీలు, పిల్లలు మరియు న్యాయాధికారులు వున్నారు.
యోహానాను వారిని గిబియోను పట్టణం నుండి తిరిగి
తీసికొని వచ్చాడు.

## ఈజిప్టుకు తప్పించుకొనుట

17-18 యోహానాను, ఇతర సైనికాధికారులు కల్దీ
యుల విషయంలో భయపడ్డారు. బబులోను రాజు
గెదల్యాను యూదా రాజ్యానికి పాలకునిగా ఎంపిక

**వారి గడ్డాలు … చీరుకొన్నారు** యెరూషలేములోని తమ దేవాలయం నాశనం చేయబడినందుకు విషాద సూచకంగా వారు అలా చేశారు.

**రోదించాడు** ఆలయం ధ్వంసమైనందుకు బహు విచారముగా ఉన్నట్లు ఇష్మాయేలు నటించాడు.

**యుద్ధ … రాజైన ఆసా** రాజైన ఆసా, గెదల్యాకు 300 సంవత్సరాల ముందు నివసించాడు. మిస్పా పట్టణంలో రక్షణ ఏర్పాట్లు చేసే విషయానికి ఇది సంబంధించినది. రాజులు మొదటి గ్రంథం 15:2 చూడండి.

చేశాడు. కాని ఇష్మాయేలు గెదల్యాను హత్య చేశాడు.
దానితో కల్దీయులకు కోపం వస్తుందేమోనని యోహా
నాను భయపడ్డాడు. కావున వారు ఈజిప్టుకు పారి
పోవాలని నిశ్చయించుకొన్నారు. ఈజిప్టుకు పోతూ
మార్గమధ్యంలో వారు గెరూతు కింహాము వద్ద ఆగారు.
గెరూతు కింహాము బేత్లెహేము పట్టణం దగ్గర ఉన్నది.

42 వారు గెరూతు కింహాము వద్ద ఉండగానే
యోహానాను, హోషేయా కుమారుడైన
యెజన్యా అనే మరో వ్యక్తి కలిసి ప్రవక్తయైన
యిర్మీయా వద్దకు వెళ్లారు. సైన్యాధికారులంతా
యోహానాను, యెజన్యానులతో కలిసి వెళ్లారు.
అల్పులు మొదలు ఉన్నతుల వరకు అంతా యిర్మీయా
వద్దకు వెళ్లారు. 2వారంతా ఇలా అన్నారు: "యిర్మీయా,
దయచేసి మా అభ్యర్థన ఆలకించు. యూదా సంత
తిలో బతికి బయటపడిన ఈ ప్రజలందరిని గురించి
నీ దేవుడైన యెహోవాకు ప్రార్థన చేయుము.
యిర్మీయా, మాలో ఎక్కువ మంది మిగలలేదు. ఒక
ప్పుడు మేము ఎక్కువ సంఖ్యలో ఉన్నాము.
3యిర్మీయా, మేము ఎక్కడికి వెళ్లవలెనో, ఏమి చేయ
వలెనో నీ దేవుడైన యెహోవాకు ప్రార్థన చేసి
తెలుసుకో."

4అప్పుడు ప్రవక్తయైన యిర్మీయా ఇలా అన్నాడు:
"మీరు నన్ను చేయమని అడిగిన విషయాలను నేను
అర్థం చేసికొన్నాను. మీ దేవుడైన యెహోవాకు
మీరడిగిన విధంగా నేను ప్రార్థన చేస్తాను. యెహోవా
చెప్పినదంతా నేను మీకు తెలియజేస్తాను. మీకు నేనేదీ
దాచి పెట్టను."

5తరువాత ప్రజలు యిర్మీయాతో ఇలా అన్నారు,
"నీ దేవుడైన యెహోవా చెప్పినదంతా మేము
చేయకపోతే దేవుడే మాకు వ్యతిరేకంగా నిజమైన సాక్షి
అవుతాడు. నీ దేవుడైన యెహోవా మేము ఏది
చేయాలో నీకు తెలియజేస్తాడని మాకు తెలుసు.
6యెహోవా వర్తమానం మాకు సమ్మతమవుతుందా,
సమ్మతం కాదా అనేది సమస్య కాదు. మా యెహోవా
దేవుని పట్ల మేము విధేయులమై ఉంటాము. మేము
నిన్ను ఒక సందేశం తెచ్చుట కొరకు పంపుచున్నాము.
దానికి మేము కట్టుబడి ఉంటాము. మా దేవుడైన
యెహోవాకు మేము విధేయులమైనప్పుడు మాకు
మంచి విషయాలు జరుగుతాయని మాకు ఖచ్చితముగా
తెలుసు."

7పది రోజులు జరిగిన పిమ్మట యెహోవా వాక్కు
యిర్మీయాకు వినిపించింది. 8అప్పుడు కారేహ కుమా
రుడైన యోహానానును, అతనితో ఉన్న సైన్యాధి
కారులను యిర్మీయా ఒక చోటికి పిలిచాడు. అతి
సామాన్యుడి మొదలు అతి ముఖ్యమైన వ్యక్తి వరకు
ప్రజలందరినీ కూడ యిర్మీయా ఒక చోటికి పిలిచాడు.
9అప్పుడు యిర్మీయా వారితో ఇలా అన్నాడు: "ఇశ్రా
యేలీయుల దేవుడైన యెహోవా వద్దకు మీరు నన్ను
పంపారు. మీరు నన్ను అడగమన్నదంతా నేను
యెహోవాను అడిగాను. యెహోవా ఇలా చెపుతు
న్నాడు: 10'ప్రజలారా మీరు యూదాలో ఉంటే నేను
మిమ్మల్ని బలపర్చుతాను – మిమ్మల్ని నాశనం
చేయను. మీరు స్థిరపడేలా చేస్తాను. నేను మిమ్మల్ని
పెకలించి వేయను. నేనిది ఎందుకు చేయదల
చుకున్నానంటే, నేను మీకు కలుగజేసిన భయంకర
విషయాల పట్ల నేను విచారిస్తున్నాను. 11బబులోను
రాజు విషయంలో ఇప్పుడు మీరు భయపడుతున్నారు.
కాని అతనిని చూచి మీరు భయపడవద్దు. బబులోను
రాజంటే మీరు భయపడవద్దు.' ఇదే యెహోవా
సందేశం. 'ఎందువల్ల నంటే, నేను మీతో ఉన్నాను.
నేను మిమ్మల్ని కాపాడతాను. నేను మిమ్మల్ని రక్షి
స్తాను. అతడు మీ మీద చెయ్యి వేయలేడు. 12నేను
మీ పట్ల దయగలిగి వుంటాను. బబులోను రాజు
కూడ మీ పట్ల కనికరం చూపుతాడు. అతడు మిమ్మల్ని
మీ దేశానికి తిరిగి తీసుకొని వస్తాడు.' 13'మేము
యూదాలో వుండమని' మీరు అనవచ్చు. అలా అంటే
మీరు మీ యెహోవా దేవుని అనుసరించనట్లే. 14'అది
కాదు. మేము వెళ్లి ఈజిప్టులో నివసిస్తాము. ఆ దేశంలో
మాకు యుద్ధ భయం ఉండదు. మేమక్కడ యుద్ధ
భేరీలు వినము. మేము అక్కడ ఆకలితో బాధపడము'
అని మీరు అనవచ్చు. 15యూదాలో మిగిలిన ప్రజలారా,
మీరలా అంటే యెహోవా వర్తమానం ఏమిటో వినండి.
ఇశ్రాయేలు దేవుడు, సర్వశక్తిమంతుడు అయిన
యెహోవా ఇలా చెప్పుచున్నాడు: 'మీరు ఈజిప్టునందు
నివసింప నిశ్చయిస్తే మీకు ఇలా జరుగుతుంది: 16మీరు
యుద్ధమనే కత్తికి భయపడ్డారు. కాని అది మిమ్మల్ని
అక్కడ ఓడిస్తుంది. మీరు ఆకలి విషయంలో భయ
పడ్డారు. కాని మీరు ఈజిప్టులో క్షామానికి గురియ
గుతారు. మీరక్కడ చనిపోతారు. 17ఈజిప్టుకు వెళ్లి
అక్కడ నివసించాలనుకునే ప్రతివాడు కత్తివాతబడి గాని,
ఆకలిచేగాని, భయంకర వ్యాధులచేగాని చనిపోతాడు.
ఈజిప్టుకు వెళ్లే ఏ ఒక్కడు బతకడు. నేను వారికి కలు
గజేసే భయంకర పరిస్థితుల నుండి ఏ ఒక్కడూ
తప్పించుకోలేడు.'

18"ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడు
అయిన యెహోవా ఇలా చెపుతున్నాడు, 'యెరూష
లేము పట్ల నా కోపాన్ని చూపాను. యెరూషలేములో
నివసించే ప్రజలను నేను శిక్షించాను. అదేరీతిగా ఈజి
ప్టుకు వెళ్లే ప్రతివాని పట్లా నా కోపం చూపిస్తాను.
ప్రజలు తమ శత్రువులకు కీడు జరగాలని కోరుకు
న్నప్పుడు మీకు జరిగినట్లు జరగాలని మిమ్మల్ని ఒక
ఉదాహరణగా తీసుకుంటారు. మీరు శాపగ్రస్తులౌతారు.
మిమ్మల్ని చూచి ప్రజలు సిగ్గు చెందుతారు. ప్రజలు
మిమ్మల్ని అవమాన పర్చుతారు. మీరు మళ్లీ యూదా
రాజ్యాన్ని చూడరు.'

19"యూదాలో మిగిలివున్న ప్రజలారా, 'మీరు
ఈజిప్టుకు పోవద్దు' అని యెహోవా మీకు చెప్పి
యున్నాడు. ఇప్పుడే మిమ్మల్ని నేను హెచ్చరిస్తు
న్నాను. 20మీకు చావు తీసికొనివచ్చే తప్పు మీరు
చేస్తున్నారు. మీరే నన్ను మీ ప్రభువైన దేవుని వద్దకు
పంపారు. 'మన ప్రభువైన దేవుణ్ణి మా కొరకు
ప్రార్థించు. యెహోవా ఏమి చేయమని చెప్పు
చున్నాడో అదంతా మాకు తెలియజేయుము. మేము
యెహోవా చెప్పినట్లు నడచుకొంటాము' అని మీరే
నాతో అన్నారు. 21కావున ఈ రోజు యెహోవా
సందేశాన్ని మీకు వినిపించాను. కాని మీరు ప్రభువైన
మీ దేవునికి విధేయులు కాలేదు. ఆయన మిమ్మల్ని
ఏమి చేయమని చెప్పటానికి నన్ను పంపియున్నాడో
అదంతా మీరు చేయలేదు! 22కావున ఇప్పుడిది బాగా
అర్థం చేసికొనండి: మీరు ఈజిప్టుకు వెళ్లి అక్కడ నివ
సించాలని అనుకుంటున్నారు. కాని ఈజిప్టులో మీరు
కత్తివేటుకు గురియైగాని, ఆకలిచేగాని, భయంకర
రోగాలతో గాని చనిపోతారు."

43 వారి దేవుడైన యెహోవావద్ద నుండి వచ్చిన
సందేశాన్ని యిర్మీయా అలా చెప్పి ముగిం
చాడు. యెహోవా తనకు తెలియజేసిన రీతిగా
యిర్మీయా ప్రజలందరికి పూర్తిగా చెప్పాడు.
2కాని హోషేయా కుమారుడైన అజర్యా, కారేహ
కుమారుడైన యోహానాను, ఇంకను మరికొంత మంది
అహంభావంతో మొండివైఖరి దాల్చారు. వారు
యిర్మీయా పట్ల చాలా కోపగించారు. "యిర్మీయా,
నీవు అబద్ధమాడుతున్నావు! 'ఓ ప్రజలారా, మీరు నివ
సించటానికి ఈజిప్టుకు వెళ్లరాదు' అని మాకు చెప్పు
మని మా ప్రభువైన దేవుడు నిన్ను పంపలేదు.
3యిర్మీయా, నేరీయా కుమారుడైన బారూకు నిన్ను
మాకు వ్యతిరేకంగా పురికొల్పుచున్నాడని మేమను
కుంటున్నాము. నీవు మమ్మల్ని బబులోను వారికి
అప్పగించాలని అతడు ఆశిస్తున్నాడు. నీవు ఇది చేస్తే,
వారు మమ్మల్ని చంపాలని ఎదురు చూస్తున్నారు.
లేదా, నీవిది చేస్తే వారు మమ్మల్ని బందీలుగా బబు
లోనుకు పట్టుకుపోవాలని అయినా కోరుకొని వుండ
వచ్చు" అని అన్నారు.
4కావున యోహానాను, సైనికాధికారులు, ఇతర
ప్రజలు ప్రభువాజ్ఞ తిరస్కరించారు. యెహోవా వారిని
యూదాలో వుండమని ఆజ్ఞ ఇచ్చాడు. 5కాని ప్రభువాజ్ఞ
పాటించటానికి బదులు, యోహానాను మరియు
సైనికాధికారులు యూదాలో మిగిలిన వారిని ఈజిప్టుకు
తీసికొని వెళ్లారు. గతంలో ఆ మిగిలిన వారిని శత్రువు
ఇతర దేశాలకు తీసికొని వెళ్లాడు. కాని వారు మరల
యూదా దేశానికి తిరిగి వచ్చారు. 6ఇప్పుడు యోహా
నాను మరియు సైనికాధికారులు కలిసి పురుషులను,
స్త్రీలను, పిల్లలను అందరినీ ఈజిప్టుకు తీసికొని వెళ్లారు.
ఆ విధంగా తీసికొని వెళ్లబడిన వారిలో రాజు కుమార్తెలు
కూడ వున్నారు. (నెబూజరదాను ఆ ప్రజలందరినీ
గెదల్యా సంరక్షణలో వుంచాడు. నెబూజరదాను బబు
లోను రాజు ప్రత్యేక అంగరక్షక దళాధిపతి.) ప్రవక్త
యైన యిర్మీయాను, నేరీయా కుమారుడగు బారూ
కును కూడ యోహానాను వెంట తీసికొని వెళ్లాడు.
7వారు యెహోవా మాట పెడచెవినిబెట్టి ఈజిప్టుకు
వెళ్లారు. వారు తహపనేసు* అనే పట్టణానికి వెళ్లారు.
8తహపనేసు పట్టణంలో యెహోవా యొక్క ఈ
వర్తమానం యిర్మీయాకు చేరింది: 9"యిర్మీయా,
కొన్ని పెద్ద రాళ్లను తీసికొనిరా. వాటిని తహపనేసులో
ఫరో రాజు అధికార గృహానికి ఎదురుగా మట్టితోను,
ఇటుకలతోను నిర్మించిన పక్కబాట కింద పాతిపెట్టు.
యూదా వారు చూస్తుండగా నీవీపని చెయ్యి.
10అప్పుడు నిన్ను చూస్తూవున్న యూదా వారితో
ఇలా చెప్పు, 'ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తి
మంతుడు అయిన యెహోవా ఇలా చెప్పుచున్నాడు:
బబులోను రాజైన నెబుకద్నెజరును ఇక్కడికి పిలు
స్తాను. అతడు నా సేవకుడు. నేనిక్కడ పాతిపెట్టిన
రాళ్లమీద నేనతని సింహాసనాన్ని నెలకొల్పుతాను.
నెబుకద్నెజరు తన రత్నకంబళిని ఈ రాళ్లపై పరుస్తాడు.
11నెబుకద్నెజరు ఇక్కడికి వచ్చిన ఈజిప్టును
ఎదిరిస్తాడు. మరణించవలసిన వారికి అతడు మరణాన్ని
తీసికొనివస్తాడు. బందీలుగా కొనిపోబడే వారికి
దాస్యాన్ని తెస్తాడు. కత్తిచే హతము గావింపబడే వారి
మీదికి ఖడ్గాన్ని తెస్తాడు. 12ఈజిప్టులోని బూటకపు
దేవుళ్ల గుళ్లల్లో నెబుకద్నెజరు అగ్నిని రగుల్చుతాడు.
అతడా గుళ్లను తగులబెట్టి, విగ్రహాలను తీసికొని
పోతాడు. గొర్రెల కాపరి తమ బట్టలనుండి నల్లులను,
ముండ్ల కాయలను ఏరివేయునట్లు నెబుకద్నెజరు ఈజి
ప్టును శుభ్రపర్చి వశం చేసికొంటాడు. ఆ తరువాత
అతడు ఈజిప్టు నుండి సురక్షితంగా వెళ్లిపోతాడు.
13ఈజిప్టులో అతి ముఖ్యమైన సూర్య దేవాలయంలోని
పవిత్ర రాతి స్తంభాలను నెబుకద్నెజరు నాశనం చేస్తాడు.
పైగా ఈజిప్టులోని బూటకపు దేవతల ఆలయా
లన్నిటినీ అతడు తగులబెడతాడు!'"

## ఈజిప్టులోని యూదా వారికి యెహోవా సందేశం

44 యిర్మీయాకు యెహోవా నుండి ఒక
సందేశం వచ్చింది. ఆ వర్తమానం ఈజిప్టులో
నివసిస్తున్న యూదా వారందరి కొరకు ఉద్దేశించ
బడింది. ఈ వర్తమానం మిగ్దోలు, తహపనేసు, నొపు
పట్టణాలలోను మరియు దక్షిణ ఈజిప్టులోను నివ
సిస్తున్న యూదా వారికె ఇవ్వబడింది. ఆ సందేశం
ఇలా ఉంది: 2ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తి

---

**తహపనేసు** తహపనేసు పట్టణం ఈజిప్టు ఈశాన్య ప్రాంతంలో వుంది.

మంతుడు అయిన యెహోవా ఇలా చెప్పుచున్నాడు,
“యెరూషలేము నగరం మీదికి, యూదా పట్టణా
లన్నిటి మీదికి నేను రప్పించిన భయంకర విపత్తులను
మీరంతా చూశారు. ఆ పట్టణాలన్నీ ఈనాడు వట్టి
రాళ్ల గుట్టల్లా వున్నాయి. 3ప్రజలంతా పాపకార్యాలు
చేయుటవల్లనే ఆ ప్రదేశాలన్నీ నాశనమయ్యాయి. ఆ
ప్రజలు అన్యదేవతలకు బలులు అర్పించారు. అది
నాకు కోపకారణమయ్యింది! గతంలో మీ ప్రజలు మీ
పూర్వీకులు ఆ అన్యదేవతలను ఎరుగరు; ఆరాధించ
లేదు. 4ఆ ప్రజల వద్దకు నా ప్రవక్తలను అనేక పర్యా
యాలు పంపి యున్నాను. ఆ ప్రవక్తలు నా సేవకులు.
ఆ ప్రవక్తలు నా సందేశాన్ని ప్రజలకు చెప్పారు. ‘మీరీ
భయంకరమైన పని చేయవద్దు. విగ్రహారాధన విష
యమై మిమ్మల్ని నేను అసహ్యించు కుంటున్నట్లు’
వారు ప్రజలకు చెప్పారు. 5కాని ఆ ప్రజలు నా ప్రవక్తల
మాట వినలేదు. ప్రజలసలు ప్రవక్తలను లక్ష్యపెట్టనే
లేదు. ఆ ప్రజలు దుష్ట కార్యాలు చేయటం మానలేదు.
అన్యదేవతలకు బలులు అర్పించటం వారు మానలేదు.
6కావున వారి మీద నా కోపాన్ని చూపించాను. యూదా
పట్టణాలను, యెరూషలేము నగర వీధులను నేను
శిక్షించాను. ఈనాడు అవి వున్నట్లుగా యెరూషలేము
నగరాన్ని, యూదా పట్టణాలను వట్టి రాళ్ల గుట్టల్లా
నా కోపం మార్చివేసింది.”

7ఇశ్రాయేలు దేవుడు, సర్వశక్తిమంతుడైన
యెహోవా యిలా చెపుతున్నాడు, “విగ్రహారాధన
చేస్తూ మిమ్మల్ని మీరు ఎందుకు బాధపెట్టుకుంటు
న్నారు? యూదా కుటుంబం నుంచి పురుషులను,
స్త్రీలను మరియు పిల్లలను, పసికందులను వేరు
చేస్తున్నారు. ఆ విధంగా యూదా వంశంలో ఎవ్వరూ
మిగలకుండా మీరు చేసుకుంటున్నారు. 8విగ్రహాలను
తయారు చేస్తూ మీరెందుకు నాకు కోపం కల్గించ
దల్చుకున్నారు? ఇప్పుడు మీరు ఈజిప్టులో ఉన్నారు.
మళ్లీ మీరిప్పుడు ఈజిప్టుకు చెందిన బూటకపు దేవ
తలకు బలులు సమర్పిస్తూ నాకు కోపం కల్గిస్తూ
ఉన్నారు. మీకై మీరే మిమ్మల్ని సర్వనాశనం చేసు
కుంటున్నారు. కేవలం అది మీ తప్పే. ఇతర దేశాలవారు
మిమ్మల్ని గూర్చి చెడుగా మాట్లాడతారు. ఈ భూమి
మీద వున్న రాజ్యాలన్నీ మిమ్మల్ని హేళన చేస్తాయి.
9మీ పూర్వీకులు చేసిన చెడుకార్యాలను మీరు మర్చి
పోయారా? యూదా రాజులు, రాణులు చేసిన క్రూర
కార్యాలు మీరు మర్చిపోయారా? మీరు, మీ భార్యలు
కలిసి యూదాలోను మరియు యెరూషలేము నగర
వీధులలోను చేసిన చెడుకార్యాలు మర్చిపోయారా?
10ఈనాటికీ యూదా ప్రజలు తమ్మును తాము తగ్గించు
కోలేదు. నాపట్లగౌరవ భావమేమీ చూపలేదు. ఆ ప్రజలు
నా బోధనలను అనుసరించలేదు. మీకు, మీ పితరులకు
యిచ్చిన ధర్మశాస్త్రాన్ని వారు పాటించ లేదు.”

11కావున ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతు
డైన యెహోవా ఇలా చేపుతున్నాడు, “మీకు భయం
కరమైన విపత్తులు కలుగజేయటానికి నేను నిశ్చ
యించాను. యూదా వంశాన్నంతా నాశనం చేస్తాను!
12యూదాలో బహు తక్కువమంది మిగిలారు. వారి
క్కడ ఈజిప్టుకు వచ్చియున్నారు. కాని యూదా
వంశంలో మిగిలిన ఆ కొద్దిమందినీ నేను నాశనం
చేస్తాను. వారు కత్తివాతబడిగాని, ఆకలితోగాని చని
పోతారు. ఇతర దేశాలవారు వీరిని గురించి చెడుగా
చెప్పుకునేలా వీరు తయారవుతారు. వీరికి జరిగిన
సంఘటనలను తలుచుకొని ఇతర దేశాలవారు భయ
భ్రాంతులవుతారు. ఆ ప్రజలు శాపానికి మారు పేర
వుతారు. ఆ యూదా ప్రజలను ఇతర దేశీయులు
అవమానపర్చుతారు. 13ఈజిప్టులో నివసించటానికి
వచ్చిన వారిని నేను శిక్షిస్తాను. వారిని శిక్షించటానికి
నేను కత్తిని, క్షామాన్ని, భయంకర రోగాలను విని
యోగిస్తాను. యెరూషలేము నగరాన్ని శిక్షించిన విధం
గానే ఆ ప్రజలను కూడ నేను శిక్షిస్తాను. 14యూదాలో
బతికి బయటపడి ఈజిప్టులో నివసిస్తున్న కొద్ది
మందిలో ఏ ఒక్కడూ నా శిక్షను తప్పించుకోలేడు.
యూదాకు తిరిగి రావటానికి ఒక్కడు కూడా మిగలడు.
వారు యూదాకు తిరిగివచ్చి మరల అక్కడ నివ
సించాలని కోరుకుంటారు. బహుశః తప్పించుకున్న
బహు కొద్దిమంది తప్ప, వారిలో ఒక్కడు కూడ
యెరూషలేముకు తిరిగి వెళ్లడు.”

15ఈజిప్టులో నివసిస్తున్న చాలా మంది యూదా
స్త్రీలు అన్యదేవతలకు ధూప, దీప, నైవేద్యాలు సమర్పి
స్తున్నారు. అది వారి భర్తలకు తెలుసు. అయినా వారు
వారిని వారించలేదు. ఆ ప్రజలు పెద్ద గుంపుగా కలుసు
కొన్నారు. వారిలో దక్షిణ ఈజిప్టులో నివసిస్తున్న
యూదా ప్రజలున్నారు. అన్యదేవతలకు నైవేద్యాలు
అర్పిస్తున్న స్త్రీల భర్తలు యిర్మీయాతో ఇలా అన్నారు:
16“నీవు మాకు చెపుతున్న యెహోవా సందేశాన్ని
మేము వినం. 17ఆకాశ రాణికి ధూప నైవేద్యాలు సమర్పి
స్తామని మేము మొక్కుకున్నాము. మేము మొక్కు
కున్న విధంగా అంతా చేస్తాము. ఆమెకు పూజలో
బలులు అర్పించి, పానార్పణ సమర్పిస్తాము. గతంలో
మేమలా చేశాం. గతకాలంలో మా పూర్వీకులు, మా
రాజులు, మా అధికారులు అలా చేశారు. యూదా
పట్టణాలలోను, యెరూషలేము నగర వీధులలోను
మేమంతా అలా చేశాం. ఆకాశ రాణిని మేము ఆరాధించి
నపుడు మాకు పుష్కలంగా ఆహారం దొరికింది. మాకు
విజయం చేకూరింది. మాకు ఏ కీడూ సంభవించలేదు.
18కాని మేము ఆకాశ రాణికి పానీయాలు సమర్పించటం
మానివేశాం. ఆమె పూజలో ఇవన్నీ మేము చేయటం
మానినప్పటి నుండి మాకు అనేక సమస్యలు
వచ్చాయి. మా ప్రజలు కత్తులచేత, ఆకలిచేత చంప
బడ్డారు.”

[19]తరువాత స్త్రీలు మాట్లాడారు.* వారు యిర్మీ
యాతో యిలా చెప్పారు, “మేము ఏమి చేస్తున్నామో
మా భర్తలకు తెలుసు. ఆకాశ రాణికి ధూప నైవేద్యాలు
అర్పించుటకు మా భర్తల అనుమతి పొందాము. వారి
అనుమతితోనే మేము ఆమెకు పానీయాలు వార
బోశాము. ఆమె ప్రతిరూపంగా మేము కుడుములు
చేయటం కూడ మా భర్తలకు తెలుసు.”
[20]పిమ్మట యిర్మీయా ఆ స్త్రీ పురుషులతో
మాట్లాడాడు. ఈ విషయాలన్నీ చెప్పిన ఆ ప్రజలతో
అతడు మాట్లాడినాడు. [21]ఆ ప్రజలతో యిర్మీయా
ఇలా అన్నాడు: “యూదా పట్టణాలలోను, యెరూ
షలేము నగరంలోను మీరు ఈ దేవతలకు చేసిన బలి
అర్పణలు యెహోవా గుర్తుపెట్టుకున్నాడు. మీరు,
మీ పితరులు, మీ రాజు, మీ అధికారులు మరియు
దేశంలో ఇతర ప్రజలు ఆ పనులు చేశారు. మీరు
చేసిన పనిని యెహోవా గుర్తుపెట్టుకొని దానిని గురించి
ఆలోచన చేశాడు. [22]తరువాత యెహోవా మీపట్ల
ఎంతమాత్రం ఓర్పు వహించ లేకపోయాడు. మీరు
చేసిన భయంకరమైన పనులను యెహోవా అస
హ్యించుకున్నాడు. అందువల్ల యెహోవా మీ దేశాన్ని
వట్టి ఎడారిగా మార్చి వేశాడు. అక్కడ ఇప్పుడు
ఎవ్వడూ నివసించడు. అన్యులు ఆ రాజ్యాన్ని గురించి
చెడ్డగా చెప్పుకుంటారు. [23]అన్య దేవతలకు మీరు
బలులు అర్పించిన కారణంగా మీకు కష్టాలన్నీ
వచ్చాయి. మీరు యెహోవా పట్ల పాపం చేశారు.
మీరు యెహోవాకు విధేయులై వుండలేదు. మీకు
అందజేసిన ఆయన ఆదేశాలనుగాని, ఆయన నిర్దేశించిన
న్యాయసూత్రాలను గాని మీరు అనుసరించలేదు. దేవుని
ఒడంబడికలో* మీ బాధ్యతను మీరు విస్మరించారు.”
[24]తరువాత ప్రజలందరినీ ఉద్దేశించి యిర్మీయా
ఇలా చెప్పాడు: “ఇప్పుడు ఈజిప్టులో ఉన్న యూదా
ప్రజలారా, యెహోవా వాక్కు వినండి: [25]ఇశ్రాయేలీ
యుల దేవుడు, సర్వశక్తిమంతుడు అయిన యెహోవా
చెప్తున్నాడు, ‘మీరు మరియు మీ భార్యలు ఏమి చేస్తామని
చెప్పినారో అది చేశారు. ఆకాశ రాణికి “మేము మొక్కు
కున్న బలులు అర్పిస్తాము, పానీయాలు వారపోస్తాము”
అని మీరన్నారు. అయితే అలాగే చేయండి. మీమాట
ప్రకారం మీరు చేస్తామన్న పనులు చేయండి. మీ
వాగ్దానాలను మీరు నిలబెట్టుకోండి. [26]కాని, ఈజిప్టులో
నివసిస్తున్న ఓ యూదా ప్రజలారా యెహోవా సందే
శాన్ని వినండి: మహిమగల నా పేరు మీద ఈ ప్రమాణం
చేస్తున్నాను: ఇప్పుడు ఈజిప్టులో నివసిస్తున్న యూదా
వారిలో ఒక్కడు కూడ మరెన్నడూ నా పేరు మీద
వాగ్దానాలు చేయడు. “నిత్యుడైన యెహోవా సాక్షిగా ’
అని వారు చెప్పరు.
[27]“‘ఆ యూదా ప్రజలను నేను గమనిస్తున్నాను.
కాని వారి సంక్షేమం కొరకు నేను వారిని గమనించటం
లేదు. వారిని దెబ్బ కొట్టటానికే నేను కనిపెట్టుకుని
వున్నాను. ఈజిప్టులో వున్న యూదా వారు ఆకలితో
మాడి చనిపోతారు. కత్తులతో నరకబడి చనిపోతారు.
వారలా క్రమేపీ ఒకరి తరువాత ఒకరు అందరూ ముగి
సేవరకు చనిపోతారు. [28]కొంతమంది యూదావారు
కత్తివాతబడకుండా తప్పించుకుంటారు. వారు ఈజిప్టు
నుండి యూదాకు తిరిగి వస్తారు. అలా తప్పించు
కొగలిగే యూదా వారు బహు తక్కువ మంది మాత్రమే.
ఈజిప్టులో నివసించటానికి వచ్చి బ్రతికి బయటపడే
ఆ బహు కొద్దిమంది యూదా వారు ఎవరి మాట నిజ
మవుతుందో తెలుసుకుంటారు. నా మాట నిజమయ్యి
నదో, వారి మాట నిజమయ్యినదో వారప్పుడు తెలుసు
కుంటారు. [29]ఇక్కడ ఈజిప్టులో మిమ్మల్ని నేను శిక్షిస్తా
నని తెలిసేటందుకు ఒక నిదర్శనం ఇస్తాను.’ ఇదే
యెహోవా వాక్కు. ‘అప్పుడు మిమ్మల్ని శిక్షిస్తానని
నేను చేసిన ప్రమాణం నిజమవుతుందని మీకు నిశ్చ
యంగా తెలుస్తుంది. [30]నేను చెప్పినది చేస్తాననేందుకు
ఇది ఒక నిదర్శనం.’ యెహోవా ఇలా తెలియ
జేస్తున్నాడు: ‘ఫరోహొఫ్ర ఈజిప్టుకు రాజు. శత్రువులు
అతనిని చంపజూస్తున్నారు ఫరోహొఫ్రను అతని
శత్రువులకు నేనప్పగిస్తాను. సిద్కియా యూదా రాజు.
సిద్కియా శత్రువు నెబుకద్నెజరు. సిద్కియాను
నేనతని శత్రువుకు అప్పగించాను. అదే రీతిగా ఫరో
హొఫ్రను నేనతని శత్రువుకు అప్పగిస్తాను.’ ”

### బారూకుకు ఒక వర్తమానం

45 యెహోయాకీము కుమారుడు యోషీయా
యూదాలో రాజైన యెహోయాకీము
పాలన నాల్గవ సంవత్సరం* జరుగుతూ ఉండగా ప్రవక్త
యైన యిర్మీయా ఈ విషయాలను నేరీయా
కుమారుడైన బారూకుతో చెప్పాడు. బారూకు ఈ
విషయాలను పుస్తక రూపంలో రాశాడు. యిర్మీయా
బారూకుకు చెప్పినది ఇది: [2]“ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా నీకు చెప్పేదేమనంటే, [3]‘బారూకూ, నీవిలా
అన్నావు, నాకు కష్టం వచ్చింది. నా బాధకు తోడు
యెహోవా నాకు దుఃఖాన్ని యిచ్చాడు. నేను మిక్కిలి
అలసిపోయాను. నా బాధలవల్ల నేను మిక్కిలి కృశించి
పోయాను. నాకు విశ్రాంతి లేదు.’” [4]యిర్మీయా, నీవిది
బారూకుకు చెప్పు: ‘యెహోవా ఇలా అంటున్నాడు:
‘నేను నిర్మించిన దానిని నేనే పడగొట్టుతున్నాను.

**తరువాత స్త్రీలు మాట్లాడారు** ఇది ప్రాచీన గ్రీకు అనువాదం నుండి తీసికొనబడింది. ఈ వాక్యం హెబ్రీ ప్రతిలో లేదు.

**దేవుని ఒడంబడిక** బహుశా ఇది మోషే ధర్మశాస్త్రం కావచ్చు. అది దేవునికి, ఇశ్రాయేలు ప్రజల మధ్య కుదిరిన ఒడంబడిక.

**యూదాలో … సంవత్సరం** అనగా క్రీ.పూ 605వ సంవత్సరం.

నేను దేనినైతే నాటితినో దానిని నేనే పెరికివేస్తున్నాను.
యూదాలో ప్రతిచోటా నేనలా చేస్తాను. 5బారూకూ,
నీవు నీ కొరకై గొప్ప విషయాలకై ఎదురు చూస్తు
న్నావా? నీవు వాటి కొరకు చూడవద్దు. ఎందుకంటే,
నేను భయంకర విపత్తును ప్రజలందరి మీదకి కలుగ
జేస్తున్నాను గనుక నీవు వారి కొరకు చూడవద్దు.' ఇవి
యెహోవా చెప్పిన విషయాలు. 'నీవు చాలా చోట్లకు
వెళ్లవలసి వుంటుంది. నీవు ఎక్కడికి వెళ్లినా ప్రాణంతో
తప్పించుకునేలా నేను చేస్తాను.'"

### రాజ్యాలకు సంబంధించిన యెహోవా సందేశాలు

46 ప్రవక్తయైన యిర్మీయాకు ఈ సందేశాలు
వచ్చాయి. ఆ సందేశాలు వివిధ దేశాలకు
సంబంధించి ఉన్నాయి.

### ఈజిప్టును గురించిన వర్తమానం

2ఈ వర్తమానం ఈజిప్టు* దేశాన్ని గురించి చెప్పి
బడినది. అది ఫరోనెకో సైన్యానికి సంబం ధించినది.
నెకో ఈజిప్టు రాజు. అతని సైన్యం కర్కెమీషు అనే
పట్టణం వద్ద ఓడింపబడింది. కర్కెమీషు యూఫ్రటీసు
నదీ తీర పట్టణం. బబులోను రాజైన నెబుకద్నెజరు
ఫరోనెకో సైన్యాన్ని కర్కెమీషు వద్ద ఓడించాడు.
అప్పుడు యూదా రాజైన యెహోయాకీము పాల
నలో నాల్గవ సంవత్సరం గడుస్తూ ఉంది. రాజైన
యెహోయాకీము యోషీయా కుమారుడు.
ఈజిప్టుకు సంబంధించిన యెహోవా సందేశం ఇలా
ఉంది:

3 "మీ చిన్న, పెద్ద డాళ్లను తీసుకోండి. యుద్ధానికి
నడవండి.
4 గుర్రాలను సిద్ధం చేయండి. సైనికులారా, మీరు
గుర్రాలను ఎక్కండి. యుద్ధానికై మీమీ సంకేత
స్థలాలకు వెళ్లండి. మీ శిరస్త్రాణాలను పెట్టు
కోండి. మీ ఈటెలకు పదును పెట్టండి. మీ
కవచాలను ధరించండి.
5 నేనేమిటి చూస్తున్నాను? ఆ సైన్యం భయ
పడింది! సైనికులు పారిపోతున్నారు. ధైర్య
వంతులైన వారి సైనికులు ఓడింపబడ్డారు. వారు
తత్తరపడి పారిపోతున్నారు. వారు వెనుదిరిగి
చూడకుండా పోతున్నారు. ఎటు చూచినా
భయం." యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
6 "వేగంగా పరుగెత్తేవారు, బలవంతులు కూడా
తప్పించుకోలేరు. వారు తూలి పడిపోతారు.
ఉత్తరదేశంలో యూఫ్రటీసు నదీ తీరాన ఇది
జరుగుతుంది.
7 నైలు నదిలా ఆ వచ్చేది ఎవరు? పరవళ్లు
తొక్కుతూ ప్రవహించే ఆ మహానదిలా వచ్చేది
ఎవరు?
8 పొంగి ప్రవహించే నైలు నదిలా వచ్చేది ఈజిప్టు
దేశమే. మహా వేగంతో ప్రవహించే మహా నదిలా
వచ్చేది ఈజిప్టు దేశమే. 'నేను వచ్చి భూమిని
కప్పివేస్తాను. నేను నగరాలను, వాటి నివాసులను
నాశనం చేస్తాను' అని ఈజిప్టు అంటున్నది.
9 గుర్రపు రౌతుల్లారా, యుద్ధానికి కదలండి. సారథు
ల్లారా, శరవేగంతో రథాలు తోలండి. యోధు
ల్లారా ముందుకు పదండి. కూషు, పూతు సైనికు
లారా, మీ డాళ్లను చేబూనండి. లూదీయులారా,
మీ విల్లంబులు వాడండి.
10 "కాని ఆ రోజు సర్వశక్తిమంతుడైన మన
యెహోవా గెలుస్తాడు! ఆ సమయంలో
ఆయన శత్రువులకి తగిన శిక్ష ఆయన విధిస్తాడు.
యెహోవా శత్రువులు వారికి అర్హమైన శిక్ష
అనుభవిస్తారు. తన పని పూర్తి అయ్యేవరకు
కత్తి హతమారుస్తుంది. దాని రక్తదాహం తీరేవరకు
కత్తి సంహరిస్తుంది. ఇది జరుగుతుంది. ఎందు
వల్లనంటే సర్వశక్తిమంతుడైన మన యెహో
వాకు ఒక బలి జరగవలసి వుంది. ఆ బలి
ఈజిప్టు సైన్యమే! అది ఉత్తర దేశాన యూఫ్ర
టీసు నది ఒడ్డున జరుగుతుంది.
11 "ఈజిప్టు, గిలియాదు వరకు వెళ్లి మందు
తెచ్చుకో. నీవు మందులనేకం తయారుచేస్తావు,
అయినా అవి నీకు ఉపయోగపడవు. నీ
గాయాలు మానవు.
12 నీ రోదనను దేశాలు వింటాయి. నీ ఏడ్పు ప్రపంచ
మంతా వినపడుతుంది. ఒక ధైర్యశాలి మరియొక
ధైర్యశాలి అయిన యోధునిపై పడతాడు. ఆ
యోధులిద్దరూ కలిసి కింద పడతారు."

13ప్రవక్తయైన యిర్మీయాకు యెహోవా ఈ వర్త
మానం అందజేశాడు. ఈజిప్టును ఎదుర్కోవటానికి
కదలివచ్చే నెబుకద్నెజరును గురించి ఈ వర్తమానం
ఇవ్వబడింది.

14 "ఈ సందేశాన్ని ఈజిప్టులో తెలియజెప్పండి.
మిగ్దోలు నగరంలో బోధించండి. ఈ సందేశాన్ని
నొపు (మెంఫిస్)లోను, తహపనేసులోను
ప్రచారం చేయండి: 'యుద్ధానికి సిద్ధపడండి.
ఎందువల్లనంటే మీ చుట్టూవున్న ప్రజలు కత్తిచే
చంపబడుతున్నారు.'
15 "ఈజిప్టూ నీ బలమైన యోధులెందుకు చంప
బడతారు? వారు నిలువలేరు. ఎందువల్లనంటే
యెహోవా వారిని నేలకు పడదోస్తాడు!

**ఈజిప్టు** ఇప్పటి ఈజిప్టు ఆనాటి ఐగుప్తు. ఆ కాలంలో
ఐగుప్తు అని పిలవబడేది.

16 ఆ సైనికులు పదేపదే తూలిపోతారు. వారొకరి మీద మరొకరు పడతారు. వారు, 'లేవండి, మనం మన స్వంత ప్రజల వద్దకు వెళదాం. మనం మన మాతృభూమికి వెళ్లిపోదాము. మన శత్రువు మనల్ని ఓడిస్తున్నాడు. మనం ఇక్కడి నుంచి వెళ్లిపోవాలి' అని అంటారు.

17 వారి స్వస్థలాలలో ఆ సైనికులు, 'ఈజిప్టు రాజైన ఫరో కేవలం ఆడంబరమైన వాడు; అతని ప్రభావం అయిపోయింది, అని అనుకుంటారు.'"

18 ఈ వర్తమానం రాజునుండి వచ్చినది. సర్వశక్తి మంతుడైన యెహోవాయే ఆ రాజు. "నిత్యుడనగు నా తోడుగా ప్రమాణము చేపుతున్నాను. ఒక మహాశక్తివంతుడైన నాయకుడు వస్తాడు. తాబోరు కొండలా, సముద్రతీరానగల కర్మెలు పర్వతంలా అతడు గొప్పవాడై ఉంటాడు.

19 ఈజిప్టు ప్రజలారా, మీ వస్తువులు సర్దుకోండి. బందీలై పోవటానికి సిద్ధమవండి. ఎందువల్లనంటే, నొపు (మెంఫిస్) నగరం శిథిలమై నిర్మానుష్యమవుతుంది. నగరాలు నాశనమవుతాయి. వాటిలో ఎవరూ నివసించరు!

20 "ఈజిప్టు ఒక అందమైన ఆవులా ఉంది. కాని ఉత్తరాన్నుండి ఒక జోరీగ దాన్ని ముసరటానికి వస్తున్నది.

21 ఈజిప్టు సైన్యంలో కిరాయి సైనికులు కొవ్విన కోడెదూడల్లా ఉన్నారు. అయినా వారంతా వెన్నుజూపి పారిపోతారు. శత్రు దాడికి వారు తట్టుకోలేరు. వారి వినాశన కాలం సమీపిస్తూ ఉన్నది. వారు అనతి కాలంలోనే శిక్షింపబడుతారు.

22 బుసకొట్టుతూ పారిపోవటానికి ప్రయత్నించే పాములా ఈజిప్టు వుంది. శత్రువు మిక్కిలి దరిజేరుతూ వున్నాడు. అందుచే ఈజిప్టు సైన్యం పారిపోవటానికి ప్రయత్నిస్తూ ఉంది. గొడ్డళ్లు చేబట్టి శత్రువులు ఈజిప్టు మీదికి వస్తున్నారు. వారు "చెట్లను నరికే మనుష్యుల్లా వున్నారు."

23 యెహోవా ఈ విషయాలు చెప్పుచున్నాడు, "ఈజిప్టు అరణ్యాన్ని (సైన్యం) శత్రువు నరికి వేస్తాడు. అరణ్యంలో (సైన్యం) చెట్లు (సైనికులు) చాలా వున్నాయి. కాని అది నరికివేయబడుతుంది. మిడుతలకంటె ఎక్కువగా శత్రు సైనికులున్నారు. లెక్కకు మించి శత్రు సైనికులున్నారు.

24 ఈజిప్టుకు తలవంపులవుతుంది. ఉత్తరాన్నుండి వచ్చే శత్రు సైన్యం వారిని ఓడిస్తుంది."

25ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడైన
యెహోవా ఇలా చెప్పుచున్నాడు, "అతి త్వరలో
థేబెసు దేవతయైన ఆమోనును* నేను శిక్షింప
నున్నాను. నేను ఫరోను, ఈజిప్టును మరియు దాని
దేవతలను శిక్షిస్తాను. ఈజిప్టు రాజులను నేను శిక్షిస్తాను.
ఫరో మీద ఆధారపడి, అతన్ని నమ్మిన ప్రజలను
కూడా నేను శిక్షిస్తాను. 26వారి శత్రువుల చేతుల్లో
వారంతా ఓడిపోయేలా నేను చేస్తాను. ఆ శత్రువులు
వారిని చంపగోరుతున్నారు. నేనా ప్రజలను బబులోను
రాజైన నెబుకద్నెజరుకు, అతని సేవకులకు అప్పగి
స్తాను. చాల కాలం ముందట ఈజిప్టు శాంతియుతంగా
వుండేది. ఈ కష్ట కాలాలు అయిన తర్వాత ఈజిప్టు
మరలా శాంతంగా వుంటుంది." ఈ విషయాలను
యెహోవా చెప్పాడు.

### ఉత్తర ఇశ్రాయేలు రాజ్యానికి ఒక వర్తమానం

27 "నా సేవకుడవైన యాకోబూ,* భయపడవద్దు. ఇశ్రాయేలూ, బెదరవద్దు. ఆ దూర ప్రాంతాల నుండి నేను మిమ్మల్ని తప్పక రక్షిస్తాను. వారు బందీలుగా వున్న దేశాలనుండి మీ పిల్లల్ని కాపాడతాను. యాకోబుకు మరల శాంతి, రక్షణ కల్పించబడతాయి. అతనిని ఎవ్వరూ భయపెట్టలేరు."

28 యెహోవా ఇలా అంటున్నాడు, "నా సేవకుడవైన యాకోబూ, భయపడకు. నేను నీతో వున్నాను. నిన్ను అనేక ఇతర దేశాలకు నేను పంపియున్నాను. ఆ రాజ్యాలన్నిటినీ నేను సర్వనాశనం చేస్తాను. కాని నిన్ను నేను పూర్తిగా నాశనం కానీయను. నీవు చేసిన నీచమైన కార్యాలకు నీవు తప్పక శిక్షింపబడాలి. కావున నీవు శిక్ష తప్పించుకొనేలా నిన్ను వదలను. నిన్ను క్రమశిక్షణలో పెడతాను. అయినా నీ పట్ల న్యాయుపరమైన ఉదారంతో మాత్రమే ఉంటాను."

### ఫిలిష్తీయుల గురించిన సందేశం

47 ప్రవక్తయైన యిర్మీయాకు యెహోవా నుండి ఈ సందేశం వచ్చింది. ఆ వర్తమానం ఫిలిష్తీయులను గురించినది. గాజా నగరంపై ఫరో దాడి చేయటానికి ముందుగా ఈ వర్తమానం వచ్చింది.

---

**ఆమోను** చాలా శతాబ్దాలవరకు ఈజిప్టులో ఆమోను అతి ముఖ్యమైన దేవుడు. ఈ భవిష్య ప్రకటన జరిగే నాటికి ఉత్తర ఈజిప్టులో ఆ దేవుడు మిక్కిలిగా ఆరాధింపబడలేదు. కాని దక్షిణ ఈజిప్టులో, ముఖ్యంగా రాజధాని నగరమైన థేబెసు ప్రాంతంలో ఇంకా ఈ దేవుడు అతి ముఖ్యుడై యున్నాడు.

**యాకోబు** ఇశ్రాయేలు యొక్క మరోపేరు. ఆదికాండం 32:22-28 చూడండి.

2 యెహోవా ఇలా చెపుతున్నాడు, "చూడు, శత్రు
సైనికులు ఉత్తరాన సమకూడుతున్నారు. శర
వేగంతో పొంగి ప్రవహించే నదిలా వారు వస్తారు.
దేశాన్నంతా ఒక మహా వెల్లువలా వారు ఆవరిస్తారు.
వారు అన్ని పట్టణాలను, వాటి ప్రజలను చుట్టు
ముడతారు. దేశంలో ప్రతి పౌరుడూ సహాయం
కొరకు ఆక్రందిస్తాడు.
3 "పరుగెత్తే గుర్రపు డెక్కల చప్పుడు వారు
వింటారు. రథాల చప్పుడు వారు వింటారు. కదిలే
చక్రాల రణగొణ ధ్వని వారు వింటారు.
తండ్రులు తమ పిల్లలకు రక్షణ కల్పించలేరు.
ఆ తండ్రులు సహాయం చేయలేనంత బలహీనుల
వుతారు.
4 "ఫిలిష్తీయులనందరినీ యెహోవా త్వరలో
నాశనం చేస్తాడు! తూరు, సీదోనులకు సహాయ
పడే మిగిలిన వారందరినీ నాశనం చేస్తాడు. ఫిలిష్తీ
యులను యెహోవా అతి త్వరలో నాశనం
చేస్తాడు. క్రేతు* ద్వీపవాసులలో మిగిలిన
వారందరినీ ఆయన నాశనం చేస్తాడు.
5 గాజా ప్రజలు దుఃఖంతో తమ తలలు గొరిగించు
కుంటారు. అష్కెలోను ప్రజల నోరు నొక్కబడు
తుంది. లోయలో మిగిలిన ప్రజలారా, ఎంత
కాలం మిమ్మల్ని మీరు గాయపర్చుకుంటారు?*
6 "ఓ యెహోవా ఖడ్గమా, నీవు ఎంతకాలము
పోరాడెదవు. నీ ఒరలోనికి నీవు వెళ్లుము! ఆగిపో!
శాంతించు' అని మీరంటారు.
7 కాని యెహోవా ఖడ్గం ఏ విధంగావిశ్రాంతి తీసి
కుంటుంది? యెహోవా దానికి ఒక ఆజ్ఞ
ఇచ్చాడు. అష్కెలోను నగరాన్ని, సముద్ర
తీరాన్ని ఎదుర్కొనమని యెహోవా దానికి ఆజ్ఞ
ఇచ్చాడు."

**మోయాబును గురించిన వర్తమానం** ఈ వర్తమానం
48 మోయాబు దేశాన్ని గురించినది. ఇశ్రాయేలు
దేవుడు, సర్వ శక్తిమంతుడు అయిన
యెహోవా ఇలా చెపుతున్నాడు,

"నెబో పర్వతానికి* చేటు కలుగుతుంది. నెబో
పర్వతం నాశనమవుతుంది. కిర్యతాయిము
పట్టణం అణగ దొక్కబడుతుంది. అది పట్టుబడు
తుంది. బలమైన దుర్గం అణగ దొక్కబడుతుంది.
అది పడగొట్టబడి చిందర వందర చేయబడు
తుంది.
2 మోయాబు మరెన్నడూ ప్రశంసించబడదు.
మోయాబును ఓడించటానికి హెష్బోను పట్టణ
వాసులు కుట్రపన్నుతారు. 'రండి. మనమా
దేశాన్ని రూపుమాపుదాము' అని వారంటారు.
మద్మేనా, నీవు కూడ మాట్లాడకుండా చేయ
బడతావు. కత్తి నిన్ను వెంటాడుతుంది.
3 హొరొనయీము నుండి వచ్చే ఆక్రందనలు
విను. అవి కలవరపాటుకు, వినాశనానికి సంబం
ధించిన కేకలు.
4 మోయాబు ధ్వంసం చేయబడుతుంది. దాని
చిన్న పిల్లలు సహాయం కొరకు విలపిస్తారు.
5 మోయాబు ప్రజలు లూహీతు మార్గంలో
వెళ్తున్నారు. వారు మార్గమధ్యంలో మిక్కిలిగా
విలపిస్తున్నారు. హొరొనయీము పట్టణ
మార్గంలో ప్రయాసతోను, బాధతోను కూడిన
రోదన వినిపించగలదు.
6 పారిపొండి! మీ ప్రాణరక్షణకై పారిపొండి! ఎడా
రిలో అరుహ వృక్షం* వీచినట్లు మీరు పారిపొండి.
7 "మీరు చేసిన వస్తువులలోను, మీ భాగ్యంలోనే
మీరు విశ్వసిస్తారు. కావున మీరు పట్టుబడతారు.
కెమోషు* దైవం బందీగా కొనిపోబడతాడు.
అతనితో పాటు అతని యాజకులు, అధికారులు
కూడ తీసికొని పోబడతారు.
8 వినాశనకారుడు ప్రతి పట్టణం మీదికి వస్తాడు.
ఒక్క పట్టణం కూడ తప్పించుకోలేదు. లోయ
శిథిలము చేయబడుతుంది. ఉన్నత మైదానం
నాశనము చేయబడుతుంది. యెహోవా ఇది
జరుగుతుందని చెప్పినాడుగాన ఇది జరిగి తీరు
తుంది.
9 మోయాబు పొలాలపైన ఉప్పు* చల్లుము. దేశం
వట్టి ఎడారి అయిపోతుంది. మోయాబు పట్ట
ణాలు ఖాళీ అవుతాయి. వాటిలో ఎవ్వరూ
నివసించరు.

---

**క్రేతు** "కఫ్తోరు" ద్వీపమని దీని శబ్దార్థం. దీన్ని కొన్నిసార్లు క్రేతు అని, మరికొన్ని సార్లు కుప్ర అని అనటం కద్దు. బైబిలు ప్రకారం ఫిలిష్తీయులు ప్రథమంగా కఫ్తోరునుండి వచ్చారు.

**ఎంతకాలం ... గాయపర్చుకుంటారు** తమ విచారాన్ని సూచించేందుకు ప్రజలు తమ శరీరాలను చీరుకొని గాయ పర్చుకునేవారు.

**నెబో పర్వతం** ఇశ్రాయేలుకు తూర్పునవున్న మోయాబు దేశంలో ఒక పర్వతం.

**అరుహ వృక్షం** ఇది ఒకరకం చెట్టు. మోయాబు దేశంలో ఒక నగరం పేరువలె ఇది ఉచ్చరింపబడుతుంది. ఇది ద్వంద్వార్థంగా వాడబడిన పదం.

**కెమోషు** కెమోషు మోయాబీయుల దైవం. అమ్మోనీ యులు కూడా దీనిని ఆరాధించారు. ఈ దేవతారాధన రాజైన సొలొమోను ద్వారా యెరూషలేములోనికి వచ్చింది. కాని యోషీయా దానిని నిర్మూలించాడు.

**ఉప్పు** ఇది కూడ ద్వంద్వార్థంగా వాడబడిన పదమే. హెబ్రీలో దీని సరియైన అర్థం మనకు తెలియదు.

10 ఎవ్వరేగాని యెహోవా చెప్పినట్లు చేయక
పోయినా, వారిని చంపటానికి తన కత్తిని వినియో
గించకపోయినా, ఆ వ్యక్తికి కీడు మూడుతుంది.*
11 “మోయాబు ఇప్పటి వరకు ఆపద ఎరుగదు.
కుదురుకోడానికి నిలకడగా పెట్టిన ద్రాక్షరసంవలె
మోయాబు ఉంది. మోయాబు ఇంతవరకు ఒక
జాడీనుండి మరొక దానిలోకి పోయబడలేదు.
అది నిర్బంధించబడి ఇతర దేశానికి కొని
పోబడలేదు. పూర్వంవలెనే అది ఇప్పుడూ రుచి
గానే వున్నాడు. అతని సువాసన మారలేదు.”
12 యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు,
“కాని మిమ్మల్ని మీ జాడీలలో* నుంచి బయట
పోయుటకు అతి త్వరలోనే నేను మనుష్యులను
పంపుతాను. ఆ మనుష్యులు మోయాబు యొక్క
జాడీలను ఖాళీ చేస్తారు. తరువాత ఆ జాడీలను
వారు పగులగొడతారు.”

13పిమ్మట మోయాబు ప్రజలు తమ బూటకపు
దైవం కెమోషు పట్ల సిగ్గు చెందుతారు. ఇశ్రాయేలు
ప్రజలు బేతేలు* నందు ఆ బూటకపు దైవాన్ని
నమ్మారు. కాని ఆ బూటకపు దైవం వారికి సహాయం
చేయనప్పుడు ఇశ్రాయేలీయులు చాలా కలత
చెందారు. మోయాబు కూడా అలా అవుతాడు.

14 “‘మేము మంచి సైనికులం. మేము యుద్ధవీరులం’
అని మీరు చెప్పుకోలేరు.
15 శత్రువు మోయాబును ఎదుర్కొంటాడు.
శత్రువు ఆ పట్టణాలలో చొరబడి నాశనం
చేస్తాడు. మోయాబు యువ వీరులంతా నరక
బడతారు.” ఈ వర్తమానం రాజునుండి వచ్చి
నది. ఆ రాజు పేరు సర్వశక్తిమంతుడైన
యెహోవా.
16 “మోయాబు అంతం దగ్గర పడింది. మోయాబు
త్వరలో నాశనమై పోతుంది.
17 మోయాబు చుట్టుపట్ల నివసించు ప్రజలారా
ఆ దేశంకొరకు విలపించండి. మోయాబు ఎంత
ప్రసిద్ధి గాంచినవాడో మీకు తెలుసు. అందువల్ల
వానికొరకు మీరు విచారించండి. ‘అధిపతుల
అధికారం విరిగిపోయింది. మోయాబు కీర్తి ప్రతి
ష్ఠలు పోయాయి’ అని మీరు చెప్పండి.
18 "దీబోను వాసులారా గొప్పవైన మీ స్థానాలనుండి
దిగిరండి. నేలమీద మట్టిలో కూర్చోండి.
ఎందువల్లనంటే, మోయాబును నాశనం చేసిన
శత్రువు వస్తున్నాడు. అతడు మీ బలమైన
నగరాలను నాశనం చేస్తాడు.
19 “అరోయేరు నివాసులారా, దారి పక్కన నిలబడి
కనిపెట్టుకొని ఉండండి. పారిపోయే మనిషిని
చూడండి. పారిపోయే స్త్రీని చూడండి. ఏమి
జరిగినందో వారిని అడగండి.
20 “మోయాబు పాడుపడి, అవమానముతో నిండి
పోతుంది. మోయాబు ఏకరీతిగా విలపిస్తుంది.
మోయాబు పాడుపడిపోయిందని అర్నోను
నది* వద్ద ప్రకటించండి.
21 ఉన్నత మైదానంలోని ప్రజలు శిక్షింపబడ్డారు.
తీర్పు హోలోనుకు వచ్చింది. యాహసు,
మేఫాతు,
22 దీబోను, నెబో, బేత్-దిబ్లాతయీము,
23 కిర్యతాయిము, బేత్గామూలు, బేత్మెయోను,
24 కెరీయోతు మరియు బొస్రా పట్టణాలకు తీర్పు
ఇవ్వబడింది. మోయాబుకు సమీపాన, దూరాన
వున్న పట్టణాలన్నిటికి శిక్ష విధించబడింది.
25 మోయాబు బలం తగ్గిపోయింది. మోయాబు
చేయి విరిగిపోయింది.” ఈ విషయాలు
యెహోవా చెప్పాడు.
26 “యెహోవా కంటె తానే ముఖ్యమైనట్లు
మోయాబు భావించటం జరిగింది. కావున, తాగి
నవాని మాదిరి తూలిపోయే వరకు మోయా
బును శిక్షించండి. మోయాబు తాను కక్కిన
పదార్థంలోపడి దొర్లుతాడు. ప్రజలు మోయా
బును చూచి హేళన చేస్తారు.
27 “మోయాబూ, నీవు ఇశ్రాయేలును చూచి హేళన
చేశావు. ఇశ్రాయేలు ఒక దొంగల గుంపు చేతికి
చిక్కింది. నీవు ఇశ్రాయేలును గురించి మాట్లాడిన
ప్రతిసారీ నీవు తలపంకించి, ఇశ్రాయేలు కంటె
నీవే మెరుగైనట్లు ప్రవర్తించావు.
28 మోయాబు ప్రజలారా, మీ పట్టణాలను వదిలి
పెట్టండి. వెళ్లి గుట్టల్లో నివసించండి. గుహ
ద్వారంలో గూడు చేసికొనే గువ్వల్లా ఉండండి.”
29 “మోయాబు గర్వాన్ని గురించి విన్నాము. అతడు

---

**ఎవ్వరేగాని ... మూడుతుంది** మోయాబీయులను చంపమని యెహోవా చేత ఆజ్ఞాపించబడిన మోయాబీయుల శత్రువుల గురించి ప్రవక్త మాట్లాడు తున్నాడు.

**జాడీలు** బహుశః దీని అర్థం మోయాబులోని పట్టణాలు కావచ్చు.

**బేతేలు** బేతేలు పట్టణమందు రాజైన యరొబాము నిర్మించిన గుడి అని దీని అర్థం. (చూడండి: రాజుల మొదటి గ్రంథం 12:28-33). అక్కడి ప్రజలు దేవునినింకా వక్రమార్గంలో పూజిస్తున్నారా అనేది స్పష్టంగా తెలియదు. లేదా కనానీయుల బూటకపు దేవత ఏల్ లేక బయలును పూజిస్తున్నదీ తెలియదు.

**అర్నోను నది** మోయాబులో అర్నోను ఒక ముఖ్యమైన నది.

మిక్కిలి గర్విష్ఠి. తాను చాలా ముఖ్యమైన వానిలా అతడు తలంచినాడు. అతడు ఎల్లప్పుడూ గొప్పలు చెప్పుకొనేవాడు. అతడు మహా గర్విష్ఠి.”

30 యెహోవా ఇలా చెపుతున్నాడు, “మోయాబు ఏ కారణమూ లేకుండానే కోపం తెచ్చు కొంటాడు, స్వంత గొప్పలు చెప్పుకుంటాడని నాకు తెలుసు. కాని అతని గొప్పలన్నీ అబద్ధాలు. అతను చెప్పేవి చేయలేడు.

31 కావున, మోయాబు కొరకు నేను ఏడుస్తు న్నాను. మోయాబులో ప్రతి పౌరుని కొరకు విచారిస్తున్నాను. కీర్హెరెశు మనుష్యుల నిమిత్తం నేను బాధపడుతున్నాను.

32 యాజెరు ప్రజలతో కలిసి నేను కూడ యాజెరు కొరకై దుఃఖిస్తున్నాను! సిబ్మా, గతంలో నీ ద్రాక్షలతలు సముద్ర తీరం వరకు వ్యాపించాయి. అవి యాజెరు పట్టణం వరకు వ్యాపించాయి. కాని వినాశనకారుడు నీ పంటను, ద్రాక్ష పండ్లను తీసికొన్నాడు.

33 మోయాబులో గల విశాలమైన ద్రాక్ష తోటల నుండి సుఖసంతోషాలు మాయమైనాయి. గానుగల నుండి ద్రాక్షరసం కారకుండా ఆపాను. రసం తీయటానికి ద్రాక్షకాయలను తొక్కే వారిలో ఆ పాటలు ఆగిపోయాయి. వారి అల రింతలు అంతమయ్యాయి.

34“హెష్బోను మరియు ఎలాలే పట్టణవాసులు
కేకలు పెడుతున్నారు. వారి రోదన దూరానగల
యాహసు పట్టణం వరకు వినిపిస్తూ ఉంది. వారి కేక
సోయరు నుండి దూరానగల హొరొనయీము,
ఎగ్లాత్షాలిషా వరకు వినవచ్చింది. నిమ్రీములో నీరు
సహితం ఇంకిపోయింది. 35మోయాబు ఉన్నత స్థలా
లలో దహన బలులు అర్పించటాన్ని నిలుపు చేస్తాను.
వారు తమ దేవతలకు ధూపం వేయకుండా
ఆపివేస్తాను.” ఇవి యెహోవా చెప్పిన విషయాలు.
36“మోయాబు కొరకు నేను మిక్కిలి భిన్నుడనై
యున్నాను. వేణువుపై విషాద గీతం ఆలపించినట్లు
నా హృదయం విలపిస్తున్నది. కీర్హెరెశు ప్రజల
విషయంలో కూడా నేను విచారిస్తున్నాను. వారి ధన
ధాన్యాలన్నీ తీసికొని పోబడ్డాయి. 37ప్రతివాని తల
గొరగబడింది. ప్రతివాని గడ్డం తీసివేయబడింది. గాయ
పర్చబడటంతో ప్రతివాని చేతుల నుండి రక్తం కారు
తున్నాయి.* ప్రతివాడూ తన మొలచుట్టూ విషాద
సూచక బట్ట కట్టుకున్నాడు. 38మోయాబులో ప్రతి
చోట చనిపోయిన వారికోసం ప్రజలు దుఃఖిస్తున్నారు.
వారు ప్రతి ఇంటిపైనా, జన సమ్మర్ద ప్రదేశాలలోనూ
అలా విలపించారు. ఒక ఖాళీ జాడీని పగులగొట్టిన
విధంగా నేను మోయాబును విచ్ఛిన్నం చేయటంతో
విషాదం అలుముకున్నది.” యెహోవా ఈ మాటలు
చెప్పాడు.
39“మోయాబు విచ్ఛిన్న మవటంతో ప్రజలు ఏడు
స్తున్నారు. మోయాబు లొంగిపోయాడు. మోయా
బుకు తలవంపులయ్యాయి. మోయాబును చూచి
ప్రజలు ఎగతాళి చేస్తారు. కాని అక్కడ జరిగిన విష
యాలవల్ల ప్రజలు భయంతో నిండిపోతారు.”

40 యెహోవా ఇలా చెపుతున్నాడు, “చూడండి! ఆకాశం నుండి పక్షిరాజు (శత్రువు) దిగు తున్నాడు. అతను తన రెక్కలను మోయాబు మీదికి చాపుతున్నాడు.

41 మోయాబు పట్టణాలు పట్టుబడతాయి. బల మైన దుర్గాలు ఓడింపబడతాయి. ఆ సమ యంలో మోయాబు సైనికులు ప్రసవించే స్త్రీలా భయాందోళనలు చెందుతారు.

42 మోయాబు రాజ్యం నాశనం చేయబడుతుంది. ఎందువల్లనంటే వారు యెహోవా కంటె తమను ముఖ్యమైన వారిగా తలంచారు.”

43 యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు, “మోయాబు ప్రజలారా, మీ కొరకై భయం, లోతైన గోతులు, ఉరులు* పొంచివున్నాయి.

44 ప్రజలు భయపడి పారిపోతారు. పరుగెత్తి లోతు గోతులల్లో పడిపోతారు. ఎవడైనా ఆ లోతు గోతుల నుండి పైకివస్తే అతడు ఉరిలో చిక్కు కుంటాడు. మోయాబుకు శిక్షా సంవత్సరాన్ని తీసికొనివస్తాను.” ఈ విషయాలన్నీ యెహోవా చెప్పాడు.

45 “బలవంతుడైన శత్రువునుండి జనం పారి పోయారు. వారు రక్షణకై హెష్బోను పట్టణానికి పారిపోయారు. అయినా అక్కడ రక్షణ దొరకలేదు. హెష్బోనులో అగ్ని ప్రజ్వరిల్లింది. సీహోను పట్టణంలో* నిప్పు చెలరేగింది. అది మోయాబు నాయకులను దహించివేస్తున్నది. అది గర్విష్ఠులను కాల్చివేస్తున్నది.

46 మోయాబూ, నీకు చెడు దాపురించింది. కెమోషు ప్రజలు నాశనం చేయబడుతున్నారు.

---

**ప్రతివాని … కారుతున్నాయి** చనిపోయిన వారిపట్ల తమ దుఃఖం ప్రకటించటానికి ప్రజలివన్నీ చేస్తారు.

**మీ కొరకై … ఉరులు** హెబ్రీలో ఇవి ద్వంద్వార్థంగా వాడబడ్డాయి. పహద్, పహత్, పహ అనునవి హెబ్రీ మాటలు.

**సీహోను పట్టణం** హెష్బోనుకే సీహోనుని అని ఆలంకా రికంగా పేరు పెట్టి పిలిచారు. చూడండి సంఖ్యా కాండము 21:25-30.

నీ కుమారులు, కుమార్తెలు చెరపట్టబడి బందీ
లుగా కొనిపోబడుతున్నారు.

47"మోయాబు ప్రజలు బందీలుగా కొనిపోబడ
తారు. కాని రాబోయే కాలంలో మోయాబీయులను
నేను వెనుకకు తీసికొని వస్తాను." ఇది యెహోవా
సందేశం. ఇంతటితో మోయాబీయులపై తీర్పు
సమాప్తం.

## అమ్మోనును గురించిన సందేశం

49 ఈ వర్తమానం అమ్మోనీయులను గురించి
నది. యెహోవా ఇలా చెపుతున్నాడు,
"అమ్మోను ప్రజలారా, ఇశ్రాయేలు ప్రజలకు
పిల్లలు లేరని మీరు అనుకొంటున్నారా? తల్లి
తండ్రులు చనిపోతే భూమిని స్వతంత్రించు
కొనుటకు అక్కడ పిల్లలు లేరని మీరనుకొంటు
న్నారా? బహుశః అందువల్లనే మల్కోము*
గాదు* రాజ్యాన్ని తీసికొన్నాడా?"
2 యెహోవా ఇలా చెపుతున్నాడు, "రబ్బోతు
అమ్మోను* ప్రజలు యుద్ధనాదాలు వినే
సమయం వస్తుంది. రబ్బోతు-అమ్మోను నాశన
మవుతుంది. అది కూలిపోయిన భవనాలతో
నిండిన ఒక కొండలా ఉంటుంది. దాని చుట్టూ
ఉన్న పట్టణాలు తగులబడతాయి. ఆ జనం ఇశ్రా
యేలీయులను తమ రాజ్యాన్ని వదిలి పొమ్మని
వత్తిడి చేశారు. కాని తర్వాత ఇశ్రాయేలు ప్రజలు
తిరిగి వారిని దేశం వదిలి పొమ్మని వారిని బల
వంతం చేస్తారు." మరియు వారి భూమిని వారి
స్వంతము చేసుకుంటారు. యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
3 "హెష్బోను ప్రజలారా, విలపించండి! ఎందు
వల్లనంటే, హాయి పట్టణం పాడైపోయింది.
రబ్బోతు – అమ్మోను మహిళల్లారా, విలపించండి!
విషాద సూచకంగా మీరు నారబట్టలు ధరించి
శోకించండి. రక్షణ కొరకు నగరానికి పరుగెత్తండి.
ఎందువల్లనంటే, శత్రువు మీ మీదికి వస్తున్నాడు.
వారు మల్కోము దైవాన్ని తీసికొనిపోతారు. వారు
మల్కోము యాజకులను, అధికారులను చెర
పట్టుతారు.
4 నీవు నీ బలాన్ని గురించి గొప్పలు చెప్పు
కుంటావు. కాని నీవు నీ బలాన్ని కోల్పోతున్నావు.
నీ డబ్బు నిన్ను రక్షిస్తుందని నీవు నమ్మావు.
నిన్ను ఎదిరించటానికి ఏ ఒక్కడూ కనీసం
ఆలోచన కూడా చేయడని నీవనుకున్నావు."
5 కాని సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెప్పు
చున్నాడు, "నలుమూలల నుండి నేను మీకు
కష్టాలు తెచ్చిపెడతాను. మీరంతా పారిపోతారు.
మిమ్మల్నందరినీ మరల ఎవ్వరూ కూడదీయ
లేరు."

6"అమ్మోనీయులు బందీలుగా కొనిపోబడతారు.
కాని అమ్మోనీయులను నేను వెనుకకు తీసికొనివచ్చే
సమయం వస్తుంది." ఈ వర్తమానం యెహోవా నుండి
వచ్చినది.

## ఎదోమును గూర్చిన సందేశం

7 ఈ వర్తమానం ఎదోమును గురించినది. సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇలా చెపుతున్నాడు,
"తేమాను పట్టణంలో జ్ఞానం ఏమాత్రం లేదా?
ఎదోములోని జ్ఞానులు మంచి సలహా ఇవ్వలేక
పోతున్నారా? వారి జ్ఞానాన్ని వారు
కోల్పోయారా?
8 దదానులో నివసించే ప్రజలారా, పారిపొండి! దాగు
కోండి! ఎందుకంటే, నేను ఏశావును* తాను
చేసిన చెడ్డ పనులు కారణంగా శిక్షిస్తాను.
9 మీ ద్రాక్ష తీగల నుండి పనివారు వారికి కావలసినన్ని
ద్రాక్ష కాయలను కోస్తారు. అయినా వారు కొన్ని
కాయలను చెట్లపై వదిలివేస్తారు. రాత్రిళ్లు
దొంగలు వచ్చినా వారికి కావలసిన పరి
మాణంలోనే తీసికొనిపోతారు.
10 కాని ఏశావు నుండి నేను అంతా తీసికుంటాను.
అతడు దాచుకొనే స్థలాలన్నింటినీ నేను
కనుగొంటాను. అతడు నానుండి ఏమీయు దాచ
లేడు. అతని పిల్లలు, బంధువులు, పొరుగువారు
అంతా చనిపోతారు.
11 అతని పిల్లల పట్ల శ్రద్ధ తీసికొనటానికి ఎవ్వరూ
మిగలరు. అతని విధవరాండ్రు ఒంటరిగా విడువ
బడుతారు (యెహోవానైన) నేను మాత్రమే మీ
అనాధుల ప్రాణాల్ని కాపాడుతాను. మరియు మీ
విధవరాండ్రు నామీద నమ్మకముంచుతారు."

12యెహోవా ఇంకా ఇలా చెపుతున్నాడు: "కొంత
మంది మనుష్యులు శిక్షకు అర్హులు కారు. అయినా

---

**మల్కోము** మల్కోము అమ్మోనీయుల దైవం.

**గాదు** ఇశ్రాయేలు వంశాలలో గాదు తెగవారు ఒకరు.
అమ్మోను దేశానికి దగ్గరగా యొర్దాను నదికి తూర్పున వారి
రాజ్యం వున్నది.

**రబ్బోతు–అమ్మోను** రబ్బోతు–అమ్మోను నగరం అమ్మోనీ
యుల రాజధాని. అది యొర్దాను నదికి 23 మైళ్ల తూర్పున
ఎత్తైన ప్రదేశంలో ఉంది.

**ఏశావు** ఏశావు యాకోబు యొక్క కవల సహోదరుడు.
కాని ఇక్కడ ఏశావు అనగా ఎదోము అని అర్థం. ఎందువల్ల
నంటే ఎదోము ప్రజలంతా ఏశావు సంతతివారు గనుక.

వారు బాధ అనుభవించారు. కాని ఎదోమూ, నీవు
శిక్షకు పాత్రుడవు. కావున నీవు నిజంగా శిక్షింపబడ
తావు. అర్హమైన నీ శిక్షను నీవు తప్పించుకోనలేవు.
నీవు దండించబడతావు.” 13యెహోవా చెపుతు
న్నాడు, “నా స్వయం శక్తితో నేనీ ప్రమాణం చేస్తు
న్నాను, బొస్రా నగరం నాశనమవుతుందని నిశ్చయంగా
చెపుతున్నాను. ఆ నగరం పాడుబడి రాళ్లగుట్టలా
మారిపోతుంది. ఇతర నగరాలకు ప్రజలు కీడు జరగాలని
కోరుకున్నప్పుడు ఈ నగరానికి సంభవించినట్లు
జరగాలని దీనిని ఉదహరిస్తారు. ప్రజలా నగరాన్ని అవ
మానపరుస్తారు. బొస్రా చుట్టుపట్లవున్న పట్టణాలన్నీ
శాశ్వతంగా శిథిలాలైపోతాయి.”

14యెహోవా నుండి నేనొక సందేశం విన్నాను,
దేశాలకు యెహోవా ఒక దూతను పంపాడు. ఆ
సందేశం ఇలా వుంది,

“మీ సైన్యాలను సమకూర్చుకోండి! యుద్ధానికి
సిద్ధపడండి. ఎదోము దేశం మీదికి కదలి వెళ్లండి!
15 “ఎదోమూ, నేను నీ ప్రాముఖ్యతను, ఘనతను
తగ్గించివేస్తాను. ప్రతివాడూ నిన్ను అసహ్యించు
కుంటాడు.
16 ఎదోమా, నీవు ఇతర దేశాలను బెదరగొట్టావు.
అందువల్ల నీవు గొప్పవాడివనుకున్నావు. కాని
నీవు మోసపోయావు. నీ గర్వం నిన్ను మోస
గించింది. ఎదోమూ, నీవు ఎత్తయిన కొండలపై
నివసిస్తున్నావు. పెద్ద బండలు, కొండలు రక్షణ
కల్గించే ప్రదేశాలలో నీవు నివసిస్తున్నావు. గద్ద
గూటిలా నీ ఇంటిని ఎంత ఉన్నతమైన స్థలంలో
కట్టుకున్నా నేను నిన్ను పట్టుకుంటాను. అక్కడి
నుండి నేను నిన్ను కిందికి దింపుతాను.” ఈ
విషయాలు యెహోవా చెప్పాడు.
17 “ఎదోము నాశనం చేయబడుతుంది. నాశన
మయిన నగరాన్ని చూచి ప్రజలు విస్మయం
చెంది ఆశ్చర్యంతో ఈల వేస్తారు. నాశనమయిన
నగరాలను చూచి ప్రజలు దిగ్భ్రాంతి చెంది
సంభ్రమాశ్చర్య పడతారు.
18 సొదొమ, గొమొఱ్ఱా నగరాలు, వాటి పరిసర
పట్టణాల్లా ఎదోము కూడ నాశనం చేయబడు
తుంది. అక్కడ ఎవ్వరూ నివసించరు.” ఈ
విషయాలు యెహోవా చెప్పాడు.

19“యొర్దాను నది దగ్గర దట్టమైన పొదలనుండి
కొన్నిసార్లు సింహం వస్తూ ఉంటుంది. పొలాల్లో ప్రజలు
మందవేసిన గొర్రెల మీదికి, పశువుల మీదికి వెళుతుంది.
నేను ఆ సింహంలాంటివాణ్ణి! నేను ఎదోము మీదికి
వెళతాను. నేనా ప్రజలను బెదరగొడతాను. వారిని
పారిపోయేలా నేను చేస్తాను. వారి యువకులలో
ఎవ్వడూ నన్ను ఆపలేడు. నాలా మరెవ్వడూ లేడు!
నన్నెవ్వరూ ఎదిరించలేరు. వారి గొర్రెల కాపరులలో
(నాయకులు) ఏ ఒక్కడూ నన్నెదిరించి నిలువలేడు.”

20 కావున ఎదోముకు వ్యతిరేకంగా యెహోవా
వేసిన పథకాన్ని వినండి. తేమాను వాసులకు
యెహోవా ఏమి చేయ నిశ్చయించినది వినండి
ఎదోము మంద (ప్రజలు)లో నుండి చిన్నవాటి
నన్నిటినీ శత్రువు ఈడ్చుకుపోతాడు. ఎదోము
పచ్చిక బయళ్లు వారు చేసినదాన్ని బట్టి ఆశ్చర్య
పోతాయి.
21 ఎదోము పతనంతో పుట్టిన శబ్దానికి భూమి
కంపిస్తుంది. వారి ఆక్రందన ఎఱ్ఱ సముద్రం
వరకు ప్రతిధ్వనిస్తుంది.
22 దూసుకువచ్చి తనను తన్నుకుపోయే జంతు
వుపై తిరుగుతూ ఎగిరే గద్దలా యెహోవా
ఉంటాడు. బొస్రా నగరంపై తన రెక్కలు విప్పు
తున్న గద్దవలె యెహోవా ఉన్నాడు. ఆ సమ
యంలో ఎదోము సైనికులు మిక్కిలిగా బెదరి
పోతారు. ప్రసవ వేదన పడుతున్న స్త్రీవలె వారు
భయాందోళనలతో ఆక్రందిస్తారు.

### దమస్కును గురించిన సందేశం

23ఈ వర్తమానము దమస్కు* నగరాన్ని గురించి నది:

“హమాతు, అర్పాదు పట్టణాలు భయపడ్డాయి.
దుర్వార్త వినటంవల్ల అవి భయపడ్డాయి. వారు
అధైర్యపడ్డారు. వారు వ్యాకులపడి బెదిరారు.
24 దమస్కు నగరం బలహీనమయ్యింది. ప్రజలు
పారిపోవాలనుకుంటున్నారు. ప్రజలకు దిగులు
పట్టుకున్నది. ప్రసవ స్త్రీలా ప్రజలు బాధ, వేదన
అనుభవిస్తున్నారు.
25 “దమస్కు సుఖసంతోషాలున్న ఒక నగరం.
ప్రజలింకా ఆ ‘వేడుక నగరాన్ని’ వదిలి పెట్టలేదు.
26 అందువల్ల యువకులు ఆ నగరంలోని కూడలి
స్థలాలలో చనిపోతారు. ఆ సమయంలో దాని
సైనికులందరూ చంపబడతారు.” సర్వశక్తి
మంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పి
నాడు.
27 “దమస్కు గోడలన్నిటికీ నేను నిప్పు పెడతాను.
బెన్హదదు బలమైన కోటలను అది పూర్తిగా
కాల్చివేస్తుంది.”

### కేదారు, హాసోరులను గూర్చిన సందేశం

28ఈ వర్తమానం కేదారు* వంశస్తులను

---

**దమస్కు** దమస్కుకు ఇప్పటి పేరు డెమాస్కస్.

**కేదారు** కేదారు అనేది యూదాకు ఆగ్నేయంగా ఎడారిలో నివసిస్తున్న ఒక అరబీ తెగ పేరు.

గూర్చియు, మరియు హాసోరు పాలకులను గురించి
నది. బబులోను రాజైన నెబుకద్నెజరు వారిని
ఓడించాడు.

యెహోవా ఇలా చెపుతున్నాడు, "కేదారు వంశీ
యుల మీదికి మీరు దండెత్తి వెళ్లండి. తూర్పున
వున్న ప్రజలను నాశనం చేయండి.
29 వారి గుడారాలు, గొర్రెల మందలు తీసికొని
పోబడతాయి. వారి గుడారంతో పాటు వారి
వస్తువులన్నీ తీసికొనిపోబడతాయి. వారి శత్రువు
ఒంటెలను పట్టుకుపోతాడు. 'ఎటు చూచినా
భయం, భయం' అని మనుష్యులు కేకలు
పెడతారు.
30 త్వరగా పారిపొండి! హాసోరు ప్రజలారా, దాగ
టానికి మంచి స్థలం చూడండి." ఈ వర్తమానం
యెహోవా నుండి వచ్చింది "నెబుకద్నెజరు
నీకు వ్యతిరేకంగా పథకం పన్నాడు. నిన్ను
ఓడించటానికి అతడు ఒక తెలివైన పథకాన్ని
ఆలోచించాడు.
31 "నిశ్చింతగావున్న దేశం ఒకటున్నది. దాన్ని
ఎవ్వరూ ఓడించరని ఆ రాజ్యానికి ధీమా. ఆ
దేశ రక్షణకు ద్వారాలుగాని, చుట్టూ కంచెగాని
ఏమీ లేవు. వారు ఒంటరిగా నివసిస్తారు. 'ఆ
రాజ్యాన్ని ఎదుర్కోండి!' అని యెహోవా
అంటున్నాడు.
32 వారి ఒంటెలను, విస్తారమైన పశుసంపదను
శత్రువు దొంగిలిస్తాడు. శత్రువు వారి పెద్ద మంద
లను దొంగిలిస్తాడు. చెంపలు కత్తిరించుకునే
వారిని* భూమి నలుదిక్కులకు పంపివేస్తాను.
అన్ని వైపుల నుండి వారి మీదికి మహా విపత్తులను
తీసికొని వస్తాను." ఈ సమాచారం యెహోవా
నుండి వచ్చినది.
33 "హాసోరు రాజ్యం గుంటనక్కలకు నివాసమవు
తుంది. అది శాశ్వతంగా వట్టి ఎడారిగా మారి
పోతుంది. అక్కడ మనుష్యులెవ్వరూ నివ
సించరు. ఆ స్థలంలో ఏ ఒక్కడూ నివాసం
చేయడు."

### ఏలామును గూర్చిన సమాచారం

34 యూదా రాజైన సిద్కియా పరిపాలనా
రంభంలో, ప్రవక్తయైన యిర్మీయా ఒక సందేశాన్ని
యెహోవా నుండి అందుకున్నాడు. ఆ సందేశం
ఏలాము* దేశానికి సంబంధించినది.

35 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెపు
తున్నాడు, "ఏలాము యొక్క ధనుస్సును నేను
త్వరలో విరచివేస్తాను. విల్లే ఏలాము యొక్క
బలమైన ఆయుధం.
36 నాలుగు ప్రచండ వాయువులను ఏలాము మీదికి
రప్పిస్తాను. ఆకాశపు నాలుగు మూలల నుండి
వాటిని రప్పిస్తాను. భూమి మీదకు గాలి వీచే
నలుమూలలకు ఏలాము ప్రజలను నేను చెదర
గొడతాను. ఏలాము ప్రజలు ప్రతి దేశానికి బందీ
లుగా కొనిపోబడతారు.
37 వారి శత్రువులు చూస్తూవుండగా ఏలామును
తునాతునకలు చేస్తాను. వారిని చంపజూచేవారి
సమక్షంలో ఏలామును భయపెడతాను. వారికి
మహా విపత్తులను తెచ్చిపెడతాను. నేనెంత
కోపంగా ఉన్నానో నేను వారికి చూపిస్తాను."
ఈ సమాచారం యెహోవా నుండి వచ్చినది.
"ఏలామును వెంటాడటానికి నేను కత్తిని
పంపుతాను. నేను వారందరినీ చంపేవరకు కత్తి
వారిని తరుముతుంది.
38 నా సింహాసనం ప్రతిష్ఠించి నేనే అదుపుదారుడనని
నిరూపిస్తాను. దాని రాజును, రాజ్యాధికారులను
నేను నాశనం చేస్తాను." ఇదే యెహోవా
సందేశం.
39 "కాని ఏలామును వెనక్కు తీసుకొని వచ్చి వారికి
మంచి సంభవించేటట్లుగా చేస్తాను." ఈ
సమాచారం యెహోవా నుండి వచ్చినది.

### బబులోనుకు సంబంధించిన సందేశం

50 బబులోను దేశానికి, కల్దీయులను ఉద్దేశించి
యెహోవా ఈ సందేశాన్ని ఇచ్చాడు.
యెహోవా ఈ వర్తమానాన్ని యిర్మీయా ద్వారా
చెప్పాడు.

2 "అన్ని దేశాల వారికి ఈ వర్తమానం ప్రకటించండి!
జెండా ఎగురవేసి ఈ సందేశం ప్రకటించండి!
పూర్తి సమాచారాన్ని ప్రకటిస్తూ ఇలా చెప్పండి,
'బబులోను రాజ్యం వశపర్చుకోబడుతుంది.
బేలు* దైవం అవమానపర్చబడుతుంది. మర్దూక్
మిక్కిలి భీతిల్లుతుంది. బబులోను విగ్రహాలు
అవమానపర్చబడతాయి. దాని విగ్రహ దేవతలు
భయంతో నిండిపోతాయి.'
3 ఉత్తర దేశమొకటి బబులోనును ఎదుర్కొం
టుంది. ఆ దేశం బబులోనును వట్టి ఎడారివలె
మార్చివేస్తుంది. ప్రజలెవ్వరూ అక్కడ నివ

---

**చెంపలు కత్తిరించుకునేవారి** అరబీ ప్రజలకు ఇది ఒక పేరు. వారు గడ్డానికి ఇరు పక్కలా కత్తిరించుకుంటారు.

**ఏలాము** ఏలాము అనేది బబులోనుకు తూర్పునవున్న ఒక రాజ్యం.

**బేలు** బేలు అనేది దైవానికి మరో పేరు. బబులోను దేశీయులకు ఇది ముఖ్యమైన దైవం.

సించరు. మనుష్యులు, జంతువులు అంతా
అక్కడ నుండి పారిపోతారు"
4 యెహోవా ఇలా చెపుతున్నాడు, "ఆ సమ
యంలో ఇశ్రాయేలు ప్రజలు, యూదా ప్రజలు
కలిసి ఒక్కరీతిగా రోదిస్తారు. వారంతా కలిసి
వారి దేవుడైన యెహోవాను వెతుక్కుంటూ
వెళతారు.
5 ఆ ప్రజలు సీయోనుకు ఎలా వెళ్లాలి అని దారి
అడుగుతారు. వారు ఆ దిశగా వెళ్లటానికి బయలు
దేరుతారు. ప్రజలు యిలా అంటారు, 'రండి,
మనల్ని మనము యెహోవాకు కలుపుకొందాం.
శాశ్వతమైన ఒక నిబంధన చేసికొందాము. మన
మెన్నటికీ మరువలేని ఒక నిబంధన చేసి
కొందాం.'
6 "నా ప్రజలు తప్పిపోయిన గొర్రెలవలె ఉన్నారు.
వారి కాపరులు (నాయకులు) వారిని తప్పుదారి
పట్టించారు. వారి నాయకులు వారిని కొండల్లో,
కోనల్లో తిరిగేలా చేశారు. వారి విశ్రాంతి
స్థలమెక్కడో వారు మర్చిపోయారు.
7 నా ప్రజలను చూచిన వారంతా వారిని గాయ
పర్చారు. పైగా వారి శత్రువులు, 'మేము ఏ
నేరమూ చేయలేదన్నారు.' ఆ ప్రజలు
యెహోవా పట్ల పాపం చేశారు. యెహోవాయే
వారి అసలైన విశ్రాంతి స్థలం. వారి తండ్రులు
నమ్మిన యెహోవాయే వారి దేవుడు.
8 "బబులోను నుండి పారిపొండి. కల్దీయుల
రాజ్యాన్ని వదిలిపొండి. మందముందు నడిచే
మేకల మాదిరి వుండండి.
9 ఉత్తరాన్నుండి చాలా దేశాలను నేను కూడగట్టుకు
వస్తాను. ఈ దేశాల కూటమి బబులోను మీదికి
యుద్ధానికి సిద్ధమవుతుంది. ఉత్తర దేశాల వారిచేత
బబులోను చెరబట్టబడుతుంది. ఆ రాజ్యాలు
బబులోను మీదికి చాలా బాణాలు వేస్తాయి.
యుద్ధం నుంచి వట్టి చేతులతో తిరిగిరాని సైని
కుల్లా ఆ బాణాలు వుంటాయి.
10 కల్దీయుల భాగ్యాన్నంతా శత్రువు కొల్లగొడ
తాడు. శత్రు సైనికులు తాము కోరుకున్నవన్నీ
పొందగలుగుతారు." ఇవి యెహోవా చెప్పిన
విషయాలు.
11 "బబులోనూ, నీవు ఉద్రేకంతోను, సంతోషం
తోను వున్నావు. నీవు నా భూమిని తీసి
కొన్నావు. ధాన్యంలో చిందులేసే పడుచు
ఆవులా నీవు నాట్యం చేస్తున్నావు. గుర్రాలు
సంతోషంలో చేసే సకిలింపుల్లా వుంది నీ నవ్వు.
12 "ఇప్పుడు నీ తల్లికి తలవంపులవుతుంది. నినుగన్న
తల్లి కలత చెందుతుంది. దేశాలన్నిటిలో బబు
లోను అతి సామాన్యమైపోతుంది. ఆమె బెట్ట
యైన వట్టి ఎడారిలా అవుతుంది.
13 యెహోవా తన కోపం చూపటంతో అక్కడ
ఎవ్వరూ నివసించరు. బబులోను నగరం పూర్తిగా
ఖాళీ అవుతుంది. "బబులోను పక్కగా పోయే
ప్రతివాడు భయపడతాడు. అది నాశనం చేయ
బడిన తీరుచూచి విస్మయంతో వారు తలలు
ఆడిస్తారు.
14 "బబులోనుతో యుద్ధానికి సిద్ధమవ్వండి. వింటిని
బట్టిన వీరుల్లారా, బబులోనుపై బాణాలు
వేయండి. మీ బాణాల్లో వేటినీ మిగల్చవద్దు.
బబులోను యెహోవా పట్ల పాపం చేసింది.
15 బబులోను చుట్టూ సైనికులు జయ నినాదాలు
చేస్తారు. ఇప్పుడు బబులోను లొంగిపోయింది!
దాని ప్రాకారాలు, బురుజులు కూలదోయ
బడ్డాయి! వారికి అర్హమైన శిక్షను యెహోవా
ఆ ప్రజలకు ఇస్తున్నాడు. ప్రజలారా, బబు
లోనుకు తగిన శిక్షను ఇవ్వండి. అది ఇతర
దేశాలకు ఏమి చేసిందో, దానిని ఆ రాజ్యానికి
తిరిగి చేయండి.
16 బబులోను ప్రజలను మొక్కలు నాటనివ్వకండి.
వారి పంటను సేకరించనీయవద్దు. బబులోను
సైనికులు చాలా మందిని తమ నగరానికి బందీ
లుగా తీసికొనివచ్చారు. ఇప్పుడు శత్రు సైన్యాలు
వచ్చాయి. కావున ఆ బందీలంతా ఇండ్లకు తిరిగి
వెళ్లుచున్నారు. ఆ బందీలు తిరిగి తమ తమ
దేశాలకు పరుగున పోతున్నారు.
17 "పొలాల్లో చెల్లాచెదరైన గొర్రెల్లా ఇశ్రాయేలు
వున్నది. సింహాలు తరిమిన గొర్రెల్లా ఇశ్రాయేలు
వున్నది. వానిని తిన్న మొదటి సింహం అష్షూరు
రాజు. వాని ఎముకలు నలుగగొట్టిన చివరి
సింహం బబులోను రాజైన నెబుకద్నెజరు."
18 కావున సర్వశక్తిమంతుడు, ఇశ్రాయేలు దేవుడు
అయిన యెహోవా ఇలా చెపుతున్నాడు, "బబు
లోను రాజును, అతని దేశాన్ని నేను త్వరలో
శిక్షిస్తాను. నేను అష్షూరు రాజును శిక్షించినట్లు
అతనిని నేను శిక్షిస్తాను. 19కాని ఇశ్రాయేలును
మళ్లీ వాని స్వంత పొలాలకు తీసుకొని వస్తాను.
అతడు కర్మేలు పర్వతం మీదను బాషాను
భూముల్లోను పండిన పంటను తింటాడు.
అతడు తిని, తృప్తి పొందుతాడు. ఎఫ్రాయిము
మరియు గిలాదు ప్రాంతాలలో గల కొండల
మీద అతడు తింటాడు."
20 యెహోవా ఇలా చెపుతున్నాడు, "ఆ సమ
యంలో ప్రజలు ఇశ్రాయేలు యొక్క తప్పులెద
కటానికి గట్టిగా ప్రయత్నిస్తారు. కాని వారికి
కన్పించదు. ప్రజలు యూదా పాపాలు వెదక
యత్నిస్తారు. కాని ఏ పాపాలూ కనుగొనబడవు.
ఎందువల్లనంటే ఇశ్రాయేలు, యూదా రాజ్యా

లలో మిగిలిన కొద్దిమందిని నేను రక్షిస్తున్నాను.
పైగా వారి పాపాలన్నిటినీ నేను క్షమిస్తున్నాను."
21 యెహోవా యిలా చెపుతున్నాడు, "మెరాత
యీయు దేశంపై దండెత్తండి! పెకోదీలో
వుంటున్న ప్రజలను ఎదుర్కొనండి! వారిని
ఎదుర్కొనండి! వారిని చంపండి. వారిని సర్వ
నాశనం చేయండి! నా ఆజ్ఞ ప్రకారం అంతా
చేయండి!
22 యుద్ధ ధ్వని దేశమంతా వినిపిస్తుంది. అది తీవ్ర
వినాశనానికి సంబంధించిన ధ్వని.
23 బబులోను ఒకనాడు సర్వప్రపంచానికి సుత్తివలె
వుంది. కాని ఇప్పుడా 'సుత్తి' విరిగి ముక్కలై
పోయింది. బబులోను సాటి రాజ్యాలన్నిటిలో
నిజంగా మిక్కిలి నాశనమైనది.
24 బబులోనూ, నీ కొరకు నేను వల పన్నాను.
అది నీవు తెలిసికొనే లోపుగానే నీవు పట్టు
బడ్డావు. నీవు యెహోవాకు వ్యతిరేకంగా పోరా
డావు. అందువల్ల నీవు చూడబడి, పట్టుబడ్డావు.
25 యెహోవా తన గిడ్డంగిని తెరిచాడు. ఆ గిడ్డంగి
నుండి యెహోవా తన కోపమనే ఆయుధాన్ని
వెలికి తీశాడు. సర్వశక్తిమంతుడైన దేవుడు తాను
చేయవలసిన పని ఒకటి వుండుటచే ఆ
ఆయుధాన్ని వెలికి తీశాడు. ఆయన చేయ
వలసిన కార్యం కల్దీయుల రాజ్యంలో ఉంది.
26దూర తీరాల నుండి బబులోను మీదికి రండి.
ఆమె ధాన్యాగారాలను పగులగొట్టండి. బబులో
నును సర్వనాశనం చేయండి. సజీవంగా ఎవ్వరినీ
వదల వద్దు. పెద్ద ధాన్యరాసులవలె వారి శవాలను
గుట్టవేయండి.
27 బబులోనులో ఉన్న గిత్తలన్నిటినీ (యువ
కులు) చంపండి. వారు నరకబడనివ్వండి. వారిని
ఓడింపబడే సమయం వచ్చింది. వారికి మిక్కిలి
కష్టం వచ్చిపడింది. వారు శిక్షింపబడే సమయం
వచ్చింది.
28 బబులోను దేశం నుండి ప్రజలు పారిపోతు
న్నారు. వారా దేశంనుండి తప్పించుకొనిపోతు
న్నారు. ఆ ప్రజలు సీయోనుకు వస్తున్నారు.
యెహోవా చేస్తున్న పనులను ఆ ప్రజలు ఇతరు
లకు చెపుతున్నారు, బబులోనుకు అర్హమైన
శిక్షను యెహోవా ఇస్తున్నారని వారు చెబుతు
న్నారు. యెహోవా ఆలయాన్ని బబులోను
ధ్వంసం చేసింది. కావున యెహోవా ఇప్పుడు
బబులోనును ధ్వంసం చేస్తున్నాడు.
29 బబులోను మీదికి విలుకాండ్రను పిలవండి. ఆ
నగరాన్ని చుట్టుముట్టమని వారికి చెప్పండి.
ఎవ్వరినీ తప్పించుకోనివ్వద్దు. అది చేసిన
దుష్టకార్యాలకు తగిన ప్రతీకారం చేయండి. అది
ఇతర రాజ్యాలకు ఏమి చేసిందో, దానిని ఆ
దేశానికి కూడా చేయండి. బబులోను యెహో
వాను గౌరవించలేదు. పరిశుద్ధుడైన ఇశ్రాయేలు
దేవునిపట్ల అది మూర్ఖంగా ప్రవర్తించింది. కావున
బబులోనును శిక్షించండి.
30 బబులోను యువకులు వీధుల్లో చంపబడతారు.
ఆ రోజున దాని సైనికులంతా చనిపోతారు."
యెహోవా ఈ విషయాలు చెపుతున్నారు.
31 "బబులోనూ, నీవు మిక్కిలి గర్విష్ఠివి. అందుచే
నేను నీకు వ్యతిరేకినైనాను." సర్వశక్తిమంతుడైన
యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు.
"నేను నీకు వ్యతిరేకిని. నీవు శిక్షింపబడే సమయం
వచ్చింది.
32 గర్విష్ఠియైన బబులోను తూలిపడి పోయింది.
అది లేచుటకు ఎవ్వరూ సహాయపడరు. దాని
పట్టణాలలో నేను అగ్ని రగుల్చుతాను. దాని
చుట్టూ వున్న వారందరినీ ఆ అగ్ని పూర్తిగా
దహించివేస్తుంది."
33 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెపుతు
న్నారు. "ఇశ్రాయేలు, యూదా ప్రజలు బానిసలై
యున్నారు. శత్రువు వారిని చెరబట్టాడు. శత్రువు
ఇశ్రాయేలును వదిలిపెట్టడు. 34కాని, దేవుడు
ఆ ప్రజలను తిరిగి తీసికొని వస్తాడు. ఆయన
పేరు సర్వశక్తిమంతుడైన యెహోవా. ఆ ప్రజ
లను ఆయన బాగా రక్షిస్తాడు. వారి రాజ్యానికి
విశ్రాంతి కల్గించే విధంగా ఆయన వారిని రక్షి
స్తాడు. అంతేగాని బబులోనులో నివసించే వారికి
ఆయన విశ్రాంతినివ్వడు."
35 యెహోవా ఇలా చెపుతున్నాడు, "బబులో
నులో నివసించే ప్రజలను ఒక కత్తి చంపుగాక.
బబులోను రాజును, అతని అధికారులను,
జ్ఞానులను ఒక కత్తి హతము చేయుగాక.
36 బబులోను యాజకులను, దొంగ ప్రవక్తలను
కత్తి సంహరించుగాక. ఆ యాజకులు వట్టి
మూర్ఖులవుతారు. బబులోను సైనికులను ఒక
కత్తి చంపుగాక. ఆ సైనికులు భీతావహులవుతారు.
37 బబులోను గుర్రాలను, రథాలను ఒక కత్తి నరికి
వేయు గాక. విదేశ కిరాయి సైనికులను ఒక
కత్తి సంహరించుగాక, ఆ సైనికులందరూ భయ
పడిన స్త్రీలవలె ఉంటారు. బబులోను ధనాగారాల
మీదికి ఒక కత్తి వెళ్లుగాక. ఆ ధనాగారాలు
దోచుకోబడతాయి.
38 బబులోను నీటి వనరులపైకి ఒక కత్తి వెళ్లుగాక.
ఆ నీటి వనరులన్నీ ఎండిపోతాయి. బబులోను
దేశంలో విగ్రహాలు కోకొల్లలు. బబులోను
ప్రజలు మూర్ఖులని ఆ విగ్రహాలు చాటి చెపు
తున్నాయి. అందుచే ఆ ప్రజలకు కష్టనష్టాలు
సంభవిస్తాయి.

39 "బబులోను మరెన్నడూ ప్రజలతో నిండి
ఉండదు. పిచ్చి కుక్కలు, ఉష్ట్ర పక్షులు,* తది
తర ఎడారి జంతువులు అక్కడ నివసిస్తాయి.
అంతేగాని, మళ్లీ జనం అక్కడ ఎన్నడూ
నివసించరు.
40 సొదొమ, గొమొర్రా నగరాలను, వాటి చుట్టుపట్ల
పట్టణాలను దేవుడు పూర్తిగా నాశనం చేశాడు.
ఇప్పుడా పట్టణాలలో ఎవ్వరూ నివసించరు.
అదేరీతి, బబులోనులో ఎవ్వరూ నివసించరు.
అక్కడ నివసించటానికి ప్రజలు అసలు వెళ్లరు.
41 "చూడండి! ఉత్తరాన్నుండి జనులు వస్తున్నారు.
వారొక బలమైన రాజ్యం నుండి వస్తున్నారు.
ప్రపంచం నలుమూలల నుండి చాలామంది
రాజులు కలిసి వస్తున్నారు.
42 వారి సైన్యాలకు ధనుస్సులు, ఈటెలు
ఉన్నాయి. ఆ సైనికులు బహు క్రూరులు. వారికి
దయలేదు. గుర్రాలపై స్వారి చేస్తూ సైనికులు
వస్తారు. అప్పుడు సముద్ర ఘోషలా శబ్దం
పుడుతుంది. వారివారి స్థానాలలో యుద్ధానికి
సిద్ధంగా నిలబడతారు! బబులోను నగరమా,
నీపై దాడికి వారు సిద్ధంగా వున్నారు.
43 ఆ సైన్యాల గురించి బబులోను రాజు విన్నాడు.
అతడు బాగా బెదరిపోయాడు! అతని చేతులు
బిగుసుకుపోయేటంతగా అతడు భయపడ్డాడు.
ప్రసవ స్త్రీ వేదనవలె, అతని భయం అతని
కడుపును ఆరాటపెడుతుంది."
44 యెహోవా చెపుతున్నాడు, "అప్పుడప్పుడు
యొర్దాను నదీ తీరాన దట్టమైన పొదల నుండి
ఒక సింహం వస్తుంది. ప్రజలు పొలాల్లో
మందవేసిన పశువులపైకి ఆ సింహం వచ్చిపడు
తుంది. అప్పుడా పశువులు చెల్లాచెదరై
పోతాయి. నేనా సింహంలా వుంటాను. బబులో
నును దాని రాజ్యం నుంచి తరిమిగొడతాను!
ఇది చేయటానికి నేనెవరిని ఎన్నుకుంటాను?
నాలాగా మరే వ్యక్తి లేడు. నన్నెదిరించగలవాడు
మరొక్కడూ లేడు. కావున నేనే ఆ పని చేస్తాను.
నన్ను బయటకు తోలటానికి ఏ గొర్రెల కాపరీ
రాడు. నేను బబులోను ప్రజలను తరిమి
గొడతాను."
45 బబులోనుకు వ్యతిరేకంగా యెహోవా పన్నిన
పథకాన్ని వినండి. కల్దీయులకు వ్యతిరేకంగా
యెహోవా ఏమి చేయ నిర్ణయించాడో వినండి.
శత్రువు బబులోనులోని గొర్రె పిల్లలను
(ప్రజలను) తిరిగి తీసికొంటాడు. ఆ గొర్రె
పిల్లలను ఆయన ఇంటికి తీసికొని వెళతాడు.
ఆ పిమ్మట బబులోను పచ్చిక బయళ్లను
యెహోవా పూర్తిగా నాశనం చేస్తాడు. జరిగిన
దానికి బబులోను విస్మయం చెందుతుంది.
46 బబులోను పడిపోతుంది. ఆ పతనానికి భూమి
కంపిస్తుంది. బబులోను పతనాన్ని గురించి
ప్రపంచ ప్రజలంతా వింటారు.

51 యెహోవా ఇలా చెపుతున్నాడు, "నేనొక
పెనుగాలి వీచేలా చేస్తాను. అది బబులోను,
కల్దీయ ప్రజల మీదికి వీచేలా చేస్తాను.
2 బబులోనును తూర్పార బట్టటానికి నేను కొత్త
వారిని పంపుతాను. వారు బబులోనును తూర్పార
బడతారు. వారు బబులోనునుండి ప్రతీది తీసు
కొంటారు. సైన్యాలు నగరాన్ని చుట్టుముట్టు
తాయి. భయంకరమైన విధ్వంసకాండ జరుగు
తుంది.
3 బబులోను సైనికులు తమ ధనుర్బాణాలను విని
యోగించలేరు. ఆ సైనికులు తమ కవచాలను
కూడ ధరించలేరు. బబులోను యువకులను
గురించి విచారించవద్దు. దాని సైన్యాన్ని సర్వ
నాశనం చేయుము.
4 బబులోను సైనికులు కల్దీయుల రాజ్యంలో చంప
బడతారు. బబులోను వీధుల్లో వారు తీవ్రంగా
గాయపర్చబడతారు."
5 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇశ్రాయేలును,
యూదాను ఒక విధవరాలివలె ఒంటరిగా వదిలి
వేయలేదు. దేవుడు ఆ ప్రజలను వదిలిపెట్టలేదు.
లేదు! ఆ ప్రజలే ఇశ్రాయేలు పవిత్ర దైవాన్ని
వదిలివేసిన పాపానికి ఒడిగట్టారు. వారే ఆయనను
వదిలారు గాని ఆయన వారిని విడిచివేయలేదు.
6 బబులోను నుంచి పారిపొండి. మీ ప్రాణ రక్షణకై
పారిపొండి! మీరు ఆగకండి. బబులోను పాపాల
కారణంగా మీరు చంపబడవద్దు! వారు చేసిన
దుష్కార్యాలకు బబులోను ప్రజలను యెహోవా
శిక్షించవలసిన సమయం వచ్చింది. బబులోనుకు
తగిన శాస్తి జరుగుతుంది.
7 యెహోవా చేతిలో బంగారు గిన్నెలా బబులోను
ఉండేది. బబులోను ప్రపంచాన్నంతటినీ తాగిం
చింది. బబులోను ఇచ్చిన మద్యాన్ని దేశాలు సేవిం
చాయి. కావున వారికి వెర్రి పట్టింది.
8 బబులోను అకస్మాత్తుగా పడి ముక్కలై పోతుంది.
దాని కొరకు విలపించండి! దాని బాధ నివారణకు
మందుతెండి! బహుశః ఆమెకు నయం కావచ్చు!
9 బబులోనుకు స్వస్థత చేకూర్చాలని యత్నిం
చాము. కాని ఆమె స్వస్థతనొందలేదు. కావున
ఆమెను వదిలివేసి మనందరం మన మన దేశాలకు
వెళ్లిపోదాం. పరలోకంలో దేవుడు బబులోనుకు

---

**ఉష్ట్ర పక్షి** ఇది ఎడారి పక్షి. ఈ పక్షులు ఎగరలేవు.

శిక్ష నిర్ణయిస్తాడు. బబులోనుకు ఏమి సంభ
వించాలో ఆయన నిర్ణయిస్తాడు.
10 యెహోవా మనకోసం శత్రువుల మీద పగతీర్చు
కొన్నాడు. రండి! ఈ విషయం మనం సీయో
నులో చెప్పుదాం. మన దేవుడైన యెహోవా
చేసిన పనులను గూర్చి చెప్పుదాం.
11 మీ బాణాలకు పదును పెట్టండి. మీ డాళ్లను
చేపట్టండి! యెహోవా మాదీయుల రాజును
ప్రేరేపిస్తున్నాడు. ఆయన బబులోనును నాశనం
చేయ సంకల్పించాడు. కావున ఆయన వారిని
ప్రేరేపిస్తున్నాడు. బబులోను ప్రజలకు అర్హమైన
శిక్షను యెహోవా విధిస్తాడు. బబులోను సైన్యం
యెరూషలేములో యెహోవా ఆలయాన్ని
నాశనం చేసింది. కావున వారికి తగిన దండన
యెహోవా విధిస్తాడు.
12 బబులోను ప్రాకారాలకు ఎదురుగా జెండా ఎగుర
వేయండి. ఎక్కువమంది కావలివారిని నియమిం
చండి. రక్షక భటులను వారి వారి స్థానాలలో
నిలపండి. రహస్య దాడికి సిద్ధంగా ఉండండి!
యెహోవా తను యోచించిన ప్రకారం చేస్తాడు.
యెహోవా బబులోనుకు వ్యతిరేకంగా ఏమి చేస్తా
నని చెప్పియున్నాడో అది చేసి తీరుతాడు.
13 బబులోనూ, నీవు పుష్కలంగా నీరున్నచోట నివ
సిస్తున్నావు. నీవు ధనధాన్యాలతో తులతూగు
తున్నావు. కాని ఒక రాజ్యంగా నీవు మనగలిగే
కాలం అంతమవుతూవుంది. నీకు వినాశనకాలం
దాపురించింది.
14 సర్వశక్తిమంతుడైన యెహోవా తన పేరుమీద
ప్రమాణం చేసి ఈ విషయాలు చెప్పాడు, "బబు
లోనూ, నిశ్చయముగా నిన్ను అనేక శత్రు సైనికు
లతో నింపుతాను. వారు మిడుతల దండులా
వచ్చి పడుతారు. ఆ సైనికులు యుద్ధంలో నీ
మీద గెలుస్తారు. వారు నీపై నిలబడి విజయ
ధ్వనులు చేస్తారు."
15 యెహోవా తన అనంత శక్తి నుపయోగించి
భూమిని సృష్టించాడు. ఆయన తన జ్ఞానాన్ని
వినియోగించి ప్రపంచాన్ని నిర్మించాడు. తన
ప్రజ్ఞతో ఆయన ఆకాశాన్ని విస్తరించాడు.
16 ఆయన గర్జిస్తే ఆకాశంలో సముద్రాలు ఘోషి
స్తాయి. భూమిపైకి మేఘాలను ఆయన పంపి
స్తాడు. ఉరుములు మెరుపులతో వర్షం పడేలా
చేస్తాడు. తన గిడ్డంగుల నుండి ఆయన పెను
గాలులు రప్పిస్తాడు.
17 కాని ప్రజలు బహుమూర్ఖులు. దేవుడు ఏమి
చేశాడో తెలిసికోలేరు. నేర్పరులైన పనివారు
బూటకపు దేవతల విగ్రహాలను చేస్తారు. ఆ
విగ్రహాలన్నీ బూటకపు దేవతలే. కావున ఆ పని
వాడు ఎంత మూర్ఖుడో అవి చాటి చెపుతాయి.
ఆ విగ్రహాలు నిర్జీవ ప్రతిమలు.
18 ఆ విగ్రహాలు నిరుపయోగం! ప్రజలు చేసిన ఆ
విగ్రహాలు నవ్వులాట బొమ్మలు! వారికి తీర్పు
తీర్చే కాలం వస్తుంది. అప్పుడా విగ్రహాలు నాశనం
చేయబడతాయి.
19 కాని యాకోబు స్వాస్థ్యము (దేవుడు) ఆ పనికి
మాలిన విగ్రహాల్లాంటివాడు కాదు. ప్రజలు దేవుని
చేయలేదు. దేవుడే తన ప్రజలను చేశాడు!
దేవుడు సమస్తాన్నీ సృష్టించినాడు! ఆయన పేరు
సర్వశక్తిమంతుడైన యెహోవా.
20 యెహోవా ఈ విధంగా అంటున్నాడు: 'బబు
లోనూ, నీవు నా చేతి దుడ్డుకర్రవి రాజ్యాలను
మోదటానికి నిన్ను వినియోగించాను. సామ్రా
జ్యాలను నాశనం చేయటానికి నిన్ను వాడాను.
21 గుర్రాన్ని, రౌతును బాదటానికి నిన్ను వాడాను.
రథాన్ని, సారథిని చిదుకగొట్టటానికి నిన్నుపయో
గించాను.
22 స్త్రీ పురుషులను చితుకగొట్టుటకు నిన్ను
వాడాను. వృద్ధులను, యువకులను చితకగొట్టు
టకు నిన్ను వాడాను. యువకులను, యువతు
లను చితకగొట్టుటకు నిన్ను వాడాను.
23 గొర్రెల కాపరులను, మందలను నాశనం చేయ
టానికి నిన్ను ఉపయోగించాను. రైతులను,
ఆవులను నాశనం చేయుటకు నిన్ను ఉపయో
గించాను. పాలకులను, ముఖ్య అధికారులను
దండించటానికి నిన్ను వాడాను.
24 కాని బబులోనుకు తగిన శాస్తి నేను చేస్తాను.
కల్దీయులందరికీ తగిన శాస్తి చేస్తాను. సీయోనుకు
వారు చేసిన కీడంతటికి తగిన శాస్తి చేస్తాను.
యూదా, నీ కన్నుల ఎదుటనే నేను వారికి
తగిన శాస్తి చేస్తాను." ఈ విషయాలు యెహోవా
చెప్పాడు.
25 యెహోవా ఇలా చెపుతున్నాడు, "బబులోనూ,
నీవొక విధ్వంసకర పర్వతానివి. నేను నీకు వ్యతి
రేకిని. బబులోనూ, భూమినంతటినీ నీవు నాశనం
చేశావు. నేను నీకు విరోధిని. నీ మీదికి నా
చేయి చాస్తున్నాను. కొండ శిఖరాల నుంచి నిన్ను
దొర్లిస్తాను. నిన్నొక కాలిపోయిన కొండలా
చేస్తాను.
26 పునాది రాళ్లకు పనికివచ్చే పెద్ద బండలను ప్రజలు
చూడరు. వారి భవనాల పునాదులకు ప్రజలు
పెద్ద రాళ్లను బబులోను నుంచి తీసికొనిపోరు.
ఎందువల్లనంటే శ్వతంగా ఈ నగరం ఒక నలిగిన
రాళ్లపోగులా మారుతుంది." ఈ విషయాలు
యెహోవా చెప్పాడు.
27 'రాజ్యంలో యుద్ధ పతాకాన్నెగుర వేయండి!

దేశాలన్నిటిలో బూర వూదండి! బబులోనుతో
యుద్ధానికి దేశాలను సిద్ధం చేయండి! బబులో
నుతో యుద్ధానికి అరారాతు, మిన్నీ, అష్కనజు
అనే రాజ్యాలను పిలవండి. దాని మీదికి సైన్యాన్ని
నడపటానికి ఒక అధికారిని ఎంపిక చేయండి.
మిడతల దండులా దానిమీదికి ఎక్కువ గుర్రాలను
పంపండి.
28 దానిమీదకి యుద్ధానికి దేశాలను సిద్ధం చేయండి.
మాదీయుల రాజులను సమాయత్తపర్చండి.
మాదీయుల పాలకులను, ముఖ్యాధికారులను
సిద్ధంచేయండి. వారు పాలించే దేశాలన్నిటినీ
బబులోను మీద యుద్ధానికి సిద్ధంచేయండి.
29 బాధలో వున్నట్లు ఆ రాజ్యం వణకిపోతుంది.
యెహోవా తన పథకాన్ని అమలుపర్చటం
మొదలు పెట్టినప్పుడు అది కంపించిపోతుంది.
బబులోనును వట్టి ఎడారిగా మార్చటమే
యెహోవా సంకల్పం. అక్కడ ఎవ్వరూ
నివసించరు.
30 బబులోను సైనికులు పోరాడటం మానివేశారు.
వారు తమ కోటల్లోనే ఉండిపోయారు. వారి
శక్తి తరిగిపోయింది. వారు బెదరిపోయిన స్త్రీలవలె
అయినారు. బబులోనులో ఇండ్లు తగులబడు
తున్నాయి. దాని ద్వారాల కడ్డీలు విరిగి
పోయాయి.
31 ఒక దూత మరో దూతను అనుసరిస్తాడు. దూత
తరువాత దూత వస్తాడు. అతని నగరమంతా
పట్టుబడిందని వారు బబులోను రాజుకు తెలియ
జేస్తారు.
32 మనుష్యులు నదులను దాటే స్థలాలన్నీ పట్టు
బడ్డాయి. చిత్తడి నేలలు సహితం మండు
తున్నాయి. బబులోను సైనికులంతా భయ
పడ్డారు."
33 ఇశ్రాయేలీయుల దేవుడు, సర్వశక్తిమంతుడూ
అయిన యెహోవా ఇలా చెపుతున్నాడు,
"బబులోను నగరం పంటకళ్లంలా ఉన్నది. పంట
కోయు కాలంలో రైతులు కోసిన పైరును కొట్టి
పొట్టునుండి ధాన్యాన్ని వేరుచేస్తారు. బబులో
నును కొట్టే కాలం దగ్గర పడుతోంది."
34 గతంలో బబులోను రాజు నెబుకద్నెజరు
మమ్మల్ని నాశనం చేశాడు. గతంలో నెబుక
ద్నెజరు మమ్మల్ని గాయపర్చాడు. ఇదివరలో
అతడు మా ప్రజలను చెరగొన్నాడు. మేము
వట్టి జాడీల్లా అయ్యాము. అతడు మాకున్న
మంచి వస్తువులన్నిటినీ తీసికొన్నాడు. కడుపు
పగిలేలా అన్నీ తిన్న బ్రహ్మరాక్షసిలా అతడు
న్నాడు. అతడు మా మంచి వస్తువులన్నీ తీసికొని
మమ్మల్ని నెట్టివేశాడు.
35 మమ్మల్ని బాధించటానికి బబులోను భయం
కరమైన పనులు చేసింది. ఇప్పుడు అవన్నీ బబు
లోనుకు జరగాలని నేను కోరుకుంటున్నాను."
సీయోనులో నివసిస్తున్న ప్రజలు ఈ విషయాలు
చెప్పారు: "బబులోను వారు మా ప్రజలను
చంపిన నేరస్థులు. వారు చేసిన దుష్ట కార్యాలకు
వారిప్పుడు శిక్షింపబడతారు." యెరూషలేము
నగరం ఆ విషయాలు చెప్పింది.
36 కావున యెహోవా ఇలా చెపుతున్నాడు,
"యూదా, నిన్ను రక్షిస్తాను. బబులోను తప్పక
శిక్షింపబడేలా చేస్తాను. బబులోను సముద్రం
ఎండిపోయేలా చేస్తాను. ఆమె ఊటలు ఎండి
పోయేలా నేను చేస్తాను.
37 బబులోను కూలిపోయిన భవంతుల గుట్టలా
తయారవుతుంది. బబులోను పిచ్చికుక్కలు
తిరుగాడే స్థలంగా మారుతుంది. ఆ రాళ్లగుట్టను
చూచిన ప్రజలు ఆశ్చర్యపోతారు. బబులోనును
చూచి జనులు బాధతో తల లాడిస్తారు. బబు
లోను నిర్మానుష్యమై పోతుంది.
38 బబులోను ప్రజలు గర్జించు యువ సింహాల్లా
ఉన్నారు. వారు పులి పిల్లల్లా గుర్రుమంటున్నారు.
39 ఆ ప్రజలు కొదమ సింహాలలా ప్రవర్తిస్తున్నారు.
వారికి నేనొక విందు ఇస్తాను. వారు బాగా మద్యం
సేవించేలా చేస్తాను. వారు నవ్వుతూ విలాసంగా
కాలక్షేపం చేస్తారు. తరువాత వారు శాశ్వతంగా
నిద్రపోతారు. వారిక మేల్కొనరు." యెహోవా
ఈ విషయాలు చెప్పాడు.
40 బబులోను ప్రజలను చంపటానికి నేను తీసికొని
వెళతాను. నరకబడటానికి వేచివుండే గొర్రెల్లా,
పొట్టేళ్లలా, మేకల్లా బబులోను ప్రజలుంటారు.
41 షేషకు ఓడింపబడుతుంది. అత్యుత్తమమైన,
గర్వించదగిన దేశం చెరబట్టబడుతుంది.
ఇతర రాజ్యాల ప్రజలు బబులోనువైపు చూస్తారు.
వారు చూసే విషయాలు వారిని భయపెడతాయి.
42 బబులోను మీదకి సముద్రం పొంగివస్తుంది.
ఘోషించే అలలు దానిని ముంచివేస్తాయి.
43 బబులోను పట్టణాలు పాడుపడి, ఖాళీ అవు
తాయి. బబులోను భూమి ఎండి ఎడారిలా మారు
తుంది. అది నిర్మానుష్యమైన భూమి అవుతుంది.
కనీసం ప్రజలు బబులోను గుండానైనా పయ
నించరు.
44 బబులోనులో బేలు దేవతను నేను శిక్షిస్తాను.
తను మింగిన మనుష్యులను అతడు కక్కేలా
చేస్తాను. ఇతర రాజ్యాల వారు బబులోనుకు
రారు. బబులోను నగరపు చుట్టున్న ప్రాకారం
కూలిపోతుంది.

45 నా ప్రజలారా, బబులోను నగరం నుండి బయ
టకు రండి. మీ ప్రాణరక్షణకు పారిపొండి.
యెహోవా యొక్క భయానక కోపంనుండి
దూరంగా పారిపొండి.
46 నా ప్రజలారా, విచారించకండి. వదంతులు
వ్యాపిస్తాయి; కాని భయపడవద్దు. ఒక వదంతి
ఈ సంవత్సరం వ్యాపిస్తుంది. మరొక వదంతి
మరు సంవత్సరం వస్తుంది. దేశంలో భీకర
పోరాటం గురించిన వదంతులు లేస్తాయి. పాల
కులు ఇతర పాలకులతో పోట్లాడుతున్నట్లు
వదంతులు వస్తాయి.
47 బబులోనువారి బూటకపు దేవతలను నేను
శిక్షించే సమయం ఖచ్చితంగా వస్తుంది. బబు
లోను రాజ్యం యావత్తు అవమాన పర్చబడు
తుంది. అనేకమంది ప్రజలు చనిపోయి నగర
వీధుల్లో పడివుంటారు.
48 అప్పుడు పరలోకంలోను, భూమి మీద ఉన్న
వారంత బబులోనుకు జరిగిన దాని విషయమై
సంతోషంతో కేకలు పెడతారు. శత్రు సైన్యాలు
ఉత్తరాన్నుండి వచ్చి బబులోనుతో యుద్ధం
చేస్తాయి గనుక వారునూ కేకలు పెడతారు."
ఈ విషయాలు యెహోవా చెప్పాడు.
49 "బబులోను ఇశ్రాయేలు ప్రజలను చంపింది.
భూమి మీద ప్రతి ప్రాంతంనూ ప్రజలలోని
బబులోను చంపింది. కావున బబులోను తప్పక
పతనమవ్వాలి!
50 కత్తివాతబడకుండా తప్పించుకున్న ప్రజలారా
త్వరపడండి; బబులోనును వదలిపొండి. ఆగ
కండి! మీరు ఎంతో దూరానగల దేశంలో
వున్నారు. కాని మీరున్న చోటనే యెహోవాను
తలుచుకోండి. యెరూషలేమును గుర్తుచేసి
కొనండి.

51 "యూదా ప్రజలమైన మేము సిగ్గుపడు
తున్నాము. మేము అవమానింపబడినందున
మేము సిగ్గుపడుతున్నాము. అది ఎందువల్ల
నంటే పరాయివాళ్లు మా దేవుని దేవాలయం
లోని పవిత్ర స్థలాల్లో ప్రవేశించారు."
52 యెహోవా ఇలా చెపుతున్నాడు, "బబులోను
విగ్రహాలను నేను శిక్షించే సమయం వస్తోంది.
ఆ సమయంలో, ఆ రాజ్యంలోని ప్రతిచోటా
గాయపడిన ప్రజలు బాధతో మూలుగుతారు.
53 ఆకాశాన్నంటే వరకు బబులోను పెరగవచ్చు.
బబులోను తన కోటలను పటిష్ఠం చేసికోవచ్చు.
కాని ఆ నగరంతో పోరాడటానికి నేను జనాన్ని
పంపుతాను. ఆ ప్రజలు దానిని నాశనం చేస్తారు."
ఈ విషయాలు యెహోవా చెప్పాడు.

54 "బబులోనులో ప్రజల ఆక్రందనలు మనం
వినగలం. కల్దీయుల రాజ్యంలో ప్రజలు చేస్తున్న
విధ్వంసకాండ శబ్దాలను మనం వింటాం.
55 అతి త్వరలో యెహోవా బబులోనును ధ్వంసం
చేస్తాడు. నగరంలో వినవచ్చే గొప్ప సందడిని
ఆయన అణచి వేస్తాడు. మహాసముద్రపు అలలు
ఘోషించినట్లు శత్రువులు వచ్చిపడతారు. చుట్టు
పట్లవున్న ప్రజలు ఆ గర్జన వింటారు.
56 సైన్యం వచ్చి బబులోనును ధ్వంసం చేస్తుంది.
బబులోను సైనికులు పట్టుబడతారు. వారి ధను
స్సులు విరిగిపోతాయి. ఎందువల్లనంటే, వారు
చేసిన పాపాలకు యెహోవా ఆ ప్రజలను శిక్షి
స్తాడు. వారికి తగిన పూర్తి దండన యెహోవా
విధిస్తాడు.
57 "బబులోను యొక్క ముఖ్యమైన అధిపతులను,
జ్ఞానులను మత్తిల్లజేస్తాను. దాని పాలకులను,
అధికారులను, సైనికులను కూడ మత్తిల్లజేస్తాను.
దానితో వారు శాశ్వతంగా నిద్రిస్తారు. వారు
ఎప్పటికీ మేల్కొనరు." ఈ విషయాలు రాజు
చెప్పియున్నాడు. ఆయన పేరు సర్వశక్తిమంతు
డైన యెహోవా.
58 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెపు
తున్నాడు, "బబులోను యొక్క మందమైన,
బలమైన గోడ కూలగొట్టబడుతుంది. దాని
ఉన్నత ద్వారాలు తగులబెట్టబడతాయి. బబు
లోను ప్రజలు కష్టపడి పనిచేస్తారు. కాని అది
వారికి సహాయపడదు! నగరాన్ని రక్షించటంలో
వారు మిక్కిలి అలసిపోతారు. కాని వారు ఎగిసే
మంటల్లో కేవలం సమిధలవుతారు!"

### యిర్మీయా బబులోనుకు సందేశం పంపుట

59యిర్మీయా ఈ సందేశాన్ని అధికారియైన శెరా
యాకు* పంపాడు. శెరాయా నేరీయా కుమారుడు.
నేరీయా మహసేయా కుమారుడు. యూదా రాజైన
సిద్కియాతో పాటు శెరాయా బబులోనుకు వెళ్లాడు.
సిద్కియా యూదాకు రాజైన పిమ్మట నాల్గవ సంవత్స
రంలో* ఇది జరిగింది. ఆ సమయంలో అధికారి
శెరాయాకు యిర్మీయా ఈ వర్తమానాన్ని పంపిం
చాడు. 60బబులోనుకు సంభ వించే భయంకర విష
యాలన్నీ యిర్మీయా ఒక పుస్తకపు చుట్టలో వ్రాశాడు.
బబులోను గురించి అతడీ విషయాలన్నీ వ్రాశాడు:
61శెరాయాకు యిర్మీయా ఇలా చెప్పాడు,

---

**శెరాయా** శెరాయా అనేవాడు యిర్మీయా కార్యదర్శియైన బారూకు సోదరుడు.

**సిద్కియా ... సంవత్సరంలో** అనగా క్రీ.పూ. 594 సంవత్సరం.

"శెరాయా, బబులోనుకు వెళ్లు. ప్రజలంతా వినేటట్లు ఈ సమాచారం తప్పకుండా చదువు. [62]తరువాత, 'ఓ దేవా, ఈ ప్రదేశమగు బబులోనును నీవు నాశనం చేస్తానని అన్నావు. నరులుగాని, జంతువులు గాని నివసించని విధంగా దానిని నాశనం చేస్తానని అన్నావు. ఈ చోటు శాశ్వతంగా వట్టి శిథిలాలు పోగు అవుతుంది' అని చెప్పు. [63]నీవీ పుస్తకం చదవటం పూర్తి చేయగానే దానికి ఒక రాయి కట్టు. తరువాత దానిని యూఫ్రటీసు నదిలోకి విసురు. [64]అప్పుడు, 'ఇదే రీతిగా బబులోను మునిగిపోతుంది. బబులోను మరి పైకి లేవదు! నేను ఇక్కడ కలుగజేసే భయంకరమైన పరిణామాల కారణంగా బబులోను మునిగిపోతుంది'" అని చెప్పు.

యిర్మీయా మాటలు సమాప్తం.

### యెరూషలేము పతనం

52 యూదాకు రాజయ్యే నాటికి సిద్కియాకు ఇరవై యొక్క సంవత్సరాల వయస్సు. యెరూషలేములో సిద్కియా పదకొండు సంవత్సరాలు పరిపాలించాడు. అతని తల్లి పేరు హమూటలు. ఈమె తండ్రి పేరు యిర్మీయా.* హమూటలు వంశం వారు లిబ్నా పట్టణవాసులు. [2]రాజైన యెహోయాకీము మాదిరిగానే సిద్కియా కూడా దుష్ట కార్యాలు చేశాడు. సిద్కియా ఆ చెడు కార్యాలు చేయటం యెహోవాకు ఇష్టం లేదు. [3]వారిపట్ల యెహోవా కోపగించటంతో యెరూషలేములోను, యూదాలోను భయంకరమైన సంఘటనలు జరిగాయి. చివరికి యెరూషలేము, యూదా ప్రజలను తన ముందు నుంచి దూరంగా తోసివేశాడు.

బబులోను రాజుమీద సిద్కియా తిరుగుబాటు చేశాడు. [4]కావున సిద్కియా పాలనలో తొమ్మిది సంవత్సరాల పది నెలలు దాటి పదవ రోజు* గడుస్తూ వుండగా బబులోను రాజైన నెబుకద్నెజరు యెరూషలేము మీదికి దండెత్తాడు. నెబుకద్నెజరు తన సైన్యాన్నంతా వెంటబెట్టుకు వచ్చాడు. బబులోను సైన్యం యెరూషలేము బయట దిగింది. తరువాత వారు నగరపు గోడల మీదికి ఎగబాకటానికి అనువుగా చుట్టూ దిమ్మలు కట్టారు. [5]రాజైన సిద్కియా పాలనలో పదకొండవ సంవత్సరం* జరిగే వరకు యెరూషలేము నగరం బబులోను సైన్యం ముట్టడిలో వుంది. [6]ఆ సంవత్సరం నాల్గవ నెలలో తొమ్మిదవ రోజున నగరంలో కరువు తీవ్రమయ్యింది. నగరంలో ఆహార పదార్థాలు అయిపోవటం కారణంగా ప్రజలకు తినటానికి తిండి కరువయ్యింది. [7]ఆ రోజున బబులోను సైన్యం యెరూషలేములోనికి ప్రవేశించింది. యెరూషలేము సైన్యం పారిపోయింది. రాత్రి సమయంలో సైనికులు నగరం వదిలి పారిపోయారు. రెండు గోడల మధ్య ద్వారం గుండా వారు బయటికి పోయారు. ఆ ద్వారం రాజు యొక్క ఉద్యానవనం వద్ద వుంది. బబులోను సైన్యం నగరాన్ని చుట్టుముట్టి ఉన్నప్పటికీ, యెరూషలేము సైనికులు పారిపోగలిగారు. వారు ఎడారివైపు పారిపోయారు.

[8]కాని, కల్దీయుల సైన్యం రాజైన సిద్కియాను వెంటాడింది. వారు యెరికో మైదానంలో అతన్ని పట్టుకున్నారు. కాని సిద్కియా సైనికులంతా పారిపోయారు. [9]బబులోను సైన్యం రాజైన సిద్కియాను చెరబట్టింది. రిబ్లా నగరంలో వున్న బబులోను రాజు వద్దకు అతన్ని తీసికొని వెళ్లారు. రిబ్లా నగరం హమాతు రాజ్యంలో వుంది. బబులోను రాజు రిబ్లా నగరంలో రాజైన సిద్కియాపై తీర్పు ప్రకటించాడు. [10]రిబ్లా నగరంలోనే బబులోను రాజు సిద్కియా కుమారులను చంపివేశాడు. తన కుమారులు క్రూరంగా చంపబడటం సిద్కియా బలవంతాన చూశాడు. (ఆ హింస చూడటానికి అతనిపై వత్తిడి వచ్చింది.) యూదా అధికారులందరినీ కూడ బబులోను రాజు చంపివేశాడు. [11]పిమ్మట బబులోను రాజు సిద్కియా కండ్లు పెరికివేశాడు. అతనికి కంచు గొలుసులు వేశాడు. తరువాత సిద్కియాను అతడు బబులోనుకు తీసికొని పోయాడు. బబులోనులో సిద్కియాను అతడు చెరసాలలో ఉంచాడు. సిద్కియా చనిపోయే వరకు చెరసాలలోనే ఉన్నాడు.

[12]బబులోను రాజు ప్రత్యేక అంగరక్షక దళాధిపతియైన నెబూజరదాను యెరూషలేముకు వచ్చాడు. రాజైన నెబుకద్నెజరు పాలనలో పందొమ్మిదవ సంవత్సరం* ఐదవనెలలో పదవ రోజున అతను వచ్చాడు. బబులోనులో నెబూజరదాను ఒక ముఖ్యమైన నాయకుడు. [13]నెబూజరదాను దేవాలయాన్ని తగులబెట్టాడు. రాజభవనాన్ని, యెరూషలేములో ఇతర గృహాలను కూడ అతడు తగులబెట్టాడు. యెరూషలేములో ప్రతి ముఖ్య భవనాన్నీ అతడు తగులబెట్టాడు. [14]కల్దీయుల సైన్యమంతా కలిసి యెరూషలేము చుట్టూవున్న గోడలను కూలగొట్టింది. రాజుయొక్క ఒక ప్రత్యేక అంగరక్షకుని కింద ఆ సైన్యం ఉంది. [15]సైనికాధికారి

---

**యిర్మీయా** ఇతడు ప్రవక్తయైన యిర్మీయా కాడు. అదే పేరుగల మరో వ్యక్తి.

**తొమ్మిది ... రోజు** అనగా క్రీ.పూ. 588 సంవత్సరం, జనవరి నెల.

**పదకొండవ సంవత్సరం** ఇది క్రీ.పూ. 587 సంవత్సరం.

**నెబుకద్నెజరు ... సంవత్సరం** అనగా క్రీ.పూ. 587 సంవత్సరం.

నెబూజరదాను ఇంకా యెరూషలేములో మిగిలిన
జనాన్ని బందీలుగా పట్టుకున్నాడు.* బబులోను
రాజుకు ఇంతకుముందే లొంగిపోయిన వారిని కూడా
చెరబట్టి తీసికొనిపోయాడు. యెరూషలేములో మిగి
లిన నిపుణులైన చేతి పనివారిని కూడా అతడు తీసికొని
వెళ్లాడు. [16]కాని నెబూజరదాను మిక్కిలి పేదవారిని
కొందరిని రాజ్యంలో వదిలివేశాడు. వారిని ద్రాక్ష తోటల
లోను, పొలాలలోను పనిచేయటానికి అతడు వదలి
వెళ్లాడు.

[17]కల్దీయుల సైన్యం ఆలయంలోని కంచు స్తంభా
లను విరుగగొట్టింది. యెహోవాయొక్క ఆలయంలో
గల స్తంభాలను, కంచు సముద్రమును (కోనేరు) కూడ
ముక్కలు చేశారు.* ఆ కంచునంతా వారు బబులో
నుకు తీసికొని పోయారు. [18]బబులోను సైన్యం
ఆలయం నుండి ఈ వస్తు సామగ్రిని కూడ తీసికొని
పోయింది: కుండలు, పారవంటి గరిటెలు, వత్తులను
ఎగదోసే పనిముట్లు, పెద్ద గిన్నెలు, పెనాలు, దేవాలయ
అర్చనలో ఉపయోగించే కంచు సామగ్రి వంటి వాటిని
కూడ బబులోను సైన్యం తీసికొనిపోయింది. [19]రాజు
యొక్క ప్రత్యేక అంగరక్షక దళాధిపతి ఈ వస్తువులు
తీసికొని వెళ్లాడు: పళ్లెములు, ధూపకలశాలు, పెద్ద
పాత్రలు, కుండలు, దీపస్తంభాలు, పెనములు, పానీ
యాలు అర్పించే పాత్రలు. వెండి, బంగారాలతో చేసిన
వస్తువులన్నీ అతడు తీసికొని పోయాడు. [20]రెండు
స్తంభాలు, సముద్రం (కోనేరు), దాని కింద పన్నెండు
కంచు గిత్తదూడల విగ్రహాలు, తోపుడు స్థంభాలు చాలా
బరువైనవి. రాజైన సొలొమోను వాటిని యెహోవా
ఆలయానికి చేయించాడు. వాటి చేతకు పట్టిన కంచు
ఎంత బరువైనదంటే దాన్ని తూచటం కష్టం.

[21]ప్రతి కంచుస్తంభం ఇరువది ఏడు అడుగుల
(పదునెనిమిది మూరలు) ఎత్తు వుంది. ప్రతి స్తంభం
పద్దెనిమిది అడుగుల (పన్నెండు మూరలు) చుట్టు
కొలత కలిగివుంది. ప్రతి స్తంభం బోలుగా ఉంది.
స్తంభపు అంచు మందం నాలుగు అంగుళాలు.
[22]మొదటి స్తంభం మీది కంచుపీట ఏడున్నర అడుగుల
(ఏడు మూరలు) ఎత్తు కలిగి ఉంది. దాని చుట్టూ
వలలాంటి నగిషీ పని, కంచు దానిమ్మకాయల
అలంకరణ చేయబడింది. మరొక స్తంభం మీద కూడ
దానిమ్మకాయల పనితనం వుంది. అదికూడ మొదటి
స్తంభం మాదిరిగానే వుంది. [23]స్తంభాల పక్కల మీద
తొంబది ఆరు దానిమ్మకాయలున్నాయి. స్తంభాల పైన
వలవంటి నగిషీపని మీద మొత్తం వంద దానిమ్మ
కాయలు వున్నాయి.

[24]రాజుయొక్క ప్రత్యేక అంగరక్షక దళాధిపతి శెరా
యాను, సిద్కియాను బందీలుగా తీసికొని పోయాడు.
ముగ్గురు ద్వారపాలకులను కూడా బందీలుగా తీసికొని
పోయాడు. శెరాయా ప్రధాన యాజకుడు, అతని
తరువాతి వాడు జెఫన్యా. [25]రాజుయొక్క ప్రత్యేక
అంగరక్షక దళాధిపతి పోరాటయోధుల దళాధిపతిని
కూడా పట్టుకున్నాడు. రాజుయొక్క సలహాదారులలో
ఏడుగురిని కూడా అతడు పట్టుకున్నాడు. ఆ మను
ష్యులు ఇంకా యెరూషలేములో ఉన్నారు. సైన్యంలో
మనుష్యులను చేర్చుకొనే అధికారిని (లేఖరి)కూడ
అతడు పట్టుకున్నాడు. నగరంలో ఉన్న అరువది మంది
సామాన్య ప్రజలను కూడా అతడు పట్టుకున్నాడు.
[26-27]అంగరక్షక దళాధిపతియైన నెబూజరదాను ఆ
అధికారులందరినీ పట్టుకున్నాడు. వారిని బబులోను
రాజు వద్దకు తీసికొనివచ్చాడు. బబులోను రాజు రిబ్లా
నగరంలోఉన్నాడు. రిబ్లా నగరం హమాతు రాజ్యంలో
వుంది. రిబ్లా నగరంలో ఆ అధికారులందరికీ రాజు
మరణశిక్ష విధించాడు.

ఆ విధంగా యూదా ప్రజలు తమ దేశంనుండి
తీసికొనిపోబడ్డారు. [28]నెబుకద్నెజరు చెరబట్టిన వారి
వివరాలు ఇలా ఉన్నాయి: నెబుకద్నెజరు పాలన ఏడవ
సంవత్సరం* గడుస్తూ వుండగా మూడు వేల ఇరవై
ముగ్గురు యూదా ప్రజలు. [29]నెబుకద్నెజరు పాలన
పదునెనిమిదవ సంవత్సరం*జరుగుతూ ఉండగా ఎని
మిది వందల ముప్పది రెండు మంది యెరూషలేము
నుండి బందీలుగా తీసుకొని పోబడ్డారు.

[30]నెబుకద్నెజరు పాలన ఇరువై మూడవ సంవత్స
రంలో* నెబూజరదాను ఏడువందల నలభై ఐదు
మంది యూదా వారిని బందీ చేశాడు. నెబూజరదాను
రాజు యొక్క ప్రత్యేక అంగరక్షక దళాధిపతి. మొత్తం
మీద నాలుగువేల ఆరువందల మందిని బందీలుగా
పట్టుకుపోయారు.

## యెహోయాకీను విడుదల

[31]యూదా రాజైన యెహోయాకీను బబులో
నులో ముప్పది ఏడు సంవత్సరాల పాటు చెరసాలలో

---

**యెరూషలేములో ... పట్టుకున్నాడు** ఇది ప్రాచీన గ్రీకు అనువాదంనుండి తీసికొనబడింది. కొంతమంది మిక్కిలి పేదవారిని అని ఈ వాక్యానికి ముందు వున్నది. బందీలుగా అని పొరపాటున తరువాత వచనంనుండి చూసి వ్రాసి యుండవచ్చు.

**కంచు ... చేశారు** బబులోను సైన్యం దేవాలయం లోనుండి వస్తు సామగ్రిని తీసికొని పోయారు. వివరాలకు మొదటి రాజుల గ్రంథం 13-26 చూడండి.

**నెబుకద్నెజరు ... 7వ సంవత్సరం.** అనగా క్రీ.పూ. 598 సంవత్సరం మధ్యనుండి 597 సంవత్సరం మధ్య కాలం.

**నెబుకద్నెజరు ... 18వ సంవత్సరం.** ఇది క్రీ.పూ. 588 సంవత్సరపు మధ్యకాలం 587 కాలం.

**నెబుకద్నెజరు ... 23వ సంవత్సరం.** ఇది క్రీ.పూ. 582వ సంవత్సరం మధ్యనుండి 581వ సంవత్సరం మధ్యవరకు.

ఉన్నాడు. యెహోయాకీను కారాగారవాసంలో ముప్పది ఏడవ సంవత్సరం* జరుగుతూ ఉండగా బబులోను రాజైన ఎవీల్మెరోదకు అతని పట్ల మిక్కిలి కనికరం చూపాడు.

ఆ సంవత్సరంలో యెహోయా కీనును అతడు చెరసాల నుండి విడుదల చేశాడు. అనగా అది ఎవీల్మె రోదకు బబులోనుకు రాజు అయిన మొదటి సంవత్సరం. ఎవీల్మెరోదకు ఆ సంవత్సరం పన్నెండవ నెలలో ఇరువై ఐదవ రోజున యెహోయా కీనును చెరసాల నుండి విడుదల చేశాడు.
32ఎవీల్మెరోదకు మిక్కిలి దయగా యెహోయాకీనుతో మాట్లా డాడు. అప్పుడు తనతో బబులోనులో ఉన్న రాజులం దరికంటె యెహోయాకీనుకు అతడు గౌరవప్రదమైన స్థానాన్ని ఇచ్చాడు.
33దానితో యెహోయాకీను తన చెరసాల బట్టలు తీసివేశాడు. మిగిలిన తన జీవిత కాల మంతా అతడు ప్రతిరోజూ రాజుయొక్క బల్లవద్దనే భోజనం చేశాడు.

34బబులోను రాజు ప్రతిరోజూ యెహోయా కీనుకు దినభత్యం ఇచ్చేవాడు. ఇది యెహోయాకీను చనిపోయేవరకు కొనసాగింది.

---

**కారాగారవాసంలో 37వ సంవత్సరం.** ఇది క్రీ.పూ. 561 సంవత్సరం.

# విలాప వాక్యములు

### యెరూషలేము తన వినాశనానికి దుఃఖించుట

1 యెరూషలేము ఒకనాడు జనసందోహంతో కిటకిట
లాడిన నగరం. కాని ఘోరంగా నిర్జనమయ్యింది!
ఒకప్పుడు ప్రపంచ మహానగరాల్లో యెరూషలేము
ఒక మహా నగరం. కాని అది విధవరాలుగా అయింది.
ఒకనాడామె నగరాలలో యువరాణిలా ఉన్నది. కాని
ఆమె ఒక బానిసలా చేయబడింది.
2 ఆమె రాత్రివేళ తీవ్రంగా దుఃఖిస్తుంది. ఆమె కన్నీరు
ఆమె చెక్కిళ్లపై ఉన్నాయి. ఆమెను ఓదార్చటానికి
ఎవ్వరూ లేరు. ఆమెతో సఖ్యంగా ఉన్న ఏ ఒక్క
దేశమూ ఆమెను ఓదార్చలేదు. ఆమె స్నేహితు
లంతా ఆమెపట్ల విముఖులయ్యారు. ఆమె స్నేహి
తులు ఆమెకు శత్రువులయ్యారు.
3 అనేక బాధలను అనుభవించి యూదా బందీ
అయ్యింది. మిక్కిలి శ్రమకు గురియై యూదా
బందీ అయ్యింది. యూదా పరదేశీయుల మధ్య
నివసిస్తూ ఉంది. ఆమెకు విశ్రాంతిలేదు. ఆమెను
వెంటాడిన ప్రజలు ఆమెను పట్టుకున్నారు. ఆ
ప్రజలు ఆమెను ఇరుకు లోయల్లో పట్టుకున్నారు.
4 సీయోనుకు పోయే మార్గాలన్నీ దుఃఖమయ
మయ్యాయి. అందుకు కారణం సీయోనుకు
నియామక కూటాలకు ఎవ్వరూ రాకపోవటమే.
సీయోను ద్వారాలు పాడుబడినాయి. సీయోను
యాజకులు మూల్గుచున్నారు. సీయోను యువ
తులు పట్టుబడ్డారు. ఇదంతా సీయోనుకు భరింప
రాని విషాదం.
5 యెరూషలేము శత్రువులు గెలిచారు. ఆమె శత్రు
వులు విజయవంతులయ్యారు. యెహోవా
ఆమెను శిక్షించిన కారణంగా ఇదంతా జరిగింది.
యెరూషలేము చేసిన అనేక పాపాలకు ఆయన
ఆమెను శిక్షించినాడు. ఆమె పిల్లలు వెళ్లిపోయారు.
వారి శత్రువులకు బందీలై వారు వెళ్లిపోయారు.
6 సీయోను కుమార్తె* అందం మాయమయ్యింది.
ఆమె రాకుమారులు లేళ్లవలె అయ్యారు. గడ్డి
మేయటానికి పచ్చిక బయలు కానరాని లేళ్లవలె
వారున్నారు. శక్తి లేకపోయినా వారెలాగో పారి
పోయారు. తమను వెంటాడుతున్న వారి నుండి
వారు పారిపోయారు.
7 యెరూషలేము గతాన్ని తలుస్తూవుంది. యెరూష
లేము బాధపడిన దినాలను, నివాసం లేక తిరిగిన
రోజులను గుర్తుకు తెచ్చుకుంటూ ఉంది. ఆమె
తన గత వైభవాన్ని జ్ఞాపకం చేసికొంటూవుంది.
పాత రోజుల తన అనుభవాలను ఆమె తలపోసు
కొంటుంది. శత్రువు తన ప్రజలను చెరబట్టిన
దినాలను ఆమె జ్ఞాపకం చేసికొంటూ ఉంది.
ఆమెకు కలిగిన నిస్సహాయ పరిస్థితిని ఆమె జ్ఞాపకం
చేసికొంటుంది. ఆమె శత్రువులు ఆమెను చూచి
నవ్వారు. ఆమె నాశనం చేయబడినందున వారు
నవ్వారు.
8 యెరూషలేము ఘోరంగా పాపం చేసింది. యెరూ
షలేము పాపాల కారణంగా ఆమెను చూసిన
వారంతా తలలూపే పరిస్థితి వచ్చింది. ఆమెను
గౌరవించిన వారంతా ఇప్పుడామెను అసహ్యించు
కుంటున్నారు. ఆమెను వారు నగ్నంగా చూశారు,
గనుక వారామెను అసహ్యించుకుంటున్నారు.
యెరూషలేము మూల్గుతూ ఉంది. ఆమె వెనుదిరిగి
పోతూవుంది.
9 యెరూషలేము చీర చెంగులు మురికి అయ్యాయి.
తనకు జరుగబోయే విషయాలను గూర్చి ఆమె
ఆలోచించలేదు. ఆమె పతనం విస్మయం కలుగ
జేస్తుంది. ఆమెను ఓదార్చటానికి ఆమెకు ఎవ్వరూ
లేరు. "ఓ ప్రభూ, నేనెలా బాధపడ్డానో చూడు!
తనెంత గొప్పవాడినని నా శత్రువు అనుకొంటు
న్నాడో చూడు!" అని ఆమె అంటూ ఉంది.
10 శత్రువు తన చేతిని చాచాడు. అతడామె విలువైన
వస్తువులన్నీ తీసికొన్నాడు. వాస్తవంగా, పర
దేశీయులు తన పవిత్ర దేవాలయములో ప్రవే
శించటం ఆమె చూసింది. ఓ యెహోవా, ఆ
ప్రజలు నీ పరిశుద్ధ స్థలాన్ని ప్రవేశించకూడదు!
అని నీవు ఆజ్ఞాపించావు.
11 యెరూషలేము ప్రజలంతా ఉస్సురుమంటూ
ఉన్నారు. ఆమె ప్రజలంతా ఆహారం కొరకు వెదు
కుతున్నారు. ఆహారం కొరకు వారికున్న విలువైన

---

**సీయోను కుమార్తె** యెరూషలేమును అలంకారికంగా సీయోను కుమార్తె అని పిలుస్తారు.

వస్తువులన్నీ ఇచ్చివేస్తున్నారు. ఇది వారు తమ
ప్రాణాలు నిలుపుకోవటానికి చేస్తున్నారు. యెరూ
షలేము ఇలా అంటున్నది: "యెహోవా, ఇటు
చూడు; నావైపు చూడు! ప్రజలు నన్నెలా అస
హ్యించుకొంటున్నారో చూడు.
12 త్రోవన పోయే ప్రజలారా, మీరు నన్ను లక్ష్య
పెట్టినట్లు లేదు. కాని నావైపు దృష్టి ప్రసరించి
చూడండి. నా బాధవంటి బాధ మరొక్కటేదైనా
ఉందా? నాకు సంభవించిన బాధలాంటిది మరేదైనా
ఉందా? యెహోవా నన్ను శిక్షించిన బాధకు
మించిన బాధ మరేదైనా ఉందా? ఆయనకు తీవ్ర
మైన కోపం వచ్చిన రోజున ఆయన నన్ను
శిక్షించాడు.
13 యెహోవా పైనుండి అగ్ని కురిపించాడు. ఆ అగ్ని
నా ఎముకలకంటింది. ఆయన నా కాళ్లకు వల
పన్నాడు. ఆయన నన్ను అన్నివైపులకు తిప్పాడు.
ఆయన నన్ను ఒక బీడు భూమిలా మార్చాడు.
నేను రోజంతా అస్వస్థతగా ఉన్నాను.

14 "కాడివలె నా పాపాలు కట్టబడ్డాయి. యెహోవా
చేతుల్లో నా పాపాలు మూటగట్టబడ్డాయి.
యెహోవా కాడి నా మెడ మీద ఉంది. యెహోవా
నన్ను బలహీన పర్చాడు. నేను ఎదిరించలేని
ప్రజలకు యెహోవా నన్ను అప్పజెప్పాడు.
15 "బలమైన నా సైనికులందరినీ యెహోవా తిరస్క
రించాడు. ఆ సైనికులంతా నగరంలోనివారే.
పిమ్మట యెహోవా ఒక జనసమూహాన్ని నా
మీదికి తెచ్చాడు. నా యువ సైనికులను చంప
టానికే ఆయన ఆ జనాన్ని తీసికొని వచ్చాడు.
ద్రాక్షా గానుగలలో వున్న కాయలపై (ప్రజలు)
యెహోవా అడుగువేసి త్రొక్కాడు. ఆ ద్రాక్షా
గానుగ కన్యక అయిన యెరూషలేము కుమారి.
16 "ఈ విషయాలన్నిటిపట్ల నేను వ్యధ చెందు
తున్నాను. నా కళ్లు; కన్నీళ్లతో తడిసిపోయాయి.
నన్ను ఓదార్చు వారెవ్వరూ నావద్ద లేరు. నన్ను
ఓదార్చి స్వస్థపర్చు వారెవ్వరూ లేరు. నా పిల్లలు
బంజరు భూమిలా ఉన్నారు. శత్రువు గెలవటంతో
వారలా తయారయ్యారు."
17 సీయోను* తన చేతులు చాపింది. ఆమెను ఆద
రించేవారెవ్వరూ లేరు. యాకోబు* శత్రువులకు
యెహోవా ఆజ్ఞ ఇచ్చాడు. యాకోబు శత్రువులకు
అతనిని చుట్టుముట్టుమని యెహోవా ఆజ్ఞ
ఇచ్చాడు. యెరూషలేము అపవిత్రమయ్యింది. ఆ
శత్రువుల మధ్య ఆమె అపవిత్రురాలైంది.
18 "నేను యెహోవాను అనుసరించటానికి తిరస్క
రించాను. అందువల్ల ఆయన చేసిన పని న్యాయ
మైనదే అని ఆమె అంటూవుంది. కావున ప్రజలారా,
వినండి! నా బాధను గమనించండి! నా యువతీ
యువకులు బందీలైపోయారు.
19 నా ప్రేమికులను నేను పిలిచాను. కాని వారు నన్ను
మోసగించారు. నా యాజకులు, నా పెద్దలు నగ
రంలో చనిపోయారు. ఆహారం కొరకు వారు అన్వే
షించారు. వారు తమ ప్రాణాలను నిలువు
కోదల్చారు.
20 "యెహోవా, నా వైపు చూడు. నేను బాధలో
ఉన్నాను! నాలో కలవరం చెలరేగింది! నా గుండె
తల్లక్రిందులైనట్లు నాకు భావన కలుగుతూ వుంది!
నా కలవరపాటుకు కారణం నేను మొండిగా
తిరుగుబాటు చేయటమే! నా పిల్లలు నడివీధుల్లో
కత్తికి గురి అయ్యారు. ఇంటిలోపల మృత్యువు
పొంచివుంది.
21 "నా గోడు విను, నేను దుఃఖభారంతో నిట్టూర్చు
తున్నాను. ఓదార్చటానికి నాకు ఎవ్వరూ లేరు.
నా శత్రువులంతా నా కష్టాల గురించి విన్నారు.
విని సంతోషపడ్డారు. నీవు నాకు ఈ శిక్ష విధించి
నందుకు వారు సంతోషించారు. నీవు ప్రకటించిన
ఆ రోజును ఇప్పుడు రప్పించుము. ఆ రోజున
నా శత్రువులు ఇప్పుడు నేనున్న స్థితికి వచ్చేలా
చేయుము.
22 "నా శత్రువుల దుష్టత్వం నీ ముందు ప్రకటితమ
వ్వనిమ్ము. నా పాపాలకు నీవు నన్ను శిక్షించినట్లు,
అప్పుడు వారి దుష్టత్వానికి వారిని శిక్షించుము.
పొంగిన దుఃఖంతో ఎడతెరిపి లేకుండా నేను
మూల్గుతున్నాను. అందువల్ల నీవు ఇది చెయ్యి.
నా హృదయం కృంగి కృశించినందున నీవు ఈ
పని చెయ్యి."

### యెహోవా యెరూషలేమును నాశనం చేయుట

2 సీయోను కుమార్తెను (యెరూషలేము)
యెహోవా మేఘముతో కప్పి ఎలా మరుగు
పర్చినాడో చూడుము. ఇశ్రాయేలు వైభవాన్ని
ఆయన ఆకాశాన్నుండి భూమికి త్రోసివేశాడు.
యెహోవాకు కోపం వచ్చిన రోజున ఇశ్రాయేలు
ఆయన కాలిపీట అని కూడా ఆయన గుర్తు పెట్టు
కోలేదు.
2 యాకోబు (ఇశ్రాయేలు) ఇండ్లను యెహోవా
మింగివేశాడు. కనికరం లేకుండా ఆయన వాటిని
మింగివేశాడు. ఆయన తన కోపంలో యూదా
కుమార్తె (యూదా రాజ్యం) కోటలను నాశనం

---

**సీయోను** యెరూషలేము నగరం కట్టబడిన పర్వతానికి ఆగ్నేయ మూల. యెరూషలేములో నివసిస్తున్న దేవుని ప్రజలు అని కూడ అర్థం.

**యాకోబు** ఇది ఇశ్రాయేలుకు మరో పేరు.

చేశాడు. యూదా రాజ్యాన్ని, దాని పాలకులను
యెహోవా నేలకు పడదోసినాడు. ఆయన
రాజ్యాన్ని నాశనం చేశాడు.
3 యెహోవా తన కోపంతో ఇశ్రాయేలు బలాన్ని
క్షయం చేశాడు. ఆయన తన కుడిచేతిని ఇశ్రా
యేలు మీదినుండి తీసివేశాడు. శత్రువు వచ్చి
నప్పుడు ఆయన అలా చేశాడు. యాకోబు (ఇశ్రా
యేలు)లో ఆయన అగ్నిశిఖలా మండినాడు. ప్రళ
యాగ్నిలా ఆయన ఉన్నాడు.
4 ఒక శత్రువులా యెహోవా తన విల్లు వంచాడు.
ఆయన కుడిచేయి తన ఖడ్గం ఒరమీద వుంది.
బాగా కన్పించే యూదా మనుష్యులందరినీ ఆయన
చంపివేశాడు. యెహోవా ఒక శత్రువులా వారిని
హతమార్చినాడు. యెహోవా తన కోపాన్ని
కుమ్మరించాడు. ఆయన దానిని సీయోను గుడారా
లపై కుమ్మరించాడు.
5 యెహోవా ఒక శత్రువులా అయ్యాడు. ఆయన
ఇశ్రాయేలును మింగేశాడు. ఆయన దాని స్థలాల
న్నిటినీ మింగేశాడు. ఆయన దాని కోటలన్నిటినీ
మింగేశాడు. మృతుల కొరకు యూదా కుమార్తెలో
మిక్కిలి దుఃఖాన్ని, బాధను కలుగ జేశాడు.
6 యెహోవా తన స్వంత గుడారాన్నే ఒక తోట
మాదిరి నాశనం చేసినాడు. ప్రజలు ఎక్కడ సమా
వేశమై తనను ఆరాధిస్తారో ఆ ప్రదేశాన్నే ఆయన
పాడుజేశాడు. సీయోనులో ప్రత్యేక సమావేశాలు,
ప్రత్యేక విశ్రాంతి దినాలను ప్రజలు మర్చిపోయేలా
యెహోవా చేశాడు. యెహోవా రాజును, యాజ
కుని తిరస్కరించాడు. తన కోపంలో ఆయన
వారిని తిరస్కరించాడు.
7 యెహోవా తన బలిపీఠాన్ని తిరస్కరించాడు.
ఆయన తన పవిత్ర ఆరాధనా స్థలాన్ని తిరస్క
రించాడు. యెరూషలేము కోట గోడలను ఆయన
శత్రువులకు అప్పజెప్పాడు. యెహోవా ఆల
యంలో శత్రువు అల్లరి చేశాడు. అది ఒక శెలవు
రోజు అన్నట్లు వారు అల్లరి చేశారు.
8 సీయోను కుమార్తె (ఇశ్రాయేలు) కోట గోడలను
కూల దోయటానికి యెహోవా పథకం నిర్ణ
యించాడు. ఒక కొలబద్దతో అతడు గోడకు
గుర్తులు పెట్టాడు. దానిని నాశనం చేయటంలో
తనను తాను నిగ్రహించుకోలేదు. కావున బయటి
ప్రాకారం, ఇతర గోడలు దుఃఖ భారంతో కూలి
పోయేలా చేశాడు. అవి ఒక్కుమ్మడిగా శిథిలమై
పోయాయి.
9 యెరూషలేము ద్వారాలు భూమిలోకి క్రుంగి
పోయాయి. ద్వారాల కడ్డీలను ఆయన నుగ్గు
నుగ్గు చేశాడు. ఆమె యొక్క రాజు, యువరాజులు
పరదేశాలకు పోయి ఉన్నారు. వారికి ఇక ఎంత
మాత్రం ఉపదేశం లేదు. యెరూషలేము ప్రవక్తలకు
కూడా యెహోవా నుండి దర్శనాలు ఏమీలేవు.
10 సీయోను పెద్దలు నేలపై కూర్చున్నారు. వారు
కింద కూర్చుండి మౌనం వహించారు. వారు తమ
తలలపై దుమ్ము జల్లుకున్నారు. వారు గోనెపట్ట
కట్టుకున్నారు. యెరూషలేము యువతులు
దుఃఖంతో తమ తలలు కిందికి వంచుకున్నారు.
11 కన్నీళ్లతో నా కళ్లు నీరసించాయి! నా అంత
రంగంలో గందరగోళం చెలరేగుతూవుంది! నా
గుండె జారి కిందపడినట్లు భావన కలుగుతూ ఉంది!
నా ప్రజల నాశనం చూసిన నాకు ఆ భావన కలు
గుతూ ఉంది. పిల్లలు, పసికందులు నగర రహదారి
స్థలాలలో మూర్ఛపోతున్నారు.
12 "రొట్టె, ద్రాక్షారసం ఏవి?" అని ఆ పిల్లలు తమ
తల్లులను అడుగుతున్నారు. వారు చనిపోతూ ఈ
ప్రశ్న అడుగుతున్నారు. వారు తమ తల్లుల ఒడిలో
పడుకొని ఉండగా చనిపోతున్నారు.
13 సీయోను కుమారీ, నిన్ను దేనితో సరిపోల్చను?
నిన్ను దేనితో పోల్చాలి? సీయోను కన్యాకుమారీ,
నిన్ను దేనితో పోల్చను? నిన్నెలా ఓదార్చగలను?
నీ వినాశనం సముద్రమంత పెద్దది! ఎవ్వరేగాని
నిన్ను స్వస్థపర్చగలరని నేను అనుకోవటంలేదు.
14 నీ ప్రవక్తలు నీ కొరకు దర్శనాలు చూశారు. కాని
వారి దర్శనాలన్నీ విలువలేని అబద్ధాలు. పాపం
చేయవద్దని వారు నిన్ను హెచ్చరించలేదు. పరిస్థితి
మెరుగుపర్చటానికి వారు ఎట్టి ప్రయత్నమూ
చేయలేదు. వారు నీకొరకు ఉపదేశాలు అందిం
చారు. కాని, అవి కేవలం నిన్ను మోసగించటానికి
ఉద్దేశించబడిన అబద్ధపు వర్తమానాలు.
15 మార్గమున పోవు వారు నిన్ను చూసి విస్మయంతో
చేతులు చరుస్తారు. యెరూషలేము కుమార్తెను
చూచి వారు ఈలవేసి తలలు ఆడిస్తారు. 'అపురూప
అందాల నగరం' అనీ, 'భూనివాసులకు ఆనంద
దాయిని' అని ప్రజలు పిలిచే నగరం ఇదేనా?"
అని వారడుగుతారు.
16 నీ శత్రువులంతా నిన్ను చూసి నోళ్లు తెరుస్తారు.
వారు ఈలవేసి, నిన్నుజూచి పండ్లు కొరుకుతారు.
"మేము వారిని మింగేశాము! నిజంగా మేము ఈ
రోజుకొరకే ఎదురుచూశాము. చివరకు ఇది జర
గటం మేము చూశాము" అని వారంటారు.
17 యెహోవా తాను అనుకున్న ప్రకారమే చేశాడు.
ఆయన ఏది చేస్తానని అన్నాడో అది చేసివేశాడు.
పూర్వకాలం నుండి ఆయన ఎలా హెచ్చరిస్తూ
వచ్చాడో ఆయన ఇప్పుడు అలాగే చేశాడు. దయా
దాక్షిణ్యం లేకుండా ఆయన నాశనం చేశాడు. నీ
మూలంగానే నీ శత్రువులు సంతోషపడేలా ఆయన
చేశాడు. ఆయన నీ శత్రువుల శక్తియుక్తులను
పెంచాడు.

18 ఓ సీయోను కుమార్తె ప్రాకారమా, నీ గుండెలు
పగిలేలా యెహోవాకు మొరపెట్టుకో! నీ కన్నీరు
వాగులా పారనీ! నీ కన్నీరు మున్నీరై పారనీ! నీ
కన్నీరు రాత్రింబవళ్లు కారనీ! వాటిని ఆపకు! నీ
కండ్లకు విశ్రాంతి నివ్వకు!
19 లెమ్మా! రాత్రిళ్లు రోదించు! రాత్రిళ్లు ప్రతి
ఝామున దుఃఖించు! ఒక జలరాశిలా నీ గుండె
కుమ్మరించు! యెహోవా ముందు నీ గుండె
కుమ్మరించు! నీ చేతులెత్తి యెహోవాకు ప్రార్థన
చేయుము. నీ పిల్లలు బతికేలా చేయుమని ఆయ
నను ప్రాధేయపడుము. ఆకలితో అలమటించి
సొమ్మసిల్లే నీ పిల్లలను బతికించుమని ఆయనను
అర్థించుము. ఆకలితో మాడి నగర వీధుల్లో వారు
సొమ్మసిల్లి పడిపోతున్నారు.
20 యెహోవా, నావైపు చూడుము! నీవు ఈ రకంగా
శిక్షించినది ఎవ్వరినో చూడు! నన్ను ఈ ప్రశ్న
అడుగనిమ్ము: తాము కన్న బిడ్డలనే స్త్రీలు తిన
వలెనా? తాము పెంచి పోషించిన బిడ్డలనే స్త్రీలు
తినవలెనా? యాజకుడు, ప్రవక్త యెహోవా ఆల
యంలో చంపబడాలా?
21 యువకులు, ముసలివారు నగర వీధుల్లో
దుమ్ములో పడివున్నారు. నా యువతీ యువకులు
కత్తి వేటుకు గురియైనారు. యెహోవా, నీవు
కోపగించిన రోజున నీవు వారిని చంపేశావు! దయ
లేకుండా నీవు వారిని చంపివేశావు!
22 నలుమూలల నుండి నా మీదికి భయాన్ని ఆహ్వా
నించావు. ఏదో విందుకు ఆహ్వానించినట్లు నీవు
భయాన్ని ఆహ్వానించావు. యెహోవాకు కోపం
వచ్చిన రోజున తప్పించుకున్నవాడుగాని, దానిని
తట్టుకున్నవాడుగాని ఒక్కడూ లేడు. నేను పెంచి
పోషించిన వారందరినీ నా శత్రువు చంపివేశాడు.

### తన బాధ యొక్క అంతరార్థాన్ని గ్రహించిన వ్యక్తి

3 నేను కష్టాలు అనుభవించిన వ్యక్తిని. యెహోవా
కోపపు కర్ర క్రింద నేను సంకట పరిస్థితులు
చూశాను.
2 యెహోవా నన్ను చీకటిలోకి నడిపించాడేగాని
వెలుగులోకి గాదు.
3 యెహోవా తన చేతిని నా మీదకి ఎత్తాడు.
రోజంతా పదే పదే ఆయన అలా చేశాడు.
4 ఆయన నా మాంసం, నా చర్మం కృశింపజేశాడు.
ఆయన నా ఎముకలు విరుగగొట్టాడు.
5 యెహోవా నా పైకి కష్టాలను, వేదనను రప్పిం
చాడు. ఆయన నాచుట్టూ విషాన్ని, సంకట పరి
స్థితిని కలుగచేశాడు.
6 ఆయన నన్ను చీకటిలో కూర్చునేలా చేశాడు.
ఏనాడో చనిపోయిన వ్యక్తిలా నన్ను ఆయన
చేశాడు.
7 యెహోవా నన్ను బయటకు రాకుండా బంధిం
చాడు. ఆయన నాకు బరువైన గొలుసులు తగి
లించాడు.
8 సహాయం కొరకు నేను మొర్రపెట్టుకుని అర్థిం
చినా, యెహోవా నా ప్రార్థన ఆలకించలేదు.
9 ఆయన నా మార్గాన్ని రాళ్లతో అడ్డగించాడు.
ఆయన నా మార్గాన్ని వక్రంగా, గతుకులమయం
చేశాడు.
10 నా మీదకు పడనున్న ఎలుగుబంటిలా యెహోవా
ఉన్నాడు. ఆయన పొంచి వున్న ఒక సింహంలా
ఉన్నాడు.
11 యెహోవా నన్ను నా మార్గం నుండి తొల
గించాడు. ఆయన నన్ను ముక్కలుగా చీల్చాడు.
నన్ను నాశనం చేశాడు.
12 ఆయన విల్లంబులు చేపట్టాడు. ఆయన బాణాలకు
నన్ను గురి చేశాడు.
13 ఆయన నా పొట్టలో బాణం వేశాడు. ఆయన
బాణాలతో నన్ను తూట్లు పొడిచాడు.
14 నా ప్రజలందరిలో నేను నవ్వులపాలయ్యాను.
రోజంతా పాటలు పాడి వారు నన్ను ఎగతాళి
చేస్తారు.
15 యెహోవా నాచేత చేదు పానీయం (శిక్ష) తాగిం
చాడు. ఆయన చేదు పానీయాలతో నన్ను నింపి
వేశాడు.
16 నా పండ్లు రాతి నేలలో గుచ్చుకుపోయేలా
యెహోవా నన్ను తోశాడు. ఆయన నన్ను మట్టి
లోకి తోసివేశాడు.
17 ఇక నాకు శాంతి ఉండదని అనుకున్నాను. మంచి
విషయాలు ఎట్టివో నేను మర్చిపోయాను.
18 "యెహోవా తిరగి నాకు సహాయం చేస్తాడనే
ఆశ లేదనుకొన్నాను."
19 ఓ యెహోవా, నా దుఃఖాన్ని, నేను నా నివాసాన్ని
కోల్పోయిన తీరును గుర్తుపెట్టుకొనుము. నీవు
నాకిచ్చిన చేదుపానీయాన్ని, విషం (శిక్ష) కలిపిన
పానీయాలను జ్ఞాపకం పెట్టుకొనుము.
20 నా కష్టాలన్నీ నాకు బాగా జ్ఞాపకం ఉన్నాయి.
నేను మిక్కిలి విచారిస్తున్నాను.
21 కాని నేను మరలా ఆలోచించగా నాకు కొంత ఆశ
పొడచూపింది. నేను ఇలా అనుకున్నాను.
22 యెహోవా యొక్క ప్రేమ, దయ అంతంలేనివి.
యెహోవా కృపా కటాక్షాలు తరగనివి.
23 అవి నిత్య నూతనాలు. ఓ యెహోవా, నీ విశ్వస
నీయత గొప్పది.
24 "యెహోవా నా దేవుడు. అందువల్లనే నాకీ ఆశ
పొడచూపింది," అని నేను అనుకున్నాను.
25 ఆయన కోసం నిరీక్షించే వారికి యెహోవా శుభం
కలుగజేస్తాడు. ఆయన కోసం వెదికేవారికి
యెహోవా ఉదారుడు.

26 యెహోవా రక్షణకై నెమ్మదిగా వేచియుండటం
క్షేమకరం
27 యెహోవా కాడిని ధరించే వానికి మంచి కలుగు
తుంది. ఆయన కాడిని చిన్నతనం నుండే
మోయటం ఆ వ్యక్తికి మరీ మంచిది.
28 యెహోవా తన కాడిని వానిమీద వేయునప్పుడు
ఆ వ్యక్తి ఒంటరిగా కూర్చుని మౌనంగా ఉండాలి.
29 ఆ వ్యక్తి బూడిదలో కూర్చొని యెహోవాకు
సాష్టాంగపడి సమస్కరించాలి. దానివల్ల తన ఆశ
నెరవేరునేమో.
30 తనను కొట్టేవానివైపు తన దవడను ఆ వ్యక్తి
తిప్పాలి. ఆ వ్యక్తి అవమానాలను భరించటానికి
సంసిద్ధుడు కావాలి.
31 యెహోవా తన ప్రజలను శాశ్వతంగా తిరస్క
రించడని ఆ వ్యక్తి గుర్తుంచుకోవాలి.
32 యెహోవా శిక్షించేటప్పుడు, ఆయనకు కరుణ
కూడ ఉంటుంది. ఆయనకుగల అపారమైన
ప్రేమ, కరుణ కారణంగా ఆయన జాలి పడతాడు.
33 యెహోవా తన ప్రజలను శిక్షింపకోరడు. తన
ప్రజలను బాధపెట్టటానికి ఆయన ఇష్టపడడు.
34 యెహోవా ఈ విషయాలంటే ఇష్టపడడు:
ఎవ్వరో ఒక్కరికోసం భూమిపైగల ఖైదీలందరినీ
ఆయన పాదాలకింద తొక్కటానికి ఇష్టపడడు.
35 ఒకని మేలుకోసం మరియొకనికి అన్యాయం
చేయటం ఆయనకు ఇష్టముండదు. కాని కొంత
మంది ఈ అన్యాయాన్ని మహోన్నతుడైన దేవుని
సన్నిధిలోనే చేస్తారు.
36 ఒకని మంచి పనిని మరియొకని కోసం పాడు
చేయటానికి ఆయన ఇష్టపడడు. యెహోవా ఈ
పనులేవీ చేయటానికి ఇష్టపడడు.
37 యెహోవా ఆజ్ఞలేకుండా ఎవ్వరూ దేనినీ చెప్ప
లేరు; చెప్పి జరిపించలేరు.
38 మహోన్నతుడైన దేవుని నోటినుండి వరాలు,
శాపాలు రెండూ వెలువడతాయి.
39 ఒక వ్యక్తియొక్క పాపాలననుసరించి యెహోవా
అతన్ని శిక్షిస్తాడు. కనుక, బతికున్న వాడెవడూ
ఆయనపై ఫిర్యాదు చేయలేడు?
40 మన జీవన విధానాన్ని, మన పనులను ఒకమారు
పరిశీలించుకొని యెహోవాను ఆశ్రయించు
దాము.
41 పరలోకాధిపతియైన దేవుని వైపు మన హృదయా
లను, చేతులను చాపుదాము.
42 ఆయనకు మనం ఇలా విన్నవించుకుందాము:
“మేము పాపం చేశాము, మొండివైఖరి దాల్చాము.
అందువల్ల నీవు మమ్మల్ని క్షమించలేదు.
43 నిన్ను కోపం ఆవరించినప్పుడు నీవు మమ్మల్ని
వెంటాడినావు. కనికరం లేకుండా నీవు మమ్మల్ని
చంపావు.
44 నిన్ను నీవు ఒక మేఘంతో కప్పుకున్నావు. ఏ
ఒక్క ప్రార్థనా నీలో ప్రవేశించకుండ నీవలా చేశావు.
45 అన్య దేశాలవారి దృష్టిలో మమ్మల్ని పనికిరాని
చెత్తలా, కల్మశంలా చేశావు.
46 మా శత్రువులందరూ మాతో కోపంగా మాట్లాడు
తున్నారు.
47 మేము భయానికి గురి అయ్యాము. మేము గోతిలో
పడ్డాము. మేము బాధపెట్టబడి, చితుక గొట్ట
బడ్డాము!”
48 నా కన్నీళ్లు ప్రవాహంలా కారుచున్నాయి! నా
ప్రజానాశనం పట్ల నేను మిక్కిలి దుఃఖిస్తున్నాను.
49 ఎడతెరిపిలేకుండా నా కన్నీరు కారుతూవుంది! నా
దుఃఖం ఆగదు.
50 ఓ యెహోవా, నీ దృష్టి మా పై ప్రసాదించి,
మమ్మల్ని చూసే వరకు నా దుఃఖం ఆగదు. పర
లోకం నుండి నీవు మమ్మల్ని చూసేవరకు నేను
దుఃఖిస్తూనే ఉంటాను.
51 నా నగర కుమార్తెలకు ఏమి జరిగిందో నేను
చూసినప్పుడు నా కండ్లు నాకు వేదన కలి
గించాయి.
52 తగిన కారణం లేకుండానే నాకు శత్రువులైన వారం
తా నన్నొక పక్షిలా తరిమారు.
53 నేను బతికి వుండగానే నన్ను గోతిలోకి తోశారు.
నాపై వాళ్లు రాళ్లు విసిరారు.
54 నీళ్లు నా తలపైకి వచ్చాయి. “ఇది నా అంతం”
అని నేననుకున్నాను.
55 ఓ యెహోవా, నీ పేరు స్మరించాను. గోతిలో
అట్టడుగునుండి నిన్ను పేరుపెట్టి పిలిచాను.
56 నీవు నా మొరాలకించావు. నీవు నీ చెవులు మూసి
కొనలేదు. నన్ను కాచి రక్షించటానికి నీవు వెనుకాడ
లేదు.
57 నేను నిన్ను పిలిచిన రోజున నీవు నాకు దగ్గరగా
వచ్చావు. “భయపడవద్దు,” అని నాకు అభయ
మిచ్చావు.
58 ఓ యెహోవా, నీవు నా సంగతి పట్టించుకొని నా
పక్షం వహించావు. నాకు మళ్లీ జీవం పోశావు.
59 ఓ యెహోవా, నీవు నా కష్టాలను తిలకించావు.
నా వ్యవహారంలో ఇప్పుడు నీ తీర్పు ఇవ్వు.
60 నా శత్రువులు నన్నెలా హింసించారో నీవు చూశావు.
వారు నాపై జరిపిన కుట్రలన్నీ నీవు చూశావు.
61 ఓ యెహోవా, వారెలా నన్నవమానించారో నీవు
విన్నావు. వారు నాపై జరిపిన కుట్రలన్నిటిని
గురించి నీవు విన్నావు.
62 నా శత్రువుల మాటలు, ఆలోచనలు ఎప్పుడూ
నాకు వ్యతిరేకంగానే ఉన్నాయి.
63 ఓ యెహోవా, వారు కూర్చున్నా, నిలబడినా
వారు నన్నెలా ఎగతాళి చేస్తున్నారో చూడు!

64 ఓ యెహోవా, వారికి తగిన గుణపాఠం నేర్పు!
వారు చేసిన నేరానికి తగిన శిక్ష విధించు!
65 వారి గుండె బండ బారేలా చేయుము! పిమ్మట
వారిని శపించుము!
66 కోపంతో వారిని వెంటాడుము! వారిని నాశనం
చేయుము. యెహోవా, వారిని ఈ ఆకాశం కింద
లేకుండా చేయుము!

### యెరూషలేము పై దాడివల్ల వచ్చిన భయాలు

4 బంగారం ఎలా నల్లబడిందో చూడు. మంచి
బంగారం ఎలా మారి పోయిందో చూడు.
ఆభరణాలన్నీ నలుపక్కలా విసరివేయబడ్డాయి.
ప్రతి వీధి మూలలో ఆ నగలు వెదజల్లబడ్డాయి.
2 సీయోను ప్రజలకు ఒకనాడు చాలా విలువ
వుండేది. వారికి బంగారంతో సరితూగే విలువ
వుండేది. కాని ఈనాడు శత్రువు వారిని మట్టి
కుండల్లా చూస్తున్నాడు. కుమ్మరి చేసిన మట్టి
కుండల్లా ఈనాడు శత్రువు వారిని చూస్తున్నాడు.
3 నక్క సహితం తన పిల్లలకు పొదుగు అందిస్తుంది.
నక్క సహితం తన పిల్లలను పాలు తాగనిస్తుంది.
కాని నా ప్రజల కుమార్తె (ఇశ్రాయేలు స్త్రీలు)
మాత్రం కఠినాత్మురాలు. ఆమె ఎడారిలో నివసించే
ఉష్ట్రపక్షిలా వుంది.
4 దాహంతో పసిబిడ్డ నాలుక అంగిట్లో అతుక్కు
పోతుంది. చిన్న పిల్లలు అన్నానికి అలమటిస్తారు.
కాని వారికి ఎవ్వరూ ఆహారం ఇవ్వరు.
5 ఒకనాడు విలువైన భోజనం చేసినవారు, ఈనాడు
వీధుల్లో చనిపోతున్నారు. అందమైన ఎర్రని
దుస్తుల్లో పెరిగిన ప్రజలు ఇప్పుడు చెత్త కుండీలలో
ఏరుకుంటున్నారు.
6 నా ప్రజల కుమార్తె (యెరూషలేము స్త్రీలు) చేసిన
పాపం మిక్కిలి ఘోరమైనది. వారి పాపం సొదొమ,
గొమొర్రాల పాపాలకు మించివుంది. సొదొమ,
గొమొర్రా పట్టణాలు అకస్మాత్తుగా నాశనం చేయ
బడ్డాయి. ఏ మానవ హస్తమో చేసిన వినాశనం
కాదది.
7 దేవుని సేవకు ప్రత్యేకంగా అంకితమైన యూదా
మనుష్యులు మంచుకంటె తెల్లనివారు. వారు పాల
కంటె తెల్లనివారు. వారి శరీరాలు పగడంలా
ఎర్రనివి. వారి దేహకాంతి నీలమువంటిది.
8 కాని వారి ముఖాలు ఇప్పుడు మసికంటె నల్లగా
తయారైనాయి. వీధిలో వారిని ఎవ్వరూ గుర్తు
పట్టలేరు. వారి ఎముకలపై వారి చర్మం ముడుతలు
పడింది. వారి చర్మం కట్టెలా అయిపోయింది.
9 కరువుతో మాడి చనిపోయిన వారి స్థితికంటె కత్తి
వేటుకు గురియైన వారు అదృష్టవంతులు. ఆకలిచే
మాడేవారు దుఃఖభాగ్యులు. వారు గాయపర్చ
బడ్డారు. పొలాల నుండి పంటలురాక వారు
ఆకలితో చనిపోయారు.
10 ఆ సమయంలో ఉత్తమ స్త్రీలు కూడ తమ స్వంత
పిల్లలను వండుకొని తిన్నారు. ఆ పిల్లలు తమ
తల్లులకు ఆహార మయ్యారు. నా ప్రజలు నాశనం
చేయబడినప్పుడు ఇది జరిగింది.
11 యెహోవా తన కోపాన్నంతా ప్రయోగించాడు.
తన కోపాన్నంతా ఆయన కుమ్మరించాడు.
సీయోనులో ఆయన అగ్నిని ప్రజ్వరిల్ల జేశాడు.
ఆ అగ్ని సీయోను పునాదులను తగులబెట్టింది.
12 జరిగిన దానిని ప్రపంచ రాజులెవ్వరూ నమ్మ
లేకపోయారు. ప్రపంచ ప్రజానీకం ఏది సంభ
వించిందో దానిని నమ్మలేకపోయింది. శత్రువులు
యెరూషలేము నగర ద్వారాల గుండా లోనికి
ప్రవేశింపగలరని వారు అనుకోలేదు.
13 యెరూషలేము ప్రవక్తలు పాపం చేసిన నేరానికి
ఇది జరిగింది. యెరూషలేము యాజకులు దుష్ట
కార్యాలు చేయటం వలన ఇది సంభవించింది.
యెరూషలేము నగరంలో ఆ మనుష్యులు రక్తం
చిందించుతున్నారు. వారు మంచివారి రక్తాన్ని
పారిస్తున్నారు.
14 ప్రవక్తలు, యాజకులు అంధుల్లా వీధుల్లో తిరి
గాడారు. వారు రక్తసిక్తమై మలినపడ్డారు. వారు
మలినపడిన కారణంగా ఎవ్వరూ వారి బట్టలను
కూడ ముట్టరు.

15 "పొండి! దూరంగా పొండి! మమ్మల్ని తాకవద్దు."
ఆ ప్రజలు చుట్టుపక్కల తిరుగాడినారు. వారికి
నివాసం లేదు. "వారు మాతో కలిసి నివసించటం
మాకు ఇష్టం లేదు." అని అన్యదేశీయులు
అన్నారు.
16 యెహోవాయే ఆ ప్రజలను నాశనం చేశాడు.
ఆయన వారి బాగోగులు ఎంతమాత్రం తెలుసు
కోలేదు. ఆయన యాజకులను గౌరవించలేదు.
ఆయన యూదా పెద్దలతో స్నేహ భావంతో లేడు.
17 మా కండ్లు పనిచేయటం మానివేశాయి. మేము
సహాయం కొరకు నిరీక్షించాము. కాని అది రాలేదు.
ఆ నిరీక్షణలో కండ్లు అలసిపోయాయి. ఏదో ఒక
రాజ్యం వచ్చి మమ్మల్ని రక్షిస్తుందని అదే పనిగా
ఎదురుచూశాము. మా కావలి బురుజులపై నుండి
మేము చూశాము. కాని ఏ దేశమూ మమ్మల్ని
కాపాడటానికి రాలేదు.
18 అన్ని వేళలా మా శత్రువులు మమ్మల్ని వేటాడారు.
మేము కనీసం వీధులలోకి కూడ పోలేకపోయాము.
మా అంతం సమీపించింది. మాకు సమయం దగ్గర
పడింది. మాకు అంతిమకాలం వచ్చేసింది!
19 మమ్మల్ని వేటాడిన మనుష్యులు ఆకాశంలో గద్దల

కంటె వేగవంతులు. ఆ మనుష్యులు మమ్మల్ని
పర్వతాలలోకి తరిమివేశారు. మమ్మల్ని పట్టుకోవ
టానికి వారు ఎడారిలో మాటువేశారు.
20 మా ముక్కు రంధ్రాలలో ఊపిరిలా మెలగిన మా
రాజును వారు తమ గోతిలో పట్టుకున్నారు. రాజు
యెహోవాచే అభిషిక్తము చేయబడిన వ్యక్తి.
"మేము ఆయన నీడలో నివసిస్తాము; ప్రపంచ
రాజ్యాల మధ్య మేము ఆయన నీడలో నివసి
స్తాము," అని మేము మా రాజును గురించి చెప్పు
కున్నాము.
21 ఎదోము ప్రజలారా, సంతోషంగా ఉండండి,
ఆనందించండి. ఊజు రాజ్యంలో నివసించే ప్రజ
లారా, సంతోషంగా వుండండి. కాని ఒక్కటి
మాత్రం గుర్తు పెట్టుకోండి. యెహోవా కోపపు
గిన్నె మీవద్దకు కూడా వస్తుంది. మీరు దానిని
తాగినప్పుడు, మీకు మత్తెక్కుతుంది. ఆ మత్తులో
మిమ్మల్ని మీరు దిగంబరులుగా చేసుకుంటారు.
22 సీయోనూ, నీ శిక్ష పూర్తి అయ్యింది. మరెన్నడూ
నీవు చెరపట్టబడవు. కాని ఎదోము ప్రజలారా,
యెహోవా మీ పాపాలకు తగిన శిక్ష విధిస్తాడు.
ఆయన మీ పాపాలను బహిర్గతం చేస్తాడు.

### యెహోవాకు ప్రార్థన

5 యెహోవా! మాకు జరిగిన దానిని జ్ఞాపకము
చేసికొనుము. మాకు జరిగిన అవమానాన్ని
తిలకించుము.
2 మా రాజ్యం పరాయివాళ్ల వశమయ్యింది. మా
ఇండ్లు అన్యదేశీయులకు ఇవ్వబడ్డాయి.
3 మేము అనాధలమయ్యాము. మాకు తండ్రిలేడు.
మా తల్లులు విధవరాండ్రవలె అయ్యారు.
4 మా తాగే నీరు మేము కొనవలసి వచ్చింది. మేము
వాడే కట్టెలకు మేము డబ్బు చెల్లించవలసి
వచ్చింది.
5 మా మెడమీద బలవంతంగా కాడి మోయవలసి
వచ్చింది. మేము అలసిపోయాము. మాకు విశ్రాంతి
లేదు.
6 మేము ఈజిప్టుతో ఒక ఒడంబడిక చేసికొన్నాము.
తగిన ఆహార పదార్థాల సరఫరాకు మేము అష్షూ
రుతో కూడ ఒక ఒడంబడిక చేసికొన్నాము.
7 నీపట్ల మా పూర్వీకులు అపచారం చేశారు. వారి
ప్పుడు చచ్చిపోయారు. వారి పాపాలకు ఇప్పుడు
మేము కష్టాలనుభవిస్తున్నాము.
8 బానిసలు మాకు పాలకులయ్యారు. వారినుండి
మమ్మల్ని రక్షించటానికి ఎవ్వరూ లేరు.
9 మేము ఆహారం సంపాదించటానికి మా ప్రాణాలు
తెగించవలసి వచ్చింది. ఎడారిలో కత్తులు ధరించి
వున్న మనుష్యుల మూలంగా మేము మా
ప్రాణాలను తెగించవలసి వచ్చింది.
10 నిప్పు కొలిమిలా మా చర్మం వేడెక్కింది. నకనక
లాడే ఆకలి కారణంగా మా చర్మం వేడెక్కింది.
11 సీయోను స్త్రీలపై శత్రువులు అత్యాచారాలు జరి
పారు. వారు యూదా నగరాలలో స్త్రీలను
చెరిపారు.
12 మా రాజకుమారులను శత్రువు ఉరితీశాడు. వారు
మా పెద్దలను గౌరవించలేదు.
13 శత్రువు మా యువకులచే తిరుగలి తిప్పించి పిండి
పట్టించాడు. మా యువకులు కట్టెల మోపులు
మోయలేక తొట్రిల్లారు.
14 నగర ద్వారాల వద్ద పెద్దలు ఏమాత్రం కూర్చోడం
లేదు. యువకులు సంగీతం పాడటం మానివేశారు.
15 మా హృదయాల్లో సంతోషం ఏ మాత్రం లేదు.
మా నాట్యం చనిపోయిన వారి కొరకు విలాపంగా
మారింది.

16 మా తలనుండి కిరీటం కింద పడిపోయింది. మేము
పాపం చేయటం మూలంగా మాకు చెడు పరిణా
మాలు వచ్చాయి.
17 ఇందు మూలంగా మా గుండెలు అలిసిపోయాయి.
ఫలితంగా మా కండ్లు మసకబారాయి.
18 సీయోను పర్వతం బీడు భూమి అయ్యింది.
సీయోను పర్వతం మీద నక్కలు సంచరి
స్తున్నాయి.
19 కాని యెహోవా, నీవు శాశ్వతంగా పరిపాలిస్తావు.
నీ రాచరిక సింహాసనం కలకాలం అలా నిలిచి
వుంటుంది.
20 యెహోవా, నీవు మమ్మల్ని శాశ్వతంగా మర్చి
పోయినట్లున్నావు. నీవు మమ్మల్ని ఇంత దీర్ఘకాలం
వదిలి వెళ్లావు.
21 యెహోవా, మమ్మల్ని నీవద్దకు చేర్చుకో. మేము
సంతోషంగా నీదరి చేరుతాము. మా రోజులను
మునుపటిలా మార్చివేయుము.
22 నీవు మమ్మల్ని పూర్తిగా తిరస్కరించావు. నీవు
మాపట్ల మిక్కిలి కోపం వహించావు.

# యెహెజ్కేలు

## పరిచయం

1 1-3నేనొక యాజకుణ్ణి. నా పేరు యెహెజ్కేలు.
బూజీ కుమారుణ్ణి. దేశభ్రష్టుడనై చెరలో
ఉన్నాను.* బబులోనులో నేను కెబారు కాలువ పక్కన
ఉండగా ఆకాశం తెరువబడింది. అప్పుడు నాకు
దైవసంబంధమైన దర్శనాలు కలిగాయి. అది ముప్పైవ
సంవత్సరంలో* నాల్గవ నెల (జూన్) ఐదవ రోజున
జరిగింది.

బబులోను రాజైన యెహోయాకీను ప్రవాసంలో
చెరపట్టబడ్డాక ఐదవ సంవత్సరం, ఆ నెలలో ఐదవ
రోజున యెహోవా వాక్కు యెహెజ్కేలుకు విన
వచ్చింది. ఆ స్థలంలో యెహోవా ప్రభావం అతని
మీదికి వచ్చింది.

### యెహోవా సింహాసనపు రథం

4ఉత్తరాన్నుండి గాలి దుమారం లేచి వస్తున్నట్లు
నేను (యెహెజ్కేలు) చూశాను. అది ఒక పెను మేఘం.
దాని నుండి అగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. దానిచుట్టూ
వెలుగు దేదీప్యమానంగా ఉంది. అగ్నిలో కణకణలాడే
లోహంలా అది మెరుస్తూ ఉంది. 5దాని లోపల నాలుగు
జంతువులు* ఉన్నాయి. వాటి రూపం మానవ
రూపంలా ఉంది. 6కాని ప్రతీ జంతువుకు నాలుగు
ముఖాలు, నాలుగు రెక్కలు ఉన్నాయి. 7వాటి కాళ్లు
నిట్ట నిలువుగా ఉన్నాయి. వాటి పాదాలు ఆవు పాదాల్లా
ఉన్నాయి. అవి మెరుగుదిద్దిన ఇత్తడిలా మెరుస్తూ
ఉన్నాయి. 8వాటి రెక్కల కింద మనుష్యుల చేతులు
వంటివి ఉన్నాయి. అక్కడ మొత్తం నాలుగు జంతు
వులున్నాయి. వాటిలో ప్రతి ఒక్క జంతువుకూ
నాలుగు ముఖాలు, నాలుగు రెక్కలు ఉన్నాయి.
9ఇప్పుడు వాటి ముఖాల గురించి వివరిస్తాను. వాటి
రెక్కలు ఒకదానితో ఒకటి తాకుతున్నాయి. అవి కదిలి
నప్పుడు ఆ జంతువులు పక్కకి తిరుగలేదు. అవి
చూస్తూవున్న దిశలోనే అవి కదిలి వెళ్ళాయి.
10ప్రతి జంతువుకు నాలుగు ముఖాలున్నాయి. ప్రతి
ఒక్కటి ముందువైపు మనుష్య ముఖం కలిగిఉంది.
కుడివైపు సింహపు ముఖం ఉంది. ఎడమ పక్క ఎద్దు
ముఖం ఉంది. వెనుకవైపు గరుడ ముఖం ఉంది. 11తమ
రెక్కలతో ఆ జంతువులు తమ శరీరాలను కప్పుకు
న్నాయి. రెండు రెక్కలు విప్పుకొని పక్కదాని రెక్క
లను తాకుతున్నాయి. మరి, రెండు రెక్కలు శరీరాన్ని
కప్పుకోవటానికి వినియోగించు కుంటున్నాయి.
12ప్రతి జంతువు చూస్తూవున్న దిశలోనే అవి కదిలి
వెళ్లాయి. గాలి* ఎటువీస్తే అవి అటు కదిలివెళ్లాయి.
కానీ, అవి కదలినప్పుడు వాటి ముఖాలు పక్కకి తిరగ
లేదు.
13ఆ జంతువులు ఆ విధంగా కనిపించాయి. జంతు
వుల మధ్యలోవున్న లోపలి ప్రాంతంలో కాలుతున్న
బొగ్గు నిప్పుల్లా కనబడిన ఏదో ఒకటి ఉంది. ఈ
అగ్ని ఆ జంతువుల చుట్టూ కదలుతున్న చిన్న కాగ
డాల్లా ఉంది. ఆ అగ్ని ప్రకాశవంతగా వెలిగి దాని
నుండి మెరుపు మెరిసింది. 14మెరుపు వంటి వేగంతో
ఆ జీవులు వెనుకకు, ముందుకు కదులుతున్నాయి!
15-16నేనా జంతువుల వైపు చూడగా నాలుగు
చక్రాలు కన్పించాయి. ఆ చక్రాలన్నీ ఒకే విధంగా కని
పించాయి. ఒక్కొక్క ముఖానికి ఒక చక్రం చొప్పున
ఉన్నాయి. ఆ చక్రాలు భూమిని తాకాయి. చక్రాలు
స్వచ్ఛమైన పసుపువన్నె గోమేధికంతో చేయబడినట్లు
కానవచ్చాయి. ఒక చక్రంలో మరో చక్రం ఉన్నట్లు
కన్పించింది. 17ఆ చక్రాలు ఏ దిశలోనైనా కదలగలవు.
కాని అవి కదలినప్పుడు జంతువులు మాత్రం తిరుగ
లేదు. 18ఆ చక్రాల అంచులు ఎత్తుగా, భయంకరంగా
ఉన్నాయి. ఆ నాలుగు చక్రాల అన్ని అంచుల చుట్టూ
కళ్లు ఉన్నాయి. 19ఆ జంతువులతోపాటు చక్రాలు
ఎప్పుడూ కదు లుతూనే ఉండేవి. జంతువులు ఆకాశం

---

**దేశభ్రష్టుడనై చెరలో ఉన్నాను** రాజైన నెబుకద్నెజరు యూదా దేశపు యూదులను దేశంనుండి వెడలగొట్టి అన్య దేశాలలో నివసించేలా చేశాడు.

**ముప్పైవ సంవత్సరం** ఇది ఏ సంవత్సరమో స్పష్టంగా తెలియదు. ప్రవాస కాలంలో ఐదవ సంవత్సరం కావచ్చు. యెహెజ్కేలు తన పుస్తకాన్ని తన చివరి దర్శనంతో గాని, లేదా మొదటి దానివంటిదితో గాని మొదలు పెట్టియుండ వచ్చు.

**జంతువులు** జీవులు అని పాఠాంతరం.

**గాలి** లేక ఆత్మ.

లోకి లేచినప్పుడు వాటితోపాటు చక్రాలు కూడా
లేచేవి. 20గాలి (ఆత్మ) వాటిని ఎటు పోవాలని కోరితే
అవి అటు వెళ్లాయి. అప్పుడు చక్రాలు కూడా వాటితో
వెళ్లాయి. ఎందువల్లనంటే ఆ జంతువుల యొక్క గాలి
శక్తి చక్రాలలోనే ఉంది. 21అందువల్ల జీవులు కదిలితే
చక్రాలు కూడా కదిలేవి. జీవులు ఆగితే చక్రాలు కూడా
ఆగేవి. చక్రాలు గాలిలోకి వెళితే, జీవులు కూడా
వాటితో పాటు వెళ్లాయి. ఎందువల్లనంటే గాలి (ఆత్మ
శక్తి) చక్రాలలోనే ఉంది.

22ఆ జీవులపై ఒక ఆశ్చర్యకరమైన వస్తువు కన్పిం
చింది. అది ఒక పెద్ద పాత్ర బోర్లించినట్లుగా ఉంది.
అది మంచులా స్వచ్ఛంగా ఉంది. అది జీవుల తలల
చుట్టూ గాలిలో తేలియాడుతూ ఉంది. 23ఈ
పాత్రకింద ప్రతి జంతువుయొక్క రెక్కలు పక్కనున్న
జంతువును తాకేటట్లు ఉన్నాయి. రెండు రెక్కలు
ఒక వైపున మరో రెండు రెక్కలు మరో వైపున శరీ
రాన్ని కప్పుతూ వ్యాపించాయి.

24పిమ్మట నేను ఆ రెక్కల చప్పుడు విన్నాను.
జంతువులు కదలినప్పుడల్లా, ఆ రెక్కలు గొప్ప శబ్దం
చేసేవి. మహా నీటి ప్రవాహం ఘోషించినట్లు వాటి
రెక్కల చప్పుడు వినిపించింది. సర్వశక్తిమంతుడైన
దేవుని గంభీర శబ్దంలాగ ఆ శబ్దం వినిపించింది. ఒక
సైన్యంగాని, ఒక ప్రజా సమూహంగాని చేసే రణగొణ
ధ్వనుల్లా అవి వినవచ్చాయి. ఆ జంతువులు కదలటం
మానినప్పుడు అవి వాటి రెక్కలను తమ పక్కలకు
దించివేసేవి.

25జంతువులు కదలటం మానివేసి, రెక్కలను దించి
వేశాయి. పిమ్మట మరొక పెద్ద శబ్దం వచ్చింది. అది
వాటి తలలపైవున్న ఆకాశమండలం లాంటి పాత్ర
మీదుగా వచ్చింది. 26ఆ పాత్రలాంటి వస్తువుపై మరొ
కటి కన్పించింది. అది ఒక సింహాసనంలా ఉంది. అది
నీలమణిలా మెరుస్తూ ఉంది. ఆ సింహాసనంపై మనిషి
వంటి ఒక స్వరూపం కూర్చున్నట్లు కన్పించింది!
27నడుము నుండి పైవరకు అతనిని పరికించి చూశాను.
కాలుతున్న లోహంలా అతడు కన్పించాడు. అతని
చుట్టూ అగ్ని ప్రజ్వరిల్లుతున్నట్లు కానవచ్చింది! అతని
నడుము నుండి కిందికి చూడగా, అంతా అగ్నిలా
కన్పించింది. అది అతని చుట్టూ ప్రకాశిస్తూ ఉంది.
28ఆయన చుట్టూ ప్రకాశించే వెలుగు ఇంద్రధనుస్సులా
ఉంది. అది యెహోవా మహిమలా ఉంది. అది చూచి
నేను సాష్టాంగపడ్డాను. నా శిరస్సు నేలకు ఆనించాను.
అప్పుడు నాతో మాట్లాడే ఒక కంఠస్వరం విన్నాను.

2 ఆ స్వరం, "నరపుత్రుడా, లెమ్ము; నేను నీతో
మాట్లాడదలిచాను" అని అన్నది.

2ఇంతలో ఒకగాలి వచ్చి నన్ను నా పాదాలమీద
నిలబెట్టింది. ఆ వ్యక్తి (దేవుడు) చెప్పేది నేను విన్నాను.
3ఆయన ఇలా చెప్పాడు, "ఓ నరపుత్రుడా, ఇశ్రాయేలు
వంశం వారితో మాట్లాడటానికి నిన్ను నేను పంపు
తున్నాను. ఆ ప్రజలు అనేక సార్లు నాకు వ్యతిరేకుల
య్యారు. వారి పూర్వీకులు కూడా నాపై తిరుగుబాటు
చేశారు. వారు నా పట్ల అనేకసార్లు పాపం చేశారు.
ఈనాటికీ వారు నాపట్ల పాపం చేస్తూనే వున్నారు.
4ఆ ప్రజలతో మాట్లాడటానికి నేను నిన్ను పంపు
తున్నాను. కాని వారు చాలా మొండివారయ్యారు.
వారు తలబిరుసు కలిగినవారు. అయినా, నీవు వారితో
తప్పక మాట్లాడాలి. 'మన ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెపుతున్నాడు' అని నీవు అనాలి. 5కాని
ఆ ప్రజలు నీ మాట వినరు. వారు నా పట్ల పాపం
చేయటం మానరు. ఎందువల్లనంటే వారు మిక్కిలిగా
తిరుగబడే స్వభావం గలవారు. వారు ఎల్లప్పుడూ నాపై
తిరుగుబాటు చేస్తూనే ఉన్నారు! కాని నీవావిషయాలు
చెప్పాలి. దానితో వారిమధ్య ఒక ప్రవక్త నివసిస్తున్నాడని
వారు తెలుసుకుంటారు.

6"ఓ నరపుత్రుడా, ఆ ప్రజలకు నీవు భయపడవద్దు,
వారు చెప్పేవాటికి నీవు భయపడకు. వారు నీకు వ్యతిరే
కులై, నీకు హాని చేయటం ఖాయం. వారు ముండ్లవంటి
వారు. తేళ్లమధ్య నివసిస్తున్నట్లు నీకు అనిపిస్తుంది.
కాని వారు చెప్పేవాటికి నీవు భయపడవద్దు. వారు
తిరుగుబాటుదారులు. అయినా వారికి నీవు భయ
పడవద్దు. 7నేను చెప్పే విషయాలు నీవు వారికి తప్పక
తెలియజేయాలి. వారు నీ మాట వినరని నాకు తెలుసు.
పైగా నా పట్ల పాపం చేయటం వారు మానరు. ఎందు
వల్లనంటే వారు తిరుగబడే స్వభావం గలవారు.

8"ఓ నరపుత్రుడా, నేను నీకు చెప్పే విషయాలు
శ్రద్ధగా విను. ఆ తిరుగుబాటుదారుల్లా నీవు నాకు వ్యతి
రేకం కావద్దు. నీ నోరు తెరచి, నా మాటలు స్వీకరించు.
తిరిగి వాటిని ప్రజలకు తెలియజెప్పు. ఈ మాటలను
నీవు జీర్ణించుకో."

9తరువాత నేను (యెహెజ్కేలు) ఒక చేయి నా
మీదికి రావటం చూశాను. ఆ చేతిలో వ్రాయబడిన
గ్రంథపు చుట్ట ఉంది. 10చుట్టబడిన ఆ కాగితాన్ని
విడదీసి చూడగా దానిమీద రెండు వైపులా వ్రాసివుంది.
అందులో రకరకాల విషాద గీతికలు, విషాద గాథలు,
హెచ్చరికలు ఉన్నాయి.

3 దేవుడు నాతో ఇలా చెప్పాడు: "ఓ నరపుత్రుడా,
నీవు చూస్తున్న దానిని తిను. ఈ గ్రంథపు చుట్టను
తిని, ఇశ్రాయేలు వంశం వారికి దీనిలోనున్న విషయా
లన్నిటినీ తెలియజెప్పు."

2ఆ తరువాత నేను నా నోరు తెరువగా, అతడు
గ్రంథపు చుట్టను నాతో తినిపించెను. 3పిమ్మట దేవుడు
ఇలా అన్నాడు: "నరపుత్రుడా, ఈ కాగితం చుట్టను
నీకిస్తున్నాను. దానిని మ్రింగివేయి! ఆ గ్రంథపు చుట్ట
నీ శరీరాన్ని నింపివేయనీ." నేను దానిని తినేశాను.
అది తేనెలా మధురంగా ఉంది.

4అప్పుడు దేవుడు నాతో ఇలా అన్నాడు, “నర పుత్రుడా, ఇశ్రాయేలు వంశంవారి వద్దకు వెళ్లు. వారికి నా మాటలన్నీ తెలియజేయుము. 5భాష తెలియని పరదేశీయుల వద్దకు నిన్ను నేను పంపటంలేదు. ఏ ఇతర భాషను నీవు నేర్చుకునే పనిలేదు. నేను నిన్ను ఇశ్రాయేలు వంశం వారివద్దకు పంపుతున్నాను! 6నీవు అర్థం చేసుకోలేని పలుభాషలు మాట్లాడే అనేక ఇతర దేశాల ప్రజల వద్దకు నేను నిన్ను పంపటం లేదు. నీవు గనుక వారి వద్దకు వెళ్లి మాట్లాడితే వారు వింటారు. కాని నీవాకఠిన భాషలు నేర్చుకోవాల్సిన అవసరం లేదు. 7లేదు! నేను నిన్ను ఇశ్రాయేలు వంశం వద్దకు పంపుతున్నాను. వారున్నారే వారు తల బిరుసు కలిగి ఉన్నారు. వారు చాలా మొండివారు! ఇశ్రాయేలీయులు నీవు చెప్పేది వినటానికి నిరాకరిస్తారు. వారు నా మాట వినదల్చుకోలేదు! 8కాని వారు ఎంత మొండివారో, నిన్ను కూడా అంత మొండివానిగా నేను చేస్తాను. నీ తల కూడా వారి తలలా కఠినంగా ఉంటుంది! 9చెకుముకిరాయి కంటె వజ్రం కఠినమైనది. అదే రకంగా, నీ తల వారి తలకంటె గట్టిగా తయారవుతుంది. నీవు మిక్కిలి మొండిగా ఉంటావు. అందువల్ల వారంటే నీవు భయపడవు. ఎల్లప్పుడూ నా మీద తిరుగుబాటు చేసే ఆ ప్రజలంటే నీవు భయపడవు.”

10ఇంకా దేవుడు ఇలా చెప్పాడు, “నరపుత్రుడా, నేను నీకు చెప్పే ప్రతీ మాటను వినాలి. విని, వాటిని జ్ఞాపకం పెట్టుకోవాలి. 11పిమ్మట దేశాన్నుండి వెళ్లగొట్ట బడిన నీ ప్రజలందరి వద్దకు వెళ్లు. వారి వద్దకు వెళ్లి, ‘మన ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పుతున్నాడు’ అని పలుకు. వారు వినరు. వారు పాపం చేయటం మానరు. అయినా నీవు ఈ విషయాలు చెప్పాలి.”

12పిమ్మట గాలి (ఆత్మ) నన్ను పైకి లేపింది. అప్పుడు వెనుక నుండి నేనొక స్వరం విన్నాను. అది ఉరుములా చాలా బిగ్గరగా ఉంది. ఆ స్వరం, “యెహోవా మహిమ ధన్యమైనది!” అని పలికింది. 13ఆ తరువాత జంతువుల రెక్కలు కదలసాగాయి. రెక్కలు ఒక దానితో ఒకటి తాకగా అవి చాలా గట్టిగా శబ్దం చేశాయి. వాటి ముందునున్న చక్రాలు కూడ పెద్ద శబ్దం చేశాయి. ఆ శబ్దం ఉరుము ఉరిమినట్లుగా ఉంది. 14గాలి (ఆత్మ) నన్ను పైకెత్తి దూరంగా తీసుకొని వెళ్లింది. నేను ఆ స్థలాన్ని వదిలిపెట్టాను. నేను నా ఆత్మలో దుఃఖించి తల క్రిందులయ్యాను! యెహోవా ప్రభావం నాలో శక్తివంతంగా పనిచేస్తూ ఉంది! 15తెల్ అవీవ్‌కు* బలవంతంగా తీసుకొనిపోబడి, అక్కడ ప్రవాసంలోవున్న ఇశ్రాయేలీయుల వద్దకు వెళ్లాను. ఆ ప్రజలు కెబారు కాలువ వద్ద నివసించారు. ఆ ప్రజలను నేను పరామర్శించాను. అక్కడ నేను వాళ్ల మధ్యలో ఏడు రోజులు భయంతోనూ, మౌనంతోనూ కూర్చుంటిని.

16ఏడు రోజుల తరువాత యెహోవా వాక్కు నాకు వినవచ్చింది. ఆయన ఇలా చెప్పాడు: 17“ఓ నర పుత్రుడా, ఇశ్రాయేలుకు నిన్ను కావలివానిగా చేస్తున్నాను. వారికి జరుగబోయే కీడును గూర్చి నేను నీకు తెలియజేస్తాను. కనుక ఆ పరిణామాలను గూర్చి నీవు వారికి హెచ్చరిక చేయాలి. 18‘ఈ దుష్ట వ్యక్తి చనిపోతాడు.’ అని నేను చెప్పితే, నీవతనిని హెచ్చరించాలి.! అతని జీవన విధానం మార్చుకొని, పాపం చేయటం మానమని చెప్పాలి. నీవతనిని హెచ్చరించకపోతే, ఆ వ్యక్తి చనిపోతాడు. అతడు పాపం చేశాడు గనుక అతడు చనిపోతాడు. కాని అతని చావుకు నిన్ను కూడా బాధ్యుణ్ణి చేస్తాను! ఎందుకంటే, నీవతని వద్దకు వెళ్లి అతనిని హెచ్చరిస్తే అతని ప్రాణం రక్షింపబడేది.

19“ఒకవేళ నీవా వ్యక్తి వద్దకు వెళ్లి అతని జీవిత విధానాన్ని మార్చుకోమనీ, చెడు కార్యాలు చేయటం మానమనీ చెప్పావనుకో. ఆ వ్యక్తి నీమాట వినకపోవచ్చు. అప్పుడతడు చనిపోతాడు. అతడు పాపి గనుక చనిపోతాడు. అయినా నీవతనిని హెచ్చరించావు. అందువల్ల నిన్ను నీవు రక్షించుకున్నవాడివవుతావు.

20“లేదా, ఒక మంచి వ్యక్తి మధ్యలో మంచి పనులు చేయడం మానివేసి చెడుపనులు చేస్తాడు. అప్పుడు నేను అతని ముందు ఏదైనా తగిలి పడటానికి (పాపంలో పడటానికి) ఉంచవచ్చు. అతడు చెడుకార్యాలు చేయటం మొదలుపెడతాడు. దానితో అతడు చనిపోతాడు. తన పాపాల కారణంగా అతడు చనిపోతాడు. దానికి తోడు నీవతనిని హెచ్చరించలేదు. అందువల్ల అతని చావుకు నిన్ను బాధ్యుణ్ణి చేస్తాను. చివరికి అతడు చేసిన మంచి పనులేవీ ప్రజలు గుర్తు పెట్టుకోరు.

21“నీవొక మంచి మనిషిని పాపం చేయవద్దని హెచ్చరిస్తావనుకో; అతడు పాపం చేయటం మానితే అతడు రక్షించబడతాడు. ఎందువల్లనంటే నీవతనికి హెచ్చరిక చేయటం, అతడు నీ మాటను వినటం

జరిగాయి గనుక. ఈ విధంగా నీవు నీ ప్రాణాన్ని కాపాడుకుంటావు.”

22పిమ్మట యెహోవా హస్తం ఆ స్థలంలో నా మీదికి వచ్చింది. “లెమ్ము; లోయలోకి వెళ్లు. అక్కడ నేను నీతో మాట్లాడతాను” అని దేవుడు నాకు చెప్పాడు.

23నేను లేచి లోయలోకి వెళ్లాను. యెహోవా మహిమ అక్కడ ఉంది. గతంలో నేను కెబారు కాలువ వద్ద చూసినట్లే అది ఉంది. నేను శిరస్సు నేలకు ఆన్చి

---

**తెల్ అవీవ్** తేలాబీబు అని పాఠాంతరం. ఇది ఇశ్రాయేలుకు బయటనున్న ఒక ప్రదేశం. దీని అసలైన ఉనికి ఎవ్వరికి సరిగ్గా తెలియదు. దీనికే ‘ఊటకొండ’ అని కూడ పేరు ఉంది. బబులోను దేశంలో కేబారు కాలువ పక్కనున్న ఒక స్థలం.

సాష్టాంగ నమస్కారం చేశాను. 24కాని, ఇంతలో ఒక
గాలి (ఆత్మ) వచ్చి నన్ను నా పాదాలపైకి లేపింది.
ఆయన నాతో ఇలా అన్నాడు, "నీవు ఇంటికి వెళ్లి
లోపల కూర్చుని గడియపెట్టుకో. 25 ఓ నరపుత్రుడా,
ప్రజలు నీ వద్దకు వచ్చి, నిన్ను తాళ్లతో బంధిస్తారు.
వారు నిన్ను ప్రజల మధ్యకు వెళ్లనీయరు. 26నేను నీ
నాలికను నీ అంగిలి గుంటలో అతుక్కుపోయేలా
చేస్తాను. దానితో నీవు మాట్లాడలేవు. అందువల్ల వారు
తప్పు చేస్తున్నట్లు వారికి చెప్పే మనుష్యుడెవ్వడూ
ఉండడు. ఎందువల్లనంటే ఆ జనులు నా మీద
ఎల్లప్పుడూ తిరుగుబాటు చేస్తూనే ఉన్నారు. 27కాని
నేను నీతో మాట్లాడతాను. పిమ్మట నీవు మళ్లీ మాట్లాడ
టానికి అనుమతిస్తాను. అయితే నీవు మాత్రం 'మన
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు' అని వారికి చెప్పాలి. ఏ వ్యక్తి అయినా విన
గోరితే మంచిదే. ఎవ్వరూ వినటానికి ఇష్టపడకపోయినా
మంచిదే. ఆ ప్రజలు ఎల్లప్పుడూ నాకు వ్యతిరేకుల
వుతూ ఉన్నారు.

4 "నరపుత్రుడా, ఒక ఇటుక తీసుకొని దానిమీద
ఒక బొమ్మ గియ్యి. యెరూషలేము నగరపు
బొమ్మ వేయుము. 2నీవా నగరాన్ని ముట్టడించే సైన్యం
లాగా చిత్రీకరించు. నగరాన్ని తేలికగా పట్టుకొనే
టందుకు అనువుగా దానిచుట్టూ ఒక మట్టిగోడ
నిర్మించు. నగరపు గోడవరకు ఒక మట్టి రహదారి
వేయుము. సమ్మెటల్ని (ముఖ్య నాయకుల్ని)
తెప్పించి, నగరం చుట్టూ సైనిక స్థావరాలను ఏర్పాటు
చేయండి. 3పిమ్మట ఒక ఇనుప పెనము తీసుకొని
దానిని నీకు, నగరానికి మధ్య ఉంచు. అది నిన్ను, నగ
రాన్ని వేరుచేసే ఇనుప గోడలా ఉంటుంది. ఈ రకంగా
నీవా నగరానికి వ్యతిరేకంగా వున్నట్లు నీవు చూపిస్తావు.
నీవా నగరాన్ని చుట్టుముట్టి దానిపై దాడి చేస్తున్నట్లు
వుంటుంది. ఎందువల్లనంటే ఇశ్రాయేలు వంశానికి ఇది
ఒక ఉదాహరణగా వుంటుంది. (దేవుడనైన) నేను
యెరూషలేమును నాశనం చేస్తానని అది నిరూపిస్తుంది.
4"తరువాత నీవు ఎడమ పక్కకి పడుకో, ఇశ్రా
యేలీయుల పాపాలన్నీ నీవు భరిస్తున్నట్లు నిరూపించే
విధంగా నీవాపని చేయాలి. నీవు ఎడమ పక్కన ఎన్నాళ్లు
పడుకొని ఉంటే అన్నాళ్ళు నీవా పాపాలను మోస్తావు.
5నీవు వారి పాపాన్ని మూడు వందల తొంభై రోజులు*
భరించాలి. ఈ ప్రకారం ఇశ్రాయేలు ఎంతకాలం శిక్షింప
బడుతుందో నేను తెలియజేస్తున్నాను. ఒక్కరోజు
ఒక్క సంవత్సరానికి సమానం.
6"ఆ తరువాత నీవు కుడి పక్కకి తిరిగి నలభై
రోజులు పడుకోవాలి. ఈసారి నీవు యూదావారి
పాపాలను నలభై రోజులపాటు భరిస్తావు. ఒక రోజు
ఒక సంవత్సరానికి సమానం. యూదా ఎంతకాలం
శిక్షింపబడాలో నేను నీకు ఈ విధంగా తెలియ
జేస్తున్నాను."
7దేవుడు మళ్లీ మాట్లాడాడు. ఆయన ఇలా
అన్నాడు, "ఇప్పుడు నీవు నీ చొక్కా చేతిని పైకి
మడిచి, ఆ ఇటుక మీదికి నీ చేతినెత్తు. యెరూషలేము
నగరంపై దాడి చేస్తున్నట్లు నీవు ప్రవర్తించు. నీవు నా
తరపు దూతగా మాట్లాడుతున్నట్లు చూపటానికి ఈ
విధంగా చేయుము. 8ఇప్పుడు చూడు, నిన్నిప్పుడు
తాళ్లతో కట్టుతున్నాను. నగరంపై నీ దాడి పూర్తయ్యే
వరకు నీవు అటు, ఇటు కదలలేవు."
9దేవుడు ఇంకా ఇలా చెప్పాడు: "రొట్టె చేయటానికి
నీవు కొంత ధాన్యాన్ని తీసుకొనిరా. కొన్ని గోధుమలు,
బార్లీ బియ్యము (యవలు), చిక్కుడు గింజలు,
పప్పులు, జొన్నలు, సజ్జలు తీసుకో. వీటన్నిటినీ
కలిపి రోటిలోవేసి దంచి పిండి చేయుము. ఈ పిండిని
ఉపయోగించి రొట్టె చేయుము. నీవు పక్కకు తిరిగి
పడుకొనే మూడువందల తొంభై రోజులూ ఈ
రొట్టెనే తినాలి. 10రొట్టెను చేయటానికి ఈ పిండిని
రోజుకు ఒక గిన్నెడు (సుమారు ఇరవై తులాలు)
మాత్రమే ఉపయోగించటానికి నీకు అనుమతి ఇవ్వ
బడింది. అవసరమైనప్పుడల్లా రోజంతా ఆ రొట్టెనే
నీవు తినాలి. 11ప్రతి రోజూ మూడు గిన్నెల నీరే నీవు
తాగాలి. రోజంతా తగిన సమయానికి దానిని తాగాలి.
12ప్రతిరోజూ నీ రొట్టెను నీవే చేసుకోవాలి. నీవు
మనుష్యుల మలం తెచ్చి, ఎండబెట్టి, దానిని కాల్చాలి.
మండే ఆ మనుష్యుల మలం మీద నీవు ఆ రొట్టెను
కాల్చాలి. ప్రజల ఎదుట ఈ రొట్టెనే నీవు కాల్చి
తినాలి." 13మళ్లీ యెహోవా ఇలా చెప్పాడు: "ఈ
పని చేయటం ద్వారా ఇశ్రాయేలు వంశీయులు పరాయి
దేశాలలో అపరిశుభ్రమైన రొట్టెలు* తింటారని నీవు
సూచిస్తావు. వారు ఇశ్రాయేలు వదిలి అన్యదేశాలకు
పోయేలా నేను వారిని ఒత్తిడి చేశాను!"
14అప్పుడు నేనిలా (యెహెజ్కేలు) అన్నాను,
"అయ్యో, నా ప్రభువైన యెహోవా, నేనెన్నడూ
అపరిశుద్ధ ఆహారాన్ని తినలేదు. వ్యాధిచే చచ్చిన జంతు
మాంసంగాని, అడవి జంతువుచే చంపబడిన పశువుల
మాంసాన్ని గాని నేను ఎన్నడూ తినియుండలేదు. నా
చిన్ననాటి నుండి ఈనాటి వరకు నేను ఎన్నడూ
అపరిశుద్ధ ఆహారం ముట్టి ఎరుగను. ఆ దుష్ట మాంస
మేదీ నానోట బడలేదు."

---

**మూడు … రోజులు** ప్రాచీన గ్రీకు ప్రతులలో నూటతొంభై రోజులని ఉంది.

**అపరిశుభ్రమైన రొట్టెలు** అపరిశుభ్రమైన దానిని తాకిన రొట్టె. దానిని తిన్నవారు దేవుని ఆరాధనకు అర్హులుగారు. శుద్ధమైన, అపరిశుభ్రమైన వస్తువుల విషయమై లేవీయ. 11:15 చూడండి.

15అందుకు దేవుడిలా అన్నాడు: “సరే! నీ రొట్టెను
కాల్చటానికి ఎండిన ఆవుపేడ ఉపయోగించేటందుకు
నీకు అనుమతి ఇస్తున్నాను. ఎండిన మనిషి మలం
నీవు వినియోగించనవసరం లేదు.”
16దేవుడు ఇంకా ఇలా అన్నాడు, “నరపుత్రుడా,
యెరూషలేముకు ఆహార పదార్థాల సరఫరాను నిలిపి
వేస్తున్నాను. అందువల్ల ప్రజలు తగుమాత్రం రొట్టె
తినవలసి వస్తుంది. వారి ఆహార పదార్థాల సరఫరా
విషయమై వారు మిక్కిలి చింతిస్తారు. వారికి తాగే
నీరు కూడా పరిమితమవుతుంది. ఆ నీటిని తాగి
నప్పుడు వారు మిక్కిలి భీతిల్లుతారు. 17ఎందువల్ల
నంటే ప్రజలకు తినటానికి తిండి, తాగటానికి నీరు
తగినంత ఉండదు. ప్రజలు ఒకరిని చూచి ఒకరు భయ
కంపితులవుతారు. వారివారి పాపాల కారణంగా వారు
చిక్కి శల్యాలైపోతారు.

5 1-2“నరపుత్రుడా, నీ ఆకలి సమయం* అనం
తరం నీవు ఈ పనులు చేయాలి: ఒక పదునైన
కత్తి తీసుకో. దానిని మంగలి కత్తిలా వినియోగించి, నీ
జుట్టును, గడ్డాన్ని గొరిగివేయుము. అలా తీసిన నీ
జుట్టును ఒక తాసులో తూకం వేయుము. ఆ జుట్టును
మూడు సమభాగాలుగా తూచాలి. నీ జుట్టులో ఒక
భాగాన్ని నగరం బొమ్మ ఉన్న ఇటుక మీద పెట్టి, ఆ
జుట్టును నగరంలో కాల్చివేయుము. కొంతమంది
ప్రజలు నగరంలో చనిపోతారనే దానికి ఇది ఒక సూచన.
ఒక కత్తితో రెండవ భాగం జుట్టును చిన్న చిన్న
ముక్కలుగా చేయుము. ఆ జుట్టును నగరం (ఇటుక)
చుట్టూ జల్లు. కొంతమంది ప్రజలు నగరం వెలుపల
చనిపోతారని ఇది తెలియజేస్తుంది. నీ జుట్టులో
మూడవ భాగాన్ని గాలిలోకి విసిరివేయుము. దానిని
గాలిలో బహుదూరం కొట్టుకొనిపోనిమ్ము. కొంత
మంది ప్రజలను నేను నా కత్తిని బయటికిలాగి బహు
దూర దేశాలకు తరిమివేస్తానని ఇది సూచిస్తుంది. 3కాని
తరువాత నీవు వెళ్లి కొట్టుకుపోయిన వెంట్రుకలలో
కొన్నింటిని ఏరి తేవాలి. వాటిని నీ దుస్తులతో చుట్టు.
ఇది నా ప్రజలలో కొంతమందిని తిరిగి నా వద్దకు
తెచ్చుకుంటాననే దానికి సూచన. 4ఎగిరిపోయిన
వెంట్రుకలలో మరికొన్నింటిని ఏరితే. తెచ్చి, వాటిని
నిప్పులో వేయుము. ఇది ఇశ్రాయేలు ఇల్లంతా అగ్నికి
గురియై నాశనమవుతుందనడానికి ఒక సూచన.”
5నా ప్రభువైన యెహోవా ఇంకా ఇలా చెప్పి
యున్నాడు. “ఆ ఇటుకరాయి యెరూషలేముకు
గురుతు. యెరూషలేమును ఇతర రాజ్యాలకు మధ్య
ఉంచుతాను. దాని చుట్టూ దేశాలుంటాయి. 6ఆ ప్రజలు
నా ఆజ్ఞలను ధిక్కరించారు. ఇతర దేశాల వారికంటె
వీరు మిక్కిలి హీనులయ్యారు. వారిచుట్టూ వున్న దేశాల
ప్రజలకంటె ఈ ప్రజలే నా ధర్మాన్ని ఎక్కువగా ఉల్లం
ఘించారు. నా ఆజ్ఞలను వినటానికి వారు నిరాక
రించారు! నా నియమాలను వారు మన్నించ లేదు!”
7కావున నా ప్రభువైన యెహోవా ఇలా అన్నాడు:
“మీకు నేను భయంకర పరిస్థితులు కల్పిస్తాను. ఎందు
కనగా మీరు నా ధర్మాన్ని అంగీకరించి, అనుసరించ
లేదు. మీరు నా ఆజ్ఞలను పాటించలేదు. మీ చుట్టూ
వున్న ప్రజలకంటే నా న్యాయసూత్రాలను మీరే ఎక్కు
వగా ఉల్లంఘించారు! ఆ ప్రజలు తప్పుగా భావించే
పనులను కూడా మీరు చేశారు!” 8అందువల్ల నా ప్రభు
వైన యెహోవా చెప్పినదేమంటే, “కాబట్టి ఇప్పుడు,
నేను కూడా మీకు వ్యతిరేకిని. ఇతర ప్రజలంతా
చూసేలా నేను మిమ్ముల్ని శిక్షిస్తాను. 9గతంలో నేనె
న్నడూ చేయని పనులు మీకు నేను చేస్తాను. ఆ
భయంకరమైన శిక్షను ఇకముందెన్నడూ విధించను!
ఎందువల్లనంటే మీరు అనేక భయంకరమైన పనులు
చేశారు. 10యెరూషలేము ప్రజలు చాలా ఆకలితో
ఉండి, తండ్రులు వారి బిడ్డలనే తినివేస్తారు. పిల్లలు
వారి తండ్రులను తినివేస్తారు. అనేక విధాలుగా
మిమ్ముల్ని నేను శిక్షిస్తాను. చావగా మిగిలిన ప్రజలను
నేను అన్ని దిక్కులలో చిందర వందరగా వదిలి
వేస్తాను.”
11నా ప్రభువైన యెహోవా ఇలా చెప్పాడు,
“యెరూషలేమా, నా జీవము తోడుగా నిన్ను నేను
శిక్షిస్తానని చెపుతున్నాను! నిన్ను శిక్షిస్తానని నేను
ప్రమాణ పూర్వకంగా చెపుతున్నాను! ఎందుకంటే,
నా పవిత్ర స్థలానికి నీవు భయంకరమైన పనులు చేశావు.
దానిని అపవిత్ర పర్చుతూ ఘోరమైన పనులు చేశావు!
నేను నిన్ను శిక్షిస్తాను. నీ పట్ల కరుణ ఏ మాత్రం
చూపించను. నిన్ను చూచి నేను విచారపడను!
12నగరంలో నీ ప్రజలలో మూడవ వంతు వ్యాధిపీడి
తులై ఆకలితో చనిపోతారు. నీ ప్రజలలో మూడవ
వంతు నగరం వెలుపల యుద్ధంలో చనిపోతారు.
అప్పుడు నా కత్తిని బయటికిలాగి మీలో మరొక మూడో
వంతు మందిని దూర దేశాలకు తరిమి వేస్తాను. నీ
చుట్టూ ఉన్న ప్రజలు యుద్ధంలో వారిని చంపివేస్తారు!
అప్పుడు మాత్రమే నేను నీ పట్ల నా కోపాన్ని ఉప
సంహరించుకుంటాను. 13అప్పుడు మాత్రమే నీ ప్రజల
పట్ల నా కోపాన్ని తగ్గించుకుంటాను. వారు నా పట్ల
చేసిన పాపకార్యాలకే వారు శిక్షింపబడ్డారని నాకు
తెలుసు. నేను వారి యెహోవానని వారప్పుడు తెలుసు
కుంటారు. వారి పట్ల నాకుగల గాఢమైన ప్రేమ*

**నీ ఆకలి సమయం** అంటే ‘నగరం మీద నీ దాడి’ యెహెజ్కేలు. 4:8 చూడండి.

**గాఢమైన ప్రేమ** హెబ్రీ మాట ఇక్కడ ప్రేమ, అసహ్యత, కోపం, ఉత్సాహం, ఈర్ష్యవంటి గాఢమైన భావమును తెలుపుతుంది.

వల్ల నేను వారితో మాట్లాడానని కూడా వారు తెలుసు
కుంటారు!"
14దేవుడు ఇలా చెప్పాడు: "యెరూషలేమా, నిన్ను
నేను నాశనం చేస్తాను. నీవు కేవలం ఒక రాళ్ల కుప్పలా
మిగిలిపోతావు. నీ చుట్టూ వున్న ప్రజలు నిన్ను ఎగతాళి
చేస్తారు. నీ పక్కగా వెళ్లే ప్రతివాడూ నిన్ను చూచి పరి
హసిస్తాడు. 15నీ చుట్టూ వున్న ప్రజలు నిన్ను పరిహ
సిస్తారు. కాని వారికి నీవొక గుణపాఠంలా కూడ మిగులు
తావు. నేను నీ పట్ల కోపగించి, నిన్ను శిక్షించినట్లు
వారు చూస్తారు. నేను మిక్కిలి కోపంగా ఉన్నాను.
నేను నిన్ను హెచ్చరించాను. యెహోవానైన నేను
ఏమి చేస్తానో నీకు చెప్పాను! 16నీకు లభించే ఆహారాన్ని
తీసేసి మరల మరల ఆకలిగొలిపే ఆ సమయాన్ని
కలుగజేస్తానని చెప్పియున్నాను. నిన్ను నాశనం చేసే
భయంకర పరిణామాలు కలుగజేస్తానని నీకు చెప్పి
యున్నాను. ఆ కరువు పరిస్థితులు అనేకసార్లు
వచ్చాయి. మీకు ఆహార పదార్థాలు సరఫరా కాకుండా
చేశాను. 17నేను ఆకలిని, క్రూరమృగాలను నీ మీదను
పంపు తాను. అవి నీ పిల్లలను చంపుతాయి. నగరమంతా
వ్యాధులు, మరణాలు సంభవిస్తాయని నేను చెప్పి
యున్నాను. మీ మీదికి శత్రు సైన్యాలను తెప్పించి
యుద్ధం చేయిస్తాను. యెహోవానగు నేను ఈ విష
యాలన్నీ సంభవిస్తాయని నీకు చెప్పియున్నాను.
అవన్నీ జరిగి తీరాయి!"

6 మళ్లీ యెహోవా వాక్కు నాకు వినిపించింది.
2ఆయన ఇలా చెప్పాడు: "నరపుత్రుడా, ఇశ్రా
యేలు పర్వతాలవైపు తిరిగి, నా తరపున వాటికి వ్యతిరే
కంగా మాట్లాడు. 3ఆ పర్వతాలకు ఈ విషయాలు
తెలియజెప్పు:
"'ఇశ్రాయేలు పర్వతములారా, నా ప్రభువైన
యెహోవా సందేశాన్ని వినండి! నా ప్రభువైన
యెహోవా కొండలకు, పర్వతాలకు, కనుమలకు,
లోయలకు ఈ విషయాలు తెలియజేస్తున్నాడు.
చూడండి! (దేవుడనగు) నేను మీపై యుద్ధానికి శత్రు
వును రప్పిస్తున్నాను. మీ ఉన్నత స్థలాలు.* నేనే
నాశనం చేస్తాను 4మీ బలిపీఠాలు ముక్కలు చేయబడ
తాయి! మీ ధూప వేదికలు నాశనం చేయబడతాయి.
మీ హేయమైన విగ్రహాలముందే మీ శవాలను పడ
వేస్తాను. 5ఇశ్రాయేలు ప్రజల శవాలను అసహ్యమైన
విగ్రహాల ముందు పడవేస్తాను. మీ ఎముకలను మీ
పీఠాల చుట్టూ వెదజల్లుతాను. 6మీ ప్రజలెక్కడ వుంటే
అక్కడ వాళ్ళు నాశనం చేయబడతారు. వారి నగరాలు
రాళ్లగుట్టల్లా మారిపోతాయి. వారి ఉన్నత స్థలాలు
నాశనం చేయబడతాయి. ఎందుకంటే, ఆ పూజా
స్థలాలు మరెన్నడూ వినియోగింపబడకుండా వుండే
టందుకు. ఆ బలి పీఠాలు నాశనం చేయబడతాయి.
ప్రజలు మరెన్నడూ ఆ రోత విగ్రహాలను ఆరాధించరు.
ఆ ధూప పీఠాలు ధ్వంసం చేయబడతాయి. మీరు
చేసిన వస్తువులన్ని సర్వనాశనం చేయబడతాయి! 7మీ
ప్రజలు చంపబడతారు. అప్పుడు నేనే ప్రభువు
(యెహోవా)నని మీరు తెలుసుకుంటారు!'"
8దేవుడు ఇలా చెప్పాడు: "కాని మీలో చాలా కొద్ది
మంది తప్పించుకునేలా నేను చేస్తాను. వారు అన్య
దేశాలలో స్వల్పకాలం పాటు నివసిస్తారు. వారిని నేను
చెల్లా చెదురుచేసి, ఇతర దేశాలలో నివసించేలా ఒత్తిడి
చేస్తాను. 9అలా మిగిలిన వారు బందీ చేయబడతారు.
వారు అన్యదేశాలలో నివసించేలా తరిమివేయబడతారు.
కాని, అలా మిగిలిన వారు నన్ను తలచుకొంటారు.
నేను వారి గుండెలు బద్దలయ్యేలా చేశాను. వారు
చేసిన చెడు కార్యాలకు వారిని వారే అసహ్యించు
కుంటారు. గతంలో వారు నాకు విముఖులై, నన్ను
వదిలిపెట్టారు. హేయమైన వారి విగ్రహాల వెంట వారు
వెళ్ళారు. తన భర్తను వదిలి, పరాయి పురుషుని వెంట
బడిన స్త్రీవలె వారున్నారు. వారెన్నో భయంకరమైన
పనులు చేశారు.
10చివరికి, నేనే యెహోవానని వారు తెలుసు
కొంటారు. నేనేదైనా చేస్తానంటే, అది చేసి తీరుతానని
కూడా తెలుసుకొంటారు! వారికి జరిగిన కీడంతా నేనే
జరిపించినట్లు వారు తెలుసుకొంటారు."
11మళ్లీ నా ప్రభువైన యెహోవా ఇలా చెప్పాడు:
"నీ చేతులు చరిచి, నీ పాదాలను దట్టించుము. ఇశ్రా
యేలు ప్రజలు చేసిన ఘోరమైన చెడ్డ పనులన్నిటినీ
విమర్శిస్తూ మాట్లాడు. వారు వ్యాధుల వల్ల, ఆకలిచేత
చనిపోతారని వారిని హెచ్చరించు. వారు యుద్ధంలో
చనిపోతారని తెలియజేయుము. 12దూరాన వున్నవారు
రోగపీడితులై చనిపోతారు. ఈ ప్రదేశానికి దగ్గరగా వున్న
ప్రజలు కత్తిచేత చంపబడతారు. ఇంకను నగరంలో
మిగిలిన ప్రజలు ఆకలితో మాడి చనిపోతారు. అప్పుడు
మాత్రమే నా కోపం తగ్గుతుంది. 13అప్పుడు మాత్రమే
నేను యెహోవానని మీరు తెలుసుకొంటారు. మీ
అపవిత్రమైన మీ విగ్రహాలముందు, వాటి బలిపీఠాల
చుట్టూ పడిన మీ శవాలను చూచినప్పుడు మీరిది
తెలుసుకుంటారు. ఆ శవాలు మీ ఆరాధనా స్థలాలున్న
ప్రతిచోట – ప్రతి కొండ, పర్వతంమీద, ప్రతి పచ్చని
చెట్టు, ఆకులున్న ప్రతి సింధూర వృక్షం క్రింద పడి
వుంటాయి. ఆ స్థలాలన్నిటిలో మీరు మీ బలులు
సమర్పించారు. అవి మీ హేయమైన విగ్రహాలకు
సుగంధ పరిమళాలు.
14కాని మీ మీదికి నా చెయ్యెత్తి, మిమ్మల్ని నేను
శిక్షించాను! నేను మీ దేశాన్ని నాశనం చేశాను. అది

**ఉన్నత స్థలాలు** కొండలమీద, పర్వతాలమీద దేవున్ని గాని, క్షుద్ర దేవతలను గాని, ఆరాధించటానికి ఏర్పాటు చేసిన స్థలాలు.

దిబ్లాతు ఎడారి* కంటె ఎక్కువగా శూన్య ప్రదేశ
మయ్యింది. ఇప్పుడు మీ ప్రజలు నివసించే ప్రతి
చోటా నేనే యెహోవానని తెలుసుకొంటారు!"

7 పిమ్మట యెహోవా వాక్కు నాకు చేరింది.
2ఆయన ఇలా అన్నాడు: "నరపుత్రుడా, నా ప్రభు
వైన యెహోవా నుండి ఒక సందేశం ఉంది. అది
ఇశ్రాయేలు దేశానికి సంబంధించినది:

అంతం వచ్చింది. దేశం యావత్తూ నాశన
మవుతుంది.
3 ఇప్పుడు నీ అంతం సమీపించింది. నేను నీ పట్ల
ఎంత కోపంగా ఉన్నానో చూపిస్తాను. నీ చెడు
కార్యాలకు నిన్ను నేను శిక్షిస్తాను. నీవు చేసిన
భయంకరమైన పనులకు ఫలమనుభవిస్తావు.
4 నీ పట్ల నేను కనికరం చూపను. నిన్ను చూచి
విచారించను. నీవు చేసిన చెడ్డకార్యాలకు నిన్ను
నేను శిక్షిస్తున్నాను. నీవు ఘోరమైన పనులు
చేశావు. నేను యెహోవానని నీవిప్పుడు తెలుసు
కొంటావు."

5నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు, "ఒక విపత్తు తరువాత మరొకటి వస్తుంది:
6అంతం సమీపిస్తున్నది! అవసానదశ వస్తున్నది. అది
అతి త్వరలో సంభవిస్తుంది! 7ఇశ్రాయేలులో నివ
సిస్తున్న ప్రజలారా, హెచ్చరించే ఈల శబ్దం వింటు
న్నారా? శత్రువు వచ్చిపడుతున్నాడు. శిక్షాకాలం అతి
దగ్గరలో ఉంది! శత్రుసైన్యపు రణగొణ ధ్వనులు పర్వ
తాలపై మరీ మరీ ఎక్కువగా వినవస్తున్నాయి. 8నేనెంత
కోపంగా వున్నానో అతి త్వరలో మీకు నేను చూపి
స్తాను. మీమీద నాకున్న కోపాన్నంతా చూపిస్తాను.
మీరు చేసిన చెడు కార్యాలకు మిమ్మల్ని నేను శిక్షిస్తాను.
మీరు చేసిన భయంకరమైన పనులన్నిటికీ మీరు ప్రతి
ఫలం చెల్లించేలా చేస్తాను. 9మీ పట్ల ఏ మాత్రం కని
కరం చూపను. మిమ్మల్ని చూచి విచారపడను. మీర
టువంటి భయంకరమైన పాపాలు చేశారు. నేను ప్రభు
వైన యెహోవానని, నేనే మిమ్మల్ని కొడతానని
మీరు తెలుసుకుంటారు.

10"ఆ శిక్షాకాలం సమీపించింది. హెచ్చరిక ఈల
విన్నావా? దేవుడు సూచన చేశాడు. శిక్ష మొదలవుతూ
ఉంది. చేతికర్ర చిగురు తొడగటం మొదలు పెట్టింది.*
అహంకారియైన రాజు (నెబుకద్నెజరు) ఇప్పటికే చాలా
బలవంతుడైనాడు. 11హింసావాదియైన అతడు ఆ దుష్ట
ప్రజలను శిక్షించటానికి సిద్ధంగా వున్నాడు. ఇశ్రాయే
లులో చాలా మంది మనుష్యులున్నారు. కాని అతడు
వారిలో ఒకడు కాదు. ఆ గుంపులో అతడొకడు కాదు.
ఆ ప్రజలలో అతడొక ప్రముఖ నాయకుడు కాదు.
12"ఆ శిక్షాకాలం దరిచేరింది. ఆ రోజు ఇక్కడే వున్నది.
సరుకులు కొనుగోలు చేసే జనులు సంతోషపడరు.
అమ్మకపుదారులు వారి అమ్మకాల పట్ల విచారపడరు.
ఎందువల్లనంటే ఆ భయంకరమైన శిక్ష ప్రతివానికి
వస్తుంది గనుక. 13తమ ఆస్తిని అమ్ముకున్న* ప్రజలు,
మరి దాని వద్దకు వెళ్లరు. ఏ వ్యక్తి అయినా తప్పించుకుని
బతికితే కూడా అతడు తన ఆస్తి వద్దకు ఎన్నడూ
మళ్లీ వెళ్లలేడు. ఎందు వల్లనంటే, దేవుని ఈ సందేశం
అందరికీ సంబంధించినది గనుక. అందువల్ల ఏ ఒక్క
డైనా బతికి బయటపడినా, అది ప్రజలను సంతోష
పెట్టలేదు.

14"ప్రజలను హెచ్చరించటానికి వారు బూరలు
ఊదుతారు. ప్రజలు యుద్ధ సన్నద్ధులౌతారు. కాని
వారు యుద్ధం చేయటానికి మాత్రం బయటికి వెళ్లరు.
ఎందువల్లనంటే నేనెంత కోపంగా వున్నానో ఆ సమూ
హమంతటికీ చూపిస్తాను గనుక. 15శత్రువు కత్తిపట్టి
నగరం వెలుపల కాచివున్నాడు. వ్యాధులు, క్షామము
నగరం లోపల ఉన్నాయి. ఏ మనిషైనా బయట
తన పొలానికి వెళ్లితే వేచి వున్న శత్రు సైనికుడు
అతన్ని చంపివేస్తాడు. ఒకవేళ ఆ వ్యక్తి నగరంలోనే
వుంటే ఆకలి, వ్యాధులు అతన్ని చంపివేస్తాయి.

16"కాని కొంతమంది ప్రజలు తప్పించుకుంటారు.
అలా బతికినవారు పర్వతాలలోకి పారిపోతారు. అయినా
వారు సంతోషంగా ఉండలేరు. వారు తమ పాపాలను
తలచుకొని కుమిలిపోతారు. వారు ఏడ్చి, పావురాలవలె
మూలుగుతారు. 17ప్రజలు మిక్కిలి అలసిపోయి,
దుఃఖించి తమ చేతులను కూడా ఎత్తలేరు. వారి కాళ్లు
నీళ్లలా ఉంటాయి. 18వారు విషాదాన్ని సూచించే
దుస్తులు ధరిస్తారు. వారిని భయం ఆవరిస్తుంది. ప్రతి
ముఖంలోనూ సిగ్గు ముంచుకు రావటం చూస్తావు.
విచారాన్ని వ్యక్తంచేస్తూ వారు తమ తలలను గొరిగించు
కుంటారు. 19వారి వెండి విగ్రహాలను వీధుల్లో పార
వేస్తారు. బంగారము (విగ్రహాల)ను మురికి గుడ్డల్లా
చూస్తారు. యెహోవా తన కోపాన్ని వారిపట్ల
చూపించినప్పుడు వారి విగ్రహాలు వారిని రక్షించలేవు
గనుక వారలా చేస్తారు. ప్రజలను పాపమార్గంలో పడ

**దిబ్లాతు ఎడారి** బహుశః ఇది రిబ్లాతు ఎడారి కావచ్చు.

**చేతికర్ర ... పెట్టింది** ఈ వృత్తాంతము దేవుడు అహరోను చేతి కర్రను చిగురింప చేసిన కాలానికి సంబంధించినది కావచ్చు. ఆ కాలంలో కొందరు లేవీయులు మోషేమీద, అహరోను మీద తిరుగుబాటు చేశారు. అయితే దేవుడు ఆ లేవీయులను సర్వనాశనం చేసినాడు. చూడండి. సంఖ్యా. 16:1; 17:11.

**తమ ఆస్తిని అమ్ముకున్న** ప్రాచీన కాలపు ఇశ్రాయేలులో ఆస్తి వ్యక్తికి చెందివుండేది కాదు. ఆస్తి వంశానికి చెంది వుంటుంది. ఏ వ్యక్తి అయినా తన ఆస్తి అమ్మితే స్వర్ణోత్సవాల సమయంలో అది కుటుంబానికి తిరిగి వచ్చేది. కాని ప్రజలు ఆస్తిని తిరిగి పొందరని ఇక్కడ యెహెజ్కేలు చెప్పుచున్నాడు.

వేయటానికి విగ్రహాలు ఒక మాయోపాయంలాంటివి.
ఆ విగ్రహాలు ప్రజలకు ఆహారాన్ని ఇవ్వలేవు. వారి
విగ్రహాలు వారి కడుపు నింపలేవు.
20“ఆ ప్రజలు వారి విలువైన ఆభరణాలు విని
యోగించి ఒక విగ్రహాన్ని తయారుచేశారు. ఆ విగ్ర
హాన్ని చూచి వారు గర్వపడ్డారు. వారింకా భయానక
విగ్రహాలు చేశారు. వారా హేయమైన వస్తువులను
చేశారు. కావున దేవుడనైన నేను వారిని మసిబట్టలా
విసిరి పారవేస్తాను. 21పరాయివారు వారిని పట్టుకునేలా
చేస్తాను. పరాయి ప్రజలు వారిని ఎగతాళి చేస్తారు.
పరాయి జనులు వారిలో కొంతమందిని చంపివేస్తారు.
మరి కొంతమందిని చెరపట్టి తీసుకొనిపోతారు. 22నేను
వారిని చూచి ముఖం తిప్పుకుంటాను. నేను వారివంక
చూడను. పరాయి మనుష్యులు నా ఆలయాన్ని
ధ్వంసం చేస్తారు. ఆ పవిత్ర భవనంలో రహస్య స్థానా
లకు వెళ్లి అపవిత్ర పరుస్తారు.
23“బందీల కొరకు సంకెళ్లు తయారుచేయి! ఎందు
కంటే ఇతరులను చంపిన నేరానికి చాలామంది ప్రజ
లుంటే శిక్షింపబడతారు గనుక ఈ గొలుసులు తయారు
చేయాలి. నగరంలో ప్రతిచోటా దౌర్జన్యం చెలరేగు
తుంది. 24రాజ్యాల నుండి చెడ్డ వ్యక్తులను తీసుకు
వస్తాను. ఆ చెడ్డ మనుష్యులు ఇశ్రాయేలీయుల ఇండ్లన్ని
టినీ ఆక్రమిస్తారు. శక్తివంతులైన మీ ప్రజలందరినీ
గర్వించకుండా చేస్తాను. అన్యదేశీయులు మీ ఆరాధన
స్థలాలన్నిటినీ వశపర్చుకుంటారు.
25“మీ ప్రజలందరూ భయంతో వణికిపోతారు.
మీరు శాంతికోసం ఎదురుచూస్తారు. కాని అది మీకు
లభ్యం కాదు. 26ఒక విషాద గాథ తరువాత మరియొకటి
మీరు వింటారు. చెడ్డవార్తలు మినహా మరేమీ మీరు
వినరు. మరొక ప్రవక్త కొరకు వెదికి, దర్శన విషయం
అడుగుతారు. ఒక్కటికూడ మీకు వుండదు. యాజ
కులు మీకు బోధించేదేమీ లేదు. పెద్దలు మీకిచ్చే
మంచి సలహా ఏమీ వుండదు. 27చనిపోయిన ప్రజల
కొరకు మీ రాజు దుఃఖిస్తాడు. నాయకులు విషాద
సూచక దుస్తులు ధరిస్తారు. సామాన్య జనులు మిక్కిలి
భయపడతారు. ఎందువల్లనంటే వారు చేసిన పనులను
నేను తిప్పికొడతాను. నేను వారికి శిక్షను నిర్ణయిస్తాను.
వారిని నేను శిక్షిస్తాను. అప్పుడా ప్రజలు నేను
యెహోవానని తెలుసుకుంటారు.”

8 ఒకరోజు నేను (యెహెజ్కేలు) నా ఇంటిలో
కూర్చొని ఉన్నాను. యూదా పెద్దలు నా ముందు
కూర్చున్నారు. ఇది చెరబట్టబడిన కాలంలో ఆరవ
సంవత్సరం, ఆరవ నెల (సెప్టెంబరు) ఐదవ రోజున
జరిగింది. నా ప్రభువైన యెహోవా శక్తి అకస్మాత్తుగా
నామీదికి వచ్చింది. 2అగ్నివంటి రూపాన్నొకటి నేను
చూశాను. అది మానవ శరీరంలా ఉంది. నడుము
నుండి కిందికి అది అగ్నిలా కన్పించింది. నడుము
నుండి పైకి ఆ ఆకారం దేదీప్యమానంగా వెలు
గొందుతూ, అగ్నిలో కరుగాలిన లోహంలా ఉంది.
3పిమ్మట చెయ్యి వంటిదొకటి నేను చూశాను. ఆ
చెయ్యి నా మీదికి వచ్చి నా తలపై జుట్టుపట్టుకుంది.
పిమ్మట ఆత్మ నన్ను గాలిలోకి లేపింది. ఆ దేవ
దర్శనంలో ఆయన నన్ను యెరూషలేముకు తీసుకొని
వెళ్లాడు. ఆయన నన్ను లోపలి ద్వారం వద్దకు
తీసుకొని వెళ్లాడు. అది నగరానికి ఉత్తర దిశన ఉంది.
ఆ ద్వారం దగ్గరే దేవుడు అసూయపడేలా చేసిన
విగ్రహం ప్రతిష్ఠితమై ఉంది. 4కాని ఇశ్రాయేలు దేవుని
మహిమ అక్కడ ఉంది. ఆ మహిమ నేను కెబారు
కాలువ వద్ద లోయలో చూసిన దర్శనంలా ఉంది.
5దేవుడు నాతో మాట్లాడుతూ, “నరపుత్రుడా,
ఉత్తర దిశవైపు చూడు!” అన్నాడు. నేను ఉత్తరానికి
చూశాను. అక్కడ బలిపీఠం వద్దగల ద్వారానికి ఉత్తరంగా
దేవుడు అసూయ పడునట్లు చేసిన విగ్రహం ఉంది.
6మళ్లీ దేవుడు నాకు ఇలా చెప్పాడు: “నరపుత్రుడా,
ఇశ్రాయేలు ప్రజలు ఎటువంటి భయంకరమైన పనులు
చేస్తున్నారో నీవు చూస్తున్నావా? వారు దానిని ఖచ్చి
తంగా నా ఆలయం పక్కనే నెలకొల్పారు! నీవు నాతో
వస్తే, ఇంకా భయంకరమైన విషయాలు చూస్తావు!”
7అందువల్ల నేను ఆవరణద్వారం వద్దకు వెళ్లాను.
గోడలో ఒక రంధ్రాన్ని చూశాను. 8దేవుడు నాతో,
“నరపుత్రుడా, గోడలో ఒక రంధ్రం చెయ్యి” అని
చెప్పాడు. కాబట్టి నేను ఆ తలుపులో ఒక రంధ్రాన్ని
చేశాను. లోపల ఒక తలుపు కన్పించింది.
9అప్పుడు దేవుడు నాతో, “లోనికి వెళ్లి ఇక్కడ
ప్రజలు చేస్తున్న భయంకరమైన, దుష్టమైన పనులను
చూడు” అని అన్నాడు. 10నేను లోనికి వెళ్లి చూశాను.
అక్కడ మీరు ఊహించటానికే అసహ్యకరమైన పాముల,
బల్లుల, క్రిమీకీటకాదుల, ఇతర జంతువుల ప్రతిమలు,
శిల్పాలు ఉన్నాయి. అవన్నీ ఇశ్రాయేలీయులు ఆరా
ధించే హేయమైన విగ్రహాలు. ఆ జంతువుల బొమ్మలు
అన్ని గోడల మీదా చుట్టూ చెక్కబడి ఉన్నాయి!
11అక్కడ షాఫాము* కుమారుడైన యజన్యా
యును, మరి డెబ్బయి మంది ఇశ్రాయేలు పెద్దలు
(నాయకులు) ప్రజలతో కలసి ఆ స్థలంలో ఆరాధి
స్తున్నారు. వారు ఖచ్చితంగా ప్రజల ముందు నిలబడి
ఉన్నారు! ప్రతీ పెద్ద మనిషి చేతిలో ఒక ధూప కలశం
ఉంది. సాంబ్రాణి ధూపం గాలిలోకి లేస్తూ ఉంది.
12అప్పుడు దేవుడు నాతో ఇలా అన్నాడు: “నర
పుత్రుడా, ఇశ్రాయేలు పెద్దలు చీకటిలో ఏమి చేస్తు
న్నారో నీవు చూశావా? ప్రతి ఒక్కడూ తన బూటకపు
దేవునికి ఒక గది కలిగి ఉన్నాడు! ‘మనల్ని యెహోవా
చూడలేదు. యెహోవా ఈ దేశాన్ని వదిలేశాడు’ అని

---

**షాఫాము** షాఫాను అని పాఠాంతరం.

వారిలో వారనుకుంటున్నారు.” 13దేవుడు మళ్లీ, “నీవు
నాతో వస్తే, ఆ మనుష్యులు మరీ భయంకరమైన
పనులు చేయటం చూస్తావు!” అని అన్నాడు.
14దేవుడు నన్ను ఆలయ ద్వారం వద్దకు తీసుకొని
వెళ్లాడు. ఈ ద్వారం ఉత్తరపు దిక్కున ఉంది. అక్కడ
స్త్రీలు కూర్చుని, ఏడ్వటం చూశాను. వారంతా బూట
కపు దేవము తమ్మూజును* గురించి దుఃఖిస్తున్నారు!
15దేవుడు ఇలా అన్నాడు: “నరపుత్రుడా, ఈ
భయంకరమైన విషయాలు గమనించావా? నా వెంట
రమ్ము. నీవింతకంటే ఘోరమైన విషయాలు
చూస్తావు!” 16ఆయన నన్ను యెహోవా ఆలయం
లోపలి ఆవరణలోనికి తీసుకొని వెళ్లాడు. అక్కడ
ఇరవై ఐదు మంది కిందికి వంగి ఆరాధించటం చూశాను.
వారు ముందు మండపానికి, బలి పీఠానికి మధ్యలో
ఉన్నారు. కాని వారు తప్పు దిశకు తిరిగి కూర్చున్నారు!
వారి వీపులు పవిత్ర స్థలానికి వెనుతిరిగి ఉన్నాయి.
వారు సూర్యుణ్ణి ఆరాధించటానికి వంగు తున్నారు!
17అప్పుడు దేవుడు ఇలా చెప్పాడు, “నరపుత్రుడా,
ఇది చూశావు గదా! యూదా ప్రజలు ఈ నా ఆల
యాన్ని అతి సామాన్యమైనదిగా భావిస్తూ, ఆలయం
లోనే వారు చెడు పనులు కొనసాగిస్తు న్నారు.! ఈ
దేశమంతా దౌర్జన్యంతో నిండిపోయింది. వారు నిరం
తరం చెడుకార్యాలు చేస్తూ నాకు పిచ్చి పట్టిస్తున్నారు.
చూడు, ఒక బూటకపు దేవతలా చంద్రుని ఆరాధించ
టానికి వారు ముక్కులకు ఉంగరాలు* పెట్టుకుంటు
న్నారు. 18వారికి నా కోపం చూపిస్తాను! వారిపట్ల
ఏమాత్రం కనికరం చూపించను! వారిని గురించి నేను
విచారించను! వారు ప్రాధేయపడి నన్ను పిలుస్తారు.
కాని వారి అభ్యర్థనను నేను వినను!”

9 పిమ్మట దేవుడు నగరాన్ని శిక్షించటానికి నియ
మితులైన నాయకులను పిలిచాడు. ప్రతి నాయ
కుడూ తన చేతిలో ఒక విధ్వంసకర ఆయధం కలిగి
ఉన్నాడు. 2పై ద్వారం నుంచి ఆరుగురు మనుష్యులు
బాటవెంట నడచి రావటం చూశాను. ఈ ద్వారం
ఉత్తర దిశన ఉంది. ప్రతి ఒక్కడూ తన చేతిలో ఒక
మారణాయుధాన్ని కలిగియున్నాడు. వారిలో ఒకడు
నార బట్టలు* ధరించాడు. అతని నడుముకు లేఖకుని
కలం, సిరాబుడ్డి* వేలాడకట్టుకున్నాడు. ఈ మను
ష్యులు ఆలయంలో కంచు పీఠం వద్దకు వెళ్లి, అక్కడ
నిలబడ్డారు. 3అప్పుడు ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా మహిమ కెరూబు దూతల మీదుగా లేచి
అతను ఎక్కడకు వెళ్లాడో అక్కడికి వచ్చింది. ఆ
తేజస్సు ఆలయ ద్వారం వద్దకు వచ్చింది. గడప మీదకు
వచ్చి తేజస్సు ఆగింది. తరువాత నారబట్టలు వేసుకొని,
లేఖకుని సామగ్రి ధరించి ఉన్నవానిని ఆ తేజస్సు
పిలిచింది.
4పిమ్మట యెహోవా (మహిమ) అతనితో,
“యెరూషలేము నగరం గుండా వెళ్లు. ఈ నగరంలో
ప్రజలు చేస్తున్న భయంకరమైన పనులన్నిటికీ కలత
చెంది, విచారిస్తున్న వారి ఒక్కొక్కరి నుదుటి మీద
ఒక గుర్తు పెట్టు” అని చెప్పాడు.
5-6మళ్లీ దేవుడు ఇతర ఐదుగురు మనుష్యులతో,
“మీరు ఆ మొదటి వ్యక్తిని అనుసరించి వెళ్లవలసిందిగా
మిమ్ముల్ని కోరుతున్నాను. నుదుటి మీద గుర్తులేని
ప్రతివానిని మీరు చంపివేయండి. వారు పెద్దలేగాని,
పిన్నలేగాని, యువతులేగాని, పిల్లలేగాని, తల్లులేగాని
ఎవరైనా లెక్కచేయవద్దు. మీ ఆయుధాన్ని వినియో
గించి నుదుటిపై గుర్తులేని ప్రతివానిని చంపివేయండి.
ఏ మాత్రం దయాదాక్షిణ్యం చూపవద్దు. ఎవ్వరిపట్లా
జాలిపడవద్దు! ఈ నా ఆలయం వద్దనే మొదలు
పెట్టండి” అని చెప్పాడు. ఆలయం ముందు ఉన్న
పెద్దలతోనే వారు మొదలుపెట్టారు.
7ఆ మనుష్యులతో దేవుడు ఇలా చెప్పాడు, “ఈ
స్థలాన్ని అపవిత్రం చేయండి. శవాలతో ఈ ఆవరణాన్ని
నింపివేయండి! ఇప్పుడు వెళ్లండి!” కావున వారు వెళ్లి
నగర ప్రజలను చంపివేశారు.
8ఆ మనుష్యులు ప్రజలను చంపటానికి వెళ్లగా,
నేను అక్కడే ఉండిపోయాను. నా శిరస్సును భూమికి
ఆనించి నమస్కరించి, “నా ప్రభువైన ఓ యెహోవా,
యెరూషలేముపై నీ కోపాన్ని ప్రకటించటంతో నీవు
ఇశ్రాయేలులో మిగిలి ఉన్న వారిని చంపివేయటం
లేదు కదా!” అని అన్నాను. 9అది విన్న దేవుడు ఇలా
అన్నాడు: “ఇశ్రాయేలు, యూదా వంశాల వారు అనేక
ఘోరపాపాలు చేశారు. ఈ దేశంలో ప్రజలు ఎక్కడ

---

**తమ్మూజు** బూటకపు దైవమగు తమ్మూజు చని పోయాడని ప్రజలు నమ్మారు. అతని భార్య ఇష్తారు తనతో పాటు అందరినీ విచారించమని కోరింది. తద్వారా తన భర్తను తిరిగి పొందగలనని ఇష్తారు ఆశించింది. నాల్గవ నెలలో (జూన్–జూలై) రెండవ రోజున ఈ క్రమము జరుపుకుంటారు. ఈ పవిత్రమైన రోజును పురస్కరించు కొని ఈ నెలకు తమ్మూజు అని పేరు పెట్టారు.

**చూడు ... ఉంగరాలు** తమ ముక్కులలో నరికిన రెమ్మలను పెట్టుకుంటున్నారు అని పాఠాంతరం. ద్రాక్ష రెమ్మ ముక్కుకు తగిలించుకోవటం ఆనాటి విగ్రహారాధకుల ఆచారం. దాని భావం సరిగా తెలియదు.

**నార బట్టలు** సామాన్యంగా యాజకులు అటువంటి బట్టలు ధరిస్తారు.

**లేఖకుని ... సిరాబుడ్డి** లేఖకుడు అధికార సంబంధమైన దస్తావేజులు మొదలైన వాటిని తిరిగి వ్రాయటం, వస్తుసామగ్రి సరఫరాలను లెక్కించటం వంటి పనులు చేస్తాడు. ఎండిన సిరా, ఒక చెక్క ఎప్పుడూ పట్టుకు తిరుగుతాడు. అవసరమైనప్పుడు ఎండిన సిరామీద నీటి చుక్కలు వేసి, కలంతో వ్రాస్తాడు.

బడితే అక్కడ హత్య చేయబడుతున్నారు. ఈ నగరం
నేరాలతో నిండిపోయింది. ఎందువల్లనంటే ప్రజలు,
'యెహోవా ఈ దేశాన్ని వదిలి వెళ్లిపోయాడు. కనుక
మనం చేసే పనులను ఆయన చూడలేడు' అని అను
కొంటున్నారు. [10]కాని నేను ఏ మాత్రం కనికరం
చూపను. ఈ ప్రజల పట్ల విచారించను. వారు దాన్ని
వారి మీదకే తెచ్చుకొన్నారు. నేను కేవలం వారికి
అర్హమైన శిక్ష విధిస్తున్నాను!"

[11]పిమ్మట నారబట్టలు ధరించి కలం, సిరాబుడ్డి
పట్టుకున్న వ్యక్తి వచ్చి, "మీ ఆజ్ఞ ప్రకారం నేను
అంతా చేశాను" అని అన్నాడు.

10 తరువాత నేను కెరూబు దూతల తలలపై
వున్న పాత్రవైపు చూశాను. అది స్వచ్ఛమైన
నీలపు మణిగా కనబడింది. ఆ పాత్ర మీద సింహాసనం
వంటిది ఒకటుంది. అక్కడ నుండి దేవుణ్ణి చూడవచ్చు.
[2]నారబట్టలు వేసుకున్న వ్యక్తితో దేవుడు ఇలా
అన్నాడు: "నీవు కెరూబు చక్రాల మధ్య ప్రాంతంలోకి
రమ్ము. కెరూబు దూతల మధ్య నుండి కొన్ని మండే
నిప్పు కణికెలను తీసుకో. ఆ నిప్పును నీ చేతిలో
పట్టుకొని వెళ్లి, దానిని యెరూషలేము నగరంపై
విసిరివేయి."

ఆ వ్యక్తి నా పక్క నుండి వెళ్లాడు. [3]ఆ వ్యక్తి
మేఘంలోకి ప్రవేశించినప్పుడు ఆలయానికి దక్షిణాన
వున్న ప్రదేశంలో కెరూబు దూతలు నిలబడ్డారు.
మేఘం లోపలి ఆవరణాన్ని కమ్మిఉంది. [4]పిమ్మట
దేవుని మహిమా ప్రకాశం కెరూబు దూతల మీదినుండి
పైకి లేచింది. ఆ దూతలు ఆలయం గడపమీద నిలబడి
ఉన్నారు. పిమ్మట ఆలయాన్ని మేఘం నింపి వేసింది.
యెహోవా తేజస్సు ఆలయ ఆవరణాన్నంతా ఆవ
రించింది. [5]ఆ తరువాత కెరూబుల రెక్కల ధ్వని
వెలుపలి ఆవరణమంతా వినబడ్డది. సర్వశక్తి మంతుడైన
దేవుడు మాట్లాడినప్పుడు వచ్చే ఆ శబ్దం ఉరుములాంటి
స్వరంలా గంభీరంగా ఉంది. రెక్కల చప్పుడు చాలా
దూరంలో గల బయటి ఆవరణ వరకు వినవచ్చింది.

[6]నారబట్టలు ధరించిన వ్యక్తికి దేవుడు ఒక ఆజ్ఞ
ఇచ్చాడు. నీవు కెరూబుల మధ్య చక్రాల నడిమి
ప్రాంతంలోకి వెళ్లి, మండే నిప్పును తీసుకొని రమ్ము.
కావున ఆ వ్యక్తి ఒక చక్రం పక్కగా నిలబడ్డాడు. [7]కెరూబు
లలో ఒకరు తన చేయిచాపి వాటి మధ్యనున్న మండే
నిప్పును తీశాడు. ఆ నిప్పును ఆ వ్యక్తి చేతిలో వేశాడు.
దానిని తీసుకొని ఆ వ్యక్తి వెళ్లిపోయాడు. [8](కెరూబుల
రెక్కల కింద మానవుల చేతుల వంటివి ఉన్నాయి.)

[9]అక్కడ నాలుగు చక్రాలున్నట్లు నేనప్పుడు
చూశాను. ప్రతి కెరూబుల పక్క ఒక చక్రం చొప్పున
ఉన్నాయి. చక్రాలు స్వచ్ఛమైన విలువైన రాయిగా
కనిపించాయి. [10]మొత్తం నాలుగు చక్రాలున్నాయి.
అవన్నీ ఒకే రీతిగా కన్పించాయి. ఒక చక్రంలో మరి
యొకటి ఉన్నట్లు అవి కన్పించాయి. [11]కదిలినప్పుడు
ఆ నాలుగూ ఒకేసారి ఏ దిశలోనైనా వెళ్ళగలిగినవి.
కాని కెరూబులు కదలినప్పుడు అటు ఇటు తిరిగేవారు
కాదు. తమ తలలు చూస్తున్న దిశలోనే వారు కదలి
వెళ్లేవారు. వారు కదలినప్పుడు అటు ఇటు తిరుగలేదు.
[12]వారి శరీరాల నిండా కన్నులున్నాయి. వారి వీపుల
మీద, చేతుల మీద, వారి రెక్కల మీద, వారి చక్రాల
మీద కన్నులున్నాయి. అవును, నాలుగు చక్రాల మీద
కన్నులున్నాయి! [13]నేను విన్నది ఈ చక్రాలనే. వీటినే
"చక్రాల మధ్యనున్న స్థలం" అంటారు.

[14-15]ప్రతి కెరూబుకూ నాలుగు ముఖాలున్నాయి.
మొదటి ముఖం కెరూబు ముఖం.* రెండవ ముఖం
మనుష్య ముఖం. మూడవది సింహపు ముఖం. నాల్గవది
గద్దముఖం. ఈ కెరూబు దూతలు నేను కెబారు కాలువ
వద్ద దర్శనంలో చూచిన జీవులే. పిమ్మట కెరూబు
గాలిలోకి పైకి లేచారు. [16]వాటితోపాటు చక్రాలు
లేచాయి. కెరూబులు రెక్కలు లేపి గాలిలోకి ఎగిరి
నప్పుడు చక్రాలు తమ దిశను మార్చలేదు. [17]కెరూ
బులు గాలిలోకి ఎగిరినప్పుడు చక్రాలు వారితో
వెళ్లాయి. కెరూబు దూతలు నిలకడగా ఉన్నప్పుడు
చక్రాలు కూడా అలానే ఉండేవి. ఎందువల్లనంటే ఆ
జీవియొక్క ఆత్మ (శక్తి) అంతా చక్రాలలోనే ఉంది.

[18]తరువాత యెహోవా మహిమ ఆలయ గుమ్మం
మీది నుండి పైకిలేచి, కెరూబుల మీదికి వచ్చి ఆగింది.
[19]అప్పుడు కెరూబులు తమ రెక్కలు విప్పి గాలిలోకి
ఎగిరిపోయారు. వారు దేవాలయాన్ని వదిలి వెళ్లటం
నేను చూశాను! చక్రాలు వారితో వెళ్లాయి. తరువాత
వారు ఆలయపు తూర్పు ద్వారం వద్ద ఆగారు. ఇశ్రా
యేలు దేవుని మహిమ గాలిలో వారిపై నిలిచింది.

[20]అప్పుడు నేను కెబారు కాలువవద్ద దర్శించిన
ఇశ్రాయేలు దేవుని మహిమ కింద ఉన్న జీవులను
గుర్తుకు తెచ్చుకున్నాను. ఆ జీవులే కెరూబు దూతలని
నేను తెలుసుకొన్నాను. [21]ప్రతి జీవికీ నాలుగు
ముఖాలు, నాలుగు రెక్కలు మరియు మానవుల చేతు
లను పోలినటువంటివి వాటి రెక్కల కింద ఉన్నాయి.
[22]కెరూబుల ముఖాలు నేను కెబారు కాలువ వద్ద
దర్శించిన జీవుల ముఖాల మాదిరిగానే ఉన్నాయి.
అవన్నీ అవి పోయే దిక్కు వైపే తిన్నగా చూస్తూ
ఉన్నాయి.

11 తరువాత ఆత్మ (గాలి) నన్ను యెహోవా
ఆలయపు తూర్పుద్వారం వద్దకు తీసుకొని
వెళ్లింది. సూర్యుడు ఉదయించే వైపుకు ఈ ద్వారం
తిరిగి ఉంది. ఈ ద్వారం ముందు ఇరవై ఐదు మంది
మనుష్యులున్నట్లు నేను చూశాను. అజ్జూరు

---

**కెరూబు ముఖం** గిత్తదూడ ముఖం. యెహెజ్కేలు. 1:10
లో వివరించబడింది. యెహెజ్కేలు. 10:22 చూడండి.

కుమారుడైన యజన్యా వారితోవున్నాడు. బెనాయా
కుమారుడు పెలట్యా కూడా అక్కడ వున్నాడు.
పెలట్యా ఆ ప్రజలకు నాయకుడుగా ఉండెను.
2పిమ్మట దేవుడు నాతో ఇలా అన్నాడు: "నర
పుత్రుడా, ఈ నగరానికి కీడు మూడే పథకాలు వేసేవారు
వీరే. ప్రజలు చెడు కార్యాలు చేయటానికి వీరు నిత్యం
ప్రోత్సహిస్తారు. 3ఈ మనుష్యులు, 'మా ఇండ్లు మేము
త్వరలో తిరిగి నిర్మించుకుంటాము. కుండలో
మాంసంలా మేమీ నగరంలో సురక్షితంగా ఉన్నాము!'
అని అంటున్నారు. 4వారీ అబద్ధాలు చెపుతున్నారు.
కావున నీవు నా తరపున ప్రజలతో మాట్లాడాలి. ఓ
నరపుత్రుడా, నీవు వెళ్లి ప్రజలకు భవిష్యత్తు యొక్క
నిజాలను ప్రకటించు."
5ఆ తరువాత యెహోవా ఆత్మ నా మీదికి
వచ్చింది. దేవుడు ఇలా చెప్పాడు: "యెహోవా ఈ
మాట చెప్పాడని వారికి తెలియజేయి: ఇశ్రాయేలు
వంశీయులారా, మీరు పెద్ద పెద్ద విషయాలు చేయ
పూనుకొంటున్నారు. కాని మీరు ఏమి ఆలో చిస్తు
న్నారో నాకు తెలుసు! 6మీరీ నగరంలో అనేక మందిని
చంపివేశారు. వీధులన్నిటినీ మీరు శవాలతో నింపి
వేశారు. 7ఇప్పుడు మన ప్రభువైన యెహోవా చెపు
తున్నదేమంటే, 'ఈ శవాలే ఆ మాంసం. నగరమే ఆ
కుండ. కాని అతడు (నెబుకద్నెజరు) వచ్చి ఈ సురక్షిత
మైన కుండలో నుండి మిమ్మల్ని తీసుకొనిపోతాడు!
8మీరు కత్తికి భయపడుతున్నారు. కాని మీ మీదికి
నేను కత్తిని తీసుకువస్తున్నాను!'" మన ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు. కావున అవి
నెరవేరితీరుతాయి!
9దేవుడు ఇంకా ఇలా చెప్పాడు: "మిమ్మల్ని ఈ
నగరం నుండి నేను బయటికి తీసుకొని వెళతాను.
మిమ్మల్ని అన్యులకు అప్పగిస్తాను. నేను మిమ్మల్ని
శిక్షిస్తాను! 10మీరు కత్తికి గురియై చనిపోతారు. నేను
మిమ్మల్ని ఇక్కడే ఇశ్రాయేలులో శిక్షిస్తాను. తద్వారా
మిమ్మల్ని శిక్షించేది నేనే అని మీరు తెలుసుకొంటారు.
నేనే యెహోవాను. 11అవును. ఈ నగరం వంట
పాత్ర అవుతుంది. మీరు అందులో ఉడికే మాంసం!
మిమ్మల్ని ఇక్కడే ఇశ్రాయేలులో శిక్షిస్తాను. 12అప్పుడు
నేనే యెహోవానని మీరు తెలుసుకుంటారు. మీరు
భగ్నపర్చింది నా ధర్మాన్నే! మీరు నా ఆజ్ఞలను శిరసావ
హించలేదు. మీ చుట్టూ వున్న దేశాల ప్రజల మాదిరిగానే
మీరూ జీవించటానికి నిర్ణయించు కున్నారు."
13నేను దేవుని తరపున మాట్లాడటం పూర్తిచేసిన
వెంటనే బెనాయా కుమారుడైన పెలట్యా చని
పోయాడు! నేను వెంటనే సాష్టాంగపడి, నా శిరస్సు
భూమికి ఆనించి ఇలా పెద్ద గొంతుకతో అరిచాను:
"నా ప్రభువైన ఓ యెహోవా, నీవు ఇశ్రాయేలులో
మిగిలిన వారందరినీ పూర్తిగా నాశనం చేయబో
తున్నావు!"
14కాని యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా చెప్పాడు: 15"నరపుత్రుడా, ఈ దేశా
న్నుండి వెడలగొట్టబడిన ఇశ్రాయేలు సంతతివారగు
నీ సోదరులను నీవు ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకో.
ఇక్కడికి చాలా దూరంలో వున్న దేశంలో వారు నివసి
స్తున్నారు. అయినా నేను వాళ్ళను తిరిగి రప్పిస్తాను.
కాని 'యెరూషలేములో ఉంటున్న జనులు యెహో
వాకు దూరంగా ఉండండి. ఈ దేశం మాకు ఇవ్వ
బడింది.' ఇది మాది అని అంటున్నారు.
16"కావున ఈ విషయాలు ఆ ప్రజలకు తెలియ
జేయుము, మన ప్రభువైన యెహోవా చెప్పున
దేమంటే, 'నా ప్రజలను దూరదేశాలకు తరలిపోయేలా
నేను ఒత్తిడి చేసిన మాట నిజమే. అనేక దేశాలలో
నివసించేలా వారిని చెల్లాచెదురు చేశాను. అయినా
వాళ్ళు ఆ దేశాలలో ఉన్నప్పుడు కొద్దికాలం నేనే
వారి ఆలయమై ఉంటాను. 17కావున వారి ప్రభువైన
యెహోవా వారిని తిరిగి తీసుకువస్తాడని నీవు ఆ
ప్రజలకు చెప్పాలి. నేను మిమ్మల్ని అనేకదేశాలకు
చెదరగొట్టాను. కాని మిమ్మల్ని మళ్లీ చేరదీసి, ఆయా
దేశాల నుండి తిరిగి తీసుకొని వస్తాను. ఇశ్రాయేలు
దేశాన్ని మళ్లీ మీకు ఇస్తాను! 18నా ప్రజలు తిరిగి
వచ్చినప్పుడు ఇప్పుడు ఇక్కడ ఉన్న అపవిత్రమైన
విగ్రహాలన్నింటినీ నాశనం చేస్తారు. 19నేను వారందరినీ
చేరదీసి, ఒక్క మనిషిలా వారిలో ఐకమత్యం
కలుగజేస్తాను. వారికి నూతన ఆత్మ కలుగజేస్తాను.
రాతి గుండెను వెలికితీసి, దాని స్థానంలో స్పందించే
గుండెను అమర్చుతాను. 20అప్పుడు వారు నా ధర్మా
లను పాటిస్తారు. వారు నా ఆజ్ఞలను పాటిస్తారు. నేను
వారికి చెప్పిన పనులు చేస్తారు. అప్పుడు వారు నిజంగా
నా ప్రజలవుతారు. నేను వారి దేవుడి నవుతాను.'"
21దేవుడు ఇంకా ఇలా అన్నాడు: "కాని ఇప్పుడు
వారి హృదయాలు ఆ భయంకరమైన, హేయమైన
విగ్రహాలకు చెందివున్నాయి. కనుక ఆ ప్రజలు చేసిన
దుష్కార్యాలకు నేను వారిని శిక్షించాలి." నా ప్రభువైన
యెహోవా ఆ మాటలు చెప్పాడు. 22పిమ్మట కెరూ
బులు తమ రెక్కలు విప్పి గాలిలో ఎగిరిపోయారు.
చక్రాలు వారితో వెళ్లాయి. ఇశ్రాయేలు దేవుని మహిమ
వారిపైన ఉంది. 23యెహోవా మహిమ గాలిలోకి లేచి
యెరూషలేమును వదిలి వెళ్లింది. యెరూషలేముకు
తూర్పున వున్న కొండ* మీద దేవుడు ఒక్క క్షణం
ఆగాడు. 24పిమ్మట ఆత్మ నన్ను గాలిలోకి లేపి మళ్లీ
బబులోను (బాబిలోనియా)కు తీసుకొని వచ్చింది.
అది నన్ను ఇశ్రాయేలు నుండి బలవంతంగా వెళ్ల
గొట్టబడిన ప్రజల వద్దకు తీసుకొనివచ్చింది. ఆ దర్శ
నంలోనే యెహోవా ఆత్మ గాలిలోకి లేచి, నన్ను

**యెరూషలేముకు … కొండ** ఇది ఒలీవల కొండ.

వదిలి వెళ్లింది. అవన్నీ నేను దర్శనంలో చూశాను.
25పిమ్మట బందీలుగా వున్న (చెరపట్టబడిన) ప్రజలతో
నేను మాట్లాడాను. యెహోవా నాకు చూపిన అన్ని
విషయాల గురించీ వారికి చెప్పాను.

12 తరువాత యెహోవా వాక్కు నాకు విన
వచ్చింది. ఆయన ఇలా అన్నాడు: 2“నర
పుత్రుడా, నీవు తిరుగుబాటుదారుల మధ్య వున్నావు.
వారు ఎప్పుడూ నాకు వ్యతిరేకంగా వుంటున్నారు.
నేను వారి కొరకు చేసిన పనులను చూడటానికి వారికి
కళ్ళున్నాయి. అయినా వాటినివారు చూడలేరు. వారిని
నేను చేయమని చెప్పిన విషయాలను వినటానికి వారికి
చెవులున్నాయి. అయినా వారు నా ఆజ్ఞలను వినరు.
ఎందువల్లనంటే వారు తిరుగుబాటుదారులు. 3కావున,
నరపుత్రుడా, నీ సామాన్లు సర్దుకో. నీవొక సుదూర
దేశానికి పోతున్నట్లు నటించు. ప్రజలిదంతా చూసేలా
నీవు చేయాలి. బహుశః వారు నిన్ను చూడవచ్చు.
కాని వారు మిక్కిలి తిరుగుబాటుదారులు.

4“ప్రజలు నిన్ను చూసే విధంగా నీ సామాన్లు
పగటిపూట బయటకు తీసుకొని వెళ్ళు. మళ్లీ
సాయంత్రం నీవొక బందీవలె దూరదేశానికి వెళ్తున్నట్లు
ప్రవర్తించు. 5మళ్లీ ఆ జనులు గమనిస్తూ వుండగా
గోడకు కన్నం పెట్టి, దాని గుండా నీవు బయటికి
వెళ్ళు. 6రాత్రిపూట నీ సామాను సంచి భుజం మీద
వేసుకొని బయలుదేరు. నీవు ఎక్కడికి వెళ్ళుతున్నావో
నీకే తెలియని విధంగా నీ ముఖాన్ని కప్పుకోవాలి.
జనులు నిన్ను గమనించేటందుకు నీవీ పనులు
చేయాలి. ఎందువల్లనంటే ఇశ్రాయేలు వంశానికి ఒక
ఆదర్శంగా నేను నిన్ను వినియోగించు కుంటు
న్నాను!”

7కావున నేను (యెహెజ్కేలు) యెహోవా ఆజ్ఞ
ప్రకారం చేశాను. పగటివేళ నా సంచులు తీసుకొని
నేనొక దూరదేశానికి వెళ్లిపోతున్నట్లు నటించాను. ఆ
సాయంత్రం నా చేతులతో గోడకు కన్నం వేశాను.
రాత్రివేళ నా సంచి చంకకు తగిలించుకొని బయలు
దేరాను. ఈ పనులన్నీ ప్రజలు గమనించే విధంగా
చేశాను.

8మరునాటి ఉదయం యెహోవా వాక్కు నాకు
వినవచ్చింది. ఆయన ఇలా అన్నాడు: 9“నరపుత్రుడా,
ఇశ్రాయేలీయులైన ఆ తిరుగుబాటుదారులు నీవు ఏమి
చేస్తున్నావని నిన్ను అడిగారా? 10వారి ప్రభువగు
యెహోవా ఈ విషయాలు చెప్పాడని తెలియజేయి.
ఈ విషాద సమాచారం యెరూషలేము నాయకునకు
(పాలకుడు), అక్కడ నివసిస్తున్న ఇశ్రాయేలీయులంద
రికీ సంబంధించినది. 11‘మీ అందరికీ నేను
(యెహెజ్కేలు) ఒక ఆదర్శం అనీ, నేను చేసి చూపించి
నవి మీకు తప్పక జరుగుతాయని’ చెప్పుము. మీరు
తప్పక దూరదేశాలకు బలవంతాన బందీలుగా తీసుకొని
పోబడతారు. 12మీ నాయకుడు (పాలకుడు) రాత్రి
పూట గోడకు కన్నం వేసి దొంగచాటుగా బయటకు
పారిపోతాడు. ప్రజలతనిని గుర్తు పట్టకుండా, అతడు
తన ముఖాన్ని కప్పుకుంటాడు. అతడెక్కడికి వెళ్ళు
చున్నాడో అతని కన్నులు చూడలేవు. 13అతడు
తప్పించుకోవటానికి ప్రయత్నిస్తాడు. కాని నేను
(దేవుడు) అతనిని పట్టుకుంటాను! అతడు నా వలలో
చిక్కుకుంటాడు. నేనతనిని కల్దీయుల రాజ్యమైన
బబులోను (బాబిలోనియా)కు తీసుకొని వస్తాను. కాని
అతడు మాత్రం తనెక్కడికి పోతున్నాడో చూడలేడు.
శత్రువు అతని కన్నులను పీకి గుడ్డివాణ్ణి చేస్తాడు
అప్పుడు అక్కడ అతడు చనిపోతాడు. 14రాజ వంశీ
యులను ఇశ్రాయేలు చుట్టూ ఉన్న అన్యదేశాలలో
నివసించేలా వారిని ఒత్తిడి చేస్తాను. అతని సైన్యాన్ని
చెల్లా చెదురు చేస్తాను. శత్రు సైన్యాలు వారిని తరిమి
కొడతాయి.

15అప్పుడా ప్రజలు నేను యెహోవాను అని
తెలుసుకొంటారు. నేనే వారిని అన్యదేశాలలో విసిరి
వేశానని తెలుసుకొంటారు. ఇతర దేశాలకు పోయేలా
వారిని నేనే ఒత్తిడి చేశానని తెలుసుకొంటారు.

16“కాని కొద్దిమంది ప్రజలను మాత్రం బతక
నిస్తాను. రోగాలవల్ల గాని, ఆకలిచేత గాని లేక యుద్ధం
వల్లగాని వారు చనిపోరు. వారు నాపట్ల చేసిన భయంకర
నేరాలను గురించి ఇతర ప్రజలకు తెలియజెప్పటానికి
గాను వారిని నేను బతకనిస్తాను. పిమ్మట వారు నేను
యెహోవానని తెలుసుకొంటారు.”

17ఆ పిమ్మట మళ్లీ యెహోవా వాక్కు నాకు
వినవచ్చింది. ఆయన ఇలా అన్నాడు: 18“నరపుత్రుడా,
నీవు చాలా భయపడినవానిలా వ్యవహరించాలి. నీవు
ఆహారం తీసుకొనే సమయంలో వణకాలి. నీవు నీరు
తాగేటప్పుడు వ్యాకుల పడుతున్నట్లు, భయపడు
తున్నట్లు ప్రవర్తించాలి. 19ఈ విషయాలు నీవు
సామాన్య ప్రజలకు తెలియజెప్పాలి. నీవు ఇలా అనాలి:
‘యెరూషలేము ప్రజలకు, ఇశ్రాయేలులో ఇతర
ప్రాంతాల ప్రజలకు మన ప్రభువైన యెహోవా చెపు
తున్నాడు, మీరు మీ ఆహారం తీసుకొనేటప్పుడు
మిక్కిలి కలత చెందుతారు. మీరు నీరు తాగేటప్పుడు
భయకంపితులవుతారు. ఎందువల్లనంటే, మీ దేశంలో
అన్ని వస్తువులూ సర్వనాశనం చేయబడతాయి!
అక్కడ నివసిస్తున్న ప్రజలందరి పట్ల శత్రువు చాలా
క్రూరంగా ప్రవర్తిస్తాడు.

20మీ నగరాలలో చాలా మంది ప్రజలు నివసి
స్తున్నారు. కాని ఆ నగరాలన్నీ నాశనం చేయబడ
తాయి. మీ దేశం యావత్తూ నాశనం చేయబడు
తుంది! అప్పుడు నేనే యెహోవానని మీరు
గుర్తిస్తారు.” 21యెహోవా వాక్కు నాకు మరల విన
వచ్చింది. ఆయన ఇలా చెప్పాడు: 22“నరపుత్రుడా,

ఇశ్రాయేలును గురించి ఎందుకు ఈ పాట పాడు
కుంటారు?'

ఆపద త్వరలో రాదు, దర్శనాలు నిజం కావు.

23"వారి ప్రభువైన యెహోవా ఆ పాటను ఆపు
చేయిస్తాడని ప్రజలకు చెప్పు. ఇశ్రాయేలును గురించి
ఆ మాటలు వారిక ఎన్నడూ పలుకరు. ఇప్పుడు వారీ
పాటపాడతారు.

ఆపద ముంచుకు వస్తూ ఉంది, స్వప్న దర్శనా
లన్నీ నిజమై తీరుతాయి.

24"నిజానికి ఇకమీదట ఇశ్రాయేలులో అసత్య దర్శ
నాలు ఉండవు. నిజం కాని భవిష్యత్తును చెప్పే తాంత్రి
కులు మరి ఉండబోరు. 25ఎందువల్లనంటే, నేనే
యెహోవాను. నేను చెప్పదలచుకున్నది స్పష్టంగా
చెప్పి తీరుతాను. అది తప్పక జరిగి తీరుతుంది! నేను
కాలయాపన చేయను. ఆ కష్టాలు త్వరలో మీ కాలం
లోనే రాబోతున్నాయి. ఓ తిరుగుబాటు ప్రజలారా,
నేను ఏదైనా చెప్పితే అది జరిగేలా చేస్తాను." ఇవీ నా
ప్రభువైన యెహోవా చెప్పిన మాటలు.
26మళ్లీ యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: 27"నరపుత్రుడా, నేను నీకిచ్చిన
దర్శనాలు భవిష్యత్తులో ఎప్పుడో జరుగుతాయని
ఇశ్రాయేలు ప్రజలు అనుకొంటున్నారు. ఇప్పటి నుంచి
చాలా సంవత్సరాల తరువాత జరుగబోయే విషయా
లను గురించి నీవు మాట్లాడుతున్నావని వారనుకుంటు
న్నారు. 28కావున నీవు వారికి ఈ విషయాలు చెప్పాలి,
'నా ప్రభువైన యెహోవా ఇలా తెలియజేస్తున్నాడు:
నేనిక ఎంతమాత్రం ఆలస్యం చేయను. నేనేదైనా
జరుగుతుందని చెప్పితే అది తప్పక జరిగి తీరుతుంది!'"
నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు చెప్పాడు.
13 మరొకసారి యెహోవా వాక్కు నాకు
వినిపించింది. ఆయన ఈ విధంగా చెప్పాడు:
2"నరపుత్రుడా, నీవు నా తరపున ఇశ్రాయేలు ప్రవక్త
లతో మాట్లాడాలి. ఆ ప్రవక్తలు వాస్తవానికి నా తరపున
మాట్లాడటం లేదు. ఆ ప్రవక్తలు తాము చెప్పదలచు
కొన్న విషయాలే చెప్పుచున్నారు. కావున నీవు వారితో
మాట్లడవలెను. వారికి ఈ విషయాలు చెప్పు:
'యెహోవా నుండి వచ్చిన వర్తమానం వినండి! 3నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెబుతున్నాడు.
దుష్ట ప్రవక్తలగు మీకు కీడు మూడుతుంది. మీరు మీ
ఆత్మలనే అనుసరిస్తున్నారు. మీరు స్వప్న దర్శనాలలో
చూసిన వాస్తవాలను ప్రజలకు చెప్పటలేదు.
4"'ఓ ఇశ్రాయేలూ! నీ ప్రవక్తలు, పాడుబడిన
ఇండ్లలో పరుగెత్తే గుంట నక్కల్లా వుంటారు. 5బీటలు
వారిన నగర గోడల వద్ద నీవు సైనికులను కాపలా
వుంచలేదు. ఇశ్రాయేలు వంశాన్ని కాపాడటానికి నీవు
గోడలను నిర్మించలేదు. కావున యెహోవావాకు
మిమ్మల్ని శిక్షించే రోజు వచ్చినప్పుడు, నీవు
యుద్ధంలో పరాజయం పొందుతావు!
6"'దొంగ ప్రవక్తలు తమకు దర్శనాలు కలిగాయని
అన్నారు. కొన్ని తంత్రాలు చేసి వారు చెప్పిన విష
యాలు జరుగుతాయని అన్నారు. కాని వారు అబద్ధ
మాడారు. వారిని యెహోవాయే పంపినట్లు వారు
చెప్పారు. అదికూడా అబద్ధమే. వారి అబద్ధాలు నిజ
మవ్వాలని వారింకా ఎదురు చూస్తూనే వున్నారు.
7"'దొంగ ప్రవక్తలారా, మీరు చూసిన దర్శనాలు
నిజం కావు. మీరు తంత్రాలు జరిపి, అనేక విషయాలు
జరుగుతాయని చెప్పారు. కాని మీరు చెప్పింది అబద్ధం!
యెహోవా ఆ విషయాలు చెప్పాడని మీరు ప్రక
టించారు. కాని నేను మీతో మాట్లాడలేదు.'"
8కావున ఇప్పుడు నా ప్రభువైన యెహోవా నిజంగా
మాట్లాడతాడు! ఆయన చెప్పినదేమంటే, "మీరు
అబద్ధమాడారు. సత్యదూరమైన దర్శనాలను మీరు
చూశారు. కావున ఇప్పుడు నేను (దేవుడు) మీకు
వ్యతిరేకినయ్యాను!" నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు. 9యెహోవా ఇంకా ఇలా
చెప్పాడు, "అబద్ధపు దర్శనాలను చూచి, అబద్ధాలు
చెప్పిన ప్రవక్తలను నేను శిక్షిస్తాను. వారిని నా ప్రజల
మధ్యనుండి తొలగిస్తాను. వారి పేర్లు ఇశ్రాయేలు వంశా
వళిలో ఉండవు. వారు మరెన్నటికీ ఇశ్రాయేలు రాజ్యా
నికి తిరిగిరారు. అప్పుడు మీ ప్రభువగు యెహోవాను
నేనే అని మీరు తెలుసుకుంటారు!
10"ఆ బూటకపు ప్రవక్తలు పదే పదే నా ప్రజలకు
అబద్ధాలు చెప్పారు. శాంతి విలసిల్లుతుందని ఆ ప్రవక్తలు
చెప్పారు. కాని శాంతి లేదు. గోడలు కట్టుదిట్టం చేసి,
ప్రజలు యుద్ధానికి సిద్ధపడవలసి ఉంది. అయితే వారు
పగిలిన గోడలమీద పలుచని పూత మాత్రం పూస్తు
న్నారు. పగుళ్లకు బంకమట్టి వ్రాస్తున్నారు. 11నేను
వారి మీదికి తీవ్రమైన వడగండ్ల వాన (శత్రు సైన్యం)
పంపుతానని నీవు వారికి చెప్పు. పెనుగాలి వీస్తుంది.
తుఫాను వస్తుంది. అప్పుడు ఆ గోడ కూలిపోతుంది.
12గోడ కూలినప్పుడు ప్రజలు ప్రవక్తలను, "మీరు
గోడలకు పూసిన బంకమట్టి ఏమయ్యింది?'" అని
అడుగుతారు. 13నా ప్రభువైన యెహోవా ఇలా చెప్పు
తున్నాడు, "నేను కోపంగా వున్నాను. మీ మీదికి నేనొక
తుఫాను పంపుతాను. నేను కోపగించివున్నాను. మీ
మీదికి జడివాన పంపుతాను. నేను కోపంగావున్నాను.
ఆకాశాన్నుండి వడగండ్లు పడేలా చేసి మిమ్మల్ని సర్వ
నాశనం చేస్తాను! 14గోడమీద మీరు పలుచనైన బంక
మట్టి పులిమారు. కాని నేను మొత్తం గోడనే నాశనం
చేస్తాను. దానిని కూలగొడతాను. ఆ గోడ మీ మీద

పడుతుంది. అప్పుడు నేనే యెహోవానని మీరు
గుర్తిస్తారు. 15గోడమీద, ఆ గోడకు పూత పూసిన
వారిమీద నా కోపం చూపటం పూర్తిచేస్తాను. అప్పుడు,
'గోడా లేదు, గోడకు పూతపూసే పని వాళ్ళూ లేరు'
అని నేనంటాను.
16"ఈ విషయాలన్నీ ఇశ్రాయేలులో వున్న దొంగ
ప్రవక్తలకు సంభవిస్తాయి. ఆ ప్రవక్తలు యెరూషలేము
ప్రజలతో మాట్లాడుతూ, శాంతి నెలకొంటుందని
అంటారు. కాని శాంతి లేదు." ఈ విషయాలన్నీ నా
ప్రభువైన యెహోవా చెప్పాడు.
17దేవుడు ఈ విధంగా చెప్పాడు: "నరపుత్రుడా,
ఇశ్రాయేలులో స్త్రీ ప్రవక్తల విషయం చూడు. ఈ
ఆడ ప్రవక్తలు నా తరఫున మాట్లాడరు. వారు చెప్ప
దలచుకొన్నవే వారు చెప్పుతారు. కావున నీవు నా
పక్షాన వారికి వ్యతిరేకంగా మాట్లాడాలి. వారికి నీవు ఈ
విషయాలు చెప్పాలి. 18నా ప్రభువైన యెహోవా ఈ
రకంగా చెపుతున్నాడు, ఓ స్త్రీలారా, మీకు కీడు జరుగు
తుంది. ప్రజలు వారి చేతులమీద ధరించటానికి మీరు
గుడ్డలతో కంకణాలు కుడతారు. ప్రజలకు కావలసిన
రకరకాల తలముసుగులు ప్రత్యేకంగా తయారు
చేస్తారు. అవన్నీ ప్రజల జీవితాలను కట్టుబాట్లలో వుంచే
మహిమగల వస్తువులని మీరు చెబుతున్నారు. మీ
బ్రతుకుదెరువు కోసం ప్రజలను మీ వలలలో వేసు
కొంటున్నారు! 19నేను ముఖ్యుడను కానని ప్రజలు
నమ్మేలా వారిని మీరు మభ్యపెడుతున్నారు. గుప్పెడు
గింజల కోసం, పట్టెడు అన్నం కోసం మీరీ పనులన్నీ
చేస్తూ ప్రజలను నాకు వ్యతిరేకులుగా చేస్తున్నారు.
నా ప్రజలకు మీరు అబద్ధాలు చెబుతున్నారు. ప్రజలు
కూడా అబద్ధాలు వినటానికే ఇష్టపడుతున్నారు. బతక
వలసిన ప్రజలను మీరు చంపుతున్నారు. చావవలసిన
మనుష్యులను మీరు జీవించేలా చేస్తున్నారు. 20కావున
ప్రభువైన యెహోవా ఈలాగు చెపుతున్నాడు, మీరు
బట్టతో కంకణాలు కట్టి ప్రజలను చిక్కించుకుంటు
న్నారు. కాని నేనా ప్రజలను విడుదల చేస్తాను. ఆ
కంకణాలు మీ చేతుల నుండి లాగి పారవేస్తాను.
అప్పుడు ప్రజలు మీ నుండి విముక్తి పొందుతారు.
పంజరంలో నుండి ఎగిరిపోయే పక్షుల్లా వారు
వుంటారు! 21నేను వారి ముసుగులను చించివేస్తాను.
మీ దుష్టశక్తి నుండి నా ప్రజలను కాపాడతాను. మీ
బోను నుండి ఆ ప్రజలు తప్పించుకుంటారు. నేనే
యెహోవానని అప్పుడు మీరు తెలుసుకుంటారు.
22"'ప్రవక్తలైన మీరు అసత్యాలు చెబుతున్నారు.
మీ అబద్ధాలు మంచి వ్యక్తులకు బాధ కలుగజేస్తాయి.
మంచి ప్రజలను బాధించటం నాకు ఇష్టంలేని పని!
దుష్ట జనాన్ని మీరు బలపర్చి, వారిని ప్రోత్సహిస్తారు.
వారి నడవడికను మార్చుకోమని మీరు వారికి చెప్పరు.
మీరు వారి ప్రాణాలను రక్షించటానికి ప్రయత్నించరు!
23కావున ఇక మీదట మీరు పనికిరాని దర్శనాలను
చూడరు. మీరిక ఎంతమాత్రం గారడీలు చేయరు. మీ
శక్తుల నుండి నా ప్రజలను నేను రక్షిస్తాను. అప్పుడు
మీరు నన్ను యెహోవా అని తెలుసుకొంటారు.'"

14 ఇశ్రాయేలు పెద్దలలో కొంతమంది నా వద్దకు
వచ్చారు. వారు నాతో మాట్లాడాలని నావద్ద
కూర్చున్నారు. 2ఆ సమయంలో యెహోవా వాక్కు
నాకు వినవచ్చింది. ఆయన ఈ విధంగా చెప్పాడు.
3"నరపుత్రుడా, ఈ మనుష్యులు నీతో మాట్లాడాలని
వచ్చారు. వారు నా సలహా కోరమని నిన్ను అడగటానికి
వచ్చారు. కాని ఈ మనుష్యులు ఇంకా హేయమైన
విగ్రహాలను కలిగివున్నారు. వారు పాపం చేయటానికి
కారణమైన వస్తువులను వారింకా విడనాడలేదు. ఆ
విగ్రహాలను వారింకా పూజిస్తూనే వున్నారు. అందువల్ల
వారు నా సలహా కొరకు రావలసిన అవసరం ఏముంది?
వారి ప్రశ్నలకు నేను సమాధానం చెప్పాలా? అవసరం
లేదు! 4అయినా నేను వారికి ఒక సమాధానం ఇస్తాను.
అది నేను వారిని శిక్షించటం! ఈ విషయాలు నీవు
వారికి చెప్పాలి, 'నా ప్రభువైన యెహోవా ఇలా అంటు
న్నాడు: ఇశ్రాయేలుకు చెందిన వాడెవడైనా ఒక ప్రవక్త
వద్దకు వచ్చి నా సలహా కోరితే, ఆ ప్రవక్త వానికి
సమాధానం చెప్పడు. నాకై నేనే ఆ వ్యక్తి ప్రశ్నకు
సమాధానమిస్తాను. ఆ వ్యక్తి తన హేయమైన విగ్రహా
లను కలిగివున్నా, తన పాపాలకు కారణమైన వస్తు
వులను దాచివుంచినా, అతడా విగ్రహారాధన చేసినా,
నేనతనికి సమాధానమిస్తాను. వానివద్ద అపవిత్ర విగ్రహా
లున్నా నేనతనితో మాట్లాడతాను. 5ఎందుకనగా నేను
వారి హృదయాలను తాకకోరుచున్నాను. వారి నీచ
మైన విగ్రహాల కొరకు వారు నన్ను విడిచిపెట్టినా,
నేను వారిని ప్రేమిస్తున్నట్లు చూపదలిచాను.'
6"కావున ఇశ్రాయేలు వంశం వారికి ఈ విషయాలు
చెప్పు. వారితో ఇలా అనాలి, 'నా ప్రభువైన యెహోవా
ఏమి చెబుతున్నాడనగా: నా వద్దకు తిరిగి రండి. మీ
అపవిత్ర విగ్రహాలను వదిలివేయండి. ఆ బూటకపు
దేవుళ్ళ నుండి దూరంకండి. 7ఏ ఇశ్రాయేలీయుడు
గాని, ఇశ్రాయేలులో నివసించే పరదేశీయుడుగాని నా
వద్దకు సలహా కోరివస్తే, వానికి నేను సమాధాన మిస్తాను.
అతను అపవిత్ర విగ్రహాలను కలిగియున్నా, తను
పాపాలు చేయటానికి కారకమైన వస్తువులను అతను
దాచుకున్నా, అతను విగ్రహాలను ఆరాధించినా, అతనికి
నేను సమాధాన మిస్తాను. నేను వారికిచ్చే సమాధాన
మిది: 8నేనా వ్యక్తికి వ్యతిరేకినవుతాను. నేను వానిని
నాశనం చేస్తాను. ఇతర ప్రజలకు అతడొక ఉదాహరణగా
మిగులుతాడు. ప్రజలతనిని చూసి నవ్వుతారు. నా
ప్రజల మధ్యనుండి అతనిని తొలగిస్తాను. అప్పుడు
నేను యెహోవానని మీరు తెలుసుకొంటారు! 9ఏ
ప్రవక్తయేగాని మూర్ఖంగా తన స్వంత సమాధానమిస్తే,

అతడెంత మూర్ఖుడో నేనతనికి నిరూపిస్తాను! అతనికి
వ్యతిరేకంగా నా శక్తిని వినియోగిస్తాను. అతనిని నాశనం
చేసి, నా ప్రజలైన ఇశ్రాయేలీయుల నుండి అతనిని
తొలగిస్తాను. 10కావున, సలహా కొరకు వచ్చిన వ్యక్తి,
సమాధాన మిచ్చిన ప్రవక్త, ఇద్దరూ ఒకే శిక్షకు గురియ
వుతారు. 11ఎందుకంటే, దానివల్ల ఆ ప్రవక్తలు నా
ప్రజలను నాకు దూరం చేయకుండా ఆగిపోతారు.
తద్వారా, నా ప్రజలు వారి పాపాలలో అపవిత్రము
కాకుండా ఆగిపోతారు. అప్పుడు వారు నా ప్రత్యేక
ప్రజలవుతారు. నేను వారి దేవుడనవుతాను.’” ఈ
విషయాలన్నీ ప్రభువైన యెహోవా చెప్పాడు.
12పిమ్మట యెహోవా వాక్కు నాకు తిరిగి విని
పించింది. ఆయన ఇలా చెప్పాడు, 13“నరపుత్రుడా,
నన్ను వదిలిపెట్టిన, నా పట్ల పాపంచేసిన ఏ దేశాన్న
యినా నేను శిక్షిస్తాను. వారికి ఆహార సరఫరాలను
నిలిపి వేస్తాను. వారికి కరువు కాలం రప్పించి, ఆ దేశ
జనాభాని పశుసంపదను తొలగిస్తాను. 14ఆ దేశంలో
నోవహు, దానియేలు, యోబు* నివసిస్తున్నప్పటికీ
దానిని నేను శిక్షిస్తాను. ఆ మనుష్యులు వారి మంచితనం
చేత వారి ప్రాణాలను కాపాడుకొనగలరు. కాని మొత్తం
దేశాన్ని వారు రక్షించలేరు.” నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెప్పాడు.
15దేవుడు ఇంకా ఇలా తెలియజెప్పాడు: “లేదా,
నేను ఆ రాజ్యానికి క్రూర మృగాలను పంపవచ్చు. ఆ
జంతువులు ప్రజలందరినీ చంపివేయవచ్చు. ఈ క్రూర
మృగాల కారణంగా ఆ దేశం గుండా ఎవ్వరూ
ప్రయాణం చేయరు. 16ఒకవేళ ఆ దేశంలో నోవహు,
దానియేలు, యోబు నివసిస్తూవుంటే ఆ ముగ్గురు
మంచి వ్యక్తులనూ నేను రక్షిస్తాను. ఆ ముగ్గురు మను
ష్యులూ తమ ప్రాణాలను కాపాడుకోగలరు. నా జీవ
ప్రమాణంగా వారు ఇతరుల ప్రాణాలను గాని, కనీసం
వారి కుమారులను, కుమార్తెలను గాని రక్షించలేరని
నిశ్చయంగా చెబుతున్నాను! ఆ చెడ్డదేశం నాశనం
చేయబడుతుంది!” నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
17దేవుడు ఈ విధంగా చెప్పాడు: “లేదా, నేను
శత్రుసైన్యాన్ని ఆ దేశం మీదికి పంపవచ్చు. ఆ సైనికులు
ఆ రాజ్యాన్ని నాశనం చేస్తారు. దేశంలో వున్న మనుష్య
లను, జంతువులను తొలగించి వేస్తాను. 18నోవహు,
దానియేలు, యోబు అక్కడ వుంటే, ఆ ముగ్గురు
మంచి వ్యక్తులను నేను రక్షిస్తాను. ఆ ముగ్గురు మను
ష్యులూ వారి ప్రాణాలను కాపాడుకోగలుగుతారు. కాని,
నా జీవ ప్రమాణంగా ఇతర ప్రజల ప్రాణాలను గాని,
తమ స్వంత కుమారుల, కుమార్తెల ప్రాణాలను గాని
కాపాడలేరని చెబుతున్నాను. ఆ చెడ్డదేశం నాశనం
చేయబడుతుంది!” నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
19దేవుడు ఇంకా ఇలా చెప్పాడు: “లేదా, ఆ దేశం
మీద ఒక వ్యాధి ప్రబలేలా నేను చేయవచ్చు. ఆ
ప్రజల మీద నా కోపం కుమ్మరిస్తాను. ఆ రాజ్యం
నుండి ప్రజలందరినీ, పశువులన్నిటినీ నేను తొలగించి
వేస్తాను. 20ఒకవేళ నోవహు, దానియేలు, యోబు
అక్కడ నివసిస్తే, ఆ ముగ్గురు మనుష్యులను నేను
రక్షిస్తాను. ఎందువల్లనంటే వారు మంచి వ్యక్తులు. ఆ
ముగ్గురూ తమ ప్రాణాలను కాపాడుకోగలరు. కాని,
నా ఆత్మ సాక్షిగా వారు ఇతర ప్రజలను గాని, వారి
స్వంత కొడుకులను, కుమార్తెలను గాని రక్షించలేరు!”
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
21మళ్లీ నా ప్రభువైన యెహోవా ఈ విధంగా
చెప్పాడు: “కావున యెరూషలేము పరిస్థితి ఎంత దారు
ణంగా వుంటుందో ఆలోచించు. ఆ నాలుగు రకాల
శిక్షలనూ ఆ నగరం మీదికి పంపుతాను! ఆ నగరం
మీదికి శత్రుసైన్యాలను, క్షామాన్ని, రోగాలను, క్రూర
మృగాలను పంపుతాను. ఆ రాజ్యం నుండి ప్రజలను,
పశువులను అందరినీ తొలగిస్తాను! 22కొంతమంది
ప్రజలు ఆ దేశంనుండి తప్పించు కుంటారు. వారు
తమ కుమారులను, కుమార్తెలను తీసుకొని నీ
సహాయం కొరకు వస్తారు. నిజంగా వారెంత చెడ్డవారో
నీవప్పుడు తెలుసుకొంటావు. నేను యెరూషలేము
మీదకి రప్పించే కష్టాలను గూర్చి నీవప్పుడు యోచించి
అవి వారికి తగినవేనని నీవనుకుంటావు. 23నీవు వారి
జీవన విధానాన్ని, వారు చేసే చెడుకార్యాలను చూస్తావు.
నేనా ప్రజలను శిక్షించటానికి తగిన కారణమున్నట్లు
నీవు అప్పుడు తెలుసుకుంటావు.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

15 మరల దేవుని వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: 2“ఓ నరపుత్రుడా,
అడవిలో నరికి తెచ్చిన చిన్న కొమ్మల కన్నా ద్రాక్షా
తీగ పుల్లలు ఏమైనా మిన్నవయినవా? కాదు! 3ద్రాక్షా
తోటల*నుంచి తెచ్చిన పుల్లలను ఏ పనికైనా నీవు
వినియోగించగలవా? లేదు! ఆ కట్టెను పాత్రలు
తగిలించేరాటలకైనా నీవు వినియోగించగలవా? లేదు!
4ప్రజలా పుల్లలను కేవలం నిప్పులో వేస్తారు. కొన్ని
పుల్లలు రెండు చివరలా మండుతూ మధ్య భాగం పొగ
కమ్మి నల్లబడతాయి. అంతేగాని పుల్లలు పూర్తిగా తగుల
బడవు. ఆ సగం కాలిన పుల్లతో నీవేమైనా చేయగలవా?

---

**నోవహు, దానియేలు, యోబు** ఈ ముగ్గురు ప్రాచీన కాలపు మనుష్యులు. వీరు మంచితనానికి, తెలివి తేటలకు ప్రసిద్ధి చెందినవారు. నోవహు, యోబులకు చెందిన కథలు బైబిలు గ్రంథలో ఉన్నాయి. దానియేలును గురించిన కథలు రాస్‌షామ్రా రచనల్లో లభ్యమవుతాయి.

**ద్రాక్ష తోట** అనేక పర్యాయాలు ఇశ్రాయేలును దేవుని యొక్క ద్రాక్షతోట అని పిలిచారు.

5ఆ పుల్ల కాలక ముందు దానితో నీవు ఏమీ
చేయలేకపోతే, నిజానికి అది కాలిన తరువాత దానితో
నీవు ఏమి చేయగలవు! 6కావున ద్రాక్షా తోటలో
తెచ్చిన పుల్లలూ కేవలం అడవిలో తెచ్చిన పుల్లల
మాదిరే వుంటాయి. ప్రజలా పుల్లలను నిప్పులో
వేస్తారు. నిప్పు వాటిని కాల్చివేస్తుంది. అదేరకంగా,
యెరూషలేములో నివసిస్తున్న ప్రజలను నేను అగ్నిలో
పడవేస్తాను!” నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు. 7“ఆ ప్రజలను నేను శిక్షిస్తాను. కాని వారిలో
కొంతమంది పూర్తిగా కాలని పుల్లల వంటివారు. వారు
శిక్షింపబడతారు. అంతేగాని వారు సర్వనాశనం చేయ
బడరు. నేను ఈ ప్రజలను శిక్షించటం నీవు చూస్తావు.
ఆ శిక్షించింది యెహోవాయే అని కూడా నీవు తెలుసు
కుంటావు! 8ప్రజలు బూటకపు దేవుళ్లను ఆరాధించే
నిమిత్తం నన్ను వదిలిపెట్టిన కారణంగా, నేను ఆ
రాజ్యాన్ని నాశనం చేస్తాను.” నా ప్రభువైన యెహోవా
ఆ విషయాలు చెప్పాడు.

16 మరో పర్యాయం యెహోవా వాక్కు నాకు
వినవచ్చింది. ఆయన ఈ విధంగా చెప్పాడు:
2“నరపుత్రుడా, యెరూషలేము ప్రజలకు వారు చేసిన
భయంకర నేరాల విషయం తెలియజెప్పు. 3నీవు ఇలా
చెప్పాలి, ‘యెరూషలేముకు నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెప్పుతున్నాడు: నీ చరిత్రవైపు ఒకసారి
చూడు. నీవు కనానులో జన్మించావు. నీ తండ్రి అమోరీ
యుడు. నీ తల్లి హిత్తీయురాలు. 4యెరూషలేమా,
నీవు పుట్టిన రోజున నీ బొడ్డు కోయటానికి ఒక్కరు
కూడా లేరు. నిన్ను శుభ్రపర్చటానికి నీ మీద ఎవ్వరూ
ఉప్పు పెట్టి స్నానం చేయించలేదు. నీకు ఎవ్వరూ
పొత్తిగుడ్డలు చుట్టలేదు. 5యెరూషలేమా, నీవు
అప్పుడు ఒంటరిదానవు. నీ కొరకు ఎవ్వరూ బాధ
పడలేదు. నిన్ను గూర్చి ఎవ్వరూ శ్రద్ధ తీసుకోలేదు.
యెరూషలేమా, నీవు పుట్టిన రోజునే నీ తల్లిదండ్రులు
నిన్ను పొలాల్లో పారవేశారు. నీవు అప్పటికి ఇంకా
రక్తంతోను, మావితోను కప్పబడి ఉన్నావు.
6“‘అప్పుడు నేను (దేవుడు) అటుగా వెళ్లు
చున్నాను. నీవు రక్తంలో తన్నుకుంటూ అక్కడ
పడివుండటం నేను చూశాను. నీవు రక్తంతో కప్పబడి
వున్నావు. కాని నేను, “నీవు బతుకుగాక!” అని
అన్నాను. అవును. నీవు రక్తంతో కప్పబడినావు. కాని,
“నీవు బతుకుగాక!” అని నేనన్నాను. 7పొలంలో
మొక్కలా నీవు పెరిగేటందుకు నేను సహాయం చేశాను.
నీవు అలా, అలా పెరిగావు. నీవు కన్యకవయ్యావు.
నీవు ఋతుమతివయ్యావు. నీ చన్నులు పెరిగాయి నీ
తల వెంట్రుకలు పెరిగాయి. అయినా, నీవు ఇంకా
నగ్నంగా దిసమొలతో ఉన్నావు. 8నేను నిన్ను తేరిపార
చూశాను. ప్రేమకు తగిన వయస్సు నీకు వచ్చినట్లు
గమనించాను. కావున నా వస్త్రములు నీమీద వేసి, నీ
నగ్నత్వాన్ని కప్పివేశాను. నిన్ను వివాహమాడటానికి
అభయమిచ్చాను. నీతో ఒక అంగీకారానికి* వచ్చాను.
అంతే; నీవు నాదానివయ్యావు.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు. 9“నేను నిన్ను
నీటితో కడిగాను. నీ రక్తాన్ని కడిగాను. నీ వంటికి
చమురు రాశాను.10* నీకు అందమైన బట్టలు, మెత్తని
చర్మపు పాదరక్షలు ఇచ్చాను. నేను నీకు నారతో ఒక
తలకట్టు, భుజాలమీద వేసుకొనే పట్టు బట్టను
ఇచ్చాను. 11పిమ్మట నీకు కొన్ని ఆభరణాలు ఇచ్చాను.
నీ ముంజేతులకు కడియాలు తొడిగాను. నీ మెడలో
బంగారు హారం వేశాను. 12నీకు ముక్కుపుడక చెవికి
దుద్దులు, నీ తలకు కిరీటము అమర్చాను. 13నీవు
ధరించిన వెండి బంగారు ఆభరణాలలోను; నార, పట్టు,
కుట్టుపని వస్త్రాలలోను నీవు ఎంతో అందంగా కన్పిం
చావు. నీవు మిక్కిలి విలువైన ఆహారం తిన్నావు. నీవు
మహా సౌందర్యవతివయ్యావు. నీవు రాణి వయ్యావు!
14నీవు అందానికి ప్రసిద్ధి చెందావు. ఎందువల్లనంటే
నిన్ను అంత లావణ్యవతిగా తీర్చిదిద్దాను!” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
15దేవుడు ఇంకా ఇలా చెప్పాడు: “కానీ నీవు నీ
అందాన్ని నమ్ముకోవటం ప్రారంభించావు. నీకున్న
మంచి పేరును నీవు వినియోగించుకుంటూ, నీవు నా
పట్ల విశ్వాస ఘాతకురాలుగా వున్నావు. నీ పక్కగా
వెళ్లే ప్రతివాని పట్ల నీవొక వేశ్యవలె ప్రవర్తించావు. నీకై
నీవు వారందరికీ సమర్పించుకున్నావు! 16నీ అందమైన
వస్త్రాలను తీసుకొని, నీ ఆరాధనా స్థలాలను అలంక
రించటానికి నీవు వాటిని వినియోగించావు. ఆ స్థలా
లలో నీవొక వేశ్యవలె ప్రవర్తించావు. నీ పక్కగా వచ్చిన
ప్రతివానికీ నిన్ను నీవు సమర్పించుకున్నావు.
17పిమ్మట నేను నీకిచ్చిన విలువైన ఆభరణాలను
తీశావు. ఆ వెండి బంగారాలను కరిగించి పురుషుల
విగ్రహాలు చేయటానికి వినియోగించావు. పైగా వాటితో
నీవు వ్యభిచరించావు కూడ! 18తరువాత అందమైన
వస్త్రాలు తీసుకొని ఆ విగ్రహాలకు దుస్తులు తయారు
చేశావు. నేను నీకిచ్చిన అత్తరులు, సాంబ్రాణి తీసుకొని,
వాటిని విగ్రహాల ముందు వుంచావు. 19నేను నీకు
రొట్టె, తేనె, నూనె ఇచ్చాను. కాని నేనిచ్చిన ఆహారా
న్నంతా నీవు నీ విగ్రహాలకు సమర్పించావు. నీ
బూటకపు దేవతల తృప్తికొరకు నీవు వాటిని మనో
హరమైన పరిమళంగా సమర్పించావు. ఆ బూటకపు

---

**అంగీకారం** అంగీకారం కుదిరినదనగా వివాహానికి ప్రధానం జరిగినదని అర్థం. దీనికి దేవుడు ఇశ్రాయేలు ప్రజలతో కుదుర్చుకున్న ఒప్పందం అని కూడ అర్థమవుతుంది.

**10-13 వచనములు** 10నుండి 13వ వచనం వరకు ఇచ్చిన వస్తువులు పవిత్ర గుడార నిర్మాణంలో ఉపయోగిస్తారు. చూడుము నిర్గమ. 25-40.

దేవతలతో నీవొక వేశ్యవలె వ్యవహరించావు!” నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
20దేవుడు చెప్పటం కొనసాగించాడు, “నీకూ,
నాకూ పిల్లలు పుట్టారు. కాని మన పిల్లల్ని నీవు తీసు
కొన్నావు. వారిని నీవు చంపి, ఆ బూటకపు దేవుళ్ళకు
అర్పించావు! నీవు నన్ను మోసం చేసి, నన్ను వదిలి
ఆ బూటకపు దేవుళ్ళ వద్దకు వెళ్లినప్పుడు చేసిన
నీచమైన పనులలో ఇది ఒకటి. 21నీవు నా కుమారులను
నరికి, అగ్నిద్వారా వాళ్లను నీ బూటకపు దేవుళ్ళకు
అందించావు. 22నీవు నన్ను వదిలి, ఈ భయంకరమైన
పనులన్నిటికీ పాల్పడ్డావు. నీ చిన్నతనాన్ని నీవు ఒక్క
సారి కూడా గుర్తుకు తెచ్చుకోలేదు. నేను నిన్ను కను
గొన్నప్పుడు నీవు దిసమొలతో వున్నట్లు, రక్తంలో
కొట్టుకుంటున్నట్లు నీకు జ్ఞాపకం లేదు.
23“ఈ చెడు కార్యాలన్నిటి తరువాత, ... ఓ
యెరూషలేమా, అది నీకు చాలా కీడుగా ఉంటుంది!”
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు తెలియ
జేశాడు. 24“ఈ విషయాలన్నీ చేసిన పిమ్మట, ఆ
బూటకపు దేవతను ఆరాధించటానికి నీవొక గుట్టను
నిర్మించావు. ప్రతి వీధి చివరా బూటకపు దేవతలను
ఆరాధించటానికి నీవు స్థలాలు ఏర్పాటు చేశావు. 25ప్రతి
బాట మొదలయ్యిన చోటా నీవు పూజకై గుట్టలు
నిర్మించావు. తరువాత నీవు నీ అందాన్ని భ్రష్టపర్చు
కున్నావు. అటుపోయే ప్రతి మనుష్యునీ నీ వలలో
వేసుకొనేటందుకు దానిని వినియోగించుకున్నావు.
వారికి నీ కాళ్ళు కన్పించేలాగు నీ చీర పైకెత్తావు.
తరువాత ఆ మనుష్యులతో నీవొక వేశ్యలా ప్రవ
ర్తించావు. 26పిమ్మట నీవు కామాతురుడైన నీ పొరుగు
వాడైన ఈజిప్టు వద్దకు వెళ్లావు. నన్ను ఆగ్రహపర్చేలా
నీవు వానితో అనేకసార్లు వ్యభిచరించావు. 27కావున
నేను నిన్ను శిక్షించాను! నీ బత్తెం (భూమి)లో కొంత
భాగాన్ని నేను తీసుకొన్నాను. నీ శత్రువులగు ఫిలిష్తీ
యుల కుమార్తెలను (నగరాలు) నీకు వ్యతిరేకంగా
వారికి ఇష్టంవచ్చినట్లు చేయనిచ్చాను. నీవు చేసే చెడ్డ
పనులపట్ల చివరికి వారు కూడ విభ్రాంతి చెందారు.
28పిమ్మట నీ కామవాంఛ తీర్చుకోవటానికి నీవు
అష్షూరు వెళ్లావు. అక్కడ నీ వాంఛ తీరలేదు. నీకు
అసలు తృప్తి అనేది లేదు. 29అందువల్ల నీవు కనానువైపు
తిరిగావు; అటు తరువాత బబులోను (బాబిలో
నియా)కు వెళ్లావు. అయినా నీకు కామం తీరలేదు.
30నీ మనస్సు మిక్కిలి బలహీనమయ్యింది. ఆ మనుష్య
లందరు (దేశాలు) నిన్ను పాపం చేయటానికి ప్రోత్స
హించేలా నీవు అలుసు ఇచ్చావు. నీవు కేవలం అహం
కారపు వేశ్యలా* ప్రవర్తించావు.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
31దేవుడు ఇలా చెప్పసాగాడు: “కాని, నీవు అసలైన
వేశ్యలా లేవు. ప్రతి బాట మొదట నీవు నీ గుట్టలను
ఏర్పాటు చేశావు; ప్రతి వీధి చివర నీ ఆరాధనా స్థలాలు
నెలకొల్పావు. ఆ మనుష్యులందరితో నీవు వ్యభిచరిం
చావు. అయినా, నిజంగా ఒక వేశ్య అడిగినట్లు నీవు
వారిని డబ్బు అడగలేదు. 32నీవు వ్యభిచారివి. నీవు నీ
భర్తతో గాకుండా, కొత్త వారితో సంభోగానికి ఇష్ట
పడ్డావు. 33వేశ్యలలో అధిక సంఖ్యాకులు తమ కోర్కె
తీర్చుకొనే పురుషులను డబ్బు ఇమ్మని పీడిస్తారు.
కాని నీవు మాత్రం అనేకంగా వున్న నీ విటులకు నీ
బహుమానాలను, డబ్బును ఇచ్చావు. నీతో వ్యభిచ
రించడానికి చుట్టూవున్న పురుషులకు డబ్బిచ్చావు.
34చాలా మంది వేశ్యలకన్నా నీవు భిన్నంగా వున్నావు.
చాలా మంది వేశ్యలు పురుషులను డబ్బు ఇమ్మని
బాధిస్తారు. కాని నీవు మాత్రం నిన్ను పొందమని నీ
విటులకు డబ్బు ఎదురిస్తున్నావు.”
35ఓ వేశ్యా, యెహోవా నుండి వచ్చిన సందేశం
విను. 36నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పుతున్నాడు, “నీ స్వంత డబ్బు ఖర్చుపెట్టి నీ
విటులకు, హేయమైన దేవతలకు నీ నగ్నత్వాన్ని
చూపించి, వారితో వ్యభిచరించావు. నీ పిల్లల్ని నీవు
చంపావు. నీవు వారి రక్తాన్ని వారపోశావు. ఆ బూటకపు
దేవుళ్ళకు అది నీ కానుక. 37అందువల్ల నీ విటుల
నందరినీ కూడదీస్తున్నాను. నీవు ప్రేమించిన మనుష్య
లందరినీ, నీవు అసహ్యించుకున్న మనుష్యులందరినీ
తీసుకువస్తాను. వాళ్లందరినీ ఒక్కసారిగా తీసుకొని వచ్చి
వారు నీ నగ్న స్వరూపాన్ని* చూసేలా చేస్తాను. నీ
పూర్తి దిగంబరత్వాన్ని వారు చూస్తారు. 38అప్పుడు
నేను నిన్ను శిక్షిస్తాను. ఒక హంతకురాలిగా, వ్యభిచా
రిణిగా నీ పాప నిరూపణ చేసి నిన్ను శిక్షిస్తాను. కోప
గించిన, అసూయ చెందిన ఒక భర్త చేతవలె నీవు
శిక్షింపబడతావు. 39నిన్ను నీ ప్రేమికుల చేతుల్లో పడ
వేస్తాను. వారు నీ గుట్టలన్నీ ధ్వంసం చేస్తారు. వారు
నీ ఆరాధనా స్థలాలన్నీ తగలబెడతారు. వారు నీ బట్టలు
చించివేస్తారు. వారు నీ అందమైన ఆభరణాలన్నీ
తీసుకొంటారు. వారు నిన్ను నిలువు దోపిడీ చేసి,
నేను నిన్ను కనుగొన్నప్పుడు వున్నట్లు నగ్నంగా వదు
లుతారు. 40వారు ఒక పెద్ద గుంపును తీసుకొని వచ్చి
నిన్ను చంపటానికి బండరాళ్ళు విసురుతారు. వారి
కత్తులతో నిన్ను ముక్కలుగా నరుకుతారు. 41వారు నీ
ఇంటిని (ఆలయం) తగలబెడతారు. ఇతర స్త్రీలందరూ
చూచే విధంగా వారు నిన్ను శిక్షిస్తారు. నీవు వేశ్యా
జీవితం గడపకుండా నిన్ను కట్టుదిట్టం చేస్తాను. నీ
విటులకు నీవు డబ్బు ఇవ్వకుండా నిన్ను ఆపుతాను.

---

**అహంకారపు వేశ్య** అహంకారపు లేదా సిగ్గులేని.

**నగ్న స్వరూపము** హెబ్రీ భాషలో ‘బందీగా అన్యదేశాలకు కొనిపోబడతావు’ అని అర్థం వస్తుంది.

42అప్పుడు నేను కోపాన్ని ఆపి, అసూయ చెందకుండా
వుంటాను. నేను శాంతిస్తాను. ఆ పిమ్మట నేను మరె
న్నడూ కోపగించను. 43ఈ విషయాలన్నీ ఎందుకు
సంభవిస్తాయి? ఎందుకనగా నీవు చిన్న వయస్సులో
ఉన్నప్పుడు ఏమి జరిగినదో నీకు జ్ఞాపకం లేదు గనుక.
ఆ చెడ్డ పనులన్నీ నీవు చేసి నాకు కోపం కలిగించావు.
ఆ చెడు కార్యాలు చేసినందుకు నిన్ను నేను శిక్షించవలసి
ఉంది. అయినా నీవు మరిన్ని భయంకరమైన పనులు
చేయటానికి వ్యూహం సిద్ధం చేశావు.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

44“నిన్ను గురించి చెప్పుకునే ప్రజలందరికీ
ఇప్పుడు ఇంకొక విషయం తోడవుతుంది. వారంతా,
‘తల్లిలాగనే కూతురు కూడ’ అని అంటారు. 45అచ్చం
నీవు నీ తల్లి కూతురువే. నీవు నీ భర్తను గురించి గాని,
నీ పిల్లలను గురించి గాని శ్రద్ధ చేయవు. నీవు ఖచ్చితంగా
నీ సోదరిలా వున్నావు. మీ ఇద్దరూ మీ భర్తలను, మీ
పిల్లలను అసహ్యించుకున్నారు. మీరు మీ తల్లిదండ్రుల
వలెనే ప్రవర్తిస్తున్నారు. నీ తల్లి హిత్తీయురాలు. నీ
తండ్రి అమోరీయుడు. 46నీ పెద్ద సోదరి సమరయ
(షోమ్రోను). ఆమె నీకు ఉత్తరంగా తన కుమార్తెలతో
(పట్టణాలు) నివసిస్తోంది. నీ చిన్న సోదరి సొదొమ*
ఆమె నీకు దక్షిణంగా తన కుమార్తెలతో (పట్టణాలు)
నివసిస్తూ ఉంది. 47వారు చేసిన మహా పాపాలన్నీ
నీవూ చేశావు. కాని నీవింకా ఘోరమైన తప్పు పనులు
చేశావు! 48నేనే ప్రభువును; యెహోవాను. నేను సజీవు
డను. నా జీవ ప్రమాణంగా చెపుతున్నాను. నీవు, నీ
కుమార్తెలు చేసినన్ని చెడు కార్యాలు నీ సోదరి సొదొమ,
ఆమె కుమార్తెలు ఎన్నడూ చేయలేదు.”

49దేవుడు ఇలా చెప్పసాగాడు: “నీ సోదరి సొదొమ,
ఆమె కుమార్తెలు గర్విష్ఠులు. వారికి తినటానికి పుష్క
లంగా ఉంది. వారికి కావలసినంత తీరుబడి సమయం
ఉంది. వారు పేదలను గాని, నిస్సహాయులను గాని
ఆదుకోలేదు. 50సొదొమ, ఆమె కుమార్తెలు అతి గర్వి
ష్ఠులయి నా ఎదుటనే భయంకరమైన పాపాలు
చేయటం మొదలు పెట్టారు. వారు చెడుకార్యాలు
చేయటం నేను చూసి, వారిని శిక్షించాను.”

51దేవుడు ఇంకా ఇలా చెప్పాడు, “నీవు చేసిన
చెడుకార్యాలలో సమరయ సగం మాత్రమే చేసింది.
సమరయ చేసిన వాటికంటే ఎన్నో ఘోరమైన పనులు
నీవు చేశావు! నీ తోబుట్టువుల కంటె నీవు అనేకనేక
చెడుకార్యాలు చేశావు. నీతో పోల్చి చూస్తే సొదొమ,
సమరయ ఎంతో మెరుగు. 52కావున నీ సిగ్గు నీవు
భరించాలి. నీతో పోల్చినప్పుడు నీ తోబుట్టువులు
మంచివాళ్లుగా కన్పించేలా నీవు ప్రవర్తించావు. నీవు
ఘోరమైన చెడుకార్యాలు చేశావు. అందుకు నీవు
సిగ్గుపడాలి.”

53దేవుడు ఇలా చెప్పసాగాడు: “నేను సొదొమను,
దాని చుట్టూ వున్న పట్టణాలను నాశనం చేశాను.
నేనింకా సమరయను, దాని చుట్టూ వున్న పట్టణాలను
నాశనం చేశాను. మరియు, ఓ యెరూషలేమా, నిన్ను
నాశనం చేస్తాను. కాని ఆ నగరాలను నేను మళ్లీ నిర్మి
స్తాను. ఓ యెరూషలేమా, నిన్ను కూడా నేను తిరిగి
నిర్మిస్తాను. 54నిన్ను ఓదార్చుతాను. అప్పుడు నీవు
చేసిన భయంకరమైన పనులు నీకు జ్ఞాపకం వస్తాయి.
నీవు సిగ్గుపడతావు. 55కావున నీవు, నీ తోబుట్టువులు
తిరిగి నిర్మింపబడతారు. సొదొమ, దాని చుట్టూ వున్న
పట్టణాలు; సమరయ, దాని చుట్టూ వున్న పట్టణాలు
మరియు నీవు, నీ చుట్టూ వున్న పట్టణాలు – అన్నీ
తిరిగి నిర్మింపబడతాయి.”

56దేవుడు ఇలా అన్నాడు: “గతంలో నీవు గర్వంగా
వున్నావు. నీ సోదరి సొదొమను నీవు ఎగతాళి చేశావు.
కాని మళ్లీ నీవు అలా చేయలేవు.

57నీవు శిక్షింపబడక ముందు, నీ పొరుగువారు నిన్ను
చూచి నవ్వక ముందు నీవది చేశావు. ఎదోము
(అరాము) కుమార్తెలు (పట్టణాలు), మరియు ఫిలిష్తీ
యులు ఇప్పుడు నిన్ను చూచి నవ్వుతున్నారు. 58నీవు
చేసిన ఘోర పాపాలకు ఫలితం ఇప్పుడు నీవు తప్పక
అనుభవించాలి.” యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.

59నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: “నీవు నీ వివాహ ప్రమాణాన్ని నిలబెట్టు
కోలేదు. మన ఒడంబడికను నీవు గౌరవించలేదు. 60నీవు
యౌవ్వన వయస్సులో వున్నప్పుడు మనం చేసుకొన్న
నిబంధన నాకు జ్ఞాపకం ఉంది. నేను నీతో సదా కొన
సాగే ఒక నిబంధన చేసుకొన్నాను! 61నీ తోబుట్టు
వులను నీ వద్దకు చేర్చుతాను. వారిని నీ కుమార్తెలుగా
తయారు చేస్తాను. అది మన నిబంధనలో లేకపోయి
నప్పటికీ, నీకొరకు నేనది చేస్తాను. అప్పుడు నీవు
చేసిన భయంకరమైన పనులు జ్ఞాపకం చేసుకొని
సిగ్గుతో క్రుంగిపోతావు.

62నీతో నేను చేసుకొన్న ఒడం బడికను కాపాడు
తాను. అప్పుడు నేను యెహోవానని నీవు తెలుసు
కొంటావు.

63నేను నీపట్ల ఉదారంగా ఉంటాను. దానివల్ల నీవు
నన్ను జ్ఞాపకం చేసుకొని, నీవు చేసిన పాపకార్యాలను
తలచుకొని సిగ్గుతో కుమిలిపోతావు. నేను నిన్ను
పరిశుద్ధం చేస్తాను. మళ్లీ నీవు ఎన్నడూ సిగ్గు పడన
వసరం లేదు!” నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు
చెప్పాడు.

---

**సమరయ … సొదొమ** సమరయ, సొదొమ ప్రజలు ఎంత చెడ్డవారో యూదా ప్రజలుకూడా అంత నీచ స్థితికి దిగజారి పోయారని యెహెజ్కేలు చెప్పుచున్నాడు. ఆ రెండు దేశాల ప్రజలు ఎంత చెడ్డవారనగా, చివరికి దేవుడు ఆ నగరాలను సర్వ నాశనం చేయవలసి వచ్చింది.

17 తరువాత యెహోవా వాక్కు నాకు విన
వచ్చింది. ఆయన ఇలా అన్నాడు, 2"నర
పుత్రుడా! ఇశ్రాయేలు వంశానికి ఈ కథ వినిపించు.
దాని అర్థమేమిటో వారినడుగు. 3వారికి ఇలా చెప్పు:

పెను రెక్కల గరుడ పక్షి ఒకటి లెబానోనుకు
వచ్చింది. మచ్చలుగల ఈకలు గరుడుడికి
మెండుగా ఉన్నాయి.
4 గరుడపక్షి రాజు ఆ పెద్ద దేవదారు వృక్షపు (లెబా
నోను) తలతుంచి వేసింది. తెంచిన కొమ్మను
కనానులోని వ్యాపారస్తుల దేశంలో నాటింది.
5 కనాను నుండి పిదప కొన్ని విత్తనాల (ప్రజల)ను
గరుడ పక్షి తీసుకుంది. సారవంతమైన భూమిలో
వాటిని నాటింది. అది వాటిని మంచి నదీతీరాన
నాటింది.
6 ఆ విత్తనం మొలకెత్తి ద్రాక్షా చెట్టయ్యింది. అది
మంచి ద్రాక్షాలత. ఆ మొక్క ఎత్తుగా లేదు.
అయినా అది ఎక్కువ విస్తీర్ణంలో పాకింది. అది
కొమ్మ తొడిగింది. చిన్న కొమ్మలు చాలా పొడుగ్గా
పెరిగాయి.
7 మరో పెద్ద రెక్కల గరుడ పక్షి ద్రాక్షా మొక్కను
చూసింది. ఆ పక్షికి చాలా ఈకలు ఉన్నాయి. ఆ
ద్రాక్షాలత తనను ఈ కొత్త పక్షి సంరక్షించాలని
కోరింది. అందువల్ల తన వేళ్లు పక్షి వైపు పెరిగేలా
చేసింది ఆ మొక్క. దాని కొమ్మలు ఆ పక్షి
వైపుకే విస్తరించాయి. అది నాటబడిన పొలాన్ని
అధిగమించింది. దాని కొమ్మలు ప్రాకాయి. తనకు
నీళ్లు పోయమని కొత్త గరుడపక్షిని కోరింది ద్రాక్షా
చెట్టు.
8 సారవంతమైన భూమిలో నాటబడింది ద్రాక్షా
మొక్క. మంచి నీటివసరు వున్నచోట నాట
బడింది. దాని కొమ్మలు బాగా పెరిగి, కాపు కాయ
వలసి ఉంది. అది ఎంతో మేలురకం ద్రాక్షాలత
అయివుండేది."
9 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు. "మరి ఆ మొక్క విజయం సాధిస్తుందని
మీరనుకుంటున్నారా? లేదు! ఆ కొత్త గరుడపక్షి
మొక్కను భూమినుండి పెరికివేస్తుంది. మొక్క
వేళ్లను పక్షి నరికివేస్తుంది. వున్న కాయలన్నీ అదే
తినేస్తుంది. కొత్త ఆకులన్నీ ఎండి రాలిపోతాయి.
మొక్క చాలా బలహీనమవుతుంది. మొక్కను
వేళ్లతో లాగివేయటానికి అది గట్టి ఆయుధాలు
పట్టటం గాని, బలమైన సైన్య సహాయాన్ని గాని
తీసుకోదు.
10 అది నాటబడిన చోట మొక్క పెరుగుతుందా?
లేదు! వేడి తూర్పు గాలులు వీస్తాయి. దానితో
మొక్క వాడి, చనిపోతుంది. అది నాటిన దగ్గరే
చనిపోతుంది."

11యెహోవా వాక్కు నాకు వినవచ్చింది. ఆయన
ఇలా అన్నాడు: 12"ఇశ్రాయేలు ప్రజలకు ఈ కథ వివ
రించు. ఇశ్రాయేలీయులు ఎల్లప్పుడూ నాపై తిరుగు
బాటు చేస్తూవున్నారు. వారికి ఈ విషయాలు వివ
రించు. మొదటి గరుడపక్షి రాజు నెబుకద్నెజరు. అతడు
బబులోను (బాబిలోనియా) రాజు. అతడు యెరూష
లేముకు వచ్చి రాజును, ఇతర పెద్దలను తీసుకొని
పోయాడు. వారిని బబులోనుకు తీసుకొని వెళ్లాడు.
13పిమ్మట రాజ కుటుంబంలోని ఒకనితో నెబుక
ద్నెజరు ఒక ఒడంబడిక చేసుకొన్నాడు. ఒక వాగ్దానం
చేయమని అతనిని నెబుకద్నెజరు ఒత్తిడి చేశాడు. అందు
వల్ల అతడు నెబుకద్నెజరు పట్ల రాజభక్తి కలిగి వుండ
టానికి మాట ఇచ్చాడు. నెబుకద్నెజరు ఇతనిని
యూదాకు రాజుగా నియమించాడు. తరువాత అతడు
శక్తియుక్తులున్న మనుష్యులందరినీ యూదా నుండి
తీసుకొనిపోయాడు. 14దానితోయూదా ఒక బలహీన
రాజ్యంగా మారిపోయింది. అందువల్ల అది రాజైన
నెబుకద్నెజరును ఎదిరించలేక పోయింది. యూదా
యొక్క నూతన రాజుతో చేసుకొన్న ఒడంబడికను
ఆచరించేలా నెబుకద్నెజరు ప్రజలపై ఒత్తిడి తెచ్చాడు.
15అయినప్పటికీ ఈ కొత్త రాజు నెబుకద్నెజరుపై
తిరుగుబాటు ప్రయత్నం చేశాడు! అతడు తన
దూతలను ఈజిప్టుకు పంపి సహాయం అర్థించాడు.
కొత్తరాజు అనేక గుర్రాలను, సైనికులను అడిగాడు.
మరి ఈ నూతన యూదా రాజు విజయం సాధిస్తాడని
ఇప్పుడు మీరనుకుంటున్నారా? ఒడంబడికను ఉల్లం
ఘించి, శిక్ష నుండి తప్పించుకునేటంత శక్తి ఈ కొత్త
రాజుకు ఉన్నదని మీరనుకుంటున్నారా?"
16నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
"నా జీవ ప్రమాణంగా ఈ కొత్త రాజు బబులోనులో
చనిపోతాడని నిశ్చయంగా చెప్పుతున్నాను! ఈ వ్యక్తిని
యూదా రాజుగా నెబుకద్నెజరు నియమించాడు. కాని
ఇతడు నెబుకద్నెజరుకు ఇచ్చినమాట నిలబెట్టు
కోలేదు. ఈ కొత్తరాజు ఒడంబడికను నిరాదరించి విడిచి
పెట్టాడు. 17పైగా ఈజిప్టు రాజు యూదా రాజును
రక్షించలేడు. అతడు అనేకమంది సైనికులను పంప
వచ్చు. కాని ఈజిప్టుకు వున్న మహా బలసంపత్తి
యూదాను రక్షించలేదు. నెబుకద్నెజరు సైన్యం నగ
రాన్ని పట్టుకొనటానికి మట్టిదారులు, మట్టి గోడలు
నిర్మిస్తుంది. అనేకమంది చనిపోతారు. 18అయినా
యూదా రాజు తప్పించుకోలేడు. ఎందుకంటే, తన
ఒడంబడిక అతడు అలక్ష్యం చేశాడు. అతడు నెబుక
ద్నెజరుకు ఇచ్చిన మాట తప్పాడు. 19నా ప్రభువైన
యెహోవా ఈ ప్రమాణం చేస్తున్నాడు: "నా జీవ
ప్రమాణంగా యూదా రాజును శిక్షిస్తానని నిశ్చయంగా
చెప్పుతున్నాను. ఎందువల్లనంటే, అతడు నా హెచ్చరి
కలను లెక్కచేయలేదు. అతడు మా ఒడంబడికను

ఉల్లంఘించాడు. [20]నేను నావల పన్నుతాను. అత
డందులో చిక్కుకొంటాడు. అతనిని నేను బబులో
నుకు తీసుకొనివచ్చి అక్కడ శిక్షిస్తాను. అతడు నాపై
తిరుగుబాటు చేశాడు గనుక నేనతనిని శిక్షిస్తాను.
[21]నేనతని సైన్యాన్ని నాశనం చేస్తాను. గొప్ప యోధు
లగు అతని సైనికులను చంపివేస్తాను. చావగా మిగిలిన
వారిని చెల్లాచెదురు చేస్తాను. నేనే యెహోవాననీ,
నీకు ఈ మాటలు చెప్పినది నేనే అనీ, నీవప్పుడు
తెలుసుకొంటావు.”

22 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: “పిమ్మట ఎత్తైన దేవదారు వృక్షపు
కొమ్మనొకటి నేను తీసుకొంటాను. వృక్షపు
పైభాగాన్నుండి ఒక చిన్న రెమ్మను తీసు
కొంటాను. నేనే దానిని చాలా ఎత్తైన పర్వతం
మీద నాటుతాను.
23 నేనే దానిని ఇశ్రాయేలులోని ఒక ఎత్తైన పర్వ
తంపై నాటుతాను. ఆ కొమ్మ ఒక వృక్షంలా
పెరుగుతుంది. అది బాగా కొమ్మలు వేసి, పండ్లు
కాస్తుంది. అది ఒక అందమైన దేవదారు వృక్ష
మవుతుంది. దాని కొమ్మలపై అనేకమైన పక్షులు
కూర్చుంటాయి. అనేకమైన పక్షులు దాని
కొమ్మల నీడల్లో నివసిస్తాయి.
24 “నేను పొడవైన వృక్షాలన్నిటినీ నేలకు పడేస్తానని
ఇతర చెట్లన్నీ అప్పుడు తెలుసుకొంటాయి.
చిన్న చెట్లను పెరగనిచ్చి మహావృక్షాలను చేస్తా
నని కూడా అవి తెలుసుకొంటాయి. పచ్చని
చెట్లు ఎండిపోయేలా, ఎండిన మోడులు చిగు
రించేలా చేస్తాను. నేనే యెహోవాను. నేనేదైనా
చేస్తానని చెప్పితే నేనది తప్పక చేస్తాను!”

18 యెహోవా వాక్కు నాకు వినిపించింది.
ఆయన ఇలా చెప్పాడు: [2]“మీరీ సామెత
వల్లిస్తూ ఉంటారు:

తల్లిదండ్రులు పుల్లని ద్రాక్ష తింటే పిల్లల
పండ్లు పులిశాయి!

ఇలా మీరెందుకు అంటూ వుంటారు? మీరు పాపం
చేస్తే, మీ బదులు భవిష్యత్తులో మరెవ్వడో శిక్షింప
బడతాడని మీరనుకుంటున్నారు.” [3]కాని నా ప్రభువైన
యెహోవా చెబుతున్నదేమంటే, “నా జీవ ప్రమాణంగా
ఇశ్రాయేలు ప్రజలు ఈ సామెత ఇక మీదట నిజమని
నమ్మరని నేను మీకు ఖచ్చితంగా చెబుతున్నాను!
[4]నేను ప్రతి వ్యక్తినీ ఒకే రకంగా చూస్తాను. ఆ వ్యక్తి
తండ్రిగాని, బిడ్డగాని గావచ్చు. పర్వాలేదు. ఎవరైతే
పాపం చేశారో ఆ వ్యక్తులే చని పోతారు!

[5]“మంచి మనిషి ఎవరైనా వుంటే, ఆ వ్యక్తి జీవిస్తాడు!
ఆ మంచి వ్యక్తి ప్రజలయెడల నీతిగా న్యాయంగా
వుంటాడు. [6]ఆ సజ్జనుడు పర్వతాలమీదికి వెళ్లి, అక్కడ
బూటకపు దేవతలకు అర్పించిన నైవేద్యాలను తినడు.
అతడు ఇశ్రాయేలులో నెలకొల్పిన రోత విగ్రహాలను
ప్రార్థించడు. అతడు తన పొరుగువాని భార్యతో వ్యభి
చరించే పాపానికి ఒడిగట్టడు. తన భార్య ముట్టయి
నప్పుడు ఆమెతో సంభోగించడు. [7]ఆ సజ్జనుడు ప్రజల
మంచితనాన్ని ఆసరాగా తీసుకోడు, ఎవ్వరేగాని అతని
వద్దకు అప్పుకు వచ్చినప్పుడు, మంచి వ్యక్తి వస్తువులను
తాకట్టు* పెట్టుకొని డబ్బు ఇస్తాడు. అప్పు తీసు
కొన్నవాడు తిరిగి చెల్లించినప్పుడు, సజ్జనుడు తన
డబ్బు తీసుకొని తాకట్టు వస్తువులను ఇచ్చివేస్తాడు.
ఆకలిగొన్న వారికి సజ్జనుడు అన్నం పెడతాడు. కట్టు
బట్టలు లేక బాధపడేవారికి అతడు వస్త్రదానం చేస్తాడు.
[8]అప్పు కోరి అతనిని ఆశ్రయిస్తే మంచి వ్యక్తి ఆ
వచ్చిన వానికి డబ్బు ఇస్తాడు. కాని అతడా ఋణానికి
వడ్డీ తీసుకో. మంచివాడు కపటంగా ప్రవర్తించటానికి
నిరాకరిస్తాడు. అతడు ప్రతి మనిషి పట్లా ఎల్లప్పుడూ
ఉదారంగా ప్రవర్తిస్తాడు. ప్రజలతనిని నమ్మవచ్చు.
[9]అతడు నా కట్టడులను అనుసరిస్తాడు. అతడు నా
నిర్ణయాలను గురించి ఆలోచించి, ధర్మవర్తనుడై నమ్మ
దగినవాడుగా వుండటం నేర్చుకుంటాడు. అతడు
సజ్జనుడు. అందుచేత అతడు జీవిస్తాడు.
[10]“కాని ఆ మంచి వ్యక్తికీ అటువంటి మంచి పనులేవీ
చేయని ఒక కుమారుడు వుండవచ్చు. ఆ కుమారుడు
వస్తువులను దొంగిలించి, నరహత్య చేయవచ్చు.
[11]అతడు ఈ చెడ్డ పనులలో దేనినైనా చేయవచ్చు.
పర్వతాల మీదకి వెళ్లి బూటకపు దేవుళ్ళకు అర్పించిన
నైవేద్యాలను తినవచ్చు. ఆ చెడ్డ కుమారుడు తన
పొరుగు వాని భార్యతో వ్యభిచరించి పాపం చేయవచ్చు.
[12]అతడు పేదలను, నిస్సహాయులను అలక్ష్యము చేయ
వచ్చు. అతడు ప్రజల మంచితనాన్ని వినియోగ పర్చు
కోవచ్చు. అప్పు తీసుకున్నవాడు సొమ్ము చెల్లించి
నప్పుడు, అతడు తాకట్టు వస్తువును తిరిగి ఇచ్చివేయక
పోవచ్చు. ఆ చెడ్డ కుమారుడు రోత పుట్టించే విగ్రహా
లను ఆరాధించి, ఇతర భయంకరమైన పనులు చేయ
వచ్చు. [13]ఆ దుష్టుడైన కుమారుని వద్ద డబ్బు అప్పు
తీసుకొనే అవసరం ఎవరికైనా కలుగవచ్చు. అతడు
వానికి అప్పు ఇవ్వవచ్చు. కాని, అతడిచ్చిన అప్పు
మీద వడ్డీ చెల్లించమని అప్పుదారుని అతడు పీడిస్తాడు.
అందువల్ల ఆ చెడ్డ కుమారుడు జీవించడు. అతడు

---

**తాకట్టు** దానిని తీర్చలేనప్పుడు అప్పు ఇచ్చిన వాడు ఆ వస్తువులను తీసుకొంటాడు. అప్పు చెల్లించలేని వాని బట్ట లను తీసికొనుట మోషే ధర్మశాస్త్రానికి విరుద్ధం. చూడండి. ద్వితీ. 24:12-13

చేసిన ఘోరమైన పనులకు అతడు చంపబడతాడు.
పైగా అతని చావుకు అతడే బాధ్యుడు.
14“ఇప్పుడా దుష్టుడైన కుమారునికి ఒక కుమారుడు
కలుగవచ్చు. ఈ కుమారుడు తన తండ్రి చేసే దుష్కా
ర్యాలను చూసి, వాటిని నిరసించి తన తండ్రిలాగా
ఉండకపోవచ్చు, వాడు ప్రజలందరినీ సమాదాన పరు
స్తాడు. 15ఆ మంచి కుమారుడు కొండల మీదికి వెళ్లి
చిల్లర దేవుళ్లను ఆరాధించడు, ఆ దేవుళ్ళకు అర్పించిన
నైవేద్యాలను తినడు. ఇశ్రాయేలులో నెలకొల్పిన రోత
విగ్రహాలకు అతడు ప్రార్థన చేయడు. అతడు తన
పొరుగువాని భార్యతో వ్యభిచార పాపానికి ఒడిగట్టడు.
16ఆ మంచి కుమారుడు ప్రజల మంచితనాన్ని ఉపయో
గించు కోకుండా ఉండవచ్చు. ఏ వ్యక్తి అయినా తన
వద్దకు అప్పుకోరివస్తే, అతడు వస్తువులు తాకట్టు పెట్టు
కొని డబ్బు ఇస్తాడు. మళ్లీ అప్పు తీసుకొన్నవాడు
డబ్బు చెల్లిస్తే, ఆ మంచి కుమారుడు తాకట్టు వస్తువులు
తిరిగి ఇచ్చివేస్తాడు. మంచి కుమారుడు ఆకలిగొన్న
వారికి అన్నం పెడతాడు. అవసరమైన వారికి అతడు
వస్త్రదానం చేస్తాడు. 17అతడు పేదలకు సహాయం
చేస్తాడు. ఎవరైనా తనవద్ద అప్పు తీసుకో తలంచితే,
మంచి కుమారుడు అతనికి డబ్బు ఇస్తాడు. కాని అతడు
ఆ అప్పుమీద వడ్డీ తీసుకొనడు! మంచి కుమారుడు
నా న్యాయాన్ని శిరసావహిస్తాడు. నా కట్టడలను పాటి
స్తాడు. తన తండ్రి చేసిన పాపాలకు ఆ మంచి కుమా
రుడు చంపబడడు! ఆ మంచి కుమారుడు జీవిస్తాడు.
18తండ్రి ప్రజలను బాధించవచ్చు. వస్తువులను దొంగి
లించవచ్చు. అతడు అతని ప్రజలకు ఏ మంచిని
ఎన్నడూ చేసియుండడు! ఆ తండ్రి తన పాపాల
కారణంగానే చనిపోతాడు. అయితే, కుమారుడు
మాత్రం అతని తండ్రి పాపాలకు శిక్షింపబడడు.
19“తన తండ్రి పాపాలకు కుమారుడు ‘ఎందుకు
చంపబడడు?’ అని నీవు అడుగవచ్చు. అందుకు
కారణం కుమారుడు న్యాయవర్తనుడై మంచి పనులు
చేయటమే! అతడు నా కట్టడలను మిక్కిలి శ్రద్ధగా
అనుసరించి నడచుకొన్నాడు! అందువల్ల అతడు జీవి
స్తాడు. 20చంపబడేది పాపాలకు ఒడిగట్టిన వ్యక్తి
మాత్రమే! ఒక కుమారుడు అతని తండ్రి పాపాలకు
శిక్షింపబడడు. ఒక తండ్రి తన కుమారుడు చేసిన
తప్పులకు గాను శిక్షింపబడడు. ఒక మంచి వ్యక్తి మంచి
తనం అతనికి మాత్రమే చెంది ఉంటుంది. ఒక చెడ్డ
వ్యక్తి చెడుతనం అతనికి మాత్రమే పరిమితమై
ఉంటుంది. 21ఒకవేళ చెడ్డ వ్యక్తి తన జీవిత విధానాన్ని
మార్చుకుంటే అతడు జీవిస్తాడు. అతడు చనిపోడు.
అతడు గతంలో చేసిన చెడ్డపనులన్నీ కొనసాగించటం
మానివేస్తాడు. నా కట్టడలన్నీ అతడు శ్రద్ధతో పాటి
స్తాడు. అతడు న్యాయవర్తనుడై, మంచివాడు అవు
తాడు. 22అతడు చేసిన చెడ్డకార్యాలను దేవుడు గుర్తు
పెట్టుకోడు. అప్పుడు దేవుని దృష్టిలో అతని మంచి
తనమే వుంటుంది! అందువల్ల ఆ వ్యక్తి జీవిస్తాడు!”
23నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
“చెడ్డవాళ్లంతా చనిపోవాలని నేను కోరుకోవటం లేదు.
వారు జీవించేటందుకు వారు తమ జీవన విధానం
మార్చుకోవాలని నేను కోరుకుంటున్నాను!
24“ఇప్పుడు ఒక మంచి వ్యక్తి తన మంచితనాన్ని
విడనాడవచ్చు. తన జీవన విధానాన్ని మార్చుకొని
గతంలో చెడ్డమనిషి చేసిన ఘోరమైన పాపాలన్నీ
చేయవచ్చు. అలాంటి వ్యక్తి జీవిస్తాడా? కావున ఆ
మంచి మనిషి మారిపోయి చెడ్డవాడయితే, అతడు
పూర్వం చేసిన మంచి పనులేవీ దేవుడు గుర్తు పెట్టు
కోడు. ఆ వ్యక్తి తనకు వ్యతిరేకి అయ్యాడనీ, పాపం
చేయటం మొదలు పెట్టాడనీ మాత్రం దేవుడు గుర్తు
పెట్టుకుంటాడు. అందువల్ల అతని పాపాల కారణంగా
అతడు చనిపోతాడు.”
25దేవుడు ఇలా చెప్పాడు: “ప్రజలారా మీరు, ‘మా
ప్రభువైన దేవుడు న్యాయంగా ప్రవర్తించడు’ అని
అంటారు. కాని ఇశ్రాయేలు వంశములారా, వినండి.
నేను న్యాయంగానే ఉన్నాను. మీరే న్యాయంగా లేరు.
26ఒక మంచి మనిషి మారిపోయి, చెడ్డవాడైతే అతని
చెడ్డకార్యాలకు ఫలితంగా అతడు చనిపోతాడు. 27ఒక
చెడ్డ వ్యక్తి మారి, మంచివాడై, మంచికార్యాలు చేస్తే,
అతడు తన జీవితాన్ని రక్షించుకుంటాడు. అతడు
బతుకుతాడు! 28తాను పూర్వం ఎంత చెడ్డవాడో
తెలుసుకొని, నావద్దకు తిరిగి వచ్చిన వాడవుతాడు.
తాను గతంలో చేసిన చెడ్డకార్యాలు మళ్లీ చేయటం
మానటంతో అతడు జీవిస్తాడు! అతడు మరణించడు!”
29ఇశ్రాయేలు ప్రజలు, “అది న్యాయం కాదు! మా
ప్రభువైన యెహోవా న్యాయంగా వుండనేరడు!” అని
అన్నారు. అందుకు దేవుడు ఇలా అన్నాడు: “నేను
న్యాయంగానే ఉన్నాను. మీరే న్యాయంగా లేరు. 30ఓ
ఇశ్రాయేలు వంశమా, ఎందువల్లనంటే, నేను ప్రతి
వ్యక్తికీ అతను చేసిన కార్యాలను అనుసరించి న్యాయ
నిర్ణయం చేస్తాను!” నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు. “కావున, మీరు నా వద్దకు
తిరిగిరండి. చెడుకార్యాలు చేయటం మానండి! ఆ
ఘోరమైన వస్తువులు మీరు పాపం చేయటానికి
కారణం కానీయకండి! 31మీరు చేసిన భయంకర వస్తువు
లన్నీ పారవేయండి. అవన్నీ కేవలం మీరు పాపం
చేయటానికే దోహదం చేస్తాయి! మీ హృదయాలను,
ఆత్మలను మార్చుకోండి. ఓ ఇశ్రాయేలు ప్రజలారా,
మిమ్మల్ని మీరెందుకు చనిపోయేలాగు చేసుకొంటు
న్నారు?
32నేను మిమ్మల్ని చంపకోరటం లేదు! దయచేసి
నా వద్దకు తిరిగి రండి. జీవించండి!” ఆ విషయాలు
నా ప్రభువైన యెహోవా చెప్పాడు.

19 దేవుడు నాకు ఈ విధంగా చెప్పాడు: "ఇశ్రాయేలు నాయకులను గురించి నీవు ఈ విషాద గీతం ఆలపించాలి:

2 "'నీ తల్లి ఆడసింహంలా, మగసింహాల మధ్య పడుకొని ఉంది. ఆమె యౌవ్వనంలో ఉన్న మగ సింహాలతో పడుకొని ఉంది. దానికి చాలా మంది పిల్లలున్నారు.
3 ఆ సింహపు పిల్లల్లో ఒకటి లేచింది. అది బలమైన యువ సింహంలా తయారయ్యింది. అది తన ఆహారాన్ని వేటాడం నేర్చుకుంది. అది ఒక మనుష్యుని తినేసింది.
4 అది గర్జించటం ప్రజలు విన్నారు. తాము పన్నిన బోనులో దానిని పట్టుకున్నారు! దాని నోటికి గాలం తగిలించారు. వారా కొదమ సింహాన్ని ఈజిప్టుకు తీసుకొని వెళ్లారు.
5 "'తల్లి తన యువసింహం నాయకత్వం వహిస్తుందనుకుంది. కాని ఆమె ఆశలు అడియాశలయ్యాయి. అందువల్ల ఆమె తన పిల్లల్లో మరో దానిని తీసుకుంది. దానిని యువ సింహంలా తీర్చిదిద్దింది.
6 అది పెద్ద సింహాలతో కలిసి వేటకెళ్లింది. అది భయంకర సింహంలా తయారయ్యింది. అది తన ఆహారం వేటాడ నేర్చుకుంది. అది ఒక మనుష్యుని చంపి తినివేసింది.
7 అది రాజభవనాల మీద దాడి చేసింది. అది నగరాలను నాశనం చేసింది. దాని గర్జన విన్న ప్రతివాడూ నోట మాట లేక నివ్వెరపోయాడు.
8 అప్పుడు తనచుట్టూ నివసిస్తున్నవారు దానికై వలపన్నారు. అది వారి వలలో చిక్కిపోయింది.
9 వారు దానికి కొక్కీలు వేసి బంధించారు. వారు దానిని తమ బోనులో ఇరికించారు. వారు దానిని బబులోను రాజు వద్దకు తీసుకొని పోయారు. అందువల్ల ఇశ్రాయేలు పర్వతాలలో ఇప్పుడు మీరు గర్జన వినలేరు.
10 "'మీ తల్లి నీటి పక్క నాటిన ద్రాక్షాలతలాంటిది. దానికి నీరు పుష్కలంగా ఉంది. అది చాలా ఫలభరితమైన దళమైన ద్రాక్షా తీగలతో పెరిగింది.
11 ఆ పిమ్మట దానికి కొన్ని పెద్ద కొమ్మలు పెరిగాయి. అవి కొన్ని చేతికర్రల్లా ఉన్నాయి. ఆ కొమ్మ ఒక రాజదండాల్లా ఉన్నాయి. ఆ ద్రాక్షాలత అలా, అలా పొడుగ్గా, చాలా కొమ్మలతో మేఘాలను అంటేలా పెరిగింది.
12 కాని ఆ ద్రాక్షా చెట్టు వేర్లతో పెరికివేయబడి, నేలమీద కూల్చి వేయబడింది. తూర్పుదిక్కు వేడిగాడ్పులు వీయగా దాని పండ్లు ఎండి పోయాయి. దాని పెద్ద కొమ్మలు విరిగి పోయాయి. అవి అగ్నిలో వేయబడ్డాయి.
13 ఇప్పుడా ద్రాక్ష మొక్క ఎడారిలో నాటబడింది. అది నీరులేక, దాహం పుట్టించే ప్రాంతం.
14 దాని పెద్ద కొమ్మ నుండి నిప్పు చెలరేగింది. నిప్పు దాని రెమ్మలను, పండ్లను నాశనం చేసింది. అందుచే బలమైన చేతికర్రాలేదు; రాజదండమూ లేదు'

ఇది ఒక విషాద గీతం. అది వినాశనాన్ని గూర్చి పాడబడింది."

20 ఒక రోజు ఇశ్రాయేలు పెద్దలు యెహోవా సలహా తీసుకొనగోరి నా వద్దకు వచ్చారు.
ఇది ప్రవాసంలో ఏడవ సంవత్సరం ఐదవ నెల (జులై),
పదవ రోజున జరిగింది. పెద్దలు (నాయకులు) నా
ముందు కూర్చున్నారు.
2 అప్పుడు యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా చెప్పాడు: 3 "నరపుత్రుడా, ఇశ్రాయేలు
పెద్దలతో మాట్లాడు. వారితో ఇలా చెప్పు, 'నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పుచున్నాడు, మీరంతా
నా సలహా తీసుకోదలచి వచ్చారా? అలా వచ్చివుంటే,
దానిని మీకు నేను యివ్వను. ఈ విషయాలు నా
ప్రభువైన యెహోవా చెప్పియున్నాడు.' 4 నీవు వారికి
తీర్పు తీర్చుతావా? నరపుత్రుడా, నీవు వారికి న్యాయ
నిర్ణయం చేస్తావా? వారి తండ్రులు చేసిన భయంకర
నేరాలను గూర్చి నీవు వారికి తెలియజెప్పాలి. 5 వారికి
నీవిలా చెప్పాలి, 'నా ప్రభువైన యెహోవా ఈ విష
యాలు చెబుతున్నాడు, నేను ఇశ్రాయేలును ఎంపిక
చేసుకొన్నప్పుడు, యాకోబు వంశం కొరకు నా
చేయెత్తి ఈజిప్టు వారికి ఒక వాగ్దానం చేశాను. అక్కడ
నన్ను నేను ప్రత్యక్షపరచుకొన్నాను. నా చేయెత్తి ఇలా
చెప్పాను: "నేను మీ దేవుడనైన యెహోవాను. 6 ఆ
రోజున మిమ్మల్ని ఈజిప్టు నుండి బయటకు తీసుకొని
వచ్చి, నేను మీకు ఇవ్వబోతున్న దేశంలోకి నడిపిస్తానని
వాగ్దానం చేశాను. అది చాలా మంచి వస్తువులున్న
దేశం.* దేశాలన్నిటిలోకి అది సుందరమైనది!
7 "రోత పుట్టించే విగ్రహాలన్నిటినీ పారవేయమని
నేను ఇశ్రాయేలు వంశం వారికి చెప్పాను. ఈజిప్టు
నుండి తేబడిన హేయమైన విగ్రహాలతో వారు కూడ
హేయమైనవారుగా తయారు కావద్దని నేను చెప్పి
యున్నాను. నేను మీ దేవుడనైన యెహోవాను."
8 కాని వారు నాపై తిరుగుబాటు చేసి, నేను చెప్పేది
వినలేదు. ఈజిప్టువారి అపవిత్రమైన విగ్రహాలను
పారవేయలేదు. వారి అపవిత్ర విగ్రహాలను ఈజిప్టులో

---

**అవి ... దేశం** అక్షర్థంగా పాలు, తేనెలు ప్రవహించుచున్న దేశం అని వ్రాయబడివుంది.

వదిలివేయలేదు. కావున నేను (దేవుడు) ఉగ్రమైన
నా కోపాన్ని చూపించటానికి ఈజిప్టులోనే వారిని
నాశనం చేయదల్చాను. 9అయినా నేను వారిని సంహ
రించలేదు. ఈజిప్టు నుండి నా ప్రజలను బయటకు
తీసుకొని వస్తానని గతంలోనే వారు నివసిస్తున్న చోటి
ప్రజలకు తెలియజేశాను. నా మంచి పేరును నేను
పాడుచేయదల్చుకోలేదు. అందువల్ల ఆ అన్యప్రజల
ముందు ఇశ్రాయేలును నాశనం చేయలేదు. 10ఇశ్రా
యేలు వంశాన్ని నేను ఈజిప్టు నుండి బయటకు
తీసుకొని వచ్చాను. వారిని ఎడారిలోకి నడిపించాను.
11అక్కడ నేను వారికి నా కట్టడలను తెలియజేశాను.
నా నియమ నిబంధనలన్నీ వారికి తెలియజెప్పాను.
నా కట్టడలను పాటించిన వ్యక్తి జీవిస్తాడు. 12ప్రత్యేక
విశ్రాంతి రోజులన్నిటి గురించి కూడానేను వారికి
చెప్పాను. నాకు, వారికి మధ్య ఆ సెలవు రోజులు
ఒక ప్రత్యేక సంకేతం. అవి నేను యెహోవానని,
వారిని నా ప్రత్యేక ప్రజలుగా చేసుకున్నానని తెలియ
జేస్తాయి.

13"అయినా ఇశ్రాయేలు వంశం ఎడారిలో నా మీద
తిరుగుబాటు చేసింది. వారు నా న్యాయాన్ని పాటించ
లేదు. వారు నా కట్టడలను అనుసరించటానికి నిరాకరిం
చారు. పైగా అవి ఎంతో మంచి నియమాలు. ఏ వ్యక్తి
అయినా ఆ నియమాలను పాటిస్తే, అతడు జీవిస్తాడు.
నేను నియమించిన ప్రత్యేక విశ్రాంతి రోజులను వారు
సామాన్య రోజులుగా పరిగణించారు. అనేకసార్లు వారా
విశ్రాంతి రోజులలో పనిచేశారు. నా ఉగ్రమైన కోపాన్ని
వారు చవిచూడటానికి నేను వారిని ఎడారిలో నాశనం
చేయ సంకల్పించాను. 14అయినా నేను వారిని సంహ
రించలేదు. నేను ఇశ్రాయేలును, ఈజిప్టు నుండి వెలికి
తీసుకొని రావటం ఇతర దేశాలు చూశాయి. నాకున్న
మంచి పేరును నేను పాడుచేసుకోదల్చలేదు. అందు
వల్ల అన్యప్రజల ముందు నేను ఇశ్రాయేలును సంహ
రించలేదు. 15ఎడారిలోని ఆ ప్రజలకు నేను మరొక
వాగ్దానం చేశాను. వారికి నేనివ్వబోయే దేశంలోకి వారిని
నేను తీసుకొని వెళ్లనని గట్టిగా చెప్పాను. అది పాలు,
తేనె ప్రవహించే సుభిక్షమైన దేశం. అది దేశాలన్నిటిలోకీ
సుందరమైన దేశం!

16"ఇశ్రాయేలు ప్రజలు నా కట్టడలను పాటించ
నిరాకరించారు. వారు నా విధులను అనుసరించలేదు.
నేను నిర్ణయించిన విశ్రాంతి రోజులను అతి సామాన్య
మైనవిగా వారు పరిగణించారు. వారి హృదయాలు ఆ
అపవిత్ర విగ్రహాలమీద లగ్నమై వుండుటచేత వారీ
పనులన్నీ చేశారు. 17కాని వారి స్థితిపట్ల నేను విచారం
వ్యక్తం చేశాను. వారిని నేను సంహరించలేదు. ఎడారిలో
వారిని నేను సర్వనాశనం చేయలేదు. 18నేను వారి
పిల్లలతో ఎడారిలో మాట్లాడాను. నేను వారితో, "మీరు
మీ తల్లిదండ్రులవలె ప్రవర్తించవద్దు. అపవిత్ర విగ్రహాల
జోలికిపోయి మిమ్మల్ని మీరు అపవిత్రం చేసుకోవద్దు.
వాటి ధర్మాన్ని మీరు అనుసరించవద్దు. వాటి ఆజ్ఞలను
మీరు పాటించవద్దు. 19నేనే యెహోవాను. నేను మీ
దేవుణ్ణి. నా ధర్మాన్ని అనుసరించండి. ఆజ్ఞాపాలన
గావించండి. నేను చెప్పే పనులు చేయండి. 20నేను
నిర్దేశించిన విశ్రాంతి రోజులు మీకు అతి ముఖ్యమైనవని
చూపించండి. అవి నాకును, మీకును మధ్య ఒక ప్రత్యేక
సంకేతమని గుర్తు పెట్టుకోండి. నేనే యెహోవాను.
నేను మీ దేవుడనని ఆ సెలవు రోజులు మీకు
సూచిస్తాయి."

21"కాని ఆ పిల్లలు నాకు వ్యతిరేకులయ్యారు.
వారు నా కట్టడలను పాటించలేదు. వారు నా ఆజ్ఞలను
లెక్క చేయలేదు. నేను వారికి చెప్పిన పనులు చేయ
లేదు. అవన్నీ మంచి న్యాయ సూత్రాలు. ఎవ్వరు
వాటిని అనుసరించినా, ఆ వ్యక్తి జీవిస్తాడు. నేను నిర్దే
శించిన ప్రత్యేక విశ్రాంతి రోజులను ప్రాముఖ్యంలేని
వాటినిగా వారు పరిగణించారు. అందువల్ల నేను
ఎడారిలో నా ఉగ్రమైన కోపం చూపటానికి వారిని
సర్వనాశనం చేద్దామనుకున్నాను. 22కాని నాకు నేనే
ఆగిపోయాను. నేను ఇశ్రాయేలును ఈజిప్టు నుండి
బయటకు తీసుకొని రావటం ఇతర రాజ్యాలు
చూశాయి. నాకున్న మంచి పేరును నేను పాడు చేసు
కోదల్చలేదు. అందువల్ల నేను ఇశ్రాయేలును అన్య
జనుల ముందు సంహరించలేదు. 23అందువల్ల ఎడా
రిలో వారికి నేను ఇంకొక మాట చెప్పాను. వారిని
ఇతర రాజ్యాలలోకి చెదరగొడతాననీ, వారిని అనేక
దేశాలకు పంపించి వేస్తాననీ చెప్పాను.

24"ఇశ్రాయేలు ప్రజలు నా ఆజ్ఞలను శిరసావహించ
లేదు. వారు నా కట్టడలను అనుసరించటానికి నిరాకరిం
చారు. వారు నేనిచ్చిన ప్రత్యేక విశ్రాంతి రోజులను
ముఖ్యమైనవిగా పరిగణించలేదు. వారి తండ్రుల అప
విత్ర విగ్రహాలను వారు పూజించారు. 25అందువల్ల
వారికి నేను చెడ్డ నీతిని ప్రసాదించాను. వారు బతకటానికి
ఆధారం కాని ఆజ్ఞలను నేను వారికి ఇచ్చాను. 26వారి
కానుకలతో వారిని వారే మలిన పర్చుకొనేలా వారిని
వదిలివేశాను. వారు తమ మొదటి సంతానాన్ని సహితం
బలి ఇవ్వటం మొదలు పెట్టారు. ఈ రకంగా ఆ ప్రజ
లను నేను నాశనం చేస్తాను. అప్పుడు నేనే యెహోవా
నని వారు తెలుసుకొంటారు.' 27కావున, ఓ నర
పుత్రుడా, ఇప్పుడు నీవు ఇశ్రాయేలు వంశంతో
మాట్లాడు. వారికిలా చెప్పు, 'నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెప్పుతున్నాడు, ఇశ్రాయేలు ప్రజలు
నాకు వ్యతిరేకంగా చెడుమాటలు పలికారు. నాపై కుట్ర
పన్నారు. 28అయినా నేను వారికి ఇస్తానని వాగ్దానం
చేసిన రాజ్యానికి వారిని తీసుకొని వచ్చాను. వారు
కొండలను, పచ్చని చెట్లను అన్నిటినీ చూసి పూజలు
చేయటానికి ఆ ప్రదేశాలకు వెళ్లేవారు. వారు బలులను,

కోప కానుకలను* ఆ ప్రదేశాలన్నిటికీ తీసుకొని
వెళ్లారు. సువాసన వేసే వారి బలులన్నీ వారు అర్పిం
చారు. ఆ స్థలాలలో పానార్పణాలు కూడా వారు
అర్పించారు. 29వారా ఉన్నత స్థలాలకు ఎందుకు వెళ్తు
న్నారని నేను వారిని అడిగాను. ఆ ఆరాధనా స్థలాలన్నీ
ఈనాటికీ ఉన్నత స్థలాలు* అనే పిలవబడు
తున్నాయి.'"
30దేవుడు ఇలా చెప్పాడు: "ఇశ్రాయేలు ప్రజలు
ఆ చెడు కార్యాలన్నీ చేశారు. అందువల్ల ఇశ్రాయేలు
వంశంవారితో మాట్లాడు. వారికి ఈ రకంగా చెప్పుము,
'నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు. మీ పూర్వీకులు చేసిన పనులనే చేస్తూ
మిమ్మును మీరు మలిన పర్చుకుంటున్నారు. మీరు వేశ్య*
వలె ప్రవర్తిస్తున్నారు. మీ పూర్వీకులు ఆరాధించిన
భయంకర దేవుళ్ళను ఆరాధించటానికి మీరు నన్ను
వదిలివేశారు. 31మీరు కూడా అవే రకమైన కానుకలు
సమర్పిస్తున్నారు. మీ బూటకపు దేవతలకు కానుకగా
మీ పిల్లలను అగ్నిలో పడవేస్తున్నారు. ఈనాడు ఆ
రోత విగ్రహాలను ఆశ్రయించి మిమ్మల్ని మీరు మరింత
మలిన పర్చుకుంటున్నారు! నేను మిమ్మల్ని నా వద్దకు
రానిచ్చి, నా సలహా తీసుకోనివ్వాలని మీరు నిజంగా
అనుకుంటున్నారా? నేను ప్రభువును; యెహోవాను.
నా జీవ ప్రమాణంగా మీ ప్రశ్నలకు సమాధానమివ్వను.
మీకు సలహా ఇవ్వను! 32ఇతర రాజ్యాల మాదిరిగా
ఉండాలని కోరుకుంటున్నట్లు మీరు అంటూ
ఉంటారు. కానీ మీ అభిప్రాయాలు, ఆశలూ ఎప్పటికీ
నెరవేరవు. ఇతర జనాంగముల ప్రజల మాదిరిగా మీరు
నివసిస్తున్నారు. కొయ్యముక్కలను, రాతి ముక్కలను
(విగ్రహాలు) మీరు కొలుస్తారు!'"
33నా ప్రభువైన యెహోవా ఇలా చెప్పుతున్నాడు,
"నా జీవ ప్రమాణంగా, రాజునై మిమ్మల్ని పరిపాలిస్తానని
వాగ్దానం చేస్తున్నాను. కాని నా శక్తివంతమైన హస్తాన్ని
ఎత్తి మిమ్మల్ని శిక్షిస్తాను. మీపట్ల నా కోపాన్ని
చూపిస్తాను! 34మిమ్మల్నందరినీ ఈ అన్యదేశాల నుండి
వెలికి తెస్తాను. ఈ రాజ్యాలకు నేను మిమ్మల్ని చెదర
గొట్టాను. కాని మిమ్మల్నందరినీ కూడదీసి, ఈ
రాజ్యాల నుండి తిరిగి తీసుకొని వస్తాను. అయినా నా
బలమైన హస్తాన్ని ఎత్తి మిమ్మల్ని శిక్షిస్తాను. మీమీద
నాకు గల కోపాన్ని వెల్లడిస్తాను! 35నేను గతంలో
చేసినట్లు మిమ్మల్ని ఒక ఎడారికి నడిపిస్తాను. కాని
ఇది అన్యదేశీయులు నివసించే ఒక స్థలం. అక్కడ
నేను ముఖాముఖిగా మీతో వ్యాజ్యెమాడుతాను.
36గతంలో ఈజిప్టు వద్దగల ఎడారిలో నేను మీ పూర్వీ
కులకు తీర్పు తీర్చినట్లు, ఇప్పుడిక్కడ మీకు న్యాయ
నిర్ణయం చేస్తాను." నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
37"మీరు నేరస్థులని తీర్పు ఇచ్చి, ఒడంబడిక*
ప్రకారం మిమ్మల్ని శిక్షిస్తాను. 38నాపై తిరుగుబాటు
చేసి, నాపట్ల పాపం చేసిన ప్రజలందరినీ నేను తొలగి
స్తాను. మీ స్వదేశాన్నుండి వారందరినీ తొలగిస్తాను.
వారు మరెన్నడూ ఇశ్రాయేలు రాజ్యానికి తిరిగిరారు.
అప్పుడు నేనే యెహోవానని మీరు తెలుసు
కొంటారు."
39ఓ ఇశ్రాయేలు వంశములారా, నా ప్రభువైన
యెహోవా ఇప్పుడు ఈ విషయాలు చెప్పుతున్నాడు,
"ఏ వ్యక్తి అయినా తన రోత విగ్రహాలను పూజింప
గోరితే, అతనిని వెళ్లి వాటిని పూజించనీయండి. కాని,
తరువాత నానుండి ఏదైనా సలహా మీకు వస్తుందని
మాత్రం మీరు అనుకోవద్దు! మీరు నా పేరు ఇక ఏ
మాత్రం పాడుచేయలేరు! ముఖ్యంగా మీరు మీ నీచ
విగ్రహాలకు కానుకలను సమర్పించినా అది జరగదు."
40నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
"ప్రజలు నన్ను సేవించటానికి ఇశ్రాయేలులో ఎత్తైన
పర్వతంగా పేరొందిన నా పవిత్ర పర్వతం వద్దకు
రావాలి! ఇశ్రాయేలు వంశంవారంతా తమ స్వంత
భూమి మీదికి వస్తారు. వారు తమ దేశంలో ఉంటారు.
మీరు నా సలహా కోరి రావలసిన స్థలం అదే. మీరు ఆ
స్థలానికి నాకు అర్పణలు ఇవ్వటానికి రావాలి. ఆ
స్థలంలో మీ పంటలో తొలి భాగాన్ని నా కొరకు
తేవాలి. ఆ స్థలంలో మీ పవిత్ర కానుకలు నాకు సమ
ర్పించాలి. 41అప్పుడు మీరు సమర్పించే బలుల
సువాసనలతో నేను సంతృప్తి చెందుతాను. ఇదంతా
నేను మిమ్మల్ని తిరిగి తీసుకొని వచ్చినప్పుడు జరుగు
తుంది. నేను మిమ్మల్ని అనేక దేశాలకు చెదరగొట్టాను.
అయినా నేను మిమ్మల్నందరినీ కూడగట్టి, మళ్లీ నా
ప్రత్యేక ప్రజగా స్వీకరిస్తాను. పైగా ఆయా దేశాలన్నీ
ఇదంతా చూస్తాయి. 42అప్పుడు నేనే యెహోవానని
మీరు తెలుసుకొంటారు. నేను మిమ్మల్ని ఇశ్రాయేలు
రాజ్యానికి తీసుకొని వచ్చినప్పుడు ఇది మీరు తెలుసు
కొంటారు. అది నేను మీ పూర్వీకులకు ఇస్తానని
వాగ్దానం చేసిన రాజ్యం. 43ఆ రాజ్యంలో మిమ్మల్ని
మలినపర్చిన వస్తువులను, మీరు చేసిన చెడుకార్యాలను

---

**కోప కానుకలు** వారికి అవి సహవాస అర్పణలు. కాని యెహెజ్కేలు అవి దేవునికి కోప కారణమైన అర్పణలని ఎగతాళి చేస్తున్నాడు.

**ఉన్నత స్థలాలు** బూటకపు దేవతలను ఆరాధించే స్థలలు. ఇవి సామాన్యంగా గుట్టలమీద, కొండలమీద ఏర్పాటు చేయబడేవి.

**వేశ్య** దేవునియందు విశ్వాసంలేకుండ, ఆయనను అనుసరించటం మానివేసే వారిని కూడ ఇలా పిలవటం పరిపాటి.

**ఒడంబడిక** రుజువు అని అర్థం, పది ఆజ్ఞలున్న రాతి పలకలు దేవునికి, ఇశ్రాయేలుకు మధ్యవున్న ఒప్పందానికి నిదర్శనం.

మీరు గుర్తుకు తెచ్చుకుని సిగ్గుపడతారు. [44]ఇశ్రాయేలు వంశములారా, మీరు ఎన్నో అకృత్యాలు చేశారు. ఆ చెడుకార్యాలకు ఫలితంగా మీరు నాశనం చేయబడాలి. కాని నాకున్న మంచిపేరు కాపాడుకోవటానికి, మీకు నిజంగా అర్హమైన శిక్ష విధించవలసి వుండి కూడా నేను విధించను. నేనే యెహోవాననని పిమ్మట మీరు తెలుసుకొంటారు." నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

[45]మళ్లీ యెహోవా వాక్కు నాకు వినవచ్చింది. ఆయన ఈ విధంగా చెప్పాడు: [46]"నరపుత్రుడా, యూదా రాజ్యం దక్షిణాన వున్న నెగెవు వైపు చూడు. నెగెవు అరణ్యానికి* వ్యతిరేకంగా మాట్లాడు. [47]నెగెవు అరణ్యానికి ఇలా చెప్పు, యెహోవా వాక్కు విను. నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు. చూడు, నీ అరణ్యంలో అగ్ని రగల్చటానికి నేను సిద్ధంగా ఉన్నాను. ప్రతి పచ్చని చెట్టునూ, ప్రతి ఎండిన చెట్టునూ అగ్ని దహించి వేస్తుంది. అలా కాల్చివేసే ఆ నిప్పు ఆర్పబడదు. దక్షిణం నుండి ఉత్తరం వరకు గల ప్రదేశమంతా కాల్చివేయ బడుతుంది. [48]అప్పుడు ప్రజ లంతా యెహోవానైన నేనే ఈ అగ్నిని ప్రజ్వలింప చేసినట్లు తెలుసుకుంటారు. ఆ నిప్పు ఆర్పివేయ బడదు.'"

[49]పిమ్మట నేను (యెహెజ్కేలు) ఇలా అన్నాను: "ఓ నా ప్రభువైన యెహోవా! నేనా విషయాలు ప్రజ లకు చెప్తే నేనేవో కాకమ్మ కథలు వారికి చెబుతున్నానని అనుకుంటారు. అది నిజంగా సంభవిస్తుందని వారను కోరు!"

21 అందువల్ల యెహోవా వాక్కు నాకు విని పించింది. ఆయన ఈ విధంగా చెప్పాడు: [2]"నరపుత్రుడా, యెరూషలేము వైపు చూసి, వారి పవిత్ర స్థలాలకు వ్యతిరేకంగా మాట్లాడు. నా తరఫున ఇశ్రా యేలు రాజ్యానికి వ్యతిరేకంగా మాట్లాడు. [3]ఇశ్రాయేలు రాజ్యానికిలా తెలియజేయి, "యెహోవా ఈ విష యాలు చెప్పాడు, నేను నీకు వ్యతిరేకంగా వున్నాను! ఒరలోనుండి నా కత్తిని దూస్తాను. నీనుండి ప్రజ లందరినీ తొలగిస్తాను. వారిలో మంచివారు, చెడ్డవారు అంతా ఉంటారు! [4]నీ మంచి మనుష్యులనూ, చెడ్డవారినీ నేను నాశనం చేస్తాను. ఒరనుండి నా కత్తిని దూస్తాను. దక్షిణాన్నుండి ఉత్తరం వరకు గల ప్రజలందరిపై దానిని ప్రయోగిస్తాను. [5]అప్పుడు ప్రజలంతా నేనే యెహోవా నని తెలుసుకొంటారు. పైగా నా కత్తిని ఒరనుండి దూశానని కూడా వారు తెలుసుకొంటారు. తన పని పూర్తి చేసే వరకు నా కత్తి మళ్లీ ఒరలోకి తిరిగి వెళ్లదు."

[6]దేవుడు నాతో ఇలా అన్నాడు: "నరపుత్రుడా, గుండె పగిలే దుఃఖంలో వున్న వ్యక్తిలా నీవు నిట్టూర్పులు విడువు. ప్రజల ముందే నిట్టూర్చు. [7]వారప్పుడు నిన్ను, 'నీ వెందుకు నిట్టూరుస్తున్నావు?' అని అడుగుతారు. దానికి నీవు ఇలా సమాధానం చెప్పాలి, 'రాబోయే విషాద వార్తను తలచుకొని" భయంతో ప్రతి హృదయం వికలమైపోతుంది. చేతులు బలహీనమవు తాయి. ప్రతి ప్రాణం నీరసించి పోతుంది. మోకాళ్ళు నీళ్లవలె మారిపోతాయి.' చూడండి; ఆ చెడ్డవార్త రాబోతూ ఉంది. ఈ విషయాలన్నీ జరుగుతాయి!" నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### ఖడ్గం సిద్ధంగా ఉంది

[8]యెహోవా వాక్కు నాకు వినిపించింది. ఆయన ఇలా అన్నాడు: [9]"నరపుత్రుడా, నా తరఫున ప్రజలతో మాట్లాడు. ఈ విషయాలు తెలియజెప్పు, 'నా ప్రభు వైన యెహోవా ఈ విషయాలు చెబుతున్నాడు:

"'చూడండి, ఒక కత్తి, పదును గల కత్తి మెరుగు
దిద్దిన కత్తి.
10 చంపటానికి పదునుపెట్టబడింది కత్తి. మెరుపులా
మెరవటానికి అది మెరుగుదిద్దబడింది. "'నా
కుమారా, నిన్ను శిక్షించటానికి నేను వాడే కర్రకు
నీవు దూరంగా పారిపోయావు. ఆ కట్టెపుల్లతో
శిక్షింపబడటానికి నీవు నిరాకరించావు.
11 అందువల్ల కత్తి మెరుగు పెట్టబడింది. ఇప్పుడది
వాడబడుతుంది. కత్తి పదును పెట్టబడి, మెరుగు
దిద్దబడింది. అదిప్పుడు చంపేవాని చేతికి ఇవ్వ
బడుతుంది.

[12]"'నరపుత్రుడా, కేకలు పెట్టి రోదించు! ఎందు కంటే ఆ కత్తి నా ప్రజల మీదికి, ఇశ్రాయేలు పాలకుల మీదికి తేబడింది! ఆ పాలకులు యుద్ధాన్ని కోరారు. అందువల్ల కత్తి ఎదురైనప్పుడు వారు నా ప్రజలతో పాటు వుంటారు! కావున నీ తొడ చరుచుకొని, నీ దుఃఖాన్ని వెలిబుచ్చే పెద్ద శబ్దాలు చేయుము! [13]ఎందు వల్లనంటే, ఇది కేవలం పరీక్ష గాదు! నీవు కట్టెతో శిక్షింపబడటానికి నిరాకరించావు. కనుక నిన్ను శిక్షించ టానికి మరి నేనేమి ఉపయోగించాలి? అవును. కత్తినే!'" నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

[14]దేవుడు ఇంకా ఇలా అన్నాడు: "నరపుత్రుడా, నీవు చప్పట్లు చరిచి, నా తరఫున ప్రజలతో మాట్లాడు.

"కత్తిని రెండుసార్లు కిందికి రానీ, అవును, మూడు
సార్లు! ఈ కత్తి ప్రజలను హతమార్చటానికే.
మహా మారణానికి వినియోగించబడేది ఈ
ఖడ్గమే! ఈ కత్తి వాళ్లను ఖండిస్తుంది.

---

**నెగెవు అరణ్యం** ఇక్కడ దేవుడు బహుశః అసహాస్యం చేస్తూ వుండవచ్చు. నెగెవు ఎడారి ప్రాంతం. నెగెవులో అరణ్యాలు లేవు.

15 భయంతో వారి హృదయాలు కరుగుతాయి.
చాలామంది పడిపోతారు. వారి నగర ద్వారం
వద్దనే చంపబడతారు. అవును. ప్రజలను చంప
టానికి ఆ ఖడ్గాన్ని నేనే ఎంపిక చేశాను! ఆ
ఖడ్గం మెరుపుతీగలా ప్రకాశిస్తుంది.
16 ఓ ఖడ్గమా, పదునుగా నుండుము, కుడి పక్క
నరుకు. ఎడమ పక్క నరుకు. నీ అంచు ఎటు
వెళ్లగోరితే అటు వెళ్లు!
17 “అప్పుడు నేను కూడా చప్పట్లు చరుస్తాను.
పిమ్మట నా కోపాన్ని చూపడం ఆపుతాను.
యెహోవానైన నేను మాట్లాడాను!”

### యెరూషలేముకు మార్గాన్ని ఎంపిక చేయటం

18యెహోవా మాట నాకు వినవచ్చింది. ఆయన
ఇలా అన్నాడు: 19“నరపుత్రుడా, బబులోను రాజు
ఖడ్గం ఇశ్రాయేలుపై రావటానికి వినియోగపడే రెండు
మార్గాలను గీయుము. రెండు మార్గాలూ ఒకే ప్రదేశం
బబులోను నుండి మొదలవ్వాలి. నగరానికి వచ్చే ఒక
మార్గం మొదట్లో ఒక గుర్తు పెట్టు. 20ఖడ్గం ఏ దారిని
వినియోగిస్తుందో తెలుపటానికి ఆ గుర్తు పెట్టాలి. ఒక
మార్గం అమ్మోనీయుల నగరమైన రబ్బాకు వెళ్తుంది.
మరొక మార్గం యూదాలోని రక్షిత నగరమైన
యెరూషలేముకు వెళ్తుంది! 21ఇది బబులోను రాజు
ఆ ప్రాంతాన్ని తాను ఎలా ఎదుర్కోవాలన్నదానిని
తెలుపుతుంది. బబులోను రాజు ఆ మార్గం రెండుగా
విడిపోయే చోటికి వచ్చాడు. బబులోను రాజు తన
భవిష్యత్తు కార్యక్రమం తెలుసుకొనటానికి మంత్ర,
తంత్ర సంకేతాలను ఉపయోగించాడు. అతడు కొన్ని
బాణాలు తీసుకొన్నాడు. తన కులదేవతలను కొన్ని
ప్రశ్నలడిగాడు. పిమ్మట అతడు చంపిన ఒక జంతువు
కార్జంవెపు చూశాడు.
22“అక్కడ అతను కొన్ని సంకేతాలు చూశాడు.
అవి అతనిని తన కుడిపక్కనున్న యెరూషలేముకు
పోయే మార్గంలో వెళ్లమని సూచించాయి! అతడు
నగర ద్వారాలు పగులగొట్టే దూలాల యంత్రాలను
తేవటానికి సిద్ధం కమ్మనే సంకేతం ఇవ్వాలను
కున్నాడు. అతడు ఆజ్ఞ ఇవ్వగానే అతని సైనికులు
మారణకాండకు పూనుకుంటారు. యుద్ధ నినాదాలు
చేయమని, నగరపు గోడకు మురికి వీధిని నిర్మించమని,
మరియు కొయ్య బురుజులు నగరాన్ని ఎదుర్కో
వడానికి నిర్మించమని సంకేతాలు యిస్తాడు. 23ఆ తంత్ర
సంకేతాలు ఇశ్రాయేలు ప్రజలకు అర్థంకావు. వారు
చేసిన వాగ్దానాలు వారికున్నాయి. అవి వారికి ముఖ్యం.
కాని యెహోవా వారి పాపాలను జ్ఞాపకం పెట్టు
కుంటాడు. దానితో ఇశ్రాయేలీయులు పట్టుబడతారు.”
24నా ప్రభువైన యెహోవా ఈ విషయం చెప్పాడు:
“మీరు అనేక చెడు కార్యాలు చేశారు. మీ పాపాలు
చాలా స్పష్టంగా కన్పిస్తున్నాయి. మీరు నేరస్థులని గుర్తు
పెట్టుకొనేలా మీరు నన్ను ఒత్తిడి చేశారు. కావున
శత్రువు మిమ్మల్ని తన గుప్పెట్లో పెట్టుకుంటాడు.
25ఓ ఇశ్రాయేలు దుష్ట నాయకుడా, నీవు చంపబడ
తావు. నీకు శిక్ష కాలం సమీపించింది! నీ అంతం
ఇక్కడే!”
26నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు, “నీ తలపాగా తీసివేయి! నీ కిరీటం తీసి
వేయి! మార్పుకు సమయం ఆసన్నమయ్యింది.
ముఖ్య నాయకులు తగ్గింపబడతారు. సామాన్య మాన
వులు ప్రముఖ వ్యక్తులౌతారు. 27ఆ నగరాన్ని నేను
సర్వనాశనం చేస్తాను! కాని యోగ్యుడైన వ్యక్తి కొత్త
రాజు అయ్యేవరకు ఇది సంభవించదు. అప్పుడు ఈ
నగరాన్ని అతడు (బబులోను రాజు) కైవసం చేసు
కొనేలా చేస్తాను.”

### అమ్మోనుకు వ్యతిరేకంగా ప్రవచనం

28దేవుడు ఇలా చెప్పాడు: “నరపుత్రుడా, నా
తరపున ప్రజలతో మాట్లాడు. ఈ విషయాలు చెప్పు:
‘అమ్మోను ప్రజలకు, వారి సిగ్గుచేటు దేవతకు నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:

“‘చూడండి, ఒక ఖడ్గం! ఆ ఖడ్గం దాని ఒరనుండి
బయటకు వచ్చింది. కత్తి మెరుగు దిద్దబడింది!
కత్తి సంహారానికి సిద్ధంగా ఉంది. అది మెరుపు
తీగలా ప్రకాశించటానికి మెరుగు దిద్దబడింది!
29 మీ దర్శనాలు పనికిరావు. మీ మంత్ర తంత్రాలు
సహాయపడవు. అదంతా ఒక అబద్ధాల మూట.
దుష్టుల మెడల మీద ఇప్పుడు కత్తి ఉంది. వారు
త్వరలో శవాలై పోతారు. వారికి సమయం దాపు
రించింది. వారి చెడుతనం ముగిసే సమయం
వచ్చింది.

### బబులోనుకు వ్యతిరేకంగా ప్రవచనం

30“‘ఇప్పుడు కత్తిని దాని ఒరలో పెట్టవచ్చు. నీవు
సృష్టింపబడిన ప్రదేశంలో, నీవు జన్మమెత్తిన రాజ్యంలో
నీకు నేను న్యాయనిర్ణయం చేస్తాను. 31నీ మీద నా
కోపాన్ని కుమ్మరిస్తాను. వేడి గాడ్పువలె నా కోపం
నిన్ను కాల్చివేస్తుంది. నిన్ను దుష్టులయిన మగవారికి
అప్పగిస్తాను. వారు ప్రజల్ని హత మార్చటంలో ఆరి
తేరిన వారు.
32నీవు అగ్నికి ఆజ్యంలా తయారవుతావు. నీ రక్తం
భూమిలోకి లోతుగా ప్రవహిస్తుంది. ప్రజలు నిన్ను
మరెన్నడూ జ్ఞాపకం పెట్టుకోరు. యెహోవానైన నేనే
ఇది చెప్పాను.”

## యెహెజ్కేలు యెరూషలేముకు వ్యతిరేకంగా మాట్లాడటం

22 యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా చెప్పాడు: 2“నరపుత్రుడా, నీవు
న్యాయనిర్ణయం చేస్తావా? హంతకుల నగరంపై
(యెరూషలేము) నీవు తీర్పు తీర్చుతావా? ఆమె చేసిన
భయంకరమైన కార్యాలను గూర్చి ఆమెకు తెలియ
జేస్తావా? 3నీవు ఇలా చెప్పాలి, ‘నా ప్రభువైన యెహోవా
ఇలా చెపుతున్నాడు, ‘నగరం హంతకులతో నిండి
ఉంది. కావున ఆమెకు శిక్షపడే కాలం వస్తుంది! తనకై
తాను రోతవిగ్రహాలను చేసింది. ఆ విగ్రహాలే ఆమెను
మలినపర్చాయి!

4“‘యెరూషలేము వాసులారా, మీరనేక మందిని
హతమార్చారు. మీరు అసహ్యకరమైన విగ్రహాలను
చేశారు. మీరు నేరస్తులు. మిమ్మల్ని శిక్షించే కాలం
వచ్చింది. మీకు అంతం సమీపించింది. అన్యదేశాల
వారు మిమ్మల్ని ఎగతాళి చేస్తారు. ఆ రాజ్యాల వారు
మిమ్మల్ని చూసి నవ్వుతారు. 5మీకు దగ్గరలోను,
దూరంలోను వున్న ప్రజలు మిమ్మల్ని ఎగతాళి
చేస్తారు. మీ పేరును మీరే పాడుచేసుకున్నారు. వారి
పెద్ద నవ్వును మీరు వినవచ్చు.

6“‘చూడండి! ఇశ్రాయేలు పాలకులలో ప్రతివాడూ
ఇతరులను చంపటానికి యెరూషలేములో తనను
తాను బాగా బలపర్చుకున్నాడు. 7యెరూషలేములో
ప్రజలు తమ తల్లిదండ్రులను గౌరవించరు. ఆ నగ
రంలో వారు అన్యదేశీయులను బాధిస్తారు. ఆ నగ
రంలో వారు అనాధ పిల్లలను, విధవలను మోసగిస్తు
న్నారు. 8మీరంతా నా పవిత్ర వస్తువులను అసహ్యించు
కుంటారు. నేను నిర్దేశించిన ప్రత్యేక విశ్రాంతి దినాలను
మీరు సామాన్యమైనవిగా భావిస్తారు. 9యెరూషలేము
ప్రజలు ఇతరులను గురించి అబద్ధాలు పలుకుతారు.
ఆ అమాయక ప్రజలను చంపటానికే వారు ఆ విధంగా
ప్రవర్తిస్తారు. ప్రజలు బూటకపు దేవుళ్లను కొలవటానికి
కొండల మీదికి వెళతారు. పిమ్మట యెరూషలేముకు
వచ్చి స్నేహ పంక్తి భోజనాలు చేస్తారు.

“‘యెరూషలేములో ప్రజలు కామవాంఛలతో
కూడిన పాపాలు చేస్తారు. 10యెరూషలేములో మను
ష్యులు తమ తండ్రి భార్యతోనే వ్యభిచరించి పాపం
చేస్తారు. యెరూషలేములో మనుష్యులు స్త్రీలను మాన
భంగం చేస్తారు. స్త్రీలు బహిష్టు అయినప్పుడు కూడా
వారిని చెరబట్టి మానభంగం చేస్తారు. 11ఒకడు ఆ
భయంకర పాపాన్ని తన పొరుగువాని భార్యతోనే
చేస్తాడు. మరొకడు తన కోడలితోనే వ్యభిచరించి
ఆమెను అపవిత్ర* పరుస్తాడు. ఇంకొకడు తన తండ్రి
కుమార్తెయగు తన సోదరిని మానభంగం చేస్తాడు.

12“‘ఓ యెరూషలేము ప్రజలారా, నరహత్య చేయ
టానికి మీరు డబ్బు తీసుకొంటారు. మీరు డబ్బు
అప్పు ఇచ్చి, దానిమీద వడ్డీ తీసుకుంటారు. స్వల్ప
లాభం కోసం మీరు మీ పొరుగువారిని మోసగిస్తారు.
మీరు నన్ను మర్చిపోయారు.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

13దేవుడు ఇలా చెప్పసాగాడు: “ఇప్పుడు చూడు!
నా చేతిని కింద కొట్టి నిన్ను ఆపుతాను! ప్రజలను
మోసగించినందుకు, చంపినందుకు నిన్ను నేను శిక్షి
స్తాను. 14అప్పుడు నీవు ధైర్యంగా ఉంటావా? నేను
నిన్ను శిక్షించటానికి వచ్చినప్పుడు నీవు శక్తిగలిగి
వుంటావా? లేదు! ఉండలేవు. నేనే యెహోవాను.
మాట్లాడింది నేనే. నేనన్నది చేసి తీరుతాను!
15మిమ్మల్ని చాలా దేశాలలోనికి చెదరగొడతాను. మీరు
అన్యదేశాలకు పారిపోయేలా మీపై ఒత్తిడి తెస్తాను. ఈ
నగరంలో ఉన్న ఏహ్యమైన వస్తువులన్నిటినీ నేను
సర్వనాశనం చేస్తాను. 16కాని యెరూషలేమా, నీవు
అపవిత్రమవుతావు. పైగా ఇతర దేశాలన్నీ ఈ విష
యాలు జరగటం చూస్తాయి. అప్పుడు నేనే
యెహోవానని నీవు తెలుసుకొంటావు.’

## పనికిరాని చెత్తవంటి ఇశ్రాయేలు

17యెహోవా వాక్కు నాకు వినవచ్చింది. ఆయన
ఇలా అన్నాడు,

18“నరపుత్రుడా, వెండితో పోల్చినప్పుడు కంచు,
ఇనుము, సీసము, తగరము మొదలైనవి చాలా విలువ
తక్కువ లోహాలు. పనివారు వెండిని శుద్ధి చేయటానికి
అగ్నిలో వేస్తారు. కరిగిన వెండి నుంచి పనివారు అలా
మైలను వేరు చేస్తారు. ఇశ్రాయేలు దేశం అలా వేరు
చేయబడిన మలిన పదార్థంలా తయారయ్యింది.
19కావున ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు, ‘మీ ప్రజలంతా పనికిరాని చెత్తలా తయా
రయ్యారు. అందువల్ల మిమ్మల్నందరినీ యెరూష
లేముకు చేర్చుతాను. 20పనివారు వెండిని, కంచును,
ఇనుమును, సీసాన్ని, తగరాన్ని నిప్పులో వేసి, నిప్పు
రగిలేలా కొలిమి వూదుతారు. లోహాలు కరగటం
మొదలు పెడతాయి. అదేమాదిరి, మిమ్మల్ని నా
అగ్నిలో వేసి కరగబెడతాను. నా రగిలే కోపమే ఆ
నిప్పు.

21ఆ నిప్పులో మిమ్మల్ని వేస్తాను. నా కోపాగ్నిని
బాగా రగిలేలా చేస్తాను. అప్పుడు మీరు కరగటం
మొదలు పెడతారు. 22వెండి నిప్పులో కరుగుతుంది.
పనివారు శుద్ధ వెండిని వేరుచేసి దానిని భద్రపరుస్తారు.
అదేమాదిరి మీరు నగరంలో కరుగుతారు. అప్పుడు
నేనే యెహోవానని మీరు తెలుసుకొంటారు. నా
కోపాన్ని మీమీద కుమ్మరించానని మీరు తెలుసు
కొంటారు.’”

---

**అపవిత్రము** పరిశుద్ధురాలు కానట్టి లేక దేవుని ఆరాధనకు పనికిరానటువంటి అని భావం.

### యెహెజ్కేలు యెరూషలేముకు వ్యతిరేకంగా మాట్లాడుట

[23]యెహోవా వాక్కు నాకు వినిపించింది. ఆయన
ఇలా చెప్పాడు, [24]"నరపుత్రుడా, ఇశ్రాయేలుతో మాట్లా
డుము. ఆమె పవిత్రురాలు కాదని నీవామెతో చెప్పుము.
నేను ఆ రాజ్యాల మీద కోపంగావున్నాను. అందువల్ల
ఆ రాజ్యంలో వానలు పడవు. [25]యెరూషలేములోని
ప్రవక్తలు కుట్రలు పన్నుతున్నారు. తను తినదల్చిన
జంతువును పట్టుకున్నప్పుడు గర్జించు సింహంలా వారు
న్నారు. ఆ ప్రవక్తలు ఎన్నో జీవితాలను నాశనం చేశారు.
వారెన్నో విలువైన వస్తువులను తీసుకున్నారు.
యెరూషలేములో ఎందరో స్త్రీలు విధవలు కావటానికి
వారు కారకులయ్యారు.

[26]"యాజకులు నా ధర్మ బోధనలను నిజంగా
గాయపర్చారు. వారు నా పవిత్ర వస్తువులను మైల
చేశారు. వారు వాటిని ముఖ్యమైనవిగా పరిగణించరు.
పవిత్ర వస్తువులను అతి సామాన్యమైనవిగా చూస్తారు.
శుభ్రమైన వస్తువులను వారు మురికైనవిగా చూస్తారు.
ఈ విషయాలను గూర్చి వారు ప్రజలకు బోధించరు.
నేను నిర్దేశించిన ప్రత్యేక విశ్రాంతి రోజులను వారు
గౌరవించి పాటించరు. నేను వారివల్ల తృణీకరించ
బడ్డాను.

[27]"తాను పట్టిన జంతువును తింటున్న తోడేలులా
ఇశ్రాయేలు నాయకులు వున్నారు. వారు ధనవంతులు
కావాలనే కోర్కెతో ఆ నాయకులు ప్రజలను చంపి
వేస్తారు.

[28]"ప్రవక్తలు ప్రజలను హెచ్చరించరు. వారు
నిజాన్ని దాచివేస్తారు. వారు గోడ నిర్మాణం చేయ
కుండా, పగుళ్లపై బంకమట్టి పూసే పనివారిలా
వుంటారు. వారి కండ్లకు కేవలం అబద్ధాలే కన్పిస్తాయి.
భవిష్యత్తును తెలుసుకొనటానికి వారు మంత్ర
తంత్రాలను వినియోగిస్తారు. అయినా వారు అబద్ధాలు
మాత్రమే చెపుతారు. వారు, 'నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెప్పాడు' అని అంటారు. కాని వారు
అబద్ధ మాడుచున్నారు. యెహోవా వారితో మాట్లాడ
లేదు!

[29]"సామాన్య ప్రజలు ఒకరికొకరు అన్యాయం చేసు
కుంటారు. ఒకరి నొకరు మోసపుచ్చుకుని, ఒకరి
సొమ్ము నొకరు దొంగిలించుకుంటారు. వారు పేద
లను, ఆసరాగా పెట్టుకొని ధనవంతులవుతారు. వారితో
నివసిస్తున్న పరదేశీయులను మోసగిస్తారు. వాళ్లకు
ఎప్పుడూ న్యాయంగా ఉండరు.

[30]"తమ జీవిత విధానాన్ని మార్చుకొని, తమ
దేశాన్ని రక్షించుకోమని నేను ప్రజలకు హితవు
చెప్పాను. గోడలను పటిష్ట పర్చమని నేను ప్రజలకు
చెప్పాను. బీటలు వారిన గోడలవద్ద నిలబడి, తమ
నగర పరిరక్షణకు పోరాడమని చెప్పాను. కాని ఏ ఒక్కడు
సహాయపడటానికి ముందుకు రాలేదు! [31]కావున వారికి
నా కోపాన్ని చూపిస్తాను. వారిని సర్వనాశనం చేస్తాను!
వారు చేసిన చెడుకార్యాలకు వారిని నేను శిక్షిస్తాను.
ఇదంతా వారి స్వయంకృత అపరాధమే! " నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

23 యెహోవా వాక్కు నాకు వినిపించింది.
ఆయన ఇలా చెప్పాడు: [2]"నరపుత్రుడా, సమ
రయ, యెరూషలేములను గురించిన ఈ కథ ఆల
కించుము. ఇద్దరు అక్కా చెల్లెళ్ళు ఉన్నారు. వారిద్దరూ
ఒక్క తల్లి కడుపునే పుట్టారు. [3]చిన్న వయస్సులో
ఉండగనే వారిద్దరూ ఈజిప్టులో వేశ్యలయ్యారు.
ఈజిప్టులో వారు మగవాళ్లతో పడుకొన్నారు. మనుష్యు
లను వారు తమ చనుమొనలు నలిపి, తమ యౌవ్వనపు
చన్నులను పట్టుకోనిచ్చారు. [4]పెద్ద కుమార్తె పేరు
ఒహొలా.* ఆమె చెల్లిలి పేరు ఒహొలీబా.* ఆ అక్కా
చెల్లెళ్లిద్దరూ నాకు భార్యలయ్యారు. మాకు పిల్లలు
కలిగారు. (నిజానికి ఒహొలాయే సమరయ. ఒహొలీ
బాయే యెరూషలేము.)

[5]"అప్పుడు ఒహొలా నా పట్ల విశ్వాసం లేకుండా
ప్రవర్తించింది. ఆమె ఒక వేశ్యలా జీవించసాగింది. తన
విటులను కోరుకోనారంభించింది. ఊదారంగు బట్టలు
వేసుకున్న అష్షూరు సైనికులను ఆమె చూసింది.
[6]గుర్రాలపై వెళ్లే ఆ సైనికులంతా కోరుకోతగ్గ యువ
కులు. వారు నాయకులు, అధికారులు అయివున్నారు.

[7]ఆ మనుష్యులందరికి ఒహొలా తనను తాను సమ
ర్పించుకుంది. అష్షూరు సైన్యంలో వారంతా ప్రత్యే
కంగా ఎంపిక చేయబడినవారు. వాళ్లందరినీ ఆమె కోరు
కొంది! వారి రోత విగ్రహాలతో ఆమె కూడ మలినపర్చ
బడింది. [8]దానికి తోడు, ఈజిప్టుతో తన ప్రేమ
కలాపాలు ఆపలేదు. ఆమె చిన్న వయస్సులో ఉన్న
ప్పుడే ఈజిప్టు ఆమెతో సంగమించాడు. ఆమె యౌవ్వ
నపు చన్నులు పట్టుకున్న మొదటి ప్రేమికుడే ఈజిప్టు.
ఈజిప్టు తన దొంగ ప్రేమనంతా ఆమెపై ఒలకబోశాడు.
[9]అందువల్ల ఆమె విటులను ఆమెను పొందడానికి
రానిచ్చాను. ఆమె అష్షూరును కోరుకుంది. అందుచే
నేనామెను వారికిచ్చాను! [10]వారామెకు మానభంగం*
కావించారు. వారు ఆమె పిల్లలను ఎత్తుకుపోయారు.
తరువాత వారు కత్తితో ఆమెను చంపివేశారు. వారామెను

---

**ఒహొలా** ఈ పేరుకు గుడారం అని అర్థం. బహుశః ఇది ఇశ్రాయేలు ప్రజలు దైవారాధనకు వెళ్లే 'పవిత్ర గుడారం' కావచ్చు.

**ఒహొలీబా** దీనికి 'నా గుడారం ఆమె యొక్క దేశంలో వుంది' అని అర్థం.

**మానభంగం** ఆమె వారికి తన నగ్నత్వాన్ని చూపించిందని దీని అర్థం. వారామెను దూర ప్రాంతానికి ఎత్తుకు పోయారని పాఠాంతరం.

అలా శిక్షించారు. స్త్రీలు ఆమెను గురించి ఇంకా చెప్పు
కుంటూనే ఉన్నారు.
[11]"తన చిన్న సోదరి ఒహొలీబా ఇవన్నీ జరగటం
చూసింది. అయినా తన అక్కకంటె ఒహొలీబా ఎక్కువ
పాపాలు చేసింది! ఒహొలాకంటె ఈమె మరీ విశ్వాసం
లేని స్త్రీ అయింది.
[12]ఈమె అష్షూరు నాయకులను, అధికారులను
కోరుకొంది. ఊదా బట్టల్లో గుర్రాలమీద స్వారీచేసే
ఆ సైనికులను ఆమె కోరుకొంది. వారంతా ఆశించదగ్గ
యువకులు. [13]ఒకే రకమైన తప్పులతో ఆ ఇద్దరు
స్త్రీలు తమ జీవితాలను నాశనం చేసుకోబోతున్నట్లు
నేను చూశాను.
[14]"ఒహొలీబా నాపట్ల విశ్వాసం లేకుండ కొన
సాగింది. బబులోను (బాబిలోనియా)లో గోడలమీద
చెక్కిన మనుష్యుల బొమ్మలను చూసింది. ఇవి ఎర్రని
బట్టలు ధరించిన కల్దీయ మనుష్యుల బొమ్మలు. [15]వారి
నడుముల చుట్టు పటకాలు, తలలపైన పొడుగాటి
తలపాగాలు ధరించి వున్నారు. ఆ మనుష్యులందరు
రథాధిపతుల వలె వున్నారు. వారంతా బబులోనులో
జన్మించిన వారుగనే కన్పించారు. [16]మరి ఒహొలీబా
వారందరినీ కావాలనుకొంది. [17]కావున ఆ బబులోను
మనుష్యులందరూ ఆమెతో సంభోగించటానికి ఆమె
ప్రేమ పాన్పు మీదికి వచ్చారు. ఆమెను విచ్చల విడిగా
వాడుకొని, చివరకు ఆమె వారిని చీదరించుకునేలా
ఆమెను అపవిత్రపరచారు.
[18]"ఒహొలీబా తన అవిశ్వాసాన్ని అందరూ గమ
నించేలా ప్రవర్తించింది. ఆమె తన నగ్నత్వాన్ని అనేక
మంది అనుభవించనిచ్చింది. దానితో నాకు ఆమెపట్ల
విసుగు పుట్టి, నేనామె అక్కను చీదరించుకున్నట్లు
ఈమెను కూడ అసహ్యించుకున్నాను. [19]పదే పదే
ఒహొలీబా నాపట్ల అవిశ్వాసంతో ప్రవర్తించింది.
పిమ్మట ఈజిప్టు తను చిన్న పిల్లగా వుండి జరిపిన
ప్రేమ కలాపాలు జ్ఞాపకం తెచ్చుకుంది. [20]గాడిద మేఢ్రం
వంటి శిశ్నముతో గుర్రంవలె వరదలా రేతస్సును కార్చే
తన విటుని ఆమె జ్ఞాపకం చేసుకున్నది.
[21]"ఒహొలీబా, నీ ప్రేమికుడు నీ చనుమొనలు
ముట్టి, నీ యౌవ్వనపు చన్నులను పట్టిన ఆ రోజులను
గురించి నీవిప్పుడు కలలు కంటున్నావు. [22]కావున
ఒహొలీబా, నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు, "నీ ప్రేమికులతో నీవిప్పుడు విసుగు
చెందియున్నావు. కాని నీ విటులను నేనిక్కడికి
రప్పిస్తాను. వారు నీ చుట్టూ మూగుతారు. [23]వారందరినీ
నేను బబులోను (బాబిలోనియా) నుండి రప్పిస్తాను.
ముఖ్యంగా కల్దీయులను రప్పిస్తాను. పెకోదు, శోయ,
కోయ ప్రాంతాలనుండి నేను పురుషులను రప్పిస్తాను.
అష్షూరు నుండి కూడ నేను మనుష్యులను రప్పిస్తాను.
తమ నాయకులను, అధికారులను రప్పిస్తాను. వారంతా
కోరుకోతగ్గ యువకులు. రథాధిపతులు, ప్రత్యేకంగా
ఎంపిక చేయబడిన గుర్రపు రౌతులు వారిలో వున్నారు.
[24]ఆ గుంపంతా నీ వద్దకు వస్తుంది. తమ గుర్రాలమీద,
రథాలమీద వారు వస్తారు. అనేకానేకమంది వస్తారు.
వారు తమ ఈటెలను, డాళ్లను, శిరస్త్రాణములను
ధరించి వస్తారు. వారంతా నీ చుట్టూ గుమిగూడతారు.
నీవు నాకు చేసినదంతా వారికి నేను వివరిస్తాను. వారికి
ఇష్టమైన రీతిలో వారు నిన్ను శిక్షిస్తారు. [25]నేనెంత
రోషంగా వున్నానో నీకు చూపిస్తాను. వారు చాలా
కోపగించి నిన్ను బాధిస్తారు. వారు నీ ముక్కూ చెవులు
కోసివేస్తారు. వారు కత్తితో నిన్ను చంపుతారు. పిమ్మట
వారు నీ పిల్లలను తీసుకుపోతారు. నీవద్ద మిగిలిన
ప్రతి దానిని వారు తగులబెడతారు. [26]నీ అందమైన
బట్టలను, ఆభరణాలను వారు తీసుకుంటారు.
[27]ఈజిప్టులో నీ ప్రేమ కలాపాలను గురించిన నీ కలలను
నిలిపివేస్తాను. మళ్లీ నీవెన్నడు వారికొరకు ఎదురు
చూడవు. నీవు ఇకముందెన్నడు ఈజిప్టును జ్ఞాపకం
చేసుకొనవు!'
[28]నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు, "నీవు అసహ్యించుకునే మనుష్యులకు నిన్ను
అప్పజెప్పుచున్నాను. నీవు విసుగుచెందిన మనుష్యు
లకే నిన్ను అప్పజెప్పుచున్నాను. [29]వారు నిన్నెంత
అసహ్యించుకుంటున్నారో వారు నీకు చూపిస్తారు. నీవు
పనిచేసిందానినంతా వారు నిన్ను నిలువు దోపిడీ చేసి,
నగ్నంగా వదులుతారు! ప్రజలు నీ పాపాలను విశదంగా
చూస్తారు. నీవు వేశ్యలా ప్రవర్తించావని, నీవు నీచమైన
కలలుగన్నావని వారు తెలుసుకుంటారు.
[30]అన్యదేశీయులను వెంబడించి పోవటానికి నన్ను
వదిలిపెట్టినప్పటి నుండి నీవీ పాపకార్యాలకు ఒడి
గట్టావు. వారి రోత విగ్రహాలను ఆరాధించటం మొదలు
పెట్టినప్పటి నుండి నీవీ చెడ్డ కార్యాలకు తలపడ్డావు.
[31]నీవు నీ అక్కను అనుసరించి, ఆమె గడిపిన జీవితాన్నే
నీవూ గడిపావు. నీకు నీవే విషపు పాత్రను అందుకుని,
నీ చేతిలో పట్టుకున్నావు. నీకు శిక్ష నీవే విధించు
కున్నావు." [32]ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు:

"నీవు నీ అక్క విషపు పాత్రను తీసుకొని తాగు
తావు. అది ఒక పొడుగాటి, వెడల్పయిన గిన్నె.
ఆ గిన్నెలో విషం (శిక్ష) చాలా పడుతుంది.
ప్రజలు నిన్ను చూచి నవ్వి, ఎగతాళి చేస్తారు.
33 తాగినవానిలా నీవు తూలిపోతావు. నీవు గొప్ప
దుఃఖముతో నింపబడతావు. షోమ్రోను పాత్ర
వినాశ ఉపద్రవములతో నిండియున్నది. అది
నీ అక్క తాగిన విషపు (శిక్ష) పాత్ర లాంటిదే.
34 ఆ పాత్రలోనే నీవు విషం తాగుతావు. దానిని
నీవు పూర్తిగా తాగుతావు. పిమ్మట పాత్ర

క్రిందకు విసిరివేసి ముక్కలు చేస్తావు. బాధతో
నీ రొమ్ములు చీరుకుంటావు. నేను ప్రభువైన
యెహోవాను గనుక ఇది సంభవిస్తుంది. ఈ
విషయాలు నేనే చెప్పాను.

35“కావున నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు, ‘యెరూషలేమా నీవు నన్ను మర్చి
పోయావు. నన్ను దూరంగా విసిరివేసి, నన్ను వెనుక
వదిలావు. నీవు నన్ను వదిలి వేశ్యలా జీవించిన కారణంగా
ఇప్పుడు నీవు బాధ అనుభవిస్తావు. నీ అపవిత్రమైన
కలలకూ నీ వ్యభిచారానికి నీవు శ్రమననుభవించాలి.

## ఒహొలా, ఒహొలీబాలకు వ్యతిరేకంగా తీర్పు

36నా ప్రభువైన యెహోవా నాతో ఇలా చెప్పాడు:
“నరుడా, నీవు ఒహొలా, ఒహొలీబాలకు తీర్పు ఇస్తావా?
అయితే వారు చేసిన భయంకర నేరాలను వారికి చెప్పు.
37వారు వివాహబంధం తెంచుకొని వ్యభిచరించారు.
వారిపై హత్యానేరం ఉంది. వారు వేశ్యల్లా ప్రవర్తించారు.
వారి అపవిత్ర విగ్రహాలతో వుండటానికి వారు నన్ను
వదిలివేశారు. నా పిల్లలు వారితో వున్నారు. కాని వారిని
నిప్పులో బలవంతంగా నడిపించింది. తమ అపవిత్ర
విగ్రహాలకు నైవేద్యం పెట్టటానికి వారీ పని చేశారు.
38నేను నిర్దేశించిన ప్రత్యేక విశ్రాంతి దినాలను, నా
పవిత్ర స్థలాన్ని వారు సామాన్యమైనవిగా పరిగణించారు.
39వారి విగ్రహాల కొరకు వారు తమ పిల్లల్ని బలిపెట్టారు.
తరువాత వారు నా పవిత్ర స్థలంలోకి వెళ్లి దానిని
కూడ అపవిత్ర పర్చారు! ఇదీ వారు నా ఆలయం
లోపలే చేశారు!
40దూర ప్రాంతాల మనుష్యుల కొరకు వారు కబురు
పంపారు. ఆ మనుష్యుల కొరకు నీవు (ఒహొలీబా)
దూతను పంపావు. వారు నిన్ను చూడటానికి వచ్చారు.
వారికొరకు నీవు స్నానం చేసి, కండ్లు అలంకరించు
కొని, ఆభరణాలు ధరించావు. 41ఒక అందమైన పాన్పు
మీద నీవు కూర్చుని, దాని ముందు ఒక బల్లవేశావు.
ఆ బల్ల మీద నా సుగంధ ధూప ద్రవ్యాన్ని,* నూనెను*
ఉంచావు.
42యెరూషలేములో వినబడే శబ్దం విందులో*
ప్రజలు చేసే రణగొణ ధ్వనిలా ఉంది. విందుకు అనేక
మంది వచ్చారు. ఎడారినుండి వచ్చిన వారు కావటంతో
వారు తాగుతూ ఉన్నారు. వారు స్త్రీలకు కడియాలు,
అందమైన కిరీటాలు యిచ్చారు. 43కామ క్రీడలతో
నీరసించిపోయిన ఆ స్త్రీతో నేను మాట్లాడినాను.
వారంతా ఆమెతోను, ఆమె వారితోను వ్యభిచార పాపం
చేస్తారా? అని అన్నాను. 44కాని వారంతా ఒక వేశ్యవద్దకు
ఆమెవద్ద వెళ్ళుచున్నట్లుగనే ఆమె వద్దకు వెళ్ళు
తున్నారు. కామంతో పాపకార్యం చేసే ఒహొలా, ఒహొ
లీబాల వద్దకు వారు మళ్లీ, మళ్లీ వెళ్లారు.
45“కాని మంచి మనుష్యులు వారిని నేరస్థులుగా
తీర్పు ఇస్తారు. వారా స్త్రీలను వ్యభిచార, హత్యానేరాల
కింద దోషులుగా నిర్ణయిస్తారు. ఒహొలా మరియు
ఒహొలీబాలు వ్యభిచార పాపం చేసినందుకు, వారు
చంపిన ప్రజల రక్తం ఇంకా వారి చేతులపై వున్నందున
ఇది ఇలా జరుగుతుంది!”
46నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: “ప్రజలను ఒక చోట సమీకరించండి. ఆ
ప్రజలందరు ఒహొలా, ఒహొలీబాలను శిక్షింప
నీయండి. ఈ ప్రజా సమూహం ఈ ఇద్దరు స్త్రీలను
శిక్షించి, వారిని ఎగతాళి చేస్తారు. 47తరువాత ఈ గుంపు
వారిద్దరిపై రాళ్ళు విసరి చంపివేస్తారు. వారా ఇద్దరినీ
తమ కత్తులతో నరికి ముక్కలు చేస్తారు. వారు ఈ
స్త్రీల పిల్లలను చంపి, వారి ఇండ్లను తగలబెడతారు.
48ఈ రకంగా ఈ దేశాన్నుండి అవమానాన్ని తొలగి
స్తాను. మిగిలిన స్త్రీలంతా మీరు చేసినటువంటి సిగ్గు
మాలిన పనులు చేయకుండ వుండేలా హెచ్చరింపబడ
తారు. 49మీరు చేసిన చెడు కార్యాలకు వారు మిమ్మల్ని
శిక్షిస్తారు. హేయమైన మీ విగ్రహాలను ఆరాధించిన
నేరానికి మీరు శిక్షింపబడతారు. అప్పుడు నేనే ప్రభువైన
యెహోవానని మీరు తెలుసుకొంటారు.”

## కుండ – మాంసం

24 నా ప్రభువైన యెహోవా మాట నాకు
చేరింది. అది చెరలో తొమ్మిదవ సంవత్సరం,
పదవనెల పదవ తేదీన జరిగింది. ఆయన ఇలా
అన్నాడు, 2‘నరపుత్రుడా, ఈ రోజు తారీఖు వేసి, ఈ
చీటీ రాయి, ‘ఈ రోజు బబులోను రాజు సైన్యం
యెరూషలేమును చుట్టుముట్టింది.’ 3విధేయులు కావ
టానికి తిరస్కరించే ఇశ్రాయేలు తెగవారికి ఈ కథ
చెప్పు. వారికి ఈ విషయాలు చెప్పుము, ‘నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:

“‘పొయ్యిమీద కుండ పెట్టుము. కుండ పెట్టి,
అందులో నీరు పోయుము.
4 దానిలో మాంసం ముక్కలు వేయాలి. మంచి
ముక్కలు వేయాలి. తొడ మాంసం, జబ్బ
మాంసం వేయాలి. మంచి ఎముకలతో కుండ
నింపాలి.

---

**నా … ద్రవ్యాన్ని** దేవునికి కానుకగా ధూపం వేయటానికి చేసే ప్రత్యేక సుగంధ ద్రవ్యాల కలయిక. దీనిని దేవాలయంలో ధూపం వేయటానికి వాడతారు. చూడండి: నిర్గమ. 30:34-38.

**నూనె** ఇది ఒక ప్రత్యేకమైన నూనె. దీనిని ప్రవక్తలను చేయటానికి, వస్తువులను పవిత్ర పర్చటానికి వాడతారు. చూడండి నిర్గమ.. 30:22-33.

**విందు** ఇది హెబ్రీలో సుహృద్భావ కానుక అని అర్థాన్నిస్తుంది. దేవుని సన్నిధిలో ప్రజలు సామూహిక విందారగించుట. ఇక్కడ ఈ ఆరాధన సమయం పెద్ద గందరగోళంగా ఉన్నట్లు తెలియజేస్తుంది. చూడండి ద్వితీ. 14:22-29; 26:1-15.

5 వీటి కొరకు మందలో వున్న మంచి జంతు
వులను (పశువులను) వాడాలి. కుండ కింద బాగా
కట్టెలు పేర్చు. మాంసం ముక్కలను వుడకబెట్టు.
ఎముకలు కూడా వుడికేలా రసాన్ని కాగబెట్టు!
6 “నా ప్రభువైన యెహోవా ఈ విధంగా చెప్పు
తున్నాడు, “హంతకులున్న ఈ నగరమునకు
కీడు మూడింది. తుప్పుమరకలున్న కుండలా
యెరూషలేము ఉంది. ఆ మచ్చలు తొలగింప
బడవు! కుండలో నుండి ప్రతి మాంసం ముక్కను
బయటకు తీయుము. ఆ మాంసాన్ని తినవద్దు!
పాడైపోయిన ఆ మాంసం నుండి యాజకులను
ఏమీ తీసుకోనివ్వద్దు.
7 యెరూషలేము ఆ తుప్పుపట్టిన కుండలా ఉంది.
ఎందువల్లననగా హత్యల రక్తం ఇంకా అక్కడ
ఉంది! రక్తాన్ని ఆమె రాళ్లమీద చిందించింది.
రక్తాన్ని ఆమె నేలపై పోసి దుమ్ముతో కప్ప
లేదు.*
8 నేనామె రక్తాన్ని రాతిబండమీద వుంచాను. అందు
వల్ల అది కప్పబడదు. చూచిన ప్రజలకు కోపం
రావాలని, అమాయక ప్రజలను చంపినందుకు
వారామెను శిక్షించాలని నేనది చేశాను.”
9 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు, “నరహంతకులతో నిండిన ఈ నగరా
నికి కీడు మూడింది! నిప్పు రాజెయ్యటానికి నేను
కట్టెలు బాగా పేర్చుతాను.
10 కుండ కింద కట్టెలు బాగా పేర్చు. నిప్పు
రాజెయ్యి. మాంసాన్ని బాగా ఉడకనియ్యి! మసాల
దినుసులు కలుపుము. ఎముకలు కాలిపోనిమ్ము.
11 పిమ్మట బొగ్గుల మీద ఖాళీ కుండను వుండ
నిమ్ము. దాని మచ్చలు కాలి మెరిసేలా దానిని
వేడెక్కనిమ్ము. దాని మచ్చలు కరిగిపోతాయి.
తుప్పు (కిలుము) రాలిపోతుంది.
12 యెరూషలేము తన మచ్చలు మాపుకోటానికి
బాగా శ్రమించవచ్చు. అయినా దాని ‘తుప్పు’
పోదు! కేవలం అగ్ని (శిక్ష) మాత్రమే ఆ తుప్పును
పోగొడుతుంది.
13 నీవు నాపట్ల పాపం చేశావు. దానితో నీ చర్మం
మాలిన్యమయ్యింది. నిన్ను కడిగి శుభ్రపర్చాలను
కున్నాను. కాని నీ వంటిమీది మచ్చలు పోకుం
డెను నీపట్ల నా తీవ్రమైన కోపం తీరేవరకు
నిన్ను కడిగే ప్రయత్నం మళ్లీ చేయను!

14 “నేనే యెహోవాను. నీకు శిక్ష విధింపబడు
తుందని చెప్పాను. అది వచ్చేలా నేను చేస్తాను. నేను
శిక్షను ఆపను. నిన్ను గురించి నేను విచారించను.
నీవు చేసిన చెడు కార్యాలకు నేను నిన్ను శిక్షిస్తాను.”
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### యెహెజ్కేలు భార్య మరణం

15 పిమ్మట యెహోవా సందేశం నాకు విన
వచ్చింది. ఆయన ఇలా అన్నాడు: 16 “నరపుత్రుడా,
నీవు నీ భార్యను మిక్కిలి ప్రేమిస్తున్నావు. కాని ఆమెను
నీనుండి నేను తీసుకొనబోతున్నాను. నీ భార్య ఆకస్మా
త్తుగా చనిపోతుంది. అయినా నీవు మాత్రం నీ విచా
రాన్ని వ్యక్తం చేయకూడదు. నీవు బిగ్గరగా ఏడ్వ
కూడదు. నీవు కన్నీళ్లు కార్చకూడదు. 17 కాని నీ వెక్కి
ఏడ్పు శబ్దాలను బయటకు వినరానీయవద్దు. చని
పోయిన నీ భార్య కొరకు నీవు ఏడ్వవద్దు. నీవు మామూ
లుగా వేసుకొనే బట్టలనే ధరించాలి. నీ తలపాగా, నీ
చెప్పులు ధరించుము. నీ విచారాన్ని వ్యక్తం చేయటానికి
నీవు నీ మీసాలను కప్పివుంచవద్దు. సామాన్యంగా
వ్యక్తులు మరణించినప్పుడు ప్రజలు తినే ఆహారాన్ని
నీవు తినవద్దు.”
18 మరునాటి ఉదయం దేవుడు చెప్పిన విషయా
లను నేను ప్రజలకు తెలియజేశాను. ఆ సాయంత్రం
నా భార్య చనిపోయింది. ఆ మరునాటి ఉదయం
దేవుడు ఆజ్ఞాపించిన విధంగా నేను అన్నీ చేశాను.
19 అప్పుడు ప్రజలు నాతో, “నీవిలా ఎందుకు
చేస్తున్నావు? దీని అర్థం ఏమిటి?” అని ప్రశ్నించారు.
20 అందుకు వారితో నేనిలా అన్నాను: “యెహోవా
మాట నాకు విన్పించింది. 21 ఇశ్రాయేలు వంశంవారితో
మాట్లాడమని ఆయన నాకు చెప్పాడు. నా ప్రభువైన
యెహోవా ఇలా చెప్పాడు: ‘చూడండి, నేను నా
పవిత్ర స్థలాన్ని నాశనం చేస్తాను. మీరా స్థలాన్ని చూచి
గర్వపడుతున్నారు. దానిని శ్లాఘిస్తూ పాటలు పాడు
తున్నారు. ఆ స్థలాన్ని చూడాలని మీరు ఉబలాట
పడుతూ వుంటారు. మీరు నిజంగా ఆ స్థలమంటే ఇష్ట
పడుతూ వున్నారు. కాని నేనాస్థలాన్ని నాశనం చేస్తాను.
మీరు మీ వెనుక వదిలిపెట్టిన మీ పిల్లలంతా యుద్ధంలో
చంపబడతారు. 22 నేను చనిపోయిన నా భార్య
విషయంలో ఏమి చేశానో, మీరు కూడా అలానే చేస్తారు.
మీ దుఃఖాన్ని సూచించటానికి మీరు మీసాలను కప్పు
కొనరు. ఒక వ్యక్తి చనిపోయినప్పుడు సామాన్యంగా
ప్రజలు తినే ఆహారాన్ని మీరు తినరు. 23 మీరు మీ
తలపాగాలు, చెప్పులు ధరిస్తారు. మీరు మీ విచారాన్ని
వ్యక్తం చేయరు. మీరు ఏడ్వరు. మీ పాపాల కారణంగా

---

**రక్తాన్ని … కప్పలేదు** మోషే ధర్మశాస్త్ర ప్రకారం ఎవరైన ఆహార నిమిత్తం ఒక జంతువును చంపినప్పుడు దాని రక్తాన్ని నేలమీద వేసి మట్టి కప్పాలి. తద్వారా ఆ జంతువు యొక్క ప్రాణాన్ని తిరిగి దేవునికి ఇస్తున్నట్లు అవుతుందని ధర్మశాస్త్రం తెలుపుతుంది. చూడండి లేవి. 17:1-16, మరియు ద్వితీ. 12:1-25. రక్తాన్ని మట్టితో కప్పకపోతే ఆ రక్తమే చంపిన వానికి వ్యతిరేకంగా సాక్షి అవుతుంది. చూడండి, ఆది. 4:10 యోబు 15:8 యెషయా 26:21.

మీరు నశించిపోతారు. మీ దుఃఖాన్ని మీరు ఒకరికొకరు
నిశ్శబ్దంగా తెలియజేసుకుంటారు. 24కావున యెహె
జ్కేలు మీకు ఒక ఉదాహరణ. అతడు చేసినవన్నీ
అలానే మీరూ చేస్తారు. ఆ శిక్షా కాలం సమీపిస్తున్నది.
అప్పుడు నేనే యెహోవానని మీరు తెలును
కుంటారు.'"

25-26"నరపుత్రుడా, ప్రజల నుండి ఆ సురక్షిత
ప్రాంతాన్ని (యెరూషలేమును) నేను తీసుకుంటాను.
ఆ అందమైన స్థలం వారిని సంతోషపెడుతూ ఉంది.
వారు దానిని చూడాలని కుతూహల పడుతూ
వుంటారు. వారు నిజంగా ఆ స్థలమంటే బాగా ఇష్టపడు
తున్నారు. ఆ నగరాన్ని, వారి పిల్లలను నేను వారినుండి
తీసుకొంటాను. ఆ సమయంలో చావగా మిగిలిన
వారిలో ఒకడు యెరూషలేమును గూర్చిన ఒక చెడు
వార్తను తీసుకొని వస్తాడు. 27అప్పుడు నీవతనితో
మాట్లాడ గలుగుతావు. ఇక నీవెంత మాత్రమూ
మౌనంగా వుండవు. ఈ రకంగా నీవు వారికి ఒక
ఉదాహరణగా ఉంటావు. నేను యెహోవానని అప్పుడు
వారు తెలుసుకుంటారు."

## అమ్మోనుకు వ్యతిరేకంగా ప్రవచనం

25 యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: 2"నరపుత్రుడా, నీవు
అమ్మోనీయులనుద్దేశించి వారికి వ్యతిరేకంగా నా
తరఫున మాట్లాడు. 3అమ్మోను ప్రజలకు ఇలా చెప్పు:
'నా ప్రభువైన యెహోవా మాటను ఆలకించండి!
నా ప్రభువైన యెహోవా ఈ విషయం చెపుతున్నాడు,
నా పవిత్ర స్థలం నాశనం చేయబడినప్పుడు మీరు
సంతోషించారు. ఇశ్రాయేలు కాలుష్యం చెందినప్పుడు
మీరు దానికి వ్యతిరేకులయ్యారు. యూదా ప్రజలు
బందీలుగా పట్టుకు పోబడినప్పుడు మీరు యూదా
వంశానికి వ్యతిరేకులయ్యారు. 4కావున తూర్పు నుండి
వచ్చే ప్రజలకు మిమ్మల్ని అప్పగిస్తాను. వారు మీ
రాజ్యాన్ని ఆక్రమిస్తారు. మీ దేశంలో వారి సైన్యాలు
స్థావరాలు ఏర్పాటు చేస్తాయి. వారు మీ మధ్య నివ
సిస్తారు. వారు మీ పంటను తింటూ, మీ పాలు
తాగుతారు.

5"'రబ్బా నగరాన్ని ఒంటెలు మేసే పచ్చిక
బయలుగా చేస్తాను. అమ్మోను దేశాన్ని గొర్రెల దొడ్డిగా
జేస్తాను. అప్పుడు నేను యెహోవానని మీరు తెలుసు
కుంటారు.

6యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
యెరూషలేము నాశనమైనప్పుడు మీరు సంతోష
పడ్డారు. మీరు మీ చేతులు చరిచి, కాళ్లు దట్టించారు.
ఇశ్రాయేలు రాజ్యాన్ని అవమానపరుస్తూ మీరు వేడుక
చేసుకున్నారు. 7కావున నేను మిమ్మల్ని శిక్షిస్తాను.
సైనికులు యుద్ధంలో తీసుకొనే విలువైన
వస్తువుల్లా* మీరు ఉంటారు. ఇతర దేశాలతో మీరు
వేరుగా అయిపోతారు. దూర దేశాల్లో మీరు చనిపోతారు.
నేను మీ దేశాన్ని నాశనం చేస్తాను! అప్పుడు నేను
యెహోవానని మీరు తెలుసుకుంటారు.'"

## మోయాబు, శేయీరులకు వ్యతిరేకంగా ప్రవచనం

8నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు, "మోయాబు, శేయీరు (ఎదోము) ప్రజలు,
'యూదా వంశం కేవలం ఇతర రాజ్యాల జనుల మాదిరే
ఉంది' అని అంటారు. 9నేను మోయాబు భుజంలోకి
నరుకుతాను. సరిహద్దుల్లో వున్న దాని నగరాలన్నిటినీ,
ఆ భూమి గొప్పదనాన్ని తీసుకుంటాను. రాజ్యానికి
తలమానికమైన బేత్యేషీమోతు, బయల్మెయోను, కిర్య
తాయిములను తీసుకుంటాను. 10తరువాత ఈ
నగరాలను తూర్పు నుండి వచ్చిన ప్రజలకు ఇస్తాను.
వారు నీ రాజ్యాన్ని చేజిక్కించు కుంటారు. తూర్పు
రాజ్యాల ప్రజలు అమ్మోను ప్రజలను నాశనం చేయ
నిస్తాను. దానితో అసలు అమ్మోను ప్రజలు ఒక దేశంగా
వుండేవారనే సత్యాన్ని ప్రజలు మర్చిపోతారు. 11అలాగే
మోయాబును నేను శిక్షిస్తాను. అప్పుడు వారంతా నేను
యెహోవానని తెలుసు కుంటారు."

## ఎదోముకు వ్యతిరేకంగా ప్రవచనం

12నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పు
తున్నాడు, "ఎదోము ప్రజలు యూదా వంశంపై
తిరుగుబాటు చేసి, చివరికి దానిని చేజిక్కించుకోవాలని
కూడ ప్రయత్నించారు. ఎదోము ప్రజలు నేరస్థులు."
13కావున నా ప్రభువైన యెహోవా చెబుతున్నదేమ
నగా, "నేనే ఎదోమును శిక్షిస్తాను. ఎదోములో వున్న
ప్రజలను, జంతువులను నాశనం చేస్తాను. తేమాను
నుండి దదాను వరకు గల మొత్తం ఎదోము, దేశాన్ని
నేను నాశనం చేస్తాను. ఎదోమీయులు యుద్ధంలో
చనిపోతారు. 14నా ప్రజలైన ఇశ్రాయేలీయులను విని
యోగించి ఎదోముకు వ్యతిరేకమవుతాను. ఈ రకంగా
ఇశ్రాయేలు కూడా ప్రజలు ఎదోముపై నాకు గల
కోపాన్ని చూపిస్తారు. అప్పుడు నేనే వారిని శిక్షించినట్లు
ఎదోము ప్రజలు తెలుసుకుంటారు." నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

## ఫిలిష్తీయులకు వ్యతిరేకంగా ప్రవచనం

15నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "ఫిలిష్తీయులున ప్రయత్నించారు పగతీర్చు
కొనుచున్నారు. వారు అతిక్రూరులు. తమ కోపం
తమలోనే ఎక్కువ కాలం వుంచుకొని తమని తాము
దహింపజేసుకొన్నారు!" 16కావున నా ప్రభువైన

**వస్తువులు** కొల్లగొట్టబడే సొమ్ము అని అర్థం.

యెహోవా చెప్పినదేమంటే, “నేను ఫిలిష్తీయులను
శిక్షిస్తాను. కెరేతీయులను నేను నాశనం చేస్తాను.
సముద్ర తీరాన నివసిస్తున్న ప్రజలను నేను సర్వ
నాశనం చేస్తాను. 17నేనా ప్రజలను శిక్షిస్తాను. వారిపై
పగ సాధిస్తాను. నా కోపంతో వారికి ఒక గుణపాఠం
నేర్పిస్తాను. అప్పుడు నేను యెహోవానని వారు
తెలుసుకుంటారు!”

## తూరును గూర్చిన విషాదవార్త

26 దేశ భ్రష్టత్వంలో (చెర) పదకొండవ
సంవత్సరపు మొదటి నెల మొదటి రోజున
యెహోవా వాక్కు నాకు చేరింది. ఆయన ఇలా
అన్నాడు: 2“నరపుత్రుడా, యెరూషలేమును గురించి
తూరు చెడ్డ విషయాలు చెప్పింది, ‘ఆహా! ప్రజలను
రక్షిస్తున్న నగర ద్వారం నాశనం చేయబడింది! నా
కొరకు నగర ద్వారం తెరవబడింది. యెరూషలేము
నగరం నాశనం చేయబడింది. అందులో నాకు విలువైన
వస్తువులు ఎన్నో లభిస్తాయి!’”
3కావున నా ప్రభువైన యెహోవా ఇలా చెపు
తున్నాడు, “తూరూ, నీకు నేను వ్యతిరేకిని! నీపై
యుద్ధం చేయటానికి అనేక దేశాల వారిని తీసుకొని
వస్తాను. తీరం మీదికి వచ్చిపడే సముద్రపు అలల్లా,
వారు నీ మీదికి మాటి మాటికీ వస్తారు.”
4దేవుడు ఇలా అంటున్నాడు: “శత్రు సైనికులు
తూరూ గోడలను నాశనం చేస్తారు. దాని బురుజులను
కూలగొడతారు. ఆమె రాజ్యంలో గల భూమి యొక్క
పైభాగపు నేలను చెరిపివేస్తాను. తూరును ఒక బండ
రాయిగా మార్చివేస్తాను. 5సముద్ర తీరాన కేవలం
చేపలు పట్టే వలలు ఆరబెట్టటానికి పనికి వచ్చే స్థలంవలె
తూరు అయిపోతుంది. ఇదే నా మాట!” నా ప్రభువైన
యెహోవా ఇలా చెపుతున్నాడు: “యుద్ధంలో సైని
కులు తీసుకొనే విలువైన వస్తువుల వలె తూరు అయి
పోతుంది. 6దాని ముఖ్య భూమిలో గల ఆమె కుమా
ర్తెలు (చిన్న పట్టణాలు) యుద్ధంలో చంపబడతారు.
అప్పుడు నేను యెహోవానని వారు తెలుసు
కుంటారు.”

## నెబుకద్నెజరు తూరును ఎదుర్కొనబోవుట

7నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “తూరు మీదికి ఉత్తర దిశనుండి ఒక
శత్రువును రప్పిస్తాను. బబులోను మహారాజైన నెబుక
ద్నెజరే ఆ శత్రువు! అతడు చాలా పెద్ద సైన్యంతో
వస్తాడు. ఆ సైన్యంలో గుర్రాలు, రథాలు, రౌతులు
ఇంకా అనేకమంది ఇతర సైనికులు ఉంటారు! ఆ
సైనికులలో చాలా దేశాల వారుంటారు. 8ముఖ్య
భూమిలో నీ కుమార్తెలను (చిన్న పట్టణాలు) నెబుక
ద్నెజరు చంపివేస్తాడు. నీ నగరాన్ని ఎదుర్కొవటానికి
అతడు బురుజులను నిర్మిస్తాడు. నీ నగరం చుట్టూ
అతడు మట్టిబాట నిర్మిస్తాడు. గోడల వరకు ఒక
మట్టిదారి వేస్తాడు. 9నీ గోడలు పగులగొట్టటానికి
అతడు దూలాలు తెస్తాడు. నీ బురుజులు కూలగొట్ట
టానికి అతడు వాడిగల పనిముట్లను ఉపయోగిస్తాడు.
10లెక్కకుమించి వున్న అతని గుర్రాలు రేపే దుమ్ముతో
నీవు కప్పబడతావు. బబులోను రాజు నగర ద్వారాల
గుండా నగర ప్రవేశం చేసినప్పుడు గుర్రాల చప్పుడుకు,
బండ్లు, రథాలు చేసే ధ్వనికి నీ గోడలు కిందికి తోయ
బడుతాయి. అవును, నీ గోడలు పెరికివేయటానికి
వారు నీ నగరంలోకి వస్తారు. 11బబులోను రాజు గుర్రం
మీద నీ నగరం గుండా వస్తాడు. అతని గుర్రాల డెక్కలు
నీ వీధులన్నిటినీ పిండిగొట్టినట్లు దట్టిస్తాయి. నీ ప్రజ
లను అతడు కత్తులతో చంపివేస్తాడు. నీ నగరంలోని
బలమైన స్తంభాలు నేలకూలుతాయి. 12నెబుకద్నెజరు
మనుష్యులు నీ ధనాన్ని దోచుకుంటారు. నీవు అమ్మ
దలచిన వస్తువులను వారు ఎత్తుకుపోతారు. వారు నీ
ప్రాకారాలను పడగొడతారు. నీ సుందర భవంతులను
వారు నాశనం చేస్తారు. నీ రాళ్లను, కలప ఇండ్లను చెత్త
వలె, సముద్రంలో పారవేస్తారు. 13అలా మీ ఆనంద
గీతికల శబ్దాన్ని ఆపివేస్తాను. ప్రజలు మీ వీణావాదనలు
మరి వినరు. 14నిన్నొక బండరాయిలా మార్చివేస్తాను.
సముద్రపు ఒడ్డున చేపలు పట్టే వలలు ఆరబెట్టటానికి
పనికివచ్చే స్థలంగా మారిపోతావు! నీవు తిరిగి
నిర్మింపబడవు. ఎందువల్లననగా యెహోవానైన నేను
ఈ విషయం చెపుతున్నాను!” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

## తూరు కొరకు ఇతర దేశాల విలాపం

15నా ప్రభువైన యెహోవా ఈ విషయం తూరుకు
చెపుతున్నాడు: “మధ్యధరా సముద్ర తీరానగల దేశాలు
నీ పతనంవల్ల కలిగిన శబ్దానికి తుళ్లిపడతాయి. నీ ప్రజలు
హింసించబడి, చంపబడినప్పుడు అది జరుగుతుంది.
16సముద్రతీర దేశరాజులంతా తమ సింహాసనాలు దిగి
తమ సంతాపాన్ని వెలిబుచ్చుతారు. వారు తమ ప్రత్యేక
రాజదుస్తులు తీసివేస్తారు. వారు తమ అందమైన బట్టలు
విసర్జిస్తారు. పిమ్మట వారు ‘భయసూచక దుస్తులు’
ధరిస్తారు. వారు నేలమీద కూర్చుని, భయంతో వణుకు
తారు. ఎంత త్వరగా నీవు నాశనం చేయబడ్డావో
చూచి వారు విస్మయం చెందుతారు. 17నిన్ను గురించి
వారు ఈ విషాద గీతిక పాడుతారు:

“‘ఓహో తూరూ, నీవొక ప్రసిద్ధ నగరానివి. నీలో
నివసించాలని ప్రజలు సముద్రాలు దాటి
వచ్చారు. నీవు చాలా ప్రఖ్యాతి చెందిన దానివి.
కాని నీవు లేకుండా పోయావు! సముద్రంలో
నీవు బలమైనదానవు. నీలాగే నీలో నివసించిన
ప్రజలు కూడా బలిష్ఠులు. నీ ముఖ్య భూమిలో
నివసించే ప్రజలు నీవంటే భయపడేలా చేశావు.

18 మరి నీవు పతనమయ్యే రోజున తీర దేశాలు
భయంతో కంపించిపోతాయి. తీరం వెంబడి
నీవెన్నో వాడలు ఏర్పాటు చేశావు. నీవు పోగానే
ఆ ప్రజలు భయభ్రాంతులవుతారు!'"

[19]నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "తూరా, నిన్ను నాశనం చేస్తాను. నీవొక
పురాతన పాడుబడ్డ నగరంలా మారతావు. అక్కడ
ఎవ్వరూ నివసించరు. సముద్రం పొంగి నీ మీదికి
వచ్చేలా చేస్తాను. ఆ గొప్ప సముద్రం నిన్ను ఆవరి
స్తుంది. [20]చనిపోయిన వాళ్లు పోయే పాతాళం లోకి
నిన్ను పంపుతాను. ఎన్నడో చనిపోయిన వారిని నీవు
కలిసికొంటావు. పాడుబడిన ఇతర పురాతన నగరాలవలె
నిన్ను కూడా కింది లోకానికి పంపివేస్తాను. సమాధికి
పోయిన ఇతరులతో నీవు కూడా ఉండిపోతావు.
అప్పుడు నీలో మరెవ్వరూ నివసించరు. మరెన్నటికీ
నీవు నివసించటానికి అనువుకాకుండా పోతావు! [21]నీకు
జరిగిన దానిని చూసి ప్రజలు భయపడిపోతారు. నీవు
నాశనమవుతావు! ప్రజలు నీకొరకు చూస్తారు; కాని
వారు నిన్ను ఇక కనుగొనలేరు!" నా ప్రభువైన
యెహోవా చెప్పిన విషయం ఇది.

### ప్రముఖ సముద్ర వ్యాపార కేంద్రంగా—తూరు

27 మరొకసారి యెహోవా వాక్కు నాకు
చేరింది. ఆయన ఇలా అన్నాడు: [2]"నర
పుత్రుడా, తూరును గురించి ఈ విషాద గీతం పాడుము.
[3]తూరును గురించిన ఈ విషయాలు తెలియ
జేయుము:

"'తూరా, నీవు సముద్రాలకు ద్వారం వంటిదానవు.
అనేక దేశాలకు నీవు వ్యాపారివి. తీరం వెంబడి
నీవనేక దేశాలకు ప్రయాణం చేస్తావు.' నిన్ను
గూర్చి నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు: "'తూరా, నీవు చాలా అందమైన
దానివని నీవనుకుంటున్నావు. నీవు చక్కని
సుందరాంగివని తలపోస్తున్నావు!
4 మధ్యధరా సముద్రం నీ నగరం చుట్టూ సరిహద్దు.
నిన్ను నిర్మించిన వారు నిన్ను సర్వాంగ సుంద
రంగా తీర్చి దిద్దారు! నీ నుండి ప్రయాణమై
వెళ్లే ఓడలవలె నీవు ఉన్నావు.
5 నీ నిర్మాణపు పనివారు శెనీరు (హెర్మోను కొండ)
నుండి తెచ్చిన తమాల వృక్షపు కర్రతో (ఓడ)
బల్లలు తయారుచేశారు. లెబానోను సరళవృక్షపు
కర్రతో నీ ఓడ స్తంభాలను చేశారు.
6 బాషాను నుండి తెచ్చిన సింధూర వృక్షపు కర్రతో
పడవ తెడ్లు చేశారు. కిత్తీయుల ద్వీపం (సైప్రస్)
నుండి తెచ్చిన దేవదారు వృక్షపు కర్రను విని
యోగించి అడుగు అంతస్థులో గదిని నిర్మించారు.
ఈ గదిని దంతపు పనితో అలంకరించారు.
7 ఈజిప్టు నుండి తెచ్చిన రంగు రంగుల నారబట్టలు
నీ తెరచాపలుగా ఉపయోగించారు. ఆ తెర
చాపయే నీ పతాకం. నీ గది తెరలు నీలం,
ఊదా రంగులను కలిగి ఉన్నాయి. అవి ఎలీషా
(సైప్రస్)* ద్వీపంనుండి వచ్చినవి.
8 సీదోనూ, అర్వదు నివాసులు నీ కొరకు నీ
పడవలు నడిపారు. తూరా, నీ వారిలో తెలివి
గలవారు నీ ఓడలకు చుక్కాని పట్టారు.
9 బిబ్లోసు (గెబలు) పెద్దలు, నేర్పరులైన పనివారు
ఓడమీద ఉండి చెక్కల మధ్య కీలువేసి ఓడను
బాగుచేశారు. సముద్రం మీదనున్న అన్ని ఓడలు,
వాటి నావికులు నీతో వర్తక వ్యాపారాలు చేయ
టానికి నీ వద్దకు వచ్చారు.'

[10]"పారసీకులు (పర్షియావారు), లూదు వారు,
పూతువారు నీ సైన్యంలో ఉన్నారు. వారు నీ యుద్ధ
వీరులు. వారు తమ డాళ్లను, శిరస్త్రాణాలను నీ గోడలకు
వేలాడదీశారు. వారు నీ నగరానికి ప్రతిష్ఠను తెచ్చి
పెట్టారు. [11]నీ నగరం చుట్టూ అర్వదు మనుష్యులు
కాపలాదారులుగా నిలబడియున్నారు. బురుజులలో
గామదు మనుష్యులు ఉన్నారు. నీ నగరం చుట్టూ
వాళ్లు తమ డాళ్లను వ్రేలాడదీసియున్నారు. వాళ్లు నీ
సౌందర్యాన్ని సంపూర్ణముగా చేశారు.
[12]"తర్షీషు* నీకున్న మంచి ఖాతాదారులలో ఒకటి.
నీవు అమ్మే అద్భుతమైన వస్తువులకు వారు వెండి,
ఇనుము, తగరం, సీసం ఇచ్చేవారు. [13]గ్రీకేయులు,
టర్కీ (తుబాలువారు) మరియు నల్ల సముద్రపు
(మెషెకు) ప్రాంత ప్రజలు నీతో వ్యాపారం చేశారు.
నీవు అమ్మే సరుకులకు వారు బానిసలను, కంచును
ఇచ్చేవారు. [14]తోగర్మా ప్రజలు నీవు అమ్మిన వస్తువు
లకు గుర్రాలను, యుద్ధాశ్వాలను, కంచర గాడిదలను
ఇచ్చేవారు. [15]దదాను ప్రజలు నీతో వ్యాపారం చేశారు.
నీవు నీ సరుకులను అనేకచోట్ల అమ్మావు. నీ
సరుకులకు మూల్యంగా వారు ఏనుగు దంతాలు,
విలువగల కోవిదారు కలపను ఇచ్చేవారు. [16]నీవద్ద అనేక
మంచి వస్తువులు ఉన్న కారణంగా ఆరాము నీతో
వ్యాపారం చేసింది. నీవు అమ్మే సరుకులకు ఎదోము
ప్రజలు పచ్చమణులు, ఊదారంగు బట్టలు, సున్నిత
మైన అల్లిక పనిచేసిన వస్త్రాలు, నాజూకైన నారబట్టలు,
పగడాలు, కెంపులు ఇచ్చేవారు.

---

**సైప్రస్** ఎలీషా ద్వీపం ఎంకోమావద్ద గల ప్రాంతం గాని, సైప్రస్ గాని, లేక ఒక గ్రీకు ద్వీపం గాని కావచ్చు.

**తర్షీషు** ఇది స్పెయిన్‌లో ఒక నగరం కావచ్చు.

[17]“యూదా ప్రజలు, ఇశ్రాయేలు ప్రజలు నీతో
వర్తకం చేశారు. వారు నీవద్ద కొనే సరుకులకు గోధుమ,
ఆలీవులు ముందు వచ్చే అత్తిపళ్లు, తేనె, నూనె, గుగ్గిలం
యిచ్చేవారు. [18]దమస్కు నీకు మరో మంచి ఖాతా
దారు. నీవద్ద ఉన్న అనేక అద్భుత వస్తువులను వారు
కొనుగోలు చేశారు. ప్రతిగా వారు హెల్బోను నుండి
తెచ్చిన ద్రాక్షారసాన్ని, తెల్ల ఉన్నిని నీకిచ్చేవారు.
[19]నీవమ్మే సరుకులకు దమస్కువారు ఉజాల్ నుండి
తెచ్చిన ద్రాక్షారసాన్ని నీకిచ్చేవారు. వాటిని ఇనుము,
కసింద మూలిక, చెరకును వారు కొన్న వస్తువులకు
మారుగా ఇచ్చేవారు. [20]వ్యాపారం ముమ్మరంగా
సాగటానికి దదాను దోహద పడింది. వారు గుర్రపు
గంతపై వేసే బట్టను, స్వారీ గుర్రాలను నీకిచ్చి సరు
కులు కొనేవారు. [21]అరబీయులు (అరేబియావారు)
కేదారు నాయకులు నీకు గొర్రె పిల్లలను, పొట్టేళ్లను,
మేకలను ఇచ్చి నీవద్ద ఉన్న సరుకులు కొనేవారు.
[22]షేబ దేశపు వర్తకులు, రామా ప్రాంత వర్తకులు
నీతో వ్యాపారం చేశారు. నీ వస్తువులకు వారు మిక్కిలి
శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యాలు, నానారకాల విలువైన
రాళ్లు, బంగారం ఇచ్చేవారు. [23]హారాను, కన్నే, ఏదెను,
షేబ, అష్షూరు మరియు కిల్మదు దేశాల ప్రజలు,
వర్తకులు నీతో వ్యాపారం చేశారు. [24]నీవద్ద కొన్న
సరుకులకు వారు నాణ్యమైన వస్త్రాలు, నీలవర్ణపు,
అల్లిక పనిచేసిన దుస్తులు, రంగు రంగుల తివాచీలు,
బాగా పురిపెట్టి పేనిన తాళ్ళు, దేవదారు కలపతో
చేయబడిన అనేక వస్తువులు ఇచ్చేవారు. ఈ వస్తు
సామగ్రులతో వారు నీతో వ్యాపారం చేశారు. [25]నీవు
అమ్మిన సరుకులు తర్షీషు ఓడలు మోసుకుపోయేవి.

“తూరూ! నీవు సరుకులతో నిండిన ఓడలాంటి
దానివి. నీవు సముద్రం మీద అనేకమైన విలువగల
సరుకులతో ఉన్నదానివి.
26 నీ పడవలను నడిపిన నావికులు నిన్ను మహా
సముద్రాల మధ్యగా తీసుకొని వెళ్తారు. కాని
బలమైన తూర్పు గాలులు నీ ఓడను నడిసము
ద్రంలో నాశనం చేస్తాయి.
27 నీ ధనమంతా సముద్రం పాలవుతుంది. నీ
ఐశ్వర్యం, నీ వర్తకం, నీ సరుకు, నీ నావికులు,
చుక్కాని పట్టేవారు, కీలుపెట్టి పడవలు బాగుచేసే
పనివారు, నీ అమ్మకపు దారులు, నీ నగరంలో
గల సైనికులు, నీ ఓడ సిబ్బంది అంతా
సముద్రంలో మునిగిపోతారు! నీవు నాశన
మయ్యే రోజున ఇదంతా జరుగుతుంది.
28 “నీ వ్యాపారులను నీవు బహుదూర ప్రాంతాలకు
పంపిస్తావు. అయితే నీ ఓడ చుక్కాని పట్టేవాని
రోదన విన్నప్పుడు ఆ ప్రాంతాలు భయంతో
వణకిపోతాయి!
29 నీ ఓడ సిబ్బంది అంతా ఓడ నుండి దుముకు
తారు. నీ నావికులు, చుక్కాని పట్టేవారు. వారు
ఓడ నుండి దుమికి ఒడ్డుకు ఈదుతారు.
30 వారు నిన్ను గురించి చాలా బాధపడతారు. వారు
రోదిస్తారు. వారు తమ తలలపై దుమ్ము పోసు
కుంటారు. వారు బూడిదలో పొర్లాడుతారు.
31 నీ కొరకు వారు తమ తలలు గొరిగించు
కుంటారు. వారు విషాద సూచక దుస్తులు ధరి
స్తారు. వారు నీకొరకు దుఃఖిస్తారు. మృతుడైన
వ్యక్తి కొరకు ఏడ్చేవానిలా వారు శోకిస్తారు.
32 “వారి భయంకర రోదనలో, ఈ విషాద గీతం
వారు ఆలపిస్తూ నీకొరకు విలపిస్తారు, “‘తూరు
వంటిది మరొక్కటి లేదు! నడి సముద్రంలో
తూరు నాశనమయ్యింది!
33 నీ వ్యాపారులు సముద్రాల మీద పయనించారు.
నీ మహా సంపదతోను, నీవు అమ్మిన సరుకుల
తోను నీవనేక మందిని తృప్తిపర్చావు. ఈ
భూమిపై గల రాజులను నీవు ఐశ్వర్యవంతులుగా
చేశావు!
34 కాని నీవు నడిసముద్రంలో, అగాధంలో ముక్కలై
పోయావు. నీవు అమ్మే వస్తువులతో పాటు నీ
మనుష్యులందరూ కూలిపోయారు!
35 తీరవాసులంతా నీ విషయంలో అదిరి
పోయ్యారు. వారి రాజులు తీవ్రంగా భయ
పడ్డారు. వారి ముఖాలు చిన్న బోయాయి.
36 ఇతర రాజ్యాల వర్తకులు నిన్ను చూసి చులకనగా
మాట్లాడారు. నీకు జరిగిన సంఘటనలు ప్రజ
లను భయభ్రాంతులను చేశాయి. ఎందువల్ల
నంటే నీవు సర్వనాశనమయ్యావు. నీవికలేవు.’”

### తూరు తనను తాను దేవునిగా భావించుకోవటం

28 యెహోవా వాక్కు నాకు వినిపించింది.
ఆయన ఇలా చెప్పాడు: [2]“నరపుత్రుడా,
తూరు పాలకునికి ఇలా చెప్పుము, ‘నా ప్రభువైన
యెహోవా నీకు చెప్పునదేమనగా:

“‘నీవు గర్విష్ఠివి! “నేనే దేవుడను! సముద్ర
మధ్యంలో దైవ స్థానంలో కూర్చున్నాను” అని
నీవంటున్నావు. “‘కాని నీవు మానవ మాత్రుడవు.
దేవుడవు మాత్రం కాదు. నీవు దేవుడవని నీకై
నీవే అనుకుంటున్నావు.
3 నీవు దానియేలు* కంటె తెలివిగలవాడవని తల
పోస్తున్నావు! రహస్యాలన్నిటినీ తెలుసుకొనగల
వని నీవనుకుంటున్నావు!
4 నీ తెలివితేటల ద్వారా, నీ వ్యాపారం ద్వారా

---

**దానియేలు** దానియేలు ప్రాచీన కాలపు జ్ఞాని.

నీవు ధనధాన్యాలు విస్తారంగా సేకరించావు. నీ
ధనాగారాలలో వెండి బంగారాలు నిలువజేశావు.
5 గొప్పదైన నీ జ్ఞానంచేత, వ్యాపారం ద్వారా నీ
సంపదను పెంచావు. ఇప్పుడా ఐశ్వర్యాన్ని చూచు
కొని నీవు గర్వపడుతున్నావు.
6 "'అందువల్ల నా ప్రభువైన యెహోవా చెపుతున్న
దేమంటే, నీవొక దేవుడిలా ఉన్నావని తలంచావు.
7 అన్య జనులను నేను నీ మీదికి రప్పిస్తాను. వారు
దేశాలన్నిటిలో అతి భయంకరులు! వారు తమ
కత్తులను దూస్తారు. నీ తెలివితేటలు సముపార్జించి
పెట్టిన అందమైన వస్తువుల మీద వాటిని ఉప
యోగిస్తారు. వారు నీ కీర్తిని నాశనం చేస్తారు.
8 వారు నిన్ను సమాధిలోకి దించుతారు. నడి సము
ద్రంలో చనిపోయిన నావికునిలా నీవుంటావు.
9 నిన్నొక వ్యక్తి చంపివేస్తాడు. అప్పుడు "నేను
దేవుణ్ణి" అని నీవు చెప్పుకోగలవా? ఆ సమ
యంలో అతడు నిన్ను తన అధీనంలో ఉంచు
తాడు. దానితో నీవొక మానవ మాత్రుడవనీ,
దేవుడవు కావనీ నీవు తెలుసుకుంటావు!
10 కొత్తవాళ్లు నిన్ను విదేశీయునిగా చూసి చంపి
వేస్తారు. నేను ఇచ్చిన ఆజ్ఞ కారణంగా ఆ పనులు
జరుగుతాయి!'" నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.

11 యెహోవా వాక్కు నాకు చేరింది. ఆయన ఇలా
అన్నాడు: 12 "నరపుత్రుడా, తూరు రాజును గురించి
ఈ విషాద గీతం ఆలపించు. అతనికి ఈ విధంగా
చెప్పుము, 'నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు:

"'నీవు ఆదర్శ పురుషుడవు. నీకు జ్ఞానసంపద
మెండు. నీ అందం పరిపూర్ణమైనది.
13 దేవుని ఉద్యానవనమైన ఏదెనులో నీవున్నావు.
నీవద్ద ప్రతి విలువైన రత్నం ఉంది- కెంపులు,
గోమేధికము, ఇతర రత్నాలు; గరుడ పచ్చలు,
సులిమానురాయి, పచ్చరాయి; నీల మణులు,
వైడూర్యము, మరకత పచ్చలు. వీటిలో ప్రతి
రాయీ బంగారంలో పొదగబడింది. నీవు సృష్టిం
పబడిన రోజుననే దేవుడు నిన్ను బలవంతుడిగా
చేశాడు.
14 "'నీవు ప్రత్యేకంగా ఎంపిక చేయబడిన
కెరూబులలో* ఒకడవై యున్నావు. నీ రెక్కలు
నా సింహాసనం మీదికి చాపబడ్డాయి. దేవుని
పవిత్ర పర్వతం మీద నిన్ను ఉంచాను. అగ్నిలా
మెరిసే ఆభరణాల గుండా నీవు నడిచావు.

15 నేను నిన్ను సృష్టించినప్పుడు నీవు మంచివాడివి,
యోగ్యుడిగా ఉన్నావు. కాని ఆ తరువాత నీవు
దుష్టుడవయ్యావు.
16 నీ వ్యాపారం నీకు చాలా ఐశ్వర్యాన్ని తెచ్చి
పెట్టింది. ధనంతో పాటు నీలో మదం (గర్వం)
పెరిగింది. దానితో నీవు పాపం చేశావు. అందువల్ల
నిన్నొక అపరిశుభ్రమైన వస్తువుగా నేను పరిగ
ణించాను. దేవుని పవిత్ర పర్వతం నుండి నిన్ను
తోసివేశాను. నీవు ప్రత్యేక కెరూబులలో ఒక
డవు. నీ రెక్కలు నా సింహాసనం పైకి చాప
బడ్డాయి. కాని అగ్నిలా మెరిసే ఆభరణాలను
వదిలిపెట్టి పోయేలా నిన్ను ఒత్తిడి చేశాను.
17 "'నీ అందాన్ని చూచుకొని నీవు గర్వపడ్డావు. నీ
గొప్పతనం యొక్క గర్వం నీ జ్ఞానాన్ని పాడు
చేసింది. అందువల్ల నిన్ను కిందికి పడదోశాను.
ఇప్పుడు ఇతర రాజులు నీవంక తేరిపార
జూస్తున్నారు.
18 నీవు చాలా పాపాలు చేశావు. నీవు చాలా
కుటిలమైన వర్తకుడవు. ఈ రకంగా పవిత్ర
స్థలాలను నీవు అపవిత్ర పర్చావు. కావున నీలో
నేను అగ్ని పుట్టించాను. అది నిన్ను దహించి
వేసింది! నీవు నేలమీద బూడిదవయ్యావు.
ఇప్పుడు ప్రతి ఒక్కడు నీ అవమానాన్ని చూడ
గలడు.
19 ఇతర దేశాల ప్రజలు నీకు సంభవించిన దాన్ని
చూచి ఆశ్చర్యపోయారు. నీకు వచ్చిన ఆపద
ప్రతి ఒక్కరిని భయపెడుతుంది. నీవు సర్వ
నాశనమయ్యావు.'"

### సీదోనుకు వ్యతిరేకంగా వర్తమానం

20 యెహోవా మాట నాకు వినిపించింది. ఆయన
ఇలా అన్నాడు: 21 "నరపుత్రుడా, సీదోను పట్టణం
వైపు చూడు. నా తరపున ఆ ప్రదేశానికి వ్యతిరేకంగా
మాట్లాడుము. 22 ఈ రకంగా చెప్పాలి, 'నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:

"'సీదోనూ, నేను నీకు వ్యతిరేకిని! నీ ప్రజలు
నన్ను గౌరవించటం నేర్చుకుంటారు! నేను
సీదోనును శిక్షిస్తాను. ప్రజలు నేనే యెహోవా
నని అప్పుడు తెలుసుకుంటారు. నేను పవిత్రు
డనని వారు నేర్చుకుని నన్ను ఆ విధంగా చూసు
కుంటారు.
23 రోగాలను, మరణాన్ని నేను సీదోనుకు పంపి
స్తాను. ఖడ్గం (శత్రు సైన్యం) నగరం వెలుపల
చాలా మందిని చంపుతుంది. వారప్పుడు నేనే
యెహోవానని తెలుసుకుంటారు!'"

---

**కెరూబులు** సాక్ష్యపు మందసం మీదనున్న కాపలా వాళ్లు,
రాజ సింహాసనపు ద్వారాలగ ఉన్నారు.

### ఇతర రాజ్యాలు ఇశ్రాయేలును పరిహసించటం మానుట

24"గతంలో ఇశ్రాయేలు చుట్టూ ఉన్న దేశాలు
దానిని అసహ్యించుకున్నాయి. కాని ఆయా దేశాలకు
కీడు జరుగుతుంది. ఇశ్రాయేలు వంశాన్ని బాధించే
ముండ్లు గాని, వదలక అంటుకునే ముండ్ల పొదలు
గాని ఇక ఎంత మాత్రం ఉండవు. అప్పుడు నేనే
ప్రభువైన యెహోవానని వారు తెలుసుకుంటారు."
25నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: "నేను ఇశ్రాయేలు ప్రజలను ఇతర దేశాలకు
చెదరగొట్టాను. కాని, ఇశ్రాయేలు వంశాన్ని నేను మళ్లీ
ఒక్క చోటికి చేర్చుతాను. అప్పుడా రాజ్యాలన్నీ నేను
పవిత్రుడనని తెలుసుకుంటాయి. అవి నన్ను ఆ విధంగా
గౌరవిస్తాయి. అప్పుడు ఇశ్రాయేలు ప్రజలు తమ
రాజ్యంలో నివసిస్తారు. ఆ రాజ్యాన్ని నేను నా సేవకుడైన
యాకోబుకు ఇచ్చాను. 26వారు ఆ రాజ్యంలో క్షేమంగా
ఉంటారు. వారు ఇండ్లు కట్టుకొని, ద్రాక్షాతోటలు
పెంచుకుంటారు. నేను వారి చుట్టూ ఉండి, వారిని
అసహ్యించుకున్న దేశాల వారిని శిక్షిస్తాను. తరువాత
ఇశ్రాయేలు ప్రజలు క్షేమంగా జీవిస్తారు. అప్పుడు నేనే
వారి దేవుడనైన యెహోవానని వారు తెలుసు
కొంటారు."

### ఈజిప్టుకు వ్యతిరేకంగా వర్తమానం

29 దేశం నుండి వెళ్లగొట్టబడిన పదవ సంవ
త్సరం, పదవనెల (జనవరి) పన్నెండవ
రోజున నా ప్రభువైన యెహోవా మాట నాకు విన
వచ్చింది. ఆయన ఇలా అన్నాడు: 2"నరపుత్రుడా,
ఈజిప్టు రాజైన ఫరోవైపు చూడు. నా తరపున నీవు
అతనికి, ఈజిప్టుకు వ్యతిరేకంగా మాట్లాడుము. 3నీవు
ఈ విధముగా మాట్లాడుము, 'నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెపుతున్నాడు:

"'ఈజిప్టు రాజువైన ఫరో, నేను నీకు విరోధిని.
నీవు నైలునదీ తీరాన పడివున్న ఒక పెద్ద క్రూర
జంతువవు. "ఈ నది నాది! ఈ నదిని నేను
ఏర్పాటు చేశాను!" అని నీవు చెప్పుకొను
చున్నావు.
4-5 "'కాని నేను నీ దవడలకు గాలం వేస్తాను. నైలు
నదిలోని చేపలు నీ చర్మపు పొలుసులను అంటు
కుంటాయి. పిమ్మట నిన్ను, నీ చేపలను నదిలో
నుంచి లాగి నేలమీదికి ఈడ్చుతాను. నీవు నేల
మీద పడతావు. నిన్నెవ్వరూ లేవనెత్తటం గాని,
పాతిపెట్టడం గాని, చేయరు. నేను నిన్ను అడవి
జంతువులకు, పక్షులకు వదిలివేస్తాను. నీవు
వాటికి ఆహారమవుతావు.
6 ఈజిప్టు నివసిస్తున్న ప్రజలంతా నేనే యెహోవా
నని అప్పుడు తెలుసుకుంటారు! "'నేనీ పనులు
ఎందుకు చేయాలి? ఇశ్రాయేలు ప్రజలు తమ
సహాయం కొరకు ఈజిప్టు మీద ఆధారపడ్డారు.
కాని ఈజిప్టు రెల్లు గడ్డిలా బలహీనమైనది.
7 ఇశ్రాయేలు ప్రజలు తమ సహాయం కొరకు
ఈజిప్టు మీద ఆధారపడ్డారు. కాని ఈజిప్టువారి
చేతులకు, భుజాలకు తూట్లు పొడిచింది. వారు
సహాయం కొరకు నీ మీద ఆధారపడ్డారు. కాని
నీవు వారి నడుము విరుగగొట్టి, మెలిపెట్టావు."'
8 కావున నా ప్రభువైన యెహోవా, ఈ విషయాలు
చెపుతున్నాడు: "నేను నీ మీదికి కత్తిని రప్పిస్తు
న్నాను. నేను నీ ప్రజలందరినీ, పశువులనూ
నాశనం చేస్తాను.
9 ఈజిప్టు నిర్మానుష్యమై నాశనమవుతుంది.
అప్పుడు నేనే యెహోవానని వారు తెలుసు
కుంటారు."

దేవుడు ఇలా చెప్పాడు: "నేనెందుకీ పనులు
చేయాలి? 'ఈ నది నాది. ఈ నదిని నేను ఏర్పాటు
చేశాను' అని నీవు చెప్పుకున్నందువల్ల! నేను ఆ పనులు
చేయదలిచాను. 10కావున నేను (దేవుడు) నీకు వ్యతి
రేకిని. అనేకంగా ఉన్న నైలు నదీ శాఖలకు నేను విరోధిని.
నేను ఈజిప్టును పూర్తిగా నాశనం చేస్తాను. మిగ్దోలు
నుండి అశ్వాన్ (సెవేనే) వరకు, మరియు ఇథియోపియ
(కూషు) సరిహద్దు వరకు గల నగరాలన్నీ నిర్మాను
ష్యమై పోతాయి. 11మనుష్యుడే గాని, జంతువే గాని
ఈజిప్టు దేశం గుండా వెళ్లరు. 12"పాడుబడ్డ దేశాల
మధ్యలో ఈజిప్టు దేశాన్ని పాడుబడ్డ నగరాల మధ్యలో
దాని నగరాన్ని పాడుగా చేస్తాను. అది నలభై సంవత్స
రాలు పాడుగా ఉంటుంది. ఈజిప్టు వారిని జనాల
మధ్యలోనికి తోలివేసి చెదరగొడతాను. చెదరగొట్టిన
దేశాల్లో నేను వారిని పరాయి వారినిగా చేస్తాను."
13నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "ఈజిప్టు ప్రజలను నేను అనేక దేశాలకు
చెదరి పోయేలా చేస్తాను. కాని నలభై సంవత్సరాల
అనంతరం ఆ ప్రజలను నేను మళ్లీ సమీకరిస్తాను.
14ఈజిప్టు బందీలను నేను వెనుకకు తీసుకొని వస్తాను.
ఈజిప్టువారిని వారి జన్మస్థలమైన పత్రోసుకు తిరిగి
తీసుకొని వస్తాను. అయితే వారి రాజ్యానికి మాత్రం
ప్రాముఖ్యం ఉండదు. 15అది ప్రాముఖ్యం లేని రాజ్యంగా
తయారవుతుంది. అది మరెన్నడూ సాటి రాజ్యాల
కంటె మిన్నగా పెరగజాలదు. అది ఇతర రాజ్యాల
మీద ఆధిపత్యం చేయలేనంత చిన్నగా దానిని నేను
తగ్గించి వేస్తాను. 16ఇశ్రాయేలు వంశం వారు తమ
సహాయం కొరకు ఈజిప్టు మీద మరెన్నడు ఆధార
పడరు. ఇశ్రాయేలీయులు తమ పాపాన్ని గుర్తు తెచ్చు

కుంటారు. తమ సహాయం కొరకు దేవుని అర్థించ
కుండా ఈజిప్టును ఆశ్రయించిన తమ పాపాన్ని వారు
గుర్తు తెచ్చుకుంటారు. నేనే ప్రభువైన యెహోవానని
వారు గుర్తిస్తారు."

**బబులోను ఈజిప్టును వశపర్చుకోవటం**

17దేశంనుండి వెళ్లగొట్టబడిన ఇరవై ఏడవ సంవ
త్సరం, మొదటి నెల (ఏప్రిల్) మొదటి రోజున దేవుని
వాక్కు నాకు వినబడింది. ఆయన ఇలా చెప్పాడు,
18"నరపుత్రుడా, బబులోను రాజైన నెబుకద్నెజరు
తూరుపై యుద్ధంలో తన సైన్యాలు తీవ్రంగా పోరాడే
లాగు చేశాడు. వాళ్ల ప్రతి సైనికుని తల గొరిగారు.
బరువైన పనులు ప్రతి సైనికుని తలమీద రుద్దబడినవి.
ప్రతి సైనికుని భుజం కొట్టుకుపోయి పుండయ్యింది.
తూరును ఓడించటానికి నెబుకద్నెజరు, అతని సైన్యం
చాలా శ్రమ పడవలసి వచ్చింది. కాని ఆ శ్రమకు
తగిన ప్రతిఫలం వారికి దక్కలేదు." 19అందువల్ల నా
ప్రభువైన యెహోవా ఈ విధంగా చెపుతున్నాడు:
"నేను ఈజిప్టు రాజ్యాన్ని బబులోను రాజైన నెబుక
ద్నెజరుకు అప్పగిస్తాను. నెబుకద్నెజరు ఈజిప్టు ప్రజ
లను పట్టుకు పోతాడు. ఈజిప్టు నుంచి విలువైన వస్తు
వుల నెన్నింటినో నెబుకద్నెజరు తీసుకొనిపోతాడు.
ఇదే నెబుకద్నెజరు సైన్యానికి పారితోషికం. 20నెబుకద్నె
జరు చేసిన కష్టానికి అతనికి నేను ఈజిప్టు రాజ్యాన్ని
ప్రతిఫలంగా ఇస్తున్నాను. వారు నా కొరకు పనిచేశారు
గనుక నేనిది వారికి చేస్తున్నాను!" నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు!

21"ఆ రోజున ఇశ్రాయేలు వంశాన్ని నేను బల
పర్చుతాను. పైగా నీ ప్రజలు ఈజిప్టువారిని చూచి
నవ్వుతారు. అప్పుడు నేను యెహోవానని వారు
తెలుసుకుంటారు."

**బబులోను సైన్యం ఈజిప్టును ఎదుర్కొంటుంది**

30 మరొకసారి యెహోవా మాట నాకు చేరింది.
ఆయన ఇలా అన్నాడు: 2"నరపుత్రుడా, నా
తరపున మాట్లాడుతూ ఈ విధంగా చెప్పుము, 'నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:

"'నీవు దుఃఖపడి, "భయంకరమైన రోజు దరిచేరు
తున్నది" అని ప్రకటించుము.
3 ఆ రోజు దగ్గరలో ఉంది! అవును. యెహోవా
తీర్పు తీర్చే రోజు దగ్గర పడుతున్నది. అది
మేఘాల రోజు. అది రాజ్యాలపై తీర్పు ఇచ్చే
సమయం!
4 ఈజిప్టు మీదకి ఒక కత్తి వస్తుంది! ఈజిప్టు పతన
మయ్యే సమయాన ఇథియోపియ (కూషు)
ప్రజలు భయంతో చెదరిపోతారు. ఈజిప్టు ప్రజ
లను బబులోను సైన్యం బందీలుగా పట్టుకుపో
తుంది. ఈజిప్టు పునాదులు కదిలిపోతాయి!

5"'ఆ అనేక మంది ప్రజలు ఈజిప్టుతో శాంతి
ఒప్పందాలు చేసుకున్నారు. కాని ఇథియోపియ
(కూషు), పూతు, లూదు, అరేబియా (మిశ్రమ
ప్రజలు), లిబ్యా (కూబు), ఇశ్రాయేలు (నా నిబంధన
దేశము) ప్రజలు - అందరూ నాశనం చేయబడతారు!

6 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "అవును. ఈజిప్టును బలపర్చిన
వారంతా పడిపోతారు! దాని బలగర్వం తగ్గి
పోతుంది. మిగ్దోలు నుండి అశ్వన్ (సెవేనే) వరకు
గల ఈజిప్టు ప్రజలంతా చంపబడతారు." నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు!
7 నాశనం చేయబడిన దేశాలలో ఈజిప్టు కూడా
కలిసిపోతుంది. శూన్యంగా మిగిలిన రాజ్యాలలో
ఈజిప్టు ఒకటి అవుతుంది.
8 ఈజిప్టులో అగ్ని రగిలిస్తాను. దానితో దాని సహా
యకులు నాశనమై పోతారు. అప్పుడు నేనే
యెహోవానని వారు తెలుసుకుంటారు.

9"'ఆ సమయాన నేను దూతలను పంపుతాను.
వారు ఓడలలో పయనించి ఇథియోపియ (కూషు)కు
దుర్వార్త తీసుకొని వెళతారు. ఇథియోపియ ఇప్పుడు
క్షేమంగా ఉన్నాననుకుంటూ ఉంది. కాని ఈజిప్టు శిక్షించ
బడినప్పుడు ఇథియోపియ ప్రజలు భయంతో
కంపించిపోతారు. ఆ సమయం వస్తూ ఉంది!

10 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "బబులోను రాజైన నెబుకద్నెజరును
నేను వినియోగించి ఈజిప్టు ప్రజలను నాశనం
చేస్తాను.
11 నెబుకద్నెజరు, అతని మనుష్యులు జాతులన్నిటి
లోనూ అతి భయంకరులు. ఈజిప్టును నాశనం
చేయటానికి వారిని తీసుకొనివస్తాను. ఈజిప్టు
మీద వారు తమ కత్తులు దూస్తారు. వారు దేశాన్ని
శవాలతో నింపివేస్తారు.
12 నైలునది ఎండిపోయేలా నేను చేస్తాను. అలా
ఎండిన భూభాగాన్ని దుష్ట జనులకు అమ్మి
వేస్తాను. ఆ భూమిని నిర్మానుష్యం చేయటానికి
నేను అన్యజనులను వినియోగిస్తాను. యెహోవా
నైన నేను ఈ విషయాలు చెపుతున్నాను!"'

**ఈజిప్టు విగ్రహాలు నాశనం చేయబడుతాయి**

13 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "ఈజిప్టులో ఉన్న విగ్రహాలను కూడా
నేను నాశనం చేస్తాను. మెంఫిస్ (నోపు)లో ఉన్న

విగ్రహాలన్నిటినీ తొలగిస్తాను. ఈజిప్టులో ఇక
ఎంత మాత్రం నాయకుడెవడు ఉండడు. ఈజిప్టు
రాజ్యంలో భయాన్ని పుట్టిస్తాను.
14 పత్రోసును శూన్య రాజ్యంగా మార్చివేస్తాను.
సోయనులో అగ్ని రగుల్చుతాను. ‘నో’ నగరాన్ని
శిక్షిస్తాను.
15 ఈజిప్టుకు కోటవలె అండగా నిల్చిన సీను మీద
నా కోపాన్ని కుమ్మరిస్తాను! ‘నో’ నగర వాసులను
నేను నాశనం చేస్తాను.
16 ఈజిప్టులో నేను అగ్ని ముట్టిస్తాను. సీను అనబడే
ప్రాంతం భయానికి గురియవుతుంది. ‘నో’
నగరంలోకి సైనికులు విరుచుకుపడ్తారు. శత్రు
వులు దాన్ని పగటిపూట ఎదుర్కొంటారు.
17 ఓను, పిబేసెతు పట్టణాల యువకులు
యుద్ధంలో చనిపోతారు. స్త్రీలు బందీలుగా
పట్టుకుపోబడతారు.
18 ఈజిప్టు ఆధిపత్యాన్ని (కాడిని) తహపనేసులో
నేను విరిచినప్పుడు అక్కడ అంధకారం ఏర్పడు
తుంది. ఈజిప్టు యొక్క బలగర్వం అంతమవు
తుంది! ఈజిప్టును ఒక మేఘం ఆవరిస్తుంది.
ఆమె కుమార్తెలు చెరపట్టబడి తీసుకుపో
బడతారు.
19 ఆ విధంగా నేను ఈజిప్టును శిక్షిస్తాను. అప్పుడు
నేనే యెహోవానని వారు తెలుసుకుంటారు!’”

### ఈజిప్టు శాశ్వతంగా బలహీనమవటం

20చెరకి కొనిపోబడిన పదకొండవ సంవత్సరం
మొదటి నెల (ఏప్రిల్) ఏడవ రోజున యెహోవా
వాక్కు నాకు వినిపించింది. ఆయన ఇలా అన్నాడు:
21“నరపుత్రుడా, ఈజిప్టు రాజైన ఫరో చేతిని (శక్తిని)
నేను విరచివేశాను. ఆ చేతికి ఎవ్వరూ కట్టు కట్టలేరు.
అది నయం కాదు. ఆ చేయి మళ్లీ కత్తి పట్టే బలాన్ని
పుంజుకోలేదు.”

22నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “నేను ఈజిప్టు రాజైన ఫరోకు విరోధిని.
అతని మంచి చేతిని, గతంలో విరిగిన అవిటి చేతిని,
రెండింటినీ నేను విరుగగొడతాను. అతని చేతి నుండి
కత్తి జారి కిందపడేలా చేస్తాను. 23ఈజిప్టువారిని వివిధ
దేశాలకు చెదరగొడతాను. 24బబులోను రాజు చేతు
లను నేను బలపర్చుతాను. నా కత్తిని అతని చేతిలో
ఉంచుతాను. కాని ఫరో చేతులను నేను విరుగ గొడ
తాను. అప్పుడు ఫరో మరణించుతాడు. వేదన పడేలా
బాధపడతాడు. 25ఆ విధంగా బబులోను రాజు చేతులను
బలపర్చి, ఫరో రాజు చేతులను నేను బలహీన పర్చు
తాను. నేనే యెహోవానని వారప్పుడు తెలుసు
కుంటారు.

“నేను నా కత్తిని బబులోను రాజు చేతిలో ఉంచు
తాను. అతడా కత్తిని ఈజిప్టు రాజ్యం మీదికి విసురు
తాడు. 26నేను ఈజిప్టువారిని వివిధ దేశాలకు తరిమి
వేస్తాను. అప్పుడు నేను యెహోవానని వారు తెలుసు
కొంటారు.”

### దేవదారు వృక్షంవంటి అష్షూరు

31 చెరకి కొనిపోబడిన పదకొండవ సంవత్సరం
మూడవ నెల మొదటి రోజున యెహోవా
మాట నాకు వినిపించింది. ఆయన ఇలా అన్నాడు:
2“నరపుత్రుడా, ఈజిప్టు రాజైన ఫరోకు మరియు
అతని ప్రజలకు ఈ విషయాలు తెలియజేయుము,
“గొప్పతనంలో నీవు ఎవరిలా ఉన్నావు?
3 మిక్కిలి ఉన్నతంగా పెరిగి తన అందమైన కొమ్మ
లతో దట్టమైన నీడనిస్తూ లెబానోనులో పెరిగిన
కేదారు వృక్షం అష్షూరు రాజ్యమే. దాని తల
మేఘాల్లో ఉంది!
4 మంచి నీటివనరు చెట్టును బాగా పెరిగేలా చేసింది.
లోతైన నది అది ఎత్తుగా పెరగటానికి దోహద
మిచ్చింది. చెట్టు నాటబడిన ప్రాంతంలో నదులు
ప్రవహించాయి. దాని కాలువలే అక్కడి పొలాల్లో
ఉన్న చెట్లకు నీటిని అందజేశాయి
5 ఆ వృక్షం అలా మిగిలిన చెట్లన్నిటిలో పొడవుగా
పెరిగింది. దానికి ఎన్నో కొమ్మలు పెరిగాయి.
నీరు పుష్కలంగా ఉంది. అందువల్ల దాని కొమ్మలు
విస్తరించాయి.
6 కావున పక్షులన్నీ దాని కొమ్మల్లో గూళ్లు కట్టు
కున్నాయి. ఆ ప్రాంతంలో జంతువులన్నీ దాని
చల్లని నీడలో తమ పిల్లల్ని పెట్టాయి. గొప్ప
రాజ్యాలన్నీ ఆ చెట్టు నీడలో నివసించాయి!
7 ఆ విధంగా ఆ చెట్టు తన గొప్పతనంలోను,
తన పొడవైన కొమ్మలతోను, ఎంతో అందంగా
కన్పించింది. ఎందువల్ల ననగా దానివేళ్ళు నీరు
బాగా అందేవరకు నాటుకున్నాయి!
8 దేవుని ఉద్యానవనంలో ఉన్న కేదారు వృక్షాలు
కూడా ఈ చెట్టంత పెద్దగా లేవు. దీనికి ఉన్నన్ని
కొమ్మలు సరళ వృక్షాలకు కూడా లేవు. అక్షోట
(మేడి) చెట్లకు అసలిటువంటి కొమ్మలే లేవు.
దేవుని ఉద్యానవనంలో ఇంత అందమైన చెట్టే
లేదు.
9 అనేకమైన కొమ్మలతో ఈ చెట్టును నేను అంద
మైనదిగా చేశాను. ఏదెనులో దేవుని ఉద్యాన
వనంలో ఉన్న చెట్లన్నీ దీనిపట్ల అసూయ
చెందాయి!’”

10కావున నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు, “ఈ చెట్టు విస్తరించి పొడవుగా పెరి
గింది. దాని తలని మబ్బుల్లో పెట్టుకుంది. దాని ఎత్తు
చూసుకొని అది గర్వపడింది. 11అందువల్ల ఒక పరాక్ర
మశాలియగు రాజు ఆ చెట్టును ఉంచుకొనేలా చేస్తాను.

అది చేసిన చెడ్డ పనులకు ఆ పాలకుడు దానిని శిక్షిస్తాడు.
అతని చెడు తనంవల్ల నేను ఆ చెట్టును నాతోటనుండి
తీసుకొంటిని. 12దేశాలన్నిటిలో కొత్తవాళ్లు, చాలా
క్రూరులయిన వాళ్లు దానిని నరికి పడవేశారు. ఆ చెట్టు
కొమ్మలు కొండల మీదను, లోయలలోను చెల్లా
చెదరుగా పడవేశారు. ఆ దేశం గుండా ప్రవహించే నదు
లలో విరిగిన కొమ్మలు కొట్టుకు పోయాయి. ఆ
చెట్టు కింద నీడ ఇక ఏ మాత్రం లేకపోవటంతో
వివిధ దేశాల ప్రజలంతా దానిని వదిలిపెట్టారు.
13ఇప్పుడు పక్షులు పడిపోయిన ఆ చెట్టు మీదే నివ
సిస్తాయి. దాని పడిపోయిన కొమ్మలమీద అడవి
జంతువులన్నీ నడుస్తాయి.

14"ఆ నీటి పక్కనున్న ఏ చెట్టూ ఇక మీదట
గర్వపడదు. అవి ఆకాశాన్నంటుకోవాలని తాపత్రయ
పడవు. ఆ నీరును పీల్చే బలమైన చెట్లలో ఏ ఒక్కటీ
పొడవుగా ఉన్నానని గొప్పలు చెప్పుకోదు. ఎందువల్ల
నంటే అవన్నీ చనిపోవటం ఖాయం. అవన్నీ పాతాళ
లోకంలోకి పోతాయి. అవి (వారు) మృతి చెందిన
వారితో పాతాళంలో కలవటం తథ్యం."

15నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు, "ఆ చెట్టు పాతాళానికి వెళ్లిన రోజున ప్రజ
లంతా సంతాపం పొందేలా చేశాను. అగాధమైన సము
ద్రంలో దాన్ని కప్పివేశాను. దాని నదులన్నిటినీ నిలుపు
జేశాను. నీరంతా ప్రవహించటం ఆగిపోయింది. లెబా
నోను దాని కొరకు దుఃఖించేలా చేశాను. ఆ మహా
వృక్షం కొరకు ఆ ప్రాంతంలో ఉన్న చెట్లన్నీ విచా
రంతో క్రుంగిపోయాయి. 16ఆ చెట్టు పడిపోయేలా
నేను చేశాను. అది పతనమయినప్పుడు వచ్చిన
శబ్దంతో దేశాలు భయంతో వణికిపోయాయి. ఆ వృక్షం
మృతుల స్థానానికి వెళ్లేలా చేశాను. అది మృతులతో
కలిసి ఉండటానికి పాతాళానికి చేరింది. గతంలో ఏదె
నులో ఉన్న అన్ని చెట్లు, లెబానోనులో ఉన్న శ్రేష్ఠమైన
చెట్లు ఆ నీటిని పీల్చాయి. ఆ చెట్లు పాతాళ లోకంలో
ఓదార్చబడ్డాయి.17అవును. మృతుల స్థానానికి మహా
వృక్షంతో పాటు మిగిలిన చెట్లు కూడ పోయాయి.
యుద్ధంలో హతులైన ప్రజలను అవి కలిశాయి. ఆ
మహా వృక్షం మిగిలిన చెట్లను బలపర్చింది. దేశాల
మధ్య ఆ మహా వృక్షం యొక్క నీడలో ఆ చెట్లు నివ
సించాయి.

18"కావున ఈజిప్టూ, ఏదెనులో నిన్ను ఏ చెట్టుతో
పోల్చను? ఆ చెట్లన్నీ పెద్దవీ, బలిష్ఠమయినవీ. ఏదెను
లోని చెట్లతో పాటు నీవు అధోలోకానికి పోతావు.
విదేశీయులతోను* యుద్ధంలో మరణించిన వారి
తోను కలిసి నీవు మృత్యుస్థానంలో పడివుంటావు.
"ఫరోకు మరియు అతని ప్రజలందరికీ ఇది సంభవి
స్తుంది!" నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.

### ఫరో ఒక సింహమా? మహా సర్పమా?

32 చెరకి కొనిపోబడిన పన్నెండవ సంవత్సరం,
పన్నెండవ నెల (మార్చి) మొదటి రోజున
యెహోవా వాక్కు నాకు వినిపించింది. ఆయన ఇలా
అన్నాడు: 2"నరపుత్రుడా, ఈజిప్టు రాజైన ఫరోను
గురించి ఈ విషాద గీతిక ఆలపించు. అతనితో ఇలా
చెప్పు:

""దేశాల మధ్య గర్వంగా తిరుగాడే బలమైన యువ
కిశోరం అని నీకు నీవే తలుస్తున్నావు. కాని,
నిజానికి నీవు సముద్రాల్లో తిరుగాడే మహాసర్పా
నివా. నీటి కాలువల గుండా నీ దారిని తీసుకొంటు
న్నావు. నీ కాళ్లతో కెలికి నీళ్లను మురికి చేస్తు
న్నావు. నీవు ఈజిప్టు నదులను కెలుకు
తున్నావు.""

3 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "అనేక మంది ప్రజలను నేను ఒక
దగ్గరికి చేర్చాను. నేనిప్పుడు నా వలను నీ మీదికి
విసురుతాను. ఆ ప్రజలంతా అప్పుడు నిన్ను
లోపలకి లాగుతారు.
4 పిమ్మట నిన్ను ఎండిన నేలపై నేను పడేస్తాను.
నిన్ను పొలాల్లో విసరివేస్తాను. నిన్ను తినటానికి
పక్షులన్నిటినీ రప్పిస్తాను. కడుపునిండా నిన్ను
తినటానికి అన్నిచోట్ల నుండి అడవి జంతువులను
రప్పిస్తాను.
5 నీ కళేబరాన్ని పర్వతాల మీద చిందర వందరగా
వేస్తాను. నీ కళేబరంతో లోయలు నింపుతాను.
6 నీ రక్తాన్ని పర్వతాలపై నేను ఒలక బోస్తాను.
అది భూమిలో ఇంకిపోతుంది. నదులన్నీ నీతో
నిండి ఉంటాయి.
7 నిన్ను మాయం చేస్తాను. నేను ఆకాశాన్ని కప్పివేసి
నక్షత్రాలు కన్పించకుండా చేస్తాను. ఒక మేఘంతో
నేను సూర్యుణ్ణి కప్పివేయగా చంద్రుడు ప్రకా
శించడు.
8 ఆకాశంలో మెరిసే జ్యోతులన్నీ నీపై వెలుగును
ప్రసరించకుండా చేస్తాను. నీ దేశమంతటా నేను
చీకటిమయం చేస్తాను.

9"నిన్ను నాశనం చేయటానికి నీ మీదికి నేను
శత్రువును తీసుకొని వచ్చినట్లు తెలుసుకొని అనేక
మంది ప్రజలు దుఃఖముఖులై, తల్లక్రిందులౌతారు. నీ
వెరుగని దేశాలు కూడా కలవరపాటు చెందుతాయి.
10నీ విషయంలో చాలా మంది ఆశ్చర్యపోయేలా
చేస్తాను. నేను నా కత్తిని వారి ముందు ఝళిపించడానికి
మునుపే వారి రాజులు నీ విషయంలో విపరీతంగా

---

**విదేశీయులు** అక్షరాల సున్నతి సంస్కారంలేని జనులు.

భయపడతారు. నీవు పతనమైన రోజున ప్రతిక్షణం
రాజులు భయంతో కంపించి పోతారు. ప్రతీ రాజూ
తనభద్రత కొరకు భయపడతాడు."
11దానికి తగిన కారణం నా ప్రభువైన యెహోవా
ఇలా తెలియజేస్తున్నాడు: "బబులోను రాజు యొక్క
కత్తి నీపై యుద్ధానికి వస్తుంది. 12యుద్ధంలో నీ ప్రజలను
చంపటానికి నేను ఆ సైనికులను వినియోగిస్తాను.
అన్ని దేశాలలో అతి భయంకరమైన దేశం నుండి ఆ
సైనికులు వస్తారు. ఈజిప్టు అతిశయపడే వస్తువుల
న్నిటినీ వారు ధ్వంసం చేస్తారు. ఈజిప్టు ప్రజలు నాశనం
చేయబడతారు. 13ఈజిప్టు నదీ తీరాలలో అనేకమైన
జంతువులున్నాయి. ఆ జంతువులన్నిటినీ కూడ నేను
నాశనం చేస్తాను! ప్రజలిక ఎంతమాత్రం తమ కాళ్లతో
నీటిని మురికిచేయరు. ఆవుల గిట్టలు ఇక ఎంత
మాత్రం నీటిని మురికి చేయవు. 14ఆ విధంగా ఈజిప్టు
నీటిని నేను శాంతపర్చుతాను. వారి నదులు ప్రశాంతంగా
ప్రవహించేలా చేస్తాను. అవి నూనెవలె మృదువుగా జాలు
వారుతాయి." నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు
చెప్పాడు. 15"నేను ఈజిప్టు దేశాన్ని ఏమీ లేకుండా
చేస్తాను. ఆ రాజ్యం సమస్తాన్ని కోల్పోతుంది. ఈజి
ప్టులో నివసిస్తున్న ప్రజలందరినీ నేను శిక్షిస్తాను.
అప్పుడు నేనే యెహోవానని, ప్రభువునని వారు
గుర్తిస్తారు!
16"ఈజిప్టు కొరకు ప్రజలు పాడే ఒక విషాద గీతిక
ఇది. ఇతర దేశాల కుమార్తెలు (నగరాలు) ఈజిప్టును
గూర్చి ఈ విలాప గీతం పాడతారు. ఈజిప్టును గురించి,
దాని ప్రజల గురించి వారు దీనిని విలాప గీతంగా
ఆలపిస్తారు. " నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు
చెప్పాడు.

### ఈజిప్టు నాశనమవబోవటం

17దేశం నుండి వెళ్లగొట్టబడిన పన్నెండవ సంవత్స
రంలో, అదే నెలలో పదిహేనవ రోజున యెహోవా
వాక్కు నాకు వినిపించింది. ఆయన ఇలా అన్నాడు:
18"నరపుత్రుడా, ఈజిప్టు ప్రజల కొరకు విలపించు.
ఈజిప్టును, ఇతర బలమైన దేశాల కుమార్తెలను
సమాధికి నడిపించు. పాతాళానికి చేరిన ఇతర జనులతో
ఉండటానికి వారిని అధోలోకానికి నడిపించు.
19"ఈజిప్టూ నీవు ఇతరులెవరికంటెను గొప్ప దానివి
కాదు! మృత్యు స్థానానికి వెళ్లు! వెళ్లి, అక్కడ అన్య
జనులతో పడివుండు.
20"యుద్ధంలో హతులైన వారందరితో కలిసి ఉండ
టానికి ఈజిప్టు వెళుతుంది. శత్రువు ఆమెను, ఆమె
జనులను దూరంగా లాగి పడవేసినాడు.
21"బలవంతులు, పరాక్రమశాలులు యుద్ధంలో
చంపబడ్డారు. ఆ పరాయి వారంతా మృత్యు స్థలానికి
దిగి వెళ్లారు. ఆ ప్రదేశం నుండి చనిపోయిన మనుష్యులు
ఈజిప్టుతోను, దాని సహాయకులతోను మాట్లాడతారు
వారు కూడ యుద్ధంలో చంపబడతారు.
22-23"అష్షూరు, దాని సర్వ సైన్యము మృత్యు
లోకంలో ఉన్నాయి. వారి సమాధులు అడుగున ఆ
రంధ్రంలో ఉన్నాయి. అష్షూరు సైనికులంతా
యుద్ధంలో హతులయ్యారు. అష్షూరు సైన్యం దాని
సమాధి చుట్టూ మూగింది. బతికి ఉన్నప్పుడు వారు
ప్రజలను భయపెట్టారు. కాని వారంతా ఇప్పుడు ప్రశాం
తంగా ఉన్నారు. వారంతా యుద్ధంలో చంపబడ్డారు.
24"ఏలాము అక్కడ ఉన్నది. దాని సైన్యమంతా
దాని సమాధి చుట్టూ ఉంది. వారంతా యుద్ధంలో
చనిపోయారు. ఆ విదేశీయులు భూమిలోకి లోతుగా
పోయారు. బతికి ఉన్నప్పుడు వారు ప్రజలను భయ
పెట్టారు. వారి అవమానాన్ని వారు పాతాళానికి తమ
తోనే తీసుకొని పోయారు. 25ఏలాముకు, యుద్ధంలో
చనిపోయిన సైనికులందరికీ వారు పడక ఏర్పాటు
చేశారు. ఏలాము సైన్యమంతా దాని సమాధి చుట్టూ
చేరింది. ఆ విదేశీయులందరూ యుద్ధంలో హతుల
య్యారు. వారు జీవించి ఉన్నప్పుడు వారు ప్రజలను
భయపెట్టారు. కాని వారి అవమానాన్ని వారు తమతో
పాతాళానికి తీసుకొని పోయారు. చనిపోయిన వారంద
రితో పాటు వారు ఉంచబడ్డారు.
26"మెషెకు, తుబాలు మరియు వాటి సైన్యాలు
అక్కడ ఉన్నాయి. వాటి సమాధులు వాటిచుట్టూ
ఉన్నాయి. విదేశీయులు యుద్ధంలో చంపబడ్డారు.
వారు జీవించి ఉన్న సమయంలో వారు ప్రజలను
భయపెట్టారు. 27కాని ఏనాడో చనిపోయిన పరాక్రమ
శాలుల పక్కన వారిప్పుడు పడుకొని ఉన్నారు! వారు
తమ యుద్ధాయుధాలతో సమాధి చేయబడ్డారు. వారి
కత్తులు వారి తలల కింద ఉంచబడతాయి. కాని వారి
పాపాలు మాత్రం వారి ఎముకల మీద ఉన్నాయి.
ఎందువల్లనంటే వారు జీవించి వున్న కాలంలో వారు
ప్రజలను భయపెట్టారు.
28"ఈజిప్టూ, నీవు కూడా నాశనం చేయబడతావు.
సున్నతి సంస్కారం లేని విదేశీయులు నిన్ను పడు
కోబెడతారు. యుద్ధంలో చనిపోయిన ఇతర సైనికు
లతో పాటు నీవు కూడా ఉంటావు.
29"ఎదోము కూడా అక్కడ ఉన్నాడు. అతని
రాజులు, ఇతర నాయకులు అతనితో అక్కడ ఉన్నారు.
వారు శూరులైన సైనికులు కూడా. అయినా వారు
యుద్ధంలో చనిపోయిన విదేశీయులతో పడివున్నారు.
వారంతా అక్కడ పరాయి వారితో పడివున్నారు. బాగా
లోతైన రంధ్రంలో ప్రజలతో వారు అక్కడ ఉన్నారు.
30"ఉత్తరదేశ రాజులంతా అక్కడ ఉన్నారు! సీదో
నుకు చెందిన సైనికులంతా అక్కడ ఉన్నారు. వారి
బలం ప్రజలను భయపెట్టింది. కాని వారు ఇబ్బంది
పడ్డారు. ఆ విదేశీయులు కూడా యుద్ధంలో చని
పోయిన ఇతరులతో పండుకొని ఉన్నారు. వారితో
పాటు తమ అవమానాన్ని కూడా పాతాళానికి తీసుకొని
పోయారు.

[31]“మృత్యు లోకంలోకి పోయిన ప్రజలను ఫరో
చూస్తాడు. అతడు, అతనితో ఉన్న అతని మనుష్యు
లందరూ అప్పుడు ఊరట చెందుతారు. అవును, ఫరో
మరియు అతని సర్వ సైన్యం యుద్ధంలో చంప
బడతారు.” ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.
[32]“ఫరో జీవించి ఉన్న కాలంలో అతనంటే ప్రజలు
భయపడేలా నేను చేశాను. కాని ఇప్పుడతడు విదేశీయు
లతో పడి ఉంటాడు. ఫరో, అతని సైన్యం యుద్ధంలో
చనిపోయిన ఇతర సైనికులతోపాటు పడివుంటారు.”
నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

## ఇశ్రాయేలుకు కావలివానిగా దేవుడు యెహెజ్కేలును ఎంపిక చేయటం

33 యెహోవా వాక్కు నాకు వినిపించింది.
ఆయన ఇలా అన్నాడు: [2]“నరపుత్రుడా, నీ
ప్రజలతో మాట్లాడు. వారికి ఈ రకంగా చెప్పు, ‘ఈ
దేశం మీదికి నేను శత్రు సైన్యాలను రప్పించవచ్చు.
అది జరిగినప్పుడు ప్రజలు ఒకనిని కావలివానిగా ఎంపిక
చేస్తారు. [3]ఈ కావలివాడు శత్రుసైన్యాలు రావటం చూచి
బూర ఊది ప్రజలను హెచ్చరిస్తాడు. [4]ప్రజలు ఆ
హెచ్చరికను విని కూడా జాగ్రత్త పడకపోతే శత్రువు
వచ్చి వారిని బందీలుగా పట్టుకుపోతాడు. అటువంటి
వ్యక్తి తన మరణానికి తనే బాధ్యుడవుతాడు. [5]అతడు
బాకా విన్నాడు. అయినా అతడు హెచ్చరికను లెక్క
చేయలేదు. అందువల్ల అతని చావుకు అతనినే నిందిం
చాలి. ఆ హెచ్చరికను గనుక అతడు లక్ష్య పెట్టి
ఉంటే అతడు తన ప్రాణాన్ని కాపాడు కొనగలిగేవాడు.
[6]“‘ఒకవేళ కావలివాడు శత్రుసైనికులు రావటం గమ
నించి కూడా బూర ఊదకపోవచ్చు. అనగా కావలివాడు
ప్రజలను హెచ్చరించలేదన్నమాట. అప్పుడు శత్రువు
వారిని పట్టుకొని బందీలుగా తీసుకుపోతాడు. తన
పాపం కారణంగా ఒక వ్యక్తి పట్టుబడతాడు. అయినా
కావలివాడు ఆ మనిషి చావుకు బాధ్యుడైవున్నాడు.’
[7]“‘నరపుత్రుడా, ఇప్పుడు నేను ఇశ్రాయేలు వంశానికి
నిన్ను కావలివానిగా నియమిస్తున్నాను. నీవు నా నోటి
నుండి ఒక వర్తమానం వింటే, నా తరపున ప్రజలను
హెచ్చరించాలి.
[8]‘ఈ దుష్ట వ్యక్తి చనిపోతాడు’ అని నేను నీకు
చెప్పవచ్చు. అప్పుడు నా తరపున నీవు వెళ్లి అతనిని
హెచ్చరించాలి. నీవు వెళ్లి ఆ దుష్ట వ్యక్తిని హెచ్చరించక,
తన జీవిత విధానాన్ని మార్చుకోమని చెప్పకపోతే
తన పాప ఫలంగా అతడు చనిపోతాడు. కాని అతని
చావుకు నేను నిన్ను బాధ్యుణ్ణి చేస్తాను.
[9]ఒక వేళ నీవా దుష్టవ్యక్తిని తన దుర్మార్గపు జీవితాన్ని
మార్చుకొని, పాపం చేయటం మానమని చెప్పి
నావనుకో, అయినా ఆ వ్యక్తి పాపం చేయటం మానక
పోతే తన పాపాలకు ఫలితంగా అతడు చనిపోతాడు.
కానీ నీవు నీ ప్రాణాన్ని కాపాడుకుంటావు.

## ప్రజా నాశనాన్ని చూడటం దేవునికి ఇష్టంకాదు

[10]“కావున నరపుత్రుడా, నా తరపున ఇశ్రాయేలు
వంశం వారితో మాట్లాడు. అప్పుడు వారు, ‘మేము
పాపం చేశాము. ధర్మాన్ని అతిక్రమించాము. మా
పాపాలు భరింపరానివి. ఆ పాపాల కారణంగా మేము
కుళ్లిపోతున్నాము. మేము జీవించాలంటే ఏమి
చేయాలి?’ అని అడుగవచ్చు.
[11]“నీవు వారితో ఇలా చెప్పాలి, ‘నా ప్రభువైన
యెహోవా చెప్పేదేమంటే, నా జీవం తోడుగా ప్రజలు
చనిపోతూ ఉంటే చూడటం నాకు ఇష్టముండదని
మీకు మాట ఇస్తున్నాను. దుష్టులు చనిపోవటం కూడా
నాకు ఇష్టంలేనిపని. వారు చనిపోవాలని నేను కోరను.
ఆ దుష్ట జనులంతా నా వద్దకు తిరిగి రావాలనే నేను
కోరుకుంటాను. వారు తమ జీవితాలను మార్చుకొని
నిజంగా జీవించాలని నేను కోరుకుంటున్నాను! అందు
వల్ల నా వద్దకు తిరిగి రండి! చెడు కార్యాలు చేయటం
మానండి! ఓ ఇశ్రాయేలు వంశీయులారా, మీరెందుకు
మరణించాలి?’
[12]“నరపుత్రుడా, నీ ప్రజలకు ఇలా చెప్పు, ‘ఒక
మంచి వ్యక్తి దుష్టుడై పాపం చేయటం మొదలు పెడితే,
అతడు గతంలో చేసిన మంచి పనులు అతనిని రక్షించ
లేవు. ఆ చెడ్డ వ్యక్తి చెడునుండి పరివర్తన చెంది మంచి
వాడై సత్కార్యాలు చేస్తే, గతంలో అతడు చేసిన పాపపు
పనులు అతనిని నాశనం చేయలేవు. కావున ఒక్క
విషయం గుర్తుపెట్టుకో. ఒక మంచి వ్యక్తి దుర్మార్గుడై
పాపం చేయడం మొదలుపెడితే అతడు గతంలో చేసిన
మంచి పనులు అతనిని రక్షించలేవు.’
[13]“ఒక మంచి మనిషికి అతడు జీవిస్తాడని నేను
చెప్పవచ్చు. తద్వారా ఆ మంచి మనిషి తను పూర్వం
చేసిన సత్కార్యాలు అతనిని రక్షించగలవని అను
కోవటం మొదలు పెట్టవచ్చు. ఆ రకమైన భావనతో
అతడు చెడు కార్యాలు చేయటానికి పాల్పడవచ్చు.
కాని గతంలో అతడు చేసిన మంచి పనులను నేను
గుర్తు పెట్టుకోను! తాను చేయ మొదలు పెట్టిన పాప
కార్యాల కారణంగా అతడు చనిపోతాడు.
[14]“లేదా, ఒక దుర్మార్గునితో అతడు చచ్చిపోతాడని
నేను చెప్పవచ్చు. అయితే అతడు తన జీవితాన్ని
మార్చుకోవచ్చు. అతడు పాపం చేయటం మాని,
సన్మార్గాన్ని అవలంబించవచ్చు. అతడు మంచివాడై
న్యాయశీలి కావచ్చు. [15]అతడు అప్పులిచ్చినప్పుడు
తాను కుదువపెట్టుకున్న వస్తువులను తిరిగి ఇచ్చి
వేయవచ్చు. అతడు దొంగిలించిన వస్తువులకు తగిన
పరిహారం చెల్లించవచ్చు. జీవాన్ని ఇచ్చే కట్టడలను
అతడు అనుసరించటం మొదలు పెట్టవచ్చు. అతడు

చెడు పనులు చేయటం మానవచ్చు. అప్పుడా వ్యక్తి
ఖచ్చితంగా జీవిస్తాడు. అతడు మరణించడు. 16అతడు
గతంలో చేసిన చెడ్డ పనులను నేను గుర్తు పెట్టకోను.
ఎందుకంటే అతడిప్పుడు న్యాయవర్తనుడై మంచి
మనిషి అయ్యాడు గనుక. అందుచే అతడు జీవిస్తాడు!
17“కాని నీ ప్రజలు, ‘అది న్యాయం కాదు! మా
ప్రభువైన యెహోవా అలా వుండజాలడు!’ అని
అంటారు.

“కాని వారే నిజానికి న్యాయవర్తనులు కాకపోతే!
మారవలసిన మనుష్యులు వారే! 18ఒక మంచి వ్యక్తి
సత్కార్యాలు చేయటం మానివేసి పాపం చేస్తే, అతని
పాప ఫలితంగా అతడు చనిపోతాడు. 19ఒక దుర్మార్గుడు
చెడు పనులు చేయటం మాని, న్యాయవర్తనుడై మంచి
జీవితాన్ని ప్రారంభిస్తే అతడు జీవిస్తాడు! 20అయినా
నేను న్యాయంగా లేనని మీరంటారు. కాని నేను మీకు
నిజం చెప్పుచున్నాను. ఇశ్రాయేలు వంశమా, ప్రతి
ఒక్కడూ తాను చేసిన పనులను బట్టి తీర్పు
పొందుతాడు!”

## యెరూషలేము వశపర్చుకొనబడింది

21అది చెరకి కొనిపోబడిన పన్నెండవ సంవత్స
రంలో పదవ నెల (జనవరి) ఐదవరోజు. ఆ రోజున
ఒక వ్యక్తి యెరూషలేము నుండి నా వద్దకు వచ్చాడు.
అతడక్కడ యుద్ధం నుండి తప్పించుకుని వచ్చాడు.
అతడు, “ఆ నగరం (యెరూషలేము) వశపర్చుకో
బడింది!” అని అన్నాడు.
22ఆ మనిషి రావడానికి ముందు నా ప్రభువైన నా
యెహోవా శక్తి నా మీదికి వచ్చింది. నాకు మాట్లాడే
శక్తి లేకుండా దేవుడు చేశాడు. ఆ వ్యక్తి నా వద్దకు
వచ్చే సమయానికి యెహోవా నా నోరు తెరపించి,
నేను మాట్లాడేలాగు చేశాడు. 23అప్పుడు యెహోవా
వాక్కు నాకు వినిపించింది. ఆయన ఇలా అన్నాడు:
24“నరపుత్రుడా, పాడుపడిన ఇశ్రాయేలు నగరాలలో
కొందరు ఇశ్రాయేలు ప్రజలు నివసిస్తున్నారు. వారు
ఇలా అంటున్నారు, ‘అబ్రాహాము ఒక్కడే ఒక్కడు.
అయినా దేవుడు అతనికి ఈ దేశాన్నంతటినీ ఇచ్చి
నాడు. ఇప్పుడు మేము చాలా మంది ప్రజల
మయ్యాము. కావున ఈ దేశం ఖచ్చితంగా మాకు
చెందుతుంది. ఇది మా దేశం!’
25“ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడని నీవు వారికి తప్పక తెలియజేయాలి, ఇంకా
‘రక్తం ఉన్న మాంసాన్ని మీరు తింటున్నారు. సహాయం
కొరకు మీరు మీ విగ్రహాలవైపు చూస్తున్నారు. మీరు
ప్రజలను హత్య చేస్తారు. కావున ఈ దేశాన్ని మీకు
నేనెందుకు ఇవ్వాలి? 26మీరు మీ కత్తిమీద ఆధార
పడతారు. మీలో ప్రతి ఒక్కడూ భయంకరమైన
పనులు చేస్తాడు. మీలో ప్రతి ఒక్కడూ మీ పొరుగు
వాని భార్యతో వ్యభిచరించి పాపం చేస్తాడు. అందువల్ల
మీరు ఈ రాజ్యాన్ని పొందలేరు!’
27“‘ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడని నీవు వారికి తెలియజేయుము, “శిథిలమైన
ఆ నగరాలలో నివసిస్తున్న ప్రజలు నా కత్తిచేత చని
పోతారని నా ప్రాణము మీద ప్రమాణం చేసి నేను
చెపుతున్నాను. ఆ సమయంలో ఎవరైనా బయట
పొలాలలోనికి వెళితే జంతువులు వారిని చంపి తిని
వేసేలా చేస్తాను. కోటలలోను, గుహలలోను ప్రజలు
దాగివుంటే వారు రోగాలతో చనిపోతారు. 28దేశాన్ని
నిర్మానుష్యంగా, ఎడారిగా మార్చేస్తాను. వేటిని చూసు
కొని ఆ దేశం గర్వపడుతూ వుందో ఆ వస్తువులన
న్నిటినీ అది కోల్పోతుంది. ఇశ్రాయేలు పర్వతాలు
శూన్యంగా తయారవుతాయి. ఆ ప్రదేశం గుండా
ఎవ్వరూ పయనించరు. 29ఆ ప్రజలు ఎన్నో భయంక
రమైన పనులు చేశారు. అందువల్ల ఆ దేశాన్ని శూన్య
మైన ఎడారిలా నేను మార్చివేస్తాను. అప్పుడు నేను
యెహోవానని ఈ ప్రజలు తెలుసుకుంటారు.’

30“నరపుత్రుడా, ఇప్పుడు నీ విషయంలో నీవు
ఒక మాట చెప్పాలి. నీ ప్రజలు గోడలకు ఆనుకొని,
వాకిళ్లలో నిలబడి నిన్ను గురించి మాట్లాడుకుంటారు.
వారు ఒకరితో ఒకరు, ‘రండి, యెహోవా ఏమి చెపు
తున్నాడో విందాం’ అని చెప్పుకుంటారు. 31కావున
వారు నా ప్రజలవలె నీవద్దకు వస్తారు. నా ప్రజలవలె
వారు నీ ముందు కూర్చుంటారు. వారు నీ మాటలు
వింటారు. కాని నీవు చెప్పినది మాత్రం వారు ఆచరిం
చరు. వారు ఏది మంచిదనుకుంటే దానినే చేస్తారు.
వారు ప్రజలను మోసగించి అధిక ధనవంతులు కావాలని
కోరుకుంటారు.’

32“వారికి నీవు కేవలం ప్రేమ గీతాలు పాడే ఒక
గాయకుడివి మాత్రమే. నీకు మధురమైన కంఠం ఉంది.
నీవు సొంపుగా వాద్యం వాయిస్తావు. నీ మాటలు వారు
వింటారు గాని, వాటిని ఆచరించరు. 33అయినా నీవు
పాడే విషయాలు తప్పక జరిగి తీరుతాయి. అప్పుడు
ప్రజలు తమలో నిజంగా ఒక ప్రవక్త నివసించాడని
తెలుసుకుంటారు!”

## గొర్రెల మందవంటి ఇశ్రాయేలు

34 యెహోవా వాక్కు నాకు వినిపించింది.
ఆయన ఇలా అన్నాడు: 2“నరపుత్రుడా, నీవు
నా తరపున ఇశ్రాయేలు గొర్రెల కాపరులకు (పాల
కులకు) వ్యతిరేకంగా మాట్లాడు. నా తరపున వాళ్లతో
మాట్లాడు. ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడని వారికి తెలుపు: ‘ఇశ్రాయేలు కాపరులారా
మీకు మీరే బాగా తింటున్నారు. అది మీకు చాలా

హానికరం! ఓ కాపరులారా, మీరు మందను ఎందుకు
మేపరు? 3బాగా బలిసిన గొర్రెలను మీరు తింటారు.
మీ దుస్తులకై వాటి ఉన్నిని వినియోగించు కుంటారు.
బలిసిన గొర్రెలను మీరు చంపుతారు; కాని మందను
మాత్రం మీరు మేపరు. 4బలహీనంగా ఉన్న వాటిని
మీరు బలంగా తయారు చేయలేదు. జబ్బు చేసిన
గొర్రెల విషయమై మీరు శ్రద్ధ తీసుకోలేదు. గాయ
పడిన గొర్రెలకు మీరు కట్టు కట్టలేదు. కొన్ని గొర్రెలు
అటు ఇటు చెదరి వెళ్లిపోయాయి. అయినా మీరు
వెళ్లి వాటిని తీసుకురాలేదు. తప్పిపోయిన గొర్రెలను
వెదకటానికి మీరు వెళ్లలేదు. లేదు; మీరు చాలా
క్రూరులు, కఠినాత్ములు – ఆ రకంగా మీరు మందను
నడిపించ ప్రయత్నించారు!

5“‘కాపరిలేని కారణంగా ఇప్పుడు మంద చెల్లాచెదరై
పోయింది. ప్రతి అడవి జంతువుకు అవి ఆహార
మైనాయి. అలా అవి చిందర వందరై పోయాయి.
6నా మంద ప్రతి పర్వతం మీద, ప్రతి కొండమీద
తిరుగాడింది. నా మంద భూమిమీద అంతటా చెల్లా
చెదరై పోయింది. వాటిని వెదకటానికి గాని, చూడ
టానికి గాని ఎవ్వరూ లేరు.’”

7కావున ఓ గొర్రెల కాపరులారా! యెహోవా మాట
వినండి. నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
8“నా జీవముతోడుగా మీకు నేనిలా మాట ఇస్తున్నాను.
అడవి జంతువులు నా మందను పట్టుకున్నాయి.
అవును, నా మంద అన్ని క్రూర జంతువులకూ ఆహార
మయ్యింది. ఎందువల్లనంటే వాటికి నిజమైన కాపరి
లేడు. నా గొర్రెల కాపరులు నా మంద విషయమై
తగిన జాగ్రత్త తీసుకోలేదు. మరియు ఆ కాపరులు
కేవలం నా మందను చంపుకు తిన్నారే గాని, దానిని
మేపలేదు.”

9అందువల్ల, ఓ కాపరులారా, యెహోవా మాట
వినండి! 10యెహోవా ఇలా చెపుతున్నాడు: “నేను
ఆ కాపరులకు విరోధిని! నా గొర్రెల కొరకు నేను
వారిని అడుగుతాను. నేను వారిని తీసివేస్తాను ఇక
ఎంతమాత్రం వారు నా మందకు కాపరులుగా కొన
సాగరు! దానితో వారు మందను చంపి తమ పొట్టను
నింపుకోలేరు. వారి బారినుండి నా మందను నేను
రక్షించుకోగలుగుతాను. అప్పుడు నా గొర్రెలు వారికి
ఆహారం కాజాలవు.”

11నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
“నాకు నేనే వారికి కాపరిగా వ్యవహరిస్తాను. చెదరి
పోయిన నా గొర్రెలను నేనే వెదకుతాను. నేను వాటి
విషయమై జాగ్రత్త తీసుకుంటాను. 12తన గొర్రెలు
తప్పిపోయినప్పుడు ఒక కాపరి వాటి వెంట ఉంటే,
అతడు వెళ్లి వాటికొరకు వెదకగలడు. అదే విధంగా,
నేను నా గొర్రెల కొరకు వెదకుతాను. నేను నా
గొర్రెలను రక్షించుకుంటాను. ఒకానొక ముసురు పట్టిన
చీకటి రోజు చెదరిపోయిన నా గొర్రెలను ఆయా
ప్రాంతాల నుండి వెదకి తీసుకు వస్తాను. 13ఆయా
దేశాలనుండి వాటిని తిరిగి తీసుకొని వస్తాను. ఆ
ప్రాంతాల నుండి వాటిని కూడదీస్తాను. వాటి స్వదేశా
నికి వాటిని తీసుకొని వస్తాను. ఇశ్రాయేలు పర్వతాల
పైన, సెలయేటి గట్ల మీద, ప్రజలు నివసించే అన్ని
ప్రాంతాలలోను నేను వాటిని మేపుతాను. 14నేను
వాటిని పచ్చిక బీళ్లకు నడిపిస్తాను. ఇశ్రాయేలు కొండల
శిఖరాల పైకి అవి వెళతాయి. అవి అక్కడ పచ్చిక
మేసి, మంచి ప్రదేశంలో హాయిగా పండుకొంటాయి.
ఇశ్రాయేలు పర్వతాల మీద మంచి పచ్చిక భూములలో
అవి మేత మేస్తాయి. 15అవును, నా మందను నేనే
మేపుతాను. వాటిని ఒక విశ్రాంతి స్థలానికి నడిపిస్తాను.”
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

16“పోయిన గొర్రెలను నేను వెదకుతాను. చెదరి
పోయిన గొర్రెలను నేను తిరిగి తోలుకు వస్తాను.
గాయపడిన గొర్రెలకు కట్లు కడతాను. నీరసపడిన
గొర్రెలు బలపడేలా చేస్తాను. కాని ఆ బలిసిన, శక్తివంత
మైన గొర్రెల కాపరులను మాత్రం నేను నాశనం
చేస్తాను. వారికి అర్హమైన శిక్ష వారికి నేను విధిస్తాను.”

17నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “మీరు, నా గొర్రెల మంద. నేను మీలో
ఒక్కొక్కదానికి తీర్పు ఇస్తాను. పొట్టేళ్లకు, మేకపోతు
లకు మధ్య తీర్పు తీర్చుతాను. 18సారవంతమైన
భూముల్లో పెరిగే గడ్డిని మీరు తినవచ్చు. అటువంట
ప్పుడు ఇతర గొర్రెలు మేసే గడ్డిని మీలో కొందరు
మీ కాళ్లతో ఎందుకు తొక్కి పాడుచేస్తారు? మీరు
స్వచ్ఛమైన నీటిని కావలసినంత తాగవచ్చు! అలా
కాకుండా ఇతర గొర్రెలు తాగదల్చుకున్న నీటిని కూడా
మీరెందుకు కెలికి మురికి చేస్తున్నారు? 19మీ కాళ్లతో
తొక్కి పాడుచేసిన గడ్డిని నా మంద తింటున్నది. మీ
కాళ్లతో కెలికి మురికి చేసిన నీటిని అవి తాగవలసి
ఉందా!” 20కావున నా ప్రభువైన యెహోవా వాటికి
ఇలా చెపుతున్నాడు: “నాకై నేనే బలిసిన గొర్రెలకు,
బక్క చిక్కిన గొర్రెలకు మధ్య తీర్పు ఇస్తాను! 21బక్క
జీవాలు అవతలికి పారిపోయే వరకు వాటిని మీరు మీ
భుజాలతోను, పార్శ్వాలతోను తోసి, మీ కొమ్ములతో
కుమ్ముతారు. 22కావున నా మందను నేనే రక్షించు
కుంటాను. అవి ఇక ఎంత మాత్రం క్రూర జంతువుల
బారిన పడవు. గొర్రెకు మరొక గొర్రెకు మధ్య నేనే
తీర్పు ఇస్తాను. 23తరువాత నా సేవకుడైన దావీదును
వాటి మీద కాపరిగా నియమిస్తాను. అతడు వాటిని
మేపుతాడు. అతడు వాటిని స్వయంగా మేపి, వాటికి
కాపరి అవుతాడు. 24ప్రభువును యెహోవాను అయిన
నేను అప్పుడు వాటికి దేవుడనవుతాను. నా సేవకుడగు
దావీదు వాటి మధ్య నివసిస్తూ పాలకుడవుతాడు.
యెహోవానైన నేనే చెపుతున్నాను.”

[25]“మరియు నా గొర్రెలతో నేను శాంతి ఒడంబడిక
చేసుకుంటాను. దేశంలో క్రూర జంతువులు లేకుండా
చేస్తాను. అప్పుడే గొర్రెలు ఎడారిలో నిర్భయంగా
తిరిగి, అడవులలో హాయిగా నిద్రిస్తాయి. [26]నేను నా
గొర్రెలను, నా కొండ (యెరూషలేము) చుట్టూ ఉన్న
ప్రదేశాలను దీవిస్తాను. సకాలంలో వర్షాలు కురిసేలా
చేస్తాను. దీవెనకరమైన జల్లులు పడతాయి. [27]పొలాల్లో
పెరిగే చెట్లు ఫలాల నిస్తాయి. భూమి తన పంటనిస్తుంది.
కావున గొర్రెలు తమ భూమిమీద సురక్షితంగా
ఉంటాయి. బాని సత్వానికి చిహ్నమైన వాటి మెడమీది
కాడిని* నేను విరుగ గొడతాను. వాటిని బానిసలుగా
చేసిన మనుషుల అధికారం నుండి వాటికి విముక్తి
కలుగజేస్తాను. అప్పుడు నేనే యెహోవానని అవి గుర్తి
స్తాయి. [28]అవి ఇక ఎంతమాత్రం మామూలు జంతువు
లవలె అన్య దేశీయులచే పట్టుబడవు. ఆ క్రూర మృగాలు
వాటిని ఇక ఎంతమాత్రం తినవు. అవి సురక్షితంగా
జీవిస్తాయి. ఎవ్వరూ వాటిని భయ పెట్టలేరు. [29]మంచి
ఉద్యానవనంగా తయారయ్యే కొంత భూమిని వాటికి
ఇస్తాను. ఆ భూమిలో అవి ఇక ఎంతమాత్రం ఆకలితో
బాధపడవు. ఇక ఏ మాత్రం అవి అన్యదేశాల నుండి
అవమానాన్ని పొందవు. [30]అప్పుడవి నేనే వాటి దేవుడ
నగు యెహోవానని తెలుసుకుంటాయి. నేను వాటితో
ఉన్నానని అవి తెలుసుకుంటాయి. మరియు ఇశ్రా
యేలు వంశం వారు తాము నా ప్రజలేనని తెలుసు
కుంటారు!” నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.

[31]“నా గొర్రెల్లారా, నా పచ్చిక బయలులో ఉండే
నా గొర్రెల్లారా మీరు కేవలం మానవ మాత్రులు.
నేను మీ దేవుడను.” నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.

### ఎదోముకు వ్యతిరేకంగా వర్తమానం

35 యెహోవా వాక్కు నాకు వినవచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: [2]“నరపుత్రుడా,
శేయీరు పర్వతం వైపు చూచి నా తరపున దానికి
వ్యతిరేకంగా మాట్లాడు. [3]దానితో ఈ విధంగా చెప్పు,
‘నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు,

““శేయీరు పర్వతమా, నేను నీకు విరోధిని! నేను
నిన్ను శిక్షిస్తాను. నిన్నొక పనికిమాలిన బీడు
భూమిలా చేస్తాను.
4 నీ నగరాలను నేను నాశనం చేస్తాను. నీవు నిర్మాను
ష్యమవుతావు. అప్పుడు నేనే యెహోవానని నీవు
తెలుసుకుంటావు.
5 ఎందువల్లనంటే నీవు నా ప్రజలకు ఎప్పుడూ
వ్యతిరేకంగా ఉన్నావు. ఇశ్రాయేలు ప్రజలు కష్టాల్లో
ఉన్నప్పుడూ, వారి శిక్షాకాల అంతిమదశలోనూ
నీవు నీ కత్తిని వారిమీద ఉపయోగించావు.””

[6]కావున నా ప్రభువైన యెహోవా చెపుతున్న
దేమంటే, “నా జీవ ప్రమాణంగా నేను నిశ్చయంగా
చెప్పేదేమంటే, నిన్ను మృత్యువు కబళించివేసేలా
చేస్తాను. మృత్యువు నిన్ను వెంటాడుతుంది. రక్తమును
నీవు అసహ్యించుకోలేదు. కావున మృత్యువు నిన్ను
తరుముకు వెళుతుంది. [7]శేయీరు పర్వతాన్ని పాడై
పోయిన శూన్య ప్రదేశంగా చేస్తాను. ఆ నగరం నుండి
వచ్చే ప్రతి వానినీ నేను చంపివేస్తాను. ఇంకా ఆ నగరం
లోకి వెళ్ల ప్రయత్నించే ప్రతివానిని నేను చంపివేస్తాను.
[8]దాని పర్వతాలన్నిటినీ శవాలతో కప్పివేస్తాను. ఆ
శవాలు నీ కొండలన్నిటి మీద, నీ లోయలు, కనుమల
న్నిటిలోను పడివుంటాయి. [9]నిన్ను శాశ్వతంగా ఏమీ
లేనివానిగా మార్చివేస్తాను. నీ నగరాలలో ఏ ఒక్కడూ
నివసించడు. అప్పుడు నేనే యెహోవానని నీవు
తెలుసుకుంటావు.”

[10]“ఈ రెండు జనాభాలు, వారి దేశాలు (ఇశ్రాయేలు,
యూదా) నావే. మేము వాటిని శాశ్వతంగా మా స్వంతం
చేసుకుంటాము” అని నీవు అన్నావు.

కాని యెహోవా ఇలా అన్నాడు! [11]నా ప్రభువైన
యెహోవా ఇలా చెపుతున్నాడు, “నీవు నా ప్రజల
పట్ల అసూయచెంది ఉన్నావు. నీవు వారిపట్ల కోపంతో
ఉన్నావు. నీవు వారిని అసహ్యించుకున్నావు. నీవు వారిని
బాధించిన విధంగా నేను నిన్ను శిక్షిస్తానని నామీద
ప్రమాణం చేసి చెపుతున్నాను! నేను నిన్ను శిక్షించి,
నేను నా ప్రజలతోనే ఉన్నానని వారు తెలుసుకొనేలా
చేస్తాను. [12]నీ అవమానాలన్నిటి గురించి నేను విన్నానని
నీవు కూడ తెలుసుకుంటావు. ఇశ్రాయేలు పర్వతానికి
వ్యతిరేకంగా నీవు అనేక చెడ్డ విషయాలు ప్రచారం
చేశావు. ‘ఇశ్రాయేలు నాశనం చేయబడింది! వాళ్లను
మేము ఆహారం నమిలినట్లు నమిలి వేస్తాము!’ అని
అంటూ నీవు ప్రచారం మొదలు పెట్టావు. [13]నీవు
గర్వించి, నాకు వ్యతిరేకంగా అనేక విషయాలు
చెప్పావు. నీవు చాలాసార్లు అలా మాట్లాడినావు. కాని
నీవు మాట్లాడిన ప్రతి మాటా నేను విన్నాను! అవును.
నీవన్నది నేను విన్నాను.”

[14]నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “నేను నిన్ను నాశనం చేసినప్పుడు ఈ
భూమి యావత్తూ సంతోషిస్తుంది. [15]ఇశ్రాయేలు దేశం
నాశనమయినప్పుడు నీవు సంతోషించావు. అదే రీతిని
నిన్ను నేను చూస్తాను. శేయీరు పర్వతం, ఎదోము
దేశం మొత్తం నాశనం చేయబడతాయి. నేనే
యెహోవానని మీరప్పుడు తెలుసుకుంటారు.”

---

**కాడి** ఇది ఎప్పుడూ ఒక మనిషి బానిస అని సూచిస్తుంది.

### ఇశ్రాయేలు దేశం పునరుద్ధరించ బడుతుంది

36 “నరపుత్రుడా, నా తరపున ఇశ్రాయేలు పర్వ
తాలతో మాట్లాడు. యెహోవా మాట ఆల
కించమని ఇశ్రాయేలు పర్వతాలకు చెప్పు! 2ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడని వారికి
తెలియజేయుము. శత్రువు నిన్ను గురించి చెడ్డ విష
యాలు ప్రచారం చేశాడు. ‘ఆహా! ఆ పురాతన పర్వ
తాలు ఇక మనవే!’” అని వారు అనుకొన్నారు.
3“కావున ఇశ్రాయేలు పర్వతాలతో నా తరపున
మాట్లాడుము. ప్రభువైన యెహోవా ఈ విషయాలు
తెలుపుతున్నాడని వాటితో చెప్పుము. శత్రువు నిన్ను
నిర్మానుష్యం చేశాడు. అన్ని వైపుల నుండి వారు నిన్ను
చితుకదొక్కారు. నిన్ను అన్యదేశాల పాలు చేయటం
కొరకే వారా విధంగా చేశారు. పిమ్మట ప్రజలు నీగురించి
గుసగుసలు మొదలు పెట్టారు.”
4కావున ఇశ్రాయేలు పర్వతములారా, ప్రభువైన
యెహోవా సందేశాన్ని వినండి! ప్రభువైన యెహోవా
దీనిని పర్వతాలకు, కొండలకు, నదులకు, లోయలకు,
శిథిలాలకు మరియు పాడుబడిన నగరాలకు చెపుతు
న్నాడు, నీ చుట్టూ ఉన్న దేశాల వారిచే నీవు దోచు
కోబడి, ఎగతాళి చేయబడ్డావు. 5“నా తీవ్రమైన భావా
లను ఇప్పుడు నిజంగా వ్యక్తం చేస్తున్నాను! ఎదోము,
తదితర దేశాలు నా కోపాన్ని చవి చూసేలా చేస్తాను.
ఎదోమీయులు నా భూమిని తమ స్వంతం చేసుకు
న్నారు. వాళ్ళు బాగా సంతోషంగా అనుభవించారు.
వారా విధంగా సంతోషంతో ఉన్నప్పుడు ఈ భూమిని
ఎలా అసహ్యించు కొనేవారో తెలిపారు. వారు ఈ
భూమిని నాశనం చేసి దాన్ని స్వాధీన పరచుకోద
లిచారు.”
6కావున నా ప్రభువైన యెహోవా ఇశ్రాయేలు
దేశమును గూర్చి ఈ విషయాలు చెపుతున్నాడు:
“నా తరపున ఇశ్రాయేలు దేశ భూభాగంతో మాట్లాడు.
పర్వతాలు, కొండలతోను, నదులతోను మరియు
లోయలతోను మాట్లాడు. ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెపుతున్నాడని ‘వారికి తెలియజేయుము.
నా తీవ్రమైన భావాలను, కోపాన్ని వ్యక్తం చేస్తాను.
నీవు ఆ ప్రజల నుండి అవమానాలను భరించావు
గనుక నేను నా కోపాన్ని వ్యక్తం చేస్తాను.’”
7నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడు: “నీ చుట్టూ ఉన్న దేశాలు అవమానాలు భరించ
వలసి ఉంటుందని నేను ప్రమాణం చేసి చెపుతున్నాను.
8“ఇశ్రాయేలు పర్వతములారా, నా ఇశ్రాయేలు
ప్రజల కొరకు మీరు కొత్త చెట్లు పెంచి, పండ్లను
పండిస్తారు. నా ప్రజలు వెంటనే తిరిగివస్తారు. 9నేను
మీతో ఉన్నాను. నేను మీకు సహాయపడతాను. ప్రజలు
నేలను దున్నుతారు. ప్రజలు మీలో విత్తనాలు నాటు
తారు. 10మీమీద అనేకానేక మంది ప్రజలు నివసిస్తారు.
ఇశ్రాయేలు వంశమంతా అక్కడ నివసిస్తుంది. నగరాలు
మళ్లీ ప్రజలతో కళకళలాడుతాయి. నాశనం చేయ
బడిన స్థలాలన్నీ నూతనంగా నిర్మింపబడతాయి.
11అనేక మంది ప్రజలను, జంతువులను నేను మీకి
స్తాను. వారికి చాలా మంది పిల్లలు పుడతారు. పూర్వం
మాదిరి ఇతరులు మీపై ఆదారపడి నివసించేలా మీకు
సదుపాయం కలుగజేస్తాను. ముందుకంటె ఇప్పుడు
మీరు ఇంకా బాగుండేటట్లు చేస్తాను. అప్పుడు నేను
యెహోవానని మీరు తెలుసుకుంటారు. 12అవును,
నా ప్రజలైన, ఇశ్రాయేలీయులను ఈ భూమి వద్దకు
నడిపిస్తాను. వారు మిమ్మల్ని వశపర్చుకుంటారు. మీరు
వారి సొత్తు అవుతారు. మరెన్నడూ వారికి పిల్లలు
లేకుండా మీరు చేయలేరు.”
13నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడు: “ఇశ్రాయేలు దేశమా! ప్రజలు నీవు చెడ్డ
పనులు చేశావని అంటారు. నీ ప్రజలను నీవే నాశనం
చేశావని వారంటారు. నీవు పిల్లలను ఎత్తుకు పోయావని
వారు చెపుతారు. 14కాని నీవు ప్రజలను ఇక ఎంత
మాత్రం నాశనం చేయవు. వారి పిల్లలను ఎంతమాత్రం
నీవు తీసుకొనవు.” నా ప్రభువైన యెహోవా ఆ విష
యాలు చెప్పాడు. 15“అన్యదేశాలు ఇక ఎంతమాత్రం
నిన్ను అవమానపర్చనివ్వను. వారిచే ఇక నీవు బాధించ
బడవు. నీవు నీ పిల్లలను ఇకమీదట పోగొట్టుకోవు.”
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### యెహోవా తన మంచి పేరును కాపాడుకోవటం

16పిమ్మట యెహోవా వాక్కు నావద్దకు వచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: 17“నరపుత్రుడా, ఇశ్రాయేలు
వంశం వారు తమ స్వంత భూమిలో నివసించారు.
కాని వారు చేసిన చెడు పనులతో ఆ దేశాన్ని వారు
మలినపర్చారు. వారు నా దృష్టిలో నెలసరి వచ్చే
మైల రక్తంతో అపరిశుభ్రంగా ఉన్న స్త్రీలవలె ఉన్నారు.
18ఆ రాజ్యంలో వారు ప్రజలను హత్యచేసి భూమి
మీద రక్తం చిందించారు. వారి విగ్రహాలతో దేశాన్ని
వారు మలినపర్చారు. అందుచే నేనెంత కోపంగా
ఉన్నానో నేను వారికి చూపించాను. 19నేను వారిని
వివిధ ప్రజల మధ్యకు చెదరగొట్టి అన్ని భూభాగాలలోకి
పంపిన కారణంగా వారు ఆయా దేశాలలో ఉండి
పోయారు. వారి వారి చెడు కార్యాలను అనుసరించి
నేను వారిని శిక్షించాను. 20వారు అన్యదేశాలకు వెళ్లారు.
ఆయా దేశాలలో కూడ వారు నా మంచి పేరును
పాడుచేశారు. ఎలాగనగా, ఆ దేశస్థులు కూడ వీరిని
గురించి మాట్లాడారు. ‘యెహోవా ఎటువంటి
దేవుడు? వీరు యెహోవా ప్రజలు. అయినా వీరు
తమ దేశాన్ని వదిలి వచ్చారు’ అని వారన్నారు.
21“ఇశ్రాయేలు ప్రజలు నా పవిత్ర నామాన్ని పాడు
చేశారు. నా పేరు విషయంలో నేను బాధపడ్డాను.

22కావున ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడని ఇశ్రాయేలు వంశానికి చెప్పు, 'ఇశ్రాయేలు వంశీ
యులారా, మీరు వెళ్లిన ప్రతిచోటా నా పవిత్ర నామాన్ని
పాడుచేశారు. దీనిని ఆపటానికి నేనేదైనా చేయదలి
చాను. ఇశ్రాయేలూ, అది నేను నీ కొరకు మాత్రం
చేయను. నా పవిత్ర నామం కొరకు నేను ఆ పని
చేస్తాను. 23గొప్పదైన నా పేరు నిజంగా పవిత్రమైనదని
నేను ఆ ప్రజలకు నిరూపిస్తాను. మీరు నా పేరును
గౌరవించేటట్లు చేస్తాను. నా మంచి పేరును ఆ దేశా
లలో మీరు పాడుచేశారు! కాని నేను పవిత్రుడనని
మీకు నిరూపిస్తాను. అప్పుడు ఆ ప్రజలంతా నేనే
యెహోవానని తెలుసుకుంటారు.'" నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

24దేవుడు ఇలా అన్నాడు, "ఆయా రాజ్యాలనుండి
మిమ్మల్ని బయటకు తీసి, ఒక్క చోటికి సమీకరించి
మీ స్వంత దేశానికి తీసుకొనివస్తాను. 25పిమ్మట మీ
మీద పరిశుద్ధ జలాన్ని చల్లి మిమ్మల్ని పవిత్రులనుగా
చేస్తాను. మీ మురికినంతటినీ కడిగివేస్తాను. ఆ విగ్రహాల
నుండి వచ్చిన మురికిని నేను కడిగివేస్తాను."

26దేవుడు ఇలా అన్నాడు: "మీలో సరికొత్త ఆత్మను
పెడతాను. మీ ఆలోచనా సరళి మార్చుతాను. మీ
శరీరం నుండి రాతి గుండెను తొలగించి సున్నితమైన
మానవ హృదయాన్ని ఇస్తాను. 27మీలో నా ఆత్మను
ప్రవేశపెడతాను. మీరు నా కట్టడులను పాటించేలా
మిమ్మల్ని నేను మార్చుతాను. మీరు నా ఆజ్ఞలను
జాగ్రత్తగా పాటిస్తారు.
28పిమ్మట మీ పూర్వీకులకు నేనిచ్చిన దేశంలో
మీరు నివసిస్తారు. మీరు నా ప్రజలవుతారు. నేను మీ
దేవుడనవుతాను."

29దేవుడు ఇలా చెప్పాడు: "నేను మిమ్మల్ని
రక్షిస్తాను. మీరు మలినపడకుండా ఉంచుతాను. ధాన్యం
(సమృద్ధిగా) పండేలా నేను ఆజ్ఞ ఇస్తాను. మీ మీదికి
కరువును రప్పించను. 30మీ చెట్ల నుండి ఫలసంపద
పుష్కలంగా వచ్చేలా చేస్తాను. మీ పొలాలను బహుగా
పండిస్తాను. అన్య దేశాలలో మరెన్నడూ మీరు ఆకలి
బాధల అవమానాన్ని అనుభవించరు. 31మీరు చేసిన
చెడు కార్యాలను మీరు గుర్తుకు తెచ్చుకుంటారు. మీరు
చేసినవి మంచి పనులు కావని తెలుసుకునే జ్ఞానం
మీకు కలుగుతుంది. మీరు చేసిన పాపాలకు, మీరు
పాల్పడిన భయంకర కృత్యాలకు మిమ్మల్ని మీరే అస
హ్యించుకుంటారు."

32నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: "ఇది మీరు గుర్తుపెట్టుకోవాలని నేను కోరు
కుంటున్నాను, మీ మంచి కొరకు నేనీ పనులేవీ
చేయటం లేదు! నా మంచి పేరు నిలుపుకోటానికే
వాటిని నేను చేస్తున్నాను! కావున ఇశ్రాయేలు వంశమా,
మీరు జీవించిన తీరుకు మీరు సిగ్గుపడి, కలత చెందాలి!"

33నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు, "నేను మీ పాపాలను కడిగివేసే రోజున
ప్రజలను మీ నగరాలకు తీసుకొని వస్తాను. పాడుబడ్డ
నగరాలు తిరిగి నిర్మించబడతాయి. 34బీడు భూములు
సాగుచేయబడతాయి. అది దారిన పోయే వారికి కేవలం
శిథిలాల గుట్టలా కన్పించదు. 35'గతంలో ఈ దేశం
నాశనమయింది. అది ఇప్పుడు ఏదెను ఉద్యానవనంలా
రూపు దిద్దుకున్నది. నగరాలు నాశనం చేయబడ్డాయి.
అవి పాడుబడి నిర్మానుష్యమైనాయి. కాని ఇప్పుడవి
రక్షిత నగరాలైనవి. వాటిలో ప్రజలు ఇప్పుడు నివసి
స్తున్నారు అని వారు చెప్పుకుంటారు.'"

36దేవుడు ఇలా చెప్పాడు: "నీ చుట్టూ ఉన్న దేశాలు
నేను యెహోవాననీ, ఆ పాడైపోయిన ప్రాంతాలను
పునరుద్ధరించాననీ తెలుసుకుంటాయి. ఖాళీగా ఉన్న
ఈ నేలలో నేను మొక్కలు నాటాను. నేనే యెహో
వాను. నేనే ఈ విషయాలను చెప్పాను. అవి జరిగేలా
చేస్తాను."

37నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు, "ఇశ్రాయేలు వంశం వారు ఇలా జరిగేలా
చేయమని నన్ను అడిగేలా కూడ చేస్తాను. వారి సంతా
నాన్ని బహుగా అభివృద్ధి చేస్తాను. వారు గొర్రెల
మందల్లా విస్తరిస్తారు. 38యెరూషలేములో ప్రత్యేక
పండుగల సందర్భంగా తేబడే గొర్రెల, మేకల మందల్లా
ఆ ప్రజలు విస్తారంగా ఉంటారు. నగరాలు, పాడుబడిన
ప్రాంతాలు తిరిగి జనసందోహాలతో కిటకిటలాడు
తాయి. అప్పుడు నేనే యెహోవానని వారు తెలుసు
కుంటారు."

### ఎండిన ఎముకల దర్శనం

37 యెహోవా శక్తి నా మీదికి వచ్చింది. దేవుని
ఆత్మ (సుడిగాలి రూపంలో) నన్ను నగరం
నుండి ఎత్తుకుపోయి ఒక లోయ మధ్యలో దించింది.
ఆ లోయ అంతా మానవ అస్థిపంజరాలతో నిండిఉంది.
2లోయలో భూమిమీద ఎముకలు లెక్కకు మించి
పడివున్నాయి. ఆ ఎముకల మధ్యగా యెహోవా నన్ను
నడిపించాడు. ఎముకలు బాగా ఎండిపోయి ఉన్నట్లు
నేను చూశాను.

3నా ప్రభువైన యెహోవా నన్ను, "నరపుత్రుడా,
ఈ ఎముకలు తిరిగి ప్రాణం పోసుకోగలవా?" అని
అడిగాడు. "నా ప్రభువైన యెహోవా, ఈ ప్రశ్నకు
సమాధానం నీకే తెలుసు" అని నేనన్నాను.

4అందుకు నా ప్రభువైన యెహోవా ఇలా అన్నాడు:
"ఆ ఎముకలతో నా తరపున మాట్లాడు. వాటికి ఈ
విధంగా చెప్పు, 'ఎండిన ఎముకల్లారా, యెహోవా
మాట వినండి! 5నా ప్రభువైన యెహోవా మీకు ఈ
విషయాలు చెపుతున్నాడు: మీలోకి ఊపిరి వచ్చేలా
చేస్తాను. మీరు ప్రాణం పోసుకుంటారు! 6మీమీద మళ్లీ

స్నాయువులు, కండరాలు కలుగజేస్తాను. మిమ్మల్ని
చర్మంతో కప్పుతాను. పిమ్మట మీలో ఊపిరి పోస్తాను.
మీరు బతుకుతారు! అప్పుడు ప్రభువును, యెహో
వాను నేనే అని మీరు తెలుసుకుంటారు.'"
7ఆయన చెప్పిన రీతిలో నేను యెహోవా తరపున
ఎముకలతో మాట్లాడాను. నేను ఇంకా మాట్లాడుతూ
ఉండగానే ఒక పెద్ద శబ్దం విన్నాను. ఎముకలలో గలగల
శబ్దం వినవచ్చింది. ఒక ఎముకతో మరొక ఎముక
కలవటం మొదలు పెట్టింది! 8తరువాత నా కళ్ల ముందే
వాటిమీద స్నాయువులు, కండరాలు ఏర్పడటం జరి
గింది. వాటిమీద చర్మం కప్పివేయటం మొదలయింది.
కాని శరీరాలు మాత్రం కదలలేదు. వాటిలో ఊపిరి
లేదు. 9పిమ్మట నా ప్రభువైన యెహోవా నాతో
ఇలా అన్నాడు: "వాయువుతో మాట్లాడు. ఓ నర
పుత్రుడా, ఊపిరితో మాట్లాడు. ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెపుతున్నాడని ఊపిరితో చెప్పు:
'ఊపిరి, అన్ని దిశలనుండి నీవు వీచి ఈ శవాలలో
జీవంపోయుము! వాటికి ఊపిరి పోయుము; అవి
తిరిగిబతుకుతాయి!'"
10ఆయన చెప్పిన విధంగా నేను యెహోవా తర
పున ఆత్మతో మాట్లాడాను. వెంటనే శవాలలోకి ఊపిరి
వచ్చింది. వాటికి ప్రాణం వచ్చి లేచి నుంచున్నాయి.
అక్కడ ఎంతో మంది మనుష్యులున్నారు. వారంతా
ఒక పెద్ద సైన్యం!
11తరువాత నా ప్రభువైన యెహోవా నాతో ఇలా
చెప్పాడు: "నరపుత్రుడా, ఈ ఎముకలు మొత్తం ఇశ్రా
యేలు వంశంలా ఉన్నాయి. ఇశ్రాయేలీయులు, 'మా
ఎముకలు ఎండిపోయాయి. మా ఆశలు అడు
గంటాయి. మేము సర్వనాశనమయ్యాము!' అని
అంటున్నారు. 12కావున నీవు నా తరపున వారితో
మాట్లాడి ప్రభువైన యెహోవా ఈ రకంగా చెపు
తున్నాడని తెలుపు, 'నా ప్రజలారా నేను మీ సమాధు
లను తెరచి, మిమ్మల్ని బయటికి తెస్తాను! పిమ్మట
మిమ్మల్ని ఇశ్రాయేలు దేశానికి తీసుకొని వస్తాను. 13నా
ప్రజలారా, నేను మీ సమాధులను తెరచి, మిమ్మల్ని
వాటినుండి బయటకు తెస్తాను! అప్పుడు నేనే
యెహోవానని మీరు తెలుసుకుంటారు. 14నా ఆత్మను
మీలో పెడతాను. దానితో మీరు మళ్లీ జీవిస్తారు.
అప్పుడు మిమ్మల్ని మీ స్వదేశానికి తిరిగి నడిపిస్తాను.
అప్పుడు నేనే యెహోవానని మీరు తెలుసుకుంటారు.
ఈ విషయాలు నేనే చెప్పానని, వాటిని జరిగేలా చేశానని
మీరు తెలుసుకుంటారు!'" ఈ విషయాలు యెహోవా
చెప్పాడు.

### యూదా, ఇశ్రాయేలు ఏకమవటం

15యెహోవా వాక్కు నాకు మళ్లీ వినిపించింది.
ఆయన ఇలా అన్నాడు: 16"నరపుత్రుడా, ఒక కట్టె
పుల్లను తెచ్చి ఈ వర్తమానం దానిమీద వ్రాయి, 'ఈ
పుల్ల యూదాకు, దాని స్నేహితులైన (తోటివారు)
ఇశ్రాయేలీయులకు చెందింది.' తరువాత మరో పుల్లను
తీసుకొని దాని మీద; 'ఈ ఎఫ్రాయిము పుల్ల యోసే
పుకు, అతని స్నేహితులైన (తోటివారు) ఇశ్రాయేలీ
యులకు చెందింది' అని వ్రాయుము. 17పిమ్మట ఆ
రెండు పుల్లలను కలుపుము. నీ చేతిలో ఆ రెండూ
ఒక్క పుల్లలా ఉంటాయి.
18"దీని భావమేమిటని నీ ప్రజలు నిన్నడుగుతారు.
19ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతున్నా
డని వారికి చెప్పు. 'ఎఫ్రాయిము చేతిలో ఉన్న
యోసేపు పుల్లను మరియు అతని స్నేహితులగు ఇశ్రా
యేలీయులను నేను తీసుకుంటాను. దానిని యూదా
యొక్క పుల్లతో కలిపి ఒక్క పుల్లగా చేస్తాను. నా
చేతిలో అవి ఒక్క కట్టె పుల్ల అవుతాయి!'
20"నీకు ముందుగ వారి కండ్ల ఎదుట ఆ కర్రలను
నీ చేతిలో ఎత్తి పట్టుకొనుము. ఆ పేర్లను ఆ కట్టెపుల్లల
మీద నీవు వ్రాశావు. 21నా ప్రభువైన యెహోవా ఈ
విధంగా చెపుతున్నాడని అనుము, 'వారు చెదరిపోయిన
దేశాల నుండి ఇశ్రాయేలు ప్రజలను నేను తీసు
కొంటాను. అన్ని చోట్ల నుండి వారిని సమావేశపర్చి,
వారి స్వంత దేశానికి తిరిగి తీసుకొని వస్తాను. 22ఇశ్రా
యేలు పర్వతం మీద వారిని ఒక్క దేశంగా చేస్తాను.
వారందరికి ఒక్కడే రాజు ఉంటాడు. వారు రెండు
రాజ్యాలుగా కొనసాగరు. వారిక ఎంతమాత్రం రెండు
రాజ్యాలుగా విడిపోరు. 23వారి విగ్రహాలతోను, భయం
కర శిల్పాలతోను, తదితర ఘోరమైన నేరాలతోను
వారు తమను తాము మలినపర్చు కోవటం
కొనసాగించరు. వారెక్కడున్నా వారి భయంకర పాపాల
న్నిటి నుండి వారిని నేను కాపాడుతాను. నేను వారిని
కడిగి పవిత్ర పర్చుతాను. వారు నా ప్రజలవుతారు.
నేను వారికి దేవుడనై యుంటాను.
24"'నా సేవకుడైన దావీదు వారికి రాజుగా ఉంటాడు.
వారంతా ఒకే ఒక్క కాపరిని కలిగి ఉంటారు. వారు నా
నీతికి, న్యాయానికి బద్ధులై జీవిస్తారు. నేను చెప్పినవన్నీ
వారు చేస్తారు. 25నేను నా సేవకుడైన యాకోబుకు
ఇచ్చిన భూమి మీద వారు నివసిస్తారు. నీ పూర్వీకులు
ఆ ప్రదేశంలో నివసించారు. నా ప్రజలూ అక్కడే నివ
సిస్తారు. వారు, వారి పిల్లలు మరియు వారి మనుమలు
అక్కడే శాశ్వతంగా నివసిస్తారు. మరియు నా సేవకుడైన
దావీదు సదా వారికి రాజై ఉంటాడు. 26నేను వారితో
శాంతి ఒడంబడిక ఒకటి చేసుకుంటాను. ఈ ఒడంబడిక
ఎల్లకాలం కొన సాగుతుంది. వారి దేశాన్ని వారికి ఇవ్వ
టానికి నేను అంగీకరించాను. వారి సంతానం విస్తారమవ
డానికి నేను అంగీకరించాను. పైగా నా పవిత్ర స్థలాన్ని
అక్కడ శాశ్వతంగా వారితో ఉంచటానికి నేను అంగీకరిం
చాను. 27నా పవిత్ర గుడారం వారి మధ్య అక్కడ

ఉంటుంది. అవును, నేను వారి దైవంగా, వారు నా
ప్రజలుగా ఉంటాము. 28మరియు ఇతర దేశాలు కూడ
నేను యెహోవానని తెలుసుకుంటాయి. నా పవిత్ర
స్థలాన్ని శాశ్వతంగా ఇశ్రాయేలు ప్రజల మధ్య ఉంచటం
ద్వారా నేను ఇశ్రాయేలీయులను నా ప్రత్యేక జనులుగా
చేశానని కూడ వారు తెలుసుకుంటారు.’”

### గోగుకు వ్యతిరేకంగా వర్తమానం

38 యెహోవా వాక్కు నా వద్దకు వచ్చింది.
ఆయన ఇలా అన్నాడు: 2“నరపుత్రుడా,
మాగోగు దేశపువాడైన గోగువైపు చూడు. అతడు
మెషెకు మరియు తుబాలు దేశాలకు అతి ముఖ్యమైన
నాయకుడు. నీవు నా తరపున గోగుకు వ్యతిరేకంగా
మాట్లాడుము. 3ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడని నీవతనికి తెలుపు, ‘గోగూ, నీవు మెషెకు
మరియు తుబాలు దేశాలకు అతి ముఖ్యమైన నాయ
కుడవు! కాని నీకు నేను విరోధిని. 4నిన్ను నేను
పట్టుకుని వెనుకకు తీసుకొని వస్తాను. నీ సైన్యంలోని
వారందరినీ నేను పట్టుకు వస్తాను. గుర్రాలను, గుర్రపు
సైన్యం వారందరిని పట్టుకు వస్తాను. మీ నోళ్లకు
గాలం తగిలించి, మీ అందరినీ తిరిగి తీసుకు వస్తాను.
మీ సైనికులంతా వారి దుస్తులు, డాళ్లు, కత్తులు ధరి
స్తారు. 5పెర్షియా (పారసీకము), ఇథియోపియ
(కూషు) మరియు పూతు సైనికులందరు కూడ మీతో
ఉంటారు. వారంతా తమ డాళ్లు, శిరస్త్రాణాలు ధరిస్తారు.
6అక్కడ గోమెరు కూడ తన సైన్యమంతటితో
ఉంటుంది. తన సైనిక పటాలాలన్నిటితో దూరాన
గల ఉత్తర దేశమైన తోగర్మా కూడ ఉంటుంది. ఆ
బందీల ప్రదర్శనలో ఇంకా అనేకానేక మంది ప్రజలు
ఉంటారు.
7“‘సిద్ధంకండి. అవును. నీవు, నీతో కలిసిన సైన్యాలు
సిద్ధం కండి. మీరు సిద్ధమై మెలకువతో ఉండండి.
8ఎంతో కాలం తరువాత మీరు విధులకు పిలవబడు
తారు. తరువాతి సంవత్సరాలలో యుద్ధ బాధలనుండి
విముక్తి చెందిన దేశంలోకి మీరు వస్తారు. ఆ దేశపు
ప్రజలు తాము ఇతర దేశాలనుండి సమ కూర్చబడి
ఇశ్రాయేలు పర్వతం మీదికి తీసుకొని రాబడతారు.
గతంలో ఇశ్రాయేలు పర్వతాలు పదే పదే నాశనం
చేయబడ్డాయి. అయితే ఈ ప్రజలు మాత్రం ఇతర
దేశాల నుండి తిరిగి వచ్చినవారు. వారంతా క్షేమంగా
నివసిస్తారు. 9కాని నీవు వారిని ఎదిరించటానికి వస్తావు.
నీవొక తుఫానులా వస్తావు. దేశాన్ని ఆవరించి గర్జించే
మేఘంలా నీవు వస్తావు. నీవు, నీతో వున్న అన్య
దేశాల సైనిక దళాలు ఈ ప్రజల మీదికి వచ్చి
పడతారు.’”
10నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “ఆ సమయంలో నీ మనస్సుకు ఒక ఆలో
చన వస్తుంది. నీవు కుయుక్తి పన్నటం మొదలు పెడ
తావు. 11నీవు ఈ విధంగా అంటావు, ‘నగరాలకు రక్షణ
గోడలు లేకుండా ఉన్న దేశంపై (ఇశ్రాయేలు) నేను
దాడిచేస్తాను. వారు ప్రశాంతంగా జీవిస్తున్నారు. సురక్షి
తంగా ఉన్నామని వారనుకుంటున్నారు. నగరాలను
రక్షించటానికి వాటిచుట్టూ గోడలే లేవు. వారి ద్వారా
లకు తాళాలు లేవు. అసలు ద్వారాలే లేవు! 12ఆ
ప్రజలను నేను ఓడించి, వారి విలువైన సొమ్ములను
నేను కొల్లగొడతాను. ఒకప్పుడు నాశనం చేయబడి,
ఇప్పుడు జనంతో క్రిక్కిరిసిన ప్రాంతాలపై నేను
యుద్ధం చేస్తాను. అన్యదేశాల నుండి వెనుకకు తీసుకొని
రాబడిన ఆ ప్రజలతో (ఇశ్రాయేలు) నేను యుద్ధం
చేస్తాను. ఇప్పుడా ప్రజలకు పశువులు, ఆస్తిపాస్తులు
సమకూడాయి. వారు ప్రపంచానికి నాలుగుబాటల
కూడలి స్థలంలో నివసిస్తున్నారు. కొన్ని అగ్ర రాజ్యాలు
ఇతర బలమైన రాజ్యాలకు ఆ ప్రాంతం గుండానే
వెళ్లాలి.’
13“సెబా, దదానువారు; తర్షీషు వ్యాపారులు, ఇతర
వ్యాపార కేంద్రాలైన నగరాల వారు నిన్ను చూచి ఇలా
అంటారు, ‘విలువైన వస్తువులు పట్టుకుపోవడానికి
వచ్చావా? మంచి మంచి వస్తువులు, వెండి బంగారాలు,
పశువులు, ఇతర సంపద కొల్లగొట్టి పట్టుకుపోవటానికి
నీవు నీ సైనిక దళాలను తీసుకొని వచ్చావా? ఆ
విలువైన వస్తువులు పట్టుకు పోవటానికి వచ్చావా?’”
14దేవుడు ఇలా అన్నాడు, “నరపుత్రుడా, నా
తరపున గోగుతో మాట్లాడు. ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెపుతున్నాడని అతనికి తెలియజేయి,
‘నా ప్రజలు ప్రశాంతంగా, నిర్భయంగా జీవిస్తున్న
సమయంలో నీవు వారిమీద దండయాత్రకు వస్తావు.
15సుదూర ఉత్తర ప్రాంతంలో గల నీ దేశంనుండి
నీవు వస్తావు. నీతో అనేక మందిని తీసుకొని వస్తావు.
వారంతా గుర్రాల మీద వస్తారు. మీరంతా ఒక శక్తి
వంతమైన మహా సైన్యంగా ఉంటారు. 16నా ప్రజలైన
ఇశ్రాయేలీయుల మీద యుద్ధం చేయటానికి మీరు
వస్తారు. దేశాన్ని ఆవరించే గర్జించే ఒక మేఘంలా
నీవుంటావు. ఆ సమయం వచ్చినప్పుడు నా దేశం
మీద యుద్ధానికి నిన్ను తీసుకొనివస్తాను. గోగూ,
అప్పుడు నేనెంత శక్తిమంతుడనో దేశాలన్నీ తెలుసు
కొంటాయి! వారు నన్ను గౌరవించటం నేర్చు
కుంటారు. నేను మహనీయుడనని వారు తెలుసు
కుంటారు. నీకు నేనేమి చేస్తానో వారు చూస్తారు!’”
17నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు, “గతంలో నేను నిన్ను గురించి మాట్లాడి
నట్లు ఆ సమయంలో ప్రజలు గుర్తు తెచ్చుకుంటారు.
నా సేవకులైన ఇశ్రాయేలు ప్రవక్తల సేవలను నేను
వినియోగించుకున్నట్లు వారు గుర్తు తెచ్చుకుంటారు.
ఇశ్రాయేలు ప్రవక్తలు గతంలో నా తరపున మాట్లా

డుతూ, వారిపై యుద్ధానికి నేను నిన్ను తీసుకొని
వస్తానని చెప్పినట్లు వారు గుర్తు తెచ్చు కుంటారు."
18నా ప్రభువైన యెహోవా ఇలా చెప్పాడు: "ఆ
సమయంలో ఇశ్రాయేలు దేశంపై యుద్ధానికి గోగు
వస్తాడు. నేను నా కోపాన్ని చూపిస్తాను. 19నా కోపంలో,
ఉద్రేకంలో నేనిలా ప్రమాణం చేస్తున్నాను, ఇశ్రాయేలు
దేశంలో ఒక తీవ్రమైన భూకంపం వస్తుందని నేను
ఖచ్చితంగా చెపుతున్నాను. 20ఆ సమయంలో జీవరాశు
లన్నీ భయంతో కంపించిపోతాయి. సముద్రంలో
చేపలు, గాలిలో పక్షులు, అడవుల్లో క్రూరమృగాలు
తదితర పాకే జీవులు, మానవులందరూ భయంతో
వణికిపోతారు. పర్వతాలు కూలిపోతాయి. కొండ
శిఖరాలు విరిగి పడతాయి. ప్రతి గోడా నేలకూలు
తుంది!"
21నా ప్రభువైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
"అంతేగాదు. ఇశ్రాయేలు పర్వతాల మీద అన్ని రకాల
భయోత్పాతాలను గోగు మీదికి రప్పిస్తాను. అతని
సైనికులు తమ కంగారులో ఒకరిపై ఒకరు పడి, తమ
కత్తులతో ఒకరి నొకరు పొడుచుకొని చంపుకుంటారు.
22రోగాలతోను, మరణంతోను గోగును శిక్షిస్తాను.
గోగు మీదను, అనేక దేశాల నుండి వచ్చిన అతని
సైన్యం మీదను వడగళ్లు, అగ్ని, గంధకం వర్షించేలా
చేస్తాను. 23నేనెంత గొప్పవాడినో నేనప్పుడు చూపి
స్తాను. నేను మహనీయుడనని రుజువు చేస్తాను. నేను
ఈ పనులు చేయటం అనేక దేశాల వారు చూస్తారు.
నేనెవరినో అప్పుడు వారు కనుగొంటారు. నేనే
యెహోవానని వారప్పుడు తెలుసుకుంటారు."

## గోగు, అతని సైన్యం యొక్క అంతం

39 "నరపుత్రుడా, నా తరఫున గోగుకు వ్యతి
రేకంగా మాట్లాడు. యెహోవా ఈ విష
యాలు చెపుతున్నాడని అతనికి తెలియజేయుము,
'గోగూ, నీవు మెషెకు, తుబాలు దేశాలకు అతి ముఖ్య
మైన నాయకుడవు! కాని నేను నీకు వ్యతిరేకిని. 2నిన్ను
నేను పట్టుకొని వెనుకకు తీసుకొని వస్తాను. దూరపు
ఉత్తర ప్రాంతం నుండి నిన్ను తీసుకు వస్తాను. ఇశ్రా
యేలు పర్వతాలపై యుద్ధానికి నిన్ను నేను తీసుకు
వస్తాను. 3కాని నీ ఎడమచేతి నుండి నీ ధనుస్సును
నేల రాల్చుతాను. నీకుడి చేతి నుండి నీ బాణాలు
పడిపోయేలా చేస్తాను. 4ఇశ్రాయేలు పర్వతాల మీద
నీవు చంపబడతావు. నీవు, నీ సైనిక దళాలు, నీతో
ఉన్న అన్య దేశాల జనులు యుద్ధంలో చంపబడతారు.
మాంసం తినే ప్రతి పక్షి, క్రూర మృగాలకి నిన్ను
ఆహారంగా పడవేస్తాను. 5నీవు నగర ప్రవేశం చేయవు.
నీవు ఆరు బయటనే పొలాల్లో చంపబడతావు. ఇది
చెప్పినది నేనే!'" నా ప్రభువైన యెహోవా ఆ
విషయాలు చెప్పాడు.

6దేవుడు ఇలా చెప్పాడు, "మాగోగు మీదికి, తీరం
వెంబడి నిర్భయంగా నివసిస్తున్న ప్రజల మీదికి అగ్నిని
పంపిస్తాను. నేనే యెహోవానని వారప్పుడు తెలుసు
కొంటారు. 7నేనొక్కడినే ఇశ్రాయేలులో మహనీ
యుణ్ణి. ప్రజలు నా పవిత్ర నామాన్ని ఇక ఎంతమాత్రం
పాడు చేయకుండా చూస్తాను. దేశాలన్నీ నేనే యెహో
వానని తెలుసుకుంటాయి. నేను ఇశ్రాయేలులో నెల
కొన్న పవిత్రుడినైన యెహోవానని వారు తెలుసు
కుంటారు. 8ఆ సమయం ఆసన్నమవుతూ ఉంది!
అది జరిగి తీరుతుంది!" యెహోవా ఈ విషయాలు
చెప్పాడు. "ఆ రోజును గురించే నేను మాట్లాడు
తున్నాను.
9"ఆ సమయంలో ఇశ్రాయేలు నగరాలలో నివసి
స్తున్న ప్రజలు ఆ పొలాలలోకి వెళతారు. వారు శత్రు
వుల ఆయుధాలన్నీ ఏరి తగలబెడతారు. డాళ్లు, ధను
స్సులు, బాణాలు, దుడ్డు కర్రలు, ఈటెలు అన్నీ వారు
తగులబెడతారు. ఆ ఆయుధాలన్నిటినీ వారు ఏడేండ్ల
పాటు వంట చెరకుగా ఉపయోగిస్తారు. 10ఈ ఆయుధా
లనే వారు వంట చెరకుగా ఉపయోగించటంతో వారు
పొలాల్లో పుల్లలు ఏరటం గాని, అడవిలో కట్టెలు
కొట్టటం గాని చేయవలసిన అవసరం లేదు. వారిని
దోచుకోవాలని వచ్చిన సైనికుల నుండి విలువైన వస్తు
వులను వారే తీసుకుంటారు. తమవద్ద విలువైన వస్తువు
లను దోచుకున్న సైనికుల నుండి వారే మంచి వస్తువు
లను తీసుకుంటారు." ఈ విషయాలు నా ప్రభువైన
యెహోవా చెప్పాడు.
11దేవుడు ఈ విధంగా చెప్పాడు: "ఆ సమయంలో
గోగును సమాధి చేయటానికి ఇశ్రాయేలులో నేనొక
స్థలాన్ని ఎంపిక చేస్తాను. మృత సముద్రానికి తూర్పున
ఉన్న ప్రయాణీకుల లోయలో అతడు సమాధి చేయ
బడతాడు. అది ప్రయాణికుల బాటను మూసివేస్తుంది.
గోగు మరియు అతని సైన్యమంతా అక్కడే సమాధి
చేయబడతారు గనుక అలా జరుగుతుంది. ప్రజలు ఆ
ప్రదేశాన్ని "గోగు సైన్యపు లోయ" అని పిలుస్తారు.
12దేశాన్ని శుద్ధి చేయటానికి ఇశ్రాయేలు వంశం వారు
వారిని ఏడు నెలల పాటు పాతిపెడతారు. 13దేశంలోని
సామాన్య ప్రజలంతా ఆ శత్రు సైనికులను పాతిపెడ
తారు. నేను ఖ్యాతి తెచ్చుకున్న ఆ రోజున ఇశ్రాయేలు
ప్రజలు కీర్తి వహిస్తారు." నా ప్రభువైన యెహోవా ఆ
విషయం చెప్పాడు.
14దేవుడు ఇలా చెప్పాడు: "ఆ చనిపోయిన
సైనికులను పాతిపెట్టటానికి పనివారిని పూర్తి సమయ
ప్రాతిపదికపై ప్రజలు నియమించవలసి ఉంటుంది.
ఈ రకంగా వారు దేశాన్ని పవిత్రం చేస్తారు. పనివారు
ఏడునెలల పాటు పని చేస్తారు. వారు శవాలను
వెదుకుతూ నలుదిశలా తిరుగుతారు. 15పనివారు అలా
తిరుగుతూ ఉన్నప్పుడు ఏ ఒక్కడైనా ఒక ఎముకను

చూస్తే దాని పక్కన ఒక గుర్తు పెడతాడు. సమాధులు
త్రవ్వేవారు వచ్చి ఆ ఎముకను గోగు సైన్యపు
లోయలో పాతిపెట్టే వరకు ఆ గుర్తు అక్కడ ఉంటుంది.
16ఆ మృతుల నగరానికి హమోనా* అని పేరు పెడ
తారు. ఈ విధంగా వారు దేశాన్ని శుద్ధి చేస్తారు."
17నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: "నరపుత్రుడా, అన్ని పక్షుల, అడవి జంతువు
లతో నా తరపున మాట్లాడు. వాటికి ఈ విధంగా
చెప్పు, 'ఇక్కడికి రండి! ఇక్కడికి రండి! చుట్టూ
మూగండి. నేను మీ కొరకు సిద్ధం చేస్తున్న బలిని
మీరు తినండి. ఇశ్రాయేలు పర్వతాల మీద చాలా పెద్ద
బలి ఇవ్వబడుతుంది. రండి. మాంసం తినండి. రక్తం
తాగండి. 18బలాఢ్యులైన సైనికుల శరీరాల మాంసం
మీరు తింటారు. మహా రాజుల రక్తాన్ని మీరు తాగుతారు.
బాషానుకు చెందిన పొట్టేళ్లు, గొర్రె పిల్లలు, మేకలు,
బలిసిన గిత్తల్లా వారుంటారు. 19మీకు కావలసిన కొవ్వు
నంతా మీరు తినవచ్చు. మీ పొట్టలు నిండేలా మీరు
రక్తం తాగవచ్చు. మీ కొరకు నేను ఇచ్చే బలి మాంసం
మీరు తిని, తాగుతారు. 20నా బల్లవద్ద తినటానికి మీకు
మాంసం పుష్కలంగా లభిస్తుంది. వారిలో గుర్రాలు,
రథసారధులు, బలిష్ఠులైన సైనికులు, ఇతర పోరాట
యోధులు ఉన్నారు.'" నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెపుతున్నాడు.
21దేవుడు ఇంకా ఇలా చెప్పాడు, "నేనేమి చేశానో
ఇతర దేశాల వారు చూసేలా చేస్తాను. ఆ అన్యదేశాల
వారు నన్ను గౌరవించటం మొదలు పెడతారు! ఆ
శత్రువు మీద నేను ఉపయోగించిన నా శక్తిని వారు
చూస్తారు. 22ఆ రోజునుంచి ఇశ్రాయేలు వంశం వారు
నేను తమ దేవుడగు యెహోవానని తెలుసుకుంటారు.
23అన్యదేశాలు ఇశ్రాయేలు వంశం వారు ఎందుకు
బందీలుగా కొనిపోబడ్డారో తెలుసుకుంటాయి. నా
ప్రజలు నామీద తిరుగుబాటు చేసినట్లు వారు తెలుసు
కుంటారు. కావున నేను వారికి విముఖు డనయ్యాను.
వారి శత్రువులు వారిని ఓడించేలా చేశాను. అందుచే
నా ప్రజలు యుద్ధంలో చంపబడ్డారు. 24వారు పాపం
చేసి, వారిని వారు మలినపర్చుకున్నారు. కావున వారు
చేసిన పనులకు నేను వారిని శిక్షించాను. నేను వారికి
విముఖుడనై, వారికి సహాయం చేయ నిరాకరించాను."
25కావున నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు: "ఇప్పుడు యాకోబు వంశాన్ని దేశ
బహిష్కరణ నుండి విముక్తిచేసి తీసుకు వస్తాను. ఇశ్రా
యేలు వంశమంతటి మీద దయ చూపుతాను. నా
పవిత్ర నామ పరిరక్షణ విషయంలో నేను నా రోషాన్ని
తెలియజేస్తాను. 26ప్రజలు వారి అవమానాలను, వారు
నాపై తిరుగుబాటు చేసిన రోజులను వారు మర్చి
పోతారు. వారు తమ స్వంత దేశంలో సురక్షితంగా
నివసిస్తారు. వారి నెవరూ భయపెట్టరు. 27అన్య దేశాల
నుంచి నా ప్రజలను వెనుకకు తీసుకొని వస్తాను. వారి
శత్రు రాజ్యాల నుండి వారిని కూడదీస్తాను. నేనెంత
పవిత్రుడనో అనేక దేశాలు అప్పుడు చూస్తాయి.
28వారు తమ ఇండ్లను వదిలి ఇతర దేశాలకు బందీలుగా
పోయేటట్లు ఇంతకు ముందు నేను చేశాను. తరువాత
మళ్లీ వారిని కూడదీసి తమ స్వంత దేశానికి తీసుకొని
వచ్చాను. అందువల్ల నేను వారి దేవుడనైన యెహోవా
నని వారు తెలుసుకుంటారు. 29ఇశ్రాయేలు వంశం
మీద నా ఆత్మను కుమ్మరిస్తాను. దాని తరువాత మరె
న్నడూ నేను నా ప్రజలకు విముఖుడనై ఉండను."
నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### నూతన ఆలయం

40 మేము బందీలుగా ఉన్న తరువాత ఇరవై
ఐదవ సంవత్సరం ఆదిలో ఆ నెల (అక్టో
బరు), పదవ రోజున యెహోవా శక్తి నా మీదికి
వచ్చింది. అంటే ఇది ఆ రోజుకు బబులోను (బాబి
లోనియా) వారు యెరూషలేమును వశపర్చుకున్న
తరువాత పద్నాలుగు సంవత్సరాలు గడిచాయి. ఒక
స్వప్న దర్శనంలో యెహోవా నన్నక్కడికి తీసుకొని
వెళ్లాడు.
2ఒక దర్శనంలో దేవుడు నన్ను ఇశ్రాయేలు రాజ్యా
నికి తీసుకొని వెళ్లాడు. చాలా ఎత్తయిన ఒక పర్వతం
దగ్గర ఆయన నన్నుదించాడు. ఆ పర్వతం మీద ఒక
నగరంలా కన్పించే ఒక దివ్య భవంతి ఉంది. ఆ నగరం
దక్షిణ దిశగా ఉంది. 3యెహోవా నన్నక్కడికి తీసుకొని
వచ్చాడు. అక్కడ ఒక మనిషి ఉన్నాడు. మెరుగుదిద్దిన
కంచులా అతడు మెరుస్తున్నాడు. ఆ మనిషి చేతిలో
గుడ్డతో చేసిన కొలతతాడు* మరియు కొలతబద్ద
ఉన్నాయి. అతడు ద్వారం వద్ద నిలబడ్డాడు. 4ఆ మనిషి
నాతో అన్నాడు, "నరపుత్రుడా నీ కళ్లను, చెవులను
శ్రద్ధగా ఉపయోగించు. ఈ వస్తువులను చూడు. నేను
చెప్పేది విను. నేను చూపించే ప్రతిదాని పట్ల నీవు
శ్రద్ధ వహించు. ఎందుకనగా నేను ఇవన్నీ నీకు చూపించే
నిమిత్తమే నీవిక్కడకు తేబడ్డావు. నీవు చూసినదంతా
ఇశ్రాయేలు వంశం వారికి చెప్పాలి."
5ఆలయ ఆవరణ చుట్టూ నేనొక గోడ చూశాను.
ఆ మనిషి చేతిలో కొలత బద్ద ఉంది. దాని పొడవు
ఆరు మూరలు. ఆ మనిషి గోడ యొక్క మందాన్ని
కొలిచాడు. దాని మందం పది అడుగుల ఆరంగుళాలు.
తరువాత అతడు గోడ ఎత్తు కొలవగా అది పది అడుగుల
ఆరంగుళాలు ఉంది.

---

**హమోనా** హెబ్రీ భాషలో హమోనా అనగా గుంపు లేక సమూహము అని అర్థం.

**కొలతతాడు** స్థలాలను కొలిచే తాడు లేక దారం అని పాఠాంతరం.

[6]ఏమ్మట ఆ మనిషి తూర్పు ద్వారం వద్దకు వెళ్లాడు.
అక్కడ దాని మెట్లెక్కి ద్వారపు గడప వెడల్పు కొలవగా
అది పది అడుగుల ఆరంగుళాలు ఉంది. మరియొక
గడప వెడల్పు కూడ పది అడుగుల ఆరంగుళాలే ఉంది.
[7]అక్కడ ఒక గది ఉంది. దాని పొడవు, వెడల్పులు
ఒక్కొక్కటి పది అడుగుల ఆరంగుళాలు. గదుల మధ్య
ఖాళీస్థలం ఎనిమిది అడుగుల తొమ్మిది అంగుళాలు
ఉంది. లోపలి వైపుకు తిరిగి ఉన్న ముఖ మండపం
దిశలో ఉన్న ద్వారం యొక్క గడప వెడల్పు పది
అడుగుల ఆరంగుళాలు.
[8]ఆలయానికి పక్కనున్న ద్వార ముఖ మంటపాన్ని
ఆ మనిషి కొలిచాడు. దాని వెడల్పు పది అడుగుల
ఆరంగుళాలు. [9]ఏమ్మట అతడు ద్వార మండపాన్ని
కొలవగా అది ఎనిమిది మూరలున్నది. ద్వారపు రెండు
పక్కలనున్న గోడను కొలిచాడు. ఒక్కొక పక్క రెండు
మూరల మందం ఉంది. ముఖ మంటపం ద్వారానికి
చివర కోవెలదిశగా ఉంది. మండప ద్వారం లోపలి
వైపున ఉంది. [10]ద్వారానికి ఇరు వైపుల మూడేసి చిన్న
గదులున్నాయి. ఈ మూడు చిన్న గదుల నాలుగు
పక్కల గోడలూ ఒకే కొలతలో ఉన్నాయి. ద్వారపు
కమ్మెలు రెండు పక్కలా ఒకే కొలతలో ఉన్నాయి.
[11]ద్వారపు ప్రవేశ మార్గం పది మూరల వెడల్పు,
పదమూడు మూరల నిడివి కలిగి ఉంది.
[12]ప్రతి గది ముందు ఒక లోతైన గోడ ఉంది. ఆ
గోడ ఎత్తు ఆరు మూరలు. దాని మందం ఆరు
మూరలు. గదులు చతురస్రాకారంలో ఉన్నాయి. ప్రతి
గోడ ఆరు మూరలపొడుగు కలది.
[13]ఆ మనిషి ద్వారపు కొలతలను ఒక గది పైకప్పు
నుండి ఎదురుగానున్న మరి యొక గది పైకప్పు వరకు
కొలిచాడు. అది ఇరవై ఐదు మూరలుంది. [14]అతడు
పక్కనున్న గోడల ముందు భాగంతో బాటు, మంటపం
ముందున్న పక్క గోడలతో సహా కొలిచాడు. దాని
పొడవు మొత్తం అరవై మూరలు. దాని వెడల్పు
ముప్పయి అడుగులు. మండపం చుట్టూ ఆవరణ
ఉంది. [15]మండపం బయటి ద్వారం నుండి లోపలి
ద్వారం వరకు ఏభై మూరలు ఉన్నాయి. [16]కాపలాగ
దులకు పైన, పక్క గోడల పైన, మంటపం మీద
చిన్న కిటికీలు ఉన్నాయి. ఆ కిటికీల పెద్ద భాగాలు
ద్వారాన్ని చూస్తున్నాయి. ద్వారానికి ఇరువైపుల ఉన్న
గోడల మీద తాటిచెట్లు చెక్కబడి ఉన్నాయి.

### బయటి ప్రాంగణం

[17]ఏమ్మట ఆ మనుష్యుడు నన్ను బయటి ఆవరణ
లోకి తీసుకొని వచ్చాడు. అక్కడ గదులు, బాటలు
రాళ్ళతో చేయబడ్డ వాటిని చూశాను. గోడల నానుకొని
ఉన్న ఆ గదులు బాటకు ఎదురుగా ఉన్నాయి. అవి
ఆవరణ చుట్టూ ఉన్నాయి. ముందు భాగంలో చదును
చేసిన బాట మీద ముప్పయి గదులున్నాయి. [18]ద్వారం
ఎంత పొడవుగా ఉందో చదును బాట కూడ అంత
పొడవుంది. ఆ దారి ద్వారపు లోపలికొస వరకు చేరి
వుంది. ఇది దిగువ చదునుబాట. [19]ఏమ్మట ఆ మను
ష్యుడు కింది ద్వారం నుండి లోపలి ఆవరణ వరకు
గల దూరాన్ని కొలిచాడు. అది తూర్పున, ఉత్తరాన
నూరు మూరలు ఉంది.

[20]ఉత్తర దిశకు ఉన్న వెలుపలి ఆవరణ ద్వారం
యొక్క పొడవు వెడల్పులను ఆ మనిషి కొలిచాడు.
[21]ఈ ద్వారం దాని రెండు పక్కల ఉండే మూడేసి
గదులు దాని ఆవరణ, మొదటి ద్వారం ప్రక్కనే
ఉన్నాయి. దాని పొడవు యాభై మూరలు, వెడల్పు
ఇరవై ఐదు మూరలు ఉంది. [22]దాని కిటికీలు, దాని
మండపం, ఖర్జూరపు చెట్ల చెక్కడాలు, తూర్పు
ద్వారపు కొలతల పనితనం వలెనే ఉన్నాయి. ద్వారం
వరకు ఏడు మెట్లున్నాయి. ద్వార మండపం లోపలికి
ఉంది. [23]లోపలి ఆవరణలో అడ్డంగా ఉత్తర ద్వారానికి
ఎదురుగా ఒక ద్వారం ఉంది. అది తూర్పు ద్వారం
వలెనే ఉంది. ఆ మనిషి ఈ లోపలి ద్వారం నుంచి
ఆ వెలుపలి ద్వారం వరకు కొలవగా అది ద్వార
ద్వారానికి నూరు మూరల వెడల్పు ఉంది.
[24]ఏమ్మట ఆ మనిషి నన్ను దక్షిణానికి తీసుకొని
వెళ్లాడు. అక్కడ నేను దక్షిణ ద్వారం చూశాను. అతడు
ద్వారపు కమ్మీలను, మండపాన్ని కొలిచాడు. ఈ కొల
తలు ఇతర ద్వారాల కొలతల మాదిరిగానే ఉన్నాయి.
[25]ద్వారానికి, మండపానికి చుట్టూ మిగతా వాటి మాదిరే
కిటికీలున్నాయి. ద్వారం ఏభై మూరల పొడవు, ఇరవై
ఐదు మూరల వెడల్పు ఉంది. [26]ద్వారం వరకు ఏడు
మెట్లున్నాయి. దాని మండప ద్వారం లోపల చివర
వరకూ ఉంది. ద్వారానికి అటూ ఇటూ ఖర్జూరపు
చెట్ల చెక్కడపు పనితనం ఉంది. [27]లోపలి ఆవరణ
యొక్క దక్షిణ దిశన ఒక గుమ్మం ఉంది. ఒక ద్వారానికి,
మరొక ద్వారానికి మధ్య దూరాన్ని ఆ మనిషి కొలి
చాడు. దాని వెడల్పు నూట డెభై ఐదు అడుగులు.

### లోపలి ఆవరణ

[28]తరువాత నన్నతడు దక్షిణ ద్వారం గుండా లోపలి
ఆవరణలోకి తీసుకొని వచ్చాడు. ఇతర గుమ్మాల
మాదిరిగానే దక్షిణ ద్వారం కొలతలు కూడ ఉన్నాయి.
[29]దక్షిణ ద్వారపు గదులు, దాని ద్వారపు కమ్మీలు,
దాని మండపం కొలతలు కూడ ఇతర గుమ్మాల
కొలతలవలెనే ఉన్నాయి. ద్వారానికి, మండపానికి
చుట్టూ కిటికీలున్నాయి. ద్వారం పొడవు ఏభై
మూరలు, వెడల్పు ఇరవై ఐదు మూరలు ఉన్నాయి.
లోపలి ఆవరణ చుట్టూ మండపాలున్నాయి.
[30]మండపం పొడవు ఇరవై ఐదు మూరలు, వెడల్పు

ఐదు మూరలు కలిగి ఉంది. [31]మరియు దాని మండప
ద్వారం వెలుపలి ఆవరణ తరువాత ఉంది. దాని ద్వారా
నికి ఇరు పక్కలనున్న గోడల మీద ఖర్జూరపు చెట్ల
చెక్కడపు పనితనం ఉంది. దానిని ఎక్కటానికి ఎనిమిది
మెట్లున్నాయి.
[32]ఆ మనిషి నన్ను తూర్పు దిశన ఉన్న లోపలి
ఆవరణలోనికి తీసుకొని వచ్చాడు. అతడు గుమ్మాన్ని
కొలిచాడు. అది ఇతర గుమ్మాల మాదిరే కొలతలు
కలిగిఉంది. [33]తూర్పు ద్వారపు గదులు, పక్కగోడలు,
మండపం ఇతర ద్వారాల మాదిరే కొలతలు కలిగి
ఉన్నాయి. ద్వారానికి, మండపానికి చుట్టూ కిటికీ
లున్నాయి. ద్వారం పొడవు ఏభై మూరలు, వెడల్పు
ఇరవై ఐదు మూరలు కలిగి ఉంది. [34]దాని మండపం
ద్వారానికి చివర వెలుపలి ఆవరణ వైపుకు ఉంది.
దాని ఇరు పక్కల ఉన్న గోడల మీద ఖర్జూరపు చెట్లు
చెక్కబడి ఉన్నాయి. దానికి ఎనిమిది మెట్లున్నాయి.
[35]పిమ్మట ఆ మనిషి నన్ను ఉత్తర ద్వారం వద్దకు
తీసుకొని వచ్చాడు. అతడు దానిని కొలిచాడు. దీని
కొలతలు కూడా ఇతర ద్వారాలవలె ఉన్నాయి. [36]ఇతర
ద్వారాల, గదుల, మండపాల కొలతల మేరకే అది
కూడా ఉంది. ద్వారం మరియు మండపం చుట్టూ
కిటికీలున్నాయి. అది యాభై మూరల పొడవు, ఇరవై
ఐదు మూరలు వెడల్పు కలిగి ఉంది. [37]దాని మండపం
ద్వారానికి చివర వెలుపలి ఆవరణ వైపున ఉంది. ఆ
రెండు గోడల మీద ఖర్జూరపు చెట్లు చెక్కబడ్డాయి.
దానికి ఎనిమిది మెట్లున్నాయి.

### బలులను సిద్ధపరిచే గదులు

[38]ద్వారం వద్ద తలుపుపున్న ఒక గది మండపానికి
చేరువగా ఉంది. యాజకులు దహన బలులు ఇవ్వటా
నికి బలి పశువులను కడిగే చోటు ఇదే. [39]ద్వార
మండపంలో ప్రతి పక్క రెండు బల్లలున్నాయి. అప
రాధ పరిహారార్థ బలులు ఇవ్వటానికి తగిన జంతువులను
ఈ బల్లల మీదనే వధిస్తారు. [40]మరియు ద్వార మండ
పానికి అవతలి పక్కన కూడా రెండు బల్లలున్నాయి.
[41]గోడల లోపల నాలుగు బల్లలున్నాయి. గోడల
బయట నాలుగు బల్లలున్నాయి. మొత్తం అక్కడ ఎని
మిది బల్లలున్నాయి. ఈ బల్లల మీదనే యాజకులు
బలి పశువులను వధిస్తారు. [42]దహనబలుల నిమిత్తం
నాలుగు చెక్కిన రాతి బల్లలు ఉన్నాయి. ఈ బల్లలు
ఒక్కొక్కటి రెండడుగుల ఏడున్నర అంగుళాల పొడవు;
రెండడుగుల ఏడున్నర అంగుళాల వెడల్పు; ఒక
అడుగు తొమ్మిది అంగుళాల ఎత్తు కలిగి ఉన్నాయి.
దహన బలులకు, ఇతర బలులకు వినియోగించే జంతు
వులను చంపటానికి తగిన పని ముట్లను యాజకులు
ఈ బల్లల మీదనే ఉంచుతారు. [43]మూడంగుళాల
మాంసపు కొక్కెములు ఆలయమంతటా ఉంచ
బడ్డాయి. అర్పణకు ప్రత్యేకించిన మాంసాన్ని బల్లల
మీద ఉంచుతారు.

### యాజకుల గదులు

[44]లోపలి ఆవరణలోకి వెళ్లే ద్వారం బయట రెండు
గదులున్నాయి. ఒకటి ఉత్తర ద్వారం వద్ద ఉంది. అది
దక్షిణానికి చూస్తూ ఉంది. రెండవ గది దక్షిణ ద్వారం
వద్ద ఉంది. అది ఉత్తరానికి చూస్తూంది. [45]ఆ మనిషి
నాతో ఇలా అన్నాడు: "దక్షిణానికి చూసే ఈ గది
దేవాలయ సేవలో ఉంటూ పనిమీద ఉన్న యాజకులు
ఉండటానికి ప్రత్యేకించబడింది. [46]కాని ఉత్తరానికి
చూస్తూవున్న గదిని విధులకు వచ్చి బలిపీఠం వద్ద
పనిచేసే యాజకులు ఉండటానికి ఇవ్వబడింది. ఈ
యాజకులంతా సాదోకు సంతతివారు. లేవీయులలో
సాదోకు సంతతివారు మాత్రమే యెహోవాకు బలులు
తెచ్చి సేవచేయ టానికి అర్హులు."
[47]ఆ మనుష్యుడు లోపలి ఆవరణను కొలవగా
అది ఖచ్చితమైన సమ చదరంగా ఉంది. దాని పొడవు,
వెడల్పులు ప్రతి ఒక్కటి నూట డెభై ఐదు అడుగులు
ఉంది. బలిపీఠం ఆలయానికి ముందున్నది.

### ఆలయ మండపం

[48]ఆ మనుష్యుడు నన్ను ఆలయ మండపానికి
తీసుకొనివచ్చాడు. అతడు మండపం యొక్క రెండు
పక్కలనున్న గోడలను కొలిచాడు. ప్రతి పక్క గోడలు
ఐదు మూరల దళం, మూడు మూరల వెడల్పు కలిగి
ఉన్నాయి. వాటి మధ్య పద్నాలుగు మూరల స్థలం
ఉంది. [49]మండపం పొడవు పన్నెండు మూరలు,
వెడల్పు ఇరవై మూరల, మండపంచేరటానికి పది
మెట్లు ఉన్నాయి. గోడలకు పక్కగా అటు ఒకటి,
ఇటు ఒకటి రెండు స్తంభాలున్నాయి.

### ఆలయ పవిత్ర స్థలం

41 ఆ మనిషి నన్ను మధ్య గదికి (పవిత్ర స్థలం)
తీసుకొని వచ్చాడు. అతడు దానికి రెండు
పక్కలనున్న గోడలను కొలిచాడు. అవి ప్రతి పక్క
పది అడుగుల ఆరంగుళాల మందాన ఉన్నాయి.
[2]తలుపు పది మూరల వెడల్పు ఉంది. ద్వారపు పక్క
భాగాలు ప్రతి పక్కా ఐదు మూరలు ఉన్నాయి. ఆ
మనిషి గదిని కొలిచాడు. అది నలభై మూరల పొడవు,
ఇరవై మూరల వెడల్పు ఉంది.

### ఆలయ అతి పవిత్ర స్థలం

[3]పిమ్మట ఆ మనిషి లోపలి చివరి గదికి వెళ్లి
ద్వారం పక్క గోడలను కొలిచాడు. ప్రతిగోడా రెండు
మూరల మందం, ఏడు మూరల వెడల్పు ఉంది.
తలుపు మధ్య ఆరు మూరల ప్రవేశ స్థలం ఉంది.

[4]తరువాత ఆ మనిషి గది యొక్క పొడవు కొలిచాడు.
అది మధ్య గదిలో ప్రవేశించే ఇరవై మూరల పొడవు,
ఇరవై మూరల వెడల్పు కలిగి ఉంది. అతను నాతో,
"ఇది అతి పవిత్ర స్థలం" అని చెప్పాడు.

### ఆలయం చుట్టూవున్న వేరే గదులు

[5]పిమ్మట అతడు ఆలయపు గోడను కొలిచాడు.
అది ఆరు మూరల మందం కలిగి ఉంది. పక్క గదులు
ఆలయం చుట్టూ ఉన్నాయి. అవి నాలుగు మూరల
వెడల్పు. [6]పక్క గదులు మూడు వివిధ అంతస్థులపై
ఉన్నాయి. ఒకదాని మీద ఒకటి అవి ఉన్నాయి. ప్రతి
అంతస్థులోను ముప్పయి గదులున్నాయి. ఆలయపు
గోడలు రాళ్ళ తిప్పలతో కట్టబడ్డాయి. పక్క గదులకు
చుట్టూ గోడ ఆధారం ఉంది. కానీ కేవలం ఆలయం
యొక్క గోడే గదులకు ఆధారం కాలేదు. [7]ఆలయం
చుట్టూ ఉన్న గదుల ప్రతి అంతస్థూ దానికింది భాగం
కంటె వెడల్పుగా ఉంది. ఆలయం చుట్టూ ఉన్న
గదుల గోడలు పైకి పోను పోనూ ఇరుకు కావడం
వల్ల పై అంతస్థుల గదులు విశాలంగా ఉన్నాయి. కింది
అంతస్థు నుండి పై అంతస్థు వరకు మధ్య అంతస్తు
గుండా మెట్లదారి ఉంది.

[8]ఆలయానికి చుట్టూ చదును చేసి బండలు పరచిన
ఎత్తయిన పునాది ఉన్నట్లు నేను చూశాను. పక్క
గదుల పునాదులు పది అడుగుల ఆరంగుళాల ఎత్తున
ఉన్నాయి. [9]పక్క గదుల బయటి గోడ ఎనిమిది
అడుగుల తొమ్మిది అంగుళాల మందం ఉంది.
ఆలయం పక్క గదులకు, యాజకుల గదులకు మధ్య
మరియు [10]ఆలయం చుట్టూ ఖాళీ స్థలం ముప్పయి
ఐదు అడుగులు. [11]పక్క గదుల వాకిళ్ళు ఎత్తయిన
పునాది స్థలం వరకూ ఉన్నాయి. ఒక వాకిలి ఉత్తర
దిశగా ఉంటే, మరొకటి దక్షిణ దిశగా ఉంది.

[12]ఆలయానికి పడమట నియమిత స్థలంలో ఒక
భవనం ఉంది. అది డెభ్బై మూరల వెడల్పు, తొంభై
మూరల పొడవు కలిగి ఉంది. ఆ భవనపుగోడ అన్ని
వైపులా ఐదు మూరల మందం ఉంది. [13]పిమ్మట ఆ
మనుష్యుడు ఆలయాన్ని కొలిచాడు. ఆలయం నూరు
మూరల పొడఉంది. భవనం, నియమిత స్థలం, దాని
గోడలతో కలిసి పొడవు నూరు మూరలున్నాయి.
[14]ఆలయం ముందు తూర్పు భాగపు నియమిత స్థలం
నూరు మూరల పొడఉంది.

[15]ఆలయపు చివరి నియమిత స్థలంలో ఉన్న
భవనం పొడవును ఆ మనిషి కొలిచాడు. ఒక గోడకు
మరొక గోడకు నూరు మూరలున్నవి. అతి పవిత్ర
స్థలానికి, పవిత్ర స్థలానికి, మండపానికి ఎదురుగా ఉన్న
ఆవరణ చుట్టూ మూడింటి గోడలకు నగిషీ పనులు
చేసిన కొయ్యపలకలు అన్ని కిటికీలకు, తలుపులకు
కొయ్యతో నగిషీలు చెయబడ్డాయి. [16]ఆలయపు
గుమ్మం వద్ద కింది నుండి కిటికీల వరకు చుట్టూ
బల్ల కూర్పువేయబడింది.

[17]ఆలయపు లోపలి, బయటి గదుల గోడలలో
నగిషీలు చేయబడ్డాయి. ఆలయం యొక్క లోపలి
గది గోడల మీద, బయట గది గోడల మీద [18]కెరూ
బుల, ఖర్జూరపు చెట్ల చిత్రాలు చెక్కబడ్డాయి.
కెరూబుల మధ్య ఒక ఖర్జూరపు చెట్టు చొప్పున
ఉన్నాయి. ప్రతీ కెరూబులకు రెండు ముఖాలు
ఉన్నాయి. [19]ఒకటి మానవ ముఖం ఆకారంలో ఉండి
ఒక పక్క నున్న ఖర్జూరపు చెట్టు వైపు చూస్తూ
ఉంటుంది. రెండవది సింహపు ముఖం. అది రెండవ
పక్కనున్న ఖర్జూరపు చెట్టును చూస్తూ ఉంటుంది.
అవి ఆలయం మీద అన్ని చోట్లా చెక్కబడ్డాయి.
[20]నేలనుండి తలుపు మీది వరకూ గల పవిత్ర స్థల
గోడల మీద కెరూబుల, ఖర్జూరపు చెట్ల చిత్రాలు
చెక్కబడ్డాయి.

[21]ఆలయపు పవిత్ర స్థలం పక్కనున్న నలు గోడలు
చదరంగా ఉన్నాయి. అతి పవిత్ర స్థలం ముందు
[22]కొయ్యతో చేయబడిన బలిపీఠం వంటిది ఒకటుంది.
అది మూడు మూరల ఎత్తు, రెండు మూరల పొడవు
కలిగి ఉంది. దాని మూలలు, దాని అడుగు, దాని
పక్కలు అన్నీ కొయ్యతోనే చేయ బడ్డాయి. "ఇది
యెహోవా ఎదుట ఉండే బల్ల" అని ఆ మనుష్యుడు
నాతో ఇలా చెప్పాడు.

[23]పవిత్ర స్థలం మరియు అతి పవిత్ర స్థలం రెండిం
టికీ రెండు తలుపులున్నాయి. [24]తలుపులలో ప్రతి
ఒక్కటి రెండు చిన్న తలుపులతో చేయబడింది. ప్రతి
తలుపుకి నిజానికి రెండు మడత తలుపులున్నాయి.
[25]పవిత్రమైన గది తలుపుల మీద కూడ కెరూబుల,
ఖర్జూరపు చెట్ల చిత్రాలు చెక్కబడ్డాయి. అవి గోడల
మీద చెక్కిన చిత్రాల మాదిరిగానే ఉన్నాయి. మండ
పానికి ముందు భాగం చెక్కలతో కప్పబడి ఉంది.
[26]మండపం చుట్టూ దాని మేడ మీద గదులలో
కొయ్యతో చేయబడ్డ చట్రపు కిటికీలు, మండపానికి
ఇరు పక్కల ఖర్జూరపు చెట్లు ఉన్నాయి.

### యాజకుని గది

42 పిమ్మట ఆ మనిషి ఉత్తరపు గుమ్మంనుండి
బయటి ఆవరణకు తీసుకొని వెళ్లాడు. ఉత్తర
నియమిత స్థలంలో అనేక గదులతో కూడుకున్న
భవనానికి నన్ను నడిపించాడు. [2]ఉత్తర దిశన ఉన్న
భవనం పొడవు నూరు మూరలు; వెడల్పు ఏభై
మూరలు ఉంది. [3]ఈ కట్టడాల గోడల మీద మూడం
తస్థుల్లో వసారాలు ఉన్నాయి. భవనానికి, ఆలయానికి
మధ్య లోపలి ఆవరణ ఇరవై మూరలుంది. దాని పక్కన
గదులు బయట ఆవరణ యొక్క చదునుబాటను
చూస్తూ ఉంది. [4]ఆ గదుల ముందు ఒక చావడి ఉంది.

దాని వెడల్పు పది మూరలు, పొడవు నూరు మూరలు (ఇది భవనానికి తూర్పుదిశగా ఉంది). వాటి తలుపులు ఉత్తరానికి ఉన్నాయి. 5భవనం మూడంతస్థుల ఎత్తు ఉండడం వల్లనూ, వాటి బయటి ఆవరణకు స్థంభాలు లేకపోవడంవల్ల పై అంతస్థుల్లో ఉన్న గదులు, మధ్యన మరియు కింది గదులకన్నా చాలా వెనుకనున్నాయి. 6పై అంతస్థులో వసారాలు ఎక్కువ స్థలం తీసుకోవటంతో పై అంతస్థులు మధ్య అంతస్థుకన్నా ఇరుకుగా ఉంది. మధ్య అంతస్థు కింది అంతస్థుకన్నా ఇరుకుగా ఉంది. 7బయట ఒక గోడ ఉంది. అది గదులకు సమాంతరంగా ఉంది. అది గదులకు ముందు ఏభై మూరల వరకు వెళ్తుంది.8ఆ భవనం మొత్తం ఆలయం వైపుగా నూరు మూరల పొడవు వున్నా, బయట ఆవరణలో అది ఏభై మూరల పొడవు ఉంది. 9ఈ గదుల ద్వారం భవనపు తూర్పు దిక్కుకు దిగువన ఉంది. కానీ ప్రజలు బయటి ఆవరణ నుండి ప్రవేశించవచ్చు. 10ఆవరణ పక్కనున్న గోడ మొదట్లో ఉంది.

ఈ గదుల ముందు దక్షిణ దిక్కున నియమిత స్థలంలో గదులు ఉన్నాయి. 11ఒక చావడి కూడా ఉంది. అవి ఉత్తర దిశన వున్న గదులమాదిరే ఉన్నాయి. దక్షిణవైపు తలుపుల పొడవు వెడల్పులు ఉత్తర దిక్కున వున్నవాటి లెక్కనే ఉన్నాయి. ఉత్తర దిశ తలుపులకు వున్న కొలతలు, గుమ్మాల మాదిరే దక్షిణ తలుపులకు కూడ ఉన్నాయి. 12కింది గదులకు ప్రవేశం భవనం తూర్పు దిక్కు చివరన ఉంది కాబట్టి ప్రజలు గోడ బయటి మార్గం గుండా ప్రవేశించవచ్చు.

13ఆ మనిషి నాతో ఇలా అన్నాడు: "నియమిత స్థలానికి అడ్డంగా ఉన్న ఉత్తర గదులు, దక్షిణ గదులు పవిత్రమైనవి. యెహోవాకు బలులు సమర్పించే యాజకులకు ఈ గదులు కేటాయించబడ్డాయి. ఆ యాజకులు అతి పవిత్ర అర్పణలను ఈ గదులలోనే తింటారు. అతి పవిత్ర అర్పణలను వారక్కడ ఉంచుతారు. ఎందుకంటే, ఈ స్థలం పవిత్రమైనది. అతి పవిత్ర అర్పణలు ఏమంటే: ధాన్యపు నైవేద్యాలు, తప్పులను పరిహరించు బలులు మరియు అపరాధ పరిహారార్థ బలులు. 14యాజకులు పవిత్ర ప్రదేశంలో ప్రవేశిస్తారు. కాని వారు బయటి ఆవరణలోకి వెళ్లే ముందు, వారు సేవ చేసేటప్పుడు ధరించే బట్టలను పవిత్ర స్థలంలో వదిలి వేస్తారు. అవి అతి పవిత్రమైన బట్టలు గనుక వారలా చేస్తారు. ఒక యాజకుడు ఆలయంలో సామాన్య ప్రజలు వుండే చోటికి వెళ్లదలచినప్పుడు అతడు వేరే బట్టలు ధరించి వెళ్లవలసి ఉంటుంది."

### ఆలయపు బయటి ఆవరణ

15ఆలయపు లోపలి భాగాన్ని ఆ మనిషి కొలవటం పూర్తి చేసిన పిమ్మట, తూర్పు ద్వారం గుండా అతడు నన్ను బయటకు తీసుకొని వచ్చాడు. గుడి బయటి భాగాన్నంతా అతడు కొలిచాడు. 16ఆ మనుష్యుడు కొలకర్రతో తూర్పు భాగాన్నంతా కొలిచాడు. అది ఐదువందల మూరల పొడఉంది. 17అతడు ఉత్తర భాగాన్ని కొలవగా అది ఐదువందల మూరల పొడఉంది. 18అతడు దక్షిణ భాగాన్ని కొలవగా అది ఐదువందల మూరల పొడఉంది. 19అతడు తిరిగి వెళ్లి పశ్చిమ దిశను కొలవగా అది ఐదువందల మూరల పొడఉంది. 20ఆ విధంగా అతడు ఆలయం యొక్క నాలుగు పక్కల కొలిచాడు. ఆలయం చుట్టూ గోడ కట్టబడింది. ఆ గోడ పొడవు అది ఐదువందల మూరల, వెడల్పు అది ఐదువందల మూరలు ఉంది. అది మామూలు ప్రదేశాన్ని, పవిత్ర స్థలం నుండి వేరుచేసింది.

### యెహోవా తన ప్రజల మధ్య నివసించుట

43 ఆ మనుష్యుడు నన్ను తూర్పు ద్వారం వద్దకు నడిపించాడు. 2అక్కడ ఇశ్రాయేలు దేవుని కీర్తి తూర్పు నుండి వచ్చింది. దేవుని కంఠస్వరం సముద్ర ఘోషలా గంభీరంగా ఉంది. దేవుని మహిమవల్ల భూమి ప్రకాశమానమయ్యింది. 3నేను చూచిన ఆ దర్శనం గతంలో నేను కెబారు కాలువవద్ద చూచిన దర్శనంవలెనే ఉంది. నేను సాష్టాంగ నమస్కారం చేశాను. 4తూర్పు ద్వారం గుండా దేవుని మహిమ ఆలయంలోకి వచ్చింది.

5అప్పుడు ఆత్మ నన్ను పట్టుకొని లోపలి ఆవరణలోనికి తీసుకొని వచ్చింది. యెహోవా మహిమ ఆలయాన్ని నింపివేసింది. 6ఆలయం లోపలి నుండి ఎవరో నాతో మాట్లాడుతున్నట్లు నేను విన్నాను. నా పక్కన ఒక మనుష్యుడు నిలబడివున్నాడు. 7ఆలయంలో నుండి వచ్చిన కంఠస్వరం నాతో ఇలా అన్నది: "నరపుత్రుడా, ఇది నా సింహాసనం, పాదపీఠం నెలకొని వున్న చోటు. ఇశ్రాయేలు ప్రజల మధ్య ఈ ప్రదేశంలో నేను శాశ్వతంగా నివసిస్తాను. ఇశ్రాయేలు వంశం మరెన్నడూ నా పవిత్ర నామాన్ని పాడు చేయదు. వ్యభిచార పాపాల చేత, ఈ ప్రదేశంలో రాజుల శవాలను పాతిపెట్టిన దోషాలచేత రాజులు, వారి ప్రజలు నా పేరును అవమాన పర్చరు. 8వారి గడప నా గడప పక్కన; వారి ద్వారం నా ద్వారం పక్కన నెలకొల్పి వారు నా పవిత్ర నామాన్ని అపవిత్రం చేయరు. గతంలో కేవలం ఒక్క గోడ మాత్రమే నాకు, వారికి అడ్డంగా ఉండేది. అందుచే వారు పాపం చేసిన ప్రతిసారి, భయంకర కార్యాలు చేసినప్పుడల్లా వారు నా పేరును అవమానపర్చారు. అందుచేత నాకు కోపం వచ్చి నేను వారిని నాశనం చేశాను. 9ఇప్పుడు వారు వ్యభిచార పాపాలకు దూరం కావాలి. వారి రాజుల కళేబరాలను నాకు దూరంగా తీసుకొనిపోవాలి. అప్పుడు నేను వారి మధ్య శాశ్వతంగా నివసిస్తాను.

10"నరపుత్రుడా, ఇప్పుడు ఇశ్రాయేలు వంశానికి ఈ ఆలయాన్ని గురించి చెప్పు. అప్పుడు వారు

తమ పాపాల పట్ల సిగ్గుపడతారు. వారు ఆలయానికి
సంబంధించిన నమూనాలు నేర్చుకొంటారు. 11పైగా
వారు తాము చేసిన చెడ్డ పనులన్నిటినీ తలపోసి సిగ్గు
పడతారు. ఆలయ నమూనాను వారు తెలుసుకోవాలి.
అది ఎలా నిర్మింపబడిందో, ఎక్కడెక్కడ లోపలికి
వచ్చే, బయటకు వెళ్లే ద్వారాలున్నాయో, ఇంకా దాని
మీద వున్న చెక్కడపు పనులను గురించే వారిని తెలిసి
కోనిమ్ము. దానికి సంబంధించిన నియమ నిబంధనల
న్నింటినీ వారికి నేర్పు. వారు చూడగలిగే విధంగా
నీవు ఈ విషయాలన్నీ వ్రాసి పెట్టు. అప్పుడు ఆలయా
నికి సంబంధించిన నియమ నిబంధనలు వారు తప్పక
పాటిస్తారు. అప్పుడు వారు వీటన్నిటినీ చేయగులు
గుతారు. 12ఆలయ ధర్మం ఇది, పర్వతం మీది శిఖరాగ్ర
ప్రదేశమంతా అతి పవిత్ర స్థలం. ఇది ఆలయ ధర్మం.

## బలిపీఠం

13"పెద్ద కొలకర్రతో కొలవగా బలిపీఠం యొక్క
కొలతలు ఇలా ఉన్నాయి, బలిపీఠం కింది అరుగు
చుట్టూ మురికి నీరు పోయే దారి ఉంది. దాని లోతు
ఒక మూర ఉంది. దాని ప్రతి పక్కా ఒక మూర
వెడల్పు ఉంది. దానిమీద అంచు చుట్టూ ఉన్న కట్టు
జానెడు ఉంది. బలిపీఠం ఎత్తు 14భూమి నుండి కింది
అంచు వరకు అస్థిభారం రెండు మూరలు. అది ఒక
మూర వెడల్పు. చిన్న అంచునుండి పై అంచు వరకు
నాలుగు మూరలుంది. అది రెండు మూరల వెడల్పు
ఉంది. అది చిన్న చూరు నుండి పెద్ద చూరు వరకు
ఏడడుగులు ఉంది. అది మూడడుగుల ఆరంగుళాల
వెడల్పు ఉంది. 15బలిపీఠం మీద అగ్నిస్థానం (హోమ
గుండం) నాలుగు మూరల ఎత్తు ఉంది. నాలుగు
మూరలు నాలుగు కొమ్ముల్లా మలచబడి ఉన్నాయి.
16బలిపీఠం మీది అగ్ని గుండం పొడవు పన్నెండు
మూరలు, వెడల్పు పన్నెండు మూరలు అది ఖచ్చిత
మైన నలుమూలల చదరంగా ఉంది. 17అంచు కూడ
పొడవు వెడల్పులు పన్నెండు మూరలు చొప్పున
చదరంగా ఉంది. దాని చుట్టూ వున్న అంచు అరమూర
ఉంది. అడుగు దిమ్మ చుట్టూ నీరు పోయే మార్గపు
వెడల్పు రెండు మూరలు ఉంది. బలిపీఠం మీదికి
మెట్లు తూర్పు దిక్కున ఉన్నాయి."
18అప్పుడు ఆ వ్యక్తి నాతో ఇలా అన్నాడు: "నర
పుత్రుడా, నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు: 'ఈ బలిపీఠం కట్టబడిన రోజున ఈ
బలులు, దాని మీద రక్తం చల్లడం అనే నియమాలు
పాటించు. 19సాదోకు వంశపు యాజకులకు పాప
పరిహారార్థ బలి నిమిత్తం ఒక కోడె దూడను ఇవ్వాలి.
వీరు లేవీ తెగకు చెందిన యాజకులు.'" నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు, 20"వారు నాకు
బలులు తెచ్చి, నాకు సేవ చేస్తారు. మీరు కోడెదూడ
రక్తాన్ని కొంత తీసుకొని బలిపీఠపు నాలుగు కొమ్ముల
మీద, దాని చూరు నాలుగు మూలల మీద, మరియు
దాని అంచు చుట్టూ వుంచాలి. తద్వారా మీరు బలి
పీఠాన్ని పవిత్ర పర్చుతారు. 21పాప పరిహారార్థ బలి
కొరకు మీరు కోడెదూడను తేవాలి. ఆలయంలోని
భవనం బయట ఒక ప్రత్యేక స్థలంలో కోడెదూడ
దహనపర్చ బడుతుంది.
22"రెండవ రోజున దోషరహితమైన ఒక మేక
పోతును బలి ఇవ్వాలి. ఇది పాపపరిహారార్థమైన బలి.
కోడెదూడను బలి ఇచ్చిన సందర్భంగా బలిపీఠాన్ని
పరిశుద్ధపర్చినట్లే యాజకులు ఇప్పుడు కూడా చేస్తారు.
23మీరు బలిపీఠాన్ని శుద్ధి పర్చిన పిమ్మట దోష
రహితమైన ఒక కోడెదూడను, మందలో ఏ దోషం
లేని ఒక పొట్టేలును బలికి తెస్తారు. 24మీరు వాటిని
యెహోవా ముందు బలి ఇస్తారు. యాజకులు వాటి
మీద ఉప్పు జల్లుతారు. పిమ్మట యాజకులు గిత్తను,
పొట్టేలును యెహోవాకు దహనబలిగా అర్పిస్తారు.
25ఏడు రోజులపాటు ప్రతిరోజూ మీరు ఒక మేకను
పాపపరిహారార్థ బలికి సిద్ధం చేస్తారు. అలాగే మీరు ఒక
కోడెదూడను, మందలో నుండి ఒక పొట్టేలును సిద్ధం
చేస్తారు. కోడెదూడ, పొట్టేలు ఏ దోషమూ లేనివై
యుండాలి. 26ఏడు రోజుల పాటు యాజకులు బలి
పీఠాన్ని శుద్ధిపర్చుతారు. తరువాత వారు దానిని
యెహోవాకు అంకితం చేస్తారు. 27ఏడు రోజులు
అయిన తరువాత ఎనిమిదవ రోజు నుండి యాజకులు
మీ దహనబలులను, సహవాస బలులను బలిపీఠం మీద
ఇవ్వాలి. అప్పుడు నేను మిమ్మల్ని అంగీకరిస్తాను."
నా ప్రభువైన యెహోవా ఇది చెప్పాడు.

## వెలుపలి ద్వారం

44 పిమ్మట ఆ మనుష్యుడు నన్ను ఆలయానికి
తూర్పున ఉన్న వెలుపలి ద్వారం వద్దకి తిరిగి
తీసుకొని వచ్చాడు. వెలుపలి ద్వారం మూసి ఉంది.
2యెహోవా నాతో ఇలా చెప్పాడు: "ఈ ద్వారం
మూయబడి ఉంటుంది. ఇది తెరవబడదు. ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవా దీనిద్వారా ప్రవేశించాడు
గనుక మరెవ్వరూ ఈ ద్వారంగుండా ప్రవేశం చేయరు.
అందువల్ల ఇది మూయబడి ఉండాలి. 3యెహోవాతో
సమాధాన బలి అర్పణ తినేటప్పుడు ప్రజాపాలకుడు
ఈ ద్వారం వద్ద కూర్చుంటాడు. ద్వారం వద్ద గల
మండప మార్గం ద్వారా అతడు వచ్చి వెళతాడు."

## ఆలయ పవిత్రత

4తరువాత ఆ మనుష్యుడు ఉత్తర ద్వారం ద్వారా
నన్ను ఆలయం ముందుకు తీసుకొని వచ్చాడు.
యెహోవా మహిమ ఆలయాన్ని నింపివేస్తున్నట్లు
నేను చూశాను. నేను సాష్టాంగపడి నమస్కరించాను.

5యెహోవా ఇలా అన్నాడు: “నరపుత్రుడా, జాగ్రత్తగా
చూడు! నీ కండ్లను, చెవులను ఉపయోగించు. ఈ
వస్తువులను చూడు. నేను యెహోవా ఆలయం
యొక్క నియమ నిబంధనలను గురించి చెప్పే ప్రతి
విషయాన్ని నీవు శ్రద్ధగా విను. ఆలయ ప్రవేశద్వారాల
వైపు, ఆలయం నుండి బయటికి పోయే ద్వారము
లన్నిటి వైపూ పరిశీలనగా చూడు. 6తరువాత నాపట్ల
తిరుగుబాటుదారులైన ఇశ్రాయేలు ప్రజలందరికీ ఈ
వర్తమానాన్ని అందించు. వారికిలా చెప్పు: ‘నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు, ఇశ్రా
యేలు వంశీయులారా, మీరు నాపట్ల చేసిన భయంకర
మైన పనులు కోకొల్లలు! ఇక చాలు. 7నా ఆలయం
లోకి మీరు అన్యదేశీయులను తీసుకొని వచ్చారు.
వారు నిజంగా సున్నతి సంస్కారం లేనివారు. వారు
తమను తాము పూర్తిగా నాకు సమర్పించుకోలేదు.
ఈ రకంగా మీరు నా ఆలయాన్ని అపవిత్రం చేశారు.
మన ఒడంబడికను మీరు భంగపర్చారు. మీరు చెడు
కార్యాలు చేశారు. తరువాత మీరు నాకు రొట్టె, కొవ్వు,
రక్తం సమర్పించారు. కాని ఇదంతా కేవలం నా ఆల
యాన్ని అపవిత్రపర్చింది. 8మీరు నా పవిత్ర వస్తువుల
విషయంలో జాగ్రత్త తీసుకోలేదు. పైగా అన్యదేశీ
యులు నా పవిత్ర స్థలాన్ని గురించి బాధ్యత వహించేలా
చేశారు!’”

9నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “నిజంగా సున్నతి సంస్కారం పొందని
విదేశీయుడెవ్వడూ నా ఆలయంలోకి రాకూడదు.
అట్టివాడు శాశ్వతంగా ఇశ్రాయేలు ప్రజల మధ్య నివసి
స్తున్న వాడైనా నా ఆలయ ప్రవేశానికి అర్హుడు కాడు.
అతడు నా ఆలయ ప్రవేశం చేసే దానికి ముందు
సున్నతి సంస్కారం పొంది తనను తాను నాకు పూర్తిగా
సమర్పించుకోవాలి.

10గతంలో ఇశ్రాయేలీయులు నాపై తిరుగుబాటు
చేసినప్పుడు లేవీయులు నన్ను వదిలివేశారు. తమ
విగ్రహాలను ఆరాధించటానికి ఇశ్రా యేలీయులు నన్ను
వదిలిపెట్టారు. లేవీయులు చేసిన పాపానికి వారు శిక్షింప
బడతారు. 11నా పవిత్ర స్థలంలో సేవ చేయటానికి
లేవీయులు ఎంపిక చేయబడ్డారు. ఆలయ ద్వారాలకు
వారు కాపలా ఉన్నారు. వారు ఆలయంలో సేవ చేశారు.
ప్రజల తరఫున బలులు దహన బలులు ఇవ్వటానికి
వారు జంతువులను వధిం చారు. ప్రజలకు సహాయం
చేయటానికి, వాళ్ళకు సేవ చేయటానికి వారు ఎంపిక
చేయబడ్డారు. 12కాని ప్రజలు నాపట్ల పాపం చేయ
టానికే లేవీయులు వారికి సహాయపడ్డారు! ప్రజల
విగ్రహారాధనలో లేవీయులు వారికి సహాయపడ్డారు!
కనుక నేను వారికి వ్యతిరేకంగా ఇలా ప్రతిజ్ఞ చేస్తున్నాను,
‘వారు తమ పాపానికి శిక్షింపబడతారు.’” నా ప్రభువైన
యెహోవా ఇది చెప్పాడు.

13“కావున యాజకులవలె లేవీయులు నాకు అర్ప
ణలు తీసుకొనిరారు. నా పవిత్ర వస్తువుల వద్దకు
గాని, అతి పవిత్రమైనవిగా తలచబడేవాటి దరిదాపులకు
గాని వారు రారు. వారు చేసిన నీచమైన పనులకు
అవమానాన్ని వారు భరించాలి. 14అయితే వారిని నా
ఆలయం గురించి శ్రద్ధ తీసుకోనిస్తాను. వారు ఆల
యంలో పనిచేస్తూ, అక్కడ తప్పక జరగవలసిన కార్యా
లన్నీ నెరవేర్చుతారు.

15“యాజకులందరూ లేవీ వంశపువారే. కాని ఇశ్రా
యేలు ప్రజలు నాపై తిరుగుబాటు చేసినప్పుడు
సాదోకు సంతతి యాజకులు మాత్రమే నా పవిత్ర
స్థలాన్ని గురించి జాగ్రత్త తీసుకున్నారు. కావున
సాదోకు సంతతి వారే నాకు అర్పణలు తెస్తారు. వారు
బలి యిచ్చే జంతువుల కొవ్వును, రక్తాన్ని నాకు
అర్పించేందుకు వారు నా ముందు నిలబడతారు.” నా
ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు!
16“వారు నా పవిత్ర స్థలంలో ప్రవేశిస్తారు. నేను వారి
కిచ్చిన వస్తువుల పట్ల జాగ్రత్త తీసుకుంటారు. 17వారు
లోపలి ఆవరణ ద్వారాలలో ప్రవేశించినప్పుడు వారు
నారబట్టలు ధరిస్తారు. లోపలి ఆవరణ గుమ్మాల వద్ద,
ఆలయంలోను సేవ చేసేటప్పుడు వారు ఉన్ని బట్టలు
ధరించరు. 18వారు నార పాగాలను తమ తలలపై ధరి
స్తారు. నడుముకు చుట్టుకొనేటందుకు కూడ వారు
నారబట్టలే వుపయోగిస్తారు. వారికి చెమట పుట్టించే
బట్టలేవీ వారు ధరించరు. 19బయటి ఆవరణలో ప్రజల
వద్దకు వారు వెళ్లేముందు, నాకు సేవ చేసేటప్పుడు
ధరించే వస్త్రాలను వారు విడుస్తారు. వారు వేరే బట్టలు
వేసుకొంటారు. ఈ విధంగా వారు పవిత్ర వస్త్రాలను
ప్రజలు ముట్టకుండ చూస్తారు.

20“ఈ యాజకులు తమ తలలు గొరిగించరు.
కాని జుట్టు బారుగా పెరగకుండా మాత్రం జాగ్రత్త
పడతారు. (తలలు గొరిగించడం విచారానికి దుఃఖానికి
సూచన. యాజకులు కేవలం యెహోవా సేవలోనే
ఆనందిస్తారు.) యాజకులు తమ తల వెంట్రుకలను
తగు మాత్రమే కత్తిరిస్తారు. 21లోపలి ఆవరణలోనికి
వెళ్లేటప్పుడు యాజకులెవ్వరూ ద్రాక్షారసం తాగరాదు.
22యాజకులు విధవరాండ్రను, విడాకులిచ్చిన స్త్రీలను
వివాహమాడరాదు. వారు కేవలం ఇశ్రాయేలు వంశంలో
నుండి కన్యలను మాత్రమే వివాహమాడాలి. లేదా
చనిపోయిన భర్త యాజకుడైతే, ఆ విధవస్త్రీని వారు
పెండ్లి చేసుకోవచ్చు.

23“పవిత్ర వస్తువులకు, పవిత్ర వస్తువులు కాని
వాటికి మధ్య వ్యత్యాసాన్ని గురించి కూడా నా ప్రజలకు
యాజకులు తెలియజేస్తారు. శుభ్రమైన పదార్థాలు
ఏవో, అపరిశుభ్రమైనవి ఏవో నా ప్రజలు తెలుసుకొ
నేటందుకు వారు సహాయపడతారు. 24న్యాయ
స్థానంలో యాజకులు న్యాయాధీశులుగా వ్యవహరి

స్తారు. ప్రజలకు తీర్పు తీర్చేటప్పుడు వారు నా కట్ట
డలను అనుసరిస్తారు. నా ప్రత్యేక విందుల (సమా
వేశాల) సమయంలో వారు నా నియమ నిబంధనలను
పాటిస్తారు. వారు నేను ఏర్పాటు చేసిన ప్రత్యేక విశ్రాంతి
రోజులను గౌరవించి, వాటిని పవిత్రంగా ఉంచుతారు.
25వారు శవాలను తాకి వారిని వారు అపవిత్ర పర్చుకోరు.
కాని ఆ చనిపోయిన వ్యక్తి గనుక తండ్రి గాని, తల్లి
గాని, కుమారుడు, కుమార్తె, సోదరుడు గాని లేక
వివాహితకాని సోదరిగాని అయితే వారు శవాలను ముట్టి
తమను తాము అపవిత్రం చేసుకొంటారు. 26ఇది
యాజకుని అపరిశుద్ధుణ్ణి చేస్తుంది. యాజకుడు
పరిశుద్ధుడయిన తరువాత అతడు ఏడు రోజులు ఆగాలి.
27అప్పుడతడు తిరిగి పవిత్ర స్థలానికి వెళ్లవచ్చు. పవిత్ర
స్థలంలో సేవ నిమిత్తం అతడు లోపలి ఆవరణలోకి
వెళ్లే రోజున తన నిమిత్తం ఒక పాప పరిహారపు బలిని
ఇచ్చుకోవాలి." నా ప్రభువైన యెహోవా ఈ విష
యాలు చెప్పాడు.

28"లేవీయులకు సంబంధించిన భూమిని విషయ
మేదంటే, వారి ఆస్తిని నేనే. ఇశ్రాయేలులో లేవీయులకు
మీరేమీ ఆస్తిని (భూమిని) ఇవ్వవద్దు. ఇశ్రాయేలులో
నేనే వారి భాగం. 29ధాన్యార్పణలు, పాప పరిహారార్థ
బలిమాంసం, అపరాధ పరిహారార్థ బలి సమర్పణ వారికి
ఆహారంగా ఇవ్వబడతాయి. ఇశ్రాయేలులో ప్రజలు
యెహోవాకు సమర్పించేదంతా వారికి చెందుతుంది.
30కోత కాలంలో ప్రతి పంటలోను మొదటి భాగం
యాజకులకు కేటాయించాలి. కలిపిన రొట్టెల పిండి
ముద్దలో మొదటి భాగం యాజకులకు ఇవ్వాలి. ఇది
మీ కుటుంబాలకు మంచి ఆశీస్సులనిస్తుంది. 31సహ
జంగా చనిపోయిన పక్షినిగాని, జంతువునుగాని, లేదా
ఏదైనా అడవి జంతువుచే చీల్చబడిన దానినిగాని
యాజకులు తినరాదు.

### పవిత్ర కార్యాలకు భూమి విభజన

45 "మీరు చీట్లువేసి భూమిని ఇశ్రాయేలు వంశపు
వారి మధ్య విభజించాలి. ఆ సమయంలో
ఒక భూమి భాగాన్ని మీరు విడిగా ఉంచాలి. అది
యెహోవా యొక్క పవిత్ర భాగం. ఆ భూమి పొడవు
ఇరవై ఐదువేల మూరలు వెడల్పు ఇరవై వేల మూరలు.
ఈ భూమి అంతా పవిత్రమైనది. 2రెండువేల ఐదు
వందల మూరల చదరపు అడుగుల పొడవున్న చతుర
స్రాకార స్థలాన్ని గుడికి కేటాయించ బడాలి. గుడి
చుట్టూ ఐదువందల మూరలు గల ఖాళీస్థలం ఉండాలి.
3పవిత్ర స్థలంలో ఇరవై ఐదువేల మూరలు పొడవు;
పదివేల మూరల వెడల్పు గల స్థలాన్ని కొలవాలి. ఈ
ప్రదేశంలోనే గుడి ఉండాలి. గుడి ప్రదేశం అతి పవిత్ర
స్థలంగా ఉండాలి.

4ఆ భూమిలో పవిత్ర భాగం యాజకుల వినియోగా
ర్థమై, ఆలయ సేవకుల నిమిత్తం వాళ్ళు ఎక్కడ
యెహోవా దగ్గరకు సేవ చేయటానికి వస్తారో వాళ్ళ
కోసం ఉంటుంది. యాజకుల ఇండ్ల నిమిత్తం, ఆల
యానికి స్థానంగా అది వినియోగ పడుతుంది. 5ఐదు
లక్షల ఇరవై ఐదువేల మూరల పొడవు, పదివేల మూరల
వెడల్పుతో మరొక భూభాగం ఆలయంలో సేవ చేసే
లేవీయులకు ప్రత్యేకించబడుతుంది. ఈ భూభాగం
లేవీయుల నివాస ప్రాంతంగా కూడా ఉపయోగపడు
తుంది.

6"మీరు నగరానికి ఐదువేల మూరల వెడల్పు,
రెండులక్షల ఏభై వేల మూరల పొడవుగల భూ భాగాన్ని
స్తారు. ఇది పవిత్ర స్థలం పొడవునా ఉంటుంది. ఇది
ఇశ్రాయేలు వంశానికంతటికీ చెంది ఉంటుంది. 7పాలనా
ధికారికి పవిత్ర స్థలానికి రెండు పక్కల ఉన్న భూమి,
నగరానికి చెందిన భూమిగా ఉంటుంది. ఒక తెగకు
(గోత్రం) చెందిన స్థలం ఎంత వెడల్పు ఉంటుందో
దీని వెడల్పు కూడ అంతే ఉంటుంది. ఇది పడమటి
సరిహద్దు నుండి తూర్పు సరిహద్దు వరకు వ్యాపించి
ఉంటుంది. 8ఈ స్థలం ఇశ్రాయేలులో పాలనాధికారి
యొక్క ఆస్తి. అందువల్ల ఈ అధిపతి నా ప్రజల జీవి
తాలను ఏ మాత్రం కష్టాలపాలు చేయనవసరం లేదు.
కానివారు ఈ స్థలాన్ని ఇశ్రాయేలీయులకు వంశాల
వారీగా ఇస్తారు."

9నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు, "ఇశ్రాయేలు పాలకులారా, ఇక చాలు! ప్రజల
పట్ల క్రూరంగా ప్రవర్తించటం, వారి సొమ్ము కొల్ల
గొట్టటం మానండి! న్యాయవర్తనులై మంచి పనులు
చేయండి! నా ప్రజలను వారి ఇండ్ల నుండి వెడల
గొట్టటం మానండి!" నా ప్రభువైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.

10"మీరు ప్రజలను మోసగించటం మానండి. మీరు
ఖచ్చితమైన తూనికలు, కొలతలు వినియోగించండి!
11'ఏఫా'* (పందుములో పదవ పాలు) మరియు "బత్"
(తూము) ఒకే పరిమాణంలో ఉండాలి. రెండూ
"ఓమెరు"లో పదవ వంతుకు సరిసమానంగా ఉండాలి.
ఆ కొలతలు "ఓమెరు" (పందుము)ను పరిమాణంగా
చేసుకొని ఉండాలి. 12"షెకెలు" (తులం) ఇరవై "గెరా"
లకు (చిన్నములు) సరి సమానంగా ఉండాలి. ఒక
"మీనా" అరవై షెకెలు (తులా)లకు సమానంగా
ఉండాలి. అనగా అది ఇరవై తులాలు, ఇరవై ఐదు
తులాలు, పదిహేను తులాల కలయికకు సమానం.

13"మీరు ఇచ్చే ప్రత్యేక (ప్రతిష్టిత) అర్పణ
ఈలాగున ఉండాలి.

---

**ఏఫా** సుమారు నలభై ఎనిమిదిన్నర గాలనులు, లేక ఆరు
బుషెలు లేక ఒక పందుము.

గోధుమలలో తూములో ఆరో భాగం, యవల
గింజలలో తూముతో ఆరో భాగం వంతున
అర్పించాలి.
14 తైల పదార్థాలు చెల్లించేటప్పుడు ప్రతి నూట
ఎనభై పడుల* ఒలీవ నూనెలో ఒక ముప్పాతిక
పడుల వంతు నూనెను చెల్లించాలి. ఇది ఒక
నిబంధన.
15 ఇశ్రాయేలులో నీటి వనరుగల ప్రాంతాలలో ఉన్న
మందలలో ప్రతి రెండు వందల గొర్రెలకు ఒక
మంచి గొర్రె చొప్పున అర్పించాలి.

“ఆ ప్రత్యేక అర్పణలు ధాన్యార్పణల కొరకు,
దహన బలులకు, సమాధాన (శాంతి) బలులకు ఇవ్వ
బడతాయి. ఈ అర్పణలన్నీ ప్రజలను పరిశుద్ధులను
చేయటానికి ఉద్దేశించబడ్డాయి.” నా ప్రభువైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
16“ఈ అర్పణ ప్రతి పౌరుడు ఇశ్రాయేలు పాలకునికి
చెల్లిస్తాడు. 17కావున పాలకుడు ప్రత్యేక పవిత్ర దినాలకు
కావలసిన వస్తువులను తప్పక ఇవ్వాలి. విందు రోజు
లకు, అమావాస్యలకు, సబ్బాతు రోజులకు ఇశ్రాయేలు
వంశం జరిపే ప్రత్యేక విందుల సమయాలకు దహన
బలులు, ధాన్యార్పణలు, పానార్పణలు పాలకుడైన
వాడు సమకూర్చాలి. ఇశ్రాయేలు వంశాన్ని పవిత్రపర్చే
కార్యక్రమంలో ఇచ్చే పాపపరిహార బలులు, ధాన్యపు
నైవేద్యాలు, దహన బలులు, సమాధాన బలులు
పాలకుడు ఇవ్వాలి.”
18నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “మొదటి నెల మొదటి రోజున ఏ దోషమూ
లేని ఒక కోడెదూడను తీసుకోవాలి. ఆలయాన్ని
పరిశుద్ధం చేయటానికి మీరు ఆ కోడెదూడను ఉప
యోగించాలి. 19పాప పరిహారార్థమైన బలిరక్తాన్ని కొంత
యాజకుడు తీసుకొని ఆలయ గుమ్మాల మీద, బలి
పీఠం అంచు నాలుగు మూలల మీద మరియు లోపలి
ఆవరణ గుమ్మం కమ్మెలమీద చల్లుతాడు. 20ఇదే పని
ఆ నెలలో ఏడవ రోజున ఎవరైనా పొర పాటునగాని,
తెలియక గాని చేసిన పాప పరిహారం నిమిత్తం మీరు
చేస్తారు. అలా మీరు ఆలయాన్ని పరిశుద్ధ పర్చాలి.

### పస్కా పండుగ సందర్భంగా ఇచ్చే అర్పణలు

21“మొదటి నెల పద్నాలుగవ రోజున మీరు పస్కా
పండుగ జరుపుకోవాలి. పులియని రొట్టెల పండుగ
ఇదే సమయంలో మొదలవుతుంది. ఆ పండుగ ఏడు
రోజులపాటు జరుగుతుంది. 22ఆ సమయంలో పాల
కుడు తన కొరకునూ, ఇశ్రాయేలు ప్రజల కొరకునూ
ఒక కోడెదూడను బలి ఇస్తాడు. అది పాపపరిహారార్థ
బలి. 23పండుగ జరిగే ఏడు రోజులు పాలకుడు ఏ
దోషములేని ఏడు కోడెదూడలను, ఏడు పొట్టేళ్లను
బలి ఇస్తాడు. అవి యెహోవాకు దహన బలులుగా
సమర్పింపబడతాయి. పండుగ ఏడు రోజులూ రోజుకు
ఒక కోడెదూడ చొప్పున పాలకుడు బలిఇస్తాడు. ప్రతి
రోజూ పాప పరిహారార్థమై అతడు ఒక మేకపోతును
అర్పిస్తాడు. 24ప్రతి కోడెదూడతో పాటు ఒక ఏఫా
(సుమారు తొమ్మిది మానికెలు) యవలను ధాన్యపు
నైవేద్యంగాను, ఒక ఏఫా యవలను ప్రతి పొట్టేలుతోను
అధిపతి చెల్లిస్తాడు. ఇంకా పాలకుడు ప్రతి తొమ్మిది
మానికెల ధాన్యంతో పాటు మూడు పడుల (ఒక
గాలను) నూనెను సమర్పించాలి. 25పాలకుడు పర్ణశాలల
పండుగ జరిపే ఏడు రోజులలోనూ ఇదే విధంగా తప్పక
చేయాలి. ఈ పండుగ ఏడవ నెలలో పదిహేనవ రోజున
మొద లవుతుంది. ఇవన్నీ పాపపరిహారార్థ అర్పణలు,
దహన బలులు, ధాన్యార్పణలు, నూనె అర్పణలుగా
పరిగణింపబడుతాయి.”

### పాలకుడు – పండుగలు

46 నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు
చెపుతున్నాడు, “లోపలి ఆవరణ తూర్పు
ద్వారం ఆరు పని రోజులలోను మూసి ఉంచబడు
తుంది. కాని అది సబ్బాతు రోజున, అమావాస్య రోజున
తెరువబడుతుంది. 2పాలకుడు ద్వారం మండపం
గుండా లోనికి ప్రవేశించి, ద్వారం పక్కన నిలబడతాడు.
తరువాత యాజకులు పాలకుని తరుపున దహనబలి,
సమాధాన బలులు సమర్పిస్తారు. ద్వారం గడపవద్దనే
పాలకుడు ఆరాధించాలి, మరియు నమస్కరించాలి.
అతడు బయటికి వెళతాడు. కాని సాయంత్రం వరకు
ద్వారం మూయబడదు. 3సబ్బాతు రోజులలోను,
అమావాస్యలందు సాధారణ ప్రజలు కూడ యెహోవా
ముందు ద్వారం తెరవబడిన దగ్గర పూజలు చేస్తారు.
4“సబ్బాతు దినాన పాలకుడు యెహోవాకు దహన
బలులు అర్పిస్తాడు. ఏ దోషమూలేని ఆరు గొర్రెపిల్ల
లను, ఏ దోషమూలేని ఒక పొట్టేలును అతడు సమకూ
ర్చాలి. 5పొట్టేలుతో పాటు ఒక ఏఫా (తొమ్మిది మాని
కెలు) ధాన్యాన్ని కూడ అతడు తప్పక ఇవ్వాలి. పాల
కుడు ధాన్యార్పణకు గొర్రె పిల్లలతో పాటు తను
ఇవ్వగలిగినంత ఇస్తాడు. ప్రతి తొమ్మిది మానికెల
(ఏఫా) ధాన్యానికి మూడు పడుల (ఒక గాలను) ఒలీవ
నూనెను అతడు తప్పక ఇవ్వాలి. 6“అమావాస్యనాడు
ఏ దోషమూలేని ఒక కోడెదూడను అతడు తప్పక
అర్పించాలి. ఏ దోషమూలేని ఆరు గొర్రె పిల్లలను,
ఒక పొట్టేలును అతడు అర్పిస్తాడు. 7కోడెదూడతో

---

**నూట ఎనభై పడుల** పది బదులు ఒక కోరు, నూట ఎనుబది పడులు సరిసమానము. కోరు అనగా ఏబదియైదు గాలనకు సమానం. బదులో పదవవంతు ఆదగానుకు సమానము. అనగా ప్రతి ఏభై ఐదు గాన్లు (ఒక కోరు) నూనె అరగాలను లేకబదులో ఐదవవంతు సమర్పించాలి.

పాటు ఒక తూమెడు ధాన్యార్పణను, పొట్టేలుతో పాటు
పాలకుడు తప్పక అందించాలి. గొర్రె పిల్లతోపాటు
పాలకుడు తన శక్తికొలది సమర్పణలు ఇవ్వవచ్చు.
ప్రతి తూమెడు ధాన్యానికి మూడు పడుల (ఒక గాలను)
నూనె చొప్పున సమర్పించాలి.
8“పాలకుడు వచ్చి తూర్పు ద్వారంలో గల
మండపం ద్వారా ఆలయ ప్రాంగణంలోకి ప్రవేశించాలి.
బయటకు కూడా వెళ్లిపోవాలి .
9“ప్రత్యేక పండుగల సందర్భంలో దేశ ప్రజలు
యెహోవా దర్శనార్థం వచ్చినప్పుడు, వారు ఉత్తర
ద్వారం గుండా ఆరాధనకు వచ్చి దక్షిణ ద్వారం గుండా
నేరుగా బయటకు వెళ్లాలి. దక్షిణ ద్వారం గుండా
ప్రవేశించిన వ్యక్తి ఉత్తర ద్వారం గుండా బయటకు
వెళ్లాలి. ఏ వ్యక్తీ ప్రవేశించిన ద్వారం గుండా బయటకు
వెళ్లరాదు. ప్రతి ఒక్కడూ తిన్నగా బయటకు సాగి
పోవాలి. 10ప్రజలు లోపల ప్రవేశించినప్పుడు, వారి
తోపాటు పాలకుడు లోనికి వెళతాడు. వారితో బాటు
పాలకుడు బయటకు వెళ్లాలి.
11“విందులప్పుడు, ప్రత్యేక సమావేశాల సమయాల
లోను ప్రతి కోడెదూడతోను తొమ్మిది మానికెల
(ఒక ఏఫా) ధాన్యార్పణ తప్పక చేయాలి. ప్రతి పొట్టేలు
తోను, తొమ్మిది మానికెల ధాన్యార్పణ చేయాలి.
ప్రతి గొర్రె పిల్లతోను అతడు తన శక్తి కొలదీ ధాన్యాన్ని
అర్పించాలి. ప్రతి తొమ్మిది మానికెల ధాన్యంతో
పాటు మూడు పడుల (ఒక గాలను) నూనెను సమ
ర్పించాలి.
12“పాలకుడు తను స్వంతంగా దహనబలులు గాని,
సమాధాన బలులుగాని తన ఇష్టపూర్వక అర్పణ
(స్వేచ్ఛార్పణ)గాని యెహోవాకు ఇవ్వదలచినప్పుడు
అతనికోసం తూర్పు ద్వారం తెరువబడుతుంది.
అప్పుడు తను విశ్రాంతి రోజున అర్పించినట్లు తన
దహనబలిని, సమాధానబలిని అర్పిస్తాడు. అతడు
వెళ్లినాక తిరిగి ద్వారం మూయబడుతుంది.

## అనుదిన అర్పణలు

13“మరియు మీరు ఏ దోషమూలేని ఒక ఏడాది
వయస్సు గల గొర్రె పిల్లను ఇవ్వాలి. అది యెహోవాకు
ప్రతి రోజూ దహనబలిగా ఇవ్వ బడుతుంది. దానిని
అనుదినం ఉదయం సమర్పించాలి. 14ప్రతిరోజూ
ఉదయం గొర్రె పిల్లతో పాటు ధాన్యార్పణ కూడ
ఇవ్వాలి. ఇందు నిమిత్తం తూమెడు గోధుమ పిండిలో
(ఏఫా) ఆరవ వంతు, ఆ సన్నపు పిండిని కలపటానికి
ఒక పడి (గాలనులో మూడవ వంతు) నూనెను ఇవ్వాలి.
ఇది యెహోవాకు అనుదిన ధాన్యార్పణ. ఇది శాశ్వ
తంగా పాటింపబడుతుంది. 15ఆ విధంగా వారు గొర్రె
పిల్లను, ధాన్యార్పణను, నూనెను ప్రతి ఉదయం ఎప్ప
టికీ దహన బలిగా ఇవ్వాలి.”

## పాలకుడు తన పిల్లలకు భూమిని ఇవ్వటానికి నియమాలు

16నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు: “రాజ్యాధిపతి తన కుమారులలో ఎవరికైనా
తన భూమిలో కొంత భాగం కానుకగా ఇస్తే అది
అతని కుమారులకు చెందుతుంది. అది వారి ఆస్తి.
17ఒకవేళ పాలకుడు తన భూమిలో కొంత భాగాన్ని
ఒక బానిసకు బహుమానం ఇస్తే, అది వాడు స్వేచ్ఛ
పొందే సంవత్సరం* వరకే వానికి చెందుతుంది.
పిమ్మట ఆ బహుమానం రాజుకు తిరిగి వస్తుంది.
కేవలం రాజు కుమారులు మాత్రమే అతను బహు
మానం చేసిన భూమిని ఉంచుకుంటారు. 18మరియు
పాలకుడు ప్రజల భూమిని తన వశం చేసుకోడు.
వారు భూమిని వదిలిపొమ్మని ఒత్తిడి కూడ చేయడు.
అతడు తన స్వంత భూమిలో కొంత భాగాన్ని మాత్రమే
తన కుమారులకు ఇవ్వాలి. ఆ విధంగా నా ప్రజలు
తమ భూమిని పోగొట్టుకునేలాగ రాజు బలవంత
పెట్టబడరు.’

## ప్రత్యేక అర్పణ ఆవరణాలు

19ఆ మనుష్యుడు నన్ను ద్వారం పక్కనున్న మార్గం
గుండా నడిపించాడు. ఉత్తర దిశన ఉన్న యాజకుల
పవిత్ర గదుల వద్దకు నన్ను నడిపించాడు. అక్కడ
బాగా పడమటికి ఉన్న ఒక స్థలాన్ని చూశాను. 20ఆ
మనుష్యుడు నాతో ఇలా అన్నాడు: “ఇక్కడే యాజ
కులు దోష బలి సమర్పణను, పాపపరిహారార్థ బలి
సమర్పణను పెడతారు. ఇక్కడే యాజకులు ధాన్యార్ప
ణలను (రొట్టె) కాల్చుతారు. ఈ విధంగా చేయటం
వలన వారీ అర్పణ పదార్థాలను బయటి ఆవరణలోనికి
తెచ్చే అవసరముండదు. కావున వారీ పవిత్ర పదార్థా
లను సామాన్య ప్రజలు ఉండే చోటుకి తీసుకొనిరారు.”
21తరువాత ఆ మనుష్యుడు నన్ను బయటి ఆవర
ణలోనికి తీసుకొని వచ్చాడు. అతడు నన్ను ఆవరణ
నాలుగు మూలలకు నడిపించాడు. ఆవరణలో ప్రతి
మూలా మరో చిన్న ఆవరణ ఉంది. 22ఆవరణ యొక్క
నాలుగు మూలలలోనూ చిన్న ఆవరణలు ఉన్నాయి.
ప్రతి చిన్న ఆవరణ నలభై మూరలు పొడుగు ముప్పై
మూరలు వెడల్పు కలిగివుండెను. నాలుగు మూలలూ
ఒకే కొలతలో ఉన్నాయి. 23లోపల నాలుగు చిన్న
ఆవరణాల్లోనూ ప్రతి ఒక్కదాని చుట్టూ ఒక ఇటుక
గోడ ఉంది. నాలుగు చిన్న ఆవరణల్లోను గోడలకు
అటకలు నిర్మింపబడ్డాయి. ఇటుక గోడల్లో వంటకు

---

**స్వేచ్ఛపొందే సంవత్సరం** దీనినే స్వర్ణోత్సవం అని కూడా అంటారు. ప్రతి ఏభై సంవత్సరాలకు ఇశ్రాయేలీయులు, తమ బానిసలు ఇశ్రాయేలీయులయితే వాళ్లను విడుదల చేస్తారు. వాళ్లు అనుభవించిన భూమి రాజుకు తిరిగి వస్తుంది.

పొయ్యిలు కట్టబడ్డాయి. 24“ఆలయంలో సేవ చేసే
వారు ఈ పాకశాలల్లోనే ప్రజల కొరకు బలి మాంసాన్ని
ఉడక బెడతారు” అని ఆ మనుష్యుడు నాకు చెప్పాడు.

## ఆలయంనుంచి పారే నీరు

47 ఆ మనుష్యుడు నన్ను మళ్లీ ఆలయ
ద్వారంవద్దకు నడిపించాడు. ఆలయ తూర్పు
గుమ్మం కిందనుంచి నీరు బయటకు రావటం
చూశాను. (ఆలయ ముఖద్వారం తూర్పునకే ఉంది)
బలిపీఠానికి దక్షిణంగా ఉన్న ఆలయ దక్షిణపు భాగం
చివరి నుండి నీరు ప్రవహిస్తూ ఉంది. 2ఆ మనుష్యుడు
నన్ను ఉత్తర ద్వారం గుండా బయటికి తీసుకొని
వచ్చి ఆ తరువాత తూర్పున ఉన్న వెలుపలి ద్వారం
బయట చుట్టూ తిప్పాడు. ఆలయ దక్షిణ భాగంలో
నీరు బయటికి వస్తూఉంది.
3ఆ మనుష్యుడు ఒక కొలత బద్ద పట్టుకొని నూరు
మూరలు కొలిచాడు. అక్కడ నీళ్లను దాటమని అతడు
నాకు చెప్పాడు. నీళ్లు చీలమండలవరకు వచ్చాయి.
4అతడు మరో ఐదు వందల ఎనభై ఆరు గజాల
రెండడుగుల దూరం కొలిచాడు. మళ్లీ ఆ ప్రదేశంలో
నీళ్లలో నడవమని అతడు నాకు చెప్పాడు. అక్కడ
నీరు నా మోకాళ్ల వరకు వచ్చింది. మరో వెయ్యి
మూరలు కొలిచాడు. అక్కడ నీళ్లలోనుండి నడవమని
అతడు నాకు చెప్పాడు. అక్కడ నీరు నా మొలలోతు
వచ్చింది. 5ఆ మనిషి మరో వెయ్యి మూరలు కొలి
చాడు. కాని అక్కడ నీరు దాటలేనంత లోతుగా ఉంది.
అది ఒక నది అయింది. నీరు ఈదటానికి అనువైన
లోతున ఉంది. అది దాట శక్యముగానంత లోతైన
నది అయ్యింది. 6“నరపుత్రుడా, నీవు చూచిన విషయా
లను శ్రద్ధగా పరిశీలించావా?” అని ఆ మనుష్యుడు
నన్నడిగాడు. పిమ్మట నది పక్కగా ఆ మనుష్యుడు
నన్ను తిరిగి వెనుకకు తీసుకొని వచ్చాడు. 7నేను నది
పక్కగా తిరిగి వస్తూ వుండగా నీటికి రెండు పక్కలా
రకరకాల చెట్లు చూశాను. 8ఆ మనుష్యుడు నాతో
ఇలా అన్నాడు: “ఈ నీరు తూర్పుగా అరబా లోయలోకి
ప్రవహిస్తూ ఉంది. ఈ నీరు మృత సముద్రంలోకి
ప్రవహించటంతో, దానిలోని నీరు మంచినీరై శుభ్ర
పడుతూ ఉంది.* 9ఈ నీటిలో చేపలు విస్తారంగా
వుంటాయి. ఈ నది ప్రవహించే ప్రాంతంలో అన్ని
రకాల జంతువులు నివసిస్తాయి. 10ఏన్గెదీ పట్టణం
నుండి ఏనెగ్లాయీము పట్టణం వరకు బెస్తవాళ్లు నది
ఒడ్డున నిలబడి ఉండటం నీవు చూడగలవు. వారు
తమ వలలు విసరి రకరకాల చేపలు పట్టటం నీవు
చూడవచ్చు. మధ్యధరా సముద్రంలో ఎన్ని రకాల
చేపలు వుంటాయో మృత సముద్రంలో అన్ని రకాల
చేపలు ఉంటాయి. 11కాని అక్కడి పర్రలు, మరియు
కొద్దిగానున్న తడి ప్రదేశాలు మంచి భూమిగా మారవు.
అవి ఉప్పు తయారు చేయటానికి వదిలివేయబడ
తాయి. 12అన్ని రకాల పండ్ల జాతి మొక్కలు నదికి
ఇరు పక్కల పెరుగుతాయి. వాటి ఆకులు ఎన్నడూ
ఎండవు. ఆ చెట్లులో పండ్లు ఇవ్వకుండా ఎప్పుడూ
ఉండవు. ప్రతినెలా అవి పండ్లు ఇస్తూనే ఉంటాయి.
చెట్లకు కావలసిన నీరు ఆలయం నుండి వస్తూ
ఉంటుంది గనుక ఇలా జరుగుతుంది. చెట్ల నుండి
లభించే పండ్లు ఆహార నిమిత్తమూ, ఆకులు
ఔషధాలకూ వినియోగపడతాయి.”

## ఇశ్రాయేలు వంశీయుల మధ్య భూమి విభజన

13నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడు: “ఇశ్రాయేలులోని పన్నెండు వంశ తెగలకు
దేశాన్ని పంచే సరిహద్దులు ఇవి: యోసేపుకు రెండు
భాగాలు. 14మీరు దేశాన్ని సమానంగా పంచుకోవాలి.
ఈ దేశాన్ని ఇస్తానని మీ పూర్వీకులకు నేను ప్రమాణం
చేశాను. కావున ఇది మీకు నేను ఇస్తున్నాను.
15“దేశ సరిహద్దులు ఇవి: ఉత్తరాన మధ్యధరా
సముద్రం నుండి మొదలై హెత్లోను మార్గం ద్వారా
హమాతు మార్గం వద్ద మలుపు తిరిగి తరువాత జెదా
దుకు 16బెరోతాయునకు, హాజేరు హమాతుకు పొలి
మేరన గల సిబ్రయీము మరియు హవ్రానుకు పొలి
మేరనగల దమస్కస్ హత్తికోను వరకు. 17అలా
సముద్రం నుండి హసరేనాను వెళ్లి ఉత్తర పొలిమేరలోని
దమస్కు మరియు హమాతు వరకూ వ్యాపించింది.
ఇది ఉత్తర సరిహద్దు.
18“తూర్పు సరిహద్దు హసరేనాను నుండి మొదలై
హవ్రాను, దమస్కుల మధ్యగా యొర్దాను నది పక్కగా
గిలాదు, ఇశ్రాయేలు భూభాగాల మధ్యగా తూర్పు
సముద్ర తీరం వెంబడి తామారు వరకు వ్యాపించింది.
ఇది తూర్పు సరిహద్దు.
19“దక్షిణ సరిహద్దు తామారు నుండి మెరీబా కాదేషు
ఊటల వరకు ఉంది. అది అక్కడ నుండి ఈజిప్టు
వాగు పక్కగా మధ్యధరా సముద్రం వరకు వ్యాపించింది.
ఇది దక్షిణ సరిహద్దు.
20“పశ్చిమాన లేబో–హమాతు వరకు మధ్యధరా
సముద్ర తీరమంతా సరిహద్దుగా ఉంటుంది. ఇది మీ
పడమటి సరిహద్దు.
21“మీరీ దేశాన్ని ఇశ్రాయేలు తెగలకు విభజించాలి.
22దీనిని మీరు ఆస్తిలా మీ మధ్య, మీ మధ్య నివసించే
పరదేశీయులకు, మీలో ఉంటూ పిల్లలు కన్న వారికి
మధ్య పంచియివ్వాలి. ఈ పరదేశీయులు దేశపౌరులే.
వారు సహజంగా ఇక్కడ పుట్టి పెరిగిన ఇశ్రాయేలీయుల
మాదిరే ఉంటారు. ఇశ్రాయేలు తెగలకు చెందిన భూమి

---

**మృత ... వుంది.** మృత సముద్రపు ఉప్పు నీరు క్రొత్తదిగా అవుతుంది.

నుండి మీరు వారికి కొంత భూమిని విభజిస్తారు. [23]ఆ
పౌరుడు ఏ తెగలో నివసిస్తూ వుంటాడో అది అతనికి
కొంత భూమిని ఇవ్వాలి." నా ప్రభువైన యెహోవా
ఈ విషయాలు చెప్పాడు!

### ఇశ్రాయేలు తెగల (గోత్రాల) వారికి భూమిలో వాటాలు

48 [1-7]"ఉత్తర సరిహద్దు మధ్యధరా సముద్రం
నుండి తూర్పుకు సాగి హెత్లోనుకు, హమాతు
కనుమ వరకు వెళ్లి, అక్కడ నుండి హసరేనాను వరకు
ఉంది. ఇది దమస్కు (డెమాస్కస్)కు, హమాతుకు
సరిహద్దు మీద ఉంది. ఆయా వంశాలకు లభించే
భూమి తూర్పునుండి పడమటివరకు వెళుతుంది.
ఉత్తరాన్నుండి దక్షిణానికి ఈ ప్రదేశంలో గల తెగలు
(గోత్రాలు) ఏవనగా: దాను, ఆషేరు, నఫ్తాలి, మనష్షే,
ఎఫ్రాయిము, రూబేను మరియు యూదా.

[8]"మిగిలిన భూభాగం ప్రత్యేక వినియోగాలకు కేటా
యించ బడింది. మిగిలిన భాగం యూదా యొక్క
భాగానికి దక్షిణాన ఉంది. ఈ ప్రదేశం ఉత్తరాన ఇరవై
ఐదువేల మూరల పొడఉంది. మరియు పడమట పది
వేల మూరల వెడల్పు, తూర్పున పదివేల మూరల
వెడల్పు, దక్షిణాన ఇరవై ఐదువేల మూరల వెడల్పు
ఉంటుంది. ఆలయం ఈ విభాగం మధ్యలోవుంటుంది.
[9]ఈ భూమిని మీరు దేవునికి అంకితం చేస్తారు. దాని
పొడవు ఎనిమిది మైళ్ల ఐదువందల ఇరవై ఎనిమిది
గజాలు; దాని వెడల్పు ఆరు మైళ్ల పదివందల ఏబది
ఆరు గజాలు. [10]ఈ ప్రత్యేక భూ విభాగం యాజకులు,
లేవీయుల మధ్య పంచబడుతుంది.

"ఈ ప్రదేశంలో యాజకులకు ఒక వంతు వస్తుంది.
ఈ భూమి ఉత్తర దిశన ఎనిమిది మైళ్ల ఐదు వందల
ఇరవై ఎనిమిది గజాల పొడవు ఉంది. పశ్చిమ దిశన
మూడు మైళ్ల ఐదువందల ఇరవై ఎనిమిది గజాల
వెడల్పు ఉంది; తూర్పున మూడు మైళ్ల ఐదువందల
ఇరవై ఎనిమిది గజాలు; దక్షిణ దిశన ఎనిమిది మైళ్ల
ఐదు వందల ఇరవై ఎనిమిది గజాల పొడఉంది.
యెహోవా ఆలయం ఈ ప్రదేశపు మధ్య భాగంలో
ఉంటుంది. [11]ఈ భూమి సాదోకు సంతతివారికి ఇవ్వ
బడుతుంది. ఈ మనుష్యులు నా పవిత్ర యాజకులుగా
ఉండటానికి ఎంపిక చేయబడ్డారు. ఎందువల్లననంటే
ఇతర ఇశ్రాయేలీయులు నన్ను వదిలిపెట్టినప్పుడు
కూడా వీరు నన్ను భక్తి శ్రద్ధలతో కొలిచారు. లేవీయులు
చేసినట్లు సాదోకు సంతతి నన్ను విడిచిపెట్టలేదు.
[12]అందుచే ఈ పవిత్ర భూమిలో ఈ ప్రత్యేక విభాగం
ఈ యాజకుల కొరకు ప్రత్యేకించబడింది. ఇది లేవీ
యుల భూమికి ప్రక్కనే ఉంటుంది.

[13]"యాజకుల భూమి ప్రక్కన లేవీయులకు
భూమిలో భాగం వుంటుంది. దాని పొడవు ఇరవై
ఐదువేల మూరలు వెడల్పు పదివేల మూరలు గలది.
వాళ్లు ఈ భూమి యొక్క పూర్తి పొడవు వెడల్పుల
వరకూ తీసుకొంటారు – అనగా పొడవు ఇరవై ఐదువేల
మూరలు, వెడల్పు ఇరవై వేల మూరలు. [14]లేవీయులు
ఈ భూమిలో ఏ భాగంతోనూ వ్యాపారం చేయ
కూడదు. వారీ భూమిలో ఏ భాగాన్నీ అమ్మలేరు.
దేశంలో ఈ భాగాన్ని వారు విడగొట్ట గూడదు. ఎందు
వల్లనంటే ఈ భూమి యెహోవాకు చెందినది. ఇది
చాలా ప్రత్యేకమైనది. ఇది దేశంలో మిక్కిలి మంచి
భాగం.

### నగర ఆస్తిలో వాటాలు

[15]"యాజకులకు, లేవీయులకు ఇచ్చిన భూమిని
ఆనుకొని ఐదువేల మూరల వెడల్పు, ఇరవై ఐదువేల
మూరల పొడవు గల ఒక స్థలం ఉంటుంది. ఈ స్థలం
నగరానికి, పశువులు తిరిగి మేయటానికి, ఇండ్లు కట్టటా
నికి ఉపయోగపడుతుంది. సామాన్య ప్రజలు ఈ
స్థలాన్ని వినియోగించుకుంటారు. నగరం దీని మధ్యలో
వుంటుంది. [16]నగర కొలతలు ఇలా ఉన్నాయి, ఉత్తరాన
నాలుగువేల ఐదువందల మూరలు, దక్షిణాన నాలుగు
వేల ఐదువందల మూరలు, తూర్పున నాలుగువేల
ఐదువందల మూరలు, పడమట నాలుగువేల ఐదు
వందల మూరలు. [17]నగరానికి పచ్చిక బీడులు
వుంటాయి. ఈ పచ్చిక బీడులు ఉత్తరాన రెండువందల
ఏభై మూరలు, దక్షిణాన రెండువందల ఏభై మూరలు.
తూర్పున రెండువందల ఏభై మూరలు, పడమట
రెండువందల ఏభై మూరలు కలిగి వుంటాయి.
[18]పవిత్ర ప్రదేశం పొడవు పక్కగా వదిలిన స్థలం
తూర్పున పదివేల మూరలు, పడమట పదివేల
మూరలు. ఈ స్థలం పవిత్ర ప్రదేశం పక్కన పొడవునా
ఉంటుంది. నగర కార్మికులకు ఈ స్థలంలో ఆహార
ధాన్యాలు పండుతాయి. [19]నగరంలో పనిచేసే కార్మి
కులు ఈ భూమిని సాగుచేస్తారు. ఇశ్రాయేలు తెగల
న్నిటిలో నుండి ఈ పనివారు వస్తారు.

[20]"ఈ ప్రత్యేక భూభాగం నలుదిశలా చదరంగా
వుంటుంది. దాని పొడవు వెడల్పులు ఒక్కొక్కటి ఇరవై
ఐదువేల మూరలు చొప్పున ఉన్నాయి. దాని ప్రత్యేక
అవసరాల కొరకే ఈ భూమిని ఉంచాలి. ఒక భాగం
యాజకులకు. ఒక భాగం లేవీయులకు. ఒక భాగం
నగరానికి చెంది ఉండవలెను.

[21-22]"ఆ ప్రత్యేక భూమిలో ఒక భాగం దేశపాలకు
నికి చెందుతుంది. ఆ ప్రత్యేక భూమి నలుదిశలా చద
రంగా ఉంది. దాని పొడవు, వెడల్పులు ఒక్కొక్కటి
ఇరవై ఐదువేల మూరల చొప్పున ఉన్నాయి. ఈ
ప్రత్యేక భూమిలో ఒక భాగం యాజకులకు, ఒక
భాగం లేవీయులకు, మరొక భాగం ఆలయానికి చెందు
తాయి. ఆలయం ఈ స్థలంలో మధ్యగా వుంటుంది.

మిగిలిన భాగం దేశపాలకునికి చెందుతుంది. బెన్యామీనీ
యుల సరిహద్దుకు, యూదా వారి సరిహద్దుకు మధ్యగా
వున్న ప్రాంతం రాజ్యాధిపతికి చెంది ఉంటుంది.
23-27"ఈ ప్రత్యేక భూమికి దక్షిణంగా వున్న భూమి
యొర్దాను నదికి తూర్పున నివసించే తెగల (గోత్రాలు)
వారికి చెందుతుంది. తూర్పు సరిహద్దు నుండి మధ్య
ధరా సముద్రం వరకు ఉన్న భూమిలో ప్రతీ గోత్రం
వారికి ఒక భాగం వస్తుంది. ఉత్తరాన్నుండి దక్షిణం
వరకు ఈ గోత్రాల వారెవరనగా: బెన్యామీను,
షిమ్యోను, ఇశ్శాఖారు, జెబూలూను మరియు గాదు.
28"గాదు వారి భూమి దక్షిణ సరిహద్దు తామారు
నుండి కాదేషులోగల మెరీబా నీటి వనరు వరకూ
అక్కడ నుండి ఈజిప్టు వాగు వెంబడి మధ్యధరా
సముద్రం వరకు వ్యాపించి ఉంది.
29ఈ భూమినే మీరు ఇశ్రాయేలు వంశాల మధ్య
విభజించుకోవాలి. ప్రతి తెగ వారికి వచ్చేది అదే."
నా ప్రభువైన యెహోవాయే ఈ విషయాలు
చెప్పాడు!

## నగర ద్వారాలు

30"ఇవి నగర ద్వారాలు. ఈ ద్వారాలు ఇశ్రాయేలు
గోత్రాల పేర్ల మీద పిలవబడతాయి. "నగర ఉత్తర
భాగం ఒక మైలు ఎనిమిది వందల ఎనభై గజాల
పొడవుంది. 31అక్కడ మూడు ద్వారాలు వుంటాయి :
అవి రూబేను ద్వారం, యూదా ద్వారం, మరియు
లేవీ ద్వారం.
32"నగర తూర్పు భాగం నాలుగువేల ఐదువందల
మూరల పొడవు. అక్కడ మూడు ద్వారాలు ఉన్నాయి:
అవి యోసేపు ద్వారం, బెన్యామీను ద్వారం మరియు
దాను ద్వారం. 33నగర దక్షిణ భాగం నాలుగువేల ఐదు
వందల మూరల పొడవుంది. అక్కడ మూడు ద్వారాలు
ఉన్నాయి: అవి షిమ్యోను ద్వారం, ఇశ్శాఖారు ద్వారం
మరియు జెబూలూను ద్వారం. 34"నగర పశ్చిమ
భాగం నాలుగు వేల ఐదువేల మూరల పొడఉంది.
అక్కడ మూడు ద్వారాలున్నాయి: అవి గాదు ద్వారం,
ఆషేరు ద్వారం మరియు నఫ్తాలి ద్వారం. 35"నగరం
చుట్టుకొలత ఆరుమైళ్లు. ఇప్పటి నుండి ఈ నగరం
'యెహోవా ఇక్కడ ఉన్నాడు' అని పిలువబడుతుంది.

# దానియేలు

### రాజైన నెబుకద్నెజరు, దానియేలు మరియు యూదావారి చెరను గురించి

1 బబులోను రాజైన, నెబుకద్నెజరు తన సైన్యంతో
యెరూషలేముకు వచ్చి దానిని చుట్టుముట్టాడు.
ఇది యెహోయాకీము యూదాకు రాజుగానున్న
మూడవ సంవత్సరంలో జరిగింది. 2ప్రభువు యూదా
రాజైన యెహోయాకీమును ఓడించడానికి, దేవుని
ఆలయం నుంచి అన్ని వస్తువులను తీసుకొని వెళ్ళ
డానికి నెబుకద్నెజరును అనుమతించాడు. అతడు ఆ
వస్తువులను తన విగ్రహ దేవతలున్న ఆలయములో
ఉంచాడు.
3తర్వాత నెబుకద్నెజరు అష్పెనజుకు (అష్పెనజు
రాజుకొలువులోని నపుంసకులలో ప్రముఖుడు),
"కొందరు యూదులను తన ఇంటికి తీసుకు రమ్మని"
చెప్పాడు. కొన్ని ప్రసిద్ధ కుటుంబాల నుంచి, ఇశ్రాయేలీ
యుల రాజకుటుంబం నుంచి ఆరోగ్యవంతులైన
యౌవ్వన యూదులను తీసుకు రమ్మని ఆజ్ఞాపిం
చాడు. 4ఎలాంటి లోపము తమ దేహాలమీద లేని
వారు, అందమైన, చురుకైన వారు, తేలికగా విషయాలు
నేర్చుకునే వారు, రాజగృహములో సేవ చేయ సామర్థ్య
ముగల యువకులను ఎన్నుకోమన్నాడు. ఆ ఇశ్రా
యేలు యువకులకు కల్దీయుల భాషను, వ్రాతలను
నేర్పుమని రాజు అష్పెనజుకు ఆజ్ఞాపించాడు.
5నెబుకద్నెజరు ఆ యువకులకు ప్రతీరోజు రాజు
తిని, త్రాగే ఆహారము, ద్రాక్షామద్యం ఇప్పించాడు.
ఇశ్రాయేలుకు చెందిన ఆ యువకులు మూడేళ్లపాటు
తర్ఫీదు పొందాలని రాజు ఆదేశించాడు. మూడేళ్ల
తర్వాత, వారు బబులోను రాజ నగరులో ప్రవీణులుగా
ఉంటారు. 6ఆ యువకులలో దానియేలు, హనన్యా,
మిషాయేలు, అజర్యా అనువారు, యూదా దేశానికి
చెందిన వారు.
7తర్వాత అష్పెనజు యూదా నుంచి వచ్చిన ఆ
యువకులకు బబులోను పేర్లు పెట్టాడు. దానియేలుకు
బెల్తెషాజరు, మిషాయేలుకు మేషాకు, అజర్యాకు
అబేద్నెగో, హనన్యాకు షద్రకు, అని పేర్లు పెట్టాడు.
8రాజు భుజించే విలువైన ఆహారం, ద్రాక్షామద్యం
తీసుకోడానికి వారు ఇష్టపడలేదు. ఆ ఆహారం, మత్తు
ద్రాక్షామద్యం తమను తాము అపవిత్రం చేసుకోవటం
దానియేలుకు ఇష్టము లేక దానిని తప్పించుమని
అష్పెనజు అనుమతి కోరాడు.
9దానియేలు పట్ల అష్పెనజు మంచిగాను, దయ
తోను ఉండేటట్లు దేవుడు చేసాడు. 10కాని అష్పెనజు
దానియేలుతో, "రాజైన నా యజమానికి భయపడు
తున్నాను. ఈ ఆహారము, ద్రాక్షామద్యం మీ కిమ్మని
రాజు నాకాజ్ఞాపించాడు. మీరు ఈ ఆహారం భుజించక
పోతే, జబ్బుగాను బలహీనంగాను కనబడతారు. మీ
వయసు వారైన ఇతర యువకులతో పోల్చితే మీరు
తక్కువగా కనిపిస్తారు. రాజు ఇది చూచి నా మీద
కోపగిస్తాడు. ఒకవేళ నా తలను కూడా తీసివేస్తాడు"
అని అన్నాడు.
11దానియేలు, హనన్యా, మిషాయేలు, అజర్యాలపై
అష్పెనజుచే నియమించబడిన సంరక్షకునితో దాని
యేలు ఇలా అన్నాడు: 12 "పది రోజులపాటు మాకు
ఈ పరీక్ష విధించు. తినడానికి కాయగూరలు, త్రాగడా
నికి మంచినీళ్లు తప్ప మరేమీ ఇవ్వవద్దు. 13పది రోజుల
తర్వాత, రాజు నియమించిన ఆహారంతిన్న ఇతర
యువకులతో మమ్మల్ని పోల్చి చూడు. ఎవరు ఆరో
గ్యంగా ఉన్నారో నీవే ఆలోచించి నీ సేవకులమైన
మాకు ఏమి చేయాలని నీ నిర్ణయమో అలాగే చెయ్యి"
అని అన్నాడు.
14అందువల్ల దానియేలును, హనన్యాను, మిషాయే
లును, అజర్యాను పదిరోజులు పరీక్షించడానికి ఆ సంరక్ష
కుడు సమ్మతించాడు. 15పదిరోజుల తర్వాత, దాని
యేలు మరియు అతని మిత్రులు రాజు ఆహారం తిన్న
ఇతర యువకులకంటె ఆరోగ్యంగా కనిపించారు.
16అందువల్ల రాజు నియమించిన ప్రత్యేక ఆహారానికి
బదులుగా, కాయగూరలు, మంచినీళ్లు దానియేలుకు,
హనన్యాకు, మిషాయేలుకు, అజర్యాకు, ఆ సంరక్షకుడు
ఇస్తూ వచ్చాడు.
17దానియేలుకు, హనన్యాకు, మిషాయేలుకు, అజ
ర్యాకు వివేకం, పలు విధాలైన వ్రాతలు, శాస్త్రాలు
నేర్చుకునే జ్ఞానము, సామర్థ్యము దేవుడు ప్రసా
దించాడు. అన్ని విధాలైన దర్శనాలు, స్వప్నాలు దాని
యేలు గ్రహించుకోగలిగాడు. 18ఆ యువకు లందరూ
మూడేళ్లపాటు మంచి శిక్షణ పొందాలని రాజు ఆదేశిం
చాడు. ఆ గడువు తీరిన తర్వాత, అష్పెనజు ఆ

యువకుల్ని రాజైన నెబుకద్నెజరు వద్దకు తీసుకు
వెళ్లాడు. 19రాజు వారితో మాట్లాడాడు. దానియేలు,
హనన్యా, మిషాయేలు, అజర్యాలకంటె ఇతర యువకు
లెవ్వరూ గొప్పగా లేకపోవడాన్ని రాజు కనుగొన్నాడు.
అందువల్ల ఈ నలుగురు యువకులు రాజు ఆస్థానంలో
నిలువగలిగారు. 20ప్రతీసారి రాజు వారిని యేదో ఒక
ముఖ్య విషయం అడుగగానే, వారు మంచి గ్రహింపు,
వివేకం ప్రదర్శించేవారు. తన రాజ్యంలో ఉన్న జ్ఞాన
వంతులందరికంటెను, ఇంద్ర జాలికులందరికంటెను,
వారు నలుగురు పదిరెట్లు ఎక్కువగా ఉన్నారని రాజు
గ్రహించాడు. 21అందువల్ల దానియేలు, కోరెషు రాజ
యిన మొదటి సంవత్సరంవరకు రాజు ఆస్థానంలో
కొనసాగాడు.

### నెబుకద్నెజరు స్వప్నం

2 నెబుకద్నెజరు రాజుగావున్న రెండవ సంవత్స
రంలో, అతనికి కొన్ని కలలు వచ్చాయి. ఆ
కలలు అతన్ని కలతపెట్టాయి, కనుక అతనికి నిద్ర
పట్టలేదు. 2అప్పుడు రాజు తన కలను చెప్పటానికి
మాంత్రికులను, గారడీవాళ్లను, శకునం చెప్పేవాళ్లను,
కల్దీయులను పిలుపించుమని ఆజ్ఞాపించాడు. వారందరు
వచ్చి రాజు ఎదుట నిలబడ్డారు. తాను ఏమి కలగన్నాడో
చెప్పుమని రాజు వారిని అడిగాడు.
3అప్పుడు వారితో రాజు ఇలా అన్నాడు, “ఆ కల
నన్ను కలతబెట్టింది. కాబట్టి కల, దాని అర్థం నాకు
మీరు చెప్పాలి”
4తర్వాత కల్దీయులు రాజుతో సిరియా భాషలో,
“రాజా, వర్థిల్లుము. మేము నీ సేవకులం. దయచేసి
నీ కల ఏమిటో చెప్పుము. ఆ తర్వాత దాని అర్థం
మేము చెబుతాము” అని అన్నారు.
5అప్పుడు నెబుకద్నెజరు వారితో, “ఆ కలను నేను
మర్చిపోయాను. కలను, దాని అర్థాన్ని కూడా మీరు
చెప్పాలి. మీరు ఇవి చెప్పకపోతే, మిమ్మల్ని ముక్కలు
ముక్కలుగా నరికిస్తాను. మీ ఇళ్లను పాడు దిబ్బలుగా
చేయిస్తాను. 6కానీ మీరు నా కలను, దాని అర్థాన్ని
వివరించినట్లయితే, అప్పుడు మీకు నేను కానుకలు,
బహుమానాలు ఇస్తాను. గొప్పగా గౌరవిస్తాను. అందువల్ల
ఆ కలను, దాని భావాన్ని, మీరు నాతో చెప్పండి”
అని అన్నాడు.
7మళ్లీ ఆ జ్ఞానవంతులు, “రాజా, దయచేసి నీ
కలను చెప్పుము, మేము దాని అర్థం చెబుతాము”
అని అడిగారు.
8అప్పుడు నెబుకద్నెజరు ఇలా అన్నాడు: “మీరింకా
వ్యవధి కోరుతున్నారని నాకు తెలుసు. కాని నేనేమి
చెప్పానో, అది నా నిర్ధారణ అని మీకు తెలుసు.
9మీరు నా కలను గురించి చెప్పకపోతే, నేను మిమ్మల్ని
శిక్షిస్తానని కూడా మీకు తెలుసు. కాబట్టి మీరంతా
నాతో వ్యర్థమైన మాటలు అబద్ధాలు చెప్పటానికి
కాలయాపన చేస్తున్నారు. నేను చెప్పిన మాటలు
మరచిపోతానని మీరు భావించవద్దు. ఇప్పుడు నా కలను
గురించి చెప్పండి. మీరు చెప్పితే, అప్పుడు ఆ కల
యొక్క అర్థము కూడా మీరు చెప్పగలరని నాకు
తెలుస్తుంది.”
10అప్పుడు రాజుతో కల్దీయులు ఇలా చెప్పారు:
“రాజు ఏమి అడుగుచున్నాడో, అది చెప్పగల వ్యక్తి
ఈ భూమిమీదనే లేడు. ఈ విధంగా వివేకవంతుల్నిగాని,
ఇంద్రజాలికుల్నిగాని, కల్దీయుల్నిగాని అడిగిన రాజు
ఎవ్వరూ లేరు. ఈ విధంగా ఏ గొప్ప రాజుగాని, ఏ
మహా శక్తివంతుడైన రాజుగాని అడుగలేదు. 11చేయ
టానికి బహు కఠినమైన దానిని రాజు అడుగుచున్నాడు.
దేవుళ్లు మాత్రమే రాజైన తమకు వచ్చిన కలనుగాని,
ఆ కల అర్థముగాని చెప్పగలుగుతారు. కాని దేవుళ్లు
మనుష్యులతో ఉండరు.”
12ఇది వినగానే, రాజు చాలా ఉగ్రుడై బబులోను
లోని జ్ఞానవంతులందరిని చంపుమని ఆజ్ఞాపించాడు.
13నెబుకద్నెజరు వివేకవంతులందరు చంపబడాలని
ఆజ్ఞ ప్రకటించగా రాజు మనుష్యులు దానియేలు
మరియు అతని మిత్రుల్ని చంపడానికి వెళ్లారు.
14అర్యోకు రాజరక్షకభటుల అధిపతి. బబులోను
లోని వివేకవంతుల్ని చంపడానికి అతను బయలు
దేరాడు. కాని దానియేలు అతనితో తెలివిగా మాట్లా
డాడు. 15దానియేలు రాజరక్షకభటుల అధిపతియైన
అర్యోకుని ఇలా అడిగాడు: “రాజు ఎందుకు ఇంత
కఠినమైన శిక్షను విధించాడు?”
అప్పుడు అర్యోకు రాజు కలయొక్క వృత్తాంతము
నంతటిని దానియేలుకు వివరించాడు. దానియేలు అది
విని సంగతి తెలుసుకొన్నాడు. 16అతను నెబుకద్నెజరు
రాజు వద్దకు వెళ్లి, తనకు మరికొంత సమయం ఇమ్మని
అప్పుడతను కలను, కలయొక్క అర్థాన్ని చెప్పగలనని
అడిగాడు.
17దానియేలు తన ఇంటికి వెళ్లి మిత్రులైన హనన్యా,
మిషాయేలు, అజర్యాలకు పూర్తి సంగతిని వివరించాడు.
18తమ పాలిట దేవుడు దయకలిగి ఆ రహస్యమును
తెలుపుటకు పరలోకమందున్న దేవుని ప్రార్థించుమని
దానియేలు తన మిత్రుల్ని కోరాడు. ఎందుకనగా దాని
యేలు మరియు అతని మిత్రులు బబులోనులోని
యితర వివేకవంతులతో కలిసి నాశనమవ్వకూడదు.
19ఆ రాత్రి, దేవుడు ఆ రహస్యమును దానియేలుకి
దర్శనములో వివరించెను. అప్పుడు పరలోక
మందున్న దేవున్ని దానియేలు స్తుతించాడు.

20 “నిరంతరం దేవుని పేరు కీర్తించబడాలి; శక్తియు
వివేకము ఆయనకే చెందాలని దానియేలు
దేవున్ని స్తుతించాడు. 21దేవుడే కాలాల్ని సమ

యాల్ని మార్చుతాడు. ఆయనే రాజుల్ని వారి
అధికారాల్ని మార్చుతాడు. ఆయనే
మనుష్యులకు వివేకమిస్తాడు. కనుక, వారు వివేక
వంతు లౌతారు. జ్ఞానమిస్తాడు, కనుక జ్ఞాన
వంతుల వుతారు.
22 గ్రహించటానికి కష్టమైన రహస్యాలు ఆయనకు
తెలుసు. చీకటిలో మరుగైన సంగతులు ఆయ
నకు తెలుసు. వెలుగు ఆయనలో నివసిస్తుంది.
23 మా పూర్వీకుల దేవా! నీకు కృతజ్ఞుణ్ణి, నిన్ను
కీర్తిస్తున్నాను. నీవు నాకు వివేకము, బలము
ప్రసాదించావు. నీవు రాజు కన్న కలను దాని
అర్థాన్ని తెలియజేశావు. మేమడిగిన విషయాల్ని
నీవు మాకు చెప్పావు" అని దానియేలు
అన్నాడు.

### కలయొక్క అర్థమును దానియేలు చెప్పుట

24తర్వాత దానియేలు అర్యోకు వద్దకు వెళ్లాడు.
బబులోను వివేకవంతుల్ని చంపటానికి రాజు అర్యో
కును ఎంపిక చేశాడు. "బబులోను వివేకవంతుల్ని
చంపవద్దు. నన్ను రాజు వద్దకు తీసుకుని వెళ్లు. కలను
గురించి దాని అర్థాన్ని గురించి నేను చెప్తాను" అని
దానియేలు అన్నాడు.
25దానియేలును అర్యోకు తక్షణం రాజువద్దకు తీసు
కొని వెళ్లాడు. అర్యోకు రాజుతో, "యూదానుంచి
బందీలుగా వచ్చిన మనుష్యులలో నేనొక వ్యక్తిని
చూశాను. కలయొక్క అర్థాన్ని రాజైన తమకు అతను
వివరించగలడు" అని చెప్పాడు.
26రాజు దానియేలుకు (బెల్తెషాజరు) ఒక ప్రశ్న
వేశాడు. "నీవు నా కలను గూర్చి, దాని అర్థాన్ని గూర్చి
చెప్పగలవా?"
27దానియేలు, "నెబుకద్నెజరు రాజా! వివేక వంతు
డుగాని, ఇంద్రజాలికుడుగాని, కల్దీయుడుగాని రాజు
అడిగిన రహస్య విషయాల గురించి చెప్పలేడు. 28కాని
పరలోకమందున్న దేవుడు మరుగైన విషయాల
గురించి చెప్పగలడు. భవిష్యత్తులో జరగబోయేదాన్ని
చూపించడానికి దేవుడు రాజుకు ఒక కలను ఇచ్చాడు.
నీవు నీ పడకమీద పడుకుని ఉండగా చూచిన విషయాలు
ఇవి. 29రాజా! నీ పడకమీద పడుకొని భవిష్యత్తులో
ఏమి జరుగునో అని తలంచుచూ నీవు నిద్రించావు.
గుప్త విషయాలు గురించి దేవుడే చెప్పగలడు. భవిష్య
త్తులో ఏమి జరుగునో దేవుడే నీకు చూపాడు.
30దేవుడు ఈ రహస్యం నాకు కూడా తెలిపాడు. ఎందు
కంటే ఇతర వివేకవంతులకంటే నాకు ఎక్కువ వివేకం
కలదనే కారణం కాదు. రాజువైన నీవు దాని అర్థమేమిటో
గ్రహించాలని తలంచి దేవుడు ఈ రహస్య విషయం
నాకు తెలిపాడు. ఆ విధంగా నీ మనస్సులోని ఆలోచ
నల్ని నీవు గ్రహించగలవు" అని అన్నాడు.

31"రాజా, నీవు నీ కలలో ఒక పెద్ద విగ్రహం నీ
ముందునిలిచి యుండటం చూశావు. అది తళతళ
మెరుస్తూ భయంకరంగా ఉండినది. 32విగ్రహం యొక్క
తల స్వచ్ఛమైన బంగారంతోను, రొమ్ము చేతులు
వెండితోను, పొట్ట, తొడలు కంచుతోను 33మోకాళ్ల
క్రింది భాగం ఇనుముతోను, పాదాలు, మట్టి, ఇను
ముతోను కలిసి చేయబడినని. 34నీవు ఆ విగ్రహం
వైపు చూస్తూ ఉండగా, ఒక రాయి మానవుని చేతిలో
తీయ బడకుండా గాలిలో ఎగిరి, దానంతట అదే వెళ్లి
ఇనుముతోను, బంకమట్టితోను చేయబడిన విగ్రహం
పాదాల మీదపడి దానిని పొడిపొడి చేసింది. 35తర్వాత
ఇనుము, బంకమట్టి, కంచు, వెండి, బంగారం పొడిపొడి
అయ్యాయి. ఆ పొడి గాలికి కొట్టుకొనిపోయి కనబడ
కుండా పోయింది. తర్వాత విగ్రహాన్ని పొడి చేసిన ఆ
రాయి పెద్ద కొండగా మారిపోయి భూమి అంతటా
వ్యాపించింది.
36"అదే నీ కల. ఇప్పుడు ఆ కలయొక్క అర్థ
మేమిటో మేము రాజుకు వివరిస్తాము. 37రాజా, నీవు
చాలా ముఖ్యుడైన రాజువి. పరలోకమందున్న దేవుడు
నీకు అధికారం, బలం, రాజ్యం, ప్రఖ్యాతిని, ప్రసాదిం
చాడు.
38"నీవు ప్రజల్ని, భూజంతువుల్ని, ఆకాశ పక్షుల్ని
లోబరచుకొని, పరిపాలించే శక్తిని ఆయన నీకు
ఇచ్చాడు. వాళ్లందరూ, అవన్నీ ఎక్కడున్నా, దేవుడు
నీవు పరిపాలించేటట్లు చేశాడు. ఓ నెబుకద్నెజరు రాజా!
ఆ విగ్రహపు బంగారు తల నీవే.
39"మరో రాజ్యం నీ తర్వాత వస్తుంది. అది
వెండి లాంటిది. కాని ఆ రాజ్యం నీ రాజ్యంలా అంత
గొప్పగా ఉండదు. ఆ తర్వాత మూడవ రాజ్యం భూమిని
పరిపాలిస్తుంది. అది కంచు లాంటిది. 40తర్వాత నాలు
గవ రాజ్యం వస్తుంది. అది ఇనుములా శక్తివంతంగా
ఉంటుంది. ఇనుము బ్రద్ధలుచేసి ముక్కలు ముక్కలుగా
విరుగకొడుతుంది. ఆ విధంగానే, ఆ నాలుగవ రాజ్యం
ఇతర రాజ్యాల్ని ముక్కలుగా పగులగొడుతుంది .
41"ఆ విగ్రహం పాదాలు, వ్రేళ్లు కొంత ఇనుము
తోను, కొంత బంకమట్టితోను చేయబడినవిగా నీవు
చూశావు. అనగా, ఆ రాజ్యం భాగాలైన రాజ్యంగా
ఉంటుంది. నీవు ఇనుమూ బంకమట్టి కలిసినట్టుగా
చూసితివి గనుక ఆ రాజ్యం కొంతవరకు ఇనుమునకు
న్నంత బలంగానూ, బంకమట్టిలా బలహీనంగానూ
ఉంటుందని అర్థం. 42ఆ విగ్రహంయొక్క పాదాలు,
బొటనవ్రేళ్లు ఇనుము బంకమట్టితో కలిసి ఉన్నట్లుగా
చూశావు. అలాగే ఆ రాజ్యం కొంత ఇనుమువలె బలం
గాను, కొంత బంకమట్టివలె బలహీనంగానూ ఉంటుంది.
43(నీవు ఇనుమును బంకమన్ను కలిసింది చూశావు.)
ఆ విధంగానే, ఆ మనుష్యులు ఒకరితొనొకరు కలసి
మెలసివుండలేరు.

44"ఆ రాజ్యపు పరిపాలకుల కాలంలో పరలోక మందున్న దేవుడు మరొక రాజ్యం స్థాపిస్తాడు. ఈ రాజ్యం ఎల్లప్పుడూ ఉంటుంది. అది యెన్నటికీ నాశనం కాదు! అది దాన్నిపొందేవాళ్ళకి తప్ప వేరే వాళ్ళకు చెందదు. ఈ రాజ్యం ఇతర రాజ్యాలన్నిటినీ నాశనం చేసి అంతం చేస్తుంది. కాని ఆ రాజ్యం మాత్రమే సదాకాలం కొనసాగుతూ ఉంటుంది.

45"నెబుకద్నెజరు రాజా, ఒక పర్వతంనుంచి విరిగిన ఒక రాయిని నీవు చూశావు. అది మనిషి చేతులతో తీయబడింది కాదు. ఆ రాయి ఇనుమును, కంచును, బంకమట్టిని, వెండిని, బంగారాన్ని ముక్కలుగా విరుగ గొట్టింది. ఈ విధంగా, దేవుడు భవిష్యత్తులో జరగను న్నదాన్ని నీకు చూపాడు. కల నిజం, దాని అర్థం నమ్మదగినది" అని దానియేలు రాజుతో చెప్పాడు.

46అప్పుడు రాజైన నెబుకద్నెజరు దానియేలుకి సాష్టాంగ నమస్కారం చేశాడు. రాజు దానియేలును గౌరవించాలనుకొన్నాడు. కాబట్టి అతనికి అర్పణాన్ని ధూపాన్ని సమర్పించాలని ఆజ్ఞాపించాడు. 47అప్పుడు దానియేలుతో రాజు, "నీ దేవుడు గొప్పవాడని, శక్తి మంతుడనీ నేను నిస్సందేహంగా తెలుసుకున్నాను. ఆయన రాజులకు రాజు, దేవుళ్ళకు దేవుడు. ప్రజలకు తెలియని విషయాలు ఆయన చెపుతాడు. ఈ రహస్య విషయాలన్నిటినీ నీవు నాకు చెప్పితివి కాబట్టి, ఇది సత్యమని నేను భావిస్తున్నాను" అని అన్నాడు.

48అప్పుడు రాజు దానియేలుకు తన రాజ్యంలో అతి ముఖ్యమైన స్థానాన్ని ఇచ్చాడు. మరియు రాజు ఖరీదైన కానుకలు ఎన్నో అతనికిచ్చాడు. నెబుకద్నె జరు దానియేలును బబులోను రాజ్య మంతటికీ పరి పాలకునిగా చేశాడు. బబులోనులోని వివేకవంతు లందరిమీద దానియేలును అధికారిగా నియమించాడు. 49షద్రకు, మేషాకు, అబేద్నెగోలను బబులోను రాజ్యంలో ముఖ్యులైన అధికారులుగా నియమింపుమని దానియేలు రాజుని కోరాడు. దానియేలు చెప్పి నట్లుగానే, రాజు చేశాడు. మరియు దానియేలు రాజు దగ్గరే ఉండేవాడు.

### బంగారు విగ్రహం – అగ్నిగుండం

3 నెబుకద్నెజరు ఒక బంగారు విగ్రహాన్ని తయారు చేయించాడు. ఆ విగ్రహం అరవై మూరల ఎత్తు, ఆరు మూరల వెడల్పు గలది. తర్వాత, బబులోను రాజ్యంలో దూరాయను మైదాన ప్రదేశంలో ఆ విగ్ర హాన్ని అతను ప్రతిష్ఠించాడు. 2ఆ తర్వాత అధిపతు లను, సేనాధిపతులను, ముఖ్యోద్యోగులను, ఉన్నతాధి కారులను, సలహాదారులను, న్యాయాధిపతులను, పాల కులను రాజ్యంలోని ఇతర ముఖ్య అధికారులను రాజు సమావేశపరచాడు. ఆ విగ్రహ ప్రతిష్ఠోత్సవానికి రాజు వారందరిని పిలిచాడు.

3రాజైన నెబుకద్నెజరు ప్రతిష్ఠించిన ఆ విగ్రహ సమక్షంలో వారందరు నిలిచారు. 4రాజు తరఫున ప్రకటనలు చేసే వ్యక్తి గొప్ప స్వరంతో, "వివిధ దేశాల నుండి, వివిధ భాషావర్గాలనుండి, వచ్చిన మీరందరూ నా మాటలు ఆలకించండి. ఇది మీరు చేయాలని రాజాజ్ఞ. 5కొమ్ము బూరలు, పిల్లన గ్రోవులు, సుంఫో నీయ, విపంచిక, తంతివాద్యాలు, తిత్తి బూరల, ధ్వనులు వినగానే మీరు బంగారు విగ్రహానికి సాష్టాంగ పడి పూజించాలి.

6ఎవరైనా ఆ బంగారు విగ్రహానికి సాగిలపడి పూజించకపోతే, అప్పుడతనిని వెంటనే మండుచున్న అగ్నిగుండంలోకి తోసివేస్తారు.

7అందువల్ల, కొమ్ము బూరలు, పిల్లన గ్రోవులు, సుంఫోనీయ విపంచిక, తంతివాద్యాలు, తిత్తిబూరలు మొదలైన సంగీత వాద్యాల ధ్వనులు వినగానే రాజు ప్రతిష్ఠించిన ఆ బంగారు విగ్రహానికి అందరు, అన్ని దేశాలవాళ్ళు, అన్ని భాషలవాళ్ళు సాష్టాంగపడి పూజించారు.

8తర్వాత కల్దీయులలో కొందరు రాజు వద్దకు వచ్చి యూదులకు విరుద్ధంగా మాటలాడసాగిరి. 9వాళ్ళు నెబుకద్నెజరుతో ఇలా అన్నారు: "రాజు, ఎల్ల ప్పుడూ వర్ధిల్లు గాక! 10రాజా! నీవొక ఆజ్ఞ విధించావు. కొమ్ము బూరలు, పిల్లనగ్రోవులు, సుంఫోనీయ, విపంచిక, తిత్తి బూరలు, మొదలైన వివిధ సంగీత వాద్యాల ధ్వనులు వినగానే అందరూ సాగిలపడి బంగారు విగ్రహాన్ని పూజించాలని నీవు చెప్పావు. 11ఎవరైనా బంగారు విగ్రహానికి బోర్లగాపడి నమస్కరించకపోతే, అతడు మండుచున్న కొలిమిలోకి త్రోయబడతాడని నీవు చెప్పావు. 12రాజా, నీ ఆజ్ఞ ప్రకారం నడవని యూదులు కొందరున్నారు. బబులోను రాజ్యంలో ఆ యూదులను నీవు ముఖ్యోద్యోగులుగా నియ మించావు. వారు షద్రకు, మేషాకు, అబేద్నెగోలు. వారు నీ దేవుళ్లను పూజించరు. నీవు ప్రతిష్ఠించిన ఆ బంగారు విగ్రాహాన్ని తలవంచి వారు పూజించలేదు."

13నెబుకద్నెజరు చాలా ఉగ్రుడైనాడు. అతడు షద్రకు, మేషాకు, అబేద్నెగోలను పిలిపించాడు. 14అందువల్ల వారిని అతని సమక్షమునకు తీసుకు వచ్చారు. నెబుకద్నెజరు వారిని చూచి, "షద్రకు, మేషాకు, అబేద్నెగో మీరు నా దేవుళ్లని పూజించని మాట నిజమేనా? పైగా నేను ప్రతిష్ఠించిన బంగారు విగ్రహాన్ని పూజించని మాటకూడా నిజమేనా? 15కొమ్ముబూరలు, పిల్లనగ్రోవులు, సుంఫోనీయ, విపంచిక, తిత్తి బూరలు మొదలైన వాద్య ధ్వనులు వినగానే మీరు బోర్లగాపడి, బంగారు విగ్రహాన్ని పూజిం చాలి. నేను ప్రతిష్ఠించిన ఆ విగ్రహాన్ని మీరు పూజిం చేందుకు సిద్ధపడితే, అది మంచిది. మీరు పూజించ కపోతే, మిమ్ముని వెంటనే మండుచున్న కొలిమిలోకి

తోసివేస్తారు. అప్పుడు ఏ దేవుడు కూడా నా అధికారం
నుంచి మిమ్మును కాపాడలేడు!"
16షద్రకు, మేషాకు, అబేద్నెగోలు రాజుకి ఇలా
ప్రత్యుత్తరమిచ్చారు: "నెబుకద్నెజరూ, ఈ విషయాలు
మీకు మేము వివరించనవసరం లేదు. 17మీరు
మమ్మును మండుచున్న కొలిమిలోకి తోసివేస్తే, మేము
నమ్ముకొన్న మా దేవుడే మమ్ములను రక్షిస్తాడు.
మరియు ఆయనకి ఇష్టం కలిగితే మీ అధికారంనుంచి
మమ్ములను కాపాడుతాడు. 18దేవుడు కూడా మమ్ము
లను రక్షించని పక్షంలో, రాజా, మేము నీ దేవుళ్లను
కొలవమనే సంగతి నీవు తెలుసుకోవాలి. నీవు ప్రతి
ష్ఠించిన బంగారు విగ్రహాన్ని మేము పూజించము."
19అప్పుడు నెబుకద్నెజరు చాలా ఉగ్రుడయ్యాడు.
షద్రకు, మేషాకు, అబేద్నెగోల వంక అతను చాలా
కోపంగా చూశాడు. మామూలుకంటె ఏడు రెట్లు
కొలిమి వేడిగా ఉండాలని అతను ఆజ్ఞాపించాడు.
20తర్వాత నెబుకద్నెజరు తన సైన్యంలోని మహా బలా
ఢ్యులైన కొందరికి షద్రకు, మేషాకు, అబేద్నె గోలని
బంధించి. వేడి కొలిమిలోకి తోసి వేయుమని ఆజ్ఞా
పించాడు.
21అందువల్ల షద్రకు, మేషాకు, అబేద్నెగోలని
బంధించి, వారిని వేడి కొలిమిలోకి త్రోసివేశారు. వాళ్లను
మంటలో విసిరివేసినప్పుడు వారు తమ అంగీలు, పైవ
స్త్రాలు, తలపాగాలు మరియు ఇతర దుస్తులు ధరిం
చారు. 22రాజు చాలా ఉగ్రుడై ఉండెను. అందువల్ల
వారు కొలిమిని త్వరగా చాలా వేడి చేశారు. ఆ మంటలు
ఎంత వేడిగా ఉన్నాయంటే ఆ మహా బలవంతులయిన
సైనికుల్ని కూడా కాల్చివేశాయి. ఆ ముగ్గురిని
మంటలో విసిరివేయడానికి మంట దగ్గరికి వెళ్లిన సైని
కులు ఆ మంటలచేత వెంటనే కాలిచచ్చారు.
23షద్రకు, మేషాకు, అబేద్నెగోలను గట్టిగా బంధించి
మంటల్లోకి త్రోసేశారు.
24తర్వాత నెబుకద్నెజరు జరిగింది చూసి ఆశ్చర్య
పడ్డాడు. తన సలహాదారుల్ని పిలిచి, "మనం ముగ్గురినే
బంధించి మంటల్లోకి త్రోసివేశాము గదా!" అని అడి
గాడు. "చిత్తం ప్రభూ" అని సలహాదారులు బదులు
చెప్పారు.
25"చూడండి! మంటల్లో నలుగురు నడుస్తున్నట్టు
నేను చూస్తున్నాను. వారు బంధించబడినట్లుగా గాని
కాలి పోయినట్టుగా గాని లేదు. నాలుగవ వ్యక్తి దైవ
కుమారునిగా కనిపిస్తున్నాడు" అని రాజు అన్నాడు.
26తర్వాత నెబుకద్నెజరు వేడి కొలిమి వద్దకు వెళ్ళి,
"అత్యున్నతుడైన దేవుని సేవకులైన షద్రకు, మేషాకు,
అబేద్నెగోల్లారా బయటికి రండి" అని పిలిచాడు.
అప్పుడు షద్రకు, మేషాకు, అబేద్నెగోలు మంట
లనుండి వెలుపలికి వచ్చారు. 27వారు వెలుపలికి రాగానే,
పాలనాధికారులు ఉన్నతాధికారులు, రాజుగారి సలహా
దారులు వారిని చుట్టుముట్టారు. షద్రకు, మేషాకు,
అబేద్నెగోలని మంటలు కాల్చలేదని, వారి దేహాలు
ఏమీ కాలిపోలేదని, వారి వెంట్రుకలు కాలిపోలేదని,
వారి బట్టలు కాలిపోలేదని, వాళ్ళ మీద మంటల
వాసనైనా లేదని వారు తెలుసుకొన్నారు.
28తర్వాత నెబుకద్నెజరు ఇలా అన్నాడు: "నేను
షద్రకు, మేషాకు, అబేద్నెగోల దేవుణ్ణి కీర్తిస్తున్నాను.
వాళ్ల దేవుడు తన దూతను పంపించి తన సేవకుల్ని
మంటలనుండి రక్షించినాడు. ఈ వ్యక్తులు ముగ్గురు
తమ దేవుని విశ్వసించారు. వారు నా ఆజ్ఞను ధిక్కరించి
చనిపోవటానికిష్టపడ్డారు కాని, మరొక దేవుని కొల
వడానికి గాని, పూజించుటకు గాని ఇష్టపడలేదు.
29అందువల్ల నేనిప్పుడు ఈ ఆజ్ఞను ఇస్తున్నాను:
ఏ దేశానికి చెందిన మనుష్యులుగాని, ఏ భాషకు చెందిన
వారు గాని, షద్రకు, మేషాకు, అబేద్నెగోల దేవునికి
విరుద్ధంగా ఏమైనా చెప్పితే వారు ముక్కలుగా నరకబడ
తారు. ఆ వ్యక్తుల ఇళ్ళు పాడుదిబ్బగా నాశనం చేయ
బడుతాయి. ఈ విధంగా ఏ ఇతర దేవుడు గాని తన
మనుష్యులను రక్షించలేడు." 30ఆ తర్వాత షద్రకు,
మేషాకు, అబేద్నెగోలకు రాజు బబులోను దేశంలో
ఇంకా ముఖ్యమైన అధికారాలిచ్చాడు.

### నెబుకద్నెజరు చెట్టు గురించి కలగనుట

4 రాజైన నెబుకద్నెజరు తన లేఖను ప్రపంచంలో
అన్ని జనాంగాలకు, ఇతర భాషలు మాటలాడే
దేశాలకు, ప్రజలకు వ్రాయిస్తూ మీ అందరికీ సమాధాన
మగుగాక!

2అత్యున్నతుడైన దేవుడు, నా కోసం చేసిన
అద్భుత విషయాలు, అద్భుత సంఘటనల
గురించి చెప్పడానికి సంతోసిస్తున్నాను.

3 దేవుని సూచనలు, అద్భుతాలు మహాగొప్పవి,
శక్తివంతమైనవి. దేవుని రాజ్యం శాశ్వతమైనది.
దేవుని ప్రభుత్వం అన్ని తరాలు కొనసాగుతుంది.

4నెబుకద్నెజరు అను నేను నా అంతఃపురాన
ఉన్నాను. నేను సుఖంగా సంతోషంగా ఉన్నాను.
5నన్ను భయంగొలిపే కల ఒకటి వచ్చింది. నేను
నా పడకమీద ఉన్నాను. నా మనస్సులోని ఆలోచ
నలు నన్ను భయపెట్టాయి. 5అందువల్ల బబులో
నులోని వివేకవంతులందరినీ నావద్దకు తీసుకు
రమ్మని ఆజ్ఞ ఇచ్చాను. ఎందుకంటే వారు నా
కలయొక్క అర్థం చెప్పగలరని. 7ఇంద్ర జాలి
కులు, కల్దీయులు వచ్చారు. రాగానే వారితో
కల వృత్తాంతం చెప్పాను. కాని దాని అర్థమేమిటో
వారు చెప్పలేకపోయారు. 8చివరికి దానియేలు

వచ్చాడు. (నా దేవుని గౌరవించే నిమిత్తం నేను
దానియేలుకు బెల్తెషాజరు అని పేరుపెడితిని.
పరిశుద్ధ దేవుళ్ళ ఆత్మ* అతనిలో వుంది.) నా
కల గురించి దానియేలుతో చెప్పాను. 9నేను
ఈ విధంగా చెప్పాను:

"బెల్తెషాజరూ! ఇంద్ర జాలికులందరిలో నీవు
చాలా ముఖ్యుడివి. పరిశుద్ధ దేవళ్ళ ఆత్మ నీలో
ఉన్నట్లు నాకు తెలుసు. ఏ రహస్యమూ నీకు
తెలుసుకోవడం కష్టంకాదు. ఇది నేను (కన్నకల)
దాని అర్థమేమిటో చెప్పుము. 10నేను నా పడక
మీద ఉండగా ఈ దర్శనం నేను చూశాను. నా
యెదుట భూమి మధ్యలో ఒక వృక్షం ఉంది.
అది చాలా ఎత్తైనది. 11ఆ చెట్టు ఏపుగా దృఢంగా
పెరిగింది. ఆ చెట్టు పైభాగం ఆకాశాన్ని అంటిందా
అన్నట్లున్నది. భూమిమీద ఎక్కడినుంచ యినా
ఆ చెట్టుని చూడవచ్చు. 12ఆ చెట్టు ఆకులు
చాలా అందమైనవి. దాని మీద చాలా పళ్లు
ఉన్నాయి. అవి అందరికీ ఆహారంగా ఉన్నాయి.
భూజంతువులకు చెట్టుక్రింద నీడ లభించింది.
దాని కొమ్మలలో పక్షులు ఉన్నవి. ప్రతీ జీవి ఆ
చెట్టునుండి పోషించబడింది.
13నేను నా పడక మీదనే పడుకొని నా దర్శ
నంలో కావలివానివలె పరలోకంనుంచి ఒక
పవిత్రుడు క్రిందికి రావడం చూశాను. 14అతను
చాలా బిగ్గరగా మాట్లాడాడు, 'చెట్టును నరికి
వేయండి. చెట్టుకొమ్మల్ని నరికి వేయండి. దాని
ఆకులను, దాని పండ్లని త్రుంచి పారవేయండి.
చెట్టుకిందవున్న జంతువుల్ని తోలివేయండి.
దాని కొమ్మల మీదవున్న పక్షుల్ని ఎగిరి పోని
వ్వండి. 15కాని దాని మొద్దును వేళ్లతో సహా
భూమిలోనే ఉండనివ్వండి. దాని చుట్టూ
ఇనుమూ కంచు కలిసిన ఒక బద్దీ వేయండి.
చెట్టుమొద్దు, వ్రేళ్లు పొలంలో పెరిగే గడ్డి మధ్యలో
భూమిలోనే ఉండినివ్వండి. మంచు చేత దాన్ని
తడవ నివ్వండి. అని అతను చెప్పాడు. 16ఇక
మీదట అతను మనిషిలా ఆలోచించడు. అతనికి
జంతువుల బుద్ధి వస్తుంది. ఏడు కాలాలు (సంవత్స
రాలు) అతని మీదగా గడుస్తాయి.'
17కావలి దూత ద్వారా ఈ ఆజ్ఞ జారీ అయింది.
పరిశుద్ధుల ద్వారా నిర్ణయం జరిగింది. ఇది అంతం
వరకు ఉంటుంది. మహోన్నతుడైన దేవుడు
మనుష్యుల రాజ్యాలను పరిపాలిస్తున్నాడని భూమి
మీద నివసించే మనుష్యులందరు తెలుసుకొ
నేందుకు వీలవుతుంది. ఆయనకు నచ్చిన
ఎవరికైనా దేవుడు ఆ రాజ్యాలను ఇచ్చి వేస్తాడు.
ఆ రాజ్యాలను పాలించేందుకు వినయ విధేయ
తగల వారిని దేవుడు ఎన్నుకుంటాడు!
18ఇదే నెబుకద్నెజరు రాజునైన నేను కన్న
కల. ఇప్పుడు బెల్తెషాజరూ (దానియేలూ) ఈ
కల అర్థం చెప్పుము. నా రాజ్యంలోని వివేకవంతు
లెవ్వరూ నాకు ఆ కల అర్థం చెప్పలేకపోయారు.
కాని బెల్తెషాజరూ, నీవు ఆ కల గురించి చెప్ప
గలవు. ఎందుకంటే నీలో పరిశుద్ధ దేవతల ఆత్మ
వుంది.

19తర్వాత దానియేలు (బెల్తెషాజరు) కొంచెంసేపు
చాలా ఆశ్చర్యచకితుడయ్యాడు. ఆలోచిస్తున్న విష
యాలు అతన్ని కలత పరచినవి. అందువల్ల రాజు,
"బెల్తెషాజరూ! (దానియేలు) ఆ కలగాని, ఆ కలయొక్క
అర్థంగాని, నిన్ను కలత చెందనీయకుండును గాక"
అని చెప్పాడు. తర్వాత బెల్తెషాజరు (దానియేలు)
రాజుతో ఇలా అన్నాడు: "నా రాజా! ఆ కల నీ విరో
ధులకు జరుగునుగాక! నీ శత్రువులకు ఆ కలయొక్క
అర్థము నెరవేరును గాక! 20-21కలలో నీవొక వృక్షాన్ని
చూశావు. అది ఏపుగా దృఢంగా పెరిగింది. దాని పైభాగం
ఆకాశాన్ని అంటినట్లుగా ఉంది. భూమిమీద ఎక్క
డినుంచియైనా దానిని చూడవచ్చు. దాని ఆకులు
అందంగా ఉన్నాయి. ఫలసమృద్ధి కూడా ఉంది. ఆ
పళ్లు ప్రతివారికీ సమృద్ధిగా ఆహారం సమకూర్చాయి.
అది అడవి మృగాలకు ఆశ్రయం. దాని కొమ్మలేమో
పక్షుల నివాసస్థానం. అలాంటి వృక్షమే నీవు చూసింది.
22రాజా. నీవే ఆ వృక్షానివి. నీవు మహా శక్తిమంతుడ
వయ్యావు. ఆకాశాన్ని అంటిన ఉన్నత వృక్షంవంటి
వాడవు నీవు. నీ అధికారం భూమిమీద దూర భాగాలకు
కూడా వ్యాపించింది."
23"రాజా, పరలోకంనుంచి ఒక పవిత్ర కావలి దేవ
దూత క్రిందికి రావడం నీవు చూశావు. అతడు ఇలా
అన్నాడు: 'చెట్టుని నరికివేయుము; నాశనం చేయుము.
ఇనుము కంచు బద్దీతో కట్టబడి, పొలంలోని గడ్డి
మధ్య నాటబడిన ఆ మొద్దును వ్రేళ్ళతో సహా భూమి
లోనే విడిచిపెట్టు. ఏడు కాలాలు (సంవత్సరాలు)
ఆతను మంచుకు తడుస్తూ మృగంవలె జీవిస్తాడు.'
24"రాజా, కలయొక్క అర్థం ఇదే. మహోన్నతు
డైన దేవుడు ఇవి జరుగుతాయని నా రాజువైన నీకు
ఆజ్ఞాపించాడు. 25నెబుకద్నెజరు రాజా, నీ ప్రజలనుంచి
దూరంగా నీవు తరుమబడుతావు. భూజంతువుల మధ్య
నీవు నివసిస్తావు. ఎద్దువలె నీవు పచ్చిక తింటావు.
నీవు మంచుచేత తడుస్తావు. అలా ఏడు కాలాలు
(సంవత్సరాలు) గడిచి పోతాయి. అప్పుడు నీవీపాఠం
నేర్చుకుంటావు – మహోన్నతుడైన దేవుడు మను
ష్యుల రాజ్యాలను పరిపాలిస్తున్నాడనియు, తనకు

**ఆత్మ** 'పరిశుద్ధ దేవుని ఆత్మ' అని అర్థం.

నచ్చిన ఎవనికైనా రాజ్యాలను ఇచ్చివేస్తాడనియు నీవు
తెలుసుకుంటావు.
26“చెట్టు మొద్దు, వ్రేళ్లనీ నేలలోనే ఉంచుము అని
ఇవ్వబడిన ఆజ్ఞకు అర్థమిది: మహోన్నతుడైన ఆ
దేవుడే మనుష్యుల రాజ్యాలను పరిపాలిస్తున్నాడన్న
విషయం నీవు తెలుసుకున్నప్పుడు, నీ రాజ్యం నీకు
ఇవ్వ బడుతుంది. 27అందువల్ల, రాజా, నా సలహాని
స్వీకరించుము. పాపం చేయడం ఆపివేయుము. సరి
యైనదేదో అదే జరిగించుము. చెడు విషయాలు
చేయడం ఆపివేయుము. బీదవారిపట్ల దయగలిగి
ఉండుము. అప్పుడు నీవు క్రమంగా విజయాన్ని
పొందగలవు.”
28నెబుకద్నెజరు రాజుకి ఆ ఘటనలన్నీ జరిగినవి.
29-30కల వచ్చిన పన్నెండు నెలల తర్వాత, బబులోను
లోని తన అంతఃపురం పైభాగాన నెబుకద్నెజరు
నడుచుచుండగా రాజు బబులోనువైపు చూసి, “ఈ
గొప్ప నగరాన్ని, ఈ గొప్ప అంతఃపురాన్ని నా శక్తివల్ల
నిర్మించాను. నేనెంత గొప్పవాడనో తెలపటానికి ఈ
అంతః పురాన్ని నిర్మించాను” అని తన మనస్సులో
చెప్పుకొన్నాడు.
31అతని మాటలు ఇంకా అతని నోటిలోనే ఉండగా,
ఆకాశమునుంచి ఒక స్వరం వినిపించింది. “నెబుకద్నె
జరు రాజా, ఈ మాటలు నీకోసమే: నీ వద్దనుంచి నీ
అధికారం తీసివేయబడింది. 32ప్రజలనుండి నీవు తరిమి
వేయబడతావు. భూజంతువులతో నీవు నివసించవలసి
వస్తుంది. ఎద్దువలె నీవు పచ్చిక మేస్తావు. నీవు గుణపాఠం
నేర్చుకునేలోగా ఏడు కాలాలు (సంవత్సరాలు) గడిచి
పోతాయి. అప్పుడు మనుష్యుల రాజ్యాలను సర్వోన్న
తుడైన దేవుడు పరిపాలిస్తాడనియు, తనకు నచ్చిన
వానికే రాజ్యాలు ఇస్తాడనియు నీవు తెలుసుకుంటావు.”
33ఆ విషయాలు వెంటనే జరిగాయి. నెబుకద్నె
జరును ప్రజలు తమ మధ్యనుండి తరిమివేశారు. అతడు
ఎద్దువలె పచ్చిక మేయ సాగాడు. ఆకాశ మంచుచేత
అతని దేహం తడిసింది. గ్రద్ద ఈకలవలె అతని వెంట్రు
కలు పొడుగ్గా పెరిగాయి. పక్షుల గోళ్లవలె అతని గోళ్లు
పొడుగ్గా పెరిగాయి. 34ఆ యేడేళ్ల కాలం పూర్తి కాగానే,
నెబుకద్నెజరు అను నేను ఆకాశంవైపు కన్నెత్తి
చూశాను. మళ్లీ నాకు మానవబుద్ధి లభించింది.
అప్పుడు మహోన్నతుడైన దేవున్ని నేను కీర్తించాను.
ఎల్లకాలము నివసించే ఆయనను గౌరవించి, ఇలా
ప్రశంసించాను:

ఆయన పరిపాలన శాశ్వతమైనది, తరతరాలకు
ఆయన రాజ్యం కొనసాగుతుంది.
35 భూమిమీద మనుష్యులు ఆయన ఎదుట లెక్క
లేనివారికి సమానము. దేవుడు పరలోకమందలి
సైన్యాలకు, భూమిమీది మనుష్యులకు తనకు
ఇష్టము వచ్చినట్లు చేస్తాడు. ఎవ్వరూ ఆయన
శక్తివంతమైన హస్తాన్ని ఆపలేరు. ఎవ్వరూ ఆయన
చేసే పనుల్ని ప్రశ్నించలేరు.

36అందువల్ల, ఆ సమయాన, దేవుడు నాకు
సరి అయిన బుద్ధిని ప్రసాదించాడు. రాజుగా అధిక
గౌరవం, శక్తిని నాకు తిరిగి ఇచ్చాడు. మరల నా
సలహాదారులు రాజపురుషులు నా సలహా అడగ
సాగారు. నేను మళ్లీ రాజుని అయ్యాను. పూర్వం
కంటె ఎక్కువ శక్తి ఎక్కువ గొప్పతనం నాకు
వచ్చాయి. 37ఇప్పుడు, నెబుకద్నెజరు అను నేను
పరలోక మందున్న రాజుని కీర్తిస్తున్నాను, గౌరవి
స్తున్నాను. ఆయన చేసే ప్రతిది సరి అయినదే.
ఆయన ఎప్పుడూ న్యాయంగానే ఉంటాడు.
గర్విష్ఠులను ఆయన అణగ ద్రొక్కుతాడు.

## గోడమీది వ్రాత

5 రాజైన బెల్షస్సరు తన వెయ్యిమంది అధికారులకు
ఒక గొప్ప విందు ఇచ్చాడు. వారితో కలిసి రాజు
ద్రాక్షామద్యం సేవిస్తూ ఉన్నాడు. 2బెల్షస్సరు ద్రాక్షా
మద్యం తాగుతుండగా బంగారు, వెండి పాత్రలు తీసు
కురమ్మని అతడు సేవకుల్ని ఆజ్ఞాపించాడు. తన
తండ్రి అయిన నెబుకద్నెజరు ఆ పాత్రల్ని యెరూష
లేము ఆలయం నుంచి తీసుకువచ్చాడు. బెల్షస్సరు
తన సామంతులు, తన భార్యలు, ఉపపత్నులు ఆ
పాత్రల్లో ద్రాక్షామద్యం పానం చేయాలని కోరాడు.
3కనుక యెరూషలేము ఆలయం నుంచి తెచ్చిన ఆ
పాత్రల్ని వారు తీసుకు వచ్చారు. రాజు మరియు
అతని సామంతులు, అతని భార్యలు, అతని ఉప
పత్నులు ఆ పాత్రల్లో పానం చేశారు. 4త్రాగుచూ
వారు బంగారం వెండి, కంచు, ఇనుము, కర్ర రాయి
మొదలైన వాటితో తయారు చేయబడిన తమ దేవు
ళ్లను కీర్తించారు.
5అప్పుడు ఉన్నట్టుండి, ఒక వ్యక్తి చేతి వ్రేళ్లు కనబడి
గోడమీద వ్రాయసాగాయి. రాజగృహములో దీపం
ప్రక్కగా గోడమీద ఆ చెయ్యి వ్రాసింది. ఆ చెయ్యి
వ్రాస్తుండగా, రాజు చూశాడు.
6రాజైన బెల్షస్సరు భయభ్రాంతుడయ్యాడు,
భయంవల్ల అతని ముఖం పాలిపోయింది. మోకాళ్లు
వణుకుతూ ఒకదానితో ఒకటి కొట్టుకొనసాగాయి.
అతని కాళ్లు చాలా బలహీనంగా ఉండటంవల్ల, అతడు
నిలబడలేక పోయాడు. 7అప్పుడు ఇంద్రజాలకుల్ని,
కల్దీయుల్ని, తన సమక్షమునకు తీసుకురావలసిందిగా
కోరాడు. ఆ వివేకవంతులతో, “గోడమీది ఈ వ్రాతను
చదివే ఏ వ్యక్తికైనా నేను బహుమతి ఇస్తాను, అతను
దాని అర్థం కూడా తెలపాలి. ఊదారంగు వస్త్రాలు
అతనికి బహూకరిస్తాను. అతని మెడలో ఒక బంగారు
గొలుసు వేస్తాను. అతనిని రాజ్యంలో మూడవ ఉన్నత
పరిపాలకునిగా చేస్తాను” అని చెప్పాడు.

8అందువల్ల వివేకవంతులందరు లోనికి వచ్చారు.
కాని వారు ఆ వ్రాతను చదవలేకపోయారు. దాని అర్థాన్ని
కూడా చెప్పలేకపోయారు. 9బెల్షెస్సరు, అతని అధికా
రులు కలవరపడ్డారు. అతనికి చింత, భయం కూడా
ఎక్కువయ్యాయి. ఆ భయంతో అతని ముఖం తెల్ల
బోయింది. 10విందు జరుగుతున్న ఆ ప్రదేశానికి రాజు
యొక్క తల్లి వచ్చింది. ఆమె రాజు, అతని అధికారుల
మాటలు విన్నది. "రాజా, నీవు చిరకాలం వర్థిల్లాలి.
ఏమీ భయపడకు. భయంతో నీ ముఖం కలత చెంద
నివ్వకు. 11నీ రాజ్యంలో ఒక మనుష్యుడున్నాడు.
పవిత్ర దేవుళ్ల* ఆత్మ అతనిలో ఉంది. నీ తండ్రి
పరిపాలించే రోజుల్లో అతను రహస్య విషయాలు
తెలుసుకోగలనని నిరూపించాడు. చాలా చురుగ్గా, వివేక
వంతంగా ఉన్నట్లుగా కూడా అతను కనిపించాడు. ఇటు
వంటి విషయాల్లో అతను దేవతలవంటివాడు. నీ
తండ్రి నెబుకద్నెజరు ఈ వ్యక్తిని వివేకవంతులందరికీ
అధికారిగా నియమించాడు. అతను ఇంద్ర జాలకు
లందరికి, కల్దీయులందరికి ఆధిపత్యం వహించాడు.
12నేను మాటలాడుతున్న వ్యక్తి పేరు దానియేలు. రాజు
అతనికి బెల్తెషాజరు అని నామకరణం చేశాడు.
బెల్తెషాజరు చాలా బుద్ధిమంతుడు. అతనికి చాలా
విషయాలు తెలుసు. అతను కలయొక్క అర్థాలు చెప్ప
గలడు. రహస్య విషయాలు వివరించగలడు. కఠినమైన
ప్రశ్నలకు ప్రత్యుత్తరం చెప్పగలడు. దానియేలును పిలి
పించు. గోడమీది వ్రాతకుగల అర్థమేమిటో అతను
చెప్పగలడు" అని ఆమె చెప్పింది.
13అందువల్ల దానియేలును రాజు వద్దకు తీసుకు
వచ్చారు. దానియేలుతో రాజు, "నీ పేరేనా దానియేలు,
రాజైన మా తండ్రి యూదానుండి బందీగా తీసుకొని
వచ్చినవాడవు నీవేనా? 14నీలో దేవతల ఆత్మ ఉన్నదని
నేను విన్నాను. నీవు చురుకైనవాడవనీ, చాలా వివేక
వంతుడవనీ, రహస్యాలను నీవు అర్థం చేసుకో గలవనీ
విన్నాను. 15వివేకవంతుల్నీ ఇంద్రజాలకుల్నీ గోడమీది
వ్రాత చదవటానికి నా వద్దకు తీసుకువచ్చారు. కాని
వారు నాకు గోడమీది వ్రాతకుగల అర్థాన్ని తెలుప
లేకపోయారు. 16నేను నిన్ను గురించి విన్నాను. మర్మ
ముల అర్థం ఏమిటో నీవు చెప్పగలవని విన్నాను.
కఠినమైన ప్రశ్నలకు సమాధానం చెప్పగలవని కూడా
విన్నాను. గోడమీది వ్రాతను చదివి, దాని అర్థాన్ని
నీవు వివరించగలిగితే, నీకు ఊదారంగుగల బట్టలు
ధరింపజేస్తాను. నీ మెడకు బంగారు గొలుసు వేస్తాను.
తర్వాత రాజ్యంలో నీవు మూడవ ఉన్నత పరిపాల
కుడవు కాగలవు" అని అన్నాడు.
17తర్వాత దానియేలు రాజుతో, "బెల్షెస్సరు రాజా,
నీ కానుకలు నీవద్దనే ఉంచుకొనుము. లేకపోతే ఆ
బహుమతుల్ని మరెవరికైనా ఇవ్వవచ్చు. కాని నీ కోసం
నేను గోడమీది వ్రాతను చదువగలను. మరియు దాని
అర్థమేమిటో నీకు వివరించగలను" అని చెప్పాడు.
18"రాజా, సర్వోన్నతుడైన దేవుడు నీ తండ్రి నెబుక
ద్నెజరును మహా శక్తిమంతమైన రాజుగా చేశాడు. దేవుడు
అతన్ని అతి ముఖ్యుడుగా చేశాడు. 19పెక్కు దేశాలకు
చెందిన ప్రజలు, పలు భాషలు మాట్లాడే ప్రజలు
నెబుకద్నెజరును చూచి భయపడుచుండిరి. ఎందు
కంటే సర్వోన్నతుడైన దేవుడు అతన్ని అతి ముఖ్యు
డైన రాజుగా చేసిన కారణంవల్ల. నెబుకద్నెజరు ఒక
వ్యక్తిని చంపదలచినట్లయితే, అతనిని చంపేవాడు. ఒక
వ్యక్తిని జీవింప తలచుకుంటే, అతణ్ణి జీవించేలా చేసే
వాడు. మనుష్యుల్ని ముఖ్యులుగా చేయదలుచు కుంటే,
ఆ మనుష్యుల్ని ముఖ్యులుగా చేసేవాడు. హీనులుగా
చేయదలచుకుంటే, హీనులుగా చేసేవాడు.
20కాని నెబుకద్నెజరు గర్విష్ఠి అయినాడు, మొండి
వాడయ్యాడు. అందువల్ల అతని నుండి అధికారం తీసు
కొనబడింది. అతని రాజ సింహాసనం తొలగించ
బడింది. అతని ప్రభావం తొలగించబడింది. 21అతని
బుద్ధి జంతువుల బుద్ధివలె మారింది. అతను అడవి
గాడిదలతో నివసించసాగాడు. ఎద్దువలె పచ్చిక
మేసాడు. మంచువల్ల తడిసాడు. అతను పాఠం నేర్చు
కొనే వరకు ఈ సంగతులు జరిగాయి. తర్వాత సర్వో
న్నతుడైన దేవుడు మనుష్యుల రాజ్యాల్ని పాలించు
వాడని, తనకు నచ్చిన వానికి రాజ్యాలు అప్పగించ
గలడని తెలుసుకొన్నాడు.
22"నెబుకద్నెజరు కుమారుడవైన బెల్షెస్సరూ! ఈ
విషయాలు నీకు ఇంతకు మునుపే తెలుసు, 23అయినా
నిన్ను నీవు తగ్గించుకొనలేదు. అందుకు బదులుగా
నీవు పరలోకమందున్న ప్రభువుకు విరోధంగా
హెచ్చించుకున్నావు. యెహోవా ఆలయం నుండి
నీవు త్రాగే పాత్రలు నీ కోసం ఆజ్ఞాపించి తెప్పించావు.
తర్వాత నీవు, నీ భార్యలు, నీ ఉపపత్నులు, రాజో
ద్యోగులు ఆ పాత్రలనుండి ద్రాక్షామద్యం పానం
చేశారు. నీవు వెండి, బంగారు, కంచు, ఇనుము, రాయి,
కర్రలతో చేయబడిన దేవుళ్లను కీర్తించావు. అవి నిజ
మైన దేవుళ్లు కావు. అవి చూడలేవు, వినలేవు, లేక
ఏమీ అర్థం చేసుకోలేవు. కాని నీ జీవితం మీదను,
నీవు చేసేవాటి మీదను, అధికారంగల దేవుణ్ణి నీవు
గౌరవించలేదు. 24ఆ కారణం వల్ల, దేవుడు గోడమీద
వ్రాసే హస్తాన్ని పంపించాడు. 25ఈ క్రింది మాటలే
గోడమీద వ్రాయబడినవి:

మెనే మెనే టెకేల్ ఊఫర్సీన్.

26 "ఈ మాటలకు అర్థం ఇది: మెనే: అనగా దేవుడు
నీ ప్రభుత్వ విషయములో లెక్కచూసి దాన్ని
ముగించాడు.

---

**పవిత్ర దేవుళ్ల** పవిత్ర దేవుని ఆత్మ అని అర్థం.

27 టెకల్ : అనగా దేవుడు నిన్ను త్రాసులో తూచగా
నువ్వు తక్కువగా కనబడ్డావు.
28 ఊఫర్సీన్: అనగా నీ రాజ్యం నీ వద్దనుండి తీసి
వేయబడి మాదీయులకూ పారసీకులకూ విభ
జింపబడింది."

29తర్వాత బెల్షస్సరు ఊదారంగు బట్టలు దానియేలు
ధరించేలా ఆజ్ఞ ఇచ్చాడు. అతని మెడకు బంగారు
గొలుసు ధరింపజేశాడు. అతను రాజ్యంలో మూడవ
గొప్ప పాలకుడని ప్రకటింపజేశాడు. 30ఆ రాత్రే బబు
లోను రాజైన బెల్షస్సరు హతుడయ్యాడు. 31దర్యావేషు
అనే పేరుగల మాదీయుడు క్రొత్తగా రాజు అయ్యాడు.
దర్యావేషు సుమారు అరవై రెండు యేండ్లవాడు.

### సింహాల బోనులో దానియేలు

6 తన రాజ్యం అంతటినీ పరిపాలించేందుకు నూట
ఇరవై మంది రాజ్యాధికారులను ఎంపిక చేయాలని
దర్యావేషు తలంచాడు. అది మంచి ఆలోచన అను
కొన్నాడు. 2మరియు ఆ నూట ఇరవై మంది రాజ్యాధి
కారుల మీద ఆధిపత్యం గలవారుగా ముగ్గురిని ఎంపిక
చేసాడు. ఆ ముగ్గురు ప్రధానులలో దానియేలు ఒకడు.
ఎవ్వరూ తనను మోసగించ కూడదని ఆ ముగ్గురిపైన,
మరి ఆ నూట ఇరవై మంది పైన దానియేల్ని అధికారిగా
ఎంపిక చేశాడు. అందువల్ల తన రాజ్యంలో ఏమీ తాను
నష్టపడేది ఉండదు. 3రాజు దానియేలును మెచ్చు
కొన్నాడు. తన మంచి ప్రవర్తన వల్లను, తన సామర్థ్యం
వల్లను దానియేలుకు రాజు అలా చేయగలిగాడు. రాజు
దానియేలు వశుడయ్యాడు. రాజ్యమంతటికీ దానియే
లును పరిపాలకునిగా చెయ్యాలని తలంచాడు. 4కాని
ఈ విషయాన్ని వినగానే ఇతర ప్రధానులు, రాజ్యాధి
కారులు అసూయ చెందారు. దానియేలులో తప్పుప
ట్టేందుకు వారు కారణాలు వెదకసాగారు. కనుక రాజ్యం
గురించి దానియేలు చేసే పనుల్ని వారు గమనించ
సాగారు. కాని దానియేలులో ఏ తప్పూ వారు కనుగొన
లేకపోయారు. ప్రజలు విశ్వసించదగిన వ్యక్తి దాని
యేలు. అతను రాజుని మోసగించలేదు. కష్టించి పని
చేసాడు.
5చివరికి వారు, "దానియేలుపై తప్పు పట్టేందుకు
తగిన కారణం మనమెన్నటికీ కనుగొనలేము. అందువల్ల
అతని దేవునికి సంబంధించిన ధర్మం గురించి మనం
ఫిర్యాదు చేసేందుకు ఏదో ఒకటి కనుగొనాలి" అని
అనుకొన్నారు.
6అందువల్ల ఆ ఇద్దరు ప్రధానులు, రాజ్యాధికారులు
ఒక బృందంగా రాజు వద్దకు వెళ్లి, "దర్యావేషు రాజు
వర్థిల్లాలి. 7ప్రధానులు, రాజ్యాధికారులు, ముఖ్యోద్యో
గులు, సలహాదారులు, రాజ్యపాలకులు అందరూ ఒక
విషయం సమ్మతించారు. రాజు ఈ చట్టం చెయ్యాలని,
ఈ చట్టాన్ని ప్రతి వ్యక్తి పాటించాలని భావిస్తున్నాము.
ఆ చట్టం ఇది: ఎవరైనా, రాజువైన నిన్ను తప్ప,
వచ్చే ముప్పై రోజులదాకా, ఏ దేవున్నిగాని, వ్యక్తినిగాని
ప్రార్థించినట్లయితే, ఆ వ్యక్తి సింహాల గుహలోకి త్రోసి
వేయబడతాడు. 8రాజా! ఆ చట్టం వ్రాసిన కాగితం
మీద సంతకం పెట్టి ఈ విధంగా చట్టం మార్చరానిది,
రద్దు చేయరానిది అని ప్రకటించాలి. ఎందుకంటే మాదీ
యుల మరియు పారసీకుల చట్టాలు మార్చరానివి
లేక రద్దు చేయరానివి" అని చెప్పారు. 9అందువల్ల
దర్యావేషు చట్టాన్ని చేసి కాగితంపై సంతకం పెట్టాడు.
10దానియేలు ప్రతిరోజూ మూడు సార్లు మోకరిల్లి
దేవుణ్ణి స్తుతిస్తూ ప్రార్థిస్తూ ఉండేవాడు. ఈ క్రొత్త
చట్టం గురించి దానియేలు విని, తన ఇంటికి వెళ్లి,
తన ఇంటిమీద ఉన్న గదిలో యెరూషలేము వైపుగా
తెరచివున్న కిటికీ వద్ద ఎప్పుడూ చేసే విధంగా,
మోకరిల్లి దేవుణ్ణి ప్రార్థించాడు.
11అప్పుడు ఆ మనుష్యులు ఒక బృందంగా వెళ్లి
దానియేలు దేవుణ్ణి ప్రార్థిస్తూ ఆయన సహాయం కోరు
తున్నట్లు వారు కనుగొన్నారు. అందువల్ల వారు
బృందంగా రాజు వద్దకు వెళ్లి, రాజు చేసిన చట్టం
గురించి వారతనితో మాట్లాడారు. 12వారు, " దర్యావేషు
రాజా, మీరొక చట్టం జారీ చేశారు. దాని ప్రకారం
వచ్చే ముప్పై రోజుల్లో ఎవరైనా మిమ్మల్ని కాక
ఇతర దేవుణ్ణి గాని వ్యక్తిని గాని ప్రార్థించినట్లయితే,
అతను సింహాల గుహలోకి త్రోసి వేయబడతాడు. ఆ
చట్టం మీద నీవు సంతకం చేశావు. అవును గదా" అని
జ్ఞాపకం చేశారు.
"అవును, నేను ఆ చట్టం మీద సంతకం చేసి
మాదీయుల, పారసీకుల చట్టాలు రద్దు చేయరానివి
లేక మార్చరానివి" అని ప్రకటించానని రాజు బదులు
చెప్పాడు. 13అప్పుడు ఆ మనుష్యులు రాజుతో,
"యూదా నుంచి తీసుకొని రాబడిన బందీలలో దాని
యేలు అనబడే ఆ వ్యక్తి మీ మాటలపట్ల శ్రద్ధ వహించ
లేదు. మీరు చేసిన చట్టాన్ని పాటించ లేదు. ప్రతిరోజూ
అతనింకా మూడుసార్లు తన దేవుని స్తుతిస్తున్నాడు"
అని చెప్పారు.
14ఇది వినగానే రాజు చాలా విచారించి, దానియే
లును రక్షించడానికి నిశ్చయించాడు. దానియేలును
కాపాడేందుకు సూర్యాస్తమయం వరకు ఒక ఉపాయం
కోసం రాజు ప్రయత్నించాడు, కాని ప్రయోజనం
లేకపోయింది. 15తర్వాత ఆ మనుష్యులు ఒక
బృందంగా రాజు వద్దకు వెళ్లారు. "రాజా, గుర్తుంచుకో.
మాదీయుల, పారసీకుల చట్టం చెబుతున్నదేమనగా,
రాజు చేసిన చట్టాన్ని మార్చుటకు రద్దు చేయుటకు
వీలులేదు" అని వారు చెప్పారు.
16అందువల్ల రాజైన దర్యావేషు ఆజ్ఞ ప్రకారం
దానియేలును తీసుకొని వచ్చి సింహాల గుహలోకి

త్రోసివేశారు. రాజు దానియేలుతో ఇట్లన్నాడు: "నీవు
నిరంతరం ఆరాధించే నీ దేవుడే నిన్ను రక్షిస్తాడని భావి
స్తున్నాను." 17ఒక పెద్ద బండను తీసుకువచ్చి, దానిని
సింహాల గుహ యొక్క ద్వారం మీద ఉంచారు. తర్వాత
రాజు తన ఉంగరంతోను, మరియు తన ఉద్యోగుల
ఉంగరాలతోను ఆ బండమీద ముద్రలు వేశారు.
ఎవ్వరూ బండను తొలగించి, దానియేలును సింహాల
గుహనుంచి వెలుపలికి తీసుకు రాకూడదని ఇలా చేశారు.
18తర్వాత దర్యావేషు రాజు తన ఇంటికి మరలి
పోయాడు. ఆ రాత్రి రాజు భోజనం చేయలేదు.
ఎవ్వరూ ఆ రాత్రి తనకు వినోదాన్ని కలిగించకూడదని
ఆదేశించాడు. ఆ రాత్రంతా రాజు నిద్ర పోలేదు.

19ఆ మరునాటి ఉదయం రాజైన దర్యావేషు
వెలుతురు వస్తూండగా సింహాల గుహవద్దకు పరుగెత్తుకు
వెళ్లాడు. 20రాజు చింతాక్రాంతుడుగా సింహాల గుహ
వద్దకు వెళ్లి దానియేలును ఇలా పిలిచాడు: "సజీవుడగు
దేవుని సేవకుడవైన దానియేలూ, నీవెప్పుడూ ఆరా
ధించే నీ దేవుడు నిన్ను సింహాల బారినుండి కాపాడ
గలిగెనా?"

21"రాజా, నీవు చిరకాలము వర్ధిల్లాలి! 22నా దేవుడు
నన్ను రక్షించడానికి తన దూతను పంపి సింహాల
నోళ్లను మూసివేశాడు. నా దేవునికి నేను కళంకరహితుణ్ణి
అని తెలుసు, కనుకనే సింహాలు నన్ను గాయపరచలేదు.
రాజా, నీకెప్పుడూ నేను అన్యాయం చెయ్యలేదు"
అని దానియేలు బదులు చెప్పాడు.

23దర్యావేషు రాజు చాలా సంతోషించాడు. సింహాల
గుహనుండి దానియేలును పైకి తీయవలసిందిగా రాజు
తన సేవకుల్ని ఆజ్ఞాపించాడు. వారు గుహనుండి దాని
యేలుని పైకి తీయగా, వారతని దేహంమీద ఎలాంటి
గాయాన్ని చూడలేదు. దానియేలు తన దేవున్ని విశ్వ
సించిన కారణంగా, అతనికి సింహాలవల్ల ఎలాంటి హాని
జరగలేదు.

24తర్వాత దానియేలుని సింహాల గుహకు పంప
డానికి కారణమైన ఆ మనుష్యుల్ని తీసుకురమ్మని
రాజు ఆజ్ఞాపించాడు. సింహాల గుహలోకి ఆ మనుష్యు
లను, వారి భార్యలను, వారి సంతానాన్ని త్రోసివేయగా
వారు సింహాల గుహ అడుగుభాగం తాకక ముందే
సింహాలు వారి శరీరాలను కబళించి వారి ఎముకల్ని
విరుగగొట్టాయి.

25తర్వాత ప్రపంచమంతటా విభిన్న భాషలు
మాట్లాడే ఆ మనుష్యులకందరికీ రాజైన దర్యావేషు
ఈ క్రింది లేఖను వ్రాశాడు:

అందరికి శుభమగు గాక!

26నేనిప్పుడు క్రొత్త చట్టం చేస్తున్నాను. నా
రాజ్యంలో ఏ భాగంలో నివసించే వారికైనా ఇది వర్తి
స్తుంది. మీరందరూ దానియేలు యొక్క దేవునికి
భయపడి వణకాలి.

దానియేలు దేవుడే సజీవుడు. ఆయన ఎప్పుడూ
జీవిస్తాడు. ఆయన రాజ్యం ఎన్నటికీ నశించదు,
ఆయన పరిపాలన అంతం కాదు.
27 దేవుడు ప్రజలకు సహాయం చేస్తాడు, రక్షిస్తాడు.
ఆయన ఆశ్చర్యాలను, అద్భుతాలను పరలోక
మందునూ, భూమి మీదనూ చేస్తాడు. దేవుడు
దానియేలును సింహాలనుండి రక్షించాడు.

28అందువల్ల దర్యావేషు రాజుగా ఉన్న కాలం
లోనూ, పారశీకుడైన కోరెషు రాజుగావున్న కాలం
లోనూ దానియేలు అభివృద్ధి చెందాడు.

### నాలుగు మృగాల్ని గూర్చి దానియేలుకు కల

7 బెల్షస్సరు బబులోనుకు రాజుగా ఉన్న మొదటి
సంవత్సరంలో, దానియేలు ఒక కలగన్నాడు. దాని
యేలు ఈ దర్శనాలు చూశాడు. అప్పుడతను తన
పడకమీద పడుకునివున్నాడు. తాను కలగన్న విష
యాల్ని దానియేలు వ్రాసాడు. 2దానియేలు ఇలా
చెప్పాడు: "నేను రాత్రివేళ ఒక దర్శనం చూశాను.
అందులో నాలుగు వైపుల నుండి గాలి వీచింది. ఆ
గాలులకు సముద్రం అల్లకల్లోలంగా ఉండింది. 3నేను
నాలుగు పెద్ద మృగాల్ని చూశాను. అవి ఒక్కొక్కటి
ఒక్కొక్క విధముగా వున్నాయి. ఆ నాలుగు మృగాలు
సముద్రం నుండి పైకి వచ్చాయి.

4"మొదటి మృగము సింహంవలె ఉండింది. దానికి
గ్రద్ద రెక్కలున్నాయి. ఆ మృగాన్ని గమనిస్తూండగా
దాని రెక్కలు విరిచివేయబడ్డాయి. అది నేలనుండి
పైకి ఎత్తబడి మనిషిలాగ రెండు కాళ్లమీద నిలబడింది.
దానికి మానవుని మనస్సువంటి మనస్సు ఇవ్వబడింది.
5"ఆ తర్వాత నా ఎదుట రెండవ మృగాన్ని
చూశాను. ఇది ఎలుగుబంటివలె కనిపించింది. ఒక
వైపుకి అది లేవనెత్తబడింది. దాని నోట్లో పళ్ల సందున
మూడు ప్రక్క ఎముకలున్నాయి. పైకి లేచి, నీకు
కావలసినంత మాంసం తిను" అని దానికి చెప్పబడింది.
6"తర్వాత నేను చూడగా నా ఎదుట మూడవ
మృగము ఉంది. ఇది చిరుతపులిలాగ ఉంది. దాని
వీపుమీద నాలుగు పక్షి రెక్కలున్నాయి. దీనికి నాలుగు
తలలున్నాయి. పరిపాలించే అధికారం దానికి ఇవ్వ
బడింది.

7"ఆ తర్వాత, నా దర్శనాలలో రాత్రివేళ చూస్తూం
డగా నా ఎదుట నాలుగవ మృగము ఉంది. ఇది చాలా
ఘోరంగాను, భయంకరంగాను కని పించింది. అది
మహా బలంగా ఉంది. దానికి ఇనుప పళ్లు ఉన్నాయి.
ఈ మృగం ముక్కలుగా చీల్చి మ్రింగుచూ మిగిలిన
దాన్ని తన కాళ్ల క్రింద త్రొక్కుచుండినది. అంతకు
మునుపు నేను చూసిన ఇతర మృగాలకంటె ఈ
నాలుగవ మృగం భిన్నంగా ఉంది. దీనికి పది కొమ్ములు
న్నాయి.

[8]“ఈ కొమ్ముల విషయం నేను తలస్తూండగా వాటిమధ్యలో ఒక చిన్న కొమ్ము పైకి వచ్చింది. దాని స్థానంలో మొదట ఉన్న మూడు కొమ్ములు కుదురుతో సహా పెరికి వేయబడ్డాయి. ఈ చిన్న కొమ్ముమీద మానవ కళ్లలాంటి కళ్లు, డంబాలు పలికే నోరు దానికి ఉన్నాయి.

### నాలుగవ మృగం తీర్పు

9 “నేను చూసస్తూండగా సింహాసనాలు వేయ
బడ్డాయి. మరియు ప్రాచీన రాజు* తన సింహాస
నమున ఆసీనుడై ఉన్నాడు. ఆయన వస్త్రాలు
మంచులా తెల్లగాను, ఆయన తల వెంట్రుకలు
స్వచ్ఛమైన ఉన్నివలె తెల్లగా ఉండినవి. ఆయన
సింహాసనం అగ్ని జ్వాలలతోను, ఆ సింహాసనపు
చక్రాలు మంటల తోను మండుచున్నవి.
10 ఆయన ఎదుట నుండి అగ్ని ప్రవాహము
బయలు వెళ్లింది. కోట్లకొలది ఆయనకు సేవ
చేస్తూ ఉన్నారు. కోట్లకొలది ఆయన ఎదుట
నిలబడ్డారు. తీర్పుకై ఆయన న్యాయసభకు
కూర్చుండగా గ్రంథాలు తెరువబడ్డాయి.

[11]“చిన్న కొమ్ము గర్వపు మాటలు మాట్లాడు చున్న శబ్దం విని అటు చూశాను. నేను చూస్తుండగా ఆ నాలుగవ మృగం చంపబడింది. దాని శరీరం నాశనం చేయబడింది. అది మండుచున్న మంటల్లోకి త్రోసి వేయబడింది. [12]మిగిలిన మృగాల అధికారం వాటినుండి తీసివేయబడింది. కాని కొంతకాలంపాటు అవి నివసించి ఉండడానికి అనుమతి ఇవ్వబడింది.

[13]“రాత్రి దర్శనాలలో, మానవ కుమారుని పోలిన ఒక వ్యక్తి రావటం నేను చూశాను. ఆయన ఆకాశంలోని మబ్బులమీద ప్రాచీన రాజు వద్దకు వచ్చి ఆయన ముందు నిలబడ్డాడు.

[14]“మానవ కుమారునివలె కనిపించిన ఆ వ్యక్తికి అధికారం, ప్రభావం, సంపూర్ణ పరిపాలనాధికారం ఇవ్వ బడ్డాయి. అందును బట్టి ప్రజలందరు, దేశాలు, ప్రతి భాషకు చెందినవారు ఆయన్ని సేవిస్తారు. ఆయన పరిపాలన ఎప్పటికీ ఉంటుంది. ఆయన రాజ్యం ఎప్పుడూ కొనసాగుతూ ఉంటుంది. అది ఎన్నటికీ అంతం కానిది.

### నాలుగవ మృగం గురించి కల వివరము

[15]“దానియేలు అను నేను నా ఆత్మలో చింతిం చాను. నేను చూసిన దర్శనాలు నన్ను కలవరబెట్టాయి. [16]అక్కడ నిలబడిన ఒకనిని నేను సమీపించి ఇదంతా ఏమిటని నేను అతన్ని అడిగాను. [17]అందువల్ల, అతను వాటి అర్థాలేమిటో వివరించి చెప్పాడు, ‘నాలుగు మృగాలు నాలుగు రాజ్యాలు.* ఆ నాలుగు రాజ్యాలు భూమిమీద ఉద్భవిస్తాయి. [18]కాని మహోన్నతుడైన దేవుని ప్రత్యేక జనులే ఆ రాజ్యాన్ని పొందుతారు. వారా రాజ్యాన్ని ఎల్లప్పుడూ కలిగియుంటారు.’

[19]“తర్వాత ఆ నాలుగవ మృగం దాని అర్థం తెలుసు కోదలచాను. మిగిలిన మృగాలకంటె నాలుగవ మృగం భిన్నమైంది, మహా భయంకరంగా ఉండింది. దానికి ఇనుప పళ్లు, కంచు గోళ్లు ఉన్నాయి. అది తన బలి పశువుల్ని అన్నింటిని చీల్చి తిని, మిగిలినదాన్ని కాళ్ల క్రింద త్రొక్కి వేసింది. [20]నాలుగవ మృగం తలమీద వున్న పది కొమ్ములు గురించి తెలుసు కోవాలను కున్నాను. అక్కడ పెరిగిన చిన్న కొమ్ము గురించి తెలుసుకోదలిచాను. వాటిలో మూడు కొమ్ముల్ని చిన్న కొమ్ము పెరికివేసింది. ఇతర కొమ్ముల కంటె చిన్న కొమ్ము గొప్పదిగా, నీచంగా కనిపించింది. అది మానవ కన్నుల లాంటి కన్నులు కలిగియుండినది. అది డంబములు పలుకుతూనే ఉండినది. [21]నేనది గమనిస్తూండగా, ఈ చిన్న కొమ్ము దేవుని ప్రత్యేక జనుల్ని ఎదిరించి వారితో యుద్ధం చేయసాగింది. [22]మరియు ఆ కొమ్ము వారిని చంపుతూ ఉండెను. ప్రాచీన రాజు వచ్చి, న్యాయవిచారణ చేసేంతవరకు అది దేవుని ప్రత్యేక జనుల్ని చంపుచుండెను. ప్రాచీన రాజు చిన్న కొమ్ముని గురించి తీర్పు ప్రకటించాడు. ఆ తీర్పు దేవుని ప్రత్యేక జనులకు సహాయము చేసింది. మరియు వారు రాజ్యమును స్వీకరించే సమయము వచ్చింది.

[23]“అతను నాకిది వివరించాడు: ‘భూమిమీద అవ తరించే నాలుగవ రాజ్యమే ఆ నాలుగవ మృగం. అది యితర రాజ్యాలకు భిన్నంగా వుంటుంది. ఆ నాలుగవ రాజ్యం ప్రపంచమంతట వుండే ప్రజల్ని తన వశం చేసుకొంటుంది. ప్రపంచంలో వుండే రాజ్యాలను అణిచివేస్తుంది. [24]ఈ నాలుగవ రాజ్యం నుండి వచ్చే పదిమంది రాజులే పది కొమ్ములు. ఆ పదిమంది రాజులు పోయిన తర్వాత, మరొక రాజు వస్తాడు. తనకు పూర్వం పరిపాలించిన రాజులకంటె ఈ రాజు భిన్నంగా ఉంటాడు. ఇతర ముగ్గురు రాజుల్ని అతను జయిస్తాడు. [25]ఈ ప్రత్యేక రాజు సర్వోన్నతుడైన ఆ దేవునికి విరుద్ధంగా మాట్లాడు తాడు. ఆ రాజు దేవుని ప్రత్యేక జనుల్ని గాయపరచి చంపివేస్తాడు. అంతకు పూర్వమే వున్న సమయాలను చట్టాలను మార్చివేయ డానికి అతను ప్రయత్నిస్తాడు. దేవుని ప్రత్యేక జనులు ఆ రాజు ఆధిపత్యంలో మూడున్నర సంవత్సరా లుంటారు.

---

**ప్రాచీన రాజు** వాస్తవంగా “ప్రాచీన రోజులు” అని వ్రాయబ డివుంది. అనగా దేవుడు అనాది కాలంనుంచి ఉన్నవాడని అర్థము.

**నాలుగు రాజ్యాలు** ‘నలుగురు రాజులు’ అని కూడా పాఠాంతరం.

26"'కాని ఏమి జరగవలెనో, (దేవుని) న్యాయ
స్థానమే నిర్ణయిస్తుంది. మరియు ఆ రాజుయొక్క అధి
కారము తీసివేయ బడుతుంది. వాని రాజ్యం సమూ
లంగా నాశనమవుతుంది. 27తర్వాత దేవుని ప్రత్యేక
జనులు రాజ్యాన్ని పరిపాలిస్తారు. వారు భూమిమీద
సర్వరాజ్యాలను పాలిస్తారు. ఈ రాజ్యం ఎన్నటికీ
ఉంటుంది. ఇతర రాజ్యాలకు చెందిన ప్రజలు వారిని
గౌరవిస్తారు, సేవిస్తారు.'
28"ఇదే కలయొక్క ముగింపు. దానియేలు అను
నేను చాలా భయపడితిని. ఆ భయంవల్ల నా ముఖం
పాలిపోయింది. మరియు నేను చూసిన, విన్న
విషయాలను నా మనస్సులో ఉంచుకొంటిని."

### దానియేలు దర్శనం – పొట్టేలుమరియు మేకపోతు

8 బెల్షస్సరు రాజుగా ఉన్న మూడవ సంవత్సరంలో,
నాకు ఈ దర్శనము కనిపించింది. ఇది మొదటి
దర్శనానికి తర్వాత వచ్చింది. 2ఆ దర్శనంలో నేను
షూషనులో ఉన్నట్లు చూశాను. ఏలాం రాష్ట్రంలో
షూషను ఒక రాజధాని నగరం. నేను ఊలయి నది
ప్రక్క నిలబడి ఉన్నాను. 3నా కన్నులెత్తి ఊలయి
నదికి ప్రక్కగా ఒక పొట్టేలు నిలబడి ఉండడం చూశాను.
ఆ పొట్టేలుకి రెండు పొడుగాటి కొమ్ములుండెను. కాని
ఒకటి మరొకదాని కంటె పొడుగైనది. పొడుగాటి
కొమ్ము తర్వాత పుట్టింది. 4ఆ కొమ్ములతో పొట్టేలు
పడమరకి, ఉత్తరానికి, దక్షిణానికి పరుగెత్తడం చూశాను.
ఏ మృగమూ పొట్టేలుని ఎదురించలేక పోయింది.
మరియు ఎవ్వరూ దీనినుండి ఇతర జంతువుల్ని
కాపాడలేక పోయారు. ఆ పొట్టేలు చేయదలచిందంతా
చేస్తాంది. అందువల్ల పొట్టేలు చాలా శక్తివంత
మయింది.
5నేను ఆ పొట్టేలు గురించి ఆలోచిస్తున్నప్పుడు,
ఒక మేకపోతు పడమర నుండి రావడం చూశాను.
అది భూమి అంతటా చుట్టి వచ్చింది. దాని కాళ్లు
భూమిని కూడా తాకలేదు. ఈ మేకపోతుకు ఒక పెద్ద
కొమ్ము దాని కళ్ల మధ్యన ఉంది.
6ఆ మేకపోతు ఊలయి నదికి ప్రక్కగా నిలబడివున్న
రెండు కొమ్ములు గల పొట్టేలు వద్దకు వచ్చింది.
మేకపోతు చాలా కోపంగా ఉంది. 7మేకపోతు పొట్టేలు
వైపు పరుగెత్తి చాలా కోపంతో కలబడి పొట్టేలు రెండు
కొమ్ముల్ని విరుగ కొట్టింది. మేకపోతును పొట్టేలు
ఎదిరించలేకపోయింది. మేకపోతు పొట్టేలుని నేలకు
పడవేసి దాన్ని త్రొక్కివేసింది. ఆ మేకపోతు నుండి
పొట్టేలుని కాపాడగలిగిన వారెవ్వరూ లేకపోయిరి.
8అందువల్ల మేకపోతు చాలా బలంగా పెరిగింది.
కాని అది శక్తివంతంగా వున్నప్పుడు, దాని పెద్ద కొమ్ము
విరిగిపోయింది. తర్వాత ఆ పెద్ద కొమ్ము స్థానంలో
నాలుగు వేరే కొమ్ములు మొలిచాయి. ఆ నాలుగు
కొమ్ములు ఆకాశపు నాలుగు దిక్కులలో పెరిగాయి.
9తర్వాత ఆ నాలుగు కొమ్ములలో ఒకదాని నుండి
ఒక చిన్న కొమ్ము పెరిగి బాగా పెద్దదయింది. అది
దక్షిణ దిక్కుగా, తూర్పు దిక్కుగా, సుందర దేశం
దిక్కుగా పెరిగింది. 10ఆ చిన్నకొమ్ము బాగా పెద్దదయి
ఆకాశాన్ని అంటేంత వరకు పెరిగింది. అది నక్షత్రాల్ని
కూడా క్రిందికి త్రోసి కాళ్ల క్రింద త్రొక్కి వేసింది.
11ఆ చిన్న కొమ్ము బాగా గర్వించి ఆ నక్షత్రాల సైన్యాధి
పతికి ఎదురు తిరిగింది. అది పరిపాలకుని అనుదిన
బల్యర్పణాన్ని ఆపివేసి. ఆయన ఆలయాన్ని పడ
గొట్టింది. 12తిరుగుబాటు జరిగినందున (పరిశుద్ధుల)
సైన్యం మరియు అనుదిన బలి దాని వశం చేయ
బడ్డాయి. సత్యం నేలకు అణచి వేయబడింది. చేసిన
ప్రతి దానిలో అది బాగా అభివృద్ధి చెందింది.
13అంతట ఒక పరిశుద్ధుడు మాట్లాడటం విన్నాను.
ఇంకొక పరిశుద్ధుడు మొదటి వానిని ఇలా అడిగాడు:
"ఈ దర్శనం నెరవేరటానికి ఎంత కాలం పడుతుంది?
అనుదిన బలిని గూర్చిన దర్శనం, నాశనం కలిగించు
తిరుగుబాటు, పరిశుద్ధ స్థలం మరియు పరిశుద్ధుల
సైన్యం కాళ్ల క్రింద త్రొక్కబడటం ఇవన్నియు నెరవేర
టానికి ఎంతకాలము పడుతుంది?"
14అతడు నాతో ఇలా అన్నాడు: "దానికి రెండువేల
మూడువందల రోజులు పడుతాయి. అప్పుడు పవిత్ర
స్థలం తిరిగి పరిశుద్ధం చేయబడుతుంది."

### దానియేలుకి దర్శనం వివరించబడింది

15దానియేలు అను నేను ఈ దర్శనం చూశాను.
అది యేమిటో తెలుసుకోవడానికి నేను ప్రయత్ని
స్తూండగా మానవుని వంటి ఒకతను నా ఎదుట నిలి
చాడు. 16తర్వాత ఒక మనిషి స్వరం ఊలయి నదిమీది
నుంచి వినవచ్చింది, "గాబ్రియేలూ, ఈ దర్శనమును
ఈ వ్యక్తికి వివరింపుము."
17నేను నిలుచుండిన స్థలానికి గాబ్రియేలు రాగా
నేను భయభ్రాంతుడనై నేలమీద సాష్టాంగపడ్డాను. గాబ్రి
యేలు దూత నాతో, "మానవపుత్రుడా!, ఈ దర్శనం
అంత్యకాలానికి సంబంధించిందని తెలుసు కొనుము"
అని చెప్పాడు.
18గాబ్రియేలు దూత నాతో మాటలాడుతూ
ఉండగా, నేను నేలమీద సాష్టాంగపడి, గాఢనిద్ర
పోయాను. అప్పుడు అతను నన్ను తాకి పైకి లేవ
నెత్తాడు. 19గాబ్రియేలు దూత ఇలా చెప్పాడు: "శ్రమ
కాలపు చివరిలో ఏమి జరుగుతుందో నీకు ఇప్పుడు
చెపుతాను. ఈ దర్శనం నియమించబడిన అంత్యకాలా
నికి సంబంధించింది" అని అన్నాడు.
20"రెండు కొమ్ములు గల పొట్టేలును నీవు
చూశావు. ఆ కొమ్ములు మాదీయ, పారసీక దేశాలు.
21బొచ్చుగల మేకపోతు గ్రీకు రాజు, దాని కళ్ల మధ్య

వున్న పెద్ద కొమ్ము మొదటి రాజు. 22ఆ కొమ్ము
విరిగి పోయింది. ఆ స్థానంలో నాలుగు కొమ్ములు
మొలిచాయి. ఆ కొమ్ములు మొదటి రాజు సామ్రాజ్యం
నుంచి చీలిన నాలుగు రాజ్యాలు. కాని ఆ నాలుగు
రాజ్యాలు మొదటి రాజువలె బలిష్టంగా ఉండవు.
23“ఆ రాజ్యాలకు అంతం సమీపించే సమయాన,
వారి దుష్టత్వం నిండినప్పుడు, మొండితనపు ముఖము
గలిగి జిత్తులమారి అయిన ఒక రాజు లేస్తాడు. ఈ
రాజు తన శక్తి వల్ల కాకుండానే మహా శక్తిమంతుడ
వుతాడు. 24ఇతడు భయంకరమైన నాశనాన్ని తెస్తాడు.
ఇతడు చేసే ప్రతి పనిలోనూ విజయం కలుగుతుంది.
అతను శక్తిమంతులైన మనుష్యుల్ని చివరికి దేవుని
ప్రత్యేక జనుల్ని కూడా నాశనం చేస్తాడు. 25ఈ రాజు
చాలా మోసగాడు, జిత్తులమారి అయివుండి, తన యుక్తి
ఉపయోగించి, వంచనతో గెలుపొందుతాడు. తాను
అతి ముఖ్యుడనని భావిస్తాడు. ప్రజలు క్షేమంగా ఉన్నా
మని తలస్తున్నప్పుడు ఇతడు చాలా మందిని, రాజాధి
రాజును సహితం ఎదిరిస్తాడు. అయినా ఇతడు నాశనం
చేయబడతాడు, కాని మానవ శక్తివల్ల కాదు.
26“ఆ కాలాన్ని గురించి నీకివ్వబడిన దర్శనం నిజ
మైంది. కాని ఆ దర్శనానికి ముద్ర వేయి. ఎందుకనగా
అది అంత్యకాల సంబంధమైనది.”
27దానియేలు అను నేను అలసిపోయి చాలా
రోజులు జబ్బు పడ్డాను. రాజుకు పనిచేసే నిమిత్తం
నేను మరల లేచి వెళ్ళాను. కాని నేను ఆ దర్శనాన్ని
తలంచుకుని కలతచెందాను. కాని దాని అర్థమేమిటో
నాకు తెలియలేదు.

## దానియేలు ప్రార్థన

9 మాదీయుడైన అహష్వేరోషు కుమారుడగు
దర్యావేషు బబులోను రాజ్యానికి రాజైన మొదటి
సంవత్సరంలో జరిగిన సంగతి ఇది. 2దర్యావేషు రాజుగా
ఉండిన మొదటి సంవత్సరంలో, దానియేలు అను
నేను, దేవుని ప్రవక్త అయిన యిర్మీయా ద్వారా
వ్రాయించిన సంగతిని గ్రహించాను. ఏమనగా యెరూష
లేము డెబ్బై సంవత్సరాలు పాడుబడినదిగా ఉండవలసిన
సమయము పూర్తి అవుతూందని గ్రహించాను. 3తర్వాత
నేను గోనెపట్ట ధరించి, బూడిదలో కూర్చుని ఉపవాస
ముండి నా ప్రభువైన దేవునికి నా మనవిని ప్రార్థన
విజ్ఞాపన ద్వారా తెలియ పర్చుకొన్నాను. 4నా దేవుడైన
యెహోవాకు ప్రార్థించి నా పాపములన్నిటినీ ఒప్పు
కొన్నాను. “ప్రభువా! నీవు భయంకరుడవైన మహా
దేవుడవు. నిన్ను ప్రేమించి, నీ ఆజ్ఞలకు లోబడే ప్రజల
పట్ల నీ ఒడంబడికను నెరవేరుస్తావు.
5“ప్రభువా! మేము పాపాలు చేశాము. మేము చెడ్డ
పనులు చేసి నీకు విరుద్ధంగా ప్రవర్తించాము. మేము
నీ ఆజ్ఞలకు, నీ విధులకు అవిధేయులమయ్యాం. 6ప్రవ
క్తలు నీ తరపున మా రాజులతోను, నాయకులతోను,
మా తండ్రులతోను, దేశంలోని ప్రజలందరితో మాట్లా
డారు. మేము నీ సేవకులైన ప్రవక్తల మాటలు వినలేదు.
7“ప్రభువా, నీవు నీతిమంతుడవు. మేము అనగా
యూదా, యెరూషలేము ప్రజలు, మా పితరులు నీకు
ద్రోహము చేసిన కారణాన దూర, సమీప దేశాలకు
చెదర గొట్టబడిన ఇశ్రాయేలు వారమైన మేము ఈ
దినాన సిగ్గు పడవలసిన వారమైయున్నాము.
8“ప్రభువా! మా రాజులు, నాయకులు, మా పూర్వీ
కులు నీకు విరోధంగా పాపం చేసినందువల్ల మేము
సిగ్గుపడ వలసిన వారమైతిమి.
9“ప్రభువు దయామయుడు, క్షమాపణా స్వభావం
గలవాడు. అయినను మేము నిజంగానే నీకు విరుద్ధంగా
పాపం చేశాము. 10మేము మా దేవుడైన యెహోవా
మాటలు పాటించలేదు. తన సేవకులైన ప్రవక్తల
ద్వారా యెహోవా మాకు ప్రసాదించిన ఆ చట్టాలను
అతిక్రమించాము. 11ఇశ్రాయేలు ప్రజలు నీ బోధనలకు
విధేయులు కాకుండా వారందరూ నీకు విముఖుల
య్యారు. దేవుని సేవకుడైన మోషే ధర్మశాస్త్రంలో
వ్రాయబడిన శాపాలు, ప్రమాణాలు మా మీద క్రుమ్మ
రించ బడ్డాయి. ఎందుకంటే మేము నీ ఎడల పాపం
చేశాము
12“దేవుడు మాకును, రాజులకును విరోధంగా
పలికిన మాటలు మా ఎడల జరిగేటట్లు చేశాడు.
ఎలాగనగా ఆకాశం క్రింద ముందెన్నడూ జరుగని మహా
విపత్తును యెరూషలేము ఎడల జరిగించుట ద్వారా
మాపై ఈ శిక్షను విధించాడు. 13ఆ భయంకర
విషయములన్నీ మోషే ధర్మశాస్త్రంలో వ్రాయబడి
నట్లుగానే మా మీద జరిగాయి. మేము మా పాపాలు
మాని, ఆయన సత్యాన్ననుసరించి నడుచుకొని,
ప్రభువు దయను పొందేటట్లు ప్రయత్నించలేదు.
14ప్రభువు మా మీద నాశనాన్ని రప్పించటానికి వెను
కాడలేదు. ఎందుకంటే మా దేవుడైన ప్రభువు ఈ
కార్యాలన్నిటిలో నీతిమంతుడు. కాని మేము ఆయనకు
విధేయులం కాలేదు.
15“మా దేవుడవైన యెహోవా, నీవు నీ మహాశక్తివల్ల
నీ ప్రజల్ని ఈజిప్టునుండి వెలుపలికి తెచ్చావు. అందు
వలననే నీవీ నాటికినీ నీ నామాన్ని గొప్పదిగా చేశావు.
కాని మేము చెడుగా ప్రవర్తించి పాపం చేశాము. 16దేవా,
నీ నీతి క్రియలను దృష్టిలో నుంచుకొని, పరిశుద్ధ
పట్టణం పట్ల, యెరూషలేం పట్ల నీ కోపాన్ని
మానుము. మా పాపాల వల్ల, మా పూర్వీకుల అప
రాధాల వల్ల యెరూషలేము, నీ ప్రజలు మా పొరుగువారి
మధ్యలో అవమానం పాలైరి. 17కాబట్టి మా దేవా!
ఇప్పుడు, నీ సేవకుడనైన నా ప్రార్థన, మనవి ఆల
కించుము. నీ నామం కొరకు, ప్రభువా! నీ ముఖ
కాంతి పాడుబడిన పరిశుద్ధ స్థలం మీద ప్రకాశించుగాక!

18నా దేవా, నీ చెవి వంచి నా ప్రార్థన వినుము! నీ
కన్నులు తెరిచి, పాడుబడిన మా పైన, నీ పేరు పెట్ట
బడిన నగరము పైన నీ దృష్టినుంచుము. మేము నీతి
మంతులమని కాదుగాని, నీవు కృపామయుడవని నీకు
మొర పెట్టుచున్నాము. 19ప్రభువా! నా మొర ఆల
కింపుము. ప్రభువా మమ్ము మన్నించుము. ప్రభువా,
మా ప్రార్థన విని, సహాయం చేయుము. నా దేవా!
ఆలస్యం చేయవద్దు. నా దేవా, నీ నామ మహిమ
కొరకు నీ పట్టణం, నీ ప్రజలు నీ పేరును ధరించి
యున్నారు.”

## డెబ్బై వారాలకు సంబంధించిన వివరము

20నేనింకా మాట్లాడుచూ, ప్రార్థిస్తూ, నా పాపాన్ని
గురించి, ఇశ్రాయేలు పాపాలను గురించి ఒప్పుకుంటూ
ఉంటిని. నా దేవుని పరిశుద్ధ పర్వతాన్ని గురించి ప్రభు
వైన నా దేవునికి ప్రార్థిస్తూ ఉంటిని. 21నేను ప్రార్థన
చేస్తూ ఉండగా నా దర్శనంలో ఇంతకు ముందు నేను
చూసిన గాబ్రియేలు దూత త్వరగా సాయంకాలపు
బలియర్పణ సమయాన వచ్చాడు. 22అతడు వచ్చి
నాతో ఇలా చెప్పాడు: “దానియేలూ, నేను నీకు
వివేకము, గ్రహింపు ఇవ్వడానికి వచ్చాను. 23నీవు ప్రార్థన
చేయడానికి మొదలు పెట్టినప్పుడు దాని సమాధానం
నాకు యివ్వబడింది. దాన్ని నేను నీకు చెప్పడానికి
వచ్చాను. ఎందుకంటే నీవు దేవునికి ప్రియమైన
వాడవు. కాబట్టి నా మాట విని దర్శనాన్ని అర్థము
చేసికొనుము.

24“నీ ప్రజలకు నీ పవిత్ర నగరానికి డెబ్బై వారాల
గడువు ఇవ్వబడింది: అనగా అతిక్రమాన్ని ముగించ
టానికి, పాపాన్ని అంతం చేయటానికి, అపరాధాన్ని
ప్రాయశ్చిత్తం చేయటానికి, నీతిని శాశ్వతంగా తేవ
టానికి, దర్శనాన్ని ప్రవచనాన్ని ముద్రించటానికి
మరియు పరిశుద్ధ స్థలాన్ని అభిషేకించటానికి డెబ్బై
వారాలు పడుతుంది.

25“కాబట్టి ఈ విషయం తెలుసుకొని గ్రహించు
కొనుము – యెరూషలేమును తిరిగి కట్టమని సందేశం
బయలు వెళ్లిన సమయంనుండి, అభిషేకింప బడిన
రాజు వచ్చేవరకు ఏడు వారాలు అవుతుంది. అరవై
రెండు వారాలలో యెరూషలేము రాజవీధులతోను,
కందకములతోను మరల కట్టబడుతుంది, కాని కష్ట
సమయాల్లో అది కట్టబడుతుంది. 26అరవై రెండు
వారాల తర్వాత అభిషేకింపబడిన రాజు* చంప
బడుతాడు. అప్పుడు రాబోయే రాజుయొక్క ప్రజలు
నగరాన్ని, పరిశుద్ధ స్థలాన్ని నాశనం చేస్తారు. దాని
అంతం ఒక ప్రళయంతో వస్తుంది. అంతం వరకు
యుద్ధం కొనసాగుతుంది. నాశనాలు జరగటానికి
ఆజ్ఞాపించబడ్డాయి.

27“ఒక వారంపాటు రాబోయే రాజు చాలామందితో
ఒక స్థిరమైన ఒప్పందం చేస్తాడు. అర్ధవారం బలి
అర్పణలు నిలుపు చేస్తాడు. అసహ్య కార్యాలు జరిగించే
(దేవాలయములో) నాశనకారుడు ఒకడు వస్తాడు. ఆజ్ఞా
పించబడిన అంతము ఈ నాశనకారుని మీద క్రుమ్మ
రించ బడేవరకు ఈ విధముగా జరుగుతుంది”

## హిద్దెకెలు నది దగ్గర దానియేలు దర్శనము

10 పారసీక రాజగు కోరెషు పాలన మూడవ సంవ
త్సరంలో, బెల్తెషాజరు అను ఒక విషయం
దానియేలుకు తెలియపర్చబడింది. అది యుద్ధమును
గూర్చిన నిజ సంగతి. ఇది దర్శనం ద్వారా దానియే
లుకు బయలుపడింది గనుక అతడు గ్రహించాడు.
2“ఆ దినాల్లో దానియేలు అను నేను మూడు
వారాలు దుఃఖాక్రాంతుడనయ్యాను. 3ఆ మూడు
వారాల్లో, నేను ఎలాంటి పుష్టికరమైన ఆహారాన్ని
భుజించలేదు, మాంసాన్ని, ద్రాక్షారసాన్ని తీసుకోలేదు,
తలకు నూనె రాసుకోలేదు.

4“మొదటి నెల ఇరవై నాల్గవ రోజున, గొప్ప నది
అయిన టైగ్రిసు (హిద్దెకెలు) నది గట్టుమీద నేను
నిలబడి ఉన్నాను. 5నేనక్కడ నిలబడి కన్నులెత్తి
చూస్తూండగా ఒక వ్యక్తి నార బట్టలు ధరించుకొని,
నడుము చుట్టూ మేలిమి బంగారపు దట్టి ధరించుకొని
యున్నాడు. 6ఆయన శరీరం గోమేధికం వలె పసుపు
గాను, ముఖం మెరుపువలె ప్రకాశవంతంగాను, కళ్లు
ప్రకాశిస్తున్న దీపాల వలె కనిపించాయి. చేతులూ,
కాళ్లూ మెరుస్తున్న కంచువలెను, మాటల శబ్దం నర
సమూహపు కంఠధ్వని వలెను ఉన్నాయి.

7“దానియేలు అను నేనొక్కడనే ఆ దర్శనం
చూశాను. నా వెంట నున్న మనుష్యులు ఆ దర్శనం
చూడలేదు. కాని వారు భయంతో వణుకుచూ పారి
పోయి దాగుకొన్నారు. 8అందువల్ల నేను ఒంటరి
వాడనై, ఆ గొప్ప దర్శనాన్ని చూచి, నాలో బలము
లేనివాడనయ్యాను. మృతుడైన వాని ముఖంవలె నా
ముఖం పాలిపోయి బలం లేని వాడనయ్యాను. 9
దర్శనంలో కనిపించిన వ్యక్తి మాటలాడడం విన్నాను.
ఆయన మాటలాడడం వినగా, నేను గాఢనిద్ర పొందిన
వాడనై నేలమీద సాష్టాంగ పడ్డాను.

10“అప్పుడు ఒక చెయ్యి నన్ను తాకి, వణుకు
చున్న నా చేతులను, మోకాళ్లను బలపరచి నన్ను
నిలువ బెట్టింది. 11అతను నాతో, ‘బహు ప్రియుడవైన
దానియేలూ! నేను నీతో చెప్పు మాటల్ని జాగ్రత్తగా
వినుము. సరిగా నిలువ బడు. నేను నీ కోసమే నీ
యొద్దకు పంపబడ్డాను’ అని అన్నాడు. అతడు నాతో
ఈ మాట చెప్పుచుండగా వణకుతూ నేను నిలబడ్డాను.
12అప్పుడు అతడు నాతో, ‘దానియేలూ, భయపడకు.
నీ దేవుని ఎదుట నిన్ను నీవు తగ్గించుకొని గ్రహించ

---

**అభిషేకింపబడిన రాజు** మెస్సీయా (క్రీస్తు).

టానికి నీ మనస్సు నిలుపుకొన్న ఆ మొదటి రోజునుండి
నీ మాటలు వినబడ్డాయి. నీవు ప్రార్థింస్తూన్నందువల్లనే
నేను నీ వద్దకు వచ్చాను. 13పారసీక రాజ్యాధిపతి
ఇరవై యొక్క రోజులు నన్ను అడ్డగించాడు. కాని,
ప్రధాన దూతలలో ఒకడైన మిఖాయేలు నా సహాయం
కోసం వచ్చాడు. అతన్ని నేను పారసీక రాజ్యాధి
పతియొద్ద విడిచి వచ్చాను. 14అంత్య దినాల్లో నీ
జనులకు జరుగబోయే సంగతుల్ని నీకు తెలియ జేయ
టానికి నేను వచ్చాను. ఈ దర్శనం రాబోయే దినాలకు
సంబధించింది’ అని చెప్పాడు.
15“అతడు అలా మాటలాడుతూ ఉండగా, నా
ముఖము నేలకు వంచి నేను మౌనంగా ఉంటిని.
16మానవ పుత్రులను పోలిన ఒకతను నా పెదవులు
తాకాడు. నేను నా నోరు తెరిచి, మాటలాడటానికి
ప్రారంభించాను. నేను నా ఎదుట నిలబడిన ఆ వ్యక్తితో,
‘అయ్యా, దర్శనంలో కనిపించిన వాటివల్ల బాధనొంది
బలము లేని వాడనయ్యాను. 17అయ్యా! నీ సేవకుడ
నైన నేను నీతో ఎలా మాట్లాడగలను? నా బలం
పోయింది. నాకు ఊపిరి ఆడనట్లయింది’ అని
అన్నాను.
18“మానవునిలా కనిపించిన ఆ వ్యక్తి మళ్లీ నన్ను
ముట్టి, బలపరిచాడు. 19అతడు నాతో, ‘బహు ప్రాయు
డవయిన మనుష్యుడా! భయపడవద్దు. నీకు శాంతి
కలుగునుగాక! శక్తివంతుడవై ధైర్యంగా ఉండు’ అని
అన్నాడు. అతడు మాటలాడగానే నేను బలం పొంది
ఇలాగన్నాను: ‘అయ్యా, నాకు నీవు శక్తినిచ్చావు.
ఇప్పుడు నీవు మాట్లాడవచ్చును.’
20“అప్పుడు అతను, ‘దానియేలూ, నేను ఎందుకు
నీవద్దకు వచ్చానో నీకు తెలుసా? నేను త్వరగా మరలి
పోయి పారసీక రాజ్యాధిపతితో యుద్ధం చేయాలి.
నేను వెళ్లినప్పుడు, గ్రీకు యువరాజు వస్తాడు. 21సత్య
గ్రంథంలో ఏమి వ్రాయబడిందో అది నేను నీకు
చెపుతాను. ఈ సంగతుల్లో మీ అధిపతి మిఖాయేలు
తప్ప మరి యెవ్వరూ నా పక్షంగా నిలబడరు.
11 మాదీయుడైన దర్యావేషు రాజుగా ఉన్న
మొదటి సంవత్సరంలో, నేను మిఖాయేలుకు
తోడుగా నిలబడ్డాను.
2“‘దానియేలూ! ఇప్పుడు నేను నీకు నిజం వివరి
స్తాను, మరి ముగ్గురు రాజులు పారసీకలో రాజ్యం
చేస్తారు. తర్వాత నాలుగవ రాజు వస్తాడు. తనకంటె
ముందున్న ఇతర పారసీక రాజులకంటె, ఆ నాలుగవ
రాజు ఐశ్వర్యవంతుడై, గొప్పవాడై వుంటాడు. అతడు
గ్రీకు రాజ్యానికి విరోధంగా అందర్ని పురికొల్పుతాడు.
3తర్వాత శక్తిమంతుడైన గొప్పరాజు ఒకడు వస్తాడు.
అతను ఎక్కువ అధికారం కలిగి తన ఇష్టానుసారంగా
చేస్తాడు. 4అతడు అభివృద్ధి పొందుచూ ఉండగా అతని
రాజ్యము ముక్కలుగా విరిగి ఆకాశపు నాలుగు దిక్కు
లకు విభాగమవుతుంది. అతని రాజ్యం అతని పిల్లలకు
గాని మనుమలకి గాని విభాగితం కాదు. అతని రాజ్యానికి
అతను పాలించిన నాటి శక్తి వుండదు. ఎందుకనగా
అతని రాజ్యం లాగివేయబడి ఇతరులకు ఇవ్వబడు
తుంది.
5“‘దక్షిణ రాజు బలవంతుడవుతాడు. కాని అతని
రాజుల్లో ఒకడు అతనికంటె బలవంతుడౌతాడు,
మరియు ఇతని రాజ్యం గొప్పదవుతుంది.
6“‘కొన్ని సంవత్సరాల తర్వాత, ఈ ఇద్దరు రాజులు
ఒక ఒప్పందం కుదుర్చుకుంటారు. దక్షిణ రాజు
యొక్క కుమార్తె ఉత్తర రాజు యొద్ద ఒప్పందం చేసు
కోటానికి వస్తుంది. కాని ఆమె తన బలాన్ని నిలుపు
కోదు. అతడు తన మాటను, బలాన్ని నిలుపుకోడు.
కాని, ఆమెను, ఆమెను తెచ్చిన వారిని, ఆమెను కన్న
వారిని, ఆమెను బలపరచిన వారిని, ఆ సమయాల్లో
విడిచిపెడతారు.
7“‘కాని ఆమె కుటుంబానికి చెందిన ఒక వ్యక్తి
దక్షిణ రాజు యొక్క స్థానం ఆక్రమించడానికి వస్తాడు.
అతడు ఉత్తర రాజు సైన్యాలను ఎదిరించి ఆ రాజు
యొక్క బలమైన దుర్గంలోకి ప్రవేశిస్తాడు. అతను
యుద్ధం చేసి జయిస్తాడు. 8అతను దేవతా ప్రతిమల్ని,
లోహ విగ్రహాల్ని, వెండి బంగారాలతో చేయబడిన
విలువగల వస్తువుల్ని ఈజిప్టుకి తీసుకు వెళతాడు. ఆ
తర్వాత అతను కొన్ని సంవత్సరాల పాటు ఉత్తర
రాజును ఎదిరించడు. 9ఉత్తర రాజు దక్షిణ రాజ్యాన్ని
ఎదుర్కొని తర్వాత తన దేశానికి మరలిపోతాడు.
10“‘ఉత్తర రాజు కుమారులు యుద్ధ సన్నద్ధులై
ఒక పెద్ద సైన్యాన్ని సమకూర్చుతారు. ఆ సైన్యం ఆ
ప్రదేశంగుండా గొప్ప ప్రవాహంవలె దక్షిణ రాజు యొక్క
బలమైన దుర్గం వరకు యుద్ధం సాగిస్తుంది. 11అప్పుడు
దక్షిణ రాజు మహోగ్రుడై ఉత్తర రాజుతో యుద్ధం
చేస్తాడు. ఉత్తర రాజు పెద్ద సైన్యంతో ఎదిరిస్తాడు
కాని ఆ సైన్యం దక్షిణ రాజు వశమవుతుంది. 12ఉత్తర
సైన్యం ఓడిపోయి తీసుకొని పోబడుతుంది. దక్షిణ
రాజు గర్విష్ఠి అవుతాడు. ఉత్తర సైన్యంలో వేలాది
సైనికుల్ని హతమార్చుతాడు. కాని అతని విజయం
కొనసాగదు. 13ఉత్తర రాజు మరో సైన్యం సమకూర్చు
కుంటాడు. ఆ సైన్యం మొదటి సైన్యం కంటె చాలా
పెద్దది. చాలా సంవత్సరాల తర్వాత, అతను ఈ పెద్ద
సైన్యాన్ని చాలా ఆయుధాల్ని సిద్ధం చేసికొని యుద్ధా
నికి వెళతాడు.
14“‘ఆ రోజుల్లో దక్షిణ రాజుకి చాలామంది వ్యతి
రేకులై ఉంటారు. దర్శన నెరవేర్పుగా నీ ప్రజల్లో
తిరుగుబాటుదారులు ఎదురు తిరుగుతారు గాని ఓడి
పోతారు. 15తర్వాత ఉత్తర రాజు వచ్చి గోడలకు
ముట్టడి దిబ్బలు కట్టి ఒక దృఢమయిన నగరాన్ని
ఆక్రమిస్తాడు. దక్షిణ సైన్యానికి మరల యుద్ధం చేయ

డానికి శక్తి ఉండదు. దక్షిణ సైన్యానికి చెందిన ఉత్తమ
సైనికులు కూడా ఉత్తర సైన్యాన్ని ఆపలేక పోతారు.
16 “తన ఇష్టము వచ్చినట్లు ఉత్తర రాజు చేస్తాడు.
ఎవ్వరూ అతనిని విరోధించలేరు. అతను అధికారం
పొంది, సుందర దేశాన్ని అదుపులో ఉంచుకొంటాడు.
మరియు అతనికి దాన్ని నాశనం చేసే శక్తికూడా
ఉంటుంది. 17 ఉత్తర రాజు తన సర్వ సైనిక బలంతో
వచ్చి దక్షిణ రాజుతో ఒప్పందం చేసుకోటానికి నిర్ణయి
స్తాడు. ఉత్తర రాజు దక్షిణ రాజుకు పెళ్లి చేసుకునేందుకు
తన కుమార్తెలలో ఒకదానిని అనుమతిస్తాడు, ఎందు
కంటే దక్షిణ రాజుని ఓడించాలని. కాని ఆ పథకాలు
నెరవేరవు, అతనికి తోడ్పడవు.
18 “అప్పుడు ఉత్తర రాజు తన దృష్టిని సముద్ర
తీరాననున్న దేశాల మీదికి మరల్చుతాడు, పెక్కు నగ
రాల్ని జయిస్తాడు. కాని తర్వాత ఒక సైన్యాధిపతి
ఉత్తర రాజు యొక్క తిరుగుబాటుని, అతని గర్వాన్ని
అణచి అతడు సిగ్గుచెందేలా చేస్తాడు.
19 “అది జరిగిన తర్వాత, ఉత్తర రాజు తన స్వదేశం
లోని బలమైన దుర్గాలకు తిరిగి వెళతాడు. కాని అతను
బలహీనుడై పతనం చెంది మరణము పాలవుతాడు.
20 “ఆ ఉత్తర రాజు తర్వాత మరో క్రొత్త పరి
పాలకుడు వస్తాడు. ఆ పరిపాలకుడు పన్నులు వసూలు
చేసే అధికారిని రాజ వైభవం కోసం డబ్బు సంపాదించ
టానికి పంపుతాడు. కాని కొన్ని సంవత్స రాలలోనే,
ఆ పరిపాలకుడు కోపము వల్లగాని, యుద్ధమువల్లగాని
కాకుండ నాశనం చేయబడతాడు.
21 “ఆ పరిపాలకుని తర్వాత అతి క్రూరుడు,
ద్వేషింపబడినవాడు అయిన ఒక వ్యక్తి వస్తాడు. రాజ
వంశానికి చెందినవాడనే గౌరవం వానికి ఉండదు.
మాయోపాయముచేత అతడు పరిపాలకుడవుతాడు.
ప్రజలు నెమ్మదిగా ఉన్న సమయాన, అతడు రాజ్యము
మీద దాడి చేస్తాడు. 22 ప్రవాహంలాంటి ఆ సైన్యాలు
వాని ఎదుటనుండి తుడిచి వేయబడును. ఒప్పందం
కుదుర్చుకున్న రాజు కూడా నశిస్తాడు. 23 ఆ రాజుతో
ఒప్పందం కుదుర్చుకొన్న తర్వాత మోసంగా ప్రవ
ర్తించి, కొద్ది మందితోనే అతడు అధికారాన్ని పొందు
తాడు. 24 సంపన్న దేశాలు నెమ్మదిగా ఉన్నప్పుడు,
అతడు (క్రూరుడూ ద్వేషింపబడినవాడూ అయిన ఆ
పరిపాలకుడు) వాటిమీద దాడి చేస్తాడు. అతని తండ్రు
లుగాని, అతని పూర్వీకులుగాని చేయలేనిదాన్ని అతడు
సాధిస్తాడు. దోపిడి, లూటి చేసి పొందిన సంపత్తును
వాని అనుచరుల మధ్య పంచుతాడు. బలమైన కోటల్ని
పడగొట్టడానికి కుట్ర చేస్తాడు, గాని అది ఒక కాలము
వరకు మాత్రమే.
25 “దక్షిణ రాజుకు విరోధంగా గొప్ప సైన్యంతో
తన బలాన్ని, ధైర్యాన్ని ఎక్కువ చేసుకొంటాడు.
గొప్ప బలమైన సేనతో దక్షిణ రాజు యుద్ధానికి దిగు
తాడు గాని, అతనికి వ్యతిరేకంగా శత్రువు పన్నిన పన్నా
గాల వల్ల దక్షిణ రాజు ఓడిపోతాడు. 26 దక్షిణ రాజు
భోజన పదార్థాలనుండి తినేవారే అతన్ని నాశనము
చేయాలని ప్రయత్నిస్తారు. అతని సైన్యం ఓడించ
బడుతుంది. యుద్ధంలో చాలామంది సైనికులు చంప
బడుతారు. 27 ఆ రాజులిద్దరూ దురుద్దేశముతో ఒకే
భోజన బల్లవద్ద కూర్చొని ఒకరికొకరు అబద్ధాలు చెప్పు
కొంటారు. అందువల్ల వారిలో ఎవరికీ మంచి కలుగదు.
ఎందుకంటే దేవుడు వారి అంతానికి ఒక కాలం నిర్ణ
యించాడు. 28 ఉత్తర రాజు అధిక సంపదతో తన దేశానికి
తిరిగి వెళతాడు. కాని, పవిత్ర ఒడంబడికకు విరుద్ధంగా
అతను తన హృదయాన్ని మార్చుకొంటాడు. తన
ఇష్టానుసారంగా జరిగిస్తూ అతడు స్వదేశానికి మరలి
పోతాడు.
29 “నియమిత సమయాన, ఉత్తర రాజు దక్షిణ రాజు
మీద మరల దాడి చేస్తాడు, కాని ఈ సారి, పూర్వం
వలె అతడు గెలుపొందలేడు. 30 కిత్తీము నుండి ఓడలు
వచ్చి ఉత్తర రాజును ఎదిరిస్తాయి. ఆ ఓడలు రావటం
చూసి. అతడు భయభ్రాంతుడవుతాడు. అప్పుడతను
వెనుదిరిగి, పవిత్ర ఒడంబడిక పట్ల తన కోపాన్ని
తీర్చుకొంటాడు. అతడు వెనక్కి తిరిగి పవిత్ర ఒడం
బడికను విసర్జించే వాళ్ల మాట వింటాడు. 31 వానినుండి
వచ్చిన సైన్యాలు కోటను, దేవాలయాన్ని అపవిత్ర
పరచి, అనుదిన బలి అర్పణలను నిలుపు చేస్తాయి.
వాళ్లు నాశనకరమైన ఆ అసహ్యమైన దాన్ని దేవాల
యంలో నిలుపుతారు.
32 “ఉత్తర రాజు పవిత్ర ఒడంబడికను అతిక్రమించిన
వాళ్లను (యూదులు) తన ఇచ్చకపు మాటలచేత దుష్ట
త్వానికి మళ్లించుతాడు. కాని తమ దేవుణ్ణి ఎరిగిన
ప్రజలు స్థిరముగా నిలబడి అతనిని ఎదిరిస్తారు.
33 “కొన్ని దినాలపాటు వారు ఖడ్గంతోను, అగ్ని
తోను, చెరసాల బంధనతోను, దోపుడుతోను
హింసించబడ్డ, వారిలో జ్ఞానవంతులైన వారు అనేకు
లను సంగతులు అర్థము చేసికొనేటట్లు చేస్తారు. 34 జ్ఞాన
వంతులైన ఆ యూదులు హింసించబడ్డ తర్వాత,
వారికి కొద్దిపాటి సహాయం లభిస్తుంది. అనేకులు వారికి
వారే జ్ఞానులైన యూదులతో ముఖస్తుతి చేస్తూ కలిసి
పోతారు. 35 నియమితమైన అంత్య కాలం ఇంకను
రాలేదు. ఆ అంత్యకాలం వరకు జ్ఞానుల్లో కొందరు
కూలుట ద్వారా మిగిలిన వారు శుద్ధిగాను, నిర్మలు
లుగాను, పరిశుద్ధులుగాను చేయ బడటానికి ఇలాగున
జరుగుతుంది.”

## ఆత్మ ప్రశంస చేసుకునే రాజు

36 “ఉత్తర రాజు తన ఇష్టానుసారముగా చేస్తాడు.
ప్రతి దేవతకు పైగా తనకు తానే హెచ్చించుకొంటూ,
ఘన పరచుకొంటాడు. అంతేకాక, దేవాది దేవునికి

విరోధంగా విచిత్రమైన విషయాలు మాట్లాడుతాడు.
ఉగ్రత తీరే వరకు వాడు వర్ధిల్లుతాడు. ఏది నిర్ణ
యమైందో అది వానికి జరుగుతుంది.
37"తన పూర్వీకుల పట్ల ఆ ఉత్తర రాజు శ్రద్ధ
వహించడు. స్త్రీల ఇష్ట దేవతల పట్ల కూడ లక్ష్యపెట్టడు.
ఏ దేవుని గురించి అతడు లక్ష్యపెట్టడు. అన్ని దేవుళ్ల
దేవతల కంటే తనను తాను హెచ్చించుకొంటాడు.
38వీటన్నిటికి బదులుగా కోటల దేవతను గౌరవిస్తాడు.
తన పూర్వీకులు ఎరుగని దేవతను బంగారు, వెండి,
వెలగల రాళ్లు మరియు వెలగల బహుమానాలతో
గౌరవిస్తాడు.
39"ఆ ఉత్తర రాజు బలమైన కోటల మీదికి అన్య
దేవుని సహాయంతో దాడి చేస్తాడు, తనను గుర్తించే
వాళ్లను హెచ్చించి గౌరవిస్తాడు. వాళ్లను చాలా మంది
ప్రజల మీద పరిపాలకులుగా ఉంచి, దేశాన్ని వెలకు
విభాగిస్తాడు.
40"అంత్యకాలంలో, దక్షిణ రాజు ఉత్తర రాజుతో
యుద్ధం చేస్తాడు. ఉత్తర రాజు ఉగ్రుడై సుడిగాలి వలె
దక్షిణ రాజు మీద రథాలు, గుర్రపు రౌతులు, అనేక
ఓడలతో విరుచుకు పడతాడు. అదే విధంగా దేశాల
మీదికి ప్రవాహం వలె వెళతాడు. 41అతడు మహిమాదేశం
మీద కూడా దాడి చేస్తాడు. అనేక దేశాల్లో వేలాది
మందిని పడగొడతాడు, కాని ఎదోము, మోయాబు,
అమ్మోనీయుల నాయకులు అతని చేతినుండి రక్షింప
బడుతారు. 42చాలా దేశాల్లో ఉత్తర రాజు తన అధి
కారాన్ని వ్యాపింప జేస్తాడు కాని ఈజిప్టు తప్పించుకో
లేదు. 43ఈజిప్టుకు చెందిన వెండి బంగారం సర్వ
సంపదలకు అతడు అధిపతి అవుతాడు. లిబియావాళ్లు,
కూషీయులు (ఇతియోపియా వాళ్లు) అతని ఎడల
విధేయులై ఉంటారు. 44కాని ఉత్తర రాజు తూర్పు,
ఉత్తర దిశలనుంచి వచ్చిన సమాచారము తెలిసికొని.
భయభ్రాంతుడై, మహోగ్రుడై చాలా మందిని సర్వ
నాశనం చేయడానికి ముందుకు సాగుతాడు. 45సుందర
మైన పరిశుద్ధ పర్వతానికి* సముద్రానికి మధ్య అతను
రాజవైభవంగల గుడారాలు నెలకొల్పుతాడు. చివరికి
అతడు నిస్సహాయుడై మరణిస్తాడు."

12 "ఆ సమయాన నీ ప్రజలైన యూదుల పక్షం
వహించిన గొప్ప రాజు మిఖాయేలు (ప్రధాన
దూత) జోక్యం కలిగించుకొంటాడు. నీ ప్రజలు ఒకే
దేశంగా కూడిన కాలంనుండి అప్పటి వరకు ముందె
న్నడూ సంభవించనంత మహా విపత్తు వారి మీద
కలుగుతుంది. కాని, నీ ప్రజల్లో ఎవరి పేరు గ్రంథమందు
వ్రాయబడిందో వారు తప్పించుకొంటారు. 2సమాధి
చేయబడిన పెక్కుమంది మృతులు, మేల్కొంటారు.
కొందరు నిత్యజీవానికి, కొందరు సిగ్గుపొందటానికి,
శాశ్వతంగా తిరస్కారం పొందటానికి మేల్కొంటారు.
3జ్ఞానవంతులు ఆకాశమందలి జ్యోతుల్లాగ ప్రకాశిస్తారు,
అనేకులను నీతి మార్గానికి నడిపించేవారు నక్షత్రాల్లాగ
శాశ్వతంగా వెలుగుతారు
4"కాని, దానియేలూ, నీవు, ఈ సందేశాన్ని
రహస్యంగా ఉంచు. ఈ పుస్తకాన్ని నీవు అంత్యకాలం
వరకు మూసి ఉంచు. చాలా మంది అటు ఇటు
భూసంచారం చేయటంవల్ల తెలివి పెరుగుతుంది" అని
గాబ్రియేలు నాతో చెప్పాడు.
5"అప్పుడు దానియేలు అను నేను చూస్తూండగా
ఇద్దరు మనుష్యులు కనబడ్డారు. నది ఈ ఒడ్డున ఒకడు,
నది ఆ ఒడ్డున మరియొకడు నిలబడి ఉన్నారు. 6నార
బట్టలు ధరించిన వ్యక్తి నదీ జలాల మీద ఉన్నాడు. ఆ
ఇరువురిలో ఒకడు, 'ఈ ఆశ్చర్య సంగతులు నెరవేరటా
నికి ఎంతకాలము పడుతుంది?' అని నార బట్టలు
ధరించిన వాన్ని అడిగాడు.
7"నార బట్టలు ధరించి నదీ జలాల మీదనున్న
వ్యక్తి ఆకాశం వైపుగా తన కుడి, ఎడమ చేతులు ఎత్తి.
సజీవుడైన దేవుని నామం మీద ప్రమాణం చేయుట
నేను విన్నాను. ఏమనగా "ఒక కాలము, కాలములు,
అర్ధకాలము (మూడున్నర సంవత్సరాలు) పడతాయి.
పరిశుద్ధ ప్రజల బలం నాశనం చేయబడటం అంతం
కాగానే ఈ సంగతులన్నీ నెరవేరుతాయి.
8"నేను విన్నాను, కాని అర్థము చేసుకోలేక
పోయాను. అందువల్ల, 'అయ్యా, ఈ సంగతులు
జరిగిన తర్వాత ఏమవుతుంది?" అని అడిగాను.
9"అందుకతడు, 'దానియేలూ! నీవు దాటిపొమ్ము.
ఈ మాటలు అంత్యకాలం వరకు ముద్ర వేయబడి
రహస్యంగా ఉంటాయి. 10చాలామంది తమ్మును తాము
పరిశుద్ధులుగా చేసికొంటారు. తమ్మును తాము తెలుపు
గాను, శుద్ధులుగాను చేసికొంటారు. కాని చెడ్డవాళ్లు
చెడ్డవాళ్లగానే ఉంటారు. ఆ దుర్జనులు ఈ విషయాలు
అర్థం చేసుకోలేరు. కాని జ్ఞానవంతులు అర్థం చేసి
కొంటారు.
11"అనుదిన బలులు నిలిపివేసిన కాలం మొదలు
కొని నాశనకరమైన అసహ్య వస్తువు నిలబెట్టబడిన కాలం
వరకు ఒక వెయ్యి రెండువందల తొంభై రోజులగును.
ఒక వెయ్యి మూడువందల ముప్పయైదు రోజులు
వేచియుండి ఆ దినముల అంతము వరకు ఉండువాడు
ధన్యుడు.
13"నీవు నీ జీవిత అంతం వరకు బ్రతికి, నీ
విశ్రాంతిలో ప్రవేశించు. దినాల అంతమందు నీవు
లేపబడి నీ స్థానములో నీవు నిలుస్తావు."

---

**పరిశుద్ధ పర్వతం** యెరూషలేము పర్వతంమీద నిర్మింప
బడింది.

# హోషేయ

### హోషేయ ద్వారా యెహోవా దేవుని సందేశం

1 బెయేరి కుమారుడైన హోషేయకు వచ్చిన
యెహోవా సందేశం ఇది. ఉజ్జీయా, యోతాము,
ఆహాజు, హిజ్కియా అనువారు యూదా దేశపు రాజు
లుగా ఉన్న కాలంలో ఈ సందేశం వచ్చింది. యెహో
యాషు కుమారుడైన యరొబాము ఇశ్రాయేలు
రాజుగా ఉన్న కాలం అది.
2ఇది హోషేయకు యెహోవా ఇచ్చిన మొదటి
సందేశం. "వెళ్లి ఒక వేశ్యను పెండ్లి చేసుకొని, ఆ వేశ్య
ద్వారా పిల్లల్ని కనుము.* ఎందుకంటే ఈ దేశంలో
ప్రజలు వేశ్యల్లా ప్రవర్తించారు – వారు యెహోవాకు
అపనమ్మకంగా జీవించారు" అని యెహోవా చెప్పాడు.

### యెజ్రెయేలు పుట్టుక

3కనుక దిబ్లయీము కుమార్తెయైన గోమెరును
హోషేయ పెండ్లి చేసుకొన్నాడు. గోమెరు గర్భ
వతియై, హోషేయకు ఒక కుమారుని కన్నది.
4యెహోవా హోషేయతో, "అతనికి యెజ్రెయేలు
అని పేరు పెట్టు. ఎందుచేతనంటే యెహూ యెజ్రె
యేలు లోయలో రక్తం చిందించిన కారణంగా నేను
యెహూ కుటుంబాన్ని నాశనం చేస్తాను. ఆ తర్వాత
ఇశ్రాయేలు రాజ్యాన్ని నేను నాశనం చేస్తాను. 5ఆ
సమయంలో యెజ్రెయేలు లోయలో ఇశ్రాయేలు
విల్లును నేను విరుగగొడ్తాను" అని చెప్పాడు.

### లో–రూహామా పుట్టుక

6మరల గోమెరు గర్భవతియై ఒక కుమార్తెకు
జన్మనిచ్చింది. యెహోవా హోషేయతో ఇలా
చెప్పాడు: "ఆమెకు లో–రూహామా అని పేరు పెట్టు.
ఎందుకంటే ఇశ్రాయేలు రాజ్యానికి నేను ఇక ఎంత
మాత్రం కరుణ చూపించను. నేను వారిని క్షమించను.
7కాని యూదా రాజ్యానికి నేను కరుణ చూపిస్తాను.
యూదా రాజ్యాన్ని నేను రక్షిస్తాను. వారిని రక్షించేందుకు
విల్లుగాని, ఖడ్గంగాని నేను ఉపయోగించను. వారిని
రక్షించేందుకు యుద్ధ గుర్రాలను గాని, సైనికులను
గాని నేను ఉపయోగించను. నేను నా స్వంత శక్తి
చేతనే వారిని రక్షిస్తాను."

### లో – అమ్మీ పుట్టుక

8గోమెరు లో–రూహామాకు చనుబాలు ఇవ్వటం
చాలించగానే ఆమె మరల గర్భవతి అయ్యింది. ఆమె
మరొక కుమారుని కన్నది. 9అప్పుడు, "అతనికి
లో–అమ్మీ అని పేరు పెట్టు. ఎందుచేతనంటే మీరు
నా ప్రజలు కారు, నేను మీ దేవుణ్ణి కాను" అని
యెహోవా చెప్పాడు.

### ఇశ్రాయేలీయులు విస్తారంగా ఉంటారని యెహోవా దేవుడు వాగ్దానం చేశాడు

10"రాబోయే కాలంలో ఇశ్రాయేలు ప్రజల సంఖ్య
సముద్రపు ఇసుక రేణువుల్లా ఉంటుంది. ఇసుకను నీవు
కొలవలేవు. లెక్కించ లేవు. ఏ స్థలంలోనైతే 'మీరు
నా ప్రజలు కారు' అని వారితో చెప్పబడిందో అక్కడే
'మీరు జీవంగల దేవుని పిల్లలు' అని వారితో చెప్పడం
జరుగుతుంది.
11"అప్పుడు యూదా ప్రజలు మరియు ఇశ్రాయేలు
ప్రజలు సమావేశపరచబడతారు. వారు ఒక పాలకుని
తమకోసం ఏర్పాటు చేసుకొంటారు. మరియు వారి
రాజ్యం ఆ దేశం పట్టజాలనంత పెద్దదిగా ఉంటుంది!
యెజ్రెయేలు దినం నిజంగా గొప్పగా ఉంటుంది."
2 "అప్పుడు మీరు మీ సోదరులతో 'మీరు నా
ప్రజలు' అనియు, మీ స్వంతవారితో 'ఆయన
మీ యెడల కరుణ చూపించాడు'" అని చెబుతారు.

### ఇశ్రాయేలీయుల రాజ్యంతో యెహోవా మాట్లాడుట

2"మీ తల్లితో గట్టిగా వాదించండి, ఎందుకంటే
ఆమె నా భార్య కాదు! నేను ఆమె భర్తను కాను! వేశ్య
లాగ ఉండటం మానుకోమని ఆమెతో చెప్పండి. ఆమె
స్తనాల మధ్య నుండి ఆమె విటులను తొలగించి వేయు
మని ఆమెతో చెప్పండి. 3ఆమె తన వ్యభిచారం మాను
కోవటానికి నిరాకరిస్తే నేను ఆమె వస్త్రాలు తీసివేసి
దిగంబరిగా చేస్తాను. ఆమెను, ఆమె పుట్టిన రోజున
ఉన్నట్టుగానే చేస్తాను. నేను ఆమె ప్రజలను తొల

**ఆ వేశ్యద్వారా పిల్లల్ని కను** అక్షర రూపంగా "వేశ్య పిల్లల్ని పొందు." అంటే వాళ్లు హోషేయ పిల్లలు కారు, కానీ వాళ్ల తల్లి వేశ్యతనం వల్ల పుట్టినవాళ్లు.

గించివేస్తాను. ఆమె ఎండిపోయిన ఖాళీ ఎడారిలాగ
ఉంటుంది. దాహంతో నేను ఆమెను చంపివేస్తాను.
4ఆమె పిల్లల మీద నేను జాలిపడను. ఎందుకంటే
వారు వ్యభిచార సంతానం కనుక. 5వారి తల్లి ఒక
వేశ్యలాగ ప్రవర్తించింది. వారి తల్లి, ఆమె చేసిన పనుల
విషయంలో సిగ్గుపడాలి. ఆమె, 'నేను నా విటుల దగ్గ
రకు వెళ్తాను, నా విటులు నాకు భోజనపానాలు ఇస్తారు.
వారు ఉన్ని మరియు మేలు రకపు సన్నని వస్త్రాలు
ఇస్తారు. ద్రాక్షామద్యం, ఒలీవనూనె వారు నాకు ఇస్తారు'
అని చెప్పింది.

6"అందుచేత, యెహోవానైన నేను మీ (ఇశ్రా
యేలు) మార్గాన్ని ముళ్లతో అడ్డువేస్తాను. నేను ఒక
గోడ కట్టిస్తాను. అప్పుడు తన దారులను ఆమె తెలుసు
కోలేక పోతుంది. 7ఆమె తన విటుల వెనుక పరుగులెత్తు
తుంది కానీ ఆమె వారిని కలుసుకోలేక పోతుంది.
ఆమె తన విటుల కోసం వెదుకుతుంది. కాని ఆమె
వారిని కనుగొనలేక పోతుంది. అప్పుడు ఆమె, 'నేను
నా మొదటి భర్త (దేవుడు) దగ్గరకు వెళ్తాను. నేను
ఆయనతో ఉన్నప్పుడు నా జీవితం బాగా ఉండింది.
ఇప్పటికంటే నా జీవితం అప్పుడే మేలు' అని ఆమె
అంటుంది. 8ధాన్యం, ద్రాక్షారసం, నూనె ఇచ్చేవాడను
నేనే అని ఆమెకు (ఇశ్రాయేలు) తెలియదు. నేను
ఆమెకు వెండి బంగారాలు ఇంకా ఇంకా ఎక్కువగా
ఇస్తూ పోయాను. కాని బయలు విగ్రహాలు చేయుటకు
ఇశ్రాయేలీయులు ఈ వెండి బంగారాలు ఉపయో
గించారు. 9కనుక నేను (యెహోవాను) తిరిగి వస్తాను.
నా ధాన్యం కోతకు సిద్ధంగా ఉన్నప్పుడు నేను దానిని
తీసివేసుకొంటాను. ద్రాక్షలు సిద్ధంగా ఉన్న సమ
యంలో నా ద్రాక్షారసం నేను తీసివేసికొంటాను. నా
ఉన్ని, మేలురకపు వస్త్రాలు నేను తీసివేసికొంటాను.
ఆమె తన నగ్న శరీరాన్ని కప్పుకునేందుకు వీటిని
నేను ఆమెకు ఇచ్చాను. 10కానిఇప్పుడు నేను ఆమెను
నగ్నంగా చేస్తాను. ఆమె ప్రేమికులు ఆమె నగ్నత్వాన్ని
చూస్తారు. నా శక్తి నుండి ఆమెను ఎవ్వరూ తప్పించ
లేరు. 11నేను (దేవుడు) ఆమె సరదానంతా తీసివేస్తాను.
ఆమె పండుగ రోజులు, ఆమె అమావాస్య విందులు,
ఆమె విశ్రాంతి దినాలు, ప్రత్యేక విందులను నేను నిలిపి
వేస్తాను. 12ఆమె ద్రాక్షావల్లులను, అంజూరపు చెట్లను
నేను నాశనం చేస్తాను. 'నా విటులు వీటిని నాకు
ఇచ్చారు' అని ఆమె చెప్పింది. కాని ఆమె తోటలను
నేను మార్చివేస్తాను. అవి భయంకరమైన అడవులుగా
మారిపోతాయి. అడవి మృగాలు వచ్చి ఆ మొక్కలను
తింటాయి.13ఆమె బయలు దేవతలను సేవించింది.
కనుక ఆమెను నేను శిక్షిస్తాను. బయలు* దేవతలకు
ఆమె ధూపం వేసింది. ఆమె వస్త్రాలు ధరించి, నగలు,
ముక్కుకమ్మి పెట్టుకొంది. అప్పుడు ఆమె తన విటుల
దగ్గరకు వెళ్లి నన్ను మరచిపోయింది." యెహోవా
ఈ విషయం చెప్పాడు.

14"కనుక నేను (యెహోవా) ఆమెతో ప్రేమగా
మాట్లాడుతాను. ఆమెను ఎడారిలోకి నడిపించి ఆమెతో
నేను మృదువుగా మాట్లాడుతాను. 15అక్కడ ద్రాక్షా
తోటలను ఆమెకు ఇస్తాను. ఆకోరు లోయను (శ్రమ
గల) ఒక నిరీక్షణ ద్వారంగా ఇస్తాను. అప్పుడు తన
యౌవన దశలో ఈజిప్టు దేశం నుండి బయటకు
వచ్చినప్పుడు చెప్పినట్టుగా ఆమె జవాబు చెపుతుంది."
16యెహోవా ఇలాగున చెపుతున్నాడు. "ఆ సమ
యంలో 'నా భర్తవు' అని నీవు నన్ను పిలుస్తావు. 'నా
బయలు' అని నీవు నన్ను పిలవవు. 17ఆమె నోటినుండి
బయలు దేవత పేర్లను నేను తొలగించివేస్తాను.
అప్పుడు ఆ బయలు దేవతల పేర్లను ప్రజలు మరల
ఉపయోగించరు.

18"ఆ సమయంలో పొలంలోని పశువులకు, ఆకా
శంలోని పక్షులకు, నేలమీద ప్రాకే ప్రాణులకు ఇశ్రాయే
లీయులకోసం నేను ఒక ఒడంబడిక చేస్తాను. విల్లు,
ఖడ్గం, యుద్ధ ఆయుధాలు నేను విరుగగొడతాను. ఆ
దేశంలో ఆయుధాలు ఏవీ మిగలవు. ఇశ్రాయేలు
ప్రజలు ప్రశాంతంగా పడుకోగల్గు నట్లు నేను దేశాన్ని
క్షేమంగా ఉంచుతాను. 19మరియు నేను (యెహోవా)
నిన్ను శాశ్వతంగా నా వధువుగా చేసుకొంటాను. మంచి
తనం, న్యాయం, ప్రేమ, కరుణలతో నిన్ను నేను నా
వధువుగా చేసుకొంటాను. 20నిన్ను నాకు నమ్మకమైన
వధువుగా చేసుకొంటాను. అప్పుడు నీవు నిజంగా
యెహోవాను తెలిసికొంటావు. 21ఆ సమయంలో
నేను నీకు జవాబు ఇస్తాను." యెహోవా ఇలాగున
చెపుతున్నాడు.

"నేను ఆకాశాలతో మాట్లాడుతాను. అవి భూమికి
వర్షాన్ని ఇస్తాయి.
22 ధాన్యం, ద్రాక్షా మద్యం, నూనెలను భూమి
ఇస్తుంది. అవి యెజ్రెయేలు అవసరాలను తీరు
స్తాయి.
23 భూమిమీద ఆమెను నేను నాటుతాను.
లో-రూహామాకు నేను దయ చూపిస్తాను.
లో-అమ్మీకి 'నీవు నా ప్రజ' అని నేను చెపుతాను.
'నీవు మా దేవుడవు'" అని వారు నాతో
చెపుతారు.

### గోమెరును బానిసత్వంనుండి హోషేయ తిరిగి కొనటం

3 అప్పుడు యెహోవా నాతో, "గోమెరుకు చాలా
మంది విటులు ఉన్నారు. కాని నీవు ఆమెను
ప్రేమిస్తూనే ఉండాలి. ఎందుచేతనంటే అది యెహోవా

---

**బయలు** ఇశ్రాయేలు వాళ్లు నివసించే ప్రాంతంలో కనానీ
యులు పూజించే అబద్ధపు దేవుళ్లు.

చేసినట్టుగా ఉంటుంది. యెహోవా ఇశ్రాయేలు ప్రజ
లను ప్రేమిస్తూనే ఉన్నాడు. కాని వారు ఇతర దేవతలను
పూజిస్తూనే ఉన్నారు. మరియు ఎండుద్రాక్షల అడలు
తినటం వారికి ఇష్టం” అని మరల నాతో చెప్పాడు.
2కనుక, గోమెరును పదునయిదు తులాల వెండి,
తొమ్మిది తూముల యవలు ఇచ్చి నేను కొన్నాను.
3కాబట్టి నేను ఆమెతో, “చాలా రోజులు నీవు నాతో
కలసి ఇంటి వద్దనే ఉండాలి. నీవు వేశ్యలా ఉండకూడదు.
నీవు మరో పురుషునితో పడుకో కూడదు. నేను
నీకు భర్తగా ఉంటాను” అని చెప్పాను.
4అదే విధంగా ఇశ్రాయేలు ప్రజలు ఒక రాజుగాని,
ఒక నాయకుడు గాని లేకుండా అనేక రోజులు
కొనసాగుతారు. ఒక బలి అర్పణగాని లేక ఒక
స్మారకశిలగాని లేకుండా ఉంటారు. వారికి ఏఫోదుగాని
లేక గృహ దేవతలు గాని ఉండవు. 5దీని తర్వాత ఇశ్రా
యేలు ప్రజలు తిరిగి వెనుకకు వస్తారు. వారు వారి
దేవుడైన యెహోవా కోసం, వారి రాజైన దావీదు
కోసం వెతుకుతారు. చివరి దినాల్లో వారు యెహో
వానూ, ఆయన మంచితనాన్నీ గౌరవిస్తారు.

### ఇశ్రాయేలీయుల మీద యెహోవా కోపంగా ఉండుట

4 ఇశ్రాయేలు ప్రజలారా, యెహోవా సందేశం
వినండి! ఈ దేశంలో నివసించే ప్రజల మీద
ఆయనకు గల వ్యాజ్యెం ఏమిటో యెహోవా చెపు
తాడు వినండి. “ఈ దేశంలోని ప్రజలు నిజంగా దేవుణ్ణి
ఎరుగరు. ప్రజలు దేవునికి సత్యవంతులుగాను, నమ్మక
స్తులుగాను లేరు. 2ప్రజలు (అబద్ధపు) ఒట్టు పెట్టు
కుంటారు, అబద్ధాలు చెపుతారు, చంపుతారు, దొంగి
లిస్తారు. వారు వ్యభిచార పాపం చేసి పిల్లల్ని కంటారు.
ప్రజలు మరల మరల హత్య చేస్తారు. 3అందుచేత
దేశం చచ్చినవాడి కోసం ఏడుస్తున్న ఒక మనిషిలాగ
ఉంది. దాని ప్రజలంతా బలహీనంగా ఉన్నారు. చివరికి
పొలాల్లోని పశువులు, ఆకాశంలోని పక్షులు, సముద్రం
లోని చేపలు కూడ చనిపోతున్నాయి. 4ఏ వ్యక్తీ మరో
వ్యక్తితో వివాదం పెట్టుకోకూడదు, నిందించకూడదు.
యాజకునితో! వాదం పెట్టుకోవద్దు. 5మీరు
(యాజకులు) పగటివేళ పడిపోతారు. మరియు రాత్రి
వేళ ప్రవక్త కూడ మీతోబాటు పడిపోతాడు. మరియు
మీ తల్లిని నేను నాశనం చేస్తాను.
6“నా ప్రజలకు తెలివి లేదు గనుక నాశనం చేయ
బడ్డారు. నేర్చుకొనేందుకు మీరు నిరాకరించారు. కనుక
నా కోసం మిమ్మల్ని యాజకులుగా ఉండనిచ్చుటకు
నేను నిరాకరిస్తాను. మీరు మీ దేవుని న్యాయచట్టం
మరచిపోయారు గనుక నేను మీ పిల్లల్ని మరచిపోతాను.
7వారు గర్విష్ఠులయ్యారు! వారు నాకు విరోధంగా ఇంకా
ఇంకా ఎక్కువ పాపం చేశారు. కనుక వారి ఘనతను
అవమానంగా నేను మార్చివేస్తాను.
8“యాజకులు ప్రజల పాపాలలో చేరిపోయారు.
వారు ఆ పాపాలను ఇంకా ఇంకా ఎక్కువగా కోరు
కొన్నారు. 9కనుక ప్రజలకంటే యాజకులు వేరుగా
ఏమీలేరు. వారు చేసిన వాటి విషయమై నేను వారిని
శిక్షిస్తాను. వారు చేసిన వాటికోసం నేను వారికి తగిన
శిక్ష విధిస్తాను.
10“వారు భోజనం చేస్తారు కాని వారికి తృప్తి
ఉండదు. వారు లైంగిక పాపాలు చేస్తారు. కాని వారికి
పిల్లలు ఉండరు. ఎందుచేతనంటే వారు యెహోవాను
విడిచిపెట్టి వేశ్యలవలె తయ్యారయ్యారు.
11“లైంగిక పాపాలు, ద్రాక్షామద్యం కొత్త ద్రాక్షా
రసం, మనిషిలో సరిగ్గా ఆలోచించగలిగే శక్తిని నాశనం
చేస్తాయి. 12సలహా కోసం నా ప్రజలు కట్టెముక్కలను
అడుగుతున్నారు. ఆ కట్టెలు వారికి జవాబిస్తాయని
వారు తలుస్తున్నారు. ఎందుచేతనంటే వారు వేశ్యలాగ
ఆ బూటకపు దేవతలను వెంటాడారు. 13వారు కొండ
శిఖరాల మీద బలులు అర్పిస్తారు. కొండలమీద,
సింధూర వృక్షాల కింద, చినారు వృక్షాల కింద, మస్తకి
వృక్షాల కింద ధూపం వేస్తారు. ఆ చెట్ల కింద నీడ
బాగున్నట్టు కనిపిస్తుంది. కనుక మీ కుమార్తెలు ఆ
చెట్ల కింద వ్యభిచరిస్తారు. మరియు మీ కోడళ్లు కూడా
పాపాలు చేస్తారు.
14“వేశ్యలుగా ఉన్నందుకు మీ కుమార్తెలను గానీ,
లైంగిక పాపాలు చేసినందుకు మీ కోడళ్లనుగాని నేను
నిందించలేను. పురుషులు వెళ్లి వేశ్యలతో పడు
కొంటారు. వారు వెళ్లి ఆలయ వేశ్యలతో కలిసి బలులు
అర్పిస్తారు. కనుక ఆ తెలివి తక్కువ ప్రజలు వారిని
వారే పాడుచేసుకుంటున్నారు.

### ఇశ్రాయేలీయుల సిగ్గుకరమైన పాపాలు

15“ఇశ్రాయేలూ, నీవు ఒక వేశ్యలాగ ప్రవర్తిస్తున్నావు.
కానీ యూదాను అపరాధిగా ఉండ నియ్యకుము. గిల్గా
లుకు గాని లేక బేతావెనుకు గాని వెళ్లకుము. ప్రమా
ణాలు చేయటానికి యెహోవా నామం ఉపయోగించ
కుము. మరియు ‘యెహోవా జీవంతోడు...!’ అని
అనవద్దు. 16ఇశ్రాయేలుకు యెహోవా ఎన్నో
ఇచ్చాడు. గడ్డి విస్తారంగా ఉన్న విశాలమైన పొలంలోకి
తన గొర్రెలను తీసికొనివెళ్లే కాపరిగా ఆయన ఉన్నాడు.
కానీ ఇశ్రాయేలు మొండిది. ఇశ్రాయేలు మరల మరల
పారిపోయే పెయ్యలాగ ఉంది. 17ఎఫ్రాయిము అతని
విగ్రహాలతో కలిశాడు కనుక అతన్ని ఒంటరిగా
విడిచివేయండి.
18“వారి త్రాగుడు వారిని ప్రక్కకు త్రిప్పివేసింది.
వారు విడువక ఇష్టానుసారంగా జారత్వము చేయుచు
ఆమెను సిగ్గుతో కప్పుతున్నారు. 19కాని ఆమెను, ఆమె
రెక్కలతో బంధించును. వారి బలి అర్పణల వలన
వారు సిగ్గునొందుదురు.”

### ఇశ్రాయేలును, యూదాను వారి నాయకులే పాపం చేయించారు

5 “యాజకులారా, ఇశ్రాయేలు రాజ్యమా, రాజవంశ
ప్రజలారా తీర్పు మీకోసమే ఉంది. నా మాట
వినండి. “మిస్పాలో మీరు ఒక ఉచ్చువలె ఉన్నారు.
తాబోరులో నేలమీద పరచిన ఒక వలవలె మీరు
ఉన్నారు. 2 మీరు ఎన్నెన్నో చెడ్డ పనులు చేశారు.
కనుక మిమ్మల్నందర్నీ నేను శిక్షిస్తాను! 3 ఎఫ్రాయిము
నాకు తెలుసు. ఇశ్రాయేలు చేసినవి నాకు తెలుసు.
ఎఫ్రాయిమూ, ఇప్పటికిప్పుడు ఒక వేశ్యలాగ నీవు
ప్రవర్తిస్తావు. ఇశ్రాయేలు తన పాపాలతో అశుద్ధమ
యింది. 4 ఇశ్రాయేలు ప్రజలు చెడ్డపనులు అనేకం
చేశారు. వారు తిరిగి వారి దేవుని దగ్గరకు రాకుండా ఆ
చెడ్డ పనులే వారిని అడ్డగిస్తాయి. ఇతర దేవతలను
వెంటాడే మార్గాలను గూర్చి వారు ఎల్లప్పుడూ తలు
స్తున్నారు. వారు యెహోవాను ఎరుగరు. 5 ఇశ్రాయే
లీయుల గర్వమే వారికి విరోధంగా ఒక సాక్ష్యం అవు
తుంది. కనుక ఇశ్రాయేలు, ఎఫ్రాయిము వారి పాపంలో
కాలు జారిపడతారు. కాని యూదా కూడ వారితోపాటే
కాలు తప్పిపడిపోతుంది.
6 “ప్రజా నాయకులు యెహోవా కోసం వెదకు
టకు వెళ్లారు. వారు, వారి ‘గొర్రెలను’ మరియు ‘ఆవు
లను’ వారితో కూడ తీసుకొని వెళ్లారు. కాని యెహో
వాను వారు కనుగొనలేదు. ఎందుచేతనంటే ఆయన
వారిని విడచిపెట్టాడు. 7 వారు యెహోవాకు విశ్వాస
పాత్రులుగా ఉండలేదు. వారి పిల్లలు పరాయివాని పిల్ల
లుగా పుట్టిరి. కాని ఇప్పుడు వారు, వారి పొలాలతో
బాటు అమావాస్యనాటికి నాశన మవుతారు.”

### ఇశ్రాయేలీయుల నాశనం గూర్చి ఒక ప్రవచనం

8 “గిబియాలో కొమ్ము ఊదండి. రామాలో బాకా
ఊదండి. బేతావెను వద్ద హెచ్చరిక చేయండి.
బెన్యామీనూ, శత్రువు నీ వెనుక ఉన్నాడు.
9 శిక్షా సమయంలో ఎఫ్రాయిము పాడైపోతాడు.
ఆ విషయాలు తప్పక జరుగుతాయి అని నేను
(దేవుడు) ఇశ్రాయేలు గోత్రాల వారిని హెచ్చరి
స్తున్నాను.
10 యూదా నాయకులు మరొక మనిషి ఆస్తిని
దొంగిలించుటకు ప్రయత్నించే దొంగల్లాగ
తయారయ్యారు. కనుక నేను (దేవుడు) వారి
మీద నా కోపాన్ని నీళ్లలాగ పోస్తాను.
11 ఎఫ్రాయిము శిక్షించబడతాడు. అతడు ద్రాక్షా
పళ్లలాగ చితుకగొట్టబడి అణగదొక్కబడతాడు.
ఎందుచేతనంటే, అతడు దుష్టత్వాన్ని చెయ్యా
లని కోరుకున్నాడు.
12 చిమ్మెట బట్టను పాడుచేసినట్టు ఎఫ్రాయిమును
నేను నాశనం చేస్తాను. చెక్కముక్కను చెదల
పురుగు పాడుచేసినట్టు నేను యూదాను పాడు
చేస్తాను.
13 ఎఫ్రాయిము తన రోగాన్ని చూశాడు, యూదా
తన గాయాన్ని చూశాడు. కనుక వారు సహాయం
కోసం అష్షూరు వెళ్లారు. తమ సమస్యలను
గూర్చి తాము ఆ మహారాజుతో చెప్పారు. కాని
ఆ రాజు మిమ్మల్ని స్వస్థపరచలేడు. అతడు
మీ గాయాన్ని బాగుచేయలేడు.
14 ఎఫ్రాయిముకు నేను ఒక సింహంవలె ఉంటాను.
యూదా రాజ్యానికి నేను ఒక కొదమ సింహంలాగ
ఉంటాను. గనుక నేను, అవును యెహోవానైన
నేనే వారిని ముక్కలుగా చీల్చివేస్తాను. నేను
వారిని తీసుకొని వెళ్లిపోతాను. నానుండి వారిని
ఎవ్వరూ రక్షించలేరు.
15 ప్రజలు తాము దోషులమని ఒప్పుకొనేంత
వరకు నాకోసం వారు వెదకుతూ వచ్చేంత
వరకు నేను నా స్థలానికి వెళ్లిపోతాను. అవును
తమ కష్టంలో నన్ను కనుక్కొనేందుకు వారు
కష్టపడి ప్రయత్నిస్తారు.”

### యెహోవా దగ్గరకు తిరిగి వచ్చినందుకు బహుమతులు

6 “రండి, మనం తిరిగి యెహోవా దగ్గరకు వెళ్దాం.
ఆయన మనల్ని గాయపరిచాడు. కాని ఆయనే
మనలను బాగుచేస్తాడు. ఆయన మనలను గాయ
పర్చాడు. కాని ఆయనే మనకు కట్టుకడతాడు.
2 తర్వాత ఆయన మనలను మరల బతికిస్తాడు.
మూడోనాడు ఆయన మనలను తిరిగి లేపుతాడు.
అప్పుడు మూడవ రోజున మనం ఆయన ఎదుట
జీవించగలం.
3 మనం యెహోవాను గూర్చి నేర్చుకొందాము.
ప్రభువును తెలుసుకొనేందుకు మనం గట్టిగా
ప్రయత్నం చేద్దాం. సూర్యోదయం వస్తుందని
మనకు తెలిసినట్లే ఆయన వస్తున్నాడని మనకు
తెలుసు. యెహోవా వర్షంలాగ మన దగ్గరకు
వస్తాడు. నేలను తడిపే వసంతకాలపు వర్షంలాగ
ఆయన వస్తాడు.”

### ప్రజలు నమ్మకస్తులు కారు

4 “ఎఫ్రాయిమూ, నిన్ను నేను (యెహోవా) ఏమి
చేయాలి? యూదా, నిన్ను నేను ఏమి చేయాలి?
నీ నమ్మకత్వం ఉదయపు మంచులాగ ఉంది.
వేకువనే ఉండకుండా పోయే హిమంలాగ నీ
నమ్మకత్వం ఉంది.
5 నేను ప్రవక్తలను ఉపయోగించి ప్రజల కోసం
న్యాయచట్టం చేశాను. నా ఆజ్ఞచేతనే ప్రజలు
చంపబడ్డారు. కానీ ఆ నిర్ణయాల మూలంగానే
మంచి విషయాలు వస్తాయి.

6 ఎందుచేతనంటే నాకు కావల్సింది నమ్మకమైన
ప్రేమయే. అంతేగాని బలిఅర్పణకాదు. ప్రజలు
నన్ను తెలుసుకోవాలని నా కోరిక దహనబలులు
తీసుకొని వచ్చేందుకు కాదు.
7 అయితే ఆదాము చేసినట్టు ప్రజలు నా ఒడంబడి
కను ఉల్లంఘించారు. వారి దేశంలో వారు నాకు
అపనమ్మకంగా ఉన్నారు.
8 గిలాదు పాపాలు చేసే ప్రజల పట్టణం. ఆ ప్రజలు
ఇతరులను ఉపాయం చేసి చంపేశారు.
9 బందిపోటు దొంగలు దాగుకొని, ఎవరిమీదనైనా
పడేందుకు వేచిఉంటారు. అదే విధంగా యాజ
కులు షెకెము వెళ్లే మార్గంలో పొంచి ఉండి, ఆ
మార్గంలో వెళ్లేవారిని వారు చంపుతారు. వారు
దుర్మార్గపు పనులు చేశారు.
10 ఇశ్రాయేలు రాజ్యంలో ఒక దారుణ విషయం
నేను చూశాను. ఎఫ్రాయిము దేవునికి అపనమ్మ
కస్తుడు. ఇశ్రాయేలు తన పాపంతో అశుద్ధమ
యింది.
11 యూదా, నీకు కూడా ఒక కోతకాలం ఉంది.
బానిసత్వం నుండి నా ప్రజలను నేను వెనుకకు
తీసుకొని వచ్చునప్పుడు అది సంభవిస్తుంది.”

7 “ఇశ్రాయేలును నేను స్వస్థపరుస్తాను! ఎఫ్రా
యిము యొక్క పాపం గూర్చి పజలు తెలుసు
కొంటారు. సమరయ అబద్ధాలను గూర్చి ప్రజలు
తెలుసుకొంటారు. ఆ పట్టణంలో వచ్చి పోయే
దొంగలను గూర్చి ప్రజలు తెలుసుకొంటారు.
2 ఆ ప్రజల నేరాలను నేను జ్ఞాపకం ఉంచు
కొంటానని వారు నమ్మరు. వారు చేసిన చెడ్డ
పనులు చుట్టూరా ఉన్నాయి. వారి పాపాలను
నేను తేటగా చూడగలను.
3 ఇశ్రాయేలు చేసే చెడ్డపనులు వాళ్ల రాజులను
సంతోషపెడ్తాయి. వాళ్లు చెప్పే అబద్ధాలు వాళ్ల
నాయకులను సంతోషపెడ్తాయి.
4 రొట్టెలు చేయువాడు రొట్టె చేయుటకు పిండి
పిసుకుతాడు. అతడు రొట్టెను పెనంమీద
వేస్తాడు. రొట్టె పొంగుతున్నప్పుడు అతడు మంట
ఎక్కువ చేయడు. కానీ ఇశ్రాయేలు ప్రజలు ఆ
రొట్టెలు చేసేవానిలాగ లేరు. ఇశ్రాయేలు ప్రజలు
వారి మంటను ఎల్లప్పుడూ ఎక్కువ చేస్తున్నారు.
5 మా రాజు దినాన, వారు మంటను పెంచుతారు.
వారు తాగుడు విందులు చేస్తారు. ద్రాక్షామద్యపు
వేడి మూలంగా పెద్దలు రోగులవుతారు. కనుక
దేవుణ్ణి ఎగతాళి చేసే ప్రజలతో రాజులు చేతులు
కలుపుతారు.
6 ప్రజలు రహస్య పథకాలు వేస్తారు. వారి హృద
యాలు పొయ్యివలె ఉద్రేకముతో మండుతాయి.
వారి కోపం రాత్రి అంతా మండుతుంది. మర్నాడు
ఉదయం అది బహు వేడిగల నిప్పువలె ఉంటుంది.
7 వాళ్లంతా మండుచున్న పొయ్యిలాంటి వాళ్లు.
వారు వారి పాలకులను నాశనం చేశారు. వారి
రాజులంతా పతనం అయ్యారు. వారిలో ఒక్కడు
కూడా సహాయం కోసం నన్ను అడుగలేదు.”

### అది నాశనం చేయబడుతుందని ఇశ్రాయేలుకు తెలియదు

8 “ఎఫ్రాయిము రాజ్యాలతో కలిసిమెలిసి ఉంటుంది.
ఎఫ్రాయిము రెండు వైపులా కాలని రొట్టెలా
ఉంది.
9 పరాయివాళ్లు ఎఫ్రాయిము బలాన్ని నాశనం
చేస్తారు. కానీ అది ఎఫ్రాయిముకు తెలియదు.
ఎఫ్రాయిము తలమీద తెల్లవెంట్రుకలు
ఉన్నాయి, కానీ అది ఎఫ్రాయిముకు తెలియదు.
10 ఎఫ్రాయిము గర్వం అతనికి విరోధంగా మాట్లా
డుతుంది. ప్రజలకు ఎన్నెన్నో కష్టాలు కలిగాయి.
అయినప్పటికీ వారు తమ దేవుడైన యెహోవా
దగ్గరకు తిరిగి వెళ్లలేదు. ప్రజలు సహాయంకోసం
ఆయనవైపు చూడలేదు.
11 కనుక ఎఫ్రాయిము తెలివిలేని పావురంలా తయా
రయ్యాడు. ప్రజలు సహాయంకోసం ఈజిప్టును
పిలిచారు. సహాయంకోసం ప్రజలు అష్షూరు
వెళ్లారు.
12 సహాయంకోసం వారు ఆయా దేశాలకు వెళ్తారు.
కానీ నేను వారిని వలలో పడవేస్తాను. వారి మీద
నేను నా వల విసిరి ఆకాశ పక్షుల్లాగ నేను వారిని
కిందికి దించుతాను. వారి ఒడంబడిక * విష
యంలో నేను వారిని శిక్షిస్తాను.
13 అది వారికి చెడుగా ఉంటుంది. వారు నన్ను
విడిచిపెట్టేశారు. నాకు విధేయులగు టకు వారు
నిరాకరించారు. కనుక వారు నాశనం చేయబడ
తారు. ఆ ప్రజలను నేను రక్షించాను. కానీ వారు
నాకు విరోధంగా అబద్ధాలు చెబుతారు.
14 అవును, వారు హృదయపూర్వకంగా ఎన్నడూ
నాకు మొరపెట్టరు. వారు ఇతరుల భూములలో
ధాన్యం, కొత్త ద్రాక్షారసం కోసం తిరిగేటప్పుడు
వారి పడకల మీద పడి ఏడుస్తారు. వారి ఆరాధ
నలో భాగంగా వారిని వారు కోసుకొంటారు.
కానీ వారి హృదయాల్లో వారు నా నుండి తిరిగి
పోయారు.
15 నేను వారికి బుద్ధి వచ్చేటట్లు చేసి, వారి చేతులను
బలపర్చాను. కానీ వారు నాకు విరోధంగా దుష్ట
పన్నాగాలు పన్నారు.

---

**వారి ఒడంబడిక** లేక వాళ్ల సంధి ప్రకటనలు.

16 దేవుళ్లుకాని వారివైపు (బయలు దేవత) వారు
తిరిగారు. వారు అక్కరకు రాని (వంగని) విల్లులా
ఉన్నారు. వారి నాయకులు తమ బలాన్ని గూర్చి
అతిశయించారు. కానీ వారు కత్తులతో చంప
బడతారు. అప్పుడు ఈజిప్టు ప్రజలు వారిని చూచి
నవ్వుతారు. విగ్రహారాధన నాశనానికి దారి
తీస్తుంది.

### విగ్రహారాధన నాశనానికి నడుపుతుంది

8 "బూర నీ నోట పెట్టుకొని, హెచ్చరిక చేయుము.
యెహోవా ఆలయం మీద పక్షి రాజువలె ఉండు.
ఇశ్రాయేలీయులు నా ఒడంబడికను ఉల్లఘించారు.
వారు నా న్యాయ చట్టానికి విధేయులు కాలేదు."
[2]'నా దేవా, ఇశ్రాయేలులో ఉన్న మాకు నీవు తెలుసు'
అని వారు అరచి నాకు చెపుతారు. [3]కానీ ఇశ్రాయేలు
మంచివాటిని తిరస్కరించింది. అందుచేత శత్రువు
అతన్ని తరుముతున్నాడు. [4]ఇశ్రాయేలీయులు తమ
రాజులను ఏర్పరచుకొన్నారు. కానీ సలహా కోసం వారు
నా దగ్గరకు రాలేదు. ఇశ్రాయేలీయులు నాయకులను
ఏర్పరచుకున్నారు. కానీ నేను ఎరిగిన మనుష్యులను
వారు ఎన్నుకోలేదు. ఇశ్రాయేలీయులు తమ వెండి,
బంగారం ఉపయోగించి వారికోసం విగ్రహాలు చేసు
కొన్నారు. కనుక వారు నాశనం చేయబడతారు.
[5](షోమ్రోనూ) నీ దూడను (విగ్రహాన్ని) యెహోవా
నిరాకరించాడు. దేవుడు అంటున్నాడు, 'ఇశ్రాయేలీ
యుల మీద నేను చాలా కోపంగా ఉన్నాను.' ఇశ్రాయేలు
ప్రజలు వారి పాపం విషయంలో శిక్షించబడతారు.
[6]ఆ విగ్రహాలను ఒక పనివాడు చేశాడు. అవి దేవుళ్లు
కావు. సమరయ దూడ ముక్కలుగా విరుగగొట్టబడు
తుంది.

[7]ఇశ్రాయేలీయులు ఒక మూర్ఖమైన పని చేశారు
అది గాలిని నాటుటకు ప్రయత్నించినట్టు ఉంది. కానీ
వారికి కష్టాలు మాత్రమే కలుగుతాయి. వారు సుడిగాలిని
పంటగా కోస్తారు. పొలంలో ధాన్యం పండుతుంది.
కానీ అది ఆహారాన్ని ఇవ్వదు. ఒకవేళ దానిలో ఏమైనా
పండినా పరాయివాళ్ళు దాన్ని తినేస్తారు.

8 ఇశ్రాయేలు మింగివేయబడింది (నాశనం చేయ
బడింది). ఇశ్రాయేలు ఎవరికీ పనికిరాని ఒక పని
ముట్టులాగ తయారయ్యింది. ఇశ్రాయేలు విసిరి
వేయబడింది వారు యితర రాజ్యాలలో చెదర
గొట్టబడ్డారు.
9 ఎఫ్రాయిము తన విటుల దగ్గరకు వెళ్లాడు. అడవి
గాడిదలా అతడు తిరుగుతూ అష్షూరు వెళ్లాడు.
10 ఆయా రాజ్యాలలో తన విటుల దగ్గరకు ఇశ్రా
యేలు వెళ్లింది. కానీ ఇప్పుడు నేను ఇశ్రాయేలీ
యులను సమకూరుస్తాను. ఆ మహాశక్తిగల రాజు
వారి మీద భారాన్ని వేస్తాడు. మరియు వాళ్లు ఆ
భారంవల్ల కొద్దిగా బాధపడాలి.

### ఇశ్రాయేలు తన దేవున్ని మరచిపోయి విగ్రహాలను పూజించుట

11 ఎఫ్రాయిము ఎన్నెన్నో బలిపీఠాలు కట్టింది. అవి
అతను పాపాలు చేయడానికి అధారమయ్యాయి
12 ఎఫ్రాయిము కోసం నేను నా న్యాయచట్టాలు
సంపూర్ణముగా వ్రాసినా అవి ఎవరో పరాయి
వాడికోసం అన్నట్టు అతడు వాటిని గూర్చి అను
కొంటాడు.
13 బలులు అంటే ఇశ్రాయేలీయులకు ఇష్టం. వారు
మాంసం అర్పించి, దాన్ని తినేస్తారు. యెహోవా
వారి బలులు స్వీకరించడు. ఆయనకు వారి
పాపాలు జ్ఞాపకమే. ఆయన వారిని శిక్షిస్తాడు.
వారు ఈజిప్టుకు బందీలుగా కొనిపోబడుతారు.
14 ఇశ్రాయేలీయులు నివాసాలు నిర్మించారు. కానీ
వారు తమను చేసిన సృష్టికర్తను మరచిపోయారు.
ఇప్పుడు యూదా కోటలు కట్టింది. కానీ
యూదా పట్టణాల మీదికి నేను అగ్నిని పంపి
స్తాను. ఆ అగ్ని దాని రాజభవనాలను నాశనం
చేస్తుంది.

### పరదేశపు చెరసాలలో దుఃఖం

9 ఇశ్రాయేలూ, రాజ్యాలు సంబరం చేసుకున్నట్టు
నీవు చేసుకోవద్దు. సంతోషంగా ఉండకు! నీవు
ఒక వేశ్యలాగ ప్రవర్తించి, నీ దేవుణ్ణి విడిచిపెట్టేశావు.
ప్రతి కళ్లం మీద నీవు నీ లైంగిక పాపం చేశావు. [2]కానీ
ఆ కళ్లములనుండి వచ్చే ధాన్యం, ఇశ్రాయేలీయులకు
సరిపడినంత ఆహారం ఇవ్వదు. ఇశ్రాయేలుకు సరిప
డినంత ద్రాక్షారసం ఉండదు.

[3]ఇశ్రాయేలీయులు యెహోవా దేశంలో నివ
సించరు. ఎఫ్రాయిము తిరిగి ఈజిప్టుకు వెళ్తుంది. వారు
తినకూడని ఆహారం వారు అష్షూరులో తింటారు.
[4]ఇశ్రాయేలీయులు ద్రాక్షారసపు అర్పణలు యెహో
వాకు అర్పించరు. వారు ఆయనకు జంతువుల బలులు
అర్పించరు. వారి బలులు శవసంస్కారము వద్ద తినే
భోజనము లాంటిది. ఎవరైతే దాన్ని తింటారో వారు
అపరిశుద్ధులవుతారు. వారి రొట్టెలు యెహోవా ఆల
యంలోనికి వెళ్లవు–అవి సరిగ్గా వారు బతికి ఉండేందుకు
మాత్రమే సరి పోతాయి. [5]వారు (ఇశ్రాయేలీయులు)
యెహోవాకు పండుగలు, పవిత్ర దినాలు ఆచరించ
లేరు.

[6]ఇశ్రాయేలీయులకు కలిగినదంతా శత్రువు తీసు
కొన్నందువల్ల ఇశ్రాయేలు వదిలిపెట్టబడింది. కాని
ఈజిప్టు ఆ ప్రజలను తీసుకొంటుంది. వారిని మెంఫెసు
పట్టణం పాతిపెడ్తుంది. వారి వెండి ఐశ్వర్యాల మీద

పిచ్చిమొక్కలు మొలుస్తాయి. ఇశ్రాయేలీయులు నివ
సించినచోట ముళ్లకంపలు పెరుగుతాయి.

## నిజమైన ప్రవక్తలను ఇశ్రాయేలు తిరస్కరించుట

7"ఇశ్రాయేల్యా, ఈ విషయాలు తెలుసుకో; శిక్షా
సమయం వచ్చింది. నీవు చేసిన చెడుకార్యాలకు
ప్రతిఫలం నీవు చెల్లించాల్సిన సమయం వచ్చింది"
అని ప్రవక్త చెపుతున్నాడు. కానీ ఇశ్రాయేలు ప్రజలు,
"ప్రవక్త బుద్ధిలేనివాడు. దేవుని ఆత్మగల ఈ మనిషి
వెర్రివాడు" అని అంటున్నారు. "మీ చెడు పాపాల
విషయంలో మీరు శిక్షింపబడతారు. మీ ద్వేషం
మూలంగా మీరు శిక్షించబడతారు" అని ప్రవక్త చెపు
తున్నాడు. 8దేవుడు మరియు ప్రవక్త ఎఫ్రాయిముకు
కాపలా కాస్తున్న కావలివంటివారు. కానీ మార్గం
పొడవునా ఎన్నో ఉచ్చులు ఉన్నాయి. మరియు
ప్రజలు ప్రవక్తను అతని దేవుని మందిరంలో కూడ
అసహ్యించు కొంటున్నారు.
9గిబియా కాలంలో వలె, ఇశ్రాయేలీయులు నాశనం
లోనికి లోతుగా దిగిపోయారు. ఇశ్రాయేలీయుల పాపా
లను యెహోవా జ్ఞాపకం ఉంచుకొంటాడు. వారి
పాపాలను ఆయన శిక్షిస్తాడు.

## ఇశ్రాయేలు విగ్రహాలను పూజించి పాడవుట

10నా మట్టుకైతే ఇశ్రాయేలు ఎడారిలో ద్రాక్షాపళ్లు
చూచినట్టు ఉంది. కాలం మొదట్లో అంజూరపు
చెట్లమీద మొదటి పండ్లవంటి వారు మీ పూర్వీకులు.
అయితే వారు బయల్పెయోరుకు వచ్చారు. వారు
మారిపోయారు – వారు ఏదో కుళ్ళిపోయినదానిలా
ఉండిరి. వారు తాము ప్రేమించిన దారుణ విషయాల్లాగే
(అబద్ధపు దేవుళ్లు) వారూ తయారయ్యారు.

## ఇశ్రాయేలీయులకు పిల్లలు లేకుండుట

11ఒక పిట్టలాగ ఎఫ్రాయిము మహిమ ఎగిరి
పోతుంది. ఇక గర్భములు దాల్చుట ఉండదు. పుట్టు
కలు ఇక ఉండవు. పిల్లలు ఇక ఉండరు. 12కానీ ఒకవేళ
ఇశ్రాయేలీయులు పిల్లలను పెంచినా, అది సహాయ
పడదు. పిల్లలను వారి దగ్గర్నుండి నేను తీసివేస్తాను.
నేను వారిని విడిచిపెట్టేస్తాను. వారికి కష్టాలు తప్ప
మరేవీ ఉండవు. 13ఎఫ్రాయిము తన పిల్లలను బోను
లోనికి నడిపిస్తూ ఉండటం నేను చూడగలను. ఎఫ్రా
యిము తన పిల్లలను హంతకుని దగ్గరకు తీసికొని
వస్తాడు. 14యెహోవా, నీ ఇష్టం వచ్చిన దాన్ని వారికి
చేయుము. గర్భస్రావాలు అయ్యే గర్భం వారికి ఇమ్ము,
పాలు ఇవ్వలేని స్తనాలు వారికి ఇమ్ము.

15 వారి దుర్మార్గం అంతా గిల్గాలులో ఉంది. అక్కడే
నేను వారిని అసహ్యించుకోవటం మొదలు
బెట్టాను. వారు చేసే దుర్మార్గపు పనుల
మూలంగా వారిని నా ఇంటినుండి నేను వెళ్ల
గొట్టేస్తాను. ఇంకెంతమాత్రం నేను వారిని ప్రేమిం
చను. వారి నాయకులు తిరుగుబాటు దారులు.
వారు నాకు విరోధంగా తిరిగారు.
16 ఎఫ్రాయిము శిక్షించబడుతుంది. వారి వేరు
చస్తుంది. వారికి ఇక పిల్లలు ఉండరు. వారు
పిల్లల్ని కనవచ్చును. కానీ వారి శరీరాలనుండి
పుట్టే ఆ ప్రశస్త శిశువులను నేను చంపేస్తాను.
17 ఆ ప్రజలు నా దేవుని మాట వినలేదు. కనుక
ఆయన వారిని నిరాకరించాడు. వారు ఇల్లులేని
వారుగా, రాజ్యాలలో సంచారం చేస్తారు.

## ఇశ్రాయేలును వారి ఐశ్వర్యాలే వారిని విగ్రహారాధనకు నడిపించుట

10 విస్తారమైన పండ్లు ఫలించే ద్రాక్షావల్లిలాంటిది
ఇశ్రాయేలు. ఇశ్రాయేలుకు దేవుని దగ్గర
నుండి ఎన్నెన్నో లభించాయి. కానీ అతడు ఇంకా
ఇంకా ఎక్కువ బలిపీఠాలను బూటకపు దేవుళ్లకు
కట్టాడు. అతని భూమి క్రమంగా ఎక్కువగా ఫలిం
చింది. కనుక అతడు బూటకపు దేవుళ్లను
గౌరవించుటకు స్థంభాలను నిలిపాడు.
2ఇశ్రాయేలు ప్రజలు దేవుణ్ణి మోసం చేయాలని
చూశారు. కానీ ఇప్పుడు వారు తమ దోషాన్ని
అంగీకరించాలి. వారి బలిపీఠాలను యెహోవా
విరుగగొడ్తాడు. వారి స్మారక శిలలను ఆయన
నాశనం చేస్తాడు.

## ఇశ్రాయేలీయుల దుర్మార్గపు తీర్మానాలు

3ఇప్పుడు, "మాకు రాజు లేడు. మేము యెహో
వాను గౌరవించము! ఆయన రాజు మాకు ఏమీ చేయ
లేడు!" అని ఇశ్రాయేలీయులు చెపుతారు.
4వారు వాగ్దానాలు చేస్తారు కానీ వారు వట్టి అబద్ధాలు
మాత్రమే చెపుతున్నారు. వారి వాగ్దానాలను వారు నిల
బెట్టుకోరు. ఇతర దేశాలతో వారు ఒప్పందాలు చేస్తారు.
ఆ ఒప్పందాలు దేవునికి ఇష్టం లేదు. ఆ న్యాయ
మూర్తులు, దున్నబడిన పొలంలో విషపు కలుపు
మొక్కల్లాంటివారు.
5సమరయ ప్రజలు బేతావెను దగ్గర దూడలను
పూజిస్తారు. ఆ ప్రజలు, యాజకులు నిజంగా ఏడు
స్తారు. ఎందుకంటే అందమైన వారి విగ్రహం ఎత్తుకుపో
బడింది. 6అష్షూరు రాజుకు కానుకగా అది ఎత్తుకొనిపో
బడింది. ఎఫ్రాయిము యొక్క అవమానకరమైన విగ్ర
హాన్ని అతడు ఉంచుకొంటాడు. ఇశ్రాయేలు తన
విగ్రహం విషయమై సిగ్గుపడుతుంది. 7సమరయ బూట
కపు దేవుడు నాశనం చేయబడతాడు. అది నీటిమీద
తేలిపోతున్న చెక్క ముక్కలాగ ఉంటుంది.

8ఇశ్రాయేలు పాపంచేసి, ఎత్తయిన స్థలాలు అనేకం
నిర్మించింది. ఆవెనులోనున్న ఎత్తయిన స్థలాలు అన్నీ
నాశనం చేయబడతాయి. వాటి బలిపీఠాలమీద ముళ్ల
కంపలు, పిచ్చిమొక్కలు మొలుస్తాయి. అప్పుడు వారు
"మమ్మల్ని కప్పండి!" అని పర్వతాలతోను, "మా
మీద పడండి!" అని కొండలతోను చెపుతారు.

### ఇశ్రాయేలు తన పాపానికి పరిహారం చెల్లించుట

9ఇశ్రాయేలూ, గిబియా కాలం నుండి నీవు పాపం
చేశావు. (మరియు ఆ ప్రజలు అక్కడ పాపం చేస్తూనే
ఉన్నారు). ఆ దుర్మార్గులను గిబియాలో యుద్ధం
నిజంగా పట్టుకొంటుంది. 10వారిని శిక్షించటానికి నేను
వస్తాను. వారికి విరోధంగా సైన్యాలు కలిసి ఉమ్మడిగా
వస్తాయి. ఇశ్రాయేలీయులను వారి రెండు పాపాల
నిమిత్తం ఆ సైన్యాలు శిక్షిస్తాయి.
11ఎఫ్రాయిము నూర్పిడి కళ్లంలో ధాన్యం మీద
నడవడానికి ఇష్టపడే శిక్షణగల పెయ్యలాగ ఉన్నాడు.
దాని మెడమీద నేను ఒక కాడిని పెడతాను. తాళ్లను
నేను ఎఫ్రాయిము మీద ఉంచుతాను. అప్పుడు
యూదా దున్నటం మొదలు పెడతాడు. యాకోబు
తానే భూమిని చదును చేస్తాడు. 12నీవు మంచితనాన్ని
నాటితే సత్య ప్రేమను కోస్తావు. నీవు నేలను దున్ని
యెహోవాతో కలిసి పంటకోస్తావు. ఆయన వచ్చి,
మంచితనాన్ని వర్షంలాగ నీమీద కురిపిస్తాడు!
13కానీ మీరు దుర్మార్గం నాటారు. కష్టాన్ని పంటగా
కోశారు. మీ అబద్ధాల ఫలం మీరు తిన్నారు. ఎందుచేత
నంటే మీరు మీ శక్తిని, మీ సైనికులను నమ్ముకొన్నారు.
14కనుక మీ సైన్యాలు యుద్ధ ధ్వనులు వింటాయి.
మరియు మీ కోటలన్నీ నాశనం చేయబడతాయి.
అది షల్మాను బేతర్బేలును నాశనం చేసిన సమ
యంలాగా ఉంటుంది. ఆ యుద్ధ సమయంలో తల్లులు
వారి పిల్లలతో పాటు చంపబడ్డారు. 15మీకు కూడ
బేతేలు వద్ద అలాగే జరుగుతుంది. ఎందుచేత నంటే,
మీరు చాలా దుర్మార్గపు పనులు చేశారు గనుక. ఆ
రోజు ప్రారంభమైనప్పుడు ఇశ్రాయేలు రాజు సర్వ
నాశనం చేయబడతాడు.

### ఇశ్రాయేలు యెహోవాను మరచి పోవుట

11 "ఇశ్రాయేలు చిన్న బిడ్డగా ఉన్నప్పుడు నేను
(యెహోవా) వానిని ప్రేమించాను.
మరియు ఈజిప్టు నుండి నా కుమారుని బయ
టకు పిలిచాను.
2 కాని ఇశ్రాయేలీయులను ఎంత ఎక్కువగా నేను
పిలిస్తే అంత ఎక్కువగా ఇశ్రాయేలీయులు నన్ను
విడిచిపెట్టారు. బయలు దేవతలకు ఇశ్రాయేలీ
యులు బలులు అర్పించారు. విగ్రహాలకు వారు
ధూపం వేశారు.
3 "అయితే ఎఫ్రాయిముకు నడవటం నేర్పింది నేనే!
ఇశ్రాయేలీయులను నేను నా చేతులతో ఎత్తు
కొన్నాను! నేను వారిని స్వస్థపరిచాను. కాని
అది వారికి తెలియదు.
4 తాళ్లతో నేను వారిని నడిపించాను. కాని అవి
ప్రేమ బంధాలు. నేను వారిని విడుదల చేసిన
వ్యక్తిలాగవున్నాను. నేను వంగి వారికి భోజనం
పెట్టాను.

5"ఇశ్రాయేలీయులు దేవుని దగ్గరకు మళ్లుకొను
టకు నిరాకరించారు. కనుక వారు ఈజిప్టు వెళ్తారు!
అష్షూరు రాజు వారికి రాజు అవుతాడు. 6వారి పట్టణా
లకు విరోధంగా ఖడ్గం విసరబడుతుంది. బలమైన
వారి మనుష్యులను అది చంపుతుంది. వారి నాయకు
లను అది నాశనం చేస్తుంది.
7"నేను తిరిగిరావాలని నా ప్రజలు కోరుకుంటు
న్నారు. పైనున్న దేవున్ని వాళ్లు వేడుకుంటారు. కాని,
దేవుడు వాళ్లకు సహాయం చేయడు."

### ఇశ్రాయేలుని నాశనం చేయడం యెహోవాకు ఇష్టం లేదు

8 "ఎఫ్రాయిమూ, నిన్ను వదులుకోవాలన్న కోర్కె
నాకు లేదు. ఇశ్రాయేలూ, నిన్ను కాపాడాలన్నదే
నా కోర్కె. నిన్ను అద్మావలె చెయ్యాలన్న
కోర్కె నాకు లేదు! నిన్ను జెబొయీములాగ
చెయ్యాలనీ లేదు! నేను నా మనసు మార్చు
కుంటున్నాను, నేను మిమ్మల్ని ప్రగాఢంగా
ప్రేమిస్తున్నాను.
9 నేను నా కోపాగ్నిని అణచుకొంటాను. నేను
మరోమారు ఎఫ్రాయిమును నాశనం చేయను.
నేను మనిషిని కాను, నేను పవిత్రమైన దేవుణ్ణి.
నేను నీతోవున్నాను కాబట్టి నేను నీపై నా
కోపం చూపను.
10 నేను సింహంలాగ గర్జిస్తాను. నేను గర్జించగానే,
నా బిడ్డలు వచ్చి నన్ను అనుసరిస్తారు.
భయంతో కంపిస్తూ నా బిడ్డలు పశ్చిమ దిశ
నుంచి వస్తారు.
11 వాళ్లు ఈజిప్టు నుంచి పక్షుల్లా వణుకుతూ
వస్తారు. వాళ్లు అష్షూరు దేశంనుంచి పావురాల
వలె కదులుతూ వస్తారు నేను వాళ్లని తిరిగి
ఇంట చేరుస్తాను" అని యెహోవా చెప్పాడు.
12 "బూటకపు దేవుళ్లతో ఎఫ్రాయిము నన్ను చుట్టు
ముట్టాడు. ఇశ్రాయేలీయులు నాకు విరోధంగా
తిరిగారు. మరియు వాళ్లు నశింపజేయబడ్డారు!
కాని, యూదా యింకా ఎల్-తోనే*

---

**ఎల్-తోనే** ఎల్-ఇది పేర్లలో ఒకటిగావచ్చు. లేక ఇది కనానీ
యుల అతి ముఖ్యమైన దేవుడు కావచ్చు. యూదా దేవునికి
నమ్మకస్థుడో లేక బూటకపు దేవతలను పూజిస్తాడో దీనివల్ల
సరిగ్గా తెలియడం లేదు.

నడుస్తున్నాడు. యూదా అపవిత్రులకు నమ్మ
కస్తుడుగా ఉన్నాడు.”

## యెహోవా ఇశ్రాయేలుకు వ్యతిరేకి అవుట

12 ఎఫ్రాయిము వాళ్లు తమ కాలాన్ని వృథా
చేస్తున్నారు, “ఇశ్రాయేలీయులు రోజంతా
“గాలిని తరుముతున్నారు”. వాళ్లు అంతకంతకు ఎక్కు
వగా అబద్ధాలాడుతున్నారు, వారు అంతకంతకు ఎక్కు
వగా దొంగతనాలు చేస్తున్నారు. వాళ్లు అష్షూరుతో
ఒప్పందాలు కుదుర్చుకున్నారు. వాళ్లు తమ ఒలీవ
నూనెను ఈజిప్టుకి తరలిస్తున్నారు.
2యెహోవా ఇలా అంటున్నాడు: “నేను ఇశ్రాయే
లుకి వ్యతిరేకంగా వాదించాను. అతను చేసిన పనులకు
గాను యాకోబును శిక్షించి తీరాలి. అతను చేసిన
వాటినిబట్టి అతన్ని శిక్షించాలి. 3యాకోబు ఇంకా తన
తల్లి కడుపులో ఉండగానే తన సోదరుణ్ణి మోసగించ
నారంభించాడు. యాకోబు బలిష్ఠుడైన యువకుడు.
అప్పట్లో అతను దేవునితో పోరాడాడు. 4యాకోబు
దేవుని దూతతో పోరాడి గెలిచాడు. అతను విలపించి
దేవుణ్ణి ఒక సహాయం చేయుమని అడిగాడు. ఇది
బేతేలులో జరిగిన సంఘటన. అక్కడే ఆయన మనతో
మాట్లాడాడు. 5ఔను, యెహోవాయే సర్వసేనాధిపతి
యైన దేవుడు. అయన పేరు యెహోవా (ప్రభువు).
6అందుకని, మీరు మీ దేవుని వద్దకు తిరిగి రండి.
ఆయనకు విధేయులుగా ఉండండి. దయగలవారిగా
నీతిమంతులుగా ఉండండి. సదా మీ దేవుని నమ్మండి.
7“యాకోబు ఒక వ్యాపారస్థుడు. అతను తన
మిత్రుణ్ణి కూడా మోసగిస్తాడు. అతని తక్కెడలు*
కూడా సరైనవి కావు. 8ఎఫ్రాయిము ఇలా అను
కున్నాడు: ‘నేను ఐశ్వర్యవంతుణ్ణి! నాకు ధనరాశులు
దొరికాయి. నా నేరాల సంగతి ఎవడూ తెలుసుకోడు.
నా పాపాల గురించి ఎవడూ తెలుసుకోడు.’
9“మీరు ఈజిప్టు దేశంలో ఉన్ననాటినుంచి
యెహోవానైన నేనే మీకు దేవుణ్ణి. గుడార సమావేశ*
కాలంలో మాదిరిగా నేను మిమ్మల్ని గుడారాల్లో
నివసింపజేస్తాను. 10నేను ప్రవక్తలతో మాట్లాడాను.
నేను వాళ్లకి అనేక దర్శనాలు ఇచ్చాను. నేను పద్ధతులను
సూచించాను. 11కాని, గిల్గాదు ప్రజలు పాపులు. అక్కడ
అనేక క్షుద్ర దేవతా విగ్రహాలు ఉన్నాయి. అక్కడి
ప్రజలు గిల్గాలువద్ద ఎడ్లను బలులుగా ఇస్తారు. వాళ్లకి
బలిపీఠాలు అనేకం ఉన్నాయి. దున్నిన పొలంలో
బురద చాళ్లు ఉన్నట్లే వాళ్లకి బారులు బారులుగా బలి
పీఠాలు ఉన్నాయి.
12“యాకోబు అరాము దేశంలోకి పారిపోయాడు.
అక్కడ, ఇశ్రాయేలు ఒక భార్యకోసం శ్రమచేశాడు.
మరో భార్యకోసం గొర్రెల్ని మేపాడు. 13కాని,
యెహోవా ఒక ప్రవక్త ద్వారా ఇశ్రాయేలును ఈజిప్టు
నుంచి వెనక్కి రప్పించాడు. యెహోవా ఒక ప్రవక్త
ద్వారా ఇశ్రాయేలును భద్రంగా కాపాడాడు. 14కాని,
ఎఫ్రాయిము యెహోవాకి మిక్కిలి కోపం కలిగించాడు.
ఎఫ్రాయిము చాలామందిని హత మార్చాడు. అందుకని,
అతను తన నేరాలకిగాను శిక్షింపబడతాడు. అతని
ప్రభువు అతన్ని తన సిగ్గును సహించేటట్లుగా చేశాడు.”

## ఇశ్రాయేలు తనని తాను నాశనం చేసుకొనుట

13 “ఇశ్రాయేలులో ఎఫ్రాయిము చాలా
ప్రాముఖ్యం సంపాదించుకున్నాడు. ఎఫ్రా
యిము మాట్లాడితే చాలు ప్రజలు భయంతో
కంపించిపోయేవారు. కాని ఎఫ్రాయిము పాపకార్యాలు
చేశాడు. అతను బయలు దేవతని ఆరాధించాడు.
2ఇప్పుడిక ఇశ్రాయేలీయులు నానాటికీ ఎక్కువగా
పాపంచేస్తారు. వాళ్లు తమకోసం తాము విగ్రహాలను
చేసుకుంటారు. పనివాళ్లు వెండితో ఆ విగ్రహాలను
చేస్తారు. అప్పుడిక ఇశ్రాయేలీయులు తమ ఆ విగ్రహా
లతో మాట్లాడతారు. వాళ్లు ఆ విగ్రహాలకు బలులు
సమర్పిస్తారు. వాళ్లు ఆ బంగారు దూడలను ముద్దు
పెట్టుకొంటారు.
3అందుకే వాళ్లు త్వరలోనే ప్రాతః కాలపు
పొగమంచులా అదృశ్యమవుతారు. ఆ పొగ మంచు
నేలపై పడుతుంది. కాని అది త్వరలోనే ఆవిరై
పోతుంది. ఇశ్రాయేలీయులు కళ్లంలో ధాన్యపు పోత
పోసేటప్పుడు గాలికి ఎగిరిపోయే పొట్టులాంటి వాళ్లు.
ఇశ్రాయేలీయులు పొగగొట్టంలోనుంచి వెలు వడి,
గాలిలో కలిసిపోయే పొగలాంటివాళ్లు.
4“మీరు ఈజిప్టులో ఉన్ననాటినుంచీ యెహోవా
నైన నేనే మీ దేవుణ్ణి. నన్ను తప్ప మీరు మరో దేవు
డెవరినీ ఎరుగరు. మిమ్మల్ని రక్షించినది నేనే. 5మీరు
ఎడారిలో ఉన్నప్పుడూ, మెట్ట ప్రాంతంలో ఉన్న
ప్పుడూ కూడా మీరు నాకు తెలుసు. 6ఇశ్రాయేలీయు
లకు నేను ఆహారమిచ్చాను. వాళ్లూ ఆహారం తిన్నారు.
వాళ్లు కడుపులు నింపుకుని తృప్తిచెందారు. వాళ్లు గర్వి
ష్ఠులై నన్ను మరచారు!
7“అందుకే నేను వాళ్ల పాలిటికి సింహంలాగ
ఉంటాను. దారిప్రక్కన పొంచివున్న చిరుత పులిలాగా
ఉంటాను. 8తన కూనల్ని కోల్పోయిన ఎలుగు బంటి
లాగ నేను వాళ్లపైన దాడిచేస్తాను. నేను వాళ్ల రొమ్ములు

---

**తక్కెడలు** ఇశ్రాయేలీయులు కనాను నివాసుల దుష్ట మార్గాలు అవలంబించారు, అనగా తప్పుడు త్రాసులను ఉపయోగించారు.

**గుడార సమావేశ** జనులు దేవుణ్ణి ప్రార్థించే ముఖ్య గుడార మిది. సుకోత్ అనే విశ్రాంతి కాలం కూడా ఈ అర్థాన్నే ఇస్తుంది. ఈ విశ్రాంతి రోజులలో యూదులు ఈ గుడారలలో లేక అస్థిర భవనాలలో నివసిస్తుండెడివారు.

చీలుస్తాను. తన కెదురైన జంతువును చీల్చి తినేసే ఒక క్రూర మృగంలాగ ఉంటాను"

### దేవుని కోపంనుంచి ఇశ్రాయేలును ఎవరూ కాపాడలేక పోవుట

9"ఇశ్రాయేలూ, నేను నీకు సహాయం చేశాను. కానీ,
నాకు నీవు ఎదురు తిరిగావు. అందుకు, నిన్ను నేని
ప్పుడు నాశనం చేస్తాను. 10నీ రాజు ఎక్కడున్నాడు?
నీ నగరాలన్నింటిలోనూ అతను నిన్ను రక్షించలేడు!
నీ న్యాయాధిపతులు ఎక్కడ? నీవొకప్పుడు 'నాకొక
రాజునీ, కొందరు నాయకుల్నీ ఇవ్వండి' అని అడిగావు.
11నాకు కోపం వచ్చి, నేను నీకొక రాజును ఇచ్చాను.
నా కోపం మితిమీరినప్పుడు నేనా రాజుని వెనక్కి
తీసేసుకున్నాను.

12 "ఎఫ్రాయిము తన దోషాన్ని కప్పుకొన ప్రయ త్నించాడు. తన పాపాలు గుప్తంగా ఉన్నాయను కున్నాడు. (కాని, అతను శిక్షింపబడతాడు.)

13 అతని శిక్ష ఎలా ఉంటుందంటే, స్త్రీ ప్రసవ బాధలా ఉంటుంది. అతను వివేకి అయిన పుత్రుడుగా ఉండడు. అతని పుట్టుకకి సమయం ఆసన్నమ వుతుంది, కాని అతను బతికి బయటపడడు.

14 "నేను వాళ్లనా సమాధినుంచి కాపాడుతాను! నేను వాళ్లని మృత్యుముఖంనుంచి కాపాడుతాను! మరణమా, నీ వ్యాధులు ఎక్కడున్నాయి? సమాధీ, నీ శక్తి ఎక్కడ? నేను పగ సాధించాలని చూడటం లేదు!

15 ఇశ్రాయేలు తన సోదరుల మధ్య పెరుగుతాడు. కాని, శక్తివంతమైన తూర్పుగాలి వీస్తుంది. యెహోవా గాలి ఎడారినుంచి వస్తుంది. అప్పుడు (ఇశ్రాయేలు) బావి ఎండిపోతుంది. అతని నీటి బుగ్గ ఇంకిపోతుంది. (ఇశ్రాయేలు) సంపదలో విలువైన వాటన్నింటినీ గాలి ఎగరే సుకుపోతుంది.

16 షోమ్రోను శిక్షింపబడాలి. ఎందుకంటే, అది తన దేవునికి వ్యతిరేకమైంది. ఇశ్రాయేలీయులు కత్తు లతో చంపబడతారు. వాళ్ల పిల్లలు తునాతునకలు చేయబడతారు. వాళ్ల గర్భిణీస్త్రీల కడుపులు చీల్చబడతాయి."

### యెహోవా వద్దకు పునరాగమనమగుట

14 ఇశ్రాయేలూ, నీవు పడిపోయి దేవునికి విరోధ
ముగా పాపము చేశావు. కాబట్టి నీ దేవుడైన
యెహోవా వద్దకు తిరిగిరమ్ము. 2నీవు చెప్పబోయే
విషయాల గురించి ఆలోచించుము. యెహోవా
వద్దకు తిరిగిరమ్ము. ఆయనతో ఇలాగున చెప్పుము,

"మా పాపాన్ని తీసివేయుము. మా మంచి పను లను అంగీకరించుము. మా పెదవులనుండి స్తుతిని సమర్పిస్తాము.

3 "అష్షూరు మమ్మల్ని కాపాడదు. మేమిక యుద్ధ గుర్రాలపైన స్వారీ చేయము. మేము మా స్వహ స్తాలతో చేసిన విగ్రహాలను ఇంకెప్పుడూ మరల 'ఇది మా దేవుడు' అని అనము. ఎందుకంటే, అనాథుల పట్ల జాలి చూపేది నువ్వొక్కడివే."

### యెహోవా ఇశ్రాయేలును క్షమించుట

4 అందుకు యెహోవా ఇలా అంటాడు: "నా కోపం చల్లారింది, కనుక, నన్ను వీడి పోయినందుకు నేను వాళ్లని క్షమిస్తాను. నేను వాళ్లని ధారాళంగా ప్రేమిస్తాను.

5 నేను ఇశ్రాయేలీయులకు మంచువలెవుంటాను. ఇశ్రాయేలు తామర పుష్పంలాగ వికసిస్తాడు. అతడు లెబానోను, దేవదారు వృక్షంలాగా వేరు తన్ని దృఢంగా నిలుస్తాడు.

6 అతని శాఖలు విస్తరిస్తాయి, అతను అందమైన దేవదారు వృక్షంలాగ ఉంటాడు. అతను లెబానోను లోని దేవదారు చెట్లు వెలువరించే సువాసనలాగ ఉంటాడు.

7 ఇశ్రాయేలీయులు మరల నా పరిరక్షణలో జీవి స్తారు. గోధుమ కంకుల్లాగ పెరుగుతారు. ద్రాక్షా తీగల్లాగ పుష్పించి ఫలిస్తారు. వారు లెబానోను ద్రాక్షారసం వలె ఉంటారు."

### విగ్రహాల విషయంలో ఇశ్రాయేలుకు యెహోవా హెచ్చరిక

8 "ఎఫ్రాయిమూ, విగ్రహాలతో ఇక నీకెంత మాత్రమూ పనిలేదు. నీ ప్రార్థనలు ఆలకించేది నేనే. నిన్ను కాపాడేది నేనే. నేను నిరంతరం పచ్చగానుండే మీ ఫలము నానుండి వస్తుంది."

### చివరి సలహా

9 వివేకవంతుడు ఈ విషయాలు గ్రహిస్తాడు. చురుకైనవాడు ఈ విషయాలు నేర్చుకోవాలి. యెహోవా మార్గాలు సరైనవి. మంచివాళ్లు వాటి ద్వారా జీవిస్తారు. పాపులు వాళ్లకు వాళ్లే చని పోతారు.

# యోవేలు

### మిడుతలు పంటలను పాడుచేయుట

1 పెతూయేలు కుమారుడైన యోవేలు ఈ సందే
శాన్ని యెహోవా దగ్గరనుండి అందుకొన్నాడు:

2 నాయకులారా, ఈ సందేశం వినండి! దేశంలో
నివసించే మనుష్యులారా, మీరందరూ నా మాట
వినండి. మీ జీవితకాలంలో ఇలాంటిది ఏదైనా
ఇదివరకు జరిగిందా? లేదు! మీ తండ్రుల
కాలంలో ఇలాంటిది ఏదైనా జరిగిందా? లేదు!
3 ఈ సంగతులను గూర్చి మీరు మీ పిల్లలతో
చెపుతారు. మీ పిల్లలు వారి పిల్లలతో చెపుతారు.
మీ మనుమలు, మనుమరాండ్రు తమ తరువాత
తరమువారితో చెపుతారు.
4 కోత మిడుతలు విడిచిపెట్టిన దానిని దండు మిడు
తలు తినేస్తాయి. దండు మిడుతలు విడిచిపెట్టిన
దానిని దూకుడు మిడుతలు తినేస్తాయి. దూకుడు
మిడుతలు విడిచిపెట్టిన దానిని వినాశ మిడుతలు
తినేశాయి!

### మిడుతలు వచ్చుట

5 మద్యపానమత్తులారా మేల్కొని, ఏడ్వండి! ద్రాక్షా
మద్యం తాగే మీరందరూ ఏడ్వండి. ఎందుకంటే
మీ క్రొత్త ద్రాక్షామద్యం అయిపోయింది. ఆ ద్రాక్షా
మద్యం మరో గుక్కెడు మీకు దొరకదు.
6 నా రాజ్యం మీద యుద్ధం చేయటానికి, ఒక
పెద్ద శక్తిగల రాజ్యం వస్తోంది. వారు లెక్కించ
శక్యంకానంత మంది సైనికులు ఉన్నారు. ఆ
మిడుతలు (శత్రుసైనికులు) మిమ్మల్ని నిలువునా
చీల్చివేయగలవు! అది వారికి సింహపు కోరలు
ఉన్నట్టుగా ఉంటుంది.
7 నా ద్రాక్షావల్లుల నుండి ద్రాక్షాపళ్ళు అన్నింటినీ
ఆ "మిడుతలు" తినేస్తాయి! అవి నా అంజూరపు
చెట్లను నాశనం చేస్తాయి. మిడుతలు నా చెట్ల
బెరడును తినేస్తాయి. కొమ్మలు తెల్లబారి
పోతాయి. చెట్లు నాశనం చేయబడతాయి.

### ప్రజలు దుఃఖించుట

8 పెళ్లికి సిద్ధంగా ఉండి తనకు కాబోయే భర్త
అప్పుడే చంపివేయబడిన ఒక యువతిలా
ఏడ్వండి.
9 యాజకులారా! యెహోవా సేవకులారా!
ఏడ్వండి. ఎందుకంటే యెహోవా ఆలయంలో
ధాన్యార్పణం, పానీయార్పణం ఇక ఉండవు.
10 పొలాలు పాడు చేయబడ్డాయి. చివరికి నేల
కూడా విలపిస్తుంది. ఎందుకనగా ధాన్యం పాడై
పోయింది. కొత్త ద్రాక్షారసం ఎండిపోయింది.
ఒలీవ నూనె ఇకలేదు.
11 రైతులారా విచారించండి! ద్రాక్షాతోట రైతులారా
గట్టిగా ఏడ్వండి. గోధుమ, బార్లీ కోసం ఏడ్వండి!
ఎందుకంటే పొలంలోని పంట నష్టమైంది.
12 ద్రాక్షా వల్లులు ఎండిపోయాయి. అంజూరపు
చెట్టు చస్తోంది. దానిమ్మ చెట్టు, ఖర్జూరపు చెట్టు,
ఆపిల్ చెట్టు, పొలములోని చెట్లు అన్నీ ఎండి
పోయాయి. ప్రజల్లో సంతోషం చచ్చింది.
13 యాజకులారా, మీ విచార సూచక వస్త్రాలు
ధరించి గట్టిగా ఏడ్వండి. బలిపీఠపు సేవకులారా,
గట్టిగా ఏడ్వండి. నా దేవుని సేవకులారా, మీరు
మీ విచార సూచక వస్త్రాలతోనే నిద్రపోతారు.
ఎందుకంటే దేవుని ఆలయంలో ధాన్యార్పణం,
పానీయార్పణం ఇకమీదట ఉండవు.

### మిడుతల భయంకర నాశనం

14ఉపవాసం ఉండాల్సిన ఒక ప్రత్యేక సమయం
ఉంటుందని ప్రజలతో చెప్పు. ప్రత్యేకమైన ఒక సమా
వేశం కోసం ప్రజల్ని పిలువుము. దేశంలో నివసిస్తున్న
నాయకులను, ప్రజలందరిని సమావేశ పరచు. నీ దేవు
డైన యెహోవా ఆలయానికి వారిని తీసుకొని వచ్చి
యెహోవాకు ప్రార్థించండి.
15దుఃఖపడండి! ఎందుకంటే యెహోవా ప్రత్యేక
దినం సమీపంగా ఉంది. ఆ సమయంలో సర్వశక్తి
మంతుడైన దేవుని దగ్గర నుండి శిక్ష ఒక దాడిలా
వస్తుంది.16మన ఆహారం పోయింది. మన దేవుని
ఆలయం నుండి ఆనందం, సంతోషం పోయాయి.
17మనం విత్తనాలు విత్తాం, కాని ఆ విత్తనాలు
ఎండిపోయి చచ్చి మట్టిలో పడివున్నాయి. మన
మొక్కలు ఎండిపోయి చచ్చిపోయాయి. మన
కొట్లాలు ఖాళీ అయిపోయి పడిపోతున్నాయి.
18జంతువులు ఆకలితో మూలుగుతున్నాయి.
పశువుల మందలు గందరగోళంగా తిరుగుతున్నాయి.

అవి మేసేందుకు గడ్డి లేదు. గొర్రెలు చస్తున్నాయి.
19యెహోవా, సహాయంకోసం నీకు నేను మొరపెడు
తున్నాను. అగ్ని మా పచ్చటి పొలాలను ఎడారిగా
మార్చేసింది. పొలంలోని చెట్లన్నింటినీ జ్వాలలు కాల్చి
వేశాయి. 20అడవి జంతువులకు కూడ నీ సహాయం
కావాలి. కాలువలు ఎండిపోయాయి, నీళ్ళు లేవు! మా
పచ్చటి పొలాలను అగ్ని ఎడారిగా మార్చివేసింది.

### రాబోతున్న యెహోవా దినం

2 సీయోనులో బూర ఊదండి. నా పవిత్ర
పర్వతం మీద హెచ్చరికగా కేకవేయండి.
దేశంలో నివసించే ప్రజలందరూ భయంతో వణు
కుదురు గాక. యెహోవా ప్రత్యేకదినం వస్తుంది.
యెహోవా ప్రత్యేక దినం సమీపంగా ఉంది.
2 అది ఒక చీకటి దుర్దినంగా ఉంటుంది. అది అంధ
కారపు మేఘాలు కమ్మిన దినంగా ఉంటుంది.
సూర్యోదయాన సైన్యం పర్వతాలలో నిండి
ఉండటం నీవు చూస్తావు. అది మహాశక్తిగల
సైన్యంగా ఉంటుంది. ఇంతకుముందు ఇలాంటిది
ఏదీ, ఎన్నడూ ఉండలేదు. మరియు ఇలాంటిది
ఏదీ, ఎన్నటికీ మరోసారి ఉండదు.
3 మండుచున్న అగ్నిలా సైన్యం దేశాన్ని నాశనం
చేస్తుంది. వారి ఎదుట దేశం ఏదెను వనంలా
ఉంది. వారి వెనుక దేశం ఖాళీ ఎడారిలా ఉంది.
ఏదీ వారినుండి తప్పించుకోలేదు.
4 వారు గుర్రాల్లా కనబడతారు. యుద్ధ గుర్రాల్లా
వారు పరుగెత్తుతారు.
5 వారి మాట వినండి. అది పర్వతాలమీద రథాలు
పరుగులెత్తిన ధ్వనిలా ఉంది. అది పొట్టును కాల్చి
వేస్తోన్న అగ్నిజ్వాలల శబ్దంలా ఉంది. వారు శక్తిగల
ఒక జనం. వారు యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు.
6 ఈ సైన్యం ఎదుట ప్రజలు భయంతో వణుకు
తారు. వారి ముఖాలు భయంతో తెల్లబడి
పోతాయి.
7 ఆ సైనికులు వేగంగా పరుగెత్తుతారు. ఆ సైనికులు
గోడలు ఎక్కుతారు. ప్రతి సైనికుడూ తిన్నగా
ముందుకు దూసుకొనిపోతాడు. వారు వారి
మార్గంనుండి తప్పుకోరు.
8 వారు ఒకరి మీద ఒకరు పడి తొక్కిసలాడరు.
ప్రతి సైనికుడూ తన సొంత దారిలో నడుస్తాడు.
ఒక సైనికుడు దెబ్బ తగిలి పడిపోతే మిగిలిన
వారు ముందుకు వెళ్లిపోతూనే ఉంటారు.
9 వారు పట్టణానికి పరుగెత్తుతారు. వారు త్వరగాగోడ
ఎక్కుతారు. వారు ఇండ్లలోనికి ఎక్కిపోతారు.
వారు ఒక దొంగలా కిటికీల్లో నుండి ప్రవేశిస్తారు.
10 వారి ఎదుట భూమి, ఆకాశం వణుకుతాయి.
సూర్యుడు, చంద్రుడు చీకటి అవుతాయి.
మరియు నక్షత్రాలు ప్రకాశించటం మాని
వేస్తాయి.
11 యెహోవా తన సైన్యాన్ని గట్టిగా పిలుస్తాడు.
ఆయన విడిది చాలా విశాలమైంది. ఆ సైన్యం
ఆయన ఆదేశాలకు లోబడుతుంది. ఆ సైన్యం
చాలా శక్తిగలది. యెహోవా ప్రత్యేక దినం ఒక
గొప్ప భయంకర దినం. ఏ మనిషీ దానిని ఆపు
చేయలేడు.

### ప్రజలు మార్పు చెందాలని యెహోవా చెప్పుట

12 ఇది యెహోవా సందేశం: "ఇప్పుడు మీ పూర్ణ
హృదయంతో నా దగ్గరకు తిరిగిరండి. మీరు
చెడ్డ పనులు చేసారు. ఏడువండి, ఏడువండి.
భోజనం ఏమీ తినకండి.
13 మీ వస్త్రాలు కాదు మీ హృదయాలు చింపు
కోండి." మీ దేవుడైన యెహోవా దగ్గరకు తిరిగి
రండి. ఆయన దయ, జాలిగలవాడు. ఆయన
త్వరగా కోపపడడు. ఆయనకు ఎంతో ప్రేమ
ఉంది. ఒకవేళ ఆయన తలపెట్టిన చెడ్డ శిక్ష విష
యంలో ఆయన తన మనస్సు మార్చు
కొంటాడేమో.
14 ఒకవేళ యెహోవా తన మనస్సు మార్చుకొంటా
డేమో ఎవరికి తెలుసు. మరియు ఒకవేళ ఆయన
తన వెనుక నీ కోసం ఒక ఆశీర్వాదం విడిచి
పెడతాడేమో. అప్పుడు నీవు నీ యెహోవా
దేవునికి ధాన్యార్పణం పానీయార్పణలు అర్పించ
వచ్చు.

### యెహోవాను ప్రార్థించు

15 సీయోనులో బూర ఊదండి. ఒక ప్రత్యేక సమా
వేశం ఏర్పాటు చేయండి. ఒక ప్రత్యేక ఉపవాస
సమయం ఏర్పాటు చేయండి.
16 ప్రజలను సమావేశం చేయండి. ఒక ప్రత్యేక
సమావేశం ఏర్పాటు చేయండి. పెద్దవాళ్లను సమా
వేశపరచండి. చిన్న పిల్లలను, తల్లుల స్తనములను
ఇంకా కుడిచే చిన్న శిశువులను సహితం సమావేశ
పరచండి. పెండ్లి కుమార్తెను, ఆమె పెండ్లి కుమా
రున్ని వారి పడక గది నుండి బయటకు
రప్పించండి.
17 యాజకులను, యెహోవా సేవకులను మండ
పానికి బలిపీఠానికి మధ్య విలపించనివ్వండి. ఆ
ప్రజలందరూ ఈ విషయాలు చెప్పాలి:
"యెహోవా, నీ ప్రజలను కరుణించు. నీ ప్రజ
లను సిగ్గుపడనియ్యకు. నీ ప్రజలను గూర్చి
ఇతరులను హేళన చేయనియ్యకు. ఇతర
దేశాల్లోని ప్రజలు నవ్వుతూ 'వారి దేవుడు
ఎక్కడ?'" అని చెప్పనియ్యకు.

### యెహోవా దేశాన్ని మరల ఇచ్చివేస్తాడు

18 అప్పుడు యెహోవా ఈ దేశాన్ని గూర్చి ఉద్వేగ
పడ్డాడు. తన ప్రజల విషయం ఆయన విచార
పడ్డాడు.
19 యెహోవా తన ప్రజలతో మాట్లాడాడు.
ఆయన చెప్పాడు, "నేను మీకు ధాన్యం, ద్రాక్షా
రసం, నూనె పంపిస్తాను. అవి మీకు సమృద్ధిగా
ఉంటాయి. రాజ్యాల మధ్య నేను మిమ్మల్ని
ఇంకెంత మాత్రం అవమానించను.
20 లేదు. ఆ ఉత్తరపు ప్రజలను మీ దేశంనుండి
వెళ్ళగొడతాను. ఎండిపోయిన ఖాళీ దేశానికి వారు
వెళ్ళేటట్టు నేను చేస్తాను. వారిలో కొందరు
తూర్పు సముద్రానికి వెళ్తారు. మరి కొందరు
పడమటి సముద్రానికి వెళ్తారు. ఆ ప్రజలు అంత
భయంకరమైన పనులు చేశారు. కాని వారు చచ్చి
కుళ్ళిపోతున్న దానిలా ఉంటారు. అక్కడ భయం
కరమైన కంపు కొడుతుంది!"

### దేశం మరల కొత్తదిగా చేయబడుతుంది

21 దేశమా, భయపడకు. సంతోషించి ఆనందంతో
నిండి ఉండు. ఎందుకంటే యెహోవా గొప్ప
కార్యాలు చేస్తాడు.
22 పొలంలోని పశువులారా, భయపడవద్దు. అర
ణ్యపు బీళ్లు మరలా గడ్డి మొలిపిస్తాయి. చెట్ల
ఫలాలు ఫలిస్తాయి. అంజూరపు చెట్లు, మరియు
ద్రాక్షావల్లులు మరిన్ని ఫలాలు ఫలిస్తాయి.
23 కనుక సీయోను ప్రజలారా, సంతోషించండి.
మీ యెహోవా దేవునియందు ఆనందంగా
ఉండండి. ఎందుకంటే ఆయన తన మంచి
తనాన్ని చూపి వర్షం కురిపిస్తాడు. ఇదివరకటివలె
ఆయన మీకు ముందటి వర్షాలు కడపటి వర్షాలు
కురిపిస్తాడు.
24 మరియు కళ్లాలు గోధుమలతో నిండిపోయి
ఉంటాయి. క్రొత్త ద్రాక్షారసం మరియు ఒలీవ
నూనె సీసాలలో పొర్లిపోతూంటాయి.
25 "నేనే యెహోవాను, నా సైన్యాన్ని మీకు విరో
ధంగా పంపించాను. ఆ దండు మిడుతలు, ఆ
దూకుడు మిడుతలు, ఆ వినాశ మిడుతలు
మరియు ఆ కోత మిడుతలు మీ వాటిని తిని
వేశాయి. కాని నేనే యెహోవాను, ఆ కష్టకాల
సంవత్సరాలన్నింటికీ తిరిగి మీకు నేను
చెల్లిస్తాను.
26 అప్పుడు మీకు తినేందుకు సమృద్ధిగా
ఉంటుంది. మీరు తృప్తిగా ఉంటారు. మీ
యెహోవా దేవుని నామం మీరు స్తుతిస్తారు.
మీకోసం ఆయన ఆశ్చర్యకార్యాలు చేస్తాడు. నా
ప్రజలు తిరిగి ఎన్నటికీ సిగ్గుపరచబడరు.
27 ఇశ్రాయేలు ప్రజలకు నేను తోడుగా ఉన్నానని
మీరు తెలుసుకొంటారు. మీ దేవుడనైన యెహో
వాను నేనే అని మీరు తెలుసుకొంటారు. మరో
దేవుడు ఎవ్వరూ లేరు. నా ప్రజలు తిరిగి
ఎన్నడూ సిగ్గుపడరు."

### యెహోవా ప్రజలందరికీ తన ఆత్మను ఇస్తానని వాగ్దానం చేయటం

28 "దీని తరువాత ప్రజలందరి మీద నా ఆత్మను
కుమ్మరిస్తాను (ఇస్తాను). మీ కుమారులు, మీ
కుమార్తెలు ప్రవచిస్తారు. మీ ముసలివాళ్లు కలలు
కంటారు. మీ యువకులు దర్శనాలు చూస్తారు.
29 ఆ సమయంలో నా సేవకుల మీద, సేవకు
రాండ్ర మీద కూడ నా ఆత్మను కుమ్మరిస్తాను
(ఇస్తాను).
30 ఆకాశంలోను, భూమిమీదను ఆశ్చర్యకార్యాలు
నేను చూపిస్తాను. రక్తం, అగ్ని, దట్టమైన పొగ
ఉంటాయి.
31 సూర్యుడు చీకటిగా మార్చబడతాడు. చంద్రుడు
రక్తంగా మార్చబడతాడు. అప్పుడు యెహోవా
యొక్క మహా భయంకర దినం వస్తుంది!
32 అప్పుడు యెహోవా నామాన్ని స్మరించే ఏ
వ్యక్తి అయినా సరే రక్షింపబడతాడు. సీయోను
కొండమీద యెరూషలేములో రక్షింపబడిన
మనుష్యులు ఉంటారు. ఇది సరిగ్గా యెహోవా
చెప్పినట్టే జరుగుతుంది. మిగిలిన వారిలో
యెహోవా పిలిచిన వారు ఉంటారు.

### యూదా శత్రువులకు శిక్ష తప్పదని యెహోవా చెప్పటం

3 "ఆ రోజుల్లో, ఆ సమయంలో యూదాను,
యెరూషలేమును నేను తిరిగి తీసికొని వస్తాను.
2 రాజ్యాలన్నింటిని కూడా నేను సమావేశ పరుస్తాను.
ఈ రాజ్యాలన్నింటిని క్రిందికి యెహోషాపాతు లోయ
లోకి నేను తీసుకొని వస్తాను. అక్కడ వారికి నేను
తీర్పు చెప్తాను. ఆ రాజ్యాలు నా ఇశ్రాయేలు ప్రజలను
చెదరగొట్టాయి. వారు ఇతర రాజ్యాలలో జీవించేలా
వారు వారిని బలవంత పెట్టారు. కనుక ఆ రాజ్యాలను
శిక్షిస్తాను. ఆ రాజ్యాలు నా దేశాన్ని విభజించేశాయి.
3 నా ప్రజల కోసం వారు చీట్లు వేసి కొన్నారు. ఒక
వేశ్యను కొనేందుకు వారు ఒక బాలుని అమ్మికొన్నారు.
మరియు తాగడానికి ద్రాక్షా మద్యం కొనేందుకు వారు
ఒక బాలికను అమ్మికొన్నారు.
4 "తూరూ! సీదోనూ! ఫిలిష్తీలోని అన్ని
ప్రాంతాలూ! మీరు నాకు ముఖ్యం కాదు. నేను ఏదైనా
చేసినందుకు మీరు నన్ను శిక్షిస్తున్నారా? మీరు నన్ను
శిక్షిస్తున్నారని తలస్తుండవచ్చు. కానీ త్వరలో నేను

మిమ్మల్ని శిక్షిస్తాను. 5నా వెండి, బంగారం మీరు
తీసుకొన్నారు. నా ప్రశస్త ఐశ్వర్యాలు మీరు తీసుకొని
మీమీ ఆలయాల్లో పెట్టుకొన్నారు.
6"యూదా, యెరూషలేము ప్రజలను మీరు గ్రీకు
వాళ్లకు అమ్మేశారు. ఆ విధంగా మీరు వారిని దేశానికి
దూరంగా తీసికొని వెళ్లగలిగారు. 7మీరు నా ప్రజలను
అంత దూరస్థలానికి పంపించి వేశారు. కానీ నేను వారిని
వెనుకకు తీసికొని వస్తాను. మరియు మీరు చేసిన
దానికి నేను మిమ్మల్ని శిక్షిస్తాను. 8మీ కుమారులను,
కుమార్తెలను యూదా ప్రజలకు నేను అమ్మివేస్తాను.
అప్పుడు వారు ఇంకా దూరంలో ఉన్న షెబాయీయు
ప్రజలకు అమ్మివేస్తారు." ఆ విషయాలు యెహోవా
చెప్పాడు.

### యుద్ధానికి సిద్ధపడండి

9 రాజ్యాలలో దీనిని ప్రకటించండి: యుద్ధానికి సిద్ధ
పడండి! బలాఢ్యులను మేల్కొలపండి! యుద్ధ
వీరులందరినీ దగ్గరగా రానివ్వండి, వారిని రాని
వ్వండి!
10 మీ నాగటి రేకులను చెడగొట్టి కత్తులు చేయండి.
మీ పోటు కత్తులు చెడగొట్టి ఈటెలు చేయండి.
బలహీనుడ్ని కూడ "నేను బలాఢ్యుడను" అని
చెప్పనీయండి.

11 సకల రాజ్యాల్లారా, త్వరపడండి! ఆ స్థలానికి
కూడి రండి! యెహోవా, బలమైన నీ సైనికు
లను తీసికొని రమ్ము.
12 రాజ్యాల్లారా మేల్కొనండి. యెహోషాపాతు
లోయలోనికి రండి. చుట్టు పక్కల రాజ్యాల
న్నింటికీ తీర్పు చెప్పేందుకు అక్కడ నేను
కూర్చుంటాను.
13 పంట సిద్ధంగా ఉంది గనుక కొడవలి పట్టుకొని
రండి. రండి, ద్రాక్షా గానుగ నిండిపోయింది గనుక
ద్రాక్షాపండ్ల మీద నడవండి. వారి దుర్మార్గం చాలా
ఉంది గనుక పీపాలు నిండిపోయి పొర్లిపోతాయి.
14 తీర్మాన లోయలో ఎంతో మంది ప్రజలు
ఉన్నారు. యెహోవా ప్రత్యేక దినం తీర్మాన
లోయకు సమీపంగా ఉంది.
15 సూర్యుడు, చంద్రుడు చీకటి అవుతాయి. నక్ష
త్రాలు ప్రకాశించడం మానివేస్తాయి.
16 యెహోవా దేవుడు సీయోనులో నుండి కేక
వేస్తాడు. యెరూషలేము నుండి ఆయన కేక
వేస్తాడు. మరియు ఆకాశం, భూమి కంపిస్తాయి.
కాని యెహోవా దేవుడే ఆయన ప్రజలకు క్షేమ
స్థానం. ఇశ్రాయేలు ప్రజలకు ఆయన క్షేమ
స్థానంగా ఉంటాడు.
17 "మీ యెహోవా దేవుడను నేనే అని అప్పుడు
మీరు తెలుసుకొంటారు. నా పవిత్ర పర్వతమైన
సీయోనులో నేను నివసిస్తాను. యెరూషలేము
పవిత్రం అవుతుంది. పరాయివారు ఆ పట్టణంలో
నుండి మరల ఎన్నడూ దాటి వెళ్లరు."

### యూదాకు కొత్త జీవితం వాగ్దానం చేయబడుట

18 "ఆ రోజున పర్వతాల నుండి తియ్యటి ద్రాక్షా
రసం కారుతుంది. కొండల్లో పాలు, తేనెలు
ప్రవహిస్తాయి. మరియు యూదాలోని ఖాళీ నదు
లన్నిటిలో నీళ్లు ప్రవహిస్తాయి. యెహోవా ఆల
యంలోనుండి ఒక నీటి ఊట చిమ్ముతుంది.
అది షిత్తీము లోయకు నీళ్లు ఇస్తుంది.
19 ఈజిప్టు ఖాళీ అవుతుంది. ఎదోము ఖాళీ అరణ్యం
అవుతుంది. ఎందుకంటే యూదా ప్రజలపట్ల
వారు క్రూరంగా ఉన్నారు. వారి దేశంలోని నిర్దోష
ప్రజలను వారు చంపివేశారు.
20 కాని యూదాలో మనుష్యులు ఎల్లప్పుడూ నివసి
స్తారు. అనేక తరాల వరకు యెరూషలేములో
మనుష్యులు నివసిస్తారు.
21 ఆ మనుష్యులు చాలా మంది ప్రజలను
చంపేశారు. కనుక ఆ ప్రజలను నేను నిజంగా
శిక్షి స్తాను!" యెహోవా దేవుడు సీయోనులో
నివసిస్తాడు.

# ఆమోసు

### ఉపోద్ఘాతం

1 ఇది ఆమోసు వర్తమానం. ఆమోసు తెకోవ నగరా
నికి చెందిన ఒక గొర్రెల కాపరి. ఉజ్జీయా
యూదాకు రాజుగాను, యెహోయాషు కుమారుడు
యరొబాము ఇశ్రాయేలుకు రాజుగాను ఉన్న కాలంలో
ఆమోసు ఇశ్రాయేలును గూర్చి దర్శనాలు చూశాడు.
ఇది భూకంపం రావటానికి రెండు సంవత్సరాల
ముందటి విషయం.

### సిరియాకు శిక్ష

2 ఆమోసు ఇలా అన్నాడు: యెహోవా సీయో
నులో సింహంలా గర్జిస్తాడు. ఆయన గంభీర
స్వరం యెరూషలేము నుండి గర్జిస్తుంది.
గొర్రెల కాపరుల పచ్చిక బయళ్లు ఎండి
పోతాయి. కర్మెలు పర్వతం* సహితం ఎండి
పోతుంది.

3యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“దమస్కు* ప్రజలు చేసిన అనేక నేరాలకు నేను
వారిని నిశ్చయంగా శిక్షిస్తాను. ఎందుకంటే వారు గిలా
దును* ధాన్యం రాలగొట్టే ఇనుప కడ్డీలతో నలుగ
గొట్టారు. 4కావున హజాయేలు* ఇంటిలో (సిరియా)
నేను అగ్నిని పుట్టిస్తాను. ఆ అగ్ని బెన్హదదు* ఉన్నత
బురుజులను నాశనం చేస్తుంది.
5“దమస్కు ద్వారాల మీద ఉన్న బలమైన కడ్డీలను
విరుగగొడతాను ఆవెను లోయలో సింహాసనంపై
కూర్చున్నవానిని నేను నాశనం చేస్తాను. బెతేదేనులో
రాజదండం పట్టిన రాజును నేను నాశనం చేస్తాను.
సిరియా ప్రజలు ఓడింపబడతారు. ప్రజలు వారిని
కీరు దేశానికి తీసుకుపోతారు.” యెహోవా ఆ విష
యాలు చెప్పాడు.

### ఫిలిష్తీయులకు శిక్ష

6యెహోవా ఇది చెపుతున్నాడు: “గాజా* ప్రజలు
చేసిన అనేక నేరాలకు నేను వారిని నిశ్చయంగా
శిక్షిస్తాను. ఎందువల్లనంటే వారు ఒక దేశ ప్రజలందరినీ
చెరబట్టి, వారిని ఎదోముకు* బానిసలుగా పంపారు.
7కావున గాజా ప్రాకారం మీదికి నేను అగ్నిని పంపుతాను.
గాజాలోని ఉన్నత బురుజులను అగ్ని దహించివేస్తుంది.
8మరియు నేను అష్డోదు*లో సింహాసనంపై కూర్చున్న
వానిని నాశనం చేస్తాను. అష్కెలోనులో* రాజదండం
ధరించిన రాజును నేను నాశనం చేస్తాను. నేను
ఎక్రోను* ప్రజలను నాశనం చేస్తాను. ఇంకా బతికివున్న
ఫిలిష్తీయులు అప్పుడు మరణిస్తారు.” దేవుడైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### ఫెనీషియా (ఫెనీకే) వారికి శిక్ష

9యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“తూరు* ప్రజలు చేసిన అనేక నేరాలకు నేను వారిని
నిశ్చయంగా శిక్షిస్తాను. ఎందువల్లనంటే వారు ఒక దేశ
ప్రజలనందరినీ చెరబట్టి, వారిని బానిసలుగా ఎదోముకు
పంపారు. తమ సోదరులతో (ఇశ్రాయేలు) చేసుకొన్న
ఒడంబడికను వారు గుర్తు పెట్టుకోలేదు. 10అందువల్ల
తూరు గోడల మీద నేను అగ్నిని రగుల్చుతాను.
తూరులో ఎత్తయిన బురుజులను ఆ అగ్ని నాశనం
చేస్తుంది.”

---

**కర్మెలు పర్వతం** ఇది ఇశ్రాయేలులో ఉన్న పర్వతం. దీనికి “దేవుని ద్రాక్షాతోట” అని అర్థం. అనగా ఇది మిక్కిలి సారవంతమైన కొండ అని భావం.

**దమస్కు** (డెమాస్కస్) ఇది సిరియా రాజధాని.

**గిలాదు** మనష్షే వంశీయులు కొందరు నివసించిన ప్రాంతం. చూడండి సంఖ్యా. 26:29.

**హజాయేలు** సిరియా రాజు. తాను రాజు కావటానికి బెన్హదదును చంపాడు.

**బెన్హదదు** ఇతడు సిరియా రాజైన హజాయేలు కుమారుడు. ఇతని పేరు, హజాయేలు చేత చంపబడిన వాని పేరు (బెన్హదదు) ఒకటే.

**గాజా** ఇది ఫిలిష్తీయుల ఒక ముఖ్యనగరం.

**ఎదోము** ఇశ్రాయేలుకు ఆగ్నేయంగా ఉన్న రాజ్యం.

**అష్డోదు** అనేది ఫిలిష్తీయుల ముఖ్యనగరం.

**అష్కెలోను** ఫిలిష్తీయుల ముఖ్యనగరం.

**ఎక్రోను** ఫిలిష్తీయుల ముఖ్యనగరం.

**తూరు** ఫెనీషియాకు (ఫెనీకే) తూరు ముఖ్య పట్టణం.

### ఎదోమీయులకు శిక్ష

11యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“ఎదోము ప్రజలు చేసిన అనేక నేరాలకు వారిని నేను
నిశ్చయంగా శిక్షిస్తాను. ఎందువల్లనంటే ఎదోము కత్తి
పట్టి తన సోదరుని (ఇశ్రాయేలు) వెంటాడాడు.
ఎదోము దయ చూపలేదు. ఎదోము కోపం శాశ్వతంగా
కొనసాగింది. అతడు ఒక క్రూర జంతువులా ఇశ్రాయే
లును చీల్చి చెండాడాడు. 12కావున తేమానులో*
నేను అగ్నిని రగుల్చుతాను. ఆ అగ్ని బొస్రా*లో
ఉన్నతమైన బురుజులను నాశనం చేస్తుంది.”

### అమ్మోనీయులకు శిక్ష

13యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“అమ్మోను ప్రజలు చేసిన అనేక నేరాలకు నేను వారిని
నిశ్చయంగా శిక్షిస్తాను. ఎందువల్లనంటే వారు గిలాదులో
గర్భిణీ స్త్రీలను చంపారు. ఆ ప్రాంతాన్ని కలుపుకొని
తమ రాజ్యాన్ని విస్తరింపజేయటానికి అమ్మోను ప్రజలు
ఈ పని చేశారు. 14కావున రబ్బా* గోడమీద నేను
అగ్ని రగుల్చుతాను. అది రబ్బాలోని ఉన్నతమైన
బురుజులను నాశనం చేస్తుంది. వారి దేశంలోకి సుడిగాలి
వచ్చినట్లు వారికి కష్టాలు వస్తాయి. 15 అప్పుడు వారి
రాజులు, నాయకులు పట్టుబడతారు. వారంతా కలిసి
చెరపట్టబడతారు.” యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.

### మోయాబుకు శిక్ష

2 యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“మోయాబు ప్రజలు చేసిన అనేక నేరాలకు నేను
వారిని నిశ్చయంగా శిక్షిస్తాను. ఎందుకంటే, ఎదోము
రాజు యొక్క ఎముకలు సున్నమయ్యేలా మోయాబు
వారు కాల్చివేశారు. 2కావున మోయాబులో నేను అగ్నిని
రగుల్చుతాను. ఆ అగ్ని కెరీయోతు* ఉన్నత బురుజు
లను నాశనం చేస్తుంది. భయంకరమైన అరుపులు,
బూర నాదాలు వినబడతాయి. మోయాబు చని
పోతాడు. 3అలా నేను మోయాబు రాజులను నిర్మూలి
స్తాను. మరియు మోయాబు నాయకు లందరినీ నేను
చంపివేస్తాను.” యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### యూదాకు శిక్ష

4యెహోవా ఇలా చెపుతున్నాడు: “యూదా వారు
చేసిన అనేక నేరాలకు నేను వారిని నిశ్చయంగా
శిక్షిస్తాను. ఎందుకంటే, వారు యెహోవా ఆజ్ఞలను
పాటించ నిరాకరించారు. వారాయన ఆజ్ఞలను స్వీక
రించలేదు. వారి పూర్వీకులు అబద్ధాలను నమ్మారు.
ఆ అబద్ధాలే యూదా ప్రజలను దేవుని అనుసరించ
కుండా చేశాయి. 5కావున యూదాలో అగ్నిని పుట్టి
స్తాను. ఆ అగ్ని యెరూషలేములోగల ఉన్నత బురు
జులను నాశనం చేస్తుంది.”

### ఇశ్రాయేలుకు శిక్ష

6యెహోవా ఇది చెపుతున్నాడు: “ఇశ్రాయేలు
వారు చేసిన అనేక నేరాలకు నేను వారిని నిశ్చయంగా
శిక్షిస్తాను. ఎందుకంటే స్వల్పమైన వెండికొరకు వారు
మంచివారిని, అమాయకులైన ప్రజలను అమ్మివేశారు.
వారు ఒక జత చెప్పుల విలువకు పేదవారిని అమ్మి
వేశారు. 7పేద ప్రజలను మట్టికరిచేలా కిందికి తోసి,
వారిపై తాము నడిచారు. బాధపడేవారి గోడును వారు
ఆలకించరు. తండ్రులు, కొడుకులు ఒకే స్త్రీతో
సంభోగిస్తారు. వారు నా పవిత్ర నామాన్ని పాడుచేసారు.
8పేద ప్రజలవద్ద వారు బట్టలు తీసుకొని, బలిపీఠాల
ముందు ఆరాధన జరిపేటప్పుడు వాటిమీద కూర్చుం
టారు. వారు పేదవారికి డబ్బు అప్పుగా ఇచ్చి, వారి
దుస్తులను తాకట్టు పెట్టుకున్నారు. ప్రజలు అపరాధ
రుసుము చెల్లించేలా వారు చేస్తారు. ఆ డబ్బును వారు
తమ దేవుని ఆలయంలో తాగటానికి ద్రాక్షా మద్యం
కొనడానికి వినియోగిస్తారు.
9“కాని అమోరీయులను* వారి ముందర నాశనం
చేసింది నేనే. అమోరీయులు దేవదారు వృక్షమంత
ఎత్తయిన వారు. వారు సింధూర వృక్షమంత బలంగల
వారు. కాని, పైన వాటి పండ్లను, కింద వాటి వేళ్లను
నేను నాశనం చేశాను. 10ఈజిప్టు దేశం నుండి మిమ్మల్ని
తీసుకొని వచ్చినది నేనే. అమోరీయుల దేశాన్ని మీరు
ఆక్రమించటంలో నేను మీకు సహాయం చేశాను. దీనికై
నలభై సంవత్సరాలు మిమ్మల్ని ఎడారిలో నడిపించాను.
11మీ కుమారులలో కొంత మందిని నేను ప్రవక్తలుగా
చేశాను. మీ యువకులలో కొంత మందిని నాజీరులుగా
నియమించాను. ఇశ్రాయేలు ప్రజలారా ఇది నిజం.”
యెహోవా ఈ విషయాలు చెప్పాడు. 12“కాని
నాజీరులు* ద్రాక్షామద్యం తాగేలా మీరు చేశారు. దేవుని
మాటలు ప్రకటించవద్దని మీరు ప్రవక్తలకు చెప్పారు.
13మీరు నాకు పెద్ద భారమైనారు. అధికమైన గడ్డివేసిన

---

**తేమాను** ఎదోము దేశంలో ఉత్తర భాగానగల ఒక నగరం.

**బొస్రా** ఎదోము రాజ్యంలో దక్షిణ భాగానగల ఒక నగరం.

**రబ్బా** అమ్మోనీయుల రాజధాని.

**కెరీయోతు** మోయాబులో ఒక నగరం.

**అమోరీయులు** ఇశ్రాయేలీయులు రాక ముందు కనానులో నివసించిన ఒక ప్రజ. ఇశ్రాయేలీయులను మోషే ఎడారిలో నడిపిస్తూ ఉండగా వారిని భయపెట్టినది వీరే. చూడండి సంఖ్యా. 13:33.

**నాజీరు** దేవునికి వాగ్దానం చేయబడిన వ్యక్తి. హెబ్రీ భాషలో దీనికి, ‘ప్రత్యేకించబడు’ అని అర్థం.

బండిలా నేను చాలా కిందకి వంగిపోయాను. 14ఎవ్వరూ
తప్పించుకోలేరు. ఎంత వేగంగా పరుగెత్తగలవాడైనా
తప్పించుకోలేడు. బల వంతులు బలంగా లేరు. సైని
కులు తమను తాము రక్షించుకోలేరు. 15విల్లంబులు,
బాణాలు చేతబట్టిన వారు బ్రతకరు. వేగంగా పరుగిడ
గలవారు తప్పించుకోలేరు. గుర్రాలు ఎక్కినవారు
ప్రాణాలతో తప్పించుకోలేరు. 16ఆ సమయంలో
మిక్కిలి బలవంతులైన సైనికులు సహితం పారిపోతారు.
వారు బట్టలు వేసుకొనటానికి కూడా సమయం
తీసుకోరు.” యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### ఇశ్రాయేలుకు హెచ్చరిక

3 ఇశ్రాయేలు ప్రజలారా, ఈ వర్తమానం వినండి!
ఇశ్రాయేలూ, నిన్ను గురించి యెహోవా ఈ
విషయాలు చెప్పాడు. ఈజిప్టు నుండి ఆయన తీసు
కొని వచ్చిన ఇశ్రాయేలు వంశాల వారందరిని గూర్చినదే
ఈ వర్తమానం. 2“భూమి మీద అనేక వంశాలున్నాయి.
కాని మిమ్మల్ని మాత్రమే నేను ఎంపికచేసి ప్రత్యేకంగా
ఎరిగియున్నాను. అయితే, మీరు నాపై తిరుగుబాటు
చేశారు. కావున మీ పాపాలన్నిటికీ నేను మిమ్మల్ని
శిక్షిస్తాను.”

### ఇశ్రాయేలు శిక్షకు కారణం

3అంగీకారం లేకుండా ఇద్దరు వ్యక్తులు కలిసి నడవ
లేరు. 4అడవిలో వున్న సింహం ఒక జంతువును పట్టు
కున్న తరువాతనే గర్జిస్తుంది. తన గుహలో వున్న ఒక
యువ కిశోరం గర్జిస్తూ ఉందంటే, అది ఏదో ఒక
దానిని పట్టుకున్నదని అర్థం. 5బోనులో ఆహారం లేక
పోతే ఒక పక్షి ఆ బోనులోకి ఎగిరిరాదు. బోను
మూసుకుపోతే, అది అందులో చిక్కుతుంది.
6హెచ్చరిక చేసే బూరనాదం వినబడితే ప్రజలు
భయంతో వణుకుతారు. ఒక నగరానికి ఏదైనా ముప్పు
వాటిల్లిందంటే, దానిని యెహోవాయే కలుగ జేసినట్లు.
7నా ప్రభువైన యెహోవా ఏదైనా చేయటానికి నిర్ణ
యించవచ్చు. కాని ఆయన ఏదైనా చేసేముందు
ఆయన తన పథకాలను తన సేవకులైన ప్రవక్తలకు
తెలియజేస్తాడు. 8ఒక సింహం గర్జిస్తే ప్రజలు భయ
పడతారు. యెహోవా మాట్లాడితే, ప్రవక్తలు దానిని
ప్రవచిస్తారు.
9-10అష్డోదు, ఈజిప్టులలో ఉన్న ఎత్తయిన బురు
జులు ఎక్కి ఈ వర్తమానం ప్రకటించండి: “మీరు
సమరయ (షోమ్రోను) పర్వతాల మీదికి రండి. అక్కడ
మీరు ఒక పెద్ద గందరగోళ పరిస్థితిని చూస్తారు. ఎందు
కంటే, సవ్యమైన జీవితం ఎలా గడపాలో ఆ ప్రజలకు
తెలియదు. సాటి ప్రజలపట్ల వారు క్రూరంగా వ్యవహ
రించారు. అన్యజనుల నుండి వారు వస్తువులను
తీసుకొని వాటిని ఎత్తయిన బురుజులలో దాచివేశారు.
యుద్ధంలో తీసుకున్న వస్తువులతో వారి ఖజానాలు
నిండివున్నాయి.”
11కావున యెహోవా చెపుతున్నదేమంటే: “దేశం
మీదికి ఒక శత్రువు వస్తాడు. ఆ శత్రువు మీ బలాన్ని
హరిస్తాడు. మీ ఎత్తయిన బురుజులలో దాచిన
వస్తువులన్నీ అతడు తీసుకుంటాడు.”
12యెహోవా ఇది చెపుతున్నాడు:

“ఒక సింహం ఒక గొర్రెపిల్ల మీద పడవచ్చు.
ఆ గొర్రెపిల్లలో కొంత భాగాన్నే కాపరి
రక్షించగలడు. సింహం నోటి నుండి అతడు
రెండు కాళ్లను గాని, చెవిలో కొంత భాగాన్ని
గాని బయటకు లాగవచ్చు. అదే మాదిరి,
ఇశ్రాయేలు ప్రజలలో ఎక్కువ మంది
రక్షింపబడరు. సమరయ (షోమ్రోను)లో
నివసిస్తున్న ప్రజలు మంచంలో కేవలం
ఒక మూలను గాని, లేక తమ పాన్పులో
ఒక గుడ్డముక్కను గాని రక్షించుకుంటారు.”

13నా ప్రభువును, దేవుడును, సర్వశక్తిమంతుడును
అయిన యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు:
“యాకోబు వంశాన్ని (ఇశ్రాయేలు) ఈ విషయాలను
గూర్చి హెచ్చరించు. 14ఇశ్రాయేలు పాపం చేసింది.
వారి పాపాలకు నేను వారిని శిక్షిస్తాను. బేతేలులో
వున్న బలిపీఠాలను కూడా నేను నాశనం చేస్తాను.
బలిపీఠపు కొమ్ములు నరికివేయబడతాయి. అవి కింద
బడతాయి. 15శీతాకాలపు విడిదిని, వేసవి విడిదిని కలిపి
నేను నాశనం చేస్తాను. దంతపు ఇండ్లు నాశనం చేయ
బడతాయి. అనేక ఇండ్లు నాశనం చేయబడతాయి.”
యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

### విలాసవంతులైన స్త్రీలు

4 సమరయ (షోమ్రోను) కొండ మీద గల బాషాను
ఆవుల్లారా* నేను చెప్పేది వినండి. మీరు పేద
ప్రజలను గాయపరుస్తారు. ఆ పేద ప్రజానీకాన్ని మీరు
అణగదొక్కుతారు. “మేము తాగటానికి ఏదైనా తీసికొని
రండి!” అని మీరు మీ భర్తలకు చెపుతారు.
2నా ప్రభువైన యెహోవా ఒక వాగ్దానం చేసాడు.
మీకు కష్టాలు వస్తాయని ఆయన తన పవిత్రత సాక్షిగా
చెప్పాడు. శత్రు ప్రజలు మీకు కొంకెలు తగిలించి
లాగుతారు. మీ పిల్లలను లాక్కుపోవటానికి చేపలు
పట్టే గాలాలను ఉపయోగిస్తారు. 3మీ నగరం నాశనం
చేయబడుతుంది. మీ స్త్రీలలో ప్రతి ఒక్కరూ గోడ

---

**బాషాను ఆవులు** అనగా సమరయలోని ఐశ్వర్యవంతులైన
స్త్రీలు. బాషాను పెద్ద ఆవులకు, ఎద్దులకు ప్రసిద్ధి. ఇది
యోర్దాను నదికి తూర్పున ఉన్నది.

కంతలగుండా నగరం నుండి బయటకు పోతారు.
చనిపోయిన మీ పిల్లలను గుట్టమీదకు విసరివేస్తారు.
యెహోవా ఇది చెపుతున్నాడు: 4“బేతేలుకు వెళ్లి
పాపం చేయండి! గిల్గాలుకు వెళ్లి మరింత పాపం
చేయండి. మీ బలులను ఉదయ వేళల్లో ఇవ్వండి.
మీ పంటలో పదవవంతు మూడు రోజులకొకసారి
తీసికొని రండి. 5పులియబెట్టిన పదార్థాన్ని స్తోత్రార్ప
ణగా ఇవ్వండి. స్వేచ్ఛార్పణల విషయం అందరికీ
చెప్పండి. ఇశ్రాయేలూ, నీవు ఈ పనులు చేయటానికి
ఇష్టపడతావు. కావున నీవు వెళ్లి వాటిని చేయి.”
యెహోవా ఇది చెప్పాడు.

6“నిన్ను నా వద్దకు వచ్చేలా చేయటానికి నేను
చాలా పనులు చేశాను. నేను, మీరు తినటానికి ఏమీ
ఆహారం ఇవ్వలేదు. మీ నగరాలలో దేనిలోనూ ఆహారం
ఇవ్వలేదు. అయినా నీవు నా వద్దకు తిరిగి రాలేదు.”
యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

7“నేను వర్షాన్ని కూడా నిలుపు చేశాను. పైగా అది
పంట కోతకు మూడు నెలల ముందు సమయం.
అందువల్ల పంటలు పండలేదు. పిమ్మట ఒక నగరంలో
వర్షం కురిపించి, మరో నగరంలో వర్షం లేకుండా
చేశాను. దేశంలో ఒక భాగంలో వర్షం పడింది. కాని
దేశంలో మరొక ప్రాంతం వర్షాలు లేక పూర్తిగా ఎండి
పోయింది. 8కావున రెండు మూడు నగరాల ప్రజలు
తడబడుతూ నీళ్లకోసం మరొక నగరానికి వెళ్లారు. కాని
అక్కడ ప్రతి ఒక్కరికీ సరిపోయేటంత నీరు లేదు.
అయినా మీరు సహాయం కొరకు నా వద్దకు రాలేదు.”
యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

9“ఎండ వేడిమివల్ల, తెగుళ్లవల్ల మీ పంటలు పాడై
పోయేలా చేశాను. మీ ఉద్యానవనాలను, ద్రాక్షా తోట
లను నేను నాశనం చేశాను. మీ అంజూరపు చెట్లను,
ఒలీవ చెట్లను మిడుతలు తినివేశాయి. కాని మీరు
మాత్రం సహాయం కొరకు నా వద్దకు రాలేదు.”
యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

10“ఈజిప్టు విషయంలో చేసినట్లు నేను మీ మీదికి
రోగాలను పంపించాను. మీ యువకులను నేను కత్తు
లతో సంహరించాను. మీ గుర్రాలను నేను తీసుకు
న్నాను. మీ స్థావరం కుళ్లిన శవాలతో దుర్గంధ పూరితమ
య్యేలా చేశాను. కాని మీరు సహాయం కొరకు నా
వద్దకు తిరిగి రాలేదు.” యెహోవా ఆ విషయాలు
చెప్పాడు. 11సొదొమ, గొమొర్రా నగరాలను నేను
నాశనం చేసినట్లు నేను నిన్ను నాశనం చేశాను. ఆ
నగరాలు పూర్తిగా ధ్వంసమయ్యాయి. పొయ్యిలో
నుండి లాగబడి కాలిన కట్టెలా మీరున్నారు. కాని మీరు
సహాయంకొరకు నా వద్దకు రాలేదు.” యెహోవా
ఈ విషయాలు చెప్పాడు.

12“కావున ఇశ్రాయేలూ, మీకు నేనీ విషయాలు
కలుగజేస్తాను. ఇది మీకు నేను చేస్తాను. ఇశ్రాయేలూ,
మీ దేవుని కలుసుకోటానికి సిద్ధమవ్వు. 13నేనెవరిని?
పర్వతాలను ఏర్పాటు చేసింది నేనే. మీ మనస్సులను*
సృష్టించింది నేనే. ఎలా మాట్లాడాలో ప్రజలకు
నేర్పింది నేనే. సంధ్యవేళను చీకటిగా మార్చేదీ నేనే.
భూమిపైగల పర్వతాలపై నేను నడుస్తాను. ఇట్టి నేను
ఎవరిని? సర్వశక్తిమంతుడగు దేవుడను. నా పేరు
యెహోవా.”

## ఇశ్రాయేలు కొరకు విషాద గీతిక

5 ఇశ్రాయేలు ప్రజలారా, ఈ పాట వినండి. ఈ
విలాపగీతం మిమ్మల్ని గురించినదే.

2 ఇశ్రాయేలు కన్యక పతనమయింది. ఆమె ఇక
లేవలేదు. మట్టిలోపడి ఆమె ఒంటరిగా వదిలి
వేయబడింది. ఆమెను లేవనెత్తే వ్యక్తే లేడు.

3నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు చెపు
తున్నాడు:

“వెయ్యిమంది సైనికులతో నగరం వదిలివెళ్లే
అధికారులు కేవలం వందమంది మనుష్యు
లతో తిరిగి వస్తారు. వందమంది సైనికు
లతో నగరం వదిలి వెళ్లే అధికారులు కేవలం
పదిమంది మనుష్యులతో తిరిగి వస్తారు.”

## తన వద్దకు తిరిగి రమ్మని ఇశ్రాయేలును యెహోవా ప్రోత్సహించుట

4 ఇశ్రాయేలీయులతో యెహోవా ఇలా చెపుతు
న్నాడు: “నన్ను వెదుక్కుంటూ వచ్చి జీవించండి.
5 కాని బేతేలులో వెదకవద్దు. గిల్గాలుకు వెళ్లవద్దు.
సరిహద్దును దాటి బెయేర్షెబాకు వెళ్లకండి. గిల్గాలు
ప్రజలు బందీలుగా తీసుకుపోబడతారు. బేతేలు
నాశనం చేయబడుతుంది.
6 యెహోవా దరిచేరి జీవించండి. మీరు
యెహోవా వద్దకు వెళ్లకపోతే యోసేపు (పది
వంశాలవారు) ఇంటిమీద నిప్పు పడుతుంది. ఆ
అగ్ని యోసేపు ఇంటిని దగ్ధం చేస్తుంది. బేతే
లులో చెలరేగిన ఆ అగ్నిని ఎవ్వరూ ఆపలేరు.
7-9 మీరు యెహోవా కొరకు చూడండి. సప్త ఋషి
నక్షత్రములను మృగశిర నక్షత్రాన్ని సృష్టించినది
ఆయనే. చీకటిని ఉదయ కాంతిగా ఆయన
మార్చుతాడు. పగటిని చీకటిగా ఆయన మార్చు
తాడు. ఆయన సముద్ర జలాలను బయట నేల
మీద కుమ్మరిస్తాడు. ఆయన పేరు యెహోవా!
ఒక బలమైన నగరాన్ని ఆయన సురక్షితంగా

---

**మనస్సులను** గాలిని పుట్టించినది నేనే అని అర్థం.

ఉంచుతాడు. మరో బలమైన నగరం నాశన
మయ్యేలా ఆయన చేస్తాడు."

**ఇశ్రాయేలీయులు చేసిన చెడుపనులు**

ప్రజలారా ఇది మీకు తగని పని. మీరు మంచిని
విషంగా మార్చుతారు. న్యాయాన్ని హత్యచేసి
నేలకు కూలేలా చేస్తారు.
10 ప్రవక్తలు బహిరంగ ప్రదేశాలకు వెళ్లి ప్రజలు చేసే
చెడ్డ పనులకు వ్యతిరేకంగా మాట్లాడతారు.
అందుచే ప్రజలా ప్రవక్తలను అసహ్యించు
కుంటారు. ప్రవక్తలు మంచివైన సామాన్య సత్యా
లను బోధిస్తారు. అందుచే ప్రజలు ఆ ప్రవక్తలను
అసహ్యించుకుంటారు.
11 మీరు ప్రజలనుండి అన్యాయంగా పన్నులు
వసూలు చేస్తారు. మీరు పేదవారి నుండి గోధుమ
మోపులను తీసుకుంటారు. ఈ ధనంతో మీరు
చెక్కిన రాళ్లతో అందమైన ఇండ్లు కట్టు
కుంటారు. కాని మీరు ఆ ఇండ్లలో నివసించరు.
మీరు అందమైన ద్రాక్షాతోటలను నాటుతారు.
కాని మీరు వాటి నుండి ద్రాక్షారసం తాగరు.
12 ఎందుకంటే మీరు చేసిన అనేక పాపాల గురించి
నాకు తెలుసు. మీరు నిజంగా కొన్ని ఘోరమైన
పాపాలు చేశారు. మంచి పనులు చేసే ప్రజలను
మీరు బాధించారు. చెడు చేయటానికి మీరు
డబ్బు తీసుకుంటారు. బహిరంగ ప్రదేశాలలో
పేదవారిని మీరు నెట్టివేస్తారు.
13 ఆ సమయంలో తెలివిగల బోధకులు ఊరు
కుంటారు. ఎందుకంటే అది చెడు కాలం గనుక.
14 దేవుడు మీతోనే ఉన్నట్లు మీరు చెపుతారు.
అందుచే మీరు మంచిపనులు చేయాలేగాని చెడు
చేయరాదు. అప్పుడు మీరు బతుకుతారు. సర్వశ
క్తుడగు యెహోవా నిజంగా మీతో వుంటాడు.
15 చెడును ద్వేషించు. మంచిని ప్రేమించు.
న్యాయస్థానాలలో న్యాయాన్ని పునరుద్ధ
రించండి. అప్పుడు యోసేపు వంశంలో మిగిలిన
వారిమీద దేవుడు, సర్వశక్తిమంతుడు అయిన
యెహోవా కనికరం కలిగి ఉండవచ్చు.

**మిక్కిలి దుఃఖకాలం రాబోవుట**

16 అందువలన నా ప్రభువును, సర్వశక్తిమంతుడు
అయిన దేవుడు ఈ విషయం చెపుతున్నాడు:
"బహిరంగ ప్రదేశాలన్నిటిలోనూ ప్రజలు విలపి
స్తారు. ప్రజలు వీధులలో రోదిస్తారు. ఏడ్చే
టందుకు ప్రజలు కిరాయి మనుష్యులను నియ
మిస్తారు.
17 ద్రాక్షా తోటలన్నిటిలో ప్రజలు విలపిస్తారు.
ఎందుకనగా నేను అటుగా వెళ్లి మిమ్మల్ని
శిక్షిస్తాను." యెహోవా ఆ విషయాలు చెప్పాడు.
18 మీలో కొంతమంది యెహోవా యొక్క ప్రత్యేక
తీర్పు రోజును చూడగోరతారు. అ రోజును
మీరెందుకు చూడగోరుతున్నారు. యెహోవా
యొక్క ఆ ప్రత్యేక దినము మీకు చీకటిని
తెస్తుందేగాని, వెలుగును కాదు!
19 ఒక సింహపు బారినుండి తప్పించుకుపోయే
వ్యక్తిపై ఎలుగుబంటి మీదపడినట్లు మీరుంటారు!
ఇంటిలోకి వెళ్లి గోడమీద చేయి వేయగా పాము
కరచిన వాని మాదిరి మీరుంటారు!
20 కావున యెహోవా యొక్క ప్రత్యేక దినము
చీకటిని తెస్తుంది గాని, వెలుగును కాదు. అది
దుఃఖ సమయంగాని, సంతోష సమయంగాదు!
ఆ రోజు మీకు వెలుగు ఏమాత్రమూ లేని కారు
చీకటిగా ఉంటుంది.

**ఇశ్రాయేలీయుల ఆరాధనను యెహోవా తిరస్కరించటం**

21 "మీ పవిత్ర దినాలను నేను ద్వేషిస్తాను! నేను
వాటిని అంగీకరించను! మీ ప్రార్థనా సమావేశాల
పట్ల నేను సంతోషంగా ఉండను!
22 మీరు నాకు దహనబలులు అర్పించినా, ధాన్యార్ప
ణలు పెట్టినా, నేను వాటిని స్వీకరించను! మీరు
సమాధాన బలులుగా అర్పించే బలిసిన జంతు
వులవైపు నేను కనీసం చూడనైనా చూడను.
23 మీరు బిగ్గరగా పాడే పాటలను ఇక్కడ నుండి
తొలగించండి. మీ స్వరమండలము నుండి వచ్చే
సంగీతాన్ని నేను వినను.
24 మీ దేశమంతటా న్యాయం నీళ్లలా ప్రవహించేలా
మీరు చేయాలి. మంచితనాన్ని ఎన్నడూ ఎండని
నీటి వాగువలె ప్రవహించేలా చేయండి.
25 ఇశ్రాయేలూ, నలుబది సంవత్సరాల పాటు నీవు
ఎడారిలో నాకు బలులు, అర్పణలు
సమర్పించావు.
26 కాని మీరు మీ రాజు యొక్క సక్కూతు విగ్రహా
లను, కైవాను* విగ్రహాలను కూడ తీసికొని
వెళ్లారు. పైగా మీకై మీరు ఆ నక్షత్రాన్ని మీ
దేవునిగా చేసుకున్నారు.
27 కావున దమస్కు (డెమాస్కస్) పట్టణం అవతలకి
మిమ్మల్ని బందీలుగా పట్టుకుపోయేలా చేస్తాను.
దేవుడును, సర్వశక్తిమంతుడు అయిన
యెహోవా ఆ విషయాలు చెపుతున్నాడు.

**ఇశ్రాయేలు నుండి మంచిరోజులు తొలగింపబడటం**

6 సీయోను వాసులారా, మీలో కొంతమంది చాలా
సుఖవంతమైన జీవితాన్ని గడుపుతున్నారు.
సమరయ పర్వతంమీద ఉన్న ప్రజలలో కొంత
మంది సురక్షితంగా ఉన్నట్లు తలంచుచున్నారు.

---

**కైవాను** ఇవి అష్షూరు దేవుళ్ల పేరు.

కాని మీకు చాలా దుఃఖకరము మీరు ప్రాముఖ్యమైన
జనాంగపు "ముఖ్య" నాయకులు. "ఇశ్రాయేలు
ప్రజలు" సలహా కొరకు మీ వద్దకు వస్తారు.
2 మీరు వెళ్లి కల్నేలో* చూడండి. అక్కడ నుండి
పెద్ద నగరమైన హమాతుకి* వెళ్లండి. ఫిలిష్తీయుల
నగరమైన గాతుకు వెళ్లండి. ఆ రాజ్యాలకంటే
మీరేమైనా గొప్పవారా? లేదు. మీ దానికంటే
వారి రాజ్యాలు విశాలమైనవి.
3 శిక్షా దినము బహు దూరాన ఉన్నదనుకొని,
దౌర్జన్య పరిపాలనకు దగ్గరవుతున్నారు.
4 కాని మీరు అన్ని సుఖాలు అనుభవిస్తారు. మీరు
దంతపు మంచాలపై పడుకుంటారు. మీ పాన్పు
లపై మీరు చాచుకొని పడుకుంటారు. మందలోని
మంచి లేత గొర్రె పిల్లలను, పశువులశాలలోని
మంచి చిన్న గిత్త దూడలను మీరు తింటారు.
5 మీరు స్వర మండలాలను వాయిస్తారు. దావీదువలె
మీరు కనిపెట్టిన వాద్య విశేషాలపై సాధన చేస్తారు.
6 చిత్రమైన గిన్నెల్లో మీరు ద్రాక్షారసం తాగుతారు.
మీరు శ్రేష్ఠమైన పరిమళ తైలాలు వాడతారు.
యోసేపు వంశం నాశనమవుతూ ఉందని కూడా
మీరు కలవరం చెందరు.

7ఆ ప్రజలు వారి పాన్పులపైన చాచుకొని పడు
కున్నారు. కాని వారి మంచి రోజులు అంత మవుతాయి.
వారు బందీలవలె అన్యదేశాలకు తీసుకొనిపోబడతారు.
ముందుగా అలా పట్టుకుపోబడే వారిలో ఈ ప్రజలు
వుంటారు. 8నా ప్రభువైన యెహోవా ఈ ప్రమాణం
చేశాడు. దేవుడును, సర్వ శక్తిమంతుడును అయిన
యెహోవా తన పేరుమీద ఈ ప్రమాణం చేశాడు:

"యాకోబుకు గర్వ కారణమైన వస్తువులను
నేను అసహ్యించుకుంటాను. అతని బల
మైన బురుజులను నేను అసహ్యించు
కుంటాను. అందుచేత 'శత్రువు' నగరాన్ని,
దానిలోని ప్రతి వస్తువును తీసుకునేలా
చేస్తాను."

### ప్రాణంతో మిగిలే ఇశ్రాయేలీయులు తక్కువ

9ఆ సమయంలో ఒకానొక ఇంట్లో పదిమంది
జీవించియుండవచ్చు. ఆ ఇంటిలో మరి కొంతమంది
మరణించవచ్చు. 10ఒక బంధువు ఆ శవాన్ని బయటకు
తీసికొనిపోయి దహనం చేయవచ్చు. ఆ బంధువు
ఇంటినుంచి ఎముకలు తేవటానికి వెళ్తాడు. ఇంటిలో
దాగిన ఏ వ్యక్తినైనా ప్రజలు పిలిచి, "నీ వద్ద ఇంకా
ఏమైనా శవాలు మిగిలాయా?" అని అడుగుతారు. ఆ
వ్యక్తి, "లేవు,...." అని సమాధానమిస్తాడు. అప్పుడా
వ్యక్తి యొక్క బంధువు ఇలా అంటాడు: "నిశ్శబ్దం!
మనం యెహోవా మాట ఎత్తకూడదు."

11 చూడు, దేవుడైన యెహోవా ఆజ్ఞ ఇవ్వగా,
పెద్ద ఇండ్లు ముక్కలుగా పగిలిపోతాయి. చిన్న
ఇండ్లు చిన్న ముక్కలైపోతాయి.
12 గుర్రాలు బండలపై పరుగిడతాయా? లేదు!
ప్రజలు ఆవులను నేల దున్నటానికి వినియోగి
స్తారా? అవును! కాని మీరు అన్నిటినీ తారుమారు
చేస్తారు. మీరు మంచిని, న్యాయాన్ని విషంగా
మార్చారు.
13 మీరు లో-దెబారులో సుఖంగా ఉన్నారు. "మేము
కర్నయీమును మా స్వశక్తిచే తెచ్చు కున్నాం"
అని మీరంటారు.

14"కాని ఇశ్రాయేలూ, నేను మీ మీదికి ఒక దేశాన్ని
రప్పిస్తాను. ఆ రాజ్యం మీకు కష్టాలు తెచ్చిపెడుతుంది.
లేబో-హమాతు నుండి అరాబా వాగువరకూ మీ
అందరికీ కష్టాలు వస్తాయి." దేవుడును, సర్వశక్తిమంతు
డును అయిన యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

### మిడుతలను గూర్చిన దర్శనం

7 యెహోవా నాకిది చూపించాడు: రెండవ పంట
పెరగటం ప్రారంభమైనప్పుడు ఆయన మిడుత
లను పుట్టిస్తున్నాడు. రాజు మొదటి పంట కోసాక
పెరిగే రెండవ పంట ఇది. 2మిడుతలు దేశంలో వున్న
గడ్డినంతా తినివేశాయి. దాని తరువాత నేనిలా అన్నాను:
"నా ప్రభువైన యెహోవా, మమ్మల్ని క్షమించుమని
నేను అర్థిస్తున్నాను! యాకోబు బతకలేడు! అతడు
చాలా చిన్నవాడు!"
3అప్పుడు యెహోవా ఈ విషయంలో తన
మనస్సు మార్చుకొని "అది జరగదు" అని అన్నాడు.

### అగ్నిని గూర్చిన దర్శనం

4నా ప్రభువైన యెహోవా ఈ విషయాలు నాకు
చూపించాడు: దేవుడైన యెహోవా అగ్నిచేత తీర్పు
తీర్చటానికి పిలవటం నేను చూశాను. ఆ అగ్ని గొప్ప
అగాధ జలాన్ని నశింపజేసింది. ఆ అగ్ని భూమిని తిని
వేయటం ప్రారంభించింది. 5కాని నేనిలా అన్నాను,
"దేవుడవైన ఓ యెహోవా, ఇది ఆపివేయుము. నిన్ను
నేను అర్థిస్తున్నాను! యాకోబు బతకలేడు! అతడు
మిక్కిలి చిన్నవాడు!"
6పిమ్మట యెహోవా ఈ విషయంలో తన
మనస్సు మార్చుకొని "అది కూడా జరగదు" అని
అన్నాడు!

**కల్నే** ఉత్తర సిరియాలో ఒక శక్తివంతమైన నగరం.

**హమాతు** హమాతు ఒక పెద్ద సిరియా నగరం.

### మట్టపుగుండును* గూర్చిన దర్శనం

7యెహోవా దీనిని నాకు చూపించాడు: మట్టపు
గుండు (మట్టపు గోడ నిటారుగా వచ్చేలా సరి చూడ
బడుతుంది)ను చేతబట్టుకొని యెహోవా ఒక గోడవద్ద
నిలబడ్డాడు. 8“ఆమోసూ, నీవు ఏమి చూస్తున్నావు?”
అని యెహోవా నన్ను అడిగాడు.
“ఒక మట్టపు గుండు”ను అని నేనన్నాను.
అప్పుడు నా ప్రభువు ఇలా అన్నాడు: “చూడు,
నా ప్రజలైన ఇశ్రాయేలీయుల మధ్య ఒక మట్టపుగుండు
పెడతాను. వారి ‘దుష్టత్వాన్ని’ ఇక ఎంత మాత్రం
నేను చూసి చూడనట్లు వదలను. (ఆ దుష్ట భాగాలను
నేను తొలగిస్తాను). 9ఇస్సాకు వంశస్థులు ఏర్పాటు
చేసిన ఉన్నత ప్రదేశాలు నాశనం చేయబడతాయి.
ఇశ్రాయేలు పవిత్ర స్థలాలన్నీ రాళ్ల గుట్టల్లా మార్చ
బడతాయి. నేను యరొబాము వంశం మీద పడి వారిని
కత్తులతో చంపుతాను.”

### ఆమోసు ప్రకటనలను అమజ్యా ఆపజూడటం

10బేతేలులో ఒక యాజకుడైన అమజ్యా ఇశ్రాయేలు
రాజైన యరొబాముకు ఈ వర్తమానం పంపాడు:
“ఆమోసు నీమీద కుట్ర పన్నుతున్నాడు. ఇశ్రాయేలు
ప్రజలు నీ మీదకు తిరగబడేలా చేయటానికి అతడు
ప్రయత్నిస్తున్నాడు. అతడు ఎంతగా మాట్లాడుతున్నా
డంటే, ఈ దేశంలో అతని మాటలు పట్టవు.
11యరొబాము కత్తిచే చంపబడతాడనీ, ఇశ్రాయేలీ
యులు తమ దేశం నుండి బందీలుగా కొనిపోబడ
తారనీ ఆమోసు ప్రచారం చేస్తున్నాడు.”
12ఆమోసుతో కూడ అమజ్యా ఇలా చెప్పాడు:
“ఓ దీర్ఘదర్శీ (ప్రవక్త), నీవు యూదాకు పారిపోయి,
అక్కడనే తిను. నీ బోధన అక్కడనే చేయి. 13అంతే
గాని, ఇక్కడ బేతేలులో ఎంతమాత్రమూ నీవు ప్రకట
నలు చేయవద్దు. ఇది యరొబాము పవిత్ర స్థలం
(రాజధాని). ఇది ఇశ్రాయేలు ఆలయం!”
14అప్పుడు అమజ్యాకు ఆమోసు ఇలా సమాధానం
చెప్పాడు: “నేను వృత్తిరీత్యా ప్రవక్తను గాను. పైగా
నేను ప్రవక్త వంశం నుండి వచ్చినవాడినీ కాను. నేను
పశువులను కాస్తూ ఉంటాను. మేడి పండ్ల వృక్షాలను
పరిరక్షిస్తూవుంటాను. 15నేనొక గొర్రెల కాపరిని.
అయితే యెహోవా నన్ను గొర్రెలను అనుసరించనీ
యకుండా పిలిచాడు. ‘నీవు వెళ్లి, నా ప్రజలైన ఇశ్రాయేలీ
యులకు ప్రకటనలు చేయి’ అని యెహోవా నాతో
చెప్పాడు. 16కావున యెహోవా వర్తమానాన్ని విను.
నీవు, ‘ఇశ్రాయేలుకు వ్యతిరేకంగా ప్రకటించవద్దు.
ఇస్సాకు వంశానికి వ్యతిరేకంగా బోధనలు చేయవద్దు’
అని నాకు చెపుతున్నావు. 17కాని యెహోవా చెప్పేదే
మంటే: ‘నీ భార్య నగరంలో వేశ్య అవుతుంది. నీ
కుమారులు, కుమార్తెలు కత్తులతో చంపబడతారు.
అన్యజనులు నీ రాజ్యాన్ని వశ పర్చుకొని, తమలో
తాము దానిని పంచుకుంటారు. నీవు పరదేశంలో చని
పోతావు. ఇశ్రాయేలు ప్రజలు నిశ్చయంగా ఈ దేశం
నుండి బందీలుగా తీసికొనిపోబడతారు.’”

### పక్వానికి వచ్చిన పండును గూర్చిన దర్శనం

8 యెహోవా ఇది నాకు చూపించాడు. వేసవి కాలపు
పండ్లగంప నొకదానిని నేను చూశాను.
2“ఆమోసూ, నీ వేమి చూస్తున్నావు?” అని యెహోవా
నన్నడిగాడు.
“ఒక గంపెడు వేసవి కాలపు పండ్లు” అని నేను
చెప్పాను.
అప్పుడు యెహోవా నాతో ఇలా చెప్పాడు: “నా
ప్రజలైన ఇశ్రాయేలీయులకు అంతం వచ్చింది. నేనిక
ఎంత మాత్రం వారి పాపాలను చూసి చూడనట్లు
ఉండను. 3ఆలయంలో పాడే పాటలు శోక గీతాలుగా
మారతాయి. నా ప్రభువైన యెహోవా ఆ విషయాలు
చెప్పాడు. ప్రతి చోటా శవాలు పడి ఉంటాయి. ప్రజలు
నిశ్శబ్దంగా శవాలను మోసుకుపోయి పీనుగుల గుట్టమీద
వేస్తారు.”

### ఇశ్రాయేలు వ్యాపారుల ధనాశ

4 నేను చెప్పేది వినండి! నిస్సహాయులైన ప్రజలపై
మీరు నడిచి వెళ్తారు. ఈ దేశ పేదప్రజలను నాశనం
చేయాలని మీరు ప్రయత్నిస్తున్నారు.
5 వర్తకులారా, మీరిలా అంటారు, “మేము ధాన్యాన్ని
అమ్ముకొనేటందుకు అమావాస్య ఎప్పుడు వెళ్లి
పోతుంది? అమ్మకానికి మా గోధుమలు తేవటానికి
విశ్రాంతి దినం ఎప్పుడైపోతుంది? కొలతలు
తగ్గించి, ధరలు పెంచుతాము. దొంగ త్రాసు
వేసి ప్రజలను మోసగిస్తాము.
6 పేదవారు ఎలాగో వారి అప్పులు తీర్చ లేరు
గనుక, మేము వారిని బానిసలనుగా కొంటాము.
జత చెప్పుల విలువకు ఆ నిస్సహాయులను మేము
కొంటాము. ఆహా, నేలపై ఒలికిన ధాన్యాన్ని
కూడా మేము అమ్ముకోవచ్చు.”
7యెహోవా ఒక మాట ఇచ్చాడు. యాకోబుకు
గర్వ కారణమైన తన పేరు మీద ఈ ప్రమాణం
చేశాడు:

“ఆ ప్రజలు చేసిన పనులను నేనెన్నడూ మరువను.
8 ఆ పనుల కారణంగా భూమి అంతా కంపిస్తుంది.
దేశంలో నివసించే ప్రతివాడు చనిపోయినవారి

---

**మట్టపుగుండు** తాపీ పనివారు వాడే గుండును తాడుతోకట్టి గోడలు నిటారుగా వస్తున్నవో లేవో చూడటానికి దీనిని వినియోగిస్తారు.

కొరకు విలపిస్తాడు. ఈజిప్టులోని నైలు నదిలా
భూమి అంతా ఉవ్వెత్తుగా లేచి పతనమవుతుంది.
భూమి అటూ ఇటూ ఊగిసలాడుతుంది.”
9 యెహోవా ఈ విషయాలు కూడా చెప్పాడు:
“ఆ సమయంలో మధ్యాహ్న సమయంలో
సూర్యుడు అస్తమించేలా నేను చేస్తాను. మబ్బులేని
పగటి సమయంలో భూమిపై చీకటి కమ్మేలా
చేస్తాను.
10 మీ పండుగ దినాలను చనిపోయిన వారి కొరకు
దుఃఖించే దినాలుగామార్చుతాను. మీ పాటలన్నీ
మృతులకొరకు విలాప గీతాలవుతాయి. ప్రతివాని
పైన విషాద సూచిక దుస్తులు వేస్తాను. ప్రతివాని
తలను బోడితల చేస్తాను. ఏకైక పుత్రుడు చని
పోయినప్పుడు కలిగే గొప్ప దుఃఖంలాంటి
దుఃఖాన్ని నేను కలిగిస్తాను. అది ఒక భయంకర
మైన అంతం.”

## దేవుని వాక్యం కొరకు రానున్న తీవ్రమైన కరువు స్థితి

11 యెహోవా చెపుతున్నాడు:

“చూడు, దేశంలో కరువు పరిస్థితిని నేను కల్పించే
సమయం వస్తూవుంది. ప్రజలు ఆహారం కొరకు
ఆకలిగొనరు. ప్రజలు నీటి కోరకు దప్పిగొనరు.
కాని యెహోవా వాక్యాల కొరకు ప్రజలు ఆకలి
గొంటారు.
12 ప్రజలు ఒక సముద్రం నుండి మరొక సముద్రం
వరకు తిరుగుతారు. వారు ఉత్తరాన్నుండి
తూర్పుకు పయనిస్తారు. యెహోవా వాక్యం
కొరకు ప్రజలు ముందుకు, వెనుకకు పోతారు.
కాని వారు దానిని కనుగొనలేరు.
13 ఆ సమయంలో అందమైన యువతీ యువ
కులు దప్పికతో సొమ్మసిల్లుతారు. షోమ్రోను
యొక్క పాపము సాక్షిగా వారు ప్రమాణం
చేసేవారు ఇలా అంటారు: ‘దానూ, నీ దేవుని
జీవముతోడు.’ బెయేర్షెబా మార్గంతోడు ఆ
ప్రజలు పతనమవుతారు, వారు మరెన్నడూ
లేవరు.”

## యెహోవా బలిపీఠం పక్కన నిల్చున్నట్లు దర్శనం

9 నా ప్రభువు బలిపీఠం పక్కన నిలబడినట్లు నేను
చూశాను. ఆయన ఇలా అన్నాడు:
“స్తంభాల తలలపై కొట్టు. దానితో అది గుమ్మాల
వరకు కదులుతుంది. స్తంభాలు ప్రజల తలలపై
పడేలా కొట్టు. ఇంకా ఎవరైనా మిగిలితే వారిని
నేను కత్తితో చంపుతాను. ఏ వ్యక్తి అయినా పారి
పోవచ్చు; కాని అతడు తప్పించుకోలేడు. ప్రజ
లలో ఒక్కడు కూడా తప్పించుకోలేడు.
2 వారు పాతాళం లోపలికి పోయినా నేను వారిని
అక్కడనుండి బయటకు లాగుతాను. వారు
ఆకాశంలోకి దూసుకుపోతే, నేను వారిని అక్కడ
నుండి కిందికి తెస్తాను.
3 వారు కర్మెలు పర్వత శిఖరంలో దాగినా వారిని
నేనక్కడ కనుగొంటాను. వారిని అక్కడ పట్టుకొని
తీసుకొస్తాను. వారు నా నుండి సముద్ర గర్భంలో
దాగటానికి ప్రయత్నించితే నేను పాముకు ఆజ్ఞ
ఇస్తాను. అది వారిని కాటేస్తుంది.
4 వారు శత్రువు చేతజిక్కి బందీలుగా కొనిపోబడితే,
నేను కత్తికి ఆజ్ఞ ఇస్తాను. అది వారిని అక్కడ
చంపివేస్తుంది. అవును. నేను వారిపై నిఘా వేసి
ఉంటాను. వారికి కష్టాలు తెచ్చి పెట్టే ఉపాయా
లను నేను అన్వేషిస్తాను. అంతేగాని, వారికి మంచి
చేసే విధానాలను నేను చూడను.”

## శిక్ష దేశ ప్రజలను నాశనం చేస్తుంది

5 నా ప్రభువును సర్వశక్తిమంతుడును అయిన
యెహోవా భూమిని తాకితే, అది కరిగిపోతుంది.
అప్పుడు భూమిపై నివసించే వారంతా చని
పోయిన వారి కొరకు విలపిస్తారు. ఈజిప్టులో
నైలు నదిలా భూమి పెల్లుబికి పడుతుంది.
6 యెహోవా తన పై అంతస్తు గదులు ఆకాశంపై
నిర్మించాడు. ఆయన తన స్వర్గాన్ని భూమికి
మీదుగా ఏర్పాటు చేశాడు. సముద్ర జలాలను
ఆయన పిలుస్తాడు. పిలిచి, వాటిని వర్షంలా
బయట భూమి మీద పారబోస్తాడు. ఆయన
పేరు యెహోవా.

## ఇశ్రాయేలు వినాశనానికి యెహోవా ప్రతిజ్ఞ

7 యెహోవా ఇది చెపుతున్నాడు:

“ఇశ్రాయేలూ, మీరు నాకు ఇథియోపియనుల
(కూషీయులు) వంటివారు. ఇశ్రాయేలీయులను
నేను ఈజిప్టు దేశం నుండి బయటకు తీసికొని
వచ్చాను. ఫిలిష్తీయులను కూడ నేను కఫ్తోరు
నుండి బయటకు రప్పించాను. మరియు అరామీ
యులను (సిరియనులు) కీరు నుండి బయటకు
తీసుకొని వచ్చాను.”

8 నా ప్రభువైన యెహోవా ఈ పాపపు రాజ్యాన్ని
(ఇశ్రాయేలు) గమనిస్తున్నాడు. యెహోవా ఇది
చెప్పాడు: “ఈ భూమి ఉపరితలం నుండి ఇశ్రాయే
లును తొలగిస్తాను. కాని యాకోబు వంశాన్ని
పూర్తిగా నాశనం చేయను.
9 ఇశ్రాయేలు రాజ్యాన్ని నాశనం చేయటానికి ఆజ్ఞ
ఇస్తున్నాను. ఇశ్రాయేలు ప్రజలను ఇతర దేశాలకు

చెదర గొడతాను. కాని అది పిండిని జల్లించువాని
రీతిగా ఉంటుంది. ఒక వ్యక్తి జల్లెడలో పిండిని
జల్లిస్తాడు. అప్పుడు మెత్తని పిండి క్రిందికి దిగు
తుంది. కాని బరక పిండి జల్లెట్లో మిగిలిపోతుంది.
యాకోబు వంశం విషయంలో కూడా ఇదే రీతి
జరుగుతుంది.

10 నా ప్రజలలో పాపులైనవారు, 'మాకేమీ కీడు
జరుగదు!' అని అంటారు. కాని ఆ జనులందరూ
కత్తులచే చంపబడతారు!"

**రాజ్యాన్ని తిరిగి ఇచ్చేందుకు దేవుడు మాట ఇచ్చుట**

11 "దావీదు గుడారం పడిపోయింది. కాని నేను
దానిని తిరిగి నిలబెడతాను. గోడల కంతలు
పూడ్చుతాను. శిథిలమైన భవనాలను తిరిగి
నిర్మిస్తాను. దానిని పూర్వమున్నట్లు నిర్మిస్తాను.
12 అప్పుడు ఎదోములో బతికివున్న ప్రజలు,
మరియు నా పేరుమీద పిలవబడే జనులందరూ
సహాయం కొరకు యెహోవా వైపు చూస్తారు."
యెహోవా ఈ మాటలు చెప్పాడు. అవి
జరిగేలా ఆయన చేస్తాడు.
13 యెహోవా చెపుతున్నాడు: "పంటకోయు వాని
వెనుక భూమిని దున్నే రోజులు వస్తున్నాయి.
ద్రాక్షాపండ్లు తెంచే వాని వెనుకనే, పండ్లను
తొక్కేవాడు వచ్చే సమయం రాబోతూవుంది.
కొండల నుంచి, పర్వతాల నుంచి మధురమైన
ద్రాక్షారసం పారుతుంది.
14 నా ప్రజలైన ఇశ్రాయేలీయులను చెరనుండి తిరిగి
తీసుకు వస్తాను. వారు శిథిలమైన నగరాలను
తిరిగి కడతారు. ఆ నగరాలలో వారు మళ్లీ నివ
సిస్తారు. వారు ద్రాక్షాతోటలు వేస్తారు. ఆ తోటల
నుంచి వచ్చిన ద్రాక్షారసాన్ని వారు తాగుతారు.
వారు తోటలను ఏర్పాటు చేస్తారు. వారు ఆ
తోటల నుండి వచ్చే ఫలాలను తింటారు.
15 నా ప్రజలను తమ దేశంలో మళ్లీ స్థిరపర్చుతాను.
నేను వారికిచ్చిన దేశాన్నుండి వారు మళ్లీ లాగి
వేయబడరు." మీ దేవుడైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.

# ఓబద్యా

### ఎదోముకు శిక్ష
ఇది ఓబద్యాకు వచ్చిన దర్శనం. నా ప్రభువైన
యెహోవా ఎదోమును* గురించి ఈ విషయం
చెప్పాడు: దేవుడైన యెహోవా నుండి ఒక
సమాచారం మేము విన్నాము. వివిధ దేశాలకు
ఒక దూత పంపబడ్డాడు. "మనం వెళ్లి ఎదోము
మీద యుద్ధం చేద్దాం" అని అతడన్నాడు.

### ఎదోముతో యెహోవా మాట్లాడటం
2 "చూడు, సాటి దేశాలలో నిన్ను అల్పునిగా చేస్తాను.
ప్రజలు నిన్ను మిక్కిలి అసహ్యంచుకుంటారు.
3 నీ గర్వం నిన్ను మోసపుచ్చింది. కొండశిఖరం
మీద గుహలలో నీవు నివసిస్తున్నావు. నీ ఇల్లు
కొండల్లో ఎత్తున ఉంది. అందువల్ల, 'నన్నెవరూ
కిందికి తేలేరు" అని, నీకు నీవు మనస్సులో అను
కుంటున్నావు.

### ఎదోము కిందికి తేబడుతుంది
4 దేవుడైన యెహోవా ఇది చెప్పాడు: "నీవు గరుడ
పక్షిలా ఎత్తుగా ఎగిరినా, నీ గూటిని నీవు నక్షత్రాల్లో
కట్టుకున్నా, అక్కడ నుండి నిన్ను కిందికి దించు
తాను"
5 నీవు నిశ్చయంగా నాశనమవుతావు! దొంగలు
నీవద్దకు వస్తారు! రాత్రి పూట దోపిడిగాండ్రు
వస్తారు! ఆ దొంగలు వారికి కావలసినవన్నీ ఎత్తుకు
పోతారు! ద్రాక్షాకాయలు ఏరటానికి పనివారు నీ
పొలాలకు వచ్చినప్పుడు, వారు కొన్ని పండ్లు
వదిలిపెడతారు.
6 ఏశావు* రహస్య ధనసంపద కొరకు శత్రువులు
వెదకుతారు. వాటిని వారు కనుగొంటారు!
7 నీ స్నేహితులైన ప్రజలంతా నిన్ను దేశం నుండి
పంపివేస్తారు. నీతో సంధి చేసుకొన్నవారు నిన్ను
మోసగించి, ఓడిస్తారు. నీ వద్దనే రొట్టెలు తిన్న
మనుష్యులు, నిన్ను పట్టటానికి వల పన్ను
తున్నారు. వారు ఇలా అంటున్నారు: 'ఇలా అవు
తుందని అతడు అనుమానించడు'

8 యెహోవా ఇలా చెపుతున్నాడు: "ఆ రోజున
ఎదోము జ్ఞానులను ఎదోము పర్వతాలలోనున్న
వివేకులను నేను నాశనం చేయగోరుదును.
9 తేమానూ, నీ యోధులు భయపడతారు. ఏశావు
పర్వతం మీద ప్రతి ఒక్కడూ చంపబడతాడు.
అనేకనేక మంది చంపబడతారు.
10 అవమానం నిన్ను ఆవరిస్తుంది. నీవు శాశ్వతంగా
నాశనమవుతావు. ఎందుకంటే, నీవు నీ సోదరుడైన
యాకోబు పట్ల చాలా క్రూరంగా ఉన్నావు.
11 పరదేశీయులు ఇశ్రాయేలు ధనరాశులను ఎత్తుకు
పోయినప్పుడు ఇశ్రాయేలు శత్రువులతో నీవు
చేతులు కలిపావు. పరదేశీయులు ఇశ్రాయేలు నగర
ద్వారంలోకి వచ్చి, యెరూషలేములో ఎవరు ఏ
భాగాన్ని ఆక్రమించు కోవాలనే దాని విషయంలో
చీట్లు వేశారు. ఆ సమయంలో, ఆ వచ్చిన వారిలో
నీవొకనిమాదిరిగా ఉన్నావు.
12 నీ సోదరుని కష్టకాలం చూసి నీవు నవ్వావు. నీవాపని
చేసియుండకూడదు. ఆ జనులు యూదాను
నాశనం చేసినప్పుడు నీవు సంతోషించావు. నీవలా
చేసియుండకూడదు. యూదా ప్రజల కష్ట
కాలంలో నీవు గొప్పలు చెప్పుకున్నావు. నీవది
చేసియుండ కూడదు.
13 నా ప్రజల నగరద్వారాన ప్రవేశం చేసి, నీవు వారి
సమస్యలను చూసి నవ్వావు. నీవది చేసియుండ
కూడదు. వారికి కష్టకాలం వచ్చినప్పుడు. నీవు
వారి ఆస్తిని దోచుకున్నావు. నీవాపని చేసియుండ
కూడదు.
14 నీవు నాలుగు బాటలు కలిసిన స్థానంలో నిలబడి
తప్పించుకొని పారిపోయే ప్రజలను చంపివేశావు.
నీవాపని చేయకుండా ఉండవలసింది. తప్పించు
కునే వారిలో కొందరిని సజీవంగా పట్టుకున్నావు.
నీవాపని చేయకుండా ఉండవలసింది.
15 అన్ని దేశాలపై యెహోవా తీర్పురోజు త్వరలో
వస్తూ ఉంది. నీవు ఇతర ప్రజలకు కీడు చేశావు.

---

**ఎదోము** యూదారాజ్యానికి ఆగ్నేయంగా ఉన్న దేశం. ఎదోము ప్రజలు ఏశావు సంతతివారు. యాకోబు కవల సోదరుడే ఏశావు. వారు ఇశ్రాయేలీయులకు శత్రువులు.

**ఏశావు** ఎదోముకు ఇది మరొక పేరు.

అదే కీడు నీకూ జరుగుతుంది. అవే చెడ్డ పనులు
నీ తలమీదికి వచ్చి పడతాయి.
16 ఎందుకంటే, నా పవిత్ర పర్వతంమీద నీవు రక్తాన్ని
చిందించావు. అలాగే ఇతర జనులు నీ రక్తాన్ని
చిందిస్తారు. నువ్వు అంతరిస్తావు. నువ్వెప్పుడూ
లేనట్లుగా ఉంటుంది.
17 కాని సీయోను కొండ మీద మాత్రం మిగిలిన
వారు ఉంటారు. వారు నా ప్రత్యేక ప్రజలుగా
ఉంటారు. యాకోబు వంశం తనకు చెందిన వస్తు
వులను తిరిగి తీసుకొంటుంది.

18 యాకోబు వంశం అగ్నిలా తయారవుతుంది.
యోసేపు* సంతతివారు మంటలా తయార
వుతారు. కాని ఏశావు వంశం బూడిదలా ఉంటుంది.
యూదా ప్రజలు ఎదోమీయులను కాల్చివేస్తారు.
యూదా ప్రజలు ఎదోమీయులను నాశనం
చేస్తారు. అప్పుడు ఏశావు సంతతివారిలో బ్రతికిన
వాడంటూ ఏ ఒక్కడూ ఉండడు." దేవుడైన
యెహోవా దాన్ని చెప్పాడు గనుక అది జరుగు
తుంది.
19 యూదాకు దక్షిణాన గల ఎడారి ప్రాంత ప్రజలు
ఏశావు కొండను ఆక్రమించుకుని నివసిస్తారు.
కొండకింది (మైదాన) ప్రాంతం వారు ఫిలిష్తీయుల
దేశాన్ని ఆక్రమిస్తారు. ఆ ప్రజలు ఎఫ్రాయిము,
సమరయ (షోమ్రోను) భూములను ఆక్రమించి
నివసిస్తారు. గిలాదు దేశం బెన్యామీనుకు చెంది
ఉంటుంది.
20 ఇశ్రాయేలు ప్రజలు వారి ఇండ్లు వదిలి పోయేలా
ఒత్తిడి చేయబడ్డారు. కాని ఆ ప్రజలే కనానీయుల
దేశాన్ని సారెపతువరకు ఆక్రమిస్తారు. యెరూషలే
మునుండి సెఫారాదుకు చెరపట్టబడ్డవారు దక్షిణ
ప్రాంత పట్టణాలను ఆక్రమించుకొంటారు.
21 జయించినవారు సీయోను కొండమీద ఉంటారు.
ఆ మనుష్యులు ఏశావు కొండ మీద నివసిస్తున్న
వారిని పరిపాలిస్తారు. అప్పుడు రాజ్యం యెహో
వాకు చెంది ఉంటుంది.

---

**యోసేపు** ఉత్తర ఇశ్రాయేలుకు ఇది మరొక పేరు.

# యోనా

## దేవుని పిలుపు – యోనా పలాయనం

1 అమిత్తయి కుమారుడైన యోనాతో* యెహోవా
మాట్లాడాడు. యెహోవా ఇలా అన్నాడు:
2“నీనెవె* ఒక మహానగరం. అక్కడి ప్రజలు చేస్తున్న
అనేక నీచ కార్యాలను గురించి నేను విన్నాను. కావున
నీవు ఆ నగరానికి వెళ్లి వారు చేసే చెడు పనులు
మానుకొనుమని చెప్పు.”
3దేవుని సలహా యోనా పాటించదలచలేదు. కావున
యెహోవాకు దూరంగా యోనా పారిపోవటానికి
ప్రయత్నించాడు. యోనా యొప్పే* పట్టణానికి
వెళ్లాడు. బహుదూరానగల తర్షీషు* నగరానికి వెళ్లే ఒక
ఓడను యోనా చూశాడు. యోనా తన ప్రయాణా
నికయ్యే ఖర్చు చెల్లించి ఓడలోనికి వెళ్లాడు. తర్షీషుకు
వెళ్లే ఈ ఓడపైగల జనంతో కలిసి యోనా ప్రయాణం
చేసి, యెహోవాకు దూరంగా పారిపోదలిచాడు.

## పెనుతుఫాను

4కాని యెహోవా సముద్రంలో పెనుతుఫాను లేవ
దీశాడు. గాలివల్ల సముద్రం అల్లకల్లోలంగా ఉంది.
తుఫాను తీవ్రంగా ఉంది. ఓడ పగిలిపోవటానికి సిద్ధంగా
ఉంది. 5ఓడ మునగకుండా అందులో ఉన్నవారు దానిని
తేలిక చేయదల్చారు. కావున వారు సరుకును సము
ద్రంలో పారవేయడం మొదలుపెట్టారు. నావికులు
చాలా భయపడ్డారు. ఓడలోనున్న ప్రతీవాడు తన
దేవుని ప్రార్థించసాగాడు.
యోనా మాత్రం పడుకోటానికి పడవ కింది భాగం
లోకి వెళ్లాడు. యోనా నిద్రపోతూ ఉన్నాడు. 6ఓడ
అధికారి యోనాను చూసి ఇలా అన్నాడు: “నిద్రలే!
నీవు ఎందుకు నిద్రపోతున్నావు? నీ దేవుణ్ణి ప్రార్థించు!
బహుశః నీ దైవం నీ ప్రార్థన ఆలకించి మనల్ని
రక్షించవచ్చు.”

## తుఫానుకు కారణం

7పిమ్మట ఓడలోని మనుష్యులు ఒకరితో ఒకరు,
“మనకీ కష్టాలు ఎందుకు వచ్చాయో తెలుసు కోవ
టానికి మనం చీట్లు వేయాలి” అని అనుకున్నారు.
అందువల్ల వారు చీట్లు వేశారు. ఈ కష్టమంతా యోనా
వల్ల వచ్చినదేనని చీట్లవల్ల తెలిసింది. 8అప్పుడు ఆ
మనుష్యులు యోనాతో ఇలా అన్నారు: “మాకు ఈ
కష్టమంతా నీ తప్పువల్లనే సంభవిస్తూ ఉంది! కావున
నీవు ఏమి చేశావో మాకు చెప్పు. నీవు ఏమిపని చేస్తావు?
నీవు ఎక్కడనుండి వస్తున్నావు? నీది ఏ దేశం? నీ
ప్రజలు ఎవరు? ”
9అప్పుడు యోనా ఇలా అన్నాడు: “నేనొక హెబ్రీ
యుడను (యూదా జాతివాడను). పరలోక దేవుడైన
యెహోవాను నేను ఆరాధిస్తాను. సముద్రాన్ని,
భూమిని సృష్టించిన దేవుడు ఆయనే.”
10తాను యెహోవా నుండి పారిపోతున్నట్లు
యోనా వారికి చెప్పాడు. ఇది తెలుసుకున్న ఆ మను
ష్యులు చాలా భయపడిపోయారు. ఆ మనుష్యులు
యోనాను, “నీ దేవునికి వ్యతిరేకంగా ఎటువంటి భయం
కరమైన అపరాధం చేశావు?” అని అడిగారు. 11గాలి,
అలలు సముద్రంలో రాను రాను మరింత తీవ్ర
మవుతున్నాయి. అందువల్ల ఆ మనుష్యులు
యోనాతో, “మమ్మల్ని మేము రక్షించుకోవాలంటే
ఏమి చేయాలి? సముద్రాన్ని శాంతింపచేయటానికి నీకు
మేము ఏమి చేయాలి?” అని అడిగారు.
12యోనా ఆ మనుష్యులతో ఇలా అన్నాడు: “నేను
తప్పు చేశానని నాకు తెలుసు. అందువల్లనే ఈ తుఫాను
సముద్రంలో చెలరేగింది. కావున నన్ను సముద్రంలోకి
తోసివెయ్యండి. సముద్రం శాంతిస్తుంది”
13కాని ఆ మనుష్యులు యోనాను సముద్రంలోకి
తోసివేయటానికి ఇష్టపడలేదు. వారు ఓడను తిరిగి
ఒడ్డుకు చేర్చాలని ప్రయత్నించారు. కాని వారలా చేయ
లేకపోయారు. గాలి, సముద్రపు అలలు రాను రాను
మరింత తీవ్రమయ్యాయి.

---

**యోనా** యోనా బహుశః రెండవ రాజులు 14:25లో పేర్కొన బడిన ప్రవక్తే కావచ్చు.

**నీనెవె** అష్షూరు ముఖ్య పట్టణం. అష్షూరు సైన్యం కీ.పూ. 723-721లో ఉత్తర ఇశ్రాయేలును నాశనం చేసింది.

**యొప్పే** మధ్యధరా సముద్రం దగ్గర ఇశ్రాయేలు తీరంలో యొప్పే ఒక పట్టణం.

**తర్షీషు** బహుశః ఇది స్పెయిన్‌లో ఒక నగరం కావచ్చు. ఇది పడమరన ఉంది. యోనా పారిపోగలిగిన దూర ప్రాంతం. నీనెవె పట్టణం ఇశ్రాయేలుకు తూర్పున ఉన్నది.

### యోనాకు శిక్ష

14కావున ఆ మనుష్యులు యెహోవాకు ఇలా విన్న
వించుకున్నారు: "ప్రభూ ఇతడు చేసిన చెడు కార్యాల
దృష్ట్యా మేము ఈ మనుష్యుని సముద్రంలోకి తోసి
వేస్తున్నాము. ఒక అమాయక వ్యక్తిని చంపిన నేరా
రోపణ దయచేసి మామీద వేయకు. మేము అతన్ని
చంపినందుకు దయచేసి నీవు మమ్మల్ని చని
పోయేలాగు చేయవద్దు. నీవు యెహోవా అని మాకు
తెలుసు. నీవు ఏది తలిస్తే అది చేస్తావు. కాని దయచేసి
మాపట్ల కరుణ చూపు."

15పిమ్మట వారు యోనాను సముద్రంలోకి విస
రివేశారు. తుఫాను ఆగిపోయింది. సముద్రం శాంతిం
చింది! 16 ఆ మనుష్యులు ఇదంతా చూసి భయపడ
సాగారు. యెహోవా పట్ల వారికి భక్తి ఏర్పడింది.
వారు యెహోవాకు ఒక బలి సమర్పించి, ప్రత్యేక
మొక్కులు మొక్కుకొన్నారు.

17యోనా సముద్రంలో పడగానే యోనాను మింగ
టానికి ఒక పెద్ద చేపను యెహోవా పంపాడు. ఆ
చేప కడుపులో యోనా మూడు పగళ్లు, మూడు
రాత్రులు ఉన్నాడు.

2 చేప కడుపులో ఉన్నంతకాలం యోనా తన
దేవుడైన యెహోవాను ప్రార్థించాడు. యోనా
ఇలా అన్నాడు:

2 "నేను తీవ్రమైన కష్టంలో ఉన్నాను. నేను
యెహోవా సహాయం అర్థించాను. ఆయన నా
ప్రార్థన ఆలకించాడు! నేను పాతాళపు లోతుల్లో
ఉన్నాను. యెహోవా, నేను నీకు మొర పెట్టు
కొనగా నీవు నా మొరాలకించావు!
3 నీవు నన్ను సముద్రంలోకి విసరివేశావు. తీవ్రమైన
నీ అలలు నన్ను ముంచెత్తాయి. నేనీ అగాధ
సముద్రం లోతులదాకా పోయాను. నా చుట్టూ
జల ప్రళయం.
4 'ఇక నేను చూడలేని స్థలానికి తోయబడ్డాను'
అని అనుకున్నాను. కాని సహాయం కొరకు నేను
నీ పవిత్ర ఆలయం వైపు చూస్తూనే ఉన్నాను.
5 "సముద్రజలం నన్ను ముంచి వేసింది. నీరు నా
నోటిని మూసివేసింది, నేను శ్వాస పీల్చు కోలే
కుండా ఉన్నాను. ఈ సముద్రపు లోతులలోకి
నేను వెళ్లాను. సముద్రపు మొక్కలు నా తలకు
చుట్టుకున్నాయి.
6 పర్వతాల పునాదులున్న చోట, సముద్రపు
అట్టడుగున నేను ఉన్నాను. ఈ చెరలో నేను
శాశ్వతంగా మూయబడి ఉన్నాననుకున్నాను.
కానీ నా దేవుడైన యెహోవా నన్ను నా సమాధి
నుండి బయటకు లేపాడు! ఓ నా దేవా, నీవు
నాకు మళ్లీ ప్రాణం పోశావు!
7 "నా ఆత్మ నిరాశ చెందింది, అప్పుడు నేను
యెహోవాను తలచుకొన్నాను. యెహోవా,
నిన్ను నేను ప్రార్థించాను. నీ పవిత్రాలయంలో
నీవు నా ప్రార్థనలు విన్నావు.
8 కొంతమంది ప్రజలు పనికిరాని విగ్రహాలను
పూజిస్తారు. కానీ ఆ విగ్రహాలు వారికి ఎన్నడూ
సహాయం చేయలేవు.
9 యెహోవా నుండి మాత్రమే రక్షణ లభిస్తుంది!
"యెహోవా, నీకు నేను బలులు అర్పిస్తాను.
నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లిస్తాను. నీకు నేను
ప్రత్యేక మొక్కులు మొక్కుతాను. నా మొక్కు
బడులు నేను చెల్లిస్తాను."

10అప్పుడు యెహోవా చేపతో మాట్లాడాడు. తరు
వాత ఆ చేప తన కడుపులో ఉన్న యోనాను పొడిగా
ఉన్న నేలమీదకు కక్కివేసింది.

### దేవుని పిలుపుకు యోనా విధేయత

3 పిదప యోనాతో యెహోవా మళ్ళీ మాట్లా డాడు.
యెహోవా ఇలా చెప్పాడు: 2"నీవు ఆ నీనెవె
మహానగరానికి వెళ్లు. నేను నీకు చెప్పే విషయాలు
వారికి బోధించు."

3యెహోవా ఆజ్ఞను శిరాసావహించి యోనా నీనెవె
నగరానికి వెళ్లాడు. నీనెవె ఒక మహా నగరం. ఎవరైనా
నగరంగుండా వెళ్లాలంటే మూడు రోజులు నడవాలి.
4యోనా నగరం మధ్యకు వెళ్లి ప్రజలకు బోధిం
చటం మొదలుపెట్టాడు. "నలభై రోజుల తరువాత
నీనెవె నాశనమవుతుంది" అని యోనా ప్రకటించాడు.
5నీనెవె నగరవాసులు దేవుని వర్తమానాన్ని విశ్వ
సించారు. ప్రజలు తమ పాపాలను గురించి ఆలోచించ
టానికి కొంతకాలంపాటు ఉపవాసం చేయటానికి నిర్ణ
యించుకొన్నారు. తమ విచారాన్ని వ్యక్తం చేయుటకు
ప్రజలు ప్రత్యేకమైన దుస్తులు ధరించారు. అతి
ముఖ్యులు, అతి సామాన్యులతో సహా నగరవాసులంతా
ఇది ఆచరించారు.
6ఈ విషయాలను గురించి నీనెవె రాజు విన్నాడు.
రాజుకూడా తాను చేసిన చెడుపనులకు విచారించాడు.
అందుచే రాజు తన సింహాసనాన్ని వదిలివేశాడు. రాజు
తన రాజదుస్తులు విసర్జించి, తన విచారాన్ని వ్యక్తం
చేసే ప్రత్యేక దుస్తులు ధరించాడు. పిమ్మట రాజు
బూడిదలో కూర్చున్నాడు. 7రాజు ఒక ప్రత్యేక వర్త
మానాన్ని వ్రాసి, నగరమంతా ప్రకటింపజేశాడు.

రాజు నుండి, అతని కింది పాలకుల నుండి వచ్చిన
ఆజ్ఞ ఏమనగా:

కొద్దికాలంపాటు ఏ మనిషీగాని, జంతువుగాని
ఏమీ తినగూడదు. పశువుల మందలనుగాని,

గొర్రెల మందలనుగాని పొలాల్లోకి వదలకూడదు. నీనెవెలో ఉన్న ఏ జీవీ ఏమీ తినకూడదు. నీరు తాగకూడదు. [8]ప్రతి వ్యక్తీ, ప్రతి జంతువూ విచార సూచకంగా ఒక ప్రత్యేకమైన బట్టతో తప్పక కప్పబడాలి. ప్రజలు బిగ్గరగా తమ గోడును దేవునికి చెప్పుకోవాలి. ప్రతి వ్యక్తీ తన జీవన విధానం మార్చుకొని, చెడు పనులు చేయటం మానాలి. [9]బహుశః అప్పుడు దేవుడు తన మనస్సు మార్చుకొని, తాను చేయ సంకల్పించిన పనులు చేయకపోవచ్చు. బహుశః దేవుని మనస్సు మార వచ్చు. కోపంగా ఉండకపోవచ్చు. అప్పుడు మనం శిక్షింపబడకపోవచ్చు."

[10]ప్రజలు చేసిన పనులన్నీ దేవుడు చూశాడు. ప్రజలు చెడుపనులు చేయటం మానినట్లు దేవుడు గమనించాడు. కావున దేవుడు మనసు మార్చుకొని, తాను చేయ సంకల్పించినది విరమించుకున్నాడు. దేవుడు ప్రజలను శిక్షించలేదు.

### దేవుని కరుణ యోనాకు కోపకారణమవటం

4 దేవుడు నగరాన్ని రక్షించటం పట్ల యోనా సంతోషంగా లేడు. యోనాకు కోపం వచ్చింది. [2]యోనా యెహోవాపట్ల చిరాకుతో ఇలా అన్నాడు: "ఇది జరుగుతుందని నాకు తెలుసు! నేను నా దేశంలో ఉన్నప్పుడు నన్ను ఇక్కడికి రమ్మన్నావు. ఈ దుర్మార్గపు నగరవాసులను నీవు క్షమిస్తావని నాకు అప్పుడే తెలుసు. అందువల్లనే నేను తర్షీషుకు పారి పోవటానికి నిర్ణయించుకున్నాను. నీవు దయగల దేవుడవని నాకు తెలుసు! నీవు కరుణ చూపిస్తావని, నీవు ప్రజలను శిక్షింపగోరవనీ నాకు తెలుసు! నీ అంత రంగం కరుణతో నిండివుందనీ నాకు తెలుసు! వీరు పాపం చేయటం మానితే, వీరిని నాశనం చేయాలనే నీ తలంపు మార్చుకుంటావనీ నాకు తెలుసు. [3]కావున యెహోవా, నన్ను చంపివేయుమని నేను నిన్ను వేడుకుంటున్నాను. నేను బ్రతకటం కంటే చనిపోవటం మంచిది!"

[4]అప్పుడు యెహోవా ఇలా అన్నాడు: "నేను ఆ ప్రజలను నాశనం చెయ్యనంత మాత్రాన నీవు కోపగించుకోవటం నీకు సమంజసమని అను కుంటున్నావా?"

[5]అయినా యోనా జరిగినదానికంతకు ఇంకా కోపంగానే ఉన్నాడు. కావున అతడు నగరం వెలుపలికి వెళ్లాడు. తూర్పు దిక్కున నగరానికి దగ్గరలో ఉన్న ఒక ప్రాంతానికి యోనా వెళ్లాడు. యోనా తన కొరకు ఒక పందిరి నిర్మించుకున్నాడు. నగరానికి ఏమవు తుందో చూద్దామని ఎదురుచూస్తూ అతడు ఆ నీడలో కూర్చున్నాడు.

### సొరచెట్టు – పురుగు

[6]యోనా కూర్చునివున్న పందిరి మీదికి ఒక సొర పాదును త్వరత్వరగా పాకేలా యెహోవా చేశాడు. అది యోనా కూర్చోవటానికి చల్లని వాతావరణం కల్పించింది. ఇది యోనాకు హాయిని సమకూర్చ టంలో సహాయపడింది. ఈ సొరపాదు మూలంగా యోనా చాలా సంతోషంగా ఉన్నాడు.

[7]మరునాటి ఉదయం, మొక్కలో ఒక భాగాన్ని తినివేయటానికి ఒక పురుగును దేవుడు పంపాడు. ఆ పురుగు మొక్కను తినివేయటం మొదలుపెట్టగా, ఆ మొక్క చనిపోయింది. [8]మిట్టమధ్యాహ్నమయ్యే సరికి, దేవుడు తూర్పు నుండి వేడిగాడ్పులు వీచేలా చేశాడు. యోనా తలమీద సూర్యుని వేడిమి ఎక్కువయ్యింది. యోనా బాగా నీరసించిపోయాడు. యోనా దేవునితో తనను చనిపోనిమ్మన్నాడు. "నేను బ్రతకటంకంటే చనిపోవటం మేలు" అని యోనా అన్నాడు.

[9]కాని దేవుడు యోనాతో, "ఈ మొక్క చని పోయినంత మాత్రాన నీవు కోపగించుకోవటం సమంజసమేనా?" అని అన్నాడు.

"అవును, నేను కోపగించుకోవటం సమంజసమే! నేను చచ్చిపోవాలనేటంత కోపంతో ఉన్నాను" అని యోనా అన్నాడు. [10]పిమ్మట యెహోవా ఇలా అన్నాడు: "ఆ మొక్కకు నీవు ఏమీ చేయలేదు! నీవు దానిని పెంచలేదు. అది రాత్రికి రాత్రి పెరిగి, మరునాడు చనిపోయింది. ఇప్పుడు నీవు ఆ మొక్కను గురించి విచారిస్తున్నావు. [11]నీవు ఒక మొక్కను గురించే కలత చెందినప్పుడు, నేను నీనెవెలాంటి ఒక మహా నగరం గురించి ఖచ్చితంగా విచారిస్తాను. ఆ నగరంలో ప్రజలు ఉన్నారు. జంతువులు అనేకంగా ఉన్నాయి. తాము తప్పు చేస్తున్నామని తెలియని ఒక లక్షా ఇరవై వేల మందికంటే ఎక్కువమంది ప్రజలు ఆ నగరంలో ఉన్నారు."

# మీకా

## సమరయ, ఇశ్రాయేలుకు దండన

1 యెహోవా వాక్కు మీకాకు అందింది. ఇది
యోతాము, ఆహాజు, మరియు హిజ్కియా అనే
రాజుల కాలంలో జరిగింది. వీరు ముగ్గురూ యూదా
రాజులు. మీకా, మోరషతు నగరం వాడు. సమరయ,
యెరూషలేములను గురించిన ఈ దర్శనాలను మీకా
చూశాడు.

2 ప్రజలారా, మీరంతా వినండి! భూమీ, దాని మీద
గల ప్రతి ఒక్కడూ, అంతా వినండి! నా ప్రభువైన
యెహోవా తన పవిత్ర ఆలయం నుండి వస్తాడు.
నా ప్రభువు మీకు వ్యతిరేకంగా ఒక సాక్షిగా వస్తాడు.
3 చూడండి, దేవుడైన యెహోవా తన స్థానంనుండి
బయటకు వస్తున్నాడు. ఆయన భూమియొక్క
ఉన్నత స్థలాలపై నడవటానికి కిందికి వస్తున్నాడు.
4 దేవుడైన యెహోవా అగ్ని ముందు మైనంలా
పర్వతాలు కరిగిపోతాయి. గొప్ప జలపాతంలా,
లోయలు వికలమై కరిగిపోతాయి.
5 యాకోబు పాపం కారణంగా, ఇశ్రాయేలు ఇంటి
వారు చేసిన పాపాల కారణంగా ఇది జరుగుతుంది.

## సమరయ పాప హేతువు

యాకోబు పాపానికి కారణం ఏమిటి? దానికి
కారణం సమరయ! యూదాలో ఉన్నత స్థల
మేది?* అది యెరూషలేము!
6 మైదానంలో రాళ్ల గుట్టలా నేను సమరయను
మార్చుతాను. అది ద్రాక్షాతోట వేయటానికి అను
వైన భూమివలె మారిపోతుంది. సమరయ యొక్క
నిర్మాణపు రాళ్లను పెరికి లోయలో పారవేస్తాను.
నేను దాని పునాదులను నాశనం చేస్తాను.
7 దాని విగ్రహాలన్నీ ముక్కలుగా విరుగ గొట్టబడ
తాయి. అది సంపాదించిన ధనం అగ్నికి ఆహుతి
అవుతుంది. దానియొక్క బూటకపు దేవుళ్ల
విగ్రహాలన్నిటినీ నేను నాశనం చేస్తాను. ఎందు
కంటే, సమరయ నా పట్లఅవిశ్వాసంగా ఉండి
అవన్నీ కూడబెట్టింది. కావున ఈ వస్తువులన్నీ
నాపట్ల అవిశ్వాసంగా ఉన్న ఇతర ప్రజలకు వెళ్లి
పోతాయి.

## మీకా యొక్క తీరని విచారం

8 ఈ చెడు విషయంలో నేను కలవరపాటుచెంది,
విచారిస్తున్నాను. నేను పాద రక్షలు కూడ లేకుండా,
నగ్నంగా బయటకు వెళతాను. నక్కలు ఊళ పెట్టి
నట్లు నేను అరుస్తాను. నిప్పు కోళ్లలా మూల్గుతాను.
9 ఎందుకనగా సమరయ గాయం మాన్పరానిది. ఆమె
గాయం (పాపం) యూదాకు వ్యాపించింది.అది
నా ప్రజల నగర ద్వారం వద్దకు చేరింది. అది
చివరకు యెరూషలేము వరకు వచ్చింది.
10 ఇది గాతులో చెప్పవద్దు. అక్కడ ఏడ్వవద్దు.
బేత్‌యఫ్రలో విలపించి, దుమ్ములో పొర్లాడు.
11 షాఫీరులో నివసించేవాడా, దిగంబరివై, సిగ్గుతో నీ
దారిన నీవు పొమ్ము. జయనానులో నివసించేవాడు
బయటకు వెళ్లడు. బేతేజెలులో ఉన్నవారు విల
పిస్తారు. దానికి కావలసిన ఆసరా మీ నుండి తీసు
కొంటుంది.
12 మారోతులో నివసించేవాడు మంచివార్త కోసం
ఎదురు చూస్తూ నీరసించిపోయాడు. ఎందుకంటే
యెహోవానుండి ఆపద యెరూషలేము నగర
ద్వారంవరకు వచ్చింది.
13 లాకీషులో నివసిస్తున్న ఓ స్త్రీ, రథాన్ని వేగముగల
గుర్రానికి తగిలించు. సీయోను పాపాలు లాకీషులో
మొదలైనాయి. ఎందుకంటే నీవు ఇశ్రాయేలు
పాపాలనే అనుసరించావు.
14 కావున గాతులోని మోరెషెతుకు మీరువీడ్కోలు
బహుమతులు ఇవ్వాలి. అక్జీబులోని ఇండ్లు
ఇశ్రాయేలు రాజులను మోసపుచ్చుతాయి.
15 మారేషా నివాసులారా, మీమీదికి నేనొక వ్యక్తిని
తీసుకొని వస్తాను, మీకున్న వస్తువులన్నీ ఆ వ్యక్తి
తీసుకుంటాడు. ఇశ్రాయేలు మహిమ (దేవుడు)
అదుల్లాములో ప్రవేశిస్తుంది.
16 కావున మీ తలలు గొరిగించి, బోడిగా చేసుకోండి.

**ఉన్నత స్థలం** దీనికి కేవలం “కొండ” అని అర్థం కావచ్చు లేదా దేవుని లేదా దొంగ దేవుళ్లను పూజించే ప్రదేశం కావచ్చు. ఈ ప్రదేశాలు సాధారణంగా కొండలమీద, పర్వతాలమీద ఉంటాయి.

ఎందుకంటే మీరు ప్రేమించే పిల్లలకొరకుమీరు
దుఃఖిస్తారు. రాబందులారా మీ తలలు బోడి
చేసుకోండి. ఎందుకంటే మీ పిల్లలు మీకు దూర
మవుతారు. వారు బలవంతంగా ఇండ్లు వదిలి
పోయేలా చేయబడతారు.

### ప్రజల దుష్ట పథకాలు

2 పాపం చేయటానికి ఉపాయం పన్నేవారికి
ఆపదలు వస్తాయి. ఆ ప్రజలు తమ పాన్పులపై
పడుకొని పాపం చేయటానికి పథకాలు వేస్తారు.
తెల్లవారగానే, ఈ ప్రజలు తమ పథకం ప్రకారం
చెడు పనులు చేస్తారు. ఎందుకంటే వాటిని
చేయటానికి వారికి శక్తి ఉంది.
2 వారు భూములను ఆశించి, వాటిని తీసుకుంటారు.
వారు ఇండ్లను కోరి వాటిని ఆక్రమిస్తారు. వారొక
వ్యక్తిని మోసపుచ్చి వాని ఇంటిని తీసుకుంటారు.
వారొక వ్యక్తిని మోసగించి అతని వస్తువులను
కాజేస్తారు.

### ప్రజలను శిక్షించటానికి యెహోవా పథకం

3 అందువల్ల యెహోవా ఈ విషయాలు చెపుతు
న్నాడు: "చూడండి, ఈ వంశం మీదికి ఆపద
తీసుకురావటానికి నేను పథకం వేస్తున్నాను.
మిమ్మల్ని మీరు రక్షించుకోలేరు. మీరు గర్వంగా
నడవలేరు. ఎందుకంటే అది కీడుమూడే సమయం.
4 ఆ సమయంలో ప్రజలు మిమ్మల్ని గురించి
పాటలు పాడుకుంటారు. ప్రజలు మిమ్మల్ని
గురించి దుఃఖ సూచకపాటలు ఆలపిస్తారు. మీరు
ఇలా అంటారు: 'మేము నాశనమయ్యాము!
యెహోవా నా ప్రజల భూమిని తీసుకున్నాడు.
ఆయన దానిని అన్యజనులకు ఇచ్చాడు. అవును,
నా భూమిని ఆయన నానుండి తీసుకున్నాడు.
యెహోవా మా పొలాలను మా శత్రువులమధ్య
విభజించాడు.
5 ప్రజలు మీ భూమిని కొలవలేరు. భూమిని
యెహోవా ప్రజల మధ్య విభజించటానికి ప్రజలు
చీట్లు వేయలేరు. ఎందుకంటే, ఆ భూమి మీకు
చెందియుండదు!'"

### మీకాను ఇక పై బోధించవద్దనటం

6 ప్రజలు ఇలా అంటారు: "మాకు బోధించవద్దు.
మా గురించి ఆ చెడు విషయాలు చెప్పవద్దు.
మాకు ఏ కీడూ జరుగబోదు."
7 కాని, యాకోబు వంశీయులారా నేనీ విషయాలు
చెప్పాలి . మీరు చేసిన పనుల పట్ల యెహోవా
కోపగిస్తున్నాడు. మీరు ధర్మంగా ప్రవర్తిస్తే నేను
మిమ్మల్ని గురించి మంచి మాటలు చెప్పేవాడిని.

### దేవుని ప్రజలే ఆయనకు శత్రువులవటం

8 కాని, ఇటీవల నా ప్రజలే నా శత్రువులయ్యారు
దారిన పోయే వారివద్ద నుండి మీరు బట్టలు
దొంగిలిస్తారు. ఆ జనులు మాత్రం సురక్షితంగా
ఉన్నామనుకున్నారు. కాని వారు యుద్ధ ఖైదీలు
అన్నట్లు, వారి వస్తువులు మీరు తీసుకుంటారు.
9 నా ప్రజల స్త్రీలను వారి అందమైన, సౌకర్యాలు
గల ఇండ్లనుండి మీరు వెళ్ళగొట్టారు. వారి చిన్న
పిల్లల మధ్యనుండి నా మహిమను మీరు తీసివేశారు.
10 లేచి వెళ్లిపొండి! ఎందుకంటే, ఇది విశ్రాంతి
తీసుకొనే స్థలం కాదు. ఎందుకంటే మీరు ఈ
స్థలాన్ని పాడు చేశారు! మీరు దీన్ని అపవిత్రం
చేశారు. కనుక అది నాశనం చేయబడుతుంది!
11 ఒక బూటకపు ప్రవక్త వచ్చి, అబద్ధాలు చెప్పవచ్చు.
అతడు, "నాకు ద్రాక్షారసం, మద్యం ఇవ్వండి.
నేను మీకు మంచి విషయాలు చెపుతాను" అని
అనవచ్చు. అతడు వారికి ఆ విధంగా బోధకు
డవుతాడు!

### యెహోవా తన ప్రజలను ఒక్క చోటికి చేర్చటం

12 అవును. యాకోబు వంశీయులారా, నేను మీ
అందరినీ ఒక్కచోటికి తీసుకువస్తాను. ఇశ్రాయేలు
ప్రజలలో మిగిలిన వారందరినీ సమకూర్చుతాను.
దొడ్డిలోని గొర్రెల్లా, పచ్చిక బీడులోనిమందల్లా,
వారిని నేను సమకూర్చుతాను. అప్పుడు ఆ స్థల
మంతా అనేకమందిచేసే ధ్వనులతో నిండి
పోతుంది.
13 "ఒక వ్యక్తి" ముందుకు తోసుకు వచ్చి తన ప్రజల
ముందుకు వస్తాడు. ఆయన ద్వారాలను పడదో
సుకుపోతాడు. ప్రజలు ఆ నగరాన్ని వదిలివేస్తారు.
వారి రాజు వారిముందు నడుస్తాడు. యెహోవా
తన ప్రజల ముందు ఉంటాడు.

### చెడు చేసిన ఇశ్రాయేలు నాయకుల అపరాధిత్వం

3 అప్పుడు నేనిలా అన్నాను: "యాకోబు పెద్దలారా,
ఇశ్రాయేలు దేశాధిపతులారా, ఇప్పుడు వినండి.
న్యాయమంటే ఏమిటో మీరు తెలుసుకోవాలి!
2 కాని మీరు మంచిని ద్వేషించి, చెడును ప్రేమిస్తారు!
మీరు వారి ప్రజల చర్మాన్ని ఒలుస్తారు. మీరు
వారి ఎముకలపై గల మాంసాన్ని లాగివేస్తారు!
3 మీరు నా ప్రజలను నాశనం చేస్తున్నారు! మీరు
వారి చర్మాన్ని ఒలుచుకుంటున్నారు; వారి ఎము
కలను విరుగ గొడుతున్నారు. మాంసంలా వారి
ఎముకలను కుండలోపెట్టటానికి మీరు
నరుకుతారు!
4 అప్పుడు మీరు దేవుడైన యెహోవాను
ప్రార్థిస్తారు. కాని ఆయన మీ ప్రార్థన వినడు;

దేవుడైన యెహోవా మిమ్మల్ని చూచి ముఖం
తిప్పుకుంటాడు. ఎందుకంటే మీరు చెడుపనులు
చేశారు!”

### బూటకపు ప్రవక్తలు

[5]అబద్ధ ప్రవక్తలు యెహోవా ప్రజలకు తప్పుడు
జీవిత విధానాన్ని బోధిస్తారు. యెహోవా ఆ ప్రవక్తల
విషయంలో ఈ విధంగా చెపుతున్నాడు:

“ప్రజలు గనుక ఈ ప్రవక్తలకు తినటానికి ఆహారం
ఇస్తే వారు శాంతి అని అరుస్తారు! ఒకవేళ ప్రజలు
వారికి ఆహారం ఇవ్వకపోతే, అప్పుడా ప్రవక్తలు
‘యుద్ధానికి సిద్ధంకండి’ అని అరుస్తారు.
6 అందువల్ల మీకు చీకటి కమ్మినట్లుఉంటుంది.
మీకు దర్శనాలు కలుగవు. భవిష్యత్తులో ఏమి
జరుగుతుందో మీరు చెప్పలేరు గనుక. మీకు అంధ
కారం వ్యాపించినట్లు ఉంటుంది. ఈ ప్రవక్తలకు
సూర్యుడు అస్తమిస్తాడు. వారికి పట్టపగలే అంధ
కారం ఆవరిస్తుంది.
7 దీర్ఘదర్శులు (ప్రవక్తలు) సిగ్గుపడతారు. భవిష్య
త్తును చూసేవారు కలవరపాటు చెందుతారు.
అవును; వారంతా వారి నోళ్లు మూసుకుంటారు.
ఎందుకంటే దేవునివద్ద నుండి సమాధానం రాదు!

### మీకా దేవునియొక్క నిజమైన ప్రవక్త

8 కానీ యెహోవా ఆత్మ నన్ను శక్తితోను, మంచి
తనంతోను, బలంతోను నింపివేసింది. కావున
నేను యాకోబుకు అతని పాపాలనుగూర్చి చెప్ప
గలను. అవును ఇశ్రాయేలుకు అతను చేసిన
పాపాలను గురించి నేను చెపుతాను!”

### ఇశ్రాయేలు నాయకులు నిందకు పాలవటం

9 యాకోబు ప్రజల నాయకులారా, ఇశ్రాయేలు అధి
పతులారా, నేను చెప్పేది వినండి! మీరు
న్యాయాన్ని ద్వేషిస్తారు. మీరు తిన్నగా ఉన్నదానిని
వంకర చేస్తారు!
10 మీరు ప్రజలను హత్యచేసి సీయోనును నిర్మిం
చారు! మీరు యెరూషలేమును పాపంతో నిర్మిం
చారు!
11 యెరూషలేములో న్యాయాధిపతులు రహస్యంగా
లంచాలు తీసుకుంటారు. వారలా చేసి న్యాయ
స్థానంలో తమ తీర్పు ఇస్తారు. ప్రజలకు బోధించే
ముందు యెరూషలేము యాజకులకు వేతనం
చెల్లించాలి. ప్రవక్తలు భవిష్యత్తులోకి చూసే
ముందు ప్రజలు వారికి డబ్బు చెల్లించాలి. అప్పుడా
నాయకులు, “మనకు ఏరకమైన కీడూరాదు!
యెహోవా మనపట్ల ఉన్నాడు!” అని అంటారు.
12 మీ మూలంగానే సీయోను నాశనమవుతుంది. అది
దున్నిన పొలంలా తయారవుతుంది. యెరూష
లేము రాళ్ల గుట్టలా మారుతుంది. ఆలయపు
పర్వతం పొదలతో నిండినవట్టి కొండలా
తయారవుతుంది.

### యెరూషలేమునుండి న్యాయం రావటం

4 చివరి రోజులలో ఇలా జరుగుతుంది.
పర్వతాలన్నిటిలో దేవుడైన యెహోవా
ఆలయమున్న పర్వతం మిక్కిలి ప్రాముఖ్యంగలది
అవుతుంది. అది కొండలన్నిటిలో ఉన్నతంగా
చేయబడుతుంది. అన్యదేశాల ప్రజలు దానివద్దకు
ప్రవాహంలా వస్తారు.
2 అనేక దేశాలవారు వచ్చి ఇలా అంటారు: “రండి
మనం యెహోవా పర్వతంమీదికి వెళదాం!
యాకోబు దేవుని ఆలయానికి వెళదాం!
యెహోవా తన ధర్మాన్ని మనకు నేర్పుతాడు.
ఆయన మార్గంలో మనం నడుద్దాం.” ఎందు
వల్లనంటే దేవుని బోధలు సీయోనునుండి
వస్తాయి. యెహోవా వాక్కు యెరూషలేము
నుండి వస్తుంది!
3 యెహూవా అనేక జనుల మధ్య తీర్పు తీర్చుతాడు.
బహు దూరానగల బలమైన దేశాల ప్రజలకు
ఆయన తీర్పు ఇస్తాడు. అప్పుడు వారు తమ
కత్తులను సాగగొట్టి వాటిని నాగలికర్రలుగా
చేస్తారు. ఆ జనులు తమ ఈటెలను సాగ
గొట్టిచెట్లను నరికే పనిముట్లుగా చేస్తారు. జనులు
ఒకరితో ఒకరు కత్తులతో యుద్ధం చేయటం
మాని వేస్తారు. వారిక ఎన్నడూ యుద్ధ వ్యూహాలను
అధ్యయనం చేయరు!
4 లేదు, ప్రతి ఒక్కడూ తన ద్రాక్షాలతల క్రింద,
అంజూరపు చెట్టుక్రింద కూర్చుంటాడు. వారిని
ఎవ్వరూ భయపడేలా చేయరు! ఎందువల్లనంటే
సర్వశక్తిమంతుడైన యెహోవా ఇది చెప్పాడు!
5 అన్యదేశాల ప్రజలు తమతమ దేవుళ్లను
అనుసరిస్తారు. కానీ మనం మాత్రం మన దేవుడైన
యెహోవా నామాన్ని సదా స్మరించుకుంటాం!

### రాజ్యం తిరిగి పొందబడటం

6 యెహోవా చెపుతున్నాడు, “యెరూషలేము
గాయపర్చబడగా కుంటిదిఅయ్యింది. యెరూష
లేము అవతలకు విసిరివేయబడింది. యెరూష
లేము గాయపర్చబడింది; శిక్షింపబడింది. అయినా
నేను ఆమెను నా వద్దకు తీసుకొనివస్తాను.
7 ఆ ‘కుంటి’ నగరవాసులే బతుకుతారు. ఆ నగర
ప్రజలు నగరం వదిలివెళ్లేలా బలవంత పెట్టబడ్డారు.
కాని నేను వారిని ఒక బలమైన రాజ్యంగారూ

పొందిస్తాను.” యెహోవా వారికి రాజుగా ఉంటాడు.
ఆయన శాశ్వతంగా సీయోను పర్వతం మీదనుండి
పరిపాలిస్తాడు.
8 ఓ మందల కావలిదుర్గమా, ఓ సీయోను కుమార్తె
పర్వతమైన ఓఫెలూ, గతంలోమాదిరి నీవొక
రాజ్యంగా రూపొందుతావు. అవును, సీయోను
కుమారీ, ఆ రాజ్యం నీకు వస్తుంది.

### ఇశ్రాయేలీయులు బాబిలోనియాకు ఎందుకు వెళ్లాలి?

9 నీవిప్పుడు అంత బిగ్గరగా ఎందుకు ఏడుస్తున్నావు?
నీ రాజు వెళ్లిపోయాడా? నీ నాయకుని నీవు
కోల్పోయావా? ప్రసవవేదనపడే స్త్రీలా నీవు బాధ
పడుతున్నావు.
10 సీయోను కుమారీ, నీవు బాధపడు. ప్రసవించే
స్త్రీలా నీవు ప్రసవించి “బిడ్డను” కను. ఎందుకంటే
నీవు (యెరూషలేము) నగరాన్ని ఇప్పుడు
వదిలివేస్తావు. నీవు వెళ్లి పొలంలో నివసిస్తావు. నీవు
బబులోనుకు (బాబిలోనియా) వెళతావు. కానీ
నీవక్కడనుండి రక్షింపబడతావు. యెహోవా
అక్కడికి వెళ్లి నిన్ను నీ శత్రువులనుండి తిరిగి
తీసుకొని వస్తాడు.

### యెహోవా ఇతర దేశాలను నాశనం చేయుట

11 అనేక దేశాలు నీ మీద యుద్ధానికి వచ్చాయి.
“సీయోను వైపు చూడు! దానిపై దాడి
చేయండి!”అని ఆ జనులు అంటారు.
12 ఆ జనులు వారి వ్యూహాలు పన్నారు. కాని
యెహోవా చేసే యోచన మాత్రం వారు
ఎరుగరు. యెహోవా ఆ ప్రజలను ఇక్కడికి ఒక
ప్రత్యేక ఉద్దేశ్యంతో తీసుకొని వచ్చాడు. కళ్లంలో
ధాన్యం నూర్చబడినట్లు ఆ జనులు నలగదొక్క
బడతారు.

### ఇశ్రాయేలు శత్రువులను ఓడించి జయించటం

13 “సీయోను కుమారీ లెమ్ము; ఆ జనాలను అణగ
దొక్కు. నేను నిన్ను బాగా బలపర్చుతాను. నీకు
ఇనుప కొమ్ములు, కంచుగిట్టలు ఉన్నట్లవుతుంది.
అనేకమంది జనులను నీవు ముక్కలుగాచి
తకగొడతావు. వారి సంపదను నేను యెహోవాకు
ఇస్తాను. వారి భాగ్యాన్ని సర్వజగత్తుకూ అధి
పతియైన యెహోవాకు సమర్పిస్తాను.”

5 కావున, బలమైన నగరమా నీ సైన్యాలను
సమీకరించు. నీ శత్రువులు ముట్టడించటానికి
కూడుకుంటున్నారు. వారు ఇశ్రాయేలు న్యాయాధి
పతిని చెంపమీద కొడతారు.

### బేత్లెహేములో పాలకుని పుట్టుక

2 కాని, బేత్లెహేము ఎఫ్రాతా, నీవు యూదాలో అతి
చిన్న గ్రామానివి. నీ వంశం లెక్కపెట్టటానికి కూడా
అతి చిన్నది. అయినప్పటికీ, నీ నుండే నా
“ఇశ్రాయేలు పాలకుడు” వస్తాడు. ఆయన
ఆరంభం (ఉనికి) పురాతన కాలంనుండి, ఆద్యంత
ములు లేని రోజులనుండి ఉంటూవుంది.
3 యెహోవా తన ప్రజలను బబులోను (బాబి
లోనియా)లో ఉండనిస్తాడు. స్త్రీ* ప్రసవించే దాకా
వారక్కడ ఉంటారు. అప్పుడు ఇంకా బతికివున్న
అతని సోదరులు తిరిగివస్తారు. వారు ఇశ్రాయేలు
ప్రజలవద్దకు తిరిగివస్తారు.
4 అప్పుడు ఇశ్రాయేలును పాలించేవాడు నిలబడి తన
మందను మేపుతాడు. యెహోవా తన శక్తితోను;
దేవుడైన యెహోవా తన అద్భుత నామ
మహత్తుతోను ఆయన వారిని నడిపించుతాడు.
వారు నిర్భయంగా జీవిస్తారు. ఎందువల్లనంటే, ఆ
సమయంలో ఆయన గొప్పతనం భూమి అంచుల
దాకా వ్యాపిస్తుంది. శాంతి నెలకొంటుంది.
5 అష్షూరు సైన్యం మన దేశంలోకి వస్తుంది. ఆ
సైన్యం మన పెద్ద ఇండ్లను నాశనంచేస్తుంది. కాని
ఇశ్రాయేలు పాలకుడు ఏడుగురు గొర్రెల కాపరు
లను ఎంపికచేస్తాడు. కాదు ఆయన ఎనమండుగురు
నాయకులనుఎంపిక చేస్తాడు.
6 వారు తమ కత్తులను ఉపయోగించి, అష్షూరువారిని
పాలిస్తారు. వారు తమ స్వంత నగరాలనుండి
నిమ్రోదుదేశాన్ని పాలిస్తారు. ఆ ప్రజలను పాలించ
టానికి వారు తమ కత్తులను ఉపయోగిస్తారు.
అప్పుడు ఇశ్రాయేలు పాలకుడు మనలను అష్షూరీ
యుల నుండి రక్షిస్తాడు. (ఆ ప్రజలు మన రాజ్యం
లోకి వస్తారు. వారు మన ప్రాంతాన్ని తమ కాళ్ళ
కింద త్రొక్కుతారు.)
7 యాకోబు సంతతిలో మిగిలిన వారుచాలామంది
ప్రజలకు యెహోవా కురిపించే మంచులా
ఉంటారు. వారు పచ్చగడ్డిపై పడే వర్షంలా
ఉంటారు. వారు ఏ మనిషి కోసమూ వేచి ఉండరు.
వారు ఎవరికీ భయపడరు.
8 అడవి జంతువుల మధ్య సింహం ఎలా ఉంటుందో,
యాకోబు సంతతిలో మిగిలినవారు చాలామంది
ప్రజలకు అలా ఉంటారు. గొర్రెలమందల్లో
చొరబడిన కొదమ సింహంలా వారుంటారు.
సింహం నడుచుకుంటూ వెళ్లినప్పుడు అది ఎటు
వెళ్లదలిస్తే అటు వెళుతుంది. అది ఒక జంతువును
ఎదుర్కొన్నప్పుడు ఎవ్వడూ దానిని అదుపు
చేయలేడు. మిగిలి ఉన్న జనులు అటువంటి
సింహంలా ఉంటారు.

---

స్త్రీ అనగా ఇక్కడ యెరూషలేము కావచ్చు.

9 మీరు మీచేతిని మీ శత్రువులపైకి ఎత్తి, వారిని
నాశనం చేస్తారు.

### ప్రజలు దేవునిపై ఆధారపడుట

10 దేవుడైన యెహోవా చెపుతున్నాడు, "ఆ
సమయంలో మీ గుర్రాలను మీవద్దనుండి
తీసుకుంటాను. మీ రథాలను నాశనంచేస్తాను.
11 మీ దేశంలోగల నగరాలను నేను నాశనం చేస్తాను.
మీ కోటలన్నిటినీ కూలగొడతాను.
12 మీరిక ఎంతమాత్రం మంత్రతంత్రాలు చేయ
ప్రయత్నించరు. భవిష్యత్తును చెప్ప యత్నించే
జనులుమీకిక వుండబోరు.
13 మీ బూటకపు దేవుళ్ల విగ్రహాలను నేనునాశనం
చేస్తాను. ఆ బూటకపు దేవుళ్ల జ్ఞాపకార్థం ఏర్పాటు
చేసిన రాళ్లను నేను పడగొడతాను. నీ చేతులు
చేసిన వస్తువులను నీవు ఆరాధించవు.
14 అషేరా దేవతను ఆరాధించటానికి ఏర్పాటు
చేయబడిన స్తంభాలను లాగివేస్తాను. మీ బూటకపు
దేవుళ్లను నేను నాశనం చేస్తాను.
15 కొంతమంది మనుష్యులు నా మాట వినరు. నేను
నా కోపాన్ని చూపిస్తాను. ఆ జనులకు నేను
ప్రతీకారంచేస్తాను."

### దేవుడైన యెహోవా ఫిర్యాదు చేయటం

6 యెహోవా ఏమి చెపుతున్నాడో ఇప్పుడు విను
నీవు లేచి పర్వతాలముందు నిలబడు. వాటికి నీ
కథ విన్నవించుకో. కొండలను నీ కథ విననియ్యి.
2 తన ప్రజలకు వ్యతిరేకంగా యెహోవాకుఒక
ఫిర్యాదు వుంది. పర్వతాల్లారా, యెహోవా చేసే
ఫిర్యాదు వినండి. భూమి పునాదుల్లారా, యెహోవా
చెప్పేది వినండి. ఇశ్రాయేలుది తప్పు అని ఆయన
నిరూపిస్తాడు!
3 యెహోవా చెపుతున్నాడు, "నా ప్రజలారా, మీ
పట్ల నేనేమి తప్పు చేశాను? మీరు నాపట్ల విరక్తి
చెందేలా నేను ఏమి చేశాను? మీకు నేను చేసిన
పనులు నాకు చెప్పండి!
4 నేను చేసిన పనులు మీకు నేను చెపుతాను! ఐగుప్తు
(ఈజిప్టు) దేశం నుండి మిమ్మల్ని నేను తీసుకు
వచ్చాను. మీకు నేను దాస్యంనుండి విముక్తి
కలిగించాను. నేను మీవద్దకు మోషే, అహరోను,
మిర్యాములను పంపాను.
5 నా ప్రజలారా, మోయాబు రాజైన బాలాకు చేసిన
దుష్టవ్యూహాలను మీరు గుర్తుపెట్టుకోండి.
బెయోరు కుమారుడైన బిలాము అనేవాడు
బాలాకుకు చెప్పిన విషయాలు గుర్తుకు తెచ్చు
కోండి అకాసియ (షిత్తీయు) నుండి గిల్గాలువరకు
జరిగిన విషయాలను గుర్తుకు తెచ్చుకోండి.
అప్పుడు యెహోవా న్యాయ వర్తనుడని మీరు
తెలుసుకుంటారు!"

### దేవుడు మననుండి ఏమి కోరుతున్నాడు?

6 దేవుడైన యెహోవా సన్నిధికి నేను వచ్చి
నప్పుడు, నేను దేవుని ముందు సాష్టాంగ
పడినప్పుడు నాతో నేనేమి తీసుకొనిరావాలి? ఒక
సంవత్సరం వయస్సుగల కోడెదూడను దహనబలి
నిమిత్తం తీసుకొని నేను యెహోవావద్దకు
రావాలా?
7 యెహోవా వెయ్యి పొట్టేళ్లతోలేక పదివేల నదు
లకు సమానమైన నూనెతో సంతృప్తి చెందుతాడా,
నా పాప పరిహారానికి నా ప్రథమ సంతానాన్నిబలి
ఇవ్వనా? నా పాపాలకు పరిహారంగా నా శరీరంలో
భాగంగా పుట్టిన శిశువును అర్పించనా?
8 మానవుడా, మంచి విషయాలను గురించి
యెహోవా నీకు చెప్పియున్నాడు. యెహోవా
నీ నుండి కోరేవి ఇవి: ఇతరుల పట్ల నీవు న్యాయంగా
ప్రవర్తించు. ప్రజలపట్ల ప్రేమ, దయకలిగి
ఉండటానికి ఇష్టపడు. అణకువ కలిగి నీ దేవునితో
జీవించు.

### ఇశ్రాయేలీయులు ఏమి చేస్తున్నారు?

9 దేవుడైన యెహోవా కంఠం నగరాన్ని (యెరూష
లేము) పిలుస్తూవుంది. తెలివిగల మనుష్యుడు
యెహోవా నామాన్ని గౌరవిస్తాడు. కావున శిక్షించే
దండంపట్ల, ఆ దండాన్నిచేత ధరించేవాని పట్ల
ధ్యానముంచు!
10 దుష్టులు తాము దొంగిలించిన ధనరాశులనుఇంకా
దాస్తున్నారా? దుష్టులు ఇంకా మరీ చిన్నబుట్టలతో
జనాన్నిమోసగిస్తున్నారా? అలా ప్రజలను మోస
గించే విధానాలను యెహోవా అసహ్యించు
కుంటాడు!
11 దుష్టులు ఇంకా తప్పుడు కొలతలు, తప్పుడు
తూనికలతో ప్రజలను మోసగిస్తున్నారా? తప్పుడు
కొలతలు కొలవటానికి వారింకా దొంగతూక
పురాళ్లు, దొంగ కొలతలుగల సంచులు కలిగి
యున్నారా? అవును! అవన్నీ ఇంకా జరుగుతూనే
ఉన్నాయి!
12 ఆ నగరంలో ధనవంతులు ఇంకా క్రూరమైన
పనులు చేస్తున్నారు! ఆ నగరవాసులు ఇంకా
అబద్ధాలు చెపుతున్నారు! అవును, ఆ ప్రజలు
అబద్ధాలు చెపుతూనే ఉన్నారు!
13 కావున నేను నిన్ను శిక్షించటం మొదలుపెట్టాను.
నీ పాపాల కారణంగా నేను నిన్ను నాశనంచేస్తాను.
14 నీవు తింటావు; కానీ నీ కడుపు నిండదు. నీ
కడుపు ఖాళీగా ఉండి నీవు ఇంకా ఆకలితో

ఉంటావు. నీవు ప్రజలను సురక్షితంగా ఉంచటానికి
ప్రయత్నిస్తావు. కాని కత్తులు పట్టిన జనులు నీవు
కాపాడిన జనులను చంపుతారు, నిన్ను
పట్టుకుంటారు.
15 నీవు విత్తనాలు చల్లుతావు; కానీ నీవు పంట
కోయలేవు. ఒలీవ గింజలను గానుగపడతావు; కానీ
నీకు నూనెరాదు. నీ తియ్యటి ద్రాక్షారసం తాగ
టానికి నీవు అనుమతింపబడవు.
16 ఎందుకంటే నీవు ఒమ్రీ* నిర్దేశించిన కట్టుబాట్లను
అనుసరిస్తూ, అహాబు వంశంవారు చేసిన చెడు
పనులన్నీ చేస్తున్నావు. నీవు వారి బోధలను పాటి
స్తున్నావు. అందువల్ల నీవు నాశనమయ్యేలా
చేస్తాను. నీ నగరవాసులు నవ్వుల పాలవుతారు.
చీదర పుట్టించే నా జనులు బందీలుగా కొనిపో
బడతారు.

### ప్రజల దుష్కార్యాలపట్ల మీకా కలత చెందటం

7 నేను కలత చెందాను! ఎందుకంటే, నేను సేక
రించబడిన వేసవి కాలపు పండులా ఉన్నాను.
పండిపోయిన ద్రాక్షాపండ్లవలె ఉన్నాను. తినటానికి
ద్రాక్షాపండ్లు మిగలలేదు. నేను కాంక్షించే తొలి
అంజూరపు పండ్లులేనేలేవు.

2 అనగా విశ్వాసంగల జనులంతా పోయారు. ఈ
దేశంలో మంచివాళ్లంటూ ఎవ్వరూ మిగులలేదు.
ప్రతి ఒక్కడూ మరొకడిని చంపటానికి వేచి
వున్నాడు. ప్రతి ఒక్కడూ తన సోదరుని కపటో
పాయంతో పట్టటానికి యత్నిస్తున్నాడు.
3 ప్రజలు తమ రెండు చేతులతో చెడ్డపనులు
చేయటానికి సమర్థులైవున్నారు. అధిపతులు
లంచం అడుగుతారు. ఒక న్యాయాధిపతి న్యాయ
స్థానంలో తన తీర్పును తారుమారు చేయటానికి
డబ్బు తీసుకుంటాడు. "ముఖ్యులగు పెద్దలు"
మంచివైన, న్యాయమైన నిర్ణయాలు చేయరు.
వారేది చేయదలచారో అదే చేస్తారు.
4 వారిలో అతి మంచివాడు సహితం ముండ్లపొదవలె
ఉంటాడు. వారిలో మిక్కిలి మంచివాడు సహితం
ముండ్లపొదకంటే చాలా కంటకుడై ఉంటాడు.

### శిక్ష పడే రోజు వస్తూవుంది.

నీ ప్రవక్తలు ఈ రోజు వస్తుందని చెప్పారు. నీ
కావలివాండ్ర దినం రానేవచ్చింది. ఇప్పుడు నీవు
శిక్షింపబడతావు! ఇప్పుడు నీవు కలవరపడతావు!

5 నీ పొరుగువానిని నమ్మవద్దు! స్నేహితుని నమ్మ
వద్దు! నీ భార్యతో సహితం నీవు స్వేచ్ఛగా
మాట్లాడవద్దు!
6 తన ఇంటివారే తనకు శత్రువులవుతారు. ఒక
కుమారుడు తన తండ్రిని గౌరవించడు. ఒక
కుమార్తె తన తల్లికి ఎదురు తిరుగుతుంది. ఒక
కోడలు తన అత్తపై తిరుగబడుతుంది.

### దేవుడైన యెహోవాయే రక్షకుడు

7 కావున సహాయంకొరకు నేను యెహోవా తట్టు
చూస్తాను. నాకు సహాయం చేయటానికి నేను
యెహోవా కొరకు నిరీక్షిస్తాను. నా దేవుడు నా
మొర ఆలకిస్తాడు.
8 నేను పతనమయ్యాను. కానీ, ఓ శత్రువూ,
నన్ను చూచి నవ్వకు! నేను తిరిగి లేస్తాను.
నేనిప్పుడు అంధకారంలో కూర్చున్నాను. కానీ
యెహోవాయే నాకు వెలుగు.

### యెహోవా క్షమిస్తాడు

9 నేను యెహోవా పట్ల పాపం చేశాను. అందువల్ల
ఆయన నేనంటే కోపంగా ఉన్నాడు. కానీ న్యాయ
స్థానంలో ఆయన నా తరఫున వాదిస్తాడు. నాకు
మంచి జరిగే పనులు ఆయన చేస్తాడు. పిమ్మట
ఆయన నన్ను వెలుగులోకి తీసుకువస్తాడు.
ఆయన చేసింది న్యాయమైనదని నేను గ్రహిస్తాను.
10 నా శత్రువు ఇది చూసి సిగ్గుపడుతుంది. "నీ
దేవుడైన యెహోవా ఎక్కడున్నాడు?" అని నా
శత్రువు నన్నడిగింది. ఆ సమయంలో ఆమెను
చూసి నేను నవ్వుతాను. వీధిలో మట్టిమీద నడిచి
నట్లు జనులు ఆమెమీద నడుస్తారు.

### యూదులు తిరిగిరావటం

11 నీ గోడలు తిరిగి కట్టబడే సమయం వస్తుంది. ఆ
సమయంలో వారి దేశం విస్తరిస్తుంది.
12 నీ ప్రజలు నీ దేశానికి తిరిగివస్తారు. అష్షూరునుండి,
ఈజిప్టు దేశపు నగరాలనుండి వారు వస్తారు. నీ
దేశం ఈజిప్టు నది మొదలుకొని యూఫ్రటీసు
నదివరకు, పడమట సముద్రంనుండి తూర్పున
పర్వతాలవరకు వ్యాపించి ఉంటుంది.
13 దేశం పాడైపోయింది. దానిలో నివసించే జనుల
వల్ల, వారు చేసిన పనులవల్ల అది పాడైపోయింది.
14 కావున దండం చేపట్టి నీ ప్రజలను పాలించు.
నీకు చెందిన ప్రజా సమూహాన్ని పాలించు. ఆ
మంద (జనులు) అడవుల్లోనూ, కర్మెలు, పర్వతం
మీదనూ ఒంటరిగానూ ఉంటుంది. గతంలో
మాదిరి ఆ మంద బాషానులోనూ, గిలాదులోనూ
నివసిస్తుంది.

---

**ఒమ్రీ** ఒక ఇశ్రాయేలు రాజు. అతడు తన ప్రజలు అబద్ధపు దేవుళ్లను ఆరాధించేలా చేశాడు. 1రాజులు 16:21-26 చూడండి.

### ఇశ్రాయేలు తన శత్రువులను ఓడించటం

15 నేను నిన్ను ఈజిప్టు నుండిబయటకు తీసుకొని
వచ్చినప్పుడు ఎన్నో అద్భుతకార్యాలు జరి
పించాను. ఆ రకంగా మీరింకా ఎన్నో అద్భుత
కార్యాలు చూసేలా చేస్తాను.
16 అన్యజనులు ఆ అద్భుతకార్యాలు చూసి సిగ్గు
పడతారు. వారి "శక్తి" నాదానితో పోల్చినప్పుడు
వ్యర్థమైనదని వారు గ్రహిస్తారు. వారు విస్మయం
చెంది, వారి నోళ్లపై చేతులు వేసుకుంటారు!
వారు చెవులు మూసుకొని, వినటానికి నిరాకరిస్తారు.
17 వారు పాములా మట్టిలో పాకుతారు. వారు
భయంతో వణుకుతారు. తమ బొరియల్లోనుంచి
బయటకు వచ్చే కీటకాలవలె, వారు నేలమీద
పాకుతారు. వారు భయపడి దేవుడైన యెహోవా
వద్దకు వస్తారు. నీ ముందు వారు భయపడతారు!

### యెహోవాకు ప్రశంస

18 నీవంటి దేవుడు మరొకడు లేడు. పాపం చేసిన
దోషులను నీవు క్షమిస్తావు. నీ ప్రజలలో మిగిలిన
వారి పాపాలవైపునీవు చూడవు. దేవుడైన
యెహోవా కోపం శాశ్వతంగా ఉండదు. ఎందు
కంటే ఆయన కనికరం చూపటానికి ఇష్టపడతాడు.

19 యెహోవా, మమ్మల్ని ఓదార్చు. మా పాపాలను
పరిహరించు. మా పాపాలన్నిటినీ లోతైన
సముద్రంలోకి విసిరివేయుము.

20 దేవా, నీవు యాకోబు యెడల నమ్మకస్తుడవుగా
ఉంటావు. అబ్రాహాము యెడల దయకలిగి
యుంటావు. ఎందుకంటే మా పూర్వీకులకు
పురాతన కాలమందు నీవు వాగ్దానం చేశావు.

# నహూము

1 ఎల్కోషువాడైన నహూముకు కలిగిన దర్శనాన్ని
వివరించే గ్రంథం. ఇది నీనెవె నగరాన్ని గూర్చిన
దుఃఖకరమైన సమాచారం.

### నీనెవె పట్ల యెహోవా కోపం

2 యెహోవా రోషంగల దేవుడు! యెహోవా నేర
స్తులను శిక్షింపబోతున్నాడు. యెహోవా తన
శత్రువులను శిక్షిస్తాడు. ఆయన తన శత్రువులపై
తన కోపాన్ని నిలుపుతాడు.
3 యెహూవా ఓర్పు గలవాడు. కాని ఆయన మిక్కిలి
శక్తిమంతుడు. యెహూవా నేరం చేసిన జనులను
శిక్షిస్తాడు. ఆయన వారిని ఊరికే వదిలి పెట్టడు.
దుష్టజనులను శిక్షించటానికి యెహోవా వస్తు
న్నాడు. ఆయన తన శక్తిని చూపటానికి సుడిగాలు
లను,తుఫానులను ఉపయోగిస్తాడు. మానవుడు
నేల మీద మట్టిలో నడుస్తాడు. కాని యెహోవా
మేఘాలపై నడుస్తాడు !
4 యెహోవా సముద్రంతో కోపంగా మాట్లాడితే,
అది ఎండిపోతుంది. ఆయన నదులన్నీ ఇంకి
పోయేలా చేస్తాడు! బాషానులోని, కర్మెలులోని
సారవంతమైన భూములన్నీ ఎండి నశించి
పోతాయి. లెబానోనులోని పుష్పాలన్నీ వాడి
పోతాయి.
5 యెహోవా వస్తాడు. పర్వతాలన్నీ భయంతో
కంపిస్తాయి. కొండలు కరిగిపోతాయి. యెహోవా
వస్తాడు. భయంతో భూమి కంపిస్తుంది. ఈ
ప్రపంచం, అందులో నివసించే ప్రతివాడూ
భయంతో వణుకుతారు.
6 యెహోవా మహాకోపం ముందు ఎవ్వరూ నిలువ
లేరు. ఆయన భయంకర కోపాన్ని ఎవ్వరూ భరిం
చలేరు. ఆయన కోపం అగ్నిలా దహించి వేస్తుంది.
ఆయన రాకతో బండలు బద్దలై చెదిరి పోతాయి.
7 యెహోవా మంచివాడు, ఆపద సమయంలో
తలదాచుకోటానికి ఆయన సురక్షిత స్థలం. ఆయ
నను నమ్మిన వారి పట్ల ఆయన శ్రద్ధ తీసు
కుంటాడు.
8 ఆయన తన శత్రువులను సర్వనాశనం చేస్తాడు.
ఆయన వరదలా వారిని తుడిచి పెడతాడు.
ఆయన తన శత్రువులను అంధకారంలోకి తరిమి
వేస్తాడు.
9 యూదా, యెహోవాపై కుట్రలు ఎందుకు పన్ను
తున్నావు? కాని ఆయన వారి పన్నాగాలన్నిటినీ
వమ్ము చేస్తాడు. కష్టం రెండవ సారి రాదు.
10 చిక్కు పడిన ముండ్ల పొదలా నీ శత్రువు నాశనం
చేయబడతాడు. ఎండిన కలుపు మొక్కల్లా వారు
వేగంగా కాలిపోతారు.
11 అష్షూరూ, నీలో నుండి ఒక మనిషి వచ్చాడు.
అతడు యెహోవాకు వ్యతిరేకంగా దుష్ట పథకాలు
వేశాడు. అతడు చెడు సలహా ఇచ్చాడు.
12 యెహోవా ఈ విషయాలు యూదాకు చెప్పాడు:
"అష్షూరు ప్రజలు పూర్తి బలం కలిగి ఉన్నారు.
వారికి చాలామంది సైనికులున్నారు. కాని వారంతా
నరికి వేయబడతారు. వారంతా అంతం చేయ
బడతారు. నా ప్రజలారా, మీరు బాధ పడేలా చేశాను.
కాని ఇక మిమ్మల్ని బాధపడనీయను.
13 అష్షూరు అధికారాన్నుండి ఇప్పుడు మిమ్మల్ని విడి
పిస్తాను. మీ మెడ మీద నుండి ఆ కాడిని తీసివేస్తాను.
మిమ్మల్నిబంధించిన గొలుసులను తెంచి వేస్తాను."
14 అష్షూరు రాజా, నీ విషయంలో యెహోవా ఈ
ఆజ్ఞ ఇచ్చాడు: "నీ పేరు పెట్టుకోటానికి నీ సంతతి
వారు ఉండరు. నీ దేవుళ్ల ఆలయాలలో నెల
కొల్పిన, చెక్కిన విగ్రహాలను, లోహపు బొమ్మలను
నేను నీ కొరకు నీ సమాధిని నేను తయారు
చేస్తున్నాను. నీవు ముఖ్యుడవు కావు !
15 యూదా, చూడు ! పర్వతాల మీద నుండి వస్తు
న్నది, అక్కడ చూడు. శుభవార్త తీసుకొని ఒక
దూత ఇక్కడికి వస్తున్నాడు! శాంతి ఉన్నదని
అతడు చెపుతున్నాడు! యూదా, నీ ప్రత్యేక పండు
గలను జరుపుకో! యూదా, నీవు మాట ఇచ్చిన
వాటిని నెరవేర్చు. దుష్ట జనులు మళ్లీ నీ మీద
దాడి చేసి నిన్ను ఓడించలేరు! ఆ దుష్ట జను
లందరూ నాశనం చేయబడ్డారు.

### నీనెవె నాశనం చేయబడుతుంది

2 నీనెవె, నీతో యుద్ధం చేయటానికి వినాశకారుడు
వస్తున్నాడు. కావున నీ నగరపు బలమైన
ప్రదేశాలను కాపాడుకో, మార్గంపై నిఘా పెట్టు.

యుద్ధానికి సిద్ధం కమ్ము. పోరాటానికి సన్నాహాలు
చెయ్యి!
2 ఎందుకంటే ఇశ్రాయేలు ప్రభావం వలె యాకో
బుకు తన ప్రభావాన్ని యెహోవా తిరిగి ఇస్తు
న్నాడు. అష్షూరీయులు ఇశ్రాయేలు ప్రజలను
నాశనం చేశారు. వారి ద్రాక్షాలతలను నాశనం
చేశారు.
3 ఆ సైనికుల డాళ్లు ఎర్రగా ఉన్నాయి. వారి దుస్తులు
మిరుమిట్లు గొలిపేటంత ఎర్రగా ఉన్నాయి. వారి
రథాలు యుద్ధానికి బారులు తీర్చబడి, అగ్ని శిఖల్లా
మెరుస్తున్నాయి. వారి గుర్రాలు స్వారీకి సిద్ధంగా
ఉన్నాయి.
4 రథాలు వీధులలో దూసుకు పోతున్నాయి. బహి
రంగ ప్రదేశాలలో అవి ముందుకు, వెనుకకు పోతు
న్నాయి. అవి మండే దివిటీల్లా, ఒక చోట నుండి
మరొక చోటికి ప్రసరించే మెరుపుల్లా కని
పించాయి!
5 అష్షూరు రాజు తన మంచి సైనికులందరినీ పిలు
స్తాడు. కాని వారు తొట్రిల్లి దారిలో పడిపోతారు.
గోడను రక్షించటానికి వారు దాని వద్దకు పరుగెడ
తారు. రక్షక కవచాన్ని వారు కిందికి దించుతారు.
6 కాని నది వైపు ద్వారాలు తెరచి ఉన్నాయి. శత్రువు
లోనికి వచ్చి, రాజ గృహాన్ని నాశనం చేస్తాడు.
7 శత్రువు రాణిని ఎత్తుకు పోతాడు. ఆమె దాసీలు
పావురాల్లా విచారంగా మూల్గుతారు. వారు విచా
రాన్ని వ్యక్త పరుస్తూ తమ రొమ్ములు బాదు
కుంటారు.
8 నీరు బయటకు కారిపోయే ఒక మడుగులా నీనెవె
నగరం ఉంది. ప్రజలు, “ఆగండి! పారిపోవటం
మానండి!” అని అరుస్తారు. కాని ఎవ్వడూ ఆగడు.
వారు చెప్పేదాన్ని ఎవ్వరూ లక్ష్యపెట్టరు!
9 నీనెవెను నాశనం చేస్తున్న సైనికులారా, వెండిని
తీసుకోండి! బంగారాన్ని దోచుకోండి! తీసు
కోటానికి అనేక వస్తువులున్నాయి. ఎన్నో ధనాగా
రాలున్నాయి!
10 ఇప్పుడు నీనెవె ఖాళీ అయ్యింది. ప్రతీదీ దోచు
కోబడింది. నగరం నాశనం చేయబడింది! ప్రజలు
వారి ధైర్యాన్ని కోల్పోయారు. వారి హృదయాలు
భయంతో వికలమవుతున్నాయి. వారి మోకాళ్ళు
ఒకదానికొకటి కొట్టుకుంటున్నాయి. వారి శరీ
రాలు వణకుతున్నాయి. వారి ముఖాలు భయంతో
వెలవెల పోతున్నాయి.
11 సింహపు గుహ (నీనెవె) ఇప్పుడు ఎక్కడుంది?
ఆడ, మగ సింహాలు అక్కడ నివసించాయి. వాటి
పిల్లలు భయపడలేదు.
12 ఆ సింహం (నీనెవె రాజు) తన పిల్లలను సంతృప్తి
పర్చటానికి అనేక మంది మనుష్యులను చంపింది.
అతడు తన గుహను (నీనెవె) మానవకళేబరాలతో
నింపివేశాడు. అతడు తాను చంపిన స్త్రీలతో తన
గుహను నింపాడు.
13 సర్వశక్తిమంతుడైన యెహోవా యిలా చెపు
తున్నాడు: “నీనెవే, నేను నీకు వ్యతిరేకిని! నీ
రథాలను నేను తగులబెడతాను. యుద్ధంలో నీ
‘యువ సింహాలను నేను చంపుతాను. భూమి మీద
మరెన్నడూ నీవు ఎవరినీ వెంటాడవు. నీ దూతలు
చెప్పే వాటిని ప్రజలు మరెన్నడూ వినరు.”

**నీనెవెకు దుర్వార్త** ఆ హంతకుల నగరానికి చాలా కీడు
3 మూడుతుంది. నీనెవె నగరం అబద్ధాల పుట్ట. ఇతర
దేశాలనుండి దోచుకున్న వస్తువులతో అది
నిండివుంది. అది వెంటాడి చంపిన అనేకమందితో
అది నిండివుంది!
2 కొరడా ఝుళిపింపుల ధ్వని, చక్రాల సవ్వడి, స్వారీ
గుర్రాల గిట్టల ధ్వనులు, ఎగిరిపడే రథాల చప్పుడు
నీవు వినవచ్చు!
3 అశ్వదళం వారు దాడి చేస్తున్నారు. వారి కత్తులు
మెరుస్తున్నాయి. వారి ఈటెలు తళుక్కుమంటు
న్నాయి! అక్కడ ఎంతోమంది చనిపోయారు.
శవాలు గుట్టలుగా పడి ఉన్నాయి. శవాలు లెక్కకు
మించివున్నాయి. శవాలకు అడ్డంపడి ప్రజలు
తొట్రిల్లుతున్నారు.
4 నీనెవె మూలంగా ఇవన్నీ జరిగాయి. తృప్తి చెందని
వేశ్యలా నీనెవె ఉంది. ఆమె మరింత మందిని కోరు
కుంది. తనను తాను అనేక జనులకు అమ్ము
కుంది. వారిని తన బానిసలుగా చేసుకోటానికి
ఆమె తన మంత్రవిద్యలను ఉపయోగించింది.
5 సర్వశక్తిమంతుడైన యెహోవా ఇలా చెపు
తున్నాడు: “నీనెవె, నీకు నేను విరోధిని. నీ బట్టలను
నీ ముఖం మీదికి లాగుతాను. నీ నగ్నత్వాన్ని
రాజ్యాలన్నిటికీ చూపిస్తాను. ఆ రాజ్యాలన్నీ నీవు
సిగ్గుపడటం చూస్తాయి.
6 నీ మీదకు మురికి వస్తువులు విసురుతాను. నిన్ను
ఏహ్యభావంతో చూస్తాను. ప్రజలు నీవంక చూసి
నవ్వుతారు.
7 నిన్ను చూసిన ప్రతి ఒక్కడూ పారిపోతాడు. ‘నీనెవె
నాశనమయ్యింది. ఆమెను గురించి ఏడ్చేవా
రెవరు?’ అని వారు అంటారు. నీనెవె నిన్ను ఓదార్చే
వారెవ్వరినీ నేను చూడలేనని నాకు తెలుసు.”

8నీనెవె, నైలు నది మీద వున్న తేబేస్*
(నో-అమోను) నగరం కంటే నీవు మెరుగైన దానవా?

---

**తేబేస్** ఈజిప్టులో ఒక మహానగరం. అది క్రీ. పూ. 663 లో అష్షూరు సైన్యంచే నాశనం చేయబడింది. ఇది అమ్మోను దేవతానగరం. గ్రీసువారు దీనిని తేబేసు అని పిలిచారు.

కాదు! తేబేస్ చుట్టూ కూడ నీరువుంది. తేబేస్ ఆ
నీటిని శత్రువుల నుండి తనను తాను కాపాడుకోటానికి
వినియోగించుకొనేది. ఆమె ఆ నీటిని ఒక గోడలా
కూడా వినియోగించుకొనేది! 9కూషీయులును,
ఈజిప్టు వారును తేబేస్‌కు మంచి బలాన్నిచ్చారు.
పూతు వారు, లూబీయులు ఆమెకు మద్దతు ఇచ్చారు.
10అయినా తేబేస్ ఓడింపబడింది. ఆమె ప్రజలు పర
దేశానికి బందీలుగా పట్టుకుపోబడ్డారు. ప్రతీ వీధిమూలా
సైనికులు ఆమె పిల్లలను చావగొట్టారు. ముఖ్యులైన
ప్రజలను ఎవరు బానిసలుగా ఉంచుకోవాలి అనే విష
యంలో వారు చీట్లు వేశారు. తేబేస్‌లో ప్రముఖులైన
వారందరికీ వారు సంకెళ్ళు వేశారు.

11కావున నీనెవే, నీవు కూడా తాగినవానిలా పడి
పోతావు! నీవు దాగటానికి ప్రయత్నిస్తావు. శత్రువుకు
దూరంగా ఒక సురక్షిత ప్రదేశం కొరకు నీవు చూస్తావు.
12కాని నీనెవే, నీ దుర్గాలన్నీ అంజూరపు చెట్లలా
ఉంటాయి. కొత్త అంజూరపు కాయలు పండుతాయి.
ఒకడు వచ్చి చెట్టును కుదుపుతాడు. అంజూరపు పండ్లు
వాని నోట పడతాయి. అతడు వాటిని తింటాడు.
అవి అయిపోతాయి!

13నీనెవే, నీ ప్రజలంతా స్త్రీలవలె ఉన్నారు. శత్రు
సైనికులు వారిని పట్టుకు పోవటానికి సిద్ధంగా ఉన్నారు.
నీ శత్రువులు లోనికి రావటానికి అనువుగా నీ దేశపు
ద్వారాలు పూర్తిగా తెరవబడి ఉన్నాయి. ద్వారాలకు
అడ్డంగా వున్న కర్రపట్టీలను అగ్ని కాల్చివేసింది.
14నీరు తెచ్చి దానిని నీ నగరంలోపల నిలువ చెయ్యి.
ఎందుకంటే, శత్రుసైనికులు నీ నగరాన్ని చుట్టు
ముట్టుతారు. వారు ఎవ్వరినీ నగరంలోకి ఆహారాన్ని,
నీటిని తీసుకు రానివ్వరు. నీ కోటలను పటిష్ఠపర్చుకో!
ఇటుకలు విస్తారంగా చేయటానికి బంక మట్టిని తీసు
కొనిరా! సున్నము గచ్చు కలుపు! ఇటుకలు చేయ
టానికి అచ్చులు తీసుకొనిరా! 15నీవు ఆ పనులన్నీ
చేయవచ్చు. కాని, అగ్ని నిన్ను పూర్తిగా నాశనం చేసి
వేస్తుంది! మరియు కత్తి నిన్ను హతమార్చుతుంది.
మిడుతల దండు వచ్చి సమస్తాన్ని తినివేసినట్లు నీ
దేశం కన్పిస్తుంది.

నీనెవే, నీవు మిక్కిలిగా పెరిగావు. నీవు మిడుతల
దండులా వున్నావు. 16వివిధ ప్రాంతాలకు వెళ్లి సరు
కులు కొని వ్యాపారం చేసే వర్తకులు నీకు అనేక
మంది ఉన్నారు. ఆకాశంలో ఎన్ని నక్షత్రాలున్నాయో
వారు అంతమంది ఉన్నారు! దండులా వచ్చి సర్వాన్ని
తినివేసే మిడుతల్లా వారున్నారు. 17మరియు నీ ప్రభు
త్వాధికారులు కూడ మిడుతల్లా వున్నారు. చలిగా ఉన్న
రోజున రాతిగోడపై కుదురుకున్న మిడుతల్లా వారు
న్నారు. కాని సూర్యుడు పైకి వచ్చినప్పుడు రాళ్ళు
వేడెక్కగా మిడుతలు ఎగిరిపోతాయి. పైగా అవి ఎక్కడికి
పోతాయో ఎవ్వరికీ తెలియదు! నీ అధికారులు కూడా
అలానేవుంటారు.

18అష్షూరు రాజా, నీ గొర్రెల కాపరులు
(నాయకులు) నిద్రకుపడ్డారు. శక్తివంతులగు ఆ
మనుష్యులు నిద్రిస్తున్నారు. ఇప్పుడు నీ గొర్రెలు
(ప్రజలు) పర్వతాలపై చెదిరిపోయాయి. వాటిని
మరల్చుకొని వచ్చేవాడు ఎవ్వడూ లేడు. 19నీనెవే,
నీవు తీవ్రంగా దెబ్బతిన్నావు. నీ గాయాన్ని ఏదీ మాన్ప
లేదు. నీ వినాశాన్ని గురించి విన్న ప్రతివాడూ చప్పట్లు
చరుస్తాడు. వారంతా సంతోషంగా ఉంటారు! ఎందు
కంటే, నీవు ఎల్లప్పుడూ కలుగజేసిన బాధను వారంతా
అనుభవించారు!

# హబక్కూకు

## దేవునికి హబక్కూకు ఫిర్యాదు చేయటం

1 ప్రవక్తయైన హబక్కూకునకు ఇవ్వబడిన వర్త
మానం ఇది.
[2]యెహోవా, నేను సహాయం కొరకు అర్థిస్తూనే
వున్నాను. నీవు నా మొర ఎన్నడు ఆలకిస్తావు?
దౌర్జన్యం విషయంలో నేను నీకు మొరపెట్టాను. కాని
నీవేమీ చేయలేదు! [3]ప్రజలు వస్తువులను దొంగలిస్తు
న్నారు. ఇతరులను బాధపెట్టుతున్నారు. ప్రజలు వాదు
లాడుతూ, కలహిస్తున్నారు. నీవెందుకు నన్నీ భయంకర
విషయాలు చూసేలా చేస్తున్నావు? [4]న్యాయవ్యవస్థ
బలహీనపడింది. ప్రజలకు న్యాయం జరుగుట లేదు.
మంచి వారిపై దుష్టులు తమ తగాదాలలో గెలు
స్తున్నారు. అందువల్ల న్యాయం ఎంతమాత్రం పక్షపాత
రహితంగా లేదు.

## దేవుడు హబక్కూకునకు సమాధానమివ్వటం

[5]యెహోవా సమాధానమిచ్చాడు: "ఇతర జనుల
వైపు చూడు! వారిని గమనించు. నీకు విస్మయం
కలుగుతుంది. నీ జీవిత కాలంలో నీకు విస్మయం
కలిగించే ఒక పని చేస్తాను. నీవు అది నమ్మాలంటే
చూసి తీరాలి. దాని విషయం నీకు చెపితే అది నీవు
నమ్మవు. [6]బబులోను ప్రజలను నేను బలమైన
రాజ్యంగా తీర్చిదిద్దుతాను. ఆ ప్రజలు నీచులు; శక్తిగల
యుద్ధవీరులు. వారు భూమికి అడ్డంగా నడుస్తారు. వారికి
చెందని ఇండ్లను, నగరాలను వారు వశపర్చుకుంటారు.
[7]బబులోనువారు ఇతర ప్రజలను భయపెడతారు.
బబులోనువారు వారు చేయదల్చుకున్నది చేస్తారు;
వెళ్ళదల్చుకున్న చోటుకి వెళతారు. [8]వారి గుర్రాలు
చిరుతపులుల కంటే వేగం కలవి. సూర్యుడు అస్త
మించాక అవి తోడేళ్ళ కంటె నీచంగా ఉంటాయి.
వారి గుర్రపు దళంవారు దూర ప్రాంతాలనుండి వస్తారు.
ఆకలిగొన్న గరుడ పక్షి ఆకాశం నుండి కిందికి దూసుకు
వచ్చినట్లు, వారు తమ శత్రువులను వేగంగా ఎదు
ర్కొంటారు. [9]వారంతా చేయకోరుకునే ఒకే ఒక్క
విషయం యుద్ధం. వారి సైన్యాలు ఎడారిలో గాలిలా
వేగంగా నడుస్తాయి. మరియు బబులోను సైనికులు
అనేకానేక మందిని చెరబడతారు. ఇసుక రేణువుల్లా
లెక్కలేనంత మందిని పట్టుకుంటారు.
[10]"బబులోను సైనికులు ఇతర దేశాల రాజులను
చూసి నవ్వుతారు. పరదేశ పాలకులు వారికి హాస్య
గాండ్రవలె ఉంటారు. పొడవైన, బలమైన గోడలు గల
నగరాలను చూచి బబులోను సైనికులు నవ్వుతారు.
ఆ సైనికులు గోడ మీదికంటె మట్టి బాట సునా
యాసంగా నిర్మించి, నగరాలను తేలికగా జయిస్తారు.
[11]పిమ్మట వారు గాలిలా వెళ్లి మరో ప్రాంతంలో
యుద్ధం చేస్తారు. బబులోనువారు ఆరాధించే ఒకే ఒక్క
వస్తువు వారి స్వయంశక్తి."

## హబక్కూకు యొక్క రెండవ ఫిర్యాదు

[12]పిమ్మట హబక్కూకు చెప్పాడు:

"యెహోవా, నీవు ఎల్లకాలములయందు ఉండే
దేవుడవు! నీవు చావులేని పవిత్ర దేవుడవు!
యెహోవా, జరుగవలసిన కార్యం జరిపించటా
నికే నీవు బబులోను ప్రజలను సృష్టించావు.
మా ఆశ్రయ దుర్గమా, యూదా ప్రజలను
శిక్షించటానికి నీవు వారిని సృష్టించావు.
13 నీ కండ్లు దుష్టత్వాన్ని చూడలేవు. ప్రజలు తప్పు
చేయటాన్ని నీవు చూడలేవు. మరి అటువంటి
నీవు ఆ దుష్టులు జయించటం ఎలా చూడగలు
గుతున్నావు? దుష్టులు మంచివారిని ఓడించటం
నీవెలా చూడగలుగుతున్నావు?
14 "నీవు ప్రజలను సముద్రంలో చేపల్లా తయారు
చేశావు. నాయకుడులేని చిన్న సముద్ర జంతు
వుల్లా వారున్నారు.
15 వారందరినీ గాలాలు, వలలు వేసి శత్రువు పట్టు
కుంటాడు. శత్రువు వారిని తన వలలో పట్టి
లాగుతాడు, తను పట్టుకున్న దానిని చూసి
శత్రువు చాలా సంతోషిస్తాడు.
16 శత్రువు తను భాగ్యవంతుడుగా నివసించటానికి,
మంచి ఆహారం తినటానికి అతని వల అతనికి
సహాయపడుతుంది. కావున శత్రువు తన వలనే
ఆరాధిస్తాడు. తన వల యొక్క గౌరవార్థం అతడు
దానికి బలులు అర్పించి, ధూపంవేస్తాడు.
17 తన వలతో ధనాన్ని తీసుకుపోవటం అతడు
కొనసాగిస్తాడా? దయా దాక్షిణ్యం లేకుండా

అతడు (బబులోను సైన్యం) ప్రజలను నాశనం
చేయటం కొనసాగిస్తాడా?

2 “నేనొక కాపలాదారునిగా నిలబడి గమనిస్తాను.
యెహోవా నాకు ఏమి చెపుతాడో వినటానికి
నేను వేచి ఉంటాను. ఆయన నా ప్రశ్నలకు
ఎలా సమాధానమిస్తాడో నేను వేచివుండి
తెలుసుకుంటాను”

### హబక్కూకునకు దేవుడు సమాధానమివ్వటం

2యెహోవా నాకు సమాధానమిచ్చాడు: “నేను నీకు
చూపించేవాటిని వ్రాయి. ప్రజలు సులభంగా చదవ
గలిగే రీతిలో దానిని ఒక పలకమీద స్పష్టంగా వ్రాయి.
3ఈ వర్తమానం భవిష్యత్తులో ఒక ప్రత్యేక సమయం
గురించినది. ఈ వర్తమానం పరిసమాప్తిని గురించినది.
అది నిజమవుతుంది! ఆ సమయం ఎన్నడూ రానట్లుగా
కన్పించవచ్చు. కాని ఓపికతో దానికొరకు వేచివుండు.
ఆ సమయం వస్తుంది. అది ఆలస్యం కాదు. 4దీనిని
విన నిరాకరించే వారికి ఈ వర్తమానం సహాయపడదు.
కాని మంచివాడు ఈ వర్తమానాన్ని నమ్ముతాడు. తన
విశ్వాసం కారణంగా, ఆ మంచి వ్యక్తి దీనిని నమ్ముతాడు.
5దేవుడు చెప్పాడు: “ద్రాక్షమద్యం మనిషిని మోసం
చేయగలదు. అదే మాదిరి ఒక బలవంతుని గర్వం
అతనిని అవివేకునిగా చేస్తుంది. అతనికి శాంతి ఉండదు.
అతడు మృత్యువువలె ఉంటాడు. అతడు ఇంకా, ఇంకా
కోరుతూనే ఉంటాడు. మృత్యువువలె అతనికి తృప్తి
అంటూ ఉండదు. అతడు ఇతర దేశాలను ఓడించటం
కొనసాగిస్తూనే ఉంటాడు. ఆ ప్రజలను చెరపట్టటం
కొనసాగిస్తూ ఉంటాడు. 6కాని అతి త్వరలోనే ఆ
ప్రజలంతా అతనిని చూచి నవ్వుతారు. తన ఓటమిని
గురించి వారు కథలు చెపుతారు. వారు నవ్వి, ‘అది
మిక్కిలి హేయమైనది! ఆ వ్యక్తి అనేక వస్తువులు దొంగి
లించాడు. తనవి కానివాటిని తన వశం చేసుకున్నాడు.
అతడు ధనాన్ని విస్తారంగా తీసు కున్నాడు. ఆ వ్యక్తికి
అది అతిశ్రమకారకమైన పని’ అని అంటారు.
7“నీవు (బలవంతుడు) ప్రజలవద్ద డబ్బు తీసు
కున్నావు. ఒక రోజు ఆ ప్రజలు మేల్కొని జరుగుతున్న
దానిని గుర్తిస్తారు. వారు నీకు ఎదురు తిరుగుతారు.
అప్పుడు వారే నీనుండి వస్తువులు తీసుకొంటారు.
నీవు చాలా భయపడతావు. 8నీవు అనేక దేశాలనుండి
వస్తువులు దొంగిలించావు. కావున ఆ ప్రజలు నీ నుండి
చాలా తీసుకుంటారు. నీవు అనేక మందిని చంపివేశావు.
నీవు దేశాలను, నగరాలను నాశనం చేశావు. నీవక్కడ
ప్రజలందరినీ చంపివేశావు. 9అవును, అన్యాయం చేసి
ధనవంతుడైన వానికి మిక్కిలి శ్రమ. సురక్షిత ప్రదే
శంలో నివసించటానికి అతడు ఆ పనులు చేశాడు.
ఇతరులు తనను దోచుకోవటాన్ని తను ఆపగలనని
అతడు అనుకొంటున్నాడు. కాని అతనికి కీడు వాటిల్లు
తుంది.
10“నీవు (బలవంతుడు) అనేక మందిని నాశనం
చేయటానికి వ్యూహాలు పన్నావు. ఇది నీ స్వంత
ప్రజలనే అవమానానికి గురిచేసింది. నీవు ప్రాణాన్ని
కోల్పోతావు. 11గోడరాళ్ళు నీకు వ్యతిరేకంగా అరు
స్తాయి. నీ స్వంత ఇంటి వాసాలు సహితం నీవు తప్పు
చేశావని ఒప్పుకుంటాయి. 12అన్యాయం చేసి, నరహత్య
చేసి నగరం నిర్మించిన నాయకునకు మిక్కిలి కీడు.
13అటువంటి జనులు నిర్మింప తలపెట్టిన వాటన్నిటినీ
అగ్నిచే కాల్చివేయటానికి సర్వ శక్తిమంతుడైన
యెహోవా నిర్ణయించాడు. వారు చేసిన పనంతా
వృథా. 14అప్పుడు ప్రతిచోట ప్రజలు యెహోవా
యొక్క మహిమను గూర్చి తెలుసుకుంటారు. సము
ద్రంలోకి నీరు వ్యాపించునట్లు ఈ వార్త వ్యాపిస్తుంది.
15తను కోపం చెంది, ఇతరులను బాధించే వ్యక్తికి
మిక్కిలి శ్రమ. ఆ వ్యక్తి కోపంలో ఇతరులను నేలకు
పడగొడతాడు. అతడు వారిని వస్త్రవిహీనులుగాను,
తాగినవారిగాను చూస్తాడు.
16“కాని అతడు యెహోవా కోపాన్ని తెలుసు
కుంటాడు. ఆ కోపం యెహోవా కుడిచేతిలో విషపు
గిన్నెలా ఉంటుంది. అతడు ఆ కోపాన్ని రుచిచూచి
తాగిన వానిలా నేలమీద పడతాడు.
“దుష్టపాలకుడా, నీవు ఆ గిన్నెనుండి తాగుతావు.
నీవు పొందేది అవమానం; గౌరవం కాదు. 17నీవు
లెబానోనులో ఎంతో మందిని బాధించావు. అక్కడ
నీవు ఎన్నో పశువులను దొంగిలించావు. కావున, చని
పోయిన ప్రజల కారణంగాను, నీవా దేశానికి చేసిన
చెడుపనుల వల్లను నీవు భయపడతావు. నీవా నగ
రాలకు, వాటిలో నివసించే ప్రజలకు చేసిన పనుల
బట్టి నీవు భయపడతావు”

### విగ్రహాలను గూర్చిన వర్తమానం

18అతని బూటకపు దేవుడు అతనికి సహాయం
చేయడు. ఎందుకనగా అది ఒకానొకడు లోహపు
తొడుగు వేసి చేసిన బొమ్మ. అది కేవలం విగ్రహం.
కావున దానిని చేసినవాడు అది సహాయం చేస్తుందని
ఆశించలేడు. ఆ విగ్రహం కనీసం మాట్లాడలేదు. 19ఒక
కొయ్య విగ్రహముతో “నిలబడు ” అని చెప్పే వానికి
మిక్కిలి వేదన! మాట్లాడలేని ఒక రాతితో, “మేలుకో”
అని చెప్పేవానికి బాధ తప్పదు. ఆ వస్తువులు అతనికి
సహాయపడలేవు. ఒక విగ్రహం బంగారంతో గాని,
వెండితో గాని తొడుగు వేయబడవచ్చు. కాని ఆ విగ్ర
హంలో ప్రాణం లేదు. 20కాని యెహోవా విషయం
వేరు! యెహోవా తన పవిత్రాలయంలో ఉన్నాడు.
కావున ఈ భూమి అంతా నిశ్శబ్దంగా వుండి, యెహోవా
ముందు గౌరవ భావంతో మెలగాలి.

### హబక్కూకు ప్రార్థన

3 ప్రవక్తయైన హబక్కూకు చేసిన షిగ్గయోను
ప్రార్థన.*

2 యెహోవా, నిన్ను గూర్చిన వార్త విన్నాను.
యెహోవా, పూర్వం నీవు చేసిన శక్తివంతమైన
పనుల విషయంలో నేను విస్మయం చెందాను.
అట్టి గొప్ప పనులు మా కాలంలో జరిపించమని
నేను నిన్ను వేడుకుంటున్నాను. ఆ పనులు
మాకాలంలోనే జరిపించమని నేను ప్రార్థిస్తు
న్నాను. కాని నీ ఆవేశంలో (ఉద్రేకం) మా పట్ల
కరుణ చూపటం గుర్తుపెట్టుకొనుము.
3 దేవుడు తేమానులో నుండి వస్తున్నాడు. పరి
శుద్ధుడు పారాను పర్వతం* మీది నుండి వస్తు
న్నాడు. యెహోవా మహిమ ఆకాశాన్ని కప్పి
వేసింది! ఆయన ప్రభావంతో భూమి నిండి
పోయింది!
4 అది ప్రకాశమానమై మెరుస్తున్న వెలుగు. ఆయన
చేతినుండి కాంతి కిరణాలు ప్రసరిస్తున్నాయి.
అట్టి మహత్తర శక్తి ఆయన చేతిలో దాగివుంది.
5 వ్యాధి ఆయనకు ముందుగా వెళ్లింది. ఆయన
వెనుక వినాశనకారి అనుసరించి వెళ్లింది.
6 యెహోవా నిలుచుండి భూమికి తీర్పు తీర్చాడు.
ఆయన అన్ని దేశాల ప్రజలవైపు చూశాడు.
వారు భయంతో వణికి పోయారు. అనాదిగా
పర్వతాలు బలంగా నిలిచి ఉన్నాయి. కాని ఆ
పర్వతాలు బద్దలై పోయాయి. పాత పాత
కొండలు పడిపోయాయి. దేవుడు ఎల్లప్పుడూ
అలానే ఉంటాడు!
7 కుషాను (కూషీయుల) నగరాలలో ఆపద సంభ
వించటం నేను చూశాను. మిద్యాను దేశీయుల
ఇండ్లు భయంతో కంపించాయి.
8 యెహోవా, నీవు నదుల పట్ల కోపంగా
ఉన్నావా? వాగుల పట్ల నీవు కోపంగా ఉన్నావా?
సముద్రం పట్ల నీవు కోపంగా ఉన్నావా? నీవు
నీ గుర్రాలను, రథాలను విజయానికి నడిపించి
నప్పుడు నీవు కోపంగా ఉన్నావా?
9 అప్పుడు కూడ నీ రంగుల కాంతి పుంజాన్ని
(ఇంద్ర ధనుస్సు) నీవు చూపించావు. భూవాసు
లతో నీవు చేసుకున్న ఒడంబడికకు అది
నిదర్శనం ఎండు భూమి నదులను విభజించింది.
10 పర్వతాలు నిన్ను చూచి వణికాయి. నీరు నేల
విడిచి పారుతున్నది. సముద్రపు నీటికి నేలపై
పట్టు దప్పినందున అది పెద్దగా ధ్వని చేసింది.
11 సూర్యుడు, చంద్రుడు వాటి కాంతిని కోల్పో
యాయి. నీ దేదీప్యమానమైన మెరుపు కాంతులు
చూడగానే అవి ప్రకాశించటం మానివేశాయి. ఆ
మెరుపులు గాలిలో దూసుకు పోయే ఈటెలు,
బాణాలవలె ఉన్నాయి.
12 నీవు కోపంతో భూమిపై నడిచి దేశాలను శిక్షిం
చావు.
13 నీ ప్రజలను రక్షించటానికి నీవు వచ్చావు.
అభిషేకం చేయబడిన నీ వ్యక్తిని రక్షించటానికి
నీవు వచ్చావు. ప్రతి చెడ్డ కుటుంబంలోనూ
మొదట పుట్టిన వానిని నీవు చంపివేశావు. ఆ
కుటుంబం దేశంలో అతి తక్కువదా? లేక అతి
గొప్పదా? అనే విచక్షణ నీవు చూపలేదు.
14 శత్రుసైనికులను ఆపటానికి నీవు మోషే చేతి
కర్రను ఉపయోగించావు. ఆ సైనికులు మామీద
యుద్ధానికి పెనుతుఫానులా వచ్చారు. రహస్యంగా
ఒక పేదవాణ్ణి దోచుకున్నట్టు, వారు మమ్మల్ని
తేలికగా ఓడించవచ్చనుకున్నారు.
15 కాని నీవు నీ గుర్రాలతో సముద్రం గుండా నడి
చావు. ఆ మహా జలరాశిని దూరంగా దొర్లి
పోయేలా చేశావు.
16 నేనీ విషయాలు విన్నప్పుడు, నా శరీరం వణి
కింది. పెద్ద శబ్దాలు నేను విన్నప్పుడు నా పెదవులు
అదిరాయి. నా ఎముకలు బలహీనమయ్యాయి.
నా కాళ్లు వణికాయి. కావున ఆ వినాశన దినం
వచ్చేవరకు ఓపికగా వేచి ఉంటాను. మామీద
దాడి చేసేవారికి ఆ విపత్కర దినం వస్తోంది.

### ఎల్లప్పుడూ యెహోవాయందు ఆనందించండి

17 అంజూరపు చెట్లు కాయలు కాయకుండా ఉండ
వచ్చు. ద్రాక్షలతలపై కాయలు ఉండక పోవచ్చు.
చెట్లకు ఆలివు పండ్లు కాయక పోవచ్చు. పొలాల్లో
ఆహార ధాన్యాలు పండక పోవచ్చు. దొడ్లలో
గొర్రెలు ఉండక పోవచ్చు. కొట్టాలలో పాడి
పశువులు లేకపోవచ్చు.
18 అయినా, నేను యెహోవా యందు ఆనంది
స్తాను. నా రక్షకుడైన దేవుని యందు నేను
ఉల్లసిస్తాను.
19 నా ప్రభువైన యెహోవా నాకు బలాన్ని ఇస్తాడు.
లేడిలా పరుగెత్తగలిగేలా ఆయన నాకు సహాయ
పడతాడు. పర్వతాలపై ఆయన నన్ను సురక్షి
తంగా నడిపిస్తాడు. సంగీత దర్శకునికి. ఇది నా
తంతి వాద్యాలతో పాడదగినది.

---

**ప్రార్థన** అనగా షిగ్గయోను మీద హబక్కూకు చేసిన ప్రార్థన. షిగ్గయోను అంటే అసలైన అర్థం సరిగ్గా తెలియదు.

**పర్వతం** అకాబా జలసంధికి పడమటనున్న ఒక ముఖ్యమైన పర్వతం కావచ్చు.

# జెఫన్యా

1 ఇది జెఫన్యాకు యెహోవా ఇచ్చిన సందేశం.
ఆమోను కుమారుడైన యోషీయా యూదాకు
రాజుగా ఉన్న కాలంలో జెఫన్యా ఈ సందేశం అందు
కొన్నాడు. జెఫన్యా కూషు కుమారుడు. కూషు గెదల్యా
కుమారుడు. గెదల్యా అమర్యా కుమారుడు. అమర్యా
హిజ్కియా కుమారుడు.

### ప్రజలకు యెహోవా తీర్పు చెప్పే దినం

2“భూమి మీదనున్న సమస్తాన్ని నేను నాశనం
చేస్తాను! 3మనుష్యులందరినీ, జంతువులన్నింటినీ నేను
నాశనం చేస్తాను. ఆకాశంలో పక్షుల్ని, సముద్రంలో
చేపల్ని నేను నాశనం చేస్తాను. దుర్మార్గులను, వారిచేత
పాపం చేయించే వాటన్నింటిని* నేను నాశనం
చేస్తాను. భూమి మీద నుండి మనుష్యులందరినీ నేను
తొలగించివేస్తాను” అని యెహోవా చెపుతున్నాడు.

4ఈ సంగతులను యెహోవా చెప్పాడు:
“యూదాను మరియు యెరూషలేములో నివసిస్తున్న
ప్రజలను నేను శిక్షిస్తాను. ఆ స్థలం నుండి నేను వీటిని
తీసివేస్తాను: బయలు దేవత పూజ చివరి గుర్తులను
నేను తొలగించి వేస్తాను. నేను పూజారులను తొలగించి
వేస్తాను. 5నక్షత్రాలను పూజించుటకు వారి యింటి
కప్పుల మీదికి వెళ్ళే వారందరినీ నేను తొలగించి
వేస్తాను. ఆ బూటకపు యాజకులను ప్రజలు మరచి
పోతారు. కొంతమంది నన్ను పూజిస్తున్నామని
అంటారు. ఆ ప్రజలు నన్ను ఆరాధిస్తామని వాగ్దానం
చేసారు. కాని ఇప్పుడు వారు బూటకపు దేవత మిల్కో
మును పూజిస్తున్నారు. కనుక ఆ ప్రజలను ఆ స్థలం
నుండి నేను తొలగించి వేస్తాను. 6కొందరు మనుష్యులు
యెహోవా నుండి తిరిగిపోయారు. వారు నన్ను వెంబ
డించుట విడిచిపెట్టారు. ఆ ప్రజలు సహాయంకోసం
యెహోవాను అడగటం మాని వేసారు. కనుక నేను
ఆ ప్రజలను ఆ స్థలంనుండి తొలగించివేస్తాను.”

7నా ప్రభువైన యెహోవా ముందు నిశ్శబ్దంగా
ఉండు! ఎందుచేతనంటే ప్రజలకు యెహోవా తీర్పు
చెప్పే దినం త్వరలో వస్తుంది గనుక! యెహోవా
తన బలిని సిద్ధం చేశాడు. తాను ఆహ్వానించిన అతిథు
లతో సిద్ధంగా ఉండుమని చెప్పాడు.

8“బలి అర్పించే యెహోవా దినాన రాజకుమారు
లను, ఇతర నాయకులను నేను శిక్షిస్తాను. విదేశీ వస్త్రాలు
ధరించిన ప్రజలందరినీ నేను శిక్షిస్తాను. 9ఆ సమ
యంలో గుమ్మం దాటిన ప్రజలందరినీ నేను శిక్షిస్తాను.
అబద్ధాలతో, హింసతో యజమాని ఇంటిని నింపిన
వారిని నేను శిక్షిస్తాను” అని యెహోవా చెప్పాడు.

10యెహోవా ఇంకా ఇలా చెప్పాడు, “ఆ సమ
యంలో యెరుషలేములోని చేప ద్వారం దగ్గర ప్రజలు
సహాయంకోసం కేకలు వేస్తారు. పట్టణంలోని ఇతర
చోట్ల ప్రజలు ఏడుస్తుంటారు. పట్టణం చుట్టూరా
కొండల్లో నాశనం చేయబడుతున్న వాటి పెద్ద శబ్దాలను
ప్రజలు వింటారు. 11పట్టణం దిగువ ప్రాంతంలో నివ
సించే ప్రజలారా, మీరు ఏడుస్తారు. ఎందుకు? ఎందు
కంటే వ్యాపారస్తులు, ధనిక వర్తకులు అందరూ నాశనం
చేయబడతారు గనుక.

12“ఆ సమయంలో నేను దీపం పట్టుకొని యెరూష
లేము అంతటా వెదకుతాను. వారి ఇష్టాను సారంగా
జీవిస్తూ తృప్తిపడుతోన్న మనుష్యులందరినీ నేను కను
గొంటాను. ఆ ప్రజలు ‘యెహోవా, ఏమీ చేయడు.
ఆయన సహాయం చేయడు, ఆయన బాధించడు’
అని అంటారు. అలాంటి వారిని నేను కనుగొని, వారిని
శిక్షిస్తాను! 13అప్పుడు మిగిలిన వారు, వారి ఐశ్వర్యాలను
తీసికొని వారి ఇండ్లను నాశనం చేస్తారు. ఆ సమయంలో
ఇండ్లు కట్టుకొన్నవారు వాటిలో నివసించరు. మరియు
ద్రాక్షా తోటలు నాటుకొన్న వారు ఆ ద్రాక్షా పండ్లరసం
తాగరు – ఇతరులకు అవి లభిస్తాయి.”

14యెహోవా తీర్పు తీర్చే ప్రత్యేక దినం త్వరగా
వచ్చేస్తుంది! ఆ రోజు దగ్గర్లో ఉంది; మరియు వేగంగా
వచ్చేస్తుంది. యెహోవా ప్రత్యేక తీర్పు దినాన ప్రజలు
విచారకరమైన శబ్దాలు వింటారు. బలమైన సైనికులు
కూడ ఏడుస్తారు! 15ఆ సమయంలో దేవుడు తన
కోపం చూపిస్తాడు. అది భయంకరమైన కష్టకాలంగా
ఉంటుంది. అది విధ్వంస సమయంగా ఉంటుంది.
అది చీకటి మబ్బు తుఫాను రోజుగా, చీకటి సమయంగా
ఉంటుంది. 16అది భద్రతా గోపురాలలో, సంరక్షిత
పట్టణాలలో ప్రజలు బూరలూ, బాకాలూ వినే యుద్ధ

---

**వాటన్నింటినీ** వాళ్ల విగ్రహాలను గూర్చి తెలుపుతుంది.

సమయంలా ఉంటుంది. [17]యెహోవా ఇలా చెప్పాడు:
“నేను ప్రజలకు జీవితం చాలా దుర్భరం చేస్తాను.
ఎక్కడికి వెళ్తున్నారో తెలియకుండా నడిచే గుడ్డివారిలా
ప్రజలు అటు ఇటు నడుస్తారు. ఎందుకంటే, ఆ ప్రజలు
యెహోవాకు విరోధంగా పాపం చేసారు గనుక. అనేక
మంది ప్రజలు చంపబడతారు. వారి రక్తం నేల మీద
చిందుతుంది. వారి మృతదేహాలు నేలమీద పెంట
కుప్పలా ఉంటాయి. [18]వారి బంగారం, వెండి వారికి
యెహోవా ఉగ్రత దినంలో సహాయం చేయవు! ఆ
సమయంలో యెహోవా చాలా చికాకుపడి కోపంగా
ఉంటాడు. యెహోవా మొత్తం ప్రపంచాన్ని నాశనం
చేస్తాడు. భూమి మీద ప్రతి ఒక్కరినీ యెహోవా
సర్వనాశనం చేస్తాడు!”

### ప్రజలు వారి జీవితాలు మార్చుకోవాలి అని యెహోవా అడగటం

2 సిగ్గులేని ప్రజలారా మీ జీవితాలు మార్చుకోండి.
[2]అదీ, మీరు వాడిపోయి చనిపోతున్న పుష్పంలా
కాకముందే. పగటి ఎండకు ఒక పుష్పం వాడిపోతుంది,
చనిపోతుంది. యెహోవా తన భయంకర కోపం
చూపించినప్పుడు మీరు అలానే ఉంటారు. కనుక మీ
మీద యెహోవా కోపపు రోజు వస్తుంది మీ బతుకులు
మార్చుకోండి! [3]దీనులైన సర్వజనులారా, యెహోవా
దగ్గరకు రండి! ఆయన చట్టాలకు విధేయులుగా
ఉండండి. మంచి పనులు చేయటం నేర్చుకోండి.
వినయంగా ఉండటం నేర్చుకోండి. ఒకవేళ అప్పుడు
యెహోవా తన కోపం చూపించేవేళ మీరు క్షేమంగా
ఉంటారేమో.

### ఇశ్రాయేలీయుల పొరుగువారిని యెహోవా శిక్షిస్తాడు

[4]గాజాలో ఏ ఒక్కరూ విడువబడరు. అష్కెలోను
నాశనం చేయబడుతుంది. మధ్యాహ్ననికల్లా అష్డోదు
నుండి ప్రజలు బలవంతంగా వెళ్లగొట్టబడతారు.
ఎక్రోను శూన్యం అవుతుంది! [5]ఫిలిష్తీ ప్రజలారా,
సముద్ర తీరంలో నివసించే ప్రజలారా, యెహోవా
దగ్గరనుండి వచ్చిన ఈ సందేశం మిమ్మల్ని గూర్చిందే.
కనాను దేశమా, పాలస్తీనా దేశమా, నీవు నాశనం చేయ
బడతావు – అక్కడ ఎవ్వరూ నివసించరు! [6]సముద్రం
పక్కన ఉన్న మీ దేశం గొర్రెల కాపరులకు, వారి
గొర్రెలకు బంజరు పొలాలుగా అవుతుంది. [7]అప్పుడు
యూదా వారిలో శేషించిన వారికి ఆ దేశం చెందుతుంది.
ఆ యూదా ప్రజలను యెహోవా జ్ఞాపకం చేసు
కొంటాడు. ఆ ప్రజలు ఒక విదేశంలో బందీలుగా
ఉన్నారు. కాని యెహోవా వారిని వెనుకకు తీసుకొని
వస్తాడు. అప్పుడు యూదా ప్రజలు ఆ పొలాల్లో తమ
గొర్రెలను గడ్డి మేయనిస్తారు. రాత్రిళ్ళు అవి అష్కె
లోను ఖాళీ ఇండ్లలో పండుకొంటాయి.

[8]యెహోవా ఇలా అంటున్నాడు: “మోయాబు
మరియు అమ్మోను ప్రజలు ఏమి చేసారో నాకు
తెలుసు! ఆ ప్రజలు నా ప్రజలను ఇబ్బంది పెట్టారు.
ఆ ప్రజలు వారి స్వంత దేశాలను విశాల పరచు
కొనేందుకు వారి భూమిని తీసుకొన్నారు. [9]కనుక
నేను బ్రతికి ఉన్నంత నిశ్చయంగా, మోయాబు
మరియు అమ్మోను ప్రజలు సొదొమ, గొమొర్రాల్లా
నాశనం చేయబడుతారు. నేను ఇశ్రాయేలీయుల దేవు
డను, సర్వశక్తిగల యెహోవాను. ఆ దేశాలు శాశ్వతంగా
సర్వనాశనం చేయబడతాయని నేను వాగ్దానం చేస్తు
న్నాను. వారి దేశంనిండా కలుపు మొక్కలు పెరిగి
పోతాయి. వారి దేశం మృత సముద్రపు ఉప్పుచేత
కప్పబడిన దేశంలా ఉంటుంది. నా ప్రజలలో శేషించిన
వారు ఆ దేశాన్ని, అందులో మిగిలిన వాటన్నింటినీ
తీసుకొంటారు.”

[10]మోయాబు మరియు అమ్మోను ప్రజలు గర్వ
పడి, దేవుని ప్రజలను గేళిచేసి, సర్వశక్తిగల యెహోవా
ప్రజల పట్ల క్రూరంగా ప్రవర్తించారు. వారిని అవమాన
పర్చారు. కనుక వాళ్లకు అవి జరిగే తీరుతాయి. [11]ఆ
ప్రజలు యెహోవాకు భయపడుతారు. ఎందుకంటే
యెహోవా వారి దేవతలను నాశనం చేస్తాడు గనుక.
అప్పుడు దూర దేశాలన్నింటిలోని మనుష్యులందరూ
యెహోవాను ఆరాధిస్తారు. [12]కూషీయులారా, దీని
అర్థం మీరు కూడాను! యెహోవా ఖడ్గం మీ ప్రజలను
కూడా చంపుతుంది. [13]మరియు యెహోవా ఉత్తరంగా
తిరిగి అష్షూరును శిక్షిస్తాడు. నీనెవెను ఆయన నాశనం
చేస్తాడు – ఆ పట్టణం ఎండిన ఎడారిలా శూన్యంగా
ఉంటుంది. [14]అప్పుడు గొర్రెలు, అడవి జంతువులు
మాత్రమే శిథిలమైన ఆ పట్టణంలో నివసిస్తాయి.
అక్కడ మిగిలిపోయిన స్తంభాలమీద గుడ్లగూబలు,
కాకులు కూర్చుంటాయి. వాటి అరుపులు కిటికీల
గుండా వినిపిస్తాయి. గుమ్మాల మీద కాకులు కూర్చుం
టాయి. ఆ ఖాళీ ఇండ్లలో నల్ల పక్షులు కూర్చుంటాయి.
[15]నీనెవె ఇప్పుడు ఎంతో గర్వంగా ఉంది. అది చాలా
సంతోషంలో నిండిన పట్టణంగా ఉంది. ఆ ప్రజలు
క్షేమంగా ఉన్నామని తలుస్తున్నారు. ప్రపంచ మంత
టిలో నీనెవె పట్టణమే మహా గొప్ప పట్టణమని వారు
తలుస్తున్నారు. కాని ఆ పట్టణం నాశనం చేయబడు
తుంది! అది అడవి జంతువులు పండు కొనేందుకు
వెళ్లే శూన్య ప్రదేశం అవుతుంది. ఆ స్థలం ప్రక్కగా
వెళ్ళే మనుష్యులు ఆ పట్టణం అంత విపరీతంగా నాశనం
చేయబడటం చూసినప్పుడు వారు తలలు ఊపుతూ
ఈలలు వేస్తారు.

### యెరూషలేం భవిష్యత్తు

3 యెరూషలేమూ, నీ ప్రజలు దేవునికి విరోధంగా
యుద్ధం చేశారు! నీ ప్రజలు ఇతరులను
బాధించారు, నీవు పాపంతో అపవిత్రమయ్యావు. [2]నీ

ప్రజలు నా మాట వినలేదు! వారు నా ప్రబోధాలు
అంగీకరించలేదు. యెరూషలేము యెహోవాను నమ్మ
లేదు. యెరూషలేము తన దేవుని దగ్గరకు వెళ్ళలేదు.
3యెరూషలేము నాయకులు గర్జించే సింహాల్లా
ఉన్నారు. దాని న్యాయమూర్తులు గొర్రెలమీద దాడి
చేసేందుకు రాత్రివేళ వచ్చి ఉదయానికి ఏమీ మిగల్చని
ఆకలిగొన్న తోడేళ్లలా ఉన్నారు. 4దాని ప్రవక్తలు ఇంకా,
ఇంకా ఎక్కువ సంపాదించటం కోసం ఎల్లప్పుడూ
వారి రహస్య పథకాలు వేస్తూనే ఉన్నారు. దాని యాజ
కులు పవిత్రమైన విషయాలను పవిత్రం కానట్టే
చూశారు. దేవుని ప్రబోధాలను వారు అతిక్రమించారు.
5కాని దేవుడు ఇంకా ఆ పట్టణంలో ఉన్నాడు. మరియు
ఆయన మంచివాడుగానే కొనసాగుతున్నాడు. దేవుడు
తప్పు ఏమీ చేయడు. ఆయన తన ప్రజలకు సహాయం
చేస్తూనే ఉంటాడు. ఆయన ప్రజలు మంచి నిర్ణయాలు
చేసేందుకు ఆయన వారికి ప్రతి ఉదయం సహాయం
చేస్తాడు. కాని ఆ దుర్మార్గులు తాము చేసే చెడ్డ
పనుల విషయంలో సిగ్గుపడరు.
6దేవుడు చెపుతున్నాడు: "నేను మొత్తం జన
సమూహాలను నాశనం చేశాను. నేను వారి సంరక్షణా
దుర్గాలను నాశనం చేశాను. నేను వారి వీధులను నాశనం
చేశాను, అక్కడ ఇప్పుడు ఎవ్వరూ వెళ్ళరు. వారి
పట్టణాలు ఖాళీ, అక్కడ ఇంకెంత మాత్రమూ ఎవ్వరూ
నివసించరు. 7నీవు ఒక పాఠం నేర్చుకోవాలని ఈ
సంగతులు నీతో నేను చెబుతున్నాను. నీవు నాకు
భయపడి నన్ను గౌరవించాలని నేను కోరుతున్నాను.
ఒకవేళ నీవు ఇలా చేస్తే, నీ ఇల్లు నాశనం చేయబడదు.
నీవు ఇలా చేస్తే నా పథకం ప్రకారం నిన్ను నేను
శిక్షించాల్సి ఉండదు." కాని ఆ చెడ్డ ప్రజలు ఇదివరకే
చేసిన ఆ చెడుకార్యాలనే ఇంకా ఎక్కువ చేయాలను
కొన్నారు!
8యెహోవా చెప్పాడు: "కనుక కొంచెం వేచి
ఉండండి! నేను నిలిచి మీకు తీర్పు చెప్పేంతవరకు
వేచి ఉండండి. అనేక దేశాల నుండి మనుష్యులను
రప్పించి, మిమ్మల్ని శిక్షించేందుకు వారిని వాడుకొనే
హక్కు నాకు ఉంది. మీ మీద నా కోపం చూపించేందుకు
నేను ఆ ప్రజలను వాడుకొంటాను. నాకు ఎంత చికాకు
కలిగిందో చూపించేందుకు నేను వారిని వాడు
కొంటాను. మరియు మొత్తం దేశం నాశనం చేయబడు
తుంది! 9అప్పుడు నేను ఇతర జనాంగ ములనుండి
ప్రజలను మార్పు చేస్తాను. కాబట్టి వారు స్పష్టంగా
మాట్లాడుతూ ప్రభువు నామాన్ని పేరుపెట్టి పిలువ
గలరు. వారందరూ ఒకే ప్రజగా కూడి నన్ను ఆరాధి
స్తారు. 10కూషు దేశంలోని నది ఆవలివైపున, అంత
దూరం నుండి ప్రజలు వస్తారు. చెదరిపోయిన నా
ప్రజలు నా దగ్గరకు వస్తారు. నా భక్తులు వస్తారు
మరియు నాకు వారు కానుకలు తెస్తారు.
11"యెరూషలేమూ, అప్పుడు నీవు, నీ ప్రజలు
నాకు విరోధంగా చేసే చెడు విషయాలను గూర్చి
ఇంకెంత మాత్రం సిగ్గుపడవు. ఎందుకంటే, ఆ దుర్మా
ర్గులందరినీ యెరూషలేము నుండి నేను తొలగించి
వేస్తాను. ఆ గర్విష్ఠులందరినీ నేను తొలగించివేస్తాను.
నా పరిశుద్ధ పర్వతంమీద ఆ గర్విష్ఠులు ఎవ్వరూ
ఉండరు.
12దీనులను, సాత్వికులను మాత్రమే నేను నా
పట్టణంలో (యెరూషలేము) ఉండనిస్తాను. మరియు
వారు యెహోవా నామాన్ని నమ్ముకొంటారు.
13ఇశ్రాయేలులో మిగిలిన వారు చెడు పనులు చేయరు.
వారు అబద్ధాలు చెప్పరు. వారు అబద్ధాలు చెప్పి
ప్రజలను మోసగించేందుకు ప్రయత్నించరు. వారు
తిని ప్రశాంతంగా పడుకొనే గొర్రెల్లా ఉంటారు –
వారిని ఎవరూ ఇబ్బంది పెట్టరు."

### ఒక ఆనంద గానం

14 యెరూషలేమా! పాడుతూ సంతోషంగా ఉండు!
ఇశ్రాయేలూ, ఆనందంగా కేకలు వేయి! యెరూ
షలేమా, సంతోషించి సరదాగా ఉండు!

15 ఎందుకంటే, నీ శిక్షను యెహోవా నిలిపివేశాడు
గనుక! నీ శత్రువుల బలమైన దుర్గాలను ఆయన
నాశనం చేశాడు! ఇశ్రాయేలు రాజా, యెహోవా
నీకు తోడుగా ఉన్నాడు. ఏ చెడు విషయం
జరుగుతున్నా దాన్ని గూర్చి నీవు దిగులు
పడాల్సిన అవసరం లేదు.

16 ఆ సమయంలో యెరూషలేముతో ఇలా చెప్ప
బడుతుంది: "బలంగా ఉండు, భయపడవద్దు!

17 నీ దేవుడైన యెహోవా నీకు తోడుగా ఉన్నాడు.
ఆయన శక్తిమంతుడైన సైనికునిలా ఉన్నాడు.
ఆయన నిన్ను రక్షిస్తాడు. ఆయన నిన్ను ఎంతగా
ప్రేమిస్తున్నాడో అది ఆయన నీకు చూపిస్తాడు.
ఆయన నీ గురించి సంతోష పడతాడు, నీవంటే
ఆనందిస్తాడు. విందులో పాల్గొన్న వారివలె
ఆయన నీ విషయంలో నవ్వుతూ
సంతోషిస్తాడు.

18 అది విందులో పాల్గొన్న ప్రజల్లా ఉంటుంది."
యెహోవా చెప్పాడు: "నీ అవమానాన్ని నేను
తొలగించివేస్తాను. ఆ ప్రజలు నిన్ను బాధించ
కుండునట్లు నేను చేస్తాను.
19 ఆ సమయంలో, నిన్ను బాధించే వారిని నేను
శిక్షిస్తాను. బాధించబడిన నా ప్రజలను నేను రక్షి
స్తాను. పారిపోయేలా బలవంతం చేయబడిన

ప్రజలను నేను తిరిగి వెనుకకు తీసుకొనివస్తాను.
మరియు నేను వారిని ప్రసిద్ధి చేస్తాను. అన్ని
చోట్లా ప్రజలు వారిని పొగడుతారు.
20 ఆ సమయంలో, నిన్ను నేను వెనుకకు తీసుకొని
వస్తాను. నేను నిన్ను కలిపి తీసుకొని వస్తాను.
నిన్ను నేను ప్రసిద్ధి చేస్తాను. అన్ని చోట్లా ప్రజలు
నిన్ను పొగడుతారు. నీ సొంత కళ్ళయెదుట
బందీలను తిరిగి నేను వెనుకకు తీసుకొని వచ్చి
నప్పుడు అది జరుగుతుంది!" ఆ సంగతులు
యెహోవా చెప్పాడు.

# హగ్గయి

### ఇది ఆలయ నిర్మాణానికి సమయం

1 దేవుడైన యెహోవా వాక్కు ప్రవక్తయైన హగ్గయి
ద్వారా యూదా పాలనాధికారియైన జెరుబ్బా
బెలుకు, మరియు ప్రధాన యాజకుడైన యెహోషు
వకు వినవచ్చింది. (జెరుబ్బాబెలు తండ్రి పేరు షయల్తీ
యేలు. యెహోషువ తండ్రి పేరు యెహోజాదాకు)
ఈ వాక్కు రాజైన దర్యావేషు పాలనలో రెండవ
సంవత్సరం ఆరవ నెల మొదటి రోజున వచ్చింది.
ఈ సందేశమేమంటే, 2సర్వశక్తి మంతుడైన యెహోవా
ఇలా చెపుతున్నాడు: "దేవుడైన యెహోవా ఆలయ
నిర్మాణానికి తగిన సమయం రాలేదని ఈ ప్రజలు
అంటున్నారు."
3పిమ్మట దేవుడైన యెహోవా వాక్కు ప్రవక్తయైన
హగ్గయి ద్వారా వచ్చి ఇలా చెప్పింది: 4"మీరు నగిషీ
పనులు చేయబడ్డ చెక్క పలకలు గోడలకు అమర్చబడి
అందంగా ఉన్న ఇండ్లలో నివసిస్తున్నారు. కాని
యెహోవా ఇల్లు ఇంకా శిథిలావస్థలోనే ఉంది. 5అందు
వల్ల సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు:
'మీ ప్రవర్తన విషయం మీరు ఆలోచించండి! 6నీవు
నాటింది ఎక్కువ. కాని నీవు కోసేది తక్కువ. నీవు
భోజనం తింటావు. అయినా నీ కడుపు నిండదు.
నీవు నీరు తాగుతావు. ఆయినా నీ దాహం తీరదు.
నీవు బట్టలు ధరిస్తావు. కాని నీకు వెచ్చగా ఉండదు.
ధన సంపాదకుడు చిల్లులు ఉన్న సంచిలో డబ్బును
వేయటానికే సంపాదిస్తాడు!'"
7సర్వశక్తిమంతుడైన యెహోవా ఇది చెపు
తున్నాడు: "మీ ప్రవర్తన గురించి మీరు ఆలోచించండి!
8మీరు పర్వతాలకు వెళ్లండి. కలప తెచ్చి ఆలయ
నిర్మాణం చేయండి. అప్పుడు ఆలయం విషయంలో
నేను సంతోషపడతాను. అది నాకు గౌరవప్రదం."
దేవుడైన యెహోవా ఇది చెప్పాడు. 9సర్వశక్తిమంతు
డైన యెహోవా చెపుతున్నాడు: "మీరు ఎంతో పెద్ద
పంటకొరకు ఎదురుచూస్తారు. కానీ మీకు లభించే
ధాన్యం కొంతమాత్రమే దానిని మీరు ఇంటికి తెచ్చి
నప్పుడు, నేను గాలినిపంపించి ఎగురగొడతాను. ఎందు
కని ఈ సంగతులు జరుగుతున్నాయి? ఎందుకనగా
నా ఇల్లు ఇంకా శిథిలావస్థలో ఉంది. కాని మీలో ప్రతి
ఒక్కడూ తన ఇంటిని భద్రపరచుకోవడానికి పరుగు
పెడతాడు. 10ఈ కారణంవల్ల ఆకాశం మంచును పడ
నీయదు. మరియు భూమి పంటలను పండనీయదు."
11ప్రభువిలా చెపుతున్నాడు, "నేను భూమిని, పర్వ
తాలను ఎండి పోవాలని ఆజ్ఞ ఇచ్చాను. భూమి పండించే
ధాన్యాలు, కొత్త ద్రాక్షారసం, ఒలీవ నూనె అన్నీ పాడై
పోతాయి. మరియు మనుష్యులందరూ నీరసించి
పోతారు. జంతువులన్నీ ఎండిపోతాయి."

### క్రొత్త ఆలయం పని ప్రారంభమవటం

12పిమ్మట షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బా
బెలు, మరియు యెహోజాదాకు కుమారుడు, ప్రధాన
యాజకుడు అయిన యెహోషువ తమ దేవుడైన
యెహోవా వాక్కును ప్రవక్తయైన హగ్గయి మాటలను
విన్నారు. వారి దేవుడైన యెహోవా తన మాటలను
హగ్గయికి పంపాడు. మిగిలివున్న ప్రజలుకూడా అజ్ఞ
పాలించారు. ప్రజలు దేవుడైన యెహోవా పట్ల భయ
భక్తులను, చూపారు. 13దేవుడైన యెహోవా తన
వార్తాహరుడైన హగ్గయికి ఒక వర్తమానం పంపాడు.
ఈ వర్తమానం ప్రజలకొరకు ఉద్దేశించబడింది. ఆ
వర్తమానం ఇలా ఉంది: దేవుడైన యెహోవా "నేను
మీతో ఉన్నాను!" అని ప్రకటిస్తున్నాడు. 14పిమ్మట
యూదా దేశపు పాలనాధికారియు, షయల్తీయేలు
కుమారుడు అయిన జెరుబ్బాబెలును దేవుడగు
యెహోవా ప్రేరేపించాడు. దేవుడైన యెహోవా
యెహోజాదా కుమారుడు, ప్రధాన యాజకుడు
అయిన యెహోషువాను కూడా ప్రేరేపించాడు.
మరియు దేవుడైన యెహోవా మిగిలివున్న జనులం
దరినీ ప్రేరేపించాడు. అప్పుడు వారంతావచ్చి తమ
దేవుడు, సర్వశక్తిమంతుడైన యెహోవా ఆలయ
నిర్మాణం మొదలు పెట్టారు. 15వారు ఈ పనిని, రాజైన
దర్యావేషు పాలనలో రెండవ సంవత్సరం, ఆరవ నెల
ఇరవై నాల్గవ రోజున ప్రారంభించారు.

### యెహోవా ప్రజలను ప్రోత్సహించటం

2 దేవుడైన యెహోవా వాక్కు ఏడవనెల ఇరవై
ఒకటో రోజున హగ్గయికి వినవచ్చింది. ఆ వాక్కు
ఇలా చెప్పింది: 2ఇప్పుడు షయల్తీయేలు కుమారుడు,
యూదారాజ్య పాలనాధికారి అయిన జెరుబ్బాబెలు

తోను, యెహోజాదాకు కుమారుడు, ప్రధాన యాజ
కుడు అయిన యెహోషువాతోను, మరియు జనులం
దరితోను మాట్లాడి ఇలా చెప్పు: [3]“ఈ ఆలయం
యొక్క గత వైభవాన్ని చూసినవారు మీలో ఎవ్వరు
మిగిలారు? ఇప్పుడు మీరు దీనిని ఎలా చూస్తున్నారు?
చాలా సంవత్సరాలక్రితం ఉన్న ఆలయంతో పోల్చి
చూస్తే, మీ కండ్లకు ఇప్పటిది ఎందుకూ పనికిరానిదిగా
ఉన్నట్లు అనిపిస్తూవుందా? [4]కాని ఇప్పుడు యెహోవా
చెపుతున్నాడు, ‘జెరుబ్బాబెలూ! అధైర్యపడవద్దు.’
యెహోజాదాకు కుమారుడు, ప్రధాన యాజకుడు
నైన యెహోషువా! ‘అధైర్యపడవద్దు. ఈ దేశ నివాసు
లైన మీరందరు అధైర్యపడవద్దు’ అని యెహోవా
చెపుతున్నాడు. ‘ఈ పనిని కొనసాగించండి, ఎందు
కంటే, నేను మీతో ఉన్నాను.’ సర్వశక్తిమంతుడైన
ప్రభువు ఈ విషయాలు చెప్పాడు!”
[5]“మీరు ఈజిప్టు నుండి బయటికి వచ్చినప్పుడు
నేను మీతో చేసిన ఒడంబడిక ప్రకారం, నా ఆత్మ మీ
మధ్య ఉంది. భయపడవద్దు! [6]ఎందువల్లనంటే సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇది చెపుతున్నాడు! కొద్ది
వ్యవధిలో మరొక్కసారి పరలోకాలను, భూమిని, సము
ద్రాన్ని, ఎండిన నేలను కంపించేలా చేస్తాను. [7]దేశాల
న్నింటినీ కుదిపివేస్తాను. వారంతా, వివిధ దేశాలలో
వున్న ధనసంపదతో వస్తారు. అప్పుడు ఈ ఆల
యాన్ని మహిమతో నింపుతాను. సర్వశక్తిమంతుడైన
యెహోవా ఇది చెపుతున్నాడు. [8]వెండి నాది. బంగారం
నాది. సర్వశక్తిమంతుడైన యెహోవా ఇది చెపు
చున్నాడు. [9]ఈ ఆలయంయొక్క తరువాత మహిమ
మొదటి ఆలయ మహత్తుకంటె ఇనుమడించి
ఉంటుంది. సర్వశక్తిమంతుడైన యెహోవా ఇది చెపు
తున్నాడు. ‘మరియు ఈ ప్రదేశంలో శాంతి నెల
కొల్పుతాను. సర్వశక్తిమంతుడైన యెహోవా ఇది
చెపుతున్నాడు!”

### పని ప్రారంభమయింది—ఆశీస్సులు వస్తాయి

[10]దర్యావేషు కాలంలో రెండవ సంవత్సరం తొమ్మి
దవ నెల ఇరవై నాలుగవ రోజున దేవుడైన యెహోవా
వాక్కు ప్రవక్త హగ్గయికి ఇలా వినవచ్చింది: [11]సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇది చెపుతున్నాడు: “ధర్మ
శాస్త్రం వీటిని గురించి ఏమి చెపుతున్నదో ఇప్పుడు
యాజకులను అడుగు. [12]“ఒకడు తన వస్త్రముల మడ
తలో పవిత్ర బలి మాంసాన్ని పెట్టుకుని వెళ్లినాడనుకో.
పవిత్ర మాంసాన్ని ఉంచిన తన వస్త్రం రొట్టెనుగాని,
వండిన ఆహారాన్నిగాని, ద్రాక్షారసం, నూనె లేక ఇతర
తినుబండారాలను తాకినదనుకో. అలా ముట్టబడిన
పదార్థం పవిత్రమౌతుందా?”
యాజకులు “కాదు” అని సమాధానమిచ్చారు.

[13]పిమ్మట హగ్గయి అన్నాడు: “ఒకడు శవాన్ని
ముట్టినాడనుకో. అతడు అపవిత్రుడవుతాడు. అతడు
గనుక దేన్నయినా ముట్టుకుంటే ఆ వస్తువు అపవి
త్రమౌతుందా?” “అది అపవిత్రమౌతుంది” అని
యాజకులు సమాధానమిచ్చారు. [14]పిమ్మట హగ్గయి
చెప్పాడు: “దేవుడైన యెహోవా ఇలా చెపుతున్నాడు:
‘ఈ జనులకు సంబంధించినంత వరకూ ఆ విషయం
కూడా నిజమే. వాళ్లు నా ముందు అపరిశుద్ధులు, అపవి
త్రులు. వాళ్ల చేతులతో తాకినవన్నీ అపరి శుద్ధమైనవి.
[15]యెహోవా ఆలయపు పని ప్రారంభించేందుకు
ముందు జరిగిన సంగతుల విషయమై ఆలోచించు.
[16]ప్రజలు ఇరవై బస్తాల ధాన్యం అవుతుందను
కొన్నారు. కాని పది బస్తాల ధాన్యం మాత్రమే కుప్పలో
ఉంది. ద్రాక్షారసం ఏభై కొలలు తీసికోటానికి ఒక
తొట్టివద్దకు రాగా, వారికి ఇరవై కొలలు మాత్రమే
దొరికేవి. [17]ఎందుకంటే నేను మిమ్మల్ని, మీ చేతులు
చేసిన వస్తువులను శిక్షించాను. మొక్కలను చీడలతోను,
బూజుతోనూ, మిమ్మల్ని వడగండ్లతోను శిక్షించాను.
కాని మీరింకా నా వద్దకు రారు.’ దేవుడైన యెహోవా
ఇలా చెపుతున్నాడు.”
[18]“ఈ రోజు తొమ్మిదవ నెలలో ఇరవైనాల్గవ
దినం. మీరు యెహోవా ఆలయానికి పునాది
వేయటం ముగించారు. కావున ఈ రోజునుండి ఏమి
జరుగుతుందో చూడండి. [19]గోదాముల్లో ధాన్యం నిలవ
వుందా? ద్రాక్షాలతలు, అంజూరపుచెట్లు, దానిమ్మ
చెట్లు ఇంకను పండ్లనీయటం లేదా? (లేదు). అయితే
మిమ్మల్ని ఈ రోజునుండి ఆశీర్వదిస్తాను!”
[20]మళ్లీ తొమ్మిదవనెల, ఇరవై నాలుగవరోజు
రెండవ సారి దేవుడైన యెహోవా వాక్కు హగ్గయికి
వినవచ్చింది. ఆ వాక్కు ఇలా చెప్పింది: [21]“జెరుబ్బా
బెలుకు చెప్పు: పరలోకాన్ని, భూమిని కదుపుతాను.
[22]రాజ్యాల సింహాసనాలను తల్లక్రిందులు చేస్తాను. ఆ
ఇతర రాజ్యాలవారిని నాశనం చేస్తాను. రథాలను వాటి
మీద ఉన్నవారిని పడదోస్తాను. గుర్రాలు, రౌతులు
కూలిపోతారు. ఆ సైన్యాలు ప్రస్తుతం మిత్రులు. కాని
వాళ్లు ఒకరికొకరు ప్రతికూలులై, కత్తులతో ఒకరి
నొకరు పొడుచుకొని చంపుకొంటారు. [23]సర్వశక్తి
మంతుడైన యెహోవా ఇది చెపుతున్నాడు: ‘షయల్తీ
యేలు కుమారుడవు, నా సేవకుడైన జెరుబ్బాబెలూ,
నిన్ను నేను ఎన్నుకొన్నాను. దేవుడైన యెహోవా
ఇలా చెపుతున్నాడు. ఆ సమయాన నేను నిన్నొక
ముద్ర వేసే ఉంగరంగా* చేస్తాను. (ఈ పనులు నేను
చేశానని మీరే ఋజువు.)” సర్వశక్తిమంతుడైన
యెహోవా ఇది చెపుతున్నాడు.

---

**ముద్ర వేసే ఉంగరము** నేనీ పనులు చేశానని చెప్పడానికి
నీవే ఒక ఋజువు.

# జెకర్యా

### యెహోవా తన ప్రజలు తిరిగి రావాలని కోరుకొనుట

1 బెరక్యా కుమారుడు జెకర్యా. యెహోవా నుండి జెకర్యాకు ఒక వర్తమానం వచ్చింది. అది పర్షియా (పారశీకం) రాజైన దర్యావేషు పాలనలో రెండవ సంవత్సరం, ఎనిమిదవ నెలలో వచ్చింది. (జెకర్యా తండ్రి పేరు బెరక్యా. బెరక్యా ఇద్దో కుమారుడు. ఇద్దో ఒక ప్రవక్త.) ఆ వర్తమానం ఇలా ఉంది.

2యెహోవా మీ పూర్వీకుల పట్ల చాలా కోపంగా ఉన్నాడు. 3కావున ప్రజలకు మీరీ విషయాలు తప్పక చెప్పాలి. యెహోవా ఇలా చెపుతున్నాడు, "మీరు నా వద్దకు తిరిగి రండి; నేను మీ వద్దకు వస్తాను." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

4యెహోవా చెప్పాడు: "మీ పూర్వీకులవలె మీరు ఉండవద్దు. గతంలో ప్రవక్తలు వారితో ఇలా మాట్లాడారు. 'సర్వశక్తిమంతుడైన యెహోవా మీ చెడు జీవిత విధానాలను మార్చుకోమని మిమ్మల్ని కోరుతున్నాడు. చెడు కార్యాలు చేయటం మానండి!' అని చెప్పారు. కాని మీ పూర్వీకులు నా మాట వినలేదు." యెహోవా ఆ విషయాలు చెప్పాడు.

5దేవుడు చెప్పాడు: "మీ పూర్వీకులు పోయారు. ఆ ప్రవక్తలూ శాశ్వతంగా జీవించలేదు. 6ప్రవక్తలు నా సేవకులు. మీ పూర్వీకులకు నా ధర్మాన్ని, బోధనలను తెలియజెప్పటానికి నేను వారిని వినియోగించుకొన్నాను. చివరకు మీ పూర్వీకులు గుణపాఠం నేర్చుకున్నారు. 'సర్వశక్తిమంతుడైన యెహోవా చేస్తానని చెప్పిన విషయాలు చేశాడు. మేము జీవించిన పద్ధతికి, మేము చేసిన చెడు పనులకు ఆయన మమ్మల్ని శిక్షించాడు' అని వారు చెప్పారు. కావున వారు దేవుని వద్దకు తిరిగి వచ్చారు."

### నాలుగు గుర్రాలకు సంబంధించిన దర్శనం

7పర్షియా రాజైన దర్యావేషు పాలనలో రెండవ సంవత్సరం పదకొండవ నెల (శెబాటు) ఇరవై నాల్గవ రోజున జెకర్యా మరో వర్తమానాన్ని యెహోవా నుండి అందుకున్నాడు. (జెకర్యా తండ్రి బెరక్యా, బెరక్యా తండ్రి ప్రవక్త అయిన ఇద్దో.) ఆ వర్తమానం ఇది.

8రాత్రివేళ ఒకడు ఎర్రగుర్రమునెక్కి స్వారీ చేయుట నేను చూశాను. అతడు లోయలో కొన్ని కదంబ చెట్ల మధ్య నిలుచున్నాడు. అతని వెనుక ఎరుపు, గోధుమరంగు మరియు తెలుపురంగు గుర్రాలు ఉన్నాయి. 9"అయ్యా, ఈ గుర్రాలు ఎందుకు?" అని నేను అడిగాను.

అప్పుడు దేవదూత నాతో మాట్లాడుతూ, "ఈ గుర్రాలు ఎందుకో నేను నీకు చూపిస్తాను" అని చెప్పాడు.

10పిమ్మట కదంబ చెట్ల మధ్య నిలుచున్న మనిషి చెప్పాడు, "యెహోవా ఈ గుర్రాలను భూమిపై ఇక్కడా, అక్కడా తిరగటానికి పంపించాడు."

11తరువాత కదంబ చెట్ల మధ్య నిలుచున్న యెహోవా దూతతో ఆ గుర్రాలు మాట్లాడాయి. "మేము భూమిపై ఇక్కడా, అక్కడా సంచరించాము. అంతా సవ్యంగా, శాంతంగా ఉంది" అని అవి చెప్పాయి.

12పిమ్మట యెహోవా దూత చెప్పాడు: "ప్రభువా! యెరూషలేమును, యూదా నగరాలను ఓదార్చటానికి నీకు ఇంకా ఎంతకాలం పడుతుంది? ఇప్పటికి డెబ్బై యేండ్లగా ఈ నగరాలపై నీ కోపాన్ని చూపిస్తూ వచ్చావు." 13అప్పుడు నాతో మాట్లాడుతూ వున్న దేవదూతకు యెహోవా సమాధానం చెప్పాడు. యెహోవా మంచివైన, ఓదార్పు మాటలు చెప్పాడు. 14తరువాత దేవదూత ఈ విషయాలను ప్రజలకు చెప్పుమని నాతో చెప్పాడు: సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు:

"యెరూషలేము పట్ల, సీయోను పట్ల నాకు గాఢమైన ప్రేమ ఉంది. 15మిక్కిలి రక్షణ కలిగియున్నామని భావించే దేశాల పట్ల నేను చాలా కోపంగా వున్నాను. నాకు కొంచెం కోపం వచ్చింది. అప్పుడు నా జనులను శిక్షించటానికి నేను ఆ రాజ్యాలను వినియోగించాను. కాని ఆ రాజ్యాలు చాలా హాని చేశాయి."

16 కావున యెహోవా చెపుతున్నాడు: "నేను యెరూషలేముకు తిరిగి వచ్చి ఆమెను ఓదార్చుతాను." సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు: "యెరూషలేము మళ్లీ నిర్మింపబడుతుంది. మరియు నా ఆలయం అక్కడ కట్టబడుతుంది."

17 దేవదూత చెప్పాడు, “ప్రజలకు ఈ విషయాలు కూడా చెప్పు, “సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు: ‘నా పట్టణాలు మళ్లీ భాగ్యవంత మవుతాయి. నేను సీయోనును ఓదార్చుతాను. నేను యెరూషలేమును నా ప్రత్యేక నగరంగా ఎంపిక చేసుకుంటాను.’””

### నాలుగు కొమ్ములు మరియు నలుగురు పనివారిని గూర్చిన దర్శనం

[18]అప్పుడు నేను పైకిచూడగా అక్కడ నాలుగు
కొమ్ములు చూశాను. [19]నాతో మాట్లాడుతున్న దేవ
దూతను, “ఈ కొమ్ముల అర్థమేమిటి?” అని అడిగాను.
అతడు ఇలా చెప్పాడు: “ఇవి ఇశ్రాయేలు, యూదా, యెరూషలేము ప్రజలను ఇతర దేశాలకు పోయేలా ఒత్తిడి చేసిన కొమ్ములు.”

[20]తరువాత యెహోవా నలుగురు పనివారిని నాకు
చూపించాడు. [21]“ఈ నలుగురు పనివారు ఏమి చేయ
టానికి వస్తున్నారు?” అని నేనతనిని అడిగాను.
అతడు ఇలా చెప్పాడు, “ఈ మనుష్యులు ఆ కొమ్ములను నాశనం చేయటానికి వచ్చారు. ఆ కొమ్ములు యూదా ప్రజలను అన్యదేశాలకు పోయేలా ఒత్తిడి చేశాయి. ఆ కొమ్ములు ఎవ్వరికీ కనికరం చూపలేదు. యూదా ప్రజలపై దాడిచేసి వారిని అన్యదేశాలకు వెడలగొట్టిన రాజ్యాలకు చిహ్నాలుగా ఈ కొమ్ములు ఉన్నాయి.”

### యెరూషలేమును కొలవటాన్ని గురించిన దర్శనం

2 నేను పైకిచూశాను. వస్తువులను కొలవటానికి
ఒకడు తాడు పట్టుకుని ఉన్నట్లు చూశాను. [2]“నీవె
క్కడికి వెళ్తున్నావు?” అని అతన్ని అడిగాను. “నేను యెరూషలేమును కొలవటానికి వెళ్తున్నాను. అది ఎంత వెడల్పు, ఎంత పొడవు వున్నదో చూడాలి” అని అతడు నాకు చెప్పాడు.

[3]అప్పుడు నాతో మాట్లాడుతున్న దేవదూత వెళ్లి
పోయాడు. మరొక దేవదూత అతనితో మాట్లాడ
టానికి వెళ్లాడు. [4]అతనితో ఇలా చెప్పాడు: “పరుగున
పొమ్ము. వెళ్లి ఆ యువకునితో యెరూషలేము కొలవలేనంత పెద్దగా వుంటుందని చెప్పు. అతనికి ఈ విషయాలు చెప్పు:

‘యెరూషలేము ప్రాకారం లేని నగరంగా ఉంటుంది. ఎందుకంటే అక్కడ ఎంతోమంది మనుష్యులు, ఎన్నో జంతువులు నివసిస్తాయి.’
5 యెహోవా చెపుతున్నాడు, ‘యెరూషలేమును రక్షిస్తూ దానిచుట్టూ నేనొక అగ్ని గోడలా ఉంటాను. ఆ నగరానికి మహిమను కలుగజేస్తూ, నేనక్కడ నివసిస్తాను.’”

### దేవుడు తన ప్రజలను ఇంటికి పిలవటం

6 యెహోవా చెపుతున్నాడు, “త్వరపడు! ఉత్తర దేశం నుండి పారిపొమ్ము! అవును. నీ ప్రజలను ప్రతి చోటికి నేను చెదర గొట్టిన మాట నిజమే.
7 సీయోను ప్రజలారా మీరు బబులోనులో బందీలయ్యారు. కాని ఇప్పుడు తప్పించుకోండి! ఆ నగరం నుండి పారిపొండి!” సర్వశక్తిమంతుడైన యెహోవా నా గురించి ఈ విషయాలు చెప్పాడు: ఆ రాజ్యాలు యుద్ధంలో నీనుండి వస్తువులు తీసుకున్నారు.
8 ఆ రాజ్యాలు ఘనత సంపాదించాయి. కాని ఆ తరువాత యెహోవా నన్ను వారి మీదికి పంపుతాడు. ఎందుకంటే, మీకు హాని కలిగించడమంటే, దేవుని కంటిపాపలకు హాని కలిగించడమే అవుతుంది. అప్పుడు ఆ రాజ్యాలు వాటి గౌరవాన్ని పొందుతాయి.
9 మరియు నేనా ప్రజలను బాధిస్తాను. వారి బానిసలు వారి ధనాన్ని తీసుకుంటారు. బబులోను ప్రజలు నా ప్రజలను బంధించి వారిని బానిసలుగా చేశారు. కాని నేను వాళ్లను దెబ్బ తీస్తాను వారు నా ప్రజలకు బానిసలవుతారు. అప్పుడు సర్వశక్తిమంతుడైన యెహోవాయే నన్ను పంపినట్లు మీరు తెలుసుకుంటారు.
10 యెహోవా చెపుతున్నాడు: “సీయోనూ, సంతోషంగా వుండు! ఎందుకంటే, నేను వస్తున్నాను. మరియు నేను నీ నగరంలో నివసిస్తాను.
11 ఆ సమయంలో అనేక దేశాల ప్రజలు నా వద్దకు వస్తారు. పైగా వారు నా ప్రజలవుతారు. నేను నీ నగరంలో నివసిస్తాను.” సర్వశక్తిమంతుడైన యెహోవా నీ వద్దకు నన్ను పంపాడని నీవు తెలుసుకుంటావు.
12 యెహోవా మళ్లీ యెరూషలేమును తన ప్రత్యేక నగరంగా ఎంపిక చేస్తాడు. మరియు యూదా పవిత్ర భూమిలో తన భాగంగా ఉంటుంది.
13 ప్రతి ఒక్కడూ ప్రశాంతంగా ఉండాలి! యెహోవా తన పవిత్ర నివాసం నుండి వస్తున్నాడు.

### ప్రధాన యాజకుని గూర్చిన దర్శనం

3 పిమ్మట దేవదూత ప్రధాన యాజకుడైన
యెహోషువను నాకు చూపించాడు. యెహోవా
దూత ముందు యెహోషువ నిలబడి ఉన్నాడు. యెహోషువాకి కుడి పక్కగా సాతాను నిలబడి ఉన్నాడు. యెహోషువ మీద చెడు పనులు చేసినట్లు నింద మోపటానికి సాతాను అక్కడ ఉన్నాడు.
[2]అప్పుడు యెహోవా దూత ఇలా చెప్పాడు:
“సాతానూ, యెహోవా నిన్ను విమర్శించు గాక. నీవు అపరాధివని యెహోవా తీర్పు ఇచ్చుగాక! యెరూష

లేమును యెహోవా తన ప్రత్యేక నగరంగా ఎంపిక
చేసుకున్నాడు. ఆయన ఆ నగరాన్ని రక్షించాడు. అది
నిప్పులోనుండి లాగిన మండే కట్టెలా ఉంది.”

3యెహోషువ దేవదూత ముందు నిలుచున్నాడు.
యెహోషువ ఒక మురికి వస్త్రం ధరించివున్నాడు.
4అప్పుడు దేవదూత తనవద్ద నిలబడిన ఇతర దేవ
దూతలతో, “యెహోషువ వేసుకున్న మురికి వస్త్రా
లను తీసివేయండి” అని చెప్పాడు. పిమ్మట దేవదూత
యెహోషువతో మాట్లాడినాడు. అతడు ఇలా
అన్నాడు: “ఇప్పుడు నీ నేరాన్ని నేను తీసివేశాను.
నీకు నూతన వస్త్రాలను ఇస్తున్నాను.”

5అప్పుడు నేను, “అతని తలపై శుభ్రమైన తలపాగా
ఉంచు” అని అన్నాను. కావున ఒక శుభ్రమైన తల
పాగాను వారతని తలపై పెట్టారు. యెహోవా దూత
అక్కడ నిలబడి వుండగా వారు అతనికి నూతన వస్త్రాలు
తొడిగారు. 6పిమ్మట యెహోషువాకు యెహోవా
దేవదూత ఈ విషయాలు చెప్పాడు:

7 సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: “నేను చెప్పిన విధంగా జీవించు. నేను
చెప్పినవన్నీ చెయ్యి. నీవు నా ఆలయానికి అధి
కారివిగా ఉంటావు. నీవు దాని ఆవరణ విషయం
శ్రద్ధ తీసుకుంటావు. ఇక్కడ నిలబడిన దేవదూత
లవలె నీవు నా ఆలయంలో ఎక్కడికైనా వెళ్లటా
నికి నీకు స్వేచ్ఛ ఉంది.
8 కావున యెహోషువ, నీవూ, నీతో వున్న
ప్రజలూ నేను చెప్పేది తప్పక వినాలి. నీవు
ప్రధాన యాజకుడవు. నీతో ఉన్న జనులు
నిజంగా అద్భుతాలు నెరవేర్చగలరు. నేను నిజంగా
నా ప్రత్యేక సేవకుని తీసుకువస్తాను. అతడు
‘కొమ్మ’ (చిగురు) అని పిలువబడతాడు.
9 చూడండి, యెహోషువ ముందు నేనొక రాతిని
పెట్టాను. ఆ రాతికి ఏడు పక్కలు (కండ్లు)
ఉన్నాయి. ఆ రాతి మీద నేనొక ప్రత్యేక వర్త
మానం చెక్కుతాను. నేను ఒక్క రోజులో ఈ
దేశంలోని పాపాలన్నీ తీసివేస్తానని ఇది తెలియ
జేస్తుంది.”
10 సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు:
“ఆ సమయంలో ప్రజలు తమ స్నేహితులతోను,
పొరుగువారితోను కూర్చొని మాట్లాడుకుంటారు.
ప్రతిఒక్కడూ తన అంజూరపు చెట్టు కింద, తన
ద్రాక్షాలత క్రింద ప్రశాంతంగా కూర్చుంటాడు.”

### దీపస్తంభం – రెండు ఒలీవ చెట్లు

4 పిమ్మట నాతో మాట్లాడుతూవున్న దేవదూత
నా వద్దకు వచ్చి నన్ను లేపాడు. నేను నిద్రనుండి
మేల్కొంటున్న వ్యక్తివలె ఉన్నాను. 2“నీవు ఏమి
చూస్తున్నావు?” అని దేవదూత నన్ను అడిగాడు.

నేను ఇలా చెప్పాను: “ఒక గట్టి బంగారు దీప
స్తంభాన్ని చూస్తున్నాను. ఆ స్తంభం మీద ఏడు దీపాలు
(ప్రమిదెలు) ఉన్నాయి. దీపస్తంభం మీద ఒక గిన్నె
ఉంది. గిన్నె నుండి ఏడు గొట్టాలు వచ్చాయి. ప్రతి
దీపానికీ ఒక గొట్టం చొప్పున వెళ్లాయి. ఆ గొట్టాలు
దీపాలకు కావలసిన నూనెను గిన్నెనుండి చేరవేస్తు
న్నాయి. 3గిన్నె పక్కగా కుడి వైపున ఒకటి, ఎడమ
వైపున ఒకటి ఒలీవ చెట్లు ఉన్నాయి.” 4తరువాత
నాతో మాట్లాడుతూవున్న దేవదూతను, “అయ్యా,
ఈ వస్తువులు ఏమి తెలియజేస్తున్నాయి?” అని
అడిగాను. 5“ఈ వస్తువులు ఏమిటో నీకు తెలియదా?”
అని నాతో మాట్లాడుతూ ఉన్న దేవదూత అన్నాడు.

“లేదయ్యా” అని నేను చెప్పాను.

6అతడు నాతో ఇలా అన్నాడు: “యెహోవా నుంచి
జెరుబ్బాబెలుకు వచ్చిన వర్తమానం ఇది: ‘నీ శక్తి సామ
ర్థ్యాలవల్ల నీకు సహాయం రాదు. నీ సహాయం నా
ఆత్మ నుండి వస్తుంది.’ సర్వశక్తిమంతుడైన యెహోవా
ఆ విషయాలు చెప్పాడు! 7ఆ ఎత్తైన పర్వతం జెరుబ్బా
బెలుకు సమమైన ప్రదేశంగా ఉంటుంది. అతడు
ఆలయ నిర్మాణం చేస్తాడు. దానికి చివరి రాయి పెట్ట
బడినప్పుడు, ‘అందంగా ఉంది! అందంగా ఉంది!’
అని ప్రజలు కేకలు పెడతారు.”

8నాకు వచ్చిన యెహోవా వర్తమానం ఇంకా ఇలా
చెప్పింది: 9“నా ఆలయానికి జెరుబ్బాబెలు పునాదులు
నిర్మిస్తాడు. మరియు జెరుబ్బాబెలు ఆలయ నిర్మాణం
పూర్తిచేస్తాడు. అప్పుడు సర్వశక్తిమంతుడైన
యెహోవా తన ప్రజలైన మీ వద్దకు నన్ను పంపినట్లు
మీరు తెలుసుకుంటారు. 10సామాన్యంగా ప్రారంభించ
బడే పనులపట్ల ప్రజలు సిగ్గుచెందరు. జెరుబ్బాబెలు
గుండు దారం తీసికొని తయారైన భవనాన్ని తనిఖీచేసి
కొలవటం చూసినప్పుడు, ప్రజలు నిజంగా సంతోషి
స్తారు. ఆ రాతికి మీరు ఇప్పుడు చూసిన ఏడు పక్కలు
యెహోవా యొక్క ఏడు కండ్లకు చిహ్నాలుగా ఉండి
అన్ని దిశలకూ చూస్తూ ఉంటాయి. అవి భూమి మీద
ప్రతిదాన్నీ చూస్తాయి.” 11పిమ్మట నేను (జెకర్యా)
అతనికి చెప్పాను: “దీపస్తంభానికి కుడి పక్కన ఒక
ఒలీవ చెట్టును, ఎడమ పక్కన మరొక చెట్టును నేను
చూశాను. ఆ రెండు ఒలీవ చెట్ల అర్థం ఏమిటి?”
12నేనింకా ఇలా అన్నాను: “బంగారు రంగుగల నూనె
ప్రవహించే బంగారు గొట్టాల వద్ద నేను రెండు ఒలీవ
కొమ్మలు చూశాను. వీటి అర్థం ఏమిటి?”

13తరువాత దేవదూత నాతో, “వీటి అర్థం ఏమిటో
నీకు తెలియదా?” అని అన్నాడు.

“లేదయ్యా” అని నేను చెప్పాను.

14“ఈ సర్వజగత్తుకు ప్రభువైన యెహోవాను
సేవించటానికి ఎంపిక చేయబడిన ఇద్దరు మనుష్యులను
అవి సూచిస్తాయి,” అని అతడు చెప్పాడు.

## చుట్టబడిన ఎగిరే పత్రం

5 నేను మళ్లీ పైకి చూడగా, చుట్టబడిన ఒక ఎగిరే
పత్రాన్ని చూశాను. [2]“నీవు ఏమి చూస్తున్నావు?”
అని దేవదూత నన్ను అడిగినాడు.
“నేనొక చుట్టగా వున్న ఎగిరే పత్రాన్ని చూస్తు
న్నాను. ఆ చుట్ట ముప్పై అడుగుల పొడవు, పదిహేను
అడుగుల వెడల్పు ఉంది” అని నేను చెప్పాను.
[3]అప్పుడు దేవదూత నాతో చెప్పాడు, “ఆ చుట్ట
బడిన పత్రంమీద ఒక శాపం వ్రాయబడి ఉంది. ఆ
పత్రంలో ఒక ప్రక్కన దొంగలకు ఒక శాపం ఉంది.
ఆ పత్రానికి మరొక పక్కన అబద్ధపు వాగ్దానాలు చేసే
వారికి ఒక శాపం ఉంది. [4]సర్వశక్తిమంతుడైన
యెహోవా చెపుతున్నాడు: దొంగల ఇండ్లకు, నా
పేరు మీద దొంగ వాగ్దానాలు చేసేవారి ఇండ్లకు ఆ
చుట్టబడిన పత్రాన్ని నేను పంపిస్తాను. ఆ పత్రం
అక్కడ వుండి, ఆ ఇండ్లను నాశనం చేస్తుంది. రాళ్లు,
కొయ్యస్తంభాలు సహితం నాశనం చేయబడతాయి.”

## స్త్రీ మరియు తొట్టె

[5]తరువాత నాతో మాట్లాడుతూవున్న దేవదూత
బయటికి వెళ్లాడు. అతడు నాతో, “చూడు! నీవు
ఏమి జరుగుతున్నట్లు చూస్తున్నావు?” అని అన్నాడు.
[6]“అదేమిటో నాకు తెలియదు” అని నేను
అన్నాను.
అతడు ఇలా చెప్పాడు: “అది ఒక కొలతొట్టె. ఈ
దేశంలో ప్రజలు చేసే పాపాలను కొలవటానికి ఆ
బుట్ట ఉద్దేశించబడింది.”
[7]ఆ తొట్టె మీదనుంచి సీసపు మూత తొలగించ
బడింది. ఆ బుట్టలో ఒక స్త్రీ కూర్చుని ఉంది. దానితో
బరువైన (డెబ్బై ఐదు పౌనులు) సీసపు తూనికరాయి
ఉంది. [8]“ఈ స్త్రీ చెడును తెలియజేస్తుంది” అని దేవ
దూత చెప్పాడు. పిమ్మట దేవదూత ఆ స్త్రీని తొట్టెలో
పడదోసి, దానిమీద సీసపు మూతను పెట్టాడు. పాపాలు
ఘోరమైనవని (బరువైనవని) ఇది తెలుపుతుంది. [9]తరు
వాత నేను పైకి చూశాను. అక్కడ సంకుబుడ్డ కొంగవలె
రెక్కలు గల ఇద్దరు స్త్రీలను చూశాను. వారు ఎగిరి
వచ్చారు. వారి రెక్కల్లో గాలి ఉంది. వారు బుట్టను
పట్టి లేవనెత్తారు. బుట్టను పట్టుకొని వారు గాలిలోకి
పోయారు. [10]“వారు ఆ బుట్టను ఎక్కడికి మోసుకు
పోతున్నారు?” అని నాతో మాట్లాడుతూ వున్న దేవ
దూతను నేనడిగాను. [11]దేవదూత నాతో ఇలా
చెప్పాడు: “షీనారులో* దానికొక ఆలయం నిర్మించ
టానికి వారు వెళ్తున్నారు. వారా ఆలయాన్ని నిర్మించాక
ఆ బుట్టను అక్కడ ఉంచుతారు.”

## నాలుగు రథాలు

6 నేను పిమ్మట నలు పక్కలా తిరిగి, పైకి చూశాను.
అక్కడ నాలుగు రథాలు నాలుగు కంచుపర్వతాల
మధ్యగా వెళ్లుచున్నట్లు నేను చూశాను. [2]ఎర్రగుర్రాలు
మొదటి రథాన్ని లాగుతున్నాయి. నల్లగుర్రాలు రెండవ
రథాన్ని లాగుతున్నాయి. [3]తెల్లగుర్రాలు మూడవ
రథాన్ని లాగుతున్నాయి. మరియు ఎర్రమచ్చలున్న
గుర్రాలు నాలుగో రథాన్ని లాగుతున్నాయి. [4]నాతో
మాట్లాడుచున్న దేవదూతను, “అయ్యా వీటి అర్థమే
మిటి?” అని అడిగాను.
[5]దేవదూత ఇలా సమాధానమిచ్చాడు: “ఇవి నాలుగు
గాలులు.* ఇవి కేవలం ఈ సర్వలోకానికి ప్రభువైన
ఆయన ముందునుండి వచ్చాయి. [6]నల్లగుర్రాలు ఉత్తరా
నికి వెళతాయి. ఎర్రగుర్రాలు తూర్పుకు వెళతాయి.
తెల్ల గుర్రాలు పడమటికి వెళతాయి. ఎర్ర మచ్చల
గుర్రాలు దక్షిణానికి వెళతాయి.”
[7]ఎర్రమచ్చల గుర్రాలు తమకు చెందిన భూభాగాన్ని
చూడాలని ఆత్రంగా ఉన్నాయి. కావున దేవదూత
వాటితో, “వెళ్లి భూమి మీద నడవండి” అని అన్నాడు.
అందుచే అవి వాటికి చెందిన ప్రాంతంలో నడుస్తూ
వెళ్లాయి. [8]తరువాత యెహోవా నన్ను బిగ్గరగా పిలిచి
ఇలా అన్నాడు: “చూడు, ఉత్తరానికి వెళ్తున్న గుర్రాలు
బబులోనులో తమ పనిపూర్తి చేశాయి. అవి నా
ఆత్మను శాంతింపజేశాయి. నేనిప్పుడు కోపంగా లేను!”

## యాజకుడైన యెహోషువ కిరీటాన్ని పొందటం

[9]పిమ్మట యెహోవా నుండి నేను మరొక వర్త
మానం అందుకున్నాను. [10]ఆయన ఇలా చెప్పాడు:
“బబులోనులో బందీలుగా ఉన్న వారిలో నుండి
హెల్దయి, టోబీయా, యెదాయా అనేవారు వచ్చారు.
వారి వద్దనుండి వెండి బంగారాలు తీసికొని, జెఫన్యా
కుమారుడైన యోషీయా ఇంటికి వెళ్లు. [11]ఆ వెండి
బంగారాలను ఒక కిరీటం చేయటానికి వినియోగించు.
ఆ కిరీటాన్ని యెహోషువ తలమీద పెట్టు. (యెహో
షువ ప్రధాన యాజకుడు. యెహోజాదాకు కుమా
రుడే యెహోషువ) తరువాత యెహోషువకు ఈ
విషయాలు చెప్పు.

12 సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విష
యాలు చెపుతున్నాడు: “కొమ్మ అని పిలువ
బడే ఒక మనిషి ఉన్నాడు. అతడు బలంగా
పెరుగుతాడు. అతడు యెహోవా ఆల
యాన్ని నిర్మిస్తాడు.
13 అతడు యెహోవా ఆలయాన్ని నిర్మించి
గౌరవాన్ని పొందుతాడు. అతడు తన సింహాస

---

**షీనారు** బబులోను నగరం నిర్మింపబడిన చదునైన
ప్రదేశం. చూడండి ఆదికాండం 11:2.

**నాలుగు గాలులు** లేక నాలుగు ఆత్మలు.

నంపై కూర్చుని, పాలకుడవుతాడు. ఒక
యాజకుడు అతని సింహాసనం వద్ద
నిలబడతాడు. ఈ ఇద్దరు మనుష్యులూ
శాంతియుత వాతావరణంలో కలిసి పని
చేస్తారు.

14“వారు కిరీటాన్ని ప్రజల జ్ఞాపకార్థం ఆలయంలో
ఉంచుతారు. ఆ కిరీటం హెల్దయి, టోబీయా,
యెదాయా మరియు జెఫన్యా కుమారుడైన యోషీ
యాలకు గౌరవాన్ని తెచ్చిపెడుతుంది. 15మిక్కిలి
దూరంలో నివసిస్తున్నవారు వచ్చి ఆలయాన్ని నిర్మి
స్తారు. అప్పుడు ప్రజలైన మీవద్దకు యెహోవా నన్ను
పంపినట్లు మీరు నిశ్చయంగా తెలుసుకుంటారు.
యెహోవా ఏమి చెపుతున్నాడో అది మీరు చేస్తే ఈ
విషయాలన్నీ జరుగుతాయి.”

### యెహోవా దయాదాక్షిణ్యాలను కోరుట

7 దర్యావేషు పర్షియా రాజుగావున్న కాలంలో
నాలుగవ సంవత్సరంలో యెహోవా నుండి
జెకర్యా ఒక వర్తమానం అందుకున్నాడు. ఇది తొమ్మి
దవ నెలలో (కిస్లేవు) నాల్గవ రోజున జరిగింది. 2బేతేలు
ప్రజలు షెరెజెరును, రెగెమ్మెలెకును, వారి మనుష్యు
లను యెహోవా వద్దకు ఒక ప్రశ్న అడగటానికి
పంపారు. 3వారు సర్వశక్తిమంతుడైన యెహోవా ఆల
యంలో ఉన్న ప్రవక్తలు, యాజకుల వద్దకు వెళ్లారు.
ఆ మనుష్యులు వారిని ఈ ప్రశ్న అడిగారు: “ఆలయ
వినాశనానికి కొన్ని సంవత్సరాలుగా మా విషాదాన్ని
వ్యక్తం చేస్తూ వచ్చాము. ప్రతి సంవత్సరం ఐదవ నెలలో
ఒక ప్రత్యేక సంతాపదినాన్ని, నిరాహార దీక్షను పాటి
స్తున్నాము. మేము ఇలా చేస్తూ ఉండవలసిందేనా?”
4సర్వశక్తిమంతుడైన యెహోవా నుండి నేను ఈ
వర్తమానం అందుకున్నాను: 5“ఈ దేశంలోని యాజకు
లకు, తదితర ప్రజలకు ఈ విషయం చెప్పు, మీరు
ఉపవాసాలు చేసి మీ సంతాపాన్ని ఐదవ నెలలోను,
ఏడవ నెలలోను ప్రకటించారు. నిజానికి ఆ ఉపవాసం
నా కొరకేనా? కాదు! 6మరియు మీరు తినటం, తాగటం
కూడ నా కొరకేనా? కాదు! అది మీ మంచి కొరకు
మాత్రమే. 7దేవుడు ఏనాడో ఈ విషయాలు చెప్ప
టానికి ఆనాటి ప్రవక్తలను వినియోగించాడు. యెరూష
లేము జనంతో నిండి ఐశ్వర్యంతో తులతూగేనాడే
ఆయన ఈ విషయాలు చెప్పాడు. యెరూషలేము
చుట్టూ వున్న పట్టణాలలో, దక్షిణ పల్లపు ప్రాంతంలో,
పడమటి కొండవాలులలో ప్రజలు నివసిస్తున్న రోజు
లలోనే దేవుడు ఈ విషయాలు చెప్పాడు.”

8 యెహోవా నుండి జెకర్యాకు వచ్చిన వర్తమానం
ఇది:

9 సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు. “ఏది ధర్మమో, ఏది న్యాయమో మీరది
చేయాలి. మీ అందరూ ఒకరికొకరు దయ,
కరుణ కలిగి ఉండాలి.
10 విధవ స్త్రీలను, అనాథ పిల్లలను, కొత్తవారిని,
పేదవారిని బాధించవద్దు. కనీసం ఒకరికొకరు కీడు
చేసుకోవాలనే ఆలోచన కూడా మీరు రానీయ
కండి!”
11 కాని ఆ ప్రజలు ఇది వినటానికి నిరాకరించారు.
ఆయన కోరింది చేయటానికి వారు నిరాక
రించారు. దేవుడు చెప్పింది వినకుండా వుండే
టందుకు వారు తమ చెవులు మూసుకున్నారు.
12 వారు చాలా మొండి వైఖరి దాల్చారు. వారు
న్యాయాన్ని పాటించరు. ఆత్మ ప్రేరణతో సర్వ
శక్తిమంతుడైన యెహోవా తన ప్రజలకు
ప్రవక్తల ద్వారా వర్తమానాలు పంపాడు. కాని
ప్రజలు వాటిని వినరాయెను. అందువల్ల సర్వశక్తి
మంతుడైన యెహోవా మిక్కిలి కోపగించాడు.
13 కావున సర్వశక్తిమంతుడైన యెహోవా
చెప్పాడు, “నేను వారిని పిలిచాను, కాని వారు
పలకలేదు. అందువల్ల ఇప్పుడు వారు పిలిస్తే
నేను పలకను.
14 ఇతర దేశాలను వారి మీదికి ఒక తుఫానులా
తీసుకువస్తాను. వారెవరో వీరికి తెలియదు; కాని
వారు దేశంలో తిరిగాక అది నాశనమై పోతుంది.
రమ్యమైన ఈ దేశం నాశనమై పోతుంది.”

### యెరూషలేమును ఆశీర్వదించటానికి యెహోవా మాట యిచ్చుట

8 సర్వశక్తిమంతుడైన యెహోవా నుండి వచ్చిన
ఒక వర్తమానం ఇది.
2సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
“నేను సీయోనును నిజంగా ప్రేమిస్తున్నాను. నేనామెను
ఎంతగా ప్రేమిస్తున్నానంటే, ఆమె నాపట్ల విశ్వాసం
లేకుండా ప్రవర్తించినప్పుడు నాకు కోపం వచ్చింది.”
3యెహోవా చెపుతున్నాడు, “నేను సీయోనుకు తిరిగి
వచ్చాను. నేను యెరూషలేములో నివసిస్తున్నాను.
యెరూషలేము విశ్వాసంగల నగరం అని పిలవబడు
తుంది. నా పర్వతం పవిత్ర పర్వతం అని పిలవబడు
తుంది.”

4సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
“వృద్ధులైన స్త్రీ పురుషులు మళ్లీ యెరూషలేము బహి
రంగ ప్రదేశాలలో కనబడతారు. ప్రజలు నడవటానికి
చేతి కర్రలు కావలసివచ్చే వయసువరకు నివసిస్తారు.
5వీధుల్లో ఆడుకునే పిల్లలతో నగరం నిండిపోతుంది.
6చావగా మిగిలిన వారు ఇదంతా అద్భుతం అను
కుంటారు. నేనూ ఇది అద్భుతం అనుకుంటాను!”

7సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
“చూడు, తూర్పు, పడమటి దేశాలలో ఉన్న నా
ప్రజలను నేను రక్షిస్తున్నాను. 8వారిని ఇక్కడికి తిరిగి
తీసుకు వస్తాను. వారు యెరూషలేములో నివసిస్తారు.
వారు నా ప్రజగా వుంటారు. నేను వారికి మెచ్చదగిన,
విశ్వసనీయమైన దేవునిగా వుంటాను.”
9సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
“ధైర్యంగా ఉండండి! సర్వశక్తిమంతుడైన యెహోవా
ముందుగా తన ఆలయాన్ని నిర్మించటానికి పునాదులు
వేసినప్పుడు ప్రవక్తలు ఇచ్చిన సందేశాన్నే ప్రజలైన
మీరు ఈనాడు వింటున్నారు. 10అంతకు ముందు,
పనివారిని పెట్టటానికి, జంతువులను బాడుగకు తీసు
కోటానికి మనుష్యుల వద్ద డబ్బు లేదు. పైగా మను
ష్యులు రావటానికి పోవటానికి కూడ క్షేమకరం కాని
సమయం. బాధలన్నిటి నుండి ఉపశమనం లేదు. నేను
ప్రతివాడిని తన పొరుగు వానిపై తిరుగబడేలా చేశాను.
11కాని ఇప్పుడు పూర్వం మాదిరిగా లేదు. బతికివున్న
వారికి ఇక అలా జరుగదు.” సర్వశక్తిమంతుడైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
12“ఈ ప్రజలు శాంతియుత వాతావరణంలో
మొక్కలు నాటుతారు. వారి ద్రాక్షాతోటలు కాయలు
కాస్తాయి. భూమి విస్తారంగా పంటనిస్తుంది. ఆకాశం
వర్షిస్తుంది. వీటన్నిటినీ నా ప్రజలైన వీరికి ఇస్తాను.
13ప్రజలు తమ శాపాలతో ఇశ్రాయేలును, యూదాను
వాడటం మొదలు పెట్టారు. కాని ఇశ్రాయేలును,
యూదాను నేను రక్షిస్తాను. ఆ పేర్లు ఒక దీవెనగా
మారుతాయి. కావున భయపడవద్దు. ధైర్యంగా
ఉండండి! ”
14సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
“మీ పూర్వీకులు నాకు కోపం కలిగించారు. అందువల్ల
వారిని నేను నాశనం చేయ సంకల్పించాను. నా మనస్సు
మార్చుకోకూడదని నేను నిర్ణయించుకున్నాను.”
సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు. 15“కాని ఇప్పుడు నా మనస్సు మార్చు
కున్నాను. అదేమాదిరి నేను యెరూషలేము పట్ల,
యూదా ప్రజల పట్ల మంచిగా వుండటానికి నిర్ణయించు
కున్నాను. కావున భయపడవద్దు! 16అయితే మీరు
మాత్రం ఇవి తప్పక చేయండి: మీ పొరుగు వారికి
నిజం చెప్పండి. మీరు మీ నగరాలలో నిర్ణయాలు
తీసుకున్నప్పుడు మీరు సరిగా ప్రవర్తించండి. ధర్మమైన
శాంతికి దోహదపడే పనులు చేయండి. 17మీ పొరుగు
వారిని బాధించడానికి మీరు రహస్య పథకాలు వేయ
కండి! బూటకపు వాగ్దానాలు చేయకండి! అటువంటి
పనులు చేయటం పట్ల ఆసక్తి కన్పరచకండి. ఎందు
కంటే, వాటిని నేను అసహ్యించుకుంటాను!”
యెహోవా ఈ విషయాలు చెప్పాడు. 18నేనీ వర్త
మానం సర్వశక్తిమంతుడైన యెహోవా నుండి అందు
కున్నాను. 19సర్వశక్తిమంతుడైన యెహోవా చెపు
తున్నాడు, “మీరు ప్రత్యేక సంతాప దినాలు, ఉపవాస
దినాలు నాల్గవ నెలలోను, ఐదవ నెలలోను, ఏడవ
నెలలోను, పదవ నెలలోను కలిగి ఉన్నారు. ఆ సంతాప
దినాలు సంతోష దినాలుగా తప్పక మార్చబడాలి.
అవి యోగ్యమైన, సంతోష దాయకమైన విశ్రాంతి
దినాలవుతాయి. కావున మీరు సత్యాన్ని, శాంతిని
ప్రేమించండి!”

20 సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతు
న్నాడు, “భవిష్యత్తులో అనేక నగరాల నుండి
ప్రజలు యెరూషలేముకు వస్తారు.
21 ఒక నగరం నుండి వచ్చిన ప్రజలు, వారు
కలిసిన మరొక నగరవాసులతో ఇలా
అంటారు, వేరేవాళ్లు మేము మీతో వస్తాము
అని అంటారు. ‘సర్వశక్తిమంతుడైన
యెహోవాను ఆరాధించటానికి మేము వెళ్తు
న్నాము. మాతో రండి!’”

22అనేక బలమైన రాజ్యాల నుండి అనేక మంది
ప్రజలు సర్వశక్తిమంతుడైన యెహోవాను వెదు
క్కుంటూ యెరూషలేముకు వస్తారు. ఆయనను ఆరా
ధించటానికి వారు అక్కడికి వస్తారు. 23సర్వశక్తి
మంతుడైన యెహోవా చెపుతున్నాడు, “ఆ సమ
యంలో వివిధ భాషలు మాట్లాడేవారు ఒక యూదా
మనిషి వద్దకు వచ్చి, ‘దేవుడు నీతో ఉన్నాడని మేము
విన్నాము. ఆయనను ఆరాధించటానికి మేము నీతో
రావచ్చునా?’ అని అడుగుతారు.”

## ఇతర దేశాలకు వ్యతిరేకంగా తీర్పు

9 ఒక విషాద వర్తమానం. ఇది హద్రాకు యొక్క
దేశాన్ని గురించి, అతని రాజధాని నగరమైన దమ
స్కును గురించిన యెహోవా వర్తమానం. “దేవుడిని
తెలుసుకున్న వారు కేవలం ఇశ్రాయేలు వంశాల వారు
మాత్రమే కాదు. ప్రతి ఒక్కడూ సహాయంకొరకు
ఆయనను ఆశ్రయించవచ్చు. 2హద్రాకు యొక్క దేశ
సరిహద్దుల్లో హమాతు ఉంది. అలాగే తూరు, సీదోనులు
కూడా ఉన్నాయి. (ఆ ప్రజలు చాలా తెలివిగల వారు)
3తూరు ఒక కోటలా కట్టబడింది. ఆ ప్రజలు వెండిని
దుమ్ము వలె విస్తారంగా సేకరించారు. బంగారం వారికి
బంకమట్టివలె సామాన్యమై పోయింది. 4కాని మా
ప్రభువైన యెహోవా దానినంతా తీసుకుంటాడు. ఆ
నగరపు శక్తివంతమైన నౌకాబలాన్ని ఆయన నాశనం
చేస్తాడు. ఆ నగరం అగ్నివల్ల నాశనం కాబడుతుంది!
5“అష్కెలోను ప్రజలు వాటిని చూసి భయపడ
తారు. గాజా ప్రజలు భయంతో వణకుతారు. ఇవన్నీ
జరగటం చూచినప్పుడు ఎక్రోను ప్రజలకు ఆశలుడు

గుతాయి. గాజాలో రాజంటూ ఎవ్వడూ మిగలడు.
అష్కెలోనులో ఇక ఎంత మాత్రం ఎవ్వరూ నివ
సించరు. [6]అష్డోదులో ప్రజలు వారి నిజమైన తండ్రులు
ఎవరో కూడ తెలుసుకోలేరు. గర్విష్ఠులైన ఫిలిష్తీయు
లను సర్వనాశనం చేస్తాను. [7]రక్తం కలిసివున్న మాంసా
న్నిగాని, నిషేధించబడిన ఏ ఇతర ఆహార పదార్థాన్ని
గాని వారిక తినరు. జీవించివున్న ఫిలిష్తీయుడెవడైనా
వుంటే అతడు నా ప్రజల్లో భాగంగా ఉంటాడు.
యూదాలో వారు మరొక వంశంగా ఉంటారు. యెబూ
సీయులవలె ఎక్రోను ప్రజలు నా ప్రజల్లో ఒక భాగము
వుతారు. నేను నా దేశాన్ని రక్షిస్తాను. [8]శత్రుసైన్యాలను
దానిగుండా వెళ్లనీయను. ఇక ఎంత మాత్రం వారిని
నా ప్రజలను బాధించనీయను. గతంలో నా ప్రజలు
ఎంత బాధపడ్డారో నేను స్వయంగా చూశాను."

### రాబోయే రాజు

9 సీయోనూ, నీవు సంతోషంగా వుండు! యెరూష
లేము ప్రజలారా, ఆనందంతో కేకలు పెట్టండి!
చూడండి, మీరాజు మీ వద్దకు వస్తున్నాడు!
ఆయన విజయం సాధించిన మంచి రాజు. కాని
ఆయన వినయం గలవాడు. ఆయన ఒక గాడి
దపై స్వారీ చేస్తున్నాడు. ఒక గాడిద పిల్లపై
వస్తున్నాడు.
10 రాజు చెపుతున్నాడు, "నేను ఎఫ్రాయిములో
రథాలూ, యెరూషలేములో గుర్రపు రౌతులను
నాశనం చేశాను. యుద్ధంలో వాడిన విల్లంబులను
నాశనం చేశాను." శాంతిని గూర్చిన వార్తను అన్య
దేశాలు విన్నాయి. ఆ రాజు సముద్రంనుండి
సముద్రంవరకు పరిపాలిస్తాడు. ఆయన నది
నుండి భూమిపై సుదూర ప్రాంతాలవరకు
పాలిస్తాడు.

### యెహోవా తన ప్రజలను రక్షించటం

11 యెరూషలేమూ, మన ఒడంబడిక రక్తంతో
స్థిరపర్చబడింది. కావున నీ బందీలను నేను
విడుదల చేశాను. నీ ప్రజలు ఇక ఎంతమాత్రం
ఆ ఖాళీ చెరసాలలో ఉండరు.
12 చెరపట్టబడిన ప్రజలారా, ఇంటికి వెళ్ళండి. మీకు
ఇంకా ఆశపడదగింది ఉంది. నేను మీవద్దకు తిరిగి
వస్తున్నానని నేను మీకు చెపుతున్నాను!
13 యూదా, నిన్ను నేను ఒక విల్లులా విని
యోగిస్తాను. ఎఫ్రాయిమూ నిన్ను నేను బాణాల్లా
వినియోగిస్తాను. ఇశ్రాయేలూ, గ్రీసుతో యుద్ధం
చేయటానికి నిన్ను ఒక బలమైన కత్తిలా ఉప
యోగిస్తాను.
14 యెహోవా వారికి కన్పిస్తాడు. ఆయన తన బాణా
లను మెరుపుల్లా వదులుతాడు. నా ప్రభువైన
యెహోవా బాకా ఊదుతాడు. అప్పుడు సైన్యం
ఎడారిలో ఇసుక తుఫానులా ముందుకు
చొచ్చుకు పోతుంది.
15 సర్వశక్తిమంతుడైన యెహోవా వారిని రక్షిస్తాడు.
శత్రువును ఓడించటానికి సైనికులు బండ
రాళ్లను, వడిసెలలను ఉపయోగిస్తారు. వారి శత్రు
వుల రక్తాన్ని వారు చిందిస్తారు. అది ద్రాక్షా
మద్యంలా పారుతుంది. అది బలిపీఠం మూలలపై
పోసిన రక్తంలా వుంటుంది!
16 ఒక కాపరి తన గొర్రెలను కాపాడినట్లు, దేవుడైన
యెహోవా తన ప్రజలను ఆ సమయంలో
కాపాడతాడు. వారాయనకు చాలా విలువైన
వారు. తన భూమిపై వారు మెరిసే రత్నాల
వంటివారు.
17 ప్రతీదీ మెచ్చదగినదై, అందంగా వుంటుంది!
విచిత్రమైన పంట పండుతుంది. కాని అది కేవలం
ధాన్యం, ద్రాక్షారసం కాదు. ఆ పంట యువతీ
యువకులే!

### యెహోవా వాగ్దానాలు

10 వసంత ఋతువులో వర్షం కొరకు యెహో
వాను ప్రార్థించండి. యెహోవా మెరుపులను
కలుగజేస్తాడు. వర్షం కురుస్తుంది. ప్రతి వాని పొలం
లోనూ దేవుడు పైరులు పెరిగేలా చేస్తాడు.
[2]భవిష్యత్తులో ఏమి జరుగుతుందో తెలుసు కోవ
టానికి ప్రజలు తమ చిన్న విగ్రహాలను, మంత్రతంత్రా
లను ఉపయోగిస్తారు. కాని అది నిరుపయోగం. ఆ
జనులు దర్శనాలు చూసి, తమ కలలను వివరిస్తారు.
కాని అవన్నీ పనికిరాని అబద్ధాలు. అందువల్ల ప్రజలు
సహాయంకొరకు గొర్రెల్లా అరుస్తూ ఇక్కడా, అక్కడా
తిరుగుతారు. కాని వారిని నడిపించటానికి కాపరిలేడు.
[3]యెహోవా చెపుతున్నాడు: "కాపరుల (నాయ
కుల) పట్ల నేను చాలా కోపంగా వున్నాను. నా గొర్రె
లకు (ప్రజలకు) జరిగిన దానికి నేను ఆ నాయకులను
బాధ్యులుగా చేశాను." (యూదా ప్రజలు దేవుని యొక్క
గొర్రెల మంద. సర్వశక్తిమంతుడైన యెహోవా తన
మంద విషయంలో జాగ్రత్త తీసుకుంటాడు. ఒక సైని
కుడు తన అందమైన యుద్ధగుర్రం విషయంలో శ్రద్ధ
చూపినట్లు, ఆయన వారి పట్ల జాగ్రత్త తీసు
కుంటాడు.)
[4]"పునాదిరాయి, గుడారపు గుంజ, యుద్ధ విల్లు,
ముందుకు చొచ్చుకువచ్చే సైన్యం అన్నీ యూదా
నుండి కలిసి వస్తాయి. [5]వారు తమ శత్రువును ఓడిస్తారు.
అది సైనికులు బురద వీధుల గుండా నడిచినట్లు
ఉంటుంది. వారు పోరాడతారు. యెహోవా వారితో
వున్న కారణంగా వారు శత్రువుకు చెందిన గుర్రపు
దళాలను కూడ ఓడిస్తారు. [6]యూదా వంశాన్ని నేను

బలపర్చుతాను. యోసేపు వంశాన్ని యుద్ధంలో గెలిచేలా చేస్తాను. వారిని సురక్షితంగా, ఆరోగ్యంగా తిరిగి తీసుకు వస్తాను. వారిని ఓదార్చుతాను. అది నేను వారిని ఎప్పుడూ విడిచి పెట్టనట్లుగా ఉంటుంది. నేను వారి దేవుడైన యెహోవాను. నేను వారికి సహాయం చేస్తాను. [7]ఎఫ్రాయిము ప్రజలు తాగటానికి పుష్కలంగా దొరికిన సైనికులవలె సంతోషంగా ఉంటారు. వారి పిల్లలు ఉల్లాసంగా ఉంటారు. వారు కూడ హాయిగా వుంటారు. వారంతా యెహోవాతో కలిసి ఉండే ఆనందమయ సమయాన్ని కలిగి ఉంటారు.

[8]"నేను వారికొరకు ఈల వేసి, వారందరినీ ఒక్క చోటికి పిలుస్తాను. నేను వారిని నిజంగా రక్షిస్తాను. వారి సంఖ్య విస్తారంగా ఉంటుంది. [9]అవును, నా ప్రజలను అనేక దేశాలకు చెదరగొడుతూ వచ్చాను. కాని ఆ దూర దేశాలలో వారు నన్ను జ్ఞాపకం చేసుకుంటారు. వారు, వారిపిల్లలు బతుకుతారు. పైగా వారు తిరిగి వస్తారు. [10]నేను వారిని ఈజిప్టు (ఐగుప్తు) నుంచి, అష్షూరు నుంచి వెనుకకు తీసుకు వస్తాను. వారిని గిలాదు ప్రాంతానికి తిరిగి తీసుకువస్తాను. అక్కడ వారికి సరిపోయే స్థలం వుండదు గనుక, వారిని దగ్గరలోనే వున్న లెబానోనులో నివసించనిస్తాను."

[11]దేవుడు వారిని ఈజిప్టు (ఐగుప్తు) నుండి బయటకు తీసికొని వచ్చినప్పుడు ఉన్నట్లుగా ఇప్పుడు పరిస్థితి ఉంటుంది. ఆయన సముద్రపు అలలను కొట్టగా, సముద్రం రెండు పాయలు అయ్యింది. ప్రజలు ఆ కష్టాల సముద్రం మధ్య నుండి నడిచి వచ్చారు. యెహోవా నదీ ప్రవాహాలను ఇంకిపోయేలా చేస్తాడు. అష్షూరు గర్వాన్ని, ఈజిప్టు (ఐగుప్తు) అధికారాన్ని ఆయన నాశనం చేస్తాడు. [12]యెహోవా తన ప్రజలు బలపడేలా చేస్తాడు. వారు ఆయన ధ్యానంలో, ఆయన నామస్మరణ చేస్తూ జీవిస్తారు. యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

### యూదా చుట్టు పట్ల వున్న దేశాలను దేవుడు శిక్షించటం

11 లెబానోనూ, అగ్ని ప్రవేశించి నీ దేవదారు వృక్షాలను* కాల్చివేసేలాగు నీ ద్వారాలను
తెరువు.
2 దేవదారు వృక్షాలు పడిపోయినందుకు సరళ
వృక్షాలు విచారిస్తాయి. బలమైన ఆ చెట్లు
దూరంగా తీసుకుపోబడ్డాయి. బాషానులోని
సింధూర వృక్షాలు నరికి వేయబడిన అడవికొరకు
దుఃఖిస్తాయి.
3 విలపించే కాపరులను వినండి. శక్తివంతులైన వారి
నాయకులు పట్టుబడ్డారు. యువకిశోరాల గర్జన
వినండి. యొర్దాను నది వద్ద గల వాటి చిక్కటి
పొదలన్నీ తీసుకుపోబడ్డాయి.

[4]దేవుడైన యెహోవా చెపుతున్నాడు, "చంపటానికి పెంచబడ్డ గొర్రెల విషయం జాగ్రత్త తీసుకో. [5]వాటి నాయకులు యజమానులవలెను, వ్యాపారులవలెను ఉన్నారు. యజమానులు వారి గొర్రెలను చంపుతారు. అయినా వారు శిక్షింపబడరు. వ్యాపారులు గొర్రెలను అమ్మి 'దేవునికి జయం, నేను భాగ్యవంతుడనయ్యాను' అని అంటారు. కాపరులు తమ గొర్రెల కొరకు విచారించరు. [6]ఈ దేశంలో నివసించే ప్రజల కొరకు నేను విచారించను." యెహోవా ఈ విషయాలు చెప్పాడు: "చూడండి, నేను ప్రతివాడినీ తన పొరుగువానిచేత, రాజుచేత దూషింపబడేటట్లు చేస్తాను. వారి దేశాన్ని నాశనం చేసేలాగు నేను వారిని వదులుతాను. నేను వారిని ఆపను!"

[7]కావున చంపబడటానికి పెంచబడిన ఆ అభాగ్యపు గొర్రెల పట్ల నేను శ్రద్ధ తీసుకున్నాను. నాకు రెండు కర్రలు దొరికాయి. ఒక కర్రను 'అభిమానం' అని, మరొక కర్రను 'సమైక్యత' అని పిలిచాను. తరువాత నేను గొర్రెల పట్ల శ్రద్ధ తీసుకోవటం మొదలు పెట్టాను. [8]ముగ్గురు కాపరులను ఒక్క నెలలో సంహరించాను. నేను గొర్రెలపట్ల కోపించగా, వారు నన్ను ద్వేషించటం మొదలు పెట్టారు. [9]అప్పుడు నేను ఇలా అన్నాను: "నేను వదిలి వేస్తాను! నేను మిమ్మల్ని గురించి శ్రద్ధ తీసుకోను! చావు కోరేవారిని నేను చనిపోనిస్తాను. నాశనమై పోవాలని కోరుకొనేవారిని నేను నాశనం కానిస్తాను. ఇంకా మిగిలినవారు ఒకరినొకరు నాశనం చేసుకుంటారు." [10]తరువాత 'అభిమానం' అనే కర్రను నేను తీసుకొని విరుగగొట్టాను. తన ప్రజలతో గల దేవుని ఒడంబడిక రద్దయినట్లు చూపటానికే నేనిది చేశాను. [11]కావున ఆ రోజున నిబంధన రద్దయింది. నన్ను గమనిస్తున్న ఆ నిర్భాగ్యపు గొర్రెలకు ఈ వర్తమానం యెహోవా నుండి వచ్చినదని తెలుసు.

[12]అప్పుడు నేనిలా అన్నాను: "మీరు నాకు వేతనం ఇవ్వదలిస్తే ఇవ్వండి. వద్దనుకుంటే మానండి!" వారప్పుడు ముప్పై వెండి నాణెములిచ్చారు. [13]తరువాత యెహోవా నాతో ఇలా అన్నాడు: "అంటే నా విలువ అంత మాత్రమేనని వారనుకుంటున్నారన్న మాట. ఆ మహా ధనాన్ని* ఆలయ ఖజానాలో పడవేయి." కావున ఆ ముప్పై వెండి నాణాలను తీసుకొని యెహోవా ఆలయంలోని ఖజానాలో పడవేశాను.

---

**దేవదారు వృక్షాలు** ఈ గేయంలో చెట్లు, పొదలు, జంతువులు యూదా చుట్టూ వున్న దేశాల నాయకులకు చిహ్నాలు.

**మహా ధనం** ఆ డబ్బు కేవలం ఒక బానిసకు ఇచ్చేటంత టిది మాత్రమే.

14పిమ్మట 'సమైక్యత' అనే కర్రను తీసుకొని రెండుగా
నరికాను. యూదా, ఇశ్రాయేలుల మధ్యగల ఐక్యతకు
భంగం వాటిల్లిందని చూపటానికి నేనిది చేశాను.

15పిమ్మట యెహోవా నాతో ఇలా చెప్పాడు:
"ఇప్పుడు గొర్రెలను కాయటానికి అసలు పనికిరాని
ఒక కర్రను చూడు. 16ఈ దేశానికి ఒక కొత్త కాపరిని
నేను తెస్తానని ఇది చూపుతుంది. కాని ఈ యువకుడు
నాశనం కాబడుతున్న గొర్రెలపట్ల జాగ్రత్త తీసుకోలేడు.
గాయపడిన గొర్రెలను అతడు బాగు చేయలేడు. బతి
కివున్న వాటికి అతడు గ్రాసం* ఇవ్వలేడు. ఆరోగ్యంగా
వున్నవి పూర్తిగా తినబడతాయి. కేవలం వాటి గిట్టలు
మాత్రం వదిలి వేయబడతాయి."

17 పనికిమాలిన ఓ నా కాపరీ, నీవు నా గొర్రెలను
వదిలివేశావు. అతనిని శిక్షించు! అతని కుడి
చేతిని, కుడి కంటిని కత్తితో కొట్టు. అతని
కుడిచేయి నిరుపయోగమవుతుంది. అతని
కుడి కన్ను గ్రుడ్డిదవుతుంది.

## యూదా చుట్టు పట్లనున్న దేశాల గురించిన దర్శనాలు

12 ఇశ్రాయేలును గురించి యెహోవా నుండి
వచ్చిన విషాద వార్త. యెహోవా ఆకాశాన్ని,
భూమిని సృష్టించాడు. ఆయన మానవుని ఆత్మను
అతనిలో పొందుపర్చాడు. యెహోవా ఈ విషయాలు
చెప్పాడు: 2"చూడండి, నేను యెరూషలేమును దాని
చుట్టూ ఉన్న దేశాలకు ఒక విషపు గిన్నెలా చేస్తాను.
దేశాలు వచ్చి ఆ నగరంపై దాడి చేస్తాయి. యూదా
అంతా బోనులో చిక్కుతుంది. 3కాని నేను యెరూష
లేమును ఒక బరువైన బండలా చేస్తాను. దానిని తీసు
కోడానికి ఎవరైనా ప్రయత్నిస్తే అది అతనినే
గాయపర్చుతుంది. ఆ ప్రజలు నిజంగా నరక బడతారు,
గీకబడతారు. కాని భూమిపై గల దేశాలన్నీ కలిసి
యెరూషలేము మీద యుద్ధానికి వస్తాయి.

4కాని ఆ సమయంలో నేను గుర్రాన్ని బెదర
గొడతాను. దాని మీద స్వారీ చేసే సైనికునికి భయం
పుట్టిస్తాను. శత్రు గుర్రాలన్నీ గుడ్డివై పోయేలా చేస్తాను.
కాని నాకండ్లు తెరవబడి ఉంటాయి. నేను యూదా
వంశాన్ని కనిపెడుతూ ఉంటాను. 5యూదా వంశ నాయ
కులు ప్రజలను ప్రోత్సహిస్తారు. వారు, 'సర్వశక్తిమంతు
డైన యెహోవా మీ దేవుడు, ఆయన మనల్ని బల
వంతులుగా చేస్తాడు' అని అంటారు. 6ఆ సమయంలో
యూదా నాయకులను అరణ్యంలో చెలరేగిన అగ్నిలా
నేను చేస్తాను. అగ్ని ఎండు గడ్డిని దగ్ధం చేసినట్లు,
వారు తమ శత్రువులను నాశనం చేస్తారు. చుట్టూ
వున్న వారి శత్రువులను వారు నాశనం చేస్తారు.
యెరూషలేము ప్రజలు మళ్లీ తీరిక కూర్చుని విశ్రాంతి
తీసుకుంటారు."

7యెరూషలేము ప్రజలు మిక్కిలి గొప్పలు చెప్పు
కోకుండా చేయటానికి, యెహోవా యూదా ప్రజలను
ముందుగా రక్షిస్తాడు. యూదాలో వున్న ప్రజలకంటె
తాము గొప్పవారమని దావీదు వంశం వారు, యెరూష
లేములో వుంటున్న ఇతర ప్రజలు గొప్పలు చెప్పు
కోలేరు. 8కాని యెరూషలేము ప్రజలను యెహోవా
రక్షిస్తాడు. ఏమీ చేతగానివాడు సహితం దావీదులా గొప్ప
సైనికుడవుతాడు. దావీదు వంశంలోని మనుష్యులు
దేవుళ్లవలె వుంటారు. ప్రజలను నడిపించే యెహోవా
దూతలా వుంటారు.

9యెహోవా చెపుతున్నాడు: "ఆ సమయంలో
యెరూషలేముపై యుద్ధానికి వచ్చిన దేశాలను నేను
నాశనం చేస్తాను. 10దావీదు వంశాన్ని, యెరూషలే
ములో నివసిస్తున్న ప్రజలను దయాదాక్షిణ్య స్వభా
వంతో నింపివేస్తాను. వారు నన్ను పొడిచారు. అలాంటి
నా సహాయం కొరకే వారు ఎదురు చూస్తారు. వారు
చాలా విచారిస్తారు. తన ఏకైక కుమారుడు చనిపోయిన
వాడు విలపించేలా, తన మొదటి కుమారుడు చని
పోయినవాడు విలపించేలా వారు దుఃఖిస్తారు. 11యెరూ
షలేములో గొప్ప దుఃఖ సమయం ఉంటుంది. అది
మెగిద్దోను లోయలో హదద్రిమ్మోను మరణంపట్ల
ప్రజల దుఃఖంలా వుంటుంది. 12ప్రతి ఒక్క కుటుంబం
విడిగా దుఃఖిస్తుంది. దావీదు కుటుంబంలోని పురుషులు
విడిగా దుఃఖిస్తారు. వారి భార్యలు విడిగా వారికి వారే
దుఃఖిస్తారు. నాతాను కుటుంబంలోని పురుషులు
ప్రత్యేకంగా విలపిస్తారు. వారి భార్యలు విడిగా దుఃఖిస్తారు.
13లేవి కుటుంబంలోని పురుషులు విడిగా విచారిస్తారు.
వారి భార్యలు ప్రత్యేకంగా విలపిస్తారు. షిమ్యోను (షిమీ)
కుటుంబంలోని పురుషులు విడిగా విలపిస్తారు. వారి
భార్యలు ప్రత్యేకంగా విలపిస్తారు. 14ఇదే మాదిరి అన్ని
వంశాలలోనూ జరుగుతుంది. పురుషులు, స్త్రీలు విడి
విడిగా దుఃఖిస్తారు."

13 కాని ఆ సమయంలో దావీదు కుటుంబానికి,
యెరూషలేములో నివసిస్తున్న ప్రజలకొరకు
ఒక నీటి జల తీయబడుతుంది. ఆ జలం వారి పాపాలను
కడిగి, వారిని పవిత్రులుగా చేయటానికి ఉద్దేశించబడు
తుంది.

## బూటకపు ప్రవక్తలు ఇక వుండరు

2సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు,
"ఆ సమయంలో విగ్రహాలన్నిటినీ భూమిపై నుండి
తొలగిస్తాను. ప్రజలు కనీసం వాటి పేర్లయినా గుర్తు
పెట్టుకోలేరు. ఈ భూమిపై నుండి బూటకపు ప్రవక్త
లను, మురికి దయ్యాలను నేను తొలగిస్తాను. 3ఎవ్వ
రైనా భవిష్య ప్రకటనలు చేస్తే అట్టి వ్యక్తి శిక్షింపబడ

---

గ్రాసం గడ్డి.

తాడు. అతని తల్లిదండ్రులు సహితం అతనితో,
'యెహోవా పేరుమీద నీవు అబద్ధాలు చెప్పావు. కావున
నీవు తప్పక చనిపోవాలి!' అని అంటారు. అతని స్వంత
తల్లిదండ్రులు అతడు భవిష్య ప్రకటనలు చేసినందుకు
కత్తితో పొడుస్తారు. 4అప్పుడు ప్రవక్తలు తమ దర్శనాల
పట్ల, తమ ప్రకటనలపట్ల సిగ్గు చెందుతారు. తాము
ప్రవక్తలమని తెలియజేసే ముతక బట్టను వారు
ధరించరు. భవిష్య ప్రకటనల పేరుతో అబద్ధాలు చెప్పి
ప్రజలను మోసగించటానికి వారు ఆ బట్టలు ధరించరు.
5ఆ జనులు ఇలా అంటారు: 'నేను ప్రవక్తను కాను.
నేనొక వ్యవసాయదారుడను. నా చిన్నతనం నుండి
నేను వ్యవసాయదారునిగానే పని చేశాను.' 6'అయితే
నీ చేతులమీద ఈ గాయాలు ఏమిటి?' అని ఇతరులు
అడుగుతారు. అందుకతడు, 'నా స్నేహితుల ఇంటిలో
నాకు దెబ్బలు తగిలాయి' అని అంటాడు."

7సర్వశక్తిమంతుడైన యెహోవా చెపుతున్నాడు:
"ఖడ్గమా, గొర్రెల కాపరిని నరుకు! నా స్నేహితుని
నరుకు! కాపరిని నరుకు! గొర్రెలన్నీ పారిపోతాయి.
నేను ఆ చిన్న వాటిని శిక్షిస్తాను. 8దేశ జనాభాలో
మూడింట రెండు వంతులు బాధింపబడగా చని
పోతారు. మూడింట ఒకవంతు బతుకుతారు. 9చని
పోగా మిగిలిన వారిని నేను పరీక్షిస్తాను. వారికి నేను
ఎన్నో కష్టాలు కలుగ జేస్తాను. వెండిని శుద్ధి చేయటానికి
కాల్చబడే అగ్నిలా ఆ కష్టాలు వుంటాయి. ఒకడు
బంగారాన్ని పరీక్ష చేసినట్లు నేను వారిని పరీక్ష చేస్తాను.
అప్పుడు సహాయం కొరకు వారు నన్ను పిలుస్తారు.
నేను వారికి సమాధానమిస్తాను. 'మీరు నా ప్రజలు'
అని నేను అంటాను. అప్పుడు వారు ఇలా అంటారు:
'యెహోవా మా దేవుడు.'"

### తీర్పు రోజు

14 చూడండి. తీర్పుతీర్చటానికి యెహోవాకు
ఒక రోజు ఉంది. మీరు తీసుకున్న ధనం మీ
నగరంలో విభజించబడుతుండి. 2యెరూషలేము మీదికి
దేశాలన్నిటినీ నేను రప్పిస్తాను. వారు నగరాన్ని పట్టు
కొని ఇండ్లన్నీ నాశనం చేస్తారు. స్త్రీలు మానభంగం
చేయబడతారు. జనాభాలో సగం మంది బందీలుగా
పట్టుకుపోబడతారు. కాని మిగిలిన ప్రజలు నగరం
నుండి తీసుకుపోబడరు. 3అప్పుడు యెహోవా ఆయా
దేశాలపైకి యుద్ధానికి వెళతాడు. అది నిజమైన యుద్ధం
అవుతుంది. 4ఆ సమయంలో ఆయన యెరూష
లేముకు తూర్పున వున్న ఒలీవల కొండమీద
నిలబడతాడు. ఒలీవల కొండ రెండుగా చీలి పోతుంది.
ఆ కొండలో ఒక భాగం ఉత్తరానికి, మరొక భాగం
దక్షిణానికి తిరుగుతాయి. తూర్పు నుండి పడమటికి
ఒక లోతైన లోయ ఏర్పడుతుంది. 5ఆ పర్వతలోయ
మీకు మరీ సన్నిహితంగా రావటంతో మీరు పారిపోవ
టానికి ప్రయత్నిస్తారు. యూదా రాజైన ఉజ్జియా
కాలంలో భూకంపం వచ్చినప్పుడు మీరు పారిపోయిన
రీతిగా మీరిప్పుడు పారిపోతారు. కాని నా దేవుడైన
యెహోవా వస్తాడు. ఆయన యొక్క పవిత్ర జను
లందరూ ఆయనతో ఉంటారు.

6-7అది ఒక ప్రత్యేకమైన రోజు. ఆ రోజున వెలుతు
రుగాని, చలిగాని, మంచుగాని వుండదు. అప్పుడు
పగలూ వుండదు, రాత్రీ వుండదు. అది ఎట్లాగో
యెహోవా ఒక్కనికే తెలుసు. అప్పుడు మామూలుగా
చీకటి పడేటప్పుడు ఇంకా కొంత వెలుతురు
ఉంటుంది. 8ఆ సమయంలో యెరూషలేము నుండి
నీరు ఎడతెరిపి లేకుండా ప్రవహిస్తుంది. ఆ ప్రవాహం
రెండు పాయలై ఒకటి తూర్పుగా పారుతుంది. రెండ
వది పడమటిగా మధ్యధరా సముద్రం వైపు ప్రవహి
స్తుంది. అది సంవత్సరం పొడవునా వేసవిలోను, శీతా
కాలంలోను ప్రవహిస్తుంది. 9ఆ సమయంలో
యెహోవా ప్రపంచానికంతటికి రాజుగా వుంటాడు.
యెహోవా ఒక్కడే. ఆయనకు పేరు ఒక్కటే.
10అప్పుడు యెరూషలేము చుట్టూ వున్న ప్రాంత
మంతా అరాబా ఎడారిలా నిర్మానుష్య మవుతుంది.
గెబ నుండి దక్షిణాన రిమ్మోను వరకు దేశం ఎడారిలా
మారిపోతుంది. కాని యెరూషలేము నగరమంతా
బెన్యామీను ద్వారం నుండి మొదటి ద్వారం (మూల
ద్వారం) వరకు, మరియు హనన్యేలు బురుజు నుండి
రాజు యొక్క ద్రాక్ష గానుగల వరకు మళ్లీ నిర్మింప
బడుతుంది. 11నిషేధం తొలగింప బడుతుంది. ప్రజలు
మళ్లీ అక్కడ ఇండ్లు కట్టుకుంటారు. యెరూషలేము
సురక్షితంగా ఉంటుంది. 12కాని యెరూషలేముతో
యుద్ధం చేసిన దేశాలన్నిటినీ యెహోవా శిక్షిస్తాడు.
ఆ మనుష్యులకు ఒక భయంకర వ్యాధి సోకేలా ఆయన
చేస్తాడు. ఆ జనులు జీవించి వుండగానే వారి శరీరాలు
కుళ్లిపోవటం ప్రారంభిస్తాయి. వారి కండ్లు కనుగుంట
లలోనే కుళ్లిపోతాయి. నాలుక నోటిలోనే కుళ్లనారంభి
స్తుంది. 13-15ఆ భయంకర వ్యాధి శత్రు స్థావరంలో
ప్రబలుతుంది. పైగా వారి గుర్రాలు, కంచర గాడిదలు,
ఒంటెలు మరియు గాడిదలు కూడ ఆ భయంకర
వ్యాధికి గురియగుతాయి.

ఆ సమయంలో ఆ ప్రజలు యెహోవా అంటే
నిజంగా భయపడతారు. వారు ఒకరి కొకరు విరోధులై,
ఒకరినొకరు పట్టుకుందురు. యూదా ప్రజలు కూడా
యెరూషలేముకు విరుద్ధంగా యుద్ధం చేస్తారు. నగరం
చుట్టూవున్న దేశాలనుండి వారికి ధనం లభిస్తుంది.
వారికి బంగారం, వెండి, బట్టలు విస్తారంగా లభిస్తాయి.
16యెరూషలేముపై యుద్ధానికి వచ్చిన వారిలో కొంత
మంది బ్రతుకుతారు. వారు ప్రతి సంవత్సరం రాజును,
సర్వశక్తిమంతుడైన యెహోవాను ఆరాధించటానికి
వస్తారు. పర్ణశాలల పండుగను చేసుకోటానికి వారు

వస్తారు. 17ఈ భూమి మీద ఏ వంశంవారైనా సర్వ
శక్తిమంతుడైన యెహోవాను ఆరాధించటానికి యెరూ
షలేముకు వెళ్ళక పోయి నట్లయితే, యెహోవా వారికి
వర్షాలు లేకుండా చేస్తాడు. 18ఈజిప్టు (ఐగుప్తు) నుండి
ఏ వంశంవారైనా పర్ణశాలల పండుగ జరుపు కొనుటకు
రాక పోయినట్లయితే, యెహోవా శత్రుదేశాలకు సంభ
వింపజేసిన ఆ భయంకర వ్యాధి వారికి సోకేలా చేస్తాడు.
19పర్ణశాలల పండుగ జరుపుకొనుటకు రానటువంటి
ఈజిప్టుకు, మరి ఏ ఇతర దేశానికైనా అదే శిక్ష.

20ఆ సమయంలో ప్రతిదీ దేవునికి చెంది
వుంటుంది. గుర్రాల మీది జీనులకు కూడ "
యెహోవాకు పవిత్రమైనది" అని వ్రాసిన చీటీలు
కట్టబడతాయి. బలిపీఠం వద్ద వుంచబడిన గిన్నెలవలె
యెహోవా ఆలయంలో వాడబడే పాత్రలన్నీ ప్రాము
ఖ్యంగల వస్తువులే. 21వాస్తవానికి యెరూషలేము,
యూదాలలో గల ప్రతి పాత్రమీద "సర్వశక్తిమంతుడైన
యెహోవాకు పవిత్రమైనది" అని వ్రాసిన చీటి అంట
బెట్టబడుతుంది. యెహోవాను ఆరాధించే ప్రతి వ్యక్తి
ఆ పాత్రలలో వండి, తినగలిగినవారై ఉంటారు. ఆ
సమయంలో సర్వశక్తిమంతుడైన యెహోవా
ఆలయంలో క్రయ విక్రయాలు జరిపే వ్యాపారస్తు
లెవ్వరూ వుండరు.

# మలాకీ

1 దేవుని దగ్గర్నుండి ఇది ఒక సందేశం. ఈ సందేశం
యెహోవా దగ్గరనుండి వచ్చింది. ఇశ్రాయేలీయు
లకు ఈ సందేశాన్ని మలాకీ ఇచ్చాడు.

### దేవుడు ఇశ్రాయేలును ప్రేమిస్తున్నాడు

2“ప్రజలారా, నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను”
అన్నాడు యెహోవా.
కానీ “నీవు మమ్మల్ని ప్రేమిస్తున్నావని తెలియ
జేసేది ఏమిటి?” అని మీరు అన్నారు.
యెహోవా చెప్పాడు: ‘ఏశావు యాకోబుకు సోద
రుడు. కానీ నేను యాకోబును ఎన్నుకొన్నాను.*
3మరియు ఏశావును నేను అంగీకరించలేదు.* ఏశావు
యొక్క కొండ దేశాన్ని* నేను నాశనం చేశాను. ఏశావు
దేశం నాశనం చేయబడింది. ఇప్పుడు అక్కడ అడవి
కుక్కలు* మాత్రమే నివసిస్తాయి.”
4ఒకవేళ ఎదోము ప్రజలు, “మేము నాశనం చేయ
బడ్డాం. కానీ మేము తిరిగి వెళ్లి, మా పట్టణాలు మరల
కట్టుకొంటాం” అని అనవచ్చును.
అయితే సర్వశక్తిమంతుడైన యెహోవా, “వారు
ఆ పట్టణాలను మరల నిర్మిస్తే, నేను వాటిని మరల
నాశనం చేస్తాను” అని చెపుతున్నాడు. కనుక ఎదోము
దుష్ట పట్టణం అని ప్రజలు చెబుతారు. ఆ దేశాన్ని
యెహోవా శాశ్వతంగా అసహ్యించుకొంటున్నాడు అని
ప్రజలు చెబుతారు.
5ప్రజలారా, మీరు ఈ సంగతులు చూశారు,
మరియు “ఇశ్రాయేలుకు వెలుపల కూడ యెహోవా
గొప్పవాడు” అని మీరు చెప్పారు.

### ప్రజలు దేవుని గౌరవించరు

6“పిల్లలు తమ తండ్రిని గౌరవిస్తారు. సేవకులు
తమ యజమానులను గౌరవిస్తారు. నేను మీ తండ్రిని.
కనుక మీరెందుకు నన్ను గౌరవించరు? నేను మీ
యజమానిని. అయినను నేనంటే భయభక్తులు ఎందు
కు లేవు మీకు? యాజకులారా, మీరు నా పేరును
అగౌరవపరుస్తున్నారు” అని సర్వశక్తిమంతుడైన
యెహోవా అన్నాడు.
కాని మీరు, “మేము నీ పేరును అగౌరవపరచామని
చూపించడానికి మేము ఏమి చేశాం?” అని అంటారు.
7“పాడైపోయిన రొట్టెను మీరు నా బలిపీఠం దగ్గ
రకు తీసికొని వస్తారు” (అని యెహోవా చెప్పాడు.)
కానీ మీరు “ఆ రొట్టెను ఏది పాడు చేస్తుంది?”
అని అంటారు.
(యెహోవా చెప్పాడు,) “నా బల్లను మీరు గౌర
వించరు. 8గుడ్డి జంతువులను బలిగా మీరు తీసికొని
వస్తారు. అది తప్పు! బలి అర్పణల కోసం కుంటి
మరియు జబ్బు జంతువులను మీరు తీసికొని వస్తారు.
మరి అదీ తప్పు. ఆ జబ్బు జంతువులను మీ దేశాధికారికి
ఇచ్చి చూడండి. ఆ జబ్బు జంతువులను అతడు
కానుకలుగా స్వీకరిస్తాడా? లేదు! ఆ కానుకలు అతడు
అంగీకరించడు!” సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
9“యాజకులారా! యెహోవా మా యెడల దయ
గలిగి ఉండాలని మీరు ఆయనను అడగాలి. కాని ఆయన
మీ మాట వినడు. మరి ఆ తప్పు అంతా మీదే”.
సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.
10“కనీసం, మీ యాజకుల్లో కొందరు దేవాలయం
తలుపులు మూయవచ్చు, హోమాలు సరిగ్గా వెలి
గించవచ్చు. మీ విషయం నాకు సంతోషంగా లేదు.
నేను మీ కానుకలు అంగీకరించను.” సర్వశక్తిమంతుడైన
యెహోవా ఈ సంగతులు చెప్పాడు.
11“ప్రపంచం అంతటా మనుష్యులు నన్ను గౌర
విస్తారు. ప్రపంచం అంతటా మనుష్యులు నాకు మంచి
కానుకలు అర్పిస్తారు. నాకు కానుకగా వారు మంచి
సాంబ్రాణి ధూపం వేస్తారు. ఎందుకంటే, ఆ మనుష్య
లందరికీ నా పేరు ముఖ్యం గనుక.” సర్వశక్తి మంతుడైన
యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
12“కానీ మీరు మాత్రం నా పేరు అంటే మీకు
గౌరవం లేదని చూపించారు. యెహోవా బల్ల మలి

---

**ఎన్నుకొన్నాను** లేక “ప్రేమించాను.”

**అంగీకరించలేదు** లేక “అసహ్యించుకున్నాను.”

**ఏశావు యొక్క కొండ దేశం** దీని అర్థం ఎదోము దేశం. ఎదోము అనేది ఏశావుకు మరో పేరు.

**అడవి కుక్కలు** శబ్దార్థ ప్రకారం “నక్కలు.”

నంగా ఉందని మీరు అంటారు. 13ఆ బల్లమీది భోజనం
మీకు ఇష్టంలేదు. ఆ భోజనాన్ని మీరు వాసన చూచి,
తినుటకు నిరాకరిస్తారు. అది చెడిపోయిందని మీరు
చెబుతారు. కానీ అది సత్యం కాదు. ఆ తర్వాత జబ్బువి,
కుంటివి, గాయపర్చబడిన జంతువులను మీరు
నాకోసం తెస్తారు. జబ్బు జంతువులను నాకు బలి
అర్పణలుగా ఇచ్చేందుకు మీరు ప్రయత్నిస్తారు. కానీ
మీ వద్దనుండి ఆ జబ్బు జంతువులను నేను అంగీక
రించను. 14కొంతమంది దగ్గర వారు బలి అర్పణలుగా
ఇవ్వగలిగిన మంచి మగ జంతువులు ఉన్నాయి. కానీ
ఆ మంచి జంతువులను వారు నాకు ఇవ్వరు. కొంత
మంది మంచి జంతువులను నాకోసం తీసికొని వస్తారు.
ఆరోగ్యంగా ఉన్న ఆ జంతువులను నాకు ఇస్తాం అని
వారు వాగ్దానం చేస్తారు. కానీ వారు ఆ మంచి జంతు
వులను రహస్యంగా మార్చివేసి, జబ్బు జంతువులను
నాకు ఇస్తారు. ఆ మనుష్యులకు చెడు సంగతులు
సంభవిస్తాయి. నేను మహారాజును. మీరు నాయెడల
భయభక్తులు కలిగి ఉండాలి. ప్రపంచం అంతటా
ప్రజలు నాయందు భయభక్తులు కలిగి ఉంటారు!"
సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు
చెప్పాడు.

## యాజకులకు నియమాలు

2 "యాజకులారా, ఈ నియమం మీ కోసమే! నా
మాట వినండి! నేను చెప్పే మాటలు గమ
నించండి! నా పేరును మీరు గౌరవించాలి. 2మీరు నా
పేరును గౌరవించకపోతే, అప్పుడు మీకు చెడు విష
యాలు సంభవిస్తాయి. మీరు ఆశీర్వాదాలు చెప్పగా
అవి శాపనార్థాలు అవుతాయి. మీరు నా పేరు అంటే
గౌరవం చూపడం లేదు గనుక కీడులు సంభవించేటట్టు
నేను చేస్తాను." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ
విషయాలు చెప్పాడు.
3"చూడండి, మీ సంతతివారిని నేను శిక్షిస్తాను.
పవిత్ర దినాల్లో, యాజకులారా, మీరు నాకు బలులు
అర్పిస్తారు. చచ్చిన జంతువుల్లో నుండి పేడ, పేగులు
మీరు తీసి, వాటిని పారవేస్తారు. కానీ నేను ఆ పేడను
మీ ముఖాలకు పులిమివేస్తాను, మరియు దానితోపాటు
మీరు విసరివేయబడుతారు! 4అప్పుడు ఈ ఆజ్ఞను
నేను ఎందుకోసం మీకు ఇచ్చానో అది మీరు నేర్చు
కొంటారు. లేవీతో నా ఒడంబడిక కొనసాగాలని నేను
ఈ విషయాలు మీతో చెపుతున్నాను." సర్వశక్తిమంతు
డైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.
5(యెహోవా చెప్పాడు,) "లేవీతో ఆ ఒడంబడిక
నేను చేశాను. అతనికి జీవం – శాంతి ఇస్తానని నేను
వాగ్దానం చేశాను – మరియు నేను వాటిని అతనికి
ఇచ్చాను! లేవీ నేనంటే భయభక్తులు చూపాడు!
అతడు నా పేరుకు గౌరవం చూపించాడు! 6లేవీ సత్య
ప్రబోధాలు నేర్పించాడు. లేవీ అబద్ధాలు నేర్పించలేదు.
లేవీ నిజాయితీపరుడు, అతడు శాంతిని ప్రేమించాడు.
లేవీ నన్ను అనుసరించి, అనేకమంది తాము చేసిన
చెడ్డ పనుల కోసం శిక్షింపబడకుండా వారిని అతడు
రక్షించాడు. 7ప్రతి యాజకుడూ దేవుని ప్రబోధాలు
ఎరిగి ఉండాలి. ప్రజలు ఒక యాజకుని దగ్గరకు వెళ్లి,
దేవుని ప్రబోధాలను అతని వద్ద నేర్చుకోగలిగి ఉండాలి.
యాజకుడు ప్రజలకు దేవుని సందేశకునిగా ఉండాలి."
8(యెహోవా చెప్పాడు,) "యాజకులారా, మీరు
నన్ను అనుసరించటం మానివేశారు! మనుష్యులచేత
చెడు చేయించటానికి ఆ ప్రబోధాలు మీరు వినియో
గించుకొన్నారు. లేవీతోటి ఒడంబడికను మీరు భగ్నం
చేశారు!" సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విష
యాలు చెప్పాడు. 9"నేను మీతో చెప్పిన విధంగా
మీరు జీవించరు! మీరు నా ప్రబోధాలు అంగీకరించ
లేదు! కనుక నేను మిమ్మల్ని ప్రాముఖ్యం లేనివారినిగా
చేస్తాను. ప్రజలు మిమ్మల్ని బహిష్కరిస్తారు!"

## యూదా దేవునికి నమ్మకంగా లేదు

10మన అందరికీ ఒకే తండ్రి ఉన్నాడు (దేవుడు).
ఆ దేవుడే మనలో ప్రతి ఒక్కరినీ చేశాడు! కనుక
ప్రజలు ఎందుకు వారి సోదరులను మోసం చేస్తు
న్నారు? ఆ ప్రజలు ఒడంబడికను సన్మానించటం
లేదని వ్యక్తం చేస్తున్నారు. మన పూర్వీకులు దేవునితో
చేసుకున్న ఒడంబడికను వారు గౌరవించరు.
11యూదా మనుష్యులు ఇతరులను మోసం చేశారు.
యెరూషలేములో, ఇశ్రాయేలులో ప్రజలు భయంకర
విషయాలు జరిపించారు. యూదాలో ప్రజలు
యెహోవా పవిత్ర ఆలయాన్ని గౌరవించలేదు. ఆ
స్థలం దేవునికి ఇష్టమైనది! యూదా ప్రజలు ఆ విదేశీ
దేవతను పూజించటం మొదలు పెట్టారు.
12యెహోవా ఆ మనుష్యులను యూదా వంశంలో
నుండి తొలగించివేస్తాడు. ఆ ప్రజలు యెహోవాకు
కానుకలు తీసికొని రావచ్చుగాక, కానీ అది సహాయ
పడదు. 13నీవు ఏడ్చి, యెహోవా బలిపీఠాన్ని కన్నీ
ళ్ళతో నింపవచ్చు, కానీ యెహోవా నీ కానుకలు
అంగీకరించడు. నీవు ఆయనకోసం తెచ్చే వస్తువులతో
యెహోవా సంతోషించడు.
14"మా కానుకలను యెహోవా ఎందుచేత అంగీ
కరించలేదు?" అని మీరు అడుగుతారు. ఎందుకంటే
మీరు చేసిన చెడుకార్యాలు యెహోవా చూశాడు,
మీకు విరుద్ధంగా ఆయనే సాక్షి. నీవు నీ భార్యను
మోసం చేయటం ఆయన చూశాడు. నీవు యువ
కునిగా ఉన్నప్పుడే నీవు ఆ స్త్రీకి వివాహం చేయబడ్డావు.
ఆమె నీ స్నేహితురాలు. తర్వాత మీరు ఇద్దరూ ఒకరికి
ఒకరు ప్రమాణాలు చేసికొన్నారు – ఆమె నీకు భార్య
అయింది. కానీ నీవు ఆమెను మోసం చేసావు. 15భర్తలు,

భార్యలు ఒకే శరీరం, ఒకే ఆత్మ కావాలని దేవుడు కోరుచున్నాడు. ఎందుకంటే, వారికి పవిత్రమైన పిల్లలు ఉండాలని. అందుచేత ఆత్మ పరమైన ఆ ఐక్యతను కాపాడుకోండి. నీ భార్యను మోసం చేయవద్దు. నీవు యువకునిగా ఉన్నప్పటి నుండి ఆమె నీకు భార్యగా ఉంది.

16"విడాకులు అంటే నాకు అసహ్యం. మరియు పురుషులు తమ భార్యలయెడల చేసే క్రూరమైన పనులు నాకు అసహ్యం. అందుచేత మీ ఆత్మపరమైన ఐక్యాన్ని కాపాడుకోండి. నీ భార్యను మోసం చేయవద్దు" అని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా చెపుతున్నాడు.

## తీర్పు కోసం ప్రత్యేక సమయం

17మీరు తప్పుడు విషయాలు నేర్పించారు. ఆ తప్పుడు ప్రబోధాలు యెహోవాకు చాలా విచారం కలిగించాయి. చెడుకార్యాలు చేసే వారంటే దేవునికి ఇష్టం అని మీరు ప్రబోధించారు. అలాంటివారే మంచి వాళ్లని దేవుడు తలుస్తాడు అని మీరు ప్రబోధించారు. చెడుకార్యాలు చేసినందుకు దేవుడు శిక్షించడు అని మీరు ప్రబోధం చేశారు.

3 "చూడండి, నేను నా సందేశకుని పంపిస్తున్నాను. అతడు నా కోసం మార్గం సిద్ధం చేస్తాడు. అకస్మాత్తుగా మీరు ఎదురుచూచే యజమాని తన ఆలయంలోనికి వచ్చేస్తాడు. అవును, మీరు కోరుతున్న క్రొత్త ఒడంబడిక దూత నిజంగా వస్తున్నాడు! సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

2"ఆ సమయాన్ని ఏ వ్యక్తి ఆపలేడు. ఆయన వచ్చినప్పుడు ఆయనకు వ్యతిరేకంగా ఎవ్వరూ నిలబడలేరు. ఆయన మండుతున్న అగ్నిలా ఉంటాడు. ప్రజలు వస్తువులను శుభ్రం చేయుటకు ఉపయోగించే శక్తివంతమైన సబ్బులా ఆయన ఉంటాడు. 3ఆయన లేవీ ప్రజలను శుభ్రపరుస్తాడు. అగ్నిచేత వెండి శుద్ధి చేయబడినట్టు ఆయన వారిని శుద్ధి చేస్తాడు. స్వచ్ఛమైన బంగారంలా, వెండిలా ఆయన వారిని చేస్తాడు. అప్పుడు వారు యెహోవాకు కానుకలు తీసికొని వస్తారు - వాటిని సరైన పద్ధతిలో వారు చేస్తారు. 4అప్పుడు యూదా నుండి, యెరూషలేము నుండి కానుకలను యెహోవా స్వీకరిస్తాడు. అది గతంలో ఉన్నట్టుగా ఉంటుంది. అది చాలకాలం కిందట ఉన్నట్టుగా ఉంటుంది. 5అప్పుడు నేను మీ దగ్గరకు వస్తాను. మరియు సరైనది నేను చేస్తాను. ప్రజలు చేసిన చెడుకార్యాలను గూర్చి న్యాయమూర్తితో చెప్పటానికి సిద్ధంగా ఉన్న మనిషిలా నేను ఉంటాను. కొంతమంది మాయమంత్రాలు చేస్తారు. కొంతమంది వ్యభిచార పాపం చేస్తారు. కొంతమంది బూటకపు వాగ్దానాలు చేస్తారు. కొంతమంది తమ పనివారిని మోసం చేస్తారు. వారు వాగ్దానం చేసిన డబ్బును వారు చెల్లించరు. విధవలకు, అనాథ బాలబాలికలకు ప్రజలు సహాయం చేయరు. విదేశీయులకు ప్రజలు సహాయం చేయరు. ప్రజలు నన్ను గౌరవించరు!" సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

## దేవుని దగ్గర దొంగిలించటం

6"నేను యెహోవాను, నేను మారను. మీరు యాకోబు పిల్లలు, మరియు మీరు పూర్తిగా నాశనం చేయబడలేదు. 7కానీ మీరు ఎన్నడూ నా ఆజ్ఞలకు విధేయులు కాలేదు. చివరికి మీ పూర్వీకులు కూడా నన్ను అనుసరించటం మానివేశారు. తిరిగి నా దగ్గరకు రండి, నేను తిరిగి మీ దగ్గరకు వస్తాను." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

"మేము ఎలా తిరిగి వెనుకకు రాగలం?" అని మీరు అంటారు. 8దేవుని దగ్గర వస్తువులు దొంగిలించటం మానివేయండి! మనుష్యులు దేవుని దగ్గర వస్తువులు దొంగిలించకూడదు. కానీ మీరు నా దగ్గర వస్తువులు దొంగిలించారు!

"నీ దగ్గర మేము ఏమి దొంగిలించాం?" అని మీరు అంటారు. "మీ వస్తువుల్లో పదోవంతు మీరు నాకు ఇచ్చి ఉండాల్సింది. మీరు నాకు ప్రత్యేక కానుకలు ఇచ్చి ఉండాల్సింది. కానీ మీరు నాకు వాటిని ఇవ్వలేదు. 9ఈ విధంగా మీ రాజ్యం మొత్తం అందరూ నా దగ్గర దొంగిలించారు. కనుక మీకు చెడు విషయాలు సంభవిస్తున్నాయి." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెపుతున్నాడు.

10సర్వశక్తిమంతుడైన యెహోవా అంటున్నాడు, "ఈ పరీక్షలో ప్రయత్నించండి. మీకు ఉన్నవాటిలో పదో భాగం నా దగ్గరకు తీసికొని రండి. వాటిని ధనాగారంలో ఉంచండి. నా మందిరానికి ఆహారం తీసికొని రండి. నన్ను పరీక్షించండి! మీరు ఆ పనులు చేస్తే, అప్పుడు నేను నిజంగా మిమ్మల్ని ఆశీర్వదిస్తాను. ఆకాశం నుండి వర్షం కురిసినట్టు, మంచి మంచి విషయాలు మీకు లభిస్తాయి. మీకు సమస్తం, కావలసిన దానికంటె ఎక్కువగా ఉంటాయి. 11నేను చీడ పురుగులు మీ పంటలను తినివేయనియ్యను. మీ ద్రాక్షావల్లులు అన్నీ ద్రాక్షాపండ్లు ఫలిస్తాయి." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

12"ఇతర రాజ్యాల ప్రజలు మీ యెడల దయగలిగి ఉంటారు. నిజంగా మీకు ఒక అద్భుత దేశం ఉంటుంది." సర్వశక్తిమంతుడైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు.

## తీర్పుకోసం ప్రత్యేక సమయం

13"మీరు నన్ను గూర్చి నీచ విషయాలు చెప్పారు" అని యెహోవా అంటున్నాడు.

కానీ “నిన్ను గూర్చి మేము ఏమి చెప్పాం?” అని
మీరు అంటారు.
14“యెహోవాను ఆరాధించటం వ్యర్థం.
యెహోవా మాకు చెప్పిన వాటిని మేము చేసాం
గాని మాకు లాభం ఏమీ కలుగలేదు. సమాధి దగ్గర
మనుష్యులు ఏడ్చినట్టు, మేము మా పాపాల విష
యంలో బాధపడ్డాం. కానీ దానివల్ల లాభం లేదు.
15గర్విష్ఠులు సంతోషంగా ఉన్నారని మేము అను
కొంటున్నాం. దుర్మార్గులే అభివృద్ధి చెందుతున్నారు.
వారు దేవుని సహనం పరీక్షించుటకు చెడు పనులు
చేస్తారు – దేవుడు వారిని శిక్షించడు అని మీరు చెప్పారు”.
16దేవుని అనుచరులు ఒకరితో ఒకరు మాట్లాడారు
– అది యెహోవా విన్నాడు. ఆయన ఎదుట ఒక
గ్రంథం ఉంది. ఆ గ్రంథంలో దేవుని అనుచరుల
పేర్లు ఉన్నాయి. వారు యెహోవా పేరును గౌరవించే
వారు. 17ఆ ప్రజలు నాకు చెందినవాళ్లు. నేను వారికి
దయ చూపుతాను. ఒక మనిషి అతనికి విధేయులయ్యే
పిల్లల యెడల చాలా దయగలిగి ఉంటాడు. అదే
విధంగా, నేను నా అనుచరులయెడల దయగలిగి
ఉంటాను. 18ప్రజలారా, మీరు తిరిగి నా దగ్గరకు వస్తారు.
మరియు మంచికి చెడుకు గల భేదం మీరు నేర్చు
కొంటారు. దేవుని అనుసరించే మనిషికి, దేవుని అనుస
రించని మనిషికీ వ్యత్యాసం మీరు నేర్చుకొంటారు అని
యెహోవా చెప్పాడు.

4 “తీర్పు సమయం వస్తుంది. అది కాలుతున్న
అగ్ని గుండంలా ఉంటుంది. ఆ గర్విష్ఠులు
అందరూ శిక్షించబడతారు. ఆ దుర్మార్గులు అందరూ
గడ్డిలా కాలిపోతారు. ఆ సమయంలో వారు అగ్నిలో
మండుతున్న ఒక పొదలా ఉంటారు – దాని కొమ్మగాని
వేరుగాని మిగలదు.” సర్వశక్తిమంతుడైన యెహోవా
ఈ విషయాలు చెప్పాడు.
2“అయితే నా అనుచరులారా, ఉదయిస్తున్న
సూర్యునిలా, మంచితనం మీమీద ప్రకాశిస్తుంది.
మరియు సూర్యకిరణాలవలె అది స్వస్థతా శక్తిని తెచ్చి
పెడ్తుంది. పాక నుండి విడిచిపెట్టబడిన దూడల్లా, మీరు
స్వేచ్ఛగా, సంతోషంగా ఉంటారు. 3అప్పుడు మీరు
ఆ దుర్మార్గుల మీద నడుస్తారు – వారు మీ పాదాల
కింద బూడిదలా ఉంటారు. తీర్పు సమయంలో ఆ
సంగతులను నేను సంభవింపజేస్తాను.” సర్వశక్తిమంతు
డైన యెహోవా ఈ విషయాలు చెప్పాడు!
4“మోషే ధర్మశాస్త్రాన్ని జ్ఞాపకం ఉంచుకొని, విధే
యత చూపండి. మోషే నా సేవకుడు. హోరేబు
(సీనాయి) కొండమీద ఇశ్రాయేలీయులందరి కోసం
ఆ చట్టాలు, నియమాలు నేను అతనికి ఇచ్చాను.”
5“చూడండి, ఏలీయా ప్రవక్తను నేను మీ దగ్గరకు
పంపిస్తాను. యెహోవా నుంచి వచ్చే ఆ మహా
భయంకర తీర్పు సమయానికి ముందు ఆయన
వస్తాడు.
6“తల్లిదండ్రులు వారి పిల్లలకు సన్నిహితులగుటకు
ఏలీయా సహాయం చేస్తాడు. మరియు అతడు
(ఏలీయా) పిల్లలు వారి తల్లిదండ్రులకు సన్నిహితుల
గుటకు సహాయం చేస్తాడు. ఇది జరిగి తీరాలి. లేదా
నేను వచ్చి, మీ దేశాన్ని పూర్తిగా నాశనం చేస్తాను,”
అని యెహోవా చెప్పాడు!

# License Agreement for Bible Texts

***World Bible Translation Center***
***Last Updated: September 21, 2006***



**These Scriptures:**

- Are copyrighted by World Bible Translation Center.
- Are not public domain.
- May not be altered or modified in any form.
- May not be sold or offered for sale in any form.
- May not be used for commercial purposes (including, but not limited to, use in advertising or Web banners used for the purpose of selling online add space).
- May be distributed without modification in electronic form for non-commercial use. However, they may not be hosted on any kind of server (including a Web or ftp server) without written permission. A copy of this license (without modification) must also be included.
- May be quoted for any purpose, up to 1,000 verses, without written permission. However, the extent of quotation must not comprise a complete book nor should it amount to more than 50% of the work in which it is quoted. A copyright notice must appear on the title or copyright page using this pattern: "Taken from the HOLY BIBLE: EASY-TO-READ VERSION™ © 2006 by World Bible Translation Center, Inc. and used by permission." If the text quoted is from one of WBTC's non-English versions, the printed title of the actual text quoted will be substituted for "HOLY BIBLE: EASY-TO-READ VERSION™." The copyright notice must appear in English or be translated into another language. When quotations from WBTC's text are used in non-saleable media, such as church bulletins, orders of service, posters, transparencies or similar media, a complete copyright notice is not required, but the initials of the version (such as "ERV" for the Easy-to-Read Version™ in English) must appear at the end of each quotation.

Any use of these Scriptures other than those listed above is prohibited. For additional rights and permission for usage, such as the use of WBTC's text on a Web site, or for clarification of any of the above, please contact World Bible Translation Center in writing or by email at distribution@wbtc.com.

World Bible Translation Center
P.O. Box 820648
Fort Worth, Texas 76182, USA
Telephone: 1-817-595-1664
Toll-Free in US: 1-888-54-BIBLE
E-mail: info@wbtc.com

**WBTC's web site –** World Bible Translation Center's web site: http://www.wbtc.org

**Order online –** To order a copy of our texts online, go to: http://www.wbtc.org

**Current license agreement –** *This license is subject to change without notice. The current license can be found at:* http://www.wbtc.org/downloads/biblelicense.htm

**Trouble viewing this file –** If the text in this document does not display correctly, use Adobe Acrobat Reader 5.0 or higher. Download Adobe Acrobat Reader from:
http://www.adobe.com/products/acrobat/readstep2.html

**Viewing Chinese or Korean PDFs –** To view the Chinese or Korean PDFs, it may be necessary to download the Chinese Simplified or Korean font pack from Adobe. Download the font packs from:
http://www.adobe.com/products/acrobat/acrrasianfontpack.html

# మత్తయి సువార్త

### యేసు వంశావళి
*(లూకా 3:23-38)*

1 యేసు క్రీస్తు వంశక్రమము: ఈయన దావీదు
మరియు అబ్రాహాము వంశానికి చెందినవాడు.

2 అబ్రాహాము కుమారుడు ఇస్సాకు.
ఇస్సాకు కుమారుడు యాకోబు
యాకోబు కుమారులు యూదా
మరియు అతని సహోదరులు.
3 యూదా కుమారులు పెరెసు మరియు
జెరహు.
పెరెసు, జెరహుల తల్లి తామారు.
పెరెసు కుమారుడు ఎస్రోము
ఎస్రోము కుమారుడు అరాము
4 అరాము కుమారుడు అమ్మీనాదాబు.
అమ్మీనాదాబు కుమారుడు నయస్సోను.
నయస్సోను కుమారుడు శల్మా.
5 శల్మా కుమారుడు బోయజు,
బోయజు తల్లి రాహాబు.
బోయజు కుమారుడు ఓబేదు.
ఓబేదు తల్లి రూతు.
ఓబేదు కుమారుడు యెష్షయి,
6 యెష్షయి కుమారుడు రాజు దావీదు.
దావీదు కుమారుడు సొలొమోను.
సొలొమోను తల్లి పూర్వం ఊరియా భార్య.
7 సొలొమోను కుమారుడు రెహబాము.
రెహబాము కుమారుడు అబీయా.
అబీయా కుమారుడు ఆసా.
8 ఆసా కుమారుడు యెహోషాపాతు.
యెహోషాపాతు కుమారుడు
యెహోరాము.
యెహోరాము కుమారుడు ఉజ్జియా.
9 ఉజ్జియా కుమారుడు యోతాము.
యోతాము కుమారుడు ఆహాజు.
ఆహాజు కుమారుడు హిజ్కియా.
10 హిజ్కియా కుమారుడు మనష్షే.
మనష్షే కుమారుడు ఆమోసు.
ఆమోసు కుమారుడు యోషీయా.
11 యోషీయా కుమారులు యెకొన్యా
మరియు అతని సోదరులు.
వీళ్ళ కాలంలోనే యూదులు
బబులోను నగరానికి బందీలుగా
కొనిపోబడినారు.
12 బబులోను నగరానికి కొనిపోబడిన
తరువాతి వంశ క్రమము:
యెకొన్యా కుమారుడు షయల్తీయేలు.
షయల్తీయేలు కుమారుడు జెరుబ్బాబెలు.
13 జెరుబ్బాబెలు కుమారుడు అబీహూదు.
అబీహూదు కుమారుడు ఎల్యాకీము.
ఎల్యాకీము కుమారుడు అజోరు.
14 అజోరు కుమారుడు సాదోకు.
సాదోకు కుమారుడు ఆకీము.
ఆకీము కుమారుడు ఎలీహూదు.
15 ఎలీహూదు కుమారుడు ఎలియాజరు.
ఎలియాజరు కుమారుడు మత్తాను.
మత్తాను కుమారుడు యాకోబు.
16 యాకోబు కుమారుడు యోసేపు.
యోసేపు భార్య మరియ.
మరియ కుమారుడు యేసు.
ఈయన్ని క్రీస్తు అంటారు.

17 అంటే అబ్రాహాము కాలం నుండి దావీదు కాలం
వరకు మొత్తం పదునాలుగు తరాలు. దావీదు కాలం
నుండి బబులోను నగరానికి బందీలుగా కొనిపోబడిన
కాలం వరకు పదునాలుగు తరాలు. అలా కొనిపోబడిన
కాలం నుండి క్రీస్తు వరకు పదునాలుగు తరాలు.

### యేసు క్రీస్తు జననం
*(లూకా 2:1-7)*

18 యేసు క్రీస్తు జననం ఇలా సంభవించింది: యేసు
క్రీస్తు తల్లి మరియకు, యోసేపు అనే వ్యక్తికి వివాహం
నిశ్చయమై ఉంది. వివాహంకాకముందే పవిత్రాత్మ శక్తి
ద్వారా మరియ గర్భవతి అయింది. 19 కాని ఆమె భర్త
యోసేపు నీతిమంతుడు. అందువల్ల అతడు ఆమెను
నలుగురిలో అవమాన పరచదలచుకోలేదు. ఆమెతో

రహస్యంగా తెగతెంపులు చేసుకోవాలని మనస్సులో
అనుకొన్నాడు.
20అతడీవిధంగా అనుకొన్న తర్వాత, దేవదూత
అతనికి కలలో కనిపించి, “యోసేపూ, దావీదు కుమా
రుడా, మరియ పవిత్రాత్మ ద్వారా గర్భవతి అయింది.
కనుక ఆమెను భార్యగా స్వీకరించటానికి భయపడకు.
21ఆమె ఒక మగ శిశువును ప్రసవిస్తుంది. ఆయన తన
ప్రజల్ని వాళ్ళు చేసిన పాపాలనుండి రక్షిస్తాడు. కనుక
ఆయనకు ‘యేసు’ అని పేరు పెట్టు” అని అన్నాడు.
22-23ప్రవక్త ద్వారా ప్రభువు ఈ విధంగా చెప్పాడు:
“కన్యక గర్భవతియై మగ శిశువును ప్రసవిస్తుంది. వాళ్ళా
యనను ఇమ్మానుయేలు అని పిలుస్తారు”* ఇది నిజం
కావటానికే ఇలా జరిగింది.
24యోసేపు నిద్రలేచి దేవదూత ఆజ్ఞాపించినట్లు
చేసాడు. మరియను తన భార్యగా స్వీకరించి తన
ఇంటికి పిలుచుకు వెళ్ళాడు. 25కాని, ఆమె కుమారుణ్ణి
ప్రసవించే వరకు అతడు ఆమెతో కలియలేదు. అతడు
ఆ బాలునికి ‘యేసు’ అని నామకరణం చేసాడు.

## తూర్పు నుండి జ్ఞానులు రావటం

2 హేరోదు రాజ్యపాలన చేస్తున్న కాలంలో
యూదయ దేశంలోని బేత్లెహేములో యేసు
జన్మించాడు. తూర్పు దిశనుండి జ్ఞానులు యెరూష
లేముకు వచ్చి 2“యూదుల రాజుగా జన్మించినవాడు
ఎక్కడున్నాడు? తూర్పున మేమాయన నక్షత్రాన్ని
చూసి ఆయన్ని ఆరాధించటానికి వచ్చాము” అని
అన్నారు.
3ఈ విషయం విని హేరోదు చాలా కలవరం
చెందాడు. అతనితో పాటు యెరూషలేము ప్రజలు
కూడ కలవరపడ్డారు. 4అతడు ప్రధానయాజకుల్ని,
పండితుల్ని* సమావేశపరచి, “క్రీస్తు ఎక్కడ జన్మించ
బోతున్నాడు?” అని అడిగాడు. 5వాళ్ళు,“యూదయ
దేశంలోని బేత్లెహేములో, అని సమాధానం చెప్పారు.
దీన్ని గురించి ప్రవక్త ఈ విధంగా వ్రాసాడు:

6 ‘యూదయ దేశంలోని బేత్లెహేమా! నీవు
యూదయ పాలకుల కన్నా తక్కువేమీ
కాదు! ఎందుకంటే, నీ నుండి ఒక పాలకుడు
వస్తాడు. ఆయన నా ప్రజల, అంటే ఇశ్రా
యేలు ప్రజల,కాపరిగా ఉంటాడు.’”

*మీకా 5:2*

7ఆ తర్వాత హేరోదు జ్ఞానుల్ని రహస్యంగా పిలిచి
ఆ నక్షత్రం కనిపించిన సరియైన సమయం వాళ్ళనడిగి

**“కన్యక ... పిలుస్తారు”** యెషయా 7:14.
**పండితుల్ని** లేక శాస్త్రుల్ని.

తెలుసుకొన్నాడు. 8వాళ్ళను బేత్లెహేముకు పంపుతూ,
“వెళ్ళి, ఆ శిశువును గురించి సమాచారం పూర్తిగా
కనుక్కోండి. ఆ శిశువును కనుక్కొన్నాక నాకు వచ్చి
చెప్పండి. అప్పుడు నేను కూడా వచ్చి ఆరాధిస్తాను”
అని అన్నాడు.
9వాళ్ళు రాజు మాటలు విని తమ దారిన తాము
వెళ్ళిపొయ్యారు. వాళ్ళు తూర్పు దిశన చూసిన
నక్షత్రం వాళ్ళకన్నా ముందు వెళ్ళుతూ ఆ శిశువు
ఉన్న ఇంటి మీద ఆగింది. 10వాళ్ళా నక్షత్రం ఆగి
పోవటం చూసి చాలా ఆనందించారు. 11ఇంట్లోకి వెళ్ళి
ఆ పసివాడు తన తల్లి మరియతో ఉండటం చూసారు.
వాళ్ళు ఆయన ముందు మోకరిల్లి ఆయన్ని ఆరాధిం
చారు. ఆ తర్వాత తమ కానుకల మూటలు విప్పి
ఆయనకు బంగారు కానుకలు, సాంబ్రాణి, బోళం
బహూకరించారు.
12హేరోదు దగ్గరకు వెళ్ళొద్దని దేవుడు ఆ
జ్ఞానులతో చెప్పాడు. అందువల్ల వాళ్ళు తమ దేశానికి
మరో దారి మీదుగా వెళ్ళిపోయారు.

## ఈజిప్టు దేశానికి తరలి వెళ్ళటం

13వాళ్ళు వెళ్ళిపొయ్యాక దేవదూత యోసేపుకు
కలలో కనిపించి,“లెమ్ము! తప్పించుకొని తల్లీ బిడ్డలతో
ఈజిప్టు దేశానికి వెళ్ళు! హేరోదు శిశువును చంపాలని
అతని కోసం వెతుక నున్నాడు. కనుక నేను చెప్పే
వరకు అక్కడే ఉండు” అని అన్నాడు.
14యోసేపు లేచి తల్లీ బిడ్డలతో ఆ రాత్రి ఈజిప్టు
దేశానికి బయలు దేరాడు. 15యోసేపు హేరోదు మర
ణించేదాకా అక్కడే ఉండి పొయ్యాడు. తద్వారా
ప్రభువు ప్రవక్త ద్వారా, “నేను నా కుమారుణ్ణి ఈజిప్టు
నుండి పిలుస్తాను.”* అని అన్న మాట నిజమైంది.
16జ్ఞానులు తనను మోసం చేసారని గ్రహించి
హేరోదు కోపంతో మండిపొయ్యాడు. అతడు వాళ్ళు
చెప్పిన కాలాన్ననుసరించి బేత్లెహేములో, దాని పరిసర
ప్రాంతాల్లో రెండు సంవత్సరాలు, లేక అంతకన్నా
తక్కువ వయస్సు గల బాలురనందర్ని చంపివేయమని
ఆజ్ఞాపించాడు.
17తద్వారా యిర్మీయా ప్రవక్త ద్వారా ప్రభువు
చెప్పిన ఈ విషయం నిజమైంది:

18 “రామా గ్రామంలో అతి దుఃఖంతో ఏడు
స్తున్న స్వరం వినిపించింది. రాహేలు తన
సంతానం కొఱకు ఏడ్చింది. ఎవరు ఓదా
ర్చిన వినలేదు. ఆమె సంతానంలో
ఎవ్వరూ మిగల్లేదు.”

*యిర్మీయా 31:15*

**“నేను ... పిలుస్తాను”** హోషేయ 11:1.

### నజరేతుకు తిరుగు ప్రయాణం

19హేరోదు మరణించిన తర్వాత దేవదూత ఈజి
ప్టులో ఉన్న యోసేపుకు కలలో కనిపించి, 20“లెమ్ము!
శిశువును చంపాలని ప్రయత్నం చేసిన వాళ్ళు చనిపో
యారు. కనుక తల్లిని, బిడ్డను తీసుకొని ఇశ్రాయేలు
దేశానికి వెళ్ళు” అని అన్నాడు.
21అందువల్ల యోసేపు లేచి తల్లిని, బిడ్డను తీసు
కొని ఇశ్రాయేలు దేశానికి వెళ్ళాడు. 22కాని, యూదయ
దేశాన్ని హేరోదుకు మారుగా అతని కుమారుడు అర్కె
లాయు పాలిస్తున్నాడని విని అక్కడికి వెళ్ళటానికి భయ
పడిపొయ్యాడు. అతనికి ఒక కల వచ్చింది. ఆ కలలో
ప్రభువు హెచ్చరించటంవల్ల అతడు గలిలయ ప్రాంతా
నికి వెళ్ళిపొయ్యాడు. 23అక్కడికి వెళ్ళి నజరేతు అనే
గ్రామంలో నివసించాడు. తద్వారా, ఆయన నజరేతు
నివాసి అని పిలువబడతాడు అని దేవుడు ప్రవక్తల
ద్వారా చెప్పిన మాటలు నిజమయ్యాయి.

### యోహాను ఉపదేశించుట

*(మార్కు 1:1-8; లూకా 3:1-9, 15-17;
యోహాను 1:19-28)*

3 బాప్తిస్మము* యిచ్చే యోహాను, ఆ కాలంలో
యూదయ దేశంలోని ఎడారిలో ఉపదేశిస్తూ ఉండే
వాడు. 2అతడు, “దేవుని రాజ్యం సమీపంలోనే ఉంది
కనుక మారుమనస్సు పొందండి!” అని ఉపదేశించాడు.
3ఇతణ్ణి గురించి దేవుడు యెషయా ప్రవక్త ద్వారా ఈ
విధంగా చెప్పాడు:

“‘ప్రభువు మార్గాన్ని సిద్ధం చెయ్యమని,
తిన్నని మార్గాన్ని వెయ్యమని’ ఎడారిలో
ఒక గొంతు ఎలుగెత్తి పలికింది”
*యెషయా 40:3*

4యోహాను ఒంటె వెంట్రుకలతో చెయ్య బడిన
వస్త్రాల్ని ధరించి, నడుముకు తోలు దట్టి కట్టుకొని,
మిడుతల్ని, అడవి తేనెను తింటూ జీవించేవాడు.
5యెరూషలేము నుండి, యూదయ దేశము నుండి
యొర్దాను నదీ ప్రాంతాలన్నిటి నుండి ప్రజలు అతని
దగ్గరకు వెళ్ళి, 6తాము చేసిన పాపాల్ని ఒప్పుకొనే
వాళ్ళు. అతడు వాళ్ళకు యొర్దాను నదిలో బాప్తిస్మము
నిచ్చేవాడు. 7పరిసయ్యులు* సద్దూకయ్యులు*
యోహాను బాప్తిస్మమునిస్తున్న ప్రాంతానికి వచ్చారు.
అతడు వాళ్ళను చూసి, “మీరు సర్పసంతానం. దేవుని
కోపం నుండి తప్పించుకొనుటకు మిమ్మల్ని ఎవరు
హెచ్చరించారు? 8మీరు మారుమనస్సు పొందినట్లుగా
మీ ప్రవర్తన మార్చుకోండి. 9‘అబ్రాహాము మా తండ్రి’
అని మీలో మీరు గర్వించకండి. ఈ రాళ్ళ నుండి
దేవుడు అబ్రాహాముకు సంతానాన్ని సృష్టించ గలడని
నేను చెబుతున్నాను. 10చెట్ల వేర్ల మీద గొడ్డలి సిద్ధంగా
ఉంది. దేవుడు మంచి ఫలమివ్వని చెట్లను నరికి మంట
ల్లోకి వేస్తాడు.
11“మీరు మారుమనస్సు పొందారు కనుక నేను
మీకు బాప్తిస్మము నిస్తున్నాను. కాని నా తర్వాత
రానున్న వాడు నా కన్నా శక్తి కలవాడు! ఆయన
చెప్పుల్ని మోయటానికి కూడా నేను తగను. ఆయన
మీకు పవిత్రాత్మతో, అగ్నితో, బాప్తిస్మము నిస్తాడు.
12తూర్పార బట్టే చేట ఆయన చేతిలో ఉంది. ఆయన
కళ్ళమును శుభ్రం చేసి తన గోధుమల్ని ధాన్యపు
కొట్టులో వేసుకొంటాడు. పొట్టును ఆరని మంటల్లో
వేసి కాలుస్తాడు.”

### యేసు బాప్తిస్మము పొందటం

*(మార్కు 1:9-11; లూకా 3:21-22)*

13గలిలయ నుండి యేసు యోహాను ద్వారా బాప్తి
స్మము పొందటానికి యొర్దాను నదీ ప్రాంతానికి
వచ్చాడు. 14కాని యోహాను ఆయనతో, “నీ ద్వారా
నేను బాప్తిస్మము పొందాలి కాని, నీవు నా ద్వారా బాప్తి
స్మము పొందటానికి రావటమా?” అని అంటూ
యేసును ఆపటానికి ప్రయత్నించాడు.
15యేసు సమాధానంగా, “ప్రస్తుతానికి ఇది జరుగ
నివ్వుము. నీతిని నిలబెట్టటానికి మనమిలా చెయ్యటం
సమంజసమే!” అని అన్నాడు. దీనికి యోహాను అంగీక
రించాడు. 16యేసు బాప్తిస్మము పొంది, నీళ్ళ నుండి
వెలుపలికి రాగానే అదే క్షణంలో ఆకాశం తెరుచుకొంది.
దేవుని ఆత్మ ఒక పావురంలాగ తన మీదికి రావటం
యేసు చూసాడు. 17పరలోకంనుండి ఒక స్వరం,
“ఈయన నా ప్రియ కుమారుడు. ఇతని పట్ల నాకెంతో
ఆనందం” అని అన్నది.

### యేసుకు కలిగిన పరీక్షలు

*(మార్కు 1:12-13; లూకా 4:1-13)*

4 ఆ తర్వాత సైతాను కలిగించే పరీక్షల్ని ఎదుర్కో
వాలని పవిత్రాత్మ యేసును ఎడారి ప్రదేశానికి
తీసుకు వెళ్ళాడు. 2అక్కడ యేసు నలభై రోజులు
ఉపవాసం చేసాడు. ఆ తర్వాత ఆయనకు ఆకలి
వేసింది. 3సైతాను ఆయన దగ్గరకు వచ్చి, “నీవు
దేవుని కుమారుడవైతే ఈ రాళ్ళను రొట్టెలుగా
మార్చు” అని అన్నాడు. 4యేసు సమాధానంగా,

---

**బాప్తిస్మము** ఇది గ్రీకు పదము. ఇంగ్లీషులో బాప్టిజమ్. దీని అర్థము ప్రత్యేకమైన నీటి మునక.

**పరిసయ్యులు** యూదుల ధర్మశాస్త్రాన్ని, వాళ్ళ ఆచారాల్ని శ్రద్ధగా పాటించే ఒక యూదుల శాఖ.

**సద్దూకయ్యులు** రాజకీయ ప్రభావంగల యూదుల శాఖ. చనిపోయిన వారు బ్రతికిరారని వాదించేవారు.

"'మనుష్యులను బ్రతికించేది కేవలం ఆహారం మాత్రమే కాదు. కాని దేవుడు పలికిన ప్రతి మాటవలన బ్రతకగలడు' అని వ్రాసారు" అని అన్నాడు.

ద్వితీయోపదేశ *8:3*

[5]ఆ తర్వాత సైతాను ఆయన్ని పవిత్ర నగరానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ దేవాలయం మీది ఒక ఎత్తైన స్థలంపై నిలుచో బెట్టి, [6]"నీవు దేవుని కుమారుడవైతే క్రిందికి దూకు, ఎందుకంటే,

'నీకు సహాయం చెయ్యమని, దేవుడు తన దూతల్ని ఆజ్ఞాపిస్తాడు. వాళ్ళు వచ్చి నీ పాదం ఏ రాయికీ తగలకుండా నిన్ను తమ హస్తాలతో ఎత్తి పట్టుకొంటారు అని వ్రాసి వుంది కదా!'" అని అన్నాడు.

కీర్తన *91:11-12*

[7]యేసు వానితో,

"'నీ ప్రభువైన దేవుణ్ణి పరీక్షించరాదు!'

ద్వితీయోపదేశ *6:16*

అని కూడా వ్రాసి వుంది" అని అన్నాడు.

[8]సైతాను ఆయన్ని ఎత్తైన ఒక పర్వతం మీదికి తీసుకు వెళ్ళి ఆయనకు ప్రపంచంలోని రాజ్యాలను, వాటి వైభవాన్ని చూపి, [9]"నీవు నా ముందు మోకరిల్లి నన్ను పూజిస్తే వీటన్నిటిని నీకిస్తాను" అని అన్నాడు. [10]యేసు:

"సైతానా! నా ముందునుండి వెళ్ళిపో! ఎందుకంటే 'నీ ప్రభువైన దేవుణ్ణి ఆరాధించాలి. ఆయన సేవ మాత్రమే చెయ్యాలి!'

ద్వితీయోపదేశ *6:13*

అని కూడా వ్రాసి వుంది" అని అన్నాడు.

[11]అప్పుడు సైతాను ఆయన్ని వదిలి వెళ్ళిపోయ్యాడు. తర్వాత దేవదూతలు వచ్చి యేసుకు పరిచర్యలు చేసారు.

### గలిలయకు తిరిగి రావటం

*(మార్కు 1:14-15; లూకా 4:14-15)*

[12]యోహాను కారాగారంలో ఉన్నాడని విని యేసు గలిలయకు తిరిగి వచ్చాడు. [13]ఆయన నజరేతును వదిలి, అక్కడి నుండి కపెర్నహూము అనే పట్టణానికి వెళ్ళి అక్కడ నివసించాడు. కపెర్నహూము, జెబూలూను మరియు నఫ్తాలి ప్రాంతంలోని సరస్సు ఒడ్డున ఉంది. [14]ఈయన ఇలా చెయ్యటం వల్ల దేవుడు యెషయా ప్రవక్త ద్వారా చెప్పిన విషయాలు నిజమయ్యాయి. [15]యెషయా ప్రవక్త ఈ విధంగా అన్నాడు:

"జెబూలూను ప్రాంతమా! నఫ్తాలి ప్రాంతమా! సముద్రం ప్రక్కన ఉన్న ఓ జనమా! యొర్దాను నదికి అవతలి వైపున నున్న ప్రదేశమా! యూదులుకాని వాళ్ళు నివసించే ఓ గలిలయా!

[16] చీకట్లో నివసిస్తున్న ప్రజలు గొప్ప వెలుగును చూసారు! మృత్యుఛాయలు పడే ప్రాంతాల్లో నివసిస్తున్న ప్రజలపై వెలుగు ప్రకాశించింది." యెషయా *9:1-2*

[17]ఆ నాటి నుండి యేసు, "దేవుని రాజ్యం దగ్గరలోనే వుంది. కనుక మారుమనస్సు పొందండి!" అని ఉపదేశించటం మొదలు పెట్టాడు.

### యేసు శిష్యులు

*(మార్కు 1:16-20; లూకా 5:1-11)*

[18]యేసు గలిలయ సముద్రం ఒడ్డున నడుస్తూ పేతురు అని పిలువబడే సీమోనును, అతని సోదరుడు అంద్రెయను చూశాడు. ఈ సోదరులు చేపలు పట్టే వారు. వాళ్ళు అప్పుడు నీళ్ళల్లో వల వేస్తూ ఉన్నారు. [19]యేసు వాళ్ళతో, "నన్ను అనుసరించండి! మీరు మనుష్యుల్ని పట్టుకొనేటట్లు చేస్తాను" అని అన్నాడు. [20]వాళ్ళు వెంటనే తమ వలల్ని వదిలి ఆయన్ని అనుసరించారు.

[21]యేసు అక్కడ నుండి వెళ్తూ మరో యిద్దర్ని చూశాడు. వాళ్ళు కూడా సోదరులు. ఒకని పేరు యాకోబు, మరొకని పేరు యోహాను. తండ్రి పేరు జెబెదయి. ఆ సోదరులు తమ తండ్రితో కలసి పడవలో కూర్చొని వలను సరిచేసు కొంటూ ఉన్నారు. యేసు వాళ్ళను పిలిచాడు. [22]వాళ్ళు వెంటనే పడవను, తమ తండ్రిని వదిలి ఆయన్ని అనుసరించారు.

[23]యేసు సమాజమందిరాల్లో బోధిస్తూ దేవుని రాజ్యాన్ని గురించి సువార్త ప్రకటిస్తూ గలిలయ ప్రాంతమంతా పర్యటించాడు. ఆయన ప్రతి రోగిని, బాధ పడ్తున్న ప్రతి వ్యక్తిని బాగు చేసాడు. [24]ఆయన కీర్తి సిరియ దేశమంతటా వ్యాపిస్తూవుండింది. ప్రజలు రకరకాల రోగాలు ఉన్నవాళ్ళను, బాధ పడ్తున్న వాళ్ళను, దయ్యాలు పట్టిన వాళ్ళను, మూర్ఛరోగుల్ని, పక్షవాత రోగుల్ని, ఆయన దగ్గరకు పిలుచుకొని వచ్చారు. ఆయన వాళ్ళను నయం చేశాడు. [25]గలిలయ నుండి, దెకపొలి* నుండి, యెరూషలేము నుండి, యూదయ

---

**దెకపొలి** అంటే పది పట్టణాలు.

నుండి, యొర్దాను నది అవతలి వైపుననున్న ప్రాంతాల
నుండి ప్రజలు గుంపులు గుంపులుగా ఆయన్ని అను
సరించారు.

## కొండ మీద ఉపదేశం

*(లూకా 6:20-23)*

5 యేసు ప్రజా సమూహాల్ని చూసి ఒక కొండ
మీదికి వెళ్ళి కూర్చొన్నాడు. ఆ తర్వాత ఆయన
శిష్యులు ఆయన దగ్గరకు వెళ్ళారు. 2యేసు ఈ విధంగా
ఉపదేశించటం మొదలు పెట్టాడు:

3 “ఆధ్యాత్మికంగా దీనులుగా ఉన్న వాళ్ళదే
దేవుని రాజ్యం. కనుక వాళ్ళు ధన్యులు.
4 దుఃఖించే వాళ్ళను దేవుడు ఓదారుస్తాడు
కనుక వాళ్ళు ధన్యులు.
5 నెమ్మది స్వభావం కలవాళ్ళు భూలోకానికి
వారసులౌతారు. కనుక వాళ్ళు ధన్యులు.
6 అన్నిటికన్నా నీతి విషయమై ప్రయాసపడే
వాళ్ళకు ప్రతిఫలం దొరుకుతుంది. గనుక
వాళ్ళు ధన్యులు.
7 దయగల వాళ్ళకు దేవుని దయ దొరుకు
తుంది. కనుక వాళ్ళు ధన్యులు.
8 శుద్ధ హృదయం కలవాళ్ళు దేవుణ్ణి
చూస్తారు. కనుక వాళ్ళు ధన్యులు.
9 శాంతి స్థాపకుల్ని దేవుడు తన కుమారులుగా
పరిగణిస్తాడు. కనుక శాంతి స్థాపకులు
ధన్యులు.
10 నీతి కోసం హింసల్ని అనుభవించిన వాళ్ళదే
దేవుని రాజ్యం కనుక వాళ్ళు ధన్యులు.

11-12 “నా కారణంగా ప్రజలు మిమ్మల్ని అవమా
నిస్తే లేక హింసిస్తే లేక అన్యాయంగా చెడు మాటలు
పలికితే, మీకు పరలోకంలో గొప్ప బహుమతి లభి
స్తుంది. కనుక మీరు ధన్యులు. ఆనందించండి. వాళ్ళు
మిమ్మల్ని హింసించినట్లే మీ కన్నా ముందున్న ప్రవ
క్తల్ని కూడ హింసించారు.

## ఉప్పు – వెలుగు

*(మార్కు 9:50; లూకా 14:34-35)*

13“మీరు ఈ ప్రపంచానికి ఉప్పు లాంటి వాళ్ళు.
కాని ఉప్పులోవున్న ఉప్పు గుణం పోతే మళ్ళీ దాన్ని
ఉప్పుగా ఎలా చెయ్యగలం? అది దేనికీ పనికి రాకుండా
పోతుంది. అంతేకాక, దాన్ని పార వేయవలసి వస్తుంది.
ప్రజలు దాన్ని త్రొక్కుతూ నడుస్తారు.
14“మీరు ఈ ప్రపంచానికి వెలుగు లాంటి వాళ్ళు.
కొండ మీద ఉన్న పట్టణాన్ని మరుగు పరచటం అసం
భవం.
15దీపాన్ని వెలిగించి దాన్ని ఎవ్వరూ గంప క్రింద
దాచి ఉంచరు. దానికి మారుగా దాన్ని వెలిగించి
ముక్కాలి పీటపై ఉంచుతారు. అప్పుడది యింట్లోని
వాళ్ళందరికి వెలుగునిస్తుంది. 16అదే విధంగా మీ జీవితం
వెలుగులా ప్రకాశించాలి. అప్పుడు యితర్లు మీరు
చేస్తున్న మంచి పనులు చూసి పరలోకంలో ఉన్న
మీ తండ్రిని స్తుతిస్తారు.

## ధర్మశాస్త్రాన్ని గురించి ఉపదేశం

17“నేను ధర్మశాస్త్రాన్ని కాని, ప్రవక్తల వచనాలను
కాని రద్దు చేయటానికి వచ్చానని అనుకోవద్దు. నేను
వాటిని రద్దుచేయటానికి రాలేదు. వాటిని పూర్తి చేయ
టానికి వచ్చాను. 18ఇది సత్యం. భూమి, ఆకాశం గడచి
పోయేలోపుల అన్ని సంగతులు, ధర్మశాస్త్రంలోని చిన్న
అక్షరం, పొల్లుతో సహా నెరవేరుతాయి. 19ఒక చిన్న
ఆజ్ఞనైనా సరే రద్దుచేసిన వాడును, తనలాగే చెయ్యమని
బోధించిన వాడును దేవుని రాజ్యంలో తక్కువ వాడుగా
ఎంచబడుతాడు. కాని ఈ ఆజ్ఞల్ని అనుసరిస్తూ వాటిని
బోధించినవాడు దేవుని రాజ్యంలో గొప్పవానిగా
ఎంచబడతాడు. 20ఎందుకంటే, మీరు శాస్త్రులకన్నా,
పరిసయ్యుల* కన్నా గొప్ప నీతిమంతులని గుర్తింప
బడకపోతే దేవుని రాజ్యంలోకి ప్రవేశింపలేరని నేను
చెబుతున్నాను.

## హత్య చెయ్య రాదు

21“పూర్వంలో ‘హత్య చేయ రాదు, హత్య చేసిన
వానికి శిక్ష పడుతుంది’ అని ప్రజలకు చెప్పటం మీరు
విన్నారు. 22కాని నేను చెప్పే దేమిటంటే తన సోదరు
నిపై కోపగించిన* ప్రతి వ్యక్తి శిక్షింపబడతాడు. తన
సోదరుణ్ణి ‘పనికిమాలినవాడా’ అన్న ప్రతి వ్యక్తి మహాస
భకు సమాధానం చెప్పవలసి ఉంటుంది. తన సోదరుణ్ణి
‘మూర్ఖుడా!’ అన్న ప్రతి వ్యక్తి నరకంలో అగ్నిపాలు
కావలసి వస్తుంది. 23-24“మీరు, మీ కానుకను బలిపీఠం
దగ్గరవుంచటానికి ముందు, మీ సోదరునికి మీపై ఏ
కారణం చేతనైనా కోపం ఉందని జ్ఞాపకం వస్తే మీ
కానుకను అక్కడే వదిలి వెళ్ళండి. వెళ్ళి, మీ సోదరునితో
ముందు రాజీ పడండి. ఆ తర్వాత వచ్చి మీ కానుకను
అర్పించండి. 25“మీరు, మీ ప్రతివాదితో దారిలో ఉన్న
ప్పుడే అతనితో మీకున్న సమస్యల్ని త్వరగా పరిష్క
రించుకోండి. అలా చేయక పోతే అతడు మిమ్మల్ని

---

**పరిసయ్యులు** యూదుల న్యాయశాస్త్రాన్ని, వాళ్ళ ఆచారాల్ని నిష్టగా పాటించే ఒక యూదుల శాఖ.

**కోపగించిన** కొన్ని వ్రాత ప్రతులలో కారణం లేకుండా అని చేర్చబడి ఉంది.

న్యాయాధిపతికి అప్పగించవచ్చు. ఆ న్యాయాధిపతి
మిమ్మల్ని భటునికి అప్పగించవచ్చు. ఆ భటుడు
మిమ్మల్ని కారాగారంలో పడవేయవచ్చు. 26ఇది
సత్యం. మీరు చెల్లించవలసిన చివరికాసు చెల్లించే వరకు
మీరా కారాగారం నుండి బయటపడరు.

## వ్యభిచారం చేయరాదు

27“‘వ్యభిచారం చేయరాదు’* అని చెప్పటం మీరు
విన్నారు. 28కాని నేను చెప్పేదేమిటంటే, పరస్త్రీ వైపు
కామంతో చూసిన వాడు, హృదయంలో ఆమెతో
వ్యభిచరించిన వానిగా పరిగణింపబడతాడు. 29మీరు
పాపం చెయ్యటానికి మీ కుడి కన్ను కారణమైతే దాన్ని
పీకి పారవేయండి. మీ శరీరమంతా నరకంలో పడటం
కన్నా మీ శరీరంలోని ఒక అవయవము పోగొట్టు
కోవటం మంచిది. 30మీరు పాపం చెయ్యటానికి మీ
కుడి చెయ్యి కారణమైతే దానిని నరికి పారవేయండి.
మీ శరీరమంతా నరకంలో పడటం కన్నా మీ శరీరంలోని
ఒక అవయవము పోగొట్టుకోవటం మంచిది.
31“‘తన భార్యకు విడాకులివ్వదలచిన వ్యక్తి ఆమెకు
ఒక విడాకుల పత్రం ఇవ్వాలి’* అని చెప్పే వాళ్ళు.
32కాని నేను చెప్పేదేమంటే భార్య మీద వ్యభిచార
కారణంలేకుండా భర్త ఆమెకు విడాకులిస్తే ఆమె
వ్యభిచారిణిగా పరిగణింప బడటానికి అతడు కారకు
డౌతాడు. అలా విడాకులు పొందిన స్త్రీని వివాహమాడిన
వాడు వ్యభిచారిగా పరిగణింపబడతాడు. వ్యభిచార కార
ణాన మాత్రానే తన భార్యకు విడాకులివ్వాలి గాని వేరే
కారణాన కాదు.

## ప్రమాణాలు

33“అంతేకాక మాట తప్పకండి. ప్రభువుతో చేసిన
ప్రమాణాల్ని నిలబెట్టుకోండి, అని పూర్వం ప్రజలకు
చెప్పటం మీరు విన్నారు. 34కాని నేను చెప్పేదేమి
టంటే, దేని మీదా ప్రమాణం చెయ్యకండి. ఆకాశం
దేవుని సింహాసనం కనుక ఆకాశం మీద ప్రమాణం
చెయ్యకండి. 35భూమి దేవుని పాదపీఠం కనుక
భూమ్మీద ప్రమాణం చెయ్యకండి. యెరూషలేము
మహారాజు నగరం కనుక దానిపై ప్రమాణం చెయ్య
కండి.
36మీ తలపై ఉన్న ఒక్క వెంట్రుకను కూడా
తెలుపుగా కాని, నలుపుగా కాని మార్చలేరు. కనుక,
మీ తలపై ప్రమాణం చెయ్యకండి. 37మీరు ‘ఔను’
అని అనాలనుకొంటే ఔననండి. ‘కాదు’ అని అనాలను
కొంటే కాదనండి. మరేవిధమైన ప్రమాణం మీ నుండి
వచ్చినా దానికి కారణం ఆ సైతానే.

**‘వ్యభిచారం చేయరాదు’** నిర్గమ. 20:14.

**‘తన భార్యకు … ఇవ్వాలి’** ద్వితీ. 24:1.

## కంటికి కన్ను

*(లూకా 6:29-30)*

38“‘కంటికి కన్ను, పంటికి పన్ను ఊడ
దీయాలి’* అని అనటం మీరు విన్నారు. 39కాని నేను
చెప్పేదేమిటంటే దుష్టుల్ని ఆపటానికి ప్రయత్నించ
కండి. మిమ్మల్ని ఎవరైనా కుడి చెంపమీద కొడితే
మీ రెండవ చెంప కూడా అతనికి చూపండి. 40ఎవరైనా
మీపై వ్యాజ్యము వేసి మీ చొక్కాను కూడా లాక్కో
వాలని చూస్తే, మీ కండువా కూడా తీసుకు వెళ్ళని
వ్వండి. 41ఎవరైనా మిమ్మల్ని తమతో మైలు దూరం
రమ్మని బలవంతం చేస్తే, అతనితో రెండు మైళ్ళు
వెళ్ళండి. 42అడిగిన వాళ్ళకు ఇవ్వండి. మీ దగ్గర అప్పు
పుచ్చుకోవాలని అనుకొని వచ్చిన వాళ్ళతో లేదనకండి.

## శత్రువుల పట్ల ప్రేమ

*(లూకా 6:27-28, 32-36)*

43“‘పొరుగింటి వాణ్ణి ప్రేమించండి. శత్రువును
ద్వేషించండి’* అని చెప్పటం మీరు విన్నారు. 44కాని
నేను చెప్పేదేమిటంటే ‘మీ శత్రువుల్ని ప్రేమించండి*
మిమ్మల్ని హింసించిన వాళ్ళ కోసం దేవుణ్ణి ప్రార్థిం
చండి.’ 45అప్పుడు మీరు పరలోకంలో ఉన్న మీ
తండ్రికి బిడ్డలౌతారు. ఎందుకంటే దేవుడు చెడ్డ వాళ్ళ
కోసం, మంచి వాళ్ళ కోసం సూర్యోదయం కలిగిస్తాడు.
నీతిమంతుల కోసం, అనీతిమంతుల కోసం వర్షాలు
కురిపిస్తాడు. 46మిమ్మల్ని ప్రేమించిన వాళ్ళను మీరు
ప్రేమిస్తే మీకేం ప్రతిఫలం కలుగుతుంది? పాపులు
కూడా అలాచెయ్యటం లేదా? 47మీ సోదరులకు
మాత్రమే మీరు అభివందనాలు చేస్తే యితర్ల కన్నా
మీరు ఏం గొప్ప? యూదులుకాని వాళ్ళు కూడా
అలా చేస్తారే! 48పరలోకంలో ఉన్న మీ తండ్రి పరి
పూర్ణుడు. మీరును ఆయనలా ఉండాలి.
6 “జాగ్రత్త! మీరు చేసే నీతికార్యాలు ఇతర్లు
చూసేలా చెయ్యకండి. అలా చేస్తే పరలోకంలో
ఉన్న మీ తండ్రి మీకు ప్రతిఫలమివ్వడు.
2“అందువల్ల మీరు దానం చేసినప్పుడు చాటింపు
వేయించుకొని నలుగురికి తెలుపకండి. కపటులు
సమాజాల్లో, వీధుల్లో, ప్రజలు గౌరవించాలని అలా
చేస్తారు. ఇది సత్యం, వాళ్ళకు లభించవలసిన ప్రతి
ఫలం అప్పుడే పూర్తిగా లభించింది. 3కాని, మీరు దానం
చేసేటప్పుడు మీ కుడిచేయి ఏమి యిస్తుందో మీ
ఎడమచేతికి తెలియనివ్వకండి. 4అప్పుడే మీ దానం

**‘కంటికి … ఊడదీయాలి’** నిర్గమ. 21:24.

**‘పొరిగింటి … ద్వేషించండి’** లేవీ. 19:18.

**మీ … ప్రేమించండి** కొన్ని వ్రాత ప్రతులలో, ‘దూషించిన వాణ్ణి ఆశీర్వదించండి. మిమల్ని ద్వేషించిన వాళ్ళకు మంచి చెయ్యండి’ అని చేర్చబడింది.

గుప్తంగా ఉంటుంది. అప్పుడు, మీరు రహస్యంగా చేస్తు
న్నది చూసి మీ తండ్రి మీకు ప్రతిఫలం యిస్తాడు.
5“మీరు ప్రార్థించేటప్పుడు కపటుల్లా ప్రార్థించ
కండి. వాళ్ళు సమాజమందిరాల్లో, వీధుల ప్రక్కన
నిలుచొని నలుగురూ చూడాలని ప్రార్థిస్తారు. అది
వాళ్ళకు ఆనందాన్నిస్తుంది. కాని ఇది సత్యం – వాళ్ళకు
లభించవలసిన ఫలితం వాళ్ళకప్పుడే పూర్తిగా లభిం
చింది. 6మీరు ప్రార్థించేటప్పుడు గదిలోకి వెళ్ళి తలుపు
వేసికొని కనిపించని మీ తండ్రికి ప్రార్థించండి. అప్పుడు
రహస్యంలో ఉండే మీ తండ్రి మీకు ప్రతిఫలం
యిస్తాడు.
7“అంతేకాక, మీరు ప్రార్థించేటప్పుడు యూదు
లుకానివాళ్ళవలె మాట్లాడవద్దు. అలా చేయడంవల్ల
దేవుడు వింటాడని వాళ్ళు అనుకొంటారు. 8వాళ్ళవలె
చేయకండి. మీకేం కావాలో మీరడగక ముందే మీ
తండ్రికి తెలుసు. 9కాబట్టి మీరీ విధంగా ప్రార్థించాలి:

‘పరలోకంలో ఉన్న మా తండ్రీ, నీ పేరు
సదా పవిత్ర పర్చబడాలని మేము ప్రార్థిస్తు
న్నాము.
10 నీ రాజ్యం రావాలనీ, పరలోకంలో నీ
చిత్తం నెరవేరునట్లే ఈ లోకంలో కూడా
నెరవేరాలని మేము ప్రార్థిస్తున్నాము.
11 ప్రతి రోజు మాకు కావలసిన ఆహారం
మాకు దయచేయుము.
12 ఇతరులు మా పట్ల చేసిన పాపాలను
మేము క్షమించినరీతి, మేము చేసిన పాపా
లను కూడా క్షమించుము.
13 మేము శోధనకు గురి అయ్యేలా చేయ
వద్దు. పైగా మమ్ములను దుష్టుని నుండి
కాపాడుము.’*

14“ఇతర్ల తప్పుల్ని మీరు క్షమిస్తే పరలోకంలో
ఉన్న మీ తండ్రి మిమ్మల్ని క్షమిస్తాడు. 15కాని యితర్లను
మీరు క్షమించక పోతే మీ తండ్రి మీ తప్పుల్ని క్షమిం
చడు.
16“కపటులు ఉపవాసం చేసి నప్పుడు ప్రజలు
గమనించాలని తమ ముఖాలు నీరసంగా కనిపించేటట్లు
చేసుకొంటారు. మీరు ఉపవాసం చేసినప్పుడు అలా
చేయకండి. ఇది సత్యం, వాళ్ళు పొందవలసిన ఫలాన్ని
పొందారు. యింకేమీ లభించదు. 17మీరు ఉపవాసం
చేసినప్పుడు తలకు నూనె రాసుకొని ముఖాన్ని
కడుక్కొండి. 18అలా చేస్తే, మీరు ఉపవాసం చేస్తున్నట్లు
ప్రజలకు కనిపించదు. కాని కనిపించని మీ తండ్రికి
మాత్రమే మీరు ఉపవాసం చేస్తున్నట్లు తెలుస్తుంది.
అందువలన రహస్యంగా చూసే మీ తండ్రి మీకు
ప్రతిఫలం యిస్తాడు.
19“మీకోసం ఈ ప్రపంచంలో ధనాన్ని కూడ
బెట్టుకోకండి. ఇక్కడ ఆ ధనానికి చెదలు పట్టుతుంది.
తుప్పు ఆ ధనాన్ని తినివేస్తుంది. దొంగలు పడి దోచు
కొంటారు.
20మీ ధనాన్ని పరలోకంలో కూడ బెట్టు కొండి.
అక్కడ చెదలు పట్టవు, తుప్పు తినివేయదు. దొంగలు
పడి దోచుకోరు. 21మీ సంపద ఎక్కడ ఉంటే మీ
మనస్సు కూడా అక్కడే ఉంటుంది.
22“కన్ను శరీరానికి ఒక దీపం లాంటిది. మీ కళ్ళు
బాగుంటే మీ శరీరమంతా వెలుగుగా ఉంటుంది. 23మీ
కళ్ళు బాగుండకపోతే మీ శరీరమంతా చీకటైపోతుంది.
మీలో ఉన్న వెలుగే చీకటై పోతే ఆ చీకటి ఎంత
భయంకరంగా ఉంటుందో కదా.
24“ఒకే వ్యక్తి యిద్దరు యజమానులకు సేవ చేయ
లేడు. అలా చేస్తే అతడు ఒకణ్ణి ప్రేమించి, యింకొకణ్ణి
ద్వేషిస్తూ ఉంటాడు. లేదా ఒకనికి అతిశ్రద్ధతో సేవ
చేసి, యింకొకణ్ణి అశ్రద్ధ చేస్తాడు. మీరు దేవునికి,
డబ్బుకు సేవకునిగా ఉండటమనేది అసంభవం.
25“అందువల్ల నేను చెప్పేదేమిటంటే, మీ జీవి
తాలకు కావలసిన ఆహారాన్ని గురించి కాని, మీ దేహా
లకు కావలసిన దుస్తుల్ని గురించి కాని చింతించకండి.
జీవితం ఆహారం కన్నా, దేహం దుస్తులకన్నా, ముఖ్య
మైనవి కావా. 26ఆకాశంలో ఎగిరే పక్షుల్ని గమనించండి.
అవి విత్తనం విత్తి పంటను పండించవు. ధాన్యాన్ని
ధాన్యపు కొట్టులో దాచివుంచవు. అయినా పర
లోకంలోవున్న మీ తండ్రి వాటికి ఆహారాన్ని యిస్తాడు.
మీరు వాటికన్నా విలువైన వాళ్ళు కారా! 27చింతించి
తన జీవితకాలాన్ని ఒక్క ఘడియ పొడిగించగలవాడు
మీలో ఎవరైనా ఉన్నారా?
28“మీరు దుస్తుల్ని గురించి ఎందుకు చింతిస్తు
న్నారు? గడ్డిమీద పెరిగే పువ్వుల్ని గమనించండి. అవి
పని చేసి దారాన్ని వడకవు. 29అయినా, నేను చెప్పే
దేమిటంటే గొప్ప వైభవమున్న సొలొమోను రాజు
కూడా అలంకరణలో ఈ పువ్వుల్లోని ఒక్క పువ్వుతో
కూడా సరితూగలేడు. 30ఈనాడు ఉండి రేపు మంటల్లో
పారవేయబడే ఈ గడ్డిని దేవుడంత అందంగా అలం
కరిస్తే మిమ్మల్ని యింకెంత అందంగా అలంకరిస్తాడో
కదా! మీలో దృఢ విశ్వాసం లేదు. 31‘ఏమి తినాలి?
ఏమి త్రాగాలి? ఏ దుస్తుల్ని వేసుకోవాలి?’ అని చింతిం
చకండి. 32యూదులు కానివాళ్ళు వాటివైపు పరుగె
త్తుతూ ఉంటారు. పరలోకంలో ఉన్న మీ తండ్రికి
యివన్నీ మీకవసరమని తెలుసు. 33కాని మొదట
ఆయన రాజ్యం కొఱకు, నీతి కొఱకు ప్రయాస
పడండి; అప్పుడు అవన్నీ దేవుడు మీకిస్తాడు. 34రేపటిని

**వచనము 13** కొన్ని వ్రాత ప్రతులలో, “ఎందుకంటే రాజ్యము, అధికారము, మహిమ చిరకాలము నీవే. ఆమేన్, అని చేర్చబడివుంది.”

గురించి చింతించకండి. రేపటి చింత రేపటిదే.
ఏరోజుకు తగ్గ కష్టాలు ఆరోజుకు ఉన్నాయి.

## ప్రజలపై తీర్పు చెప్పే విషయంలో యేసు బోధించుట

*(లూకా 6:37-38, 41-42)*

7 “ఇతర్లపై తీర్పు చెప్పకండి. అలా చేస్తే ఇతర్లు
కూడ మీపై తీర్పు చెబుతారు. 2మీరు ఇతర్లపై
తీర్పు చెప్పినట్లే ఇతర్లు మీపై కూడా తీర్పు చెబుతారు.
మీరు కొలిచిన కొలతతో ఇతర్లు మీకు కొలిచి ఇస్తారు.
3మీరు మీ సోదరుని కంట్లో ఉన్న నలుసును గమని
స్తారు. కాని మీ కంట్లో ఉన్న దూలాన్ని గమనిం
చరెందుకు? 4మీ కంట్లో దూలం పెట్టుకొని ‘నీ కంట్లో
ఉన్న నలుసును నన్ను తీయనివ్వు!’ అని మీ సోదరు
నితో ఎట్లా అనగలుగుతున్నారు? 5కపటీ! మొదట నీ
కంట్లో ఉన్న దూలాన్ని నన్ను తీసివేయనీ! అప్పుడు
నీవు స్పష్టంగా చూడకలిగి, నీ సోదరుని కంట్లో ఉన్న
నలుసును తీయకలుగుతావు.
6“పవిత్రమైన దాన్ని కుక్కలకు పెట్టకండి. అలా
చేస్తే అవి తిరగబడి మిమ్మల్ని చీల్చి వేస్తాయి. ముత్యా
లను పందుల ముందు వేయకండి. వేస్తే అవి వాటిని
కాళ్ళ క్రింద త్రొక్కి పాడుచేస్తాయి.

## అడగండి; వెతకండి; తట్టండి

*(లూకా 11:9-13)*

7“అడిగితే లభిస్తుంది. వెతికితే దొరుకుతుంది.
తట్టితే తలుపు తెరుచుకుంటుంది. 8ఎందుకంటే, అడి
గిన ప్రతి ఒక్కనికి లభిస్తుంది. వెతికిన ప్రతి ఒక్కనికి
దొరుకుతుంది. తట్టిన ప్రతి ఒక్కని కోసం తలుపు
తెరుచుకుంటుంది.
9“రొట్టె నడిగితే రాయినిచ్చే తండ్రి మీలో
ఎవడైనా ఉన్నాడా? 10లేక చేపనడిగితే పామునెవరైనా
యిస్తారా? 11దుష్టులైన మీకే మీ పిల్లలకు మంచి కాను
కలివ్వాలని తెలుసు కదా! మరి అలాంటప్పుడు పరలో
కంలోవున్న మీ తండ్రి తన్నడిగిన వాళ్ళకు మంచి
కానుకలివ్వడా? తప్పకుండా యిస్తాడు.

## అతి ముఖ్యమైన నియమం

12“ప్రతి విషయంలో యితర్లు మీకోసం ఏం
చెయ్యాలని మీరు ఆశిస్తారో మీరు యితర్ల కోసం
అదే చెయ్యాలి. ఇదే మోషే ధర్మశాస్త్రం యొక్క,
ప్రవక్తలు ప్రవచించిన వాటి యొక్క అర్థం.

## పరలోకానికి, నరకానికి మార్గాలు

*(లూకా 13:24)*

13-14“నరకానికి వెళ్ళే మార్గము సులభంగా
ఉంటుంది. దాని ద్వారం విశాలంగా ఉంటుంది. చాలా
మంది ఆ ద్వారాన్ని ప్రవేశిస్తారు. పరలోకానికి వెళ్ళే
మార్గము కష్టంగా ఉంటుంది. దాని ద్వారం ఇరుకుగా
ఉంటుంది. కొద్దిమంది మాత్రమే దాన్ని కను
గొంటారు. ఇది గమనించి, ఇరుకైన ద్వారాన్నే ప్రవేశిం
చండి.

## చెట్టు, దాని ఫలము

*(లూకా 6:43-44; 13:25-27)*

15“కపట ప్రవక్తల విషయంలో జాగ్రత్తగా ఉండండి.
వాళ్ళు గొఱ్ఱె తోళ్ళు కప్పుకొని మీ దగ్గరకు వస్తారు.
కాని లోపల క్రూరమైన తోడేళ్ళలా ఉంటారు. 16వాళ్ళ
వల్ల కలిగిన ఫలాన్ని బట్టి వాళ్ళను మీరు గుర్తించ
కలుగుతారు. ముళ్ళపొదల నుండి ద్రాక్షపండ్లను, పల్లేరు
మొక్కల నుండి అంజూరపు పండ్లను పొందగలమా?
17మంచి చెట్టుకు మంచి పండ్లు కాస్తాయి. పులుపు
పండ్లు కాచే చెట్టుకు పులుపు పండ్లు కాస్తాయి. 18మంచి
చెట్టుకు పులుపు పండ్లు కాయవు. పులుపు పండ్లు
కాచే చెట్టుకు మంచి పండ్లు కాయవు. 19దేవుడు మంచి
ఫలమివ్వని చెట్టును నరికి మంటల్లో వేస్తాడు. 20అందు
వల్ల, వాళ్ళవల్ల కలిగిన ఫలాన్ని బట్టి మీరు వాళ్ళను
గుర్తించ కలుగుతారు.
21“నన్ను ప్రభూ! ప్రభూ! అని పిలిచినంత
మాత్రాన దేవుని రాజ్యంలోకి ప్రవేశింపగలమని అను
కోకండి. నా తండ్రి ఇష్టానుసారం నడచుకున్న వాళ్ళు
మాత్రమే ప్రవేశింపగలరు. 22ఆ రోజు చాలా మంది
నాతో ‘ప్రభూ! ప్రభూ! నీపేరిట మేము దైవ సందేశాన్ని
ప్రకటించలేదా? దయ్యాల్ని పారద్రోలలేదా? ఎన్నో
అద్భుతాలు చెయ్యలేదా?’ అని అంటారు. 23అప్పుడు
నేను వాళ్ళతో ‘మీరెవరో నాకు తెలియదు. పాపాత్ము
లారా! నా ముందు నుండి వెళ్ళిపొండి’ అని స్పష్టంగా
చెబుతాను.

## తెలివిగలవాడు, తెలివిలేనివాడు

*(లూకా 6:47-49)*

24“అందువల్ల నామాటలు విని వాటిని ఆచరించే
ప్రతి ఒక్కడూ బండపై తన యింటిని కట్టుకొన్న
వానితో సమానము. 25ఆ ఇల్లు రాతి బండపై నిర్మిం
చబడింది. కనుక వర్షాలుపడి, వరదలు వచ్చి తుఫాను
గాలులు వీచి ఆ యింటిని కొట్టినా ఆయిల్లు పడిపో
లేదు. 26కాని నా మాటలు విని వాటిని ఆచరించని
ప్రతి ఒక్కడూ యిసుకపై తన యింటిని నిర్మించు
కొన్న మూర్ఖునితో సమానము. 27వర్షాలు వచ్చి, వర
దలు వచ్చి, తుఫాను గాలులు వీచి ఆ యింటిని
కొట్టాయి. ఆ యిల్లుకూలి నేలమట్టమై పోయింది”
దాని పతనం భయంకరమైనది.
28-29యేసు చెప్పటం ముగించాడు. ఆయన వాళ్ళ
శాస్త్రులవలే కాకుండా అధికారమున్న వానిలాగ బోధిం

చాడు. కనుక ప్రజలు ఆయన ఉపదేశాలు విని ఆశ్చర్య
పడ్డారు.

### కుష్టు రోగికి నయం కావటం

*(మార్కు 1:40-45; లూకా 5:12-16)*

8 యేసు కొండదిగి రాగా, ప్రజలు గుంపులు
గుంపులుగా ఆయన్ని అనుసరించారు. 2కుష్టు
రోగంతో ఉన్న వాడొకడు వచ్చి ఆయన ముందు
మోకరిల్లి, "మీరు తలచుకొంటే నన్ను బాగు చెయ్య
గలరు" అని అన్నాడు. 3యేసు తన చేయి చాపి
అతణ్ణి తాకుతూ, "నీకు బాగు కావాలని కోరుతున్నాను,
స్వస్థుడవు కమ్ము!" అని అన్నాడు. వెంటనే అతనికి
నయమైపోయింది. 4అప్పుడు యేసు అతనితో, "ఈ
సంఘటనను గురించి ఎవ్వరికీ చెప్పకు. కాని
యాజకుని దగ్గరకు వెళ్ళి నీ దేహాన్ని చూపి, మోషే
ఆజ్ఞాపించిన కానుకను అర్పించు. తద్వారా నీకు
నయమైనట్లు వాళ్ళకు రుజు వౌతుంది" అని అన్నాడు.

### శతాధిపతి యొక్క విశ్వాసం

*(లూకా 7:1-10; యోహాను 4:43-54)*

5యేసు కపెర్నహూము అనే పట్టణానికి వెళ్ళాక
శతాధిపతి ఒకడు ఆయన దగ్గరకు వచ్చి, ఆయన
సహాయం కావాలని కోరుతూ, 6"ప్రభూ! నా సేవకుడు
పక్షవాతం వచ్చి యింట్లో పడుకొని ఉన్నాడు. వానికి
చాలా బాధ కలుగుతోంది" అని అన్నాడు. 7యేసు,
"నేను వచ్చి నయం చేస్తాను" అని అన్నాడు.
8కాని శతాధిపతి సమాధానంగా, "ప్రభూ! మీరు
మా యింటి గడపలో కాలుపెట్టటానికి కూడా నేను
అర్హుడను కాను. కాని మీరు మాటంటే చాలు, నాసేవ
కునికి నయమై పోతుంది. 9ఎందుకంటే, నేను కూడా
అధికారుల క్రింద ఉన్న వాణ్ణి. నా క్రింద కూడా సైని
కులున్నారు. నేను ఈ సైనికునితో 'వెళ్ళు' అంటే
వెళ్తాడు; ఆ సైనికునితో 'రా' అంటే వస్తాడు. నా
సేవకునితో 'ఇది చేయి' అంటే చేస్తాడు" అని అన్నాడు.
10యేసు ఇదివిని ఆశ్చర్యపొయ్యాడు. ఆయన తన
వెంట వస్తున్న వాళ్ళతో, "ఇది సత్యం. ఇంత గొప్ప
విశ్వాసమున్న వ్యక్తి నాకు ఇశ్రాయేలీయులలో ఎవ్వరూ
కనిపించలేదు. 11నేను చెప్పేదేమిటంటే, తూర్పు
నుండి, పడమరనుండి, చాలామంది ప్రజలు వస్తారు.
వచ్చి, అబ్రాహాము, ఇస్సాకు, యాకోబులతో కలిసి
దేవుని రాజ్యంలో జరిగే విందులో పాల్గొంటారు. 12కాని
దేవుడు తన రాజ్యానికి తమ పుట్టుక వల్ల వారసులైన
వాళ్ళను అవతల దూరంగా చీకట్లో పారవే స్తాడు.
అక్కడ వాళ్ళు ఏడుస్తూ బాధననుభవిస్తారు."
13ఇలా అని, యేసు శతాధిపతితో, "వెళ్ళు! నీవు
విశ్వసించినట్లే జరుగుతుంది" అని అన్నాడు. అదే
క్షణంలో అతని సేవకునికి నయమైపోయింది.

### యేసు అనేకులకు నయం చెయ్యటం

*(మార్కు 1:29-34; లూకా 4:38-41)*

14యేసు పేతురు యింటికి వచ్చి పేతురు అత్త
జ్వరంతో మంచం పట్టి ఉండటం చూసాడు.
15ఆయన ఆమె చేతిని తాకగానే, జ్వరం ఆమెను
వదిలి వెళ్ళి పోయింది. ఆమె లేచి ఆయనకు సపర్యలు
చెయ్యటం మొదలుపెట్టింది.
16ప్రజలు సాయంత్రం కాగానే, దయ్యాలు పట్టిన
వాళ్ళను చాలా మందిని యేసు దగ్గరకు పిలుచుకు
వచ్చారు. ఆయన ఒక మాటతో దయ్యాల్ని వదిలిం
చాడు. రోగాలున్న వాళ్ళందరికి నయం చేసాడు.
17యెషయా ప్రవక్త ద్వారా దేవుడు పలికిన ఈ
మాటలు నిజం కావటానికి ఇలా జరిగింది:

"మన రోగాల్ని ఆయన తనపై వేసు
కొన్నాడు. మన బాధల్ని ఆయన అను
భవించాడు."

*యెషయా 53:4*

### యేసును అనుసరించటానికి చెల్లించవలసిన వెల

*(లూకా 9:57-62)*

18యేసు తన చుట్టూ ఉన్న ప్రజల గుంపును
చూసి, తన శిష్యులతో సరస్సు అవతలి వైపుకు వెళ్ళం
డని అన్నాడు. 19అప్పుడు శాస్త్రుడొకడు ఆయన దగ్గర
కు వచ్చి, "బోధకుడా! మీరెక్కడికి వెళ్తే నేనక్కడికి
వస్తాను" అని అన్నాడు.
20యేసు, "నక్కలు దాక్కోవటానికి బిలము
లున్నాయి. గాలిలో ఎగిరే పక్షులు ఉండటానికి గూళ్ళు
న్నాయి. కాని మనుష్యకుమారుడు తల వాల్చటానికి
కూడ స్థలం లేదు" అని అతనితో అన్నాడు.
21మరొక శిష్యుడు, "ప్రభూ! మొదట నా తండ్రిని
సమాధి చేసుకోనివ్వండి" అని అన్నాడు.
22యేసు అతనితో, "చనిపోయిన తమ వాళ్ళను
చనిపోయే వాళ్ళు సమాధి చేసుకోనిమ్ము! నీవు నన్ను
అనుసరించు!" అని అన్నాడు.

### యేసు తుఫానును అణచివేయుట

*(మార్కు 4:35-41; లూకా 8:22-25)*

23యేసు పడవనెక్కాడు. ఆయన శిష్యులు
ఆయన్ని అనుసరించారు. 24అకస్మాత్తుగా ఒక పెద్ద
తుఫాను ఆ సరస్సు మీదికి రావటం వల్ల ఆ పడవ
అలల్లో చిక్కుకు పోయింది. ఆసమయంలో యేసు
నిద్రపోతూ ఉన్నాడు. 25శిష్యులు ఆయన దగ్గరకు
వచ్చి ఆయన్ని నిద్రలేపుతూ, "ప్రభూ! రక్షించండి.
మునిగిపోతున్నాము!" అని అన్నారు.
26యేసు, "మీ విశ్వాసం ఏమైంది? ఎందుకు భయ
పడుతున్నారు?" అని అంటూ లేచి గాలిని, అలల్ని

శాంతించమని ఆజ్ఞాపించాడు. అవి శాంతించాయి.
27వాళ్ళు ఆశ్చర్యపడి, “ఈయనేలాంటి వాడు? గాలి,
అలలు కూడా ఈయన మాట వింటున్నాయే!” అని
అన్నారు.

## దయ్యం పట్టిన యిద్దరిని నయం చేయటం

*(మార్కు 5:1-20; లూకా 8:26-39)*

28యేసు, సరస్సు ఆవలి వైపునున్న గదరేనీ
యుల ప్రాంతాన్ని చేరుకున్నాడు. దయ్యాలు పట్టిన
మనుష్యులిద్దరు స్మశానం నుండి వచ్చి ఆయన్ని
కలుసుకొన్నారు. వీళ్ళ క్రూర ప్రవర్తన వల్ల ఆ దారి
మీద ఎవ్వరూ వెళ్ళేవాళ్ళు కారు. 29అవి, “దేవుని
కుమారుడా! మాకేం చెయ్యాలని వచ్చావు తగిన
సమయం రాకముందే మమ్మల్ని శిక్షించాలని యిక్కడికి
వచ్చారా?” అని బిగ్గరగా అన్నాయి.
30వాళ్ళకు కొంత దూరంలో ఒక పెద్ద పందుల
గుంపు మేస్తూ ఉంది. 31ఆ దయ్యాలు యేసుతో,
“మీరు మమ్మల్ని వెళ్ళగొట్టాలని అనుకొంటే ఆ
పందుల గుంపులోకి పంపండి” అని ప్రాధేయపడ్డాయి.
32ఆయన వాటితో, “వెళ్ళండి!” అని అన్నాడు.
అందువల్ల అవి వెలుపలికి వచ్చి ఆ పందుల్లోకి ప్రవేశిం
చాయి. ఆ పందుల గుంపంతా నిటారుగా ఉన్న కొండ
మీదనుండి జారి సరస్సులో పడి చనిపొయ్యాయి.
33ఆ పందుల్ని కాస్తున్న వాళ్ళు అక్కడి నుండి పరుగెత్తి
గ్రామంలోకి వెళ్ళి జరిగిందంతా, అంటే ఆ దయ్యం
పట్టిన వాళ్ళ కేమైందో అంతా చెప్పారు. 34ఇది విని
ఆ గ్రామమంతా యేసును కలవటానికి వచ్చింది. వాళ్ళా
యన్ని చూసాక తమ పరిసరాల్ని వదిలి వెళ్ళమని
ఆయనను ప్రాధేయ పడ్డారు.

## యేసు పక్షవాత రోగికి నయం చెయ్యటం

*(మార్కు 2:1-12; లూకా 5:17-26)*

9 యేసు పడవనెక్కి సముద్రం దాటి తన స్వగ్రామా
నికి వచ్చాడు. 2కొందరు వ్యక్తులు మంచం పట్టిన
ఒక పక్షవాత రోగిని చాప మీద పడుకోబెట్టి ఆయన
దగ్గరకు తీసికొని వచ్చారు. యేసు వాళ్ళ విశ్వాసాన్ని
చూసి ఆ పక్షవాత రోగితో, “ధైర్యంగా ఉండు, నీ
పాపాలు క్షమించబడ్డాయి” అని అన్నాడు.
3ఇది విని కొందరు శాస్త్రులు తమలో తాము,
“ఇతడు దైవ దూషణ చేస్తున్నాడు” అని అను
కొన్నారు.
4వాళ్ళు ఏమనుకొంటున్నారో యేసుకు తెలిసి
పోయింది. ఆయన వాళ్ళతో, “మీ హృదయాల్లోకి
దురాలోచనల్ని ఎందుకు రానిస్తారు? 5‘నీ పాపాలు
క్షమించబడ్డాయి’ అని అనటం సులభమా లేక ‘లేచి
నిలుచో’ అని అనటం సులభమా? 6పాపాలు క్షమించ
టానికి మనుష్య కుమారునికి అధికారముందని మీకు
తెలియాలి!” అని వాళ్ళతో అన్నాక, పక్షవాత రోగితో,
“లే! నీ చాపను తీసికొని యింటికి వెళ్ళు!” అని
అన్నాడు. 7పక్షవాతంతో ఉన్నవాడు లేచి యింటికి
వెళ్ళాడు. 8ఇది చూసి అక్కడున్న ప్రజల్లో భక్తి కలిగింది.
మానవులకు ఇలాంటి అధికారమిచ్చిన దేవుణ్ణి వాళ్ళు
స్తుతించారు.

## మత్తయిని పిలవటం

*(మార్కు 2:13-17; లూకా 5:27-32)*

9యేసు అక్కడి నుండి బయలుదేరి వెళ్తుండగా,
మత్తయి అనేవాడు కూర్చొని పన్నులు వసూలు చేస్తూ
ఉండటం చూసాడు. యేసు అతనితో, “నన్ను అనుస
రించు!” అని అన్నాడు. మత్తయి లేచి ఆయన్ని అనుస
రించాడు.
10యేసు మత్తయి యింట్లో భోజనానికి కూర్చుని
ఉండగా, చాలామంది పన్నులు సేకరించే వాళ్ళు,
పాపులు వచ్చారు. వాళ్ళంతా యేసుతో, ఆయన
శిష్యులతో కలిసి భోజనానికి కూర్చున్నారు. 11పరిస
య్యులు ఇది గమనించి యేసు శిష్యులతో, “మీ
ప్రభువు పన్నులు సేకరించే వారితోను, పాపులతోను
కలిసి ఎందుకు భోజనం చేస్తాడు?” అని అడిగారు.
12యేసు ఇదివిని, “ఆరోగ్యంగా ఉన్న వాళ్ళకు వైద్యుని
అవసరం ఉండదు. రోగంతో ఉన్న వాళ్ళకే వైద్యుని
అవసరం ఉంటుంది. 13‘నేను కోరేది దయ, జంతువుల
బలినికాదు’* అనే వాక్యానికి అర్థమేమిటో వెళ్ళి నేర్చు
కోండి. ఎందుకంటే నేను నీతిమంతులను పిలవటానికి
రాలేదు. పాపులను పిలవటానికి వచ్చాను” అని
అన్నాడు.

## ఉపవాసం

*(మార్కు 2:18-22; లూకా 5:33-39)*

14ఆ తర్వాత యోహాను శిష్యులు వచ్చి, యేసును,
“మేము, పరిసయ్యులు ఉపవాసం చేస్తాం కదా; మరి
మీ శిష్యులు ఉపవాసం ఎందుకు చెయ్యరు?” అని
అడిగారు.
15యేసు, “పెళ్ళికుమారుని అతిథులు పెళ్ళి కుమా
రుడు వాళ్ళతో ఉండగా ఎందుకు ఉపవాసం చేస్తారు?
పెళ్ళి కుమారుడు వెళ్ళి పోయే సమయం వస్తుంది.
అప్పుడు వాళ్ళు ఉపవాసం చేస్తారు” అని సమాధానం
చెప్పాడు.
16“పాత వస్త్రం యొక్క చిరుగును క్రొత్త వస్త్రంతో
కుట్టరు. అలా చేస్తే ఆ అతుకు చినిగిపోతుంది. అంతే
కాక ఆ చిల్లు యింకా పెద్దదౌతుంది. 17అదే విధంగా
క్రొత్త ద్రాక్షా రసమును పాతతోలు సంచిలో దాచరు.
అలా చేస్తే ఆ తోలు సంచి చినిగిపోయి ఆ ద్రాక్షారసము

---

**‘నేను … బలినికాదు’** హోషేయ 6:6.

నాశనమై పోతుంది. అంతేకాక ఆ తోలు సంచి నాశనమై
పోతుంది. అందువల్ల క్రొత్త ద్రాక్షారసమును క్రొత్త
తోలు సంచిలోనే దాచి ఉంచాలి. అలా చేస్తే రెండూ
భద్రంగా ఉంటాయి" అని యేసు అన్నాడు.

### చనిపోయిన బాలికను బ్రతికించటం

*(మార్కు 5:21-43; లూకా 8:40-56)*

18యేసు ఈ విధంగా మాట్లాడుతుండగా యూదుల
సమాజమందిరానికి అధికారిగా ఉన్నవాడు ఒకడు వచ్చి,
ఆయన ముందు మోకరిల్లి, "నా కూతురు చని
పోయింది. కాని మీరు వచ్చి మీ చేయి ఆమె మీద
ఉంచితే ఆమె బ్రతుకుతుంది" అని అన్నాడు.
19యేసు, ఆయన శిష్యులు లేచి అతని వెంట
వెళ్ళారు.
20వాళ్ళు వెళ్తుండగా పండ్రెండేండ్ల నుండి రక్త
స్రావంతో బాధ పడుతున్న ఒక స్త్రీ వెనుక నుండి వచ్చి
ఆయన అంగీ యొక్క కొనను తాకింది. 21ఆమె,
"నేను ఆయన వస్త్రాన్ని తాకగలిగితే చాలు నాకు
నయమై పోతుంది" అని తనలో తాను అనుకొన్నది.
22యేసు వెనక్కు తిరిగి ఆమెనుచూసి, "ధైర్యంగా
వుండమ్మా! నీ విశ్వాసమే నిన్ను బాగుచేసింది" అని
అన్నాడు.
23యేసు ఆ అధికారి యింట్లోకి ప్రవేశిస్తూ, అక్కడ
పిల్లన గ్రోవి వాయించే వాళ్ళు, గోల చేస్తున్న వాళ్ళు
ఉండటం చూసాడు. 24వాళ్ళతో, "వెళ్ళిపొండి, ఆమె
చనిపోలేదు. నిద్రపోతూ ఉంది, అంతే!" అని అన్నాడు.
వాళ్ళాయన్ని హేళన చేసారు. 25ఆయన వాళ్ళను
పంపేసాక లోపలికి వెళ్ళి ఆ అమ్మాయి చేయి తాకాడు.
ఆమె వెంటనే లేచి నిలుచుంది. 26ఈ వార్త ఆ
ప్రాంతమంతా వ్యాపించింది.

### ఇద్దరు గ్రుడ్డి వాళ్ళకు చూపు కలిగించటం

27యేసు అక్కడినుండి బయలుదేరి వెళ్తుండగా
యిద్దరు గ్రుడ్డివాళ్ళు, "దావీదు కుమారుడా! మాపై
దయ చూపు!" అని పిలుస్తూ ఆయన్ని అనుసరిం
చారు.
28యేసు యింట్లోకి వెళ్ళాక ఆ గుడ్డివాళ్ళాయన
దగ్గరకు వెళ్ళారు. ఆయన వాళ్ళను, "ఇది నేను చేయ
గలననే విశ్వాసం మీకుందా?" అని అడిగాడు. "ఉంది
ప్రభూ!" అని వాళ్ళు సమాధానం చెప్పారు.
29అప్పుడాయన వాళ్ళ కళ్ళను తాకుతూ,
"మీకెంత విశ్వాసముంటే అంత ఫలం కలుగనీ!" అని
అన్నాడు. 30వాళ్ళకు చూపు వచ్చింది. యేసు, "ఈ
విషయం ఎవ్వరికీ తెలియకుండా జాగ్రత్త పడండి!"
అని వాళ్ళను హెచ్చరించాడు.
31కాని వాళ్ళు వెళ్ళి ఆయన్ని గురించి ఆ ప్రాంత
మంతా ప్రచారం చేసారు. 32వాళ్ళు వెలుపలికి వెళ్తుం
డగా కొందరు వ్యక్తులు దయ్యం పట్టిన మూగ వాడి
నొకణ్ణి యేసు దగ్గరకు పిలుచుకు వచ్చారు. 33యేసు
దయ్యాన్ని వదిలించాక ఆ మూగవాడు మాట్లాడటం
మొదలు పెట్టాడు. అక్కడున్న ప్రజలు నిర్ఘాంతపోయి,
"ఇలాంటిదేదీ ఇదివర కెన్నడూ ఇశ్రాయేలులో జరగ
లేదే?" అని అన్నారు. 34కాని పరిసయ్యులు, "అతడు
దయ్యాల రాజు సహాయంతో దయ్యాల్ని పారద్రోలు
తున్నాడు" అని అన్నారు.

### కొద్దిమంది పనివాళ్ళు

35యేసు సమాజమందిరాల్లో బోధిస్తూ అన్ని పట్ట
ణాలు, పల్లెలు పర్యటన చేసాడు. దేవుని రాజ్యాన్ని
గురించి సువార్త ప్రకటించాడు. అన్నిరకాల రోగాల్ని,
బాధల్ని నయం చేసాడు. 36ప్రజలు కాపరిలేని గొఱ్ఱెల్లా
అలసి పోయి, చెదరి పోయి ఉండటం చూసి యేసు
వాళ్ళపై జాలి పడ్డాడు. 37ఆ తర్వాత తన శిష్యులతో,
"పంట బాగా పండింది కాని పని వాళ్ళే తక్కువగా
ఉన్నారు. 38పంట ప్రభువును, పంట కోయటానికి
పని వాళ్ళను పంపమని ప్రార్థించండి" అని అన్నాడు.

### యేసు అపొస్తలులను పంపటం

*(మార్కు 3:13-19; 6:7-13; లూకా 6:12-16; 9:1-6)*

10 యేసు తన పన్నెండు మంది శిష్యుల్ని పిలిచి
దయ్యాల్ని వదిలించటానికి, అన్ని రకాల
వ్యాధుల్ని, బాధల్ని నయం చేయటానికి వాళ్ళకధికారం
ఇచ్చాడు. 2ఆ పన్నెండుగురి అపోస్తలుల పేర్లు ఇవి:
సీమోను; ఇతన్నే పేతురు అని పిలిచేవాళ్ళు. అతని
సోదరుడు అంద్రెయ. జెబెదయి కుమారుడు
యాకోబు, యాకోబు సోదరుడు యోహాను.
3ఫిలిప్పు, బర్తొలొమయి, తోమా, పన్నులు సేకరించే
మత్తయి, అల్ఫయి కుమారుడు యాకోబు, తద్దయి
అని పిలువబడే లెబ్బయి, 4కనానీయుడైన సీమోను,
యేసుకు ద్రోహం చేసిన యూదా ఇస్కరియోతు.
5ఆ పన్నెండుగురిని ప్రజల వద్దకు పంపుతూ వారికి
యేసు ఈ విధంగా ఉపదేశించాడు: "యూదులు కాని
వాళ్ళ దగ్గరకు గాని, సమరయ దేశంలోని పట్టణా
లలోకి గాని వెళ్ళకండి. 6దానికి మారుగా ఇశ్రాయేలు
ప్రజల వద్దకు వెళ్ళండి. వారు తప్పిపోయిన గొఱ్ఱెలవలె
ఉన్నారు. 7వెళ్ళి, దేవుని రాజ్యం దగ్గరలోనే ఉందని
ప్రకటించండి. 8జబ్బుతో ఉన్న వాళ్ళకు నయం
చెయ్యండి. దయ్యాలను వదిలించండి. మీకు ఉచితంగా
లభించింది ఉచితంగా యివ్వండి. 9బంగారం కాని,
వెండికాని, రాగి కాని మీ సంచిలో పెట్టుకొని వెళ్ళకండి,
10మీరు ప్రయాణం చేసేటప్పుడు సంచిని కాని,
దుస్తుల్ని కాని, చెప్పుల్ని కాని, చేతి కర్రను కాని మీ
వెంట తీసుకెళ్ళకండి. పని చేసిన వాళ్ళకు కూలి
దొరకాలి కదా!

11"మీరు ఏ పట్టణానికి వెళ్ళినా, ఏ పల్లెకు వెళ్ళినా
మంచి వాడెవరో విచారించి, ఆ గ్రామం వదిలే దాకా
అతని ఇంట్లోనే ఉండండి. 12మీరా ఇంట్లోకి ప్రవేశిం
చినప్పుడు ఆ ఇంట్లో 'శాంతి కలుగునుగాక' అనండి.
13ఆ ఇంటివారు యోగ్యులైతే మీరు చెప్పిన శాంతి ఆ
ఇంటివారికి కలుగుతుంది. లేక పోయినట్లైతే ఆ శాంతి
మీకే తిరిగి వస్తుంది. 14ఒక వేళ, మీకు ఎవ్వరూ
స్వాగతం చెప్పక పోయినట్లైతే, ఆ ఇంటిని కాని లేక
ఆ గ్రామాన్ని కాని వదిలి వెళ్ళేముందు మీ కాలి ధూళి
దులిపి వెయ్యండి. 15ఇది సత్యం, తీర్పు చెప్పే రోజు
సొదొమ మరియు గొమొఱ్ఱా పట్టణాలకన్నా మీరు
వదిలిన గ్రామం భరించలేని స్థితిలో ఉంటుంది.

16"తోడేళ్ళ మధ్యకు గొఱ్ఱెల్ని పంపినట్లు
మిమ్మల్ని పంపుతున్నాను. అందువల్ల పాముల్లాగా తెలి
విగా, పావురాల్లా నిష్కపటంగా మీరు మెలగండి. 17కాని,
వాళ్ళ విషయంలో జాగ్రత్తగా ఉండండి. వాళ్ళు
మిమ్మల్ని స్థానిక సభలకు అప్పగిస్తారు. తమ సమాజ
మందిరాల్లో కొరడా దెబ్బలుకొడతారు. 18వాళ్ళు నా
కారణంగా మిమ్మల్ని పాలకుల ముందుకు, రాజుల
ముందుకు తీసుకు వెళ్తారు. మీరు వాళ్ళ ముందు,
యూదులుకాని ప్రజలముందు నా గురించి చెప్పాలి.

19వాళ్ళు మిమ్మల్ని అధికారులకు అప్పగించి
నప్పుడు, ఏ విధంగా మాట్లాడాలి? ఏం మాట్లాడాలి?
అని చింతించకండి. మీరు ఏం మాట్లాడాలో దేవుడు
ఆ సమయంలో మీకు తెలియచేస్తాడు. 20ఎందుకంటే,
మాట్లాడేది మీరు కాదు. మీ తండ్రి ఆత్మ మీ ద్వారా
మాట్లాడుతాడు.

21"సోదరుడు సోదరుణ్ణి, తండ్రి కుమారుణ్ణి మరణా
నికి అప్పగిస్తారు. పిల్లలు తమ తల్లి తండ్రులకు ఎదురు
తిరిగి వాళ్ళను చంపుతారు. 22ప్రజలందరూ నా పేరు
కారణంగా మిమ్మల్ని ద్వేషిస్తారు. కాని చివరి దాకా
సహనంతో ఉన్న వాళ్ళను దేవుడు రక్షిస్తాడు.
23మిమ్మల్ని ఒక పట్టణంలో హింసిస్తే తప్పించుకొని
యింకొక పట్టణానికి వెళ్ళండి. ఇది నిజం. మీరు
ఇశ్రాయేలు దేశంలోని పట్టణాలన్ని తిరగక ముందే
మనుష్యకుమారుడు వస్తాడు.

24"విద్యార్థి గురువు కన్నా గొప్పవాడు కాడు. అలాగే
సేవకుడు యజమానికన్నా గొప్పవాడు కాడు.
25విద్యార్థి గురువులా ఉంటే చాలు. అలాగే సేవకుడు
యజమానిలా ఉంటే చాలు. ఇంటి యజమానినే బయె
ల్జెబూలు* అని అన్న వాళ్ళు ఆయింటివాళ్ళను
యింకెంత అంటారో కదా!

26"అందువల్ల వాళ్ళకు భయపడకండి. రహస్యమై
నవి బయటపడతాయి. దాచబడినవి నలుగురికీ తెలు
స్తాయి.

27నేను రహస్యంగా చెబుతున్న విషయాలను
బాహాటంగా యితర్లకు చెప్పండి. మీ చెవుల్లో చెప్పిన
విషయాలను యింటి కప్పులపై ఎక్కి ప్రకటించండి.
28వాళ్ళు దేహాన్ని చంపగలరు కాని ఆత్మను చంపలేరు.
వాళ్ళను గురించి భయపడకండి. శరీరాన్ని, ఆత్మను
నరకంలో వేసి నాశనం చెయ్యగల వానికి భయపడండి.
29ఒక పైసాకు రెండు పిచ్చుకలు అమ్ముతారు కదా.
అయినా మీ తండ్రికి తెలియకుండా ఒక్క పిచ్చుక
కూడా నేల మీదికి పడదు. 30మీ తల మీద ఉన్న
వెంట్రుకల సంఖ్య కూడా ఆయనకు తెలుసు. 31అందు
వలన భయపడ కండి. ఎన్ని పిచ్చుకలైనా మీకు సాటి
కాలేవు.

32"నన్ను ప్రజల సమక్షంలో అంగీకరించిన ప్రతి
వ్యక్తిని పరలోకంలో ఉన్న నా తండ్రి సమక్షంలో
అంగీకరిస్తాను. 33కాని ప్రజల సమక్షంలో నన్ను తిర
స్కరించిన వాణ్ణి నేను పరలోకంలో ఉన్న నా తండ్రి
సమక్షంలో తిరస్కరిస్తాను.

34"నేను శాంతిని నెలకొల్పటానికి వచ్చానను
కోకండి. నేను ఈ ప్రపంచంలోకి శాంతిని తీసుకు
రాలేదు. కత్తిని తెచ్చాను.
35-36ఎందుకంటే,

నేను తల్లీ కూతుర్ల మధ్య, అత్తా కోడళ్ళ
మధ్య విరోధం కలిగిం చాలని వచ్చాను.
'ఒకే యింటికి చెందిన వాళ్ళు ఆ యింటి
యజమాని శత్రువులౌతారు.'"

*మీకా 7:6*

37"తన తల్లి తండ్రుల్ని నా కన్నా ఎక్కువగా
ప్రేమించే వ్యక్తి నాతో రావటానికి అర్హుడు కాడు. తన
కొడుకును కాని, లేక కూతుర్నికాని నాకన్నా ఎక్కువగా
ప్రేమించే వ్యక్తి నాతో రావటానికి అర్హుడుకాడు. 38నన్ను
వెంబడించేవాడు తనకియ్యబడిన సిలువను అంగీకరిం
చకపోతే, నాకు యోగ్యుడు కాడు. 39జీవితాన్ని కాపాడు
కొనువాడు దాన్ని పోగొట్టుకొంటాడు. నా కోసం
జీవితాన్ని పోగొట్టుకొన్నవాడు జీవితాన్ని సంపాదించు
కొంటాడు.

40"మిమ్మల్ని స్వీకరించువాడు నన్ను స్వీకరించి
నట్లే. నన్ను స్వీకరించినవాడు నన్ను పంపిన దేవుణ్ణి
స్వీకరించినట్లే. 41ఒక వ్యక్తి ప్రవక్త అయినందుకు అత
నికి స్వాగతం చెప్పిన వ్యక్తి ఆ ప్రవక్త పొందిన ఫలం
పొందుతాడు. ఒక వ్యక్తి నీతిమంతుడై నందుకు అతనికి
స్వాగతం చెప్పిన వ్యక్తి నీతిమంతుడు పొందే ఫలం
పొందుతాడు.

42మీరు నా అనుచరులై నందుకు, ఈ అమాయ
కులకు ఎవరు ఒక గిన్నెడు నీళ్ళనిస్తారో వాళ్ళకు
ప్రతిఫలం లభిస్తుంది. ఇది నిజం."

---

**బయెల్జెబూలు** అంటే సాతాను.

### యోహాను అడగనంపిన ప్రశ్న

*(లూకా 7:18-35)*

11 యేసు తన పన్నెండుగురి శిష్యులకు వాళ్ళు
చెయ్యవలసిన వాటిని గురించి చెప్పటం
ముగించాడు. ఆ తర్వాత ఆయన అక్కడి నుండి
బయలుదేరి గ్రామాల్లో బోధించటానికి, ప్రకటించ
టానికి వెళ్ళాడు. 2కారాగారంలోవున్న యోహాను క్రీస్తు
చేస్తున్న వాటిని గురించి విన్నాడు. అతడు తన
శిష్యుల్ని యేసు దగ్గరకు పంపి, 3వాళ్ళ ద్వారా,
"రావలసిన వాడవు నువ్వేనా? లేక మరెవరికోసమైనా
మేము ఎదురు చూడాలా?" అని అడిగించాడు.
4యేసు, "మీరు విన్నవాటిని గురించి, చూసిన
వాటిని గురించి వెళ్ళి యోహానుకు చెప్పండి. 5గ్రుడ్డి
వాళ్ళు చూపు పొందుతున్నారని, కుంటివాళ్ళు నడువ
గలుగుతున్నారని, కుష్టురోగులకు నయమై పోతోం
దని, చెవిటి వాళ్ళు వినకలుగుతున్నారని, చనిపోయిన
వాళ్ళు బ్రతికి వస్తున్నారని, సువార్త పేదవాళ్ళకు ప్రక
టింపబడుతోందని చెప్పండి. 6నా విషయంలో అను
మానం చెందని వాడు ధన్యుడు" అని సమాధానం
చెప్పాడు.
7యోహాను శిష్యులు వెళ్తూ ఉంటే, యేసు యోహా
నును గురించి అక్కడున్న ప్రజలతో ఇలా మాట్లాడటం
మొదలు పెట్టాడు: "ఎడారి ప్రాంతాల్లోకి ఏం చూడాలని
వెళ్ళారు? గాలికి కొట్టుకొనే రెల్లును చూడాలని
వెళ్ళారా? 8మరి ఏం చూడాలని వెళ్ళారు? మంచి
దుస్తులు వేసుకొన్న మనిషిని చూడాలని వెళ్ళారా?
మంచి దుస్తులు వేసుకొన్న వాళ్ళు రాజభవనంలో
నివసిస్తారు. 9మరి, ఏం చూడాలని వెళ్ళారు? ప్రవక్తనా?
అవును, యోహాను ప్రవక్త కన్నా గొప్పవాడని నేను
చెబుతున్నాను. 10అతణ్ణి గురించి ఈ విధంగా వ్రాసారు:

'నీ కన్నా ముందు నా దూతను పంపుతాను,
అతడు నీ కన్నా ముందు వెళ్ళి నీ మార్గాన్ని
సిద్ధం చేస్తాడు.'

మలాకీ *3:1*

11"ఇది సత్యం. ఇదివరకు జన్మించిన వాళ్ళలో
బాప్తిస్మము ఇచ్చే యోహాను కన్నా గొప్పవాడు లేడు.
అయినా దేవుని రాజ్యంలో అత్యల్పుడు యోహాను
కన్నా గొప్పవానిగా పరిగణింపబడతాడు. 12బాప్తిస్మము
ఇచ్చే యోహాను కాలం నుండి, నేటి వరకు దేవుని
రాజ్యం ముందడుగు వేస్తూవుంది. శక్తిగల వాళ్ళు దాన్ని
సంపాదించటానికి ప్రయత్నిస్తున్నారు. 13యోహాను
కాలం వరకు ప్రవక్తలు, ధర్మశాస్త్రము వీటిని గురించి
వచించటం జరిగింది. 14ఆ యోహానే రానున్న
ఏలీయా. ఇష్టముంటే అంగీకరించండి. 15ఇష్టమున్న
వాడు వింటాడు.

16"ఈ తరం వాళ్ళను నేను ఎవరితో పోల్చాలి?
వాళ్ళు సంతలో కూర్చొని బిగ్గరగా మాట్లాడుకొం
టున్న పిల్లలతో సమానము. 17"వాళ్ళు ఇలా అన్నారు:

'మేము పిల్లనగ్రోవి వూదాము, కాని మీరు
నాట్యం చెయ్యలేదు, మేము విషాదగీతం
పాడాము. కాని మీరు దుఃఖించలేదు.'

18ఎందుకంటే యోహాను తింటూ, త్రాగుతూ రాలేదు.
కాని అతనిలో దయ్యం ఉందన్నారు. 19మనుష్య కుమా
రుడు తింటూ త్రాగుతూ వచ్చాడు. కాని వాళ్ళు,
'ఇదిగో తిండిపోతు, త్రాగుపోతు. ఇతను పన్నులు
సేకరించే వాళ్ళకు, పాపులకు మిత్రుడు' అని అన్నారు.
జ్ఞానము దాని పనులను బట్టి తీర్పు పొందుతుంది"

### విశ్వాసంలేని పట్టణాలు

*(లూకా 10:13-15)*

20ఆయన అనేక మహత్కార్యాలు చేసిన కొన్ని
పట్టణాలు మారుమనస్సు పొందలేదు. కనుక యేసు
వాటిని విమర్శించాడు. 21"అయ్యో! కొరాజీనా పట్టణ
మా! అయ్యో! బేత్సయిదా నగరమా! నేను మీలో
చేసిన అద్భుతాలను తూరు, సీదోను పట్టణాలలో
చేసివుంటే వాళ్ళు ఏనాడో గోనెపట్టలు కట్టుకొని,
బూడిదరాసుకొని మారుమనస్సు పొంది ఉండే వాళ్ళు.
22కానీ, నేను చెప్పేదేమిటంటే తీర్పు చెప్పేరోజున
తూరు, సీదోను నగరాలకన్నా మీరు భరించలేని స్థితిలో
ఉంటారు. 23ఇక, ఓ కపెర్నహూము నగరమా! నీవు
ఆకాశానికి ఎక్కుతాననుకొన్నావా? అలా జరుగదు!
నీవు మృత్యులోకానికి పడిపోతావు. నీలో చేసిన మహ
త్యాలు సొదొమ నగరంలో చేసివుంటే అది ఈనాటికీ
నిలిచి ఉండేది. 24కాని నేను మీకు చెప్పేదేమంటే
తీర్పుచెప్పే రోజున సొదొమ నగరానికన్నా మీరు
భరించలేని స్థితిలో ఉంటారు."

### అలసిన వాళ్ళకు విశ్రాంతి

*(లూకా 10:21-22)*

25ఆ సమయంలో యేసు యింకా ఈ విధంగా
అన్నాడు, "తండ్రీ! ఆకాశానికి భూలోకానికి ప్రభువైన
నిన్ను స్తుతిస్తున్నాను. ఎందుకంటే, నీవు వీటిని తెలి
విగల వాళ్ళ నుండి, జ్ఞానుల నుండి దాచి చిన్న పిల్లలకు
తెలియ జేసావు. 26ఔను తండ్రీ! నీవీలాగు చేయటం
నీకిష్టమయింది.
27"నా తండ్రి నాకు అన్నీ అప్పగించాడు. తండ్రికి
తప్ప నాగురించి ఎవ్వరికి తెలియదు. నాకును, నా
తండ్రిని గురించి చెప్పాలనే ఉద్దేశంతో నేను ఎన్ను
కొన్న వాళ్ళకును తప్ప, తండ్రిని గురించి ఎవ్వరికీ
తెలియదు.

28“బరువు మోస్తూ అలసిపోయిన వాళ్ళంతా నా దగ్గరకు రండి. నేను మీకు విశ్రాంతి కలిగిస్తాను. 29నేనిచ్చిన కాడిని మోసి, నా నుండి నేర్చుకోండి. నేను సాత్వికుడను. నేను దీనుడను. 30నేనిచ్చిన కాడిని మోయటం సులభం. నేనిచ్చే భారం తేలికగా ఉంటుంది. కనుక మీ ఆత్మలకు విశ్రాంతి కలుగుతుంది.”

12 ఒకప్పుడు ఒక విశ్రాంతి రోజున యేసు, తన శిష్యులతో కలిసి పొలాల్లో నడుస్తూ ఉన్నాడు. ఆయన శిష్యులు ఆకలితో ఉండటం వల్ల కంకులు నలిపి తినటం మొదలు పెట్టారు. 2పరిసయ్యులు ఇది చూసి యేసుతో, “విశ్రాంతి రోజు మీ శిష్యులు చెయ్యరాని పని చేస్తున్నారు” అని అన్నారు.

3-4యేసు, “దావీదుకు, అతని అనుచరులకు ఆకలి వేసినప్పుడు అతడు దేవాలయం లోకి ప్రవేశిం చారు. తర్వాత అతడు, అతని అనుచరులు దేవుని సన్నిధిలో పెట్టిన రొట్టెలు తిన్నారు. ఈ విషయాన్ని మీరు చదువలేదా? యాజకులకు తప్ప దావీదుకు కాని, అతని అనుచరులకు కాని, మరెవ్వరికి ఆ రొట్టెను తినే అధికారం లేదు. 5అంతేకాక, యాజకులు విశ్రాంతి రోజు పని చేస్తారన్న విషయం ధర్మశాస్త్రంలో ఉంది. ఇది మీరు చదువలేదా? వాళ్ళు అలా చెయ్యటం తప్పు కాదు. 6నేను చెప్పేదేమిటంటే మందిరం కన్నా గొప్ప వాడు యిక్కడున్నాడు. 7‘నాకు దయకావాలి, బలి కాదు’* అన్న వాక్యంలోని అర్థం మీకు తెలిసివుంటే మీరు అమాయకుల్ని అవమానించే వాళ్ళు కాదు.

8“విశ్రాంతి రోజుకు మనుష్యకుమారుడు ప్రభువు” అని అన్నాడు.

9ఆయన అక్కడి నుండి బయలు దేరి సమాజ మందిరానికి వెళ్ళాడు. 10అక్కడ ఎండి పోయిన చేయి గలవాడొకడున్నాడు. యేసుపై నేరారోపణ చెయ్యాలని ఎదురుచూస్తున్న పరిసయ్యులు, ఆయన్ని, “విశ్రాంతి రోజు నయం చెయ్యటం ధర్మమా?” అని అడిగారు.

11ఆయన వాళ్ళతో, “మీలో ఎవరి దగ్గరైనా ఒక గొఱ్ఱె ఉందనుకొండి. విశ్రాంతి రోజు అది గోతిలో పడితే దాన్ని పట్టి మీరు బయటికి లాగరా? 12మరి మానవుడు గొఱ్ఱెలకన్నా ఎన్నోరెట్లు విలువైన వాడు కదా! అందువల్ల విశ్రాంతిరోజు మంచి చెయ్యటం ధర్మమే!” అని అన్నాడు.

13అలా అన్నాక ఆ ఎండి పోయిన చెయ్యిగల వానితో, “నీ చేయి చాపు!” అని అన్నాడు. అతడు చేయి చాపాడు. చేయి పూర్తిగా నయమై రెండవ చెయ్యిలా అయింది. 14కాని పరిసయ్యులు బయటికి వెళ్ళి, యేసును చంపటానికి పన్నాగం పన్నారు.

15యేసు ఇది తెలుసుకొని అక్కడి నుండి వెళ్ళి పోయాడు. చాలా మంది ఆయన్ని అను సరించారు. ఆయన వాళ్ళ వ్యాధుల్ని నయం చేసాడు. 16తనను గురించి ఎవ్వరికీ చెప్పవద్దని వాళ్ళను హెచ్చరించాడు. 17యెషయా ప్రవక్త ద్వారా దేవుడు చెప్పిన ఈ వాక్యాలు నిజం కావటానికి ఈ విధంగా జరిగింది:

18 “ఆయన నేనెన్నుకున్న నా సేవకుడు!
ఆయన పట్ల నాకు ప్రేమవుంది. ఆయన
నా ఆత్మకు చాలా ఆనందం కలిగించాడు.
నా ఆత్మ ఆయన పైకి రప్పించుదును.
ఆయన జనములకు న్యాయం చేకూరుతుందని ప్రకటిస్తాడు.
19 ఆయన పోట్లాడడు; కేకలు పెట్టడు.
ఆయన ధ్వని వీధిలోని వాళ్ళకెవ్వరికి వినిపించదు.
20 న్యాయం చేకూరే వరకు నలిగిన రెల్లును
ఆయన విరువడు. ఆరిపోతున్న దీపాన్ని
ఆయన ఆర్పడు.
21 ఈయన పేరుమీద ఇతర జనాలకు నిరీక్షణ
కలుగుతుంది.”

*యెషయా 42:1- 4*

22ఆ తర్వాత కొందరు, దయ్యంపట్టి గ్రుడ్డివానిగా మూగ వానిగా అయిపోయిన ఒకతణ్ణి యేసు దగ్గరకు పిలుచుకు వచ్చారు. యేసు అతనికి నయం చేసాడు. దానితో ఆ మూగ వానికి మాట, దృష్టి రెండూ వచ్చాయి. 23ప్రజలందరికి ఆశ్చర్యమేసి, “ఈయన బహుశా దావీదు కుమారుడేమో!” అని అన్నారు.

24పరిసయ్యులు ఇదివిని, “దయ్యాల రాజైన బయెల్జెబూలు సహాయంతో యితడు దయ్యాలను వదిలిస్తున్నాడు. అంతే!” అని అన్నారు.

25వాళ్ళ ఆలోచనలను యేసు తెలుసుకొన్నాడు. వాళ్ళతో, “విభాగాలైన ప్రతి రాజ్యం నశించి పోతుంది. విభాగాలైన ప్రతి పట్టణమూ, ప్రతి యిల్లు కూలి పోతుంది. 26సైతాను సైతాన్ని పారద్రోలితే వాడు విడిపోతాడు. అప్పుడు వాని రాజ్యం ఏవిధంగా నిలుస్తుంది? 27నేను బయెల్జెబూలు ద్వారా దయ్యాన్ని పారద్రోలుతున్నట్లైతే మీ కుమారులు ఎవరి ద్వారా పారద్రోలుతున్నారు? మీరంటున్నది తప్పని మీ వాళ్ళే ఋజువు చేస్తున్నారు. 28ఒకవేళ నేను దేవుని ఆత్మ ద్వారా దయ్యాల్ని పారద్రోలుతున్నట్లతే దేవుని రాజ్యం మీకు వచ్చినట్లేగదా!

29“అంతేకాక మొదట బలవంతుణ్ణి కట్టి వేయకుండా అతని యింట్లోకి వెళ్ళి అతని వస్తువుల్ని ఎవ్వరూ దోచుకోలేరు. ఆ బలవంతుణ్ణి కట్టివేసాక అతని యింటిని దోచుకోగలరు.

---

**‘నాకు … బలికాదు’** హోషేయ 6:6.

30“నాతో ఉండని వాడు నాకు శత్రువుగా ఉంటాడు.
నాతో కలసిమెలసి ఉండనివాడు చెదరి పోతాడు.
31అందువలన నేను చెప్పేదేమిటంటే మానవుడు చేసిన
పాపాలన్నిటిని దేవ దూషణను దేవుడు క్షమిస్తాడు.
కాని పవిత్రాత్మను దూషించిన వాళ్ళను క్షమించడు.
32మనుష్య కుమారుణ్ణి దూషిస్తూ మాట్లాడిన వాణ్ణి
దేవుడు క్షమిస్తాడు. కాని పవిత్రాత్మను దూషిస్తూ
మాట్లాడిన వాణ్ణి ఈయుగంలో కాని, లేక రానున్న
యుగంలో కాని క్షమించడు.
33“మీరు మంచిఫలాలు కావాలనుకుంటే, చెట్టును
మంచిగా చేయాలి. నీ చెట్టు మంచిది కాకపోతే దానికి
చెడ్డ ఫలాలు కాస్తాయి. పండును బట్టి చెట్టు ఎట్టిదో
చెప్పబడుతుంది. 34మీరు పాముల్లాంటి వాళ్ళు.
దుష్టులు మంచి మాటలేవిధంగా ఆడగలుగుతారు.
హృదయంలో ఉన్నదాన్ని నోరు మాట్లాడుతుంది.
35మంచి వానిలో మంచి ఉంటుంది. కనుక అతని
నుండి మంచి బయటికి వస్తుంది. దుష్టునిలో చెడు
ఉంటుంది కనుక అతని నుండి చెడు బయటికి వస్తుంది.
36కాని నేను చెప్పేదేమిటంటే మానవులు తాము నిర్ల
క్ష్యంగా ఆడిన ప్రతి మాటకు తీర్పు చెప్పే రోజున
లెక్క చెప్పవలసి ఉంటుంది. 37ఎందుకంటే మీరాడిన
మాటల్ని బట్టి మీరు నిరపరాధులో, అపరాధులో నిర్ణ
యింపబడుతుంది” అని అన్నాడు.
38ఆ తర్వాత కొందరు శాస్త్రులు, పరిసయ్యులు
అయనతో, “బోధకుడా! మీరొక రుజువు చూపాలని
మా కోరిక!” అని అన్నారు. 39కాని ఆయన చెప్పాడు:
‘దుష్టులు, వ్యభిచారులు అయినటువంటి ఈ తరం
వాళ్ళు రుజువుచూపమని కోరుతారు. యోనా ప్రవక్త
ద్వారా చూపిన రుజువు తప్ప మరే రుజువు చూప
బడదు. 40ఎందుకంటే, యోనా పెద్ద చేప కడుపులో
మూడు పగళ్ళు, మూడు రాత్రులు గడిపాడు. అదే
విధంగా మనుష్య కుమారుడు మూడు రాత్రులు,
మూడు పగళ్ళు భూగర్భంలో గడుపుతాడు. 41నీనెవె
ప్రజలు యోనా ప్రకటించిన సందేశాన్ని విని మారు
మనస్సు పొందారు. కనుక తీర్పు చెప్పబడే రోజు
వాళ్ళు ఈ తరం వాళ్ళతో సహా నిలబడి ఈతరం
వాళ్ళు నేరస్థులని నిర్ణయిస్తారు. కాని యిప్పుడు
యోనా కంటె గొప్పవాడు యిక్కడున్నాడు. 42దక్షిణ
దేశపు రాణి సాలొమోను జ్ఞానాన్ని వినాలని చాలా
దూరం నుండి వచ్చింది. కనుక తీర్పు చెప్పే రోజు
ఆమె ఈ తరం వాళ్ళతో కలసి నిలబడి ఈ తరం
వాళ్ళు నేరస్థులని నిర్ణయిస్తుంది. కాని యిప్పుడు
సాలొమోను కన్నా గొప్పవాడు యిక్కడున్నాడు.
43“దయ్యం పట్టిన వాని నుండి బయటికి వచ్చిన
దయ్యం విశ్రాంతి కోసం వెతుకుతూ నీరులేని చోట
తిరుగుతుంది. కాని దానికి విశ్రాంతి దొరకదు. 44అప్పు
డది, ‘నేను వదిలి వచ్చిన నాయింటికి మళ్ళీ వెళ్తాను’
అని అనుకొంటుంది. అది తిరిగి వచ్చి, ఆయింటిని
ఎవ్వరూ ఆక్రమించనట్లు, పైగా శుభ్రంగా వూడ్చి
అన్నీ సరిదిద్దినట్లు గమనిస్తుంది. 45అప్పుడది వెళ్ళి
తనతో సహా, తనకన్నా దుష్టమైన ఏడు దయ్యాల్ని
పిలుచుకు వస్తుంది. అన్నీకలసి ఆ యింటిలోకి వెళ్ళి
నివసిస్తాయి. అప్పుడా వ్యక్తిగతి మొదటికన్నా
అధ్వాన్నం ఔతుంది. దుర్బుద్ధికల ఈ తరం వాళ్ళకు
ఇలాంటి గతి పడ్తుంది” అని చెప్పాడు.
46యేసు ప్రజలతో యింకా మాట్లాడు తూనే
ఉన్నాడు. ఇంతలో ఆయన తల్లి, సోదరులు ఆయనతో
మాట్లాడాలనుకొని వచ్చి, బయట నిలబడ్డారు.
47ఒకడు యేసుతో, “మీ తల్లి, సోదరులు మీతో మాట్లా
డాలని బయట నిలుచొన్నారు!” అని అన్నాడు.
48యేసు సమాధానం చెబుతూ, “ఎవరు నా తల్లి?
ఎవరు నా సోదరులు?” అని అన్నాడు. 49తన శిష్యుల
వైపు చూపుతూ, “ఇదిగో నా తల్లి, నా సోదరులు.
50ఎవరైతే పరలోకంలోని నా తండ్రి యిచ్చానుసారం
నడుచుకొంటారో వాళ్ళే నా సోదరులు, నా చెల్లెండ్రు,
నా తల్లి” అని అన్నాడు.

### విత్తనాలు నాటటం

*(మార్కు 4:1-9; లూకా 8:4-8)*

13 అదే రోజు యేసు ఇంటి నుండి వెళ్ళి సరస్సు
ప్రక్కన కూర్చున్నాడు. 2ఆయన చుట్టు పెద్ద
ప్రజల గుంపు సమావేశమైంది. అందువల్ల ఆయన
పడవనెక్కి కూర్చున్నాడు. ప్రజలు సరస్సు ఒడ్డున
నిలుచున్నారు. 3ఆయన వాళ్ళకు ఎన్నో విషయాలు
ఉపమానాలు చెబుతూ బోధించాడు, “ఒక రైతు
విత్తనాలు చల్లటానికి వెళ్ళాడు. 4అతడు విత్తనాలు చల్లు
తుండగా కొన్ని విత్తనాలు దారి ప్రక్కన పడ్డాయి.
పక్షులు వచ్చి వాటిని తిని వేసాయి. 5మరి కొన్ని విత్త
నాలు మట్టి ఎక్కువగా లేని రాతి నేలపై పడ్డాయి.
మట్టి ఎక్కువగా లేనందున అవి త్వరగా మొలకెత్తాయి.
6కాని సూర్యోదయ మయ్యాక ఆ మొక్కలు వాడి
పొయ్యాయి. వాటివేర్లు పెరగనందు వల్ల అవి ఎండి
పొయ్యాయి. 7మరి కొన్ని విత్తనాలు ముండ్ల మొక్కల
మధ్య పడ్డాయి. ఆ ముళ్ళ మొక్కలు పెరిగి ధాన్యపు
మొక్కల్ని అణిచి వేసాయి. 8మరి కొన్ని విత్తనాలు
సారవంతమైన నేలపై బడ్డాయి. వాటిలో కొన్ని నూరు
రెట్ల పంటను, కొన్ని అరవైరెట్ల పంటను, కొన్ని
ముప్పైరెట్ల పంట నిచ్చాయి. 9వినేవాళ్లు వాళ్ళు
వినండి!” అన్నాడు.
10శిష్యులు వచ్చి యేసును, “మీరు ప్రజలతో ఉప
మానాలు ఉపయోగించి ఎందుకు మాట్లాడుతారు?”
అని అడిగారు.
11ఆయన ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“దేవుని రాజ్యం యొక్క రహస్యాలను తెలుసుకొనే

జ్ఞానాన్ని మీరు పొందారు. వాళ్ళుకాదు. 12దేవుడు
గ్రహింపు ఉన్న వాళ్ళకు ఇంకా ఎక్కువగా ఇస్తాడు.
లేని వాళ్ళ దగ్గరనుండి ఉన్నది కూడా తీసివేస్తాడు.
13నేను వాళ్ళతో ఉపమానాల ద్వారా ఎందుకు మాట్ల
డుతున్నానంటే, చూసినా వాళ్ళు అర్థం చేసుకోలేరు.
విన్నా అర్ధంచేసుకోరు, గ్రహించరు. 14తద్వారా
యెషయా ప్రవక్త ద్వారా చెప్పిన ఈ ప్రవచనం వాళ్ళ
విషయంలో నిజమైంది:

> ‘మీరు తప్పక వింటారు. కాని అర్థంచేసుకో
> లేరు. మీరు తప్పక చూస్తారు కాని గ్రహిం
> చలేరు.
> 15 వాళ్ళు కళ్ళతో చూసి, చెవుల్తోవిని,
> హృదయాలతో అర్థం చేసుకొని నావైపు
> మళ్ళితే నేను వాళ్ళను నయం చేస్తాను.
> కాని అలా జరుగరాదని ఈ ప్రజల హృద
> యాలు మొద్దుబారాయి. వాళ్ళకు బాగా
> వినిపించదు. వాళ్ళు తమ కళ్ళు మూసి
> కొన్నారు.’
>
> యెషయా *6:9-10*

16కాని మీ కళ్ళు చూడకలుగుతున్నాయి. కనుక అవి
ధన్యమైనవి. మీ చెవులు విన కలుగుతున్నాయి. కనుక
అవి ధన్యమైనవి. 17ఎందుకంటే ఎందరో ప్రవక్తలు,
నీతిమంతులు మీరుచూస్తున్నవి చూడాలని ఆశిం
చారు. కాని చూడలేక పోయారు. మీరు వింటున్నవి
వినాలని ఆశించారు. కాని వినలేక పోయారు. ఇది
సత్యం.
18“మరి విత్తనాన్ని చల్లే రైతు ఉపమానాన్ని గురించి
వినండి. 19కొందరు దేవుని రాజ్యాన్ని గురించి
వింటారు. కాని అర్థం చేసుకోరు. అలాంటి హృద
యాల్లో నాట బడిన దైవ సందేశాన్ని సైతాను తీసుకు
వెళ్తాడు. వీళ్ళను రహదారి ప్రక్కనపడిన విత్తనాలతో
పోల్చ వచ్చు. 20దైవ సందేశాన్ని విని వెంటనే ఆనం
దంగా అంగీకరించే వాళ్ళను రాతి నేలపైబడ్డ విత్తనా
లతో పోల్చవచ్చు. 21అలాంటి విత్తనాలకు వేర్లు
ఉండవు. కనుక అవి చాలా కాలం బ్రతుకవు. సందేశం
వలన కష్టాలుకాని హింసలు కాని సంభవించినప్పుడు
వాళ్ళు వెంటనే దాన్ని వదలి వేస్తారు. 22దైవ సందేశాన్ని
విని జీవితంలోని కష్టాలకు, ధనం వలన కలిగే మోసానికి
ఉక్కిరి బిక్కిరై నిష్ఫలులై పోయే వాళ్ళను ముళ్ళ
మొక్కల్లో పడిన విత్తనాలతో పోల్చవచ్చు. 23దైవ
సందేశాన్ని విని దాన్ని అర్థం చేసుకొనే వాళ్ళను సార
వంతమైన భూమిలో పడ్డ విత్తనాలతో పోల్చవచ్చు.
వాటిలో కొన్ని నూరురెట్లు పంటను, కొన్ని అరవై
రెట్లు పంటను, కొన్ని ముప్పైరెట్లు పంటను
యిస్తాయి.”

## కలుపు మొక్కలు

24యేసు వాళ్ళకింకొక ఉపమానం చెప్పాడు:
“దేవుని రాజ్యాన్ని మంచి విత్తనాల్ని తన పొలంలో
నాటిన మనిషితో పోల్చవచ్చు. 25అందరూ నిద్రపో
తుండగా అతని శత్రువు వచ్చి గోధుమ విత్తనాల మధ్య
కలుపు విత్తనాలను చల్లిపోయాడు. 26గోధుమ మొల
కెత్తి విత్తనం వేసింది. వాటితో సహా కలుపుమొక్కలు
కూడ కనిపించాయి. 27పని వాళ్ళు, తమ యజమాని
దగ్గరకు వచ్చి ‘అయ్యా! మీరు మీ పొలంలో మంచి
విత్తనాలను నాటలేదా? మరి కలుపు మొక్కలు ఎట్లా
మొలిచాయి?’ అని అడిగారు. 28‘ఇది శత్రువు చేసిన
పని’ అని ఆ యజమాని సమాధానం చెప్పాడు. పని
వాళ్ళు – ‘మమ్మల్ని వెళ్ళి కలుపు తీయమంటారా?’
అని అడిగారు. 29అతడు ‘వద్దు! మీరిప్పుడు కలుపు
తీస్తే గోధుమ మొక్కల్ని కూడా పెరికి వేసే అవకాశం
ఉంది. 30కోతకొచ్చేవరకు రెండింటినీ పెరగ నివ్వండి.
అప్పుడు నేను కోత కోసే వాళ్ళతో ‘మొదట కలుపు
మొక్కలు కోసి, కాల్చివేయటానికి వాటిని మోపులుగా
కట్టి కాల్చి వేయండి. ఆ తర్వాత గోధుమ గింజల్ని
ప్రోగు చేసి నా ధాన్యపు కొట్టులోకి తీసుకు వెళ్ళ
మంటాను’ అని అంటాడు.”

## ఆవగింజ

(మార్కు *4:30-34;* లూకా *13:18-21*)

31ఆయన వాళ్ళకింకొక ఉపమానం చెప్పాడు:
“దేవుని రాజ్యాన్ని ఒక ఆవగింజతో పోల్చవచ్చు. ఒక
వ్యక్తి ఒక ఆవగింజను తన తోటలో నాటాడు. 32అది
విత్తనాలన్నిటికన్నా చిన్నదైనా, పెరిగి నప్పుడది
మొక్కలన్నిటి కన్నా పెద్దగా పెరిగి ఒక చెట్టవుతుంది.
గాలిలో ఎగిరే పక్షులు దాని కొమ్మలపై గూళ్ళు కట్టు
కొంటాయి.” 33యేసు వాళ్లకింకొక ఉపమానం
చెప్పాడు: “దేవుని రాజ్యం పులుపు పిండి లాంటిది.
ఒక స్త్రీ పులి పిండిని తీసికొని మూడు సేర్ల పిండిలో
కలిపింది. అలా చెయ్యటం వల్ల ఆ పిండంతా పులుపుగా
మారింది.” 34యేసు ప్రజలకు ఇవన్నీ ఉపమానాల
ద్వారా చెప్పాడు. ఉపమానం ఉపయోగించ కుండా
వాళ్ళకేదీ చెప్పలేదు. 35దాంతో ప్రవక్త ద్వారా దేవుడు
చెప్పిన వాక్యాలు నిజమయ్యాయి:

> “నేను ఉపమానాల ద్వారా మాట్లాడి,
> పపంచం సృష్టింపబడిన నాటినుండి దాచ
> బడిన వాటిని చెబుతాను.”
>
> కీర్తన *78:2*

## కలుపు ఉపమానానికి అర్థం

36ఆ తర్వాత ఆయన ప్రజల్ని వదలి యింట్లోకి
వెళ్ళాడు. ఆయన శిష్యులు వచ్చి ఆయన్ని, “పొలం

లోని కలుపు మొక్కల ఉపమానాన్ని గురించి మాకు
వివరంగా చెప్పండి” అని అడిగారు.
37యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“మంచి విత్తనాన్ని నాటుతున్న వాడు మనుష్య కుమా
రుడు. 38ఈ ప్రపంచం పొలంతో పోల్చబడింది. మంచి
విత్తనాలు దేవుని రాజ్యంలోవున్న ప్రజలతో పోల్చబ
డ్డాయి. పొలంలోని కలుపు మొక్కలు సైతాను కుమా
రులతో పోల్చబడ్డాయి. 39వాటిని నాటిన శత్రువు
సైతానుతో పోల్చబడ్డాడు. కోతకాలం యుగాంతంతో
పోల్చబడింది. కోతకోసేవాళ్ళు దేవదూతలతో పోల్చ
బడ్డారు.
40“కలుపు మొక్కల్ని పెరికి మంటల్లో వేసి కాల్చి
వేసినట్లే యుగాంతంలో కూడా మనుష్య కుమారుడు
తన దూతల్ని పంపుతాడు. 41వాళ్ళు వచ్చి ఆయన
రాజ్యంలో ఉన్న పాపుల్ని, పాపాలను కలుగజేసే
వాళ్ళను ప్రోగు చేస్తారు. అలా ప్రోగు చేసి వాళ్ళను
అగ్ని గుండంలో పారవేస్తారు. 42వాళ్ళు ఏడుస్తారు.
బాధననుభవిస్తారు. 43ఆ తర్వాత నీతిమంతులు తమ
తండ్రి రాజ్యంలో సూర్యునిలా ప్రకాశిస్తారు. విన్నవాళ్ళు
అర్థం చేసుకోండి!

### దాచిన నిధి

44“దేవుని రాజ్యం పొలంలో దాచబడిన నిధి
లాంటిది. ఒక వ్యక్తి ఆ నిధిని కనుగొన్నాడు. కాని
వెంటనే దాన్ని దాచేసాడు. ఆ తర్వాత ఆనందంగా
వెళ్ళి తన దగ్గరున్న వన్నీ అమ్మివేసి ఆ పొలాన్ని
కొన్నాడు.
45“దేవుని రాజ్యం మంచి ముత్యాల కోసం వెతికే
వర్తకుని లాంటిది. 46ఒక వర్తకుడు మంచి విలువైన
ఒక ముత్యాన్ని కనుగొన్నాడు. ఆ తర్వాత వెళ్ళి తన
కున్నదంతా అమ్మేసి దాన్ని కొన్నాడు.

### వల

47“దేవుని రాజ్యం సరస్సులోకి వేసి అన్ని రకాల
చేపల్ని పట్టుకొనే ఒక వలలాంటిది. 48వల చేపల్తోనిండి
పొయ్యాక బెస్తవాళ్ళు దాన్ని ఒడ్డుకు లాగి మంచి
చేపల్ని బుట్టలో వేసికొని పనికిరాని చేపల్ని పారవే
స్తారు. 49అదేవిధంగా యుగాంతంలో కూడా దేవ
దూతలు వచ్చి నీతిమంతులనుండి దుర్మార్గుల్ని వేరు
చేసి, భయానకమైన మంటల్లో పార వేస్తారు. 50వాళ్ళు
దుఃఖిస్తారు. బాధనను భవిస్తారు. పళ్ళు కొరుకుతారు.”
51“మీకివన్నీ అర్థమయ్యాయా?” అని యేసు
అడిగాడు. అవునని వాళ్ళు సమాధానం చెప్పారు.
52యేసు వాళ్ళతో, “దేవుని రాజ్యాన్ని గురించి
బోధన పొందిన శాస్త్రుల్ని తన ధనాగారం నుండి క్రొత్త
నిధుల్ని, పాతనిధుల్ని తీసుకొని వచ్చే ఆసామితో
పోల్చవచ్చు” అని అన్నాడు.

### స్వగ్రామంలో

*(మార్కు 6:1-6; లూకా 4:16-30)*

53యేసు ఈ ఉపమానాలన్నిటిని చెప్పటం ముగిం
చాక అక్కడి నుండి ప్రయాణమై తన స్వగ్రామం
వెళ్ళాడు. అక్కడ సమాజ మందిరంలో ప్రజలకు
బోధించటం మొదలు పెట్టాడు. 54వాళ్ళు ఆ బోధనలు
విని చాలా ఆశ్చర్యపడి, “ఈ జ్ఞానం, ఈ శక్తి ఈయనకు
ఎక్కడ నుండి లభించాయి? 55ఈయన వడ్రంగి
కుమారుడే కదూ! ఈయన తల్లి పేరు మరియ కదూ!
ఇతని సోదరులు యాకోబు, యోసేపు, సీమోను,
యూదా కదూ! 56ఇతని అక్క చెల్లెండ్రందరూ మన
గ్రామంలోనే నివసిస్తున్నారు కదూ! మరి ఈయనకు
యివన్నీ ఎక్కడనుండి లభించాయి?” అని అన్నారు.
57ఆయనపై వాళ్ళకు కోపం వచ్చింది.
యేసు వాళ్ళతో, “స్వగ్రామం వాళ్ళు, యింటి
వాళ్ళు తప్ప ప్రవక్తను అందరూ గౌరవిస్తారు” అని
అన్నాడు. 58వాళ్ళు విశ్వసించలేదు. కనుక ఆయన
అక్కడ ఎక్కువ అద్భుతాలు చేయలేదు.

### యోహాను తల నరకటం

*(మార్కు 6:14-29; లూకా 9:7-9)*

14 ఆ కాలంలో గలిలయకు అధిపతియైన
హేరోదు యేసును గురించి విన్నాడు. 2అతడు
తన పరిచారకులతో, “ఇతడు బాప్తిస్మము నిచ్చే
యోహాను అని నా నమ్మకం. అతడు బ్రతికి వచ్చాడు.
కనుకనే అద్భుతాలు చేసే శక్తి ఆయనలోవుంది” అని
అన్నాడు.
3అలా ఎందుకన్నాడంటే కొంతకాలానికి ముందు
హేరోదు యోహానును బంధించి కారాగారంలో వేసాడు.
ఇలా జరగటానికి కారణం హేరోదియ. ఈమె హేరోదు
సోదరుడైన ఫిలిప్పుకు భార్య. 4పైగా యోహాను
హేరోదుతో, “నీ వామెతో కలసి జీవించటం న్యాయం
కాదు!” అని అనేవాడు. 5ఈ కారణంగా హేరోదు
యోహానును చంపాలనుకున్నాడు. కాని ప్రజలు
యోహానును ఒక ప్రవక్తగా పరిగణించేవారు కనుక
హేరోదు వాళ్ళను చూసి భయపడి పోయాడు.
6హేరోదు పుట్టిన రోజు పండుగ జరిగింది. ఆరోజు
హేరోదియ కుమార్తె సభలో నాట్యం చేసి హేరోదును
మెప్పించింది. 7అందువల్ల అతడు ఆమె అడిగింది
యిస్తానని వాగ్దానం చేసాడు. 8ఆమె తన తల్లి ప్రోద్బ
లంతో, “బాప్తిస్మమిచ్చు యోహాను తలను ఒక
పళ్ళెంలో పెట్టి నాకివ్వండి” అని అడిగింది. 9ఇది
విన్న రాజుకు దుఃఖం కలిగింది. కాని వాగ్దానం చేయటం
వల్ల, అతిథులు అక్కడే ఉండటంవల్ల ఆమె కోరిక
తీర్చమని ఆజ్ఞాపించాడు. 10వెంటనే భటుణ్ణి పంపి
కారాగారంలో ఉన్న యోహాను తల నరికి వేయించాడు.
11ఒక భటుడు యోహాను తలను ఒక పళ్ళెంలో తీసుకు

వచ్చి ఆమె కిచ్చాడు. ఆమె దాన్ని తన తల్లి దగ్గరకు
తీసుకు వెళ్ళింది. 12యోహాను శిష్యులు వచ్చి అతని
దేహాన్ని తీసుకు వెళ్ళి సమాధి చేసారు. ఆ తర్వాత
వెళ్ళి యేసుతో చెప్పారు.

### అయిదు వేలమందికి భోజనం

*(మార్కు 6:30-44; లూకా 9:10-17; యోహాను 6:1-14)*

13జరిగిందివిని యేసు పడవనెక్కి ఏకాంతంగా నిర్జన
ప్రదేశానికి వెళ్ళాడు. ఆయన వెళ్ళిన సమాచారం విని
ప్రజలు గుంపులు గుంపులుగా పట్టణాలనుండి వచ్చి
కాలినడకన ఆయన్ని అనుసరించారు. 14యేసు పడవ
నుండి దిగి ప్రజలు గుంపులు గుంపులుగా అక్కడ
ఉండటం చూసాడు. ఆయనకు జాలి వేసింది. వాళ్ళలో
రోగాలున్న వాళ్ళను ఆయన బాగు చేసాడు.
15సాయంకాలం కాగానే శిష్యులు ఆయన దగ్గరకు
వచ్చి, "ఈ ప్రదేశం ఏమూలో ఉంది, పైగా ఇప్పటికే
చాలా ప్రొద్దుపోయింది. వీళ్ళను పంపి వేయండి.
గ్రామాల్లోకి వెళ్ళి ఏదైనా కొనుక్కొని తింటారు" అని
అన్నారు.
16యేసు, "వాళ్ళు వెళ్ళనక్కరలేదు. తినటానికి మీరే
ఏదైనా యివ్వండి" అని వాళ్ళతో అన్నాడు. 17"మా
దగ్గర అయిదు రొట్టెలు, రెండు చేపలు మాత్రమే
ఉన్నాయి" అని వాళ్ళు సమాధానం చెప్పారు.
18"వాటిని ఇక్కడకు తీసుకు రండి" అని యేసు
అన్నాడు. 19ఆ తర్వాత ప్రజల్ని అక్కడున్న పచ్చిక
బయళ్ళలో కూర్చోమని అన్నాడు. ఆ అయిదు
రొట్టెల్ని, రెండు చేపల్ని తీసికొని ఆకాశం వైపు
చూసి దేవునికి స్తోత్రం చెల్లించాడు. ఆ రొట్టెను విరిచి
తన శిష్యులకు ఇచ్చాడు. శిష్యులు ప్రజలకు పంచారు.
20అందరూ కడుపు నిండా తిన్నారు. ఆ తర్వాత
శిష్యులు మిగిలిన ముక్కల్ని పన్నెండు గంపల నిండా
నింపారు. 21స్త్రీలు, పిల్లలే కాకుండా అయిదువేల మంది
దాకా పురుషులు ఆ రోజు అక్కడ భోజనం చేసారు.

### యేసు నీళ్ళపై నడవటం

*(మార్కు 6:45-52; యోహాను 6:15-21)*

22ఆ తర్వాత యేసు తన శిష్యులతో పడవనెక్కి
తనకన్నా ముందు అవతలి ఒడ్డుకు వెళ్ళమని చెప్పాడు.
తానక్కడే ఉండి ప్రజల్ని ఇళ్ళకు పంపాలని ఆయన
ఉద్దేశం. 23ప్రజల్ని పంపేశాక యేసు ఏకాంతంగా ప్రార్థిం
చటానికి కొండ మీదికి వెళ్ళాడు. సాయంకాలం
అయింది. అయినా ఆయనొక్కడే అక్కడ ఉండి
పోయాడు. 24పడవ ఒడ్డుకు చాలా దూరంలో ఉంది.
ఎదురు గాలి వీయటం వల్ల అలలు ఆ పడవను కొడ్తూ
ఉన్నాయి.
25రాత్రి నాలుగో ఝామున యేసు నీళ్ళ మీద
నడుస్తూ శిష్యుల దగ్గరకు వెళ్ళాడు. 26ఆయన నీళ్ళ
పై నడవటం చూసి శిష్యులు 'దయ్యం' అంటూ
భయంతో పెద్దకేక పెట్టారు.
27యేసు వెంటనే, "నేనే! ధైర్యంగా ఉండండి!
భయపడకండి!" అని అన్నాడు.
28పేతురు, "ప్రభూ మీరైతే, నీళ్ళ మీద నడుస్తూ
నన్ను మీదగ్గరకు రానివ్వండి!" అని అన్నాడు.
29"రా" అని యేసు అన్నాడు.
అప్పుడు పేతురు పడవ దిగి నీళ్ళ మీద నడుస్తూ
యేసు దగ్గరకు వెళ్ళాడు. 30కాని గాలి వీయటం గమ
నించి భయపడి నీళ్ళలో మునుగుతూ, "ప్రభూ, నన్ను
రక్షించండి!" అని కేక వేశాడు.
31యేసు వెంటనే తన చేయి జాపి అతణ్ణి పట్టు
కొని, "నీలో దృఢవిశ్వాసం లేదు! ఎందుకు సందే
హించావు?" అని ప్రశ్నించాడు.
32వాళ్ళిద్దరూ పడవనెక్కాక గాలి తీవ్రత తగ్గిపో
యింది. 33పడవలోవున్న వాళ్ళు యేసుకు
మ్రొక్కుతూ, "మీరు నిజంగా దేవుని కుమారుడు!"
అని అన్నారు.
34వాళ్ళు సరస్సు దాటి గెన్నేసరెతు ఒడ్డును
చేరుకున్నారు. 35ఆ గ్రామం వాళ్ళు యేసును గుర్తించి
చుట్టూ ఉన్న ప్రాంతాల వాళ్ళందరికి కబురు పెట్టారు.
ప్రజలు రోగాలతో ఉన్న వాళ్ళను ఆయన దగ్గరకు
పిలుచుకు వచ్చి 36"వాళ్ళను మీ అంగీ అంచునైనా
తాకనివ్వండి" అని బ్రతిమిలాడారు. ఆయన్ని తాకిన
వాళ్ళకందరికి నయమైపోయింది.

15 కొందరు పరిసయ్యులు, శాస్త్రులు యెరూష
లేము నుండి వచ్చి, 2"మీ శిష్యులు భోజనానికి
ముందు చేతులెందుకు కడుక్కోరు? పెద్దలు నియ
మించిన ఆచారాల్ని వాళ్ళెందుకు ఉల్లంఘిస్తున్నారు?"
అని అడిగారు.
3యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: "మీ
ఆచారాల కోసం దేవుని ఆజ్ఞల్ని ఎందుకుల్లంఘి
స్తున్నారు? 4దేవుడు 'తల్లి తండ్రుల్ని గౌరవించు' అని
అన్నాడు. అంతేకాక 'తల్లి తండ్రుల్ని దూషించిన వానికి
మరణ దండన వేయవలెను!' అని కూడా చెప్పాడు.
5-6కాని మీరు ఒక వ్యక్తి తన తల్లి తండ్రులతో 'మీ
అవసరాలకివ్వాలనుకొన్న ధనం దేవునికి ముడుపు
కట్టాను' అని అన్నవాడు, తల్లి తండ్రుల్ని గౌరవించ
నవసరం లేదని అంటున్నారు. అంటే మీరు మీ ఆచారం
కోసం దేవుని మాటను కాదంటున్నారన్న మాట.
7మీరు మోసగాళ్ళు. యెషయా మిమ్మల్ని గురించి
సరిగ్గా ముందే చెప్పాడు.

8 అతడు, 'ఈ ప్రజలు నన్ను పెదాలతో
గౌరవిస్తారు. కాని వాళ్ళ హృదయాలు నాకు
దూరంగా ఉంటాయి.

9 వాళ్ళ ఆరాధనలు వ్యర్థం! వాళ్ళ బోధ
నలు మానవులు సృష్టించిన ఆజ్ఞలతో
సమానం’ అని అన్నాడు.”
*యెషయా 29:13*

10యేసు ప్రజల్ని తన దగ్గరకు రమ్మని పిలిచి
వాళ్ళతో, “విని అర్థం చేసుకోండి. 11మానవుని నోటి
లోనికి వెళ్ళేదేదీ అతణ్ణి అపవిత్రం చెయ్యదు. అతని
నోటినుండి వచ్చే మాటలు అతణ్ణి అపవిత్రం
చేస్తాయి” అని అన్నాడు. 12ఆ తర్వాత ఆయన
శిష్యులు వచ్చి, “మీరన్నది విని పరిసయ్యులు కోప
గించు కొన్నారని మీకు తెలుసా?” అని అడిగారు.
13యేసు సమాధానంగా, “పరలోకంలో ఉన్న నా
తండ్రి నాటని ప్రతి మొక్క వేర్లతో పెరికి వేయ బడు
తుంది. 14వాళ్ళ విషయాన్ని వదిలెయ్యండి. వాళ్ళు
గ్రుడ్డివాళ్ళు. కాని వారు ఇతరులకు దారి చూపుతూ
ఉంటారు. గ్రుడ్డివాడు గ్రుడ్డివానికి దారి చూపితే
యిద్దరూ గోతిలో పడ్తారు” అని అన్నాడు.
15పేతురు, “ఆ ఉపమానాన్ని మాకు విడమరచి
చెప్పండి” అని అడిగాడు.
16యేసు, “మీక్కూడా అర్థంకాలేదా? 17నోట్లోకి
వెళ్ళినవి కడుపులోకి వెళ్ళి తదుపరి శరీరం నుండి
బయటకు వెళ్తున్నాయని మీకు తెలియదా? 18కాని
నోటినుండి బయటకు వచ్చే మాటలు హృదయం
నుండి వస్తాయి. మనిషిని అపవిత్రం చేసేవి ఇవే.
19ఎందుకంటే, దురాలోచన, హత్య, లైంగిక అవినీతి,
వ్యభిచారం, దొంగతనము, తప్పుడు సాక్ష్యము, అప
నింద, మానవుని హృదయం నుండి వస్తాయి. 20వీటి
కారణంగా మానవుడు అపవిత్రమౌతున్నాడు. చేతులు
కడుక్కోకుండా భోజనం చేసినంత మాత్రాన అప
విత్రం కాడు” అని అన్నాడు.
21యేసు ఆ ప్రదేశాన్ని వదిలి తూరు, సీదోను
ప్రాంతాలకు వెళ్ళాడు. 22కనాను ప్రాంతానికి చెందిన
ఒక స్త్రీ యేసు దగ్గరకు ఏడుస్తూ వచ్చి, “ ప్రభూ!
దావీదు కుమారుడా! నాపై దయ చూపు. నా కూతురు
దయ్యం పట్టి చాలా బాధ పడుతుంది” అని ఆయనతో
అన్నది.
23యేసు ఏ సమాధానం చెప్పలేదు. అందువల్ల
శిష్యులు వచ్చి, “ఆమె బిగ్గరగా కేకలు వేస్తూ మన
వెంట వస్తోంది. ఆమెను వెళ్ళమనండి” అని విజ్ఞప్తి
చేసారు.
24యేసు, “తప్పిపోయిన ఇశ్రాయేలు ప్రజల*
కోసం మాత్రమే దేవుడు నన్ను పంపాడు” అని
అన్నాడు. 25ఆ స్త్రీ వచ్చి యేసు ముందు మోకరిల్లి,
“ప్రభూ! నాకు సహాయం చెయ్యండి!” అని అడిగింది.
26యేసు, “దేవుని సంతానానికి చెందిన ఆహారం
తీసుకొని కుక్కలకు వెయ్యటం న్యాయం కాదు” అని
సమాధానం చెప్పాడు.
27“ఔను ప్రభూ! కాని, కుక్కలు కూడా తమ
యజమాని విస్తరు నుండి పడిన ముక్కల్ని తింటాయి
కదా!” అని ఆమె అన్నది.
28అప్పుడు యేసు, “అమ్మా! నీలో ఉన్న విశ్వాసం
గొప్పది. నీవు కోరినట్లే జరుగుతుంది” అని సమాధానం
చెప్పాడు.
ఆ క్షణంలోనే ఆమె కూతురుకు నయమై
పోయింది.
29యేసు అక్కడి నుండి బయలు దేరి, గలిలయ
సరస్సు తీరము మీదుగా నడిచి కొండ మీదికి వెళ్ళి
కూర్చున్నాడు.
30ప్రజలు గుంపులు గుంపులుగా అక్కడికి
వచ్చారు. వాళ్ళు తమ వెంట కుంటి వాళ్ళను, గ్రుడ్డి
వాళ్ళను, కాళ్ళు చేతులు పడి పోయిన వాళ్ళను,
మూగ వాళ్ళను యింకా అనేక రకాల రోగాలున్న
వాళ్ళను తీసికొని వచ్చి ఆయన కాళ్ళ ముందు పడ
వేసారు. ఆయన వాళ్ళకు నయం చేసాడు. 31మూగ
వాళ్ళకు మాట వచ్చింది. కాళ్ళు చేతులు పడిపోయిన
వాళ్ళకు నయమై పోయింది. కుంటి వాళ్ళు నడిచారు.
గ్రుడ్డివాళ్ళకు చూపు వచ్చింది. ఇవన్నీ జరగటం చూసి
ప్రజలు ఆశ్చర్యపడి ఇశ్రాయేలు దేవుణ్ణి స్తుతించారు.
32యేసు తన శిష్యుల్ని పిలిచి వాళ్ళతో, “వీళ్ళ
పట్ల నాకు చాలా జాలి వేస్తోంది. వాళ్ళు మూడు
రోజులనుండి నా దగ్గరే ఉన్నారు. వాళ్ళ దగ్గర తినటానికి
ఏమీ లేదు. వాళ్ళను ఆకలితో పంపటం నాకిష్టం లేదు.
అలా పంపివేస్తే వాళ్ళు దారిలో మూర్ఛ పడిపో తారు”
అని అన్నాడు.
33ఆయన శిష్యులు సమాధానంగా, “ఈ మారు
మూల ప్రాంతంలో అందరికి సరిపోయె రొట్టెలు
ఎక్కడ దొరుకుతాయి?” అని అన్నారు.
34“మీ దగ్గర ఎన్ని రొట్టెలున్నాయి?” యేసు
అడిగాడు.
“ఏడు రొట్టెలు, కొన్ని చేపలు ఉన్నాయి” అని
వాళ్ళు సమాధానం చెప్పారు.
35యేసు ప్రజల్ని కూర్చోమన్నాడు. 36ఆ
తర్వాత ఆ ఏడు రొట్టెల్ని, చేపల్ని తీసుకొని దేవునికి
కృతజ్ఞతలు చెప్పి వాటిని విరిచి శిష్యులకు యిచ్చాడు.
శిష్యులు వాటిని ప్రజలకు పంచి పెట్టారు. 37అందరూ
సంతృప్తిగా తిన్నారు. ఆ తర్వాత శిష్యులు మిగిలిన
ముక్కల్ని ఏడు గంపల నిండా నింపారు.
38స్త్రీలు, చిన్న పిల్లలు కాక నాలుగు వేలమంది
పురుషులు ఆ రోజు అక్కడ భోజనం చేసారు. 39యేసు
ప్రజల్ని పంపేసాక పడవనెక్కి మగదాను ప్రాంతానికి
వెళ్ళాడు.

**ప్రజలు** మూలభాషలో “గొర్రెలు” అని వ్రాయబడివుంది.

### అద్భుతకార్యం చూపమని అడగటం

*(మార్కు 8:11-13; లూకా 12:54-56)*

16 పరిసయ్యులు, సద్దూకయ్యులు యేసును పరీ
క్షించాలని వచ్చి, 'ఆకాశం నుండి ఒక అద్భు
తాన్ని మాక్కూడా చూపండి' అని అడిగారు.
2ఆయన, "సాయంత్రం వేళ ఆకాశం ఎర్రగా
ఉంటే ఆ రోజు వాతావరణం బాగుంటుందని మీరం
టారు. 3ఉదయం ఆకాశం ఎఱ్ఱగావుండి, ఆకాశంలో
మబ్బులు ఉంటే ఆ రోజు తుఫాను వస్తుందని
అంటారు. ఆకాశం వైపు చూసి మీరు వాతావరణాన్ని
సూచించ గలరుకాని ఈ కాలంలో కనబడుతున్న
అద్భుతాన్ని అర్థం చేసుకోలేరేం? 4దుష్టులు, వ్యభి
చారులు అయి నటువంటి ఈ తరం వాళ్ళు అద్భుత
కార్యాల్ని చూపమని కోరతారు. దేవుడు యోనా ద్వారా
చూపిన అద్భుతం తప్ప మరే అద్భుతం చూపబడదు"
అని చెప్పి వాళ్ళను వదిలి వెళ్ళి పోయాడు.

### పులుపు

*(మార్కు 8:14-21)*

5శిష్యులు సరస్సు దాటి వెళ్ళే ముందు, తమ వెంట
రొట్టెల్ని తీసుకు వెళ్ళటం మరచి పొయ్యారు. 6యేసు
వాళ్ళతో, "జాగ్రత్త! పరిసయ్యులు కారణంగా, సద్దూక
య్యుల కారణంగా కలిగే పులిసిన పిండి విషయంలో
దూరంగా ఉండండి" అని అన్నాడు. 7ఈ విషయాన్ని
గురించి వారు తమలో తాము చర్చించుకొని, "మనం
రొట్టెలు తేలేదని అలా అంటు న్నాడు" అని అన్నారు.
8వాళ్ళ చర్చ యేసుకు తెలిసింది. వాళ్ళతో,
"మీలో దృఢ విశ్వాసం లేదు. రొట్టెలు లేవని మీలో
మీరెందుకు చర్చించు కొంటున్నారు. 9మీ కింకా
అర్థంకాలేదా? అయిదు వేల మందికి అయిదు రొట్టెల్ని
పంచినప్పుడు మిగిలిన ముక్కల్ని మీరెన్ని గంపల
నిండా నింపారో మీకు జ్ఞాపకం లేదా? 10మరి ఏడు
రొట్టెల్ని నాలుగు వేల మందికి పంచినప్పుడు మిగిలిన
ముక్కల్ని మీరెన్ని గంపల నిండా నింపారో జ్ఞాపకం
లేదా? 11నేను రొట్టెల్ని గురించి మాట్లాడలేదని
మీకెందుకు అర్థం కావటం లేదు? పరిసయ్యుల కార
ణంగా, సద్దూకయ్యుల కారణంగా కలిగే దుష్ప్రభావానికి
దూరంగా ఉండండి" అని అన్నాడు. 12ఆయన
రొట్టెలకు ఉపయోగించే పులుపు విష యంలో జాగ్రత్త
పడమనటం లేదని, పరిసయ్యుల బోధన విషయంలో,
సద్దూకయ్యుల బోధన విష యంలో జాగ్రత్త
పడమంటున్నాడని అప్పుడు వాళ్ళకు అర్థమయింది.

### యేసే క్రీస్తు

*(మార్కు 8:27-30 లూకా 9:18-21)*

13యేసు ఫిలిప్పు స్థాపించిన కైసరయ పట్టణ
ప్రాంతానికి వచ్చాక తన శిష్యులతో, "మనుష్య కుమా
రుణ్ణి గురించి ప్రజలేమను కుంటున్నారు?" అని
అడిగాడు.
14వాళ్ళు, "కొందరు బాప్తిస్మమిచ్చు యోహాను
అంటున్నారు. కొందరు ఏలీయా అంటున్నారు.
కొందరు యిర్మీయా అంటున్నారు. మరి కొందరు
ప్రవక్తల్లో ఒకడై ఉండవచ్చని అంటున్నారు" అని
అన్నారు.
15యేసు, "కాని మీ విషయమేమిటి? నేనెవరని
మీరనుకొంటున్నారు?" అని వాళ్ళనడిగాడు.
16సీమోను పేతురు, "నీవు క్రీస్తువు! సజీవుడైన
దేవుని కుమారుడవు!" అని అన్నాడు.
17యేసు సమాధానం చెబుతూ, "యోనా కుమా
రుడా! ఓ! సీమోనూ, నీవు ధన్యుడవు! ఈ విష
యాన్ని నీకు మానవుడు చెప్పలేదు. పరలోకం
లోవున్న నా తండ్రి చెప్పాడు. 18నీవు పేతురు వని
నేను చెబుతున్నా. ఈ బండ మీద నేను నా సంఘాన్ని
నిర్మిస్తాను. మృత్యులోకపు శక్తులు సంఘాన్ని ఓడించ
లేవు. 19దేవుని రాజ్యం యొక్క తాళం చెవులు నేను
నీకిస్తాను. ఈ ప్రపంచంలో నీవు నిరాకరించిన వాళ్ళను
పరలోకంలో కూడా నిరాకరిస్తాను. ఈ ప్రపంచంలో
నీవు అంగీకరించిన వాళ్ళను పరలోకంలో కూడా అంగీ
కరిస్తాను" అని చెప్పాడు. 20ఆ తర్వాత, తాను క్రీస్తు
అన్న విషయం ఎవ్వరికీ చెప్ప వద్దని శిష్యులతో
చెప్పాడు.

### యేసు పొందనున్న మరణం

*(మార్కు 8:31-9:1; లూకా 9:22-27)*

21అప్పటి నుండి యేసు తన శిష్యులతో తాను
యెరూషలేముకు వెళ్ళ వలసిన విషయాన్ని గురించి,
అక్కడున్న పెద్దలు, మహాయాజకులు, శాస్త్రులు తనను
హింసించే విషయాన్ని గురించి, తాను పొందవలసిన
మరణాన్ని గురించి, మూడవ రోజు బ్రతికి రావటాన్ని
గురించి చెప్పటం మొదలు పెట్టాడు.
22పేతురు ఆయనను ప్రక్కకు పిలిచి అలా మాట్లాడ
వద్దంటూ, "దేవుడు మీపై దయ చూపాలి ప్రభూ!
అలా ఎన్నటికి జరగ కూడదు!" అని అన్నాడు.
23యేసు పేతురు వైపు తిరిగి, "నా ముందు నుండి
వెళ్ళిపో సాతాను! నీవు నాకు ఆటంకం కలిగి స్తున్నావు!
నీవు మనుష్యుల సంగతుల గురించి ఆలోచిస్తున్నావు
కాని, దేవుని సంగతులు గురించి కాదు" అని అన్నాడు.
24యేసు తన శిష్యులతో, "నా వెంట రాదలచిన
వాడు అన్నీ విడచి పెట్టి, తన సిలువను మోసుకొంటూ
నన్ను అనుసరించాలి. 25తన ప్రాణాన్ని కాపాడాలను
కొన్నవాడు దాన్ని పోగొట్టుకొంటాడు. కాని నా కోసం
తన ప్రాణాన్ని ఒదులు కొన్నవాడు దాన్ని కాపాడు
కుంటాడు. 26ప్రపంచాన్నంతా జయించి తన

ప్రాణాన్ని* పోగొట్టుకొన్న వ్యక్తికి ఏం లాభం కలుగు
తుంది? ఆ ప్రాణాన్ని తిరిగి పొందటానికి అతడేమివ్వ
గలుగుతాడు? 27మనుష్యకుమారుడు తన దేవదూత
లతో కలిసి, తండ్రి మహిమతో రానున్నాడు. అప్పుడా
యన ప్రతి ఒక్కనికి, చేసిన పనిని బట్టి ప్రతిఫలం
ఇస్తాడు. 28ఇక్కడ నిలుచున్న వాళ్ళలో కొందరు
మనుష్యకుమారుడు రావటం చూసేవరకు జీవించే
వుంటారు” అని గట్టిగా చెప్పాడు.

## దివ్యరూపం పొందటం

(మార్కు 9:2-13; లూకా 9:28-36)

17 యేసు ఆరు రోజుల తర్వాత పేతురును,
యాకోబును,యాకోబు సోదరుడైన యోహా
నును, ఒక ఎత్తైన కొండ మీదికి తన వెంట ప్రత్యేకంగా
పిలుచుకు వెళ్ళాడు. 2ఆయన అక్కడ వాళ్ళ సమక్షంలో
దివ్యరూపం పొందాడు. ఆయన ముఖం సూర్యునిలా
ప్రకాశించింది. ఆయన దుస్తులు వెలుతురువలే తెల్లగా
మారాయి. 3అదే క్షణంలో వాళ్ళ ముందు మోషే
మరియు ఏలీయా ప్రత్యక్షమయ్యారు. వాళ్ళు
యేసుతో మాట్లాడటం శిష్యులు చూసారు.
4పేతురు యేసుతో, “ప్రభూ! మనమిక్కడ
ఉండటం మంచిది. మీరు కావాలంటే మూడు పర్ణ
శాలలు నిర్మిస్తాము – మీకొకటి, మోషే కొకటి, ఏలీ
యా కొకటి” అని అన్నాడు.
5అతడు ఇంకా మాట్లాడుతుండగా ఒక కాంతి
వంతమైన మేఘం ఆ ముగ్గుర్ని కప్పివేసింది. ఆ మేఘం
నుండి ఒక స్వరం, “ఈయన నా ప్రియ కుమారుడు,
ఈయన పట్ల నాకు ప్రేమ ఉంది. ఈయన నాకు
చాలానచ్చాడు. ఈయన మాట వినండి” అని విని
పించింది.
6ఇది విని శిష్యులు భయంతో సాష్టాంగ పడ్డారు.
7యేసు వచ్చి వాళ్ళను తాకుతూ, “లేవండి! భయపడ
కండి!” అని అన్నాడు. 8వాళ్ళు తలెత్తి చూసారు.
వాళ్ళకు యేసు తప్ప యింకెవరూ కనపడలేదు.
9వాళ్ళు కొండ దిగి క్రిందికి వస్తుండగా యేసు,
“మనుష్యకుమారుడు బ్రతికి వచ్చే వరకు మీరు
చూసిన ఈ దృశ్యాన్ని గురించి ఎవ్వరికి చెప్పకండి”
అని ఆజ్ఞాపించాడు.
10“మరి మొదట ఏలీయా రావాలని శాస్త్రులు ఎందు
కంటున్నారు” అని శిష్యులు అడిగారు.
11యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“ఏలీయా తప్పకుండా వస్తాడు. వచ్చి అన్నీ ముందు
న్నట్లు స్థాపిస్తాడు. 12నేను చెప్పేదేమిటంటే, ఏలీయా
ఇది వరకే వచ్చాడు. కాని వాళ్ళతన్ని గుర్తించలేదు.
పైగా అతని పట్ల తమ యిష్టానుసారంగా ప్రవర్తించారు.
అదే విధంగా వాళ్ళు మనుష్య కుమారునికి కూడా
బాధలు కలిగిస్తారు.” 13యేసు బాప్తిస్మమునిచ్చే యోహా
నును గురించి మాట్లాడుతున్నట్లు శిష్యులకు అప్పుడు
అర్థమయింది.

## దయ్యం పట్టిన బాలుని నయం చేయుట

(మార్కు 9:14-29; లూకా 9:37-43)

14వాళ్ళు ప్రజల దగ్గరకు రాగానే ఒక వ్యక్తి యేసు
దగ్గరకు వచ్చి మోకరిల్లి, 15“ప్రభూ! నా కుమారునిపై
దయ చూపండి. అతడు మూర్ఛ రోగంతో చాలా
బాధపడ్తున్నాడు. మాటి మాటికి నిప్పుల్లో పడ్తూ
ఉంటాడు. 16అతణ్ణి నేను మీ శిష్యుల దగ్గరకు తీసుకు
వచ్చాను. కాని వాళ్ళతనికి నయం చెయ్యలేక
పొయ్యారు” అని అన్నాడు.
17అప్పుడు యేసు, “మూర్ఖులైన ఈ తరానికి
చెందిన మీలో విశ్వాసం లేదు. మీకు సక్రమమైన
ఆలోచనలు రావు. నేనెంత కాలమని మీతో ఉండాలి?
ఎంతకాలమని మీ పట్ల సహనం వహించాలి. ఆ బాలుణ్ణి
నా దగ్గరకు పిలుచుకు రండి” అని అన్నాడు. 18యేసు
ఆ దయ్యానికి వెళ్ళిపొమ్మని గట్టిగా చెప్పాడు. అది
ఆ బాలుని నుండి వెలుపలికి వచ్చింది. అదే క్షణంలో
ఆ బాలునికి నయమై పోయింది.
19శిష్యులు ఆ తర్వాత యేసు దగ్గరకు ప్రత్యే
కంగా వచ్చి, “మేమెందుకు దాన్ని వెళ్ళగొట్టలేక
పోయాము?” అని అడిగారు.
20యేసు, “మీలో దృఢవిశ్వాసం లేదు కనుక మీరు
దాన్ని వెళ్ళగొట్టలేక పొయ్యారు. కాని ఇది సత్యం.
21మీలో ఆవగింజంత విశ్వాసమున్నా చాలు. మీరీ
కొండతో ‘అక్కడికి వెళ్ళు’ అని అంటే వెళ్తుంది. మీకు
అసాధ్యమనేది ఉండదు” అని అన్నాడు.
22వాళ్ళంతా గలిలయలో మళ్ళీ కలుసు కొన్న
ప్పుడు యేసు వాళ్ళతో, “మనుష్య కుమారుడు దుర్మా
ర్గులకు అప్పగించబడుతాడు. 23వాళ్ళాయన్ని చంపు
తారు. కాని మూడవ రోజు ఆయన తిరిగి బ్రతికి
వస్తాడు” అని అన్నాడు. ఇది విని శిష్యులు చాలా
దుఃఖించారు.

## దేవాలయపు పన్ను

24యేసు, ఆయన శిష్యులు కపెర్నహూము చేరు
కొన్నారు. అక్కడ అరషెకెలు పన్నులు సేకరించే
అధికారులు పేతురు దగ్గరకు వచ్చి, “మీ బోధకుడు
గుడి పన్ను చెల్లించడా?” అని ప్రశ్నించారు. 25“చెల్లి
స్తాడు” అని పేతురు సమాధానం చెప్పి యింట్లోకి
వెళ్ళాడు.
అతడేం మాట్లాడక ముందే యేసు, “సీమోనూ!
నీవేమంటావు? రాజులు సుంకాలు, పన్నులు ఎవ

**ప్రాణాన్ని** గ్రీకు పదమునకు ‘ఆత్మ’ అని కూడా అర్థము.

ర్నుండి సేకరిస్తారు? తమ స్వంత కుమారులనుండా?
లేక యితర్లనుండా?" అని అడిగాడు.
26"ఇతర్లనుండి" అని పేతురు సమాధానం
చెప్పాడు.
యేసు, "అలాగయితే కుమారులు చెల్లించ వలసిన
అవసరం లేదన్న మాటేగా! 27కాని వాళ్ళకాటంకం
కలిగించటం నాకిష్టం లేదు. సరస్సు దగ్గరకు వెళ్ళి
గాలం వెయ్యి! మొదట పట్టుకొన్న చేప నోటిని
తెరిచి చూస్తే నీకు నాలుగు ద్రాక్మల* నాణెం కనబడు
తుంది. దాన్ని తీసుకువెళ్ళి నా పక్షాన, నీ పక్షాన
వాళ్ళకు చెల్లించు!" అని అన్నాడు.

### దేవుని రాజ్యంలో ఎవరు గొప్ప?

*(మార్కు 9:33-37; లూకా 9:46-48)*

18 ఆ తర్వాత శిష్యులు యేసు దగ్గరకు వచ్చి,
"మరి దేవుని రాజ్యంలో అందరి కన్నా గొప్ప
వాడెవరు?" అని అడిగారు.
2యేసు ఒక చిన్న పిల్లవాణ్ణి దగ్గరకురమ్మని పిలిచి
అతణ్ణి వాళ్ళ మధ్య నిలుచో బెట్టి ఈ విధంగా అన్నాడు:
3"ఇది సత్యం. మీరు మారి, మీ హృదయాల్లో చిన్న
పిల్లల్లా ఉండకపోతే దేవుని రాజ్యంలో ప్రవేశించ లేరు.
4అందువల్ల ఈ చిన్నపిల్లవానిలో ఉన్న వినయాన్ని
అలవర్చు కున్నవాడు దేవుని రాజ్యంలో అందరికన్నా
గొప్ప వానిగా పరిగణింప బడతాడు.
5"అంతేకాక ఇలాంటి చిన్నపిల్లల్లో ఒకనికి నా పేరిట
స్వాగత మిచ్చిన వాణ్ణి నాకు స్వాగత మిచ్చిన వానిగా
నేను పరిగణిస్తాను. 6కాని నన్ను విశ్వసించే ఈ చిన్న
పిల్లల్లో ఎవరైనా పాపం చేయటానికి కారకుడవటం
కన్నా, మెడకు తిరుగటి రాయి కట్టబడి లోతైన సముద్ర
దంలో పడవేయబడటం మేలు. 7ప్రపంచంలోని మాన
వుల్ని చూచినప్పుడు విచారం కలుగుతుంది. ఎందు
కంటే వాళ్ళ చేత పాపం చేయించే సంగతులు
అలాంటివి. అవి జరుగక తప్పదు. కాని ఎవడు అలాం
టివి జరిగిస్తాడో వాని స్థితి భయంకరమైనది. 8మీ
కాలుగాని లేక మీ చేయిగాని మీ పాపానికి కారణమైతే
దాన్ని నరికి పారవేయండి. కాళ్ళు చేతులు ఉండి నర
కంలో శాశ్వతమైన మంటల్లో పడటం కన్నా, కుంటి
వానిగా లేక వికలాంగునిగా జీవం పొందటం మేలు.
9ఇక మీ కన్ను మీ పాపానికి కారణమైతే దాన్ని పీకి
పారవేయండి. రెండు కళ్ళుండి నరకంలోని మంటల్లో
పడటం కన్నా ఒక కన్నుతో జీవంలో ప్రవేశించి
జీవించటం మేలు.

### తప్పిపోయిన గొఱ్ఱెల ఉపమానం

*(లూకా 15:3-7)*

10"ఈ చిన్న పిల్లల్లో ఎవర్నీ చిన్న చూపు చూడ
కండి. నేను చెప్పేదేమిటంటే పరలోకంలో ఉన్న వీళ్ళ
దూతలు పరలోకంలో ఉన్న నా తండ్రి ముఖాన్ని
ఎప్పుడూ చూస్తూ ఉంటారు. 11*
12"ఒకని దగ్గర వంద గొఱ్ఱెలు వున్నాయనుకోండి.
అందులో ఒక గొఱ్ఱె తప్పి పోతే, అతడు ఆ తొంబై
తొమ్మిది గొఱ్ఱెల్ని కొండమీద వదిలి, ఆ తప్పిపోయిన
గొఱ్ఱె కోసం వెతుక్కొంటూ వెళ్ళడా? మీరేమంటారు?
13ఇది సత్యం, ఒక వేళ ఆ గొఱ్ఱె దొరికితే ఆ తప్పిపోని
తొంబై తొమ్మిది గొఱ్ఱెలు తన దగ్గరున్న దానికన్నా
ఎక్కువ ఆనందిస్తాడు. 14అతనిలాగే పరలోకంలోవున్న
నా తండ్రి ఈ చిన్న పిల్లల్లో ఎవ్వరూ తప్పిపోరాదని
ఆశిస్తుంటాడు.

### పాపం చేసిన సోదరుడు

*(లూకా 17:3)*

15"మీ సోదరుడు మీపట్ల అపరాధం చేస్తే అతని
దగ్గరకు వెళ్ళి అతడు చేసిన అపరాధాన్ని అతనికి
రహస్యంగా చూపండి. అతడు మీ మాట వింటే అతణ్ణి
మీరు జయించినట్లే! 16ఒక వేళ అతడు మీ మాట
వినకపోతే, ఒకరిద్దర్ని మీ వెంట తీసుకు వెళ్ళండి.
ఎందుకంటే ప్రతి విషయాన్ని నిర్ణయించటానికి
యిద్దరు లేక ముగ్గురు సాక్ష్యం చెప్పాలి. 17వాళ్ళ మాట
వినటానికి అతడు అంగీకరించకపోతే వెళ్ళి వాళ్ళ
సంఘానికి చెప్పండి. అతడు సంఘం చెప్పిన మాట
కూడా వినకపోతే అతణ్ణి మీ వానిగా పరిగణించకండి.
18"ఇది సత్యం. ఈ ప్రపంచములో మీరు నిరాక
రించిన వాళ్ళను పరలోకంలో నేను కూడా నిరాకరి
స్తాను. ఈ ప్రపంచంలో మీరు అంగీకరించిన వాళ్ళను
పరలోకంలో నేను కూడా అంగీకరిస్తాను.
19"అంతేకాక, నేను చెప్పేదేమిటంటే మీలో
యిద్దరు కలసి దేవుణ్ణి ఏమి అడగాలో ఒక నిర్ణయానికి
వచ్చి ప్రార్థించాలి. అప్పుడు పరలోకంలోవున్న నా
తండ్రి మీ కోరిక తీరుస్తాడు. 20ఎందుకంటే, నా పేరిట
యిద్దరు లేక ముగ్గురు ఎక్కడ సమావేశమైతే నేను
అక్కడ వాళ్ళతో ఉంటాను."

### క్షమించని సేవకుని ఉపమానం

21అప్పుడు పేతురు యేసు దగ్గరకు వచ్చి,
"ప్రభూ! నా సోదరుడు నా పట్ల పాపం చేస్తే నేనెన్ని
సార్లు అతణ్ణి క్షమించాలి? ఏడుసార్లా?" అని అడిగాడు.

---

**నాలుగు ద్రాక్మల** ఆనాటి పనివాడు దినానికి ఒక ద్రాక్మా సంపాదించేవాడు.

**వచనము 11** కొన్ని గ్రీకు ప్రతులలో 11 వ వచనం ఇలా ఉంది: "మనుష్యకుమారుడు తప్పి పోయిన ప్రజలను రక్షించ టానికి వచ్చాడు."

22యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు,
“ఏడుసార్లు కాదు, డెబ్బది ఏడు సార్లు* క్షమించాలని
చెబుతున్నాను.”
23“అందువల్లే దేవుని రాజ్యాన్ని తన సేవకులతో
లెక్కలు పరిష్కరించుకోవాలన్న రాజుతో పోల్చవచ్చు.
24ఆ రాజు లెక్కలు పరిష్కరించటం మొదలు పెట్టగానే
వేలకొలది తలాంతులు* అప్పు ఉన్న ఒక వ్యక్తిని
భటులు రాజుగారి దగ్గరకు పిలుచుకు వచ్చారు. 25కాని
అప్పు ఉన్న వాని దగ్గర చెల్లించటానికి డబ్బు లేదు.
అందువల్ల ఆ రాజు అతణ్ణి, అతని భార్యను, అతని
సంతానాన్ని, అతని దగ్గర ఉన్న వస్తువులన్నిటిని
అమ్మేసి అప్పు చెల్లించమని ఆజ్ఞాపించాడు.
26“ఆ సేవకుడు రాజు ముందు మోకరిల్లి, ‘కొద్ది
గడువు యివ్వండి, మీకివ్వ వలసిన డబ్బంతా యిచ్చే
స్తాను’ అని వేడుకొన్నాడు. 27రాజు ఆ సేవకునిపై
దయచూపి అతణ్ణి విడుదల చేసాడు.పైగా అతని
అప్పుకూడా రద్దు చేసాడు.
28“ఆ సేవకుడు వెలుపలికి వెళ్ళి, తనతో కలసి
పనిచేసే సేవకుణ్ణి చూసాడు. తనకు వంద దేనారాలు
అప్పువున్న అతని గొంతుక పట్టుకొని, ‘నా అప్పు
తీర్చు!’ అని వేధించాడు.
29“అప్పువున్నవాడు మోకరిల్లి, ‘కొద్ది గడువు
యివ్వు! నీ అప్పు తీరుస్తాను!’ అని బ్రతిమిలాడాడు.
30“కాని అప్పిచ్చిన వాడు దానికి అంగీకరించలేదు.
పైగా వెళ్ళి తన అప్పు తీర్చే దాకా ఆ అప్పున్నవాణ్ణి
కారాగారంలో వేయించాడు. 31తోటి సేవకులు జరి
గింది చూసారు. వాళ్ళకు చాలా దుఃఖం కలిగింది.
వాళ్ళు వెళ్ళి జరిగిందంతా తమ రాజుతో చెప్పారు.
32“అప్పుడా ప్రభువు ఆ సేవకుణ్ణి పిలిచి, కోపంతో
‘దుర్మార్గుడా! నీవు బ్రతిమిలాడి నందుకు నీ అప్పంతా
రద్దు చేసాను. 33-34మరి, నేను నీమీద దయ చూపినట్లే
నీవు నీ తోటి సేవకునిపై దయ చూపనవసరంలేదా?’
అని అన్నాడు. ఆ తదుపరి తన అప్పంతా తీర్చేదాకా
చిత్రహింస పెట్టమని ఆ సేవకుణ్ణి భటులకు అప్ప
గించాడు. 35మీలో ప్రతి ఒక్కరూ మీ సోదరుణ్ణి
మనసారా క్షమించక పోతే పరలోకంలోవున్న నా తండ్రి
మీ పట్ల ఆ రాజులాగే ప్రవర్తిస్తాడు.”

### విడాకుల్ని గురించి ఉపదేశించటం

*(మార్కు 10:1-12)*

19 యేసు మాట్లాడటం ముగించాక గలిలయ
వదలి యొర్దాను నది అవతలి వైపున ఉన్న
యూదయ ప్రాంతానికి వెళ్ళాడు. 2ప్రజలు గుంపులు
గుంపులుగా ఆయన్ని అనుసరించారు. ఆయన
వాళ్ళకు నయం చేసాడు.
3కొందరు పరిసయ్యులు ఆయన్ని పరీక్షించాలని
వచ్చి, “పురుషుడు తన భార్యకు ఏదో ఒక కారణం
చూపి విడాకులివ్వవచ్చా?” అని అడిగారు.
4-5యేసు, “మొదట్లో సృష్టికర్త పురుషుణ్ణి, స్త్రీని
సృష్టించి ఇలా అన్నాడు: ‘పురుషుడు తన తల్లి తండ్రు
లను వదలి తన భార్యతో ఏక మౌతాడు. వాళ్ళి
ద్దరూ కలసి ఒకే శరీరంగా జీవిస్తారు!’* ఇది మీరు
చదువలేదా? 6ఆ కారణంగా వాళ్ళనిక మీదట యిరు
వురిగా కాకుండా ఒకరిగా పరిగణించాలి! దేవుడు ఏకం
చేసిన వాళ్ళను మానవుడు వేరు చేయరాదు!” అని
సమాధానం చెప్పాడు.
7“మరి పురుషుడు విడాకుల పత్రం తన భార్య
కిచ్చి ఆమెను పంపివేయవచ్చని మోషే ఎందుకు ఆజ్ఞా
పించాడు?” అని వాళ్ళు అడిగారు.
8యేసు, “మీరు దేవుని ఆజ్ఞలను అనుసరించే
వాళ్ళు కాదు కాబట్టి మీ భార్యలకు విడాకులివ్వటానికి
మోషే మీకు అనుమతి యిచ్చాడు. అంతేకాని మొదటి
నుండి ఈ విధంగా లేదు. 9కాని నేను చెప్పేదేమిటంటే
అవినీతిపరురాలు కాని తన భార్యకు విడాకులిచ్చి
మరొక స్త్రీని వివాహమాడిన వాడు వ్యభిచారిగా పరిగ
ణింపబడతాడు. విడువబడ్డ దానిని పెండ్లి చేసికొంటే
వాడును వ్యభిచారిగా అవుతాడు” అని అన్నాడు.
10శిష్యులు ఆయనతో, “విడాకులివ్వటానికి
ఇలాంటి కారణం కావలసి వస్తే వివాహం చేసుకోకుండా
ఉండటమే ఉత్తమం” అని అన్నారు.
11-12యేసు, “మీరన్నట్లు చెయ్యటం అందరికీ
సాధ్యంకాదు. కొందరు నపుంసకులుగా పుడ్తారు. కనుక
వివాహం చేసుకోరు. మరి కొందర్ని యితర్లు నపుంసకు
లుగా చేస్తారు. కనుక వివాహం చేసుకోరు. కాని కొందరు
దేవుని రాజ్యంకొరకు వివాహం చేసుకోరు. ఈ బోధను
అనుసరించ గలవాడే అనుసరించనీ” అని సమాధానం
చెప్పాడు.

### యేసు చిన్న పిల్లల్ని ఆశీర్వదించటం.

*(మార్కు 10:13-16; లూకా 18:15-17)*

13యేసు తన చేతుల్ని చిన్న పిల్లల తలలపై
ఉంచి వాళ్ళకోసం ప్రార్థించాలని కొందరు వ్యక్తులు
వాళ్ళను ఆయన దగ్గరకు పిలుచుకొని వచ్చారు. కాని
ఆ పిలుచుకు వచ్చిన వాళ్ళను శిష్యులు చివాట్లు
పెట్టారు. 14కాని యేసు, “దేవుని రాజ్యం అలాంటి
వాళ్ళదే కనుక వాళ్ళను నా దగ్గరకు రానివ్వండి! వాళ్ళ
నాపకండి!” అని అన్నాడు. 15వాళ్ళ తలలపై చేతులుం
చాక యేసు అక్కడనుండి ముందుకు సాగి పొయ్యాడు

---

**డెబ్బది ఏడు సార్లు** లేక “ఏడు డెబ్బది సార్లు.”

**వేలకొలది తలాంతులు** ఒక తలాంతు అనగా రెండు వందల నలభై బంగారు నాణెములు. ఆది. 4:24.

**‘మొదట్లో … జీవిస్తారు’** ఆది. 1:27.

### ధనవంతుడు

(*మార్కు 10:17-31; లూకా 18:18-30*)

16ఒక వ్యక్తి యేసు దగ్గరకు వచ్చి, “బోధకుడా!
నిత్యజీవం పొందాలంటే నేను ఏ మంచి పని
చెయ్యాలి?” అని అడిగాడు.
17యేసు, “మంచిని గురించి నన్నెందుకు అడుగు
తున్నావు? ఒకే ఒక మంచి వాడున్నాడు. నీవు నిత్యజీవం
పొందాలంటే ఆజ్ఞల్ని పాటించు!” అని అన్నాడు. 18“ఏ
ఆజ్ఞలు?” ఆ వ్యక్తి అడిగాడు.
యేసు, “హత్యచేయరాదు, వ్యభిచరించ రాదు.
దొంగతనం చెయ్యరాదు. దొంగ సాక్ష్యం చెప్పరాదు.
19తల్లి తండ్రుల్ని గౌరవించాలి.* మీ పొరుగువాళ్ళను
మిమ్మల్ని మీరు ప్రేమించుకొన్నంతగా ప్రేమించాలి”
అని సమాధానం చెప్పాడు*
20ఆ యువకుడు, “నేనవన్నీ చేస్తూనే ఉన్నాను.
యింకా ఏం చెయ్యాలి?” అని అడిగాడు.
21యేసు, “నీవు పరిపూర్ణత పొందాలని అనుకుంటే
వెళ్ళి నీ దగ్గరున్నవన్నీ అమ్మేసి పేదవాళ్ళకివ్వు! అలా
చేస్తే నీకు పరలోకంలో ధనం లభిస్తుంది. ఆ తదుపరి
నన్ను అనుసరించు” అని సమాధానం చెప్పాడు.
22ఆ యువకుని దగ్గర చాలా ధనముంది కనుక
యేసు చెప్పింది విని విచారంతో వెళ్ళిపోయాడు.
23ఆ తర్వాత యేసు తన శిష్యులతో, “నేను
నిజం చెబుతున్నాను. ధనవంతుడు దేవుని రాజ్యంలోకి
ప్రవేశించటం చాలా కష్టం. 24నేను మళ్ళీ చెబుతు
న్నాను. ధనవంతుడు దేవుని రాజ్యంలోకి ప్రవేశించటం
కన్నా ఒంటె సూదిరంధ్రం ద్వారా వెళ్ళటం సులభం!”
అన్నాడు.
25శిష్యులు ఇది విని చాలా ఆశ్చర్యపడి, “మరి
రక్షణ ఎవరికి లభిస్తుంది?” అని అడిగారు.
26యేసు వాళ్ళ వైపు చూసి, “మానవులు దీన్ని
స్వతహాగా సాధించలేరు. కాని దేవునికి అన్నీ సాధ్యమే!”
అని అన్నాడు.
27అప్పుడు పేతురు, “మిమ్మల్ని అనుసరించ
టానికి మేము అన్నీ వదులుకున్నాము. మరి, మాకేం
లభిస్తుంది?” అని అన్నాడు.
28యేసు, “ఇది సత్యం. క్రొత్త ప్రపంచంలో
మనుష్యకుమారుడు తేజోవంతమైన సింహాసనంపై
కూర్చుంటాడు. నన్ను అనుసరిస్తున్న మీరు కూడా
పన్నెండు సింహాసనాలపై కూర్చొని ఇశ్రాయేలు జనాం
గంలోని పన్నెండు గోత్రాల్ని పాలిస్తారు. 29నా కోసం
ఇండ్లను కాని, సోదరుల్ని కాని, అక్కచెల్లెండ్లను కాని,
తల్లిని కాని, తండ్రిని కాని, సంతానాన్ని కాని, పొలాల్ని
కాని విడిచినవాడు దానికి నూరువంతుల ఫలం పొందు
తాడు. అంతేకాక నిత్యజీవం కూడా పొందుతాడు.
30కాని ముందున్న వాళ్ళలో చాలామంది వెనక్కి
వెళ్తారు. వెనుక నున్న వాళ్ళలో చాలా మంది ముందుకు
వస్తారు!” అని అన్నాడు.

### ద్రాక్షతోటలోని పనివాళ్ళు

20 “దేవుని రాజ్యాన్ని ద్రాక్షతోట యజమా
నితో పోల్చవచ్చు. అతడు తన తోటలో
పని చెయ్యటానికి పని వాళ్ళను నియమించాలని ఉద
యమే లేచి వెళ్ళాడు. 2ఆ రోజు పనికి వాళ్ళకు ఒక
దీనారా యివ్వటానికి అంగీకరించి వాళ్ళను తన ద్రాక్ష
తోటకు పంపాడు.
3“అతడు ఉదయం తొమ్మిదిగంటలకు మళ్ళీ
సంతకు వెళ్ళాడు. అక్కడ మరికొంత మంది ఏ పనీ
చేయకుండా వూరికే నిల్చొని ఉండటం చూసాడు.
4అతడు వాళ్ళతో ‘మీరు కూడా వెళ్ళి నా ద్రాక్షతోటలో
పని చెయ్యండి. మీక్కూడా సమంజసమైన కూలి
యిస్తాను’ అని అన్నాడు. 5వాళ్ళు దానికి అంగీకరించి
వెళ్ళారు.
“అతడు పన్నెండు గంటలప్పుడు, మూడు గంట
లప్పుడు కూడా వెళ్ళి మళ్ళీ అలాగే చేసాడు. 6అతడు
అయిదు గంటలప్పుడు మళ్ళీ వెళ్ళి మరి కొంతమంది
అక్కడ నిలుచొని ఉండటం గమనించాడు. అతడు
వాళ్ళతో ‘మీరు ఏమీ చెయ్యకుండా దినమంతా
యిక్కడ ఎందుకు నిలుచున్నారు?’ అని అడిగాడు.
7“‘మాకెవ్వరూ పనివ్వలేదు’ అని వాళ్ళు సమా
ధానం చెప్పారు, అతడు వాళ్ళతో ‘మీరు కూడా నా
ద్రాక్షతోటలో పని చెయ్యండి!’ అని అన్నాడు.
8సాయంత్రం కాగానే ఆ ద్రాక్షతోట యజమాని పెద్ద
దాసునితో ‘పనివాళ్ళందరిని పిలిచి చివరకు వచ్చిన
వాళ్ళతో మొదలుపెట్టి కూలి యిచ్చేయి!’ అని
అన్నాడు.
9“అయిదు గంటలప్పుడు పని మొదలు పెట్టిన
కూలీలు వచ్చారు. వాళ్ళకు ఒక దీనారా లభించింది.
10మొదట పని మొదలుపెట్టిన వాళ్ళువచ్చి తమకు
ఎక్కువ కూలి లభిస్తుందని ఆశించారు. కాని వాళ్ళకు
కూడా ఒక దీనారా లభించింది. 11-12వాళ్ళు కూలి
తీసికొని యజమానునితో ‘చివరకు వచ్చిన వాళ్ళు
ఒకే గంట పని చేసారు. ఎండను సహించి దినమంతా
పనిచేసిన మమ్మల్ని, వాళ్ళనూ మీరు సమానంగా
చూస్తున్నారు’ అని సణగటం మొదలు పెట్టారు.
13“కాని అతడు ఒక కూలి వానితో, ‘మిత్రమా
నేను నీకు అన్యాయం చెయ్యటం లేదు. ఒక దీనారాకు
పని చేస్తానని నీవు ఒప్పుకోలేదా? 14నీ కూలి తీసికొని
వెళ్ళిపో! నీకిచ్చిన కూలినే చివరను వచ్చిన వానికి
కూడా యివ్వాలనుకొన్నాను. 15నా డబ్బుతో నా
యిష్టంవచ్చినట్లు చేసుకొనే అధికారం నాకులేదా?

---

**‘తల్లి … గౌరవించాలి’** నిర్గమ. 20:12-16.

**‘మీ … చెప్పాడు’** లేవీ. 19:18.

నేను ఔదార్యం చూపుతున్నందుకు నీవు ఓర్వలేకుండా
ఉన్నావా?' అని అన్నాడు.
16"ఈ విధంగా చివరనున్న వాళ్ళు ముందుకు
వస్తారు; ముందున్న వారు చివరకు వెళ్తారు."

### యేసు తాను పొందనున్న మరణాన్ని గురించి మళ్ళీ చెప్పటం

*(మార్కు 10:32-34; లూకా 18:31-34)*

17యేసు యెరూషలేముకు వెళ్తూ పండ్రెండు
మంది శిష్యులను ప్రక్కకు పిలిచి ఈ విధంగా అన్నాడు:
18"మనమంతా యెరూషలేమునకు వెళ్తున్నాము.
అక్కడ మనుష్యకుమారుడు ప్రధానయాజకులకు,
శాస్త్రులకు అప్పగింప బడతాడు. వాళ్ళు ఆయనకు
మరణదండన విధించి, 19యూదులుకాని వాళ్ళకప్ప
గిస్తారు. ఆ యూదులుకాని వాళ్ళు ఆయన్ని హేళన
చేసి కొరడా దెబ్బలు కొట్టి సిలువకు వేస్తారు. మూడవ
రోజు ఆయన బ్రతికి వస్తాడు."

### ఒక తల్లి కోరిన కోరిక

*(మార్కు 10:35-45)*

20ఆ తర్వాత జెబెదయి భార్య తన కుమారులతో
కలిసి యేసు దగ్గరకు వచ్చి ఆయన ముందు మోకరిల్లి
ఒక ఉపకారం చెయ్యమని కోరింది.
21యేసు, "నీకేం కావాలి?" అని అడిగాడు.
ఆమె, "మీ రాజ్యంలో, నా ఇరువురు కుమారుల్లో
ఒకడు మీ కుడిచేతివైపున, మరొకడు మీ ఎడమచేతి
వైపున కూర్చునేటట్లు అనుగ్రహించండి" అని అడి
గింది.
22యేసు, "మీరేం అడుగుతున్నారో మీకు తెలి
యదు. నా పాత్రలో దేవుడు కష్టాల్ని నింపాడు. నేను
త్రాగటానికి సిద్ధంగా ఉన్నాను. మీరు త్రాగగలరా?"
అని అడిగాడు.
"త్రాగగలము" అని వాళ్ళు సమాధానం చెప్పారు.
23యేసు వాళ్ళతో, "మీరు నిజంగానే త్రాగవలసి
వస్తుంది. కాని నా కుడిచేతివైపున కూర్చోవటానికి,
లేక ఎడమచేతివైపు కూర్చోవటానికి అనుమతి యిచ్చే
అధికారం నాకు లేదు. ఈ స్థానాల్ని నా తండ్రి ఎవరి
కోసం నియమించాడో వాళ్ళకే అవి దక్కుతాయి"
అని అన్నాడు.
24మిగతా పదిమంది ఇది విని ఆ ఇరువురు సోదరుల
పట్ల కోపగించుకొన్నారు. 25యేసు వాళ్ళను పిలిచి,
"యూదులుకాని రాజులు తమ ప్రజలపై అధికారం
చూపుతూ ఉంటారు. వాళ్ళ పెద్దలు వాళ్ళను అణచి
పెడ్తూ ఉంటారు. ఈ విషయం మీకు తెలుసు. 26మీరు
అలాకాదు. మీలో గొప్పవాడు కాదలచినవాడు మీ సేవ
కునిగా ఉండాలి. 27మీలో ముఖ్యుడుగా ఉండ దలచిన
వాడు బానిసగా ఉండాలి. 28మనుష్యకుమారుడు సేవ
చేయించుకోవడానికి రాలేదు. సేవచెయ్యటానికి
వచ్చాడు. అనేకుల విమోచన కోసం తన ప్రాణాన్ని
ఒక వెలగా చెల్లించడానికి వచ్చాడు" అని అన్నాడు.

### ఇద్దరు గ్రుడ్డి వాళ్ళకు చూపురావటం

*(మార్కు 10:46-52; లూకా 18:35-43)*

29యేసు, ఆయన శిష్యులు యెరికో పట్టణం
నుండి బయలు దేరి వెళ్తూండగా చాలా మంది ప్రజలు
ఆయన్ని అనుసరించారు. 30దారి ప్రక్కన కూర్చొన్న
ఇద్దరు గ్రుడ్డివాళ్ళు యేసు ఆ దారిన వస్తున్నాడని
విని, "మమ్మల్ని కరుణించు దావీదు కుమారుడా!"
అని బిగ్గరగా అన్నారు.
31ప్రజలు వాళ్ళను నిశ్శబ్దంగా వుండమని గద్దిం
చారు. కాని ఆ గ్రుడ్డివాళ్ళు యింకా బిగ్గరగా, "ప్రభూ!
దావీదు కుమారుడా! మాపై దయచూపు!" అని
అన్నారు. 32యేసు ఆగి ఆ గ్రుడ్డి వాళ్ళను పిలిచి,
"ఏం చెయ్యమంటారు?" అని అడిగాడు.
33"ప్రభూ! మాకు చూపుకావాలి!" అని వాళ్ళు
సమాధానం చెప్పారు. 34యేసుకు వాళ్ళపై దయ
కలిగి వాళ్ళ కళ్ళను తాకాడు. వెంటనే వాళ్ళకు చూపు
వచ్చింది. వాళ్ళు ఆయన్ని అనుసరించారు.

### క్రీస్తు యెరూషలేమునకు వెళ్ళటం

*(మార్కు 11:1-11; లూకా 19:28-38; యోహాను 12:12-19)*

21 వాళ్ళు యెరూషలేమునకు వెళ్తూ బేత్పగే
అనే గ్రామాన్ని చేరుకున్నారు. యేసు తన
శిష్యుల్లో యిద్దర్ని ఆ గ్రామానికి పంపుతూ వాళ్ళతో
ఈ విధంగా అన్నాడు: 2"గ్రామంలోకి వెళ్ళండి. అక్కడ
వాకిలిలో కట్టబడిన ఒక గాడిద, దాని పిల్ల కనబడు
తాయి. వాటిని విప్పి నా దగ్గరకు తీసుకురండి. 3ఎవ
రైనా అడిగితే, 'ప్రభువుకు అవి కావాలి; వాటి అవసరం
తీరిన వెంటనే తిరిగి పంపుతాడు' అని చెప్పండి."
4దేవుడు ప్రవక్త ద్వారా పలికిన ఈ వాక్యాలు నిజం
కావటానికి ఇలా జరిగింది:

> 5"గాడిదనెక్కి వినయంగా నీ రాజు వస్తున్నాడు
> చూడు! బరువు మోసే గాడిద పిల్లనెక్కి
> వస్తున్నాడు చూడు! అని సీయోను
> కుమారితో చెప్పండి."
>
> *జెకర్యా 9:9*

6శిష్యులు వెళ్ళి యేసు ఆజ్ఞాపించినట్లు చేసారు.
7గాడిదను, గాడిద పిల్లను తీసుకు వచ్చి వాటిపై తమ
వస్త్రాలను పరిచారు. యేసు వస్త్రాలపైనెక్కి కూర్చు

న్నాడు. 8అక్కడున్న వాళ్ళలో చాలామంది తమ
వస్త్రాల్ని దారిపై పరిచారు. మరికొందరు చెట్ల
కొమ్మల్ని విరిచి దారిపై పరిచారు. 9ఆయనకు
ముందు, వెనుక నడుస్తున్న ప్రజలు ఇలా కేకలు వేసారు.

"దావీదు కుమారునికి హోసన్నా! ప్రభువు
పేరిట వస్తున్నవాడు ధన్యుడు! మహోన్న
తమైన స్థలములో హోసన్నా!"*
*కీర్తన 118:26*

10యేసు యెరూషలేమునకు వెళ్ళాడు. ఆ పట్టణ
మంతా ఆందోళన చెలరేగింది, "ఈయనెవరు?" అని
ప్రజలు ప్రశ్నించారు.
11"ఈయన యేసు, గలిలయలోని నజరేతు
గ్రామానికి చెందిన ప్రవక్త!" అని ఆయన వెంటనున్న
వాళ్ళే సమాధానం చెప్పారు.

### యేసు ఆలయం లోకి వెళ్ళటం

*(మార్కు 11:15-19; లూకా 19:45-48;
యోహాను 2:13-22)*

12యేసు ఆలయంలోకి వెళ్ళి, అక్కడ అమ్ము
తున్న వాళ్ళను, కొంటున్న వాళ్ళను బయటికి వెళ్ళ
గొట్టాడు. డబ్బు మారకం చేస్తున్న వర్తకుల బల్లలను,
పావురాలు అమ్ముతున్న వర్తకుల పీఠల్ని క్రింద పడ
వేసాడు. 13ఆయన వాళ్ళతో, "'నా ఆలయం
ప్రార్థనాలయం అనిపించుకుంటుంది'* అని వ్రాసారు.
కాని దాన్ని మీరు దోపిడి దొంగల గుహగా మార్చారు"
అని అన్నాడు.
14గ్రుడ్డివాళ్ళు, కుంటివాళ్ళు ఆలయంలో ఉన్న
ఆయన దగ్గరకు వచ్చారు. ఆయన వాళ్ళకును నయం
చేసాడు. 15ప్రధాన యాజకులు, శాస్త్రులు ఆయన
చేసిన అద్భుతాలను చూసారు. మందిరావరణంలో
ఉన్న పిల్లలు, "దావీదు కుమారునికి హోసన్నా!"*
అని కేకలు వేయటం విన్నారు. వాళ్ళకు కోపం
వచ్చింది. 16"చిన్న పిల్లలేమంటున్నారో నీవు
విన్నావా?" అని వాళ్ళు యేసును ప్రశ్నించారు.
యేసు, "విన్నాను. 'చిన్న పిల్లలు, పసిపాపలు
కూడా నిన్ను స్తుతించేటట్లు చేసావు!'* అని వ్రాసారు.
ఇది మీరు ఎన్నడూ చదువలేదా?" అని అన్నాడు.
17ఆయన వాళ్ళను వదిలి, పట్టణం బయట ఉన్న
బేతనియ గ్రామానికి వెళ్ళి ఆ రాత్రి అక్కడ గడిపాడు.

### అంజూరపు చెట్టు ఎండిపోవటం

*(మార్కు 11:12-14, 20-24)*

18ఉదయం ఆయన పట్టణానికి తిరిగి వెళ్తుండగా
ఆయనకు ఆకలి వేసింది. 19యేసు దారిప్రక్కనున్న
ఒక అంజూరపు చెట్టును చూసి దాని దగ్గరకు వెళ్ళాడు.
కాని ఆయనకు దానిపై ఆకులు తప్ప మరి ఏమియూ
కనిపించలేదు. ఆయన ఆ చెట్టుతో, "ఇక మీదట
నీకు ఫలం కలుగకుండా వుండుగాక!" అని అన్నాడు.
వెంటనే ఆ చెట్టు ఎండిపోయింది.
20శిష్యులు ఇది చూసి చాలా ఆశ్చర్య పడి, "అంజూ
రపు చెట్టు ఇంత త్వరగా ఎట్లా ఎండిపోయింది?"
అని అడిగారు.
21యేసు, "ఇది సత్యం. మీరు అనుమానం చెంద
కుండా విశ్వశిస్తే నేను అంజూరపు చెట్టుకు చేసినట్టు
మీరు కూడా చేయగలరు. అంతే కాకుండా మీరీ పర్వ
తంతో 'వెళ్ళి సముద్రంలో పడు' అని అంటే అది
అలాగే చేస్తుంది. 22దేవుడు మీరడిగినవి యిస్తాడని
విశ్వసించి ప్రార్థించండి. అప్పుడు మీరేవి అడిగితే అవి
లభిస్తాయి" అని అన్నాడు.

### అధికారం ఎవరిచ్చారు?

*(మార్కు 11:27-33; లూకా 20:1-8)*

23యేసు మందిరానికి వెళ్ళి బోధిస్తుండగా ప్రధాన
యాజకులు, పెద్దలు వచ్చి, "ఏ అధికారంతో నీవు
ఈ పనులు చేస్తున్నావు? నీకీ అధికారం ఎవరిచ్చారు?"
అని అడిగారు.
24యేసు సమాధానం చెబుతూ, "నేను కూడా
మిమ్మల్నొక ప్రశ్న అడుగుతాను. మీరు దానికి సమా
ధానం చెబితే నేను ఇది ఎవరిచ్చిన అధికారంతో చేస్తు
న్నానో చెబుతాను.
25-26బాప్తిస్మమివ్వమని యోహానును ఎవరు
పంపారు? దేవుడా? మానవులా?" అని అడిగాడు.
వాళ్ళు, "'దేవుడు' అని సమాధానం చెబితే మరి
అలాగైతే అతణ్ణి ఎందుకు నమ్మలేదు? అని అంటాడు.
'మానవులు' అని సమాధానం ఇస్తే ప్రజలందరూ
యోహాను ఒక ప్రవక్త అని నమ్మేవాళ్ళు కనుక వాళ్ళు
ఏం చేస్తారో" అనే భయంతో పరస్పరం మాట్లాడు
కొన్నారు. 27అందువల్ల వాళ్ళు, "మాకు తెలియదు"
అని సమాధానం చెప్పారు.
ఆయన, "నేను కూడా ఎవరిచ్చిన అధికారంతో
యివి చేస్తున్నానో మీకు చెప్పను" అని అన్నాడు

### తండ్రి మాట పాలించిన కుమారుని ఉపమానం

28"ఆలోచించి సమాధానం చెప్పండి. ఒకనికి
యిద్దరు కుమారులుండేవాళ్ళు. అతడు మొదటి కుమా
రుని దగ్గరకు వెళ్ళి, 'నాయనా! వెళ్ళి ఈ రోజు ద్రాక్ష
తోటలో పనిచెయ్యి!' అని అన్నాడు.

---

**'నా ఆలయం … అనిపించుకుంటుంది'** యెషయా 56:7.

**హోసన్నా** ఇది హీబ్రూ పదం. దీని అర్థం "రక్షించు." కాని ఈ పదాన్ని దేవున్ని స్తోత్రించటానికి ఉపయోగించేవారు.

**'విన్నాను … చేసావు'** కీర్తన 8:3.

29“కుమారుడు, ‘నాకిష్టంలేదు’ అని సమాధానం
చెప్పాడు. కాని తదుపరి తన మనస్సు మార్చుకొని
పని చెయ్యటానికి వెళ్ళాడు.
30“తండ్రి రెండవ కుమారునికి అదే విషయం
చెప్పాడు. రెండవ కుమారుడు ‘వెళ్తానండి’ అని
అన్నాడు. కాని వెళ్ళలేదు.
31“ఆ యిద్దరిలో తండ్రి మాటను ఎవరు పాలిం
చారు? అని యేసు అడిగాడు.”
“మొదటి వాడు” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు, “నేను
మీకు సత్యం చెబుతున్నాను. సుంకరులు, వేశ్యలు
మీకన్నా ముందు దేవుని రాజ్యంలోకి ప్రవేశిస్తారు.
32మీకు నీతిమార్గాన్ని చూపటానికి యోహాను
వచ్చాడు. మీరతణ్ణి నమ్మలేదు. కాని సుంకరులు,
వేశ్యలు ఆయన్ని విశ్వసించారు. ఇది చూసాక కూడా
మీరు మారుమనస్సు పొందలేదు, విశ్వసించలేదు.

### కౌలుకు తీసుకొన్న రైతుల ఉపమానం
*(మార్కు 12:1-12; లూకా 20:9-19)*

33“ఇంకొక ఉపమానాన్ని వినండి. ఒక ఆసామి
ఉండేవాడు. అతడు ఒక ద్రాక్షతోట నాటాడు. చుట్టూ
ఒక గోడ కట్టించి ద్రాక్షరసాన్ని తీయటానికి ఒక
గానుగను, తొట్టిని కట్టించాడు. కావలి కాయటానికి
ఒక కంచె వేయించాడు. ఆ తర్వాత ఆ ద్రాక్షతోటను
కొంతమంది రైతులకు కౌలుకిచ్చి ప్రయాణమై వెళ్ళి
పోయాడు. 34కోతకాలం కాగానే తన సేవకుల్ని ఆ
రైతుల దగ్గరకు పంపి తన భాగం తీసుకు రమ్మన్నాడు.
35“ఆ రైతులు, ఆ సేవకుల్ని పట్టుకొని వాళ్ళలో
ఒకణ్ణి కొట్టారు. మరొకణ్ణి చంపారు. మూడవవాణ్ణి
రాళ్ళతో కొట్టి చంపారు. 36ఆ ఆసామి ఈసారి మొదటి
కన్నా యింకా ఎక్కువమంది సేవకుల్ని పంపాడు.
కాని ఆ రైతులు వాళ్ళ పట్ల కూడా అదే విధంగా
ప్రవర్తించారు. 37ఆ ఆసామి ‘నా కుమారుణ్ణి వాళ్ళు
గౌరవించవచ్చు!’ అని అనుకొని చివరకు తన కుమా
రుణ్ణి వాళ్ళ దగ్గరకు పంపాడు.
38“కాని ఆ రైతులు అతని కుమారుణ్ణి చూసి
‘ఇతడు వంశోద్ధారకుడు. రండి! ఇతణ్ణి చంపేసి అతని
ఆస్థిని తీసుకొందాం’ అని పరస్పరం మాట్లాడు
కొన్నారు.
39ఆ తర్వాత కుమారుణ్ణి పట్టుకొని చంపి
ద్రాక్షతోటకవతల పారవేసారు.
40“మరి ఆ ద్రాక్షతోట యజమాని తిరిగి వచ్చాక
ఆ రైతుల్ని ఏమి చేస్తాడంటారు?”
41వాళ్ళు, “ఆ దుష్టుల్ని ఘోరంగా చంపేస్తాడు.
ఆ తదుపరి పంట కాలంలో తన భాగాన్ని తనకిచ్చే
రైతులకు ఆ ద్రాక్షతోటను కౌలుకిస్తాడు” అని సమా
ధానం చెప్పారు.

42యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: “లేఖ
నాల్లో మీరీ విషయం ఎన్నడూ చదువలేదా?

> ‘ఇల్లుకట్టువాళ్ళు త్రుణీకరించిన రాయి
> ముఖ్యమైన రాయి అయింది. ఇది ప్రభువు
> చేసాడు.. ఆ రాయి మన కండ్లకు ఆశ్చ
> ర్యంగా కనబడుతుంది!’
>
> *కీర్తన 118:22-23*

43“అందువల్ల నేను చెప్పేదేమిటంటే దేవుడు తన
రాజ్యాన్ని మీ నుండి తీసికొని, ఆ రాజ్యానికి తగిన
విధంగా ప్రవర్తించే వాళ్ళకు యిస్తాడు. 44ఈ బండ
మీద పడ్డవాడు ముక్కలై పోతాడు. ఎవని మీద ఈ
బండ పడ్తుందో అతడు నలిగి పోతాడు.”
45ప్రధాన యాజకులు, పరిసయ్యులు యేసు
చెప్పిన ఉపమానం విని ఆయన తమను గురించి
మాట్లాడుతున్నట్టుగా గ్రహించారు. 46వాళ్ళు ఆయన్ని
బంధించటానికి మార్గాన్ని వెతికారు. కాని ప్రజలు
ఆయన్ని ఒక ప్రవక్త అని అనుకొనే వాళ్ళు కనుక
వాళ్ళు ప్రజల్ని చూసి భయపడి పోయారు.

### పెళ్ళి విందు ఉపమానం
*(లూకా 14:15-24)*

22 యేసు ఉపమానాలు ఉపయోగిస్తూ
వాళ్ళతో మళ్ళీ ఈ విధంగా చెప్పాడు:
2“దేవుని రాజ్యాన్ని తన కుమారుని వివాహ సందర్భంగా
విందునేర్పాటు చేసిన ఒక రాజుతో పోల్చవచ్చు. 3ఆ
రాజు విందుకు ఆహ్వానింపబడిన వాళ్ళను రమ్మని
పిలవటానికి తన సేవకుల్ని పంపాడు. కాని ఆహ్వాని
తులు రావటానికి నిరాకరించారు.
4“ఆ రాజు మరికొంతమంది సేవకుల్ని పంపుతూ
ఆహ్వానింపబడిన వాళ్ళతో ‘భోజనం సిద్ధంగా ఉందని
చెప్పండి. ఎద్దుల్ని, బాగా బలిసిన పశువుల్ని కోసి
అన్నీ సిద్ధంగా ఉంచామని చెప్పి వాళ్ళని పెళ్ళికి రమ్మ
నండి’ అని అన్నాడు.
5“కాని ఆహ్వానితులు లెక్క చెయ్యలేదు. ఒకడు
తన పొలానికి, ఇంకొకడు తన వ్యాపారం మీద వెళ్ళి
పొయ్యారు. 6మిగతా వాళ్ళు ఆ సేవకుల్ని పట్టుకొని
అవమానించి చంపేశారు. 7ఆ రాజుకు చాలా కోపం
వచ్చింది. తన సైన్యాన్ని పంపి ఆ హంతకుల్ని నాశనం
చేసి, వాళ్ళ పట్టణాన్ని కాల్చి వేసాడు.
8“ఆ తర్వాత తన సేవకులతో, ‘పెళ్ళి విందు
సిద్ధంగా ఉంది. కాని నేనాహ్వానించిన వాళ్ళు విందుకు
రావటానికి అర్హులుకారు. 9వీధుల్లోకి వెళ్ళి మీకు కని
పించిన వాళ్ళందర్ని విందుకాహ్వానించండి’ అని
అన్నాడు. 10ఆ సేవకులు వీధుల్లోకి వెళ్ళి తమకు
కనిపించిన వాళ్ళందర్ని అంటే మంచి వాళ్ళను, చెడ్డ

వాళ్ళను, అందర్నీ పిలుచుకు వచ్చారు. అతిథులతో
పెళ్ళి యిల్లంతా నిండిపోయింది.
11“రాజు అతిథుల్ని చూడాలని వచ్చాడు. అక్క
డున్న వాళ్ళల్లో ఒకడు పెళ్ళి దుస్తులు వేసుకోలేదని
గమనించాడు. 12‘మిత్రమా! పెళ్ళి దుస్తులు వేసు
కోకుండా లోపలికి ఎట్లా వచ్చావు?’ అని రాజు అతన్ని
అడిగాడు. ఆ వ్యక్తి ఏమీ మాట్లాడలేక పొయ్యాడు.
13వెంటనే ఆ రాజు తన సేవకులతో, ‘అతని కాళ్ళు,
చేతులు కట్టేసి అవతల చీకట్లో పారవేయండి. అక్క
డున్న వాళ్ళు ఏడుస్తూ బాధననుభవిస్తారు’ అని
అన్నాడు.
14“దేవుడు అనేకుల్ని ఆహ్వానిస్తాడు. కాని కొందర్ని
మాత్రమే ఎన్నుకొంటాడు” అని అంటూ యేసు
చెప్పటం ముగించాడు.

## చక్రవర్తికి పన్నులు కట్టటం ధర్మమా? కాదా?

*(మార్కు 12:13-17; లూకా 20:20-26)*

15ఆ తర్వాత పరిసయ్యులు వెళ్ళి ఆయన్ని
ఆయన మాటల్తోనే పట్టి వేయాలని కుట్ర పన్ని
తమ శిష్యుల్ని, హేరోదు పక్షమున్న వాళ్ళను యేసు
దగ్గరకు పంపారు. 16వాళ్ళు, “బోధకుడా! మీరు సత్య
వంతులని, దైవ మార్గాన్ని ఉన్నది ఉన్నట్టుగా బోధి
స్తారని మాకు తెలుసు. ఇతర్ల అంతస్తులను లెక్క
చెయ్యరు. కనుక పక్షపాతం చూపరని కూడా మాకు
తెలుసు. 17మరి చక్రవర్తికి పన్నులు కట్టడం ధర్మమా?
కాదా? మీరేమంటారు?” అని ఆయన్ని అడిగారు.
18యేసుకు వాళ్ళ దురుద్దేశం తెలిసి పోయింది.
వాళ్ళతో, “వేషధారులారా! నన్నెందుకు పరీక్షిస్తు
న్నారు? 19ఏ నాణెంతో పన్నులు కడుతున్నారోదాన్ని
నాకు చూపండి” అని అన్నాడు. వాళ్ళు ఒక దీనారా
తెచ్చి ఆయనకు ఇచ్చారు.
20ఆయన, “ఈ బొమ్మ ఎవరిది? ఆ నాణెంపై
ఎవరి శాసనం ఉంది?” అని వాళ్ళనడిగాడు.
21“చక్రవర్తిది” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
అప్పుడాయన వాళ్ళతో, “చక్రవర్తికి చెందింది చక్రవర్తికి
యివ్వండి. దేవునికి చెందింది దేవునికి యివ్వండి”
అని అన్నాడు.
22ఇది విని వాళ్ళు చాలా ఆశ్చర్యపడ్డారు. ఆ తదుపరి
ఆయన్ని వదిలి వెళ్ళి పొయ్యారు.

## పునరుత్థానం తర్వాత వివాహ బంధం ఉండదు

*(మార్కు 12:18-27; లూకా 20:27-40)*

23అదే రోజు పునరుత్థానంలేదని వాదించే సద్దూక
య్యులు యేసు దగ్గరకు వచ్చి ఇలా అన్నారు:
24“బోధకుడా! ఒక వ్యక్తి సంతానం లేకుండా మరణిస్తే,
అతని సోదరుడు ఆ వితంతువును వివాహమాడి చని
పోయిన సోదరునికి సంతానం కలిగించాలని మోషే
అన్నాడు. 25మాలో ఏడుగురు సోదరులున్న ఒక
కుటుంబం ఉండింది. మొదటివాడు వివాహం చేసుకొని
సంతానం లేకుండా మరణించాడు. కనుక ఆ వితంతు
వును చనిపోయిన వాని సోదరుడు వివాహం చేసు
కొన్నాడు. 26రెండవవాడు, మూడవవాడు, ఏడవవాని
దాకా అదేవిధంగా ఆమెను పెళ్ళి చేసుకొని మరణిం
చారు. 27చివరకు ఆ స్త్రీ కూడా మరణించింది. 28ఆ
ఏడుగురు ఆ స్త్రీని వివాహం చేసుకొన్నారు కదా, మరి
పునరుత్థానం తర్వాత ఆమె ఆ ఏడుగురిలో ఎవరి
భార్యగా ఉంటుంది?” అని అడిగారు.
29యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు:,
“మీకు లేఖనాలు తెలియవు. దేవుని శక్తి గురించి మీకు
తెలియదు. అందువల్ల మీరు పొరబడుతున్నారు. 30పున
రుత్థానమందు పెళ్ళి చేసుకోవటం కాని, చెయ్యటం
కాని ఉండదు. వాళ్ళు పరలోకంలోని దేవదూతల్లా
ఉంటారు. 31ఇక చనిపోయిన వారు బ్రతకడాన్ని
గురించి దేవుడు మీకేం చెప్పాడో మీరు చదువ లేదా?
32‘నేను అబ్రాహాముకు దేవుణ్ణి, ఇస్సాక్కు దేవుణ్ణి,
యాకోబుకు దేవుణ్ణి’* అని అన్నాడు. ఆయన చని
పోయిన వాళ్ళ దేవుడు కాదు. జీవిస్తున్న వాళ్ళ దేవుడు”
33ప్రజలు ఈ బోధన విని ఆశ్చర్యపొయ్యారు.

## అన్నిటికన్నా గొప్ప ఆజ్ఞ

*(మార్కు 12:28-34; లూకా 10:25-28)*

34యేసు సద్దూకయ్యుల నోరు మూయించాడని
విని పరిసయ్యులు అక్కడ సమావేశమయ్యారు.
35-36వాళ్ళలో ఉన్న ధర్మశాస్త్ర పండితుడొకడు
యేసును పరీక్షించాలని, “బోధకుడా! ధర్మశాస్త్రాల్లో
ఉన్న ఆజ్ఞలన్నిటిలో ఏ ఆజ్ఞ గొప్పది?” అని ప్రశ్నిం
చాడు.
37యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: “మీ
ప్రభువైన దేవుణ్ణి సంపూర్ణమైన హృదయంతో, సంపూ
ర్ణమైన ఆత్మతో, సంపూర్ణమైన బుద్ధితో ప్రేమిం
చండి.* 38ఇది అన్ని ఆజ్ఞలకన్నా మొదటిది, గొప్పది.
39రెండవ ఆజ్ఞ కూడా అట్టిదే. ‘నిన్ను నీవు ప్రేమిం
చుకొన్నంతగా నీ పొరుగువాణ్ణి ప్రేమించు’* 40ధర్మ
శాస్త్రాలలో ఉన్న వాటన్నిటికి, ప్రవక్తలు వ్రాసిన వాట
న్నిటికి ఈ రెండు ఆజ్ఞలే ఆధారం.”

## క్రీస్తు ఎవరి కుమారుడు?

*(మార్కు 12:35-37; లూకా 20:41-44)*

41పరిసయ్యులు సమావేశమయ్యారు. యేసు
వాళ్ళను 42“మీరు క్రీస్తును గురించి ఏమనుకుంటు

---

**‘నేను … దేవుణ్ణి’** నిర్గమ. 3:6.

**‘మీ ప్రభువైన … ప్రేమించండి’** ద్వితీ. 6:5.

**‘ నిన్ను … ప్రేమించు’** లేవీ. 19:18.

న్నారు? ఆయన ఎవరి కుమారుడు?" అని అడిగాడు.
"దావీదు కుమారుడు" అని వాళ్ళు సమాధానం
చెప్పారు.
43యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు, "మరి
దావీదు దేవుని ఆత్మ ద్వారా మాట్లాడుతూ క్రీస్తును
'ప్రభూ!' అని ఎందుకు పిలిచాడు? దావీదు

44 'ప్రభువు, నా ప్రభువుతో నీ శత్రువుల్ని నీ
కాళ్ళ ముందు పడవేసే దాకా, నా కుడి
వైపు కూర్చో, అని అనలేదా?'
*కీర్తన 110:1*

45దావీదు క్రీస్తును 'ప్రభూ' అని అన్నాడు కదా. అలాంట
ప్పుడు క్రీస్తు దావీదు కుమారుడెట్లవుతాడు?"
46ఎవ్వరూ ఏ సమాధానం చెప్పలేక పొయ్యారు. ఆ
రోజు నుండి ఆయన్ని మరే ప్రశ్నలు అడగటానికి
ఎవ్వరికీ ధైర్యం చాలలేదు.

### శాస్త్రుల్ని, పరిసయ్యుల్ని విమర్శించుట
*(మార్కు 12:38-40; లూకా 11:37-52; 20:45-47)*

23 ఆ తర్వాత యేసు ప్రజలతో, తన శిష్యు
లతో ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు:
2"శాస్త్రులు, పరిసయ్యులు మోషే స్థానంలో కూర్చుని
వున్నారు. 3అందువల్ల వాళ్ళు చెప్పినది విధేయతతో
చెయ్యండి. కాని వాళ్ళు బోధించినవి వాళ్ళే ఆచరించరు
కనుక వాళ్ళు చేసేవి చెయ్యకండి. 4వాళ్ళు బరువైన
మూటలు కట్టి ప్రజల భుజాలపై పెడతారు. కాని
వాళ్ళు మాత్రం ఆ బరువు మొయ్యటానికి తమ వేలు
కూడా కదిలించరు.
5"పెద్ద దేవుని వాక్యములు వ్రాసి పెట్టుకొన్న సంచు
లను కట్టుకొని, వెడల్పాటి అంచులుగల వస్త్రాలు
ధరించి చేసే ప్రతిపని ప్రజలు చూడాలని చేస్తారు.
6విందుల్లో, సమాజమందిరాల్లో ముఖ్యమైన స్థానాల్ని
ఆక్రమించటానికి చూస్తారు. 7సంతల్లో, ప్రజలు తమకు
నమస్కరించాలని, తమను రబ్బీ అని పిలవాలని
ఆశిస్తారు.
8"మీకందరికి బోధకుడు ఒకడే! మీరంతా సోద
రులు. కనుక మిమ్మల్ని రబ్బీ అని పిలువ నీయ
కండి. 9ప్రపంచంలో ఎవ్వర్నీ 'తండ్రీ!' అని సంబో
ధించకండి. మీ అందరికి తండ్రి ఒక్కడే. ఆ తండ్రి
పరలోకంలో ఉన్నాడు.10అదే కాకుండా మిమ్మల్ని
'గురువు!' అని పిలువ నియ్యకండి. మీకు ఒకే గురువు
ఉన్నాడు. ఆయనే 'క్రీస్తు.' 11మీలో గొప్ప వాడు మీ
సేవకునిగా ఉండాలి. 12ఎందుకంటే గొప్పలు చెప్పు
కొనేవాణ్ణి దేవుడు అణచి వేస్తాడు. అణకువతో ఉన్న
వాణ్ణి దేవుడు గొప్పవానిగా చేస్తాడు.
13"శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మోస
గాళ్ళు. మీకు శిక్షతప్పదు. దేవుని రాజ్యంలోకి ప్రజల్ని
ప్రవేశింపనీయకుండా మీరు దాని మార్గాన్ని మూసి
వేస్తారు. మీరు ప్రవేశించక పోవటమేకాకుండా, ప్రవే
శించటానికి ప్రయత్నించే వాళ్ళను కూడా ఆపుతు
న్నారు. 14శాస్త్రులారా! పరిసయ్యులారా! మీకు శిక్ష
తప్పదు. మీరు మోసాలు చేస్తారు. వితంతువుల యిళ్ళు
దోస్తారు. ఇతర్లు చూడాలని గంటల కొలది ప్రార్థిస్తారు.
కనుక మీకు అందరికన్నా తీవ్రమైన శిక్ష లభిస్తుంది.
15"శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మోస
గాళ్ళు. మీకు శ్రమ తప్పదు. మీరు మోసాలు చేస్తారు.
వితంతువుల ఇళ్లు దోస్తారు. ఇతర్లు చూడాలని గంటల
కొలది ప్రార్థిస్తారు. కనుక మీరు కఠినమైన శిక్ష పొందు
తారు.
16"గ్రుడ్డి మార్గదర్శకులారా! మీకు శిక్ష తప్పదు.
దేవాలయంపై ఒట్టు పెట్టుకొంటే నష్టం లేదుకాని,
'దేవాలయంలోని బంగారంపై ఒట్టు పెట్టుకొంటే ఆ
ఒట్టుకు కట్టుబడి ఉండాలి' అని మీరంటారు. 17మీరు
అంధులే కాక మూర్ఖులు కూడా! ఏది గొప్పది? బంగా
రమా? లేక బంగారాన్ని పవిత్రం చేసే దేవాలయమా?
18అంతేకాక, 'బలిపీఠంపై ఒట్టుపెట్టుకొంటే నష్టంలేదు
కాని, దాని మీదనున్న కానుకపై ఒట్టు పెట్టుకొంటే
ఆ ఒట్టుకు కట్టుబడి ఉండాలి' అని మీరంటారు.
19అంధులారా, ఏది గొప్పది? కానుకా? లేక ఆ కానుకను
పవిత్రంచేసే బలిపీఠమా? 20అందువల్ల బలిపీఠంపై
ఒట్టుపెట్టు కొంటే, దానిపై ఉన్న వాటి మీద కూడా
ఒట్టు పెట్టుకొన్నట్లే కదా! 21అదే విధంగా దేవాల
యంపై ఒట్టు పెట్టుకొంటే, దాని మీద, అందులో
నివసించే వాని మీద ఒట్టు పెటుకొన్నట్లే కదా! 22అదే
విధంగా పరలోకంపై ఒట్టు పెట్టుకొంటే అక్కడున్న
సింహాసనం మీదా, ఆ సింహాసనంపై కూర్చొన్న వాని
మీద ఒట్టు పెట్టుకొన్నట్టే గదా!
23"శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మోస
గాళ్ళు. మీకు శిక్ష తప్పదు. మీరు పుదీనా, సోంపు,
జీలకర్ర మొదలగు వాటిలో పదో వంతు దేవునికి
అర్పిస్తారు. కాని ధర్మశాస్త్రంలో వున్న ముఖ్యమైన
వాటిని: అంటే న్యాయము, దయ, విశ్వాసము,
మొదలగు వాటిని వదిలి వేస్తారు. మొదటి వాటిని
విడువకుండా మీరు వీటిని ఆచరించి వుండ వలసింది.
24గ్రుడ్డి మార్గదర్శకులారా! దోమను వడకట్టి ఒంటెను
మ్రింగువారివలే ఉన్నారు మీరు.
25"శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మోస
గాళ్ళు! మీకు శిక్ష తప్పదు. మీరు చెంబుల్ని, పాత్రల్ని
బయటివైపు కడుగుతారు కాని లోపల దురాశ,
స్వార్థము పేరుకొని ఉన్నాయి. 26పరిసయ్యులారా!
మీరు అంధులు. మొట్టమొదట చెంబుల్ని, పాత్రల్ని
లోపలి వైపు శుభ్రంచేయండి. అప్పుడు వాటి బయటి

వైపుకూడా శుభ్రంగా ఉంటుంది. 27శాస్త్రులారా!
పరిసయ్యులారా! మీరు మోస గాళ్ళు. మీకు శిక్ష
తప్పదు. మీరు సున్నం కొట్టిన సమాధుల్లాంటి వాళ్ళు.
అవి బయటకు అందంగా కనబడుతాయి. కాని వాటి
నిండా ఎముకలు, కుళ్ళిన దేహం ఉంటాయి. 28అదే
విధంగా మీరు బాహ్యంగా నీతిమంతుల వలె కన్పిస్తారు.
కాని లోపల మోసం, అన్యాయం నిండి ఉన్నాయి.
29"శాస్త్రులారా! పరిసయ్యులారా! మీరు మోస
గాళ్ళు. మీకు శిక్ష తప్పదు. మీరు ప్రవక్తల కోసం
సమాధుల్ని కడతారు. నీతిమంతుల సమాధుల్ని అలం
కరిస్తారు. 30అంతేకాక 'మేము మా తాత ముత్తాతల
కాలంలో జీవించి ఉంటే, వాళ్ళతో కలసి ప్రవక్తల
రక్తాన్ని చిందించి ఉండేవాళ్ళం కాదు' అని మీరంటారు.
31అంటే మీరు ప్రవక్తల్ని హత్యచేసిన వంశానికి చెంది
నట్లు అంగీకరించి మీకు వ్యతిరేకంగా మీరే సాక్ష్యం
చెప్పుకొంటున్నారన్నమాట. 32మీ తాత ముత్తాతలు
ప్రారంభించారు. మీరు ముగించండి!
33"మీరు పాముల్లాంటి వాళ్ళు. మీది సర్పవంశం.
నరకాన్ని ఎట్లా తప్పించుకోగలరు? 34నేను మీ దగ్గరకు
ప్రవక్తల్ని, జ్ఞానుల్ని, బోధకులను పంపుతున్నాను.
వాళ్ళలో కొందరిని మీరు సిలువకు వేసి చంపుతారు.
మరి కొందరిని సమాజమందిరాల్లో కొరడా దెబ్బలు
కొడ్తారు. వాళ్ళను వెంటాడుతూ గ్రామ గ్రామానికి
వెళ్ళి మీరీ పనులు చేస్తారు. 35నీతిమంతుడైన హేబెలు
రక్తం నుండి దేవాలయానికి బలిపీఠానికి మధ్య మీరు
హత్యచేసిన బరకీయ కుమారుడైన జెకర్యా రక్తం దాకా
ఈ భూమ్మీద కార్చిన నీతిమంతుల రక్తానికంతటికి
మీరు బాధ్యులు. 36ఇది సత్యం. ఈ నేరాలన్నీ ఈ
తరం వాళ్ళపై ఆరోపింపబడతాయి.

## యెరూషలేము విషయంలో దుఃఖించటం

*(లూకా 13:34-35)*

37"ఓ యెరూషలేమా! యెరూషలేమా! నీవు ప్రవ
క్తల్ని చంపావు! దేవుడు నీదగ్గరకు పంపిన వాళ్ళను
నీవు రాళ్ళతో కొట్టావు! కోడి తన పిల్లల్ని దాని
రెక్కల క్రింద దాచినట్లే నేను నీ సంతానాన్ని దాయా
లని ఎన్నోసార్లు ఆశించాను. కాని నీవు అంగీక
రించలేదు. 38అదిగో చూడు! పాడుబడిన మీ యింటిని
మీకొదిలేస్తున్నాను. 39'ప్రభువు పేరిట రానున్న వాడు
ధన్యుడు!' అని నీవనే దాకా నన్ను మళ్ళీ చూడవని
చెబుతున్నాను."

## యుగాంతం ముందు కనిపించే సూచనలు

*(మార్కు 13:1-31; లూకా 21:5-33)*

24 యేసు దేవాలయాన్ని వదిలి వెళ్తుండగా
ఆయన శిష్యులు దగ్గరకు వచ్చి ఆ దేవాల
యపు కట్టడాన్ని ఆయన దృష్టికి తెచ్చారు. 2యేసు,
"ఇవన్నీ చూస్తున్నారుగా! ఇది సత్యం. రాయి మీద
రాయి నిలువకుండా వాళ్ళు అన్నీ పడగొడ్తారు" అని
అన్నాడు.
3యేసు ఒలీవ చెట్ల కొండ మీద కూర్చొన్నాడు.
ఆయన శిష్యులు ఆయన దగ్గరకు ప్రత్యేకంగా వచ్చి,
"చెప్పండి; ఇది ఎప్పుడు సంభవిస్తుంది? మీరు రావ
టానికి ముందు, ఈ యుగం అంతమవటానికి ముందు
ఏ సూచన కనిపిస్తుంది?" అని అడిగారు.
4యేసు సమాధానంగా, "మిమ్మల్నెవరూ మోసం
చెయ్యకుండా జాగ్రత్త పడండి. 5ఎందుకంటే చాలా
మంది నా పేరిట వచ్చి 'నేను క్రీస్తును' అని చెప్పు
కొంటూ అనేకుల్ని మోసం చేస్తారు. 6యుద్ధాలను
గురించి, యుద్ధముల వదంతుల్ని గురించి విన్నప్పుడు
మీరు దిగులు పడకండి. అవి తప్పక సంభవిస్తాయి.
కాని 'అంతం' అప్పుడే రాదు. 7దేశం మీదికి దేశం
యుద్ధానికి వస్తుంది. రాజ్యం మీదికి రాజ్యం యుద్దానికి
వస్తుంది. పలుప్రాంతాల్లో క్షామాలు, భూకంపాలు,
సంభవిస్తాయి. 8అంటే, ప్రసవవేదనలు ఆరంభం
అయ్యాయన్నమాట.
9"ఆ తర్వాత వాళ్ళు మిమ్మల్ని అధికారులకు
అప్పగిస్తారు. ఆ అధికారులు మిమ్మల్ని హింసించి చంపు
తారు. నా కారణంగా దేశాలన్నీ మిమ్మల్ని ద్వేషిస్తాయి.
10ఆ సమయంలో అనేకులు ఈ విశ్వాసాన్ని వదిలి
వేస్తారు. పరస్పరం ద్వేషించు కొంటారు. 11దొంగ
ప్రవక్తలు అనేకులు వచ్చి ప్రజల్ని మోసం చేస్తారు.
12పాపం పెరగటం వల్ల అనేకుల్లో ప్రేమ చల్లారి
పోతుంది. 13కాని చివరి దాకా పట్టుదలతో నిలుచున్న
వాణ్ణి దేవుడు రక్షిస్తాడు. 14ఈ రాజ్యాన్ని గురించి చెప్పే
సువార్త ప్రపంచమంతా ప్రకటింప బడుతుంది. ఆ
సువార్త దేశాలన్నిటికిని ఒక ఋజువుగా ఉంటుంది.
అప్పుడు అంతం వస్తుంది.
15"అసహ్యం కలిగించేది, సర్వ నాశనం కలిగించేది
పవిత్ర స్థానంలో నిలుచొని ఉండటం మీరు చూస్తారు.
దీన్ని గురించి దానియేలు ప్రవక్త మాట్లాడాడు. పాఠ
కుడు దీని అర్థం గ్రహించాలి. 16అప్పుడు యూదయ
ప్రాంతంలోవున్న ప్రజలు కొండల మీదికి పారిపోవటం
మంచిది. 17మిద్దె మీద ఉన్నవాడు తన యింట్లోకి
వెళ్ళి ఏదీ తీసుకోరాదు. 18పొలంలో వున్నవాడు తన
వస్త్రాన్ని తీసుకు రావటానికి వెనక్కు మళ్ళరాదు. 19ఆ
రోజుల్లో గర్భిణీ స్త్రీలకు, పురిటి స్త్రీలకు ఎంత
దుఃఖంకలుగుతుందో కదా! 20ఆ రోజుల్లో చాలా
కష్టంగా ఉంటుంది. కనుక చలికాలంలో కాని, లేక
విశ్రాంతి రోజు కాని పారిపోవలసిన పరిస్థితి ఏర్పడ
కూడదని ప్రార్థించండి. 21ప్రపంచం సృష్టింపబడిన
నాటి నుండి నేటి దాకా అలాంటి కష్టం ఎన్నడూ
సంభవించలేదు. యిక ముందు సంభవించదు.
22దేవుడు ఆ రోజుల సంఖ్య తక్కువ చేసి ఉండక

పోయినట్లయితే, ఎవ్వరూ బ్రతికి ఉండే వాళ్ళు కాదు.
కాని దేవుడు తానెన్నుకొన్న వాళ్ళకోసం ఆ రోజుల
సంఖ్య తగ్గించాడు. 23ఆ రోజుల్లో మీలో ఎవరైనా,
‘ఇదిగో చూడండి క్రీస్తు యిక్కడ ఉన్నాడు’ అని కాని,
లేక, ‘అక్కడున్నాడు’ అని కాని అంటే నమ్మకండి.
24ఎందుకంటే క్రీస్తులమని, ప్రవక్తలమని చెప్పు
కొంటూ ప్రజల్ని మోసం చెయ్యటానికి గొప్ప మహ
త్యాలు, ఆశ్చర్యం కలిగించే కార్యాలు చేసే మోసగాళ్ళు
బయలు దేరుతారు. వీళ్ళు వీలైతే దేవుడు ఎన్నుకొన్న
వాళ్ళను కూడా మోసం చెయ్యటానికి ప్రయత్నిస్తారు.
25చూడండి! ముందే మీకు చెబుతున్నాను.
26“కనుక మీతో ఎవరైనా, ‘అదిగో! ఆయన నిర్మా
నుష్య ప్రాంతాల్లో ఉన్నాడు’ అంటే, అక్కడికి వెళ్ళ
కండి. లేక, ‘యిక్కడ గదుల్లో ఉన్నాడు’ అంటే, నమ్మ
కండి. 27తూర్పు నుండి పడమర దాకా మెరిసే మెరుపు
వలే మనుష్యకుమారుడు వస్తాడు. 28శవమున్న చోటే
రాబందులు ప్రోగౌతాయి.
29“ఆ కష్టకాలం గడిచిన వెంటనే:

‘దేవుడు సూర్యుణ్ణి చీకటిగా చేస్తాడు.
చంద్రుడు వెలుగు నివ్వడు నక్షత్రాలు
ఆకాశంనుండి రాలిపోతాయి ఆకాశంలోని
శక్తులు కదలిపోతాయి.’
*యెషయా 13:10; 34:4*

30“అప్పుడు మనుష్యకుమారుని సూచన ఆకా
శంలో కనిపిస్తుంది. భూమ్మీద ఉన్న దేశాలన్నీ దుఃఖి
స్తాయి. మనుష్య కుమారుడు శక్తితో, గొప్ప తేజస్సుతో
ఆకాశంలోని మేఘాలపై రావటం వాళ్ళు చూస్తారు.
31అప్పుడు దేవుడు తన దూతల్ని గొప్ప బూరధ్వనితో
పంపుతాడు. ఆ దూతలు నలువైపుల నుండి అంటే,
ఆ చివరి నుండి ఈ చివరిదాకా గాలించి దేవుడెన్ను
కొన్న వాళ్ళను ప్రోగు చేస్తారు.
32“ఇక ఇప్పుడు అంజూరపు చెట్టు ఉపమానాన్ని
గురించి నేర్చుకోండి. వాటి రెమ్మలు మృదువై ఆకులు
చిగురించగానే, ఎండకాలం దగ్గరకు వచ్చిందని మీకు
తెలిసి పోతుంది. 33అదే విధంగా నేను చెప్పినవన్నీ
చూసిన వెంటనే ఆయన దగ్గరలోనే ఉన్నాడని అంటే
మీ తలుపు ముందే ఉన్నాడని తెలుసుకొంటారు. 34ఇది
సత్యం. ఇవన్నీ జరిగేదాకా ఈ తరం వాళ్ళు జీవించే
ఉంటారు. 35భూమి, ఆకాశము నశించి పొతాయి కాని
నా మాటలు శాశ్వతంగా నిలిచి పోతాయి!

### ఆ దినం కాని, ఆ ఘడియ కాని ఎవ్వరికీ తెలియదు

*(మార్కు 13:32-37; లూకా 17:26-30, 34-36)*

36“ఆ రోజును గురించి లేక ఆ ఘడియను గురించి
పరలోకంలోని దేవ దూతలకు గాని, కుమారునికి గాని
ఎవ్వరికి తెలియదు. తండ్రికి మాత్రం తెలుసు.
37నోవహు కాలంలో ఏ విధంగా ఉందో మనుష్య కుమా
రుడు వచ్చినప్పుడు కూడా అదే విధంగా వుంటుంది.
38నోవహు తన నావలో ప్రవేశించేదాకా, ప్రళయానికి
ముందు రోజుల్లో ప్రజలు తింటూ, త్రాగుతూ,
పెళ్ళిళ్ళు చేసుకొంటూ, పెళ్ళిళ్ళు చేస్తూ జీవించారు.
39ప్రళయం వచ్చి వాళ్ళందరూ కొట్టుకొని పోయేదాకా
ఆ విధంగా జరుగు తుందని వాళ్ళకు తెలియదు.
మనుష్యకుమారుడు కూడా అదే విధంగా అకస్మాత్తుగా
వస్తాడు. 40ఆ రోజు ఇద్దరు వ్యక్తులు పొలంలో పని
చేస్తూవుంటే ఒకడు ఆయన వెంట తీసుకు పోబడ
తాడు. రెండవ వాడు వదిలి వేయ బడతాడు. 41ఇద్దరు
స్త్రీలు తిరుగలి విసురుతూ ఉంటే ఒక స్త్రీని తన వెంట
తీసుకు వెళ్తాడు. రెండవ స్త్రీని వదిలి వేస్తాడు.
42“మీ ప్రభువు ఏ రోజు రానున్నాడో మీకు తెలి
యదు కనుక సిద్ధముగా ఉండండి. 43కాని ఈ విషయం
తెలుసుకోండి. ఇంటి యజమానికి దొంగ ఎప్పుడు
వస్తాడో తెలిసి ఉంటే, తన యింట్లోకి దొంగను
రానీయ కుండా కాపలాకాస్తాడు. 44మనుష్యకుమా రుడు
కూడా మీరు అనుకోని ఘడియలో వస్తాడు. కనుక
మీరు కూడా అదే విధంగా సిద్ధంగా ఉండాలి.
45“విశ్వాసము, తెలివిగల ఒక సేవకుణ్ణి ఉదాహ
రణగా తీసుకోండి. అతని యజమాని అతణ్ణి తన
యింట్లో పనిచేసే వాళ్ళకు సరియైన సమయంలో
భోజనం పెట్టడానికి నియమించాడు. 46యజమాని
వచ్చినప్పుడు ఆ సేవకుడు తన యజమాని చెప్పినట్లు
చేస్తూవుంటే ధన్యుడు. 47నేను మీకు నిజం చెబుతు
న్నాను: యజమాని ఆ నౌకరును తనకున్న ఆస్తి
అంతటిపై అధికారిగా నియమిస్తాడు. 48ఒక వేళ ఆ
సేవకుడు దుర్మార్గుడైతే తనలో తాను ‘నా యజమాని
త్వరలో రాడు’ అని అనుకొని 49తన తోటి పని
వాళ్ళను కొట్టడం మొదలు పెడ్తాడు. అంతేకాక త్రాగు
బోతులతో కలసి తిని, త్రాగుతాడు. 50యజమాని
తన సేవకుడు ఎదురు చూడని రోజు, అతనికి తెలియని
ఘడియలో వచ్చి,
51“అతణ్ణి చంపించి పాపులతో సహా నరకంలో
పడవేస్తాడు. ఆ నరకంలో వాళ్ళంతా ఏడుస్తూ పండ్లు
కొరుకుతూ బాధననుభవిస్తారు.

### పది మంది కన్యకల ఉపమానం

25 “దేవుని రాజ్యం ఇలా ఉంటుంది: పది
మంది కన్యకలు తమ తమ దీపాలు తీసుకొని
పెళ్ళి కుమారుణ్ణి కలవటానికి వెళ్ళారు. 2వాళ్ళలో
ఐదుగురు తెలివిలేని వాళ్ళు; ఐదుగురు తెలివిగల
వాళ్ళు. 3తెలివి లేని కన్యలు దీపాలు తీసుకెళ్ళారు
కాని తమ వెంట నూనె తీసుకు వెళ్ళలేదు. 4తెలివిగల
కన్యలు తమ దీపాలతో పాటు పాత్రలో నూనె కూడా

తీసుకు వెళ్ళారు. 5పెళ్ళి కుమారుడు రావటం ఆలస్యం
అయింది. అందరికి కునుకు వచ్చి నిద్దుర పొయ్యారు.
6“అర్ధరాత్రి వేళ, ‘అదిగో పెళ్ళి కుమారుడు! వచ్చి
చూడండి!’ అని ఎవరో బిగ్గరగా కేక వేసారు.
7“వెంటనే ఆ కన్యకలందరూ లేచి తమ దీపాల్ని
సరి చేసుకొన్నారు. 8తెలివి లేని కన్యలు ‘మీ నూనె
కొద్దిగా మాకివ్వండి; మా దీపాలలో నూనంతా అయి
పోయింది!’ అని తెలివిగల కన్యల్ని అడిగారు.
9“తెలివి గల కన్యలు, ‘ఈ నూనె మనకందరికి
సరిపోదేమో! దుకాణానికి వెళ్ళి మీకోసం కొద్ది నూనె
కొనుక్కురండి’ అని సమాధానం చెప్పారు.
10“కాని వాళ్ళు నూనె కొనుక్కురావటానికి వెళ్ళిన
ప్పుడు పెళ్ళి కుమారుడు వచ్చాడు. సిద్ధంగా ఉన్న
కన్యలు పెళ్ళి విందుకు అతనితో కలసి లోపలికి
వెళ్ళారు. ఆ తదుపరి తలుపు వేయబడింది.
11“మిగతా కన్యలు వచ్చి, ‘అయ్యా! అయ్యా!
తలుపు తెరవండి’ అని అడిగారు.
12“కాని అతడు, ‘నేను నిజం చెబుతున్నాను; మీరె
వరో నాకు తెలియదు’ అని సమాధానం చెప్పాడు.
13“మీకు ఆ రోజు, ఆ ఘడియ ఎప్పుడు వస్తుందో
తెలియదు కనుక మెలకువతో ఉండండి.

## ముగ్గురు సేవకుల ఉపమానం

*(లూకా 19:11-27)*

14“దేవుని రాజ్యం ఇలా ఉంటుంది: ఒక వ్యక్తి ప్రయా
ణమై వెళ్తూ తన సేవకుల్ని పిలిచి తన ఆస్తిని వాళ్ళకు
అప్పగించాడు. 15ఒకనికి ఐదు తలాంతుల* ధనం
ఇచ్చాడు. రెండవ వానికి రెండు తలాంతులు, మూడవ
వానికి ఒక తలాంతు వాళ్ళ వాళ్ళ శక్తిని బట్టి ఇచ్చాడు.
ఆ తర్వాత ప్రయాణమై వెళ్ళాడు. 16ఐదు తలాంతులు
పొందిన వాడు వెంటనే వెళ్ళి ఆ ధనాన్ని ఉపయోగించి
మరో ఐదు తలాంతులు సంపాదించాడు. 17అదేవిధంగా
రెండు తలాంతులు పొందిన వాడు వెళ్ళి మరో రెండు
తలాంతులు సంపాదించాడు. 18కాని ఒక తలాంతు
పొందిన వాడు వెళ్ళి ఒక గొయ్యి త్రవ్వి యజమాని
యిచ్చిన ధనాన్ని అందులో దాచాడు.
19“చాలాకాలం తర్వాత ఆ యజమాని తిరిగి వచ్చి
లెక్కలు చూసాడు. 20ఐదు తలాంతులు పొందినవాడు
మరో ఐదు తలాంతులు తెచ్చి, ‘అయ్యా! మీరు నాకు
ఐదు తలాంతులు ఇచ్చారు. నేను మరో ఐదు సంపా
దించాను చూడండి!’ అని అన్నాడు.
21“ఆ యజమాని ‘మంచి పని చేసావు! నీలో
మంచితనం, విశ్వాసం ఉన్నాయి. నీవు కొంచెములో
నమ్మకంగా పని చేసావు! కనుక నిన్ను ఇంకా చాలా
వాటిపై అధికారిగా నియమిస్తాను. నీ యజమానితో
కలసి ఆనందించు!’ అని సమాధానం చెప్పాడు.
22 “రెండు తలాంతులు పొందిన వాడు కూడా
వచ్చి, ‘అయ్యా! నాకు రెండు తలాంతులు యిచ్చారు.
నేను మరో రెండు సంపాదించాను. చూడండి!’ అని
అన్నాడు.
23“ఆ యజమాని ‘మంచిపని చేసావు! నీలో
మంచితనము, విశ్వాసము ఉన్నాయి. నీవు కొంచె
ములో నమ్మకంగా పని చేసావు కనుక నిన్ను యింకా
చాలా వాటిపై అధికారిగా నియమిస్తాను, నీ యజ
మానితో కలసి ఆనందించు!’ అని అన్నాడు.
24“తదుపరి ఒక తలాంతు పొందిన వాడు వచ్చి
‘అయ్యా! మీరు కృరమైన వారని నాకు తెలుసు. విత్తనం
నాటని చోట మీరు పంటను కోస్తారు. విత్తనం వేయని
పొలాలనుండి ధాన్యం ప్రోగు చేస్తారు. 25అందువల్ల
నేను భయపడి మీ తలాంతు తీసుకు వెళ్ళి భూమిలో
దాచి ఉంచాను. ఇదిగో! మీది మీరు తీసుకోండి!’
అని అన్నాడు.
26“ఆ యజమాని ఈ విధంగా సమాధానం
ఇచ్చాడు: ‘నీవు దుర్మార్గుడివి! సోమరివి! నేను విత్తనం
నాటని పొలం నుండి పంటను కోస్తానని, విత్తనం
వెయ్యని చోట ధాన్యం ప్రోగు చేస్తానని నీకు తెలుసు
నన్న మాట. అలా అనుకొన్నవాడివి నా డబ్బు వడ్డీ
వ్యాపారుల దగ్గర దాచి ఉంచ వలసింది. 27అలా
చేసుంటే నా డబ్బు వడ్డీతో సహా నాకు లభించేది.’
28“అతని దగ్గరున్న తలాంతు తీసుకొని పది తలాం
తులున్న వానికివ్వండి. 29ఎందుకంటే ఉన్న వాళ్ళకు
దేవుడు యింకా ఎక్కువ యిస్తాడు. అప్పుడు వాళ్ళ
దగ్గర సమృద్ధిగా ఉంటుంది. లేని వాళ్ళనుండి వాళ్ళ
దగ్గరున్నది కూడా తీసి వేయబడుతుంది. 30ఆ
పనికిరాని వాణ్ణి బయట చీకట్లో పడవేయండి.
అక్కడతడు ఏడుస్తూ బాధ ననుభవిస్తాడు.”

## చివరి తీర్పు

31“తేజోవంతుడైన మనుష్యకుమారుడు తన దేవ
దూతలతో కలసి వస్తాడు. వచ్చి తేజోవంతమైన తన
సింహాసనంపై కూర్చుం టాడు. 32ప్రజలందర్నీ సమా
వేశ పరచి గొఱ్ఱెల కాపరి మేకల్లో నుండి గొఱ్ఱెల్ని
వేరు చేసినట్లు వాళ్ళను వేరుచేస్తాడు. 33తదుపరి కొంద
రిని తన కుడి వైపున, కొందరిని తన ఎడమ వైపున
ఉంచుతాడు.
34“అప్పుడా రాజు తన కుడి వైపునున్న వాళ్ళతో,
‘రండి! నా తండ్రి ఆశీర్వాదాలను మీరు పొందారు.
మీ రాజ్యాన్ని తీసుకొండి. ప్రపంచం సృష్టింపబడిన
ప్పుడే ఈ రాజ్యాన్ని దేవుడు మీకోసం ఉంచాడు.
35ఎందుకంటే, ‘నేను ఆకలితో ఉన్నప్పుడు మీరు
నాకు భోజనం పెట్టారు. దాహం వేసినప్పుడు మీరు

---

**ఒక తలాంతు** ముప్పై వేల దేనారాలకు సమానం.(ఒక దేనారము పనివాని ఒకరోజు జీతము.)

నాకు నీళ్ళిచ్చారు. పరదేశీయునిగా మీ దగ్గరకు వచ్చిన
ప్పుడు నాకు ఆతిథ్యమిచ్చారు. 36దుస్తులు కావలసి
వచ్చినప్పుడు మీరు నాకు దుస్తులిచ్చారు. జబ్బుతో
ఉన్నప్పుడు మీరు నాకు సేవ చేసారు. నేను కారా
గారంలో ఉన్నప్పుడు వచ్చి పలకరించారు' అని
అంటాడు.
37"అప్పుడు నీతిమంతులు, 'ప్రభూ! మీరు
ఆకలితో ఉండగా మేము ఎప్పుడు మీకు భోజనం
పెట్టాము? మీరు దాహంతో ఉండగా మీకు నీళ్ళెప్పు
డిచ్చాము? 38మీరు పరదేశీయునిగా ఎప్పుడు
వచ్చారు? మిమ్మల్ని ఎప్పుడు ఆహ్వానించాము? మీకు
దుస్తులు ఎప్పుడు కావలసివచ్చింది? దుస్తులు మీకు
ఎప్పుడిచ్చాము? 39మీరు అనారోగ్యంగా ఉన్నప్పుడు
మేము ఎప్పుడు చూసాము? మీరు కారాగారంలో ఎప్పు
డువున్నారు? మిమ్మల్ని చూడటానికి ఎప్పుడు
వచ్చాము?' అని అడుగుతారు.
40"ఆ రాజు, 'ఇది సత్యం. హీన స్థితిలో ఉన్న నా
సోదరులకు మీరు చేసిన ప్రతి సహాయాన్ని నాకు
చేసినట్టుగా పరిగణిస్తాను' అని సమాధానం చెబుతాడు.
41"ఆ తర్వాత ఆ రాజు తన ఎడమ వైపునున్న
వాళ్ళతో, 'శాపగ్రస్తులారా! వెళ్ళి పొండి! సైతాను
కొరకు, వాని దూతలకొరకు సిద్ధం చేయబడిన శాశ్వత
మైన మంటల్లో పడండి. 42ఎందుకంటే, నేను ఆకలితో
ఉన్నప్పుడు మీరు నాకు భోజనం పెట్టలేదు. దాహం
వేసినప్పుడు మీరు నాకు నీళ్ళివ్వలేదు. 43నేను
పరదేశీయునిగా వచ్చినప్పుడు మీరు నన్ను ఆహ్వానించ
లేదు. నాకు దుస్తులు కావలసి వచ్చినప్పుడు మీరు
దుస్తుల్ని యివ్వలేదు. నేను జబ్బుతో కారాగారంలో
ఉన్నప్పుడు మీరు నాకు సేవ చేయలేదు' అని
అంటాడు.
44"అప్పుడు వాళ్ళు కూడా, 'ప్రభూ! మీరు ఆకలి
గావున్నప్పుడు గాని, లేక దాహంతో ఉన్నప్పుడు కాని,
లేక పరదేశీయునిగా కాని, లేక జబ్బుతో ఉన్న వానిగా
కాని లేక చెరసాలలో ఉన్నట్టుకాని ఎప్పుడు
చూసాము? అలా చూసి కూడా మీకు ఎప్పుడు
సహాయం చెయ్యలేదు?' అని అంటారు.
45"ఆయన, 'ఇది సత్యం. హీనస్థితిలో ఉన్న వానికి
మీరు సహాయం చెయ్యలేదు. కనుక నాకు సహాయం
చెయ్యనట్లే' అని చెబుతాడు.
46"వాళ్ళు వెళ్ళి శాశ్వతంగా శిక్షను అనుభవిస్తారు.
కాని నీతిమంతులు అనంత జీవితం పొందుతారు."

### యేసును బంధించాలని కుట్ర పన్నటం

*(మార్కు 14:1-2; లూకా 22:1-2; యోహాను 11:45-53)*

26 యేసు చెప్పటం ముగించాడు. ఆ తదుపరి
శిష్యులతో 2"రెండు రోజుల తర్వాత పస్కా
పండుగ వస్తోందని మీకు తెలుసు. ఆ తర్వాత మనుష్య
కుమారునికి శ్రమ సంభవిస్తుంది. తత్ఫలితంగా ఆయన
శత్రువులు ఆయన్ని సిలువకు వేస్తారు" అని అన్నాడు.
3ప్రధానయాజకులు, పెద్దలు, కయప అని పిలువ
బడే ప్రధానయాజకుని యింటి ఆవరణంలో సమా
వేశమై 4యేసును ఏదో ఒక కుట్రతో బంధించి చంపా
లని పన్నాగం పన్నారు. 5"కాని పండుగ రోజుల్లో
కాదు. అలా చేస్తే ప్రజల్లో అల్లర్లు చెలరేగవచ్చు' అని
అనుకొన్నారు.

### బేతనియ గ్రామంలో తైలాభిషేకం

*(మార్కు 14:3-9; యోహాను 12:1-8)*

6బేతనియ గ్రామంలో కుష్ఠురోగియగు సీమోను
అని పిలువబడే ఒక వ్యక్తి యింట్లో యేసు ఉన్నాడు.
7యేసు భోజనానికి కూర్చొని ఉండగా ఒక స్త్రీ చలువ
రాతి బుడ్డిలో అతి విలువైన అత్తరుతో ఆయన దగ్గరకు
వచ్చి ఆయన తలపై పోసింది.
8ఇది చూసి శిష్యులకు కోపం వచ్చింది. "ఎందు
కిలా వ్యర్థంచేయటం? 9ఈ అత్తరు పెద్ద మొత్తానికి
అమ్మి ఆ డబ్బు పేదవాళ్ళ కివ్వవలసింది!" అని
వాళ్ళన్నారు.
10యేసుకు ఈ విషయం తెలిసి, "ఆమెనెందు
కంటున్నారు? ఆమె సరియైన పని చేసింది, 11పేద
వాళ్ళు మీతో ఎప్పుడూ ఉంటారు. కాని నేను మీతో
ఎల్లకాలం ఉండబోను. 12ఆమె ఆ అత్తరు నా శరీరం
మీద పోసి నన్ను సమాధి చెయ్యటానికి సిద్ధం చేసింది.
13ఇది సత్యం – ఈ సువార్తను ప్రపంచంలో ఏ చోట
ప్రకటించినా ఆమె జ్ఞాపకార్థం ఆమె చేసింది కూడా
చెప్పబడుతుంది" అని అన్నాడు.

### యేసుకు ద్రోహం చెయ్యటానికి యూదా అంగీకరించటం

*(మార్కు 14:10-11; లూకా 22:3-6)*

14ఆ తర్వాత పన్నెండుగురిలో ఒకడైన యూదా
ఇస్కరియోతు ప్రధాన యాజకుల దగ్గరకు వెళ్ళాడు.
15"ఆయన్ని మీ కప్పగిస్తే మీరు నాకేమివ్వాలను
కొన్నారు?" అని వాళ్ళ నడిగాడు. వాళ్ళు ముప్పై
వెండి నాణేలు లెక్క పెట్టి యిచ్చారు. 16అప్పటి
నుండి యూదా ఆయన్ని పట్టివ్వాలని అవకాశం కోసం
ఎదురు చూడసాగాడు.

### ప్రభువుతో చివరి రాత్రి భోజనం

*(మార్కు 14:21-22; లూకా 22:7-14, 21-23;
యోహాను 13:21-30)*

17పులియని రొట్టెలు తినే పండుగ రోజులు
వచ్చాయి. మొదటి రోజు శిష్యులు యేసు దగ్గరకు
వచ్చి, "పస్కా పండుగ భోజనం ఎక్కడ సిద్ధం చేయ
మంటారు?" అని అడిగారు.

[18]యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: "పట్ట
ణంలోకి నేను చెప్పిన వ్యక్తి దగ్గరకు వెళ్ళండి. అతనితో
'నా సమయం దగ్గరకొచ్చింది. నేను నా శిష్యులతో
కలసి పస్కా పండుగ భోజనం మీ యింట్లో చెయ్యాల
నుకొంటున్నానని మా ప్రభువు చెప్పమన్నారు' అని
చెప్పండి." [19]శిష్యులు యేసు సూచించిన విధంగా
పస్కాపండుగ విందు సిద్ధం చేసారు.
[20]సాయంత్రం కాగానే యేసు పన్నెండు మందితో
కలసి భోజనానికి కూర్చున్నాడు. [21]అంతా భోజనం
చేస్తుండగా ఆయన, "ఇది సత్యం. మీలో ఒకడు నాకు
ద్రోహం చేస్తాడు" అని అన్నాడు.
[22]వాళ్ళకు దుఃఖం కలిగింది. ప్రతి ఒక్కడు ఆయ
నతో, "ప్రభూ! నేను కాదు కదా!" అని అన్నాడు.
[23]యేసు సమాధానం చెబుతూ, "నాతో కలసి
గిన్నెలో చెయ్యి ఉంచిన వాడు నాకు ద్రోహం చేస్తాడు.
[24]మనుష్యకుమారుడు లేఖనాల్లో వ్రాసినట్లు చనిపో
తాడు. కాని ఆయనకు ద్రోహంచేసిన వానికి బహు
శ్రమ కలుగుతుంది. వాడు జన్మించి ఉండక పోయినట్ల
యితే బాగుండేది" అని అన్నాడు.
[25]అప్పుడు ఆయనకు ద్రోహం చేయనున్న
యూదా, "నేను కాదు కదా రబ్బీ"* అని అన్నాడు.
యేసు, "ఔను! నువ్వే!"* అని సమాధానం చెప్పాడు.
[26]వాళ్ళు భోజనం చేస్తుండగా యేసు ఒక రొట్టె
తీసుకొని దేవునికి కృతజ్ఞతలు అర్పించి దాన్ని విరిచి
శిష్యులకిస్తూ, "ఇది తీసుకొని తినండి! ఇది నా దేహం!"
అని అన్నాడు.
[27]ఆ తర్వాత పాత్రను తీసుకొని దేవునికి కృతజ్ఞ
తలు అర్పించి వాళ్ళకిస్తూ, "అందరూ ఈ పాత్రలో
వున్న దాన్ని త్రాగండి. [28]ఇది నా ఒడంబడిక* రక్తం.
అనేకులకు పాప క్షమాపణ కలగాలని నేనీ రక్తాన్ని
చిందించాను.
[29]ఈ రోజు నుండి నా తండ్రి రాజ్యంలో మీతో
కలసి ద్రాక్షారసాన్ని మళ్ళీ త్రాగే దాకా దీన్ని యిక
మీదట త్రాగనని మీతో చెబుతున్నాను" అని అన్నాడు.
[30]వాళ్ళు కీర్తనను పాడాక ఒలీవ చెట్ల కొండ మీదికి
వెళ్ళారు.

## పేతురు యేసును ఎరుగనని చెప్పటం

*(మార్కు 14:27-31; లూకా 22:31-34;
యోహాను 13:36-38)*

[31]ఆ తదుపరి యేసు వాళ్ళతో, "ఈ రాత్రి మీరు
నాకారణంగా చెదరిపోతారు. ఎందుకంటే:

'నేను గొఱ్ఱెల కాపరిని చంపుతాను అప్పుడా
గొఱ్ఱెల మంద చెదరి పోతుంది'
*జెకర్యా 13:7*

అని వ్రాయబడివుంది.

[32]"కాని దేవుడు నన్ను బ్రతికించాక నేను మీకన్నా
ముందే గలిలయకు వెళ్తాను" అని అన్నాడు.
[33]పేతురు, "అందరూ మిమ్మల్ని వదిలి వెళ్ళినా
నేను మాత్రం మిమ్మల్ని వదలి వెళ్ళను" అని సమా
ధానం చెప్పాడు.
[34]యేసు, "ఇది సత్యం. ఈ రాత్రి కోడి కూయక
ముందే నేనెవరో తెలియదని మూడు సార్లు అంటావు"
అని సమాధానం చెప్పాడు.
[35]కాని పేతురు, "నేను మీతో కలసి మరణిస్తాను,
కాని మీరెవరో నాకు తెలియదని అనను" అని అన్నాడు.
శిష్యులందరూ అదే విధంగా అన్నారు.

## గెత్సేమనే తోట

*(మార్కు 14:32-42; లూకా 22:39-46)*

[36]ఆ తర్వాత యేసు శిష్యులతో కలసి గెత్సేమనే
అనే ప్రదేశానికి వెళ్ళాడు. వాళ్ళతో, "ఇక్కడే
కూర్చోండి. నేను అక్కడికి వెళ్ళి ప్రార్థిస్తాను" అని
అన్నాడు. [37]యేసు పేతుర్ని, జెబెదయి యొక్క
యిద్దరు కుమారుల్ని తన వెంట పిలుచుకు వెళ్ళాడు.
ఆయనకు దుఃఖం వచ్చింది. మనస్సు వ్యాకులం
చెందింది. [38]అప్పుడాయన వాళ్ళతో, "నా ఆత్మ
మరణ వేదన పొందుతోంది. ఇక్కడే ఉండి నాతో
సహా మేలుకొని ఉండండి" అని అన్నాడు.
[39]యేసు యింకా కొంత దూరం వెళ్ళి సాష్టాంగ
పడి, "నా తండ్రీ! వీలైతే దుఃఖంతో నిండిన ఈ
పాత్రను నా నుండి తీసివేయి! అయినా నెరవేరవల
సింది నా యిచ్ఛకాదు. నీది" అని అంటూ ప్రార్థించాడు.
[40]ఆ తర్వాత తిరిగి వచ్చి శిష్యులు నిద్రిస్తూ ఉండటం
గమనించాడు. ఆయన, "నాతో సహా ఒక గంట సేపు
మేలుకోలేక పొయ్యారా?" అని అన్నాడు. [41]"మెలకు
వగా ఉండి ప్రార్థించండి! అప్పుడే మీరు దుష్ప్రేరేప
ణకులోనై పోకుండా ఉంటారు. ఆత్మ సిద్ధంగా ఉంది
కాని శరీరం బలహీనంగా ఉంది!" అని పేతురుతో
అన్నాడు. [42]ఆయన రెండవసారి వెళ్ళి, "నా తండ్రీ!
ఈ పాత్రలోవున్నది త్రాగితేగాని వీల్లేదంటే నేను దాన్ని
త్రాగుతాను. నీ యిష్టమే నెరవేరు గాక!" అని
ప్రార్థించాడు.
[43]ఆయన తిరిగి వచ్చి తన శిష్యులు మళ్ళీ నిద్రి
స్తుండటం గమనించాడు. కళ్ళు బరువెక్కటంవల్ల
వాళ్ళు నిద్రనాపుకోలేక పోయారు. [44]ఆయన మూడవ
సారి వాళ్ళను వదిలి వెళ్ళి ముందు ప్రార్థించినట్లే మళ్ళీ
ప్రార్థించాడు. [45]ఆ తదుపరి తన శిష్యుల దగ్గరకు

---

**రబ్బీ** అనగా గురువు లేక బోధకుడు.

**నువ్వే** లేక 'నీవే స్వయంగా అన్నావు!'

**ఒడంబడిక** కొన్ని గ్రీకు వ్రాత ప్రతులలో 'క్రొత్త' అని చేర్చబడింది.

వచ్చి, "మీరింకా నిద్రిస్తూ, విశ్రాంతి తీసుకొంటున్నారా. చూడండి! మనుష్యకుమారుడు పాపాత్ములకు అప్పగింపబడే ఘడియ దగ్గరకు వచ్చింది. [46]వెళ్దాం, లేవండి. అదిగో! నాకు ద్రోహం చేయనున్నవాడు వస్తున్నాడు!" అని అన్నాడు.

### యేసును బంధించటం

*(మార్కు 14:43-50; లూకా 22:47-53; యోహాను 18:3-12)*

[47]ఆయనింకా మాట్లాడుతూ ఉండగానే పన్నెండు గురిలో ఒకడైన యూదా వచ్చాడు. ప్రధాన యాజకులు, ప్రజాప్రముఖులు పంపించిన పెద్ద ప్రజల గుంపు ఒకటి వాని వెంట ఉంది. వాళ్ళ చేతుల్లో కత్తులు, కర్రలు ఉన్నాయి.
[48]ఆ ద్రోహి, "నేను వెళ్ళి ఎవర్ని ముద్దు పెట్టుకుంటానో, ఆయన్ని బంధించండి!" అని ముందే ఒక ఏర్పాటు చేసుకొన్నాడు.
[49]యూదా వెంటనే యేసు దగ్గరకు వెళ్ళి, "వందనాలు రబ్బీ!" అని ఆయన్ని ముద్దుపెట్టుకున్నాడు.
[50]యేసు, "మిత్రమా! నీవు చేయవచ్చిన పని చెయ్యి" అని అన్నాడు.

వెంటనే కొందరు వ్యక్తులు ముందుకు వచ్చి ఆయన్ని బంధించారు.
[51]యేసుతో ఉన్న వాళ్ళలో ఒకడు వెంటనే తన కత్తిని వరనుండి తీసి, ప్రధాన యాజకుని సేవకుని యొక్క చెవిని నరికి వేసాడు.

[52]యేసు, "కత్తిని వరలో పెట్టెయి! కత్తినెత్తిన వాడు ఆ కత్తితోనే మరణిస్తాడు.
[53]నేను నా తండ్రిని సహాయం కావాలని అడగలేననుకొన్నావా? నేను అడిగిన వెంటనే పన్నెండు దళాలకంటే* ఎక్కువ మంది దేవదూతల్ని పంపుతాడు.
[54]నేను అలాచేస్తే ఈ విధంగా జరగాలని లేఖనాల్లో వ్రాసినవి ఎట్లా నెరవేరుతాయి?" అని అన్నాడు.

[55]ఆ తదుపరి యేసు వచ్చిన ప్రజలతో, "దోపిడి దొంగను పట్టుకోవటానికి వచ్చినట్లు కత్తులతో, కర్రలతో వచ్చారేం? మందిరావరణంలో కూర్చొని ప్రతి రోజు బోధించాను. కాని అప్పుడు మీరు నన్ను బంధించలేదు.
[56]కాని, ప్రవక్తలు వ్రాసినవి నెరవేరాలని యివన్నీ జరిగాయి" అని అన్నాడు. వెంటనే ఆయన శిష్యులందరూ ఆయన్ని వదిలి వెళ్ళి పొయ్యారు.

### మహా సభ ముందు యేసు

*(మార్కు 14:53-65; లూకా 22:54-55, 63-71; యోహాను 18:13-14, 19-24)*

[57]వాళ్ళు యేసును బంధించి ప్రధాన యాజకుడైన 'కయప' దగ్గరకు తీసుకు వెళ్ళారు. అక్కడ శాస్త్రులు, పెద్దలు ఇది వరకే సమావేశమై వున్నారు.
[58]కాని పేతురు కొంత దూరంలోవుండి యేసును ప్రధానయాజకుని యింటి దాకా అనుసరించాడు. ఇంట్లో ఏం జరుగుతుందో చూడాలని భటుల్తో కలసి యింటి ముంగిట్లో కూర్చున్నాడు.

[59]మరణ శిక్ష విధించాలనే ఉద్దేశ్యంతో ప్రధాన యాజకులు, మహాసభ సభ్యులు యేసుకు ప్రతికూలంగా, దొంగ సాక్ష్యం కొరకు చూసారు.
[60]చాలా మంది దొంగ సాక్ష్యం చెప్పటానికి ముందుకు వచ్చారు. కాని చంపడానికి సరైన కారణం లభించలేదు. చివరకు యిద్దరు వ్యక్తులు ముందుకు వచ్చి
[61]ఈ విధంగా చెప్పారు, "ఈ వ్యక్తి 'నేను దేవాలయాన్ని నాశనం చేసి మూడు రోజుల్లో మళ్ళీ నిర్మించగలను' అని అన్నాడు."

[62]అప్పుడు ప్రధానయాజకుడు లేచి నిలబడి యేసుతో, "నీవు సమాధానం చెప్పవా? వీళ్ళు చేస్తున్న నేరారోపణ లేమిటి?" అని అడిగాడు.
[63]కాని యేసు సమాధానం చెప్పలేదు.

ప్రధాన యాజకుడు, "సజీవుడైన దేవునిపై ప్రమాణం చేసి చెప్పు, నీవు దేవుని కుమారుడై నటువంటి క్రీస్తువా?" అని అడిగాడు.

[64]యేసు సమాధానం చెబుతూ, "ఔను! మీరన్నది నిజం. అంతే. నేను మీతో చెప్పేదే మిటంటే యిక మీదటి నుండి మనుష్యకుమారుడు సర్వశక్తిసంపన్నుని కుడివైపు కూర్చొని ఉండటం మీరు చూస్తారు. ఆయన మేఘాలపై రావటం మీరు చూస్తారు" అని అన్నాడు.

[65]ఇది విని ప్రధానయాజకుడు తన దుస్తుల్ని చింపుకొని కోపాన్ని వ్యక్తపరుస్తూ, "ఇతను దైవ దూషణ చేస్తున్నాడు. మనకింక ఇతర సాక్ష్యాలు ఎందుకు? చూడండి! అతడు చేసిన దైవ దూషణ విన్నారు కదా!
[66]మరి మీరేమంటారు?" అని అడిగాడు.

"అతనికి మరణ దండన విధించవలసిందే" అని వాళ్ళు సమాధానం చెప్పారు.

[67]వాళ్ళలో కొందరు ఆయన ముఖంమ్మీద ఉమ్మేసి కొట్టారు. మరి కొందరు ఆయన చెంప మీద కొట్టి
[68]"ఓ క్రీస్తూ! నిన్నెవరు కొట్టారో చెప్పుకో!" అని అన్నారు.

### పేతురు యేసును ఎరుగననటం

*(మార్కు 14:66-72; లూకా 22:56-62; యోహాను 18:15-18, 25-27)*

[69]ఇక్కడ పేతురు బయట ముంగిట్లో కూర్చొని ఉండగా ఒక దాసీ పిల్ల అతని దగ్గరకు వచ్చి, 'నీవు కూడా గలిలయ వాడైన యేసుతో ఉన్న వాడవే కదూ!' అని అడిగింది.

---

**నేను … దళాలకంటే** దళం అనగా ఆరు వేల మంది యోధులు.

70కాని అతడు వాళ్ళందరి ముందు, "నీవేం మాట్లా
డుతున్నావో నాకు తెలియదు!" అని అంటూ ఆమె
మాటను కాదన్నాడు. 71ఆ తరువాత, అతడు అక్కడి
నుండి ద్వారం దగ్గరకు వెళ్ళాడు. అక్కడతణ్ణి మరో
దాసీ పిల్ల చూసి, అక్కడున్న ప్రజలతో, "ఈ వ్యక్తి,
నజరేతు యేసుతో ఉన్న వాడే!" అని అన్నది.
72పేతురు ఒట్టు పెట్టుకొని మళ్ళీ ఆమె మాటల్ని
కాదంటూ, "నాకు ఆ మనిషి ఎవరో తెలియదు!"
అని అన్నాడు. 73కొద్ది సేపయ్యాక అక్కడ నిలుచున్న
వాళ్ళు పేతురు దగ్గరకు వచ్చి, "నీవు తప్ప కుండా
వాళ్ళలో ఒకడివి. నీ మాట తీరు చూస్తేనే తెలిసి
పోతుంది!" అని అన్నారు.
74అప్పుడు పేతురు శపించుకోవటం మొదలు
పెట్టాడు. అతడు ప్రమాణం చేస్తూ, "ఆ మనిషి ఎవరో
నాకు తెలియదు!" అని అన్నాడు. వెంటనే కోడి
కూసింది. 75అప్పుడు యేసు చెప్పిన ఈ మాటలు
పేతురుకు జ్ఞాపకం వచ్చాయి: "కోడి కూయక ముందే
నేనెవరో తెలియదని మూడు సార్లంటావు" పేతురు
బయటకు వెళ్ళి భోరున ఏడ్చాడు.

### యూదా ఉరి వేసుకోవటం

*(మార్కు 15:1; లూకా 23:1-2; యోహాను 18:28-32)*

27 తెల్లవారాక ప్రధానయాజకులు, పెద్దలు
అంతా సమావేశమై యేసును చంపటానికి
నిశ్చయించారు. 2వాళ్ళాయన్ని బంధించి తీసుకెళ్ళి
రాష్ట్ర పాలకుడైన పిలాతుకు అప్పగించారు.
3యేసుకు ద్రోహం చేసిన యూదా యేసుని
చంపటానికి నిశ్చయించారని విని చాలా బాధ పడ్డాడు.
తాను తీసుకొన్న ముప్పై వెండి నాణాల్ని ప్రధాన
యాజకులకు, పెద్దలకు తిరిగి యిచ్చేస్తూ 4"నేను
పాపం చేసాను. ఆ అమాయకుణ్ణి చావుకు అప్ప
గించాను" అని అన్నాడు. వాళ్ళు , "అది నీ గొడవ.
మాకు సంబంధం లేదు" అని సమాధానం చెప్పారు.
5యూదా ఆ డబ్బును దేవాలయంలో పారవేసి,
వెళ్ళి ఉరి వేసుకున్నాడు. 6ప్రధానయాజకులు
నాణాల్ని తీసికొని, "ఇది రక్తాని కోసం చెల్లించిన
డబ్బు కనుక ఈ డబ్బును ధనాగారంలో ఉంచటం
మంచిది కాదు" అని అన్నారు. 7వాళ్ళు ఆలోచించి
ఆ ధనంతో విదేశీయుల్ని సమాధి చెయ్యటానికి ఉప
యోగపడేటట్లు ఒక కుమ్మరి వాని పొలాన్ని కొన్నారు.
8అందువల్లే ఈ నాటికీ ఆ పొలాన్ని 'రక్తపు భూమి'
అని అంటారు.
9-10తద్వారా యిర్మీయా ప్రవక్త ద్వారా దేవుడు
పలికిన ఈ వాక్యాలు నెరవేరాయి, "వాళ్ళు ముప్పై
వెండి నాణాలు తెచ్చారు. ఇది అతని విలువ. ఇది
ఇశ్రాయేలు ప్రజలు నిర్ణయించిన విలువ. ప్రభువు ఆజ్ఞా
పించినట్లు వాళ్ళు ఆ ధనంతో కుమ్మరి పొలాన్ని
కొన్నారు."*

### పిలాతు సమక్షంలో యేసు

*(మార్కు 15:6-5; లూకా 23:13-25;
యోహాను 18:39-19:16)*

11యేసు రాష్ట్రపాలకుని ముందు నిల్చున్నాడు.
ఆ రాష్ట్రపాలకుడు, "నీవు యూదులకు రాజువా?"
అని యేసును అడిగాడు.
"ఔను! నీవన్నది నిజం!" అని యేసు సమాధానం
చెప్పాడు.
12ప్రధానయాజకులు, పెద్దలు ఆయనపై నేరారో
పణలు చేస్తూ పోయారు. కాని ఆయన సమాధానం
చెప్పలేదు. 13అప్పుడు పిలాతు, "వాళ్ళు నీపై యిన్ని
నేరాలు మోపుతున్నారు కదా! నీవు వినటం లేదా?"
అని అడిగాడు.
14యేసు ఒక్క నేరారోపణకు కూడా సమాధానం
చెప్పలేదు. రాష్ట్రపాలకునికి చాలా ఆశ్చర్యం వేసింది.
15పండుగ రోజుల్లో ప్రజలు కోరిన ఒక
నేరస్తుణ్ణి విడుదల చేసే ఆచారాన్ని ఆ రాష్ట్రపాలకుడు
ఆచరిస్తూ ఉండేవాడు.
16ఆ రోజుల్లో బరబ్బ అనే ప్రసిద్ధిగాంచిన ఒక
నేరస్తుడు కారాగారంలో ఉన్నాడు. 17అందువల్ల ప్రజలు
సమావేశమయ్యాక పిలాతు, "ఎవర్ని విడుదల చెయ్య
మంటారు? బరబ్బనా లేక క్రీస్తు అని పిలువబడే
యేసునా?" అని వాళ్ళనడిగాడు. 18అసూయవల్ల
వాళ్ళు యేసుని తనకప్పగించారని పిలాతుకు తెలుసు.
19పిలాతు న్యాయపీఠంపై కూర్చొబోతుండగా
అతని భార్య, "ఆ నీతిమంతుని విషయంలో జోక్యం
కలిగించుకోకండి. నిన్న రాత్రి ఆయన గురించి కలగ
న్నాను. ఆ కలలో ఎన్నో కష్టాలను అనుభవించాను"
అన్న సందేశాన్ని పంపింది.
20బరబ్బాను విడుదల చేసి యేసుకు మరణ దండన
విధించేటట్లు కోరుకోమని ప్రధాన యాజకులు,
పెద్దలు ప్రజల్ని ప్రోద్బలం చేసారు.
21"ఇద్దర్లో నన్ను ఎవర్ని విడదల చెయ్యమం
టారు?" అని రాష్ట్రపాలకుడు అడిగాడు. "బరబ్బను"
అని వాళ్ళు సమాధానం చెప్పారు.
22"మరి 'క్రీస్తు' అని పిలువబడే ఈ యేసును
నన్నేమి చెయ్యమంటారు?" అని పిలాతు అడిగాడు.
అంతా, "సిలువకు వెయ్యండి!" అని సమాధానం
చెప్పారు. 23"ఆయనేం తప్పు చేసాడు?" అని పిలాతు
అడి గాడు. కాని వాళ్ళు, "అతన్ని సిలువకు వెయ్యండి"
అని యింకా బిగ్గరగా కేకలు వేసారు.

---

**"వాళ్ళు ... కొన్నారు"** జెకర్యా 11:12-13; యిర్మీయా 32:6-9.

24లాభం కలగటానికి మారుగా అల్లర్లు మొదలవటం
పిలాతు గమనించాడు. తరువాత అతడు నీళ్ళు తీసు
కొని ప్రజలముందు ఆ నీళ్ళను చేతులు మీదుగా
వదుల్తూ, “ఈయన రక్తానికి నేను బాధ్యుణ్ణికాను. ఇది
మీ బాధ్యత!” అని అన్నాడు.
25ప్రజలు, “అతని రక్తానికి మేము, మా సంతానము
బాధ్యత వహిస్తాము!” అని సమాధానం చెప్పారు.
26ఆ తర్వాత పిలాతు బరబ్బను విడుదల చేసాడు.
కాని యేసును కొరడా దెబ్బలు కొట్టించి సిలువకు
వేయటానికి అప్పగించాడు.

## భటులు యేసును ఎగతాళి చెయ్యటం

*(మార్కు 15:16-20; యోహాను 19:2-3)*

27ఆ తర్వాత రాష్ట్రపాలకుని సైనికులు యేసును
కోటకు తీసుకు వెళ్ళారు. దళానికి చెందిన సైనికు
లందరూ ఆయన చుట్టూ చేరారు. 28ఆయన దుస్తుల్ని
విప్పి, ఎఱ్ఱ రంగుగల ఒక పొడుగాటి వస్త్రాన్ని ఆయనకు
తొడిగించారు. 29ముళ్ళతో ఒక కిరీటాన్ని అల్లి ఆయన
తలపై పెట్టారు. ఆయన కుడి చేతికి ఒక బెత్తాన్ని
చ్చారు. ఆయన ముందు మోకరిల్లి నమస్కరిస్తూ,
“యూదుల రాజా! జయము” అని హేళన చేసారు.
30ఆయన మీద ఉమ్మివేసారు. బెత్తాన్ని తీసుకొని
దాంతో ఆయన తలపై కొట్టారు. 31ఆయన్ని హేళన
చేసాక ఆ పొడుగాటి వస్త్రాన్ని తీసేసి ఆయన దుస్తుల్ని
ఆయనకు తొడిగించారు. ఆ తదుపరి ఆయన్ని సిలు
వకు వెయ్యటానికి తీసుకెళ్ళారు.

## యేసుని సిలువకు వెయ్యటం

*(మార్కు 15:21-32; లూకా 23:26-43;
యోహాను 19:17-27)*

32వాళ్ళు బయటికి వెళ్తూండగా కురేనే పట్టణానికి
చెందిన సీమోను అనేవాడు కనిపించాడు. అతణ్ణి బల
వంతం చేసి యేసు సిలువను మొయ్యమన్నారు.
33వాళ్ళు గొల్గొతా అనే స్థలాన్ని చేరుకున్నారు.
గొల్గొతా అంటే “పుర్రెలాంటి స్థలం” అని అర్థం.
34అక్కడ చేదుకలిపిన ద్రాక్షరసాన్ని యేసుకు త్రాగ
టానికి యిచ్చారు. కాని రుచి చూసాక దాన్ని త్రాగ
టానికి ఆయన నిరాకరించాడు. 35ఆయన్ని సిలువకు
వేసాక ఆయన దుస్తుల్ని చీట్లువేసి పంచుకున్నారు.*
36సైనికులు కూర్చొని ఆయనకు కాపలా కాశారు.
37ఆయనపై ఆరోపించిన, “ఇతడు యూదుల రాజు”
అన్న నేరాన్ని వ్రాసి ఆయన తలపై భాగాన ఉంచారు.
38ఆ తదుపరి ఆయనతో పాటు దోపిడి దొంగలిద్దర్ని
ఒకణ్ణి కుడివైపు, మరొకణ్ణి ఎడమ వైపు సిలువకు
వేసారు. 39ఆ దారిన వెళ్ళిన వాళ్ళు తమ తలలాడిస్తూ
ఆయన్ని దూషిస్తూ 40“దేవాలయాన్ని నాశనం చేసి
మూడు రోజుల్లో పునర్నిర్మాణం చేయగల వాడివి!
నిన్ను నీవు రక్షించుకో. నీవు దేవుని కుమారుడవైతే
ఆ సిలువ నుండి దిగిరా!” అని అన్నారు.
41ప్రధానయాజకులు శాస్త్రులతో, పెద్దలతో కలసి
ఆయన్ని అదే విధంగా హేళన చేస్తూ, 42“అతడు
యితరులను రక్షిస్తాడు. కాని తనను తాను రక్షించు
కోలేడు. అతడు ఇశ్రాయేలు ప్రజలకు రాజైనట్లయితే
ఆ సిలువ నుండి క్రిందికి దిగిరానీ. అప్పుడతణ్ణి విశ్వసి
స్తాము. 43అతడు దేవుణ్ణి విశ్వసిస్తాడు, ‘నేను దేవుని
కుమారుణ్ణి’ అని అన్నాడు. దేవునికి కావలసివస్తే అతణ్ణి
రక్షించుకోమనండి” అని అన్నారు. 44ఆయనతో సహా
సిలువకు వేయబడిన దోపిడి దొంగలు కూడా
అయన్ని అదేవిధంగా అవమానించారు.

## యేసు మరణం

*(మార్కు 15:33-41; లూకా 23:44-49;
యోహాను 19:28-30)*

45మధ్యాహ్నం పన్నెండు గంటల నుండి మూడు
గంటలదాకా ఆ దేశమంతా చీకటి వ్యాపించింది.
46సుమారు మూడు గంటలప్పుడు యేసు బిగ్గరగా,
“ఏలీ! ఏలీ! లామా సబక్తానీ?” అని కేక వేసాడు.
అంటే, “నా దైవమా! నా దైవమా! నన్నెందుకు
ఒంటరిగా ఒదిలివేసావు!”* అని అర్థం.
47అక్కడ నిల్చున్న వాళ్ళు కొందరు ఇది విని,
“అతడు ఏలీయాను పిలుస్తున్నాడు” అని అన్నారు.
48ఒకడు వెంటనే పరుగెత్తుకొంటూ వెళ్ళి ఒక
‘స్పాంజి’ తెచ్చాడు. దాన్ని పులిసిన ద్రాక్షారసంలో
ముంచి ఒక బెత్తానికి పెట్టి యేసుకు త్రాగటానికి
యిచ్చాడు. 49కాని యితర్లు, “ఆగండి! అతణ్ణి రక్షించ
టానికి ఏలీయా వస్తాడేమో చూద్దాం!” అని అన్నారు.
50యేసు మళ్ళీ ఒక మారు పెద్ద కేక వేసి తన
ప్రాణం వదిలి వేసాడు.
51అదే క్షణంలో దేవాలయంలోని తెర పైనుండి
క్రింది దాకా చినిగి పోయింది. భూకంపం వచ్చి బండలు
పగిలి పొయ్యాయి. 52సమాధులు తెరుచుకొన్నాయి.
దేవుడు చనిపోయిన పరిశుద్ధులను అనేకుల్ని బ్రతికిం
చాడు. 53వాళ్ళు సమాధులనుండి వెలుపలికి వచ్చారు.
యేసు బ్రతికి వచ్చాక వాళ్ళు పవిత్ర నగరాన్ని ప్రవేశించి
చాలా మందికి కనిపించారు.
54యేసును కాపలాకాస్తున్న శతాధిపతి, సైనికులు
భూకంపాన్ని, జరిగిన మిగతా సంఘటల్ని చూసి చాలా
భయపడిపోయి, “ఈయన నిజంగా దేవుని కుమా

---

**పంచుకొన్నారు** కొన్ని ప్రతులలో, ‘వాళ్ళు నా దుస్తుల్ని పంచుకొన్నారు. నా వస్త్రం కొరకు చీట్లు వేసారు,’ అని ప్రవక్త అన్న ఈ మాట నిజం కావాలనిఅని వ్రాయబడి ఉంది

**నా దైవమా ... ఒదిలివేసావు** కీర్తన. 22:1.

రుడే!" అని అన్నారు. 55చాలా మంది స్త్రీలు కొంత
దూరం నుండి చూస్తూ ఉన్నారు. వీళ్ళు యేసుకు
ఉపచారాలు చెయ్య టానికి గలిలయ నుండి ఆయన్ని
అనుసరిస్తూ వచ్చిన వాళ్ళు. 56వాళ్ళలో మగ్దలేనే
గ్రామస్తురాలైన మరియ, యాకోబు, యోసేపు
అనువారి తల్లి మరియ, జెబెదయి కుమారుల తల్లి
ఉన్నారు.

### యేసును సమాధి చెయ్యటం

*(మార్కు 15:42-47; లూకా 23:50-56;*
*యోహాను 19:38-42)*

57సాయంత్రం అయ్యింది. యోసేపు అనే ధన
వంతుడు అరిమతయియ గ్రామం నుండి వచ్చాడు.
యోసేపు కూడా యేసు శిష్యుల్లో ఒకడు 58అతడు
పిలాతు దగ్గరకు వెళ్ళి యేసు దేహాన్ని యివ్వమని
కోరాడు. పిలాతు యివ్వమని ఆజ్ఞాపించాడు.
59యోసేపు ఆ దేహాన్ని తీసుకొని ఒక క్రొత్త గుడ్డలో
చుట్టాడు. 60ఒక పెద్ద రాయిని తొలిచి తన కోసం
నిర్మించుకొన్న క్రొత్త సమాధిలో దాన్ని ఉంచాడు.
ఒక రాయిని ఆ సమాధి ద్వారానికి అడ్డంగా దొర్లించి
వెళ్ళి పొయ్యాడు. 61మగ్దలేనే మరియ, యింకొక
మరియ ఆ సమాధికి ఎదురుగా అక్కడే కూర్చొని
ఉన్నారు.

### సమాధిని కాపలా కాయటం

62అది విశ్రాంతికి సిద్ధమయ్యే రోజు. మరుసటి
రోజు పరిసయ్యులు పిలాతు సమక్షంలో సమావేశ
మయ్యారు. 63"అయ్యా! ఆ మోసగాడు బ్రతికి ఉండగా
'మూడు రోజుల్లో నేను తిరిగి బ్రతికి వస్తాను' అని
అనటం మాకు జ్ఞాపకం ఉంది. 64అందువల్ల మూడవ
రోజు వరకు ఆ సమాధిని జాగ్రత్తగా కాపలా కాయమని
ఆజ్ఞాపించండి. అలా చెయ్యకపోతే అతని శిష్యులు
వచ్చి అతని దేహాన్ని దొంగిలించి, 'అతడు బ్రతికాడు'
అని ప్రజలతో చెప్పవచ్చు. ఈ చివరి మోసం మొదటి
మోసం కన్నా ఘోరంగా ఉంటుంది" అని అన్నారు.
65పిలాతు, "భటుల్ని తీసుకు వెళ్ళండి. వాళ్ళు
సమాధిని జాగ్రత్తగా కాపలా కాయటం మీ బాధ్యత"
అని చెప్పాడు. 66వాళ్ళు వెళ్ళి రాతికి ముద్రవేసి భటుల్ని
ఆ సమాధికి కాపలా ఉంచి దాన్ని భద్రం చేసారు.

### యేసు బ్రతికి రావటం

*(మార్కు 16:1-8; లూకా 24:1-12; యోహాను 20:1-10)*

28 విశ్రాంతి రోజు గడిచింది. ఆదివారం సూర్యో
దయమవుతుండగా మగ్దలేనే మరియ,
యింకొక మరియ సమాధిని చూడటానికి వెళ్ళారు.
2అప్పుడు ఒక భూకంపం వచ్చింది. పరలోకం
నుండి ప్రభువు దూత వచ్చి ఆ సమాధి దగ్గరకు
వెళ్ళాడు. ఆ రాతిని దొర్లించి దాని మీద కూర్చొన్నాడు.
3ఆ రూపం మెరుపులా ఉంది. అతని దుస్తులు మంచు
వలె తెల్లగా ఉన్నాయి. 4సమాధిని కాపలా కాస్తున్న
భటులు అతన్ని చూసి భయపడి వణికి పోయి, చని
పోయిన వాళ్ళలా అయ్యారు. 5ఆ దేవదూత, స్త్రీలతో
ఈ విధంగా అన్నాడు, "భయపడకండి, సిలువకు
వేయబడిన యేసు కోసం మీరు చూస్తున్నారని నాకు
తెలుసు. 6ఆయనిక్కడ లేడు. ఆయన తాను చెప్పినట్లు
బ్రతికి వచ్చాడు. ఆయన్ని పడుకోబెట్టిన స్థలాన్ని
చూడండి. 7ఆ తదుపరి వెంటనే వెళ్ళి ఆయన
శిష్యులతో, 'ఆయన బ్రతికి వచ్చాడు. మీకన్నా ముందే
గలిలయకు వెళ్ళ బోతున్నాడు. మీరు ఆయన్ని
అక్కడ కలుసుకొంటారు' అని చెప్పండి. నేను
చెప్పవలసింది చెప్పాను."
8ఆ స్త్రీలు ఆయన శిష్యులకు చెప్పాలని సమాధి
దగ్గరనుండి భయంతో, ఆనందంతో పరుగెత్తికొంటూ
వెళ్ళారు. 9యేసు వాళ్ళను కలుసుకొని, "శుభం!"
అని అన్నాడు. వాళ్ళు ఆయన దగ్గరకు వచ్చి ఆయన
కాళ్ళపైబడి ఆయనకు మ్రొక్కారు. 10అప్పుడు యేసు
వాళ్ళతో, "భయపడకండి. వెళ్ళి నా సోదరులతో
గలిలయకు వెళ్ళమని చెప్పండి. వాళ్ళు అక్కడ నన్ను
కలుసుకొంటారు" అని అన్నాడు.

### ప్రధానయాజకులు భటుల్ని అబద్ధమాడమని కోరటం

11ఆ స్త్రీలు వెళ్ళి పొయ్యారు. అదే సమయంలో
కొంతమంది భటులు పట్టణంలోకి వెళ్ళి జరిగినదంతా
ప్రధానయాజకులతో చెప్పారు. 12ప్రధాన యాజ
కులు పెద్దల్ని కలుసుకొని ఒక కుట్ర పన్నారు. వాళ్ళు
భటులకు పెద్ద మొత్తాలిస్తూ వాళ్ళతో, 13"అతని
శిష్యులు, 'మేము రాత్రి వేళ నిద్రిస్తుండగా వచ్చి అతని
దేహాన్ని దొంగిలించుకు పొయ్యారు' అని చెప్పండి.
14ఈ వార్త రాష్ట్రపాలకునిదాకా వెళ్తే అతణ్ణి శాంత పరచి
మీకు కష్టం కలుగకుండా మేము చూస్తాము" అని
అన్నారు.15భటులు డబ్బు తీసుకొని వాళ్ళు చెప్పినట్లు
చేసారు. ఈ కథ బాగా వ్యాపించి ఈ నాటికీ వాడుకలో
ఉంది. 16ఆ తర్వాత ఆ పదకొండుగురు శిష్యులు గలి
లయకు వెళ్ళి, యేసు చెప్పిన కొండ మీదికి వెళ్ళారు.
17అక్కడ యేసును చూసి ఆయన ముందు సాష్టాంగ
పడ్డారు. కాని వాళ్ళలో కొందరు సందేహించారు
18అప్పుడు యేసు వాళ్ళ దగ్గరకు వచ్చి, "పరలో
కంలో, భూమ్మీదా ఉన్న అధికారమంతా దేవుడు నాకి
చ్చాడు. 19అందువల్ల అన్ని దేశాలకు వెళ్ళి, వాళ్ళను
శిష్యులుగా చెయ్యండి. తండ్రి పేరిట, కుమారుని
పేరిట, పవిత్రాత్మ పేరిట వాళ్ళకు బాప్తిస్మము
యివ్వండి. 20నేను మీకాజ్ఞాపించినవన్నీ వాళ్ళను ఆచ
రించమని బోధించండి. నేను అన్ని వేళలా ఈ
యుగాంతం దాకా మీ వెంట ఉంటాను" అని అన్నాడు.

# మార్కు సువార్త

### సువార్త ప్రారంభం

(*మత్తయి 3:1-12; లూకా 3:1-9, 15-17;*
*యోహాను 1:19-28*)

1 దేవుని కుమారుడైన* యేసు క్రీస్తును గురించి
సువార్త ప్రారంభం 2యెషయా ప్రవక్త వ్రాసిన
గ్రంథంలో ఈ విధంగా వ్రాయబడి ఉంది:

> "ఇతడు నా దూత. ఇతణ్ణి నీకన్నా ముందు
> పంపుతాను, ఇతడు నీ కోసం దారి సిద్ధం
> చేస్తాడు."
>
> *మలాకీ 3:1*

> 3 "'ప్రభువు మార్గాన్ని సిద్ధం చేయుము, అతని
> కోసం చక్కటిదారుల్ని, వేయుము' అని
> అరణ్య ప్రాంతంలో ఒక వ్యక్తి కేక వేయు
> చున్నాడు."
>
> *యెషయా 40:3*

4కనుక యోహాను ప్రజలకు ఎడారి ప్రాంతంలో
బాప్తిస్మమిచ్చాడు. పాపపరిహారార్థం మారుమనస్సు
పొందటం, బాప్తిస్మము పొందటం అవసరమని వాళ్ళకు
ప్రకటించాడు. 5యూదయ దేశంలోని ప్రజలు,
యెరూషలేములోని ప్రజలు అతని దగ్గరకు వెళ్ళారు.
తాము చేసిన పాపాలను చెప్పుకొన్నారు. అతడు
వాళ్ళకు యొర్దాను నదిలో బాప్తిస్మం* ఇచ్చాడు.
6యోహాను ఒంటె వెంట్రుకలతో చేసిన దుస్తుల్ని
వేసుకొనేవాడు. నడుముకు తోలుదట్టీ కట్టుకొనే
వాడు. మిడుతల్ని, అడవి తేనెను తింటూ జీవించే
వాడు. 7అతడు ప్రకటించిన సందేశం ఇది, "నా తర్వాత
నాకన్నా శక్తివంతుడైన వాడు వస్తాడు. నేను వంగి
అతని చెప్పులు విప్పే అర్హత కూడా నాకు లేదు.
8నేను మీకు నీళ్ళతో బాప్తిస్మము యిస్తున్నాను. కాని
అయన మీకు పవిత్రాత్మతో బాప్తిస్మమిస్తాడు."

### యేసు బాప్తిస్మము పొందటం

(*మత్తయి 3:13-17; లూకా 3:21-22*)

9ఆ రోజుల్లో, గలిలయలోని నజరేతు పట్టణానికి
చెందిన యేసు వచ్చాడు. యోహాను ఆయనకు
యొర్దాను నదిలో బాప్తిస్మము యిచ్చాడు. 10యేసు
నీటి నుండి బయటికి వస్తుండగా ఆకాశం తెరుచుకొని
అందులో నుండి పవిత్రాత్మ ఒక పావురంలా తన
మీదికి దిగిరావడం ఆయన గమనించాడు.
11పరలోకం నుండి ఒక స్వరము, "నీవు నా ప్రియ
కుమారుడవు. నీవంటే నాకెంతో ఆనందం!" అని
అన్నది.
12వెంటనే దేవుని ఆత్మ యేసును ఎడారి ప్రాంతా
నికి తీసుకు వెళ్ళాడు. 13ఆయన అక్కడ నలభై రోజులు
న్నాడు. సైతాను ఆయన్ని పరీక్షించాడు. ఆయన
మృగాల మధ్య జీవించాడు. దేవదూతలు ఆయనకు
సపర్యలు చేసారు.

### మొదటి శిష్యులు

(*మత్తయి 4:12-22; లూకా 4:14-15; 5:1-11*)

14యోహాను చెరసాలలో వేయబడ్డాడు. యేసు
గలిలయకు వెళ్ళి దేవుని సువార్తను ప్రకటించాడు.
15ఆయన, "దేవుని రాజ్యం వస్తుంది. ఆ సమయం
దగ్గరకు వచ్చింది. మారుమనస్సు పొంది సువార్తను
విశ్వసించండి" అని ప్రకటించాడు.
16యేసు గలిలయ సముద్రం ఒడ్డున నడుస్తూ
ఉన్నాడు. ఆయన చేపలు పట్టేవాళ్ళైన సీమోను
మరియు అతని సోదరుడు అంద్రెయ వల వేయటం
చూసాడు.
17యేసు వాళ్ళతో, "నన్ను అనుసరించండి. మీరు
మనుష్యులను పట్టుకొనేటట్లు చేస్తాను" అని అన్నాడు.
18వాళ్ళు వెంటనే తమ వలల్ని వదిలి ఆయన్ని
అనుసరించారు.
19ఆయన కొంతదూరం వెళ్ళాక జెబెదయి కుమా
రుడైన యాకోబు, అతని సోదరుడు యోహాను పడ
వలో ఉండటం చూసాడు. వాళ్ళు వల సిద్ధం చేసు
కొంటూ ఉన్నారు. 20యేసు వాళ్ళను పిలిచాడు.
వాళ్ళు తమ తండ్రి జెబెదయిని పనివాళ్ళతో అక్కడే
పడవలో వదిలివేసి యేసును అనుసరించారు.

---

**కుమారుడైన** కొన్ని ప్రతుల్లో 'దేవుని కుమారుడు' అని లేదు.

**బాప్తిస్మము** ఇది గ్రీకు పదము. ఇంగ్లీషులో దీని అర్థం ప్రత్యేకమైన నీటిమునక బాప్తిస్మము.

### యేసు దయ్యాన్ని విడిపించటం
(*లూకా 4:31-37*)
21అంతా కలిసి కపెర్నహూము అనే పట్టణానికి
వెళ్ళారు. విశ్రాంతి రోజు వచ్చింది. యేసు సమాజ
మందిరానికి వెళ్ళి బోధించటం మొదలు పెట్టాడు.
22శాస్త్రులవలే కాకుండా అధికారమున్న వానిలా బోధిం
చాడు. కనుక ప్రజలు ఆయన బోధన విని ఆశ్చర్య
పడ్డారు. 23అదే సమయంలో దయ్యం పట్టిన వాడొకడు
ఆ సమాజమందిరానికి వచ్చాడు. 24వాడు, “నజరేయు
డవైన యేసూ! మాతో నీకేం పని? మమ్మల్ని నాశనం
చెయ్యటానికి వచ్చావా? నీవెవరవో నాకు తెలుసు.
నీవు దేవుని పరిశుద్ధుడవు” అని అన్నాడు.
25యేసు, “నోరుమూసికో వాని నుండి బయటకు
రా!” అని గద్దిస్తూ అన్నాడు. 26ఆ దయ్యం వాణ్ణి వణి
కించి పెద్దకేక పెడుతూ వానినుండి బయటికి వచ్చింది.
27ప్రజలందరూ చాలా ఆశ్యర్యపడ్డారు. వాళ్ళు, “ఇదే
మిటి? కొత్తబోధనా? పైగా అధికారంతో బోధిస్తు
న్నాడే! దయ్యాలను ఆజ్ఞాపిస్తే అవికూడా విధేయతతో
ఆయనకు లోబడుతున్నవి!” అని పరస్పరం మాట్లాడు
కున్నారు. 28గలిలయ ప్రాంతాల్లో ఉన్న వాళ్ళకందరికి
ఆయన గురించి తెలిసిపోయింది.

### యేసు అనేకులకు నయం చెయ్యటం
(*మత్తయి 8:14-17; లూకా 4:38-41*)
29వాళ్ళు సమాజమందిరం వదిలి నేరుగా యాకోబు
మరియు యోహానులతో కలిసి సీమోను మరియు
అంద్రెయల ఇంటికి వెళ్ళారు. 30సీమోను అత్త
జ్వరంతో మంచం పట్టివుంది. ఆమెను గురించి వాళ్ళు
యేసుతో చెప్పారు. 31ఆయన ఆమెను సమీపించి
చేయి పట్టుకొని లేపి కూర్చోబెట్టాడు. జ్వరం ఆమెను
వదిలిపోయింది. ఆమె వెంటనే వాళ్ళకు సపర్యలు
చెయ్యటం మొదలు పెట్టింది.
32ఆ రోజు సాయంత్రం సూర్యాస్తమయం కాగానే
ప్రజలు వ్యాధిగ్రస్తుల్ని, దయ్యంపట్టిన వాళ్ళను, యేసు
దగ్గరకు పిలుచుకు వచ్చారు. 33ఆ ఊరంతా
ఆయనవున్న యింటిముందు చేరుకుంది. 34రకరకాల
వ్యాధులున్న వాళ్ళకు యేసు నయం చేసాడు. ఎన్నో
దయ్యాలను విడిపించాడు. ఆ దయ్యాలకు తానెవరో
తెలుసు కనుక ఆయన వాటిని మాట్లాడ నివ్వలేదు.

### యేసు ఏకాంతంగా ప్రార్థించటం
(*లూకా 4:42-44*)
35యేసు తెల్లవారుఝామున ఇంకా చీకటియుండ
గానే లేచి యిల్లు వదిలి ఎడారి ప్రదేశానికి వెళ్ళి, అక్కడ
ప్రార్థించాడు. 36సీమోను మరియు అతని సహచరులు
యేసును వెతకటానికి వెళ్ళారు. 37ఆయన్ని చూసి
వాళ్ళు, “అంతా మీకోసం వెతుకుతున్నారు” అని
అన్నారు. 38యేసు సమాధానం చెబుతూ, “ఇతర
గ్రామాలకు వెళ్దాం రండి. అక్కడ కూడా ప్రకటించాలని
నా అభిలాష, నేను వచ్చింది కూడా అందుకే కదా!”
అని అన్నాడు. 39ఆయన గలిలయ ప్రాంతమంతా
పర్యటన చేసి అక్కడి సమాజమందిరాల్లో ప్రకటిం
చాడు. దయ్యాలను వదిలించాడు.

### కుష్టురోగి
(*మత్తయి 8:1-4; లూకా 5:12-16*)
40ఒక కుష్టురోగి ఆయన దగ్గరకు వచ్చి మోకరిల్లి,
“మీరు దయతలిస్తే నయం చెయ్యగలరు” అని వేడు
కున్నాడు.
41యేసుకు జాలివేసింది. తన చేయి జాపి, “సరే
దయ చూపుతాను!” అని అంటూ అతణ్ణి తాకాడు.
42వెంటనే కుష్టురోగం అతన్ని వదిలిపోయింది. అతనికి
నయమైంది.
43అతణ్ణి పంపివేస్తూ, “ఈ విషయం ఎవ్వరికీ
చెప్పకుండా జాగ్రత్తపడు. 44కాని వెళ్ళి మీ యాజకునికి
చూపు. మోషే ఆజ్ఞాపించిన బలి యిచ్చి నీవు శుద్ధి
అయినట్లు రుజువు చేసుకో” అని గట్టిగా చెప్పాడు.
45కాని అతడు వెళ్ళి అందరికి చెప్పాడు. ఆ కారణంగా
యేసు ఆ గ్రామాన్ని బహిరంగంగా ప్రవేశించ లేకపో
య్యాడు. గ్రామాల వెలుపల అరణ్య ప్రదేశాల్లో బస
చేసాడు. అయినా ప్రజలు అన్ని ప్రాంతాలనుండి
అయన దగ్గరకు వచ్చారు.

### పక్షవాత రోగికి నయం చెయ్యటం
(*మత్తయి 9:1-8; లూకా 5:17-26*)
2 కొద్ది రోజుల తర్వాత యేసు మళ్ళీ కపెర్న
హూము పట్టణానికి వెళ్ళాడు. ఆయన ఇంటికి
వచ్చాడన్న వార్త ప్రజలకు తెలిసింది. 2చాలా మంది
ప్రజలు సమావేశం అవటం వల్ల స్థలం చాలలేదు.
తలుపు అవతల కూడా స్థలం లేకపోయింది. యేసు
వాళ్ళకు ఉపదేశిస్తూ ఉన్నాడు. 3ఇంతలో నలుగురు
మనుష్యులు ఒక పక్షవాత రోగిని మోసికొని అక్కడికి
తీసుకు వచ్చారు. 4చాలామంది ప్రజలుండటం వల్ల
రోగిని యేసు ముందుకు తీసుకు రాలేకపోయారు.
అందువల్ల వాళ్ళు యేసువున్న గది పైకప్పు తెరచి,
ఆ పక్షవాత రోగిని, అతడు పడుకొని ఉన్న చాపతో
సహా ఆ సందు ద్వారా యేసు ముందుకు దించారు.
5యేసు వాళ్ళ విశ్వాసాన్ని చూసి పక్షవాత రోగితో,
“కుమారుడా! నీ పాపాలు క్షమించబడ్డాయి!” అని
అన్నాడు.
6అక్కడే కూర్చొని ఉన్న కొందరు శాస్త్రులు
తమలో తాము ఈ విధంగా అనుకొన్నారు. 7“ఇతడెం
దుకు ఈ విధంగా అంటున్నాడు? ఇది దైవ దూషణ

కాదా? దేవుడు తప్ప వేరెవ్వరు పాపాల్ని క్షమించ గలరు?" అని అనుకొన్నారు.

8వాళ్ళు తమ మనస్సులో ఈ విధంగా ఆలోచిస్తు న్నారని యేసు మనస్సు తక్షణమే గ్రహించింది. ఆయన వాళ్ళతో, "మీరు దీన్ని గురించి ఆ విధంగా ఎందుకు ఆలోచిస్తున్నారు? 9ఏది సులభం? పక్షవాత రోగితో, 'నీ పాపాలు క్షమించబడ్డాయి!' అని అనటం సులభమా లేక, 'నీ చాప తీసుకొని నడిచి వెళ్ళు!' అని అనటం సులభమా? 10భూలోకంలో పాపాలు క్షమించే అధి కారం మనుష్య కుమారునికి ఉందని మీరు తెలుసు కోవాలి!" అని అంటూ, పక్షవాత రోగితో, 11"నేను చెబుతున్నాను, లేచి నీ చాప తీసుకొని యింటికి వెళ్ళు!" అని అన్నాడు. 12వెంటనే ఆ పక్షవాత రోగి లేచి నిలబడి తన చాప తీసుకొని అందరూ చూస్తుండగా నడుస్తూ వెళ్ళి పోయాడు. ఇది చూసి అక్కడున్న వాళ్ళందరూ ఆశ్చర్యపడ్డారు. "మేము ఇలాంటిది ఎన్నడూ చూడలేదు!" అని అంటూ దేవుణ్ణి స్తుతించారు.

## మత్తయిని పిలవటం

*(మత్తయి 9:9-13; లూకా 5:27-32)*

13యేసు మళ్ళీ సముద్రం ఒడ్డుకు వెళ్ళాడు. చాలామంది ప్రజలు ఆయన చుట్టూ చేరారు. ఆయన వాళ్ళకు బోధించటం మొదలుపెట్టాడు. 14అక్కడి నుండి బయలుదేరి ముందుకు నడుస్తూండగా అల్ఫాయి కుమారుడైన లేవి* పన్నులు వసూలు చేసే పాకలో కూర్చొని వుండటం చూసాడు. యేసు అతనితో, "నా వెంటరా" అని అన్నాడు. లేవి లేచి ఆయన్ని అనుసరించాడు.

15యేసు, ఆయన శిష్యులు లేవి యింట్లో భోజనం చేస్తూ ఉన్నారు. ఆయనతో సహా చాలామంది పన్నులు వసూలు చేసేవాళ్ళు, పాపం చేసిన వాళ్ళు భోజనం చేస్తూ ఉన్నారు. వీళ్ళలో చాలామంది యేసు అనుచరులు. 16పరిసయ్యులలోని శాస్త్రులు యేసు పాపం చేసిన వాళ్ళతో, పన్నులు వసూలు చేసే వాళ్ళతో భోజనం చెయ్యటం చూసారు. వాళ్ళు ఆయన శిష్యులతో, "ఆయన పాపం చేసిన వాళ్ళతో, పన్నులు వసూలు చేసే వాళ్ళతో ఎందుకు కలసి తింటాడు?" అని అడిగారు.

17ఇది విని యేసు వాళ్ళతో, "ఆరోగ్యంగా ఉన్న వాళ్ళకు వైద్యుని అవసరం ఉండదు. రోగంతో ఉన్న వాళ్ళకే వైద్యుని అవసరం ఉంటుంది. నేను నీతిమంతు లను పిలవటానికి రాలేదు. పాపులను పిలవటానికి వచ్చాను" అని అన్నాడు.

## ఉపవాసాలను గురించి ప్రశ్న

*(మత్తయి 9:14-17; లూకా 5:33-39)*

18యోహాను శిష్యులు, పరిసయ్యులు, ఉపవాసాలు చేస్తూ ఉంటారు. కొందరు యేసు దగ్గరకు వచ్చి, "యోహాను శిష్యులు, పరిసయ్యుల శిష్యులు ఉపవాసాలు చేస్తారు కదా! మీ శిష్యులు ఎందుకు చెయ్యరు?" అని అడిగారు.

19యేసు, "పెళ్ళికుమారుడు వాళ్ళతో ఉన్నంత కాలం వాళ్ళు ఉపవాసం చెయ్యరు. 20కాని, వాళ్ళనుండి పెళ్ళికుమారుణ్ణి తీసుకు వెళ్ళేరోజు వస్తుంది. ఆ రోజు వాళ్ళు ఉపవాసం చేస్తారు" అని అన్నాడు. 21"పాత వస్త్రంపై ఉన్న చిరుగుకు క్రొత్త వస్త్రంతో ఎవరు కుడ్తారు? అలా చేస్తే క్రొత్త వస్త్రం గుంజుకుపోయి మొదటి చిరుగు ఇంకా పెద్దదౌతుంది. 22పాతతోలు సంచుల్లో క్రొత్త ద్రాక్షారసం ఎవరూ దాచరు. అలా దాస్తే క్రొత్త ద్రాక్షారసం ఆ తోలు సంచిని చినిగేటట్లు చేస్తుంది. తోలుసంచీ, ద్రాక్షారసం రెండూ నాశన మౌతాయి. అందువల్ల క్రొత్త ద్రాక్షారసం క్రొత్త తోలు సంచుల్లోనే దాచాలి" అని కూడా యేసు అన్నాడు.

## విశ్రాంతి రోజుకు ప్రభువు

*(మత్తయి 12:1-8; లూకా 6:1-5)*

23ఒక విశ్రాంతి రోజు యేసు పొలాల ద్వారా వెళ్తూవున్నాడు. ఆయన శిష్యులు కూడా ఆయన వెంటే ఉన్నారు. వాళ్ళు తినటానికి కొన్ని ధాన్యపు కంకుల్ని త్రుంచారు. 24పరిసయ్యులు ఆయనతో, "అదిగో చూడండి! వాళ్ళు విశ్రాంతి రోజు చేయ కూడని పని ఎందుకు చేస్తున్నారు?" అని అడిగారు.

25యేసు, "దావీదు, అతని అనుచరులు ఆకలితో ఉన్నప్పుడు వాళ్ళకు ఆహారం కావలసివచ్చింది. అప్పుడు దావీదు ఏం చేసాడో మీరు ఎన్నడూ చదవలేదా? 26అబ్యాతారు ప్రధానయాజకుడుగా ఉన్న కాలంలో దావీదు దేవాలయంలోకి ప్రవేశించి దేవుని సముఖమున పెట్టిన రొట్టె తీసుకొని, తానుతిని, తన సహచరులకు కూడా కొంత యిచ్చాడు. ఈ రొట్టెను యాజకులు తప్ప యితరులు తినకూడదు" అని అన్నాడు.

27యేసు వాళ్ళతో మళ్ళీ ఈ విధంగా అన్నాడు: "విశ్రాంతి రోజు మానవుని కోసం సృష్టింపబడింది. కాని మానవుడు విశ్రాంతి రోజు కోసం సృష్టింపబడ లేదు. 28అందువల్ల మనుష్యకుమారునికి విశ్రాంతి రోజుపై కూడా అధికారం ఉంది."

3 ఒక రోజు యేసు సమాజమందిరానికి వెళ్ళాడు. అక్కడ చెయ్యి ఎండిపోయిన వాడొకడు ఉన్నాడు. 2అక్కడున్న వాళ్ళలో కొందరు, యేసు ఆ చేయి ఎండిపోయిన వానికి విశ్రాంతి రోజు నయం చేస్తాడేమో చూడాలని జాగ్రత్తగా గమనిస్తూ ఉన్నారు.

---

**లేవి** లేవికి ఇంకొక పేరు మత్తయి.

అలా చేస్తే ఆయనపై నేరం మోపాలని వాళ్ళ ఉద్దేశ్యం.
3యేసు ఆ చేయిపడిపోయిన వానితో, “అందరి
ముందుకి వచ్చి నిలుచో” అని అన్నాడు.
4అప్పుడు యేసు అక్కడున్న వాళ్ళతో, “విశ్రాంతి
రోజున మంచి చెయ్యటం ధర్మమా? లేక చెడు
చేయటం ధర్మమా? ప్రాణాన్ని రక్షించటం ధర్మమా
లేక చంపటం ధర్మమా?” అని అన్నాడు. కాని దానికి
వాళ్ళు ఏ సమాధానమూ చెప్పలేదు.
5ఆయన కోపంతో చుట్టూ చూసాడు. వాళ్ళవి
కఠిన హృదయాలైనందుకు ఎంతో దుఃఖిస్తూ, ఆ
చేయి ఎండిపోయిన వానితో, ‘నీ చేయి చాపు’ అని
అన్నాడు. వాడు చేయి చాపాడు. వెంటనే అతని
చేయి పూర్తిగా నయమైపోయింది. 6ఆ తర్వాత పరిస
య్యులు బయటికి వెళ్ళి, హేరోదీయులతో కలిసి
యేసును చంపాలని కుట్రపన్నటం మొదలు పెట్టారు.

## ప్రజలు యేసును అనుసరించటం

7యేసు తన శిష్యులతో కలిసి సముద్రం దగ్గరకు
వెళ్ళాడు. గలిలయ నుండి చాలా మంది ప్రజలు
ఆయన్ని అనుసరించారు. 8యేసు చేస్తున్నవన్నీ విని
చాలామంది ప్రజలు యూదయ నుండి, యెరూష
లేము నుండి, ఇదూమియ నుండి, యొర్దాను నది
అవతలి వైపునున్న ప్రాంతాలనుండి, తూరు, సీదోను
పట్టణాల చుట్టూవున్న ప్రాంతాలనుండి ఆయన
దగ్గరకు వచ్చారు. 9చాలామంది ప్రజలు ఉండటం
వల్ల వాళ్ళు తనను త్రోయ కుండా ఉండాలని యేసు
తన శిష్యులతో ఒక చిన్న పడవను తన కోసం సిద్ధం
చేయమని చెప్పాడు. 10ఆయన చాలామందికి నయం
చేసాడు. అందువల్ల రోగాలున్నవాళ్ళు ఆయన్ని తాకా
లని ముందుకు త్రోసుకుంటూ వస్తూ ఉన్నారు.
11చెడు ఆత్మలు ఆయన్ని చూసినప్పుడల్లా ఆయన
ముందుపడి బిగ్గరగా, “నీవు దేవుని కుమారుడివి” అని
కేకలు వేసేవి. 12యేసు తానెవరో ఎవ్వరికీ చెప్పవద్దని
ఆ ప్రజల్ని గట్టిగా ఆజ్ఞాపించాడు.

## పన్నెండు మంది అపొస్తలుల్ని నియమించటం

(*మత్తయి 10:1-4; లూకా 6:12-16*)

13యేసు కొండపైకి వెళ్ళి తనకు కావలసిన
వాళ్ళను పిలిపించాడు. వాళ్ళు ఆయన దగ్గరకు
వెళ్ళారు. 14ఆయన పన్నెండుగురిని తన అపొస్తలులుగా
నియమించాడు. వాళ్ళు తనతో ఉండాలని, ప్రకటించ
టానికి వాళ్ళను ప్రపంచంలోకి పంపాలని ఆయన
ఉద్దేశ్యం. 15దయ్యాలను వదిలించే అధికారం వాళ్ళ
కిచ్చాడు. 16ఆయన నియమించిన పన్నెండుగురు అపో
స్తలుల పేర్లు యివి: సీమోను, ఇతనికి పేతురు అనే
పేరునిచ్చాడు. 17జెబెదయి కుమారులైన యాకోబు
అతని సోదరుడు యోహాను, వీళ్ళకు బోయనేర్గెసు
అనే పేరునిచ్చాడు. బోయనేర్గెసు అంటే “ఉరుముకు
పుత్రులు” అని అర్థం.
18అంద్రెయ, ఫిలిప్పు, బర్తొలొమయి, మత్తయి,
తోమా, అల్ఫయి కుమారుడు యాకోబు, తద్దయి,
జెలటు అని పిలవబడే సీమోను, 19యేసుకు ద్రోహం
చేసిన యూదా ఇస్కరియోతు.

## యేసు మరియు బయల్జెబూలు

(*మత్తయి 12:22-32; లూకా 11:14-23; 12:10*)

20ఆ తర్వాత యేసు యింటికి వెళ్ళాడు. మళ్ళీ
ప్రజలు సమావేశమయ్యారు. దీనితో ఆయనకు,
ఆయన శిష్యులకు తినటానికి కూడా సమయం దొరక
లేదు. 21ప్రజలు ‘ఆయనకు మతిపోయింది’ అని
అంటూ ఉండటం వల్ల ఆయన బంధువులు ఆయన
భారం వహించటానికి వచ్చారు.
22యెరూషలేము నుండి వచ్చిన శాస్త్రులు, “అతనికి
బయల్జెబూలు దయ్యం పట్టింది. దయ్యాల రాజు
సహాయంతో అతడు దయ్యాలను వదిలిస్తున్నాడు”
అని అన్నారు.
23అందువల్ల యేసు వాళ్ళను గురించి, ఉపమా
నాలు ఉపయోగించి వారితో ఈ విధంగా అన్నాడు:
“సైతాను తనను తాను ఏవిధంగా పారద్రోలుతాడు?
24ఏ రాజ్యంలో చీలికలు వస్తాయో ఆ రాజ్యం నిలువదు.
25కుటుంబంలో చీలికలు వస్తే ఆ కుటుంబం నిలు
వదు. 26సైతాను తనకు తాను విరోధి అయి తన
అధికారంతో చీలికలు తెచ్చుకొంటే ఆ సైతాను
నిలవడు. వాని అధికారం అంతమౌతుంది. 27నిజానికి
బలవంతుని యింట్లోకి వెళ్ళి అతని వస్తువుల్ని దోచు
కోవాలనుకొంటే మొదట ఆ బలవంతుణ్ణి కట్టి
వేయవలసి వస్తుంది. అప్పుడే ఆ యింటిని దోచు
కోగల్గుతాడు. 28నేను నిజం చెబుతున్నాను. మానవులు
చేసిన అన్ని పాపాలను, వాళ్ళ దూషణలను, దేవుడు
క్షమిస్తాడు. 29కాని పవిత్రాత్మను దూషించిన వాణ్ణి
దేవుడు ఎప్పటికి క్షమించడు. అతణ్ణి శాశ్వతమైన పాపం
చేసిన వానిగా పరిగణిస్తాడు.”
30ధర్మశాస్త్రపండితులు తనలో దురాత్మ ఉందని
అనటం వలన ఆయన పై విధంగా అన్నాడు.

## యేసు తల్లి, సోదరులు

(*మత్తయి 12:46-50; లూకా 8:19-21*)

31యేసు తల్లి, ఆయన సోదరులు అక్కడికి
వచ్చారు. బయటే నిలుచుని యేసును పిలవమని ఒకణ్ణి
లోపలికి పంపారు. 32యేసు చుట్టూ జనసమూహం
ఉంది. వాళ్ళు ఆయనతో, “మీ తల్లి, సోదరులు
మీకోసం అడుగుతూ బయట నిలుచున్నారు” అని
అన్నారు. 33“ఎవరు నా తల్లి? ఎవరు నా సోదరులు?”
అని అంటూ 34చుట్టూ కూర్చున్న వాళ్ళ వైపు చూసి,

“వీరే నా తల్లి, నా సోదరులు. 35దైవేచ్ఛానుసారం
నడుచుకొనే వాళ్ళు నా సోదరులు, నా అక్కచెల్లెండ్లు,
నా తల్లి” అని అన్నాడు.

## రైతు ఉపమానం
(మత్తయి *13:1-9;* లూకా *8:4-8*)

4 ఒక రోజు యేసు సముద్రం దగ్గర బోధించటం
మొదలుపెట్టాడు. ఆయన చుట్టూ చాలమంది
ప్రజలు చేరటం వల్ల ఆయన పడవనెక్కి కూర్చొని
నీళ్ళలోకి వెళ్ళాడు. ప్రజలు ఒడ్డున ఉన్నారు. 2ఆయన
ఉపమానాలు ఉపయోగిస్తూ వాళ్ళకు చాలా విషయాలు
బోధించాడు. ఆ విధంగా బోధిస్తూ, 3“వినండి! ఒక
రైతు విత్తనాలు చల్లటానికి వెళ్ళాడు. 4అతడు విత్తన
ములు చల్లుతుండగా కొన్ని దారి ప్రక్కన పడ్డాయి.
వాటిని పక్షులు తినివేసాయి. 5మరికొన్ని మట్టి
ఎక్కువగా లేని రాతి నేలపై పడ్డాయి. మట్టి ఎక్కువగా
లేనందువల్ల అవి త్వరగా మొలకెత్తాయి. 6కాని
సూర్యుడు రాగానే అవి ఆ వేడికి వాడిపోయాయి.
వాటికి వేర్లు పెరగనందువల్ల అవి ఎండిపొయ్యాయి.
7మరికొన్ని విత్తనాలు ముళ్ళ మొక్కల మధ్య పడ్డాయి.
ఆ ముళ్ళ మొక్కలు పెరిగి ధాన్యపుమొక్కలను అణచి
వేయటం వల్ల వాటికి ధాన్యం పండలేదు. 8మరికొన్ని
విత్తనాలు సార వంతమైన భూమ్మీద పడ్డాయి. అవి
మొలకెత్తి పెరిగి, ముప్పై వంతుల, అరవై వంతుల,
నూరువంతుల పంటను కూడా యిచ్చాయి.”
9ఈ విధంగా చెప్పి యేసు, “చెవులున్న వాడు
విననీ!” అని అన్నాడు.
10ఆయన ఏకాంతంగా ఉన్నప్పుడు ఆయన
పన్నెండుగురు శిష్యులు ఆయన చుట్టూ ఉన్న మిగతా
వాళ్ళు ఆ ఉపమానాన్ని గురించి అడిగారు.
11ఆయన వాళ్ళతో, “దేవుని రాజ్యంయొక్క
రహస్య జ్ఞానాన్ని మీకు చెప్పాను. కాని యితరులకు
ఈ జ్ఞానం ఉపమానాల ద్వారా చెబుతాను.
12ఎందుకంటే,

> ‘వాళ్ళు ఎప్పుడూ చూస్తారు కాని ఏదీ
> గ్రహించరు. అన్నీ వింటారు కాని ఒక్కటీ
> అర్థం చేసుకోరు. వాళ్ళు అలా చేస్తే దేవుని
> వైపు మళ్ళవచ్చు దేవుడు వాళ్ళను
> క్షమిస్తాడు.’”
>
> యెషయా *6:9-10*

## రైతు ఉపమానానికి యేసు అర్థం చెప్పటం
(మత్తయి *13:18-23;* లూకా *8:11-15*)

13యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: “మీకీ
ఉపమానం అర్థం కాలేదా? మరి మిగతా ఉపమానాల్ని
ఎలా అర్థం చేసుకొంటారు? 14రైతు , దైవ సందేశాన్ని
విత్తుతున్నవాడు. 15కొందరు వ్యక్తులు దారి మీది మట్టి
లాంటి వాళ్ళు. వీళ్ళలో విత్తనం నాటిన వెంటనే,
అంటేవాళ్ళు విన్న వెంటనే, సైతాను వచ్చి వాళ్ళలో
నాట బడిన దైవసందేశాన్ని తీసుకువెళ్తాడు. 16మరి
కొందరు రాతినేలలాంటి వాళ్ళు. వీళ్ళు సందేశాన్ని
విని ఆనందంతో దాన్ని స్వీకరిస్తారు. 17కాని వాళ్ళు
సందేశాన్ని లోతైన జీవితంలోనికి నాటనివ్వరు. కొంత
కాలం మాత్రమే నిలుస్తుంది. ఆ సందేశం కారణంగా
కష్టంకాని, హింసకాని కలిగితే వాళ్ళువెంటనే దాన్ని
వదిలేస్తారు.
18మరి కొందరు ముళ్ళమొక్కలు మొలిచే
నేలలాంటి వాళ్ళు. వాళ్ళు దైవసందేశం వింటారు కాని
19ఈ జీవితం వల్ల కలిగే చింతలు, ధనం కలిగించే
మోసం, యితర వస్తువుల పట్ల వ్యామోహం, ఆ దైవ
సందేశాన్ని అణిచివేసి ఫలించ కుండా చేస్తాయి.
20ఇతరులు సారవంతమైన భూమిలాంటివాళ్ళు. కనుక
వీళ్ళు దైవసందేశాన్ని విని అంగీకరించి ఫలంపొందే
వాళ్ళు. కనుక వీళ్ళు ముప్పై, అరవై, నూరువంతుల
ఫలం ఫలిస్తారు.”

## దీపస్తంభం
(లూకా *8:16-18*)

21ఆయన మళ్ళీ వాళ్ళతో ఈ విధంగా అన్నాడు:
“మీరు దీపాన్ని తెచ్చి స్తంభం మీద పెట్టకుండా మంచం
క్రింద లేక పాత్ర క్రింద పెడతారా? లేదు, దీపస్తంభం
మీద పెడతారు. 22దాచబడినవన్నీ బహిరంగమౌతాయి.
అన్ని రహస్యాలు బయటపడతాయి. 23వింటున్న మీరు
జాగ్రత్తగా వినండి.”
24యేసు మళ్ళీ ఈ విధంగా అన్నాడు: “మీరు
విన్నదాన్ని జాగ్రత్తగా గమనించండి. మీరు ఏ కొలతతో
కొలిచి యిస్తారో అదే కొలతతో యింకా ఎక్కువగా
కొలిచి దేవుడు మీకిస్తాడు. 25వున్నవానికి దేవుడు
యింకా ఎక్కువగా యిస్తాడు. లేనివాని దగ్గరనుండి
అతని దగ్గర ఉన్నది కూడా తీసివేస్తాడు.”

## పెరిగే విత్తనం యొక్క ఉపమానం

26యేసు మళ్ళీ ఈ విధంగా అన్నాడు: “దేవుని
రాజ్యం ఈ విధంగా ఉంటుంది. ఒక వ్యక్తి విత్తనాల్ని
భూమ్మీద చల్లుతాడు. 27అవి రాత్రి, పగలు, అతడు
పడుకొని ఉన్నా, లేచివున్నా మొలకెత్తి పెరుగుతూ
ఉంటాయి. అవి ఏ విధంగా పెరుగుతున్నాయో అతనికి
తెలియదు.
28భూమి తనంతకు తానె ధాన్యాన్ని పండి స్తుంది.
మొదట మొలక వేసి ఆ తర్వాత కంకువేసి, ఆకంకి
నిండా ధాన్యం పండుతుంది. 29పంటకాలం వరకు ఆ
ధాన్యం పూర్తిగా పండి పోతుంది. వెంటనే, రైతు
కొడవలిపెట్టి కోస్తాడు.”

### ఆవగింజ ఉపమానం
*(మత్తయి 13:31-32, 34-35; లూకా 13:18-19)*
30ఆయన మళ్ళీ ఈ విధంగా అన్నాడు: "దేవుని
రాజ్యం ఏవిధంగా ఉందని చెప్పాలి? ఏ ఉపమానాన్ని
ఉపయోగించి దాన్ని వర్ణించాలి? 31అది ఆవగింజ
లాంటిది. మనం భూమిలో నాటే విత్తనాలన్నిటి కన్నా
అది చాలా చిన్నది. 32కాని ఆ ఆవగింజను నాటాక
తోటలో ఉన్న అన్ని మొక్కల కన్నా అది పెద్దగా
పెరుగుతుంది. దాని కొమ్మలు పెద్దగా ఉంటాయి.
గాలిలో ఎగిరే పక్షులు దాని నీడలో గూడుకట్టు
కొంటాయి."
33యేసు ఇలాంటి ఉపమానాల్ని ఎన్నో ఉపయో
గించి, దైవసందేశాన్ని వాళ్ళు అర్థం చేసుకొన్నంత
బోధించాడు. 34ఉపమానాల్ని ఉపయోగించకుండా
వాళ్ళకు ఏదీ బోధించ లేదు. కాని ఆయన తన
శిష్యులతో ఒంటరిగా ఉన్నప్పుడు వాళ్ళకు అన్నీ
వివరించి చెప్పాడు.

### యేసు పెనుగాలిని అణచి వేయటం
*(మత్తయి 8:23-27; లూకా 8:22-25)*
35ఆ రోజు సాయంత్రం ఆయన తన శిష్యులతో,
"సముద్రం అవతలివైపుకు వెళ్దాం!" అని అన్నాడు.
36శిష్యులు, అక్కడ ఉన్న ప్రజా సమూహాన్ని వదిలి
పడవలో ఉన్న యేసును తమవెంట తీసుకు వెళ్ళారు.
మరికొన్ని పడవలు కూడా వాళ్ళను అనుసరించాయి.
37ఇంతలో తీవ్రమైన ఒక పెనుగాలి వీచింది. అలలు
రేగి ఆ పడవలోకి నీళ్ళు వచ్చాయి. పడవ నిండి
పోసాగింది. 38పడవ వెనుక వైపు యేసు తలక్రింద
ఒక దిండు పెట్టుకొని నిద్రపోతూ ఉన్నాడు. శిష్యులు
ఆయన్ని లేపి ఆయనతో, "బోధకుడా! మేము మునిగి
పోయినా మీకు చింతలేదా?" అని అన్నారు.
39ఆయన లేచి గాలిని, అలల్ని గద్దిస్తూ, "ఆగిపో,
నెమ్మదించు!" అని ఆజ్ఞాపించాడు. వెంటనే గాలి తీవ్రత
తగ్గిపోయింది. అంతటా శాంతం ఏర్పడింది.
40ఆయన తన శిష్యులతో, "మీరెందుకింత భయ
పడుతున్నారు? మీలో యింకా విశ్వాసం కలుగలేదా?"
అని అన్నాడు.
41వాళ్ళకు చాలా భయంవేసింది. తమలో తాము,
"ఎవరీయన? గాలి, అలలు కూడా ఆయన మాటకు
లోబడుతున్నాయే!" అని ఆశ్చర్యపడ్డారు.

### దయ్యం పట్టినవానికి నయం చెయ్యటం
*(మత్తయి 8:28-34; లూకా 8:26-39)*
5 వాళ్ళు సముద్రం దాటి గెరాసేనుల ప్రాంతానికి
వెళ్ళారు. 2యేసు పడవ నుండి క్రిందికి దిగగానే
దయ్యం పట్టిన వాడొకడు స్మశానం నుండి ఆయన
దగ్గరకు వచ్చాడు. 3వాడు స్మశానంలో నివసిస్తుండే
వాడు. ఇనుప గొలుసులతో కట్టినా వాణ్ణి ఎవ్వరూ
పట్టి ఉంచలేక పోయారు. 4వాని చేతుల్ని, కాళ్ళను
ఎన్నోసార్లు యినుప గొలుసులతో కట్టివేసే వాళ్ళు.
కానివాడు ఆ గొలుసుల్ని తెంపి, కాళ్ళకు వేసిన యినుప
కడ్డీలను విరిచి వేసేవాడు. వాణ్ణి అణచగలశక్తి ఎవ్వరికి
లేదు. 5వాడు స్మశానంలో సమాధుల దగ్గర, కొండల
మీదా, రాత్రింబగళ్ళు బిగ్గరగా ఏడుస్తూ తిరుగుతూ
ఉండేవాడు. రాళ్ళతో తన శరీరాన్ని గాయపరుచు
కొనేవాడు.
6వాడు యేసును దూరంనుండి చూసి పరుగెత్తి
వెళ్ళి ఆయన ముందు మోకరిల్లాడు. 7"యేసూ!
మహోన్నతుడైన దేవుని కుమారుడా! మాజోలికి రావ
ద్దయ్యా! మమ్మల్ని హింసించనని దేవుని మీద ప్రమా
ణంతో చెప్పండి" అని వాడు బిగ్గరగా అరుస్తూ ప్రాధేయ
పడ్డాడు. 8ఎందుకంటే ఒక్క క్షణం క్రితం యేసు
వానితో, "ఓ! దయ్యమా! ఆ మనిషి నుండి బయట
కురా!" అని అన్నాడు.
9యేసు వాణ్ణి 'నీ పేరేమి?' అని అడిగాడు.
"నా పేరు 'పటాలం'.* మా గుంపు చాలా పెద్దది"
అని ఆ మనిషి సమాధానం చెప్పాడు. 10వానిలోని
దయ్యాలు యేసుతో, తమను ఆ ప్రాంతం నుండి
పంపివేయవద్దని దీనంగా ఎన్నోసార్లు వేడుకొన్నాయి.
11ఆ కొండ ప్రక్కన ఒక పెద్ద పందుల గుంపు
మేస్తూవుంది. 12ఆ దయ్యాలు యేసుతో, "మమ్మల్ని
ఆ పందుల్లోకి పంపండి. వాటిలో ప్రవేశించటానికి
అనుమతివ్వండి" అని అన్నాయి. 13యేసు వాటికి
అనుమతి యిచ్చాడు. దయ్యాలు వాని నుండి వెలుప
లికి వచ్చి పందుల్లోకి ప్రవేశించాయి. రెండువేల దాకా
ఉన్న ఆ పందుల గుంపు వాలుగా ఉన్న కొండమీద
నుండి వేగంగా పరుగెత్తుకొనిపోయి సరస్సు పడి మునిగి
పొయ్యాయి.
14ఆ పందుల్ని కాస్తున్న వాళ్ళు పారిపోయి పట్ట
ణంలో, పల్లెప్రాంతాల్లో, ఈ సంఘటనను గురించి
చెప్పారు. ప్రజలు జరిగినదాన్ని చూడాలని వచ్చారు.
15వాళ్ళు యేసు దగ్గరకు వచ్చి అక్కడి దయ్యాల
పటాలం పట్టినవాడు దుస్తులు వేసుకొని సక్రమమైన
బుద్ధితో, కూర్చొని ఉండటం గమనించారు. వాళ్ళకు
భయం వేసింది. 16జరిగిన దాన్ని పూర్తిగా చూసిన
వాళ్ళు, దయ్యాలుపట్టిన వానికి జరిగిన దాన్ని గురించి,
పందుల్ని గురించి వాళ్ళకం దరికి చెప్పారు. 17వాళ్ళు
యేసును తమ ప్రాంతాన్ని వదిలి వెళ్ళమని వేడు
కొన్నారు. 18యేసు పడవనెక్కుతుండగా దయ్యం
పట్టిన వాడు వెంటవస్తానని బ్రతిమలాడాడు.

---

**'పటాలం'** రోమాసైన్యంలో పటాలం అనగా ఐదు వేల
మంది సైనికులు.

19యేసు దానికి అంగీకరించలేదు. అతనితో, "ఇంటికి వెళ్ళి ప్రభువు నీకు ఎంత సహాయం చేశాడో, నీపై ఎంత కరుణ చూపాడో నీ కుటుంబం లోని వాళ్ళతో చెప్పు" అని అన్నాడు. 20అతడు వెళ్ళి దెకపొలిలో* యేసు తనకోసం చేసినదంతా చెప్పాడు. అందరూ చాలా ఆశ్చర్యపడ్డారు.

### ఒక స్త్రీకి, ఒక బాలికకు నయం చెయ్యటం

*(మత్తయి 9:18-26; లూకా 8:40-56)*

21యేసు మళ్ళీ పడవనెక్కి సముద్రం దాటి అవతలి గట్టు చేరుకొన్నాడు. ఒక పెద్ద ప్రజల గుంపు ఆయన చుట్టూ చేరింది. ఆయన యింకా సముద్రం దగ్గరే ఉన్నాడు. 22ఇంతలో సమాజ మందిరానికి అధికారులలో ఒకడు అక్కడికి వచ్చాడు. అతని పేరు యాయీరు. అతడు యేసును చూసి ఆయన కాళ్ళ మీద పడి, 23"నా చిన్నకూతురు చావు బ్రతుకుల్లో ఉంది. మీరు దయచేసి వచ్చి మీ చేతుల్ని ఆమె మీద ఉంచితే ఆమెకు నయమై జీవిస్తుంది" అని దీనంగా వేడుకొన్నాడు.

24యేసు అతని వెంట వెళ్ళాడు. ఒక పెద్ద ప్రజాసమూహం ఆయన్ని త్రోసుకుంటూ ఆయన్ని అనుసరించింది.

25పన్నెండు సంవత్సరాల నుండి రక్త స్రావంతో బాధపడుతున్న ఒక స్త్రీ ఆ గుంపులో ఉంది. 26ఆమె చాలామంది వైద్యుల దగ్గరకు వెళ్ళింది. కాని ఆమె బాధ ఏమాత్రం తగ్గలేదు. తన దగ్గరున్న డబ్బంతా వ్యయం చేసింది. కాని నయమవటానికి మారుగా ఆమెస్థితి యింకా క్షీణించింది. 27ఆమె యేసును గురించి వినటం వల్ల గుంపులోనుండి యేసు వెనుకగా వచ్చింది. 28తన మనస్సులో, "నేను ఆయన వస్త్రాన్ని తాకితే చాలు, నాకు నయమైపోతుంది" అని అనుకొని, ఆయన వస్త్రాన్ని తాకింది. 29వెంటనే ఆమె రక్తస్రావం ఆగిపోయింది. తన శరీరంలోని బాధలనుండి విముక్తి పొందినట్లు ఆమెకు అర్థమయింది. 30వెంటనే, యేసుకు తన నుండి శక్తి పోయినట్లు తెలిసింది. చుట్టూ ఉన్న ప్రజల వైపు తిరిగి చూసి, "నా దుస్తుల్ని ఎవరు తాకారు?" అని అన్నాడు.

31ఆయన శిష్యులు, "ప్రజలు మిమ్మల్ని త్రోసుకొంటూ మీ మీద పడుతున్నారు గదా! అయినా ఎవరు తాకారని అడుగుతున్నా రెందుకు?" అని అన్నారు.

32కాని యేసు, 'ఎవరు తాకారు?' అని చుట్టూ చూస్తూ ఉండిపోయాడు. 33అప్పుడా స్త్రీ తనకు నయమైపోయిందని తెలుసుకొని, భయంతో వణుకుతూ వచ్చి యేసు కాళ్ళపై పడి జరిగినదంతా చెప్పింది. 34ఆయనామెతో, "అమ్మా! నీ విశ్వాసమే నీకు నయం చేసింది. శాంతంగా వెళ్ళు, నీ బాధలు నివారణ అయ్యాయి" అని అన్నాడు.

35యేసు ఇంకా మాట్లాడుతుండగా సమాజ మందిరానికి అధికారియైన యాయీరు ఇంటి నుండి కొందరు మనుష్యులు వచ్చి యాయీరుతో, "మీ కూతురు మరణించింది. బోధకునికి శ్రమ కలిగించటం దేనికి?" అని అన్నారు.

36యేసు వాళ్ళన్న దాన్ని విని లెక్క చేయకుండా సమాజమందిరపు అధికారితో, "భయపడకు. నమ్మకంతో ఉండు" అని అన్నాడు. 37యేసు పేతుర్ని, యాకోబును, యాకోబు సోదరుడైన యోహాన్ను తప్ప మరెవ్వరిని తనవెంట రానివ్వలేదు.

38యాయీరు యింటికి వచ్చాక అక్కడున్న వాళ్ళు బిగ్గరగా ఏడుస్తూ పెడ బొబ్బలు పెడుతూ ఉండటం యేసు చూసాడు. ఏమీ తోచక అందరూ దిగులుతో ఉండినారు. 39ఆయన యింట్లోకి వెళ్ళి వాళ్ళతో, "ఎందుకు దిగులు? ఎందుకీ ఏడుపు? ఆమె చనిపోలేదు. నిద్రలోవుంది! అంతే!" అని అన్నాడు. 40కాని వాళ్ళాయన్ని హేళన చేసారు. యేసు వాళ్ళనందరినీ వెలుపలికి పంపాడు. ఆమె తండ్రిని, తల్లిని, తనతోవున్న శిష్యుల్ని వెంటబెట్టుకొని, ఆమె ఉన్న గదికి వెళ్ళాడు. 41ఆమె చేయి తన చేతిలోకి తీసుకొని "తలీతాకుమీ!" అని అన్నాడు. అంటే చిన్నమ్మాయి! నేను చెబుతున్నాను లెమ్ము అని అర్థం 42ఆమె వెంటనే లేచి నడవటం మొదలుపెట్టింది. ఆమె వయస్సు పన్నెండు సంవత్సరాలు. ఇది చూసి అందరికీ చాలా ఆశ్చర్యం కలిగింది. 43దీన్ని గురించి ఎవ్వరికీ చెప్పవద్దని ఖచ్చితంగా ఆజ్ఞాపించాడు. ఆమెకు తిన టానికి ఏదైనా యివ్వమని వాళ్ళకు చెప్పాడు.

### నజరేతు ప్రజలు యేసును తృణీకరించటం

*(మత్తయి 13:53-58; లూకా 4:16-30)*

6 యేసు అక్కడినుండి తన శిష్యులతో కలిసి స్వగ్రామానికి వెళ్ళాడు. 2విశ్రాంతి రోజు రాగానే సమాజమందిరంలో బోధించటం మొదలుపెట్టాడు. చాలామంది ఆయన చెప్పిన విషయాలు విని ఆశ్చర్యపడ్డారు. వాళ్ళు పరస్పరం ఈ విధంగా మాట్లాడుకొన్నారు: "ఈయన కింత జ్ఞానం ఏవిధంగా లభించింది? ఈ జ్ఞానం ఎలాంటిది? ఈయన మహత్యాలు ఎట్లా చేస్తున్నాడు. 3ఈయన వడ్రంగి కదా! మరియ కుమారుడు కదూ! యాకోబు, యోసే, యూదా, సీమోనుల సోదరుడే యితడు. ఇతని చెల్లెండ్లు యిక్కడ మనతోనే ఉన్నారు కదూ!" అని అంటూ వాళ్ళు ఆయన్ని తృణీకరించారు.

4యేసు వాళ్ళతో, "ప్రవక్తకు స్వగ్రామంలో, తన బంధువుల్లో, తన యింట్లో తప్ప అన్నిచోట్లా గౌరవం

---

**దెకపొలి** అనగా పది పట్టణాలు.

లభిస్తుంది” అని అన్నాడు. 5యేసు కొందరు వ్యాధి
గ్రస్తుల మీద తన చేతులుంచి, వాళ్ళకు నయం
చేయటం తప్ప మరేమహత్యాలు అక్కడ చేయలేక
పోయాడు. 6వాళ్ళలో విశ్వాసం లేక పోవటం చూసి
ఆయనకు ఆశ్చర్యం వేసింది. ఆ తర్వాత యేసు,
గ్రామ గ్రామానికి వెళ్ళి బోధించాడు.

## యేసు పన్నెండు మందిని పంపటం

(*మత్తయి 10:1, 5-15; లూకా 9:1-6*)

7ఆయన పన్నెండుగురిని పిలిచి వాళ్ళకు దయ్యా
లపై అధికారమిచ్చాడు. ఇద్దరిద్దరి చొప్పున పంపుతూ,
8వాళ్ళకు ఈ విధంగా ఉపదేశించాడు: “ప్రయాణం
చేసేటప్పుడు చేతి కర్రను తప్ప మరేదీ తీసుకు
వెళ్ళకండి. ఆహారము, సంచీ, దట్టీలో డబ్బు, తీసుకు
వెళ్ళకండి. 9చెప్పులు వేసుకోండి. కాని మారు దుస్తులు
తీసుకు వెళ్ళకండి. 10ఒకరి యింటికి వెళ్ళాక ఆ గ్రామం
వదిలి వెళ్ళేదాకా ఆ యింట్లోనే ఉండండి. 11ఒక గ్రామం
వాళ్ళు మీకు స్వాగతమివ్వక పోతే, లేక మీ బోధనల్ని
వినకపోతే మీరా గ్రామం వదిలేముందు వాళ్ళ వ్యతిరే
కతకు గుర్తుగా మీ కాలికంటిన వాళ్ళ ధూళిని
దులపండి.”*
12వాళ్ళు వెళ్ళి ప్రజలకు మారుమనస్సు పొందమని
బోధించారు. 13ఎన్నో దయ్యాలను వదిలించారు.
చాలామంది వ్యాధిగ్రస్తులకు నూనెరాచి నయం చేసారు.
14యేసుకు పేరు ప్రఖ్యాతులు రావడంతో హేరోదు
రాజుకు వీటిని గురించి తెలిసింది. బాప్తిస్మము* నిచ్చే
యోహాను బ్రతికివచ్చాడని, కనుకనే మహత్వపూర్వక
మైన కార్యాలు చేసేశక్తి అతనిలో ఉన్నదని అన్నాడు.
15ఆయన ఏలీయా అని కొందరన్నారు ప్రవక్త
అని మరికొందరన్నారు.
“పూర్వకాలపు ప్రవక్తల్లాంటివాడు” అని మరి
కొందరన్నారు.
16కాని హేరోదు వీటిని గురించి విని, “నేను తల
నరికించిన యోహాను బ్రతికి వచ్చాడు” అని అన్నాడు.

## బాప్తిస్మము నిచ్చే యోహాను మరణం

17క్రితంలో హేరోదు, స్వయంగా యోహానును
బంధించి కారాగారంలో వేయమని ఆజ్ఞాపించాడు. తాను
వివాహం చేసుకొన్న హేరోదియ కారణంగా ఈ పని
చేయవలసి వచ్చింది. ఈమె హేరోదు సోదరుడైన
ఫిలిప్పు భార్య. 18పైగా యోహాను హేరోదుతో, “నీ
సహోదరుని భార్యను చేసుకోవటం అన్యాయం”
అంటూ ఉండేవాడు. 19అందువల్ల హేరోదియకు
యోహాను అంటే యిష్టం వుండేదికాదు. అంతేకాక,
ఆమె అతణ్ణి చంపి వేయాలని ఆశించింది. కాని
యోహాను అంటే హేరోదు భయపడేవాడు. కనుక
అలా చెయ్య లేకపొయ్యాడు. 20పైగా యోహాను నీతి
మంతుడని, పవిత్రమైనవాడని హేరోదుకు తెలుసు.
కనుక అతణ్ణి కాపాడుతూ వుండేవాడు. హేరోదు
యోహాను మాటలు విన్నప్పుడు ఎంతో కలవరం
చెందేవాడు. అయినా అతని మాటలు వినటానికి
యిష్టపడేవాడు.
21చివరకు హేరోదియకు అవకాశం లభించింది.
హేరోదు తన రాజ్యంలోని ప్రముఖ అధికారులను,
సైన్యాధిపతులను గలిలయలోని ప్రముఖులను పిలిచి
తన పుట్టినరోజు పండుగ చేసాడు. 22హేరోదియ
కూతురు వచ్చి నాట్యం చేసింది. ఆమె హేరోదును,
అతని అతిథుల్ని మెప్పించింది.
హేరోదు ఆమెతో, “నీకు కావలసింది ఏదైనా
కోరుకో! యిస్తాను!” అని అన్నాడు. 23“నీవేదడిగినా
యిస్తాను, అర్థ రాజ్యాన్నైనా సరే!” అని ప్రమాణం
చేసాడు.
24ఆమె వెళ్ళి తన తల్లితో, “నన్నేమి కోరుకో
మంటావు?” అని అడిగింది.
“బాప్తిస్మము నిచ్చే యోహాను తల కోరుకో!”
అని ఆమె సమాధానం చెప్పింది.
25వెంటనే ఆమె రాజు దగ్గరకు పరుగెత్తి, “బాప్తి
స్మము నిచ్చే యోహాను తలను ఒక పళ్ళెంలో పెట్టి
తక్షణమే యిప్పించమని మిమ్మల్ని వేడుకొంటు
న్నాను” అని అన్నది.
26రాజుకు చాలా దుఃఖం కలిగింది. కాని తాను
ప్రమాణం చేసాడు. పైగా అతిథులక్కడే ఉన్నారు.
కనుక ఆమె కోరికను నిరాకరించ దలచుకోలేదు.
27అందువల్ల అతడు వెంటనే యోహాను తల తీసుకు
రమ్మని ఆజ్ఞాపిస్తూ ఒక భటుణ్ణి పంపాడు. ఆ భటుడు
వెళ్ళి యోహాను తలను కారాగారంలోనే నరికి వేసి,
28దాన్ని ఒక పళ్ళెంలో పెట్టి తీసుకు వచ్చి ఆమెకు
బహూకరించాడు. ఆమె దాన్ని తన తల్లికి ఇచ్చింది.
29యోహాను శిష్యులు ఇదివిని అక్కడికి వెళ్ళి అతని
దేహాన్ని తీసుకువెళ్ళి సమాధిచేసారు.

## యేసు ఐదువేలమందికి భోజనం పెట్టటం

(*మత్తయి 14:13-21; లూకా 9:10-17;
యోహాను 6:1-4*)

30అపొస్తలులు యేసు చుట్టూ చేరి తాము చేసిన
వాటిని గురించి, బోధించిన వాటిని గురించి వివరంగా
ఆయనకు చెప్పారు. 31వాళ్ళ దగ్గరకు చాలామంది
వస్తూ పోతూ ఉండటం వల్ల వాళ్ళకు తినటానికి కూడా
సమయం లేకపోయింది. అందుకు యేసు వాళ్ళతో,

---

**ఒక గ్రామం ... దులపండి** వాళ్ళ తీర్పుకువాళ్ళే ఉత్తర వాదులు అని తీర్పు చెప్పటం.

**బాప్తిస్మము** ఇది గ్రీకు పదము. ఇంగ్లీషులో బాప్టిజం. దీని అర్థం ప్రత్యేకమైన నీటిమునక.

"నాతో మీరు మాత్రమే ఏకాంత ప్రదేశానికి వచ్చి
కొంత విశ్రాంతి తీసుకోండి" అని అన్నాడు.
32అందువల్ల వాళ్ళు మాత్రమే ఒక పడవనెక్కి నిర్జన
ప్రదేశానికి వెళ్ళారు. 33కాని, వాళ్ళు వెళ్ళటం చాలా
మంది చూసారు. వాళ్ళెవరో గుర్తించి అన్ని పట్టణాల
నుండి పరుగెత్తుకొంటూ వెళ్ళి, వాళ్ళకన్నా ముందే
ఆ ఎడారి ప్రాంతాన్ని చేరుకొన్నారు. 34యేసు పడవ
దిగి ఆ ప్రజాసమూహాన్ని చూసాడు. కాపరి లేని గొర్రెల్లా
ఉన్న ఆ ప్రజల్ని చూసి ఆయనకు జాలివేసింది.
అందువల్ల వాళ్ళకు ఎన్నో విషయాలు బోధించటం
మొదలు పెట్టాడు.
35అప్పటికే మధ్యాహ్నం దాటి సాయంకాల మవు
తూవుంది. ఆయన శిష్యులు వచ్చి, "ఇది నిర్మానుష్య
ప్రాంతం. ఇప్పటికే సాయంకాల మవుతూవుంది.
36మీరీ ప్రజల్ని పంపివేస్తే వాళ్ళు చుట్టూవున్న పల్లెలకో
లేక గ్రామాలకో వెళ్ళి ఏదైనా కొనుక్కొని తింటారు"
అని అన్నారు.
37కాని యేసు, "వాళ్ళు తినటానికి మీరే ఏదైనా
ఇవ్వండి!" అని సమాధానం చెప్పాడు.
"రెండు వందల దేనారాలకు రొట్టెలు కొని వాళ్ళకు
పంచి పెట్టమంటావా?" అని ఆయన్ని అడిగారు.
38"మీ దగ్గర ఎన్ని రొట్టెలు ఉన్నాయో వెళ్ళి
చూడండి" అని యేసు అన్నాడు.
వాళ్ళు వెళ్ళి చూసి వచ్చి, "ఐదు రొట్టెలు, రెండు
చేపలు ఉన్నాయి" అని అన్నారు.
39పచ్చిగడ్డి మీద అందరినీ గుంపులు గుంపులుగా
కూర్చోబెట్టమని శిష్యులతో చెప్పాడు. 40ప్రజలు
గుంపుకు యాభై, నూరుగురి చొప్పున కూర్చున్నారు.
41యేసు ఆ ఐదు రొట్టెల్ని రెండు చేపల్ని తీసుకొని
ఆకాశం వైపు చూసి కృతజ్ఞత చెప్పి రొట్టెల్ని
తుంచాడు. అవి తన శిష్యులకిచ్చి ప్రజల ముందుంచ
మన్నాడు. అదే విధంగా ఆ రెండు చేపల్ని కూడా
భాగాలు చేసి అందరికి పంచాడు. 42అందరూ సంతృప్తిగా
తిన్నారు. 43శిష్యులు మిగిలిన రొట్టెముక్కల్ని, చేప
ముక్కల్ని పన్నెండు గంపల నిండా నింపారు. 44ఆ
రోజు అక్కడ ఐదు వేలమంది పురుషులు భోజనం
చేసారు.

### యేసు నీళ్ళపై నడవటం

(*మత్తయి 14:22-33; యోహాను 6:15-21*)

45ఆ తదుపరి యేసు తన శిష్యులతో, పడవనెక్కి,
తనకన్నాముందు బేత్సయిదాకు వెళ్ళ మని గట్టిగా
చెప్పాడు. బేత్సయిదా సముద్రంకు ఆవలివైపున ఉంది.
యేసు ప్రజల్ని తమ తమ యిండ్లకు వెళ్ళమని
చెప్పాడు. 46వాళ్ళను వదిలి ప్రార్థించటానికి కొండ
మీదికి వెళ్ళాడు.
47అర్ధరాత్రికి శిష్యులున్న పడవ సముద్రం మధ్య
వుంది. యేసు మాత్రం యింకా గట్టునే ఉన్నాడు.
48ఎదురు గాలి వీయటం వల్ల శిష్యులు కష్టంగా తెడ్లు
వేయటం ఆయన చూసాడు. తెల్లవారు ఝామున
యేసు నీళ్ళ మీదుగా నడిచి వాళ్ళ దగ్గరకు వెళ్ళాడు.
వాళ్ళను దాటి ముందుకు వెళ్తుంటే 49ఆయన శిష్యులు
ఆయన నీళ్ళమీద నడవటం చూసి, దయ్యం అనుకొని
భయపడి బిగ్గరగా కేకలు వేసారు. 50వెంటనే ఆయన
వాళ్ళతో మాట్లాడుతూ, "ధైర్యంగా ఉండండి. నేనే!
భయపడకండి!" అని అన్నాడు. 51ఆయన పడవనెక్క
గానే గాలి తీవ్రత పూర్తిగా తగ్గి పోయింది. వాళ్ళు ఇది
చూసి దిగ్భ్రాంతి చెందారు. రొట్టెలు పంచిన అద్భు
తాన్ని వాళ్ళు చూశారు. 52కాని దానిని అర్థం చేసుకోలేక
పోయారు. 53సముద్రం దాటి గెన్నేసరెతు తీరాన్ని
చేరుకొని అక్కడ పడవను నిలిపారు. 54వాళ్ళు పడవ
దిగగానే ప్రజలు యేసును గుర్తించారు. 55ప్రజలు
చుట్టూ ఉన్న ప్రాంతాలకు పరుగెత్తి వెళ్ళి రోగుల్ని
చాపలపై పడు కోబెట్టి ఆయనున్న చోటికి తీసుకు
వచ్చారు. 56పల్లెల్లో, పట్టణాల్లో, పొలాల్లో, చుట్టూ,
ఆయన వెళ్ళిన ప్రతిచోట రోగుల్ని వీథుల్లో పడు
కోబెట్టారు. ఆయన వస్త్రాన్నైనా తాకనీయ మని
ఆయన్ని బ్రతిమలాడారు. ఆయన్ని తాకిన ప్రతి ఒక్క
రికి నయమై పోయింది.

### పరిశుభ్రం, అపరిశుభ్రం

(*మత్తయి 15:1-20*)

7 యెరూషలేము నుండి వచ్చిన పరిసయ్యులు,*
శాస్త్రులు యేసు చుట్టూ చేరారు. 2వాళ్ళు, యేసు
శిష్యుల్లో కొందరు అపరిశుభ్రమైన చేతులతో, అంటే
ఆచారం ప్రకారం చేతులు కడుక్కోకుండా భోజనం
చేయటం గమనించారు. 3పరిసయ్యులే కాక యూదు
లందరూ పెద్దలు చెప్పిన ఆచారం ప్రకారం తమ
చేతుల్ని ప్రత్యేకంగా శుభ్రం చేసుకోకుండా భోజనం
చెయ్యరు. 4వాళ్ళు వీథిలోకి వెళ్ళివస్తే చేతులు కడు
క్కోకుండా భోజనం చెయ్యరు. ఇదేకాక వాళ్ళింకా
అనేకమైన ఆచారాలు పాటిస్తారు. లోటాలను, చెంబు
లను, గిన్నెలను* శుద్ధి చేయటం వాళ్ళ ఆచారం.
5అందువల్ల పరిసయ్యులు, శాస్త్రులు యేసుతో,
"మీ శిష్యులు చేతులు కడుక్కోకుండా భోజనం
ఎందుకు చేస్తారు? పెద్దలు చెప్పిన ఆచారం ఎందుకు
పాటించరు?" అని అడిగారు.

---

**పరిసయ్యులు** యూదుల న్యాయశాస్త్రాన్ని, వాళ్ళ ఆచా
రాల్ని నిష్ఠగా పాటించే ఒక యూదుల శాఖ.

**గిన్నెలను** కొన్ని ప్రాచీన ప్రతుల్లో భోజనం చేసే బల్లల్ని
అని కూడా ఉంది.

6యేసు సమాధానంగా, “యెషయా వేషధారులైన
మిమ్మల్ని గురించి సరిగ్గా ప్రవచించాడు. అతడు తన
గ్రంథంలో ఇలా ప్రవచించాడు:

‘వీళ్ళు మాటలతో నన్ను గౌరవిస్తారు. కాని
వాళ్ళ హృదయాలు నాకు చాలా దూరంగా
ఉన్నాయి.
7 వాళ్ళు మానవ కల్పితమైన నియమాలను
బోధిస్తారు. కనుక వాళ్ళ ఆరాధన నిరర్థకం.’
*యెషయా 29:13*

8“దేవుని ఆజ్ఞల్ని పాటించటం మానేసి, మాన
వుడు కల్పించిన ఆచారాల్ని పట్టుకొని మీరు పాటిస్తు
న్నారు” అని అన్నాడు.
9“మీరు దేవుని ఆజ్ఞల్ని కాదని, మీ ఆచారాలను
స్థాపించటంలో ఘనులు. 10ఉదాహరణకు, మోషే మీ
తల్లితండ్రుల్ని గౌరవించమని* మరియు తల్లిని కాని,
తండ్రిని కాని దూషించినవారికి మరణ దండన విధించ
మని ఆజ్ఞాపించాడు.* 11కాని ఒక మనిషి దగ్గర తన
తల్లితండ్రులకు సహాయం చెయ్యటానికి కొంత ధనం
ఉన్నా అతడు వాళ్ళతో, అది అంటే దేవునికి అర్పితం
అని అంటే, 12ఆ మనిషి తన తల్లి తండ్రులకు సహాయం
చేయనవసరంలేదని మీరు అతణ్ణి సమర్థిస్తున్నారు. 13మీ
పెద్దల ఆచారం దేవుని ఆజ్ఞను రద్దు చేస్తోంది. ఇలాంటివి
మీరు ఎన్నో చేస్తున్నారు.”
14యేసు మళ్ళీ, ప్రజల్ని తన దగ్గరకు పిలిచి,
“ప్రతి ఒక్కళ్ళు ఇది వినండి. అర్థం చేసుకోండి.
15బయట ఉన్నవేవీ మనిషి కడుపులోకి వెళ్ళి అతణ్ణి
అపవిత్రం చేయవు. 16మనిషినుండి బయటకు వచ్చేది
అతణ్ణి అపవిత్రం చేస్తోంది” అని అన్నాడు.
17యేసు ప్రజల్ని వదిలి యింట్లోకి వెళ్ళాక ఆయన
శిష్యులు ఆ ఉపమానాన్ని గురించి అడిగారు.
18“మీరింత అజ్ఞానులా! బయట ఉన్నది లోపలికి వెళ్ళి
మనిషిని అపవిత్రం చెయ్యటం లేదని మీరు గమనిం
చటం లేదా! 19అది మనిషి హృదయంలోకి వెళ్ళదు.
కడుపులోకి వెళ్ళి అక్కడ నుండి బయటకు వచ్చే
స్తుంది.” యేసు ఈ విధంగా చెప్పి అన్ని ఆహార
పదార్థాలు తినడానికి పవిత్రమైనవని అని సూచించాడు.
20ఆయన మళ్ళీ ఈ విధంగా అన్నాడు: “మనిషి
నుండి బయటకు వచ్చేవి అతణ్ణి అపవిత్రం చేస్తాయి.
21ఎందుకంటే, మానవుల హృదయాల నుండి దురాలో
చనలు, జారత్వం, దొంగతనం, నరహత్యలు, వ్యభి
చారం, 22లోభం, చెడుతనం, కృత్రిమం, కామవికారం,
మత్సరం, దేవదూషణ, అహంభావం, అవివేకం బయ
టకు వస్తాయి.* 23ఇవే లోపల నుండి బయటకు
వచ్చి నరుని అపవిత్రం చేస్తాయి.”

### సిరియలోని ఫెనికయ స్త్రీ యొక్క విశ్వాసము
*(మత్తయి 15:21-28)*

24యేసు ఆ ప్రాంతం వదిలి తూరు* ప్రాంతానికి
వెళ్ళాడు. అక్కడ ఒకరి యింటికి వెళ్ళాడు. తనక్కడ
ఉన్నట్లు ఎవ్వరికీ తెలియరాదని ఆయన ఉద్దేశ్యం.
కాని దాన్ని రహస్యంగా ఉంచలేకపోయాడు. 25ఒక స్త్రీ
వెంటనే యేసును గురించి విన్నది. ఆమె కూతురుకు
దయ్యం పట్టివుంది. ఆమె అక్కడికి వచ్చి యేసు
కాళ్ళపై పడింది. 26ఆమె గ్రీసు దేశస్తురాలు. జన్మస్థానం
సిరియ దేశంలోని ఫొనీషియా. తన కూతురు నుండి
ఆ దయ్యాన్ని వదిలించమని ఆమె యేసును వేడు
కొంది. 27ఆయన ఆమెతో, “మొదట చిన్నపిల్లల్ని
వాళ్ళకు కావలసినవి తిననివ్వాలి. ఎందుకంటే చిన్న
పిల్లల ఆహారాన్ని తీసుకొని కుక్కలకు వేయటం
సమంజసం కాదు” * అని అన్నాడు.
28“ఔను! ప్రభూ! కాని, బల్లక్రిందవున్న కుక్కలు
కూడా చిన్నపిల్లలు వదిలివేసిన ముక్కల్ని తింటాయి
కదా!” అని ఆమె సమాధానం చెప్పింది.
29అప్పుడు యేసు ఆమెతో, “అలాంటి సమా
ధానం చెప్పావు కనుక వెళ్ళు. దయ్యం నీ కూతుర్ని
వదిలి వెళ్ళింది” అని అన్నాడు.
30ఆమె యింటికి వెళ్ళి తన కూతురు పడకపై
పడుకొని ఉండటం చూసింది. దయ్యం నిజంగా ఆమె
నుండి వెళ్ళిపోయింది.

### చెముడు, నత్తి ఉన్న వానికి నయం చేయటం

31ఆ తర్వాత యేసు తూరు ప్రాంతం వదిలి,
సీదోను వెళ్ళి అక్కడినుండి దెకపొలి ద్వారా గలిలయ
సముద్రం చేరుకొన్నాడు. 32అక్కడ కొందరు చెముడు,
నత్తి ఉన్న ఒక మనిషిని యేసు దగ్గరకు పిలుచుకు
వచ్చారు. అతనిపై తన చేయి పెట్టమని వాళ్ళు
యేసును వేడుకొన్నారు.
33యేసు అతణ్ణి ప్రజలనుండి ప్రక్కకు పిలుచుకు
వెళ్ళి తన చేతి వ్రేళ్ళను అతని చెవుల్లో ఉంచాడు.
ఉమ్మివేసి ఆ వ్యక్తి యొక్క నాలుక తాకాడు. 34ఆకాశం
వైపుచూసి నిట్టూర్చి, “ఎప్ఫతా” అని అన్నాడు. అంటే
‘తెరుచుకో’ అని అర్థం 35వెంటనే అతని చెవులు తెరుచు
కొన్నాయి. అతని నాలుక వదులైంది. అతడు స్పష్టంగా
మాట్లాడటం మొదలు పెట్టాడు.

---

**మీ తల్లి … గౌరవించమని** నిర్గమ. 20:12; ద్వితీ 5:16.

**తల్లిని … ఆజ్ఞాపించాడు** నిర్గమ. 21:17; లేవీ. 20:9.

**ఎందుకంటే … వస్తాయి** రోమా. 1:29; గలతీ. 5:19.

**తూరు** మరియు సీదోను అని అనేక ప్రతులలో ఉంది.

**సమంజసం కాదు** యూదులు ఇతర్లను కుక్కలుగా భావించే వాళ్ళు.

36యేసు దీన్ని ఎవ్వరికీ చెప్పవద్దని ఆజ్ఞాపించాడు.
కాని ఆయన చెప్పిన కొద్దీ వాళ్ళు దాన్ని గురించి
యింకా ఎక్కువగా చెప్పారు. 37 ప్రజల ఆశ్చర్యానికి
అంతులేక పోయింది. వాళ్ళు, “ఈయన అన్నీ బాగా
చేస్తాడు. పైగా చెవిటివాడు వినేటట్లు, నత్తివాడు మాట్లా
డేటట్లు కూడా చేస్తున్నాడు” అని అన్నారు.

## యేసు నాలుగువేల మందికి భోజనం పెట్టటం

(*మత్తయి 15:32-39*)

8 ఆ రోజుల్లో మళ్ళీ ఒకసారి పెద్ద ప్రజల గుంపు
సమావేశమైంది. వాళ్ళ దగ్గర తినటానికి ఏమీ
ఉండనందువల్ల యేసు శిష్యుల్ని పిలిచి, 2“నాకు జాలి
వేస్తోంది. వాళ్ళిప్పటికే మూడు రోజులనుండి నా దగ్గరు
న్నారు. తినటానికి వాళ్ళ దగ్గర ఏమీలేదు. 3నేను
వాళ్ళను ఆకలితో యింటికి పంపివేస్తే వాళ్ళలో
కొందరు చాలా దూరం నుండి వచ్చారు. కనుక వాళ్ళు
దారిలో మూర్ఛపోవచ్చు” అని అన్నాడు.
4ఆయన శిష్యులు, “ఈ ఎడారి ప్రాంతంలో వాళ్ళు
తినటానికి చాలినంత ఆహారం ఎక్కడనుండి
తెమ్మంటారు?” అని అన్నారు.
5“ఎన్ని రొట్టెలున్నాయి” అని యేసు అడిగాడు.
“ఏడు” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
6యేసు ప్రజల్ని కూర్చోమని చెప్పాడు. ఆ ఏడు
రొట్టెలు తీసుకొని దేవునికి కృతజ్ఞతలు చెప్పి వాటిని
విరిచాడు. ఆ రొట్టెముక్కల్ని తన శిష్యులకిచ్చి ప్రజ
లకు పంచమన్నాడు. వాళ్ళు అలాగే చేసారు. 7వాళ్ళ
దగ్గర కొన్ని చేపలుకూడా ఉన్నాయి. వాటి కోసం
కూడా దేవునికి కృతజ్ఞతలు చెప్పి వాటిని కూడా
పంచమని తన శిష్యులకు యిచ్చాడు. 8ప్రజలు వాటిని
తిని సంతృప్తి చెందారు. ఆ తర్వాత ప్రజలు తినగా
మిగిలిన ముక్కల్ని ఏడు గంపలనిండా నింపారు.
9నాలుగు వేలమంది ప్రజలు అక్కడవున్నారు. వాళ్ళను
పంపివేసి వెంటనే 10యేసు తన శిష్యులతో కలిసి
పడవనెక్కి దల్మనూతా ప్రాంతానికి వెళ్ళాడు.
11పరిసయ్యులు వచ్చి యేసును ప్రశ్నించటం
మొదలుపెట్టారు. ఆయన్ని పరీక్షించే ఉద్దేశ్యంతోనే
ఆకాశంనుండి ఒక రుజువు చూపమన్నారు. 12ఆయన
పెద్దగా నిట్టూర్చి, “ఈ కాలపు వాళ్ళు అద్భుతాల్ని
రుజువులుగా చూపమని ఎందుకు అడుగుతారు? ఇది
నిజం. మీకు ఏ రుజువూ చూపబడదు” అని అన్నాడు.
13అ తర్వాత ఆయన వాళ్ళను వదిలి పడవనెక్కి
అవతలి ఒడ్డు చేరుకొన్నాడు. 14శిష్యులు రొట్టెలు
తేవటం మరిచిపోయారు. వాళ్ళ దగ్గర ఒక రొట్టె
మాత్రమే ఉంది. 15యేసు, “జాగ్రత్తగా ఉండండి. పరిస
య్యుల పులుపును హేరోదు పులుపును* గమనిస్తూ
ఉండండి” అని వాళ్ళను హెచ్చరించాడు. 16ఇది వాళ్ళు
పరస్పరం చర్చించుకొంటూ, “మన దగ్గర రొట్టెలు
లేవని అలా అంటున్నాడా!” అని అనుకొన్నారు.
17వాళ్ళు ఏమి చర్చించుకొంటున్నారో యేసు
కనిపెట్టి, “రొట్టెలులేవని ఎందుకు చర్చించు కుంటు
న్నారు? మీకు యింకా అర్థం కాలేదా? మీరు చూడ
లేదా? మీ బుద్ధి మందగించిందా? 18మీకు కళ్ళున్నాయి
కాని చూడలేరు. చెవులున్నాయి కాని వినలేరు. మీకు
జ్ఞాపకం లేదా? 19నేను ఐదు రొట్టెల్ని విరిచి ఐదువేల
మందికి పంచిపెట్టినప్పుడు మిగిలిన ముక్కల్ని మీరెన్ని
గంపలనిండా నింపారు?” అని అడిగాడు.
“పన్నెండు” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
20“మరి ఏడు రొట్టెలు విరిచి నాలుగు వేలమందికి
పంచినప్పుడు మిగిలిన ముక్కల్ని ఎన్ని గంపలనిండా
నింపారు?” అని యేసు అన్నాడు.
“ఏడు” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
21“యింకా మీకు అర్థంకాలేదా?” అని ఆయన
వాళ్ళతో అన్నాడు.

## బేత్సయిదాలో గ్రుడ్డివానికి నయం చేయటం

22యేసు, ఆయన శిష్యులు బేత్సయిదాకు
వచ్చారు. అక్కడి ప్రజలు గ్రుడ్డివాణ్ణి యేసు దగ్గరకు
తీసుకు వచ్చారు. అతణ్ణి తాకమని వాళ్ళు ఆయనను
వేడుకొన్నారు. 23యేసు ఆ గ్రుడ్డివాని చేయి పట్టుకొని
ఊరిబయటకు తీసుకు వెళ్ళాడు. యేసు ఆ గ్రుడ్డివాని
కళ్ళ మీద ఉమ్మివేసి తన చేతుల్ని వాటిపై వుంచి,
‘నీకేమైనా కనబడుతోందా’ అని అడిగాడు.
24ఆ గ్రుడ్డివాడు తలెత్తి, “మనుష్యులు నడుస్తు
న్నట్లు కనబడుతున్నారు. కాని వాళ్ళు చెట్లలా కనబడు
తున్నారు” అని అన్నాడు.
25యేసు మళ్ళీ ఒకసారి అతని కళ్ళపై తన చేతుల్ని
ఉంచాడు. వెంటనే అతని కళ్ళు తెరుచుకున్నాయి.
అతనికి దృష్టి వచ్చింది. అన్నీ స్పష్టంగా చూడగలిగి
నాడు. 26యేసు అతణ్ణి యింటికి పంపుతూ, “గ్రామం
లోకి వెళ్ళవద్దు”* అని అన్నాడు.

## పేతురు యేసును “క్రీస్తు” అని అంగీకరించటం

(*మత్తయి 16:13-20; లూకా 9:18-21*)

27యేసు తన శిష్యులతో కలిసి, కైసరయ ఫిలిప్పి
పట్టణానికి చుట్టూవున్న పల్లెలకు వెళ్ళాడు. దారిలో
యేసు వాళ్ళతో, “ప్రజలు నేనెవరని అనుకొంటు
న్నారు?” అని అడిగాడు.
28వాళ్ళు, “బాప్తిస్మము నిచ్చే యోహాను అని
కొందరు, ఏలీయా అని కొందరు, ప్రవక్తలలో ఒకడై

---

**పులుపు** అంటే దుష్ప్రచారము.

**“గ్రామంలోకి వెళ్ళవద్దు”** కొన్ని ప్రతుల్లో ‘వెళ్ళి గ్రామంలో ఎవ్వరికీ చెప్పవద్దు ’అని ఉంది .

ఉండవచ్చని మరికొందరు అంటున్నారు” అని సమా
ధానం చెప్పారు.
29“మరి మీ సంగతేమిటి? మీరేమంటారు?” అని
అడిగాడు.
పేతురు, “మీరే క్రీస్తు”* అని సమాధానం చెప్పాడు.
30తనను గురించి ఎవ్వరికీ చెప్పవద్దని వాళ్ళను
హెచ్చరించాడు.

## యేసు తన మరణాన్ని గురించి ముందుగా చెప్పటం

*(మత్తయి 16:21-28; లూకా 9:22-27)*

31ఆ తరుపరి యేసు వాళ్ళకు ఈ విధంగా చెప్పటం
మొదలుపెట్టాడు: “మనుష్య కుమారుడు కష్టాలు
అనుభవిస్తాడు. పెద్దలు, ప్రధానయాజకులు, శాస్త్రులు,
ఆయన్ని తృణీకరిస్తారు. ఆయన చంపబడి మూడు
రోజుల తర్వాత మళ్ళీ బ్రతికివస్తాడు.” 32యేసు ఈ
విషయాన్ని గురించి స్పష్టంగా మాట్లా డాడు. పేతురు
ఆయన చేయిపట్టుకొని వారించటం మొదలుపెట్టాడు.
33కాని యేసు వెనక్కు తిరిగి తన శిష్యుల వైపు
ఒకసారి చూసి, పేతురుతో “సైతానా! నాముందు
నుండి వెళ్ళిపో! నీవు మానవరీతిగా ఆలోచిస్తున్నావు
కాని, దేవుని రీతిగా కాదు” అని అన్నాడు.
34ఆ తర్వాత తన శిష్యుల్ని, ప్రజల్ని దగ్గరకు
పిలిచి, “మీరు నన్ను అనుసరింపదలిస్తే, తనను తాను
విసర్జించుకొని తన సిలువను మోస్తూ అనుసరించాలి.
35ఎందుకంటే, తన ప్రాణాన్ని కాపాడుకోవాలను కొన్న
వాడు దాన్ని పోగొట్టుకొంటాడు. కాని నాకోసం,
సువార్త కోసం ప్రాణాన్ని పోగొట్టుకొన్నవాడు దాన్ని
కాపాడుకొంటాడు. 36ప్రపంచాన్నంతా జయించి తన
ప్రాణాన్ని వదులుకొన్న మనిషికి ఏంలాభం కలుగు
తుంది? 37తన ప్రాణాన్ని తిరిగి పొందటానికి మనిషి
ఏంయివ్వగలడు? 38ఈ తరం వ్యభిచారంతో,
పాపంతో, నిండివుంది. నా విషయంలో కాని, నా
బోధనల విషయంలో కాని ఎవ్వడు సిగ్గుపడతాడో,
మనుష్య కుమారుడు తండ్రి తేజస్సుతో, పవిత్రమైన
దేవదూతలతో కలసి వచ్చినప్పుడు వాని విషయంలో
సిగ్గుపడతాడు.”
9 ఆయన వాళ్ళతో, “ఇది నిజం. ఇక్కడ నిలు
చున్న వాళ్ళలో కొందరు దేవుని రాజ్యం శక్తితో
రావటం చూస్తారు. దానికి ముందు వాళ్ళు మరణిం
చరు” అని అన్నాడు.

## దివ్యరూపం

*(మత్తయి 17:1-13; లూకా 9:28-36)*

2ఆరురోజుల తర్వాత యేసు పేతురును, యాకో
బును, యోహానును ఒక ఎత్తైన కొండ మీదికి తనవెంట
పిలుచుకు వెళ్ళాడు. వాళ్ళు అక్కడ ఏకాంతంగా
ఉన్నారు. అక్కడ యేసు వాళ్ళ సమక్షంలో దివ్యరూపం
పొందాడు. 3ఆయన దుస్తులు మెరువ సాగాయి.
ప్రపంచంలో ఏ చాకలి చలువ చేయలేనంత తెల్లగా
మారిపొయ్యాయి. 4ఏలీయా, మోషేలు ప్రత్యక్షమ
య్యారు. వాళ్ళు యేసుతో మాట్లాడటం శిష్యులు
చూసారు.
5పేతురు యేసుతో, “రబ్బీ! మనమిక్కడే ఉండటం
మంచిది. మేము మూడు పర్ణశాలలు వేస్తాము.
మీకొకటి, మోషే కొకటి, ఏలీయా కొకటి” అన్నాడు
6శిష్యులు భయపడుతూ ఉండటం వల్ల పేతురుకు
ఏమనాలో తోచలేదు.
7అప్పుడు ఒక మేఘం కనిపించి వాళ్ళను కప్పి
వేసింది. ఆ మేఘం నుండి, “ఈయన నా ప్రియమైన
కుమారుడు. ఈయన మాట వినండి” అని అనటం
వినిపించింది.
8వెంటనే వాళ్ళు తమ చుట్టూ చూశారు. మిగతా
యిద్దరూ వాళ్ళకు కనిపించలేదు. యేసు మాత్రమే
కనిపించాడు.
9వాళ్ళు కొండదిగి క్రిందికి వస్తుండగా యేసు,
“మనుష్యకుమారుడు చనిపోయి బ్రతికి వచ్చేవరకు
మీరు చూసిన దృశ్యాన్ని ఎవ్వరికీ చెప్పకండి” అని
ఆజ్ఞాపించాడు.
10అందువల్ల వాళ్ళావిషయాన్ని తమలోనే దాచు
కొని, చనిపోయి బ్రతికి రావటాన్ని గురించి చర్చించు
కొన్నారు.
11వాళ్ళాయనతో, “ఏలీయా మొదట రావాలని
శాస్త్రులు ఎందుకంటున్నారు?” అని అడిగారు.
12యేసు సమాధానం చెబుతూ, “ఏలీయా మొదట
వచ్చినప్పుడు సరి చేస్తాడన్నమాట నిజం. కాని,
మనుష్యకుమారుడు కష్టాలను అనుభవించాలని, తృణీ
కరింపబడాలని ధర్మశాస్త్రంలో ఎందుకు వ్రాసారు?
13ఏలీయా వచ్చాడు. లేఖనాల్లో వ్రాసిన విధంగా ప్రజలు
చేయాలనుకొన్నవన్నీ ఇతనికి చేసారు” అని అన్నాడు

## దయ్యం పట్టిన బాలునికి నయం చెయ్యటం

*(మత్తయి 17:14-20; లూకా 9:37-43)*

14వీళ్ళు మిగతా శిష్యుల దగ్గరకు వచ్చారు. అక్కడ
ఒక పెద్ద ప్రజల గుంపు శిష్యుల చుట్టూ ఉండటం,
వాళ్ళతో ఏవో వాదిస్తూ ఉండటం చూసారు.
15యేసును చూడగానే అక్కడున్న వాళ్ళందరూ ఆశ్చ
ర్యపడి స్వాగతం చెప్పటానికి ఆయన దగ్గరకు
పరుగెత్తారు.
16యేసు శిష్యులను, “వాళ్ళతో మీరేమి వాదిస్తు
న్నారు” అని అడిగాడు.
17ఆ గుంపులో నుండి ఒకడు, “అయ్యా! నేను
నా కుమారుణ్ణి మీదగ్గరకు పిలుచుకు వచ్చాను.

---

“క్రీస్తు” లేక మెస్సీయ.

దయ్యం పట్టి అతనికి మాట పడిపోయింది. 18ఆ
దయ్యం మీదికి వచ్చినప్పుడంతా అది అతణ్ణి నేలపై
పడ వేస్తుంది. అప్పుడు నా కుమారుని నోటినుండి
నురుగు వస్తుంది. పండ్లు కొరుకుతాడు. అతని శరీరం
కట్టెబారిపోతుంది. ఆ దయ్యాల్ని వదిలించమని మీ
శిష్యుల్ని అడిగాను. కాని వాళ్ళు ఆ పని చేయలేక
పోయారు" అని అన్నాడు.
19యేసు, "ఈనాటి వాళ్ళలో విశ్వాసం లేదు.
నేనెంత కాలమని మీతో ఉండాలి? ఎంతకాలమని
మిమ్మల్ని భరించాలి? ఆ బాలుణ్ణి నా దగ్గరకు పిలు
చుకురండి" అని అన్నాడు.
20వాళ్ళు ఆ బాలుణ్ణి పిలుచుకు వచ్చారు. ఆ
దయ్యం యేసును చూసిన వెంటనే, ఆ బాలుణ్ణి
వణికేటట్లు చేసింది. ఆ బాలుడు క్రింద పడ్డాడు.
నురుగు కక్కుతూ పొర్లాడటం మొదలు పెట్టాడు.
21యేసు ఆ బాలుని తండ్రితో, "ఎంత కాలం
నుండి యితడీవిధంగా ఉన్నాడు?" అని అడిగాడు.
"చిన్ననాటి నుండి" అని అతడు సమాధానం
చెప్పాడు. 22"ఆ దయ్యం అతణ్ణి చంపాలని ఎన్నో
సార్లు అతణ్ణి నిప్పుల్లో, నీళ్ళలో పడవేసింది. మీరేదైనా
చేయగల్గితే మా మీద దయవుంచి మాకు సహాయం
చెయ్యండి" అని అ బాలుని తండ్రి అన్నాడు.
23యేసు, "నీవు విశ్వసించగలిగితే, విశ్వాసమున్న
వానికి ఏదైనా సాధ్యమౌతుంది" అని అన్నాడు.
24వెంటనే ఆ బాలుని తండ్రి, "నేను విశ్వసిస్తు
న్నాను. నాలో ఉన్న అపనమ్మకం తొలిగిపోవటానికి
సహాయపడండి" అన్నాడు.
25యేసు ప్రజలగుంపు తన దగ్గరకు పరుగెత్తు
కుంటూ రావటం చూసి ఆ దయ్యంతో, "ఓ చెవిటి,
మూగ దయ్యమా! అతని నుండి బయటకు రమ్మని,
మళ్ళీ అతనిలో ప్రవేశించవద్దని నేను ఆజ్ఞాపిస్తున్నాను"
అని అన్నాడు.
26ఆ దయ్యం కేకపెట్టి అతణ్ణి తీవ్రంగా వణికించి
బయటకు వచ్చింది. ఆ బాలుడు శవంలా పడివుండుట
వల్ల చాలా మంది అతడు చనిపొయ్యాడనుకొన్నారు.
27కాని, యేసు అతని చేతులు పట్టుకొని లేపి నిలుచో
బెట్టాడు.
28ఇంట్లోకి వెళ్ళాక శిష్యులు రహస్యంగా, "మేమెం
దుకు వెళ్ళగొట్టలేక పొయ్యాము?" అని అడిగారు.
29యేసు, "ఈ రకమైన దయ్యాన్ని ప్రార్థనతో*
మాత్రమే వెళ్ళగొట్టగలము" అని సమాధానం
చెప్పాడు.
30-31వాళ్ళా ప్రాంతాన్ని వదిలి గలిలయ ద్వారా
ప్రయాణం సాగించారు. యేసు తన శిష్యులకు
బోధిస్తూ ఉండటం వల్ల తామెక్కడ ఉన్నది కూడా
ఎవ్వరికీ తెలియకూడదని ఆశించాడు. ఆయన
వాళ్ళతో, "ఒకడు మనుష్యకుమారునికి ద్రోహం చేసి
శత్రువులకు అప్పగిస్తాడు. వాళ్ళాయన్ని చంపుతారు.
మూడు రోజుల తర్వాత ఆయన తిరిగి బ్రతికివస్తాడు"
అని అన్నాడు. 32కాని యేసు చెప్పింది శిష్యులకు
అర్థంకాలేదు. దాన్ని గురించి అడగటానికి వాళ్ళకు
భయం వేసింది.

## ఎవరు గొప్ప

(మత్తయి *18:1-5;* లూకా *9:46-48*)

33వాళ్ళు కపెర్నహూము అనే పట్టణాన్ని చేరు
కొన్నారు. అందరూ యింట్లోకి వెళ్ళాక యేసు
వాళ్ళతో, "దార్లో దేన్ని గురించి చర్చించుకొన్నారు?"
అని అడిగాడు. 34వాళ్ళు వచ్చేటప్పుడు అందరికన్నా
గొప్ప వాడెవరన్న విషయాన్ని గురించి చర్చించారు.
కాబట్టి అందరూ మౌనంగా ఉండిపొయ్యారు.
35యేసు కూర్చుంటూ, పన్నెండుగురిని పిలిచి,
"ముఖ్యస్థానాన్ని వహించాలనుకొన్నవాడు అందరికన్నా
చివరన ఉండి సేవచేయ్యాలి" అని అన్నాడు.
36ఒక బాలుణ్ణి పిలుచుకు వచ్చి వాళ్ళ మధ్య
నిలుచోబెట్టాడు. ఆ బాలుణ్ణి ఎత్తుకొని, 37"నా పేరిట
ఇలాంటి పసివానిని అంగీకరించే వాడు నన్ను అంగీక
రించినవానిగా పరిగణింపబడతాడు. నన్ను అంగీకరించే
వాడు నన్నే కాదు, నన్ను పంపినవానిని కూడా అంగీ
కరిస్తాడు" అని అన్నాడు.
38"బోధకుడా! ఒకడు, మీ పేరిట దయ్యాల్ని
వదిలించటం మేము చూశాము. అతడు మనవాడు
కానందువల్ల అలా చెయ్యటం మానెయ్యమని అతనికి
చెప్పాము" అని యోహాను అన్నాడు.
39యేసు ఈ విధంగా అన్నాడు: "అతణ్ణి ఆపకండి,
నా పేరిట అద్భుతం చేసిన వాడు నాకు వ్యతిరేకంగా
మాట్లాడలేడు. 40ఎందుకంటే, మనకు వ్యతిరేకంగా
లేనివాడు మన పక్షాన ఉన్న వానితో సమానము.
41ఇది నిజం, మీరు క్రీస్తుకు చెందిన వాళ్ళని గమనించి
నా పేరిట ఒక గిన్నెడు నీళ్ళు మీకు త్రాగటానికి
యిచ్చినవాడు తప్పక ప్రతిఫలం పొందుతాడు.

## పాపానికి కారకుడు అవటం

(మత్తయి *18:6-9;* లూకా *17:1-2*)

42"నన్ను విశ్వసించే ఈ పసివాళ్ళు పాపం చేయ
టానికి కారకులు అవటం కన్నా మెడకు ఒక పెద్ద
తిరుగటిరాయి కట్టుకొని సముద్రంలో పడటం మేలు.
43మీరు పాపం చెయ్యటానికి మీ చేయి కారణమైతే
దాన్ని నరికి వేయండి. ఆరని మంటలు మండే నరకానికి
రెండు చేతులతో వెళ్ళటం కన్నా, అవిటివానిగా నిత్య

---

**ప్రార్థనతో** ప్రాచీన ప్రతులలో "ఉపవాసము వలననే" అని చేర్చబడింది.

జీవంపొందటం ఉత్తమం. 44* 45పాపం చెయ్యటానికి
మీ కాలు కారణమైతే దాన్ని నరికివేయండి. రెండు
కాళ్ళుండి నరకంలో పడటంకన్నా కుంటివానిగా నిత్య
జీవం పొందటం ఉత్తమం. 46-47*పాపం చెయ్యటానికి
మీ కన్ను కారణమైతే దాన్ని పీకివేయండి. రెండు
కళ్ళతో నరకంలో పడటంకన్నా ఒక కన్నుతో దేవుని
రాజ్యాన్ని ప్రవేశించటం ఉత్తమం. 48అక్కడ నరకంలో
పడ్డవాళ్ళు చావరు. 'వాళ్ళను కరుస్తున్న పురుగులు
చావవు! ఆ మంటలు ఆరిపోవు'* 49ప్రతి వాడు ఈ
అగ్నిలో శిక్షననుభవిస్తాడు.

50"ఉప్పు మంచిదే. కాని దానిలో ఉన్న ఉప్పు
గుణం పోతే ఆ గుణం మళ్ళీ ఏవిధంగా తేగలరు?
కాబట్టి మీరు మంచివారై ఉండండి. ఒకరితో ఒకరు
శాంతంగా ఉండండి."

### విడాకులను గురించి

*(మత్తయి 19:1-12)*

10 యేసు ఆ ప్రాంతాన్ని వదిలి యూదయ
ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడి నుండి
యొర్దాను నది అవతల వైపునున్న ప్రాంతానికి
వెళ్ళాడు. మళ్ళీ ప్రజల గుంపులు ఆయన దగ్గరకు
వచ్చాయి. యేసు ఎప్పటిలాగే వాళ్ళకు బోధించాడు.
2కొందరు పరిసయ్యులు* ఆయన్ని పరీక్షించాలి
అనుకొని వచ్చి, "ఒక మనిషి తన భార్యకు విడాకు
లివ్వటం న్యాయ సమ్మత మేనా?" అని అడిగారు.
3యేసు, "మోషే మీకు ఏమని ఆజ్ఞాపించాడు?"
అని అడిగాడు.

4వాళ్ళు, "విడాకుల పత్రం వ్రాసి భార్యను పంపి
వేయటానికి మోషే అనుమతి ఇచ్చాడు" అని అన్నారు.
5యేసు, "మీరు దేవునికి లోబడనివారు కనుక
మోషే అలా వ్రాశాడు. 6కాని, దేవుడు తన సృష్టి
ప్రారంభించినప్పుడు ఆడ, మగ అనే జాతుల్ని సృష్టిం
చాడు'* 7అందువల్లే, పురుషుడు తన తల్లి తండ్రుల్ని
వదిలి తన భార్యతో కలిసి జీవిస్తున్నాడు.* 8వాళ్ళిద్దరూ
ఐక్యమై ఒకే దేహంగా మారిపోతారు. అందువల్ల వాళ్ళు
యిద్దరివలే కాకుండా ఒకరిలా జీవిస్తారు. 9కనుక దేవుడు
ఐక్యం చేసిన వాళ్ళను ఏ మానవుడూ వేరు చేయ
కూడదు" అని అన్నాడు.

10అంతా యింట్లోకి వచ్చాక శిష్యులు యేసును
ఈ విషయాన్ని గురించి విశదంగా చెప్పమని కోరారు.
11యేసు ఇలాగన్నాడు: "తన భార్యకు విడాకులిచ్చి
మరొక స్త్రీని వివాహం చేసుకొన్నవాడు తన భార్యకు
వ్యతిరేకంగా వ్యభిచరించినవాడౌతాడు. 12అదే విధంగా
తన భర్తకు విడాకులిచ్చి మరొక పురుషుని వివాహం
చేసుకొన్న స్త్రీ వ్యభిచారిణిగా పరిగణింపబడుతుంది."

### యేసు చిన్నపిల్లల్ని దీవించటం

*(మత్తయి 19:13-15; లూకా 18:15-17)*

13యేసు తాకాలని, ప్రజలు చిన్నపిల్లల్ని పిలుచు
కొని వస్తూవుంటే శిష్యులు వాళ్ళని గద్దించారు. 14ఇది
చూసి యేసుకు మనస్సులో బాధకలిగింది. ఆయన
వాళ్ళతో, "చిన్నపిల్లల్ని నా దగ్గరకు రానివ్వండి.
వాళ్ళను ఆపకండి. దేవుని రాజ్యం చిన్న పిల్లల్లాంటి
వారిది. 15ఇది నిజం. చిన్న పిల్లవాని వలే దేవుని
రాజ్యాన్ని స్వీకరించనివాడు ఆ రాజ్యంలోకి ప్రవేశించ
లేడు" అని అన్నాడు. 16ఆయన ఆ చిన్న పిల్లల్ని
దగ్గరకు పిలిచి వాళ్ళపై తన చేతులుంచి ఆశీర్వ
దించాడు.

### ధనవంతుడు

*(మత్తయి 19:16-30; లూకా 18:18-30)*

17యేసు బయలుదేరుతుండగా ఒక మనిషి పరుగె
త్తుకొంటూ ఆయన దగ్గరకు వచ్చి ఆయన ముందు
మోకరిల్లి, "మంచి బోధకుడా! నేను నిత్యజీవం పొందా
లంటే ఏమి చెయ్యాలి?" అని అడిగాడు.

18యేసు, "నేను మంచివాణ్ణి అని ఎందుకు అంటు
న్నావు. దేవుడు తప్ప ఎవరూ మంచి వారు కారు.
మోషే ఆజ్ఞలు నీకు తెలుసు కదా! 19హత్య చేయరాదు,
వ్యభిచారం చేయరాదు. దొంగతనము చెయ్యరాదు.
దొంగ సాక్ష్యం చెప్పరాదు. మోసం చెయ్యరాదు. నీ
తల్లి తండ్రుల్ని గౌరవించు" అని అన్నాడు.

20అతడు, "అయ్యా! నా చిన్నతనంనుండి నేను
వీటిని పాటిస్తున్నాను!" అని అన్నాడు.

21యేసు అతని వైపు చూసాడు. అతనిపై యేసుకు
అభిమానం కలిగింది. అతనితో, "నీవు యింకొకటి
చెయ్యాలి. వెళ్ళి నీ దగ్గరున్నవన్నీ అమ్మేసి పేదవాళ్ళ
కివ్వు. అప్పుడు నీకు పరలోకంలో సంపద లభిస్తుంది.
ఆ తదుపరి నన్ను అనుసరించు" అని అన్నాడు.

22ఇది విన్నాక ఆ వచ్చిన వ్యక్తి ముఖం చిన్న
బోయింది. అతని దగ్గర చాలా ధనముండటం వల్ల
దుఃఖంతో అక్కడినుండి వెళ్ళిపొయ్యాడు.

23యేసు చుట్టూ చూసి తన శిష్యులతో, "ధన
మున్నవాడు దేవుని రాజ్యంలోకి ప్రవేశించటం చాలా

---

**వచనము 44** కొన్ని ప్రాచీన గ్రీకు ప్రతులు 44వ వాక్యాన్ని చేర్చాయి. అది. 48వ వాక్యము రెండూ ఒకటే.

**వచనము 46** కొన్ని ప్రాచీన గ్రీకు ప్రతులు 46వ వాక్యాన్ని చేర్చాయి. అది. 48వ వాక్యము రెండూ ఒకటే.

**వాళ్లను … ఆరిపోవు** యెషయా 66:24.

**పరిసయ్యులు** యూదుల ధర్మశాస్త్రాన్ని, వాళ్ళ ఆచారాల్ని నిష్టగా పాటించే ఒక యూదుల శాఖ.

**దేవుడు … సృష్టించాడు** ఆది. 1:27.

**అందువల్లే … జీవిస్తున్నాడు** ఆది. 2:24.

కష్టం" అని అన్నాడు. 24శిష్యులు ఆయన మాటలకు
ఆశ్చర్యపోయారు. యేసు మళ్ళీ, "శిష్యులారా! దేవుని
రాజ్యంలో ప్రవేశించటం ఎంతో కష్టం! 25ధనవంతుడు
దేవుని రాజ్యంలోకి ప్రవేశించటం కన్నా ఒంటె సూది
రంధ్రం ద్వారా వెళ్ళటం సులభం" అని అన్నాడు.
26ఇది విని శిష్యులు యింకా ఎక్కువ ఆశ్చర్య
పడ్డారు. అలాగైతే, "ఎవరికి రక్షణ లభిస్తుంది?" అంటూ
పరస్పరం మాట్లాడుకున్నారు.
27యేసు వాళ్ళవైపు చూసి, "మానవునికి ఇది అసా
ధ్యమైన పని కాని, దేవునికి అన్నీ సాధ్యమే!" అని
అన్నాడు. 28పేతురు ఆయనతో, "మిమ్మల్ని అనుసరిం
చాలని మేము అన్నీ వదిలివేసాము" అని అన్నాడు.
29-30యేసు, "ఇది నిజం. నా కోసం, సువార్త కోసం,
తన యింటినికాని, సోదరులనుకాని, అక్క చెల్లెండ్లను
కాని, తల్లినికాని, తండ్రినికాని, సంతానాన్ని కాని, పొలా
ల్నికాని, విడిచినవాడు ఈ తరంలోనే నూరు రెట్లు
యిళ్ళను, సోదరులను, అక్క చెల్లెండ్లను, తల్లుల్ని,
సంతానాన్ని, పొలాల్ని పొందుతాడు. వీటితో పాటు
హింసల్ని కూడా పొందుతాడు. రానున్న లోకంలో
నిత్యజీవం పొందుతాడు. 31కాని ముందున్న వాళ్ళు
చివరివాళ్ళై, చివర వున్న వాళ్ళు ముందుకు వెళ్తారు"
అని అన్నాడు.

### యేసు తన మరణాన్ని గురించి మళ్ళీ ప్రవచనం చెప్పటం

(*మత్తయి 20:17-19; లూకా 18:31-34*)

32యేసు, ఆయనతో ఉన్న వాళ్ళు అంతా యెరూ
షలేము వెళ్ళటానికి బయలుదేరారు. యేసు అంద
రికన్నా ముందు నడుస్తూ ఉన్నాడు. ఆయన శిష్యులు
దిగులుతో నడుస్తూ ఉన్నారు. యేసును అనుసరిస్తున్న
యితరులు భయపడుతూ నడుస్తూ ఉన్నారు. యేసు
మళ్ళీ తన శిష్యులను ప్రక్కకు పిలిచి తనకు జరుగ
నున్న వాటిని గురించి వాళ్ళకు చెప్పాడు. 33ఆయన,
"వినండి, మనం యెరూషలేము దాకా వెళ్తున్నాము.
అక్కడ మనుష్యకుమారునికి ద్రోహం జరుగుతుంది.
ఆయన ప్రధానయాజకులకు, శాస్త్రులకు అప్పగింప
బడతాడు. వాళ్ళాయనకు మరణ శిక్ష విధించి యూదు
లుకాని వాళ్ళకు అప్పగిస్తారు. 34యూదులుకాని వాళ్ళు
ఆయన్ని హేళన చేసి ఆయన మీద ఉమ్మివేస్తారు.
ఆయన్ని కొరడా దెబ్బలుకొడతారు. ఆ తర్వాత
చంపివేస్తారు. మూడు రోజుల తర్వాత ఆయన బ్రతికి
వస్తాడు" అని అన్నాడు.

### యాకోబు మరియు యోహానుల నివేదన

(*మత్తయి 20:20-28*)

35జెబెదయి కుమారులు యాకోబు మరియు
యోహానులు ఆయన దగ్గరకు వచ్చారు. వాళ్ళు,
"బోధకుడా! మేము అడిగింది చెయ్యమని కోరుతు
న్నాము" అని అన్నారు.
36"ఏమి చెయ్యమంటారు?" అని యేసు అడిగాడు.
37వాళ్ళు, "మీరు మహిమను పొందినప్పుడు మాలో
ఒకరిని మీ కుడిచేతి వైపు, మరొకరిని మీ ఎడమ
చేతివైపు కూర్చోనివ్వండి" అని అడిగారు.
38యేసు, "మీరేమి అడుగుతున్నారో మీకు తెలి
యదు. నేను త్రాగినదాన్ని మీరు త్రాగగలరా? నేను
పొందిన బాప్తిస్మము మీరు పొందగలరా?" అని
అడిగాడు.
39"పొందగలము" అని వాళ్ళు సమాధానం
చెప్పారు. యేసు వాళ్ళతో, "నేను త్రాగిన దాన్ని మీరు
త్రాగుదురు, నేను పొందిన బాప్తిస్మము మీరు పొందు
దురు. 40కాని నా కుడివైపు, లేక నా ఎడమ వైపు
కూర్చొమనటానికి అనుమతి యిచ్చేది నేను కాదు.
ఈ స్థానాలు ఎవరి కోసం నియమించబడ్డాయో వాళ్ళు
మాత్రమే కూర్చోగలరు" అని అన్నాడు.
41ఇది విని మిగతా పది మందికి యాకోబు మరియు
యోహానులపై కోపం వచ్చింది. 42యేసు వాళ్ళను
దగ్గరకు పిలిచి, "యూదులుకాని వాళ్ళను పాలించ
వలసిన ప్రభువులు, వాళ్ళపై తమ అధికారం చూపుతూ
ఉంటారు. ఇతర అధికారులు కూడా వాళ్ళపై అధికారం
చూపుతూ ఉంటారు. ఇది మీకు తెలుసు. 43మీ
విషయంలో అలా కాదు. మీలో అందరి కన్నా గొప్ప
కావాలనుకున్నవాడు మిగతా వాళ్ళందరికీ సేవ
చేయాలి. 44మీలో ప్రాముఖ్యత పొందాలను కొన్న
వాడు మీ అందరికీ బానిసగా ఉండాలి. 45ఎందుకంటే
మనుష్యకుమారుడు కూడా సేవ చేయించు కోవటానికి
రాలేదు. కాని సేవ చేయటానికి, అందరి పక్షాన తన
ప్రాణాన్ని క్రయధనంగా ధారపోయటానికి వచ్చాడు"
అని అన్నాడు.

### బర్తిమయికి చూపు ఇవ్వటం

(*మత్తయి 20:29-34; లూకా 18:35-43*)

46ఆ తర్వాత వాళ్ళు యెరికో చేరుకున్నారు.
యేసు, ఆయన శిష్యులు, వాళ్ళతో ఉన్న ప్రజల
గుంపు ఆ పట్టణాన్ని వదిలి బయలుదేరారు. తీమయి
కుమారుడు బర్తిమయి అనే ఒక గ్రుడ్డివాడు దారి
ప్రక్కన కూర్చుని ఉండినాడు. అతడు బిక్షగాడు. 47ఆ
గ్రుడ్డివాడు, వస్తున్నది నజరేతు నివాసి యేసు అని
తెలుసుకొని, "యేసూ! దావీదు కుమారుడా! నాపై
దయ చూపు!" అని బిగ్గరగా అనటం మొదలు పెట్టాడు.
48చాలామంది అతణ్ణి తిట్టి ఊరుకో మన్నారు.
కాని ఆ గ్రుడ్డివాడు. "దావీదు కుమారుడా! నా మీద
దయ చూపు" అని యింకా బిగ్గరగా అరిచాడు.
49యేసు ఆగి, "అతణ్ణి పిలవండి" అని అన్నాడు.
వాళ్ళా గ్రుడ్డివానితో, "ధైర్యంగా లేచి నిలుచో. ఆయన

నిన్ను పిలుస్తున్నాడు" అని అన్నారు. 50ఆ గుడ్డివాడు
కప్పుకొన్న వస్త్రాన్ని ప్రక్కకు త్రోసి, గభాలున లేచి
యేసు దగ్గరకు వెళ్ళాడు.
51యేసు, "ఏమి కావాలి?" అని అడిగాడు. ఆ
గ్రుడ్డివాడు, "రబ్బీ! నాకు చూపు కావాలి" అని అన్నాడు
52యేసు, "నీ విశ్వాసం నీకు నయం చేసింది.
యిక వెళ్ళు" అని అన్నాడు.
వెంటనే అతనికి చూపు వచ్చింది. అతడు యేసును
అనుసరిస్తూ ఆయన వెంట వెళ్ళాడు.

### మెస్సీయ యెరూషలేము ప్రవేశించటం

*(మత్తయి 21:1-11; లూకా 19:28-40;
యోహాను 12:12-19)*

11 వాళ్ళు యెరూషలేము పట్టణాన్ని సమీపిం
చారు. ఒలీవలకొండ దగ్గరున్న బేత్పగే
మరియు బేతనియ గ్రామాలకు రాగానే యేసు తన
శిష్యుల్లో యిద్దరిని పంపుతూ, 2వాళ్ళతో, "ముందున్న
గ్రామానికి వెళ్ళండి. మీరాగ్రామంలోకి వెళ్ళిన వెంటనే
అక్కడ వయస్సులో ఉన్న ఒక గాడిద పిల్ల మీకు
కనబడుతుంది. అది ఒక వాకిలి ముందు కట్టబడి
ఉంటుంది. దాని మీద ఇది వరకెవ్వరూ స్వారి చెయ్య
లేదు. దాన్ని విప్పి యిక్కడకు తీసుకొని రండి. 3అలా
ఎందుకు చేస్తున్నారని మిమ్మల్ని ఎవరైనా అడిగితే,
'ప్రభువుకు కావాలి. త్వరలోనే తిరిగి పంపు తాము'*
అని సమాధానం చెప్పండి" అని అన్నాడు.
4శిష్యులు వెళ్ళి, ఇంటి ముందు వీధిలో ఒక గాడిద
ఉండటం చూసారు. వాళ్ళు దాన్ని విప్పుతుండగా
5అక్కడ నిలుచున్న కొందరు మనుష్యులు, "గాడిదను
ఎందుకు విప్పుతున్నారు?" అని అడిగారు. 6వాళ్ళు
యేసు చెప్పమన్న సమాధానం చెప్పారు. ఆ మను
ష్యులు వాళ్ళను పోనిచ్చారు. 7వాళ్ళా గాడిదను యేసు
దగ్గరకు తీసుకొని వచ్చి, తమ వస్త్రాల్ని దాని మీద
పరిచారు. యేసు దానిపై కూర్చున్నాడు. 8చాలామంది
ప్రజలు తమ వస్త్రాలను దారిమీద పరిచారు. మరి
కొందరు తోటలనుండి తెచ్చిన చెట్ల రెమ్మల్ని దారి
మీద పరిచారు. 9ముందు నడుస్తున్న వాళ్ళు, వెనుక
నడుస్తున్న వాళ్ళు,

"హోసన్నా,* ప్రభువు పేరిట వచ్చుచున్న
వాడు ధన్యుడు
కీర్తన. *118:25-26*

10 రానున్న మన తండ్రి దావీదు రాజ్యం
ధన్యమైనది. మహోన్నతుడైన వానికి
హోసన్నా!"

అని బిగ్గరగా కేకలు వేసారు.

11యేసు యెరూషలేం పట్టణం ప్రవేశించి అక్క
డున్న ఆలయానికి* వెళ్ళాడు. చుట్టూ ఉన్న వాటిని
చూసాడు. అప్పటికే ప్రొద్దు పోయి ఉండటం వల్ల
పన్నెండు గురితో కలిసి బేతనియకు వెళ్ళాడు.

### యేసు దేవాలయమును శుద్ధిచేయటం

*(మత్తయి 21:18-19)*

12మరుసటిరోజు వాళ్ళు బేతనియనుండి బయలు
దేరి వస్తుండగా యేసుకు ఆకలి వేసింది. 13కొంత
దూరంలో ఆకులున్న అంజూరపు చెట్టు ఉండటం
యేసు చూసాడు. దాని మీద పండ్లున్నాయేమో చూడా
లని దగ్గరకు వెళ్ళాడు. కాని దగ్గరకు వెళ్ళాక, అది
పండ్లు కాచేకాలం కానందువల్ల ఆయనకు ఆకులు
తప్ప పండ్లు కనిపించలేదు. 14అప్పుడు యేసు ఆ
చెట్టుతో, "ఎన్నడూ ఎవ్వరూ నీ ఫలాల్ని తినకూడ
దు!" అని అన్నాడు. ఆయన అలా అనటం శిష్యులు
విన్నారు.
15యెరూషలేము చేరుకొన్నాక యేసు దేవాల
యంలోకి ప్రవేశించి వ్యాపారం చేస్తున్న వాళ్ళను
తరిమి వేయటం మొదలుపెట్టాడు. డబ్బు మార్చే
వ్యాపారస్తుల బల్లల్ని, పావురాలు అమ్ముతున్న వ్యాపార
స్తుల బల్లల్ని క్రింద పడవేసాడు. 16దేవాలయం ద్వారా
ఎవరూ సరుకులు మోసుకు పోనీయకుండా చేసాడు.
17ఆయన బోధిస్తూ, "'నా ఆలయం అన్ని జనాంగా
లకు ప్రార్థనా ఆలయం అనిపించుకొంటుంది' అని
గ్రంథాల్లో వ్రాసారు.* కాని మీరు దాన్ని దోపిడి
దొంగలు దాచుకొనే గుహగా మార్చారు"* అని
అన్నాడు. 18అక్కడున్న ప్రజలు యేసు బోధను విని
ఆశ్చర్యపొయ్యారు. ప్రధానయాజకులు, శాస్త్రులు
భయపడి యేసును చంపటానికి మార్గం వెతకటం
మొదలు పెట్టారు. 19సాయంత్రంకాగానే ఆయన,
శిష్యులు పట్టణం వదిలి వెళ్ళిపొయ్యారు.

### ఎండిపోయిన అంజూరపు చెట్టు

*(మత్తయి 21:20-22)*

20ఉదయం ఆ దారిన నడుస్తూ వాళ్ళా అంజూరపు
చెట్టు వ్రేళ్ళు మొదలుకొని ఎండి పోయి ఉండటం

---

**ప్రభువుకు … పంపుతాము** 'ప్రభువుకు కావాలి. అది ఆయనకు అవసరమై యున్నది' అని కొన్ని ప్రతుల్లో ఉంది.

**హోసన్నా** అంటే, 'రక్షించు' అని అర్థం. కాని దాని అర్థం 'జయంగా' మారిపోయింది.

**ఆలయము** యెరూషలేములో ఉన్న ఆలయం. ప్రపంచంలో ఉన్న యూదులందరికి ఇది ఒక్కటే ఆలయం.

**నా ఆలయం … వ్రాసారు** యెషయా 56:7.

**మీరు … మార్చారు** యిర్మీయా 7:11.

గమనించారు. 21పేతురుకు యేసు అన్నమాటలు జ్ఞాపకం వచ్చి యేసుతో, “రబ్బీ! అదిగో చూడండి; మీరు శపించిన అంజూరపు చెట్టు ఎండిపోయింది” అని అన్నాడు.

22యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు. “దేవుణ్ణి విశ్వసించండి. 23ఇది నిజం. హృదయంలో అనుమానించకుండా తాను అన్నది జరుగుతుందని నమ్మి ఒక కొండతో ‘వెళ్ళి సముద్రంలో పడు’ అని అంటే, అలాగే సంభవిస్తుంది. 24అందువల్ల నేను చెప్పేదేమిటంటే, మీరు ప్రార్థించేటప్పుడు ఏది అడిగినా మీకు లభిస్తుందని సంపూర్ణంగా విశ్వసించండి. అప్పుడు మీకది లభిస్తుంది. 25అంతేకాక, మీరు ప్రార్థించటానికి నిలుచున్నప్పుడు మీకు ఎవరితోనన్న విరోధం ఉంటే అతణ్ణి క్షమించండి. అప్పుడు పరలోకంలో ఉన్న మీ తండ్రి మీ పాపాలను క్షమిస్తాడు. 26మీరు ఇతరులను క్షమించకపోతే, పరలోకంలో ఉన్న మీ తండ్రి కూడా మీ పాపాలను క్షమించడు.”*

## యేసు అధికారాన్ని ప్రశ్నించటం

*(మత్తయి 21:23-27; లూకా 20:1-8)*

27యేసు, ఆయన శిష్యులు యెరూషలేం చేరుకొన్నారు. ఆయన మందిరావరణంలో నడుస్తుండగా ప్రధానయాజకులు, శాస్త్రులు పెద్దలు ఆయన దగ్గరకు వచ్చారు. 28వాళ్ళాయన్ని, “ఎవరిచ్చిన అధికారంతో నీవు వీటిని చేస్తున్నావు? ఇవి చేయటానికి అధికారమెవరిచ్చారు?” అని అడిగారు.

29యేసు సమాధానంగా, “నన్ను ఒక్క ప్రశ్న అడుగనివ్వండి. దానికి మీరు సమాధానం చెప్పండి. అప్పుడు నేనివి ఎవరిచ్చిన అధికారంతో చేస్తున్నానో చెబుతాను. 30యోహాను బాప్తిస్మము పరలోకంలో నుండి వచ్చినదా? లేక మానవులనుండి వచ్చినదా? సమాధానం చెప్పండి” అన్నాడు.

31వాళ్ళు, ఆ విషయాన్ని గురించి పరస్పరం చర్చించుకొని, “మనం ‘పరలోకం నుండి’ అని అంటే, ‘మరి అలాగైతే మీరు యోహాన్ను ఎందుకు నమ్మలేదు?’ అని అడుగుతాడు. 32మనం ‘మానవుల నుండి’ అని అంటే ప్రజలకు మనమంటే కోపం వస్తుంది” అని అనుకున్నారు. యోహాను ఒక ప్రవక్త అని ప్రతి ఒక్కడు నమ్మటం వల్ల వాళ్ళు ప్రజలంటే భయపడ్డారు. 33కనుక వాళ్ళు, “మాకు తెలియదు.” అని సమాధానం చెప్పారు. యేసు, “అలాగైతే నేను కూడా యివి ఎవరిచ్చిన అధికారంతో చేస్తున్నానో చెప్పను” అని అన్నాడు.

## కౌలుదార్లు – కుమారుడు ఉపమానం

*(మత్తయి 21:33-46; లూకా 20:9-19)*

12 ఆ తర్వాత ఆయన వాళ్ళతో దృష్టాంతాలు చెబుతూ ఇలా మాట్లాడటం మొదలు పెట్టాడు: “ఒకడు ద్రాక్షతోట వేసి, చుట్టూ ఒక గోడ కట్టాడు. ద్రాక్షపళ్ళు త్రొక్కటానికి ఒక తొట్టి కట్టించాడు. అక్కడే ఒక గోపురం కట్టించాడు. ఆ తర్వాత ఆ ద్రాక్షతోటను కొంతమంది రైతులకు కౌలుకిచ్చి ప్రయాణమై వెళ్ళిపోయాడు. 2పంటకాలం రాగానే పంటలో తనకు రావలసిన భాగం తీసుకు రమ్మని ఒక సేవకుణ్ణి వాళ్ళ దగ్గరకు పంపాడు. 3కాని ఆ రైతులతణ్ణి పట్టుకొని కొట్టి వట్టిచేతులతో పంపివేసారు. 4ఆ తర్వాత అతడు యింకొక సేవకుణ్ణి పంపాడు. వాళ్ళతణ్ణి తలపై బాది అవమానపరిచారు. 5అతడు యింకొక సేవకుణ్ణి కూడా పంపాడు. వాళ్ళ తణ్ణి చంపివేసారు. అతడింకా చాలామందిని పంపాడు. కాని ఆ రైతులు వారిలో కొందరిని చంపారు. మరి కొందరిని కొట్టారు. 6తన ప్రియమైన కుమారుడు తప్ప పంపటానికి యింకెవ్వరూ మిగల్లేదు. వాళ్ళు తన కుమారుణ్ని గౌరవిస్తారనుకొని చివరకు తన కుమారుణ్ణి పంపాడు. 7కాని ఆ రైతులు ‘ఇతడు వారసుడు! యితణ్ణి చంపుదాం; అప్పుడు ఆ వారసత్వం మనకు దక్కు తుంది’ అని పరస్పరం మాట్లాడుకొన్నారు. 8ఆ కార ణంగా వాళ్ళతణ్ణి పట్టుకొని చంపి ఆ ద్రాక్షతోటకు అవతల పడవేసారు.

9“అప్పుడు ఆ ద్రాక్షతోట యజమాని ఏం చేస్తాడు? వచ్చి ఆ రైతుల్ని చంపేసి ఆ ద్రాక్షతోటను యితరులకు కౌలుకిస్తాడు. 10లేఖనాల్లో ఈ విధంగా వ్రాసారు: ఇది మీరు చదువలేదా?

‘ఇల్లుకట్టువాళ్ళు పనికిరాదని పారవేసిన
రాయి తలరాయిగా మారింది.
11 ఇది ప్రభువు చేసాడు. ఆ అద్భుతాన్ని
మనం కండ్లారా చూసాము.’”

*కీర్తన 118:22-23*

12ఈ దృష్టాంతం తమనుగూర్చి చెప్పాడని యూదులు గ్రహించారు. కనుక ఆయన్ని బంధించటానికి మార్గం ఆలోచించారు. కాని ప్రజల గుంపును చూసి భయపడిపొయ్యారు. అందువల్ల ఆయన్ని వదిలి వెళ్ళిపొయ్యారు.

## చక్రవర్తికి పన్నులు కట్టటం

*(మత్తయి 22:15-22; లూకా 20:20-26)*

13ఆ తర్వాత యేసును ఆయన మాటల్లో పట్టేయాలని కొంతమంది పరిసయ్యుల్ని* హేరోదు రాజు

---

**వచనము 26** కొన్ని గ్రీకు ప్రతులలో 26వ వచనం చేర్చబడింది.

**పరిసయ్యులు** యూదుల న్యాయశాస్త్రాన్ని వాళ్ళ ఆచారాల్ని నిష్ఠగా పాటించే ఒక యూదుల శాఖ.

పక్షముననున్న వాళ్ళను ఆయన దగ్గరకు పంపారు.
[14]వాళ్ళు ఆయన దగ్గరకు వచ్చి , "అయ్యా! మీరు
సత్యవంతులని మాకు తెలుసు. మీరు మానవుల మాట
లకు లొంగిపోరు. వాళ్ళెవరనే విషయం మీకు అవసరం
లేదు. సత్యమార్గాన్ని మీరు ఉన్నది ఉన్నట్లు బోధి
స్తారు. మరి చక్రవర్తికి పన్నులు కట్టటం న్యాయమా?
కాదా? [15]మేము పన్నులు కట్టాలా మానాలా?" అని
అడిగారు. యేసుకు వాళ్ళ కుట్ర తెలిసి పోయింది.
"నన్నెందుకు మోసం చేయాలని అనుకుంటున్నారు?
ఒక దేనారా* యివ్వండి. నన్ను దాన్ని చూడని
వ్వండి" అని అన్నాడు. [16]వాళ్ళు ఒక నాణాన్ని తీసుకు
వచ్చారు. యేసు, "దీని మీద ఎవరి బొమ్మ ఉంది?
ఎవరి శాసనం ఉంది?" అని అడిగాడు. "చక్రవర్తిది"
అని వాళ్ళు సమాధానం చెప్పారు.
[17]అప్పుడు యేసు వారితో, "చక్రవర్తికి చెందింది
చక్రవర్తికి యివ్వండి, దేవునికి చెందింది దేవునికి
యివ్వండి" అని అన్నాడు. ఆయన సమాధానం విని
వాళ్ళు ఆశ్చర్యపొయ్యారు.

## మళ్ళీ బ్రతికి రావటం

*(మత్తయి 22:23-33; లూకా 20:27-40)*

[18]చనిపోయిన వాళ్ళు మళ్ళీ బ్రతకరని వాదించే
సద్దూకయ్యులు ఆయన దగ్గరకు వచ్చి ఒక ప్రశ్న
వేసారు. [19]"అయ్యా, ఒకని సోదరుడు చనిపోతే, ఆ
చనిపోయిన సోదరునికి సంతానం లేకపోయినట్టయితే,
ఆ చనిపోయిన సోదరుని భార్యను బ్రతికివున్న సోద
రుడు వివాహమాడి, చనిపోయిన సోదరునికి సంతానం
కలిగేటట్లు చెయ్యాలని మోషే మనకోసం ధర్మ
శాస్త్రంలో వ్రాసాడు. [20]ఒకప్పుడు ఏడుగురు సోదరు
లుండే వాళ్ళు. మొదటివాడు వివాహం చేసుకొని
సంతానం లేకుండా చనిపొయ్యాడు. [21]రెండవ వాడు
అతని వితంతువును వివాహమాడాడు. కాని అతడు
కూడా సంతానం లేకుండా చనిపొయ్యాడు. మూడవ
వానికి కూడా అదే సంభవించింది. [22]ఆ ఏడుగురిలో
ఎవ్వరికి సంతానం కలగలేదు. చివరకు ఆ స్త్రీకూడా
చనిపోయింది. [23]చనిపోయిన వాళ్ళు బ్రతికి వచ్చి
నప్పుడు ఆమె ఎవరి భార్యగా పరిగణింపబడుతుంది?
ఆమెను ఆ ఏడుగురు పెండ్లి చేసుకొన్నారు కదా?"
అని అడిగారు.
[24]యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: "మీకు
లేఖనాలు, దేవుని శక్తి తెలియవు. కనుక పొరబడు
తున్నారు. [25]చనిపోయిన వాళ్ళు బ్రతికివచ్చాక
వివాహం చేసుకోరు. వాళ్ళు ఆడ, మగ అని ఉండరు.
వాళ్ళు పరలోకంలో ఉన్న దేవదూతల్లా ఉంటారు.
[26]ఇక చనిపోయిన వాళ్ళు బ్రతకటం విషయంలో
మోషే తాను వ్రాసిన గ్రంథంలో 'పొదను' గురించి
వ్రాసినప్పుడు, దేవుడు అతనితో, 'నేను అబ్రాహాముకు
దేవుణ్ణి, ఇస్సాక్కు దేవుణ్ణి, యాకోబుకు దేవుణ్ణి'*
అని అతనితో చెప్పాడు. [27]'నేను వాళ్ళ దేవుణ్ణి' అని
ఆయన అన్నప్పుడు, వాళ్ళు నిజంగా చనిపోలేదన్న
మాట. అంటే ఆయన బ్రతికివున్న వాళ్ళకు మాత్రమే
దేవుడు. మీరు చాలా పొరబడుతున్నారు."*

## అన్నిటికన్నా గొప్ప ఆజ్ఞ

*(మత్తయి 22:34-40; లూకా 10:25-28)*

[28]శాస్త్రుల్లో ఒకడు వచ్చి వాదన విన్నాడు. యేసు
చక్కటి సమాధానం చెప్పాడని గ్రహించి, "ఆజ్ఞలన్ని
టిలో ఏ ఆజ్ఞ ముఖ్య మైనది?" అని యేసును అడిగాడు.
[29]యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: "ఓ
ఇశ్రాయేలు జనాంగమా విను. మొదటిది ఇది: మన
ప్రభువైన దేవుడు మాత్రమే ప్రభువు. [30]నీ శక్తి, బుద్ధి,
సంపూర్ణంగా ఉపయోగిస్తూ నీ ప్రభువైన దేవుణ్ణి నీ
సంపూర్ణమైన ఆత్మతో మనస్ఫూర్తిగా ప్రేమించు,*
[31]రెండవది ఇది: నిన్ను నీవు ప్రేమించుకున్నంతగా
నీ పొరుగు వాణ్ణి ప్రేమించు.* వీటిని మించిన ఆజ్ఞ
మరొకటి లేదు."
[32]ఆ శాస్త్రి, "అయ్యా! చక్కగా చెప్పారు. దేవుడు
ఒక్కడేనని, ఆయన తప్ప మరెవ్వరూ లేరని సరిగ్గా
చెప్పారు. [33]ఆ దేవుణ్ణి సంపూర్ణమైన బుద్ధితో, సంపూర్ణ
మైన మనస్సుతో శక్తినంతా ఉపయోగిస్తూ ప్రేమించా
లని, మరియు తనను ప్రేమించు కొన్నంతగా, తన
పొరుగు వాణ్ణి ప్రేమించాలని చక్కగా చెప్పారు. ఈ
రెండు ఆజ్ఞలు, బలులకన్నా, దహన బలులకన్నా
ముఖ్యమైనవి" అని అన్నాడు.
[34]అతడు తెలివిగా చెప్పాడని యేసు గ్రహించి
అతనితో, "నీవు దేవుని రాజ్యానికి దూరంగా లేవు!"
అని అన్నాడు. ఆ తర్వాత ఆయన్ని ప్రశ్నలు అడగ
టానికి ఎవ్వరికి ధైర్యం చాలలేదు.

## క్రీస్తు ఎవరి కుమారుడు?

*(మత్తయి 22:41-46; లూకా 20:41-44)*

[35]యేసు మందిరంలో బోధిస్తూ ఈ విధంగా
అన్నాడు: "క్రీస్తు దావీదు కుమారుడని శాస్త్రులు ఎందు
కంటున్నారు? [36]దావీదే స్వయంగా పవిత్రాత్మ ద్వారా
మాట్లాడుతూ ఈ విధంగా అన్నాడు:

---

**దేనారా** అంటే ఓ వెండి నాణెము.

**'నేను ... దేవుణ్ణి'** నిర్గమ. 3:6.

**నేను ... పొరబడుతున్నారు** అబ్రాహాము, ఇస్సాకు యాకోబులు ఇంకా బ్రతికి వున్నారు.

**'నీ శక్తి, బుద్ధి ... ప్రేమించు'** ద్వితీ. 6:4,5.

**'నీ పొరుగు ... వాణ్ణి ప్రేమించు'** లేవీ. 19:18.

‘ప్రభువు, నా ప్రభువుతో ఈ విధంగా
అన్నాడు: ‘నీ శత్రువుల్ని నీ కాళ్ళ ముందు
పడవేసే వరకు నా కుడి చేతి వైపు
కూర్చొనుము.’

*కీర్తన 110:1*

37దావీదు స్వయంగా ఆయన్ని, ‘ప్రభూ!’ అని పిలి
చాడు కదా! మరి అలాంటప్పుడు క్రీస్తు దావీదు కుమా
రుడెట్లా ఔతాడు?” అక్కడున్న ప్రజలగుంపు అత్యా
నందంగా ఆయన మాటలు విన్నారు.
38యేసు యింకా ఎన్నో విషయాలు బోధిస్తూ
ఈ విధంగా అన్నాడు: “శాస్త్రుల విషయంలో జాగ్రత్తగా
ఉండండి. వాళ్ళు పొడుగాటి దుస్తులు ధరించి నడ
వాలని, సంతల్లో ప్రజలు తమకు నమస్కరించాలని
కోరుతూ ఉంటారు. 39వాళ్ళు సమాజాల్లో ముఖ్య
స్థానాలను, విందుల్లో గౌరవప్రదమైన స్థానాలను ఆక్ర
మించాలని ఆశిస్తూ ఉంటారు. 40వాళ్ళు వితంతువుల
యిండ్లను దోచుకుంటూ, పైకి మాత్రం గంటల
తరబడి ప్రార్థిస్తూవుంటారు. అలాంటి వాళ్ళను దేవుడు
అతితీవ్రంగా శిక్షిస్తాడు.”

## వితంతువు యిచ్చిన కానుక

*(లూకా 21:1-4)*

41ఒక రోజు యేసు, మందిరంలో కానుకలు వేసే
పెట్టెకు ఎదురుగా కూర్చొని ఉన్నాడు. ప్రజలు ఆ
పెట్టెలో డబ్బును వేయటం ఆయన గమనించాడు
ధనవంతులు చాలామంది పెద్ద పెద్ద మొత్తాల్ని ఆ
పెట్టెలో వేసారు. 42కాని ఒక పేద వితంతువు వచ్చి
రెండు రాగి నాణేలను ఆ పెట్టెలో వేసింది.
43యేసు తన శిష్యులను దగ్గరకు పిలిచి, “ఇది
నిజం. ఈ పేద వితంతువు ఆ పెట్టెలో అందరికన్నా
ఎక్కువ డబ్బు వేసింది. 44మిగతా వాళ్ళు తాము
దాచుకొన్న ధనంలో కొంత భాగం మాత్రమే వేసారు.
కాని ఆమె పేదదైనా తన దగ్గరున్నదంతా వేసింది”
అని అన్నాడు.

## చివరి కాలంలో జరిగే సంఘటనలు

*(మత్తయి 24:1-44; లూకా 21:5-33)*

13 యేసు మందిరం నుండి వెళ్తుండగా శిష్యుల్లో
ఒకడు, “బోధకుడా! చూడండి, ఎంత అద్భుత
మైన పెద్దరాళ్ళో! ఎంత పెద్ద కట్టడాలో చూడండి!”
అని అన్నాడు.
2యేసు సమాధానంగా, “నీవు పెద్ద కట్టడాన్ని
చూస్తున్నావా? రాయి మీద రాయి నిలువకుండా
రాళ్ళన్నీ పడిపోతాయి” అని అన్నాడు.
3యేసు మందిరానికి ఎదురుగా ఉన్న ఒలీవల
కొండపై కూర్చొన్నాడు. ఆయన వెంట ఆయన
శిష్యులు పేతురు, యాకోబు, యోహాను మరియు
అంద్రెయ ఉన్నారు. వాళ్ళు ఆయనతో 4“ఇది
ఎప్పుడు జరుగుతుందో మాకు చెప్పండి. ఇవి జరుగ
బోయే సమయం వచ్చిందని సూచించటానికి ఏం
జరుగుతుంది?” అని అడిగారు.
5యేసు వాళ్ళతో, “మిమ్మల్నెవరూ మోసం చేయ
కుండా జాగ్రత్తపడండి. 6అనేకులు నా పేరు పెట్టు
కొని వచ్చి, నేనే ఆయన్ని అని చెప్పి అనేకుల్ని
మోసం చేస్తారు. 7మీరు యుద్ధాల్ని గురించి కాని,
యుద్ధాల వదంతుల్ని గురించి కాని వింటే వెంటనే
ఆందోళన చెందకండి. అవి తప్పక సంభవిస్తాయి.
కాని అంతం అప్పుడే రాదు. 8దేశాలకు, రాజ్యాలకు
మధ్య యుద్ధాలు సంభవిస్తాయి. అనేక ప్రాంతాల్లో
భూకంపాలు వస్తాయి. కరువులు వస్తాయి. అంటే ప్రస
వించే ముందు కలిగే నొప్పులు ప్రారంభమయ్యా
యన్నమాట.
9“మీరు జాగ్రత్తగా ఉండండి. కొందరు మనుష్యులు
మిమ్మల్ని మహాసభలకు అప్పగిస్తారు. సమాజ మంది
రాల్లో మీరు కొరడా దెబ్బలు తినవలసి వస్తుంది. నా
కారణంగా మీరు రాజ్యాధికారుల ముందు, రాజుల
ముందు నిలుచొని సాక్ష్యం చెప్పవలసి వస్తుంది.
10మొదట మీరు అన్ని దేశాలకు సువార్త తప్పక ప్రక
టించాలి. 11మిమ్మల్ని బంధించి విచారణ జరపటానికి
తీసుకు వెళ్తారు. అప్పుడు మీరు ఏం మాట్లాడాలో
అని చింతించకండి. ఆ సమయంలో మీకు తోచింది
మాట్లాడండి. ఎందుకంటే, అప్పుడు మాట్లాడేది మీరు
కాదు. పవిత్రాత్మ మీ ద్వారా మాట్లాడుతాడు. 12“సోద
రులు ఒకరికొకరు ద్రోహం చేసుకొని, ఒకరి మరణానికి
ఒకరు కారకులౌతారు. అదే విధంగా తండ్రి తన కుమా
రుని యొక్క మరణానికి కారకుడౌతాడు. పిల్లలు తమ
తల్లిదండ్రులకు ఎదురు తిరిగి వాళ్ళ మరణానికి కారకు
లౌతారు. 13నా కారణంగా ప్రజలందరూ మిమ్మల్ని
ఏవగించు కొంటారు. కాని చివరిదాకా పట్టుదలతో
ఉన్న వాణ్ణి దేవుడు రక్షిస్తాడు.
14“నాశనం కలిగించేది, అసహ్యమైనది, తనది కాని
స్థానంలో నిలుచొని ఉండటం మీకు కనిపిస్తే* యూద
యలో ఉన్నవాళ్ళు కొండల మీదికి పారిపోండి.
15ఇంటి మిద్దె మీద ఉన్న వాళ్ళు క్రిందికి దిగి తమ
వస్తువులు తెచ్చుకోవటానికి తమ యిళ్ళలోకి వెళ్ళ
రాదు. 16పొలాల్లో పని చేస్తున్న వాళ్ళు తమ దుస్తులు
తెచ్చుకోవటానికి యిళ్ళకు వెళ్ళరాదు. 17గర్భిణీ
స్త్రీలకు, బాలింతలకు ఆ రోజులు ఎంత దుర్భరంగా
ఉంటాయో కదా! 18ఈ సంఘటన చలికాలంలో సంభ
వించకూడదని ప్రార్థించండి. 19ప్రపంచంలో ఇదివరకు
ఎన్నడూ, అంటే దేవుడు ఈ ప్రపంచాన్ని సృష్టించి

---

**నాశనం … కనిపిస్తే** దానియేలు 9:27; 11:31; 12:11.

ననాటి నుండి ఈనాటి వరకూ సంభవించని దుర్భ
రమైన కష్టాలు ఆ రోజుల్లో సంభవిస్తాయి. అలాంటి
కష్టాలు యిక ముందు కూడా ఎన్నడూ కలగవు.
20కాని దేవుడు ఆ రోజుల సంఖ్య తక్కువ చేసాడు.
లేకపోయినట్లయితే ఎవ్వరూ బ్రతికేవాళ్ళు కాదు.
తానెన్నుకున్న తన ప్రజల కోసం ఆ రోజుల సంఖ్యను
తగ్గించాడు. 21ఆ రోజుల్లో మీలో ఎవరైనా 'ఇదిగో!
క్రీస్తు యిక్కడ ఉన్నాడని' కాని, 'అదిగో అక్కడు
న్నాడని' కాని అంటే నమ్మకండి. 22దొంగ క్రీస్తులు,
దొంగ ప్రవక్తలు వచ్చి అద్భుతాలు, మహత్యాలు చేసి
వీలైనంత వరకు దేవుడు ఎన్నుకొన్న వాళ్ళను మోసం
చెయ్యాలని చూస్తారు. 23అందువల్ల మీరు జాగ్రత్తగా
ఉండాలని, అన్ని విషయాలు మీకు ముందే
చెబుతున్నాను.

24"కాని ఆ కష్టాలు గడిచిన తర్వాత వచ్చే రోజుల్లో

'సూర్యుడు చీకటైపోతాడు. చంద్రుడు తన
వెలుగును వెదజల్లడు.
25 ఆకాశంలోని నక్షత్రాలు రాలిపోతాయి. ఆకా
శంలో వున్నవన్నీ మార్పుచెందుతాయి.'
యెషయా *13:10; 34:4*

26"అప్పుడు మనుష్యకుమారుడు గొప్ప శక్తితో,
తేజస్సుతో మేఘాలమీద రావటం మానవులు
చూస్తారు. 27ఆయన నలువైపుల నుండి, అంటే ఈ
మూల నుండి ఆ మూల దాకా, తన దేవదూతలను
పంపి తానెన్నుకున్న ప్రజలను ప్రోగు చేయిస్తాడు.

### అంజూరపు చెట్టు పాఠం

28"అంజూరపు చెట్టును చూసి ఈ పాఠం నేర్చు
కోండి. దాని రెమ్మలు ఆకులు చిగురించుట చూసి
ఎండాకాలం రానున్నదని మీరు గ్రహిస్తారు. 29అదే
విధంగా యివి జరగటం మీరు చూసినప్పుడు ఆయన
త్వరగా రానైయున్నాడని గ్రహిస్తారు. 30ఇది నిజం.
ఈ కాలపువాళ్ళు జీవిస్తూండగానే ఇవన్ని జరుగును.
31ఆకాశం, భూమి గతించి పోతాయి కాని, నా మాటలు
ఎన్నటికి గతించిపోవు.

### ఆ దినము, ఘడియ ఎవ్వరికీ తెలియదు

32"ఆ దినము, ఆ ఘడియ ఎప్పుడు వస్తుందో,
పరలోకంలోని దేవదూతలకు గాని, కుమారునికి గాని,
మరెవ్వరికి గాని తెలియదు. అది తండ్రికి మాత్రమే
తెలుసు. 33జాగ్రత్తగా, సిద్ధంగా ఉండండి.* ఆ
సమయం ఎప్పుడు రాబోతోందో మీకు తెలియదు.
34ఇది తన యిల్లు విడిచి దూరదేశం వెళ్ళే ఒక మనిషిని
పోలి ఉంటుంది. అతడు తన యింటిని సేవకులకు
అప్పగిస్తాడు. ప్రతి సేవకునికి ఒక పని అప్పగిస్తాడు.
ద్వారం దగ్గరవున్నవానికి కాపలా కాయమని చెబుతాడు.
35ఎల్లప్పుడు సిద్ధంగా ఉండమని చెబుతాడు. ఇంటి
యజమాని ఎప్పుడు తిరిగి వస్తాడో మీకు తెలియదు.
సాయంత్రం వస్తాడో, మధ్యరాత్రి వస్తాడో, కోడికూసే
వేళకు వస్తాడో, సూర్యోదయం వేళకు వస్తాడో,
ఎప్పుడు వస్తాడో మీకు తెలియదు. 36అతడు అకస్మా
త్తుగా వచ్చి మీరు నిద్రిస్తూ ఉండటం చూస్తాడేమో.
37హెచ్చరికగా ఉండండి అని మీకు చెబుతున్నాను.
అదే ప్రతి ఒక్కనికి చెబుతున్నాను."

### బేతనియలో యేసుకు అత్తరుతో తలంటు

(*మత్తయి 26:1-5; లూకా 22:1-2;*
*యోహాను 11:45-53*)

14 పస్కా పండుగకు, పులియబెట్టని రొట్టెల
పండుగకు రెండురోజుల ముందు ప్రధాన
యాజకులు, శాస్త్రులు యేసును బంధించి చంపటానికి
పన్నాగం పన్నటం మొదలుపెట్టారు. 2"కాని పండుగ
రోజుల్లో కాదు. అలా చేస్తే ప్రజలు అల్లర్లు మొదలు
పెట్టవచ్చు' అని మాట్లాడుకొన్నారు.

3ఆ సమయంలో యేసు బేతనియలో ఉన్నాడు.
ఆయన కుష్టురోగి సీమోను ఇంట్లో భోజనానికి
కూర్చొని ఉండగా, ఒక స్త్రీ ఆ ఇంట్లోకి వచ్చింది.
ఆమె స్వచ్ఛమైన అగరు చెట్లనుండి చేసిన మిక్కిలి
విలువైన అత్తరును ఒక చలువరాతి బుడ్డిలో తన
వెంట తెచ్చింది. ఆ బుడ్డి మూత పగులగొట్టి ఆ
అత్తరును యేసు తలపై పోసింది.

4ఇది చూసి అక్కడున్న వాళ్ళలో కొందరికి కోపం
వచ్చింది. వాళ్ళు పరస్పరం, "అత్తరును ఇలా వృధా
చేయటం ఎందుకు? 5దాన్ని అమ్మితే మూడు వందల
దేనారాలు* వచ్చేవి. ఆ డబ్బు పేదవాళ్ళకు యిచ్చి
ఉండవలసింది" అని ఆ స్త్రీని గూర్చి గొణుక్కున్నారు.

6యేసు, "ఆపండి. ఆమెనెందుకు కంగారు పెడుతు
న్నారు. ఆమె మంచి పని చేసింది. 7పేదవాళ్ళు మీలో
ఎప్పుడూ ఉంటారు. మీ కిష్టం వచ్చినప్పుడు మీరు
వాళ్ళకు సహాయం చెయ్యవచ్చు. కాని నేను ఎల్లకాలం
మీతో ఉండను. 8ఆమె చేయగలిగింది ఆమె చేసింది.
నన్ను సమాధికి సిద్ధం చేయాలని ఆమె నాదేహంపై
అత్తరు పోసింది.* 9ఇది నిజం. ప్రపంచంలో సువార్త
ప్రకటించిన ప్రతిచోటా ఆమె జ్ఞాపకార్థంగా ఆమె
చేసింది కూడా చెప్పబడుతుంది" అని అన్నాడు.

---

**ఉండండి.** కొన్ని వ్రాత ప్రతులు 'ప్రార్థించండి' అని చేర్చాయి.

**మూడు వందల దేనారాలు** వెండి నాణాలు.

**అత్తరు పోసింది** ఇది యూదుల ఆచారము.

10ఆ తర్వాత పన్నెండుగురిలో ఒకడైన యూదా
ఇస్కరియోతు, యేసును ప్రధాన యాజకులకు పట్టి
వ్వటానికి వాళ్ళ దగ్గరకు వెళ్ళాడు. 11వాళ్ళు ఇది విని
చాలా ఆనందపడి, అతనికి డబ్బిస్తామని వాగ్దానం
చేసారు. అందువల్ల యూదా యేసును పట్టివ్వటానికి
తగిన అవకాశం కోసం ఎదురు చూడసాగాడు.

### ప్రభువు చివరి రాత్రి భోజనం

*(మత్తయి 26:17-25; లూకా 22:7-14, 21-23;*
*యోహాను 13:21-30)*

12పులియబెట్టని రొట్టెల పండుగ వచ్చింది.
మొదటి రోజు పస్కా గొఱ్ఱెపిల్లను బలి యివ్వటం
ఆచారం. ఆ రోజు యేసు శిష్యులు ఆయనతో,
"ఎక్కడికి వెళ్ళి పస్కా* పండుగ భోజనం సిద్ధం
చెయ్యమంటారు?" అని అడిగారు.
13యేసు తన శిష్యుల్లో యిద్దరిని పంపుతూ
వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: "నగరంలోకి వెళ్ళండి.
నీళ్ళ కడవనెత్తుకొని వస్తున్న ఒక మనిషి మీకు కని
పిస్తాడు. అతణ్ణి అనుసరించండి. 14అతడు ప్రవే శించిన
యింటి యజమానితో, అతిథులు ఉండే గది ఎక్క
డుందో బోధకుడు అడగమన్నాడని, ఆయన తన
శిష్యులతో కలిసి ఆ గదిలో పస్కా పండుగ భోజనం
చెయ్యాలని అనుకుంటున్నాడని, నేను అన్నట్లు
చెప్పండి. 15అన్ని వస్తువులతో సిద్ధంగా ఉన్న మేడ
మీది విశాలమైన గదిని అతడు మీకు చూపుతాడు.
మనకోసం అక్కడ భోజనం ఏర్పాటు చేయండి."
16శిష్యులు పట్టణంలోకి వెళ్ళారు. యేసు చెప్పి
నట్లే అన్నీ జరిగాయి. వాళ్ళు పస్కా పండుగ భోజనం
సిద్ధం చేసారు.
17సాయంత్రం కాగానే యేసు పన్నెండు గురితో
కలిసి వచ్చాడు. 18వాళ్ళంతా బల్లముందు కూర్చొని
భోజనం చేస్తూవున్నారు. అప్పుడు యేసు వాళ్ళతో,
"ఇది నిజం. మీలో ఒకడు అంటే ప్రస్తుతం నాతో
కూర్చొని భోజనం చేస్తున్నవాళ్ళలో ఒకడు, నాకు
ద్రోహం చేస్తాడు" అని అన్నాడు.
19వాళ్ళకు దుఃఖం వచ్చింది. 'ఖచ్చితంగా నేను
కాదుగదా ప్రభూ' అని ఒకరి తర్వాత ఒకరు ఆయనతో
అన్నారు.
20యేసు, "మీ పన్నెండుగురిలో ఒకడు, నాతో
కలిసి రొట్టె గిన్నెలో ముంచేవాడు, నాకు ద్రోహం
చేస్తాడు. 21లేఖనాల్లో వ్రాసిన విధంగా మనుష్య కుమా
రుడు వెళ్ళి పోవుచున్నాడు. కాని మనుష్యకుమారునికి
ద్రోహం చేసినవాడు శాపగ్రస్తుడౌతాడు. వాడు జన్మించి
వుండకపోతే బాగుండేది" అని అన్నాడు. 22అంతా
భోజనం చేస్తుండగా, యేసు రొట్టె తీసు కొని దేవునికి
కృతజ్ఞతలు చెప్పాడు. దాన్ని విరిచి శిష్యులకిస్తూ,
"ఇది నా దేహం. దీన్ని తీసుకొండి" అని అన్నాడు.
23ఆ తర్వాత గిన్నె తీసుకొని దేవునికి కృతజ్ఞతలు
చెప్పి వాళ్ళకిచ్చాడు. వాళ్ళందరూ ఆ గిన్నె నుండి
త్రాగారు. 24ఇది నా నిబంధన* రక్తం. ఆ రక్తాన్ని
అందరికోసం కార్చాను. 25ఇది నిజం. నేను దేవుని
రాజ్యంలో ప్రవేశించి క్రొత్త ద్రాక్షారసం త్రాగేదాకా,
యిప్పుడు తప్ప మరెప్పుడూ ద్రాక్షారసం త్రాగను"
అని యేసు అన్నాడు. 26వాళ్ళు ఒక భక్తిగీతం పాడాక
ఒలీవల కొండ మీదికి వెళ్ళారు.

### యేసు ఎవరో తెలియదంటాడని ఆయన చెప్పటం

*(మత్తయి 26:31-35; లూకా 22:31-34;*
*యోహాను 13:36-38)*

27యేసు వాళ్ళతో, "మీ మనస్సులు చెదరి
పోతాయి. ఎందుకంటే లేఖనాల్లో,

'నేను గొఱ్ఱెల కాపరిని కొడతాను! గొఱ్ఱె
లన్నీ చెదరిపోతాయి!' *జెకర్యా 13:7*

అని వ్రాయబడింది.

28"కాని, నేను బ్రతికివచ్చాక మీకన్నా ముందుగా గలిల
యకు వెళ్తాను" అని యేసు వాళ్ళతో అన్నాడు.
29అప్పుడు పేతురు, "అందరి విశ్వాసం పోయినా
నా విశ్వాసం సన్నగిల్లదు" అని అన్నాడు. 30యేసు
సమాధానంగా, "ఇది నిజం. ఈ రోజు, అంటే ఈ
రాత్రి కోడి రెండు* సార్లు కూయకముందే నీవు
మూడుసార్లు నేనెవరో తెలియదంటావు" అని
అన్నాడు. 31కాని పేతురు ఎన్నటికి అలా అనని
అంటూ, "నేను మీతో మరణించవలసి వచ్చినా సరే
నేనెన్నటికీ మీరెవరో తెలియదనను" అని అన్నాడు.
మిగతా శిష్యులు కూడా అదేవిధంగా అన్నారు.

### గెత్సేమనె

*(మత్తయి 26:36-46; లూకా 22:39-46)*

32అంతా గెత్సేమనె అనే స్థలానికి వెళ్ళారు. అక్కడ
యేసు తన శిష్యులతో, "నేను ప్రార్థించి వచ్చేదాకా
మీరిక్కడే ఉండండి" అని అన్నాడు. 33కాని యేసు
పేతురును, యాకోబును, యోహానును, తన వెంట
పిలుచుకు వెళ్ళాడు. ఆయనకు చాలా దుఃఖం,* ఆవే
దన కలగటం మొదలుపెట్టింది. 34ఆయన వాళ్ళతో,
"నా ఆత్మ ప్రాణం పోయేటంత దుఃఖాన్ని అనుభ

---

**పస్కా** ముఖ్యమైన యూదుల పండుగ.

**నిబంధన** కొన్ని వ్రాతప్రతులు 'క్రొత్త' అని చేర్చాయి.

**రెండు** కొన్ని ప్రాచీన ప్రతులలో 'రెండు' అన్న సంఖ్య
లేదు.

**దుఃఖం** అంటే మరణము.

విస్తోంది. ఇక్కడే కూర్చొని మెలకువతో ఉండండి”
అని అన్నాడు. 35ఆయన కొంత దూరం వెళ్ళి
నేలపై మోకరిల్లి వీలైతే ‘ఆ ఘడియ’ రాకూడదని
ప్రార్థిస్తూ, 36ఆయన, “అబ్బా తండ్రీ! నీ కన్నీ సాధ్యం.
ఈ దుఃఖాన్ని నాకు దూరంగా తీసివేయి. కాని, నెరవేర
వలసింది నా కోరిక కాదు, నీది” అని అన్నాడు.
37ఆయన వచ్చి తన శిష్యులు నిద్రిస్తుండడం
చూసాడు. ఆయన పేతురుతో, “సీమోనూ! నిద్రిస్తు
న్నావా, ఒక గంట మేలుకో లేక పాయావా? 38మెలకు
వతో ఉండండి. ప్రార్థించండి. అప్పుడే మీరు సైతాను
ప్రేరణకు లొంగకుండా ఉంటారు. ఆత్మ సిద్ధమే కాని
శరీరంలో బలం లేదు” అని అన్నాడు.
39యేసు, మళ్ళీ వెళ్ళి మొదటివలే ప్రార్థించాడు.
40ఆయన తిరిగివచ్చి శిష్యుల కళ్ళు భారంగా ఉండటం
వల్ల వాళ్ళు నిద్రిస్తూ వుండటం గమనించాడు. ఆయ
నకు ఏం సమాధానం చెప్పాలో శిష్యులకు తోచలేదు.
41యేసు మూడవసారి తిరిగివచ్చి వాళ్ళతో,
“ఇంకా హాయిగా నిద్రిస్తున్నారా? చాలించండి.
సమయం ఆసన్నమైంది. అదిగో చూడండి. మనుష్య
కుమారుడు పాపులకు అప్పగింపబడుతున్నాడు.
42లేవండి! వెళ్దాం రండి. అదిగో! ద్రోహి వస్తున్నాడు!”
అని అన్నాడు.

### యేసును బంధించటం

(*మత్తయి 26:47-56; లూకా 22:47-53;*
*యోహాను 18:3-12*)

43అయన ఇంకా మాట్లాడుతుండగా పన్నెండు
గురిలో ఒకడైన యూదా వచ్చాడు. ప్రధాన యాజ
కులు, శాస్త్రులు, పెద్దలు పంపిన ప్రజలు కత్తులు,
కర్రలు పట్టుకొని యూదా వెంట ఉన్నారు.
44ఆ ద్రోహి వాళ్ళతో, “నేను వెళ్ళి ఎవర్ని ముద్దు
పెట్టుకొంటానో* ఆయనే యేసు. ఆయన్ని బంధించి
భటుల మధ్య ఉంచి తీసుకు వెళ్ళండి” అని వాళ్ళతో
చెప్పాడు. ఆయన్ని ముద్దు పెట్టుకొని వాళ్ళకు సంజ్ఞ
చేస్తానని ముందే వాళ్ళతో మాట్లాడుకొన్నాడు.
45వెంటనే యూదా, యేసు దగ్గరకు వెళ్ళి, “రబ్బీ!”
అని అంటూ ఆయన్ని ముద్దు పెట్టుకొన్నాడు.
46వచ్చిన ప్రజలు యేసును బంధించారు. 47యేసు
ప్రక్కన నిలుచున్న వాడొకడు తన కత్తి తీసి
ప్రధానయాజకుని సేవకుని చెవి నరికి వేసాడు.
48యేసు, “మీరు కత్తులతో, కర్రలతో వచ్చి
బంధించటానికి నేనేమైనా దొంగనా? 49నేను ప్రతి
రోజు మందిరంలో బోధిస్తూ మీతో ఉన్నవాణ్ణే.
అప్పుడు నన్ను ఎందుకు బంధించలేదు? కాని,
లేఖనాల్లో వ్రాసింది జరిగి తీరాలి” అని అన్నాడు.
50అప్పుడు యేసు అనుచరులందరూ ఆయన్ని ఒంట
రిగా వదిలి పారిపోయారు.
51ఒక యువకుడు యేసును అనుసరిస్తూ ఉన్నాడు.
అతని వంటిమీద నడుముకు కట్టుకొన్న గుడ్డ తప్ప
మరేది లేదు. ప్రజలు వానిని కూడా గభాలున
పట్టుకున్నారు. కాని, 52అతడు తన అంగీపై వేసుకొన్న
గుడ్డ జారిరాగా అతడు దాన్ని వదిలి పారిపోయాడు.

### మహాసభ ముందు

(*మత్తయి 26:57-68; లూకా 22:54-55, 63-71;*
*యోహాను 18:13-14, 19-24*)

53వాళ్ళు యేసును ప్రధానయాజకుని దగ్గరకు
తీసుకు వెళ్ళారు. ప్రధాన యాజకులు, పెద్దలు,
శాస్త్రులు అందరూ అక్కడ సమావేశం అయ్యారు.
54పేతురు కొంత దూరంలో ఉండి వాళ్ళను అనుస
రిస్తూ ప్రధాన యాజకుని యింటి పెరట్లోకి వచ్చాడు.
భటులతో పాటు తాను కూడా చలి మంటలు వేసు
కొంటూ వాళ్ళతో కూర్చున్నాడు.
55ప్రధానయాజకులు, మహాసభకు చెందిన
అందరు సభ్యులు, యేసుకు మరణదండన విధించ
టానికి తగిన సాక్ష్యం కోసం వెతక సాగారు. కాని
వాళ్ళకు సాక్ష్యం లభించలేదు. 56చాలా మంది ప్రతి
కూలంగా దొంగసాక్ష్యం చెప్పారు. కాని వాళ్ళ సాక్ష్యాలు
ఒకదానితో ఒకటి పొసగలేదు.
57అప్పుడు కొందరు లేచి ఈ దొంగ సాక్ష్యం
చెప్పారు: 58“మానవులు కట్టిన ఈ మందిరాన్ని పడ
గొట్టి మూడు రోజుల్లో మానవులు కట్టని మరొక
మందిరాన్ని నిర్మిస్తాను’ అని అతడు అనటం మేము
విన్నాము.” 59కాని ఆ సాక్ష్యం కూడా ఒకరు ఒక
విధంగా, యింకొకరు యింకో విధంగా చెప్పారు.
60ఆ తర్వాత ప్రధాన యాజకుడు లేచి సభ్యుల
ముందు నిలుచొని యేసుతో, “నీవు సమాధానం చెప్ప
దలచుకోలేదా? వీళ్ళు నీకు వ్యతిరేకంగా సాక్ష్యం చెబు
తున్నారు కదా! నీవేమంటావు?” అని అడిగాడు. 61కాని
యేసు ఏ సమాధానం చెప్పక మౌనం వహించాడు.
ప్రధానయాజకుడు, “నీవు దేవుని కుమారుడవైన
క్రీస్తువా? మానవులు స్తుతించే దేవుని కుమారుడవా?”
అని మళ్ళీ ప్రశ్నించాడు.
62యేసు, “ఔను. సర్వశక్తి సంపన్నుడైన దేవుని
కుడిచేతి వైపు మనుష్యకుమారుడు కూర్చొని
ఉండటం, ఆయన పరలోకంలో నుండి మేఘాలపై
రావటం మీరు చూస్తారు” అని అన్నాడు.
63ప్రధానయాజకుడు తన దుస్తుల్ని చింపుకొని*

---

**ముద్దు పెట్టుకొంటానో** ఎవరి నుదురు ముద్దు పెట్టు
కొంటానో అని పాఠాంతరం.

**దుస్తుల్ని చింపుకొని** వాళ్ళు ఇలా తమ కోపం వ్యక్త పరిచే
వాళ్ళు.

"మనకు యితర సాక్ష్యాలు ఎందుకు? [64]అతడు దైవ దూషణ చేయటం మీరు విన్నారుగదా; మీ అభి ప్రాయమేమిటి?" అని సభ్యుల్ని అడిగాడు.

అందరూ మరణ దండన విధించాలని అన్నారు. [65]ఆ తర్వాత కొందరు యేసు మీద ఉమ్మివేయటం మొదలుపెట్టారు. కొందరు ఆయన కళ్ళకు గంతలు కట్టి తమ పిడికిలితో గుద్ది, "ఎవరో చెప్పుకో" అని హేళన చేసారు. కాపలాకాచే భటులు ఆయన్ని తీసుకు వెళ్ళి కొట్టారు.

### పేతురు యేసు ఎవరో తనకు తెలియదనటం
(మత్తయి *26:69-75;* లూకా *22:56-62;*
యోహాను *18:15-18, 25-27*)

[66]పేతురు, క్రింద యింటి ముందు పెరట్లో ఉన్నాడు. ప్రధానయాజకుని దాసీలలో ఒకతె అక్కడకు వచ్చింది. [67]పేతురు చలిమంటలు వేసుకొంటూ అక్కడ ఉండటం చూసి అతని దగ్గరకు వెళ్ళి అతణ్ణి పరీక్షగా చూసింది. "నజరేతు యేసుతో నీవు కూడా ఉన్నావు కదూ!" అని ఆమె పేతురుతో అన్నది.

[68]అతడు నాకు తెలియదంటూ, "నీవేం అంటున్నావో నాకు అర్థం కావటంలేదు" అని అన్నాడు. పేతురు ద్వారం వైపు వెళ్ళాడు. వెంటనే కోడికూసింది.

[69]ఆ దాసీపిల్ల పేతురును చూసి, చుట్టూ ఉన్న వాళ్ళతో ఇతడు వాళ్ళలో ఒకడు అని మళ్ళీ అన్నది. [70]మళ్ళీ పేతుర , "అది నిజం కాదు; నాకు తెలియదు" అని అన్నాడు. కొద్దిసేపయ్యాక పేతురుతో నిలుచున్న వాళ్ళు అతనితో, "నీవు కూడ గలిలయ వాడవు కనుక తప్పకుండా వాళ్ళలో ఒకడివి" అని అన్నారు.

[71]పేతురు తన మీద ఒట్టు పెట్టుకొంటూ, "ప్రమాణంగా చెబుతున్నాను. మీరు మాట్లాడుతున్న మనిషి ఎవరో నాకు తెలియదు" అన్నాడు.

[72]వెంటనే రెండవసారి* కోడికూసింది. అప్పుడు యేసు తనతో అన్న ఈ మాటలు పేతురుకు జ్ఞాపకం వచ్చాయి: "కోడి రెండు సార్లు కూయకముందే నేనెవరో తెలియదని మూడుసార్లు అంటావు." పేతురు దుఃఖం ఆపుకోలేక శోకించటం మొదలు పెట్టాడు.

### పిలాతు సమక్షంలో యేసు
(మత్తయి *27:1-2, 11-14;* లూకా *23:1-5;*
యోహాను *18:28-38*)

15 తెల్లవారుఝామున ప్రధాన యాజకులు, పెద్దలు, శాస్త్రులు, మహాసభకు చెందిన అందరు సభ్యులు కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు. వాళ్ళు యేసును బంధించి తీసుకెళ్ళి పిలాతుకు* అప్పగించారు. [2]పిలాతు, "నీవు యూదులకు రాజువా?" అని అడిగాడు. "మీరే అంటున్నారుగా!" అని యేసు సమాధానం చెప్పాడు.

[3]ప్రధానయాజకులు యేసు మీద ఎన్నో నేరాలు మోపారు. [4]అందువల్ల పిలాతు యేసుతో మళ్ళీ, "నీవు సమాధానం చెప్పదలచుకోలేదా? వాళ్ళు నీ మీద ఎన్ని నేరాలు మోపుతున్నారో చూడు!" అని అన్నాడు.

[5]అయినా యేసు సమాధానం చెప్పలేదు. ఇది చూసి పిలాతుకు చాలా ఆశ్చర్యం వేసింది.

[6]పండుగ రోజు ప్రజల కోరిక ప్రకారం ఒక నేరస్తుణ్ణి విడుదల చేయటం ఒక ఆచారం. [7]తిరుగుబాటులో పాల్గొని హత్యలు చేసిన వాళ్ళు కారాగారంలో ఉన్నారు. వాళ్ళలో బరబ్బ ఒకడు. [8]ప్రజలు పిలాతు దగ్గరకు వచ్చి ప్రతి సంవత్సరం విడుదల చేసినట్లే ఆ సంవత్సరం కూడా ఒకణ్ణి విడుదల చెయ్యమని కోరారు.

[9-10]ప్రధానయాజకులు అసూయ వల్ల యేసును తనకప్పగించారని పిలాతుకు తెలుసు. కనుక, "యూదుల రాజును విడుదల చెయ్యమంటారా?" అని అడిగాడు. [11]కాని ప్రధానయాజకులు యేసుకు మారుగా బరబ్బాను విడుదల చేసేటట్లు పిలాతును కోరమని ప్రజలను పురికొల్పారు.

[12]పిలాతు, "మరి మీరు 'యూదుల రాజు' అని పిలిచే ఈ మనిషిని ఏం చెయ్యమంటారు?" అని అడిగాడు.

[13]వాళ్ళు, "సిలువకు వేయుము!" అని కేకలు వేసారు.

[14]"ఎందుకు? అతడు చేసిన నేరమేమిటి?" అని పిలాతు అడిగాడు.

ప్రజలు యింకా బిగ్గరగా, "అతణ్ణి సిలువకు వేయండి" అని కేకలు వేసారు. [15]ఆ ప్రజల గుంపును ఆనందపరచాలని వాళ్ళు అడిగినట్లు బరబ్బను విడుదల చేసాడు. కొరడా దెబ్బలు కొట్టి సిలువకువెయ్యమని యేసును భటు లకు అప్పగించాడు.

### భటులు యేసును హేళన చేయటం

[16]భటులు యేసును రాజభవనంలో, అంటే ప్రేతోర్యమునకు తీసుకెళ్ళి, భటులందరిని సమావేశ పరచారు. [17]వాళ్ళాయనకు ఊదారంగు రాజ దుస్తులను తొడిగించారు. ముళ్ళతో ఒక కిరీటాన్ని అల్లి ఆయన తలపై పెట్టారు. [18]ఆ తర్వాత, "యూదుల రాజా! జయము!" అని ఆయన్ని పిలుస్తూ కేకలు వేసారు. [19]ఆయన తలపై కర్రతో మాటి మాటికి కొడుతూ ఆయన మీద ఉమ్మివేసారు. ఆయన ముందు వంగి తమ మోకాళ్ళపై కూర్చొని ఆయన్ని వ్యంగ్యంగా

**రెండవసారి** కొన్ని ప్రాచీన ప్రతుల్లో రెండవసారి అన్న సంఖ్యలేదు.

**పిలాతు** యూదయ రాష్ట్రపాలకుడు. క్రీ. శ. 26-36.

పూజించారు. 20ఆయన్ని హేళన చేసిన తర్వాత, ఊదా
రంగు దుస్తుల్ని తీసేసి ఆయన దుస్తుల్ని ఆయనకు
తొడిగించారు. ఆ తర్వాత ఆయన్ని సిలువకు వేయ
టానికి తీసుకు వెళ్ళారు.

## సిలువకు వేయటం

(*మత్తయి 27:32-44; లూకా 23:26-43;
యోహాను 19:17-27*)

21కురేనే పట్టణానికి చెందిన సీమోను అనే వాడొ
కడు పొలాలనుండి ఆ దారిన వెళ్తూ ఉన్నాడు. ఇతడు
అలెక్సంద్రుకు మరియు రూపునకు తండ్రి. భటులు
యితనితో బలవంతంగా సిలువ మోయించారు.
22వాళ్ళు యేసును గొల్గొతాకు తీసుకువచ్చారు.
గొల్గొతా అంటే "పుర్రెలాంటి స్థలం" అని అర్థం
23అక్కడ వాళ్ళు ఆయనకు ద్రాక్షారసంలో మత్తు కలిపి
త్రాగమని యిచ్చారు. కాని ఆయన త్రాగలేదు. 24ఆ
తర్వాత వాళ్ళాయన్ని సిలువకు వేసారు. ఆయన
దుస్తులు పంచుకోవటానికి చీట్లు వేసి ఎవరికి వచ్చినవి
వాళ్ళు తీసుకొన్నారు. 25ఆయన్ని సిలువ వేసినప్పుడు
ఉదయం తొమ్మిది గంటలు. 26ఆయనపై మోపబడిన
నేరాన్ని, "యూదులరాజగు యేసు" అని ఒక పలకపై
వ్రాసి తగిలించారు. 27ఆయనతో సహా యిద్దరు బంది
పోటు దొంగలను ఒకణ్ణి కుడి వైపు, మరొకణ్ణి
ఎడమవైపు సిలువకు వేసారు. 28 'తద్వారా ఆయన్ని
నేరస్తులతో సమాచంగా పరిగణించారు' అని శాస్త్రాల్లో
వ్రాసిన వాక్యం నిజమయింది.* 29ఆ దారి మీద
నడిచివెళ్ళే వాళ్ళు ఆయన్ని అవమాన పరచారు. వాళ్ళు
తమ తలలాడిస్తూ, "మరి మందిరాన్ని పడగొట్టి మూడు
రోజుల్లో మళ్ళీ కట్టిస్తానన్న వాడవు గదా. 30సిలువ
నుండి క్రిందికి దిగి నిన్ను నీవు కాపాడుకోలేవా?"
అని అన్నారు. 31ప్రధానయాజకులు, శాస్త్రులు కూడా
ఆయన్ని హేళన చేస్తూ "ఇతరులను రక్షించాడు కాని
తనను తాను రక్షించుకోలేడు. 32ఈ క్రీస్తు, ఈ
ఇశ్రాయేలు రాజు సిలువనుండి క్రిందికి దిగివస్తే చూసి
అప్పుడు విశ్వసిస్తాము" అని పరస్పరం మాట్లాడు
కొన్నారు. ఆయనతో సహా సిలువకు వేయబడ్డ వాళ్ళు
కూడా యేసును అవమానించారు.

## యేసు మరణం

(*మత్తయి 27:45-56; లూకా 23:44-49;
యోహాను 19:28-30*)

33మధ్యాహ్నం పన్నెండు గంటలనుండి మూడు
గంటలదాకా ఆ దేశమంతా చీకటి వ్యాపించింది.
34మూడు గంటలకు యేసు బిగ్గరగా, "ఎలోయీ,
ఎలోయీ, లామా సబక్తానీ" అంటే, "నాదేవా! నాదేవా!
నన్నెందుకు ఒంటరిగావదిలివేసావు"* అని కేకవేసాడు.
35దగ్గర నిలుచున్న కొందరు ఇది విని, "వినండి!
అతడు ఏలీయాను పిలుస్తున్నాడు" అని అన్నారు.
36ఒకడు పరుగెత్తి వెళ్ళి ఒక స్పాంజిని పులిసిన
ద్రాక్షరసంలో ముంచి ఒక కట్టెకు తగిలించి యేసుకు
త్రాగటానికి అందించాడు. మరొకడు, "అతణ్ణి వద
లండి! అతణ్ణి క్రిందికి దింపటానికి ఏలీయా వస్తాడేమో
చూద్దాం!" అని అన్నాడు.
37పెద్ద కేక పెట్టి యేసు ప్రాణం వదిలాడు.
38అప్పుడు మందిరంలోని తెర మీది నుండి క్రింది
వరకు రెండు భాగాలుగా చినిగిపోయింది. 39యేసు
ముందు నిలుచొని ఉన్న శతాధిపతి ఆయన కేక విని,*
ఆయన చనిపోయిన విధం చూసి, "ఈయన తప్పక
దేవుని కుమారుడు" అని అన్నాడు.
40కొందరు స్త్రీలు దూరం నుండి అన్నీ గమనిస్తూ
ఉన్నారు. వాళ్ళలో మగ్దలేనే మరియ, చిన్న యాకో
బుకు, యోసేపుకు తల్లి అయిన మరియ మరియు
సలోమే ఉన్నారు. 41గలిలయలో ఉన్నప్పుడు వీళ్ళు
యేసును అనుసరిస్తూ, ఆయన సేవచేస్తూ ఉండే
వాళ్ళు, వీళ్ళేగాక ఆయన వెంట యెరూషలేమునకు
వచ్చిన స్త్రీలు కూడా అక్కడ ఉన్నారు.

## యేసును సమాధి చెయ్యటం

(*మత్తయి 27:57-61; లూకా 23:50-56;
యోహాను 19:38-42*)

42అది సబ్బాతుకు సిద్ధమయ్యే రోజు, అనగా
విశ్రాంతి రోజుకు ముందు రోజు సాయంత్రమయింది.
43అరిమతయియ గ్రామస్తుడు యోసేపు ధైర్యంగా
పిలాతు దగ్గరకు వెళ్ళి యేసు దేహాన్ని అడిగాడు.
యోసేపు మహాసభలో పేరుగల సభ్యుడు. ఇతడు
స్వయంగా దేవుని రాజ్యంకొరకు కాచుకొని ఉండే
వాడు. 44యేసు అప్పుడే చనిపోయాడని విని పిలాతు
ఆశ్చర్యపడ్డాడు. శతాధిపతిని పిలిచి, "యేసు అప్పుడే
చనిపోయాడా?" అని అడిగాడు. 45ఆ సైన్యాధి పతి
ఔనని అన్నాక యేసు దేహాన్ని తీసుకు వెళ్ళటానికి
యోసేపుకు అనుమతి యిచ్చాడు. 46యోసేపు,
నారతో చేసిన వస్త్రాన్ని కొనుక్కొని వచ్చి, యేసు
దేహాన్ని క్రిందికి దింపి ఆ వస్త్రంలో చుట్టాడు. ఆ
తర్వాత ఆ దేహాన్ని తీసుకువెళ్ళి రాతితో మలచిన
సమాధిలో ఉంచాడు. ఒక రాయిని అడ్డంగా దొర్లించి
ఆ సమాధి మూసివేసాడు. 47మగ్దలేనే మరియ,
యోసేపు తల్లి మరియ ఆ దేహం ఉంచిన స్థలాన్ని
చూసారు.

---

**తద్వారం ... నిజమయింది** అని కొన్ని గ్రీకు ప్రతులలో చేర్చబడింది.

**'నాదేవా ... వేసావు'** కీర్తన. 22:1.

**విని** కొన్ని ప్రతులలో 'అతని కేక విని' అని లేదు.

### బ్రతికి రావటం

*(మత్తయి 28:1-8; లూకా 24:1-12;*
*యోహాను 20:1-10)*

16 విశ్రాంతి రోజు* ముగియగానే, మగ్దలేనే
మరియ, యాకోబు తల్లి మరియ మరియు
సలోమే యేసు దేహానికి పూయటానికి సుగంధ
ద్రవ్యాలుకొన్నారు. 2ఆదివారం ఉదయం సూర్యో
దయం అవుతుండగా వాళ్ళు సమాధి దగ్గరకు వెళ్ళాలని
బయలుదేరారు. 3“ఇంతకూ సమాధికి అడ్డంగా ఉన్న
రాయిని ఎవరు తీస్తారు?” అని పరస్పరం దారిలో
మాట్లాడుకొన్నారు.

4వాళ్ళు కళ్ళెత్తి సమాధి వైపు చూసారు. ఆ
పెద్దరాయి దొర్లిపోయి ఉంది. 5వాళ్ళు సమాధిలోకి
ప్రవేశించారు. అక్కడ దానికి కుడి వైపు ఒక యువకుడు
తెల్లటి దుస్తులు ధరించి ఉండటం చూసారు. వాళ్ళకు
భయం వేసింది.

6ఆ యువకుడు, “భయపడకండి, సిలువకు వేయ
బడిన నజరేతు యేసు కోసం చూస్తున్నారా? ఆయన
యిక్కడ లేడు. ఆయన బ్రతికి వచ్చి వెళ్ళిపొయ్యాడు.
ఆయన్ని పడుకోబెట్టిన స్థలం చూడండి. 7కాని మీరు
వెళ్ళి శిష్యులతో, ముఖ్యంగా పేతురుతో ఈ విధంగా
చెప్పండి: ‘యేసు మీకు ముందే గలిలయకు వెళ్తు
న్నాడు. ఆయన ముందే చెప్పి నట్లు, మీరు ఆయన్ని
అక్కడ చూస్తారు.’”

8ఆ స్త్రీలు దిగ్భ్రాంతిచెంది వణుకుతూ ఆ సమాధి
నుండి పరుగెత్తి పోయారు. భయం వల్ల వాళ్ళు ఎవరికీ
ఏమీ చెప్పలేదు.

---

ముఖ్యమైన ప్రాచీన వ్రాతప్రతులు మార్కు
16:8తో సమాప్తమయ్యాయి.

### యేసు కనిపించటం

*(మత్తయి 28:9-10; లూకా 24:13-35;*
*యోహాను 20:11-18)*

9యేసు ఆదివారం తెల్లవారుఝామున బ్రతికి వచ్చి
మొదట మగ్దలేనే మరియకు కనిపించాడు. గతంలో
యేసు ఈమె నుండి ఏడు దయ్యాలను వదిలించి
ఉన్నాడు. 10ఆమె ఇదివరలో యేసుతో
ఉన్నవాళ్ళ దగ్గరకు వెళ్ళింది. వాళ్ళు దుఃఖంతో
విలపిస్తూ ఉన్నారు. అమె వాళ్ళకు జరిగిన సంగతి
చెప్పింది. 11యేసు బ్రతికి ఉన్నాడని, తాను ఆయన్ని
చూసానని చెప్పింది. ఇది వాళ్ళు విన్నారు. కాని వాళ్ళు
ఆమె మాటలు నమ్మలేదు.

12ఆ తర్వాత యేసు తన యిద్దరు శిష్యులు వారి
గ్రామానికి నడుస్తుండగా మరో రూపంలో కని
పించాడు. 13వీళ్ళు తిరిగి వచ్చి జరిగిన విషయం మిగిలిన
శిష్యులకు చెప్పారు. కాని వాళ్ళు వీళ్ళను కూడా
నమ్మలేదు.

14ఆ తర్వాత పదకొండుగురు భోజనం చేస్తుండగా
యేసు వాళ్ళకు కనిపించాడు. తాను బ్రతికి వచ్చిన
విషయం కొందరు చెప్పినా శిష్యులు నమ్మలేదు. కనుక
యేసు వాళ్ళు తనను నమ్మనందుకు వాళ్ళను
గద్దించాడు.

15యేసు వాళ్ళతో, “ప్రపంచమంతా పర్యటన చేసి
ప్రజలందరికి సువార్త ప్రకటించండి. 16విశ్వసించి
బాప్తిస్మము పొందిన వాళ్ళను దేవుడు రక్షిస్తాడు. కాని,
విశ్వసించని వాళ్ళను దేవుడు శిక్షిస్తాడు. 17విశ్వసించిన
వాళ్ళకు ఈ ఋజువులు కనిపిస్తాయి. నాపేరిట వాళ్ళు
దయ్యాలను వెళ్ళగొట్టకలుగుతారు. తమకు రాని
భాషల్లో మాట్లాడకలుగుతారు. 18తమ చేతుల్తో
పాముల్ని పట్టుకో గలుగుతారు. విషం త్రాగినా వాళ్ళ
కేహానీ కలుగదు. వాళ్ళు తమ చేతుల్ని రోగులపై
ఉంచితే వాళ్ళకు నయమైపోతుంది” అని అన్నాడు.

### యేసు పరలోకానికి వెళ్ళటం

*(లూకా 24:50-53; అపొ. కా 1:9-11)*

19యేసు ప్రభువు వాళ్ళతో మాట్లాడిన తరువాత
దేవుడాయన్ని పరలోకానికి పిలుచుకొన్నాడు. ఆయన
అక్కడ దేవుని కుడిచేతి వైపున కూర్చున్నాడు.

20ఆ తర్వాత వాళ్ళు అన్ని ప్రాంతాలకు వెళ్ళి
ప్రకటించారు. ప్రభువు వాళ్ళతో సహా పని చేసి వాళ్ళు
ప్రకటించిన సందేశం నిజమని నిరూపించటానికి ఎన్నో
అద్భుతాలు చేసి చూపాడు. ఆమేన్.

---

**విశ్రాంతి రోజు** అంటే సబ్బాతు.

# లూకా సువార్త

### గౌరవనీయులైన థెయొఫిలాకు,

1 మనలో జరిగిన సంఘటల్ని మొదటి నుండి
కండ్లారా చూసి, దైవ సందేశాన్ని బోధించిన వాళ్ళు
మనకు వాటిని అందించారు. 2-3వీటన్నిటినీ నేను
మొదట నుండి క్షుణ్ణంగా పరిశోధించాను కనుక నాకు
కూడా వీటన్నిటిని క్రమపద్ధతిలో వ్రాసి మీకు అందిం
చటం ఉత్తమమనిపించింది. 4మీరు నేర్చు కొన్నవి
నిజమని మీరు తెలుసుకోవాలనే ఉద్దేశంతో నేను ఈ
గ్రంథం మీకోసం వ్రాస్తున్నాను.

### యోహాను జన్మనుగురించి ప్రవచనం

5హేరోదు* రాజు యూదయను పాలించే
కాలంలో జెకర్యా అనే ఒక యాజకుడు ఉండేవాడు.
ఇతడు అబీయా* అనబడే యాజక శాఖకు చెందిన
వాడు. ఇతని భార్య అహరోను శాఖకు చెందినది. ఆమె
పేరు ఎలీసబెతు. 6ఈ దంపతులు యధార్థంగా, దేవునికి
ప్రీతికరంగా నడుచుకుంటూ ప్రభువు ఆజ్ఞల్ని పాటిస్తూ
ఏ అపకీర్తి లేకుండా నిష్టాపరులై జీవించే వాళ్ళు, 7ఎలీస
బెతు గొడ్రాలు. పైగా వాళ్ళిద్దరూ వయస్సు మళ్ళిన
వాళ్ళు. వాళ్ళకు సంతానం కలుగలేదు."

8తన శాఖకు చెందిన వాళ్ళు చేయవలసిన వంతు
రావటం వల్ల జెకర్యా యాజక పనులు చేస్తూ ఉన్నాడు.
9దేవాలయంలో దేవునికి ధూపం వేయటానికి వాడుక
ప్రకారం చీట్లు వేసి జెకర్యాను ఎన్నుకున్నారు.
10అతడు ధూపం వేస్తుండగా బయట సమావేశమైన
భక్తులు ప్రార్థిస్తున్నారు.

11ధూపవేదికకు కుడివైపున జెకర్యాకు ఒక దేవ
దూత ప్రత్యక్షం అయ్యాడు. 12జెకర్యా అతణ్ణి చూడ
గానే ఉలిక్కి పడ్డాడు. అతనికి భయం వేసింది. 13దేవ
దూత అతనితో, "జెకర్యా భయపడకు. దేవుడు నీ
ప్రార్థనలు విన్నాడు. నీ భార్య ఎలీసబెతు ఒక మగశిశు
వును కంటుంది. ఆ పిల్లవానికి యోహాను అని నామ
కరణం చెయ్యి. 14ఇతని పుట్టుకవల్ల నీవు చాలా
ఆనందిస్తావు. నీవేకాక ప్రజలందరూ ఆనందిస్తారు.
15అతడు ఆధ్యాత్మికతతో గొప్ప వాడౌతాడు. దేవుడ
తని గొప్ప తనం చూసి ఆనందిస్తాడు. అతడు ద్రాక్షా
రసం కాని, లేక యితర రకములైన మద్యపానాల్ని
కాని ముట్టడు. పుట్టినప్పటి నుండే అతనిలో పవి
త్రాత్మ* ఉంటాడు. 16ఇశ్రాయేలు ప్రజల ప్రభువైన
దేవుని దగ్గరకు యితడు చాలా మంది ప్రజల్ని తీసుకు
వస్తాడు. 17తండ్రుల హృదయాలను పిల్లల వైపు
మళ్ళించటానికి, దేవుణ్ణి నమ్మని వాళ్ళను నీతిమంతుల
జ్ఞానం సంపాదించేటట్లు చెయ్యటానికి, ప్రభువు రాకకు
ప్రజల్ని సిద్ధపరచటానికి ఇతడు ఏలీయాలో* ఉన్న
ఆత్మ బలంతో ప్రభువు కన్నా ముందుగా వెళ్తాడు"
అని అన్నాడు.

18జెకర్యా దేవదూతతో, "మీరన్న విధంగా జరుగు
తుందన్నదానికి నిదర్శన మేమిటి? నేను ముసలి వాణ్ణి.
నా భార్యకు కూడా వయస్సు మళ్ళింది" అని అన్నాడు.

19దేవదూత ఈ విధంగా సమాధానం చెప్పాడు:
"నా పేరు గాబ్రియేలు. నేను దేవుని దూతను. నీతో
మాట్లాడి నీకీ సువార్త చెప్పుమని దేవుడు నన్ను
పంపాడు. 20జాగ్రత్త! నీవు నామాటలు నమ్మటం లేదు
కనుక మూగవాడవై పోతావు. తగిన సమయం వచ్చాక
నా మాటలు నిజమౌతాయి. అంతదాకా నీకు మాటలు
రావు."

21బయట ప్రజా సమూహం జెకర్యా దేవా
లయంలో యింతదాకా ఎందుకున్నాడో అని ఆశ్చ
ర్యంతో అతని కోసం కాచుకొని ఉన్నారు. 22జెకర్యా
వెలుపలికి వచ్చాడు. కాని వాళ్ళతో మాట్లాడలేక
పోయాడు. ఏమీ మాట్లాడలేక సంజ్ఞలు చెయ్యటం
వల్ల దేవాలయంలో అతనికి దివ్య దర్శనం కలిగినదని
అక్కడున్న వాళ్ళు గ్రహించారు.

23సేవాదినములు ముగిసాక అతడు తన యింటికి
వెళ్ళిపోయాడు.

---

**హేరోదు** యూదయకు రాజైనపెహేరోదు, క్రీ.పూ. 40-4.

**అబీయా** యూదా యాజకుల 24 శాఖలలో ఒకటి ఇది. 1దిన 24.

**పవిత్రాత్మ** ఈయన దైవత్వంలో మూడవ వ్యక్తి. ఈయన్ని దేవుని ఆత్మ, క్రీస్తు ఆత్మ, ఆదరణ కర్త అని కూడా అంటారు. ఈయన లోకంలో జనుల మధ్య దైవ కార్యాన్ని చేస్తాడు.

**ఏలీయా** క్రీ.పూ. 850 లో జీవించిన ప్రవక్త.

24కొన్ని రోజుల తర్వాత అతని భార్య ఎలీసబెతు
గర్భవతి అయింది. ఐదు నెలల దాకా ఆమె గడప
దాటలేదు. 25“ప్రభువు ఈ దశలో నాకీ గర్భం యిచ్చి
నన్ను అనుగ్రహించాడు; నలుగురిలో నాకున్న అవ
మానం తొలగించాడు” అని ఆమె అన్నది.

### యేసు జన్మిస్తాడని ప్రవచనం

26ఎలీసబెతు ఆరు నెలల గర్భంతో ఉంది. అప్పుడు
దేవుడు గాబ్రియేలు అనే దేవదూతను గలిలయలోని
నజరేతు అనే పట్టణంలో ఉన్న ఒక కన్య దగ్గరకు
పంపాడు. 27దావీదు వంశస్థుడైన యోసేపు అనే
వ్యక్తితో ఈ కన్యకు పెళ్ళి నిశ్చయమైంది. ఈ కన్య
పేరు మరియ. 28ఈ దేవదూత ఆమె దగ్గరకు వెళ్ళి
ఆమెతో, “నీకు శుభం కలుగుగాక! ప్రభువు నిన్ను
అనుగ్రహించాడు. ఆయన నీతో ఉన్నాడు” అని
అన్నాడు.
29దేవదూత మాటలు విని మరియ కంగారు పడి
ఇతని దీవెనకు అర్థమేమిటా అని ఆశ్చర్యపడింది.
30ఇది చూసి దేవదూత ఆమెతో యిలా అన్నాడు:
“భయపడకు మరియా! దేవుడు నిన్ను అను
గ్రహించాడు.
31నీవు గర్భం దాల్చి మగ శిశువును కంటావు.
ఆయనకు యేసు అని పేరు పెట్టు. 32ఆయన చాలా
గొప్ప వాడై సర్వోన్నతుడైన దేవుని కుమారుడని
పిలువబడతాడు. ప్రభువైన దేవుడు ఆయన పూర్వి
కుడైన దావీదు సింహాసనాన్ని ఆయనకు యిస్తాడు.
33యాకోబు వంశానికి చెందిన వాళ్ళందర్ని ఈయన
చిరకాలం పాలిస్తాడు. ఆయన రాజ్యం ఎన్నటికీ అంత
రించదు.”
34“నా కింకా పెండ్లి కాలేదే! ఇది ఎట్లా సాధ్యమవు
తుంది?” అని మరియ దేవదూతను అడిగింది.
35ఆ దేవదూత ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“పవిత్రాత్మ నీ మీదికి వచ్చునప్పుడు సర్వోన్నతుడైన
దేవుని శక్తి నిన్ను ఆవరిస్తుంది. అందువలన నీకు
పుట్టబోయే శిశువు పవిత్రంగా ఉంటాడు. ఆ శిశువు
దేవుని కుమారుడని పిలువబడతాడు. 36నీ బంధువు
ఎలీసబెతు తన వృద్ధాప్యంలో తల్లి కాబోతోంది. గొడ్రా
లని పిలవబడే ఆమె యిప్పుడు ఆరు నెలల గర్భంతో
ఉంది. 37దేవునికి సాధ్యం కానిది ఏదీ లేదు.”
38మరియ, “నేను దేవుని సేవకురాలను. మీరన్న
విధంగానే జరుగనీ!” అని సమాధానం చెప్పింది. ఆ
తర్వాత దేవదూత వెళ్ళిపోయాడు.

### మరియ ఎలీసబెతును కలుసుకోవటం

39మరియ వెంటనే యూదా పర్వత ప్రాంతం
లోని ఒక గ్రామానికి వెళ్ళటానికి ప్రయాణమైంది.
40ఆ గ్రామంలోనున్న జెకర్యా యింటికి వెళ్ళి ఎలీస
బెతును కలుసుకొని ఆమె క్షేమ సమాచారాలు అడిగింది.
41ఎలీసబెతు ఆమె మాటలు విన్న తక్షణమే, ఆమె
గర్భంలో ఉన్న శిశువు గంతులు వేసాడు. ఎలీసబెతు
పవిత్రాత్మతో నిండిపోయింది. 42ఆమె బిగ్గరగా,
“దేవుడు ఏ స్త్రీనీ దీవించనంతగా నిన్ను దీవించాడు.
అదే విధంగా నీ గర్భంలోనున్న శిశువు కూడా ధన్యుడు.
43కాని దేవుడు నా మీద యింత దయ ఎందుకు
చూపుతున్నాడు. నా ప్రభువు తల్లి నాదగ్గరకు రావ
టమా? 44నీ మాటలు నా చెవిలో పడగానే నా గర్భంలో
ఉన్న శిశువు ఆనందంతో గంతులు వేశాడు. 45ప్రభువు
చెప్పినట్లు జరుగుతుందని విశ్వసించావు. ధన్యు
రాలవు” అని అన్నది.

### మరియ పాడిన భక్తి గీతం

46మరియ ఈ విధంగా అన్నది:

47 “నా ఆత్మ ప్రభువును కొలిచింది. దేవుడు
చేసిన ఈ మంచికి నా మనస్సు ఆనందం
పొందింది. ఆయనే నా రక్షకుడు.
48 దీనురాల్ని నేను! ఆయన దాసీని నేను,
నన్ను కరుణించాడు! ఇక నుండి అందరూ
నన్ను ధన్యురాలంటారు!
49 దేవుడు సర్వశక్తి సంపన్నుడు. ఆయన
నాకు ఎంతో మంచి చేశాడు! ఆయన
నామం పవిత్రం!
50 తనంటే భయపడే వాళ్ళపై తరతరాలు
దయ చూపుతాడు.
51 తన బలమైన హస్తాన్ని జాపి గర్వించే
వాళ్ళను వాళ్ళ ఆలోచనల్ని అణిచి
వేస్తాడు.
52 రాజుల్ని, వాళ్ళ సింహాసనాల నుండి దింపి
వేస్తాడు. దీనులకు గొప్ప స్థానాలిస్తాడు.
53 పేదవాళ్ళ అవసరాలన్నీ తీరుస్తాడు. ధనవం
తుల్ని వట్టి చేతుల్తో పంపేస్తాడు.
54 తరతరాల నుండి మన పూర్వీకులతో,
అబ్రాహాముతో, అతని సంతతితో చెప్పి
నట్లు
55 దేవుని ఇష్టానుసారం జీవించిన ఇశ్రాయేలు
ప్రజలకు సహాయం చేశాడు. మరవకుండా
వాళ్ళపై దయ చూపాడు.”

56మరియ ఎలీసబెతు యింట్లో మూడు నెల
లుండి, ఆ తర్వాత యింటికి తిరిగి వెళ్ళిపోయింది.

### యోహాను జన్మ వృత్తాంతం

57ఎలీసబెతుకు నెలలు నిండి మగశిశువును ప్రసవిం
చింది. 58బంధువులు మరియు ఇరుగు పొరుగు వాళ్ళు
ప్రభువు ఆమెను కనికరించినందుకు ఆనందించారు.

59ఎనిమిదవ రోజు వాళ్ళు పిల్లవానికి సున్నతి
చేయటానికి వచ్చి అతనికి జెకర్యా అని అతని తండ్రి
పేరే పెట్టబోయారు. 60కాని తల్లి వారిస్తూ, “ఆ పేరు
వద్దు! యోహాను అని పేరు పెట్టండి” అని అన్నది.
61వాళ్ళు, “మీ బంధువుల్లో ఆ పేరున్న వాళ్ళు
ఎవ్వరూ లేరే?” అని అన్నారు. 62ఆ పిల్లవాని తండ్రికి
సంజ్ఞలుచేసిఅతడే పేరు పెట్టదలచాడో” అని అడిగారు.
63అతడు వ్రాయటానికి ఒక పలక నివ్వమని అడిగి
దానిపై, “అతనికి యోహాను అని పేరు పెట్టండి”
అని వ్రాసాడు. ఇది చూసి అంతా ఆశ్చర్యపోయారు.
64వెంటనే అతని నోరు, నాలుక కదిలి బాగై పోయింది.
అతడు దేవుణ్ణి స్తుతిస్తూ మాట్లాడటం మొదలు
పెట్టాడు. 65ఇరుగు పొరుగు వాళ్ళలో భక్తి, భయమూ
నిండుకుపొయ్యాయి. యూదయ పర్వత ప్రాంత
మంతా ఈ వార్త వ్యాపించింది. 66ఈ విషయం విన్న
ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపడి, “ఈ పసివాడు ఎంతగొప్ప
వాడౌతాడో కదా!” అని అన్నారు. ఆ బాలునికి ప్రభువు
హస్తం తోడుగా ఉంది.

### జెకర్యా చెప్పిన భవిష్యం

67ఆ బాలుని తండ్రి జెకర్యా పవిత్రాత్మతో నింప
బడి దేవుని సందేశాన్ని ఈ విధంగా చెప్పాడు:

68 “తన ప్రజలకు స్వేచ్ఛ కలిగించి, రక్షించ
వచ్చిన ప్రభువును స్తుతించండి! ఇశ్రా
యేలు ప్రజల దేవుణ్ణి స్తుతించండి!
69 మహాశక్తి గల రక్షకుణ్ణి తన సేవకుడైన
దావీదు వంశం నుండి మనకోసం పంపాడు.
70 గతంలో మహాత్ములైన ప్రవక్తల ద్వారా
ఈ విషయం చెప్పాడు.
71 దేవుడు శత్రువుల బారినుండి, మనను
ద్వేషించే వారినుండి, మనల్ని రక్షిస్తాడు.
72 మన తండ్రులను, తాత ముత్తాతలను,
కరుణిస్తానన్నాడు. పవిత్రమైన ఒడంబడిక
మరిచి పోనన్నాడు!
73 శత్రువుల బారినుండి రక్షిస్తానని మన తండ్రి
అబ్రాహాముతో ప్రమాణం చేశాడు.
74 మనం ఏ భయం లేకుండా తనను
సేవించాలి.
75 జీవితాంతం పవిత్రంగా, ధర్మంగా, తన
కోసం జీవించాలని ఆయన ఉద్దేశ్యం!
76 “ఓ శిశువా! నీవు సర్వోన్నతుని ప్రవక్తవని
పిలువబడతావు! ప్రభువు కన్నా ముందు
వెళ్ళి ప్రభువు రాకకు మార్గం వేస్తావు!
77 పాప క్షమాపణ ద్వారా రక్షణ కలుగు
తుందన్న జ్ఞానాన్ని ఆయన ప్రజలకు
బోధిస్తావు!
78 మన దేవుడు తన కనికరంవల్ల పరలోకం
నుండి ఒక నీతిసూర్యుణ్ణి పంపించి
79 మరణమనే చీకటి నీడలో నివసించే మనపై
ప్రకాశించునట్లు చేసి మనల్ని శాంతి
మార్గంలో నడిపిస్తాడు!”

80ఆ బాలుడు పెరిగి పెద్దవాడై ఆత్మలో బలం
పొందాడు. ఇశ్రాయేలు ప్రజలకు బోధించే సమయం
వచ్చే దాకా యోహాను ఎడారుల్లో జీవించాడు.

### యేసు జన్మ వృత్తాంతం

(*మత్తయి 1:18-25*)

2 ఇది యిలా వుండగా రోమా సామ్రాజ్యమంతటా
జనాభా లెక్కలు సేకరించటానికి కైసరు ఔగుస్తు
చక్రవర్తి ఒక ప్రకటన జారీ చేశాడు. 2కురేనియు సిరియ
దేశాన్ని పాలిస్తున్న కాలంలో మొదటి సారిగా ఇలాంటి
జనాభా లెక్కలు సేకరింపబడ్డాయి. 3అందువల్ల ప్రతి
ఒక్కరూ జాబితాలో తమ పేర్లు వ్రాయబడటానికి
తమ స్వగ్రామాలకు వెళ్ళారు.
4యోసేపు దావీదు వంశానికి చెందినవాడు కాబట్టి
అతడు గలిలయలోని నజరేతు అనే పట్టణం నుండి
యూదయ దేశంలోని దావీదు పట్టణానికి వెళ్ళాడు.
దీన్ని బేత్లెహేము అని అనే వాళ్ళు. 5మరియతో ఇతనికి
పెళ్ళి నిశ్చయమై ఉంది. మరియ గర్భంతో ఉంది.
అతడు ఆమెను తన వెంట తీసుకొని తమ పేర్లు
జాబితాలో వ్రాయించుకోటానికి వెళ్ళాడు. 6వాళ్ళక్కడ
ఉండగా ఆమెకు ప్రసవ వేదన వచ్చింది. 7ఆమె మగశి
శువును ప్రసవించింది. ఈయన ఆమె మొదటి కుమా
రుడు. వాళ్ళకు సత్రంలో గది దొరకనందువల్ల ఆమె
ఆ పసివాణ్ణి పొత్తి గుడ్డలతో చుట్టి పశువుల తొట్టిలో
ఉంచింది.

### గొఱ్ఱెల కాపరులు చూసిన దృశ్యం

8ఊరు ప్రక్క పొలాల్లో ఉన్న గొఱ్ఱెల కాపరులు
రాత్రివేళ తమ గొఱ్ఱెల్ని కాపలాకాస్తూ ఉన్నారు. 9ఒక
దేవదూత వాళ్ళకు ప్రత్యక్ష మయ్యాడు. వాళ్ళ చుట్టూ
దివ్యమైన వెలుగు ప్రకాశించింది. వాళ్ళు చాలా భయ
పడ్డారు.
10ఆ దేవదూత వాళ్ళతో, “భయపడకండి! మీకే
కాక ప్రజలందరికీ ఆనందం కలిగించే సువార్త తెచ్చాను.
11దావీదు పట్టణంలో ఈ రోజు మీకోసం రక్షకుడు
జన్మించాడు. ఆయనే మన ప్రభువు. 12మీకొక గుర్తు
చెబుతాను. పశువుల తొట్టిలో, పొత్తిగుడ్డలతో చుట్ట
బడిన ఒక పసివాడు మీకు కనిపిస్తాడు” అని అన్నాడు.
13తక్షణం పరలోకంలోనుండి చాలామంది దేవ
దూతలు వచ్చి అక్కడున్న దేవదూతతో నిలుచొని
దేవుణ్ణి స్తుతిస్తూ ఈ విధంగా అన్నారు:

14 "మహోన్నత లోకంలోవున్న దేవునికి
మహా తేజస్సు కలుగుగాక! భూమ్మీద
ఆయన ప్రేమించే ప్రజలకు శాంతి కలుగు
గాక!"

15 దేవదూతలు వాళ్ళను వదిలి పరలోకానికి వెళ్ళి
పొయ్యాక గొఱ్ఱెల కాపరులు, "జరిగిన దాన్ని గురించి
ప్రభువు మనకు చెప్పాడు. బేత్లెహేము వెళ్ళి ఇది
చూసి వద్దాం" అని మాట్లాడుకొన్నారు.
16 వాళ్ళు తక్షణం అక్కడికి వెళ్ళారు. మరియను,
యోసేపును, తొట్టిలో పడుకొనివున్న పసివాణ్ణి,
చూసారు. 17 ఆ బాలుణ్ణి చూసాక ఆయన్ని గురించి
దేవదూత తమతో చెప్పిన విషయం అందరితో
చెప్పారు. 18 వాళ్ళు చెప్పింది విని అంతా ఆశ్చర్య
పోయారు. 19 కాని, మరియ యివన్నీ మనస్సులో
భద్రంగా దాచుకొని వాటిని గురించి ఆలోచించేది.
20 గొఱ్ఱెల కాపరులు తాము విన్నవి, చూసినవి దేవ
దూత చెప్పినట్లు జరిగినందుకు వాటిని గురించి మాట్లా
డుకొంటూ దేవుణ్ణి స్తుతిస్తూ, ఆయన తేజస్సును పొగు
డుతూ తిరిగి వెళ్ళిపొయ్యారు.
21 ఎనిమిదవ రోజున సున్నతి చేయించి ఆ బాలునికి
యేసు అని నామకరణం చేసారు. మరియ గర్భవతి
కాకముందే దేవదూత ఈ పేరు మరియకు చెప్పాడు.

### బాలుని దేవాలయానికి తీసుకెళ్ళటం

22 మోషే ధర్మశాస్త్రానుసారం మరియ, యోసే
పులు పరిశుభ్రం కావలసిన సమయం వచ్చింది. వాళ్ళు
ఆ బాలుణ్ణి ప్రభువుకు అర్పించటానికి యెరూషలే
ముకు వెళ్ళారు. 23 ప్రభువు యొక్క ధర్మశాస్త్రంలో
మొదటి మగసంతానాన్ని దేవునికి సమర్పించాలి* అని
వ్రాయబడి ఉంది. 24 అంతేకాక, ప్రభువు యొక్క ధర్మ
శాస్త్రం ఆదేశించిన విధంగా వాళ్ళు వెళ్ళి రెండు పావు
రాలనైనా లేక రెండు గువ్వలనైనా బలి యివ్వా
లనుకొన్నారు.
25 ఇక్కడ యెరూషలేములో సుమెయోను అని
పిలువబడే ఒక వ్యక్తివున్నాడు. ఇతడు భక్తితో నీతిగా
జీవించేవాడు. ఇశ్రాయేలు ప్రజలకు దేవుడు ఎప్పుడు
సహాయం చేస్తాడా అని కాచుకొని ఉండేవాడు. అతడు
పవిత్రాత్మ పూర్ణుడు. 26 ప్రభువు వాగ్దానం చేసిన
క్రీస్తును చూసే వరకు మరణించడని పవిత్రాత్మ అతనికి
బయలుపర్చాడు. 27 పవిత్రాత్మ తన మీదికి రాగా అతడు
దేవాలయంలోకి వెళ్ళాడు. అదే సమయానికి ధర్మ
శాస్త్రం చెప్పిన ఆచారం నెరవేర్చడానికి మరియ,
యోసేపు బాలునితో సహా మందిరంలోకి వచ్చారు.
28 సుమెయోను ఆ బాలుణ్ణి తన చేతుల్తో ఎత్తి దేవుణ్ణి
ఈ విధంగా స్తుతించటం మొదలు పెట్టాడు:

29 "మహా ప్రభూ! నీ మాట ప్రకారం నీ సేవ
కుణ్ణి శాంతంగా వెళ్ళనివ్వు.
30 నీవు నియమించిన రక్షకుణ్ణి కళ్ళారా
చూసాను.
31 నీవు ఆయన్ని ప్రపంచములోని ప్రజలం
దరి ముందు ఎన్నుకొన్నావు!
32 యూదులుకాని వాళ్ళకు నీ మార్గాన్ని
చూపే వెలుగు ఆయనే. నీ ఇశ్రాయేలు
ప్రజల కీర్తి చిహ్నం ఆయనే!"

33 యేసు తల్లితండ్రులు అతడు చెప్పిన విష
యాలు విని ఆశ్చర్యపడ్డారు. 34 ఆ తర్వాత సుమె
యోను వాళ్ళను ఆశీర్వదించి యేసు తల్లియైన మరి
యతో ఈ విధంగా అన్నాడు: "ఈ బాలుని కారణంగా
ఎందరో ఇశ్రాయేలీయులు అభివృద్ధి చెందుతారు!
మరెందరో పడిపోతారు! ఈ బాలుడు దేవుని చిహ్నం.
ఈ చిహ్నాన్ని చాలా మంది ఎదిరిస్తారు. 35 తద్వారా
మనుష్యుల మనస్సుల్లో ఉన్న రహస్యాలు బయట
పడ్తాయి. ఒక కత్తి నీ గుండెను దూసుకుపోతుంది."
36 ఆ మందిరంలో, "అన్న" అనే ఒక ప్రవక్త్రి కూడా
ఉండేది. ఈమె పనూయేలు కుమార్తె. ఆషేరు తెగకు
చెందింది. ఆమె వయస్సులో చాలా పెద్దది. పెండ్లి
అయిన ఏడు సంవత్సరాలకే ఆమె వితంతువు అయింది.
37 అప్పటికి ఆమెకు ఎనభై నాలుగు సంవత్సరాలు.
మందిరం విడిచి వెళ్ళేది కాదు. రాత్రింబగళ్ళు
ప్రార్థించేది. ఉపవాసాలు చేసేది. 38 మరియ, యోసే
పులు అక్కడ ఉండగా ఆమె వాళ్ళ దగ్గరకు వచ్చింది.
దేవునికి కృతజ్ఞతలు చెప్పి యెరూషలేములో విముక్తి
కొరకు ఎదురు చూస్తున్న వాళ్ళందరికి ఆ బాలుణ్ణి
గురించి చెప్పింది.
39 ప్రభువు ధర్మశాస్త్రానుసారం చేయవలసినవన్నీ
చేశాక మరియ, యోసేపులు తమ స్వగ్రామమైన గలిల
యలోని నజరేతుకు తిరిగి వెళ్ళిపోయారు. 40 యేసు
పెరిగి పెద్ద వాడయ్యాడు. బలంతోపాటు తెలివి కూడా
ఆయనలో అభివృద్ధి కొనసాగింది. దేవుని అనుగ్రహం
ఆయన మీద ఉంది.

### పన్నెండు ఏండ్ల తర్వాత

41 ప్రతి సంవత్సరం ఆయన తల్లిదండ్రులు పస్కా
పండుగకు యెరూషలేము వెళ్ళేవాళ్ళు. 42 కనుక ఎప్ప
టిలాగే అలవాటు ప్రకారం యేసుకు పండ్రెండు సంవ
త్సరాలున్నప్పుడు వాళ్ళు పండుగ కోసం యెరూష
లేముకు వెళ్ళారు. 43 పండుగ తర్వాత ఆయన తల్లి
దండ్రులు తిరిగి తమ ఊరికి వెళ్ళటానికి ప్రయాణ

---

**మొదటి ... సమర్పించాలి** లేవీ. 12:8.

మయ్యారు. కాని యేసు యెరూషలేములోనే ఉండి
పొయ్యాడు. తల్లిదండ్రులకు ఇది తెలియదు. 44తమ
గుంపులో ఉన్నాడనుకొని వాళ్ళు ఒక రోజంతా
ప్రయాణం చేసారు. తమతో లేడని గ్రహించాక వాళ్ళు
తమ స్నేహితులతో, బంధువులతో ఉన్నాడనుకొని
వాళ్ళలో వెతకసాగారు. 45ఆయన కనిపించక పోయే
సరికి వాళ్ళు ఆయన్ని వెతకటానికి యెరూషలేము
తిరిగి వెళ్ళారు. 46మూడు రోజులు వెతికాక ఆయన
వాళ్ళకు మందిరంలో కూర్చొని వాళ్ళు చెప్పినవి
వింటూ, వాళ్ళను ప్రశ్నిస్తూ ఉండగా కన్పించాడు.
47ఆయనలో ఉన్న గ్రహింపు శక్తికి, ఆయన సమాధా
నాలకు అక్కడవున్న వాళ్ళంతా ఆశ్చర్యపోయారు.
48ఆయన తల్లిదండ్రులు కూడ ఆయన్ను చూసి చాలా
ఆశ్చర్య పోయారు. యేసు తల్లి ఆయనతో, "ఇలా
ఎందుకు చేసావు బాబు? నేను, మీ నాన్న దిగులుపడి
అన్ని చోట్లా వెతికాము!" అని అన్నది.
49యేసు, "నా కోసం ఎందుకు వెతికా రమ్మా!
నేను నా తండ్రి పనిలో ఉండాలని మీకు తెలియదా?"
అని అన్నాడు. 50వాళ్ళకు ఆయన అన్న మాటలు
అర్థం కాలేదు.
51ఆ తర్వాత ఆయన వాళ్ళ వెంట నజరేతుకు
వెళ్ళాడు. వినయ విధేయలతో నడుచుకునే వాడు.
కాని ఆయన తల్లి జరిగిన ఈ సంఘటనల్ని తన
మనస్సులో ఆలోచిస్తూ ఉండేది. 52యేసు జ్ఞానంలో,
బలంలో, అభివృద్ధి చెందుతూ పెరగసాగాడు. దేవుని
మెప్పు, ప్రజల మెప్పు సంపాదించాడు.

3 కైసరు తిబెరి రాజ్యపాలన చేస్తున్న పదు నైదవ
సంవత్సరములో యూదయ దేశాన్ని పొంతి
పిలాతు పాలిస్తూ ఉన్నాడు. హేరోదు గలిలయ దేశానికి
సామంతరాజుగా ఉన్నాడు.
హేరోదు తమ్ముడు ఫిలిప్పు ఇతూరయ, త్రకోనీత
ప్రాంతాలకు పాలకుడుగా ఉన్నాడు.
లుసానియా అబిలేనే రాష్ట్రానికి సామంతరాజుగా
ఉన్నాడు.
2ఇతని కాలంలోనే అన్న మరియు కయప ప్రధాన
యాజకులుగా ఉన్నారు. వీళ్ళ కాలంలోనే జెకర్యా
కుమారుడైన యోహాను అరణ్య ప్రాంతాల్లో జీవిస్తూ
ఉన్నాడు. అక్కడ అతనికి దేవుని సందేశం లభించింది.
3ఆ తర్వాత అతడు యొర్దాను నది చుట్టూ ఉన్న
ప్రాంతాలన్నీ తిరిగి, 'పాప క్షమాపణ పొందాలంటే
మారుమనస్సు కలిగి బాప్తిస్మము పొందాలి' అని బోధిం
చాడు. 4దీన్ని గురించి యెషయా ప్రవక్త గ్రంథంలో
ఈ విధంగా వ్రాయబడివుంది :

"ప్రభువు కోసం మార్గం వేయుమని ఆయన
బాటలు చక్కగా చేయుమని ఎడారి ప్రాంత
ములో ఒక గొంతు ఎలుగెత్తి పలికింది.
5 లోయలు పూడ్చివేయ బడుతాయి.
కొండలు గుట్టలు నేలమట్టమౌతాయి.
వంకర బాటలు చక్కగ ఔతాయి. కరుకు
బాటలు నునుపుగా ఔతాయి.
6 మానవులు దేవుడు ప్రసాదించే రక్షణను
చూస్తారు!"

*యెషయా 40:3-5*

7ప్రజలు బాప్తిస్మము పొందటానికి గుంపులు గుంపు
లుగా యోహాను దగ్గరకు వచ్చారు. యోహాను, "మీరు
సర్పసంతానం. దేవునికి కోపం రానున్నది. ఆ కోపం
నుండి పారిపోవాలను కుంటున్నారు. అలా చేయుమని
ఎవరు చెప్పారు? 8మారుమనస్సు పొందినట్లు ఋజువు
చేసే పనులు చెయ్యండి. 'అబ్రాహాము మా తండ్రి'
అని గొప్పలు చెప్పుకొన్నంత మాత్రాన లాభం లేదు.
ఈ రాళ్ళ నుండి దేవుడు అబ్రాహాము సంతానాన్ని
సృష్టించగలడని నేను చెబుతున్నాను. 9చెట్లవేళ్ళమీద
గొడ్డలి సిద్ధంగా ఉంది. మంచి ఫల మివ్వని చెట్టును
కొట్టేసి ఆయన మంటల్లో పార వేస్తాడు" అని అన్నాడు.
10"మరి మేము ఏం చెయ్యాలి?" అని ప్రజలు
అడిగారు.
11యోహాను, "రెండు చొక్కాలున్న వాడు ఒక
చొక్కాకూడా లేని వానితో వాటిని పంచుకోవాలి.
అలాగే మీ ఆహారం కూడా పంచుకోవాలి" అని
అన్నాడు.
12పన్నులు సేకరించేవాళ్ళు కూడా బాప్తిస్మము
పొందటానికి వచ్చారు. వాళ్ళు, "బోధకుడా! మేము
ఏం చెయ్యాలి?" అని అడిగారు.
13"సేకరించ వలసిన పన్నుల కన్నా ఎక్కువ
పన్నులు సేకరించవద్దు" అని అతడు వాళ్ళతో
అన్నాడు.
14కొందరు సైనికులు కూడా వచ్చి, "మేము ఏం
చెయ్యాలి?" అని అతణ్ణి అడిగారు.
అతడు సమాధానం చెబుతూ, "ప్రజల నుండి
డబ్బు గుంజవద్దు! వాళ్ళపై తప్పుడు నిందలు మోప
కండి. మీ జీతంతో తృప్తి చెందండి" అని అన్నాడు.
15ప్రజలు రానున్న వాని కోసం ఆశతో కాచుకొని
ఉన్నరోజులవి. వాళ్ళు యోహానే క్రీస్తు అయి
ఉండవచ్చునుకున్నారు.
16యోహాను వాళ్ళకు ఈ విధంగా సమాధానం
చెప్పాడు: "నేను మీకు నీటిలో బాప్తిస్మము* నిచ్చాను.
కాని నాకన్నా శక్తిగలవాడు వస్తాడు. ఆయన కాలిచె
ప్పులు విప్పే అర్హతకూడా నాకు లేదు. ఆయన మీకు
పవిత్రాత్మలో, అగ్నిలో బాప్తిస్మమునిస్తాడు. 17చేట

---

**బాప్తిస్మము** ఇది గ్రీకు పదము. ఇంగ్లీషులో బాప్టిజమ్. దీని అర్థం ప్రత్యేకమైన నీటి మునక.

ఆయన చేతిలో ఉంది. ఆయనాచేటతో ధాన్యాన్ని
శుభ్రపరచి తన ధాన్యాన్ని కొట్టులో దాచుకొని,
పొట్టును ఆరని మంటల్లో కాల్చివేస్తాడు. 18యోహాను
వాళ్ళకు హెచ్చరిక కలిగేటట్లు యింకా ఎన్నో విష
యాలు చెప్పాడు. సువార్త కూడా ప్రకటించాడు.

19రాజ్యాధికారి హేరోదుకు అతని సోదరుని భార్య
అయిన హేరోదియతో సంబంధంవుంది. దీని కార
ణంగా, హేరోదు చేసిన యితర దుష్కార్యాల కారణంగా
యోహాను అతణ్ణి తీవ్రంగా విమర్శించాడు. 20తద్వారా
హేరోదు, యోహానును కారాగారంలో ఉంచాడు. ఇలా
చేసి తాను చేసిన దుష్కార్యాలకు మరొక దుష్కార్యం
చేర్చుకొన్నాడు.

21యోహాను ప్రజలకు బాప్తిస్మమునిస్తూ వుండి
నాడు. అప్పుడు వాళ్ళతో సహా యేసుకు కూడా
బాప్తిస్మమునిచ్చాడు. యేసు ప్రార్థిస్తుండగా పరలోకం
తెరువబడింది. 22పవిత్రాత్మ ఒక పావురం రూపంలో
దిగివచ్చి ఆయనపై వ్రాలాడు. వెంటనే పరలోకం
నుండి ఒక స్వరం, "నీవు నా ప్రియ కుమారుడివి.
నిన్ను నేను ప్రేమించుచున్నాను.నీయందు ఎక్కువగా
నేను ఆనందించుచున్నాను" అని వినబడింది.

## యోసేపు వంశ వృక్షం

(*మత్తయి 1:1-17*)

23యేసు బోధించటం మొదలు పెట్టినప్పుడు
ఆయనకు సుమారు ముప్పై సంవత్సరాలు. యేసు
యోసేపు కుమారుడు అని ప్రజలు అనుకునేవాళ్ళు.
యోసేపు హేలీ కుమారుడు, 24హేలీ మత్తతు
కుమారుడు, మత్తతు లేవి కుమారుడు. లేవి మెల్కీ
కుమారుడు. మెల్కీ యన్న కుమారుడు. యన్న
యోసేపు కుమారుడు. 25యోసేపు మత్తతీయ
కుమారుడు, మత్తతీయ ఆమోసు కుమారుడు.
ఆమోసు నాహోము కుమారుడు, నాహోము ఎస్లి
కుమారుడు. ఎస్లి నగ్గయి కుమారుడు. 26నగ్గయి
మయతు కుమారుడు. మయతు మత్త తీయ
కుమారుడు. మత్తతీయ సిమియ కుమారుడు. సిమియ
యోశేఖు కుమారుడు యోశేఖు యోదా కుమారుడు.

27యోదా యోహన్న కుమారుడు. యోహన్న
రేసా కుమారుడు, రేసా జెరుబ్బాబెలు కుమారుడు.
జెరుబ్బాబెలు షయల్తీయేలు కుమారుడు. షయల్తీ
యేలు నేరి కుమారుడు, 28నేరి మెల్కీ కుమారుడు,
మెల్కీ అద్ది కుమారుడు, అద్ది కోసాము కుమారుడు,
కోసాము ఎల్మదాము కుమారుడు,ఎల్మదాము ఏరు
కుమారుడు, 29ఏరు యెహోషువ కుమారుడు.
యెహోషువ ఎలీయెజెరు కుమారుడు. ఎలీయెజెరు
యోరీము కుమారుడు. యోరీము మత్తతు కుమా
రుడు, మత్తతు లేవి కుమారుడు,

30లేవి షిమ్యోను కుమారుడు, షిమ్యోను యూదా
కుమారుడు, యూదా యోసేపు కుమారుడు.
యోసేపు యోనాము కుమారుడు. యోనాము ఎల్యా
కీము కుమారుడు, 31ఎల్యాకీము మెలెయా కుమా
రుడు. మెలెయా మెన్నా కుమారుడు. మెన్నా మత్తతా
కుమారుడు. మత్తతా నాతాను కుమారుడు. నాతాను
దావీదు కుమారుడు, 32దావీదు యెష్షయి కుమారుడు,
యెష్షయి ఓబేదు కుమారుడు, ఓబేదు బోయజు
కుమారుడు, బోయజు శల్మాను కుమారుడు, శల్మాను
నయస్సోను కుమారుడు,

33నయస్సోను అమ్మీనాదాబు కుమారుడు. అమ్మీ
నాదాబు అరాము కుమారుడు. అరాము ఎస్రోము
కుమారుడు, ఎస్రోము పెరెసు కుమారుడు, పెరెసు
యూదా కుమారుడు. 34యూదా యాకోబు కుమా
రుడు, యాకోబు ఇస్సాకు కుమారుడు, ఇస్సాకు అబ్రా
హాము కుమారుడు, అబ్రాహాము తెరహు కుమారుడు,
తెరహు నాహోరు కుమారుడు, 35నాహోరు సెరూగు
కుమారుడు, సెరూగు రయూ కుమారుడు, రయూ
పెలెగు కుమారుడు, పెలెగు హెబెరు కుమారుడు,
హెబెరు షేలహు కుమారుడు,

36షేలహు కేయినాను కుమారుడు, కేయినాను
అర్ఫక్షదు కుమారుడు, అర్ఫక్షదు షేము కుమారుడు,
షేము నోవహు కుమారుడు, నోవహు లెమెకు కుమా
రుడు, 37లెమెకు మెతూషెల కుమారుడు, మెతూషెల
హనోకు కుమారుడు, హనోకు యెరెదు కుమారుడు,
యెరెదు మహలలేలు కుమారుడు, మహలలేలు కేయి
నాను కుమారుడు, 38 కేయినాను ఎనోషు కుమారుడు,
ఎనోషు షేతు కుమారుడు, షేతు ఆదాము కుమా
రుడు, ఆదాము దేవుని కుమారుడు.

## సైతాను యేసును శోధించటం

(*మత్తయి 4:1-11; మార్కు 1:12-13*)

4 యేసు యొర్దాను నది ప్రాంతం నుండి తిరిగి
వచ్చాడు. ఆయన పవిత్రాత్మపూర్ణుడై యుండి
ఎడారి ప్రాంతానికి ఆత్మ చేత నడిపించబడ్డాడు.
2అక్కడ సైతాను ఆయన్ని నలభై దినాలు శోధిం
చాడు. ఆ నలభై రోజులు యేసు ఉపవాసం చేశాడు.
ఆ తర్వాత ఆయనకు ఆకలి వేసింది.

3సైతాను ఆయనతో, "నీవు దేవుని కుమారుడ
వైతే ఈ రాయిని రొట్టెగా మారుమని ఆజ్ఞాపించు!"
అని అన్నాడు.

4 యేసు, "'మనిషి జీవించటానికి ఆహారం
మాత్రమే చాలదు' అని వ్రాయబడింది"
అని సమాధానం చెప్పాడు.

ద్వితీయోపదేశ *8:3*

[5]ఆ సైతాను ఆయన్ని ఎత్తైన స్థలానికి తీసుకు
వెళ్ళాడు. ఒక్క క్షణంలో ప్రపంచంలోని రాజ్యాలన్నీ
ఆయనకు చూపించాడు. [6]ఆయనతో, "వీటిపై అధి
కారము, వాటివల్ల లభించే గౌరవము నీకిస్తాను. అవి
నావి. నా కిష్టం వచ్చిన వానికివ్వగలను. [7]నా కాళ్ళ
మీద పడితే వీటిని నీకిస్తాను" అని అన్నాడు.

[8]యేసు,

> "'నీ ప్రభువైన దేవుని ముందు మాత్రమే
> మోకరిల్లి, ఆయన సేవ మాత్రమే చెయ్యి'
> అని వ్రాయబడింది"

అని సమాధానం చెప్పాడు.

*ద్వితీయోపదేశ 6:13*

[9]సైతాను ఆయన్ని యెరూషలేములో ఉన్న
ఆలయానికి తీసుకెళ్ళి ఎత్తైన స్థలంలో నిలుచోబెట్టి
"నీవు దేవుని కుమారుడవైతే యిక్కడి నుండి క్రిందికి
దూకు.

> [10] 'దేవుడు తన దూతలతో నిన్ను కాపాడు
> మని ఆజ్ఞాపిస్తాడు'

*కీర్తన 91:11*

[11]అంతేకాక:

> 'ఆ దూతలు నీ కాళ్ళు రాతికి తగలకుండా
> నిన్ను తమ చేతుల్తో ఎత్తి పట్టుకుంటారు'
> అని వ్రాయబడింది" అని అన్నాడు.

*కీర్తన 91:12*

[12]యేసు,

> "'నీ ప్రభువైన దేవుణ్ణి పరీక్షించరాదు' అని
> కూడా వ్రాయబడింది" అని సమాధానం
> చెప్పాడు.

*ద్వితీయోపదేశ 6:16*

[13]ఆ సైతాను యేసును పరీక్షించటం మానేసి అప్పటికి
ఆయన్ని వదిలి పొయ్యాడు.

**నజరేతు ప్రజలు యేసును నిరాకరించటం**

*(మత్తయి 4:12-17; మార్కు 1:14-15)*

[14]యేసు పవిత్రాత్మ శక్తితో గలిలయకు తిరిగి
వచ్చాడు. ఆయన్ని గురించి ఆ చుట్టూ ఉన్న ప్రాంతా
ల్లోని ప్రజలకు తెలిసింది. [15]ఆయన ఆ ప్రాంతాల్లో
ఉన్న సమాజ మందిరాల్లో బోధించాడు. ప్రతి ఒక్కరూ
ఆయన్ని స్తుతించారు.

[16]ఆ తర్వాత తాను పెరిగిన నజరేతు గ్రామానికి
వెళ్ళాడు. ఒక విశ్రాంతి రోజున అలవాటు ప్రకారం
సమాజమందిరానికి వెళ్ళి, చదవటానికి నిలుచున్నాడు.
[17]అక్కడున్న వాళ్ళు, ప్రవక్త యెషయా గ్రంథాన్ని
ఆయన చేతికి ఇచ్చారు. ఆయనా గ్రంథములో ఈ
వాక్యాలున్న పుటను తెరిచి చదవటం మొదలు
పెట్టాడు:

> [18]"ప్రభువు నన్నభిషేకించి పేదవాళ్ళకు
> నన్ను సువార్త ప్రకటించుమన్నాడు.
> అందుకే ప్రభువు ఆత్మ నాలో ఉన్నాడు.
> బంధితులకు స్వేచ్ఛ ప్రకటించుమని,
> గుడ్డివారికి చూపు కలిగించాలని, హింసిం
> పబడే వారికి విడుదల కలిగించాలని,
> నన్ను పంపాడు.
> [19] ప్రభువు 'తాను దయ చూపే సంవత్సరం'
> ప్రకటించుమని నన్ను పంపాడు."

*యెషయా 61:1-2*

[20]ఆ తదుపరి యేసు గ్రంథం మూసేసి దాన్ని
తెచ్చిన వానికి యిచ్చి కూర్చున్నాడు. సమాజ మంది
రంలో ఉన్నవాళ్ళందరి కళ్ళు ఆయనపై ఉన్నాయి.
[21]ఆయన వాళ్ళతో, "ఈ రోజు గ్రంథములో వ్రాయ
బడిన ఈ వాక్యాలు మీరు వింటుండగానే నెరవేరాయి"
అని అన్నాడు.

[22]అంతా ఆయన్ని మెచ్చుకున్నారు. అంతే కాక
ఆయన నోటినుండి వచ్చిన ఆ చక్కటి మాటలు
విని అందరూ ఆశ్చర్యపోయారు. వాళ్ళు, "ఈయన
యోసేపు కుమారుడు కదా!" అని అన్నారు. [23]యేసు
వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: "'వైద్యుడా! నిన్ను
నీవు నయం చేసుకో!' అన్న సామెత మీరు నాకు
చెబుతారని తెలుసు. పైగా మీరు, 'కపెర్నహూములో
చేసిన మహాత్యాల్ని గురించి మేము విన్నాము. వాటిని
యిక్కడ నీ స్వగ్రామంలో కూడా చెయ్యి!" అని
అంటారని నాకు తెలుసు. [24]ఇది నిజం. ఏ ప్రవక్తనూ
అతని స్వగ్రామపు ప్రజలు అంగీకరించలేదు. [25]ఏలీయా
కాలంలో ఇశ్రాయేలు దేశంలో చాలామంది వితం
తువులుండినారని ఖచ్చితంగా చెప్పగలను. ఆ కాలంలో
మూడున్నర సంవత్సరాలు వర్షాలు కురియలేదు. దేశ
మంతటా తీవ్రమైన కరువు వ్యాపించి ఉంది. [26]సీదోను
రాష్ట్రంలోని సారెపతు అనే గ్రామంలో ఒక వితంతువు
ఉండేది. దేవుడు ఏలీయాను ఆమె దగ్గరకు తప్ప
మరెవ్వరి దగ్గరకు పంపలేదు. [27]ప్రవక్త ఎలీషా*
కాలంలో ఇశ్రాయేలు దేశంలో చాలా మంది కుష్టు

---

**ఎలీషా** ఏలీయా కాలం తరువాత నివసించిన ప్రవక్త ఎలీషా.

రోగులుండే* వాళ్ళు. కాని సిరియ దేశానికి చెందిన నయమాను అనేవాణ్ణి తప్ప దేవుడు వీళ్ళలో ఒక్కరిని కూడా నయం చేయలేదు.”

28సమాజమందిరములోవున్న వాళ్ళందరికి యిది విని ఆయనపై చాలా కోపం వచ్చింది. 29వాళ్ళు లేచి ఆయన్ని గ్రామం నుండి వెళ్ళగొట్టారు. ఆ గ్రామం కొండ మీద ఉంది. వాళ్ళు ఆయన్ని క్రిందికి త్రోయాలని కొండ చివరకు తీసుకు వెళ్ళారు. 30కాని ఆయన వాళ్ళ మధ్యనుండి నడిచి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

### యేసు దయ్యాన్ని వెళ్ళ గొట్టటం

*(మార్కు 1:21-28)*

31అక్కడి నుండి ఆయన గలిలయలోని కపెర్నహూము అనే పట్టణానికి వెళ్ళాడు. అక్కడ విశ్రాంతి రోజున బోధించటం మొదలు పెట్టాడు. 32ఆయన అధికారమున్న వానిలా బోధించటం వల్ల వాళ్ళు ఆశ్చర్యపోయారు. 33అదే సమయంలో దయ్యం పట్టిన వాడొకడు ఆ సమాజమందిరంలోకి వచ్చాడు. ఆ దయ్యం బిగ్గరగా 34“ఓ నజరేయుడవైన యేసూ! మాతో నీకేం పని? మమ్మల్ని నాశనం చెయ్యటానికి వచ్చావా? నీవెవరో నాకు తెలుసు. నీవు దేవుని పరిశుద్ధుడవు” అని అన్నది.

35యేసు, “నోరు మూసుకొని అతని నుండి బయటకు రా!” అని గద్దించాడు. ఆ దయ్యం తాను పట్టిన వాణ్ణి క్రింద పడవేసి ఏ హానీ చెయ్యకుండా ఆ దయ్యం వెలుపలికి వచ్చింది.

36అక్కడున్న ప్రజలందరూ ఆశ్చర్యపోయారు. వాళ్ళు పరస్పరం, “ఏమిటిది? దయ్యాలను కూడా ఆయన అధికారంతో ఆజ్ఞాపిస్తున్నాడే? అవి బయటికి రావటానికి ఈయన మాటల్లో ఎంత శక్తి ఉందో కదా?” అని మాట్లాడుకున్నారు. 37ఆ చుట్టు ఉన్న ప్రాంతాల్లో ఈయన్ని గురించి అందరికీ తెలిసింది.

### యేసు అనేకులకు స్వస్థత చెయ్యటం

*(మత్తయి 8:14-17; మార్కు 1:29-34)*

38యేసు సమాజమందిరాన్ని వదిలి సీమోను యింటికి వెళ్ళాడు. సీమోను అత్తకు జ్వరం తీవ్రంగా ఉంది. వాళ్ళు ఆమె జ్వరాన్ని గురించి యేసుకు చెప్పారు. 39యేసు, ఆమె దగ్గరకు వచ్చి జ్వరాన్ని వదిలి పొమ్మని గద్దించాడు. జ్వరం ఆమెను వదిలి వెళ్ళిపోయింది. వెంటనే ఆమె లేచి అందరిని ఆదరించటం మొదలు పెట్టింది.

40సూర్యాస్తమయమౌతుండగా ప్రజలు రక రకాల రోగాలున్న వాళ్ళను ఆయన దగ్గరకు తీసుకు వచ్చారు. ఆయన ప్రతి ఒక్కరి మీద తన చేతుల్ని ఉంచి అందరిని నయం చేశాడు. 41“నీవు దేవుని కుమారుడవు” అని బిగ్గరగా కేకలు వేస్తూ చాలా మంది నుండి దయ్యాలు బయటకు వచ్చాయి. వాటికి తాను క్రీస్తు అని తెలియటం వల్ల యేసు వాటిని మాట్లాడవద్దని గద్దించాడు.

42తెల్లవారుతుండగా యేసు గ్రామం వదిలి ఎడారిగా ఒంటరిగా ఒక ప్రత్యేక స్థలానికి వెళ్ళాడు. ప్రజలాయన కోసం వెతుకుతూ ఆయనున్న చోటికి వచ్చారు. ఆయన తమను మళ్ళీ వదిలి వెళ్ళకుండా చెయ్యాలని ప్రయత్నించారు. 43కాని యేసు, “దేవుని రాజ్యం యొక్క సువార్త నేను యితర పట్టణాల్లో కూడా ప్రకటించాలి. దేవుడు నన్ను అందుకే పంపాడు” అని అన్నాడు. 44ఆయన యూదయ ప్రాంతాల్లోని సమాజ మందిరాల్లో బోధించాడు.

5 ఒక రోజు యేసు గెన్నేసరెతు సరస్సు ప్రక్కన నిలబడి దైవసందేశం ఉపదేశిస్తున్నాడు. ప్రజలు ఆయన ఉపదేశం వినటానికి త్రోసుకుంటూ ఆయన చుట్టూ చేరారు. 2యేసు సరస్సు ప్రక్కన రెండు పడవలుండటం చూశాడు. బెస్తవాళ్ళు పడవలు దిగి ఆ ప్రక్కనే తమ వలలు కడుక్కుంటున్నారు. 3యేసు సీమోను అనే వ్యక్తికి చెందిన పడవనెక్కి పడవను ఒడ్డునుండి కొంతదూరం తీసుకొని వెళ్ళమన్నాడు. ఆ తర్వాత ఆయన ఆ పడవలో కూర్చొని ప్రజలకు బోధించటం మొదలు పెట్టాడు.

4ఆయన మాట్లాడటం ముగించాక సీమోనుతో, “పడవను నీళ్ళు లోతుగా ఉన్న చోటికి పోనిచ్చి వల వేయండి. మీకు చేపలు దొరుకుతాయి” అని అన్నాడు.

5సీమోను, “అయ్యా! మేము రాత్రంతా చాలా కష్టపడి పనిచేసినా చేపలు పట్టలేక పోయాము. అయినా మీరు చెబుతున్నారు కాబట్టి మేము వేస్తాము” అని అన్నాడు. 6వాళ్ళు, ఆయన చెప్పినట్లు చేసి ఎన్నో చేపలు పట్టారు. ఆ బరువుకు వలలు చినగటం మొదలు పెట్టాయి. 7కాబట్టి ప్రక్క పడవలో ఉన్న తమతోటి పని వాళ్ళను వచ్చి తమకు సహాయం చెయ్యమని అడిగారు. వాళ్ళు వచ్చి ఆ రెండు పడవల్ని పూర్తిగా చేపల్తో నింపారు. ఆ బరువుకు వాళ్ళ పడవలు మునగసాగాయి.

8సీమోను పేతురు యిది చూసి యేసు కాళ్ళపై పడి, “నేనొక పాపిని. వెళ్ళిపొండి ప్రభూ!” అని అన్నాడు. 9అతడు, అతనితో ఉన్న వాళ్ళు తాము పట్టిన చేపలు చూసి ఆశ్చర్యపోయారు. 10వీళ్ళే కాక జెబెదయి కుమారులు యాకోబు, యోహానులు కూడా ఆశ్చర్యపోయారు. వీళ్ళు సీమోను భాగస్థులు.

---

**కుష్ఠ రోగము** గ్రీకు పదము తత్ సంబంధమైన ఇతర రోగాలను కూడా సూచిస్తుంది.

యేసు సీమోనుతో, “చింతించకు. ఇప్పటి నుండి
నువ్వు మనుష్యుల్ని పడ్తావు!” అని అన్నాడు.
11వాళ్ళు పడవలు ఒడ్డుకు చేర్చి అన్నీ వదిలేసి
ఆయన్ని అనుసరించారు.

### కుష్టురోగి

*(మత్తయి 8:1-4; మార్కు 1:40-45)*

12యేసు ఒక గ్రామంలో ఉండగా ఒళ్ళంతా కుష్టు
రోగం ఉన్న వాడు ఆయన్ని చూడాలని వచ్చాడు.
యేసును చూడగానే ఆయన కాళ్ళ ముందు సాష్టాంగ
పడి, “ప్రభూ! మీరు దయ తలిస్తే నాకు నయం
చెయ్యగలరు!” అని వేడుకొన్నాడు.
13యేసు, “నీకు నయం చేస్తాను!” అని అంటూ
తన చేయి జాపి అతణ్ణి తాకాడు. వెంటనే కుష్టురోగం
అతణ్ణి వదలి పోయింది. 14ఆ తర్వాత యేసు, “ఈ
విషయం ఎవ్వరికీ చెప్పవద్దు. కాని వెళ్ళి యాజకునికి
చూపు! నీకు నయమై పోయిందని నిరూపించుకో!”
అని ఆజ్ఞాపించాడు.
15కాని యేసును గురించి యింకా చాలా మందికి
తెలిసిపోయింది. ఆయన బోధనలు వినటానికి, తమ
రోగాలు నయం చేసుకోవటానికి ప్రజలు గుంపులు
గుంపులుగా వచ్చారు. 16కాని యేసు ప్రార్థించటానికి
అరణ్యప్రాంతానికి వెళ్ళాడు.

### యేసు పక్షవాత రోగిని నయం చెయ్యటం

*(మత్తయి 9:1-8; మార్కు 2:1-12)*

17ఒక రోజు ఆయన బోధిస్తుండగా పరిస
య్యులు,* శాస్త్రులు అక్కడ కూర్చొని ఉన్నారు.
వీళ్ళు గలిలయలోని పల్లెల నుండి, యూదయ,
యెరూషలేము పట్టణాల నుండి వచ్చిన వాళ్ళు.
రోగులకు నయం చేసే శక్తి యేసులో ఉంది.
18కొంతమంది ఒక పక్షవాత రోగిని ఒక మంచం మీద
మోసుకొని వచ్చారు. అతణ్ణి యేసు ముందు ఉంచా
లని, యేసు ఉన్న యింట్లోకి తీసుకువెళ్ళటానికి
ప్రయత్నించారు. 19కాని ప్రజాసమూహం అధికముగా
ఉండటం వల్ల అలా చెయ్యటం వీలుకాలేదు. వాళ్ళు
ఇంటి మీదికి వెళ్ళి పైకప్పు ద్వారా ఆ రోగిని
మంచంతో సహా యేసు ముందు దించారు. యేసు
ప్రజల మధ్య ఉన్నాడు. 20ఆయన వాళ్ళ విశ్వాసం
చూసి, “మిత్రమా, నీ పాపాలు క్షమించాను!” అని
అన్నాడు.
21పరిసయ్యులు, శాస్త్రులు మనస్సులో, “భక్తి హీను
నిగా మాట్లాడుతున్నాడే? వీడెవడు? దేవుడు తప్ప
యితరులెవరు పాపాలు క్షమించగలరు?” అని అను
కున్నారు.
22వాళ్ళేమనుకుంటున్నారో యేసుకు తెలిసి
పోయింది. ఆయన, “మీరు మీ మనస్సులో అలా
ఎందుకాలోచిస్తున్నారు? 23‘నీ పాపాలు క్షమించాను’
అని అనటం తేలికా? లేదా ‘లేచి నడు’ అని అనటం
తేలికా? 24కాని మనుష్యకుమారునికి ఈ భూమ్మీద
పాపాలు క్షమించటానికి అధికారముందని మీరు గ్రహిం
చాలి” అని అంటూ ఆ పక్షవాత రోగితో, “నేను
చెబుతున్నాను; లేచి నీ మంచం తీసుకొని యింటికి
వెళ్ళు!” అని అన్నాడు.
25ఆ పక్షవాత రోగి వెంటనే అందరి ముందు లేచి
తానిదివరకు పడుకున్న మంచమును తీసుకొని దేవుణ్ణి
స్తుతిస్తూ యింటికి వెళ్ళిపోయాడు. 26అక్కడున్న
వాళ్ళంతా దిగ్భ్రాంతి చెంది దేవుణ్ణి స్తుతించటం
మొదలు పెట్టారు. వాళ్ళు భయంతో, “ఈ రోజు
మనం అనుకోని గొప్ప సంఘటన చూసాము” అని
అన్నారు.
27తర్వాత యేసు అక్కడి నుండి వెళ్ళి పోయాడు.
లేవి* అనే ఒక పన్నులు సేకరించే గుమాస్తా, పన్నులు
సేకరిస్తూ ఒక గదిలో కూర్చొని ఉన్నాడు. యేసు
అతణ్ణి చూసి, “నా వెంట రా!” అని అతనితో అన్నాడు.
28లేవి లేచి అన్నీవదిలి యేసును అనుసరించాడు.
29ఆ తర్వాత లేవి తన యింట్లో యేసు కోసం
ఒక పెద్ద విందు చేశాడు. చాలా మంది పన్నులు
వసూలు చేసేవాళ్ళు, ఇతర్లు ఆయనతో కలసి భోజనం
చేస్తూఉన్నారు. 30పరిసయ్యులు, వాళ్ళ గుంపుకు చెంది
నశాస్త్రులు యేసు అనుచరులతో, “మీరు పన్నులు
సేకరించే వాళ్ళతో, పాపులతో కలిసి ఎందుకు
తింటారు?” అని విమర్శిస్తూ అడిగారు.
31యేసు, “ఆరోగ్యంగా ఉన్న వాళ్ళకు వైద్యుని
అవసరం ఉండదు. అనారోగ్యంగా ఉన్న వాళ్ళకు
వైద్యుని అవసరం ఉంటుంది. 32నేను నీతిమంతుల్ని
పిలిచి, వాళ్ళకు మారుమనస్సు పొందుమని చెప్పటానికి
రాలేదు. పాపుల కోసం వచ్చాను” అని సమాధానం
చెప్పాడు.
33వాళ్ళు, “యోహాను శిష్యులు ఎప్పుడూ ఉప
వాసాలు, ప్రార్థనలు చేస్తూ ఉంటారు. పరిసయ్యులు
కూడా అదేవిధంగా చేస్తూ ఉంటారు. కాని మీ వాళ్ళు
తింటూ త్రాగుతూ ఉంటారు” అని ఆయనతో
అన్నారు.
34యేసు, “పెళ్ళి కుమారుని అతిథులు పెళ్ళి
కుమారునితో ఉన్నప్పుడు ఉపవాసం చేస్తారా? 35కాని
పెళ్ళి కుమారుణ్ణి వాళ్ళనుండి తీసుకు వెళ్ళే సమయం
వస్తుంది. అప్పుడు వాళ్ళు ఉపవాసం చేస్తారు” అని

---

**పరిసయ్యులు** యూదుల ధర్మశాస్త్రాన్ని, వాళ్ళ ఆచా
రాల్ని నిష్టగా పాటించే ఒక యూదుల శాఖ.

**లేవి** లేవికి ఇంకొక పేరు మత్తయి.

అన్నాడు. 36యేసు వాళ్ళకు ఈ ఉపమానం కూడా చెప్పాడు: “క్రొత్త బట్టను చింపి పాత బట్టకు ఎవ్వరూ అతుకులు వెయ్యరు. అలా వేస్తే క్రొత్త బట్ట పాత బట్టను చింపివేస్తుంది. పైగా క్రొత్తబట్ట నుండి చింపిన గుడ్డ పాతబట్టకు సరిగ్గా అతకదు. 37అదేవిధంగా క్రొత్త ద్రాక్షారసాన్ని పాత తిత్తిలో ఎవ్వరూ నింపరు. అలా చేస్తే క్రొత్త రసం తిత్తిని చింపుతుంది. ద్రాక్షారసం కారి పోతుంది. తిత్తి కూడా నాశనమౌతుంది. 38అలా చెయ్యరాదు. క్రొత్త ద్రాక్షారసం క్రొత్త తిత్తిలోనే పొయ్యాలి. 39పాత ద్రాక్షారసం త్రాగిన వాడు క్రొత్త ద్రాక్షారసాన్ని కోరడు. అతడు ‘పాతది బాగుంది’ అని అంటాడు.”

### విశ్రాంతి రోజు ప్రభువు

(*మత్తయి 12:1-8; మార్కు 2:23-28*)

6 ఒక విశ్రాంతి రోజు యేసు ధాన్యపు పొలాల్లో నడుస్తూ ఉన్నాడు. ఆయన శిష్యులు కంకులు త్రుంచి వాటిని నలిపి తినటం మొదలుపెట్టారు. 2కొందరు పరిసయ్యులు, “విశ్రాంతి రోజున చెయ్యరాని పనులు ఎందుకు చేస్తున్నారు?” అని అడిగారు.

3యేసు, “దావీదు తనకు, తనతో ఉన్న వాళ్ళకు ఆకలి వేసినప్పుడు ఏమిచేసాడో మీరు చదవలేదా? 4అతడు దేవుని ఆలయంలోకి వెళ్ళాడు. అక్కడ దేవుని సన్నిధిని పెట్టిన రొట్టెలు ఉండినవి. వాటిని యాజకులు తప్ప యితర్లు తిన కూడదు. అతడు వాటిని తీసుకొని తాను తిని, తనతో ఉన్న వాళ్ళకు కూడా ఇచ్చాడు” అని సమాధానం చెప్పాడు. 5యేసు మళ్ళీ, “మనుష్యకుమారుడు విశ్రాంతి రోజుకు ప్రభువు!” అని అన్నాడు.

### చేయి పడిపోయిన వానికి నయం చెయ్యటం

(*మత్తయి 12:9-14; మార్కు 3:1-6*)

6మరొక విశ్రాంతి రోజు యేసు సమాజ మందిరానికి వెళ్ళి బోధిస్తూ ఉన్నాడు. అక్కడ కుడి చేయి పడిపోయిన వాడొకడున్నాడు. 7పరిసయ్యులు, శాస్త్రులు యేసును ఏదో ఒక కారణంతో నిందించాలని ఎదురు చూస్తూ ఉన్నారు. కనుక వాళ్ళు విశ్రాంతి రోజు ఆయన ఆ చేయి పడిపోయిన వానిని నయం చేస్తాడేమోనని ఆయన్ని జాగ్రత్తగా గమనిస్తూ ఉన్నారు. 8యేసుకు వాళ్ళేమాలోచిస్తున్నారో తెలుసు. ఆయన ఆ చేయి పడి పోయిన వానితో,“లేచి అందరి ముందు నిలుచో!” అని అన్నాడు. ఆ చేయి పడిపోయిన వాడు లేచి నిలుచున్నాడు. 9ఆ తదుపరి యేసు వాళ్ళతో, “విశ్రాంతి రోజు ఏది చెయ్యటం న్యాయమని మిమ్మల్ని అడుగుతున్నాను? ఒకరికి మేలు చేయటమా? లేక కీడు చేయటమా? ప్రాణాన్ని రక్షించటమా? లేక నాశనం చేయటమా?” అని అన్నాడు. 10యేసు వాళ్ళ వైపు ఒకసారి చూసి, చేయి పడిపోయిన వానితో, “నీ చేయి చాపు!” అని అన్నాడు. ఆ చేయి పడిపోయినవాడు యేసు చెప్పినట్లు చేశాడు. అతని చేయి పూర్తిగా నయమై పోయింది. 11ఇది చూసి అక్కడున్న వాళ్ళకు చాలా కోపం వచ్చింది. వాళ్ళు యేసును ఏమి చెయ్యాలో తమలో తాము ఆలోచించుకొన్నారు.

### పన్నెండు మందిని ఎన్నుకోవటం

(*మత్తయి 10:1-4; మార్కు 3:13-19*)

12ఆ తర్వాత యేసు ఒక రోజు ప్రార్థించటానికి కొండ మీదికి వెళ్ళాడు. రాత్రంతా దేవుణ్ణి ప్రార్థిస్తూ గడిపాడు. 13ఉదయం కాగానే తన శిష్యులందర్ని దగ్గరకు పిలిచి వాళ్ళలో పన్నెండు మందిని ఎన్నుకొని వాళ్ళను తన అపొస్తలులుగా నియమించాడు. 14వారెవరనగా, సీమోను, యేసు ఇతనికి ‘పేతురు’ అని పేరు పెట్టాడు, అతని తమ్ముడు అంద్రెయ. యాకోబు, యోహాను, ఫిలిప్పు, బర్తొలొమయి, 15మత్తయి, తోమా, అల్ఫయి కుమారుడు యాకోబు, జెలోతే* అని పిలువ బడే సీమోను 16యాకోబు కుమారుడు యూదా, యూదా ఇస్కరియోతు. ఈ యూదా ఇస్కరియోతు మున్ముందు ద్రోహి ఔతాడు.

### దీవెనలు, శ్రమలు

(*మత్తయి 4:23-25; 5:1-12*)

17యేసు వాళ్ళతో సహా కొండ దిగి సమంగా ఉన్న స్థలంలో నిలుచున్నాడు. చాలా మంది శిష్యులు ఆయనతో ఉన్నారు. ఆయన శిష్యులే కాక యూదయ నుండి, యెరూషలేం నుండి చాలా మంది ప్రజలు వచ్చారు. సముద్ర తీరంలో ఉన్న తూరు, సీదోను పట్టణాల నుండి కూడా చాలా మంది ప్రజలు వచ్చారు. 18ఆయన బోధనలు వినాలని ఆయన ద్వారా తమ రోగాలు బాగు చేయించుకోవాలని వాళ్ళ ఉద్దేశ్యం. దయ్యాలు పట్టి బాధ పడ్తున్న వాళ్ళు కూడా వచ్చారు. వాళ్ళకు కూడా నయమై పోయింది. 19ఆయన నుండి శక్తి ప్రవహించి అందరికి నయం చేస్తూవుండటం వల్ల అందరూ ఆయన్ని తాకటానికి ప్రయత్నించారు.

20యేసు తన శిష్యుల వైపు చూసి ఈ విధంగా అన్నాడు:

21“దీనులైన మీరు ధన్యులు. దేవుని రాజ్యం మీది. ఇప్పుడు ఆకలితో ఉన్న మీరు ధన్యులు. మీ ఆకలి తీరుతుంది. ఇప్పుడు దుఃఖిస్తున్న మీరు ధన్యులు. భవిష్యత్తులో మీరు నవ్వుతారు.

---

**జెలోతే** అనగా మతాభిమాని అని అర్థం.

[22]“మనుష్యకుమారుని కారణంగా ప్రజలు
మిమ్మల్ని ద్వేషించినప్పుడు, మిమ్మల్ని దూరం చేసి
అవమానించినప్పుడు, మీ పేరే హానికరమైనదని వారు
భావించి నప్పుడు మీరు ధన్యులౌతారు! [23]మీకు
పరలోకంలో గొప్ప బహుమతి లభిస్తుంది. కనుక యిది
జరిగిన రోజు ఆనందంతో గంతులు వెయ్యండి! వీళ్ళ
పూర్వీకులు కూడా ఆనాడు ప్రవక్తల పట్ల యిదే
విధంగా ప్రవర్తించారు.

[24]“ఓ ధనికులారా! మీకు శ్రమ తప్పదు!
మీరు అనుభవించవలసిన సుఖాన్ని యిది
వరకే అనుభవిం చారు!
[25] కడుపులు నిండిన ప్రజలారా మీకు శ్రమ
తప్పదు. మీకు ఆహారం దొరకదు! నవ్వు
తున్న ప్రజలారా! మీకు శ్రమ తప్పదు!
మీరు దుఃఖిస్తారు. శోకిస్తారు!

[26]“పొగడ్తలుపొందే ప్రజలారా! మీకు శిక్ష తప్పదు!
వాళ్ళ పూర్వులు యిదే విధంగా అబద్ధప్రవక్తల్ని
పొగిడారు.

### శత్రువులపట్ల ప్రేమ
(*మత్తయి 5:38-48; 7:12*)

[27]“కాని, నా మాటలు వినే వాళ్ళకు యిది నేను
చెబుతున్నాను: మీ శత్రువుల్ని ప్రేమించండి.
మిమ్మల్ని ద్వేషించే వాళ్ళకు మంచి చెయ్యండి.
[28]మిమ్మల్ని దూషించే వాళ్ళను దీవించండి. మీకు
కీడు చేసిన వాళ్ళకు మంచి కలగాలని ప్రార్థించండి.
[29]ఒక చెంప మీద కొట్టిన వానికి రెండవ చెంప కూడా
చూపండి. నీ పై కండువాను తీసికొనే వానిని నీ
చొక్కాను కూడ తీసికోనివ్వు. [30]అడిగిన వాళ్ళకు
యివ్వండి. మీ వస్తువుల్ని ఎవరైనా తీసుకుంటే వాటిని
తిరిగి అడక్కండి. [31]ఇతర్లు మీ పట్ల ఏ విధంగా ప్రవ
ర్తించాలని మీరు ఆశిస్తారో అదేవిధంగా మీరు యితర్ల
పట్ల ప్రవర్తించండి. [32]మిమ్మల్ని ప్రేమించిన వాళ్ళను
ప్రేమిస్తే అందులో గొప్పేముంది? పాపులు కూడా
తమను ప్రేమించిన వాళ్ళను ప్రేమిస్తారు. [33]మీకు
మంచి చేసిన వాళ్ళకు మీరు మంచి చేస్తే అందులో
గొప్పేముంది? పాపులు కూడా అదే విధంగా చేస్తారు.
[34]అప్పు తిరిగి చెల్లిస్తారని ఆశించి అప్పిస్తే అందులో
గొప్పే ముంది? తమ అప్పు పూర్తిగా చెల్లిస్తారని పాపులు
కూడా తమలో తాము యిచ్చి పుచ్చుకుంటారు. [35]మీ
శత్రువుల్ని ప్రేమించండి. వాళ్ళకు మంచి చెయ్యండి.
తిరిగి చెల్లిస్తారని ఆశించకుండా అప్పివ్వండి. విశ్వాస
ఘాతుకుల మీద, దుర్మార్గుల మీద కూడా దేవుడు
దయ చూపుతాడు. మీరు నేను చెప్పినట్లు చేస్తే
సర్వోన్నతుడైన దేవుడు మిమ్మల్ని తన కుమారులుగా
పరిగణిస్తాడు. మీకు గొప్ప బహుమతి లభిస్తుంది. [36]మీ
తండ్రివలె మీరు కూడా దయ, ప్రేమ చూపుతూ
జీవించండి.

[37]“ఇతర్లపై తీర్పు చెప్పకండి. అప్పుడు ఇతర్లు
మీపై తీర్పు చెప్పరు. ఇతర్లను నిందించకండి. అప్పుడు
యితర్లు మిమ్మల్ని నిందించరు. ఇతరులను క్షమిం
చండి. అప్పుడు యితర్లు మిమ్మల్ని క్షమిస్తారు.
[38]ఇతర్లకు యివ్వండి, మీకివ్వబడుతుంది. అప్పుడు
మీకు కొలతలు నింపి, అదిమి, కుదిల్చి ఒలికిపోతుం
డగా మీ ఒడిలో పోస్తారు. మీరు ఏ కొలతతో యిస్తే
ఆ కొలతతో మీకు లభిస్తుంది.”
[39]ఆయన ఈ ఉపమానం కూడా చెప్పాడు: “ఒక
గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివానికి దారి చూపగలడా?
అలా చేస్తే యిద్దరూ గోతిలో పడ్తారు కదా! [40]శిష్యుడు
తన గురువు కన్నా గొప్ప కాదు. కాని శిక్ష సంపూర్ణంగా
పొందిన తర్వాత అతని గురువుతో సమానమౌతాడు.
[41]“నీ కంట్లోవున్న పెద్ద దూలంను నీవు చూడక
నీ సోదరుని కంట్లోవున్న చిన్న నలుసును ఎందుకు
చూస్తావు? [42]నీ కంట్లో దూలం పెట్టుకొని, ‘నీ కంట్లో
ఉన్న నలుసును నన్ను తియ్యనివ్వు’ అని అతనితో
ఏలాగు అనగలుగుతున్నావు? ఓ కపటీ! నీ కంట్లో
దూలాన్ని ముందు తీసేయి. అప్పుడు నీవు బాగా
చూడ కలిగి నీ సోదరుని కంట్లో ఉన్న నలుసును ఏ
విధంగా తియ్యాలో తెలుసుకుంటావు.

### చెట్టు, దాని ఫలము
(*మత్తయి 7:17-20; 12:34-35*)

[43]“మంచి చెట్టుకు చెడు పండ్లు కాయవు. అదే
విధంగా చెడ్డ చెట్టుకు మంచి పండ్లు కాయవు.
[44]పండ్లను బట్టి చెట్టు జాతి తెలుస్తుంది. ముండ్ల పొదల
నుండి అంజూరపు పండ్లు, గోరింట పొదల నుండి
ద్రాక్షాపండ్లు లభించవు. [45]మంచి వాని హృదయం
మంచి గుణాలతో నిండి ఉంటుంది. కాబట్టి అతని
నుండి మంచి తనమే బయటకు వస్తుంది. చెడ్డవాని
హృదయం చెడు గుణాలతో నిండి ఉంటుంది. కాబట్టి
అతనినుండి చెడే బయటకు వస్తుంది. మనిషి తన
హృదయములో ఉన్న గుణాలను బట్టి మాట్లాడుతాడు.

### రెండు రకాల పునాదులు
(*మత్తయి 7:24-27*)

[46]“నేను చెప్పింది చెయ్యకుండా నన్ను ‘ప్రభూ!
ప్రభూ!’ అని పిలవటం ఎందుకు? [47]నా దగ్గరకు
వచ్చి నా మాటలు విని వాటిని అనుసరించే వాడు
ఎలాంటి వాడో చెబుతాను వినండి. [48]అలాంటి వాణ్ణి
భూమి లోతుగా త్రవ్వి రాళ్ళ పునాది వేసి యిల్లు
కట్టుకున్న వానితో పోల్చవచ్చు. ఇతడు తన యింటిని
సక్రమమైన పద్ధతిలో కట్టాడు కనుక వరదలు వచ్చి

నీటి ప్రవాహం ఆ యింటిని కొట్టినా ఆ యిల్లు కూలి పోలేదు. 49నా మాటలు విని వాటిని అనుసరించని వాడు పునాది వేయకుండా, నేలపై ఇల్లు కట్టుకొన్న వానితో సమానము. వరదలు వచ్చాయి. ఆ నీటి ప్రవాహానికి ఆ యిల్లు కూలి నేల మట్టమై పోయింది."

### శతాధిపతి యొక్క విశ్వాసం

*(మత్తయి 8:5-13; యోహాను 4:43-54)*

7 యేసు తాను చెప్పవలసినవన్నీ చెప్పాడు. ప్రజలు ఆయన చెప్పినవన్నీ విన్నారు. ఆ తర్వాత యేసు కపెర్నహూముకు వెళ్ళాడు. 2అక్కడ కపెర్నహూములో ఒక శతాధిపతి ఉండేవాడు. అతని సేవకుడు జబ్బుతో చాలా బాధపడ్తూ చివరి దశలో ఉన్నాడు. శతాధిపతి అతణ్ణి చాలా ప్రేమతో చూసుకొనేవాడు. 3ఆ శతాధిపతి యేసును గురించి విన్నాడు. అతడు యూదుల పెద్దల్ని కొందర్ని పంపించి తన సేవకునికి వచ్చి నయం చేయమని అడగమన్నాడు.

4వాళ్ళు యేసు దగ్గరకు వచ్చి, "ఈ మనిషి మీ సహాయం పొందటానికి అర్హుడు. 5మన సమాజ మందిరాన్ని కట్టించిన వాడు అతడే" అని దీనంగా అన్నారు.

6యేసు వాళ్ళ వెంట వెళ్ళాడు. ఆయన శతాధిపతి యింటికి వస్తుండగా ఆ శతాధిపతి తన స్నేహితుల్ని పంపి ఆయనతో యిలా చెప్పమన్నాడు: "ప్రభూ! మీరు నా గడప దాటి నా యింట్లో కాలు పెట్టే అర్హత నాకు లేదు. మీకా శ్రమ వద్దు. 7నేను మీ దగ్గరకు వచ్చే అర్హత నాకు ఉందనుకోను. కనుక అక్కడినుండి ఆజ్ఞాపిస్తే నా సేవకునికి నయమై పోతుంది. 8ఆజ్ఞాపించటం అంటే ఏమిటో నాకు తెలుసు. ఎందుకంటే నేను ఒకరి అధికారంలో ఉన్నవాణ్ణి. నా క్రింద ఉన్న సైనికులపై నాకు అధికారం ఉంది. ఇతణ్ణి 'వెళ్ళు' అంటే వెళ్తాడు. అతణ్ణి 'రా' అంటే వస్తాడు. నా సేవకునితో 'యిది చెయ్యి' అంటే చేస్తాడు."

9యేసు శతాధిపతి చెప్పి పంపింది విని ఆశ్చర్య పొయ్యాడు. తనను అనుసరిస్తున్న ప్రజల వైపు తిరిగి, "ఇంత భక్తి నేను ఇశ్రాయేలులో కూడా చూడలేదని చెప్పగలను" అని అన్నాడు.

10యేసు దగ్గరకు పంపబడిన పెద్దలు తిరిగి శతాధిపతి దగ్గరకు వెళ్ళారు. అక్కడ ఆ సేవకునికి నయమై ఉండటం గమనించారు.

### చనిపోయిన వాణ్ణి బ్రతికించటం

11ఆ తర్వాత యేసు నాయీను అనే పట్టణానికి వెళ్ళాడు. ఆయన శిష్యులు, చాలా మంది ప్రజలు ఆయన వెంట వెళ్ళారు. 12ఆయన ఆ పట్టణం యొక్క ముఖ్యద్వారం చేరుకుంటుండగా కొందరు శవాన్ని మోసుకొని వెళ్తుండటం చూశాడు. అతని తల్లికి ఈ చనిపోయిన వాడు మాత్రమే కుమారుడు. తల్లి వితంతువు. ఆ వూరి వాళ్ళు అనేకులు ఆమె వెంటవున్నారు. 13ఆమెను చూసి ప్రభువు హృదయం కరిగి పోయింది. ఆయన ఆమెతో, "దుఃఖించకమ్మా" అని అన్నాడు. 14ఆ తదుపరి వెళ్ళి పాడెను తాకాడు. పాడె మోసుకు వెళ్తున్న వాళ్ళు కదలకుండా ఆగి పోయారు. యేసు, "బాబూ! లెమ్మని నీతో చెబుతున్నాను!" అని అన్నాడు. 15ఆ చనిపోయిన వాడు లేచి కూర్చొని మాట్లాడటం మొదలుపెట్టాడు. యేసు అతణ్ణి అతని తల్లికి అప్పగించాడు.

16వాళ్ళందరిలో భక్తి, భయము నిండుకు పోయాయి. వాళ్ళు దేవుణ్ణి స్తుతించారు. వాళ్ళు, "ఒక గొప్ప ప్రవక్త మనకు ప్రత్యక్షమయ్యాడు. దేవుడు తన ప్రజల్ని కాపాడటానికి వచ్చాడు" అని అన్నారు.

17యేసును గురించి యూదయ ప్రాంతంలోను, దాని చుట్టూవున్న ప్రాంతాల్లోను తెలిసిపోయింది.

### యోహాను అడగనంపిన ప్రశ్న

*(మత్తయి 11:2-19)*

18యోహాను శిష్యులు యోహానుకు వీటన్నిటిని గురించి చెప్పారు. 19అతడు తన శిష్యుల్లో యిద్దర్ని పిలిచి, "రానున్నది మీరేనా? లేక మరొకరి కోసం మేము ఎదురు చూడాలా?" అని ప్రభువును అడిగి రమ్మని పంపాడు.

20వాళ్ళు యేసు దగ్గరకు వచ్చి, "బాప్తిస్మము నిచ్చి, ఉపదేశం చేసే యోహాను ఈ విధంగా అడిగి రమ్మని మమ్మల్ని పంపాడు: 'రానున్నది మీరేనా? మరొకరి కోసం మేము ఎదురుచూడాలా?'" అని అన్నారు.

21వాళ్ళు అక్కడ ఉండగా యేసు రోగగ్రస్తులకు, బాధితులకు, దయ్యాలు పట్టిన వాళ్లకు నయం చేశాడు. చాలా మంది గ్రుడ్డి వాళ్ళకు దృష్టినిచ్చాడు. 22యేసు, ఆ వర్తమానం తెచ్చిన వాళ్ళతో, "వెళ్ళి యోహానుతో గ్రుడ్డివాళ్ళకు దృష్టి లభిస్తోందని, కుంటివాళ్ళు నడుస్తున్నారని, కుష్టురోగులకు నయమౌతుందని, చెవిటి వాళ్ళు వింటున్నారని, పేదవాళ్ళకు దైవ సందేశము బోధింపబడ్తోందని చెప్పండి. మీరు చూసిన వాటిని, విన్నవాటిని అతనికి చెప్పండి. 23నన్ను విశ్వసించటానికి వెనుకంజ వెయ్యని వాడు ధన్యుడు" అని అన్నాడు.

24ఆ వార్త తెచ్చిన వాళ్ళు వెళ్ళి పొయ్యాక యేసు అక్కడ సమావేశమైన ప్రజలకు యోహానును గురించి ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు: "ఎడారి ప్రాంతాలకు ఏం చూడాలని వెళ్ళారు? రెల్లు గాలికి కదలటం చూడాలని వెళ్ళారా? 25ఏమి చూడాలని వెళ్ళారు? విలువైన వస్త్రాల్ని ధరించిన వాళ్ళనా? విలువైన వస్త్రాలను ధరించేవారు రాజగృహాల్లో ఉంటారు. 26మరి ఏమి చూడాలని వెళ్ళారు? ప్రవక్తనా? ఔను,

యోహాను ప్రవక్త కన్నా గొప్పవాడని మీతో చెప్పుచు
న్నాను. 27యోహాన్ను గురించి లేఖనాల్లో ఈ విధంగా
వ్రాయబడి ఉంది:

'ఇతడు నా దూత, ఇతణ్ణి నీ కన్నా ముందుగా
పంపుతాను. ఇతడు నీ కోసం దారి సిద్ధం
చేస్తాడు ' *మలాకీ 3:1*

28యోహాను ప్రపంచములో పుట్టిన మానవులం
దరి కన్నా గొప్పవాడు. కాని దేవుని రాజ్యంలో అంద
రికన్నా అల్పుడు యోహాను కన్నా గొప్పవాడని నేను
చెబుతున్నాను."
29యోహాను బోధనలు విని ప్రజలు, చివరకు
పన్నులు వసూలు చేసేవాళ్ళు కూడా, యోహాను
ద్వారా బాప్తిస్మము పొందారు. తద్వారా వాళ్ళు దేవుడు
సంకల్పించినట్లు చేసారు. 30కాని పరిసయ్యులు,
శాస్త్రులు యోహాను చేత బాప్తిస్మము పొందటానికి
నిరాకరించారు. తద్వారా వాళ్ళు దేవుడు తమకోసం
సంకల్పించిన దాన్ని నిరాకరించారు. 31మరి ఈ కాలపు
ప్రజల్ని నేను దేనితో పోల్చాలి? వాళ్ళు ఏ విధంగా
ఉంటారు? 32వాళ్ళు సంతలో కూర్చొని

'మేము మీకోసం పిల్లన గ్రోవి ఊదాము.
కాని మీరు నాట్యం చేయలేదు. మేము
చనిపోయిన వాని కోసం పాట పాడాము.
కాని మీరు దుఃఖించలేదు'

అని మాట్లాడుకొంటున్న చిన్న పిల్లల్లాంటి వాళ్ళు.
33"బాప్తిస్మమునిచ్చే యోహాను ఆహారం తినలేదు.
ద్రాక్షారసం త్రాగలేదు. మీరు అతనికి దయ్యం పట్టింద
న్నారు. 34మనుష్యకుమారుడు తింటూ, త్రాగుతూ
వచ్చాడు. ఆయన్ని మీరు తిండిపోతు, త్రాగుపోతు
అని అన్నారు. పన్నులు వసూలు చేసే వాళ్ళతో,
పాపులతో స్నేహం చేస్తాడని ఆయన్ని విమర్శించారు.
35జ్ఞానము దానిని పొందినవాని ద్వారా సరైనదని
ఋజువు చేయబడుతుంది."

### పాపపు స్త్రీ యేసు పాదాలకు అత్తరు పూయటం

36ఒకసారి ఒక పరిసయ్యుడు యేసును తన
యింటికి భోజనానికి పిలిచాడు. యేసు అతని
యింటికి వెళ్ళాడు. ఆయన భోజనానికి కూర్చొని
ఉండగా 37ఆ పట్టణంలో పాపాలు చేస్తూ జీవిస్తున్న
ఒక స్త్రీ యేసు పరిసయ్యుని యింట్లో భోజనం చేస్తు
న్నాడని తెలుసుకొని అక్కడికి వెళ్ళింది. వెళ్ళేముందు
చలువరాతి బుడ్డిలో ఖరీదైన అత్తరు తన వెంట తీసుకు
వెళ్ళింది. 38వెనుకనుండి వచ్చి ఆయన కాళ్ళ దగ్గర
నిలుచొంది. ఆయన పాదాలను తన కన్నీటితో తడిపి,
తన వెంట్రుకలతో తుడిచి ముద్దు పెట్టుకుంది.
వాటిపై అత్తరు పోసింది. 39ఆయన్ని ఆహ్వానించిన
పరిసయ్యుడు ఇది చూసి, "ఆయన ప్రవక్త అయినట్లైతే
తనను ఎవరు తాకారో, ఆమె ఎలాంటి స్త్రీయో, అంటే
ఆమె పాపం చేస్తూ జీవించే స్త్రీయని తెలుసుకుంటాడు"
అని తన మనస్సులో అనుకున్నాడు.
40యేసు అతనితో, "సీమోనూ, నీకో విషయం
చెప్పాలి!" అని అన్నాడు.
"చెప్పండి, బోధకుడా!" అని సీమోను అన్నాడు.
41యేసు, "ఇద్దరు వ్యక్తులు ఒక షావుకారికి అప్పుం
డినారు. వాళ్ళలో ఒకడు అయిదు వందల దేనారాలు,
యింకొకడు యాభై దేనారాలు అప్పు తీసుకొని
ఉన్నారు. 42ఇద్దరిలో ఎవ్వరి దగ్గర కూడా అప్పు
తీర్చటానికి డబ్బులేదు. అందువల్ల ఆ షావుకారు
వాళ్ళిద్దరి అప్పు రద్దు చేశాడు. ఆ యిద్దరిలో ఎవరు
ఆ షావుకారి పట్ల ఎక్కువ ప్రేమ కనుబరుస్తారు?"
అని అడిగాడు.
43"ఎక్కువ ధనం అప్పున్నవాడని నేననుకొం
టాను" అని సీమోను సమాధానం చెప్పాడు.
యేసు, "నీ తీర్పు సరియైనది" అని అన్నాడు.
44ఆ తర్వాత ఆ స్త్రీ వైపు తిరిగి సీమోనుతో, "ఈ
స్త్రీని చూస్తున్నావా? నేను నీ యింటికి వచ్చాను.
కాళ్ళు కడుక్కోవటానికి నీవు నీళ్ళు కూడా యివ్వలేదు.
కాని ఈమె నా కాళ్ళు తన కన్నీటితో కడిగి తన
వెంట్రుకలతో తుడిచింది. 45నీవు నన్ను ప్రేమతో
హృదయానికి హత్తుకోలేదు. కాని ఈమె యింట్లోకి
వచ్చినప్పటినుండి నా కాళ్ళను భక్తితో ముద్దాడటం
మానలేదు. 46నీవు నా తలకు నూనె అంటలేదు. కాని
ఈమె నా కాళ్ళకు అత్తరు రాసింది. 47అందువల్ల నేను
చెప్పేదేమిటంటే ఆమె చేసిన పాపాలన్నీ క్షమించ
బడ్డాయి. దీనికి ఆమె చూపిన అమితమైన ప్రేమే
నిదర్శనం. కొన్ని పాపాలు మాత్రమే క్షమించబడిన
వానికి కొంత ప్రేమ మాత్రమే ఉంటుంది" అని
అన్నాడు. 48ఆ తర్వాత యేసు ఆమెతో, "నీ పాపాలు
క్షమించబడ్డాయి" అని అన్నాడు. 49అక్కడున్న మిగతా
అతిథులు, "పాపాలు కూడా క్షమించటానికి యితడె
వరు?" అని పరస్పరం మాట్లాడుకున్నారు.
50యేసు ఆ స్త్రీతో, "నీ విశ్వాసమే నిన్ను రక్షిం
చింది. శాంతంగా వెళ్ళు!" అని అన్నాడు.

8 ఆ తర్వాత యేసు పట్టణాలు, పల్లెలు పర్యటించి
దేవుని రాజ్యం యొక్క సువార్త ప్రజలకు ప్రక
టించాడు. పన్నెండుమంది అపొస్తలులు ఆయన వెంటే
ఉన్నారు. 2దయ్యాలు విడిపించబడిన కొందరు స్త్రీలు,
రోగాలు నయం చేయబడిన కొందరు స్త్రీలు కూడా
ఆయన వెంట ఉన్నారు. వీళ్ళలో మగ్దలేనే అని పిలవ
బడే మరియ ఒకతె. ఈమె నుండి ఏడు దయ్యాలు
విడిపించబడ్డాయి. 3హేరోదు రాజుకు కుడిభుజంగా

ఉన్న కూజా భార్య యోహన్న, సూసన్న, మొదలగు
చాలా మంది స్త్రీలు ఆయన వెంట ఉన్నారు. వీళ్ళు
తమ స్వంత డబ్బుతో యేసుకు, ఆయన అపొస్త
లులకు సహాయం చేస్తూ ఉండేవాళ్ళు.
4అనేక గ్రామాల నుండి ప్రజలు యేసు దగ్గరకు
వచ్చారు. ఒక పెద్ద గుంపు సమావేశమైంది. యేసు
వాళ్ళకీ ఉపమానం చెప్పటం మొదలు పెట్టాడు:
5"ఒక రైతు విత్తనాలు చల్లడానికి పొలానికి వెళ్ళాడు.
అతడు విత్తనాలు చల్లుతుండగా కొన్ని విత్తనాలు దారిపై
పడ్డాయి. వాటిని ప్రజలు త్రొక్కి వేసారు. పక్షులు
వచ్చి వాటిని తిని వేసాయి. 6మరికొన్ని విత్తనాలు
మట్టి కొద్దిగా ఉన్న రాతి నేలపై పడ్డాయి. అవి
మొలకెత్తాయి, కాని వాటికి తేమ దొరకనందు వలన
అవి వాడి పొయ్యాయి. 7మరి కొన్ని విత్తనాలు ముళ్ళ
మొక్కల స్థలంలో పడ్డాయి. ఈ విత్తనాలతో పాటు
ముళ్ళ మొక్కలు కూడా పెరిగి వాటిని పెరగ నివ్వలేదు.
8మరి కొన్ని విత్తనాలు సారవంతమైన భూమ్మీద
పడ్డాయి. అవి మొలకెత్తి, పెరిగి పెద్దవై నూరు రెట్లు
ఫలాన్నిచ్చాయి."
ఈ విధంగా చెప్పి, "వినే వాళ్ళు జాగ్రత్తగా వినాలి"
అని బిగ్గరగా అన్నాడు.
9శిష్యులు, "ఈ ఉపమానానికి అర్థమేమిటని"
ఆయన్ని అడిగారు.
10యేసు, "దేవుని రాజ్యం యొక్క రహస్య జ్ఞానం
తెలుసుకొనే అవకాశం మీకివ్వబడింది. కాని యితర్లకు,
ఆ రహస్యం ఉపమానాలు ఉపయోగించి చెబుతాను.
ఎందుకంటే,

> 'వాళ్ళు చూస్తున్నట్లే వుండి చూడలేరు,
> వాళ్ళు వింటున్నదానిని అర్థం చేసు
> కోలేరు.'
>
> *యెషయా 6:9*

11"ఇందులోని అర్థం యిది: విత్తనం దైవ సందేశం.
12దారిపై బడ్డ విత్తనాల సంఘటనకు అర్థం యిది:
కొందరు ప్రజలు వింటారు. కాని సైతాను వచ్చి వాళ్ళ
హృదయాల్లో ఉన్న దైవ సందేశాన్ని తీసుకు వెళ్తాడు.
వీళ్ళు విశ్వసించ రాదని, రక్షింపబడరాదని వాని ఉద్దేశ్యం.
13రాతి నేలపై బడ్డ విత్తనాల సంఘటనకు అర్థం యిది:
కొందరు దైవ సందేశం విని దాన్ని ఆనందంగా స్వీకరి
స్తారు. కాని వీళ్ళ విశ్వాసానికి వేర్లు ఉండవు. కనుక
వాళ్ళు కొద్ది కాలం మాత్రమే విశ్వసిస్తారు. పరీక్షా
సమయం రాగానే వెనుకంజ వేస్తారు. 14ముళ్ళు పెరిగే
నేలపై బడ్డ విత్తనాల సంఘటనకు అర్థంయిది:
కొందరు వింటారు కాని సుఖదుఃఖాలు, ధనము వాళ్ళను
అణచి వేయటం వల్ల వాళ్ళు సంపూర్ణంగా ఫలించరు.
15సారవంతమైన నేలపై బడ్డ విత్తనాల సంఘటనకు
అర్థం యిది: కొందరు ఉత్తమమైన మంచి మనస్సుతో
విని, విన్న వాటిని హృదయాల్లో దాచుకొని పట్టు
దలతో మంచి ఫలాన్నిస్తారు.

### జ్ఞానం దీపం లాంటిది

*(మత్తయి 4:21-25)*

16"దీపాన్ని వెలిగించి ఏ కుండ క్రిందో లేక మంచం
క్రిందో ఎవ్వరూ దాచరు. ఇంట్లోకి వచ్చిన వాళ్ళకు
వెలుగు కనిపించాలని ఆ దీపాన్ని ఎత్తైన దీప స్థంభంపై
పెడ్తాము. 17తెలియబడని, బయలు పర్చబడని రహస్య
మేదియు ఉండదు.* అందువల్ల మీరు ఎట్లా వింటు
న్నారో జాగ్రత్తగా ఆలోచించండి. 18కలిగియున్న వానికి
ఇంకా ఎక్కువ యివ్వ బడుతుంది. లేని వాని నుండి
వాని దగ్గరున్నదని అనుకొంటున్నది కూడా తీసి వేయ
బడుతుంది" అని అన్నాడు.

### నిజమైన బంధువులు

*(మత్తయి 12:46-50; మార్కు 3:31-35)*

19ఒకసారి యేసు తల్లి, ఆయన సోదరులు ఆయన్ని
చూడాలని వచ్చారు. ప్రజల గుంపు ఆయన చుట్టూ
ఉండటం వల్ల వాళ్ళు ఆయన దగ్గరకు వెళ్ళలేక
పొయ్యారు. 20ఒకడు యేసుతో, "మీ తల్లి, సోదరులు
మిమ్మల్ని చూడాలని వచ్చి బయట నిలుచున్నారు"
అని అన్నాడు.
21యేసు, "దైవ సందేశం విని దాన్ని అనుసరించే
వాళ్ళే నా తల్లి, నా సోదరులు" అని సమాధానం
చెప్పాడు.

### యేసు పెనుగాలిని అణిచి వేయటం

*(మత్తయి 8:23-27; మార్కు 4:35-41)*

22ఒక రోజు యేసు, ఆయన శిష్యులు పడవలో
ఉండగా, "సముద్రం అవతలి ఒడ్డుకు వెళ్దాం" అని
అన్నాడు. అందువల్ల వాళ్ళు ప్రయాణమయ్యారు.
23ప్రయాణం సాగిస్తుండగా యేసు నిద్రపొయ్యాడు.
అకస్మాత్తుగా పెనుగాలి ఆ సముద్రం మీదుగా వీచింది.
నీళ్ళు పడవలోకి రావటం మొదలుపెట్టాయి. వాళ్ళం
దరూ పెద్ద ప్రమాదంలో చిక్కుకొని పొయ్యారు.
24శిష్యులు యేసును నిద్ర లేపుతూ, "ప్రభూ! ప్రభూ!
మనము మునిగి పోతున్నాం!" అని అన్నారు.
ఆయన లేచి గాలిని, నీళ్ళను ఆగమని గద్దించాడు.
పెనుగాలి ఆగిపోయింది. 25"యేసు, మీ విశ్వాసం
ఏమైంది?" అని తన శిష్యుల్ని అడిగాడు.
వాళ్ళు భయంతో ఆశ్చర్యంగా, "ఆయన ఎంత
గొప్పవాడు! నీళ్ళను, గాలిని కూడా ఆజ్ఞాపిస్తున్నాడే!

---

**వచనము 17** ప్రకారము అన్నీ బాహాటంగా తెలియ జేయ
బడును.

అవి విధేయతతో ఆయన ఆజ్ఞను పాటిస్తున్నాయే!"
అని పరస్పరం మాట్లాడుకున్నారు.
26వాళ్ళు గెరాసేనులు అనే ప్రజలు నివసించే
ప్రాంతాన్ని చేరుకున్నారు. ఆ ప్రాంతం గలిలయ సము
ద్రానికి అవతలి వైపున ఉంటుంది. 27యేసు ఒడ్డు
చేరగానే దయ్యం పట్టిన ఆ ఊరి వాడొకడు యేసు
దగ్గరకు వచ్చాడు. చాలాకాలం నుండి అతడు బట్టలు
వేసుకొనేవాడు కాదు. ఇంట్లో నివసించే వాడు కాదు.
స్మశానాల్లో నివసించేవాడు. 28ఆ దయ్యం పట్టినవాడు
యేసును చూడగానే పెద్ద గొంతుతో, "యేసూ! దేవుని
కుమారుడా! నాతో నీకేం పని? నన్ను హింసించ
వద్దని వేడుకొంటున్నాను" అని బిగ్గరగా అంటూ
ఆయన కాళ్ళ మీద పడ్డాడు. 29యేసు ఆ దయ్యాన్ని
అతని నుండి బయటకు రమ్మని ఆజ్ఞా పించాడు. ఈ
దయ్యం అతణ్ణి చాలాసార్లు ఆవరించింది. అతని కాళ్ళు
చేతులు గొలుసులతో కట్టేసి కాపలాలోవుంచేవాళ్ళు.
అయినా అతడు ఆ గొలుసులను తెంపుకొనే వాడు.
ఆ దయ్యం అతణ్ణి నిర్మానుష్య స్థలాలకు లాక్కొని
వెళ్ళేది.
30యేసు, "నీ పేరేమిటి?" అని అడిగాడు.
అతడు, "సేన" అని సమాధానం చెప్పాడు. ఎన్నో
దయ్యాలు వానిలో ఉండటం వల్ల ఈ విధంగా సమా
ధానం చెప్పాడు. 31ఆ దయ్యాలు తమను పాతాళం
లోకి పడవేయ వద్దని ఎంతో ప్రాధేయ పడ్డాయి.
32అక్కడ కొండ మీద ఒక పెద్ద పందుల గుంపు
మేస్తూ ఉంది. ఆ దయ్యాలు, తాము ఆ పందుల్లోకి
వెళ్ళేటట్లు అనుమతి యివ్వుమని యేసును వేడుకు
న్నాయి. ఆయన అనుమతినిచ్చాడు. 33ఆ దయ్యాలు
ఆ మనిషి నుండి బయటకు వచ్చి పందుల్లోకి జొర
బడ్డాయి. ఆ తర్వాత అవి ఆ కొండనుండి క్రిందికి
పరుగెత్తి సముద్రంలో పడి మునిగి పొయ్యాయి.
34పందులు కాస్తున్న వాళ్ళు జరిగింది చూసి పరు
గెత్తి వెళ్ళి గ్రామంలో ఉన్న వాళ్ళకు, పొలాల్లో ఉన్న
వాళ్ళకు చెప్పారు. 35ప్రజలు ఏమి జరిగిందో చూడా
లని అక్కడికి వెళ్ళారు. అంతా యేసు దగ్గరకు వచ్చారు.
అక్కడ దయ్యాలు వదిలింపబడ్డవాడు యేసు కాళ్ళ
దగ్గరవుండటం వాళ్ళు చూశారు. అతని ఒంటిపై
దుస్తులువున్నాయి. అతని ప్రవర్తన సహజంగా ఉంది.
ఇది గమనించి వాళ్ళకు భయం వేసింది. 36జరిగింది
చూసిన వాళ్ళు ఆ దయ్యం పట్టినవానికి ఏ విధంగా
నయమైపోయిందో వచ్చిన వాళ్ళకు చెప్పారు. 37గెరాసే
ను ప్రజలందరికి చాలా భయం వేయటం వల్ల తమ
ప్రాంతం వదిలి వెళ్ళమని వాళ్ళు యేసుతో అన్నారు.
అందువల్ల ఆయన పడవనెక్కి వెళ్ళిపోయాడు.
38దయ్యాలు వదిలింపబడ్డ వాడు వెంటవస్తానని
యేసును బ్రతిమిలాడాడు. 39యేసు అతనితో, "నీ
ఇంటికి తిరిగి వెళ్ళి దేవుడు చేసిన మేలు అందరికి
చెప్పు" అని అతణ్ణి పంపివేసాడు. అందువల్ల అతడు
వెళ్ళి యేసు తనకు చేసిన మేలు తన గ్రామంలో
ఉన్న వాళ్ళకందరికి చెప్పాడు.
40ప్రజలందరూ యేసు కోసం వేచి ఉన్నారు.
ఆయన రాగానే వాళ్ళు ఆయనకు స్వాగతమిచ్చారు.
41అదే సమయానికి సమాజ మందిరానికి అధికారిగా
ఉన్న యాయీరు అన్న వ్యక్తి ఒకడు వచ్చి యేసు
కాళ్ళ మీద పడ్డాడు. 42తన పన్నెండేండ్ల కుమార్తె
కూతురు చనిపోతుందని, తనకు ఒకే కూతురని, తన
యింటికి వచ్చి ఆమెకు నయం చేయమని వేడు
కున్నాడు.
యేసు అతని ఇంటికి వెళ్తుండగా, ప్రజలు త్రోసు
కొంటూ ఆయన చుట్టూ ఉన్నారు. 43ఆ గుంపులో
పన్నెండేండ్లనుండి రక్తస్రావంతో బాధపడ్తున్న ఒక స్త్రీ
ఉంది. ఆమె తన దగ్గరున్న ధనమంతా ఖర్చు పెట్టినా
ఏ వైద్యుడూ ఆమె రోగాన్ని నయం చేయలేక
పోయాడు. 44ఆమె యేసు వెనుకనుండి వచ్చి ఆయన
అంగీ యొక్క కొనను తాకింది. వెంటనే ఆమె రక్త
స్రావం ఆగిపోయింది. 45ఆయన, "నన్నెవరు
తాకారు?" అని అడిగాడు.
అంతా తాము కాదన్నారు. అప్పుడు పేతురు,
"ప్రభూ! ప్రజలు త్రోసుకొంటూ మీ మీద పడ్తున్నారు
కదా! ఎవరని చెప్పగలము?" అని అన్నాడు.
46యేసు, "కాని ఎవరోనన్ను తాకారు. నా నుండి
శక్తి వెళ్ళటం గమనించాను" అని అన్నాడు. 47అప్పుడా
స్త్రీ తనను గమనించకుండా ఉండరని గ్రహించి, వణ
కుతూ వచ్చి యేసు కాళ్ళపై పడింది. తాను ఆయన్ని
ఎందుకు తాకిందో, తనకు ఎలా వెంటనే నయమైందో
అందరి సమక్షంలో చెప్పింది. 48అప్పుడు యేసు
ఆమెతో, "అమ్మా! నీ విశ్వాసం నీకు నయం చేసింది.
శాంతంగా వెళ్ళు" అని అన్నాడు.
49యేసు యింకా మాట్లాడుతుండగా ఆ సమాజ
మందిరపు అధికారి ఇంటినుండి ఒకడు వచ్చి అతనితో,
"మీ కూతురు చనిపోయింది. ప్రభువును కష్టపెట్ట
నవసరం లేదు" అని అన్నాడు.
50ఇది విని యేసు యాయీరుతో, "భయపడకు,
విశ్వాసం ఉంచుకో, ఆమెకు నయమైపోతుంది" అని
అన్నాడు.
51యేసు యాయీరు యింటికి వచ్చాడు.
పేతురు, యోహాను, యాకోబు ఆ అమ్మాయి తల్లి
తండ్రుల్ని తప్ప మరెవ్వరిని తన వెంట రానివ్వలేదు.
52వాళ్ళంతా ఆమె కోసం శోకిస్తూ ఉన్నారు. యేసు,
"మీ శోకాలు ఆపండి. ఆమె చనిపోలేదు, నిద్రపోతూ
ఉంది అంతే" అని అన్నాడు.
53ఆమె చనిపోయిందని వాళ్ళకు తెలుసు. కనుక
వాళ్ళు ఆయన్ని హేళన చేసారు. 54యేసు ఆమె
చేతులు పట్టుకొని, "లే అమ్మాయి!" అని అన్నాడు.

55ఆమె ఆత్మ తిరిగి ఆమెలో చేరింది. ఆమె వెంటనే
లేచి కూర్చొంది. యేసు వాళ్ళతో, "ఆమెకు ఏదైనా
తినటానికి యివ్వండి" అని అన్నాడు. 56ఆమె తల్లి
తండ్రులు దిగ్భ్రాంతి చెందారు. కాని యేసు జరిగిన
దాన్ని గురించి ఎవ్వరికి చెప్పవద్దని ఆజ్ఞాపించాడు.

### యేసు తన పన్నెండుమంది శిష్యుల్ని పంపటం

*(మత్తయి 10:5-15; మార్కు 6:7-13)*

9 యేసు తన పన్నెండు మంది శిష్యుల్ని సమావేశ
పరిచి దయ్యాల్ని పారద్రోలటానికి, రోగాలను
నయం చేయటానికి వాళ్ళకు శక్తి, అధికారము
ఇచ్చాడు. 2వాళ్ళను ప్రపంచంలోకి పంపుతూ దేవుని
రాజ్యాన్ని గురించి ప్రకటించుమని, రోగాలున్న
వాళ్ళకు నయం చెయ్యమని వాళ్ళతో చెప్పాడు.
3వాళ్ళతో, "ప్రయాణం చేస్తున్నప్పుడు మీ వెంట
చేతి కర్రకాని, సంచికాని, ఆహారంకాని, ధనంకాని,
మారు దుస్తులు కాని, యితర వస్తువులు కాని తీసుకు
వెళ్ళకండి. 4ఒక యింటికి వెళ్తే ఆ గ్రామం వదిలే
దాకా ఆ యిల్లు విడిచి వెళ్ళకండి. 5ప్రజలు మీకు
స్వాగతం ఇవ్వకుంటే ఆ ఊరు వదిలి వెళ్ళే ముందు
వాళ్ళు చేసిన పొరపాటు చూపటానికి మీ కాలి ధూళి
దులపండి" అని అన్నాడు.
6ఆ తర్వాత వాళ్ళు బయలు దేరి ప్రతి గ్రామానికి
వెళ్ళారు. ప్రతిచోటా దైవ సందేశాన్ని ప్రకటించారు.
రోగాలున్న వాళ్ళకు నయం చేసారు.

### హేరోదు ఆందోళన

*(మత్తయి 14:1-12; మార్కు 6:14-29)*

7సామంతరాజైన హేరోదు జరుగుతున్న వాటిని
గురించి విని చాలా కంగారు పడ్డాడు. యోహాను బ్రతికి
వచ్చాడని కొందరన్నారు. 8ఏలీయా కనిపించాడని
కొందరన్నారు. మరి కొందరు పూర్వకాలం నాటి
ప్రవక్తల్లో ఒకడు బ్రతికి వచ్చాడని అన్నారు. 9కాని
హేరోదు, "నేను యోహాను తల నరికించాను కదా.
మరి ఎవర్ని గురించి వింటున్నాను?" అని మనస్సులో
అనుకొన్నాడు. హేరోదు యేసును చూడాలని ఆతృత
పడ్డాడు.

### ఐదు వేలమందికి భోజనం పెట్టటం

*(మత్తయి 14:13-21; మార్కు 6:30-44;
యోహాను 6:1-14)*

10అపొస్తలులు తిరిగి వచ్చి తాము చేసినవన్నీ
యేసుతో చెప్పారు. ఆ తర్వాత యేసు అపొస్తలులను
ప్రజలకు దూరంగా బేత్సయిదా అనే పట్టణానికి తన
వెంట తీసుకు వెళ్ళాడు. 11ప్రజలకు ఈ విషయం
తెలిసింది. వాళ్ళు యేసును చూడటానికి అక్కడికి
కూడా వెళ్ళారు. ఆయన వాళ్ళను ఆహ్వానించి దేవుని
రాజ్యాన్ని గురించి చెప్పి రోగాలున్న వాళ్ళకు నయం
చేశాడు.
12సూర్యాస్తమయమౌతుండగా ఆయన వద్దకు
పన్నెండు మంది అపొస్తలులు వచ్చి, "మనం ఏ మూలో
ఉన్నాం. ప్రజల్ని వెళ్ళమనండి. చుట్టూ ఉన్న పల్లెలకు,
గ్రామాలకు వెళ్ళి ఆహారము, విశ్రమించటానికి స్థలం,
చూసుకొంటారు" అని అన్నారు.
13యేసు వాళ్ళతో, "వాళ్ళు తినటానికి మీరే ఏదైనా
ఆహారం ఇవ్వండి" అని అన్నాడు.
వాళ్ళు, "మా దగ్గర అయిదు రొట్టెలు, రెండు
చేపలు మాత్రమే ఉన్నాయి. మేము వెళ్ళి వీళ్ళంద
రికోసం ఆహారం కొనుక్కు రావాలని మీ ఉద్దేశ్యమా?"
అని అన్నారు. 14సుమారు ఐదువేలమంది పురుషులు
అక్కడ ఉన్నారు.
కాని యేసు తన శిష్యులతో, "పంక్తికి యాభై
మంది చొప్పున వాళ్ళను కూర్చో బెట్టండి" అని
అన్నాడు.
15శిష్యులు ఆయన చెప్పినట్లు చేసారు. వచ్చిన
వాళ్ళందరూ కూర్చున్నారు. 16యేసు ఆ ఐదు
రొట్టెలు, రెండు చేపలు తీసుకొని ఆకాశం వైపు
చూసి, దేవునికి కృతజ్ఞత చెప్పి వాటిని భాగాలు చేశాడు.
వాటిని తన శిష్యుల కిచ్చి ప్రజలకు పంచమన్నాడు.
17అందరూ కడుపు నిండుగా తిన్నారు. ఆ తర్వాత
శిష్యులు మిగిలిన ఆహారాన్ని పండ్రెండు గంపల నిండా
నింపారు.

### పేతురు యేసును "క్రీస్తు" అని చెప్పటం

*(మత్తయి 16:13-19; మార్కు 8:27-29)*

18ఒక రోజు యేసు ఏకాంతంగా ప్రార్థిస్తూ ఉన్నాడు.
ఆయన శిష్యులు ఆయన దగ్గరకు వచ్చారు. ఆయన
ప్రార్థించటం ముగించాక వాళ్ళతో, "ప్రజలు నేను
ఎవర్నని అంటున్నారు?" అని అడిగాడు.
19వాళ్ళు, "కొందరు బాప్తిస్మము నిచ్చే యోహాను
అని అంటున్నారు. మరికొందరు పూర్వకాలం నాటి
ప్రవక్త బ్రతికి వచ్చాడు అని అంటున్నారు" అని
సమాధానం చెప్పారు.
20"మీ సంగతేమిటి? మీరేమంటారు?" అని ఆయన
అడిగాడు. పేతురు, "మీరు దేవుడు పంపిన క్రీస్తు"
అని సమాధానం చెప్పాడు.
21"ఈ విషయం ఎవ్వరికీ చెప్పవద్దు" అని యేసు
ఖండితంగా చెప్పాడు. 22ఆయన వాళ్ళతో, "మనుష్య
కుమారుడు ఎన్నో కష్టాలు అనుభవిస్తాడు. పెద్దలు,
ప్రధాన యాజకులు, శాస్త్రులు ఆయన్ని తిరస్కరిస్తారు.
ఆయన చంపబడి మూడవ రోజున బ్రతికింపబడ
తాడు" అని అన్నాడు.
23ఆ తర్వాత వాళ్ళతో ఈ విధంగా అన్నాడు:
"నా వెంట రావాలనుకొన్నవాడు తన కోరికల్ని చంపు

కొని, తన సిలువను ప్రతిరోజు మోసుకొంటూ నన్ను
అనుసరించాలి. 24తన ప్రాణాన్ని రక్షించు కోవాలను
కొన్నవాడు దాన్ని పోగొట్టు కొంటాడు. కాని నా
కోసం తన ప్రాణాన్ని పోగొట్టుకొనువాడు దాన్ని
రక్షించుకొంటాడు. 25ప్రపంచాన్నంతా జయించి
తనను పోగొట్టుకొని, తన జీవితాన్ని నాశనం చేసు
కొంటే దానివల్ల కలిగే లాభమేమిటి? 26నన్ను, నా
సందేశాన్ని అంగీకరించటానికి సిగ్గు పడిన వాళ్ళ విష
యంలో, మనుష్యకుమారుడు తన తేజస్సుతో, తండ్రి
తేజస్సుతో, పవిత్రమైన దేవదూతల తేజస్సుతో వచ్చి
నప్పుడు సిగ్గుపడతాడు. 27ఇది నిజం. ఇక్కడ నిలు
చున్న వాళ్ళలో కొందరు దేవుని రాజ్యాన్ని చూడ
కుండా మరణించరు."

## దివ్య దర్శనం

*(మత్తయి 17:1-8; మార్కు 9:2-8)*

28ఈ విధంగా చెప్పిన ఎనిమిది రోజులకు పేతురు,
యోహాను, యాకోబును తన వెంట తీసుకొని ఒక
కొండ మీదికి యేసు ప్రార్థించటానికి వెళ్ళాడు.
29ఆయన ప్రార్థిస్తుండగా ఆయన ముఖతేజస్సు
మారింది. ఆయన దుస్తులు తెల్లగా ప్రకాశించటం
మొదలు పెట్టాయి. 30అకస్మాత్తుగా యిద్దరు వ్యక్తులు
తేజస్సుతో యేసు ముందు ప్రత్యక్షమై ఆయనతో
మాట్లాడటం మొదలు పెట్టారు. వాళ్ళు మోషే, ఏలీ
యాలు. 31యెరూషలేములో నెరవేర్చబడనున్న దైవే
చ్ఛను గురించి, అంటే ఆయన మరణాన్ని గురించి,
మాట్లాడారు. 32పేతురు, అతని వెంటనున్న వాళ్ళు
మంచి నిద్రమత్తులో ఉన్నారు. వాళ్ళకు మెలకువ
వచ్చింది. వాళ్ళు లేచి యేసు తేజస్సును, ఆయనతో
నిలుచొని ఉన్న ఆ యిద్దరి పురుషుల తేజస్సును
చూసారు.

33మోషే, ఏలీయాలు వెళ్తుండగా పేతురు
యేసుతో, "ప్రభూ! మనము యిక్కడ ఉండటం
మంచిది. మీకొకటి, మోషే కొకటి, ఏలీయా కొకటి
మూడు పర్ణశాలలు వేయమంటారా?" అని అడిగాడు.
పరిస్థితి అర్థం చేసుకోకుండా అతడు ఈ మాటలు
అన్నాడు.

34పేతురు ఈ మాట అంటుండగానే ఒక మేఘం
వచ్చి వాళ్ళను కప్పి వేసింది. వాళ్ళను ఆ మేఘం
కప్పివేస్తుండగా పేతురుకు, అతనితో ఉన్న వాళ్ళకు
భయం వేసింది. 35ఆ మేఘం నుండి ఒక స్వరం,
"ఈయన నా ప్రియ కుమారుడు, నేను ఎన్నుకొన్న
వాడు. ఆయన చెప్పినట్లు చెయ్యండి" అని వినబడింది.

36ఆ స్వరం మాట్లాడటం ముగించాక వాళ్ళకు
అక్కడ యేసు మాత్రమే కనిపించాడు. చాలా కాలం
దాకా శిష్యులు తాము చూసిన దాన్ని ఎవ్వరికి చెప్ప
లేదు.

## దయ్యం పట్టిన బాలునికి నయం చేయటం

*(మత్తయి 17:14-18; మార్కు 9:14-27)*

37మరుసటి రోజు వాళ్ళు కొండ దిగగానే పెద్ద
ప్రజల గుంపు ఒకటి యేసును చూడటానికి అక్కడ
సమావేశమైంది. 38ఆ గుంపులో నుండి ఒకడు,
"అయ్యా! వచ్చి నా కుమారుణ్ణి కటాక్షించుమని వేడు
కుంటున్నాను. నాకు ఒక్కడే కుమారుడు. 39ఒక
దయ్యం అతణ్ణి ఆవరిస్తుంది. అది మీదికి రాగానే అతడు
బిగ్గరగా కేకలు వేస్తాడు. అది అతణ్ణి క్రింద పడవేస్తుంది.
అతడు వణుకుతూ నోటినుండి నురుగులు కక్కు
తాడు. అది అతణ్ణి వదలటం లేదు. అతణ్ణి పూర్తిగా
నాశనం చేస్తోంది. 40ఆ దయ్యాన్ని వెళ్ళగొట్టమని మీ
శిష్యుల్ని వేడుకున్నాను. కాని వాళ్ళు ఆ పని చెయ్యలేక
పొయ్యారు" అని అన్నాడు.

41యేసు, "మూర్ఖతరం వారలారా! విశ్వాస
హీనులారా! మీతో ఉండి ఎన్ని రోజులు సహించాలి?
నీ కుమారుణ్ణి పిలుచుకురా!" అని అన్నాడు.

42ఆ దయ్యం పట్టిన వాడు వస్తూవుంటే అది
అతణ్ణి నేల మీద పడవేసింది. యేసు ఆ దయ్యాన్ని
వెళ్ళిపొమ్మని గద్దించి ఆ బాలునికి నయం చేశాడు.
తదుపరి అతణ్ణి అతని తండ్రికి అప్పగించాడు. 43దేవుని
మహిమ చూసి అందరూ ఆశ్చర్యపోయారు. యేసు
చేసింది చూసి వాళ్ళు తమ ఆశ్చర్యం నుండి కోలుకోక
ముందే యేసు తన శిష్యులతో ఈ విధంగా అన్నాడు:

44"నేను చెప్పబోయేది జాగ్రత్తగా వినండి.
మనుష్యకుమారుణ్ణి ఒక ద్రోహి యితర్లకు అప్పగి
స్తాడు." 45వాళ్ళకు దీని అర్థం తెలియలేదు. వాళ్ళకు
అర్థం కాకుండునట్టు రహస్యంగా ఉంచబడింది. దాన్ని
గురించి అడగటానికి వాళ్ళకు ధైర్యం చాలలేదు.

## ఎవరు గొప్ప?

*(మత్తయి 18:1-5; మార్కు 9:33-37)*

46తమలో అందరి కన్నా ఎవరు గొప్ప అన్న
అంశంపై శిష్యుల మధ్య ఒక వాదం మొదలైంది.
47యేసుకు వాళ్ళ ఆలోచనలు తెలిసిపోయాయి.
ఆయన ఒక చిన్న పిల్లవాణ్ణి తీసుకొని తన ప్రక్కన
నిలబెట్టుకొని 48వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: "నా
పేరిట ఈ పసివానిని అంగీకరిస్తే నన్ను అంగీకరించిన
దానితో సమానము. నన్ను అంగీకరిస్తే నన్ను పంపిన
వానిని అంగీకరించిన దానితో సమానము. మీలో అంద
రికన్నా తక్కువవాడు అందరికన్నా గొప్పవానితో
సమానము."

49యోహాను, "అయ్యా! మీ పేరుతో ఒకడు
దయ్యాల్ని వదిలిస్తున్నాడు. అతడు మన వాడు కాదు.
కనుక అలా చెయ్యవద్దని అడ్డగించాము" అని అన్నాడు.
50యేసు, "అతణ్ణి ఆపకండి. నాకు వ్యతిరేకంగా ఉండని

వాడు నాకు అనుకూలంగా ఉన్న వానితో సమానము" అని అన్నాడు.

## విశ్వసించని గ్రామము

51ఆయన పరలోకానికి వెళ్ళే సమయం దగ్గర పడసాగింది. యేసు యెరూషలేము వెళ్ళాలని గట్టిగా నిశ్చయించుకున్నాడు. 52తన దూతల్ని తనకన్నా ముందు పంపాడు. వాళ్ళు ఆయన కోసం అన్నీ సిద్ధం చెయ్యాలని ఒక సమరయ పల్లెకు వెళ్ళారు. 53ఆ వూరి వాళ్ళు ఆయన యెరూషలేము వెళ్తుండటం వలన ఆయనకు స్వాగతమివ్వలేదు. 54ఆయన శిష్యులలో యాకోబు, యోహాను యిది చూసి యేసుతో, "ప్రభూ! వాళ్ళను నాశనం చేయటానికి ఆకాశం నుండి అగ్ని రప్పించమంటారా?"* అని అడిగారు.
55యేసు వాళ్ళవైపు చూసి వాళ్ళను గద్దించాడు.*
56అక్కడి నుండి వాళ్ళంతా మరొక గ్రామానికి వెళ్ళారు.

## యేసును అనుసరించటానికి చెల్లించవలసిన వెల

*(మత్తయి 8:19-22)*

57వాళ్ళు దారిమీద నడుస్తుండగా ఒకడు యేసుతో, "మీరు ఎక్కడికి వెళ్తే నేనక్కడికి వస్తాను" అని అన్నాడు.

58యేసు, "నక్కలు నివసించటానికి బొరియలు ఉన్నాయి. ఆకాశ పక్షులకు గూళ్ళున్నాయి. కాని మనుష్యకుమారుడు తల వాల్చటానికి కూడా స్థలం లేదు" అని అన్నాడు.

59యేసు యింకొకనితో, "నా వెంట రా!" అని అన్నాడు.

కాని అతడు, "ప్రభూ! నేను వెళ్ళి ముందు నా తండ్రిని సమాధి చేసి రానివ్వండి!" అని అన్నాడు.

60యేసు అతనితో, "చనిపోయిన వాళ్ళ సంగతి చనిపోయినవాళ్ళు చూసుకోనీ. నీవు వెళ్ళి దేవుని రాజ్యాన్ని గురించి ప్రకటించు" అని అన్నాడు.

61ఇంకొకడు, "ప్రభూ! నేను మిమ్మల్ని అనుసరిస్తాను. కాని ముందు వెళ్ళి నాయింటి వాళ్ళకు చెప్పి రానివ్వండి" అని అన్నాడు.

62అందుకు యేసు, "దున్నుటకు నాగల్ని పట్టుకొని వెనక్కి తిరిగేవాడు దేవుని రాజ్యానికి అర్హుడుకాడు" అని అతనితో చెప్పాడు.

**వచనము 54** కొన్ని గ్రీకు ప్రతులలో "ఏలీయ చేసినట్లు" అని చేర్చబడింది.

**వచనము 55** కొన్ని గ్రీకు ప్రతులలో "అందుకు యేసు 'మీరు ఏ ఆత్మకు సంబంధించిన వాళ్ళో మీకు తెలియదు.' 56 మనుష్యకుమారుడు మానవుల్ని నాశనం చేయడానికి కాక రక్షించడానికే వచ్చాడు."

## యేసు తన శిష్యుల్ని పంపటం

10 ఆ తర్వాత యేసు మరొక డెబ్బది* మందిని నియమించాడు. వాళ్ళను జతలు జతలుగా తాను వెళ్ళబోయే ప్రతి గ్రామానికి, పల్లెకు తన కంటే ముందు పంపుతూ, 2"పంటబాగా పండింది. కాని పనివాళ్ళు తక్కువగా ఉన్నారు. అందువల్ల పంటనిచ్చిన ఆ ప్రభువును పని వాళ్ళను తన పొలాలకు పంపమని ప్రార్థించండి. 3వెళ్ళండి! తోడేళ్ళ మందలోకి గొర్రెల్ని పంపినట్లు మిమ్మల్ని పంపుతున్నాను. 4మీ వెంట డబ్బు దాచుకొనే సంచి కాని, జోలి కాని, చెప్పులు కాని, తీసుకు వెళ్ళకండి. దారి మీద ఎవ్వరితో మాట్లాడకండి.

5ఒకరి యింట్లోకి వెళ్ళేముందు, మొదట సమాధానం కలుగుగాక అని చెప్పండి. 6ఆ యింటిలో శాంతి పొందనర్హుడైన వ్యక్తి ఉంటే మీ ఆశీస్సు అతనికి తోడౌతుంది. లేని పక్షంలో మీ ఆశీస్సు మీకు తిరిగివస్తుంది. 7ఉన్న యింట్లోనే ఉండండి. ఇచ్చిన దాన్ని భుజించండి. పని చేసిన వానికి కూలి దొరకాలి కదా! ఇల్లిల్లు తిరగకండి. 8ఒక గ్రామంలోకి వెళ్ళినప్పుడు ఆ గ్రామస్థులు స్వాగతమిచ్చి ఏది మీ ముందు పెడితే అది భుజించండి. 9గ్రామంలో ఉన్న రోగులకు నయం చెయ్యండి. వాళ్ళతో, 'దేవుని రాజ్యం మీ దగ్గరకు వస్తోంది' అని చెప్పండి. 10మీరొక గ్రామానికి వెళ్ళినప్పుడు ఆ గ్రామస్థులు స్వాగత మివ్వకుంటే 11వీధిలోకి వెళ్ళి మీరు చేస్తున్నది తప్పని సూచించటానికి, 'మా కాలికంటిన మీ ఊరి ధూళి కూడా దులిపి వేస్తున్నాము. కాని యిది మాత్రం నిజం. దేవుని రాజ్యం సమీపంలోనే ఉంది. తెలిసికోండి' అని అనండి. 12తీర్పు చెప్పబోయేరోజున, ఆ ఊరి ప్రజల్ని దేవుడు సొదొమ ప్రజలకన్నా ఎక్కువగా శిక్షిస్తాడని నేను చెబుతున్నాను.

13"అయ్యో కొరాజీనా! అయ్యో బేత్సయిదా! మీకోసం చేసిన అద్భుతాలు తూరు, సీదోను పట్టణాలలో చేసివుంటే వాళ్ళు చాలా కాలం క్రిందటే గోనెపట్ట కట్టుకొని బూడిద తలపై వేసుకొని పశ్చాత్తాపం చెంది, మారుమనస్సు పొందివుండే వాళ్ళు. 14కాని తీర్పు చెప్పబడే రోజున తూరు, సీదోను ప్రజలకన్నా మిమ్మల్ని ఎక్కువగా శిక్షిస్తాడు. 15ఇక, ఓ కపెర్నహూమా! ఆకాశమంత ఎత్తుగా హెచ్చించుకొందువా? పాతాళానికి త్రోసి వేయబడతావు.

16"మీ బోధనలు వింటే నా బోధనలు విన్నట్టే. మిమ్మల్ని నిరాకరిస్తే నన్నును నిరాకరించినట్టే. నన్ను నిరాకరిస్తే నన్ను పంపినవానిని నిరాకరించినట్లే" అని వాళ్ళతో అన్నాడు.

**డెబ్బది** కొన్ని ప్రతులలో డెబ్బదిరెండు అని ఉన్నది.

17ఆ డెబ్బైమంది శిష్యులు ఆనందంతో తిరిగి
వచ్చి, “ప్రభూ! మీ పేరు చెప్పగానే దయ్యాలు కూడా
మా మాటలకు లోబడ్డాయి” అని అన్నారు. 18యేసు,
“సైతాను ఆకాశం నుండి మెరుపువలే పడిపోవటం
నేను చూశాను. 19పాముల మీద నడవటానికి మీకు
అధికారము యిచ్చాను. శత్రువును జయించే అధికారం
యిచ్చాను. ఏదీ మీకు హాని చెయ్యలేదు. 20దయ్యాలు
మీ మాట వింటున్నంత మాత్రాన ఆనందించకండి.
మీ పేరు పరలోకంలో వ్రాయబడినందుకు ఆనందిం
చండి” అని అన్నాడు.

21ఆయన పవిత్రాత్మలో సంతోషిస్తూ, “ఆకాశా
నికి, భూమికి ప్రభువైనటు వంటి ఓ తండ్రీ! నీకు
స్తుతులు! నీవీ విషయాలు చదువుకున్న వాళ్ళనుండి,
విజ్ఞానుల నుండి దాచి, అమాయకులకు తెలియ
చేసావు. ఔను, తండ్రీ! ఇదే నీచిత్తము” అని అన్నాడు.
22“నా తండ్రి నాకు అన్నీ యిచ్చాడు. తండ్రికి
తప్ప కుమారుడెవరో ఇతర్లకు తెలియదు. కుమా
రుడు చెప్పదలచిన వాళ్లకు తప్ప తండ్రి ఎవరో
యితర్లకు తెలియదు” అని అన్నాడు.
23ఆ తర్వాత తన శిష్యుల వైపు తిరిగి, “మీరు
చూస్తున్నవి చూసే కన్నులు ధన్యమైనవి. 24నేను
చెప్పేదేమిటంటే మీరు చూస్తున్నవి చూడాలని చాలా
మంది ప్రవక్తలు, రాజులు ఆశించారు. కాని చూడలేక
పోయారు. మీరు వింటున్నవి వినాలని వాళ్ళాశించారు.
కాని వినలేక పోయారు” అని రహస్యంగా వారితో
అన్నాడు.

### నిజమైన పొరుగువాడు

25ఒక ధర్మశాస్త్రపండితుడు యేసును పరీక్షిం
చాలనుకొని లేచి, “బోధకుడా! నేను నిత్యజీవం*
పొందాలంటే ఏమి చెయ్యాలి?” అని అడిగాడు.
26దానికి యేసు, “ధర్మశాస్త్రంలో ఏమి వ్రాసారు?
నీవు ఏమిచదివావు?” అని అడిగాడు.
27అతడు, “నీ ప్రభువైనటువంటి దేవుణ్ణి సంపూర్ణ
మైన మనస్సుతో, సంపూర్ణమైన ఆత్మతో, సంపూర్ణ
మైన బుద్ధితోనూ, శక్తితోనూ ప్రేమించు. అంతేకాక,
నిన్ను ప్రేమించుకొన్నంతగా నీ పొరుగు వాళ్ళను
ప్రేమించు’* అని వ్రాయబడివుంది” అని చెప్పాడు.
28యేసు ఈ విధంగా అన్నాడు: “నీవు సరియైన
సమాధానం చెప్పావు. ఆ విధంగా నడుచుకో, అనంత
జీవితం పొందుతావు.” 29ఆ పండితుడు తాను
నీతిమంతుడనని రుజువు చేయటానికి యేసుతో, “మరి
నా పొరుగువాడు ఎవరు?” అని అడిగాడు.

30యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“ఒకడు యెరూషలేము నుండి యెరికోకు ప్రయాణం
చేస్తూ దార్లో దొంగల చేతిలో చిక్కాడు. వాళ్ళతణ్ణి
నిలువు దోపిడి చేసి బాగాకొట్టి వదిలి వేసారు. అతడు
కొన ప్రాణంతో ఉన్నాడు. 31అనుకోకుండా ఒక
యాజకుడు ఆ దారిన రావటం తటస్థించింది. అతణ్ణి
చూసి కూడా ఆ యాజకుడు ప్రక్కకు తొలిగి
వెళ్ళిపొయ్యాడు. 32అదే విధంగా ఒక లేవీయుడు
కూడా వచ్చి అతణ్ణి చూసి ప్రక్కకు తొలిగి వెళ్ళి
పొయ్యాడు.
33ఒక సమరయ ప్రాంతపువాడు ప్రయా ణంచేస్తూ
అతని దగ్గరకు వచ్చాడు. అతణ్ణి చూసి ఆ సమరయ
వానికి చాలా జాలి కలిగింది. 34అతని దగ్గరకు వెళ్ళి
అతని గాయాలమీద ద్రాక్షారసం పోసి, నూనె రాచి,
కట్లు కట్టాడు. ఆ తర్వాత తన దగ్గరున్న గాడిద మీద
అతణ్ణి ఎక్కించుకొని ఒక సత్రానికి తీసుకు వెళ్ళాడు.
ఈ విధంగా అతనికి చాలా ఉపకారం చేశాడు. 35మరుసటి
రోజు ఆ సత్రపు యజమానికి రెండు దేనారాలిచ్చి,
‘ఇతణ్ణి జాగ్రత్తగా చూసుకో. ఇతని కోసం నేనిచ్చిన
దాని కన్నా ఎక్కువ ఖర్చు చేయవలసి వస్తే నేను
తిరిగి వచ్చినప్పుడు ఆ డబ్బు నీకిస్తాను’ అని చెప్పి
వెళ్ళిపొయ్యాడు.”
36ఈ విషయం చెప్పి యేసు, “దొంగల చేతుల్లో
చిక్కిన వానికి ఈ ముగ్గురిలో ఎవరు పొరుగువాడని నీ
అభిప్రాయం?” అని అడిగాడు.
37ఆ పండితుడు, “అతనిపై జాలి చూపిన వాడే!”
అని సమాధానం చెప్పాడు. దానికి యేసు, “నీవు
కూడా అతనిలాగే నడుచుకో” అని చెప్పాడు.

### యేసు మార్త యింటికి వెళ్ళటం

38యేసు తన శిష్యులతో ప్రయాణం చేస్తూ ఒక
గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామంలో మార్త అనే స్త్రీ
ఆయన్ని తన యింటికి ఆహ్వానించింది. 39ఆమెకు
మరియ అనే ఒక సోదరి ఉంది. మరియ యేసు
ప్రభువు కాళ్ళ దగ్గర కూర్చొని ఆయన చెప్పిన విష
యాలు వింటూ ఉంది. 40కాని మార్తకు పని ఎక్కువగా
ఉండటం వల్ల చిరాకు కలిగింది. ఆమె యేసు దగ్గరకు
వచ్చి, “ప్రభూ! నా సోదరి యింటి పనంతా నామీద
వదిలి వేయటం మీకు న్యాయ మనిపిస్తుందా? వచ్చి
నాకు సహాయం చెయ్యమని ఆమెతో చెప్పండి” అని
అన్నది.
41ప్రభువు, “మార్తా! మార్తా! పనులు ఎక్కువగా
ఉండటం వల్ల నీకు చింత, చిరాకు కలుగుతున్నాయి.
42నిజంగా చెయ్యవలసింది ఒక్కటే పని. మరియ ఏది
ఉత్తమమో దాన్ని ఎన్నుకొంది. దాన్ని ఆమెనుండి
ఎవ్వరూ తీసుకోలేరు” అని అన్నాడు.

---

**నిత్యజీవం** నిత్యజీవం అనగా మరణించిన తర్వాత శాశ్వతంగా
దేవుని రాజ్యంలో జీవించుట (అనంత జీవం).

**నీ ప్రభువై … ప్రేమించు’** లేవీ 19:18.

### యేసు ప్రార్థన గురించి బోధించటం
(*మత్తయి 6:9-15; మార్కు 7:7-11*)

11 ఒక రోజు యేసు ఒక చోట ప్రార్థిస్తూ
ఉన్నాడు. ఆయన ప్రార్థించటం ముగించాక
ఆయన శిష్యుల్లో ఒకడు, “ప్రభూ! యోహాను తన
శిష్యులకు ప్రార్థించటం నేర్పించినట్లు మాక్కూడా
ప్రార్థించటం నేర్పండి” అని అడిగాడు.
2ఆయన వాళ్ళతో, “మీరు ఈ విధంగా ప్రార్థించాలి:

‘తండ్రీ! నీ పేరు పవిత్రంగానే ఉండాలి! నీ
రాజ్యం రావాలి!
3 మాకు ప్రతి రోజు ఆహారం యివ్వు!
4 మా పట్ల పాపం చేసిన వాళ్ళను మేము
క్షమించి నట్లు మా పాపాలు క్షమించు.
మమ్మల్ని శోధనలో పడనివ్వవద్దు!’”

5-6ఆ తర్వాత ఆయన వాళ్ళతో, “ఒక వేళ మీలో
ఒకడు అర్థరాత్రివేళ తన స్నేహితుని యింటికి వెళ్ళి,
‘నా స్నేహితుడు ఒకడు అకస్మాత్తుగా మా యింటి
కొచ్చాడు. మా యింట్లో తినటానికి ఏమీ లేదు.
మూడు రొట్టెలుంటే యిస్తావా?’ అని అడిగాడను
కొండి. 7ఆ స్నేహితుడు యింటి నుండి బయటకు
రాకుండా, ‘నేను, నా పిల్లలు పడుకున్నాం. తలుపులు
కూడా తాళం వేసాం. అనవసరంగా బాధ పెట్టొద్దు.
అయినా యిప్పుడు లేచి నేను రొట్టె లివ్వలేను’ అని
అన్నాడనుకోండి. నేను చెప్పేదేమిటంటే, 8అతడు
తన స్నేహితుడైనందుకు రొట్టెలు యివ్వకపోయినా
మొండిగా అడగటం వల్ల తప్పక లేచి అతడడిగిన
రొట్టెలు యిస్తాడు. 9కనుక, నేను మీకు చెప్పేదేమంటే:
అడగండి, మీకు లభిస్తుంది. వెతకండి దొరుకుతుంది.
తలుపు తట్టండి, అది మీకోసం తెరుచుకుంటుంది.
10ఎందుకంటే, అడిగిన ప్రతి ఒక్కనికి లభిస్తుంది.
వెతికిన వానికి దొరుకుతుంది. తలుపు తడితే అది
అతని కోసం తెరుచుకుంటుంది. 11మీలో ఏ తండ్రి
తన కుమారుడు చేప నడిగితే, చేపకు బదులుగా
పామునిస్తాడు? 12లేక గ్రుడ్డునడిగితే తేలునిస్తాడు?
13మీరు చెడ్డవాళ్ళైనా మీ కుమారులకు మంచి
బహుమతులు ఎట్లా యివ్వాలో మీకు తెలుసు. కనుక
పరలోకంలో ఉన్న మీ తండ్రి తన్నడిగినవాళ్ళకు
పవిత్రాత్మను తప్పక యిస్తాడని గ్రహించండి” అని
చెప్పాడు.

### యేసు శక్తికి మూలం
(*మత్తయి 12:22-30; మార్కు 3:20-27*)

14ఒక రోజు యేసు ఒక మూగ దయ్యాన్ని పార
ద్రోలుతూ ఉన్నాడు. ఆ దయ్యం వెళ్ళిపోగానే అది
పట్టిన మనిషి మాట్లాడటం మొదలు పెట్టాడు. అది
చూసి ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. 15కొందరు,
“బయెల్జెబూలు అనే దయ్యాలరాజు ద్వారా అతడు
దయ్యాల్ని పారద్రోలుతున్నాడు” అని అన్నారు.
16మరి కొందరు యేసును పరీక్షించుచూ ఒక
అద్భుతం పరలోకంనుండి చూపుమని అడిగారు.
17యేసుకు వాళ్ళ అభిప్రాయం తెలిసిపోయింది.
అందువల్ల వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: “చీలికలు
కలిగిన యిల్లు పడిపోతుంది.
18సైతానురాజ్యంలో చీలికలు కలిగితే వాని రాజ్యం
ఎలా నిలుస్తుంది? ఇలా ఎందుకు అంటున్నానంటే
బయెల్జెబూలు సహాయంతో నేను దయ్యాల్ని వదిలిస్తు
న్నానని మీరు అంటున్నారు. 19నేను బయెల్జెబూలు
ద్వారా దయ్యాల్ని వదిలిస్తున్నట్లైతే, మీ వాళ్ళు దేని
సహాయంతో దయ్యాల్ని వదిలిస్తున్నారు? అందువల్ల
మీ వాదన తప్పని మీ వాళ్ళే రుజువు చేస్తున్నారు.
20కాని నేను దైవశక్తితో దయ్యాల్ని వదిలిస్తున్నాను
కనుక, దేవుని రాజ్యం వచ్చినట్లు స్పష్టంగా తెలుస్తోంది.
21“ఒక బలవంతుడు ఆయుధాల్ని ధరించి తన
యింటిని కాపలా కాస్తే అతని యింట్లోని వస్తువులు
భద్రంగా ఉంటాయి. 22కాని అతని కన్నా బలవంతుడు
వచ్చి మీదపడి అతన్ని ఓడిస్తే అతడిన్నాళ్ళు నమ్ము
కున్న ఆయుధాలన్నీ ఇంటివానియొద్ద నుండి తీసు
కొని, ఆదోచుకొన్నవస్తువుల్ని అందరికీపంచిపెడ్తాడు.
23“నాతో ఉండని వాడు నాకు వ్యతిరేకంగా ఉన్న
వానితో సమానము. నాతో కలిసి గొఱ్ఱెల్ని ప్రోగు
చేయటానికి సహాయం చెయ్యనివాడు వాటిని చెదర
గొట్టిన వానితో సమానము.
24“దయ్యము ఒక మనిషి నుండి వెలుపలికి వచ్చాక
విశ్రాంతి కోసం నీరులేని స్థలాల్లో వెతుకుతుంది. కాని
దానికి విశ్రాంతి లభించదు. అప్పుడది, ‘నేను వదిలి
వచ్చిన యింటికి వెళ్తాను’ అని అనుకుంటుంది. 25అక్క
డికి వెళ్ళాక ఆ యిల్లు ఊడ్చబడి వుండటం ఎక్కడి
వస్తువులక్కడ సక్రమంగా వుండటం చూస్తుంది. 26అది
మళ్ళీ బయటికి వెళ్ళి తనకన్నా దుర్మార్గులైన ఏడు
దయ్యాలను తనవెంట తీసుకువస్తుంది. ఆ దయ్యా
లన్నీ కలిసి ఆ యింట్లో నివసించటానికి వెళ్తాయి.
అప్పుడు ఆ మనిషి స్థితి మొదటిస్థితికన్నా అధ్వాన్నంగా
ఉంటుంది.” 27యేసు ఈ విషయాలు చెబుతుండగా
ప్రజల్లో ఒక స్త్రీ బిగ్గరగా, “నిన్ను కని పెంచిన ఆ తల్లి
ధన్యురాలు” అని అన్నది. 28ఆయన, “అవునుగాని,
దైవసందేశం విని దాన్ని పాటించే వాళ్ళు ఇంకా
ధన్యులు” అని సమాధానం చెప్పాడు.

### దేవుడు చూపిన రుజువు
(*మత్తయి 12:38-42; మార్కు 8:12*)

29ప్రజల గుంపు పెరుగుతూ పోయింది. యేసు
ఈ విధంగా చెప్పటం మొదలు పెట్టాడు: “ఈ కాలం

వాళ్ళు చెడ్డవాళ్ళు, గనుక అద్భుతాలు అడుగుతారు.
దేవుడు యోనాను పంపి యిచ్చిన రుజువు తప్ప,
మరే రుజువు మీకు యివ్వబడదు. 30ఎందుకంటే,
నీనెవె ప్రజలకు యోనా ఏ విధంగా ఒక రుజువో అదే
విధంగా మనుష్యకుమారుడు ఈ తరం వాళ్ళకు ఒక
రుజువు. 31దక్షిణ దేశపు రాణి సొలొమోను రాజు బోధి
స్తున్న జ్ఞానాన్ని వినటానికి చాలా దూరం నుండి
వచ్చింది. కాని యిప్పుడు సొలొమోను కన్నా గొప్ప
వాడు యిక్కడున్నాడు. ఈనాటి ప్రజలు ఆయన
మాటలు వినటం లేదు. కనుక తీర్పు చెప్పబడే రోజు
ఆ రాణి వీళ్ళతో సహా నిలబడి వీళ్ళు తప్పు చేశారని
నిరూపిస్తుంది. 32నీనెవె ప్రజలు యోనా బోధనలు
విని మారుమనస్సు పొందారు. కనుక తీర్పు చెప్పబడే
రోజున వాళ్ళు ఈనాటి ప్రజలతో సహా నిలుచొని
వీళ్ళు తప్పు చేశారని నిరూపిస్తారు. కాని యిప్పుడు
యోనా కన్నా గొప్పవాడు ఇక్కడున్నాడు.

## దేహం యొక్క వెలుగు

(*మత్తయి 5:15; 6:22-23*)

33"దీపాన్ని వెలిగించి, యింటికి వచ్చే పోయే
వాళ్ళకు కనిపించేలా ఒక ఎత్తైన బల్ల మీద పెడ్తాము
కాని, గంప క్రింద దాచి ఉంచము. 34మీ కళ్ళు దేహానికి
దీపం లాంటివి. మీ కళ్ళు బాగుంటే మీ దేహమంతా
కాంతితో వెలుగుతుంది. కాని, అవి చెడిపోతే, మీ
దేహమంతా చీకటైపోతుంది. 35అందువలన మీలో
ఉన్న వెలుగు చీకటైపోకుండా చూసుకోండి. 36మీ
దేహమంతా కొంచెం కూడా చీకటిలో లేకుండా వెలు
గుతూ ఉంటే అది సంపూర్ణంగా వెలుగుతూ ఉంటుంది.
ఆ దేహం దీపపు వెలుగు ప్రకాశించినట్లు ప్రకాశిస్తుంది."

## యేసు పరిసయ్యుల్ని, శాస్త్రుల్ని విమర్శించటం

(*మత్తయి 23:1-36; మార్కు 12:38-40;
లూకా 20:45-47*)

37యేసు మాట్లాడటం ముగించాడు. ఒక పరి
సయ్యుడు యేసును తన యింటికి ఆహ్వా నించాడు.
యేసు అతని యింటికి వెళ్ళి భోజనానికి కూర్చుని
ఉన్నాడు. 38యేసు భోజనానికి ముందు చేతులు
కడుక్కోకుండా కూర్చోవటం గమనించి పరిసయ్యు
నికి ఆశ్చర్యం వేసింది. 39అప్పుడు ప్రభువు అతనితో,
"మీ పరిసయ్యులు గిన్నెల్ని, పళ్ళేల్ని వెలుపలి భాగం
శుభ్రం చేస్తారు. కాని లోపల దురాశ, దుష్టత్వము
నిండివుంటాయి. 40మూర్ఖులారా! వెలుపలి భాగం
సృష్టించిన వాడే లోపలి భాగం సృష్టించలేదా? 41మీరు
దాచుకున్న వాటిని పేదవాళ్ళకు దానం చెయ్యండి.
అప్పుడు మీరు పూర్తిగా శుభ్రమౌతారు. 42మీరు మీ
తోటలో పండిన పుదీనా, సదాప మొదలగు కూరగా
యల యొక్క పదవ వంతు దేవునికి యిస్తారు. కాని
న్యాయాన్ని, దేవుని ప్రేమని నిర్లక్ష్యం చేస్తున్నారు.
కనుక మీకు శ్రమ. పదవ వంతు ఇవ్వటం మాను
కోకుండా న్యాయాన్ని, దేవుని ప్రేమను కూడా అలవ
రుచుకోవలసింది. 43మీరు సమాజమందిరాల్లో ఉన్నత
స్థలాల్లో కూర్చోవటానికోసం ప్రాకులాడుతారు. దారి
మీద వెళ్తూవుంటే ప్రజలు గౌరవమివ్వాలని ఆశిస్తారు.
కనుక మీకు శ్రమ తప్పదు. 44ప్రజలు తమకు
తెలియకుండా త్రొక్కుతూ నడిచే సమాధుల్లాంటి
వాళ్ళు మీరు. మీకు శ్రమ తప్పదు" అని అన్నాడు.

45ధర్మశాస్త్రంలో పాండిత్యం ఉన్న ఒకడు లేచి,
"బోధకుడా! మీరీ విధంగా మాట్లాడి మమ్మల్ని కూడా
అవమానిస్తున్నారు" అని అన్నాడు.

46యేసు, "ధర్మశాస్త్ర పండితులారా! మీరు ప్రజ
లపై వాళ్ళు మోయలేని భారం వేస్తున్నారు. కాని
వాటిని లేపటానికి మీరు ఒక్క వ్రేలు కూడా కదల్చరు.
కనుక మీకు శ్రమ తప్పదు. 47మీరు ప్రవక్తల కోసం
సమాధులు కట్టిస్తారు. కాని మీ పూర్వీకులు వాళ్ళను
చంపారు. కనుక మీకు శిక్ష తప్పదు. 48అంటే పూర్వీ
కులు చేసిన దాన్ని అంగీకరిస్తున్నట్లు నిరూపించు
కొంటున్నారన్న మాట. వాళ్ళు ప్రవక్తల్ని చంపారు.
మీరు సమాధులు కట్టించారు.

49అందువల్లే దేవుడు దివ్యజ్ఞానంతో ఈ విధంగా
చెప్పాడు: 'నేను వాళ్ళకోసం ప్రవక్తల్ని, అపొస్తులులను
పంపుతాను. 50కొందర్ని వాళ్ళు చంపుతారు. మిగతా
వాళ్ళను హింసిస్తారు.' అందువలన ప్రపంచం పుట్టిన
నాటినుండి ప్రవక్తలు కార్చిన రక్తానికి ఈ తరం వాళ్ళు
బాధ్యులు.

51హేబెలు హత్య మొదలుకొని ధూప వేదికకు,
మందిరానికి మధ్య చంపబడిన జెకర్యా హత్య దాకా
వీళ్ళు బాధ్యులు. ఔను. ఈ కాలం వాళ్ళు వీటికి
బాధ్యులని నేను చెబుతున్నాను.

52"ధర్మశాస్త్ర పండితులారా! జ్ఞానం యొక్క తాళం
చెవి మీరు తీసుకున్నారు. దాని తలుపులు తెరిచి
మీరు లోనికి వెళ్ళలేరు. పైగా వెళ్తున్న వాళ్ళను అడ్డగి
స్తారు. మీకు శిక్ష తప్పదు" అని చెప్పాడు.

53యేసు అక్కడినుండి వెళ్ళిన తర్వాత పరిస
య్యులును, శాస్త్రులును ఆయనను ఇంకా ఎక్కువగా
వ్యతిరేకించారు. ప్రశ్నలతో ఆయన్ని వేధించారు.

54ఆయనను మాటలలో చిక్కించాలని ప్రయ
త్నించారు.

## జాగ్రత్త

12 అంతలో వేలమంది ప్రజలు సమావేశ మవటం
వలన ఒకళ్ళనొకళ్ళు త్రోసు కోవటం
మొదలు పెట్టారు. యేసు మొదట తన శిష్యులతో
మాట్లాడుతూ ఈ విధంగా అన్నాడు: "పరిసయ్యుల
ప్రభావానికి గురికాకుండా జాగ్రత్త పడండి. 2బయట

పడకుండా ఏదీ దాగివుండదు. దాచబడింది ఏదీ బహి
రంగం కాకుండా పోదు. 3చీకట్లో మాట్లాడుకున్న
మాటలు అందరికీ వినిపిస్తాయి. గది తలుపులు వేసు
కొని రహస్యంగా మాట్లాడుకున్న విషయాలు ఇంటి
కప్పుల మీదినుండి ప్రకటింపబడతాయి.
4“మిత్రులారా! నేను చెబుతున్నది వినండి: ఈ
శరీరాన్ని చంపేవాళ్ళను చూసి భయపడకండి. దాన్ని
చంపాక వాళ్ళేమీ చెయ్యలేరు. 5ఎవరికి భయపడాలో
నేను చెబుతున్నాను. శరీరం చనిపోయాక మిమ్మల్ని
నరకంలో పారవేయటానికి అధికారమున్న వానికి భయ
పడండి! ఔను, ఆయనకు భయపడుమని చెబు
తున్నాను.
6“రెండు కాసులకు ఐదు పిచ్చుకలు అమ్ముడు
పోతాయి కదా! అయినా, ఒక్క పిచ్చుకనైనా దేవుడు
మరచిపోలేదు. 7మీ తల మీద ఎన్ని వెంట్రుకలు
ఉన్నాయో కూడా దేవునికి తెలుసు. పిచ్చుకలకన్నా
మీ విలువ ఎక్కువే! కనుక భయపడకండి.
8“బహిరంగంగా నన్ను అంగీకరించిన వాణ్ణి మనుష్య
కుమారుడు దేవదూతల సమక్షంలో అంగీకరి స్తాడని
నేను చెబుతున్నాను. 9కాని ప్రజల సమక్షంలో నన్ను
కాదన్న వాణ్ణి మనుష్యకుమారుడు దేవుని సమక్షంలో
కాదంటాడు.
10“మనుష్యకుమారుణ్ణి దూషించిన వాణ్ణి దేవుడు
క్షమించవచ్చునేమో కాని పవిత్రాత్మను దూషించి
నవాణ్ణి దేవుడు క్షమించడు.
11“సమాజమందిరాల ముందు, లేక పాలకుల
ముందు, లేక అధికారులముందు మిమ్మల్ని నిలబెడితే
ఏ విధంగా మాట్లాడాలో, నిర్దోషులని ఏ విధంగా
ఋజువు చేసుకోవాలో చింతించకండి. 12మీరు ఏమి
మాట్లాడాలో అప్పుడు పవిత్రాత్మ మీకు చెబుతాడు.”

### పిసినారి ఉపమానం

13ప్రజల నుండి ఒకడు, “అయ్యా! నా సోదరుణ్ణి
ఆస్థి పంచిపెట్టమని చెప్పండి” అని అన్నాడు.
14యేసు, “నన్ను మీ న్యాయాధిపతిగా లేక మీ
మధ్యవర్తిగా ఎవరు నియమించారు?” అన్నాడు. 15ఆ
తర్వాత వాళ్ళతో, “జాగ్రత్త! అత్యాసలకు పోకండి.
మానవుని జీవితం అతడు ఎంత ఎక్కువ కూడ
బెట్టాడన్న దానిపై ఆధారపడి ఉండదు” అని అన్నాడు.
16ఆయన వాళ్ళకు ఈ ఉపమానం చెప్పాడు: “ఒక
ధనికుడు ఉండేవాడు. అతని పొలంలో బాగాపంట
పండింది. 17అతడు ‘నేనేం చేయాలి? నా దగ్గర ఈ
ధాన్యం దాచటానికి స్థలం లేదే’ అని తనమనస్సులో
ఆలోచించసాగాడు. 18‘ఆ! ఇలా చేస్తాను. నా ధాన్యపు
కొట్టుల్ని పడగొట్టి యింకా పెద్దవి కట్టిస్తాను. వాటిలో
నా ధాన్యాన్ని, వస్తువుల్ని దాస్తాను’ అని అనుకొన్నాడు.
ఆ తర్వాత అతడు, తనతో 19‘అదృష్టవంతుడివి, సంవ
త్సరాలదాకా సరిపోయే వస్తువుల్ని కూడబెట్టుకు
న్నావు. ఇక జీవితాన్ని సుఖంగా గడుపు. తిను, త్రాగు,
ఆనందించు’ అని చెప్పుకుంటానని అను కొన్నాడు.
20కాని దేవుడు అతనితో ‘మూర్ఖుడా! ఈ రాత్రే నీ
ప్రాణం పోతుంది. అప్పుడు నీవు నీకోసం దాచుకొన్నవి
ఎవరు అనుభవిస్తారు?’ అని అడిగాడు.
21“ఐహిక సంపదల్ని కూడబెట్టుకొని, ఆధ్యాత్మిక
సంపదల్ని నిర్లక్ష్యం చేసినవాని గతి అదే విధంగా
ఉంటుంది.”

### దేవుణ్ణి నమ్మండి

(మత్తయి *6:25-34; 19-21*)

22ఈ విధంగాచెప్పి యేసు తన శిష్యులతో ఇలా
అన్నాడు: “అందువల్ల నేను చెప్పేదేమిటంటే జీవించ
టానికి ఏమి తినాలి? మీ దేహాలకు ఏ దుస్తులు ధరిం
చాలి? అని చింతించకండి. 23మీ జీవితం ఆహారాని
కన్నా ముఖ్యమైనది. దేహం దుస్తులకన్నా విలువైనది.
24పక్షుల్ని చూడండి. అవి విత్తనాలు నాటవు. పంట
కోయవు. వాటిదగ్గర ఎలాంటి ధాన్యపు కొట్లు లేవు.
దేవుడు వాటికి ఆహారం చూపిస్తున్నాడు. మీరాపక్షుల
కన్నా విలువైన వాళ్ళు. 25చింతించి తన జీవితాన్ని
ఒక గంట పొడిగించగల వాళ్ళు మీలో ఎవరైనా
ఉన్నారా?
26మీరింత చిన్న విషయం సాధించ లేనప్పుడు
మిగతా వాటిని గురించి ఎందుకు చింతిస్తున్నారు?
27పువ్వులు ఏ విధంగా పెరుగుతున్నాయో గమనిం
చండి. అవి పని చేయవు. దారం వడకవు. నేను
చెప్పేదేమిటంటే ఖరీదైన దుస్తులు వేసుకొనే సొలొ
మోను రాజుకూడా ఏ ఒక్క పువ్వుతో సరితూగలేడు.
28మీలో కొంతకూడా విశ్వాసం లేదు. ఎందుకు? ఈ
రోజు ఉండి, రేపు అగ్నిలో కాలిపోయే గడ్డిని దేవుడు
అంత అందంగా అలంకరించాడు కదా! మరి మిమ్మ
ల్నెంత అందంగా అలంకరిస్తాడో ఆలోచించండి.
29అందువల్ల ఏమి తినాలి, ఏమి త్రాగాలి అని ప్రాకులాడ
కండి. వాటిని గురించి చింతించకండి. 30ప్రపం
చంలోవున్న ప్రతి ఒక్కడూ వాటికోసం ప్రాకులాడు
తాడు. మీ తండ్రికి మీ కేవి అవసరమో తెలుసు.
31ఆయన రాజ్యాన్ని, నీతిని సంపాదించుకోండి.
అప్పుడు దేవుడు మీకు యివి కూడా యిస్తాడు.
32“మీరు అమాయకమైన చిన్న మందలాంటి
వాళ్ళు. కాని భయపడకండి. మీ తండ్రి తన రాజ్యాన్ని
మీకు ఆనందంగా ఇస్తాడు. 33మీ ఆస్థి అమ్మి పేద
వాళ్ళకు దానం చెయ్యండి. పాతబడని డబ్బుల సంచి
సిద్ధం చేసుకోండి. మీ ధనాన్ని పరలోకంలో దాచండి.
అక్కడ అది తరగదు. దొంగలు దాన్ని ముట్టలేరు. ఆ
సంపదకు చెదలు పట్టవు. 34మీ ధనమున్న చోటే మీ
మనస్సు కూడా ఉంటుంది.

### సిద్ధంగా ఉండండి
*(మత్తయి 24:45-51)*

35"మీ నడికట్టుతో నడుముకు చుట్టి, దీపాలు
వెలిగించి సిద్ధంగా ఉండండి. 36పెళ్ళి విందుకు వెళ్ళి
యింటికి వస్తున్న యజమాని కోసం కాచుకొని ఉండే
సేవకుల్లా ఉండండి. అలా చేస్తే యజమాని వచ్చి
తలుపు తట్టిన వెంటనే అతనికోసం మీరు తలుపు
తీయకలుగుతారు. 37యజమాని వచ్చినప్పుడు మెలు
కువతో ఉన్న సేవకులు ధన్యులు. ఇది నిజం. యజ
మాని వచ్చి తానే నడుము బిగించుకొని స్వయంగా
సేవ చేస్తాడు. సేవకుల్ని కూర్చోబెట్టి వాళ్ళకు వడ్డించ
టానికి సిద్ధమౌతాడు. 38అతడు ఏ అర్ధరాత్రికో లేక
తెల్లవారుఝామునో వచ్చినప్పుడు అతని కోసం
సిద్ధంగావున్న సేవకులు ధన్యులు. వాళ్ళకు శుభం
కలుగుతుంది. 39కాని యిది అర్థంచేసుకోండి. దొంగ
ఏ ఘడియలో వస్తాడో యింటి యజమానికి తెలిస్తే
అతడు తన యింట్లోకి దొంగల్ని రానివ్వడు. 40మీరు
కూడా సిద్ధంగా వుండండి. ఎందుకంటే మనుష్య
కుమారుడు మీరు అనుకోని సమయంలో వస్తాడు."

41పేతురు, "ప్రభూ! మీరీ ఉపమానం మాకోసం
చెబుతున్నారా లేక అందరి కోసమా?" అని అడిగాడు.

42ప్రభువు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
"తెలివిగల ఉత్తమ సేవకుడు ఎవడు? ఆ యజమాని
తిరిగి వచ్చినప్పుడు తాను విశ్వసించగల వాణ్ణి, తెలివి
గలవాణ్ణి తన యితర సేవకులకు సరియైన ఆహారం
ఇవ్వటానికి వాళ్ళపై అధికారిగా నియమిస్తాడు. 43ఆ
యజమాని వచ్చినప్పుడు, అతడు చెప్పిన విధంగా
నడుచుకొన్న సేవకుడు ధన్యుడు. 44ఇది నిజం. ఆ
యజమాని అతణ్ణి తన ఆస్థికంతటికి అధికారిగా నియ
మిస్తాడు. 45కాని ఒకవేళ ఆ సేవకుడు తనలో తాను,
'నా యజమాని త్వరలో రాడు' అని అనుకొని తన
క్రింద పనిచేసేవాళ్ళను ఆడా మగా అనే భేదం లేకుండా
కొట్టి, తిని త్రాగటం మొదలు పెడతాడనుకోండి.
46యజమాని ఆ సేవకుడు ఎదురుచూడని రోజున
అనుకోని సమయంలో వచ్చి ఆ సేవకుణ్ణి నరికించి
భక్తిహీనుల గుంపులో చేరుస్తాడు.

47"తన యజమాని మనస్సు తెలిసి కూడా, అతని
యిష్టానుసారం పని చెయ్యని సేవకుడికి ఎక్కువ
దెబ్బలు తగులుతాయి. 48కాని తెలియక శిక్షార్హమైన
పనులు చేసిన వాడికి తక్కువ దెబ్బలు తగులుతాయి.
దేవుడు తాను ఎక్కువగా యిచ్చిన వాళ్ళనుండి
ఎక్కువ కోరుతాడు. ఎక్కువ అప్పగించినవాళ్ళ నుండి
యిచ్చిన దానికన్నా ఎక్కువ ఆశిస్తాడు.

### శాంతికి మారుగా పోట్లాట

49"నేను ఈ భూమ్మీద అగ్నివేయడానికి వచ్చాను.
ఆ అగ్ని యిదివరకే రగిలి ఉండాలని ఆశించాను.
50కాని నేను పొందవలసిన బాప్తిస్మము ఉంది. అది
జరిగే వరకు నాకీ వేదన తప్పదు. 51శాంతిని కలుగ
జేయుటకు నేనీ భూమ్మీదికి వచ్చాననుకొంటు
న్నారా? కాదు. దీన్ని విభజించటానికి వచ్చాను.
52ఇప్పటి నుండి ఒక కుటుంబంలో ఐదుగురు ఉంటే,
వాళ్ళు విడిపోయి, ముగ్గురు ఒకవైపుంటే ఇద్దరొకవైపు;
యిద్దరొక వైపుంటే ముగ్గురొక వైపు చేరి
పోట్లాడుతారు.

53 తండ్రి కుమారునితో, కుమారుడు
తండ్రితో, తల్లి కూతురుతో, కూతురు
తల్లితో, అత్త కోడలితో, కోడలు అత్తతో
పోట్లాడుతారు."

### కాలాన్ని అర్థం చేసుకోండి
*(మత్తయి 16:2-3)*

54యేసు అక్కడున్న ప్రజలతో, "మీరు పడమరన
మేఘాలు కమ్ముకోవటం చూసిన వెంటనే, 'వర్షం
కురుస్తుంది' అని అంటారు. 55దక్షిణం నుండి గాలివీయ
గానే, 'వేడి ఎక్కువౌతుంది' అని అంటారు. మీరన్నట్లే
జరుగుతుంది. 56కాని మీరు వంచకులు. భూమివైపు,
ఆకాశం వైపు చూసి ఏమి జరుగబోతుందో చెప్పగలరు.
కాని ప్రస్తుతం జరుగుతున్న దాన్ని చూసి ఏమి జరుగ
బోతుందో ఎందుకు చెప్పలేరు?

57"ఏది న్యాయమో స్వయంగా మీరే నిర్ణయిం
చండి. 58మీ ప్రతి వాదితో కలిసి న్యాయాధిపతి దగ్గరకు
వెళ్ళటానికి ముందు దారి మీద ఉన్నప్పుడే అతనితో
రాజీ పడటానికి గట్టిగా ప్రయత్నించండి. అలా చెయ్య
కపోతే అతడు మిమ్మల్ని న్యాయాధిపతి ముందుకు
లాగవచ్చు. ఆ న్యాయాధిపతి మిమ్మల్ని భటులకు
అప్పగించవచ్చు. ఆ భటులు మిమ్మల్ని కారాగారంలో
వేయవచ్చు. 59నేను చెప్పేది వినండి. మీ దగ్గర ఉన్న
చివరి పైసా చెల్లించే దాకా మీరు బయటపడరు."

### పాపాలు చెయ్యటం మానుకోండి

13 ఆ సమయంలో అక్కడున్న వాళ్ళలో కొందరు
యేసుతో, "పిలాతు గలిలయ ప్రజల రక్తాన్ని
బలి యిచ్చిన జంతువుల రక్తంతో కలిపాడని"
చెప్పారు. 2యేసు వాళ్ళకు ఈ విధంగా సమాధానం
చెప్పాడు: "ఈ విధంగా చనిపోయినందుకు వీళ్ళు
యితర గలిలయ ప్రజలకంటే ఎక్కువ పాపం చేసారని
మీ అభిప్రాయమా? 3నేను కాదంటాను. మీరు వాళ్ళలా
నాశనం కాకముందే మారుమనస్సు పొందండి. 4గోపురం
మీదపడి సిలోయములో చనిపోయిన ఆ పద్దెనిమిది
మంది సంగతేమిటి? యెరూషలేములో నివసించే ఇతర
ప్రజలకు కాకుండా వీళ్ళకు ఈ గతి పట్టటం సమంజ

సమని మీ అభిప్రాయమా? 5నేను కాదంటాను. మీరు వాళ్ళలా నాశనం కాకముందే మారుమనస్సు పొందండి.”

### పండ్లుకాయని అంజూరపు చెట్టు యొక్క ఉపమానం

6ఆ తర్వాత యేసు ఈ ఉపమానం చెప్పాడు: “ఒకడు తన ద్రాక్షాతోటలో ఒక అంజూరపు చెట్టు నాటాడు. పండ్ల కోసం ఆ అంజూరపు చెట్టు దగ్గరకు వెళ్ళి అతడు తరచు చూస్తూవుండేవాడు. కాని అతనికి పండ్లు కనిపించలేదు. 7అతడు తోటమాలితో, ‘ఈ చెట్టుకు పండ్లు కాస్తాయేమోనని మూడేళ్ళు చూసాను. కాని దానికి పండ్లు కాయలేదు. దాన్ని కొట్టేయి. అది అనవసరంగా భూమి సారాన్ని గుంజి వేస్తోంది’ అని అన్నాడు. 8ఆ తోట మాలి, ‘అయ్యా! దీన్ని యింకొక సంవత్సరం వదిలెయ్యండి. నేను చుట్టూ పాదు త్రవ్వి ఎరువు వేస్తాను. 9వచ్చే సంవత్సరం పంట కాస్తే మంచిదే. కాయకపోతే అప్పుడు కొట్టి వేయవచ్చు’ అని అన్నాడు.”

10ఒక విశ్రాంతి రోజు యేసు సమాజ మందిరంలో బోధిస్తూ ఉన్నాడు. 11దయ్యం పట్టటంవల్ల పద్దెనిమిది ఏళ్ళనుండి రోగంతో బాధపడ్తున్న స్త్రీ అక్కడ ఉంది. ఆమె నడుము వంగి ఉంది. ఆమె చక్కగా నిలువ లేకపోయేది. 12యేసు ఆమెను చూసి దగ్గరకు రమ్మని పిలిచి ఆమెతో, “అమ్మా! నీ రోగం నుండి నీకు విముక్తి కలిగించాను.” 13అని అంటూ ఆమె మీద తన చేతుల్ని ఉంచాడు. వెంటనే ఆమె చక్కగా నిలబడి దేవుణ్ణి స్తుతించటం మొదలు పెట్టింది.

14విశ్రాంతి తీసుకోవలసిన రోజున ఆమెకు నయం చేసినందుకు ఆ సమాజమందిరపు అధికారికి కోపం వచ్చింది. అతడు ప్రజలతో, “ఆరు రోజులు పని చెయ్యటానికి ఉన్నాయి. ఆ రోజుల్లో వచ్చి నయం చేయించుకోండి. విశ్రాంతి తీసుకోవవలసిన రోజున కాదు” అని అన్నాడు.

15యేసు, “మీరు కపటులు. విశ్రాంతి రోజు మీ ఎద్దును, గాడిదను కొట్టం నుండి విప్పుకొని వెళ్ళి నీళ్ళు త్రాగించరా? 16ఈమె అబ్రాహాము కుమార్తె. పద్దెనిమిది సంవత్సరాలు సైతాను ఈమెను తన ఆధీనంలో ఉంచుకొన్నాడు. మరి ఈమెకు విశ్రాంతి రోజు ఆ బంధంనుండి విముక్తి కలిగించనవసరం లేదంటారా?” అని అడిగాడు. 17ఈ మాటలు, ఆయన విరోధులు సిగ్గుపడేటట్లు చేశాయి. కాని ఆయన చేసిన మహత్కార్యాల్ని చూసి ప్రజలు చాలా ఆనందించారు.

### ఆవగింజ ఉపమానం

*(మత్తయి 13:31-33; మార్కు 4:30-32)*

18ఆ తర్వాత యేసు, “దేవుని రాజ్యం ఏ విధంగా ఉంటుంది? దాన్ని దేనితో పోల్చాలి? 19అది ఒక ఆవ గింజ లాంటిది. దాన్ని ఒకడు తన తోటలో నాటాడు. అది పెరిగి చెట్టయింది. ఆకాశంలో ఎగిరే పక్షులు దాని కొమ్మల మీద వ్రాలాయి” అని అన్నాడు.

20యేసు మళ్ళీ, “దేవుని రాజ్యాన్ని దేనితో పోల్చాలి?” అని అడిగి, 21“అది పిండిలో కలిపే పులుపు లాంటిది. ఒక స్త్రీ ఆ పులుపును మూడు కుంచాల పిండిలో ఆ పిండంతా పులిసేదాకా కలిపింది” అని సమాధానం చెప్పాడు.

### ఇరుకు ద్వారం

*(మత్తయి 7:13-14, 21-23)*

22యేసు పట్టణాల్లో, పల్లెల్లో బోధిస్తూ యెరూషలేము వైపు ప్రయాణం సాగించాడు. 23ఒకడు, “ప్రభూ! కొద్దిమంది మాత్రమే రక్షింపబడతారా?” అని అడిగాడు.

24ఆయన వాళ్ళతో, “దేవుని రాజ్యానికి ఉన్న ద్వారం యిరుకైనది. ఆ ద్వారం ద్వారా ప్రవేశించటానికి గట్టి ప్రయత్నం చెయ్యండి. అనేకులు ఆ ద్వారం ద్వారా ప్రవేశించటానికి ప్రయత్నం చేస్తారు. కాని ప్రవేశించలేరు. 25ఇంటి యజమాని లేచి తలుపులకు తాళం వేస్తాడు. మీరు బయట నిలబడి తలుపు తడుతూ ‘అయ్యా! మాకోసం తలుపు తెరవండి!’ అని వేడుకొంటారు. కాని ఆయన ‘మీరెవరో, ఏ ఊరినుండి వచ్చారో నాకు తెలియదు’ అని సమాధానం చెబుతాడు. 26అప్పుడు మీరు, ‘మీతో కలిసి తిన్నాము. మీరు మా వీధుల్లో బోధించారు’ అని అంటారు. 27కాని ఆయన, ‘మీరెవరో నాకు తెలియదు. ఎక్కడినుండి వచ్చారో తెలియదు. ఇక్కడినుండి వెళ్ళండి, మీరంతా దుర్మార్గులు’ అని అంటాడు. 28మీరు అబ్రాహామును, ఇస్సాకును, యాకోబును ఇతర ప్రవక్తలను దేవుని రాజ్యంలో చూస్తారు. మిమ్మల్ని బయట పారవేసినందుకు మీరు దుఃఖిస్తారు. బాధననుభవిస్తారు. 29ప్రజలు ఉత్తర దక్షిణాల నుండి, తూర్పు పడమరల నుండి దేవుని రాజ్యంలో జరుగుతున్న విందుకు వచ్చి తమ తమ స్థానాల్లో కూర్చుంటారు. 30ఇప్పుడు చివరి స్థానాల్లో కూర్చున్నవాళ్ళు అక్కడ ముందు స్థానాల్లో కూర్చుం టారు. ఇప్పుడు మొదటి స్థానాల్లో ఉన్న వాళ్ళు అక్కడ చివరి స్థానాల్లో కూర్చుంటారు” అని అన్నాడు.

### యేసు యెరూషలేము విషయంలో దుఃఖించటం

*(మత్తయి 23:37-39)*

31అప్పుడు కొందరు పరిసయ్యులు యేసు దగ్గరకు వచ్చి, “ఈ ప్రాంతం వదిలి యింకెక్కడికైనా వెళ్ళు. హేరోదు రాజు నిన్ను చంపాలను కుంటున్నాడు” అని అన్నారు.

32యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: “ఈ రోజు, రేపు ప్రజలకు నయం చేస్తాను. దయ్యాల్ని

వదిలిస్తాను. మూడవరోజు నేను చేయవలసిన కార్యం
ముగుస్తుంది. వెళ్ళి ఈ విషయం ఆ గుంట నక్కతో
చెప్పండి. 33ప్రవక్త అయినవాడు యెరూషలేమునకు
బయట మరణించకూడదు కదా. కనుక ఏది ఏమైనా
ఈ రోజు, రేపు, ఎల్లుండి నా ప్రయాణం సాగిస్తూ
ఉండవలసిందే.
34“ఓ యెరూషలేమా! యెరూషలేమా! నీవు
ప్రవక్తలను చంపుతున్నావు. దేవుడు పంపిన ప్రచార
కుల్ని రాళ్ళతో కొడుతున్నావు. కోడి తన పిల్లల్ని
రక్షించటానికి రెక్కల క్రిందికి చేర్చుకొన్నట్లే నీ
ప్రజలను నాదగ్గరకు చేర్చుకోవాలని ఎన్నో సార్లు
అనిపించింది! కాని నీవు దానికి అంగీకరించలేదు! 35నీ
ఇల్లు పాడుబడుతుంది. ‘ప్రభువు పేరిట వచ్చినవాడు
ధన్యుడు’* అని నీవనే వరకు నీవు నన్ను చూడవు.”

## యేసు ఒక రోగికి నయం చెయ్యటం

14 ఒక విశ్రాంతి రోజు యేసు పరిసయ్యుల అధి
కారులలో ఒకని ఇంటికి భోజనానికి వెళ్ళాడు.
వాళ్ళు ఆయన్ని జాగ్రత్తగా గమనిస్తూ ఉన్నారు. 2దేహ
మంతా నీరొచ్చిన* ఒక వ్యక్తి యేసు ముందు
కొచ్చాడు. 3యేసు శాస్త్రుల్ని, పరిసయ్యుల్ని, “విశ్రాంతి
రోజు నయం చెయ్యటం శాస్త్ర సమ్మతమా? కాదా?”
అని అడిగాడు. 4వాళ్ళు దానికి సమాధానం చెప్పలేదు.
యేసు ఆ రోగి మీద తన చేతులుంచి నయం చేసి
పంపాడు. 5ఆ తర్వాత, “మీ కుమారుడో లేక మీ
ఎద్దు విశ్రాంతి రోజు బావిలో పడితే మీరు వెంటనే
పైకి లాగి రక్షించరా?” అని అడిగాడు. 6దానికి వాళ్ళు
సమాధానం చెప్పలేక పోయారు.
7విందుకు వచ్చిన అతిథులు గౌరవ స్థానం ఆక్ర
మించుట గమనించి యేసు వాళ్ళకు ఈ ఉపమానం
చెప్పాడు: 8“మీరు పెళ్ళి విందుకు ఆహ్వానింపబడి
నప్పుడు, మీకన్నా ముఖ్యమైన అతిథులు ఆహ్వానించ
బడి ఉండవచ్చు. కనుక ముందు స్థానాల్లో కూర్చో
కండి. 9అలాచేస్తే ఆ యింకొక వ్యక్తిని ఆహ్వానించిన
వాడు వచ్చి నీతో ‘ఈ స్థలం యితనికి యివ్వు’ అని
అంటాడు. నీవు అవమానం పొంది చివరన ఉన్న
స్థలంలో కూర్చో వలసి వస్తుంది. 10అందువల్ల నిన్ను
ఆహ్వానించినప్పుడు చివరన ఉన్న స్థలంలో కూర్చో.
అలా చేస్తే నిన్ను ఆహ్వానించిన వ్యక్తి నీ దగ్గరకు
వచ్చి ‘మిత్రమా! ముందుకు వచ్చి మంచి స్థలంలో
కూర్చో’ అని అంటాడు. అప్పుడు అక్కడున్న
వాళ్ళలో నీ గౌరవం పెరుగుతుంది. 11ఎందుకంటే
ఉన్నత స్థానాన్ని ఆక్రమించినవాడు అల్ప స్థానానికి
దించబడతాడు. తనంతట తాను అల్పస్థానాన్ని
ఆక్రమించినవాడు ఉన్నత స్థానానికి ఎత్తబడతాడు.”
12అప్పుడు యేసు తన అతిథితో, “భోజనానికి
లేక విందుకు ఆహ్వానించదలచి నప్పుడు మీ
స్నేహితుల్ని కాని, మీ సోదరుల్ని కాని, మీ బంధువుల్ని
కాని ధనికులైన మీ ఇరుగు పొరుగు వాళ్ళను కాని
ఆహ్వానించకండి. అలా చేస్తే మిమ్మల్ని కూడా వాళ్ళు
ఆహ్వానిస్తారు. అప్పుడు వాళ్ళ రుణం తీరిపోతుంది.
13కనుక మీరు విందు చేసినప్పుడు పేదవాళ్ళను,
వికలాంగులను, కుంటివాళ్ళను, గ్రుడ్డివాళ్ళను ఆహ్వానిం
చండి. 14వాళ్ళు మీ రుణం తీర్చలేరు. కనుక మీరు
ధన్యులౌతారు. ఎందుకంటే మంచి వాళ్ళు బ్రతికి వచ్చి
నప్పుడు దేవుడు మీరు చేసిన మంచి పనికి మంచి
బహుమతి నిస్తాడు” అని అన్నాడు.

## పెద్ద విందు ఉపమానం

*(మత్తయి 22:1-10)*

15భోజనానికి కూర్చున్న వాళ్ళలో ఒకడు యిది
విని యేసుతో, “దేవుని రాజ్యంలో జరిగే విందులో
పాల్గొన్నవాడు ధన్యుడు” అని అన్నాడు.
16యేసు యిలా చెప్పాడు: “ఒకడు పెద్ద విందు
చేయదలచి చాలా మందిని ఆహ్వానించాడు. 17వంటలు
సిద్ధమయ్యాక తాను ఆహ్వానించిన వాళ్ళ దగ్గరకు
తన సేవకుణ్ణి పంపి ‘రండి! అంతా సిద్ధం’ అని చెప్ప
మన్నాడు. 18కాని అందరూ ఒకే రీతిగా సాకులు
చెప్పారు. మొదటివాడు ‘నేను పొలం కొన్నాను, వెళ్ళి
తప్పకుండా దాన్ని చూడాలి; నన్ను క్షమించు’ అని
అన్నాడు. 19ఇంకొకడు ‘నేను ఐదు జతల ఎద్దులు
కొన్నాను. వెళ్ళి అవి ఏ విధంగా పనిచేస్తాయో చూడాలి,
నన్ను క్షమించును’ అని అన్నాడు. 20మరొకడు ‘నేను
ఈ రోజే పెళ్ళి చేసు కున్నాను కనుక రాలేను’ అని
అన్నాడు. 21ఆ సేవకుడు తిరిగి వచ్చి జరిగినదంతా
తన యజమానితో చెప్పాడు. అతనికి కోపం వచ్చి
తన సేవకునితో, ‘వెంటనే పట్టణంలో ఉన్న అన్ని
వీధుల్లోకి వెళ్ళి పేదవాళ్ళను, వికలాంగులను, గ్రుడ్డి
వాళ్ళను, కుంటివాళ్ళను పిలుచుకురా!’ అని అన్నాడు.
22ఆ సేవకుడు మళ్ళీవచ్చి, ‘అయ్యా! మీరు చెప్పినట్లు
చేసాను. కాని భోజనశాలలు ఇంకా నిండలేదు’ అని
అన్నాడు. 23అప్పుడు ఆ యజమాని తన సేవకునితో
‘ఊరి బయటనున్న రహదారులకు, పొలాలకు వెళ్ళి
అక్కడి వాళ్ళను తప్పక రమ్మనమని చెప్పు. వాళ్ళతో
నా యిల్లంతా నిండి పోవాలి. 24నేను చెప్పేదేమిటంటే
నేనిదివరకు పిలిచిన వాళ్ళలో ఒక్కడు కూడా నా
విందు రుచి చూడడు’ అని అన్నాడు.”
25ప్రజలు గుంపులు గుంపులుగా యేసుతో
ప్రయాణం చేస్తూవున్నారు. యేసు వాళ్ళ వైపు తిరిగి,
26“నాతో వచ్చి, తన తల్లి తండ్రులకన్నా, తన భార్య

---

**ప్రభువు … ధన్యుడు** కీర్తన 118:26.

**నీరొచ్చిన** జలోదర రోగం అని కొన్ని తర్జుమాల్లో ఉంది.

కన్నా, తన సంతానానికన్నా, తన తోబుట్టు వులకన్నా,
చివరకు తన ప్రాణానికన్నా నన్ను ఎక్కువగా ప్రేమించ
లేనివాడు నా శిష్యుడు కాలేడు. 27అంతేకాక తన
సిలువను మోసికొని నన్ను అనుసరించనివాడు నా
శిష్యుడు కాలేడు. 28గోపురం కట్టాలను కొన్నవాడు
కూర్చొని దానికి ఎంత వ్యయ మౌతుందో అంచనా
వేయడా? తన దగ్గర కావలసినంత డబ్బు ఉందో
లేదో చూసుకోడా? 29-30పునాదులు వేసాక దాన్ని
పూర్తి చెయ్యలేక పోతే చూసిన వాళ్ళంతా 'ఇతడు
కట్టటం మొదలెట్టాడు కాని పూర్తి చెయ్యలేక
పోయాడు' అని అతణ్ణి హేళన చేస్తారు.
31"అంతేకాక ఒక రాజు మరొక రాజుతో యుద్ధం
చెయ్యటానికి వెళ్తాడనుకోండి. అతడు శాంతంగా
కూర్చొని తన పదివేల సైన్యంతో యుద్ధం చేయబో
తున్న ఇరవై వేల సైన్యాన్ని ఎదిరించగలనా లేదా అని
ఆలోచించడా? 32యుద్ధం చేయలేనని అనుకుంటే
సైన్యాలు దూరంగా ఉన్నప్పుడే తన రాయబారుల్ని
పంపి సంధి చేసుకొంటాడు. 33అదే విధంగా మీరు
కూడా జాగ్రత్తగా ఆలోచించండి. మీరు మీకున్న వాటిని
వదిలివేయకుంటే నా శిష్యులు కాలేరు.
34"ఉప్పు మంచిదే, కాని దానిలో ఉన్న ఉప్పు
గుణం పోతే దాన్ని మళ్ళీ ఉప్పుగా ఎట్లా చెయ్యగలము?
35అది పెంట కుప్పకు పనికి రాదు. పొలానికి పనికి
రాదు. దాన్ని పారవేయవలసి వస్తుంది. చెప్పిన వాటిని
జాగ్రత్తగా గమనించండి."

### తప్పి పోయిన గొఱ్ఱె ఉపమానం

*(మత్తయి 18:12-14)*

15 ఒక రోజు పన్నులు వసూలు చేసే వాళ్ళు,
పాపులు ఆయన చెప్పినవి వినటాని కాయన
చుట్టూ సమావేశమయ్యారు. 2కాని పరిసయ్యులు,
శాస్త్రులు, "ఇతడు పాపుల్ని పిలిచి వాళ్ళతో కలిసి
తింటాడు" అని గొణిగారు.
3అప్పుడు యేసు వాళ్ళకు ఈ ఉపమానం
చెప్పాడు: 4"మీలో ఒకని దగ్గర వంద గొఱ్ఱెలు ఉన్నా
యనుకోండి. అందులో ఒక గొఱ్ఱె తప్పిపోతే అతడు
తన తొంబది తొమ్మిది గొఱ్ఱెల్ని అక్కడ బయల్లో
వదిలేసి ఆ తప్పిపోయిన గొఱ్ఱె దొరికేదాకా వెతకడా?
5అది దొరికిన వెంటనే దాన్ని భుజాలపై మోసికొని
ఆనందంతో 6యింటికి వెళ్ళి తన స్నేహితుల్ని, ఇరుగు
పొరుగు వాళ్ళను పిలిచి 'తప్పిపోయిన నా గొఱ్ఱె దొరి
కింది. మన మంతా ఆనందించుదాం' అని అంటాడు.
7నేను చెప్పేదేమిటంటే అదేవిధంగా మారుమనస్సు
పొందనవసరం లేని తొంభై తొమ్మిది మంది నీతి
మంతుల విషయంలో కలిగే ఆనందం కన్నా పాపం
చేసిన ఒక్కడు మారుమనస్సు పొందితే పరలోకంలో
ఉన్న వాళ్ళు ఎక్కువ ఆనందిస్తారు.

### పోగొట్టుకున్న నాణెం ఉపమానం

8"ఒక స్త్రీ దగ్గర పది వెండి నాణాలు ఉన్నాయను
కోండి. అందులో ఒక నాణెం పోగొట్టుకొంటే ఆమె
దీపం వెలిగించి యిల్లంతా వూడ్చి అది దొరికే దాకా
జాగ్రత్తగా వెతకదా? 9దొరికిన వెంటనే తన స్నేహి
తుల్ని, ఇరుగు పొరుగు వాళ్ళను పిలిచి 'పోగొట్టు
కున్న నా నాణెం దొరికింది. మనమంతా ఆనందించు
దాం!' అని అంటుంది. 10నేను చెప్పేది ఏమిటంటే
అదే విధంగా ఒక పాపాత్ముడు మారుమనస్సు పొందితే
దేవదూతలు ఆనందిస్తారు" అని అన్నాడు.

### తప్పిపోయిన కుమారుని ఉపమానం

11యేసు ఇంకా ఇలా చెబుతూ పోయాడు: "ఒకనికి
యిద్దరు కుమారులు ఉన్నారు. 12చిన్నవాడు
తండ్రితో, 'నాన్నా! నా భాగం ఆస్తి నాకు ఇచ్చేయి'
అని అడిగాడు. తండ్రి సరేనని తన ఆస్తిని ఇరువురి
మధ్య పంచిపెట్టాడు. 13కొద్ది రోజుల్లో చిన్నవాడు
తనపాలు భాగం తీసుకొని దూర దేశాలకు వెళ్ళి
పొయ్యాడు. ఉన్న డబ్బంతా విలాసాలకు ఖర్చు
పెట్టాడు. 14అంతా ఖర్చయి పోయింది. ఇంతలో అత
డున్న దేశంలో తీవ్రమైన క్షామం వచ్చింది. అతని
దగ్గర ఏమీ మిగల్లేదు. కనుక ఆ దేశంలో ఉన్న ఒక
ఆసామి దగ్గర ఉద్యోగంలో చేరాడు. 15ఆ ఆసామి
అతణ్ణి పందులు కాయటానికి నియమించాడు. 16ఆ
పందులు తినే ఆహారంతో తన కడుపు నింపుకోవాలని
అనుకున్నాడు. అయినా ఎవ్వరూ అతనికి ఏదీ ఇవ్వ
లేదు.
17అతనికి బుద్ధి వచ్చింది. అతడు 'నా తండ్రి
పనివాళ్ళ దగ్గర కూడా కావలసినంత తిండి ఉంది.
నేనేమో ఇక్కడ ఆకలితో చచ్చిపోతున్నాను. 18నేను
ఈ గ్రామం వదిలి తిరిగి తండ్రి దగ్గరకు వెళ్తాను.
వెళ్ళి అతనితో నాన్నా! నేను దేవుని పట్ల, నీ పట్ల
కూడా పాపం చేశాను. 19నేను నీ కుమారుడనని చెప్పు
కొంటానికి కూడా తగను. నన్ను కూడా నీ దగ్గర పని
చేసేవాళ్ళతో ఉండనీ!' అని చెప్పాలని మనస్సులో
అనుకున్నాడు. 20వెంటనే అతడు తన తండ్రి దగ్గరకు
వెళ్ళాడు.
"ఇంటికి కొంత దూరంలో ఉండగానే అతని
తండ్రికి తనకుమారుణ్ణి చూసి చాలా కనికరం కలిగింది.
అతడు పరుగెత్తుకొంటూ తన కుమారుని దగ్గరకు
వెళ్ళి అతణ్ణి కౌగిలించుకొని ముద్దు పెట్టుకొన్నాడు.
21అతడు తండ్రితో 'నాన్నా! నేను దేవుని పట్ల, నీ
పట్ల పాపం చేసాను. నేను నీ కుమారుణ్ణని చెప్పు
కోవటానికి కూడా తగను' అని అన్నాడు. 22అతని
తండ్రి పని వాళ్ళతో, 'వెంటనే వెళ్ళి మంచి దుస్తులు,
వేలికి ఉంగరము, కాళ్ళకు జోళ్ళు తెచ్చి యితనికి
తొడిగించండి. 23బాగా బలిసిన దూడను తీసుకు వచ్చి

కొయ్యండి. పండుగ చేసుకొందాం. 24చనిపోయిన
నా కుమారుడు బ్రతికి వచ్చాడు. తప్పి పోయినవాడు
తిరిగి దొరికాడు' అని అన్నాడు. వాళ్ళు వెంటనే పండుగ
చేసుకోవడం మొదలు పెట్టారు.
25"ఇంతలో పెద్దవాడు పొలంనుండి ఇంటికి వస్తూ
వున్నాడు. అతనికి ఇంటినుండి సంగీతము, నాట్యము
జరుగుతున్న ధ్వనులు వినిపించాయి. 26అతడు పని
వాళ్ళలో ఒకణ్ణి పిలిచి, 'ఏమి జరుగుతోంది?' అని
అడిగాడు. 27ఆ పనివాడు 'మీ తమ్ముడు వచ్చాడు.
మీ నాన్న అతడు క్షేమంగా తిరిగి వచ్చాడని బాగా
బలిసిన దూడను కోసి విందు చేస్తున్నాడు' అని
చెప్పాడు. 28ఇది విని అతనికి కోపం వచ్చింది. కనుక
ఇంట్లోకి అడుగు పెట్టనని అన్నాడు. అందువల్ల అతని
తండ్రి వెలుపలికి వచ్చి బ్రతిమిలాడాడు. 29అతడు
తండ్రితో, 'యిదిగో నాన్నా! ఎన్నో ఏండ్లనుండి నేను
బానిసలాగా పనిచేసాను. నీ ఆజ్ఞ జవదాట లేదు. అయినా
నేను నా స్నేహితులతో విందు చేసుకోవటానికి నీవు
ఒక్క చిన్న గొఱ్ఱెను కూడా ఇవ్వలేదు. 30కాని, నీ
ఈ కుమారుడు ఆస్తినంతా వేశ్యలకు తగలెట్టి ఇల్లు
చేరుకొంటే వానికోసం బలిసిన దూడను కోస్తునావు!'
అని అన్నాడు. 31కాని తండ్రి అతనితో, 'నా బాబూ!
నీవెప్పుడూ నా దగ్గరే ఉంటున్నావు. కనుక నా దగ్గర
ఉన్నవన్నీ నీవి. 32కాని నీ ఈ తమ్ముడు చనిపోయి
తిరిగి బ్రతికాడు. తప్పిపోయిన వాడు దొరికాడు. కనుక
మనం ఆనందంగా పండుగ చేసుకోవాలి' అని
అన్నాడు."

## అవినీతి గుమాస్తా యొక్క ఉపమానం

16 యేసు తన శిష్యులతో ఈ విధంగా చెప్పటం
మొదలుపెట్టాడు: "ఒక ధనవంతుని దగ్గర ఒక
గుమాస్తా పని చేస్తూ ఉండేవాడు. కొందరు, గుమాస్తా
ఆ ధనవంతుని ధనం వ్యర్థం చేస్తున్నాడని అతనిపై
ఆ ధనవంతునితో ఫిర్యాదు చేశారు. 2ఆ కారణంగా ఆ
ధనవంతుడు తన గుమాస్తాను పిలిచి, 'నేను నిన్ను
గురించి వింటున్నదేమిటి? జమాఖర్చుల లెక్కలు
నాకు చూపు. నీవిక నా గుమాస్తాగా ఉండటానికి వీల్లేదు'
అని అన్నాడు. 3ఆ గుమాస్తా 'నేనేం చెయ్యాలి? నా
యజమాని నన్ను ఉద్యోగం నుండి తీసివేస్తున్నాడు.
పొలం దున్ని జీవించాలంటే శక్తి లేదు. భిక్ష మెత్తు
కోవాలంటే సిగ్గేస్తుంది. 4ఆ! నా ఉద్యోగం పోయి
నప్పుడు ప్రజలు నన్ను తమ ఇండ్లలోనికి ఆహ్వానించే
టట్లు ఏమి చెయ్యాలో తెలిసింది' అని అనుకున్నాడు.
5వెంటనే అతడు తన యజమానికి అప్పున్న వాళ్ళను
ఒక్కొక్కరిని పిలిచాడు. మొదటివానితో 'నా యజ
మానికి ఎంత అప్పున్నావు!' అని అడిగాడు. 6'వంద
లీటరులు ఒలీవ నూనె' అని అతడు సమాధానం
చెప్పాడు. ఆ గుమాస్తా 'ఈ రసీదు తీసుకొని అక్కడ
కూర్చొని దాన్ని వెంటనే యాభై లీటర్లు చెయ్యి'
అని అతనితో అన్నాడు. 7ఆ తర్వాత రెండవ వానితో,
'నీవెంత అప్పున్నావు?' అని అడిగాడు. 'వంద గోధుమ
సంచులు' అని అతడు సమాధానం చెప్పాడు. ఆ
గుమాస్తా, 'ఈ రసీదు తీసుకొని దాన్ని ఎనభై సంచులు
చెయ్యి' అని అతనితో అన్నాడు. 8ఆ యజమాని, ఆ
అవినీతి గుమాస్తాను తెలివిగా ప్రవర్తించినందుకు అభినం
దించాడు. దైవ చింతన కల వాళ్ళు ఆధ్యాత్మిక విష
యాల్లో చూపుతున్న తెలివి కన్నా, ప్రాపంచిక విష
యాల్లో ఉన్న వాళ్ళు తమ పరిస్థితుల్ని ఎక్కువ
తెలివిగా ఎదుర్కొంటారు.
9"నేను చెప్పేదేమిటంటే, మీ ఐహిక సంపదను
ఉపయోగించి ఈ లోకపు స్నేహితులను సంపాదిం
చండి. మీ ధనం తరిగిపోయిన తర్వాత వారు మీకు
సహాయం అవుతారు. 10చిన్న విషయాల్లో నమ్మగలిగిన
వాణ్ణి పెద్ద విషయాల్లో కూడా నమ్మ వచ్చు. చిన్న
విషయాల్లో అవినీతిగా ఉన్నవాడు పెద్ద విషయా
ల్లోకూడా అవినీతిగా ఉంటాడు. 11ఐహిక సంపద విష
యంలో మిమ్మల్ని నమ్మలేనప్పుడు నిజమైన సంపద
విషయంలో మిమ్మల్నెవరు నమ్ముతారు? 12ఇతరుల
ఆస్తి విషయంలో మిమ్మల్ని నమ్మలేనప్పుడు మీకు
మీ స్వంత ఆస్తిని ఎవరిస్తారు? 13ఏ సేవకుడూ ఇద్దరు
యజమానులకు సేవ చేయ లేడు. అలాచేస్తే అతడు
ఒకరిని ప్రేమించి ఇంకొకరిని ద్వేషిస్తాడు. ఒకని పట్ల
విశ్వాసం చూపి యింకొకని పట్ల నీచంగా ప్రవర్తిస్తాడు.
దేవుణ్ణి, ధనాన్ని సమంగా కొలువలేము."

## ధర్మశాస్త్రము, దేవుని రాజ్యము

*(మత్తయి 11:12-13)*

14పరిసయ్యులు ధనాన్ని ప్రేమించేవాళ్ళు కనుక
వాళ్ళు ఇది విని యేసును హేళన చేశారు. 15యేసు
వాళ్ళతో, "మీరు ప్రజల ముందు నీతిమంతులుగా
ప్రవర్తిస్తారు. కాని మీ హృదయాల్లో ఏముందో దేవునికి
తెలుసు. మానవులు వేటికి అత్యధికమైన విలువనిస్తారో
వాటిని దేవుడు తిరస్కరిస్తాడు.
16"యోహాను కాలందాకా ధర్మశాస్త్రము, ప్రవక్తలు
వ్రాసిన విషయాలు ఆచరణలో ఉన్నాయి. యోహాను
కాలం నుండి దేవుని రాజ్యాన్ని గురించి సువార్త ప్రక
టింపబడుతోంది. ప్రతి ఒక్కరూ ఆ రాజ్యంలోకి వెళ్ళా
లని తమ శక్త్యానుసారం కష్టపడుతున్నారు. 17భూమి,
ఆకాశము నశించిపోవచ్చు, కాని ధర్మశాస్త్రంలో ఉన్న
ఒక్క అక్షరం కూడా పొల్లుపోదు.
18"తన భార్యకు విడాకులిచ్చి మరొక స్త్రీని వివాహం
చేసుకొన్న ప్రతివాడు వ్యభిచారిగా పరిగణింపబడతాడు.
విడాకులివ్వబడిన స్త్రీని వివాహం చేసుకొన్నవాడు
కూడా వ్యభిచారిగా పరిగణింపబడతాడు" అని అన్నాడు.

### ధనవంతుడు, లాజరు

19“ఒకప్పుడు ఒక ధనవంతుడు ఉండేవాడు. అతడు
మంచి విలువైన దుస్తులు వేసుకొని ప్రతిరోజు
భోగాలనుభవిస్తూ జీవించేవాడు. 20అతని గడప ముందు
లాజరు అనే భిక్షగాడు ఉండేవాడు. అతని ఒంటినిండా
కురుపులు ఉండేవి. కుక్కలు వచ్చి అతని కురుపులు
నాకుతూ ఉండేవి. 21అతడాధనికుని బల్లమీద నుండి
పడిన ఎంగిలి ముక్కలతో తన కడుపు నింపుకోవటానికి
ఆశతో అక్కడ పడి ఉండేవాడు. 22ఆ భిక్షగాడు చని
పొయ్యాడు. అతణ్ణి దేవదూతలు తీసుకువెళ్ళి అబ్రా
హాము ప్రక్కన కూర్చుండబెట్టారు. ఆ తర్వాత ఆ
ధనికుడు కూడా చనిపొయ్యాడు. అతడు సమాధి
చెయ్యబడ్డాడు. 23నరకంలో ఆ ధనికుడు హింసలు
అనుభవిస్తూవుండేవాడు. తలెత్తి చూడగా లాజరును
తన ప్రక్కన కూర్చోబెట్టుకున్న అబ్రాహాము కని
పించాడు. వాళ్ళు చాలా దూరంగా ఉన్నారు. 24అందు
వల్ల అబ్రాహామును పిలిచి, ‘తండ్రీ అబ్రాహామా! నామీద
దయ చూపు. నేను ఈ మంటల్లో తీవ్రంగా
బాధపడ్తున్నాను. లాజరుతో ఇక్కడకు వచ్చి తన వేలు
ముంచి నా నాలుక తడపమని చెప్పండి’ అని అన్నాడు.
25కాని అబ్రాహాము, ‘కుమారుడా! జ్ఞాపకం తెచ్చుకో!
నీవు బ్రతికిన రోజుల్లో సుఖాలను భవించావు. లాజరు
కష్టాలనుభవించాడు. కాని అతడిక్కడ ఆనందంగా
ఉన్నాడు. నీవు బాధలను అనుభవిస్తున్నావు. 26ఇక్కడి
వాళ్ళు అక్కడకు రాకూడదని, అక్కడివాళ్ళు యిక్కడికి
రాకూడదని మన మధ్య పెద్ద అఘాతం ఉంది’ అని
అన్నాడు. 27ఆ ధనికుడు అలాగైతే ‘తండ్రీ! లాజరును
మా తండ్రి ఇంటికి పంపు. 28అక్కడ నా ఐదుగురు
సోదరు లున్నారు. వాళ్ళు యిక్కడకు వచ్చి హింసలు
అనుభవించకుండా ఉండేటట్లు వాళ్ళకు బోధించుమని
చెప్పు’ అని అన్నాడు. 29అబ్రాహాము ఈ విధంగా
సమాధానం చెప్పాడు: ‘మోషే, ప్రవక్తలు ఉన్నారు
కదా! వాళ్ళు చెప్పినట్లు చెయ్యనీ!’ 30‘తండ్రీ! అబ్రా
హామా! చనిపొయిన వాళ్ళ నుండి ఎవరైనా వెళ్తే
వాళ్ళు విని మారుమనస్సు పొందుతారు’ అని ఆ
ధనికుడు అన్నాడు. 31అబ్రాహాము, ‘వాళ్ళు మోషే,
ప్రవక్తలు చెప్పినట్లు విననట్లైతే చనిపోయినవాడు
బ్రతికి వచ్చినా వాళ్ళు వినరు’ అని అన్నాడు.”

### పాపము

*(మత్తయి 18:6-7, 21-22; మార్కు 9:42)*

17 యేసు తన శిష్యులతో ఇలా అన్నాడు:
“ప్రజలు పాపం చేసే పరిస్థితులు కలుగ చేసే
వాళ్ళకు శిక్ష తప్పదు. 2ఈ అమాయకుల్లో ఏ ఒక్కడు
పాపం చేసేటట్లు చేసినా శిక్ష తప్పదు. అది జరుగక
ముందే అలాంటి వాని మెడకు తిరగటి రాయి కట్టి
సముద్రంలో పడవేస్తే అది అతనికి మేలు చేసి నట్లవు
తుంది. 3అందువల్ల జాగ్రత్త!

“మీ సోదరుడు పాపం చేస్తే గద్దించండి. పశ్చాత్తాపం
చెందితే క్షమించండి. 4అతడు రోజుకు ఏడుసార్లు మీ
పట్ల పాపం చేసి ఏడుసార్లు మీ దగ్గరకు వచ్చి, ‘నేను
పశ్చాత్తాపం చెందాను’ అని అంటే అతణ్ణి క్షమించండి.”

5అపొస్తలులు ప్రభువుతో, “మా విశ్వాసాన్ని గట్టి
పరచండి” అని అన్నారు.

6ప్రభువు, “మీలో ఆవగింజంత విశ్వాసం ఉన్నా
చాలు; మీరు కంబళి చెట్టుతో, ‘నీవు నీ వేర్లతో బాటు
పెళ్లగింపబడి వెళ్ళి సముద్రంలో పడి అక్కడ
నాటుకుపో!’ అని అంటే అది మీ మాట వింటుంది.

### సేవకుని కర్తవ్యం

7“మీ పొలం దున్నే సేవకుడో లేక మీ గొర్రెలు
కాచే సేవకుడో ఒకడున్నాడనుకోండి. అతడు పొలం
నుండి యింటికి రాగానే, ‘రా! వచ్చి కూర్చొని భోజనం
చెయ్యి’ అని అతనితో అంటారా? అనరు. 8దీనికి
మారుగా, ‘వంటవండి, దుస్తులు మార్చుకొని, నేను
తిని త్రాగేదాకా పనిచేస్తూవుండు. ఆ తర్వాత నువ్వు
కూడా తిని త్రాగు’ అని అంటారు. 9మీరు చెప్పినట్లు
విన్నందుకు మీ సేవకునికి కృతజ్ఞత తెలుపు
కుంటారా? 10మీరు కూడా చెప్పిన విధంగా చేసాక
‘మేము మామూలు సేవకులము, చెప్పినట్లు చేసాము.
అది మా కర్తవ్యం’ అని అనాలి.”

### పదిమంది కుష్టురోగులకు నయం చెయ్యటం

11యేసు యెరూషలేముకు ప్రయాణం సాగిస్తూ
గలిలయ నుండి సమరయ పొలిమేరలకు వచ్చాడు.
12ఒక గ్రామంలోకి వెళ్తూండగా పదిమంది కుష్టురోగులు
ఆయన దగ్గరకు వచ్చారు. వాళ్ళు ఆయనకు కొద్ది
దూరంలో నిలుచొని, 13“యేసు ప్రభూ! మాపై
దయచూపు” అని బిగ్గరగా అన్నారు.

14ఆయన వాళ్ళను చూసి, “వెళ్ళి యాజకులకు
చూపండి” అని అన్నాడు.

వాళ్ళు వెళ్తూంటే వాళ్ళకు నయమై పోయింది.
15వాళ్ళలో ఒకడు తనకు నయమవటం గమనించి,
గొంతెత్తి దేవుణ్ణి స్తుతిస్తూ వెనక్కు వెళ్ళాడు. 16యేసు
ముందు మోకరిల్లి కృతజ్ఞత చెప్పుకున్నాడు. అతడు
సమరయ వాడు. 17యేసు, “పదిమందికి నయమైంది
కదా! మిగతా తొమ్మిది మంది ఏరి? 18ఈ సమర
యుడు తప్ప మరెవ్వరూ దేవుణ్ణి స్తుతించటానికి తిరిగి
రాలేదా?” అని అన్నాడు. 19ఆ తర్వాత అతనితో,
“లేచి వెళ్ళు. నీ విశ్వాసమే నీకు నయం చేసింది” అని
అన్నాడు.

### దేవుని రాజ్యం రావటం
*(మత్తయి 24:23-28, 37-41)*

20“కొందరు పరిసయ్యులు దేవుని రాజ్యం ఎప్పుడు
వస్తుందని అడిగారు.”
యేసు, “దేవుని రాజ్యం అందరికీ కనిపించేలా రాదు.
21‘ఇదిగో, దేవుని రాజ్యం ఇక్కడ ఉంది; అదిగో అక్కడ
ఉంది’ అని ఎవరూ అనరు. ఎందుకంటే దేవుని రాజ్యం
మీలో ఉంది!” అని సమాధానం చెప్పాడు.
22ఆ తర్వాత, తన శిష్యులతో, “మనుష్యకుమా
రుడు మీతో ఒక్క రోజన్నా ఉండాలని మీరు
తహతహలాడే సమయం వస్తుంది. కాని అలా జరగదు.
23ప్రజలు, ‘అదిగో అక్కడ ఉన్నాడని’ కాని, లేక ‘ఇదిగో
ఇక్కడున్నాడని’ కాని అంటే వాళ్ళ వెంట పరుగెత్తి
వెళ్ళకండి.
24“ఎందుకంటే మనుష్యకుమారుడు తిరిగి వచ్చి
నప్పుడు ఆకాశంలో ఈ చివరినుండి ఆ చివరి దాకా
మెరిసే మెరుపులా ఉంటాడు. 25కాని దానికి ముందు
ఆయన ఎన్నో కష్టాలు అనుభవించాలి. ఈ తరం
వాళ్ళతో తృణీకరింపబడాలి. 26నోవహు కాలంలో
జరిగిన విధంగా మనుష్యకుమారుని కాలంలో కూడా
జరుగుతుంది. 27నోవహు నావలో ప్రవేశించేదాకా
ప్రజలు తింటూ, త్రాగుతూ, వివాహాలు చేస్తూ,
వివాహాలు చేసుకొంటూ గడిపారు. అతడు నావలో
ప్రవేశించాక వరదలు రాగా మిగిలిన వాళ్ళందరూ నాశన
మయ్యారు. 28లోతు కాలంలో కూడా అదేవిధంగా
జరిగింది. ప్రజలు తింటూ, త్రాగుతూ, అమ్ముతూ,
కొంటూ, పొలాలు సాగుచేస్తు, ఇళ్ళు కడుతూ జీవిం
చారు. 29కాని లోతు సొదొమ పట్టణం వదిలి వెళ్ళిన
వెంటనే ఆకాశం నుండి మంటలు, గంధకము వర్షంలా
కురిసి అందర్ని నాశనం చేసింది. 30మనుష్యకుమారుణ్ణి
దేవుడు వ్యక్తం చేసిన రోజు కూడా ఇదే విధంగా
జరుగుతుంది.
31“ఆ రోజు ఇంటి కప్పు మీదనున్న వాళ్ళు తమ
వస్తువులు తెచ్చుకోవటానికి ఇళ్ళలోకి వెళ్ళరాదు.
అదేవిధంగా పొలాల్లో ఉన్నవాళ్ళు ఏ వస్తువు కోసం
ఇంటికి తిరిగి వెళ్ళరాదు. 32లోతు భార్యను జ్ఞాపకం
తెచ్చుకొండి. 33తన ప్రాణాన్ని కాపాడు కోవాలను
కొన్నవాడు పోగొట్టుకొంటాడు. ప్రాణం పోగొట్టుకోవ
టానికి సిద్ధంగా ఉన్నవాడు తన ప్రాణం కాపాడు
కొంటాడు. 34ఆ రాత్రి ఒక పడక మీద ఇద్దరు నిద్రిస్తూ
ఉంటే ఒకడు వదిలి వేయబడి మరొకడు తీసుకొని
వెళ్ళబడతాడు. 35ఇద్దరు స్త్రీలు తిరుగలి విసురుతూ
ఉంటే ఒకామె తీసుకు వెళ్ళబడుతుంది, మరొకామె
వదిలి వేయ బడుతుంది.” 36*
37“ఇవి ఎక్కడ సంభవిస్తాయి ప్రభూ!” అని వాళ్ళు
అడిగారు.
ఆయన, “ఎక్కడ శవముంటే అక్కడ రాబందు
లుంటాయి” అని సమాధానం చెప్పాడు.

### పట్టు వదలని వితంతువు యొక్క ఉపమానం

18 నిరంతరం ప్రార్థిస్తూ ఉండాలని, నిరుత్సాహం
చెందరాదని, బోధించటానికి యేసు తన
శిష్యులకు ఈ ఉపమానం చెప్పాడు: 2“ఒక గ్రామంలో
ఒక న్యాయాధిపతి ఉండేవాడు. అతనికి దేవుడంటే
భయంకాని, ప్రజలు తనని గురించి ఏమనుకొంటారనే
భీతికాని లేకుండెను. 3అదే గ్రామంలో ఒక వితంతువు
ఉండేది. ఆమె ఆ న్యాయాధిపతి దగ్గరకు ప్రతీరోజు
వచ్చి ‘నాకు ఒకడు అన్యాయం చేశాడు. నాకు న్యాయం
చేకూర్చండి’ అని అడుగుతూ ఉండేది. 4చాలా కాలం
అతడు ఆమె మాటలు పట్టించుకోలేదు. కాని చివరకు
‘నాకు దేవుడంటే భయంకాని, ప్రజలంటే భీతికాని
లేదు. 5కాని ఈ వితంతువు వచ్చి నన్ను విసిగిస్తోంది.
కాబట్టి ఈమె మళ్ళీ మళ్ళీ నా దగ్గరకు రాకుండ
ఈమెకు న్యాయం జరిగేలా చూస్తాను’ అని తన మన
స్సులో అనుకున్నాడు.”
6ఇలా చెప్పి ప్రభువు, “ఆ నీతి నియమం లేని
న్యాయాధిపతి అనుకొన్న మాటలు విన్నారు కదా!
7మరి దేవుడు తనను రాత్రింబగళ్ళు ప్రార్థించే తన
వాళ్ళకు న్యాయం చేకూర్చకుండా ఉంటాడా? వాళ్ళకు
న్యాయం చెయ్యటంలో ఆలస్యం చేస్తాడా! 8ఆయన
వాళ్ళకు వెంటనే న్యాయం చేకూరుస్తాడని నేను చెబు
తున్నాను. కాని మనుష్యకుమారుడు వచ్చినప్పుడు
ఈ ప్రపంచంలోని ప్రజలలో విశ్వాసాన్ని కను
గొంటాడా?” అని అన్నాడు.

### పరిసయ్యుడు, పన్నులు సేకరించేవాడు

9తాము మాత్రమే నీతిమంతులమని అనుకొని
యితర్లను చిన్నచూపు చూసేవాళ్ళకు యేసు ఈ
ఉపమానం చెప్పాడు: 10“ఇద్దరు మనుష్యులు మంది
రానికి వెళ్ళారు. ఒకడు పరిసయ్యుడు, ఒకడు పన్నులు
వసూలు చేసేవాడు. 11పరిసయ్యుడు ఒక ప్రక్క
నిలుచొని ఈ విధంగా ప్రార్థించటం మొదలు పెట్టాడు:
‘ప్రభూ! నేను యితరుల్లా, అంటే మోసగాళ్ళల్లా, దుర్మా
ర్గుల్లా, వ్యభిచారుల్లా ఉండనందుకు నీకు కృతజ్ఞుణ్ణి.
ఈ పన్నులు సేకరించేవానిలా నేను ఉండనందుకు
కూడా కృతజ్ఞుణ్ణి. 12నేను వారానికి రెండుసార్లు ఉప
వాసాలు చేస్తాను. నా సంపదలో పదవవంతు దేవుని
పేరిట యిస్తాను.’
13“ఆ పన్నులు సేకరించేవాడు మరొక ప్రక్క
నిలుచొని ఆకాశం వైపు కూడా చూడ ధైర్యము లేక
గుండెలు బాదుకుంటూ, ‘దేవుడా! నేనొక పాపిని,

---

వచనము 36 ‘ఇద్దరు మనుష్యులు పొలంలో ఉంటే
ఒకణ్ణి తీసుకువెళ్ళి యింకొకణ్ణి వదిలి వేస్తాడు.’

నాపై దయచూపు' అని అన్నాడు. 14దేవుని దృష్టిలో
పరిసయ్యునికి మారుగా ఇతడు నీతిమంతుడనిపించు
కొని ఇంటికి వెళ్ళాడు. ఎందుకంటే గొప్పలు చెప్పు
కొన్నవాడు అణచబడతాడు. అణుకువతో ఉన్నవాడు
గొప్ప స్థానానికి ఎత్తబడతాడు."

### యేసు చిన్న పిల్లల్ని దీవించటం

(*మత్తయి 19:13-15; మార్కు 10:13-16*)

15యేసు వారిని తాకాలని ప్రజలు చిన్న పిల్లల్ని
ఆయన దగ్గరకు పిలుచుకు వచ్చారు. శిష్యులు యిది
చూసి ప్రజల్ని వారించారు. 16కాని, యేసు ఆ చిన్న
పిల్లల్ని తన దగ్గరకు పిలుస్తూ, "చిన్న పిల్లల్ని నా
దగ్గరకు రానివ్వండి. వాళ్ళను ఆపకండి. దేవుని రాజ్యం
వాళ్ళలాంటి వారిదే. 17యిది నిజం. దేవుని రాజ్యాన్ని
చిన్న పిల్లల్లా అంగీకరించనివాడు అందులోకి ప్రవేశించ
లేడు" అని అన్నాడు.

### ధనవంతుడు

(*మత్తయి 19:16-30; మార్కు 10:17-31*)

18ఒక యూదుల నాయకుడు యేసును, "బోధ
కుడా! మీరు మంచివాళ్ళు. నేను అనంత జీవితం
పొందాలంటే ఏమి చెయ్యాలి?" అని అడిగాడు.
19"నేను మంచివాణ్ణని ఎందుకంటున్నావు? దేవుడు
తప్ప మరెవ్వరూ మంచి వాళ్ళు కాదు. 20నీకు దేవుని
ఆజ్ఞలు తెలుసు కదా: 'వ్యభిచారం చెయ్యరాదు, హత్య
చెయ్యరాదు. దొంగతనము చెయ్యరాదు. దొంగ
సాక్ష్యాలు చెప్పరాదు. తల్లి తండ్రుల్ని గౌరవించవ
లెను'"* అని యేసు సమాధానం చెప్పాడు.
21"నేను చిన్ననాటినుండి ఈ నియమాలు పాటి
స్తూనేవున్నాను" అని ఆ యూదుల పెద్ద అన్నాడు.
22ఇది విని యేసు అతనితో, "నీలో యింకొక
లోపం ఉంది. నీ దగ్గరున్నవన్నీ అమ్మేసి పేదవాళ్ళకు
దానం చెయ్యి. అది నీకు పరలోకంలో సంపద అవు
తుంది. ఆ తదుపరి నన్ను అనుసరించు" అని అన్నాడు.
23ఆ యూదుల పెద్ద చాలా ధనవంతుడు. అందువల్ల
యిది విని అతనికి చాలా దుఃఖం కలిగింది.
24యేసు అతడు దుఃఖపడటం చూసి, "ధన
వంతులు దేవుని రాజ్యంలో ప్రవేశించటం చాలా కష్టం.
25ధనవంతుడు దేవుని రాజ్యంలోకి ప్రవేశించటంకన్నా
ఒంటె సూది రంధ్రం ద్వారా వెళ్ళటం సులభం" అని
అన్నాడు.
26ఇది విని వాళ్ళు,"మరి ఎవరు రక్షింపబడుతారు?"
అని అడిగారు.
27"మానవునికి సాధ్యంకానిది దేవునికి సాధ్య
మౌతుంది" అని యేసు అన్నాడు.
28పేతురు, "మిమ్మల్ని అనుసరించటానికి మాకు
న్నవన్నీ వదిలివేసాము" అని అన్నాడు.
29యేసు, "ఇది నిజం. దేవుని రాజ్యం కొరకు
తన యింటిని, భార్యను, సోదరుల్ని, తల్లితండ్రుల్ని,
సంతానాన్ని వదిలినవాడు ఏ మాత్రం నష్టపోడు.
30ఇప్పుడు ఎన్నోరెట్లు ఫలం పొందటమే కాకుండా
ముమ్ముందు అనంత జీవితం పొందుతాడు" అని
అన్నాడు.

### యేసు తన మరణాన్ని గురించి మళ్ళీ ప్రవచనం చెప్పటం

(*మత్తయి 20:17-19; మార్కు 10:32-34*)

31యేసు పన్నెండుమందిని ప్రక్కకు పిలుచుకు
వెళ్ళి, "మనం యెరూషలేము వెళ్ళాలి. మనుష్యకుమా
రుణ్ణి గురించి ప్రవక్తలు వ్రాసినవన్నీ నిజం కాబోతు
న్నాయి. 32ఆయన యూదులుకాని వాళ్ళకు అప్పగింప
బడతాడు. వాళ్ళాయన్ని హేళన చేస్తారు. అవమాని
స్తారు, ఆయనపై ఉమ్మి వేస్తారు, 33కొరడా దెబ్బలు
కొడతారు, చివరకు చంపివేస్తారు. మూడవ రోజు
ఆయన బ్రతికి వస్తాడు" అని అన్నాడు. 34శిష్యులకు
ఆయన చెప్పింది ఏ మాత్రం అర్థం కాలేదు. ఆయన
చెప్పిన దానిలో గూఢార్థం ఉంది. కాని వాళ్ళకది
బోధపడలేదు.

### గ్రుడ్డివానికి దృష్టి కలిగించటం

(*మత్తయి 20:29-34; మార్కు 10:46-52*)

35యేసు యెరికో పట్టణాన్ని సమీపిస్తున్నాడు.
అదే సమయానికి ఒక గ్రుడ్డివాడు దారిప్రక్కన భిక్ష
మెత్తుకుంటూ కూర్చొని ఉన్నాడు. 36అతడు ప్రజల
గుంపు వెళ్తుండటం గమనించి ఏమి జరుగుతోందని
అడిగాడు.
37వాళ్ళు, "నజరేతు నివాసి యేసు ఈ దారిలో
వెళ్తున్నాడు" అని చెప్పారు.
38ఆ గ్రుడ్డివాడు బిగ్గరగా, "యేసూ! దావీదు
కుమారుడా! నామీద దయ చూపు!" అని అన్నాడు.
39ముందున్న వాళ్ళు అతణ్ణి గద్దిస్తూ నోరు
మూసుకోమని చెప్పారు. కాని, అతడు యింకా బిగ్గరగా,
"దావీదు కుమారుడా! నా మీద దయ చూపు" అని
అన్నాడు.
40యేసు ఆగి ఆ గ్రుడ్డివాణ్ణి తన దగ్గరకు పిలుచుకు
రమ్మని ఆజ్ఞాపించాడు. అతడు దగ్గరకు రాగానే యేసు
అతణ్ణి
41"ఏమి కావాలి?" అని అడిగాడు.
"ప్రభూ! నాకు దృష్టి కావాలి" అని గ్రుడ్డివాడు
సమాధానం చెప్పాడు.
42యేసు, "నీకు దృష్టి కలగాలి! నీవు విశ్వసించావు
కనుక నీకు దృష్టి కలిగింది" అని అన్నాడు.

---

**'వ్యభిచారం … గౌరవించవలెను'** నిర్గమ 20:16 ద్వితీ. 12:5, 16-20.

43వెంటనే అతడు చూడగలిగాడు. ఆ గ్రుడ్డివాడు
దేవుణ్ణి స్తుతిస్తూ యేసును అనుసరించాడు. ప్రజ
లందరూ యిది చూసి వారుకూడా దేవుణ్ణి స్తుతించారు.
19 యేసు యెరికోను చేరి ఆ పట్టణం ద్వారా
వెళ్తూవున్నాడు. 2ఆ గ్రామంలో జక్కయ్య అనే
వాడు ఉండేవాడు. అతడు పన్నులు సేకరించేవాళ్ళలో
పెద్ద అధికారి. గొప్ప ధనికుడు కూడా. 3జక్కయ్య
యేసు ఎవరో చూడాలను కొన్నాడు. కాని ప్రజలు
గుంపులు గుంపులుగా వుండిరి అతడు పొట్టి వాడు
అవటం వలన యేసును చూడలేక పోయాడు. 4యేసు
ఆ దారిలో వస్తున్నాడని తెలిసి ఆయన్ని చూడటానికి
అందరికన్నా ముందు పరుగెత్తి ఒక మేడి చెట్టెక్కి
కూర్చున్నాడు. 5యేసు ఆ చెట్టుదగ్గరకు వచ్చాక
పైకి చూసి, "జక్కయ్యా! జక్కయ్యా! వెంటనే
క్రిందికి దిగిరా! ఈ రోజు నేను నీ యింట్లో బస
చెయ్యాలి!" అని అన్నాడు.
6అతడు వెంటనే క్రిందికి దిగి ఆనందంతో
యేసుకు స్వాగతం చెప్పాడు. 7ప్రజలు జరిగిన దంతా
చూసి, "యేసు ఒక పాపి యింట్లో బస చెయ్యటానికి
వెళ్తున్నాడే!" అని గొణిగారు.
8కాని జక్కయ్య ప్రభువుతో, "ప్రభూ! నేను
యిక్కడే నా ఆస్థిలో సగం పేదవాళ్ళకు యిస్తాను.
నేను ఎవరినుండైనా ఏదైనా మోసం చేసి తీసుకొని
ఉంటే దానికి నాలుగు రెట్లు వాళ్ళకు చెల్లిస్తాను" అని
అన్నాడు.
9అప్పుడు యేసు, "ఇతడు కూడా అబ్రాహాము
కుమారుడు. కనుక ఈ యింటికి ఈ రోజు రక్షణ
వచ్చింది. 10మనుష్యకుమారుడు తప్పిపోయిన
వాళ్ళను వెతికి రక్షించటానికి వచ్చాడు" అని అన్నాడు.

## పది మీనాల ఉపమానం

(*మత్తయి 25:14-30*)

11ప్రజలు ఆయన చెబుతున్న విషయాలు వింటూ
ఉన్నారు. ఆయన యెరూషలేము దగ్గరగా ఉండటం
వల్ల ప్రజలు దేవుని రాజ్యం రాబోతోందని అను
కున్నారు. కనుక ఆయన వాళ్ళకు ఈ ఉపమానం
చెప్పాడు: 12"గొప్ప కుటుంబంలో పుట్టిన వాడొకడు
దూర దేశానికి వెళ్ళి తన దేశానికి రాజుగా నియమింప
బడ్డాక తిరిగి రావాలనుకొన్నాడు. 13వెళ్ళేముందు తన
సేవకుల్ని పది మందిని పిలిచి ఒక్కొక్కనికి ఒక మీనా
యిచ్చి, నేను తిరిగి వచ్చేదాకా ఈ డబ్బుతో వ్యాపారం
చెయ్యండి" అని అన్నాడు. 14అతని ప్రజలకు అత
డంటే యిష్టం ఉండేది కాదు. కనుక వాళ్ళు తమ
ప్రతినిధుల్ని పంపి, 'ఇతడు మా రాజుగా ఉండటం
మాకిష్టం లేదు' అని చెప్పనంపారు.
15"అయినా అతడు రాజుగా నియమింపబడ్డాడు.
ఆ తర్వాత అతడు తన దేశానికి తిరిగి వచ్చాడు.
తాను డబ్బిచ్చిన సేవకులు ఎంత సంపాదించారో
కనుక్కోవటానికి వాళ్ళను పిలిపించాడు. 16మొదటి
వాడు వచ్చి, 'ప్రభూ! మీరిచ్చిన మీనాతో మరొక
పది మీనాలు సంపాదించాను' అని అన్నాడు.
17'మంచిది! నీవు మంచి సేవకుడివి. నీవు చిన్న
వాటిలో కూడా ఇంత నమ్మకంగా ఉన్నందుకు పది
గ్రామాలపై నీకు అధికారం ఇస్తున్నాను' అని ఆ రాజు
అన్నాడు. 18రెండవ వాడు వచ్చి 'ప్రభూ! మీరిచ్చిన
మీనాతో ఐదు మీనాలు సంపాదించాను' అని అన్నాడు.
19'నిన్ను ఐదు గ్రామాలపై అధికారిగా నియ మిస్తు
న్నాను' అని ఆ రాజు అన్నాడు. 20మూడవవాడు
వచ్చి, 'ప్రభూ! ఇదిగో మీరిచ్చిన మీనా. దాన్ని నేను
ఒక గుడ్డలో చుట్టి దాచి ఉంచాను. 21మీరు చాలా
కఠినాత్ములు కనుక మీరంటే నాకు భయం. మీరు
మీవి కానివాటిని లాక్కుంటారు; విత్తకుండానే కోయా
లంటారు' అని అన్నాడు. 22ఆ రాజు, 'ఓరి, దుర్మార్గుడా!
నిన్ను శిక్షించటానికి నీ మాటలే ఉపయోగిస్తాను. నేను
కఠినాత్ముడనని నీకు తెలుసునన్నమాట. నేను ఇవ్వని
వాటిని లాక్కుంటానన్నమాట. విత్తనం వేయకుండా
ఫలం పొందుతానన్న మాట. 23అలాంటప్పుడు నా
డబ్బు వడ్డీకి ఎందుకు యివ్వలేదు? అలా చేసివుంటే
నేను తిరిగి వచ్చినప్పుడు నా డబ్బు వడ్డీతో సహా
నాకు లభించేది కదా!' అని అన్నాడు. 24ఆ తర్వాత
అక్కడ నిలుచున్న వాళ్ళతో 'వాని నుండి ఆ మీనా
తీసుకొని పదిమీనాలున్న వానికి ఇవ్వండి!' అని
అన్నాడు. 25'అయ్యా! అతని దగ్గర పదిమీనాలున్నాయి
కదా!' అని వాళ్ళు అన్నారు. 26అతడు 'వున్నవానికి
యింకా ఎక్కువ ఇవ్వబడుతుంది. ఏమీలేని వాని నుండి
అతని దగ్గర ఉన్నవి కూడా తీసివేయబడతాయి. 27ఇక
నేను తమ రాజుగా ఉండటానికి నిరాకరించిన శత్రువుల్ని
పిలుచుకు వచ్చి నా ముందు చంపండి' అని అన్నాడు."

## మహా రాజులా ప్రవేశించటం

(*మత్తయి 21:1-11; మార్కు 11:1-11;*
*యోహాను 12:12-19*)

28యేసు ఈ ఉపమానం చెప్పి యెరూషలేము
వైపు ప్రయాణం సాగించాడు. 29-30వాళ్ళు ఒలీవల
కొండ దగ్గర ఉన్న బేత్పగే, బేతనియ గ్రామాలను
చేరుకొన్నాక యేసు తన శిష్యుల్లో యిద్దరిని
పంపుతూ, "ముందున్న గ్రామానికి వెళ్ళండి. మీరా
గ్రామాన్ని ప్రవేశించగానే స్థంభానికి కట్టబడిన ఒక గాడిద
పిల్ల కనబడుతుంది. దాని మీద యిదివరకు ఎవ్వరూ
ఎక్కలేదు. దాన్ని విప్పి యిక్కడకు తీసుకొని రండి.
31ఎవరైనా 'ఎందుకు విప్పుతున్నారు?' అని అడిగితే
ఇది ప్రభువుకు కావాలని చెప్పండి" అని అన్నాడు.
32వాళ్ళు వెళ్ళి ఆయన చెప్పిన విధంగా గాడిద
స్థంభానికి కట్టబడి ఉండటం చూసారు. 33వాళ్ళు దాన్ని

విప్పుతుండగా దాని యజమానులు వచ్చి, “గాడిదను
ఎందుకు విప్పుతున్నారు?” అని అడిగారు.
34ఇది “ప్రభువుకు కావాలి” అని వాళ్ళు సమాధానం
చెప్పారు. 35వాళ్ళు దాన్ని యేసు దగ్గరకు తీసుకు
వచ్చి తమ వస్త్రాల్ని దానిపై పరిచి, దాని మీద యేసును
ఎక్కించారు. 36ఆయన వెళ్తుండగా ప్రజలు తమ
వస్త్రాల్ని దారి మీద పరిచారు.
37ఆయన ఒలీవల కొండమీద నుండి క్రిందికి దిగే
స్థలాన్ని చేరుకున్నాడు. శిష్యుల గుంపంతా తాము
మహత్యాలు చూసినందుకు ఆనందంతో బిగ్గరగా
యిలా దేవుణ్ణి స్తుతించటం మొదలు పెట్టారు:

38“ప్రభువు పేరిట రానున్న రాజు ధన్యుడు!
*కీర్తన 118:26*
పరలోకంలో శాంతి! మహోన్నత
స్థలాల్లో దేవునికి మహిమ!”

39గుంపులో ఉన్న కొందరు పరిసయ్యులు
యేసుతో, “బోధకుడా! మీ శిష్యుల్ని అదుపులో
పెట్టుకో!” అని అన్నారు. 40యేసు, “వాళ్ళు గొంతెత్తి
మాట్లాడటం ఆపితే, రాళ్ళు గొంతెత్తి మాట్లాడటం
మొదలు పెడతాయి” అని సమాధానం చెప్పాడు.
41-42ఆయన యెరూషలేము సమీపిస్తూ ఆ
పట్టణాన్ని చూసి ఈ విధంగా విలపించసాగాడు:
“శాంతిని స్థాపించటానికి ఏమి కావాలో నీకు ఈ రోజైనా
తెలిసుంటే బాగుండేది. కాని అది నీకిప్పుడు అర్థం
కాదు. 43నీ శత్రువులు నీ చుట్టూ గోడకట్టి నాలుగు
వైపులనుండి ముట్టడి చేసే రోజులు రానున్నాయి.
44వాళ్ళు నిన్ను, నీ ప్రజల్ని నేల మట్టం చేస్తారు.
దేవుని రాకను నీవు గమనించలేదు. కనుక వాళ్ళు ఒక
రాయి మీద యింకొక రాయి ఉండకుండా చేస్తారు”
అని అన్నాడు.
45ఆ తర్వాత ఆయన మందిరంలోకి ప్రవేశించి
అక్కడ అమ్ముతున్న వ్యాపారస్తుల్ని తరిమి వేయటం
మొదలు పెట్టాడు. 46వాళ్ళతో, “నా ఆలయం ప్రార్థనా
ఆలయం.* కాని మీరు దాన్ని దొంగలు దాగుకొనే
స్థలంగా మార్చారు!”* అని చెప్పబడిందని అన్నాడు.
47ఆయన ప్రతి రోజు మందిరంలో బోధిస్తూ
ఉండేవాడు. ప్రధానయాజకులు, శాస్త్రులు, ప్రజా
నాయకులు ఆయన్ని చంపాలని ప్రయత్నిస్తూ
ఉన్నారు. 48కాని ప్రజలు యేసు మాటలు శ్రద్ధతో
వింటూ ఉండటం వల్ల ఆయన్ని ఏ విధంగా చంపాలో
వాళ్ళకు బోధపడలేదు.

### యూదుల నాయకులు యేసును ప్రశ్నించుట
(*మత్తయి 21:23-27; మార్కు 11:27-33*)

20 ఒక రోజు మందిరంలో యేసు ప్రజలకు
బోధిస్తూ, సువార్త ప్రకటిస్తూ ఉన్నాడు.
అప్పుడు ప్రధానయాజకులు, శాస్త్రులు, పెద్దలు అంతా
కలిసి ఆయన దగ్గరకు వచ్చారు. 2“ఎవరిచ్చిన
అధికారంతో నీవు ఇవన్నీ చేస్తున్నావు? నీకీ అధికారం
ఎవరిచ్చారు? చెప్పు” అని వాళ్ళు అడిగారు.
3ఆయన, “నన్నొక ప్రశ్న అడుగనివ్వండి.
4యోహానుకు బాప్తిస్మము నిచ్చే అధికారం ఎవ
రిచ్చారు? దేవుడా? లేక ప్రజలా” అని అన్నాడు.
5వాళ్ళు పరస్పరం ఈ విధంగా చర్చించు కున్నారు:
“దేవుడంటే, అతడు ‘మరి మీరు యోహానును ఎందుకు
నమ్మలేదు?’ అని అంటాడు 6ప్రజలంటే, ‘ప్రజలు
యోహానును ఒక ప్రవక్త అని విశ్వసిస్తూ ఉండేవాళ్ళు
కనుక వాళ్ళు మనల్ని రాళ్ళతో కొడ తారు.’ 7అందువల్ల
ఆ అధికారం ఎక్కడినుండి వచ్చిందో మాకు తెలి
యదు” అని సమాధానం చెప్పారు.
8యేసు, “మరి అలాగైతే నేను కూడా ఎవరి అధికా
రంతో యివన్నీ చేస్తున్నానో చెప్పను” అని అన్నాడు.

### రైతుల ఉపమానం
(*మత్తయి 21:33-46; మార్కు 12:1-12*)

9ఆ తర్వాత ప్రజలకు ఈ ఉపమానం చెప్పటం
మొదలుపెట్టాడు: “ఒకడు ఒక ద్రాక్షాతోట వేసి
రైతులకు కౌలుకిచ్చి చాలాకాలం దేశాంతరం వెళ్ళి
పొయ్యాడు. 10పండ్లు కోసే సమయానికి తన పాలు
వసూలుచేసుకురమ్మని సేవకుణ్ణి పంపాడు. ఆ
రైతులు అతణ్ణి కొట్టి వట్టి చేతుల్తో పంపారు. 11ఆ
ఆసామి మరొక సేవకుణ్ణి పంపాడు. ఆ రైతులు అతణ్ణి
కూడా బాగా కొట్టి అవమానించి వట్టిచేతుల్తో పంపారు.
12అతడు మూడవ వాణ్ణి పంపాడు. వాళ్ళతణ్ణి తీవ్రంగా
గాయపరచి తరిమి వేసారు. 13ఆ ద్రాక్షాతోట యజ
మాని ‘నేనేం చెయ్యాలి? ఆ! నా ముద్దుల కొడుకుని
పంపుతాను. బహుశా వాళ్ళతణ్ణి గౌరవించ వచ్చు’ అని
అనుకున్నాడు. 14కాని రైతులు అతని కుమారుణ్ణి
చూసి, తమలో ‘ఇతడు వారసుడు కనుక యితణ్ణి
చంపేద్దాం. అప్పుడు ఈ తోట మనకే ఉంటుంది’
అని నిశ్చయించుకొన్నారు. 15అతణ్ణి ద్రాక్షాతోట
నుండి బైటకు తరిమి చంపివేసారు.
“ఆ ద్రాక్షాతోట ఆసామి వాళ్ళనేమి చేస్తాడు?
16వచ్చి ఆ రైతుల్ని చంపేసి ఆ ద్రాక్షతోట యింకొ
కరికి కౌలుకు యిస్తాడు” అని అన్నాడు.
ప్రజలు యిది విని, “అలా ఎన్నటికి జరుగ
కూడదు” అని అన్నారు. 17యేసు వాళ్ళవైపు సూటిగా
చూసి మరి అలాగైతే లేఖనాల్లో వ్రాయబడిన ఈ
వాక్యానికి అర్థమేమిటి:

---

**నా … ఆలయం** యెషయా 56:7.

**కాని … మార్చారు!** యిర్మీయా 7:11.

‘పనికి రానిదని ఇళ్ళుకట్టేవాళ్ళు పారవేసిన
రాయి ముఖ్యమైన రాయి అయింది?’
*కీర్తన 118:22*

18ఆ రాయిమీద ఎవరు పడతారో వాళ్ళు ముక్కలై
పోతారు. ఆ రాయి ఎవరి మీద పడుతుందో వాళ్ళు
నలిగి పోతారు” అని అన్నాడు.
19శాస్త్రులు, ప్రధానయాజకులు ఈ ఉపమానం
తమను ఉద్దేశించి చెప్పిందని గ్రహించి ఆయన్ని బంధిం
చటానికి వెంటనే ప్రయత్నించారు. కాని ప్రజల్ని చూసి
భయపడి పోయారు.

## చక్రవర్తికి పన్నులు చెల్లించటం

(*మత్తయి 22:15-22; మార్కు 12:13-17*)

20వాళ్ళు సరియైన అవకాశం కోసం ఎదురు
చూడసాగారు. కనుక వాళ్ళు తమ వాళ్ళను కొందర్ని
రహస్యంగా ఆయన దగ్గరకు పంపారు. వాళ్ళు మంచి
వాళ్ళుగా నటిస్తూ యేసు చెప్పిన విషయాల్లో ఏదైనా
తప్పు పట్టి ఆయన్ని ఆ ప్రాంతం యొక్క రాజ్యాధి
కారికి అప్పగించటానికి ప్రయత్నించసాగారు. ఆ రాజ్యా
ధికారికి శిక్షించటానికి అధికారం ఉంది. 21ఒక రోజు
వాళ్ళు యేసుతో, “బోధకుడా! మీరు సత్యం మాట్లా
డుతారు. సత్యం బోధిస్తారు. పక్షపాతం చూపరు. దేవుని
మార్గాన్ని ఉన్నది ఉన్నట్లు బోధిస్తారని మాకు తెలుసు.
22మరి మేము చక్రవర్తికి పన్నులు కట్టాలా వద్దా?”
అని అడిగారు. 23వాళ్ళ పన్నాగం గమనించి 24యేసు,
“ఒక దేనారా చూపండి. దాని మీద ఎవరి బొమ్మవుంది?
ఎవరి పేరు ఉంది” అని అడిగాడు.
“చక్రవర్తిది” అని వాళ్ళుసమాధానం చెప్పారు.
25ఆయన అలాగైతే, “చక్రవర్తికి చెందింది చక్రవ
ర్తికి యివ్వండి. దేవునికి చెందింది దేవునికి యివ్వండి”
అని అన్నాడు.
26ఆయన అక్కడ ప్రజల సమక్షంలో చెప్పిన ఈ
సమాధానంలో వాళ్ళు ఏ తప్పూ పట్టలేకపోయారు.
పైగా వాళ్ళాయన సమాధానానికి ఆశ్చర్యపడి మౌనం
వహించారు.

## బ్రతికి రావటం

(*మత్తయి 22:23-33; మార్కు 12:18-27*)

27చనిపోయ్యాక మళ్ళీ బ్రతికిరారని వాదించే సద్దూ
కయ్యుల తెగకు చెందిన కొందరు యేసు దగ్గరకు
వచ్చి ఈ విధంగా ప్రశ్నించారు: 28“బోధకుడా! మోషే
‘ఒక వ్యక్తి సంతానం లేకుండా మరణిస్తే అతని సోదరుడు
ఆ చనిపోయిన వానికి సంతానం కలుగ చేయటానికి
అతని భార్యను వివాహం చేసుకోవాలి’ అని వ్రాశాడు.
29ఒకప్పుడు ఏడుగురు సోదరులుండే వారు. మొదటి
వాడు పెళ్ళి చేసుకొని సంతానం లేకుండా మరణిం
చాడు. 30రెండవవాడు ఆమెను పెళ్ళి చేసుకొని మరణిం
చాడు. 31మూడవవాడును ఆమెను పెళ్ళి చేసుకొ
న్నాడు. అదేవిధంగా ఆ ఏడుగురు సోదరులు సంతానం
లేకుండా మరణించారు. 32చివరకు ఆమెకూడా మర
ణించింది. 33మరణించిన వాళ్ళందరూ బ్రతికి వచ్చిన
ప్పుడు ఆమెను ఆ ఏడుగురూ పెళ్ళి చేసుకొంటారు
గనుక ఆమె ఎవరి భార్య అవుతుంది?” అని అడిగారు.
34యేసు, “ఈ భూమ్మీద వాళ్ళు పెళ్ళిళ్ళు చేస్తారు.
చేసుకొంటారు. 35పరలోకమునకు పునరుత్థానమగు
టకు అర్హత ఉన్నవాళ్ళు అనంత జీవితం పొంది
రానున్న కాలంలో జీవిస్తారు. అప్పుడు వాళ్ళు పెళ్ళిళ్ళు
చేసుకోరు, చెయ్యరు. 36వాళ్ళు దేవదూతల వలె,
దేవుని కుమారులవలె ఉంటారు. కనుక వారిక చావరు.
వాళ్ళు మరణాన్ని జయించి బ్రతికి వచ్చిన వాళ్ళు
కనుక దేవుని సంతానంగా పరిగణింపబడతారు.
37మండుచున్న పొదను గురించి వ్రాస్తూ, ‘ప్రజలు
చావునుండి బ్రతికింపబడతారు’ అని మోషే సూచిం
చాడు. ఎందుకంటే, అతడు ప్రభువును గురించి ప్రస్తా
విస్తూ ‘ప్రభువు అబ్రాహాముకు, ఇస్సాకుకు, యాకో
బుకు దేవుడు’ * అని వ్రాసాడు. 38ప్రభువు చనిపోయిన
వాళ్ళకు దేవుడు కాదు. ఆయన సజీవంగా ఉన్నవాళ్ళకే
దేవుడు. ఆయన అందర్ని జీవిస్తున్న వాళ్ళుగా పరి
గణిస్తాడు” అని అన్నాడు.
39కొందరు శాస్త్రులు, “బోధకుడా! చక్కగా
చెప్పారు” అని అన్నారు. 40ఆ తదుపరి ఆయన్ని
ప్రశ్నించటానికి ఎవరికీ ధైర్యం చాలలేదు.

## క్రీస్తు దావీదు కుమారుడా?

(*మత్తయి 22:41-46; మార్కు 12:35-37*)

41ఆ తర్వాత యేసు వాళ్ళతో, “క్రీస్తు దావీదు
కుమారుడని వాళ్ళు ఎందుకు అంటున్నారు?
42-43దావీదు, తన కీర్తనలో ఈ విధంగా వ్రాశాడు
కదా!

‘ప్రభువు నా ప్రభువుతో: నేను నీ శత్రువుల్ని
నీ పాదపీఠంగా చేసేవరకూ నా కుడి
వైపు కూర్చో’
*కీర్తన 110:1*

44దావీదు ఆయన్ని ‘ప్రభూ!’ అని అన్నాడు కదా!
అలాంటప్పుడు ఆయన దావీదు కుమారుడెట్లా
ఔతాడు?” అని అన్నాడు.

---

**‘ప్రభువు ... దేవుడు’** నిర్గమ. 3:6.

### శాస్త్రుల్ని విమర్శించటం

(*మత్తయి 23:1-36; మార్కు 12:38-40;
లూకా 11:37-54*)

45ప్రజలు యేసు చెబుతున్న విషయాలు వింటూ
అక్కడే ఉన్నారు. ఆయన తన శిష్యులకు ఈ విధంగా
చెప్పాడు: 46“శాస్త్రుల విషయంలో జాగ్రత్తగా ఉండండి.
నిండుగా అంగీలువేసుకొని తిరగాలి అంటే వారికి చాలా
యిష్టం. సంతలో నడుస్తున్నప్పుడు ప్రజలు దండాలు
పెడితే సంతసిస్తారు. విందుకు వెళ్ళినప్పుడు, సమాజ
మందిరానికి వెళ్ళినప్పుడు ముఖ్యమైన స్థానాల్లో
కూర్చోవటానికి ప్రాకులాడుతారు. 47వితంతువుల్ని
మోసం చేసి వాళ్ళ ఇళ్ళు దోచుకుంటారు. కాని పైకి
మాత్రం చాలాసేపు ప్రార్థనలు చేస్తూవుంటారు.
అలాంటి వాళ్ళను దేవుడు తీవ్రంగా శిక్షిస్తాడు.”

### విధవరాలు ఇచ్చిన కానుక

(*మార్కు 12:41-44*)

21 యేసు చుట్టూ చూసాడు. ధనవంతులు
హుండీలో కానుకలు వేయటం ఆయన గమ
నించాడు. 2అతి పేదరాలైన ఒక వితంతువు రెండు
పైసాలు హుండీలో వెయ్యటం కూడా ఆయన గమ
నించాడు. 3ఆయన, “నేను చెప్పేదేమిటంటే ఈ బీద
వితంతువు అందరికన్నా ఎక్కువ ఆ హుండీలో వేసింది.
4యితర్లు తమ దగ్గరున్న సంపద నుండి కొంత
మాత్రమే కానుకగా వేసారు. కాని ఆమె తాను జీవించ
టానికి దాచుకొన్నదంతా ఆ హుండీలో వేసింది” అని
అన్నాడు.

### మందిరం నాశనమౌతుందని యేసు చెప్పటం

(*మత్తయి 24:1-14; మార్కు 13:1-13*)

5ఆయన శిష్యుల్లో కొందరు ఆ మందిరానికి చెక్క
బడిన రాళ్ళ అందాన్ని గురించి, ప్రజలు యిచ్చిన
కానుకలతో చేసిన అలంకరణను గురించి మాట్లాడు
కొంటూ ఉన్నారు.
6కాని యేసు, “మీరిక్కడ చూస్తున్నవన్నీ రాయి
మీద రాయి నిలువకుండా నేలమట్టమై పొయ్యే
సమయం వస్తుంది” అని అన్నాడు.
7వాళ్ళు, “అయ్యా! యివి ఎప్పుడు సంభవిస్తాయి!
ఇవి జరుగబోయేముందు ఎలాంటి సూచనలు
కనిపిస్తాయి” అని అడిగారు.
8ఆయన, “జాగ్రత్త! మోసపోకండి. నా పేరిట
అనేకులు వచ్చి, ‘నేనే ఆయన్ని అని, కాలం సమీపిం
చింది’ అని అంటారు. వాళ్ళను అనుసరించకండి.
9యుద్ధాల్ని గురించి, తిరుగుబాట్లను గురించి వింటే
భయపడకండి. ఇవన్నీ ముందు జరిగి తీరవలసిందే.
కాని అంతం అప్పుడే రాదు” అన్నాడు.
10ఆ తర్వాత ఆయన వాళ్ళతో, “దేశం దేశంతో,
రాజ్యం రాజ్యంతో యుద్ధం చేస్తుంది. 11అన్నిచోట్లా
తీవ్రమైన భూకంపాలు, కరువులు, రోగాలు సంభవి
స్తాయి. ఎన్నో భయంకరమైన సంఘటనలు జరుగు
తాయి. ఆకాశంలో భయంకర గుర్తులు కనిపిస్తాయి.
12“కాని యివన్నీ జరుగక ముందే యూదులు
మిమ్మల్ని బంధించి, హింసించి సమాజమందిరాలకు
అప్పగిస్తారు. ఆ సమాజ మందిరాల అధికారులు
మిమ్మల్ని కారాగారంలో పడవేస్తారు. రాజుల ముందు,
రాజ్యాధికారుల ముందు నిలబెడతారు. ఇవన్నీ నాపేరు
కారణంగా జరుగుతాయి. 13తద్వారా వాళ్ళకు
సువార్తను గురించి చెప్పే అవకాశం మీకు కలుగుతుంది.
14వాళ్ళ సమక్షంలో మిమ్మల్ని మీరు సమర్థించు
కోవటానికి సిద్ధం కారాదని మీ మనస్సులో నిర్ణయించు
కోండి. 15ఎందుకంటే సరియైన సమయానికి మాట్లాడ
టానికి అవసరమైన పదాన్ని నేను మీకు అందిస్తాను.
కావలసిన జ్ఞానం యిస్తాను. మీ ప్రతివాదులు మీ
మాటల్ని ఖండించకుండా ఉండేటట్లు చేస్తాను.
వాళ్ళలో తిరిగి వాదించే శక్తి లేకుండా చేస్తాను. 16మీ
తల్లి తండ్రులు, సోదరులు, బంధువులు, మిత్రులు
మీకు ద్రోహం చేస్తారు. మీలో కొందర్ని చంపి వేస్తారు.
17నా కారణంగా ప్రజలందరూ మిమ్మల్ని ఏవగించు
కొంటారు. 18కాని మీ తల మీదనున్న ఒక్కవెంట్రుక
కూడా రాలిపోదు. 19సహనంతో ఉండండి. అప్పుడే
మిమ్మల్ని మీరు వీటన్నిటియందు విశ్వాసం ద్వారా
రక్షించుకో గలుగుతారు.

### యేసు యెరూషలేము నాశనమౌతుందని చెప్పటం

(*మత్తయి 24:15-21; మార్కు 13:14-19*)

20“యెరూషలేము చుట్టూ సైన్యాలు చూసి
నప్పుడు అది నాశనమయ్యే రోజులు వచ్చాయని
గ్రహించండి. 21అప్పుడు యూదయలో ఉన్న మీరు
పరుగెత్తి కొండల మీదికి వెళ్ళండి. పట్టణంలో ఉన్న
వాళ్ళు అక్కడి నుండి వెళ్ళిపొండి. గ్రామాల్లో ఉన్న
వాళ్ళు పట్టణాల్లోకి వెళ్ళకండి. 22ఇది శిక్షా సమయం.
ఇదివరకు లేఖనాల్లో వ్రాసినవన్నీ నిజంకానున్న
సమయం. 23ఆ రోజుల్లో గర్భిణీ స్త్రీలకు, పురిటి
స్త్రీలకు ఎంత కష్టం కలుగుతుందో కదా! ఈ దేశానికి
పెద్ద దుఃఖంకలుగనున్నది. దేవుడు తన కోపాన్ని ఈ
దేశంపై చూపనున్నాడు. 24కొందరు కత్తికి బలి
అవుతారు. మరి కొందరు ఖైదీలుగా యితర దేశాలకు
తీసుకు వెళ్ళబడతారు. యూదులుకాని వాళ్ళ కాలం
ముగిసేదాకా వాళ్ళు యెరూషలేమును అణగద్రొక్కి
ఉంచుతారు.
25“సూర్యునిలో, చంద్రునిలో, నక్షత్రాల్లో సూచ
నలు కన్పిస్తాయి. సముద్రాల రోదనకు, తీవ్రమైన
అలలకు దేశాలు భయపడి కలవరం చెందుతాయి.

26రానున్న ఘోరాన్ని తలంచుకొని ప్రజలు భయంతో
మూర్ఛపోతారు. ఆకాశపు జ్యోతులు గతి తప్పుతాయి.
27అప్పుడు శక్తితో, గొప్ప తేజస్సుతో మేఘం మీద
మనుష్యకుమారుడు రావటం వాళ్ళు చూస్తారు. 28ఇవి
జరగటం మొదలైనప్పుడు లేచి మీ తలలెత్తి చూడండి.
అంటే మీకు రక్షణ దగ్గరకు వచ్చిందని అర్థం" అని
అన్నాడు.

## చెట్ల ఉపమానం

(*మత్తయి 24:32-35; మార్కు 13:28-31*)

29ఆయన వాళ్ళకు ఈ ఉపమానం చెప్పాడు: "ఆ
అంజూరపు చెట్టును చూడండి. అంతెందుకు;
చెట్లన్నిటిని చూడండి. 30చెట్టు చిగురు వేయగానే
ఎండాకాలం దగ్గరకు వచ్చిందని గ్రహిస్తారు 31అదే
విధంగా ఈ సంఘటనలు జరగటం చూసి నప్పుడు
దేవుని రాజ్యం దగ్గరకు వచ్చిందని గ్రహించండి.
32"ఇది నిజం. ఇవన్నీ సంభవించేవరకు ఈ
తరంవాళ్ళు గతించరు. 33ఆకాశం, భూమి గతించి
పోవచ్చుకాని నామాటలు చిరకాలం నిలిచి పోతాయి.

## అన్ని వేళలా సిద్ధంగా ఉండండి

34"జాగ్రత్త! విందులు, వినోదాలు చేసుకొంటూ
త్రాగుబోతులై జీవించకండి. ప్రాపంచిక విషయాల్లో
మునిగిపోకండి. అలా చేస్తే మీ బుద్ధి పని చెయ్యటం
మానేస్తుంది. అప్పుడు ఆ దినం మీరు సిద్ధంగా లేన
ప్పుడు వచ్చి మీ మీద పడుతుంది. 35అది ప్రపంచం
మీదికంతా వస్తుంది. 36అన్ని వేళలా జాగ్రత్తగా ఉండండి.
ఈ దుర్ఘటనలనుండి తప్పించుకొనే శక్తి, మనుష్య
కుమారుని సమక్షంలో నిలబడగలిగే శక్తి కలగాలని
ప్రార్థించండి"
37యేసు ప్రతి రోజు మందిరంలో బోధిస్తూ
ఉండేవాడు. ప్రతిరాత్రి ఒలీవలకొండ మీదికి వెళ్ళి గడిపే
వాడు. 38ప్రజలందరు ఆయన బోధనలు వినాలని
తెల్లవారుఝామునే మందిరానికి వెళ్ళేవాళ్ళు.

## యేసును చంపటానికి కుట్ర

(*మత్తయి 26:1-5, 14-16; మార్కు 14:1-2, 10-11;*
*యోహాను 11:45-53*)

22 పులవకుండా రొట్టెలు చేసే పండుగ దగ్గరకు
వచ్చింది. దాన్ని "పస్కా" అనే వాళ్ళు.
2ప్రజల్లో ఉన్న విశ్వాసం చూసి ప్రధాన యాజకులు,
శాస్త్రులు భయపడి పోయారు. వాళ్ళు ఏదో ఒక విధంగా
యేసును చంపాలని ప్రయత్నం చేయసాగారు.
3పన్నెండు మందిలో ఒకడైన ఇస్కరియోతు
అనబడే యూదాలో సాతాను ప్రవేశించాడు. 4యూదా
ప్రధానయాజకులను, ముఖ్య ద్వార పాలకుల్ని కలుసు
కొని తాను ఏవిధంగా యేసును వాళ్ళకప్ప గించగలడో
చర్చించాడు. 5యూదా చెప్పింది విని ప్రధాన
యాజకులు ఆనందించారు. యేసును అప్పగిస్తే
అతనికి కొంత డబ్బు యిస్తామని వాళ్ళు చెప్పారు.
6అతడు దానికి అంగీకరించి ప్రజలు లేనప్పుడు
యేసును వాళ్ళకప్పగించాలనుకొని మంచి సమయం
కోసం ఎదురు చూడసాగాడు.

## చివరి భోజనం

(*మత్తయి 26:17-25; మార్కు 14:12-21;*
*యోహాను 13:21-30*)

7పులవకుండా రొట్టెలు చేసే పండుగ వచ్చింది.
ఆ రోజు పస్కా గొర్రె పిల్లను బలి ఇచ్చే వాళ్ళు.
8యేసు పేతురు, యోహానులతో, "వెళ్ళి పస్కా
పండుగ భోజనం సిద్ధం చెయ్యండి" అని చెప్పాడు.
9వాళ్ళు, "ఎక్కడ సిద్ధం చెయ్యమంటారు?" అని
అడిగారు. 10ఆయన, "మీరు పట్టణంలోకి ప్రవేశిస్తుంటే
నీళ్ళ కడవ ఎత్తుకొని వెళ్తున్న వాడొకడు కనిపిస్తాడు.
అతణ్ణి అనుసరించి అతడు ఏ యింట్లోకి వెళ్తాడో ఆ
యింట్లోకి వెళ్ళండి. 11ఆయింటి యజమానితో, 'మా
బోధకుడు తన శిష్యులతో కలిసి పస్కా భోజనం
చెయ్యాలి. కనుక అతిథులుండే గది ఎక్కడుందో
మాకు చూపండి' అని అతనితో అనండి. 12అతడు
మీకు మేడ మీద ఉన్న ఒక విశాలమైన గది చూపిస్తాడు.
ఆ గదిలో అన్ని సౌకర్యాలు ఉంటాయి. పస్కా భోజనం
అక్కడ తయారు చెయ్యండి."
13వాళ్ళు వెళ్ళి, అన్నీ యేసు చెప్పిన విధంగా
ఉండటం గమనించారు. అక్కడ వాళ్ళు పస్కా పండుగ
భోజనం తయారు చేసారు.
14భోజనం చేసే సమయం దగ్గరకు వచ్చింది.
యేసు, ఆయన అపొస్తలులు భోజనానికి కూర్చు
న్నారు. 15ఆయన వాళ్ళతో, "నేను చనిపోకముందే
మీతో కలిసి ఈ పస్కా భోజనము చెయ్యాలని ఎంతో
ఆశ పడ్డాను. 16ఎందుకంటే దేవుని రాజ్యంలో ఈ
పస్కా భోజనమునకు ఉన్న నిజమైన అర్థం నెరవేరు
తుంది. అంతదాకా ఈ భోజనం మళ్ళీ చెయ్యను"
అని అన్నాడు. 17ఆయన గిన్నె తీసుకొని దేవునికి
కృతజ్ఞతలు చెప్పి, "ఇది తీసుకొని మీ మధ్య
పంచుకొండి. 18ఎందు కంటే దేవుని రాజ్యం
వచ్చేవరకు నేను ద్రాక్షతో చేసిన ఈ పానీయం మళ్ళీ
త్రాగనని మీతో చెబుతున్నాను" అని అన్నాడు.
19ఆ తర్వాత ఒక రొట్టె తీసుకొని దేవునికి కృతజ్ఞ
తలు చెప్పి దాన్ని త్రుంచి వాళ్ళకిస్తూ, "ఇది నా
శరీరం. మీకోసం యివ్వబడింది. నా జ్ఞాపకార్థం యిది
చెయ్యండి" అని అన్నాడు. 20అదే విధంగా భోజనం
అయ్యాక ఆయన గిన్నె తీసుకొని, "ఇది నా రక్తంతో
చేసిన క్రొత్త నిబంధన. నేను ఈ రక్తాన్ని మీకోసం
చిందిస్తున్నాను."

21“నాకు ద్రోహం చేయబోతున్నవాడు నాతో
యిక్కడ భోజనానికి కూర్చొని ఉన్నాడు. 22దేవుడు
నిర్ణయించినట్లు మనుష్యకుమారుడు మరణించ బోతు
న్నాడు. ఆయనకు ద్రోహం చేసిన వానికి శిక్ష తప్పదు”
అని అన్నాడు.
23వాళ్ళు తమలో, “ఎవరీపని చేస్తారా?” అని
పరస్పరం ప్రశ్నించుకొన్నారు.

## ఎవరు గొప్ప

24ఆ తర్వాత వాళ్ళలో ‘ఎవరుగొప్ప’ అన్న విష
యంపై వాదన మొదలైంది. 25యేసు వాళ్ళతో,
“యూదులుకాని వాళ్ళను వాళ్ళ రాజులు క్రూరంగా
పాలిస్తారు. అధికారంలో ఉన్నవాళ్ళు తమను పొగడమని
ప్రజల్ని ఒత్తిడి చేస్తారు. 26కాని మీరు అలా ఉండ
కూడదు. మీలో అందరికన్నా గొప్పవాడు అందరికన్నా
చిన్నవానిలా మెలగాలి. నాయకుడు సేవకునిలా
ఉండాలి. 27ఎవరు గొప్ప? భోజనానికి కూర్చొన్నవాడా
లేక భోజనం వడ్డించేవాడా? భోజనానికి కూర్చొన్న
వాడేకదా! కాని నేను మీ సేవకునిలా ఉంటున్నాను.
28“మీరు నా కష్టసమయాల్లో నా వెంట ఉన్న
వాళ్ళు. 29కనుక నా తండ్రి నాకు రాజ్యాన్ని అప్పగించి
నట్లు నేను మీకు రాజ్యాన్ని అప్పగిస్తాను. 30అప్పుడు
మీరు నా రాజ్యంలో నాతో కలిసి కూర్చొని తింటారు.
సింహాసనాలపై కూర్చుని పండ్రెండు వంశాల వారిపై
తీర్పు చేస్తారు.

## పేతురు తనను నిరాకరిస్తాడని యేసు చెప్పటం

(*మత్తయి 26:31-35; మార్కు 14:27-31;
యోహాను 13:36-38*)

31“సీమోనూ! సీమోనూ! మిమ్మల్ని గోధుమలు
చెరిగినట్లు చెరిగి పరీక్షించటానికి సైతాను అనుమతి
పొందాడు. 32కాని సీమోనూ! నీలో ఉన్న విశ్వాసం
సన్నగిల్ల రాదని నేను ప్రార్థించాను. నీ విశ్వాసం మళ్ళీ
బలపడినప్పుడు నీ సోదరుల విశ్వాసాన్ని గట్టి పరుచు”
అని అన్నాడు.
33కాని సీమోను, “ప్రభూ! మీ వెంట కారాగారానికి
రమ్మన్నా, చనిపొమ్మన్నా సిద్ధమే!” అని సమాధానం
చెప్పాడు.
34యేసు, “పేతురూ! నేను చెప్పేది విను. ఈ
రోజు కోడి కూయక ముందే నేనెవరినో నీకు తెలియ
దని మూడు సార్లంటావు” అని అన్నాడు.

## రానున్న కష్టాలు

35ఆ తర్వాత యేసు, “నేను మిమ్మల్ని డబ్బు
దాచుకొనే సంచీ, చేతి సంచీ, చెప్పుల జోళ్ళూ
లేకుండా పంపినప్పుడు మీ అవసరాలు తీరలేదా?”
అని అడిగాడు.
“తీరాయి” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
36యేసు వాళ్ళతో, “ఇప్పుడు మీ దగ్గర డబ్బులు
దాచుకొనే సంచి ఉంటే దాన్ని మీ వెంట తీసుకెళ్ళండి.
మీ దగ్గర కత్తి లేకుంటే మీ వస్త్రాన్ని అమ్మి కత్తి
కొనండి. 37లేఖనాల్లో

‘అతడు నేరస్థునిగా పరిగణింపబడ్డాడు.’
*యెషయా 53:12*

అని వ్రాయబడి ఉంది. అది నా విషయంలో నిజ
మౌతుంది. ఔను! అది యిప్పుడు నా విషయంలో
నిజమౌతుంది!” అని అన్నాడు.
38శిష్యులు ఆయనతో, “ఇదిగో ప్రభూ! యిక్కడ
రెండు కత్తులున్నాయి” అని అన్నారు.
“ఆ విషయం ఇకచాలించండి” అని ఆయన
అన్నాడు.

## ఒలీవల కొండ మీద ప్రార్థించటం

(*మత్తయి 26:36-46; మార్కు 14:32-42*)

39“అలవాటు ప్రకారం యేసు ఒలీవల కొండ మీదికి
వెళ్ళటానికి బయలుదేరాడు. ఆయన శిష్యులు
ఆయన్ని అనుసరించారు. 40అక్కడికి చేరుకొన్నాక
వాళ్ళతో, మీరు శోధనలో పడకుండ ఉండటానికి
ప్రార్థించాలి” అని అన్నాడు.
41ఆయన వాళ్ళనుండి రాయి విసిరినంత దూరం
వెళ్ళి, మోకరిల్లి ఈ విధంగా ప్రార్థించాడు: 42“తండ్రీ!
నీ కిష్టమైతే ఈ గిన్నె నా నుండి తీసివెయ్యి. కాని
నెరవేరవలసింది నా యిచ్ఛ కాదు; నీది.” 43అప్పుడు
ఒక దేవదూత పరలోకంలోనుండి వచ్చి ఆయనకు
శక్తి నివ్వటానికి ప్రత్యక్షమైనాడు. 44ఆయన ఆవేదనతో
యింకా తీవ్రంగా దేవుణ్ణి ప్రార్థించాడు. నేలమీద
పడ్తున్న ఆయన చెమట చుక్కలు రక్తపు చుక్కల్లా
ఉన్నాయి.*
45ప్రార్థించటం ముగించాక ఆయన తన శిష్యుల
దగ్గరకు వెళ్ళాడు. దుఃఖం వల్ల అలసిపోయి వాళ్ళు
నిద్రిస్తూ ఉన్నారు. 46వాళ్ళతో, “ఎందుకు పడుకు
న్నారు? లేచి మీరు శోధింపబడకూడదని ప్రార్థించండి”
అని అన్నాడు.

## యేసును బంధించటం

(*మత్తయి 26:47-56; మార్కు 14:43-50;
యోహాను 18:3-11*)

47ఆయనింకా మాట్లాడుతుండగా ప్రజల గుంపు
ఒకటి అక్కడికి వచ్చింది. పన్నెండుమందిలో ఒకడైన

---

**వచనము 43,44** కొన్ని ప్రాచీన గ్రీకు ప్రతులలో ఈ వాక్యాలు లేవు.

యూదా అన్నవాడు అందరి కన్నా ముందు ఉన్నాడు.
వాడు యేసును ముద్దు పెట్టుకోవటానికి ఆయన
దగ్గరకు వెళ్ళాడు.
48కాని యేసు వానితో, "యూదా! ముద్దు పెట్టు
కొని దేవుని కుమారునికి ద్రోహం చెయ్యాలని నీ
ఉద్దేశ్యమా?" అని అడిగాడు. 49యేసు శిష్యులు జరుగ
బోయే సంఘటనను గ్రహించారు. వాళ్ళు, "ప్రభూ!
మా కత్తులతో వాళ్ళను నరకమంటారా?" అని అడి
గారు. 50ఇంతలో ఆయన శిష్యుల్లో ఒకడు తన కత్తి
దూసి ప్రధానయాజకుని సేవకుని యొక్క కుడిచెవి
నరికి వేశాడు.
51యేసు, "ఆపండి" అని అంటూ ఆ సేవకుని
చెవి తాకి అతనికి నయం చేశాడు.
52ఆ తర్వాత యేసు తనను బంధించటానికి వచ్చిన
ప్రధానయాజకులతో, మందిరం యొక్క ముఖ్య
ద్వారపాలకులతో, పెద్దలతో ఈ విధంగా అన్నాడు:
"నేనొక దొంగనైనట్లు మీరు కత్తులతో, కర్రలతో
రావలసిన అవసరమేమొచ్చింది? 53నేను మీతో పాటు
ప్రతీరోజు ఆలయంలో ఉన్నాను. కాని మీరు అప్పుడు
నన్ను బంధించలేదు. ఇది మీ ఘడియ. సైతాను
శక్తులు రాజ్యం చేస్తున్న ఘడియ."

### పేతురు యేసు తనకు తెలియదనటం

*(మత్తయి 26:57-58, 69-75; మార్కు 14:53-54, 66-72;
యోహాను 18:12-18, 25-27)*

54యేసును బంధించి ప్రధాన యాజకుని యింటికి
తీసుకొని వెళ్ళారు. పేతురు కొంత దూరంలో ఉండి
వాళ్ళను అనుసరించాడు. 55వాళ్ళు పెరటి మధ్య
చలిమంటలు వేసి చుట్టూరా కూర్చొన్నారు. పేతురు
వచ్చి వాళ్ళతో సహా కూర్చున్నాడు. 56ఒక పనిపిల్ల
ఆ మంటల వెలు తురులో పేతురు అక్కడ కూర్చుని
ఉండటం గమనించింది. దగ్గరకు వచ్చి అతణ్ణి చూస్తూ,
"ఇతడు కూడా యేసుతో ఉన్నాడు" అని అనింది.
57కాని పేతురు అది నిజంకాదంటూ, "ఆయనె
వరో నాకు తెలియదు అమ్మాయి!" అని అన్నాడు.
58కొంత సేపయ్యాక మరొకడు అతణ్ణి చూసి, "నీవు
కూడా వాళ్ళలో ఒకడివి" అని అన్నాడు.
"నేను వాళ్ళలో ఒకణ్ణి కాదు" అని సమాధానం
చెప్పాడు.
59ఒక గంట తర్వాత యింకొకడు, "ఇతడు గలి
లయ దేశస్థుడు. కనుక తప్పక అతనితో ఉన్నవాడే!"
అని అన్నాడు.
60"అయ్యా! మీరేం మాట్లాడుతున్నారో నాకు
తెలియదు" అని పేతురు సమాధానం చెప్పాడు.
అతడీ మాటలంటుండగానే కోడి కూసింది.
61ప్రభువు అటువైపు మళ్ళీ సూటిగా పేతురు వైపు
చూశాడు. అప్పుడు ప్రభువు, "ఈ రోజు కోడి కూయక
ముందే నేనెవరినో తెలియదని మూడుసార్లంటావు"
అని అన్న మాటలు పేతురుకు జ్ఞాపకం వచ్చాయి.
62పేతురు బయటకు వెళ్ళి భోరున ఏడ్చాడు.

### భటులు యేసును హేళన చెయ్యటం

*(మత్తయి 26:67-68; మార్కు 14:65)*

63-64యేసును కాపలా కాస్తున్న వాళ్ళు ఆయన్ని
హేళన చేస్తూ కొట్టటం మొదలు పెట్టారు. ఆయన
కళ్ళకు బట్టకట్టి, "నిన్నెవరు కొట్టారో దివ్యదృష్టితో
చూసి చెప్పు!" అని ఆయన్ని కవ్వించి అడిగారు.
65అవమానిస్తూ ఎన్నెన్నో మాటలు అన్నారు.

### మహాసభ సమక్షంలో యేసు

*(మత్తయి 26:59-66; మార్కు 14:55-64;
యోహాను 18:19-24)*

66సూర్యోదయం కాగానే యూదుల పెద్దలు,
ప్రధానయాజకులు, శాస్త్రులు సమావేశమయ్యారు.
వాళ్ళు యేసును మహాసభ ముందుకు పిలుచుకు
వచ్చారు. 67మహాసభ సభ్యులు, "నీవు క్రీస్తువైనట్లైతే
మాతో చెప్పు" అని అన్నారు.
యేసు, "నేను చెబితే మీరు నమ్మరు. 68నేను
అడిగితే మీరు చెప్పరు. 69కాని యిప్పటినుండి మనుష్య
కుమారుడు సర్వశక్తిసంపన్నుడైన దేవుని యొక్క కుడి
వైపున కూర్చుంటాడు" అని సమాధానం చెప్పాడు.
70వాళ్ళు, "నీవు దేవుని కుమారునివా?" అని
అడిగారు. ఆయన, "మీరన్నది నిజం" అని అన్నాడు.
71ఆ తదుపరి వాళ్ళు, "మనకిక ఇతర సాక్ష్యాలు
ఎందుకు? స్వయంగా అతని నోటినుండే విన్నాము"
అని అన్నారు.

### పిలాతు సమక్షంలో యేసు

*(మత్తయి 27:1-2, 11-14; మార్కు 15:1-5;
యోహాను 18:28-38)*

23 మహాసభ సభ్యులందరూ లేచి యేసును
పిలాతు ముందుకు పిలుచుకు వచ్చి, 2"ఇతడు
మన దేశాన్ని తప్పుదారి పట్టించటం మేము గమనిం
చాము. చక్రవర్తికి పన్నులు కట్టరాదని, తాను క్రీస్తునని,
రాజునని చెప్పుకుంటున్నాడు" అని ఫిర్యాదు చేసారు.
3ఇది విని పిలాతు యేసుతో, "నీవు యూదుల
రాజువా?" అని అడిగాడు.
"ఔను, మీరన్నది నిజం!" అని యేసు సమాధానం
చెప్పాడు.
4ఆ తర్వాత పిలాతు ప్రధాన యాజకులతో,
ప్రజలతో, "ఇతనికి శిక్ష విధించటానికి నాకు ఏ కారణం
కనిపించటం లేదు" అని అన్నాడు.
5కాని వాళ్ళు, "ఇతడు తన బోధనలతో యూదయ
ప్రాంతంలో ఉన్న ప్రజలనందరిని పురికొలుపు

చున్నాడు. ఇది యితడు గలిలయలో ప్రారంభించి
యిక్కడి దాకా వచ్చాడు" అని మళ్ళీ మళ్ళీ అన్నారు.

### హేరోదు సమక్షంలో యేసు

6ఇది విని పిలాతు వాళ్ళను, "అతడు గలిలయ
దేశస్థుడా?" అని అడిగాడు. 7యేసు, హేరోదు పాలి
స్తున్న ప్రాంతానికి చెందినవాడని తెలుసుకొన్న
వెంటనే, పిలాతు ఆయన్ని హేరోదు దగ్గరకు పంపాడు.
అప్పుడు హేరోదు యెరూషలేములో ఉన్నాడు.
8హేరోదుకు చాలాకాలం నుండి యేసును చూడాలని
ఉంది. కనుక ఆయన్ని చూడగానే హేరోదుకు చాలా
ఆనందం కలిగింది. యేసును గురించి విన్నవాటిని
బట్టి ఆయన ఏదైనా మహత్మ్యం చేస్తాడేమోనని
ఆశించాడు. 9అతడు యేసును ఎన్నో ప్రశ్నలు అడి
గాడు. కాని యేసు ఒక్కదానికి కూడా సమాధానం
చెప్పలేదు. 10ప్రధానయాజకులు, శాస్త్రులు యేసుపై
తీవ్రంగా నేరారోపణ చేస్తూ అక్కడే నిలుచొని ఉన్నారు.
11హేరోదు, అతని భటులు యేసును తిరస్కరించి,
హేళన చేస్తూ నవ్వారు. ఆయనకు రాజ దుస్తులు
తొడిగించి తిరిగి పిలాతు దగ్గరకు పంపారు. 12ఆ
రోజు హేరోదు, పిలాతు ఇద్దరూ మిత్రులయ్యారు.
ఆనాటివరకు వాళ్ళు శత్రువులుగా ఉన్నారు.

### మరణదండన విధించటం

*(మత్తయి 27:15-26; మార్కు 15:6-15;*
*యోహాను 18:39-19:16)*

13పిలాతు ప్రధానయాజకుల్ని, పాలకుల్ని,
ప్రజల్ని సమావేశపరిచాడు. 14వాళ్ళతో, "తిరుగు బాటు
చెయ్యటానికి ప్రజల్ని పురికొలుపుతున్నాడని అతణ్ణి
మీరిక్కడికి పిలుచుకు వచ్చారు. మీ సమక్షంలోనే అతణ్ణి
విచారించాము. మీ నేరారోపణలకు నాకు ఏమాత్రం
కారణం కనపడటం లేదు. 15హేరోదుకు కూడా ఏ
తప్పూ కనిపించలేదు. కనుకనే అతణ్ణి తిరిగి మా
దగ్గరకు పంపాడు. మరణ దండన పొందవలసిన నేరం
అతడు చెయ్యలేదని మీరు గమనించారు. 16అందువల్ల
కొన్ని కొరడా దెబ్బలు కొట్టి విడుదల చేస్తాను" అని
అన్నాడు. 17*

18వాళ్ళంతా ఒకే గొంతుతో, "అతణ్ణి చంపండి,
బరబ్బను విడుదల చెయ్యండి" అని కేకలు వేశారు.
19బరబ్బ తాను పట్టణంలో చేసిన యొక తిరుగుబాటు
కారణంగా, హత్య కారణంగా కారాగారంలో ఉన్నాడు.
20యేసును విడుదల చెయ్యాలనే ఉద్దేశ్యంతో పిలాతు
మళ్ళీ విజ్ఞప్తి చేశాడు. 21కాని వాళ్ళు బిగ్గరగా, "అతణ్ణి
సిలువకు వెయ్యండి!" అని కేకలు వేశారు.
22మూడవసారి, పిలాతు వాళ్ళతో ఈ విధంగా
అన్నాడు: "ఎందుకు? అతడేమి నేరం చేశాడు? అతనికి
మరణ దండన విధించటానికి నాకు ఏ కారణం కన్పించ
లేదు. అందువల్ల కొన్ని కొరడా దెబ్బలు కొట్టి విడుదల
చేస్తాను." అని అన్నాడు.
23కాని, అతణ్ణి సిలువకు వెయ్యమని కేకలు
వేయటం వాళ్ళు మానలేదు. చివరకు వాళ్ళు గెలిచారు.
24పిలాతు వాళ్ళడిగినట్లు చెయ్యటానికి ఒప్పు
కున్నాడు. 25తిరుగుబాటు కారణంగా, హత్య కారణంగా
కారాగారంలో ఉన్న వాళ్ళడిగిన బరబ్బను విడుదల
చేసి యేసును వాళ్ళ కప్పగించాడు.

### సిలువకు వెయ్యటం

*(మత్తయి 27:32-44; మార్కు 15:21-32;*
*యోహాను 19:17-27)*

26వాళ్ళు యేసును తీసుకొని వెళ్తూ, గ్రామం నుండి
పట్టణంలోకి వస్తున్న సీమోను అనే వాణ్ణి పట్టుకొని
అతనిపై సిలువను పెట్టి యేసు వెనుక నడిపించారు.
సీమోను కురేనే గ్రామస్థుడు.
27చాలామంది ప్రజలు యేసు వెనుక నడుస్తూ
ఉన్నారు. వాళ్ళలో కొందరు స్త్రీలు కూడా ఉన్నారు.
వాళ్లు గుండెలు బాదుకుంటూ, ఏడుస్తూ యేసు వెనుక
నడిచారు. 28యేసు వాళ్ళవైపు తిరిగి, "యెరూషలేము
బిడ్డలారా! నా కోసం దుఃఖించకండి. మీకోసం, మీ
సంతానం కోసం దుఃఖించండి. 29'గొడ్రాళ్ళుగా ఉన్న
స్త్రీలు ధన్యులని, పిల్లలు కనని కడుపులు, పాలివ్వని
స్తనములు ధన్యములైనవి' అనే రోజులు వస్తాయి.
30అప్పుడు వాళ్ళు పర్వతాలతో తమ మీద పడమని
అంటారు. కొండలతో కూలి తమను కప్పి వేయమని
అడుగుతారు.* 31చెట్టు పచ్చగా ఉన్నప్పుడే ప్రజలు
ఈ విధంగా చేస్తే అది ఎండిపొయ్యాక ఏం చేస్తారు?"
అని అన్నాడు.
32మరణ దండన విధించటానికి, ఇద్దరు నేరస్థుల్ని
కూడా యేసు వెంట తీసుకొని వెళ్తూ ఉన్నారు.
33కల్వరి* అనబడే స్థలాన్ని చేరుకొన్నాక ఆ నేరస్థులు
యిద్దర్నీ ఒకణ్ణి యేసుకు కుడివైపు, మరొకణ్ణి
ఎడమవైపు ఉంచి ముగ్గుర్నీ సిలువకు వేసారు.
34యేసు, "తండ్రీ, వాళ్ళను క్షమించు. వాళ్ళేం చేస్తు
న్నారో వాళ్ళకే తెలియదు" అని అన్నాడు.*

---

**వచనము 17** "కొన్ని గ్రీకు ప్రతులలో 17వ వచనం యిలా చేర్చబడింది: ప్రతి సంవత్సరం పస్కా పండుగ సందర్భంగా ప్రజలకోరికపై ఒక ఖైదీని పిలాతు విడుదల చేయుట ఆనవాయితీ."

**పర్వతాలతో … అడుగుతారు** హోషేయా 10:8.

**కల్వరి** అనగా పుర్రె.

**వచనము 34** కొన్ని ప్రాచీన గ్రీకు ప్రతులలో ఈ పదాలు లేవు.

వాళ్ళు చీట్లు వేసి ఆయన దుస్తుల్ని పంచు
కొన్నారు. 35ప్రజలు జరుగుతున్న వాటిని చూస్తూ
నిలబడి ఉన్నారు. పాలకులు ఎగతాళి చేసారు. వాళ్ళు,
"ఇతర్లను రక్షించాడే! తాను దేవుడెన్నుకొన్న వాడైన
ట్లైతే, తాను 'క్రీస్తు' అయినట్లైతే తనను తాను రక్షించు
కోనీ!" అని అన్నారు.

36భటులు కూడా దగ్గరకు వచ్చి ఆయన్ని హేళన
చేసారు. వాళ్ళు ఆయనకు పులిసిన ద్రాక్షారసం యిస్తూ
37"నీవు యూదుల రాజువైతే నిన్ను నీవు రక్షించుకో!"
అని ఎగతాళి చేసారు.

38"ఇతడు యూదుల రాజు" అని వ్రాసి సిలువకు
తగిలించారు.

39ఆయనతో సహా సిలువకు వేయబడిన ఒక
నేరస్థుడు, "నీవు క్రీస్తువు కదా! నిన్ను రక్షించుకొని
మమ్మల్ని కూడా రక్షించు!" అని అవమాన పరిచాడు.
40కాని మరొక నేరస్థుడు మొదటి వాణ్ణి గద్దిస్తూ,
"నీవు దేవునికి భయపడవా! నీవు కూడా అదే శిక్ష
అనుభవిస్తున్నావు కదా! మనల్ని శిక్షించటం న్యాయమే.
41మనము చేసిన నేరానికి తగిన శిక్ష అనుభవిస్తున్నాము.
కాని ఆయన ఏ అపరాధమూ చెయ్యలేదు" అని
అన్నాడు.

42ఆ తదుపరి ఆయనతో, "యేసూ! నీవు నీ
రాజ్యం చెయ్యటం మొదలు పెట్టినప్పుడు నన్ను
జ్ఞాపకముంచుకో " అని అన్నాడు.

43యేసు, "ఇది నిజం, ఈ రోజు నువ్వు నాతో
సహా పరదైసులో* ఉంటావు" అని సమాధానం
చెప్పాడు.

44-45అప్పుడు మధ్యాహ్నం పండ్రెండు గంటల
సమయం. సూర్యుడు ప్రకాశించటం మానేయటం
వల్ల అప్పటినుండి మూడు గంటలదాకా ఆ దేశమంతా
చీకటితో నిండిపోయింది. మందిరంలో ఉన్న తెర
రెండు భాగాలుగా చినిగి పోయింది.

46యేసు బిగ్గరగా, "తండ్రీ! నా ఆత్మను నీ చేతుల్లో
పెడ్తున్నాను" అని అన్నాడు. వెంటనే తన ప్రాణం
వదిలాడు.

47శతాధిపతి జరిగిందిచూసి దేవుణ్ణి స్తుతిస్తూ,
"ఈయన నిజంగా నీతిమంతుడై ఉన్నాడు!" అని
అన్నాడు.

48ఈ దృశ్యం చూడాలని గుమికూడిన ప్రజలు
జరిగినదాన్ని చూసి తమ గుండెలు బాదుకుంటూ
వెళ్ళిపోయారు. 49కాని ఆయనకు తెలిసిన వాళ్ళు,
గలిలయ నుండి ఆయన్ని అనుసరిస్తూ వచ్చిన స్త్రీలు,
యివన్నీ చూస్తూ కొంతదూరంలో నిలుచొని
ఉన్నారు.

### యేసును సమాధి చెయ్యటం

*(మత్తయి 27:57-61; మార్కు 15:42-47;*
*యోహాను 19:38-42)*

50అరిమతయియ యూదుల గ్రామం. ఆ గ్రామా
నికి చెందిన యోసేపు అనేవాడు అక్కడ ఉన్నాడు.
అతడు మహాసభ సభ్యుడు. 51నీతిమంతుడు, మంచి
వాడు. యోసేపు దేవుని రాజ్యం కొరకు ఎదురు
చూస్తూ ఉన్నాడు. మహాసభ సభ్యులు యేసుకు మరణ
శిక్ష విధించటానికి నిర్ణయించినప్పుడు అతడు ఒప్పు
కోలేదు.52యోసేపు పిలాతు దగ్గరకు వెళ్ళి యేసు
దేహాన్ని తీసుకెళ్ళటానికి అనుమతి పొందాడు. 53అతడు
ఆ దేహాన్ని సిలువ నుండి క్రిందికి దింపి ఒక విలువైన
బట్టలో చుట్టాడు. ఆ తర్వాత దాన్ని తీసుకెళ్ళి
యిదివరకు ఎవర్నీపెట్టని ఒక సమాధిలో ఉంచాడు.
ఆ సమాధి పెద్దరాయి మలచి సిద్ధం చేయబడి ఉంది.
54అది విశ్రాంతిరోజు కొరకు సిద్ధమౌతున్న రోజు.
అది ప్రారంభం అవ్వబోతుంది.

55యేసు వెంట గలిలయనుండి వచ్చిన స్త్రీలు
యోసేపు వెంట వెళ్లి సమాధిని, అతడు ఆ సమాధిలో
యేసు దేహాన్ని ఉంచిన దృశ్యాన్ని చూసారు. 56ఆ
తర్వాత వాళ్ళు యింటికి వెళ్ళి, అత్తరు, సుగంధ
ద్రవ్యాలు సిద్ధం చేసారు.

కాని విశ్రాంతి రోజు ప్రారంభం అయినందువల్ల
వాళ్ళు మోషే శాస్త్రం ప్రకారం ఏ పనీ చేయలేదు.

### బ్రతికి రావటం

*(మత్తయి 28:1-10; మార్కు 16:1-8;*
*యోహాను 20:1-10)*

24 ఆదివారం తెల్లవారుఝామున ఆ స్త్రీలు తాము
సిద్ధం చేసిన సుగంధ ద్రవ్యాలను తీసుకొని
సమాధి దగ్గరకు వెళ్ళారు. 2సమాధికి ఉన్న రాయి
త్రోసి వేయబడి ఉండటం గమనించి లోపలికి వెళ్ళి
చూసారు. 3అక్కడ వాళ్ళకు యేసు ప్రభువు దేహం
కనిపించ లేదు. 4దీన్ని గురించి వాళ్ళింకా ఆశ్చర్య
పడుతుండగా అకస్మాత్తుగా యిద్దరు వ్యక్తులు ప్రత్యక్షమై
వాళ్ళ ప్రక్కన నిలుచున్నారు. వాళ్ళ దుస్తులు మెరుపు
వలె మెరుస్తూ ఉన్నాయి. 5భయంతో ఆ స్త్రీలు
ముఖాల్ని వంచుకొన్నారు. ఆ దేవదూతలు, "మీరు
బ్రతికి ఉన్నవాని కోసం చనిపోయిన వాళ్ళ మధ్య
ఎందుకు వెతుకుతున్నారు? 6-7ఆయన బ్రతికి,
యిక్కడినుండి వెళ్లి పోయాడు. ఆయన మీతో కలిసి
గలిలయలో ఉన్నప్పుడు, 'మనుష్యకుమారుడు పాపా
త్ములకు అప్పగింపబడాలి; సిలువ మీద చంప బడాలి.
మూడవ రోజు బ్రతికి రావాలి!' అని అన్నవిషయం
మీకు జ్ఞాపకం లేదా!" అని అన్నారు. 8అప్పుడు వాళ్ళకు
ఆయన మాటలు జ్ఞాపకం వచ్చాయి.

---

**పరదైసు** చనిపోయిన విశ్వాసుల ఆత్మలు విశ్రాంతి తీసికొనే
స్థలం.

9-10మగ్దలేనే మరియ, యోహాను, యాకోబుల
తల్లి మరియ, మిగతా స్త్రీలు సమాధినుండి వెళ్ళి ఈ
విషయాలు ఆ పదకొండుగురికి, మిగతా వాళ్ళకు
చెప్పారు. 11ఆ స్త్రీల మాటలకు అర్థం లేదనుకొని
శిష్యులు వాళ్ళమాటలు నమ్మలేదు. 12అయినా
పేతురు లేచి ఆ సమాధి దగ్గరకు పరుగెత్తాడు. లోనికి
తొంగి చూసి, కట్టబడిన వస్త్రాలు అక్కడ పడివుండటం
గమనించాడు. ఏమి జరిగి ఉంటుందా? అని ఆశ్చర్య
పడ్తూ వెళ్ళి పోయాడు.

### ఎమ్మాయు దారి

*(మార్కు 16:12-13)*

13అదేరోజు వాళ్ళలో ఇద్దరు ఎమ్మాయు అనే
గ్రామానికి వెళ్తూవున్నారు. అది యెరూషలేంకు ఏడు
మైళ్ళ దూరంలో ఉంది. 14వాళ్ళు జరిగిన సంఘ
టనలను గురించి మాట్లాడుకొంటున్నారు. 15వాళ్ళు
ఈ విషయాన్ని గురించి చర్చిస్తూండగా యేసు
స్వయంగా వచ్చి వాళ్ళతో కలిసి నడవటం మొదలు
పెట్టాడు. 16కాని తానెవ్వరో వాళ్ళను గుర్తుపట్టనివ్వ
లేదు. 17యేసు వాళ్ళతో, "మీరు ఏం మాట్లాడుకొంటు
న్నారు?" అని అడిగాడు.
వాళ్ళు ఆగిపొయ్యారు. వాళ్ళ ముఖాల్లో దుఃఖం
ఉంది. 18వాళ్ళలో క్లెయొపా అనే వాడు ఈ విధంగా
సమాధానం చెప్పాడు: "ఈ మధ్య జరిగిన సంఘటనలు
తెలుసుకోకుండా యెరూషలేములో నివసిస్తూన్న
వాడివి నీవొక్కడివేనా!" అని అన్నాడు.
19"ఏ సంఘటనలు?" అని యేసు అడిగాడు.
వాళ్ళు, "నజరేతు నివాసియైన యేసును గురించి.
ఆయన ఒక ప్రవక్త. గొప్ప విషయాలు చెప్పాడు.
గొప్ప పనులు చేశాడు. ప్రజల మెప్పు, దేవుని మెప్పు
పొందాడు. 20మా ప్రధాన యాజకులు, పాలకులు,
మరణ దండన విధించుమని ఆయన్ని అధికారులకు
అప్పగించారు. వాళ్ళు ఆయన్ని సిలువకు వేసారు.
21ఆయన ఇశ్రాయేలును రక్షిస్తాడని ఆశించాము. పైగా
యివన్నీ మూడు రోజుల క్రితం జరిగాయి. 22అంతే
కాక మాతో ఉన్న కొందరు స్త్రీలు ఆశ్చర్యం కలిగించే
విషయం మాకు చెప్పారు. వాళ్ళు ఈ రోజు తెల్లవారు
ఝామున సమాధిదగ్గరకు వెళ్ళారు. 23కాని, అక్కడ
వాళ్ళకు యేసు దేహం కనిపించలేదు. తాము దేవ
దూతల్ని చూసినట్లు, ఆ దేవదూతలు యేసు బ్రతికి
వచ్చాడని చెప్పినట్లు మాకు చెప్పారు. 24మాతో ఉన్న
వాళ్ళు కొందరు సమాధి దగ్గరకు వెళ్ళి అది ఆ స్త్రీలు
వర్ణించిన విధంగా ఉండటం గమనించారు. కాని అక్కడ
యేసు కనిపించలేదు" అని అన్నారు.
25యేసు వాళ్ళతో, "అజ్ఞానులారా! ప్రవక్తలు
చెప్పిన విషయాలు నమ్మటానికి యింత ఆలస్యం
ఎందుకు చేస్తున్నారు? 26క్రీస్తు చనిపోయి తర్వాత
కదా తేజస్సు పొందాలి!" అని అన్నాడు. 27ఆ తదుపరి
మోషే గ్రంథాలతో, ప్రవక్తల వ్రాతలతో మొదలు పెట్టి
తనను గురించి లేఖనాల్లో వ్రాసినవన్నీ వాళ్ళకు అర్థ
మయ్యేటట్లు చెప్పాడు.
28వాళ్ళు వెళ్ళనున్న గ్రామం దగ్గరకు వచ్చింది.
యేసు తాను యింకా ముందుకు వెళ్ళనున్న వానిలా
కనిపించాడు. 29కాని వాళ్ళు, "సాయంకాలమైంది.
చీకటి కాబోతోంది. మాతో ఉండిపొండి!" అని
అన్నారు. యేసు సరేనని వాళ్ళతో వాళ్ళ యింటికి
వెళ్ళాడు.
30వాళ్ళతో భోజనానికి కూర్చున్నాక ఆయన
రొట్టె తీసుకొని దేవునికి కృతజ్ఞత చెప్పి దాన్ని విరిచి
వాళ్ళకిచ్చాడు. 31అప్పుడు వాళ్ళ కండ్లు తెరిపించాడు.
వెంటనే వాళ్ళు ఆయన్ని గుర్తించారు. కాని ఆయన
అదృశ్యమయ్యాడు. 32ఆ తర్వాత వాళ్ళు, "దారిపై
నడుస్తుండగా ఆయన మాట్లాడి, లేఖనాల్లో నిజమైన
అర్థాన్ని మనకు చెప్పినప్పుడు గుండెల్లో మండు
తున్నట్లు అనిపించలేదా?" అని ఆ యిద్దరూ మాట్లాడు
కున్నారు.
33వాళ్ళు లేచి వెంటనే యెరూషలేము వెళ్ళారు.
అక్కడ ఆ పదకొండుగురు శిష్యులు, మిగతా వాళ్ళు
సమావేశమై ఉన్నారు. 34వాళ్ళలో ఒకడు, "ఔను!
ఇది నిజం. ప్రభువు బ్రతికి వచ్చి సీమోనుకు కని
పించాడు" అని అన్నాడు.
35ఆ తదుపరి ఆ వచ్చిన వాళ్ళు దారిపై జరిగిన
సంఘటనను, యేసు రొట్టెను విరిచినప్పుడు తాము
ఆయన్ని గుర్తించిన విషయము చెప్పారు.

### యేసు తన శిష్యులకు కనిపించటం

*(మత్తయి 28:16-20; మార్కు 16:14-18;
యోహాను 20:19-23; అపొ. కా 1:6-8)*

36వాళ్ళు ఈ విషయాన్ని గురించి యింకా మాట్లా
డుతుండగా యేసు స్వయంగా వచ్చి వాళ్ళతో నిలు
చుని, "శాంతి కలుగు గాక" అని అన్నాడు.
37వాళ్ళు భూతాన్ని చూసామనుకొని వణికి
భయపడిపోయారు. 38యేసు వాళ్ళతో, "మీరెందుకు
భయపడ్తున్నారు. మీకు సందేహాలు ఎందుకు కలుగు
తున్నాయి? 39నా చేతులు, కాళ్ళు చూడండి. నేనే
ఆయనను. తాకి చూడండి. నాకు మాంసము, ఎము
కలు ఉన్నాయి. భూతానికి అవి ఉండవు" అని అన్నాడు.
40ఆయన ఈ మాటలు అంటూ తన చేతులు,
కాళ్ళు వాళ్ళకు చూపాడు. 41వాళ్ళకు ఆశ్చర్యము,
ఆనందము కలిగాయి. వాళ్ళు నమ్మలేకపొయ్యారు.
అప్పుడు యేసు, "మీ దగ్గర తినటానికి ఏమైనా ఉందా?"
అని అడిగాడు. 42వాళ్ళు ఒక కాల్చిన చేపను
తెచ్చి యిచ్చారు. 43ఆయన దాన్ని తీసుకొని
వాళ్ళ సమక్షంలో తిన్నాడు.

44ఆయన, “నేను మీతో కలిసి ఉన్నప్పుడు మోషే
ధర్మశాస్త్రంలో, ప్రవక్తల గ్రంథాలలో, కీర్తనలలో నన్ను
గురించి వ్రాసిన వన్నీ జరుగుతాయి అని చెప్పాను”
అని అన్నాడు.
45అప్పుడు వాళ్ళు లేఖనాలను అర్థం చేసు కోవాలనే
ఉద్దేశ్యంతో వాళ్ళ కండ్లు తెరిపించాడు. 46ఆయన
వాళ్ళతో, “ఈ విధంగా వ్రాయబడి ఉంది: క్రీస్తు చని
పోయి మూడవరోజున బ్రతికి వస్తాడు! 47పశ్చాత్తా
పాన్ని గురించి, పాప క్షమాపణ గురించి ఆయన పేరిట
ప్రకటించటం మొదట యెరూషలేంలో మొదలౌ
తుంది. ఆ పిదప అది అన్ని దేశాల్లో ప్రకటింపబడు
తుంది. 48మీరు వీటికి సాక్షులు. 49నా తండ్రి వాగ్దానం
చేసిన ఆయన్ని నేను పంపుతాను. కాని పరలోకం
నుండి మీకు పరిశుద్ధాత్మ శక్తి లభించే దాకా ఈ
పట్టణంలోనే ఉండండి” అని చెప్పాడు.

### పరలోకానికి వెళ్ళటం

*(మార్కు 16:19-20; అపొ. కా 1:9-11)*

50ఆ తర్వాత వాళ్ళను అక్కడి నుండి బేతనియ
దాకా తీసుకు వెళ్ళి తన చేతులెత్తి వాళ్ళను ఆశీర్వ
దించాడు. 51వాళ్ళను ఆశీర్వదిస్తుండగా ఆయన వాళ్ళ
నుండి దూరం చేయబడ్డాడు. ఆ తర్వాత పరలోకానికి
తీసుకు వెళ్ళబడ్డాడు. 52ఆ తర్వాత వాళ్ళాయనకు
నమస్కరించి చాలా ఆనందంతో యెరూషలేముకు
తిరిగి వెళ్ళారు. 53వాళ్ళు మందిరంలో ఉండి విరామం
లేకుండా దేవుని స్తుతించారు.

# యోహాను సువార్త

### వాక్యము మానవావతారం ఎత్తటం

1 సృష్టికి ముందు నుండి జీవంగల వాక్యము ఉండెను.
ఆ వాక్యము దేవునితో ఉండెను. ఆ వాక్యమే
దేవుడు. 2ఆయన సృష్టికి ముందు దేవునితో ఉండే
వాడు. 3ఆయన ద్వారా అన్నీ సృష్టింపబడ్డాయి. సృష్టిం
పబడిన దేదీ ఆయన లేకుండా సృష్టింపబడలేదు.
4ఆయన జీవానికి మూలం. ఆ జీవం మానవ జాతికి
వెలుగునిచ్చెను. 5వెలుగు చీకట్లో వెలుగుతోంది, కాని
చీకటి దాన్ని అర్థం చేసుకోలేదు.
6దేవుడు ఒక వ్యక్తిని పంపాడు. అతని పేరు
యోహాను. 7తన ద్వారా మానవులు విశ్వసించాలని
అతడు వెలుగును గురించి చెప్పటానికి వచ్చాడు.
8అతడు ఆ వెలుగు కాదు. ఆ వెలుగును గురించి
చెప్పటానికి వచ్చిన సాక్షి మాత్రమే అతడు. 9ప్రతి
ఒక్కరికి వెలుగునిచ్చే ఆ నిజమైన వెలుగు ప్రపంచం
లోకి వస్తూ ఉన్నాడు.
10ఆయన ప్రపంచంలోకి వచ్చాడు. ఆయన ద్వారా
ప్రపంచం సృష్టింపబడినా, ప్రపంచం ఆయన్ని గుర్తించ
లేదు. 11ఆయన తన స్వంత వాళ్ళదగ్గరకు వచ్చాడు.
కాని వాళ్ళాయనను ఒప్పుకోలేదు. 12అయినా, తనను
ఒప్పుకొన్న వాళ్ళందరికి, అంటే తనను నమ్మిన
వాళ్ళకందరికి, దేవుని సంతానమయ్యే హక్కును
ఇచ్చాడు. 13కాని వీళ్ళు మానవుల రక్తం వలనకాని,
శారీరక వాంఛలవల్ల కాని, మనుష్యుని నిర్ణయంవల్ల
కాని, జన్మించలేదు. వీళ్ళు దేవుని సంతానం.
14ఆ జీవంగల వాక్యము మానవరూపం దాల్చి మాన
వుల మధ్య జీవించాడు. ఆయనలో కృప, సత్యము
సంపూర్ణంగా ఉన్నాయి. ఆయన తండ్రికి ఏకైక
పుత్రుడు. కనుక ఆయనలో ప్రత్యేకమైన తేజస్సు
ఉంది. ఆ తేజస్సును మేము చూసాము. 15యోహాను
ఆయన్ని గురించి ఈ విధంగా నొక్కి చెప్పాడు:
"ఈయన గురించి నేను యిది వరకే ఈ విధంగా
చెప్పాను, 'నా తర్వాత రానున్నవాడు నాకన్నా ముందు
నుండి ఉన్నవాడు. కనుక ఆయన నాకన్నా
గొప్పవాడు.'"
16ఆయన పరిపూర్ణత వల్ల మనమంతా అనుగ్రహం
మీద అనుగ్రహం పొందాము. 17దేవుడు మోషే ద్వారా
ధర్మశాస్త్రాన్ని ఇచ్చాడు. యేసు క్రీస్తు ద్వారా కృపను,
సత్యాన్ని ఇచ్చాడు. 18ఎవ్వరూ ఎన్నడూ దేవుణ్ణి చూడ
లేదు. దేవుని ప్రక్కనవున్న ఆయన ఏకైక పుత్రుడు
దేవునితో సమానము. ఆయన మనకు దేవుణ్ణి గురించి
తెలియచేసాడు.

### బాప్తిస్మము నిచ్చిన యోహాను యొక్క సందేశము

*(మత్తయి 3:1-12; మార్కు 1:2-8; లూకా 3:15-17)*

19యోహాన్ను అడిగి, అతడెవరన్న విషయం
కనుక్కురావటానికి, యెరూషలేములోని యూదులు
యాజకులను లేవీయులను* అతని దగ్గరకు పంపారు.
20యోహాను సమాధానం చెప్పటానికి నిరాకరించ
లేదు. పైగా ఏదీ దాచకుండా స్పష్టంగా సమాధానం
చెప్పాడు. యోహాను, "నేను క్రీస్తును* కాదు!" అని
చెప్పాడు. 21వాళ్ళు అతణ్ణి, "మరి నీవెవరు?
ఏలీయావా?" అని అడిగారు.
అతడు, "కాదు" అని అన్నాడు.
"ప్రవక్తవా?"
"కాదు."
22చివరకు వాళ్ళు, "మరి నీవెవరవు? మమ్మల్ని
పంపిన వాళ్ళకు చెప్పటానికి మాకో సమాధానం
చెప్పండి. మమ్మల్ని పంపిన వాళ్ళకు చెప్పటానికి నీ
గురించి నీవేమని చెప్పుచున్నావు?" అని అడిగారు.
23యోహాను యిలా సమాధానం చెప్పాడు:

"ప్రభువు కోసం చక్కటి మార్గం వేయుమని
ఎడారి ప్రాంతాల్లో ఒక స్వరం ఎలుగెత్తి
పలికింది."

*యెషయా 40:3*

ఇవి యెషయా ప్రవక్త అన్న మాటలు.
24వీళ్ళను పంపింది పరిసయ్యులు. 25వాళ్ళు మరొక
ప్రశ్న వేస్తూ, "నీవు క్రీస్తువు కానంటున్నావు. ఏలీయా
వుకానంటున్నావు. ప్రవక్తవుకానంటున్నావు. అటువం
టప్పుడు నీవు ప్రజలకు బాప్తిస్మము ఎందుకి
స్తున్నావు?" అని అడిగారు.

---

**లేవీయులు** సహాయం చేసేవాళ్ళు.

**క్రీస్తు** లేక మెస్సీయ ఇది హీబ్రూ పదము.

26యోహాను సమాధానం చెబుతూ, “నేను నీళ్ళ
ద్వారా బాప్తిస్మము యిస్తున్నాను. కాని మీరెరుగని
వాడొకాయన మీ మధ్య ఉన్నాడు. 27నా తర్వాత
రానున్నవాడు ఆయనే. ఆయన చెప్పులు విప్పటానికి
కూడా నేను తగను” అని అన్నాడు.
28ఈ సంఘటనలన్నీ బేతనియ గ్రామంలో జరి
గాయి. అది యోహాను బాప్తిస్మము ఇచ్చిన యొర్దాను
నదికి అవతల వైపున ఉంది.

## దేవుని గొఱ్ఱె పిల్ల

29మరుసటి రోజు యోహాను యేసు తన వైపు
రావటం చూసి, “అదిగో! దేవుని గొఱ్ఱె పిల్ల! ఆయన
ప్రజల పాపాలను తన మీద వేసుకొంటాడు. 30నేను
యిదివరలో, ‘నా తర్వాత రానున్న వాడొకడున్నాడు.
ఆయన నాకన్నా ముందు నుండి ఉన్నవాడు. అందు
వలన ఆయన నాకన్నా గొప్పవాడు’ అని నేను చెప్పింది
ఈయన్ని గురించే! 31అప్పుడాయన ఎవరో
నాక్కూడా తెలియదు. కాని, ఆయన్ని ఇశ్రాయేలు
ప్రజలకు తెలియ చేయటానికి బాప్తిస్మము నిస్తూ
వచ్చాను.”
32ఆ తర్వాత యోహాను మళ్ళీ ఈ విధంగా
చెప్పాడు: “ఆకాశం నుండి పవిత్రాత్మ ఒక పావురంలా
వచ్చి ఆయనపై వాలటం చూసాను. 33బాప్తిస్మము
నివ్వటానికి దేవుడు నన్ను పంపాడు. ‘పవిత్రాత్మ
క్రిందికి వచ్చి ఎవరి మీద వాలుతాడో ఆ వ్యక్తి పవి
త్రాత్మ ద్వారా బాప్తిస్మము యిస్తాడు’ అని దేవుడు
నాకు ముందే చెప్పక పోయివుంటే ఆయనెవరో నాకు
తెలిసేది కాదు. 34నేను ఈ సంఘటనను చూసాను.
ఈయన దేవుని కుమారుడని సాక్ష్యం చెబుతున్నాను.”
35మరుసటి రోజు యోహాను అక్కడ నిలబడి
ఉన్నాడు. అతని శిష్య బృందానికి చెందిన యిద్దరు
అతనితో ఉండినారు. 36అదే సమయాన యేసు అలా
వెళ్ళటం చూసి, “అదిగో దేవుని గొఱ్ఱె పిల్లను చూడం
డి!” అని అన్నాడు.
37ఆ యిద్దరు శిష్యులు అతడీమాట అనటం విని,
యేసును అనుసరించారు. 38యేసు వాళ్ళ వైపు తిరిగి,
వాళ్ళు రావటం చూసి, “మీకేం కావాలి?” అని అడిగాడు.
వాళ్ళు, “రబ్బీ! మీరెక్కడ ఉంటున్నారు?” అని
అడిగారు. అంటే గురువు అని అర్థం.
39యేసు, “వచ్చి చూడండి” అని సమాధానం
చెప్పాడు. వాళ్ళు వెళ్ళి ఆయనెక్కడ ఉంటున్నాడో
చూసారు. ఆ రోజు ఆయనతో గడిపారు. అప్పుడు
సుమారు సాయంకాలం నాలుగు గంటలు అయింది.
40యోహాను చెప్పింది విని, యేసును అనుస
రించిన యిద్దరిలో అంద్రెయ ఒకడు. అంద్రెయ
సీమోను పేతురు సోదరుడు. 41అంద్రెయ వెంటనే
తన సోదరుడైన సీమోన్ను కనుగొని అతనితో,
“మెస్సీయను కనుగొన్నాము” అని అన్నాడు.
42తర్వాత సీమోన్ను యేసు దగ్గరకు పిలుచుకు
వచ్చాడు. యేసు అతణ్ణి చూసి, “నీ పేరు సీమోను!
నీవు యోహాను కుమారుడవు. ఇప్పటి నుండి నీవు
కేఫా* అని పిలువ బడుతావు” అని అన్నాడు. కేఫా
అంటే పేతురు అని అర్థం
43మరుసటి రోజు యేసు గలిలయకు వెళ్ళాలని
నిశ్చయించుకున్నాడు. ఫిలిప్పు దగ్గరకు వెళ్ళి
అతనితో, “నన్ను అనుసరించు” అని అన్నాడు.
44అంద్రెయ, పేతురుల్లాగే, ఫిలిప్పు కూడా బేత్సయిదా
గ్రామస్థుడు. 45ఫిలిప్పు నతనయేలు కోసం వెతికి
అతనితో, “మేము మోషే ధర్మశాస్త్రంలో ఎవర్ని
గురించి వ్రాయబడివుందో ఆయన్ని కనుగొన్నాము.
ప్రవక్తలు వ్రాసింది ఈయన్ని గురించే. ఈయన పేరు
యేసు. ఈయన యోసేపు కుమారుడు. నజరేతు
గ్రామస్థుడు” అని చెప్పాడు.
46నతనయేలు, “నజరేతు గ్రామం నుండి మంచి
జరగటం సంభవమా!” అని అడిగాడు.
“వచ్చి చూడు!” అని ఫిలిప్పు అన్నాడు.
47నతనయేలు తన వైపు రావటం యేసు
చూసాడు. అతణ్ణి గురించి, “అదిగో! నిజమైన ఇశ్రాయే
లీయుడు! అతనిలో ఏ కపటమూ లేదు” అని అన్నాడు.
48“మీకు నేనెలా తెలుసు?” అని నతనయేలు
అడిగాడు. యేసు, “ఫిలిప్పు నిన్ను పిలువక ముందే,
నీవు అంజూరపు చెట్టు క్రింద ఉన్నప్పుడే నిన్ను
చూసాను” అని అన్నాడు.
49నతనయేలు, “రబ్బీ! మీరు నిజముగా దేవుని
కుమారుడు. ఇశ్రాయేలు జనాంగానికి ప్రభువు” అని
అన్నాడు.
50యేసు, “నీవు అంజూరపు చెట్టు క్రింద ఉండటం
చూసానని చెప్పినందుకు విశ్వసిస్తున్నావా? వీటికన్నా
గొప్ప వాటిని చూస్తావు!” అని అన్నాడు. 51ఆయన
మళ్ళీ, “ఇది నిజం. ఆకాశం తెరుచు కోవటం, దేవ
దూతలు మనుష్యకుమారుని యొద్దకు దిగటం, మరల
ఎక్కిపోవటం చూస్తావు” అని అన్నాడు.

## కానా పట్టణంలో వివాహం

2 మూడవరోజు గలిలయ దేశంలోని “కానా” పట్ట
ణంలో ఒక పెళ్ళి జరిగింది. యేసు తల్లి అక్కడ
ఉన్నది. 2యేసు, ఆయన అనుచరులు కూడా ఆ
పెళ్ళికి ఆహ్వానించబడ్డారు. 3ద్రాక్షారసం అయిపో
యాక యేసు తల్లి ఆయనతో, “వాళ్ళ దగ్గర ద్రాక్షారసం
అయిపోయింది!” అని చెప్పింది.

---

**కేఫా** అంటే “రాయి” దీన్నే గ్రీకు భాషలో “పేతురు”
అంటారు.

4యేసు, “నాకెందుకు చెబుతున్నావమ్మా! నా
సమయమింకా రాలేదు!” అని సమాధానం చెప్పాడు.
5ఆయన తల్లి పనివాళ్ళతో, “ఆయన చెప్పినట్లు
చెయ్యండి!” అని అనింది.
6ప్రక్కనే రాతితో చేయబడిన ఆరు బానలు
ఉన్నాయి. అలాంటి బానల్ని యూదులు ఆచారపు
స్నానం చేసి పరిశుద్ధం కావటానికి ఉపయోగించే
వాళ్ళు. ఒక్కొక్క బానలో ఎనభై నుండి నూరు లీటర్ల
దాకా నీళ్ళు పట్టేవి.
7యేసు పనివాళ్ళతో, “ఆ బానల్ని నీళ్ళతో
నింపండి!” అని అన్నాడు. వాళ్ళు బానల నిండా నీళ్ళు
నింపారు. 8ఆ తర్వాత యేసు వాళ్ళతో, “ఇప్పుడు
ఒక బానలో నుంచి కొద్దిగా తీసి పెళ్ళి పెద్ద దగ్గరకు
తీసుకెళ్ళండి” అని అన్నాడు.
వాళ్ళు అలాగే చేసారు. ఆ పెళ్ళి పెద్ద ద్రాక్షారసంగా
మారిన ఆ నీళ్ళు రుచి చూసాడు. 9ఆ పనివాళ్ళకు
అది ఎక్కడనుండి వచ్చిందో తెలుసు. కాని ఆ పెళ్ళి
పెద్దకు అది ఎక్కడి నుండి వచ్చిందో అర్థం కాలేదు.
కనుక అతడు పెళ్ళి కుమారుణ్ణి ప్రక్కకు పిలిచి
అతనితో, 10“అందరూ మంచి ద్రాక్షారసంను మొదట
పోస్తారు. అతిథులంతా త్రాగి మత్తులయ్యాక
మామూలు ద్రాక్షారసంను పోస్తారు. కాని నీవు మంచి
ద్రాక్షారసంను యింత దాకా ఎందుకు దాచావు?” అని
అన్నాడు.
11యేసు చేసిన అద్భుతాలలో యిది మొదటిది.
ఇది గలిలయలోని కానాలో జరిగింది. ఈ విధంగా
ఆయన తన మహిమను చాటాక ఆయన శిష్యులకు
ఆయన పట్ల విశ్వాసం కలిగింది.

### యేసు మందిరాన్ని పరిశుభ్రం చేయటం

*(మత్తయి 21:12-13; మార్కు 11:15-17;*
*లూకా 19:45-46)*

12ఇది జరిగాక యేసు తన తల్లితో, సోదరులతో,
శిష్యులతో కలిసి కపెర్నహూము అనే పట్టణానికి
వెళ్ళాడు. అక్కడ వాళ్ళు కొద్దిరోజులు బస చేసారు.
13యూదుల పస్కా పండుగ దగ్గర పడగానే యేసు
యెరూషలేము వెళ్ళాడు. 14ప్రజలు మందిర ఆవర
ణంలో ఎద్దుల్ని, గొఱ్ఱెల్ని, పావురాల్ని, అమ్మటం
చూసాడు. కొందరు బల్లల ముందు కూర్చొని డబ్బు
మార్చటం చూసాడు. 15త్రాళ్ళతో ఒక కొరడా చేసి
అందర్ని ఆ మందిరావరణం నుండి తరిమి వేసాడు.
ఎద్దుల్ని, గొఱ్ఱెల్ని తరిమేసి, డబ్బులు మారుస్తున్న
వాళ్ళ డబ్బును క్రింద చల్లి వాళ్ళ బల్లల్ని తల క్రిందు
లుగా చేసివేసాడు. 16పావురాలు అమ్ముతున్న
వాళ్ళతో, “అవన్నీ అక్కడనుండి తీసివేయండి! నా
తండ్రి ఆలయాన్ని సంత దుకాణంగా మార్చటానికి
మీకెన్ని గుండెలు?” అని అన్నాడు.

17ఆయన శిష్యులు లేఖనాల్లో వ్రాయబడిన ఈ
విషయం జ్ఞాపకం చేసుకున్నారు:

> “నీ యింటిపై నాకున్న ఆశ నన్ను
> దహించివేస్తుంది”
>
> *కీర్తన 69:9*

18యూదులు యేసుతో, “ఒక అద్భుతాన్ని చేసి
చూపించు. దానితో నీకు యివి చేయటానికి అధికార
మున్నదని నమ్ముతాము” అని అన్నారు.
19యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: “ఈ
మందిరాన్ని పడగొట్టండి. నేను దాన్ని మూడు
రోజుల్లో మళ్ళీ కడతాను.”
20యూదులు, “ఈ మందిరం కట్టటానికి నలభై
ఆరు సంవత్సరాలు పట్టింది. నీవు దాన్ని మూడు
రోజుల్లో నిర్మిస్తావా?” అని అన్నారు.
21కాని యేసు మాట్లాడింది ఆలయమనే తన
దేహాన్ని గురించి. 22ఆయన బ్రతికింపబడ్డాక, ఆయన
శిష్యులకు ఆయన చెప్పింది జ్ఞాపకం వచ్చింది.
అప్పుడు వాళ్ళు గ్రంథాల్లో వ్రాయబడిన వాటిని,
యేసు చెప్పిన వాటిని విశ్వసించారు.
23పస్కా పండుగ రోజుల్లో ఆయన యెరూష
లేములో ఉండి చేసిన అద్భుతాల్ని ప్రజలు చూసారు.
వాళ్ళకు ఆయన పట్ల విశ్వాసము కలిగింది. 24కాని
ఆయనకు మానవ స్వభావము తెలుసు. కనుక తనను
తాను వాళ్ళకు అప్పగించుకోలేదు. 25మానవ స్వభావం
ఆయనకు తెలుసు కనుక మానవుల్ని గురించి
ఆయనకు ఎవడును చెప్పనవసరం లేదు.

### యేసు నికోదేముకు బోధించటం

3 నీకొదేము అనే పరిసయ్యుడు యూదుల నాయ
కునిగా ఉండేవాడు. 2అతడు ఒకనాటి రాత్రి యేసు
దగ్గరకు వెళ్ళి, “రబ్బీ! నీవు దేవుని నుండి వచ్చిన
బోధకుడవని మాకు తెలుసు. నీవు చేస్తున్న అద్భు
తాలు దేవుని అండ లేకుండా ఎవ్వరూ చెయ్యలేరు”
అని అన్నాడు.
3యేసు జవాబు చెప్పుతూ, “ఇది సత్యం. క్రొత్తగా
జన్మిస్తే తప్ప ఎవ్వరూ దేవుని రాజ్యాన్ని చూడలేరు”
అని స్పష్టంగా చెప్పాడు. 4నికోదేము, “కాని ఒక వ్యక్తి
వృద్ధుడయ్యాక తిరిగి ఏవిధంగా జన్మిస్తాడు? మళ్ళీ
జన్మించటానికి తల్లిగర్భంలోకి రెండవ సారి ప్రవే
శించలేము కదా!” అని అడిగాడు.
5యేసు జవాబు చెప్పుతూ, “ఇది సత్యం. నీళ్ళ
ద్వారా, పవిత్రాత్మద్వారా, జన్మిస్తే తప్ప ఎవ్వరూ
దేవుని రాజ్యంలోకి ప్రవేశించలేరు. 6మానవుడు భౌతి
కంగా జన్మిస్తాడు. కాని, ఆధ్యాత్మికత పవిత్రాత్మ వల్ల
జన్మిస్తుంది. 7అందువల్ల నేను, “నీవు మళ్ళీ జన్మిం

చాలి" అనటం విని ఆశ్చర్యపోవద్దు. 8గాలి తన యిష్టం
వచ్చినట్లు వీస్తుంది. మీరు దాని ధ్వని వినగలరు కాని
అది ఏ వైపు నుండి వీచిందో, ఏ వైపుకు వీస్తుందో
చెప్పలేరు. పవిత్రాత్మవల్ల జన్మించిన ప్రతి ఒక్కరూ
అలాగే ఉంటారు."
9"అది ఏ విధంగా సంభవమౌతుంది?" అని నికో
దేము అడిగాడు.
10యేసు, "నీవు ఇశ్రాయేలు వారిలో పండితుడవు
కదా! నీకీ విషయాలు అర్థం కాలేదా? 11ఇది నిజం.
మేము మాకు తెలిసిన విషయాలు చెబుతున్నాము.
చూసిన వాటికి సాక్ష్యం చెబుతున్నాము. అయినా మీరు
మేము చెబుతున్న వాటిని అంగీకరించరు. 12నేను
మాట్లాడిన ప్రాపంచిక విషయాలను గురించి మీరు
నమ్మలేదు. అటువంటప్పుడు పరలోక విషయాలు
మాట్లాడితే ఎట్లా నమ్ముతారు? 13పరము నుండి
వచ్చిన మనుష్యకుమారుడు తప్ప పరమునకు
ఎవ్వరూ ఎప్పుడూ వెళ్ళలేదు.
14-15"ఆయన్ని నమ్మిన ప్రతి ఒక్కడూ నశించ
కుండా అనంత జీవితం పొందాలంటే, మోషే ఎడారిలో
పామును ఎత్తినట్లు మనుష్యకుమారుడు కూడా ఎత్త
బడాలి" అని అన్నాడు.
16దేవుడు ఈ ప్రపంచప్రజల్ని ఎంతగానో ప్రేమిం
చాడు. తన ఒక్కగానొక్క కుమారుణ్ణి ఈ ప్రపంచం
లోకి పంపాడు. ఆయన్ని నమ్మిన వాళ్ళెవ్వరూ నాశనం
కాకూడదని, వాళ్ళు అనంత జీవితం పొందాలనీ ఆయన
ఉద్దేశ్యం. 17దేవుడు తన కుమారుని ద్వారా ఈ ప్రపం
చానికి రక్షణనివ్వటానికే గాని తీర్పు చెప్పటానికి పంప
లేదు. 18తన కుమారుణ్ణి నమ్మినవానికి ఆయన శిక్ష
విధించడు. నమ్మని వానిపై, అనగా తన ఏకైక కుమా
రుణ్ణి నమ్మ లేదు కనుక, యిదివరకే శిక్ష విధించాడు.
19దేవుడు చెప్పిన తీర్పు యిది: ప్రపంచంలోకి వెలుగు
వచ్చింది. ప్రజలు దుర్మార్గపు పనులు చేసారు. కనుక
వాళ్ళు వెలుగుకు మారుగా చీకటిని ప్రేమిం
చారు. 20చెడుపనులు చేసేవాడు వెలుగును ద్వేషిస్తాడు.
తన చెడు బయట పడుతుందేమోనని అతడు వెలుగు
లోకి రాడు.
21మంచి పనులు చేసేవాడు తాను చేసిన పనులు
దేవుని వల్ల చేసిన విషయమై ప్రజలు గ్రహించాలని
వెలుగులోకి వస్తాడు.

## యోహాను చెప్పిన సందేశం

22ఇది జరిగిన తర్వాత యేసు తన శిష్యులతో
యూదయ ప్రాంతానికి వెళ్ళి అక్కడ కొద్దిరోజులు
గడిపాడు, బాప్తిస్మము నిచ్చాడు. 23అదేవిధంగా
యోహాను కూడా సలీము పట్టణం దగ్గరున్న ఐనోను
గ్రామంలో నీళ్ళు పుష్కలంగావుండటం వల్ల, అక్కడి
ప్రజలకు బాప్తిస్మమునిస్తూ ఉన్నాడు. ప్రజలు బాప్తి
స్మము పొందటానికి అక్కడికి వెళ్తూ ఉండేవాళ్ళు.
24ఇది యోహానును కారాగారంలో వేయకముందు
జరిగిన సంఘటన.
25పవిత్రం కావటానికి శుద్ధి చేసే ఆచారం విష
యంలో ఒక యూదునికి, యోహాను శిష్యులకు వాదన
జరిగింది. 26వాళ్ళు యోహాను దగ్గరకు వచ్చి, "రబ్బీ!
యొర్దాను నదికి అవతలి వైపున మీతో ఉన్నవాడు,
మీరు ఎవర్ని గురించి సాక్ష్యము చెప్పారో ఆయన
బాప్తిస్మము నిస్తున్నాడు. అందరూ ఆయన దగ్గరకు
వెళ్తున్నారు" అని చెప్పారు.
27యోహాను సమాధానం చెబుతూ, "దేవుడిస్తే
తప్ప ఎవ్వరూ దేన్నీ పొందలేరు. 28నేను క్రీస్తును
కానని, ఆయన కన్నా ముందు పంపబడిన వాణ్ణి మాత్ర
మేనని నేను ముందే చెప్పాను. దీనికి మీరు సాక్ష్యం.
29పెళ్ళి కూతురు పెళ్ళి కుమారుని సొత్తు. కాని పెళ్ళి
కుమారుని స్నేహితుడు పెళ్ళికుమారుని మాట
వినాలని కాచుకొని ఉంటాడు. అతని స్వరం వినిపించ
గానే ఆనందిస్తాడు. నాదీ అలాంటి ఆనందమే. ఆ
ఆనందం నాకిప్పుడు సంపూర్ణంగా కలిగింది. 30ఆయన
ప్రాముఖ్యత పెరగాలి. నా ప్రాముఖ్యత తరగాలి.
31"పై నుండి వచ్చిన వాడు అందరికన్నా
గొప్పవాడు. ఈ ప్రపంచంలో పుట్టిన వాడు ఈ ప్రపం
చానికి చెందుతాడు. అలాంటి వాడు ప్రాపంచిక విష
యాల్ని గురించి మాట్లాడుతాడు. పరలోకం నుండి
వచ్చిన వాడు అందరికన్నా గొప్పవాడు. 32ఆయన
తాను చూసిన వాటిని గురించి, విన్నవాటిని గురించి
సాక్ష్యం చెబుతాడు. కాని ఆయన సాక్ష్యాన్ని ఎవ్వరూ
అంగీకరించరు. 33దాన్ని అంగీకరించిన మనిషి దేవుడు
సత్యవంతుడని అంగీకరిస్తాడు. 34ఎందుకంటే దేవుడు
పంపిన వాడు దేవుడు చెప్పిన మాటలు చెబుతాడు.
ఆయనకు దేవుడు పవిత్రాత్మను అపరిమితంగా
ఇస్తాడు. 35తండ్రి కుమారుణ్ణి ప్రేమిస్తున్నాడు. అందు
వలన అంతా ఆయన చేతుల్లో ఉంచాడు. 36ఆ కుమా
రుణ్ణి నమ్మిన ప్రతి ఒక్కడూ అనంత జీవితం పొందు
తాడు. కాని ఆ కుమారుణ్ణి తృణీకరించినవాడు అనంత
జీవితం పొందలేడు. దేవుని కోపం నుండి ఎవడూ
తప్పించుకోలేడు" అని అన్నాడు.

## సమరయ స్త్రీతో మాట్లాడటం

4 యేసు యోహాను కన్నా ఎక్కువ మందిని శిష్యు
లుగా చేసుకుంటున్నాడని, అతని కన్నా ఎక్కువ
మందికి బాప్తిస్మము నిస్తున్నాడని పరిసయ్యులు
విన్నారు. 2నిజానికి, బాప్తిస్మము నిచ్చింది యేసు కాదు.
ఆయన శిష్యులు. 3యేసు యిది గమనించి,
యూదయ వదిలి మళ్ళీ గలిలయకు వెళ్ళిపోయాడు.
4ఆయన సమరయ ద్వారా ప్రయాణం చేయవలసి
వచ్చింది.

5ప్రయాణం చేసి సమరయలోని సుఖారు అనే
గ్రామాన్ని చేరుకున్నాడు. ఈ గ్రామాన్ని ఆనుకొని
ఉన్న భూమిని, యాకోబు తన కుమారుడైన యోసే
పుకు యిచ్చాడు. 6అక్కడ యాకోబు బావి ఉండేది.
యేసు ప్రయాణం వల్ల అలసి ఆ బావి దగ్గరకు వచ్చి
కూర్చున్నాడు. అప్పుడు మధ్యాహ్నం సుమారు
పన్నెండు గంటలు. 7ఒక సమరయ స్త్రీ నీళ్ళు తోడు
కొని వెళ్ళటానికి వచ్చింది. యేసు ఆమెతో, “అమ్మా!
నాకు త్రాగటానికి నీళ్ళిస్తావా?” అని అడిగాడు. 8ఆయన
శిష్యులు ఆహారం కొనుక్కొని రావటానికి పట్టణంలోకి
వెళ్ళారు.
9ఆ సమరయ స్త్రీ ఆయనతో, “మీరు యూదులు,
నేను సమరయ స్త్రీని. నన్ను నీళ్ళివ్వమని అడుగుతు
న్నారేం?” అని అన్నది. యూదులు సమరయులతో
స్నేహంగా ఉండరు.
10యేసు సమాధానం చెబుతూ, “దేవుడు ఏమివ్వ
గలడో నీకు తెలియదు. నిన్ను నీళ్ళు ఎవరు అడుగుతు
న్నారో నీకు తెలియదు. అది నీకు తెలిసివుంటే నేను
అడగటానికి బదులు నీవు నన్ను నీళ్ళు అడిగేదానివి.
నేను నీకు జీవజలాన్ని యిచ్చేవాణ్ణి” అని అన్నాడు.
11ఆ స్త్రీ, “అయ్యా! బావి లోతుగా ఉంది. పైగా
మీ దగ్గర చేదటానికి ఏమీ లేదు. ఈ జీవజలం మీకెల్లా
లభిస్తుంది? 12మీరు మా తండ్రి యాకోబు కన్నా
గొప్పవారా? అతడు ఈ బావి మాకిచ్చాడు. ఈ బావి
నీళ్ళు అతడు, అతని కుమారులు, అతని గొఱ్ఱెలు
త్రాగాయి” అని అన్నది.
13యేసు, “ఈ నీళ్ళు త్రాగినా మళ్ళీ దాహం
వేస్తుంది! 14కాని నేనిచ్చే నీళ్ళు త్రాగినవానికి మళ్ళీ
దాహం కాదు. నేనిచ్చిన నీళ్ళు అతనిలో ఒక సజీవమైన
ఊటగా మారి అతనికి అనంత జీవితాన్నిస్తుంది” అని
సమాధానం చెప్పాడు.
15ఆ స్త్రీ, “అయ్యా! నాకు మళ్ళీ దాహం కలుగ
కుండా, నేను నీళ్ళు చేదటానికి ఇక్కడికి ప్రతి రోజూ
రాకుండా ఉండేటట్లు నాకా జలాన్ని ప్రసాదించండి”
అని అడిగింది.
16ఆయన, “వెళ్ళి నీ భర్తను పిలుచుకొని రా!”
అని ఆమెతో అన్నాడు.
17“నాకు భర్తలేడు” అని ఆమె తెలియ
చెప్పింది.18యేసు, “నీకు భర్తలేడని సరిగ్గా సమాధానం
చెప్పావు. నిజానికి నీకు ఐదుగురు భర్తలుండిరి.
ప్రస్తుతం నీవు ఎవరితో నివసిస్తున్నావో అతడు నీ
భర్త కాడు. నీవు నిజం చెప్పావు” అని అన్నాడు.
19ఆమె, “అయ్యా! మీరు ప్రవక్తలా కనిపిస్తున్నారు.
20మా పూర్వులు ఈ కొండ మీద పూజించారు. కాని
మీ యూదులు, ‘మేము పూజించవలసింది యిక్కడ
కాదు, యెరూషలేములో పూజించాలి’ అని అంటు
న్నారు” అని ఆ స్త్రీ అన్నది. 21యేసు, “నన్ను
నమ్మమ్మా! తండ్రిని ఆరాధించటానికి ఈ కొండ
మీదికి గాని లేక యెరూషలేముకు గాని వెళ్ళవలసిన
అవసరం తీరిపోయే సమయం వస్తుంది. 22మీ సమ
రయ దేశస్థులు తెలియనిదాన్ని ఆరాధిస్తారు. రక్షణ
యూదుల నుండి రానున్నది కనుక మేము మాకు
తెలిసిన దాన్ని ఆరాధిస్తాము. 23నిజమైన ఆరాధికులు
తండ్రిని ఆత్మతోను, సత్యముతోను ఆరాధించే
సమయం రానున్నది. ఆ సమయం ఇప్పుడే వచ్చింది
కూడా. ఎందుకంటే తండ్రి అటువంటి ఆరాధికుల
కోసమే ఎదురు చూస్తున్నాడు. 24దేవుడు ఆత్మ అయి
వున్నాడు. కనుక ఆయన ఆరాధించేవారు ఆయన్ని
ఆత్మతోను, సత్యముతోను ఆరాధించాలి” అని
అన్నాడు.
25ఆ స్త్రీ, “క్రీస్తు అనబడే మెస్సీయ రానున్నాడని
నాకు తెలుసు. ఆయన వచ్చినప్పుడు మాకన్నీ విశ
దంగా చెబుతాడు” అని అనింది.
26యేసు, “నీతో మాట్లాడుతున్నవాడు ఆయనే!”
అని అన్నాడు.
27అదే క్షణంలో ఆయన శిష్యులు తిరిగి వచ్చారు.
ఆయనొక స్త్రీతో మాట్లాడటం చూసి ఆశ్చర్యపడ్డారు.
కాని, “మీకేమి కావాలి?” అని కాని, లేక, “ఆమెతో
ఎందుకు మాట్లాడుతున్నారని కాని” వాళ్ళు అడగలేదు.
28ఆ స్త్రీ తన కడవనక్కడ వదలి గ్రామంలోకి
తిరిగి వెళ్ళిపోయింది. 29ప్రజలతో, “రండి! నేను చేసిన
వాటన్నిటిని చెప్పిన వ్యక్తిని చూడండి. ఈయనే క్రీస్తు
అవును గదా” అని అన్నది. 30వాళ్ళందరూ గ్రామం
నుండి బయలు దేరి ఆయన దగ్గరకు వచ్చారు.
31ఇంతలో ఆయన శిష్యులు, “రబ్బీ! భోజనం
చెయ్యండి” అని వేడుకున్నారు.
32కాని ఆయన వాళ్ళతో, “నా దగ్గర తినటానికి
ఆహారం ఉంది. కాని ఆ ఆహారాన్ని గురించి మీకేమీ
తెలియదు” అని అన్నాడు.
33ఆయన శిష్యులు, “ఆయన కోసం ఎవరో
భోజనం తెచ్చివుంటారు!” అని పరస్పరం మాట్లాడు
కున్నారు.
34యేసు, “నన్ను పంపిన వాని కోరిక తీర్చటం,
ఆయన కార్యాన్ని పూర్తి చేయటయే, నా భోజనం.
35‘విత్తిన తర్వాత నాలుగు నెలల్లో పంట వస్తుంది!’
అని మీరంటున్నారు. కాని నేను చెప్పేదేమిటంటే కళ్ళు
తెరచి పొలాల వైపు చూడండి. పంట కోయటానికి
సిద్ధంగా ఉంది. 36దాన్ని విత్తిన వాడు, కోసేవాడు
ఫలం పొందుతున్నారు. అనంత జీవితం కోసం, అతడు
ఆ పంటను కోస్తున్నాడు. తద్వారా విత్తనం నాటిన
వాడు, పంటకోసే వాడు, యిద్దరూ ఆనందిస్తారు.
37‘విత్తనం ఒకడు నాటితే ఫలం ఇంకొకడు పొందు
తాడు’ అన్న సామెత ఈ సందర్భంలో వర్తిస్తుంది.
38మీరు కష్టపడి పని చెయ్యని పంట కోయటానికి

మిమ్మల్ని పంపాను. దాని కోసం యితర్లు చాలా
కష్టించి పని చేసారు. వాళ్ళ కష్టానికి మీరు ఫలం
పొందుతున్నారు" అని చెప్పాడు.
39ఆ పట్టణంలో ఉన్న సమరయ ప్రజలతో ఆ
స్త్రీ, "నేను చేసినదంతా ఆయన చెప్పాడు" అని
చెప్పింది. ఆ కారణంగా అనేకులు యేసును నమ్మారు.
40అందువల్ల ఆ సమరయ ప్రజలాయన దగ్గరకు వెళ్ళి
తమతో ఉండుమని వేడుకున్నారు. ఆయన వాళ్ళతో
రెండు రోజులున్నాడు. 41ఆయన చెప్పిన విషయాల
వలన యింకా అనేకులు విశ్వాసులైయ్యారు.
42ఆ సమరయ ప్రజలు ఆమెతో, "మొదట నీవు
చెప్పిన విషయాలు విని ఆయన్ని విశ్వసించాము.
కాని యిప్పుడు మేము ఆయన మాటలు స్వయంగా
విన్నాము. కనుక ఆయన్ని సంపూర్ణంగా విశ్వసి
స్తునాము. ఆయన ప్రపంచాన్ని రక్షించటానికి వచ్చిన
వాడని మాకు బాగా తెలిసిపోయింది" అని అన్నారు.

### రాజ్యాధికారి కుమారునికి నయం చేయటం

*(మత్తయి 8:5-13; లూకా 7:1-10)*

43రెండు రోజుల తర్వాత ఆయన గలిలయకు
వెళ్ళాడు. 44అక్కడ యేసు, "ప్రవక్తకు తన స్వగ్రా
మంలో గౌరవం లేదు" అని అన్నాడు. 45ఆయన గలి
లయ వచ్చాక అక్కడి ప్రజలు ఆయనకు స్వాగత
మిచ్చారు. గలిలయ ప్రజలు కూడా పస్కా పండుగ
కోసం యెరూషలేము వెళ్ళారు. కనుక, వాళ్ళు ఆయన
అక్కడ పండుగ రోజుల్లో చేసిన వాటన్నిటిని చూశారు.
46యేసు, తాను నీళ్ళను ద్రాక్షారసంగా మార్చిన
గలిలయలోని 'కానా'ను మళ్ళీ దర్శించాడు. కపెర్న
హూము పట్టణంలో ఒక రాజ్యాధికారి ఉండే వాడు.
అతని కుమారుడు జబ్బుతో ఉన్నాడు. 47యేసు
యూదయ నుండి గలిలయకు వచ్చాడని విని ఆ
రాజ్యాధికారి ఆయన దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి చావుకు
దగ్గరగా ఉన్న తన కుమారునికి నయం చేయుమని
వేడుకున్నాడు. 48"మహాత్కార్యాలు, అద్భుతాలు
చూస్తే కాని మీరు నమ్మరు" అని యేసు అతనితో
అన్నాడు.
49ఆ రాజ్యాధికారి, "అయ్యా! నా కుమారుడు
మరణించకముందే దయచేసి రండి!" అని అన్నాడు.
50యేసు,"నీవు వెళ్ళు! నీ కుమారుడు జీవిస్తాడు"
అని అన్నాడు.
అతడు యేసు మాట విశ్వసించి వెళ్ళి పోయాడు.
51అతడు యింకా దారిలో ఉండగానే అతని సేవకులు
ఎదురుగా వచ్చి బాబుకు నయమై పోయిందని
చెప్పారు. 52అతడు వాళ్ళను తన కుమారునికి ఏ
సమయంలో నయమైందని అడిగాడు.
వాళ్ళు, "నిన్న ఒంటిగంటకు జ్వరం విడిచింది"
అని సమాధానం చెప్పారు. 53సరిగ్గా అదే సమయానికి
యేసు తనతో, "నీ కుమారుడు జీవిస్తాడు" అని అన్న
విషయం అతనికి జ్ఞాపకం వచ్చింది. అందువల్ల అతడు,
అతని యింట్లోని వాళ్ళంతా ప్రభువుని నమ్మారు.
54యూదయ దేశం నుండి గలిలయకు వచ్చాక
యిది యేసు చేసిన రెండవ మహత్కార్యము.

### చిన్న కొలను దగ్గర నయం చేయటం

5 కొద్ది రోజుల తర్వాత యూదుల పండుగ
వచ్చింది. యేసు యెరూషలేముకు వెళ్ళాడు.
2అక్కడ యెరూషలేములో గొర్రెల ద్వారం దగ్గర
ఒక కొలను ఉండేది. దీన్ని హీబ్రూ భాషలో బేతెస్థ
అని అంటారు. దీని చుట్టూ ఐదు మండపాలు ఉండేవి.
3చాలామంది వికలాంగులు, గ్రుడ్డి వాళ్ళు, కుంటివాళ్ళు,
పక్షవాత రోగులు అక్కడ వేచి ఉండేవాళ్ళు. 4"అప్పుడ
ప్పుడు ప్రభువు దూత దిగి వచ్చి ఆ నీళ్ళను కదిలించేవాడు.
అలా నీళ్ళు కదిలిన వెంటనే ఆ కోనేరులోకి దిగిన మొదటి
వాని రోగాలన్నీ నయమయ్యేవి. అని చెప్పబడింది.* 5అక్క
డున్న వాళ్ళలో ఒకడు ముప్పైఎనిమిది సంవత్సరాల
నుండి రోగంతో బాధ పడ్తూ ఉన్నాడు. 6యేసు
అతడక్కడ ఉండటం చూసాడు. చాలాకాలం నుండి
అతడాస్థితిలో ఉన్నాడని గ్రహించి అతనితో, "నీకు
నయం కావాలని ఉందా?" అని అడిగాడు.
7ఆ వికలాంగుడు, "అయ్యా! నీళ్ళు కదిలి నప్పుడు
ఆ కోనేరులోకి దించటానికి ఎవరూ లేరు; అయినా
వెళ్ళటానికి ప్రయత్నిస్తుండగానే, ఇంకొకడు నాకన్నా
ముందు ఆ నీళ్ళలోకి దిగుతాడు" అని అన్నాడు.
8అప్పుడు యేసు అతనితో, "లే! నీ చాప తీసు
కొని నడువు!" అని అన్నాడు. 9అతనికి వెంటనే
నయమైపోయింది. అతడు తన చాపతీసుకొని వెళ్ళి
పోయాడు.
ఈ సంఘటన విశ్రాంతి రోజున జరిగింది. 10తత్కా
రణంగా యూదులు కోలుకున్న వానితో, "ఇది
విశ్రాంతి రోజు. ధర్మశాస్త్రం ప్రకారం నీవు చాపమోసుక
వెళ్ళటానికి వీల్లేదు" అని అన్నారు.
11కాని అతడు, "నాకు నయం చేసిన వ్యక్తి, 'నీ
చాప పట్టుకొని వెళ్ళు' అని అన్నాడు" అని సమాధానం
చెప్పాడు.
12వాళ్ళు, "నీ చాప తీసుకొని నడవమన్న
వాడెవడు?" అని అడిగారు.
13ప్రజల గుంపు ఉండటం వల్ల యేసు అక్కడి
నుండి వెళ్ళిపోయాడు. కనుక తనకు నయం చేసిన
వాడెవరో అతడు చూపలేక పోయాడు.
14ఆ తర్వాత యేసు అతణ్ణి మందిరంలో కలుసు
కొని, "చూడు! నీవు తిరిగి ఆరోగ్యవంతుడవు

---

**వచనము 4** కొన్ని గ్రీకు ప్రతులలో, "వారు నీళ్ళు
కదలింపబడేవరకు వేచి ఉండెడి వారు" అని చేర్చబడింది.

అయ్యావు. పాపాలు చెయ్యటం మానేయి. లేకపోతే
ఇంతకన్నా ఎక్కువ కీడు సంభవించవచ్చు!" అని
అన్నాడు.
15ఆ తర్వాత వాడు వెళ్ళి, తనకు నయం చేసిన
వ్యక్తి యేసు అని చెప్పాడు.

## కుమారుని ద్వారా జీవము

16యేసు విశ్రాంతి రోజున యివన్నీ చేశాడని తెలి
యటం వల్ల యూదులు ఆయన్ని పీడించటం
మొదలు పెట్టారు. 17యేసు వాళ్ళతో, "నా తండ్రి
అన్నివేళలా పని చేస్తాడు. అందువల్ల నేనుకూడా పని
చేస్తున్నాను" అని సమాధానం చెప్పాడు.
18ఈ కారణంగా యూదులాయన్ని చంపటానికి
యింకా గట్టిగా ప్రయత్నించారు. వాళ్ళు, "అతడు
విశ్రాంతి రోజును పాటించక పోవటమే కాకుండా,
దేవుడు తన తండ్రి అని కూడా అంటున్నాడు. అలా
చేసి తనను దేవునితో సమానం చేసు కొంటున్నాడు"
అని అన్నారు.
19యేసు, "ఇది నిజం. కుమారుడు ఏదీ స్వయంగా
చెయ్యలేడు. తన తండ్రి చేస్తున్న దాన్ని చూసి,
దాన్ని మాత్రమే కుమారుడు చెయ్యగలడు. తండ్రి
ఏది చేస్తాడో, కుమారుడూ అదే చేస్తాడు. 20తండ్రికి
కుమారుని పట్ల ప్రేమ ఉంది కనుక తాను చేస్తున్నవన్నీ
ఆయనకు చూపిస్తాడు. భవిష్యత్తులో ఆయనకు
యింకా గొప్ప వాటిని చూపిస్తాడు. అప్పుడు మీరంతా
ఆశ్చర్య పోతారు. 21తండ్రి చనిపోయిన వాళ్ళను బ్రతి
కించినట్లే కుమారుడు కూడా తనకు యిష్టం వచ్చిన
వాళ్ళకు ప్రాణం పోస్తాడు. 22అంతేకాదు, తండ్రి ఎవరి
మీద తీర్పు చెప్పడు. తీర్పు చెప్పటానికి కుమారునికి
సర్వాధికారాలు ఇచ్చాడు. 23తండ్రిని గౌరవించినట్లు,
కుమారుణ్ణి గౌరవించాలని యిలా చేసాడు. కుమారుణ్ణి
గౌరవించని వాడు, ఆ కుమారుణ్ణి పంపిన తండ్రిని
కూడా గౌరవించనట్లే పరిగణింపబడతాడు" అని
అన్నాడు.
24యేసు, "ఇది సత్యం. నామాటలు విని నన్ను
పంపిన వానిని నమ్మువాడు అనంత జీవితం పొందు
తాడు. అలాంటి వాడు శిక్షింపబడడు. అంటే అతడు
చావు తప్పించుకొని జీవాన్ని పొందాడన్న మాట.
25ఇది సత్యం. దేవుని కుమారుని స్వరం చనిపోయిన
వాళ్ళు వినే కాలం రాబోతూవుంది. ఇప్పటికే వచ్చింది.
ఆ స్వరం విన్నవాళ్ళు క్రొత్త జీవితాన్ని పొందుతారు.
26ఎందుకంటే, జీవానికి తండ్రి ఏ విధంగా మూలపురు
షుడో అదేవిధంగా కుమారుడు కూడా జీవానికి మూల
పురుషుడు. కుమారుణ్ణి మూలపురుషుడుగా చేసింది
తండ్రి! 27కుమారుడు మానవావతారం పొందాడు
కనుక తండ్రి ఆయనకు తీర్పు చెప్పే అధికారం
యిచ్చాడు. ఆయన స్వరం వినే కాలం రానున్నది.
28ఆశ్చర్యపడకండి! సమాధుల్లో ఉన్న వాళ్ళందరూ
ఆయన స్వరం వినే కాలం రానున్నది. 29వెలుపలికి
రండి! మంచి చేసిన వాళ్ళు నిరంతరం జీవించటానికి
బ్రతికి వస్తారు. కీడు చేసిన వాళ్ళు నిరంతరం
శిక్షింపబడటానికి బ్రతికివస్తారు.
30"నేను స్వయంగా ఏదీ చెయ్యలేను. నేను దేవుడు
చెప్పమన్న తీర్పు చెబుతాను. అందువలన నా తీర్పు
న్యాయమైనది. నెరవేర వలసింది నాయిచ్ఛ కాదు.
నేను నన్ను పంపిన వాని యిచ్ఛ నెర వేర్చటానికి
వచ్చాను.

## సాక్ష్యం

31"నా పక్షాన నేను సాక్ష్యం చెబితే దానికి విలువ
ఉండదు. 32కాని నా పక్షాన సాక్ష్యం చెప్పేవాడు మరొ
కాయన ఉన్నాడు. నా విషయంలో ఆయన చెప్పే
సాక్ష్యానికి విలువ ఉందని నాకు తెలుసు.
33"మీరు మీ వాళ్ళను యోహాను దగ్గరకు పంపారు.
అతడు న్యాయం పక్షాన మాట్లాడాడు. 34మానవుని
సాక్ష్యం నాకు కావాలని కాదు. మీరు రక్షింపబడాలని
ఈ విషయం చెబుతున్నాను. 35యోహాను ఒక దీపంలా
మండుచూ వెలుగు నిచ్చాడు. కొంతకాలం మీరా
వెలుగు ద్వారా లాభంపొంది ఆనందించారు.
36"నా దగ్గర యోహాను సాక్ష్యాని కన్నా గొప్ప
సాక్ష్యం ఉంది. పూర్తి చెయ్యమని తండ్రి నాకు అప్ప
గించిన కార్యాల్ని నేను పూర్తి చేస్తున్నాను. ఈ కార్యాలు
తండ్రి నన్ను పంపాడని నిరూపిస్తాయి. 37నన్ను పంపిన
తండ్రి స్వయంగా నన్ను గురించి చెప్పాడు. మీరాయన
స్వరం ఎన్నడూ వినలేదు. ఆయన రూపాన్ని
ఎప్పుడూ చూడలేదు. 38అంతే కాక ఆయన పంపిన
వాణ్ణి మీరు నమ్మటం లేదు. కనుక, ఆయన బోధనలు
మీ మనస్సులో నివసించటంలేదు. 39లేఖనాల ద్వారా
అనంత జీవితం లభిస్తుందని మీరు వాటిని పరిశోధి
స్తారు. కాని ఆ లేఖనాలే నన్ను గురించి సాక్ష్యం చెపుతు
న్నాయి. 40అయినా మీరు నా దగ్గరకు వచ్చి నానుండి
క్రొత్త జీవితాన్ని పొందటానికి నిరాకరిస్తున్నారు.
41"నాకు మానవుల పొగడ్తలు అవసరం లేదు. 42కాని
మీ గురించి నాకు తెలుసు. మీకు దేవునిపట్ల ప్రేమ
లేదని నాకు తెలుసు. 43నేను నా తండ్రి పేరిట
వచ్చాను. నన్ను మీరు అంగీకరించలేదు. కాని ఒక
వ్యక్తి స్వయంగా తన పేరిట వస్తే అతణ్ణి మీరు అంగీక
రిస్తారు. 44మీరు పరస్పరం పొగడుకుంటారు. కాని
దేవుని మెప్పు పొందాలని ప్రయత్నించరు. అలాంట
ప్పుడు నన్ను ఎట్లా విశ్వసించగలరు? 45నేను
మిమ్మల్ని నా తండ్రి సమక్షంలో నిందిస్తానని అనుకో
కండి. మీరు ఆధారంగా చేసుకొన్న మోషే మిమ్మల్ని
నిందిస్తున్నాడు. 46మీరు మోషేను నమ్మినట్లైతే, అతడు
నన్ను గురించి వ్రాసాడు కనుక మీరు నన్ను కూడా

నమ్మే వాళ్ళు. 47అతడు వ్రాసింది మీరు నమ్మనప్పుడు
నేను చెప్పింది ఎట్లా నమ్మగలరు?" అని అన్నాడు.

### ఐదువేల మందికి భోజనం పెట్టటం

*(మత్తయి 14:13-21; మార్కు 6:30-44;*
*లూకా 9:10-17)*

**6** ఇది జరిగిన కొద్ది రోజులకు, యేసు గలిలయ
సముద్రం (తిబెరియ సముద్రం) దాటి వెళ్ళాడు.
2ఆయన అద్భుతమైన మహిమలతో రోగులకు బాగు
చెయ్యటం చూసి, పెద్ద ప్రజల గుంపు ఒకటి ఆయన్ని
అనుసరిస్తూ వచ్చింది. 3యేసు తన శిష్యులతో కలిసి
కొండ మీదికి వెళ్ళి అక్కడ కూర్చున్నాడు. 4అవి
పస్కా పండుగకు ముందు రోజులు. పస్కా యూదుల
పండుగ.

5యేసు తలెత్తి పెద్ద ప్రజలగుంపు తన వైపు రావటం
చూసి, ఫిలిప్పుతో, "వీళ్ళు తినటానికి ఆహారం ఎక్కడ
కొందాం?" అని అడిగాడు. 6అతణ్ణి పరీక్షించటానికి
మాత్రమే ఈ ప్రశ్న అడిగాడు. యేసు తాను ఏమి
చెయ్యాలో ముందే ఆలోచించు కొన్నాడు.

7ప్రతి ఒక్కనికి ఒక్కొక ముక్క దొరకాలన్నా,
రెండువందల దేనారాలు ఖర్చు చేయవలసి వస్తుంది.
అయినా అది చాలదు.

8యేసు శిష్యుల్లో ఒకడైన అంద్రెయ అక్కడు
న్నాడు. యితడు సీమోను పేతురు సోదరుడు.
9"ఇక్కడ ఒక బాలుని దగ్గర యవలతో చేసిన ఐదు
రొట్టెలు, రెండు కాల్చిన చేపలు ఉన్నాయి. కాని
యింతమందికి అవి ఎట్లా సరిపోతాయి?" అని
అన్నాడు.

10యేసు, "ప్రజల్ని కూర్చోపెట్టండి!" అని
అన్నాడు. అక్కడ చక్కటి పచ్చిక బయళ్ళు ఉన్నాయి.
ప్రజలందరూ కూర్చున్నారు. అక్కడున్న పురుషుల
సంఖ్య ఐదువేలు. 11యేసు ఆ రొట్టెల్ని తీసుకొని,
దేవునికి కృతజ్ఞత చెప్పి, అక్కడ కూర్చున్నవాళ్ళకు
పంచిపెట్టాడు. అదే విధంగా చేపల్ని కూడా పంచి
పెట్టాడు. అందరూ కావలసినంత తిన్నారు.

12వాళ్ళు తృప్తిగాతిన్నాక, తన శిష్యులతో, "ఏదీ
వృధా కాకుండా వాళ్ళు తినగా మిగిలిన ముక్కల్ని
ఎత్తి పెట్టండి!" అని అన్నాడు. 13ఐదు బార్లీ రొట్టెల్ని
పంచగా మిగిలిన ముక్కల్ని శిష్యులు పండ్రెండు గంపల
నిండా నింపారు.

14ప్రజలు యేసు చేసిన ఆ మహా కార్యాన్ని చూసి,
"లోకానికి రానున్న ప్రవక్త ఈయనే!" అని అనటం
మొదలుపెట్టారు.

15యేసు వాళ్ళు తనను బలవంతంగా రాజును
చెయ్యాలనుకుంటున్నారని గ్రహించాడు. కనుక
ఆయన ఏకాంతంగా కొండకు వెళ్ళిపొయ్యాడు.

### యేసు నీళ్ళపై నడవటం

*(మత్తయి 14:22-27; మార్కు 6:45-52)*

16సాయంకాలమైంది. ఆయన శిష్యులు సముద్రం
దగ్గరకు వెళ్ళారు. 17వాళ్ళు ఒక పడవనెక్కి సముద్రంకు
అవతలి వైపుననున్న కపెర్నహూము అనే పట్టణం
వైపు వెళ్ళసాగారు. అప్పటికే చీకటి పడింది. యేసు
వాళ్ళనింకా కలుసుకోలేదు. 18గాలి తీవ్రంగా వీయటం
వల్ల అలలు అధికమయ్యాయి. 19మూడు నాలుగు
మైళ్ళ దూరందాకా తెడ్లు వేసాక, యేసు నీళ్ళ పై
నడుస్తూ పడవ దగ్గరకు రావటం వాళ్ళు చూసారు.
వాళ్ళకు బాగా భయం వేసింది. 20కాని, యేసు
వాళ్ళతో, "నేనే! భయపడకండి!" అని అన్నాడు.
21ఈ మాట అన్న తర్వాత ఆయన పడవలోకి రావటా
నికి వాళ్ళు అంగీకరించారు. ఆ తదుపరి వాళ్ళు, తాము
వెళ్ళదలచిన తీరాన్ని త్వరలోనే చేరుకున్నారు.

22తెల్లవారింది. అవతలి ఒడ్డున ఉండి పోయిన
ప్రజలకు అక్కడ ఒకే పడవ ఉందని, యేసు శిష్యులతో
కలసి వెళ్ళలేదని, శిష్యులు మాత్రమే వెళ్ళారని, తెలుసు
కొన్నారు. 23-24వాళ్ళు యేసు, ఆయన శిష్యులు
అక్కడ లేరని గ్రహించిన వెంటనే, వెతకటానికి నిశ్చ
యించుకున్నారు. తిబెరియ నుండి కొన్ని పడవలు
వచ్చి ఒడ్డు చేరాయి. ప్రభువు దేవునికి కృతజ్ఞత చెప్పి,
రొట్టెల్ని ప్రజలకు పంచిన స్థలం దీని సమీపంలో
ఉంది. వాళ్ళు ఆ పడవలెక్కి ఆయన్ని వెదుకుతూ
కపెర్నహూము వెళ్ళారు.

### యేసు మన జీవితానికి ఆహారం లాంటివాడు

25యేసు అవతలి ఒడ్డున కనిపించగానే, వాళ్ళు
ఆయనతో, "రబ్బీ! మీరు ఇక్కడికి ఎప్పుడు
వచ్చారు?" అని అడిగారు.

26యేసు, "ఇది నిజం. అద్భుతాల్ని చూసినందు
వలన నన్ను మీరు వెతకటం లేదు. రొట్టెలు తిని మీ
కడుపులు నింపుకొన్నందుకు నా కోసం వెతుకు
తున్నారు. 27చెడిపోయే ఆహారం కోసం పాటు పడ
కండి. చిరకాలం ఉండే ఆహారం కోసం పాటు పడండి.
దాన్ని మనుష్యకుమారుడు మీకిస్తాడు. ఆయన పై
తండ్రి అయిన దేవుడు తన అంగీకార ముద్రవేశాడు"
అని చెప్పాడు.

28వాళ్ళు ఆయన్ని, "దైవకార్యం చెయ్యాలంటే
మేము ఏమి చెయ్యాలి?" అని అడిగారు.

29యేసు, "ఆయన్ని పంపిన వాణ్ణి నమ్మటమే
దైవకార్యం" అని సమాధానం చెప్పాడు.

30కనుక వాళ్ళు ఆయనతో చెప్పారు, "అలాగైతే,
మేము నమ్మేటట్లు ఏ అద్భుత కార్యాన్ని చేసి చూపి
స్తారు? 31మా ముత్తాతలు ఎడారుల్లో మన్నాను*

---

**మన్నా** యూదులు ఎడారుల్లో ఉండగా దేవుడిచ్చిన ఆహారం.

తిన్నారు. దీన్ని గురించి గ్రంథాల్లో ఈ విధంగా వ్రాయ
బడి ఉంది, 'ఆయన వాళ్ళు తినటానికి పరలోకం
నుండి ఆహారం యిచ్చాడు."
32యేసు జవాబు చెప్పుతూ, "ఇది నిజం. పర
లోకం నుండి నిజమైన ఆహారం ఇచ్చేంది మోషే
కాదు. దాన్ని యిచ్చేవాడు నా తండ్రి. 33ఆ జీవాహారం
పరలోకం నుండి దిగి వచ్చిన క్రీస్తే. ఆయన లోకానికి
జీవాన్నిస్తాడు" అని అన్నాడు.
34వాళ్ళు, "అయ్యా! యికనుండి ఈ ఆహారం
మాకివ్వండి!" అని అన్నారు.
35యేసు ఈ విధంగా చెప్పాడు: "నేను జీవాన్నిచ్చే
ఆహారాన్ని. నా దగ్గరకు వచ్చిన వాడు ఆకలితో పోడు.
నన్ను నమ్మినవానికి ఎన్నడూ దాహం కలుగదు. 36కాని
నేను ఇంతకు క్రితం చెప్పినట్లు, నన్ను చూసారు!
అయినా మీరు నమ్మలేదు! 37తండ్రి నాకప్పగించిన
వాళ్ళందరూ నా దగ్గరకు వస్తారు. నా దగ్గరకు వచ్చిన
వాణ్ణెవణ్ణీ నేను ఎన్నటికి నెట్టి వేయను. 38ఎందుకంటే,
నేను పరలోకం నుండి నా యిష్టం నెర వేర్చుకోవటానికి
దిగిరాలేదు. నన్ను పంపిన వాని ఇష్టాన్ని నెర వేర్చటానికి
వచ్చాను. 39నన్ను పంపిన వాని కోరిక యిది: నా
కప్పగింపబడిన వాళ్ళను నేను పోగొట్టు కోరాదు.
వాళ్ళను చివరి రోజు బ్రతికించాలి. 40కుమారుని వైపు
చూసి ఆయన్ని నమ్మిన వాడు అనంత జీవితం
పొందాలి. ఇది నా తండ్రి కోరిక. అలా నమ్మిన వాణ్ణి
నేను చివరి రోజు బ్రతికిస్తాను."
41ఆయన, "నేను పరలోకం నుండి వచ్చిన ఆహా
రాన్ని" అని అనటం విని యూదులు గొణిగారు.
42"ఇతడు యోసేపు కుమారుడైన యేసు కదా! ఇతని
తల్లిదండ్రుల్ని మనం ఎరుగుదుమే! మరి యిప్పు
డితడు, 'నేను పరలోకంనుండి దిగి వచ్చానని' ఎందుకు
అంటున్నాడు?" అని వాళ్ళన్నారు.
43యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
"మీలో మీరు గొణుక్కోవడం చాలించండి. 44నన్ను
పంపిన తండ్రి పంపితే తప్ప, నా దగ్గరకు ఎవ్వడూ
రాలేడు. నా దగ్గరకు వచ్చిన వాణ్ణి చివరి రోజు నేను
బ్రతికిస్తాను. 45ప్రవక్తల గ్రంథంలో ఈ విధంగా వ్రాయ
బడింది: 'దేవుడు వాళ్ళందరికీ బోధిస్తాడు.'* తండ్రి
మాట విని ఆయన చెప్పింది నేర్చుకున్న వాళ్ళు నా
దగ్గరకు వస్తారు. 46దేవుని నుండి వచ్చిన వాడు తప్ప
తండ్రినెవ్వరూ చూడలేదు. ఆయన మాత్రమే తండ్రిని
చూసాడు. 47ఇది నిజం. నమ్మిన వానికి అనంత జీవితం
లభిస్తుంది. 48నేను మీ జీవితానికి ఆహారాన్ని. 49మీ
పూర్వీకులు ఎడారిలో ఉన్నప్పుడు
మన్నా తిన్నారు. అయినా చనిపోయారు. 50కాని
ఈయన పరమునుండి వచ్చిన నిజమైన ఆహారం.
దీన్ని అందరూ తినవచ్చు. దీన్ని తిన్నవాడు మరణిం
చడు. 51పరమునుండి వచ్చిన సజీవమైన ఆ ఆహారాన్ని
నేనే. దీన్ని తిన్నవాడు చిరకాలం జీవిస్తాడు. ఈ ఆహారం
నా శరీరం. నా శరీరాన్ని లోకం యొక్క జీవం కోసం
యిస్తాను."
52ఆ తర్వాత, "మనకు తన శరీరాన్ని తినటానికి
ఈయన ఏవిధంగా యిస్తాడు?" అని యూదులు పర
స్పరం తీవ్రంగా వాదించుకున్నారు. 53యేసు వాళ్ళతో
ఈ విధంగా అన్నాడు: "ఇది సత్యం. మనుష్యకుమారుని
శరీరం తిని, ఆయన రక్తం త్రాగితే తప్ప మీలో జీవం
ఉండదు. 54నా శరీరము తిని, నా రక్తం త్రాగిన వానికి
అనంతజీవితం లభిస్తుంది. అతణ్ణి నేను చివరి రోజు
బ్రతికిస్తాను. 55ఎందుకంటే నా శరీరం నిజమైన
ఆహారం. నా రక్తం నిజమైన పానీ యము. 56నా
శరీరం తిని, నా రక్తం త్రాగినవాడు నాలో ఉంటాడు.
57సజీవుడైన నా తండ్రి నన్ను పంపాడు. ఆయన
కారణంగానే నేను జీవిస్తున్నాను. అదే విధంగా నన్ను
ఆహారంగా తిన్నవాడు నాకారణంగా జీవిస్తాడు. 58పర
లోకంనుండి దిగివచ్చిన నిజమైన ఆహారం యిదే!
ఇది మన పూర్వీకులు తిన్న ఆహారం లాంటిది కాదు.
వాళ్ళు అది తిన్నా చని పొయ్యారు. కాని ఈ ఆహారాన్ని
తిన్నవాళ్ళు అనంతజీవితం పొందు తారు." 59యేసు,
కపెర్నహూము లోని యూదుల సమాజ మందిరంలో
బోధిస్తూ ఈ విషయాలు చెప్పాడు.

## చాలా మంది శిష్యులు యేసును వదిలి వెళ్ళటం

60ఆయన చెప్పినవి విని చాలా మంది శిష్యులు,
"ఈ బోధన చాలా కష్టమైనది. దీన్ని ఎవరు అంగీకరించ
గలరు?" అని అన్నారు.
61తన శిష్యులు ఈ విషయాన్ని గురించి గొణు
క్కుంటున్నారని యేసు గ్రహించాడు. ఆయన
వాళ్ళతో, "ఇది మీకు కష్టంగా ఉందా? 62మనుష్య
కుమారుడు, తాను ముందున్న చోటికి వెళ్ళటం
చూస్తే మీరేమంటారు? 63ఆత్మ జీవాన్నిస్తాడు. శరీరానికి
విలువ లేదు. నా మాటలు ఆత్మకు సంబంధించినవి.
అవి జీవం. 64కాని, మీలో కొందరు నమ్మటం లేదు"
అని అన్నాడు. తనను నమ్మని వాడెవడో, తనకు
ద్రోహం చేసేవాడెవడో యేసుకు ముందునుండి
తెలుసు. 65యేసు యింకా ఈ విధంగా అన్నాడు:
"తండ్రి అనుమతిస్తే తప్ప నా దగ్గరకు ఎవ్వరూ రాలేరని
అందుకే అన్నాను."
66ఆ రోజు నుండి చాలా మంది శిష్యులు ఆయన్ని
అనుసరించటం మానుకొని వెనక్కు మళ్ళి పోయారు.
67యేసు, "మీరు కూడా వెళ్ళాలని అను కుంటు
న్నారా?" అని పన్నెండు మందిని అడిగాడు.
68సీమోను పేతురు, "ప్రభూ మేము ఎవరి దగ్గరకు
వెళ్ళాలి? అనంత జీవితాన్ని గురించి చెప్పే మాటలు

**దేవుడు … బోధిస్తాడు** యెషయా 54:13.

మీ దగ్గర ఉన్నాయి. 69మీరు దేవునికి సంబంధించిన
వారని, పవిత్రులని మాకు తెలుసు. అది మేము
నమ్ముతున్నాము" అని సమాధానం చెప్పాడు.
70అప్పుడు యేసు, "మీ పన్నెండు మందిని ఎన్ను
కొన్న వాణ్ణి నేనే కదా! అయినా మీలో ఒకడు
సైతాను!" అని అన్నాడు.
71ఆయన ఉద్దేశ్యం సీమోను కుమారుడైన ఇస్కరి
యోతు యూదా అని. యూదా పన్నెండు మందిలో
ఒకడైయుండి యేసుకు ద్రోహం చేస్తాడు.

### యేసు పర్ణశాలల పండుగకు వెళ్ళటం

7 ఇది జరిగిన తర్వాత, యేసు గలిలయలో
మాత్రమే పర్యటన చేసాడు. యూదులు ఆయన
ప్రాణం తీయాలనుకోవటం వలన ఆయన కావాలనే
యూదయలో పర్యటన చెయ్యలేదు. 2యూదుల
పర్ణశాలల పండుగ దగ్గరకు వచ్చింది. 3యేసు సోదరులు
యేసుతో, "నీవీ ప్రాంతం వదిలి యూదయకు వెళ్ళు.
అలా చేస్తే నీ శిష్యులు నీవు చేసే కార్యాల్ని
చూడగలుగుతారు. 4నీవు ఈ కార్యాల్ని చేస్తున్నావు.
కనుక నీవు ప్రజలముందుకు రావాలి. ఎందుకంటే,
ప్రజానాయకుడు కాదలచిన వాడు రహస్యంగా కార్యం
చేయడు" అని అన్నారు. 5అంటే ఆయన సోదరులు
కూడా ఆయన్ని నమ్మలేదన్నమాట! 6యేసు
వాళ్ళతో, "నాకింకా సమయం రాలేదు. మీకు ఏ
సమయమైనా మంచిదే. 7ప్రపంచం మిమ్మల్ని ద్వేషిం
చదు. కాని నేను దాని పనులు దుర్మార్గములని
అంటాను. కనుక అది నన్ను ద్వేషిస్తున్నది. 8మీరు
పండుగకు వెళ్ళండి. నాకు తగిన సమయం యింకా
రాలేదు కనుక నేను యిప్పుడు రాను" అని అన్నాడు.
9ఇలాగు అన్న తర్వాత యేసు గలిలయలోనే ఉండి
పోయాడు.
10ఆయన సోదరులు వెళ్ళాక ఆయన కూడా పండు
గకు వెళ్ళాడు. కాని బహిరంగంగా కాదు. రహస్యంగా.
11అక్కడ పండుగ జరిగే స్థలంలో యూదులు, 'అతడె
క్కడున్నాడు?' అని అంటూ ఆయన కోసం
వెదకసాగారు.
12ప్రజలు ఆయన్ని గురించి రహస్యంగా మాట్లా
డటం మొదలుపెట్టారు. కొందరు ఆయన మంచివాడ
న్నారు. మరి కొందరు, "కాదు, అతడు ప్రజల్ని మోసం
చేస్తున్నాడు!" అని అన్నారు. 13యూదులకు భయపడి
ఆయన్ని గురించి బహిరంగంగా ఎవ్వడూ ఏమీ
అనలేదు.

### యేసు పండుగ సమయంలో బోధించటం

14పండుగ సగం కాకముందే యేసు మందిరంలోకి
వెళ్ళి బోధించటం మొదలుపెట్టాడు. 15యూదులు
ఆశ్చర్యపడి, "చదవకుండా యితడు యింత జ్ఞానాన్ని
ఏ విధంగా సంపాదించాడు" అని అన్నారు.
16యేసు, "నేను బోధించేవి నావి కావు. అవి నన్ను
పంపిన దేవునివి. 17దైవేచ్ఛానుసారం జీవించ దలచిన
వానికి నా బోధనలు దేవునివా లేక నేను స్వయంగా
నా అధికారంతో మాట్లాడుతున్నవా అన్న విషయం
తెలుస్తుంది. 18స్వతహాగా మాట్లాడే వాడు గౌరవం
సంపాదించాలని చూస్తాడు. కాని తనను పంపిన వాని
గౌరవం కోసం మాట్లాడేవాడే నిజమైన వాడు. అలాంటి
వాడు అసత్యమాడడు. 19మోషే మీకు ధర్మశాస్త్రాన్ని
అందించాడు కదా! అయినా మీలో ఒక్కడు కూడా
దాన్ని పాటించలేదు. నన్ను చంపటానికి ఎందుకు
ప్రయత్నిస్తున్నారు" అని అన్నాడు.
20"నీకేమన్నా దయ్యం పట్టిందా? నిన్ను చంప
టానికి ఎవరు ప్రయత్నిస్తున్నారు?" అని ప్రజలు
అన్నారు.
21యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: "నేను
ఒక మహత్కార్యాన్ని చేసాను. దానికే మీరింత ఆశ్చర్య
పడిపోయారు. 22మోషే మీకు సున్నతి* చేయించు
కోమని చెప్పాడు. నిజానికి యిది మోషే నుండి కాదు
కాని పితరులనుండి ప్రారంభమైనది. 23కనుక అవసర
మైతే మీరు విశ్రాంతి రోజున సున్నతి చేస్తే తప్పుకాదు
కాని, నేను ఒక మనిషి దేహాన్ని సంపూర్ణంగా నయం
చేసినందుకు మీకు కోపం వస్తోందా? 24పైన చూసి
తీర్పు చెప్పటం మానుకోండి. న్యాయంగా తీర్పు
చెప్పండి."

### యేసు, "క్రీస్తా"?

25అదే క్షణాన కొందరు యెరూషలేము ప్రజలు
ఈ విధంగా అనటం మొదలుపెట్టారు: "వాళ్ళు చంపా
లని ప్రయత్నిస్తున్నది ఈయనే కదా! 26ఆయనిక్కడ
బహిరంగంగా మాట్లాడుతున్నా వాళ్ళు ఆయన్ని ఒక్క
మాట కూడా అనటం లేదే! అధికారులు కూడా
ఈయన నిజంగా క్రీస్తు అని తలంచారా ఏమి? 27కాని
క్రీస్తు వచ్చేటప్పుడు ఎక్కడనుండి వస్తాడో ఎవ్వరికీ
తెలియదు. మరి ఈయనెక్కడి నుండి వచ్చాడో
మనకందరికి తెలుసు!"
28అప్పుడు యేసు మందిరంలో ఇంకను మాట్లా
డుతూ ఉండినాడు. ఆయన బిగ్గరగా, "ఔను! నేనె
వరినో మీకు తెలుసు. నేను స్వతహాగా యిక్కడికి
రాలేదు. నన్ను పంపించిన వాడు సత్యవంతుడు. ఆయ

---

**సున్నతి** పురుషాంగము యొక్క ముందు చర్మాన్ని కోయటం. ప్రతి యూద బాలునికి ఈ సున్నతి చెసేవాళ్ళు. దేవుడు అబ్రాహాముతో చేసిన ఒప్పందానికి యిది బాహ్యమైన గుర్తు.

నెవరో మీకు తెలియదు. 29కాని ఆయన నన్ను
పంపాడు కాబట్టి ఆయన దగ్గర నుండి నేను యిక్కడికి
వచ్చాను. కాబట్టి ఆయనెవరో నాకు తెలుసు” అని
అన్నాడు.
30ఇది విని వాళ్ళు ఆయన్ని బంధించాలని ప్రయ
త్నించారు. కాని ఆయన సమయం యింకా రాలేదు
కనుక ఆయన మీద ఎవ్వరూ చేయి వేయలేదు.
31అక్కడున్న వాళ్ళలో చాలా మంది ఆయన్ని విశ్వ
సించారు. వాళ్ళు, “క్రీస్తు వచ్చినప్పుడు ఈయన కన్నా
గొప్ప అద్భుతాలు చేస్తాడా?” అని అన్నారు.
32ప్రజలు ఆయన్ని గురించి యిలా మాట్లాడు
కోవటం పరిసయ్యులు విన్నారు. వాళ్ళు, ప్రధాన
యాజకులు కలిసి ఆయన్ని బంధించటానికి భటుల్ని
పంపారు. 33కనుక యేసు ప్రజలతో, “నేను మీతో
కొద్దికాలమే ఉంటాను. ఆ తర్వాత నన్ను పంపిన
వాని దగ్గరకు వెళ్తాను. 34నా కోసం మీరు వెతుకుతారు.
కాని నన్ను కనుక్కోలేరు. నేనున్న చోటికి మీరు
రాలేరు” అని అన్నాడు.
35యూదులు తమలో తాము, “మనం కనుక్కో
కుండా ఉండేటట్లు ఇతడు ఎక్కడికి వెళ్ళ దలిచాడు?
గ్రీకుల మధ్య నివసిస్తున్న మనవాళ్ళ దగ్గరకు వెళ్ళి
గ్రీకులకు బోధిస్తాడా? 36‘నా కోసం వెతుకుతారు,
కాని కనుక్కోలేరు. నేనున్న చోటికి మీరు రాలేరు’
అని అతడు అనటంలో అర్థమేమిటి?” అని మాట్లాడు
కున్నారు.
37పండుగ చివరి రోజు చాలా ముఖ్య మైనది. ఆ
రోజు యేసు నిలుచుని పెద్ద గొంతుతో, “దాహం
వేసినవాడు నా దగ్గరకు రావచ్చు. వచ్చి తన దాహం
తీర్చుకోవచ్చు. 38లేఖనాలు చెప్పినట్లు, నన్ను నమ్మిన
వాని లోపలి నుండి జీవపు ఊటలు ప్రవహిస్తాయి”
అని అన్నాడు. 39అంటే, తనను నమ్మిన వాళ్ళకు
ముందుగా లభించబోయే ఆత్మను గురించి ఈ
మాటలు చెప్పాడు. ఆయన మహిమపర్చబడలేదు.
కనుక దేవుడు యింత వరకు ఆత్మను ఎవ్వరికీ
యివ్వలేదు.
40ఆయన మాటలు విన్నాక కొందరు, “ఈయన
తప్పక ప్రవక్త అయివుండాలి” అని అన్నారు.
41మరికొందరు, “ఈయన క్రీస్తు అయ్యి ఉండాలి”
అని అన్నారు.
కాని యితర్లు, “క్రీస్తు గలిలయనుండి ఎట్లా
వస్తాడు? 42ఆయన దావీదు వంశం నుండి, దావీదు
నివసించిన బేత్లెహేమునుండి వస్తాడని లేఖనాల్లో
వ్రాసారు కదా!” అని అన్నారు.
43యేసును బట్టి అక్కడున్న ప్రజలలో భేధాభి
ప్రాయం కలిగింది. 44కనుక ఆయన్ని బంధించాలను
కున్నారు. కాని ఎవ్వరూ ఆయన పై చెయ్యి వెయ్య
లేదు.

### యూదుల నాయకులు విశ్వసించక పోవటం

45చివరకు భటులు ప్రధానయాజకుల దగ్గరకు,
పరిసయ్యుల దగ్గరకు తిరిగి వెళ్ళి పొయ్యారు. వాళ్ళు
ఆ భటుల్ని, “అతణ్ణెందుకు పిలుచుకొని రాలేదు?”
అని అడిగారు.
46వాళ్ళు, “అతడు మాట్లాడినట్లు ఇంత వరకు
ఎవ్వరూ మాట్లాడలేదు!” అని అన్నారు.
47పరిసయ్యులు, “అంటే! మిమ్మల్ని కూడా అతడు
మోసం చేసాడా? 48పాలకుల్లో కాని, పరిసయ్యుల్లో
కాని అతణ్ణి నమ్మిన వాళ్ళెవ్వరూ లేరు. 49ధర్మశాస్త్రాన్ని
గురించి ఏమీ తెలియని ఆ ప్రజల మీద దేవుని శాపం
ఉందన్నట్లే!” అని అన్నారు.
50నీకొదేము వాళ్ళలో ఒకడు. ఇతడు ఇదివరలో
యేసు దగ్గరకు వెళ్ళి వచ్చాడు. 51అతడు, “మన
ధర్మశాస్త్రం విచారణ చేయకుండా, అతని వాదన విన
కుండా, అతడు చేసింది తెలుసుకోకుండా శిక్ష విధి
స్తుందా?” అని అడిగాడు.
52వాళ్ళు, “నీవు కూడా గలిలయవాడవా? ధర్మ
శాస్త్రాన్ని చదువు. ప్రవక్త గలిలయనుండి రాడని నీకే
తెలుస్తుంది” అని సమాధానం చెప్పారు.

---

ముఖ్యమైన ప్రాచీన వ్రాతప్రతులు యోహాను 7:53-8:11 లేవు.

### వ్యభిచరించిన స్త్రీ

53ఆ తర్వాత అందరూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి
పొయ్యారు.
8 యేసు మళ్ళీ ఒలీవల చెట్ల కొండ మీదికి వెళ్ళాడు.
2సూర్యోదయం అవుతుండగా ఆయన మళ్ళీ
మందిరంలో కనిపించాడు. అక్కడ ప్రజలు ఆయన
చుట్టూ సమావేశమయ్యారు. వాళ్ళకు బోధించటానికి
ఆయన కూర్చున్నాడు. 3వ్యభిచారం చేస్తుండగా పట్టు
బడిన స్త్రీని శాస్త్రులు, పరిసయ్యులు కలిసి అక్కడికి
తీసుకొని వచ్చారు. ఆమెను అందరి ముందు నిలుచో
బెట్టి 4యేసుతో, “బోధకుడా! ఈ స్త్రీ వ్యభిచారం
చేస్తుండగా పట్టుబడింది. 5మోషే, ధర్మశాస్త్రంలో
యిలాంటి స్త్రీని రాళ్ళతో కొట్టి చంపు మని ఆజ్ఞాపిం
చాడు. మీరేమంటారు?” అని అడిగారు. 6ఆయన్ని
పరీక్షించటానికి ఈ ప్రశ్న వేసారు. ఆయన్ని శిక్షించ
టానికి కారణం దొరుకుతుందని వాళ్ళ ఉద్దేశ్యం. కాని
యేసు వంగి, నేలపై తన వ్రేలితో వ్రాయటం మొదలు
పెట్టాడు. 7వాళ్ళు ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు. యేసు
తలెత్తి చూస్తూ, “మీలో పాపం చెయ్యని వాడు ఎవరైనా
ఉంటే, అతడు ఆమెపై మొదటిరాయి విసర వచ్చు!”
అని అన్నాడు. 8ఇలా అన్నాక, మళ్ళీ క్రిందికి వంగి
నేలపై వ్రాస్తూ ఉన్నాడు.

9ఇది విన్న వాళ్ళు ఒక్కొక్కరు అక్కడి నుండి
వెళ్ళటం మొదలుపెట్టారు. మొదట వృద్ధులు వెళ్ళి
పోయారు. చివరకు అక్కడ నిలుచున్న స్త్రీతో యేసు
మాత్రం మిగిలి పొయ్యాడు. 10యేసు తలెత్తి చూస్తూ,
“వాళ్ళెక్కడమ్మా! నిన్నెవ్వరూ శిక్షించ లేదా?” అని
అడిగాడు.
11“లేదు ప్రభూ!” అని ఆమె అన్నది.
“నేను కూడా శిక్ష విధించను. వెళ్ళు! ఇకనుండి
పాపం చెయ్యకు!” అని అన్నాడు.

### యేసు ఈ ప్రపంచానికి వెలుగు

12యేసు మరొక సమయంలో ప్రజలకు బోధించి
నప్పుడు, “నేను ప్రపంచానికి వెలుగును. నన్ను అను
సరించినవాళ్ళు అంధకారంలో నడవరు. వాళ్ళకు
జీవితం యొక్క వెలుగు లభిస్తుంది” అని అన్నాడు.
13పరిసయ్యులు సవాలు చేస్తూ, “నీ పక్షాన నీవు
సాక్ష్యం చెప్పుకుంటున్నావు. నీ సాక్ష్యం పనికి రాదు”
అని అన్నారు.
14యేసు సమాధానం చెబుతూ, “నేను నా పక్షాన
సాక్ష్యం చెబితే ఆ సాక్ష్యం నమ్మవచ్చు. ఎందుకంటే,
నేనెక్కడినుండి వచ్చానో, ఎక్కడికి వెళ్తున్నానో నాకు
తెలుసు. కాని నేను ఎక్కడినుండి వచ్చానో ఎక్కడికి
వెళ్తున్నానో మీకు తెలియదు.
15మీరు అందరి మానవుల వలె తీర్పుచెబుతారు.
నేను ఎవరిపైనా తీర్పు చెప్పను. 16కాని నేను ఒక
వేళ తీర్పు చెబితే నా తీర్పు సత్యసమ్మతమైనది.
ఎందుకంటే, నేను ఒంటరిగా తీర్పు చెప్పటం లేదు.
నన్ను పంపిన నా తండ్రి నాతో ఉన్నాడు. 17ఇద్దరు
కలసి సాక్ష్యం చెబితే ఆ సాక్ష్యాన్ని నమ్మవచ్చని మీ
ధర్మశాస్త్రంలో వ్రాసారు. 18నేను నా పక్షాన సాక్ష్యం
చెబుతున్నాను. నా యింకొక సాక్షి నన్ను పంపిన ఆ
తండ్రి” అని అన్నాడు. 19అప్పుడు వాళ్ళు, “నీ తండ్రి
ఎక్కడ ఉన్నాడు?” అని అడిగారు.
యేసు, “మీకు నేను ఎవరినో, నా తండ్రి ఎవరో
తెలియదు. నేనెవరినో తెలిస్తే, నా తండ్రి ఎవరో
మీకు తెలుస్తుంది” అని సమాధానం చెప్పాడు. 20ఆయ
నీవిషయాలన్నీ మందిరంలో కానుకలు వేసే చోట
నిలుచొని బోధిస్తూ మాట్లాడాడు. అయినా ఆయన్నె
వరూ బంధించలేదు; కారణం? ఆయన ఘడియ
యింకా రాలేదు!
21యేసు మరొకసారి వాళ్ళతో, “నేను వెళ్తు న్నాను.
మీరు నా కోసం వెతుకుతారు. కాని నేను వెళ్ళేచోటికి
మీరు రాలేరు. ఎందుకంటే మీరు మీ పాపాల్లో మరణి
స్తారు” అని అన్నాడు.
22యూదులు, “ఆత్మహత్య చేసుకొంటాడా?
అందుకేనా, ‘నేను వెళ్ళే చోటికి మీరు రాలేరు’ అని
అంటున్నాడు” అని అన్నారు.
23యేసు, “మీరు యిక్కడి వాళ్ళు. నేను పై నుండి
వచ్చిన వాణ్ణి. మీరు ఈలోకపు వాళ్ళు, నేను ఈ
లోకపు వాణ్ణి కాదు. 24మీరు మీ పాపాలతో మరణిస్తారు”
అని అన్నాడు.
25వాళ్ళు, “అది సరే కాని, నీవెవరు?” అని అడిగారు.
యేసు, “నేను యింతదాకా ఎవరన్ని చెబు
తున్నానో ఆయన్నే” అని అన్నాడు. 26“నేను మీ
తీర్పు విషయంలో ఎన్నో సంగతులు చెప్పగలను.
కాని దానికి మారుగా నన్ను పంపిన వాని నుండి విన్న
వాటిని మాత్రమే ప్రపంచానికి చెబుతున్నాను. ఆయన
నమ్మదగినవాడు” అని అన్నాడు.
27ఆయన తన తండ్రిని గురించి చెబుతున్నాడు.
వాళ్ళు అర్థం చేసుకోలేదు. 28అందువలన యేసు
వాళ్ళతో, “మనుష్యకుమారుణ్ణి పైకి లేపినప్పుడు
ఆయన నేనేనని మీరు తెలుసుకుంటారు. అంతేకాక
స్వతహాగా నేను ఏమీ చెయ్యనని, నా తండ్రి బోధించిన
వాటిని మాత్రమే చెబుతానని తెలుసుకుంటారు.
29నన్ను పంపిన వాడు నాతో ఉన్నాడు. నేను అన్ని
వేళలా ఆయనకు యిష్టమైనవే చేస్తాను. కనుక ఆయన
నన్ను ఒంటరిగా వదిలి వేయడు” అని అన్నాడు.
30ఆయన చెప్పిన విషయాలు విని అనేకులు ఆయన
విశ్వాసులైయ్యారు.

### అబ్రాహాము సంతానం

31తనను నమ్మిన యూదులతో యేసు, “మీరు
నా బోధనలు పాటిస్తే, మీరు నా నిజమైన శిష్యులు.
32అప్పుడు మీరు సత్యాన్ని గురించి తెలుసు కుంటారు.
ఆ సత్యమే మీకు స్వేచ్ఛ కలిగిస్తుంది” అని అన్నాడు.
33వాళ్ళు, “మేము అబ్రాహాము వంశీయులం.
మేమింతవరకు ఎవ్వరికి బానిసలుగా ఉండలేదు. మరి
మాకు స్వేచ్ఛ కలుగుతుందని ఎందుకంటున్నావు?”
అని అన్నారు. 34యేసు జవాబు చెప్పుతూ, “ఇది నిజం.
పాపం చేసిన ప్రతి ఒక్కడూ పాపానికి బానిస ఔతాడు.
35బానిసకు కుటుంబంలో శాశ్వతమైన స్థానం ఉండదు.
కాని కుమారుడు శాశ్వతంగా ఆ యింటికి చెందినవాడు.
36కుమారుడు స్వేచ్ఛ కలిగిస్తే మీకు నిజమైన స్వేచ్ఛ
కలుగుతుంది. 37మీరు అబ్రాహాము సంతానమని నాకు
తెలుసు. అయినా మీకు నా సందేశం నచ్చలేదు.
కనుక నన్ను చంపటానికి ప్రయత్నిస్తున్నారు. 38నేను
నా తండ్రి సమక్షంలో చూసిన దాన్ని చెబుతున్నాను.
మీరు మీ తండ్రి* నుండి విన్నదాన్ని చేస్తున్నారు”
అని అన్నాడు.
39“అబ్రాహాము మా తండ్రి” అని వాళ్ళు
సమాధానం చెప్పారు.

---

**మీ తండ్రి** ఇక్కడ సాతాను వాళ్ళ తండ్రి అని అర్థము. 8:44 వచనం చూడండి.

యేసు, "మీరు అబ్రాహాము సంతానమైతే అబ్రా
హాము చేసినట్లు చేసేవాళ్ళు! 40నేను చేసిందల్లా దేవుని
నుండి విన్న సత్యాన్ని చెప్పటమే! దానికి మీరు నన్ను
చంపాలని ప్రయత్నిస్తున్నారు. అబ్రాహాము మీలా ప్రవ
ర్తించలేదు. 41మీరు మీ తండ్రి చేసినట్లు చేస్తున్నారు"
అని అన్నాడు.
వాళ్ళు, "మేము అక్రమంగా పుట్టలేదు. మాకు
దేవుడొక్కడే తండ్రి" అని అన్నారు.
42యేసు వాళ్ళతో ఈ విధంగా అన్నాడు: "దేవుడు
మీ తండ్రి అయినట్లయితే నేను దేవునినుండి వచ్చానని
నమ్మేవాళ్ళు. కనుక మీరు నన్ను ప్రేమించే వాళ్ళు.
స్వతహాగా నేను యిక్కడికి రాలేదు. దేవుడే నన్ను
పంపాడు. 43మీరు నా సందేశం అంగీకరించటం లేదు
కనుక నేను చెప్పేది మీకు అర్థం కావటం లేదు.
44మీరు సైతానుకు చెందిన వాళ్ళు. వాడే మీ తండ్రి.
మీ తండ్రి కోరికల్ని తీర్చడమే మీ అభిలాష. వాడు
మొదటి నుండి హంతకుడు. వాడు సత్యాన్ని అనుస
రించడు. వాడిలో సత్యమనేది లేదు. అబద్ధ మాడటం
వాడి ప్రకృతి. కనుక వాడు అన్ని వేళలా అబద్ధమాడు
తాడు. వాడు అబద్ధానికి తండ్రి. 45నేను నిజం చెప్పటం
వల్ల మీరు నమ్మటంలేదు. 46నేను పాపం చేశానని
మీలో ఎవరైనా నిరూపించగలరా? నేను నిజం చెబుతు
న్నాను కదా! నన్నెందుకు విశ్వసించరు. 47దేవుని
సంతానం దేవుని మాట వింటుంది. మీరు దేవుని
సంతానం కాదు కనుక నేను చెప్పింది వినటంలేదు."

## యేసు, అబ్రాహాము

48"నీవు సమరయ దేశస్థుడవని, నీకు దయ్యం
పట్టిందని మేమనటంలో నిజం లేదా?" అని వాళ్ళు
ప్రశ్నించారు.
49"నాకు దయ్యం పట్టలేదు. నేను నా తండ్రిని
గౌరవిస్తాను. మీరు నన్ను అగౌరవ పరుస్తున్నారు.
50నేను నా కీర్తిని కోరటం లేదు. కాని నా కీర్తి కోరేవాడొ
కాయన ఉన్నాడు. ఆయనే న్యాయాధిపతి. 51ఇది
నిజం. నా బోధ అనుసరించిన వాడు ఎన్నటికీ చావు
చూడడు" అని అన్నాడు.
52ఇది విని యూదులు బిగ్గరగా, "నీకు దయ్యం
పట్టిందని మాకిప్పుడు తెలిసింది! అబ్రాహాము చని
పోయాడు. అలాగే ప్రవక్తలు చనిపోయారు. అయినా
నీ బోధన అనుసరించిన వాడు చనిపోడని అంటు
న్నావు. 53నీవు మా తండ్రి అబ్రాహాము కన్నా గొప్ప
వాడవా? అతడు చనిపొయ్యాడు. ప్రవక్తలు కూడా
చనిపొయ్యారు. నీ మనస్సులో నీవెవరవనుకుంటు
న్నావు?" అని అన్నారు.
54యేసు, "నన్ను నేను పొగుడుకుంటే ఆ పొగడ్తకు
అర్థం లేదు. నన్ను పొగిడేవాడు నా తండ్రి. ఆయన
మీ దేవుడని మీరే అంటున్నారు. 55ఆయన మీకు
తెలియదు. కాని నాకాయన తెలుసు. ఆయన నాకు
తెలియదని అంటే, నేను మీలాగే అబద్ధాలాడినట్లు
వుతుంది. కాని ఆయన నాకు తెలుసు. ఆయన మాట
నేను పాటిస్తాను. 56మీ తండ్రి అబ్రాహాము నా కాలాన్ని
చూడగలనని గ్రహించిన వెంటనే ఆనందపడ్డాడు.
అతడు చూశాడు; ఆనంద పడ్డాడు" అని అన్నాడు.
57ఆ కారణంగా యూదులు, "నీకింకా యాభై
ఏళ్ళైనా నిండలేదు. నీవు అబ్రాహామును చూసావా?"
అని అన్నారు.
58యేసు, "ఇది నిజం. అబ్రాహాము పుట్టక ముందే
నేను ఉన్నాను" అని అన్నాడు. 59ఇది విని వాళ్ళు
ఆయన్ని కొట్టాలని రాళ్ళు ఎత్తి పట్టుకున్నారు. కాని
యేసు వాళ్ళకు కనిపించకుండా దాక్కొని ఆ గుంపు
నుండి వెళ్ళిపోయాడు.

## యేసు ఒక పుట్టు గ్రుడ్డివానిని నయం చేయటం

9 ఆయన వెళ్తూ ఒక పుట్టు గ్రుడ్డి వాణ్ణి చూశాడు.
2ఆయన శిష్యులు ఆయనతో, "రబ్బీ! యితడు
గ్రుడ్డివానిగా పుట్టాడే! ఎవరు పాపం చేసారంటారు?
ఇతడా లేక యితని తల్లిదండ్రులా?" అని అడిగారు.
3యేసు, "ఇతడు కాని, యితని తల్లిదండ్రులు
కాని పాపం చెయ్యలేదు! దేవుని శక్తి యితని జీవితం
ద్వారా ప్రదర్శింపబడాలని గ్రుడ్డివానిగా పుట్టాడు.
4సూర్యాస్తమయం అయ్యేలోగా మనం నన్ను పంపిన
వాని కార్యం చేయాలి. రాత్రి రాబోతోంది. అప్పుడు
ఎవ్వరూ పని చెయ్యలేరు. 5ఈ ప్రపంచంలో నేను
ఉన్నంత కాలం నేను దానికి వెలుగును" అని అన్నాడు.
6ఈ విధంగా మాట్లాడి నేల మీద ఉమ్మి వేసాడు.
ఆ ఉమ్మితో బురద చేసి, ఆ గ్రుడ్డివాని కళ్ళమీద
పూసాడు. 7అతనితో, "వెళ్ళి, సిలోయం కోనేట్లో
కడుక్కో!" అని అన్నాడు. సిలోయం అన్న పదానికి
అర్థం 'పంపబడిన వాడు'. ఆ గ్రుడ్డివాడు వెళ్ళి తన
కళ్ళు కడుక్కున్నాడు. అతనికి దృష్టి వచ్చాక తిరిగి
వచ్చాడు.
8అతని ఇరుగు, పొరుగు వాళ్ళు, అతడు భిక్షమెత్తు
కుంటుండగా చూసిన వాళ్ళు, "ఈ మనిషి కూర్చొని
భిక్షమెత్తు కుంటూవుండే వాడు కదా!" అని అన్నారు.
9కొందరు, "ఔనన్నారు. మరికొందరు, కాదు
ఇతడు అతనిలా కనిపిస్తున్నాడు, అంతే!" అని అన్నారు.
కాని అతడు స్వయంగా, "నేనే అతణ్ణి" అని
అన్నాడు. 10"మరి అలాగైతే నీకు దృష్టి ఎట్లా
వచ్చింది!" అని వాళ్ళు అడిగారు.
11అతడు, "యేసు అని పిలుస్తారే ఆయన బురద
చేసి నా కళ్ళ మీద పూసాడు. తర్వాత నన్ను వెళ్ళి
సిలోయం కొనేరులో కడుక్కో మన్నాడు. నేను అలాగే
వెళ్ళి కడుక్కున్నాను. ఆ తర్వాత నాకు దృష్టి
వచ్చింది" అని సమాధానం చెప్పాడు.

12వాళ్ళు, "అతడెక్కడ ఉన్నాడు?" అని అడిగారు.
ఆయన, "నాకు తెలియదు" అని అన్నాడు.

### పరిసయ్యులు విచారించటం

13వాళ్ళు యింతకు పూర్వం గ్రుడ్డివానిగా ఉన్న
వాణ్ణి పరిసయ్యుల దగ్గరకు పిలుచుకు వచ్చారు.
14బురద చేసి ఆ గ్రుడ్డివానికి నయం చేసింది విశ్రాంతి
రోజు. 15పరిసయ్యులు దృష్టి ఎట్లా వచ్చిందని అతణ్ణి
ప్రశ్నించారు.

అతడు, "ఆయన నా కళ్ళమీద బురద పూసాడు.
నేను వెళ్ళి కడుక్కొన్నాను. నాకు దృష్టి వచ్చింది"
అని అన్నాడు.

16కొందరు పరిసయ్యులు, "అతడు విశ్రాంతి
రోజును పాటించడు. కనుక అతడు దేవుని నుండి
రాలేదు!" అని అన్నారు.

మరికొందరు, "ఇతడు పాపాత్ముడైతే ఇలాంటి
అద్భుతాలు చేయగలడా?" అని అన్నారు. అలా
వారిలో వారికి వివాదం కలిగింది.

17వాళ్ళు మళ్ళీ గ్రుడ్డివానితో, "నీవు అతని గురించి
ఏమనుకొంటున్నావు" అని అడిగారు.

"ఆయన ఒక ప్రవక్త!" అని ఆ నయమైన వాడు
సమాధానం చెప్పాడు.

18ఇదివరలో గ్రుడ్డివానిగా ఉన్నవాడు యితడేనని;
యిప్పుడతనికి దృష్టి వచ్చిందని, అతని తల్లిదండ్రుల్ని
పిలువనంపే దాకా యూదులు నమ్మలేదు. 19అతని
తల్లిదండ్రులతో, "ఇతడు మీ కుమారుడా! గ్రుడ్డి వానిగా
జన్మించింది ఇతడేనా? ఇతడు ఇప్పుడెట్లా చూడగలుగు
తున్నాడు?" అని అడిగారు.

20అతని తల్లిదండ్రులు, "అతడు మా కుమారుడని,
గ్రుడ్డివానిగా జన్మించాడని మాకు తెలుసు. 21కాని
అతడు ఇప్పుడేవిధంగా చూడగలుగు తున్నాడో, అత
నికి దృష్టి ఎవరిచ్చారో మాకు తెలియదు. అతణ్ణే
అడగండి! తనను గురించి సమాధానం చెప్పుకోగల
వయస్సు అతనికి ఉంది" అని అన్నారు. 22యేసే,
"క్రీస్తు" అన్న ప్రతి ఒక్కణ్ణి సమాజ మందిరం నుండి
బహిష్కరించాలని యూదులు యిది వరకే నిశ్చయిం
చారు. కనుక వాళ్ళకు భయపడి అతని తల్లిదండ్రులు
ఈ విధంగా సమాధానం చెప్పారు. 23అందుకే వాళ్ళు,
"అతనికి వయస్సు వచ్చింది. అతణ్ణే అడగండి!" అని
అన్నారు.

24యూదులు గ్రుడ్డివానిగా ఉన్నవాణ్ణి రెండవసారి
పిలువనంపారు. అతనితో, "దేవుణ్ణి స్తుతించు, అతణ్ణి
కాదు. అతడు పాపాత్ముడని తెలుసు!" అని అన్నారు.

25"ఆయన పాపాత్ముడో, కాదో నాకు తెలియదు.
నాకు ఒకటి తెలుసు. నేనిదివరలో గ్రుడ్డి వాణ్ణి. ఇప్పుడు
చూడగలుగుతున్నాను" అని అతడు సమాధానం
చెప్పాడు.

26"అతడు ఏమి చేసాడు? ఏ విధంగా నీకు దృష్టి
కలిగించాడు?" అని వాళ్ళు అడిగారు.

27అతడు, "నేను యిది వరకే చెప్పాను. కాని
మీరు వినలేదు. మళ్ళీ ఎందుకు అడుగుతున్నారు?
మీరు కూడా ఆయన శిష్యులు కావాలని అనుకుంటు
న్నారా?" అని అన్నాడు.

28వాళ్ళు అతణ్ణి అవమానపరచారు. అతనితో,
"నువ్వు అతని శిష్యుడివి. మేము మోషే శిష్యులము.
29దేవుడు మోషేతో మాట్లాడాడని మాకు తెలుసు.
ఇక ఇతని గురించా? ఇతడెక్కడినుండి వచ్చాడో కూడా
మాకు తెలియదు" అని అన్నారు.

30అతడు, "ఇది చాలా విచిత్రం. ఆయన ఎక్కడి
నుండి వచ్చాడో కూడా మీకు తెలియదు. అయినా
ఆయన నాకు దృష్టి కలిగించాడు. 31దేవుడు పాపా
త్ముల మాటలు వినడని, తన ఆజ్ఞలను పాటిస్తున్న
విశ్వాసుల మాటలు వింటాడని మాకు తెలుసు. 32పుట్టు
గ్రుడ్డివానికి కళ్ళు తెప్పించటం ఇది వరకు ఎవ్వరూ
వినలేదు. 33ఇతడు దేవుని నుండి రానట్లైతే ఏమీ చెయ్య
లేకపొయ్యేవాడు" అని అన్నాడు.

34ఇది విని వాళ్ళు, "నీవు పాపంలో పుట్టావు.
పాపంలో పెరిగావు. మాకు ఉపదేశించటానికి నీకెంత
ధైర్యం?" అని అంటూ అతణ్ణి వెలివేశారు.

35అతణ్ణి వెలివేశారని యేసు విన్నాడు. యేసు
అతణ్ణి కనుగొని, "నీవు మనుష్యకుమారుణ్ణి నమ్ము
చున్నావా?" అని అడిగాడు.

36ఆ వ్యక్తి, "ఆయనెవరో చెప్పండి ప్రభూ!
విశ్వసిస్తాను!" అని అన్నాడు.

37యేసు, "నీవు ఆయన్ని చూస్తున్నావు. నీతో
మాట్లాడుతున్నవాడాయనే!" అని అన్నాడు.

38అతడు, "ప్రభూ! నేను నమ్ముతున్నాను!" అని
అంటూ ఆయన ముందు మోకరిల్లాడు.

39యేసు, "నేను తీర్పు చెప్పటానికి ఈ ప్రపంచం
లోకి వచ్చాను. ఆ తీర్పేదనగా-గ్రుడ్డివాళ్ళు చూడగల
గాలనీ, చూడగలమని అంటున్న వాళ్ళు గ్రుడ్డి వాళ్ళు
కావాలని నేను వచ్చాను" అని అన్నాడు.

40ఆయనతో ఉండి ఆయనన్న మాటలు విన్న
కొందరు పరిసయ్యులు, "మేము కూడా గ్రుడ్డి వాళ్ళ
మంటున్నావా?" అని అన్నారు.

41యేసు, "మీరు గ్రుడ్డి వాళ్ళైనట్లైతే మిమ్మలను
దోషులుగా పరిగణించవలసిన అవసరం ఉండదు. కాని
మీరు చూడగలము అంటున్నారు. కనుక మిమ్మల్ని
దోషులనవలసిందే!" అని అన్నాడు.

### గొఱ్ఱెలకాపరి, తన గొఱ్ఱెలు

10 "ఇది నిజం. గొఱ్ఱెల దొడ్డిలోకి తలుపు ద్వారా
వెళ్ళకుండా గోడనెక్కి వెళ్ళే వాడు దొంగ,
దోపిడిగాడు. 2తలుపు ద్వారా ప్రవేశించేవాడు ఆ

గొఱ్ఱెలకు కాపరి. 3ద్వార పాలకుడు అతని కోసం
తలుపు తెరుస్తాడు. గొఱ్ఱెలు అతని స్వరము గుర్తి
స్తాయి. ఆ గొఱ్ఱెలు అతనివి. అతడు ఆ గొఱ్ఱెలను
పేరుపెట్టి పిలిచి వాటిని వెలుపలికి తీసుకొని వెళ్తాడు.
4తన గొఱ్ఱెల్ని వెలుపలికి పిలుచుకొని వచ్చాక అతడు
ముందు నడుస్తాడు. వాటికి అతని స్వరం తెలుసు
కనుక అవి అతణ్ణి అనుసరిస్తాయి. 5అవి క్రొత్త వాని
వెంట వెళ్ళవు. క్రొత్త వాని స్వరం గుర్తుపట్టలేవు.
కనుక పారిపోతాయి." 6యేసు ఈ ఉపమానం ఉపయో
గించి బోధించాడు. కాని వాళ్ళకు ఆయనేమి చెబుతు
న్నాడో అర్థం కాలేదు.

7అందువల్ల యేసు మళ్ళీ ఈ విధంగా చెప్పటం
మొదలు పెట్టాడు: "నిజంగా నేను గొఱ్ఱెలకు ద్వారాన్ని.
8నాకన్నా ముందు వచ్చిన వాళ్ళు దొంగలు, దోపిడి
గాళ్ళు. కనుక గొఱ్ఱెలు వాళ్ళ మాటలు వినలేదు.
9నేను ద్వారాన్ని. నా ద్వారా ప్రవేశించిన వాళ్ళు రక్షింప
బడతారు. వాళ్ళు స్వేచ్ఛగా లోపలికి వస్తూ పోతూ
ఉంటారు. ఆ గొఱ్ఱెలకు పచ్చిక బయళ్ళు కనిపిస్తాయి.
10దొంగ దొంగతనం చేయటానికి, చంపటానికి,
నాశనం చేయటానికి వస్తాడు. నేను వాళ్ళకు క్రొత్త
జీవితం ఇవ్వాలని వచ్చాను. ఆ క్రొత్త జీవితం సంపూర్ణ
మైనది.

11"మంచి కాపరి గొఱ్ఱెల కోసం చావటానికి కూడా
సిద్ధమౌతాడు. నేను ఆ మంచి కాపరిని. 12కూలి కోసం
పనిచేసే వాడు కాపరికాడు. గొఱ్ఱెలు అతనివి కావు.
కనుక అతడు తోడేళ్ళు రావటం చూస్తే గొఱ్ఱెల్ని
వదిలి పారిపోతాడు. అప్పుడు తోడేళ్ళు వచ్చి మంద
మీద పడి వాటిని చెదరగొడతాయి. 13అతడు కూలి
కొరకు పని చేసేవాడు కాబట్టి గొఱ్ఱెల క్షేమం చూడడు.

14-15"నేను మంచి కాపరిని. నా తండ్రికి నన్ను
గురించి, నాకు నా తండ్రిని గురించి తెలుసు. అదే
విధంగా నాకు నా గొఱ్ఱెల్ని గురించి, నా గొఱ్ఱెలకు
నా గురించి తెలుసు. నా గొఱ్ఱెల కోసం నేను ప్రాణం
ఇస్తాను. 16ఈ మందకు చెందని గొఱ్ఱెలు కొన్ని
ఉన్నాయి. అవికూడా నావే. వాటిని కూడా నేను
తీసుకొని రావాలి. అవి నా మాట వింటాయి. అప్పుడు
అన్నీ ఒకే మందగా ఉంటాయి. ఒకే ఒక కాపరి ఉంటాడు.
17నేను నా ప్రాణం యివ్వటానికి సిద్ధంగా ఉన్నాను.
దాన్ని తిరిగి పొందడానికి శక్తిమంతుడను. కనుకనే నా
తండ్రి నన్ను ప్రేమిస్తున్నాడు. 18నా ప్రాణాన్ని
నానుండి ఎవ్వరూ తీసుకోలేరు. నేను స్వయంగా నా
ప్రాణం యిస్తాను. నా ప్రాణం యివ్వటానికి, తిరిగి
తీసుకోవటానికి నాకు అధికారం ఉంది. అది నా తండ్రి
ఆజ్ఞ."

19ఈ మాటల వల్ల యూదుల్లో తిరిగి చీలికలు
వచ్చాయి. 20చాలా మంది, "దయ్యం పట్టి అతనికి
బాగా పిచ్చెక్కింది. అతని మాటలెందుకు వినటం?"
అని అన్నారు. 21కాని మరికొందరు, "అవి దయ్యం
పట్టినవాని మాటలు కావు. దయ్యం గ్రుడ్డి వాళ్ళకు
ఎట్లా దృష్టిని కలిగించగలదు?" అని అన్నారు.

### యూదులు విశ్వసించకపోవటం

22ఆలయ ప్రతిష్ఠిత అనే పండుగ యెరూష
లేములో జరుగుతూంది. 23అది చలికాలం. యేసు
మందిరావరణంలో సొలొమోను మంటపం దగ్గర
నడుస్తూవున్నాడు. యూదులు ఆయన చుట్టూ గుమి
కూడారు. 24వాళ్ళు, "నీవు మమ్మల్ని ఎంతకాలం సందే
హంలో ఉంచుతావు? నీవు క్రీస్తువయినట్లైతే దాచ
కుండా చెప్పు" అని అన్నారు.

25యేసు, "ఆ విషయం నేను ఇది వరకే చెప్పాను.
కాని మీరు నమ్మటం లేదు. నా తండ్రి పేరిట నేను
చేస్తున్న అద్భుతాలే నేను ఎవరన్న దానికి రుజువు.
26కాని మీరు నా మందకు చెందిన వాళ్ళు కాదు.
కాబట్టి నన్ను విశ్వసించటం లేదు. 27నా గొఱ్ఱెలు నా
మాట గుర్తిస్తాయి. నాకు వాటిని గురించి తెలుసు.
అవి నన్ను అనుసరిస్తాయి. 28వాటికి నేను అనంత
జీవితం యిస్తాను. అవి ఎన్నటికీ మరణించవు. వాటిని
నా అండ నుండి ఎవ్వరూ తీసుకొని పోలేరు. 29వాటిని
నాకిచ్చిన నా తండ్రి అందరి కన్నా గొప్పవాడు. నా
తండ్రి అండనుండి వాటిని ఎవ్వరూ తీసుకొని పోలేరు.
30నేను, నా తండ్రి ఒకటే!" అని అన్నాడు.

31యూదులు ఆయన్ని కొట్టాలని మళ్ళీ రాళ్ళె
త్తారు. 32కాని యేసు వాళ్ళతో, "నేను నా తండ్రి
చేయుమన్న ఎన్నో మంచి పనులు చేసాను. వీటిలో
దేన్ని చేసినందుకు మీరు నన్ను కొట్టాలనుకుంటు
న్నారు?" అని అన్నాడు.

33యూదులు, "నీవు మంచి పనులు చేసినందుకు
రాళ్ళు రువ్వటం లేదు కాని, నీవు దైవదూషణ చేస్తు
న్నందుకు. మనిషివై దేవుణ్ణని అంటున్నందుకు నిన్ను
చంపదలచాము" అని అన్నారు.

34యేసు సమాధానంగా, "మీ ధర్మశాస్త్రంలో, 'మీరు
దేవుళ్ళని' దేవుడు అన్నట్లు వ్రాయబడి ఉంది. 35మీ
ధర్మశాస్త్రం అసత్యం చెప్పదు. దేవుడు తన సందేశం
విన్న ప్రజల్ని దేవుళ్ళుగా అన్నాడు. 36తండ్రి నన్ను
ఎన్నుకొని తన కార్యం చెయ్యటానికి ఈ ప్రపం
చంలోకి పంపాడు. మరి నేను దేవుని కుమారుణ్ణని
అనటం ఆయన్ని దూషించటం ఎట్లా ఔతుంది?
37నేను, నా తండ్రి కార్యం చేస్తే తప్ప నన్ను విశ్వసించ
కండి. 38నేను నా తండ్రి కార్యాన్ని చేసాను. కనుక
మరి నన్ను విశ్వసించకపోయినా కనీసం నా కార్యాన్ని
విశ్వసించండి. అలా చేస్తే నా తండ్రి నాలో ఉన్నాడని,
నేను నా తండ్రిలో ఉన్నానని మీకు స్పష్టంగా తెలిసి
పోతుంది."

39ఆయన్ని బంధించాలని వాళ్ళు మరొక సారి
ప్రయత్నించారు. కాని ఆయన అక్కడ నుండి వెళ్ళి
పోయాడు.
40యేసు మళ్ళీ యొర్దాను నది యొక్క అవతలి
ఒడ్డుకు వెళ్ళి అక్కడ ఉండిపొయ్యాడు. ఇదివరలో
యోహాను బాప్తిస్మము నిచ్చింది ఇక్కడే. 41అనేకులు
ఆయన దగ్గరకు వచ్చారు. "వాళ్ళు యోహాను ఏ
మహాత్యం చెయ్యలేదు. కాని ఈయన్ని గురించి అతను
చెప్పిన ప్రతీ విషయం నిజం" అని పరస్పరం మాట్లాడు
కున్నారు. 42అక్కడ అనేకులు యేసును విశ్వసించారు.

11 బేతనియ గ్రామానికి చెందిన లాజరుకు జబ్బు
చేసింది. మరియ, ఆమె సోదరి మార్త కూడా
ఆ గ్రామంలో ఉండే వాళ్ళు. 2ఒకప్పుడు ప్రభువు
పాదాల మీద అత్తరు పోసి తన తల వెంట్రుకలతో
తుడిచింది ఈ మరియయే! జబ్బుతో ఉండిన లాజరు
మరియ సోదరుడు. 3ఈ స్త్రీలు, "ప్రభూ! మీరు ప్రేమి
స్తున్న లాజరు జబ్బుతో ఉన్నాడు" అన్న వార్త
యేసుకు పంపారు.
4యేసు, విని, "ఈ జబ్బు చంపటానికి రాలేదు.
దేవుని కుమారునికి మహిమ కలుగచేసి తద్వారా దేవుని
మహిమను ప్రకటించటానికి వచ్చింది" అని అన్నాడు.
5యేసుకు మార్త పట్ల, ఆమె సోదరి పట్ల, లాజరు
పట్ల ప్రేమ ఉంది. 6లాజరు జబ్బుతో ఉన్నాడని యేసు
విన్నాడు. అక్కడ రెండురోజులు ఉండి, 7ఆ తర్వాత
తన శిష్యులతో, "మనమంతా యూదయకు తిరిగి
వెళ్దాం" అని అన్నాడు.
8వాళ్ళు, "కాని రబ్బీ! యింతకు ముందే
యూదులు మిమ్మల్ని రాళ్ళతో కొట్టాలని ప్రయత్నిం
చారు. అయినా మీరు తిరిగి అక్కడికి వెళ్తున్నారా?"
అని అడిగారు.
9యేసు, "దినానికి పన్నెండు గంటలు వెలుతురుం
టుంది. పగటి వేళ నడిచేవాడు ప్రపంచం యొక్క
వెలుగు చూస్తుంటాడు. కనుక క్రిందపడడు. 10రాత్రి
వేళ నడిచే వానిలో వెలుగు ఉండదు. కనుక క్రింద
పడతాడు" అని అన్నాడు.
11ఈ విషయాలు చెప్పాక యేసు యింకా ఈ
విధంగా అన్నాడు: "మన స్నేహితుడు లాజరు నిద్ర
పోయాడు. అతణ్ణి నిద్రనుండి లేపటానికి నేను అక్కడికి
వెళ్తున్నాను."
12ఆయన శిష్యులు, "ప్రభూ! నిద్రపోతే ఆరో
గ్యంగా ఉంటాడు" అని అన్నారు.
13యేసు మాట్లాడింది అతని చావును గురించి.
కాని ఆయన శిష్యులు ఆయన సహజమైన నిద్రను
గురించి మాట్లాడుతున్నాడనుకున్నారు. 14అప్పుడు
యేసు స్పష్టంగా, "లాజరు చనిపోయాడు. 15నేనక్కడ
లేనిది మంచిదైంది. మీ కోసమే అలా జరిగింది. మీరు
నమ్మాలని నా ఉద్దేశ్యం. ఇప్పుడు అక్కడికి వెళ్దాం"
అని అన్నాడు.
16దిదుమ అని పిలువబడే తోమా, మిగతా శిష్యు
లతో, "యేసుతో కలసి చనిపోవటానికి మనం కూడా
ఆయన వెంట వెళ్దాం" అని అన్నాడు.

### లాజరు కుటుంబాన్ని ఓదార్చుట

17యేసు అక్కడికి చేరుకున్నాడు. నాలుగు రోజుల
ముందే లాజరు సమాధి చేయబడ్డాడని ఆయనకు
తెలిసింది.
18బేతనియ, యెరూషలేమునకు సుమారు రెండు
మైళ్ళ దూరంలో ఉంటుంది. 19చాలా మంది
యూదులు మార్తను, మరియను వాళ్ళ సోదరుడు
చనిపోయినందుకు ఓదార్చటానికి వచ్చారు.
20యేసు వస్తున్నాడని విని మార్త ఆయన్ని
కలుసుకోవటానికి వెళ్ళింది. కాని మరియ ఇంట్లోనే
ఉండిపోయింది. 21మార్త యేసుతో, "ప్రభూ! మీరి
క్కడ ఉండి ఉంటే నా సోదరుడు చనిపోయే వాడు
కాదు. 22కాని, యిప్పటికైనా మీరడిగితే దేవుడు
మీరడిగింది యిస్తాడని నాకు తెలుసు" అని అంది.
23యేసు ఆమెతో, "మీ సోదరుడు మళ్ళీ బ్రతికి
వస్తాడు" అని అన్నాడు.
24మార్త, "చివరి రోజున అనగా అందరూ బ్రతికి
వచ్చే రోజున అతడూ బ్రతికి వస్తాడని నాకు తెలుసు"
అని సమాధానం చెప్పింది.
25యేసు, "బ్రతికించే వాణ్ణి, బ్రతుకును నేనే.
నన్ను నమ్మినవాడు చనిపోయినా జీవిస్తాడు. 26జీవి
స్తున్నవాడు నన్ను విశ్వసిస్తే ఎన్నటికి మరణించడు.
ఇది నీవు నమ్ముతున్నావా?" అని అడిగాడు.
27ఆమె, "నమ్ముతున్నాను ప్రభూ! మీరు క్రీస్తు
అని, ఈ ప్రపంచంలోకి వచ్చిన దేవుని కూమారుడవని
నమ్ముతున్నాను" అని అన్నది.
28ఈ విధంగా అన్న తర్వాత యింటికి వెళ్ళి తన
సోదరి మరియను ప్రక్కకు పిలిచి, ఆమెతో,
"బోధకుడు వచ్చాడు. నీ కొరకు అడుగుతున్నాడు"
అని అంది. 29మరియ యిది విని వెంటనే లేచి ఆయన
దగ్గరకు వెళ్ళింది. 30యేసు గ్రామంలోకి రాలేదు. ఆయ
నింకా మార్త కలుసుకొన్న చోటే ఉన్నాడు. 31మరియ
యింట్లో ఆమెను ఓదారుస్తున్న యూదులు ఆమె
హడావుడిగా లేచి బయటకు వెళ్ళటం చూసారు. ఆమె
దుఃఖించటానికి సమాధి దగ్గరకు వెళ్తోందని ఆమె వెంట
వెళ్ళారు. 32మరియ యేసు ఉన్న చోటికి వెళ్ళి
ఆయన్ని చూసి, కాళ్ళ ముందుపడి, "ప్రభూ! మీరి
క్కడ ఉండి ఉంటే నా సోదరుడు చనిపోయేవాడు
కాదు!" అని అన్నది.
33ఆమె, ఆమెతో వచ్చిన యూదులు దుఃఖించటం
చూసి యేసు తన ఆత్మలో కలవర పడ్డాడు. ఆయన

హృదయం కరిగి పోయింది. 34“అతన్నెక్కడ సమాధి
చేసారు?” అని యేసు అడిగాడు. “వచ్చి చూడండి
ప్రభూ!” అని వాళ్ళు సమాధానం చెప్పారు.
35యేసు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.
36అప్పుడు యూదులు, “యేసు అతన్నెంతగా
ప్రేమించాడో చూడండి!” అని అన్నారు.
37కాని కొందరు, “గ్రుడ్డివానికి కళ్ళు తెప్పించిన
యితడు, చనిపోకుండా చెయ్యలేక పోయాడా?” అని
అన్నారు.
38యేసు హృదయం మళ్ళీ కదిలింది. ఆయన
సమాధి దగ్గరకు వెళ్ళాడు. ఆ సమాధి ఒక గుహలా
ఉంది. ఒక రాయి దానికి అడ్డంగా పెట్టబడి ఉంది.
39“ఆ రాయి తీసి వెయ్యండి!” అని అన్నాడు.
చనిపోయిన వాని సోదరి మార్త, “కాని, ప్రభూ!
అతని దేహం నాలుగు రోజులనుండి అక్కడవుంది.
యిప్పటికది కంపు కొడ్తూ ఉంటుంది” అని అంది.
40అప్పుడు యేసు, “నమ్మితే దేవుని మహిమను
చూస్తావని నేను చెప్పలేదా?” అని అన్నాడు.
41వాళ్ళు ఆ రాయి తీసి వేసారు. యేసు పైకి
చూసి, “తండ్రీ నీవు నామాటలు విన్నందుకు కృత
జ్ఞుణ్ణి. 42నా మాటలు అన్ని వేళలా వింటావని నాకు
తెలుసు. నీవు నన్ను పంపించినట్లు వీళ్ళు నమ్మాలని,
వీళ్ళకు అర్థం కావాలని అక్కడ నిలుచున్న వాళ్ళ
మంచి కోసం యిలా అంటున్నాను” అని అన్నాడు.
43ఈ విధంగా అన్నాక యేసు పెద్ద స్వరంతో,
“లాజరూ! వెలుపలికి రా!” అని పిలిచాడు. 44చని
పోయిన వాడు వెలుపలికి వచ్చాడు. అతని కాళ్ళు
చేతులు వస్త్రాలతో చుట్టబడి ఉన్నాయి. అతని ముఖం
మీద కూడా ఒక గుడ్డ కట్టబడి ఉంది.
యేసు వాళ్ళతో, “సమాధి దుస్తుల్ని తీసి వేయండి,
అతణ్ణి వెళ్ళనివ్వండి!” అని అన్నాడు.
45మరియ దగ్గరకు వచ్చిన యూదుల్లో చాల మంది
యేసు చేసింది చూసి ఆయన యందు నమ్మకం
ఉంచారు. 46కొందరు మాత్రం పరిసయ్యుల దగ్గరకు
వెళ్ళి యేసు చేసింది చెప్పారు. 47అప్పుడు ప్రధాన
యాజకులు, పరిసయ్యులు మహాసభను ఏర్పాటు
చేసారు. “మనం ఏం చేద్దాం? ఈ మనుష్యుడు చాలా
మహత్కార్యాలు చేస్తున్నాడు. 48అతణ్ణి ఈ విధంగా
వదిలి వేస్తే ప్రతి ఒక్కడు అతని శిష్యుడవుతాడు. ఆ
తర్వాత రోమనులు వచ్చి మన మందిరాన్ని, మన
దేశాన్ని నాశనం చేస్తారు” అని అన్నారు.
49వాళ్ళలో ఒకడైన కయప అనబడే వాడు, “మీకేమీ
తెలియదు!” అని అన్నాడు. కయప ఆ సంవత్స రానికి
ప్రధాన యాజకుడు. 50అతడు యింకా, “దేశమంతా
నాశనం కావటానికన్నా ప్రజల కోసం ఒక మనిషి
చావటం మంచిది. ఇది మీకు అర్థం కాదా?” అని
అన్నాడు.
51-52యూదుల దేశం కోసమేకాక, ప్రపంచంలో
చెదరియున్న దేవుని ఇతర జనాంగములను ఒకటిగా
చేయటానికి కూడా యేసు ప్రాణమిస్తాడని కయప
ప్రవచనం చెప్పాడు. అవి అతడు స్వయంగా ఆడిన
మాటలు కావు. అవి అతడు ఆ సంవత్సరపు ప్రధాన
యాజకునిగా పలికిన మాటలు.
53ప్రధాన యాజకుని మాటలు విని ప్రజలు ఆనాటి
నుండి యేసును చంపటానికి పన్నాగాలు పన్నటం
మొదలు పెట్టారు. 54అందువల్ల యేసు యూదుల
మధ్య బహిరంగంగా తిరగటం మానేసి వాళ్ళకు
దూరంగా ఎడారి దగ్గర ఉన్న ఎఫ్రాయిము అనే గ్రామా
నికి వెళ్ళి పోయాడు. అక్కడ ఆయన తన శిష్యులతో
కొంత కాలం గడిపాడు.
55యూదుల పస్కా పండుగ దగ్గరకు వచ్చింది.
పండుగకు ముందు శుద్ధి చేసుకోవటానికి గ్రామ గ్రామా
లనుండి చాలా మంది ప్రజలు యెరూషలేంకు వెళ్ళారు.
56అక్కడ వీళ్ళంతా యేసు కోసం వెతికారు. మంది
రంలో సమావేశం అయ్యాక వాళ్ళు, “మీరేమను
కుంటున్నారు? పండుగకు వస్తాడా? రాడా?” అంటూ
పరస్పరం మాట్లాడుకున్నారు. 57ప్రధానయాజకులు,
పరిసయ్యులు, “యేసు ఎక్కడున్న విషయం తెలిసిన
వాడు వెంటనే తమకు తెలియచేయవలెనని” ఒక ఆజ్ఞ
ప్రకటించారు. యేసును బంధించాలని వాళ్ళ ఉద్దేశ్యం.
12 పస్కా పండుగకు ఆరు రోజుల ముందే యేసు
బేతనియ చేరుకున్నాడు. యేసు బ్రతికించిన
లాజరు యింతకు పూర్వం ఆ గ్రామంలో నివసిస్తూ
ఉండేవాడు. 2అక్కడ యేసు గౌరవార్థం ఒక విందు
ఏర్పాటు చేయబడింది. మార్త వడ్డిస్తూ ఉంది.
యేసుతో సహా కూర్చున్న వాళ్ళలో లాజరు ఒకడు.
3మరియ జటామాంసి చెట్టుతో చేయబడిన ఒక
సేరున్నర విలువైన మంచి అత్తరు యేసు పాదాల
మీద పోసి, తన తల వెంట్రుకలతో పాదాలను
తుడిచింది. ఇల్లంతా అత్తరు వాసనతో నిండిపోయింది.
4-5యూదా ఇస్కరియోతు యేసు శిష్యుల్లో
ఒకడు. యేసుకు ద్రోహం చెయ్యబోయేవాడు వీడే.
యూదా, “ఈ అత్తరు అమ్మి, ఆ డబ్బు పేద వాళ్ళ
కెందుకివ్వలేదు. ఆ అత్తరు వెల మూడువందల దేనారా
లన్నా ఉంటుంది కదా!” అని అన్నాడు. 6యూదాకు
పేద వాళ్ళపై కనికరం ఉండుటవలన యిలా అనలేదు.
వీడు దొంగ. డబ్బు సంచి తన దగ్గర ఉండటంవల్ల
దానిలోవున్న డబ్బు దొంగిలించే వాడు.
7యేసు, “ఆమె ఈ అత్తరుతో నన్ను సమాధికి
సిద్ధం చెయ్యటానికి ఈనాటి దాకా దాన్ని దాచి
ఉంచింది. 8మీతో పేదవాళ్ళు ఎప్పటికీ ఉంటారు.
కాని నేను ఎల్లకాలం మీతో ఉండను” అని అన్నాడు.
9ఇంతలో పెద్ద యూదుల గుంపు ఒకటి యేసు
అక్కడవున్నాడని విని అక్కడికి వచ్చింది. ఆయన

కోసమే కాకుండా ఆయన బ్రతికించిన లాజరును
కూడా చూడటానికి వచ్చారు. 10-11తద్వారా ప్రధాన
యాజకులు లాజరును కూడా చంపాలని పన్నాగం
పన్నారు. ఎందుకంటే యితని కారణంగానే చాలామంది
యూదులు యేసు దగ్గరకు వెళ్ళి ఆయన యందు
నమ్మకం ఉంచారు.

### మెస్సీయ యెరూషలేములో ప్రవేశించటం

(*మత్తయి 21:1-11; మార్కు 11:1-11; లూకా 19:28-40*)
12మరుసటి రోజు పండుగ కోసం వచ్చిన గుంపు
ఒకటి యేసు యెరూషలేంలోకి వస్తున్నాడని విన్నది.
13వాళ్ళు ఖర్జూరపు మట్టల్ని పట్టుకొని,

"హోసన్నా!* ప్రభువు పేరిట వచ్చిన
ఇశ్రాయేలు రాజు ధన్యుడు!"
*కీర్తన 118:25-26*

అని కేకలు వేస్తూ ఆయన్ని కలవటానికి వచ్చారు.

14యేసు ఒక గాడిదపిల్లను కనుగొని దానిపై
కూర్చున్నాడు. ఈ సందర్భాన్ని గురించి ప్రవచనాల్లో
ఈ విధంగా వ్రాయబడి ఉంది:

15 "సీయోను కుమారీ, భయపడకు! గాడిద
పిల్లపై కూర్చొని నీ రాజు వస్తున్నాడు
చూడు!"
*జెకర్యా 9:9*

16ఇవి ఆయన శిష్యులకు అప్పుడు అర్థంకాలేదు.
కాని యేసు మహిమ పొందిన తర్వాత ప్రవక్తలు
ఆయన్ను గురించి వ్రాశారని గుర్తించారు. అంతేగాక
తాము చేసిన వాటిని గురించి అర్థం చేసుకొన్నారు.
17యేసు లాజరును సమాధినుండి లేచి రమ్మని
పిలవటము, అతణ్ణి బ్రతికించటము చూసిన ప్రజలు
ఆవార్త ప్రచారం చేసారు. 18చాలా మంది ఆయన ఈ
అద్భుతాన్ని చేసాడని విన్నందువలన ఆయన్ని కలుసు
కోవటానికి వెళ్ళారు. 19అందువలన పరి సయ్యులు
పరస్పరం, "చూడండి! మనం గెలవటం లేదు. ప్రపంచ
మంతా అతని వెంట ఎట్లా వెళ్తున్నారో చూడండి!"
అని మాట్లాడుకున్నారు.

### యేసు తన మరణం గురించి ప్రవచించాడు

20పండుగ రోజు ఆరాధన చెయ్యటానికి వెళ్ళిన
వాళ్ళల్లో గ్రీకులు కూడా ఉన్నారు. 21వాళ్ళు ఫిలిప్పును
కలుసుకొని, "అయ్యా! మేము యేసును చూడటానికి
వచ్చాము" అని అన్నారు. ఫిలిప్పు, గలిలయలోని
బేత్సయిదా అనే గ్రామానికి చెందిన వాడు. 22ఫిలిప్పు
వెళ్లి అంద్రెయతో చెప్పాడు. వీళ్ళిద్దరూ వెళ్ళియేసుతో
చెప్పారు.
23యేసు ఇలా అన్నాడు: "మనుష్యకుమారుడు
మహిమపొందు గడియ దగ్గరకు వచ్చింది. 24ఇది నిజం.
గోధుమ విత్తనం భూమ్మీద పడి చనిపోకపోతే అది
ఒకటిగానే ఉంటుంది. అది చనిపోతే ఎన్నో విత్తనాల్ని
ఉత్పత్తి చేస్తుంది. 25తన ప్రాణాన్ని ప్రేమించే వాడు
దాన్ని పోగొట్టుకుంటాడు. కాని ఈ ప్రాపంచిక జీవి
తాన్ని ఏవగించుకొన్నవాడు తన ప్రాణాన్ని కాపాడు
కొంటాడు. పైగా అనంతజీవితం పొందుతాడు. 26నా
సేవ చేయదలచిన వాడు నన్ను అనుసరించాలి. నేను
ఎక్కడ ఉంటే నా సేవకుడు అక్కడ ఉంటాడు. నా
సేవ చేసేవాణ్ణి నా తండ్రి గౌరవిస్తాడు.
27"ఇక నా ఆత్మ కలవరం చెందుతున్నది. తండ్రీ
నేనేమనాలి? ఈ గడియనుండి నన్ను రక్షించుమని
అడగాలా? కాదు! నేను వచ్చింది ఈ గడియ కోసమే
కదా! 28తండ్రీ నీ పేరుకు మహిమ కలిగించుకో."
అప్పుడు పరలోకం నుండి ఒక స్వరం, "నేను
యిదివరలో నా పేరుకు మహిమ కలిగించాను. మళ్ళీ
దానికి మహిమ కలిగిస్తాను!" అని అన్నది.
29అక్కడ నిలుచున్న ప్రజలు యిది విన్నారు.
కొందరు ఉరిమిందన్నారు. మరి కొందరు, "దేవదూత
ఆయనతో మాట్లాడాడు" అని అన్నారు.
30యేసు, "ఆ గొంతు మీ కోసం పలికింది. నా
కోసం కాదు. 31ఈ ప్రపంచంపై తీర్పు చెప్పే సమయం
వచ్చింది. ఈ లోకాధికారిని బయటకు తరిమి వేసే
సమయం వచ్చింది. 32కాని దేవుడు నన్ను ఈ భూమ్మీ
దినుండి పైకెత్తినప్పుడు నేను ప్రజలందర్ని నా
యొద్దకు ఆకర్షిస్తాను. వాళ్ళను నా దగ్గరకు పిలి పించు
కుంటాను" అని అన్నాడు. 33ఇది చెప్పి తాను ఏ
విధంగా మరణించనున్నాడో సూచించాడు.
34ప్రజలు, "మేము ధర్మశాస్త్రం ద్వారా 'క్రీస్తు'
చిరకాలం ఉంటాడని విన్నాము. అలాంటప్పుడు
మనుష్యకుమారుణ్ణి దేవుడు పైకెత్తుతాడని ఎట్లా అన
గలుగుతున్నావు? ఈ మనుష్యకుమారుడెవరు?" అని
అన్నారు. 35అప్పుడు యేసు వాళ్ళతో, "వెలుగు మీ
కోసం యింకా కొంత కాలం మాత్రమే ఉంటుంది.
చీకటి రాకముందే, అంటే వెలుగు ఉండగానే ప్రయాణం
సాగించండి. చీకట్లో నడిచే వ్యక్తికి తానెక్కడికి వెళుతు
న్నాడో తెలియదు. 36వెలుగు ఉన్నప్పుడే దాన్ని విశ్వ
సించండి. అప్పుడు మీరు వెలుగు యొక్క సంతానంగా
లెక్కింపబడతారు" అని అన్నాడు. యేసు మాట్లాడటం
ముగించాక వాళ్ళకు కనిపించకుండా ఉండాలని
దూరంగా వెళ్ళి పోయాడు.

---

**హోసన్నా** అంటే రక్షించు అని అర్థం. కాని దాని అర్థం ఒక
పొగడ్తగా మారిపోయింది.

### యూదులు నిరాకరించటం

37యేసు ఇన్ని మహాత్కార్యాలు వాళ్ళ సమక్షంలో
చేసినా వాళ్ళలో ఆయన పట్ల విశ్వాసం కలుగలేదు.
38ప్రవక్త యెషయా చెప్పిన ఈ వాక్యాలు నిజం
కావటానికి యిలా జరిగింది:

> "ప్రభూ! మా సందేశం ఎవరు విశ్వ
> సించారు? ప్రభువు తన శక్తిని ఎవరికి
> చూపాడు?"
>
> *యెషయా 53:1*

39అందుచేత వాళ్ళు విశ్వసించలేక పోయారు. ఈ
విషయాన్ని యెషయా ప్రవక్త మరొక చోట చెప్పినది
నెరవేరునట్లు యిలా జరిగింది:

> 40 "ప్రభువు వాళ్ళ కళ్ళు కప్పి, వాళ్ళ హృద
> యాలు మూసి వేశాడు. వాళ్ళు చూడ
> రాదని, వాళ్ళు అర్థం చేసుకోరాదని ఆయన
> ఉద్దేశ్యం. అలా చేయకపోతే వాళ్ళు నా
> వైపు మళ్లుతారు. వాళ్ళకు నేను నయం
> చేయవలసివస్తుంది."
>
> *యెషయా 6:10*

41యెషయా యేసు మహిమను చూసాడు. కనుకనే
ఆయన్ని గురించి ఆ విధంగా మాట్లాడాడు.
42ఈ పరిస్థితుల్లో కూడా యూదుల నాయకుల్లో
కొందరు యేసును విశ్వసించారు. కాని పరిసయ్యులు
తమను సమాజం నుండి బహిష్కరిస్తారనే భయం వల్ల
ఆ విషయాన్ని బహిరంగంగా చెప్పలేదు. 43ఎందుకంటే,
వీళ్ళకు దేవుని మెప్పుకన్నా ప్రజల పొగడ్తలంటే ఎక్కువ
యిష్టం.
44యేసు, "నన్ను విశ్వసించేవాడు, నన్నే కాక
నన్ను పంపిన వానియందు కూడా విశ్వసిస్తాడు.
45అతడు నన్ను చూసేటప్పుడు నన్ను పంపిన వానిని
చూస్తున్నట్లే! 46నేను ఈ ప్రపంచంలోకి వెలుగ్గా వచ్చా
ను! ఎందుకంటే నన్ను విశ్వసించేవాడు చీకటిలో
ఉండ కూడదని. అందుచేత నేను చెప్పే మాటలన్నీ
తండ్రి నాతో చెప్పుమని ఇచ్చిన మాటలే.
47"ఎవడైనను నా మాటలు విని వాటిని అనుస
రించని వానికి నేను తీర్పు తీర్చను. ఎందుకంటే నేను
ఈ ప్రపంచానికి తీర్పు తీర్చటానికి రాలేదు, కాని
నేను రక్షించటానికి వచ్చాను. 48నన్ను, నా మాటల్ని
ఇష్టపడక వ్యతిరేకించేవానిపై ఒక న్యాయాధిపతి
ఉన్నాడు. నేను పలికిన మాటయే చివరి దినమున
వానికి తీర్పుతీరుస్తుంది. 49నేను నా యిష్ట ప్రకారం
మాట్లాడలేదు, గాని నా తండ్రి ఏమి చెప్పుమని నాకు
ఆజ్ఞాపించాడో అలాగే చెప్పాను. 50ఆయన ఆజ్ఞ నిత్య
జీవానికి నడిపిస్తుందని నాకు తెలుసు. అందుచేత నేను
చెప్పే మాటలన్నీ తండ్రి నాతో చెప్పుమని ఇచ్చిన
మాటలే" అని అన్నాడు.

### యేసు తన శిష్యుల పాదాలు కడగటం

13 పస్కా పండుగ దగ్గరకు వచ్చింది. ఈ ప్రపం
చాన్ని వదిలి తన తండ్రి దగ్గరకు వెళ్ళే
సమయం వచ్చిందని యేసుకు తెలుసు. ఆయన ఈ
ప్రపంచంలో ఉన్న తన వాళ్ళను ప్రేమించాడు. తాను
వాళ్ళనెంత సంపూర్ణంగా ప్రేమించాడంటే ఆ ప్రేమను
వాళ్ళకు చూపించాడు.
2యేసు, ఆయన శిష్యులు రాత్రి భోజనం చేయు
టకు కూర్చొని ఉన్నారు. సైతాను అప్పటికే సీమోను
కుమారుడైన యూదా ఇస్కరియోతులో ప్రవేశించి
యేసుకు ద్రోహం చెయ్యమని ప్రేరేపించాడు. 3తండ్రి
తనకు సంపూర్ణమైన అధికారమిచ్చినట్లు యేసుకు
తెలుసు. తాను దేవుని నుండి వచ్చిన విషయము,
తిరిగి ఆయన దగ్గరకు వెళ్ళ బోతున్న విషయము
ఆయనకు తెలుసు. 4అందువల్ల ఆయన భోజన పంక్తి
నుండి లేచాడు. తన పైవస్త్రాన్ని తీసివేసి, ఒక కండు
వాను నడుముకు చుట్టుకున్నాడు. 5ఆ తర్వాత ఒక
వెడల్పయిన పళ్ళెంలో నీళ్ళు పోసి తన శిష్యుల
పాదాలు కడగటం మొదలుపెట్టాడు. నడుముకు చుట్టు
కున్న కండువాతో వాళ్ళ పాదాలు తుడిచాడు.
6యేసు సీమోను పేతురు దగ్గరకు రాగానే, పేతురు
ఆయనతో, "ప్రభూ! మీరు నా పాదాలు కడుగుతారా?"
అని అన్నాడు. 7యేసు, "నేను చేస్తున్నది నీకు
యిప్పుడు అర్థం కాదు. తదుపరి అర్థమౌతుంది" అని
సమాధానం చెప్పాడు.
8పేతురు, "మీరు నా పాదాలు ఎన్నటికీ కడుగ
కూడదు. నేను ఒప్పుకోను" అని అన్నాడు.
యేసు, "నీ పాదాలు కడిగితే తప్ప నీకు, నాకు
సంబంధం ఉండదు!" అని సమాధానం చెప్పాడు.
9సీమోను పేతురు, "ప్రభూ! అలాగైతే నా పాదాలే
కాదు, నా చేతుల్ని, నా తలను కూడా కడగండి!"
అని అన్నాడు.
10యేసు సమాధానం చెబుతూ, "స్నానం చేసిన
వాని శరీరమంతా శుభ్రంగా ఉంటుంది. కనుక అతడు
పాదాలు మాత్రం కడుక్కుంటే చాలు ఒక్కడు తప్ప
మీరందరూ పవిత్రులై ఉన్నారు" అని అన్నాడు.
11తనకు ద్రోహం చేయనున్న వాడెవడో యేసుకు
తెలుసు. కనుకనే ఒక్కడు తప్ప అందరూ పవిత్రంగా
ఉన్నారని ఆయనన్నాడు.
12ఆయన వాళ్ళ పాదాలు కడగటం ముగించి, పై
వస్త్రాన్ని వేసుకొని తాను యింతకు ముందు
కూర్చున్న స్థలానికి వెళ్ళాడు. యేసు, "నేను చేసింది
మీకు అర్థమైందా? 13మీరు నన్ను 'బోధకుడా!' అని

'ప్రభూ!' అని పిలుస్తారు. నేను బోధకుడను కనుక
మీరు నన్ను ఆ విధంగా పిలవటం సమంజసమే!
14మీ బోధకుడను, ప్రభువును అయిన నేను మీ
పాదాలు కడిగాను. కనుక మీరు కూడా ఒకరి పాదాలు
ఒకరు కడగాలి. 15నేను చేసిన దాన్ని ఆదర్శంగా తీసు
కొని నేను చేసినట్లు మీరు కూడా చేయాలని నా
ఉద్దేశ్యం. 16ఇది నిజం. యజమాని కంటే సేవకుడు
గొప్ప కాదు. అలాగే వార్త తెచ్చేవాడు వార్త పంపిన
వాని కన్నా గొప్ప కాదు. 17ఇవన్నీ మీరు తెలుసు
కున్నారు. వీటిని ఆచరిస్తే ధన్యులౌతారు.
18"నేనిది మీ అందర్ని గురించి చెప్పటం లేదు.
నేను ఎన్నుకొన్న వాళ్ళు నాకు తెలుసు. కాని ఈ
విషయం జరిగి తీరాలి: 'నాతో రొట్టె పంచుకొన్న
వాడు నాకు ద్రోహం చేస్తాడు.'* ఇవి జరుగక ముందే
మీకు అన్నీ చెబుతున్నాను. 19అవి జరిగినప్పుడు నేనే
ఆయన్ని అని మీరు విశ్వసించాలని నా ఉద్దేశ్యం. 20ఇది
నిజం. నేను పంపిన వాణ్ణి అంగీకరించిన వాడు నన్ను
అంగీకరించిన వానిగా పరిగణింపబడతాడు. నన్ను అంగీ
కరించిన వాడు నన్ను పంపిన వాణ్ణి అంగీకరించినట్లు
పరిగణింపబడతాడు" అని అన్నాడు.

### వంచకుడు

*(మత్తయి 26:20-25; మార్కు 14:17-21; లూకా 22:21-23)*

21యేసు మాట్లాడటం ముగించాడు. ఆయన మన
స్సుకు చాలా వేదన కలిగింది. ఆయన, "ఇది నిజం.
మీలో ఒకడు నాకు ద్రోహం చేస్తాడు" అని అన్నాడు.
22ఆయన శిష్యులు, ఆయన ఎవర్ని గురించి అంటు
న్నాడో తెలుసుకోలేక ఒకరి ముఖం ఒకరు చూసుకు
న్నారు. 23యేసు ప్రేమించిన శిష్యుల్లో ఒకడు యేసు
ప్రక్కనే కూర్చొని ఉన్నాడు. 24సీమోను పేతురు ఆ
శిష్యునితో, "ఎవర్ని గురించి అంటున్నాడో అడుగు"
అని సంజ్ఞ చేసాడు.
25అతడు యేసుకు దగ్గరగా ఒరిగి, "ప్రభూ!
ఎవరు!" అని అడిగాడు.
26యేసు, "నేనీ రొట్టె ముక్కను పాత్రలో ముంచి
ఎవరికిస్తానో వాడే!" అని సమాధానం చెప్పాడు.
తదుపరి రొట్టెముక్కను పాత్రలో ముంచి సీమోను
కుమారుడైన ఇస్కరియోతు యూదాకు యిచ్చాడు.
27రొట్టె తీసుకొన్న వెంటనే సైతాను వానిలోకి ప్రవే
శించాడు. యేసు వానితో, "నీవు చేయబోయేదేదో
త్వరగా చెయ్యి" అని అన్నాడు. 28కాని, భోజనా నికి
కూర్చున్న వాళ్ళకెవ్వరికీ యేసు ఆ విధంగా ఎందు
కంటున్నాడో అర్థం కాలేదు. 29డబ్బు యూదా ఆధీ
నంలో ఉండేది. కాబట్టి పండుగకు కావలసినవి కొని
తెమ్మంటున్నాడని కొందరనుకున్నారు. పేదలకు
కొంత పంచి పెట్టమంటున్నాడని మరికొందరను
కున్నారు.
30యూదా రొట్టె తీసుకొని వెంటనే బయటకు
వెళ్ళిపోయాడు. అది రాత్రి సమయం.

### మహిమ

31వాడు వెళ్ళిపోయాక యేసు, "ఇప్పుడు మనుష్య
కుమారుని మహిమ వ్యక్తమయింది. అలాగే ఆయనలో
దేవుని మహిమ వ్యక్తమయింది. 32దేవుడు ఆయన
ద్వారా మహిమ పొందాక తన కుమారుణ్ణి తనలో
ఐక్యం చేసికొని మహిమపరుస్తాడు. ఆలస్యం చేయడు."
33యేసు, "బిడ్డలారా! నేను మీతో మరి కొంత కాలం
మాత్రమే ఉంటాను. మీరు నా కోసం చూస్తారు.
యూదులకు చెప్పిన విషయాన్నే మీకూ చెబుతు
న్నాను. నేను వెళ్ళే చోటికి మీరు యిప్పుడురారు.

### క్రొత్త ఆజ్ఞ

34"నేను మీకొక క్రొత్త ఆజ్ఞనిస్తున్నాను. మీరు
ఒకరినొకరు ప్రేమించుకొనండి. నేను మిమ్మల్ని
ప్రేమించిన విధంగా మీరు కూడా ఒకరిపట్ల ఒకరు
ప్రేమ కలిగి వుండండి 35మీరు ఒకరినొకరు ప్రేమతో
చూసుకున్నప్పుడే మీరు నాకు శిష్యులని లోకమంతా
తెలుసుకుంటారు.

### యేసు పేతురుతో మాట్లాడటం

*(మత్తయి 26:31-35; మార్కు 14:27-31; లూకా 22:31-34)*

36సీమోను పేతురు, "ప్రభూ! మీరెక్కడికి వెళ్తు
న్నారు?" అని అడిగాడు.
యేసు, "నేను ఎక్కడికి వెళ్తున్నానో అక్కడికి నీవు
యిప్పుడు నా వెంట రాలేవు. కాని తర్వాత నన్ను
అనుసరించగలుగుతావు" అని అన్నాడు.
37పేతురు, "ప్రభూ! యిప్పుడే ఎందుకు నేను నీ
వెంట రాలేను? నేను మీకోసం నా ప్రాణాల్ని అర్పించ
టానికి సిద్ధంగా ఉన్నాను" అని అన్నాడు.
38యేసు, "నీవు నిజంగా నా కోసం నీ ప్రాణం
యిస్తావా? ఇది నిజం. కోడి కూసేలోగా నేనెవరినో
తెలియదని మూడుసార్లు అంటావు!" అని సమాధానం
చెప్పాడు.

### 'మార్గము, సత్యము, జీవము —ఈ మూడు యేసే'

14 "మీరు ఆందోళన చెందకండి. దేవుణ్ణి
నమ్మండి. నన్ను కూడా నమ్మండి. 2నా
తండ్రి యింట్లో ఎన్నో గదులున్నాయి. అలా లేక
పోయినట్లైతే మీకు చెప్పేవాణ్ణి. మీకోసం ఒక స్థలము
నేర్పాటు చేయటానికి అక్కడికి వెళ్తున్నాను. 3నేను

---

**'నాకు ద్రోహం చేస్తాడు'** కీర్తన 41:9.

వెళ్ళి మీకోసం స్థలం ఏర్పాటు చేశాక తిరిగి వచ్చి
మిమ్మల్ని నాతో పిలుచుకొని వెళ్తాను. నేను ఎక్కడ
ఉంటే మీరు అక్కడ ఉండటం నా ఉద్దేశ్యం. 4నేను
వెళ్ళే చోటికి వచ్చే దారి మీకు యిదివరకే తెలుసు”
అని యేసు అన్నాడు.

5తోమా ఆయనతో, “ప్రభూ! మీరు వెళ్ళే చోటు
ఎక్కడుందో మాకు తెలియదు. అలాంటప్పుడు మాకా
దారి ఏ విధంగా తెలుస్తుంది?” అని అన్నాడు.

6యేసు, “మార్గము, సత్యము, జీవము, నేనే! నా
ద్వారా తప్ప తండ్రి దగ్గరకు ఎవ్వరూ రాలేరు. 7నేను
ఎవరో మీకు నిజంగా తెలిసివుంటే నా తండ్రి ఎవరో
మీకు తెలుస్తుంది. యిప్పుడు ఆయన్ని చూసారు.
ఆయనెవరో మీకు తెలుసు” అని సమాధానం
చెప్పాడు.

8ఫిలిప్పు, “ప్రభూ! మాకు తండ్రిని చూపండి.
అది చాలు” అని అన్నాడు.

9యేసు ఈ విధంగా సమాధానం చెప్పాడు: “నేను
యింత కాలం మీతో కలిసి ఉన్నాను కదా! అయినా
నేనెవరినో నీకు తెలియదా ఫిలిప్పు? నన్ను చూస్తే
నా తండ్రిని చూసినట్లే. అలాగైతే తండ్రిని చూపుమని
ఎందుకు అడుగుతున్నావు? 10నేను తండ్రిలో, తండ్రి
నాలో ఉన్నాడని, నీవు నమ్మటం లేదా? నేను చెప్పే
మాటలు నా స్వంతవి కావు. నాలో నివసిస్తున్న తండ్రి
తన పనిని చేస్తున్నాడు. 11నేను తండ్రిలో, తండ్రి
నాలో ఉన్నామని నమ్మండి. లేక మహాత్కార్యాలు
చూసైనా నమ్మండి. 12ఇది నిజం. నేను తండ్రి దగ్గరకు
వెళ్తున్నాను. నన్ను నమ్మిన ప్రతి ఒక్కడూ నేను
చేసిన కార్యాలు చేస్తాడు. వీటికన్నా యింకా గొప్ప
కార్యాలే చేస్తాడు. 13కుమారుని ద్వారా తండ్రి మహిమ
పొందటానికి మీరు నా పేరిట ఏమి అడిగినా చేస్తాను.
14నా పేరిట నన్ను ఏమడిగినా నేను చేస్తాను.

## పవిత్రాత్మ వాగ్దానం

15“మీకు నా మీద ప్రేమ ఉంటే నేను ఆజ్ఞాపించి
నట్లు చేస్తారు. 16-17మీతో చిరకాలం ఉండి, మీకు
సహాయం చెయ్యటానికి మరొక ఉత్తరవాదిని* పంపు
మని నేను తండ్రిని అడుగుతాను. ఆయన ఆత్మను
పంపుతాడు. ఆ పవిత్రాత్మ సత్యాన్ని ప్రకటించటం
తన కర్తవ్యం. ప్రపంచం ఆయన్ని చూడలేదు. ఆయన
గురించి ప్రపంచానికి తెలియదు. కనుక ఆయన్ని అంగీ
కరించలేదు. ఆయన మీతో ఉన్నాడు కనుక మీకు
ఆయన గురించి తెలుసు. ఆయన భవిష్యత్తులో మీతో
ఉంటాడు. లోకం ఆయన్ని అంగీకరించలేదు, ఎందు
కంటే అది ఆయన్ని చూడలేదు, తెలుసుకోలేదు.

18“నేను మిమ్మల్ని అనాథలుగా వదిలి వేయను.
మీ దగ్గరకు తిరిగి వస్తాను. 19కొద్ది రోజుల తర్వాత
ఈ ప్రపంచం నన్ను చూడదు. కాని మీరు నన్ను
చూస్తారు. ఎందుకంటే నేను ఏ విధంగా జీవిస్తున్నానో
అదే విధంగా మీరు కూడా జీవిస్తారు. 20ఆ రోజు నేను
తండ్రిలో, మీరు నాలో, నేను మీలో ఉన్నామన్న
విషయం మీరు గ్రహిస్తారు. 21నా ఆజ్ఞలు విని వాటిని
అనుసరించినవాడే నన్ను ప్రేమించిన వానిగా పరిగణింప
బడతాడు. నన్ను ప్రేమించిన వాణ్ణి నా తండ్రి ప్రేమి
స్తాడు. నేను కూడా అతణ్ణి ప్రేమించి అతనికి ప్రత్యక్ష
మౌతాను.” 22అప్పుడు యూదా (యూదా ఇస్కరి
యోతు కాదు), “కాని ప్రభూ! మీరు మాకు మాత్రమే
ప్రత్యక్షమై, ప్రపంచానికి ప్రత్యక్షంకానని ఎందుకంటు
న్నారు?” అని అన్నాడు.

23యేసు, ఈ విధంగా సమాధానం చెప్పాడు:
“నన్ను ప్రేమించేవాడు నేను చెప్పినట్లు చేస్తాడు.
అలాంటివాణ్ణి నా తండ్రి ప్రేమిస్తాడు. మేము వచ్చి
అతనితో నివసిస్తాము. 24నన్ను ప్రేమించనివాడు నా
మాట వినడు. మీరు వింటున్న నా ఈ మాటలు
నావి కావు. అవి నన్ను పంపిన తండ్రివి.

25“నేను వెళ్ళిపోక ముందే ఈ విషయాలన్నీ మీకు
చెప్పాను. 26తండ్రి నా పేరిట పంపనున్న ఆదరణకర్త,
అంటే పవిత్రాత్మ, మీకు సహాయం చెయ్యటానికి
వస్తాడు. ఆయన మీకు అన్నీ బోధిస్తాడు. నేను చెప్పిన
వన్నీ మీకు జ్ఞాపకం చేస్తాడు.

27“ ‘శాంతిని’ మీకు యిస్తున్నాను. అది నాలో
ఉన్న శాంతి. ప్రపంచం దాన్ని మీకివ్వ జాలదు. కనుక
చింతించకండి. భయపడకండి. 28నేను వెళ్తున్నానని,
మళ్ళీ తిరిగి మీ దగ్గరకు వస్తానని చెప్పటం మీరు
విన్నారు. మీకు నా మీద ప్రేమ ఉంటే నేను తండ్రి
దగ్గరకు వెళ్తున్నందుకు మీరు ఆనందిస్తారు. ఎందు
కంటే తండ్రి నాకన్నా గొప్పవాడు. 29ఇది జరిగి
నప్పుడు మీరు విశ్వసించాలని మీకీ విషయం ముందే
చెబుతున్నాను. 30ఈ లోకాధికారి రాబోతున్నాడు.
అందువలన మీతో ఎక్కువ కాలం మాట్లాడను. వాడు
నన్నేమీ చెయ్యలేడు. 31కాని నాకు తండ్రిపై ప్రేమ
ఉందన్న విషయము, ఆయన ఆజ్ఞాపించినట్లు నేను
చేస్తున్న విషయము ప్రపంచానికి తెలియాలి. అందుకే
యిలా చేస్తున్నాను. రండి, యిక్కడి నుండి వెళ్దాం!

## తీగ, కొమ్మలు

15 “నా తండ్రి తోట యజమాని. నేను నిజమైన
ద్రాక్షా తీగను. 2నాలో ఫలం కాయని కొమ్మల
న్నిటిని నా తండ్రి పూర్తిగా కొట్టి వేస్తాడు. ఫలమిచ్చే
కొమ్మల్ని, అవి యింకా ఎక్కువ ఫల మిచ్చేటట్లు
చెయ్యటానికి వాటకొనల్ని కత్తిరిస్తాడు. 3నేను మీకు
బోధించిన విషయాలవల్ల ఎక్కువ ఫల మిచ్చేటట్లు
మీరిదివరకే కత్తిరింపబడ్డారు. 4నాలో ఐక్యమై ఉండండి.

---

**ఉత్తరవాది** లేక ఆదరణకర్తను.

నేను మీలో ఐక్యమై ఉంటాను. కొమ్మ స్వతహాగా
ఫలమివ్వ లేదు. అది తీగకు అంటుకొని ఉండాలి.
అదేవిధంగా మీరు నాలో ఉంటేనే ఫలమివ్వగలరు.
5“నేను తీగను. మీరు నా కొమ్మలు. ఒక వ్యక్తి
నాలో ఉండి నేను అతనిలో ఉంటే అతడెక్కువ ఫల
మివ్వగలడు. నాకు దూరంగా ఉండి మీరేమీ చెయ్య
లేరు. 6నాలో ఉండని వాళ్ళు కొమ్మవలే పారవేయబడ
తారు. అప్పుడు కొమ్మలు ఎండి పోతాయి. వాటిని
ప్రోగుచేసి ప్రజలు మంటల్లో వేస్తారు. అవి కాలి
పోతాయి.
7“మీరు నాలో, నా ఉపదేశాలు మీలో ఉంటే మీరు
మీకిష్టమైన దేదైనా అడగండి. అది మీకిస్తాను. కోరింది
జరుగుతుంది. 8మీరు ఎక్కువ ఫలం ఫలించి నా
శిష్యులుగా ఉంటే నా తండ్రి మహిమ వ్యక్తం చేసిన
వాళ్ళౌతారు. 9నా తండ్రి నన్ను ప్రేమించినట్లు నేను
మిమ్మల్ని ప్రేమించాను. నా ప్రేమకు పాత్రులై
ఉండండి. 10నేను నా తండ్రి ఆజ్ఞలకు లోబడి ఆయన
ప్రేమలో నిలిచి యున్నట్లుగా మీరు నా ఆజ్ఞలకు
లోబడినట్లైతే నా ప్రేమలో నిలిచియుంటారు. 11నా
ఆనందం మీరు కూడా పంచుకోవాలని, మీరు సంపూ
ర్ణంగా ఆనందించాలని మీకీ విషయాలన్నీ చెప్పాను.
12నా ఆజ్ఞ యిది: నేను మిమ్మల్ని ఏ విధంగా ప్రేమిస్తు
న్నానో, అదే విధంగా మీరు కూడా పరస్పరం ప్రేమతో
ఉండండి. 13స్నేహితుల కోసం ప్రాణాలి వ్వటం కన్నా
గొప్ప ప్రేమ లేదు. 14నేను ఆజ్ఞాపించి నట్లు చేస్తే
మీరు నా స్నేహితులు. 15నేను యిక మీదటి నుండి
మిమ్మల్ని సేవకులుగా భావించను. ఎందుకంటే, సేవ
కునికి తన యజమాని చేస్తున్న దేమిటో తెలియదు.
కాని నేను నా తండ్రి నుండి విన్న వాటినన్నిటిని
మీకు చెప్పాను. అందుకే మీరు నా స్నేహితులని
అన్నాను. 16మీరు నన్ను ఎన్నుకో లేదు. నేను
మిమ్మల్ని ఎన్నుకొన్నాను. మీరు వెళ్ళి చిరకాలం
ఉండే ఫలమివ్వాలని మిమ్మల్ని ఎన్నుకొని నియమిం
చాను. మీరు నా పేరిట ఏది అడిగినా నా తండ్రి
మీకిస్తాడు. 17ఒకరిపట్ల ఒకరు ప్రేమ కలిగి ఉండండి.
ఇది నా ఆజ్ఞ.

## ప్రపంచం యొక్క ద్వేషం

18“ప్రపంచం మిమ్మల్ని ద్వేషిస్తే, ఆ ప్రపంచం
మీకన్నా ముందు నన్ను ద్వేషించిందన్న విషయం
జ్ఞాపకం ఉంచుకోండి. 19మీరు ప్రపంచానికి చెందిన
వాళ్ళైతే ఆ ప్రపంచంలోని ప్రజలు మిమ్మల్ని తమ
వాళ్ళుగా ప్రేమిస్తారు. నేను మిమ్మల్ని ఈ ప్రపంచం
నుండి ఎన్నుకొన్నాను. కనుక యిప్పుడు మీరు ఈ
ప్రపంచానికి చెందరు. అందుకే ప్రపంచం మిమ్మల్ని
ద్వేషిస్తుంది. 20‘యజమాని కంటే సేవకుడు గొప్ప
కాదు’ అని నేను చెప్పిన మాటలు జ్ఞాపకం ఉంచుకోండి.
వాళ్ళు నన్నే హింసించారు. కనుక మిమ్మల్ని కూడా
హింసిస్తారు. వాళ్ళు నా సందేశం పాటించి ఉంటే మీ
సందేశం కూడా పాటిస్తారు. 21నన్ను పంపింది ఎవరో
వాళ్ళకు తెలియదు. కనుక నా పేరిట వెళ్ళిన మీ
పట్ల ఈ విధంగా ప్రవర్తిస్తారు. 22నేను రాకుండా,
వాళ్ళకు బోధించకుండా ఉండివుంటే పాపదోషము
వాళ్ళ మీద ఉండేది కాదు. కాని ఇప్పుడు వాళ్ళు తమ
పాపాల నుండి తప్పించుకోలేరు. 23నన్ను ద్వేషించిన
వాడు నా తండ్రిని కూడా ద్వేషించిన వానిగా పరిగ
ణింబడతాడు. 24నేను వాళ్ళ కోసం ఎవరూ చేయని
ఈ మహాత్కార్యాలు చేసివుండక పోయినట్లైతే వాళ్ళకు
ఈ పాపం అంటి ఉండేది కాదు. కాని యిప్పుడు
వాళ్ళు నా అద్భుతాన్ని చూసారు. అయినా నన్ను,
నా తండ్రిని ద్వేషిస్తున్నారు. 25కాని ధర్మశాస్త్రంలో,
‘వాళ్ళు నిష్కారణంగా నన్ను ద్వేషించారు,* అని
వ్రాయబడింది. నెరవేరటానికి యిలా జరిగింది.
26“నేను నా తండ్రి నుండి సత్య స్వరూపియైన
ఆత్మను మీకు ఆదరణకర్తగా పంపుతాను. తండ్రిలో
నుండి వచ్చిన ఈ ఆత్మ నన్ను గురించి సాక్ష్యమిస్తాడు.
27మీరు నాతో మొదటి నుండి ఉన్న వాళ్ళు కనుక
మీరు కూడా సాక్ష్యం చెప్పాలి.

16 “మీ విశ్వాసం చెదరిపోకూడదని ఈ విషయా
లన్నీ మీకు చెప్పాను. 2వాళ్ళు మిమ్మల్ని
సమాజ మందిరాల నుండి వెలి వేస్తారు. నిజం చెప్పా
లంటే, మిమ్మల్ని చంపితే దేవుని సేవ చేసిన దానితో
సమానంగా భావించే కాలం వస్తుంది. 3వాళ్ళకు నా
గురించి కాని, తండ్రిని గురించి కాని తెలియదు కనుక
అలా చేస్తారు. 4ఆ సమయం వచ్చినప్పుడు నేను
హెచ్చరించినట్లు మీకు జ్ఞాపకం ఉండాలని ఈ విషయం
చెపుతున్నాను. ఇన్నాళ్ళు మీతో ఉన్నాను. కనుక
మీకీ విషయం మొదట చెప్పలేదు.

## పవిత్రాత్మ చేసిన క్రియలు

5“కాని యిప్పుడు నేను నన్ను పంపిన వాని దగ్గరకు
వెళ్తున్నాను. కాని మీలో ఒక్కరైనా నేను ఎక్కడికి
వెళ్తున్నానని అడగలేదు. 6నేను ఈ విషయం చెప్పటం
వల్ల మీ హృదయాలు దుఃఖంతో నిండిపోయాయి.
7కాని నేను వెళ్ళటం మీ మంచి కోసమే. ఇది నిజం.
నేను వెళ్ళకపోతే మీకు సహాయం చెయ్యటానికి ఆదర
ణకర్త రాడు. నేను వెళ్తే ఆయన్ని పంపగలను. 8ఆయన
వచ్చాక పాపాన్ని గురించి, నీతిని గురించి, తీర్పును
గురించి ప్రపంచాన్ని ఒప్పింప చేస్తాడు. 9ప్రజలు నన్ను
విశ్వసించలేదు కనుక వాళ్ళలో ‘పాపం’ వుందని రుజువు
చేస్తాడు. 10మీరు చూడలేని చోటికి, అంటే తండ్రి

---

**వాళ్లు … ద్వేషించారు** కీర్తన 35:19.

దగ్గరకు, వెళ్తున్నాను. కనుక తండ్రితో నాకున్న
సంబంధాన్ని ఆయన రుజువు చేస్తాడు. 11కనుక నీతి
విషయంలో ఈ లోకాధికారియైన సైతానుకు ఇది
వరకే శిక్ష విధింపబడింది. కనుక 'తీర్పు' విషయంలో
ఒప్పింప చేస్తాడు.
12"నేను మీకు చెప్పవలసిన విషయాలు ఎన్నో
ఉన్నాయి. కాని వాటికి మీరు ప్రస్తుతం తట్టుకొనలేరు.
13కాని సత్యాన్ని ప్రకటించే ఆత్మ వచ్చాక మిమ్మల్ని
సంపూర్ణంగా సత్యంలోకి నడిపిస్తాడు. ఆయన స్వత
హాగా మాట్లాడడు. తాను విన్న వాటిని మాత్రమే
మాట్లాడుతాడు. జరుగనున్న వాటిని గురించి మీకు
చెబుతాడు. 14నా సందేశం మీకు తెలియజేయుట
వల్ల ఆయన నన్ను మహిమ పరుస్తాడు. 15తండ్రికి
చెందినవన్నీ నావి. అందువల్లే ఆత్మ నా సందేశం
తీసుకొని మీకు తెలియచేస్తాడని చెప్పాను.
16"కొంత కాలం గడిచాక మీరు నన్ను చూడరు.
ఆ తదుపరి మరి కొంత కాలం గడిచాక మీరు నన్ను
చూస్తారు."
17ఆయన శిష్యుల్లో కొందరు, "'కొంత కాలం
గడిచాక మీరు నన్ను చూడరు' అని అనటంలోను
మరియు, 'మరి కొంత కాలం గడిచాక మీరు మళ్ళీ
నన్ను చూస్తారు' అని అనటంలో అర్థమేమిటి? పైగా
'నేను తండ్రి దగ్గరకు వెళ్తున్నానని' అంటున్నాడే!
అంటే ఏమిటి?" అని పరస్పరం మాట్లాడుకున్నారు.
18"కొంత కాలం తర్వాత అని అనటంలో ఆయన
ఉద్దేశ్యమేమిటి? ఆయనేమంటున్నాడో అర్థం కావటం
లేదు!" అని వాళ్ళు మళ్ళీ మళ్ళీ అనుకొన్నారు.
19ఈ విషయాన్ని గురించి వాళ్ళడగాలని అను
కుంటున్నారని యేసు గ్రహించాడు. అందువలన
ఆయన వాళ్ళతో ఈ విధంగా అన్నాడు, 'కొంతకాలం
గడిచాక నన్ను చూడరు, మరి కొంత కాలం గడిచాక
నన్ను చూస్తారు' అని నేనటంలో అర్థమేమిటని పర
స్పరం మాట్లాడుకుంటున్నారా? 20మీరు దుఃఖిస్తున్న
ప్పుడు ప్రపంచం ఆనందిస్తుంది. మీ మనస్సుకు చాలా
బాధ కలుగుతుంది. కాని మీ దుఃఖం ఆనందంగా మారు
తుంది. ఇది నిజం. 21'ప్రసవించే సమయం వచ్చి
నప్పుడు గర్భంతో ఉన్న స్త్రీ నొప్పులు అనుభవిస్తుంది.
శిశువు పుట్టాక ఒక జీవిని ఈ ప్రపంచంలోకి తెచ్చిన
ఆనందంలో తన వేదన మరచి పోతుంది.' 22అదే
విధంగా యిది మీరు దుఃఖించే సమయం. కాని నేను
మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను. అప్పుడు మీ హృద
యాలు ఆనందంతో నిండిపోతాయి. ఆ ఆనందాన్ని
ఎవ్వరూ దోచుకోలేరు. 23ఆ రోజు మీరు నన్ను
ఏమీ అడగరు. ఇది నిజం. నా పేరిట మీరేది అడిగినా
తండ్రి మీకిస్తాడు. 24ఇంత కాలం మీరు నా పేరిట
ఏమీ అడగలేదు. 'అడగండి; మీకు లభిస్తుంది' అప్పుడు
మీకు సంపూర్ణమైన ఆనందం కలుగుతుంది.
25"నేను యింత వరకూ ఉపమానాలతో మాట్లా
డుతూ వచ్చాను. కాని యిలాంటి భాష ఉపయోగించ
కుండా నేను స్పష్టంగా మాట్లాడే సమయం వస్తోంది.
అప్పుడు నేను మీకు తండ్రిని గురించి స్పష్టంగా చెబు
తాను. 26ఆ రోజు మీరు నా పేరిట తండ్రిని అడుగు
తారు. మీ పక్షాన నేను తండ్రిని అడుగుతున్నానని
అనటం లేదు. 27నేను తండ్రి నుండి వచ్చానని మీరు
నమ్మారు. మీకు నా పట్ల ప్రేమ ఉంది. కనుక తండ్రికి
స్వయంగా మీ పట్ల ప్రేమ ఉంది. 28నేను తండ్రి
నుండి ఈ ప్రపంచంలోకి వచ్చాను. ఇప్పుడు నేనీ
ప్రపంచాన్ని వదిలి తండ్రి దగ్గరకు వెళ్తున్నాను."
29శిష్యులు, "ఇప్పుడు మీరు ఉపమానాల ద్వారా
కాకుండా స్పష్టంగా మాట్లాడుతున్నారు. 30మీకు అన్నీ
తెలుసునని మేము ఇప్పుడు గ్రహించాము. ఎవరునూ
మీకు ప్రశ్న వేయవలసిన అవసరం లేదు. అందువల్ల
మీరు దేవుని నుండి వచ్చారని విశ్వసిస్తున్నాము" అని
అన్నారు.
31యేసు, "చివరకు నమ్ముతున్నారన్న మాట!
32మీరు నన్ను ఒంటరిగా ఒదిలి మీమీ యిండ్లకు వెళ్ళే
సమయం రానున్నది. ఇప్పుడే వచ్చింది. నా తండ్రి
నాతో ఉన్నాడు. కనుక నేను ఒంటరిగా ఉండను.
33"నా ద్వారా మీకు శాంతి కలగాలని యివన్నీ
మీకు చెప్పాను. ఈ ప్రపంచంలో మీకు కష్టాలు కలుగు
తాయి. కాని ధైర్యంగా ఉండండి. నేను ప్రపంచాన్ని
జయించాను" అని అన్నాడు.

17 ఆ తర్వాత యేసు ఆకాశం వైపు చూసి ఈ
విధంగా ప్రార్థించాడు: "తండ్రీ! సమయం
వచ్చింది. నీ కుమారునికి మహిమ కలిగించు. అప్పుడు
కుమారుడు నీకు మహిమ కలిగిస్తాడు. 2ప్రజలందరిపై
కుమారునికి అధికారమిచ్చావు. నీవు అప్పగించిన
వాళ్ళకు, ఆయన అనంత జీవితం యివ్వాలని నీ
ఉద్దేశ్యం. 3నీవు మాత్రమే నిజమైన దేవుడవు. నిన్నూ,
నీవు పంపిన 'యేసుక్రీస్తు'ను తెలుసుకోవటమే అనంత
జీవితం. 4పూర్తి చేయుమని నీవు నాకు అప్పగించిన
కార్యాన్ని పూర్తిచేసి ఈ ప్రపంచంలో నీకు కీర్తి కలిగిం
చాను. 5తండ్రీ! ఈ ప్రపంచం ఆరంభం కాక ముందు
నీతో పాటు నాకు కూడా మహిమ ఉండేది. ఇప్పుడు
ఆ మహిమ నీ సమక్షంలో నాకు కలిగేటట్లు చేయుము.
6"ఈ ప్రపంచంలో నీవు నాకు అప్పగించిన వాళ్ళకు
నిన్ను గురించి తెలియ చేసాను. వాళ్ళు నీ వాళ్ళు.
కాని వాళ్ళను నీవు నాకు అప్పగించావు. వాళ్ళు నీ
సందేశాన్ని పాటించారు. 7నీవు నాకు ఎన్నో
యిచ్చావు. అవన్నీ నాకిచ్చినావని వాళ్ళకిప్పుడు తెలి
సింది. 8ఎందుకంటే, నీవు నాకు చెప్పిన సందేశాన్ని
వాళ్ళకు చెప్పాను. వాళ్ళు దాన్ని అంగీకరించారు.
నేను నిజంగా నీ నుండి వచ్చానని వాళ్ళకు తెలుసు.
నీవు నన్ను పంపావన్న విశ్వాసం యిప్పుడు వాళ్ళలో

కలిగింది. 9నేను వాళ్ళ కోసం ప్రార్థిస్తున్నాను. ప్రపంచానికోసం ప్రార్థించటం లేదు. నీవు నాకు అప్పగించిన వాళ్ళు నీ వాళ్ళు కావాలని ప్రార్థిస్తున్నాను. 10నావన్నీ నీవి, నీవన్నీ నావి. నా వాళ్ళ ద్వారా నాకు మహిమ కలుగుతోంది. 11నేనీ ప్రపంచంలో యిక ఉండను. కాని వాళ్ళు ఈ ప్రపంచంలోనే ఉన్నారు. నేను నీ దగ్గరకు రాబోతున్నాను. ఓ తండ్రీ! నీలో పవిత్రత ఉంది. నీవు నాకిచ్చిన, నీ నామంలో ఉన్న మహిమతో వాళ్ళను రక్షించు. అలా చేస్తే మనం ఒకటిగా ఉన్నట్లు వాళ్ళు కూడా ఒకటిగా ఉంటారు. 12నేను వాళ్ళతో ఉన్నప్పుడు, నీవు నా కిచ్చిన నామంతో వాళ్ళను రక్షించి కాపాడాను. లేఖనాల్లో వ్రాసినవి నిజం కావటానికి నాశనం కావలసిన వాడు తప్ప మరెవ్వరూ నాశనం కాలేదు.

13“నేను నీ దగ్గరకు వస్తున్నాను. నా ఆనందం వాళ్ళ హృదయాల్లో పూర్తిగా నిండి పోవాలని నేనీ ప్రపంచంలో ఉన్నప్పుడే ఈ విషయాలు చెబుతున్నాను. 14నీ సందేశం నా శిష్యులకు చెప్పాను. నేను ఈ ప్రపంచానికి చెందిన వాణ్ణి కాదు. అదే విధంగా నా శిష్యులు కూడా ఈ ప్రపంచానికి చెందిన వాళ్ళు కాదు. కనుక ప్రపంచం వాళ్ళను ద్వేషిస్తుంది. 15వాళ్ళనీ ప్రపంచం నుండి తీసుకు వెళ్ళమని నేను ప్రార్థించటం లేదుగాని దుర్మార్గుని నుండి వాళ్ళను రక్షించుమని ప్రార్థిస్తున్నాను. 16నేను ఏ విధంగా ఈ ప్రపంచానికి చెందనో అదే విధంగా వాళ్ళు కూడా ఈ ప్రపంచానికి చెందరు. 17సత్యంలో వారిని పవిత్రపరచు, నీ వాక్యమే సత్యం. 18నీవు నన్ను ఏ విధంగా పంపావో, అదే విధంగా వాళ్ళను నేను ఈ ప్రపంచంలోకి పంపాను. 19వాళ్ళ కోసం నన్ను నేను ప్రత్యేకపరచు కొన్నాను. వాళ్ళు కూడా నిజంగా ప్రత్యేకించబడాలని నా ఉద్దేశ్యం.

20“నా ప్రార్థన వాళ్ళ కోసం మాత్రమే కాదు. వాళ్ళ సందేశం ద్వారా నన్ను విశ్వసించే వాళ్ళ కోసం కూడా నేను ప్రార్థిస్తున్నాను. 21తండ్రీ! నేను నీలో, నీవు నాలో ఉన్నట్లే వాళ్ళందరూ ఒకటిగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. నీవు నన్ను పంపినట్లు ఈ ప్రపంచం నమ్మాలంటే వాళ్ళను కూడా మనలో ఐక్యం చేయుము.

22మనము ఒకటిగా ఉన్నట్లు వాళ్ళు కూడా ఒకటిగా ఉండాలని, నీవు నాకిచ్చిన మహిమను నేను వాళ్ళ కిచ్చాను. 23నేను వాళ్ళలో ఉన్నాను. నీవు నాలో ఉన్నావు. వాళ్ళలో సంపూర్ణమైన ఐక్యత కలిగేటట్లు చేయుము. అలా చేస్తే నీవు నన్ను పంపావని, నన్ను ప్రేమించినంతగా వాళ్ళను కూడా ప్రేమించావని ప్రపంచానికి తెలుస్తుంది.

24“తండ్రీ! నీవు నాకు అప్పగించిన వాళ్ళు నేను ఎక్కడ ఉంటే అక్కడ ఉండాలని కోరుకుంటున్నాను. ఈ ప్రపంచం పుట్టక ముందు నుండి నన్ను ప్రేమించావు. నాకు మహిమను ఇచ్చావు. ఆ మహిమను వాళ్ళు చూడాలని నా అభిలాష. 25నీతి స్వరూపుడవగు తండ్రీ! ప్రపంచానికి నీవెవరవో తెలియక పోయినా నీవు నాకు తెలుసు. నీవు నన్ను పంపావని వీళ్ళకు తెలుసు. 26నీవెవరవో వాళ్ళకు తెలియ చేసాను. తెలియ చేస్తూ ఉంటాను. నాయందు నీకున్న ప్రేమ వాళ్ళయందు కూడా ఉండాలని, వాళ్ళలో నేను స్వయంగా ఉండాలని నా ఉద్దేశ్యం.”

### యేసును బంధించటం

*(మత్తయి 26:47-56; మార్కు 14:43-50; లూకా 22:47-53)*

18 యేసు ప్రార్థించటం ముగించాక తన శిష్యులతో కలిసి ప్రయాణమయ్యాడు. అంతా కలిసి కెద్రోను లోయ దాటి వెళ్ళారు. అక్కడ ఒక ఒలీవల తోట ఉంది. వాళ్ళు ఆ తోటలోకి వెళ్ళారు.

2యేసు తన శిష్యులతో తరుచు యిక్కడ కలుసుకొంటూ ఉండేవాడు కనుక ఆయనకు ద్రోహం చేసిన యూదాకు ఈ స్థలం తెలుసు. 3అందువల్ల యూదా ఒక సైనిక దళాన్ని, ప్రధాన యాజకులు, పరిసయ్యులు పంపిన కొంతమంది రక్షక భటుల్ని వెంట బెట్టుకొని వచ్చాడు. వాని వెంట ఉన్న వాళ్ళు ఆయుధాలను, దివిటీలను, దీపాలను, పట్టుకొని వాణ్ణి అనుసరించారు.

4యేసుకు జరుగనున్నదంతా తెలుసు. ఆయన ముందుకు వచ్చి, “వాళ్ళతో మీకెవరు కావాలి?” అని అడిగాడు.

5“నజరేతుకు చెందిన యేసు!” అని వాళ్ళు సమాధానం చెప్పారు.

“ఆయన్ని నేనే!” అని యేసు అన్నాడు. ద్రోహం చేసిన యూదా వాళ్ళతో నిలుచుని ఉన్నాడు. 6యేసు, ‘నేనే ఆయన్ని’ అని అనటం విని వాళ్ళు ఒక అడుగు వెనక్కు వేసి క్రింద పడిపోయారు.

7యేసు, “మీ కెవరు కావాలి?” అని మళ్ళీ అడిగాడు.

వాళ్ళు, “నజరేతుకు చెందిన యేసు” అని సమాధానం చెప్పారు.

8యేసు, “ఆయన్ని నేనే అని చెప్పానుగా? మీరు నా కోసం చూస్తుంటే వీళ్ళను మాత్రం వెళ్ళ నివ్వండి” అని అన్నాడు. 9‘నీవు నాకప్పగించిన వాళ్ళలో ఒక్కణ్ణి కూడా నేను పోగొట్టుకో లేదు’ అని ఆయన అన్న మాటలు నిజం కావటానికి యిలా జరిగింది.

10సీమోను పేతురు దగ్గర ఒక కత్తి ఉండింది. అతడు ఆ కత్తి దూసి ప్రధాన యాజకుని సేవకుణ్ణి నరకటానికి పోయి, అతని కుడి చెవి నరికి వేసాడు. ఆ సేవకుని పేరు ‘మల్కు’. 11యేసు పేతురుతో, “నీ కత్తి ఒరలో పెట్టు! నా తండ్రి యిచ్చిన పాత్ర నేను త్రాగకుండా ఉంటానా?” అని అన్నాడు.

### యేసును అన్న దగ్గరకు పిలుచుకు వెళ్ళటం

*(మత్తయి 26:57-58; మార్కు 14:53-54; లూకా 22:54)*

12ఆ తర్వాత సైనిక దళము, దళాధిపతి, రక్షక భటులు యేసును బంధించి, మొదట అన్న దగ్గరకు తీసుకు వెళ్ళారు. అన్న 'కయప'కు కూమార్తె నిచ్చిన మామ. 13'కయప' ఆ సంవత్సరానికి ప్రధాన యాజకుడుగా ఉన్నాడు. 14ప్రజల కొరకు ఒకే ఒక వ్యక్తి చనిపోవటం మంచిదని యూదులకు సలహా ఇచ్చిన వాడు ఇతడే!

### పేతురు తెలియదనటం

*(మత్తయి 26:69-70; మార్కు 14:66-68; లూకా 22:55-57)*

15సీమోను పేతురు, అతనితో పాటు యింకొక శిష్యుడు యేసు వెంట వెళ్ళారు. ఈ యింకొక శిష్యుడు ప్రధాన యాజకునికి తెలిసినవాడు. అందువల్ల అతడు యేసు వెంట ప్రధాన యాజకుని యింటి ఆవరణంలోకి వెళ్ళాడు. 16కాని పేతురు బయట ద్వారం దగ్గర ఉండవలసి వచ్చింది. ప్రధాన యాజకునికి పరిచయమున్న ఆ యింకొక శిష్యుడు, బయటికి వచ్చి అక్కడవున్న కాపలా ఆమెతో మాట్లాడి పేతుర్ని లోపలికి పిలుచుకు వెళ్ళాడు. 17"నీవు అతని శిష్యుల గుంపుకు చెందిన వాడవు కావా?" అని ద్వారం దగ్గరున్న కాపలాది పేతుర్ని అడిగింది.

"లేదు!" అని అతడు జవాబు చెప్పాడు.

18చలిగా ఉంది కనుక రక్షక భటులు, సేవకులు, చలిమంట వేసి దాని చుట్టూ నిల్చున్నారు. పేతురు వెళ్ళి వారితో సహా చలికాచుకొనుచున్నాడు.

### ప్రధానయాజకుడు యేసును బంధించటం

*(మత్తయి 26:59-66; మార్కు 14:55-64; లూకా 22:66-71)*

19ప్రధానయాజకుడు యేసును ఆయన శిష్యుల్ని గురించి, ఆయన బోధిస్తున్న విషయాల్ని గురించి ప్రశ్నించాడు. 20యేసు, "నేను సమాజమందిరాలలోను, యూదులు సమావేశమయ్యే దేవాలయంలోను బహిరంగంగా ఈ ప్రపంచానికి బోధించేవాణ్ణి. నేను రహస్యంగా ఏదీ బోధించలేదు. 21అలాంటప్పుడు నన్నెందుకు ప్రశ్నిస్తున్నారు. నేను చెప్పిన వాటిని గురించి, నా బోధనలను విన్న వాళ్ళను అడగండి. నేను చెప్పినవి వాళ్ళకు తెలుసు" అని అన్నాడు.

22యేసు ఈ విధంగా మాట్లాడటం వలన ఆయన ప్రక్కన నిలుచున్న ఒక రక్షకభటుడు ఆయన చెంప మీద కొడుతూ, "ప్రధానయాజకునితో అలాగేనా మాట్లాడటం?" అని అన్నాడు.

23యేసు, "నేను ఏదైనా తప్పు మాట్లాడి ఉంటే చెప్పు. కాని నేను నిజం మాట్లాడాను. మరినన్నెందుకు కొట్టావు?" అని అడిగాడు. 24ఆ తర్వాత అన్న ఆయనకు కట్టిన త్రాళ్ళు విప్పకుండా ప్రధాన యాజకుడు కయప దగ్గరకు పంపాడు.

### పేతురు రెండవసారి, మూడవసారి తెలియదని అనటం

*(మత్తయి 26:71-75; మార్కు 14:69-72; లూకా 22:58-62)*

25సీమోను పేతురు నిలుచొని యింకా చలి కాగుతూ ఉన్నాడు. వాళ్ళు, "నీవు అతని శిష్యుల్లో ఒకడివి కదూ?" అని అడిగారు.

"కాదు" అని పేతురు అన్నాడు.

26ప్రధాన యాజకుని దగ్గర ఒకడు పని చేస్తూ ఉండేవాడు. వీని బంధువు చెవును పేతురు నరికి వేసాడు. వాడు పేతురుతో, "నీవు అతనితో కలిసి తోటలో ఉండగా చూడలేదని అనుకొంటున్నావా?" అని అన్నాడు.

27పేతురు మళ్ళీ, "లేదు" అన్నాడు. వెంటనే కోడి కూసింది.

### పిలాతు సమక్షంలో యేసు

*(మత్తయి 27:1-2, 11-31; మార్కు 15:1-20; లూకా 23:1-25)*

28ఆ తర్వాత యూదులు యేసును కయప నుండి రోము రాజ్యాధికారి భవనానికి తీసుకు వెళ్ళారు. తెల్లవారింది. పస్కా పండుగ భోజనం చెయ్యటానికి ముందు మైలపడ కూడదని వాళ్ళు రాజభవనంలోకి వెళ్ళలేదు. 29పిలాతు వాళ్ళను కలవటానికి వెలుపలికి వచ్చి, "ఇతడేమి తప్పు చేసాడు?" అని అడిగాడు.

30"అతడు నేరస్థుడు కానట్లైతే మీకు అప్పగించే వాళ్ళం కాదు!" అని అన్నారు.

31పిలాతు, "అతణ్ణి మీరే తీసుకు వెళ్ళి మీ ధర్మశాస్త్రాన్ననుసరించి విచారణ చేసుకోండి" అని అన్నాడు.

32యూదులు, "మాకు మరణశిక్ష విధించే అధికారం లేదే!" అని సమాధానం చెప్పారు.

యేసు, తాను ఎలాంటి మరణం పొందనున్నాడో యిది వరకే చెప్పాడు. అది నిజం కావాలని యిలా జరిగింది.

33పిలాతు భవనంలోకి వెళ్ళి యేసును పిలిపించాడు. ఆయనతో, "నీవు యూదుల రాజువా?" అని అడిగాడు.

34యేసు, "అది నీవు స్వయంగా వేసిన ప్రశ్నా లేక యితర్లు నా గురించి అలా చెప్పారా?" అని అడిగాడు. 35పిలాతు, "నేను యూదుణ్ణని అను కుంటున్నావా? నీ వాళ్ళు, మీ ప్రధాన యాజకుడు నిన్ను నాకు అప్పగించారు. నీవు ఏం చేసావు?" అని అడిగాడు.

36యేసు, "నా రాజ్యం ఈ ప్రపంచానికి సంబం
ధించింది కాదు. అలాగైనట్లైతే నా అనుచరులు
యూదుల చేత నేను బంధింపకుండా ఉండాలని
వాళ్ళతో యుద్ధం చేసేవాళ్ళు. కాని నా రాజ్యం పరలోక
సంబంధమైంది" అని అన్నాడు.
37"అలాగైతే నీవు రాజువన్న మాట!" అని పిలాతు
అన్నాడు.
యేసు జవాబు చెప్పుతూ, "నన్ను రాజని నీవ
నటం నిజమే. నేను సత్యాన్ని గురించి చెప్పటానికి
జన్మించాను. ఆ కారణంగానే ఈ ప్రపంచంలోకి
వచ్చాను. సత్యాన్ని ప్రేమించే వాళ్ళు నా మాట
వింటారు."
38"సత్యం అంటే ఏమిటి?" అని పిలాతు అడిగాడు.
ఇలా అన్నాక అతడు మళ్ళీ యూదుల దగ్గరకు వెళ్ళి,
"అతణ్ణి శిక్షించటానికి నాకు ఏ కారణం కనిపించటం
లేదు! 39కాని మీ ఆచారం ప్రకారం ప్రతి పస్కా పండు
గకు ఒక ఖైదీని విడుదల చెయ్యటం నా ధర్మం,
'యూదుల రాజును' విడుదల చేయమంటారా?" అని
అడిగాడు. 40వాళ్ళు బిగ్గరగా కేకలు వేస్తూ, "వద్దు, అతణ్ణి
కాదు. బరబ్బను విడుదల చెయ్యండి!" అని అన్నారు.
ఈ బరబ్బ ఒక బందిపోటు దొంగ.*

### యేసుకు సిలువ శిక్ష విధించటం

19 ఆ తర్వాత పిలాతు యేసును తీసుకు వెళ్ళి
కొరడాలతో కొట్టించాడు. 2భటులు
ముళ్ళతో ఒక కిరీటాన్ని అల్లి యేసు తలపై పెట్టారు.
ఆయనకు ఊదారంగు వస్త్రాన్ని తొడిగించారు.
3ఆయన దగ్గరకు మాటి మాటికి వెళ్ళి, "యూదుల
రాజా! జయము!" అని అంటూ ఆయన ముఖం
మీద కొట్టారు.
4పిలాతు మరొకసారి వెలుపలికి వచ్చి యూదు
లతో, "యిదిగో చూడండి! అతణ్ణి మీ ముందుకు
తెస్తున్నాను. అతణ్ణి శిక్షించటానికి నాకే కారణం కనిపించ
టంలేదు. ఇది మీరు గ్రహించాలి" అని అన్నాడు.
5యేసుకు ముళ్ళ కిరీటాన్ని, ఊదారంగు దుస్తుల్ని
ధరింపజేసి వెలుపలికి తీసుకొచ్చారు. పిలాతు వాళ్ళతో,
"ఆ మనిషిని చూడండి!" అని అన్నాడు.
6ప్రధానయాజకులు, అధికారులు యేసును చూడ
గానే, "సిలువకు వెయ్యండి! సిలువకు వెయ్యండి!" అని
కేకలు వేసారు.
కాని పిలాతు, "మీరే తీసుకు వెళ్ళి సిలువకు
వెయ్యండి. అతణ్ణి శిక్షించటానికి నాకే కారణం కని
పించటం లేదు" అని అన్నాడు.
7కాని యూదులు, "మాకో న్యాయశాస్త్రం ఉంది.
తాను, 'దేవుని కుమారుడను' అని అన్నాడు కనుక,
మా న్యాయశాస్త్రం ప్రకారం అతడు మరణ దండన
పొందాలి!" అని అన్నారు.
8పిలాతు ఇది విని యింకా భయపడి పొయ్యాడు.
9అతడు తిరిగి భవనంలోకి వెళ్ళి యేసుతో, "నీ
స్వగ్రామం ఏది?" అని అడిగాడు. కాని యేసు దానికి
సమాధానం చెప్పలేదు. 10పిలాతు "నాతో మాట్లాడ
టానికి నిరాకరిస్తున్నావా? నిన్ను విడుదల చేయటానికి,
సిలువకు వేయటానికి నాకు అధికారం ఉందని నీకు
తెలియదా?" అని అన్నాడు.
11యేసు సమాధానంగా, "పైన ఉన్నవాడు యిస్తే
తప్ప నీకు నాపై ఏ అధికారం లేదు. కనుక నన్ను
నీకు అప్పగించిన వాడు ఎక్కువ పాపం చేసాడు"
అని అన్నాడు.
12ఆ క్షణం నుండి, పిలాతు యేసును విడుదల
చెయ్యాలని ప్రయత్నించాడు. కాని యూదులు,
"ఇతణ్ణి విడుదల చేస్తే నీవు చక్రవర్తికి మిత్రుడవు కాదు.
తాను రాజునన్న ప్రతి ఒక్కడూ చక్రవర్తిని వ్యతిరేకించిన
వాడౌతాడు!" అని కేకలు వేసారు.
13ఇది విని పిలాతు యేసును వెలుపలికి పిలుచు
కొని వచ్చాడు. 'రాళ్ళు పరచిన స్థలంలో' ఉన్న న్యాయ
పీఠంపై కూర్చున్నాడు. దీన్ని హీబ్రూ భాషలో
'గబ్బతా' అని అంటారు.
14అది పస్కా పండుగకు సిద్ధపడబొయ్యేరోజు.
అప్పుడు ఉదయం సుమారు ఆరు గంటల సమయం.
పిలాతు యూదులతో, "ఇదిగో మీ రాజు" అని
అన్నాడు.
15కాని వాళ్ళు, "తీసుకు వెళ్ళండి, తీసుకు వెళ్ళండి.
సిలువకు వేయండి!" అని కేకలు వేసారు.
పిలాతు, "మీ రాజును సిలువకు వేయ మంటారా?"
అని అన్నాడు.
ప్రధానయాజకులు, "చక్రవర్తి తప్ప మాకు వేరే
రాజు లేడు" అని సమాధానం చెప్పారు. 16తదుపరి,
పిలాతు ఆయన్ని సిలువకు వెయ్యమని భటులకు
అప్పగించాడు.

### సిలువ

*(మత్తయి 27:32-44; మార్కు 15:21-32;*
*లూకా 23:26-43)*

17భటులు యేసును తీసుకు వెళ్ళారు. తన సిలు
వను మోసుకొని యేసు పుర్రె స్థలాన్ని చేరుకున్నాడు.
హీబ్రూ భాషలో దీన్ని 'గొల్గొతా' అంటారు. 18ఇక్కడ
ఆయన్ని సిలువకు వేసారు. ఆయనకు ఇరువైపు
మరొక యిద్దర్ని సిలువకు వేసారు. 19పిలాతు, ఒక
ప్రకటన వ్రాయించి ఆయన సిలువకు తగిలించాడు.
ఆ ప్రకటనలో, 'నజరేతు నివాసి యేసు యూదుల
రాజు' అని వ్రాయబడి ఉంది. 20యేసును సిలువకు

---

**బందిపోటు దొంగ** అనగా రోమా రాజ ద్రోహి, హంతకుడు.

వేసిన స్థలము పట్టణానికి దగ్గరగా ఉంది. ఆ ప్రకటన
హీబ్రూ, రోమా, గ్రీకు భాషల్లో వ్రాయబడి ఉంది.
కనుక చాలా మంది యూదులు ఈ ప్రకటన చదివారు.
21యూదుల ప్రధాన యాజకులు దీన్ని గురించి
పిలాతు ముందు ఫిర్యాదు చేస్తూ, "'యూదుల రాజు'
అని వ్రాసారెందుకు? 'ఇతడు, తాను యూదుల రాజని
అన్నాడు' అని వ్రాయండి" అని అన్నారు.
22పిలాతు, "వ్రాసిందేదో వ్రాసాను" అని సమా
ధానం చెప్పాడు.
23భటులు యేసును సిలువకు వేసాక ఆయన
దుస్తుల్ని నాలుగు భాగాలుగా చేసి తలొకటి పంచు
కున్నారు. వాళ్ళు ఆయన పొడుగాటి అంగీని కూడా
లాక్కున్నారు. అది పై నుండి క్రింది దాకా కుట్టు
లేకుండా నేయబడి ఉంది. 24ఆ భటులు, "దీన్ని
చింపకుండా చీట్లు వేసి ఎవరికి దొరుకుతుందో
చూద్దాం!" అని మాట్లాడుకున్నారు. ఈ విధంగా అను
కున్నట్లు చేసారు.

"వాళ్ళు నా దుస్తుల్ని పంచుకొన్నారు! నా
దుస్తుల కోసం చీట్లు వేసారు!"
*కీర్తన. 22:18*

అని లేఖనాల్లో వ్రాయబడిన విషయం నిజం కావటానికి
యిలా జరిగింది.

25యేసు సిలువదగ్గర ఆయన తల్లి, తల్లి యొక్క
సోదరి, క్లోపా భార్య మరియ, మగ్దలేనే మరియ, నిలు
చొని ఉన్నారు. 26యేసు తన తల్లి, తన ప్రియ
శిష్యుడు అక్కడ నిలుచొని ఉండటం చూసాడు. తన
తల్లితో, "అమ్మా! ఇదిగో నీ కుమారుడు" అని
అన్నాడు. 27ఆ శిష్యునితో, "ఇదిగో నీ తల్లి!" అని
అన్నాడు. ఆనాటి నుండి ఆ శిష్యుడు ఆమెను తన
ఇంట్లో చేర్చుకున్నాడు.

## యేసు మరణం

*(మత్తయి 27:45-56; మార్కు 15:33-41;
లూకా 23:44-49)*

28ఆ తర్వాత యేసు అంతా ముగిసిందని గ్రహిం
చాడు. ఆయన, "నాకు దాహం వేస్తోంది" అని అన్నాడు.
లేఖనాల్లో వ్రాసింది నిజంకావటానికి ఇలా జరిగింది.
29పులిసిన ద్రాక్షారసం ఉన్న ఒక కుండ అక్కడ ఉంది.
వాళ్ళు ఒక స్పాంజి ఆ కడవలో ముంచి, హిస్సోపు
చెట్టుకొమ్మపై ఆ స్పాంజి పెట్టి, దాన్ని యేసు
పెదాలకు అందించారు. 30ఆయన దాన్ని రుచిచూచి,
"అంతా ముగిసింది" అని అన్నాడు. ఆ మాట అన్నాక,
తలవాల్చి ఆత్మను అప్పగించాడు.

31అది పండుగకు సిద్ధమయ్యే రోజు. మరుసటి
రోజు విశేషమైన విశ్రాంతి రోజు* కనుక ఆ రోజు
వాళ్ళను సిలువపై వదిలి వేయటం యూదులకు
యిష్టం లేదు. అందువల్ల వాళ్ళు వారి కాళ్ళు విరగ్గొట్టి
వారిని క్రిందికి దింపి వేయించుమని పిలాతును అడి
గారు. 32భటులు వచ్చి యేసుతో సిలువకు వేయబడిన
మొదటి వాని కాళ్ళు, రెండవ వాని కాళ్ళు విరగ్గొట్టారు.
33వాళ్ళు యేసు దగ్గరకు వచ్చి ఆయన అప్పటికే
చనిపోయినట్లు గమనించారు. అందువల్ల వాళ్ళు
ఆయన కాళ్ళు విరగ్గొట్టలేదు. 34దానికి మారుగా
భటుల్లో ఒకడు యేసు డొక్కను బల్లెంతో పొడిచాడు.
వెంటనే రక్తం, నీళ్ళు కారాయి. 35మీరు కూడా విశ్వ
సించాలని ఈ సంఘటన చూసిన వాడు దీన్ని గురించి
చెప్పాడు. అతడు చెప్పింది నిజం. తాను సత్యం పలుకు
తున్నట్లు అతనికి తెలుసు. 36-37లేఖనాల్లో వ్రాయ
బడిన విషయాలు నిజం కావటానికి యిలా జరిగింది.
ఒకచోట ఇలా వ్రాయబడి ఉంది: "ఆయనలో ఒక్క
ఎముక కూడ విరువబడదు."* మరొక చోట, ఇలా
వ్రాయబడివుంది: "తాము పొడిచిన వాని వైపు వాళ్ళు
చూస్తారు"*

## యేసును సమాధి చెయ్యటం

*(మత్తయి 27:57-61; మార్కు 15:42-47;
లూకా 23:50-56)*

38ఆ తర్వాత 'అరిమతయియ' గ్రామానికి చెందిన
యోసేపు, యేసు దేహాన్నివ్వమని పిలాతును అడి
గాడు. యోసేపు యూదులంటే భయపడేవాడు. కనుక
రహస్యంగా యేసు శిష్యుడైనాడు. పిలాతు అంగీకారం
పొంది అతడు యేసు దేహాన్ని తీసుకు వెళ్ళాడు.
39అతని వెంట 'నీకొదేము' కూడా ఉన్నాడు. క్రితంలో
ఒక నాటి రాత్రి యేసును కలుసుకున్న వాడు యితడే.
ఇతడు ముప్పై అయిదు కిలోలబోళం, అగరుల మిశ్ర
మాన్ని తన వెంట తీసుకు వచ్చాడు. 40వాళ్ళిద్దరూ
కలిసి యేసు దేహాన్ని సుగంధ ద్రవ్యాల్లో ఉంచి, దాన్ని
నారగుడ్డలో చుట్టారు. ఇలా చెయ్యటం యూదుల
సాంప్రదాయం. 41యేసును సిలువకు వేసిన చోట
ఒక తోట ఉంది. ఆ తోటలో ఒక కొత్త సమాధి
ఉంది. ఆ సమాధిలో అంతవరకు ఎవర్నీ ఉంచలేదు.
42అది యూదులు పండుగకు సిద్ధం అవ్వ బోయే
రోజు. పైగా ఆ సమాధి సిలువకు సమీపంలో ఉంది.
కనుక వాళ్ళు ఆయన దేహాన్ని ఆ సమాధిలో ఉంచారు.

---

**విశ్రాంతి రోజు** నిర్గమ. 12:16.

**ఆయన … విరువబడదు** నిర్గమ. 12:46 సంఖ్యా. 9:12.

**తాము … చూస్తారు** కీర్తన 34:20, 19:37; జెకర్యా 12:10.

### యేసు బ్రతికి రావటం

(*మత్తయి 28:1-10; మార్కు 16:1-8; లూకా 24:1-12*)

20 ఆ రోజు ఆదివారం. 'మగ్దలేనే'కు చెందిన
మరియ చీకటి ఉండగా లేచి ఆ సమాధి
దగ్గరకు వెళ్ళింది. దాని ద్వారానికి ఉన్న రాయి తీసి
వేయబడి ఉండటం గమనించింది. 2అందువల్ల ఆమె
సీమోను పేతురు దగ్గరకు, 'యేసు ప్రేమించిన
యింకొక శిష్యుని' దగ్గరకు పరుగెత్తుకొంటూ వెళ్ళి,
వాళ్ళతో, 'ఎవరో ప్రభువును సమాధి నుండి తీసుకు
వెళ్ళారు. ఎక్కడ ఉంచారో తెలియదు' అని అన్నది.
3పేతురు, 'ఆ యింకొక శిష్యుడు' సమాధి చూడ
టానికి బయలుదేరి వెళ్ళారు. 4వాళ్ళు కలిసి పరుగెత్తు
కుంటూ వెళ్లారు కాని, 'ఆ యింకొక శిష్యుడు' పేతురు
కన్నా ముందు పరుగెత్తి సమాధిని మొదట చేరు
కున్నాడు. 5అతడు తొంగి లోపల చూసాడు. అక్కడ
పడివున్న నారబట్టలు అతనికి కనిపించాయి. కాని
అతడు లోపలికి వెళ్ళలేదు. 6అతని వెనుక వస్తున్న
పేతురు వచ్చి సమాధిలోకి వెళ్ళాడు. అక్కడ పడి
ఉన్న బట్టల్ని చూసాడు. 7వాటినే కాక యేసు తల
చుట్టూ చుట్టబడిన వస్త్రాన్ని కూడా చూసాడు. మడత
పెట్టబడిన తల వస్త్రం నారబట్టలతో కాక వేరుగా
ఉంచబడి ఉంది. 8సమాధి దగ్గరకు ముందు వెళ్ళిన
శిష్యుడు కూడా తర్వాత లోపలికి వెళ్ళాడు. ఆ దృశ్యం
చూసి విశ్వసించాడు. 9'యేసు బ్రతికి వస్తాడని' లేఖ
నాల్లో వ్రాయబడిన విషయం వాళ్ళకు యింకా అర్థం
కాలేదు.
10ఆ తర్వాత శిష్యులు తమ తమ యిండ్లకు
వెళ్ళిపొయ్యారు.

### మగ్దలేనే మరియకు యేసు కనిపించటం

(*మార్కు 16:9-11*)

11కాని, మరియ సమాధి బయట దుఃఖిస్తూ నిలు
చొని ఉంది. ఆమె దుఃఖం ఆగలేదు. సమాధిలోకి
తొంగి చూసింది. 12తెల్లటి దుస్తుల్లో ఉన్న యిద్దరు
దేవదూతలు అక్కడ కూర్చొని ఉండటం ఆమె గమనిం
చింది. యేసు దేహాన్ని ఉంచిన చోట ఒక దేవదూత
తల వైపు, మరొక దేవదూత కాళ్ళ వైపు కూర్చొని
ఉన్నారు.
13వాళ్ళామెను, "ఎందుకు దుఃఖిస్తున్నావమ్మా?"
అని అడిగారు.
ఆమె, "వాళ్ళు నా ప్రభువును తీసుకు వెళ్ళారు.
ఆయన్ని ఎక్కడ ఉంచారో నాకు తెలియదు" అని
అన్నది. 14అలా అన్నాక వెనక్కు తిరిగింది. అక్కడ
యేసు నిలుచొని ఉండటం చూసింది. కాని ఆయనే
'యేసు' అని ఆమె గుర్తించలేదు.
15ఆయన, "ఎందుకు విలపిస్తున్నావమ్మా! ఎవరి
కోసం చూస్తున్నావు?" అని అడిగాడు.
అతడొక తోటమాలి అనుకొని, "అయ్యా మీరా
యన్ని ఎత్తుకుపోయి ఉంటే ఎక్కడ ఉంచారో
చెప్పండి. నేను వెళ్ళి తెచ్చుకుంటాను" అని అంది.
16యేసు ఆమెను 'మరియా' అని పిలిచాడు.
ఆమె ఆయన వైపు చూసి హీబ్రూ భాషలో
'రబ్బూనీ!' అని అన్నది. రబ్బూనీ అంటే బోధకుడు
అని అర్థం.
17యేసు, "నేనింకా తండ్రి దగ్గరకు వెళ్ళలేదు కనుక
నన్ను తాకవద్దు. నా సోదరుల దగ్గరకు వెళ్ళి నాకు,
మీకు తండ్రి, దేవుడు అయినటువంటి వాని దగ్గరకు
వెళ్తున్నానని చెప్పు" అని అన్నాడు.
18మగ్దలేనే మరియ శిష్యుల దగ్గరకు వెళ్ళింది.
తాను ప్రభువును చూసిన వార్త, ప్రభువు తనకు చెప్పిన
సందేశము, వాళ్ళతో చెప్పింది.

### యేసు శిష్యులకు కనిపించటం

(*మత్తయి 28:16-20; మార్కు 16:14-18; లూకా 24:36-49*)

19ఆ ఆదివారం సాయంకాలం శిష్యులందరు ఒకే
చోట సమావేశమయి ఉన్నారు. యేసు వచ్చి వాళ్ళ
మధ్య నిలుచొని, "మీకు శాంతి కలుగు గాక!" అని
అన్నాడు. 20ఇలా అన్నాక ఆయన తన చేతుల్ని,
ప్రక్క భాగాన్ని చూపించాడు. ప్రభువును చూసాక
శిష్యులకు చాలా ఆనందం కలిగింది.
21యేసు మళ్ళీ, "మీకు శాంతి కలుగు గాక! తండ్రి
నన్ను పంపినట్లు నేను మిమ్మల్ని పంపుతున్నాను"
అని అన్నాడు. 22ఇలా అన్నాక, "పవిత్రాత్మను
పొందండి!" అని వాళ్ళపై ఊదాడు. 23ఆ తర్వాత,
"మీరు ఎవరి పాపాలు క్షమిస్తే వారి పాపాలు క్షమింప
బడతాయి. మీరు ఎవరి పాపాలు క్షమించకపోతే వారి
పాపాలు క్షమించబడవు" అని వాళ్ళతో అన్నాడు.

### తోమా యేసును చూడటం

24యేసు వచ్చినప్పుడు పండ్రెండుగురిలో ఒకడైన
తోమా శిష్యుల్తోలేడు. ఇతణ్ణి 'దిదుమ' అని పిలిచే
వాళ్ళు. 25మిగతా శిష్యులు తోమాతో, 'మేము ప్రభు
వును చూసాము' అని అన్నారు. కాని తోమా, "నేను
స్వయంగా ఆయన చేతులకున్న మేకుల గాయాల్ని
చూసి, వాటిని చేతుల్తో తాకి, ఆయన ప్రక్క డొక్కపై
నా చేతుల్ని ఉంచాక ఆయన్ని నమ్ముతాను" అని
అన్నాడు.
26ఒక వారం రోజుల తర్వాత యేసు శిష్యులు
ఒక యింట్లో ఉన్నారు. తోమా కూడా వాళ్ళతో
ఉన్నాడు. తలుపులు మూసి వేసి ఉన్నా యేసు లోపలికి
వచ్చి వాళ్ళ మధ్య నిలుచొని, "మీకు శాంతి కలుగు
గాక!" అని అన్నాడు. 27యేసు తోమాతో, "నా
చేతులు చూడు. నీ వేళ్ళతో వాటిని తాకు. నా ప్రక్క

భాగంపై నీ చేతుల్ని ఉంచు! ఇక అనుమానించకు”
అని అన్నాడు.
28తోమా ఆయనతో, “దేవా! నా ప్రభూ!” అని
అన్నాడు.
29అప్పుడు యేసు అతనితో, “నన్ను చూసావు
కనుక నమ్మావు. నన్ను చూడకున్నా విశ్వసించే వాళ్ళు
ధన్యులు” అని అన్నాడు.

## ఈ గ్రంథం వ్రాయటంలో ఉద్దేశ్యం

30నేను ఈ గ్రంథంలో వ్రాసినవే కాక, యేసు
ఇంకా అనేకమైన మహత్కార్యాలు చేసాడు. వాటన్నిటినీ
శిష్యులు చూసారు. 31యేసు ‘క్రీస్తు’ అని, ‘దేవుని
కుమారుడని’ ఆయన్ని విశ్వసించిన వాళ్ళకు ఆయన
పేరిట అనంత జీవితం లభిస్తుందని మీరు నమ్మాలనే
ఉద్దేశ్యంతో యివి వ్రాయబడ్డాయి.

## యేసు మళ్ళీ కనిపించటం

21 ఆ తర్వాత తిబెరియ సముద్రం దగ్గర యేసు
మళ్ళీ కనిపించాడు. అది ఈ విధంగా జరిగింది:
2సీమోను పేతురు, దిదుమ అని పిలువబడే తోమా,
గలిలయలోని కానా పట్టణానికి చెందిన ‘నతనయేలు’,
జెబెదయి కుమారులు, మరొక యిద్దరు శిష్యులు,
అంతా కలిసి ఒక చోట ఉన్నారు. 3సీమోను పేతురు,
“నేను చేపలు పట్టటానికి వెళ్తున్నాను” అని అన్నాడు.
మిగతా వాళ్ళు, “మేము కూడా వస్తున్నాము” అని
అన్నాక అంతా కలిసి వెళ్ళి పడవనెక్కారు. కాని ఆ
రాత్రి వాళ్ళకు చేపలు దొరక లేదు.
4తెల్లవారే సమయానికి యేసు ఒడ్డున నిలుచొని
ఉన్నాడు. కాని శిష్యులు ఆయనే ‘యేసు’ అని గ్రహించ
లేదు. 5యేసు, “మిత్రులారా! చేపలు ఏమైనా దొరి
కాయా?” అని అడిగాడు.
‘లేదు’ అని వాళ్ళన్నారు.
6ఆయన, “పడవ కుడి వైపు మీ వల వేయండి.
మీకు చేపలు దొరుకుతాయి” అని అన్నాడు. వాళ్ళు
ఆయన చెప్పిన విధంగా వల వేసారు. చేపలు ఎక్కువగా
వలలో పడటంవల్ల వాళ్ళు ఆ వల లాగలేక పొయ్యారు.
7యేసు ప్రేమించిన శిష్యుడు పేతురుతో, “అదిగో
చూడు ప్రభువు” అని అన్నాడు. సీమోను పేతురు,
“అదిగో ప్రభువు!” అని అతడు అనటం విన్న వెంటనే,
యిది వరకు తీసివేసిన తన పై వస్త్రాన్ని నడుముకు
చుట్టుకొని నీళ్ళలోకి దూకాడు. 8మిగతా శిష్యులు
ఒడ్డుకు వంద గజాల దూరంలో ఉన్నారు. అందువల్ల
వాళ్ళు చేపలతో నిండిన వలను లాగుతూ పడవను
నడుపుకుంటూ అతణ్ణి అనుసరిస్తూ ఒడ్డును చేరు
కున్నారు. 9వాళ్ళు పడవ దిగాక కాలుతున్న బొగ్గుల
మీద చేపలు ఉండటం చూసారు. కొన్ని రొట్టెలు
కూడా అక్కడ ఉన్నాయి. 10యేసు వాళ్ళతో “మీరు
పట్టిన కొన్ని చేపలు తీసుకురండి” అని అన్నాడు.
11సీమోను పేతురు పడవ ఎక్కి వలను ఒడ్డుకు
లాగాడు. ఆ వలనిండా పెద్ద పెద్ద చేపలు ఉన్నాయి.
మొత్తం నూట ఏబది మూడు చేపలు ఉన్నాయి.
అన్ని చేపలున్నా ఆ వల చినుగలేదు! 12యేసు
వాళ్ళతో, “రండి! వచ్చి భోజనం చెయ్యండి” అని
అన్నాడు. ‘మీరెవరు’ అని అడగటానికి శిష్యుల కెవ్వరికీ
ధైర్యం చాలలేదు.

## అతడు ప్రభువని వాళ్ళకు తెలుసు

13యేసు వాళ్ళ దగ్గరకు వచ్చి, రొట్టెను తీసుకొని
వాళ్ళకిచ్చాడు. అదే విధంగా చేపల్ని కూడా
యిచ్చాడు. 14ఆయన బ్రతికింపబడ్డాక తన శిష్యులకు
కనిపించడం యిది మూడవసారి.

## యేసు మరియు పేతురు

15వాళ్ళు భోజనం చెయ్యటం ముగించాక యేసు,
సీమోను పేతురుతో, “యోహాను కుమారుడవైన
సీమోనూ! వీళ్ళకన్నా నన్ను నీవు ఎక్కువగా ప్రేమిస్తు
న్నావా?” అని అడిగాడు.
“ఔను ప్రభూ! ప్రేమిస్తున్నానని మీకు తెలి
యదా!” అని అన్నాడు.
యేసు, “నా గొఱ్ఱెల్ని మేపు!” అని అన్నాడు.
16యేసు, “యోహాను కుమారుడవైన సీమోనూ!
నీవు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా?” అని మళ్ళీ
అడిగాడు.
అతడు, “ఔను ప్రభూ! నేను ప్రేమిస్తున్నానని
మీకు తెలియదా!” అని అన్నాడు.
యేసు, “నా గొఱ్ఱెల్ని జాగ్రత్తగా చూసుకో!” అని
అన్నాడు.
17మూడవసారి అతనితో, “యోహాను కుమారుడ
వైన సీమోనూ! నన్ను ప్రేమిస్తున్నావా?” అని
అన్నాడు.
మూడవసారి, ‘నన్ను ప్రేమిస్తున్నావా’ అని అడిగి
నందుకు పేతురు మనస్సు చివుక్కుమన్నది. అతడు,
“ప్రభూ! మీకన్నీ తెలుసు. నేను మిమ్మల్ని ప్రేమిస్తు
న్నానని కూడా తెలుసు” అని అన్నాడు.
యేసు, “నా గొఱ్ఱెల్ని మేపు! 18ఇది నిజం.
వయస్సులో ఉన్నప్పుడు నీ దుస్తులు నీవు వేసుకొని
నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళే వాడవు. కాని వయస్సు
మళ్ళిన తర్వాత నీవు చేతులు చాపితే మరొకళ్ళు
నీకు దుస్తులు తొడిగించి నీకు యిష్టం లేదన్న చోటికి
తీసుకు వెళ్తారు” అని అన్నాడు. 19పేతురు ఎలాంటి
మరణం పొంది దేవునికి కీర్తి తెస్తాడో సూచించటానికి
యేసు ఇలా అన్నాడు. ఆ తర్వాత అతనితో “నన్ను
అనుసరించు!” అని అన్నాడు.

[20]పేతురు వెనక్కు తిరిగి చూసాడు. యేసు ప్రేమించిన శిష్యుడు వెంట రావటం గమనించాడు. రాత్రి భోజనాలప్పుడు యేసుకు ఆనుకొని, "ప్రభూ! మీకు ఎవరు ద్రోహం చేస్తారు!" అని ప్రశ్నించిన వాడు యితడే. [21]పేతురు అతణ్ణి చూసి యేసుతో "ప్రభూ! అతని సంగతి ఏమిటి?" అని అడిగాడు.

[22]యేసు సమాధానంగా, "నేను తిరిగి వచ్చే వరకు అతడు బ్రతికి ఉండాలని నాకిష్టమైతే! ఆ సంగతి నీ కెందుకు. నీవు నన్ను అనుసరించు!" అని అన్నాడు. [23]యేసు ఈ విధంగా అనటం వల్ల ఈ శిష్యుడు చనిపోడనే వదంతి సోదరుల్లో వ్యాపించింది. కాని యేసు అతడు చనిపోడని అనలేదు. అతడు, "నేను తిరిగి వచ్చేవరకు అతడు బ్రతికి ఉండాలని నా ఉద్దేశ్యమైతే ఆ సంగతి నీకెందుకు?" అని అన్నాడు, అంతే.

[24]వీటిని గురించి సాక్ష్యం చెప్పిన వాడు, వ్రాసిన వాడు ఈ శిష్యుడే. అతని సాక్ష్యం నిజమైనదని మనకు తెలుసు. [25]యేసు యింకా ఎన్నో కార్యాలు చేసాడు. వాటన్నిటిని గురించి వ్రాస్తే ఈ గ్రంథాలకు ఈ ప్రపంచంలో ఉన్న స్థలమంతా కూడా సరిపోదని నేనను కుంటాను.

# అపొస్తలుల కార్యములు

1 ప్రియమైన థెయొఫిలాకు,
నేను నా మొదటి గ్రంథంలో యేసు చేసింది,
బోధించింది మొదలుకొని ఆయన పరలోకానికి తీసుకు
వెళ్ళబడిన రోజు వరకు జరిగినదంతా వ్రాసాను.
2 ఆయన పరలోకానికి తీసుకు వెళ్ళబడే ముందు పవి
త్రాత్మ మహిమతో తానెన్నుకొన్న అపొస్తలులకు*
వాళ్ళు చేయవలసిన కర్తవ్యాలను చెప్పాడు. 3 ఆయన
చనిపోయిన తర్వాత వాళ్ళకు కనిపించి తాను బ్రతికే
ఉన్నానని ఎన్నో నిదర్శనాలను చూపించాడు. వాళ్ళకు
నలభై రోజుల దాకా కనిపించి దేవుని రాజ్యాన్ని గురించి
బోధించాడు. 4 ఆయన వారిని ఒకసారి కలిసికొని ఈ
విధంగా ఆజ్ఞాపించాడు: "యెరూషలేము పట్టణాన్ని
వదిలి వెళ్ళకండి. నా తండ్రి వాగ్దానం చేసిన వరం
కోసం కాచుకొని ఉండండి. దాన్ని గురించి నేను మీకి
దివరకే చెప్పాను. 5 యోహాను నీళ్ళతో బాప్తిస్మము
నిచ్చాడు. కాని కొద్ది రోజుల్లో మీరు పవిత్రాత్మలో
బాప్తిస్మము పొందుతారు."

6 వాళ్ళంతా కలుసుకొన్నప్పుడు, "ప్రభూ! మీరు
ఈ సమయాన ఇశ్రాయేలు ప్రజలకు రాజ్యాన్ని తిరిగి
ఇస్తారా?" అని యేసును అడిగారు.

7 ఆయన వాళ్ళతో, "తండ్రి తన అధికారంతో
గడియలను, రోజులను నియమించాడు. కాని వాటిని
తెలుసుకొనే అవసరం మీకు లేదు. 8 కాని పవిత్రాత్మ
మీ మీదికి వచ్చినప్పుడు మీలో శక్తి కలుగుతుంది.
మీరు మొదట యెరూషలేములోనూ, యూదయ,
సమరయ ప్రాంతాలన్నిటిలోనూ ప్రపంచపు అన్ని
స్థలాల్లోనూ నన్ను గురించి సాక్ష్యమిస్తారు" అని
అన్నాడు.

9 ఈ విధంగా చెప్పాక వాళ్ళ కళ్ళ ముందే ఆయన
పరలోకానికి తీసుకు వెళ్ళబడ్డాడు. వాళ్ళకు కనపడ
కుండా ఒక మేఘం ఆయన్ని కప్పివేసింది. 10 ఆయన
వెళ్తూ ఉంటే వాళ్ళు దీక్షతో ఆకాశం వైపు చూస్తూ
నిలుచున్నారు. అకస్మాత్తుగా తెల్లని దుస్తులు వేసుకొన్న
యిద్దరు వ్యక్తులు వాళ్ళ ప్రక్కన నిలుచొని వాళ్ళతో,
11 "గలిలయ ప్రజలారా! ఆకాశంలోకి చూస్తూ
ఎందుకు నిలుచున్నారు? మీ నుండి పరలోకానికి
తీసుకు వెళ్ళబడిన ఈ యేసు మీరు చూస్తున్నప్పుడు
పరలోకానికి వెళ్ళినట్లే మళ్ళీ తిరిగి వస్తాడు" అని
అన్నారు.

### మత్తీయని ఎన్నుకోవటం

12 ఆ తర్వాత వాళ్ళు ఒలీవల కొండనుండి యెరూష
లేమునకు తిరిగి వచ్చారు. ఈ కొండ పట్టణానికి
విశ్రాంతి రోజున నడిచినంత దూరంలో ఉంటుంది.*
13 వాళ్ళు వచ్చి మేడ మీద తాము నివసిస్తున్న గదిలోకి
వెళ్ళారు. అక్కడున్న అపొస్తలులు ఎవరనగా: పేతురు,
యోహాను, యాకోబు, అంద్రెయ, ఫిలిప్పు, తోమా,
బర్తొలొమయి, మత్తయి, అల్ఫయి కుమారుడు
యాకోబు, 'జెలోతే'* అని పిలువబడే సీమోను,
యాకోబు కుమారుడు యూదా.

14 వీళ్ళంతా సమావేశమై ఒకే మనస్సుతో ఎప్పుడూ
ప్రార్థిస్తూ ఉండేవాళ్ళు. కొందరు స్త్రీలు, యేసు తల్లి
మరియ, యేసు సోదరులు కూడా వీళ్ళతో ఉండే
వాళ్ళు.

15 ఒక రోజు భక్తులందరూ సమావేశం అయ్యారు.
వాళ్ళ సంఖ్య నూటఇరవై. పేతురు మాట్లాడటానికి
లేచి నిలుచున్నాడు. 16 అతడు వాళ్ళతో ఈ విధంగా
అన్నాడు: "నా సోదరులారా! చాలా కాలం క్రిందటే
పవిత్రాత్మ యూదాను గురించి దావీదు నోటి ద్వారా
పలికాడు. లేఖనాల్లో వ్రాయబడిన ఈ విషయాలు
తప్పక జరుగవలసినవి. ఈ యూదా యేసును బంధిం
చిన వాళ్ళకు దారి చూపాడు. 17 యూదా మాలో
ఒకడు. మాతో కలసి సేవ చెయ్యటానికి ఎన్నుకోబడ్డ
వాడు."

18 యూదా చేసిన ఈ కుట్రకు అతనికి డబ్బు
దొరికింది. ఆ డబ్బుతో ఒక భూమి కొనబడింది. ఆ
తర్వాత యూదా తలక్రిందుగా పడిపోయాడు. అతని
దేహం చీలిపోయి ప్రేగులు బయటపడ్డాయి. 19 యెరూ
షలేములోని వాళ్ళంతా దీన్ని గురించి విన్నారు. అందు
వలన తమ భాషలో ఆ భూమిని అకెల్దమ అని పిలిచే
వాళ్ళు. దీని అర్థం రక్తపు భూమి."

---

**అపొస్తలులు** అనగా పంపబడిన వారు.

**ఈ కొండ … ఉంటుంది** ఒక కిలోమీటరు.

**జెలోతే** తన మతము, దేవునిపై అభిమానంగల యూదుడు.

20పేతురు యింకా ఈ విధంగా అన్నాడు: "దీన్ని
గురించి కీర్తనల గ్రంథంలో ఈ విధంగా వ్రాయబడి
వుంది:

'అతని భూమిని పాడు పడనిమ్ము అక్కడె
వ్వరూ నివసించకుండా పోనిమ్ము.'
కీర్తన *69:25*

అతని స్థానాన్ని యింకొకడు 'ఆక్రమించ
నిమ్ము!'
కీర్తన *109: 8*

21"ఇప్పుడు యింకొకడు మనలో చేరాలి. అతడు
వాళ్ళలో, అంటే యేసు మనతో కలసి జీవించినంత
కాలం మనతో కలసి ఉన్న వాళ్ళలో ఒకడై ఉండాలి.
22అతడు యేసుప్రభువు చావునుండి బ్రతికి వచ్చాడన్న
దానికి మనతో కలసి సాక్ష్యం చెప్పాలి. యోహాను
బాప్తిస్మము నివ్వటం మొదలు పెట్టినప్పటి నుండి
యేసును మననుండి పరలోకానికి తీసుకు వెళ్ళిన
దినం దాకా మనతో కలసి జీవించినవాడై ఉండాలి."
23వాళ్ళు ఇద్దరి పేర్లను సూచించారు. బర్సబ్బా అని
పిలువబడే యోసేపు పేరు ఇతన్నే యూస్తు అని
కూడా అంటారు, మత్తీయ పేరు. 24-25అంతా కలసి
ఈ విధంగా ప్రార్థించారు: "ప్రభూ! నీకు ప్రతి ఒక్కరి
మనస్సు తెలుసు. యూదా తన స్థానాన్ని వదిలి తాను
వెళ్ళతగిన స్థానానికి వెళ్ళాడు. ఇప్పుడు ఈ ఇద్దరిలో
అపొస్తలత్వాన్ని, ఈ సేవా స్థానాన్ని ఆక్రమించటానికి
నీవెన్నుకొన్న వాణ్ణి మాకు చూపించు." 26ఆ తర్వాత
వాళ్ళు చీటీలు వేసారు. వాళ్ళు తీసిన చీటీలో మత్తీయ
పేరు వ్రాయబడి ఉంది. అందువల్ల అతడు ఆ
పదకొండుగురిలాగే అపొస్తలుడయ్యాడు.

## పవిత్రాత్మ రావటం

2 పెంతెకొస్తు అనే పండుగ వచ్చింది. ఆ రోజు
వాళ్ళంతా ఒక చోట సమావేశం అయ్యారు.
2తీవ్రమైన గాలి వీచినప్పుడు కలిగే ధ్వనిలాంటిది పర
లోకంనుండి అకస్మాత్తుగా వచ్చి వాళ్ళు కూర్చొన్న
యింటినంతా నింపి వేసింది. 3అప్పుడు వాళ్ళకు నాలు
కల్లా అగ్ని జ్వాలలు కనిపించాయి. అవి విడిపోయి
ప్రతి ఒక్కరి మీదా దిగినవి. 4అందరూ పవిత్రాత్మతో
నిండిపోయి తమ భాషల్లో కాక యితర భాషల్లో మాట్లా
డటం మొదలు పెట్టారు. వాళ్ళిలా మాట్లాడటానికి
పవిత్రాత్మ శక్తినిచ్చాడు.
5అప్పుడు ఈ యెరూషలేము పట్టణంలో అన్ని
దేశాలకు చెందిన దైవభక్తిగల యూదులు ఉండినారు.
6ఆ మాటల శబ్దం విని ఒక పెద్ద ప్రజల గుంపు
అక్కడికి వచ్చింది. గుంపులోని ప్రతి ఒక్కడూ తన
స్వంత భాషలో వాళ్ళు మాట్లాడటం విని దిగ్భ్రాంతి
చెందాడు. 7వాళ్ళు దిగ్భ్రాంతి చెంది, "మాట్లాడుతున్న
వాళ్ళందరూ గలిలయ ప్రాంతపు వాళ్ళే కదా? 8అలాం
టప్పుడు, మాలోని ప్రతి ఒక్కడూ, అతని స్వంత
భాషలో వాళ్ళు మాట్లాడటం ఎట్లా వింటున్నాడు.
9మేము, అంటే 'పార్తి' దేశం వాళ్ళు, 'మాదీ' దేశం
వాళ్ళు, 'ఏలామీ' దేశం వాళ్ళు, 'మెసొపొతమియ' నివా
సులు, యూదయ, కప్పదొకియ, పొంతు, ఆసియ
నివాసులు, 10ఫ్రుగియ, పంఫులియ, ఈజిప్టు ప్రాంతాల
వాళ్ళు, 'లిబియ' లోని 'కురేనే' దగ్గరున్న ప్రాంతాల
నుండి వచ్చిన వాళ్ళు, రోము నగరం నుండి వచ్చిన
వాళ్ళు, 11యూదులు, యూద మతంలో చేరిన వాళ్ళు,
క్రేతీయులు, అరబీయులు, వాళ్ళు దేవుని మహిమల్ని
గురించి మా స్వంత భాషలో చెప్పటం వింటున్నామే!"
అని అన్నారు.
12దిగ్భ్రాంతి చెందటం వల్ల, జరిగిన విషయాలు
అర్థం కాక పోవటం వల్ల, "దీని అర్థమేమిటి" అని పర
స్పరం ప్రశ్నించుకొన్నారు. 13"బాగా మద్యం త్రాగి
మత్తులో ఉన్నారు' అని కొందరు వాళ్ళనెగతాళి
చేసారు.

## పేతురు ఉపన్యసించటం

14ఇది విని పేతురు పదకొండుగురితో లేచి, పెద్ద
గొంతుతో ప్రజల్ని సంబోధిస్తూ, "తోటి యూదా
సోదరులారా! యెరూషలేంలో నివసిస్తున్న సమస్త ప్రజ
లారా! నన్ను దీన్ని గురించి మీకు చెప్పనివ్వండి.
నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. 15మీరనుకొన్నట్లు
వీళ్ళు త్రాగలేదు. ఇప్పుడు ఇంకా ఉదయం తొమ్మిది
గంటలే కదా! 16దీన్ని గురించి ప్రవక్త యోవేలు ఈ
విధంగా వ్రాసాడు కనుక యివి జరుగుతున్నాయి:

17 'దేవుడు ఈ విధంగా అంటున్నాడు: ఈ
చివరి దినాల్లో నా ఆత్మను అందరిపై
కురిపిస్తాను! మీ కుమారులు, కుమార్తెలు,
నా ప్రవచనాలు పలుకుతారు! మీ యువ
తరం దివ్యదర్శనాలు చూస్తుంది. వయస్సు
మళ్ళిన మీ వాళ్ళు కలలు గంటారు.
18 ఆడా, మగా అనే భేదం లేకుండా నా
సేవకులందరిపై ఆ దినాల్లో నా ఆత్మను
కురిపిస్తాను. అప్పుడు వాళ్ళు నా ప్రవచ
నాలు చెబుతారు.
19 పైన ఆకాశంలో నేను అద్భుతాలు చూపి
స్తాను. క్రింద భూమ్మీద రుజువులు చూపి
స్తాను. రక్తం, మంటలు, చిక్కటి పొగలు
చెలరేగుతాయి.
20 సూర్యుణ్ణి చీకటిగా మారుస్తాను. చంద్రుణ్ణి
ఎర్రటి రక్తంలా మారుస్తాను. ఉత్కృష్టమైన

టువంటి, తేజోవంతమైనటువంటి ప్రభు
వుయొక్క దినం రాక ముందే యిది జరుగు
తుంది.
21 అప్పుడు ఆయన నామంలో ప్రార్థించు
ప్రతి ఒక్కణ్ణి ప్రభువు రక్షిస్తాడు.'
యోవేలు *2:28-32*

22"ఇశ్రాయేలు ప్రజలారా! ఇది వినండి. దేవుడు
నజరేతు నివాసియైన యేసును, తాను ప్రత్యేకంగా
నియమించాడన్న విషయం మీకు నిరూపించాలని
ఆయన ద్వారా మహాత్యాలు, అద్భుతాలు మీకోసం
చేసాడు. సూచనలు చూపాడు. ఈ మహాత్యాలు,
అద్భుతాలు చేసినట్లు, సూచనలు చూపినట్లు మీకు
ఇదివరకే తెలుసు. 23దైవ సంకల్పానుసారం ఆయన
దివ్యజ్ఞానానుసారం యేసు మీకు అప్పగింపబడ్డాడు.
ఆ తర్వాత మీరు దుర్మార్గుల సహాయంతో ఆయనను
సిలువకు వేసి, మేకులు కొట్టి ఆయన్ని చంపారు.
24కాని దేవుడాయన్ని బ్రతికించాడు. ఆయనకు మరణ
వేదన నుండి విముక్తి కలిగించాడు. మరణానికి ఆయన్ని
బంధించి ఉంచటం చేతకాలేదు. 25దావీదు యేసును
గురించి ఈ విధంగా అన్నాడు:

'ప్రభువును, నేను నా ముందు అన్ని వేళలా
చూసాను. నన్ను రక్షించటానికి ప్రభువు
నా వెంట ఉన్నాడు!
26 అందుకే నా మాటల్లో ఆనందం నిండి
యున్నది. అందుకే నా దేహం ఆశతో
జీవిస్తోంది.
27 ఎందుకంటే, నా ఆత్మను నీవు చని
పోయిన వాళ్ళతో వదిలివేయవు నీవు నీ
భక్తుని దేహాన్ని కుళ్ళ నీయవు
28 నాకు జీవపు దారుల్ని చూపావు! నా వెంటే
ఉండి నాకు ఆనందం కలిగించావు!'
కీర్తన *16:8-11*

29"సోదరులారా! మన వంశీయుడైన దావీదును
గురించి నేనిది ఖచ్చితంగా చెప్పగలను. అతడు చని
పొయ్యాడు. అతణ్ణి సమాధి చేసారు. ఆ సమాధి ఈ
నాటికీ ఉంది. 30దావీదు ఒక ప్రవక్త. దావీదు వంశంలో
పుట్టిన వాణ్ణొకణ్ణి సింహాసనంపై కూర్చొ బెడ్తానని
దేవుడు అతనికి ప్రమాణ పూర్వకంగా వాగ్దానం చేసాడు.
ఇది దావీదుకు తెలుసు. 31ఈ జరుగనున్న దాన్ని
గురించి దావీదుకు ముందే తెలుసు. అందువల్లే అతడు
క్రీస్తు బ్రతికి రావటాన్ని గురించి ఈ విధంగా అన్నాడు:

'దేవుడు ఆయన్ని సమాధిలోవదిలి వేయ
లేదు. ఆయన శరీరము కుళ్ళు పట్టలేదు.'

క్రీస్తు సమాధినుండి లేచే విషయమై దావీదు మాటలా
డుచూ ఉన్నాడు. 32కావున దేవుడు ఈ యేసునే
మృత్యువు నుండి బ్రతికించినాడు. దీనికి మేమంతా
సాక్ష్యము. 33యేసు పరలోకానికి ఎత్తబడినాడు.
ఇప్పుడు యేసు దేవునితో ఆయన కుడిప్రక్కన
ఉన్నాడు. తండ్రి పరిశుద్ధాత్మను యేసుకు ఇచ్చాడు.
దేవుడు ఇస్తానని వాగ్దానము చేసినది పరిశుద్ధాత్మయే.
యేసు ఇప్పుడాయాత్మను ఇస్తున్నాడు. ఇదే మీరు
వింటున్నదీ, చూస్తున్నదీ. 34-35యేసులా దావీదు పర
లోకానికి వెళ్ళలేదు. అయినా, అతడీవిధంగా అన్నాడు:

'ప్రభువు నా ప్రభువుతో, నేను నీ శత్రువుల్ని
నీ పాదపీఠంగా చేసే వరకు నీవు నా కుడి
వైపు కూర్చో!'
కీర్తన *110:1*

36"అందువల్ల ఇశ్రాయేలు ప్రజలందరూ యిది ఖచ్చి
తంగా తెలుసుకోవాలి. దేవుడు, మీరు సిలువకు వేసి
చంపిన ఈ యేసును ప్రభువుగా, క్రీస్తుగా నియ
మించాడు."
37ఇది విని ప్రజల హృదయాలు కదిలి పొయ్యాయి.
వాళ్ళు పేతురు మరియు యితర అపొస్తలులను,
"సోదరులారా! మేము ఏం చెయ్యాలి?" అని అడిగారు.
38పేతురు ఈ విధంగా జవాబు చెప్పాడు: "మీలో
ప్రతి ఒక్కడూ పాప క్షమాపణ నిమిత్తం మారుమనస్సు
కలిగి యేసు క్రీస్తు పేరిట బాప్తిస్మము పొందాలి.
అప్పుడు మీ పాపాలు క్షమించబడ్తాయి. మీకు
పవిత్రాత్మ వరం లభిస్తుంది. 39దేవుడు ఈ వాగ్దానాన్ని
మీకోసం, మీ సంతానాని కోసం, ప్రభువు ఆహ్వానించ
బోయే దూర ప్రాంతాల వాళ్ళకందరి కోసం చేసాడు."
40వాళ్ళకు అనేక మాటల ద్వారా ఎన్నో విష
యాలు చెప్పాడు. అంతేకాక, వాళ్ళతో ఈ విధంగా
బ్రతిమలాడాడు: "వక్రబుద్ధులున్న ఈ తరం వాళ్లనుండి
విడిపోయి రక్షణ పొందండి." 41అతని సందేశాన్ని అంగీక
రించిన వాళ్ళు బాప్తిస్మము పొందారు. ఆ రోజు
సుమారు మూడువేల మంది విశ్వాసులుగా చేరారు.

## విశ్వాసుల సహవాసం

42వాళ్లు అపొస్తలుల బోధను వింటూ సహవాసము
లోను, రొట్టె విరుచుటలోను పాలి భాగస్థులై; ప్రార్థన
చేయుటలో నిమగ్నులై యుండేవాళ్లు. 43దేవుడు అపొ
స్తలుల ద్వారా ఎన్నో అద్భుతాలు చేసాడు. చిహ్నాలు
చూపాడు. ప్రతి ఒక్కనిలో దైవ భీతి కలిగింది. 44భక్తు
లంతా ఒకే చోట సమావేశమయ్యారు. తమ దగ్గరున్న
ప్రతి వస్తువును అందరితో కలిసి పంచుకొనే వాళ్ళు.
45తమ ఆస్తిని, వస్తువుల్ని అమ్మి అవసరమున్న వాళ్ళకు
యిచ్చేవాళ్ళు. 46ప్రతి రోజు మందిరావరణంలో ఒకే

ఉద్దేశ్యంతో సమావేశమయ్యేవాళ్ళు. ఇండ్లలో సమావే
శమై ఆహారాన్ని పంచుకొని తినేవాళ్ళు. మంచి మన
స్సుతో అమితానందంగా భుజించే వాళ్ళు, 47దేవుణ్ణి
స్తుతించే వాళ్ళు. ప్రజలందరూ వాళ్ళను యిష్టపడే
వాళ్ళు. ప్రభువు తాను రక్షించిన వాళ్ళను విశ్వాసులతో
చేరుస్తూ వచ్చాడు.

### పేతురు కుంటివానిని నయం చెయ్యటం

3 ఒక రోజు పేతురు, యోహాను పగలు మూడు
గంటలప్పుడు మందిరానికి వెళ్తున్నారు. అది
ప్రార్థనా సమయం. 2కొందరు ఒక పుట్టు కుంటి
వాణ్ణి ప్రతిరోజూ మోసుకొని వెళ్ళి ఒక ద్వారం ముందు
దించే వాళ్ళు. దీన్నే సౌందర్య ద్వారం అనేవాళ్ళు.
మందిరంలోకి ప్రవేశించే వాళ్ళనుండి ఆ కుంటివాడు
భిక్షమెత్తుకొంటూ ఉండేవాడు. 3ఈ కుంటివాడు,
పేతురు యోహానులు ఆలయంలోకి ప్రవేశించ
బోతుండగా చూసి వాళ్ళను భిక్షమడిగాడు. 4పేతురు
అతనివైపు ఏక దృష్టితో చూసాడు. యోహాను కూడా
అలాగే చూసాడు. పేతురు ఆ కుంటివానితో, "మా
వైపు చూడు!" అని అన్నాడు. 5ఆ కుంటివాడు వాళ్ళే
దైనా యిస్తారని వాళ్ళ వైపు చూసాడు. 6అప్పుడు
పేతురు, "నా దగ్గర వెండి, బంగారాలు లేవు కాని నా
దగ్గరున్న దాన్ని నీకిస్తాను. నజరేతు నివాసి యేసు
క్రీస్తు పేరిట నడువు!" అని అంటూ, 7అతని కుడి
చేయి పట్టుకొని లేపాడు. వెంటనే ఆ కుంటివాని
చీలమండలకు, పాదాలకు బలం వచ్చింది. 8అతడు
గంతేసి నిలబడి నడవటం మొదలు పెట్టాడు. తదుపరి
అతడు నడుస్తూ గంతులేస్తూ దేవుణ్ణి స్తుతిస్తూ వాళ్ళతో
సహా మందిరంలోకి ప్రవేశించాడు. 9మందిరంలో ఉన్న
వాళ్ళంతా అతడు నడవటం, దేవుణ్ణి స్తుతించటం
చూసారు. 10భిక్షమెత్తుకోవటానికి మందిరంలోని
సౌందర్య ద్వారం ముందు కూర్చునేవాడు అతడేనని
గుర్తించారు. జరిగింది చూసి వాళ్ళు భయపడి
దిగ్భ్రాంతి చెందారు.

### పేతురు ఉపన్యసించటం

11ఆ భిక్షమెత్తుకొనేవాడు పేతురు, యోహానులను
అంటి పెట్టుకొనే ఉన్నాడు. ప్రజల్లో కలిగిన ఆశ్చర్యం
తగ్గలేదు. వాళ్ళు సొలొమోను మంటపంలో ఉన్న
పేతురు, యోహానుల దగ్గరకు పరుగెత్తుకొంటూ
వెళ్ళారు. 12పేతురు వాళ్ళను చూసి ఈ విధంగా
అన్నాడు: "ఇశ్రాయేలు ప్రజలారా! ఇది మీకెందుకు
ఆశ్చర్యం కలిగిస్తోంది? మేము మా స్వశక్తితో లేక మా
మంచితనంతో యితణ్ణి నడిపించినట్లు మావైపు అంత
దీక్షతో ఎందుకు చూస్తున్నారు? 13అబ్రాహాము,
ఇస్సాకు, యాకోబుల దేవుడు, మన వంశీయుల
దేవుడు తన సేవకుడైన యేసును మహిమ పర్చాడు.
మీరాయన్ని అధికారులకు అప్పగించారు. పిలాతు
ఆయన్ని విడుదల చెయ్యాలని నిర్ణయించినప్పుడు
మీరు పిలాతు ముందు యేసును నిరాకరించారు. 14పవి
త్రుడు, నీతిమంతుడు, అయిన ఆయన్ని నిరాకరించి,
ఆయనకు మారుగా ఒక హంతకుణ్ణి విడుదల చెయ్యా
లని మీరు కోరారు. 15మీరు, మీకు నిత్యజీవాన్నిచ్చే
దాతను చంపారు. కాని దేవుడాయన్ని చావు నుండి
బ్రతికించాడు. మేము దీనికి సాక్షులం. 16మాకు 'యేసు'
అనే పేరులో నమ్మకం ఉండబట్టే మీకు తెలిసిన యిత
నికి, మీరు చూస్తున్న యితనికి నయమై పోయింది.
యేసు పేరు, ఆయన కలిగించిన విశ్వాసము యితనికి
పూర్తిగా స్వస్థత కలిగించాయి. ఇది మీరు చూసారు.
17"సోదరులారా! మీ నాయకులవలె మీరు కూడా
అమాయకంగా ప్రవర్తించారని నాకు తెలుసు. 18కాని,
'క్రీస్తు తప్పక చనిపోవాలి' అని ప్రవక్తలందరి ద్వారా
దేవుడు ముందే పలికిన వాక్కుల్ని ఈ విధంగా నిజం
చేసాడు. 19మారుమనస్సు పొంది దేవునివైపు మళ్ళండి.
అలా చేస్తే దేవుడు మీ పాపాలు కడిగి వేస్తాడు. మీకు
విమోచనం కలిగే రోజులు వస్తాయి. 20మీకోసం దేవుడు
క్రీస్తుగా నియమించిన యేసును పంపుతాడు. 21చాలా
కాలం క్రితమే తమను తాము దేవునికి అంకితం చేసు
కొన్న ప్రవక్తల నోటి ద్వారా యిలా అభయ మిచ్చాడు,
"సర్వం పునః స్థాపితం చేసేకాలం వచ్చేవరకు యేసు
పరలోకంలోనే ఉండాలి. 22మోషే ఈ విధంగా
అన్నాడు: 'ప్రభువైన దేవుడు మీ కొరకు నాలాంటి
ప్రవక్తను పంపుతాడు. ఆయన మీ సోదరులనుండి
వస్తాడు. ఆయన చెప్పినట్లు మీరు వినాలి. 23దేవుడు
ఆయన మాటల్ని వినని ప్రతి ఒక్కణ్ణి తమ వాళ్ళ
నుండి దూరం చేసి నాశనం చేస్తాడు'* 24సమూయేలు
కాలం నుండి ప్రవక్తలందరూ ఈ రోజులు రాను
న్నాయని చెప్పారు. 25మీ పూర్వీకులతో దేవుడు చేసిన
ఒప్పందానికి, మీ ప్రవక్తలకు, మీరు వారసులు. దేవుడు
అబ్రాహాముతో, 'నీ వంశీయుని ద్వారా భూమ్మీద
ఉన్న ప్రజలందర్ని దీవిస్తాను'* అని అన్నాడు.
26దేవుడు తన సేవకుణ్ణి మొదట మీ దగ్గరకు పంపాడు.
మీ అందర్ని మీ మీ దుర్మార్గాలనుండి మళ్ళించటానికి
ఆయన్ని పంపాడు. అలా చేసి మిమ్మల్ని దీవించాలని
అనుకొన్నాడు."

4 యాజకులు, మందిరం యొక్క ద్వార పాలకుల
అధిపతి, సద్దూకయ్యులు కలిసి పేతురు, యోహా
నులు ఉన్న చోటికి వెళ్ళారు. అప్పుడు వాళ్ళు ప్రజలకు
ఉపదేశిస్తూ ఉన్నారు. 2ఆ అపొస్తలులు ప్రజలకు ఉప
దేశించటం, యేసును ఉదాహరణగా తీసుకొని చని
పోయిన వాళ్ళు బ్రతికి వస్తారని ప్రకటించటం విని

---

**దేవుడు ... చేస్తాడు** ద్వితీ. 18:15, 19.

**నీ వంశీయుని ... దీవిస్తాను** ఆది. 22:18, 26:24.

వాళ్ళకు చాలా కోపం వచ్చింది. 3వాళ్ళు పేతురును,
యోహానును బంధించారు. అప్పటికే సాయంకాలమై
ఉండటం వల్ల మరుసటి రోజు దాకా వాళ్ళను బంధించి
ఉంచారు. 4వాళ్ళ సందేశాన్ని విని అనేకులు విశ్వాసుల
య్యారు. ఆ విశ్వాసుల సంఖ్య సుమారు అయిదు
వేలదాకా పెరిగి పోయింది.

5మరుసటి రోజు నాయకులు, పెద్దలు, పండితులు
యెరూషలేములో సమావేశం అయ్యారు. 6'అన్న,'
అనే ప్రధానయాజకుడు, కయప, యోహాను, అలె
క్సంద్రు, ప్రధాన యాజకుని కుటుంబానికి చెందిన
వాళ్ళు అంతా ఆ సమావేశంలో ఉన్నారు. 7పేతురును,
యోహానును వీళ్ళ ముందుకు పిలుచుకు వచ్చారు.
"ఏ అధికారంతో, ఎవరి పేరిట మీరాపని చేసారు?"
అని వాళ్ళు ప్రశ్నించటం మొదలు పెట్టారు.

8అదే సమయంలో, పేతురు పవిత్రాత్మతో నిండి
నవాడై వాళ్ళకు ఈ విధంగా సమాధానం చెప్పాడు:
"ప్రజా నాయకులారా! పెద్దలారా! 9ఒక కుంటివానికి
చేసిన ఉపకారాన్ని గురించి మమ్మల్ని ప్రశ్నించాలను
కొంటున్నారా? అతనికి ఎవరు నయం చేసారని
తెలుసుకోవాలనుకొంటున్నారా? 10అలాగైతే మీరు,
ఇశ్రాయేలు ప్రజలు ఇది తెలుసుకోవాలి. నజరేతు
నివాసి యేసు క్రీస్తు పేరిట ఈ కుంటి వాడు పూర్తిగా
నయమై మీ ముందు నిలుచున్నాడు. మీరు యేసును
సిలువకు వేసి చంపినా దేవుడాయన్ని బ్రతికించాడు.

11 'ఇల్లుకట్టు వాళ్ళైన మీరు పార వేసిన రాయి
ఈ యేసే! ఇప్పుడది మూలకు తలరాయి
అయింది, ఆ రాయి యేసే.'
*కీర్తన 118:22*

12రక్షణ యింకెవరి ద్వారా లభించదు. ఎందుకంటే,
రక్షణ పొందటానికి ఈ పేరు (యేసు క్రీస్తు) తప్ప
మరే పేరును దేవుడు మానవులకు తెలుప లేదు. ఈ
పేరుకు తప్ప ఆ శక్తి ప్రపంచంలో మనుష్యులకివ్వబడిన
మరే పేరుకు లేదు."

13పేతురు, యోహానులు చదువురాని మామూలు
మనుష్యులని వాళ్ళకు తెలిసి పోయింది. కాని వాళ్ళ
ధైర్యాన్ని చూసి సభ్యులకు ఆశ్చర్యం వేసింది. అప్పుడా
సభ్యులు వాళ్ళు యేసుతో ఉన్న వాళ్ళని గ్రహించారు.
14కాని నయమైన మనిషి వాళ్ళతో నిలిచి ఉండటం
చూసి యింకే ఆక్షేపణలు చెయ్యలేక పోయారు.
15వాళ్ళను మహా సభనుండి వెళ్ళమని ఆజ్ఞాపించి
పరస్పరం యిలా చర్చించుకొన్నారు: 16"వీళ్ళనేం
చెయ్యాలి? యెరూషలేము నివాసులందరికి వీళ్ళు
అద్భుతమైన మహిమ చేసారని బాగా తెలుసు. మనం
దాన్ని కాదనలేం. 17కాని యిది ప్రజల్లో యింకా ఎక్కు
వగా వ్యాపించక ముందే యిక మీదట అతని పేరిట
ఎవరితో ఏమీ మాట్లాడవద్దని వాళ్ళను వారించాలి."
18వాళ్ళను మళ్ళీ పిలిచి యేసు పేరిట బోధించ
కూడదని, ఆయన గురించి మాట్లాడకూడదని ఆజ్ఞాపిం
చారు. 19కాని పేతురు, యోహానులు వాళ్ళకు సమా
ధానం చెబుతూ, "మీరు చెప్పింది చెయ్యాలో, దేవుడు
చెప్పింది చెయ్యాలో, దేవుని దృష్టిలో ఏది న్యాయమో
మీలో మీరు నిర్ణయించుకోండి. 20ఎందుకంటే మేము
చూసిన దాన్ని, విన్న దాన్ని గురించి ప్రజలకు చెప్ప
కుండా వుండలేము" అని అన్నారు.

21వాళ్ళు పేతురును, యోహానును, యింకా
కొంచెం భయపెట్టి వదిలేసారు. 22దేవుని మహిమ వల్ల
నయమైన వ్యక్తి నలభై ఏండ్లు దాటినవాడు. ఈ జరిగిన
సంఘటనవల్ల ప్రజలంతా కలిసి దేవుణ్ణి స్తుతించటం
మొదలుపెట్టారు. అందువలన వీళ్ళను ఏ విధంగా
శిక్షించాలో వాళ్ళు నిర్ణయం తీసుకోలేక పోయారు.

## విశ్వాసుల ప్రార్థన

23విడుదలయ్యాక పేతురు, యోహానులు తమ
వాళ్ళ దగ్గరకు వెళ్ళి ప్రధాన యాజకులు, పెద్దలు
చెప్పినదంతా చెప్పారు. 24ఇది విన్నాక వాళ్ళంతా కలిసి
ఒకే ధ్యేయంతో దేవుణ్ణి ఈ విధంగా ప్రార్థించారు:
"మహా ప్రభూ! నీవు ఆకాశాన్ని, భూమిని, సముద్రాన్ని
వాటిలో ఉన్న సకల వస్తువుల్ని సృష్టించావు. 25నీవు
పవిత్రాత్మ ద్వారా నీ సేవకుడు, మా తండ్రి అయిన
దావీదు నోటినుండి యిలా పలికించావు:

'జనాంగములు ఎందుకు రెచ్చుతున్నాయి?
26 ప్రజలెందుకు వృధాగా పన్నాగాలు పన్ను
తున్నారు? రాజులు, పాలకులు కలిసి
ప్రభువును, ఆయన క్రీస్తును ఎందుకు
ఎదిరిస్తున్నారు?'
*కీర్తన 2:1-2*

27హేరోదు మరియు పొంతి పిలాతు, ఇశ్రాయేలు ప్రజ
లతో మరియు యితర దేశ ప్రజలతో కలిసారు.
అంతా కలిసి పవిత్రతగల నీ సేవకుణ్ణి, నీవు క్రీస్తుగా
నియమించిన యేసును నిజంగానే ఎదిరించారు. 28ఏది
జరగాలో నీ శక్తి సంకల్పానుసారం నీవు ముందే నిర్ణయిం
చావు. వాళ్ళు నీవు నిర్ణయించినట్లే చేసారు. 29ఇప్పుడు
వాళ్ళు మమ్మల్ని భయ పెడ్తున్నారు, చూడు ప్రభూ!
నీ సందేశాన్ని ధైర్యంగా చెప్పే శక్తిని నీ సేవకులకు
యివ్వు! 30యేసు పవిత్రమైనవాడు, నీ సేవకుడు.
ఆయన పేరిట రోగుల్ని నయం చేయటానికి, అద్భు
తాలు, మహాత్యాలు చెయ్యటానికి నీ అభయ హస్తాన్ని
చాపి మాకు శక్తి నివ్వు!"

31వాళ్ళ ప్రార్థన ముగిసాక వాళ్ళు సమావేశమైన
స్థలం కంపించింది. అందరిలో పవిత్రాత్మ నింపుదల

కలిగింది. వాళ్ళు దైవ సందేశాన్ని ధైర్యంగా చెప్పటం
మొదలు పెట్టారు.

## విశ్వాసుల ఐకమత్యం

32విశ్వాసుల మనస్సు, ఆత్మ ఒకే విధంగా ఉండేవి.
ఎవ్వరూ 'ఇది నాది' అని అనకుండా తమకున్న వాటిని
ఇతర్లతో పంచుకొనే వాళ్ళు. 33దైవికమైన శక్తితో అపొస్త
లులు ప్రభువు బ్రతికి వచ్చాడని ఋజువు చేసారు.
దేవుని అనుగ్రహం వాళ్ళందరిపై సంపూర్ణంగా ఉంది.
34వాళ్ళలో ఎవ్వరికీ ఏ కొరతలు ఉండేవి కావు. ఇండ్లు,
పొలాలు ఉన్న వాళ్ళు వాటిని అమ్మి, 35ఆ డబ్బును
అపొస్తలుల పాదాల ముందుంచే వాళ్ళు. ఆ అపొస్తలులు
అవసరమున్న ప్రతి ఒక్కనికి ఆ డబ్బును పంచే వాళ్ళు.
36యోసేపు అనే అతడు లేవి వంశీయుడు. ఇతడు
సైప్రసు (కుప్ర) ద్వీపానికి చెందిన వాడు. ఇతణ్ణి
అపొస్తలులు బర్నబా (ప్రోత్సాహపు కుమారుడని ఈ
పదానికి అర్థం) అని పిలిచే వాళ్ళు. 37ఇతడు తన
పొలాన్ని అమ్మి ఆ డబ్బు తెచ్చి అపొస్తలుల పాదాల
ముందుంచాడు.

## అననీయ మరియు సప్పీరా

5 'అననీయ' అనబడే ఒక వ్యక్తి, అతని భార్య
'సప్పీరా' కలిసి తమ భూమి అమ్మేసారు. 2'అన
నీయ' తన కొరకు కొంత డబ్బు దాచుకొన్నాడు.
ఈ విషయం అతని భార్యకు తెలుసు. 'అననీయ'
మిగతా డబ్బు తెచ్చి అపొస్తలుల కాళ్ళ ముందుంచాడు.
3అప్పుడు పేతురు ఈ విధంగా అన్నాడు: "అననీయా
నీ మనస్సులో సైతాను ఎందుకు చేరాడు? భూమి
అమ్మగా వచ్చిన డబ్బులో కొంత భాగాన్ని దాచి పవి
త్రాత్మను ఎందుకు మోసం చేసావు? 4అది అమ్మక
ముందు కూడా నీదే కదా! అమ్మిన తర్వాత కూడా
ఆ డబ్బు నీ ఆధీనంలోనే ఉంది కదా! ఇలా చెయ్య
టానికి నీకెట్లా బుద్ధి పుట్టింది. నీవు మనుష్యులతో
కాదు అబద్ధం ఆడింది, దేవునితో." 5ఈ మాటలు
విని అననీయ క్రింద పడి ప్రాణాలు విడిచాడు. ఈ
సంఘటన విన్న వాళ్ళందరికీ ఒక పెద్ద భయం పట్టు
కుంది. 6కొందరు యువకులు ముందుకొచ్చి అననీయ
దేహాన్ని ఒక వస్త్రంలో చుట్టి మోసుకెళ్ళి సమాధి
చేసారు.

7మూడు గంటల తర్వాత అననీయ భార్య అక్కడికి
వచ్చింది. అక్కడ జరిగిందేదీ ఆమెకు తెలియదు.
8పేతురు, "మీరు భూమి అమ్మగా లభించిన డబ్బు
యింతేనా? చెప్పు!" అని ఆమెను అడిగాడు.

"ఔనండి! అంతే డబ్బు లభించింది" అని ఆమె
సమాధానం చెప్పింది.

9పేతురు ఆమెతో, "నీవు, నీ భర్త కలిసి ప్రభువు
ఆత్మను పరీక్షించాలని ఎందుకు నిశ్చయించు
కున్నారు? ఆ తలుపు దగ్గరనుండి వస్తున్న అడుగుల
చప్పుడు విను! అవి నీ భర్తను సమాధి చేసిన వాళ్ళవి.
వాళ్ళు నిన్ను కూడా మోసుకు వెళ్తారు" అని అన్నాడు.
10తక్షణమే ఆమె అతని పాదములముందు పడి
ప్రాణాలు విడిచింది. ఆ తర్వాత యువకులు లోపలికి
వచ్చి ఆమె చనిపోయి ఉండటం చూసి ఆమెను కూడా
మోసుకు వెళ్ళి ఆమె భర్త ప్రక్కన సమాధి చేసారు.
11సంఘానికీ, ఈ సంఘటనలు విన్న వాళ్ళకు పెద్ద
భయం పట్టుకుంది.

## అనేకులను నయం చేయటం

12అపొస్తలులు, విశ్వాసులు, ఉమ్మడిగా సొలొమోను
మండపంలో సమావేశమౌతూ ఉండే వాళ్ళు. వీళ్ళు
ప్రజల్లో ఎన్నో అద్భుతాలు, మహత్యాలు చేసారు.
13ప్రజలు అపొస్తలుల్ని పొగుడుతూ ఉన్నప్పటికి
మిగతా వాళ్ళు వాళ్ళతో చేరడానికి తెగించలేదు.
14చాలా మంది స్త్రీలు, పురుషుల ప్రభువును విశ్వసిం
చారు. ప్రభువు వాళ్ళను సంఘంలో చేర్చాడు. 15ఇవి
చూసిన ప్రజలు జబ్బుతో ఉన్న వాళ్ళను దారి మీదికి
తెచ్చి పరుపుల మీద చాపల మీద పడుకోబెట్టారు.
పేతురు ఆ దారి మీదుగా నడిచినప్పుడు అతని నీడ
కొందరి మీదనన్నా పడుతుందని వాళ్ళ ఉద్దేశ్యం.
16ప్రజలు యెరూషలేము చుట్టూ ఉన్న ప్రాంతాల
నుండి గుంపులు గుంపులుగా వచ్చారు. తమలో
జబ్బుతో ఉన్న వాళ్ళను, దయ్యాలు పట్టి బాధపడ్తున్న
వాళ్ళను తీసుకు వచ్చారు. వాళ్ళందరికి నయమై
పోయింది.

## అపొస్తలులు హింసించబడుట

17సద్దూకయ్యుల తెగకు చెందిన ప్రధాన యాజ
కుడు, అతనితో ఉన్న వాళ్ళు అసూయతో నిండి
పోయారు. 18వాళ్ళు అపొస్తలులను బంధించి కారాగా
రంలో వేసారు. 19కాని రాత్రివేళ దేవదూత కారాగారపు
తలుపులు తీసి వాళ్ళను బయటికి పిలుచుకు వచ్చాడు.
20వాళ్ళతో, "వెళ్ళి మందిర ఆవరణంలో నిలుచొని
ఈ క్రొత్త జీవితాన్ని గురించి విశదంగా ప్రజలకు
చెప్పండి" అని చెప్పాడు. 21దేవదూత చెప్పినట్లు విని
వాళ్ళు తెల్లవారుతుండగా మందిరం యొక్క ఆవర
ణంలో ప్రవేశించి ప్రజలకు బోధించటం మొదలు
పెట్టారు.

ప్రధానయాజకుడు, అతనితో ఉన్న వాళ్ళు ఇశ్రా
యేలు ప్రజల పెద్దలందర్ని సమావేశపరిచి మహాసభను
ఏర్పాటు చేసారు. ఆ తర్వాత అపొస్తలులను పిలుచుకు
రమ్మని కొందర్ని కారాగారానికి పంపారు. 22-23భటులు
కారాగారానికి వచ్చారు. కాని వాళ్ళకు అపొస్తలులు కన
పడలేదు. వాళ్ళు తిరిగి వెళ్ళి, "మేము కారాగారపు
ద్వారాలు భద్రంగా తాళం వేయబడి ఉండటం

చూసాము. ద్వార పాలకులు ద్వారాల దగ్గర ఉండటం
చూసాము. కాని ద్వారాలు తెరిచి చూస్తే అపొస్తలులు
లేరు" అని జరిగిన విషయం చెప్పారు. 24ఈ సంగతి
విని మందిరం యొక్క ద్వారపాలకుల అధిపతి, ప్రధాన
యాజకులు, వాళ్ళు ఏమై ఉంటారా? అని ఆశ్చర్య
పడ్డారు. 25ఇంతలో ఒకడు వచ్చి, "మీరు కారాగారంలో
ఉంచిన వాళ్ళు మందిరం యొక్క అవరణంలో నిలబడి
ప్రజలకు బోధిస్తున్నారు" అని చెప్పాడు. 26ఇది విని
ద్వారపాలకుల అధిపతి భటులను వెంట తీసుకొని
వాళ్ళను పట్టుకు రావటానికి వెళ్ళాడు. ప్రజలు తమను
రాళ్ళతో కొడతారనే భయం వాళ్ళలో ఉంది. కనుక
అపొస్తలులపై వాళ్ళు ఏ దౌర్జన్యం చేయలేదు.
27అపొస్తలుల్ని పిలుచుకు వచ్చి మహాసభ ముందు
నిలుచో బెట్టారు. ప్రధానయాజకుడు విచారణ చేస్తూ,
28"మీ యేసు పేరిట బోధించవద్దని మేము యిది
వరకే ఖచ్చితంగా ఆజ్ఞాపించాము. అయినా యెరూషలే
మంతా మీ బోధనలతో నింపివేసారు. అంతేకాక అతని
మరణాన్ని మాపై మోపాలని చూస్తున్నారు" అని
అన్నాడు. 29పేతురు, మిగతా అపొస్తలులు యిలా
అన్నారు: "మేము దేవుని ఆజ్ఞల్ని పాటిస్తున్నాము,
మానవుల ఆజ్ఞల్ని కాదు. 30మీరు సిలువకు వ్రేలాడదీసి
చంపిన యేసును మా పూర్వీకుల దేవుడు బ్రతికిం
చాడు. 31దేవుడు ఆయనకు తన కుడి వైపుననున్న
స్థానాన్నిచ్చాడు. ఆయన్ని ఒక అధిపతిగా, రక్షకుడిలా
నియమించాడు. తద్వారా ఇశ్రాయేలు ప్రజలకు పశ్చా
త్తాపం పొందే అవకాశము, తమ పాపాలకు క్షమాపణ
పొందే అవకాశము కలగాలని ఆయన ఉద్దేశ్యం. 32వీటికి
మేము సాక్షులము. దేవుడు తన ఆజ్ఞల్ని పాటించిన
వాళ్ళ కిచ్చిన పవిత్రాత్మ కూడా దీనికి సాక్షి."
33ఇది విని వాళ్ళకు చాలా కోపం వచ్చింది. వాళ్ళు,
అపొస్తలులను చంపాలనుకున్నారు. 34కాని 'గమలీ
యేలు' అనే పరిసయ్యుడు ఆ మహాసభలో లేచి నిలు
చొని అపొస్తలుల్ని కొంతసేపు అవతలకు తీసుకు
వెళ్ళమని ఆజ్ఞాపించాడు. గమలీయేలు ధర్మశాస్త్ర పండి
తుడు. ప్రజల గౌరవం పొందినవాడు. 35అతడు వాళ్ళని
సంబోధిస్తూ, "ఇశ్రాయేలు ప్రజలారా! వీళ్ళను ఏమి
చెయ్యాలో జాగ్రత్తగా ఆలోచించండి! 36ఇదివరలో
థూదా కనిపించి తానొక గొప్ప వాణ్ణని చెప్పుకున్నాడు.
సుమారు నాలుగువందల యాభై మంది అతణ్ణి అనుస
రించారు. అతడు చంపబడ్డాడు. ఆ తర్వాత అతని
అనుచరులు చెదిరి పోయారు. చివరకు ఏమీ మిగల్లేదు.
37అతని తర్వాత జానాభా లెక్కల కాలంలో యూదా
అనే వాడు వచ్చి ప్రజల్ని చేరదీసి తిరుగుబాటు చేసాడు.
ఇతడు గలిలయవాడు. ఇతడు కూడా చంపబడ్డాడు.
అతని అనుచరులందరూ చెదిరిపోయారు, 38అందువల్ల
వాళ్ళ విషయంలో నా సలహా ఇది: వాళ్ళ విషయం
పట్టించుకోకండి! వాళ్ళను వదిలివేయండి! వాళ్ళ
కార్యము, వాళ్ళ ఉద్దేశ్యము మానవుడు సృష్టించినదైతే
అది నశిస్తుంది. 39అలా కాకుండా అది దైవేచ్ఛ వలన
అయితే మీరు వాళ్ళను ఆపలేరు. అలా చేస్తే మీరు
దేవునికి ఎదురు తిరిగిన వాళ్ళౌతారు" అని అన్నాడు.
40సభ్యులు అతడు చెప్పినట్లు విన్నారు. అపొస్త
లుల్ని పిలిపించి కొరడా దెబ్బలు కొట్టించారు. ఆ
తర్వాత, యేసు పేరిట మాట్లాడవద్దని వారించి వదిలి
వేసారు. 41అపొస్తలులు యేసు కోసం అవమానింప
బడటానికి తాము అర్హులైనందుకు సంతోషిస్తూ మహా
సభ నుండి వెళ్ళి పోయారు. 42ప్రతి రోజూ మంది
రంలో, ఇంటింటా, "యేసే క్రీస్తు" అని ప్రకటించారు.
ఈ సువార్త ప్రకటించటం మానుకోలేదు.

## ఏడుగురిని ఎన్నుకోవటం

6 యేసు అనుచరుల సంఖ్య పెరుగుతూ ఉంది. ఆ
రోజుల్లో గ్రీకు భాషలో మాట్లాడే యూదులు
హీబ్రూ భాష మాట్లాడే యూదులతో, "మా వితంతు
వుల్ని ప్రతి రోజు చేసే దానాల విషయంలో సరిగ్గా
చూడటం లేదు" అని తగువు పెట్టుకొన్నారు.
2అందువలన ఆ పన్నెండుమంది అపొస్తలులు అను
చరులందర్ని సమావేశపరిచి ఈ విధంగా అన్నారు:
"అన్న దానాల విషయం చూడటానికోసం మేము
దేవుని సందేశం యొక్క బోధన విషయంలో అశ్రద్ధ
వహించటం మంచిది కాదు. 3సోదరులారా! పవిత్రాత్మ
సంపూర్ణంగాగల వాళ్ళను, పూర్ణ జ్ఞానం కల వాళ్ళను
ఏడుగురిని మీలోనుండి ఎన్నుకోండి. ఈ బాధ్యత
వాళ్ళకప్పగిస్తాం. 4మేము మా కాలాన్ని ప్రార్థనలకు,
దేవుని సందేశాన్ని ఉపదేశించటానికి వినియోగిస్తాము."
5అపొస్తలులు చెప్పింది వాళ్ళకందరికి బాగా
నచ్చింది. వాళ్ళు స్తెఫనును ఎన్ను కొన్నారు. స్తెఫను
దేవుని పట్ల గొప్ప విశ్వాసం గలవాడు. అతనిలో పవి
త్రాత్మ సంపూర్ణంగా ఉంది. అతణ్ణే కాక ఫిలిప్పును,
ప్రొకొరును, నీకానోరును, తీమోనును, పర్మెనాసును,
నీకొలాసును కూడా ఎన్నుకొన్నారు. ఈ నీకొలాసు
అంతియొకయకు చెందినవాడు. పూర్వం యూదుల
మతంలో చేరినవాడు. 6ప్రజలు వీళ్ళను అపొస్తలుల
ముందుకు పిలుచుకొని వచ్చారు. అపొస్తలులు
ప్రార్థించి తమ చేతుల్ని వాళ్ళపై ఉంచారు.
7దేవుని సందేశం ప్రచారమైంది. యెరూషలేములో
శిష్యుల సంఖ్య బాగా పెరిగి పోయింది. చాలా మంది
యాజకులు విశ్వసించారు.

## స్తెఫనును బంధించటం

8దేవునినుండి సంపూర్ణమైన శక్తిని, అనుగ్రహాన్ని
పొందిన స్తెఫను ప్రజల సమక్షంలో గొప్ప అద్భుతాలు
చేసాడు. అద్భుతమైన చిహ్నాలు చూపాడు. 9కాని
స్వతంత్రుల సమాజమని పిలువబడే సమాజానికి

చెందిన కొందరు యూదులు స్తెఫనుతో వాదన పెట్టు
కొన్నారు. వీళ్ళలో కురేనీ, అలెక్సంద్రియ పట్టణాలకు
చెందిన యూదులు, కిలికియ, ఆసియ ప్రాంతాలకు
చెందిన యూదులు కూడా ఉన్నారు. [10]కాని మాట్లాడ
టానికి పవిత్రాత్మ అతనికి తెలివి నిచ్చాడు. కనుక
అతని మాటలకు వాళ్ళు ఎదురు చెప్పలేక పోయారు.
[11]ఆ తర్వాత యూదులు కొందరిని పురికొలిపి, "ఈ
స్తెఫను మోషేను, దేవుణ్ణి దూషిస్తూ మాట్లాడటం
మేము విన్నాము" అని చెప్పమన్నారు. [12]అదే విధంగా
ప్రజల్ని, పెద్దల్ని, పండితుల్ని, కూడా పురికొలిపి
పంపారు. ఆ తదుపరి స్తెఫన్ను బంధించి మహాసభ
ముందుకు తెచ్చారు. [13-14]తప్పుడు సాక్ష్యాలు తెచ్చి,
"యితడు ఈ పవిత్ర స్థానాన్ని గురించి, ధర్మశాస్త్రాన్ని
గురించి ఎదిరిస్తూ మాట్లాడటం మానుకోడు. ఎందు
కంటే, ఇతడు నజరేతు నివాసి యేసు ఈ ప్రాంతాన్ని
నాశనం చేస్తాడని, మోషే మనకందించిన ఆచారాన్ని
మారుస్తాడని చెప్పటం మేము విన్నాము" అని వాళ్ళతో
చెప్పించారు. [15]సభలో కూర్చొన్న వాళ్ళంతా స్తెఫను
వైపు శ్రద్ధగా చూసారు. వాళ్ళకు అతని ముఖం ఒక
దేవదూత ముఖంలా కనిపించింది.

### స్తెఫను ఉపన్యాసం

7 ఆ తర్వాత ప్రధానయాజకుడు, "ఈ నేరారో
పణలు నిజమా?" అని అతణ్ణి అడిగాడు. [2]అతడు
సమాధానంగా, "అయ్యలారా! సోదరులారా! నేను
చెప్పేది వినండి. అది, మన తండ్రి అబ్రాహాము
'మెసొపొతమియలో' నివసిస్తున్న కాలం. అంటే, అతడు
అప్పటికి యింకా తన నివాసాన్ని 'హారాను' పట్టణానికి
మార్చలేదన్న మాట. [3]అక్కడ అతనికి తేజస్వి అయిన
దేవుడు కనిపించి, 'నీ దేశాన్ని, ప్రజల్ని వదిలి నేను
చూపబోయే దేశానికి వెళ్ళు' అని అన్నాడు. [4]అందువల్ల
అతడు కల్దీయులదేశాన్ని వదిలి హారానులో స్థిరపడ్డాడు.
అతని తండ్రి చనిపోయాక ఆ దేశాన్ని కూడా వదలమని,
మీరిప్పుడు నివసిస్తున్న ఈ దేశంలో దేవుడతణ్ణి
స్థిరపర్చాడు. [5]దేవుడతనికి ఈ దేశంలో ఒక్క అడుగు
భూమి కూడా ఆస్థిగా యివ్వలేదు. అతనికి అప్పుడు
సంతానం లేక పోయినా, అతనికి, అతని తర్వాత
రానున్న వాళ్ళకు ఆ దేశం ఆస్తిగా ఉంటుందని వాగ్దానం
చేసాడు. [6]దేవుడతనితో, 'నీ వారసులు పరదేశంలో
నివసిస్తారు. ఆ పరదేశీయులు, నీ వాళ్ళను నాలుగు
వందల సంవత్సరాలు తమ బానిసలుగా ఉంచుకొని
వాళ్ళను కష్టపెడతారు. [7]వాళ్ళను బానిసలుగా చేసిన
దేశాన్ని, నేను శిక్షిస్తాను. ఆ తర్వాత నీ ప్రజలు ఆ
దేశం వదిలి నన్ను యిక్కడ ఆరాధిస్తారు' అని అన్నాడు.
[8]సున్నతి నియమాన్ని పాటిస్తే తన వాగ్దానాన్ని నిలుపు
కొంటానని దేవుడు అబ్రాహాముతో ఒక ఒప్పందం
చేసాడు. ఇస్సాకు పుట్టిన ఎనిమిదవ రోజున అబ్రాహాము
అతనికి సున్నతి చేయించాడు. అదే విధంగా ఇస్సాకు
తన కుమారుడైన యాకోబుకు సున్నతి చేయిం
చాడు. యాకోబు తన పన్నెండుమంది కుమారులకు
సున్నతి చేయించాడు. ఈ పన్నెండు మంది పండ్రెండు
వంశాలకు మూల పురుషులయ్యారు.
[9]"వీళ్ళకు, తమలో ఒకడైన యోసేపు మీద ఈర్ష్య
ఉండేది. అందువల్ల వాళ్ళతణ్ణి ఈజిప్టు దేశానికి బానిసగా
అమ్మేసారు. కాని దేవుడతనికి అండగా ఉండి, [10]అతణ్ణి
కష్టాల నుండి రక్షించాడు. అతనికి జ్ఞానాన్ని యిచ్చాడు.
ఆ జ్ఞానంతో అతడు ఈజిప్టు రాజైన 'ఫరో' అభిమా
నాన్ని సంపాదించాడు. 'ఫరో' అతణ్ణి ఈజిప్టు దేశానికి
పాలకునిగా, తన రాజ భవనాలకు అధికారిగా నియమిం
చాడు. [11]ఇంతలో ఈజిప్టు, కనాను దేశాల్లో కరువు
రాగా ప్రజలు చాలా కష్టాలనుభవించారు. మన పూర్వీకు
లకు తినటానికి తిండి కూడా లేకుండింది. [12]ఈజిప్టు
దేశంలో ధాన్యం ఉందని తెలియగానే యాకోబు మన
పూర్వీకుల్ని మొదటి సారిగా అక్కడకు పంపాడు.
[13]రెండవసారి వచ్చినప్పుడు, యోసేపు తానెవ్వరన్న
విషయం తన సోదరులకు చెప్పాడు. యోసేపు
కుటుంబాన్ని గురించి ఫరోకు తెలిసిపోయింది. [14]ఆ
తర్వాత యోసేపు తన తండ్రి యాకోబును, డెబ్బై
ఐదు మందిగల తన కుటుంబాన్ని పిలవనంపాడు.
[15]యాకోబు ఈజిప్టు దేశానికి వచ్చాక, అతడు, మన
పూర్వీకులు అందరూ చనిపోయారు. [16]వాళ్ళ దేహాలు
షెకెము పట్టణానికి తేబడ్డాయి. అబ్రాహాము యిదివ
రలో హమోరు వంశం వాళ్ళకు డబ్బిచ్చి వాళ్ళనుండి
ఒక స్మశాన భూమిని కొని ఉన్నాడు. వాళ్ళు అక్కడ
సమాధి చేయబడ్డారు.
[17]"దేవుడు అబ్రాహాముకు చేసిన వాగ్దానం ఫలించే
సమయం దగ్గరకు వచ్చింది. ఈజిప్టులో మన వాళ్ళ
సంఖ్య బహుగా పెరిగింది. [18]కొంత కాలం తర్వాత
యోసేపును గురించి ఏమీ తెలియనివాడు ఈజిప్టు
దేశానికి పాలకుడయ్యాడు. [19]అతడు మన వాళ్ళను
మోసం చేసాడు. మన వాళ్ళ సంతానం చనిపోవాలని,
వాళ్ళకు పుట్టిన పసికందుల్ని బయట వేయించి వాళ్ళ
పట్ల క్రూరంగా ప్రవర్తించాడు. [20]ఆ కాలంలోనే మోషే
జన్మించాడు. ఇతడు సామాన్యుడు కాడు. మోషే
మూడు నెలల దాకా తన తల్లి దండ్రుల దగ్గర పెరిగాడు.
[21]ఇతణ్ణి యింటి బయట ఉంచగానే ఫరో కుమార్తె
తీసుకెళ్ళి తన స్వంత కుమారునిగా పెంచుకుంది.
[22]ఈజిప్టు దేశస్థుల జ్ఞానాన్నంతా అతనికి నేర్పించింది.
మోషే గొప్ప విషయాలు చెప్పటంలో గొప్ప పనులు
చేయటంలో ఆరితేరిన వాడయ్యాడు.
[23]"మోషేకు నలభై సంవత్సరాలు రాగానే అతడు
తన తోటి ఇశ్రాయేలు ప్రజల్ని కలుసుకొన్నాడు.
[24]ఒక సారి మోషే, ఈజిప్టు దేశస్థుడు ఇశ్రాయేలు వానితో
అన్యాయంగా ప్రవర్తించటం చూసి ఇశ్రాయేలీవానికి

సహాయం చెయ్యాలనే ఉద్దేశ్యంతో, అతణ్ణి రక్షించటా
నికి వెళ్ళాడు. ఈజిప్టు దేశస్థుణ్ణి చంపి ఇశ్రాయేలు
వాని పక్షాన పగ తీర్చుకున్నాడు. 25ఇశ్రాయేలు ప్రజల్ని
రక్షించటానికి దేవుడు తనను ఉపయోగిస్తున్న విషయం
వాళ్ళు తెలుసుకొంటారని మోషే ఆశించాడు. కాని
వాళ్ళకది అర్థంకా లేదు. 26మరుసటి రోజు మోషే
యిద్దరు ఇశ్రాయేలీయులు పోట్లాడటంచూసి, వాళ్ళను
శాంత పరచాలనే ఉద్దేశ్యంతో, 'అయ్యా! మీరు సోద
రులు! పరస్పరం ఎందుకు పోట్లాడుతున్నారు?' అని
అడిగాడు. 27ఏ ఇశ్రాయేలు వాడు తోటివాడికి
అన్యాయం చేశాడో వాడు, మోషేను ప్రక్కకు త్రోసి,
'మా మీద తీర్పు చెప్పటానికి, మమ్మల్ని పాలించటానికి
నిన్నెవరు నియమించారు? 28ఈజిప్టు దేశస్థుణ్ణి నిన్న
చంపినట్లు నన్ను కూడా చంపాలని చూస్తున్నావా?'
అని అన్నాడు. 29ఈ విమర్శ విని మోషే ఈజిప్టు
దేశాన్ని వదిలి, మిద్యాను దేశానికి పారిపోయి అక్కడ
పరదేశీయునిగా స్థిరపడ్డాడు. అక్కడ అతనికి యిద్దరు
కుమారులు కలిగారు.

30"నలభై సంవత్సరాలు గడిచాయి. ఒక రోజు
సీనాయి పర్వతంపై మండుతున్న పొదలో మోషేకు
ఒక దేవదూత కనిపించాడు. 31ఆ దృశ్యాన్ని చూసి
మోషే దిగ్భ్రాంతి చెందాడు. దగ్గరనుండి చూడాలను
కొని ముందుకు వెళ్తుండగా అతనికి ప్రభువు స్వరం
వినిపించింది. 32ఆ స్వరం అతనితో 'నేను మీ పూర్వుల
దేవుణ్ణి! అబ్రాహాము, ఇస్సాకు, యాకోబుల దేవుణ్ణి!'*
అని అన్నాడు. మోషే వణికి పోయాడు. తలెత్తి చూడ
టానికి అతనికి ధైర్యం చాలలేదు. 33ప్రభువు, "చెప్పులు
తీసెయ్యి! నీవు నిలుచున్న స్థలం పవిత్రమైనది. 34నా
ప్రజల్ని ఈజిప్టులో అణచి ఉంచటం చూసాను. వాళ్ళ
ఏడుపులు విన్నాను. వాళ్ళకు విముక్తి కలిగించటానికి
వచ్చాను. రా! నిన్ను తిరిగి ఈజిప్టు పంపుతాను!'*
అని అన్నాడు.

35స్తెఫను ఇంకా ఇలా చెప్పాడు: "నిన్ను పాలకు
నిగా, న్యాయాధిపతిగా చేసిందెవరు?' అని వాళ్ళచే
తిరస్కరింపబడినవాడే ఈ మోషే. ఈ మోషేను
దేవుడు వాళ్ళపాలకునిగా, రక్షకునిగా పంపినట్లు పొదలో
కనిపించిన దేవదూత ద్వారా తెలియచేసాడు. 36మోషే
అద్భుతాలు, మహాత్యాలు చేసి వాళ్ళను ఈజిప్టు నుండి
వెలుపలికి పిలుచుకు వచ్చాడు. ఎఱ్ఱ సముద్రం దగ్గర,
ఆ తర్వాత నలభై సంవత్సరాలు ఎడారుల్లో కూడా
అద్భుతాలు, మహాత్యాలు చేసాడు. 37'నా లాంటి
ప్రవక్తను దేవుడు మీ నుండి ఎన్నుకొని మీకందిస్తాడు'
అని ఇశ్రాయేలు ప్రజలతో చెప్పిన మోషే ఇతడే!
38ఇశ్రాయేలు ప్రజలందరూ ఎడారిలో సమావేశమైన
ప్పుడు, అక్కడున్న మన పూర్వీకులతో కలిసి ఉన్న
వాడు మోషేనే. సీనాయి పర్వతంపై దేవదూతతో
మాట్లాడింది మోషేనే. మనకు అందివ్వటానికి సజీవ
మైన దైవసందేశాన్ని పొందింది మోషేనే.

39"కాని మన పూర్వీకులు అతని మాటలు వినలేదు.
పైగా అతణ్ణి తిరస్కరించి ఈజిప్టు దేశానికి తిరిగి వెళ్ళా
లనుకొన్నారు. 40అందువల్ల అహరోనుతో, 'మాకు దారి
చూపించగల దేవుళ్ళ విగ్రహాలను సిద్ధం చేయించు.
మమ్మల్ని ఈజిప్టు నుండి పిలుచుకు వచ్చిన ఆ
మోషేకు ఏమైందో ఏమో!'* అని అన్నారు. 41వెంటనే
అందరూ కలిసి దూడ రూపంలో ఒక విగ్రహాన్ని సిద్ధం
చేసారు. ఆ విగ్రహానికి బలి అర్పించారు. తమ చేతుల్తో
తయారు చేసిన ఆ విగ్రహం పేరిట పండుగ చేసు
కొన్నారు. 42కాని దేవుడు విరక్తి చెంది, 'ఆకాశంలోని
మీ దేవుళ్ళను మీరు పూజించుకొండి' అని అన్నాడు.
దీన్ని గురించి ప్రవక్తల గ్రంథంలో యిలా వ్రాయబడి
వుంది:

'ఓ ఇశ్రాయేలు ప్రజలారా! ఎడారుల్లో
నలభై సంవత్సరాలు పశువుల్ని బలి
యిచ్చింది నా కోసం కాదు!
43 మీరు మీ వెంట మోసుకు వెళ్ళింది,
'మొలొకు' యొక్క డేరా! మీరు మోసుకు
వెళ్ళింది మీరు దేవుడను కొంటున్న
'రొంఫా' నక్షత్రం యొక్క విగ్రహాన్ని!
దాన్ని మీరు పూజించుకోవటానికి సృష్టిం
చుకున్నారు. కనుక మిమ్మల్ని బబులోను
నగరానికి దూరంగా పంపుతాను!'

ఆమోసు *5:25-27*

44"మన పూర్వులు ఎడారుల్లో ఉన్నప్పుడు వాళ్ళ
వద్ద దేవుని గుడారం ఉంది. ఇది మోషేచే నిర్మింప
బడినది. ఇది నిర్మింపబడక ముందు దేవుడు ఒక
నమూనాను మోషేకు చూపి దాని ప్రకారం నిర్మించు
మని ఆజ్ఞాపించాడు. 45ఆ తర్వాత ఇది మన పూర్వీకు
లకు లభించింది. వాళ్ళు యెహోషువ నాయకత్వాన,
దేవుడు పారద్రోలిన ప్రజలు వదిలి వెళ్తున్న భూమిపై
స్థిరపడుతున్న సమయాన ఈ గుడారం వాళ్ళ దగ్గరే
ఉంది. దావీదు కాలందాకా అది ఆ దేశంలో ఉంది.
46దావీదు దేవుని అనుగ్రహం పొంది యాకోబు వంశీ
యుల కోసం మందిరాన్ని నిర్మించే అవకాశం యివ్వ
మని దేవున్ని కోరాడు. 47అయితే ఈ మందిరాన్ని
నిర్మించింది సొలొమోను రాజు.

48"కాని సర్వోన్నతుడైన దేవుడు మానవులు నిర్మిం
చిన మందిరాల్లో నివసించడు. దీన్ని గురించి ప్రవక్త
యిలా అన్నాడు:

---

**నేను ... దేవుణ్ణి** నిర్గమ. 3:6.

**వాళ్ళకు ... పంపుతాను** నిర్గమ. 3:5-10.

**మాకు ... ఏమో** నిర్గమ. 32:1.

49 'ఆకాశం నా సింహాసనం! భూమి నా పాద
పీఠం! నా కెలాంటి మందిరం నిర్మిస్తారు
మీరు? విశ్రాంతికి నాకు స్థలం ఏది?
50 ఇవన్నీ నిర్మించింది నేనే కాదా?' అని ప్రభు
వన్నాడు." యెషయా *66:1-2*

51స్తెఫను ఉపన్యాసం సాగిస్తూ, "మూర్ఖులారా! మీ
హృదయాలు యూదులుకాని వాళ్ళ హృదయాల వలే
ఉన్నాయి. మీ చెవులు దైవ సందేశాన్ని వినటానికి
నిరాకరిస్తున్నాయి. మీరు మీ పూర్వులు ప్రవర్తించి
నట్లు ప్రవర్తిస్తున్నారు. వాళ్ళవలె మీరు కూడా అన్ని
వేళలా పవిత్రాత్మను తృణీకరించారు. 52మీ పూర్వులు
హింసించని ప్రవక్త ఒక్కడైనా ఉన్నాడా! నీతిమంతుడు
రానున్నాడని ప్రవచనం చెప్పిన వాళ్ళను వాళ్ళు చంపి
వేసారు. ఇక మీరు ద్రోహం చేసి క్రీస్తుని కూడా చంపే
సారు. 53దేవదూతల ద్వారా అందివ్వబడిన దేవుని
ధర్మశాస్త్రం లభించింది మీకు. కాని దాన్ని మీరు పాటిం
చను కూడా లేదు" అని అన్నాడు.

## స్తెఫన్ను రాళ్ళతో కొట్టి చంపటం

54ఈ మాటలు విని వాళ్ళు కోపంతో మండి పోయి,
అతణ్ణి చూసి పళ్ళు కొరికారు. 55కాని స్తెఫను పవిత్రా
త్మతో నిండిపోయి పరలోకం వైపే చూసి దేవుని
తేజస్సును, యేసు దేవుని కుడి వైపు ఉండటం
చూసాడు. 56"అదిగో చూడండి! పరలోకం తెరుచు
కోవటం. దేవుని కుమారుడు ఆయన కుడి వైపు
నిలుచొని వుండటం చూస్తున్నాను!" అని అన్నాడు.
57ఈ మాటలు విని వెంటనే వాళ్ళు తమ చెవులు
మూసుకున్నారు. బిగ్గరగా కేకలు వేస్తూ అతని మీదికి
వెళ్ళారు. 58అతణ్ణి ఊరి బయటికి లాగి రాళ్ళతో
కొట్టటం మొదలు పెట్టారు. ఈ సంఘటన చూస్తున్న
వాళ్ళు తమ వస్త్రాల్ని 'సౌలు' అనబడే ఒక యువకుని
కాళ్ళ ముందు వుంచారు. 59వాళ్ళు రాళ్ళు విసరు
తుండగా స్తెఫను, "యేసు ప్రభూ! నా ఆత్మను నీలో
చేర్చుకో!" అని ప్రార్థించాడు. 60ఆ తదుపరి మోకరిల్లి,
"ప్రభూ! వాళ్ళపై ఈ పాపం మోపవద్దు!" అని బిగ్గరగా
అన్నాడు. ఈ మాట అన్న వెంటనే కళ్ళు మూసాడు.
8 అతణ్ణి చంపటానికి తన అంగీకారం చూపుతు
న్నట్లు సౌలు అక్కడే ఉన్నాడు.

## సౌలు సంఘాన్ని హింసించటం

2-3కొందరు విశ్వాసుల స్తెఫన్ను సమాధి చేసి,
అతని కోసం దుఃఖించారు. ఆ రోజు యెరూషలేము
లోని సంఘంపై పెద్ద హింసాకాండ మొదలైంది. సౌలు
సంఘాన్ని నాశనం చెయ్యటం మొదలు పెట్టాడు.
ఇంటింటికి వెళ్ళి ఆడవాళ్ళను, మగవాళ్ళను బయటకు
లాగి కారాగారంలో వేసాడు. అపొస్తలులు తప్ప మిగతా
వాళ్ళంతా చెదిరిపోయి, యూదయ, సమరయ ప్రాంతా
లకు వెళ్ళిపోయారు. 4ఇలా చెదిరిపోయిన వాళ్ళు
తాము వెళ్ళిన ప్రతిచోటా సువార్త ప్రకటించారు.

## సమరయలో ఫిలిప్పు

5ఫిలిప్పు సమరయలోని ఒక పట్టణానికి వెళ్ళి
క్రీస్తును గురించి ప్రకటించాడు. 6-7ప్రజలు ఫిలిప్పు
చెప్పిన ఉపన్యాసాలు విన్నారు. చేసిన అద్భుతాలు
చూసారు. దయ్యాలు పట్టిన వాళ్ళు, పక్షవాత రోగులు,
కుంటివాళ్ళు చాలా మంది అక్కడ ఉన్నారు.
దయ్యాలు పట్టిన వాళ్ళనుండి దయ్యాలు పెద్దకేకలు
వేస్తూ వెలుపలికి వచ్చాయి. పక్షవాత రోగులకు, కుంటి
వాళ్ళకు నయమైంది. ఈ కారణంగా వాళ్ళు అతడు
చెప్పిన విషయాల్ని జాగ్రత్తగా గమనించారు. 8ఆ
పట్టణంలో ఉన్న వాళ్ళందరూ ఆనందించారు.

## మాంత్రికుడైన సీమోను

9సీమోను సమరయకు చెందినవాడు. అతడు చాలా
కాలం నుండి ఇంద్రజాలం చేస్తూ, సమరయ ప్రజల్ని
ఆశ్చర్య పరుస్తుండేవాడు. తానొక గొప్ప వాణ్ణని చెప్పు
కొనేవాడు. 10చిన్నా, పెద్దా అంతా అతడు చెప్పినవి
జాగ్రత్తగా వినేవాళ్ళు. "మనం గొప్ప శక్తి అంటామే ఆ
దైవికమైన శక్తి అతనిలో మూర్తీభవించి ఉంది" అని
ప్రజలు అనే వాళ్ళు. 11అతడు వాళ్ళను తన ఇంద్ర
జాలంతో చాలాకాలం నుండి ఆశ్చర్య పరుస్తూ ఉండ
టంవల్ల వాళ్ళు అతడు చెప్పినట్లు చేసేవాళ్ళు. 12కాని
దేవుని రాజ్యాన్ని గురించిన శుభవార్తను, యేసు క్రీస్తు
పేరును ఫిలిప్పు ప్రకటించిన తరువాత ఆడ, మగా
అందరూ విని, విశ్వసించి, బాప్తిస్మము పొందారు.
13సీమోను కూడా విశ్వసించి బాప్తిస్మము పొందాడు.
అతడు ఫిలిప్పుకు సన్నిహితంగా ఉండి అతడు చేసిన
మహాత్యాల్ని అద్భుతాల్ని చూసి ఆశ్చర్య పడ్డాడు.
14యెరూషలేములోని అపొస్తలులు సమరయ దేశం
దేవుని సందేశాన్ని అంగీకరించిందని విని, పేతురును,
యోహాన్ను అక్కడికి పంపారు. 15పేతురు, యోహా
నులు వచ్చి అక్కడి వాళ్ళకు పవిత్రాత్మ లభించాలని
ప్రార్థించారు. 16ఎందుకంటే అక్కడి వాళ్ళు యేసు
ప్రభువు పేరిట బాప్తిస్మము పొందారు. కాని వాళ్ళమీదికి
పవిత్రాత్మ యింకారాలేదు. 17వాళ్ళు తమ చేతుల్ని
అక్కడి ప్రజలపై ఉంచిన వెంటనే ఆ ప్రజలు పవి
త్రాత్మను పొందారు.
18అపొస్తలులు తమ చేతుల్ని వాళ్ళపై ఉంచిన
వెంటనే వాళ్ళలోకి పవిత్రాత్మ రావటం సీమోను గమ
నించి వాళ్ళతో, 19"నేను మీకు డబ్బులిస్తాను; నా
చేతులుంచిన ప్రతి ఒక్కనికి పవిత్రాత్మ లభించేటట్లు
చేసే ఈ శక్తి నాక్కూడా యివ్వండి" అని అడిగాడు.

[20]పేతురు, "దేవుని వరాన్ని డబ్బుతో కొనగలనని
అనుకొన్నావు కనుక నీ డబ్బు నీతో నాశనమైపోనీ!
[21]దేవుని దృష్టిలో నీ హృదయం మంచిది కాదు. కనుక
ఈ సేవలో నీకు స్థానం లేదు. [22]నీ దుర్బుద్ధికి పశ్చా
త్తాపం చెంది ప్రభువును ప్రార్థించు. అలాంటి ఆలోచన
నీలో కలిగినందుకు ప్రభువు నిన్ను క్షమించవచ్చు.
[23]నీలో విషం నిండి ఉండటం నేను చూస్తున్నాను.
నీవు అధర్మానికి లోబడి పోయావు" అని సమాధానం
చెప్పాడు.

[24]ఆ తదుపరి సీమోను వాళ్ళతో, "మీరన్నదేదీ
నాకు కలగకూడదని నా పక్షాన ప్రభువును ప్రార్థిం
చండి" అని అడిగాడు.

[25]పేతురు, యోహానులు తాము ప్రభువును గురించి
విన్నది, చూసినది అక్కడి ప్రజలకు చెప్పారు. ప్రభువు
చెప్పిన సందేశాన్ని ప్రకటించారు. ఆ తర్వాత వాళ్ళు
శుభవార్తను ఎన్నో సమరయ పల్లెల్లో ప్రకటిస్తూ
యెరూషలేమునకు తిరిగి వచ్చారు.

## ఫిలిప్పు ఇథియోపియా దేశస్థునికి బాప్తిస్మము ఇవ్వటం

[26]ఒక దేవదూత ఫిలిప్పుతో, "లే! దక్షిణంగా వెళ్ళి
యెరూషలేము నుండి గాజా వెళ్ళే ఎడారి దారిని
చేరుకో!" అని అన్నాడు. [27]అతడు లేచి వెళ్ళాడు.
అక్కడ ఇథియోపియా దేశానికి చెందిన ఒక వ్యక్తి కని
పించాడు. అతడు నపుంసకుడు. ఇథియోపియన్ల రాణి
కందాకే రాజ్యంలో ప్రధాన కోశాధికారిగా పని చేస్తుండే
వాడు. యెరూషలేమునకు ఆరాధనకు వెళ్ళి, [28]తిరిగి
వస్తూ తన రథంలో కూర్చొని యెషయా గ్రంథాన్ని
చదువుచుండగా, [29]దేవుని ఆత్మ ఫిలిప్పుతో, "ఆ రథం
దగ్గరకు వెళ్ళి అక్కడే ఉండు" అని అన్నాడు. [30]ఫిలిప్పు
రథందగ్గరకు పరుగెత్తుతూ యెషయా ప్రవక్త గ్రంథాన్ని
ఆ కోశాధికారి చదవటం విన్నాడు. అక్కడికి వెళ్ళి ఆ
కోశాధికారిని, "నీవు చదువుతున్నది అర్థమౌతోందా?"
అని అడిగాడు.

[31]"ఎవరైనా నాకు విడమర్చి చెబితే తప్ప ఎట్లా
అర్థమౌతుంది" అని కోశాధికారి అన్నాడు. అతడు
ఫిలిప్పును రథమెక్కి కూర్చోమని చెప్పాడు. [32]ఆ
కోశాధికారి ధర్మశాస్త్రంలోని ఈ వాక్యాన్ని చదువుతు
వున్నాడు:

"చంపటానికి తీసుకు వెళ్ళుతున్న
గొఱ్ఱెలా ఆయన నడిపించబడ్డాడు తన
బొచ్చును కత్తిరిస్తున్న గొఱ్ఱెపిల్ల మౌనం
వహించినట్లుగా అయన మాట్లాడ లేదు!
33 ఆయన దీనత్వాన్ని చూసి అన్యాయం
జరిగించారు. ఆయన జీవితాన్ని భూమ్మీ
దనుండి తొలగించారు. ఆయన సంత
తిని గురించి యిక మాట్లాడేదెవరు?"
*యెషయా 53:7-8*

[34]ఆ కోశాధికారి ఫిలిప్పును, "ఈ ప్రవక్త ఎవర్ని
గురించి మాట్లాడుతున్నాడు? తనను గురించా లేక
మరొకర్ని గురించా? దయచేసి చెప్పండి!" అని
అడిగాడు. [35]ఫిలిప్పు ప్రవచనాల్లోని ఆ వాక్యాలతో
మొదలెట్టి, యేసును గురించిన శుభవార్తను అతనికి
చెప్పాడు.

[36]ఆ దారిన ప్రయాణం చేస్తూ వాళ్ళు నీళ్ళున్న
ఒక ప్రదేశాన్ని చేరుకొన్నారు. ఆ కోశాధికారి, "ఇదిగో!
ఇక్కడ నీళ్ళున్నాయి, మీరు నాకు బాప్తిస్మమునెందుకు
ఇవ్వకూడదు?" అని అడిగాడు. [37]దాన్ని ఆపమని
ఆజ్ఞాపించి, ఫిలిప్పు ఆ కోశాధికారి ఇద్దరు కలిసి నీళ్ళ
లోకి వెళ్ళారు.* [38]ఫిలిప్పు అతనికి బాప్తిస్మము
నిచ్చాడు. [39]వాళ్ళు నీళ్ళ నుండి వెలుపలికొచ్చాక
ప్రభువు ఆత్మ అకస్మాత్తుగా ఫిలిప్పును అక్కడినుండి
తీసుకొని వెళ్ళాడు. ఆ కోశాధికారి ఫిలిప్పును మళ్ళీ
చూడలేదు. అయినా అతడు ఆనందంతో తన దారిన
తాను వెళ్ళిపొయ్యాడు. [40]ఫిలిప్పు అజోతు అనే పట్ట
ణంలో కనిపించాడు. అక్కడి నుండి బయలు దేరి
అన్ని పట్టణాలకు వెళ్ళి శుభవార్తను ప్రకటించాడు.
చివరకు కైసరియ చేరుకొన్నాడు.

## సౌలు మార్పునొందటం

9 సౌలు, ప్రభువు అనుచరుల్ని చంపిస్తానని ఇంకా
బుసలు కొడ్తూనే ఉన్నాడు. [2]ప్రధాన యాజకుని
దగ్గరకు వెళ్ళి డెమాస్కసు పట్టణంలోని సమాజమంది
రాలకు ఉత్తరాలు వ్రాసి యివ్వమని అడిగాడు. ప్రభువు
మార్గాన్ని అనుసరించే వాళ్ళు కనిపిస్తే స్త్రీ, పురుష
భేదం లేకుండా వాళ్ళను బంధించి యెరూషలేముకు
తీసుకు రావాలని అతని ఉద్దేశ్యం.

[3]అతడు డెమాస్కసు పొలిమేరలు చేరుకున్నాడు.
అకస్మాత్తుగా ఆకాశం నుండి ఒక వెలుగు అతని చుట్టూ
ప్రకాశించింది. [4]అతడు నేల కూలి పొయ్యాడు. ఒక
స్వరం, "సౌలా! సౌలా! నన్నెందుకు హింసిస్తున్నావు?"
అని వినబడింది. [5]"ప్రభూ! మీరెవరు?" అని సౌలు
అడిగాడు. [6]"నేను నీవు హింసిస్తున్న యేసును. లేచి
పట్టణంలోకి వెళ్ళు. నీవేం చెయ్యాలో అక్కడ నీకు
చెప్పబడుతుంది" అని ఆయన సమాధానం చెప్పాడు.

[7]సౌలుతో ప్రయాణం చేస్తున్న వాళ్ళు మూగ
వాళ్ళలా నిల్చున్నారు. వాళ్ళు ఆ స్వరం విన్నారే కాని

---

**వచనము 37** కొన్ని వ్రాతప్రతుల్లో 37వ వాక్యాన్ని చేర్చాయి: ఫిలిప్పు, "నీవు మనస్ఫూర్తిగా విశ్వసిస్తే అలాగే చేస్తాను" అని అన్నాడు. ఆ కోశాధికారి, "యేసుక్రీస్తు దేవుని కుమారుడని నేను విశ్వసిస్తున్నాను" అని అన్నాడు.

వాళ్ళకెవ్వరూ కనపడలేదు. 8క్రింద పడ్డ సౌలు లేచి
నిలుచొని కళ్ళు తెరిచాడు. కాని అతనికి ఏమీ కనిపించ
లేదు. వాళ్ళతని చేయి పట్టుకొని డెమాస్కసులోనికి
నడిపించారు. 9మూడు రోజుల దాకా అతడు గ్రుడ్డి
వానిగానే ఉండిపోయాడు. ఆహారం కాని నీళ్ళుకాని
ముట్టలేదు.
10డెమాస్కసులో యేసు భక్తుడొకడుండే వాడు.
అతని పేరు అననీయ. ప్రభువతనికి దివ్యదర్శనంలో
కనపడి, ‘అననీయా!’ అని పిలిచాడు.
“ఇదిగో, ఇక్కడున్నాను ప్రభూ!” అని అతడు
జవాబు చెప్పాడు
11ప్రభువతనితో, “‘తిన్నని వీధి’ అని పిలువబడే
వీధిలో ఉన్న ‘యూదా’ యింటికి వెళ్ళు, ‘తార్సు’
అనే పట్టణం నుండి వచ్చిన సౌలు అనే వ్యక్తి కోసం
అడుగు. అతడు ప్రార్థిస్తూ ఉంటాడు. 12అతడొక దివ్య
దర్శనంలో ‘అననీయ’ అనే పేరుగల వాడు అతని
దగ్గరకు వచ్చినట్టు, అతనికి దృష్టి రావటానికి అతనిపై
చేతులుంచబడినట్లు చూసాడు” అని చెప్పాడు.
13అననీయ, “ప్రభూ, అతడు యెరూషలేంలోని
పరిశుద్ధులకు చాలా హాని చేసినట్లు చాలా మంది
విన్నారు. 14మిమ్మల్ని శరణు జొచ్చిన ప్రతి ఒక్కణ్ణి
బంధించే అధికారం అతడు ప్రధాన యాజకులదగ్గర
నుండి పొందాడు”, అని సమాధానం చెప్పాడు.
15అప్పుడు ప్రభువు అననీయతో, “వెళ్ళు! నా
పేరు యూదులు కాని వాళ్ళకు, వాళ్ళ పాలకులకు,
ఇశ్రాయేలు ప్రజలకు ప్రచారం చేయటానికి యితణ్ణి
నేను ఒక సాధనంగా ఎన్ను కొన్నాను. 16నా పేరిట
అతడెన్ని కష్టాలు పడవలసి వస్తుందో నేనతనికి తెలియ
చేస్తాను” అని అన్నాడు.
17ఆ తర్వాత అననీయ అక్కడి నుండి బయలుదేరి
సౌలు ఉన్న యింటికి వెళ్ళాడు. తన చేతుల్ని సౌలు
మీద ఉంచి, “సోదరుడా! సౌలా! యేసు ప్రభువు నీవిక్క
డికి వస్తున్నప్పుడు నీకు దారిలో కనిపించాడే, ఆయనే,
నీవు మళ్ళీ చూడగలగాలని, పవిత్రాత్మ నీలో నిండాలని
నన్ను పంపాడు” అని అన్నాడు. 18వెంటనే పొరల్లాం
టివి సౌలు కళ్ళనుండి రాలి క్రిందపడ్డాయి. అతడు
మళ్ళీ చూడగలిగాడు. అతడు లేచి బాప్తిస్మము
పొందాడు. 19ఆ తర్వాత కొంత ఆహారాన్ని పుచ్చు
కొన్నాక అతనికి బలం వచ్చింది.

## సౌలు డెమాస్కసులో బోధించుట

సౌలు డెమాస్కసులో ఉన్న విశ్వాసులతో కొద్ది
రోజులు గడిపాడు. 20ఆ తర్వాత, యూదుల సమాజ
మందిరాల్లో, “యేసు దేవుని కుమారుడు” అని బోధిం
చటం మొదలు పెట్టాడు.
21అతని మాటలు విన్న వాళ్ళందరూ ఆశ్చర్యపడి,
“యెరూషలేములో యేసును నమ్మిన వాళ్ళను చంపిన
వాడు ఇతడే కదా! ఇక్కడికి వచ్చింది యేసు శిష్యులను
బంధించటానికే కదా! అలా బంధించి వాళ్ళను ప్రధాన
యాజకుల దగ్గరకు తీసుకొని వెళ్ళాలనే కదా అతని
ఉద్దేశ్యం!” అని అనుకొన్నారు.
22కాని సౌలు ఇంకా ఎక్కువ ఆత్మ బలంతో డెమా
స్కసులో నివసించే యూదులకు, ‘యేసు ప్రభువే
క్రీస్తు’ అని రుజువు చేసి వాళ్ళను ఆశ్చర్య పరిచాడు.
23చాలా రోజులు గడిచిపోయాయి. యూదులు
అతణ్ణి చంపాలని కుట్రపన్నారు. 24కాని సౌలుకు వాళ్ళ
కుట్ర తెలిసి పోయింది. యూదులు అతణ్ణి చంపాలని
రాత్రింబగళ్ళు పట్టణ ద్వారాలను జాగ్రత్తగా కాపలా
కాచారు. 25కాని అతని శిష్యులు రాత్రివేళ అతణ్ణి ఒక
బుట్టలో దాచి కోట గోడనుండి క్రిందికి దింపారు.
26సౌలు యెరూషలేముకు వచ్చాక శిష్యులతో కలిసి
పోవటానికి ప్రయత్నించాడు. కాని వాళ్ళు అతడంటేనే
భయపడిపోయారు. 27కాని బర్నబా అతణ్ణి పిలుచుకొని
అపొస్తలుల దగ్గరకు వచ్చి వాళ్ళతో సౌలు ప్రయా
ణంలో ప్రభువును చూసిన విషయము, ప్రభువు అత
నితో మాట్లాడిన విషయము, అతడు డెమాస్కసులో
యేసు పేరును ధైర్యంగా ప్రకటించిన విషయము
చెప్పాడు.
28స్వేచ్ఛగా తిరుగుతూ ప్రభువు పేరును ధైర్యంగా
ప్రకటిస్తూ సౌలు వాళ్ళతో కలిసి యెరూషలేములో
ఉండిపోయాడు. 29గ్రీకు మాట్లాడే యూదులతో
మాట్లాడి వాదించాడు. వాళ్ళు అతణ్ణి చంపాలని నిశ్చ
యించారు. 30సోదరులకు యిది తెలియగానే అతణ్ణి
కైసరియకు తీసుకెళ్ళి అక్కడి నుండి తార్సుకు
పంపారు. 31ఆ తర్వాత యూదయ, గలిలయ, సమర
యలోని సంఘాలు కొద్ది రోజులు ప్రశాంతంగా గడి
పాయి. ఆయా ప్రాంతాలలోని సంఘాలకు చెందిన
సభ్యులు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతూ ప్రభు
వంటే భయభక్తులు కలిగి, పవిత్రాత్మ ద్వారా ప్రోత్సా
హపొందుతూ జీవించారు. సభ్యులసంఖ్య పెరుగుతూ
వచ్చింది.

## లుద్ద మరియు జొప్పలో పేతురు

32పేతురు దేశమంతా తిరుగుతూ ‘లుద్ద’ అనే పట్ట
ణంలో నివసిస్తున్న విశ్వాసుల్ని కలుసుకోవటానికి
వెళ్ళాడు. 33అక్కడ ఎనిమిదేళ్ళ నుండి పక్షవాతంతో
మంచంపట్టిన ‘ఐనెయ’ అనే వాణ్ణి చూసాడు.
34“ఐనెయా! అని పిలిచి యేసు క్రీస్తు నీకు నయం
చేస్తాడు. లేచి నీ పరుపును సర్దుకో!” అని అన్నాడు.
ఐనెయ వెంటనే లేచి నిలుచున్నాడు. 35లుద్ద, షారోను
పట్టణాల్లో నివసిస్తున్న వాళ్ళంతా ఐనెయను చూసి
ప్రభువునందు విశ్వాసముంచారు.
36‘యొప్పే’ అనే పట్టణంలో, తబితా అనే శిష్యు
రాలు ఉండేది. ఈమెను గ్రీకు భాషలో దొర్కా అని

పిలిచే వాళ్ళు. ఈమె పేదలకు సహాయం చేస్తూ
ఉండేది. ఎప్పుడూ మంచి పనులు చేసేది. 37పేతురు
అదే ప్రాంతాల్లో ఉండగా ఆమె జబ్బు పడి చని
పోయింది. ఆమె శవానికి స్నానం చేయించి మేడ
మీది గదిలో ఉంచారు. 38లుద్ద యొప్పే పట్టణానికి
దగ్గరగా ఉండింది. పేతురు లుద్దలో ఉన్నాడని, శిష్యులు
యిద్దరు మనుష్యుల్ని అతని దగ్గరకు పంపి వెంటనే
రమ్మని వేడుకున్నారు.

39పేతురు వాళ్ళ వెంట వెళ్ళాడు. అతడు రాగానే
మేడ మీది గదికి తీసుకు వెళ్ళారు. అతని చుట్టూ
చేరిన వితంతువులు, దొర్కా తమతో ఉన్నప్పుడు
కుట్టిన రకరకాల దుస్తుల్ని చూపి విలపించారు.
40పేతురు వాళ్ళందర్ని గదినుండి వెలుపలికి పంపి తన
మోకాళ్ళపై ప్రార్థించాడు. శవం వైపు తిరిగి, "లే,
తబితా!" అని అన్నాడు. ఆమె కళ్ళు తెరిచింది. పేతు
రును చూసి లేచి కూర్చుంది. 41అతడు చేతులందించి
ఆమె నిలబడటానికి సహాయం చేసాడు. ఆ తదుపరి
పేతురు భక్తుల్ని, వితంతువుల్ని పిలిచి వాళ్ళకు
ప్రాణంతో ఉన్న తబితాను చూపాడు.

42యొప్పే ప్రాంతమంతా యిది తెలిసి పోయింది.
అనేకులు ప్రభువు భక్తులయ్యారు. 43పేతురు
యొప్పేలో సీమోను అనే ఒక చెప్పులు కుట్టే వాని
యింట్లో చాలా రోజులు గడిపాడు.

## కొర్నేలీ పేతురును పిలిపించటం

10 కైసరియ అనే పట్టణంలో కొర్నేలీ అనే
పేరుగల ఒక వ్యక్తి ఉండేవాడు. అతడు, 'ఇటలీ'
దళంలో శతాధిపతిగా* పని చేస్తూ ఉండేవాడు. 2అత
నికి, అతని యింట్లోని వాళ్ళకందరికి దేవుడంటే
భయభక్తులుండేవి. అతడు తన డబ్బును ధారాళంగా
దానం చేసేవాడు. దేవుణ్ణి ఎల్లప్పుడు ప్రార్థించే వాడు.
3ఒక రోజు మధ్యాహ్నం మూడు గంటలప్పుడు అతనికి
ఒక దివ్య దర్శనంలో ఒక దేవదూత తన ముందు
ప్రత్యక్షం కావటం స్పష్టంగా చూసాడు. ఆ దేవదూత
అతణ్ణి సమీపించి, 'కొర్నేలీ' అని పిలిచాడు.

4కొర్నేలీ అతని వైపు చూసి భయంతో, "ఏమిటి
ప్రభూ" అని అడిగాడు.

ఆ దేవదూత కొర్నేలీతో, "నీ ప్రార్థనలు, పేద
వాళ్ళకు నీవు చేస్తున్న దానాలు దేవుడు గుర్తించాడు.
5ఇప్పుడు నీవు కొందర్ని సీమోను అని పిలువబడే
పేతురును పిలుచుకొని రావటానికి యొప్పేకు పంపు.
6అతడు ప్రస్తుతం సీమోను అనే చెప్పులు కుట్టే వాని
యింట్లో అతిథిగా ఉంటున్నాడు. అతని యిల్లు
సముద్రము తీరాన ఉంది" అని అన్నాడు. 7ఇలా చెప్పి
దేవదూత వెళ్ళి పోయాడు. ఆ తదుపరి కొర్నేలీ తన
సేవకుల్లో యిద్దర్ని పిలిచాడు. ఇంటి పనులు చేసే
భటుల్లో ఒకణ్ణి పిలిచాడు. ఈ భటుడు దైవ భక్తి
కలవాడు. 8జరిగినదంతా వాళ్ళకు చెప్పి వాళ్ళను
యొప్పేకు పంపాడు.

## పేతురుకు దివ్య దర్శనం కలగటం

9మరుసటి రోజు వాళ్ళు యొప్పేను సమీపించారు.
అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలు. అదే సమ
యంలో పేతురు ప్రార్థించటానికి మిద్దె మీదికి వెళ్ళి
నాడు. 10పేతురుకు ఆకలి వేసింది. ఏదైనా తినాలను
కొన్నాడు. అతని కోసం వంట సిద్ధం చేస్తుండగా అత
నికి దర్శనం కలిగింది. 11"ఆ దర్శనంలో ఆకాశం
తెరుచుకొని ఏదో క్రిందికి దిగి రావటం చూశాడు.
అది ఒక పెద్ద దుప్పటిలా ఉంది. ఎవరో దాని నాలుగు
మూలలు పట్టుకొని క్రిందికి దింపుతున్నట్లు అది
భూమ్మీదికి దిగింది. 12అందులో నాలుగు కాళ్ళున్న
అన్ని రకాల జంతువులు, ప్రాకే ప్రాణులు, గాలిలో
ఎగిరే పక్షులు ఉన్నాయి. 13ఒక స్వరం, "పేతురూ,
లే! వాటిని చంపి తిను" అని అన్నది.

14పేతురు, "ప్రభూ! నేనలా చెయ్యలేను. అధమ
మైన దాన్ని, పరిశుభ్రంగా లేనిదాన్ని నేను ఎన్నడూ
తినలేదు" అని సమాధానం చెప్పాడు.

15ఆ స్వరం రెండవసారి, "దేవుడు పవిత్రం చేసిన
వాటిని అపవిత్రం అనకు" అని అన్నది. 16ఇలా మూడు
సార్లు జరిగిన వెంటనే అది ఆకాశానికి తీసుకు వెళ్ళ
బడింది. 17పేతురు ఈ దివ్య దర్శనానికి అర్థం తెలియక
దాన్నిగురించి ఆశ్చర్యంతో ఆలోచిస్తున్నాడు. ఇంతలో
కొర్నేలీ పంపిన మనుష్యులు సీమోను యిల్లు ఎక్క
డుందో కనుక్కొని అతని యింటి ముందు ఆగారు.
18"పేతురు అని పిలుస్తారే ఆ సీమోను యిక్కడ అతిథిగా
ఉంటున్నాడా?" అని యింటి వాళ్ళను అడిగారు.

19దివ్య దర్శనాన్ని గురించి పేతురు యింకా ఆలోచి
స్తుండగా దేవుని ఆత్మ అతనితో, "ఇదిగో! ముగ్గురు
వ్యక్తులు నీ కోసం వెతుకుతున్నారు. 20లేచి క్రిందికి
వెళ్ళు. వాళ్ళను పంపింది నేనే. కనుక వాళ్ళ వెంట
వెళ్ళటానికి కొంచెం కూడా సంకోచపడకు" అని
చెప్పాడు. 21పేతురు క్రిందికి వెళ్ళి వాళ్ళతో, "ఇదిగో!
మీరు చూస్తున్నది నా కొరకే! ఎందుకొచ్చారు!" అని
అడిగాడు.

22వాళ్ళు, "మేము కొర్నేలీ అనే శతాధిపతి దగ్గ
ర్నుండి వచ్చాము. అతడు మంచివాడు. దేవుని పట్ల
భయభక్తులు కలవాడు. యూదులందరు అతణ్ణి గౌరవి
స్తారు. మిమ్మల్ని తన యింటికి ఆహ్వానించి మీరు
చెప్పింది వినవలెనని పవిత్రమైన దేవదూత అతనితో
చెప్పాడు" అని సమాధానం చెప్పారు. పేతురు వాళ్ళను
యింట్లోకి రమ్మని పిలిచి ఆ రాత్రికి అక్కడే ఉండు
మన్నాడు.

---

**శతాధిపతి** అనగా వంద సైనికులపై అధిపతి.

### కొర్నేలీ యింటికి పేతురు వెళ్ళటం
23మరుసటి రోజు పేతురు వాళ్ళతో ప్రయాణ
మయ్యాడు. యొప్పేలోని కొందరు సోదరులు కూడా
అతని వెంట వెళ్ళారు. 24ఆ మరుసటి రోజు వాళ్ళు
కైసరియ చేరుకొన్నారు. వీళ్ళు రానున్నారని తెలిసి
కొర్నేలీ సన్నిహితులైన బంధువుల్ని తన యింటికి
ఆహ్వానించాడు. 25పేతురు యింట్లోకి అడుగు పెట్టుం
డగానే కొర్నేలీ అతనికి ఎదురు వెళ్ళి అతని కాళ్ళ
ముందు సాష్టాంగపడి నమస్కరించాడు. 26పేతురు అత
నిని లేపుతూ, "లెమ్ము! నేను కూడా ఒక మనిషినే"
అని అన్నాడు. 27పేతురు అతనితో మాట్లాడుతూ
లోపలికి వెళ్ళాడు. అక్కడ చాలా మంది ప్రజలు సమా
వేశమై ఉండటం చూసాడు. 28పేతురు వాళ్ళతో,
"యూదుడు, యూదుడు కాని వానితో కలిసి ఉండ
రాదనీ, అతని యింటికి వెళ్ళరాదనీ యూదుల న్యాయ
శాస్త్రం అంటుంది. ఇది తప్పని మీకందరికి తెలుసు.
కావున ఏ వ్యక్తినీ అధమంగా భావించరాదు. పరిశుభ్రత
లేని వాడని అనకూడదు. ఇది నాకు దేవుడు తెలియ
జేసాడు. 29కాబట్టి నా కోసం పిలవనంపగానే వచ్చాను.
నన్నెందుకు పిలిచారో నేను యిప్పుడు కారణం
అడగవచ్చా?" అని అన్నాడు.
30కొర్నేలీ యిలా చెప్పాడు: "నాలుగు రోజుల
క్రితం యిదే సమయంలో యింట్లో కూర్చొని దేవుణ్ణి
ప్రార్థిస్తున్నాను. అప్పుడు పగలు మూడు గంటలు.
అకస్మాత్తుగా తెల్లటి మెరిసే దుస్తులు వేసుకొని ఒక
వ్యక్తి నా ముందు ప్రత్యక్షమయ్యాడు. 31అతడు నాతో,
'కొర్నేలీ! దేవుడు నీ ప్రార్థనల్ని విన్నాడు. నీవు పేదలకు
చేస్తున్న దానాలను గుర్తించాడు. 32పేతురు అని పిలువ
బడే సీమోన్ను పిలుచుకు రావటానికి కొందర్ని
యొప్పేకు పంపు. అతడిప్పుడు సీమోను అనే
చెప్పులు కుట్టే వాని యింట్లో అతిథిగా ఉన్నాడు.
ఈ చెప్పులు కుట్టేవాని యిల్లు సముద్ర తీరాన ఉంది'
అని చెప్పాడు. 33మిమ్మల్ని పిలుచుకు రావటానికి
తక్షణం మనుష్యుల్ని పంపాను. మీరొచ్చి మంచి పని
చేసారు. ఇప్పుడు మనమంతా దేవుని ముందున్నాము.
మాకు చెప్పుమని ప్రభువు మీ కాజ్ఞాపించిన వన్నీ విన
టానికి సిద్ధంగా ఉన్నాము."

### పేతురు వాక్యోపదేశం
34-35పేతురు ఇలా చెప్పటం మొదలు పెట్టాడు:
"దేవుడు పక్షపాతం చూపడని, తానంటే భయ భక్తు
లున్న వాళ్ళను, నిజాయితీ పరుల్ని వాళ్ళు ఏ
దేశస్థులైనా అంగీకరిస్తాడని యిప్పుడు నాకు బాగా
తెలిసింది. 36ఈ సందేశాన్ని దేవుడు ఇశ్రాయేలు వంశీ
యులకు అందించాడు. దేవుడు మన కందరికి ప్రభు
వైన యేసు క్రీస్తు ద్వారా శాంతి లభిస్తుందనే శుభ
వార్తను ప్రకటించాడు. 37యోహాను బోధించిన బాప్తిస్మ
మును ప్రజలు పొందాక గలిలయలో ఒక సంగతి
ప్రారంభమైంది. ఆ సంగతిని గురించిన ప్రకటనలు
యూదయ ప్రాంతం అంతా వ్యాపించాయి. ఇది
మీకంతా తెలుసు. 38నజరేతు నివాసి యేసును దేవుడు
పవిత్రాత్మతో అభిషేకించాడు. అద్భుతమైన శక్తి
యిచ్చాడు. దేవుడు ఆయనతో ఉండటం వల్ల యేసు
ప్రజలకు మేలు చేస్తూ అన్ని ప్రాంతాలు పర్యటించాడు.
సైతాను పీడవలన బాధపడ్తున్న వాళ్ళకు నయం
చేసాడు. ఈ విషయాలన్నీ మీకు తెలుసు. 39యెరూష
లేము, యూదయ దేశంలో ఉన్న మిగతా ప్రాంతాల్లో
ఆయన చేసిన ప్రతి పనిని మేము కళ్ళారా చూసాము.
వాళ్ళు ఆయన్ని మ్రానుతో చేసిన సిలువకు మేకులు
కొట్టి చంపారు. 40కాని మూడవ రోజున దేవుడు
ఆయన్ని బ్రతికించాడు. ఆయన ప్రజలకు కనిపించా
లని దేవుని ఉద్దేశ్యం. 41అందరూ ఆయన్ని చూడలేదు.
ఇది వరకే దేవుడు ఎన్ను కొన్న కొందరు మాత్రం
చూసారు. మేమే ఆ సాక్షులం. ఆయన బ్రతికి వచ్చాక
మేమంతా ఆయనతో కలిసి భోజనం చేసాం. 42ఆయన
అందరికీ న్యాయాధిపతి. అంటే బ్రతికి ఉన్న వాళ్ళకు,
పునర్జీవం పొందనున్న వాళ్ళకు. ఈ పదవిని దేవుడు
ఆయనకిచ్చాడు. దీన్ని గురించి ప్రజలముందు సాక్ష్యం
చెప్పుమని, సువార్తను ప్రకటించుమని ఆయన మాకు
ఆజ్ఞాపించాడు. 43యేసును నమ్మిన వాళ్ళు తమ పాపా
లకు ఆయన ద్వారా క్షమాపణ పొందుతారని ప్రవక్త
లందరు చెప్పారు."
44పేతురు యింకా మాట్లాడుతుండగానే అతని
సందేశాన్ని వింటున్న అక్కడి వాళ్ళందరి మీదికి పరి
శుద్ధాత్మ వచ్చాడు. 45పేతురుతో వచ్చిన వాళ్ళందరు
యూదులు. 46యేసునందు విశ్వసించినవారు. వీళ్ళు
యూదులుకాని వాళ్ళు యితర భాషల్లో మాట్లాడటం,
దేవుణ్ణి స్తుతించటం చూసారు. దేవుడు తన పరి
శుద్ధాత్మను వరంగా యూదులు కాని వాళ్ళకు కూడా
యిచ్చాడని గ్రహించి వాళ్ళకు ఆశ్చర్యం వేసింది.
తదుపరి పేతురు యిలా అన్నాడు: 47"వీళ్ళకు బాప్తి
స్మము నివ్వటానికి అడ్డు చెప్పే ధైర్యం ఎవరికుంది?
మనలాగే వీళ్ళు కూడా దేవుని పరిశుద్ధాత్మ పొందారు."
48యేసు పేరిట వాళ్ళు బాప్తిస్మం పొందాలని పేతురు
ఆజ్ఞాపించాడు. ఇదంతా ముగిసాక వాళ్ళు పేతురును
తమతో కొద్ది రోజులు ఉండుమని అడిగారు.

### పేతురు తన అనుభవాల్ని చెప్పటం
11 అపొస్తలులు, యూదయ దేశంలో ఉన్న సోద
రులు, యూదులు కాని వాళ్ళకు కూడా దైవ
సందేశం లభించిందని విన్నారు. 2పేతురు యెరూష
లేము వచ్చాడు. సున్నతి చేసుకోవాలి అని వాదించే
వాళ్ళ గుంపు అతణ్ణి విమర్శిస్తూ, 3"నీవు సున్నతి

చేసుకోని వాళ్ళ యిళ్ళలోకి వెళ్ళి వాళ్ళతో కలిసి
తిన్నావు!" అని అన్నారు.
4 పేతురు వాళ్ళకు జరిగింది జరిగినట్లు ఈ విధంగా
విడమర్చి చెప్పటం మొదలు పెట్టాడు: 5 "నేను యొప్పే
పట్టణంలో ప్రార్థిస్తుండగా నాకు దర్శనం కలిగింది. ఆ
దర్శనంలో ఒక దివ్య సంగతి చూసాను. ఆ దివ్య
దర్శనంలో ఒక పెద్ద దుప్పటి లాంటిది ఆకాశంనుండి
ఎవరో దాని నాలుగు మూలలు పట్టుకొని క్రిందికి
దింపుతున్నట్లు చూసాను. అది నేనున్న స్థలంలో
దిగింది. 6 నేను అందులో ఏముందోనని జాగ్రత్తగా
చూసాను. భూమ్మీద నివసించే నాలుగు కాళ్ళ జంతు
వులు, క్రూర మృగాలు, ప్రాకే ప్రాణులు, గాల్లో ఎగిరే
పక్షులు కనిపించాయి. 7 అంతలో నాకొక స్వరం విని
పించి నాతో, 'పేతురూ! లే! వీటిలో ఏ జంతువునైనా
చంపి దానిని తిను!' అని అంది. 8 'నేనాపని చేయలేను
ప్రభూ! తిన కూడదన్న దాన్ని నా నాలుక ఎన్నడూ
రుచి చూడలేదు' అని నేను సమాధానం చెప్పాను.
9 ఆకాశం నుండి ఆ స్వరం రెండవసారి యిలా అంది:
'దేవుడు తినవచ్చని అన్న వాటిని తిన కూడదని
అనకు.' 10 ఇలా మూడు సార్లు జరిగాక అది ఆకాశానికి
తీసుకు వెళ్ళబడింది. 11 అదే క్షణంలో నన్ను పిలుచుకు
వెళ్ళడానికి కైసరియనుండి వచ్చిన ముగ్గురు వ్యక్తులు
నేనున్న యింటి ముందు ఆగారు. 12 వాళ్ళతో వెళ్ళ
టానికి నేను ఏ మాత్రం వెనకాడరాదని దేవుని ఆత్మ
నాతో చెప్పాడు. అక్కడున్న ఆరుగురు సోదరులు
కూడా నాతో వచ్చారు. మేమంతా కలిసి కొర్నేలీ
యింటికి వెళ్ళాం. 13 అతడు తన యింట్లో ఒక దేవ
దూత ప్రత్యక్షమైన విషయము, అతణ్ణి తాను చూసిన
విషయము, దేవదూత, 'పేతురు అని పిలువబడే
సీమోన్ను పిలుచుకురావటానికి కొందర్ని యొప్పేకు
పంపు,
14 అతడు మాట్లాడే విషయాలు నిన్ను, నీ
యింట్లోని వాళ్ళనందరిని రక్షిస్తాయి' అని తనతో
చెప్పిన విషయము మాకు చెప్పాడు. 15 నేను మాట్లా
డటం మొదలెడుతుండగా, మొట్టమొదట మన మీదికి
వచ్చినట్లే పరిశుద్ధాత్మ వాళ్ళ మీదకు కూడా వచ్చాడు.
16 'యోహాను నీళ్ళతో బాప్తిస్మము యిచ్చాడు కాని
నీవు పరిశుద్ధాత్మలో బాప్తిస్మము పొందుతావు!' అని
అన్న యేసుప్రభువు మాటలు నాకు జ్ఞాపకం
వచ్చాయి. 17 మనం యేసు క్రీస్తు ప్రభువును నమ్మి
నందుకు మనకిచ్చిన వరమునే దేవుడు వాళ్ళకు కూడా
యిచ్చాడు. అలాంటప్పుడు దేవుణ్ణి ఎదిరించటానికి
నేనెవర్ని?"
18 వాళ్ళీ మాటలు విన్నాక వేరే ఆక్షేపణలు చేయ
లేదు. దేవుడు యూదులు కాని వాళ్ళకు కూడా మారు
మనస్సు కలిగి రక్షణ పొందే అవకాశ మిచ్చాడంటూ
వాళ్ళు దేవుణ్ణి స్తుతించారు.

## అంతియొకయ ప్రజలకు శుభవార్త తెలియటం

19 స్తెఫను చనిపోయిన తర్వాత జరిగిన హింసలకు
భక్తులు చెదిరిపోయారు. వీళ్ళలో కొందరు ఫొనీషియ,
సైప్రసు, అంతియొకయ పట్టణాలకు వెళ్ళి దైవ సందే
శాన్ని యూదులకు మాత్రమే చెప్పారు. 20 సైప్రసు,
కురేనీ పట్టణాలకు చెందిన వీళ్ళలో కొందరు అంతి
యొకయకు వెళ్ళి, గ్రీకువారితో కూడా మాట్లాడటం
మొదలు పెట్టారు. 21 ప్రభువు అభయ హస్తం వాళ్ళవెంట
ఉంది. కనుక అనేకులు వాళ్ళు చెప్పిన దానిలో ఉన్న
సత్యాన్ని గ్రహించి ప్రభువునందు విశ్వాసులైయ్యారు.
22 యెరూషలేములోవున్న సంఘం ఈ వార్త విని
బర్నబాను అంతియొకయకు పంపింది. 23 అతడు అంతి
యొకయకు వెళ్ళి అక్కడి ప్రజలపై దైవానుగ్రహం
అమితంగా ఉండటం గమనించి చాలా ఆనందించాడు.
ప్రభువు పట్ల మనసారా భక్తి చూపుతూ ఉండుమని,
అక్కడి వాళ్ళందర్ని వేడుకున్నాడు. 24 బర్నబా ఉత్త
ముడు. పరిశుద్ధాత్మ ప్రభావం అతనిపై సంపూర్ణంగా
ఉంది. అంతేకాక దేవుని పట్ల సంపూర్ణమైన విశ్వాసం
ఉంది. అనేకులు ప్రభువునందు విశ్వాసులైయ్యారు.
25 ఆ తర్వాత బర్నబా, తార్సు అనే పట్టణానికి
వెళ్ళి సౌలు కోసం చూసాడు. అతణ్ణి కలుసుకొని
అంతియొకయకు పిలుచుకు వచ్చాడు. 26 సౌలు,
బర్నబా ఒక సంవత్సరం అంతియొకయలో ఉన్నారు.
అక్కడి సంఘాన్ని కలుసుకొంటూ అనేకులకు
బోధించే వాళ్ళు. అంతియొకయలోని శిష్యులు మొద
టిసారిగా "క్రైస్తవులు" అని పిలువబడ్డారు.
27 ఆ రోజుల్లో కొంత మంది ప్రవక్తలు యెరూష
లేము నుండి అంతియొకయకు వచ్చారు. 28 వాళ్ళలో
ఒకతని పేరు అగబు. అతడు లేచి నిలబడి పరిశుద్ధాత్మ
శక్తితో, "తీవ్రమైన కరువు త్వరలో ప్రపంచమంతా
రాబోతోంది" అని సూచించాడు. ఈ కరువు క్లౌదియ
చక్రవర్తి పరిపాలిస్తున్న కాలంలో సంభవించింది. 29 ఇది
విని అంతియొకయలో ఉన్న శిష్యులు యూదయలో
నివసిస్తున్న తమ సోదరుల కోసం తమకు చేతనయిన
సహాయం వాళ్ళు చెయ్యాలని నిర్ణయించుకొన్నారు.
30 అనుకొన్న విధంగా బర్నబా, సౌలు ద్వారా తాము
పంపదలచిన వాటిని యూదయలోని పెద్దలకు
పంపారు.

## హింసలు

12 ఆ రోజుల్లోనే హేరోదు రాజు సంఘానికి
చెందిన కొందర్ని హింసించటం మొదలు
పెట్టాడు. 2 అతడు యోహాను సోదరుడైన యాకోబును
కత్తితో నరికి వేయించాడు. 3 ఈ సంఘటనకు
యూదులు ఆనందించారు. ఇది గమనించి అతడు
పేతురును కూడా బంధించాలని వెళ్ళాడు. ఈ సంఘ
టన యూదులు పులియని రొట్టెలు తినే పండుగ

రోజుల్లో సంభవించింది. [4]అతణ్ణి బంధించి కారాగా
రంలో వేసాడు. పూటకు నలుగురి చొప్పున కాపలా
కాయుమని చెప్పి పదహారుగురు భటులకు అతణ్ణి
అప్పగించాడు. పస్కా పండుగ జరిగాక అతణ్ణి ప్రజల
ముందుకు తెచ్చి విచారణ జరిపించాలని అతని
ఉద్దేశ్యం. [5]పేతురును అంతదాకా కారాగారంలో
ఉంచాడు. పేతురు కోసం సంఘానికి చెందిన వాళ్ళు
దీక్షతో దేవుణ్ణి ప్రార్థించారు.

### ప్రభువు దూత పేతురును విడిపించటం

[6]హేరోదు రేపు విచారణ చేస్తాడనగా ఆ నాటి
రాత్రి పేతురు యిరువురి సైనికుల మధ్య నిద్రిస్తూ
ఉన్నాడు. సైనికులు అతణ్ణి రెండు యినుప గొలుసు
లతో కట్టివేసి ఉంచారు. మరి కొందరు సైనికులు
కారాగారం ముందు కాపలా కాస్తూ ఉన్నారు. [7]అకస్మా
త్తుగా ప్రభువు దూత ప్రత్యక్షం అయ్యాడు. ఆ గది
యంతా వెలుగుతో నిండి పోయింది. ప్రభువు దూత
పేతురు భుజం తట్టి, "త్వరగా లెమ్ము!" అని అంటూ
అతణ్ణి నిద్రలేపాడు. మణికట్లకు కట్టిన సంకెళ్ళు వూడి
పోయాయి. [8]ఆ దూత, "లేచి, నీ దుస్తులు సరిచేసు
కొని, చెప్పులు తొడుక్కో!" అని అన్నాడు. పేతురు
అలాగే చేసాడు. "నీ దుప్పటి శరీరం మీద కప్పుకొని
నా వెంటరా!" అని ఆ దూత అన్నాడు. [9]పేతురు
అతణ్ణి అనుసరిస్తూ కారాగారంనుండి వెలుపలికి
వచ్చాడు. కాని దేవదూత చేస్తున్నదంతా నిజంగా జరు
గుతుందని అతడు అనుకోలేదు. తానొక కలకంటున్నా
ననుకొన్నాడు. [10]వాళ్ళు మొదటి కాపలా వాణ్ణి, రెండవ
కాపలా వాణ్ణి, దాటి పట్టణంలోకి వెళ్ళే యినుప ద్వారం
దగ్గరకు వచ్చారు. అది వాళ్ళ కోసం దానంతట అదే
తెరుచుకుంది. వాళ్ళు దాన్ని దాటి వెళ్ళారు. కొంత
దూరం నడిచాక అకస్మాత్తుగా ఆ ప్రభువు దూత అతణ్ణి
వదిలి వెళ్ళి పోయాడు.

[11]అప్పటికి పేతురుకు తెలివి వచ్చింది. అతడు,
"ప్రభువు తన దూతను పంపి హేరోదు బంధం నుండి
మరియు కీడు కలగాలని ఎదురు చూస్తున్న యూదుల
నుండి, నన్ను రక్షించాడు. ఇందులో ఏ మాత్రం
సందేహం లేదు" అని తనలో తాను అనుకొన్నాడు.

[12]జరిగిన వాటిని గ్రహించాక యోహాను తల్లియైన
మరియ యింటికి వెళ్ళాడు. యోహాన్ని మార్కు అని
కూడా పిలిచే వాళ్ళు. అక్కడ చాలా మంది సమావేశమై
ప్రార్థిస్తూ ఉన్నారు. [13]పేతురు తలుపు తట్టాడు. 'రొదే'
అనే పనిపిల్ల తలుపు తీయటానికి వచ్చింది. [14]ఆమె
పేతురు స్వరం గుర్తించి చాలా ఆనందించింది. ఆ
ఆనందంలో తలుపు కూడా తెరువకుండా లోపలికి
పరుగెత్తి, "పేతురు తలుపు ముందున్నాడు" అని కేక
వేసింది. [15]వాళ్ళంతా "నీకు మతిపోయింది" అని
అన్నారు. కాని ఆమె తాను చెప్పింది నిజమని నొక్కి
చెప్పింది. దానికి వాళ్ళు, "అది అతని దూత అయివుం
టుంది" అని అన్నారు.

[16]పేతురు ఇంకా తలుపు తడుతూనే ఉన్నాడు.
వాళ్ళు వెళ్ళి తలుపు తెరిచి చూసి చాలా ఆశ్చర్యపడ్డారు.
[17]పేతురు వాళ్ళందర్ని నిశ్శబ్దంగా ఉండుమని సంజ్ఞ
చేసాడు. ఆ తదుపరి దేవుడు తనను కారాగారం నుండి
ఏ విధంగా బయటికి తీసుకొని వచ్చాడో అందరికీ
విశదంగా చెప్పాడు. "యాకోబుకు, మిగతా సోదరులకు
దీన్ని గురించి చెప్పండి" అని చెప్పి, వాళ్ళను వదిలి
వేరే ప్రదేశానికి వెళ్ళి పొయ్యాడు.

[18]ఉదయం సైనికుల్లో చాలా అలజడి చెలరేగింది.
"పేతురు ఏమై ఉంటాడు?" అని వాళ్ళు ప్రశ్నించు
కున్నారు. [19]హేరోదు పేతుర్ని వెతకటానికి అంతా
గాలించమన్నాడు. కాని పేతురు కనిపించలేదు.
హేరోదు కాపలా వాళ్ళను అడ్డు ప్రశ్నలు వేసి విచారిం
చాడు. ఆ తదుపరి ఆ కాపలా వాళ్ళను చంపుమని
ఆజ్ఞాపించాడు. ఇది జరిగిన తదుపరి హేరోదు యూద
యనుండి కైసరియకు వెళ్ళి అక్కడ కొద్ది రోజులు
గడిపాడు.

### హేరోదు మరణం

[20]హేరోదు తూరు, సీదోను ప్రజల పట్ల చాలా
కోపంతో ఉన్నాడు. వాళ్ళంతా యిప్పుడు ఒకటై
హేరోదుతో మాట్లాడటానికి వెళ్ళారు. రాజుగారి ఆంత
రంగిక స్నేహితుడైన 'బ్లాస్తు'ను తమ వైపు త్రిప్పుకొని
శాంతి కావాలని అడిగారు. వీళ్ళ రాజ్యం తమ ఆహార
ధాన్యాల కోసం హేరోదు రాజ్యంపై ఆధారపడి ఉండ
టమే దీనికి కారణం.

[21]ఒక నియమితమైన రోజు హేరోదు రాజ దుస్తులు
ధరించాడు. సింహాసనంపై కూర్చొని ప్రజల్ని సంబో
ధిస్తూ ఒక ఉపన్యాసం యిచ్చాడు. [22]"ఇది దేవుని
కంఠం. మనిషిది కాదు" అని ప్రజలు ఆపకుండా కేకలు
వేసారు.

[23]దేవునికి చెందవలసిన ఘనత అతడు అంగీక
రించినందుకు ప్రభువు దూత అతణ్ణి తక్షణమే
రోగంతో పడవేసాడు. పురుగులు పట్టి అతడు చని
పోయాడు. [24]దైవ సందేశం విని విశ్వసిస్తున్న ప్రజల
సంఖ్య పెరుగుతూ వచ్చింది.

[25]బర్నబా, సౌలు తమ పని ముగించుకొని యెరూష
లేము నుండి తిరిగి వచ్చారు. తమ వెంట మార్కు
అని పిలువబడే యోహాన్ను కూడా పిలుచుకు
వచ్చారు.

### బర్నబాను, సౌలును ఎన్నుకొని పంపటం

13 అంతియొకయలోని సంఘంలో ఉన్న ప్రవ
క్తలు, పండితులు ఎవరనగా: బర్నబా, 'నీగెరు'
అని పిలువబడే 'సుమెయోను' కురేనీ గ్రామానికి

చెందిన లూకియ, మనయేను (ఇతడు, సామంత
రాజైన హేరోదు, యిద్దరూ కలిసి పెరిగారు), మరియు
సౌలు. 2వీళ్ళు ఉపవాసాలు చేసి ప్రభువును ప్రార్థిస్తుం
డగా పరిశుద్ధాత్మ, “బర్నబాను, సౌలును నా కోసం
వేరుచేయండి. వాళ్ళను ఒక ప్రత్యేకమైన పని కోసం
పిలిచాను” అని అన్నాడు.
3అక్కడున్న వాళ్ళు వీళ్ళిద్దర్ని పంపే ముందు
ప్రార్థనలు, ఉపవాసాలు చేసి, వాళ్ళపై తమ చేతులుంచి
పంపారు.

### సైప్రసులో

4పవిత్రాత్మ వాళ్ళను పంపాడు. వాళ్ళు ‘సెలూ
కయ’ అనే పట్టణానికి వెళ్ళి అక్కడినుండి ఓడలో
ప్రయాణం చేసి సైప్రసు (కుప్ర) అనే ద్వీపాన్ని
చేరుకున్నారు. 5అక్కడి నుండి సలామి అనే పట్టణానికి
వెళ్ళారు. అక్కడున్న యూదుల సమాజమందిరాల్లో
దైవ సందేశాన్ని ప్రకటించారు. వాళ్ళకు సహాయంగా
యోహాను వాళ్ళ వెంటే ఉన్నాడు.
6వాళ్ళు ఆ ద్వీపాన్నంతా పర్యటించి ‘పాఫు’ అనే
పట్టణం చేరుకున్నారు. ఇంద్రజాలం చేస్తూ తానొక
ప్రవక్తనని చెప్పుకుంటున్న వ్యక్తిని అక్కడ కలుసు
కున్నారు. అతడు యూదుడు. పేరు ‘బర్‌యేసు,’
7అతడు ‘సెర్గిపౌలు’ అనే రాష్ట్రపాలకునికి సన్నిహితంగా
ఉండేవాడు. సెర్గిపౌలు తెలివిగలవాడు. దైవ సందేశాన్ని
వినాలని బర్నబాను, సౌలును ఆహ్వానించాడు. 8ఇంద్ర
జాలికుడైన ‘ఎలుమ’ గ్రీకు భాషలో ఇది ఇతని పేరు.
రాష్ట్రపాలకుణ్ణి ఈ విశ్వాసానికి దూరంగా ఉంచాలని
ప్రయత్నించాడు. 9అప్పుడు సౌలు (ఇతణ్ణి పౌలు అని
కూడా పిలిచే వారు) పరిశుద్ధాత్మతో నిండిపోయి ఎలు
మను సూటిగా చూస్తూ, 10“నీవు సైతానుకు పుట్టావు!
మంచిదన్న ప్రతిదీ నీకు శత్రువు! నీలో అన్ని రకాల
మోసాలు, కుట్రలు ఉన్నాయి! ప్రభువు యొక్క
సక్రమ మార్గాల్ని వక్రంగా మార్చటం ఎప్పుడు మాను
కొంటావు?
11ఇదిగో చూడు, ప్రభువు ఇప్పుడు నిన్ను శిక్షిస్తాడు.
కొంతకాలం దాకా నీవు సూర్యుని వెలుగు చూడలేవు!
గుడ్డి వాడివై పోతావు!” అని అన్నాడు.
తక్షణమే పొగమంచు, చీకట్లు అతణ్ణి చుట్టివేసాయి.
తన చేయిపట్టుకొని నడిపేందుకు ఎవరైనా దొరుకు
తారేమోనని తారాడుతూ చూసాడు. 12ఆ రాష్ట్రపాల
కుడు ప్రభువును గురించి చెప్పిన బోధనలు విని
ఆశ్చర్యపడి ప్రభువును నమ్మాడు.

### పిసిదియ అంతియొకయలో

13‘పాఫు’ నుండి పౌలు, అతని స్నేహితులు, పంఫూలి
యాలోని ‘పెర్గే’ అనే పట్టణానికి ఓడలో ప్రయాణం
చేసి వెళ్ళారు. యోహాను వాళ్ళను అక్కడ వదిలి
యెరూషలేమునకు తిరిగి వెళ్ళిపోయాడు. 14వాళ్ళు
పెర్గే నుండి పిసిదియ ప్రక్కన ఉన్న అంతియొకయ
అనే పట్టణాన్ని చేరుకున్నారు. ఒక విశ్రాంతి రోజు
యూదుల సమాజ మందిరములోకి వెళ్ళి కూర్చు
న్నారు. 15ధర్మశాస్త్రంలోని విషయాలు, ప్రవక్తల
గ్రంథాలు చదివారు. ఆ తదుపరి సమాజమందిరం
యొక్క అధికారులు, “సోదరులారా! ప్రజలను ఉత్సాహ
పరిచే ఆధ్యాత్మిక విషయాలు ఏవైనా ఉంటే దయచేసి
మాట్లాడండి” అని అడగనంపారు.
16పౌలు లేచి నిలుచొని చేతులెత్తి, “ఇశ్రాయేలు
ప్రజలారా! యూదులవలె దైవభీతిగల ప్రజలారా! నా
మాటలు వినండి. 17ఇశ్రాయేలు ప్రజల దేవుడు మన
పూర్వులను ఎన్నుకొని వాళ్ళు ఈజిప్టులో పర దేశీ
యులుగా ఉన్నప్పుడు వాళ్ళను గొప్ప వాళ్ళుగా
చేసాడు. తన అద్భుతమైన శక్తితో ఆ దేశం నుండి
వాళ్ళను పిలుచుకెళ్ళి, 18ఎడారుల్లో వాళ్ళ ప్రవర్తనను
నలభై సంవత్సరాలు సహిస్తూ వాళ్ళను కాపాడాడు.
19కనాను దేశంలో ఏడు జాతుల్ని పడగొట్టి తన ప్రజల్ని
ఆ ప్రాంతానికి వారసులుగా చేసాడు. 20ఇవి చేయటానికి
నాలుగు వందల ఏబది సంవత్సరాలు పట్టింది.
“ఆ తర్వాత దేవుడు సమూయేలు ప్రవక్త కాలం
దాకా, నాయకత్వం వహించగల న్యాయాధిపతుల్ని
పంపాడు. 21తమకు ‘రాజు’ కావాలని కోరగా కీషు
కుమారుడైన ‘సౌలును’ వాళ్ళకు రాజుగా పంపాడు.
ఇతడు బెన్యామీను వంశానికి చెందినవాడు. సౌలు నలభై
సంవత్సరాలు పాలించాడు. 22సౌలును తీసివేసాక
దావీదును వాళ్ళ రాజుగా చేసాడు. దావీదు విషయంలో
తన అంగీకారం చూపుతూ దేవుడు యిలా అన్నాడు:
‘యెష్షయి కుమారుడైన దావీదు నా మనస్సుకు
నచ్చాడు. అతడు నేను చెప్పినట్లు చేస్తాడు.’ 23దేవుడు
తన వాగ్దానానుసారం ఇశ్రాయేలు ప్రజల కోసం రక్షకుడై
నటువంటి యేసును ఇతని వంశంలో జన్మింపచేసాడు.
24యేసు రాకముందు, యోహాను మారుమనస్సును
గురించి బాప్తిస్మమును గురించి ఇశ్రాయేలు ప్రజలకు
బోధించాడు. 25తన కర్తవ్యం ముగిసే చివరి దశలో
అతడు ఇలా అన్నాడు: ‘నేనెవర్ననుకొన్నారు. నేను
మీరనుకొంటున్న వాణ్ణి కాదు! కాని నా తర్వాత ఆయన
రాబోతున్నాడు. ఆయన చెప్పులు తాకే అర్హత కూడా
నాకు లేదు.’
26“సోదరులారా! అబ్రాహాము వంశీయులారా! దైవ
భీతిగల ఇతర ప్రజలారా! రక్షణ గురించి తెలియ చేసే
సందేశాన్ని దేవుడు మనకు తెలియచేసాడు. 27కాని
యెరూషలేము ప్రజలు, వాళ్ళ పాలకులు ఈ యేసును
గుర్తించలేదు. యేసుకు మరణదండన వేయించి ప్రతి
విశ్రాంతి రోజున చదివే ప్రవక్తల మాటలు నిజం చేసారు.
28ఆయనకు మరణ దండన విధించటానికి వాళ్ళకు
ఏ కారణం దొరక్కపోయినా ఆయనను చంపివేయిం

చమని పిలాతును కోరారు. 29లేఖనాల్లో ఆయన్ని
గురించి వ్రాసిన విధంగా వాళ్ళాయనను చంపారు. ఆ
తర్వాత సిలువనుండి క్రిందికి దింపి సమాధి చేసారు.
30కాని దేవుడాయన్ని బ్రతికించాడు. 31ఇదివరలో ఆయ
నతో కలిసి గలిలయనుండి యెరూషలేమునకు
ప్రయాణం చేసిన ప్రజలకు చాలా రోజులదాకా కనిపిం
చాడు. 32వాళ్ళు ఆయన కోసం ఇశ్రాయేలు ప్రజల
ముందు సాక్ష్యం చెప్పటానికి సిద్ధంగా ఉన్నారు.
33దేవుడు మన పూర్వులకు చేసిన వాగ్దానాన్ని
యిప్పుడు వాళ్ళ సంతతియైన మన కోసం పూర్తి
చేసాడు. యేసును బ్రతికించటంతో ఈ వాగ్దానం
పూర్తి అయింది. ఇదే మేము చెప్పే సువార్త. దీన్ని
గురించి కీర్తన గ్రంథంలో ఇలా వ్రాయబడివుంది:

> 'నీవు నా కుమారుడవు! నేడు నేను నీకు
> తండ్రి నయ్యాను.' *కీర్తన 2:7*

34దేవుడు ఆయన్ని బ్రతికించాడు. ఆయన ఎన్నటికీ
మట్టిలో కలిసిపోడు. అందువల్ల దేవుడు మరొక చోట,

> 'నేను దావీదుకు తప్పక యిస్తానన్న పవిత్ర
> మైన ఆశీస్సులను నీకిస్తాను' అని అన్నాడు.
> *యెషయా 55:3*

35మరొక చోట యిలా చెప్పబడింది:

> 'నీ పవిత్రుడి దేహాన్ని సమాధిలో నీవు
> క్రుళ్ళి పోనియ్యవు!'
> *కీర్తన 16:10*

36దావీదు తన కాలంలో దేవుని ఆజ్ఞానుసారం నడుచు
కొన్నాడు. అతడు చనిపోగానే అతణ్ణి అతని పూర్వీ
కులతో సమాధి చేసారు. అతని దేహం మట్టిలో కలిసి
పోయింది. 37కాని దేవుడు బ్రతికించిన వాడు మట్టిలో
కలిసి పోలేదు. 38మీరీ విషయం తెలుసుకోవాలి: యేసు
ద్వారా మీ పాపాలు క్షమించ బడుతాయని మేము
ప్రకటిస్తున్నాము. మోషే ధర్మశాస్త్రం క్షమించలేని
పాపాలనుండి, 39యేసు తనను నమ్ముకొన్న ప్రతి
ఒక్కణ్ణీ క్షమిస్తాడు. 40ప్రవక్తలు చెప్పిన ఈ విషయాలు
మీకు సంభవించకుండా జాగ్రత్త పడండి:

> 41 'పరిహాసం చేసే ప్రజలారా! ఆశ్చర్యం
> పొందండి! నశించండి! ఎందుకనగా మీ
> కాలంలో మీరు నమ్మలేనిది నేనొకటి
> చేయబోతున్నాను! మరొకరు చెప్పినా
> మీరు నమ్మరు.'"
> *హబక్కూకు 1:5*

42పౌలు, బర్నబా యూదుల సమాజ మందిరాన్ని
వదిలి వెళ్తుండగా వచ్చే విశ్రాంతి రోజు ఈ విషయాల్ని
గురించి యింకా ఎక్కువగా మాట్లాడుమని ప్రజలు
అడిగారు. 43ప్రజలు వెళ్ళి పోయాక చాలామంది
యూదులు, యూదుల మతంలో భక్తిగలవాళ్ళు పౌలు,
బర్నబా వెంట వెళ్ళారు. పౌలు, బర్నబాలు ప్రజలతో,
"దేవుని అనుగ్రహాన్ని విశ్వసిస్తూ యిలాగే జీవిస్తూ
ఉండండి!" అని చెప్పారు.

44మరుసటి విశ్రాంతి రోజున పట్టణమంతా ప్రభువు
సందేశాన్ని వినాలని సమావేశం అయ్యింది. 45సమావేశ
మయిన ప్రజల్ని చూసి యూదుల్లో ఈర్ష్య నిండి
పోయింది. వాళ్ళు పౌలుకు ఎదురు తిరిగి మాట్లాడి
అతణ్ణి దూషించారు. 46పౌలు, బర్నబాలు ధైర్యంగా
సమాధానం చెబుతూ, "అందరికన్నా ముందు దైవ
సందేశాన్ని మీకు చెప్పటం మా కర్తవ్యం. కాని మీరు
నిరాకరించటంవల్ల, నిత్యజీవానికి అనర్హులమని మీలో
మీరు అనుకోవటం వల్ల మేము మిమ్మల్ని వదిలి
యితరుల దగ్గరకు వెళ్తున్నాము. 47ప్రభువు యిలా
ఆజ్ఞాపించాడు అని అన్నాడు:

> 'ప్రపంచానికి రక్షణ కలిగించాలని యితర
> దేశాలకు నిన్నొక వెలుగుగా చేసాను!'"
> *యెషయా 49:6*

48యూదులు కాని వాళ్ళు ఇది విని ఆనందించారు.
ప్రభువు సందేశాన్ని అంగీకరించారు. అనేకులు విశ్వాసు
లైయ్యారు. శాశ్వతమైన క్రొత్త జీవితాన్నివ్వటానికి
దేవుడు వీళ్ళను ఎన్నుకొన్నాడు.

49దైవ సందేశం ఆ ప్రాంతమంతా వ్యాపించింది.
50కాని యూదులు పట్టణంలోని పెద్దలతో, దైవ భక్తిగల
గొప్పింటి స్త్రీలతో మాట్లాడి వాళ్ళకు పౌలు, బర్నబాల
పట్ల కోపం కలిగేటట్లు చేసారు. అంతా కలిసి వాళ్ళను
హింసించి ఆ తదుపరి వాళ్ళను తమ పట్టణం నుండి
తరిమి వేసారు. 51పౌలు, బర్నబా తమ నిరసనకు
చిహ్నంగా కాలి ధూళిని దులిపి 'ఈకొనియ' అనే పట్ట
ణానికి వెళ్ళి పోయారు. 52కాని విశ్వాసులపై పవిత్రాత్మ
ప్రభావం ఉండటంవల్ల వాళ్ళలో ఉన్న ఉత్సాహం
తగ్గలేదు.

### ఈకొనియలో

14 ఈకొనియలో పౌలు, బర్నబా ఎప్పటిలాగే
యూదుల సమాజమందిరానికి వెళ్ళి, బాగా
మాట్లాడారు. తద్వారా చాలా మంది యూదులు,
యూదులుకాని వాళ్ళు విశ్వాసులైయ్యారు. 2వాళ్ళ
సందేశాన్ని నమ్మని యూదులు, యూదులు కాని
వాళ్ళను రేకెత్తించి మన సోదరులకు విరుద్ధంగా వాళ్ళ
మనసుల్ని పాడుచేసారు. 3కాబట్టి, వాళ్ళు ప్రభువు

పట్ల తమ విశ్వాసము విడువక ధైర్యంగా మాట్లాడుతూ
అక్కడ చాలాకాలం ఉన్నారు. ప్రభువు వాళ్ళకు అద్భు
తాలను, మహిమలను చేసే శక్తినిచ్చాడు. ఈ విధంగా
తన అనుగ్రహాన్ని గురించి ఋజువు చేసాడు. 4ఆ
పట్టణంలోని ప్రజలు రెండు వర్గాలుగా చీలిపోయి
కొందరు యూదుల పక్షం, మరికొందరు అపొస్తలుల
పక్షం చేరిపోయారు.
5యూదులు కాని వాళ్ళు, యూదులు తమ తమ
నాయకులతో కలిసి అపొస్తలుల్ని అవమానించి.
రాళ్ళతో కొట్టి చంపివేయాలను కొన్నారు. 6కాని
అపొస్తలులు ఇది కనిపెట్టి లుకయొనియలోని లుస్త్ర,
దెర్బే, అనే పట్టణాల చుట్టూ ఉన్న ప్రాంతాలకు
వెళ్ళి పోయారు. 7ఆయా ప్రాంతాల్లో వాళ్ళు దేవుని
సువార్తను ప్రకటించటం కొనసాగించారు.

## లుస్త్ర, దెర్బే పట్టణాల్లో

8లుస్త్రలో ఒక కుంటివాడుండే వాడు. ఇతడు
కుంటివానిగా పుట్టాడు. ఎన్నడూ నడవలేదు. 9పౌలు
మాట్లాడుతుండగా అతడు విన్నాడు. పౌలు అతని వైపు
సూటిగా చూసి నయం కాగల విశ్వాసం అతనిలో
ఉందని గ్రహించి, 10"లేచి నీ కాళ్ళపై నిలబడు!" అని
అతనితో బిగ్గరగా అన్నాడు. తక్షణం అతడు గంతేసి
నడవటం మొదలు పెట్టాడు. 11పౌలు చేసింది చూసి
ప్రజలు తమ లుకయొనియ భాషలో, "మానవ బృహ
స్పతి రూపంలో దేవుళ్ళు దిగివచ్చారు" అని బిగ్గరగా
అన్నారు. 12బర్నబాను ద్యుపతి అని, ప్రధాన ఉపన్యాస
కుడు కాబట్టి పౌలును హెర్మే అని పిలిచారు. 13వీళ్ళు
దేవుళ్ళని అనుకోవటం వల్ల వీళ్ళకు బలి యివ్వాలనే
ఉద్దేశ్యంతో ఊరి బయట ఉన్న ద్యుపతి మందిరం
యొక్క పూజారి, ప్రజలు కలిసి ఎద్దుల్ని, పూలహా
రాలను పట్టణ ద్వారాల దగ్గరకు తెచ్చారు.
14కాని అపొస్తలులైన బర్నబా, పౌలు ఇది విని
తమ దుస్తుల్ని చింపుకుంటూ ఆ ప్రజల గుంపులోకి
పరుగెత్తి యిలా బిగ్గరగా అన్నారు: 15"అయ్యలారా!
మీరిలా ఎందుకు చేస్తున్నారు? మేము కూడా మనుష్య
లమే! మీలాంటి మనుష్యులమే! ఈ పనికి రానివాటి
నుండి మిమ్మల్ని దూరం చేసి ఆకాశాన్ని, భూమిని,
సముద్రాల్ని వాటిలో ఉన్న వాటన్నిటిని సృష్టించిన
దేవుని వైపు మళ్ళించే సువార్తను తెచ్చాము. ఆ దేవుడు
సజీవమైనవాడు. 16ఇదివరలో దేవుడు ప్రజల్ని తమ
యిష్టం వచ్చినట్లు చెయ్యనిచ్చాడు. 17కాని ఆకాశం
నుండి వానలు కురిపించి, పంట కాలంలో పంటలు
పండించి తినటానికి కావలసినంత ఆహారాన్నిచ్చి మన
మనసుల్ని ఆనందంతో నింపి మనపై దయచూపి
దేవుడు తానున్నట్లు తెలియ చేసాడు." 18ఇన్ని చెప్పాక
కూడా ప్రజలు తాము యివ్వాలను కొన్న బలినివ్వటం
మానుకోలేదు.
19కాని కొందరు యూదులు అంతియొకయ, ఈకొ
నియ పట్టణాలనుండి వచ్చి ప్రజల్ని తమవైపు మళ్ళిం
చుకొన్నారు. అంతా కలిసి పౌలు మీద రాళ్ళు విసిరారు.
అతడు చనిపోయాడనుకొని అతణ్ణి ఊరి బయట
పారవేసారు. 20శిష్యులు అతని చుట్టూ చేరారు. ఆ
తదుపరి అతడు లేచి మళ్ళీ పట్టణంలోకి వెళ్ళాడు.
మరుసటి రోజు అతడు బర్నబాను కలుసుకొన్నాడు.
ఇద్దరూ కలిసి దెర్బే అనే పట్టణానికి ప్రయాణ
మయ్యారు.

## సిరియలోని అంతియొకయకు తిరిగిరావటం

21ఆ పట్టణంలో సువార్తను ప్రకటించి చాలామందిని
శిష్యులుగా చేసుకొన్నారు. లుస్త్ర, ఈకొనియ, అంతి
యొకయ పట్టణాలకు తిరిగి వచ్చారు. 22శిష్యుల్ని
ఆత్మీయంగా బలపరుస్తూ భక్తి వదలకుండా ఉండుమని
ఉత్సాహం కలిగే మాటలు చెప్పారు. "దేవుని రాజ్యం
లోకి ప్రవేశించటానికి మనం ఎన్నో కష్టాలను
భవించాలి" అని వాళ్ళు అన్నారు. 23పౌలు, బర్నబా
కలిసి ప్రతి సంఘానికి కొందరు పెద్దల్ని నియమిం
చారు. ఈ పెద్దలు ఇంతకు క్రితమే ప్రభువును విశ్వసిం
చిన వాళ్ళు కనుక పౌలు, బర్నబా ప్రార్థనలు, ఉపవా
సాలు చేసి వాళ్ళను ప్రభువుకు అప్పగించారు.
24ఆ తదుపరి పిసిదియ ప్రాంతాలకు వెళ్ళి అక్కడ
నుండి పంఫూలియ చేరుకొన్నారు. 25పెర్గేలో సందే
శాన్ని ప్రకటించి అక్కడినుండి అత్తాలియకు వెళ్ళారు.
26అత్తాలియ నుండి అంతియొకయకు తిరిగి ప్రయాణ
మయ్యారు. ప్రస్తుతం ముగించిన దైవ కార్యాన్ని చేయ
టానికి దైవానుగ్రహం కలగాలని దీవించి వీళ్ళను దేవునికి
అప్పగించింది యిక్కడే.
27అంతియొకయకు వచ్చాక సంఘాన్ని పిలిచి
దేవుడు తమ ద్వారా చేసినవన్నీ చెప్పారు. యూదులు
కాని వాళ్ళు కూడా తనను నమ్మేటట్లు దేవుడు ద్వారా
లను ఏ విధంగా తెరిచాడో చెప్పారు. 28వాళ్ళు అక్క
డున్న శిష్యులతో చాలా కాలం గడిపారు.

## యెరూషలేములో సమావేశం

15 కొందరు యూదయనుండి అంతియొకయకు
వచ్చి అక్కడున్న సోదరులకు, "సున్నతి అనే
మోషే ఆచారాన్ని పాటిస్తే తప్ప మీకు రక్షణ లభిం
చదు" అని బోధించారు. 2ఈ కారణంగా పౌలు, బర్నబా
వాళ్ళతో తీవ్రమైన వాదనలు, చర్చలు చేసారు.
అపొస్తలుల్ని ఈ విషయాన్ని గురించి సంప్రదించాలనే
ఉద్దేశ్యంతో పౌలును, బర్నబాను, మరి కొంతమందిని
యెరూషలేమునకు పంపాలనే నిర్ణయం జరిగింది.
3అక్కడున్న సంఘం వీళ్ళకు వీడ్కోలు యిచ్చింది.
వీళ్ళు ఫొనీషియ, సమరయ పట్టణాల ద్వారా
ప్రయాణం చేస్తూ యూదులు కాని వాళ్ళలో వచ్చిన

మార్పును గురించి అక్కడి వాళ్ళకు చెప్పారు. ఇది
సోదరులందరికీ చాలా ఆనందం కలిగించింది. 4వీళ్ళు
యెరూషలేము చేరగానే సంఘము, అపొస్తలులు,
పెద్దలు అంతా కలిసి వీళ్ళకు స్వాగతం యిచ్చారు.
పౌలు, బర్నబా దేవుడు తమ ద్వారా చేసిన వాటిని
వాళ్ళకు చెప్పారు. 5పరిసయ్యుల తెగకు చెందిన
కొందరు భక్తులు లేచి, “యూదులు కాని వాళ్ళు
తప్పక సున్నతి చేసుకోవాలి. మోషే ధర్మశాస్త్రాన్ని
పాటించాలి” అని అన్నారు.
6అపొస్తలులు, పెద్దలు కలిసి ఈ విషయాన్ని
పరిశీలించారు. 7ఎన్నో చర్చలు జరిగాక పేతురు లేచి
యిలా అన్నాడు: “సోదరులారా! యూదులు కాని
వాళ్ళు నా నోటి నుండి సువార్త విని విశ్వాసులు కావా
లని చాలా కాలం క్రిందటే దేవుడు మనందరి నుండి
నన్నెన్నుకొన్నట్లు మీకు తెలుసు. 8మానవుల మనస్సు
తెలిసిన దేవుడు, మనకిచ్చినట్లే పవిత్రాత్మను వాళ్ళకు
కూడా యిచ్చి వాళ్ళను అంగీకరించినట్లు మనకు
తెలియ చేసాడు. 9మనకు, వాళ్ళకూ వ్యత్యాసం చూప
లేదు. వాళ్ళు విశ్వసించారు. కనుక వాళ్ళ హృదయా
లను పవిత్రం చేసాడు. 10మరి అలాంటప్పుడు బరువైన
ఈ కాడిని శిష్యుల మెడపై ఎందుకు పెడ్తున్నారు?
ఈ బరువును మనము, మన పెద్దలు కూడా మోయలేక
పోయాము కదా! దేవుడు కోప్పడుతాడో లేదో చూడా
లని ఉందా? 11యేసు ప్రభువు దయతో మనము,
వీళ్ళు కూడా రక్షింప బడుతామని నమ్ముతున్నాము.”
12సభలో ఉన్న వాళ్ళందరూ నిశ్శబ్దం వహించారు.
బర్నబా, పౌలు యూదులు కాని వాళ్ళలో దేవుడు
తమ ద్వారా చేసిన మహిమల్ని గురించి, అద్భుతాల్ని
గురించి, చెప్పగా వాళ్ళు విన్నారు. 13పౌలు, బర్నబా
మాట్లాడటం ముగించాక యాకోబు ఈ విధంగా
అన్నాడు: “సోదరులారా! నా మాటలు వినండి!
14దేవుడు మొదట్లో యూదులు కాని వాళ్ళపట్ల తన
అభిమానాన్ని చూపి వాళ్ళనుండి కొందర్ని ఎన్నుకొని
తన ప్రజగా ఎలా చేసుకొన్నాడో సీమోను మనకు
వివరించి చెప్పాడు. 15ఈ సంఘటనను ప్రవక్తలు ఈ
వాక్యాల్లో సరిగ్గా వర్ణించారు:

16 ‘కూలి పోయిన దావీదు యింటిని పునః
నిర్మిస్తాను! ఆ శిథిలాలతో క్రొత్త యింటిని
నిర్మిస్తాను!
17 మిగతా వాళ్ళంతా ప్రభువును వెతుకు
తారు! నేనెన్నుకొన్న యూదులుకాని
ప్రజలు కూడా వెతుకుతారు,

ఆమోసు *9:11-12*

18 అని ప్రభువు చాలా కాలం క్రిందటే తెలియ
చేసాడు.’

19“దేవుడు యూదులు కాని వాళ్ళను కూడా అంగీ
కరించాడు కాబట్టి, దేవుని వైపు మళ్ళుతున్న వాళ్ళ
మనస్సుకు కష్టం కలిగించ కూడదని నా అభిప్రాయం.
20-21కాని తరతరాలనుండి మోషే ధర్మశాస్త్రాన్ని ప్రతి
పట్టణంలో ప్రకటిస్తూ, వాటిని ప్రతి విశ్రాంతి రోజు
సమాజ మందిరాల్లో చదివారు కాబట్టి,

విగ్రహాలకు నైవేద్యం పెట్టిన ఆహారం ముట్ట
రాదని, పరస్త్రీని కామించకూడదని, గొంతు
నులిమి చంపిన జంతువుల మాంసం ముట్ట
రాదని, జంతువుల రక్తాన్ని తినరాదని
వాళ్ళకు మనం వ్రాయాలి.”

### యూదులు కాని భక్తులకు లేఖ

22అపొస్తలులు, పెద్దలు, సంఘసభ్యులు, అంతా
కలిసి సంఘంనుండి కొందర్ని ఎన్నుకొని పౌలు, బర్న
బాతో సహా వాళ్ళను అంతియొకయకు పంపారు.
సోదరుల్లో ముఖ్యులైన బర్సబ్బా అని పిలువబడే
యూదాను, సీలను ఎన్నుకొని 23వాళ్ళవెంట ఈ
లేఖను పంపారు: మీ సోదరులైన అపొస్తలులనుండి,
పెద్దలనుండి, అంతియొకయ, సిరియ, కిలికియ
పట్టణాల్లోని యూదులుకాని సోదరులకు, శుభం!

ప్రియ సహోదరులారా!
24మా అనుమతి లేకుండా మాలో కొందరు
అక్కడికి వచ్చి తమ మాటల్తో మీలో అశాంతి
కలిగించి మీ మనస్సుల్ని పాడుచేసారని
విన్నాము. 25మా ప్రియమిత్రులైన బర్నబాతో,
పౌలుతో కొందర్ని మీ వద్దకు పంపాలని
మేమంతా కలిసి నిర్ణయించాము. 26వీళ్ళు మన
యేసుక్రీస్తు ప్రభువు కోసం తమ ప్రాణాల్ని
తెగించిన వాళ్ళు. 27అందువల్ల, మేము వ్రాస్తు
న్నవి తమ నోటిద్వారా మీకు తెలపాలని
యూదాను, సీలను, పంపుతున్నాము. 28ఈ
నియమాల్నితప్ప మిగతా నియమాల్ని మీపై
మోపటం భావ్యంకాదని పవిత్రాత్మకు, మాకు
అనిపించింది:

29 విగ్రహాలకు నైవేద్యం పెట్టిన ఆహారాన్ని,
గొంతునులిమి చంపిన జంతువుల
మాంసాన్ని, జంతువుల రక్తాన్ని ముట్ట
కండి. పరస్త్రీని వాంఛించకండి.

ఇలా వీటికి దూరంగా ఉండటంవల్ల మీలో సత్ప్రవర్తన
కలుగుతుంది.
వీడ్కోలు.
30వాళ్ళు సెలవు తీసుకొని అంతియొకయకు
వెళ్ళారు. యేసు భక్తులందర్ని పిలిచి వాళ్ళకీ లేఖ

నిచ్చారు. 31ప్రోత్సాహపరిచే ఈ లేఖను చదివి ప్రజలు
చాలా ఆనందించారు. 32యూదా, సీల కూడా ప్రవక్తలు
కాబట్టి ఆ ఊరి సోదరులతో చాలా సేపు మాట్లాడి
వాళ్ళను ప్రోత్సాహపరిచి ఆధ్యాత్మికంగా బలపరిచారు.
33వాళ్ళక్కడ కొద్దిరోజులు గడిపారు. ఆ తదుపరి
అక్కడి సోదరులు, 'శాంతి కలుగుగాక' అని కోరుతూ
వాళ్ళకు వీడ్కోలు చెప్పారు. వీళ్ళు తమను పంపిన
వాళ్ళ దగ్గరకు తిరిగి వెళ్ళిపోయారు. 34 "కాని సీల
అక్కడే ఉండిపోవాలనుకొన్నాడు."*
35పౌలు, బర్నబా అంతియొకయలో కొద్ది రోజులు
గడిపారు. వీళ్ళు, యింకా అనేకులు కలిసి ప్రభువు
సందేశాన్ని ఉపదేశించి బోధించారు.

## పౌలు, బర్నబా విడిపోవటం

36కొంతకాలం తర్వాత పౌలు, బర్నబాతో,
"ప్రభువు సందేశాన్ని ఉపదేశించిన ప్రతి పట్టణానికి,
మనం మళ్ళీ వెళ్దాం. అక్కడి సోదరుల్ని కలుసుకొని
వాళ్ళు ఏ విధంగా అభివృద్ధి చెందుతున్నారో చూసి
వద్దాం" అని అన్నాడు. 37బర్నబా, మార్కు అని పిలువ
బడే యోహానును కూడా తమ వెంట పిలుచుకు
వెళ్దామనుకొన్నాడు. 38కాని తమతో పని చెయ్యకుండా
తమను పంఫూలియలో వదిలి వేసాడు కాబట్టి పౌలు
అతణ్ణి పిలుచుకు వెళ్ళటం మంచిది కాదనుకొన్నాడు.
39బర్నబా, పౌలు మధ్య తీవ్రమైన స్పర్థ కలగటంవల్ల
వాళ్ళు విడిపోయారు. బర్నబా మార్కును తన వెంట
పిలుచుకొని ఓడలో సైప్రసుకు వెళ్ళాడు. 40పౌలు,
సీలను తన వెంట పిలుచుకొని వెళ్ళాడు. అక్కడున్న
సోదరులు అతనికి ప్రభువు అనుగ్రహం కలగాలని
దీవించి ప్రభువుకు అప్పగించారు. 41అతడు సిరియ,
కిలికియ పట్టణాల ద్వారా ప్రయాణం చేసి అక్కడి
సంఘాలను ఆధ్యాత్మికంగా బలపరిచాడు.

## పౌలు, సీలల వెంట తిమోతి వెళ్ళటం

16 ఆ తర్వాత పౌలు దెర్బే వెళ్ళి అక్కడి నుండి
లుస్త్రకు వెళ్ళాడు. లుస్త్రలో తిమోతి అనే
పేరుగల ఒక విశ్వాసి ఉండేవాడు. అతని తల్లి భక్తిగల
యూదురాలు; తండ్రి గ్రీసు దేశస్థుడు. 2లుస్త్ర,
ఈకొనియ పట్టణాల్లో నివసించే సోదరుల్లో తిమోతి
మంచి పేరు తెచ్చుకున్నాడు. పౌలు అతణ్ణి తన వెంట
పిలుచుకు వెళ్దామనుకొన్నాడు. 3తిమోతి తండ్రి గ్రీసు
దేశస్థుడని ఆ ప్రాంతంలో నివసించే యూదులందరికి
తెలుసు. కాబట్టి అతనికి సున్నతి చేయించాడు. 4అపొ
స్తలులు, పెద్దలు యెరూషలేములో నిర్ణయించిన నియ
మాల్ని, వాళ్ళు ప్రతి పట్టణానికి వెళ్ళి ప్రజలకు తెలియ
చేసి, వాటిని పాటించుమని చెప్పారు. 5తద్వారా
సంఘాల్లో భక్తి అభివృద్ధి చెందింది. రోజు రోజుకూ
ఆ సంఘాల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

## పౌలుకు దివ్యదర్శనం కలగటం

6వాళ్ళు ఆసియ ప్రాంతాలకు వెళ్ళి ఈ సందేశాన్ని
బోధించాలనుకొన్నారు. కాని పరిశుద్ధాత్మ వాళ్ళను
ఆపాడు. కనుక, వాళ్ళు ఫ్రుగియ, గలతీయలలోని
ప్రతి గ్రామానికి వెళ్ళారు. 7ముసియ పొలిమేరలకు
వచ్చాక బితూనియకు వెళ్ళటానికి ప్రయత్నించారు.
కాని యేసు ఆత్మ అందుకు అంగీకరించలేదు. 8ఆ
కారణంగా వాళ్ళు ముసియ దాటి త్రోయకు వెళ్ళారు.
9మాసిదోనియ ప్రాంతంవాడొకడు,"మాసిదోనియకు
వచ్చి మమ్మల్ని రక్షించండి" అని వేడుకొన్నట్లు ఆ
రాత్రి పౌలుకు ఒక దర్శనం కలిగింది. 10పౌలుకు దర్శనం
కలిగాక మాసిదోనియ నివాసులకు సువార్త ప్రకటించ
టానికి దేవుడు మమ్మల్ని ఎన్నుకొన్నాడని గ్రహించి
తక్షణమే మేము అక్కడికి వెళ్ళటానికి సిద్ధం
అయ్యాము.

## లూదియ భక్తురాలు కావటం

11'త్రోయ' నుండి సముద్ర ప్రయాణం చేసి నేరుగా
సమొత్రాకేకు వెళ్ళి మరుసటి రోజు నెయపొలి చేరు
కొన్నాము. 12అక్కడి నుండి ప్రయాణమై రోము
సామ్రాజ్యంలోని ఫిలిప్పీకి వెళ్ళాం. ఫిలిప్పీ మాసిదోని
యలోని ప్రాంతంలో చాలా ముఖ్యమైన పట్టణం.
మేము ఆ పట్టణంలో చాలా రోజులు గడిపాము.
13ఒక విశ్రాంతి రోజున ప్రార్థనలు చేయటానికి
స్థలం దొరుకుతుందని ఆశిస్తూ ఊరి బయట ఉన్న
నది దగ్గరకు వెళ్ళాము. అక్కడికి వచ్చిన ఆడవాళ్ళతో
కూర్చొని మాట్లాడటం మొదలుపెట్టాము. 14మా
మాటలు వింటున్న ఒకావిడ పేరు 'లూదియ.' ఈవిడ
తుయతైర గ్రామానికి చెందింది. ఊదారంగు పొడిని
వ్యాపారం చేసే ఈ లూదియ భక్తురాలు. దేవుడు
ఆవిడ మనస్సును మార్చి పౌలు సందేశం వినేటట్లు
చేసాడు.
15ఆమె, ఆమె యింట్లో ఉన్న వాళ్ళంతా
బాప్తిస్మము పొందాక మమ్మల్ని యింటికి ఆహ్వానిం
చింది. "నేను నిజంగా ప్రభువు భక్తురాలననే నమ్మకం
మీలో ఉన్నట్లయితే వచ్చి మా యింట్లో ఉండండి"
అని మమ్మల్ని వేడుకొని చాలా బలవంతం చేసింది.

## పౌలు మరియు సీల కారాగారంలో

16ఒకసారి మేము ప్రార్థనా స్థలానికి వెళ్తుండగా ఒక
బానిస పిల్ల కనిపించింది. ఆమెకు సోదె చెప్పే శక్తిగల
'పుతోను' అనే ఒక దయ్యము పట్టివుంది. ఆమె సోదె
చెప్పటం వల్ల ఆమె యజమానులు చాలా డబ్బు

---

**కాని ... పోవాలనుకొన్నాడు** కొన్ని ప్రతులు 34వ వాక్యాన్ని చేర్చాయి.

గడించారు. 17ఆమె పౌలును, మమ్మును అనుసరిస్తూ,
"వీళ్ళు సర్వోన్నతుడైన దేవుని సేవకులు. రక్షణకు
దారి చూపుతున్నారు" అని బిగ్గరగా కేక పెట్టేది. 18ఇలా
చాలా రోజులు చేసింది. చివరకు పౌలు విసుగు చెంది
వెనక్కి తిరిగి ఆమెలో ఉన్న దయ్యంతో, "యేసు
క్రీస్తు పేరిట ఆమెను వదిలి పొమ్మని ఆజ్ఞాపిస్తున్నాను"
అని అన్నాడు. వెంటనే దయ్యం ఆమెను వదిలివేసింది.
19ఆ బానిస పిల్ల యజమానులు తాము డబ్బు
చేసుకొనే ఆశ నశించిందని గ్రహించి పౌలును, సీలను
బంధించారు. 20వాళ్ళను బహిరంగంగా రోము సైనికాధి
కారులముందుకు పిలుచుకువచ్చి, "వీళ్ళు యూదులు.
మన పట్టణంలో అలజడి లేపుతున్నారు. 21రోము
పౌరులుగా మనము ఆచరించలేని ఆచారాలను వాళ్ళు
మనకు చెబుతున్నారు. వాటిని అంగీకరించటం కూడా
న్యాయం కాదు" అని అన్నారు. 22ప్రజల గుంపు పౌలు,
సీలల మీద పడింది. అధికారులు వాళ్ళ దుస్తుల్ని
చింపి కొట్టమని ఆజ్ఞాపించారు. 23చావకొట్టి, వాళ్ళను
చెరసాలలో పడవేస్తూ, "వీళ్ళను జాగ్రత్తగా కాపలా
కాయండి" అని ఆ చెరసాల అధికారితో చెప్పారు.
24కనుక ఆ చెరసాల అధికారి వాళ్ళ కాళ్ళను బొండ
కొయ్యకు గల రంధ్రాల్లో బిగించి లోపలి గదిలో
పడవేసాడు.
25అర్ధరాత్రి వేళ పౌలు, సీల ప్రార్థనలు చేస్తూ,
దైవకీర్తనలు పాడుతుండగా ఇతర బందీలు వింటు
న్నారు. 26అకస్మాత్తుగా ఒక పెద్ద భూకంపం వచ్చింది.
దానితో చెరసాల పునాదులు కదిలి పోయాయి.
వెంటనే చెరసాల తలుపులన్నీ తెరుచుకున్నాయి.
వీళ్ళకు కట్టిన కట్లు తెగిపొయ్యాయి. 27చెరసాల
అధికారి మేలుకొని చెరసాల తలుపులు తెరచి ఉండటం
చూసి నేరస్థులు అందరు తప్పించుకు పోయారనుకొని
కత్తి దూసి తనను తాను చంపుకోబోయాడు. 28కాని
పౌలు, 'హాని చేసుకోవద్దు! మేమంతా యిక్కడే
ఉన్నాము' అని బిగ్గరగా అన్నాడు.
29ఆ అధికారి దీపాలు తెప్పించి లోపలికి పరుగెత్తి
కొంటూ వెళ్ళి వణకుతూ పౌలు, సీలల కాళ్ళ మీద
పడ్డాడు. 30ఆ తరువాత వాళ్ళను బయటికి పిలుచుకు
వచ్చి, "అయ్యా! నేను రక్షణ పొందాలంటే ఏమి
చేయాలి?" అని అడిగాడు.
31వాళ్ళు, "యేసు ప్రభువును నమ్ము! నీకు, నీ
యింట్లోని వాళ్ళకందరికీ రక్షణ లభిస్తుంది" అని సమా
ధానం చెప్పారు. 32ఆ తరువాత వాళ్ళు ప్రభువు
సందేశాన్ని అతనికి, అతని యింట్లోని వాళ్ళకందరికీ
చెప్పారు. 33ఆ అధికారి, ఆ రాత్రివేళ వాళ్ళను పిలుచుకు
వెళ్ళి గాయాలను కడిగాడు. వెంటనే అతడు, అతని
యింట్లోని వాళ్ళు బాప్తిస్మము పొందారు. 34ఆ
తరువాత అతడు వాళ్ళను తన యింటికి పిలుచుకు
వెళ్ళి వాళ్ళకు భోజనం పెట్టాడు. అతడు, అతని
యింట్లోని వాళ్ళు తాము దేవుణ్ణి విశ్వసించటం
మొదలు పెట్టినందుకు చాలా ఆనందించారు.
35తెల్లవారగానే న్యాయాధికారులు తమ భటుల్ని
చెరసాల అధికారి దగ్గరకి పంపి వాళ్ళను విడుదల
చేయుమని ఆజ్ఞాపించారు.
36"నిన్ను, సీలను విడుదల చేయుమని న్యాయాధి
కారులు సెలవిచ్చారు. మీరిక వెళ్ళొచ్చు, క్షేమంగా
వెళ్ళండి!" అని చెరసాల అధికారి అన్నాడు.
37కాని పౌలు వాళ్ళతో, "మేము రోము పౌరులమైనా
విచారణ జరుపకుండా ప్రజల ముందు మమ్మల్ని
కొరడా దెబ్బలు కొట్టారు. కారాగారంలో పడవేసారు.
కాని యిప్పుడు రహస్యంగా పంపి వేయాలని చూస్తు
న్నారు. వీల్లేదు, స్వయంగా వచ్చి మమ్మల్ని విడుదల
చేయుమని అధికారులతో చెప్పండి" అని అన్నాడు.
38భటులు ఈ వార్త అధికారులకు తెలియజేసారు.
వాళ్ళు పౌలు, సీలలు రోము పౌరులని విని భయపడి
పోయారు. 39అందువల్ల అధికారులు వాళ్ళ దగ్గరకు
వెళ్ళి తమ తప్పు క్షమించుమని వేడుకొన్నారు.
వాళ్ళను ఊరి బయటకు పిలుచుకు వెళ్ళి, దయ
ఉంచి తమ ఊరు విడిచి వెళ్ళమని వాళ్ళను కోరారు.
40పౌలు, సీలలు కారాగారంనుండి లూదియ యింటికి
వెళ్ళారు. అక్కడున్న సోదరులను కలుసుకొని వాళ్ళలో
విశ్వాసం పెరిగే విధంగా మాట్లాడి వెళ్ళి పోయారు.

### థెస్సలొనీకలో

17 వాళ్ళు 'అంఫిపొలి', 'అపోల్లోనియ', పట్టణాల
ద్వారా ప్రయాణం చేసి థెస్సలొనీక అనే
పట్టణం చేరుకున్నారు. అక్కడ ఒక యూదుల సమాజ
మందిరం ఉంది. 2అలవాటు ప్రకారం పౌలు ఆ సమాజ
మందిరానికి వెళ్ళాడు. అక్కడ మూడు శనివారాలు
గడిపాడు. వాళ్ళతో యూదుల లేఖనాలు చెప్పి, విష
యాలు తర్కించాడు. 3క్రీస్తు చనిపోవలసిన అవసరం,
బ్రతికి రావలసిన అవసరం ఉందని వాళ్ళకు అర్థమయ్యే
టట్లు చెప్పాడు. ఈ విషయాన్ని లేఖనాలుపయోగించి
ఋజువు చేసాడు. "నేను చెబుతున్న ఈ యేసే క్రీస్తు!"
అని వాళ్ళకు నచ్చ చెప్పాడు. 4తద్వారా కొందరు
సమ్మతించి పౌలు, సీలల పక్షము చేరి పోయారు.
దైవ భీతిగల చాలా మంది గ్రీకులు, ముఖ్యమైన స్త్రీలు
వీళ్ళ పక్షం చేరిపోయారు.
5ఇది గమనించి యూదులు అసూయ పడ్డారు.
సంతలో ఉన్న పనిలేని వాళ్ళను కొందర్ని సమావేశ
పరచి పట్టణంలో అల్లర్లు మొదలు పెట్టారు. పౌలు,
సీలలను ప్రజల ముందుకు లాగాలనుకొని అంతా కలిసి
యాసోను యింటి మీద పడ్డారు. 6వాళ్లు అక్కడ కని
పించక పొయే సరికి యాసోన్ను, మరి కొందరు
సోదరుల్ని పట్టణపు అధికారుల ముందుకు తీసుకొని
వచ్చి, "ప్రపంచాన్నే కలవరపరచిన ఈ మనుష్యులు

ఇప్పుడిక్కడికి వచ్చారు. 7వీళ్ళకు యాసోను తన
యింట్లో ఆతిథ్యమిచ్చాడు. వీళ్ళంతా చక్రవర్తి నియ
మాల్ని అతిక్రమిస్తూ యేసు అనే మరొక రాజున్నా
డంటున్నారు" అని కేకలు వేసారు.
8ఈ మాటలు విని అక్కడున్న ప్రజలు, అధికారులు
రేకెత్తి పోయారు. 9ఆ తర్వాత యాసోనుతో, మిగతా
వాళ్ళందరితో పత్రాన్ని వ్రాయించుకొని వాళ్ళను
వదిలి వేసారు.

### బెరయలో

10అర్ధరాత్రి కాగానే సోదరులు పౌలు, సీలలను
బెరయ అనే పట్టణానికి పంపించారు. బెరయకు వచ్చిన
వాళ్ళు యూదుల సమాజ మందిరానికి వెళ్ళారు. 11థెస్స
లొనీక వాళ్ళకన్నా బెరయ వాళ్ళు మర్యాద కల వాళ్ళు.
వాళ్ళు దైవ సందేశాన్ని శ్రద్ధతో వినేవాళ్ళు. ప్రతీరోజు
పవిత్ర గ్రంథాలు చదివి, ఆ సందేశంలోని నిజానిజాలు
పరిశీలించే వాళ్ళు. 12చాలామంది యూదులు విశ్వాసు
లైయ్యారు. వాళ్ళలాగే ముఖ్యమైన గ్రీకు స్త్రీలు, పురు
షులు కూడా విశ్వాసులైయ్యారు. 13పౌలు దైవ సందే
శాన్ని బెరయలో కూడా ఉపదేశిస్తున్నాడని థెస్సలొనీక
లోని యూదులకు తెలిసింది. వాళ్ళు అక్కడికి వెళ్ళి
ప్రజలను పురికొలిపి, వాళ్ళలో అల్లర్లు రేకెత్తించారు.
14వెంటనే సోదరులు పౌలును సముద్ర తీరానికి
పంపారు. సీల, తిమోతి బెరయలోనే ఉండి పోయారు.
15పౌలుతో వెళ్ళిన వాళ్ళు అతనితో కలిసి ఏథెన్సుదాకా
వెళ్ళారు. సీలను, తిమోతిని అయినంత త్వరలో రమ్మ
నమని పౌలు వాళ్ళ ద్వారా కబురు పంపాడు. ఈ
వార్తతో వాళ్ళు తిరిగి బెరయకు వెళ్ళిపోయారు.

### ఏథెన్సులో

16పౌలు ఏథెన్సులో వాళ్ళ కోసం ఎదురు చూస్తూ
కొద్ది రోజులు ఆగిపొయ్యాడు. ఆ పట్టణం విగ్రహాలతో
నిండి ఉండటం గమనించి అతని ఆత్మ క్షోభించింది.
17అందువల్ల సమాజ మందిరంలో సమావేశమయ్యే
యూదులతో, దైవ భీతిగల యూదులు కాని ప్రజ
లతో, సంతకు వచ్చి పోయే ప్రజలతో ప్రతి రోజూ
మాట్లాడేవాడు. 18ఎపికూరీయులు అని అనబడే
కొందరు తత్వజ్ఞులు, స్తోయికులు అనబడే కొందరు
తత్వజ్ఞులు అతనితో తర్కించారు.
"ఆ వదరబోతు ఏమంటున్నాడు?" అని కొందరు
అన్నారు. "ఇతర దేవుళ్ళను గురించి ప్రబోధిస్తున్న
ట్లుంది" అని మరి కొందరు అన్నారు. పౌలు యేసును
గురించి, ఆయన బ్రతికి రావటాన్ని గురించి ప్రక
టించటం వల్ల అతణ్ణి వాళ్ళిలా విమర్శించారు. 19వాళ్ళు
అతనిని పట్టుకొని అరేయొపగు సభకు పిలుచుకు
వచ్చారు. "నీవు చెబుతున్న ఈ క్రొత్త బోధన ఏమిటో
మేము తెలుసుకో వచ్చా?" అని కొందరు అడిగారు.
20"మీరు చిత్రమైన విషయాలు మా చెవుల్లో వేసారు.
వాటి అర్థం మాకు చెప్పండి" అని మరి కొందరడిగారు.
21ఏథెన్సు ప్రజలు, ఆ పట్టణంలో నివసించే పరదేశీ
యులు, తమ కాలాన్నంతా కొన్ని సిద్ధాంతాలను చెప్ప
టంలోనో లేక వినటంలోనో గడిపే వాళ్ళు. మరే
పని చేసే వాళ్ళు కాదు.
22పౌలు అరేయొపగు సభలో నిల్చొని, "ఏథెన్సు
ప్రజలారా! మీరు అన్ని విషయాల్లో చాలా నిష్టగా
ఉన్నారు. ఇది నేను గమనించాను. 23నేను మీ పట్టణ
మంతా పర్యటించాను. మీరు పూజించే వాటిని
చూసాను. అంతేకాదు సాంబ్రాణి వేసే ఒక బలిపీఠం
మీద, 'తెలియని దేవునికి' అని వ్రాయబడి ఉండటం
చూసాను. అందువల్ల మీకు తెలియకున్నా మీరు
పూజించే ఆ దేవుణ్ణి గురించి ప్రకటించబోతున్నాను.
24ఈ ప్రపంచాన్ని, దానిలో ఉన్న ప్రతి వస్తువును
సృష్టించిన దేవుడు; ఆకాశానికి, భూమికి ప్రభువైనటు
వంటి దేవుడు, మానవులు కట్టిన మందిరాల్లో నివ
సించడు. 25మానవులు దేవుని కోసం చేయగలిగిందేదీ
లేదు. జీవి పీల్చుకొనే గాలిని, కావలసిన ప్రతీ వస్తువును
యిచ్చిన దేవునికి మానవుని సేవలు కావాలా?
26ఆయన ఒక్క మనుష్యునితో మానవులందర్ని
సృష్టించి వాళ్ళు ఈ ప్రపంచమంతా నివసించేటట్లు
చేసాడు. వాళ్ళ కోసం ఒక కాలాన్ని నియమించాడు.
ఏ దేశపు ప్రజలు ఎక్కడ నివసించాలో ఆ స్థలాన్ని,
కాలాన్ని సరిగ్గా నియమించాడు. 27మానవులు తనను
వెతకాలనీ, గ్రుడ్డివాడు తడిమినట్టు తడిమి తనను కను
గొనే అవకాశం వాళ్ళకు కలిగించాలనీ యిలా చేసాడు.
కాని నిజానికి ఆయన ఎవ్వరికీ దూరంగాలేడు:

28 'మనం ఆయనలో జీవిస్తున్నాం
ఆయనలో కదులుతున్నాం.
ఆయన కారణంగా మనం ఉన్నాం'

మీలోని కొందరు కవులు చెప్పినట్లు:

'మనం ఆయన సంతానం.'

29మనం దేవుని సంతానం కదా! అలాంటప్పుడు,
దేవుడు బంగారంతోకాని లేక వెండితోకాని, లేక రాతితో
కాని చేయబడిన విగ్రహంలాంటి వాడని మనం ఎట్లా
అనగలం? ఆయన మానవుడు తన కల్పనతో, కళతో
సృష్టించిన విగ్రహంలాంటివాడుకాడు. 30గతంలో మాన
వుని అజ్ఞానం పట్ల ఆయన చూసీ చూడనట్లు ప్రవ
ర్తించాడు. కాని యిప్పుడు ప్రతి ఒక్కణ్ణీ మారు మనస్సు
పొందుమని ఆజ్ఞాపిస్తున్నాడు. 31ప్రపంచంలో ఉన్న
ప్రతీ వ్యక్తిపై న్యాయమైన తీర్పు చెప్పనున్న రోజును
నిర్ణయించాడు. ఎవని ద్వారా తీర్పు చెప్పనున్నాడో
ఆయన్ని నియమించాడు. ఆయన్ని బ్రతికించితాను
చేయనున్న దాన్ని ప్రజలందరికీ ఋజువు చేసాడు."

32చనిపోయిన వారు యేసువలె బ్రతికివస్తారన్న
విషయం విని కొందరు అతణ్ణి హేళన చేసారు. మరి
కొందరు, "ఈ విషయాన్ని గురించి మాకింకా వినాలని
ఉంది" అని అన్నారు. 33పరిస్థితులు యిలా అవటం
వల్ల పౌలు ఆ సభనుండి వెళ్ళిపొయ్యాడు. 34కొందరు
విశ్వాసులై పౌలును అనుసరించారు. వాళ్ళలో అరేయొ
పగు అను సభకు సభ్యత్వం ఉన్న దియొనూసియు
అనేవాడు, దమరి అనే స్త్రీ మొదలగు వాళ్ళున్నారు.

### కొరింథు

18 ఆ తరువాత పౌలు ఏథెన్సు వదిలి కొరింథుకు
వెళ్ళాడు. 2అక్కడ అకుల అనే యూదుణ్ణి
కలుసుకొన్నాడు. ఇతని స్వగ్రామం పొంతు. క్లౌదియ
యూదులందర్ని రోము నగరం వదిలి వెళ్ళమని
ఆజ్ఞాపించటంవలన అకుల ఇటలీ నుండి తన భార్య
ప్రిస్కిల్లతో కలిసి ఈ మధ్య యిక్కడికి వచ్చాడు.
పౌలు వాళ్ళను చూడటానికి వెళ్ళాడు. 3తనలాగే వాళ్ళు
కూడా గుడారాలు చేసి జీవించే వాళ్ళు కనుక వాళ్ళతో
కలిసిఉండి పని చేసాడు. 4ప్రతి విశ్రాంతి రోజూ సమాజ
మందిరాల్లో తర్కించి యూదుల్ని, గ్రీకుల్ని ఒప్పించ
టానికి ప్రయత్నించేవాడు.
5మాసిదోనియ నుండి సీల, తిమోతిలు వచ్చాక
పౌలు తన కాలాన్నంతా బోధించటానికి వినియోగిం
చాడు. యూదుల సమక్షంలో మాట్లాడి, యేసుప్రభువే
క్రీస్తు అని నిరూపించేవాడు. 6కాని యూదులు ఎదురు
తిరిగి అతణ్ణి దూషించారు. పౌలు తన నిరసనను వ్యక్త
పరుస్తూ తన దుస్తుల్ని దులిపి, "మీరు పొందనున్న
శిక్షకు మీరే బాధ్యులు, నేను బాధ్యుణ్ణి కాదు. ఇక
మీదట నేను యూదులు కాని వాళ్ళ దగ్గరకు వెళ్తాను"
అని అన్నాడు. 7పౌలు సమాజమందిరాన్ని వదిలి ప్రక్క
నున్న తీతియు యూస్తు అనే విశ్వాసి యింటికి
వెళ్ళాడు. 8యూదుల సమాజమందిరంపై అధికారిగా
పని చేస్తున్న క్రిస్పు అనే వ్యక్తీ అతని యింట్లోని
వాళ్ళు ప్రభువును విశ్వసించారు. చాలా మంది కొరింథు
ప్రజలు పౌలు చెప్పిన వాటిని విని ప్రభువును విశ్వసించి
బాప్తిస్మము పొందారు.
9-10ఒక నాటి రాత్రి ప్రభువు పౌలుకు కలలో కని
పించి, "ఈ పట్టణంలో నా ప్రజలు చాలా మంది
ఉన్నారు. కనుక మౌనం వహించక ధైర్యంగా బోధించు.
నేను నీ వెంటే ఉన్నాను. ఎవ్వరూ నీకు ఎదురు
తిరగ లేరు. ఏ హానీ చెయ్యలేరు" అని అన్నాడు.
11పౌలు ఒకటిన్నర సంవత్సరాలు అక్కడుండి దైవ
సందేశాన్ని వాళ్ళకు బోధించాడు.
12గల్లియో అనే పేరుగల ఒక వ్యక్తి అకయ ప్రాంతా
నికి సామంత రాజుగా ఉండేవాడు. అతని కాలంలో
యూదులందరూ కలిసి పౌలుకు ఎదురు తిరిగారు.
అతణ్ణి న్యాయస్థానం ముందుకు తెచ్చి, 13"ఇతడు
మనశాస్త్రానికి విరుద్ధమైన పద్ధతిలో దేవుణ్ణి పూజించు
మని ప్రజల్ని ఒత్తిడి చేస్తున్నాడు" అని అతణ్ణి నిందిం
చారు. 14పౌలు సమాధానం చెప్పటానికి సిద్ధం
అయ్యాడు. ఇంతలో గల్లియో యూదులతో, "మీరు
ఘోరమైన నేరాన్ని గురించి కాని, లేక చెడు నడతను
గురించి కాని చెప్పదలిస్తే నేను మీ విన్నపం వినటం
సమంజసంగా ఉంటుంది. 15కాని మీ ఆరోపణ పదాలను
గురించి, పేర్లను గురించి, మీ శాస్త్రాల్ని గురించి కాబట్టి
మీలో మీరు తీర్మానం చేసుకోండి. 16అలాంటి వాటిపై
నేను తీర్పు చెప్పను" అని అంటూ వాళ్ళను న్యాయ
స్థానం నుండి తరిమి వేసాడు.
17వాళ్ళు యూదుల సమాజమందిరానికి పెద్ద
అయినటువంటి సోస్తెనేసును పట్టకొని అతణ్ణి న్యాయ
స్థానం ముందుకొట్టారు. అయినా గల్లియో తనకు
సంబంధం లేనట్టు వూరుకొన్నాడు.

### అంతియొకయకు తిరిగి వెళ్ళటం

18పౌలు కొరింథులో కొంతకాలం ఉన్నాడు. ఆ
తర్వాత అక్కడున్న సోదరుల్ని వదిలి, ప్రిస్కిల్లను,
అకులను తన వెంట పిలుచుకొని ఓడలో సిరియ
దేశానికి ప్రయాణమయ్యాడు. ప్రయాణానికిముందు
తాను మ్రొక్కుబడి తీర్చుకోవటానికి కెంక్రేయలో తన
వెంట్రుకలు కత్తిరించు కున్నాడు. 19వాళ్ళు ఎఫెసు
చేరుకున్నారు. అక్కడ పౌలు ప్రిస్కిల్లను వదిలి తానొ
క్కడే సమాజమందిరానికి వెళ్ళి యూదులతో తర్కిం
చాడు. 20వాళ్ళు అతణ్ణి తమతో మరికొన్ని రోజులుం
డుమని అడిగారు. అతడు వీల్లేదన్నాడు. 21కాని వెళ్ళే
ముందు, "దేవుని చిత్తమైతే మళ్ళీ వస్తాను" అని
వాళ్ళతో చెప్పి అక్కడినుండి ఓడలో ప్రయాణం
చేసాడు.
22అతడు కైసరియ తీరాన్ని చేరుకొని అక్కడి
నుండి యెరూషలేము వెళ్ళాడు. అక్కడున్న సంఘానికి
శుభాకాంక్షలు తెలిపి అక్కడినుండి అంతియొకయకు
వెళ్ళాడు. 23అంతియొకయలో కొద్ది రోజులు గడిపి
అక్కడినుండి ప్రయాణమై గలతియ, ఫ్రుగియ
ప్రాంతాల్లో పర్యటన చేసి, ఆయా ప్రాంతాల్లో ఉన్న
విశ్వాసుల్లో విశ్వాసం అభివృద్ధి చెందేటట్లు చేసాడు.

### అపొల్లో ఎఫెసులో

24ఇది యిలా ఉండగా అపొల్లో అనే యూదుడు
ఎఫెసు పట్టణానికి వెళ్ళాడు. అపొల్లో స్వగ్రామం అలె
క్సంద్రియ. ఇతడు గొప్ప పండితుడు. యూదుల
శాస్త్రాల్లో ఆరితేరినవాడు. 25ప్రభువు మార్గాన్ని గురించి
ఉపదేశం పొందినవాడు. యేసును గురించి సక్రమంగా
గొప్ప ఉత్సాహంతో బోధించాడు. కాని బాప్తిస్మము
విషయంలో అతనికి యోహాను బోధించిన విషయాలు
మాత్రమే తెలుసు. 26అతడు యూదుల సమాజ మంది

రంలో ధైర్యంగా మాట్లాడటం మొదలు పెట్టాడు.
ప్రిస్కిల్ల, అకుల యితని బోధన విని అతణ్ణి తమ
యింటికి పిలిచి దైవ మార్గాన్ని గురించి అతనికి యింకా
విశదంగా చెప్పారు. 27అపొల్లో అకయ ప్రాంతానికి
వెళ్ళాలనుకొన్నాడు. సోదరులు అతని ఉద్దేశాన్ని బల
పరిచారు. అకయ ప్రాంతాల్లో ఉన్న శిష్యులకు ఉత్తరం
వ్రాసి యితనికి స్వాగతం చెప్పుమని అడిగారు. అతడు
వెళ్ళి, దైవానుగ్రహంవల్ల యేసును విశ్వసించిన
వాళ్ళకు చాలా సహాయం చేసాడు. 28ప్రజలందరి
ముందు యూదులతో తీవ్రమైన వాద వివాదాలు చేసి,
వాళ్ళను ఓడించి శాస్త్రాల ద్వారా యేసుప్రభువే క్రీస్తు
అని రుజువు చేసాడు.

19 అపొల్లో యింకా కొరింథులోనే ఉన్నాడు.
పౌలు భూమార్గం ద్వారా ప్రయాణం చేసి
ఎఫెసు చేరుకున్నాడు. అక్కడ కొంత మంది శిష్యుల్ని
కలుసుకొని 2వాళ్ళతో, "మీరు విశ్వసించిన పిదప
పవిత్రాత్మను పొందారా?" అని అడిగాడు.
వాళ్ళు, "లేదండి! పవిత్రాత్మ ఉన్నాడనేది కూడా
మేము వినలేదు" అని సమాధానం చెప్పారు.
3పౌలు, "మీరు ఎలాంటి బాప్తిస్మం పొందారు?"
అని అడిగాడు.
"యోహాను బాప్తిస్మం" అని వాళ్ళు చెప్పారు.
4పౌలు, "యోహాను మారుమనస్సుకు సంబంధిం
చిన బాప్తిస్మము నిచ్చాడు. అతడు, తన తర్వాత
రానున్న వాణ్ణి, అంటే యేసును నమ్ముమని ప్రజలకు
బోధించాడు కదా!" అని అన్నాడు.
5ఇది విన్నాక వాళ్ళు యేసు ప్రభువు పేరిట
బాప్తిస్మము పొందారు. 6పౌలు తన చేతుల్ని వాళ్ళ
తలలపై ఉంచగానే పరిశుద్ధాత్మ వాళ్ళ మీదికి వచ్చాడు.
వాళ్ళంతా తమకు రాని భాషల్లో మాట్లాడారు. దేవుడు
ప్రేరేపించిన సత్యాలు ప్రకటించారు. 7అక్కడ మొత్తం
పన్నెండు మంది ఉన్నారు.
8పౌలు యూదుల సమాజమందిరానికి మూడు
నెలలు వెళ్ళాడు. దేవుని రాజ్యాన్ని గురించి ధైర్యంగా
వాదించి వాళ్ళను ఒప్పించటానికి ప్రయత్నించాడు.
9కాని కొందరు నమ్మలేదు. తమ పట్టు వదులుకో
లేదు. పైగా ప్రభువు చూపిన మార్గాన్ని బహిరంగంగా
దూషించారు. అందువల్ల పౌలు వాళ్ళను వదిలి,
శిష్యుల్ని తన వెంట పిలుచుకు వెళ్ళాడు. అతడు,
తురన్ను ఉపన్యాసశాలలో ప్రతి రోజూ తర్కించేవాడు.
10ఇలా రెండు సంవత్సరాలు గడిచాయి. ఫలితంగా
ఆసియ ప్రాంతాల్లో నివసిస్తున్న యూదులు, గ్రీకులు
అందరూ ప్రభువు సందేశాన్ని విన్నారు.
11దేవుడు పౌలు ద్వారా ఎన్నో మహాత్కార్యాలు
చేసాడు. 12ప్రజలు అతడు తాకిన జేబు రుమాళ్ళను,
తుండు గుడ్డల్ని తీసుకొని జబ్బుతో ఉన్న వాళ్ళ దగ్గ
రకు వెళ్ళే వాళ్ళు. వాటితో వాళ్ళ జబ్బులు నయ
మయ్యేవి. పట్టిన దయ్యాలు వదిలిపొయ్యేవి.
13చుట్టూ ఉన్న ప్రాంతాలలో తిరిగి దయ్యాల్ని
వదిలిస్తున్న కొందరు యూదులు యేసు ప్రభువు
పేరునుపయోగించి దయ్యాలు పట్టిన వాళ్ళకు నయం
చెయ్యటానికి ప్రయత్నించారు. వాళ్ళు, "పౌలు ప్రకటి
స్తున్న యేసు పేరిట ఆజ్ఞాపిస్తున్నాము. బయటకు
రా!" అని అనే వాళ్ళు. 14స్కెవ అనే యూదుల
ప్రధాన యాజకుడు, అతని ఏడుగురు కుమారులు
యిలా చేసే వాళ్ళు. 15ఒకసారి ఆ దయ్యం, "యేసు
ఎవరో నాకు తెలుసు. పౌలు ఎవరో నాకు తెలుసు.
కాని మీరెవరు?" అని అడిగింది.
16ఆ దయ్యం పట్టిన వాడు వాళ్ళ మీద పడి వాళ్ళను
బాగా కొట్టాడు. వాళ్ళు రక్తం కార్చుకుంటూ ఆ యిల్లు
వదిలి దిగంబరంగా పారిపోయారు. 17ఎఫెసులో నివసి
స్తున్న యూదులకు, గ్రీకులకు ఈ విషయం తెలి
సింది. వాళ్ళందరూ భయపడి యేసు ప్రభువు
నామాన్ని చాలా గౌరవించటం మొదలు పెట్టారు. 18ఇది
జరిగాక చాలామంది తాము చేసిన వాటిని బహిరంగంగా
ఒప్పుకోవటం మొదలు పెట్టారు. 19మంత్ర విద్య
నేర్చిన కొందరు తమ గ్రంథాల్ని తెచ్చి అందరి సమ
క్షంలో వాటిని కాల్చి వేసారు. ఆ తదుపరి వాళ్ళు
తాము కాల్చిన గ్రంథాల వెలగట్టి వాటి వెల సుమారు
యాభై వేల ద్రాక్మాలని* నిర్ణయించారు. 20ఈ విధంగా
ప్రభువు సందేశం బాగా వ్యాపించింది. దాని ప్రభావం
అభివృద్ధి చెందుతూ వచ్చింది. 21ఆ సంఘటనలు
జరిగాక పౌలు మాసిదోనియ, అకయ ప్రాంతాల ద్వారా
యెరూషలేము వెళ్ళాలని పరిశుద్ధాత్మ సహాయంతో
నిశ్చయించుకున్నాడు. అక్కడికి వెళ్ళాక రోము నగ
రాన్ని తప్పక దర్శించాలను కున్నాడు. 22తనకు
సహాయం చేసే వాళ్ళలో యిద్దర్ని మాసిదోనియకు
పంపాడు. వాళ్ళ పేర్లు తిమోతి, ఎరస్తు. అతడు ఆసియ
ప్రాంతంలో మరి కొంత కాలం గడిపాడు.

## ఎఫెసులో అల్లర్లు

23ఆ రోజుల్లోనే ప్రభువు చూపిన మార్గాన్ని గురించి
పెద్ద గొడవ జరిగింది 24'దేమేత్రి' అనే ఒక కంసాలి
ఉండేవాడు. ఇతడు అర్తెమి దేవత ఉండే మందిరం
యొక్క ప్రతి రూపాలను వెండితో తయారు చేసి
అమ్మేవాడు. తద్వారా తన క్రింద పని చేసే వాళ్ళకు
చాలినంత పని కల్పించేవాడు. 25తన పనివాళ్ళను,
తనలాంటి వృత్తి చేసే వాళ్ళను సమావేశ పరిచి ఈ
విధంగా అన్నాడు: "అయ్యలారా! మనమీ వ్యాపారంలో
చాలా ధనం గడిస్తున్న విషయం మీకందరికీ తెలుసు.

---

**ద్రాక్మలు** ఒక ద్రాక్మ ఒక రోజు బత్యం. ఇది దేనారాకు
సమానం. దేనారా అనగా సుమారు అర్థ రూపాయి.

26ఈ పౌలు అనే వాడు ఏం చేస్తున్నాడో మీరు చూస్తు
న్నారు. ఇతడిక్కడ ఎఫెసులో, సుమారు ఆసియ
ప్రాంతాలన్నిటిలో మానవుడు సృష్టించిన విగ్రహాలు
దేవుళ్ళు కాదంటూ చాలా మంది ప్రజల్ని నమ్మించి
తప్పు దారి పట్టిస్తున్నాడన్న విషయం మీరు విన్నారు.
27ఈ కారణంగా మన వ్యాపారానికున్న మంచిపేరు
పోయే ప్రమాదం ఉంది. పైగా అర్తెమి మహాదేవి మంది
రాని కున్న విలువ పోతుంది. ఆసియ ప్రాంతాల్లోనే
కాక ప్రపంచమంతా పూజింపబడుతున్న ఆ దేవత
యొక్క గొప్పతనము కూడా నశించి పోతుంది.”

28ఈ మాటలు విన్న వాళ్ళకు చాలా ఉద్రేకం కలి
గింది. వాళ్ళు బిగ్గరగా, “ఎఫెసు ప్రజల అర్తెమి దేవత
గొప్పది!” అని నినాదం చెయ్యటం మొదలు పెట్టారు.

29ఈ అలజడి ఆ పట్టణమంతా వ్యాపించి
పోయింది. మాసిదోనియకు చెందిన ‘గాయియు,
అరిస్తర్కు’ అనే యిద్దరు వ్యక్తులు పౌలు వెంట ఉన్నారు.
ప్రజలు వీళ్ళను బంధించి త్రోసుకొంటూ ఒక్క
గుంపుగా పెద్ద నాటక శాలలోకి ప్రవేశించారు. 30పౌలు
ప్రజల ముందుకు రావాలనుకొన్నాడు. కాని అనుచరు
లతన్ని వెళ్ళనివ్వలేదు. 31పౌలు స్నేహితులు కొందరు
ఆ ప్రాంతాలకు పాలకులుగా ఉండే వాళ్ళు. నాటక
శాలలోకి వెళ్ళ వద్దని వేడుకుంటూ వీళ్లు పౌలుకు ఒక
ఉత్తరం పంపారు.

32ఆ సభ అంతా గందరగోళంగా ఉంది. కొందరు
యిదని, కొందరు అదని బిగ్గరగా కేకలు వేసారు. కొంద
రికి తప్ప మిగతా వాళ్ళకెవ్వరికీ తామక్కడికి ఎందుకు
వచ్చిందీ తెలియదు.

33యూదులు అలెక్సంద్రును ముందుకు త్రోసారు.
కొందరు కేకలు వేస్తూ అతనికి ఏదో సలహా యిచ్చారు.
అతడందర్నీ శాంతంగా ఉండుమని సంజ్ఞ చేసి సమాధా
నంగా ఏదో చెప్పబోయాడు. 34అతడు కూడా ఒక
యూదుడని తెలుసుకొన్నాక వాళ్ళంతా రెండు గంటల
సేపు ఒకే గొంతుతో, “ఎఫెసు ప్రజల అర్తెమి దేవత
చాలా గొప్పది” అని నినాదం చేసారు.

35ఆ గ్రామాధికారి ప్రజల్ని శాంత పరుస్తూ యిలా
అన్నాడు: “ఎఫెసు ప్రజలారా! మహా దేవత అర్తెమి
యొక్క మందిరాన్ని, స్వర్గంనుండి పడిన శిలా విగ్ర
హాన్ని చూసుకొనే బాధ్యత ఎఫెసు పట్టణంపై ఉంది.
ఇది ప్రపంచానికంతా తెలుసు. 36దీన్ని ఎవరూ కాదన
లేరు. కనుక మీరు ఆలోచించకుండా తొందర పడి
ఏదీ చెయ్యకండి. శాంతంగా ఉండండి! 37వీళ్ళు మన
మందిరాన్ని దోచుకోలేదు. మన దేవతను దూషించ
లేదు. అయినా మీరు వీళ్ళనిక్కడికి పట్టుకొని వచ్చారు.
38దేమేత్రికి లేక అతనితో కలిసి పనిచేసే వాళ్ళకు
వాళ్ళపై నేరం మోపాలని ఉంటే న్యాయస్థానాలు తెరిచి
ఉన్నాయి. వాళ్ళ వాద వివాదాలు వినటానికి న్యాయధి
పతులున్నారు. 39మీరింకేదైనా చెప్పుకోవాలనుకొంటే
చట్ట ప్రకారం జరిగే ప్రజా సమావేశాల్లో చెప్పుకోండి.
40ఈనాడు జరిగిన సంఘటనవల్ల మనం తిరుగుబాటు
చేసామని అధికారులు మనపై నేరం మోపే ప్రమాదం
వుంది. అది జరిగితే ఈ అలజడికి ఏ కారణం లేదు
కనుక మనం ఏ సమాధానమూ చెప్పలేము.” 41ఇలా
చెప్పి అందర్నీ అక్కడినుండి వెళ్ళమన్నాడు.

20 అల్లర్లు తగ్గిపొయ్యాక, పౌలు యేసు శిష్యుల్ని
పిలిచాడు. వాళ్ళను ఆత్మీయంగా ప్రోత్సాహ
పరిచి, వాళ్ళనుండి సెలవు తీసుకొన్నాడు. ఆ తర్వాత
మాసిదోనియకు వెళ్ళాడు. 2ఆ ప్రాంతాన పర్యటన
చేసి ఆత్మీయంగా ఉత్సాహపరిచే ఎన్నో విషయాలు
ప్రజలకు చెప్పి చివరకు గ్రీసు దేశం చేరుకున్నాడు.
3అక్కడ మూడు నెలలున్నాడు. అక్కడినుండి సిరియ
దేశానికి ఓడలో ప్రయాణం చేయ్యాలనుకొని సిద్ధ
మయ్యాడు. ఇంతలో యూదులు తనను చంపాలని
అనుకొంటున్నారని అతనికి తెలిసింది. అందువలన
అతడు తిరిగి మాసిదోనియకు వెళ్ళి అక్కడినుండి
ప్రయాణం చేసాడు. 4అతని వెంట ఉన్న వాళ్ళు ఎవ
రనగా: బెరయ పట్టణంనుండి పుర్రు కుమారుడైన
సోపత్రు, థెస్సలొనీక పట్టణం నుండి అరిస్తర్కు,
సెకుందు, దెర్బే పట్టణం నుండి గాయియు, తిమోతి,
ఆసియ నుండి తుకికును, త్రోఫిము. 5వీళ్ళు ముందే
వెళ్ళి మా కోసం త్రోయలో కాచుకొని ఉన్నారు.
6కాని మేము ఫిలిప్పీనుండి ప్రత్యేకమైన పులియని
రొట్టెల పండుగ తర్వాత ఓడలో ప్రయాణ
మయ్యాము. అయిదు రోజులు ప్రయాణం చేసాక
త్రోయలో వాళ్ళను కలుసు కున్నాము. అక్కడ ఏడు
రోజులు ఉన్నాము.

7ఆదివారం రోజున అంతా కలిసి రొట్టె విరుచుటకు
సమావేశమయ్యాము. పౌలు మరుసటి రోజు
ప్రయాణం చేయాలని అనుకోవటం వలన అర్ధరాత్రి
దాకా ప్రజలతో మాట్లాడాడు. 8మేము మేడపైనున్న
గదిలో సమావేశమయ్యాము. మాగదిలో చాలా దీపాలు
వెలుగుతూ ఉన్నాయి. 9ఆ గది కిటికీలో ఐతుకు
అనే యువకుడు కూర్చొని ఉన్నాడు. పౌలు ఏకధాటిగా
మాట్లాడుతూ ఉన్నాడు. ఇంతలో ఐతుకుకు నిద్ర
వచ్చి గాఢంగా నిద్రపొయ్యాడు. ఆ నిద్రలో మూడవ
అంతస్తు నుండి క్రింద పడ్డాడు. కొంత మంది వచ్చి
చనిపోయిన అతణ్ణి చూసారు. 10పౌలు క్రిందికి వెళ్ళి
ఆ యువకుని ప్రక్కన ఒరిగి అతణ్ణి తన చేతుల్తో
ఎత్తి, “దిగులు పడకండి, ప్రాణం ఉంది” అని అన్నాడు.
11అతడు మళ్ళీ మేడ మీదికి వెళ్ళి రొట్టె విరిచి
సోదరులకు పంచి తాను తిన్నాడు. తెల్లవారే దాకా
వాళ్ళతో మాట్లాడి వెళ్ళిపొయ్యాడు. 12ప్రజలు బ్రతి
కింపబడిన ఆ యువకుణ్ణి అతని యింటికి పిలుచుకు
వెళ్ళారు. ఆ తర్వాత వాళ్ళ మనస్సులు ఎంతో నెమ్మది
పడ్డాయి.

13మేము పౌలును వదిలి ఓడనెక్కి ‘అస్సు’కు
వెళ్ళాము. తాను కాలి నడకన అస్సుకు చేరుకొని
మమ్మల్ని అక్కడ కలుసుకొంటానని చెప్పాడు. అక్కడి
నుండి మాతో కలిసి ఓడలో ప్రయాణం చెయ్యాలని
అతని ఉద్దేశ్యం. 14మేము అతణ్ణి అస్సులో కలుసు
కొన్నాక అతడు మా ఓడనెక్కాడు. అంతా కలిసి ‘మితు
లేనే’ వెళ్ళాము. 15మితులేనే నుండి మరుసటి రోజు
ఓడలో మళ్ళీ ప్రయాణం సాగించి, ‘కీయొసు’ ద్వీపం
కొంత దూరం ఉందనగానే లంగరు వేసాము. ఆ మరు
సటి రోజు ప్రయాణం చేసి ‘సమొసు’ ద్వీపానికి దగ్గ
రగా వచ్చాము. మరొక రోజు ప్రయాణం చేసాక
‘మిలేతు’ చేరుకున్నాము. 16పౌలు యెరూషలేము
త్వరగా వెళ్ళాలని అనుకొన్నాడు. ఆసియ ప్రాంతంలో
కాలాన్ని వ్యర్థం చెయ్యటం యిష్టం లేక ఎఫెసులో
ఆగకుండా వెళ్ళాడు. వీలైతే పెంతెకొస్తు పండుగనాటికి
యెరూషలేంలో ఉండాలని అనుకొన్నాడు.

17పౌలు కొందర్ని మిలేతునుండి ఎఫెసుకు పంపి
అక్కడున్న సంఘ పెద్దల్ని పిలిపించాడు. 18వాళ్ళు
వచ్చాక వాళ్ళతో యిలా చెప్పాడు: “నేను ఆసియలో
అడుగు పెట్టిన నాటినుండి మీతో ఉన్నన్ని రోజులు
ఏ విధంగా జీవించానో మీకు తెలుసు. 19యూదుల
పన్నాగాలవల్ల నాకు ఎన్నో కష్టాలు, దుఃఖాలు సంభ
వించాయి. అయినా ప్రభువు సేవ సంపూర్ణమైన విశ్వా
సంతో చేసాను. 20ఆత్మీయ విషయాల్లో మీకు
దోహదమయ్యే ప్రతీ విషయాన్ని దాచకుండా,
బహిరంగంగా ప్రకటించటమే కాకుండా యింటింటికీ
వెళ్లి బోధించానని మీకు తెలుసు. 21మారు మనస్సు
పొంది, దేవుని కోసం జీవించుమని, మన యేసు
ప్రభువును నమ్ముమని యూదులకు, గ్రీకులకు
చెప్పాను. 22పరిశుద్ధాత్మ చెప్పినట్లు చెయ్యాలనే ఉద్దే
శ్యంతో నేను యెరూషలేము వెళ్తున్నాను. అక్కడేం
జరుగుతుందో నాకు తెలియదు. 23నేను కష్టాలు, కారా
గారాలు ఎదుర్కొంటానని పరిశుద్ధాత్మ నన్ను ప్రతి
పట్టణంలో ముందే వారించాడు. ఇది మాత్రం నాకు
తెలుసు. 24నా జీవితాన్ని నేను లెక్కచెయ్యను. కాని
ఈ పరుగు పందెం ముగించి యేసు ప్రభువు చెప్పిన
ఈ కార్యాన్ని పూర్తి చేస్తే చాలు. దేవుని అనుగ్రహాన్ని
గురించి చెప్పే సువార్తను ప్రకటించటమే నా కర్తవ్యం.

25“మళ్ళీ మిమ్మల్ని చూడటం వీలు పడదని నాకు
తెలుసు. నేను మీతో ఉండి దేవుని రాజ్యాన్ని గురించి
ప్రకటించాను. 26అందువల్ల ఈ రోజు నేనిది ఖచ్చితంగా
చెప్పగలను. మీలో ఎవరైనా ఆత్మీయంగా మరణిస్తే
దానికి నేను బాధ్యుణ్ణి కాను. 27ఎందుకంటే, నేను
దేవుడు చెయ్యదలచిన దాన్ని సంపూర్ణంగా కొంచెం
కూడా సంకోచించకుండా ప్రకటించాను. 28పరిశు
ద్ధాత్మ మిమ్మల్ని సంఘానికి కాపరులుగా నియమిం
చాడు. ఆ దేవుని సంఘానికి మీరు గొర్రెల కాపరుల్లా
ఉండాలి. ఆయన తన సంఘమును తన స్వంత
రక్తంతో సంపాదించాడు. మీ విషయంలో, ఈ సంఘ
విషయంలో జాగ్రత్తగా ఉండండి. 29నేను వెళ్ళి
పొయ్యాక భయంకరమైన తోడేళ్ళు మీ మందలోకి
వచ్చి హాని కలిగిస్తాయని నాకు తెలుసు. 30మీలోనుండి
కూడా కొందరు ముందుకు వచ్చి మీతో ఉన్న అను
చరుల్ని దొంగిలించాలని అబద్ధాలాడుతారు. 31అందుకే
జాగ్రత్తగా ఉండండి. నేను మూడు సంవత్సరాలు మీతో
ఉన్నాను. కంట తడి పెట్టుకొని రాత్రింబగళ్ళు మీలో
ఉన్న ప్రతి ఒక్కర్నీ వారించాను. ఈ విషయం మరిచి
పోకండి.

32“ఇప్పుడు మిమ్మల్ని దేవునికి, ఆయన అను
గ్రహాన్ని గురించి బోధించే సందేశానికి అప్పగిస్తున్నాను.
ఆ సందేశంలో మిమ్మల్ని ఆత్మీయంగా అభివృద్ధి
పరచగల శక్తి ఉంది. అంతేకాక అది పరిశుద్ధమైన దేవుని
విశ్వాసులకు లభించిన వారసత్వం మీక్కూడా లభించే
టట్లు చేస్తుంది. 33మీ నుండి నేను వెండి బంగారాలు
కాని, మంచి దుస్తులు కాని ఆశించలేదు. 34నేను నా
చేతుల్తో పని చేసి, నా అవసరాలు, నాతో ఉన్న
వాళ్ళ అవసరాలు తీర్చుకొన్నానని మీకు తెలుసు.
35కష్టించి పని చేసి దిక్కులేని వాళ్ళకు సహాయం
చెయ్యటం ఉత్తమమని మీకు అన్ని విధాలా తెలియ
చేసాను. యేసు ప్రభువు, ‘తీసుకోవటంలో కన్నా
యివ్వటంలో చాలా దీవెన ఉంది!’ అని అన్నాడు.
ఈ మాటలు జ్ఞాపకం ఉంచుకోవటం అవసరమని
మీకు ఋజువు చేసాను.”

36ఈ విధంగా చెప్పి, అతడు తన మోకాళ్ళూని
అందరితో కలిసి ప్రార్థించాడు. 37ఆ తర్వాత అందరూ
కంట తడిపెట్టుకొని అతనికి ప్రేమతో వీడ్కోలు
యిచ్చారు. 38‘మిమ్మల్ని మళ్ళీ చూడటం వీలుపడదు’
అని అతడన్న మాటలు వాళ్ళకు చాలా దుఃఖం కలి
గించాయి. ఆ తదుపరి వాళ్ళతనితో ఓడవరకు
వెళ్ళారు.

## యెరూషలేముకు ప్రయాణం

21 మేము సెలవు పుచ్చుకొని నేరుగా ‘కోసు’కు
ఓడలో ప్రయాణం చేసాము. మరుసటి రోజు
‘రొదు’ చేరుకున్నాము. అక్కడినుండి బయలుదేరి
‘పతర’ చేరుకున్నాము. 2ఒక ఓడ ఫొనీషియ వెళ్ళటం
గమనించి అందులో ప్రయాణం చేసాము. 3సైప్రసు
ద్వీపం కనపడ్డాక ఆ ద్వీపానికి దక్షిణంగా వెళ్ళి సిరియ
దేశం చేరుకున్నాం. మా ఓడ సరుకు దింపవలసి
ఉంది కనుక తూరుద్వీపంలో ఆగాము. 4అక్కడ భక్తు
లుండటం గమనించి వాళ్ళతో ఏడు రోజులున్నాము.
వాళ్ళు పరిశుద్ధాత్మ శక్తి ద్వారా యెరూషలేము వెళ్ళ
వద్దని పౌలుతో చెప్పారు. కాని వెళ్ళవలసిన సమయం
రాగానే ప్రయాణమై మా దారిన మేము వెళ్ళాము.

5విశ్వాసులు, తమ భార్యా బిడ్డలతో కలిసి మా వెంట
ఊరి అవతలి వరకు వచ్చారు. సముద్ర తీరం చేరు
కున్నాక, అందరమూ మోకరిల్లి ప్రార్థించాము. 6పర
స్పరం వీడ్కోలు చెప్పుకున్నాక మేము ఓడనెక్కాము.
వాళ్ళు తమ తమ యిండ్లకు తిరిగి వెళ్ళిపోయారు.
7మేము తూరు నుండి మా ప్రయాణం సాగించి
తొలెమాయి తీరం చేరుకున్నాము. అక్కడున్న సోద
రుల్ని కలుసుకొని వాళ్ళతో ఒక రోజు గడిపాము.
8మరుసటి రోజు ప్రయాణమై కైసరియ చేరు
కున్నాము. అక్కడ సువార్త ప్రచారం చేస్తున్న ఫిలిప్పు
అనే వ్యక్తి యింట్లో బసచేసాము. అతడు యెరూష
లేములో ఎన్నుకోబడ్డ ఏడుగురిలో ఒకడు. 9అతనికి
నలుగురు పెళ్ళికాని కూతుర్లు ఉన్నారు. వాళ్ళు దైవే
చ్ఛను చెప్పటంలో ప్రతిభావంతులు. 10అక్కడ మేము
చాలా రోజులున్నాక, అగబు అనే ప్రవక్త యూదయ
నుండి వచ్చాడు. 11అతడు మా దగ్గరకు వచ్చి, పౌలు
నడికట్టు తీసుకొని దాంతో తన కాళ్ళు చేతులు కట్టి
వేసుకొని ఈ విధంగా అన్నాడు: "ఈ నడికట్టు
ఎవరిదో, అతణ్ణి యెరూషలేములో యూదులు ఈ
విధంగా కట్టేసి యూదులుకాని వాళ్ళకు అప్పగిస్తారు
అని పరిశుద్ధాత్మ చెపుతున్నాడు."
12ఇది విని అక్కడి ప్రజలు, మేము కలిసి పౌలును
యెరూషలేము వెళ్ళవద్దని బ్రతిమిలాడాము. 13పౌలు,
"మీరు దుఃఖించి నా గుండెలెందుకు పగుల గొడ్తు
న్నారు? యేసుప్రభువు పేరిట బంధింప బడటానికే
కాదు, మరణించటానికి కూడా నేను సిద్ధంగా
ఉన్నాను!" అని సమాధానం చెప్పాడు. 14మేము అతని
మనస్సు మార్చలేమని తెలుసుకొన్నాక, "ప్రభువు ఇచ్ఛ
ఏ విధంగా ఉంటే ఆ విధంగా జరుగుతుంది," అనుకొని
మేమేమీ మాట్లాడలేదు.
15ఆ తర్వాత అంతా సిద్ధమై యెరూషలేము
వెళ్ళాము. 16కైసరియ నుండి కొందరు శిష్యులు మా
వెంట వచ్చి మమ్మల్ని 'మ్నాసోను' అనే అతని
యింటికి పిలుచుకు వెళ్ళారు. అక్కడ మా బస.
మ్నాసోను, సైప్రసు ద్వీపానికి చెందినవాడు. మొదట్లో
విశ్వాసులైన వాళ్ళలో ఇతడు ఒకడు.

## పెద్దల్ని కలుసుకోవటం

17మేము యెరూషలేము వచ్చాము. అక్కడి సోద
రులు మాకు మనసారా స్వాగతమిచ్చారు. 18మరుసటి
రోజు మేము పౌలుతో కలిసి యాకోబును చూడాలని
వెళ్ళాము. అక్కడ సంఘ పెద్దలందరూ ఉన్నారు.
19పౌలు వాళ్ళను కుశల ప్రశ్నలు అడిగి తాను చేసిన
కార్యాలవల్ల దేవుడు యూదులు కాని వాళ్ళతో చేసిన
వాటినన్నిటిని ఒక్కొక్కటి విడమరిచి చెప్పాడు.
20వాళ్ళా మాటలు విని దేవుణ్ణి స్తుతించారు. ఆ తర్వాత
పౌలుతో, "సోదరుడా! వేలకొలది యూదులు విశ్వాసు
లవటం నీవు చూస్తున్నావు. మోషే ధర్మశాస్త్రాన్ని
పాటించటం ముఖ్యమని వాళ్ళ అభిప్రాయం. 21కాని
నీవు మోషే ధర్మశాస్త్రాన్ని వదులమని, కుమారులకు
సున్నతి చేయించటం తప్పని యూదుల ఆచారాలను
పాటించవద్దని యూదులుకాని వాళ్ళ మధ్య నివసిస్తున్న
యూదులకు బోధించినట్లు వీళ్ళకు ఎవరో చెప్పారు.
22ఏం చెయ్యాలి? నీవు వచ్చిన విషయం వాళ్ళకు
తప్పక తెలుస్తుంది. 23అందువల్ల మేము చెప్పినట్లు
చెయ్యి. మా దగ్గర మ్రొక్కుబడి ఉన్న వాళ్ళు నలుగురు
న్నారు. 24వీళ్ళను నీ వెంట పిలుచుకెళ్ళు. వాళ్ళతో
కలిసి శుద్ధీకరణ చేయి. వాళ్ళు తల వెంట్రుకలు తీయిం
చుకోవటానికి అయ్యే డబ్బు చెల్లించు. అలా చేస్తే నీ
గురించి విన్నవి నిజం కాదని అందరికీ రుజువౌతుంది.
మోషే ధర్మశాస్త్రాన్ని పాటిస్తూ జీవిస్తున్నావని వాళ్ళకు
తెలుస్తుంది. 25ఇక యూదులు కాని భక్తుల విషయంలో
మేమిదివరకే మా అభిప్రాయం తెలియచేసాము. వాళ్ళు
ఈ నియమాన్ని మాత్రం పాటిస్తే చాలని ఇదివరకే
వాళ్ళకు వ్రాసి పంపాము:

'విగ్రహాలకు పెట్టిన నైవేద్యం ముట్టరాదు.
రక్తాన్ని, గొంతునులిపి చంపిన జంతువుల
మాంసాన్ని తినరాదు. పరస్త్రీని కోరరాదు'"
అని అన్నారు.

26మరుసటి రోజు పౌలు వాళ్ళను పిలుచుకెళ్ళి
వాళ్ళతో సహా శుద్ధి చేసుకొన్నాడు. ఆ తదుపరి యెరూ
షలేము మందిరానికి వెళ్ళి పూర్తిగా శుద్ధి కావటానికి
ఎన్ని రోజులు వేచివుండాలో ప్రకటించాడు. చివరి
రోజున తనతో వచ్చిన ప్రతి ఒక్కరి పక్షాన బలి ఇవ్వ
వచ్చని చెప్పాడు.

## పౌలు బంధింపబడటం

27-28ఏడు రోజులు పూర్తిగా గడవక ముందే ఆసియ
ప్రాంతం నుండి వచ్చిన కొందరు యూదులు పౌలును
మందిరంలో చూసారు. వాళ్ళు ప్రజల్ని పురికొలిపి
పౌలును బంధించారు. ప్రజలతో, "ఇశ్రాయేలు ప్రజ
లారా! మాతో సహకరించండి. ఇతడు అన్ని ప్రాంతాలు
తిరిగి ఇశ్రాయేలు ప్రజల్ని గురించి, మోషే ధర్మ
శాస్త్రాన్ని గురించి యెరూషలేములోని మందిరాన్ని
గురించి విరుద్ధంగా అందరికీ బోధించాడు. ఇప్పుడు
గ్రీకుల్ని కొందర్ని మందిరంలోకి పిలుచుకొని వెళ్లి,
ఈ పవిత్ర స్థానాన్ని అపవిత్రం చేసాడు" అని బిగ్గరగా
అన్నారు. 29ప్రజలు ఎఫెసుకు చెందిన త్రోఫిమును
పౌలుతో కలిసి పట్టణంలో తిరగటం చూసారు. కనుక
పౌలు అతణ్ణి మందిరంలోకి పిలుచుకెళ్ళాడను
కున్నారు.

30పట్టణమంతా అల్లర్లు వ్యాపించాయి. ప్రజలు అన్ని
వైపులనుండి పరుగెత్తికొంటూ వచ్చారు. పౌలును పట్టు
కొని మందిరం అవతలికి లాగి వెంటనే మందిరం
యొక్క తలుపులు మూసి వేసారు. 31వాళ్ళు, అతణ్ణి
చంపే ప్రయత్నంలో ఉన్నారు. యెరూషలేమంతా
అల్లర్లతో నిండిపోయిందనే వార్త సైన్యాధిపతికి పంప
బడింది. 32ఆ సైన్యాధిపతి వెంటనే, కొందరు సైని
కుల్నీ, సైన్యాధిపతుల్నీ తన వెంట బెట్టుకొని ప్రజలు
గుమి కూడిన చోటికి వెళ్ళాడు. వాళ్ళు సైన్యాధిపతిని,
సైనికుల్నీ చూసి, పౌలును కొట్టడం మానివేసారు.
33సైన్యాధిపతి అతని దగ్గరకు వెళ్ళి, అతణ్ణి పట్టుకొని
యినుప గొలుసులతో కట్టి వేయుమని ఆజ్ఞాపిస్తూ
సైనికులకు అప్పగించాడు. “అతడెవరు? ఏం
చేసాడు?” అని తదుపరి ప్రజల్ని విచారించాడు.
34ప్రజలు బిగ్గరగా కేకలు వేస్తూ, ఒకరొకటి,
మరొకరు మరొకటి చెప్పారు. అల్లరిగా ఉండటం వల్ల
సైన్యాధిపతికి జరిగిందేమిటో తెలియలేదు. పౌలును
కోటలోకి తీసుకు వెళ్ళుమని ఆజ్ఞాపించాడు. 35పౌలు
మెట్లు ఎక్కుతుండగా ప్రజలు చాలా అల్లరి చేసారు.
అందువల్ల సైనికులు పౌలును మోసికొని కోటలోకి
తీసుకు వెళ్ళారు. 36ప్రజలు అతణ్ణి వెంటాడుతూ,
“అతణ్ణి చంపాలి!” అని బిగ్గరగా నినాదం చేసారు.

### ప్రజలతో మాట్లాడటం

37సైనికులు పౌలును కోటలోకి తీసుకు వెళ్ళే
ముందు, అతడు సైన్యాధిపతితో, “నేను మీతో కొద్దిగా
మాట్లాడవచ్చా?” అని అడిగాడు.
సైన్యాధిపతి, “నీవు గ్రీకు భాష మాట్లాడుతున్నావే!
38క్రితంలో ప్రభుత్వాన్ని ధిక్కరించి నాలుగు వేల మంది
హంతకుల్ని ఎడారుల్లోకి పిలుచుకు వెళ్ళిన ఈజిప్టు
దేశపువాడవు నీవే కదూ?” అని అడిగాడు.
39పౌలు, “నేను యూదుణ్ణి, కిలికియ దేశంలోని
తార్సు అనే ముఖ్య పట్టణానికి చెందిన పౌరుణ్ణి. నన్ను
ప్రజలతో మాట్లాడ నివ్వండి!” అని అడిగాడు.
40సైన్యాధిపతి సరేనన్నాడు. పౌలు మెట్ల మీద
నిలబడి చేతులెత్తి శాంతించమని ప్రజల్ని కోరాడు.
అందరూ శాంతించాక ‘హెబ్రీ’ భాషలో ఈ విధంగా
మాట్లాడాడు:

22 “పెద్దలారా! సోదరులారా! నా సమాధానం
వినండి,” 2అతడు హెబ్రీ భాషలో మాట్లా
డటం విని వాళ్ళు మరింత నిశ్శబ్దం వహించారు. 3పౌలు
ఈ విధంగా చెప్పుకొంటూ పొయ్యాడు: “నేను
యూదుణ్ణి, కిలికియ దేశంలోని తార్సు అనే పట్టణంలో
జన్మించాను. ఈ పట్టణంలో పెరిగాను. మన పూర్వులు
అప్పగించిన ధర్మశాస్త్రంలో గమలీయేలు వద్ద సంపూ
ర్ణంగా శిక్షణ పొందాను. మీరు ఈనాడు దేవుని పట్ల ఏ
పద్ధతినసరించి మీ భక్తిని ప్రదర్శిస్తున్నారో అదే
పద్ధతిలో నేనూ ప్రదర్శిస్తూ ఉండేవాణ్ణి. 4నేను యేసు
మార్గాన్ని అనుసరించిన వాళ్ళను ఎన్నో హింసలు
పెట్టాను. తద్వారా కొందరికి మరణం కూడా సంభవిం
చింది. ఆడా, మగా అనే భేదం లేకుండా అందర్నీ
బంధించి కారాగారంలో వేసేవాణ్ణి. 5ప్రధాన యాజ
కుడు, మహా సభకు చెందిన పెద్దలు దీనికి సాక్ష్యం.
వాళ్ళను, డెమాస్కసులోని వాళ్ళ సోదరులకు ఉత్తరాలు
వ్రాసి ఇవ్వమని అడిగి తీసుకొన్నాను. అక్కడికి వెళ్ళి
యేసు మార్గాన్ని అనుసరిస్తున్న వాళ్ళను బంధించి
యెరూషలేమునకు పట్టుకు వచ్చి వాళ్ళకు శిక్ష
ఇవ్వాలనేదే నా ఉద్దేశ్యం.
6“నేను డెమాస్కసుకు వెళ్ళినప్పుడు, ఆ పట్టణపు
పొలిమేరలకు చేరగానే అకస్మాత్తుగా ఆకాశం నుండి
తేజోవంతమైన వెలుగు నా చుట్టూ ప్రకాశించింది.
అప్పుడు మధ్యాహ్నం సుమారు పన్నెండు గంటలు.
7నేను నేల కూలిపొయ్యాను. నాతో ఒక స్వరం,
‘సౌలా! సౌలా! నన్నెందుకు హింసిస్తున్నావు!’ అని
అడిగింది. 8‘మీరెవరు ప్రభూ!’ అని నేనడిగాను. ‘నేను
నజరేతుకు చెందిన యేసును. నీవు హింసిస్తున్నది
నన్నే!’ అని ఆ స్వరం జవాబు చెప్పింది. 9నాతో
ఉన్నవాళ్ళు ఆ వెలుగును చూసారు. కాని ఆ స్వరం
ఏం మాట్లాడుతోందో వాళ్ళకు అర్థంకాలేదు. 10‘నన్నేం
చేయమంటారు ప్రభూ!’ అని నేనడిగాను. ‘లే! లేచి
డెమాస్కసు వెళ్ళు. అక్కడికి వెళ్ళాక నీవు చేయవలసిన
పనులు చెప్పబడుతాయి’ అని ప్రభువు అన్నాడు. 11ఆ
వెలుగు నన్ను గ్రుడ్డివానిగా చెయ్యటంవల్ల నాతో ఉన్న
వాళ్ళు నన్ను నా చేయి పట్టుకొని డెమాస్కసుకు
నడిపించుకు వెళ్ళారు.
12“అననీయ అనే పేరుగల వ్యక్తి నన్ను చూడటానికి
వచ్చాడు. అతడు మోషే ధర్మశాస్త్రాన్ని శ్రద్ధతో
పాటించే విశ్వాసి. అక్కడ నివసిస్తున్న యూదులందరు
అతణ్ణి గౌరవించేవాళ్ళు. అననీయ నా ప్రక్కన నిల్చొని
13‘సౌలా! నా సోదరా! నీకు దృష్టి కలుగుగాక!’ అని
అన్నాడు. తక్షణం నేను చూడ గలిగాను. 14ఆ తదుపరి
అతడు, ‘మన పూర్వీకులు పూజించిన దేవుడు, తాను
చేయదలచిన విషయం తెలుపటానికి, నీతిమంతుడై
నటువంటి తన సేవకుణ్ణి చూడటానికి, ఆయన నోటి
మాటలు వినటానికి, నిన్ను ఎన్నుకొన్నాడు. 15నీవు
చూసిన వాటిని గురించి, విన్న వాటిని గురించి ఆయన
పక్షాన అందరి ముందు సాక్ష్యం చెబుతావు. 16ఇంకా
ఎందుకు చూస్తున్నావు? లే! బాప్తిస్మము పొందు.
ఆయన పేరున ప్రార్థించి నీ పాపాలు కడుక్కో!’ అని
అన్నాడు. 17“నేను యెరూషలేమునకు తిరిగి వచ్చి
మందిరంలో ప్రార్థనలు చేస్తుండగా నాకు దర్శనం
కలిగింది. 18ఆ దర్శనంలో ప్రభువు, ‘త్వరగా లే!
వెంటనే యెరూషలేము వదిలి వెళ్ళిపో! నా గురించి
నీవు చెప్పే సత్యాన్ని వాళ్ళు అంగీకరించరు’ అని

అనటం విన్నాను. 19నేను, ‘ప్రభూ! నేను ప్రతి
యూదుల సమాజమందిరంలోకి వెళ్ళి భక్తుల్ని
బంధించి శిక్షించిన విషయం అందరికీ తెలుసు. 20నీ
సాక్షి స్తెఫను తన రక్తాన్ని చిందించినప్పుడు నేను నా
అంగీకారం చూపుతూ, అతణ్ణి చంపుతున్న వాళ్ళ
దుస్తుల్ని కాపలా కాస్తూ అక్కడే నిలుచొని ఉన్నాను’
అని అన్నాను.
21అప్పుడు ప్రభువు నాతో, ‘వెళ్ళు! నిన్ను
దూరంగా యూదులుకాని వాళ్ళ దగ్గరకు పంపుతాను’
అని అన్నాడు.”
22ప్రజలు, పౌలు చెప్పింది అంతదాకా విన్నారు.
కాని అతడు ఈ మాట అనగానే, బిగ్గరగా, “అతడు
బ్రతకటానికి వీల్లేదు, చంపి పారవేయండి!” అని కేకలు
వేసారు. 23వాళ్ళు తమ దుస్తుల్ని చింపి పారవేస్తూ,
దుమ్ము రేపుతూ కేకలు వేసారు.
24సేనాధిపతి పౌలును కోట లోపలికి తీసుకు
వెళ్ళుమని ఆజ్ఞాపించాడు. ప్రజలు అతణ్ణి చూసి ఎందు
కిలా కేకలు వేస్తున్నారో తెలుసుకోవటానికి పౌలును
కొరడాలతో కొట్టుమని ఆజ్ఞాపించాడు. 25అతణ్ణి కొట్ట
టానికి కట్టి వేస్తుండగా పౌలు అక్కడున్న శతాధిపతి,
“నేరస్తుడని నిర్ణయం కాకముందే రోము పౌరుణ్ణి కొరడా
దెబ్బలు కొట్టటం న్యాయమేనా?” అని అడిగాడు.
26ఇది విన్నాక ఆ సేనాధిపతి, సహస్రాధిపతి దగ్గరకు
వెళ్ళి పౌలు అన్నది చెబుతూ, “మీరేమి చేస్తున్నారో
మీకు తెలుసా? అతడు రోము పౌరుడట!” అని
అన్నాడు.
27ఆ సహస్రాధిపతి పౌలు దగ్గరకు వెళ్ళి, “ఇప్పుడు
చెప్పు! నీవు రోము పౌరుడివా?” అని అడిగాడు.
“ఔను!” పౌలు సమాధానం చెప్పాడు.
28సహస్రాధిపతి, “నేను రోము పౌరుడవటానికి చాలా
డబ్బు యివ్వవలసి వచ్చింది” అని అన్నాడు.
పౌలు, “నేను పుట్టినప్పటి నుండి రోము పౌరుణ్ణి!”
అని అన్నాడు.
29అతణ్ణి ప్రశ్నలడగాలనుకొన్న వాళ్ళు తక్షణమే
వెనుకంజ వేసారు. ఆ సహస్రాధిపతి కూడా తాను
రోము పౌరుణ్ణి బంధించిన విషయం గమనించి భయ
పడి పోయాడు.
30అతడు పౌలుపై యూదులు మోపిన నిందకు
సరియైన కారణం తెలుసుకోవాలను కొన్నాడు. కనుక
మరుసటి రోజు ప్రధాన యాజకుల్ని, మిగతా సభ్యుల్ని
సమావేశం కమ్మని ఆజ్ఞాపించాడు. పౌలును విడుదల
చేసి వాళ్ళ ఎదుటకు పిలుచుకు వెళ్ళాడు.
23 పౌలు మహాసభ వైపు సూటిగా చూసి,
“సోదరులారా! నేను ఈనాటివరకు నిష్కల్మ
షంగా జీవించాను. దీనికి దేవుడే సాక్షి” అని అన్నాడు.
2ఈ మాటలు అనగానే ప్రధాన యాజకుడైన
అననీయ, పౌలు ప్రక్కన నిలుచున్న వాళ్ళతో, “అతని
మూతి మీద కొట్టి నోరు మూయించండి” అని ఆజ్ఞా
పించాడు. 3అప్పుడు పౌలు అతనితో, “దేవుడు నీ
నోరు మూయిస్తాడు. నీవు సున్నం కొట్టిన గోడవి.
ధర్మశాస్త్రం ప్రకారం నా మీద తీర్పు చెప్పటానికి
నీవక్కడ కూర్చున్నావు. కాని నన్ను కొట్టుమని
ఆజ్ఞాపించి నీవా ధర్మశాస్త్రాన్నే ఉల్లంఘిస్తున్నావు” అని
అన్నాడు.
4పౌలు ప్రక్కన నిలుచున్న వాళ్ళు, “దేవుని ప్రధాన
యాజకుని అవమానించటానికి నీకెంత ధైర్యం?” అని
అన్నారు.
5అందుకు పౌలు, “సోదరులారా! ప్రధాన యాజకు
డని నాకు తెలియదు. మన లేఖనాల్లో యిలా వ్రాయ
బడివుంది, ‘ప్రజానాయకుల్ని గురించి చెడుగా మాట్లాడ
రాదు.’”*
6పౌలుకు వాళ్ళలో కొందరు సద్దూకయ్యులని, మరి
కొందరు పరిసయ్యులని తెలుసు. అందువల్ల అతడు
ఆ మహాసభలో బిగ్గరగా, “సోదరులారా! నేను పరి
సయ్యుణ్ణి. నా తండ్రి పరిసయ్యుడు. నేను యిక్కడ
నిందితునిగా నిలుచోవటానికి కారణం చనిపోయిన
వాళ్ళు బ్రతికి వస్తారన్నదే నాలోని ఆశ” అని అన్నాడు.
7అతడీ మాట అనగానే, సద్దూకయ్యులకు, పరిసయ్యు
లకు సంఘర్షణ జరిగి వాళ్ళు రెండు భాగాలుగా చీలి
పోయారు. 8సద్దూకయ్యులు మనుష్యులు బ్రతికి
రారని, దేవదూతలు, ఆత్మలు అనేవి లేవని వాదిస్తారు.
కాని పరిసయ్యులు యివి ఉన్నాయి అంటారు. 9సభలో
పెద్ద అలజడి మొదలైంది. పరిసయ్యులకు సంబంధిం
చిన కొందరు పండితులు లేచి బిగ్గరగా వాదిస్తూ,
“యితనిలో మాకే తప్పు కనిపించలేదు. దేవదూతో
లేక ఆత్మో అతనితో మాట్లాడి ఉండవచ్చు!” అని
అన్నారు. 10సంఘర్షణ చాలా తీవ్రంగా మారిపోయింది.
ఆ రెండు గుంపులు కలిసి, పౌలును చీల్చివేస్తారేమోనని
సహస్రాధిపతి భయపడిపొయ్యాడు. అతడు తన సైని
కులతో, “వెళ్ళండి! అతణ్ణి వాళ్ళనుండి విడిపించు
కొచ్చి కోట లోపలికి తీసుకెళ్ళండి” అని ఆజ్ఞాపిం
చాడు. 11ఆ రాత్రి ప్రభువు పౌలు ప్రక్కన నిలుచొని,
“ధైర్యంగా ఉండి, నా గురించి నీవు యెరూషలేములో
బోధించిన విధంగా రోములో కూడా బోధించాలి”
అని అన్నాడు.

### పౌలును చంపటానికి కుట్ర

12మరుసటి రోజు యూదులు ఒక కుట్ర పన్నారు.
పైగా, పౌలును చంపేవరకు అన్నపానాలు ముట్టరాదని
వాళ్ళందరూ ఒక ప్రమాణం తీసుకున్నారు. 13నలభై
మంది కంటే ఎక్కువే ఈ కుట్రలో పాల్గొన్నారు.
14వాళ్ళు ప్రధానయాజకుల దగ్గరకు, పెద్దల దగ్గరకు

---

**ప్రజా … మాట్లాడరాదు** నిర్గమ. 22:28.

వెళ్లి, “మేము పౌలును చంపే వరకు అన్న పానాలు
ముట్టరాదని ప్రమాణం తీసుకున్నాం. 15కనుక మీరు
మహాసభ పక్షాన అతణ్ణి గురించి, ‘మేము యింకా
విశదంగా తెలుసుకోవాలనుకొంటున్నాము’ అని అబ
ద్ధాలు చెప్పి, ఆ సాకుతో పౌలును పంపుమని సహస్రాధి
పతిని అడగండి. అతడు ఇక్కడికి చేరకముందే అతణ్ణి
చంపటానికి మేము సిద్ధంగా ఉంటాము” అని అన్నారు.
16పౌలు మేనల్లుడు ఈ కుట్రను గూర్చి విని కోట
లోకి వెళ్ళి పౌలుతో చెప్పాడు. 17పౌలు శతాధిపతిని
పిలిచి, “ఈ యువకుణ్ణి సహస్రాధిపతి దగ్గరకు పిలుచు
కెళ్ళు. అతనికి యితడు చెప్పవలసిన విషయం ఒక
టుంది” అని అన్నాడు. 18శతాధిపతి ఆ యువకుణ్ణి
సహస్రాధిపతి దగ్గరకు పిలుచుకెళ్ళి, “చెరసాలలో ఉన్న
పౌలు నన్ను పిలిచి ఈ యువకుణ్ణి మీ దగ్గరకు
పిలుచుకెళ్ళమన్నాడు. ఇతడు మీకొక విషయం చెప్ప
దలిచాడు!” అని అన్నాడు.
19సహస్రాధిపతి ఆ యువకుని చేయి పట్టుకొని
ప్రక్కకు తీసుకెళ్ళి, “నాకేం చెప్పాలనుకొన్నావు?”
అని అడిగాడు.
20ఆ యువకుడు, “పౌలును గురించి యింకా విశ
దంగా తెలుసుకోవాలనే సాకుతో యూదులందరూ
కలిసి, పౌలును రేపు మహాసభకు పిలుచుకు రమ్మని
మీకు విజ్ఞాపన చెయ్యాలనుకొంటున్నారు. 21వాళ్ళ
విజ్ఞాపనను అంగీకరించకండి. నలభై కంటే ఎక్కువ
మంది పౌలును పట్టుకోవటానికి కాచుకొని ఉన్నారు.
అతణ్ణి చంపే దాకా అన్నపానీయాలు ముట్టమని
ప్రమాణం తీసుకున్నారు” అని అన్నాడు.
22సహస్రాధిపతి యువకుణ్ణి వెళ్ళుమని చెబుతూ,
తనకీవిషయం చెప్పినట్టు ఎవ్వరికీ చెప్పవద్దని జాగ్రత్త
పరిచాడు.

## పౌలును కైసరియకు పంపటం

23తదుపరి తన శతాధిపతుల్ని యిద్దర్ని పిలిచి,
“రెండు వందల సైనికుల్ని, డెబ్బైమంది గుఱ్ఱపు
రౌతుల్ని, బళ్ళేలు ఉపయోగించే రెండు వందల సైని
కుల్ని మీ వెంట తీసుకొని ఈ రాత్రి తొమ్మిది గంట
లకు కైసరియకు వెళ్ళండి. 24పౌలుకు గుర్రాన్నిచ్చి
రాష్ట్రాధిపతియైన ఫేలిక్సు దగ్గరకు క్షేమంగా పంపండి”
అని ఆజ్ఞాపించాడు. 25సహస్రాధిపతి యిలా ఒక ఉత్తరం
వ్రాసి ఇచ్చాడు:

26“గౌరవనీయులైన ఫేలిక్సు రాష్ట్రాధిపతికి,
క్లౌదియ లూసియ అభివందనాలు చెప్పి
వ్రాయునది,
27ఇతణ్ణి యూదులు పట్టుకొని చంపబో
య్యారు. కాని, నేను యితడు రోము పౌరుడు
అని తెలుసుకొని నా దళాలతో వెళ్లి అతణ్ణి
రక్షించాను. 28వాళ్ళెందుకు అతణ్ణి అపరాధి
అంటున్నారో తెలుసుకోవాలని అతణ్ణి వాళ్ళ
మహాసభకు పిలుచుకు వెళ్ళాను. 29వాళ్ళు, తమ
ధర్మశాస్త్రం విషయంలో యితణ్ణి అపరాధి
అంటున్నారని నాకు తెలిసింది. కారాగారంలో
ఉంచవలసిన నేరం కాని, మరణ దండన వేయ
వలసిన నేరం కాని ఇతడు చేయలేదు. 30వాళ్ళు
ఇతణ్ణి చంపటానికి కుట్ర పన్నుతున్నారని తెలి
సింది. అందువలన వెంటనే మీ దగ్గరకు పంపు
తున్నాను. ఇతనిపై నేరారోపణ చేసిన వాళ్ళతో
ఆ నేరారోపణ మీ సమక్షంలో చెయ్య వచ్చని
చెప్పాను.

31సహస్రాధిపతి ఆజ్ఞాపించినట్లు సైనికులు పౌలును
రాత్రి వేళ తమతో పిలుచుకు వెళ్ళి అంతిపత్రికి చేరు
కున్నారు.32మరుసటి రోజు రౌతుల్ని పౌలు వెంట
పంపి, సైనికులు కోటకు తిరిగి వచ్చారు. 33పౌలుతో
వెళ్ళిన వాళ్ళు కైసరియ చేరుకొని ఆ ఉత్తరాన్ని,
పౌలును, రాష్ట్రాధిపతికి అప్పగించారు. 34రాష్ట్రాధిపతి
ఆ ఉత్తరాన్ని చదివి, “నీవు ఏ ప్రాంతం వాడవు?”
అని పౌలును అడిగాడు. అతడు కిలికియ వాడని తెలుసు
కొని, 35“నీపై నేరారోపణ చేసిన వాళ్ళు యిక్కడికి
వచ్చాక నీ విషయం విచారిస్తాను” అని అన్నాడు. ఆ
తర్వాత పౌలును హేరోదు భవనంలో ఉంచి కాపలా
కాయుమని భటులతో చెప్పాడు.

## ఫేలిక్సు సమక్షంలో విచారణ

24 అయిదు రోజుల తర్వాత ప్రధాన యాజకు
డైన అననీయ, కొంతమంది పెద్దలతో,
తెర్తుల్లు అనబడే న్యాయవాదితో కలిసి కైసరియ చేరు
కున్నాడు. పౌలు పట్ల తాము చేయదలచిన నేరారో
పణల్ని రాష్ట్రాధిపతి ముందు ఉంచాడు. 2తెర్తుల్లు తన
వాదనను ప్రారంభిస్తూ, “మీ పాలనలో చాలాకాలం
శాంతంగా జీవించాము. ఇది మా అదృష్టం. మీ ముందు
చూపువల్ల ఈదేశంలో ఎన్నో సంస్కరణలు జరిగాయి.
3“మహా ఘనత పొందిన ఫేలిక్సు ప్రభూ! మీరు
చేసిన వాటిని అన్ని ప్రాంతాల్లో ఉన్న మా ప్రజలు,
ఎంతో కృతజ్ఞతతో, సంపూర్ణంగా అంగీకరిస్తున్నారు.
4మిమ్మల్ని ఎక్కువగా విసిగించటం మాకు ఇష్టం లేదు.
కనుక క్లుప్తంగా చెపుతాము. మేము చెప్పేది మాపై
దయవుంచి వినుమని విజ్ఞప్తి చేస్తున్నాము. 5ఇతడు
సమస్యలు, కష్టాలు కలిగిస్తాడని మాకు తెలిసింది.
ప్రపంచంలో ఉన్న యూదులందరిలో ఇతడు అల్లర్లు
లేపాడు. ఇతడు కుట్రలు పన్నే నజరేతు జాతికి
నాయకుడు. 6ఇతడు దేవాలయాన్ని అపవిత్రం చెయ్య

టానికి ప్రయత్నించాడు. 7 * 8 మీరితణ్ణి విచారిస్తే మేము
చేసిన అరోపణల యొక్క నిజానిజాలు మీకే తెలు
స్తాయి" అని అన్నాడు. 9 న్యాయస్థానంలో యూదులం
దరూ ఈ ఆరోపణలు నిజమని చెబుతూ, తెర్తుల్లు
వాదనను బలపరిచారు.

10 రాష్ట్రాధిపతి పౌలును మాట్లాడుమని సంజ్ఞ
చేసాడు. పౌలు ఈ విధంగా మాట్లడటం మొదలు
పెట్టాడు: "మీరు ఈ దేశంలో ఎన్నో సంవత్సరాలు
న్యాయాధిపతిగా ఉన్నారు. అందువల్ల నేను ఆనందంగా
నా నిర్దోషత్వం నిరూపిస్తాను. 11 నేను ఆరాధించటానికి
యెరూషలేము వెళ్ళి యింకా పన్నెండు రోజులు
కాలేదు. నేను చెబుతున్న దానిలోని నిజానిజాలు మీరు
సులభంగా విచారించవచ్చు. 12 నాపై నేరారోపణ చేసిన
వీళ్ళు నేను మందిరంలో వాదిస్తుండగా చూసారా?
లేదు. సమాజమందిరంలో కాని పట్టణంలో మరెక్క
డైనా కాని, నేను ప్రజల్ని పురికొల్పటం వీళ్ళు
చూసారా? లేదు. 13 వీళ్ళు ప్రస్తుతం నాపై మోపుతున్న
నేరాల్ని నిరూపించలేరు. 14 వాళ్ళు, దేన్ని వేరొక జాతిగా
పరిగణిస్తారో దాన్ని నేను అనుసరిస్తున్నానని ఒప్పు
కుంటాను. ఈ మార్గాన్ననుసరించి నేను మా పూర్వీ
కుల దేవుణ్ణి ఆరాధిస్తున్నాను. పైగా, ధర్మశాస్త్రంలో
వ్రాయబడినవాటిని, మన ప్రవక్తలు వ్రాసిన వాటిని,
నేను సంపూర్ణంగా విశ్వసిస్తాను. 15 వాళ్ళలాగే నాకూ
దేవుడంటే నమ్మకం ఉంది. వాళ్ళలాగే, సన్మార్గుడు,
దుర్మార్గుడు బ్రతికివస్తారని నేను ఎదురు చూస్తున్నాను.
16 అందువలన నా ఆత్మను దేవుని దృష్టిలో, మానవుని
దృష్టిలో మలినం కాకుండా ఉంచుకోవటానికి
ఎప్పుడూ మనసారా ప్రయత్ని స్తున్నాను.

17 "పేద వాళ్ళకు డబ్బు దానం చెయ్యాలని,
దేవునికి కానుకలివ్వాలని ఎన్నో ఏండ్ల తర్వాత నేను
యెరూషలేముకు వచ్చాను. 18 నేనీ కార్యాలు మంది
రావరణంలో చేస్తుండగా వాళ్ళు చూసారు. నేను శాస్త్ర
యుక్తంగా శుభ్రమయ్యాను. నా వెంట ప్రజా సమూహం
లేదు. నేను ఏ అల్లర్లు మొదలు పెట్టలేదు. 19 కానీ
అక్కడికి ఆసియనుండి వచ్చిన కొందరు యూదులకు
నేను నేరం చేసానని అనిపిస్తే, యిక్కడికి వచ్చి నేరా
రోపణ చేయవలసి ఉంది. 20 నేను మహాసభ ముందు
నిలుచున్నప్పుడు నాలో ఏ అపరాధం కనిపెట్టారో
ఇక్కడ నిలుచున్న వాళ్ళను చెప్పమనండి. 21 ఔను!
నేను ఒకటి చేసాను. వాళ్ళ సమక్షంలో నిలుచొని
బిగ్గరగా 'చనిపోయిన వాళ్ళు బ్రతికి వస్తారని నమ్మి
నందుకు మీ ముందు ఈ రోజు నేరస్థునిగా నిలు
చున్నాను' అని అన్నాను. ఇది తప్ప నేనేమీ
చెయ్యలేదు."

22 యేసు ప్రభువు మార్గం బాగా తెలిసిన ఫేలిక్సు
సభను ముగిస్తూ, "సహస్రాధిపతి లూసియ వచ్చాక
నీ విషయం నిర్ణయిస్తాను" అని అన్నాడు. 23 శతాధి
పతితో, "పౌలును కాపలాలో ఉంచు! కాని కొంత
స్వేచ్ఛ నివ్వు. అతని స్నేహితులు అతనికి ఏదైనా
ఇవ్వటానికి వస్తే వాళ్ళనాపవద్దు" అని అన్నాడు.

24 కొద్ది రోజుల తర్వాత ఫేలిక్సు తన భార్య ద్రుసి
ల్లతో వచ్చాడు. ద్రుసిల్ల యూదురాలు. ఫేలిక్సు
పౌలును పిలిపించాడు. 'యేసుక్రీస్తులో విశ్వాసం' అనే
విషయాన్ని గురించి, పౌలు మాట్లాడాడు. ఫేలిక్సు
విన్నాడు. 25 పౌలు సన్మార్గాన్ని గురించి, మనో నిగ్ర
హాన్ని గురించి, రానున్న తీర్పును గురించి చెప్పటం
విని ఫేలిక్సు భయపడి, "ఇప్పటికి చాలించి, వెళ్ళు!
నాకు వీలున్నప్పుడు నిన్ను మళ్ళీ పిలిపిస్తాను" అని
అన్నాడు. 26 కాని తనకు లంచమిస్తాడని ఆశించి అతణ్ణి
మాటిమాటికి పిలిపించి అతనితో మాట్లాడే వాడు.

27 రెండు సంవత్సరాలు గడిచాక పోర్కియు ఫేస్తు
ఫేలిక్సు స్థానంలో వచ్చాడు. ఫేలిక్సు యూదులకు
ఒక ఉపకారం చెయ్యాలనే ఉద్దేశంతో పౌలును కారాగా
రంలోనే ఉంచాడు.

### ఫేస్తు సమక్షంలో విచారణ

25 ఫేస్తు ఆ ప్రాంతానికి వచ్చిన మూడు రోజుల
తర్వాత కైసరియ నుండి యెరూషలేమునకు
వెళ్ళాడు. 2 అక్కడ ప్రధాన యాజకులు, యూదుల
పెద్దలు అతణ్ణి కలుసుకొని, పౌలును గురించి చెప్పారు.
3 పౌలును వెంటనే యెరూషలేముకు పంపి తమకు
ఉపకారం చెయ్యుమని వేడుకున్నారు. ఎవ్వరికీ తెలియ
కుండా పౌలును దారిలో చంపేయాలని వాళ్ళ కుట్ర.
4 ఫేస్తు, "పౌలు కైసరియలో బందీగా ఉన్నాడు. నేను
కూడా అక్కడికి త్వరలోనే వెళ్తున్నాను. 5 మీలో ముఖ్య
మైన వాళ్ళు నావెంట వస్తే, అతడు ఒకవేళ ఏదైనా
నేరం చేసి ఉంటే అతనిపై మీ నేరారోపణలు అక్కడే
చేయవచ్చు" అని అన్నాడు.

6 అక్కడ వాళ్ళతో ఎనిమిది, పది రోజులు గడిపాక
కైసరియకు వెళ్ళాడు. వెళ్ళిన మరుసటి రోజు
న్యాయసభను ఏర్పాటు చేసి పౌలును తన ముందుకు
పిలుచుకు రమ్మని ఆజ్ఞాపించాడు. 7 పౌలు కనపడగానే
యెరూషలేము నుండి వచ్చిన యూదులు అతని
చుట్టూచేరి అతనిపై తీవ్రమైన నేరాలు ఆరోపించారు.
ఎన్ని నేరాల్ని ఆరోపించినా, ఒక్క నేరాన్ని కూడా
నిరూపించలేక పోయారు. 8 తదుపరి పౌలు, తాను
నేరస్థుడు కాదని నిరూపించుకోవటానికి ఈ విధంగా

---

**వచనము 6–8** కొన్ని గ్రీకు ప్రతులు ఈ వచనాన్ని కూడా చేర్చాయి: "ఇతనిని బంధించి ఇతనిపై మా ధర్మశాస్త్రాను సారం తీర్పు చెప్పాలనుకొన్నాము. 7 కాని సహస్రాధిపతి యైన లూసియ తన బలగంతో వచ్చి ఇతనిని మా నుండి తీసికొని పోయాడు. 8 పైగా ఇతనిపై నేరారోపణ చేయు వారిని మీ వద్దకు వెళ్ళుమని కూడా ఆజ్ఞాపించాడు."

వాదించాడు, "నేను యూదుల ధర్మశాస్త్రాన్ని కాని,
మందిర నియమాల్ని కాని అతిక్రమించ లేదు. చక్రవర్తికి
ఎదురు తిరిగి ప్రవర్తించనూ లేదు."
9ఫేస్తు, యూదులకు ఉపకారం చేయాలని,
పౌలుతో,"నీవు యెరూషలేము వచ్చి అక్కడ నా ఎదుట
న్యాయస్థానంలో నిలుచోగలవా?" అని అడిగాడు.
10పౌలు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "నేను
ప్రస్తుతం చక్రవర్తి యొక్క న్యాయస్థానంలో నిలుచు
న్నాను. ఇక్కడే తీర్పు జరగాలి. నేను యూదులకు
ఏ అన్యాయం చెయ్యలేదు. ఇది మీకు బాగా తెలుసు.
11మరణదండన పొందవలసిన నేరం నేను ఒక వేళ
ఏదైనా చేసివుంటే, మరణించటానికి నేను వెనుకంజ
వేయను. కాని వీళ్ళు ఆరోపించిన నేరాలు అసత్యమైతే
నన్ను వీళ్ళకప్పగించే అధికారం ఎవ్వరికీ లేదు. చక్ర
వర్తినే ఈ విషయంపై తీర్పు చెప్పుమని నేను విన్న
వించుకొంటాను."
12ఫేస్తు తన సలహాదార్లతో సంప్రదించి యిలా
ప్రకటించాడు: "నీవు చక్రవర్తి సమక్షంలో విన్నవించు
కోవాలని కోరావు. కనుక నిన్ను చక్రవర్తి దగ్గరకు
పంపుతాను."

### ఫేస్తు అగ్రిప్పను సంప్రదించటం

13కొద్ది రోజుల తర్వాత అగ్రిప్పరాజు, బెర్నీకే,
ఫేస్తును కలుసుకొందామని కైసరియకు వచ్చారు.
14వాళ్ళక్కడ చాలా రోజులున్నారు. ఫేస్తు పౌలు విష
యాన్ని రాజుగారితో చర్చిస్తూ, "ఇక్కడ, ఫేలిక్సు
కారాగారంలో ఉంచిన వాడొకడున్నాడు. 15నేను
యెరూషలేముకు వెళ్ళినప్పుడు ప్రధానయాజకులు,
యూదుల పెద్దలు అతనిపై నేరారోపణ చేసి అతనికి
మరణదండన విధించుమని నన్ను కోరారు. 16నేను,
'నేరమారోపింపబడిన వానికి తనపై నేరారోపణ చేసిన
వాళ్ళను ప్రత్యక్షంగా కలుసుకొని, వాళ్ళారోపించిన నేరా
లకు ప్రతిగా తన రక్షణార్థం మాట్లాడే అవకాశం కలగాలి.
దానికి ముందు అతణ్ణి అప్పగించటం రోమనుల పద్ధతి
కాదు' అని జవాబు చెప్పాను. 17నాతో కలిసి వాళ్ళిక్కడికి
వచ్చారు. నేను ఆలస్యం చెయ్యకుండా మరుసటి
రోజే సభనేర్పాటు చేసి పౌలును సభలోకి పిలుచు
కురమ్మని ఆజ్ఞాపించాను. 18అతనిపై నేరారోపణ చేసిన
వాళ్ళు లేచి మాట్లాడారు. కాని నేననుకున్న ఏ నేరాన్నీ
అతనిపై అరోపించలేదు. 19దానికి మారుగా తామను
సరించే మతాన్ని గురించి అతనితో వాదించారు. చని
పోయిన యేసును గురించి తర్కించారు. కాని పౌలు
యేసు బ్రతికే ఉన్నాడని వాదించాడు. 20అలాంటి విష
యాలు ఏ విధంగా విచారణ చెయ్యాలో నాకు తెలి
యదు. అందువల్ల నేను అతణ్ణి, 'విచారణ కోసం
నీవు యెరూషలేము వెళ్తావా?' అని అడిగాను. 21చక్రవర్తే
తీర్పు చెప్పాలని, అంతదాకా తనను కారాగారంలో
ఉంచుమని పౌలు కోరాడు. ఆ కారణంగా అతణ్ణి కైసరు
దగ్గరకు పంపేదాకా కారాగారంలో ఉంచుమని ఆజ్ఞాపిం
చాను" అని చెప్పాడు.
22అగ్రిప్ప ఫేస్తుతో, "అతడు మాట్లాడే విషయాలు
వినాలని నాక్కూడా ఉంది" అని అన్నాడు.
"రేపు మీరతని మాటలు వింటారు" అని ఫేస్తు
జవాబు చెప్పాడు.

### అగ్రిప్ప సమక్షంలో పౌలు

23మరుసటి రోజు అగ్రిప్ప, బెర్నీకే మిక్కిలి ఆడం
బరంగా సభలోకి వచ్చి సహస్రాధిపతులతో, పట్టణ
ప్రముఖులతో కలిసి కూర్చున్నారు. ఫేస్తు ఆజ్ఞాపించ
గానే పౌలు సభలోకి తేబడ్డాడు. 24ఫేస్తు యిలా
అన్నాడు: "అగ్రిప్ప రాజా! సభికులారా! మీరు
చూస్తున్న ఈ వ్యక్తిని గురించి యూదులు యెరూషలే
ములో, ఇక్కడ, 'ఇతడిక ఎక్కువ రోజులు బ్రతక
టానికి వీల్లేదు' అని బిగ్గరగా కేకలు వేసి నాకు ఫిర్యాదు
చేసారు. 25మరణ దండన విధించవలసిన నేరమేదీ
అతడు చెయలేదని నాకర్థమైనది. కాని అతడు చక్రవర్తికి
విన్నవించు కొంటానని అన్నాడు. కనుక అతణ్ణి చక్రవర్తి
దగ్గరకు పంపాలని నిశ్చయించుకున్నాను. 26ఇతణ్ణి
గురించి చక్రవర్తికి వ్రాయటానికి నాకేదీ కనిపించలేదు.
అందువల్ల యితణ్ణి మీ ముందుకు పిలుచుకు వచ్చాను.
అగ్రిప్ప రాజా! ముఖ్యంగా మీకోసం యితణ్ణి పిలిపిం
చాను. మీ విచారణ వల్ల వ్రాయటానికి నాకేదైనా కని
పించవచ్చు. 27ఒక బందీని, అతడు చేసిన నేరం
స్పష్టంగా చూపకుండా పంపటం న్యాయం కాదని నా
అభిప్రాయం."

### పౌలు తాను నిర్దోషినని వాదించటం

26 అప్పుడు అగ్రిప్పరాజు పౌలుతో, "నీవు
చెప్పుకోదలచింది ఇక చెప్పుకోవచ్చు!" అని
అన్నాడు. పౌలు తన చేతులెత్తి, తాను నిర్దోషినని
నిరూపించుకోవటానికి ఈ విధంగా చెప్పటం మొదలు
పెట్టాడు: 2"అగ్రిప్ప రాజా! ఈ రోజు మీ ముందు
నిలుచొని యూదులు నాపై అరోపించిన నేరాలు
అసత్యమని ఋజువు చేసుకోవటానికి అవకాశం కల
గటం నా అదృష్టం. 3మీకు యూదులతో, వాళ్ళ
ఆచారాలతో, వాళ్ళు తర్కించే విషయాలతో బాగా
పరిచయముంది. కనుక యిది నిజంగా నా అదృష్టం.
నేను చెప్పేది మీరు శాంతంగా వినాలని మనవి చేసు
కుంటున్నాను.
4"నేను చిన్ననాటినుండి ఏ విధంగా జీవించానో
యూదులకందరికీ తెలుసు. నా దేశంలో గడిచిన నా
బాల్యం మొదలుకొని యెరూషలేములో జరిగిన సంఘ
టనల దాకా జరిగినదంతా వాళ్ళకు తెలుసు. 5వాళ్ళు
నన్ను ఎన్నో సంవత్సరాలనుండి ఎరుగుదురు. నేను,

మన మతంలోని నిష్ఠగల పరిసయ్యుల తెగను అను
సరిస్తూ జీవించానని వాళ్ళకు తెలుసు. కావాలనుకొంటే
వాళ్ళే యిది నిజమని సాక్ష్యం చెబుతారు. [6]దేవుడు
మన పూర్వీకులకు చేసిన వాగ్దానంలో నాకు నమ్మకం
ఉంది. అందువల్లే నేను ఈ రోజు ఈ పరీక్షకు నిల
బడవలసి వచ్చింది. [7]ఈ వాగ్దానం పూర్తి కావాలని
మన పండ్రెండు గోత్రాల వాళ్ళు రాత్రింబగళ్ళు విశ్వా
సంతో దేవుణ్ణి సేవిస్తూ ఎదురు చూస్తున్నారు. ఓ
రాజా! ఈ ఆశ నాలో ఉండటం వల్లే యూదులు
నన్ను నేరస్థునిగా పరిగణిస్తున్నారు. [8]దేవుడు చని
పోయిన వాళ్ళను బ్రతికిస్తాడు. ఈ సత్యాన్ని మీరు
ఎందుకు కాదంటున్నారు? [9]"ఒకప్పుడు నేను కూడా
నజరేతు నివాసి యేసు నామము లేకుండా చెయ్యటం
నా కర్తవ్యంగా భావించాను. [10]నేను యెరూషలేములో
చేసింది అదే. ప్రధాన యాజకులు యిచ్చిన అధి
కారంతో నేను చాలామంది పరిశుద్ధుల్ని కారాగారంలో
వేసాను. వాళ్ళను చంపటానికి నేను నా అంగీకారం
కూడా తెలిపాను. [11]ఎన్నోసార్లు నేను ఒక సమాజ
మందిరమునుండి మరొక సమాజ మందిరానికి వెళ్ళి
వాళ్ళను శిక్షించాను. వాళ్ళతో బలవంతంగా యేసును
దూషింప చేసాను. పిచ్చి కోపంతో యితర పట్టణాలకు
కూడా వెళ్ళి ఆ మార్గాన్ని అనుసరించే వాళ్ళను
హింసించాను.

[12]"ఒక రోజు నేను, ప్రధానయాజకుల అధికా
రంతో, అనుమతితో డెమాస్కసుకు వెళ్తు న్నాను.
[13]సుమారు మధ్యాహ్నం పన్నెండు గంటలప్పుడు, ఓ
రాజా! నేను దారిలో ఉండగా ఆకాశంనుండి ఒక గొప్ప
వెలుగు రావటం చూసాను. ఆ వెలుగు సూర్యుని
కన్నా యింకా ఎక్కువ వెలుగుతో వచ్చి నా మీద
నాతో ఉన్న వాళ్ళ మీద ప్రకాశించింది. [14]మేమంతా
నేలపై పడిపొయ్యాము. ఒక స్వరం హెబ్రీ బాషలో
నాతో ఈ విధంగా అనటం విన్నాను: 'సౌలా! సౌలా!
నన్ను ఎందుకు హింసిస్తున్నావు? ఇలా చేయటంవల్ల
నీకే నష్టం కలుగుతుంది.' [15]నేను, 'మీరెవరు ప్రభూ!'
అని అడిగాను. 'నేను నీవు హింసిస్తున్న యేసును'
అని ప్రభువు జవాబు చెప్పాడు. [16]'ఇక లేచి నిలబడు,
నిన్ను నా సేవకునిగా నియమించుకోవాలని అను
కున్నాను. నన్ను చూసిన ఈ సంఘటనను గురించి,
నేను చూపబోయే వాటిని గురించి యితర్లకు చెప్ప
టానికి నిన్ను నియమించాలని నీకు ప్రత్యక్షమయ్యాను.
[17]నిన్ను నీ వాళ్ళనుండి, యూదులుకాని వాళ్ళనుండి
రక్షిస్తాను.

[18]వాళ్ళ కళ్ళు తెరిపించి వాళ్ళను చీకటినుండి
వెలుగులోకి పిలుచుకు రావటానికి నిన్ను పంపుతు
న్నాను. వాళ్ళను సైతాను ఆధీనం నుండి కాపాడి,
దేవుని వైపు మళ్ళించటానికి నిన్ను పంపుతున్నాను.
వాళ్ళు నన్ను విశ్వసించి తమ పాపాలకు క్షమాపణ
పొందాలని, దేవుడు ఎన్నుకొన్న వాళ్ళతో కలిసి తమ
స్థానం పొందాలని యిలా చేస్తున్నాను.'

[19]"అందువల్ల అగ్రిప్ప రాజా! ఆకాశంనుండి వచ్చిన
దివ్య దర్శనమును నేను అతిక్రమించలేను. [20]మారు
మనస్సు పొంది దేవుని వైపు మళ్ళుమని, తమ నిజమైన
పశ్చాత్తాపం మారుమనస్సు అన్న విషయం పనుల
ద్వారా ఋజువు చేయుమని ఉపదేశించాను. ఈ ఉప
దేశం డెమాస్కసు ప్రజలతో మొదలుపెట్టి యెరూష
లేములోని ప్రజలకు, యూదయలోని యితర ప్రజ
లకు, యూదులుకాని వాళ్ళకు చెప్పాను. [21]ఆ కార
ణంగా యూదులు నన్ను మందిరంలో పట్టుకొని
చంపాలని ప్రయత్నించారు. [22]కాని దేవుని దయ
ఈనాటికీ నా మీద ఉంది. కనుక చిన్నా, పెద్దా, అనే
భేధం లేకుండా అందరికీ దీన్ని గురించి చెబుతున్నాను.
మోషే, మరియు ప్రవక్తలు జరుగనున్న వాటిని గురించి
ముందే ఈ విధంగా చెప్పారు: [23]'క్రీస్తు మరణించవలసి
వస్తుంది. కాని బ్రతికి వచ్చిన వాళ్ళలో ఆయన
మొదటివాడౌతాడు. తన ప్రజలకు, యూదులుకాని
వాళ్ళకు వెలుగునివ్వటానికి వచ్చాడని చెపుతున్నాను.'
నేను వీళ్ళు చెప్పినవి తప్ప వేరే విషయాలు చెప్పటం
లేదు."

[24]పౌలు, తన రక్షణార్థం ఈ విధంగా మాట్లాడు
తుండగా, ఫేస్తు, పౌలుతో వాదన ఆపమంటూ, "నీకు
మతిపోయింది పౌలూ! నీ పాండిత్యం నిన్ను పిచ్చివాణ్ణి
చేస్తుంది" అని బిగ్గరగా అన్నాడు. [25]పౌలు, "మహా
ఘనత పొందిన ఓ ఫేస్తూ! నేను పిచ్చివాణ్ణి కాదు.
సక్రమంగానే మాట్లాడాను. సత్యం చెప్పాను. [26]రాజు
గారికి యివన్నీ తెలుసు. నేను రాజుగారితో స్వేచ్ఛగా
మాట్లాడగలను. ఇవి అతని దృష్టి నుండి తప్పించు
కోలేవన్న నమ్మకం నాకుంది. ఎందుకంటే యివి
రహస్యంగా సంభవించలేదు. [27]అగ్రిప్ప రాజా! మీరు
ప్రవక్తలు వ్రాసిన వాటిని నమ్ముచున్నారా? అవును,
నమ్ముచున్నారని నాకు తెలుసు" అని పౌలు అన్నాడు.

[28]అగ్రిప్ప, "అంత సులభంగా నన్ను క్రైస్తవునిగా
చెయ్యాలనుకుంటున్నావా?" అని అన్నాడు.

[29]పౌలు, "సులభమో, కష్టమో! మీరే కాదు, ఈ
రోజు నా మాటలు వింటున్న ప్రతి ఒక్కడూ ఈ
సంకెళ్ళు తప్ప మిగిలిన వాటిలో నావలె కావాలని
దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను" అని అన్నాడు.

[30]రాజు లేవగానే రాష్ట్రాధిపతి, బెర్నీకే, మరియు
వాళ్ళతో కూర్చున్న వాళ్ళు లేచి నిలుచున్నారు.
[31]వాళ్ళా గది వదిలివెళ్తూ తమలో తాము, "ఇతడు
మరణ దండన పొందటానికి కాని, కారాగారంలో ఉండ
వలసిన నేరం కాని ఏదీ చేయలేదు" అని అనుకున్నారు.
[32]అగ్రిప్ప ఫేస్తుతో, "ఇతడు చక్రవర్తికి విన్నపం చేయ
కుండా ఉండినట్లైతే విడుదలచేసి ఉండే వాణ్ణి!" అని
అన్నాడు.

### పౌలు రోముకు వెళ్ళటం

27 మేము ఇటలీకి ఓడలో ప్రయాణం చేయాలని
అధికారులు నిర్ణయించి పౌలును, ఇతర ఖైదీ
లను ‘యూలి’ అనబడే శతాధిపతికి అప్పగించారు.
ఇతడు చక్రవర్తి దళానికి చెందినవాడు. 2మేము ఆసియ
తీరాలకు వెళ్ళటానికి సిద్ధమవుతున్న ‘అద్రముత్తియ’
అనే ఓడనెక్కి ప్రయాణం అయ్యాము. మాసిదోనియ
ప్రాంతంలోని థెస్సలొనీకకు చెందిన అరిస్తార్కు అనే
వాడు మా వెంట ఉన్నాడు. 3మరుసటి రోజు మేము
సీదోను చేరుకున్నాము. యూలి, పౌలు తన స్నేహి
తుల్ని కలుసుకొని సహాయం పొందేటట్లు అతనికి
అనుమతిచ్చి అతనిపై దయచూపాడు. 4అక్కడి నుండి
మళ్ళీ ఓడలో ప్రయాణం సాగించాము. ఎదురుగాలి
వీస్తూ ఉంది. అందువల్ల కుప్రకు దక్షిణంగా గాలి వీచని
నీళ్లలో ప్రయాణం సాగించాము. 5కిలికియ, పంఫూ
లియల దగ్గర ఉన్న సముద్రం మీద ప్రయాణం చేస్తూ
‘లుకియ’ ప్రాంతంలో ఉన్న ‘మూర’ అనే పట్టణాన్ని
చేరుకున్నాము. 6మా వెంట ఉన్న శతాధిపతి ఇటలీకి
వెళ్తున్న ‘అలెక్సంద్రియ’ ఓడను చూసి, మమ్మల్ని ఆ
ఓడలో ఎక్కించాడు.

7ఎదురు గాలి వీస్తూవుండటం వల్ల మా ప్రయాణం
చాలా రోజుల వరకు మెల్లగా సాగింది. చాలా కష్టంగా
‘క్నీదు’ తీరాన్ని చేరుకున్నాము. ఎదురు గాలి వల్ల
ముందుకు వెళ్లలేక పొయ్యాము. అందువల్ల దక్షిణంగా
వెళ్ళి ‘క్రేతు’ ద్వీపాన్ని అడ్డంగా పెట్టుకొని ‘సల్మోనే’
తీరంగుండా ప్రయాణం సాగించాము. 8ఆ నీళ్లలో మా
ప్రయాణం కష్టంగా సాగింది. ఏదో విధంగా ‘మంచి
రేవులు’ అనే స్థలాన్ని చేరుకున్నాము. ఈ తీరం
‘లసైయ’ అనే పట్టణానికి దగ్గరగా ఉంది.

9అప్పటికే చాలా కాలం వృధా అయిపోయింది.
కాని ప్రయాణం చెయ్యటం ప్రమాదకరమైపోయింది.
ఉపవాస దినం* చేసే దినం కూడా దాటి పోయింది.
అందుకు పౌలు వాళ్ళను జాగ్రత్తపడుమని చెబుతూ,
10“ప్రజలారా! ఈ ప్రయాణంలో మనకు కష్టాలు
సంభవిస్తాయని నాకనిపిస్తూవుంది. ఓడను, సరుకును
నష్టపోవటమే కాకుండా మన ప్రాణాలకు కూడా
ప్రమాదం కలుగవచ్చు!” అని అన్నాడు. 11కాని ఆ
శతాధిపతి పౌలు మాటలు వినక ఆ ఓడ యొక్క
యజమాని మాటలు, నావికుని మాటలు విన్నాడు.
12వాళ్ళున్న రేవు చలి కాలంలో ఉండటానికి పనికి
రాదు. కనుక అనేకులు ప్రయాణం సాగించుమని సలహా
యిచ్చారు. చలికాలం గడపటానికి ‘ఫీనిక్సు’ అనే రేవు
చేరగలమని అంతా ఆశించారు. ఈ ఫీనిక్సు రేవు క్రేతు
ద్వీపంలో ఉంది. నైరుతి, వాయవ్య దిశలనుండి
మాత్రమే ఆ రేవును ప్రవేశించటానికి వీలుంటుంది.

### తుఫాను

13దక్షిణ గాలి వీచగానే తమకు కావలసింది దొరి
కిందని వాళ్ళనుకున్నారు. లంగరు తీసి, ఓడను క్రేతు
తీరం ప్రక్కగా నడుపుతూ ప్రయాణం సాగించారు.
14అంతలోనే, ఊరకులోను అనబడే తీవ్రమైన తుఫాను
గాలి క్రేతు ద్వీపం మీదుగా వీచటం మొదలైంది. 15ఓడ
ఆ తుఫానుగాలికి కొట్టుకొని పోయింది. ఎదురు
గాలివల్ల మా ఓడ ముందుకు పోలేక పోయింది. మేమేమీ
చెయ్యలేక పోయాము. గాలి వీచిన వైపు మా ఓడ
కొట్టుకొని పోయింది. 16‘కౌద’ అనబడే చిన్న ద్వీపాన్ని
అడ్డంగా పెట్టుకొని దాని ప్రక్కగా ప్రయాణం సాగిం
చాము. ఓడకు కట్టబడిన పడవను చాలా కష్టంగా
కాపాడగలిగాము. 17దానిని ఓడమీదకి ఎక్కించిన తర్వాత
త్రాళ్ళు బిగించి ఓడను గట్టిగా కట్టారు. ఓడ ‘సూర్తిస’
ప్రాంతంలోని యిసుక తిప్పల మీదికి వెడ్తుందని
భయపడ్డారు. కనుక తెరచాపలు దించి ఓడను గాలి
వీచే వైపు పోనిచ్చారు. 18మరుసటి రోజు, తుఫానుగాలి
తీవ్రంగా వీచటంవల్ల ఓడలోవున్న సరుకులు సము
ద్రంలో పడవేసారు. 19మూడవ రోజు ఓడలో ఉపయో
గించే పనిముట్లను కూడా సముద్రంలో పడవేసారు.
20సూర్యుడు కాని, నక్షత్రాలు కాని చాలా రోజుల దాకా
కనపడ లేదు. తుఫానుగాలి తీవ్రత తగ్గలేదు. మేము
బ్రతుకుమీద ఆశ యిక పూర్తిగా వదులుకున్నాము.

21చాలా రోజులనుండి వాళ్ళు ఆహారం తినలేదు.
పౌలు వాళ్ళ మధ్య నిలబడి, “నా సలహా పాటించి
మీరు క్రేతు నుండి ప్రయాణం చేయకుండా ఉండ
వలసింది. అలా చేసి ఉంటే మీకు కష్టంగాని, నష్టంగాని
కలిగేది కాదు. 22కాని, యిప్పుడు మిమ్మల్ని ఒకటి
కోరుతున్నాను. ధైర్యంగా ఉండండి. మీలో ఒక్కరు
కూడా ప్రాణాల్ని కోల్పోరు. కాని ఓడ మాత్రం
నష్టమౌతుంది. 23నేను ఎవరికి చెందానో, ఎవరి సేవ
నేను చేస్తున్నానో ఆయన దూత నిన్న రాత్రి నా
ప్రక్కన నిలబడి ఇలా చెప్పాడు: 24‘పౌలూ! భయ
పడకు. విచారణకై నీవు చక్రవర్తి ముందు నిలబడతావు
దేవుడు దయదలిచి, నీ కోసం నీతో ప్రయాణం
చేస్తున్న వాళ్ళ ప్రాణాలను రక్షించాడు.’ 25అందువల్ల
ప్రజలారా! ధైర్యంగా ఉండండి. నాకు దేవుని పట్ల
నమ్మకం ఉంది. ఆయన చెప్పినట్లే జరుగుతుంది.
26మనం త్వరలోనే ఒక ద్వీపానికి కొట్టుకుపోతాము”
అని అన్నాడు.

27పదునాల్గవ రోజు రాత్రి కూడా మేమింకా అద్రియ
సముద్రంలో గాలికి కొట్టుకొని పోతున్నాము. సుమారు
అర్థరాత్రి వేళ నావికులు భూమి దగ్గరకొచ్చిందని
గ్రహించారు. 28బుడుదు* నీళ్ళలోకి వేసి ఇరవై బారల
లోతుందని తెలుసుకున్నారు. కొంతసేపైన తర్వాత

**ఉపవాస దినం** ఇది యూదులకు పవిత్రమైన దినము.

**బుడుదు** నీళ్ళ లోతును కొలిచే పనిముట్టు.

మళ్ళీ బుడుదు నీళ్ళలోకి వేసి పదునైదు బారల లోతుం
దని తెలుసుకున్నారు. 29ఓడ, రాళ్ళకు కొట్టుకుంటుం
దని భయపడి ఓడ వెనుక భాగంనుండి నాలుగు లంగర్లు
వేసారు. ఆ తదుపరి సూర్యుని వెలుగు కోసం ప్రార్థిం
చారు. 30నావికులు ఓడ ముందుభాగంనుండి లంగర్లు
నీళ్ళలోకి దింపుతున్నట్లు నటిస్తూ ఓడకు కట్టబడిన
చిన్న పడవను సముద్రంలోకి దింపారు. తప్పించుకు
వెళ్ళాలని వాళ్ళ ఉద్దేశ్యం. 31అప్పుడు పౌలు శతాధి
పతితో, సైనికులతో, “ఈ నావికులు ఓడలో ఉంటే
తప్ప మీరు రక్షింపబడరు” అని అన్నాడు. 32ఇది విని
సైనికులు పడవకు కట్టిన త్రాళ్ళను కోసి ఆ పడవను
నీళ్ళలోకి పోనిచ్చారు. 33సూర్యోదయానికి ముందు
పౌలు వాళ్ళ నందర్నీ తినుమని చెబుతూ, “గడిచిన
పదునాలుగు రోజుల నుండి మీరు ఆహారం ముట్ట
కుండా జీవించారు. ఏం జరుగనున్నదో మీకు తెలి
యదు. అయినా కాచుకున్నారు. 34ఇక మిమ్మల్ని
కొంచెం తినుమని వేడుకొంటున్నాను. మిమ్మల్ని
రక్షించుకోవాలంటే తినటం అవసరం. మీ తలలపై
ఉన్న ఒక్క వెంట్రుక కూడా రాలిపోదు” అని అన్నాడు.
35ఇలా చెప్పాక అతడు రొట్టెను తీసుకొని దేవునికి
అందరి ముందు కృతజ్ఞతలు చెప్పి దాన్నుండి ఒక
ముక్కను విరిచి తినటం మొదలు పెట్టాడు. 36అప్పు
డందరూ ధైర్యం తెచ్చుకొని ఆహారం పుచ్చుకున్నారు.
37మా సంఖ్య మొత్తం రెండువందల డెబ్బది ఆరు.
38వాళ్ళంతా తృప్తిగా తిన్నారు. ఆ తర్వాత ఓడలో
ఉన్న మిగతా ధాన్యాన్ని సముద్రంలోకి పారవేసి ఓడను
తేలిక చేసారు.

## ఓడ పగిలి పోవటం

39సూర్యోదయమయింది. వాళ్ళకు భూమి కనిపిం
చింది. కాని వాళ్ళు అది గుర్తించలేదు. ఇసుక ఉన్న
తీరం యొక్క పాయ కనపడగానే ఓడను వీలైతే అక్కడ
ఆపాలనుకున్నారు. 40త్రాళ్ళు కోసేసి లంగర్లను సము
ద్రంలోకి పడనిచ్చారు. చుక్కానుల త్రాళ్ళు విప్పారు.
ఓడ యొక్క ముందుభాగంలో ఉన్న తెరచాపను లేపి
ఓడను తీరం వైపు పోనిచ్చారు. 41కాని ఆ ఓడ నీళ్ళలో
ఉన్న యిసుకకు తగిలి భూమిలో చిక్కుకొని
పోయింది. ఓడ యొక్క ముందుభాగం యిసుకలో
చిక్కుకుపోవటం వల్ల ఓడ కదల్లేదు. అలలు తీవ్రంగా
కొట్టటం వల్ల ఓడ యొక్క వెనుక భాగం ముక్కలై
పోయింది.
42నేరస్థులు ఈది పారిపోకుండా ఉండాలనే ఉద్దే
శ్యంతో సైనికులు వాళ్ళను చంపాలని నిశ్చయించు
కున్నారు, 43కాని పౌలు ప్రాణాన్ని కాపాడాలనే ఉద్దే
శ్యంతో ఆ శతాధిపతి సైనికులు చేయదలచిన దానిని
చేయనివ్వలేదు. ఈద గలిగిన వాళ్ళను, నీళ్ళలోకి
దూకి ఒడ్డును చేరుకోమని ఆజ్ఞాపించాడు. 44మిగతా
వాళ్ళను చెక్కల సహాయంతో, ఓడ యొక్క విరిగిన
ముక్కల సహాయంతో, ఒడ్డును చేరుకోమన్నాడు. ఈ
విధంగా అందరూ క్షేమంగా తీరాన్ని చేరుకున్నారు.

## మెలితే ద్వీపం

28 తీరం చేరుకున్నాక ఆ ద్వీపాన్ని ‘మెలితే’
అంటారని తెలుసుకున్నాము. 2ఆ ద్వీపంలో
నివసించే వాళ్ళు మాపై చాలా దయచూపారు.
అప్పుడు వర్షం కురుస్తూవుంది. చలి తీవ్రంగా ఉంది.
వాళ్ళు చలిమంటలు వేసి మమ్మల్ని కూడా రమ్మ
న్నారు. 3పౌలు కట్టెలు ప్రోగుచేసి ఆ మోపును
మంటపై వేసాడు. ఆ కట్టెల మోపునుండి ఒక పాము
ఆ వేడికి తట్టుకోలేక వెలుపలికి వచ్చి, పౌలు చేతిని
కరిచి దాని పళ్ళతో పట్టుకుంది. 4ఆ ద్వీపవాసులు
పౌలు చేతికి పాము వ్రేలాడి ఉండటం చూసి తమలో
తాము, “ఇతడు తప్పక ఒక హంతకుడై ఉండాలి!
సముద్రంనుండి తప్పించుకున్నాడు కాని, దేవుడతన్ని
బ్రతుకనివ్వలేదు” అని అనుకున్నారు. 5కాని పౌలు,
ఆ పామును మంటలోకి దులిపి వేసాడు. అతనికి ఏ
హానీ కలుగలేదు. 6వాళ్ళు అతని శరీరం వాచి
పోతుందనో, లేక అతడు అకస్మాత్తుగా చనిపోతాడనో
అనుకొని చాలా సేపు కాచుకున్నారు. అతనికి ఏ హానీ
కలగక పోవటం గమనించి, వాళ్ళు తమ మనస్సును
మార్చుకొని, “అతడు ఒక దేవత” అని అన్నారు.
7ఆ ప్రక్కనున్న పొలాలు ‘పొప్లి’ అనే అతనికి చెంది
నవి. పొప్లి ఆ ద్వీపానికి అధికారి. అతడు మమ్మల్ని
తన యింటికి అహ్వానించి మూడు రోజుల దాకా
అతిథిసత్కార్యాలు చేసాడు. 8పొప్లి తండ్రి జ్వరంతో,
చీమునెత్తురు విరేచనాలతో మంచం పట్టి ఉన్నాడు.
పౌలు అతణ్ణి చూడటానికి వెళ్ళాడు. దేవుణ్ణి ప్రార్థించి
పౌలు తన చేతుల్ని అతని తలపై ఉంచాడు. వెంటనే
అతనికి నయమై పోయింది. 9ఈ విధంగా జరిగిన
తర్వాత ఆ ద్వీపంలో ఉన్న మిగతా రోగులు కూడా
వచ్చారు. వాళ్ళక్కూడా నయమైపోయింది. 10ఆ ద్వీప
వాసులు మమ్మల్ని ఎన్నో విధాలుగా గౌరవించి మేము
ప్రయాణమయ్యేముందు మాకు కావలసిన సామగ్రి
నిచ్చారు.

## రోముకు రావటం

11చలికాలమంతా ఆ ద్వీపంలో ఉండి పోయిన
ఒక ఓడలో మూడు నెలల తర్వాత ప్రయాణం
చేసాము. అది అలెక్సంద్రియ నగరానికి చెందిన ఓడ.
దాని పేరు “కవల దేవతలు.” 12మేము ‘సురకూసై’
అనే పట్టణానికి చేరుకున్నాము. సురకూసైలో మేము
మూడు రోజులుండి, మరల బయలు దేరాము.
13మేము రేగియ నగరానికి వచ్చాము. మరుసటి రోజు
నైరుతి గాలి వీచటంతో మేము బయలు దేరగలిగాము.

ఒక రోజు తరువాత మేము పొతియొలీ నగరం చేరాము.
14అక్కడున్న సోదరుల్లో కొందర్ని కలుసు కున్నాము.
వాళ్ళు మమ్మల్ని ఆహ్వానించి తమతో ఒక వారం
ఉండుమన్నారు. ఈ విధంగా రోము చేరుకు న్నాము.
15రోములో ఉన్న సోదరులు మేము వస్తున్నా మని
విన్నారు. మమ్మల్ని కలుసుకోవ టానికి వాళ్ళు
అప్పియా ఫోరన్,* త్రెయిన్ టావెర్న్ అనే గ్రామాల
వరకు వచ్చారు. వీళ్ళను చూడగానే పౌలు దేవునికి
కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. అతనిలో ధైర్యం కలి
గింది. 16మేము రోము పట్టణం చేరుకున్నాక పౌలును
ఏకాంతంగా ఉండనిచ్చారు. కాని ఒక సైనికుణ్ణి అతనికి
కాపలాగా ఉంచారు.

### రోము నగరంలో బోధించటం

17మూడు రోజుల తర్వాత పౌలు యూదుల నాయ
కుల్ని పిలిపించాడు. అంతా సమావేశమయ్యాక పౌలు
వాళ్ళతో, "సోదరులారా! మన ప్రజలకు విరుద్ధంగా
లేక మన పూర్వీకుల ఆచారాలకు విరుద్ధంగా నేను
ఏదీ చెయ్యలేదు. అయినా నన్ను యెరూషలేములో
బంధించి రోము అధికారులకు అప్పగించారు. 18వాళ్ళు
విచారణ చేసారు. కాని యూదులు ఆరోపించినట్లు
మరణదండన పొందవలసిన అపరాధమేదీ నేను చెయ్య
లేదు. కనుక నన్ను విడుదల చెయ్యాలనుకున్నారు.
19కాని, దానికి యూదులు ఒప్పుకోలేదు. నేను చక్ర
వర్తికి విజ్ఞాపన చెయ్యటం అవసరమైంది. యూదులపై
నేరారోపణ చెయ్యటానికి నేనిక్కడికి రాలేదు. 20ఈ
కారణంగానే నేను మిమ్మల్ని చూసి మాట్లాడాలని
పిలువనంపాను. ఇశ్రాయేలు ప్రజల్లో ఉన్న ఆశ కోసం
నేనీ సంకెళ్ళలో ఉన్నాను" అని అన్నాడు.
21వాళ్ళు ఈ విధంగా సమాధానం చెప్పారు:
"యూదయ నుండి మిమ్మల్ని గురించి మాకెలాంటి
ఉత్తరంరాలేదు. అక్కడినుండి వచ్చిన సోదరులు కూడా
మిమ్మల్ని గురించి ఏ సమాచారం చెప్పలేదు. చెడుగా
మాట్లాడలేదు. 22కాని అన్ని ప్రాంతాల వాళ్ళు ఈ
మతాన్ని గురించి విరుద్ధంగా మాట్లాడుతున్నారని
మాకు తెలుసు. అందువలన దీన్ని గురించి మీ అభి
ప్రాయం వినాలని ఉంది."

23పౌలును కలుసుకోవటానికి వాళ్ళు ఒక దినాన్ని
నిర్ణయించారు. ఆ రోజు మొదటి రోజుకన్నా ఎక్కువ
మంది పౌలు నివసిస్తున్న స్థలానికి వచ్చారు. పౌలు
ఉదయంనుండిసాయంకాలందాకా వాళ్ళతో మాట్లాడి,
దేవుని రాజ్యాన్ని గురించి విడమరచి చెప్పాడు. మోషే
ధర్మశాస్త్రంనుండి, ప్రవక్తల వ్రాతల నుండి ఉదాహ
రణలు తీసుకొని, యేసును గురించి చెప్పి వాళ్ళను
ఒప్పించటానికి ప్రయత్నించాడు. 24అతడు చెప్పింది
కొందరు నమ్మారు. కొందరు నమ్మలేదు. 25వాళ్ళలో
వాళ్ళకు భేదాభిప్రాయం రావటం వలన వాళ్ళు వెళ్ళి
పోవటం మొదలుపెట్టారు. పౌలు ఈ చివరి మాట
చెప్పటం మొదలు పెట్టాడు: "పరిశుద్ధాత్మ మీ పూర్వీ
కులతో ప్రవక్త యెషయా ద్వారా ఈ విధంగా చెప్పి
నిజం పలికాడు:

26 'ప్రజలతో ఈ విధంగా చెప్పు: మీరెప్పుడూ
వింటుంటారు. కాని ఎన్నటికీ అర్థం చేసు
కోరు! మీరు అన్ని వేళలా చూస్తుంటారు.
కాని ఎన్నటికీ గ్రహించరు.
27 వాళ్ళు కళ్ళతో చూసి, చెవుల్తో విని
హృదయాలతో అర్థం చేసుకొని నా వైపు
మళ్ళితే నేను వాళ్ళకు నయం చేస్తాను.
కాని అలా జరుగకూడదని ఈ ప్రజల హృద
యాలు ముందే మొద్దు బారాయి. వాళ్ళకు
బాగా వినిపించదు. వాళ్ళు తమ కళ్ళు
మూసుకున్నారు.'

*యెషయా 6:9-10*

28"అందువల్ల మీరీ విషయాన్ని గ్రహించాలి. రక్ష
ణను గురించి ఈ సందేశం యూదులు కాని వాళ్ళ
వద్దకు పంపబడింది. వాళ్ళు వింటారు!" 29*
30పౌలు రెండు సంవత్సరాలు తాను అద్దెకు తీసు
కున్న ఇంట్లో నివసించాడు. తనను చూడాలని వచ్చిన
వాళ్ళందరికీ స్వాగతం చెప్పాడు. 31ధైర్యంగా,
స్వేచ్ఛతో దేవుని రాజ్యాన్ని గురించి చెప్పి, యేసు
క్రీస్తు ప్రభువును గురించి బోధించాడు.

---

**అప్పియా ఫోరన్** రోము నగరము దగ్గర అప్పియాకు వెళ్ళే
మార్గములోనున్న ఒక సంత జరిగే గ్రామము. త్రెయిన్
టావెర్న్ అనగా మూడు సత్రాల గ్రామము.

**వచనం 29** కొన్ని వ్రాత ప్రతులలో 29వ వాక్యము చెప్ప
బడింది: "అతడిలా అన్నాక, యూదులు తమలో తాము
తీవ్రంగా వాదించుకొంటూ వెళ్ళిపోయారు."

# రోమీయులకు వ్రాసిన లేఖ

1 యేసుక్రీస్తు సేవకుడైన పౌలు నుండి: దేవుడు
తన అపొస్తలునిగా* పని చేయటానికి రమ్మని
నన్ను పిలిచినాడు. దేవుని సువార్తను ప్రకటించటానికి
నన్ను ప్రత్యేకించినాడు.
2దేవుడు ఈ సువార్తను తన ప్రవక్తలతో వ్రాయించి
పవిత్ర లేఖనముల ద్వారా ఇంతకు క్రితమే తెలియ
చేసాడు. 3ఈ సువార్త దేవుని కుమారుడును మన
ప్రభువు అయిన యేసుక్రీస్తును గురించి. ఆయన
దావీదు వంశంలో మానవునిగా జన్మించాడు. 4పవిత్ర
మైన దేవుని ఆత్మ ఆయన్ని తన శక్తితో బ్రతికించి,
ప్రభువైన యేసుక్రీస్తు దేవుని కుమారుడని నిరూపించి
నాడు. 5ఆయన ద్వారా నేను దేవుని దయను పొంది
ఆయన కోసం అపొస్తలుడనయ్యాను. ప్రజలందరు
సువార్తను విశ్వసించి దాన్ని అనుసరించాలని దేవుని
ఉద్దేశ్యం. 6యేసుక్రీస్తుకు చెందిన వారవుటకు పిలువ
బడిన వాళ్ళలో మీరు కూడా ఉన్నారు. 7అందువల్ల
రోము పట్టణంలో ఉన్న మీ అందరికీ వ్రాయుట
మేమనగా మీరు దేవునికి ప్రియమైన వాళ్ళు. ఆయన
మిమ్మల్ని తన ప్రజగా ఉండటానికి పిలిచాడు. మన
తండ్రియైన దేవుడు, యేసుక్రీస్తు ప్రభువు మీకు
అనుగ్రహాన్ని ప్రసాదించి మీలో శాంతి కలుగు
జేయునుగాక!

### రోము నగరాన్ని దర్శించాలని అభిలాష

8మీ విశ్వాసాన్ని గురించి ప్రపంచానికంతా తెలి
సింది. కనుక నన్ను ముందు యేసుక్రీస్తు ద్వారా
దేవునికి కృతజ్ఞతలు అర్పించనివ్వండి. 9నేను దేవుని
కుమారుని సువార్తను ప్రకటించి మనస్ఫూర్తిగా ఆయన
సేవ చేస్తున్నాను. 10నేను ప్రార్థనలు చేసినప్పుడెల్లా
విడువకుండా మిమ్మల్ని జ్ఞాపకం చేసుకొంటాను.
దానికి ఆ దేవుడే సాక్షి. చివరకు ఇప్పుడైనా నేను మీ
దగ్గరకు రావటానికి దైవేచ్ఛవల్ల మార్గం ఏర్పడాలని
ప్రార్థిస్తున్నాను. 11మీకు ఆధ్యాత్మిక శక్తి కలిగేటట్లు
ఆత్మీయవరాన్ని అందించాలని మీ దగ్గరకు రావాలను
కొంటున్నాను. 12అంటే మీరూ, నేనూ మనలోవున్న
విశ్వాసం ద్వారా పరస్పరం ప్రోత్సాహపరచు కోవాలని
ఆశిస్తున్నాను. 13సోదరులారా! నేను, మిగతా యూదు
లుకాని వాళ్ళనుండి ఫలం పొందినట్లే మీ నుండి కూడా
ఫలం పొందాలని, మీ దగ్గరకు రావాలని ఎన్నోసార్లు
అనుకున్నాను. కాని ఇప్పటి వరకు ఆటంకాలు కలి
గాయి. ఈ విషయం మీరు గ్రహించాలని నా కోరిక.
14గ్రీకులకు, గ్రీకులు కాని వాళ్ళకు, జ్ఞానులకు,
అజ్ఞానులకు బోధించవలసిన కర్తవ్యం నాది. 15అందుకే
రోము నగరంలో ఉన్న మీకు కూడా సువార్త ప్రక
టించాలని అనుకొంటున్నాను.
16సువార్త విషయంలో నేను సిగ్గుపడను. ఎందు
కంటే, విశ్వాసమున్న ప్రతి ఒక్కరికీ, అంటే యూదులకే
కాక ఇతరులకు కూడా రక్షణను కలిగించే దేవుని శక్తి
అది. 17ఈ సువార్తలో దేవుడు మానవుల్ని నీతిమంతు
లుగా పరిగణించే విధానాన్ని గురించి చెప్పబడివుంది.
అది విశ్వాసంతో మొదలై విశ్వాసంతో అంతమౌ
తుంది. దీన్ని గురించి లేఖనాల్లో, "విశ్వాసంవల్ల నీతి
మంతుడైన వాడు అనంతజీవితం పొందుతాడు"* అని
వ్రాయబడి ఉంది.

### యూదులుకాని వాళ్ళు చేసిన పాపాలు

18భక్తిహీనులై దుర్బుద్ధితో సత్యాన్ని అణిచిపెట్టే
ప్రజలపై, దేవుడు స్వర్గంనుండి తన ఆగ్రహాన్ని
చూపుతాడు. 19తనను గురించి తెలియవలసిన విష
యాలు దేవుడు వాళ్ళకు తెలియచేసాడు కనుక అవి
వాళ్ళకు స్పష్టంగా తెలుసు. 20కంటికి కనిపించని దేవుని
గుణాలు, అంటే, శాశ్వతమైన ఆయన శక్తి, దైవికమైన
ఆయన ప్రకృతి ప్రపంచం సృష్టింపబడిన నాటినుండి
స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆయన సృష్టి ద్వారా,
ఆయన గుణాన్ని మానవులు చూడగలిగారు. కనుక
వాళ్ళు ఏ సాకూ చెప్పలేని స్థితిలో ఉన్నారు. 21ఎందు
కంటే, వాళ్ళకు దేవుడెవరో తెలిసినా, వాళ్ళాయనను
దేవునిగా స్తుతింపలేదు. ఆయనకు కృతజ్ఞతలు కూడా
చెప్పలేదు. దానికి మారుగా వాళ్ళలో పనికిమాలిన
ఆలోచనలు కలిగాయి. తెలివిలేని వాళ్ళ మనసులు
అంధకారమైపోయాయి. 22వాళ్ళు తాము తెలివిగల
వాళ్ళమని చెప్పుకొన్నారు కాని మూర్ఖులవలె

**అపొస్తులుడు** అనగా పంపబడినవాడు అని అర్థం.

**విశ్వాసం ... పొందుతాడు** హబక్కూకు 2:4.

ప్రవర్తించారు. 23ఏలాగనగా చిరకాలం ఉండే దేవుని
తేజస్సును నశించిపోయే మనిషిని పోలిన విగ్రహాలకు,
పక్షి విగ్రహాలకు, జంతువుల విగ్రహాలకు, ప్రాకే ప్రాణుల
విగ్రహాలకు మార్చి వాటిని పూజించారు.
24అందువల్ల దేవుడు వాళ్ళను, వాళ్ళ హృదయా
లలోని మలినమైన లైంగిక కోరికలు తీర్చు కోవటానికి
వదిలివేసాడు. తద్వారా వాళ్ళు పరస్పరం తమ దేహా
లను మలినం చేసుకొన్నారు. 25దేవుడు చెప్పిన
సత్యాన్ని అసత్యానికి మార్చారు. సృష్టికర్తను పూజించి
ఆయన సేవ చెయ్యటానికి మారుగా ఆ సృష్టికర్త
సృష్టించిన వాటిని పూజించి వాటి సేవ చేసారు.
సృష్టికర్త సర్వదా స్తుతింపదగినవాడు. ఆమేన్!
26పురుషులు కూడా ఈ విధంగా చెయ్యటం వల్ల,
దేవుడు వాళ్ళను సిగ్గుమాలిన తమ కోరికలకు
వదిలివేసాడు. వాళ్ళ స్త్రీలు కూడా సహజ సంపర్కాలను
వదిలివేసి అసహజమైన సంపర్కాలకు అలవాటు పడి
పోయారు. 27అదే విధంగా, పురుషులు కూడా స్త్రీలతో
సహజ సంపర్కాలు వదిలి వేసి పురుషులతో సంపర్కం
పొందాలనే కోరికలతో చెలరేగి పోయారు. పురుషులు
పురుషులతో అసహజమైన సహవాసాలు చేసి తమ
అసహజతకు తగిన శిక్షను స్వయంగా అను
భవిస్తున్నారు.
28పైగా వాళ్ళు దేవునికి సంబంధించిన జ్ఞానాన్ని
లెక్కచెయ్యలేదు. కనుక దేవుడు వాళ్ళను వాళ్ళ నీచ
బుద్ధికి వదిలి వేసాడు. తద్వారా వాళ్ళు చెయ్యరాని
పనులు చేసారు. 29అన్యాయం, దుష్టత్వం, దురాశ,
దుర్నీతి, ద్వేషం, హత్య, పోరాటం, మోసం, అసూయ
అనే గుణాలు వాళ్ళలో సంపూర్ణంగా నిండి పోయాయి.
వాళ్ళు వృధాగా మాట్లాడుతూ, 30ఇతర్లను నిందిస్తూ,
దేవుణ్ణి ద్వేషిస్తూ, ఇతర్లపై దౌర్జన్యం చూపుతూ,
గర్విస్తూ, బడాయిలు చెప్పుకొంటూ జీవిస్తూ
ఉంటారు. దుర్మార్గపు పనులు చెయ్యటానికి రకరకాల
మార్గాలు కనిపెడ్తూ ఉంటారు. అంతేకాక తమ తల్లి
దండ్రుల పట్ల అవిధేయతగా ప్రవర్తిస్తూ ఉంటారు.
31వాళ్ళలో తెలివిలేదు, విశ్వాసము లేదు, హృదయము
లేదు, కనికరం లేదు. 32దేవుని నీతి నియమములకు
వ్యతిరేకంగా ఇలాంటి పనులు చేసే వాళ్ళకు మరణ
శిక్ష తప్పదని వాళ్ళకు తెలుసు. కాని వాళ్ళు ఆ పనులు
చేస్తూ ఉండటమే కాకుండా ఆ పనులు చేసే వాళ్ళను
మెచ్చుకొంటూ ఉంటారు.

## దేవుని తీర్పు

2 ఇతర్లపై తీర్పు చెప్పే నీవు, ఏ సాకూ చెప్పలేని
స్థితిలో ఉన్నావు. ఎందుకంటే, ఏ విషయాల్లో
నీవు ఇతర్లపై తీర్పు చెపుతున్నావో అవే పనులు నీవు
కూడా చేస్తున్నావు. అందువల్ల నీకు నీవే శిక్ష
విధించుకుంటున్నావు. 2దేవుడు అలాంటి దుర్మార్గపు
పనులు చేస్తున్న వాళ్ళకు సత్యం ఆధారం మీద న్యాయ
మైన శిక్ష విధిస్తాడని మనకు తెలుసు. 3మిత్రమా! ఏ
కారణాల వల్ల నీవు వాళ్ళపై తీర్పు చెపుతున్నావో
అవే పనులు నీవు కూడా చేస్తున్నావు. మరి అలాంట
ప్పుడు దేవుని శిక్షను తప్పించుకోగలనని ఎలా అను
కుంటున్నావు? 4లేక, నీవు దేవుని అనంతమైన
దయను, క్షమను, సహనాన్ని ద్వేషిస్తున్నావా? నీవు
మారుమనస్సు పొందాలని దేవుడు నీపై దయ
చూపాడు. ఈ విషయం నీకు తెలియదా? 5కాని,
నీది కఠిన హృదయం. అది పశ్చాత్తాపం పొందదు.
కనుక దేవుడు ఆగ్రహం చూపే రోజున నీకు లభింప
నున్న శిక్షను, స్వయంగా ఎక్కువ చేసు కొంటు
న్నావు. ఆ రోజు న్యాయమైన తీర్పు నీకు వ్యక్తమౌ
తుంది. 6ఆ రోజు దేవుడు ప్రతి ఒక్కనికి అతడు
చేసిన పనిని బట్టి ప్రతిఫలం ఇస్తాడు.* 7కొందరు
ఎప్పుడూ మంచి పనులు చేస్తూ ఉంటారు. వాళ్ళు
తేజస్సును, గౌరవాన్ని, నశించని దేహాన్ని పొందాలని
ఎదురుచూస్తూ ఉంటారు. అలాంటి వాళ్ళకే దేవుడు
అనంత జీవాన్నిస్తాడు. 8మరికొందరు సత్యాన్ని తృణీ
కరించి, చెడును అనుసరిస్తూ స్వార్థంతో జీవిస్తూ
ఉంటారు. దేవుడు అలాంటి వాళ్ళపై తన ఆగ్రహాన్ని
తీవ్రంగా చూపుతాడు. 9చెడును చేసిన ప్రతి మనిషికి
కష్టాలు, దుఃఖాలు సంభవిస్తాయి. అవి యూదులకు,
తర్వాత ఇతరులకు కూడా సంభవిస్తాయి. 10మంచి
చేసిన ప్రతి ఒక్కనికి తేజస్సు, గౌరవము, శాంతి లభి
స్తాయి. అవి మొదట యూదులకు తర్వాత ఇతరులకు
కూడా లభిస్తాయి. 11దేవుడు పక్షపాతం చూపడు.
12ధర్మశాస్త్రము లేని పాపులు ధర్మశాస్త్రము లేకుం
డానే నశించిపోతారు. అలాగే ధర్మశాస్త్రం ఉండి కూడా
పాపం చేసిన వాళ్ళపై దేవుడు ధర్మ శాస్త్రానుసారం
తీర్పు చెపుతాడు. 13ఎందుకంటే, ధర్మశాస్త్రాన్ని
విన్నంత మాత్రాన దేవుని దృష్టిలో నీతి మంతులు
కాలేరు. కాని ధర్మశాస్త్రంలో ఉన్న నియమాల్ని విధేయ
తతో ఆచరించే వాళ్ళను దేవుడు నీతిమంతులుగా
పరిగణిస్తాడు. 14యూదులుకాని వాళ్ళకు ధర్మశాస్త్రం
లేదు. కాని వాళ్ళు సహజంగా ధర్మశాస్త్రం చెప్పినట్లు
నడుచుకొంటే వాళ్ళకు ధర్మశాస్త్రం లేకపోయినా,
వాళ్ళు నడుచుకునే పద్ధతే ఒక ధర్మశాస్త్రం అవుతుంది.
15వాళ్ళ ప్రవర్తన, ధర్మశాస్త్ర నియమాలు వాళ్ళ హృద
యాలపై వ్రాయబడినట్లు చూపిస్తుంది. ఇది నిజమని
వాళ్ళ అంతరాత్మలు కూడా చెపుతున్నాయి. వాళ్ళు
కొన్ని సార్లు సమర్థించుకొంటూ, మరి కొన్నిసార్లు
నిందించుకొంటూ, తమలోతాము వాదించుకుంటూ
ఉంటారు. 16ఆ రోజు దేవుడు మానవుల రహస్య
ఆలోచనలపై యేసుక్రీస్తు ద్వారా తీర్పు చెపుతాడు.

---

**ప్రతి … ఇస్తాడు** కీర్తన 62:12; సామె. 24:12.

నేను ప్రజలకు అందించే సువార్త ఈ విషయాన్ని
తెలియ జేస్తుంది.

### యూదులు, వాళ్ళ ధర్మశాస్త్రము

17నీవు యూదుడవని చెప్పుకొంటావు. ధర్మ
శాస్త్రాన్ని నమ్ముకొన్నావు. దేవునితో నీకు ఉన్న సంబం
ధాన్ని గురించి గర్వంగా చెప్పుకుంటావు. 18నీవు ధర్మ
శాస్త్రం ప్రకారము శిక్షణ పొందావు. దేవుని ఉద్దేశ్యం
తెలుసుకొన్నావు. మంచిని గుర్తించ గలుగుతున్నావు.
19అంధులకు మార్గదర్శివని, చీకట్లో ఉన్నవాళ్ళకు
వెలుగువంటివాడవని నీవను కొంటున్నావు. 20మీ ధర్మ
శాస్త్రంలో జ్ఞానం, సత్యం ఉన్నాయి కనుక నీవు మూర్ఖు
లను సరిదిద్దగలననుకొంటున్నావు. అజ్ఞానులకు
బోధించగలననుకొంటున్నావు. 21ఇతర్లకు బోధించే
నీవు స్వయంగా నీకు నీవే ఎందుకు బోధించుకోవటం
లేదు? దొంగతనము చేయరాదని బోధించే నీవు
దొంగతనము చేయవచ్చా? 22వ్యభిచారం చేయరాదని
బోధించే నీవు వ్యభిచారం చేయవచ్చా? విగ్రహారా
ధనను అసహ్యించుకునే నీవు మందిరాలు దోచు
కోవచ్చా? 23ధర్మశాస్త్రాన్ని గురించి గర్వంగా చెప్పు
కొనే నీవు ధర్మశాస్త్రాన్ని అతిక్రమించి దేవుణ్ణి అగౌరవ
పరచవచ్చా? 24ఈ విషయంపై, "నీ కారణంగా దేవుని
పేరు యూదులుకాని వాళ్ళ మధ్య దూషింపబడింది"*
అని వ్రాయబడివుంది.

25ధర్మశాస్త్రాన్ని అనుసరిస్తే సున్నతికి* విలువ
ఉంది. కాని నీవు ధర్మశాస్త్రాన్ని ఉల్లంఘిస్తే, నీ సున్నతికి
విలువలేదు. 26కనుక సున్నతి చేయించుకోని వాళ్ళు
ధర్మశాస్త్ర నియమాల్ని పాటిస్తే వాళ్ళు సున్నతి
చేయించుకొన్న వాళ్ళతో సమానము కదా?
27యూదులైన మీ దగ్గర ధర్మశాస్త్రం వ్రాత మూలంగా
ఉంది. మీరు సున్నతి చేయించుకుంటారు. అయినా,
మీరు ధర్మశాస్త్రాన్ని ఉల్లంఘించారు కనుక, ధర్మ
శాస్త్రాన్ని అనుసరిస్తున్న వ్యక్తి, అతడు సున్నతి పొందని
వాడైనా మీరు తప్పు చేస్తున్నారని రుజువు చేస్తున్నాడు.
28నిజమైన సున్నతి బాహ్యమైనది, శారీరకమైనది
కాదు. అదేవిధంగా యూదునివలే బాహ్యంగా కనబడి
నంత మాత్రాన యూదుడుకాలేడు. 29అంతరంగంలో
యూదునిగా ఉన్నవాడే నిజమైన యూదుడు. హృద
యపు సున్నతి అంటే పరిశుద్ధాత్మ ద్వారా సున్నతి
పొందటం అన్నమాట. ధర్మశాస్త్ర నియమంతో కాదు.
ఇలాంటివాణ్ణి దేవుడు మెచ్చుకొంటాడు. మానవులు
కాదు.

3 సున్నతి పొందిన వాళ్ళలో ఏదైనా ప్రత్యేకత
ఉందా? లేదు. మరి అలాంటప్పుడు యూదు
లుగా ఉండటంవల్ల వచ్చిన లాభమేమిటి? 2ఎంతో
లాభం ఉంది. అన్నిటికన్నా ముఖ్యమేమిటంటే దేవుడు
వాళ్ళకు తన సందేశాన్ని అప్పగించాడు. 3మరి వాళ్లల్లో
కొందరు నమ్మతగని వాళ్ళున్నంత మాత్రాన దేవుడు
నమ్మతగని వాడని అనగలమా? 4అలా అనలేము. ప్రతి
ఒక్కడూ అసత్యం చెప్పినాసరే, దేవుడు మాత్రం
సత్యవంతుడుగా ఉంటాడు! ఈ విషయమై ఇలా
వ్రాయబడివుంది:

> "నీవు మాట్లడినప్పుడు నిజం చెప్పావని
> ఋజువౌతుంది. నీపై విచారణ జరిగి
> నప్పుడు నీవు గెలుస్తావు!"
>
> *కీర్తన 51:4*

5మనం అధర్మంగా ఉన్నాము కనుకనే దేవునిలో
ఉన్న ధర్మం స్పష్టంగా కనిపిస్తోందంటే ఏమనగలము?
దేవుడు మనల్ని శిక్షించి తప్పు చేస్తున్నాడనగలమా?
నేను మానవ నైజం ప్రకారం తర్కిస్తున్నాను. 6ఎన్న
టికీ కాదు. అలాగైనట్లైతే దేవుడు ప్రపంచంపై ఎట్లా
తీర్పు చెప్పగలడు?
7"నేను అసత్యవంతునిగా ఉండటంవల్ల దేవుడు
సత్యవంతుడనే కీర్తి పెరుగుతున్నట్లైతే, నేను పాపినని
ఇంకా ఎందుకంటున్నారు? 8మంచి కలగటానికి మనం
పాపంచేద్దాం" అని అనకూడదు. మేమీ విధంగా బోధిం
చినట్లు కొందరు మమ్మల్ని నిందించి అవమానిస్తు
న్నారు. వాళ్ళకు తగిన శిక్ష లభిస్తుంది.

### నీతిమంతుడొక్కడూ లేడు

9మరి ఇంతకూ ఏమని నిర్ణయం చేద్దాం? మనం
వాళ్ళకంటే ఉత్తమమైన వాళ్ళమనా? ఎన్నటికి కాదు.
యూదులు, యూదులుకాని వాళ్ళు, అందరూ సమా
నంగా పాపం చేసారు. దీన్ని నేనిదివరకే ఋజువు
చేసాను. 10ఈ విషయమై ఇలా వ్రాయబడి ఉంది:

> "నీతిమంతుడు లేడు. ఒక్కడు కూడా లేడు!
> 11 అర్థం చేసుకొనేవాడొక్కడూ లేడు. దేవుణ్ణి
> అన్వేషించే వాడెవ్వడూ లేడు.
> 12 అందరూ వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు.
> అందరూ కలిసి పనికిరాని వాళ్ళైపోయారు.
> మంచి చేసే వాడొక్కడూ లేడు. ఒక్కడు
> కూడా లేడు!"
>
> *కీర్తన 14:1-3*

---

**నీ కారణంగా ... దూషింపబడింది** యెషయా 52:5; యెహెజ్కే. 36:22

**సున్నతి** పురుషాంగము యొక్క ముందు చర్మాన్నికోయటం. ప్రతియూదా బాలునికి ఈ సున్నతి చేసే వాళ్ళు. దేవుడు అబ్రాహాముతో చేసిన ఒప్పందానికి ఇది బాహ్యమైన గుర్తు.

[13] "వాళ్ళ నోళ్ళు తెరుచుకొన్న సమాధుల్లా
ఉన్నాయి. వాళ్ళ నాలుకలు మోసాలు పలు
కుతూ ఉంటాయి;"
*కీర్తన 5:9*

"వాళ్ళ పెదాలపై పాము విషం ఉంటుంది!"
*కీర్తన 140:3*

[14] "వాళ్ళ నోటినిండా తిట్లూ, ద్వేషంతో
కూడుకొన్న మాటలు ఉంటాయి!"
*కీర్తన 10:7*

[15] "వాళ్ళ పాదాలు రక్తాన్ని చిందించటానికి
తొందర పడ్తుంటాయి.
[16] వాళ్ళు తాము నడిచిన దారుల్లో వినాశ
నాన్ని, దుఃఖాన్ని వదులుతుంటారు.
[17] వాళ్ళకు శాంతి మార్గమేదో తెలియదు!"
*యెషయా 59:7-8*

[18] "వాళ్ళ కళ్ళలో దైవభీతి కనిపించదు."
*కీర్తన 36:1*

[19]ధర్మశాస్త్ర నియమాలు ధర్మశాస్త్రాన్ని అనుసరిం
చవలసిన వారికి వర్తిస్తాయని మనకు తెలుసు. తద్వారా
ప్రపంచంలో ఉన్న వాళ్ళందరూ, అంటే యూదులు
కాని వాళ్ళేకాక, యూదులు కూడా దేవునికి లెక్క
చెప్పవలసి ఉంటుంది. ఎవ్వరూ తప్పించుకోలేరు.
[20]ధర్మశాస్త్రం తెలిస్తే పాపాన్ని గురించి జ్ఞానం కలుగు
తుంది. అంతేకాని, ధర్మశాస్త్రాన్ని అనుసరించినంత
మాత్రాన దేవుని దృష్టిలో నీతిమంతులం కాలేము.

### విశ్వాసం ద్వారా నీతిమంతుడు కావటం

[21]కాని దేవుడు ఇప్పుడు ధర్మశాస్త్రం ఉపయోగిం
చకుండా నీతిమంతులయ్యే విధానం మనకు తెలి
యచేసాడు. ఈ విధానాన్ని ప్రవక్తలు ముందే చెప్పారు.
ఇది ధర్మశాస్త్రంలోనూ ఉంది. [22]దీని ప్రకారం యేసు
క్రీస్తులో మనకున్న విశ్వాసంవల్ల దేవుడు మనల్ని
నిర్దోషులుగా పరిగణిస్తున్నాడని విదితమౌతుంది.
ఆయనను విశ్వసించిన ప్రతి ఒక్కనికి ఈ విధానం
వర్తిస్తుంది. [23]అందరూ పాపం చేసారు, కనుక దేవుని
తేజస్సు* పంచుకోవటానికి ఎవ్వరికీ అర్హత లేదు.
అందువల్ల ఈ విధానం అందరికీ వర్తిస్తుంది. వ్యత్యాసం
లేదు. [24]కాని, దేవుడు వాళ్ళను తన ఉచితమైన కృపవల్ల
నీతిమంతులుగా చేస్తున్నాడు. ఇది యేసుక్రీస్తు వల్ల
కలిగే విముక్తి ద్వారా సంభవిస్తుంది. [25]దేవుడు ఇది
వరలో ప్రజలు చేసిన పాపాల్ని లెక్క చెయ్యకుండా
సహనం వహించాడు. ఆయన తన నీతిని నిరూపించా
లని యేసుక్రీస్తు రక్తాన్ని విశ్వసించే ప్రజలకోసం ఆయ
నను కరుణాపీఠంగా చేసాడు. [26]అలా చేసి ఇప్పుడు
తన నీతిని ప్రదర్శిస్తున్నాడు. ప్రజలు తనను నీతిమంతు
నిగా పరిగణించాలని, యేసును విశ్వసించే ప్రజలను
నీతిమంతులుగా చెయ్యాలని ఆయన ఉద్దేశ్యం.
[27]మరి, మనం గర్వించటానికి కారణం ఉందా?
ఖచ్చితంగా లేదు. ఏ న్యాయం ప్రకారం కారణం లేదని
చెప్పగలుగుతున్నాము? విశ్వాసానికి సంబంధించిన
న్యాయంవల్ల కారణం లేదని చెపుతున్నాము. కాని
క్రియా న్యాయం వల్లకాదు. [28]మనిషిలో ఉన్న విశ్వాసం
అతణ్ణి నీతిమంతునిగా చేస్తుంది. ధర్మశాస్త్రం ఆదే
శించిన క్రియలు చేసినందుకు కాదు. ఇది నేను ఖచ్చి
తంగా చెప్పగలను. [29]దేవుడు యూదులకు మాత్రమే
దేవుడా? దేవుడొక్కడే కనుక ఆయన యూదులు
కానివాళ్లకు కూడా దేవుడే. [30]దేవుడు సున్నతి పొందిన
వాళ్లను వాళ్ళలో విశ్వాసం ఉంది కనుక నీతిమంతులుగా
పరిగణిస్తాడు. సున్నతి పొందని వాళ్ళను కూడా వాళ్ళ
విశ్వాసాన్ని బట్టి నీతిమంతులుగా పరిగణిస్తాడు. [31]మరి
అలాగైతే, ఈ విశ్వాసాన్ని స్థాపించి మనం ధర్మశాస్త్రాన్ని
రద్దు చేస్తున్నామా? కాదు. దాని విలువను ఎత్తి
చూపిస్తున్నాము.

### అబ్రాహాము యొక్క విశ్వాసం

4 అబ్రాహాము మన మూలపురుషుడు. అతడు ఈ
విషయంలో ఏమి నేర్చుకొన్నాడు! [2]అబ్రాహాము
చేసిన కార్యాలవలన అతడు నీతిమంతునిగా పరిగణింప
బడి ఉంటే అతడు గర్వించటానికి కారణం ఉండేది.
కాని దేవుని యెదుట కాదు [3]ఈ విషయాన్ని గురించి
ఈ విధంగా వ్రాయబడి ఉంది: "అబ్రాహాము దేవుణ్ణి
విశ్వసించాడు కనుక దేవుడు అతణ్ణి నీతిమంతునిగా
పరిగణించాడు."*
[4]పనిచేసేవానికి కూలి దొరుకుతుంది. అది అతని
హక్కు. ఆ వచ్చిన జీతం బహుమానం కాదు. [5]దుర్మా
ర్గుల్ని నీతుమంతులుగా చెయ్యగల దేవుడు, వాళ్ళు
కార్యాలు చెయ్యకపోయినా వాళ్ళు తనను విశ్వసిస్తే,
వాళ్ళ విశ్వాసాన్నిబట్టి వాళ్ళను నీతిమంతులుగా
పరిగణిస్తాడు. [6]క్రియలు చేయకున్నా దేవునిచే నీతి
మంతునిగా పరిగణింపబడిన మానవుడు ధన్యుడు. ఈ
విషయాన్ని గురించి దావీదు ఈ విధంగా అన్నాడు:

[7] "దేవుడు ఎవరి తప్పుల్ని, పాపాల్ని, క్షమి
స్తాడో వాళ్ళు ధన్యులు.

---

**తేజస్సు** అనగా మహిమ.

**అబ్రాహాము … పరిగణించాడు** ఆది. 15:6.

8ఎవరి పాపాల్ని ప్రభువు వాళ్ళ లెక్కలో
వెయ్యడో వాళ్ళు ధన్యులు.”
*కీర్తన 32:1-2*

9మరి, సున్నతి చేయించుకొన్న వాళ్ళు మాత్రమే
ధన్యులా లేక సున్నతి చేయించుకోని వాళ్ళు కూడా
ధన్యులా? అబ్రాహాములో విశ్వాసం ఉండటం వల్ల
దేవుడతణ్ణి నీతిమంతునిగా పరిగణించాడని మన
మంటూ వచ్చాము. 10దేవుడు, అతణ్ణి నీతిమంతు
నిగా ఎప్పుడు అన్నాడు? సున్నతి చేయించుకొన్న
పిదపనా లేక ముందా? సున్నతి చేయించుకున్న పిదప
కాదు, ముందే. 11అబ్రాహాము సున్నతి చేయించు
కోకముందు అతనిలో విశ్వాస ముండటం వల్ల దేవుడ
తణ్ణి నీతిమంతునిగా పరిగణించాడు. దీనికి చిహ్నంగా
అబ్రాహాము సున్నతిని ఒక ముద్రగా పొందాడు.
తద్వారా సున్నతి పొందకున్నా, విశ్వాసం ఉన్న
వాళ్ళకు అతడు తండ్రి అయ్యాడు. వీళ్ళను నీతిమంతు
లుగా పరిగణించాలని దేవుని ఉద్దేశం. 12అబ్రాహాము
సున్నతి చేయించు కొన్న వాళ్ళకు కూడా తండ్రి.
అంటే అందరికీ కాదు. మన తండ్రి అబ్రాహాము సున్నతి
చేయించు కోకముందు నుండి అతనిలో ఉన్న విశ్వా
సాన్ని తమలో చూపిన వాళ్ళకు మాత్రమే అతడు
తండ్రి. 13అబ్రాహాము మరియు అతని సంతానం
ప్రపంచాన్ని వారసత్వంగా పొందుతారని దేవుడు
వాగ్దానం చేసాడు. ఈ వాగ్దానం ధర్మశాస్త్రాన్ని పాటించి
నందుకు చెయ్యలేదు. అతనిలో విశ్వాస ముండటం
వలన దేవుడతణ్ణి నీతిమంతునిగా పరిగణించి ఈ
వాగ్దానం చేసాడు. 14ఒకవేళ వారసులు కావటానికి ధర్మ
శాస్త్రం కారణమైతే, విశ్వాసానికి విలువ ఉండదు. పైగా
వాగ్దానానికి అర్థం ఉండదు. 15ధర్మశాస్త్రం ఉంటే దేవుని
ఆగ్రహం ఉంటుంది. కాని ధర్మశాస్త్రం లేకపోతే దాన్ని
అతి క్రమించే ప్రశ్నేరాదు.

16ఆ వాగ్దానము విశ్వాసము ఉండటం వల్ల సంభవి
స్తోంది. అది ఉచితంగా లభించాలని దేవుని ఉద్దేశ్యం.
అది అబ్రాహాము సంతానాని కంతా వర్తిస్తుందని దేవుడు
అభయమిచ్చాడు. అంటే ధర్మశాస్త్రం ఉన్న వాళ్ళకే
కాకుండా అబ్రాహాములో ఉన్న విశ్వాసాన్ని తమలో
వ్యక్తం చేసే వాళ్ళకు కూడా అది వర్తిస్తుందన్న మాట.
అబ్రాహాము మనందరికీ తండ్రి. 17దీన్ని గురించి ఈ
విధంగా వ్రాయబడి ఉంది: “నేను నిన్ను ఎన్నో జనాం
గములకు తండ్రినిగా చేస్తాను.”* దేవుని దృష్టిలో
అబ్రాహాము మనకు తండ్రిలాంటి వాడు. దేవుడు చని
పోయిన వాళ్ళకు ప్రాణం పొయ్యగలడు. తన ఆజ్ఞ
లతో లేనివాటిని సృష్టించగలడు. అలాంటి దేవుణ్ణి
అబ్రాహాము విశ్వసించాడు.

18నిరాశా సమయంలో అబ్రాహాము ఆశతో నమ్మి
కొన్నాడు. అందుకే అతడు ఎన్నో జనములకు తండ్రి
అయ్యాడు. “నీ సంతతి వాళ్ళు చాలా మంది ఉంటారు”
అని దేవుడు చెప్పిన ప్రకారమే జరిగింది. 19అప్పటికి
అబ్రాహాముకు సుమారు నూరు సంవత్సరాల వయస్సు.
అతని శరీరం బలహీనంగా ఉండింది. పైగా శారాకు
గర్భం దాల్చే వయస్సు దాటిపోయి ఉంది. ఈ
సంగతులు అబ్రాహాముకు తెలుసు. అయినా అతని
విశ్వాసం సన్నగిల్లలేదు. 20దేవుడు చేసిన వాగ్దా నంలో
అతడు తన విశ్వాసాన్ని కోల్పోలేదు. దానికి మారుగా
అతడు దృఢ విశ్వాసంతో దేవుణ్ణి స్తుతించాడు.
21దేవుడు తాను చేసిన వాగ్దానాన్ని నిలుపు కోగలడని,
ఆ శక్తి అయనలో ఉందని అబ్రాహాముకు సంపూర్ణ
మైన విశ్వాసం ఉండినది. 22ఈ కారణంగానే, “దేవు
డతణ్ణి నీతిమంతునిగా పరిగణించాడు.” 23‘నీతిమంతు
నిగా పరిగణించాడు’ అన్న పదాలు అతనికొరకు
మాత్రమే వ్రాయబడలేదు. 24అవి మనకోసం కూడా
వ్రాయబడ్డాయి. మనము మన యేసుప్రభువును బ్రతి
కించిన దేవునియందు విశ్వసిస్తున్నాము. కనుక దేవుడు
మనల్ని కూడా నీతిమంతులుగా పరిగణిస్తాడు.
25దేవుడు మన పాపాల కోసం ఆయన్ని మరణానికి
అప్పగించాడు. మనం నీతిమంతులం కావాలని
ఆయన్ని బ్రతికించాడు.

### దేవునితో స్నేహము

5 మనలో విశ్వాసము ఉండటం వలన దేవుడు
మనము నీతిమంతులమని తీర్పు చెప్పాడు. ఆ
కారణంగా, మన యేసు క్రీస్తు ప్రభువు ద్వారా మనకు
దేవునితో స్నేహం కలిగింది. 2మనం ప్రస్తుతం జీవి
స్తున్న జీవితం దేవుని అనుగ్రహం వల్ల సంభవించింది.
ఇది విశ్వాసంగల మనకు యేసుక్రీస్తు ద్వారా లభిం
చింది. దేవుని తేజస్సులో భాగం పంచుకొంటామనే
ఆశ మనలో ఉండటం వల్ల మనకు ఎంతో ఆనందం
కలుగుతోంది. 3అంతేకాదు, కష్టాలు సహనాన్ని
పెంపొందింపచేస్తాయని మనకు తెలుసు. కనుక
మనము కష్టాలు అనుభవించటంలో కూడా ఆనం
దాన్ని పొందుతున్నాము. 4సహనం వల్ల దేవుని మెప్పు,
మెప్పువల్ల ఆయన తేజస్సులో భాగం పంచు
కొంటామనే నిరీక్షణ కలుగుతోంది. 5దేవుడు మన
కిచ్చిన పరిశుద్ధాత్మ ద్వారా తన ప్రేమను మనపై
కురిపించాడు. కనుక ఆ ఆశ విషయంలో మనకు
నిరాశ కలుగదు.

6నిజానికి మనలో శక్తి లేని సమయాన భక్తిహీనుల
మైన మన కోసం క్రీస్తు మరణించాడు. 7నీతిమంతుల
కోసం మరణించటం చాలా అరుదు. మంచి స్నేహితుని
కోసం ఒకడు ధైర్యం చేసి, మరణిస్తే మరణించవచ్చు.

---

**నేను … చేస్తాను** ఆది. 17:5.

8కాని మనమింకా పాపంలో ఉన్నప్పుడే క్రీస్తు మన
కోసం మరణించాడు. ఈ విధంగా దేవుడు తన ప్రేమను
మనకోసం వ్యక్తం చేసాడు.
9దేవుడు యేసుక్రీస్తు రక్తంద్వారా మనము
నీతిమంతులమని తీర్పు చెప్పాడు. కనుక మనము
దేవుని ఆగ్రహం నుండి తప్పకుండా రక్షింపబడుతాము.
ఇది యేసుక్రీస్తు ద్వారా సంభవిస్తుంది. 10ఒకప్పుడు
మనం దేవుని శత్రువులం. అయినా తన కుమారుని
మరణంవల్ల మనకు ఆయనతో సమాధానం కలిగింది.
కనుక క్రీస్తు జీవితం ద్వారా ఆయన మనల్ని తప్ప
కుండా రక్షిస్తాడు. 11పైగా మన యేసుక్రీస్తు ప్రభువు
ద్వారా దేవునితో స్నేహం కలిగినందుకు మనం
ఇప్పుడు ఆనందిస్తున్నాము.

### ఆదాము వల్ల మరణం, క్రీస్తు వల్ల జీవం

12పాపం ఈ ప్రపంచంలోకి ఆదాము ద్వారా
ప్రవేశించింది. పాపం ద్వారా మరణం సంభవించింది.
అంతేకాక అందరూ పాపంచేసారు కనుక అందరికీ
మరణం ప్రాప్తించింది. 13ధర్మశాస్త్రానికి ముందే పాపం
ఈ ప్రపంచంలో ఉండేది. కాని ధర్మశాస్త్రం లేక పోయి
నట్లైతే పాపం లెక్కలోకి వచ్చేది కాదు. 14అయినా,
ఆదాము కాలంనుండి మోషే కాలం వరకు మానవులపై
మరణం రాజ్యం చేసింది. ఆదాము దేవుని ఆజ్ఞను
అతిక్రమించాడు. కాని అతనివలె పాపం చెయ్యని
వాళ్ళపై కూడా మరణం రాజ్యం చేసింది.
ఆదాముకు, రానున్న వానికి కొంత పోలిక ఉంది.
15కాని దేవుడు ఇచ్చిన వరానికి, ఆదాము చేసిన పాపానికి
పోలికలేదు. ఒకడు చేసిన పాపం వల్ల చాలా మంది
మరణించారు. మరొకని అనుగ్రహం వల్ల, అంటే
యేసుక్రీస్తు అనుగ్రహంవల్ల, దేవునిలో వరము, ఆయన
అనుగ్రహము ఉచితంగా లభించాయి. 16పైగా ఆదాము
ఒక్కసారి చేసిన పాపానికి నేరస్థుడుగా తీర్పు ఇవ్వ
బడింది. కాని ఎన్నో పాపాలు చేసిన మనకు దేవుని
నుండి నీతిమంతులముగా అయ్యే వరం లభించింది.
అందువల్ల ఆదాము పాపాన్ని దేవుని వరంతో పోల్చ
లేము. 17ఆదాము పాపం చేసాడు. ఆ ఒక్కని పాపం
వల్ల మరణం రాజ్యం చేసింది. కాని ఆ ‘ఇంకొకని’
ద్వారా అంటే యేసుక్రీస్తు ద్వారా ఆధ్యాత్మిక జీవితం
పొంది రాజ్యం చెయ్యటం తథ్యం. ఇది దేవుని నుండి
నీతియను వరాన్ని, సంపూర్ణమైన ఆయన అను
గ్రహాన్ని పొందిన వాళ్ళకు సంభవిస్తుంది.
18అందువల్ల ఒకడు చేసిన పాపం వల్ల ప్రజలం
దరికీ శిక్ష విధించబడింది. అదే విధంగా ఒకడు ఒక
నీతికార్యాన్ని చేయటం వల్ల, అందరూ శిక్షను తప్పించు
కొని అనంతజీవితం పొందుటకు మార్గమేర్ప డింది.
19ఒకని అవిధేయతవల్ల అనేకులు పాపులుగా చేయ
బడిరి. అలాగే ఒకని విధేయతవల్ల అనేకులు నీతిమంతు
లగుదురు. 20పాపం అధికం కావాలని దేవుడు ధర్మశా
స్త్రాన్నిచ్చాడు. కాని పాపం అధికమైన చోటే అనుగ్రహం
ఇంకా అధికమయ్యింది. 21పాపం మరణంద్వారా రాజ్యం
చేసినట్లు దైవానుగ్రహం నీతిద్వారా రాజ్యం చేసింది.
మన యేసుక్రీస్తు ప్రభువుద్వారా అది మనకు అనంత
జీవం కలిగిస్తుంది.

### పాపం విషయంలో మరణించాము గాని క్రీస్తులో బ్రతికినాము

6 దైవానుగ్రహం అధికం కావాలని మనం పాపం
చేసుకొంటూ పోదామంటారా? 2ఎన్నటికీ కాదు.
పాపపు జీవితం విషయంలో మనం మరణించిన
వారము. అలాంటప్పుడు మనం పాపంలో జీవించు
కొంటూ ఎట్లా ఉండగలము? 3బాప్తిస్మము పొందిన
మన మందరము క్రీస్తుయేసులో ఐక్యత పొందాము.
ఈ బాప్తిస్మము ద్వారా ఆయన మరణంలో కూడా
భాగం పంచుకొన్నామని మీకు తెలియదా? 4ఈ బాప్తి
స్మము ద్వారా మరణించి మనం ఆయనతో సహా
సమాధి పొందాము. తండ్రి తేజస్సు ద్వారా క్రీస్తు
బ్రతికింపబడినట్లుగానే మనం కూడా నూతన జీవి
తాన్ని పొందటమే ఇందులోని ఉద్దేశ్యం.
5మనం ఆయన మరణంలో ఐక్యమైనట్లుగా
ఆయన పునరుత్థానములో కూడా మనం ఐక్యం
కాగలం. 6మన పాపజీవితం క్రీస్తుతో కూడ సిలువ
వేయబడినందున, ఈ పాప శరీరం బలహీనమై, మన
మిక పాపానికి దాసులుగానుండమని మనకు తెలుసు.
7ఎందుకంటే మరణించిన ప్రతీ వ్యక్తి పాపం నుండి
విముక్తి పొందుతాడు. 8మనం క్రీస్తుతో కలిసి మరణిస్తే
ఆయనతో కూడా జీవిస్తామని నమ్ముచున్నాము.
9దేవుడు క్రీస్తును బ్రతికించాడని, ఆయనకు మళ్ళీ
మరణం ప్రాప్తించదని మనకు తెలుసు. మరణానికి
ఆయనపై అధికారం ఉండదు. 10పాపం విషయమై
ఆయన ఒకే ఒకసారి మరణించాడు. కాని ఆయన
జీవిస్తున్న జీవితం దేవుని కోసం జీవిస్తున్నాడు. 11అదే
విధంగా, మీరు పాపం విషయంలో మరణించినట్లు
దేవునికోసం యేసుక్రీస్తులో జీవిస్తున్నట్లు భావించండి.
12నశించిపోయే మన శరీరాన్ని పాపం పాలించ
కుండా జాగ్రత్త పడండి. దాని కోరికలకు లోబడకండి.
13మీ అవయవాలను దుర్నీతికి సాధనాలుగా పాపానికి
అర్పించకండి. దానికి మారుగా మీరు చనిపోయి బ్రతికి
వచ్చిన విషయం జ్ఞాపకం పెట్టుకొని మిమ్మల్ని మీరు
దేవునికి అర్పించుకోండి. మీ అవయవాలను నీతికి
సాధనాలుగా దేవునికి అర్పించండి. 14మీరు ధర్మశాస్త్రం
యొక్క ఆధీనంలోలేరు. కాని దైవానుగ్రహంలో
ఉన్నారు. కనుక పాపం మీపై రాజ్యం చెయ్యదు.

### నీతికి బానిసలు

15అంటే? మనం ధర్మశాస్త్రం యొక్క ఆధీనంలో
లేమని దానికి మారుగా దైవానుగ్రహంలోనున్నామని
పాపం చెయ్యవచ్చా? అలా చెయ్యలేము. 16సేవ
చెయ్యటానికి మిమ్మల్ని మీరు బానిసలుగా అర్పించు
కొంటే మీరు సేవ చేస్తున్న యజమానికి నిజంగా
బానిసలై ఉంటారు. ఇది మీకు తెలియదా? మీరు
పాపానికి బానిసలైతే అది మరణానికి దారితీస్తుంది.
కాని, దేవుని పట్ల విధేయతగా ఉంటే మీరు నీతిమంతు
లౌతారు.

17ఒకప్పుడు మీరు పాపానికి బానిసలు. కాని
మీకందివ్వబడిన బోధనా విధానాన్ని మనసారా స్వీక
రించి దాన్ని అనుసరించారు. దానికి మనం దేవునికి
కృతజ్ఞతలు చెప్పుకొందాం. 18మీరు పాపం నుండి
విముక్తులై నీతికి బానిసలయ్యారు.

19మీకు వీటిని అర్థం చేసుకొనే శక్తి లేదు కనుక
నేను మామూలు ఉదాహరణలు ఉపయోగిస్తూ మాట్లా
డుతున్నాను. ఇదివరలో మీరు మీ అవయవాల్ని అపవి
త్రతకు, దుర్మార్గపు పనులు చెయ్యటానికి బానిసలుగా
అర్పించుకొన్నారు. అదే విధంగా ఇప్పుడు మీ అవ
యవాల్ని నీతికి, పవిత్రతకు నడిపించే బానిసలుగా
అర్పించుకోండి.

20మీరు పాపానికి బానిసలుగా ఉన్నప్పుడు నీతి
మీపై రాజ్యం చెయ్యలేదు. 21ఆ పనులవల్ల మీరు
ఏమి ఫలం పొందారు? వాటివల్ల మరణమే కలుగు
తుంది. 22ఇక ఇప్పుడు మీరు పాపంనుండి విముక్తులై
దేవునికి బానిసలయ్యారు. కనుక మీరు పొందుతున్న
ఫలం పవిత్రతకు దారి తీస్తుంది. చివరకు అనంత
జీవితం లభిస్తుంది. 23పాపం మరణాన్ని ప్రతి ఫలంగా
ఇస్తుంది. కాని దేవుడు యేసుక్రీస్తు ప్రభువు ద్వారా
అనంతాన్ని బహుమానంగా ఇస్తాడు.

### వివాహ బంధం

7 సోదరులారా! నేను ధర్మశాస్త్రం తెలిసిన వాళ్ళతో
మాట్లాడుతున్నాను. ధర్మశాస్త్రానికి ఒక వ్యక్తిపై
అతడు బ్రతికి ఉన్నంతవరకే అధికారం కలిగి
ఉంటుందని మీకు తెలియదా?

2ఉదాహరణకు, ధర్మశాస్త్రం ప్రకారం స్త్రీ అమె భర్త
జీవించి ఉన్నంతవరకే అతనికి బద్ధురాలై ఉంటుంది.
ఒకవేళ అతడు మరణిస్తే ధర్మశాస్త్ర బంధం నుండి
ఆమెకు విముక్తి కలుగుతుంది. 3ఆమె భర్త జీవించి
ఉండగా ఇంకొకణ్ణి వివాహమాడితే ఆమె వ్యభిచారి
అనబడుతుంది. కాని అమె భర్త మరణిస్తే ఆమెకు ఆ
చట్టం నుండి విముక్తి కలుగుతుంది. అప్పుడు ఆమె
ఇంకొకణ్ణి వివాహం చేసుకొన్నా ఆమె వ్యభిచరించిన
దానిగా పరిగణింపబడదు.

4అదే విధంగా నా సోదరులారా! మీరు కూడా క్రీస్తు
శరీరంతో పాటు చనిపోయి ధర్మశాస్త్ర బంధం నుండి
విముక్తి పొందారు. మీరు బ్రతికింపబడ్డ క్రీస్తుకు చెందిన
వారై దేవుని కొరకు ఫలిస్తారు. 5ధర్మశాస్త్రం మూలంగా
కలిగిన దురాశలు మన శరీరాల్లో పని చేయటంవల్ల
మనం మరణాన్ని పొందాము. 6మనల్ని బంధించి
ఉంచిన ధర్మశాస్త్రం విషయంలో మనం మరణించాము
కనుక ఇప్పుడు మనము ఆ బంధం నుండి స్వేచ్ఛను
పొందాము. అందువల్ల వ్రాత పూర్వకంగా ఉన్న
ధర్మశాస్త్రానికి మనమిక బానిసలము కాము. దేవుని
ఆత్మ చూపించిన క్రొత్త మార్గాన్ని అనుసరించి
మనము ఆయన సేవ చేస్తున్నాము.

### ధర్మశాస్త్రము, పాపము

7అంటే, ధర్మశాస్త్రం పాపంతో కూడుకున్నదని
అర్థమా? కాదు. ధర్మశాస్త్రం లేకపోయినట్లయితే
పాపమంటే నాకు తెలిసేది కాదు. "ఇతర్లకు చెందిన
వాటిని ఆశించవద్దని"* ధర్మశాస్త్రం చెప్పి ఉండకపోతే,
ఆశించటమంటే ఏమో నాకు తెలిసేది కాదు. 8ధర్మ
శాస్త్రం చెప్పిన ఆజ్ఞను ఉపయోగించి పాపం నాలో
అన్ని రకాల దురాశల్ని కలిగించింది. ధర్మశాస్త్రం లేక
పోయినట్లైతే పాపంలో ప్రాణముండేది కాదు. 9ఒక
ప్పుడు నేను ధర్మశాస్త్రం లేకుండా జీవించాను. కాని
ఆజ్ఞ రాగానే పాపం మొలకెత్తింది. దానితో నేను
మరణించాను. 10జీవాన్నివ్వటానికి ఉద్దేశింపబడిన ఆ
ఆజ్ఞ నాకు మరణాన్ని కలుగ చెయ్యటం గమనించాను.
11"ఆజ్ఞ" కలుగ చేసిన అవకాశాన్ని ఉపయోగించుకొని,
పాపం నన్ను మోసం చేసి ఆ ఆజ్ఞద్వారా నన్ను
చంపివేసింది.

12సరే! మరి, ధర్మశాస్త్రం పవిత్రమైంది. ధర్మ
శాస్త్రంలో ఉన్న ప్రతీ ఆజ్ఞ పవిత్రమైంది. దానిలో
నీతి, మంచితనము ఉన్నాయి. 13అలాగైతే, మరి ఆ
మంచి ధర్మశాస్త్రం నాకు మరణాన్ని కలిగించిందా?
ఎన్నటికి కాదు. ధర్మశాస్త్రాన్ని ఉపయోగించి పాపం
నాకు మరణాన్ని కలిగించి తన నిజ స్వరూపాన్ని
వ్యక్త పరిచింది. అందువల్ల ధర్మశాస్త్రం యొక్క ఆజ్ఞ
ద్వారా పాపం ఇంకా గొప్ప పాపంగా కనిపించింది.

14ధర్మశాస్త్రం ఆధ్యాత్మికమైనదని మనకు తెలుసు.
కాని నేను బలహీనమైన మనిషిని, పాపానికి బానిసగా
అమ్ముడుపోయిన వాణ్ణి. 15నేనేం చేస్తున్నానో నాకు
తెలియదు. నేను చెయ్యాలనుకొన్నదాన్ని చెయ్యటం
లేదు. దేన్ని ద్వేషిస్తున్నానో దాన్నే చేస్తున్నాను.
16నేను వద్దను కున్న దాన్నే చేస్తే ధర్మశాస్త్రం మంచిదని
అంగీకరిస్తున్నాను. 17నిజానికి చేస్తున్నది నేను కాదు.
నాలో నివసిస్తున్న పాపం ఇలా చేస్తోంది. 18నా శరీరంలో

**ఇతర్లకు ... వద్దని** నిర్గమ. 20:17; ద్వితీ. 5 :12.

మంచి అనేది నివసించటం లేదని నాకు తెలుసు,
మంచి చెయ్యాలనే కోరిక నాలో ఉంది కాని, అలా
చెయ్యలేకపోతున్నాను. 19చెయ్యాలను కొన్న మంచిని
నేను చెయ్యటం లేదు. దానికి మారుగా చెయ్య
రాదనుకొన్న చెడుపు నేను చేస్తూ పోతున్నాను.
20చెయ్యకూడదనుకొన్న దాన్ని నేను చేస్తున్నానంటే,
దాన్ని చేస్తున్నది నేను కాదు. నాలో నివసిస్తున్న
పాపమే అలా చేయిస్తోంది.
21అందువల్ల, 'నేను మంచి చెయ్యాలని అను
కొన్నప్పుడు చెడు నాతో అక్కడే ఉంటుంది' అనే
ఈ నియమం నాలో పని చేస్తున్నట్లు గమనిస్తున్నాను.
22నా అంతరాత్మ దేవుడిచ్చిన ధర్మశాస్త్ర విషయంలో
ఆనందం పొందుతోంది. 23కాని, నా అవయవాల్లో
వేరొక నియమం పని చేస్తున్నట్లు గమనిస్తున్నాను.
నన్ను పాపాత్మునిగా చేస్తున్న ఈ నియమం నా
మెదడులో ఉన్న ధర్మశాస్త్రంతో పోరాడి నన్ను ఖైదీగా
చేస్తోంది. 24నేనెంత దౌర్భాగ్యుణ్ణి! మరణం యొక్క
ఆధీనంలో ఉన్న ఈ నా శరీరం నుండి నన్ను ఎవరు
రక్షిస్తారు?
25అందువల్ల మన యేసుక్రీస్తు ప్రభువు ద్వారా
మనం దేవునికి కృతజ్ఞతలు తెలుపు కొందాం.
స్వయంగా, బుద్ధి పూర్వకంగా నేను దేవుని ధర్మ
శాస్త్రానికి బానిసను. కాని నా శరీరం పాపాన్ని కలుగచేసే
నియమానికి బానిస.

## ఆత్మ ద్వారా జీవము

8 అందువల్ల, ప్రస్తుతం యేసు క్రీస్తులో ఐక్యత
పొంది జీవిస్తున్న వాళ్ళకు దేవుడు శిక్ష విధించడు.
2దేవుని ఆత్మ మనం యేసుక్రీస్తుతో ఐక్యత పొందటం
వల్ల మనలో జీవాన్ని కలుగ చేశాడు. ఆ ఆత్మ యొక్క
నియమం మన పాపానికి, మరణానికి చెందిన నియమం
నుండి నాకు విముక్తి కలిగించింది. 3ధర్మశాస్త్రం అన్నీ
చెయ్యలేక పోయింది. పాపస్వభావం దాన్ని బలహీనం
చేసింది. అందువల్ల దేవుడు తన కుమారుణ్ణి పాపాలు
చేసే మానవుని రూపంలో పాపాలకు బలిగా పంపాడు.
ఆయన వచ్చి మానవునిలో ఉన్న పాపాలకు శిక్ష
విధించాడు. 4ధర్మశాస్త్రం ఆదేశించిన నీతికార్యాలు మన
ద్వారా జరగాలని ఆయన ఉద్దేశ్యం. మనము పాప
స్వభావంతో జీవించటం లేదు. పరిశుద్ధాత్మ చెప్పినట్లు
జీవిస్తున్నాము.
5ప్రాపంచికంగా జీవించే వాళ్ళ మనస్సు ప్రాపంచిక
విషయాలకు లోనైవుంటుంది. కాని దేవుని ఆత్మ
చెప్పినట్లు జీవించే వాళ్ళ మనస్సు ఆ ఆత్మకు సంబం
ధించిన విషయాలకులోనై ఉంటుంది. 6ప్రాపంచిక
విషయాలకు లోనవటం వల్ల మరణం సంభవిస్తుంది.
కాని పరిశుద్ధాత్మకు లోనవటం వల్ల జీవం, శాంతం
లభిస్తాయి. 7ఎందుకంటే, ప్రాపంచిక విషయాలకు
లోనైనవాని మనస్సు దేవుణ్ణి ద్వేషిస్తుంది. అలాంటి
మనస్సు దేవుని ధర్మశాస్త్రానికి ఆధీనమై ఉండదు. ఉండ
జాలదు. 8ప్రాపంచికంగా జీవించే వాళ్ళు దేవుని మెప్పు
పొందలేరు.
9దేవుని ఆత్మ మీలో నిజంగా నివసిస్తున్నట్లైతే,
మీరు ఈ లోక సంబంధంగా జీవించటంలేదన్నమాట.
అంటే మీరు ఆత్మీయంగా జీవిస్తున్నారన్నమాట. క్రీస్తు
యొక్క ఆత్మ తనలో లేనివాడు క్రీస్తుకు చెందడు.
10ఒక వేళ క్రీస్తు మీలో జీవిస్తున్నట్లైతే పాపం కారణంగా
మీ శరీరం చనిపోయినా మీలోవున్న దేవుడు మిమ్మల్ని
నీతిమంతులుగా చేసాడు కనుక, ఆయన ఆత్మ మీకు
జీవాన్నిస్తాడు. 11మరణించిన యేసును దేవుడు లేపి
నాడు. దేవుని ఆత్మ మీలో నివసిస్తున్నట్లైతే, నశించి
పోయే మీ దేహాలకు ఆయన జీవం పోస్తాడు. మృతి
నుండి యేసును లేపినవాడు దేవుడే కావున మీలో
నివసిస్తున్న ఆయన ఆత్మ ద్వారా దేవుడు మీ శరీరాలను
జీవింప చేస్తాడు.
12అందువల్ల సోదరులారా! మనము మన ఐహిక
వాంఛల ప్రకారం బ్రతకనవసరం లేదు. 13ఎందుకంటే,
ఐహికవాంఛలతో జీవిస్తే మీరు మరణిస్తారు. కాని శరీరం
చేస్తున్న చెడ్డ పనుల్ని ఆత్మద్వారా రూపు మాపితే
మీరు జీవిస్తారు.
14దేవుని ఆత్మను అనుసరించిన వాళ్ళు దేవుని
కుమారులు. 15మీరు బానిసలయ్యే ఆత్మను పొంద
లేదు. మీరు దేవుని కుమారులుగా అయ్యే ఆత్మను
పొందారు. ఇది మీలో భయం కలిగించదు. దానికి
మారుగా మనము దేవుణ్ణి, 'అబ్బా! తండ్రీ!' అని
పిలుస్తున్నాము 16మనం దేవుని పుత్రులమని దేవుని
ఆత్మ మన ఆత్మతో కలిసి సాక్ష్యం చెపుతున్నాడు.
17మనము దేవుని సంతానము కనుక మనము ఆయన
వారసులము. క్రీస్తుతో సహా వారసులము. మనము
ఆయనలో కలిసి ఆయన తేజస్సును పంచు
కోవాలనుకొంటే, ఆయనతో కలిసి ఆయన కష్టాలను
కూడా పంచుకోవాలి.

## రానున్న తేజస్సు

18మనకు వ్యక్తం కానున్న తేజస్సు, మనం ప్రస్తుతం
అనుభవిస్తున్న కష్టాలకన్నా ఎన్నో రెట్లు గొప్పదని
నా అభిప్రాయం. 19దేవుడు తన కుమారుల్ని బయలు
పర్చాలని సృష్టి అంతా ఆతృతతో కాచుకొని ఉంది.
20సృష్టి నాశనంకు అప్పగింపబడింది. అయితే తన
కోరిక ప్రకారం కాకుండ, దాన్ని లోబర్చిన వాని చిత్త
ప్రకారం నిరీక్షణలో అప్పగించబడింది. 21బాని
సత్వంతో క్షీణించిపోతున్న ఈ సృష్టి ఒక రోజు విడు
దలపొంది, దేవుని సంతానం అనుభవింపనున్న తేజో
వంతమైన స్వేచ్చను అనుభవిస్తుందనే ఒక విశ్వాసం
ఉంది.

22సృష్టి అంతా ప్రసవించునప్పుడు స్త్రీకి కలిగే
బాధలాంటి నొప్పులతో మూలుగుతూ ఈనాటి వరకు
బాధపడుతుందని మనకు తెలుసు. 23అంతేకాదు,
దేవుని ఆత్మను మొదటి ఫలంగా పొందిన మనము
కూడా మన మనస్సులో మూలుగుతున్నాము. మనం
దత్త పుత్రులం కావాలనీ, మన శరీరాలకు విముక్తి
కలగాలనీ ఆతృతతో కాచుకొని ఉన్నాము. 24మనం
రక్షింపబడినప్పుడు ఈ నిరీక్షణ మనలో ఉంది. కాని
విశ్వాసంతో ఎదురు చూస్తున్నది లభించిన తర్వాత
దాని కోసం ఆశించవలసిన అవసరం ఉండదు. తన
దగ్గరున్న దానికోసం ఎవరు ఎదురు చూస్తారు? 25కాని
మన దగ్గర లేనిదాని కోసం ఆశిస్తే దాని కోసం ఓర్పుతో
నిరీక్షిస్తాము. 26అదే విధంగా మనం బలహీనులం కనుక,
ఏ విధంగా ప్రార్థించాలో మనకు తెలియదు. కనుక,
దేవుని ఆత్మ స్వయంగా మన పక్షాన మాటలు వ్యక్త
పరచలేని మూలుగులతో దేవునికి తెలిపి మనకు
సహాయపడుతున్నాడు. 27ఆయన దేవునితో తన
ప్రజలకోసం ఆయన ఇచ్ఛానుసారం విన్నపం చేస్తు
న్నాడు. మన హృదయాలను పరిశోధించే దేవునికి
ఆయన యొక్క ఆలోచనలు తెలుసు.

## గొప్ప విజయం

28దేవుడు తనను ప్రేమించే ప్రజల కోసం, తన
ఉద్దేశానుసారం పిలువబడిన వాళ్లకోసం ఆయన సమ
స్తము చేయుచున్నాడని మనకు తెలుసు. ఈ ప్రజల్ని
దేవుడు తన ఉద్దేశానుసారంగా పిలిచాడు. 29దేవుడు
తనకు ఇదివరకే తెలిసిన వాళ్ళను తన కుమారునిలా
రూపొందించాలని ప్రత్యేకంగా ఉంచాడు. తనకు చాలా
మంది పుత్రులుండాలని, వాళ్ళలో యేసు మొట్ట
మొదటి వానిగా ఉండాలని ఆయన ఉద్దేశ్యం. 30దేవుడు
ఎవర్ని ప్రత్యేకంగా ఉంచాడో వాళ్ళను పిలిచాడు.
ఎవర్ని పిలిచాడో వాళ్ళను నీతిమంతులుగా చేసాడు.
ఎవర్ని నీతిమంతులుగా చేసాడో వాళ్ళతో తన మహి
మను పంచుకొన్నాడు.

31మరి, మనము దీనికి ఏమి ప్రత్యుత్తరం ఇవ్వ
గలము? దేవుడే మనవైపు ఉన్నప్పుడు మనకు
విరుద్ధంగా ఎవరుంటారు? 32మనందరి కోసం, ఆయన
తన స్వంత కుమారుణ్ణి ఇవ్వటానికి కూడా వెనుకాడ
లేదు. అలాంటప్పుడు తన కుమారునితో సహా అన్నీ
మనకివ్వడా? 33దేవుడు ఎన్నుకొన్న వాళ్ళపై ఎవరు
నేరం మోపుతారు? మనల్ని నీతిమంతులుగా చేసేవాడు
దేవుడే. 34ఇక మనకు ఎవ్వరూ శిక్ష విధించలేరు.
చనిపోయి, బ్రతికి వచ్చిన యేసు క్రీస్తు దేవుని కుడిచేతి
వైపు కూర్చొని మన పక్షాన వేడుకుంటున్నాడు.
35క్రీస్తు ప్రేమనుండి మనల్ని ఎవరు దూరం చెయ్య
గలరు? కష్టం, దుఃఖం, హింస, కరువు, దిగంబరత్వం,
అపాయం, ఖడ్గం, మనల్ని దూరం చెయ్యగలవా?
36దీన్ని గురించి ఈ విధంగా వ్రాయబడి ఉంది:

> “నీ కోసం దినమంతా మరణాన్ని ఎదు
> ర్కొంటూ ఉన్నాము, మేము చంపబడ
> నున్న గొర్రెలవలె ఉన్నాం.”
>
> *కీర్తన 44:22*

37ఈ విషయాలన్నిటిలో, మనల్ని ప్రేమించిన
ఆయన ద్వారా సంపూర్ణ విజయాన్ని సాధించాము.
38చావుగాని, బ్రతుకుగాని, దేవదూతలుగాని, దయ్యా
లుగాని, ప్రస్తుతంగాని, భవిష్యత్తుగాని, మరే శక్తులుగాని
39ఎత్తుగాని, అగాధంగాని, సృష్టిలో ఉన్న మరేదైనాగాని
మన యేసుక్రీస్తు ప్రభువు ద్వారా మనకు లభిస్తున్న
దేవుని ప్రేమనుండి మనల్ని విడదీయలేవని నేను
ఖండితంగా చెప్పగలను.

## దేవుడు, తాను ఎన్నుకొన్న ప్రజలు

9 క్రీస్తు పేరిట నేను నిజం చెపుతున్నాను. నేను
అసత్యమాడటం లేదు. నా అంతరాత్మ, పవి
త్రాత్మ ద్వారా ఇది నిజమని సాక్ష్యం చెబుతోంది.
2నాలో చాలా దుఃఖం ఉంది. అంతంగాని ఆవేదన నా
హృదయంలో ఉంది. 3నా వంశానికి చెందిన నా సోద
రుల కోసం దేవుడు నన్ను శపించినా, క్రీస్తు నుండి
నన్ను వేరు చేసినా నాకు సంతోషమే. 4ఈ నా
సోదరులు ఇశ్రాయేలు వంశానికి చెందిన వాళ్ళు. దేవుడు
వాళ్ళను తన పుత్రులుగా చేసుకొని మహిమను, ఒడం
బడికలను, ధర్మశాస్త్రాన్ని, ఆరాధనా విధానాన్ని ఇచ్చి
వాగ్దానాలు చేసాడు. 5మూలపురుషులు వీళ్ళ వంశానికి
చెందిన వాళ్ళు. క్రీస్తు వీళ్ళ వంశంలో జన్మించాడు.
క్రీస్తు అందరికీ దేవుడు. ఆయన్ని చిరకాలం అందరూ
స్తుతించుగాక! ఆమేన్!

6ఇశ్రాయేలు వంశానికి చెందిన వాళ్ళందర్ని దేవుడు
తన ప్రజగా ఎన్నుకోలేదు. కాబట్టి దేవుని మాట
పరాజయం పొందిందని మనమనకూడదు. 7లేక
అబ్రాహాము సంతానమందరూ నిజంగా అబ్రాహాము
సంతానమని మనమనలేము. కాని ఈ విషయంపై
ఈ విధంగా వ్రాయబడి ఉంది: “ఇస్సాకు వల్ల మాత్రమే
నీ సంతానం గుర్తింపబడుతుంది.”* 8ఇంకొక రీతిగా
చెప్పాలంటే అబ్రాహాముకు ప్రకృతి సహజంగా జన్మిం
చినంత మాత్రాన దేవుని సంతానంగా పరిగణింప
బడరు. కాని దేవుని వాగ్దానం మూలంగా అతనికి కలిగిన
సంతానం అబ్రాహాము సంతానంగా పరిగణింప బడు
తుంది. 9ఈ వాగ్దానం ఈ విధంగా వ్రాయబడి ఉంది:

---

**ఇస్సాకు … గుర్తింపబడుతుంది** ఆది. 21:12.

"నియమిత సమయానికి నేను తిరిగి వస్తాను, శారాకు పుత్రుడు జన్మిస్తాడు."*

10అంతేకాదు. రిబ్కాకు, మన మూల పురుషుడైన ఇస్సాకు ద్వారా ఇద్దరు పుత్రులు కలిగారు. 11-12కాని దేవుడు ఒక్కణ్ణే ఎన్నుకోవాలని, తద్వారా తన ఉద్దేశ్యం సంపూర్ణంగా నెరవేరాలని, రిబ్కాతో, "పెద్ద వాడు, చిన్నవాని సేవ చేస్తాడు"* అని అన్నాడు. అప్పటికింకా ఈ కవలలు జన్మించలేదు కనుక వాళ్ళు మంచి, చెడు, చేసే ప్రశ్నే రాదు. అంటే దేవుడు తన ఇష్ట ప్రకారం పిలిచాడు. కాని, ఈ పిలుపు వాళ్ళు చేసిన పనులపై ఆధారపడలేదన్న మాట. 13ఈ విషయంపై ఈ విధంగా వ్రాయబడి ఉంది: "నేను యాకోబును ప్రేమించాను, కాని ఏశావును ద్వేషించాను."*

14మరి, మనమేమనాలి? దేవుడు అన్యాయం చేసాడా? లేదు. 15ఎందుకంటే ఆయన మోషేతో ఈ విధంగా అన్నాడు: "నాకిష్టం వచ్చిన వాళ్ళను కరుణిస్తాను, నాకిష్టం వచ్చిన వాళ్ళపై దయ చూపిస్తాను."* 16అందువల్ల ఇది, మానవుని అభీష్టంపై కాని, లేక అతని శ్రమపై కాని ఆధారపడింది కాదు. ఇది దేవుని కనికరంపై ఆధారపడింది. 17లేఖనము ఫరోతో ఈ విధంగా అంటుంది: "నీ ద్వారా నా శక్తి వ్యక్తం చెయ్యాలనీ, ప్రపంచమంతా నా పేరు ప్రకటింపబడాలనీ, నేను నిన్ను రాజుగా చేసాను."* 18అంటే, దేవుడు తనకిష్టమున్న వాళ్ళపై కనికరం చూపిస్తాడు, తనకిష్టమున్న వాళ్ళపై కఠినత్వం చూపిస్తాడు

19మీరు నాతో, "మరి, దేవుడు మమ్మల్ని ఎందుకు ఇంకా నిందిస్తున్నాడు? ఆయన ఇష్టాన్ని ఎవరు కాదనగలరు?" అని అనవచ్చు. 20కాని, ఓ మనిషీ! దేవునితో ఎదురు తిరిగి మాట్లాడటానికి నీ వెవరవు? సృష్టింపబడింది సృష్టికర్తతో, "నన్నీవిధంగా ఎందుకు సృష్టించావు?"* అని అడగవచ్చా? 21కుమ్మరి ఒకే మట్టి ముద్దతో కొన్ని కుండల్ని మంచి పనులకోసం, మరి కొన్నిటిని మామూలుగా ఉపయోగించుకోవటానికి చేస్తాడు. అలా చెయ్యటానికి అతనికి అధికారం లేదా?

22భవిష్యత్తులో దేవుడు తన కోపాన్ని చూపాలని, తన శక్తిని తెలియచెయ్యాలని, నాశనం చెయ్యతగిన దుర్మార్గుల పట్ల సహనం వహించాడంటే మనమేమనగలము? 23దేవుడు తన తేజస్సులోని గొప్పతనాన్ని తెలియ చెయ్యాలని తన మహిమను పంచుకోవటానికి దయతో ఇతర్లను సృష్టించాడంటే మనం ఏమనగలం? 24యూదుల నుండే కాక, యూదులుకాని వాళ్ళ నుండి కూడా దేవుడు ప్రజల్ని పిలిచాడు. ఆయన పిలిచింది మనల్నే. 25హోషేయ గ్రంథంలో దేవుడు ఈ విధంగా చెప్పాడు:

> "నా ప్రజలు కాని వాళ్ళను నా ప్రజలని
> పిలుస్తాను నా ప్రియురాలుకాని జనాన్ని
> నా ప్రియురాలా అని పిలుస్తాను."
> హోషేయ *2:23*

> 26 "మీరు నా ప్రజలు కారు అని అన్నచోటనే
> మీరు సజీవంగా ఉండే దేవుని పుత్రులు
> అని అనటం సంభవిస్తుంది."
> హోషేయ *1:10*

27యెషయా ప్రవక్త ఇశ్రాయేలు వంశాన్ని గురించి ఇలా అన్నాడు:

"ఇశ్రాయేలు పుత్రుల సంఖ్య సముద్ర తీరంపై ఉన్న ఇసుక రేణువుల్లా ఉన్నా, కొందరు మాత్రమే రక్షింపబడతారు. 28ఎందుకంటే, ప్రపంచానికి విధించిన శిక్షను ప్రభువు త్వరలోనే నెర వేరుస్తాడు."*

29యెషయా జరుగుతుందని చెప్పినట్లు: "సర్వ శక్తిసంపన్నుడైన ప్రభువు కొంత మందిని మనకు వదిలి ఉండక పోయినట్లైతే మనం

సొదొమ ప్రజల వలే, గొమొఱ్ఱా ప్రజలవలె ఉండే వాళ్ళం."*

### ఇశ్రాయేలు మరియు సువార్త

30మరి మనమేమనాలి? నీతిమంతులు కావటానికి ప్రయత్నించని యూదులుకానిప్రజలు నీతి మంతుల య్యారు. అది వాళ్ళల్లో విశ్వాసం ఉండటం వల్ల సంభవించింది. 31కాని ధర్మశాస్త్రంద్వారా నీతిమంతులు కావాలని ప్రయత్నించిన ఇశ్రాయేలు వంశీయులు నీతి మంతులు కాలేదు. 32ఎందుకు? వాళ్ళు విశ్వాసంతో కాకుండా కార్యాలు చేసి ప్రయత్నించారు. కనుక అడ్డురాయి తగిలి తొట్రుపడ్డారు. 33దీన్ని గురించి ఈ విధంగా వ్రాయబడి ఉంది:

> "నేను సీయోనులో ఒక రాయిని స్థాపించాను. దాని వల్ల కొందరు తొట్రుపడతారు. నేనొక శిలను స్థాపిస్తాను. దాని వల్ల

---

**నియమిత ... జన్మిస్తాడు** ఆది. 18:10,14.

**పెద్ద ... చేస్తాడు** ఆది. 25:23.

**నేను ... ద్వేషించాను** మలాకీ 1:2-3.

**నాకిష్టం ... చూపిస్తాను** నిర్గమ. 33:2,19.

**నీ ... చేసాను** నిర్గమ. 9:16.

**నన్నీ ... సృష్టించావు** యెషయా 29:16, 45:9.

**ఇశ్రాయేలు ... నెరవేరుస్తాడు** యెషయా 10:22-23.

**సర్వశక్తి ... వాళ్ళం** యెషయా 1:9.

వాళ్ళు క్రింద పడతారు. ఆయన్ని నమ్మిన
వానికెన్నడూ ఆశాభంగం కలుగదు.”
యెషయా *8:14; 28:16*

10 సోదరులారా! దేవుడు ఇశ్రాయేలు వంశీయుల్ని రక్షించాలని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తు న్నాను. 2వాళ్ళు శ్రద్ధతో దేవుని సేవ చేస్తున్నారని నేను సాక్ష్యం చెప్పగలను. కాని వాళ్ళ శ్రద్ధ జ్ఞానం మీద ఆధారపడ లేదు. 3దేవుడు నీతిమంతులుగా చేసే విధానాన్ని గురించి తెలియక వాళ్ళు తమ విధానాన్ని స్థాపించాలనుకొన్నారు. కనుక వాళ్ళు దేవుడు చెప్పిన విధానాన్ని అంగీకరించ లేదు. 4నమ్మిన ప్రతి ఒక్కడూ నీతిమంతుడు కావాలని క్రీస్తు వచ్చాక ధర్మశాస్త్రం అంతమైపోయింది.

### విశ్వసించిన వాళ్ళందరికీ మోక్షం

5ధర్మశాస్త్రం ద్వారా లభించే నీతిని గురించి మోషే ఈ విధంగా వ్రాస్తున్నాడు: “ధర్మశాస్త్ర క్రియలుచేసే మానవుడు వీటి ద్వారా జీవిస్తాడు”* 6కాని విశ్వాసం వల్ల కలిగే నీతిని గురించి ఈ విధంగా వ్రాశారు: “పరలో కానికి ఎవరు ఎక్కుతారు?” అని అనకండి. అంటే ఎవరు పరలోకానికి ఎక్కి క్రీస్తును క్రిందికి పిలుచుకు రాగలరు? 7“అగాధంలోకి ఎవరు దిగుతారు?”* అని అనకండి. అంటే ఎవరు అగాధంలోకి దిగి క్రీస్తును చావునుండి పిలుచుకురాగలరు? 8మరి వాక్య మేమంటు న్నది! “దైవ సందేశం మీకు దగ్గరగా ఉంది. అది మీ నోటిలో ఉంది, మీ హృదయాల్లో ఉంది.”* ఇది విశ్వాసానికి సంబంధించిన సందేశము. దీన్ని మేము ప్రకటిస్తున్నాము. 9యేసు, ప్రభువని మీ నోటితో బహిరంగంగా ఒప్పుకొని చనిపోయిన వారిలో నుండి దేవుడాయన్ని బ్రతికించాడని మీ హృదయాల్లో విశ్వ సిస్తే మీరు రక్షింపబడుతారు. 10ఎందుకంటే మనము, మన హృదయాలతో విశ్వసిస్తాము కనుక నీతిమంతు లుగా పరిగణింపబడుతాము. నోటితో ఒప్పుకొం టాము కనుక రక్షణను పొందుతాము. 11లేఖ నాల్లో ఈ విధంగా వ్రాసారు: “ఆయన్ని నమ్మిన వానికి ఆశా భంగం కలుగదు.”* 12యూదులకు, యూదులుకాని వాళ్ళకు వ్యత్యాసం లేదు. ప్రభువు ఒక్కడే. ఆయనే అందరికి ప్రభువు. ఆయన, తనను ప్రార్థించిన వాళ్ళం దరికీ అడిగినంత ఇస్తాడు. 13దీన్ని గురించి, “ప్రభువును ప్రార్థించిన ప్రతి ఒక్కడూ రక్షింపబడతాడు”* అని వ్రాయబడి ఉంది.
14మరి, విశ్వసించకుండా ఎలా ప్రార్థించగలరు? ఆయన్ని గురించి వినకుండా వాళ్ళు ఆయన్ని ఏ విధంగా విశ్వసించగలరు? వాళ్ళకు ఎవరో ఒకరు చెప్ప కుంటే వాళ్ళు ఏ విధంగా వినగలరు? 15ఎవరైనా పంపందే వాళ్ళు వచ్చి ఎలా చెపుతారు? దీన్ని గురించి ఈ విధంగా వ్రాసారు: “సువార్తను తెచ్చేవాళ్ళ పాదాలు ఎంత అందంగా ఉన్నాయి!”*
16కాని సువార్తను అందరూ అంగీకరించలేదు. యెషయా ఈ విధంగా అన్నాడు: “ప్రభూ! మేము చెప్పినదాన్ని ఎవరు నమ్మారు?”* 17తద్వారా, సువార్తను వినటం వల్ల విశ్వాసం కలుగుతుంది. క్రీస్తు సందేశం ద్వారా సువార్త వినటం సంభవిస్తుంది.
18“వాళ్ళు వినలేదా?” అని నేనడుగుతున్నాను. వాళ్ళు విన్నారు. ఆ విషయమై ఈ విధంగా వ్రాయబడి ఉంది:

“వాళ్ళ స్వరం ప్రపంచమంతా వినిపించింది.
వాళ్ళు పలికిన మాటలు ప్రపంచం నలు
మూలలా వినిపించాయి.”
కీర్తన *19:4*

19“ఇశ్రాయేలుకు ఈ విషయం తెలియదా?” అని నేను మళ్ళీ అడుగుచున్నాను. అవును వారికి తెలిసింది. మోషే మొదట ఈ విధంగా అన్నాడు:

“జనాంగము కాని వారి ద్వారా మీరు
అసూయ పడేటట్లు చేస్తాను అర్థం చేసు
కోలేని జనము ద్వారా మీరు కోపం చెందే
టట్లు చేస్తాను.”
ద్వితీయోపదేశ *32:21*

20యెషయా ధైర్యంగా ఇలా అన్నాడు:

“నా కోసం వెదకని వాళ్ళు నన్ను కను
గొంటారు. నా కోసం అడగని వాళ్ళకు
నేను స్వయంగా ప్రత్యక్ష మయ్యాను.”
యెషయా *65:1*

21కాని ఇశ్రాయేలు ప్రజల్ని గురించి అతడు ఈ విధంగా అన్నాడు: “అవిధేయతతో ఎదురుతిరిగి మాట్లాడు తున్న ప్రజల కోసం దినమంతా వేచియున్నాను.”*

---

**ధర్మశాస్త్ర ... జీవిస్తాడు** లేవీ. 18:5; ద్వితీ. 30:12.
**అగాధంలోకి ... దిగెతారు** ద్వితీ. 30:13.
**దైవ సందేశం ... ఉంది** ద్వి తీ. 30:14.
**ఆయన్ని ... కలుగదు** యెషయా 28:16.
**ప్రభువును ... రక్షింపబడతాడు** యోవేలు 2:32.
**సువార్తను ... ఉన్నాయి** యెషయా 52:7.
**ప్రభూ ... నమ్మారు** యెషయా 53:1.
**అవిధేయతతో ... వేచియున్నాను** యెషయా 65:2.

## దేవుని దయ

11 "మరి దేవుడు తన ప్రజల్ని నిరాకరించాడా?"
అని నేను అడుగుతున్నాను. లేదు, నేను
స్వయంగా ఇశ్రాయేలు వంశీయుణ్ణి. బెన్యామీను తెగకు
చెందిన వాణ్ణి. అబ్రాహాము మా మూలపురుషుడు.
2తనకు ముందే తెలిసిన ప్రజల్ని దేవుడు నిరాక
రించలేదు. లేఖనాల్లో ఏలీయాను గురించి ఏమని
వ్రాసారో మీకు తెలియదా? అతడు ఇశ్రాయేలు వంశీ
యులపై నేరారోపణ చేస్తూ దేవునితో ఈ విధంగా
విన్నవించు కొన్నాడు: 3"ప్రభూ! వాళ్ళు నీ ప్రవక్తల్ని
చంపి వేసారు. నీ బలిపీఠాన్ని నేల మట్టం చేసారు.
మిగిలిన వాణ్ణి నేనొక్కణ్ణే. నన్ను కూడా చంపాలని
ప్రయత్నిస్తున్నారు."* 4అప్పుడు దేవుని స్వరం ఈ
విధంగా అన్నది: "బయలు ముందు మోకరించని
ఏడువేలమందిని నా కోసం ప్రత్యేకంగా ఉంచుకొ
న్నాను."* 5అదే విధంగా ఇప్పుడు కూడా దేవుడు
కరుణించిన కొద్దిమంది మిగిలిపొయ్యారు. 6ఇది దేవుని
అనుగ్రహం వల్ల జరిగింది. అంటే, అది మానవులు
చేసిన కార్యాలపై ఆధారపడింది కాదన్నమాట. అలా
కాక పోయినట్లైతే అనుగ్రహానికి అర్థం ఉండేది కాదు.*
7-8అంటే ఏమిటి? ఇశ్రాయేలు ప్రజలకు వాళ్ళు
మనసారా కోరుకొన్నది లభించలేదు. కాని దేవుడు
ఎన్నుకొన్న వాళ్ళకు అది లభించింది. ఇశ్రాయేలు
దేశంలోని మిగతా ప్రజలు సువార్తను నిరాకరించారన్న
విషయమై ఈ విధంగా వ్రాయబడి ఉంది:

> "దేవుడు వాళ్ళకు మత్తుగల ఆత్మను."
> యెషయా *29:10*

> చూడలేని కళ్ళను, వినలేని చెవుల్ని
> ఇచ్చాడు. ఈ నాడు కూడా వాళ్ళు అదే
> స్థితిలో ఉన్నారు."
> ద్వితీయోపదేశ *29:4*

9ఈ సందర్భాన్ని గురించి దావీదు ఈ విధంగా
అంటున్నాడు:

> "వాళ్ళు విందులు చేస్తున్నప్పుడు
> వేసుకొన్న బల్లలు బోనులవలె, వలలవలె
> మారుగాక! వాళ్ళు క్రింద పడి శిక్షను
> అనుభవించుదురు గాక!
> 10 వాళ్ళ కన్నులు చీకటితో నిండిపోయి,
> వాళ్ళ దృష్టి నశించుగాక! వాళ్ళ నడుములు
> కష్టాలతో వంగిపోయి వాళ్ళు ఎప్పుడూ
> అదే స్థితిలో ఉండిపోవుదురు గాక!"
> *కీర్తన 69:22-23*

## అంటు వేయబడ్డ కొమ్మలు

11నేను ఇంకొక ప్రశ్న వేస్తాను: యూదులు లేవలే
నంత క్రిందపడి పొయ్యారా? లేదు. వాళ్ళు పాపాలు
చేయటంవల్ల యూదులుకాని వాళ్ళకు రక్షణ లభిం
చింది. యూదుల్లో ఈర్ష్య కలగాలని ఇలా జరిగింది.
12వాళ్ళు పాపాలు చెయ్యటంవల్ల ప్రపంచానికి ఐశ్వర్యం
కలిగింది వాళ్ళకు నష్టం కలగటంవల్ల యూదులు
కానివాళ్ళు భాగ్యవంతులయ్యారు. ఆలాగైతే వాళ్ళు
సంపూర్ణంగా క్రీస్తును అంగీకరించి యుంటే ఇంకెంత
లాభం కలుగుతుందో గ్రహించండి.
13యూదులుకాని ప్రజలారా! ఇప్పుడిక నేను మీతో
మాట్లాడుతున్నాను. నేను మీకోసం క్రీస్తు అపొ
స్తలునిగా పని చేస్తున్నాను కనుక, నేను చేస్తున్న పనిపట్ల
నాకు ఎంతో గౌరవం ఉంది.
14ఈ విధంగానైనా నా వాళ్ళలో ఈర్ష్య కలుగచేసి,
వాళ్ళలో కొందరినైనా రక్షించ కలుగుతానని ఆశిస్తు
న్నాను. 15వాళ్ళు నిరాకరించటం వల్ల ప్రపంచానికి
దేవునితో స్నేహం కలిగింది. అలాంటప్పుడు వాళ్ళు
అంగీకరించియుంటే మరణంనుండి జీవానికి వచ్చినట్లే.
పిండిముద్దలో ఒక భాగం ప్రథమ ఫలంగా సమర్పిస్తే
అది పవిత్రమైతే 16దేవునికి పవిత్రమైనట్లే కదా! వేర్లు
పవిత్రమైతే కొమ్మలు పవిత్రమైనట్లే కదా!
17చెట్టు కొమ్మల్ని కొన్నిటిని కొట్టివేసి, అడవి
ఒలీవచెట్ల కొమ్మలవలెనున్న మిమ్మల్ని దేవుడు
అంటుకట్టాడు. తద్వారా వేరులో నున్న బలాన్ని మీరు
పంచుకొంటున్నారు.
18కాని ఆ కొమ్మలపైగా గర్వించకండి. మీ వల్ల
వేరు పోషింపబడటం లేదు. వేరువల్ల మీరు పోషింపబడు
తున్నారు. 19మమ్మల్ని అంటు కట్టాలని కొమ్మలు
కొట్టి వేయబడ్డాయి, అని మీరనవచ్చు.
20నిజమే! విశ్వాసం లేనందువల్ల అవి కొట్టి వేయ
బడ్డాయి. మీలో విశ్వాసం ఉండటం వల్ల మీరా చెట్టు
నంటుకొని ఉన్నారు. అలా అని గర్వించకండి.
భయంతో ఉండండి. 21ఎందుకంటే, సహజంగా పెరిగిన
కొమ్మల్ని దేవుడు లెక్కచేయ లేదంటే మిమ్మల్ని
కూడా లెక్కచేయడు.
22అందువల్ల దేవుని కరుణను, కోపాన్ని అర్థం
చేసుకొనండి. విశ్వసించని కొమ్మల్ని నరికి వేసి
ఆయన తన కోపాన్ని ప్రదర్శించాడు. మీరు ఆయన
కరుణను అంటిపెట్టుకొని జీవిస్తుంటే కరుణను

---

**ప్రభూ ... ప్రయత్నిస్తున్నారు** 1రాజులు19:10,14.

**బయలు ... ఉంచు కొన్నాను** 1 రాజులు 19:18.

**ఇది దేవుని ... ఉండేది కాదు** కొన్ని వ్రాత ప్రతులు, కార్యం వల్ల అయితే, అది అనుగ్రహం కాదు. అది అను గ్రహమైతే, కార్యాలు కార్యాలు కావు అని చేర్చాయి.

చూపుతూ ఉంటాడు. లేని పక్షాన మిమ్మల్ని కూడా
కొట్టివేస్తాడు.
23వాళ్ళు, మేము విశ్వాసహీనంగా ఉంటామని
మొండి పట్టు పట్టకుండా ఉంటే, దేవుడు మళ్ళీ వాళ్ళను
అంటు కడతాడు. వాళ్ళను తిరిగి అంటుకట్టే శక్తి దేవునికి
ఉంది.
24స్వాభావికంగా అడవి జాతికి చెందిన ఒలీవల
చెట్లనుండి కొట్టిన కొమ్మలవలెనున్న మిమ్మల్ని
మేలురకపు చెట్టుకు అంటు వేయగలిగితే, మేలు రకపు
ఒలీవల చెట్ల కొమ్మల్ని స్వజాతికి చెందిన చెట్టుకు
అంటు వేయటం ఇంకెంత సులభమో ఆలోచించండి.

### ఇశ్రాయేలు ప్రజలు

25సోదరులారా! మీరు తెలుసుకోవాలని మీకీ
రహస్యం చెప్పాలనుకొంటున్నాను. మీరు అజ్ఞానులుగా
ఉండటం నాకిష్టం లేదు. కొందరు ఇశ్రాయేలు ప్రజలు
మూర్ఖత్వంతో ఉన్నారు. నాటబడాలని కోరుకొం
టున్న యూదులుకాని ప్రజలు నాటబడే వరకు ఈ
మూర్ఖత్వం వీళ్ళలో ఉంటుంది. 26శాస్త్రాల్లో వ్రాసినట్లు
ఇశ్రాయేలు ప్రజలు ఈ విధంగా రక్షింపబడతారు:

> "రక్షకుడు సీయోను నుండి వస్తాడు; అతడు
> యాకోబు వంశీయుల్లో ఉన్న చెడును
> తొలగిస్తాడు.
> 27 నేను వాళ్ళ పాపాలను తొలగించినప్పుడు,
> వాళ్ళతో ఈ ఒడంబడిక చేస్తాను."
> *యెషయా 59:20-21; 27:9*

28ఒక విధంగా చూస్తే వాళ్ళు సువార్తను బట్టి మీకు
శత్రువులు. మరొక విధంగా చూస్తే వాళ్ళు దేవుడు
ఎన్నుకొన్న వాళ్ళు కనుక, వాళ్ళ మూల పురుషుల్ని
బట్టి వాళ్ళు ప్రేమించబడ్డారు. 29ఎందుకంటే, దేవుడు
'వరాల' విషయంలో, 'పిలుపు' విషయంలో మనస్సు
మార్చుకోడు. 30యూదులు కాని మీరు ఒకప్పుడు
దేవుణ్ణి నిరాకరించారు. కాని ఇప్పుడు యూదులు
సువార్తను నిరాకరించటంవల్ల దైవానుగ్రహం మీకు
లభించింది.
31అదే విధంగా ఇప్పుడు యూదులు దేవుణ్ణి
నిరాకరిస్తున్నారు. అందువల్ల, మీకు లభించిన అను
గ్రహం ద్వారా వాళ్ళకు కూడా దైవానుగ్రహం లభి
స్తుంది. 32ఎందుకంటే, దేవుడు అందరిపై అనుగ్రహం
చూపాలని అందర్నీ కలిపి అవిధేయతకు బంధించి
వేసాడు?

### స్తుతి

33దేవుని దగ్గర గొప్ప ఐశ్వర్యం ఉంది. దేవుని
జ్ఞానం, విజ్ఞానం అతీతమైనది. ఆయన తీర్పులు
ఎవ్వరికీ అర్థం కావు. ఆయన మార్గాల్ని ఎవ్వరూ కని
పెట్టలేరు.

> 34 "ప్రభువు మనస్సు ఎవరికి తెలుసు?
> ఆయనకు సలహా చెప్పే వాడెవరు?"
> *యెషయా 40:13*

> 35 "దేవునికి ఎవరు అప్పిచ్చారు? ఆయన
> ఎవ్వరికీ ఋణపడలేదు."
> *యోబు 41:11*

36అన్ని వస్తువులు, ఆయనున్నుండి వచ్చాయి.
ఆయన ద్వారా వచ్చాయి, అన్నీ ఆయన కొరకే
ఉన్నాయి. ఆయనకు చిరకాలం మహిమ కలుగుగాక!
ఆమేన్.

### క్రొత్త జీవితము

12 అందువల్ల నా సోదరులారా! నేను మీకీ విజ్ఞప్తి
చేస్తున్నాను, దేవుడు తన అనుగ్రహం చూపిం
చాడు కనుక మీ జీవితాల్ని ఆయనకు అర్పించుకోండి.
ఆయనకు ఆనందం కలిగేటట్లు పవిత్రంగా జీవించండి.
ఇదే మీరు చేయవలసిన నిజమైన సేవ! 2ఇక మీదట
ఈ లోకంతీరును అనుసరిస్తూ జీవించకండి. మీ మన
స్సు మార్చుకొని మీరు కూడా మార్పు చెందండి.
అప్పుడు మీరు దైవేచ్ఛ ఏమిటో తెలుసుకొని, అది
ఉత్తమమైనదనీ, ఆనందం కలిగిస్తుందనీ, పరిపూర్ణ
మైనదనీ గ్రహిస్తారు!
3దేవుడు నాకిచ్చిన అనుగ్రహాన్ని ఆధారంగా తీసు
కొని మీలో ప్రతి ఒక్కరికీ నేను చెప్పేదేమిటంటే,
మిమ్మల్ని గురించి మీరు ఉన్నదాని కంటే గొప్పగా
భావించకండి. సక్రమంగా ఉండి దేవుడిచ్చిన విశ్వా
సంతో మిమ్మల్ని మీరు అంచనా వేసుకోండి. 4దేహానికి
ఎన్నో అవయవాలుంటాయి. ఈ అవయవాలన్నిటికీ
ఒకే పని ఉండదు. 5అదే విధంగా అధిక సంఖ్యలో
ఉన్న మనమంతా క్రీస్తులో ఒకే దేహంగా రూపొందింప
బడ్డాము. ప్రతి సభ్యునికి మిగతా సభ్యులతో సంబంధం
ఉంది. 6దేవుని అనుగ్రహం వల్ల మనందరికి రకరకాల
కృపావరాలు లభించాయి. దైవ సందేశాన్ని గురించి
మాట్లాడే వరాన్ని పొందిన వాళ్ళు ఆ పనిని విశ్వాసంతో
చెయ్యాలి. 7సేవచేసే వరం పొందిన వాళ్ళు సేవ
చెయ్యాలి. బోధించే వరం పొందినవాళ్ళు బోధించాలి.
8ప్రజలను ప్రోత్సాహ పరచే వరం పొందిన వాళ్ళు
ప్రోత్సాహ పరచాలి. దానం చేసే వరం పొందిన వాళ్ళు
ధారాళంగా దానం చెయ్యాలి. నాయకత్వం వహిం
చాలని వరం పొందిన వాళ్ళు శ్రద్ధతో నాయకత్వం
చెయ్యాలి. దయ చూపాలని వరం పొందిన వాళ్ళు
ఆనందంగా దయ చూపాలి.

### ప్రేమ

9ప్రేమలో నిజాయితీగా ఉండండి. దుర్మార్గాన్ని
ద్వేషించండి. మంచిని అంటి పెట్టుకొని ఉండండి.
10సోదర ప్రేమతో, మమతతో ఉండండి. మీ సోదరు
లను మీకన్నా అధికులుగా భావించి గౌరవిస్తూ
ఉండండి. 11ఉత్సాహాన్ని వదులు కోకుండా ఉత్తేజిత
మైన ఆత్మతో ప్రభువు సేవ చేయండి. 12పరలోకం
లభిస్తుందన్న ఆశతో ఆనందం పొందుతూ, కష్ట సమ
యాల్లో సహనం వహించి, అన్ని వేళలా విశ్వాసంతో
ప్రార్థిస్తూ ఉండండి. 13మీ సహాయం అవసరమున్న
దేవుని ప్రజలతో మీకున్న వాటిని పంచుకోండి. ఆతి
థ్యాన్ని మరువకండి.

14మిమ్మల్ని హింసిస్తున్న వాళ్ళను ఆశీర్వదిం
చండి. ఆశీర్వదించాలి, కాని దూషించ కూడదు.
15ఆనందంగా ఉన్నవాళ్ళతో వాళ్ళ ఆనందాన్ని,
దుఃఖంగా ఉన్నవాళ్ళతో వాళ్ళ దుఃఖాన్ని పంచుకోండి.
16అందరి విషయంలో ఒకే విధంగా ప్రవర్తించండి.
గర్వించకండి. తక్కువ స్థాయిగల వాళ్ళతో సహవాసం
చెయ్యండి. మీలో మాత్రమే జ్ఞానం ఉందని
భావించకండి.

17కీడు చేసిన వాళ్ళకు కీడు చెయ్యకండి. ప్రతి
ఒక్కరి దృష్టిలో మంచిదనిపించే దాన్ని చెయ్యటానికి
జాగ్రత్త పడండి. 18అందరితో శాంతంగా ఉండటానికి
ప్రయత్నించండి. 19మిత్రులారా! పగతీర్చుకోకండి.
ఆగ్రహం చూపటానికి దేవునికి అవకాశం ఇవ్వండి.
ఎందుకంటే లేఖనాల్లో, “పగతీర్చుకోవటం నావంతు.
నేను ప్రతీకారం తీసుకొంటాను”* అని వ్రాయబడి
ఉంది. 20దానికి మారుగా, “మీ శత్రువు ఆకలితో ఉంటే
అతనికి ఆహారం ఇవ్వండి. అతనికి దాహం వేస్తుంటే
నీళ్ళివ్వండి. ఇలా చేయటం వల్ల కాలే నిప్పులు అతని
తలపై కుమ్మరించినట్లు అతనికి అనిపిస్తుంది”* అని
వ్రాయబడివుంది. 21చెడు మీపై గెలుపు సాధించకుండా
జాగ్రత్తపడండి. చెడ్డతనాన్ని మంచితనంతో గెలవండి.

### అధికారులు

13 ప్రభుత్వాన్ని దేవుడే నియమించాడు కనుక
ప్రతి ఒక్కడూ ప్రభుత్వం చెప్పినట్లు
చెయ్యాలి. ప్రస్తుతమున్న ప్రభుత్వాన్ని కూడా దేవుడే
నియమించాడు. 2అందువల్ల ప్రభుత్వాన్ని ఎదిరించిన
వాడు దేవుని ఆజ్ఞను ఎదిరించిన వానితో సమానము.
వాళ్ళు శిక్షననుభవింపవలసి వస్తుంది. 3సక్రమంగా
నడుచుకొనే వాళ్ళు పాలకులకు భయపడరు. తప్పు
చేసిన వాళ్ళకే ఆ భయం ఉంటుంది. ప్రభుత్వానికి
భయపడకుండా ఉండాలంటే, సక్రమంగా నడుచు
కోండి. అప్పుడు ప్రభుత్వం మిమ్మల్ని మెచ్చు
కుంటుంది. 4మీ మంచి కోసం ప్రభుత్వ అధికారులు
దేవుని సేవకులుగా పని చేస్తున్నారు. కాని మీరు తప్పు
చేస్తే భయపడ వలసిందే! వాళ్ళు ఖడ్గాన్ని వృధాగా
ధరించరు. దేవుని సేవకులుగా వాళ్ళు తప్పు చేసిన
వాళ్ళను శిక్షించటానికి ఉన్నారు. 5అందువల్ల శిక్షింప
బడుతారనే కాకుండా మీ అంతరాత్మల కోసం కూడా
అధికారులు చెప్పినట్లు చెయ్యటం అవసరం.

6అధికారులు దేవుని సేవకులు. వాళ్ళు తమ
కాలాన్నంతా దీని కోసమే ఉపయోగిస్తున్నారు. అందు
వల్లే మీరు పన్నులు చెల్లిస్తున్నారు. 7ఎవరికేది ఋణపడి
ఉంటే అది వాళ్ళకివ్వండి. పన్నులు ఋణ పడి ఉంటే
పన్నుల్ని, సుంకాలు ఋణపడి ఉంటే సుంకాల్ని,
మర్యాదను ఋణపడి ఉంటే మర్యాదను, గౌరవాన్ని
ఋణపడి ఉంటే గౌరవాన్ని ఇవ్వండి.

### ప్రేమ

8తోటి వాళ్ళను ప్రేమిస్తే ధర్మశాస్త్రాన్నంతా అను
సరించినట్లే కనుక ఇతర్లను ప్రేమించటం అనే
ఋణంలో తప్ప మరే ఋణంలో పడకండి. 9“వ్యభి
చారం చెయ్యరాదు; హత్య చెయ్యరాదు; దొంగతనం
చెయ్యరాదు; ఇతర్లకు చెందిన వాటిని ఆశించరాదు”*
అనే మొదలగు ఆజ్ఞలన్నీ, “నిన్ను నీవు ప్రేమించు
కొన్నంతగా నీ పొరుగు వాణ్ణి ప్రేమించు” అనే ఆజ్ఞలో
మిళితమై ఉన్నాయి. 10ప్రేమ పొరుగు వానికి హాని
కలిగించదు. కాబట్టి ధర్మశాస్త్రం సాధించాలి అనుకొన్న
దాన్ని ప్రేమ సాధిస్తుంది.

### నిద్రనుండి మేలుకోండి

11యేసుక్రీస్తును మనం నమ్మిననాటి కంటే నేడు
రక్షణ దగ్గరగా ఉంది కనుక ప్రస్తుత కాలాన్ని అర్థం
చేసుకోండి. ఆ గడియ అప్పుడే వచ్చేసింది. కనుక
నిద్రనుండి మేలుకోండి. 12రాత్రి గడిచిపోతోంది.
అంతంకాని పగలు త్వరలోనే రాబోతోంది. అందువల్ల
చీకట్లో చేసే పనుల్ని ఆపి, పగటి వేళ ధరించే ఆయు
ధాల్ని ధరించండి. 13పగటి వేళకు తగ్గట్టుగా మర్యాదగా
మసలుకొండి. ఉగ్రత తాండవం చెయ్య కుండా, త్రాగి
మత్తులు కాకుండా, వ్యభిచారం చెయ్యకుండా, నీతి
లేని పనులు చెయ్యకుండా, కలహాలు, అసూయలు
లేకుండా ప్రవర్తించండి. 14యేసుక్రీస్తు ప్రభువును
వస్త్రంగా ధరించండి. శారీరక వాంఛల్ని ఏ విధంగా
తృప్తిపరుచుకోవాలా అని అలోచించటం మానుకోండి.

---

**పగతీర్చుకో … తీసుకొంటాను** ద్వితీ. 32:35.

**మీ శత్రువు … అనిపిస్తుంది** సామె. 25:21-22.

**వ్యభిచారం … ఆశించరాదు** నిర్గమ. 20:13, 15:17.

### విమర్శించకండి

14 సంపూర్ణమైన విశ్వాసం లేని వాణ్ణి నిరాకరించ
కండి. వాదగ్రస్తమైన సంగతుల్ని విమర్శించ
కండి. 2ఒకడు అన్నీ తినవచ్చని విశ్వసిస్తాడు. కాని
సంపూర్ణ విశ్వాసం లేని ఇంకొకడు కూరగాయలు
మాత్రమే తింటాడు. 3అన్నీ తినే వ్యక్తి అలా చెయ్యని
వ్యక్తిని చిన్న చూపు చూడకూడదు. అదే విధంగా
అన్నీ తినని వాడు, తినేవాణ్ణి విమర్శించకూడదు. అతణ్ణి
కూడా దేవుడు అంగీకరించాడు కదా. 4ఇతర్ల సేవకునిపై
తీర్పు చెప్పటానికి నీ వెవరవు? అతడు నిలిచినా
పడిపోయినా అది అతని యజమానికి సంబంధించిన
విషయం. ప్రభువు అతణ్ణి నిలబెట్ట గలడు కనుక అతడు
నిలబడ గలుగుతున్నాడు.

5ఒకడు ఒక రోజు కన్నా మరొక రోజు ముఖ్య
మైనదని భావించవచ్చు. ఇంకొకడు అన్ని రోజుల్ని
సమానంగా భావించవచ్చు. ప్రతి ఒక్కడూ తాను
పూర్తిగా నమ్మిన వాటిని మాత్రమే చెయ్యాలి. 6ఒక
రోజును ప్రత్యేకంగా భావించే వాడు ప్రభువు పట్ల
అలా చేస్తాడు. మాంసాన్ని తినేవాడు తినటానికి ముందు
దేవునికి కృతజ్ఞతలు చెపుతాడు. కనుక అతనికి ప్రభువు
పట్ల విశ్వాసం ఉందన్నమాట. తినని వాడు కూడా
ప్రభువుకు కృతజ్ఞతలు చెపుతాడు కనుక అతనికి కూడా
ప్రభువు పట్ల విశ్వాసము ఉందన్నమాట. 7మనలో
ఎవ్వరూ తమకోసం మాత్రమే బ్రతకటం లేదు. అదే
విధంగా తమ కోసం మాత్రమే మరణించటం లేదు.
మనం జీవిస్తున్నది ప్రభువు కొరకు జీవిస్తున్నాము.
8మనం మరణించేది ప్రభువు కోసం మరణిస్తున్నాము.
అందువల్ల మనం మరణించినా, జీవించినా ప్రభువుకు
చెందిన వాళ్ళమన్న మాట.

9ఈ కారణంగానే మరణించిన వాళ్ళకు, జీవించే
వాళ్ళకు ప్రభువుగా ఉండాలని క్రీస్తు చనిపోయి తిరిగి
బ్రతికి వచ్చాడు. 10ఇక ఇదిగో నీవు! నీ సోదరునిపై
ఎందుకు తీర్పు చెపుతున్నావు. మరి మీలో కొంద
రెందుకు మీ సోదరుని పట్ల చిన్నచూపు చూస్తున్నారు?
మనమంతా ఒక రోజు దేవుని సింహాసనం ముందు
నిలబడతాము. 11దీన్ని గురించి ఈ విధంగా వ్రాయబడి
ఉంది:

> "ప్రభువు ఈ విధంగా అన్నాడు: నా పై
> ప్రమాణం చేసి చెపుతున్నాను. నా ముందు
> అందరూ మోకరిల్లు తారు, దేవుని ముందు
> ప్రతి నాలుక ఆయన అధికారాన్ని అంగీకరి
> స్తుంది."
>
> *యెషయా 45:23*

12అందువల్ల మనలో ప్రతి ఒక్కడూ తనను గురించి
దేవునికి లెక్కచూపవలసి ఉంటుంది.

13కాబట్టి ఇతర్లపై తీర్పు చెప్పటం మాను
కొందాం. అంతేకాక, మీ సోదరుని మార్గంపై అడ్డు
రాయి పెట్టనని, అతనికి ఆటంకాలు కలిగించనని
తీర్మానం చేసుకోండి. 14ఏ ఆహారం అపవిత్రం కాదని
యేసుప్రభువు ద్వారా నేను తెలుసుకొన్నాను. కానీ
ఎవరైనా ఒక ఆహారం అపవిత్రమని తలిస్తే అది అతనికి
అపవిత్రమౌతుంది. 15నీవు తినే ఆహారం వల్ల నీ
సోదరునికి దుఃఖం కలిగితే నీవు ప్రేమగా ఉండటం
మానుకొన్నావన్నమాట. నీ ఆహారం కారణంగా నీ
సోదరుణ్ణి నాశనం చెయ్యవద్దు. అతనికోసం క్రీస్తు
మరణించాడు. 16నీ మంచి పనుల్ని ఇతర్లు దూషించ
కుండా ప్రవర్తించు. 17దేవుని రాజ్యం అంటే తినటం
త్రాగటం కాదన్నమాట. అది పవిత్రాత్మ ద్వారా
లభించే నీతికి, శాంతికి, ఆనందానికి సంబంధించింది.
18ఈ విధంగా క్రీస్తు సేవ చేసిన వాణ్ణి దేవుడు మెచ్చు
కొంటాడు. ఇతర్లు కూడా మెచ్చుకొంటారు.

19అందువల్ల మనము శాంతికి, మన అభివృద్ధికి
దారి తీసే కార్యాలను చేద్దాం.

20ఆహారం కొరకు దేవుని పనిని నాశనం చెయ్య
కూడదు. అన్ని ఆహారాలు తినవచ్చు. కాని, ఇతర్ల
ఆటంకానికి కారణమయ్యే ఆహారాన్ని తినటం
అపరాధం. 21నీ సోదరుడికి ఆటంక కారకుడివి అవటం
కన్నా, మాంసాన్ని తినకుండా ఉండటం, ద్రాక్షారసం
త్రాగకుండా ఉండటం, అలాంటి పన్లేవీ చెయ్యకుండా
ఉండటం ఉత్తమం.

22అందువల్ల వీటి విషయంలో నీవు ఏది నమ్మినా
ఎలా ఉన్నా అది నీకు, దేవునికి సంబంధించిన విషయం.
తానంగీకరిస్తున్న వాటి విషయంలో తనను తాను
నిందించుకోని వ్యక్తి ధన్యుడు. 23సందేహిస్తూ తినే వ్యక్తి
విశ్వాసంలేకుండా తింటున్నాడు. కనుక దేవుడతనికి
శిక్ష విధిస్తాడు. విశ్వాసంతో చేయని పనులన్నీ పాపంతో
కూడుకొన్నవి.

15 సంపూర్ణ విశ్వాసంగల మనము సంపూర్ణ
విశ్వాసం లేని వాళ్ళ బలహీనతల్ని సహించాలి.
మనం మన ఆనందం మాత్రమే చూసుకోకూడదు.
2ప్రతి వ్యక్తి తన సోదరుని మేలు కోసం, అభివృద్ధి
కోసం అతనికి అనుగుణంగా నడుచుకోవాలి. 3క్రీస్తు
కూడా తన ఆనందం మాత్రమే చూసుకోలేదు. దీన్ని
గురించి ఈ విధంగా వ్రాసారు: "దేవా! నిన్ను అవమా
నించిన వాళ్ళు నన్నూ అవమానించారు." 4గతంలో
వ్రాసిన లేఖనాలు మనకు బోధించటానికి వ్రాశారు.
వాటి ద్వారా సహనము, ప్రోత్సాహము పొంది, రక్షణ
లభిస్తుందన్న నమ్మకం మనలో కలగాలని దానిలోని
ఉద్దేశ్యం.

5మనలో సహనము, ప్రోత్సాహము, కలుగచేసే
దేవుడు, యేసుక్రీస్తు ద్వారా మీ మధ్య ఐకమత్యము
కలుగచేయును గాక! 6అప్పుడు మనము ఒకే హృద

యంతో, ఒకే నాలుకతో మన యేసుక్రీస్తు ప్రభువుకు
తండ్రి ఐనటువంటి దేవుణ్ణి స్తుతించ కలుగుతాము.
7దేవునికి ఘనత కలగాలని క్రీస్తు మిమ్మల్ని
అంగీకరించినట్లే మీరు కూడా ఇతర్లను అంగీకరించండి.
8మూలపురుషులకు దేవుడు చేసిన వాగ్దానాన్ని నిల
బెట్టాలని, దేవుడు సత్యవంతుడని నిరూపించాలని, క్రీస్తు
యూదుల సేవకుడు అయ్యాడు. 9యూదులు కాని
వాళ్ళు దేవుని అనుగ్రహం కోసం ఆయన్ని స్తుతిం
చాలని క్రీస్తు ఉద్దేశ్యం. ఈ సందర్భాన్ని గురించి ఈ
విధంగా వ్రాయబడి ఉంది:

"ఈ కారణంగానే యూదులుకాని వాళ్ళతో
కలిసి నిన్ను స్తుతిస్తాను. నీ పేరిట భక్తి
గీతాలు పాడతాను."

కీర్తన *18:49*

10మరొక చోట:

"యూదులుకాని ప్రజలారా! మీరు కూడా
దేవుని ప్రజలతో ఆనందించండి."

ద్వితీయోపదేశ *32:43*

11ఇంకొక చోట ఇలా వ్రాయబడివుంది:

"యూదులుకాని ప్రజలారా! పభువును
స్తుతించండి. ఆయన్ని స్తుతిస్తూ గీతాలు
పాడండి!"

కీర్తన *117:1*

12యెషయా ఒకచోట ఈ విధంగా అన్నాడు:

"యెష్షయి వంశ వృక్షం యొక్క వేరు
చిగురిస్తుంది. ఆయన దేశాలను పాలిస్తాడు
యూదులుకాని వాళ్ళు ఆయనలో
నిరీక్షిస్తారు."

యెషయా *11:10*

13రక్షణ లభిస్తుందని నిరీక్షణ కలిగించే ఆ దేవుడు
మీలో ఉన్న విశ్వాసం ద్వారా మీకు సంపూర్ణమైన
ఆనందాన్ని, శాంతిని కలుగచేయు గాక! అప్పుడు మీలో
ఉన్న నిరీక్షణ పరిశుద్ధాత్మ శక్తి ద్వారా పొంగి పొర్లుతుంది.

**ఉద్దేశ్యం**

14సోదరులారా, మీలో మంచితనముందని, సంపూ
ర్ణమైన జ్ఞానం మీలో ఉందని, పరస్పరం బోధించుకో
గల సామర్థ్యం మీలో ఉందని నాకు నమ్మకం ఉంది.
15అయినా నేను కొన్ని విషయాల్ని గురించి మీకు
జ్ఞాపకం చెయ్యాలని వాటిని గురించి మీకు ధైర్యంగా
వ్రాసాను. దేవుడిచ్చిన వరం వల్ల ఇది చెయ్యగలిగాను.
ఆ వరము ఏదనగా 16నేను యాజకునిగా పని చేస్తూ
దైవసందేశాన్ని యూదులుకాని వాళ్ళకు బోధించాలని
దేవుడు నన్ను యేసు క్రీస్తుకు సేవకునిగా చేసాడు.
ఇందువలన యూదులుకాని వాళ్ళు పరిశుద్ధాత్మ ద్వారా
పవిత్రం చేయబడి దేవునికి అంగీకారమైన సంతానం
కాగలరు.
17అందువల్ల, నేను యేసుక్రీస్తు ద్వారా దేవుని సేవ
చేస్తున్నందుకు గర్విస్తున్నాను. 18క్రీస్తు నా ద్వారా
చేసిన వాటిని గురించి మాత్రమే నేను ధైర్యంగా చెప్పు
కుంటాను. యూదులుకాని వాళ్ళు నేను చేసిన బోధ
నల ద్వారా, నా కార్యాల ద్వారా దైవ సందేశాన్ని
అనుసరించేటట్లు క్రీస్తు చేసాడు. 19గుర్తుల ద్వారా,
అద్భుతాల ద్వారా, పరిశుద్ధాత్మ శక్తి ద్వారా ఈ పని
సాధించాడు. అందుకే యెరూషలేము నుండి ఇల్లూరికు
దాకా అన్ని ప్రాంతాలలో క్రీస్తు యొక్క సువార్తను
ప్రకటించగలిగాను. 20క్రీస్తును గురించి తెలియని
ప్రాంతాలలో సువార్తను ప్రకటించాలనే ఆశయం నాలో
ఉంది. మరొకడు వేసిన పునాదిపై ఇల్లు కట్టటం నా
కిష్టం లేదు. 21అందుకే ఈ విధంగా వ్రాయబడి ఉంది:

"ఆయన్ని గురించి చెప్పబడిన వాళ్ళు
చూస్తారు. కాని వాళ్ళు తెలుసుకొంటారు.
ఆయన్ని గురించి వినని వాళ్ళు అర్థం చేసు
కొంటారు."

యెషయా *52:15*

**రోము నగరాన్ని దర్శించాలని ప్రయత్నం**

22మీ దగ్గరకు రావటానికి ఈ పరిస్థితుల కారణంగా
నాకు ఎన్నో ఆటంకాలు కలిగాయి.
23ఈ ప్రాంతంలో నేను చేయవలసిన పని ముగి
సింది. అంతేకాక ఎన్నో సంవత్సరాలనుండి మిమ్ముల్ని
కలుసుకోవాలనుకొంటున్నాను. 24నేను స్పెయిను
దేశానికి వెళ్ళేటప్పుడు రోము నగరానికి వచ్చి కొన్ని
రోజులు మీతో ఆనందంగా గడపాలని ఆశిస్తున్నాను.
అక్కడి నుండి నేను ప్రయాణం సాగించినప్పుడు మీరు
నాకు సహాయం చేస్తారని ఆశిస్తున్నాను. 25కాని
ప్రస్తుతం నేను యెరూషలేములోని దేవుని ప్రజలకు
సహాయం చెయ్యటానికి అక్కడికి వెళ్తున్నాను. 26ఎందు
కంటే యెరూషలేములోని దేవుని ప్రజల్లో ఉన్న పేద
వాళ్ళ కోసం మాసిదోనియ, అకయ ప్రాంతాలలోని
సోదరులు చందా ఇవ్వటానికి ఆనందంగా అంగీకరిం
చారు. 27వాళ్ళు ఈ చందా అనందంగా ఇచ్చారు.
వాళ్ళకు, వీళ్ళు సహాయం చెయ్యటం సమంజసమే.
ఎందుకంటే, యూదులుకాని వాళ్ళు, యెరూషలేము
లోని దేవుని ప్రజలు ఆత్మీయ ఆశీర్వాదంలో భాగం
పంచుకొన్నారు. కనుక తమకున్న వాటిని వీళ్ళు

వాళ్ళతో పంచుకోవటం సమంజసమే. 28ఈ కార్యాన్ని
ముగించి వాళ్ళందరికీ చందా తప్పక ముట్టేటట్లు చూసి
స్పెయిను దేశానికి వెళ్ళే ముందు మిమ్మల్ని చూడటా
నికి వస్తాను. 29నేను మీ దగ్గరకు వచ్చినప్పుడు క్రీస్తు
నుండి సంపూర్ణంగా ఆశీస్సులు పొంది వస్తానని నాకు
తెలుసు.

30సోదరులారా! మన యేసు క్రీస్తు ప్రభువు ద్వారా,
పరిశుద్ధాత్మ ప్రేమ ద్వారా మిమ్మల్ని వేడుకొనే
దేమిటంటే, నా కోసం దేవుణ్ణి హృదయపూర్వకంగా
ప్రార్థించండి. 31యూదయ ప్రాంతంలోని విశ్వాస
హీనులనుండి నేను రక్షింపబడాలని, యెరూషలేము
లోని దేవుని ప్రజలు నా సహాయాన్ని ఆనందంగా
అంగీకరించాలని ప్రార్థించండి. 32తదుపరి, నేను దేవుని
చిత్తమైతే మీ దగ్గరకు ఆనందంగా వచ్చి మీతో
సమయం గడుపుతాను. 33శాంతి ప్రదాత అయినటు
వంటి దేవుడు మీ అందరికీ తోడుగా ఉండు గాక!
ఆమేన్.

### కుశలములు

16 కేంక్రేయ పట్టణంలో ఉన్న సంఘానికి సేవ
చేస్తున్న మన సోదరి ఫీబే చాలా మంచిది.
2దేవుని ప్రజలకు తగిన విధంగా ప్రభువు పేరిట ఆమెకు
స్వాగతం చెప్పండి. ఆమె అనేకులకు చాలా సహాయం
చేసింది. నాకు కూడా చాలా సహాయం చేసింది.
కనుక ఆమె మీ నుండి ఏ సహాయం కోరితే ఆ
సహాయం చెయ్యండి.

3నాతో కలిసి యేసుక్రీస్తు సేవ చేస్తున్న ప్రిస్కి
ల్లకు, ఆమె భర్త అకులకు నా వందనాలు చెప్పండి.
4వాళ్ళు నా కోసం తమ ప్రాణాలనే తెగించారు. నేనే
కాక, యూదులుకాని వాళ్ళ సంఘాలన్నీ వాళ్ళకు
కృతజ్ఞతతో ఉంటాయి.

5వాళ్ళ ఇంట్లో సమావేశమయ్యే వాళ్ళందరికీ నా
వందనాలు చెప్పండి. ఆసియ ప్రాంతంలో క్రీస్తును
నమ్మిన వాళ్ళలో నా ప్రియమిత్రుడు ఎపైనెటు మొద
టివాడు. అతనికి నా శుభములు అందించండి.
6మీకోసం చాలా కష్టపడి పని చేస్తున్న మరియకు నా
వందనములు చెప్పండి. 7నాతో సహా కారాగారంలో
గడిపిన నా బంధువులు ఆంద్రొనీకును, యూనీయ
కును నా వందనాలు చెప్పండి. వాళ్ళు అపొస్తలులలో
గొప్పవారు. అంతేకాక వాళ్ళు నాకన్నా ముందే క్రీస్తును
అంగీకరించారు. 8ప్రభువు వల్ల నేను, అంప్లీయతు
స్నేహితులమయ్యాము. అతనికి నా వందనాలు
చెప్పండి. 9మాతో కలిసి క్రీస్తు సేవచేస్తున్న ఊర్బా
నును, నా ప్రియ మిత్రుడైనటువంటి స్టాకుకు నా
వందనాలు చెప్పండి. 10అపెల్లెకు క్రీస్తు పట్ల నిజమైన
భక్తి ఉన్నట్లు నిరూపించబడింది. అతనికి నా వందనాలు
చెప్పండి. అరిస్టొబూలు కుటుంబానికి చెందిన వాళ్ళకు
వందనాలు చెప్పండి. 11హెరోదియోను నా బంధువు.
అతనికి నా వందనాలు చెప్పండి. ప్రభువుకు చెందిన
నార్కిస్సు కుటుంబాన్ని అడిగానని చెప్పండి. 12ప్రభువు
కోసం కష్టించి పని చేస్తున్న త్రుపైనా, త్రుఫోసా అనే
స్త్రీలకు నా వందనాలు చెప్పండి. మరొక స్త్రీ పెర్సిసు
చాలా కష్టించి పని చేసింది. ఆమెకు నా వందనాలు
చెప్పండి. 13ప్రభువు ఎన్నుకొన్న రూఫునకు, అతని
తల్లికి నా వందనాలు చెప్పండి. అతని తల్లి నాకు
కూడా తల్లిలాంటిది. 14అసుంక్రీతును, ప్లెగోనును,
హెర్మేను, పత్రొబను, హెర్మాను, వాళ్ళతో ఉన్న ఇతర
సోదరులకు వందనాలు చెప్పండి. 15పిలొలొగును,
యూలియా అనే సోదరిని, నేరియను, అతని సోదరిని,
ఒలుంపాను వాళ్ళతో ఉన్న దేవుని ప్రజలందరికి వంద
నాలు చెప్పండి. 16మీరు ఒకరినొకరు కలిసినప్పుడు
పవిత్రమైన ముద్దులతో పరస్పరం శుభాకాంక్షలు తెలుపు
కోండి. క్రీస్తు సంఘాలన్నీ మీకు శుభాకాంక్షలు తెలుపు
తున్నాయి.

17సోదరులారా! నేను మిమ్మల్ని అర్థించే దేమి
టంటే చీలికలు కలిగించే వాళ్ళను, మీ దారికి ఆటం
కాలు కలిగించే వాళ్ళను, మీరు నేర్చుకొన్న వాటికి
వ్యతిరేకంగా బోధించే వాళ్ళను గమనిస్తూ వాళ్ళకు
దూరంగా ఉండండి. 18అలాంటి వాళ్ళు యేసుక్రీస్తు
ప్రభువు సేవ చెయ్యరు. దానికి మారుగా వాళ్ళు తమ
కడుపులు నింపుకొంటారు. మంచి మాటలు ఆడుతూ,
ముఖస్తుతి చేస్తూ అమాయకుల్ని మోసం చేస్తూ
ఉంటారు. 19మీరు క్రీస్తును చాలా విధేయతతో అను
సరిస్తున్నారన్న విషయం అందరూ విన్నారు. అందు
వల్ల మీ విషయంలో చాలా ఆనందంగా ఉంది. మీరు
మంచివాటిని గురించి జ్ఞానం సంపాదిస్తూ చెడు విష
యంలో అజ్ఞానులుగా ఉండాలని నా కోరిక! 20శాంతి
దాత అయినటువంటి దేవుడు త్వరలోనే సైతాన్ను
మీ కాళ్ళ క్రింద అణగ త్రొక్కుతాడు. మన యేసుక్రీస్తు
ప్రభువు యొక్క అనుగ్రహం మీకు తోడుగా ఉండుగాక!

21నాతో కలిసి సేవ చేస్తున్న తిమోతి మీకు
వందనములు తెలుపుతున్నాడు. నా బంధువులు,
లూకియ, యాసోను, సోసిపత్రు కూడా మీకు వంద
నాలు తెలుపుతున్నారు. 22పౌలు చెప్పుచున్న ఈ
లేఖను వ్రాస్తున్న తెర్తియు అనే నేను ప్రభువు పేరిట
మీకు శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

23మొత్తం సంఘానికి, నాకు, ఆతిథ్యమిస్తున్న
గాయియు, మీకు వందనాలు చెపుతున్నాడు పట్టణ
కోశాధికారి అయిన ఎరస్తు, మా సోదరుడు క్వర్తు
మీకు వందనాలు తెలుపమన్నారు.

24-25నేను బోధించే సువార్తానుసారం, యేసు
క్రీస్తును గురించి ప్రకటించిన సందేశానుసారం
ఎన్నో సంవత్సరాలనుండి దాచబడి ప్రస్తుతం వ్యక్తం
చెయ్యబడిన ఈ రహస్య సత్యం ప్రకారం, మీలో

ఉన్న విశ్వాసాన్ని దృఢ పరచగలుగుతున్న ఆ దేవుణ్ణి స్తుతించుదాం. [26]కాని ఇప్పుడు ప్రవక్తల వ్రాతల మూలంగా ఆ రహస్య సత్యం బయటపడింది. అందరూ దేవుణ్ణి విశ్వసించి విధేయతతో ఆయన్ని అనుసరించాలని అమరుడైన దేవుని ఆదేశానుసారం అన్ని దేశాలకు ఆ రహస్యం తెలుపబడింది. [27]సర్వజ్ఞుడైనటువంటి దేవునికి, యేసు క్రీస్తు ద్వారా సదా మహిమ కలుగుగాక! ఆమేన్.

# కొరింథీయులకు వ్రాసిన మొదటి లేఖ

1 దైవేచ్ఛవల్ల యేసుక్రీస్తు అపొస్తలుడుగా వుండ
టానికి పిలువబడ్డ పౌలు నుండి, మరియు సోదరు
డైన సొస్తెనేసు నుండి.
[2]కొరింథులోని దేవుని సంఘానికి అంటే యేసు
క్రీస్తులో పరిశుద్ధులుగా నుండుటకు పిలువబడిన
మీకును, ఇతర ప్రాంతాల్లో నివసిస్తూ, యేసుక్రీస్తు
నామంలో ప్రార్థిస్తున్న వారందరికి శుభం కలుగు గాక!
[3]మన తండ్రియైన దేవుని నుండి ప్రభువైన యేసు
క్రీస్తు నుండి మీకు శాంతి, అనుగ్రహం లభించుగాక!

### కృతజ్ఞత

[4]యేసు క్రీస్తు ద్వారా మీకు తన అనుగ్రహం
ప్రసాదించిన దేవునికి నేను మీ పక్షాన అన్ని వేళలా
కృతజ్ఞతలు అర్పిస్తాను. [5]మీరు ఆయనలో ఐక్యత
పొందారు. కనుక మీ మాటలో, మీ జ్ఞానంలో అన్ని
విధాలా అభివృద్ధి చెందారు. [6]క్రీస్తును గురించి చెప్ప
బడిన సందేశం మీలో బాగా నాటుకుపోయింది.
[7]మరియు ప్రభువైన యేసు క్రీస్తు రెండవ రాకడ
కొరకు మీరు కాచుకొని ఉన్నారు. ఆత్మీయ జ్ఞానానికి
మీలో ఏ కొరతా లేదు. [8]మన యేసు క్రీస్తు ప్రభువు
వచ్చిన రోజున మీరు నిర్దోషులుగా పరిగణింప
బడతారు. దానికి తగినట్లు దేవుడు మీకు చివరిదాకా
శక్తినిస్తాడు. [9]తన కుమారుడును, మన ప్రభువు అయిన
టువంటి యేసు క్రీస్తుతో సహ వారసులగుటకు
దేవుడు మిమ్మల్ని పిలిచాడు. ఆయన నమ్మకస్తుడు.

### సంఘంలో చీలికలు

[10]సోదరులారా! మీలో చీలికలు కలుగకుండా అంతా
ఒకే మాటపై నిలబడండి. మీరంతా ఒకే ధ్యేయంతో,
ఒకే మనస్సుతో ఉండాలని మన యేసు క్రీస్తు ప్రభువు
పేరిట మిమ్మల్ని వేడుకొంటున్నాను. [11]నా సోదరు
లారా! మీలో మీరు పోట్లాడుకుంటున్నారని క్లోయె
కుటుంబం నాకు తెలియ చేసింది. [12]నేను చెప్పేదే
మిటంటే మీలో ఒకడు, "పౌలును అను సరిస్తు న్నానని"
ఇంకొకడు, " నేను అపొల్లోను అనుసరిస్తున్నానని"
మరొకడు, "నేను కేఫాను* అనుసరిస్తున్నానని"
నాలుగో వాడు, "నేను క్రీస్తును అనుసరిస్తున్నానని"
అంటున్నారు. [13]అంటే క్రీస్తు విభజింపబడ్డాడా? పౌలు
మీకోసం సిలువపై చనిపొయ్యాడా? పౌలు పేరిట
మీరు బాప్తిస్మము పొందారా? [14]నేను క్రిస్పుకు,
గాయియుకు తప్ప ఎవ్వరికీ బాప్తిస్మము నివ్వలేదు.
అందుకు నేను దేవునికి కృతజ్ఞుణ్ణి. [15]కనుక మీరు నా
నామంలో బాప్తిస్మము పొందినట్లు ఎవ్వరూ అనలేరు.
[16]ఔను, నేను స్తెఫను కుటుంబానికి చెందిన వాళ్ళకు
మాత్రమే బాప్తిస్మము ఇచ్చితిని. వీరికి తప్ప మరెవ్వ
రికైనా ఇచ్చితినేమో జ్ఞాపకం లేదు. [17]ఎందుకంటే,
క్రీస్తు బాప్తిస్మము యివ్వటానికి నన్ను పంపలేదు.
సువార్త ప్రకటించటానికి పంపాడు. తెలివిగా మాట్లాడి
బోధించటానికి నన్ను పంపలేదు. అలా చేస్తే క్రీస్తు
సిలువకు ఉన్న శక్తి తగ్గిపోతుంది.

### నిజమైన జ్ఞానము

[18]ఎందుకంటే, క్రీస్తు సిలువను గురించిన సందే
శము నశించిపోయే వాళ్ళకు నిష్ప్రయోజనంగా కని
పిస్తుంది. కాని రక్షింపబడుతున్న మనకు అది దేవుని
శక్తి. [19]దీన్ని గురించి ప్రవచనాల్లో ఈ విధంగా వ్రాయ
బడి ఉంది:

> "విజ్ఞానుల్లో ఉన్న విజ్ఞానాన్ని నేను నాశనం
> చేస్తాను. పండితుల్లో ఉన్న తెలివిని నిష్ప్ర
> యోజనం చేస్తాను."
>
> యెషయా *29:14*

[20]మరి విజ్ఞానులు ఏమయ్యారు? పండితులు ఏమ
య్యారు? సమకాలిక తర్క శాస్త్రజ్ఞులు ఏమయ్యారు?
అంటే, దేవుడు ఈ ప్రపంచంలో ఉన్న జ్ఞానం నిష్ప్ర
యోజనమని రుజువు చేసినట్లే కదా! [21]తనను
జ్ఞానంతో కనుక్కోవటం సాధ్యం కారాదని దేవుడే
నిర్ణయించాడు. దానికి మారుగా ప్రజలు 'మూర్ఖత్వం'

---

**కేఫా** అంటే పేతురు.

అని భావిస్తున్న ‘మా సందేశాన్ని’ విశ్వసించిన వాళ్ళు
రక్షింపబడాలని ఆయన నిర్ణయించాడు. 22యూదులు
మహిమలు అడుగుతారు. గ్రీకులు జ్ఞానాన్ని అన్వేషి
స్తారు. 23మేమైతే, సిలువపైనున్న క్రీస్తును ప్రకటి
స్తాము. మా సందేశం యూదులకు ఒక ఆటంకంగాను,
యూదులుకాని వాళ్ళకు అర్థం లేని దానిగాను కనిపి
స్తుంది. 24కాని దేవుడు పిలిచిన యూదులకు, యూదు
లుకాని వాళ్ళకు ‘క్రీస్తు’ దేవుని శక్తితో, ఆయన
జ్ఞానంతో సమానము. 25దేవునికి అవివేకంలా కని
పించేది, నిజానికి మానవుని జ్ఞానం కన్నా శ్రేష్ఠమైనది.
దేవుని బలహీనత మానవుల బలంకన్నా శక్తి
వంతమైనది.

26సోదరులారా! మిమ్మల్ని పిలిచినప్పుడు మీరు ఏ
విధంగా ఉన్నారో జ్ఞాపకం ఉందా? ప్రపంచం మిమ్మల్ని
జ్ఞానులుగా పరిగణించలేదు. మీకు పేరు ప్రతిష్టలు లేవు.
మీరు ఉన్నత కుటుంబాలకు చెందలేదు. 27కాని దేవుడు
విజ్ఞానుల్ని సిగ్గుపరచాలని, ప్రపంచంలోని మూర్ఖుల్ని
ఎన్నుకొన్నాడు. బలవంతుల్ని సిగ్గుపరచాలని ప్రపం
చంలోని బలహీనుల్ని ఎన్నుకొన్నాడు. 28ప్రపంచం
ముఖ్యమైన వాళ్ళని భావి స్తున్న మనుష్యుల ప్రాముఖ్య
తను తీసివేయటానికి, దేవుడు ఈలోకంలో చిన్న
చూపుతో చూడబడే వాళ్ళనూ, ఏవగించుకొనబడే
వాళ్ళనూ, లెక్క చెయ్యబడని వాళ్ళను ఎన్ను
కొన్నాడు. 29తనముందు ఎవ్వరూ గర్వించరాదని
ఆయన ఉద్దేశ్యం. 30కాని దేవుని కారణంగా మీకు
యేసు క్రీస్తులో ఐక్యత కలిగింది. దేవుడు క్రీస్తును
మీకు జ్ఞానంగా యిచ్చాడు. క్రీస్తు మనకు నీతి, పవిత్రత,
విమోచన కలిగిస్తాడు. 31అందువల్ల లేఖనాల్లో వ్రాయ
బడినట్లు, “గర్వించాలనుకొన్నవాడు ప్రభువు విష
యంలో గర్వించాలి.”*

2 సోదరులారా! నేను మీ దగ్గరకు వచ్చి దేవుని
రహస్యాన్ని ప్రకటించినప్పుడు మాటల చాతు
ర్యంతో గాని లేక ఉత్కృష్టమైన విజ్ఞానంతోగాని ప్రక
టించలేదు* 2ఎందుకంటే నేను మీతో ఉన్నప్పుడు
యేసు క్రీస్తునూ ఆయన సిలువ మరణాన్ని తప్ప
మిగతా వాటిని గురించి మరచిపోవాలని నిర్ణయించు
కొన్నాను. 3నేను మీ దగ్గరకు వచ్చినప్పుడు నా శక్తిపై
నమ్మకం పెట్టుకొని రాలేదు. భయంతో వణుకుతూ
వచ్చాను. 4మిమ్మల్ని సమ్మతింప చెయ్యాలని నేను
జ్ఞానంతో నిండిన పదాలుపయోగించి నా సందేశం
బోధించలేదు. దేవుని ఆత్మ యిచ్చిన శక్తినుపయో
గించి నా సందేశంలో ఉన్న సత్యాన్ని ఋజువు చేసాను.
5మీ విశ్వాసానికి మానవుల పాండిత్యం కాకుండా దేవుని
శక్తి పునాదిగా ఉండాలని నా ఉద్దేశ్యం.

### ఆత్మ ఇచ్చిన జ్ఞానము

6కాని ఆత్మీయ పరిపూర్ణత పొందినవాళ్ళకు మేము
జ్ఞానంతో నిండిన సందేశం చెపుతాము. ఆ సందేశం
ఈ ప్రపంచానికి సంబంధించిన జ్ఞానం కాదు. అది
ప్రపంచాన్ని పాలించే పాలకులకు సంబంధించిన
జ్ఞానమూ కాదు. చివరికి ఆ పాలకులు లేకుండా
పోతారు. 7నేను చెపుతున్నది దేవుడు చెప్పిన రహస్య
జ్ఞానం. ‘ఇది’ ఇంతదాకా మానవులనుండి రహస్యంగా
దాచబడిన జ్ఞానం. ఆ జ్ఞానం ద్వారా మనకు మహిమ
కలగాలని కాలానికి ముందే దేవుడు నిర్ణయించాడు.
8ఈనాటి పాలకులు దాన్ని అర్థం చేసుకోలేదు. దాన్ని
అర్థం చేసుకొనివుంటే మహిమా స్వరూపి అయిన
మన ప్రభువును సిలువకు వేసి చంపేవాళ్ళు కాదు.
9దీన్ని గురించి ప్రవచనాల్లో ఈ విధంగా వ్రాయబడి
ఉంది:

> “దేవుడు తనను ప్రేమించిన వాళ్ళకోసం
> సిద్ధంగా ఉంచిన వాటిని ఎవరి కళ్ళూ చూడ
> లేదు. ఎవరి చెవులు వినలేదు. ఎవరూ
> వాటిని ఊహించలేదు.”
>
> *యెషయా 64:4*

10కాని దేవుడు ఈ రహస్యాన్ని మనకు తన ఆత్మ
ద్వారా తెలియచేసాడు.

ఆత్మ అన్నిటినీ పరిశోధిస్తాడు. దేవునిలో దాగి
ఉన్న వాటిని కూడా పరిశోధిస్తాడు. 11మానవునిలో
ఉన్న ఆలోచనలు అతనిలో ఉన్న ఆత్మకు తప్ప
ఇతరులకు తెలియదు. అదేవిధంగా దేవునిలో ఉన్న
ఆలోచనలు ఆయన ఆత్మకు తప్ప ఇతరులకు తెలి
యదు. 12మనం ఈ ప్రపంచానికి సంబంధించిన
ఆత్మను పొందలేదు. దేవుడు పంపిన ఆత్మను మనం
పొందాము. తాను ఉచితంగా యిచ్చిన వాటిని గురించి
మనం తెలుసుకోవాలని ఆయన ఉద్దేశ్యం. 13మాన
వులు తమ జ్ఞానంతో బోధించిన పదాలను వాడకుండా
ఆత్మ బోధించిన పదాలను వాడి, ఆత్మీయ సత్యాలను
ఆత్మీయ భాషలో చెపుతూ ఉంటాము. 14తనలో
దేవుని ఆత్మలేని మానవుడు, దేవుని ఆత్మ ఇచ్చే
వరాలను అంగీకరించడు. అతనికవి మూర్ఖంగా కని
పిస్తాయి. వాటిని ఆత్మీయంగా మాత్రమే అర్థం చేసు
కోగలము కనుక అతడు వాటిని అర్థం చేసుకోలేడు.
15ఆత్మీయంగా ఉన్నవాడు అందరిపై తీర్పు చెప్ప
కలడు. కాని అతనిపై ఎవడూ తీర్పు చెప్పలేడు.
16దీన్ని గురించి ప్రవచనాల్లో ఈ విధంగా వ్రాయబడి
ఉంది:

---

**గర్వించా ... గర్వించాలి** యిర్మీయా 9:24.

**ప్రకటించలేదు** కొన్ని ప్రతులలో దేవుని రహస్యాన్ని
మాత్రమే ప్రకటించాను అని ఉంది.

"ప్రభువులో ఉన్న జ్ఞానం ఎవరు తెలుసుకో గలరు? ప్రభువుకు ఎవరు సలహా యివ్వ గలరు?"

*యెషయా 40:13*

కాని మన విషయం వేరు. మనలో క్రీస్తు మనస్సు ఉంది.

### మానవులను అనుసరించుట తప్పు

3 సోదరులారా! ఆత్మీయత కలవాళ్ళతో మాట్లాడినట్లు నేను మీతో మాట్లాడలేక పొయ్యాను. ఆత్మీయత లేనివాళ్ళతో మాట్లాడినట్లు మాట్లాడాను. క్రీస్తు వల్ల మీరు పొందిన జీవితంలో, మిమ్మల్ని పసి పిల్లలుగా పరిగణించి మాట్లాడాను. 2మీరు అన్నం తినటానికి సిద్ధంగా లేరు. కనుక పాలు యిచ్చాను. మీరు యిప్పటికీ సిద్ధంగా లేరు. మీరింకా ఆత్మీయత లేని వాళ్ళలా ప్రవర్తిస్తున్నారు. 3మీలో అసూయలు, పోట్లాటలు, ఇంకా ఉన్నాయి. అంటే మీరు ఆత్మీయత లేని వాళ్ళలా జీవిస్తున్నట్లే కదా! అంటే మీరు మిగతావాళ్ళలా జీవిస్తున్నట్లే కదా! 4మీలో ఒకడు, "నేను పౌలును అనుసరిస్తున్నానని" మరొకడు, "నేను అపొల్లోను అనుసరిస్తున్నానని" అంటున్నారు. అలా మామూలు మనుష్యులు అంటారు.

5ఇంతకూ అపొల్లో ఎవరు? పౌలు ఎవరు? మేము కేవలం దేవుని సేవకులం. మా ద్వారా మీరు క్రీస్తును విశ్వసించారు. అంతే. ప్రభువు అప్పగించిన కర్తవ్యాన్ని మాలో ప్రతి ఒక్కడూ నిర్వర్తించాడు. 6నేను విత్తనం నాటాను. అపొల్లో నీళ్ళుపోసాడు. కాని దాన్ని పెంచుతున్నవాడు దేవుడే. 7విత్తనం నాటటం, నీళ్ళు పోయటం ముఖ్యం కాదు. దాన్ని పెంచే దేవుడు ముఖ్యమైనవాడు. 8విత్తనం నాటేవానికి, నీళ్ళు పోసే వానికి ఉద్దేశ్యం ఒక్కటే. చేసిన పనిని బట్టి ప్రతీఒక్కనికి ప్రతిఫలం లభిస్తుంది. 9ఎందుకంటే, మేము దేవునితో కలిసి పని చేసేవాళ్ళం. మీరు ఆయన పొలమునూ ఆయన భవనమునై యున్నారు.

10దేవుని అనుగ్రహం వల్ల నేను నేర్పుగల నిర్మాణకుడుగా పునాదులు వేసాను. ఇతరులు ఆ పునాదిపై కడుతున్నారు. ప్రతి ఒక్కడూ తానేవిధంగా కడుతున్నాడో గమనిస్తూ జాగ్రత్తగా కట్టాలి. 11ఆ 'పునాది' యేసు క్రీస్తు కనుక ఇదివరకే వేసిన ఆ పునాది తప్ప వేరొక పునాదిని ఎవ్వరూ వేయలేరు. 12కొందరు బంగారము, వెండి, విలువైన రత్నాలు ఉపయోగించి ఈ పునాది మీద కడుతారు. మరికొందరు చెక్కను, గడ్డిని, ఆకుల్ని ఉపయోగించి కడుతారు. 13వాళ్ళ పనితనము క్రీస్తు వచ్చిన రోజున ఆయనయొక్క వెలుగులో బయటపడుతుంది. 'ఆ రోజు' నిప్పువలె వస్తుంది. ఆ నిప్పు ప్రతి ఒక్కరి పనితనాన్ని పరీక్షిస్తుంది. 14వాళ్ళు నిర్మించింది నిలిస్తే వాళ్ళకు ప్రతిఫలం లభిస్తుంది. 15అది కాలిపోతే వాళ్ళకు నష్టం కలుగుతుంది. కాని మంటలనుండి అతనొక్కడే తప్పించుకొన్న విధంగా రక్షింపబడతాడు.

16మీరు దేవుని మందిరమని, దేవుని ఆత్మ మీలో నివసిస్తున్నాడని మీకు తెలియదా? 17కనుక దేవుని మందిరాన్ని నాశనం చేసిన వాణ్ణి దేవుడు నాశనం చేస్తాడు. దేవుని మందిరం పవిత్రమైనది. మీరే ఆ మందిరం.

18మిమ్మల్ని మీరు మోసం చేసుకోకండి. ప్రాపంచిక విషయాల్లో తెలివి ఉందని భావించేవాడు మొదట తనను తాను జ్ఞానహీనునిగా ఎంచుకొంటే తర్వాత జ్ఞాని కాగలడు. 19ఎందుకంటే దేవుడు ఈ ప్రాపంచిక జ్ఞానాన్ని మూర్ఖమైన దానిగా పరిగణిస్తాడు. దీన్ని గురించి లేఖనాల్లో, "తమ చమత్కారము ఉపయోగించే జ్ఞానుల్ని దేవుడు పట్టేస్తాడు"* అని వ్రాయబడివుంది. 20మరొకచోట, "జ్ఞానుల ఆలోచనలు పనికిరావని ప్రభువుకు తెలుసు"* అని వ్రాయబడివుంది. 21కనుక మానవుల తెలివిని పొగడకండి. అవన్నీ మీవి. 22పౌలు, అపొల్లో, కేఫా, ప్రపంచము, బ్రతుకు, చావు, ప్రస్తుతము, భవిష్యత్తు అన్నీ మీవి. 23మీరు క్రీస్తుకు చెందినవారు. క్రీస్తు దేవునికి చెందినవాడు.

### క్రీస్తు యొక్క అపొస్తలులు

4 అందువల్ల మమ్మల్ని మీరు క్రీస్తు సేవకులుగా, దేవుని రహస్యాలు అప్పగింపబడ్డ వాళ్ళుగా పరిగణించండి. 2బాధ్యత అప్పగింపబడిన సేవకుడు ఆ బాధ్యతను నమ్మకంతో నిర్వర్తించాలి. 3మీరు నాపై తీర్పు చెప్పినా, ఇతరులు తమ నియమాల ప్రకారము తీర్పు చెప్పినా నేను లెక్కచెయ్యను. నాపై నేనే తీర్పు చెప్పుకోను. 4నా మనస్సు నిర్మలమైనది. అంత మాత్రాన నేను నిర్దోషినికాను. ప్రభువు నాపై తీర్పు చెపుతాడు. 5అందువల్ల తీర్పుచెప్పే సమయం వచ్చేదాకా, ఎవరిమీదా తీర్పు చెప్పకండి. ప్రభువు వచ్చేదాకా ఆగండి. ఆయన చీకట్లో దాగివున్నదాన్ని వెలుగులోకి తెస్తాడు. మానవుల హృదయాల్లో దాగివున్న ఉద్దేశ్యాలను బహిరంగ పరుస్తాడు. అప్పుడు ప్రతి ఒక్కడూ తనకు తగిన విధంగా దేవుని మెప్పు పొందుతాడు.

6సోదరులారా! "లేఖనాల్లో వ్రాయబడినవాటిని అతిక్రమించకండి" అనే లోకోక్తి యొక్క అర్థం మీరు నేర్చుకోవాలని, దానివల్ల మీరు లాభం పొందాలని మేము, అంటే నేను, అపొల్లో ఆ లోకోక్తి ప్రకారం నడుచుకొన్నాము. మీరు ఒకరిని పొగిడి యింకొకరిని

---

**తమ ... పట్టేస్తాడు** యోబు 5:13.

**జ్ఞానుల ... తెలుసు** కీర్తన. 94:11.

ద్వేషించకండి. 7ఇతరులకన్నా మీలో ఏమి ప్రత్యేకత
ఉంది? మీదగ్గరున్నవన్నీ మీరు దేవుని నుండే కదా
పొందింది. మరి అలాంటప్పుడు మీకు అవి దేవుడు
యివ్వనట్లు ఎందుకు చెప్పుకొంటున్నారు?

8ఇప్పటికే మీకు కావలసినవన్నీ మీ దగ్గర ఉన్నాయి.
మీరు ధనవంతులై పొయ్యారు. మేము రాజులం
కాకపోయినా, మీరు రాజులైపొయ్యారు. మీరు నిజంగా
రాజులు కావాలని మా అభిలాష. అప్పుడు మేము
మీతో సహా రాజులమౌతాము. 9మరణ శిక్ష పొందిన
నేరస్థుల్లాగా, దేవుడు అపొస్తులులమైన మమ్మల్ని
చివరన ఉంచాడు. లోకమునకంతటికీ, దేవదూతలకు,
మానవులకు అపొస్తులమైన మేము ప్రదర్శనా వస్తువుల
య్యాము. 10క్రీస్తు కొరకు మేము మూర్ఖులమ
య్యాము. కాని మీరు క్రీస్తు విషయంలో తెలివిగా
నడుచుకొన్నారు. మేము బలహీనులము. మీరు బల
వంతులు. మీకు గౌరవం లభిస్తోంది. మాకు అవమానం
లభిస్తోంది. 11ఇప్పటికీ మేము ఆకలిదప్పులతో బాధ
పడ్తున్నాము. చినిగిన దుస్తులు వేసుకొని జీవిస్తు
న్నాము. నిర్దాక్షిణ్యమైన హింసలు అనుభవిస్తు న్నాము.
మాకు ఇల్లు వాకిలి లేదు. 12మేము మా చేతుల్తో
కష్టపడి పనిచేస్తున్నాం. మమ్మల్ని దూషించిన వాళ్ళను
మేము దీవిస్తున్నాం. మాకు శిక్ష విధిస్తే అనుభవిస్తాం.
13అవమానిస్తే, మర్యాదగా సమాధానం చెపుతున్నాం.
ఇంతదాకా మేము ఈ ప్రపంచానికి చెందిన చెత్తలాగా,
పారవేసిన కసువులాగా చూడ బడ్డాము.

14మిమ్మల్ని సిగ్గుపరచాలని ఇలా వ్రాయటం లేదు.
నా పుత్రులవలె ప్రేమించి హెచ్చరిస్తున్నాను.
15క్రీస్తులో మీకు పదివేల మంది ఉపదేశకులు ఉన్నా
మీకు తండ్రులు అనేకులు లేరు. యేసు క్రీస్తు వల్ల
మీరు పొందిన జీవితం మూలంగా సువార్త తెచ్చి మీకు
తండ్రినయ్యాను. 16కనుక నన్ను అనుసరించుమని
మిమ్మల్ని వేడుకొంటున్నాను. 17ఈ కారణంగా నాకు
ప్రియమైన నా కుమారునిలాంటి తిమోతిని, మీదగ్గరకు
పంపుతున్నాను. తిమోతి ప్రభువు ప్రేమించిన కుమా
రుడు. అతడు యేసు క్రీస్తుతో నేను సాగిస్తున్న జీవిత
విధానాన్ని మీకు జ్ఞాపకం చేస్తాడు. నేను ఈ జీవిత
విధానాన్ని గురించి ప్రతి సంఘంలో బోధిస్తుంటాను.

18నేను రాననుకొని మీలో కొందరు గర్వాన్ని
ప్రదర్శించటం మొదలు పెట్టారు. 19కాని ప్రభువు
చిత్తమైతే నేను త్వరలోనే వస్తాను. గర్వంతో మాట్లాడు
తున్నవాళ్ళు ఏమి చెయ్యకలుగుతారో చూస్తాను.
20దేవుని రాజ్యం అంటే ఒట్టి మాటలు కాదు. అది
శక్తితో కూడినది. 21మీకేమి కావాలి:

మిమ్మల్ని శిక్షించటానికి మీ దగ్గరకు
రావాలా? లేక దయ, ప్రేమ చూపటానికి
రావాలా?

### నీతిలేని సోదరుణ్ణి బహిష్కరించండి

5 మీలో లైంగిక అవినీతి బాగా వ్యాపించి పోయిందని
నాకు స్పష్టంగా తెలిసింది. అలాంటి అవినీతి, క్రైస్త
వులు కానివాళ్ళలో కూడా లేదు. ఒకడు తన సవతి
తల్లితో సంబంధం పెట్టుకొన్నాడని విన్నాను. 2ఇది
గర్వించతగిన విషయమా? ఇది చాలా దుఃఖించవలసిన
విషయము. ఈ పని చేసిన వాణ్ణి మీరు సంఘం
నుండి బహిష్కరించవలసి ఉంది. 3నేను శరీరముతో
మీ దగ్గర లేకున్నా నా ఆత్మలో మీతో ఉన్నాను.
నేను మీతోవున్నట్లు భావించి ఈ అపరాధము చేసిన
వానిపై తీర్పు చెపుతున్నాను. 4మీరు యేసు ప్రభువు
పేరిట సమావేశమైనప్పుడు నా ఆత్మలో మీతో
ఉంటాను. యేసు ప్రభువు శక్తి మీలో ఉంటుంది.
5అప్పుడు అతణ్ణి సైతానుకు అప్పగించండి. తద్వారా
వాని పాపనైజం నశించి అతని ఆత్మ మన ప్రభువు
వచ్చిన రోజున రక్షింపబడుతుంది.

6"మీరు గర్వించటం మంచిది కాదు. పులుపు
కొంచెమైనా, పిండినంతా పులుపు చేస్తుందని తెలి
యదా?"

7పులిసిన పాత పిండిని పారవేయండి. క్రీస్తు మన
పస్కా గొఱ్ఱెపిల్లగా బలి ఇవ్వబడ్డాడు. అప్పుడు మీరు
క్రొత్త పిండిలా ఉంటారు. నిజానికి మీరు పులియని
క్రొత్త పిండివంటి వాళ్ళు. 8కనుక పులియని రొట్టెతో
పండుగ చేసుకొందాము. ద్వేషంతో, పాపంతో
కూడుకున్న పాత పులి పిండితో కాక నిష్క
పటంతోనూ, సత్యంతోనూ కూడుకొన్న పులియని
రొట్టెతో పండుగ ఆచరిద్దాము.

9నేను నా లేఖల్లో లైంగిక అవినీతి కలవాళ్ళతో
సాంగత్యం చేయవద్దని వ్రాసాను. 10అంటే, సంఘానికి
చెందని అవినీతిపరులతో, లోభులతో, మోస గాళ్ళతో,
విగ్రహారాధకులతో సాంగత్యం చేయవద్దని నేను
చెప్పటం లేదు. అలా చేస్తే మీరు ఈ ప్రపంచాన్నే
వదిలివేయవలసి వస్తుంది. 11నేను ప్రస్తుతం వ్రాసేది
ఏమిటంటే తాను సోదరుణ్ణని చెప్పుకొంటూ, లైంగిక
అవినీతితో జీవించే వానితో, లోభత్వం చేసేవానితో,
విగ్రహారాధన చేసే వానితో, ఇతరులను దూషించే
వానితో, త్రాగుబోతుతో, మోసంచేసే వానితో, సహ
వాసం చేయవద్దని చెపుతున్నాను. అలాంటి వానితో
కలిసి భోజనం కూడా చేయవద్దు.

12సంఘానికి చెందని వానిపై తీర్పు చెప్పే అధి
కారం నాకు లేదు. కాని సంఘంలో ఉన్న వానిపై
తీర్పు చెప్పవలసిన అవసరం ఉంది. 13"సంఘానికి
చెందని వాళ్ళపై దేవుడు తీర్పు చెపుతాడు. కాని ఆ
దోషిని మీ సంఘం నుండి వెలివేయండి."*

**సంఘానికి … వెలివేయండి** ద్వితీ. 17:7; 19:19; 22:21; 24:7.

### క్రైస్తవుల మధ్య వివాదాలు

6 ఒకవేళ మీ మధ్య తగువులొస్తే, మన సంఘంలో
ఉన్న పవిత్రుల దగ్గరకు వెళ్ళాలి కాని, సంఘానికి
చెందని వాళ్ళ దగ్గరకు వెళ్ళేందుకు మీ కెంత ధైర్యం?
2పవిత్రులు ప్రపంచం మీద తీర్పు చెపుతారన్న
విషయం మీకు తెలియదా? మీరు ప్రపంచంమీద తీర్పు
చెప్పగలిగినప్పుడు, సాధారణమైన విషయాలపై తీర్పు
చెప్పే స్తోమత మీలో లేదా? 3మనము దేవదూతల
మీద కూడా తీర్పు చెపుతామన్న విషయం మీకు
తెలియదా? అలాంటప్పుడు ఈ జీవితానికి సంబంధిం
చిన విషయాలు ఏ పాటివి? 4మీ మధ్య వివాదాలొస్తే,
సంఘం లెక్కచెయ్యని వాళ్ళ దగ్గరకు వెళ్ళి వాళ్ళను
న్యాయం చెప్పమంటారా? 5సిగ్గుచేటు! సోదరుల మధ్య
కలిగే తగువులు తీర్చగలవాడు మీలో ఒక్కడు కూడా
లేడా? 6సంఘానికి చెందినవాని దగ్గరకు వెళ్ళకుండా
ఒక సోదరుడు మరొక సోదరునిపై నేరారోపణ చేయ
టానికి న్యాయస్థానానికి వెళ్ళుతున్నాడు. అంటే సంఘా
నికి చెందనివాళ్ళను అడుగుతున్నాడన్న మాట.
7మీ మధ్య వ్యాజ్యాలు ఉండటం వల్ల మీరు పూర్తిగా
ఓడిపొయ్యారని చెప్పవచ్చు. వ్యాజ్యాలు పెట్టు కోవ
టంకన్నా అన్యాయం సహించటం, మోసపోవటం
మంచిది. 8దానికి మారుగా మీరే అన్యాయాలు,
మోసాలు చేస్తున్నారు. ఇతరులను కాక, మీ సోదరులనే
మోసం చేస్తున్నారు.
9దుష్టులు దేవుని రాజ్యానికి వారసులు కాలేరని
మీకు తెలియదా? మోసపోకండి. లైంగిక విషయాల్లో
అవినీతిగా జీవించేవాళ్ళకు, విగ్రహారాధికులకు, వ్యభి
చారులకు, మగ వేశ్యలు, మగవాళ్ళతో మగవాళ్ళు,
ఆడవాళ్ళతో ఆడవాళ్ళు తమ కామాన్ని తీర్చుకొనే
వాళ్ళకు, 10దొంగలకు, దురాశాపరులకు, త్రాగు బోతు
లకు, అపవాదాలు లేవదీసేవాళ్ళకు, మోస గాళ్ళకు,
దేవుని రాజ్యం దొరకదు. 11మీలో కొందరు ఆ విధంగా
జీవించారు. కాని దేవుడు మీ పాపాలు కడిగివేశాడు.
కనుక మీరు పవిత్రంగా ఉన్నారు. యేసు క్రీస్తు ప్రభువు
పేరిట మన దేవుని ఆత్మ ద్వారా మీరు నిర్దోషులుగా
పరిగణింపబడ్డారు.

### లైంగిక అవినీతి

12“ఏది చెయ్యటానికైనా నాకు అనుమతి ఉంది.”
కాని వాటివల్ల లాభం కలుగదు. “ఏది చెయ్యటానికైనా
నాకు అనుమతి ఉంది” కాని నేను దానికి బానిసను
కాను, 13“తిండి కడుపు కోసము, కడుపు తిండి కోసము
సృష్టింపబడినాయి.” కాని దేవుడు రెంటినీ నాశనం
చేస్తాడు. దేహం ఉన్నది వ్యభిచారం చేయటానికి కాదు.
అది ప్రభువు కోసం ఉంది. ప్రభువు దేహం కోసం
ఉన్నాడు. 14దేవుడు తన శక్తితో ప్రభువును బ్రతి
కించాడు. అదే విధంగా మనల్ని కూడా బ్రతికిస్తాడు.
15మీ దేహాలు క్రీస్తుకు అవయవాలని మీకు తెలియదా?
మరి అలాంటప్పుడు క్రీస్తు అవయవాల్ని, వేశ్య
దేహంతో కలుపమంటారా? అసంభవము. 16తన
దేహాన్ని వేశ్య దేహంతో కలిపిన వాడు ఆ దేహంతో
ఒకటైపోతాడని మీకు తెలియదా? దీన్ని గురించి,
“రెండు దేహాలు ఒక దేహంగా అవుతాయి”* అని లేఖ
నాల్లో వ్రాయబడివుంది. 17కాని ప్రభువుతో ఐక్యమైన
వాడు ఆయన ఆత్మతో ఐక్యమౌతాడు.
18లైంగిక అవినీతికి దూరంగా ఉండండి. మనిషి
చేసే మిగతా పాపాలు తన దేహానికి సంబంధించినవి
కావు. కాని వ్యభిచారం చెయ్యటంవల్ల వ్యక్తి తన స్వంత
దేహంపట్ల పాపం చేసినట్లౌతుంది. 19మీ దేహం
పరిశుద్ధాత్మకు మందిరమని మీకు తెలియదా? దేవుడు
యిచ్చిన పరిశుద్ధాత్మ మీలో ఉన్నాడు. మీ దేహంపై
మీకు హక్కులేదు. 20మీకోసం వెల చెల్లించబడింది.
కనుక మీ దేహాల్ని దేవుని మహిమ కోసం ఉపయో
గించండి.

### వివాహం

7 ఇక మీరు వ్రాసిన ప్రశ్నలకు నా సమాధానం
ఇది: ఔను. వివాహం చేసుకోకుండా ఉండటం
మంచిది. 2కాని లైంగిక అవినీతి చాలా వ్యాపించి
పోయింది కనుక స్త్రీ పురుషులు వివాహం చేసుకోవటం
మంచిది. 3ప్రతీ పురుషుడు భర్తగా తన కర్తవ్యాలు
నిర్వహించాలి. అలాగే ప్రతీ స్త్రీ భార్యగా తన కర్తవ్యాలు
నిర్వహించాలి. 4భార్యకు తన శరీరంపై అధికారం లేదు.
భర్తకు మాత్రమే ఆమె శరీరంపై అధికారం ఉంది.
అలాగే భర్తకు తన శరీరంపై అధికారం లేదు. అతని
శరీరంపై అతని భార్యకు మాత్రమే అధికారం ఉంది.
5భార్యాభర్తలు ఇరువురు సమ్మతించి దేవుని ప్రార్థించ
టంలో తమ కాలాన్ని గడపదలిస్తే తప్ప వేరువేరుగా
ఉండకూడదు. ప్రార్థనా సమయం ముగిసాక మళ్ళీ
మీరు కలిసికొనండి. మీలో ఆత్మనిగ్రహం లేదు. కనుక
సైతాను ప్రేరేపణకు లొంగిపోకుండా జాగ్రత్త పడ
టానికి ఇలా చెయ్యటం అవసరం. 6ఇలా చెయ్యు
మని నేను ఆజ్ఞాపించటం లేదు. ఇలా చెయ్యటానికి
నా అనుమతి తెలుపుతున్నాను. 7అందరూ నాలా ఉండా
లని నా కోరిక. కాని ప్రతి ఒక్కనికీ దేవుడు ఒక ప్రత్యే
కమైన వరం ఇచ్చాడు. ఒకనికి ఒక వరం, ఇంకొకనికి
ఇంకొక వరం ఇచ్చాడు.
8అవివాహితులకు, వితంతువులకు నా సలహా ఇది:
వాళ్ళు నాలాగే పెళ్ళి చేసుకోకుండా ఉండటం
మంచిది. 9కాని వాళ్ళలో నిగ్రహం లేకపోతే పెళ్ళి
చేసుకోవటం ఉత్తమం. కామంతో కాలిపోవటం కన్నా
పెళ్ళి చేసుకోవటం మంచిది.

---

**రెండు … అవుతాయి** ఆది. 2:24.

10వివాహితులకు నా ఆజ్ఞ ఇది. ఇది నా ఆజ్ఞ కాదు
ప్రభువుయొక్క ఆజ్ఞ. భార్య తన భర్తను వదిలి వేయ
రాదు. 11అలా వదిలివేస్తే ఆమె తిరిగి పెళ్ళి చేసుకో
కూడదు. లేదా భర్తతో సమాధాన పడాలి. అలాగే భర్త
తన భార్యకు విడాకులు ఇవ్వకూడదు.
12మిగతా వాళ్ళకు నా ఆజ్ఞ యిది. ఇది ప్రభువు
ఆజ్ఞ కాదు. నా ఆజ్ఞ. ఒక విశ్వాసి భార్య ప్రభువును
నమ్మనిదై అతనితో ఉండటానికిష్టపడితే అతడు
ఆమెకు విడాకులు ఇవ్వకూడదు. 13అలాగే ఏ స్త్రీకైనను
అవిశ్వాసియైన భర్తయుండి అతడు ఆమెతో జీవిం
చాలని అనుకొంటే ఆమె అతనికి విడాకులు ఇవ్వ
కూడదు. 14అంటే, విశ్వాసం లేని భర్త విశ్వాసురాలైన
భార్యతో కలిసి జీవించటంవల్ల పవిత్రమౌతాడు.
అదేవిధంగా అవిశ్వాసియైన భార్య విశ్వాసియైన భర్తతో
కలిసి జీవించటం వల్ల పవిత్రమౌతుంది. అలాకానట్ల
యితే మీ సంతానం అపవిత్రంగా ఉంటుంది. కాని
ఇప్పుడున్న ప్రకారం వాళ్ళు పవిత్రులే.
15కాని, విశ్వాసి కానివాడు వెళ్ళిపోవాలని అను
కొంటే వెళ్ళిపోనివ్వండి. ఇలాంటి పరిస్థితుల్లో విశ్వాసికి
కాని, విశ్వాసురాలికి కాని ఏ నిర్బంధం ఉండకూడదు.
దేవుడు శాంతితో జీవించటానికే మనల్ని పిలిచాడు.
16ఓ స్త్రీ! నీ వల్ల నీ భర్త రక్షింపబడుతాడో లేదో!
నీకేమి తెలుసు? ఓ పురుషుడా! నీ వల్ల నీ భార్య
రక్షింపబడుతుందో లేదో! నీకేమి తెలుసు?
17ప్రతి ఒక్కడూ తన జీవితాన్ని ప్రభువు ప్రసాదిం
చిన వరం ప్రకారం జీవించాలి. మీ జీవితం ప్రభువు
నియమించిన ప్రకారముగా పిలుపుకు తగినట్టుగా
ఉండాలి. ఈ నియమాన్ని అన్ని సంఘాలు పాటించా
లని ఆజ్ఞాపిస్తున్నాను. 18సున్నతి చేయించుకొన్న
వాడు దేవుని పిలుపును అంగీకరిస్తే, అతడు ఆ సున్నతి
లేనివానిగా ఉండుటకు ప్రయత్నించరాదు. సున్నతి
చేయించుకొననివాడు దేవుని పిలుపును అంగీ కరిస్తే
అతడు సున్నతి చేయించుకోవటానికి ప్రయత్నం
చేయరాదు. 19సున్నతి చేయించుకొన్నా, చేయించు
కోక పోయినా జరిగేది ఏమీలేదు. దేవుని ఆజ్ఞల్ని
పాటించటం ముఖ్యం. 20ప్రతి ఒక్కడూ, దేవుడు పిలిచి
నప్పుడు ఏ విధంగా ఉన్నాడో అదేవిధంగా ఉండాలి.
21దేవుడు పిలిచినప్పుడు నీవు బానిసవా? చింతించకు.
కాని నీవు స్వేచ్ఛ పొందగలిగితే అందుకు ప్రయత్నం
చేయి. 22ప్రభువు పిలిచినప్పుడు బానిసగా ఉన్నవాడు,
ప్రభువులో ఐక్యత పొందటంవల్ల స్వేచ్ఛను పొందు
తాడు. అదేవిధంగా ప్రభువు పిలిచినప్పుడు స్వేచ్ఛగా
ఉన్నవాడు ప్రభువుకు బానిస అవుతాడు. 23మీకోసం
వెల చెల్లించి దేవుడు మిమ్మల్నికొన్నాడు. మానవులకు
బానిసలు కాకండి. 24సోదరులారా! దేవుడు మిమ్మల్ని
పిలిచినప్పుడు మీరేవిధంగా ఉన్నారో ఇప్పుడు కూడా
మీరు అదేవిధంగా ఉండి దేవునితో కలిసి ఉండండి.
25ఇక కన్యలను గురించి: ప్రభువు మీకు ఏ ఆజ్ఞ
ఇవ్వలేదు. కాని దేవుని అనుగ్రహంవల్ల నేను మీకు
చెపుతున్న సలహాలు నమ్మతగినవి. 26ప్రస్తుతమున్న
క్లిష్ట పరిస్థితుల వల్ల మీరు కన్యలుగా ఉండిపోవటం
మంచిది. 27ఇక పురుషులు. మీరు వివాహితులైనట్ల
యితే విడాకులు ఇవ్వకండి. మీరు అవివాహితులైన
ట్లయితే భార్యల కోసం వెతక్కండి. 28అలాగని మీరు
వివాహం చేసుకొంటే పాపం కాదు. అదే విధంగా కన్యలు
కూడా వివాహం చేసుకొంటే పాపం కాదు. కాని వివాహం
చేసుకొన్నవాళ్ళు జీవితంలో చాలా కష్టాలు అనుభవి
స్తారు. మీకా కష్టాలు కలుగరాదని ఇలా చెపుతున్నాను.
29సోదరులారా! ఇక వ్యవధి లేదు. ఇక మీదట
నుండి భార్యలున్నవాళ్ళు భార్యలు లేనట్లు జీవించాలి.
30దుఃఖించేవాళ్ళు దుఃఖించనట్లు, ఆనందిస్తున్నవాళ్ళు
ఆనందించనట్లు, కొనేవాళ్ళు కొన్నవి తమవి కానట్లు
జీవించాలి. 31ఇప్పుడున్న ప్రపంచం నశించబోతోంది.
కనుక ఈ ప్రపంచంలో జీవిస్తున్నవాళ్ళు దానిలో ఉన్న
వస్తువుల పట్ల ఆశ పెంచుకోకుండా జీవించాలి.
32మీరు చింతించరాదని నా కోరిక. 'వివాహం చేసు
కోనివాడు ప్రభువును ఏ విధంగా ఆనంద పరచాలా'
అని, అంటే ఆత్మీయమైన విషయాలను గురించి ఆలో
చిస్తూ ఉంటాడు. 33కాని వివాహితుడు తన భార్యను
ఎలా ఆనందపరచాలని ఆలోచిస్తూ ఉంటాడు. కనుక
ప్రాపంచిక విషయాలను గురించి ఆలోచిస్తూ
ఉంటాడు. 34అందువల్ల అతని మనస్సు రెండు రకాలుగా
పని చేస్తూ ఉంటుంది. పెళ్ళికాని స్త్రీలు, కన్యలు ప్రభువు
ఆజ్ఞల్ని పాటించటంలో నిమగ్నులై ఉంటారు. తమ
మనస్సును, శరీరాన్ని ప్రభువుకు అర్పించి పని చేస్తుం
టారు. కాని పెళ్ళి చేసుకొన్న స్త్రీలు తమ భర్తను
ఆనందపరచటానికి, ప్రాపంచిక విషయాలను గురించి
ఆలోచిస్తూ ఉంటారు. 35ఇది నేను మీ మంచి కోసం
చెపుతున్నాను. అనవసరమైన కట్టుబాట్లు నియమిం
చాలని కాదు. మీరు సక్రమంగా నడుచుకోవాలని, మన
స్ఫూర్తిగా మిమ్మల్ని మీరు ప్రభువుకు అర్పించు
కోవాలని నా ఉద్దేశ్యం. 36తనతో పెళ్ళి నిశ్చయమైన
కన్యను పెళ్ళి చేసుకోకుండా ఉండటం అక్రమమని
భావించినవాడు, లేక ఆమెకు వయస్సు పెరిగిపోవటం
వల్ల పెళ్ళి చేసుకోవటం అవసరమని భావించినవాడు,
పెళ్ళి చేసుకోవచ్చు. ఇది పాపం కాదు. 37కాని పెళ్ళి
చేసుకోరాదని తన మనస్సులో నిశ్చయించుకొన్న
వాడు, పెళ్ళి చేసుకోవాలనే నిర్బంధం లేనివాడు, తన
మనస్సును అదుపులో పెట్టు కోగలవాడు కూడా,
పెళ్ళిమాని సరియైన పని చేస్తున్నాడు. 38కనుక తనతో
పెళ్ళి నిశ్చయమైన కన్యను పెళ్ళి చేసుకొన్నవాడు
మంచి పని చేస్తున్నాడు. కాని పెళ్ళి చేసుకోనివాడు
ఇంకా మంచి పని చేస్తున్నాడు. 39భర్త బ్రతికి ఉన్నంత
కాలము భార్య అతనికి కట్టుబడి ఉండాలి. అతడు

చనిపోతే ఆమె తనకు ఇష్టమున్నవాణ్ణి వివాహం చేసు
కోవచ్చు. కాని అతడు ప్రభువు యొక్క విశ్వాసియై
ఉండాలి. 40ఆమె విధవరా లుగా ఉండిపోతే ఆనందంగా
ఉంటుందని నా అభి ప్రాయం. నాకును దేవుని ఆత్మ
సహాయం ఉన్నదని తలస్తున్నాను.

### విగ్రహార్పితమైన పదార్థం

8 ఇక విగ్రహాలకు బలి యిచ్చిన వాటిని గురించి:
మనలో జ్ఞానం ఉందని మనకు తెలుసు. జ్ఞానం
గర్వాన్ని కలిగిస్తుంది. ప్రేమ మనిషిని అభివృద్ధి పరు
స్తుంది. 2తనలో జ్ఞానముందని భావిస్తున్న వానిలో
నిజానికి ఉండవలసిన జ్ఞానం లేదు. 3కాని తనను
ప్రేమిస్తున్న మనిషిని దేవుడు గుర్తిస్తాడు.
4ఇక విగ్రహాలకు బలి ఇచ్చిన వాటి విషయం:
విగ్రహానికి అర్థం లేదని, ఒక్కడే దేవుడున్నాడని మనకు
తెలుసు. 5దేవుళ్ళని పిలువబడేవాళ్ళు ఆకాశంలోగాని,
భూమిమీదగాని ఉన్నా, వాళ్లు "దేవుళ్ళని", "ప్రభువు
లని" పిలవబడుచున్నారు. 6అయితే నిజానికి మనకు
ఒక్కడే దేవుడున్నాడు. ఆయనే మన తండ్రి. అన్నిటినీ
ఆయనే సృష్టించాడు. ఆయన కోసమే మనము జీవిస్తు
న్నాము. మనకు ఒక్కడే ప్రభువు. ఆయనే యేసు
క్రీస్తు. ఆయన ద్వారానే అన్నీ సృష్టింపబడ్డాయి.
ఆయన వల్ల మనము జీవిస్తున్నాము.
7కాని ఈ విషయం తెలియని వాళ్ళు చాలామంది
ఉన్నారు. ఈనాటికీ విగ్రహారాధనకు అలవాటు పడ్డ
కొందరు ఆ పదార్థాన్ని తిన్నప్పుడు అది విగ్రహానికి
అర్పించింది అనుకొని తింటారు. వాళ్ళ మనసులు
బలహీనమైనవి కనుక వాళ్ళు మలినమయ్యారు.
8ఆహారంవల్ల మనము దేవునికి సన్నిహితులము
కాలేము. ఆ ఆహారం తినకపోతే నష్టం ఏమీ లేదు.
తింటే వచ్చిన లాభం లేదు.
9కాని మీ నిర్ణయము, దృఢ విశ్వాసం లేనివాళ్ళకు
నష్టం కలిగించకుండా జాగ్రత్త పడండి. 10ఈ విష
యంపై గట్టి అభిప్రాయంలేని వాడొకడు, ఈ విష
యాన్ని గురించి జ్ఞానమున్న మిమ్మల్ని గుడిలో
నైవేద్యం తినటం చూస్తాడనుకోండి. అప్పుడు అతనికి
విగ్రహాలకు నైవేద్యం పెట్టిన ఆహారం తినటానికి ధైర్యం
కలుగుతుంది.
11బలహీనమైన మనస్సుగల మీ సోదరుని కోసం
క్రీస్తు మరణించాడు. కాని మీ "ఆ జ్ఞానం" వల్ల ఆ
సోదరుడు నశిస్తాడు. 12అలా చేస్తే మీ సోదరునిపట్ల
పాపం చేసి అతని మనస్సును గాయపరిచిన వాళ్ళవు
తారు. తద్వారా మీరు క్రీస్తుపట్ల పాపం చేసిన వాళ్ళవు
తారు. 13నా సోదరుడు పాపం చేయటానికి నా ఆహారం
కారణమైతే నేనిక మీదట మాంసం తినను! ఏ విధంగా
నైనా అతని పతనానికి కారకుణ్ణి కాకుండా ఉంటాను.

### అపొస్తులుని హక్కులు

9 నాకు స్వేచ్ఛ లేదా? నేను అపొస్తలుడను కానా?
నేను మన యేసు క్రీస్తు ప్రభువును చూడలేదా?
'మీరే' ప్రభువు కోసం నేను చేసిన సేవా ఫలితం
కదా? 2నేను ఇతరులకు క్రీస్తు అపొస్తులుడను కాక
పోవచ్చు. కాని నేను మీకు క్రీస్తు అపొస్తులుడను.
నేను క్రీస్తు అపొస్తులుడనన్న దానికి మీరే నా రుజువు.
3నాపై తీర్పు చెప్పాలనుకొన్నవాళ్ళకు నా సమా
ధానం యిది: 4అన్న పానాలకు మాకు అధికారం
లేదా? 5ఇతర అపొస్తులుల వలె, ప్రభువు సోదరులవలె,
కేఫావలే, విశ్వాసురాలైన భార్యను వెంట తీసుకెళ్ళ
టానికి మాకు అధికారం లేదా? 6నేనూ, బర్నబా
మాత్రమే జీవించటానికి పనిచేయాలా? 7తన స్వంత
డబ్బుతో సైనికునిగా ఎవరు పని చేస్తారు? ద్రాక్షా
మొక్కల్ని నాటి వాటి ఫలాన్ని తినకుండా ఎవరుం
టారు? పశువుల మందలను కాస్తూ, వాటి పాలు త్రాగ
కుండా ఎవరుంటారు?
8నేను దీన్ని మానవ దృష్టిలో చెపుతున్నానా?
ధర్మశాస్త్రం కూడా ఈ మాటే చెబుతోంది. 9మోషే
ధర్మశాస్త్రంలో, "ధాన్యం త్రొక్కే ఎద్దు నోటికి చిక్కం
వేయరాదు"* అని వ్రాయబడివుంది. ఎద్దులకోసం
మాత్రమే దేవుడు ఈ మాట అన్నాడా? 10ఈ మాట
మనకోసమే వ్రాయబడిందని నేను గట్టిగా చెప్పగలను.
పొలం దున్నేవాడూ, పంట నూర్చేవాడూ, పంట
ఫలంలో భాగం లభిస్తుందన్న ఆశతో ఆ పనులు
చేస్తారు. 11మేము మీలో ఆత్మీయ విత్తనాలు చల్లాము.
మీనుండి మా అవసరాలు తీర్చుకోవటం తప్పా?
12మిగతావాళ్ళకు మీనుండి ఈ సహాయం పొందే
హక్కు ఉన్నప్పుడు మాకు వాళ్ళకంటే ఎక్కువ హక్కు
ఉందికదా? కానీ, మేమాహక్కు ఉపయోగించు కోలేదు.
క్రీస్తు సువార్తా ప్రచారంలో ఏ ఆటంకం కలుగకుండా
ఉండాలని మేము ఎన్నో కష్టాలు అనుభవించాము.
13మందిరంలో పనిచేసే వాళ్ళకు మందిరం నుండి
ఆహారం లభిస్తుంది. బలిపీఠం దగ్గర పనిచేసేవాళ్ళకు
బలి ఇవ్వబడిన వాటిలో భాగం లభిస్తుందని తెలి
యదా? 14అదే విధంగా సువార్త బోధించే వాళ్ళకు
సువార్త ద్వారా జీవితావసరాలు తీరాలని ప్రభువు ఆజ్ఞా
పించాడు.
15కాని నేను ఈ హక్కుల్ని ఉపయోగించు కోలేదు.
మీరు నాకు సహాయం చెయ్యాలనే ఉద్దేశ్యంతో నేను
ఇది వ్రాయటం లేదు. అభిమానం దెబ్బతినటం కన్నా
నాకు చావటం మేలనిపిస్తుంది. 16కాని నేను సువార్త
ప్రకటిస్తున్నందుకు గొప్పలు చెప్పుకోలేను. సువార్త
బోధించటం నా కర్తవ్యం. నేను సువార్త బోధించటం
ఆపేస్తే నాకు శాపం కలుగు గాక! 17స్వయంగా ఈ

---

**ధాన్యం ... వేయరాదు** ద్వితీ. 25:4.

పని చేస్తే నాకు బహుమానం ఉంది. ఈ పని చెయ్యాలని
నేను స్వయంగా కోరలేదు. ఆ బాధ్యతను నాకు దేవుడే
అప్పగించాడు. 18మరి నా ప్రతిఫలం ఏమిటి? ప్రతిఫలం
పుచ్చుకోకుండా, నా హక్కులు అడగకుండా సువార్తను
ప్రకటించటమే నా ప్రతిఫలం.
19నేను స్వేచ్ఛాజీవిని, ఎవ్వరికీ బానిసను కాను.
కాని చేతనైనంతమందిని గెలవాలని నేను ప్రతి ఒక్కనికీ
బానిసనౌతాను. 20నేను యూదులతో ఉన్నప్పుడు
వాళ్ళని గెలవాలని యూదునిలా జీవించాను. ధర్మ
శాస్త్రాన్ని అనుసరించే వాళ్ళతో ఉన్నప్పుడు వాళ్ళ
హృదయాలు గెలవాలని, నేను ధర్మశాస్త్రం అను సరించ
వలసిన అవసరం లేకపోయినా ధర్మశాస్త్రం అను
సరించేవాళ్ళ కోసం దాన్ని అనుసరిస్తూ ఉన్నట్లు జీవిం
చాను. 21ధర్మశాస్త్రం లేనివాళ్ళతో ఉన్నప్పుడు వాళ్ళని
గెలవాలని, ధర్మశాస్త్రం లేనివానిగా ప్రవర్తించాను. అంటే
నేను దేవుని న్యాయానికి అతీతుడను కాను. నిజానికి
నేను క్రీస్తు న్యాయాన్ని అనుసరిస్తున్నాను. 22బలహీ
నుల్ని గెలవాలని బలహీనుల కోసం బలహీనుడన
య్యాను. ఏదో ఒక విధంగా కొందరినైనా రక్షించ
గలుగుతానేమో అని నేను అందరికోసం అన్ని విధా
లుగా మారిపొయ్యాను. 23నేను ఇవన్నీ సువార్త కోసం
చేసాను. అది అందించే దీవెనలు పొందాలని నా
అభిలాష.
24పరుగు పందెంలో అందరూ పాల్గొన్నా ఒక్కనికే
బహుమతి లభిస్తుందని మీకు తెలియదా? కనుక ఆ
బహుమతి పొందాలనే ఉద్దేశ్యంతో పరుగెత్తండి.
25పరుగు పందెంలో పాల్గొనదలచిన వాళ్ళందరూ
మంచి క్రమశిక్షణ పొందుతారు. విజయకిరీటం పొందా
లనే వాళ్ళ ఉద్దేశ్యం. కాని వాళ్ళు పొందే కిరీటం
చిరకాలం ఉండదు. మనం చిరకాలం ఉండే కిరీటం
కోసం పోరాడుతున్నాం. 26నేను గమ్యం లేకుండా
పరుగెత్తను. గాలితో పోరాడుతున్న వానిలా పోరాడను.
27నేను నా దేహానికి సరియైన శిక్షణనిచ్చి, అదుపులో
ఉంచుకొంటాను. బోధించిన తర్వాత కూడా ఆ
బహుమతి పొందే అర్హత పోగొట్టుకోరాదని ప్రయాస
పడుచున్నాను.

## ఇశ్రాయేలు చరిత్ర నుండి హెచ్చరికలు

10 సోదరులారా! ఈ సత్యమును గ్రహించకుండా
యుండుట నాకిష్టం లేదు. మన పూర్వీకులు
మేఘం క్రింద యుండిరి. సముద్రాన్ని చీల్చి ఏర్పరచ
బడిన దారి మీద వాళ్ళు నడిచి వెళ్ళారు. 2వాళ్ళు
మేఘంలో, సముద్రంలో బాప్తిస్మము పొందాక, మోషే
లోనికి ఐక్యత పొందారు. 3అందరూ ఒకే ఆత్మీయ
ఆహారం తిన్నారు. 4అందరూ ఒకే విధమైన ఆత్మీయ
నీటిని త్రాగారు. ఈ నీటిని వాళ్ళ వెంటనున్న ఆత్మీయ
మైన బండ యిచ్చింది. ఆ బండ క్రీస్తే. 5అయినా
వాళ్ళలో కొందరు మాత్రమే దేవునికి నచ్చిన విధంగా
జీవించారు. మిగతా వాళ్ళు ఎడారిలో చనిపొయ్యారు.
6వాళ్ళలా మనం చెడుచేయరాదని వారించటానికి
ఇవి దృష్టాంతాలు. 7కొందరు పూజించినట్లు మీరు
విగ్రహాలను పూజించకండి. ధర్మశాస్త్రంలో ఈ విధంగా
వ్రాయబడి ఉంది: “ప్రజలు తిని, త్రాగటానికి కూర్చొ
న్నారు. లేచి నృత్యం చేసారు.”* 8మనం వాళ్ళు
చేసినట్లు వ్యభిచారం చేయరాదు. వ్యభిచారం
చెయ్యటం వల్ల ఒక్కరోజులో, వాళ్ళలో ఇరవై మూడు
వేలమంది మరణించారు. 9వాళ్ళు ప్రభువును శోధించిన
విధంగా మనం శోధించరాదు. పరీక్షించిన వాళ్ళను
పాములు చంపివేసాయి. 10వాళ్ళవలె సణగకండి. సణ
గిన వాళ్ళను మరణదూత చంపివేశాడు.
11మనకు దృష్టాంతముగా ఉండాలని వాళ్ళకు ఇవి
సంభవించాయి. మనల్ని హెచ్చరించాలని అవి ధర్మ
శాస్త్రంలో వ్రాయబడ్డాయి. ఈ యుగాంతములో బ్రతు
కుతున్న మనకు బుద్ధి కలుగుటకై ఇవి వ్రాయ
బడ్డాయి. 12కనుక గట్టిగా నిలుచున్నానని భావిస్తున్న
వాడు క్రింద పడకుండా జాగ్రత్త పడాలి. 13మానవులకు
సహజంగా సంభవించే పరీక్షలు తప్ప మీకు వేరే పరీక్షలు
కలుగలేదు. దేవుడు నమ్మకస్తుడు. భరించగల పరీక్షల
కన్నా, పెద్ద పరీక్షలు మీకు ఆయన కలుగనీయడు.
అంతేకాక, పరీక్షా సమయం వచ్చినప్పుడు వాటిని
ఎదుర్కొని జయం పొందే మార్గం కూడా దేవుడు
చూపుతాడు.

## విగ్రహారాధన; విందులు ప్రభు రాత్రి భోజనము!

14కనుక నా ప్రియ మిత్రులారా! మీరు విగ్రహా
రాధనకు దూరంగా ఉండండి. 15మీరు తెలివిగల వాళ్ళు
కనుక ఇలా మాట్లాడుతున్నాను. నేను చెపుతున్న
వాటిని గురించి మీరే నిర్ణయించండి. 16మనము కృతజ్ఞ
తతో దీవెన పాత్రనుండి త్రాగటం క్రీస్తు రక్తాన్ని
పంచుకోవటం కదా? మనము విరిచిన రొట్టెను పంచు
కోవటము, క్రీస్తు శరీరాన్ని పంచుకోవటము కదా?
17రొట్టె ఒకటే గనుక ఆ ఒకే రొట్టెలో పాలుపొందే
మనం అనేకులమైనప్పటికిని ఒకే శరీరమైయున్నాము.
18ఇశ్రాయేలు ప్రజల్ని చూడండి. బలి ఇచ్చిన
దాన్ని తినేవాళ్ళు బలిపీఠానికి భాగస్వాములు కారా?
19మరి నేను చెపుతున్న దానికి అర్థం ఏమిటి? విగ్ర
హాల్లో కాని, ఆరగింపు చేసిన ప్రసాదంలోకాని, ఏదో
ప్రత్యేకత ఉందని చెపుతున్నానా? 20లేదు. నేను చెపు
తున్నది ఏమిటంటే యూదులుకాని వాళ్ళు బలి పీఠా
లపై బలి ఇచ్చినవి దయ్యాల కోసం బలి ఇవ్వబడ్డాయి.
అవి దేవునికి అర్పితం కావు. మీరు దయ్యాలతో
భాగస్వాములు కారాదని నా విన్నపం. 21మీరు ప్రభువు

---

**ప్రజలు ... చేసారు** నిర్గమ 32:6.

పాత్రనుండి త్రాగుతూ దయ్యాల పాత్రనుండి కూడా
త్రాగాలని ప్రయత్నించరాదు. మీరు ప్రభువు పంక్తిలో
కూర్చొని భోజనం చేస్తూ దయ్యాల పంక్తిలో కూడా
కూర్చోవటానికి ప్రయత్నం చేయరాదు. 22మనం
దేవుని కోపాన్ని రేపటానికి ప్రయత్నిద్దామా? మనం
ఆయన కంటే శక్తిగల వాళ్ళమా? ఎన్నటికీ కాదు.

## మరికొన్ని కర్తవ్యాలు

23“మనకు ఏది చెయ్యటానికైనా స్వేచ్ఛ ఉంది”
కాని అన్నీ లాభదాయకం కావు, “మనకు అన్నీ చెయ్య
టానికి స్వేచ్ఛ ఉంది” కాని అన్నిటి వల్ల వృద్ధి కలుగదు.
24ఎవరూ తమ మంచి కొరకే చూసుకోరాదు. ఇతరుల
మంచి కోసం కూడా చూడాలి.
25మీ మనస్సులు పాడు చేసుకోకుండా కటికవాని
అంగడిలో అమ్మే ఏ మాంసాన్నైనా తినండి. 26“ఎందు
కంటే ఈ భూమి, దానిలో ఉన్నవన్నీ ప్రభునివే.”*
27క్రీస్తును విశ్వసించని వాడు మిమ్మల్ని భోజ
నానికి పిలిస్తే మీకు ఇష్టముంటే వెళ్ళండి. మనస్సుకు
సంబంధించిన ప్రశ్నలు వేయకుండా మీ ముందు ఏది
ఉంచితే అది తినండి. 28కాని ఎవరైనా మీతో, “ఇది
విగ్రహాలకు ఆరగింపు పెట్టిన ప్రసాదం” అని అంటే,
ఈ విషయం మీతో చెప్పినవాని కోసం, వాని
మనస్సుకోసం దాన్ని తినకండి* 29అంటే, మీ మనస్సు
కోసం అని కాదు, ఆ చెప్పిన వాని మనస్సు కోసం
దాన్ని తినకండి. నా స్వాతంత్ర్యం విషయంలో అవతలి
వాని మనస్సు ఎందుకు తీర్పు చెప్పాలి? 30నేను కృతజ్ఞ
తలు అర్పించి భోజనం చెయ్యటం మొదలుపెట్టాను.
నేను కృతజ్ఞతలు అర్పించి తినే భోజనాన్ని గురించి
ఇతరులు నన్నెందుకు విమర్శించాలి?
31కానీ మీరు తిన్నా, త్రాగినా, ఏది చేసినా అన్నీ
దేవుని ఘనత కోసం చేయండి. 32యూదులకు గాని,
యూదులుకాని వాళ్ళకు గాని, దేవుని సంఘానికి గాని,
కష్టం కలిగించకుండా జీవించండి. 33నేను చేస్తున్నట్లు
మీరు చెయ్యండి. నేను అన్ని పనులూ ఇతరులను
సంతోషపెట్టాలని చేస్తాను. నా మంచి నేను చూసు
కోను. వాళ్ళ మంచి కోసం చేస్తాను. వాళ్ళు రక్షింప
బడాలని నా ఉద్దేశ్యం.

## ఆరాధనా, పవిత్రత – తలపై ముసుగు

11 నేను క్రీస్తును అనుసరించిన విధంగా, మీరు
నన్ను అనుసరించండి.
2నన్ను ఎప్పుడూ జ్ఞాపకం చేసుకొంటూ, నేను
చెప్పిన బోధనల్ని పాటిస్తున్నందుకు మిమ్మల్ని అభి
నందిస్తున్నాను. 3క్రీస్తుకు ప్రతీ మనిషిపై అధికారం
ఉంది. ప్రతీ పురుషునికి తన భార్యపై అధికారం ఉంది.
దేవునికి క్రీస్తుపై అధికారం ఉంది. ఇది మీరు అర్థం
చేసుకోవాలని నా కోరిక. 4కనుక తన తల కప్పుకొని
బహిరంగంగా దేవుణ్ణి ప్రార్థించేవాడు లేక దైవసందేశాన్ని
ప్రకటించేవాడు తన తలను అవమానపరచిన వానితో
సమానము. 5తల మీద ముసుగు వేసుకోకుండా బహి
రంగంగా దేవుణ్ణి ప్రార్థించే స్త్రీ, లేక దైవ సందేశాన్ని
బోధించే స్త్రీ తన తలను అవమానపరచినట్లు అవు
తుంది. ఆమె తలగొరిగించుకొన్న దానితో సమా
నము. 6స్త్రీ తన తల మీద ముసుగు వేసుకోకపోతే
ఆమె తన తలవెంట్రుకలు కత్తిరించుకోవటం మంచిది.
తల వెంట్రుకలు కత్తిరించుకోవటం కాని, లేక తల
గొరిగించుకోవటం కాని అవమానంగా అనిపిస్తే ఆమె
తన తలపై ముసుగు వేసుకోవాలి. 7పురుషుడు దేవుని
ప్రతి రూపం. దేవునికి కీర్తి కలిగించేవాడు పురుషుడు.
కనుక అతడు తన తల కప్పుకొనకూడదు. కాని స్త్రీ
వల్ల పురుషునికి కీర్తి కలుగుతుంది.
8ఎందుకంటే పురుషుడు స్త్రీ నుండి సృష్టింప
బడలేదు. స్త్రీ పురుషుని నుండి సృష్టింపబడింది. 9అంతే
కాక పురుషుడు స్త్రీ కొరకు సృష్టింపబడలేదు. స్త్రీ
పురుషుని కొరకు సృష్టింపబడింది. 10ఈ కారణంగా
మరియు దేవదూతల కారణంగా స్త్రీ తనపై ఒకరికి
అధికారముందని చూపటానికి తన తలపై ముసుగు
వేసుకోవాలి. 11కాని ప్రభువు దృష్టిలో పురుషుడు
లేకుండా స్త్రీ, స్త్రీ లేకుండా పురుషుడు జీవించలేరు.
12ఎందుకంటే, స్త్రీ పురుషుని నుండి సృష్టింపబడినట్లే,
పురుషుడు కూడా స్త్రీ నుండి సృష్టింపబడ్డాడు. కాని
అన్నిటినీ దేవుడే సృష్టించాడు. 13తలపై ముసుగు
వేసుకోకుండా స్త్రీ దేవుణ్ణి ప్రార్థించటం సరియేనా?
మీరే నిర్ణయించండి. 14పురుషునికి పొడుగాటి వెంట్రు
కలు ఉండటం వలన అతనికి అవమానమని ప్రకృతే
మీకు తెలియచెయ్యటం లేదా? 15స్త్రీకి తన తల
వెంట్రుకలు ముసుగుగా ఉండటానికి పొడుగాటి వెంట్రు
కలు ఇవ్వబడ్డాయి. దాని వల్ల ఆమెకు గౌరవం లభి
స్తుంది. 16దీన్ని గురించి ఎవరైనా వాదించాలను కొంటే
మా సమాధానం యిదే తప్ప వేరొకటి లేదు. దేవుని
సంఘం కూడా దీన్నే అనుసరిస్తుంది.

## ప్రభువు భోజనం

17మీ సంఘ సమావేశాలు మంచి కన్నా చెడును
ఎక్కువగా చేస్తున్నాయి. కనుక ఈ క్రింది ఆజ్ఞలు
మిమ్మల్ని పొగుడుతూ వ్రాయటం లేదు. 18మీరు
సమావేశమైనప్పుడు మీలో విభాగాలు కలుగుతున్నట్లు
నేను విన్నాను. ఇందులో నిజముండవచ్చు. 19సక్రమ
మార్గాల్లో నడుచుకొనే వాళ్ళు రుజువు కావాలంటే
మీలో విభేదాలు ఉండటం అవసరం. 20మీరు సమా

---

**ఎందుకంటే ... ప్రభునివే** కీర్తన 24:1; 50:12; 89:11.

**వచనము 28** కొన్ని వ్రాతప్రతులలో ‘ఈ భూమి, అందులో ఉన్నవన్నీ ప్రభునివి’ అని చేర్చాయి.

వేశమైనప్పుడు నిజమైన “ప్రభు రాత్రి భోజనం”
చెయ్యటం లేదు. 21ఎందుకంటే మీరు తినేటప్పుడు
ఎవరికోసం కాచుకోకుండా తింటారు. బాగా త్రాగు
తారు. కాని కొందరు ఆకలితో ఉండిపోతారు. 22తిన
టానికి, త్రాగటానికి మీకు ఇళ్ళు లేవా? మీరు
పేదవాళ్ళను అవమానిస్తున్నారు. అంటే, మీరు దేవుని
సంఘాన్ని లెక్కచెయ్యనట్లే కదా! మీరు ఇలా చేస్తు
న్నందుకు మిమ్మల్ని పొగడాలా? ఈ విషయంలో
మిమ్మల్ని పొగడను.

23నేను ప్రభువు నుండి పొందిన సందేశాన్ని మీకు
చెప్పాను. యేసు ప్రభువు అప్పగింపబడిన రాత్రి రొట్టె
చేత పట్టుకొని 24దేవునికి కృతజ్ఞతలు చెప్పిదాన్ని
విరిచి, “ఇది మీ కొరకైన నా శరీరం నన్ను జ్ఞాపకం
చేసుకొనుటకే దీనిని చేయుడి” అని అన్నాడు. 25అదే
విధముగా వారు భోజనమయిన తర్వాత ద్రాక్షారసం
ఉన్న పాత్రను తీసుకొని, “ఈ పాత్ర నా రక్తంవలనైన
క్రొత్త నిబంధన. మీరు దీనిని త్రాగునప్పుడెల్లా నన్ను
జ్ఞాపకం చేసుకొనండి” 26కనుక మీరు ఈ రొట్టెను
తిని, ద్రాక్షా రసమును త్రాగినప్పుడెల్ల ఆయన
మరణాన్ని ఆయన వచ్చేదాకా ప్రకటిస్తారు.

27కనుక ప్రభువు పట్ల అయోగ్యముగా ఎవరు
ఆయన రొట్టె తింటారో, ఎవరు ఆయన పాత్ర నుండి
త్రాగుతారో అతడు ప్రభువు శరీరం పట్ల, ఆయన
రక్తంపట్ల పాపం చేసిన వాడగును. 28ప్రతీ వ్యక్తి రొట్టెను
తినే ముందు, ఆ పాత్రనుండి త్రాగే ముందు తన
ఆత్మను స్వయంగా పరిశోధించుకోవాలి. 29ప్రభువు
శరీరమని గ్రహించక రొట్టెను తినువాడు, మరియు
ద్రాక్షారసం త్రాగువాడు శిక్షావిధికి గురి అవుతాడు.
30అందువల్లనే మీలో అనేకులు బలహీనులు, రోగ
గ్రస్తులు అయిన్నారు, కొందరు మరణించారు. 31కనుక
మొదటే మనల్నిమనం పరీక్షించుకొంటే మనం శిక్ష
పొందం. దేవుడు మనల్ని శిక్షించడు. 32కాని, మనకు
సరియైన శిక్షణ యివ్వాలని ప్రభువు మనల్ని శిక్షిస్తాడు.
ప్రపంచంతోపాటు మనకు శిక్ష లభించరాదని ఆయన
ఉద్దేశ్యం. 33అందువల్ల నా సోదరులారా! మీరు భోజ
నానికి సమావేశమైనప్పుడు ఒకరి కోసం ఒకరు కాచు
కోండి. 34మీరు సమావేశమైనప్పుడు ఒకవేళ మీలో
ఎవరికైనా ఆకలి వేస్తే, అలాంటి వాడు యింట్లోనే
తిని రావాలి. అలా చేస్తే మీరు సమావేశమైనప్పుడు
తీర్పుకు గురికారు. నేను వచ్చినప్పుడు మీకు మిగతా
ఆజ్ఞలు యిస్తాను.

### పవిత్రాత్మ వరాలు

12 సోదరులారా! పరిశుద్ధాత్మ యిచ్చే వరాలను
గురించి మీరు తెలుసుకోవాలని నా అభి
ప్రాయము. 2మీరు క్రీస్తులో విశ్వాసులు కానప్పుడు
ఏదో ఒక విధంగా ప్రేరేపింపబడి త్రోవ తప్పి, మాట్లాడ
లేని విగ్రహాల వైపుకు మళ్ళారు. ఇది మీకు తెలుసు.
3అందువల్ల నేను చెప్పేదేమిటంటే, దేవుని ఆత్మ
ద్వారా మాట్లాడేవాడెవ్వడూ, “యేసు శాపగ్రస్తుడని”
అనడు. అదే విధంగా ఆత్మ ద్వారా మాత్రమే “యేసే
ప్రభువు” అని అనగలడు.

4దేవుని ఆత్మ ఒక్కడే అయినా ఆయన ఎన్నో
రకాల వరాలిస్తాడు. 5ప్రభువు ఒక్కడే కాని, ఆయనకు
ఎన్నో విధాలుగా సేవ చేయవచ్చు. 6దేవుడు నలుగు
రిలో పలువిధాలుగా పని చేస్తాడు. దేవుడు ఒక్కడే
అయినా ఆయన అన్నీ చేస్తాడు. అందరిలో చేస్తాడు.
7దేవుడు ప్రతీ ఒక్కరిలో తన ఆత్మ ఉండేటట్లు
చేసాడు. ఇది మనము చూస్తున్నాము. అందరికీ
శ్రేయస్సు కలగాలని ఆయన ఉద్దేశ్యం. 8ఒకనికి పరి
శుద్ధాత్మ ద్వారా ఆత్మీయ జ్ఞానంతో మాట్లాడే వరాన్ని,
ఆ ఆత్మ ద్వారానే బుద్ధి వాక్యాన్ని ఇచ్చాడు. 9అదే
పరిశుద్ధాత్మ ద్వారా ఒకనికి విశ్వాసము ఇచ్చాడు.
మరొకనికి వ్యాధులు నయం చేసే వరము నిచ్చాడు.
10ఒకనికి అద్భుతాలు చేయు శక్తిని, మరొకనికి
ప్రవచించే శక్తిని ఇచ్చాడు. ఒకనికి ఆత్మలను గుర్తించే
శక్తిని, మరొకనికి రకరకాల భాషల్లో మాట్లాడే శక్తిని
ఇచ్చాడు. ఇంకొకనికి వాటి అర్థాలను విడమర్చి చెప్పే
శక్తినిచ్చాడు. 11ఆ ఒక్క ఆత్మయే అన్నీ చేస్తున్నాడు.
ఆయన తన యిచ్చానుసారం ప్రతీ ఒక్కనికి వరాల్ని
ఇస్తాడు.

### ఒకే శరీరం, అనేక అవయవాలు

12శరీరంలో అనేక భాగాలు ఉన్నా అవి కలిసి ఒక
దేహంగా పని చేస్తాయి. క్రీస్తు కూడా అంతే. 13అంటే
మనమంతా ఒక ఆత్మ ద్వారా బాప్తిస్మము పొంది,
ఒక శరీరంలో ఐక్యం అయ్యాము. మనము యూదుల
మైనా, గ్రీకులమైనా, బానిసలమైనా, బానిసలముకాక
పోయినా, మనకందరికీ ఒకే ఆత్మ యివ్వబడినాడు.

14మన శరీరంలో ఎన్నో భాగాలున్నాయి. ఒకటి
కాదు. 15ఒకవేళ, కాలు, “నేను చేతిని కాను, కనుక
నేను ఈ శరీరానికి చెందను” అని అన్నంతమాత్రాన
అది శరీరంలో ఒక భాగం కాకపోదు. 16అదే విధంగా
ఒక వేళ చెవి,“నేను కన్నును కాను. కనుక ఈ శరీరానికి
చెందను” అని అన్నంతమాత్రాన అది శరీరంలో ఒక
భాగం కాకపోదు. 17శరీరమంతా కన్నైపోతే దేనితో
వింటాం? శరీరమంతా చెవియైతే దేనితో వాసన
చూస్తాం? 18కాని నిజానికి దేవుడు ఈ శరీరంలోని
ప్రతి అవయవాన్ని తాను అనుకొన్న విధంగా అమ
ర్చాడు. 19అన్ని అవయవాలు ఒక అవయవంగా మారితే
శరీరం ఉండదు. 20నిజానికి శరీరంలో అనేక భాగాలు
ఉన్నా శరీరం ఒక్కటే.

21కన్ను చేతితో, “నీవు నాకు అవసరం లేదు”
అని అనలేదు. అదే విధంగా శిరస్సు పాదాలతో, “మీరు

నాకు అవసరం లేదు” అని అనలేదు. 22సున్నితంగా
కనిపించే అవయవాలే నిజానికి ముఖ్యమైనవి. 23ముఖ్యం
కాదనుకొనే భాగాలను మనము ప్రత్యేకంగా కాపాడు
తాము. బహిరంగ పరచలేని భాగాలపట్ల మనము ప్రత్యేక
మైన శ్రద్ధ చూపుతాము. 24బహిరంగ పరచగల భాగాల
పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపనవసరం లేదు. కాని
దేవుడు శరీరానికి సంబంధించిన భాగాల్ని ఒక చోట
చేర్చి ప్రాముఖ్యత లేని భాగాలకు ప్రాముఖ్యత కలిగిం
చాడు. 25శరీరంలో చీలికలు ఉండరాదని, దాని భాగాలు
పరస్పరం శ్రద్ధ చూపుతూ ఉండాలని, ఆయన ఉద్దేశ్యం.
26ఒక భాగానికి కష్టం కలిగితే ప్రతీయొక్క భాగం దానితో
సహా కష్టం అనుభవిస్తుంది. ఒక భాగానికి గౌరవం లభిస్తే
మిగతా భాగాలన్నిటికీ దానితో సహా ఆనందం కలుగు
తుంది.

27మీరు క్రీస్తు శరీరం. మీలో ప్రతి ఒక్కరూ ఆ
శరీరానికి చెందిన భాగాలు. 28దేవుడు సంఘంలో ఉన్న
వాళ్ళందర్నీ తమతమ స్థానాల్లో ఉంచాడు. మొదటి
స్థానంలో అపొస్తలులను, రెండవస్థానంలో ప్రవక్తల్ని,
మూడవస్థానంలో బోధించే వాళ్ళను, ఆ తర్వాత
మహాత్కార్యాలను చేసేవాళ్ళను, వాళ్ళ తర్వాత
వ్యాధులు నయం చేసే శక్తి గలవాళ్ళను, ఇతరులకు
సహాయం చేసే వాళ్ళను, పరిపాలించే వాళ్ళను, తమకు
తెలియని భాషల్లో మాట్లాడగల శక్తి గలవాళ్ళను
ఉంచాడు. 29వీళ్ళలో అందరూ అపొస్తలులు కారు,
అందరూ ప్రవక్తలు కారు, అందరూ బోధించే వాళ్ళు
కారు, అందరూ అద్భుతాలు చేసే వాళ్ళుకారు.
30వీళ్ళలో అందరికి వ్యాధులు నయం చేసే శక్తి లేదు.
తెలియని భాషలో మాట్లాడే శక్తి లేదు. ఆ మాటలకు
అర్థం విడమర్చి చెప్పే శక్తి లేదు. 31కనుక మీ హృదయా
లను ముఖ్యమైన వరాల వైపుకు మళ్ళించండి. ఏది
ఏమైనా అన్నిటి కన్నా ముఖ్యమైన మార్గం చూపిస్తాను.

13 ఇతరుల భాషల్లో, దేవదూతల భాషల్లో మాట్లా
డగలిగిన నాలో ప్రేమ లేకపోతే నా మాటలకు
అర్థం ఉండదు. 2నాకు దైవ సందేశం చెప్పే వరం
ఉన్నా, నాలో సంపూర్ణ జ్ఞానం ఉన్నా, నాకు అన్ని
రహస్యాలు తెలిసినా, నాలో పర్వతాలను కదిలించగల
విశ్వాసం ఉన్నా, నాలో ప్రేమ లేక పోయినట్లయితే
నేను నిరర్థకుణ్ణి. 3నేను నా సర్వము పేదలకు దానం
చేసినా, నా దేహాన్ని అగ్నికి అర్పితం చేసినా నాలో
ప్రేమ లేకపోతే అది నిరర్థకము.

4ప్రేమలో సహనము ఉంది. ప్రేమలో దయ ఉంది.
ప్రేమలో ఈర్ష్య లేదు. అది గొప్పలు చెప్పుకోదు.
దానిలో గర్వము లేదు. 5దానిలో క్రూరత్వము లేదు.
దానిలో స్వార్థం లేదు. దానికి ముక్కుమీద కోపం
ఉండదు. అది తప్పులు ఎంచదు. 6ప్రేమ చెడును
గురించి ఆనందించదు. అది సత్యాన్నిబట్టి ఆనంది
స్తుంది. 7ప్రేమ అన్ని సమయాల్లో కాపాడుతుంది.
అది అన్ని వేళలా విశ్వసిస్తుంది. ఆశను ఎన్నటికీ
వదులుకోదు. అది ఎప్పుడూ సంరక్షిస్తుంది.

8దైవసందేశాన్ని చెప్పేవరము మనము పొందాము.
అది అంతమౌతుంది. తెలియని భాషల్లో మాట్లాడే
శక్తి మనకు ఉంది. అది అంతమౌతుంది. మనలో
జ్ఞానం ఉంది. అది నశించిపోతుంది. కాని ప్రేమ నశించి
పోదు. 9ఎందుకంటే, మన జ్ఞానం మితమైంది, మన
కుండే ఈ సందేశము అసంపూర్ణమైనది. 10అయితే
సంపూర్ణత కలిగినప్పుడు ఈ అసంపూర్ణత అంత
మౌతుంది. 11నేను పసివానిగా ఉన్నప్పుడు పసివాని
మాటలు, అనుభవాలు, ఆలోచనలు నాలో ఉండేవి.
నేను యవ్వనంలోకి వచ్చాక నా బాల్యంలో ఉన్న
గుణాల్ని మరిచి పోయాను. 12ప్రస్తుతం అద్దంలో
మసకగా కనిపిస్తున్న ప్రతిబింబాన్ని మాత్రమే మనము
చూస్తున్నాము. తదుపరి మనము ఆ ముఖాన్ని
స్పష్టంగా చూస్తాము. ఇప్పుడు నాకు తెలిసింది సంపూ
ర్ణంకాదు. కాని తదుపరి నా గురించి దేవునికి తెలిసినంత
సంపూర్ణంగా నాకు ఆయన్ని గురించి తెలుస్తుంది.
13అంతందాకా ఈ మూడు, అంటే విశ్వాసము, నిరీక్షణ,
ప్రేమ ఉంటాయి. వీటిలో ప్రేమ గొప్పది.

## వరాలు, వాటి ప్రాముఖ్యత

14 కనుక ప్రేమ మార్గాన్ని అనుసరించండి.
ఆత్మీయ శక్తి లభించాలని, ముఖ్యంగా దైవ
సందేశం ప్రకటించగలిగే వరం లభించాలని ఆశించండి.
2తనకు తెలియని భాషలో మాట్లాడే వాడు దేవునితో
మాట్లాడుతూ ఉన్నాడన్న మాట. మానవులతో కాదు.
అతని మాటలు ఎవ్వరూ అర్థం చేసుకోలేరు. అతడు
పవిత్రాత్మ శక్తితో రహస్యాలను చెబుతూ ఉంటాడు.
3కాని దైవసందేశం చెప్పేవాడు విశ్వాసాన్ని బలపర
చాలని ప్రజల్లో ఉత్సాహము, శాంతి కలిగించాలని దైవ
సందేశం చెపుతాడు. 4తనకు తెలియని భాషలో మాట్లా
డేవాడు తనకు మాత్రమే మేలు కలిగించుకొంటాడు.
కాని దైవ సందేశం చెప్పేవాడు సంఘానికి మేలు కలిగి
స్తాడు. 5మీలో ప్రతి ఒక్కడూ తెలియని భాషల్లో మాట్లా
డితే నాకు యిష్టమే. కాని మీరు దైవసందేశం చెప్పటం
నాకు ఇంకా ఎక్కువ యిష్టం. తెలియని భాషల్లో
మాట్లాడే వాని మాటలకు అర్థం విడమర్చి చెప్పేవాడు
ఉంటే సంఘానికి లాభం కలుగుతుంది. అది సంభ
వించక పోతే తెలియని భాషల్లో మాట్లాడే వానికన్నా
దైవసందేశం చెప్పేవాడే గొప్ప. 6సోదరులారా! నేను
అక్కడికి వచ్చి తెలియని భాషలో మాట్లాడితే మీకు
ఏం లాభం కలుగుతుంది? నా ద్వారా మీకు దేవుడు
ఒక క్రొత్త విషయం తెలియచెయ్యాలి. లేక నా ద్వారా
మీకు జ్ఞానం కలగాలి. లేక మీకు నా ద్వారా దైవసందేశం
తెలియాలి. లేక నేను మీకు ఒక క్రొత్త విషయం
బోధించగలగాలి. అలా జరగనట్లయితే లాభం ఏమిటి?

7పిల్లనగ్రోవి, వీణ వంటి ప్రాణం లేని వస్తువులు కూడా
శబ్దం చేస్తాయి. వాటి స్వరాల్లో భేదం లేకుంటే ఏ
రాగం వాయిస్తున్నారో ఎట్లా తెలుస్తుంది? 8బాకా
సక్రమంగా ఊది పిలవకుంటే యుద్ధానికి ఎవరు
సిద్ధమౌతారు? 9అదే విధంగా మీ నాలుకతో అర్థం
అయ్యే పదాలు మాట్లాడితే తప్ప మీరేం మాట్లాడు
తున్నారో యితరులకు ఎట్లా అర్థం అవుతుంది. మీరు
గాలిలో మాట్లాడినట్లు ఉంటుంది. 10ప్రపంచంలో
చాలా రకాల భాషలు ఉన్నాయి. సందేహం లేదు. కాని
అర్థం లేని భాష ఏదీ లేదు. 11ఒకడు మాట్లాడే విషయం
నేను అర్థం చేసుకోలేక పోతే, నేను అతనికి పరదేశీయు
నిగా, అతడు నాకు పరదేశీయునిగా ఉంటాము. 12మీకు
ఆత్మీయ శక్తి లభించాలని ఆసక్తి ఉంది. కనుక
సంఘాన్ని అభివృద్ధి పరిచే వరాలను అమితంగా
కోరుకొండి.

13కనుక తనకు తెలియని భాషల్లో మాట్లాడేవాడు
తాను మాట్లాడిన వాటికి అర్థం చెప్పగలిగే శక్తి నివ్వమని
దేవుణ్ణి ప్రార్థించాలి. 14ఎందుకంటే నేను నాకు తెలి
యని భాషల్లో ప్రార్థిస్తే నా ఆత్మ ప్రార్థిస్తుంది కాని
నా బుద్ధి అందులో పాల్గొనదు. 15మరి నేను ఏం
చెయ్యాలి? నేను నా ఆత్మతో మాత్రమే కాక, నా
బుద్ధితో కూడా ప్రార్థిస్తాను. నా ఆత్మతోను నా మనస్సు
తోను కూడా పాడుతాను. 16మీరు దేవుణ్ణి ఆత్మతో
స్తుతిస్తున్నారనుకోండి. మీ సమావేశంలో సభ్యుడు
కానివాడుంటే, అతనికి మీరు ఏమంటున్నారో తెలి
యదు. కనుక, మీరు చేస్తున్న ప్రార్థనలకు ఎప్పుడు,
"ఆమేన్" అని అనాలో అతనికి ఎట్లా తెలుస్తుంది?
17మీరు సక్రమంగా స్తుతించినా ఆ వ్యక్తికి దాని వల్ల
మేలు కలుగదు.

18మీ అందరి కంటే ఎక్కువగా యితర భాషల్లో
మాట్లాడగలందుకు నేను దేవునికి కృతజ్ఞుణ్ణి. 19నేను
సంఘంలో మాట్లాడినప్పుడు తెలియని భాషల్లో పది
వేల పదాలు మాట్లాడటంకన్నా నాకు తెలిసిన భాషల్లో
ఐదు పదాలు ఉపయోగించి బోధించటం ఉత్తమమని
నా అభిప్రాయము. 20సోదరులారా! చిన్నపిల్లలవలె
ఆలోచించకండి. చెడు విషయంలో చిన్న పిల్లల్లా
ఉండండి. కాని ఆలోచించేటప్పుడు పెద్దవాళ్ళలా
ఆలోచించండి. 21లేఖ నాల్లో ఇలా వ్రాయబడివుంది:

> "ఇతర భాషలు మాట్లాడే వాళ్ళ ద్వారా,
> విదేశీయుల పెదాల ద్వారా వీళ్ళతో నేను
> మాట్లాడుతాను. అయినా వాళ్ళు నా
> మాటలు వినరు."
>
> యెషయా *28:11-12*

22తెలియని భాషల్లో మాట్లాడగల శక్తి వుంటే, అది
విశ్వాసం లేని వాళ్ళకు రుజువుగా ఉంటుంది. కాని ఆ
రుజువు విశ్వాసం ఉన్న వాళ్ళకు అవసరం లేదు.
అయినా దైవ సందేశం విశ్వాసం ఉన్న వాళ్ళకే గాని,
విశ్వాసం లేని వాళ్ళకు కాదు. 23సంఘంలో ఉన్న
వాళ్ళందరూ ఒకచోట సమావేశమై, తమకు తెలియని
భాషల్లో మాట్లాడటం మొదలు పెడతారనుకోండి.
అప్పుడు సభ్యులు కానివాళ్లు లేక విశ్వాసంలేని వాళ్ళు
ఆ సమావేశంలో ఉంటే మీకు పిచ్చి ఎక్కిందని
అనుకోరా? 24దానికి మారుగా మీరంతా దైవసందేశాన్ని
చెపుతున్నారనుకోండి. అప్పుడు విశ్వాసం లేనివాడో
లేక సభ్యుడు కానివాడో సమావేశంలో ఉంటే మీరు
చెపుతున్నది విని తన తప్పు తెలుసుకుంటాడు. అంటే
దైవ సందేశం అతనిపై తీర్పు చెప్పిందన్నమాట.
25అతని మనస్సులో ఉన్న ఆలోచనలు బయట
పడతాయి. అతడు మోకరిల్లి దేవుణ్ణి ఆరాధిస్తూ,
"దేవుడు నిజంగా యిక్కడ మీతో ఉన్నాడు" అని
అంగీకరిస్తాడు.

### నియమాలు

26సోదరులారా! యిక మేము ఏమని చెప్పాలి?
మీరంతా సమావేశమైనప్పుడు ఒకడు స్తుతిగీతం పాడు
తాడు. మరొకడు ఒక మంచి విషయాన్ని బోధిస్తాడు.
ఇంకొకడు దేవుడు తనకు తెలియచేసిన విషయాన్ని
చెపుతాడు. ఒకడు తనకు తెలియని భాషలో మాట్లాడు
తాడు. మరొకడు దాని అర్థం విడమరచి చెపుతాడు.
ఇవన్నీ సంఘాన్ని బలపరచటానికి జరుగుతున్నాయి.
27తెలియని భాషల్లో మాట్లాడగలిగే వాళ్ళు ఉంటే,
ఇద్దరు లేక ముగ్గురి కంటే ఎక్కువ మాట్లాడకూడదు.
ఒకని తర్వాత ఒకడు మాట్లాడాలి. దాని అర్థం విడమర్చి
చెప్పగలవాడు ఉండాలి. 28అర్థం చెప్పేవాడు లేకపోయి
నట్లయితే తెలియని భాషలో మాట్లాడేవాడు మాట్లా
డటం మానెయ్యాలి. అతడు తనలో తాను మాట్లాడు
కోవచ్చు. లేదా దేవునితో మాట్లాడవచ్చు.

29దైవసందేశాన్ని యిద్దరు లేక ముగ్గురు మాట్లాడ
వచ్చు. మిగతావాళ్ళు చెప్పిన దాన్ని జాగ్రత్తగా గమ
నించాలి. 30ఒకవేళ అక్కడ కూర్చున్న వాళ్ళకు దేవుడు
తన సందేశాన్ని చెప్పమంటే, మాట్లాడు తున్నవాడు
మాట్లాడటం ఆపివెయ్యాలి. 31అలా చేస్తే ఒకరి తర్వాత
ఒకరు దైవసందేశం చెప్పవచ్చు. అలా చెయ్యటం
వల్ల అందరూ నేర్చుకొంటారు. ప్రతీ ఒక్కరికి
ప్రోత్సాహం కలుగుతుంది. 32దైవ సందేశం చెప్పే వాళ్ళు
తమ ప్రేరణను అదుపులో పెట్టుకోవచ్చు. 33దేవుడు
శాంతి కలుగ చేస్తాడు. అశాంతిని కాదు.

34ఇతర సంఘాలలో జరుగుతున్నట్లు స్త్రీలు
సమావేశాలలో మౌనం వహించాలి. మాట్లాడటానికి
వాళ్ళకు అధికారం లేదు. ధర్మశాస్త్రంలో, "స్త్రీలు అణ
కువతో ఉండాలి" అని వ్రాయబడి ఉంది. 35స్త్రీలు
సంఘంలో మాట్లాడటం అవమానకరం. కనుక ఒకవేళ

స్త్రీ ఒక విషయాన్ని గురించి తెలుసుకోదలిస్తే, తమ
ఇండ్లలో తమ భర్తల్ని అడిగి తెలుసుకోవాలి. 36దైవ
సందేశం మీ నుండి ప్రారంభం కాలేదు. అది మీకు
మాత్రమే లభించలేదు.
37దేవుడు తన ద్వారా సందేశం పంపాడన్నవాడు,
లేక తనలో ఆత్మీయ శక్తి ఉందని అనుకొన్నవాడు
నేను మీకు వ్రాసినది ప్రభువు ఆజ్ఞ అని గుర్తించాలి.
38అతడు యిది గుర్తించకపోతే దేవుడు అతణ్ణి గుర్తిం
చడు* 39సోదరులారా! దైవసందేశం చెప్పాలని ఆశిం
చండి. తెలియని భాషలో మాట్లాడే వాళ్ళను ఆపకండి.
40కాని అన్నిటినీ చక్కగా, సక్రమమైన పద్ధతిలో
జరపండి.

## క్రీస్తు బ్రతికి రావటం

15 సోదరులారా! నేను మీకు ప్రకటించిన
సువార్తను విని దాన్ని సంపూర్ణంగా విశ్వ
సించారు. దాన్ని మీకు మళ్ళీ జ్ఞాపకం చెయ్యాలని
నా ఉద్దేశ్యం. 2నేను బోధించిన సువార్తను మీరు విడవ
కుండా అనుసరిస్తే అది మీకు రక్షణ కలిగిస్తుంది.
లేనట్లయితే మీ విశ్వాసం వృధా అయిపోతుంది.
3నేను పొందిన దాన్ని మీకు మొదట అందించాను.
లేఖనాల్లో వ్రాయబడిన విధంగా క్రీస్తు మన పాపాల
నిమిత్తం మరణించాడు. 4లేఖనాల్లో వ్రాయబడిన
విధంగా ఆయన పాతి పెట్టబడి మూడవరోజున బ్రతి
కింపబడ్డాడు. 5పేతురుకు కనిపించాడు. ఆ తదుపరి
పన్నెండు మందికి కనిపించాడు. 6ఒకేసారి ఐదు వందల
మందికి కనిపించాడు. వాళ్ళలో చాలా మంది ఇంకా
జీవించివున్నారు. కొందరు మాత్రమే చనిపొయ్యారు.
7ఆ తర్వాత ఆయన యాకోబుకు కనిపించాడు.
అపొస్తలులందరికీ కనిపించాడు. 8చివరకు అయోగ్యుడ
నైన నాకు కూడా కనిపించాడు. 9ఎందుకంటే, అపొస్త
లుల్లో నేను అధముణ్ణి. దేవుని సంఘాన్ని హింసించిన
వాణ్ణి. కనుక అపొస్తులుడనని అనిపించుకోవటానికి
కూడా అర్హుణ్ణి కాను. 10కాని దేవుని దయవల్ల ఈ
స్థాయిలో ఉన్నాను. ఆయన దయ వృధా కాలేదు.
నేను వాళ్ళందరికన్నా కష్టించి పని చేసాను. ఇది నిజానికి
నేను చెయ్యలేదు. దేవుని దయ నాతో ఈ పని
చేయించింది. 11నేను బోధించినా లేక వాళ్ళు బోధిం
చినా మేమంతా ఒకటే బోధించాము. మీరు దాన్ని
విశ్వసించారు.

## చనిపోయిన వాళ్ళు బ్రతికి రావటం

12కాని మేము, క్రీస్తు చావు నుండి బ్రతికి వచ్చాడని
బోధించాము కదా! మరి మీలో కొందరు చనిపోయిన
వాళ్ళు బ్రతికి రారని ఎందుకంటున్నారు? 13అది
నిజమైతే క్రీస్తు కూడా చనిపోయి బ్రతికి రాలేదనే
అర్థం వస్తుంది. 14క్రీస్తు చనిపోయి బ్రతికి రానట్లయితే
మా బోధన, మీ విశ్వాసము వృధా అయినట్లే కదా!
15అంతేకాదు దేవుడు చనిపోయిన క్రీస్తును బ్రతికించా
డని మేము చెప్పాము. అలాకాని పక్షంలో మేము దేవుణ్ణి
గురించి తప్పు సాక్ష్యము చెప్పిన వాళ్ళమౌతాము.
కాని ఒకవేళ దేవుడు చనిపోయిన వాళ్ళను నిజంగా
బ్రతికించనట్లయితే ఆయన్ని కూడా బ్రతికించలేదు.
16ఎందుకంటే చనిపోయిన వాళ్ళను బ్రతికించనట్ల
యితే క్రీస్తును కూడా బ్రతికించలేదు. 17క్రీస్తును బ్రతి
కించలేదు అంటే, మీ విశ్వాసం వ్యర్థం. మీకు మీ
పాపాలనుండి విముక్తి కలగలేదన్న మాట. 18అంటే
చనిపోయిన క్రీస్తు విశ్వాసులు కూడా తమ పాపాల
నుండి విముక్తి పొందలేదన్నమాట. 19మనకు క్రీస్తు
పట్ల ఉన్న ఆశాభావం ప్రస్తుత జీవితం కోసం మాత్రమే
అయినట్లయితే మన స్థితి అందరికన్నా అధ్వాన్నం
ఔతుంది. 20కాని నిజానికి చనిపోయిన క్రీస్తు బ్రతికింప
బడ్డాడు. చనిపోయి బ్రతికింపబడ్డ వాళ్ళలో ఆయన
ప్రథముడు. 21ఒక మనుష్యుని ద్వారా మరణం వచ్చి
నట్లు, పునరుత్థానం కూడా ఒక మనుష్యుని ద్వారా
వచ్చింది. 22ఆదాములో ఐక్యత పొందటం వల్ల మాన
వులు మరణిస్తున్నట్లుగానే క్రీస్తులో ఐక్యత పొందటం
వల్ల చనిపోయిన వాళ్ళు బ్రతుకుతారు. 23ప్రతీ ఒక్కడు
తన వరుసను బట్టి బ్రతికింపబడతాడు. మొదట క్రీస్తు,
ఆయన వచ్చిన తరువాత ఆయనకు సంబంధించిన
వాళ్ళు బ్రతికింపబడతారు. 24అన్నీ అంతమయ్యే కాలం
వస్తుంది. అప్పుడాయన రాజ్యాలన్నిటినీ, అధికారంలో
ఉన్న వాళ్ళందరి శక్తిని నాశనం చేసి తండ్రి అయిన
దేవునికి తన రాజ్యం అప్పగిస్తాడు. 25ఎందుకంటే,
దేవుడు శత్రువులందరిని తన పాదాల ముందు పడవేసే
దాకా ఆయన రాజ్యం చెయ్యాలి. 26చివరి శత్రువైన
మృత్యువు నాశనము చేయబడుతుంది. 27ఎందుకంటే
లేఖనాల్లో, “అన్నిటినీ ఆయన పాదాల క్రింద
ఉంచాడు” అని వ్రాయబడి ఉంది. ‘అన్నిటినీ ఆయన
పాదాల క్రింద ఉంచాడు’ అని అంటే, వీటిలో దేవుడు
కూడా ఉన్నాడని కాదు. దేవుడు అన్నిటినీ క్రీస్తు పాదాల
క్రింద ఉంచాడు. 28కాని అన్నీ తన పాదాల క్రింద
ఉంచబడగా కుమారుడు తనకు తానే దేవునికి విధే
యుడై ఉన్నాడు. ఆ తదుపరి దేవుడు అన్నిటినీ
పాలిస్తాడు. 29పునరుత్థానం లేనట్లయితే, మరి చని
పోయిన వాళ్ళ కోసం, బాప్తిస్మము పొందిన వాళ్ళ
సంగతేమిటి? వాళ్ళు ఏ విధంగా బ్రతికివస్తారు? చని
పోయిన వాళ్ళు బ్రతికి రానట్లయితే ఇంకా బాప్తిస్మము
ఎందుకు ఇస్తున్నారు.
30మరి మేము ప్రతి గడియ మా ప్రాణాలను
ఎందుకు ప్రమాదంలో వేసుకొంటున్నాం? 31సోదరు

**గుర్తించడు** కొన్ని వ్రాత ప్రతులలో, “అతడు దీన్ని గుర్తించక పోతే, అది అతని ఇష్టం” అని ఉంది.

లారా! నేను ప్రతీరోజు మరణాన్ని ఎదుర్కొంటు
న్నాను. మన క్రీస్తు ప్రభువులో మిమ్మల్ని చూసి
నేను గర్విస్తాను. కనుక మీకు ఈ విషయం చెపుతు
న్నాను. 32ఒకవేళ నేను ఎఫెసులో క్రూర మృగాలతో
పోట్లాడటం, మానవ కారణంగా మాత్రమే అయినట్ల
యితే నాకొచ్చిన లాభం ఏమిటి? చనిపోయిన వాళ్ళు
తిరిగి బ్రతకనట్లయితే, “తిని, త్రాగుదాం, ఎలాగో
మరణిస్తాంగదా.”*
33మోసపోకండి, “చెడు సహవాసం మంచి వాణ్ణి
చెడుపుతుంది.” 34మేలుకోండి. పాపం చెయ్యటం
మానుకొండి. మీలో కొందరికి దేవుణ్ణి గురించి తెలి
యదు. అది సిగ్గు చేటు.

## బ్రతికి వచ్చిన దేహం

35కొందరు, “చనిపోయిన వాళ్ళు ఏ విధంగా బ్రతి
కింపబడతారు? వాళ్ళు ఎలాంటి దేహంతో వస్తారు?”
అని అడగవచ్చు. 36ఎంతటి మూర్ఖులు! నీవు భూమిలో
నాటిన విత్తనం చనిపోకపోతే అది మొలకెత్తదు. 37నీవు
ఒక చిన్న విత్తనాన్ని, ఉదాహరణకు ఒక గోధుమ
విత్తనాన్ని నాటుతావు, కాని పెరగబోయే మొలకను
నాటవు. 38దేవుడు తాను అనుకొన్న విధంగా ప్రతీ
విత్తనానికి దానికి తగిన దేహాన్ని యిస్తాడు. 39మాంసా
లన్నీ ఒకే రకం కావు. మానవుల మాంసం ఒక రకం.
జంతువులమాంసం ఒక రకం. పక్షుల మాంసం ఒక
రకం. చేపల మాంసం ఒక రకం. 40ఆకాశంలో జ్యోతు
లున్నాయి, భూమ్మీద జ్యోతులున్నాయి, గాని వాటి
వాటి ప్రకాశం వేరు. 41సూర్యుడు ఒక రకంగా, చంద్రుడు
ఒక రకంగా, నక్షత్రాలు ఒక రకంగా ప్రకాశిస్తాయి. ఒక
నక్షత్రం ప్రకాశించిన విధంగా మరొక నక్షత్రం
ప్రకాశించదు.
42చనిపోయిన వాళ్ళు బ్రతికి రావటం కూడా
అదేవిధంగా ఉంటుంది. నశించిపోయే శరీరాన్ని నాటి
నశించని శరీరాన్ని పొందుతారు. 43గౌరవం లేని శరీరంగా
నాటబడి మహిమగల శరీరముగా లేపబడుతుంది. బల
హీనమైన శరీరంగా నాటబడి శక్తిగల శరీర ముగా లేస్తుంది.
44భౌతికమైన శరీరాన్ని నాటి, ఆత్మీయమైన శరీరాన్ని
పుట్టిస్తాడు.
భౌతికమైన శరీరం ఉంది అంటే, ఆత్మీయ శరీరం
కూడా ఉంటుంది. 45ఈ విధంగా వ్రాయబడింది:
“ప్రథమ పురుషుడైన ఆదాము జీవించే నరుడయ్యాడు,
చివరి ఆదాము జీవాన్ని ఇచ్చే ఆత్మ అయ్యాడు.”
46ముందు ఆత్మీయత రాలేదు. ముందు భౌతిక శరీరం
వచ్చింది. ఆ తర్వాత ఆత్మీయత వచ్చింది. 47మొదటి
పురుషుడు భూమ్మీద ఉన్న మట్టితో సృష్టింపబడ్డాడు.
రెండవ మనుష్యుడు పరలోకంనుండి దిగివచ్చాడు.
48భూమ్మీద ఉన్న వాళ్ళు మట్టితో సృష్టింపబడిన
వానివలే ఉన్నారు. పరలోకానికి సంబంధించిన వాళ్ళు
పరలోకంనుండి వచ్చిన వానివలె ఉన్నారు. 49మట్టితో
సృష్టింపబడిన వాని పోలికలతో మనము జన్మించినట్లే
పరలోకం నుండి వచ్చిన వాని పోలికలను కూడా
మనము పొందుతాము.
50సోదరులారా! నేను చెప్పేదేమిటంటే, రక్త
మాంసాలతో ఉన్న వాళ్ళు దేవుని రాజ్యం పొందలేరు.
నశించిపోయేది అమరత్వం పొందదు. 51మీకో రహస్యం
చెపుతాను వినండి. మనలో ఎవ్వరూ చని పోరు.
అందరూ మారిపోతారు. 52చివరి బూర ఊది నప్పుడు,
మనమందరము ఒక్క క్షణంలో, కనురెప్ప పాటులో
మారిపోతాము. ఆ క్షణంలో చనిపోయిన వాళ్ళు బ్రతికి
వచ్చి చిరంజీవులై పోతారు. మనలో మార్పు కలుగు
తుంది. 53ఎందుకంటే నశించిపోయే ఈ దేహం నాశనం
కాని దేహాన్ని ధరించాలి. చనిపోయే ఈ దేహం
అమరత్వం పొందాలి. 54ఇది జరిగినప్పుడు లేఖనాల్లో
వ్రాయబడినట్లు జరుగుతుంది:

“మరణం ఓడిపోయి, సంపూర్ణ విజయం
కలిగింది.”
యెషయా *25:8*

55“ఓ మరణమా! నీ విజయం ఎక్కడ! ఓ
మరణమా! నీ కాటు వేసే శక్తి ఎక్కడ?”
హోషేయ *13:14*

56మరణం కాటు వేయగల శక్తిని ధర్మశాస్త్రం నుండి
పొందుతుంది. 57కాని దేవుడు మన యేసు ప్రభువు
ద్వారా మనకు విజయం యిస్తాడు. కనుక దేవునికి
వందనాలు.
58కనుక నా ప్రియమైన సోదరులారా! ఏదీ
మిమ్మల్ని కదిలించలేనంత స్థిరంగా నిలబడండి.
ప్రభువుకోసం పడిన మీ శ్రమ వృధాకాదు. ఇది మీకు
తెలుసు. కనుక సదా ప్రభువు సేవలో లీనమై ఉండండి.

## పరిశుద్ధుల కోసం చందా

16 పరిశుద్ధుల కోసం సేకరించవలసిన చందాల
విషయంలో ఏం చెయ్యాలో, గలతీయలో
ఉన్న సంఘాలకు చెప్పాను. మీరు కూడా అదేవిధంగా
చెయ్యండి. 2తన సంపాదనను బట్టి ప్రతి ఒక్కడూ
కొంత డబ్బు ఆదివారం రోజు దాచాలి. అలా చేస్తే
నేను వచ్చిన రోజెల్లా చందానెత్తనవసరం ఉండదు.
3నేను వచ్చాక మీరెన్నుకొన్న వాళ్ళకు పరిచయ
పత్రాలు వ్రాసి వాళ్ళతో మీరు సేకరించిన డబ్బును
యెరూషలేము పంపుతాను. 4నేను కూడా వెళ్ళటం
ఉచితమని అనిపిస్తే అంతా కలిసి వెళ్తాం.

---

**తిని … మరణిస్తాంగదా** యెషయా 22:13.

### మనవి

[5]నేను మాసిదోనియ ద్వారా వెళ్ళాలి కనుక అక్క
డికి వెళ్ళి, మీ దగ్గరకు వస్తాను. [6]అలా చేస్తే నేను
మీతో కొంతకాలం గడపవచ్చు. బహుశా చలికాల
మంతా అక్కడే ఉంటానేమో. ఆ తర్వాత నా ముందు
ప్రయాణం ఎక్కడికైతే అక్కడికి వెళ్ళటానికి మీరు
సహాయపడవచ్చు. [7]అందుకే ప్రస్తుతం మీ దగ్గరకు
రావాలని లేదు. అలా చేస్తే, నేను వెళ్తూ మిమ్మల్ని
చూసినట్లు మాత్రమే ఔతుంది. అలా కాక! ప్రభువు
చిత్తమైతే మీతో కొంతకాలం గడపాలని ఉంది. [8]నేను
ఎఫెసులో పెంతుకొస్తు పండుగ దాకా ఉంటాను.
[9]అక్కడ ఫలవంతమైన కార్యాలు చెయ్యటానికి నాకొక
గొప్ప అవకాశం కలిగింది. కాని చాలా మంది వ్యతి
రేకిస్తున్నారు.

[10]తిమోతి మీ దగ్గరకు వస్తే అతనికి ధైర్యం
చెప్పండి. ఎందుకంటే, నాలాగే అతడు కూడా ప్రభువు
కార్యాన్ని చేస్తున్నాడు. [11]ఎవ్వరూ అతణ్ణి నిరాకరించ
కండి. అతని ప్రయాణం శాంతంగా సాగేటట్లు
చూడండి. అతడు యితర సోదరులతో కలిసి నా
దగ్గరకు రానున్నాడు. అతని కోసం నేను ఎదురు
చూస్తున్నాను. [12]ఇక మన సోదరుడైన అపొల్లోను
గురించి: నేను మిగతా సోదరులతో కలిసి మీ దగ్గరకు
వెళ్ళుమని చాలా వేడుకొన్నాను. అతనికి ప్రస్తుతం
వెళ్ళటానికి కొంచెంకూడా యిష్టం లేదు. కాని తనకు
మనస్సున్నప్పుడు అతడు వస్తాడు.

[13]మెలకువగా ఉండండి. సంపూర్ణంగా విశ్వసిం
చండి. ధైర్యంగా ఉండండి. శక్తిని వదులుకోకండి.
[14]చేసే కార్యాలు ప్రేమతో చెయ్యండి.

[15]అకయ ప్రాంతంలో విశ్వాసులుగా మారిన
వాళ్ళలో స్తెఫను కుటుంబం మొదటిది. ఇది మీకు
తెలుసు. వాళ్ళు తమ జీవితాన్ని విశ్వాసుల సేవకు
అంకితం చేసారు. [16]వాళ్ళను అనుసరించుమని
మిమ్మల్ని వేడుకొంటున్నాను. వాళ్ళనే కాక వాళ్ళతో
కలిసి సేవ చేస్తున్న ప్రతి ఒక్కణ్ణీ మీరు అనుసరించాలి.
[17]స్తెఫను, పొర్మూనాతు, అకాయికు వచ్చి మీరు
తీర్చలేని కొరత తీర్చారు. వాళ్ళు రావటంవల్ల నాకు
ఆనందం కలిగింది. [18]వాళ్ళు మీ ఆత్మలకు, నా ఆత్మకు
ఆనందం కలిగించారు. వాళ్ళను గౌరవించటం
సమంజసం.

### శుభాకాంక్షలు

[19]ఆసియ ప్రాంతంలోని సంఘాలు మీకు శుభా
కాంక్షలు తెలుపుతున్నాయి. అకుల, ప్రిస్కిల్ల మరియు
వాళ్ళింట్లో సమావేశమయ్యే సంఘము మీకు ప్రభువు
పేరిట తమ హృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపు
తున్నారు. [20]ఇక్కడున్న సోదరులందరు మీకు శుభా
కాంక్షలు తెలుపుతున్నారు. సోదరుల ప్రేమతో ఒకళ్ళ
నొకళ్ళు హృదయాలకు హత్తుకోండి. పవిత్రమైన
ముద్దుతో ఒకరికొకరు వందనాలు చెప్పండి.

[21]నేను పౌలును ఈ శుభాకాంక్షలు నా స్వహస్తాలతో
వ్రాస్తున్నాను.

[22]ప్రభువును ప్రేమించని వాడు శాపగ్రస్తుడు అవు
తాడు! ప్రభువా రమ్ము!* [23]యేసు ప్రభువు యొక్క
అనుగ్రహము మీకందరికి లభించుగాక. [24]యేసు క్రీస్తు
పేరిట నా ప్రేమ మీకందరికీ తెలుపుతున్నాను.
ఆమేన్.

---

**ప్రభువా రమ్ము** అన్నది అరాము భాషలో “మారనాత” అని ఉంది.

# కొరింథీయులకు వ్రాసిన రెండవ లేఖ

### దీవెనలు

1 దైవేచ్ఛ వల్ల యేసు క్రీస్తు అపొస్తులునిగా ఉన్న
పౌలు నుండి, మన సోదరుడైన తిమోతి నుండి
కొరింథులో ఉన్న దేవుని సంఘానికి మరియు అకయ
ప్రాంతంలోని పవిత్రులకు.
2మన తండ్రియైన దేవుని నుండి, యేసు క్రీస్తు
ప్రభువు నుండి మీకు అనుగ్రహము, శాంతి లభించాలని
కోరుతున్నాను.

### దేవునికి వందనాలు చెల్లించుట

3మన యేసు క్రీస్తు ప్రభువును తండ్రియైన దేవుణ్ణి
స్తుతిద్దాము. దేవుడు దయామయుడు. మనకు అన్ని
విషయాల్లో సహాయం చేస్తాడు. 4ఆయన మన కష్టాలు
తొలిగిపోవటానికి సహాయం చేస్తాడు. ఆయన లాగే
మనము కూడా యితరుల కష్టాలు తొలగించటానికి
సహాయం చెయ్యాలని ఆయన ఉద్దేశం. 5క్రీస్తు కష్టాల్ని
మనము పంచుకొన్న విధంగా ఆయన ద్వారా కలిగే
సహాయాన్ని కూడా పంచుకొందాము. 6మీకు
సహాయం చెయ్యాలని రక్షణ కలగాలని మేము కష్టాలు
అనుభవిస్తున్నాము. మీకు సహాయం చెయ్యటానికి
దేవుడు మాకు సహాయం చేస్తున్నాడు. ఈ సహాయం
వల్ల మేము అనుభవించిన కష్టాలు మీరు కూడా
అనుభవించేటట్లు మీలో సహనం కలుగుతుంది. 7నాకు
మీ పట్ల గట్టి నమ్మకం ఉంది. మీరు మా కష్టాలు
పంచుకొన్నట్లు గానే, మాకు కలిగే సహాయాన్ని కూడా
పంచుకొంటారని మాకు తెలుసు.
8మేము ఆసియ ప్రాంతంలో అనుభవించిన కష్టాలు
మీకు చెప్పకుండా ఉండ లేము. మాకు అక్కడ తీవ్ర
మైన కష్టాలు కలిగాయి. అవి మేము మోయలేనంతగా
ఉండినవి. జీవిస్తామనే ఆశ కూడా పోయింది. 9మా
మనస్సులకు మరణదండన పొందినట్లు అనిపించింది.
మమ్మల్ని మేము నమ్ముకో రాదని, చనిపోయిన
వాళ్ళను బ్రతికించే దేవుణ్ణి నమ్మాలని ఇలా జరిగింది.
10దేవుడు మమ్మల్ని ఆ ప్రమాదకరమైన చావునుండి
రక్షించాడు. ఇక ముందు కూడా రక్షిస్తాడు. మాకు
ఆయన పట్ల పూర్తిగా విశ్వాసం ఉంది. 11మీరు ప్రార్థించి
మాకు సహాయం చెయ్యాలి. ఎంతమంది ప్రార్థిస్తే
దేవుడు మాకు అంత సహాయం చేస్తాడు. దేవుడు
మాకు ఆ సహాయం చేసాక, అందరూ ఆయనకు
కృతజ్ఞతలు చెప్పుకొనే అవకాశం కలుగు తుంది.

### పౌలు ఉద్దేశం మారుట

12మేము ఈ ప్రపంచంలో నిజాయితీగా, సదుద్దేశా
లతో జీవిస్తున్నాము. ముఖ్యంగా మీకోసం చేసినవి
సదుద్దేశంతో చేసాము. మేము చేసినవన్నీ దేవుని దయ
వల్ల సంభవించాయి. ఇది మానవ ప్రయత్నంవల్ల సంభ
వించ లేదు. ఇది నిజమని మా అంతరాత్మలు చెపుతు
న్నాయి. ఇది మేము గర్వించదగ్గ విషయం. 13మేము
మీరు చదవ కలిగింది, అర్థం చేసుకోగలిగింది మాత్రమే
వ్రాస్తున్నాము. 14మీరు మమ్మల్ని కొద్దిగా అర్థం చేసు
కొన్నారు. మున్ముందు పూర్తిగా అర్థం చేసుకొంటారని
ఆశిస్తున్నాను. యేసు ప్రభువు వచ్చిన రోజు, మీ
కారణంగా మేము గర్విస్తున్నట్లే, మా కారణంగా మీరు
గర్వించ కలుగుతారు.
15నాకు ఈ విషయంలో నమ్మకం ఉంది. కనుకనే
మీకు రెండుసార్లు లాభం కలగాలని నేను మొదట
మిమ్మల్ని దర్శించాలని అనుకొన్నాను. 16మాసిదోని
యకు వెళ్ళే ముందు, తిరిగి వచ్చేముందు మీ దగ్గరకు
రావాలనుకొన్నాను. అక్కడి నుండి నేను యూదయకు
వెళ్ళేటప్పుడు మీ నుండి సహాయం లభిస్తుందని ఆశిస్తు
న్నాను. 17నేను ఈ ఏర్పాట్లు ఆలోచించకుండా చేసా
నని అనుకొంటున్నారా? నేను అందరిలా ఒకసారి
‘ఔనని’ ఒకసారి ‘కాదని’ అనను.
18దేవుని సాక్షిగా చెపుతున్నాను. మీకు బోధించిన
విషయంలో “ఔను” “కాదు” అనే ప్రశ్నే లేదు. 19నేను,
సిల్వాను, తిమోతి, మీకు బోధించిన దేవుని కుమారు
డైన యేసు క్రీస్తు విషయం “ఔను” “కాదు” అని
అనలేదు. ఆయన అన్నివేళలా “ఔను” అని అన్నాడు.
20దేవుడు క్రీస్తునందు చేసిన ఎన్ని వాగ్దానాలైనను
“ఔను” అని అన్నట్లుగానే ఉన్నవి. అందువల్ల యేసు
క్రీస్తు ద్వారా మనము “ఆమేన్” అని అంటున్నాము.
ఇలా అని దేవునికి మహిమ కలిగిస్తున్నాము. 21దేవుడు

మనకు, అంటే మీకు, మాకు క్రీస్తు పట్ల ధృఢవిశ్వాసము ఉండేటట్లు చేస్తున్నాడు. మనకు అభిషేక మిచ్చిన వాడు దేవుడు. 22దేవుడు మనము తన వాళ్ళమన్న ముద్ర మనపై వేసాడు. తన ఆత్మను రానున్న దానికి హామీగా మన గుండెల్లో ఉంచాడు.

23నేను దైవసాక్షిగా చెపుతున్నాను. మిమ్మల్ని నొప్పించరాదని నా ఉద్దేశ్యం. కనుక నేను కొరింథుకు తిరిగి రాలేదు. 24మీ విశ్వాసము ద్వారా ధృఢంకాగలరు. కనుక మీరు ఏ విధంగా విశ్వసించాలో మేము చెప్పటం లేదు. మీ ఆనందం కోసం మీతో కలిసి పని చెయ్యాలని మా ఉద్దేశ్యము.

2 అందువల్ల నేను మళ్ళీ మీ దగ్గరకువచ్చి మిమ్మల్ని దుఃఖపెట్టరాదని నిర్ణయించుకొన్నాను. 2నేను మిమ్మల్ని దుఃఖపెడితే దుఃఖపడిన మీరు తప్ప నన్ను సంతోష పెట్టటానికి ఇతరులు ఎవరున్నారు? 3కనుక మీకా ఉత్తరం వ్రాసాను. నేను వచ్చినప్పుడు నన్ను సంతోషపెట్టాలనుకొన్న వాళ్ళు నాకు దుఃఖం కలిగించ రాదని నా ఉద్దేశ్యం. నేను ఆనందంగా ఉంటే మీరు కూడా ఆనందిస్తారని నాకు తెలుసు.

4దుఃఖంతో కన్నీళ్ళు కారుస్తూ, వేదన పడుతూ మీకా ఉత్తరం వ్రాసాను. మీకు దుఃఖం కలిగించాలని కాదు. మీ పట్ల నాకున్న ప్రేమను మీకు తెలియ చెయ్యాలని అలా వ్రాసాను.

### తప్పు చేసిన వాణ్ణి క్షమించటం

5ఎవరైనా దుఃఖం కలిగించి ఉంటే, అతడు నాకు కాదు, మీకు దుఃఖం కలిగించాడు. అందరికీ కాకున్నా మీలో కొందరికన్నా దుఃఖం కలిగించాడు. అతని పట్ల కఠినంగా ప్రవర్తించటం నాకు యిష్టం లేదు. 6మీలో చాలా మంది అతణ్ణి శిక్షించారు. అతనికి ఆ శిక్ష చాలు. 7అతణ్ణి క్షమించి ఓదార్చండి. అలా చెయ్యకపోతే అతడు ఇంకా ఎక్కువ దుఃఖంలో మునిగిపోతాడు. 8అతని పట్ల మీకున్న ప్రేమను అతనికి తెలియ చెయ్యుమని వేడుకొంటున్నాను. 9మీరు పరీక్షకు నిలువగలరా లేదా అన్నది చూడాలని, దేవుని ఆజ్ఞల్ని అన్నివేళలా పాటి స్తారా లేదా అన్నది గమనించాలని, నేను మీకా ఉత్తరం వ్రాసాను. 10మీరు క్షమించిన వాళ్ళను నేనూ క్షమిస్తాను. నేను క్షమించింది, నిజానికి నేను క్షమించవలసింది ఏదైనా ఉండి ఉంటే అది మీకోసం క్రీస్తు అంగీకారంతో క్షమించాను. 11సైతాను కుట్రలు మనకు తెలియనివి కావు. వాడు మనల్ని మోసం చెయ్యరాదని ఇలా చేసాను.

### క్రీస్తు ద్వారా విజయము

12నేను క్రీస్తు సందేశం ప్రకటించటానికి త్రోయకు వెళ్ళాను. నా కోసం ప్రభువు ఎన్నో అవకాశాలు కలిగించాడు. 13నా సోదరుడైన తీతు నాకు కనిపించ లేదు. కనుక నా మనస్సుకు శాంతి కలుగలేదు. వాళ్ళ నుండి సెలవు తీసుకొని మాసిదోనియకు వెళ్ళాను.

14దేవుడు, క్రీస్తు ద్వారా అన్ని వేళలా మనకు విజయం కలిగిస్తాడు. అందుకు మనము దేవునికి కృతజ్ఞ తతో ఉందాము. క్రీస్తు యొక్క జ్ఞాన పరిమళాన్ని మా ద్వారా అన్ని చోట్లా ఆయన వెదజల్లాడు. 15రక్షింప బడే వాళ్ళకు, నాశనమవుతున్న వాళ్ళకు మనము క్రీస్తు పరిమళంగా ఉండేటట్లు దేవుడు మనల్ని ఉపయో గించాడు. 16మన పరిమళము ఒకరికి మరణము కలిగిస్తే మరొకరికి అది జీవాన్నిస్తుంది. ఇది చెయ్యటానికి ఎవరు అర్హులు? 17అనేకులు దైవ సందేశాన్ని సంతలో అమ్మే సరకులా అమ్ముతున్నారు. మేము అలాంటి వాళ్ళము కాదు. మేము క్రీస్తు సేవకులము. దేవుని సాక్షిగా చెపు తున్నాము. దేవుడే మమ్మల్ని పంపాడు.

### క్రొత్త నిబంధన యొక్క సేవకులు

3 ఇలా మాట్లాడటం మమ్మల్ని మేము పొగడు కొంటున్నట్లు అనిపిస్తోందా? మీ నుండి మాకు పరిచయపత్రాలు కావాలా? లేక మీ దగ్గరకు వచ్చిన ప్పుడు యితరులవలే పరిచయ పత్రాలు తీసుకు రావాలా? 2మీరే మా పరిచయ పత్రం. మిమ్మల్ని గురించి మా హృదయాలపై వ్రాయబడి ఉంది. ఇది అందరికీ తెలుసు. దాన్ని అందరూ చదివారు. 3మీరు క్రీస్తును గురించి వ్రాసిన పత్రంలా స్పష్టంగా కనిపిస్తు న్నారు. ఈ పత్రం సిరాతో కాక, సజీవమైన దేవుని ఆత్మతో వ్రాయబడింది. అది రాతి పలకపై కాక, మానవుల హృదయాలపై వ్రాయ బడింది. మీరు మా సేవా ఫలితం.

4మేము దేవుణ్ణి క్రీస్తు ద్వారా విశ్వసిస్తున్నాము. కనుక మాకానమ్మకం ఉంది. 5మేము చేస్తున్న కార్యాలు చేయగల సామర్థ్యం మాలో ఉందని చెప్పటం లేదు. ఆ శక్తి మాకు దేవుడు ప్రసాదించాడు. 6దేవుడు మేము క్రొత్త నిబంధనకు సేవకులుగా ఉండేటట్లు మాకు శక్తినిచ్చాడు. ఈ నిబంధన వ్రాత రూపంలో లేదు. అది దేవుని ఆత్మ రూపంలో ఉంది. వ్రాత రూపంలో ఉన్న నియమాలు మరణాన్ని కలిగిస్తాయి. కాని దేవుని ఆత్మ జీవాన్నిస్తాడు.

### క్రొత్త నిబంధన యొక్క మహిమ

7రాతిపలకపై అక్షరాలతో చెక్కబడిన నియ మాలను దేవుడు యిచ్చినప్పుడు, మోషే ముఖం మీద మహిమాప్రకాశం కనిపించింది. తదుపరి ఆ మహిమ తగ్గుతూ పోయింది. అయినా ఇశ్రాయేలు ప్రజలు అతని ముఖం చూడలేక పోయారు. చావును కలిగించే పాలనలో మహిమ అంత గొప్పగా ఉంటే, 8దేవుని ఆత్మనిచ్చే పాలనలో యింకెంత మహిమ ఉంటుందో ఆలోచించండి. 9శిక్షను కలిగించే పాలనలో అంత

మహిమ ఉంటే, నీతిని స్థాపించే పాలనలో యింకెంత
మహిమ ఉంటుందో ఆలోచించండి. 10ఇప్పుడు మనకు
లభించిన గొప్ప మహిమతో పోలిస్తే, గతంలో ఉండిన
ఆ మహిమకు ప్రకాశం లేదు. 11నశించిపోతున్న ఆ
మహిమకు అంత ప్రకాశం ఉంటే చిరకాలం ఉండే
మహిమకు యింకెంత ప్రకాశం ఉంటుందో ఆలోచిం
చండి.
12మాకు అంత నిరీక్షణ ఉంది కనుకనే మాలో
యింత ధైర్యముంది. 13తగ్గిపోతున్న తన ప్రకాశాన్ని
ఇశ్రాయేలు ప్రజలు చూడరాదని మోషే తన ముఖానికి
ముసుగు వేసుకొన్నాడు. మేము మోషే లాంటి
వాళ్ళము కాదు. 14వాళ్ళు అర్థం చేసుకోలేదు. ఈ
నాటికీ వాళ్ళు పాత నిబంధన గ్రంథం చదివినప్పుడు
వాళ్ళకు ముసుగు కనిపిస్తూవుంటుంది. దాన్ని ఎవ్వరూ
తీయలేరు. క్రీస్తు మాత్రమే ఆ ముసుగు తీసి వేయగ
లడు. 15ఈ నాటికీ మోషే గ్రంథాలు చదివినప్పుడు
ఆ ముసుగు వాళ్ళ బుద్ధిని కప్పివేస్తుంది. 16కాని ప్రభువు
వైపుకు మళ్ళిన వాళ్ళ 'ముసుగు తీసివేయ బడింది.'*
17ప్రభువే 'ఆత్మ'. ప్రభువు ఆత్మ ఎక్కడ ఉంటే అక్కడ
స్వేచ్ఛ ఉంటుంది. 18ముసుగు తీసివేయబడ్డ మా
ముఖాల్లో ప్రభువు మహిమ ప్రకాశిస్తోంది. అది ఆత్మ
అయినటు వంటి ప్రభువు నుండి వచ్చింది. అనంత
మైన ఆ మహిమ మమ్మల్ని ప్రభువులా మారుస్తోంది.

### మట్టి కుండలో సంపద

4 దేవుని అనుగ్రహం వల్ల మేము ఈ సేవ చేస్తు
న్నాము. కనుక ధైర్యం కోల్పోము. 2నిజానికి
అవమానం కలిగించే రహస్య మార్గాలను మేము వదిలి
వేసాము. మేము మోసాలు చెయ్యము. దైవసందేశాన్ని
మార్చము. సత్యాన్ని అందరికీ స్పష్టంగా తెలియ
చేస్తాము. తద్వారా మేము ఎలాంటి వాళ్ళమో మేము
దేవుని సమక్షంలో ఏ విధంగా జీవిస్తున్నామో ప్రజలు
తెలుసుకున్నారు. 3మేము చెప్పే దైవ సందేశం
మూయబడితే నశించే వాళ్ళకు మాత్రమే అది మూయ
బడింది. 4క్రీస్తు దేవుని ప్రతిరూపం. దైవ సందేశం
ఆయన మహిమను ప్రకాశింప చేస్తుంది. దాన్ని చూడ
నీయకుండా ఈ యుగపుపాలకుడు* నమ్మని ప్రజల
హృదయాలను గ్రుడ్డి చేసాడు. 5మమ్మల్ని మేము
ప్రకటించుకోము. యేసు క్రీస్తు ప్రభువని ప్రకటిస్తాము.
యేసు కొరకు మేము మీ సేవకులమని ప్రకటిస్తాము.
6"చీకటి నుండి వెలుగు ప్రకాశించనీ!"* అని అన్న
దేవుడు తన వెలుగు మా హృదయాల్లో వెలిగించాడు.
క్రీస్తు ముఖంలో దేవుని మహిమ ప్రకాశిస్తోంది. ఆ
మహిమలో ఉన్న జ్ఞానాన్ని మాలో ప్రకాశింప చేసాడు.
7దేవుడు ఇచ్చిన ఈ ఐశ్వర్యం మామూలు
మట్టికుండల్లో దాగివుంది. మేమే ఆ కుండలము. దీని
వల్ల ఈ శక్తి మాది కాదని, దేవునిదని స్పష్టంగా తెలు
స్తోంది. 8మా చుట్టూ కష్టాలు ఉన్నాయి. కాని మేము
ఆ కష్టాలకు నలిగిపోలేదు. మాకు అవమానాలు కలి
గాయి. కాని మేము వాటివల్ల దిగులుపడలేదు. 9మేము
హింసించబడుతున్నాము కాని, మేము దిక్కులేని
వాళ్ళము కాము. మేము క్రింద పడ్డాము కాని నశించి
పోలేదు. 10మేము అన్ని వేళలా యేసు మరణాన్ని
మోసుకొని తిరుగుతూ ఉంటాము. 'ఆయన' జీవితం
మా జీవితాల ద్వారా వ్యక్తం కావాలని మా ఉద్దేశ్యం.
11బ్రతికి ఉన్న మేము యేసుకోసం మా జీవితాలను
మరణానికి అప్పగిస్తూ ఉంటాము. ఆయన జీవితం
మా భౌతిక దేహాల్లో వ్యక్తం కావాలని మా ఉద్దేశ్యం.
12కనుక ఆయన మరణం మాలో పనిచేస్తోంది. ఆయన
జీవితం మీలో పని చేస్తోంది.
13లేఖనాల్లో, "నేను విశ్వసించాను. కనుక మాట్లాడు
తున్నాను"* అని వ్రాయబడివుంది. మేము కూడా
అదే విధంగా విశ్వసించాము. కనుక మాట్లాడుతున్నాము.
14ఎందుకంటే, చనిపోయిన యేసు ప్రభువును
బ్రతికించిన వాడు, ఆయనతో సహా మమ్మల్ని కూడా
బ్రతికిస్తాడని మాకు తెలుసు. ఆ విధంగా మమ్ములను
కూడా లేపి, మీతో సహా మమ్మల్ని కూడా దేవుని
సమక్షంలో నిలబెడతాడు. 15ఇవన్నీ మీ కోసమే జరుగు
తున్నాయి. దైవానుగ్రహం ప్రజల్లో వ్యాపిస్తూ పోవా
లనీ, దేవుని మహిమ నిమిత్తమై ప్రజలు అర్పించే కృతజ్ఞ
తలు పెరుగుతూ పోవాలని యిందులోని ఉద్దేశ్యం.
16కనుక మేము అధైర్యపడము. భౌతికంగా మేము
క్షీణించిపోతున్నా, మా ఆంతర్యం ప్రతి రోజూ శక్తి
పొందుతూ ఉంది. 17క్షణికమైన మా మామూలు కష్టాలు
మా కోసం శాశ్వతమైన మహిమను కలిగిస్తున్నవి.
మనము పొందుతున్న మహిమతో, అనుభవింపనున్న
కష్టాలను పోలిస్తే ఈ కష్టాలు లెక్కింపతగినవి కావు.
18అందువల్ల కనిపించేవాటిపై మా దృష్టి ఉంచక
కనిపించని వాటిపై మా దృష్టి కేంద్రీకరిస్తున్నాము.
కనిపించేది క్షణికము. కనిపించనిది అనంతము.

### పరలోకంలో నివాసం

5 భూలోక నివాసులమైన మనము నివసిస్తున్న ఈ
గుడారం, అంటే మన శరీరం నశిస్తే, పరలోకంలో
మనము నివసించటానికి ఒక భవనం ఉంది. దాన్ని
మానవుడు నిర్మించలేదు. శాశ్వతమైన ఆ భవనాన్ని
దేవుడే నిర్మించాడు. 2పరలోకపు గుడారాన్ని ధరిం

---

**ముసుగు … బడింది** నిర్గమ. 34:34.

**పాలకుడు** లేక సాతానుడు.

**చీకటి … ప్రకాశించనీ** ఆది. 1:3.

**నేను … మాట్లాడుతున్నాను** కీర్తన. 116:10.

చాలని ఆశిస్తూ మనము ఇంకా మూల్గుతూ ఉన్నాము.
3మనము ఆ శరీరాన్ని ధరించాక మనకు నగ్నత
ఉండదు. 4ఈ గుడారంలో నివసిస్తున్నంత కాలం మనం
పెద్ద భారంతో మూల్గుతూ ఉంటాము. ఈ భౌతిక
శరీరాన్ని ధరించిన మనము ఈ జీవితం యొక్క
అంతంలో పరలోకపు శరీరాన్ని ధరించుకొంటాము.
5ఆ శరీరాన్ని ధరించ టానికి దేవుడు మనల్ని సిద్ధం
చేసాడు. దానికి హామీగా తన ఆత్మను మనకు ఇచ్చాడు.
6అందువల్ల మనము ఈ శరీరంలో నివాసమున్నంత
కాలము ప్రభువుకు దూరంగా ఉన్నామని మనకు ఖండి
తంగా తెలుసు. 7మనము దృష్టి ఉండటం వల్ల జీవిం
చటం లేదు. విశ్వాసం ఉండటం వల్ల జీవిస్తున్నాము.
8మనమీశరీరానికి దూరమై, ప్రభువుతో నివసించాలని
కోరుకొంటున్నాము. మనకు ఆ ధైర్యం ఉంది. 9అందు
వల్ల మనమీ శరీరంలో నివసిస్తున్నా లేక దానికి దూరంగా
ఉన్నా ఆయన్ని ఆనంద పరచటమే మన ఉద్దేశ్యం.
10ఎందుకంటే మన మంతా క్రీస్తు సింహాసనం ముందు
నిలబడవలసి వస్తుంది. అప్పుడు, ఈ శరీరంలో మన
ముండగా చేసిన మంచికి, చెడుకు తగిన విధంగా ప్రతి
ఒక్కడూ ప్రతిఫలం పొందుతాడు.

### దేవునితో సమాధానము

11కనుక ప్రభువుకు భయపడుట అంటే ఏమిటో
స్పష్టంగా తెలుస్తోంది. కనుక ఆయన సందేశాన్ని అంగీ
కరించుమని ఇతరులను కూడా ఒత్తిడి చేస్తాము. మా
గురించి దేవునికి బాగా తెలుసు. మీ హృదయాలకు
కూడా ఈ విషయం తెలుసునని నా విశ్వాసం. 12మా
గురించి మేము చెప్పుకోవాలని లేదు. మా విషయంలో
గర్వించటానికి మీకు అవకాశం యిస్తున్నాము. అప్పుడు
మీరు మనిషి గుణాన్ని కాక, అతని వేషం చూసి పొగిడే
వాళ్ళకు, సమాధానం చెప్పగలుగుతారు. 13మాకు మతి
పోయిందా? ఔను, అది దేవుని కోసం పోయింది.
మాకు మతి ఉందా? ఔను అది మీకోసం ఉంది.
14క్రీస్తు ప్రేమ మమ్మల్ని బలవంతము చేస్తుంది. ఎందు
కంటే ప్రజల కోసం ఆయన మరణించాడు. అందువల్ల
అందరూ ఆయన మరణంలో భాగం పంచుకొన్నారు.
ఇది మనకు తెలుసు. 15ఆయన అందరి కోసం మరణిం
చాడు. కనుక జీవిస్తున్న వాళ్ళు యిక మీదట తమ
కోసం జీవించరాదు. మరణించి ప్రజలకోసం మళ్ళీ
బ్రతికింపబడిన వాని కోసం జీవించాలి. 16ఇక నుండి
మేము ఎవ్వరినీ లౌకికంగా పరిగణించము. ఒకప్పుడు
మనం క్రీస్తును లౌకికంగా పరిగణించాము, గాని ఇప్పుడు
అలా కాదు. ఆయన్ని గురించి మా అభిప్రాయం
మారిపోయింది. 17క్రీస్తులో ఐక్యత పొందినవాడు క్రొత్త
జీవితం పొందుతాడు. పాత జీవితం పోయి క్రొత్త
జీవితం వస్తుంది. 18ఇదంతా దేవుడు చేసాడు. శత్రువు
లుగా ఉన్న మనల్ని క్రీస్తు ద్వారా తన మిత్రులుగా
చేసుకొన్నాడు. ఇతరులను కూడా తన మిత్రులుగా
చేసే బాధ్యత మనపై ఉంచాడు. 19క్రీస్తు ద్వారా దేవుడు
అందరినీ తన మిత్రులుగా చేసుకొనుచు న్నాడన్నదే
మా సందేశం. దేవుడు ప్రజలు చేసిన పాపాలను క్షమి
స్తాడు. వాళ్ళను తన మిత్రులుగా ఏ విధంగా చేసుకొంటా
డన్న సందేశం చెప్పాడు. 20మేము క్రీస్తు రాయబా
రులం. దేవుడే మా ద్వారా ఈ విజ్ఞప్తి చేస్తున్న విషయం
గ్రహించండి. క్రీస్తు పక్షాన దేవునితో సమాధాన
పడుమని మిమ్మల్ని వేడుకొంటున్నాము. 21క్రీస్తు
పాపం చెయ్యలేదు. కాని మనకోసం దేవుడు ఆయన్ని
పాపంగా చేసాడు. మనం క్రీస్తులో ఐక్యత పొంది దేవుని
దృష్టిలో నీతిమంతులంగా ఉండాలని ఇలా చేసాడు.

6 దేవునితో సహపనివారంగా మేము, దైవాను
గ్రహాన్ని వృథా చేసుకోవద్దని మిమ్మల్ని వేడు
కొంటున్నాము. 2ఎందుకంటే, దేవుడే ఈ విధంగా
అన్నాడు:

> "నేను సరియైన సమయానికి మీ మనవి
> విన్నాను. రక్షించే రోజున మీకు సహాయం
> చేసాను."
>
> *యెషయా 49:8*

నేను చెప్పేదేమిటంటే, దేవుడు అనుగ్రహించే
సమయం ఇదే. రక్షించే రోజు ఈ దినమే.

### పౌలు యొక్క కష్టాలు

3మేము చేసే సేవ చెడుపేరు పొందరాదని, మేము
ఎవరి దారికీ ఆటంకాలు కలిగించము. 4దానికి మారుగా
మేము అన్ని విషయాలలో దేవుని సేవకులమని
రుజువు చేసుకొంటున్నాము. ఆ గొప్ప సహనం మాకు
కష్టాలు, దుఃఖాలు, అవసరాలు కలిగినప్పుడు, 5దెబ్బలు
తిన్నప్పుడు, చెరసాలలో పడినప్పుడు, ప్రజలు ఎదురు
తిరిగినప్పుడు, నిద్రాహారాలు లేక కష్టపడి పని చేసిన
ప్పుడు, 6నిష్కల్మషంగా ఉండటంలో, యిత్లర్లను అర్థం
చేసుకోవటంలో, సహనం, దయ చూపటంలో, పరిశు
ద్ధాత్మ విషయంలో, నిజమైన ప్రేమ వ్యక్తం చేయ
టంలో, 7సత్యంగా మాట్లాడటంలో, దేవుని శక్తి విష
యంలో, కుడిఎడమ చేతుల్లో ఉన్న నీతి ఆయుధాల
విషయంలో, 8కీర్తి వచ్చినా, అవమానాలు కలిగినా,
పొగడ్తలు వచ్చినా, నిందలు కలిగినా, సత్యవంతులన్నా,
మోసగాళ్ళన్నా, 9మేము తెలిసినా మమ్మల్ని తెలియని
వాళ్ళుగా చూసినప్పుడు, చనిపోవు చున్నను చనిపోని
వారిగా ఉన్నప్పుడు, కొట్టబడినా, చంపబడకుండా
ఉన్నప్పుడు, 10దుఃఖంతో ఉన్నా ఆనందంగా ఉన్న
ప్పుడు, దరిద్రులమైనా యితరులను ధనవంతులుగా
చేస్తున్నప్పుడు, మా దగ్గర ఏమీ లేకున్నా అన్నీ

ఉన్నాయన్నట్టుగా వున్నప్పుడు మేము దేవుని సేవకు
లంగా రుజువు చేసుకొంటున్నాం.
11కొరింథులోని ప్రజలారా! మేము మీతో దాచ
కుండా మాట్లాడి మిమ్మల్ని హృదయ పూర్వకంగా
అంగీకరించాము. 12మేము మా ప్రేమ దాచకుండా
మీకు చూపాము. కాని మీరు మీ ప్రేమ మాకివ్వకుండా
దాస్తున్నారు. 13నేను మిమ్మల్ని నా బిడ్డలుగా భావించి
మాట్లాడుతున్నాను. మేము మిమ్మల్ని హృదయ
పూర్వకంగా అంగీకరించినట్లే, మమ్మల్ని మీరు
హృదయపూర్వకంగా అంగీకరించండి.

### అవిశ్వాసులతో కలిసిపోకండి

14అవిశ్వాసులతో అంటిపెట్టుకోకండి. నీతికి,
దుర్మార్గతకు పొత్తు ఏ విధంగా కుదురుతుంది? వెలు
గుకూ, చీకటికి ఏమి సహవాసము? 15క్రీస్తుకు, బెలియా
లుకు మధ్య సంబంధము ఎలా ఉంటుంది? విశ్వాసం
ఉన్న వానికి, విశ్వాసం లేని వానికి మధ్య స్నేహం
ఎలా కుదురుతుంది? 16దేవుని ఆలయానికి, విగ్రహా
లకు ఒడంబడిక ఎలా ఉంటుంది? మనం జీవంతో
ఉన్న దేవునికి ఆలయంగా ఉన్నాము. దేవుడు ఈ
విధంగా అన్నాడు:

> "నేను వాళ్ళ మధ్య నడుస్తూ వాళ్ళతో
> జీవిస్తాను. వాళ్ళు నా ప్రజగా, నేను వాళ్ళ
> దేవునిగా ఉంటాము."
> *లేవీ. 26:11-12*

> 17 "కాబట్టి వాళ్ళను వదిలి వేరుగా ఉండండి.
> అపవిత్రమైన దానికి దూరంగా ఉంటే నిన్ను
> స్వీకరిస్తాను అని ప్రభువు అన్నాడు."
> *యెషయా 52:11*

> 18 "నేను మీకు తండ్రిగా ఉంటాను. మీరు
> నాకు కుమారులుగా, కుమార్తెలుగా
> ఉంటారు అని సర్వశక్తిసంపన్నుడైన
> ప్రభువు అంటున్నాడు."
> 2 సమూ. *7:14; 7:8*

7 మిత్రులారా! మనకు ఈ వాగ్దానాలు వున్నాయి.
కనుక మన దేహాలకు, మన ఆత్మలకు కలిగిన
మలినాన్ని కడిగి పరిశుద్ధమౌదాం. మనకు దేవునిపట్ల
భయ భక్తులు ఉన్నాయి. కనుక పరిపూర్ణత పొంద
టానికి ప్రయత్నం చేద్దాం.

### పౌలు యొక్క సంతోషం

2మీ హృదయాల్లో మాకు స్థానం ఇవ్వండి. మేము
ఎవ్వరికీ అన్యాయం చేయలేదు. ఎవ్వరినీ తప్పుదారి
పట్టించలేదు. మా స్వలాభానికి ఎవ్వరినీ దోచు
కోలేదు. 3మిమ్మల్ని నిందించాలని ఇలా అనటం లేదు.
మా హృదయాల్లో మీకు ఎలాంటి స్థానం ఉందో
మీకు ముందే చెప్పాను. మేము మీతో కలిసి జీవించ
టానికి, మరణించటానికి కూడా సిద్ధంగా ఉన్నాము.
4మీ పట్ల నాకు సంపూర్ణ నమ్మకం ఉంది. మీ విష
యంలో నేను గర్విస్తుంటాను. మీ ప్రోత్సాహం వల్ల
మేము మా కష్టాల్ని ధైర్యంగా ఎదుర్కొంటున్నాము.
నాకు చాలా ఆనందంగా ఉంది.
5మేము మాసిదోనియ దేశానికి వచ్చినప్పటినుండి
మా ఈ దేహాలకు విశ్రాంతి లేదు. ప్రతిచోటా మమ్మల్ని
కష్టపెట్టారు. బయట ఆందోళనలు, లోపల భయాలు.
6కాని క్రుంగిన మనస్సులకు శాంతిని కలిగించే దేవుడు
తీతును పంపి మాకు సహాయం చేసాడు. 7అతడు
రావటం వల్ల మాత్రమే కాకుండా మీరతనికి చేసిన
సహాయాన్ని గురించీ, ఆదరణను గురించీ అతడు
చెప్పటం వల్ల మాకు ఆనందం కలిగింది. అతడు మీ
కోరికను గురించి, మీ దుఃఖాన్ని గురించి, మీరు నా
పట్ల చూపిన అభిమానాన్ని గురించీ చెప్పాడు. దానివల్ల
ఇంకా ఎక్కువ ఆనందపడ్డాను.
8నా లేఖ మీకు దుఃఖం కలిగించినా, అది వ్రాసి
నందుకు నేను బాధ చెందటం లేదు. అది మీకు
కొంత దుఃఖం కలిగించిందని నాకు తెలుసు. అది
నాకు కూడా కొంత దుఃఖం కలిగించింది. అయినా
అది కొంచెం సేపు మాత్రమే. 9కాని యిప్పుడు నాకు
ఆనందంగా ఉంది. మీకు దుఃఖం కలిగించానని కాదు,
మీ దుఃఖం మారుమనస్సుకు నడిపింది. దేవుని
చిత్తానుసారంగా మీరు దుఃఖపడ్డారు. గాని మేము మీకు
ఏ హానీ కలిగించలేదు. 10దేవుడు కలిగించిన దుఃఖం,
మారుమనస్సు పొందేటట్లు చేసి రక్షణకు దారితీస్తుంది.
దాని వల్ల నష్టం కలుగదు. కాని ఈ ప్రపంచం కలిగించే
దుఃఖం మరణానికి దారితీస్తుంది. 11దేవుడు కలిగించిన
దుఃఖం వల్ల మీలో కలిగిన మార్పుల్ని గమనించండి.
మీలో ఎంత నిజాయితీ కలిగిందో చూడండి. నిర్దోషు
లని నిరూపించుకోవటానికి మీరు ఎంత ఉత్సాహంతో
ఉన్నారో గమనించండి. ఎంత ఆందోళన కలిగిందో
గమనించండి. మీ అభిమానం ఎంతగా అభివృద్ధి
చెందిందో గమనించండి. మీ విశ్వాసం ఎంతగా పెరి
గిందో, న్యాయం చేకూర్చాలనే ఆత్రుత ఎంతగా కలి
గిందో గమనించండి. మీరు ఈ సమస్యవల్ల కలిగిన
ప్రతీ నిందనుండి తప్పించుకొన్నారు. 12కనుక నేనా
ఉత్తరం మీలో అన్యాయం చేసిన వానికొరకు గాని, ఆ
అన్యాయానికి గురి అయిన వానికొరకు గాని, వ్రాయ
లేదు. దేవుని సాక్షిగా చెపుతున్నాను–మీరు కనబరు
స్తున్న అభిమానాన్ని, మీరు చూడగలగాలని వ్రాసాను.
13అది మాకు ప్రోత్సాహం కలిగించింది. మా ప్రోత్సా
హంతో పాటు, తీతు యొక్క ఆనందాన్ని చూసి

మాకు ఇంకా ఎక్కువ ఆనందం కలిగింది. మీరు అతని
మనస్సుకు శాంతి చేకూర్చారు. 14నేను మిమ్మల్ని
అతని ముందు పొగిడాను. మీరు నా మాట నిలబెట్టారు.
మేము మీతో ఎప్పుడూ సత్యం మాట్లాడాము.
మిమ్మల్ని పొగుడుతూ తీతుసకు చెప్పినవి కూడా
సత్యమని మీరు రుజువు చేసారు. 15మీరు అతణ్ణి విధే
యతతో, భయంతో, వణుకుతూ ఆహ్వానించారు.
ఆ విషయం అతడు జ్ఞాపకం చేసుకొని మీ పట్ల ఉన్న
వాత్సల్యాన్ని పెంచుకొన్నాడు. 16నేను మిమ్మల్ని
సంపూర్ణంగా విశ్వసించగలను. అందుకు నాకు
ఆనందంగా ఉంది.

### చందాలు సేకరించటం

8 సోదరులారా! మాసిదోనియ దేశంలోని సంఘాల
పట్ల దేవుడు చూపిన అనుగ్రహాన్ని గురించి మీకు
తెలపాలని మా అభిప్రాయం. 2వాళ్ళ కష్టాలు వాళ్ళను
తీవ్రంగా పరీక్షించాయి. వాళ్ళు చాలా పేదరికం అనుభ
వించారు. అయినా వాళ్ళలో చాలా ఆనందం కలిగి,
వాళ్ళు యివ్వటంలో మిక్కిలి ఔదార్యం చూపారు.
3వాళ్ళు యివ్వగలిగింది స్వయంగా యిచ్చారు. అంతే
కాదు, తాము యివ్వగలిగినదానికన్నా ఇంకా ఎక్కువే
యిచ్చారని నేను ఖచ్చితంగా చెప్పగలను. 4విశ్వాసులైన
వారికి చేసే సహాయంలో తాము కూడా చేరుతామని
వాళ్ళు మమ్మల్ని ప్రాధేయపడ్డారు.
5మేము ఆశించినంతగా చేయలేదు. అయినా
వాళ్ళు మొదట తమను తాము ప్రభువుకు అర్పించు
కొన్నారు. తర్వాత దేవుని చిత్తాను సారంగా మాకును
అప్పగించుకున్నారు. 6ఈ కార్యాన్ని ప్రారంభించిన
తీతును దీన్ని కొనసాగించుమని వేడుకొన్నాము. మీరు
చేయాలనుకొన్న ఈ సేవాకార్యాన్ని అతడు పూర్తి
చేసాడు. 7మీరు విశ్వాసంలో, మాటలో, జ్ఞానంలో,
సంపూర్ణ ఆసక్తిలో, మా పట్ల వ్యక్తపరుస్తున్న ప్రేమలో
అందరినీ మించి పోయారు. మీ దాతృత్వంలో కూడా
అందరినీ మించిపోవాలని మిమ్మల్ని అడుగుతున్నాను.
8నేను మీకు ఆజ్ఞాపించటం లేదు. ఇతరులు
చేస్తున్న సేవతో మీ ప్రేమను పోల్చి చూడాలని ఉంది.
మీ ప్రేమ ఎంత నిజమైందో చూడాలని ఉంది. 9మన
యేసు క్రీస్తు ప్రభువు అనుగ్రహం ఎంత గొప్పదో
మీకు తెలుసు. ఆయన ఐశ్వర్యవంతుడైనా మీ కొరకు
పేదవాడయ్యాడు. ఆయన పేదరికం వల్ల మీరు ఐశర్య
వంతులు కావాలని ఆ విధంగా చేసాడు.
10ఈ విషయంలో మీకు ఏది మంచిదో అది
చెబుతాను. పోయిన సంవత్సరం మీరు అందరికన్నా
ఎక్కువగా యివ్వటమే కాకుండా అలాంటి ఉద్దేశ్యం
ఉన్న వాళ్ళలో మీరే ప్రథములు. 11కార్యాన్ని మొదలు
పెట్టటంలో చూపిన ఆసక్తి దాన్ని పూర్తి చెయ్యటంలో
కూడా చూపండి. మీ శక్త్యానుసారం చెయ్యండి. 12మీకు
యివ్వాలనే ఆసక్తి ఉంటే దేవుడు దాన్ని అంగీకరిస్తాడు.
మీ దగ్గర లేని దాన్ని బట్టి కాకుండా ఉన్నదాన్ని బట్టి
మీరిచ్చింది అంగీకరిస్తాడు. 13మీ మీద భారం మోపి
యితరుల భారం తగ్గించాలని కాదు కాని అందరికీ
సమానంగా ఉండవలెనని నా ఉద్దేశ్యం. 14ప్రస్తుతం మీ
దగ్గర అన్నీ సమృద్ధిగా ఉన్నాయి. కనుక అవసరమున్న
వాళ్ళకు మీరు సహాయం చెయ్యటం సమంజసమే.
అలా చేస్తే మీకు అవసరంవున్నప్పుడు వాళ్ళు
సహాయం చేస్తారు. అప్పుడు సమంజసంగా ఉంటుంది.
15లేఖనాల్లో ఈ విధంగా వ్రాసారు:

> "ఎక్కువ కూడబెట్టిన వాని దగ్గర ఎక్కువ
> లేదు. తక్కువ కూడబెట్టిన వాని దగ్గర
> తక్కువలేదు."
>
> *నిర్గమ. 16:18*

### తీతును కొరింథుకు పంపటం

16మీపట్ల నాకున్న చింతనే, దేవుడు తీతు హృద
యంలో కూడా పెట్టాడు. అందుకు నేను దేవునికి
కృతజ్ఞుణ్ణి. 17తీతు మా నివేదన అంగీకరించాడు. అంతే
కాక, చాలా ఉత్సాహంతో స్వయంగా మీ దగ్గరకు వస్తు
న్నాడు. 18అతని వెంట యింకొక సోదరుణ్ణి పంపుతు
న్నాము. ఈ సోదరుడు సువార్త ప్రకటించి చేసిన
సేవను అన్ని సంఘాలు అభినందిస్తున్నాయి. 19పైగా,
అతడు మా వెంట ఉండి, మాతో సహా ఈ కానుకను
తీసుకు వెళ్ళాలని సంఘాలు అతణ్ణి ఎన్నుకొన్నాయి.
మేమీకానుక ప్రభువు మహిమ కోసం తీసుకు వెళ్తు
న్నాము. సహాయం చేయాలన్న మా ఉత్సాహాన్ని
చూపాలని మా ఉద్దేశ్యం.
20ఈ గొప్ప విరాళాలు విమర్శకు గురి కాకుండా
జాగ్రత్తగా యిస్తాము. 21ప్రభువు దృష్టిలోనే కాకుండా
ప్రజల దృష్టిలో కూడా ఏది ధర్మమో అది చెయ్యాలని
మేము శ్రద్ధతో కష్టపడుతున్నాము.
22అందువల్ల మా సోదరుణ్ణి కూడా వాళ్ళతో
పంపుతున్నాము. ఇతన్ని మేము చాలాసార్లు పరీ
క్షించాము. సేవ చెయ్యాలనే ఉత్సాహం అతనిలో
ఉన్నట్లు గ్రహించాము. ఇక అతనికి మీపట్ల సంపూర్ణ
మైన విశ్వాసం ఉండటంవల్ల అతని ఉత్సాహం ఇంకా
ఎక్కువైంది.
23ఇక తీతు విషయమా! అతడు నేను మీకోసం
చేస్తున్న సేవలో భాగస్తుడు. నాతో కలిసి పని చేసే
వాడు. ఇక మేము పంపిన సోదరులు, సంఘాల ప్రతి
నిధులు, క్రీస్తుకు గౌరవం కలిగించే వాళ్ళు. 24అందు
వల్ల, మీకు ప్రేమ ఉన్నట్లు వాళ్ళకు రుజువు చెయ్యండి.
మేము మీ విషయంలో ఎందుకు గర్విస్తున్నామో
వాళ్ళకు చూపండి. అలా చెయ్యటం వల్ల సంఘాలన్నీ
దీన్ని గమనిస్తాయి.

9 భక్తులకు చేయవలసిన సహాయాన్ని గురించి నేను మీకు వ్రాయవలసిన అవసరం లేదు. 2సహాయం చెయ్యాలనే ఉత్సాహం మీలో ఉన్నట్లు నాకు తెలుసు. అకయలో ఉన్న మీరు, పోయిన సంవత్సరం నుండి యివ్వటానికి సిద్దంగా ఉన్నారని మాసిదోనియా ప్రజలకు నేను గర్వంగా చెప్పాను. మీ ఉత్సాహం వాళ్ళలో చాలా మందిని ప్రోత్సాహపరిచింది. వాళ్ళు కార్యానిర్వహణకు పూనుకొన్నారు. 3ఈ విషయంలో మేము మిమ్మల్ని గురించి పొగుడుతూ చెప్పిన మాటలు వ్యర్థం కాకూడదని నా ఉద్దేశ్యం. మీరు సహాయం చెయ్యటానికి సిద్ధంగా ఉంటారని నాకు తెలుసు. కనుక సోదరుల్ని పంపుతున్నాను. 4ఒక వేళ మాసిదోనియ వాళ్ళు నాతో వచ్చి మీరు సిద్ధంగా లేరని తెలుసుకొంటే, మీకే కాక, మీపై యింత నమ్మకం ఉన్న మాకు కూడా అవమానం కలుగుతుంది. 5కనుక సోదరుల్ని ముందే మీ దగ్గరకు పంపటం అవసరం అనిపించింది. వాళ్ళు వచ్చి మీరు ధారాళంగా వాగ్దానం చేసిన విరాళాన్ని ప్రోగుచేస్తారు. అలా చేస్తే మేము వచ్చినప్పుడు ఆ కానుక సిద్ధంగా ఉంటుంది. అప్పుడు ఆ కానుక అయిష్టంగా కాక, ఆనందంగా యిచ్చినట్లు అందరికీ తెలుస్తుంది.

### సమృద్ధిగా విత్తనం నాటటం

6కొంచెముగా విత్తేవాడు కొద్ది పంటను మాత్రమే పొందుతాడు. అదే విధంగా ఎక్కువగా విత్తేవానికి పంటకూడా ఎక్కువగా లభిస్తుంది. మీరిది జ్ఞాపకం ఉంచుకొండి. 7ఆనందంగా యిచ్చే వాణ్ణి దేవుడు ప్రేమిస్తాడు. కనుక ప్రతి ఒక్కడూ గొణుక్కోకుండా యివ్వాలి. ఒకరి బలవంతంతో కాకుండా తాను స్వయంగా నిర్ణయించుకొని యివ్వాలి. 8అప్పుడు దేవుడు మీకవసరమున్న దాని కన్నా ఎక్కువే యిస్తాడు. మీకు అవసరమున్నవన్నీ అన్ని వేళలా మీకు లభించేటట్లు చెయ్యటమే కాకుండా సత్కార్యాలు చెయ్యటానికి కావలసినవి సమృద్ధిగా యిస్తాడు. 9దీన్ని గురించి లేఖనాల్లో ఇలా వ్రాసారు:

> “అతడు పేదలకు ధారాళంగా యిచ్చాడు
> అతని నీతి చిరకాలం ఉంటుంది.”
> కీర్తన *112:9*

10రైతుకు విత్తనాలు, తినటానికి ఆహారము యిచ్చే దేవుడే మీ పంటను సమృద్ధిగా పండించటానికి కావలసిన విత్తనాలు యిస్తాడు. తద్వారా మీ నీతికి ఫలం కలిగిస్తాడు. 11మీరు అన్ని విషయాల్లో ధారాళంగా ఉండేటట్లు మీకు సకల ఐశ్వర్యాలు యిస్తాడు. మా ద్వారా మీరిచ్చిన విరాళాలు తీసుకొని విశ్వాసులు దేవునికి కృతజ్ఞతలు చెపుతారు. 12మీరు చేసిన సహాయం విశ్వాసుల అవసరాలను తీరుస్తుంది. అంతే కాక, వాళ్ళు దేవుణ్ణి అన్నివేళలా స్తుతించేటట్లు చేస్తుంది. 13మీరు ఈ సేవ చేసి మీ విశ్వాసాన్ని నిరూపించుకున్నారు. క్రీస్తు సువార్తను అంగీకరించారు. దాన్ని విధేయతతో పాటించారు. మీకున్న దాన్ని వాళ్ళతో మాత్రమే కాక, అందరితో ధారాళంగా పంచుకొన్నారు. ఇది చూసి ప్రజలు దేవుణ్ణి స్తుతిస్తారు. 14దేవుడు మీపై యింత కరుణ చూపినందుకు, వాళ్ళు ప్రార్థించినప్పుడు మనసారా మిమ్మల్ని ప్రేమతో తలచుకుంటారు. 15దేవుడు యిచ్చిన వర్ణనాతీతమైన ఆ కానుకకు మనము ఆయనకు కృతజ్ఞతతో ఉందాము.

### పౌలు తనను సమర్థించుకోవటం

10 క్రీస్తులో ఉన్న సాత్వికం పేరిట, దయ పేరిట మిమ్మల్ని వేడుకొంటున్నాను. కొందరు నేను మీ సమక్షంలో ఉన్నప్పుడు నాలో ధైర్యం ఉండదని, మీకు దూరంగా ఉన్నప్పుడు నాలో ధైర్యముంటుందని అంటున్నారు. 2నేను మీ దగ్గరకు వచ్చినప్పుడు ధైర్యంగా మాట్లాడవలసిన అవసరం లేదు. మేము లౌకికంగా జీవిస్తున్నామని అనుకొనేవాళ్ళతో కూడా ధైర్యంగా మాట్లాడనవసరం లేదు. 3మేము ఈ ప్రపంచంలో జీవిస్తున్నా, ఈ ప్రపంచంలో ఉన్నవాళ్ళు యుద్ధం చేసినట్లు మేము చెయ్యము. 4మేము ఉపయోగించే ఆయుధాలు ఈ ప్రపంచంలోని వాళ్ళు ఉపయోగించేవి కావు. కాని శత్రువుల కోటలను పడగొట్టగల దైవికమైన శక్తి మా ఆయుధాల్లో ఉంది. 5మేము దేవుని జ్ఞానాన్ని ఎదిరించే తర్కాలను, డాంబిక వాదాలను ఓడించి పడగొడతాము. ప్రతి భావాన్ని బంధించి అందరినీ క్రీస్తుకు విధేయులు అయ్యేటట్లు చేస్తాము. 6మిమ్మల్నందర్నీ విధేయులుగా చేసాక అవిధేయతతో ఉన్న ప్రతి సంఘటనను శిక్షించటానికి సిద్ధంగా ఉంటాము.

7మీరు పైకి కనిపించే వాటిని మాత్రమే చూస్తున్నారు. తాను క్రీస్తుకు చెందినవాణ్ణని విశ్వసించిన వాడు, తాను ఏ విధంగా క్రీస్తుకు చెందాడో మేము అతనిలాగే క్రీస్తుకు చెందిన వాళ్ళమని గమనించాలి. 8మిమ్మల్ని నాశనం చెయ్యటానికి కాకుండా అభివృద్ధి పరచటానికి ప్రభువు మాకు అధికార మిచ్చాడు. దాన్ని గురించి నేను గొప్పలు చెప్పుకోవటానికి సిగ్గుపడను. 9నా లేఖల ద్వారా మిమ్మల్ని భయపెట్టాలని ప్రయత్నించటం లేదు. మీరు అలా అనుకోకండి. 10ఎందుకంటే కొందరు, “అతని లేఖలు బలంగా, ముఖ్యమైనవిగా కనిపిస్తాయి. కాని మనిషిని ఎదురుగా ఉన్నప్పుడు చూస్తే బలహీనంగా ఉంటాడు. మాటలు నిస్సారంగా ఉంటాయి” అని అంటారు. 11వాళ్ళు మేము దూరంగా వుండి లేఖల్లో వ్రాసిన విధంగా సమక్షంలో ఉన్నప్పుడు కూడా నడుచుకొంటామని గమనించాలి.

12ఆ ప్రగల్భాలు పలికే గుంపుతో పోల్చుకొనే
ధైర్యం కూడా మాకు లేదు. మేము వాళ్ళతో పోల్చు
కోము. తెలివిలేని వాళ్ళు తమ గొప్పతనాన్ని తామే
కొల్చుకుంటూ, తమతో తమను పోల్చుకొంటారు.
13మేము యితర విషయాల్లో గొప్పలు చెప్పుకోము.
కాని, దేవుడు మాకప్పగించిన విషయంలో గొప్పలు
చెప్పుకోవటం మానము. ఆ విషయాలు మీకు కూడా
చెప్పాము. 14మేము మా హద్దులు మీరిపోవటం లేదు.
మీరు ఆ హద్దుల్లో ఉన్నారు కనుక మేము క్రీస్తు సువార్త
తీసుకొని మీ దగ్గరకు వచ్చాము. మేము మా హద్దులు
మీరలేదు. 15లేక మేము యితరులు చేసిన కార్యాల్ని
గొప్పగా చెప్పి మా హద్దులు దాటిపోలేదు. మీ విశ్వాసం
అభివృద్ధి చెందుతుందని మాకు నమ్మకం ఉంది. మేము
చేస్తున్న సేవాకార్యం మీ ద్వారా నలువైపులా వ్యాపిం
చాలి. 16దైవసందేశాన్ని మీ ప్రాంతంలోనే కాక, మీకు
ముందున్న ప్రాంతాల్లో కూడా ప్రకటించాలని మా
ఉద్దేశం. ఇతరులు తమ ప్రాంతాల్లో యిదివరకే చేసిన
కార్యాల్ని గురించి మేము గొప్పలు చెప్పుకోవాలని
మాకు లేదు. 17కాని, "గర్వించాలనుకొన్నవాడు
ప్రభువు విషయంలో గర్వించాలి"* అని వ్రాయ
బడింది. 18ప్రభువు ఎవరిని యోగ్యుడని సమ్మతిస్తాడో
వాడే యోగ్యుడౌతాడు. కాని తనకు తాను యోగ్యుడని
చెప్పుకొనే వాడు యోగ్యుడు కాడు.

### పౌలు మరియు అబద్ధపు అపొస్తలులు

11 నా తెలివి తక్కువ తనాన్ని మీరు కొద్దిగా
సహిస్తారని ఆశిస్తున్నాను. మీరు సహిస్తున్నారని
నాకు తెలుసు. 2మీ విషయంలో నాకు అసూయగా
ఉంది. ఆ అసూయ దేవుని కోసం. మిమ్మల్ని ఒకే
భర్తకు అంటే క్రీస్తుకు అప్పగిస్తానని వాగ్దానం చేసాను.
మిమ్మల్ని పవిత్ర కన్యగా ఆయనకు బహూకరించాలని
అనుకున్నాను. 3సర్పం కుయుక్తిగా చెప్పిన అబద్ధాల
వల్ల 'హవ్వ' మోసపోయినట్లే మీరునూ మోసపోతారని,
మీ మనస్సులు మలినం అవుతాయని నా భయం.
మీకు క్రీస్తుపట్ల ఉన్న భక్తి పవిత్రమైంది. సంపూర్ణ
మైనది. అది విడిచివేస్తారని నా భయం. 4ఎవరైనా మీ
దగ్గరకు వచ్చి మేము యేసును గురించి బోధించినట్లు
గాక, వేరే విధంగా బోధిస్తే మీరు దాన్ని ఆనందంగా
అంగీకరిస్తారు. మా నుండి పొందిన దైవ సందేశానికి,
ఆత్మకు వ్యతిరేకంగా దైవ సందేశాన్ని, ఆత్మను
ఎవరైనా యిస్తే మీరు వాటిని అంగీకరిస్తారు."* 5ఆ
'గొప్ప అపొస్తలుల కన్నా' నేను కొంచెం కూడా తక్కువ
కానని అంటున్నాను. 6మాట్లాడటంలో నాకు అను
భవం లేకపోయినా జ్ఞానం ఉంది. దీన్ని గురించి మేము
అన్ని విధాలా మీకు స్పష్టంగా తెలియజేసాము. 7దైవ
సందేశాన్ని మీకు ఉచితంగా ప్రకటించాను. మీకు
ప్రాముఖ్యత యిచ్చి నేను తగ్గించుకొన్నాను. అలా
చెయ్యటం పాపమా? 8ఇతర సంఘాలు నన్ను పోషిం
చాయి. అందువలన మీకు సేవ చేయటానికి వాటిని
దోచినట్లయింది. 9నేను మీతో ఉన్నప్పుడు ఎవ్వరికీ
భారంగా ఉండలేదు. మాసిదోనియ నుండి వచ్చిన
సోదరులు నాకు కావలసినవన్నీ తెచ్చారు. నేను మీపైఏ
విధమైన భారం మోప లేదు. ఇకముందు కూడా
మోపను. 10దీన్ని గురించి నేను గర్వపడకుండా అకయ
ప్రాంతంలో ఉన్న వాడెవ్వడూ నన్ను ఆప లేడు. ఇది
నేను క్రీస్తు సత్యంగా చెపుతున్నాను. 11ఎందుకు, మీ
పట్ల నాకు ప్రేమ లేదనా? నేను ప్రేమిస్తున్నానని
దేవునికి తెలుసు.

12వాళ్ళు తమను గురించి గర్వంగా చెప్పుకోవాలని
చూస్తారు. తాము మాతో సమానంగా ఉన్నట్లు మీరు
గమనించాలని వాళ్ళ ఉద్దేశ్యం. ఆ అవకాశం కోసం
వాళ్ళు ఎదురు చూస్తూ ఉంటారు. వాళ్ళు గర్వించ
టానికి కారణం లేకుండా చెయ్యటానికి నేను చేస్తున్నది
చేస్తూపోతాను. 13అలాంటి వాళ్ళు దొంగ అపొస్తలులు.
మోసాలు చేస్తారు. క్రీస్తు అపొస్తలుల వలె నటిస్తారు.
14దీనిలో ఆశ్చర్యమేలేదు! సైతాను కూడా తాను
వెలుగుదూత అయినట్లు నటిస్తాడు. 15మరి సైతాను
సేవకులు నీతిమంతులవలె నటించటంలో ఆశ్చర్యమే
లేదు! చివరన వాళ్ళు చేసిన పనుల్ని బట్టి ఫలితం
పొందుతారు.

### పౌలు తన కష్టాలలో అతిశయించుట

16నన్నొక తెలివితక్కువవానిగా పరిగణించవద్దని
మళ్ళీ చెపుతున్నాను. మీరు నేను తెలివితక్కువ వాణ్ణని
అనుకొంటే, తెలివిలేని వాణ్ణి అంగీకరించినట్లు నన్ను
అంగీకరించండి. అప్పుడు దానికి నేను కొద్దిగా గర్వప
డవచ్చు. 17నాలో ఉన్న ఆత్మవిశ్వాసం వల్ల గర్వంగా
మాట్లాడుతున్నాను. ప్రభువు మాట్లాడమన్నట్లు
కాకుండా తెలివిలేనివాడు మాట్లాడినట్లు మాట్లాడు
తున్నాను. 18అందరూ లౌకికులవలె తమను గురించి
గర్వంగా మాట్లాడుకుంటున్నారు. కనుక నేను కూడా
గర్వంగా మాట్లాడుతున్నాను. 19మీరు బుద్ధిమంతులై
యుండి తెలివిలేనివాళ్ళ పట్ల మీరు ఆనందంగా సహనం
చూపిస్తున్నారు. 20మిమ్మల్ని బానిసలుగా చేసుకొన్న
వాళ్ళ పట్ల, దోచుకొనే వాళ్ళ పట్ల, మీ వల్ల లాభం
పొందే వాళ్ళపట్ల, మిమ్మల్ని అణచి పెట్టే వాళ్ళ పట్ల,
మీ చెంపమీద కొట్టిన వాళ్ళ పట్ల, మీరు సహనం
చూపుతారు. 21వాళ్ళలా ప్రవర్తించే ధైర్యం మాకు
లేదు. ఇది చెప్పుకోవటానికి నాకు సిగ్గు వేస్తోంది.

---

**గర్వించా … గర్వించాలి** యిర్మీయా 9:24.

**ఎవరైనా … అంగీకరిస్తారు** ఇది వ్యంగ్యంగా చెప్పబడింది. దీని అర్థమేమంటే: వాళ్ళు అలాంటి విషయాల్ని సహించ కలగాలి.

ఎవరికైనా గర్వంగా మాట్లాడే ధైర్యం ఉంటే,
నేనూ ఒక అవివేకిగా మాట్లాడుతున్నాను, నాకు కూడా
గర్వంగా మాట్లాడే ధైర్యం ఉంది. 22వాళ్ళు
హెబ్రీయులా? నేను కూడా హెబ్రీయుణ్ణి, వాళ్ళు
ఇశ్రాయేలీయులా? నేను కూడా ఇశ్రాయేలీయుడను.
వాళ్ళు అబ్రాహాము వంశీయులా? నేను కూడా అబ్రా
హాము వంశీయుణ్ణి. 23వాళ్ళు క్రీస్తు సేవకులా? ఈ
విధంగా మాట్లాడాలంటే నాకు మతిపోతుంది. నేను
వాళ్ళకన్నా ఎక్కువ సేవ చేస్తున్నాను. నేను వాళ్ళకన్నా
ఎక్కువ కష్టించి పని చేసాను. వాళ్ళకన్నా ఎక్కువ
సార్లు కారాగారానికి వెళ్ళాను. వాళ్ళకన్నా తీవ్రమైన
కొరడాదెబ్బలు తిన్నాను. ఎన్నోసార్లు చావుకు గురి
అయ్యాను.

24యూదులు నన్ను ఐదు సార్లు ముప్పై తొమ్మిది
కొరడాదెబ్బలు కొట్టారు. 25మూడు సార్లు ఇనుప కడ్డీ
లతో కొట్టారు; ఒకసారి రాళ్ళతో కొట్టారు. మూడు
సార్లు పడవ పగిలి ఒక రాత్రి, ఒక పగలు సముద్రం
మీద గడిపాను.

26విరామం లేకుండా ప్రయాణం చేసాను. ఆ
ప్రయాణాల్లో నదులవల్ల ప్రమాదం కలిగింది. బంది
పోటు దొంగలవల్ల ప్రమాదం కలిగింది. నా జాతీయుల
వల్ల ప్రమాదం కలిగింది. యూదులుకాని వాళ్ళవల్ల
ప్రమాదం కలిగింది. పట్టణాల్లో ప్రమాదం కలిగింది.
నిర్మానుష్య ప్రాంతాల్లో ప్రమాదం కలిగింది. సముద్రం
మీద ప్రమాదం కలిగింది. దొంగ సోదరుల వల్ల
ప్రమాదం కలిగింది. 27నేను కష్టాలు ఎదుర్కొని, కష్టించి
పని చేసాను. నిద్రలేని రాత్రులు ఎన్నో గడిపాను.
ఆకలి దప్పులు అంటే ఏమిటో తెలుసుకొన్నాను.
ఎన్నోసార్లు ఆహారం లేక గడిపాను. చలిలో వస్త్రాలు
లేకుండా గడిపాను.

28ఇవే కాక, సంఘాల కొరకు నేను ప్రతిరోజూ
దిగులు పడుతుంటాను. 29మీలో ఒకడు బలహీనుడై
నప్పుడు, నేనూ బలహీనుడు కాకుండా ఉండగలనా?
ఒకడు పాపంలో పడితే, నేను నా అంతరంగంలో
మండి పోకుండా ఉండగలనా? పాపం చెయ్యటానికి
మీలో ఎవరైనా కారకుడు అయితే అతని పట్ల నాకు
కోపం కలగదా?

30నేను గర్వంగా చెప్పుకోవాలి అంటే బలహీనతను
చూపే వాటిని గురించి గర్వంగా చెప్పుకొంటాను.
31యేసు ప్రభువుకు తండ్రి అయిన దేవునికి, సర్వదా
స్తుతింపతగిన దేవునికి, నేను అసత్యం ఆడటం లేదని
తెలుసు. 32నేను డెమాస్కసులో ఉన్నప్పుడు అరెత
అను రాజు పరిపాలనలో ఉన్న రాజ్యాధికారి, నన్ను
బంధించాలని ఊరి చుట్టూ కాపలా ఉంచాడు. 33కాని
కొందరు నన్ను గంపలో ఉంచి గోడ మీదనుండి
క్రిందికి దింపారు. నేను చిక్కకుండా తప్పించుకొని
పారిపోయాను.

### పౌలుకు దర్శనం, ముల్లు

12 లాభం లేకపోయినా నేను గర్వంగా చెప్పు
కొంటూ పోవాలి. ప్రభువు వలన కలిగిన దర్శ
నాలు, ప్రత్యక్షతలు గురించి చెప్పనివ్వండి. 2క్రీస్తును
విశ్వసించే ఒక వ్యక్తి నాకు తెలుసు. పద్నాలుగు సంవత్స
రాల క్రితం దేవుడు అతణ్ణి మూడవ ఆకాశమునకు
తీసుకు వెళ్ళాడు. అతణ్ణి శరీరంతో తీసుకొని వెళ్ళాడో
లేక అతని ఆత్మను తీసుకొని వెళ్ళాడో, నాకు తెలి
యదు. అది దేవునికే తెలుసు. 3నాకు తెలిసిన ఈ
వ్యక్తి శరీరంతో వెళ్ళాడో లేక అతని ఆత్మ మాత్రమే
వెళ్ళిందో నాకు తెలియదు. దేవునికే తెలుసు. 4దేవుడు
యితణ్ణి పరదైసునకు తీసుకు వెళ్ళాడు. అక్కడ అతడు
పవిత్రమయిన విషయాలు విన్నాడు. ఇవి చెప్పటానికి
అనుమతి లేదు. 5నేను అతణ్ణి గురించి గర్వంగా చెపు
తున్నాను. కాని నా గురించి నేను గర్వంగా చెప్పుకోను.
నా బలహీనతను గురించి మాత్రమే గర్వంగా చెప్పు
కొంటాను. 6ఒకవేళ నేను గర్వంగా మాట్లాడినా, నేను
ఎప్పుడూ నిజం చెబుతాను కనుక తెలివిలేని వాణ్ణని
అనిపించుకోను. నేను చెప్పిన వాటి కన్నా, చేసిన
వాటి కన్నా నన్ను గురించి మీరు గొప్పగా అనుకోరాదని
నా అభిలాష. కనుక నేను నన్నుగురించి గర్వంగా
చెప్పుకోకుండా నిగ్రహించుకొంటాను.

7దేవుడు కనుపరచిన ఈ గొప్పవిషయాల వల్ల
నాకు గర్వం కలుగరాదని నా శరీరంలో ఒక ముల్లు
ఉంచబడింది. అది సైతానుదూత. అది నన్ను బాధ
పెడుతూ ఉంటుంది. 8ఆ ముల్లు తీసివేయుమని ప్రభు
వుతో మూడు సార్లు మొరపెట్టుకొన్నాను. 9కాని
ప్రభువు నాతో, “నీకు నా అనుగ్రహం చాలు. నా శక్తి
నీ బలహీనత ద్వారా పరిపూర్ణత పొందుతుంది” అని
అన్నాడు. అందువల్ల క్రీస్తు శక్తి నాలో ఉండాలని నా
బలహీనతను గురించి ఇంకా ఎక్కువ ఆనందంతో,
గర్వంగా చెప్పుకొంటాను. 10అందువల్లే క్రీస్తు కోసం
నేను బలహీనతల్లో, అవమానాల్లో, ఇబ్బందుల్లో,
హింసల్లో, కష్టాల్లో ఆనందం పొందుతూ ఉంటాను.
నేను బలహీనంగా ఉన్నప్పుడు బలంగా ఉంటాను.

### కొరింథు ప్రజల విషయంలో చింత

11నేను తెలివిలేని వానిలా ప్రవర్తిస్తున్నాను. కాని
దీనికి మీరే కారకులు. నేను ఏమీకాకపోయిన ఆ “గొప్ప
అపొస్తలుల”కన్నా తీసిపోను. కనుక మీరు నన్ను
మెచ్చుకోవలసింది. 12అపొస్తలుడని అనిపించుకొను
టకు తగిన ఋజువులు, అద్భుతాలు, మహాత్కార్యాలు
మీ మధ్య నేను పట్టుదలతో చేసాను. అవి నేను
మీకోసం పట్టుదలతో చేసాను. 13నేను మీకు ఎన్నడూ
భారంగా ఉండలేదు, అన్న విషయలో తప్ప ఇతర
సంఘాలకన్నా మీరు ఏ విషయంలో తీసిపోయారు?
దీనికి నన్ను క్షమించండి.

14ఇక యిప్పుడు మూడవసారి మీ దగ్గరకు
రావటానికి సిద్ధంగా ఉన్నాను. ఈసారి కూడా నేను
మీకు భారంగా ఉండను. నాకు కావలసింది మీ దగ్గరున్న
వస్తువులు కాదు. మీరు నాకు కావాలి. పిల్లలు తల్లి
దండ్రుల కోసం ఆస్తిని కూడపెట్టరు. కాని తల్లిదండ్రులే
తమ పిల్లల కోసం ఆస్తి కూడ బెడ్తారు 15అందువల్ల
నా దగ్గరున్నదంతా ఆనందంతో మీకోసం వ్యయం
చేస్తాను. 'నన్ను' మీకోసం ఉపయోగించుకోండి. నేను
మిమ్మల్ని ఎక్కువ ప్రేమిస్తే నన్ను మీరు తక్కు వగా
ప్రేమిస్తారా?

16అది అలా ఉండనివ్వండి, నేను మీకు భారంగా
ఉండలేదని తెలుసు కాని, "నేను పన్నాగాలు పన్ని
మిమ్మల్నివలలో వేసుకొన్నానని" కొందరు అనవచ్చు.
17నేను పంపిన మనుష్యుల్లో ఎవరైనా మిమ్మల్ని
మోసగించటానికి ఉపయోగించుకొన్నానా? లేదని
నాకు తెలుసు. నేను వాళ్ళద్వారా మిమ్మల్ని ఉపయో
గించుకొన్నానా? 18నేను తీతును మీ దగ్గరకు వెళ్ళ
మని వేడుకొన్నాను. మా సోదరుణ్ణి అతని వెంట
పంపాను. తీతు మిమ్మల్ని వంచించలేదు కదా? వంచిం
చాడా? లేదు. మేమంతా ఒకే ఆత్మతో, ఒకే మార్గాన్ని
అనుసరించామని మీకు తెలుసు.

19మమ్మల్ని మేము మీ ముందు సమర్థించుకోవా
లని మా పక్షాన మేము వాదిస్తున్నామని అనుకొంటు
న్నారా? లేదు. మేము దేవుని ముందు క్రీస్తులో మాట్లా
డుతున్నాము. సోదరులారా! మీ విశ్వాసాన్ని ధృఢపర
చాలని, మేము యివి చేస్తున్నాము. 20ఎందుకంటే,
మేము మీ దగ్గరకు వచ్చినప్పుడు నేను అనుకొన్నట్లు
మీరు, మీరనుకొన్నట్లు నేను ఉండమేమోనని నాకు
భయం వేస్తోంది. కలహాలు, అసూయలు, కోపాలు,
కక్షలు, వదంతులు, గుస గుసలు, అహంభావాలు, అల్లర్లు
ఉంటాయేమోనని భయపడుతున్నాము. 21నేను మీ
దగ్గరకు మళ్ళీ వచ్చినప్పుడు నా దేవుని ముందు నాకు
తలవంపులు కలుగుతాయేమోనని భయం వేస్తోంది.
గతంలో కామక్రీడలు, వ్యభిచారంలాంటి అపవిత్రమైన
పనులు చేసి ఆ పాపాలకు పశ్చాత్తాపం పొందని వాళ్ళు
చాలా మంది ఉన్నారు. అలాంటి వాళ్ళవల్ల నాకు
దుఃఖం కలుగుతుందనే భయం వేస్తోంది.

## చివరి హెచ్చరికలు

13 మూడవసారి మీ దగ్గరకు వస్తున్నాను. "ప్రతి
విషయం యిద్దరు లేక ముగ్గురు సాక్ష్యాలతో
రుజువు పరచాలి."* 2నేను రెండవ సారి వచ్చి మీతో
ఉన్నప్పుడు ఈ విషయంలో మిమ్మల్ని యిదివరకే
హెచ్చరించాను. నేను యిప్పుడు మీ సమక్షంలో లేను
కనుక మళ్ళీ చెపుతున్నాను. 3కనుక నేను ఈ సారి
వచ్చినప్పుడు ఇదివరలో పాపంచేసిన వాళ్ళను,
ఇప్పుడు పాపంచేసిన వాళ్ళను శిక్షిస్తాను. క్రీస్తు నా
ద్వారా మాట్లాడుతున్నాడన్న దానికి మీరు రుజువు
అడుగుతున్నారు. మీ పట్ల క్రీస్తు బలహీనంగా ఉండడు.
ఆయన మీ మధ్య శక్తివంతంగా ఉన్నాడు. 4బల
హీనతల్లో ఆయన సిలువ వేయబడ్డాడు. అయినా,
దైవశక్తివల్ల జీవిస్తున్నాడు. అదే విధంగా మేము ఆయ
నలో బలహీనంగా ఉన్నా, దైవశక్తి వల్ల ఆయనతో
సహా జీవించి మీ సేవ చేస్తున్నాము.

5మీరు నిజమైన 'విశ్వాసులా, కాదా' అని తెలుసు
కోవాలనుకొంటే మిమ్మల్ని మీరు పరిశోధించుకోవాలి.
మీలో యేసు క్రీస్తు ఉన్నట్లు అనిపించటం లేదా?
మీరు ఈ పరీక్షల్లో ఓడిపోతే క్రీస్తు మీలో ఉండడు.
6మేము ఈ పరీక్షల్లో విజయం సాధించిన విషయం
మీరు గ్రహిస్తారని నమ్ముతున్నాను.

7మీరు ఏ తప్పూ చేయకుండా ఉండాలని మేమే
దేవుణ్ణి ప్రార్థిస్తాము. మేము పరీక్షల్లో నెగ్గినట్లు ప్రజలు
గమనించాలని కాదు కాని, మేము పరీక్షల్లో నెగ్గినట్లు
కనపడకపోయినా మీరు మంచి చెయ్యాలని దేవుణ్ణి
ప్రార్థిస్తాము. 8మేము సత్యానికి విరుద్దంగా ఏదీ చెయ్య
లేము. అన్నీ సత్యంకొరకే చేస్తాము. 9మీరు బలంగా
ఉంటే, మేము బలహీనంగా ఉంటానికి సంతోషిస్తాం.
మీలో పరిపూర్ణమైన శక్తి కలగాలని మేము
ప్రార్థిస్తున్నాము.

10అందువల్లే నేను మీ సమక్షంలో లేనప్పుడు యివి
వ్రాస్తున్నాను. అలా చేస్తే నేను వచ్చినప్పుడు నా
అధికారం ఉపయోగించటంలో కాఠిన్యత చూప
నవసరం ఉండదు. ఈ అధికారం ప్రభువు మీ విశ్వాసాన్ని
వృద్ధిపరచటానికి యిచ్చాడు, కాని నాశనం చేయటానికి
కాదు.

11తుదకు, సోదరులారా! పరిపూర్ణులుగా ఉండటా
నికి ప్రయత్నించండి. నేను చెప్పేవాటిని చెయ్యండి.
ఒకరితో ఒకరు సహకరిస్తూ జీవించండి. ప్రేమను, శాంతి
నిచ్చే దేవుడు మీతో ఉంటాడు. 12పవిత్రమైన ముద్దుతో
పరస్పరం శుభాకాంక్షలు చెప్పుకోండి. 13ఇక్కడున్న
విశ్వాసులందరు తమ శుభాకాంక్షలు తెలుపమన్నారు.

14యేసు క్రీస్తు ప్రభువు యొక్క అనుగ్రహం, దేవుని
ప్రేమ, పరిశుద్ధాత్మ యొక్క సహవాసము మీ అందరితో
ఉండుగాక!

---

**ప్రతి … పరచాలి** ద్వితీ. 19:15.

# గలతీయులకు వ్రాసిన లేఖ

1 మనుష్యుని నుండియైనను, మనుష్యుని ద్వారానై
నను కాక, యేసుక్రీస్తు ద్వారాను, ఆయనను మరణ
ములో నుండి లేపిన తండ్రియైన దేవుని ద్వారాను
అపొస్తలుడైన పౌలు నుండియు,
2మరియు నాతో ఉన్న యితర సోదరుల
నుండియు, గలతీయలో ఉన్న సంఘాలకు:
3మన తండ్రియైన దేవుడు, యేసు క్రీస్తు ప్రభువు
మిమ్మల్ని కనికరించి మీకు శాంతి ప్రసాదించుగాక!
4ప్రస్తుతం మనము అనుభవిస్తున్న చెడుకాలం నుండి
రక్షించటానికి మన పాపాలకోసం క్రీస్తు బలి అయ్యాడు.
తద్వారా మన తండ్రియైన దేవుని యిచ్ఛను పూర్తి
చేసాడు. 5దేవునికి మహిమ చిరకాలం ఉండుగాక!
ఆమేన్.

### ఒకే ఒక సువార్త

6తనలో దయవుండటం వల్ల దేవుడు మిమ్మల్ని
పిలిచాడు. మీరు ఆయన్ని యింతత్వరలో వదిలివే
యటం, మరొక సువార్తవైపు మళ్ళటం నాకు ఆశ్చర్యం
కలిగిస్తుంది. 7నిజానికి మేము మీకు ప్రకటించిన సువార్త
కాక వేరొక సువార్త లేనేలేదు. కొందరు మిమ్మల్ని
కలవరపెట్టటానికి క్రీస్తు సువార్తను మార్చటానికి ప్రయ
త్నంచేస్తున్నారు. 8నేను గాని, లేక పరలోకం నుండి
వచ్చిన దేవదూత గాని మేము ప్రకటించిన సువార్త
గాక మరొక సువార్తను ప్రకటిస్తున్నట్లయితే అలాంటి
వాడు నిత్యనాశనానికి గురియగు గాక.
9మేము యిదివరకు చెప్పినదాన్ని యిప్పుడు నేను
మళ్ళీ చెపుతున్నాను. మీరు అంగీకరించిన సువార్త
గాక వేరొక సువార్తను ఎవడైనా మీకు భోధిస్తున్నట్ల
యితే వాడు నిరంతరము శాపగ్రస్తుడవును గాక! 10నేని
ప్పుడు మానవుని మెప్పు పొందటానికి ప్రయత్ని
స్తున్నానా లేక దేవుని మెప్పునా? మానవుణ్ణి నేను
సంతోషపెట్టాలని చూస్తున్నానా? నేను ఇంకా మాన
వుణ్ణి సంతోషపెట్టాలని చూస్తున్నట్లయితే క్రీస్తు
సేవకుణ్ణి కాదు.

### దేవుని పిలుపు

11సోదరులారా! నేను ప్రకటించిన సువార్త మాన
వుడు కల్పించింది కాదు. అది మీరు గమనించాలి.
12నేనా సువార్తను మానవుని ద్వారా పొందలేదు. దాన్ని
నాకెవరూ బోధించనూలేదు. దాన్ని నాకు యేసుక్రీస్తు
తెలియచేసాడు. 13నేను యూదునిగా ఎట్లా జీవించానో
మీరు విన్నారు. నేను దేవుని సంఘాన్ని అపరిమితంగా
హింసించిన విషయం మీకు తెలుసు. దాన్ని ఏ విధంగా
నాశనం చెయ్యాలని చూసానో మీకు తెలుసు. 14నేను
యూదునిగా నా వయస్సులో ఉన్న వాళ్ళందరి కన్నా
చురుకైనవాడను. నా పూర్వీకుల సాంప్రదాయాల విష
యంలో నాకు చాలా పట్టుదల ఉంది.
15కాని దేవుడు తన దయతో నేను పుట్టినప్పుడే
నన్ను ప్రత్యేకంగా ఉంచాడు. నన్ను పిలిచి తన కుమా
రుణ్ణి తెలియ చెయ్యటానికి నిశ్చయించుకొన్నాడు.
16నేను యూదులుకానివాళ్ళకు తన కుమారుని
గూర్చిన సువార్తను బోధించాలని ఆయన ఉద్దేశ్యం.
నేనీ విషయంలో మరొకవ్యక్తిని సంప్రదించ లేదు.
17నాకన్నా ముందునుండి అపొస్తలులుగా ఉన్న వాళ్ళను
చూడటానికి నేను యెరూషలేము కూడా వెళ్ళలేదు.
దానికి మారుగా నేను వెంటనే అరేబియా దేశానికి
వెళ్ళి ఆ తర్వాత డెమాస్కసుకు తిరిగి వచ్చాను.
18మూడు సంవత్సరాలు గడిచాక పేతురును పరిచయం
చేసుకోవటానికి యెరూషలేము వెళ్ళాను. అతనితో
పదిహేను రోజులు గడిపాను. 19ఆ సమయంలో
ప్రభువు సోదరుడైన యాకోబు తప్ప మిగతా అపొస్తలు
లెవరూ నాకు కనిపించలేదు. 20నేను అబద్ధం వ్రాయ
టంలేదని దేవునిపై ప్రమాణం చేసి చెపుతున్నాను.
21ఆ తర్వాత నేను సిరియ, కిలికియ దేశాలకు
వెళ్ళాను.22యూదయ ప్రాంతంలోని క్రీస్తు సంఘాలు
నన్ను ప్రత్యక్షంగా ఎప్పుడూ చూడలేదు. 23“ఇదివరలో
మన వాళ్ళను హింసించిన వ్యక్తి యిప్పుడు సువార్త
ప్రకటిస్తున్నాడు. ఒకప్పుడు అతడు సువార్తను నాశనం
చెయ్యాలని చూసాడు” అని యితర్లు అనగా వాళ్ళు
విన్నారు. మరియు 24నా గురించి వాళ్ళు దేవుణ్ణి
స్తుతించారు.

### అపొస్తలులు పౌలును అంగీకరించటం

2 పద్నాలుగు సంవత్సరాల తర్వాత బర్నబాతో
కలిసి నేను మళ్ళీ యెరూషలేము వెళ్ళాను. తీతు
కూడా నా వెంట ఉన్నాడు. 2దేవుడు ఆదేశించటం

వల్ల నేను అక్కడికి వెళ్ళాను. యూదులుకాని వాళ్ళకు
నేను ప్రకటిస్తున్న సువార్తను రహస్యంగా ముందు
అక్కడి నాయకులకు చెప్పాను. నేను ప్రస్తుతం
చేస్తున్న సేవ, యిది వరకు చేసిన సేవ వ్యర్థంకా
కూడదని నా అభిప్రాయం. 3నా వెంటనున్న తీతు
గ్రీకు దేశస్థుడైనా సున్నతి చేయించుకోమని వాళ్ళు
బలవంతం చెయ్యలేదు.
4మాలో కొందరు దొంగసోదరులు చేరారు.
వాళ్ళలో కొందరు తీతు సున్నతి పొందాలని బల
వంతం చేసినా నేను ఒప్పుకోలేదు. వీళ్ళు గూఢచారు
లుగా సంఘంలో మేము యేసుక్రీస్తులో విశ్వాసుల
ముగా అనుభవిస్తున్న స్వాతంత్ర్యాన్ని పరిశీలించాలని
వచ్చారు. మమ్మల్ని మళ్ళీ బానిసలుగా చెయ్యాలని
వాళ్ళ ఉద్దేశ్యం. 5సువార్తలో ఉన్న సత్యం మీకు లభిం
చాలని మేము వాళ్ళకు కొంచెం కూడా లొంగలేదు.
6సంఘంలో ముఖ్యమైన వాళ్ళలా కనిపించే వాళ్ళు,
వాళ్ళ అంతస్థు ఏదైనా సరే నేను లెక్కచెయ్యను.
అంతేకాక అంతస్థును బట్టి దేవుడు తీర్పుచెప్పడు,
నేను చెప్పిన సందేశాన్ని మార్చలేదు. 7పైగా యూదు
లకు బోధించే బాధ్యత పేతురుకు ఇవ్వబడినట్లే,
యూదులుకానివాళ్ళకు బోధించే బాధ్యత నాకివ్వబ
డిందని వాళ్ళు గమనించారు. 8పేతురు యూదులకు
అపొస్తలుడుగా చేసిన సేవలో దేవుడు సహకరించినట్లే,
అపొస్తలుడనుగా యూదులు కాని వాళ్ళ కోసం నేను
చేస్తున్న సేవలో కూడా దేవుడు నాకు సహకరించాడు.
9ముఖ్యమైన వాళ్ళని పేరు పొందిన యాకోబు, కేఫా,
యోహాను దేవుడు నాపై చూపిన అనుగ్రహాన్ని గుర్తించి
నాకు, బర్నబాకు సహాయం చెయ్యటానికి అంగీకరిం
చారు. మేము యూదులుకాని వాళ్ళదగ్గరకు వెళ్ళే
టట్లు, వాళ్ళు యూదుల దగ్గరకు వెళ్ళేటట్లు నిర్ణయిం
చుకొన్నాము. 10మేము పేదవాళ్ళకు సహాయం
చెయ్యాలని మాత్రం వాళ్ళు కోరారు. మాకును అదే
అభిలాషవుంది.

## పౌలు పేతురును విమర్శించటం

11పేతురు అంతియొకయకు వచ్చినప్పుడు అతని
తప్పు స్పష్టంగా కనిపించటంవల్ల అది నేను అతని
ముఖం ముందే చెప్పాను. 12ఇదివరలో ఏం జరిగిం
దంటే యాకోబు దగ్గరనుండి కొందరు వ్యక్తులు
పేతురు దగ్గరకు వెళ్ళారు. అప్పటి దాకా పేతురు
యూదులుకానివాళ్ళతో కలిసి తింటూవుండేవాడు.
కాని, వాళ్ళురాగానే సున్నతి గుంపుకు చెందిన వాళ్ళకు
భయపడి వాళ్ళతో కలిసి తినటం మానుకొని వాళ్ళకు
దూరంగా వెళ్ళాడు. 13మిగతా యూదులు కూడా
అతడు చేస్తున్న ఈ వంచనలో పాల్గొన్నారు. దీని
ప్రభావం వల్ల బర్నబా కూడా తప్పుదారి పట్టాడు.
14సువార్త బోధించిన విధంగా వాళ్ళు నడుచుకోవటం
లేదని నేను గ్రహించి పేతురుతో అందరి ముందు,
“నీవు యూదుడుకాని వానివలె జీవిస్తున్నావు. మరి
అలాంటప్పుడు యూదులుకాని వాళ్ళను యూదుల
సాంప్రదాయాల్ని అనుసరించుమని ఎందుకు ఒత్తిడి
చేస్తున్నావు?” అని అడిగాను.
15పుట్టుకతో మనము యూదులము. యూదులు
కాని వాళ్ళలా పాపం చేసేవాళ్ళము కాదు. 16ధర్మ
శాస్త్రాన్ని ఆచరించటం వల్ల నీతిమంతుడు కాడని,
యేసుక్రీస్తును విశ్వసించటంవల్ల మాత్రమే ఒకడు నీతి
మంతుడౌతాడని మనకు తెలుసు. ధర్మశాస్త్రం వల్ల
ఎవ్వరూ నీతిమంతులుగా కాలేరు. కనుక మనం కూడా
ధర్మశాస్త్రం వల్ల కాకుండా యేసుక్రీస్తు పట్ల మనకున్న
విశ్వాసంవల్ల నీతిమంతులం కావాలనే ఉద్దేశ్యంతో
ఆయన్ని విశ్వసించాము.
17మనము క్రీస్తు వల్ల నీతిమంతులం కావాలని
ఆయన్ని విశ్వసించామంటే దాని అర్థం మనం పాపు
లమనే కాదా! అంటే క్రీస్తు పాపానికి తోడ్పడు
తున్నాడా? ఎన్నటికీ కాదు. 18నేను వదిలివేసిన ధర్మ
శాస్త్రాన్ని నేనే మళ్ళీ బోధిస్తే నేను ఆ ధర్మశాస్త్రాన్ని
అతిక్రమించిన వాణ్ణవుతాను. 19నేను దేవుని కోసం
జీవించాలని ధర్మశాస్త్రం పట్ల మరణించాను. ధర్మ
శాస్త్రమే నన్ను చంపింది. 20నేను క్రీస్తుతో సహా సిలువ
వేయబడ్డాను కాబట్టి నేను జీవించటం లేదు. క్రీస్తు
నాలో జీవిస్తున్నాడు. ఈ దేహంలో నన్ను ప్రేమించి
నా కోసం మరణించిన దేవుని కుమారుని పట్ల నాకున్న
విశ్వాసంవల్ల నేను జీవిస్తున్నాను. 21దేవుని దయను
నేను కాదనలేను. ధర్మశాస్త్రం వల్ల ఒకడు నీతిమంతు
డుకాగలిగితే మరి క్రీస్తు ఎందుకు మరణించినట్లు?

## ధర్మశాస్త్రమా? లేక విశ్వాసమా?

3 గలతీయ ప్రజలారా! మీరు అవివేకులు. మిమ్మ
లను ఎవరు మోసగించారు? యేసుక్రీస్తు సిలువకు
వేయబడినదానిలోవున్న అర్థం మీ కళ్ళముందు
స్పష్టంగా చిత్రించాము. 2మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగ
నివ్వండి. ధర్మశాస్త్రం అనుసరించటంవల్ల మీరు పరిశు
ద్ధాత్మను పొందారా? లేక సువార్త విశ్వసించటం వల్ల
పొందారా? 3మీరింత అవివేకులా? పరిశుద్ధాత్మతో
ప్రారంభించి ఇప్పుడు మానవ ప్రయత్నంద్వారా నీతి
మంతులు కావాలని చూస్తున్నారా? 4మీరు ఇన్ని కష్టాలు
వ్యర్థంగా అనుభవిస్తున్నారా? అది నేను అంగీకరించను.
5దేవుడు పరిశుద్ధాత్మను పంపి మీకోసం మహత్కార్యాలు
చేస్తున్నది మీరు ధర్మశాస్త్రం అనుసరించినందుకా? లేక
సువార్తను విశ్వసించినందుకా?

6అబ్రాహామును పరిశీలించండి. “అతడు దేవుణ్ణి
విశ్వసించాడు. కనుక దేవుడతణ్ణి నీతిమంతునిగా పరిగ
ణించాడు”* 7కనుక విశ్వాసమున్న వాళ్ళే అబ్రాహాము
కుమారులని గ్రహించండి. 8యూదులు కానివాళ్ళను
దేవుడు వాళ్ళ విశ్వాసాన్ని బట్టి నీతిమంతులుగా నిర్ణయి
స్తాడని లేఖనాలు వ్రాసినవాళ్ళు దివ్యదృష్టితో చూసి
చెప్పారు. ఈ విషయాన్ని దేవుడు అబ్రాహా ముతో,
“అన్ని జనములవారు నీ కారణంగా ధన్యులౌతారు!”*
అని ముందే చెప్పాడు. 9కనుక అబ్రాహాము విశ్వసించి
ధన్యుడయ్యాడు. అదేవిధంగా అతనివలె విశ్వసించిన
వాళ్ళు కూడా ధన్యులౌతారు. 10ధర్మశాస్త్రంపై ఆధార
పడిన వాళ్ళందరి మీద శాపం ఉంది. “ధర్మశాస్త్ర
గ్రంథంలో వ్రాయబడిన వాటన్నిటిని అన్నివేళలా
ఆచరిస్తూ జీవించని వాడు దేవుని శాపానికి గురి
ఔతాడు”* అని వ్రాయబడి ఉంది. 11ధర్మశాస్త్రం
ద్వారా దేవుడు ఎవ్వరినీ నీతిమంతునిగా చెయ్యడని
మనకు స్పష్టంగా తెలుస్తోంది. ఎందుకంటే, “విశ్వాసం
ద్వారా నీతిమంతుడైనవాడు అనంతజీవితం పొందు
తాడు”* అని ప్రవచనంలో వ్రాయబడి ఉంది. 12ధర్మ
శాస్త్రానికి విశ్వాసం పునాదికాదు. పైగా, “ధర్మశాస్త్రం
చెప్పినట్లు అన్నీ చేసినవాడు మాత్రమే అనంతజీవితం
పొందుతాడు”* అని వ్రాయబడి ఉంది. 13“చెట్టుకు
వ్రేలాడవేయబడిన ప్రతి ఒక్కడూ శాపగ్రస్థుడు!”* అని
ధర్మశాస్త్రంలో వ్రాయబడింది. కనుక మనకు ధర్మ
శాస్త్రం యొక్క శాపంనుండి విముక్తి కలిగించాలని క్రీస్తు
ఆ శాపానికి గురి అయ్యాడు. 14దేవుడు అబ్రాహాముకు
చేసిన వాగ్దానం తనద్వారా యూదులుకాని వాళ్ళకు
కూడా లభించాలని క్రీస్తు మనకు విముక్తి కలిగించాడు.
వాగ్దానం చేయబడిన పరిశుద్ధాత్మ మనకు విశ్వాసం
ద్వారా లభించాలని ఆయన ఉద్దేశ్యం.

### ధర్మశాస్త్రము; వాగ్దానము

15సోదరులారా! ఇక మన నిత్యజీవితం నుండి ఒక
ఉదాహరణ తీసుకొంటాను. అంగీకరించిన ఒడంబడి
కను మనం రద్దుచెయ్యలేము, లేక మార్చలేము. ఈ
విషయంకూడా అలాంటిదే. 16అబ్రాహాముకు, అతని
వారసునికి దేవుడు వాగ్దానం చేసాడు.* కాని ధర్మ
శాస్త్రంలో, “వారసులకు” అని వ్రాయబడలేదు. కాని
“అనేకులు” అని అర్థం రాకుండా “ఒకనికి” అనే అర్థం
వచ్చేటట్లు వ్రాయబడి ఉంది. ఆయనే క్రీస్తు. 17నేను
చెప్పేది ఏమిటంటే నాలుగు వందల ముప్పై సంవత్స
రాల తర్వాత ప్రవేశపెట్టబడిన ధర్మశాస్త్రం గతంలో
దేవుడు చేసిన ఒడంబడికను ప్రక్కకు త్రోసి ఆయన
చేసిన వాగ్దానాన్ని రద్దు చెయ్యలేదు. 18అయితే వార
సత్వం ధర్మశాస్త్రంపై ఆధారపడిలేక అది వాగ్దానంపై
ఆధారపడి వుందన్న మాట. ఆ రీతిగా దేవుడు ఆ
వారసత్వాన్ని వాగ్దానం ద్వారా అబ్రాహాముకు
యిచ్చాడు. 19మరి అలాగైతే ధర్మశాస్త్రం ఉండటంలో
ఉద్దేశ్య మేమిటి? పాపాన్ని ఎత్తి చూపటమే దాని
ఉద్దేశ్యం. వాగ్దానం చెయ్యబడిన అబ్రాహాము వంశీ
యుడు వచ్చే వరకే దాని ఉపయోగం. దేవదూతల
ద్వారా ఒక మధ్యవర్తి చేత ధర్మశాస్త్రం మనకు అంద
జేయబడింది. 20కాని వాగ్దానం విషయంలో దేవుడు
ఒక్కడే కనుక మధ్యవర్తి అవసరం కలుగలేదు. రెండు
పక్షాలుంటే కదా మధ్యవర్తి కావాలి.

21మరి అలాగైతే ధర్మశాస్త్రం దేవుని వాగ్దానాలకు
విరుద్ధమా? ఎన్నటికీ కాదు. ధర్మశాస్త్రానికి అనంత
జీవితాన్నిచ్చే శక్తివుండిఉంటే దాని ద్వారా నీతిమం
తులం అయ్యేవాళ్ళం. 22కాని లేఖనాల్లో, ‘ప్రపంచం
పాపాల్లో చిక్కుకు పోయింది’ అని వ్రాయబడి ఉంది.
ఇలా ఎందుకైందంటే యేసుక్రీస్తు పట్ల ఉన్న విశ్వాసం
వల్ల వాగ్దానం చెయ్యబడిన వరము విశ్వాసం ఉన్న
వాళ్ళకే యివ్వబడుతుంది.

23విశ్వాసంలేక ముందు మనం ధర్మశాస్త్రం యొక్క
ఖైదీలము. విశ్వాసం మనకు బయలు పడే దాకా
మనము ఖైదీలుగా ఉన్నాము. 24మనము విశ్వాసం
ద్వారా నీతిమంతులం కావటానికి, మనల్ని క్రీస్తు దగ్గ
రకు పిలుచుకువెళ్ళటానికి ఈ ధర్మశాస్త్రం నియమింప
బడింది. 25ఇప్పుడు ఆ విశ్వాసం వచ్చింది. కనుక
ధర్మశాస్త్రానికి మనపై ఇక ఏ మాత్రం అధికారం లేదు.

### దేవుని పుత్రులు

26యేసుక్రీస్తులో మీకు విశ్వాసం వుండటంవల్ల
మీరంతా దేవుని పుత్రులయ్యారు. 27ఎందుకంటే
క్రీస్తులో బాప్తిస్మము పొందిన మీరు క్రీస్తును ధరించు
కొన్నారు. 28ఇప్పుడు యేసుక్రీస్తులో యూదుడని,
యూదుడుకానివాడని, బానిసని, యజమాని అని, ఆడ
అని, మగ అని, వ్యత్యాసం లేదు. క్రీస్తుయేసులో
మీరందరు సమానం. 29మీరు క్రీస్తుకు చెందితే అబ్రా
హాము సంతానంగా పరిగణింపబడతారు. దేవుడు అబ్రా
హాముతో చేసిన వాగ్దానం ప్రకారం దేవుని ఆశీర్వాదా
లకు మనం వారసు లమౌతాం.

4 నేను చెప్పేదేమిటంటే వారసుడు చిన్నవానిగా
ఉన్నంత కాలం, అతడు ఆస్తికంతా వారసుడైనా

---

**అతడు ... పరిగణించాడు** ఆది. 15:6.

**అన్ని ... ధన్యులౌతారు** ఆది. 12:3; 18:8; 22:18.

**ధర్మశాస్త్ర ... గురి ఔతాడు** ద్వితీ. 27:26.

**విశ్వాసం ... పొందుతాడు** హబక్కూకు 2:4.

**ధర్మశాస్త్రం ... పొందుతాడు** లేవీ. 18:5.

**చెట్టుకు ... శాపగ్రస్థుడు** ద్వితీ. 21:23.

**అబ్రాహాముకు ... చేసాడు** ఆది. 12:7; 24:7.

అతనికి, బానిసకు వ్యత్యాసం లేదు. 2అతని తండ్రినియ
మించిన కాలం వచ్చేదాకా అతడు సంరక్షకుల ఆధీ
నంలో ఉండవలసిందే. 3అదేవిధంగా మనము పిల్లలంగా
ఉండినప్పుడు ప్రపంచం యొక్క నియమాలకు బాని
సలమై జీవించాము. 4కాని సరైన సమయం రాగానే
దేవుడు తన కుమారుణ్ణి పంపాడు. ఆ కుమారుడు
ఒక స్త్రీకి జన్మించాడు. ఆయన కూడా ధర్మశాస్త్రం
క్రింద జన్మించాడు. 5మనము దేవుని సంతానం కావా
లని ఆయన మనలను ధర్మశాస్త్ర బంధం నుండి విముక్తి
కలిగించాడు.

6మీరు దేవుని కుమారులు గనుక దేవుడు తన
కుమారుని ఆత్మను మీ హృదయాల్లోకి పంపాడు. ఆ
ఆత్మ “అబ్బా!* తండ్రీ!” అని తన తండ్రిని పిలుస్తూ
ఉంటాడు. 7కనుక మీరు బానిసలుకారు. మీరు దేవుని
సంతానం. కనుక దేవుడు మిమ్మల్ని కూడా తనకు
వారసులను చేసుకొన్నాడు.

## గలతీయులపట్ల పౌలు శ్రద్ధ

8ఇదివరలో మీకు నిజమైన దేవుణ్ణి గురించి తెలి
యదు. కనుక మీరు వట్టి దేవుళ్ళకు బానిసలై జీవిం
చారు. 9కాని యిప్పుడు మీకు దేవుడెవరో తెలుసు.
లేక దేవుడు మిమ్మల్ని తెలుసుకొన్నాడు; అలాంట
ప్పుడు బానిసలుకావటానికి నిస్సారమైన నిరర్థకమైన ఆ
శక్తులవైపు మళ్ళీ ఎందుకు వెళ్తున్నారు? 10మీరు ప్రత్యే
కమైన దినాలను, నెలలను, ఋతువులను, సంవత్సరా
లను యింకా పాటిస్తున్నారు. 11మిమ్మల్ని చూస్తే
నాకు దిగులు వేస్తోంది. మీకోసం వ్యర్థంగా శ్రమపడ్డానే
మోనని అనిపిస్తోంది.

12సోదరులారా! నేను మీలా అయ్యాను. కనుక
మీరు నాలా కావాలని విన్నవించుకుంటున్నాను. మీరు
నా పట్ల ఏ అపరాధమూ చెయ్యలేదు. 13నాకు అనారో
గ్యంగా ఉండటం వల్ల నేను మీ దగ్గరకు వచ్చాను.
తద్వారా మీకు మొదట సువార్త ప్రకటించే అవకాశం
నాకు కలిగింది. 14నా అనారోగ్యం మీకు కష్టం కలిగిం
చినా మీరు నన్ను తిరస్కరించలేదు. విసుక్కోలేదు.
దానికి మారుగా నేనొక దేవదూత నైనట్లు, నేను
యేసు క్రీస్తునైనట్లు నాకు స్వాగతం చెప్పారు. 15మీ
ఆనందం ఏమైంది? మీరు నా సహాయంకోసం మీ
కళ్ళుకూడా పీకి నాకిచ్చి ఉండేవాళ్ళు. ఇది నేను ఖచ్చి
తంగా చెప్పగలను. 16నిజం చెప్పటం వల్ల యిప్పుడు
నేను మీ శత్రువునయ్యానా?

17వాళ్ళు మిమ్మల్ని లోబరుచుకోవాలని గట్టిగా
ప్రయత్నిస్తున్నారు. దానివల్ల మీకు మంచి కలుగదు.
మానుండి మిమ్మల్ని వేరుచెయ్యాలని వాళ్ళ
ప్రయత్నం. మీరు వాళ్ళను మాత్రమే అనుసరించాలని
వాళ్ళ ఉద్దేశ్యం. 18ఉద్దేశ్యం మంచిదైతే పట్టుదలతో
ఉండటం మంచిదే. కనుక నేను మీతో ఉన్నప్పుడు
మాత్రమే కాకుండా ఎప్పుడూ అదేవిధంగా ఉండండి.
19నా ప్రియమైన బిడ్డలారా! క్రీస్తులో మీరు మరలా
రూపం దాల్చే వరకూ నేను మీకోసం మళ్ళీ ఈ ప్రస
వవేదనపడుతూ ఉండవలసిందే. 20మీ విషయంలో నాకు
చాలా దిగులుగా ఉంది. కనుక మీతో ప్రత్యక్షంగా మాట్లా
డాలని, మరొక విధంగా మీకు చెప్పాలని ఉంది.

## హాగరు మరియు శారా

21ధర్మశాస్త్రం చెప్పినట్లు నడుచుకోవాలని అను
కొన్న మీకు ధర్మశాస్త్రం ఏమి చెపుతుందో తెలియదా?
22అబ్రాహాముకు ఇద్దరు పుత్రులని, ఒకడు బానిసస్త్రీకి
జన్మించాడని, మరొకడు స్వంతస్త్రీకి జన్మించాడని
ధర్మశాస్త్రంలో వ్రాయబడివుంది. 23బానిస స్త్రీ వల్ల
అతనికి జన్మించిన కుమారుడు ప్రకృతి సిద్ధంగా జన్మిం
చాడు. కాని స్వంత స్త్రీకి జన్మించిన వాడు వాగ్దానం
వల్ల జన్మించాడు.

24ఈ వృత్తాంతం అలంకారికంగా చెప్పబడింది. ఆ
యిరువురు స్త్రీలు రెండు ఒడంబడికలతో పోల్చ
బడ్డారు. సీనాయి పర్వతం మీద నుండి ఒక ఒడంబడిక
వచ్చింది. దీనివల్ల జన్మించినవాళ్ళు బానిసలు కావాలని
ఉంది. ‘హాగరు’ను ఆ మొదటి ఒడంబడికతో పోల్చ
వచ్చును. 25అరేబియాలో ఉన్న సీనాయి పర్వతంతో
కూడా ‘హాగరు’ను పోల్చవచ్చు. ఆమెను ప్రస్తుతం
యెరూషలేముతో పోల్చవచ్చు. ఎందుకంటే ఆ పట్టణ
పు ప్రజలు కూడా ఆమె సంతానంలా బానిసలు. 26కాని
పరలోకంలో ఉన్న యెరూషలేము స్వతంత్రమైంది.
అది మన తల్లి. 27దీన్ని గురించి ప్రవచనాల్లో ఈ
విధంగా వ్రాయబడి ఉంది:

> “ఓ! గొడ్రాలా! పిల్లల్ని కనని దానా! ఆనం
> దించు, పురిటి నొప్పులు పడని దానా!
> గట్టిగా కేకలువేయి! ఎందుకనగా భర్తవున్న
> స్త్రీకన్నా భర్తలేని స్త్రీకి పిల్లలు ఎక్కువ.”
> యెషయా *54:1*

28కనుక సోదరులారా! మీరు ఇస్సాకు వలే వాగ్దానపు
పిల్లలుగా జన్మించలేదు. 29ఆనాడు ప్రకృతి సిద్ధంగా
జన్మించిన కుమారుడు పరిశుద్ధాత్మ శక్తి ద్వారా జన్మిం
చిన కుమారుణ్ణి హింసించాడు. ఈనాడు కూడా అదే
జరుగుతోంది. 30కాని ధర్మశాస్త్రం ఏమి చెపుతున్నది?
“బానిస స్త్రీ కుమారుడు, స్వంత స్త్రీకి జన్మించిన
కుమారునితో ఆస్తిపంచుకోలేడు. కనుక ఆ బానిస

---

**అబ్బా** ఇది అరామికు పదము. దీని అర్థం “తండ్రి” లేక “నాన్న.”

స్త్రీని, ఆమె కుమారుణ్ణి బయటికి తరిమి వేయండి”*
అని వ్రాయబడి ఉంది. 31సోదరులారా! మనము స్వంత
స్త్రీకి జన్మించిన బిడ్డలం. బానిస స్త్రీకి జన్మించిన బిడ్డలం
కాము.

### క్రీస్తు వల్లనే స్వేచ్ఛ

5 మనము స్వతంత్రంగా ఉండాలని క్రీస్తు మనకు
స్వేచ్ఛకలిగించాడు. కనుక పట్టుదలతో ఉండండి.
‘ధర్మశాస్త్రం’ అనే బానిసత్వంలోనికి పోకుండా జాగ్రత్త
పడండి. 2నా మాట వినండి. మీరు సున్నతి చేయించు
కోవటానికి అంగీకరిస్తే క్రీస్తువల్ల మీకు ఏమాత్రమూ
ప్రయోజనంలేదని పౌలను నేను చెపుతున్నాను.
3సున్నతి చేయించుకోవటానికి అంగీకరించినవాడు
ధర్మశాస్త్రాన్నంతా పాటించవలసి వస్తుందని నేను మళ్ళీ
ప్రతీ ఒక్కరికి ఖచ్చితంగా చెపుతున్నాను.
4ధర్మశాస్త్రంద్వారా నీతిమంతులుగా కావాలనుకొం
టున్న మీరు స్వయంగా క్రీస్తులోనుండి విడిపోయారు.
తద్వారా దైవానుగ్రహాన్ని పోగొట్టుకొన్నారు. 5కాని,
మనము పరిశుద్ధాత్మ ద్వారా ఆశిస్తున్న నీతి, విశ్వాసం
ద్వారా లభిస్తుందని సంపూర్ణంగా విశ్వసించి దానికోసం
నిరీక్షిస్తున్నాము. 6ఎందుకంటే యేసుక్రీస్తు దృష్టిలో
సున్నతికి విలువ లేదు. సున్నతి చేసుకొన్నా, చేసుకోక
పోయినా ఒకటే. ప్రేమద్వారా వ్యక్తమయ్యే విశ్వాసానికి
మాత్రమే విలువ ఉంటుంది. 7మీరు పందెంలో బాగా
పరిగెత్తుచుండిరి. ఈ సత్యాన్ని అనుసరించకుండా
మిమ్మల్ని ఎవరు ఆటంకపరిచారు? 8మిమ్మల్ని పిలి
చిన వాడు ఆటంక పరచలేదు. 9“పులుపు కొంచెమైనా,
పిండినంతా పులిసేటట్లు చేస్తుంది” అని మనకు
తెలుసు. 10మీరు మరో విధంగా ఆలోచించరని ప్రభువు
నందు నాకు సంపూర్ణమైన నమ్మకం ఉంది. మీ దృఢ
విశ్వాసాన్ని కదిలిస్తున్నవాడు, ఎవడైనాసరే వాడు తప్పక
శిక్షననుభవిస్తాడు.
11నా సోదరులారా సున్నతి చేయించుకోవాలని
నేనింకా బోధిస్తున్నట్లైతే, నన్ను వాళ్ళెందుకు ఇంకా
హింసిస్తున్నారు? నేను ఆ విధంగా ఉపదేశిస్తున్నట్ల
యితే నేను సిలువనుగురించి బోధించినా ఎవరికీ
అభ్యంతరం ఉండేది కాదు. 12మిమ్మల్ని కలవర పెట్టే
వాళ్ళు పూర్తిగా అంగచ్ఛేదన జరిగించుకోవటం మంచిది.

### పరిశుద్ధాత్మ చూపిన జీవిత మార్గము

13నా సోదరులారా! మీరు స్వేచ్ఛగా జీవించాలని
దేవుడు మిమ్మల్ని పిలిచాడు. మీరీ స్వేచ్ఛను మీ
శారీరిక వాంఛలు తీర్చుకోవటానికి ఉపయోగించకండి.
దానికి మారుగా ప్రేమతో పరస్పరం సహాయం చేసు
కొంటూ ఉండండి. 14“నిన్ను నీవు ప్రేమించు కొన్నం
తగా నీ పొరుగు వాణ్ణి ప్రేమించు”* అన్న ఒకే నియ
మంలో ధర్మశాస్త్రమంతా యిమిడి ఉంది. 15మీరీవిధంగా
కలహములాడుకొంటూ హింసించు కొంటూ ఉంటే
మిమ్మల్ని మీరు నాశనం చేసుకొంటారు. అలా జరగక
ముందే జాగ్రత్త పడండి.
16కనుక పరిశుద్ధాత్మశక్తి ద్వారా జీవించండి.
అప్పుడు మీ మానవ స్వభావంవల్ల కలిగే వాంఛల్ని
తీర్చుకోకుండా ఉండగలరు. 17ఎందుకంటే మానవ
స్వభావము పరిశుద్ధాత్మ కోరుకొంటున్న దానికి విరు
ద్ధంగా ఉంటుంది. పరిశుద్ధాత్మ కోరేది మన స్వభావం
కోరేదానికి విరుద్ధంగా ఉంటుంది. ఇవి ఒకదానికొకటి
విరుద్ధంగా ఉంటాయి. తద్వారా మీరు చెయ్యాలను
కుంటున్న దాన్ని చెయ్యలేకపోతున్నారు. 18కాని పరి
శుద్ధాత్మ చూపిన మార్గాన్ని అనుసరిస్తే ధర్మశాస్త్రం
మిమ్మల్ని బంధించదు.
19మానవ స్వభావం యొక్క పనులు మనకు బాగా
తెలుసు. అవేవనగా-వ్యభిచారము, అపవిత్రత, కామము,
20విగ్రహారాధన,మంత్రతంత్రాలు,ద్వేషము, కలహము,
ఈర్ష్య, కోపము, స్వార్థము, విరోధము, చీలికలు,
21అసూయ, త్రాగుబోతు తనము, కామకేళీలు మొదల
గునవి. వీటిని గురించి నేనిదివరకే వారించాను. మళ్ళీ
వారిస్తున్నాను. ఈ విధంగా జీవించేవాళ్ళు దేవుని రాజ్యా
నికి వారసులు కాలేరు. 22కాని పరిశుద్ధాత్మ వల్ల కలిగే
ఫలాలు, ప్రేమ, ఆనందం, శాంతం, సహనం, దయ,
మంచితనం, విశ్వాసం, 23వినయం, ఆత్మ నిగ్రహం.
వీటికి విరుద్ధంగా ఏ చట్టమూ లేదు. 24యేసుక్రీస్తుకు
చెందినవాళ్ళు తమ శరీరాన్ని, దానికి చెందిన మోహా
లను, కోరికలను సిలువకు వేసి చంపారు. 25మనము
పరిశుద్ధాత్మ వలన జీవిస్తున్నాము. కనుక ఆయన ప్రకా
రము నడుచుకొందాము. 26ఒకరికొకర్ని రేపకుండా,
ద్వేషించకుండా, గర్వించకుండా ఉందాం.

### అందరికీ మంచి చెయ్యండి.

6 నా సోదరులారా! మీలో ఎవరైనా పాపం చేస్తే,
మీలో ఆత్మీయంగా జీవిస్తున్న వాళ్ళు అతన్ని
సరిదిద్దాలి. ఇది వినయంగా చెయ్యాలి. కాని మీరు
స్వతహాగా ఆ పాపంలో చిక్కుకుపోకుండా జాగ్రత్త
పడండి. 2పరస్పరం కష్టాలు పంచుకోండి. అప్పుడే
క్రీస్తు ఆజ్ఞను పాటించినవాళ్ళౌతారు. 3తనలో ఏ
గొప్పతనమూ లేనివాడు, తాను గొప్ప అని అనుకొంటే
తనను తాను మోసం చేసుకొన్న వాడౌతాడు. 4ప్రతి
ఒక్కడూ తన నడవడికను స్వయంగా పరీక్షించుకోవాలి.
అప్పుడు తాను మరొకరితో పోల్చుకోకుండా తన
నడతను గురించి గర్వించవచ్చు. 5ప్రతి ఒక్కడూ తన
కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

---

**బానిస … వేయండి** ఆది. 21:10.

**నిన్ను … ప్రేమించు** లేవీ. 19:18.

6దేవుణ్ణి గురించి బోధన పొందినవాడు, బోధించిన
వానికి అన్నివిధాల సహాయం చెయ్యాలి.
7మోసపోకండి, ప్రతి ఒక్కడూ తాను నాటిన చెట్టు
ఫలాన్నే పొందుతాడు. ఈ విషయంలో దేవుణ్ణి మోసం
చెయ్యలేము. 8శారీరికవాంఛలు అనే పొలంలో విత్తనం
నాటితే మరణాన్ని ఫలంగా పొందుతాడు. పరిశుద్ధా
త్మను మెప్పించే విధంగా నాటితే పరిశుద్ధాత్మ నుండి
అనంతజీవితం అనే ఫలం పొందుతాడు. 9కనుక మనం
విశ్రాంతి తీసుకోకుండా మంచి చేద్దాం. మనము విడువ
కుండా మంచి చేస్తే సరియైన సమయానికి మంచి
అనే పంటకోయ గలుగుతాము. 10మనకు మంచి చేసే
అవకాశం ఉంది కనుక అందరికీ మంచి చేద్దాం.
ముఖ్యంగా విశ్వాసులకు మంచి చేద్దాం.

### చివరి మాట

11ఇది మీకు నేను నా స్వహస్తాలతో వ్రాసాను.
మీరు గమనించాలని అక్షరాలు ఎంత పెద్దగా వ్రాసానో
చూడండి. 12నలుగురిలో మంచి పేరు పొందాలను
కొన్నవాళ్ళు సున్నతి చేయించుకోమని మిమ్మల్ని
ఒత్తిడి చేస్తున్నారు. వాళ్ళీవిధంగా చెయ్యటానికి ఒకే
ఒక కారణం ఉంది. అది క్రీస్తు సిలువనుగురించి
బోధించటంవల్ల కలిగే హింసనుండి తప్పించుకోవాలని
వాళ్ళ ఉద్దేశ్యం.
13సున్నతి చేసుకొన్నవాళ్ళుకూడా ధర్మశాస్త్రాన్ని
ఆచరించరు. కాని శారీరకంగా వాళ్ళు గర్వించటానికి
మిమ్మల్ని సున్నతి చేయించు కోమంటున్నారు.
14యేసుక్రీస్తు ప్రభువు యొక్క సిలువయందు
తప్ప మరి దేనియందును అతిశయించను. ఎందు
కనగా క్రీస్తు సిలువ ద్వారా లోకానికి నేను, నాకు
లోకం చచ్చియున్నాము. 15సున్నతి చేయించుకొన్నా
చేయించుకోకపోయినా ఒకటే. క్రొత్త జీవితం
పొందటం ముఖ్యం.
16ఈ నియమాల్ని పాటించే వాళ్ళందరికీ, దేవుని
ఇశ్రాయేలు ప్రజలకు శాంతి, అనుగ్రహం లభించును
గాక.
17చివరకు, నా దేహంపై యేసును గురించి పొందిన
గుర్తులు ఉన్నాయి. కనుక నా కెవ్వరూ ఆటంకం కలి
గించకుండా ఉండండి.
18సోదరులారా! యేసుక్రీస్తు ప్రభువు యొక్క అను
గ్రహము మీ ఆత్మకు తోడై ఉండుగాక! ఆమేన్.

# ఎఫెసీయులకు వ్రాసిన లేఖ

1 దైవేచ్ఛవల్ల యేసు క్రీస్తు అపొస్తలుడు అయిన
పౌలు నుండి యేసు క్రీస్తును విశ్వసించే ఎఫెసు
లోని* పవిత్రులకు:
2మన ప్రభువైన యేసు క్రీస్తు, మన తండ్రియైన
దేవుడు మీకు అనుగ్రహం, శాంతి ప్రసాదించు గాక!

### క్రీస్తులో ఆత్మీయ దీవెనలు

3మన యేసు క్రీస్తు ప్రభువుకు తండ్రి అయినటు
వంటి దేవునికి స్తుతి కలుగుగాక! దేవుడు పరలోకానికి
చెందిన మనకు ఆత్మీయతకు కావలసిన వన్నీ మనలో
క్రీస్తు ద్వారా సమకూర్చి మనల్ని దీవించాడు. 4మనము
తన దృష్టియందు పవిత్రంగా ఏ తప్పూ చెయ్యకుండా
ఉండాలని ప్రపంచాన్ని సృష్టించక ముందే క్రీస్తులో
మనల్ని తన ప్రేమవల్ల ఎన్నుకొన్నాడు. 5యేసు క్రీస్తు
ద్వారా మనల్ని తన కుమారులుగా ప్రేమతో దగ్గరకు
చేర్చుకోవాలని సృష్టికి ముందే నిర్ణయించాడు. ఇదే
ఆయనఉద్దేశ్యము. ఇలా చేయటమే ఆయన ఆనందం!
6కనుక ఈ అద్భుతమైన అనుగ్రహాన్ని తాను ప్రేమి
స్తున్న క్రీస్తులో ఉన్న మనకు ఉచితంగా యిచ్చిన
దేవుణ్ణి మనము స్తుతించుదాం. 7ఆయన రక్తం వల్ల
మనకు విడుదల కలిగింది. మన పాపాలు క్షమించ
బడ్డాయి. ఆయన అనుగ్రహం ఎంతో గొప్పది. 8ఆ
అనుగ్రహాన్ని దేవుడు మనపై ధారాళంగా కురిపించాడు.
ఇది బాగా ఆలోచించి దివ్యజ్ఞానంతో చేసాడు. 9ఆయన
తాను క్రీస్తు ద్వారా ఆనందముతో చెయ్యదలచిన
మర్మాన్ని తన యిచ్ఛానుసారం మనకు తెలియ
చేసాడు. 10సరియైన సమయం రాగానే తాను పూర్తి
చేయదలచిన దాన్ని పూర్తి చేస్తాడు. సృష్టినంతటిని,
అంటే భూలోకాన్ని, పరలోకాన్ని ఒకటిగా చేసి దానికి
క్రీస్తును అధిపతిగా నియమిస్తాడు.
11అన్నీ ఆయన ఉద్దేశ్యానుసారం, ఆయన నిర్ణ
యించిన విధంగా సంభవిస్తాయి. తాను సృష్టికి ముందు
నిర్ణయించిన విధంగా తన ఉద్దేశ్యం ప్రకారం మనము
క్రీస్తులో ఐక్యతపొంది ఆయన ప్రజగా ఉండేటట్లు
ఆయన మనల్ని ఎన్నుకున్నాడు. 12క్రీస్తు మనకు
రక్షణ యిస్తాడని విశ్వసించిన వాళ్ళలో మనము
మొదటివాళ్ళము. మనము ఆయన మహిమకు కీర్తి
కలిగించాలని ఆయన ఉద్దేశ్యము. ఆయన మహిమను
బట్టి ఆయనన్ను స్తుతించుదాం. 13మీరు రక్షణను
గురించి చెప్పబడిన సువార్త విన్నారు. ఆ గొప్ప సత్యం
మీకు లభించింది. కనుక మీకు కూడా క్రీస్తులో ఐక్యత
కలిగింది. ఆయన్ని మీరు విశ్వసించినప్పుడు మీపై
ముద్ర వేయబడింది. ఆ ముద్రే దేవుడు వాగ్దానం
చేసిన పరిశుద్ధాత్మ. 14తన ప్రజలందరికీ రక్షణ కలిగే
వరకు వారసత్వానికి హామీగా ఆయన పరిశుద్ధాత్మను
మనదగ్గర ఉంచాడు. ఇది ఆయన మహిమ కోసం
జరిగింది.

### పౌలు యొక్క ప్రార్థన

15ఈ కారణాన నేను మీకు యేసు ప్రభువుపట్ల
ఉన్న విశ్వాసాన్ని గురించి, విశ్వాసులపట్ల మీకున్న
ప్రేమను గురించి విన్నప్పటినుండి 16దేవునికి కృతజ్ఞ
తలు చెప్పటం మానలేదు. ప్రార్థించినప్పుడు మిమ్మల్ని
తలుచుకోవటం మానలేదు. 17నేను ఎల్లప్పుడు మన
క్రీస్తు ప్రభువు యొక్క దేవుడు అయిన ఆ మహిమగల
తండ్రి మీకు పరిశుద్ధాత్మను యివ్వాలని ప్రార్థిస్తు
న్నాను. ఆ పరిశుద్ధాత్మ మీకు జ్ఞానాన్నిచ్చి, దేవుణ్ణి
తెలియజేయాలని నా అభిలాష. అప్పుడు మీరు దేవుణ్ణి
యింకా ఎక్కువగా తెలుసుకోగలుగుతారు. 18మీ మనో
నేత్రాలు తెరుచుకోవాలని, మీరు ఆశిస్తున్న వార
సత్వాన్ని గురించి తెలుసుకోవాలని నా ప్రార్థన. ఆ
వారసత్వం మీకివ్వటానికి ఆయన మిమ్మల్ని పిలిచాడు.
అప్పుడు ఆయన తన విశ్వాసులకు వాగ్దానం చేసిన
ఆశీస్సులు ఎంత అద్భుతమైనవో మీరు చూడగలుగు
తారు. 19క్రీస్తును విశ్వసించే మనలో పని చేస్తున్న
ఆయన శక్తి ఎంత ఉత్తమమైనదో మీరు తెలుసు
కోవాలని నా ప్రార్థన. 20ఈ శక్తి ద్వారా క్రీస్తును బ్రతి
కించి పరలోకంలో తన కుడివైపు కూర్చోబెట్టుకు
న్నాడు. 21దేవుడు క్రీస్తుకు యిచ్చిన స్థానం అన్ని
హోదాలకన్నా, అన్ని అధికారాలకన్నా, అన్ని శక్తుల
కన్నా, అన్ని రాజ్యాలకన్నా గొప్పది. అది ప్రస్తుత
మున్న బిరుదులకన్నా, భవిష్యత్తులో లభించే బిరుదుల
కన్నా గొప్పది. 22దేవుడు అన్నిటిని ఆయన పాదాల
క్రింద ఉంచి, ఆయన్ని సంఘానికి సంబంధించిన వాట

**ఎఫెసు** కొన్ని ప్రాచీన ప్రతుల్లో ఈ పదం లేదు.

న్నిటిపై అధిపతిగా నియమించాడు. 23సంఘము
ఆయన శరీరం. ఆయన అన్నిటికీ అన్ని విధాల పరి
పూర్ణత కలిగిస్తాడు. సంఘం కూడా ఆయన వల్ల పరి
పూర్ణత పొందుతుంది.

## క్రీస్తులో పునర్జీవం

2 ఇక మీ విషయమా! ఇదివరలో మీరు మీ పాపాల్లో,
అతిక్రమాల్లో మరణించారు. 2అప్పుడు మీరు
ప్రపంచాన్ని అనుసరించి జీవించారు. వాయుమండలా
ధికారిని అనుసరించే వాళ్ళు. ఆ వాయుమండలాధికారి
ఆత్మ దేవునికి అవిధేయతగా ఉన్నవాళ్ళలో ఇప్పుడూ
పని చేస్తుంది. 3నిజానికి మనం కూడా మన మానవ
స్వభావం వల్ల కలిగే వాంఛల్ని, శారీరిక వాంఛల్ని,
మన ఆలోచనలవల్ల కలిగే వాంఛల్ని తృప్తిపరుచు
కుంటున్న వాళ్ళలా జీవించాము. కాబట్టి వాళ్ళలా
మనము కూడా దేవుని కోపానికి గురి అయ్యాము.
4కాని దేవుడు కరుణామయుడు. ఆయనకు మనపై
అపారమైన ప్రేమ ఉంది. 5మనము అవిధేయత వల్ల
ఆత్మీయ మరణం పొందినా ఆయన మనల్ని క్రీస్తుతో
పాటు బ్రతికించాడు. ఆయన అనుగ్రహం మిమ్మల్ని
రక్షించింది. 6మనకు యేసు క్రీస్తులో కలిగిన ఐక్యతవల్ల
పరలోకంలో తనతో కలిసి రాజ్యం చెయ్యటానికి
మనల్ని క్రీస్తుతో పాటు బ్రతికించాడు. 7యేసు క్రీస్తు
ద్వారా తన అనుగ్రహాన్ని తెలియజేసి, తన అపారమైన
దయ మనపై చిరకాలం ఉంటుందని నిరూపించాడు.
8మీరు ఆయన అనుగ్రహంవల్ల రక్షింపబడ్డారు. మీలో
విశ్వాసం ఉండటం వల్ల మీకాఅనుగ్రహం లభించింది.
అది మీరు సంపాదించింది కాదు. దాన్ని దేవుడు మీకు
ఉచితంగా యిచ్చాడు. 9అది మీ కృషి వల్ల లభించింది
కాదు. కనుక గొప్పలు చెప్పుకోవటానికి అవకాశం
లేదు. 10దేవుడు మన సృష్టికర్త. ఆయన యేసు క్రీస్తులో
మనలను సత్కార్యాలు చేయటానికి సృష్టించాడు. ఆ
సత్కార్యాలు ఏవో ముందే నిర్ణయించాడు.

## మనము క్రీస్తులో ఒకటిగా ఉన్నాము

11మీరు యూదులుగా పుట్టలేదు. కనుక యూదులు
మిమ్మల్ని 'సున్నతి చేయించుకొని వాళ్ళు' అని
అంటారు. తాము సున్నతి పొందిన వాళ్ళైనందుకు
వాళ్ళు గర్విస్తూవుంటారు. వీళ్ళ సున్నతి శారీరక
మైనది. ఆత్మవల్ల పొందింది కాదు. ఇది మీరు జ్ఞాపకం
ఉంచుకోండి. 12అంతేకాక ఒకప్పుడు మీరు క్రీస్తుతో
కాక విడిగా ఉండేవాళ్ళు. ఇశ్రాయేలు దేశంలో మీకు
పౌరసత్వం లేదు. దేవుడు వాగ్దానం చేసిన ఒడంబడికలో
మీకు భాగం లేదు. మీరు రక్షణ లభిస్తుందన్న ఆశలే
కుండా, ఈ ప్రపంచంలో దేవుడనే వాడు లేకుండా
జీవించారు. ఇది కూడా మీరు జ్ఞాపకం ఉంచుకోండి.
13కాని ఒకప్పుడు దూరంగా ఉన్న మీరు క్రీస్తు రక్తం
వల్ల దేవునికి దగ్గర అయ్యారు. 14మనకు సంధి
కలిగించిన వ్యక్తి క్రీస్తు. ఆయన యిద్దరినీ ఒకటిగా
చేసి ద్వేషమనే అడ్డుగోడను నిర్మూలించాడు. 15ధర్మ
శాస్త్రాన్ని, అందులో చెప్పిన ఆజ్ఞల్ని, నియమాల్ని
తన ప్రాణం అర్పించి రద్దు చేసాడు. ఇద్దరినీ కలిపి
తనలో ఒక క్రొత్త మనిషిని సృష్టించి శాంతి స్థాపించాలని
ఆయన ఉద్దేశ్యం. 16ఈ విధంగా సిలువద్వారా వాళ్ళ
మధ్య ఉన్న ద్వేషాన్ని నిర్మూలించి ఒకటిగా ఉన్న ఆ
క్రొత్త మనిషికి, దేవునికి సంధి కుదర్చాలని ఆయన
ఉద్దేశ్యం. 17క్రీస్తు వచ్చి దూరంగా ఉన్న మీకు, మరియు
దగ్గరగా ఉన్న వాళ్ళకు శాంతి సువార్తను ప్రకటించాడు.
18ఆయన కారణంగా మన యిద్దరికి, తండ్రి దగ్గరకు
ఒక ఆత్మద్వారా వెళ్ళే అవకాశం కలిగింది.
19అందువల్ల మీరిక మీదట పరులు కారు. పరదేశీ
యులు కారు. పవిత్రులతో కలిసి జీవిస్తున్న తోటి
పౌరులు. దేవుని కుటుంబానికి చెందిన సభ్యులు.
20మీరు కూడా అపొస్తలులు, ప్రవక్తలు వేసిన పునాదిపై
కట్టబడ్డారు. క్రీస్తు దానికి ప్రధానమైన మూలరాయి.
21ఆయన వల్ల ఈ ఇల్లు సక్రమంగా నిర్మింపబడి అభి
వృద్ధి చెందుతుంది. అది ప్రభువు పవిత్ర దేవాలయము.
22ఆయనలో ఐక్యత పొందిన మిమ్మల్ని కూడా యిత
ర్లతో చేర్చి ఈ ఇల్లు నిర్మింపబడుతుంది. ఈ
యింటిలో దేవుని ఆత్మ నివసిస్తాడు.

## పౌలు యూదులుకాని వాళ్ళకు బోధించుట

3 అందువల్ల యూదులు కాని మీ కోసం పౌలు
అను నేను, యేసు క్రీస్తు ఖైదీని అయ్యాను.
2దేవుడు నన్ను అనుగ్రహించి మీకోసం ఈ పని నాకు
అప్పగించినట్లు మీరు తప్పకుండా వినేవుంటారు. 3ఈ
రహస్యం నాకు తెలుపబడినట్లు నేను యిదివరకే
క్లుప్తంగా మీకు వ్రాసాను. 4క్రీస్తును గురించి రహస్య
జ్ఞానం నాకు అర్థమైనట్లు నేను వ్రాసింది చదివితే
మీకు తెలుస్తుంది. 5ఈ రహస్యజ్ఞానాన్ని దేవుడు మన
పూర్వీకులకు ఇవ్వలేదు. ఇప్పుడా రహస్యజ్ఞానాన్ని
దేవుడు తన ఆత్మ ద్వారా పవిత్రులైన అపొస్తలులకు,
ప్రవక్తలకు, తెలియచేసాడు. 6ఆ రహస్యం ఏమిటంటే,
సువార్త వల్ల యూదులు కానివాళ్ళు ఇశ్రాయేలు
వాళ్ళతో సహా వారసులౌతారు. వాళ్ళు ఒకే శరీరానికి
సంబంధించిన అవయవాలు. అంతేకాక దేవుడు యేసు
క్రీస్తు ద్వారా చేసిన వాగ్దానానికి వాళ్ళు భాగస్తులు.
ఇది సువార్త వల్ల సంభవిస్తోంది.
7దేవుడు తన శక్తిని నాపై ఉపయోగించి తన
అనుగ్రహాన్ని నాకు వరంగా ప్రసాదించటం వల్ల నేను
ఈ సువార్తకు దాసుణ్ణయ్యాను. 8దేవుని ప్రజలంద
రిలో నేను అధముణ్ణి. అయినా దేవుడు నాకీవరం
ప్రసాదించాడు. క్రీస్తులో ఉన్న అనంతమైన ఐశ్వర్యాన్ని
గురించి యూదులుకాని వాళ్ళకు బోధించే అవకాశం

నాకిచ్చి నన్ను అనుగ్రహించాడు. 9అన్నిటినీ సృష్టించిన
దేవుడు తరతరాల నుండి తనలో దాచుకొన్న ఈ
రహస్య ప్రణాళికను ప్రతి ఒక్కరికీ స్పష్టం చేయుమని
నాకు అప్పగించాడు. 10వాయుమండలంలో ఉన్న పాల
కులకు, అధికారులకు సంఘంద్వారా అన్నిటిలో అతీ
తుడైన దేవుని జ్ఞానాన్ని తెలియచేయాలని ఆయన
ఉద్దేశ్యం. 11దేవుడు యిలా చెయ్యాలని కాలానికి ముందే
అనుకున్నాడు. ఆ అనుకొన్న దాన్ని ఇప్పుడు మన
యేసు క్రీస్తు ద్వారా సాధించాడు. 12క్రీస్తుతో మనకు
కలిగిన ఐక్యత వల్ల మరియు ఆయనలో మనకున్న
విశ్వాసం వల్ల మనము దేవుని సమక్షంలో ధైర్యంగా
సంపూర్ణమైన స్వేచ్ఛతో నిలబడగలుగుతున్నాము.
13మీ కోసం నేను కష్టాలు అనుభవిస్తున్నందుకు అధైర్య
పడకండి. ఇది నా విజ్ఞప్తి. నా కష్టాల వల్ల మీకు
గౌరవం లభిస్తుంది.

## ఎఫెసీయుల కోసం ప్రార్థన

14ఈ కారణాన నేను తండ్రి ముందు మోకరిల్లుచు
న్నాను. 15కనుక భూలోకంలో, పరలోకంలో ఉన్న
విశ్వాసులందరు ఆయన పేరులో ఒకే కుటుంబముగా
జీవిస్తున్నారు. 16ఆయన తన అనంతమైన మహిమతో
పరిశుద్ధాత్మ ద్వారా శక్తినిచ్చి ఆత్మీయంగా బలపరచు
మని వేడుకొంటున్నాను. 17అప్పుడు క్రీస్తు మీలో
విశ్వాసం ఉండటం వల్ల మీ హృదయాల్లో నివసిస్తాడు.
మీ వేర్లు ప్రేమలో నాటుక పోయేటట్లు చేయుమనీ
మీ పునాదులు ప్రేమలో ఉండేటట్లు చేయుమనీ ప్రార్థి
స్తున్నాను. 18అప్పుడు మీరు పవిత్రులతో సహా క్రీస్తు
ప్రేమ ఎంత అనంతమైనదో, ఎంత లోతైనదో అర్థం
చేసుకో కలుగుతారు. 19జ్ఞానాన్ని మించిన క్రీస్తు
ప్రేమను మీరు తెలుసుకోవాలని దేవునిలో ఉన్న పరి
పూర్ణత మీలో కలగాలని నా ప్రార్థన.
20దేవుడు మనమడిగిన దానికన్నా, ఊహించిన దాని
కన్నా ఎక్కువే యివ్వగలడు. ఇది మనలో పని చేస్తున్న
ఆయన శక్తిద్వారా సంభవిస్తోంది. 21సంఘంలో యేసు
క్రీస్తు ద్వారా దేవునికి చిరకాలం శాశ్వతమైన మహిమ
కలుగుగాక! ఆమేన్.

## క్రీస్తు దేహంలో ఐక్యత

4 ప్రభువు మిమ్మల్ని పిలిచిన పిలుపు సార్థకమయ్యే
టట్లు జీవించుమని ప్రభువు యొక్క ఖైదీనైన
నేను విజ్ఞప్తి చేస్తున్నాను. 2అన్ని వేళలా విధేయతగా,
శాంతంగా ఉండండి. వినయంతో, దయతో, సహ
నంతో జీవించండి. ఇతర్ల తప్పులను ప్రేమతో క్షమిం
చండి. 3శాంతి కలిగించిన బంధంతో పరిశుద్ధాత్మ
యిచ్చిన ఐక్యతను పొందటానికి అన్నివిధాలా
ప్రయత్నంచెయ్యండి. 4శరీరము ఒక్కటే, ఆత్మయు
ఒక్కటే, నిరీక్షణ ఒక్కటే, 5ఆ ఒకే నిరీక్షణయం
దుండుటకే ఆయన మనలను పిలిచాడు. అదే విధముగా
ప్రభువు ఒక్కటే విశ్వాసము ఒక్కటే, బాప్తిస్మము
ఒక్కటే. దేవుడు ఒక్కడే. 6ఆయనే అందరికి తండ్రి.
అందరికి ప్రభువు. అందరిలో ఉన్నాడు. అందరి ద్వారా
పని చేస్తున్నాడు.
7క్రీస్తు చెప్పిన విధంగా ప్రతి ఒక్కరికి కృప యివ్వ
బడింది. 8అందువల్ల లేఖనాల్లో ఇలా వ్రాయబడి ఉంది:

> “ఆయన పైకి వెళ్ళినప్పుడు బంధితుల్ని
> వరుసగా తనతో తీసుకు వెళ్ళాడు. మాన
> వులకు వరాలిచ్చాడు.”
>
> *కీర్తన 68:18*

9“ఆయన పైకి వెళ్ళాడు” అని అనటంలో అర్థమే
మిటి? ఆయన క్రిందికి, అంటే భూమి క్రింది భాగాలకు
దిగి వచ్చాడనే అర్థం కదా! 10క్రిందికి దిగి వచ్చిన
వాడే ఆకాశములను దాటి పైకి వెళ్ళాడు. ఆ విధంగా
పైకి వెళ్ళి లోకాలన్నిటిని నింపి వేసాడు. 11కొందరు
అపొస్తలులు కావాలని, కొందరు ప్రవక్తలు కావాలని,
కొందరు సువార్తికులు కావాలని, కొందరు సంఘ కాప
రులు కావాలని, మరి కొందరు బోధకులు కావాలని
ఆదేశించి వాళ్ళకు తగిన వరాలిచ్చాడు. 12పవిత్రుల్ని
సేవా కార్యాలకు సిద్ధం చేయాలనీ, దాని వల్ల క్రీస్తు
శరీరం అభివృద్ధి చెందాలని ఆయన ఉద్దేశ్యం.
13అప్పుడు మనము విశ్వాసంతో, దేవుని కుమారుణ్ణి
గురించిన జ్ఞానంలో ఒకటిగా ఉంటాము. క్రీస్తులో
ఉన్న పరిపూర్ణతను పొందేదాకా ఆత్మీయంగా అభివృద్ధి
చెందుతాము.
14అప్పుడు మనము పసిపిల్లల వలె ఉండము. అల
లకు యిటు అటు కొట్టుకొనిపోము. గాలిలాంటి ప్రతి
భోదనకు కదిలిపోము. కపటంతో, కుయుక్తితో పన్నిన
మాయోపాయాలకుమోసపోకుండా ఉంటాము.
15మనము ప్రేమతో నిజం చెబుతూ అన్ని విధాల
అభివృద్ధిచెంది శిరస్సైన క్రీస్తును చేరుకోవాలి. 16శరీ
రంలోని అన్నిభాగాలు ఆయన ఆధీనంలో ఉంటాయి.
చక్కగా అమర్చబడిన ఆ భాగాలన్నీ కలిసి శరీరానికి
ఆధారమిస్తాయి. ఇలా ప్రతీ భాగం తన పని చెయ్యు
టంవల్ల శరీరం ప్రేమతో పెరిగి అభివృద్ధి చెందుతుంది.

## వెలుగు పిల్లలుగా జీవించటం

17ప్రభువు పేరిట నేను ఈ విషయం చెప్పి వారి
స్తున్నాను. ఇక మీదట యూదులుకాని వాళ్ళవలే జీవిం
చకండి. వాళ్ళ ఆలోచనలు నిరుపయోగమైనవి.
18వాళ్ళు చీకట్లో ఉన్నారు. వాళ్ళలో ఉన్న మూర్ఖత
కారణంగా వాళ్ళ హృదయాలు కఠినంగా ఉండటం
వల్ల వాళ్ళకు దేవుడిచ్చిన జీవితంలో భాగం లభించ

లేదు. 19వాళ్ళు మంచిగా ఉండటం మానుకొన్నారు.
అంతులేని ఆశతో శారీరక సుఖాలు అనుభవిస్తూ అన్ని
రకాల అపవిత్రమైన సుఖాలకు మరిగారు. 20కాని మీరు
క్రీస్తును గురించి నేర్చుకొన్నది యిది కాదు. 21మీరు
యేసును గురించి విన్నారు. ఆయనలో ఉన్న సత్యాన్ని
ఆయన పేరిట నేర్చుకొన్నారు. 22మీ గత జీవితం
మిమ్మల్ని పాడు చేసింది. దాన్ని మరిచిపొండి. మీ
మోసపు తలంపులు మిమ్మల్ని తప్పు దారి పట్టిం
చాయి. తద్వారా మీ గత జీవితం మిమ్మల్ని నాశనం
చేసింది. 23మీ బుద్ధులు, మనస్సులు మారి మీలో
నూతనత్వం రావాలి. 24దేవుడు తన పోలికలతో సృష్టిం
చిన క్రొత్త మనిషిగా మీరు మారాలి. ఆ క్రొత్త మనిషిలో
నిజమైన నీతి, పవిత్రత ఉన్నాయి.

25మనమంతా ఒకే శరీరానికి చెందిన వాళ్ళము కనుక
అబద్ధం చెప్పటం మానుకోవాలి. సత్యమే మాట్లాడాలి.
26మీరు మీ కోపంలో పాపం చెయ్యకండి. ఒకవేళ
కోప్పడినా సూర్యాస్తమయం కాకముందే మీకోపం తగ్గి
పోవాలి. 27సాతానుకు అవకాశమివ్వకండి. 28దొంగలు
యికమీదట దొంగతనం చెయ్యరాదు. వాళ్ళు తమ
చేతుల్ని మంచి పనులు చెయ్యటానికి ఉపయోగించాలి.
అప్పుడు వాళ్ళు పేద వాళ్ళకు సహాయం చెయ్య
గలుగుతారు.

29దుర్భాషలాడకండి. ఇతర్ల అభివృద్ధికి తోడ్పడే
విధంగా, వాళ్ళకు అవసరమైన విధంగా మాట్లాడండి.
మీ మాటలు విన్న వాళ్ళకు లాభం కలగాలి. 30మీకు
విమోచన కలిగే రోజుదాకా మీలో ముద్రింపబడిన
దేవుని పరిశుద్ధాత్మను దుఃఖపరచకండి. 31మీలో ఉన్న
కక్షను, కోపాన్ని, పోట్లాడే గుణాన్ని, దూషించే
గుణాన్ని, మీ నుండి తరిమి వేయండి. మీలో ఎలాంటి
చెడుగుణం ఉండకూడదు. 32దయాదాక్షిణ్యాలు అల
వరచుకోండి. దేవుడు క్రీస్తు ద్వారా మిమ్మల్ని క్షమించి
నట్లు మీరు కూడా యితరులను క్షమించండి.

## వెలుగులో జీవించటం

5 మీరు దేవుని సంతానం. మీరు ఆయనకు ప్రియ
మైన బిడ్డలు. కనుక ఆయన వలె ఉండటానికి
ప్రయత్నించండి. 2క్రీస్తు మనల్ని ప్రేమించి పరిమళ
వాసనగా ఉండుటకు మనకోసం దేవునికి తనను తాను
ధూపంగా, బలిగా అర్పించుకొన్నాడు. మీరు ఆయనలా
మీ తోటి వాళ్ళను ప్రేమిస్తూ జీవించండి.

3కాని మీరు వ్యభిచారాన్ని గురించి గాని, అపవిత్ర
తను గురించి గాని, దురాశను గురించి గాని మాట
కూడా ఎత్తకూడదు. ఇలాంటి దుర్గుణాలు విశ్వాసుల్లో
ఉండకూడదు. 4అంతేకాక మీరు బూతు మాటలు,
అర్థంలేని మాటలు పలుకకూడదు. అసభ్యమైన పరి
హాసాలు చేయకూడదు. వీటికి మారుగా అన్నివేళలా
దేవునికి కృతజ్ఞతతో ఉండండి. 5ఒకటి మాత్రం తథ్య
మని గ్రహించండి. అవినీతి పరులు, అపవిత్రులు, అత్యా
శాపరులు, నిజానికి ఇలాంటివాళ్ళు విగ్రహారాధకులతో
సమానము, ఇలాంటివాళ్ళు దేవుడు మరియు క్రీస్తు
పాలిస్తున్న రాజ్యానికి వారసులు కాలేరు.

6వట్టిమాటలతో మిమ్మల్నెవరూ మోసం చెయ్య
కుండా జాగ్రత్తపడండి. దేవుని పట్ల అవిధేయత ఉన్న
వాళ్ళు శిక్షింపబడతారు. 7వాళ్ళు చేస్తున్న పనుల్లో
పాల్గొనకండి. 8ఒకప్పుడు మీరు చీకట్లో జీవించారు.
కాని ప్రభువులో ఐక్యత కలిగినందువల్ల ప్రస్తుతం వెలు
గులో జీవిస్తున్నారు. వెలుగు సంతానం వలే జీవించండి.
9ఎందుకంటే వెలుగునుండి మంచితనము, నీతి అనే
ఫలాలు లభిస్తాయి. 10ప్రభువుకు ఏది ఇష్టమో తెలుసు
కొని ఆ ప్రకారము వెలుగు సంబంధులవలె చేయండి.
11చీకటికి సంబంధించిన కార్యాలు చెయ్యకండి. వాటి
వల్ల ఉపయోగం లేదు. అలాంటి కార్యాలు చేస్తున్న
వాళ్ళను గురించి అందరికీ చెప్పండి. 12అవిధేయులు
రహస్యంగా చేసినవాటిని గురించి మాట్లాడటం కూడా
అవమాన కరం. 13వాటిని వెలుగులోకి తెస్తే వాటి
నిజస్వరూపం బయటపడుతుంది. 14వెలుగు అన్నీ
కనిపించేలా చేస్తుంది. అందువల్లే ఈ విధంగా వ్రాయ
బడింది:

“నిద్రిస్తున్న ఓ మనిషీ మేలుకో!
బ్రతికి లేచిరా!
క్రీస్తు నీపై ప్రకాశిస్తాడు.”

15మీరు ఏ విధంగా జీవిస్తున్నారో జాగ్రత్తగా గమనిం
చండి. బుద్ధిహీనుల్లాకాక, బుద్ధిగలవారిలా జీవించండి.
16ఇవి మంచి రోజులు కావు. కనుక వచ్చిన ప్రతీ అవ
కాశాన్ని ఉపయోగించుకోండి. 17మూర్ఖంగా ప్రవర్తించ
కండి. ప్రభువు ఆంతర్యాన్ని తెలుసుకోండి. 18మత్తు
పదార్థాలు త్రాగుతూ త్రాగుబోతుల్లా జీవించకండి.
త్రాగుబోతుతనం వ్యభిచారానికి దారితీస్తుంది. కనుక
దానికి మారుగా పరిశుద్ధాత్మతో నింపబడండి. 19స్తుతి
గీతాలతో, పాటలతో, ఆత్మీయ సంకీర్తనలతో హెచ్చ
రింపబడుతూ, ప్రభువును మీ మనస్సులలో కీర్తిస్తూ
స్తుతిగీతాలు, పాటలు పాడండి. 20మన ప్రభువైన
యేసు క్రీస్తు పేరిట తండ్రియైన దేవునికి అన్ని వేళలా
కృతజ్ఞతలు చెల్లించండి.

## భార్యాభర్తలు

21మీకు క్రీస్తుపట్ల భయ భక్తులు ఉన్నాయి. కనుక
ఒకరొకొకరు లోబడి ఉండండి.

22స్త్రీలు మీరు ప్రభువుపట్ల విశ్వాసం కనబరచండి.
అలాగే మీ భర్తలపట్ల కూడా గౌరవము కనబరుస్తూ
జీవించండి. 23క్రీస్తు సంఘానికి శిరస్సు. సంఘము
ఆయనకు శరీరంలాంటిది. ఆయన దాన్ని రక్షిస్తు

న్నాడు. అదేవిధంగా భర్త, భార్యకు శిరస్సులాంటి వాడు.
[24]సంఘం క్రీస్తుకు విధేయతగా ఉన్నట్లే భార్య తన
భర్తకు అన్ని విషయాల్లో విధేయతగా ఉండాలి.
[25]క్రీస్తు తన సంఘాన్ని ప్రేమించి దాని కోసం
తనను అర్పించుకున్నట్లే భర్త తన భార్యను ప్రేమించి
తనను అర్పించుకోవటానికి సిద్ధంగా ఉండాలి. [26]క్రీస్తు
తన సంఘాన్ని పవిత్రం చేయాలని తనను తాను
అర్పించుకున్నాడు. ఆ సంఘాన్ని దేవుని వాక్యమను
నీళ్ళతో కడిగాడు; సువార్త సందేశంతో దాన్ని శుద్ధీక
రించాడు. [27]దాన్ని తేజోవంతంగా, పవిత్రంగా మరకా
మచ్చా లేకుండా, మరే తప్పూ లేకుండా, అపకీర్తి
లేకుండా చేసేందుకు ఆ సంఘం కోసం తనకు తానే
అర్పించుకొన్నాడు. [28]అదే విధంగా భర్త తన భార్యను
తన శరీరంగా భావించి ప్రేమించాలి. తన భార్యను
ప్రేమిస్తే తనను తాను ప్రేమించు కొన్నదానితో సమా
నము. [29]సహజంగా ఎవ్వరూ తమ శరీరాన్ని ద్వేషిం
చరు. అందరూ తమ శరీరాన్ని పోషించుకొంటూ
రక్షించుకొంటారు. [30]అదే విధంగా మనము క్రీస్తు శరీ
రంలో భాగాలము. కనుక ఆయన సంఘంగా ఉన్న
మనల్ని ఆయన పోషించి రక్షిస్తాడు. [31]“ఈ కారణంగా
పురుషుడు తన తల్లి దండ్రులను వదిలి తన భార్యతో
కలిసి జీవిస్తాడు. వాళ్ళిద్దరూ ఒకే శరీరంగా జీవిస్తారు.”*
[32]ఇది గొప్ప రహస్యం. కాని నేను క్రీస్తును గురించి
ఆయన సంఘాన్ని గురించి మాట్లాడుతున్నాను. [33]ఏది
ఏమైనా ప్రతి ఒక్కడూ తనను తాను ప్రేమించు
కొన్నంతగా తన భార్యను ప్రేమించాలి. భార్య తన
భర్తను గౌరవించాలి.

### తల్లిదండ్రుల్ని గౌరవించండి

6 బిడ్డలారా! ప్రభువు ఆజ్ఞాపించిన విధంగా మీరు
మీ తల్లిదండ్రుల్ని గౌరవించండి. ఇది మంచిపని,
[2]“మీ తల్లిదండ్రుల్ని గౌరవించండి”* అన్న దేవుని
ఆజ్ఞ వాగ్దానముతో కూడినవాటిలో మొదటిది. [3]“మీకు
శుభం కలుగుతుంది. భూలోకంలో మీ ఆయువు అభి
వృద్ధిచెంది ఆనందంగా జీవిస్తారు.”*
[4]తండ్రులు తమ పిల్లలకు కోపం కలిగించరాదు.
దానికి మారుగా ప్రభువు చెప్పిన మార్గాన్ని వాళ్ళకు
బోధించి, అందులో శిక్షణనిచ్చి వాళ్ళను పెంచాలి.

### బానిసలు, యజమానులు

[5]బానిసలు తమ యజమానుల పట్ల విధేయతతో
ఉండాలి. వాళ్ళకు మనస్పూర్తిగా క్రీస్తుకు విధేయులై
నట్లు సేవ చెయ్యాలి. [6]వాళ్ళ అభిమానం సంపాదిం
చాలనే ఉద్దేశ్యంతో వాళ్ళు గమనిస్తున్నప్పుడు
మాత్రమే కాక అన్నివేళలా మీ పనులు మీరు చెయ్యాలి.
మీరు క్రీస్తు బానిసలు. కనుక మనస్పూర్తిగా దైవేచ్ఛాను
సారం చెయ్యండి. [7]సంతోషంగా సేవ చెయ్యండి.
మానవుల సేవ చేస్తున్నామని అనుకోకుండా ప్రభువు
సేవ చేస్తు న్నట్లు భావించండి. [8]ప్రభువు మనిషి చేసిన
సేవను బట్టి ప్రతిఫలం ఇస్తాడు. అతడు బానిస
అయినాసరే. లేక యజమాని అయినాసరే. ఇది మీరు
జ్ఞాపకం ఉంచు కోండి. [9]యజమానులు బానిసలపట్ల
మంచిగా ఉండాలి. యజమానులు బానిసలను భయ
పెట్టరాదు. మీ యజమాని, వాళ్ళ యజమాని పర
లోకంలో ఉన్నాడు. ఆయన పక్షపాతం చూపడు.

### దేవుడు యిచ్చిన ఆయుధాలు

[10]చివరకు చెప్పేదేమిటంటే ప్రభువుతో మీకు
లభించిన ఐక్యత మీకు అధిక బలాన్నిస్తుంది. ఆయ
నలో ఉన్న శక్తి మీకు శక్తినిస్తుంది. [11]సైతాను పన్నే
పన్నాగాలను ఎదిరించటానికి దేవుడిచ్చిన ఆయుధాల
న్నిటిని ధరించండి. [12]మనం పోట్లాడు తున్నది మాన
వులతో కాదు. చీకటిని పాలించే వాళ్ళతో, దానిపై
అధికారమున్నవాళ్ళతో, చీకటిలోని శక్తులతో, ఆకా
శంలో కనిపించని దుష్టశక్తులతో మనం పోరాడుతు
న్నాము. [13]కనుక దేవుడిచ్చిన ఆయుధాలను ధరిం
చండి. అప్పుడు ఆ దుర్దినమొచ్చి నప్పుడు మీరు
శత్రువును ఎదిరించ గలుగుతారు. చివరిదాకా పోరాడాక
కూడా మీ యుద్ధరంగంలో మీరు నిలబడగలుగుతారు.
[14]కనుక ధైర్యంగా నిలబడండి. సత్యమనేదట్టి
నడుముకు చుట్టుకొని, నీతి అనే కవచాన్ని ధరించండి.
[15]శాంతి సందేశమనే పాదరక్షల్ని ధరించి సిద్ధంగా
ఉండండి. [16]వీటితో పాటు విశ్వాసమనే డాలును
ధరించి సైతాను ప్రయోగించే అగ్నిబాణాల్ని ఆర్ప
టానికి సిద్ధంకండి. [17]రక్షణ అనే శిరస్త్రాణము, ఆత్మ
యిచ్చిన వాక్యమనే దేవుని ఖడ్గాన్ని ధరించండి. [18]ప్రార్థ
నలు, విన్నపాలు, పరిశుద్ధాత్మ ద్వారా చెయ్యండి.
అన్నివేళలా ప్రార్థించండి. మెలకువతో ఉండండి.
దేవుని ప్రజలకోసం ప్రార్థించటం మానవద్దు. వాళ్ళ
కోసం అన్ని వేళలా ప్రార్థించండి.
[19]నేను నా నోరు కదల్చినప్పుడు దేవుడు తన
వాక్యాన్ని నాకందివ్వాలని నాకోసం కూడా ప్రార్థిం
చండి. అప్పుడు నేను దైవసందేశంలో ఉన్న రహ
స్యాన్ని ధైర్యంగా చెప్పగలుగుతాను. [20]సంకెళ్ళలో
వున్న నేను ఈ సందేశం బోధించటానికి రాయబారిగా
వచ్చాను. నేను ధైర్యంగా ప్రకటించాలి కనుక ఆ ధైర్యం
నాలో కలిగేటట్లు నాకోసం ప్రార్థించండి.
[21]ప్రభువును విశ్వసిస్తున్న సేవకుడును, మన
ప్రియ సోదరుడునైన ‘తుకికు’ మీకు అన్నీ చెబుతాడు.
అతని ద్వారా మీకు నేను ఎలా ఉన్నానో, ఏమి చేస్తు

---

**ఈ కారణంగా ... శరీరంగా జీవిస్తారు** ఆది. 2:24.

**మీ తల్లి... గౌరవించండి** ద్వితీ. 5:16.

**మీకు ... జీవిస్తారు** ద్వితీ. 5:16.

న్నానో తెలుస్తుంది. 22మేము ఏవిధంగా ఉన్నామో
మీరు తెలుసుకోవాలని మరియు అతడు మీకు
ప్రోత్సాహం కలిగించాలని అతణ్ణి నేను మీ దగ్గరకు
పంపుతున్నాను. 23సోదరులందరికీ తండ్రియైన దేవుని
నుండి, యేసు క్రీస్తు ప్రభువు నుండి విశ్వాసంతో పాటు
శాంతి, ప్రేమ లభించుగాక! 24మన యేసు క్రీస్తు ప్రభు
వును ప్రేమించే వాళ్ళకు ఆయన అనుగ్రహం
ఎల్లప్పుడూ లభించుగాక!

# ఫిలిప్పీయులకు వ్రాసిన లేఖ

1 యేసు క్రీస్తు సేవకులైన పౌలు మరియు తిమో
తియు, యేసు క్రీస్తులో ఐక్యమై, ఫిలిప్పీ పట్ట
ణంలో నివసిస్తున్న పవిత్రులకు, పెద్దలకు, పరిచారకు
లకు వ్రాయునది ఏమనగా: 2మన తండ్రియైన దేవుని
నుండి, యేసు క్రీస్తు ప్రభువు నుండి మీకు అను
గ్రహము, శాంతి లభించును గాక!

### కృతజ్ఞత, ప్రార్థన

3నేను మిమ్మల్ని తలచుకొన్నప్పుడెల్లా దేవునికి
కృతజ్ఞతలు చెప్పుకొనుచున్నాను. 4కనుక మీకోసం
ప్రార్థించినప్పుడెల్లా ఆనందంతో ప్రార్థిస్తాను. 5దైవ
సందేశం ప్రచారం చెయ్యటానికి మీరు మొదటి రోజు
నుండి ఈ రోజుదాకా నాతో కలిసి పని చేసారు. 6ఈ
మంచికార్యాన్ని మీలో ప్రారంభించినవాడు అది పూర్తి
అయ్యేదాకా, అంటే యేసు క్రీస్తు వచ్చే దాకా కొనసాగి
స్తాడని నాకు నమ్మకం ఉంది.
7మీరు నా హృదయంలో ఉన్నారు. కనుక మీ
అందర్ని గురించి నేనీవిధంగా ఆలోచించటం సమంజ
సమే. ఎందుకంటే నేను సంకెళ్ళలో ఉన్నా, లేక సువా
ర్తను ప్రకటిస్తూ దానిలో ఉన్న నిజాన్ని నిరూపిస్తూ,
స్వేచ్ఛగా పర్యటన చేస్తున్నా దైవానుగ్రహాన్ని మీరు
నాతో కలిసి పంచుకొన్నారు. 8మీ పట్ల నాకున్న
ప్రేమ యేసు క్రీస్తు నుండి వచ్చిందని నేను దైవసాక్షిగా
చెపుతున్నాను.
9ఇదే నా ప్రార్థన:

మీ ప్రేమ అవధులు లేకుండా పెరగాలి,
దానితో బాటు మీకు నిజమైన జ్ఞానము,
ఆ జ్ఞానంలోని లోతులు తెలుసుకొనే శక్తి
కలగాలి.
10 అప్పుడు మీకు మంచి, చెడు విడమరిచే
శక్తి కలుగుతుంది. క్రీస్తు వచ్చే వరకు మీరు
పవిత్రంగా ఎలాంటి అపవాదులు లేకుండా
ఉండగలుగుతారు.
11 మీరు నీతిగా జీవించటం వల్ల ఫలం పొందు
తారు. ఆ ఫలం యేసుక్రీస్తు నుండి వచ్చి
మీలో నిండిపోతుంది. తద్వారా దేవునికి
కీర్తి, స్తుతి కలుగుతుంది.

### పౌలు సంకెళ్ళు, సువార్త

12సోదరులారా! నాకు జరిగిన సంఘటనలు దైవ
సందేశాన్ని ప్రచారం చేయటానికి తోడ్పడుతాయని
మీరు గమనించాలి. 13ఈ సంఘటనలు సంభవించటం
వల్ల క్రీస్తుకోసం సంకెళ్ళలో బంధింపబడ్డానని అందరికీ
తెలిసిందే. ఇది రాజభవనంలో ఉన్న రక్షకభటులకు
కూడా తెలిసిందే. 14ఈ సంకెళ్ళ మూలంగా, ప్రభువు
కారణంగా నా సోదరులైన అనేకులకు దైవసందేశం
బోధించటానికి ప్రోత్సాహం కలిగింది. వాళ్ళు ఇంకా
ఎక్కువ ధైర్యంతో భయం లేకుండా మాట్లాడగలుగు
తున్నారు.
15కొందరు నాపై అసూయవల్ల పగతో క్రీస్తును
గురించి బోధిస్తున్నారు. కాని మరి కొందరు మంచి
ఉద్దేశ్యంతో బోధిస్తున్నారు. 16వీళ్ళు, దైవసందేశాన్ని
ప్రకటించటానికి నేనిక్కడ ఉంచబడ్డానని గమనించి
ప్రేమతో భోదిస్తున్నారు. 17మొదట పేర్కొన బడ్డ
వాళ్ళు స్వార్థంతో, విశ్వాసహీనులై క్రీస్తును గురించి
బోధిస్తున్నారు. ఎందుకంటే నేనిక్కడ సంకెళ్ళలో
ఉన్నప్పుడు నాకు ఎక్కువ కష్టాలు కలిగించాలని వాళ్ళ
ఉద్దేశ్యం.
18దాని వల్ల కలిగేది ఏమీలేదు. ముఖ్యమైన విషయ
మేమిటంటే సదుద్దేశాలతో అయితేనేమిటి, దురుద్దే
శాలతో అయితేనేమిటి క్రీస్తును గురించి బోధింపబడు
తోంది. కనుక నాకు ఆనందంగా ఉంది. ఔను నేను
యిదేవిధంగా ఆనందిస్తూ ఉంటాను. 19ఎందుకంటే
మీ ప్రార్థనవల్ల యేసు క్రీస్తుయొక్క ఆత్మ చేసిన
సహాయం వల్ల నేను అనుభవిస్తున్న ఈ కష్టాలే నా
విడుదలకు దారితీస్తాయని నాకు తెలుసు. 20నాకు
ఎలాంటి అవమానం కలుగరాదని, నాకు ధైర్యం కల
గాలని మనసారా కోరుకొంటున్నాను. ఎప్పటిలాగే
యిప్పుడు కూడా క్రీస్తు, నా దేహంలో మహిమ పొందా
లని ఆశిస్తున్నాను. ఇది నేను జీవించటం వల్ల సంభ
వించినా, లేక మరణం వల్ల సంభవించినా నాకు చింత
లేదు. 21ఎందుకంటే, నాకు క్రీస్తే జీవితం. నేను మర
ణిస్తే, అదికూడా లాభకరమే. 22నేను ఈ దేహంతో
జీవిస్తే దానివల్ల నా శ్రమకు తగిన ఫలం లభిస్తుంది.
అయినా నేను ఏది కోరుకోవాలో నాకే తెలియదు.
23ఈ రెంటి మధ్య నేను నలిగిపోతున్నాను. ఒక విధంగా

చూస్తే ఈ దేహాన్ని వదిలి క్రీస్తు సమక్షంలో ఉండాలని
అనిపిస్తోంది. ఇది అన్నిటికన్నా ఉత్తమం. 24కాని
యింకొక విధంగా చూస్తే మీ కొరకు నేనీ దేహంతో
ఉండటం చాలా అవసరం. 25ఇది నాకు బాగా తెలుసు.
అందువల్ల నేను బ్రతికి ఉండి అందరితో కలిసి విశ్వాసం
ద్వారా సంభవిస్తున్న మీ అభివృద్ధి కోసం, ఆనందం
కోసం పని చేస్తాను. 26నేను మళ్ళీ మీతో కలిసి జీవిం
చునప్పుడు మీకు యేసు క్రీస్తులో కలిగిన ఐక్యత
కారణంగా యింకా ఎక్కువ గర్విస్తాను.
27ఏది ఏమైనా క్రీస్తు సువార్తకు తగిన విధంగా
జీవించండి. అప్పుడు నేను మిమ్మల్ని చూసినా చూడక
పోయినా, మీరు ఒక ఆత్మగా, ఒక మనిషిగా సువార్త
వల్ల సంభవించే విశ్వాసంకోసం పని చేస్తున్నారని నేను
వినాలి. 28మీ శత్రువులకు ఏ మాత్రం భయపడకండి.
అన్నివేళలా ధైర్యంగా ఉండండి. అప్పుడు మీరు గెలుస్తా
రని, తాము ఓడిపోతామని వాళ్ళకు తెలుస్తుంది. ఇది
దేవుడు చేసాడు. 29ఎందుకంటే, క్రీస్తును విశ్వసించే
అవకాశమే కాకుండా, ఆయన కోసం కష్టాలు అనుభ
వించే అవకాశం మీకు కూడా దేవుడు కలిగించాడు.
30గతంలో నేను సాగించిన పోరాటాన్ని చూసారు.
దాన్ని గురించి విన్నారు. మీరు కూడా ఆ పోరాటాన్ని
సాగిస్తున్నారు.

### క్రీస్తు వినయంను అనుకరించుట

2 క్రీస్తులో ఐక్యత పొందటం వలన మీకు శక్తి కలి
గింది కదా! ఆయన ప్రేమ మీకు ఆనందం
యిస్తుంది కదా! ఆయన ఆత్మతో మీకు స్నేహం
కలిగింది గదా! మీలో దయాదాక్షిణ్యాలు అభివృద్ధి
చెందుతున్నాయి కదా!
2అలాగైతే ఒకే మనస్సుతో, ఒకే ప్రేమలో పాలు
పంచుకొంటూ, ఒకే ఆత్మతో, ఒకే ఉద్దేశంతో ఉండి
నన్ను పూర్తిగా ఆనందపరచండి. 3స్వలాభం కోసంగాని,
స్వాభిమానంకోసం గాని ఏదీ చేయకండి. వినయంగా
ఉండండి. మీరు యితరుల కన్నా గొప్ప అని భావించ
కండి. 4మీ స్వార్థం కోసం మాత్రమే చూసు కోకుండా
యితరుల అవసరాలను కూడా గమనించండి. 5యేసు
క్రీస్తులో ఉన్న మనస్సును పెంచుకోండి.
6ఆయన దేవునితో సమానము. అయినా ఆయనా
స్థానాన్ని పట్టుకొని కూర్చోవాలనుకోలేదు.
7ఆయన అంతా వదులుకొన్నాడు. మానవ రూపం
దాల్చి సేవకునివలే ఉండటానికి వచ్చాడు. 8మానవుని
వలే కనిపిస్తూ, వినయంగా వుంటూ, మరణాన్ని కూడా
విధేయతగా అంగీకరించి, సిలువపై మరణించాడు.
9అందువల్ల దేవుడాయనకు ఉన్నతస్థానం ఇచ్చి
అన్ని పేర్లకన్నా ఉత్తమమైన పేరు యిచ్చాడు. 10యేసు
పేరు విన్నప్పుడు పరలోకంలో, భూలోకంలో, పాతా
ళలోకంలో ఉన్న వాళ్ళంతా ఆయన ముందు మోకరి
ల్లాలని ఈ విధంగా చేసాడు. 11ప్రతి నాలుక యేసు
క్రీస్తు ప్రభువని అంగీకరించాలని ఈ విధంగా చేసాడు.
తండ్రియైన దేవునికి మహిమ కలుగుగాక!

### నక్షత్రాలవలె ప్రకాశించటం

12నా ప్రియమిత్రులారా! నేను మీతో ఉన్నప్పుడు
మీరు దేవుని ఆజ్ఞల్ని అతిక్రమించలేదు. ప్రస్తుతం నేను
మీతో లేను కనుక యిప్పుడు మీరు దేవుని ఆజ్ఞల్ని
పాటించుచూ మీ స్వంత రక్షణను భయముతోను,
వణకుతోనూ, కార్యసాధకము చేయండి. 13దేవుడు
మీలో ఉండి తన ఉద్దేశ్యాన్ని నెరవేర్చుకోవటానికి కావల
సిన ఉత్సాహము, శక్తి మీకు యిస్తాడు.
14మీరు చేస్తున్న పని గొణగకుండా, వాదించ
కుండా చెయ్యండి. 15అప్పుడు మీరు నిష్కళంకులై
మంచి వాళ్ళుగా ఉంటారు. దుర్మార్గులై నీతిలేకుండా
జీవిస్తున్న వీళ్ళమధ్య ఏ అపరాధమూ చెయ్యని దేవుని
బిడ్డల్లా ఉంటారు. మీరు వాళ్ళమధ్య ఆకాశంలోని నక్ష
త్రాల్లా ప్రకాశిస్తారు. 16మీరు జీవంగల దైవసందేశాన్ని
ప్రకటిస్తున్నారు. కనుక క్రీస్తు వచ్చిన రోజున మీ విష
యంలో గర్వించటానికి నాకు ఆస్కారం ఉంటుంది.
నా కృషి, సాధన వ్యర్థం కాలేదని ఋజువౌతుంది.
17మీ విశ్వాసం వల్ల అర్పిస్తున్న బలికి తోడుగా నా
రక్తాన్ని బలిగా ధార పోయవలసివస్తే నేను వెనుకాడను.
చాలా ఆనందిస్తాను. నా ఆనందాన్ని మీతో పంచు
కోవాలని నా కోరిక. 18అందువల్ల మీరు కూడా
ఆనందించి, మీ ఆనందాన్ని నాతో పంచుకొండి.

### తిమోతిని పంపటం

19మిమ్మల్ని గురించి తెలిస్తే నాకు కూడా ఆనందం
కలుగుతుంది. కనుక తిమోతిని మీ దగ్గరకు పంపే
అవకాశం యేసు ప్రభువు త్వరలో కలిగిస్తాడని నిరీ
క్షిస్తాను. 20మీ క్షేమం విషయంలో నిజంగా శ్రద్ధ వహించే
వ్యక్తి అతను తప్ప నా దగ్గర మరొకడు లేడు. 21ప్రతి
ఒక్కడూ తన స్వార్థం కోసం అలోచిస్తాడే కాని యేసు
క్రీస్తును గురించి ఆలోచించడు. 22సువార్త ప్రచారం
చెయ్యటానికి అతడు నా కుమారునిలా పని చేసాడు.
అలా చేసి తన యోగ్యతను ఋజువు చేసుకొన్నాడని
మీకు తెలుసు. 23నా పరిస్థితులు ఎలా ఉంటాయో
తెలియగానే అతణ్ణి మీ దగ్గరకు పంపటానికి ఎదురు
చూస్తున్నాను. 24నన్ను కూడా త్వరలో మీ దగ్గరకు
పంపుతాడనే నమ్మకం నాకు ప్రభువుపట్ల ఉంది.

### ఎపఫ్రాదితును తిరిగి పంపటం

25నాకు సహాయం చెయ్యటానికి మీరు ఎపఫ్రా
దితును పంపారు. అతడు మీరు పంపిన దూత. అతణ్ణి
తిరిగి మీ దగ్గరకు పంపటం అవసరమని భావిస్తున్నాను.
ఎపఫ్రాదితు నాతో కలిసి నా సోదరునివలే పోరాడి,

పని చేసాడు. 26మిమ్మల్ని చూడాలని, మీ దగ్గరకు రావాలని అతడు ఎదురు చూస్తున్నాడు. అతడు జబ్బుతో ఉన్నాడన్న విషయం మీరు విన్నట్లు అతనికి తెలిసి అతడు చాలా చింతిస్తున్నాడు. 27అతనికి నిజంగా చనిపోయేటంత జబ్బు చేసింది. కాని దేవుని దయ అతనిపై ఉంది. కనుక అతను బ్రతికాడు. దేవుడు అతనికే కాకుండా, నాకు మరొకసారి దుఃఖం కలుగ రాదని నాపై కూడా దయచూపాడు. 28అందువల్ల అతణ్ణి మీ దగ్గరకు పంపాలని ఎదురు చూస్తున్నాను. అతణ్ణి చూసి మీరు ఆనందించాలని నా ఉద్దేశ్యం. అప్పుడు నాకు నిశ్చింతగా ఉంటుంది. 29కనుక ప్రభువు పేరిట ఆనందంతో అతనికి స్వాగతం చెప్పండి. అలాంటి వాళ్ళను మీరు గౌరవించాలి. 30మీరు చేయ లేని సహాయం తాను చేయాలని అతడు తన ప్రాణం కూడా తెగించాడు. క్రీస్తు అప్పగించిన పని పూర్తి చేయటం కొరకు మరణించటానికి కూడా అతడు సిద్ధమయ్యాడు.

## నిజమైన ధర్మము

3 సోదరులారా! చివరి మాట, ప్రభువు మీకు కావలసినంత ఆనందం ప్రసాదించుగాక! వ్రాసిన విషయాలే మళ్ళీ వ్రాయటానికి నేను వెనుకాడను. దాని వల్ల మీకు యింకా ఎక్కువ లాభం కలుగుతుంది. 2దుర్మార్గులైన ఆ కుక్కల విషయంలో శరీరాన్ని ముక్కలు చేసే వాళ్ళ విషయంలో జాగ్రత్తగా ఉండండి. 3మనం దేవుణ్ణి ఆయన ఆత్మ ద్వారా ఆరాధిస్తున్నాము.* ఇది నిజమైన సున్నతి. వాళ్ళు పొందిన సున్నతిలాంటిది కాదు. మనము యేసు క్రీస్తులో ఉన్నందుకు గర్విస్తున్నాము. కనుక బాహ్యంగా కనిపించే ఈ ఆచారాలను మనము విశ్వసించము. 4కాని అలాంటి ఆచారాలను విశ్వసించటానికి నాకు కారణాలు ఉన్నాయి. బాహ్యమైన ఈ ఆచారాలను నమ్మటం ముఖ్యమని యితరులు అనుకొంటున్నట్లైతే వాటిని నమ్మటానికి వాళ్ళకన్నా నాకు ఎక్కువ కారణాలు ఉన్నాయి. 5నేను పుట్టిన ఎనిమిదవ రోజు నాకు సున్నతి చేసారు. నేను బెన్యామీను తెగకు చెందిన వాణ్ణి. పుట్టుకతో ఇశ్రాయేలు దేశస్థుణ్ణి. హెబ్రీయులకు జన్మించిన హెబ్రీయుణ్ణి. ధర్మశాస్త్రాన్ని అనుసరించే పరిసయ్యుణ్ణి. 6ఉత్సాహంతో సంఘాన్ని హింసించిన వాణ్ణి. ధర్మశాస్త్రాల్లోని నియమాలను పాటించటంలో నేను ఒక్క తప్పు కూడా చేయలేదు. 7నేను క్రీస్తు విశ్వాసిని అయినందుకు, ఇదివరలో లాభంగా పరిగణించిన వాటిని నేను ప్రస్తుతం నష్టంగా పరిగణిస్తున్నాను. 8అంతేకాక, నా ప్రభువైన యేసు క్రీస్తును తెలుసుకోవటం చాలా గొప్ప విషయం. ఆయనతో పోల్చి చూస్తే అన్నీవృథా అనిపిస్తుంది. ఆయన కొరకు నేను అన్నీ వదిలి వచ్చాను. క్రీస్తును పొందాలని వాటిని చెత్తగా పరిగణిస్తున్నాను. 9ఆయనలో ఐక్యత పొంది ఉండటమే నా ఉద్దేశ్యము. ధర్మశాస్త్రాన్ని అనుసరించి పొందే నీతి నాకు అనవసరం. క్రీస్తులో విశ్వాసం ఉండటం వల్ల లభించే నీతి నాకు కావాలి. 10నాకు క్రీస్తును తెలుసుకోవాలని ఉంది. చావునుండి బ్రతికి రాగల శక్తిని గురించి తెలుసుకోవాలని ఉంది. ఆయన పొందిన కష్టాల్లో పాలు పంచుకొని ఆయనతో స్నేహం పొందాలని ఉంది. ఆయనతో మరణించి ఆయనలా అయి పోవాలని ఉంది. 11ఇవన్నీ చేసి తిరిగి బ్రతికి రావాలని ఉంది. దీన్ని ఏదో ఒక విధంగా సాధించాలని ఉంది.

## గమ్యం వైపు పరుగెత్తటం

12వీటన్నిటిని నేను యింకా సాధించలేదు. నాలో పరిపూర్ణత యింకా కలుగలేదు. కాని క్రీస్తు దేనికోసం నన్ను ఎన్నుకొన్నాడో దాన్ని నేను చేజిక్కించు కోవాలని పట్టుదలతో సాగిపోతున్నాను. 13సోదరులారా! అది నాకు చిక్కిందని నేను అను కోవటం లేదు. కాని ఒకటి మాత్రం నేను చేస్తున్నాను. గతాన్ని మరచిపోయి భవిష్యత్తులో ఉన్నదాని కోసం కష్టపడుతున్నాను. 14గమ్యాన్ని చేరుకొని బహుమతి పొందాలని ముందుకు పరుగెత్తుతున్నాను. దేవుడు నేను ఈ గమ్యాన్ని చేరు కోవాలని యేసు క్రీస్తు ద్వారా నన్ను పరలోకం కొరకు పిలిచాడు.

15ఆత్మీయంగా పరిపూర్ణత పొందిన మనమంతా అన్ని విషయాల్లో యిలాంటి దృక్పథం ఉంచుకోవాలి. ఒకవేళ మీలో ఎవరికైనా దేని మీదనన్నా వేరు అభిప్రాయం ఉంటే దేవుడు దాన్ని కూడా మీకు స్పష్టం చేస్తాడు. 16మనం మాత్రం, మనమిదివరలో సాధించిన వాటికి అనుగుణంగా నడుచుకొందాము.

17సోదరులారా! నావలె జీవించండి. మేము బోధించిన విధానాన్ని అనుసరిస్తున్న వాళ్ళను గమనించండి. 18నేనిదివరకే ఎన్నోసార్లు చెప్పాను. ఇప్పుడు మళ్ళీ కన్నీళ్ళతో చెబుతున్నాను. క్రీస్తు సిలువ పట్ల శత్రుత్వంతో జీవిస్తున్న వాళ్ళు చాలా మంది ఉన్నారు. 19వినాశనమే వాళ్ళ గమ్యం. వాళ్ళ కడుపే వాళ్ళ దేవుడు. అవమానమే వాళ్ళ కీర్తి. వాళ్ళ మనస్సులు ఐహికమైన వాటిపై ఉంటాయి. 20కాని మన నివాసం పరలోకంలో ఉంది. మనల్ని రక్షించటానికి పరము నుండి రానున్న క్రీస్తు ప్రభువు కోసం మనం ఆశతో ఎదురు చూస్తున్నాము. 21అన్నిటినీ తన ఆధీనంలో ఉంచుకోగల శక్తి ఆయనలో ఉంది. ఆ శక్తితో ఆయన మన నీచమైన శరీరాలను తన తేజోవంతమైన శరీరంలా ఉండేటట్లు చేస్తాడు.

**మనం … ఆరాధిస్తున్నాము** లేక దేవుని ఆత్మచేత ఆరాధిస్తున్నాము.

### చివరి సలహా

4 నా ప్రియమైన సోదరులారా! మిమ్మల్ని చూడా
లని నాకు ఎంతో ఆత్రుతగా ఉంది. మీరు నాకు
చాలా ఆనందం కలిగించారు. మీ విషయంలో నేను
చాలా గర్విస్తుంటాను. ప్రియ మిత్రులారా! ప్రభువును
అనుసరించటం మానుకోకండి.
2యువొదియ, సుంటుకే అనేవాళ్లు ప్రభువు విశ్వా
సులు కనుక వాళ్ళు పరస్పరం ఒక అంగీకారానికి రావా
లని అర్థిస్తున్నాను. 3నిజమైన జత పనివాడా! నీవు
నాతో కలిసి పని చేసావు. నీవు నమ్మకంగా పని చేసే
వాడవని నాకు తెలుసు. ఈ స్త్రీలకు సహాయం చేయి.
దైవసందేశాన్ని ప్రకటించటంలో వీళ్ళు క్లెమెంతు
తోను, మరియు మిగతా వాళ్ళతోను కలిసి నా పక్షాన
నిలిచారు. ఈ మిగతా వాళ్ళ పేర్లు జీవగ్రంథంలో
ఉన్నాయి. 4అన్ని వేళలందును మీరు ప్రభువునందు
ఆనందించండి, మళ్ళీ చెపుతున్నాను. ప్రభువునందు
ఆనందించండి. 5మీరు దయగల వాళ్ళనే పేరు
పొందాలి. ప్రభువు త్వరలో రానున్నాడు. 6ఏ విష
యంలో చింతలు పెట్టుకోకండి. ప్రతిసారి ప్రార్థించి
మీ కోరికల్ని దేవునికి తెలుపుకోండి. కృతజ్ఞతా హృద
యంతో అడగండి. 7దేవుడు యిచ్చే శాంతిని ఎవ్వరూ
అర్థం చేసుకోలేదు. అది మీ హృదయాలను, మీ బుద్దిని,
యేసు క్రీస్తులో ఉంచి కాపలాకాస్తుంది.
8కనుక సోదరులారా! నేను చివరకు చెప్పేదేమి
టంటే, సత్యమైనవాటిని, మంచివాటిని, ధర్మమైన
వాటిని, పవిత్రమైనవాటిని, ఆనందమైన వాటిని, మెచ్చు
కోతగ్గవాటిని, అంటే ఉత్తమంగా ఉన్న వాటిని గురించి,
ప్రశాంతమైన వాటిని గురించి మీ మనస్సులో ఆలోచిం
చండి. 9మీరు నా ద్వారా నేర్చుకొన్న వాటిని, నా
నుండి పొందిన వాటిని, నా నుండి విన్నవాటిని, నాలో
చూసినవాటిని ఆచరణలో పెట్టండి. అప్పుడు శాంతిని
కలిగించే దేవుడు మీతో ఉంటాడు.

### కానుకలకు కృతజ్ఞత

10మీకు నా పట్ల ఉన్న అభిమానం మళ్ళీ మొలకె
త్తినందుకు నేను ప్రభువు పేరిట చాలా ఆనంది
స్తున్నాను. ఔను మీకు నా పట్ల అభిమానం ఉంది
కాని, దాన్ని చూపించుకొనే అవకాశం మీకు చిక్కలేదు.
11నాకు మీ అవసరముందని ఈ విధంగా మాట్లాడటం
లేదు. ఏ పరిస్థితుల్లోనైనా తృప్తిగా ఉండేందుకు నేను
నేర్చుకొన్నాను. 12అవసరంలో ఉండటం అంటే
ఏమిటో, అధికంగా కలిగి ఉండటం అంటే ఏమిటో
నాకు తెలుసు. అన్ని పరిస్థితుల్లో, అంటే కడుపు
నిండి ఉండుటను ఆకలితో ఉండుటను, అవసరాలలో
ఉన్నప్పుడును అధికంగా కలిగి ఉన్నప్పుడును సంతృప్తి
కరంగా ఎలా ఉండాలో, దాని రహస్యమేమిటో, నేను
తెలుసుకున్నాను. 13నాకు శక్తి నిచ్చే క్రీస్తు ద్వారా
నేను ఏపనినైనా చేయగలను.
14అయినా మీరు నా కష్టాలు పంచుకొని మంచి
పని చేసారు. 15పైగా దైవసందేశాన్ని గురించి మీరు
క్రొత్తగా విన్నప్పుడు, ఫిలిప్పీలోవున్న మీరు తప్ప
ఎవ్వరూ నాకు సహాయం చెయ్యలేదు. నేను మాసి
దోనియ నుండి ప్రయాణం సాగించినప్పుడు ఒక్క
సంఘం కూడా నాకు సహాయం చెయ్యలేదు. నాకు
వాళ్ళు ఏమీ యివ్వలేదు. నానుండి ఏమీ పుచ్చు
కోలేదు.
16నేను థెస్సలొనీకలో ఉన్నప్పుడు కూడా నా
అవసరాన్ని బట్టి మీరు నాకు ఎన్నోసార్లు సహాయం
చేసారు. 17నేను మీ నుండి విరాళాలు పొందాలని యిలా
మాట్లాడటం లేదు. మీ జీవితం యొక్క లెక్కలకు
కొంత లాభం చేకూర్చాలని నా అభిప్రాయం. 18నాకు
కావలసిన దాని కన్నా ఎక్కువే చెల్లించారు. మీరు ఎప
ఫ్రొదితు ద్వారా నాకు పంపిన విరాళాలు నాకు
ముట్టాయి. దానితో నా అవసరాలు పూర్తిగా తీరి
పోయాయి. సుగంధ పరిమళాల వలే ఉన్న మీ విరా
ళాలను దేవుడు ఆనందంగా అంగీకరిస్తాడు.
19నా దేవుడు యేసు క్రీస్తులో ఉన్న గొప్ప ఐశ్వ
ర్యంతో మీ అవసరాలన్నీ తీరుస్తాడు. 20మన తండ్రి
యైన దేవునికి చిరకాలపు కీర్తి కలుగుగాక! ఆమేన్.

### చివరి మాట

21యేసు క్రీస్తులో ఐక్యత పొందిన ప్రతి పవిత్రునికి
నా వందనాలు తెలుపండి. నాతోవున్న సోదరులందరూ
మీకు వందనాలు తెలుపుతున్నారు. 22పవిత్రులందరు,
ముఖ్యంగా చక్రవర్తి భవనంలో నివసించే వాళ్ళు, మీకు
వందనాలు తెలుపుతున్నారు.
23యేసు క్రీస్తు ప్రభువుయొక్క అనుగ్రహము మీ
ఆత్మకు తోడుగా ఉండుగాక!

# కొలొస్సయులకు వ్రాసిన లేఖ

1 దైవేచ్ఛవల్ల యేసు క్రీస్తు ప్రభువుయొక్క అపొస్తలు
డైన పౌలు నుండి, మరియు మన సోదరుడైన
తిమోతి నుండి;
2విశ్వాసంతో పరిశుద్ధతలో సోదరులుగా క్రీస్తులో
ఐక్యత పొంది జీవిస్తున్న కొలొస్సయి పట్టణంలోని
పవిత్రులకు, మనతండ్రియైన దేవుడు మీకు శాంతిని,
కృపను ప్రసాదించుగాక!

## ప్రార్థన; కృతజ్ఞత

3మేము మీ గురించి విన్నందుకు మన యేసు
ప్రభువుకు తండ్రి అయిన దేవునికి సర్వదా కృతజ్ఞు
లము. మేము మీకోసం దేవుణ్ణి ప్రార్థిస్తున్నాము. 4క్రీస్తు
పట్ల మీకున్న విశ్వాసాన్ని గురించి, విశ్వాసుల పట్ల
మీకున్న ప్రేమను గురించి మేము విన్నాము. 5నిజమైన
సందేశాన్ని, అంటే సువార్తను మొదటినుండి మీరు
విన్నారు. అది రక్షణ కలుగజేస్తుందన్న ఆశ మీలో
కలిగింది. మీ విశ్వాసము, ప్రేమ, మీ ఆశపై ఆధారపడి
ఉంటాయి. దేవుడు మీ నిరీక్షణను మీకోసం పరలో
కంలో భద్రంగా దాచి ఉంచాడు. 6దైవసందేశాన్ని విని,
దేవుని అనుగ్రహాన్ని గురించి సంపూర్ణంగా అర్థం చేసు
కొన్న నాటి నుండి మీరు ఫలం పొందారు. అదే
విధంగా యిప్పుడు కూడా దేవుడు తన ఆశీస్సులు
అందరికీ ప్రసాదిస్తాడు. సువార్త ప్రపంచమంతా వ్యాపి
స్తోంది. 7మీరీ సువార్త 'ఎపఫ్రా' ద్వారా విన్నారు. అతడు
మాకు ప్రియమైనవాడు. మాతో కలసి మా పక్షాన
విశ్వాసంతో క్రీస్తు సేవ చేస్తున్న వాడు. 8మీకు పరి
శుద్ధాత్మ యిచ్చిన ప్రేమను గురించి అతడు మాకు
చెప్పాడు. 9ఆత్మీయత జ్ఞానము, తనను గురించిన
జ్ఞానము, మీకు ప్రసాదించుమని మిమ్మల్ని గురించి
విన్న నాటి నుండి విడువకుండా మీకోసం దేవుణ్ణి
ప్రార్థించాము:

మీకు 'దైవేచ్ఛ'ను తెలుసుకొనే జ్ఞానం కల
గాలని మా అభిలాష.
10 మీరు ప్రభువు యిచ్చానుసారం జీవిం
చాలనీ, అన్ని వేళలా ఆయనకు ఆనందం
కలిగించే వాటిని మాత్రమే చేయాలనీ
మా అభిలాష. సత్కార్యాలు చేసి ఫలం
చూపించండి. దేవుణ్ణి గురించి మీకున్న
జ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోండి.
11 సర్వశక్తి సంపన్నుడైన దేవుడు మీకు శక్తి
నిచ్చు గాక! అప్పుడు అన్నిటినీ సంతో
షంతో భరించగల సహనము మీలో కలుగు
తుంది.

12దేవుడు తన వెలుగు రాజ్యంలో, అంటే తన
విశ్వాసుల కోసం ప్రత్యేకంగా ఉంచిన దానిలో మీకు
భాగం లభించేటట్లు చేసాడు. దానికి మీరు తండ్రికి
మనస్పూర్తిగా కృతజ్ఞతతో ఉండండి. 13మనల్ని చీకటి
రాజ్యం నుండి రక్షించి, తాను ప్రేమించే కుమారుని
రాజ్యంలోకి రప్పించాడు.
14కుమారుడు మన పక్షాన మన పాపాల నిమిత్తం
తన ప్రాణం చెల్లించాడు. కనుక ఆయన కారణంగా
దేవుడు మనల్ని క్షమించాడు.

## క్రీస్తు యొక్క గొప్పతనము

15క్రీస్తు కనిపించని దేవుని ప్రతిబింబం. ఆయన
అన్నిటికన్నా పూర్వంనుండి అనగా జగత్తుకు పునాది
వేయుటకు ముందునుండి ఉన్నవాడు. 16క్రీస్తు అన్ని
టినీ సృష్టించాడు. పరలోకంలో ఉన్న వాటిని,
భూమ్మీద కనిపించే వాటిని, కనిపించని వాటిని, సింహాస
నాలను, ప్రభుత్వాలను, పాలకులను, అధికారులను,
అన్నిటినీ ఆయనే సృష్టించాడు. అన్నీ తన కోసం
సృష్టించుకొన్నాడు. 17క్రీస్తు ఆదినుండి ఉన్నాడు.
ఆయనలో అన్నీ ఐక్యమై ఉన్నాయి. 18సంఘం
ఆయన శరీరం. ఆయన సంఘానికి శిరస్సు. ఆయనే
అన్నిటికీ మూలం. చనిపోయి తిరిగి బ్రతికిన వాళ్ళలో
ఆయన మొదటి వాడు. అన్నిటిలో ఆయనకు ప్రాము
ఖ్యత ఉండాలని దేవుడు యిలా చేసాడు.
19దేవుడు తనలో ఉన్న పరిపూర్ణత ఆయనలో
ఉండటానికి ఆనందంగా అంగీకరించాడు. 20దేవుడు
అన్నిటినీ, అంటే భూమ్మీద ఉన్నవాటినీ, పరలోకంలో
ఉన్నవాటినీ, కుమారుని ద్వారా తిరిగి తనలో చేర్చు
కోవాలనుకొన్నాడు. తన కుమారుడు సిలువపై
చిందించిన రక్తం ద్వారా ఈ సంధి కలగాలని ఆయన
ఉద్దేశ్యం.

21మీ దుష్ప్రవర్తనల వల్ల, మీ మనస్సులో ఉన్న
దురాలోచనల వల్ల ఒకప్పుడు మీరు దేవునికి దూరంగా
ఉండి, ఆయనకు శత్రువులుగా జీవించారు. 22కాని
ప్రస్తుతం తన కుమారుని భౌతిక మరణం ద్వారా
మీతో సంధి చేసి, మిమ్మల్ని పవిత్రం చేసి, మిమ్మల్ని
నిష్కళంకులుగా, నిరపరాధులుగా తన ముందు నిల
బెట్టుకోవాలని ఆయన ఉద్దేశ్యం. 23మీరు విన్న సువార్త
వలన రక్షణ కలుగుతుందన్న ఆశ మీలో కలిగింది.
దాన్ని పోగొట్టు కోకుండా, ధృఢంగా స్థిరంగా ఆయన్ని
విశ్వసిస్తూ ఉంటేనే అది సంభవిస్తుంది. మీరు విన్న
ఈ సువార్త ఆకాశం క్రింద ఉన్న ప్రతీ జీవికి ప్రకటింప
బడింది. నేను ఈ సందేశానికి సేవకుణ్ణి అయ్యాను.

### సంఘం కోసం పౌలు పడిన శ్రమ

24మీ కొరకు నేను కష్టాలు అనుభవించినందుకు
యిప్పుడు నాకు ఆనందం కలుగుతోంది. ఎందుకంటే
క్రీస్తు సంఘం అనబడే తన శరీరం ద్వారా అనుభవించ
వలసిన కష్టాలు నా దేహం అనుభవించి పూర్తి చేస్తోంది.
25తన సందేశాన్ని మీకు సంపూర్ణంగా ఉపదేశించుమని
దేవుడు నన్ను నియమించాడు. తత్కారణంగా నేను
క్రీస్తు సంఘానికి సేవకుణ్ణి అయ్యాను. 26యుగ
యుగాలనుండి, తరతరాలనుండి రహస్యంగా దాచబడిన
ఈ దైవ సందేశం ప్రస్తుతం భక్తులకు చెప్పబడింది.
27భక్తులకు ఈ రహస్యంలోని గొప్ప మహత్మ్యాన్ని
తెలియ చేసి, యూదులుకాని వాళ్ళకు చూపాలని
ఆయన ఉద్దేశ్యం. మీలో ఉన్న 'క్రీస్తే' ఆ రహస్యం.
ఆయన వల్ల మహిమను తప్పక పొందుతామనే ఆశ
మనలో ఉంది. 28ఆయన్ని గురించి మేము ప్రకటి
స్తున్నాము. మాలో ఉన్న జ్ఞానాన్నంతా ఉపయోగించి
ప్రతి ఒక్కరికీ బోధిస్తున్నాము. సలహాలిస్తున్నాము.
ఈ విధంగా ప్రతి ఒక్కరినీ క్రీస్తు ద్వారా దేవుని ముందు
ఆధ్యాత్మికతలో పరిపూర్ణత పొందిన వాళ్ళలా నిలబె
ట్టాలని మా ఉద్దేశ్యము. 29దీన్ని సాధించటానికి నేను
నా శక్తినంతా ఉపయోగించి కష్టపడి పని చేస్తున్నాను.
నాలో ఉన్న ఈ బలవత్తరమైన శక్తి క్రీస్తు నాలో ఉండి
పని చేయటం వల్ల కలుగుతోంది.

2 మీ కోసం, లవొదికయలో ఉన్న వాళ్ళకోసం,
నన్ను ఇంతవరకూ కలుసుకోకుండావున్న వాళ్ళ
కోసం నేను ఎంత శ్రమిస్తున్నానో మీరు గ్రహించాలని
నా కోరిక. 2మీ హృదయాలు ధైర్యంతో నిండిపోవాలనీ,
ప్రేమతో మీరు ఐక్యము కావాలనీ నా అభిలాష.
అప్పుడు మీరు సంపూర్ణంగా అర్థం చేసుకోగలుగు
తారు. అదే ఒక సంపద. ఈ విధంగా మీరు దేవుణ్ణి
గురించి, అంటే క్రీస్తును గురించి, రహస్య జ్ఞానం పొందు
తారు. 3క్రీస్తులో వివేకము, జ్ఞానము అనే సంపదలు
దాగి ఉన్నాయి.

4తియ్యటి మాటలతో మిమ్మల్నెవ్వరూ మోసం
చెయ్యకుండా ఉండాలని మీకీ విషయాలు చెబు
తున్నాను. 5నేను శరీరంతో అక్కడ మీ దగ్గర లేక
పోయినా నా ఆత్మ మీ దగ్గరే ఉంది. మీ క్రమశిక్షణను,
క్రీస్తు పట్ల మీకున్న సంపూర్ణ విశ్వాసాన్ని చూసి నా
ఆత్మ ఆనందిస్తోంది.

### క్రీస్తు వల్ల సంపూర్ణమైన జీవితం

6మీరు యేసు క్రీస్తును ప్రభువుగా స్వీకరించినట్లే
ఆయనలో ఐక్యమై జీవించండి. 7మీ వేర్లు ఆయనలో
నాటి, ఆయనలో అభివృద్ధి చెందుతూ జీవించండి.
మీకు ఉపదేశించిన విధంగా సంపూర్ణమైన విశ్వాసంతో
ఉండండి. మీ కృతజ్ఞత పొంగిపోవాలి.
8మోసంతో, పనికిరాని తత్వజ్ఞానంతో మిమ్మల్ని
ఎవ్వరూ బంధించకుండా జాగ్రత్త పడండి. వాళ్ళ తత్వ
జ్ఞానానికి మూలం క్రీస్తు కాదు. దానికి మానవుని
సాంప్రదాయాలు, అతని నైజంవల్ల కలిగిన నియమాలు
కారణం. 9ఎందుకంటే, దేవుని ప్రకృతి క్రీస్తులో సంపూ
ర్ణంగా మానవ రూపంతో జీవిస్తోంది. 10మీరు ఆయ
నలో ఐక్యత పొందారు. కనుక మీకు ఆ సంపూర్ణత
లభించింది. క్రీస్తు అన్ని శక్తులకూ, అన్ని అధికారాలకూ
అధిపతి.
11ఆయనతో మీకు కలిగిన ఐక్యత వల్ల మీరు
సున్నతి పొందారు. ఈ సున్నతి మానవులు చేసింది
కాదు. ఇది క్రీస్తు స్వయంగా చేసిన సున్నతి. పాపాలతో
కూడుకొన్న ఈ దేహం నుండి విముక్తి పొందటమే
ఈ సున్నతి. 12మీరు బాప్తిస్మము పొందటం వల్ల
క్రీస్తులో సమాధి పొందారు. క్రీస్తును బ్రతికించిన దేవుని
శక్తి పట్ల మీకున్న విశ్వాసం వలన మిమ్మల్ని కూడా
దేవుడు ఆయనతో సహా బ్రతికించాడు. అంటే బాప్తి
స్మము వల్ల యిది కూడా సంభవించింది. 13మీరు
చేసిన పాపాల వల్ల, పాపాలతో కూడుకొన్న ఈ
దేహం నుండి స్వేచ్ఛ పొందకుండా మీరు గతంలో
ఆత్మీయంగా మరణించారు. కాని దేవుడు మీ పాపాల
న్నిటినీ క్షమించి క్రీస్తుతో సహా మిమ్మల్ని బ్రతికిం
చాడు. 14ఆ పద్ధతులను గురించి, నియమాలను
గురించి మనం వ్రాత మూలంగా అంగీకరించిన
పత్రాన్ని, అది మనకు వ్యతిరేకంగా ఉంది కనుక,
ఆయన దానిని తీసుకెళ్ళి మేకులతో సిలువకు
కొట్టాడు. 15అధికారాలను, శక్తుల్ని పనికి రాకుండా
చేసి వాటిని బహిరంగంగా హేళన చేసి, సిలువతో
వాటిపై విజయం సాధించాడు.
16అందువల్ల అన్నపానాల విషయంలో గాని, మత
సంబంధమైన పండుగ విషయాల్లో గాని, అమావాస్య
పండుగ విషయంలో గాని, యూదుల విశ్రాంతి రోజు
విషయంలో కాని యితరులు మీపై తీర్పు చెప్పకుండా
జాగ్రత్తపడండి. 17ఇవి నీడలా రానున్న వాటిని సూచిస్తు

న్నాయి. కాని సత్యం క్రీస్తులో ఉంది. 18కొందరు
తాము దివ్యదర్శనం చూసామని, కనుక తాము గొప్ప
అని చెప్పుకొంటారు. అతి వినయం చూపుతూ దేవ
దూతల్ని పూజిస్తుంటారు. వాళ్ళు మిమ్మల్ని అయో
గ్యులుగా పరిగణించకుండా జాగ్రత్త పడండి. వాళ్ళు
ప్రాపంచిక దృష్టితో ఆలోచిస్తారు. కనుక, నిష్కారణంగా
గర్విస్తు వుంటారు. 19శిరస్సు కారణంగా కీళ్ళు, నరాలు
దేహాన్ని ఒకటిగా ఉంచి ఆ దేహానికి శక్తిని కలిగిస్తు
న్నాయి. శిరస్సు కారణంగా దేవుని ఆదేశానుసారం ఆ
దేహం అభివృద్ధి చెందుతూ ఉంటుంది. అలాంటి
శిరస్సుతో వాళ్ళు సంబంధం తెంచుకొన్నారు.
20మీరు క్రీస్తుతో మరణించినప్పుడే ఈ ప్రపంచం
యొక్క ప్రాథమిక నియమాల నుండి స్వేచ్ఛను
పొందారు. మరి అలాంటప్పుడు ఈ ప్రపంచానికి
చెందిన వాళ్ళైనట్లు ఆ ప్రాథమిక నియమాలను
ఎందుకు పాటిస్తున్నారు: 21“ఇది వాడకు, దాన్ని రుచి
చూడకు, ఇది ముట్టుకోకు” 22ఈ నియమాలు మాన
వుల ఆజ్ఞలతో, బోధనలతో సృష్టింపబడినవి కనుక
అవి వాడుక వల్ల నశించిపోయే వస్తువులలాంటివి.
23ఇలాంటి నియమాలు పైకి తెలివైనవిగా కనిపిస్తాయి.
అవి దొంగపూజలకు, దొంగవినయం చూపటానికి,
దేహాన్ని అనవసరంగా, కఠినంగా, శిక్షించటానికి ఉప
యోగపడవచ్చు. కాని శారీరక వాంఛల్ని అదుపులో
పెట్టుకోవటానికి పనికి రావు.

## క్రొత్త జీవితం

3 మీరు క్రీస్తుతో కూడా సజీవంగా లేచి వచ్చారు.
ఆయన పరలోకంలో దేవుని కుడిచేతి వైపు
కూర్చొని ఉన్నాడు. కనుక పరలోకంలో ఉన్నవాటిని
ఆశించండి. 2-3మీరు మరణించారు. ఇప్పుడు మీ
ప్రాణం క్రీస్తుతో సహా దేవునిలో దాగి ఉంది. కనుక
భూమ్మీద ఉన్న వాటిని కాకుండా పరలోకంలో ఉన్న
వాటిని గురించి ఆలోచించండి. 4క్రీస్తు మీ నిజమైన
ప్రాణం. ఆయన వచ్చినప్పుడు మీరాయనతో సహా
దేవుని మహిమలో భాగం పంచుకొంటారు.
5మీరు మీ భౌతిక వాంఛల్ని చంపుకోవాలి. అంటే,
వ్యభిచారము, అపవిత్రత, మోహము, దురాశ, అత్యాశ,
ఇవి ఒక విధమైన విగ్రహారాధన కనుక, వీటన్నిటినీ
వదులుకోవాలి. 6వీటివల్ల దేవునికి కోపం వస్తుంది.*
7మీ గత జీవితంలో ఈ గుణాలు మీలో ఉన్నాయి.
8కాని యిక మీరు ఆగ్రహాన్ని, ద్వేషాన్ని, దుష్ట
త్వాన్ని వదులుకోవాలి. ఇతరులను దూషించరాదు.
బూతులు మాటలాడరాదు. 9మీరు మీ పాత స్వభా
వాల్ని, పద్ధతుల్ని వదిలి వేసారు, కనుక అసత్యములాడ
రాదు. 10మీరు క్రొత్త జీవితం పొందారు. ఆ జీవితానికి
సృష్టికర్త అయినటువంటి దేవుడు మిమ్మల్ని తన ప్రతి
రూపంలో మలుస్తూ, తనను గురించిన జ్ఞానాన్ని మీలో
అభివృద్ధి పరుస్తున్నాడు. 11ఇక్కడ గ్రీకు దేశస్థునికి,
యూదునికి భేదం లేదు. సున్నతి పొందినవానికి, పొంద
నివానికి భేదం లేదు. విదేశీయునికి సిథియనుడుకి*
భేదం లేదు. బానిసకు, బానిసకానివానికి భేదం లేదు.
క్రీస్తే సర్వము. అన్నిటిలోనూ ఆయనే ఉన్నాడు.
12మీరు దేవుడు ఎన్నుకొన్న వాళ్ళు. ఆయన
ప్రేమిస్తున్న పవిత్రులు. అందువల్ల మీరు సానుభూతి,
దయ, వినయము, సాత్వికము, సహనము, అలవర్చు
కోవాలి. 13మీలో ఎవడైనా మీకు అన్యాయం చేసినవాడ
నిపిస్తే కోపగించుకోకుండా అతణ్ణి క్షమించండి. ప్రభువు
మిమ్మల్ని క్షమించినట్లు మీరు కూడా యితరులను
క్షమించండి. 14అన్నిటికన్నా ముఖ్యంగా ప్రేమను అల
వర్చుకోండి. అది సంపూర్ణమైన బంధాన్ని, పరిపూర్ణ
మైన ఐక్యతను, కలుగ చేస్తుంది. 15క్రీస్తు కలుగ చేసిన
శాంతిని మీ హృదయాలను పాలించనివ్వండి. మీరు
ఒకే శరీరంలో ఉండాలని దేవుడు మిమ్మల్ని పిలిచాడు.
మీలో శాంతి కలుగచేయాలని ఆయన ఉద్దేశ్యం.
కృతజ్ఞతతో ఉండండి. 16క్రీస్తు సందేశాన్ని మీలో
సంపూర్ణంగా జీవించనివ్వండి. మీ తెలివినంతా ఉప
యోగించి పరస్పరం సహాయం చేసుకోండి. దైవ
సందేశాన్ని బోధించుకోండి. దేవునికి మీ హృదయాల్లో
కృతజ్ఞతలు తెలుపుకొంటూ స్తుతిగీతాలు, కీర్తనలు
పాడుకోండి. వాక్యాలు చదవండి. 17మాటద్వారా కాని,
క్రియా రూపంగా కాని మీరేది చేసినా యేసు ప్రభువు
పేరిట చెయ్యండి. ఆయన ద్వారా తండ్రి అయినటు
వంటి దేవునికి కృతజ్ఞతతో ఉండండి.

## క్రొత్త జీవితంలో ఉండవలసిన బంధాలు

18స్త్రీలు తమ భర్తలకు విధేయులై ఉండాలి. ఇది
ప్రభువును బట్టి విశ్వాసులు చేయవలసిన విధి.
19పురుషులు తమ భార్యలను ప్రేమించాలి.
వాళ్ళతో కఠినంగా ప్రవర్తించరాదు.
20పిల్లలు తమ తల్లిదండ్రుల పట్ల అన్ని విషయాల్లో
విధేయతతో ఉండాలి. అప్పుడు వాళ్ళను ప్రభువు
మెచ్చుకొంటాడు.
21తండ్రులు తమ పిల్లలకు చిరాకు కలిగించరాదు.
అలా చేస్తే వాళ్ళకు నిరుత్సాహం కలుగుతుంది. 22బాని
సలు తమ యజమానుల పట్ల అన్ని విషయాల్లో
విధేయతతో ఉండాలి. వాళ్ళు మిమ్మల్ని గమనిస్తున్న
ప్పుడే కాకుండా, వాళ్ళ అభిమానం సంపాదించటానికి
మాత్రమే కాకుండా, మీకు ప్రభువు పట్ల ఉన్న విశ్వాసం

---

**వచనము 6** కొన్ని పురాతన ప్రతులలో అవిధేయుల మీద దేవునికి కోపం వస్తుంది. అన్న వచనం చివరలో చేర్చబడి వుంది.

**సిథియనులు** అనాగరికమైన ఒక జనం.

కారణంగా మనస్ఫూర్తిగా పని చేయాలి. 23అలా చేసేది మనస్ఫూర్తిగా చేయండి. ఎందుకంటే మీరు సేవ చేస్తున్నది క్రీస్తు ప్రభువు కోసం. 24మీరు ప్రభువుకు దాసులని మీకు తెలుసు. కనుక ఏది చేసినా అది మానవుల కోసమే కాకుండా ప్రభువు కోసం కూడా చేయండి. 25తప్పు చేసిన వాడు ఆ తప్పుకు తగిన శిక్ష అనుభవించాలి. దేవుడు పక్షపాతం చూపకుండా తీర్పు చెబుతాడు.

4 యజమానులు తమ సేవకుల పట్ల మంచిగా, న్యాయంగా ఉండాలి. మీకు కూడా పరలోకంలో ఒక యజమాని ఉన్నాడని జ్ఞాపకం ఉంచుకోండి.

### మరికొన్ని ఉపదేశములు

2మనస్సు నిమగ్నం చేసి, భక్తితో దేవుణ్ణి ప్రార్థించండి. దేవునికి మీ కృతజ్ఞత తెలుపుకోండి. 3మా సందేశానికి దేవుడు దారి చూపాలని, ఆయన క్రీస్తును గురించి తెలియ చేసిన రహస్య సత్యాన్ని మేము ప్రకటించగలగాలని మా కోసం కూడా ప్రార్థించండి. నేను దాని కోసమే సంకెళ్ళలో ఉన్నాను. 4నేను ఆ సందేశాన్ని స్పష్టంగా, యితరులకు అర్థమయ్యేలా ప్రకటించగలగాలని కూడా ప్రార్థించండి. ఇది నా కర్తవ్యం. 5అవిశ్వాసులతో తెలివిగా ప్రవర్తించండి. వచ్చిన ప్రతి అవకాశాన్ని పూర్తిగా ఉపయోగించుకోండి. 6మీరు మర్యాదగా, తెలివిగా మాట్లాడాలి. మీ మాటలు అందరి ప్రశ్నలకు సమాధానం యిచ్చేటట్లు ఉండాలి.

### చివరి మాట

7'తుకికు' నా గురించి అన్ని విషయాలు మీకు చెప్పుతాడు. అతడు విశ్వాసంగల పరిచారకుడు. ప్రభువు సేవ చేయటంలో నా సహచరుడు. 8మా పరిస్థితులు మీకు తెలియాలనీ, అతడు మీ మనస్సుకు శాంతి కలిగించాలనే ముఖ్యోద్దేశంతో అతణ్ణి మీ దగ్గరకు పంపుతున్నాను. 9మనకు ప్రియ సోదరుడు, విశ్వాసం కలవాడు అయినటువంటి ఒనేసిముతో కలిసి అతడు వస్తున్నాడు. 'ఒనేసిము' మీ వద్దనుండి వచ్చినవాడే. ఇక్కడ జరుగుతున్నవన్నీ వాళ్ళు చెబుతారు. 10నాతో కారాగారంలో ఉన్న 'అరిస్తార్కు', 'మార్కు' మీకు వందనములు తెలుపుతున్నారు. మార్కు బర్నబాకు మేనల్లుడు. మార్కు కోసం మీరు చేయవలసిన వాటిని గురించి యిదివరకే చెప్పాను. అతడక్కడికి వస్తే అతనికి స్వాగతం చెప్పండి. 11'యూస్తు' అని పిలువబడే యేసు కూడా మీకు వందనములు చెప్పమన్నాడు. దేవుని రాజ్యంకొరకు నాతో కలిసి పని చేస్తున్న వాళ్ళలో ఈ ముగ్గురు మాత్రమే యూదా మతము నుండి మనలో చేరిన వారు. నా ఈ కృషిలో వాళ్ళు నాకు చాలా ఆదరణగా ఉన్నారు.

12మీలో ఒకడైన 'ఎపఫ్రా' మీకు వందనములు తెలుపుతున్నాడు. ఇతడు యేసు క్రీస్తు సేవకుడు. మీకు దైవేచ్ఛపై పూర్తిగా విశ్వాసం ఉండాలనీ మీరు ఆత్మీయంగా పరిపూర్ణత పొందాలనీ, మీ కొరకు అతడు దేవుణ్ణి పట్టుదలతో ప్రార్థిస్తూ ఉన్నాడు. 13ఇతడు మీకోసం 'లవొదికయ' 'హియెరాపొలి' గ్రామాలలోని వాళ్ళ కోసం కష్టపడి పని చేస్తున్నాడని నేను గట్టిగా చెప్పగలను. 14మన ప్రియమిత్రుడు, వైద్యుడైన 'లూకా' మరియు 'దేమాయు' మీకు వందనములు చెపుతున్నారు.

15లవొదికయలోని సోదరులకు, 'నుంఫా'కు, ఆమె యింట్లోని క్రీస్తు సంఘానికి నా శుభాకాంక్షలు. 16ఈ లేఖను మీ సంఘంలో చదివాక, లవొదికయలోనున్న సంఘంలో కూడా చదివేటట్లు చూడండి. ఆ తర్వాత లవొదికయ నుండి వచ్చిన లేఖను మీ సంఘంలో చదవండి. 17ప్రభువు అప్పగించిన కార్యాన్ని పూర్తి చెయ్యుమని 'అర్ఖిప్పు'తో చెప్పండి. 18ఈ శుభాకాంక్షలు పౌలను నేను స్వయంగా నా చేతులతో వ్రాస్తున్నాను. నా 'సంకెళ్ళను' జ్ఞాపకం ఉంచుకోండి. దేవుని యొక్క అనుగ్రహం మీపై ఉండుగాక!

# థెస్సలొనీకయులకు వ్రాసిన మొదటి లేఖ

1 మన తండ్రియైన దేవునికి యేసు క్రీస్తు ప్రభువుకు
చెందిన థెస్సలొనీక పట్టణంలో ఉన్న సంఘానికి
పౌలు, సిల్వాను మరియు తిమోతి వ్రాయటమేమనగా,
మీకు దైవానుగ్రహము, శాంతి లభించుగాక!

### దేవునికి కృతజ్ఞతలు

2మేము మీకోసం ప్రార్థిస్తూ మీరు మా సోదరులై
నందుకు మేము దేవునికి అన్నివేళలా కృతజ్ఞతతో
ఉన్నాము. 3విశ్వాసం వల్ల మీరు సాధించిన కార్యాన్ని
గురించి, ప్రేమ కోసం మీరు చేసిన కార్యాల్ని గురించి
యేసు క్రీస్తు ప్రభువులో మీకున్న దృఢవిశ్వాసంవల్ల
మీరు చూపిన సహనాన్ని గురించి విన్నాము. దానికి
తండ్రియైన దేవునికి మేము అన్ని వేళలా కృతజ్ఞులము.
4సోదరులారా! దేవుడు మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు.
ఆయన మిమ్మల్ని ఎన్నుకొన్నాడని మాకు తెలుసు.
5ఎందుకంటే, మేము సువార్తను మీకు ఒట్టి మాట
లతో బోధించలేదు. శక్తితో, పరిశుద్ధాత్మతో, గట్టి
నమ్మకంతో బోధించాము. మేము మీకోసం మీతో
కలిసి ఏ విధంగా జీవించామో మీకు తెలుసు. 6మీరు
మమ్మల్ని, ప్రభువును అనుసరించారు. మీకు కష్టం
కలిగినా పరిశుద్ధాత్మ ఇచ్చిన ఆనందంతో సందేశాన్ని
అంగీకరించారు. 7కనుక మాసిదోనియ, అకయ పట్టణా
లలో ఉన్న విశ్వాసులందరికీ మీరు ఆదర్శులయ్యారు.
ఆ పట్టణాలలో మీ ద్వారా ప్రభువు సందేశం ప్రచార
మైంది. 8దేవుని పట్ల మీకున్న విశ్వాసం, ఆ పట్టణా
లలోనే కాక, ప్రతి చోటా తెలిసింది. దాన్ని గురించి
మేమేమీ చెప్పనవసరం లేదు. 9మీరు మాకెలాంటి
స్వాగతమిచ్చారో వాళ్ళు అందరికీ చెపుతున్నారు.
అంతేకాక, సజీవమైన నిజమైన దేవున్ని పూజించటానికి
మీరు విగ్రహారాధనను వదలి నిజమైన దేవుని వైపుకు
ఏ విధంగా మళ్ళారో వాళ్ళు అందరికీ చెపుతున్నారు.
10పరలోకంలో నుండి రానున్న దేవుని కుమారుడైన
యేసు కొరకు మీరు ఏ విధంగా కాచుకొని ఉన్నారో
వాళ్ళు అందరికీ చెపుతున్నారు. దేవునిచే సజీవంగా
లేపబడిన ఈ యేసు రానున్న ఆగ్రహం నుండి మనల్ని
రక్షిస్తాడు.

### థెస్సలొనీకలో పౌలు సేవ

2 సోదరులారా! మేము మీ దగ్గరకు రావటం వల్ల
లాభం కలుగకపోలేదు. ఇది మీకు తెలుసు. 2మేము
యిదివరలో కష్టాలు అనుభవించిన విషయము, ఫిలి
ప్పీలో అవమానాలు భరించిన విషయము మీకు
తెలుసు. మాకు అనేక ఆటంకాలు కలిగినా మేము
మా దేవుని సహాయంతో యేసు సువార్తను మీకు
బోధించటానికి ధైర్యం చేసాము. 3మేము తప్పుగా
భోధించలేదు. లేక దురుద్దేశ్యాలతో బోధించలేదు.
మేము మిమ్మల్ని మోసం చేయాలని ప్రయత్నం
చేయటంలేదు.

4దేవుడు మా యోగ్యతను గమనించి మాకు
సువార్తను అప్పగించాడు. మా హృదయాలను పరీక్షించే
దేవుణ్ణి సంతోషపెట్టాలని చూస్తున్నాము కాని, మాన
వుల్ని కాదు. 5మేము పొగడ్తలు ఉపయోగించలేదని
మీకు తెలుసు. స్వార్థానికోసం మేము దొంగవేషాలు
వేయలేదు. దీనికి దేవుడే సాక్షి. 6మీ పొగడ్తలు కాని,
లేక ఇతర్ల పొగడ్తలు కాని మాకు అవసరం లేదు.
7క్రీస్తు అపొస్తలులముగా మేము మా భారం మీపై
మోపగల్గినా అలా చేయలేదు. తల్లి తన పిల్లల్ని చూసు
కొన్నట్టు మిమ్మల్ని చూసుకొని మీ పట్ల దయతో
ఉండినాము.* 8మేము మిమ్మల్ని మనసారా ప్రేమిం
చాము. తద్వారా మీరు మాకు సన్నిహితులయ్యారు.
దానితో సువార్తే కాకుండా, మా జీవితాలను కూడా
మీతో పంచుకొన్నాము. 9సోదరులారా! మా శ్రమ,
కష్టము మీకు తప్పక జ్ఞాపకం ఉండి ఉండవచ్చును.
మేము దేవుని సువార్తను మీకు ప్రకటించినప్పుడు
మేము మీకు భారంగా ఉండరాదని రాత్రింబగళ్ళు పని
చేసాము.

10విశ్వాసులైన మీ మధ్య మేము ఎంతో పవిత్రంగా,
నీతిగా, అపకీర్తి లేకుండా జీవించాము. దీనికి మీరే
సాక్షులు. దేవుడు కూడా దీనికి సాక్షి. 11మేము మీ
అందరితో, తండ్రి తన పిల్లలతో ఏ విధంగా ఉంటాడో

---

**మీ పట్ల … ఉండినాము** మీ మధ్య పిల్లలవలె ఉండినాము అని కొన్ని ప్రతులలో వ్రాయబడివుంది.

ఆ విధంగా ఉన్నాము. 12మీకు ఆధ్యాత్మిక శక్తినిస్తూ,
మిమ్మల్ని ఓదారుస్తూ, తన రాజ్యంలోకి ఆహ్వానించి,
తన మహిమలో మీకు భాగం యిచ్చే దేవుని మెప్పు
పొందేటట్లు మిమ్మల్ని జీవించుమని చెప్పాము.
13దైవసందేశాన్ని మీరు మా నుండి విని దాన్ని
మానవుల సందేశంలా కాకుండా, దైవ సందేశంలా
అంగీకరించారు. ఇలా జరిగినందుకు మేము దేవునికి
సర్వదా కృతజ్ఞులము. అది నిజంగా దైవ సందేశము.
అది భక్తులైన మీలో పని చేస్తోంది. 14సోదరులారా!
యేసు క్రీస్తులో ఐక్యతపొందిన యూదయలోని దేవుని
సంఘాలవలే మీరు కూడా కష్టాలు అనుభవించారు.
యూదుల వల్ల ఆ సంఘాలు అనుభవించిన కష్టాలే
మీరు మీ ప్రజల వల్ల అనుభవించారు. 15ఆ యూదులు
యేసు ప్రభువును, ప్రవక్తలను చంపారు. మిమ్మల్ని
తరిమి వేసారు. వాళ్ళు దేవుణ్ణి దుఃఖపెట్టారు. మానవు
లందరికి శత్రువులై జీవించారు. 16రక్షణ కలిగించే
సందేశాన్ని యూదులుకాని వాళ్ళకు చెప్పనీయకుండా
మమ్మల్ని అడ్డగించారు. ఈ విధంగా చేసి తమ పాపా
లను అంతులేకుండా పెంచుకొంటూ పోయారు.
చివరకు దేవునికి వాళ్ళ మీద కోపం వచ్చింది.

### థెస్సలొనీకయులను మళ్ళీ చూడాలని పౌలు వాంఛించటం

17సోదరులారా! కొద్దికాలం మేము మీ నుండి
దూరంగా ఉండవలసి వచ్చింది. మా శరీరాలు మాత్రమే
మీ నుండి దూరంగా ఉన్నాయి. కాని మా మనసులు
కాదు. మిమ్మల్ని చూడాలని మా మనస్సుల్లో చాలా
ఉంది. కనుక మేము ఎన్నో విధాల ప్రయత్నించాము.
18మాకు మీ దగ్గరకు రావాలని ఉంది. పౌలునైన నేను
ఎన్నోసార్లు రావటానికి ప్రయత్నం చేసాను. కాని
సైతాను మమ్మల్ని అడ్డగించాడు. 19ఎందుకంటే మా
ఆశలు మీ మీద పెట్టుకున్నాము. మా ఆనందం మీరే.
మన యేసు క్రీస్తు ప్రభువు వచ్చినప్పుడు ఆయన
సమక్షంలో గర్వించటానికి కిరీటం మీరే కదా! 20మాకు
కీర్తి లభించటానికి నిజంగా మీరే కారణం. మీరే మా
ఆనందం.

3 మేము మీ దగ్గరకు రావాలని ఎంతో ప్రయత్నించి
రాలేకపోయాము. 2అందుచేత తిమోతిని పంపించి
మేము ఏథెన్సులో ఉండి పొయ్యాము. కనుక దేవుని
సేవ చేయటంలో మరియు క్రీస్తును గురించి సువార్త
ప్రచారం చేయటంలో మాతో కలిసి పనిచేసిన మా
సోదరుడు తిమోతిని ప్రోత్సాహ బలం కోసం మీ దగ్గరకు
పంపాము. 3ఈ హింసల కారణంగా మీలో ఎవ్వరూ
వెనుకంజ వేయరాదని మా ఉద్దేశ్యము. ఈ హింసలను
అనుభవించటం మన విధి అని మీకు బాగా తెలుసు.
4నిజానికి, మేము మీతో ఉన్నప్పుడే మనము ఈ
హింసల్ని అనుభవించవలసి వస్తుందని మీకు చెప్పాము.
మేము అన్నట్టుగానే జరిగింది. మీరు గమనించే
ఉంటారు. 5ఆ కారణంగా నేనిక ఓపికతో ఉండలేక మీ
విశ్వాసాన్ని గురించి తెలుసుకోవటానికి అతణ్ణిపంపాను.
ఏదో ఒక విధంగా సైతాను మిమ్మల్ని శోధిస్తాడని,
నా శ్రమ వృధా అయిపోయిందని భయపడ్డాను.
6కాని తిమోతి మీ దగ్గర నుండి యిప్పుడే వచ్చాడు.
మీ విశ్వాసాన్ని గురించి, మీ ప్రేమను గురించి మంచి
వార్త తీసుకొని వచ్చాడు. మమ్మల్ని గురించి అన్ని
వేళలా మీరు మంచిగా భావిస్తున్నారని తెలిసింది. మేము
మిమ్మల్ని చూడటానికి ఎదురు చూస్తున్నట్లే, మీరు
కూడా మమ్మల్ని చూడటానికి ఆశిస్తున్నారని అతడు
మాకు చెప్పాడు. 7సోదరులారా! మేము దుఃఖంతో
ఉన్నప్పుడు, హింసలను అనుభవిస్తున్నప్పుడు మీ
విశ్వాసం చూసి ఆనందించాము. 8మీకు ప్రభువు పట్ల
ఉన్న విశ్వాసాన్ని మీరు విడువకుండా ఉంటే మా
జీవితం సార్థకమౌతుంది. 9మేము దేవుని సమక్షంలో
ఉన్నప్పుడు మీ విషయంలో చాలా కృతజ్ఞులము.
మేము ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా అవి తక్కువే!
10మిమ్మల్ని చూసే అవకాశం కలగాలని, మీ విశ్వాసం
దృఢపడాలని, దానికి కావలసినవి దేవుడు ఇవ్వాలని,
రాత్రింబగళ్ళు మనసారా దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటాము.
11మన తండ్రియైన దేవుడు, మన ప్రభువైన యేసు
మేము మీ దగ్గరకు రావటానికి మాకు దారి చూపుగాక!
12మీపై ఉన్న మా ప్రేమ అభివృద్ధి చెందుతున్నట్లే,
మీలో పరస్పరం ప్రేమ అభివృద్ధి చెందేటట్లు,
యితరుల పట్ల కూడా మీ ప్రేమ అభివృద్ధి చెందేటట్లు
ప్రభువు అనుగ్రహించుగాక. 13మన యేసు ప్రభువు
భక్తులతో వచ్చినప్పుడు మన తండ్రియైన దేవుని
ముందు మీరు ఏ అపకీర్తి లేకుండా పవిత్రంగా ఉండే
టట్లు దేవుడు మీకు శక్తి ననుగ్రహించుగాక!

### దేవునికి నచ్చిన జీవితం

4 సోదరులారా! చివరకు చెప్పేదేమిటంటే దేవుని
మెప్పు పొందటానికి ఏ విధంగా జీవించాలో మేము
మీకు బోధించాము. మీరు మేము చెప్పినట్లు జీవిస్తు
న్నారు. కాని మేము ప్రస్తుతం యేసు ప్రభువు పేరిట
మిమ్మల్ని అడిగేదేమిటంటే మీరు ఆ జీవితాన్ని యింకా
సంపూర్ణంగా జీవించాలి. ఇది మా విజ్ఞప్తి. 2యేసు
ప్రభువు యిచ్చిన అధికారంతో మేము చెప్పిన ఉపదే
శాలు మీకు తెలుసు. 3మీరు పవిత్రంగా ఉంటూ వ్యభి
చారం చేయకుండా ఉండాలి. ఇది దేవుని యిచ్ఛ.
4మీరు పవిత్రంగా, గౌరవప్రదంగా జీవించాలి. మీ దేహా
లను మీరు అదుపులో పెట్టుకోవాలి.* 5పవిత్రులు
కాని వాళ్ళు లైంగిక వాంఛలతో బ్రతుకుతూ ఉంటారు.

---

**మీ దేహాలను ... పెట్టుకోవాలి** లేక “నీ భార్యతో ఎలా జీవించాలో నేర్చుకోవాలి.”

ఆ విధంగా మీరు జీవించకూడదు. 6ఈ విషయంలో
ఎవరూ తమ సోదరుల్ని మోసం చేయరాదు. వాళ్ళను
తమ లాభానికి ఉపయోగించుకోరాదు. అలాంటి పాపం
చేసిన వాళ్ళను ప్రభువు శిక్షిస్తాడు. మేము దీన్ని గురించి
ముందే చెప్పి వారించాము. 7దేవుడు మనల్ని పిలిచింది
అపవిత్రంగా ఉండేందుకు కాదు. పవిత్రంగా జీవించేం
దుకు పిలిచాడు. 8అందువల్ల ఈ ఉపదేశాన్ని తృణీకరిం
చిన వాడు మానవుణ్ణి కాదు, తన పరిశుద్ధాత్మ నిచ్చిన
దేవుణ్ణి తృణీకరించిన వాడౌతాడు.

9సోదర ప్రేమను గురించి మేము వ్రాయవలసిన
అవసరం లేదు. ఎందుకంటే పరస్పరం ప్రేమించు
కొనుమని దేవుడే మీకు బోధించాడు. 10నిజానికి మాసి
దోనియ ప్రాంతంలో ఉన్న సోదరులందరినీ మీరు
ప్రేమిస్తున్నారు. కాని సోదరులారా! మీరు యింకా
ఎక్కువ ప్రేమించాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

11మేమిదివరకే చెప్పిన విధంగా శాంతితో జీవించా
లని ఆశించండి. మీ స్వహస్తాలతో పని చేస్తూ యితర్ల
జోలికి పోకుండా జీవించండి. 12అలా చేస్తే మీ నిత్య
జీవితాన్ని చూసి యితర్లు మిమ్మల్ని గౌరవిస్తారు.
అప్పుడు మీరు యితర్లపై ఆధార పడనవసరం
ఉండదు.

## ప్రభువు రాక

13సోదరులారా! చనిపోయిన వాళ్ళను గురించి మీకు
తెలియాలని మా కోరిక. బ్రతుకుపై ఆశలేని వాళ్ళవలే
దుఃఖించరాదని మా కోరిక. 14యేసు చనిపోయి తిరిగి
బ్రతికివచ్చాడని మనం నమ్ముతాము. అందుకే
యేసును విశ్వసించిన వాళ్ళు మరణించినప్పుడు
దేవుడు వాళ్ళను ఆయనతో సహా బ్రతికిస్తాడని కూడా
మనం విశ్వసిస్తాము. 15ప్రభువు వచ్చేవరకు మనం
బ్రతికి ఉంటే, యింతకు క్రితము చనిపోయిన వాళ్ళ
కంటే ముందు వెళ్ళము. ఇది ప్రభువు స్వయంగా
చెప్పాడు. 16ప్రభువు పరలోకం నుండి దిగివచ్చి
నప్పుడు ప్రధాన దూతతో అధికార పూర్వకంగా
వస్తాడు. అప్పుడు ప్రధాన దూత శబ్దము, దేవుని బూర
శబ్దం వినిపిస్తాయి. అప్పుడు క్రీస్తులో చనిపోయిన
వాళ్ళు మొదటలేస్తారు. 17ఆ తర్వాత యింకా బ్రతికి
ఉన్న మనల్ని ప్రభువు వాళ్ళతో సహా ఆకాశంలో
ఉన్న మేఘాల్లోకి తీసుకువెళ్తాడు. అప్పటినుండి మనం
ఆయనతో చిరకాలం ఉండిపోతాము. 18అందువల్ల
వీటిని గురించి మాట్లాడుకొని పరస్పరం ధైర్యం చెప్పు
కోండి.

## ప్రభువు రాకకు సిద్ధంగా ఉండండి

5 సోదరులారా! ఇవి ఎప్పుడు జరుగనున్నాయో,
వాటి సమయాలను గురించి, కాలములను గురించి
మేము వ్రాయనవసరం లేదు. 2ప్రభువు రానున్న
దినము అకస్మాత్తుగా రాత్రి పూట దొంగ వచ్చినట్లు
వస్తుందని మీకు బాగా తెలుసు. 3ప్రజలు, "మేము
శాంతంగా, క్షేమంగా ఉన్నాము" అని అంటున్నప్పుడు
గర్భిణీయైన స్త్రీకి ఆకస్మాత్తుగా నొప్పులు వచ్చినట్లే
వాళ్ళు నాశనమౌతారు. తప్పించుకోలేరు. 4కాని సోదరు
లారా! మీరు చీకట్లో లేరు. కనుక ఆ దినం మిమ్మల్ని
దొంగల్లా ఆశ్చర్యపరచదు. 5మనం వెలుగుకు, పగటి
వేళకు సంబంధించిన వాళ్ళము. రాత్రికి, చీకటివేళకు
సంబంధించిన వాళ్ళము కాము. 6మరి అలాంటప్పుడు
యితరుల వలె నిద్రపోకుండా, హుషారుగా, ఆత్మ నిగ్ర
హంతో ఉందాము. 7ఎందుకంటే, నిద్రపొయ్యే వాళ్ళు
రాత్రివేళ నిద్రపోతారు. త్రాగుబోతులు రాత్రివేళ త్రాగు
తారు. 8మనం పగటికి చెందిన వాళ్ళము కనుక ఆత్మ
నిగ్రహంతో ఉందాము. విశ్వాసాన్ని, ప్రేమను కవచం
గాను; రక్షణ, నిరీక్షణలను శిరస్త్రాణంగా ధరించుదాము.
9ఎందుకంటే దేవుడు కోపాన్ని చూపటానికి మనల్ని
ఎన్నుకోలేదు. మన యేసు క్రీస్తు ప్రభువు ద్వారా
రక్షణ ఇవ్వటానికి ఎన్నుకొన్నాడు. 10మనం మరణిం
చినా, లేక బ్రతికి ఉన్నా తాను వచ్చినప్పుడు తనతో
కలిసి జీవించాలని క్రీస్తు మన కోసం మరణించాడు.
11మీరు ఎప్పటిలాగే పరస్పరం ఉత్సాహ పరచుకుంటూ,
యితర్ల అభివృద్ధికి తోడ్పడుతూ ఉండండి.

## చివరి మాట

12సోదరులారా! మేము ప్రస్తుతం కోరేదేమిటంటే,
కష్టపడి పని చేస్తూ ప్రభువు సేవలో మీకు దారి
చూపుతూ మీకు బోధిస్తున్న వాళ్ళను గౌరవించండి.
13వాళ్ళు మంచి కార్యం చేస్తున్నారు కనుక వాళ్ళను
అందరికన్నా ఎక్కువగా ప్రేమించి గౌరవించండి.
శాంతంగా జీవించండి. 14సోదరులారా! సోమరులను
వారించండి. పిరికి వాళ్ళకు ధైర్యం చెప్పండి. అందరి
పట్ల శాంతంగా ఉండండి. బలహీనుల్ని బలపర్చండి.
ఇది మా విజ్ఞాపన. 15కీడు చేసిన వాళ్ళకు తిరిగి కీడు
చేసే వాళ్ళను గమనిస్తూ వాళ్ళను అలా చేయనీయ
కుండా జాగ్రత్త పడండి. పరస్పరం దయ కలిగి యితర్ల
పట్ల దయచూపుతూ ఉండండి. 16ఎప్పుడూ ఆనం
దంగ వుండండి. విడువకుండా ప్రార్థించండి. 17దైవ
నియమాన్ని తప్పక పాటించండి. 18అన్ని వేళలా దేవు
నికి కృతజ్ఞతతో ఉండండి. యేసు క్రీస్తు వల్ల కలిగిన
జీవితంలో మీరు ఈ విధంగా ఉండాలని దేవుని కోరిక.

19ఆత్మ వెలిగించిన జ్యోతిని ఆర్పి వేయకండి.
20ప్రవక్తలు చెప్పిన వాటిని తూలనాడకండి.

21అన్నిటినీ పరీక్షించండి. మంచిని విడువకండి.
22చెడుకు దూరంగా ఉండండి.

23శాంతిని ప్రసాదించే ఆ దేవుడు మిమ్మల్ని పూర్తిగా
పవిత్రం చెయ్యనీయండి. మన యేసు క్రీస్తు ప్రభువు

వచ్చేరోజు, మీ అంతరాత్మ, ప్రాణం, దేహం ఏ అపకీర్తి
లేకుండా ఉండుగాక! 24మిమ్మల్ని పిలిచేవాడు విశ్వ
సింపదగ్గవాడు. ఆయన మేము కోరింది తప్పక
చేస్తాడు. 25సోదరులారా! మా కోసం ప్రార్థించండి.
26సోదరులందరినీ ప్రేమతో హృదయాలకు హత్తు
కోండి. 27ప్రభువు సమక్షంలో ఈ లేఖను సోదరు
లందరికీ చదివి వినిపించుమని నేను ఆజ్ఞాపిస్తున్నాను.
28మన యేసు ప్రభువు అనుగ్రహం మీపై ఉండుగాక!

# థెస్సలొనీకయులకు వ్రాసిన రెండవ లేఖ

## ప్రార్థన, కృతజ్ఞత

1 పౌలు, సిల్వాను మరియు తిమోతిల నుండి మన
తండ్రియైన దేవునికి మరియు యేసు క్రీస్తు
ప్రభువుకు చెందిన థెస్సలొనీకయుల సంఘానికి:
2మన తండ్రియైన దేవుడు, యేసు క్రీస్తు ప్రభువు
మీకు అనుగ్రహము, శాంతి ప్రసాదించు గాక!
3సోదరులారా! మీ విశ్వాసం రోజు రోజుకు అభివృద్ధి
చెందుతోంది. మీ మధ్య ఉన్న ప్రేమ వర్థిల్లుతోంది.
కనుక మీ విషయంలో మేము దేవునికి అన్నివేళలా
కృతజ్ఞతగా ఉండాలి. 4మీరు ఓర్పుతో సహిస్తున్న హింస
లను గురించి, కష్టాలను గురించి విశ్వాసాన్ని గురించి
మేము పొగడుతూ దేవుని ఇతర సంఘాలకు చెపుతూ
ఉంటాము.
5దేవుడు న్యాయంగా తీర్పు చెబుతాడన్న దానికి
ఇది సాక్ష్యం. మీరు దేనికొరకు వీటిని అనుభవిస్తున్నారో
ఆ రాజ్యానికి దేవుడు మిమ్మల్ని అర్హులుగా చేస్తాడు.
6దేవుడు నీతిమంతుడు. మిమ్మల్ని కష్టపెట్టిన వాళ్ళకు
కష్టం కలిగిస్తాడు. 7ఆయన మనందరి కష్టాలు తొలిగి
స్తాడు. ఇది యేసు ప్రభువు పరలోకం నుండి, శక్తిగల
దేవదూతలతో, అగ్ని జ్వాలలతో వచ్చినప్పుడు సంభ
విస్తుంది. 8దేవుడు అంటే ఎవరో తెలియని వాళ్ళను,
మన ప్రభు యేసు సువార్తను అంగీకరించని వాళ్ళను
ఆయన శిక్షిస్తాడు. 9వాళ్ళు ప్రభువు సమక్షంలో నుండి,
ఆయన గొప్పశక్తి నుండి దూరమై శాశ్వతంగా నాశనమై
పోతారు. 10ఆయన వచ్చినప్పుడు ఆయన విశ్వాసులు
ఆయనతోసహా మహిమను పొందుతారు. అప్పుడు
ఆయనయందు విశ్వసించినవాళ్ళు ఆయన్ని చూసి
దిగ్భ్రాంతి చెందుతారు. మేము చెప్పిన సందేశాన్ని
మీరు కూడా విశ్వసించారు కనుక మహిమను పొందే
వాళ్ళలో మీరు కూడా ఉన్నారు.
11ఇది మనస్సులో పెట్టుకొని తాను పిలిచిన పిలు
పుకు తగినట్లు మీ జీవితాలను నడుపమని మేము
దేవుణ్ణి ప్రతి రోజూ ప్రార్థిస్తూ ఉంటాము. అంతేకాక,
మీరు మంచి చేయాలని ఆశిస్తూ కోరుకొన్న ప్రతి
కోరికను, విశ్వాసం వల్ల మీరు చేస్తున్న ప్రతి కార్యాన్ని
దేవుడు తన శక్తి ద్వారా పూర్తి చేయాలనీ ప్రార్థిస్తూ
ఉంటాము. 12మీ ద్వారా మన యేసు క్రీస్తు ప్రభువు
మహిమ పొందాలని, మీకు ఆయన ద్వారా తన మహి
మలో భాగం కలగాలని మేము ప్రార్థిస్తూ ఉంటాము.
ఇది మన దేవుని అనుగ్రహం వల్ల, యేసు క్రీస్తు ప్రభువు
యొక్క కృప వల్ల సంభవిస్తుంది.

## పాప పురుషుడు

2 సోదరులారా! మన యేసు ప్రభువు రాకను
గురించి, ఆయనతో జరుగబోయే సమావేశాన్ని
గురించి మీకు కొన్ని విషయాలు చెప్పాలి. 2ఎవరైనా
వచ్చి తమకు మేము ఏదైనా ఉత్తరం వ్రాసినట్లు లేదా
ప్రభువు రానున్నదినం వచ్చినట్లు తెలిసిందని చెప్పినా,
లేక ఆత్మద్వారా ఆ విషయం తెలిసిందని చెప్పినా,
లేక ఆ విషయాన్ని గురించి మిమ్మల్ని ఎవరైనా
వారించినా భయపడకండి. దిగులు చెందకండి.
3మిమ్మల్ని ఎవ్వరూ ఏ విధంగా మోసం చేయకుండా
జాగ్రత్త పడండి. దేవుని పట్ల తిరుగుబాటు జరిగి, ఆ
నాశన పుత్రుడు, దుష్టుడు కనిపించేదాకా ఆ రోజు
రాదు. 4అంతేగాక దేవునికి సంబంధించిన ప్రతిదానిపై
ఆ భ్రష్టుడు తనను తాను హెచ్చించు కొంటూ మంది
రంలో ప్రతిష్ఠించుకుని తానే దేవుణ్ణని ప్రకటిస్తాడు.
5నేను మీతో ఉన్నప్పుడు ఈ విషయాలన్నీ
చెప్పాను. మీకు జ్ఞాపకం ఉంది కదా? 6ఆ భ్రష్టుని
రాకను ఏది అడ్డగిస్తుందో మీకు తెలుసు. సరియైన
సమయానికి రావాలని వాని రాక ఆపబడింది. 7వాని
అధర్మం రహస్యంగా పనిచేస్తూ తన శక్తిని చూపటం
అప్పుడే మొదలు పెట్టింది. దాన్ని అడ్డగించే వాడు
ఒకాయన ఉన్నాడు. వాణ్ణి అడ్డగిస్తున్న వాడు తీసివేయ
బడేదాకా ఆయన వాణ్ణి అడ్డగిస్తూనే ఉంటాడు.
8అప్పుడు ఆ భ్రష్టుడు కనిపిస్తాడు. యేసు ప్రభువు
వాణ్ణి తన వూపిరితో హతమారుస్తాడు. యేసు తేజోవం
తంగా ప్రత్యక్షమై ఆ భ్రష్టుణ్ణి నాశనం చేస్తాడు. 9ఆ
భ్రష్టుడు సైతాను శక్తితో వచ్చి రకరకాల మహాత్కా
ర్యాలు చేస్తాడు. దొంగ చిహ్నాలు, అద్భుతాలు చేసి
మోసం చేస్తాడు. 10నాశనం కానున్న వాళ్ళను అన్ని
విధాలా మోసం చేస్తాడు. వాళ్ళు సత్యాన్ని ప్రేమించ

టానికి, దేవుని రక్షణను స్వీకరించటానికి నిరాకరించారు కనుక నశించిపోతారు. 11ఈ కారణంగా దేవుడు వాళ్ళకు మోసం చేసే శక్తిని పంపుతాడు. వాళ్ళు దాన్ని నమ్ముతారు. 12సత్యాన్ని నమ్మక అధర్మంగా జీవించాలని నిశ్చయించుకొన్న వాళ్ళందరినీ శిక్షిస్తాడు.

### బలంగా నిలబడండి

13సోదరులారా! ప్రభువు మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు. మీకోసం మేము దేవునికి అన్నివేళలా కృతజ్ఞతతో ఉండాలి. పరిశుద్ధాత్మ మిమ్మల్ని పరిశుద్ధ పరచటవల్ల, సత్యంలో మీకున్న విశ్వాసం వల్ల దేవుడు మిమ్మల్ని రక్షించటానికి కాలానికి ముందే ఎన్నుకొన్నాడు.

14మన యేసు క్రీస్తు ప్రభువు యొక్క మహిమలో మీరు భాగం పంచుకోవాలని, మీరు రక్షణ పొందాలనీ, దేవుడు మా సువార్త ద్వారా మిమ్మల్ని పిలిచాడు. 15సోదరులారా! మేము లేఖ ద్వారా మరియు మా బోధన ద్వారా బోధించిన సత్యాలను విడువకుండా నిష్ఠతో అనుసరించండి.

16యేసు క్రీస్తు ప్రభువు, మనల్ని ప్రేమించిన మన తండ్రియైన దేవుడు మనల్ని అనుగ్రహించి మనకు అనంతమైన ధైర్యాన్ని, మంచి ఆశాభావాన్ని ఇచ్చారు. 17దేవుడు మిమ్మల్ని ప్రోత్సాహ పరిచి, మంచి పనులు చేయటానికి, మంచి మాటలు ఆడటానికి, మీకు ధైర్యం కలుగజేయునుగాక!

### మా కోసం ప్రార్థించండి

3 సోదరులారా! చివరకు చెప్పేదేమిటంటే మా కోసం ప్రార్థించండి. ప్రభువు సందేశం మీలో వ్యాపించిన విధంగా త్వరలోనే మిగతా వాళ్ళలో కూడా వ్యాపించి కీర్తి చెందాలని ప్రార్థించండి. 2విశ్వాసం అందరిలో ఉండదు. కనుక దుర్మార్గుల నుండి, దుష్టుల నుండి మేము రక్షింపబడాలని ప్రార్థించండి.

3కాని ప్రభువు నమ్మతగిన వాడు. కనుక ఆయన మిమ్మల్ని సైతాను నుండి రక్షించి మీకు శక్తి కలిగిస్తాడు. 4మా ఆజ్ఞల్ని పాటిస్తున్నారనీ ఇక ముందుకునూ పాటిస్తారనీ మాకు నమ్మకం ఉంది. ఈ నమ్మకం మాకు ప్రభువువల్ల కలిగింది. 5తండ్రియైన దేవునిలో ఉన్న ప్రేమ, క్రీస్తులో ఉన్న సహనము మీ హృదయాల్లో నింపబడాలని మా అభిలాష.

### పని చెయ్యటం మీ కర్తవ్యం

6సోదరులారా! యేసు క్రీస్తు ప్రభువు పేరిట మేము ఆజ్ఞాపిస్తున్నదేమనగా మా నుండి విన్న క్రీస్తు సందేశం ప్రకారం జీవించక అక్రమంగా జీవిస్తున్న ప్రతి సోదరునితో సాంగత్యం చెయ్యకండి. 7మమ్మల్ని అనుసరించాలని మీకు బాగా తెలుసు. మేము మీతో ఉన్నప్పుడు సోమరులంగా ఉండలేదు. 8అంతేకాక మేము ఎవరి ఇంట్లోనైనా వూరికే భోజనం చేయలేదు. మీలో ఎవ్వరికీ కష్టం కలిగించరాదని మేము రాత్రింబగళ్ళు కష్టపడి పని చేసాము. 9మీ నుండి అలాంటి సహాయం కోరే అధికారం మాకు ఉంది. కాని మీకు ఆదర్శంగా ఉండాలని అలా చేసాము. 10మేము మీతో ఉన్నప్పుడే, “మనిషి పని చేయకపోతే భోజనం చేయకూడదు” అని చెప్పాము.

11మీలో కొందరు సోమరులని విన్నాము. వాళ్ళు పని చెయ్యక పోవటమే కాకుండా ఇతరుల విషయంలో జోక్యం కలుగ చేసుకొంటున్నారని విన్నాము. 12వాళ్ళు ఇతరుల విషయంలో జోక్యం కలిగించుకోరాదని, తాము తినే ఆహారం పనిచేసి సంపాదించాలని యేసు క్రీస్తు పేరిట ఆజ్ఞాపిస్తున్నాము. 13ఇక మీ విషయమంటారా, మంచి చెయ్యటం మానకండి.

14ఈ లేఖలో వ్రాసిన మా ఉపదేశం ఎవరైనా పాటించక పోతే అలాంటి వాళ్ళను ప్రత్యేకంగా గమనించండి. అలాంటి వాణ్ణి సిగ్గుపడేటట్లు చెయ్యటానికి అతనితో సాంగత్యం చేయకండి. 15అయినా అతణ్ణి శత్రువుగా పరిగణించకుండా సోదరునిగా భావించి అతణ్ణి వారించండి.

### చివరి మాట

16శాంతిని ప్రసాదించే ప్రభువు మీకు అన్ని వేళలా, అన్ని విధాలా శాంతి ప్రసాదించుగాక! పైగా ఆయన మీ అందరికీ తోడై ఉండుగాక!

17పౌలను నేను, నా స్వహస్తాలతో మీకు శుభాకాంక్షలు తెలుపుతున్నాను. నా లేఖలన్నిటిలో నేను ఇదే విధంగా సంతకం చేస్తాను. ఇది నా పద్ధతి. 18మన యేసు క్రీస్తు అనుగ్రహం మీ అందరికీ లభించుగాక!

# తిమోతికి వ్రాసిన మొదటి లేఖ

1 విశ్వాసంలో నా కుమారునితో సమానమైన తిమో
తికి పౌలు వ్రాయడం ఏమనగా, నేను మన రక్షకుడైన
దేవుని ఆజ్ఞానుసారమూ, మనకు రక్షణ లభిస్తున్న
ఆశకు మూలకారకుడైన యేసు క్రీస్తు ఆజ్ఞానుసా
రమూ, యేసు క్రీస్తుకు అపొస్తలుడనయ్యాను. 2తండ్రి
అయినటువంటి దేవుడు, మన యేసు క్రీస్తు ప్రభువు,
నీపై అనుగ్రహం చూపాలనీ, నిన్ను కరుణించాలనీ,
నీకు శాంతి చేకూర్చాలనీ ఆశిస్తున్నాను.

## దొంగ బోధకుల విషయంలో జాగ్రత్త

3నేను మాసిదోనియకు వెళ్ళినప్పుడు నీకు చెప్పిన
విధంగా నీవు ఎఫెసులో ఉండుము. అక్కడ కొందరు
తప్పుడు సిద్ధాంతాలు బోధిస్తున్నారు. వాళ్ళతో ఆ
విధంగా చెయ్యవద్దని చెప్పు. 4అంతేకాక, వాళ్ళు
పుక్కిటి పురాణాలు చెప్పకూడదనీ, అంతు పొంతులేని
వంశావళితో సమయం వ్యర్థం చేయవద్దని కూడా ఆజ్ఞా
పించు. ఇలాంటివి దైవకార్యానికి తోడ్పడడానికి బదు
లుగా చీలికలు కల్గిస్తాయి. దైవకార్యం విశ్వాసంతో
కూడుకొన్న పని. 5ఇందులోని ఉద్దేశ్యం ఏమిటంటే,
పవిత్ర హృదయం నుండీ, స్వచ్ఛమైన అంతరాత్మ
నుండీ, నిజమైన విశ్వాసం నుండి ఉద్భవించే ప్రేమను
కలిగియుండటమే. 6కొందరు వ్యక్తులు నిజమైన
ధ్యేయం మరిచిపోయి, వ్యర్థంగా తిరిగిపోయారు.
7తాము ధర్మశాస్త్ర పండితులు కావాలనుకొంటారు.
కాని వాళ్ళకు వాళ్ళు చెప్పే మాటలే తెలియదు.
నమ్మకంతో మాట్లాడు తున్న విషయాలను గురించి
వాళ్ళకు తెలియదు.
8ధర్మశాస్త్రాన్ని మానవుడు సక్రమంగా ఉపయో
గిస్తే మంచిదని మనకు తెలుసు. 9మంచి వాళ్ళ కోసం
ధర్మశాస్త్రం వ్రాయబడలేదని మనకు తెలుసు. చట్ట
విరుద్ధంగా ప్రవర్తించే వాళ్ళ కోసం, తిరుగుబాటు చేసే
వాళ్ళ కోసం, దేవుణ్ణి నమ్మని వాళ్ళకోసం, భక్తిహీనుల
కోసం, పాపులకోసం, అపవిత్రమైనవాళ్ళకోసం, తల్లి
దండ్రులను గౌరవ పరచనివాళ్ళకోసం, హంతకుల
కోసం, 10వ్యభిచారుల కోసం, కామంతో అసహజంగా
ప్రవర్తించేవాళ్ళకోసం, బానిస వ్యాపారం చేసేవాళ్ళ
కోసం, అసత్యాలాడే వాళ్ళకోసం, దొంగ సాక్ష్యాలు
చెప్పేవాళ్ళకోసం, నిజమైన బోధనకు వ్యతిరేకంగా
నడుచుకొనే వాళ్ళకోసం, అది వ్రాయబడింది. 11నాకం
దించిన దివ్యమైన ఆ సువార్తలో ఈ ఉపదేశం ఉంది.
దాన్ని తేజోవంతుడైన దేవుడు నాకందించాడు.

## దేవుని దయకు నేను కృతజ్ఞుణ్ణి

12నాకు శక్తినిచ్చి, నన్ను విశ్వాసపాత్రునిగా ఎంచి,
ఈ సేవకోసం నన్ను నియమించిన మన యేసు
క్రీస్తు ప్రభువుకు నా కృతజ్ఞతలు అర్పిస్తున్నాను. 13ఒక
నాడు నేను దైవదూషణ చేసిన వాణ్ణి, హింసించిన
వాణ్ణి, క్రూరుణ్ణి. నేను అమాయకంగా నాలో విశ్వాసం
లేకపోవడం వల్ల అలా ప్రవర్తించానని దేవుడు నన్ను
కనికరించాడు. 14మన ప్రభువు తన అనుగ్రహాన్ని నాపై
ధారాళంగా కురిపించాడు. ఆ అనుగ్రహంతో పాటు
యేసు క్రీస్తులో ఉన్న విశ్వాసగుణాన్ని, ప్రేమను కూడా
నాకు ప్రసాదించాడు.
15పాపులను రక్షించటానికి యేసు క్రీస్తు ఈ లోకా
నికి వచ్చాడు. ఇది విశ్వసింపదగిన విషయం. దీన్ని
అందరూ అంగీకరించాలి. ఆ పాపుల్లో నేను ప్రథముణ్ణి,
16నేను ప్రథముణ్ణి కనుకనే యేసు నాపై దయ
చూపాడు. ఈ విధంగా తనను విశ్వసించబోయే
వాళ్ళకు, తన వల్ల విముక్తి పొందబోయే వాళ్ళకు
అనంతమైన తన సహనము ఆదర్శంగా ఉండాలని
అంతులేని సహనాన్ని ప్రదర్శించాడు. 17చిరకాలం
రాజుగా ఉండే దేవునికి, కంటికి కనిపించని, చిరంజీవి
అయినటువంటి ఆ ఒకే ఒక దేవునికి గౌరవము, మహిమ
చిరకాలం కలుగుగాక! ఆమేన్.
18తిమోతీ, నా కుమారుడా! గతంలో ప్రవక్తలు నీ
భవిష్యత్తును గురించి చెప్పారు. దాని ప్రకారం మంచి
పోరాటం సాగించి ఆ ప్రవక్తలు చెప్పినవి సార్థకం చేయు
మని ఆజ్ఞాపిస్తున్నాను. 19విశ్వాసంతో, మంచి హృద
యంతో పోరాటం సాగించు. కొందరు వీటిని వదిలి
తమ విశ్వాసాన్ని పోగొట్టుకొన్నారు. 20హుమెనైయు,
అలెక్సంద్రు ఇలాంటి వాళ్ళు. వీళ్ళు దైవదూషణ
చెయ్యకుండా ఉండటం నేర్చుకోవాలని వాళ్ళను
సైతానుకు అప్పగించాను.

### ప్రార్థన

2 నేను మిమ్మల్ని వేడుకొనేదేమిటంటే మొదట
విజ్ఞాపనలు, ప్రార్థనలు, కృతజ్ఞతలు ప్రజలందరి
పక్షాన చెయ్యండి. 2ముఖ్యంగా రాజుల పక్షాన, అధి
కారుల పక్షాన దేవునికి విజ్ఞాపన చెయ్యండి. అప్పుడు
మనము నిశ్చింతగా, శాంతంగా సత్ప్రవర్తనతో, ఆత్మీ
యతతో జీవించగల్గుతాము. 3ఇలా చెయ్యటం
ఉత్తమం. మరియు మన రక్షకుడైన దేవునికి అది
సంతృప్తి కలిగిస్తుంది. 4మానవులందరూ రక్షింపబడా
లనీ, సత్యాన్ని గ్రహించాలనీ దేవుని ఇష్టం. 5ఎందుకంటే
ఒకే ఒక దేవుడున్నాడు. దేవునికి, మానవులకు మధ్య
సంధి కుదుర్చటానికి ఒకే ఒక మధ్యవర్తి ఉన్నాడు.
ఆయనే మానవునిగా జన్మించిన యేసు క్రీస్తు.
6ఆయన మానవులకు విమోచన కలిగించాలని సరి
యైన సమయానికి తనను తాను ఒక వెలగా అర్పించు
కొన్నాడు. మానవులందరూ రక్షింపబడటమే దేవుని
ఉద్దేశ్యమన్న దానికి యిది నిదర్శనము. 7అందువలన
దేవుడు నన్ను ఒక దూతగా, అపొస్తలునిగా నియమించి
యూదులుకాని వాళ్ళకు నిజమైన విశ్వాసాన్ని బోధించ
టానికి పంపాడు. ఇది సత్యం. అబద్ధం కాదు.

8అన్ని స్థలాల్లో పురుషులు ఆగ్రహం చెందకుండా,
వాదనలు పెట్టుకోకుండా తమ పవిత్రమైన చేతులెత్తి
ప్రార్థించాలని నా అభిలాష. వాళ్ళు ఎక్కడ నివసిస్తున్నా
ఈ విధంగా ప్రార్థించాలి.

9స్త్రీలు గౌరవం కలిగించే దుస్తులు ధరించి విన
యంగా, మర్యాదగా ఉండాలి. బంగారునగలు,
ముత్యాలు, ఖరీదైన దుస్తులు, తలవెంట్రుకలతో నానా
విధపు ముడులు వేయటం. ఇవి మీకు అలంకార
ముగా అనుకొనక, 10దైవభక్తులమని చెప్పుకొనుటకు
తగినట్లుగా సత్కార్యములనే ఆభరణాలను అలంకా
రంగా ధరించాలి.

11స్త్రీలు నెమ్మదిగ ఉంటూ సంపూర్ణమైన విన
యంతో ఉండటం నేర్చుకోవాలి. 12స్త్రీలు బోధించ
టంగాని, పురుషులపై అధికారం చెయ్యటం గాని నేను
ఒప్పుకోను. వాళ్ళు ఎక్కువగా మాట్లాడకూడదు.
13దేవుడు ఆదామును మొదట సృష్టించాడు. ఆ తర్వాత
హవ్వను సృష్టించాడు. 14మోసపోయింది ఆదాము
కాదు. స్త్రీ మోసపోయి పాపియైనది. 15దేవుని పట్ల
విశ్వాసము, పవిత్రత, ప్రేమ, మర్యాద అనే గుణాలు
అలవర్చుకోవాలి. సంతానం కలుగుట ద్వారా ఆమెకు
క్షేమం కలుగుతుంది.

### పెద్దలు, పరిచారకులు

3 ఇక్కడొక నమ్మదగిన సంగతి: సంఘంలో పెద్ద
కావాలనుకొన్నవాడు గొప్ప సంగతినే కోరుకొను
చున్నాడు. 2పెద్దనిందకు చోటివ్వనివాడై ఉండాలి.
అతడు ఏకపత్నీవ్రతుడై ఉండాలి. మితంగా జీవించాలి.
వివేకవంతుడై ఉండాలి. సంఘంలో గౌరవం కలిగి
ఉండాలి. ఇతర్లకు సహాయం చేస్తూ ఉండాలి. బోధిం
చగల సామర్థ్యం ఉండాలి. 3అలాంటి వాడు మద్యం
త్రాగరాదు. అతనిలో కోపానికి మారుగ వినయం
ఉండాలి. పోట్లాడే గుణం ఉండకూడదు. ధనం మీద
ఆశ ఉండకూడదు. 4తన సంసారాన్ని సక్రమంగా
నడుపుకోగలిగి ఉండాలి. అతడు, తన పిల్లలు తనపట్ల
విధేయతగా ఉండేటట్లు, తనను మనస్ఫూర్తిగా గౌరవిం
చేటట్లు చేసుకోవాలి. 5తన సంసారాన్ని సక్రమంగా
నడుపుకోలేనివాడు, దేవుని సంఘాన్ని ఏ విధంగా నడప
గలడు? 6అతడు క్రొత్తగా నమ్మిన వాడై ఉండకూడదు.
అటువంటి వ్యక్తి ఉబ్బిక్కిపోయి సైతాను పొందిన
శిక్షనే పొందవచ్చు. 7సంఘానికి చెందని వాళ్ళలో
కూడా అతనికి మంచి పేరు ఉండాలి. అప్పుడే అతడు
చెడ్డ పేరు పొందకుండా సైతాను వలలో పడకుండా
ఉంటాడు.

8అదే విధంగా సంఘ పరిచారకులు గౌరవింపదగిన
వాళ్ళై ఉండాలి. నీతిపరులై ఉండాలి. త్రాగుబోతులు
కాకూడదు. మోసాలు చేసి లాభాలు పొందే వాళ్ళు
కాకూడదు. 9దేవుడు చెప్పిన సత్యాలను వాళ్ళు పవిత్ర
హృదయంతో ఆచరించాలి. 10వాళ్ళు మొదట పరీక్షింప
బడాలి. ఆ తర్వాత ఎవ్వరికీ ఏ ఆక్షేపణ లేనట్లయితే
వాళ్ళను పరిచారకులుగా ఎన్నుకోవచ్చు. 11అదే
విధంగా పరిచర్యచేయు స్త్రీలు* కూడా గౌరవింపదగిన
వాళ్ళై ఉండాలి. వాళ్ళు యితర్లను నిందిస్తూ మాట్లాడ
రాదు. అన్ని విషయాల్లో మితంగా ఉండాలి. నమ్మదగిన
వాళ్ళై ఉండాలి. 12పరిచారకుడు కూడా ఏకపత్నీ
వ్రతుడై ఉండాలి. తన పిల్లల్ని, కుటుంబాన్ని సక్ర
మంగా నడపాలి. 13ఆ విధంగా నడిపేవాళ్ళు క్రీస్తులో
మంచి పేరు, బలమైన విశ్వాసం సంపాదించుకొంటారు.

14నేను నీ దగ్గరకు త్వరలోనే రావాలను కొంటు
న్నాను. అయినా నేనీ ఆజ్ఞల్ని ఎందుకు వ్రాస్తున్నా
నంటే, 15ఒకవేళ నేను రావటం ఆలస్యం అయితే
ప్రజలు దేవుని కుటుంబంలో, అంటే సజీవుడైన దేవుని
సంఘంలో ఏ విధంగా ప్రవర్తించాలో ఈ లేఖ ద్వారా
నీకు తెలియజేస్తున్నాను. దేవుని సంఘం ఒక స్తంభం
లాంటిది. అది సత్యానికి ఆధారమైనది. 16ఆత్మీయ
తలో ఉన్న రహస్యం నిస్సందేహంగా చాలా గొప్పది.

క్రీస్తు మానవ రూపం ఎత్తాడు. పరిశుద్ధాత్మ
వలన ఆయన నిజమైన నిర్దోషిగా నిరూపిం
చబడ్డాడు. దేవదూతలు ఆయన్ని
చూసారు. రక్షకుడని ఆయన గురించి ప్రజ

**స్త్రీలు** ఈ స్త్రీలు పరిచారకుల భార్యలైయుండవచ్చు. లేక పరిచారకులకు సహకరించేసహాయకులైయుండవచ్చు. విశేష సేవ చేయుటకు ఏర్పరచబడిన స్త్రీలు, రోమా 16:1 చూడండి.

లకు ప్రకటింపబడింది. ప్రజలు ఆయన్ని
విశ్వసించారు. ఆయన తన మహిమతో
పరలోకానికి కొనిపోబడ్డాడు.

### దొంగ పండితులు

4 చివరిదినాల్లో కొందరు విశ్వాసాన్ని వదిలి మోస
గించే దయ్యాల బోధనల్ని అనుసరిస్తారని పరి
శుద్ధాత్మ స్పష్టంగా చెపుతున్నాడు. 2దొంగ మాటలు
చెప్పేవాళ్ళు దొంగ ఉపదేశాలు చేస్తారు. వాళ్ళ అంత
రాత్మలు మొద్దుబారాయి. 3అలాంటి వాళ్ళు వివాహం
చేసుకోవటం తప్పని, కొన్ని రకాల ఆహారాలు తిన
కూడదని బోధిస్తారు. కాని దేవుడు అన్ని ఆహారాలూ
తినటానికే సృష్టించాడు. విశ్వాసులు, సత్యాన్ని తెలుసు
కొన్న వాళ్ళు, దేవునికి కృతజ్ఞతలర్పించి ఆహారాన్ని
భుజించాలి. 4దేవుడు సృష్టించిన వన్నీ మంచివే కనుక
మనం దేన్నీ నిరాకరించకూడదు. అన్నిటినీ దేవునికి
కృతజ్ఞతలర్పించి భుజించాలి. 5అవి దేవుని వాక్యం
వల్లను, ప్రార్థన ద్వారాను పవిత్రం చేయబడినాయి.

### మంచి సేవకునిగా ఉండుము

6నీవీ బోధనలు సోదరులకు చెబితే యేసు క్రీస్తు
యొక్క మంచి సేవకునిగా పరిగణింపబడతావు. నీవు
విశ్వసించిన సత్యాలను, సుబోధనలను నీవు అనుసరి
స్తున్నావు కనుక నీకు అభివృద్ధి కల్గుతుంది. 7ఆత్మీ
యత లేని కాకమ్మ కథలకు, ముసలమ్మ కథలకు
దూరంగా ఉండు. భక్తితో ఉండటానికి అభ్యాసం
చెయ్యి. 8శారీరక శిక్షణ వల్ల కొంత ఉపయోగం ఉంది.
దైవభక్తివల్ల ప్రస్తుత జీవితంలోనూ, రానున్న జీవి
తంలోనూ మంచి కల్గుతుంది. కనుక అది అన్ని విష
యాల్లో ఉపయోగపడుతుంది. 9ఇది నమ్మదగిన
విషయం. సంపూర్ణంగా అంగీకరించ దగినది. 10మానవ
జాతి రక్షకుడైన దేవుణ్ణి, ముఖ్యంగా తనను నమ్మిన
వాళ్ళను రక్షించే సజీవుడైన దేవుణ్ణి మనం విశ్వ
సించాము. కనుకనే మనము సహనంతో కష్టించి
పనిచేస్తున్నాము.

11ఈ విషయాలు మిగతా వాళ్ళకు బోధించి,
వాటిని ఆచరించుమని ఆజ్ఞాపించు. 12నీవు వయస్సులో
చిన్నవాడైనందుకు నిన్నెవ్వడూ చులకన చెయ్య
కుండా జాగ్రత్త పడుము. క్రీస్తును విశ్వసించే వాళ్ళకు
మాటల్లో, జీవిత విధానంలో, ప్రేమలో, విశ్వాసంలో,
పవిత్రతలో ఆదర్శంగా ఉండు. 13నేను వచ్చేవరకు నీ
కాలాన్ని దైవవాక్యాలు బహిరంగంగా చదవటానికి,
వాటిని ఉపదేశించటానికి ఉపయోగించు. ప్రజల్లో విశ్వా
సాన్ని పెంపొందింప చేయుము. 14పెద్దలు తమ చేతుల్ని
నీపై ఉంచినప్పుడు ప్రవక్తలు చెప్పిన భవిష్యత్తు
ప్రకారం నీకు వరం లభించింది. దాన్ని నిర్లక్ష్యం చెయ్య
వద్దు. 15నేను చెప్పిన విషయాలపై నీ మనస్సు లగ్నం
చేయి. అప్పుడు అందరూ నీ అభివృద్ధిని గమనిస్తారు.
16నీ వ్యక్తిగత జీవితాన్నీ, నీవు బోధించే వాటినీ జాగ్రత్తగా
గమనించు. వాటిని పట్టుదలతో సాధించు. అలా చేస్తే
నిన్ను నీవు రక్షించుకొన్నవాడవౌతావు. నీ బోధన
విన్నవాళ్ళను రక్షించిన వాడవౌతావు.

### సలహాలు

5 వృద్ధులతో కఠినంగా మాట్లాడవద్దు. వాళ్ళను
తండ్రులుగా భావించి సలహాలు చెప్పు. చిన్న
వాళ్ళను నీ తమ్ములుగా భావించు. 2వయస్సు మళ్ళిన
స్త్రీని నీ తల్లిగా, పిన్న వయస్సుగల స్త్రీని పవిత్ర హృద
యంతో నీ సోదరిగా భావించు.

3అవసరంలోవున్న వితంతువులకు సహాయం
చేయుము. 4వితంతువులకు పిల్లలు గాని, పిల్లల పిల్లలు
గాని ఉన్నట్లయితే, వాళ్ళు తమ కుటుంబాన్ని
పోషించు కోవటం ముఖ్యంగా నేర్చుకోవాలి. ఆ విధంగా
తమ మతానికి సంబంధించి కర్తవ్యాలను నిర్వర్తించాలి.
అలా చేస్తే తమ తల్లిదండ్రుల ఋణం, తాత ముత్తాతల
ఋణం తీర్చు కొన్నట్లవుతుంది. అది దేవునికి సంతృప్తి
కలుగ చేస్తుంది. 5ఒంటరిగా దీనావస్థలో ఉన్న వితం
తువు తన ఆశల్ని దేవునిలో పెట్టుకొని, సహాయం
కోసం రాత్రింబగళ్ళు ప్రార్థిస్తుంది. 6కాని భోగాలకొరకు
జీవించే వితంతువు జీవిస్తున్నా మరణించినట్లే. 7ఈ
ఉపదేశాలను ప్రజలకు బోధించు. అప్పుడు వాళ్ళలో
ఎవ్వరూ నీలో తప్పు పట్టలేరు. 8తన స్వంతవారిని
ముఖ్యంగా తన కుటుంబాన్ని కాపాడ లేనివాడు మనం
నమ్మే సత్యాలను విడిచి అవిశ్వాసి అయిన వానితో
సమానం. అతడు దేవుణ్ణి నమ్మని వానికన్నా
అధ్వాన్నం.

9ఒకే పురుషుణ్ణి పెండ్లాడి అరవై ఏండ్లు దాటి
ఉంటే తప్ప ఆమె పేరు వితంతువుల జాబితాలో
చేర్చరాదు. 10అంతేకాక, సత్కార్యాలు చేసే స్త్రీయని
ఆమెకు మంచి పేరుండాలి. పిల్లల్ని సక్రమంగా
పెంచటం, అతిథి సత్కార్యాలు చెయ్యటం, పవిత్రుల
కాళ్ళు కడగటం, కష్టాల్లో ఉన్న వారికి సహాయం
చెయ్యటంలాంటి గుణాలు ఆమెలో ఉండాలి. తన
జీవితాన్ని యిలాంటి మంచి పనులు చెయ్యటానికి
అంకితం చేసిన స్త్రీగా ఉండాలి.

11పిన్న వయస్సుగల వితంతువుల్ని ఈ జాబితాలో
చేర్చవద్దు. వాళ్ళ వాంఛలు క్రీస్తు పట్ల వాళ్ళకున్న
భక్తిని మించిపోయినప్పుడు, వాళ్ళు మళ్ళీ పెళ్ళి చేసు
కోవాలనుకొంటారు. 12తద్వారా తమ మొదటి ప్రమా
ణాన్ని ఉల్లంఘిస్తారు. ఇలా చెయ్యటం వల్ల వాళ్ళకు
శిక్ష లభిస్తుంది. 13పైగా వాళ్ళు వ్యర్థంగా కాలయాపన
చెయ్యటానికి, ఇంటింటికి తిరగటానికి అలవాటు పడి
పోతారు. వాళ్ళిలా కాలాయాపన చెయ్యటమే కాకుండా
కబుర్లకు, యితర్ల విషయాల్లో జోక్యం కలిగించుకోవ

టానికి అలవాటుపడ్తారు. వాళ్ళకు మౌనంగా ఉండటం
చేతకాదు. 14అందువల్ల పిన్న వయస్సులో ఉన్న వితం
తువులు పెళ్ళి చేసుకొని పిల్లల్ని కని, తమ యిండ్లను
చూసుకోవాలి. ఇది నా సలహా. అప్పుడు వాళ్లను
నిందించడానికి యితర్లకు ఆస్కారము ఉండదు. 15నిజా
నికి కొందరు సైతాన్ను అనుసరించటానికి యిది వరకే
తిరిగి వెళ్ళారు. 16క్రీస్తును విశ్వసించే స్త్రీ,* తన
కుటుంబంలో వితంతువులున్నట్లైతే, వాళ్ళకు
సహాయం చేయాలి. సంఘంపై ఆ భారం వేయరాదు.
అప్పుడు క్రీస్తు సంఘం నిజంగా ఆసరాలేని వితంతు
వులకు సహాయం చేయ కల్గుతుంది.

17క్రీస్తు సంఘం యొక్క కార్యక్రమాలు నడిపించే
పెద్దలు, ముఖ్యంగా ఉపదేశించటానికి, బోధించటానికి
కష్టపడి పని చేస్తున్న పెద్దలు రెట్టింపు గౌరవానికి
అర్హులు. 18ఎందుకంటే ధర్మశాస్త్రంలో, “ధాన్యము
తొక్కే ఎద్దు మూతి కట్టరాదు” మరియు “పని చేసే
వానికి కూలి దొరకాలి” అని వ్రాయబడి ఉంది.

19ఇద్దరు లేక ముగ్గురు సాక్షులు ఉంటే తప్ప సంఘం
పెద్దలమీద మోపిన నేరాన్ని పరిశీలించవద్దు. 20తప్పు
చేసిన వాళ్ళను బహిరంగంగా ఖండించు. అలా చేస్తే
అది చూసి మిగతా వాళ్ళు జాగ్రత్త పడతారు.

21నేను దేవుని సమక్షంలో, యేసు క్రీస్తు సమ
క్షంలో, దేవుడు ఎన్నుకొన్న దేవదూతల సమక్షంలో
ఆజ్ఞాపిస్తున్నాను. ఒకని పక్షం వహించి మరొకని పట్ల
వ్యతిరేకంగా ఉండవద్దు. నిష్పక్షపాతంగా ఈ ఆజ్ఞల్ని
అమలులో పెట్టు. ఏదీ పక్షపాతంతో చెయ్యవద్దు.

22నీవు తొందరపడి ఎవరిమీద హస్తనిక్షేపణ చేయ
వద్దు. ఇతర్లపాపాల్లో భాగస్తుడవు కావద్దు. నిన్ను నీవు
పవిత్రంగా చూచుకో.

23నీళ్ళు మాత్రమే త్రాగవద్దు. నీ కడుపు బాగు
కావటానికి కొద్దిగా ద్రాక్షారసము త్రాగు. అప్పుడు నీవు
ఆరోగ్యంగా ఉంటావు.

24కొందరు చేసిన పాపాలు స్పష్టంగా కనిపిస్తు
న్నాయి. అవి వాళ్ళకన్నా ముందు తీర్పుకై పరుగెత్తుచు
న్నాయి. మరి కొందరి పాపాలు ఆలస్యంగా కనిపి
స్తాయి. 25అదే విధంగా మంచి పనులు స్పష్టంగా కనిపి
స్తాయి. రహస్యంగానుండే మంచి పనులు కూడా
బయలు పరచబడును.

6 బానిసత్వంలో ఉన్నవాళ్ళు తమ యజమాను
లను పూర్తిగా గౌరవించాలి. అప్పుడే దేవునికి,
మా బోధనకు చెడ్డపేరు రాకుండా ఉంటుంది. 2యజ
మానులు దేవుని కుటుంబానికి చెందినంత మాత్రాన
బానిసలు వారిని గౌరవించటం మానుకోరాదు. అలా
కాక వాళ్ళకు యింకా ఎక్కువ సేవ చేయాలి. ఎందు
కంటే ఈ సేవ పొందే వాళ్ళు భక్తులు. వీరు ప్రేమ
చూపుతున్న వాళ్ళు. ఈ విధంగా నీవువీటిని ఉపదేశించి
ఆచరణలో పెట్టుమని వాళ్ళకు చెప్పు.

## ధన ఆశ

3మన యేసు క్రీస్తు ప్రభువు బోధించిన చక్కటి
ఉపదేశాలను, మన దేవుని సేవకు సంబంధించిన సక్రమ
మార్గాలను వదిలి యితర మార్గాలను బోధించు వాడు
4మోసగాడు అన్నమాట. అలాంటి వానికి ఏమీ తెలియ
దన్నమాట. అలాంటి వానిలో వివాదాస్పదమైన విష
యాలను అనవసరంగా తర్కించాలనే అనారోగ్యకర
మైన ఆసక్తి ఉంటుంది. అది ద్వేషానికి, పోరాటానికి,
దూషణలకు, దుష్టత్వంతో నిండిన అనుమానాలకు
దారి తీస్తుంది. 5అంతేకాక, సత్యాన్ని గ్రహించక దైవభక్తి,
ధనార్జనకు ఒక సాధనమని భావించే దుష్టబుద్ధి గలవాళ్ళ
మధ్య నిరంతరమైన ఘర్షణలు కల్గుతాయి.

6కాని సంతృప్తితో ఉండి, భక్తిని అవలంబిస్తే అదే
ఒక గొప్ప ధనము. 7ఈ లోకంలోకి మనమేమీ తీసుకు
రాలేదు. ఈ లోకంనుండి ఏమీ తీసుకుపోలేము.
8మనకు తిండి, బట్ట ఉంటే చాలు. దానితో తృప్తి
పొందుదాము. 9కాని ధనవంతులు కావాలనుకొనేవారు,
ఆశలకులోనై మూర్ఖత్వంతో హానికరమైన ఆశల్లో
చిక్కుకుపోతారు. అవి వాళ్ళను అధోగతి పట్టించి
పూర్తిగా నాశనం చేస్తాయి. 10ధనాశ అన్ని రకాల దుష్ట
త్వానికి మూలకారణం. కొందరు, ధనాన్ని ప్రేమించి,
క్రీస్తు పట్ల ఉన్న విశ్వాసానికి దూరమైపోయారు.
తద్వార దుఃఖాల్లో చిక్కుకుపోయారు.

## తిమోతికి చెప్పిన ఉపదేశము

11కాని నీవు విశ్వాసివి. కనుక వీటికి దూరంగా
ఉండు. నీతిని, భక్తిని, విశ్వాసాన్ని, ప్రేమను, సహనాన్ని,
వినయాన్ని అలవరచుకో. 12నీ విశ్వాసాన్ని కాపాడు
కోవటానికి బాగా పోరాటం సాగించు. అనంత జీవితాన్ని
సంపాదించు. దీని కోసమే దేవుడు నిన్ను పిలిచాడు.
నీవు అనేకుల సమక్షంలో ఆ గొప్ప సత్యాన్ని అంగీక
రించావు. 13అన్నిటికీ ప్రాణం పోసే దేవునిపేరిట,
పొంతి పిలాతు సమక్షంలో అదే గొప్ప సత్యాన్ని అంగీ
కరించిన యేసు క్రీస్తు పేరిట నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను.
14మన యేసు క్రీస్తు ప్రభువు వచ్చేదాక ఈ ఆజ్ఞను
పాటించు. దాన్ని పాటించటంలో ఏ మచ్చా రానీయ
కుండా, ఏ అపకీర్తీ రానివ్వకుండా చూడు. 15‘మన
పాలకుడు,’ రాజులకు రాజును, ప్రభువులకు ప్రభువునై
యున్నాడు.

సర్వాధిపతి అయిన దేవుడు తగిన సమయం
రాగానే యేసు క్రీస్తును పంపుతాడు. 16మనం సమీపిం
చలేని వెలుగులో ఉండే అమరుడైన దేవుడాయన.
దేవుణ్ణి ఎవ్వరూ చూడలేదు, మరి ఎవ్వరూ చూడలేరు.

---

**క్రీస్తును … స్త్రీ** లేక పురుషుడు.

ఆయనకు చిరకాలం మహిమ కలుగుగాక! ఆయన
శక్తి తరగకుండా ఉండుగాక! ఆమేన్.
[17]ధనవంతులు గర్వించరాదనీ, క్షణికమైన ధనాన్ని
నమ్మకూడదనీ, వాళ్ళతో చెప్పుదానికి మారుగా మన
ఆనందానికి అన్నీ సమకూర్చే దేవుణ్ణి నమ్ముమని
ఆజ్ఞాపించు. [18]సత్కార్యాలు చేస్తూ సత్ ప్రవర్తన కలిగి
అవసరమైనవాటిని యితర్లతో ఔదార్యముగా పంచు
కుంటూ ఉండుమని ఆజ్ఞాపించు. [19]ఈ విధంగా ఆత్మీ
యతలో ఐశ్వర్యాన్ని సంపాదిస్తే అది భవిష్యత్తుకు
చక్కటి పునాది వేస్తుంది. తద్వారా నిజమైన జీవితం
పొందకల్గుతారు.
[20]తిమోతీ, నీకు అప్పగింపబడిన సత్యాన్ని జాగ్ర
త్తగా కాపాడు. ఆత్మీయతలేని చర్చలకు దూరంగా
ఉండు. జ్ఞానంగా చెప్పబడే వ్యతిరేక సిద్ధాంతాలకు
దూరంగా ఉండు. [21]కొందరు ఈ వ్యతిరేక సిద్ధాంతాలు
బోధించారు. ఇలా చేసిన వాళ్ళు, మనము విశ్వసిస్తున్న
సత్యాలను వదిలి తప్పు దారి పట్టారు.
దైవానుగ్రహం నీకు తోడుగా ఉండుగాక!

# తిమోతికి వ్రాసిన రెండవ లేఖ

1 పౌలు నుండి నా ప్రియమైన కుమారుడు తిమోతికి
వ్రాయడమేమనగా మన తండ్రియైన దేవుని నుండి,
మన ప్రభువైన యేసు క్రీస్తు నుండి నీకు కృప,
దయ, శాంతి లభించుగాక!
2నేను దైవేచ్ఛానుసారం యేసు క్రీస్తుకు అపొస్తలుడ
నయ్యాను. దేవుడు వాగ్దానము చేసిన అనంతజీవితము
యేసు క్రీస్తు వలన సంభవిస్తుంది. దాని కారణముగా
నేను అపొస్తలుడనయ్యాను.

### విశ్వాసంలో ఉండండి

3నేను నిష్కల్మష హృదయంతో నా పూర్వీకుల
దేవునికి సేవచేస్తూ కృతజ్ఞుడనై యున్నాను. రాత్రింబ
గళ్లు నిన్ను జ్ఞాపకము పెట్టుకొని నీ కోసం ప్రార్థిస్తూ
ఉంటాను. 4నీలాంటి వాణ్ణి నాకు యిచ్చినందుకు నేను
దేవునికి ఎంతో కృతజ్ఞుణ్ణి. నీ కన్నీళ్ళు జ్ఞాపకం వస్తు
న్నాయి. నిన్ను చూడాలని పిస్తుంది. నిన్ను చూసాక
నా మనస్సు ఆనందంతో నిండిపోతుంది. 5నీలో ఉన్న
నిజమైన విశ్వాసం నాకు జ్ఞాపకము ఉంది. అటువంటి
విశ్వాసం మీ అమ్మమ్మ లోయిలోనూ ఉండేది. నీ
తల్లి యునీకేలో కూడా ఉండేది. నీలో కూడా అలాం
టిది ఉందని సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. 6అందు
కోసం, నా చేతులు నీ తలపై ఉంచడం వల్ల నీకు
దేవుడు యిచ్చిన వరాన్ని ఉపయోగిస్తూ ఉండుమని
నీకు జ్ఞాపకం చేస్తున్నాను. 7దేవుడు మనకు పిరికి
ఆత్మను ఇవ్వలేదు. ఆయన మనకు శక్తి, ప్రేమ,
స్వయం క్రమశిక్షణగల ఆత్మనిచ్చాడు.
8కనుక ప్రభువును గురించి చెప్పవలసి వచ్చిన
ప్పుడు గాని, అతని ఖైదీనైన నా విషయము చెప్పవలసి
వచ్చినప్పుడు గాని సిగ్గుపడకుము. దానికి మారుగా
దేవుడు ఇచ్చిన శక్తిని ఉపయోగించి, సువార్త కోసం
నాతో కలిసి కష్టాలు అనుభవించుము. 9దేవుడు మనల్ని
రక్షించి తన ప్రజలుగా మాత్రమే ఉండటానికి పిలిచాడు.
మనము చేసిన పనులను బట్టి ఆయన ఇలా చేయలేదు.
కాని ఇది కేవలం ఆయన అనుగ్రహంవల్ల, ఆయన
ఉద్దేశానుసారం చేసాడు. దేవుడు కాలానికి ముందే
యేసు క్రీస్తు ద్వారా మనకు అనుగ్రహాన్ని ప్రసాదిం
చాడు. 10కాని ఇప్పుడు మన రక్షకుడైన యేసు క్రీస్తు
వచ్చి దాన్ని మనకు వ్యక్తము చేసాడు. ఈయన తన
సువార్త ద్వారా మరణాన్ని నిర్మూలించి అనంత జీవి
తాన్ని, అమరత్వాన్ని వెలుగులోకి తెచ్చాడు. 11ఈ
సువార్తను ప్రకటించటానికి, నన్ను వార్తాహరునిగానూ,
అపొస్తులునిగానూ, ఉపాధ్యాయునిగానూ నియమిం
చాడు. 12ఆ కారణంగా నేను ప్రస్తుతం కష్టాలు అనుభవి
స్తున్నాను. అందుకు నేను సిగ్గుపడను. ఎందుకంటే
నేను విశ్వసించిన వాణ్ణి గురించి నాకు బాగా తెలుసు.
ఆ రానున్న రోజు దాకా ఆయన నాకు అప్పగించిన
దాన్ని, కాపాడుతాడని నాకు విశ్వాసం ఉంది. 13నేను
నీకు బోధించిన ఉపదేశాలను ఆదర్శంగా పెట్టుకో.
యేసు క్రీస్తులో వాటిని విశ్వాసంతో, ప్రేమతో వాటిని
మార్గదర్శంగా ఉంచుకో.

### అనవసరంగా వాదించకండి

14దేవుడు దాచమని నీకు అప్పగించిన గొప్ప
సత్యాన్ని, మనలో నివసిస్తున్న పరిశుద్ధాత్మ సహాయ
ముతో కాపాడు. 15ఆసియ ప్రాంతములో ఉన్న
వాళ్ళంతా నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపొయ్యారని
నీకు తెలుసు. 'ఫుగెల్లు' 'హెర్మొగెనే' కూడా నన్ను
వదిలి వెళ్ళిపొయ్యారు. 16నా చేతికి సంకెళ్ళు ఉన్నా
యని సంకోచించక 'ఒనేసిఫోరు' ఎన్నోసార్లు వచ్చాడు.
అది నాకు చాలా ఆనందం కలిగించింది. అతని
కుటుంబాన్ని దేవుడు కాపాడు గాక! 17అంతేకాక అతడు
రోములో ఉన్నప్పుడు నేను కనిపించేవరకు నా కోసం
కష్టపడి వెతికాడు. 18ఆ 'రానున్న రోజున' కని కరము
పొందేటట్లు ప్రభువు అతనికి కృప అనుగ్రహించుగాక!
నేను ఎఫెసులో ఉన్నప్పుడు అతడు నాకు ఎన్నివిధాల
సహాయం చేసాడో నీకు బాగా తెలుసు.
2 నా కుమారుడా! యేసు క్రీస్తులోనున్న కృప
ద్వారా బలవంతుడుగా నుండు. 2నేను బోధించిన
వాటిని నీవు విన్నావు. వాటిని నేను అనేకుల సమక్షంలో
బోధించాను. ఆ ఉపదేశాలను నీవు నమ్మగల వాళ్ళకు,
యితరులకు బోధించగల సామర్థ్యము ఉన్న వాళ్ళకు
అప్పగించు. 3యేసు క్రీస్తుకు మంచి సైనికునివలే,
మాతో కలిసి విశ్వాసంతో కష్టాలు సహించు. 4సైనికు
నిగా పని చేసేవాడు సామాన్య ప్రజల విషయాల్లో
తలదూర్చడు. గాని అతడు, తన సైన్యాధిపతిని
సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తాడు. 5అదేవిధంగా ఆట

పందెంలో పాల్గొనేవాడు ఆ ఆట నియమాల్ని పాటిస్తే
కాని విజయం సాధించలేడు. [6]కష్టించి పని చేసే
రైతుకు, వచ్చిన పంటలో భాగము అందరి కన్నా
ముందు లభిస్తుంది. [7]నేను చెప్పే వాటిని గురించి
ఆలోచించు. ప్రభువు నీకు వీటన్నిటిని గురించి
తెలుసుకొనే జ్ఞానం కల్గిస్తాడు.

[8]దావీదు వంశానికి చెందిన యేసు క్రీస్తు బ్రతికింప
బడ్డాడన్న విషయం జ్ఞాపకం పెట్టుకో. ఇదే నేను
బోధించే సువార్త. [9]ఈ సువార్త బోధించటం వల్ల
నేను సంకెళ్ళతో నేరస్తుని వలె కష్టాలు అనుభవిస్తు
న్నాను. కాని దేవుని సందేశానికి సంకెళ్ళు లేవు. [10]కను
కనే, దేవుడు ఎన్నుకొన్న వాళ్ళ కోసం ఈ కష్టాలు
సహిస్తున్నాను. యేసు క్రీస్తు వల్ల లభించే రక్షణ,
శాశ్వతమైన మహిమ, వాళ్ళకు కూడా లభించాలని నా
అభిలాష.

[11]ఈ విషయము నమ్మటానికి యోగ్యమైంది:

మనం ఆయనతో సహా మరణిస్తే ఆయ
నతో కలిసి జీవిస్తాం.
12 మనం సహిస్తే ఆయనతో కలిసి రాజ్యం
చేస్తాం! మనం ఆయన్ని కాదంటే ఆయన
మనల్ని కాదంటాడు
13 మనం నమ్మతగని వాళ్ళమైనా ఆయన
నమ్మతగినవాడుగానే ఉంటాడు.తన స్వభా
వానికి వ్యతిరేకంగా ఏదీ చేయలేడు.

### దేవుడు సమ్మతించిన పనివాడు

[14]వాళ్ళకు ఈ విషయాలు జ్ఞాపకము చేస్తూ ఉండు.
వ్యర్థమైన మాటల్ని గురించి వాదించరాదని దేవుని
సమక్షంలో వాళ్ళను వాదించు. అలాంటి వాదనవల్ల ఏ
లాభం కలుగదు. పైగా విన్నవాళ్ళను అది పాడు
చేస్తుంది. [15]దేవుని సమక్షంలో ఆయన అంగీకారం
పొందే విధంగా నీ శక్తికి తగినట్లు కృషి చేయి. అప్పుడు
నీవు చేస్తున్న పనికి సిగ్గు పడనవసరం ఉండదు.
సత్యాన్ని సక్రమంగా బోధించు. [16]విశ్వాస హీనమైన
మాటలు, పనికిరాని మాటలు మాట్లడవద్దు. అలాంటి
వాళ్ళు దేవునికి యింకా దూరమైపోతారు. [17]వీళ్ళ
బోధన పైకి కనిపించని వ్యాధిలా వ్యాపిస్తుంది. హుమె
నైయు, ఫిలేతు, ఈ గుంపుకు చెందిన వాళ్ళు. [18]వీళ్ళు
సత్యాన్ని విడిచి తప్పు దారి పట్టారు. పునరుత్థానం
జరిగిపోయిందని చెప్పి కొందరి విశ్వాసాన్ని పాడు
చేస్తున్నారు. [19]అయినా, దేవుడు వేసిన పునాది గట్టిది.
దాన్ని ఎవ్వరూ కదల్చలేరు. ఈ పునాదిపై, “తన
వాళ్ళెవరో ప్రభువుకు తెలుసు.* ప్రభువు నామాన్ని
అంగీకరించిన ప్రతి ఒక్కడు దుర్మార్గాలు వదిలి
వెయ్యాలి” అని వ్రాయబడి ఉంది.

[20]గొప్ప వాళ్ళ యిండ్లలో వెండి, బంగారు వస్తువులే
కాక, చెక్కతో మట్టితో చేయబడిన వస్తువులు కూడా
ఉంటాయి. కొన్ని ప్రత్యేక సమయాల్లో ఉపయోగిం
చేవి, మరికొన్ని ప్రతి రోజు ఉపయోగించేవి. [21]దుర్మా
ర్గాలను వదిలిన వాణ్ణి దేవుడు ప్రత్యేక మైన కార్యాలకు
ఉపయోగిస్తాడు. అలాంటి వాడు పవిత్రంగా ఉండి దేవు
నికి ఉపయోగకరంగా ఉంటాడు. మంచి కార్యాలను
చేయటానికి సిద్ధంగా ఉంటాడు.

[22]యవ్వనంలో కలిగే చెడు కోరికలకు దూరంగా
ఉండు. ప్రభువును పవిత్ర హృదయంతో కొలిచే
వాళ్ళతో కలిసి నీతిని విశ్వాసాన్ని ప్రేమను, శాంతిని
అనుసరించు. [23]కొందరు అర్థం లేకుండా మూర్ఖంగా
వాదిస్తారు. అవి పోట్లాటలకు దారి తీస్తాయని నీకు
తెలుసు. కనుక అలాంటి వివాదాల్లో పాల్గొనవద్దు.
[24]అంతేకాక ప్రభువు సేవకుడు పోట్లాడరాదు. అందరి
పట్ల దయ చూపాలి. బోధించ కలిగి ఉండాలి. సహనం
ఉండాలి. [25]తనకు వ్యతిరేకంగా మాట్లాడే వాళ్ళకు
శాంతంగా బోధించాలి. వాళ్ళ హృదయాలు మార్చి
దేవుడు వాళ్ళకు సత్యం తెలుసుకొనే మార్గం చూపి
స్తాడని ఆశించాలి. [26]అప్పుడు వాళ్ళకు బుద్ధివచ్చి
సైతాను వేసిన వలనుండి తప్పించుకో గల్గుతారు.
ఎందుకంటే సైతాను వాళ్ళను తన యిచ్ఛ నెరవేర్చ
టానికి బంధించి పెట్టాడు.

### చివరి కాలపు సంగతులు

3 ఈ విషయాలు జ్ఞాపకం పెట్టుకోండి. చివరి
రోజులు ఘోరంగా ఉంటాయి. [2]మనుష్యుల్లో
స్వార్థం, ధనంపై ఆశ, గొప్పలు చెప్పుకోవటం,గర్వం,
దూషణ, తల్లితండ్రుల పట్ల అవిధేయత, కృతఘ్నత,
అపవిత్రత, [3]ప్రేమలేని తనం, క్షమించలేని గుణం,
దూషించే గుణం, మనోనిగ్రహం లేకుండుట, మంచిని
ప్రేమించకుండుటం, [4]ద్రోహబుద్ది, దురుసుతనం,
అహంభావం, దేవునికంటె సుఖాన్ని ప్రేమించటం.
[5]పైకి భక్తిపరుల్లావుండి దాని శక్తిని అంగీకరించ
కుండటం, అలాంటి వాటికి దూరంగా ఉండు. [6]వాళ్ళు
యిళ్ళల్లోకి చొరబడి, దురాశల్లో చిక్కుకు పోయి,
పాపాలతో జీవిస్తున్న బలహీనమైన మనస్సుగల స్త్రీలను
లోబరుచుకొంటారు. [7]ఈ స్త్రీలు ఎప్పుడూ నేర్చు
కొంటారు. కాని, సత్యాన్ని గ్రహించ లేకపోతున్నారు.
[8]యన్నే, మరియు యంబ్రే అనువారు మోషేను
ఎదిరించిన విధంగా వీళ్ళ బుద్ధులు పాడై సత్యాన్ని
ఎదిరిస్తున్నారు. మనం నమ్ముతున్న సత్యాన్ని వీళ్ళు
నమ్మలేక పోతున్నారు. [9]వీళ్ళు ముందుకు పోలేరు.
మోషేను ఎదిరించిన వాళ్ళలాగే వీళ్ళ అవివేకం ప్రతి
ఒక్కరికి తెలుస్తుంది.

---

**తన … తెలుసు** సంఖ్యా. 16:5.

### చివరి మాట

10కాని, నీకు నా ఉపదేశాలు, నా జీవితం, నా
ఉద్దేశ్యం, నా విశ్వాసం, నా శాంతం, నా ప్రేమ, నా
సహనం, 11అంతియొకయ, ఈకొనియ, లుస్త్ర
పట్టణాల్లో నేను అనుభవించిన హింసలు, నా బాధలు,
ఇవన్నీ పూర్తిగా తెలుసు. ఇన్ని జరిగినా దేవుడు నన్ను
వీటినుండి రక్షించాడు. 12యేసు క్రీస్తులో ఆధ్యాత్మి
కంగా జీవిం చాలనుకొన్న ప్రతి ఒక్కడూ హింసింప
బడతాడు. 13దుష్టులు, వేషధారులు, మోసంచేస్తూ,
మోసపోతూ ఉంటారు. ఇది రోజు రోజుకూ
అధికమవుతుంది.

14కాని, నీవు ఎవరినుండి నేర్చుకొన్నావో తెలుసు.
కనుక, నీవు నేర్చుకొన్న వాటిని, విశ్వసించిన వాటిని
పాటిస్తూ ఉండు. 15అంతే కాక, నీవు నీ చిన్ననాటినుండి
పవిత్ర గ్రంథాలు తెలిసిన వాడవు. అవినీలో జ్ఞానం
కలిగించి యేసు క్రీస్తు పట్ల నీకున్న విశ్వాసం మూలంగా
రక్షణను ప్రసాదించాయి. 16లేఖనాలన్నీ దేవునిచే ప్రేరే
పింపబడినవి. నీతిని బోధించటానికి, గద్దించటానికి,
సరిదిద్దటానికి, నీతి విషయం తర్ఫీదు చేయటానికి,
ఉపయోగపడతాయి. 17వీటి ద్వారా దైవజనుడు ప్రతి
మంచి కార్యాన్ని చేయటానికి సంపూర్ణంగా తయారు
కాగలడు.

4 చనిపోయిన వాళ్ళపై, బతికివున్న వాళ్ళపై తీర్పు
చెప్పే దేవుని సమక్షంలో యేసు క్రీస్తు సమక్షంలో
నీకొక ఆజ్ఞ యిస్తున్నాను. ఆయన ప్రత్యక్షంకాను
న్నాడు కనుక, ఆయన రాజ్యం రానున్నది కనుక, నీకీ
విధంగా ఆజ్ఞాపిస్తున్నాను. 2దైవ సందేశాన్ని ప్రకటించు.
అన్ని సమయాల్లో సిద్ధంగా ఉండు. తప్పులు సరిది
ద్దుతూ, అవసరమైతే గద్దిస్తూ, ప్రోత్సాహమిస్తూ, సహ
నంతో బోధిస్తూ ఉండు. 3ప్రజలు మంచి ఉపదేశాలు
వినటం మాని వేసే సమయం వస్తుంది. వాళ్ళు తమ
యిష్టం వచ్చినట్లు చేస్తారు. తాము వినదల్చిన లౌకిక
మైన వాటిని చెప్ప గలిగే పండితుల్ని తమ చుట్టూ
ప్రోగుచేసుకొంటారు. 4సత్యం వినటం మాని, పురాణా
లను వింటారు. 5కాని అన్ని విషయాల్లో నిగ్రహంగా
ఉండు. కష్టాలు ఓర్చుకో. సువార్త ప్రచారం చెయ్య
టానికి కష్టించి పనిచెయ్యి. నీ సేవా సంబంధంలో
చెయ్యవలసిన కర్తవ్యాలు పూర్తిగా నిర్వర్తించు.

6నా ప్రాణాలు ధారపోయవలసిన గడియ దగ్గరకు
వచ్చింది. నేను వెళ్ళే సమయంవచ్చింది. 7ఈ పోటీలో
నేను బాగా పరుగెత్తాను. విశ్వాసాన్ని వదులుకోకుండా
పందెం ముగించాను. 8ఇప్పుడు 'నీతి' అనే కిరీటం నా
కోసం కాచుకొని ఉంది. నీతిగా తీర్పు చెప్పే ప్రభువు
'ఆ రానున్న రోజు' దాన్ని నాకు బహుమతిగా యిస్తాడు.
నాకే కాక, ఆయన రాక కోసం నిరీక్షిస్తున్న వాళ్ళందరికీ
ఆ బహుమతి లభిస్తుంది.

### వ్యక్తిగత సలహాలు

9నా దగ్గరకు త్వరలో రావటానికి సాధ్యమైనంత
ప్రయత్నం చెయ్యి. 10ఎందుకంటే, 'దేమా' ప్రపంచం
మీద వ్యామోహంవల్ల నన్ను వదిలి థెస్సలొనీకకు వెళ్ళి
పొయ్యాడు. క్రేస్కే, గలతీయకు వెళ్ళిపొయ్యాడు.
తీతు, దల్మతియకు వెళ్ళిపొయ్యాడు. 11లూకా
మాత్రము నాతో ఉన్నాడు. మార్కు ఎక్కడ ఉన్నాడో
కనుక్కొని నీ వెంట పిలుచుకొనిరా. నా ఈ సేవా
కార్యక్రమంలో అతని సహాయం నాకు ఉపయోగపడు
తుంది. 12తుకికును ఎఫెసుకు పంపాను.

13నేను త్రోయలో ఉన్నప్పుడు కర్పు యింట్లో
నా అంగీ మరిచిపొయ్యాను. దాన్ని, గ్రంథాలను,
ముఖ్యంగా తోలు కాగితాల గ్రంథాలను, తీసుకొనిరా.

14కంచరి అలెక్సంద్రు నాకు చాలా అపకారం
చేసాడు. అతడు చేసిన దానికి ప్రభువు అతనికి తగిన
శిక్ష విధిస్తాడు. 15అతడు మన సందేశాన్ని చాలా తీవ్రంగా
విమర్శిస్తాడు కనుక, అతని విషయంలో నీవు కూడా
జాగ్రత్తగా ఉండు. 16నా విషయంలో మొదటి సారి
విచారణ జరిగినప్పుడు నాకు ఎవ్వరూ సహాయం
చెయ్యలేదు. అందరు నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళి
పొయ్యారు. దేవుడు వాళ్ళను క్షమించు గాక! 17నా
ద్వారా సువార్త ప్రకటింపబడాలని యూదులుకాని
వాళ్ళందరు వినాలని ప్రభువు నా ప్రక్కన నిలబడి
నాకు శక్తినిచ్చాడు. సింహాల నోటినుండి నన్ను కాపా
డాడు. 18ప్రభువు నాకు ఏ విధమైన కీడు సంభవించ
కుండా నన్ను కాపాడి, క్షేమంగా పరలోకంలో ఉన్న
తన రాజ్యానికి పిలుచుకు వెళ్తాడు. ఆయనకు చిరకాలం
మహిమ కలుగుగాక! ఆమేన్. 19ప్రిస్కిల్లను, అకులను,
ఒనేసిఫోరు కుటుంబం వాళ్ళకు నా వందనాలు చెప్పు.
20ఎరస్తు, కొరింథులోనే ఉండి పొయ్యాడు. త్రోఫిము
జబ్బుతో ఉండటం వల్ల అతణ్ణి మిలేతులో వదల
వలసి వచ్చింది. 21చలి కాలానికి ముందే నీవిక్కడికి
రావటానికి గట్టిగా ప్రయత్నించు.

యుబూలు, పుదే, లిను, క్లౌదియ, మిగతా సోదరు
లందరు నీకు వందనాలు చెప్పుచున్నారు.

22ప్రభువు నీ ఆత్మకు తోడైయుండును గాక!
దైవానుగ్రహం నీపై ఉండుగాక!

# తీతుకు వ్రాసిన లేఖ

1 దేవుని సేవకుడును, యేసు క్రీస్తు యొక్క అపొస్త
లుడయినటువంటి పౌలు నుండి. దేవుడు తానెన్ను
కున్న ప్రజల విశ్వాసాన్ని ధృఢపరచడానికి, వాళ్ళను
భక్తి కల్గించే మన సత్యం వైపు మళ్ళించటానికి నన్ను
ఎన్నుకొన్నాడు. 2ఈ సత్యం, అనంతజీవితం లభిస్తుం
దని విశ్వసించటంపై ఆధారపడి ఉంది. అబద్ధం ఆడని
దేవుడు మనకి జీవితం యిస్తానని కాలానికి ముందే
వాగ్దానం చేసాడు.
3సరియైన సమయానికి దాన్ని తన సందేశం ద్వారా
మనకు తెలియచేసాడు. ఈ సందేశం నాకప్పగింప
బడింది. మన రక్షకుడైనటువంటి దేవుడు దాన్ని మీకు
ప్రకటించుమని ఆజ్ఞాపించాడు. కనుక దాన్ని మీకు
ప్రకటిస్తున్నాను.
4మనలో ఉన్న విశ్వాసం మూలంగా నా ప్రియ
కుమారునిగా భావిస్తున్న తీతుకు వ్రాయుటమేమనగా,
మన తండ్రియైన దేవుని నుండి, మన రక్షకుడైన
యేసు క్రీస్తునుండి నీకు శాంతి, కృప లభించుగాక!

### క్రేతులో తీతు చేయవలసిన పని

5అసంపూర్ణంగా వదిలి వేయబడిన వాటిని పూర్తి
చేయటానికి, నేను ఆదేశించిన విధంగా ప్రతి పట్ట
ణంలో పెద్దలను నియమించటానికి నిన్ను క్రేతులో
వదిలి వచ్చాను. 6క్రీస్తు సంఘంలోయున్న అధ్యక్షుడు
నిందారహితుడై, ఏకపత్నీవ్రతుడై ఉండాలి. తనపిల్లలు
అవిధేయతగా ఉండక అవినీతిగా ఉండక చెడ్డపేరు
లేకుండా విశ్వసించినవాళ్ళుగా ఉండాలి. 7సంఘాధ్య
క్షుడు దైవకార్యాన్ని నడిపించే బాధ్యత కలవాడు కనుక
అతడు నిందారహితుడై ఉండాలి. అతనిలో గర్వము
ఉండరాదు. ముక్కోపి కాకూడదు. త్రాగుబోతు కాకూ
డదు. పోట్లాడరాదు. అధర్మంగా లాభాలు సంపాదించ
రాదు. 8అతిథులను పరామర్శించే వాడైయుండాలి.
మంచి పనులు చెయ్యాలి. మనో నిగ్రహం, నీతి, పవి
త్రత, క్రమశిక్షణ మొదలగు గుణాలు అతనిలో ఉండాలి.
9తనకు బోధింపబడిన సందేశాన్ని విశ్వాసంతో ఆచరిం
చాలి. అప్పుడే యితరులకు ఈ గొప్ప సత్యాన్ని
చెప్పి వాళ్ళను కూడా ప్రోత్సాహపరచగలడు. ఈ
సందేశాన్ని అంగీకరించని వాళ్ళకు వాళ్ళు చేస్తున్న
తప్పు చూపగలడు.
10తాము అవిధేయతగా ఉంటూ, అధికంగా
మాట్లాడి నమ్మించాలని ప్రయత్నించే మోసగాళ్ళు
చాలా మంది ఉన్నారు. ముఖ్యంగా సున్నతి అవసరమని
వాదించే యూదులు ఈ విధంగా చేస్తున్నారు. 11అన్యా
యంగా లాభం గడించటానికి బోధించరాని విషయాలు
బోధించి కుటుంబాల్ని నాశనం చేస్తున్నారు. వాళ్ళను
ఆపటం అవసరం. 12“క్రేతీయులు అబద్ధాలాడుతున్నా
రనీ, క్రూర మృగాల్లాంటి వాళ్ళనీ, సోమరిపోతులనీ,
తిండి పోతులనీ” క్రేతీయులలో ప్రవక్త ఒకడు అన్నాడు.
13ఈ సాక్ష్యము నిజము. వాళ్ళను గట్టిగా వారించటం
అవసరం. అలా చేస్తే, వాళ్ళ విశ్వాసం ధృఢమౌతుంది.
14అప్పుడు వాళ్ళు యూదుల కల్పిత కథలను మరిచి
పోయి, మన సత్యాన్ని నిరాకరించే వాళ్ళ బోధలను
లెక్క చెయ్యరు. 15పవిత్రంగా ఉన్నవాళ్ళకు అన్నీ
పవిత్రంగా కనిపిస్తాయి. కాని దుష్టులకు, విశ్వాసంలేని
వాళ్ళకు ఏదీ పవిత్రంగా కనిపించదు. వాళ్ళ బుద్ధులు,
మనస్సులు చెడుతో నిండి ఉంటాయి. 16వాళ్ళు తమకు
దేవుని గురించి తెలుసునంటారు కాని, వాళ్ళ ప్రవర్తన
ఆ దేవుణ్ణి నిరాకరిస్తున్నట్లు చూపిస్తుంది. వాళ్ళు
ద్వేషంతో, అవిధేయతతో ప్రవర్తిస్తూ ఉంటారు. వాళ్ళు
మంచి పని చేయటానికి అంగీకరించరు.

### మంచి బోధన

2 ఉత్తమ సిద్ధాంతాల ప్రకారం సత్యాన్ని అనుసరించు
మని ప్రజలకు బోధించు. 2వృద్ధులకు శాంతంగా
ఉండుమని, గౌరవంగా జీవించుమని, ఆత్మ నిగ్రహం,
సంపూర్ణమైన విశ్వాసం, ప్రేమ, సహనము కలిగి ఉండు
మని బోధించు.
3అదే విధంగా వృద్ధ స్త్రీలకు పవిత్రంగా జీవించు
మని, ఇతర్లను దూషించకూడదని, త్రాగుబోతులు
కాకూడదని, మంచిని మాత్రమే ఉపదేశమిమ్మని చెప్పు.
4అలా చేస్తే వాళ్ళు యౌవన స్త్రీలకు తమ భర్తల్ని,
తమ పిల్లల్ని ప్రేమించాలని, 5ఆత్మ నిగ్రహం కలిగి
ఉండి పవిత్రంగా జీవించాలని, తమ గృహనిర్వాహక
కర్తవ్యాలను పూర్తి చెయ్యాలని, దయను అలవరుచు
కోవాలని, వారి భర్తలకు విధేయతగా ఉండాలని ఉప
దేశించి శిక్షణ నిస్తారు. అప్పుడు దైవసందేశాన్ని
ఎవ్వరూ విమర్శించరు.

6అదే విధంగా మనోనిగ్రహం కలిగి ఉండుమని
యువకులకు బోధించు. 7నీవు స్వయంగా ఉత్తమ
కార్యాలు చేస్తూ వాళ్ళకు ఆదర్శంగా ఉండాలి. నీవు
బోధించేటప్పుడుమనస్ఫూర్తిగా, గంభీరంగా బోధించు.
8విమర్శకు గురికాకుండా జాగ్రత్తగా బోధించు.
అప్పుడు నీ శత్రువులు విమర్శించటానికి ఆస్కారం
దొరకక సిగ్గుపడతారు.

9బానిసలు తమ యజమానుల యిష్టానుసారం నడు
చుకోవాలని బోధించు. తమ యజమానులకు
ఆనందం కలిగేటట్లు మసలుకోవాలనీ, వాళ్ళకు ఎదురు
తిరిగి మాట్లాడరాదనీ వాళ్ళకు బోధించు. 10తమ యజ
మానులనుండి, దొంగిలించరాదనీ, తమ యజమా
నులు తమను విశ్వసించేటట్లు నడుచుకోవాలనీ
బోధించు. అప్పుడే మన రక్షకుడైన దేవుని గురించి
నేర్చుకొన్నవి సార్థకమౌతాయి.

11ఎందుకంటే, మానవులకు రక్షణ కలిగించే దైవా
నుగ్రహం అందరికి ప్రత్యక్షమైంది. 12అది నాస్తికత్వాన్ని,
ఐహిక దురాశల్ని మానివేయుమని బోధిస్తుంది.
మనోనిగ్రహం కలిగి, క్రమశిక్షణతో, ఆత్మీయంగా ఈ
ప్రపంచంలో జీవించుమని బోధిస్తుంది. 13మనం ఆశి
స్తున్న ఆ గొప్ప రోజు వస్తుందని, ఆ రోజున మన
గొప్ప దేవుడునూ మన రక్షకుడైనటువంటి యేసు
క్రీస్తు కనిపిస్తాడని నిరీక్షిస్తూ ఉన్నాము. 14అన్ని పాపాల
నుండి మనకు విముక్తి కలగాలని యేసు క్రీస్తు తనను
తాను అర్పించుకొన్నాడు. సత్కార్యాలు చెయ్యాలని
ఉత్సాహపడుతున్న ఈ ప్రజలు ఈ యేసు క్రీస్తుకు
చెందిన వాళ్ళు. ఆయన వాళ్ళను తనకోసం పవిత్రంగా
చేసాడు. 15నీవు ఈ విషయాలను బోధించాలి. సంపూ
ర్ణమైన అధికారంతో ప్రజలను ఉత్సాహపరుస్తూ,
ఖండిస్తూ, నిన్ను ఎవ్వరూ ద్వేషించకుండా జాగ్రత్త
పడుము.

### విశ్వాసులు చేయవలసిన విధులు

3 పాలకులు, అధికారులు ఆజ్ఞాపించినట్లు నడుచు
కోమని ప్రజలకు జ్ఞాపకం చేయి. విధేయతగా
ఉండుమని, సత్కార్యాలు చేయటానికి సిద్ధంగా ఉండు
మని బోధించు. 2ఇతర్లను దూషించకుండా శాంతిని,
మంచి తనాన్ని అలవర్చుకోమని, అందరిపట్ల దయ
చూపుమని బోధించు.

3గతంలో మనం కూడా మూర్ఖంగా, అవిధేయంగా
ఉంటిమి. తప్పులు చేస్తూ మానసిక వాంఛలకు, సుఖా
లకులోనై అసూయతో యితర్ల చెడును కోరుతూ,
ద్వేషిస్తూ, ద్వేషింపబడుతూ జీవించాము. 4అలాంటి
సమయంలో మన రక్షకుడైనటువంటి దేవుని దయ,
ప్రేమ మనకు కనిపించాయి. 5మనం నీతికార్యాలు
చేసినందుకు ఆయన మనలను రక్షించలేదు కాని తన
కృప ద్వారానే మనల్ని పవిత్రపరచి, మనకు పరి
శుద్ధాత్మ ద్వారా ఆత్మీయ పునర్జన్మ కల్గించాడు. క్రొత్త
జీవితాన్నిచ్చి, మనల్ని రక్షించాడు. 6పరిశుద్ధాత్మను
మన రక్షకుడైన యేసు క్రీస్తు ద్వారా ధారాళంగా మనపై
కురిపించాడు. 7ఆయన అనుగ్రహం వల్ల మనం నీతి
మంతులంగా వారసులం కావాలని ఆయన ఉద్దేశ్యం.
ఈ విధంగా మనమాశిస్తున్న అనంతజీవితం పొంద
గలుగుతాము. 8ఇది నిజం. నీవు ఈ విషయాన్ని నొక్కి
చెప్పాలి.

అలా చేస్తే దేవుణ్ణి విశ్వసించిన వాళ్ళు జాగ్రత్తగా
ఉండి, మంచి చేయటంలో నిమగ్నులౌతారు. ఇది
మంచిది. దాని వలన ప్రజలకు లాభం కలుగుతుంది.

9కాని మూర్ఖంగా వాదించే వాళ్ళకు, వంశ చరిత్రల్ని
చర్చించే వాళ్ళకు, ధర్మశాస్త్రాన్ని గురించి వాదించే
వాళ్ళకు, పోట్లాడే వాళ్ళకు దూరంగా ఉండు. అలాంటి
చర్చలవల్ల ఉపయోగమేమీ ఉండదు. వాటివల్ల లాభం
కలుగదు. 10చీలికలు కలిగించే వాణ్ణి ఒకటి రెండు
సార్లు గద్దించు. ఆ తర్వాత అతనితో సంబంధం
తెంపుకో. 11అలాంటి వాడు దుర్మార్గుడని, పాపి అని
నీకు బాగా తెలుసు. అతడు తనకు తాను శిక్ష విధించు
కొన్నాడు.

### చివరి మాట

12అర్తెమానును, తుకికును, నీ దగ్గరకు పంపిన
తక్షణం నీవు నికొపొలికి వచ్చి నన్ను కలుసుకో. ఈ
చలికాలం నేనక్కడ గడపదలిచాను. 13న్యాయవాది
జేనా, అపొల్లోల ప్రయాణానికి కావలసినవన్నీ సమ
కూర్చి వాళ్ళకు సహాయం చెయ్యి.

14మన వాళ్ళు సత్కార్యాలు చేయటానికి నేర్చుకొని
వాటిలో నిమగ్నులై ఉండాలి. తమ నిత్యావసరాలకు
కావలిసినవి సంపాదించుకోవాలి. వ్యర్థంగా జీవించ
కూడదు.

15నాతో ఉన్న వాళ్ళు నీకు వందనాలు తెలుపు
తున్నారు. విశ్వాసం మూలంగా మన స్నేహితులైన
వాళ్ళకు నా శుభాకాంక్షలను తెలుపుము. మీ అందరిపై
దేవుని కృప ఉండునుగాక!

# ఫిలేమోనుకు వ్రాసిన లేఖ

యేసు క్రీస్తు కోసం ఖైదీనైన పౌలును మరియు
మన సోదరుడైన తిమోతియు,
మా ప్రియ జతపనివాడైన ఫిలేమోనుకు, 2మరియు
మన సోదరి అప్పియకు, మనతో సహా పోరాటం సాగి
స్తున్న అర్ఖిప్పుకు, మీ యింట్లో సమావేశమయ్యే
సంఘానికి వ్రాస్తున్న సంగతులు:
3మన తండ్రియైన దేవుడు, మన యేసు క్రీస్తు
ప్రభువు మిమ్మల్ని అనుగ్రహించి మీకు శాంతి ప్రసా
దించు గాక!

## ప్రార్థన, కృతజ్ఞత

4కాబట్టి నేను ప్రార్థనలు చేసినప్పుడెల్లా నిన్ను
జ్ఞాపకం పెట్టుకొని నా దేవునికి కృతజ్ఞతలు చెప్పుకొను
చున్నాను. 5యేసు ప్రభువు పట్ల నీకున్న భక్తిని
గురించి, భక్తులపట్ల నీకున్న ప్రేమను గురించి నేను
విన్నాను. 6క్రీస్తు మనకు చేసిన మంచిని నీవు పూర్తిగా
అర్థం చేసుకోవాలనీ, తద్వారా మన విశ్వాసాన్ని నీవు
యితరులతో ఉత్సాహంగా పంచుకోగల్గాలనీ నేను
దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. 7సోదరా! నీవు భక్తులకు
సహాయం చేసి వాళ్ళను ఆనందపరిచావు. కనుక నీ
ప్రేమ నాకు చాలా ఆనందమును, తృప్తిని కల్గించింది.

## ఒనేసిము కొరకు విజ్ఞప్తి

8క్రీస్తు పేరిట నీవు చేయవలసిన కర్తవ్యాలను ఆజ్ఞా
పించగల అధికారం నాకున్నా, 9నేను ప్రేమతో నీకు
విజ్ఞప్తి చేస్తున్నాను. పౌలను నేను, వయస్సు మళ్ళిన
వాణ్ణిగా, యేసు క్రీస్తు ఖైదీని. 10నా కుమారు నితో
సమానమైన ఒనేసిము విషయంలో నిన్ను ఒకటి వేడు
కొంటున్నాను. నేను ఖైదీగా ఉన్నప్పుడు అతడు నా
కుమారుడయ్యాడు. 11గతంలో అతని వలన నీకు
ఉపయోగం లేదు. కాని యిప్పుడు అతని వలన నీకూ,
నాకూ, యిద్దరికీ ఉపయోగం ఉంది.
12నా గుండెలాంటివాడైన అతణ్ణి తిరిగి నీ దగ్గరకు
పంపుతున్నాను. 13నేను సువార్త కారణంగా ఖైదీగా
ఉన్నాను. ఈ సమయంలో నీ స్థానంలో అతడు
నాకు సహాయం చేయాలని నా అభిలాష. కనుక అతణ్ణి
నా దగ్గరే ఉంచుకోవాలనుకొన్నాను. 14కాని నీ అనుమతి
లేకుండా నేనిది చేయదలచుకోలేదు. నీవు చేసే ఈ
సహాయం నా ఒత్తిడివల్ల కాకుండా నీ యిష్టం ప్రకారం
చెయ్యాలని నా ఉద్దేశ్యం.
15ఒనేసిము నీ నుండి కొంతకాలం దూరం
అయ్యాడు. చిరకాలం నీ దగ్గర ఉండాలని యిలా జరి
గిందేమో. 16అతడు యిప్పుడు దాసుడు మాత్రమే
కాదు. క్రీస్తును నమ్మిన మన ప్రియసోదరుడు. అతడు
నాకు చాలా దగ్గరి వాడు. తోటి మనిషిగా, ప్రభువు
వల్ల కలిగిన బంధంలో ఒక సోదరునిగా, అతన్ని నీవు
యింకా దగ్గరివానిగా భావిస్తావు. 17నీవు నన్ను నీ భాగ
స్వామిగా భావిస్తూన్నట్లయితే నాకు స్వాగతం చెప్పి
నట్లే, అతనికి కూడా స్వాగతం చెప్పు. 18అతడు నీ
పట్ల ఏదైనా అపరాధం చేసి ఉంటే, లేక అతడు నీకు
ఏదైన అప్పు ఉంటే అది నా లెక్కలో వ్రాయి. 19నేను
ఆ అప్పును తీరుస్తానని పౌలు అను నేను నా స్వహ
స్తంతో వ్రాస్తున్నాను. కాని నీవు నీ జీవితంతో సహా
నాకు బాకీ ఉన్నావని చెప్పనవసరం లేదు. 20కనుక
నా సోదరా! ప్రభువు కోసం దయచేసి నాకీ సహాయం
చేయుము. క్రీస్తు కారణంగా మనం సోదరులం కనుక
నాకీ తృప్తి కలిగించు. 21నీ విధేయతపై నాకు నమ్మకం
ఉంది. నేను అడిగిన దానికన్నా ఎక్కువే చేస్తావని
నాకు తెలుసు. అందుకే నీకు వ్రాస్తున్నాను.
22మరొక విషయం. అతిథులకోసం ఉంచిన గదిని
నా కోసం సిద్ధంగా ఉంచు. నీ ప్రార్థనలు విని దేవుడు
నన్ను నీ దగ్గరకు పంపుతాడని ఆశిస్తున్నాను.
23యేసు క్రీస్తు నిమిత్తం నాతో సహా కారాగారంలో
ఉన్న ఎపఫ్రా నీకు వందనాలు తెలుపమన్నాడు.
24నాతో పని చేస్తున్న మార్కు, అరిస్తార్కు, దేమా,
లూకా కూడా నీకు వందనాలు తెలుపుతున్నారు.
25యేసు క్రీస్తు ప్రభువు యొక్క అనుగ్రహం మీ
ఆత్మకు తోడుగా ఉండుగాక!

# హెబ్రీయులకు వ్రాసిన లేఖ

1 దేవుడు గతంలో ప్రవక్తల ద్వారా ఎన్నో సార్లు, ఎన్నో విధాలుగా మన పూర్వీకులతో మాట్లాడాడు. 2అన్నిటిపై తన కుమారుణ్ణి వారసునిగా నియమించాడు. ఆయన ద్వారా ఈ విశ్వాన్ని సృష్టించాడు. ఈ చివరి రోజుల్లో ఆయన ద్వారా మనతో మాట్లాడాడు. 3కుమారుడు దేవుని మహిమ యొక్క ప్రకాశం. తండ్రి యొక్క ఉనికిలో పరిపూర్ణ ఉనికిగలవాడు. కుమారుడు శక్తివంతమైన తన మాటతో అన్నిటినీ పోషించి సంరక్షిస్తున్నాడు. పాపపరిహారం చేసాక ఈయన పరలోకంలోకి వెళ్ళాడు. అక్కడ, మహా తేజస్వియైన దేవుని కుడివైపు కూర్చున్నాడు. 4ఆయన దేవదూతలకన్నా గొప్పవాడు. దానికి తగ్గట్టుగా ఆయన గొప్ప పేరు కూడా వారసత్వం పొందాడు. దేవదూతల కన్నా కుమారుడు గొప్పవాడు.

5ఎందుకంటే దేవుడు ఏ దేవదూతతో కూడా ఈ విధంగా అనలేదు:

> "నీవు నా కుమారుడవు, నేడు నేను నీ తండ్రినయ్యాను."
>
> *కీర్తన 2:7*

మరొక చోట:

> "నేనతనికి తండ్రినౌతాను. అతడు నా కుమారుడౌతాడు."
>
> *2 సమూయేలు 7:14*

6మరొకచోట, దేవుడు తన మొదటి సంతానాన్ని ఈ ప్రపంచంలోకి తీసుకొని వచ్చినప్పుడు ఈ విధంగా అన్నాడు:

> "దేవదూతలు ఆయన్ని ఆరాధించాలి!"
>
> *ద్వితీయోపదేశ 32:43*

7దేవదూతల గురించి దేవుడు మాట్లాడుతూ:

> "దేవుడు తన దూతల్ని ఆత్మలుగాను తన సేవకుల్ని అగ్ని జ్వాలల్లా చేస్తాడు!"
>
> *కీర్తన 104:4*

8కాని కుమారుణ్ణి గురించి ఈ విధంగా అన్నాడు:

> "ఓ దేవా! నీ సింహాసనం చిరకాలం వుంటుంది. నీతి నీ రాజ్యానికి రాజదండంగా వుంటుంది.
>
> 9 నీవు నీతిని ప్రేమించి దుర్నీతిని ద్వేషించావు. అందువల్ల దేవుడు! నీ దేవుడు ఆనందమనే నూనెతో నిన్ను అభిషేకించి నీ స్నేహితులందరి కన్నా నిన్ను అధికంగా గౌరవించాడు."
>
> *కీర్తన 45:6-7*

10ఆయనింకా ఈ విధంగా అన్నాడు:

> "ఓ ప్రభూ! ఆదిలో ఈ ప్రపంచానికి నీవు పునాదులు వేశావు. ఆకాశాలను నీ చేతుల్తో సృష్టించావు.
>
> 11 అవి నశించి పోతాయి ఒక వస్త్రంలా పాత బడతాయి. కాని, నీవు చిరకాలం వుంటావు.
>
> 12 వాటిని నీవు ఒక వస్త్రంలా మడుస్తావు. వాటిని నీవు దుస్తులు మార్చినట్లు మారుస్తావు. కాని నీవు మాత్రం అలాగే వుంటావు! నీ సంవత్సరములకు అంతంలేదు!"
>
> *కీర్తన 102:25-27*

13దేవుడు ఏ దేవదూతతోనైనా:

> "నీ శత్రువుల్ని నీ పాద పీఠంగా చేసే వరకు నా కుడివైపు కూర్చో,"
>
> *కీర్తన 110:1*

అని ఎన్నడైనా అన్నాడా?

14ఈ దేవదూతలందరూ సేవ చేయటానికి వచ్చిన ఆత్మలే కదా! రక్షణ పొందే వ్యక్తుల సేవ చేయటానికే గదా దేవుడు వీళ్ళను పంపింది?

### జాగ్రత్తపడమని హెచ్చరిక

2 అందువల్ల, మనం విన్న సత్యాలను మనం ముందు కన్నా యింకా ఎక్కువ జాగ్రత్తగా పరిశీలించాలి. అప్పుడే మనం వాటికి దూరమైపోము. 2దేవదూతలు

చెప్పిన సందేశంలో సత్యం ఉందని రుజువైంది.* ఆ
సందేశాన్ని అనుసరించని వానికి దాన్ని విననివానికి
తగిన శిక్ష లభించింది. 3మరి, అటువంటి మహత్తరమైన
రక్షణను మనం గమనించకపోతే శిక్షనుండి ఏ విధంగా
తప్పించుకోగలం? ఈ రక్షణను గురించి మొట్ట మొదట
మన ప్రభువు ప్రకటించాడు. ఆ సందేశాన్ని విన్న
వాళ్ళు అందులో ఉన్న సత్యాన్ని మనకు వెల్లడి చేసారు.
4దేవుడు ఎన్నో సూచనల్ని, అద్భుతాల్ని, మహిమల్ని
చూపాడు. తన యిష్టాను సారం పరిశుద్ధాత్మ యొక్క
వరాల్ని పంచి పెట్టాడు. తద్వారా ఆ సందేశంలో
ఉన్న సత్యాన్ని మనకు రుజువు చేసాడు.

### యేసు మానవజన్మనెత్తటం

5మనం మాట్లాడుతున్న ప్రపంచాన్ని, అంటే
రాబోవు ప్రపంచాన్ని దేవుడు తన దూతలకు లోపర్చ
లేదు. 6ధర్మశాస్త్రంలో ఒకచోట ఈ విధంగా వ్రాయ
బడింది:

“మానవుణ్ణి గురించి నీవాలోచించటానికి
అతడెంతటి వాడు? మానవ కుమారుణ్ణి
నీవు చూడడానికి అతడెంతటి వాడు?
7 నీవతనికి దేవదూతలకన్నా కొద్దిగా తక్కువ
స్థానాన్ని యిచ్చావు! కీర్తి గౌరవమనే కిరీ
టాన్ని నీవతనికి తొడిగించి,
8 అన్నిటినీ అతని పాదాల క్రింద వుంచావు.”

*కీర్తన 8:4-6*

దేవుడు అన్నిటినీ ఆయన పాదాల క్రింద ఉంచాడు
అంటే, ప్రతి ఒక్కటి ఆయన అధికారానికి లోబడి
ఉండాలన్నమాట. కాని ప్రస్తుతం, అన్నీ ఆయన ఆధీ
నంలో ఉన్నట్లు మనకు కనిపించటం లేదు. 9యేసు,
దేవదూతల కన్నా కొంత తక్కువ వానిగా చేయ
బడ్డాడు. అంటే ఆయన మానవులందరి కోసం మరణిం
చాలని, దేవుడాయన్ని అనుగ్రహించి ఈ తక్కువ స్థానం
ఆయనకు యిచ్చాడు. యేసు కష్టాలను అనుభవించి
మరణించటంవలన ‘మహిమ, గౌరవము’ అనే కిరీటాన్ని
ధరించగలిగాడు.

10దేవుడు తన కుమారుల్లో చాలామంది తన మహి
మలో భాగం పంచుకొనేటట్లు చెయ్యాలని, వాళ్ళ
రక్షణకు కారకుడైనటువంటి యేసును కష్టాలను
భవింపజేసి, ఆయనలో పరిపూర్ణత కలుగ చేసాడు.
ఎవరికోసం, ఎవరిద్వారా, ఈ ప్రపంచం సృష్టింప
బడిందో ఆ దేవుడు ఈ విధంగా చేయటం ధర్మమే!
యేసు మానవుల్ని పవిత్రం చేస్తాడు. 11ఆయన
పవిత్రం చేసిన ప్రజలు, పవిత్రం చేసే ఆయన ఒకే
కుటుంబానికి చెందిన వాళ్ళు. అందువలనే, వాళ్ళు
తన సోదరులని చెప్పుకోవటానికి యేసు సిగ్గుపడటం
లేదు. 12ఆయన ఈ విధంగా అన్నాడు:

“నిన్ను గురించి నా సోదరులకు తెలియ
చేస్తాను. సభలో, నిన్ను స్తుతిస్తూ పాటలు
పాడతాను!”

*కీర్తన 22:22*

13మరొక చోట

“నేను దేవుణ్ణి నమ్ముతున్నాను!”

*యెషయా 8:17*

అంతేకాక ఇలా కూడా అన్నాడు:

“నేను, దేవుడు నాకిచ్చిన సంతానం యిక్కడ
ఉన్నాము!”

*యెషయా 8:18*

14ఆయన ‘సంతానమని’ పిలువబడిన వాళ్ళు రక్త
మాంసాలుగల ప్రజలు. యేసు వాళ్ళలా అయిపోయి
వాళ్ళ మానవనైజాన్ని పంచుకొన్నాడు. ఆయన తన
మరణం ద్వారా మరణంపై అధికారమున్న సైతాన్ను
నాశనం చేయాలని ఇలా చేశాడు. 15తద్వారా జీవి
తాంతం మరణానికి భయపడి జీవించే వాళ్ళకు స్వేచ్ఛ
కలిగించాడు.

16నిజానికి, ఆయన దేవదూతలకు సహాయం
చెయ్యాలని రాలేదు. అబ్రాహాము సంతానానికి
సహాయం చెయ్యాలని వచ్చాడు. 17ఈ కారణంగా
ఆయన అన్ని విధాల తన సోదరులను పోలి జన్మించ
వలసి వచ్చింది. ఆయన మహాయాజకుడై తన ప్రజ
లపై దయ చూపటానికి మానవ జన్మనెత్తాడు. ఆయన
ప్రజల పాపాలకు ప్రాయశ్చిత్తం చెయ్యాలని వారిలో
ఒకడాయెను. 18శోధన సమయాల్లో యేసు కష్టాలను
అనుభవించాడు. కనుక యిప్పుడు శోధనలకు
గురౌతున్న వాళ్ళకు ఆయన సహాయం చేయగలడు.

### యేసు మోషే కన్నా గొప్పవాడు

3 పరలోక దేవుని పిలుపులో పాలివారైన సోదరు
లారా! మీరు పవిత్రత గలవాళ్ళు. మనం బహి
రంగంగా విశ్వసిస్తున్న ప్రధాన యాజకుడు, దేవుని
అపొస్తలుడు అయినటువంటి యేసు పట్ల మీ మనస్సు
లగ్నం చెయ్యండి. 2మోషే దేవుని ఇల్లంతటిలో నమ్మ
కస్తుడు. అలాగే యేసు కూడా తనను నియమించిన
దేవునియందు నమ్మకస్తుడుగా ఉండెను. 3ఇంటికంటే,
ఇల్లు కట్టిన వానికి ఎక్కువ గౌరవముంటుంది. అలాగే

---

**దేవదూతలు ... రుజువైంది** సీనాయి పర్వతం మీద దేవుడు దేవదూతల ద్వారా మోషేకు యిచ్చిన ఆదేశం.

మోషే కన్నా యేసు ఎక్కువ గౌరవానికి అర్హుడనిపించు కొన్నాడు. [4]ఎందుకంటే, ప్రతి ఇంటిని ఎవరో ఒకడు కడతాడు, కాని దేవుడు అన్నిటినీ నిర్మించాడు.

[5]దేవుని ఇల్లంతటిలో మోషే సేవకునిగా విశ్వాసంతో పని చేసాడు. ఆ కారణంగా, చాలా కాలం తర్వాత మోషే జరుగబోవువాటికి సాక్షిగా ఉండెను. [6]కాని క్రీస్తు దేవుని ఇల్లంతటికి నమ్మకస్తుడైన కుమారుడు. మనం అతిశయించే నిరీక్షణ, ధైర్యంను గట్టిగా పట్టుకొన్న వారమైతే మనం ఆయన ఇల్లౌతాం. అందువల్ల మనం ఆశిస్తున్న దానికోసం, విశ్వాసంతో ధైర్యంగా ఉంటే ఆ యింటికి చెందిన వాళ్ళమౌతాము.

### దేవుని ప్రజలకు విశ్రాంతి

[7-8]అందువల్ల పరిశుద్ధాత్మ ఈ విధంగా అంటున్నాడు:

> "ఆనాడు ఎడారిలో మూర్ఖులై మీరాయనకు
> ఎదురు తిరిగారు. ఆయన సహనాన్ని పరీ
> క్షించారు. కాని నేడు మీరాయన మాట
> వింటే మీ హృదయాలు కఠిన పర్చు
> కోవద్దు.
> 9 నేను నలభై సంవత్సరాలు చేసినదంతా
> చూసి కూడా మీ పూర్వీకులు నన్నూ,
> నా సహనాన్ని పరీక్షించారు.
> 10 ఆ కారణంగానే, ఆ ప్రజలంటే నాకు కోపం
> వచ్చింది, 'వాళ్ళ హృదయాలు పెడ
> దారులు పట్టాయి, నేను చూపిన దారుల్ని
> వాళ్ళు చూడ లేదు' అని అన్నాను.
> 11 అందుకే, 'నా విశ్రాంతిలోనికి వాళ్ళను
> రానివ్వనని కోపంతో ప్రమాణం చేశాను.'"
>
> *కీర్తన 95:7-11*

[12]సోదరులారా! సజీవంగా ఉన్న దేవునికి దూరమైపోయే హృదయంకాని, విశ్వాసంలేని హృదయంకాని, మీలో ఉండకుండా జాగ్రత్త పడండి. [13]ఆ 'నేడు' అనేది యింకా ఉంది గనుక, పరస్పరం ప్రతి రోజు ప్రోత్సాహ పరచుకొంటూ ఉండండి. అప్పుడు పాపం మిమ్మల్ని మోసం చెయ్యలేదు. మీలో మూర్ఖత్వం ఉండదు. [14]మనలో మొదటినుండి ఉన్న విశ్వాసాన్ని చివరిదాకా గట్టిగా పట్టుకొనివుంటే, మనం క్రీస్తుతో కలిసి భాగం పంచుకొంటాం. [15]ఇంతకు ముందు చెప్పబడినట్లు:

> "ఆనాడు మూర్ఖులై మీరాయనకు ఎదురు
> తిరిగారు కాని, నేడు మీరాయన మాట
> వింటే అలా చెయ్యకండి."
>
> *కీర్తన 95:7-8.*

[16]వీళ్ళందరూ ఈజిప్టు దేశంనుండి మోషే పిలుచుకొని వచ్చిన ప్రజలే కదా! దేవుని స్వరం విని ఎదురు తిరిగింది వీళ్ళే కదా! [17]నలభై సంవత్సరాలు దేవుడు కోపగించుకొన్నది ఎవరిమీద? పాపం చేసి ఎడారిలో పడి చనిపోయిన వాళ్ళమీదనే కదా! [18]"నా విశ్రాంతిలోనికి వాళ్ళను రానివ్వను" అని, అవిధేయతగా ప్రవర్తించిన వాళ్ళ విషయంలో దేవుడు ప్రమాణం చేయలేదా?

[19]వాళ్ళు విశ్వసించలేదు గనుగ ఆ విశ్రాంతిలో ప్రవేశించ లేకపొయ్యారు. ఇది మనం గమనిస్తూనే ఉన్నాము.

**4** దేవుని విశ్రాంతిలో ప్రవేశించుదుమన్న వాగ్దానం యింకా అలాగే ఉంది. అందువలన అక్కడికి వెళ్ళగలిగే అవకాశాన్ని ఎవ్వరూ జారవిడుచుకోకుండా జాగ్రత్త పడదాం. [2]ఎందుకంటే, వాళ్ళకు ప్రకటింపబడినట్లే మనకు కూడా సువార్త ప్రకటింపబడింది. కాని, వాళ్ళు ఆ సువార్తను విశ్వాసంతో వినలేదు గనుక అది వాళ్ళకు నిష్ప్రయోజనమైపోయింది. [3]సువార్తను విశ్వసించే మనం దేవుని విశ్రాంతిలో ప్రవేశిస్తాము.

> "నా కోపంతో ప్రమాణం చేసి చెప్పు
> చున్నాను: 'నా విశ్రాంతిలోనికి వాళ్ళను
> రానివ్వను'"
>
> *కీర్తన 95:11*

అని దేవుడు అన్నాడు. ప్రపంచాన్ని సృష్టించిన తర్వాత ఆయన కార్యం ముగిసింది. [4]కాని, "దేవుడు ప్రపంచాన్ని సృష్టించటం ముగించిన తర్వాత విశ్రాంతి తీసుకొనెను"* అని ఏడవ రోజును గురించి ఒక చోట వ్రాయబడి ఉంది. [5]దేవుడు ఈ విషయాన్ని గురించి మళ్ళీ చెబుతూ, "నా విశ్రాంతిలోనికి వాళ్ళను రానివ్వను" అని అన్నాడు.

[6]ఆ విశ్రాంతిలో ప్రవేశించటానికి అవకాశం ఇంకా వుంది. ఇదివరలో శుభసందేశాన్ని విన్న వాళ్ళు, వాళ్ళ అవిధేయతవల్ల లోపలికి వెళ్ళలేక పొయ్యారు. [7]అందువల్ల దేవుడు మరొక దినాన్ని నిర్ణయించాడు. దాన్ని "ఈ రోజు" అని అన్నాడు. నేను ముందు వ్రాసినట్లు చాలాకాలం తర్వాత దేవుడు దావీదు ద్వారా ఈ విధంగా మాట్లాడాడు:

> "ఈ రోజు మీరాయన స్వరం వింటే,
> మూర్ఖంగా ప్రవర్తించకండి."
>
> *కీర్తన 95:7-8*

[8]యెహోషువా వాళ్ళకు విశ్రాంతి ఇచ్చినట్లయితే దేవుడు ఆ తర్వాత మరొక రోజును గురించి మాట్లాడి

---

**దేవుడు ... తీసుకొనెను** ఆది. 2:2.

ఉండేవాడు కాదు. 9అందువల్ల, దేవుని ప్రజల కోసం
‘విశ్రాంతి’ కాచుకొని ఉంది. 10దేవుడు తన పని ముగించి
విశ్రమించాడు. అలాగే, దేవుని విశ్రాంతిలో ప్రవేశించే
ప్రతి ఒక్కడూ తన పనినుండి విశ్రాంతి పొందుతాడు.
11అందువల్ల ఆ విశ్రాంతిని పొందటానికి మనం అన్ని
విధాలా ప్రయత్నంచేద్దాం. వాళ్ళలా అవిధేయతగా ప్రవ
ర్తించి క్రింద పడకుండా జాగ్రత్తపడదాం.
12దైవ సందేశం సజీవమైంది. దానిలో చురుకు
దనం ఉంది. అది రెండు వైపులా పదునుగానున్న
కత్తికన్నా పదునైంది. అది చొచ్చుకొని పోయి
ఆత్మను, ప్రాణాన్ని, కీళ్ళను, ఎముకలో ఉన్న మూలు
గను విభాగించగలదు. అది మనస్సు యొక్క భావాల
మీద, ఆలోచనల మీద తీర్పు చెప్పగలదు. 13సృష్టిలో
ఉన్న ఏ వస్తువూ దేవుని దృష్టినుండి తప్పించుకోలేదు.
కళ్ళ ముందు పరచబడినట్లు ఆయనకు అన్నీ స్పష్టంగా
కనిపిస్తాయి. అలాంటి దేవునికి మనం మనకు సంబం
ధించిన లెక్కల్ని చూపవలసి వుంటుంది.

## యేసు గొప్ప ప్రధాన యాజకుడు

14పరలోకానికి వెళ్ళిన యేసు దేవుని కుమారుడు.
ఆయనే మన ప్రధాన యాజకుడు. మనం బహిరంగంగా
అంగీకరించిన విశ్వాసాన్ని విడువకుండా దృఢంగా
ఉండాలి. 15మన ప్రధాన యాజకుడు మన బలహీన
తలను చూసి సానుభూతి చెందుతూ ఉంటాడు. ఎందు
కంటే ఆయన మనలాగే అన్ని రకాల పరీక్షలకు గురి
అయ్యాడు. కాని, ఆయన ఏ పాపమూ చెయ్యలేదు.
16అందువలన మనకు అనుగ్రహం ప్రసాదించే దేవుని
సింహాసనం దగ్గరకు విశ్వాసంతో వెళ్ళుదాం. అలా
చేస్తే మనకు అవసరమున్నప్పుడు, ఆయన దయ,
అనుగ్రహము మనకు లభిస్తాయి.

5 ఆధ్యాత్మిక విషయాల్లో, తమ పక్షాన పని చెయ్య
టానికి ప్రజలు తమ నుండి ప్రధాన యాజకుని
ఎన్నుకొంటారు. పాప పరిహారార్థం అర్పించే కానుకల్ని,
బలుల్ని దేవునికి యితడు సమర్పిస్తాడు. 2ఇతనిలో
కూడా ఎన్నో రకాల బలహీనతలు ఉంటాయి కనుక,
అజ్ఞానంతో తప్పులు చేస్తున్న ప్రజల పట్ల యితడు
సానుభూతి కనుబరుస్తాడు. 3ఈ కారణంగానే, ప్రజల
పాపాలకు బలిని అర్పించినట్లే తన పాపాలకు కూడా
బలిని అర్పించవలసి వుంటుంది.
4ప్రధాన యాజకుని స్థానం గౌరవనీయమైంది. ఆ
స్థానాన్ని ఎవ్వరూ, స్వయంగా ఆక్రమించలేరు. దేవుడు
అహరోనును పిలిచినట్లే ఈ స్థానాన్ని ఆక్రమించటానికి
అర్హత గలవాణ్ణి పిలుస్తాడు. 5క్రీస్తు ప్రధానయాజకుని
యొక్క గౌరవ స్థానాన్ని స్వయంగా ఆక్రమించ లేదు.
దేవుడాయనతో,

“నీవు నా కుమారుడవు. నేడు నేను నీకు
తండ్రినయ్యాను”
*కీర్తన 2:7*

అని చెప్పి మహిమ పరచెను.

6మరొక చోట, ఇలా అన్నాడు:

“నీవు మెల్కీసెదెకు వలె చిరకాలం యాజకు
డవై వుంటావు.”
*కీర్తన 110:4*

7యేసు తాను భూమ్మీద జీవించినప్పుడు తనను
చావునుండి రక్షించగల దేవుణ్ణి కళ్ళ నిండా నీళ్ళు
పెట్టుకొని పెద్ద స్వరంతో ప్రార్థించి వేడుకొన్నాడు.
ఆయనలో భక్తి, వినయం ఉండటం వల్ల దేవుడాయన
విన్నపం విన్నాడు. 8యేసు దేవుని కుమారుడైనా,
తాననుభవించిన కష్టాల మూలంగా విధేయతతో
ఉండటం నేర్చుకొన్నాడు. 9పరిపూర్ణత పొందాక, తన
పట్ల విధేయతగా ఉన్న వాళ్ళందరికీ శాశ్వతమైన రక్షణ
ప్రసాదించ గలవాడయ్యాడు. 10దేవుడు మెల్కీసెదెకు
యొక్క క్రమంలో యేసును ప్రధానయాజకునిగా
నియమించాడు.

## మీరింకా పసికందులు

11ఈ విషయాన్ని గురించి మేము చెప్పవలసింది
ఎంతో ఉంది. కాని మీలో గ్రహించే శక్తి తక్కువగా
ఉండటం వల్ల, విడమర్చి చెప్పటానికి చాలా కష్టమౌ
తుంది. 12నిజం చెప్పాలంటే, మీకిదివరకే బోధించి
ఉండవలసింది. కాని దైవ సందేశంలోని ప్రాథమిక
సత్యాలను మీకు మళ్ళీ నేర్పించవలసిన అవసరం
కలుగుతోంది. అంటే, మీరు పాలు త్రాగగలరు కాని,
ఆహారం తినగల శక్తి మీకింకా కలుగలేదు.
13పాలతో జీవించేవాళ్ళు యింకా పసికందులే కనుక
వాళ్ళకు మంచి చెడులను గురించి తెలియదు. 14కాని,
ఆహారం ఎదిగిన వాళ్ళు తినగలుగుతారు. అంటే, వాళ్ళు
జీవితానికి అలవాటు పడి మంచి చెడులను గుర్తించ
టంలో నేర్పు సంపాదించారన్న మాట.

6 అందువల్ల క్రీస్తును గురించి బోధింపబడిన ప్రాథ
మిక పాఠాలను చర్చించటం మాని ముందుకు
వెళ్తూ పరిపూర్ణత చెందుదాం. ఘోరమైన తప్పులు
చేసి మారుమనస్సు పొందటం, దేవుని పట్ల విశ్వాసం,
2బాప్తిస్మమును* గురించి బోధించటం, చేతులు తల
మీద ఉంచి అభిషేకించటం, చనిపోయిన వాళ్ళు తిరిగి

---

**బాప్తిస్మము** ఇక్కడ బాప్తిస్మము అనగా “క్రైస్తవ బాప్తిస్మము” అయివుండవచ్చు లేక యూదా సంప్రదాయ శుద్ధీకరణలు అయివుండవచ్చు.

బ్రతికి రావటం, శాశ్వతమైన తీర్పు, యివి మన
పునాదులు. ఈ పునాదుల్ని మళ్ళీ మళ్ళీ వేయకుండా
ఉందాం. 3దేవుడు సమ్మతిస్తే అలాగే జరుగుతుంది.

4ఒకసారి వెలిగింపబడిన వాళ్ళు, పరలోకం నుండి
పొందిన వరాన్ని రుచి చూసిన వాళ్ళు, పవిత్రాత్మలో
భాగం పంచుకున్న వాళ్ళు, 5దైవ సందేశం యొక్క
మంచితనాన్ని రుచి చూసిన వాళ్ళు, రానున్న కాలం
యొక్క శక్తిని రుచిచూచిన వాళ్ళు 6పడిపోతే మారు
మనస్సు పొందేటట్లు చేయటం అసంభవం. ఎందు
కంటే, వాళ్ళు ఈ విధంగా చేసి దేవుని కుమారుణ్ణి
మళ్ళీ సిలువవేసి చంపుతున్నారు. ఆయన్ని నలుగు
రిలో అవమాన పరుస్తున్నారు.

7తన మీద తరచుగా పడ్తున్న వర్షాన్ని పీల్చుకొనే
భూమి, తనను దున్నిన రైతులకు పంటనిచ్చిన భూమి
దేవుని ఆశీస్సులు పొందుతుంది. 8కాని, ముళ్ళ
మొక్కలు, కలుపుమొక్కలతో పెరిగేభూమి నిరుప
యోగమైనది. అలాంటి భూమిని దేవుడు శపిస్తాడు.
చివరకు దాన్ని కాల్చి వేస్తాడు.

9ప్రియమైన సోదరులారా! మేము మాట్లాడుతున్న
ఈ రక్షణ సంబంధమైన విషయాల ద్వారా మీకు
మంచి కలుగుతుందనే విశ్వాసం మాకుంది. 10దేవుడు
అన్యాయంచెయ్యడు. మీరు దేవుని ప్రజలకు సహాయం
చేసారు. యిప్పుడు కూడా చేస్తూనే ఉన్నారు. మీరు
చేసిన కార్యాలను మీరాయన పట్ల చూపిన ప్రేమను
ఆయన మరిచిపోడు. 11మీ నిరీక్షణ సంపూర్ణమగు
నట్లుగా మీలో ప్రతి ఒక్కడు మీరిదివరకు చూపిన
ఆసక్తి చివరివరకు చూపాలి. 12మీరు సోమరులుగా
నుండకూడదు. కాని వాగ్దానము చేయబడిన దానిని
విశ్వాసము ద్వారా, సహనము ద్వారా పొందినవారిని
అనుసరించండి.

13దేవుడు అబ్రాహాముతో వాగ్దానం చేసినప్పుడు
తనకంటే గొప్పవాడెవ్వడూ లేనందు వలన స్వయంగా
తన మీదే ప్రమాణం తీసుకొంటూ, 14ఇలా అన్నాడు:
"నేను నిన్ను తప్పకుండా ఆశీర్వదిస్తాను. నీ సంతతిని
అభివృద్ధి పరుస్తాను." 15అబ్రాహాము ఓర్పుతో కాచు
కొన్నాడు. దేవుడు తన వాగ్దానాన్ని నెరవేర్చాడు.
16ప్రజలు తమకన్నా గొప్ప వాళ్ళ మీద ప్రమాణం
చేస్తారు. ఈ ప్రమాణాలు వివాదాలు సాగనీయకుండా
చేసి మాటల్లో మీ సత్యాన్ని దృఢ పరుస్తాయి. 17దేవుడు
తన వాగ్దానం విషయంలో తన ఉద్దేశ్యాన్ని మార్చు
కోనని వాగ్దానం పొందిన వారసులకు స్పష్టం చేయా
లనుకున్నాడు. అందువల్ల ఆ వాగ్దానాన్ని తన మీద
ప్రమాణం చేసి ధృఢపరిచాడు. 18అందువల్ల ఈ
'రెండూ' మార్పు చెందలేవు. వీటివిషయంలో దేవుడు
అసత్యమాడలేడు. తానివ్వబోయే వాటికోసం ఆశా
భావంతో పరుగెత్తుతున్న వాళ్ళకు ప్రోత్సాహం కలగాలని
ఈ ప్రమాణం చేశాడు. 19భద్రతను దృఢత్వాన్ని కలి
గించే ఈ నిరీక్షణ మన ఆత్మలకు లంగరు లాంటిది.
ఈ నిరీక్షణ తెరవెనుక లోపలి భాగంలో స్థిరముగా
ప్రవేశించగలదు. 20యేసు మన కోసం, మనకన్నా
ముందు ఆ తెరలోపలికి వెళ్ళాడు. మెల్కీసెదెకు
క్రమంలో యేసు కూడా శాశ్వతంగా ప్రధాన యాజకు
డుగా ఉంటాడు.

## మెల్కీసెదెకు

7 ఈ మెల్కీసెదెకు షాలేము రాజు; మరియు
మహోన్నతుడైన దేవుని యాజకుడు. అబ్రా
హాము రాజులను ఓడించి తిరిగి వస్తున్నప్పుడు మెల్కీసె
దెకు అతన్ని కలుసుకొని ఆశీర్వదించాడు. 2అబ్రా
హాము తాను జయించిన వాటిలో పదవ వంతు మెల్కీ
సెదెకుకు యిచ్చాడు. మొదటిదిగా 'మెల్కీసెదెకు' అనే
పదానికి నీతికిరాజు అనే అర్థం. రెండవదిగా 'షాలేము
రాజు' అను యితని పేరుకు శాంతికి రాజు అనే అర్థం
కూడా వుంది. 3మెల్కీసెదెకు తల్లిదండ్రులెవరో మనకు
తెలియదు. అతని పూర్వీకులెవరో మనకు తెలియదు.
అతని బాల్యాన్ని గురించి కాని, అంతిమ రోజుల్ని
గురించికాని మనకు తెలియదు. దేవుని కుమారునివలె
అతడు కూడా చిరకాలం యాజకుడుగా ఉంటాడు.

4మూల పురుషుడైన అబ్రాహాము కూడా తాను
జయించిన దానిలో పదవ వంతు అతనికిచ్చాడంటే,
అతడు ఎంత గొప్పవాడో గ్రహించండి. 5ఇశ్రాయేలు
ప్రజలు అబ్రాహాము వంశానికి చెందిన వాళ్ళు, లేవి
జాతికి చెందిన యాజకుల సోదరులు. అయినా ధర్మ
శాస్త్రంలో ఈ లేవి యాజకులు ప్రజలు ఆర్జించిన
దానిలో పదవ వంతు సేకరించాలని ఉంది. 6మెల్కీ
సెదెకు లేవి జాతికి చెందిన వాడు కాకపోయినా, అబ్రా
హాము నుండి అతని ఆదాయంలో పదవ వంతు సేక
రించాడు. దేవుని వాగ్దానాలు పొందిన అతణ్ణి ఆశీర్వ
దించాడు. 7ఆశీర్వదించేవాడు, ఆశీర్వాదం పొందే వాని
కన్నా గొప్ప వాడవటంలో అనుమానం లేదు. 8ఒక
వైపు చనిపోయేవాళ్ళు పదవ వంతు సేకరిస్తున్నారు.
మరొక వైపు చిరకాలం జీవిస్తాడని లేఖనాలు ప్రక
టించిన మెల్కీసెదెకు పదవ వంతు సేకరిస్తున్నాడు.
9ఒక విధంగా చూస్తే పదవ వంతు సేకరించే లేవి,
అబ్రాహాము ద్వారా పదవ వంతు చెల్లించాడని చెప్ప
కోవచ్చు. 10ఎందుకంటే, మెల్కీసెదెకు అబ్రాహామును
కలుసుకొన్నప్పుడు లేవి యింకా జన్మించ లేదు.
అతడు, తన మూల పురుషుడైన అబ్రాహాములోనే
ఉన్నాడు.

## యేసు, మెల్కీసెదెకు లాంటి యాజకుడు

11మోషే ధర్మశాస్త్రంలో లేవి జాతికి చెందిన యాజ
కుల గురించి వ్రాసాడు. ఒకవేళ, ఆ యాజకుల ద్వారా
ప్రజలు పరిపూర్ణత పొంద గలిగి ఉంటే అహరోనులాంటి

వాడు కాకుండా మెల్కీసెదెకులాంటి యాజకుడు
రావలసిన అవసరమెందుకు కలిగింది? 12దేవుడు మన
కోసం క్రొత్త యాజకుణ్ణి నియమించాడు కాబట్టి
ఆయనకు తగ్గట్టుగా యాజక ధర్మాన్ని కూడా
మార్చాడు. 13ఈ విషయాలు ఎవర్ని గురించి చెప్ప
బడ్డాయో, ఆయన వేరొక గోత్రపు వాడు. ఆ గోత్రానికి
చెందిన వాళ్ళెవ్వరూ ఎన్నడూ బలిపీఠం ముందు
నిలబడి యాజకునిగా పనిచేయ లేదు. 14మన ప్రభువు
యూదా వంశానికి చెందిన వాడనే విషయం మనకు
స్పష్టమే! ఈ గోత్రపు వాళ్ళు యాజకులౌతారని మోషే
అనలేదు.

15పైగా మెల్కీసెదెకు లాంటి మన ప్రభువు యాజ
కుడై ఈ విషయం ఇంకా స్పష్టం చేశాడు. 16మన
ప్రభువు ధర్మశాస్త్రంలో వ్రాయబడిన వంశావళిని అను
సరించి యాజకుడు కాలేదు. ఆయన చిరంజీవి గనుక
యాజకుడయ్యాడు. 17ఎందుకంటే, "నీవు మెల్కీసె
దెకు క్రమంలో చిరకాలం యాజకుడవై ఉంటావు"*
అని లేఖనాలు ప్రకటిస్తున్నాయి.

18పాత నియమం సత్తువ లేనిది, నిరుపయోగ
మైనది. కనుక, అది రద్దు చేయబడింది. 19ఆ ధర్మ
శాస్త్రం ఎవనిలోనూ పరిపూర్ణత కలిగించలేక పోయింది.
అందువల్ల దేవుడు మనలో క్రొత్త నిరీక్షణను ప్రవే
శపెట్టాడు. ఈ నిరీక్షణ మనల్ని ఆయనకు దగ్గర
చేస్తుంది.

20దీని విషయంలో దేవుడు ప్రమాణం కూడా
చేశాడు. మిగతా వాళ్ళు యాజకులైనప్పుడు ఎవ్వరూ
ప్రమాణం చెయ్యలేదు. 21కాని, యేసు ప్రమాణం
ద్వారా యాజకుడైనాడు. ఈయన విషయంలో
దేవుడాయనతో ఇలా అన్నాడు:

> "ప్రభువు ప్రమాణం చేశాడు. తన మనస్సును
> మార్చుకోడు: 'నీవు చిరకాలం యాజకు
> డుగా వుంటావు.'"
>
> *కీర్తన 110:4*

22ఈ ప్రమాణంద్వారా యేసు శ్రేష్టమైన క్రొత్త
ఒడంబడికకు బాధ్యుడయ్యాడు.

23ఎందరో యాజకులయ్యారు కాని, చావు వాళ్ళని
యాజకులుగా పనిచేయనీయకుండా అడ్డగించింది.
24కాని యేసు చిరంజీవి గనుక చిరకాలం యాజకుడుగా
ఉంటాడు. 25అందువలన తన ద్వారా దేవుని దగ్గరకు
వచ్చే వాళ్ళను ఆయన ఎప్పుడూ రక్షిస్తూ ఉంటాడు.
ఆయన వాళ్ళ పక్షాన దేవుణ్ణి వేడుకోటానికి చిరకాలం
జీవిస్తూ ఉంటాడు.

26పవిత్రమైన వాడు, ఏ కళంకం లేనివాడు, పరి
శుద్ధమైన వాడు, పాపుల గుంపుకు చెందనివాడు, పర
లోకంలో ఉన్నత స్థానాన్ని పొందినవాడు, ఇలాంటి
ప్రధాన యాజకుడై అవసరాన్ని తీరుస్తున్నాడు.
27ఆయన, ఇతర ప్రధాన యాజకులవలె తన పాపాల
కొరకు గానీ, ప్రజల పాపాల కొరకు గానీ ప్రతిరోజు
బలుల్ని అర్పించవలసిన అవసరం లేదు. ఆయన
తనను తానే బలిగా అర్పించుకున్నాడు. అంటే మొదటి
బలి, చివరి బలి ఆయనే! 28ధర్మశాస్త్రం బలహీనులైన
వాళ్ళను యాజకులుగా నియమించింది; కాని, ధర్మ
శాస్త్రం తర్వాత వచ్చిన ప్రమాణం కుమారుణ్ణి ప్రధాన
యాజకునిగా నియమించింది. అంతే కాక, ఆయన
చిరకాలం పరిపూర్ణునిగా చేయబడ్డాడు.

## క్రొత్త ఒడంబడిక

8 మేము చెబుతున్న దానిలో ముఖ్య అంశం ఏమి
టంటే: పరలోకంలో మహోన్నతుని సింహాస
నానికి కుడి వైపు కూర్చోగల అధికారమున్న ప్రధాన
యాజకుడు మనకున్నాడు. 2అంతే కాక ఆయన
నిజమైన గుడారంలో, అంటే ప్రభువు నిర్మించిన
పరిశుద్ధాలయములో సేవ చేస్తున్నాడు. ఈ గుడారం
మానవుడు నిర్మించింది కాదు.

3కానుకల్ని, బలుల్ని అర్పించటానికి ప్రధాన యాజ
కుడు నియమించబడతాడు. అందువల్ల ఈయన దగ్గర
కూడా అర్పించటానికి ఏదైనా ఉండవలసిన అవసరం
ఏర్పడింది. 4ఈయన భూలోకంలో ఉండినట్లయితే
యాజకుడుగా పని చేసేవాడు కాదు. ఎందుకంటే,
ధర్మశాస్త్రం ఆదేశించిన విధంగా కానుకలు అర్పించే
యాజకులు యిదివరకే భూలోకంలో ఉన్నారు.
5వాళ్ళు భూమ్మీద నున్న పరిశుద్ధ స్థలములో సేవ
చేస్తూ ఉంటారు. భూలోకంలో ఉన్న ఈ పరిశుద్ధ
స్థలము పరలోకంలో ఉన్న దానికి నీడలాంటిది, అంటే
ప్రతిబింబం. ఈ కారణంగానే, మోషే గుడారాన్ని నిర్మిం
చటానికి మొదలు పెట్టినప్పుడు దేవుడు అతనితో,
"నేను నీకు కొండమీద చూపించిన విధంగా దాన్ని
నిర్మించు!"* అని హెచ్చరించాడు. 6యేసు మధ్య
వర్తిగా ఉండి నియమించిన ఒడంబడిక పాత దానికన్నా
ఉత్తమమైనది. అందులో ఉత్తమ వాగ్దానాలు న్నాయి.
అందువల్ల దేవుడు యేసుకిచ్చిన యాజకత్వము వాళ్ళు
చేసే యాజకత్వం పనికన్నా ఉత్తమమైనది.

7ఎందుకంటే ఒకవేళ మొదటి ఒడంబడికలో ఏ
తప్పూ లేక పోయినట్లయితే యింకొక ఒడంబడిక
యొక్క అవసరం ఉండక పోయేది. 8కాని ప్రభువు
ప్రజల పొరపాట్లను కనిపెట్టి వాళ్ళతో ఈ విధంగా
అన్నాడు:

---

**నీవు … ఉంటావు** కీర్తన 110:4.

**నేను … నిర్మించు** నిర్గమ. 25:40.

"ఇశ్రాయేలు, యూదా, ప్రజలతో క్రొత్త
ఒడంబడిక చేయవలసిన సమయం
వస్తుంది!
9 వాళ్ళ ముత్తాతల్ని ఈజిప్టు దేశంనుండి,
చేయి పట్టుకొని వెలుపలికి పిలుచుకొని
వచ్చాను. ఆనాడు వాళ్ళతో ఒక ఒడంబడిక
చేసాను. నేను మీతో చేయబోతున్న ఒడం
బడిక ఆనాటి ఒడంబడికలా ఉండదు.
వాళ్ళు నా ఒడంబడిక ప్రకారం నడుచుకో
లేదు గనుక వాళ్ళను నేను లెక్క చెయ్య
లేదు.
10 ఆ తర్వాత, ఇశ్రాయేలు ప్రజలతో ఈ
విధంగా ఒడంబడిక చేస్తాను: నా నియ
మాల్ని వాళ్ళ మనసుల్లో ఉంచుతాను.
వాటిని వాళ్ళ హృదయాలపై వ్రాస్తాను.
నేను వాళ్ళ దేవునిగా ఉంటాను. వాళ్ళు
నా ప్రజగా ఉంటారు.
11 అప్పుడు ప్రభువుని తెలుసుకోమని
ప్రక్కింటి వానికి గాని, తన సోదరునికి
గాని బోధించ వలసిన అవసరం ఉండదు.
ఎందుకంటే ఆ రోజుల్లో అధముడు, గొప్ప
వాడు, అందరు నన్ను తెలుసుకొంటారు.
12 నేను వాళ్ళ దోషాల్ని క్షమిస్తాను. వాళ్ళ
పాపాల్ని మరచి పోతాను."
*యిర్మీయా 31:31-34*

[13]ఈ ఒడంబడికను "క్రొత్త ఒడంబడిక" అని పిల
వటం వల్ల మొదటిది పాత ఒడంబడిక అయిపోయింది.
పురాతనమైనది, శిథిలమైనది, త్వరలోనే అదృశ్యమై
పోతుంది.

## భూలోక గుడారములో సేవ

9 సేవా నియమాలను గురించి, మానవ నిర్మితమైన
గుడారమును గురించి మొదటి ఒడంబడికలో
వ్రాయబడి ఉంది. [2]గుడారం వేసి మొదటి గదిని సిద్ధం
చేసే వాళ్ళు. ఆ గదిలో ఒక దీప స్థంభం, ఒక బల్ల,
ప్రతిష్ఠించబడిన రొట్టె ఉంచేవాళ్ళు. ఈ గదిని పవిత్ర
స్థానమని పిలిచే వాళ్ళు. [3]మరొక తెరవేసి రెండవ
గదిని సిద్ధం చేసేవాళ్ళు. దీన్ని అతి పవిత్ర స్థానమని
పిలిచే వాళ్ళు. [4]ఇక్కడ బంగారు ధూప వేదిక, మరియు
బంగారు రేకుచేత కప్పబడిన ఒడంబడిక మందసము
ఉండేవి. ఈ మందసంలో మన్నా* ఉంచబడిన బంగా
రుగిన్నె, చిగురు వేసిన అహరోను చేతికర్ర, ఒడంబడిక
పలకలు ఉండేవి. [5]ఈ మందసం మీద కరుణాపీఠం
ఉండేది. దానికి యిరువైపులా దేవదూతలు ఉండే
వారు. వారి రెక్కలు ఆ కరుణాపీఠాన్ని కప్పి ఉంచేవి.
కాని వీటిని గురించి ప్రస్తుతం వివరంగా చర్చించలేము.
[6]అన్నీ ఈ విధంగా అమర్చబడిన తర్వాత, యాజ
కులు నియమానుసారం ముందున్న గదిలోకి ప్రవేశించి
సేవ చేసేవాళ్ళు. [7]కాని ప్రధాన యాజకుడు మాత్రమే
సంవత్సరానికి ఒకసారి అతిపరిశుద్ధ స్థలంలోకి రక్తంతో
ప్రవేశించే వాడు. తన పక్షాన, అజ్ఞానంతో పాపాలు
చేసిన ప్రజల పక్షాన తప్పకుండా రక్తాన్ని తెచ్చి దేవునికి
అర్పించేవాడు. [8]అంటే మొదటి గది ఉన్నంతకాలం
అతి పవిత్ర స్థానానికి ప్రవేశం కలగదని పరిశుద్ధాత్మ
తెలియజేస్తున్నాడు. [9]ఇది ప్రస్తుత కాలాన్ని సూచి
స్తోంది. అంటే కానుకలు, బలులు అర్పించటం వల్ల
యాజకుని అంతరాత్మ పరిశుద్ధం కాదని పరిశుద్ధాత్మ
సూచిస్తున్నాడు. [10]ఇవి కేవలం అన్న పానాలకు, పలుర
కాల పరిశుద్ధ స్నానాలకు సంబంధించిన ఆచారాలు.
క్రొత్త క్రమం వచ్చేదాకా ఈ బాహ్య నియమాలు
వర్తిస్తాయి.

## యేసు రక్తం

[11]దేవుడు చేసిన మంచి పనులు సాగించటానికి
క్రీస్తు ప్రధాన యాజకుడై పరలోకంలోని గుడారానికి
వెళ్ళాడు. ఆ గుడారం చాలా పెద్దది. శ్రేష్ఠమైనది. అది
మానవుడు నిర్మించింది కాదు. [12]ఆయన మేకల రక్తం
ద్వారా, దూడల రక్తం ద్వారా, ఆ గుడారంలోకి వెళ్ళ
లేదు. తన స్వంత రక్తంతో అతి పవిత్రమైన ఆ స్థానాన్ని
శాశ్వతంగా ప్రవేశించి, మనకు శాశ్వతమైన రక్షణ కలిగిం
చాడు. [13]మేకల రక్తాన్ని, ఎద్దుల రక్తాన్ని, దూడలను
కాల్చిన బూడిదను, అపవిత్రంగా ఉన్న వాళ్ళపై
ప్రోక్షించి, వాళ్ళను పవిత్రం చేసేవాళ్ళు. ఇలా చేయటం
వల్ల వాళ్ళు బాహ్యంగా మాత్రమే పవిత్రులౌతారు.
[14]కాని, నిష్కళంకుడైన యేసు శాశ్వతమైన తన
ఆత్మను దేవునికి అర్పించుకొన్నాడు. తద్వారా క్రీస్తు
రక్తం మన చెడు అంతరాత్మల్ని కూడా పరిశుద్ధం
చేస్తోంది. మనము సజీవుడైన దేవుణ్ణి ఆరాధించాలని
ఆయనీవిధంగా చేసాడు.
[15]ఈ కారణంగా క్రీస్తు క్రొత్త ఒడంబడికకు మధ్యవర్తి
అయ్యాడు. ఈయన దేవుడు పిలిచిన వాళ్ళకు దేవుడు
వాగ్దానం చేసిన శాశ్వత వారసత్వం లభించేటట్లు
చేస్తాడు. మొదటి ఒడంబడిక చెలామణిలో ఉండగా
ప్రజలు చేసిన పాపాలకు తన ప్రాణాన్ని వెలగా చెల్లించి
వాళ్ళకు స్వేచ్ఛ కలిగించాడు.
[16]వీలునామా చెలామణిలోకి రావాలంటే, దాన్ని
వ్రాసిన వ్యక్తి యొక్క మరణాన్ని నిరూపించటం అవ
సరం. [17]ఎందుకంటే, వ్రాసిన వాడు మరణిస్తే వీలు
నామా చెలామణిలోకి వస్తుంది. వీలునామా వ్రాసిన
వాడు జీవిస్తుంటే, అది ఎట్లా చెలామణిలోకి వస్తుంది?

---

**మన్నా** యూదులు ఎడారుల్లో ఉండగా దేవుడు ఇచ్చిన
ఆహారం.

18ఈ కారణంగానే, మొదటి ఒడంబడిక కూడా
రక్తాన్ని ఉపయోగించకుండా చెలామణి కాలేక
పోయింది. 19ధర్మశాస్త్రంలో ఉన్న నియమాల్ని మోషే
ప్రజలకు ప్రకటించిన తర్వాత దూడల రక్తాన్ని నీళ్ళలో
కలిపి, ఆ మిశ్రమాన్ని హిస్సోపు చెట్ల కొమ్మలతో,
సింధూర వర్ణముగల గొఱ్ఱె బొచ్చుతో ధర్మశాస్త్ర
గ్రంథం మీద, ప్రజల మీద చల్లాడు. 20ఆ తర్వాత
మోషే వాళ్ళతో, "దేవుడు తన ఒడంబడికను ఆచరిం
చుమని ఆజ్ఞాపించి ఈ ఒడంబడిక రక్తాన్ని మీకిచ్చాడు"
అని అన్నాడు. 21అదేవిధంగా అతడు గుడారం మీద,
సేవా సామగ్రి మీద ఆ రక్తాన్ని ప్రోక్షించాడు. 22నిజానికి,
యించుమించు అన్ని వస్తువుల్ని రక్తంతో పరిశుద్ధం
చెయ్యాలని ధర్మశాస్త్రం ఆదేశిస్తుంది. రక్తం చిందించక
పోతే పాప పరిహారం కలగదు. 23అందువల్ల పర
లోకంలో ఉన్నవస్తువుల ప్రతిరూపాలను బలి యిచ్చి
పరిశుద్ధం చేయవలసిన అవసరం ఏర్పడింది. కాని,
పరలోకంలో ఉన్న వాటిని పవిత్రం చెయ్యటానికి
యింకా మంచిరకమైన బలులు కావాలి. 24భూమ్మీద
వున్న ఈ పవిత్ర స్థానం నిజమైన దానికి ప్రతిరూపం
మాత్రమే. క్రీస్తు మానవుడు నిర్మించిన ఈ పవిత్ర
స్థానాన్ని కాదు ప్రవేశించింది. ఆయన మనకోసం పర
లోకంలో ఉన్న దేవుని యొద్దకు వెళ్ళాడు. 25ప్రధాన
యాజకుడు ప్రతి సంవత్సరం పశువుల రక్తంతో అతి
పవిత్ర స్థానాన్ని ప్రవేశించినట్లు, ఆయన తనను తాను
పదే పదే బలిగా సమర్పించుకోవటానికి పరలోకానికి
వెళ్ళలేదు. 26అలా అర్పించి ఉంటే ప్రపంచం సృష్టింప
బడినప్పటినుండి క్రీస్తు ఎన్నోసార్లు మరణించ వలసి
వచ్చేది. కాని, ప్రస్తుతం యుగాల అంతంలో తనను
తాను ఒకే ఒకసారి బలిగా అర్పించుకుని పాపపరిహారం
చెయ్యాలని ప్రత్యక్ష్యమయ్యాడు. 27ప్రతి ఒక్కడూ,
ఒక్క సారే మరణించాలి. తర్వాత దేవుని తీర్పుకు
గురి అవ్వాలి. వాళ్ళపై తీర్పు చెబుతాడు. 28అందువల్ల,
అనేకుల పాప పరిహారం కోసం క్రీస్తు ఒకసారి మాత్రమే
తనను తాను బలిగా అర్పించుకున్నాడు. ఆయన రెండ
వసారి ప్రత్యక్ష్యమౌతాడు. పాపం మోయటానికి కాదు
తనకోసం కాచుకొని ఉన్నవాళ్ళకు రక్షణ కలిగించటానికి
ప్రత్యక్ష్యమౌతాడు.

10 ధర్మశాస్త్రం రాబోవు మంచి విషయాల
నీడలాంటిది. అది అస్పష్టమైనది. అంటే, ఆ
మంచి విషయాలు అప్పటికింకా రాలేదన్నమాట. ధర్మ
శాస్త్రం ఆదేశించిన విధంగా ప్రజలు దేవుని దగ్గరకు
ప్రతి సంవత్సరం వచ్చి తప్పకుండా ఒకే రకమైన బలులు
అర్పించే వాళ్ళు. కాని ధర్మశాస్త్రం వాళ్ళలో పరిపూర్ణత
కలిగించలేదు. 2అలా చేసినట్లైతే, వాళ్ళు ఆ బలులు
యివ్వటం మాని ఉండేవాళ్ళు. పాపాలు శాశ్వతంగా
పరిహారమై వాళ్ళు పశ్చాత్తాపం చెందవలసిన అవసరం
ఉండేది కాదు.

3కాని దానికి మారుగా ఆ బలులు వాళ్ళు చేసిన
పాపాల్ని ప్రతి సంవత్సరం వాళ్ళకు జ్ఞాపకం చేస్తూ
ఉంటాయి. 4ఎద్దుల రక్తంతో, మేకల రక్తంతో పాప
పరిహారం కలగటమనేది అసంభవం. 5ఆ కారణంగానే,
క్రీస్తు ఈ ప్రపంచంలోకి వచ్చాక దేవునితో ఈ విధంగా
అన్నాడు:

"బలుల్ని, అర్పణల్ని నీవు కోరలేదు కాని,
నేనుండటానికి ఈ శరీరాన్ని సృష్టించావు.
6 జంతువుల్ని కాల్చి అర్పించిన ఆహుతులు
కాని, పాప పరిహారం కోసం యిచ్చిన
బలులు కాని, నీకు ఆనందం కలిగించలేదు.
7 అప్పుడు నేను, 'ఇదిగో దేవా! ఇక్కడ
ఉన్నాను! నన్ను గురించి గ్రంథాల్లో
వ్రాశారు. నేను నీ యిచ్ఛ నెరవేర్చటానికి
వచ్చాను' అని అన్నాను."

*కీర్తన 40:6-8*

8"బలుల్ని, అర్పణల్ని, జంతువుల్నికాల్చి యిచ్చిన
ఆహుతుల్ని, పాప పరిహారం కోసం యిచ్చిన
ఆహుతుల్ని, నీవు కోరలేదు. అవి నీకు ఆనందం కలి
గించ లేదు" అని మొదట అన్నాడు. కాని, ధర్మశాస్త్రం
ఈ ఆహుతుల్ని యివ్వమని ఆదేశించింది. 9ఆ తర్వాత
క్రీస్తు, "ఇదిగో దేవా! ఇక్కడ ఉన్నాను. నీ యిచ్ఛ
నెరవేర్చటానికి వచ్చాను" అని అన్నాడు. ఆయన
రెండవ దాన్ని నెరవేర్చటానికి మొదటి దాన్ని రద్దు
చేశాడు. 10దైవేచ్ఛ నెరవేర్చటానికి క్రీస్తు తన శరీరాన్ని
బలిగా అర్పించి మనల్ని శాశ్వతంగా పవిత్రం చేశాడు.
ఆయన యిచ్చిన మొదటి బలి, చివరి బలి యిదే.
11ప్రతి యాజకుడు మత సంబంధమైన కర్తవ్యాన్ని
ప్రతి రోజు నెరవేరుస్తూ ఉంటాడు. ఇచ్చిన బలుల్నే
మళ్ళీ మళ్ళీ యిస్తూ ఉంటాడు. ఈ బలులు పాప
పరిహారం చెయ్యలేవు. 12కాని క్రీస్తు మన పాప పరిహా
రార్థం ఒకే ఒక బలి యిచ్చి దేవుని కుడిచేతి వైపు
శాశ్వతంగా కూర్చుండి పొయ్యాడు. 13అప్పటినుండి,
ఆయన శత్రువుల్ని దేవుడు ఆయన పాదపీఠంగా
చెయ్యాలని కాచుకొని ఉన్నాడు. 14ఆయన ఒకే ఒక
అర్పణ చేసి పరిశుద్ధులలో శాశ్వతమైన పరిపూర్ణత
కలిగించాడు.
15ఈ విషయాన్ని గురించి పరిశుద్ధాత్మ మనకు
యిలా ప్రకటిస్తున్నాడు:

16 "ఆ తర్వాత నేను వాళ్ళతో ఈ ఒడంబడిక
చేస్తాను. నా నియమాల్ని వాళ్ళ హృద
యాల్లో ఉంచుతాను. వాటిని వాళ్ళ
మనస్సులపై వ్రాస్తాను."

*యిర్మీయా 31:33*

17ఆ పరిశుద్ధాత్మ ఇంకా యిలా అన్నాడు:

“వాళ్ళ పాపాల్ని, దుర్మార్గాల్ని నేను మరిచి
పోతాను!”
*యిర్మీయా 31:34*

18వాళ్ళ పాపాల్ని దేవుడు క్షమించాడు కాబట్టి,
పాపం కోసం బలుల్ని అర్పించవలసిన అవసరం
తీరి పోయింది.

### విశ్వాసాన్ని వదులుకోకండి

19సోదరులారా! యేసు తన రక్తాన్ని అర్పించాడు.
తద్వారా అతి పవిత్ర స్థానానికి వెళ్ళగలమనే విశ్వాసం
మనలో కలిగింది. 20ఆయన శరీరం ఒక తెరగా ఉంది.
దాన్ని తొలగించి మనకోసం సజీవమైన నూతన
మార్గాన్ని వేశాడు. 21అంతే కాక, ఆ ప్రధాన యాజకుడు
మన దేవాలయంపై అధికారిగా పనిచేస్తున్నాడు.
22తప్పు చేసి బాధపడ్తున్న మన హృదయాలపై రక్తం
ప్రోక్షింప బడింది. స్వచ్ఛమైన నీళ్ళతో మన దేహాలు
పరిశుభ్రం చేయబడ్డాయి. ఇప్పుడిక మంచి హృదయా
లతో, సంపూర్ణ విశ్వాసంతో దైవ సన్నిధిని చేరు
కొందాం. 23మనకు వాగ్దానం చేసినవాడు నమ్మదగిన
వాడు. అందువల్ల మనం బహిరంగంగా ప్రకటిస్తున్న
విశ్వాసాన్ని విడువకుండా ధైర్యంతో ఉందాం.
24ప్రేమిస్తూ మంచిపనులు చేస్తూ ఉండమని పర
స్పరం ప్రోత్సాహపరుచుకొందాం. 25సమావేశాలకు
రాకుండా ఉండటం కొందరికి అలవాటు. కాని, మనం
పరస్పరం కలుసుకొంటూ ఉందాం. ముఖ్యంగా ప్రభువు
రానున్నదినం* సమీపిస్తోంది గనుక పరస్పరం
ప్రోత్సాహ పరచుకొంటూ ఉందాం.
26సత్యాన్ని గురించి జ్ఞానం సంపాదించిన తర్వాత
కూడా, మనం కావాలని పాపాలు చేస్తూ ఉంటే, యిక
అర్పించటానికి మన దగ్గర బలి ఎక్కడుంది? 27తీర్పు
జరుగుతుందనే భయము, దేవుని శత్రువుల్ని కాల్చివేసే
మంటలురానున్నాయనే భయము మాత్రమే మిగిలి
పోతాయి. 28మోషే నియమాల్ని ఉల్లంఘించిన వానిపై
యిద్దరు లేక ముగ్గురు చెప్పిన సాక్ష్యాలతో దయ
చూపకుండా మరణ శిక్ష విధించే వాళ్ళు. 29మరి దేవుని
కుమారుణ్ణి కాళ్ళ క్రింద త్రొక్కిన వాణ్ణి, తనను పవిత్రం
చేసిన ఒడంబడిక రక్తాన్ని అపవిత్రంగా పరిగణించే
వాణ్ణి, అనుగ్రహించే ఆత్మను అవమాన పరిచేవాణ్ణి,
యింకెంత కఠినంగా శిక్షించాలో మీరే ఊహించండి.
30“పగ తీర్చుకోవలసిన పని నాది, తిరిగి చెల్లించే
వాణ్ణి నేను” అని అన్నవాడు, “ప్రభువు తన ప్రజలపై
తీర్పు చెపుతాడు”* అని అన్న వాడు ఎవరో మనకు
తెలుసు. 31సజీవంగా ఉన్న దేవుని చేతుల్లో పాపా
త్ములు చిక్కు కోవటమనేది భయానకమైన
విషయము.
32మీరు వెలిగింపబడిన రోజుల్ని జ్ఞాపకం తెచ్చు
కోండి. ఆ రోజుల్లో మీరు ఎన్నో కష్టాలు అనుభ
వించారు. అయినా మీరు వాటిని సహించారు. 33కొన్ని
సార్లు మీరు అవమానాన్ని, హింసను బహిరంగంగా అను
భవించారు. మరికొన్నిసార్లు అవమానాన్ని, హింసను
అనుభవించే వాళ్ల ప్రక్కన నిలుచున్నారు. 34అంతేకాక,
చెరసాలల్లో ఉన్న వాళ్ళ పట్ల మీరు సానుభూతి
చూపించారు. పైగా ‘మీ ఆస్తుల్ని’ దోచుకొంటుంటే
ఆనందంగా అంగీకరించారు. ఎందు కంటే, మీరు
పొందిన ఆస్తి మీరు పోగొట్టుకొన్న ఆస్తి కన్నా ఉత్తమమై
నదని మీకు తెలుసు. అది శాశ్వతమైనదని కూడా
మీకు తెలుసు.
35అందువల్ల మీ విశ్వాసాన్ని వదులు కోకండి. దానికి
మంచి ప్రతి ఫలం లభిస్తుంది. 36మీరు పట్టుదలతో
ఉండాలి. దైవేచ్ఛ ప్రకారం నడుచు కోవాలి. ఆ తర్వాత
దేవుడు, తాను వాగ్దానం చేసిన దాన్ని ప్రసాదిస్తాడు.
37ఎందుకంటే, త్వరలోనే,

“వస్తున్నవాడు, వస్తాడు, ఆలస్యం
చెయ్యడు!
38 నీతిమంతులైన నా ప్రజలు నన్ను విశ్వ
సిస్తూ జీవిస్తారు. కాని వాళ్ళలో ఎవరైనా
వెనుకంజ వేస్తే నా ఆత్మకు ఆనందం
కలుగదు.”
*హబక్కూకు 2:3-4*

39కాని, మనం వెనుకంజ వేసి నశించిపోయే వాళ్ళ
లాంటి వారం కాదు. గాని విశ్వాసం ద్వారా రక్షించ
బడే వాళ్ళ లాంటివారం.

### విశ్వాసము

11 ఆశించినవి తప్పక లభిస్తాయని నమ్మటం,
మనకు కనిపించనివాటిని ఉన్నాయని
నమ్మటం. ఇదే విశ్వాసం. 2మన పూర్వీకుల్లో
యిలాంటి విశ్వాసముంది కనుకనే దేవుడు వాళ్ళను
మెచ్చుకొన్నాడు.
3దేవుడు ఆజ్ఞాపించటం వల్ల ఈ ప్రపంచం సృష్టింప
బడిందని మనము విశ్వశిస్తున్నాము. అంటే, కనిపించని
వాటితో కనిపించేది సృష్టింపబడిందన్న మాట.

---

**ప్రభువు … దినం** బహుశః, ఇది క్రీస్తు రెండవ సారి తిరిగి వస్తాడని సూచిస్తుంది.

**ప్రభువు … చెపుతాడు** ద్వితీ. 32:35; ద్వితీ. 32:36; కీర్తన 135:14.

4హేబెలుకు దేవుని పట్ల విశ్వాసముంది గనుకనే
అతడు కయీను అర్పించిన బలికన్నా విలువైన బలిని
దేవునికి అర్పించాడు. హేబెలు అర్పించిన బలిని దేవుడు
మెచ్చుకొని అతణ్ణి నీతిమంతునిగా పరిగణించాడు.
అందుకే హేబెలు మరణించినా అతనిలో ఉన్న విశ్వాసం
ద్వారా యింకా మాట్లాడుతునే ఉన్నాడు.
5హనోకు దేవుణ్ణి విశ్వసించాడు కాబట్టే దేవుడతణ్ణి
సజీవంగా పరలోకానికి తీసుకు వెళ్ళాడు. ఆ కారణంగానే
అతడు ఎవ్వరికీ కనపడలేదు. పరలోకానికి వెళ్ళక
ముందు అతడు దేవుణ్ణి సంతోషపరచినందుకు దేవుడు
అతణ్ణి మెచ్చుకొన్నాడు. 6విశ్వాసం లేకుండా దేవుణ్ణి
ఆనంద పరచటం అసంభవం. దేవుని దగ్గరకు రావాలను
కొన్నవాడు ఆయనున్నాడని, అడిగిన వాళ్ళకు ప్రతి
ఫలం యిస్తాడని విశ్వసించాలి.
7నోవహు దేవుణ్ణి విశ్వసించినందువల్ల దేవుడతనికి,
'ప్రళయం రాబోతున్నది' అని ముందే చెప్పాడు.
అతనిలో భయ భక్తులుండటం వల్ల అతడు దేవుని
మాట విని, తన కుటుంబాన్ని రక్షించటానికి ఒక
ఓడను నిర్మించాడు. అతనిలో ఉన్న విశ్వాసము
ప్రపంచం తప్పు చేసిందని నిరూపించింది. ఆ విశ్వాసం
మూలంగా అతడు నీతిమంతుడయ్యాడు.
8అబ్రాహాములో విశ్వాసముంది కనుక అతడు
దేవుడు చెప్పిన దేశానికి, తానెక్కడికి వెళ్తున్నది తనకు
తెలియక పోయినా విధేయతతో వెళ్ళాడు. ఆ తర్వాత
దేవుడతనికి ఆ దేశాన్ని అతని పేరిట యిచ్చాడు.
9విశ్వాసముంది కనుకనే అతడు దేవుడు చూపిన
దేశంలో ఒక పరదేశీయునిగా నివసించాడు. దేవుడు
వాగ్దానం చేసిన వాటిల్లో తనతో సహా వారసులైన
ఇస్సాకు మరియు యాకోబులతో కలిసి గుడారాల్లో
నివసించాడు. 10దేవుడు తన నమూన ప్రకారం శాశ్వత
మైన పునాదులు వేసి నిర్మించిన పట్టణం కోసం అబ్రా
హాము ఎదురు చూస్తూ ఉండేవాడు.
11శారా వృద్ధురాలు. పైగా గొడ్రాలు. అబ్రాహాం
వృద్ధుడయినా, దేవుడు చేసిన వాగ్దానాన్ని విశ్వసించి
నందువల్ల అబ్రాహాము తండ్రి కాగలిగాడు. 12చని
పోవటానికి సిద్ధంగా ఉన్న అబ్రాహాముకు ఆకాశంలో
ఉన్న నక్షత్రాల్లా, సముద్ర తీరానవుండే యిసుక
రేణువుల్లా లెక్కలేనంత మంది వారసులు కలిగారు.
13వీళ్ళందరు దేవుణ్ణి విశ్వసిస్తూ జీవించి, మరణిం
చారు. దేవుడు వాగ్దానం చేసినవి వాళ్ళకు లభించలేదు.
వాళ్ళు అవి రావటం దూరం నుండి చూసి ఆహ్వా
నించారు. ఈ భూమ్మీద తాము పరదేశీయుల్లా జీవి
స్తున్నట్లు వాళ్ళు అంగీకరించారు. 14వాళ్ళు మాట్లాడిన
తీరు చూస్తే వాళ్ళు తమ స్వదేశానికోసం వెతుకు
తూండేవాళ్ళని అనిపిస్తుంది. 15ఒక వేళ వాళ్ళు తాము
వదిలివచ్చిన దేశాన్ని గురించి ఆలోచిస్తున్నట్లయితే
తమ దేశానికి తిరిగి వెళ్ళే అవకాశం వాళ్ళకు ఉండింది.
16కాని వాళ్ళు యింకా గొప్ప దేశానికి, అంటే పర
లోకానికి వెళ్ళాలని ఆశించారు. అందువల్ల దేవుడు
యితర్లు తనను 'వాళ్ళ దేవుడు' అని పిలిచినందుకు
సిగ్గుపడలేదు. పైగా తన వాళ్ళ కోసం ఒక పట్టణం
నిర్మించాడు.
17-18దేవుడు అబ్రాహామును పరీక్షించినప్పుడు అత
నిలో విశ్వాసముండటంవల్ల ఇస్సాకును బలిగా అర్పించ
టానికి సిద్ధం అయ్యాడు. దేవుడు ఇస్సాకు ద్వారా నీ
వంశం అభివృద్ధి చెందుతుంది* అని యింతకు
పూర్వం వాగ్దానం చేశాడు. అయినా అబ్రాహాము తన
ఏకైక పుత్రుణ్ణి బలిగా అర్పించ బోయాడు. 19దేవుడు
చనిపోయిన వాళ్ళను బ్రతికించగలడని అబ్రాహాముకు
తెలుసు. ఒక విధంగా చూస్తే దేవుడు ఇస్సాకును బ్రతి
కించి అబ్రాహాముకు ఇచ్చాడనే చెప్పుకోవచ్చు.
20ఇస్సాకు దేవుణ్ణి విశ్వసించాడు కాబట్టి, యాకో
బును, ఏశావును వాళ్ళ భవిష్యత్తు ప్రకారం
దీవించాడు. 21దేవుణ్ణి విశ్వసించాడు కాబట్టి
యాకోబు, తాను మరణించే ముందు యోసేపు కుమా
రుల్ని దీవించగలిగాడు. అంతే కాక తన చేతి కఱ్ఱపై
వ్రాలి దేవుణ్ణి ప్రార్థించాడు.
22యోసేపు దేవుణ్ణి విశ్వసించాడు కాబట్టి తాను
చనిపోయేముందు ఇశ్రాయేలు ప్రజలు ఈజిప్టు దేశం
నుండి వెళ్ళిపోతారని ముందుగానే చెప్పగలిగాడు. అంతే
కాక, అప్పుడు తన ఎముకల్ని ఏమి చెయ్యాలో
వాళ్ళకు చెప్పాడు. 23మోషే తల్లి తండ్రులకు దేవుని
పట్ల విశ్వాసముంది గనుక, మోషే జన్మించాక అతడు
సాధారణమైన శిశువు కాడని గ్రహించగలిగారు. తద్వారా
వాళ్ళు రాజశాసనానికి భయపడకుండా అతణ్ణి మూడు
నెలల దాకా దాచివుంచారు.
24మోషే దేవుణ్ణి విశ్వసించాడు కాబట్టే, అతడు
పెద్దవాడైన తర్వాత ఫరోకుమార్తె యొక్క కుమా
రునిగా గుర్తింపబడటానికి నిరాకరించాడు. 25పాపం
ద్వారా లభించే సుఖాల్ని కొద్దికాలం అనుభవించటాని
కన్నా దేవుని ప్రజలతో సమానంగా కష్టాలను అను
భవించటానికి అతడు సిద్ధమయ్యాడు. 26అతడు ప్రతి
ఫలం కోసం ఎదురు చూస్తూ ఉండేవాడు కనుక,
ఈజిప్టులోని ఐశ్వర్యానికన్నా క్రీస్తు కొరకు అవమానం
భరించటం ఉత్తమమని భావించాడు. 27మోషే దేవుణ్ణి
విశ్వసించాడు కనుక, అతడు రాజు యొక్క ఆగ్రహానికి
భయపడకుండా ఈజిప్టు దేశాన్ని వదిలి వెళ్ళి
పోయాడు. అదృశ్యంగా ఉన్నవాణ్ణి చూసినట్లు అతడు
భావించటం వల్ల అతని పట్టుదల పెరిగింది. 28అతడు
దేవుణ్ణి విశ్వసించటం మూలంగానే పస్కా పండుగను,
రక్తాన్ని ద్వారాలపై ప్రోక్షించాలనే ఆచారాన్ని నియ
మించాడు. మృత్యు దూత ఇశ్రాయేలు ప్రజల మొదటి

**దేవుడు ... చెందుతుంది** ఆది. 21:12.

సంతానాన్ని తాకరాదని ఈ ఆచారం నియమించాడు.
29దేవుణ్ణి విశ్వసించినందుకే ప్రజలు ఎఱ్ఱ సముద్రంలో
ఏర్పడిన ఆరిన నేల మీద నడిచారు. కాని ఈజిప్టు
దేశస్థులు అలా చెయ్యాలని ప్రయత్నించి సముద్రంలో
మునిగి పొయ్యారు.

30ప్రజలు యెరికో కోట చుట్టు ఏడు రోజులు
విశ్వాసంతో తిరగటం వల్ల ఆ కోట గోడలు పడి
పొయ్యాయి.

31దేవుణ్ణి విశ్వసించటం వల్లనే, వేశ్య అయినటు
వంటి రాహాబు యెహోషువా పంపిన గూఢచారులకు
తన యింట్లో ఆతిథ్యమిచ్చింది. ఆ కారణంగానే, అవి
శ్వాసులతో సహా ఆమె మరణించలేదు.

32ఇంకేం చెప్పమంటారు? గిద్యోనును గురించి,
బారాకు గురించి, సమ్సోను గురించి, యెఫ్తా గురించి,
దావీదు గురించి, సమూయేలును గురించి మరియు
ప్రవక్తల గురించి చెప్పటానికి నాకు వ్యవధి లేదు.
33వీళ్ళు దేవుణ్ణి విశ్వసించటం వల్ల రాజ్యాలు జయిం
చారు. న్యాయాన్ని స్థాపించారు. దేవుడు వాగ్దానం చేసిన
దాన్ని పొందారు. సింహాల నోళ్ళు మూయించారు.
34భయంకరమైన మంటల్ని ఆర్పివేశారు. కత్తి
పోట్లనుండి తమను తాము రక్షించుకొన్నారు. వాళ్ళ
బలహీనత బలంగా మారిపోయింది. వాళ్ళు యుద్ధా
లలో గొప్ప శక్తి కనబరుస్తూ పరదేశసైన్యాలను ఓడిం
చారు. 35దేవుణ్ణి విశ్వసించటం వల్లనే కొందరు స్త్రీలు
చనిపోయిన తమ వాళ్ళను తిరిగి సజీవంగా పొందారు.
కొందరు చావునుండి బ్రతికి వచ్చాక ఉత్తమ జీవితం
గడపాలనే ఉద్దేశ్యముతో చిత్రహింసలనుండి విడుదల
కోరలేదు. 36భక్తిహీనులు వీళ్ళలో కొందర్ని పరిహాసం
చేస్తూ కొరడా దెబ్బలు కొట్టారు. మరి కొందర్ని
సంకెళ్ళతో బంధించి చెరసాలలో వేశారు. 37కొందర్ని
రాళ్ళతో కొట్టారు; రంపంతో కోసారు; కత్తితో పొడిచి
చంపారు. ఆ భక్తులు మేకల చర్మాలను, గొఱ్ఱెల
చర్మాలను ధరించి అనాథలై తిరిగారు. అంతేకాక
హింసను, దుష్ప్రవర్తనను సహించారు. 38ఎడారుల్లో
పర్వత ప్రాంతాల్లో, గుహల్లో, సొరంగాల్లో, నివ
సించారు. ఈ ప్రపంచం వాళ్ళకు తగిందికాదు.

39వాళ్ళ విశ్వాసాన్ని దేవుడు మెచ్చు కొన్నాడు.
కాని దేవుడు వాగ్దానం చేసింది వాళ్ళకు యింకా లభిం
చలేదు. 40దేవుడు మనకివ్వటానికి ఉత్తమమైన దాన్ని
దాచి ఉంచాడు. మనతో కలిసి మాత్రమే వాళ్ళకు
పరిపూర్ణత కలగాలని యిలా చేసాడు.

### కుమారులు, క్రమశిక్షణ

12 అందువల్ల మన పక్షాన కూడా ఇందరు
సాక్షులున్నారు గనుక మన దారికి అడ్డం వచ్చిన
వాటన్నిటిని తీసిపారవేద్దాం. మనల్ని అంటుకొం
టున్న పాపాల్ని వదిలించుకొందాం. మనం పరుగెత్త
వలసిన పరుగు పందెంలో పట్టుదలతో పరుగిడుదాం.
2మన దృష్టిని యేసుపై ఉంచుదాం. మనలో విశ్వాసం
పుట్టించిన వాడు, ఆ విశ్వాసంతో పరిపూర్ణత కలుగ
చేయువాడు ఆయనే. తనకు లభింపనున్న ఆనందం
కోసం ఆయన సిలువను భరించాడు. సిలువను భరించి
నప్పుడు కలిగిన అవమానాల్ని ఆయన లెక్క చెయ్య
లేదు. ఇప్పుడాయన దేవుని సింహాసనానికి కుడివైపున
కూర్చొని ఉన్నాడు. 3పాపాత్ములు తనపట్ల కనుబర
చిన ద్వేషాన్ని ఆయన ఏ విధంగా సహించాడో జాగ్రత్తగా
గమనించండి. అప్పుడు మీరు అలిసిపోకుండా, ధైర్యం
కోల్పోకుండా వుంటారు. 4మీరు పాపంతో చేస్తున్న
యుద్ధంలో రక్తం చిందించ వలసిన అవసరం యింత
వరకు కలుగలేదు. 5మిమ్మల్ని కుమారులుగా భావించి
చెప్పిన ప్రోత్సాహకరమైన ఈ సందేశాన్ని పూర్తిగా మరిచి
పోయారు:

"నా కుమారుడా! ప్రభువు విధించిన
క్రమశిక్షణను చులకన చెయ్యకు! నీ తప్పు
ప్రభువు సరిదిద్దినప్పుడు నిరుత్సాహపడకు!
6 ఎందుకంటే, ప్రభువు తనను ప్రేమించిన
వాళ్ళనే శిక్షిస్తాడు. అంతేకాక తన కుమారు
నిగా అంగీకరించి ప్రతిఒక్కణ్ణి శిక్షిస్తాడు."
సామెతలు *3:11-12*

7కష్టాల్ని శిక్షణగా భావించి ఓర్చుకోండి. దేవుడు
మిమ్మల్ని తన కుమారులుగా చూసుకొంటాడు. తండ్రి
నుండి శిక్షణ పొందని కుమారుడెవడున్నాడు? 8మీకు
శిక్షణ లభించక పోతే మీరు దేవుని నిజమైన కుమారులు
కారన్న మాట. ప్రతి ఒక్కడూ క్రమశిక్షణ పొందుతాడు.
9మన తల్లిదండ్రులు మనకు శిక్షణనిచ్చారు. ఆ
కారణంగా వాళ్ళను మనం గౌరవించాము. మరి అలాం
టప్పుడు మన ఆత్మలకు తండ్రి అయిన వానికి
యింకెంత గౌరవమివ్వాలో ఆలోచించండి. 10మన
తండ్రులు, వాళ్ళకు తోచిన విధంగా కొద్దికాలం పాటు
మనకు క్రమశిక్షణ నిచ్చారు. కాని దేవుడు మన మంచి
కోసం, ఆయన పవిత్రతలో మనం భాగం పంచుకోవా
లని మనకు శిక్షణనిచ్చాడు. 11శిక్షణ పొందేటప్పుడు
బాధగానే వుంటుంది. ఆనందంగా ఉండదు. కాని ఆ
తర్వాత శిక్షణ పొందిన వాళ్ళు నీతి, శాంతి అనే ఫలం
పొందుతారు.

12అందువల్ల మీ బలహీనమైన చేతుల్ని, వణకు
తున్న మోకాళ్ళను శక్తివంతం చేసుకోండి. 13మీరు
నడిచే దారుల్ని* సమంగా చేసుకోండి. అప్పుడు ఆ
దారులు కుంటి వాళ్ళకు అటంకం కలిగించటానికి
మారుగా సహాయపడ్తాయి.

---

**దారుల్ని** సామెత. 4:26.

### హెచ్చరికలు, ఉపదేశాలు

14అందరిపట్ల శాంతి కనబరుస్తూ జీవించటానికి
ప్రయత్నించండి. పవిత్రంగా జీవించండి. పవిత్రత
లేకుండా ఎవ్వరూ ప్రభువును చూడలేరు. 15ఒక్కరు
కూడా దైవానుగ్రహానికి దూరం కాకుండా జాగ్రత్త
పడండి. 16వ్యభిచారం చెయ్యకండి. ఒక పూట భోజ
నంకోసం జ్యేష్టపుత్రునిగా తన హక్కుల్ని అమ్మివేసిన
ఏశావువలె భక్తిహీనులై జీవించకండి. 17ఏశావు ఆ తర్వాత
ఆ ఆశీర్వాదం పొందాలని కోరినప్పుడు దేవుడు నిరాక
రించిన విషయం మీకు తెలుసు. అతడు ఆ ఆశీర్వా
దాన్ని పొందాలని పశ్చాత్తాపం చెందుతూ కన్నీళ్ళు
పెట్టుకొన్నాడు. కాని లాభం కలుగలేదు.

18తాకగల పర్వతం దగ్గరకు మీరు రాలేదు. అగ్ని
జ్వాలలతో మండుతున్న పర్వతం దగ్గరకు మీరు
రాలేదు. కారు మబ్బులు, చీకటి, తుఫాను క్రమ్ముకొన్న
పర్వతం దగ్గరకు మీరు రాలేదు. 19ఆ పర్వతం నుండి
బూర ధ్వని, మాట్లాడుతున్న కంఠ ధ్వని వినటానికి
రాలేదు. ఆ కంఠం విన్నవాళ్ళు భయపడి వినడానికి
నిరాకరించారు. 20ఎందుకంటె, "ఆ పర్వతాన్ని ఒక
జంతువు తాకినా ఆ జంతువును రాళ్ళతో కొట్టాలి"*
అని ఆ స్వరం ఆజ్ఞాపించింది. ఈ ఆజ్ఞను వాళ్ళు
భరించలేక పొయ్యారు. 21ఆ దృశ్యము ఎంత భయంక
రంగా ఉందంటే, మోషే 'నేను భయంతో ఒణికి పోతు
న్నాను'* అని అన్నాడు.

22కాని మీరు సీయోను పర్వతం దగ్గరకు వచ్చారు.
ఇదే పరలోకపు యెరూషలేము! సజీవుడైన దేవుని
నగరం. ఆనందంతో సమూహమైన వేలకొలది దేవ
దూతల దగ్గరకు మీరు వచ్చారు. 23మొట్టమొదట
జన్మించిన వాళ్ళ సంఘానికి మీరు వచ్చారు. వీళ్ళ
పేర్లు పరలోకంలో వ్రాయబడి ఉన్నాయి. మానవుల
న్యాయాధిపతియైన దేవుని దగ్గరకు మీరు వచ్చారు.
దేవుడు పరిపూర్ణత కలిగించిన నీతిమంతుల ఆత్మల
దగ్గరకు మీరు వచ్చారు. 24క్రొత్త ఒడంబడికకు మధ్య
వర్తి అయిన యేసు దగ్గరకు మీరు వచ్చారు. హేబేలు
రక్తానికన్నా ఉత్తమసందేశాన్నిచ్చే 'ప్రోక్షింపబడే రక్తం'
దగ్గరకు మీరు వచ్చారు.

25జాగ్రత్త! మనతో మాట్లాడుతున్న ఆయన్ని నిరా
కరించకండి. ఆయన ఇహలోకానికి వచ్చి పలికిన
మాటల్ని ఆనాటి వాళ్లు నిరాకరించారు. తద్వారా
ఆయన ఆగ్రహం నుండి తప్పించుకోలేక పొయ్యారు.
మరి ఆయన పరలోకంనుండి పలికే మాటల్ని నిరాక
రిస్తే ఆయన ఆగ్రహంనుండి ఎలా తప్పించుకొన
గలము? 26ఆనాడు ఆయన కంఠం భూకంపం కలిగిం
చింది. కాని యిప్పుడు ఆయన, "నేను భూమినే కాక
ఆకాశాన్ని కూడా, మరొక్కసారి కదిలిస్తాను"* అని
వాగ్దానం చేసాడు. 27"మరొక్కసారి" అన్న పదాలు,
కదిలే వాటిని, అంటే సృష్టింపబడ్డవాటిని నాశనం చేస్తా
డని సూచిస్తున్నాయి. కదలనివి అలాగే ఉండిపోతాయి.

28ఎవ్వరూ కదిలించలేని రాజ్యం మనకు లభింప
నున్నది కనుక దేవునికి మనము కృతజ్ఞులమై ఉందాం.
ఆయన్ని భయ భక్తులతో, ఆయనకు యిష్టమైన
విధంగా ఆరాధించుదాము. 29ఎందుకంటే, మన దేవుడు
"మండుచున్న అగ్నిలాంటివాడు."*

### చివరి మాటలు

13 పరస్పరం సోదరుల్లా జీవించండి. 2తెలియని
వాళ్ళకు ఆతిథ్యమివ్వండి. కొందరు యిలా
చేసి తమకు తెలియకుండానే దేవదూతలకు ఆతిథ్య
మిచ్చారు. 3చెరసాలల్లో ఉన్న వాళ్ళను, మీరు వాళ్ళతో
సహా ఉన్నట్లు భావించి జ్ఞాపకంచేసుకోండి. అదేవిధంగా
కష్టాలనుభవిస్తున్న వాళ్ళను, మీరు వాళ్ళతో సహా
కష్టాలనుభవిస్తున్నట్లు భావించి జ్ఞాపకంచేసుకోండి.

4వివాహాన్ని అందరూ గౌరవించాలి. వివాహ
పాన్పును నిష్కళంకంగా ఉంచాలి. వ్యభిచారుల్ని, వివా
హితులతో లైంగిక సంబంధాలను పెట్టుకున్న వాళ్ళను
దేవుడు శిక్షిస్తాడు. 5ధనాశ లేకుండా జీవితాలు గడపండి.
మీ దగ్గరున్న దానితో సంతృప్తి చెందండి. ఎందుకంటే
దేవుడు ఈ విధంగా అన్నాడు:

> "నేను నిన్ను ఎన్నటికీ విడువను నిన్నెన్న
> టికీ ఒంటరివాణ్ణి చెయ్యను."
> *ద్వితీయోపదేశ 31:6*

6అందువల్ల మనం దృఢ విశ్వాసంతో,

> "ప్రభువు నా రక్షకుడు, నాకే భయం లేదు.
> మానవుడు నన్నేమి చెయ్యగలడు?"
> *కీర్తన 118:6-7*

అని అంటున్నాము.

7మీకు దైవ సందేశాన్ని ఉపదేశించిన గురువుల్ని
జ్ఞాపకముంచుకోండి. వాళ్ళ జీవిత విధానం వలన
కలిగిన మంచిని గమనించండి. వాళ్ళ విశ్వాసాన్ని అనుస
రించండి. 8నిన్న, నేడు, నిరంతరం యేసు క్రీస్తు ఒకే
విధంగా ఉంటాడు.

9ఎన్నో రాకాల విచిత్రమైన బోధనలు ఉన్నాయి.
వాటివల్ల మోసపోకండి. దైవానుగ్రహంతో మన హృద

---

**ఆ … కొట్టాలి** నిర్గమ. 19:12-13.

**నేను … పోతున్నాను** ద్వితీ. 9:19.

**నేను … కదిలిస్తాను** హగ్గయి 2:6.

**మండు … లాంటివాడు** ద్వితీ. 4:24.

యాలు శక్తి పొందాలి గాని ఆహారంతో కాదు. ఆహార
నియమాల వల్ల వాళ్ళకు లాభం కలుగదు.
[10]యూదుల గుడారంలో సేవచేసే యాజకులకు
మన బలిపీఠం మీద బలి ఇచ్చిన దాన్ని తినే అధికారం
లేదు. [11]పాపాలకు ప్రాయశ్చిత్తంగా అర్పించటానికి
ప్రధాన యాజకుడు జంతువుల రక్తాన్ని అతి పవిత్ర
స్థానంలోకి తీసుకు వెళ్ళేవాడు. ఆ జంతువుల దేహాల్ని
శిబిరానికి ఆవలి వైపు కాల్చేవాడు. [12]మనుష్యుల్ని
తన రక్తంతో పవిత్రం చెయ్యాలని యేసు నగరపు
సింహద్వారానికి ఆవల మరణించాడు. [13]అందువల్ల
శిబిరం వెలుపలనున్న ఆయన దగ్గరకు వెళ్ళి ఆయన
అవమానాన్ని పంచుకుందాం. [14]మనకు స్థిరమైన
పట్టణం లేదు. కాని ముందు రానున్న పట్టణం
కొరకు ఎదురు చూస్తున్నాము. [15]అందువల్లే మనం
యేసు ద్వారా దేవుణ్ణి అన్ని వేళలా స్తుతించుదాం.
మన నోటి ద్వారా కలిగే స్తుతిని ఆయనకు బలిగా
అర్పించి, ఆయన పేరులో ఉన్న కీర్తిని పంచుకుందాం.
[16]ఇతరులకు ఉపకారం చెయ్యండి. మీకున్న దాన్ని
యితరులతో పంచుకోండి. ఇలాంటి పనులు దేవునికి
చాలా యిష్టం.
[17]మీ నాయకుల పట్ల విధేయతగా ఉంటూ, వాళ్ళు
చెప్పినట్లు చెయ్యండి. మీ ఆత్మల్ని కాపాడ వలసిన
పని వాళ్ళది. వాళ్ళు దేవుని ముందు లెక్క చెప్పవలసి
వుంటుంది. వాళ్ళకు మీరు విధేయులై వుంటే, వాళ్ళు
తాము చేయవలసిన పనిని ఆనందంగా చేయగలుగు
తారు. అది వాళ్ళకు భారంగా వుండదు. వాళ్ళకు
భారం కలగటం మీకు మంచిది కాదు.
[18]మా కోసం ప్రార్థించండి. మా అంతరాత్మలు
నిర్మలమైనవనే విశ్వాసం మాకు ఉంది. మేము అన్ని
విధాలా గౌరవప్రదంగా జీవించాలనుకొంటున్నాము.
[19]నేను ముఖ్యంగా వేడుకునేదేమిటంటే, నేను త్వర
లోనే మిమ్మల్ని కలుసుకోవాలని దేవుణ్ణి ప్రార్థించండి.
[20]శాంతిని స్థాపించే దేవుడు, గొఱ్ఱెల గొప్ప కాపరి
అయిన మన యేసు ప్రభువును తిరిగి బ్రతికించాడు.
ఈ కార్యాన్ని దేవుడు శాశ్వతమైన ఒడంబడిక రక్తం
ద్వారా జరిగించాడు. [21]ఆ దేవుడు మీరు ఆయన
యిష్టానుసారం నడుచుకునేటట్లు మీకు కావలసినవి
సమకూర్చు గాక! ఆయన మనలో ఉండి, యేసు
క్రీస్తు ద్వారా తన యిష్టాన్ని నెరవేర్చుగాక! ఆయనకు
చిరకాలం మహిమ కలుగుగాక! ఆమేన్.
[22]సోదరులారా! నేనీ లేఖను క్లుప్తంగా వ్రాసాను.
ప్రోత్సాహం కలుగ చేసే ఈ సందేశాన్ని సహృదయంతో
చదువమని వేడుకుంటున్నాను. [23]మన సోదరుడైన
తిమోతిని విడుదల చేసినట్లు మీకు తెలియ జేస్తు
న్నాను. అతడు నా వద్దకు త్వరలో వస్తే అతనితో
కలిసి మిమ్మల్ని చూడటానికి వస్తాను. [24]మీలోవున్న
పెద్దలకు, దేవుని ప్రజలకు వందనాలు తెలుపండి.
ఇటలీ దేశానికి చెందిన విశ్వాసులు మీకు వందనాలు
తెలుపుతున్నారు. [25]మీ అందరికి ప్రేమానుగ్రహము
తోడుగా వుండునుగాక!

# యాకోబు వ్రాసిన లేఖ

### విశ్వాసము, జ్ఞానము

1 దేవునికి, యేసుక్రీస్తు ప్రభువుకు సేవకుడైన
యాకోబునైన నేను, చెదరిపోయి పలు ప్రాంతా
లలో నివసిస్తున్న పన్నెండు గోత్రాల వారికి శుభా
కాంక్షలు తెలుపుతూ వ్రాయునదేమనగా:
2-3 నా సోదరులారా! మీకు పరీక్షలు కలిగినప్పుడు
పరమానందంగా భావించండి. విశ్వాసం పరీక్షింప
బడటం వల్ల సహనం కలుగుతుందని మీకు తెలుసు.
4 మీరు చేసిన పనిలో పూర్తిగా సహనం చూపండి.
అలా చేస్తే మీరు బాగా అభివృద్ధి చెంది పరిపూర్ణత
పొందుతారు. అప్పుడు మీలో ఏ లోపం ఉండదు.
5 మీలో జ్ఞానం లేనివాడు ఉంటే అతడు దేవుణ్ణి అడగాలి.
దేవుడు కోపగించుకోకుండా అందరికీ ధారాళంగా
యిస్తాడు. కనుక మీకు కూడా యిస్తాడు. 6 కాని దేవుణ్ణి
అడిగినప్పుడు సంశయించకుండా విశ్వాసంతో అడ
గండి. సంశయించేవాడు గాలికి ఎగిరి కొట్టుకొను సము
ద్రంమీది తరంగంతో సమానము. 7 అలాంటి వాడు
ప్రభువు నుండి తనకు ఏదైనా లభిస్తుందని ఆశించ
కూడదు. 8 అలాంటివాడు ద్వంద్వాలోచనలు చేస్తూ
అన్ని విషయాల్లో చంచలంగా ఉంటాడు.

### ధనము, దరిద్రము

9 దీనస్థితిలో ఉన్న సోదరుడు తనకు గొప్ప స్థానం
లభించినందుకు గర్వించాలి. 10 ధనవంతుడు తాను
కూడా గడ్డిపువ్వులా రాలిపోవలసిన వాడే కనుక తనకు
దీనస్థితి కలిగినందుకు ఆనందించాలి. 11 ఎందుకంటే,
సూర్యుడు ఉదయిస్తాడు. మండుటెండకు గడ్డి ఎండి
పోతుంది. దాని పువ్వులు రాలి దాని అందంచెడి
పోతుంది. అదేవిధంగా ధనవంతుడు తన వ్యాపారం
సాగిస్తుండగానే మరణిస్తాడు.

### పరీక్షలు, దుర్బుద్ధులు

12 పరీక్షా సమయంలో సహనం కలవాడు ధన్యుడు.
ఆ విధంగా పరీక్షింపబడినవాడు జీవకిరీటాన్ని పొందు
తాడు. అంటే దేవుడు తనను ప్రేమించిన వాళ్ళకు
చేసిన వాగ్దానం అతడు పొందుతాడన్నమాట. 13 ఒకడు
శోధింపబడినప్పుడు, దేవుడు నన్ను శోధిస్తున్నాడని
అనకూడదు. ఎందుకంటే దేవుడు చెడు ద్వారా
శోధింపడు. ఆయన ఎవర్నీ శోధించడు. 14 దురాశలకు
లోనై ఆశల్లో చిక్కుకు పోయినప్పుడు నీతికి దూరమై
చెడును చెయ్యాలనే బుద్ధి పుడుతుంది. 15 దురాశ
గర్భం దాల్చి పాపాన్ని ప్రసవిస్తుంది. ఆ పాపం పండి
మరణాన్ని కంటుంది.
16 నా ప్రియమైన సోదరులారా! మోసపోకండి.
17 ప్రతి మంచి వరానికి, ప్రతి శ్రేష్ఠమైన వరానికి పరలోకం
మూలం. వెలుగును సృష్టించిన తండ్రి ఈ వరాలిస్తాడు.
ఆ వరాలిచ్చే తండ్రి మార్పుచెందడు. ఆయన
ఎప్పుడూ ఒకే విధంగా ఉంటాడు. 18 దేవుడు తన
సృష్టిలో మనము ప్రథమ ఫలాలుగా ఉండాలని సత్య
వాక్యం ద్వారా మనకు జన్మనివ్వటానికి సంకల్పించాడు.

### వినటం, చెయ్యటం

19 నా ప్రియమైన సోదరులారా! ఈ విషయాల్ని
తెలుసుకోండి: ప్రతీ మనిషి వినటానికి సిద్ధంగా ఉండాలి.
మాట్లాడే ముందు ఆలోచించాలి. కోపాన్ని అణచు
కోవాలి. 20 ఎందుకంటే కోపం ద్వారా దేవుడు ఆశించే
నీతి కలుగదు.
21 అందువల్ల దుర్మార్గాల్ని, అవినీతిని పూర్తిగా వదిలి
వెయ్యండి. మీలో నాటుకు పోయిన దైవసందేశాన్ని
విధేయతతో ఆచరించండి. అది మీ ఆత్మల్ని రక్షించ
గలదు.
22 దైవసందేశం చెప్పినట్లు చెయ్యండి. దాన్ని విని
కూడా మీరు ఏమీ చెయ్యలేక పోతే మిమ్మల్ని మీరు
మోసపుచ్చుకొన్న వాళ్ళవుతారు. 23-24 దైవసందేశం
విని అది చెప్పినట్లు చెయ్యని వాడు అద్దంలో తన
ముఖం చూసుకొని తానేవిధంగా కనిపించాడో వెంటనే
మరిచిపోయే వ్యక్తిలాంటివాడు. 25 స్వేచ్ఛను కలిగించే
పరిపూర్ణమైన ధర్మశాస్త్రాన్ని పరిశీలిస్తూ దాని ప్రకారం
జీవించేవాడు క్రియచేస్తున్న వానిగా పరిగణింపబడ
తాడు. అలాంటివాడు విని మరిచిపోయే రకం కాదు.
అతడు చేస్తున్న ప్రతీ కార్యము ఫలించాలని దేవుడు
అతణ్ణి దీవిస్తాడు.
26 తానొక విశ్వాసినని తలంచి తన నాలుకకు కళ్ళెం
వేసుకోకపోతె తనను తాను మోసం చేసుకొన్నవాడౌ
తాడు. అతని విశ్వాసం నిష్ప్రయోజనమౌతుంది.
27 అనాథుల్ని, వితంతువుల్ని కష్టాల్లో ఆదుకోవటం,

ఈ ప్రపంచంలో ఉన్న చెడువల్ల మలినం కాకుండా
ఉండటము. ఇదే మన తండ్రియైన దేవుడు అంగీకరించే
నిజమైన భక్తి. అదే నిజమైన భక్తి.

### పక్షపాతం చూపరాదు

2 నా సోదరులారా! తేజోవంతుడైన మన యేసు
క్రీస్తు ప్రభువును విశ్వసిస్తున్న మీరు పక్షపాతం
చూపకూడదు. 2బంగారు ఉంగరాలు, మంచి దుస్తులు
వేసుకొన్న వాడొకడు, మాసిన దుస్తులు వేసుకొన్న
వాడొకడు మీ సమావేశానికి వస్తారనుకోండి. 3అప్పుడు
మీరు మంచి దుస్తులు వేసుకొన్న వాని పట్ల ప్రత్యేకమైన
శ్రద్ధ కనపరుస్తూ, "రండి! ఈ మంచి స్థానంలో
కూర్చోండి" అని అంటూ పేదవానితో, "నీ వక్కడ
నిలబడు!" అనిగాని "నా కాళ్ళ దగ్గర కూర్చో" అనిగాని
అంటే, 4మీరు వ్యత్యాసము చూపుతున్నట్లే కదా!
దుర్బుద్ధితో తీర్పు చెప్పినట్లే కదా!
5నా ప్రియమైన సోదరులారా! ప్రపంచ దృష్టిలో
పేదవాళ్ళు విశ్వాసంలో ధనికులు కావాలనీ, వాళ్ళు
తన రాజ్యానికి వారసులు కావాలనీ దేవుడు వాళ్ళను
ఎన్నుకోలేదా? తనను ప్రేమించిన వాళ్ళకు రాజ్యాన్ని
స్తానని దేవుడు యింతకు క్రితమె వాగ్దానం చేసాడు.
6మీరు పేదవాళ్ళను అవమానిస్తున్నారు. మిమ్మల్ని
దోచుకొనే వాళ్ళు ధనికులే కదా! వాళ్ళేకదా మిమ్ము
లను న్యాయస్థానానికి ఈడ్చేది? 7మీరు ఎవరికి
చెందారో గౌరవప్రదమైన ఆయన పేరును దూషి
స్తున్నది వాళ్ళే కాదా?
8"నీ పొరుగింటి వాణ్ణి నిన్ను నీవు ప్రేమించు
కొన్నంతగా ప్రేమించు"* అని ధర్మశాస్త్రంలో ఉన్న
ఈ ఆజ్ఞను మీరు నిజంగా పాటిస్తే మీలో సత్ప్రవర్తన
ఉన్నట్లే. 9కాని ఒకవేళ మీరు పక్షపాతం చూపితే పాపం
చేసిన వాళ్ళౌతారు. తద్వారా ధర్మశాస్త్రం ప్రకారం
మీరు నీతిని ఉల్లంఘించిన వాళ్ళౌతారు. 10ఎందుకంటే
ధర్మశాస్త్రంలో ఉన్న నియమాలన్నిటినీ పాటిస్తూ ఒకే
ఒక నియమాన్ని ఉల్లంఘిస్తే అలాంటి వాడు ధర్మ
శాస్త్రాన్నంతా ఉల్లంఘించిన వాడౌతాడు. 11ఎందు
కంటే, "వ్యభిచారం చేయరాదు"* అని అన్నవాడే
"హత్యచేయరాదు" అని కూడా అన్నాడు. మీరు
వ్యభిచారం చేసివుండక పోవచ్చు. కాని హత్య చేసి
ఉంటే! అలాంటప్పుడు మీరు ధర్మశాస్త్రాన్ని ఉల్లం
ఘించినట్లే కదా! 12స్వేచ్ఛను కలిగించే క్రొత్త ధర్మ
శాస్త్రాన్ని బట్టి తీర్పు పొందనున్న వాళ్ళలా ప్రవర్తిం
చండి. అదేవిధంగా మాట్లాడండి. 13దేవుడు తీర్పు
చెప్పేటప్పుడు దయాహీనులపై దయ చూపడు. కాని
దయచూపిన వాళ్ళు తీర్పు చెప్పే సమయంలో
ఆనందిస్తారు.

### విశ్వాసము, క్రియ

14నా సోదరులారా! 'నాకు విశ్వాసం ఉంది' అని
అన్న వ్యక్తి ఆ విశ్వాసాన్ని క్రియా రూపకంగా చూపక
పోతే అది నిష్ప్రయోజనం. అలాంటి విశ్వాసం అతణ్ణి
రక్షించగలదా? 15ఒక సోదరుడో లేక సోదరియో
కూడూ గుడ్డా లేక బాధపడ్తున్నారనుకోండి. 16అప్పుడు
మీరు అతనితో, "క్షేమంగా వెళ్ళిరా! కడుపునిండా తిని
ఒంటి నిండా దుస్తులు వేసుకో!" అని అంటూ వాళ్ళ
అవసరాలు తీర్చకపోతే దానివల్ల వచ్చిన లాభమేమిటి?
17విశ్వాసంతో పాటు క్రియ లేకపోతే ఆ విశ్వాసం
పూర్తిగా నిష్ప్రయోజనమై పోతుంది.
18కాని, "ఒకనిలో విశ్వాసం ఉండవచ్చు. మరొ
కనిలో క్రియ ఉండవచ్చు!" అని మీరనవచ్చు! అలా
గైతే క్రియలు లేకుండా మీలో ఉన్న విశ్వాసాన్ని
నాకు చూపండి. నేను క్రియారూపకంగా నా విశ్వాసాన్ని
చూపుతాను. 19ఒక్కడే దేవుడున్నాడని మీరు విశ్వసి
స్తారు. మంచిదే. దయ్యాలు కూడా దాన్ని నమ్ము
తాయి. అయినా, దేవుడు తమను శిక్షిస్తాడేమోనని
భయపడ్తూ ఉంటాయి.
20ఓ మూర్ఖుడా! క్రియలు లేని విశ్వాసం వ్యర్థ
మన్న* దానికి నీకు ఋజువు కావాలా? 21మన పూర్వీ
కుడు అబ్రాహాము తన కుమారుడైన ఇస్సాకును బలి
పీఠంపై బలిగా యివ్వటానికి సిద్ధమైనందుకు దేవుడ
తణ్ణి, అతడు చేసిన క్రియలను బట్టి నీతిమంతునిగా
పరిగణించలేదా? 22అతనిలో ఉన్న విశ్వాసము క్రియతో
కలిసి పని చెయ్యటం మీరు గమనించారు. అతడు
చేసిన క్రియ అతని విశ్వాసానికి పరిపూర్ణత కలిగించింది.
23"అబ్రాహాము దేవుణ్ణి నమ్మాడు. తద్వారా దేవుడతణ్ణి
నీతిమంతునిగా పరిగణించాడు"* అని లేఖనాల్లో
చెప్పిన విషయం నిజమైంది. దేవుడతణ్ణి తన మిత్రునిగా
పిలిచాడు. 24మానవునిలో ఉన్న విశ్వాసాన్ని బట్టి
మాత్రమే కాకుండా అతడు చేసిన క్రియలను బట్టి
నీతిమంతునిగా పరిగణింపబడటం మీరు చూసారు.
25మరొక ఉదాహరణ రాహాబు. ఆమె గూఢచారు
లకు ఆతిథ్యమిచ్చి వాళ్ళను వేరొక దారిన పంపివేసింది.
ఆమె చేసిన క్రియను బట్టి దేవుడు ఆమెను నీతి
మంతురాలిగా పరిగణించ లేదా?
26ఆత్మలేని శరీరం ఏ విధంగా నిర్జీవమైందో అదే
విధంగా క్రియలేని విశ్వాసము నిర్జీవమైనది.

---

**నీ పొరుగింటి ... ప్రేమించు** లేవీ. 19:18.

**వ్యభిచారం చేయరాదు** నిర్గమ. 20:14; ద్వితీ. 5:18.

**వ్యర్థము** కొన్ని ప్రాచీన వ్రాత ప్రతులలో 'చనిపోయింది'
అని ఉంది.

**అబ్రాహాము ... పరిగణించాడు** ఆది. 15:6.

### నాలుకను మచ్చిక చేసుకొండి

3 నా సోదరులారా! దేవుడు మిగతా వాళ్ళ కన్నా, బోధించే మనల్ని కఠినంగా శిక్షిస్తాడని మీకు తెలుసు. కనుక అందరూ బోధకులు కావాలని ఆశించకండి. 2మనమంతా ఎన్నో తప్పులు చేస్తుంటాము. తాను ఆడే మాటల్లో ఏ తప్పూ చేయనివాడు పరిపూర్ణుడు. అలాంటివాడు కళ్ళెం వేసి తన శరీరాన్ని అదుపులో పెట్టుకోగలడు. 3చెప్పినట్లు వినాలనే ఉద్దేశ్యంతో మనం గుఱ్ఱం నోటికి కళ్ళెం వేస్తాం. అలా చేస్తేనే మనం దాన్ని పూర్తిగా అదుపులో పెట్టుకోగలము. 4ఓడను ఉదాహరణగా తీసుకొండి. అది చాలా పెద్దగా ఉంటుంది. బలమైన గాలివల్ల అది నడుస్తుంటుంది. కాని దాన్ని నావికుడు చిన్న చుక్కానితో తన యిష్టం వచ్చిన చోటికి తీసుకు వెళ్ళగలడు. 5అదేవిధంగా నాలుక శరీరంలో చిన్న భాగమైనా గొప్పలు పలుకుతుంది.

చిన్న నిప్పురవ్వ పెద్ద అడవిని ఏ విధంగా కాలుస్తుందో గమనించండి. 6నాలుక నిప్పులాంటిది. అది చెడుతో నిండిన ప్రపంచానికి ప్రతినిధిగా మన శరీరంలో ఉంది. అది మన శరీరంలో ఒక భాగంగా ఉండి శరీరమంతా చెడును వ్యాపింపచేస్తుంది. మనిషి యొక్క జీవితానికే నిప్పంటిస్తుంది. నాలుక ఈ నిప్పును నరకం నుండి పొందుతుంది. 7మానవుడు అన్ని రకాల జంతువుల్ని, పక్షుల్ని, ప్రాకే జీవుల్ని, సముద్రంలోని ప్రాణుల్ని మచ్చిక చేసుకొంటున్నాడు; ఇదివరకే మచ్చిక చేసుకొన్నాడు. 8కాని నాలుకను ఎవ్వరూ మచ్చిక చేసుకోలేదు. అది ప్రాణాంతకమైన విషంతో కూడుకున్న ఒక అవయవం. అది చాలా చెడ్డది. విరామం లేకుండా ఉంటుంది. 9మనం, మన నాలుకతో ప్రభువును, తండ్రిని స్తుతిస్తాము. అదే నాలుకతో దేవుని పోలికలో సృష్టింపబడిన మానవుణ్ణి శపిస్తాము. 10స్తుతి, శాపము ఒకే నోటినుండి సంభవిస్తున్నాయి. నా సోదరులారా! ఇది తప్పు. 11ఉప్పు నీళ్ళు, మంచి నీళ్ళు ఒకే ఊట నుండి పారుతున్నాయా? 12నా సోదరులారా! అంజూరపు చెట్టుకు ఒలీవ పండ్లు, లేక ద్రాక్షతీగకు అంజూరపు పండ్లు కాస్తాయా? అలాగే ఉప్పు నీటి ఊట నుండి మంచి నీళ్ళు ఊరవు.

### తెలివిగల వాళ్ళు

13జ్ఞానవంతులు, విజ్ఞానవంతులు మీలో ఎవరైనా ఉన్నారా? అలాగైతే వాళ్ళను సత్ప్రవర్తనతో, వినయంతో కూడుకొన్న విజ్ఞానంతో సాధించిన కార్యాల ద్వారా చూపమనండి. 14ఒకవేళ మీ హృదయాల్లో అసూయతో కూడుకొన్న కోపము, స్వార్థంతో కూడుకొన్న ఆశ ఉంటే మీలో వివేకముందని ప్రగల్భాలు చెప్పుకోకండి. అలా చేస్తే నిజాన్ని మరుగు పరచినట్లౌతుంది. 15మీలో ఉన్న ఈ జ్ఞానము పరలోకంలో నుండి దిగి రాలేదు. ఇది భూలోకానికి చెందింది. ఇందులో ఆధ్యాత్మికత లేదు. ఇది సైతానుకు చెందింది. 16ఎందుకంటే అసూయ, స్వార్థము, ఎక్కడ ఉంటాయో అక్కడ అక్రమాలు, అన్ని రకాల చెడు పద్ధతులు ఉంటాయి. 17కాని పరలోకం నుండి వచ్చిన జ్ఞానం మొదట పవిత్రమైనది. అది శాంతిని ప్రేమిస్తుంది, సాధుగుణం, వినయం, సంపూర్ణమైన దయ, మంచి ఫలాలు, నిష్పక్షపాతం, యధార్థత కలిగియుంటుంది. 18శాంతి స్థాపకులు శాంతిని విత్తి నీతి అనే పంటను కోస్తారు.

### దేవుణ్ణి శరణు కోరండి

4 మీలో మీకు యుద్ధాలు, పోట్లాటలు ఎందుకు జరుగుతున్నాయి? మీ ఆంతర్యంలోని ఆశలు మీలో యుద్ధం చేయటం వల్లనే గదా యివి జరగటం? 2మీరు కోరుతారు. అది లభించదు. దాని కోసం మీరు చంపటానికి కూడా సిద్ధమౌతారు. మీలో అసూయ కలుగుతుంది. అయినా మీ కోరిక తీర్చుకోలేరు. మీరు పోట్లాడుతారు. యుద్ధం చేస్తారు. కాని మీరు దేవుణ్ణి అడగరు కనుక మీ కోరిక తీరదు. 3మీరు దురుద్దేశ్యంతో అడుగుతారు. కనుక మీరు అడిగినా మీకు లభించదు. మీరు అడిగేది మీ సుఖాలకు ఖర్చు పెట్టాలని అడుగుతారు. 4నమ్మక ద్రోహులారా! ప్రపంచంతో స్నేహం చేస్తే దేవుణ్ణి ద్వేషించినట్లని మీకు తెలియదా? ప్రపంచంతో స్నేహం చెయ్యాలను కొన్నవాడు దేవునికి శత్రువు అవుతాడు. 5లేఖనాల్లో ఈ విషయం వృధాగా వ్రాసారనుకుంటున్నారా? “ఆయన మన కిచ్చిన ఆత్మను* మనం ఆయన కోసం మాత్రమే వాడాలని చూస్తుంటాడు.” 6దేవుడు మనపై ఎంతో అనుగ్రహం చూపుతున్నాడు. అందువల్ల లేఖనాల్లో, “దేవుడు అహంకారం కలవాళ్ళను ద్వేషిస్తాడు. వినయం కలవాళ్ళను కనికరిస్తాడు”* అని వ్రాయబడింది.

7అందువల్ల దేవుని పట్ల విధేయతతో ఉండండి. సైతాన్ను ఎదిరించండి. అప్పుడు ఆ సైతాను మీ నుండి పారిపోతాడు. 8దేవుణ్ణి మీరు సమీపిస్తే దేవుడు మిమ్మల్ని సమీపిస్తాడు. పాపాత్ములారా! మీ పాపాలు కడుక్కోండి. చంచలమైన మనస్సుగల ప్రజలారా! మీ హృదయాల్ని పవిత్రం చేసుకోండి. 9విచారించండి, దుఃఖించండి, శోకించండి. మీ నవ్వును దుఃఖంగా మార్చుకోండి. మీ ఆనందాన్ని విషాదంగా మార్చుకోండి. 10ప్రభువు సమక్షంలో మీరు తగ్గింపు కలవారుగా ఉండండి. అప్పుడు ఆయన మిమ్మల్ని పైకిలేపుతాడు. 11సోదరులారా! పరస్పరం దూషించుకోకండి. తన సోదరుల్ని దూషించిన వాడు, లేక సోదరునిపై తీర్పు

---

**ఆత్మ** పరిశుద్ధాత్మ.

**దేవుడు … కనికరిస్తాడు** సామెత 3:34.

చెప్పినవాడు, ధర్మశాస్త్రాన్ని దూషించిన వానిగా పరి
గణింపబడతాడు. మీరు అలా చేస్తే ధర్మశాస్త్రాన్ని ఆచ
రించటానికి మారుగా, న్యాయాధిపతివలె ఆ ధర్మ
శాస్త్రంపై తీర్పు చెపుతున్నారన్న మాట. 12ధర్మశాస్త్రా
న్నిచ్చిన వాడును, న్యాయాధిపతియు ఆయనే. రక్షించ
గలవాడు, నాశనం చెయ్యగలవాడు ఆయనే. మరి
యితర్లపై తీర్పు చెప్పటానికి నీవెవరు?

### ప్రగల్భాలు చెప్పకోకండి

13వినండి! "ఈ రోజో లేక రేపో మేము ఈ పట్ట
ణానికో లేక ఆ పట్టణానికో వెళ్ళి అక్కడ ఒక సంవత్సరం
గడిపి వ్యాపారం చేసి డబ్బు గడిస్తాము" అని మీరంటూ
ఉంటారు. 14అంతెందుకు, రేపేమి జరుగబోతుందో
మీకు తెలియదు. మీరు కొంతసేపు కనిపించి ఆ
తర్వాత మాయమైపోయే పొగమంచు లాంటి వాళ్ళు.
15మీరు దానికి మారుగా, "ప్రభువు అనుగ్రహిస్తే మేము
జీవించి యిదీ అదీ చేస్తాము" అని అనాలి. 16మీరు
గర్వంగా ప్రగల్భాలు పలుకుతూ ఉంటారు. అలా ప్రగ
ల్భాలు పలకటం తప్పు. 17అందువల్ల మంచి చెయ్య
టానికి నేర్చుకొన్నవాడు మంచి పనినే చెయ్యాలి.
అలా చెయ్యకపోవటం పాపం అవుతుంది.

### ధనికులకు హెచ్చరిక

5 ధనికులారా! వినండి. మీకు కష్టాలు కలుగనున్నవి.
కనుక దుఃఖించండి. శోకిస్తూ కేకలు వేయండి.
2మీ ధనం చెడిపోతుంది. మీ దుస్తులకు చెదలు
పట్టాయి. 3మీ దగ్గరున్న వెండి బంగారాలకు త్రుప్పు
పడుతుంది. వాటి త్రుప్పు మీకు వ్యతిరేకంగా సాక్ష్యం
చెప్పి మీ శరీరాల్ని నిప్పులా కాల్చి వేస్తుంది. చివరి
దినాలకు మీరు ధనాన్ని దాచుకొన్నారు. 4మీ పొలాల్ని
సాగు చేసిన పనివాళ్ళకు మీరు కూలి యివ్వలేదు.
వాళ్ళు ఏడుస్తూ మీపై ఫిర్యాదు చేస్తున్నారు. ఆ కూలి
వాళ్ళ ఏడ్పులు సర్వశక్తి సంపన్నుడైన ప్రభువు చెవిలో
పడ్డాయి. 5మీరు ఐశ్వర్యంతో విలాసాలు చేసుకొంటూ
ఈ ప్రపంచంలో జీవించారు. మీరు మీ హృదయాల్ని
కొవ్వెక్క చేసి చివరి రోజు వధింపబడటానికి సిద్ధపరుస్తు
న్నారు. 6తప్పు చేయని వాళ్ళపై మీరు శిక్ష విధించారు.
వాళ్ళను చంపారు. అయినా వాళ్ళు మిమ్మల్ని
ఎదిరించటం లేదు.

### సహనము

7అందువల్ల సోదరులారా! ప్రభువు వచ్చే వరకు
సహనంతో ఉండండి. రైతు పొలం నుండి వచ్చే
విలువైన పంటకోసం ఏ విధంగా కాచుకొని ఉంటాడో
గమనించండి. అతడు, తొలకరి కడవరి వర్షం దాకా
సహనంతో కాచుకొని ఉంటాడు. 8ప్రభువు రానున్న
సమయం సమీపిస్తోంది. కనుక ధైర్యం చెడకుండా
సహనంతో ఉండండి. 9సోదరులారా! ఒకరి మీద ఒకరు
చాడీలు చెప్పకోకండి. అలా చేస్తే దేవుడు మిమ్మల్ని
శిక్షిస్తాడు. ఆ న్యాయాధిపతి మీ తలుపు ముందు నిలుచు
న్నాడు.

10సోదరులారా! ప్రభువు పక్షాన మాట్లాడిన ప్రవక్తలు
కష్టాలు అనుభవించారు. వాళ్ళలో సహనం ఉంది.
వాళ్ళను ఆదర్శంగా తీసుకోండి. 11కష్టాలు అనుభవించి
కూడా విశ్వాసంతో ఉన్న వాళ్ళను మనము ధన్యులుగా
భావిస్తాము. యోబు సహనాన్ని గురించి మీరు
విన్నారు. ప్రభువు చేసిన దాన్ని చూసారు. ప్రభువులో
దయా దాక్షిణ్యాలు సంపూర్ణంగా ఉన్నాయి. 12నా
సోదరులారా! అన్నిటికన్నా ముఖ్యమైన దేమిటంటే,
పరలోకం పేరిట గాని, భూమి పేరిట గాని, మరేదానిపై
గాని ఒట్టు పెట్టుకోకండి. మీరు "ఔను" అని
అనాలనుకొంటె "ఔను" అనండి. "కాదు" అని
అనాలనుకొంటె "కాదు" అని అనండి. అలా చేస్తే
దేవుడు మిమ్మల్ని శిక్షించడు.

13మీలో ఎవరైనా కష్టాల్లో ఉంటే అలాంటి వాడు
ప్రార్థించాలి. ఆనందంగా ఉన్నవాడు దేవుణ్ణి స్తుతిస్తూ
పాటలు పాడాలి. 14అనారోగ్యంగా ఉన్నవాడు సంఘ
పెద్దల్ని పిలవాలి. ఆ పెద్దలు వచ్చి, ప్రార్థించి ప్రభువు
పేరిట అతనికి నూనె రాయాలి. 15విశ్వాసంతో చేసిన
ప్రార్థన ఆ రోగికి ఆరోగ్యం కలుగచేస్తుంది. ప్రభువు
అతనికి ఆరోగ్యం కలుగచేస్తాడు. పాపం చేసి ఉంటె
అతన్ని క్షమిస్తాడు. 16అందువల్ల చేసిన తప్పుల్ని పర
స్పరం ఒప్పుకోండి. ఒకరికొకరు ప్రార్థించండి.
తద్వారా ఆరోగ్యం చేకూరుతుంది. నీతిమంతుని
ప్రార్థన బహు బలముగలది. కనుక ఎంతో మేలు చేయ
గలదు. 17ఏలీయా మనలాంటి మనిషే. ఒకప్పుడు
వర్షాలు కురియరాదని అతడు ఆసక్తితో ప్రార్థించాడు.
మూడున్నర సంవత్సరాల దాకా వర్షాలు కురియలేదు.
18ఆ తర్వాత మళ్ళీ ప్రార్థించాడు. ఆకాశం నుండి
వర్షాలు కురిసాయి. భూమి నుండి పంటలు పండాయి.

19నా సోదరులారా! మీలో ఎవరైనా నీతిమార్గానికి
దూరంగా పోయిన వాణ్ణి వెనక్కు పిలుచుకు వస్తే
యిది గమనించండి. 20పాపిని వాని తప్పు మార్గం
నుండి మళ్లించినవాడు అతని ఆత్మను పాపాలన్నిటి
నుండి రక్షించిన వాడౌతాడు. అదీగాక అతన్ని చావు
నుండి తప్పించిన వాడౌతాడు.

# పేతురు వ్రాసిన మొదటి లేఖ

1 చెదరిపోయి పొంతు, గలతీయ, కప్పదొకియ,
ఆసియ, బితూనియ, ప్రాంతాలలో పరదేశీయు
లుగా నివసిస్తున్న వాళ్ళకు, యేసు క్రీస్తు అపొస్తలుడైన
పేతురు వ్రాయునదేమనగా, ప్రియులారా! మీరు
దేవునిచే ఎన్నుకోబడ్డ వాళ్ళు. మీకు ఆయన అను
గ్రహము, శాంతి సమృద్ధిగా లభించాలని కోరుతున్నాను.
2మీరు యేసు క్రీస్తుకు విధేయులై ఉండాలని, ఆయన
రక్తం చేత ప్రోక్షింపబడాలని, తండ్రి అయినటువంటి
దేవుడు మిమ్మల్ని తన దివ్యజ్ఞానంతో ఎన్నుకున్నాడు;
పరిశుద్ధాత్మ మిమ్మల్ని పవిత్రం చేసాడు.

### సజీవమైన ఆశాభావం

3మన ప్రభువైన యేసు క్రీస్తుకు తండ్రి అయినటు
వంటి దేవుణ్ణి స్తుతించుదాం. ఆయనకు మనపై అను
గ్రహం ఉండటం వల్ల యేసు క్రీస్తును బ్రతికించి మనకు
క్రొత్త జీవితాన్ని యిచ్చాడు. అంతేకాక మనలో సజీవ
మైన ఆశాభావాన్ని కలిగించాడు. 4నాశనంకాని, మచ్చ
లేని, తరగని వారసత్వం పొందటానికి ఆశించండి.
దేవుడు మీకోసం దాన్ని పరలోకంలో దాచి ఉంచాడు.
5చివరి దశలో మనకు వ్యక్తం కావటానికి రక్షణ సిద్ధంగా
ఉంది. మీలో విశ్వాసం ఉండటంవల్ల, అది లభించే
వరకూ మీకు దైవశక్తి రక్షణ కలిగిస్తుంది. 6కొంతకాలం
సంభవించిన అనేక రకాల కష్టాల్ని అనుభవించవలసి
వచ్చినప్పుడు మీరు అనుభవించారు. దానికి ఆనందిం
చండి. 7మీ విశ్వాసం యధార్థమైనదని రుజువగుటకు
ఈ శ్రమలు మీకొచ్చాయి. బంగారం నిప్పుచేత కాల్చ
బడి శుద్ధి అయినా, చివరికది నాశనం కాక తప్పదు.
మీ విశ్వాసం బంగారం కంటే విలువైనదిగా యుండి
యేసు క్రీస్తు వచ్చినప్పుడు ప్రశంస, మహిమ, ఘనత
పొంద తగినదిగా వుంటుంది.

8మీరాయన్ని చూడలేదు. అయినా ప్రేమిస్తు
న్నారు. ప్రస్తుతం చూడటం లేదు. అయినా విశ్వసిస్తు
న్నారు. వ్యక్తం చేయలేని దివ్యమైన ఆనందం మీలో
నిండిపోయింది. 9ఎందుకంటే ఏ ఉద్దేశ్యంతో మీరు
విశ్వసిస్తున్నారో ఆ ఉద్దేశ్యం నెర వేరుతోంది. మీ
ఆత్మలకు రక్షణ లభిస్తోంది.

10ఈ రక్షణ విషయంలో, ప్రవక్తలు మీకోసం
రాబోవు కృపను గురించి మాట్లాడుతూ అతిజాగ్రత్తతో
తీవ్రంగా పరిశోధించారు. 11వాళ్ళలో ఉన్న క్రీస్తు ఆత్మ
క్రీస్తు బాధల్ని గురించి, ఆ తర్వాత ఆయన పొందనున్న
మహిమను గురించి వాళ్ళకు ముందుగానే తెలియ
జేసాడు. ఆ ఆత్మ సూచించిన కాలాన్ని, పరిస్థితుల్ని
తెలుసుకోవటానికి వాళ్ళు ప్రయత్నం చేసారు. 12తమ
లాభం కోసం కాకుండా మీకు సేవ చేయాలని ఇలా
చేసారు. ఈ విషయం దేవుడు వాళ్ళకు తెలియ
చేసాడు. పరలోకం నుండి దేవుడు పంపిన పరిశుద్ధాత్మ
ద్వారా, సువార్తను బోధించిన వాళ్ళు మీకు వాటిని
గురించి తెలిపారు. వాటిని గురించి తెలుసుకోవాలని
దేవదూతలు కూడా ఎదురు చూస్తున్నారు.

### పవిత్రంగా జీవించండి

13అందుచేత కార్యసిద్ధికోసం మీ మనసుల్ని సిద్ధం
చేసికొంటూ మిమ్మల్ని అదుపులో పెట్టుకోండి.
యేసు క్రీస్తు ప్రత్యక్షమైనప్పుడు మీ కందివ్వబోయే
అనుగ్రహంపై సంపూర్ణమైన ఆశాభావంతో ఉండండి.
14మీరు అజ్ఞానంతో జీవించినప్పుడు దురాశలకు లోనై
జీవించారు. ఇప్పుడావిధంగా జీవించకుండా చిన్న పిల్లల
వలే విధేయతతో జీవించండి. 15మిమ్మల్ని పిలిచిన
వాడు ఏ విధంగా పవిత్రుడో అదేవిధంగా మీరు కూడా
పవిత్రమైన కార్యాలను చేస్తూ పవిత్రంగా జీవించండి.
16ఎందుకంటే ధర్మశాస్త్రంలో, "నేను పవిత్రుణ్ణి; కనుక
మీరు కూడా పవిత్రంగా ఉండండి"* అని వ్రాయబడి
ఉంది.

17పక్షపాతము చూపకుండా ఒక వ్యక్తి చేసిన కార్యా
లను బట్టి తీర్పు చెప్పే దేవుణ్ణి మీరు 'తండ్రి' అని
పిలుస్తారు కనుక మీరు భయ భక్తులతో పరదేశీయు
లుగా మీ జీవితాలను గడపండి. 18ఎందుకంటే, మీ
పూర్వీకులు వంశపారంపర్యంగా మీ కందించిన వ్యర్థ
జీవితం నుండి మీకు విడుదల కలుగలేదు. నశించి
పోయే వెండి, బంగారం వంటి వస్తువుల వల్లనూ కలుగ
లేదు. ఈ విషయం మీకు తెలుసు. 19ఏ లోపమూ,
మచ్చాలేని గొఱ్ఱెపిల్లయైన క్రీస్తు యొక్క అమూల్య
మైన రక్తం ద్వారా మీకు విముక్తి కలిగింది. 20ఈ
ప్రపంచానికి పునాది వేయకముందే దేవుడు క్రీస్తును

---

**నేను ... ఉండండి** లేవీ. 11:44-45; 19:2; 20:7.

ఎన్నుకున్నాడు. కాని మీకోసం ఈ చివరి రోజుల్లో
ఆయన్ను వ్యక్తం చేసాడు. 21ఆయన కారణంగా మీరు
దేవుణ్ణి విశ్వసిస్తున్నారు. ఆయన్ని బ్రతికించి మహిమ
గలవానిగా చేసాడు. తద్వారా మీకు దేవుని పట్ల
విశ్వాసము, ఆశ కలిగాయి.
22సత్యాన్ని విధేయతతో ఆచరించటం వల్ల మీ
జీవితాలు పవిత్రమయ్యాయి. తద్వారా మీ సోదరుల
పట్ల మీకు నిజమైన ప్రేమ కలిగింది. పరస్పరం హృద
యపూర్వకంగా* చిరకాలం ప్రేమించుకుంటూ
ఉండండి. 23నశించిపోయే సంతానంగా మీరు తిరిగి
పుట్టలేదు, గాని నశించని సంతానంగా సజీవమైన దేవుని
వాక్యం ద్వారా తిరిగి పుట్టారు. 24ఎందుకంటే,

"మానవులు గడ్డిపోచల్లాంటి వాళ్ళు వాళ్ళ
కీర్తి గడ్డిపువ్వు లాంటిది గడ్డి ఎండిపోతుంది,
పువ్వు రాలిపోతుంది,
25 కాని, ప్రభువు సందేశం చిరకాలం నిలిచి
పోతుంది."

*యెషయా 40:6-8*

మీకు ప్రకటింపబడిన సందేశం యిదే!

2 అందువలన మీరు దుష్టత్వమంతటినీ, మోస
మంతటినీ, వేషధారణను, అసూయను మరియు
ప్రతివిధమైన దూషణను మీ నుండి తీసివేయండి.
2అప్పుడే జన్మించిన శిశువులు పాలకోసం తహతహలా
డినట్లు, మీరు కూడా దేవుని వాక్యమను పరిశుద్ధ
పాల కోసం తహతహలాడండి. ఆ పాల వల్ల మీరు
ఆత్మీయంగా రక్షణలో ఎదుగుతారు. 3ప్రభువు మంచి
వాడని అనుభవ పూర్వకంగా మీరు తెలిసికొన్నారు.

### సజీవమైన రాయి

4మీరు సజీవమైన రాయియగు ప్రభువు వద్దకు
రండి. మానవులు ఈ సజీవమైన రాయిని తృణీకరిం
చారు. కాని, దేవుడు ఆయన్ని అమూల్యంగా పరిగణించి
ఎన్నుకొన్నాడు. 5మీరు కూడా సజీవమైన రాళ్ళుగా
ఆత్మీయమైన మందిర నిర్మాణంలో కట్టబడు
చున్నారు. యేసు క్రీస్తు ద్వారా దేవునికి ఆత్మీయ
బలుల్ని అర్పించడానికి మీరు పవిత్ర యాజకులుగా
ఎన్నుకోబడ్డారు. 6ఎందుకంటే, ధర్మశాస్త్రంలో ఈ విష
యాన్ని గురించి ఈ విధంగా వ్రాసారు:

"అదిగో చూడు! సీయోనులో ఒక రాయి
స్థాపించాను! పునాది రాయిగా ఎన్నుకున్న
అమూల్యమైన రాయి అది. ఆయన్ని
నమ్మిన వానికెవ్వనికీ అవమానం ఎన్నటికీ
కలుగదు!"

*యెషయా 28:16*

7ఇప్పుడు నమ్మిన మీకు అది అమూల్యమైన రాయి.
కాని నమ్మని వాళ్ళకు:

"ఇల్లు కట్టేవాళ్ళు నిషేధించిన రాయి
మూలకు తలరాయి అయింది."

*కీర్తన 118:22*

8మరొక చోట యిలా వ్రాయబడి ఉంది:

"ఈ రాయి, మానవులు తొట్రుపడేటట్లుచే
స్తుంది ఈ బండ వాళ్ళను క్రింద పడ
వేస్తుంది."

*యెషయా 8:14*

దైవసందేశాన్ని నిరాకరించిన వాళ్ళు తొట్రు పడతారు.
వాళ్ళు దానికని నిర్ణయించబడ్డారు.
9కాని, మీరు దేవుడు ఎన్నుకున్నప్రజలు, మీరు
రాజవంశానికి చెందిన యాజకులు, మీరు పవిత్రమైన
జనాంగము, మీరు దేవునికి సన్నిహితమైన ప్రజలు.
తన ఘనతను గూర్చి చెప్పటానికి దేవుడు మిమ్మల్ని
ఎన్నుకున్నాడు. అంధకారం నుండి అద్భుతమైన తన
వెలుగులోకి రమ్మని ఆయన మిమ్మల్ని పిలిచాడు.
10పూర్వం మీరు దేవుని ప్రజ కాదు. ఇప్పుడు మీరు
దేవుని ప్రజ. పూర్వం మీకు దైవానుగ్రహం లభించ
లేదు. కాని యిప్పుడు లభించింది.
11ప్రియమైన సోదరులారా! ఈ ప్రపంచంలో మీరు
పరదేశీయుల్లా, యాత్రికుల్లా, జీవిస్తున్నారు. మీ
ఆత్మలతో పోరాడుతున్న శారీరక వాంఛల్ని వదిలి
వేయమని మిమ్మల్ని వేడుకుంటున్నాను. 12యూదు
లుకాని వాళ్ళ మధ్య నివసిస్తున్న మీరు మంచి నడవడిక
గలిగి జీవించాలి. ఎందుకంటే, 'దుర్మార్గులని' మిమ్మల్ని
నిందిస్తున్న వాళ్ళు మీ మంచి నడవడికను చూసి
దేవుడు తీర్పు చెప్పనున్న రోజు ఆయన మహిమను
బట్టి ఆయన్ని స్తుతిస్తారు.

### పరిపాలకుల పట్ల, అధికారుల పట్ల వినయం

13మీరు ప్రభువు కోసం అధికారుల పట్ల విధేయ
తతో ఉండండి. అది సర్వాధికారమున్న చక్రవర్తికా
నివ్వండి, 14లేక, ఆ చక్రవర్తి నియమించిన రాజ్యాధికా
రులు కానివ్వండి. చక్రవర్తి ఈ రాజ్యాధికారుల్ని తప్పు
చేసిన వాళ్ళను శిక్షించటానికి, ఒప్పు చేసిన వాళ్ళను
మెచ్చుకోవటానికి పంపించాడు. 15మీరు మంచి పనులు
చేసి, అవివేకంగా మాట్లాడే మూర్ఖుల నోళ్ళను కట్టి

---

**హృదయపూర్వకంగా** కొన్ని ప్రాచీన ప్రతులలో పవిత్ర
హృదయంతో అని ఉంది.

వేయాలని దేవుని కోరిక. 16స్వేచ్ఛగా జీవించండి.
కాని ఈ స్వేచ్ఛను మీ దుష్ట స్వభావాన్ని కప్పిపుచ్చ
టానికి ఉపయోగించకండి. దేవుని సేవకులవలె జీవిం
చండి. 17అందర్నీ గౌరవించండి. తోటి విశ్వాసులైన
సోదరులను ప్రేమించండి. దేవునికి భయపడండి.
రాజును గౌరవించండి. 18బానిసలారా! తమ యజమా
నులను, వాళ్ళు దయాదాక్షిణ్యాలతో మంచిగా ప్రవ
ర్తించే యజమానులు కానివ్వండి, లేక దౌర్జన్యంతో
ప్రవర్తించే యజమానులు కానివ్వండి పూర్తిగా గౌర
విస్తూ విధేయతతో ఉండండి. 19ఎందుకంటే, తనకు
అన్యాయంగా సంభవిస్తున్న బాధల్ని, దేవుణ్ణి దృష్టిలో
ఉంచుకొని అనుభవించే వ్యక్తి శ్లాఘనీయుడు. 20నీవు
చేసిన తప్పులకు దెబ్బలు తిని ఓర్చుకుంటే అందులో
గొప్పేమిటి? కాని మంచి చేసి కూడా బాధల్ని అనుభ
వించి ఓర్చుకుంటే అది దేవుని సాన్నిధ్యంలో శ్లాఘనీయ
మౌతుంది. 21దేవుడు మిమ్మల్ని పిలిచింది అందు
కోసమే! మీకు ఆదర్శంగా ఉండాలనీ, మీరు తన
అడుగు జాడల్లో నడుచుకోవాలనీ క్రీస్తు మీకోసం
కష్టాలనుభవించాడు.

22 "ఆయన ఏ పాపం చేయలేదు! ఆయన
మాటల్లో ఏ మోసం కనబడలేదు!"
*యెషయా 53:9*

23వారాయన్ని అవమానించినప్పుడు ఎదురుతిరిగి
మాట్లాడలేదు. కష్టాలను అనుభవించవలసి వచ్చిన
ప్పుడు ఆయన ఎదురు తిరగలేదు. దానికి మారుగా,
న్యాయంగా తీర్పు చెప్పే ఆ దేవునికి తనను తాను
అర్పించుకున్నాడు. 24ఆయన మన పాపాలను సిలు
వపై భరించాడు. పాపం చేస్తూ జీవించటం మాను
కున్న మనం నీతిగా జీవించాలని యిలా చేసాడు.
ఆయన దెబ్బల ద్వారా మన రోగాలు మాని
పోయాయి. 25ఎందుకంటే, ఇదివరలో మీరు దారి
తప్పిన గొర్రెల్లా ప్రవర్తించారు. కాని యిప్పుడు మీరు,
మీ ఆత్మల్ని కాపలా కాచే కాపరి, అధిపతి దగ్గరకు
తిరిగి వచ్చారు.

### భార్యాభర్తలు

3 అదే విధంగా భార్యలు తమ భర్తలకు అణిగి ఉండాలి.
అప్పుడు ఒక వేళ ఏ పురుషుడైనా దైవసందేశాను
సారం నడుచుకోక పోతే ఆ సందేశాన్ని గురించి ప్రస్తా
వించకుండానే స్త్రీలు, తమ నడత ద్వారా 2మీ పవి
త్రతను, భక్తిని వాళ్ళు చూడటం వల్ల మీ భర్తలు
మంచి దారికి రాగలరు. 3జడ వేసి, బంగారు నగలు
ధరించి, విలువైన దుస్తుల్ని కట్టుకొని శరీరాన్ని
బాహ్యంగా అలంకరించటంకన్నా 4మీ అంతరాత్మను,
సాత్వికత, శాంతత అనే నశించని గుణాలతో అలంక
రించుకోండి. దేవుడు యిలాంటి అలంకరణకు ఎంతో
విలువనిస్తాడు. 5దేవుణ్ణి విశ్వసించి పవిత్రంగా జీవించిన
పూర్వకాలపు స్త్రీలు యిలాంటి గుణాలతో అలంకరిం
చుకునేవాళ్ళు. వాళ్ళు తమ భర్తలకు అణిగిమణిగి ఉండే
వాళ్ళు. 6శారా తన భర్త అబ్రాహాముకు అణిగిమణిగి
ఉండి, అతణ్ణి 'యజమాని' అని పిలిచేది. మీరు కూడా
నీతిగా ప్రవర్తిస్తూ, భయపడకుండా ఉంటే దేవుడు
మిమ్మల్ని శారా కుమార్తెల్లా పరిగణిస్తాడు.
7భర్తలు, తమ భార్యలు తమకన్నా శారీరకంగా
తక్కువ శక్తి కలవాళ్ళని గుర్తిస్తూ కాపురం చెయ్యాలి.
మీతో సహా వాళ్ళు కూడా దేవుడు అనుగ్రహించిన
జీవితాన్ని పంచుకుంటున్నారు. కనుక వాళ్ళను మీరు
గౌరవించాలి. అలా చేస్తే మీ ప్రార్థనలకు ఏ ఆటంకము
కలుగదు.

### నీతి కోసం బాధలనుభవించటం

8చివరకు చెప్పేదేమిటంటే మీరంతా కలిసిమెలిసి
ఉంటూ దయా సానుభూతులతో పరస్పరం సోదరుల
వలే ప్రేమించుకుంటూ, నమ్రతగలవారై జీవించండి.
9అపకారం చేసిన వాళ్ళకు అపకారం చెయ్యకండి.
అవమానించిన వాళ్ళను అవమానించకండి. అంత
టితో ఆగక అలాంటి వాళ్ళను దీవించండి. ఎందు
కంటే, దేవుడు తన దీవెనలకు మీరు వారసులు కావాలని
మిమ్మల్ని పిలిచాడు. 10లేఖనాల్లో ఈ విధంగా వ్రాయ
బడి ఉంది:

"బ్రతకాలని ఇష్టపడే వాడు, మంచిరోజులు
చూడదలచినవాడు, తన నాలుక చెడు
మాటలాడకుండా చూసుకోవాలి. తన
పెదాలు మోసాలు పలుకకుండా కాపాడు
కోవాలి.
11 చెడు చెయ్యటం మాని, మంచి చెయ్యాలి.
శాంతిని కోరి సాధించాలి.
12 నీతిమంతులను దేవుడు గమనిస్తూ
ఉంటాడు. వాళ్ళ ప్రార్థనల్ని శ్రద్ధతో వింటూ
ఉంటాడు. కాని దుష్టుల విషయంలో
ముఖం త్రిప్పుకుంటాడు."
*కీర్తన 34:12-16*

13ఉత్సాహంతో మంచి చేస్తున్న మీకు ఎవరు హాని
చేస్తారు? 14కాని ఒకవేళ నీతికోసం మీరు కష్టాలు అను
భవిస్తే మీకు దేవుని దీవెనలు లభిస్తాయి. "వాళ్ళ
బెదిరింపులకు భయపడకండి. ఆందోళన చెందకండి."
15క్రీస్తును మీ హృదయ మందిరంలో ప్రతిష్టించండి.
మీ విశ్వాసాన్ని గురించి కారణం అడుగుతూ ఎవరైనా
ప్రశ్నిస్తే, అలాంటి వాళ్ళకు సమాధానమివ్వటానికి
అన్ని వేళలా సిద్ధంగా ఉండండి. 16కాని మర్యాదగా

గౌరవంతో సమాధాన మివ్వండి. మీ మనస్సును
నిష్కల్మషంగా ఉంచుకోండి. సత్ప్రవర్తనతో క్రీస్తును
అను సరిస్తున్న మిమ్మల్ని అవమానించి దుర్భాషలాడిన
వాళ్ళు స్వయంగా సిగ్గు పడిపోతారు. 17చెడును చేసి
కష్టాలను అనుభవించటం కన్నా మంచి చేసి కష్టాలను
అనుభవించటమే దైవేచ్ఛ. యిదే ఉత్తమం. 18క్రీస్తు
మీ పాపాల నిమిత్తం తన ప్రాణాన్ని ఒకసారి యిచ్చాడు.
దేవుని సన్నిధికి మిమ్మల్ని తీసుకు రావాలని నీతిమంతు
డైన క్రీస్తు మీ పాపాల నిమిత్తం మరణించాడు.
వాళ్ళాయనకు భౌతిక మరణం కలిగించినా, ఆయన
పరిశుద్ధాత్మ ద్వారా పునర్జీవం పొందాడు. 19పరిశుద్ధాత్మ
ద్వారా చెరలోబడిన ఆత్మల దగ్గరకు వెళ్ళి బోధిం
చాడు. 20గతంలో ఈ ఆత్మలు దేవుని పట్ల అవిధేయ
తతో ప్రవర్తించాయి. నోవహు కాలంలో, నోవహు
ఓడ నిర్మాణాన్ని సాగించినంతకాలం దేవుడు శాంతంగా
కాచుకొని ఉన్నాడు. ఆ తర్వాత కొందరిని మాత్రమే,
అంటే ఓడలో ఉన్న ఎనిమిది మందిని మాత్రమే నీళ్ళ
నుండి రక్షించాడు. 21అదేవిధంగా మీరు బాప్తిస్మము
పొందటం వల్ల దేవుడు మిమ్మల్ని రక్షిస్తాడు. బాప్తిస్మము
పొందటం అంటే శరీరం మీదినుండి మలినాన్ని కడిగి
వేయటం కాదు. దేవుణ్ణి స్వచ్ఛమైన మనస్సునిమ్మని
వేడుకోవడం. ఇది యేసు క్రీస్తు చావు నుండి బ్రతికి
రావటం వల్ల సంభవిస్తోంది.
22ఆయన పరలోకానికి వెళ్ళి దేవుని కుడి చేతి
వైపు కూర్చొని, దేవదూతల మీద, అధికారుల మీద
శక్తుల మీద రాజ్యం చేస్తున్నాడు.

4 క్రీస్తు శారీరకమైన బాధననుభవించాడు గనుక మీరు
కూడా ఆ గుణాన్ని ఆయుధంగా ధరించండి.
2ఎందుకంటే శారీరకమైన బాధననుభవించే వ్యక్తి తన
మిగతా భౌతిక జీవితాన్ని, మానవులు కోరే దురాశల్ని
తీర్చుకోవటానికి ఉపయోగించకుండా దైవేచ్ఛ కోసం
ఉపయోగిస్తాడు. అలాంటి వానికి పాపంతో సంబంధ
ముండదు. 3గతంలో మీరు యూదులుకాని వాళ్ళవలే
పోకిరి చేష్టలు, దురాశకు, త్రాగుడుకు, అల్లరితో
కూడిన ఆటపాటలు, త్రాగుడు విందులకు, చేయతగని
విగ్రహారాధనలకు లోనై జీవించారు. వారి ఇష్టము నెర
వేర్చుచుండుటకు గడచిన కాలమే చాలును. 4కాని
ప్రస్తుతం మీరు వాళ్ళ వలె మితిమీరిన దుష్ప్రవర్తనకు
లోనై వాళ్ళతో సహా పరుగెత్తనందుకు, వాళ్ళు ఆశ్చర్య
పడి మిమ్మల్ని దూషిస్తున్నారు. 5అయితే చనిపోయిన
వాళ్ళ మీద బ్రతికియున్న వాళ్ళ మీద, తీర్పు చెప్పే
ఆ దేవునికి వాళ్ళు సమాధానం చెప్పుకోవలసి
ఉంటుంది. 6ఈ కారణంగానే సువార్త ఇప్పుడు చని
పోయిన వాళ్ళకు కూడా ప్రకటింపబడింది. వాళ్ళు
కూడా ఆధ్యాత్మికంగా జీవించాలని దేవుడు మానవు
లపై తీర్పు చెప్పినట్లు గానే వాళ్ళ మీద కూడా
తీర్పు చెపుతాడు.
7అన్నీ అంతమయ్యే సమయం దగ్గరకు వచ్చింది.
అందువల్ల స్థిరబుద్ధితో, ఆత్మ నిగ్రహంతో ఉండండి.
అప్పుడే మీరు ప్రార్థించ గలుగుతారు. 8అన్నిటికన్నా
ముఖ్యంగా, 'ప్రేమ' పాపాలన్నిటినీ కప్పివేస్తుంది గనుక
పరస్పరం హృదయపూర్వకంగా ప్రేమించుకోండి.
9సణగకుండా, పరస్పరం అతిథి సత్కార్యాలు చేసు
కోండి. 10ప్రతి ఒక్కడూ ఆత్మీయంగా తాను పొందిన
వరాన్ని యితర్ల సేవ చేయటానికి ఉపయోగించాలి.
అనేక రకాలుగా లభించిన ఈ దైవానుగ్రహాన్ని విశ్వా
సంతో ఉపయోగించాలి. 11మాట్లాడాలని అనుకున్న
వాడు దైవసందేశానుసారం మాట్లాడాలి. సేవ చేయ
దలచిన వాడు దేవుడిచ్చిన శక్తిని ఉపయోగించి సేవ
చెయ్యాలి. అలా చేస్తే, శాశ్వతంగా తేజోవంతుడూ,
శక్తివంతుడూ అయినటువంటి దేవుణ్ణి యేసు క్రీస్తు
ద్వారా అన్ని విషయాల్లో స్తుతించినట్లు అవుతుంది.
12నా ప్రియమైన సోదరులారా! మీకు అగ్నిపరీక్ష
జరుగుతోంది. తద్వారా ఏదో జరుగరానిది జరిగినట్లు
ఆశ్చర్యపడకండి. 13క్రీస్తు కష్టాల్లో మీరు పాలు పంచు
కుంటున్నందుకు ఆనందించండి. అలా చేస్తే ఆయన
మహిమ వ్యక్తమైనప్పుడు మీరు చాలా ఆనందిస్తారు.
14ఒకవేళ క్రీస్తు పేరు కారణంగా మీకు అవమానం
కలిగితే, మీరు ధన్యులు. అంటే దేవుని తేజోవంతమైన
ఆత్మ మీలో ఉన్నాడన్న మాట. 15హత్య చేసి కాని,
దొంగతనం చేసికాని, దుర్మార్గంగా ప్రవర్తించి గాని,
లేక యితర్ల విషయాల్లో జోక్యం కలిగించుకోవటం
వలన కాని, మీరు శిక్షను అనుభవించ కూడదు. 16మీరు
క్రైస్తవులైనందు వలన శిక్షననుభవించ వలసివస్తే సిగ్గు
పడనవసరం లేదు. మీరు క్రైస్తవులైనందుకు దేవుణ్ణి
స్తుతించండి. 17ఎందు కంటే, తీర్పు చెప్పే సమయం
దగ్గరకు వచ్చింది. మొదట దేవుని కుటుంబానికి
చెందిన వాళ్ళ మీద తీర్పు చెప్పబడుతుంది. మరి ఆ
తీర్పు మనతో ప్రారంభమైతే దేవుని సువార్తను నిరాక
రించిన వాళ్ళగతేమౌతుంది? 18లేఖనాల్లో ఈ విధంగా
వ్రాసారు: "నీతిమంతులకే రక్షణ లభించటం కష్టమైతే,
నాస్తికుని గతి, పాపాత్ముని గతి, ఏమౌతుంది?"*
19అందువలన, దైవేచ్ఛ ప్రకారం కష్టాలనుభవించే
వాళ్ళు, విశ్వసింప దగిన సృష్టికర్తకు తమను తాము
అర్పించుకొని సన్మార్గంలో జీవించాలి.

5 మీలో ఉన్న సంఘ పెద్దలకు విజ్ఞప్తి చేయట
మేమనగా, మీలాగే నేను కూడా ఒక పెద్దను.
క్రీస్తు అనుభవించిన బాధల్ని చూసిన వాణ్ణి. దేవుడు
వ్యక్తం చేయనున్న మహిమలో భాగస్తుణ్ణి. 2సంరక్షణలో
ఉన్న దేవుని మందకు కాపరులుగా ఉండి దాన్ని
జాగ్రత్తగా కాపాడండి. కర్తవ్యంగా కాకుండా మీ మన
స్ఫూర్తిగా ఆ కార్యాన్ని చేయండి. దైవేచ్ఛ కూడా

---

**నీతిమంతులకే … ఏమౌతుంది** సామెత. 11:31.

అదే! డబ్బుకు ఆశపడి కాకుండా మీ అభీష్టంతో ఆ కార్యాన్ని చెయ్యండి.
3దేవుడు మీకప్పగించిన వాళ్ళపై అధికారం చూప
కుండా ఆ మందకు ఆదర్శ పురుషులుగ ఉండండి.
4ముఖ్య కాపరి ప్రత్యక్షం అయినప్పుడు ఎన్నటికీ
నశించిపోని వెలుగు కిరీటం మీకు లభిస్తుంది. 5అదే
విధంగా యువకులు పెద్దలకు అణిగిమణిగి ఉండాలి. వినయమనే వస్త్రాన్ని ధరించి యితర్ల సేవ చెయ్యండి. ఎందుకంటే లేఖనాల్లో:

> "దేవుడు గర్వంతో ఉన్నవాళ్ళకు వ్యతిరేకంగా ఉంటాడు, కాని, వినయంతో ఉన్న వాళ్ళకు కృపననుగ్రహిస్తాడు."
>
> సామెత *3:34*

అని వ్రాయబడి ఉంది. 6అందువల్ల దేవుని బలమైన
చేతి క్రింద వినయంతో ఉండండి. సరియైన సమయం
రాగానే ఆయన మిమ్మల్ని పైకి తెస్తాడు. 7ఆయన
మీ గురించి చింతిస్తాడు. గనుక మీ చింతల్ని ఆయనపై వదిలివేయండి.
8మీ ఆలోచనల్ని అదుపులో పెట్టుకొని మెలుకువతో ఉండండి. మీ శత్రువైనటువంటి సైతాను సింహంలా గర్జిస్తూ మిమ్మల్ని మ్రింగి వేయాలని మీ
చుట్టూ తిరుగుతూ ఉన్నాడు. 9ఈ ప్రపంచంలో ఉన్న
మీ సోదరులు యిలాంటి కష్టాలే అనుభవిస్తున్నారని మీకు తెలుసు. గనుక దృఢ విశ్వాసంతో ఉండి ఆ
సైతానుకి ఎదురు తిరగండి. 10దయామయుడైన
దేవుడు, మీరు క్రీస్తులో శాశ్వతమైన తన మహిమను పంచుకోవాలని మిమ్మల్ని పిలిచాడు.
మీరు కొన్ని కష్టాలనుభవించాక, ఆయన స్వయంగా మీకు శక్తిని, ధృఢత్వాన్ని యిచ్చి గట్టి
పునాది వేసి మీలో పరిపూర్ణత కలిగిస్తాడు. 11ఆయన
యొక్క అధికారం చిరకాలం ఉండుగాక! ఆమేన్.
12నా సోదరునిగా భావించే విశ్వాసనీయుడైన
సిల్వాను సహాయంతో మీకీ లేఖను పంపుచున్నాను. మిమ్మల్ని ప్రోత్సాహపరచాలని, ఇది దేవుని నిజమైన అనుగ్రహమని సాక్ష్యం చెప్పాలని ఉద్దేశించి ఈ లేఖను వ్రాస్తున్నాను. ఆ అనుగ్రహాన్ని వదులుకోకండి.
13మీతో సహా ఎన్నుకోబడి బబులోనులో ఉన్న
ఆమెయు, నా కుమారునితో సమానమైన మార్కు,
మీకు తమ శుభాకాంక్షలు తెలుపుతున్నారు. 14ప్రేమలో
ఒకళ్ళనొకళ్ళు హృదయాలకు హత్తుకొని శుభాకాంక్షలు తెలుపుకోండి. క్రీస్తులో నున్న మీ అందరికీ శాంతి కలుగు గాక!

# పేతురు వ్రాసిన రెండవ లేఖ

1 యేసు క్రీస్తు సేవకుడును, అపొస్తలుడునైన
సీమోను పేతురు మన దేవుని యొక్కయు, మన
రక్షకుడైన క్రీస్తు యొక్కయు నీతినిబట్టి మాలాగే
అమూల్యమైన విశ్వాసాన్ని పొందినవాళ్లకు వ్రాస్తున్నది.
2దేవుణ్ణి గురించి, మన ప్రభువైన యేసు క్రీస్తును
గురించి మీరు జ్ఞానం సంపాదించాలి. ఆ జ్ఞానం ద్వారా
మీకు అనుగ్రహం, శాంతి సమృద్ధిగా లభించాలని కోరు
తున్నాను.
3మన దేవుడు తనను గురించి మనలో ఉన్న
జ్ఞానం ద్వారా తన మహిమను, మంచితనాన్ని పంచు
కోవటానికి మనల్ని పిలిచాడు. అంతేకాక రక్షణ,
ఆత్మీయ జీవితానికి కావలసినవాటిని దేవుడు తన శక్తి
ద్వారా మనకిచ్చాడు. 4ఈ విధంగా, అమూల్యమైన
టువంటి గొప్ప వాగ్దానాన్ని మనకోసం చేసాడు. ఆ
వాగ్దానాల సహాయంతో దురాశ వల్ల సంభవించే ఈ
ప్రపంచంలోని పాపాలనుండి తప్పించుకొని, తన
స్వభావంలో మీరు భాగం పంచుకోవాలనే ఉద్దేశ్యంతో
ఇలా చేసాడు.
5అందువల్ల మీలో ఉన్న విశ్వాసానికి తోడుగా మంచి
తనాన్ని కూడా అలవరుచుకోవటానికి అన్ని విధాలా
ప్రయత్నం చెయ్యండి. మంచితనానికి తోడుగా
జ్ఞానాన్ని, 6జ్ఞానానికి తోడుగా ఆత్మనిగ్రహాన్ని, ఆత్మ
నిగ్రహానికి తోడుగా పట్టుదలను, పట్టుదలకు తోడుగా
ఆత్మీయతను, 7ఆత్మీయతకు తోడుగా సోదర
ప్రేమను, సోదర ప్రేమకు తోడుగా అనురాగంతో
నిండిన ప్రేమను అలవరుచుకోండి. 8ఈ గుణాలు
మీలో పెరుగుతూ ఉండాలి. మన ప్రభువైన యేసు
క్రీస్తును గురించిన జ్ఞానం మీలో ఉంది. పై గుణాలు
మీలో ఉంటే ఈ జ్ఞానాన్ని ఫలవంతంగాను, ఉపయోగక
రంగాను చేస్తాయి. 9ఆ గుణాలు లేనివానికి దూరదృష్టి
ఉండదు. అలాంటివాడు గ్రుడ్డివానితో సమానము.
అంటే ఇలాంటి వ్యక్తి, తాను యిదివరలో చేసిన
పాపాల్ని దేవుడు క్షమించాడన్న విషయం మరిచి
పోయాడన్న మాట.
10సోదరులారా! దేవుని పిలుపు, మీ ఎన్నిక ఫలించే
టట్లు యింకా ఎక్కువ శ్రద్ధ వహించండి. ఇవన్నీ
చేస్తూవుంటే మీరేనాటికీ క్రిందపడరు. 11తద్వారా మన
ప్రభువు, రక్షకుడు అయినటువంటి యేసు క్రీస్తు
యొక్క శాశ్వతమైన రాజ్యంలోకి మీకు ఘనస్వాగతం
లభిస్తుంది.
12వీటిని గురించి మీకిదివరకే తెలుసు. ప్రస్తుతం
మీరంగీకరించిన సత్యంలో మీకు దృఢమైన విశ్వాస
ముంది. అయినా ఈ విషయాల్ని గురించి మీకు
ఎప్పుడూ జ్ఞాపకం చేస్తూ ఉంటాను. 13గుడారమనే
ఈ శరీరంలో ప్రాణమున్నంతవరకు, మీకు జ్ఞాపకం
చేయటం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. 14ఎందుకంటే,
మన యేసు క్రీస్తు ప్రభువు ముందే స్పష్టం చేసినట్లు,
నేను త్వరలోనే ఈ దేహాన్ని వదిలివేస్తానని నాకు
తెలుసు.* 15నేను వెళ్ళాక కూడా మీరీ విషయాల్ని
ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకొనేటట్లు నేను అన్ని విధాలా
పాటుపడతాను.

## ప్రవచన వాక్యం

16యేసు క్రీస్తు ప్రభువు రాకను గురించి, ఆయన
శక్తిని గురించి తెలివిగా అల్లిన కథల ద్వారా మేము
మీకు చెప్పలేదు. మేము ఆయన గొప్పతనాన్ని కళ్ళారా
చూసాము. 17ఆయన తన తండ్రి అయిన దేవుని
నుండి కీర్తిని, మహిమను పొందుతుండగా, గొప్ప బల
ముగల స్వరము వినిపించింది: “ఈయన నా కుమా
రుడు. ఈయన పట్ల నాకు చాలా ప్రేమ ఉంది.
ఈయన కారణంగా నాకు చాలా ఆనందం కలుగు
తోంది”* అని, 18పవిత్రమైన పర్వతంపై మేము
ఆయనతో ఉన్నప్పుడు పరలోకంనుండి ఈ స్వరం
వినిపించటం మేము స్వయంగా విన్నాము.*
19అందువల్ల, ప్రవక్తలు చెప్పిన సందేశమంటే మాకు
యింకా ఎక్కువ విశ్వాసం కలిగింది. మీరు ఆ సందేశాన్ని
గమనించటం మంచిది. ఆ సందేశం చీకటిలో వెలిగే
వెలుగులాంటిది. సూర్యోదయ మయ్యేవరకూ, వేకువ
చుక్క మీ హృదయాల్లో ఉదయించే వరకూ ఆ
వెలుగును మీరు గమనిస్తూ ఉండాలి. 20అన్నిటి కన్నా
ముఖ్యంగా మీరు తెలుసుకోవలసినది ఏమిటంటే, ప్రవ

---

**వచనము 14** యోహాను 21:18-19.

**ఈయన … కలుగుతోంది** మత్తయి 17:5, మార్కు 9:7; లూకా 9:35.

**వచనము 18** మత్తయి 17:1-9.

చనాల్లో వ్రాయ బడిన విషయాలు, ప్రవక్తలు తమ
వ్యక్తిగత అభిప్రాయాలతో వ్రాయలేదు. 21ఎందుకంటే,
'ప్రవచనం' మానవులు తమ యిష్ట ప్రకారం పలికింది
కాదు. పవిత్రాత్మచే ప్రేరేపణ పొంది వాళ్ళు దేవుణ్ణుండి
సందేశాన్ని పలికారు.

## దుర్బోధకులు

2 కాని పూర్వం ప్రజల మధ్య దొంగ ప్రవక్తలు
కూడా ఉండేవాళ్ళు. అదే విధంగా మీ మధ్యకూడా
దుర్బోధకులు ఉంటారు. వాళ్ళు నాశనానికి దారితీసే
సిద్ధాంతాల్ని రహస్యంగా ప్రవేశపెడుతూ, తమను కొన్న
ప్రభువును కూడా కాదంటారు. తద్వారా తమను తాము
నాశనం చేసుకుంటారు. ఇది త్వరలోనే జరుగుతుంది.
2అవమానకరమైన వాళ్ళ పద్ధతుల్ని అనేకులు పాటించి
సత్యానికే అపకీర్తి తెస్తారు. 3ఈ దుర్బోధకులు తమలో
ఉన్న అత్యాశలవల్ల తాము సృష్టించిన కథలతో తమ
స్వలాభం కొరకు మిమ్మల్ని ఉపయోగించు కుంటారు.
దేవుడు వాళ్ళకు విధించిన శిక్ష చాలాకాలం నుండి
వాళ్ళకోసం కాచుకుని ఉంది. రానున్న ఆ వినాశనం
ఆగదు.
4దేవుడు పాపం చేసిన దేవదూతల్ని కూడా విడిచి
పెట్టకుండా నరకంలో* వేసాడు. తీర్పు చెప్పే
రోజుదాకా అక్కడ వాళ్ళను అంధకారంలో బంధించి
ఉంచుతాడు. 5దేవుడు పురాతన ప్రపంచంపై సాను
భూతి చూపలేదు. దుర్మార్గులైన ఆనాటి ప్రజలమీదికి
ప్రళయం రప్పించాడు. నీతిని బోధించిన నోవహు,
మిగతా ఏడుగురు తప్ప అందరూ నాశనమై పొయ్యారు.
6దుర్మార్గులకు ఏమి సంభవిస్తుందో చూపడానికి
దేవుడు సొదొమ, గొమొఱ్ఱా పట్టణాలను భస్మం చేసి
వాటిని ఉదాహరణలుగా చూపించాడు. 7కాని దేవుడు
నీతిమంతుడైన లోతును రక్షించాడు. ప్రజలు అరాచ
కంగా, అసభ్యంగా ప్రవర్తిస్తూ ఉండటం వల్ల లోతు
చాలా బాధపడ్తూ ఉండేవాడు. 8ఆ నీతిమంతుడు
దుర్మార్గుల మధ్య ప్రతిరోజూ నివసిస్తూ, వాళ్ళ దుష్ప్ర
వర్తనల్ని చూస్తూ వింటూ ఉండేవాడు. వాళ్ళు చేస్తున్న
దుష్ట పనులు చూసి అతని హృదయం తరుక్కు
పోయేది. 9విశ్వాసుల్ని పాపాలు చేయకుండా చేసి
ఎలా కాపాడుకోవాలో ఆ ప్రభువుకు తెలుసు. తీర్పు
చెప్పే రోజుదాకా దుర్మార్గుల్ని ఎలా శిక్షిస్తూ ఉండాలో
కూడా ఆ ప్రభువుకు తెలుసు.
10అధికారాన్నుల్లంఘిస్తూ, అసహ్యకరమైన ఐహిక
వాంఛల్ని తీర్చుకుంటూ గర్వాంధులై పరలోక నివా
సుల్ని దూషించటానికి భయపడని వాళ్ళ విషయంలో
యిది ముఖ్యంగా నిజమౌతుంది. ఇలాంటి దుర్బోధ
కులు ధైర్యంగా గర్వంతో గొప్పవాళ్ళను దూషిస్తారు.
11వాళ్ళకన్నా బలవంతులు, శక్తివంతులు అయినటు
వంటి దేవదూతలు కూడా ప్రభువు సమక్షంలో ఆ
గొప్పవాళ్ళపై నేరారోపణ చేసి దూషించారు.
12తమకు తెలియని వాటిని ఆ దుర్బోధకులు దూషి
స్తారు. వాళ్ళు అడివి జంతువుల్లాంటి వాళ్ళు. ఇలాంటి
జంతువులు పట్టుకుని చంపబడటానికే పనికి వస్తాయి.
ఆ జంతువుల్లాగే వాళ్ళు కూడా నశించిపోతారు.
13వాళ్ళు చేసిన చెడ్డకార్యాలకు ప్రతి ఫలంగా వాళ్ళకు
హాని కలుగుతుంది. పట్టపగలు శారీరిక వాంఛల్ని తీర్చు
కోవటమే వాళ్ళకు ఆనందం. వాళ్ళు తాము చేసిన
మోసాలకు ఆనందిస్తూ మీతో కలిసి విందులు
చేయటం మీకు అవమానం. అది మీకు తీరని కళంకం.
14వాళ్ళు కళ్ళనిండా కామాన్ని నింపుకొని, పాపం
చేయటం ఎన్నటికీ మానరు. వాళ్ళు మనస్సు స్థిరంలేని
వాళ్ళను అడ్డదారి పట్టిస్తారు. దేవుని శాపానికి గురియైన
వాళ్ళు, డబ్బు లాగటంలో నిపుణులు.
15వాళ్ళు సక్రమ మార్గాన్ని వదిలేసి, దారితప్పి
బిలాము మార్గాన్ని అనుసరిస్తారు. బిలాము, అధర్మంగా
ధనార్జన చేసిన బెయోరు* కుమారుడు. 16కాని ఈ
బిలామును అతడు చేసిన తప్పుకు మాటలురాని ఒక
గాడిద మానవుని గొంతుతో గద్దించి, ఆ ప్రవక్త పిచ్చి
తనాన్ని ఆపింది.
17ఇలాంటి దుర్బోధకులు నీళ్ళు లేని బావుల్లాంటి
వాళ్ళు. తుఫాను గాలికి కొట్టుకొని పోయే మేఘాల్లాంటి
వాళ్ళు. గాఢాంధకారాన్ని దేవుడు వాళ్ళకోసం దాచి
ఉంచాడు. 18ఆ బోధకులు ప్రగల్భాలు పలుకుతూ
ఉంటారు. అంతేకాక, అప్పుడే మోసగాళ్ళ నుండి
తప్పించుకొన్న వ్యక్తుల శారీరక వాంఛల్ని ప్రేరేపించి,
అడ్డదారి పట్టిస్తూ ఉంటారు. 19తాము స్వయంగా
దుర్వ్యసనాలకు బానిసలై ఉండి, యితరులకు స్వేచ్ఛ
కలిగిస్తామని వాగ్దానం చేస్తూ ఉంటారు. తనను జయిం
చిన దానికి మానవుడు బానిసై పోతాడు. 20ప్రపం
చంలో ఉన్న దుర్నీతి నుండి తప్పించు కోవాలంటే,
మన ప్రభువు, రక్షకుడు అయినటువంటి యేసు
క్రీస్తును తెలుసుకోవాలి. వాళ్ళు మళ్ళీ ఆ దుర్నీతిలో
చిక్కుకొని బానిసలైతే యిప్పటి స్థితి మునుపటి స్థితి
కన్నా అధ్వాన్నంగా ఉంటుంది. 21వాళ్ళకందివ్వబడిన
పవిత్ర ఆజ్ఞను తెలుసుకుని వెనక్కి మళ్ళటం కన్నా
ఆ ధర్మ మార్గాన్ని తెలుసుకోకపోయినట్లయితే ఉత్త
మంగా ఉండేది. 22అలా వెనక్కు మళ్ళిన వాళ్ళ విష
యంలో ఈ సామెతలు నిజమౌతాయి: "కుక్క తాను
కక్కిన దాన్ని తిరిగి తింటుంది. దేహాన్ని కడిగిన పంది
బురదలో పొర్లాడటానికి తిరిగి వెళ్తుంది."

---

**నరకంలో** కొన్ని ప్రాచీన ప్రతులలో "అంధకారపు సంకెళ్ళలో" అని ఉంది.

**బెయోరు** కొన్ని గ్రీకు ప్రతుల్లో "బెసోరు" అని వుంది.

3 ప్రియమైన సోదరులారా! ఇది నా రెండవ ఉత్తరం.
కల్మషం లేని మీ హృదయాలను ఉత్తేజపరచాలని
మీకీ రెండు ఉత్తరాలు వ్రాసాను. 2పవిత్రులైన ప్రవక్తలు
చాలాకాలం క్రిందటే చెప్పిన సందేశాలను మన ప్రభువు,
రక్షకుడు అయినటువంటి యేసు క్రీస్తు మీ అపొస్తలుల
ద్వారా యిచ్చిన ఆజ్ఞను మీకు జ్ఞాపకం చెయ్యాలని
నా ఉద్దేశ్యం. 3చివరి రోజుల్లో కొందరు వ్యక్తులు
వచ్చి తమ వాంఛల్ని తీర్చుకుంటూ మిమ్మల్ని ఎగ
తాళి చేస్తారు. ఈ విషయాన్ని మీరు ముఖ్యంగా అర్థం
చేసుకోవాలి: 4“వస్తానని వాగ్దానం చేసాడే, ఎప్పుడు
వస్తాడు? మా పూర్వీకులు మరణించినప్పటి నుండే
కాదు ప్రపంచం సృష్టింపబడినప్పటి నుండీ అన్నీ
సక్రమంగానే నడుస్తున్నాయి” అని వాళ్ళంటారు.
5చాలా కాలం క్రితమే దేవుడు తన మాటతో ఆకాశా
లను, భూమిని సృష్టించాడు. వాళ్ళు ఈ విషయాన్ని
కావాలనే మరిచిపోతారు. ఈ భూమి నీళ్ళనుండి, నీళ్ళ
ద్వారా సృష్టింపబడింది. 6నీళ్ళ కారణంగా ప్రళయం
వచ్చి ఆనాటి ప్రపంచం నాశనమై పోయింది. 7దేవుడు
ఆ మాటతోటే ఈనాటి ఆకాశాన్ని, భూమిని మంట
లతో నాశనం చెయ్యటానికి దాచి ఉంచాడు. తీర్పు
చెప్పే రోజుదాకా, అంటే దైవభక్తి లేనివాళ్ళను నాశనం
చేసే రోజుదాకా దాచి ఉంచుతాడు.
8కాని ప్రియమైన సోదరులారా! ఈ విషయాన్ని
మరచిపోకండి. ప్రభువుకు ఒక రోజు వెయ్యి సంవత్స
రాలుగాను, వెయ్యి సంవత్సరాలు ఒక రోజుగాను
ఉంటాయి.* 9ప్రభువు ఆలస్యం చేస్తున్నాడని
కొందరు అనుకుంటారు. కాని, ఆయన తన వాగ్దానాన్ని
నిలబెట్టుకోవటంలో ఆలస్యం చెయ్యడు. ఎవ్వరూ
నాశనం కాకూడదని, అందరూ మారుమనస్సు పొందా
లని ఆయన ఉద్దేశ్యం. అందుకే ఆయన మీ పట్ల
సహనం వహిస్తున్నాడు. 10కాని ప్రభువు రానున్న దినం
ఒక దొంగలా వస్తుంది. ఆ రోజు ఆకాశాలు గర్జిస్తూ
మాయమైపోతాయి. ఆకాశాల్లో ఉన్నవన్నీ మంటల్లో
కాలి నాశనమై పోతాయి. పృథ్వి, దానిలో ఉన్న సమస్త
వస్తువులూ కాలిపోతాయి. 11అన్నీ ఈ విధంగా
నాశనమైపోతాయి కనుక దేవుని ప్రజలై పవిత్రంగా
జీవించటం ఎంత అవసరమో గ్రహించండి. 12దేవుని
దినం రావాలని మీరు ఎదురు చూస్తున్నారు కనుక ఆ
దినం త్వరలోనే రావాలని మీరు ఆశించాలి. ఆ రోజు
వచ్చి ఆకాశాలను మంటలతో నాశనం చేస్తుంది. ఆ
వేడికి పరమాణువులు కరిగి పోతాయి. 13దేవుడు
వాగ్దానం చేసిన క్రొత్త ఆకాశంలో క్రొత్త భూమిపై
నీతి నివసిస్తుంది. వాటికోసమే మనం ఎదురు
చూస్తున్నాం.
14ప్రియ మిత్రులారా! మీరు వీటికోసం ఎదురు
చూస్తున్నారు గనుక మీలో ఏ దోషమూ, కళంకమూ
లేకుండా ఉండేటట్లు అన్నివిధాల ప్రయత్నంచె
య్యండి. శాంతం వహించండి. 15మన ప్రభువు యొక్క
సహనము మనకు రక్షణను యిస్తుందని గ్రహించండి.
దేవుడు యిచ్చిన విజ్ఞానంతో మన ప్రియ మిత్రుడు
పౌలు మీకు ఈ విషయాల్ని గురించి వ్రాసాడు.
16అతడు వ్రాసిన ఉత్తరాలన్నీ యిదేవిధంగా
వ్రాసాడు. వాటన్నిటిలోనూ ఈ విషయాల్ని గురించే
మాట్లాడాడు. అతని ఉత్తరాల్లోని కొన్ని విషయాలు
అర్థం చేసుకోవటానికి కష్టంగా ఉంటాయి. జ్ఞానం
లేనివాళ్ళు, చపల చిత్తం గలవాళ్ళు యితర లేఖనాలపై
తప్పుడు వ్యాఖ్యానం చేసినట్లే దీనిమీద కూడా తప్పుడు
వ్యాఖ్యానం చేస్తారు. ఇలా చేయటం వల్ల వాళ్ళు నాశన
మైపోతారు.
17అందువల్ల ప్రియమైన సోదరులారా! ఇప్పుడీ విష
యాలు మీకు తెలుసు. కనుక జాగ్రత్తగా ఉండండి.
నీతికి విరుద్ధంగా ప్రవర్తించే వ్యక్తుల తప్పుడు మాటలకు
మోసపోకండి. మీలోవున్న స్థిరత్వాన్ని వదులుకోకండి.
18మన ప్రభువు, రక్షకుడు అయినటువంటి యేసు
క్రీస్తు పట్ల మీకున్న కృతజ్ఞతను పెంచుకుంటూ,
ఆయన్ని గురించి జ్ఞానంలో అభివృద్ధి చెందుతూ
ఉండండి. ఆయనకి ఇప్పుడూ, చిరకాలం మహిమ
కలుగుగాక! ఆమేన్.

---

**వచనము 8** కీర్తన. 90:4 చూడండి.

# యోహాను వ్రాసిన మొదటి లేఖ

### జీవం కలిగించే వాక్యం

1 ఏది మొదటినుండి ఉన్నదో,

దాన్ని మేము విన్నాము
మా కళ్ళారా చూసాము.
చూసి మాచేతుల్తో తాకాము.

అదే జీవం కలిగించే వాక్యం. దాన్ని గురించే మీకు
ప్రకటిస్తున్నాము. 2జీవం కనిపించింది. మేము దాన్ని
చూసాము. చూసినట్టు సాక్ష్యం కూడా చెపుతున్నాము.
ఆ జీవాన్ని గురించి మీకు ప్రకటిస్తున్నాము. ఆ జీవం
తండ్రితో ఉంది. అది మాకు కనిపించింది. 3తండ్రితో
ఆయన కుమారుడైన యేసు క్రీస్తుతో మాకు సహ
వాసం ఉంది కనుక, మీరు కూడా మాతో సహవాసం
చెయ్యాలనే ఉద్దేశ్యంతో మేము చూసినదాన్ని, విన్న
దాన్ని మీకు ప్రకటిస్తున్నాము. 4మన* ఆనందం
సంపూర్ణంగా ఉండాలని యిది మీకు వ్రాస్తున్నాను.

### వెలుగులో నడుచుట

5దేవుడు వెలుగైవున్నాడు. ఆయనలో చీకటి ఏ
మాత్రం లేదు. ఈ సందేశాన్ని ఆయన మాకు
చెప్పాడు. దాన్ని మేము మీకు ప్రకటిస్తున్నాం. 6మనకు
ఆయనతో సహవాసముందని అంటూ చీకట్లో నడిస్తే
మనము అసత్యమాడినట్లే కదా! సత్యాన్ని ఆచరిం
చటం మానుకొన్నట్లే కదా! 7దేవుడు వెలుగులో
ఉన్నాడు. కాబట్టి మనం కూడా వెలుగులో నడిస్తే
మన మధ్య సహవాసం ఉంటుంది. దేవుని కుమారుడైన
యేసు క్రీస్తు రక్తం మన పాపాలన్నిటిని కడుగుతుంది.
8మనలో పాపం లేదని అంటే, మనల్ని మనము
మోసం చేసుకొన్న వాళ్ళమౌతాము. సత్యం మనలో
ఉండదు. 9మనం చేసిన పాపాన్ని ఒప్పుకొంటే దేవుడు
సత్యవంతుడు సక్రమంగా న్యాయం జరిగించే వాడు
కనుక మన పాపాల్ని క్షమిస్తాడు. మనలో ఉన్న అవినీతిని
కడిగి వేస్తాడు. 10మనం పాపాలు చెయ్యలేదని అంటే
ఆయన్ని మనం అబద్ధమాడుతున్న వానిగా చేసినట్లౌ
తుంది. ఆయన సందేశానికి మన జీవితాల్లో స్థానం
ఉండదు.

2 బిడ్డలారా! మీరు పాపం చెయ్యకూడదని మీకు
లేఖను వ్రాస్తున్నాను. ఒకవేళ ఎవరైనా పాపం
చేస్తే, మన పక్షాన తండ్రితో మాట్లాడేందుకు న్యాయ
వాది అయిన యేసు క్రీస్తు ఉన్నాడు. 2ఆయన మన
పాప పరిహారార్థం బలి అయ్యాడు. మన పాపాల కోసమే
కాకుండా ప్రపంచంలో ఉన్న వాళ్ళందరి పాపాలకోసం
బలి అయ్యాడు.
3ఆయన ఆజ్ఞల్ని మనం ఆచరిస్తే ఆయన మనకు
తెలుసుననే విశ్వాసం మనలో కలుగుతుంది. 4ఆయన
నాకు తెలుసని అంటూ ఆయన ఆజ్ఞల్ని పాటించని
వాడు అబద్ధాలాడుతున్నాడన్నమాట. అలాంటి
వ్యక్తిలో సత్యం ఉండదు. 5యేసు ఆజ్ఞల్ని పాటించిన
వానిలో దేవుని ప్రేమ సంపూర్ణంగా ఉంటుంది. తద్వారా
మనం ఆయనలో ఉన్నామని తెలుసుకొంటాము.
6యేసులో జీవిస్తున్నానని చెప్పుకొనే వాడు,
ఆయనలా నడుచుకోవాలి.
7ప్రియ మిత్రులారా! నేను మీకోసం క్రొత్త ఆజ్ఞను
వ్రాయటం లేదు. మొదటినుండి మీ దగ్గరవున్న పాత
ఆజ్ఞనే వ్రాస్తున్నాను. మీరు విన్న సందేశమే ఈ పాత
ఆజ్ఞ. 8అయినా, ఆ ఆజ్ఞను ఒక క్రొత్త ఆజ్ఞగా మీకోసం
వ్రాస్తున్నాను. దాని సత్యం అందరిలో కనిపిస్తోంది.
చీకటి గతిస్తోంది. నిజమైన వెలుగు ప్రకాశించటం
మొదలు పెట్టింది. 9తాను వెలుగులో ఉన్నానని చెప్పు
కొంటూ తన సోదరుణ్ణి ద్వేషించేవాడు యింకా అంధ
కారంలో ఉన్నాడన్నమాట. 10సోదరుణ్ణి ప్రేమించే
వాడు వెలుగులో జీవిస్తాడు. అతనిలో ఏ ఆటంక
కారణం ఉండదు. 11కాని సోదరుణ్ణి ద్వేషించేవాడు
అంధకారంలోనే ఉండిపోతాడు. అంటే, ఆ అంధకారం
లోనే తిరుగుతూ ఉంటాడన్నమాట. చీకటి అతణ్ణి
గ్రుడ్డివానిగా చేసాయి కాబట్టి తానెక్కడికి వెళ్తున్నది
అతనికే తెలియదు.

12 బిడ్డలారా! ఆయన పేరిట మీ పాపాలు
క్షమించబడ్డాయి. అందుకే మీకు వ్రాస్తు
న్నాను!
13 వృద్ధులారా! మొదటినుండి ఉన్నవాడెవరో
మీకు తెలుసు! అందుకే మీకు వ్రాస్తు
న్నాను. యువకులారా! మీరు సైతాన్ను

**మన** కొన్ని గ్రీకు ప్రతులలో 'మీ' అని వున్నది.

గెలిచారు. అందుకే మీకు వ్రాస్తున్నాను!
బిడ్డలారా! తండ్రిని మీరెరుగుదురు.
అందుకే మీకు వ్రాస్తున్నాను.
14 వృద్ధులారా! మొదటి నుండి ఉన్న వాణ్ణి
మీరెరుగుదురు. అందుకే మీకు వ్రాస్తు
న్నాను! యువకులారా! మీలో బలం
ఉంది. దేవుని సందేశం మీలో జీవిస్తోంది.
మీరు సైతానును గెలిచారు. అందుకే మీకు
వ్రాస్తున్నాను.

### ప్రపంచాన్ని ప్రేమించకండి

15ప్రపంచాన్ని కాని, ప్రపంచంలో ఉన్నవాటిని కాని
ప్రేమించకండి. అంటే, ప్రపంచాన్ని ప్రేమించే వ్యక్తిలో
తండ్రి ప్రేమ ఉండదన్నమాట.

16 శారీరిక వాంఛలు, కళ్ళలోని దురాశలు,
ఒకడు చేసేదాన్ని బట్టి, కలిగియున్న
దాన్ని బట్టి కలిగే గర్వం.

ఇవి తండ్రికి సంబంధించినవి కావు. ఇవి ప్రపంచానికి
సంబంధించినవి. 17ఈ ప్రపంచము, దానిలో ఉన్న
ఆశలు నశించిపోతాయి. కాని దైవేచ్ఛానుసారం జీవించే
వ్యక్తి శాశ్వతంగా జీవిస్తాడు.

### క్రీస్తు విరోధుల విషయంలో జాగ్రత్త

18బిడ్డలారా! ఇది చివరి గడియ. క్రీస్తు విరోధి
రానున్నాడని మీరు విన్నారు. ఇప్పటికే క్రీస్తు విరోధులు
చాలామంది వచ్చారు. తద్వారా యిది చివరి గడియ
అని తెలిసింది. 19క్రీస్తు విరోధులు మన నుండి విడి
పొయ్యారు. నిజానికి, వాళ్ళు మనవాళ్ళు కారు. ఎందు
కంటే వాళ్ళు మనవాళ్ళైనట్లయితే మనతోనే ఉండి
పొయ్యేవాళ్ళు. వాళ్ళు వెళ్ళిపోవటం, వాళ్ళలో
ఎవ్వరూ మనవాళ్ళు కారని తెలుపుతోంది.
20కాని దేవుడు మిమ్మల్ని అభిషేకించాడు. తద్వారా
మీరంతా సత్యాన్నిగురించి తెలుసుకొన్నారు. 21మీకు
సత్యాన్ని గురించి తెలియదని భావించి నేను మీకు
వ్రాస్తున్నాననుకోకండి. సత్యాన్ని గురించి మీకు
తెలుసు. పైగా సత్యం నుండి అసత్యం బయటకు
రాదు.
22అసత్యమాడేవాడెవ్వడు? యేసే క్రీస్తు కాదని
అనేవాడు. అతడే క్రీస్తు విరోధి. అలాంటి వ్యక్తి తండ్రిని,
కుమారుణ్ణి నిరాకరిస్తాడు. 23కుమారుణ్ణి నిరాకరించే
వ్యక్తికి తండ్రి రక్షణ ఉండదు. కుమారుణ్ణి అంగీకరించే
వ్యక్తికి తండ్రి రక్షణ తోడుగా ఉంటుంది.
24మొదట మీరు విన్నవి మీలో ఉండిపోయేటట్లు
చూసుకోండి. అప్పుడే మీరు కుమారునిలో, తండ్రిలో
జీవించగలుగుతారు. 25పైగా ఆయన మనకు నిత్యజీవం
గురించి వాగ్దానం చేసాడు.
26ఇవన్నీ మిమ్మల్ని తప్పుదారి పట్టించటానికి
ప్రయత్నం చేస్తున్నవాళ్లను గురించి వ్రాస్తున్నాను.
27ఇక మీ విషయం అంటారా? దేవుడు మిమ్మల్ని
అభిషేకించాడు. దానివల్ల కలిగిన ఫలం మీలో ఉంది.
మీ కెవ్వరూ బోధించవలసిన అవసరం లేదు. ఆ
అభిషేకం వల్ల మీలో జ్ఞానం కలుగుతుంది. దేవుడు
మీకు నిజంగా అభిషేకమిచ్చాడు. అది అసత్యం కాదు.
ఆయన బోధించిన విధంగా ఆయనలో నివసించండి.

### దేవుని సంతానం

28బిడ్డలారా! ఆయన ప్రత్యక్షమైనప్పుడు మనలో
ధైర్యం ఉండేటట్లు, ఆయన సమక్షంలో సిగ్గు పడ
కుండా ఉండేటట్లు ఆయనలో జీవిస్తూ ఉండండి.
29ఆయన నీతిమంతుడని మీకు తెలిసి ఉంటే నీతిని
అనుసరించే ప్రతి ఒక్కడూ ఆయన నుండి జన్మించా
డని మీరు గ్రహిస్తారు.

3 మనం దేవుని సంతానంగా పరిగణింపబడాలని
తండ్రి మనపై ఎంత ప్రేమను కురిపించాడో
చూడండి. అవును; మనం దేవుని సంతానమే.
ప్రపంచం ఆయన్ని తెలుసుకోలేదు కనుక మనల్ని
కూడా తెలుసుకోవటం లేదు. 2ప్రియ మిత్రులారా!
మనం ప్రస్తుతానికి దేవుని సంతానం. ఇకముందు ఏ
విధంగా ఉంటామో దేవుడుమనకింకా తెలియబరచ
లేదు. కాని యేసు తిరిగి వచ్చినప్పుడు ఆయనెలా
ఉంటాడో చూస్తాము. కనుక మనంకూడా ఆయనలాగే
ఉంటామని మనకు తెలుసు. 3ఇలాంటి ఆశాభావాన్ని
ఉంచుకొన్నప్రతిఒక్కడూ ఆయనలా పవిత్రమౌతాడు.
4పాపాలు చేసిన ప్రతి ఒక్కడూ నీతిని ఉల్లంఘించిన
వాడౌతాడు. నిజానికి, పాపమంటేనే ఆజ్ఞను ఉల్లంఘిం
చటం. 5కాని, యేసు పాప పరిహారం చెయ్యటానికి
వచ్చాడని మీకు తెలుసు. ఆయనలో పాపమనేది లేదు.
6ఆయనలో జీవించేవాడెవ్వడూ పాపం చెయ్యడు.
ఆయన్ని చూడని వాడు, ఆయనెవరో తెలియనివాడు
మాత్రమే పాపం చేస్తూ ఉంటాడు.
7బిడ్డలారా! మిమ్మల్నెవరూ మోసం చెయ్య కుండా
జాగ్రత్త పడండి. యేసు నీతిమంతుడు. ఆయనలా
నీతిని పాలించే ప్రతివ్యక్తి నీతిమంతుడు. 8ఆదినుండి
సైతాను పాపాలు చేస్తూ ఉన్నాడు. అందువల్ల పాపం
చేసే ప్రతీవ్యక్తి సైతానుకు
చెందుతాడు. సైతాను చేస్తున్న పనుల్ని నాశనం
చెయ్యటానికే దేవుని కుమారుడు వచ్చాడు.
9దైవేచ్ఛవల్ల జన్మించిన వానిలో దేవుని బీజం
ఉంటుంది. కనుక పాపం చెయ్యడు. అతడు దేవుని
వల్ల జన్మించాడు కనుక పాపం చెయ్యలేడు. 10అదే

విధంగా తన సోదరుణ్ణి ప్రేమించనివాడు దేవుని
సంతానంకాదు. నీతిని పాటించని వాడు దేవుని సంతా
నంకాదు. దీన్నిబట్టి దేవుని సంతానమెవరో, సైతాను
సంతానమెవరో మనంస్పష్టంగా తెలుసుకోగలుగుతాం.

### పరస్పరం ప్రేమతో ఉండండి

11"పరస్పరం ప్రేమతో ఉండాలి" అనే సందేశాన్ని
మీరు మొదటినుండి విన్నారు.
12సైతాను సంబంధియైన కయీను తన సోదరుణ్ణి
హత్య చేసాడు. మీరు అతనిలా ఉండకూడదు. కయీను
తన సోదరుణ్ణి ఎందుకు హత్య చేసాడు? కయీను
దుర్మార్గుడు. అతని సోదరుడు సన్మార్గుడు. 13ప్రపంచం
మిమ్మల్ని ద్వేషిస్తే ఆశ్చర్యపడకండి.
14మనం మన సోదరుల్ని ప్రేమిస్తున్నాము కనుక
మరణం నుండి బ్రతికింపబడ్డాము. ఈ విషయం
మనకు తెలుసు. ప్రేమించనివాడు మరణంలోనే ఉండి
పోతాడు. 15సోదరుణ్ణి ద్వేషించేవాడు హంతకునితో
సమానము. అలాంటివానికి నిత్య జీవం లభించదని
మీకు తెలుసు. 16యేసు క్రీస్తు మనకోసం తన ప్రాణా
లర్పించాడు. మనం మన సోదరులకోసం ప్రాణాల్ని
ధారపొయ్యాలి. అప్పుడే 'ప్రేమ' అంటే ఏమిటో మనం
తెలుసుకోగలము.
17ఒకని దగ్గర అన్ని సౌకర్యాలు ఉన్నాయనుకోండి.
కాని, అతడు తన సోదరునికి అవసరాలు ఉన్నాయని
తెలిసి కూడా దయ చూపకుండా ఉంటే అతని పట్ల
దేవుని దయ ఎందుకు ఉంటుంది? 18బిడ్డలారా! మనం
మాటలతో కాక క్రియా రూపంగా, సత్యంతో మన
ప్రేమను వెల్లడి చేద్దాం.
19-20మన హృదయాలు మనల్ని గద్దించినప్పుడు,
దేవుడు మన హృదయాలకన్నా గొప్పవాడు. అన్నీ
తెలిసినవాడు కనుక, మనం నోటి మాటలతో కాక
క్రియారూపంగా సత్యంతో ప్రేమను చూపుదాం. అలా
చేస్తే మనం సత్యానికి చెందిన వాళ్ళమని తెలుసు
కొంటాం. పైగా ఆయన సమక్షంలో దేవుడు మన
హృదయాలకన్నా గొప్పవాడని, మన హృదయాలకు
నచ్చ చెప్పగలుగుతాం.
21ప్రియమిత్రులారా! మన హృదయాలు మనమీద
నిందారోపణ చేయలేనిచో మనకు ఆయన సమక్షంలో
ధైర్యం ఉంటుంది. 22దేవుని ఆజ్ఞల్ని పాటిస్తూ ఆయ
నకు ఆనందం కలిగే విధంగా నడుచుకొంటే మనం
అడిగింది మనకు లభిస్తుంది. 23ఆయన ఆజ్ఞ యిది:
దేవుని కుమారుడైన యేసు క్రీస్తు నామమందు విశ్వాస
ముంచండి. ఆయనాజ్ఞాపించిన విధంగా పరస్పరం
ప్రేమతో ఉండండి. 24దేవుని ఆజ్ఞల్ని పాటించిన వాళ్ళు
ఆయనలో జీవిస్తారు. ఆయన వాళ్ళలో జీవిస్తాడు.
ఆయన మనకు ఇచ్చిన ఆత్మద్వారా ఆయన మనలో
జీవిస్తున్నాడని తెలుసు కోగలుగుతాం.

### ఆత్మల్ని పరిశీలించండి

4 ప్రియమిత్రులారా! అన్ని ఆత్మల్ని నమ్మకండి.
ఆ ఆత్మలు దేవుని నుండి వచ్చాయా అన్న
విషయాన్ని పరిశీలించండి. ఎందుకంటే, మోసం చేసే
ప్రవక్తలు చాలామంది ఈ ప్రపంచంలోకి వచ్చారు.
2యేసు క్రీస్తు దేవుని నుండి శరీరంతో వచ్చాడని
అంగీకరించిన ప్రతీ ఆత్మ దేవునికి చెందినదని దేవుని
ఆత్మద్వారా మీరు గ్రహించాలి. 3యేసును అంగీకరిం
చని ప్రతి ఆత్మ దేవుని నుండి రాలేదన్నమాట.
అలాంటి ఆత్మ క్రీస్తు విరోధికి చెందింది. ఆ ఆత్మలు
రానున్నట్లు మీరు విన్నారు. అవి అప్పుడే
ప్రపంచంలోకి వచ్చాయి.
4బిడ్డలారా! మీరు దేవుని సంతానం కనుక వాటిని
జయించగలిగారు. పైగా మీలో ఉన్నవాడు, ఈ ప్రపం
చంలో ఉన్నవాళ్ళకన్నా గొప్పవాడు. 5క్రీస్తు విరోధులు
ప్రపంచానికి చెందినవాళ్ళు. అందువల్ల వాళ్ళు ప్రపం
చాన్ని దృష్టిలో పెట్టుకొని మాట్లాడుతారు. ప్రపంచం
వాళ్ళ మాటలు వింటుంది. 6మనం దేవునికి చెందిన
వాళ్ళం. అందువల్ల దేవుణ్ణి తెలుసుకొన్నవాడు మన
మాటలు వింటాడు. కాని దేవునికి చెందనివాడు మన
మాటలు వినడు. దీన్నిబట్టి మనము, ఏ ఆత్మ సత్య
మైనదో, ఏ ఆత్మ అసత్య మైనదో తెలుసు
కోగలుగుతాము.

### దేవుడు ప్రేమా స్వరూపుడు

7ప్రియమిత్రులారా! ప్రేమ దేవుని నుండి వస్తుంది.
కనుక మనం పరస్పరం ప్రేమతో ఉందాం. ప్రేమించే
వ్యక్తి దేవుని వలన జన్మిస్తాడు. అతనికి దేవుడు తెలుసు.
8దేవుడు ప్రేమస్వరూపం గలవాడు. ప్రేమలేనివానికి
దేవుడెవరో తెలియదు. 9మనం కుమారుని ద్వారా
జీవించాలని దేవుడు తన ఒక్కగానొక్క కుమారుణ్ణి
ఈ ప్రపంచంలోకి పంపి తన ప్రేమను మనకు వెల్లడి
చేసాడు. 10"మనం, ఆయన్ని ప్రేమిస్తున్నందుకు
ఆయన ఈ పని చెయ్యలేదు. ఆయన మనల్ని ప్రేమిస్తు
న్నాడు కనుక, మన ప్రాయశ్చిత్తానికి బలిగా తన
కుమారుణ్ణి పంపాడు." ఇదే ప్రేమ.
11ప్రియ మిత్రులారా! దేవుడు మనల్ని యింతగా
ప్రేమించాడు కనుక మనం కూడా పరస్పరం ప్రేమతో
ఉండాలి. 12దేవుణ్ణి ఎవ్వరూ చూడలేదు. మనం పర
స్పరం ప్రేమతో ఉంటే దేవుడు మనలో నివసిస్తాడు.
ఆయన ప్రేమ మనలో పరిపూర్ణత చెందుతుంది.
13ఆయన తన ఆత్మను మనకిచ్చాడు. తద్వారా
మనము ఆయనలో జీవిస్తున్నామని, ఆయన మనలో
జీవిస్తున్నాడని మనం తెలుసుకోగలుగుతున్నాము.
14దేవుడు తన కుమారుణ్ణి ప్రపంచాన్ని రక్షించటానికి
పంపాడు. ఆయన్ని మేము చూసాము, కాబట్టి సాక్ష్యం
చెపుతున్నాము. 15యేసు దేవుని కుమారుడని

అంగీకరించిన వానిలో దేవుడు నివసిస్తాడు దేవునిలో
వాడు నివసిస్తున్నాడు. [16]దేవునికి మనపట్ల ప్రేమ
ఉందని మనం నమ్ముతున్నాము. ఆ ప్రేమ మనకు
తెలుసు. దేవుడే ప్రేమ. ప్రేమలో జీవించేవాడు దేవు
నిలో జీవిస్తాడు. దేవుడు అతనిలో జీవిస్తాడు. [17]తీర్పు
చెప్పేరోజు మనం ధైర్యంతో ఉండాలని మనమధ్య
నున్న ప్రేమ పరిపూర్ణం చెయ్యబడింది. ఎందుకంటే,
మనమీ ప్రపంచంలో ఆయనవలె జీవిస్తున్నాము.
[18]ప్రేమలో భయం ఉండదు. పరిపూర్ణతపొందిన ప్రేమ
భయాన్ని పారద్రోలుతుంది. ఎందుకంటే, భయం
శిక్షకు సంబంధించింది. భయపడే వ్యక్తి ప్రేమలో
పరిపూర్ణత పొందలేడు.

[19]దేవుడు మనల్ని ప్రేమించినందుకు మనం
ఆయన్ని ప్రేమిస్తున్నాము. [20]'నేను దేవుణ్ణి ప్రేమిస్తు
న్నాను' అని అంటూ తన సోదరుణ్ణి ద్వేషించే వాడు
అసత్య మాడుతున్నాడన్న మాట. కనిపిస్తున్న సోద
రుణ్ణి ప్రేమించలేనివాడు కనిపించని దేవుణ్ణి ప్రేమించ
లేడు. [21]దేవుడు మనకీ ఆజ్ఞనిచ్చాడు: నన్ను ప్రేమించే
వాడు తన సోదరుణ్ణి కూడా ప్రేమించాలి.

### దేవుని కుమారునిలో విశ్వాసము

5 యేసే క్రీస్తు అని నమ్మిన వాణ్ణి దేవుడు తన
సంతానంగా పరిగణిస్తాడు. తండ్రిని ప్రేమించిన
ప్రతీ ఒక్కడు కుమారుణ్ణి ప్రేమించినట్లుగా పరిగణింప
బడతాడు. [2]దేవుణ్ణి ప్రేమిస్తూ ఆయన ఆజ్ఞల్ని పాటిం
చటం వల్ల ఆయన కుమారుణ్ణి ప్రేమిస్తున్నట్లు
మనము తెలుసుకోగలము. [3]ఆయన ఆజ్ఞల్ని పాటించి
మనము మన ప్రేమను వెల్లడి చేస్తున్నాము. ఆయన
ఆజ్ఞలు కష్టమైనవి కావు. [4]దేవుని కారణంగా జన్మిం
చినవాడు ప్రపంచాన్ని జయిస్తాడు. మనలో ఉన్న
ఈ విశ్వాసం వల్ల మనము ఈ ప్రపంచాన్ని జయించి
విజయం సాధించాము. [5]యేసు దేవుని కుమారుడని
విశ్వసించేవాళ్ళే ప్రపంచాన్ని జయిస్తారు.

[6]యేసు క్రీస్తు నీళ్ళద్వారా, రక్తంద్వారా వచ్చాడు.
ఆయన నీళ్ళద్వారా, మాత్రమే రాలేదు. నీళ్ళద్వారా,
రక్తం ద్వారా కూడా వచ్చాడు. ఆత్మ సత్యవంతుడు.
అందుకే ఆ ఆత్మ సాక్ష్యం చెపుతున్నాడు. [7]సాక్ష్యం
చెప్పేవారు ముగ్గురున్నారు. [8]ఆత్మ, నీళ్ళు, రక్తం ఈ
ముగ్గురూ ఒకే సాక్ష్యాన్ని చెపుతున్నారు. [9]మనము
మనుష్యుల సాక్ష్యం అంగీకరిస్తాము. కాని యిది దేవుని
సాక్ష్యం కనుక యింకా గొప్పది. ఈ సాక్ష్యం తన
కుమారుణ్ణి గురించి యిచ్చింది. [10]దేవుని కుమారుని
పట్ల విశ్వాసమున్నవాడు ఈ సాక్ష్యాన్ని నమ్ముతాడు.
దేవుడు తన కుమారుని విషయంలో యిచ్చిన సాక్ష్యం
నమ్మనివాడు దేవుడు అసత్యవంతుడని నిందించిన
వాడౌతాడు. [11]ఆ సాక్ష్యం యిది! దేవుడు మనకు
నిత్యజీవం యిచ్చాడు. ఈ జీవము ఆయన కుమారు
నిలో ఉంది. [12]కుమారుణ్ణి స్వీకరించిన వానికి ఈ
జీవము లభిస్తుంది. ఆ కుమారుణ్ణి స్వీకరించని వానికి
జీవం లభించదు.

### చివరి మాట

[13]దేవుని కుమారుని పేరులో విశ్వాసం ఉన్న మీకు
నిత్యజీవం లభిస్తుంది. ఈ విషయం మీకు తెలియాలని
యివన్నీ మీకు వ్రాస్తున్నాను. [14]దేవుణ్ణి ఆయన
యిష్టానుసారంగా మనము ఏది అడిగినా వింటాడు.
దేవుణ్ణి సమీపించటానికి మనకు హామీ ఉంది. [15]మన
మేది అడిగినా వింటాడని మనకు తెలిస్తే మన మడిగింది
మనకు లభించినట్లే కదా!

[16]మరణం కలిగించే పాపము తన సోదరుడు
చెయ్యటం చూసిన వాడు తన సోదరుని కోసం దేవుణ్ణి
ప్రార్థించాలి. అప్పుడు దేవుడు అతనికి క్రొత్త జీవితం
యిస్తాడు. ఎవరి పాపం మరణానికి దారితీయదో
వాళ్ళను గురించి నేను మాట్లాడుతున్నాను. మరణాన్ని
కలిగించే పాపం విషయంలో ప్రార్థించమని నేను
చెప్పటం లేదు. [17]ఏ తప్పు చేసినా పాపమే. కాని
మరణానికి దారితీయని పాపాలు కూడా ఉన్నాయి.
[18]దేవుని బిడ్డగా జన్మించిన వాడు పాపం చెయ్యడని
మనకు తెలుసు. తన బిడ్డగా జన్మించిన వాణ్ణి దేవుడు
కాపాడుతాడు. సైతాను అతణ్ణి తాకలేడు. [19]మనము
దేవుని సంతానమని, ప్రపంచమంతా సైతాను ఆధీ
నంలో ఉందని మనకు తెలుసు.

[20]దేవుని కుమారుడు వచ్చి నిజమైన వాడెవడో
తెలుసుకొనే జ్ఞానాన్ని మనకు యిచ్చాడు. ఇది మనకు
తెలుసు. మనము నిజమైన వానిలో ఐక్యమై ఉన్నాము.
ఆయన కుమారుడైన యేసు క్రీస్తులో కూడా ఐక్యమై
ఉన్నాము. ఆయన నిజమైన దేవుడు. ఆయనే నిత్య
జీవం. [21]బిడ్డలారా! విగ్రహాలకు దూరంగా ఉండండి.

# యోహాను వ్రాసిన రెండవ లేఖ

దేవుడు ఎన్నుకొన్న అమ్మగారికి, ఆమె సంతానానికి,
పెద్దనైన నేను వ్రాస్తున్నది ఏమనగా,
2మీ పట్ల నాకు నిజమైన ప్రేమవుంది. సత్యం
మాలో శాశ్వతంగా ఉంది కాబట్టే, నాకేకాకుండా సత్యం
తెలిసిన వాళ్ళందరికీ మీ పట్ల ప్రేమ ఉంది.
3తండ్రి అయిన దేవుడు, తండ్రి యొక్క కుమారు
డైన యేసు క్రీస్తు మనకు సత్యంతో, ప్రేమతో ఇచ్చిన
కృప, దయ, శాంతి, మనలో ఉండాలని కోరుతున్నాను.
4మీ సంతానంలో కొందరు, తండ్రి ఆజ్ఞాపించి
నట్లు నిజాయితీగా జీవిస్తున్నారని తెలిసి నాకు చాలా
ఆనందం కలిగింది. 5అమ్మా! మొదటినుండి ఉన్న
ఆజ్ఞనే నేను మీకు వ్రాస్తున్నాను. కాని, క్రొత్త ఆజ్ఞను
వ్రాయటం లేదు. మనము పరస్పరం ప్రేమతో ఉండా
లని అంటున్నాను. 6ఆయన ఆజ్ఞల్ని విధేయతతో
పాటించటమే ప్రేమ. మీరు మొదటి నుండి విన్నట్లు,
ప్రేమతో జీవించుమని ఆయన ఆజ్ఞాపించాడు.
7యేసు క్రీస్తు శరీరంతో రాలేదనే మోసగాళ్ళు
చాలామంది ఈ ప్రపంచంలో వ్యాపించారు. వాళ్ళు
మోసగాళ్ళు; క్రీస్తు విరోధులు. 8పని చేయటంవల్ల
లభించే ఫలాన్ని వదులుకోకుండా జాగ్రత్త పడండి.
సంపూర్ణమైన ఫలం లభించేటట్లు చూసుకోండి.
9క్రీస్తు ఉపదేశాన్ని ఉల్లంఘించిన వానిపై దేవుని
అనుగ్రహం ఉండదు. ఆ ఉపదేశానుసారం నడుచుకొనే
వానిపై తండ్రి, కుమారుల అనుగ్రహం ఉంటుంది.
10ఈ ఉపదేశం తమ వెంట తీసుకురాకుండా మీ దగ్గరకు
వచ్చిన వాణ్ణి మీ ఇంట్లోకి రానివ్వకండి. అలాంటి
వాణ్ణి పలుకరించకండి. 11ఎవరైనా అలాంటి వాణ్ణి
పలుకరిస్తే, ఆ పలుకరింపబడినవాడు చేసిన చెడ్డ
పనుల్లో భాగస్తుడౌతాడు.
12నాకింకా ఎన్నో విషయాలు వ్రాయాలని ఉంది.
కాని కాగితాన్ని సిరాను ఉపయోగించటం నాకు యిష్టం
లేదు. నేను మిమ్మల్ని కలిసి ముఖాముఖి మీతో మాట్లా
డటానికి ఎదురు చూస్తున్నాను. అప్పుడు మనకు
సంపూర్ణమైన ఆనందం కలుగుతుంది. 13దేవుడు ఎన్ను
కొన్న మీ సోదరి యొక్క సంతానం,* వాళ్ళ అభి
వందనాలు మీకు తెలుపుతున్నారు.

---

**సంతానం** అంటే సంఘానికి చెందిన సభ్యులు.

# యోహాను వ్రాసిన మూడవ లేఖ

నా ప్రియ మిత్రుడైన గాయునకు,
పెద్దనైన నాకు నీపట్ల నిజమైన ప్రేమ ఉంది.
2ప్రియ మిత్రమా! నీ ఆత్మ క్షేమంగా ఉన్నట్లు
నీవు ఆరోగ్యంగా ఉండాలని, నీ జీవితం చక్కటి
మార్గాల్లో నడవాలని ప్రార్థిస్తున్నాను. 3కొందరు సోద
రులు వచ్చి నీలో ఉన్న సత్యాన్ని గురించి చెప్పారు.
నీవేవిధంగా సత్యాన్ని అనుసరిస్తున్నావో చెప్పారు. అది
విని నాకు చాలా ఆనందం కలిగింది. 4నా పిల్లలు
సత్యాన్ని అనుసరిస్తూ ఏ విధంగా జీవిస్తున్నారో తెలుసు
కోవటంకన్నా మించిన ఆనందం నాకు మరొకటి
లేదు.
5ప్రియ మిత్రమా! ఆ సోదరులు నీకు పరాయి
వాళ్ళయినా వాళ్ళకోసం నీవు చేస్తున్నది విశ్వాసంతో
చేస్తున్నావు. 6-7నీ ప్రేమను గురించి వాళ్ళు సంఘానికి
చెప్పారు. వాళ్ళు క్రైస్తవులు కానివాళ్ళనుండి సహాయం
కోరక క్రీస్తు పేరు కోసం బయలుదేరారు. నీవు దేవునికి
నచ్చే విధంగా వాళ్ళను సాగనంపి మంచి పని చేసావు.
8సత్యం కోసం మనం కలిసి పని చెయ్యాలంటే,
అలాంటివాళ్ళను ఆదరించాలి.
9నేను సంఘానికి వ్రాసాను. కాని దియొత్రెఫే
తనకు ప్రాముఖ్యత కావాలని కోరుకుంటున్నాడు
కనుక, మనకు సుస్వాగతం చెప్పలేదు.
10దానితో తృప్తి పడక సోదరులకు సుస్వాగతం
చెప్పటానికి అంగీకరించటం లేదు. పైగా సుస్వాగతం
చెప్పే వాళ్ళను అడ్డగిస్తూ వాళ్ళను సంఘంనుండి
బహిష్కరిస్తున్నాడు. అందువల్ల నేను వస్తే అతడు
మనల్ని గురించి ద్వేషంతో ఎందుకు మాట్లాడు
తున్నాడో కనుక్కుంటాను.
11ప్రియ స్నేహితుడా! చెడుననుసరించటం మాని
మంచిని అనుసరించు. మంచి చేసిన వాణ్ణి దేవుడు
తన వానిగా పరిగణిస్తాడు. చెడు చేసిన వాడెవ్వడు
దేవుణ్ణి ఎరుగడు.
12దేమేత్రిని గురించి అందరూ సదాభిప్రాయంతో
మాట్లాడుకొంటారు. సత్యమే అతణ్ణి గురించి సదా
భిప్రాయము కలిగిస్తుంది. మేము కూడా అతణ్ణి గురించి
సదాభిప్రాయంతో మాట్లాడుకుంటున్నాము. మేము
చెపుతున్నది నిజమని నీకు తెలుసు.
13నేను నీకు వ్రాయవలసినవి ఎన్నో ఉన్నాయి.
కాని సిరాతో కలంతో వ్రాయాలని అనిపించటం లేదు.
14నేను నిన్ను త్వరలోనే చూడగలనని ఆశిస్తున్నాను.
అప్పుడు ముఖా ముఖిగా మాట్లాడుకుందాము.
15నీకు శాంతి కలుగుగాక! ఇక్కడి స్నేహితులు తమ
అభివందనాలు తెలుపుతున్నారు. అక్కడి స్నేహితుల్ని
ఒక్కొక్కరిని పేరుతో పిలిచి అభివందనాలు తెలుపు.

# యూదా వ్రాసిన లేఖ

యేసు క్రీస్తు సేవకుడు, యాకోబు సోదరుడు అయిన
టువంటి యూదా,
తండ్రియైన దేవుని ద్వారా పిలువబడి, ప్రేమింపబడి,
యేసు క్రీస్తులో భద్రం చేయబడిన వారికి వ్రాయున
దేమనగా:
2దేవుని అనుగ్రహం, శాంతి, ప్రేమ మీకు సమృద్ధిగా
లభించునుగాక!

### దుర్బోధకులు

3ప్రియమిత్రులారా! మనమందరము కలిసి పంచు
కొంటున్న రక్షణను గురించి మీకు వ్రాయాలని
పించింది. కాని మరొక విషయాన్ని గురించి వ్రాయటం
చాలా ముఖ్యమనిపిస్తోంది. అదేమిటంటే దేవుడు తన
పవిత్రులకు అప్పగించిన సువార్తలో ఏ మార్పు
రాకుండా మీరు పోరాడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.
4కొందరు దుర్బోధకులు మీలో రహస్యంగా చేరి
ఉన్నారు. వీళ్ళు శిక్షింపదగిన వాళ్ళని చాలా కాలం
క్రిందటే లేఖనాల్లో వ్రాయబడింది. వీళ్ళు దేవుణ్ణి వ్యతి
రేకించువారు. వీళ్ళు దైవానుగ్రహాన్ని ఉపయోగించు
కొంటూ అవినీతిగా జీవిస్తారు. వీళ్ళు మన ఏకైక
ప్రభువు, పాలకుడు అయిన యేసు క్రీస్తును నిరా
కరిస్తూ ఉంటారు.
5మీకీ విషయాలన్నీ తెలుసు. అయినా కొన్ని విష
యాలు జ్ఞాపకం చెయ్యాలని అనుకొంటున్నాను.
ఈజిప్టు దేశంలో బానిసలుగా ఉండిన తన ప్రజలకు,
ప్రభువు స్వేచ్ఛ కలిగించాడు. కాని ఆ తర్వాత వాళ్ళలో
విశ్వాసం లేని వాళ్ళను నాశనం చేసాడు. 6తమ తమ
స్థానాలను, అధికారాలను వదిలిన దేవదూతలను
దేవుడు చిరకాలపు సంకెళ్ళతో అంధకారంలో బంధించి
ఉంచాడు. చివరిరోజుదాకా అదేవిధంగా బంధించి
ఉంచుతాడు. 7సొదొమ, గొమొఱ్ఱా పట్టణాల ప్రజలు,
వాటి పరిసర పట్టణాల్లోని ప్రజలు లైంగిక అవినీతికి,
అసహజమైన లైంగిక సహవాసాలకు లోనైపొయ్యారు.
అందువల్ల వాళ్ళు శాశ్వతమైన మంటల్లో శిక్షనను
భవించారు. తద్వారా ఈ సంఘటన కూడా ఇతరులకు
నిదర్శనంగా నిలిచిపోయింది. 8వాళ్ళలాగే కలలుగనే
ఈ దుర్బోధకులు తమ శరీరాల్ని మలినం
చేసికొంటూ, అధికారాన్ని ఎదిరిస్తూ, దేవదూతల్ని
దూషిస్తూ ఉంటారు. 9కాని ప్రధాన దేవదూత అయిన
మిఖాయేలు కూడా తాను మోషే దేహం విషయంలో
వాదించినప్పుడు ఆ సాతాన్ని నిందించలేదు. వాణ్ణి
దూషించ లేదు. అతడంత ధైర్యం చెయ్యలేకపో
య్యాడు. ఆ సాతానుతో, “ప్రభువు నిన్ను గద్దిస్తాడు”
అని మాత్రం అన్నాడు. 10ఈ దుర్బోధకులు తమకర్థం
కాని విషయాన్ని గురించి దూషిస్తూ మాట్లాడుతారు.
తెలివిలేని లౌకికంగా అర్థంచేసికొంటారు. పశువుల్లా వీటి
ద్వారా నశించిపోతారు.
11వీళ్ళు కయీను మార్గాన్ని అనుసరించారు. లాభం
కోసం బిలాము చేసిన తప్పునే చేసారు. కోరహువలె
తిరుగుబాటు చేసి అతనిలాగే నశించిపొయ్యారు.
వీళ్ళకు శ్రమ కలుగుగాక!
12వీళ్ళు మీరు చేసే సమాజ విందుల్లో ఏ మాత్రం
సిగ్గు లేకుండా పాల్గొంటారు. తమ కడుపులు బాగా
నింపుకొంటారు. గాలికి ఎగిరే నీళ్ళులేని మేఘాల్లాంటి,
ఫలమివ్వని ఎండిన వృక్షం లాంటి వాళ్ళు. వ్రేళ్ళు
పెకిలింపబడి రెండు సార్లు చనిపోయిన వృక్షం లాంటి
వాళ్ళు. 13అవమానమనే నురుగు కక్కే సముద్రపు
కెరటాల్లాంటి వాళ్ళు. ఆకాశంలో గతితప్పి తిరిగే నక్ష
త్రాల్లాంటి వాళ్ళు. వారి కోసం దేవుడు గాఢాంధకారాన్ని
శాశ్వతంగా దాచి ఉంచాడు.
14ఆదాము తర్వాత ఏడవ వాడైన హనోకు వీళ్ళను
గురించి ఈ విధంగా ప్రవచించాడు: “అదిగో! ప్రభువు
వేలకొలది పరిశుద్ధులతో కలిసి వస్తున్నాడు. 15వచ్చి
అందరిపై తీర్పు చెపుతాడు. దుర్మార్గపు పనులు చేసే
అవిశ్వాసుల్ని, తమకు వ్యతిరేకంగా చెడు మాట్లాడే
పాపుల్ని శిక్షిస్తాడు.” 16ఈ దుర్బోధకులు సణుగుతూ
తప్పు లెంచుతూ ఉంటారు. తమ దుర్వ్యసనాలు తీర్చు
కొంటూ, ప్రగల్భాలు చెప్పుకొంటూ తమ లాభం
కోసం ఇతర్లను పొగడుతూ ఉంటారు.

### హెచ్చరికలు, ఉపదేశాలు

17కాని ప్రియమిత్రులారా! మన ప్రభువైన యేసు
క్రీస్తు యొక్క అపొస్తలులు చెప్పిన ప్రవచనాల్ని జ్ఞాపకం
ఉంచుకోండి. 18“చివరి రోజుల్లో దేవుణ్ణి దూషించే
వాళ్ళు తమ దుర్వ్యసనాలు తీర్చుకొంటూ వస్తారు”
అని అపొస్తలులు చెప్పారు. 19వాళ్ళు ప్రస్తావించిన

ఈ దుర్బోధకులే మిమ్మల్ని విడదీస్తారు. ఈ దుర్బో
ధకులు పశువుల్లా ప్రవర్తిస్తారు. వీళ్ళలో దేవుని ఆత్మ
ఉండదు.
[20]కాని ప్రియమిత్రులారా! మీలో ఉన్న విశ్వాసం
అతిపవిత్రమైనది. దానితో మిమ్మల్ని మీరు అభివృద్ధి
పరుచుకోండి. పవిత్రాత్మ ద్వారా ప్రార్థించండి.
[21]దేవుని ప్రేమను వదులుకోకండి. మీకు నిత్యజీవం
ఇచ్చే మన యేసు క్రీస్తు ప్రభువు దయకొరకు కాచు
కొని ఉండండి. [22]సంశయాలున్న వాళ్ళపట్ల కనికరం
చూపండి. [23]మంటల్లో పడబోయే వాళ్ళను బయ
టకు లాగి కాపాడండి. దుర్నీతిలో మలినమైన దుస్తుల్ని
వేసుకొన్న వాళ్ళ పట్ల మీకు అసహ్యము, భయము
కలిగినా వాళ్ళ పట్ల కనికరం చూపండి.
[24]ఆ దేవుడు క్రిందపడకుండా మిమ్మల్ని కాపాడ
గలడు. మీలో ఏలోపం లేకుండా చేసి తేజోవంతమైన
తన సమక్షంలో నిలుపుకొని ఆనందాన్ని కలిగించ
గలడు. అలాంటి ఆయనకు [25]మన రక్షకుడైనటువంటి
ఏకైక దేవునికి, మన యేసు క్రీస్తు ప్రభువు ద్వారా
గొప్పతనము, తేజస్సు, శక్తి, అధికారము, భూత
భవిష్యత్ వర్తమాన కాలాలలో లభించుగాక! ఆమేన్.

# ప్రకటన గ్రంథము

### తొలి పలుకు

1 దేవుడు త్వరలోనే జరుగనున్న వాటిని తన సేవ
కులకు తెలియచేయుమని యేసు క్రీస్తుకు
చెప్పాడు. యేసు తన దూతను, తన భక్తుడైన
యోహాను దగ్గరకు పంపి ఈ విషయాలు తెలియ
చేసాడు. ఈ గ్రంథంలో ఆ విషయాలు ఉన్నాయి.
2యోహాను దేవుని సందేశాన్ని, యేసు క్రీస్తు చెప్పిన
దాన్ని దివ్య దర్శనంలో చూసాడు. అందులో చూసిన
వన్నీ చెప్పాడు. 3ఈ దైవ సందేశంలో ఉన్న వాటిని
చదివిన వాళ్ళు, వాటిని విని, వాటిలో వ్రాయబడిన
వాటిని ఆచరించే వాళ్ళు ధన్యులు. సమయం దగ్గరగా
నున్నది.

### శుభాకాంక్షలు

4యోహాను నుండి,
ఆసియ ప్రాంతంలో ఉన్న ఏడు సంఘాలకు,
భూత, భవిష్యత్ వర్తమానకాలాల్లో ఉన్నవాడు, ఆయన
సింహాసనం ముందున్న ఏడు ఆత్మలు మీకు తమ
అనుగ్రహాన్ని, శాంతిని ప్రసాదించుగాక! 5మరియు, చని
పోయి బ్రతికింపబడిన వాళ్ళలో మొదటివాడు, నిజ
మైన విషయాలు చెప్పేవాడు రాజులకు రాజైన యేసు
క్రీస్తు మీకు అనుగ్రహం, శాంతి ప్రసాదించుగాక!
ఆయన మనలను ప్రేమిస్తున్నాడు. ఆయనే తన
రక్తంతో మనల్ని మన పాపాలనుండి రక్షించాడు. 6మన
కోసం ఒక రాజ్యాన్ని స్థాపించాడు. మనము ఆయన
తండ్రియైన దేవుని సేవ చేయాలని మనల్ని యాజకు
లుగా చేసాడు. ఆయనకు చిరకాలం మహిమ శక్తి కలుగు
గాక! ఆమేన్!
7చూడు! ఆయన మేఘాలపై వస్తున్నాడు. ప్రతీ
నేత్రము ఆయన్ని చూస్తుంది. ఆయన్ని పొడిచిన
వాళ్ళు* కూడా ఆయన్ని చూస్తారు. ప్రపంచంలోని
ప్రజలందరూ ఆయన్ని చూచి భయాందోళనలతో
దుఃఖిస్తారు. అలాగే జరుగు గాక! ఆమేన్.
8భూత, భవిష్యత్, వర్తమాన కాలాల్లో ఉండేవాడు,
సర్వశక్తి సంపన్నుడైనవాడు, మన ప్రభువైన దేవుడు
“ఆదియు, అంతమును* నేనే!” అని అన్నాడు.

### మనుష్య కుమారునిలాంటి వాడు

9నేను యోహానును, మీ సోదరుణ్ణి యేసుతో
పొందిన ఐక్యత వల్ల మనము ఆయన రాజ్యంలో ఒక
టిగా ఉన్నాము. సహనంతో కష్టాలు అనుభవిస్తు
న్నాము. యేసు చెప్పిన సత్యాన్ని దేవుని సందేశాన్ని
ప్రకటించటం వల్ల నన్ను వాళ్ళు పత్మాసు ద్వీపంలో
ఒంటరిగా ఉంచారు. 10ఆదివారము నాడు నేను దేవుని
ఆత్మపూర్ణుడనైయుండగా బూర వూదినట్లు నా వెనుక
నుండి ఒక పెద్ద శబ్దం వినిపించింది. 11అది నాతో,
“నీవు చూసిన దాన్ని ఒక గ్రంథంగా వ్రాసి ఈ ఏడు
సంఘాలకు అనగా, ఎఫెసు, స్ముర్న, పెర్గము, తుయ
తైర, సార్దీసు, ఫిలదెల్ఫియ, లవొదికయకు పంపుము”
అని అన్నది. 12నాతో మాట్లాడుతున్న స్వరం ఎవరిదో
చూడాలని వెనక్కు తిరిగి చూసాను. వెనక్కు తిరిగి
చూడగా ఏడు బంగారు దీపస్తంభాలు కన్పించాయి.
13వాటి మధ్య ఒక వ్యక్తి కనిపించాడు. ఆయన
మనుష్యకుమారునిలా* ఉన్నాడు. ఆయన వేసుకొన్న
అంగీ ఆయన పాదాల వరకు ఉంది. ఆయన
రొమ్మునకు బంగారు దట్టి కట్టబడివుంది. 14ఆయన
తల వెంట్రుకలు తెల్లని ఉన్నిలా ఉన్నాయి. ఆయన
వెంట్రుకల్ని మంచుతో కూడా పోల్చవచ్చు. ఆయన
కళ్ళు అగ్ని జ్వాలల్లా ఉన్నాయి. 15ఆయన పాదాలు
కొలిమిలో కాలే యిత్తడిలా ఉన్నాయి. ఆయన కంఠ
ధ్వని జల ప్రవాహం చేసే శబ్దంలా ఉంది. 16ఆయన
తన కుడి చేతిలో ఏడు నక్షత్రాలను పట్టుకొని ఉన్నాడు.
ఇరువైపులా పదునుగానున్న ఒక కత్తి ఆయన నోటి
నుండి బయటకు వచ్చింది. ఆయన ముఖం దివ్యంగా
ప్రకాశిస్తున్న సూర్యునిలా ఉంది.

---

**ఆయన్ని … వాళ్ళు** యోహాను 19:34.

**ఆదియు, అంతమును** ఇది గ్రీకు అక్షరమాలలో మొదటి మరియు చివరి అక్షరాలు. ఈ విధంగా దేవుడే ఆది మరియు అంతము అయివున్నాడు.

**మనుష్యకుమారునిలా** దానియేలు 7:13 చూడండి.

[17]నేనాయన్ని చూసి, ప్రాణం పోయిన వానిలా
ఆయన పాదాల ముందు పడ్డాను. అప్పుడు ఆయన
తన కుడి చేతిని నా తలపై ఉంచి, "భయపడకు.
ఆదిని, అంతాన్ని నేనే!" అని అన్నాడు. [18]"నేను చిర
కాలం జీవించేవాణ్ణి. ఒకప్పుడు నేను మరణించి
ఉంటిని. కాని యిక శాశ్వతంగా జీవించి ఉంటాను.
మరణంపై నాకు అధికారం ఉంది. మృత్యులోకపు
తాళంచెవులు నా దగ్గర ఉన్నాయి. [19]అందువల్ల
యిప్పుడున్న వాటిని, ముందు జరుగబోయే వాటిని,
నీవు చూసిన వాటిని గురించి వ్రాయి. [20]నీవు నా
కుడి చేతిలో చూసిన ఏడు నక్షత్రాల రహస్యము,
ఏడు దీపస్తంభాల రహస్యము యిది. ఆ ఏడు నక్షత్రాలు
ఏడు సంఘాలకు చెందిన దూతలు, ఆ ఏడు దీప
స్తంభాలు ఏడు సంఘాలన్నమాట.

### ఎఫెసులోని సంఘానికి

2 "ఎఫెసులోని సంఘానికి చెందిన దూతకు ఈ
విధంగా వ్రాయి:

"ఏడు నక్షత్రాలను తన కుడి చేతిలో పట్టుకొని,
ఏడు బంగారు దీపస్తంభాల మధ్య నడిచేవాడు ఈ
విధంగా అంటున్నాడు. [2]నీవు చేసిన పనులు నాకు
తెలుసు. నీవు పట్టుదలతో శ్రమించి పని చేసావు.
నీవు దుష్టుల్ని సహించలేవని నాకు తెలుసు. అపొస్తలు
లమని చెప్పుకొంటున్న వాళ్ళను నీవు పరీక్షించి వాళ్ళు
మోసగాళ్ళని తెలుసుకొన్నావు. [3]నీవు పట్టుదలతో
అలసిపోకుండా నా పేరిట కష్టాలు ఓర్చుకొన్నావు.

[4]"కాని నీ తొలి ప్రేమను నీవు పూర్తిగా మరిచి
పోయావు. ఇది నాకు యిష్టము లేదు. [5]నీవు ఎంత
దిగజారిపోయావో జ్ఞాపకం తెచ్చుకో. మారు మనస్సు
పొందు. మొదట చేసిన విధంగా చేయి. నీవు మారు
మనస్సు పొందకపోతే, నేను వచ్చి నీ దీపాన్ని దాని
స్థలం నుండి తీసి వేస్తాను.

[6]"నీకొలాయితులు* చేసే పనులు నీకు యిష్టం
లేదు. నాకు కూడా యిష్టం లేదు. ఆ విషయంలో
మనం ఏకీభవిస్తున్నాము.

[7]"ఆత్మ సంఘాలకు చెపుతున్న వాటిని ప్రతీవాడు
వినాలి. గెలుపు సాధించిన వానికి పరదైసులో ఉన్న
జీవవృక్షం యొక్క ఫలం తినే అధికారం యిస్తాను.

### స్ముర్నలోని సంఘానికి

[8]"స్ముర్నలోని క్రీస్తు సంఘానికి చెందిన దూతకు
ఈ విధంగా వ్రాయి:

"ఆదియు, అంతము అయిన వాడు, చనిపోయి
తిరిగి బ్రతికి వచ్చిన వాడు ఈ విధంగా చెబుతున్నాడు:
[9]మీ దుఃఖాలను గురించి, మీ దారిద్ర్యాన్ని గురించి
నాకు తెలుసు. అయినా మీరు భాగ్యవంతులు.
మిమ్మల్ని గురించి కొందరు చెడుగా మాట్లాడుతు
న్నారు. వాళ్ళు తాము యూదులమని చెప్పు కొంటారు
గాని నిజానికి వాళ్ళు యూదులు కారు. వాళ్ళు సైతాను
సమాజానికి చెందిన వాళ్ళు. [10]మీరు అనుభవించ
బోయే శ్రమలను గురించి భయపడకండి. సైతాను
మీలో కొందరిని చెరసాలలో వేస్తాడు. మీరు పది
రోజులు హింసను అనుభవిస్తారు. ఇది మీకొక పరీక్ష.
మరణానికి కూడా భయపడకుండా విశ్వాసంతో
ఉండండి. నేను మీకు జీవ కిరీటాన్ని యిస్తాను.

[11]"ఆత్మ సంఘాలకు చెబుతున్న వాటిని ప్రతీవాడు
వినాలి. వీటిని జయించిన వాడు రెండవ మరణాన్నుండి
తప్పించుకొంటాడు.

### పెర్గములోని సంఘానికి

[12]"పెర్గములోని సంఘానికి చెందిన దూతకు ఈ
విధంగా వ్రాయి:

"రెండు వైపులా పదునైన కత్తిగలవాడు ఈ విధంగా
చెబుతున్నాడు. [13]సైతాను సింహాసనం ఎక్కడ ఉందో
అక్కడే నీవు నివసిస్తున్నావని నాకు తెలుసు. అయినా
నీకు నా పేరంటే విశ్వాసం ఉంది. విశ్వాసంతో నా
విషయంలో అంతిపయి తన భక్తిని వ్యక్తపరచిన
కాలంలో కూడా నా పట్ల నీకున్న విశ్వాసాన్ని నీవు
వదులుకోలేదు. సైతాను నివసించే పట్టణంలో
అంతిపయి చంపబడ్డాడు.

[14]"కాని కొన్ని విషయాల్లో నాకు నీవు నచ్చలేదు.
బిలాము బోధనలు* పఠించే వాళ్ళు కొందరు నీ
సంఘంలో ఉన్నారు. ఈ బిలాము, ఇశ్రాయేలీయులను
రేకెత్తించి వాళ్ళతో పాపపు పనులు చేయించమని
బాలాకుకు బోధించాడు. బాలాకు వాళ్ళు విగ్రహాలకు*
ఆరగింపు పెట్టిన ఆహారం తినేటట్లు అవినీతిగా బ్రతికే
టట్లు చేసాడు. [15]నీకొలాయితులను అనుసరించే
వాళ్ళు కూడా నీ దగ్గరున్నారు. [16]మారుమనస్సు
పొందండి. అలా చేయకపోతే నేను త్వరలోనే మీ
దగ్గరకు వచ్చి, నా నోటి నుండి బయలువెడలు కత్తితో
యుద్ధం చేస్తాను.

[17]"ఆత్మ క్రీస్తు సంఘాలకు చెప్పిన వాటిని ప్రతీ
వాడు వినాలి.

"విజయం సాధించిన వానికి నేను దాచి ఉంచిన
'మన్నా'ను* తినుటకు యిస్తాను. ఒక తెల్ల రాయి

---

**నీకొలాయితులు** ఆసియామైనర్‌లోని ఒక మతానికి చెందిన గుంపు.

**బిలాము బోధనలు** సంఖ్యా. 22:20; 25:5 చూడండి.

**విగ్రహాలకు** ఇశ్రాయేలీయుల విగ్రహారాధన ఆత్మీయ వ్యభిచారంగా చెప్పబడింది. యిర్మీయా 3:6-10; 5:7 యెహెజ్క. 16:1-43 చూడండి.

**మన్నా** యూదులు ఎడారిలో ఉండగా దేవుడిచ్చిన ఆహారం.

మీద ఒక క్రొత్త పేరు వ్రాసి దాన్ని కూడా అతనికి యిస్తాను. నేను ఆ రాయి ఎవరికి యిస్తానో అతనికి మాత్రమే ఆ పేరు తెలుస్తుంది.

## తుయతైరలోని సంఘానికి

18“తుయతైరలోని సంఘానికి చెందిన దూతకు ఈ విధంగా వ్రాయి:

“అగ్ని జ్వాలల్లా మండుతున్న కళ్ళు కలవాడు
కొలిమిలో కాల్చి మెరుగు పెట్టబడిన యిత్తడిలా
పాదాలు కలవాడు ఈ విధంగా చెబుతున్నాడు. 19నీవు
చేస్తున్న పనులు, నీ ప్రేమ, విశ్వాసము, సేవ, పట్టుదల
నాకు తెలుసు. నీవు మొదట చేసినదానికన్నా,
యిప్పుడు ఎక్కువ చేస్తున్నావని నాకు తెలుసు.
20తానొక ప్రవక్తనని చెప్పుకొంటున్న యెజెబెలు
చేస్తున్న పనుల్ని నీవు సహిస్తున్నావు. ఇది నాకు యిష్టం
లేదు. ఆ స్త్రీ తన బోధనలతో నా సేవకులను తప్పుదారి
పట్టిస్తోంది. దాని కారణంగా వాళ్ళు నీతి లేని కామ
కృత్యాలు చేస్తున్నారు. విగ్రహాలకు ఆరగింపు పెట్టిన
ఆహారం తింటున్నారు.* 21అది చేసిన అవినీతికి మారు
మనస్సు పొందమని నేను దానికి కొంత గడువునిచ్చాను.
కాని అది దానికి అంగీకరించలేదు. 22అందువల్ల దానికి
కష్టాలు కలిగిస్తాను. అవినీతిగా దానితో కామకృత్యాలు
చేసిన వాళ్ళు తమ పాపానికి మారుమనస్సు పొందక
పోతే, వాళ్ళను తీవ్రంగా శిక్షిస్తాను. 23దాని బిడ్డల్ని
చంపివేస్తాను. అప్పుడు హృదయాల్ని, బుద్ధుల్ని
శోధించేవాణ్ణి నేనేనని అన్ని సంఘాలు తెలుసు
కొంటాయి. చేసిన కార్యాలను బట్టి ప్రతీ ఒక్కరికి
ప్రతిఫలం యిస్తాను.

24“తుయతైరలో ఉన్న మిగతా ప్రజలకు, అంటె,
దాని బోధనల్ని ఆచరించని వాళ్ళకు, మరియు
సైతాను రహస్యాలను అభ్యసించని వాళ్ళకు నేను చెప్పే
దేమిటంటే, నేను మీ మీద మరే భారము వెయ్యను.
25నేను వచ్చేదాకా మీరు అనుసరిస్తున్న వాటినే అను
సరిస్తూ ఉండండి.

26“విజయాన్ని సాధించి నా ఇచ్ఛానుసారం చివరి దాకా ఉన్నవానికి నేను జనములపై అధికారం యిస్తాను.

27 ‘అతడు వాళ్ళను కఠిన శాసనాలతో పాలి
స్తాడు. వాళ్ళను కుండల్ని పగులకొట్టినట్లు
పగులగొడ్తాడు.’

*కీర్తన 2:9*

28ఈ అధికారం నేను నా తండ్రినుండి పొందాను. అదే విధంగా వాళ్ళు నా నుండి అధికారం పొందుతారు.
నేను అతనికి వేకువ చుక్కను కూడా యిస్తాను.
29ఆత్మ సంఘాలకు చెబుతున్న వాటిని ప్రతీవాడు
వినాలి.

## సార్దీసులోని సంఘానికి

3 “సార్దీసులోని సంఘానికి చెందిన దూతకు ఈ విధంగా వ్రాయి:

“దేవుని ఏడు ఆత్మలను, ఏడు నక్షత్రాలను తన
ఆధీనంలో ఉంచుకొన్నవాడు ఈ విధంగా చెపుతు
న్నాడు: నీవు చేస్తున్న పనులు నాకు తెలుసు. ప్రజలు
నీవు బ్రతికి ఉన్నావని అనుకొంటున్నారు. కాని నీవు
నిజానికి చనిపోయిన వానితో సమానము. 2నా దేవుని
దృష్టిలో నీవు చేస్తున్న పనులు యింకా పూర్తి కాలేదు.
ఇది నేను గమనించాను. కనుక జాగ్రత్త. నీలో ఉన్న
శక్తి పూర్తిగా నశించకముందే నీ శక్తిని కాపాడుకో. 3నీకు
లభించిన దాన్ని, నీవు విన్నదాన్ని జ్ఞాపకం తెచ్చుకో.
ఆచరించు. మారుమనస్సు పొందు. కాని నీవు జాగ్రత్తగా
ఉండకపోతే నేను ఒక దొంగలా వస్తాను. నేను ఎప్పుడు
వస్తానో నీవు తెలుసుకోలేవు. 4మలినంకాని కొందరు
వ్యక్తులు అక్కడ సార్థీసులో నీ దగ్గరున్నారు. వాళ్ళు
యోగ్యులు కనుక, తెల్లని దుస్తులు ధరించి నాతో
సహా నడుస్తారు. 5విజయం సాధించిన వాళ్ళలా తెల్లని
దుస్తులు ధరించండి. అలా చేసిన వాని పేరును నేను
జీవగ్రంథంనుండి తుడిచివేయను. అతణ్ణి నా తండ్రి
ముందు, దేవ దూతల ముందు అంగీకరిస్తాను. 6సంఘా
లకు ఆత్మ చెపుతున్న దాన్ని ప్రతీవాడు వినాలి.

## ఫిలదెల్ఫియలోని సంఘానికి

7“ఫిలదెల్ఫియలోని సంఘానికి చెందిన దూతకు ఈ విధంగా వ్రాయి:

“పవిత్రమైన వాడు, సత్యవంతుడు, దావీదు తాళం
చెవి ఉన్నవాడు ఈ విధంగా చెపుతున్నాడు. ఆయన
తెరిచిన దాన్ని ఎవ్వరూ మూయలేరు.* ఆయన
మూసినదాన్ని ఎవ్వరూ తెరువలేరు. 8నీ పనులు నాకు
తెలుసు. అదిగో చూడు! ఎవ్వరూ మూయలేని
ద్వారాన్ని నీ ముందు ఉంచాను. నీ దగ్గర ఎక్కువ
బలంలేదని నాకు తెలుసు. అయినా నా పేరును త్రుణీ
కరించకుండా అంగీకరించావు. 9సైతాను మందిరానికి
చెందిన వాళ్ళను, యూదులు కాకున్నా యూదులమని
చెప్పుకొనే వాళ్ళను, అబద్ధాలాడేవాళ్ళను, నీ కాళ్ళ
ముందు పడేటట్లు చేస్తాను. నాకు నీ పట్ల ప్రేమ
ఉందని వాళ్ళు తెలుసుకొనేటట్లు చేస్తాను. 10సహ
నంతో కష్టాలు అనుభవించమని నేను ఆజ్ఞాపించాను.
నీవా ఆజ్ఞను పాటించావు. కనుక విచారించే సమయం
వచ్చినప్పుడు నిన్ను రక్షిస్తాను. ఈ ప్రపంచంలో నివ

---

**వచనము 20** ప్రకటన 2:14 చూడండి.

**తెరిచిన … మూయలేరు** యెషయా 22:22.

సిస్తున్న వాళ్ళందరిపై విచారణ జరిగే సమయం
రాబోతోంది.
11“నేను త్వరలోనే రాబోతున్నాను. నీ దగ్గరున్న
దాన్ని అంటిపెట్టుకొని ఉండు. అలా చేస్తే నీ కిరీటాన్ని
ఎవ్వరూ తీసుకోలేరు. 12అలా విజయం సాధించిన
వాణ్ణి, నేను నా దేవుని మందిరంలో ఒక స్తంభంలా
ఉంచుతాను. అతనా స్థానాన్ని ఎన్నటికీ వదిలి వెళ్ళడు.
నేను అతనిపై నా దేవుని పేరు వ్రాస్తాను. నా దేవుని
నగరమైన క్రొత్త యెరూషలేము పేరు వ్రాస్తాను. ఈ
క్రొత్త యెరూషలేము పరలోకంలో ఉన్న నా దేవుని
దగ్గరినుండి వస్తోంది. అతని మీద నా క్రొత్త పేరు
కూడా వ్రాస్తాను. 13ఆ సంఘాలకు ఆత్మ చెబుతున్న
విషయాలను ప్రతీవాడు వినాలి.

### లవొదికయలోని సంఘానికి

14“లవొదికయలోని సంఘానికి చెందిన దూతకు
ఈ విధంగా వ్రాయి:
“ఈ విషయాలకు ఆమేన్* అనువాడును, దేవుడు
సృష్టించిన వాటన్నిటికీ మొదటివాడును నిజమైన సాక్షి
అయినవాడును చెప్పుచున్నాడు.
15“నీవు చేసిన పనుల్ని గురించి నాకు తెలుసు.
నీలో చల్లదనం గాని వేడిమి గాని లేదు. రెండింటిలో
ఏదైనా ఒకటి నీలో ఉండాలని నా కోరిక. 16నీవు వేడి
గానూ లేవు, చల్లగాను లేవు. గోరు వెచ్చగా ఉన్నావు.
కనుక నిన్ను నా నోటి నుండి బయటకు ఉమ్మి
వేయబోతున్నాను. 17‘నేను ధనవంతుణ్ణి, నా దగ్గర
ఐశ్వర్యం ఉంది. నాకు ఏ కొరతా లేదు’ అని నీవంటు
న్నావు. కాని నీవు దౌర్భాగ్యుడవు. దీనావస్థలో
ఉన్నావు. నీవు దరిద్రుడవు, గ్రుడ్డివాడవు, దిగంబ
రుడవు. 18నీవు ధనవంతుడవు కావాలనుకొంటే,
నిప్పులో పుటం వేయబడిన బంగారాన్ని నా దగ్గర
నుండి కొనుమని సలహా ఇస్తున్నాను. సిగ్గు కలిగించే
నీ దిగంబరత్వాన్ని దాచుకోవటానికి నా నుండి తెల్లని
దుస్తులు కొనుమని సలహా ఇస్తున్నాను. నా నుండి
కాటుకను కూడా కొనుక్కొని నీ కళ్ళకు పెట్టుకో.
అప్పుడు చూడగల్గుతావు.
19“నేను ప్రేమించిన వాళ్ళను గద్దిస్తాను. వాళ్ళను
శిక్షిస్తాను. అందువల్ల నిజాయితీతో ఉండి పశ్చాత్తాపం
చెందు. 20ఇదిగో! నేనిక్కడ తలుపు దగ్గర నిలబడి
తట్టుతున్నాను. ఎవరైనా నా స్వరం విని తలుపుతెరిస్తే
నేను లోపలికి వచ్చి అతనితో కలిసి తింటాను. అతడు
నాతో కలిసి తింటాడు.
21“నేను విజయం సాధించి నా తండ్రితో కలిసి
ఆయన సింహాసనంపై కూర్చొన్నాను. అదే విధంగా
విజయం సాధించినవాడు నాతో సింహాసనంపై
కూర్చొంటాడు. 22సంఘాలకు ఆత్మ చెబుతున్న
వాటిని ప్రతీవాడు వినాలి.”

4 ఇది జరిగిన తర్వాత నేను కళ్ళెత్తి చూశాను. పర
లోకంలో ఒక ద్వారం కనిపించింది. ఆ ద్వారము
తెరుచుకొని ఉంది. బూర ఊదినట్లు యింతకు ముందు
మాట్లాడిన స్వరం నాకు మళ్ళీ వినిపించింది. అది
నాతో, “ఇలా మీదికి రా; దీని తర్వాత ఏమి జరుగు
తుందో నీకు చూపిస్తాను” అని అంది.
2నేను వెంటనే పరిశుద్ధాత్మ ఆధీనమయ్యాను.
పరలోకంలో ఉన్న సింహాసనం నాముందు కనిపిం
చింది. దాని మీద ఎవరో కూర్చొని ఉన్నారు. 3దాని
మీద కూర్చున్నవాడు సూర్యకాంత మణివలే, పద్మరాగ
మువలెవున్నాడు. ఆ సింహాసనం చుట్టూ మరకతమును
పోలిన ఆకాశ ధనుస్సు ప్రకాశిస్తూ ఉంది. 4దాని చుట్టూ
యిరువది నాలుగు యితర సింహాసనాలు ఉన్నాయి.
వాటి మీద యిరువది నాలుగు మంది పెద్దలు కూర్చొని
ఉన్నారు. వాళ్ళు తెల్లని దుస్తులు ధరించి ఉన్నారు.
వాళ్ళ తలలపై బంగారు కిరీటాలు ఉన్నాయి. 5సింహా
సనం నుండి మెరుపులువచ్చాయి. పెద్ద గర్జనలు ఉరు
ములు దాన్నుండి వినిపించాయి. ఆ సింహాసనం
ముందు ఏడు దీపాలు దివ్యంగా వెలుగుతూ ఉన్నాయి.
ఇవి దేవుని ఏడు ఆత్మలు. 6గాజుతో కప్పిన సముద్రంలా
కనిపించే ఒక గాజు సముద్రం ఆ సింహాసనం ముందు
కనిపించింది. అది స్ఫటికంలా నిర్మలంగా ఉంది.
సింహాసనం మధ్య, చుట్టూ, అంటే ముందు,
వెనుకా, నాలుగు ప్రాణులు ఉన్నాయి. వాటి దేహాలు
ముందు, వెనుకా, కళ్ళతో కప్పబడి ఉన్నాయి.
7మొదటి ప్రాణి ఒక సింహంలా, రెండవది ఒక ఎద్దులా,
మూడవది ఒక మనిషి ముఖంలా, నాలుగవది ఎగిరే
పెద్దపక్షిలా ఉన్నాయి.* 8ప్రతీ ప్రాణికి ఆరు రెక్కలు
ఉన్నాయి. వాటి శరీరాలుపైన, క్రిందా కళ్ళతో పూర్తిగా
కప్పబడి ఉన్నాయి. రెక్కల క్రింద కళ్ళతో కప్పబడి
ఉన్నాయి. రాత్రింబవళ్ళు అవి విడువక:

> “భూత, భవిష్యత్ వర్తమాన కాలాల్లో ఉన్న
> వాడు, సర్వశక్తి సంపన్నుడును ప్రభువునైన
> దేవుడు పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరి
> శుద్ధుడు”

అని పాడుతూ ఉన్నాయి. 9సింహాసనంపై
కూర్చొన్న వానికి, చిరకాలం జీవించే వానికి, మహిమ,
గౌరవము కలగాలని అంటూ ఈ ప్రాణులు తమ
కృతజ్ఞతలు తెలుపుతూ పాడాయి. 10అవి ఆ విధంగా
పాడినప్పుడు ఆ యిరవై నాలుగు మంది పెద్దలు ఆ

---

**ఆమేన్** ఇది ఇక్కడ యేసుక్రీస్తు పేరుగా ఉపయోగించ
బడింది. ఈ హీబ్రూ పదం “తథాస్తు” లేక “నిజంగా” అనే
అర్థాన్నిస్తుంది.

**వచనము 7** యెహెజ్కే. 1:4-14 చూడండి.

సింహాసనంపై కూర్చొన్నవానిముందు సాష్టాంగపడి
చిరకాలం జీవించే ఆయన్ని స్తుతించారు. తమ
కిరీటాల్ని సింహాసనం ముందువేసి,

11 “మా ప్రభూ! దైవమా! నీవు తేజమును,
గౌరవమును, శక్తిని పొందతగిన యోగ్యు
డవు, నీవు అన్నిటినీ సృష్టించావు. అవి నీ
యిష్టానుసారం సృష్టింపబడి జీవాన్ని
పొందాయి” అని అన్నారు.

### గంథము, గొఱ్ఱెపిల్ల

5 ఆ తర్వాత, సింహాసనంపై కూర్చొన్న వాని కుడి
చేతిలో చుట్టబడియున్న ఒక గ్రంథాన్ని
చూసాను. దాని యిరువైపులా ఏదో వ్రాయబడి ఉంది.
దానిపై ఏడు ముద్రలు ఉన్నాయి. 2శక్తివంతమైన ఒక
దేవదూత నాకు కనిపించాడు. అతడు పెద్ద స్వరంతో,
“ఆ ముద్రలను విప్పి ఆ గ్రంథాన్ని తెరువగల యోగ్యు
డెవరు?” అని ప్రకటించటం నేను చూసాను. 3పర
లోకంలోగాని, భూమ్మీదగాని, పాతాళంలోగాని ఆ
గ్రంథాన్ని తెరువగలవాడు, దాని లోపలవున్నది చూడ
గలవాడు ఎవ్వడూ నాకు కనిపించలేదు. 4ఆ గ్రంథాన్ని
తెరువగల వాడు దాని లోపల ఏముందో చూడగల
యోగ్యుడు కనిపించనందుకు నేను చాలా విలపించాను.
5అప్పుడు ఆ పెద్దల్లో ఒకడు నాతో, “విలపించ
వద్దు. యూదాతెగకు చెందిన సింహము, దావీదు
వంశాంకురము విజయం పొందాడు చూడు. ఆ
గ్రంథాన్ని, దాని ఏడు ముద్రల్ని తెరువగలవాడు
ఆయనే!” అని అన్నాడు.
6అప్పుడు నాకొక గొఱ్ఱె పిల్ల కనిపించింది. అది
సింహాసనం మధ్య ఉంది. అది వధింపబడినదానిలా
నాకు కనిపించింది. దాని చుట్టూ ఆ నాలుగు ప్రాణులు
ఉన్నాయి. పెద్దలు ఉన్నారు. ఆ గొఱ్ఱె పిల్లకు ఏడు
కొమ్ములు, ఏడు కళ్ళు ఉన్నాయి. అవి దేవుని ఏడు
ఆత్మలు. దేవుడు ప్రపంచమంతా వ్యాపింపచేసింది ఈ
ఆత్మలనే. 7ఆయన వచ్చి సింహాసనంపై కూర్చొన్న
వాని కుడిచేతినుండి ఆ గ్రంథాన్ని తీసుకొన్నాడు.
8ఆయన ఆ గ్రంథాన్ని తీసుకొన్న వెంటనే, ఆ నాలుగు
జీవులు ఆ యిరవైనాలుగుమంది పెద్దలు, ఆ గొఱ్ఱెపిల్ల
ముందు సాష్టాంగపడ్డారు. ప్రతి ఒక్కరి దగ్గర ఒక సితార
ఉంది. సాంబ్రాణితో నిండిన బంగారు గిన్నెలు
ఉన్నాయి. ఇవి విశ్వాసుల ప్రార్థనలన్న మాట. 9వాళ్ళు
ఒక క్రొత్త కీర్తన పాడారు:

“నీవు వధింపబడినందుకు ప్రతీ జాతినుండి
ప్రతీ భాషనుండి,ప్రతీ దేశంనుండి, ప్రతీ
గుంపునుండి, నీ రక్తంతో మానవుల్ని
దేవుని కోసంకొన్నావు. కనుక ఆ
గ్రంథాన్ని తీసుకొని దాని ముద్రలు విప్పే
అర్హత నీవు పొందావు.
10 మా దేవుని కొరకు ఈ ప్రజలతో ఒక
రాజ్యాన్ని సృష్టించావు. వాళ్ళను యాజకు
లుగా నియమించావు. వాళ్ళు ఈ ప్రపం
చాన్ని పాలిస్తారు.”

11ఆ తర్వాత చూస్తే నాకు చాలామంది దేవదూతల
స్వరం వినిపించింది. వాళ్ళ సంఖ్య కోట్లకొలదిగావుంది.
వాళ్ళు సింహాసనం చుట్టూ, ప్రాణుల చుట్టూ, పెద్దల
చుట్టూ గుమికూడి ఉన్నారు. 12వాళ్ళు బిగ్గరగా,

“శక్తిని, ఐశ్వర్యాని, జ్ఞానాన్ని, బలాన్ని, గౌర
వాన్ని, మహిమను స్తుతిని పొందటానికి
వధింపబడిన గొఱ్ఱె పిల్ల యోగ్యమైనవాడు”

అని పాడారు.

13ఆ తర్వాత పరలోకంలో, భూమ్మీద, పాతా
ళంలో, సముద్రం మీద ఉన్న ప్రతీ ప్రాణి, ఈ విధంగా
పాడటం విన్నాను:

“సింహాసనంపై కూర్చున్న వానికి, గొఱ్ఱె
పిల్లకు చిరకాలం స్తుతి, గౌరవము, మహిమ,
శక్తి కల్గుగాక!”

14ఆ నాలుగు ప్రాణులు, “ఆమేన్” అని అన్నాయి.
పెద్దలు సాష్టాంగ నమస్కారం చేసి స్తుతించిరి.

### ముద్ర

6 ఆ గొఱ్ఱె పిల్ల ఆ ఏడింటిలో మొదటి ముద్రను
తెరవటం చూసాను. ఆ నాలుగు ప్రాణుల్లో ఒక
ప్రాణి “రా!” అని ఉరుముతూ అనటం విన్నాను.
2నా ముందు ఒక తెల్లటి గుఱ్ఱం కనిపించింది.
దానిమీద స్వారి చేస్తున్నవాడు విల్లు పట్టుకొని
ఉన్నాడు. అతనికి ఒక కిరీటం యివ్వబడింది. అతడు
విజయం సాధించాలని నిర్ణయించుకొన్న వీరునిలా
స్వారీ చేస్తూ యుద్ధరంగానికి వెళ్ళిపోయాడు.
3ఆ గొఱ్ఱెపిల్ల రెండవ ముద్రను తీసినప్పుడు
రెండవ ప్రాణి “రా!” అని అనటం విన్నాను. 4అప్పుడు
యింకొక గుఱ్ఱం వెలుపలికి వచ్చింది. అది ఎఱ్ఱటి
రంగులో ఉంది. భూమ్మీద శాంతి లేకుండా చేయ
టానికి, మానవులు ఒకరినొకరు వధించు కొనేటట్లు
చేయటానికి, దాని రౌతుకు అధికారం యివ్వబడింది.
అతనికి ఒక పెద్ద ఖడ్గం యివ్వబడింది.
5ఆ గొఱ్ఱెపిల్ల మూడవ ముద్రను తీసినప్పుడు
మూడవ ప్రాణి “రా!” అని అనటం విన్నాను. నా

ముందు ఒక నల్లటి గుఱ్ఱం కనిపించింది. దాని రౌతు
చేతిలో ఒక తక్కెడ ఉంది. 6అప్పుడు ఆ నాలుగు
ప్రాణులనుండి ఒక స్వరం, “ఒక దేనారమునకు ఒక
సేరు గోధుమలనియు ఒక దేనారమునకు మూడు
సేర్లు యవలనియు నూనెను, ద్రాక్షారసమును పాడు
చేయవద్దనియు!” అని అనటం వినిపించింది.
7ఆ గొఱ్ఱెపిల్ల నాల్గవ ముద్రను తీసినప్పుడు నాల్గవ
ప్రాణి “రా!” అని అనటం విన్నాను. 8అక్కడ నా
ముందు పాలిపోయినట్టుగా ఉన్న ఒక గుఱ్ఱం కనిపిం
చింది. దాని రౌతు పేరు “మృత్యువు.”* మృత్యు
లోకము వానిని అనుసరిస్తూ వాని వెనుకనే ఉంది.
భూమి నాల్గవ వంతుపై అతనికి అధికారం యివ్వ
బడింది. కత్తితో, కరువుతో, తెగులుతో, క్రూర మృగా
లతో భూనివాసులను చంపటానికి అతనికి అధికారం
యివ్వబడింది.
9ఆ గొఱ్ఱెపిల్ల ఐదవ ముద్రను తీసినప్పుడు, వధింప
బడిన ఆత్మల్ని బలిపీఠం క్రింద చూసాను. వీళ్ళు
దేవుని సందేశాన్ని బోధించటం వల్ల మరియు సాక్ష్యం
చెప్పటం వల్ల వధింపబడిన వాళ్ళు. 10వాళ్ళు పెద్ద
స్వరంతో, “మహా ప్రభూ! నీవు పరిశుద్ధుడవు, సత్య
వంతుడవు. ఈ భూమ్మీద నివసించే వాళ్ళపై తీర్పు
చెప్పటానికి, మా రక్తము నిమిత్తము పగ తీర్చుకోవ
టానికి యింకా ఎంతకాలం పడ్తుంది?” అని అన్నారు.
11ఆ తర్వాత ప్రతీ ఒక్కరికి ఒక తెల్లటి వస్త్రం
యివ్వబడింది. ‘మీరు చంపబడినట్లే, మీ తోటి సేవ
కులు, సోదరులు చంపబడతారు. వాళ్ళ సంఖ్య ముగిసే
వరకు మీరు మరికొంత కాలం కాచుకొని ఉండాలి’
అని వాళ్ళకు తెలుపబడింది.
12ఆయన ఆరవ ముద్రను విప్పుతూ ఉంటే నేను
చూసాను. ఒక పెద్ద భూకంపం కలిగింది. గొఱ్ఱె
బొచ్చుతో చేసిన గొంగళి లాగా, సూర్యగోళం నల్లగా
మారిపోయింది. పున్నమి చంద్రబింబం ఎఱ్ఱటి రక్తంలా
మారిపోయింది. 13తీవ్రంగా గాలి వీచినప్పుడు, కాలం
కాని కాలంలో కాచిన అంజూరపు పండ్లు క్రింద పడి
నట్లు, ఆకాశంలో ఉన్న నక్షత్రాలు భూమ్మీద పడ్డాయి.
14ఆకాశం కాగితంలా చుట్టుకు పోయి మాయమై
పోయింది. అన్ని పర్వతాలు, ద్వీపాలు స్థానం తప్పినవి.
15అప్పుడు ఈ భూమిని పాలించే రాజులు, యువ
రాజులు, సైన్యాధిపతులు, శ్రీమంతులు, శక్తివంతులు,
బానిసలు, బానిసలుకాని వాళ్ళు గుహల్లో, పర్వాతాలపై
ఉన్న రాళ్ళ మధ్య దాక్కొన్నారు. 16వాళ్ళు పర్వతా
లను, రాళ్ళను పిలుస్తూ, “మాకు అడ్డంగా పడి
మమ్మల్ని సింహాసనంపై కూర్చొన్న వానినుండి, ఆ
గొఱ్ఱెపిల్ల కోపం నుండి కాపాడండి” అని అన్నారు.
17“ఆయన ఆగ్రహం చూపించే గొప్పదినం
వచ్చింది! దాన్ని ఎవరు ఎదుర్కోగలరు?”

### దేవుని సేవకులు రక్షింపబడతారు

7 ఇది జరిగిన తర్వాత భూమి నాలుగు మూలలా
నలుగురు దేవదూతలు నిలబడి ఉండటం
చూసాను. వాళ్ళు భూమ్మీద, సముద్రం మీద, చెట్ల
మీద, గాలివీయకుండా భూమి యొక్క నలుదిశలనుండి
వీచే గాలిని పట్టుకొన్నారు. 2అతడు వారిని పిలిచాడు.
ఈ నలుగురి దూతలకు భూమికి, సముద్రానికి హాని
చేయగల శక్తి ఉంది. మరొక దూత తూర్పునుండి
రావటం చూసాను. అతని దగ్గర చిరంజీవి అయిన
దేవుని ముద్ర ఉంది. 3అతడు బిగ్గరగా ఆ నలుగురి
దూతలతో, “దేవుని సేవకుల నొసళ్ళపై ముద్ర వేసే
వరకు, భూమికి గాని, సముద్రానికి గాని, చెట్లకు గాని
హాని కలిగించకండి” అని అన్నాడు. 4ఆ తర్వాత
ముద్రలు వేయబడ్డవారి సంఖ్య నాకు వినబడింది.
వాళ్ళ సంఖ్య మొత్తం ఒక లక్ష నలభై నాలుగు వేలు.
వీళ్ళందరు ఇశ్రాయేలు జనాంగం. అన్ని గోత్రాలకు
చెందిన వాళ్ళు. 5యూదా గోత్రం నుండి పన్నెండు
వేలమందికి, రూబేను గోత్రం నుండి పన్నెండు వేల
మందికి, గాదు గోత్రం నుండి పన్నెండు వేలమందికి,
6ఆషేరు గోత్రం నుండి పన్నెండు వేలమందికి, నఫ్తాలి
గోత్రం నుండి పన్నెండు వేలమందికి, మనష్షే గోత్రం
నుండి పన్నెండు వేలమందికి, 7షిమ్యోను గోత్రం
నుండి పన్నెండు వేలమందికి, లేవి గోత్రం నుండి
పన్నెండు వేలమందికి, ఇశ్శాఖారు గోత్రం నుండి
పన్నెండు వేలమందికి, 8జెబూలూను గోత్రం నుండి
పన్నెండు వేలమందికి, యోసేపు గోత్రం నుండి
పన్నెండు వేలమందికి, బెన్యామీను గోత్రం నుండి
పన్నెండు వేలమందికి, ముద్ర వేయబడింది.
9దీని తర్వాత ఎవ్వరూ లెక్క వెయ్యలేని ఒక పెద్ద
ప్రజల గుంపు నాముందు కనిపించింది. వాళ్ళలో ప్రతి
దేశానికి చెందిన వాళ్ళు ఉన్నారు. ప్రతి భాషకు చెందిన
వాళ్ళు ఉన్నారు. వాళ్ళు తెల్లటి దుస్తులు వేసుకొని,
చేతుల్లో ఖర్జూర మట్టలు పట్టుకొని ఉన్నారు. వాళ్ళు
సింహాసనం ముందు, గొఱ్ఱెపిల్ల ముందు నిలబడి
ఉండటం నాకు కనిపించింది. 10వాళ్ళందరు, “సింహాస
నంపై కూర్చొన్న మన దేవునికి, మన గొఱ్ఱెపిల్లకు,
జయము!” అని బిగ్గరగా అన్నారు. 11సింహాసనం
చుట్టూ, పెద్దల చుట్టూ ఆ నాలుగు ప్రాణుల చుట్టూ
దేవదూతలు నిలబడి ఉన్నారు. వాళ్ళు సింహాసనం
ముందు సాష్టాంగపడి దేవుణ్ణి స్తుతించటం మొదలు
పెట్టారు. 12“ఆమేన్! మన దేవుణ్ణి స్తుతించుదాం!
ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకొందాం. ఆయనలో
తేజస్సు, జ్ఞానము, గౌరవము, అధికారము, శక్తి చిరకాలం
ఉండుగాక! ఆమేన్!”

---

**మృత్యువు** ఈ పదానికి ఉపయోగించబడిన గ్రీకు పదం “రోగం” అనే అర్థాన్ని కూడా ఇస్తుంది.

13పెద్దల్లో ఒకడు నాతో, “తెల్లటి దుస్తులు వేసు
కొన్న వాళ్ళెవరు? ఎక్కడినుండి వచ్చారు?” అని
అడిగాడు.
14“అయ్యా! మీకే తెలియాలి!” అని నేను
సమాధానం చెప్పాను.
“అనేకమైన కష్టాలు అనుభవించిన వాళ్ళు వీళ్ళే.
తమ దుస్తుల్ని గొఱ్ఱెపిల్ల రక్తంలో ఉతికి శుభ్రం చేసు
కొన్నారు. 15అందువల్ల వాళ్ళు దేవుని సింహాసనం
ముందున్నారు. రాత్రింబగళ్ళు ఆయన మందిరంలో
ఉండి ఆయన సేవ చేస్తున్నారు. ఆ సింహాసనంపై
కూర్చొన్న వాడు వాళ్ళందరిపై తన గుడారం కప్పు
తాడు. 16వాళ్ళకిక మీదట ఆకలి కలుగదు. దాహం
కలుగదు. సూర్యుడు తన ఎండతో వాళ్ళను మాడ్చడు.
వాళ్ళకు ఏ వేడీ తగులదు. 17సింహాసనంపై కూర్చొన్న
గొఱ్ఱెపిల్ల వాళ్ళ కాపరిగా ఉంటాడు. ఆయన సజీవమైన
నీటి ఊటల దగ్గరకు వాళ్ళను పిలుచుకు వెళతాడు.
దేవుడు వాళ్ళ కళ్ళనుండి కారే ప్రతీ కన్నీటి బొట్టును
తుడిచి వేస్తాడు.”

8 ఆయన ఏడవ ముద్ర విప్పినప్పుడు పరలోకంలో
అరగంటదాకా నిశ్శబ్దంగా ఉండెను. 2దేవుని
ముందు నిలబడి ఉన్న ఆ ఏడుగురు దేవదూతల్ని
చూసాను. వాళ్ళకు ఏడు బూరలు యివ్వబడ్డాయి.
3బంగారు ధూపార్తి పట్టుకొన్న మరొక దూత వచ్చి
ధూప వేదిక ముందు నిలుచున్నాడు. సింహాసనం
ముందున్న ధూప వేదికలో ధూపం వేయటానికి అత
నికి ఎన్నో ధూపద్రవ్యాలు యివ్వబడ్డాయి. పవిత్రుల
ప్రార్థనలతో ధూపం వేయబడింది. 4దూత వేసిన
సుగంధ ధూపము, పవిత్రుల ప్రార్థనలతో పాటు దేవు
నికి అందింది. 5దూత ధూపార్తిని తీసుకొని ధూప
వేదికలో ఉన్న నిప్పు అందులో ఉంచి దాన్ని భూమ్మీ
దకు విసిరి వేసాడు. దాంతో ఉరుములు, పెద్దగర్జనలు,
మెరుపులు, భూకంపాలు కలిగాయి.

### ఏడు బూరలు

6ఏడు బూరలు పట్టుకొన్న ఆ ఏడుగురు దూతలు
ఆ బూరలు ఊదటానికి సిద్ధపడ్డారు.
7మొదటి దూత బూర ఊదాడు. వెంటనే రక్తంతో,
నిప్పుతో కూడిన వడగండ్లు భూమ్మీదికి విసిరివేయబ
డ్డాయి. భూమిపైనున్న మూడవ భాగం కాలిపోయింది.
మూడవ భాగం చెట్లు కూడా కాలిపోయాయి. పచ్చిగడ్డి
పూర్తిగా కాలిపోయింది.
8రెండవ దూత బూర ఊదాడు. ఒక మండుతున్న
పెద్ద పర్వతం లాంటిది సముద్రంలో పార వేయ
బడింది. సముద్రంలో మూడవ భాగం రక్తంగా మారి
పోయింది. 9సముద్రంలో ఉన్న ప్రాణులలో మూడవ
భాగం చనిపోయాయి. మూడవ భాగం ఓడలు నాశన
మయ్యాయి.

10మూడవ దేవదూత తన బూర ఊదాడు. ఒక
పెద్ద నక్షత్రం దివిటీలా మండుతూ ఆకాశం నుండి
వచ్చి నదుల మూడవ భాగం మీద, నీటి ఊటల మీద
పడింది. 11ఆ నక్షత్రం పేరు మాచిపత్రి.* దానివల్ల
మూడవ భాగం నీళ్ళు చేదుగా మారిపోయాయి. చేదుగా
మారిన ఆ నీటి వల్ల చాలామంది మరణించారు.
12నాలుగవ దేవదూత బూర ఊదాడు. అప్పుడు
సూర్యునిలో మూడవ భాగము, చంద్రునిలో మూడవ
భాగము, నక్షత్రాలలో మూడవ భాగము నాశన
మయ్యాయి. తద్వారా అవి చీకటిగా మారిపోయాయి.
దాని మూలంగా దినంలో మూడవ భాగం, రాత్రిలో
మూడవ భాగం చీకటితో నిండుకుపోయాయి.
13నేను ఇంకా చూస్తూనే ఉన్నాను. ఇంతలో గాలిలో
ఎగురుతున్న ఒక పెద్దపక్షి గొప్ప స్వరంతో, “భూమ్మీద
జనులకు శ్రమ! శ్రమ! శ్రమ!. ఎందుకనగా ఇంకా
ముగ్గురు దేవదూతలు ఊదబోతున్నారు” అని కేకలు
వేయటం విన్నాను.

### పాతాళం నుండి మిడుతలు

9 ఐదవ దేవదూత తన బూర ఊది నప్పుడు ఆకాశం
నుండి భూమ్మీద పడ్డ నక్షత్రాన్ని చూశాను.
పాతాళం* యొక్క తాళం చెవి ఈ నక్షత్రానికి
యివ్వబడింది. 2అతడు పాతాళాన్ని తెరిచాడు.
అప్పుడు దాన్నుండి పెద్ద పొగ లేచింది. అది ఒక
పెద్ద కొలిమి నుండి వచ్చినట్లు అనిపించింది. పాతాళం
నుండి వచ్చిన పొగవల్ల సూర్యుడు, ఆకాశం చీకటై
పోయాయి. 3ఆ పొగ నుండి మిడతలు భూమ్మీదికి
వచ్చాయి. తేళ్ళ వలె కుట్టే శక్తి ఆ మిడతలకివ్వబడింది.
4భూమ్మీద ఉండే గడ్డికి కాని, మొలకకు కాని, చెట్టుకు
కాని హాని చేయవద్దని, నుదుటిమీద దేవుని ముద్రలేని
వాళ్ళకు మాత్రమే హాని కలిగించమని ఆ మిడతలకు
చెప్పబడింది. 5మనుష్యుల్ని ఐదు నెలల దాకా
హింసించే శక్తి వాటికి యివ్వబడింది. వాళ్ళను చంపే
శక్తి వాటికి యివ్వబడలేదు కాని అవి కుట్టినప్పుడు
తేళ్ళు కుట్టినట్లు నొప్పి కలుగుతుంది. 6ఆ కాలంలో
మనుష్యులు చావే మంచిదని చావును వెతుకుతారు.
కాని వాళ్ళకది దొరకదు. వాళ్ళు చావాలని చాలా ఆశి
స్తారు. కాని చావు వాళ్ళని తప్పించుకొని వెళ్ళి పోతుంది.
7ఆ మిడుతలు యుద్ధానికి సిద్ధం చేయబడిన
గుఱ్ఱాలలా కనిపించాయి. వాటి తలలమీద బంగారు
కిరీటాల్లాంటివి ఉన్నాయి. వాటి ముఖాలు మనుష్యుల
ముఖాల్లా ఉన్నాయి. 8వాటి తలవెంట్రుకలు స్త్రీల తల
వెంట్రుకల్లా ఉన్నాయి. వాటి కోరలు సింహపు కోరల్లా

---

**మాచిపత్రి** ఇది ఒక చేదు చెట్టుయొక్క పేరు. ఇది విచారాన్ని సూచిస్తుంది.

**పాతాళం** ప్రకటన 20:1-3 చూడండి.

ఉన్నాయి. 9అవి ఇనుప కవచాలు వేసుకొని ఉన్నాయి.
వాటి రెక్కల ధ్వని గుఱ్ఱాలు, రథాలు యుద్ధానికి
వెడుతున్నప్పుడు కలిగే ధ్వనిలా ఉంది. 10వాటి తోకలు
తేళ్ళ తోకల్లా కొండ్లతో ఉన్నాయి. వాటి తోకల్లో
ఐదునెలల దాకా ప్రజల్ని హింసించే శక్తి ఉంది. 11పాతాళ
లోకపు దూత వాటికి రాజుగా ఉన్నాడు. హెబ్రూ
భాషలో వాని పేరు అబద్దోను. గ్రీకు భాషలో వాని
పేరు అపొల్లుయోను.
12మొదటి శ్రమ సమాప్తమయింది. మిగతా రెండు
శ్రమలు యింకా జరుగవలసి ఉన్నాయి.
13ఆరవ దేవదూత తన బూర ఊదాడు. దేవుని
ముందున్న బంగారు ధూపవేదిక యొక్క నాలుగు
కొనల నుండి నాకు ఒక స్వరం వినిపించింది. 14ఆ
స్వరం బూర ఊదుతున్న ఆరవ దూతతో, "యూఫ్ర
టీసు మహానది దగ్గర బంధింపబడిన నలుగురి దూతల్ని
విడుదల చేయి" అని అనింది. 15ఇదే గడియ, ఇదే
రోజు, ఇదే నెల, ఇదే సంవత్సరము, విడుదల చేయ
టానికి వాళ్ళు యింతదాకా బంధింపబడ్డారు. మనుష్యు
లలో మూడవ భాగాన్ని హతమార్చటానికి వాళ్ళు విడు
దల చేయబడ్డారు. 16ఆ రౌతులసంఖ్య ఇరవై కోట్లు
అన్నట్లు నేను విన్నాను.
17నాకు కనిపించిన రౌతులు, గుఱ్ఱాలు ఈ విధంగా
ఉన్నాయి. రౌతుల కవచాలు అగ్నివలె ఎరుపు,
ముదురు నీలం, గంధకాన్ని పోలిన పసుపు రంగుల్లో
ఉన్నాయి. గుఱ్ఱాల తలలు సింహాల తలల్లా ఉన్నాయి.
వాటి నోళ్ళనుండి మంటలు, పొగ, గంధకము బయ
టికి వచ్చాయి. 18వాటి నోళ్లనుండి వచ్చిన ఈ మూడు
పీడలు, అంటే మంటలు, పొగలు, గంధకాల వల్ల
మనుష్యులలో మూడవ భాగం హతులై పోయారు.
19ఆ గుఱ్ఱాల శక్తి వాటి నోళ్ళల్లో, తోకల్లో ఉంది.
వాటి తోకలు పాముల్లా ఉన్నాయి. ఆ తోకలకు
పాము తలలు ఉన్నాయి. వాటితో అవికాటు వేసి
బాధిస్తవి. 20ఈ మూడు పీడలు యింత నాశనం చేసినా,
మరణించని మానవజాతి తాము చేసిన పాపాలకు పశ్చా
త్తాప పడలేదు. వాళ్ళు దయ్యాల్ని పూజించటం మాను
కోలేదు. బంగారమూ, వెండి, కంచు, రాతి విగ్రహాలను,
చెక్కతో చేసిన విగ్రహాలను పూజించటం వాళ్ళు
మానుకోలేదు. ఈ విగ్రహాలు చూడకపోయినా, వినక
పోయినా, కదలక పోయినా, వాటిని పూజించటం
మానుకోలేదు. 21అంతేకాక, వాళ్ళు తాము చేసిన హత్య
లకు, మంత్రతంత్రాలకు, లైంగిక అవినీతికి, దొంగత
నాలకు మారుమనస్సు పొందలేదు.

## దేవదూత, చిన్న గ్రంథము

10 శక్తివంతుడైన మరొక దేవదూత పరలోకం
నుండి క్రిందికి రావటం చూశాను. ఆయన
మేఘాన్ని ఒక వస్త్రంగా ధరించి ఉన్నాడు. ఆయన
తలపై మేఘధనుస్సు ఉంది. ఆయన ముఖం సూర్యు
నిలా ఉంది. ఆయన కాళ్ళు మండుతున్న స్తంభాల్లా
ఉన్నాయి. 2ఆయన చేతిలో ఒక చిన్న గ్రంథం ఉంది.
అది తెరువబడి ఉంది. ఆయన తన కుడి కాలు
సముద్రం మీద ఎడమకాలు భూమ్మీద ఉంచి బిగ్గరగా
అరిచాడు. 3ఆ అరుపు సింహ ఘర్జనలా ఉంది. ఆయ
నలా అరచినప్పుడు ఏడు ఉరుములు మాట్లాడాయి.
4ఏడు ఉరుములు మాట్లాడిన వాటిని నేను వ్రాయటం
మొదలుపెట్టాను. కాని పరలోకం నుండి ఒక స్వరం
నాతో, "ఏడు ఉరుములు అన్న మాటల్ని దాచి ముద్ర
వేయి, వాటిని వ్రాయవద్దు" అని అన్నది.
5సముద్రం మీద, భూమ్మీద నిలబడి ఉన్న దూత
నేను చూస్తుండగా తన కుడి చేతిని పరలోకం వైపుకు
చాపాడు. 6చిరకాలం జీవించే వాని మీద, పరలోకం
అందులో ఉన్న వాటిని సృష్టించిన వాని మీద, భూమిని
అందులో ఉన్న వాటన్నిటినీ సృష్టించిన వాని మీద,
సముద్రాన్ని అందులోవున్న వాటన్నిటినీ సృష్టించిన
వాని మీద ప్రమాణం చేసి ఈ విధంగా అన్నాడు:
"ఇక ఆలస్యం ఉండదు. 7కాని ఏడవ దూత తన
బూర ఊదటం మొదలు పెట్టే రోజులు వచ్చినప్పుడు
దేవుని రహస్య ప్రణాళిక సమాప్తమౌతుంది. దేవుడు
తన సేవకులైన ప్రవక్తలకు ఈ రహస్యాన్ని ముందే
చెప్పాడు" అని అన్నాడు.
8నేను పరలోకం నుండి విన్న స్వరం మళ్ళీ నాతో,
"వెళ్ళు. సముద్రం మీదా, భూమ్మీదా, నిలబడి ఉన్న
దూత చేతిలో తెరువబడివున్న గ్రంథాన్ని తీసుకో!"
అని అన్నది.
9అందువల్ల, నేను దేవదూత దగ్గరకు వెళ్ళి, ఆ
చిన్న గ్రంథాన్నివ్వమని అడిగాను. ఆయన నాతో,
"ఇది తీసుకొని తిను. అది నీ కడుపుకు చేదు కలిగి
స్తుంది. కాని నీ నోటికి తేనెలా మధురంగా ఉంటుంది"
అని అన్నాడు. 10నేనా చిన్న గ్రంథాన్ని, దూత
చేతినుండి తీసుకొని తినివేసాను. అది నా నోటికి
తేనెలా మధురంగా ఉండెను. కాని అది తిన్నాక నా
కడుపుకు చేదుగానుండెను.11ఆ తర్వాత ఆ దూత
నాతో, "నీవు చాలా మంది ప్రజల్ని, గురించి, దేశాల్ని
గురించి, రాజుల్ని గురించి మళ్ళీ ప్రవచనం చెప్పాలి"
అని అన్నాడు.

## ఇద్దరు సాక్షులు

11 ఒక దేవదూత ఒక కొలత బద్ద లాంటిది నాకిచ్చి
ఈ విధంగా అన్నాడు: వెళ్ళు. దేవుని మంది
రాన్ని, బలిపీఠాన్ని కొలత వేయి. ఎంతమంది ప్రజలు
ఆరాధిస్తున్నారో కూడా లెక్కపెట్టు. 2కాని వెలుపలి
ఆవర్ణం, యూదులుకాని వాళ్ళకివ్వబడింది. కనుక
దాన్ని కొలత వేయకుండా వదిలేయి. వాళ్ళు నలభై
రెండు నెలలు దాకా ఈ పవిత్ర నగరాన్ని త్రొక్కుతూ

నడుస్తారు. 3నేను నా యిరువురి సాక్షులకు శక్తినిస్తాను.
వాళ్ళు గోనె పట్ట కట్టుకొని పన్నెండువందల అరువది
దినాల దాకా దైవ సందేశం చెబుతారు. 4రెండు ఒలీవ
వృక్షాలు, రెండు దీపస్తంభాలు ఆ సాక్షులు. ఇవి ఈ
భూమిని పాలించే దేవుని సమక్షంలో ఉన్నాయి. 5వారికి
హాని కలిగించాలని ఎవరైనా ప్రయత్నం చేస్తే వాళ్ళ
నోళ్ళనుండి మంటలు వచ్చి, తమ శత్రువుల్ని మ్రింగి
వేస్తాయి. వారికి హాని తల పెట్టిన వాళ్ళు ఈ విధంగా
మరణిస్తారు. 6తాము దేవుని సందేశం బోధించే
కాలంలో వర్షం కురియకుండా చేయటానికి వాళ్ళు
ఆకాశాన్ని మూసి వేస్తారు. వాళ్ళకా శక్తి ఉంది. అంతేకాక,
నీళ్ళను రక్తంగా మార్చగల శక్తి కూడా వాళ్ళకు ఉంది.
రకరకాల తెగుళ్ళను తమకు యిష్టం వచ్చినప్పుడు
ప్రపంచంలో వ్యాపింప చేయగల శక్తి కూడా వాళ్ళకు
ఉంది.

7వాళ్ళు తమ సందేశం చెప్పటం ముగించాక,
మృగం పాతాళంనుండి మీదికి వచ్చి, వాళ్ళతో యుద్ధం
చేసి వాళ్ళను ఓడించి చంపి వేస్తుంది. 8వాళ్ళ దేహాలు
మహానగరపు వీధుల్లో పడి ఉంటాయి. ఈ మహానగరం
సొదొమతో, ఈజిప్టుతో పోల్చబడింది. ఇక్కడ ప్రభువు
సిలువకు వేయబడ్డాడు. 9మూడున్నర రోజులు ప్రతీ
దేశానికి, ప్రతీ జాతికి, ప్రతీ భాషకు, ప్రతీ గుంపుకు
చెందిన ప్రజలు, ఆ శవాలను చూస్తారు. వాళ్ళు వాటిని
సమాధి చేయటానికి నిరాకరిస్తారు. 10ఈ యిరువురు
ప్రవక్తలు భూమ్మీద నివసిస్తున్న వాళ్ళకు కష్టాలు కలి
గించారు. కనుక ప్రజలు ఆ ప్రవక్తలు మరణించటం
చూసి ఆనందించారు. పరస్పరం కానుకలు పంపు
కున్నారు. వేడుకలు చేసుకొన్నారు.

11కాని మూడున్నర రోజుల తర్వాత దేవుడు ప్రవ
క్తల్లో మళ్ళీ ప్రాణం పోశాడు. వాళ్ళు లేచి నిలుచు
న్నారు. వీళ్ళను చూసిన ప్రజలు చాలా భయపడి
పోయారు. 12అప్పుడు పరలోకంనుండి ఒక స్వరం
బిగ్గరగా, “మీదికి రండి” అని అనటం వాళ్ళు విన్నారు.
శత్రువులు చూస్తుండగా, వాళ్ళు ఒక మేఘం మీద పర
లోకానికి వెళ్ళిపోయారు.

13అదే క్షణంలో ఒక పెద్ద భూకంపం వచ్చింది.
పట్టణంలో పదవ భాగం నాశనమైపోయింది. భూ
కంపం వల్ల సుమారు ఏడువేల మంది మరణించారు.
బ్రతికున్న వాళ్ళు చాలా భయపడిపోయి పరలోకంలో
ఉన్న దేవుణ్ణి స్తుతించారు.

14రెండవ శ్రమ ముగిసింది. మూడవ శ్రమ త్వరలో
జరుగనుంది.

## ఏడవ బూర

15ఏడవ దేవదూత తన బూర ఊదాడు. పరలోకం
నుండి అనేక స్వరాలు యిలా బిగ్గరగా అనటం విని
పించింది:

> “ప్రపంచంమన ప్రభువు రాజ్యంగా మారింది.
> ఆయన క్రీస్తు రాజ్యంగా మారింది. ఆయన
> చిరకాలం రాజ్యం చేస్తాడు.”

16దేవుని సమక్షంలో సింహాసనాలపై కూర్చొన్న
యిరువది నాలుగు మంది పెద్దలు సాష్టాంగపడ్డారు.
17వాళ్ళు దేవుణ్ణి పూజిస్తూ ఈ విధంగా అన్నారు:

> “ప్రభూ! సర్వ శక్తివంతుడవైన దైవమా!
> నీవు ప్రస్తుతం ఉన్నావు. గతంలో ఉన్నావు.
> నీ గొప్పశక్తిని ఉపయోగించి మళ్ళీ పాలిం
> చటం మొదలుపెట్టావు. కనుక నీకు మా
> కృతజ్ఞతలు!
> 18 దేశాలు ఆగ్రహం చెందాయి. ఇప్పుడు నీకు
> ఆగ్రహం వచ్చింది. చనిపోయిన వాళ్ళపై
> తీర్పు చెప్పే సమయం వచ్చింది. నీ సేవ
> కులైన ప్రవక్తలకు ప్రతిఫలం యిచ్చే
> సమయం వచ్చింది. నీ పవిత్రులకు, నీ
> నామాన్ని గౌరవించే వాళ్ళకు, సామాన్యు
> లకు పెద్దలకు, అందరికీ ప్రతిఫలం యిచ్చే
> కాలం వచ్చింది. భూమిని నాశనం చేసే
> వాళ్ళను నాశనం చేసే కాలం వచ్చింది.”

19అప్పుడు పరలోకంలో ఉన్న దేవుని మందిరం
తెరువబడింది. ఆ మందిరంలో ఉన్న ఆయన పరి
శుద్ధమైన ఒడంబడిక మందసం కనిపించింది. అప్పుడు
మెరుపులు, గర్జనలు, ఉరుములు, భూకంపము, పెద్ద
వడగండ్లవాన వచ్చాయి.

## స్త్రీ, ఘటసర్పం

12 పరలోకంలో ఒక గొప్ప అద్భుతమైన దృశ్యం
కనిపించింది. సూర్యుణ్ణి తన వస్త్రంగా,
చంద్రుణ్ణి తన పాదాల క్రింద, పన్నెండు నక్షత్రాల
కిరీటాన్ని తలపై పెట్టుకొన్న ఒక స్త్రీ కనిపించింది.
2ఆమె గర్భంతో ఉంది. ప్రసవించే సమయం రావటం
వల్ల ఆమె నొప్పులతో బిగ్గరగా కేక వేసింది. 3అప్పుడు
పరలోకంలో ఇంకొక దృశ్యం కనిపించింది. ఒక పెద్ద
ఘటసర్పం, ఏడు తలలతో, పది కొమ్ములతో కని
పించింది. అది ఎర్రగా ఉంది. అ ఏడు తలలమీద
ఏడు కిరీటాలు ఉన్నాయి. 4ఆ ఘటసర్పం తన తోకతో
ఆకాశం నుండి నక్షత్రాలలో మూడవభాగాన్ని ఊడ్చి,
వాటిని భూమ్మీదికి పారవేసింది. ఆ స్త్రీ ప్రసవించిన
వెంటనే శిశువును మ్రింగి వేద్దామని, ఆ ఘటసర్పం
ప్రసవించబోయే ఆ స్త్రీ ముందు నిలబడివుంది. 5ఆమె
ఒక మగశిశువును ప్రసవించింది. ఆ బాలుడు దేశాలను
గొప్ప అధికారంతో పాలిస్తాడు. ఆ శిశువును ఎవరో

ఎత్తుకొని దేవుని సింహాసనం దగ్గరకు తీసుకు వెళ్ళారు.
6ఆ స్త్రీ ఎడారి ప్రాంతానికి పారిపోయింది. ఆమెను
పన్నెండు వందల అరువది రోజులదాకా జాగ్రత్తగా
చూసుకోవటానికి దేవుడు ఒక స్థలం ఏర్పాటు చేశాడు.
7పరలోకంలో ఒక యుద్ధంజరిగింది. మిఖాయేలు,
అతని దూతలు, ఘటసర్పంతో యుద్ధం చేసారు.
ఘటసర్పం తనదూతలతో తిరిగి యుద్ధం చేసింది.
8ఆ ఘటసర్పానికి తగినంత శక్తి ఉండనందువల్ల ఓడి
పోయిపరలోకంలో వాటి స్థానాన్ని పోగొట్టుకొన్నాయి.
9వాళ్ళు ఆ ఘటసర్పాన్ని భూమ్మీదికి త్రోసి వేశారు.
ఇది ప్రపంచాన్ని తప్పుదారి పట్టించే ఆది సర్పం.
చాలాకాలం నుండి ఉన్న ఈ ఘటసర్పానికి దయ్యమని,
సైతాను అని పేరు. ఆ ఘటసర్పాన్ని, దాని దూతల్ని
వాళ్ళు క్రిందికి త్రోసి వేశారు.
10పరలోకం నుండి ఒక పెద్దస్వరం బిగ్గరగా యిలా
అనటం విన్నాను: “మనదేవుని ముందు మన సోద
రుల్ని రాత్రింబగళ్ళు నిందించే వాడు క్రిందికి త్రోసి
వేయబడ్డాడు. అందుకే మన దేవుని రాజ్యం వచ్చింది.
రక్షణ శక్తి లభించింది. ఆయన క్రీస్తుకు అధికారం
వచ్చింది. 11గొఱ్ఱెపిల్ల రక్తంతో, తాము బోధించిన
సత్యంతో మన సోదరులు వాణ్ణి ఓడించారు. వాళ్ళు
తమ జీవితాల్ని, చావుకు భయపడేటంతగా ప్రేమించ
లేదు. 12కనుక పరలోకమా! ఆనందించు. పరలోకంలో
ఉన్న ప్రజలారా! ఆనందించండి. ప్రపంచమా! నీలో
సైతాను ప్రవేశించాడు కనుక నీకు శాపం కలుగుతుంది!
సముద్రమా! నీకు శాపం కలుగుతుంది! సైతానుకు
తన కాలం తీరిందని తెలుసు. కనుక వాడు చాలా
కోపంతో ఉన్నాడు.”
13ఘటసర్పం తాను భూమ్మీదకు విసిరివేయ
బడటం గమనించి మగశిశువును ప్రసవించిన స్త్రీని
వెంటాడింది. 14ఆమెకోసం ఎడారి ప్రాంతంలో
ఏర్పాటు చేయబడిన స్థలానికి ఆమె ఎగిరిపోవటానికి,
దేవుడు ఆమెకు రెండు పక్షిరాజు రెక్కల్ని యిచ్చాడు.
అక్కడ ఆ ఘటసర్పానికి దూరంగా ఆమె మూడున్నర
సంవత్సరాలు జాగ్రత్తగా పోషించబడుతుంది. 15ఆ
సర్పం తన నోటినుండి నీళ్ళను వదిలింది. ఆ నీళ్ళు
ఒక నదిలా ప్రవహించాయి. ఆ నీళ్ళు ఆమెను కొట్టుకు
పోయేటట్లు చేయాలని ఆ ఘటసర్పం ప్రయత్నిం
చింది.
16కాని భూమి తన నోరు తెరిచి ఘటసర్పం కక్కిన
నీటిని త్రాగి ఆ స్త్రీని రక్షించింది. 17ఆ స్త్రీని చూసి
ఘటసర్పానికి చాలా కోపం వచ్చింది. అది ఆమె
యొక్క మిగతా సంతానంతో యుద్ధం చేయాలని
వెళ్ళింది. దేవుని ఆజ్ఞలను పాటిస్తూ యేసును గురించి
సాక్ష్యం చెప్పింది ఈమె మిగతా సంతానమే.
18వారితో యుద్ధంచేయుటకై ఆ ఘట సర్పం
సముద్రతీరం దగ్గర నిలుబడి ఉంది.

### సముద్రం నుండి మృగం రావటం

13 సముద్రం నుండి ఒక మృగం రావటం నేను
చూసాను. దానికి పది కొమ్ములు, ఏడు తలలు
ఉన్నాయి. ఆ పది కొమ్ములమీద పది కిరీటాలు
ఉన్నాయి. ప్రతి తలపై ఒక దేవ దూషణ పేరు
వ్రాయబడి ఉంది. 2నేను చూసిన ఆ మృగం ఒక
చిరుత పులిలా ఉంది. కాని దాని కాళ్ళు ఎలుగుబంటి
కాళ్ళలా ఉన్నాయి. దాని నోరు సింహం నోరులా
ఉంది. ఆ ఘటసర్పం ఆ మృగానికి తన శక్తిని, తన
సింహాసనాన్ని, గొప్ప అధికారాన్ని యిచ్చింది. 3ఆ
మృగానికి ఉన్న తలల్లో ఒక తలకు ప్రమాదకరమైన
గాయం ఉన్నట్లు కనిపించింది. కాని ఆ ప్రమాద కరమైన
గాయం మానిపోయింది. ప్రపంచమంతా ఆశ్చర్యపడి
ఆ మృగాన్ని అనుసరించింది. 4ఘటసర్పం ఆ మృగానికి
అధికారమిచ్చినందువల్ల మానవులు ఆ ఘటసర్పాన్ని
పూజించారు. వాళ్ళు మృగాన్ని కూడా పూజిస్తూ,
“మృగం వలె ఎవరున్నారు? మృగంతో ఎవరు యుద్ధం
చేయగలరు?” అని అన్నారు.
5గర్వంగా మాట్లాడటానికి, దైవ దూషణ చేయటా
నికి, తన అధికారాన్ని నలుబది రెండు నెలలు చెలాయిం
చడానికి ఆ మృగానికి నోరు యివ్వబడింది. 6ఆ మృగం
తన నోరు తెరచి దేవుణ్ణి దూషించింది. ఆయన
నామాన్ని, ఆయన నివసించే స్థానాన్ని, పరలోకంలో
నివసించే వాళ్లను దూషణ చేసింది. 7భక్తులతో యుద్ధం
చేసి జయించటానికి దానికి శక్తి యివ్వబడింది.
అంతేకాక, అన్ని జాతుల మీద, అన్ని గుంపుల మీద,
అన్ని భాషల మీద, అన్ని దేశాల మీద ఆ మృగానికి
అధికారమివ్వబడింది. 8ఈ భూమ్మీద నివసించే
వాళ్ళంతా, అంటే ప్రపంచం సృష్టింపబడిన నాటినుండి
ఎవరి పేర్లు వధింపబడిన గొఱ్ఱెపిల్ల జీవ గ్రంథంలో
వ్రాయబడలేదో, వాళ్ళు ఈ మృగాన్ని పూజిస్తారు.
9చెవులున్న వాళ్ళు వినండి:

10 బంధింపబడవలసిన వాడు బంధింపబడ
తాడు. కత్తితో వధింపబడవలసిన వాడు
వధింపబడతాడు. కనుక భక్తుల్లో శాంతము,
విశ్వాసము ఉండాల్సి వస్తుంది.

### భూమినుండి మృగం రావటం

11తదుపరి మరొక మృగం భూమిలోపలి నుండి
రావటం చూసాను. ఆ మృగానికి గొఱ్ఱెకు ఉన్నట్లు
రెండు కొమ్ములు ఉన్నాయి. కాని అది ఘటసర్పం
మాట్లాడినట్లు మాట్లాడింది. 12అది ప్రమాదకరమైన
గాయం నయమైన మొదటి మృగం పక్షాన, దాని అధి
కారమంతా ఉపయోగించి భూమిని, దానిపై నివసించే
వాళ్ళను, మొదటి మృగాన్ని పూజించేటట్లు చేసింది.
13అది అద్భుతమైన సూచనలు చూపింది. ప్రజలు

చూస్తుండగా ఆకాశం నుండి మంటల్ని కూడా భూమ్మీ
దికి రప్పించింది. 14మొదటి మృగం పక్షాన సూచనలు
చూపటానికి దానికి అధికారమివ్వబడింది. ఈ అధికా
రంతో అది భూమ్మీద నివసించే వాళ్ళను మోసం
చేస్తోంది. కత్తితో గాయపడికూడా జీవించిన మృగానికి
గౌరవార్థంగా ఒక విగ్రహాన్ని స్థాపించమని ప్రజల్ని ఆజ్ఞా
పించింది. 15మొదటి మృగం యొక్క విగ్రహానికి
ప్రాణం పోసే శక్తి యివ్వబడింది. ఆ విగ్రహం మాట్లాడి,
తనను పూజించటానికి నిరాకరించిన వాళ్ళను చంపే
టట్లు చేసింది. 16అంతేకాక చిన్నా, పెద్దా, ధనికుడూ,
పేదవాడు, బానిస, స్వతంత్రుడు అనే భేదం లేకుండా
ప్రతి ఒక్కడూ తన కుడి చేతి మీదగాని, నుదుటిమీద
గాని, ఒక ముద్ర వేసుకోవాలని నిర్బంధం చేసింది.
17ఈ ముద్ర లేకుండా ఎవ్వరూ అమ్మటం కాని,
కొనటం కాని, చేయరాదని యిలా చేసింది. ఈ ముద్ర
లలో ఆ మృగం పేరు, లేక వాని పేరు సంఖ్య వ్రాయబడి
ఉంది. 18ఇక్కడే తెలివి కావాలి. ఆ పరిజ్ఞానం ఉన్నవాడు
ఆ మృగం యొక్క సంఖ్య ఏదో చెప్పనీ! ఎందుకంటే
అది ఒక మనుష్యుని సంఖ్య. వాని సంఖ్య ఆరువందల
అరువదియారు.

### గొఱ్ఱెపిల్ల మరియు లక్ష నలభైనాలుగువేలు

14 అప్పుడు నేను చూశాను. నా ముందు ఆ
గొఱ్ఱెపిల్ల కనబడినాడు. ఆయన సీయోను
పర్వతంపై నిలబడి ఉన్నాడు. ఆయనతో ఒకలక్షా
నలుబది నాలుగు వేల మంది ఉన్నారు. వాళ్ళ
నొసళ్ళపై ఆయన పేరు, ఆయన తండ్రి పేరు వ్రాయ
బడి ఉంది. 2పరలోకం నుండి నాకొక శబ్దం వినిపిం
చింది. ఆయన ధ్వని జలపాతపు ధ్వనిలా, పెద్ద ఉరుము
ధ్వనిలా ఉంది. నేను విన్న ఆ ధ్వని వీణను మీటి
నప్పుడు కలిగే ధ్వనిలా ఉంది.
3వాళ్ళు సింహాసనం ముందు, ఆ నాలుగు ప్రాణుల
ముందు, పెద్దల ముందు నిలబడి ఒక క్రొత్త పాట
పాడారు. భూలోకం నుండి విమోచించబడ్డ ఒక లక్షా
నలువది నాలుగు వేల మంది తప్ప యితరులు ఆ
పాట నేర్చుకోలేక పోయారు. 4వీళ్ళు స్త్రీ సంపర్కంతో
మలినం కాకుండా పవిత్రంగా ఉన్నవాళ్ళు. వీళ్ళు గొఱ్ఱె
పిల్ల ఎక్కడికి వెళ్ళినా ఆయన్ని అనుసరించే వాళ్ళు.
వీళ్ళు మానవులనుండి కొనుక్కోబడి ప్రథమ ఫలంగా
దేవునికి, గొఱ్ఱెపిల్లకు ప్రత్యేకింపబడినవాళ్ళు. 5వీళ్ళ
మాటల్లో అసత్యం లేదు. వీళ్ళు నిర్దోషులు.

### ముగ్గురు దూతలు

6ఆ తర్వాత మరొక దూత మధ్యాకాశంలో ఎగ
రటం చూసాను. ప్రపంచంలో నివసించే ప్రజలందరికీ,
అంటే ప్రతీ దేశానికి, ప్రతీ జాతికి, ప్రతీ భాషకు ప్రతీ
గుంపుకు చెందిన ప్రజలకు ప్రకటించటానికి అతని
దగ్గర "అనంత జీవితాన్ని" గురించిన సువార్త ఉంది.
7అతడు బిగ్గరగా, "దేవునికి భయపడండి. ఆయన
మహిమను స్తుతించండి. ఆయన తీర్పు చెప్పే గడియ
దగ్గరకు వచ్చింది. ఆకాశాన్ని, భూమిని, సముద్రాన్ని,
నీటి ఊటలను సృష్టించిన వాణ్ణి పూజించండి" అని
అన్నాడు.
8రెండవ దూత మొదటి దూతను అనుసరిస్తూ,
"బాబిలోను పతనమైపోయింది. బాబిలోను మహా
నగరం పతనమైపోయింది. 'వ్యభిచారం' అనబడే
మద్యాన్ని దేశాలకు త్రాగించింది ఇదే" అని అన్నాడు.
9మూడవ దూత మొదటి యిద్దరిని అనుసరిస్తూ
బిగ్గరగా, "మృగాన్ని గాని, దాని విగ్రహాన్ని గాని పూజించి
దాని ముద్రను నుదుటిమీద గాని, చేతిమీదకాని
వేయించు కొన్నవాడు దేవుని కోపమనే మద్యాన్ని
త్రాగక తప్పదు. 10ఈ మద్యం దేవుని ఆగ్రహం అనబడే
గిన్నెలో పూర్తి ఘాటుతో చేయబడింది. అంతేకాక
పరిశుద్ధమైన దూతల ముందు, గొఱ్ఱెపిల్ల ముందు
మండుతున్న గంధకంతో వానిని హింసిస్తారు. 11వాళ్ళు
కాలటం వల్ల రగులుతున్న పొగ చిరకాలం లేస్తూనే
ఉంటుంది. మృగాన్ని గాని, దాని విగ్రహాన్ని గాని
పూజించే వాళ్ళకు, లేక దాని పేరును ముద్రగా పొందిన
వాళ్ళకు పగలు, రాత్రి విరామం ఉండదు" అని
అన్నాడు. 12అంటే దేవుని ఆజ్ఞలను పాటించే పవిత్రులు
యేసుపట్ల విశ్వాసం ఉన్నవాళ్ళు సహనంగా ఉండాలి.
13ఆ తదుపరి పరలోకం నుండి ఒక స్వరం, "ఇది
వ్రాయి. ఇప్పటి నుండి ప్రభువులో చనిపోయిన వాళ్ళు
ధన్యులు" అని అన్నది.
"అది నిజం. వాళ్ళకిక విశ్రాంతి ఉంటుంది. ఇది
వరకు వాళ్ళు చేసిన మంచిపనులు వాళ్ళ వెంట
ఉంటాయి" అని పరిశుద్ధాత్మ అన్నాడు.

### భూమ్మీద పంట కోత

14ఒక తెల్లటి మేఘం నాముందు కనిపించింది.
దానిమీద "మనుష్య కుమారుని"* లాంటివాడు
కూర్చొనివుండటం చూశాను. ఆయన తలపై బంగారు
కిరీటం ఉంది. ఆయన చేతిలో పదునైన కొడవలి
ఉంది 15ఆ తర్వాత మందిరం నుండి మరొక దూత
వచ్చాడు. అతడు బిగ్గరగా మేఘం మీద కూర్చొన్నవాణ్ణి
పిలిచి, "భూమ్మీద పంట పండింది. పంటను కోసే
సమయం వచ్చింది. నీ కొడవలి తీసుకొని పంటను
కోయి!" అని అన్నాడు. 16మేఘంమీద కూర్చొన్న
వాడు తన కొడవలిని భూమ్మీదికి విసిరాడు. వెంటనే
ఆ కొడవలి పంటను కోసింది.

---

**మనుష్య కుమారుని** ఇది యేసు క్రీస్తు యొక్క మరోపేరు. యేసు కొన్నిసార్లు తనను గురించి మాట్లాడుతూ ఈ పదాన్ని ఉపయోగించాడు. దానియేలు 7:13-14.

[17]పరలోకంలో ఉన్న మందిరంనుండి యింకొక
దూత వచ్చాడు. అతని దగ్గర కూడా ఒక పదునైన
కొడవలి ఉంది. [18]మరొకదూత బలిపీఠం నుండి
వచ్చాడు. అగ్నికి అధికారియైన యితడు బిగ్గరగా పదు
నైన కొడవలి ఉన్నవాణ్ణి పిలుస్తూ, "ద్రాక్ష పండింది.
నీ పదునైన కొడవలి తీసుకెళ్ళి భూమ్మీదవున్న ద్రాక్షా
తోటనుండి ద్రాక్షా గుత్తుల్ని కోయి" అని అన్నాడు.
[19]ఆ దూత కొడవలిని భూమ్మీదికి విసిరి ద్రాక్షా
పండ్లు కోసి వాటిని దేవుని కోపం అనబడే పెద్ద
తొట్టిలో వేసాడు. [20]ఊరికి అవతలవున్న ద్రాక్షా
తొట్టిలో ద్రాక్షాపళ్ళను వేసి వాటిని త్రొక్కారు.
దాన్నుండి రక్తం ప్రవహించింది. ఆ రక్తం గుఱ్ఱం నోటి
కళ్ళెం అంత ఎత్తు లేచి, సుమారు రెండు వందల
మైళ్ళదూరందాకా ప్రవహించింది.

## ఏడు తెగుళ్ళతో ఏడుగురు దూతలు

15 నేను పరలోకంలో యింకొక అద్భుతమైన
దృశ్యం చూశాను. ఏడుగురు దూతలు ఏడు
చివరి తెగుళ్ళు పట్టుకొని ఉండటం చూశాను. వీటితో
దేవుని కోపం సమాప్తమౌతుంది. కనుక యివి చివరివి.
[2]నిప్పుతో కలిసిన గాజు సముద్రం లాంటి ఒక
సముద్రం నాకు కనిపించింది. మృగాన్ని, దాని
విగ్రహాన్ని జయించిన వాళ్ళు దాని నామానికున్న
సంఖ్యను జయించిన వాళ్ళు సముద్రతీరం మీద నిల
బడి ఉండటం చూసాను. వాళ్ళు తమ చేతుల్లో
దేవుడుంచిన వీణల్ని పట్టుకొని ఉన్నారు. [3]దేవుని
సేవకుడైన మోషే గీతాన్ని, గొఱ్ఱెపిల్ల గీతాన్ని వాళ్ళు
ఈ విధంగా పాడుతూ ఉన్నారు:

"ప్రభూ! సర్వశక్తి సంపన్నుడవైన దైవమా!
నీ కార్యాలు గొప్పవి. అద్భుతమైనవి. యుగ
యుగాలకురాజువు నీవు. నీ మార్గాలు సత్య
సమ్మతమైనవి. న్యాయసమ్మతమైనవి.
4 ఓ ప్రభూ! నీ కెవరు భయపడరు? నీ
నామాన్ని స్తుతించనివారెవరున్నారు? నీ
వొక్కడివే పరిశుద్ధుడవు. నీ నీతికార్యాలు
ప్రత్యక్షమైనవి. కనుక ప్రజలందరూ వచ్చి
నిన్ను ఆరాధిస్తారు."

[5]దీని తర్వాత పరలోకంలో ఉన్న మందిరాన్ని
చూసాను. అంటే సాక్ష్యపు గుడారము తెరుచుకోవటం
చూసాను. [6]ఆ మందిరం నుండి ఏడుగురు దేవదూతలు
ఏడు తెగుళ్ళతో బయటకు వచ్చారు. వాళ్ళు తెల్లటి
మెరిసే నార బట్టలు వేసుకొని ఉన్నారు. రొమ్ముల
మీద బంగారు దట్టి కట్టుకొని ఉన్నారు. [7]ఆ తర్వాత
ఆ నాలుగు ప్రాణుల్లో ఒకటి ఆ ఏడుగురి దూతలకు,
చిరంజీవి అయిన దేవుని ఆగ్రహంతో నిండిన ఏడు
బంగారు పాత్రల్ని యిచ్చింది. [8]ఆ మందిరమంతా
దైవశక్తి వల్ల మరియు ఆయన తేజస్సువల్ల కలిగిన
పొగలతో నిండిపోయింది. ఏడుగురు దూతలు తెచ్చిన
ఏడు తెగుళ్ళు పూర్తి అయ్యేవరకు ఆ మందిరంలో
ఎవ్వరూ ప్రవేశించలేకపోయారు.

## కోపంతో నిండుకొన్న ఏడు పాత్రలు

16 మందిరం నుండి ఒక స్వరం బిగ్గరగా ఆ ఏడు
గురు దూతలతో, "వెళ్ళండి, దేవుని కోపంతో
నిండిపోయిన ఆ ఏడు పాత్రల్ని భూమ్మీద కుమ్మరిం
చండి" అని అనటం నాకు వినిపించింది.
[2]మొదటి దూత వెళ్ళి తన పాత్రను భూమ్మీద
కుమ్మరించాడు. మృగం ముద్రవున్న వాళ్ళ దేహాల
మీద, మృగం విగ్రహాన్ని పూజించిన వాళ్ళ దేహాలమీద,
బాధ కలిగించే వికారమైన కురుపులు లేచాయి.
[3]రెండవ దూత వెళ్ళి, తన పాత్రను సముద్రం
మీద కుమ్మరించాడు. ఆ సముద్రం శవంలోని రక్తంలా
మారిపోయింది. సముద్రంలో ఉన్న సమస్త జీవ
రాసులు మరణించాయి.
[4]మూడవ దూత తన పాత్రను నదులమీద, నీటి
ఊటలమీద కుమ్మరించాడు. వాటి నీళ్ళు రక్తంగా
మారాయి. [5]నీటి మీద అధికారమున్న దూత ఈ
విధంగా అనటం విన్నాను:

"నీవు న్యాయంగా తీర్పు చెప్పావు. నీవు
ప్రస్తుతం ఉన్నావు. గతంలో ఉండిన
వాడవు. నీవు పవిత్రమైన వాడవు, ఎందు
కంటే నీవు ఆవిధంగా తీర్పు తీర్చావు.
6 వాళ్ళు నీ భక్తుల రక్తాన్ని, నీ ప్రవక్తల రక్తాన్ని
కార్చారు. దానికి తగిన విధంగా నీవు
వాళ్ళకు త్రాగటానికి రక్తాన్నిచ్చావు."

[7]బలిపీఠం ఈ విధంగా సమాధానం చెప్పటం నేను
విన్నాను:

"ఔను ప్రభూ! సర్వ శక్తి సంపన్నుడవైన
ఓ దైవమా! నీ తీర్పులు సత్యసమ్మత
మైనవి. న్యాయసమ్మతమైనవి."

[8]నాల్గవ దూత తన పాత్రను సూర్యుని మీద కుమ్మ
రించాడు. ప్రజల్ని వేడితో మాడ్చి వేయటానికి సూర్యు
నికి అధికారమివ్వబడింది. [9]తీవ్రమైన వేడివల్ల ప్రజలు
మాడిపోయారు. వాళ్ళు ఈ తెగుళ్ళ మీద అధికార
మున్న దేవుని నామాన్ని దూషించారు. వాళ్ళు పశ్చా
త్తాపం చెందటానికి నిరాకరించారు. ఆయన్ని స్తుతించ
టానికి నిరాకరించారు.

10ఐదవ దూత తన పాత్రను మృగం యొక్క
సింహాసనం మీద క్రుమ్మరించాడు. వెంటనే వాని
రాజ్యం చీకటిలో మునిగి పోయింది. ప్రజలు నొప్పితో
తమ నాలుకలు కొరుక్కున్నారు. 11తమ బాధలకు,
తమ కురుపులకు పరలోకంలోవున్న దేవుణ్ణి దూషిం
చారు. కాని తాము చేసిన చెడ్డ పనులను మాని మారు
మనస్సు పొందటానికి నిరాకరించారు.
12ఆరవ దూత, తన పాత్రను యూఫ్రటీసు అను
మహానది మీద క్రుమ్మరించాడు. తూర్పున ఉన్న
రాజులకు మార్గం సిద్ధం కావాలని ఆ నది ఎండి
పోయింది. 13ఆ తర్వాత కప్పల్లా కనిపించే అసహ్య
కరమైన మూడు దయ్యాలు కనిపించాయి. అవి ఘట
సర్పం నోటినుండి, మృగం నోటినుండి, దొంగ ప్రవక్త
నోటినుండి బయటికి వచ్చాయి. 14అవి భూతాత్మలు.
వాటికి మహత్కార్యలు చేసే శక్తి ఉంది. అవి సర్వ శక్తి
సంపన్నుడైన దేవుని 'మహాదినం' నాడు జరిగే యుద్ధాని
కోసం రాజుల్ని సిద్ధం చేయటానికి ప్రపంచంలోని
రాజులందరి దగ్గరికి వెళ్తాయి.
15"జాగ్రత్త! నేను దొంగలా వస్తాను. తన దుస్తులు
తన దగ్గర ఉంచుకొని, మేలుకొని ఉన్నవాడు ధన్యుడు.
అలా చేయకపోతే అతడు నగ్నంగా వెళ్ళి తన నగ్నతకు
అవమాన పడవలసి వస్తుంది."
16ఆ భూతాత్మలు హీబ్రూ భాషలో 'హార్‌మెగిద్దోను'
అనే ప్రదేశంలో రాజుల్ని సమావేశ పరిచాయి.
17ఏడవ దూత తన పాత్రను గాలిలో క్రుమ్మరిం
చాడు. మందిరంలో ఉన్న సింహాసనం మీదినుండి
ఒక స్వరం బిగ్గరగా "సమాప్తం" అని అన్నది. 18వెంటనే
మెరుపులు మెరిసాయి. ఉరుములు, గర్జనలు వినిపిం
చాయి. తీవ్రమైన భూకంపం వచ్చింది. మానవుడు
భూమ్మీద పుట్టిననాటినుండి అటువంటి భూకంపం
ఎన్నడూ జరుగలేదు. ఆ భూకంపం అంత తీవ్రంగా
ఉంది. 19మహానగరం మూడు భాగాలుగా చీలిపోయింది.
దేశాల్లో ఉన్న పట్టణాలు కూలిపోయాయి. దేవుడు
బాబిలోను మహానగరాన్ని శిక్షించటం మరచిపోలేదు.
దాని పాత్రలో 'తీవ్రమైన ఉగ్రత' అనబడే మద్యాన్ని
పోసాడు. 20ద్వీపాలు, పర్వతాలు మాయమై
పోయాయి. 21ఆకాశం నుండి పెద్ద వడగండ్లు వచ్చి
ప్రజలమీద పడ్డాయి. అవి ఒక్కొక్కటి అయిదేసి మణు
గుల బరువు ఉన్నాయి. ఈ వడగండ్లవాన కలిగించి
నందుకు ప్రజలు దేవుణ్ణి దూషించారు. ఈ వడగండ్ల
వల్ల ప్రజలకు చాలా బాధ కలిగింది.

## మృగము పైనున్న స్త్రీ

17 ఏడు పాత్రలున్న ఏడుగురి దేవదూతల్లో ఒకడు
వచ్చి నాతో ఈ విధంగా అన్నాడు: అది పేరు
గాంచిన వేశ్య. బహు జనములమీద కూర్చున్న ఆ
వేశ్యకు యివ్వబడే శిక్షను నీకు చూపిస్తాను. నా వెంట
రా. 2దానితో భూపతులు వ్యభిచరించారు. ఈ
భూమ్మీద నివసించే ప్రజలు అది అందించే వ్యభిచార
మనే మద్యంతో మత్తెక్కిపోయారు.
3ఆ తర్వాత ఆ దేవదూత నన్ను ఆత్మద్వారా
ఒక ఎడారి ప్రాంతానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఒక
స్త్రీ ఎర్రటి, ఊదా రంగులుగల మృగం మీద కూర్చొని
ఉండటం చూసాను. ఆ మృగం మీద దూషణలు
వ్రాయబడి ఉన్నాయి. ఆ మృగానికి ఏడు తలలు,
పదికొమ్ములు ఉన్నాయి. 4ఆ స్త్రీ ఊదా, ఎరుపు
రంగుగల వస్త్రాల్ని కట్టుకొని ఉంది. బంగారుతో, రత్నా
లతో, ముత్యాలతో చేసిన మెరిసే ఆభరణాలను వేసు
కొని ఉంది. అది తన చేతిలో ఒక బంగారు పాత్రను
పట్టుకొని ఉంది. ఆ పాత్ర అసహ్యమైన వాటితో,
అది చేసిన వ్యభిచార కల్మషంతో నిండివుంది. 5ఈ
పేరు దాని నుదుటి మీద వ్రాయబడి ఉన్నది:

**బాబిలోను మహానగరం**
**వేశ్యలకు తల్లి!**
**ప్రపంచంలోని కల్మషాలకు తల్లి!**

6ఆ స్త్రీ భక్తుల రక్తాన్ని త్రాగి, మత్తుగా ఉండటం
చూసాను. ఆ రక్తం యేసును గురించి సాక్ష్యం చెప్పిన
వాళ్ళది. నేనా స్త్రీని చూసి ఆశ్యర్యపడ్డాను. 7అప్పుడు
ఆ దేవదూత నాతో ఈ విధంగా అన్నాడు, "నీ వెందుకు
అంత ఆశ్చర్యపడుతున్నావు? ఆ స్త్రీ యొక్క రహస్యం
నీకు చెబుతాను. ఆమె స్వారీ చేసే ఏడుతలల, పది
కొమ్ముల మృగాన్ని గురించి చెపుతాను. 8నీవు చూసిన
మృగం ప్రస్తుతం లేదు. ఒకప్పుడు ఉండింది. పాతాళం
నుండి లేచి వచ్చి అది నాశనమౌతుంది. ఆ మృగం
ఒకప్పుడు ఉండేది. ఇప్పుడు లేదు. భవిష్యత్తులో
వస్తుంది. కనుక ప్రపంచంలో ఉన్నవాళ్ళు ఆ మృగాన్ని
చూసి దిగ్భ్రాంతి చెందుతారు. సృష్టి మొదలైనప్పటి
నుండి వీళ్ళ పేర్లు జీవ గ్రంథంలో వ్రాయబడలేదు.
9"దీన్ని అర్థం చేసుకోవటానికి బుద్ధి అవసరం."
ఆ ఏడుతలలు ఆ స్త్రీ కూర్చొన్న ఏడుకొండలు. ఆ
ఏడు తలలు ఏడుగురు రాజులతో పోల్చబడ్డాయి.
10ఐదుగురు పడిపోయారు. ఒకడు ఉన్నాడు. ఇంకొ
కడు యింకా రాలేదు. అతడొచ్చాక కొద్దికాలం
ఉంటాడు. 11ఒకప్పుడు ఉండి ప్రస్తుతము లేని మృగము
ఎనిమిదవ రాజు. అతడు ఏడుగురిలో ఒకడు. అతడు
కూడా నాశనమౌతాడు.
12"నీవు చూసిన ఆ పది కొమ్ములు పదిమంది
రాజులు. వాళ్ళకు యింకా రాజ్యము లభించలేదు.
కాని వాళ్లకు రాజులకున్న అధికారము, మృగంతో
పాటు ఒక గంట సమయం మాత్రమే లభిస్తుంది.
13వాళ్ళందరి ఉద్దేశ్యం ఒకటి. దాని కోసం తమ శక్తిని,
అధికారాన్ని ఆ మృగానికిచ్చారు. 14వాళ్ళు గొర్రె

పిల్లతో యుద్ధం చేస్తారు. కాని గొర్రెపిల్ల ప్రభువులకు
ప్రభువు. రాజులకు రాజు. కనుక విజయం పొందు
తాడు. ఆయన వెంట ఆయన పిలిచిన వాళ్ళు, ఆయన
ఎన్నుకొన్నవాళ్ళు, ఆయన్ని విశ్వసించే వాళ్ళు
ఉంటారు.”

15ఆ తర్వాత దూత నాతో ఈ విధంగా అన్నాడు:
“నీవు ఆ వేశ్య కూర్చున్న నీళ్ళను చూసావు. ఆ
నీళ్ళు ప్రజల గుంపుల్ని, జాతుల్ని, దేశాలను, భాషలను
సూచిస్తోంది. 16నీవు చూసిన మృగము, దాని పది
కొమ్ములు ఆ వేశ్యను ద్వేషిస్తాయి. అవి ఆమె దగ్గర
ఉన్నవన్నీ తీసుకొని ఆమెను నగ్నంగా వదిలేస్తాయి.
ఆమె దేహాన్ని తిని, ఆమెను మంటల్లో కాల్చివేస్తాయి.
17దేవుడు తన ఉద్దేశ్యం నెరవేర్చుమని వాటి హృదయా
లకు చెప్పాడు. కనుక ఆ పదికొమ్ములు తమ రాజ్యాన్ని
దేవుడు చెప్పిన మాట నెరవేరే వరకు ఆ మృగానికి
యివ్వటానికి అంగీకరించాయి. 18నీవు చూసిన ఆ
స్త్రీ భూలోకంలోని రాజులను పాలించే మహానగరం.”

### బాబిలోను పతనము

18 ఇది జరిగిన తర్వాత పరలోకంనుండి మరొక
దూత దిగి రావటం చూసాను. అతని తేజస్సు
భూమిని ప్రకాశింప చేసింది. 2అతడు బిగ్గరగా యిలా
అన్నాడు:

“బాబిలోను మహానగరం కూలిపోయింది,
కూలిపోయింది. అది అక్కడ దయ్యాలకు
నివాసమైంది. ప్రతి దురాత్మకు అది తిరుగు
లాడు స్థలమైంది. ప్రతి ఏవగింపు కలిగించే
అపవిత్రమైన పక్షికి అది సంచరించు స్థల
మైంది.
3 దేశాలన్నీ దాని వ్యభిచారమనే మద్యాన్ని
త్రాగాయి. దేవుని ఆగ్రహమనే మద్యాన్ని
త్రాగి మత్తెక్కి పోయాయి. భూరాజులు
దాంతో వ్యభిచరించారు. ప్రపంచంలోని
వర్తకులు, దాని మితి మీరిన విలాసాలతో
ధనవంతులయ్యారు.”

4ఆ తదుపరి ఇంకొక స్వరం పరలోకంలో నుండి
ఈ విధంగా అనటం విన్నాను:

“నా ప్రజలారా! దానిలో నుండి బయటకు
రండి. ఎందుకంటే దాని పాపాల్లో మీరు
పాలు పంచుకోరు. అప్పుడు దానికున్న
తెగుళ్ళు మీకు రావు.
5 దాని పాపాలు ఆకాశం అంత ఎత్తుగా పేరుకు
పోయాయి. దేవునికి దాని నేరాలు జ్ఞాపకం
ఉన్నాయి.
6 అది యిచ్చింది తిరిగి దానికే యివ్వండి.
అది చేసిన దానికి రెండింతలు దానికి చెల్లిం
చండి. దాని పాత్రలో రెండింతలు ఘాటుగా
ఉన్న మద్యాన్ని పొయ్యండి.
7 ఆ పట్టణం అనుభవించిన పేరు ప్రతిష్టలకు
సమానంగా అది అనుభవించిన సుఖాలకు
సమానంగా దానికి దుఃఖాలు కలిగించి
హింసించండి. అది తన మనస్సులో, ‘నేను
రాణిలా సింహాసనంపై కూర్చుంటాను. నేను
ఎన్నటికీ వితంతువును కాను. నేను ఎన్న
టికీ దుఃఖించను’ అని తనలో గర్విస్తుంది.
8 అందువల్ల చావు, దుఃఖము, కరువు, తెగులు
ఒకేరోజు వచ్చి దాన్ని బాధిస్తాయి. దానిపై
తీర్పు చెప్పే మన ప్రభువైన దేవుడు శక్తి
వంతుడు కనుక దాన్ని మంటల్లో కాల్చి
వేస్తాడు.”

9దానితో వ్యభిచరించి సుఖాలనుభవించిన భూరా
జులు అది మండుతున్నప్పుడు వచ్చిన పొగలు చూసి
దానికోసం గుండెలు బాదుకొని దుఃఖిస్తారు. 10దానికి
జరుగుతున్న హింసను చూసి భయపడి దూరంగా
నిలబడి,

‘అయ్యో! అయ్యో! మహానగరమా! శక్తి
వంతమైన బాబిలోను నగరమా! ఒకే ఒక
గంటలో నీకు నాశనం వచ్చింది’ అని
విలపిస్తారు.

11ప్రపంచంలోని వర్తకులు తమ వస్తువులు యిక
మీదట కొనేవారు ఎవ్వరూ ఉండరు కనుక తమ నష్టానికి
దానిమీద విలపిస్తారు. 12వీళ్ళు బంగారు, వెండి వస్తు
వులు, రత్నాలు, ముత్యాలు, సున్నితమైన నార బట్టలు,
ఊదారంగు వస్త్రాలు, పట్టు వస్త్రాలు, ఎర్రటి రంగుగల
వస్త్రాలు, దబ్బచెట్ల పలకలు, దంతంతో, మంచి
చెక్కతో, కంచుతో, ఇనుముతో, చలువరాతితో చేసిన
అన్ని రకాల వస్తువులు, 13దాల్చిన చెక్క, ఓమము,
అగరుబత్తులు, మంచి అత్తరు, సాంబ్రాణి, ద్రాక్షారసం,
ఒలీవ నూనె, మెత్తని పిండి, గోధుమలు, పశువులు,
గొర్రెలు, గుర్రాలు, బండ్లు, బానిసలు, మనుష్యుల
శరీరాలు, ప్రాణాలు అమ్మేవాళ్ళు.
14వాళ్ళు,

‘నీవు కోరిన ఫలము దొరక లేదు. నీ ఐశ్వ
ర్యము, నీ భోగము నశించి పొయ్యాయి.
అవి మళ్ళీ రావు’

అని అన్నారు.

[15]వస్తువులు అమ్మి ధనం గడించిన వర్తకులు ఆమె అనుభవిస్తున్న హింసను చూసి భయపడి దూరంగా నిలుచుంటారు. వాళ్ళు దుఃఖంతో విలపిస్తారు. [16]వాళ్ళు,

‘అయ్యో! అయ్యో! సున్నితమైన వస్త్రాల్ని, ఊదారంగు వస్త్రాల్ని, ఎర్రటి రంగు వస్త్రాల్ని ధరించిన మహానగరమా! బంగారుతో, రత్నాలతో, ముత్యాలతో చేసిన నగలు ధరించిన మహానగరమా!
17 ఒకే ఒక గంటలో నీ ఐశ్వర్యమంతా నశించి పోయిందే!’ అని విలపిస్తారు

“ప్రతి నావికాధికారుడు, ఓడలో ప్రయాణం చేసే ప్రతి యాత్రికుడు, నావికులు, సముద్రం ద్వారా తమ జీతం గడించి జీవించే వాళ్ళు అందరూ దూరంగా నిలబడి ఉన్నారు. [18]ఆ పట్టణం కాలుతున్నపుడు వచ్చే పొగలను చూసి వాళ్ళు ఆశ్చర్యంతో, “ఈ మహా నగరమంత గొప్పగా ఏ పట్టణమైనా ఉందా?” అని అంటారు. [19]వాళ్ళు దుఃఖంతో విలపిస్తూ, దుమ్మును నెత్తిన వేసుకొంటూ,

‘అయ్యో! అయ్యో! మహానగరమా! సముద్రంలో ఓడ ఉన్న ప్రతి ఒక్కడూ దాని ధనం వల్ల ధనికులయ్యారే! ఒకే ఒక గంటలో ఆమె నాశనమయ్యిందే! అని ఏడుస్తారు.
20 పరలోకమా! దాని పతనానికి ఆనందించు! విశ్వాసులారా! అపొస్తలులారా! ప్రవక్తలారా! ఆనందించండి. అది మీతో ప్రవర్తించిన విధానానికి దేవుడు దానికి తగిన శిక్ష విధించాడు’”

అని అంటారు.

[21]అప్పుడు ఒక శక్తివంతుడైన దూత తిరుగటిరాయి వంటి పెద్దరాయిని ఎత్తి సముద్రంలో పారవేసి ఈ విధంగా అన్నాడు:

“గొప్ప శక్తితో బాబిలోను మహానగరం క్రిందికి పారవేయబడుతుంది. అది మళ్ళీ కనిపించదు.
22 వీణను వాయించే వాళ్ళ సంగీతం, యితర వాయిద్యాలు వాయించే వాళ్ళ సంగీతం, పిల్లనగ్రోవి ఊదేవాళ్ళ సంగీతం, బూర ఊదేవాళ్ళ సంగీతం, నీలో మళ్ళీ వినిపించదు. పని చేయగలవాడు నీలో మళ్ళీ కనిపించడు. తిరుగటి రాయి శబ్దం మళ్ళీ నీలో వినిపించదు.
23 దీపపు కాంతి నీలో మళ్ళీ ప్రకాశించదు. కొత్త దంపతుల మాటలు నీలో మళ్ళీ వినిపించవు. నీ వర్తకులు ప్రపంచంలో గొప్పగా ఉన్నారు. నీ ఇంద్రజాలంతో దేశాలు తప్పుదారి పట్టాయి.
24 ఆ పట్టణంలో ప్రవక్తల రక్తం, పవిత్రుల రక్తం కనిపించింది ప్రపంచంలో వధింప బడిన వాళ్ళందరి రక్తం, ఆ పట్టణంలో కనిపించింది.’

### దేవుణ్ణి స్తుతించండి

19 ఇది జరిగిన తర్వాత పరలోకంలో ఒక పెద్ద ప్రజా సమూహం మాట్లాడుతున్నట్లు నాకు ఒక స్వరం వినిపించి యిలా అన్నది:

“దేవుణ్ణి స్తుతించండి! రక్షణ, మహిమ, అధికారం మనదేవునిదే.
2 ఆయన నీతిమంతుడు కనుక న్యాయంగా సత్యంగా తీర్పు చెబుతాడు. తన వ్యభిచారంతో ప్రపంచాన్ని పాడు చేసిన ఆ వేశ్యను ఆయన శిక్షించాడు. తన సేవకుల రక్తానికి దానిపై కక్ష తీర్చుకొన్నాడు.”

[3]వాళ్ళందరు మళ్ళీ, ఇలా అన్నారు:

“దేవుణ్ణి స్తుతించండి! కాలిన ఆ మహానగరంనుండి పొగ ఆగకుండా మీదికి వెళ్తుంటుంది.”

[4]ఆ యిరవై నాలుగుమంది పెద్దలు సాష్టాంగ పడి సింహాసనంపై కూర్చొన్న దేవుణ్ణి ఆరాధించారు. అదే విధంగా ఆ నాలుగు ప్రాణులు కూడా ఆరాధించాయి. వాళ్ళు ఇలా
అన్నారు:

“ఆమేన్! దేవుణ్ణి స్తుతించండి!”

[5]అప్పుడు సింహాసనం నుండి ఒక స్వరం యిలా అన్నది:

“ఆయన సేవకులైన మీరంతా, చిన్నా, పెద్దా అనే బేధం లేకుండా మన దేవుణ్ణి స్తుతించండి ఆయనకు భయపడే మీరంతా మన దేవుణ్ణి స్తుతించండి.”

[6]ఆ తర్వాత నాకు ఒక ధ్వని వినిపించింది. ఆ ధ్వని పెద్ద ప్రజాసమూహం చేసిన ధ్వనిలా జలపాతం

చేసే ధ్వనిలా పెద్ద ఉరుముల ధ్వనిలా ఉంది. వాళ్ళు,
యిలా అన్నారు:

"దేవుణ్ణి స్తుతించండి. సర్వశక్తిసంపన్నుడు,
మన ప్రభువు అయిన దేవుడు మనల్ని
పాలిస్తున్నాడు.
7 మనం ఆనందించుదాం. సంతోషంతో
ఆయన్ని ఘనపర్చుదాం గొఱ్ఱెపిల్ల వివాహం
కానున్నది. ఆయన పెళ్ళి కూతురు తనకు
తానే సిద్ధం అయింది.
8 సున్నితమైన నార బట్టలు ఆమె ధరించ
టానికి యివ్వబడ్డాయి. అవి స్వచ్ఛంగా
తెల్లగా ఉన్నాయి.""

(సున్నితమైన నార బట్టలు పవిత్రులు చేసిన నీతి
పనులను సూచిస్తున్నాయి).
9ఆ తదుపరి దూత నాతో, "ఇది వ్రాయి. గొఱ్ఱెపిల్ల
పెళ్లి విందుకు ఆహ్వానింపబడ్డ వాళ్ళు ధన్యులు."
అతడు యింకా ఇలా అన్నాడు, "ఇవి నిజంగా దేవుని
మాటలు."
10ఇది విన్నాక అతన్ని ఆరాధించాలని నేను అతని
కాళ్ళ మీద పడ్డాను. కాని అతడు నాతో, "అలా చేయ
వద్దు. నేను నీ తోటి సేవకుణ్ణి. యేసు చెప్పిన దాన్ని
అనుసరించే సోదరుల సహచరుణ్ణి. దేవుణ్ణి ఆరాధించు.
యేసు చెప్పిన విషయాలనే ప్రవక్తలు కూడా చెప్పారు"
అని అన్నాడు.

### తెల్లటి గుర్రంపై రౌతు

11నేను తెరుచుకొని ఉన్న పరలోకాన్ని చూసాను.
నా ముందు ఒక తెల్లటి గుఱ్ఱం కనిపించింది. దాని
రౌతు నమ్మకమైన వాడని, సత్యవంతుడని పేరున్న
వాడు. అతడు నీతిగా తీర్పు చెబుతాడు. న్యాయంగా
యుద్ధం చేస్తాడు. 12ఆయన కళ్ళు నిప్పులా మండుతూ
ఉన్నాయి. ఆయన తలమీద ఎన్నో కిరీటాలు
ఉన్నాయి. ఆయన మీద ఒక పేరు వ్రాయబడి ఉంది.
ఆయనకు తప్ప మరెవ్వరికీ ఆ పేరు తెలియదు.
13ఆయన రక్తంలో ముంచబడిన వస్త్రాన్ని ధరించి
ఉన్నాడు. ఆయన పేరు దేవుని వాక్యం. 14తెల్లగా పరి
శుద్ధంగా ఉన్న సున్నితమైన దుస్తులు వేసుకొని పర
లోకంలో ఉన్న సైనికులు తెల్లటి గుర్రాలపై స్వారీ
చేస్తూ ఆయన్ని అనుసరించారు. 15దేశాలను ఓడించ
టానికి ఆయన నోటినుండి పదునైన కత్తి బయటకు
వచ్చింది. ఆయన దేశాలను గొప్ప అధికారంతో
పాలిస్తాడు. ఆయన సర్వ శక్తి సంపన్నుడైన దేవుని
ఆగ్రహమనబడే ద్రాక్షా గానుగను త్రొక్కుతాడు. ఆ
ఆగ్రహం తీవ్రమైనది. 16ఆయన వస్త్రంమీద, ఆయన
తొడమీద:

"రాజులకు రాజు, ప్రభువులకు ప్రభువు"

అని వ్రాయబడి ఉంది.
17ఒక దూత సూర్యునిలో నిలబడి ఉండటం
చూసాను. అతడు బిగ్గరగా గాలిలో ఎగురుతున్న పక్షు
లతో, "దేవుని గొప్ప విందుకొరకు అందరూ సమా
వేశం కండి. 18మీరు వస్తే రాజుల మాంసం, సైన్యాధి
పతుల మాంసం, వీరుల మాంసం, గుఱ్ఱాల మాంసం,
రౌతుల మాంసం, ప్రజల మాంసం, బానిసలుకాని
వాళ్ళ మాంసం, బానిసల మాంసం, ముఖ్యమైన వాళ్ళ
మాంసం, తినటానికి లభిస్తుంది" అని అన్నాడు.
19ఆ తదుపరి మృగము మరియు భూపాలకులు,
వాళ్ళ సైన్యాలు, అంతా కలిసి గుఱ్ఱంపై స్వారీ చేస్తున్న
వానితో, ఆయన సైన్యంతో యుద్ధం చేయటానికి
సిద్ధం అయ్యారు. 20కాని ఆ మృగము బంధింపబడింది.
ఆ మృగం పక్షాన మహత్వపూర్వకమైన సూచనలు
చూపిన దొంగ ప్రవక్త కూడా బంధింపబడ్డాడు. వాడు
ఈ సూచనలతో మృగం యొక్క ముద్రను పొందిన
వాళ్ళను, ఆ మృగాన్ని ఆరాధించిన వాళ్ళను మోసం
చేస్తూపోయాడు. వీళ్ళందరిని గంధకంతో మండు
తున్న భయానకమైన గుండంలో ఆ గుఱ్ఱంపై స్వారీ
చేస్తున్న వాడు సజీవంగా పడవేసాడు. 21గుఱ్ఱపు రౌతు
నోటినుండివచ్చిన కత్తితో మిగతా వాళ్ళు చంపబడ్డారు.
పక్షులు వచ్చి వీళ్ళ దేహాలను కడుపు నిండా తిన్నాయి.

### వెయ్యి సంవత్సరాలు

20 పరలోకంలో నుండి ఒక దూత దిగి రావటం
చూసాను. అతని దగ్గర పాతాళలోకపు తాళం
చెవి ఉంది. అతని చేతిలో ఒక పెద్ద గొలుసు ఉంది.
2అతడు ఘటసర్పాన్ని పట్టుకొని వెయ్యి ఏండ్లదాకా
బంధించి వేసాడు. దీన్ని ఆది సర్పమని, దయ్యమని,
సైతానని అంటారు. 3అతడు దాన్ని పాతాళలోకంలో
పడవేసి, తాళం వేసి, దాని మీద ముద్ర వేసాడు.
వెయ్యి ఏండ్లు ముగిసేదాకా, అది దేశాలను మళ్ళీ
మోసం చెయ్యకుండా ఉండాలని ఈ విధంగా చేసాడు.
ఆ తర్వాత కొద్ది సమయం దానికి విడుదల ఇవ్వ
బడుతుంది.
4నేను సింహాసనాలు చూసాను. తీర్పు చెప్పటానికి
అధికారం పొందినవారు ఆ సింహాసనాలపై కూర్చొని
ఉన్నారు. యేసు చెప్పిన సందేశాన్ని నమ్మకంగా బోధిం
చినందుకు దేవుని సందేశాన్ని ప్రకటించి నందుకు
తలలు కొట్టి వేయబడినవాళ్ళ ఆత్మల్ని చూసాను.
వీళ్ళు మృగాన్నిగాని, దాని విగ్రహాన్ని గాని ఆరాధించ
లేదు. వాళ్ళు దాని ముద్రను వాళ్ళ నొసళ్ళ మీదగాని,
చేతులమీదగాని వేయించుకోలేదు. వాళ్ళు మళ్ళీ బ్రతికి
క్రీస్తుతో పాటు వెయ్యి ఏండ్లు పాలించారు. 5మిగతా
చనిపోయిన వాళ్ళు వెయ్యి ఏండ్లు పూర్తి అయ్యేదాకా

బ్రతికి రాలేదు. ఈ విధంగా చనిపోయి బ్రతికి రావటం యిది మొదటిసారి. 6మొదటిసారి బ్రతికి వచ్చినవాళ్ళ గుంపుకు చెందిన వాళ్ళు ధన్యులు. పరిశుద్ధమైన వాళ్ళు. ఇక రెండవ మరణానికి* వాళ్ళపై అధికారము ఉండదు. వాళ్ళు దేవునికి, క్రీస్తుకు యాజకులుగా ఉండి క్రీస్తుతో సహా వెయ్యి ఏండ్లు రాజ్యం చేస్తారు.

## సైతాను అపజయం పొందటం

7వెయ్యి ఏండ్లు గడిచాక సైతాను కారాగారంనుండి విడుదల చేయబడతాడు. 8వాడు బయటకు వచ్చి దేశాలను మోసం చేస్తాడు. వాడు ప్రపంచం నలుమూలలకు, అంటే గోగు, మాగోగులకు వెళ్ళి యుద్ధం చేయటానికి ప్రజల్ని సమకూరుస్తాడు. సముద్ర తీరాన ఉన్న ఇసుక రేణువుల సంఖ్యతో సమానంగా వాళ్ళ సంఖ్య ఉంటుంది. 9వాళ్ళు భూమి నలుమూలలకు వెళ్ళి భక్తుల శిబిరాలను ఆక్రమించారు. దేవుడు ప్రేమించే పట్టణాన్ని చుట్టుముట్టారు. కాని పరలోకంలో నుండి అగ్ని కురిసి వాళ్ళను నాశనం చేసింది. 10ఇక వాళ్ళను మోసం చేసిన సైతాను మండుతున్న గంధకపు గుండంలో పారవేయబడ్డాడు. దానిలో క్రూర మృగం, దొంగ ప్రవక్త యింతకు ముందే పడవేయబడ్డారు. గుండం లోనే వాళ్ళు రాత్రింబగళ్ళు నిరంతరం హింసింపబడతారు.

## చనిపోయిన వాళ్ళపై తీర్పు

11తర్వాత నాకు ఒక పెద్ద సింహాసనము కనిపించింది. అది తెల్లగా ఉంది. దానిపై కూర్చొన్నవాణ్ణి చూసాను. భూమి, ఆకాశం ఆయన నుండి పారిపొయ్యాయి. వాటికి స్థలం దొరకలేదు. అవి అదృశ్యమయ్యాయి. 12నేను చనిపోయిన వాళ్ళను చూసాను. అందులో గొప్పవాళ్ళు, కొద్దివాళ్ళు ఉన్నారు. వాళ్ళు సింహాసనం ముందు నిలబడి ఉన్నారు. అప్పుడు గ్రంథాలు తెరువబడ్డాయి. మరొక గ్రంథంకూడా తెరువబడింది. అది జీవగ్రంథం. చనిపోయిన వాళ్ళపై తీర్పు చెప్పబడింది. వాళ్ళు చేసినవి ఆ గ్రంథాల్లో వ్రాయబడి ఉన్నాయి. వాటి ప్రకారం వాళ్ళ మీద తీర్పు చెప్పబడింది. 13సముద్రం తనలో చనిపోయిన వాళ్ళను విడుదల చేసింది. మృత్యువు తన మృత్యులోకంలో ఉన్నవాళ్ళను విడుదల చేసింది. వాళ్ళు చేసిన వాటిని బట్టి తీర్పు చెప్పబడింది. 14ఆ తర్వాత మృత్యువు, మృత్యు లోకము, మంటలు ఉన్న గుండంలో పారవేయబడ్డాయి. మంటల గుండం రెండవ మరణం. 15జీవ గ్రంథంలో పేరులేని వాడు మంటల గుండంలో పారవేయబడ్డాడు.

**రెండవ మరణం** అంటే నరకం.

## క్రొత్త యెరూషలేము

21 ఆ తర్వాత నేను ఒక క్రొత్త ఆకాశాన్ని, క్రొత్త భూమిని* చూసాను. మొదటి ఆకాశం, మొదటి భూమి అదృశ్యమయ్యాయి. ఇప్పుడు సముద్రము లేదు. 2నేను పరిశుద్ధ పట్టణమైన క్రొత్త యెరూషలేము పరలోకం నుండి దిగిరావటం చూసాను. అది దేవుని నుండి, పెళ్ళికుమారుని కోసం పెళ్ళికూతురిలా అలంకరించుకొని దిగి వచ్చింది. 3సింహాసనం నుండి ఒక స్వరం బిగ్గరగా, "ఇక నుండి దేవుడు మానవులతో ఉంటాడు. వాళ్ళతో నివసిస్తాడు. వాళ్ళు ఆయన ప్రజలు; ఆయన వాళ్ళ దేవుడై వాళ్ళతో స్వయంగా ఉంటాడు. 4వాళ్ళ కళ్ళ నుండి కారిన ప్రతి కన్నీటి బొట్టును తుడిచివేస్తాడు. పాత సంగతులు గతించి పోయాయి. కనుక యిక మీదట చావుండదు. దుఃఖం ఉండదు. విలాపం ఉండదు, బాధ ఉండదు" అని అన్నది.

5సింహాసనంపై కూర్చొన్నవాడు, "నేను ప్రతి వస్తువును క్రొత్తగా చేస్తాను" అని అన్నాడు. "ఇవి విశ్వసింపదగినవి, సత్యం, కనుక యివి వ్రాయి" అని అన్నాడు.

6ఆయన నాతో, "అంతా సమాప్తమైంది. అల్ఫా, (ఆదిని) ఓమెగా (అంతాన్ని) నేనే. మొదటివాణ్ణి, చివరివాణ్ణి నేనే. దాహంతోవున్న వానికి ఊటనుండి జీవజలాన్ని ఉచితంగా ఇస్తాను. 7జయించినవాడు వీటన్నిటికీ వారసుడౌతాడు. నేను అతనికి దేవునిగా, అతడు నాకు కుమారునిగా ఉంటాము. 8కాని, పిరికి వాళ్ళు, విశ్వాసం లేనివాళ్ళు, నీచులు, హంతకులు, అవినీతిపరులు, ఇంద్ర జాలకులు, విగ్రహారాధకులు, అసత్యాలాడేవాళ్ళు మండే గంధకమున్న భయానకమైన గుండంలో ఉంటారు. యిది రెండవ మరణం" అని అన్నాడు.

9ఏడు పాత్రలతో ఏడు చివరి తెగుళ్ళు పట్టుకొని ఉన్నవారిలో ఒక దూతవచ్చి నాతో, "పెళ్ళికూతుర్ని, అంటే గొఱ్ఱెపిల్ల భార్యను చూపిస్తాను రా!" అని అన్నాడు. 10అతడు నన్ను ఆత్మ ద్వారా ఎత్తుగా ఉన్న గొప్ప పర్వతం మీదికి తీసుకు వెళ్ళాడు. పరలోకంలో ఉన్న దేవుని దగ్గరనుండి దిగివస్తున్న పరిశుద్ధ పట్టణమైన యెరూషలేమును చూపించాడు. 11అది దేవుని మహిమతో వెలుగుతూ ఉంది. దాని మహిమ అమూల్యమైన ఆభరణంగా, అంటే సూర్య కాంత మణిలా ఉంది. అది స్పటికంలా స్వచ్ఛంగా ఉంది. 12దాని చుట్టూ ఎత్తైన ఒక ప్రాకారం ఉంది. ఆ ప్రాకారానికి పన్నెండు ద్వారాలు ఉన్నాయి. పన్నెండుమంది దేవదూతలు ఆ ద్వారాల యొద్ద ఉన్నారు. ఆ ద్వారాల మీద ఇశ్రాయేలీయుల పన్నెండు గోత్రాల పేర్లు వ్రాయ

**క్రొత్త ఆకాశాన్ని, క్రొత్త భూమిని** యెషయా 65:17; 66:22 2 పేతురు 3:13 చూడండి.

బడ్డాయి. 13తూర్పు వైపు మూడు ద్వారాలు, ఉత్తరం
వైపు మూడు ద్వారాలు, దక్షిణం వైపు మూడు
ద్వారాలు, పడమర వైపు మూడు ద్వారాలు ఉన్నాయి.
14ఆ నగర ప్రాకారానికి పన్నెండు పునాదులున్నాయి.
వాటి మీద గొర్రెపిల్ల యొక్క పన్నెండుగురి అపొస్తలుల
పేర్లు ఉన్నాయి.
15నాతో మాట్లాడిన దూత దగ్గర బంగారంతో చేసిన
కొలత బద్ద ఉంది. అతడు దాని పట్టణాన్ని, దాని
ప్రాకారాన్ని, ద్వారాలను కొలవటానికి తెచ్చాడు. 16ఆ
పట్టణం చతురస్రంగా కట్టబడి ఉంది. దాని వెడల్పు,
పొడవు సమానంగా ఉన్నాయి. అతడు కొల బద్దతో
పట్టణాన్ని కొలిచాడు. దాని పొడవు, వెడల్పు, ఎత్తు,
1500 మైళ్ళు* ఉన్నట్లు కనుగొన్నాడు. 17ఆ పట్టణం
యొక్క ప్రాకారాన్ని కొలిచి దాని ఎత్తు ఆ నాటి
కొలత పద్ధతి ప్రకారం 144 మూరలు* ఉన్నట్లు
కనుగొన్నాడు. 18ఆ ప్రాకారం సూర్య కాంతములతో
కట్టబడి ఉంది. ఆ పట్టణం బంగారంతో కట్టబడి
ఉంది. అది గాజు వలె స్వచ్ఛంగా ఉంది. 19ఆ ప్రాకారాల
పునాదులు రకరకాల రత్నాలతో అలంకరింపబడి
ఉన్నాయి. మొదటి పునాదిరాయి సూర్య కాంతం,
రెండవది నీలం, మూడవది యమున, నాలుగవది
పచ్చ,
20ఐదవది వైఢూర్యం, ఆరవది కెంపు, ఏడవది
సువర్ణ రత్నము, ఎనిమిదవది గోమేధికము, తొమ్మి
దవది పుష్యరాగము, పదవది సువర్ణ సునీయము, పద
కొండవది పద్మరాగము, పన్నెండవది సుగంధము. 21ఆ
పన్నెండు ద్వారాలు పన్నెండు ముత్యాలతో చేయబడి
ఉన్నాయి. ఒక్కొక్క ద్వారం ఒక్కొక్క ముత్యంతో
చేయబడి ఉంది. ఆ పట్టణపు వీధులు మేలిమి బంగా
రంతో చేయబడి ఉన్నాయి. అవి గాజువలె స్వచ్ఛంగా
ఉన్నాయి.
22ఆ పట్టణంలో నాకు మందిరం కనిపించలేదు.
సర్వశక్తి సంపన్నుడు, ప్రభువు అయినటువంటి దేవుడు
మరియు గొర్రెపిల్ల ఆ పట్టణానికి 'మందిరమై ఉన్నారు'.
23దేవుని తేజస్సు ఆ పట్టణానికి వెలుగు నిస్తుంది.
గొర్రెపిల్ల ఆ పట్టణానికి జ్యోతి కాబట్టి ఆ పట్టణానికి
వెలుగునివ్వటానికి సూర్యచంద్రులు అవసరం లేదు.
24జనులు ఆ వెలుగులో నడుస్తారు. ప్రపంచంలో ఉన్న
రాజులు తమ ఘనతను ఆ పట్టణానికి తీసుకు వస్తారు.
25ఆ పట్టణంలో రాత్రి అనేది ఉండదు. కనుక ఆ
పట్టణం యొక్క ద్వారాలు ఎన్నటికీ మూయబడవు.
26జనముల గౌరవము, వారి కీర్తి, ఈ పట్టణానికి తేబడు
తాయి. 27అపవిత్రమైనది ఆ పటణ్టంలో ప్రవేశింపదు.
అదే విధంగా అవమానకరమైన పనులు చేసేవాళ్ళు,
మోసగాళ్ళు ఆ పట్టణంలోకి ప్రవేశించరు. గొర్రెపిల్ల
జీవ గ్రంథంలో ఎవరి పేర్లు వ్రాయబడ్డాయో వాళ్ళు
మాత్రమే ప్రవేశించకలుగుతారు.

## జీవజలం పారే నది

22 ఆ తర్వాత ఆ దేవదూత స్పటికంలా
స్వచ్ఛంగా ఉన్న నదిని నాకు చూపాడు.
దానిలో జీవజలం ఉంది. ఆ నది దేవుడు మరియు
గొర్రెపిల్ల కూర్చున్న సింహాసనం నుండి మొదలై,
2పట్టణంలోని గొప్ప వీధి మధ్యనుండి పారుతూ ఉంది.
ఆ నదికి యిరువైపులా జీవ వృక్షం ఉంది. ఆ వృక్షానికి
పన్నెండు కాపులు కాస్తాయి. ప్రతి నెలా ఆ వృక్షం
ఫలాలనిస్తుంది. ఆ వృక్షం యొక్క ఆకులు జనములను
నయం చేయటానికి ఉపయోగింపబడుతాయి. 3ఇక
మీదట ఏ శాపం ఉండదు. దేవునికి మరియు గొర్రె
పిల్లకు చెందిన సింహాసనం పట్టణంలో ఉంటుంది.
ఆయన భక్తులు ఆయనకు సేవచేస్తారు. 4వాళ్ళు
ఆయన ముఖం చూస్తారు. ఆయన పేరు వాళ్ళ
నొసళ్ళపై ఉంటుంది. 5ఇక మీదట చీకటి ఉండదు.
ప్రభువైన దేవుడు వాళ్ళకు వెలుగునిస్తాడు. కనుక
వాళ్ళకు దీపపు వెలుగు కాని, సూర్యుని వెలుగు కాని
అవసరం ఉండదు. వాళ్ళు చిరకాలం రాజ్యం చేస్తారు.
6ఆ దూత నాతో, "ఇవి నమ్మదగినవి. నిజమైనవి.
ప్రవక్తల ఆత్మలకు దేవుడైన ప్రభువు త్వరలోనే జరుగ
నున్న వాటిని తన సేవకులకు చూపించటానికి తన
దూతను పంపాడు" అని అన్నాడు.

## యేసు రావటం

7"చూడు! నేను త్వరలోనే రాబోతున్నాను. ఈ
గ్రంథంలో చెప్పబడిన ప్రవచన వాక్కును ఆచరించే
వాడు ధన్యుడు."
8యోహాను అనబడే నేను ఈ విషయం చూసాను.
నేను అవి విని, చూసినప్పుడు నాకు యివి చూపిస్తున్న
దూతను ఆరాధించటానికి అతని కాళ్ళ మీదపడ్డాను.
9కాని అతడు నాతో, "నేను నీ తోటి సేవకుణ్ణి, నీ
సోదరులతో, ప్రవక్తలతో, ఈ గ్రంథంలో ఉన్న సందే
శాలు ఆచరించే వాళ్ళతో కలిసి సేవచేసేవాణ్ణి. నన్ను
ఆరాధించకు. దేవుణ్ణి ఆరాధించు" అని అన్నాడు.
10అతడు యింకా ఈ విధంగా అన్నాడు: కాలం సమీపి
స్తుంది, కనుక ఈ గ్రంథంలోని ప్రవచన వాక్కును
రహస్యంగా దాచవద్దు.
11తప్పు చేసేవాణ్ణి తప్పు చేయనీ! నీచంగా
ప్రవర్తించే వాణ్ణి నీచంగా ప్రవర్తించనీ! నీతిగా ఉండేవాణ్ణి
నీతిగా ఉండనీ! పవిత్రంగా ఉండేవాణ్ణి పవిత్రంగా
ఉండనీ. 12"జాగ్రత్త, నేను త్వరలో రాబోతున్నాను.
ప్రతి ఒక్కనికి అతడు చేసే వాటిని బట్టి నా దగ్గ

---

**1500 మైళ్లు** అనగా 2,200 కిలోమీటర్లు.

**144 మూరలు** అనగా 200 అడుగులు లేదా 65 మీటర్లు.

రున్నదాన్ని బహుమతిగా ఇస్తాను. [13]ఆదియు, అంతామును* నేనే. మొదటివాణ్ణి, చివరివాణ్ణి నేనే. ఆరంభాన్ని, సమాప్తాన్ని నేనే.

[14]"జీవవృక్షం మీది ఫలాన్ని తినటానికి అర్హత పొందేందుకు, గుమ్మాల ద్వారా పట్టణంలోకి వెళ్ళే అర్హత పొందేందుకు తమ తమ దుస్తుల్ని శుభ్రం చేసు కొని సిద్ధంగా ఉన్నవాళ్ళు ధన్యులు. [15]పట్టణానికి వెలు పట కుక్కలు, ఇంద్ర జాలికులు, అవినీతిపరులు, హంత కులు, విగ్రహారాధకులు, అసత్యాన్ని ప్రేమించి జీవించే వాళ్ళు రకరకాల మనుష్యులు ఉంటారు.

[16] "నేను యేసును. ఈ విషయాన్ని సంఘాలకు చెప్పటానికి నా దూతను నీ దగ్గరకు పంపాను. నేను వేరును, దావీదు వంశాంకురాన్ని, ప్రకాశించే వేకువ చుక్కను." [17]ఆత్మ మరియు పెళ్ళికుమార్తె "రండి" అని అంటున్నారు. ఇది విన్నవాడు "రండి!" అనాలి. దాహంతో ఉన్నవాళు రావచ్చును. ఇష్టమున్నవాడు ఉచితంగా లభించే జీవజలాన్ని త్రాగవచ్చు.

[18]ఈ గ్రంథంలో ఉన్న ప్రవచన వాక్కును వినే ప్రతి ఒక్కణ్ణి నేను ఈ విధంగా హెచ్చరిస్తు న్నాను.

[19]ఒకవేళ ఎవరైనా దీనికి ఏదైనా చేర్చితే, ఈ గ్రంధంలో వ్రాయబడిన తెగుళ్ళు వాని మీదకువస్తాయి. ఎవడైనా ఈ ప్రవచన గ్రంథంనుండి ఏవైనా మాటలు తీసి వేస్తే, ఈ గ్రంథంలో వర్ణింపబడిన జీవవృక్షంలో, పవిత్ర పట్టణంలో అతనికున్న హక్కును దేవుడు తీసివేస్తాడు.

[20]యేసు ఇవన్నీ నిజమని చెపుతున్నాడు. ఇప్పుడు ఆయన, "ఔను, నేను త్వరలోనే వస్తాను" అని అంటు న్నాడు. ఆమేన్! రండి యేసు ప్రభూ!

[21]యేసు ప్రభువు అనుగ్రహం దేవుని జనులపై ఉండుగాక. ఆమేన్.

---

**ఆదియు, అంతము** మూలభాషలో అల్ఫా మరియు ఓమెగ.

# License Agreement for Bible Texts

***World Bible Translation Center***
***Last Updated: September 21, 2006***



**These Scriptures:**

- Are copyrighted by World Bible Translation Center.
- Are not public domain.
- May not be altered or modified in any form.
- May not be sold or offered for sale in any form.
- May not be used for commercial purposes (including, but not limited to, use in advertising or Web banners used for the purpose of selling online add space).
- May be distributed without modification in electronic form for non-commercial use. However, they may not be hosted on any kind of server (including a Web or ftp server) without written permission. A copy of this license (without modification) must also be included.
- May be quoted for any purpose, up to 1,000 verses, without written permission. However, the extent of quotation must not comprise a complete book nor should it amount to more than 50% of the work in which it is quoted. A copyright notice must appear on the title or copyright page using this pattern: "Taken from the HOLY BIBLE: EASY-TO-READ VERSION™ © 2006 by World Bible Translation Center, Inc. and used by permission." If the text quoted is from one of WBTC's non-English versions, the printed title of the actual text quoted will be substituted for "HOLY BIBLE: EASY-TO-READ VERSION™." The copyright notice must appear in English or be translated into another language. When quotations from WBTC's text are used in non-saleable media, such as church bulletins, orders of service, posters, transparencies or similar media, a complete copyright notice is not required, but the initials of the version (such as "ERV" for the Easy-to-Read Version™ in English) must appear at the end of each quotation.

Any use of these Scriptures other than those listed above is prohibited. For additional rights and permission for usage, such as the use of WBTC's text on a Web site, or for clarification of any of the above, please contact World Bible Translation Center in writing or by email at distribution@wbtc.com.

World Bible Translation Center
P.O. Box 820648
Fort Worth, Texas 76182, USA
Telephone: 1-817-595-1664
Toll-Free in US: 1-888-54-BIBLE
E-mail: info@wbtc.com

**WBTC's web site –** World Bible Translation Center's web site: http://www.wbtc.org

**Order online –** To order a copy of our texts online, go to: http://www.wbtc.org

**Current license agreement –** *This license is subject to change without notice. The current license can be found at:* http://www.wbtc.org/downloads/biblelicense.htm

**Trouble viewing this file –** If the text in this document does not display correctly, use Adobe Acrobat Reader 5.0 or higher. Download Adobe Acrobat Reader from: http://www.adobe.com/products/acrobat/readstep2.html

**Viewing Chinese or Korean PDFs –** To view the Chinese or Korean PDFs, it may be necessary to download the Chinese Simplified or Korean font pack from Adobe. Download the font packs from: http://www.adobe.com/products/acrobat/acrrasianfontpack.html